# Madras Auxiliary Bible Society.

This Telugu Bible has been printed and published to meet the urgent wants of the Telugu people. The edition consists of the Rev. J. Hay's translation of Genesis and the 20th chapter of Exodus, both revised by the Delegates; and his translation of Exodus, Leviticus, Psalms and Proverbs, regard being had to the style approved by the majority of the Delegates. The remaining books of the Old Testament are a reprint of the Rev. Messrs. Gordon and Pritchett's translation, revised to some extent by the Rev. R. D. Johnston. The Rev. Messrs. Wardlaw and Hay translated and published all the books of the New Testament in 1856. During the past few years, the Rev. J. Hay has to some extent revised that translation.

---

తెనుగు జనుల ఇప్పటి అవసరములను బట్టి ఈ తెనుగు బైబిలు అచ్చు వేయించి ప్రచురము చేయబడినవి. ఈ కూర్పులో, హే దొర (Rev. J. Hay) తెనిగించిన తరువాత, Delegates అను వారు సరిచూచిన ఆదికాండము, నిర్గమ కాండములో ఇరువదియవ అధ్యాయము తప్ప, అతడే వారు సమ్మతించిన శైలిని బట్టి తెనిగించిన నిర్గమకాండశేషము, లేవీయకాండము, కీర్తనలు, సామితలున్నవి. పాత నిబంధనలో తక్కిన గ్రంథములను, గార్డను, ప్రిచ్చేతను దొరలు (Rev. Messrs. Gordon and Pritchett) తెనిగించిరి. జోనుస్తనను దొర (Rev. R. D. Johnston) కొంత మట్టుకు వాటిని సవరణ చేసెను.

కొత్త నిబంధన గ్రంథములన్ని, హే, వార్డ్లా యను దొరలు (Rev. Messrs. Hay and Wardlaw) తెనిగించి 1856-వ సంవత్సరమున అచ్చువేయించిరి. ఈ మధ్య సంవత్సరములలో హే దొర (Rev. J. Hay) కొంత మట్టుకు వాటిని సవరణ చేయుచు వచ్చెను.

January 1882.

Bible. Telugu

Bible
Telugu
1881

THE

# HOLY BIBLE,

CONTAINING THE

## OLD AND NEW TESTAMENTS:

TRANSLATED INTO

## THE TELUGU LANGUAGE,

UNDER THE AUSPICES OF

**The British and Foreign Bible Society.**



MADRAS:
PRINTED FOR THE MADRAS AUXILIARY BIBLE SOCIETY,
AT THE CHRISTIAN KNOWLEDGE SOCIETY'S PRESS.

1881.

*Super royal 8vo. Long primer.*

Bible
Asiatic
Telugu

# పరిశుద్ధ గ్రంథము.

ఇందున

## పాత నిబంధనయు, క్రొత్త నిబంధనయు

యిమిడియున్నవి.

ఇంగ్లండుమొదలగు సర్వదేశ సత్యవేద సంఘపువారి అనుమతి చొప్పున

చెన్నపురి సత్యవేద సంఘపు వారివలన

## తెనుగులో భాషాంతరము చేయించబడినది.

చెన్నపురి

క్రీస్తు విజ్ఞాపన సంఘపువారి ముద్రాక్షరశాలలో

అచ్చువేయబడినది.

1881.

THE

# OLD TESTAMENT,

TRANSLATED INTO

## THE TELUGU LANGUAGE.

---

# పాత నిబంధన.

ఇది

చెన్నపురి సత్యవేద సంఘపు వారివలన

తెనుగులో భాషాంతరము చేయించబడినది.

MADRAS:

PRINTED FOR THE MADRAS AUXILIARY BIBLE SOCIETY,
AT THE CHRISTIAN KNOWLEDGE SOCIETY'S PRESS.

1881.

*Super royal 8vo. Long primer.*

# THE BOOKS OF THE OLD TESTAMENT.

పాత నిబంధనయొక్క పరిశుద్ధ గ్రంథమునందు యిమిడియున్న పుస్తకముల నామ క్రమము, అధ్యాయముల వెరసి.

# ఆ ది కాం డ ము

అనగా,

# మోషే మొదటి గ్రంథము.

## 1. అధ్యాయము.

1 ఆది యందు దేవుడు ఆకాశమును భూమిని సృజిం
2 చెను. । అప్పుడు భూమి నిరాకారముగాను శూన్యము
గాను ఉండెను. మరియు, చీకటి అగాధ జలము పైని
ఉండెను. దేవుని ఆత్మ నీళ్లపైని అల్లాడుచునుండెను.
3 దేవుడు—వెలుగు కలుగు గాకని పలికినప్పుడు
4 వెలుగు కలిగెను. । దేవుడు ఆ వెలుగు మంచిదై ఉం
డుట చూచెను. దేవుడు ఆ వెలుగును చీకటిని వేరు
5 పరిచెను. । దేవుడు వెలుగునకు పగలనియు, చీకటికి
రాత్రి అనియు పేరు పెట్టెను. అప్పుడు అస్తమయ
మును ఉదయమును కలిగెను; అది మొదటి దినము.

6 మరియు, దేవుడు—నీళ్ల మధ్యను ఒక విశాలము కలిగి,
ఆ నీళ్లను ఈ నీళ్లను వేరుపరచు గాకని పలికెను. ।
7 దేవుడు ఆ విశాలము చేసి, విశాలము కింది నీళ్లను
విశాలము మీది నీళ్లను వేరుపరిచెను. ఆ ప్రకారమా
8 యెను. । దేవుడు ఆ విశాలమునకు ఆకాశమని పేరు
పెట్టెను. అప్పుడు అస్తమయమును ఉదయమును కలి
గెను; అది రెండవ దినము.

9 మరియు, దేవుడు—ఆకాశము కిందనున్న నీళ్లు ఒక
చోటనే కూర్చబడి ఆరిన నేల కనబడుగాకని పలి
10 కెను. ఆ ప్రకారమాయెను. । దేవుడు ఎండిన నేలకు
భూమి అని పేరు పెట్టెను. నీళ్ల రాశికి ఆయన సము
ద్రములని పేరు పెట్టెను. దేవుడు అది మంచిదై
ఉండుట చూచెను.

11 మరియు, దేవుడు — మొలకలను, విత్తనములిచ్చే
చెట్లను, భూమి మీద తమ తమ జాతి ప్రకారము
తమలో విత్తనములు గల ఫలమిచ్చే ఫల వృక్షములనును
భూమి మొలిపించు గాకని పలికెను. ఆ ప్రకారమా
12 యెను. । భూమి మొలకలను, తమ తమ జాతి ప్రకా
రము విత్తనములిచ్చే చెట్లను, తమ తమ జాతి ప్రకా
రము తమలో విత్తనములు గల ఫల వృక్షములనును
మొలిపించెను. దేవుడు అది మంచిదై ఉండుట చూ
చెను. । అప్పుడు అస్తమయమును ఉదయమును కలి 13
గెను; అది మూడవ దినము.

మరియు, దేవుడు—పగటిని రాత్రిని వేరుపరుచు 14
టకు ఆకాశ విశాలమందు జ్యోతులు కలుగుగాకని
యు, అవి గురుతుల కొరకు, కాలముల కొరకు, దిన
సంవత్సరముల కొరకునై ఉండు గాకనియు, । భూ 15
మి మీద వెలుగిచ్చుటకు అవి ఆకాశ విశాలమందు
జ్యోతులై ఉండు గాకనియును పలికెను. ఆ ప్రకా
రమాయెను. । దేవుడు ఆ రెండు గొప్ప జ్యోతులను, 16
అనగా (వాటిలో) పగటిని ఏలుటకు పెద్ద జ్యోతిని,
రాత్రిని ఏలుటకు చిన్న జ్యోతిని, నక్షత్రములనును
చేసెను. । అప్పుడు భూమి మీద వెలుగిచ్చుటకును 17,18
పగటిని రాత్రిని ఏలుటకును, వెలుగును చీకటిని వేరు
పరుచుటకును, దేవుడు ఆకాశ విశాలమందు వాటిని
ఉంచెను. దేవుడు అది మంచిదై ఉండుట చూచె
ను. । అప్పుడు అస్తమయమును ఉదయమును కలిగెను; 19
అది నాలుగవ దినము.

మరియు, దేవుడు — జీవము గలవి నీళ్లలో విస్త 20
రించు గాకనియు, పక్షులు భూమి పైని ఆకాశ
విశాలములోను ఎగురు గాకనియును పలికెను. । దే 21
వుడు నీళ్లలో వాటి వాటి జాతి ప్రకారము, విస్త
రించే మహామత్స్యములను, జీవముగల పురుగులన్నిటి
యు, దాని దాని జాతి ప్రకారము, రెక్కలు గల
ప్రతి పక్షిని సృజించెను. దేవుడు అది మంచిదై
ఉండుట చూచెను. । దేవుడు — మీరు ఫలాభివృద్ధి 22
పొంది, సముద్రముల నీళ్లలో నిండి ఉండుడనియు,
పక్షులు భూమి మీద విస్తరించు గాకనియును, వా
టిని ఆశీర్వదించెను. । అప్పుడు అస్తమయమును ఉద 23
యమును కలిగెను; అది అయిదవ దినము.

24 మరియు, దేవుడు—వాటి వాటి జాతి ప్రకారము,
జీవముగల వాటిని, అనగా, వాటి వాటి జాతి ప్రకా
రము, పశువులు, పురుగులు, అడవి జంతువులును
భూమి కనునుగాకని పలికెను. ఆ ప్రకారమాయె
25 ను. । దేవుడు ఆయా జాతి ప్రకారము అడవి జంతు
వులను, ఆయా జాతి ప్రకారము పశువులను, ఆయా
జాతి ప్రకారము నేల పాకే ప్రతి పురుగును చేసెను.
దేవుడు అది మంచిదై ఉండుట చూచెను.

26 మరియు, దేవుడు—మా స్వరూపమందు మా పో
లికె చొప్పున నరులను చేయుదమనియు, వారు సము
ద్రపు చేపలను, ఆకాశ పక్షులను, పశువులను, సమస్త
భూమిని, భూమి మీద పాకే ప్రతి పురుగునును ఏలు
27 దురుగాకనియు పలికెను. । దేవుడు తన స్వరూపమం
దు నరుని సృజించెను. దేవుని స్వరూపమందు వాని
సృజించెను. స్త్రీనిగాను పురుషునిగాను వారిని
సృజించెను.

28 మరియు, దేవుడు వారిని ఆశీర్వదించెను; ఏలా
గంటే—మీరు ఫలాభివృద్ధి పొంది, విస్తరించి, భూమిని
నిండించి, దాని లోపరుచుకొనండి; సముద్రపు చేప
లను, ఆకాశ పక్షులను, భూమి మీద పాకే ప్రతి జీవి
నిని ఏలుదురుగాకని దేవుడు వారితో పలికెను.

29 మరియు, దేవుడు — ఇదుగో! భూమి మీదనున్న
విత్తనములిచ్చే ప్రతి చెట్టును, విత్తనములిచ్చే వృక్ష
ఫలము గల ప్రతి వృక్షమును మీకు ఇచ్చి ఉన్నా
30 ను; అవి మీకు ఆహారమై ఉండును. । అడవి జంతువు
లన్నిటికిని, ఆకాశ పక్షులన్నిటికిని, భూమి మీద
పాకే, జీవముగల వాటికన్నిటికిని పచ్చని చెట్లన్ని
యును ఆహారమై ఉండునని పలికెను. ఆ ప్రకార
మాయెను.

31 దేవుడు తాను చేసినది యావత్తును చూచినప్పుడు
ఇదుగో! అది మిక్కిలీ మంచిది. అప్పుడు అస్తమయ
మును ఉదయమును కలిగెను; అది ఆరవ దినము.

## 2. అధ్యాయము.

1 ఈలాగున ఆకాశము, భూమియు, వాటి సమస్త
2 ప్రకాశమాన సైన్యమును సంపూర్తి చేయబడెను.। దేవు
డు తాను చేసిన తన పని ఏడవ దినములోగా సం
పూర్తి చేసి, తాను చేసిన తన పని అంతటినుంచి ఏడవ
3 దినమందు విశ్రమించెను. । కాబట్టి దేవుడు ఆ ఏడవ
దినమును ఆశీర్వదించి పరిశుద్ధపరిచెను; ఎందుకంటే
దానిలో దేవుడు తాను చేయుటకు సృజించిన తన
పని అంతటినుంచి విశ్రమించెను.

యెహూవా దేవుడు భూమిని, ఆకాశమును చేసిన 4
దినమందు, ఆకాశ భూములు సృజించబడినప్పుడు,
వాటి వాటి వంశావళి ఇదే. । అదివరకు, పొలమందలి 5
ఏ పొదయును భూమి మీదను ఉండలేదు. పొలమందలి
ఏ చెట్టును మొలవలేదు; ఎందుకంటే యెహూవా
దేవుడు భూమి మీద వాన కురిపించలేదు. నేలను
సేద్యపరుచుటకు, నరుడు ఉండలేదు. । అయితే ఆవిరి 6
భూమినుంచి లేచి నేలంతటిని తడిపెను.

మరియు, యెహూవా దేవుడు నేల మంటితో 7
నరుని నిర్మించి వాని నాసికారంధ్రములలో జీవముల
ఊపిరిని ఊదెను; అప్పుడు నరుడు జీవముగలవా
డాయెను.

మరియు, యెహూవా దేవుడు తూర్పున ఏదెను 8
లో* ఒక తోట వేసి తాను నిర్మించిన నరుని దానిలో
ఉంచెను.। మరియు, యెహూవా దేవుడు, చూచుటకు 9
రమ్యమైనదిని, ఆహారమునకు మంచిదినైన ప్రతి వృక్ష
మును, ఆ తోట మధ్యను జీవముల వృక్షమును, మేలు
కీడుల తెలివి వృక్షమును నేలనుంచి మొలవ చేసెను.

మరియు, ఆ తోట తడుపుటకు ఏదెనులోనుంచి 10
ఒక నది బైలుదేరి అక్కడనుంచి వేరుబడి నాలుగు శా
ఖలాయెను. । మొదటిదాని పేరు పీషోను; అది బంగా 11
రమున్ను హవీలా దేశమంతటి చుట్టూ పారుచున్నది.।
ఆ దేశపు బంగారము మంచిది; అక్కడ బదోలహును,† 12
గోమేదకమును ఉన్నవి. । రెండవ నది పేరు గీహో 13
ను; అది కుష దేశమంతటిని చుట్టుకొనుచున్నది. । మూ 14
డవ నది పేరు హిద్దెకెలు; అది అష్షూరు తూర్పు
వైపున పారుచున్నది. నాలుగవ నది ఫరాతు.। మరియు, 15
యెహూవా దేవుడు నరుని తీసుకొని, ఏదెను తో
టను సేద్యపరుచుటకును, దాని కాచుటకును, దాని
లో వాని విశ్రమింపచేసెను.

మరియు, యెహూవా దేవుడు — ఈ తోటలో 16
నున్న ప్రతి వృక్ష ఫలములను తినవచ్చును; । అయితే 17
మేలు కీడుల తెలివి వృక్ష ఫలములను తినరాదు; నీవు
వాటిని తినే దినమున చావనే చచ్చెదవని నరునికి
ఆజ్ఞాపించెను.

మరియు, యెహూవా దేవుడు—నరుడు ఒంటిగా 18
ఉండుట మంచిది కాదు; వానికి సాటియైన సహాయ
మును వాని కొరకు చేయుదునని అనుకొనెను.

యెహూవా దేవుడు ప్రతి భూజంతువును, ప్రతి 19
ఆకాశ పక్షిని నేలనుంచి నిర్మించి, ఆదాము వాటికి
ఏ పేరు పెట్టునో చూచుటకు, అతని యొద్దికి వాటిని
రప్పించెను. జీవము గల ప్రతి దానికి ఆదాము ఏయే

*అనగా, పరమదేశము. † అది గుగ్గిలమని కొందరంటారు.

20 పేరు పెట్టెనో ఆయా పేరు దానిది.। అప్పుడు ఆదా
ము సమస్త పశువులకు, ఆకాశ పక్షులకు, సమస్త
భూజంతువులకును పేరులు పెట్టెను. అయితే ఆదా
మునకు సాటియైన సహాయము అతని కొరకు కనబడ
లేదు.

21 అప్పుడు యెహోవా దేవుడు ఆదామునకు గాఢ
నిద్ర కలుగచేసి, అతడు నిద్రించినప్పుడు, అతని పక్క
టెముకలలోను ఒకటి తీసి ఆచోటును మాంసముతో
22 పూడ్చెను.। తరువాత యెహోవా దేవుడు, తాను ఆ
దామునుంచి తీసిన పక్కటెముకను స్త్రీనిగా నిర్మించి,
23 ఆమెను ఆదాము యొద్దకి తీసుకొని వచ్చెను.। అప్పుడు
ఆదాము—సరి, ఈమె నా ఎముకలలో ఎముకయును,
నా మాంసములో మాంసమునై ఉన్నది. ఈమె
మనిషిలోనుంచి తియ్యబడెను గనుక ఈమె ఆడు
24 మనిషి అనబడునని పలికెను.। కాబట్టి మనుష్యుడు తన
తండ్రిని తన తల్లిని విడిచి తన భార్యతో హత్తుకొ
నును: వారు ఏక శరీరమై ఉందురు.

25 అప్పుడు వారిద్దరు, అనగా ఆదామును అతని భార్య
యును దిగంబరులై ఉండిరి; అయితే వారు సిగ్గు
పడలేదు.

## 3. అధ్యాయము.

1 యెహోవా దేవుడు చేసిన ప్రతి భూజంతువుకంటె
సర్పము యుక్తి గలదై ఉండెను. అది ఆ స్త్రీతో—
ఇది నిజమా? ఈ తోట వృక్షములలో దేని ఫలముల
నైనను మీరు తిన కూడదని దేవుడు చెప్పెనా? అని
2 పలికెను.। అందుకు స్త్రీ—ఈ తోట వృక్ష ఫలములను
3 మేము తినవచ్చును;। అయితే తోట మధ్యనున్న వృక్ష
ఫలములను గురించి దేవుడు—మీరు చావకనుండుటకు
వాటిని తిన కూడదనియు, వాటిని ముట్ట కూడదనియును
4 చెప్పెనని సర్పముతో పలికెను.। అందుకు సర్పము—
5 మీరు చావనే చావరు;। ఎందుకంటె మీరు వాటిని
తినే దినమున మీ కన్నులు తెరవబడుననియు, మీరు
మేలు కీడులను ఎరిగినవారై దేవతల వలెను ఉందురని
యు దేవునికి తెలుసునని స్త్రీతో పలికెను.

6 స్త్రీ ఆ వృక్ష ఫలము ఆహారమునకు మంచిదిని,
కన్నులకు అందమైనదిని, వివేకమిచ్చుటకు రమ్యమైన
వృక్షమునై ఉండుట చూచినప్పుడు, ఆమె దాని
ఫలములలో కొన్ని తీసుకొని తిని, తనతో ఉన్న తన
7 పెనిమిటికిని ఇచ్చెను. అతడు కూడా తినెను.। అప్పుడు
వారిద్దరి కన్నులు తెరవబడెను; అప్పుడు వారు, తాము
దిగంబరులై ఉండుట తెలుసుకొని, అంజూరపు ఆకు
లను కుట్టి తమకు కచ్చడములను చేసుకొనిరి.। అయితే 8
వారు, తోటలో సంచరించుచున్న యెహోవా దేవుని
శబ్దమును పగటి గాలి వేళను వినినప్పుడు, ఆదామును
అతని భార్యయును తోట చెట్ల మధ్యను యెహోవా
దేవుని సమ్ముఖమునుంచి దాగిరి.

అప్పుడు యెహోవా దేవుడు ఆదామును పిలిచి— 9
నీవు ఎక్కడ ఉన్నావనెను?। అందుకు అతడు—నేను 10
తోటలో నీ శబ్దము వినినప్పుడు, దిగంబరినై ఉన్నా
ను గనుక భయపడి దాగి ఉన్నాననెను.। అందుకు 11
ఆయన—నీవు దిగంబరివని నీకు తెలిపినవాడు ఎవడు?
నీవు తిన కూడదని నేను నీకు ఆజ్ఞాపించిన వృక్ష ఫల
ములు తిన్నావా అని పలికెను.। అందుకు ఆదాము— 12
నా యొద్దను ఉండుటకు నీవు నాకు ఇచ్చిన ఈ స్త్రీయే
ఆ వృక్ష ఫలములు కొన్ని నాకు ఇచ్చినందున, నేను
తిన్నానని పలికెను.

అప్పుడు యెహోవా దేవుడు స్త్రీతో—నీవు చేసి 13
నది ఏమిటి? అని పలికెను. అందుకు స్త్రీ—సర్పము
నన్ను మోసపుచ్చినందున తిన్నానని పలికెను.

అప్పుడు యెహోవా దేవుడు—నీవు దీని చేసినం 14
దున పశువులన్నిటికంటెను, భూజంతువులన్నిటికం
టెను నీవు శపించబడి నీ కడుపుతో నడుచుచు నీ
జీవిత దినములన్నిట మన్ను తినుదువుగాక.। మరియు, 15
నీకును స్త్రీకిని, నీ సంతానమునకును ఆమె సంతాన
మునకును వైరము కలుగచేతును. ఆయన నిన్ను తల
మీద కొట్టును. నీవు ఆయనను మడిమె మీద కొట్టు
దువని సర్పముతో చెప్పెను.

ఆయన స్త్రీని చూచి — నీవు గర్భవతివవుటవల్ల 16
నైన నీ వేదనను నేను మిక్కిలి హెచ్చించెదను; వేద
నతో పిల్లలను కందువు; నీ పెనిమిటి ఎడల నీకు
వాంఛ కలుగును; అతడు నిన్ను ఏలునని చెప్పెను.

ఆయన ఆదామును చూచి—నీవు నీ భార్య మాట 17
విని, నీవు తిన కూడదని నేను నీకు ఆజ్ఞాపించిన వృక్ష
ఫలములు తిన్నావు గనుక నీ నిమిత్తము నేల శపించ
బడి ఉన్నది; వేదనతో నీ జీవిత దినములన్నిట దాని
పంట తిందువు;। అది ముండ్ల పొదలను, రక్కసి చెట్లను 18
నీకు మొలిపించును; పొలములోని పంట తిందువు;।
నీవు నేలకు తిరిగి చేరే పర్యంతము నీ ముఖముయొక్క 19
చెమటవల్ల ఆహారము తిందువు; ఎందుకంటె నేలనుంచి
నీవు తియ్యబడితివి; నీవు మన్ను; తిరిగీ మంటికి చేరు
దువని చెప్పెను.

20 ఆదాము తన భార్యకు హవ్వ* అని పేరు పెట్టెను.
ఎందుకంటే ఆమె జీవము గల ప్రతివానికిని తల్లి.
21 యెహోవా దేవుడు ఆదామునకును అతని భార్యకును
చర్మపు చొక్కాలను చేయించి వారికి తొడగనిచ్చెను.
22 అప్పుడు యెహోవా దేవుడు—ఇదిగో! మేలు
కీడులను ఎరుగుటకు ఆదాము మనలోను ఒకని వలెను
ఉన్నాడు. కాబట్టి అతడు ఒకవేళ తన చెయ్యి చాచి
జీవముల వృక్ష ఫలములు కూడా తీసుకొని తిని నిరం
23 తరము జీవించునేమో అని అనుకొని । యెహోవా
దేవుడు, అతడు ఏ నేలనుంచి తియ్యబడెనో దాని
సేద్యపరచుటకు ఏదెను తోటలోనుంచి అతని పంపి
వేసెను.
24 అప్పుడు ఆయన ఆదామును వెళ్లగొట్టి ఏదెను తో
టకు తూర్పు దిక్కున కెరూబులనును, జీవముల వృక్ష
మార్గమును కాచుటకు ఇటు అటు తిరుగుచున్న ఖడ్గ
జ్వాలనును నిలువ బెట్టెను.

## 4. అధ్యాయము.

1 ఆదాము తన భార్యయైన హవ్వను ఎరిగినప్పుడు
ఆమె గర్భవతియై కయీనును కని—ఒక మనుష్యుని,
యెహోవాచే — నేను సంపాదించి ఉన్నానని అనెను.।
2 తరువాత ఆమె అతని తమ్ముడైన హేబెలును కనెను.
హేబెలు గొర్రెల కాపరియై ఉండెను. కయీను
భూమి సేద్యపరిచే వాడు.
3 కొన్ని దినములైన తరువాత, కయీను పొలముల
పంటలో కొంత యెహోవాకు కానుకగా తెచ్చెను.।
4 హేబెలు కూడా తన మందలో తొలుచూలున పుట్టి
కొవ్విన వాటిలో కొన్నిటిని తెచ్చెను. యెహోవా
హేబెలునును, అతని కానుకనును లక్ష్యపెట్టెను.।
5 అయితే కయీనును, అతని కానుకనును ఆయన లక్ష్య
పెట్టలేదు. కాబట్టి కయీనుకు మిక్కిలీ ఆగ్రహము
పుట్టి, అతడు తన తల వంచుకొనెను.
6 అప్పుడు యెహోవా కయీనుతో—నీకు ఎందుకు
ఆగ్రహము పుట్టెను? నీ తల ఎందుకు వంగి ఉ
7 న్నది? । నీవు సత్క్రియ చేసితే (తలను) ఎత్తుకొనవా?
సత్క్రియ చేయకపోతే వాకిట్లో పాపము పండుకొ
నుచున్నది; నీ యెడల దానికి వాంఛ కలుగును; నీవు
దాని ఏలుదువని చెప్పెను.
8 కయీను తన తమ్ముడైన హేబెలుతో చెప్పెను.
తరువాత వారు పొలములో ఉన్నప్పుడు, కయీను
తన తమ్ముడైన హేబెలుకు విరోధముగా లేచి అతని
చంపెను.

అప్పుడు యెహోవా — నీ తమ్ముడైన హేబెలు 9
ఎక్కడ ఉన్నాడని కయీనుతో పలికెను. అందుకు
అతడు—నేను ఎరుగను; నా తమ్ముని కాపాడేవాడను
నేనా? అని పలికెను. । అప్పుడు ఆయన—నీవు చేసినది 10
ఏమిటి? నీ తమ్ముని రక్తముయొక్క శబ్దము నేలనుంచి
నన్ను గూర్చి మొరబెట్టుచున్నది.। కాబట్టి నీ తమ్ముని 11
రక్తమును నీ చేతినుంచి పుచ్చుకొనుటకు తన నోరు
తెరిచిన ఈ నేలనుంచి, నీవు శపించబడినవాడవు;।
నీవు నేలను సేద్యపరచునప్పుడు, అది తన సారమును 12
ఇకమీదట నీకియ్యదు; నీవు భూమి మీద దిగులు
పడుచూ దేశదిమ్మరివై ఉందువని చెప్పెను.

అందుకు కయీను—నా అక్రమము భరించ లేనంత 13
గొప్పది. । ఇదిగో! నేడు ఈ ప్రదేశమునుంచి నన్ను 14
వెళ్లగొట్టితివి; నీ సమ్ముఖమునుంచిని వెలివేయబడి, భూ
మి మీద దిగులుపడుచూ, దేశదిమ్మరినై ఉందును.
కాబట్టి, నన్ను కనుగొనే వాడెవడో, వాడు నన్ను
చంపునని యెహోవాతో పలికెను.

అందుకు యెహోవా అతనితో—కాబట్టి ఎవ 15
డైనా కయీనును చంపితే, వానికి ప్రతి దండన
ఏడంతలు కలుగునని చెప్పెను. మరియు, ఎవడైనా
కయీనును కనుగొని అతని చంపకనుండుటకు, యె
హోవా అతనికి ఒక గురుతు పెట్టెను. । అప్పుడు 16
కయీను యెహోవా ఎదుటనుంచి బయలువెళ్లి ఏదె
నుకు తూర్పు దిక్కున, నోదు దేశములో కాపుర
ముండెను.

కయీను తన భార్యను ఎరిగినప్పుడు, ఆమె గర్భ 17
వతియై హనోకును కనెను. అప్పుడు అతడు ఒక
ఊరు కట్టించుచుండెను. ఆ ఊరికి హనోకనే తన
కుమారుని పేరు పెట్టెను.

హనోకుకు ఈరాదు పుట్టెను. ఈరాదు మహూ 18
యాయేలును కనెను. మహూయాయేలు మతూషా
యేలును కనెను. మతూషాయేలు లెమెకును కనెను.।
లెమెకు ఇద్దరు స్త్రీలను వివాహము చేసుకొనెను. 19
వారిలో ఒకదాని పేరు ఆదా; రెండవదాని పేరు
సిల్లా. । ఆదా యాబాలును కనెను. అతడు, పశువులు 20
గలవారై గుడారములలో నివసించే వారికి మూలమై
ఉండెను. । అతని సహోదరుని పేరు యూబాలు. 21
ఇతడు కిన్నెరనును పిల్లనగ్రోవినిని వాడికచేసే వారికి
అందరికిని మూలమై ఉండెను.

మరియు, సిల్లా కూడా తూబల్కయీనును కనె 22
ను. అతడు, రాగి ఇనుముల పని ముట్లకు అన్నిటికిని

* అనగా, జీవము.

పదును పెట్టేవాడు. తూబల్కయీను సహోదరి
పేరు నయమా.
23 లెమెకు తన భార్యలను చూచి
—ఓ ఆదా! ఓ సిల్లా! నా పలుకు వినుడి;
లెమెకు భార్యలారా! నా మాటను ఆలకించుడి: .
నా గాయమునకై ఒక మనుష్యుని,
నా దెబ్బకై ఒక పడుచువానిని చంపి ఉంటేనేమి!।
24 ఏడింతలు ప్రతిదండన కయీను కొరకైతే,
లెమెకు కొరకు డెబ్బది ఏడింతలుగా ఉండుననెను.

25 ఆదాము తిరిగీ తన భార్యను ఎరిగినప్పుడు ఆమె
కుమారుని కని—కయీను చంపిన హేబెలుకు ప్రతిగా
దేవుడు నాకు మరియొక సంతానమును నియమించెనని
26 అనుకొని, అతనికి షేతనే పేరు పెట్టెను.। మరియు,
షేతుకు కూడా కుమారుడు పుట్టెను; అతనికి ఎనో
షని పేరు పెట్టెను. అప్పుడు యెహోవా పేరట
ప్రార్థించుట ఆరంభమైనది.

## 5. అధ్యాయము.

1 ఆదాము వంశావళి గ్రంథము ఇదే. దేవుడు ఆదా
మును సృజించిన దినమున, దేవుని పోలికెగా అతని
2 చేసెను;। మగవానిగాను ఆడుదానిగాను వారిని సృ
జించి, వారు సృజించబడిన దినమందు వారిని ఆశీర్వ
దించి, వారికి ఆదామని పేరు పెట్టెను.

3 ఆదాము నూట ముప్పది ఏండ్లు బ్రతికి, తన పోలి
కెగా తన స్వరూపము చొప్పున కుమారుని కని, అత
4 నికి షేతని పేరు పెట్టెను.। షేతును కనిన తరువాత,
ఆదాము దినములు ఎనమన్నూరు ఏండ్లు. అతడు కుమా
5 రులను కుమార్తెలను కనెను.। ఆదాము బ్రతికిన దిన
ములన్నియు తొమ్మన్నూట ముప్పది ఏండ్లు; అప్పుడు
అతడు మృతిబొందెను.

6 షేతు నూట అయిదేండ్లు బ్రతికి ఎనోషును
7 కనెను.। ఎనోషును కనిన తరువాత షేతు ఎనమ
న్నూట ఏడేండ్లు బ్రతికి, కుమారులను కుమార్తెలను
8 కనెను.। షేతు బ్రతికిన దినములన్నియు తొమ్మ
న్నూట పన్నెండు ఏండ్లు; అప్పుడు అతడు మృతి
బొందెను.

9 ఎనోషు తొంబది సంవత్సరములు బ్రతికి కేయి
10 నానును కనెను.। కేయినానును కనిన తరువాత,
ఎనోషు ఎనమన్నూట పదిహేను ఏండ్లు బ్రతికి,
11 కుమారులను కుమార్తెలను కనెను.। ఎనోషు దినముల
న్నియు తొమ్మన్నూట అయిదేండ్లు; అప్పుడు అతడు
మృతిబొందెను.

కేయినాను డెబ్బది ఏండ్లు బ్రతికి మహలలేలును 12
కనెను.। మహలలేలును కనిన తరువాత కేయినాను 13
ఎనమన్నూట నలుబది ఏండ్లు బ్రతికి, కుమారులను
కుమార్తెలను కనెను.। కేయినాను దినములన్నియు 14
తొమ్మన్నూట పది ఏండ్లు; అప్పుడు అతడు మృతిబొం
దెను.

మహలలేలు అరువది ఐదేండ్లు బ్రతికి యెరెదును 15
కనెను.। యెరెదును కనిన తరువాత, మహలలేలు ఎన 16
మన్నూట ముప్పది ఏండ్లు బ్రతికి, కుమారులను కుమా
ర్తెలను కనెను.। మహలలేలు దినములన్నియు ఎనమ 17
న్నూట తొంబది ఐదేండ్లు; అప్పుడు అతడు మృతి
బొందెను.

యెరెదు నూట అరువది రెండేండ్లు బ్రతికి హనో 18
కును కనెను.। హనోకును కనిన తరువాత యెరెదు 19
ఎనమన్నూరేండ్లు బ్రతికి, కుమారులను కుమార్తెలను
కనెను.। యెరెదు దినములన్నియు తొమ్మన్నూట అరు 20
వది రెండేండ్లు; అప్పుడు అతడు మృతిబొందెను.

హనోకు అరువది అయిదేండ్లు బ్రతికి మతూషె 21
లహును కనెను.। హనోకు మతూషెలహును కనిన 22
తరువాత మున్నూరేండ్లు దేవునితో కూడా నడుచుచు,
కుమారులను కుమార్తెలను కనెను.। హనోకు దినముల 23
న్నియు మున్నూట అరువది ఐదేండ్లు.। హనోకు 24
దేవునితోకూడా నడుచుచున్నప్పుడు, అతడు లేకపో
యెను; ఎందుకంటే దేవుడు అతని తీసుకొనెను.

మతూషెలహు నూట ఎనబది ఏడేండ్లు బ్రతికి 25
లెమెకును కనెను.। మతూషెలహు లెమెకును కనిన 26
తరువాత, ఏడ్నూట ఎనబది రెండేండ్లు బ్రతికి, కుమా
రులను కుమార్తెలను కనెను.। మతూషెలహు దినము 27
లన్నియు తొమ్మన్నూట అరువది తొమ్మిది ఏండ్లు;
అప్పుడు అతడు మృతిబొందెను.

లెమెకు నూట ఎనబధి రెండేండ్లు బ్రతికి ఒక 28
కుమారుని కని।—ఇతడు యెహోవా శపించిన భూమి 29
వల్లనైన మన చేతుల కష్టములనుంచియును మన పని
నుంచియును మనకు నెమ్మది కలుగ జేసునని అనుకొని,
అతనికి నోవహు అని పేరు పెట్టెను.

లెమెకు నోవహును కనిన తరువాత ఏనూట తొం 30
బది ఐదేండ్లు బ్రతికి, కుమారులను కుమార్తెలను కనె
ను.। లెమెకు దినములన్నియు ఏడ్నూట డెబ్బది 31
ఏడేండ్లు; అప్పుడు అతడు మృతిబొందెను.। నోవ 32
హు ఏనూరేండ్లు గలవాడై షేమును, హామును, యాపె
తును కనెను.

## 6. అధ్యాయము.

1 మరియు, నరులు* భూమి మీద విస్తరించుటకు
మొదలు బెట్టినప్పుడు కుమార్తెలు వారికి పుట్టిరి. ।
2 అప్పుడు దేవుని కుమారులు నరుల కుమార్తెలు చక్కని
వారై ఉండుట చూచి వారందరిలో తమకు మనస్సు
వచ్చిన స్త్రీలను వివాహము చేసుకొనిరి.

3 అప్పుడు యెహోవా—నా ఆత్మ నరులతో ఎల్ల
ప్పుడును వాదించదు; వారు తమ అక్రమమున మాం
సమై ఉన్నారు; అయితే వారి దినములు నూట ఇరు
వది ఏండ్లవునని పలికెను.

4 ఆ దినములలో, నాపీలులు భూమి మీదనుండిరి.
అంతేకాదు; దేవుని కుమారులు నరుల కుమార్తెల యొ
ద్దికి చేరినప్పుడు వారికి పిల్లలను కనిరి. పూర్వకాల
మందు పేరుపొందిన శూరులు వీరే.

5 అప్పుడు యెహోవా నరుల చెడుతనము భూమి
మీద విస్తారమైనదై నిండి ఉండుటయును, వారి హృ
దయము యొక్క తలంపుల సంకల్పమంతయు ప్రతి
దినము కేవలము చెడ్డదై ఉండుటయును చూచిన
6 ప్పుడు, । యెహోవా తాను భూమి మీద నరులను
చేసినందువల్ల సంతాపము పొంది, తన హృదయము
7 లో నొచ్చుకొనెను. । అప్పుడు యెహోవా—నేను
సృజించిన నరులను, నరులు మొదలుకొని జంతువులు,
పురుగులు, ఆకాశ పక్ష్యాదుల పర్యంతము, భూమి
మీదనుంచి తుడిచి వేయుదును; ఎందుకంటే నేను
వారిని చేసినందువల్ల సంతాపము పొంది ఉన్నానని
8 పలికెను. । అయితే నోవహు యెహోవా కన్నుల
ఎదుట దయ పొందెను.

9 నోవహు వంశావళి ఇదే. నీతిపరుడైన నోవహు
తన కాలపు వారిలో యథార్థవంతుడు. నోవహు
10 దేవునితో కూడా నడిచేవాడు. । నోవహు షేము,
హాము, యాపెతనే ముగ్గురు కుమారులను కనెను.

11 భూమి దేవుని ఎదుట చెడిపోయి ఉండెను;
12 భూమి బలాత్కారముతో నిండి ఉండెను. । దేవుడు
భూమిని చూచినప్పుడు, ఇదుగో! అది చెడిపోయి
ఉండెను; ఏలాగంటే భూమి మీద సమస్త శరీరులు
13 తమ మార్గమును చెరిపివేసుకొని ఉండిరి. । అప్పుడు
దేవుడు నోవహును చూచి — నా ఎదుట సమస్త
శరీరుల అంతము వచ్చి ఉన్నది; ఎందుకంటే వారిమూ
లముగా భూమి బలాత్కారముతో నిండి ఉన్నది
గనుక ఇదుగో! వారిని భూమితో కూడా నాశము
14 చేయుదును. । గోపెరు కర్రతో నీ కొరకు నావను
చేసుకొనుము. గదులు పెట్టి ఆ నావను చేసి లో
పటను వెలపటను దానికి కీలు రాయ వలెను. । నీవు 15
ఈలాగున దాని చేయ వలసినది; ఆ నావ మున్నూరు
మూరల పొడుగును, ఏబది మూరల వెడల్పును ముప్పది
మూరల ఎత్తును గలదై ఉండ వలెను. । ఆ నావకు 16
కిటికి చేసి, పైని మూరెడు మట్టుకు దాని ముగించ
వలసినది. నావ తలుపు దాని పక్కను ఉంచ వలసి
నది. కిందిది రెండవది మూడవదియైన మూడు అంత
స్థులు గలదానిగా దాని చేయ వలెను. । ఇదుగో! నేనే 17
జీవాత్మగల సమస్త శరీరులను ఆకాశము కిందనుంచి
నాశము చేయుటకు, దేశము మీదికి జలప్రళయము
రా చేయుచున్నాను. దేశమందలి సమస్తమును చని
పోవును; । అయితే నీతో నా నిబంధన స్థిరపరుచు 18
దును. నీవును, నీతో కూడా నీ కుమారులును, నీ
భార్యయు, నీ కుమారుల భార్యలును ఆ నావలో
ప్రవేశించ వలసినది. । మరియు, నీతో బ్రతికి ఉండే 19
లాగున సమస్త జీవులలో అనగా, సమస్త శరీరుల
యొక్క ప్రతి జాతిలోనివి రెండేసి చొప్పున, నీవు
నావలోకి చేర్చవలెను. వాటిలో మగదిని ఆడుదిని
ఉండ వలసినది. । వాటి వాటి జాతి ప్రకారము పక్షు 20
లలోను, వాటి వాటి జాతి ప్రకారము జంతువుల
లోను, వాటి వాటి జాతి ప్రకారము నేల పాకే
అన్నిటిలోనును, ప్రతి జాతిలో రెండేసి చొప్పున,
బ్రతికి ఉండేలాగున నీ యొద్దికి అవి చేరును. । మరి 21
యు, తినబడే నానా విధమైన ఆహార పదార్థములను
నీవు నీ కొరకు తీసుకొనుము. నీవు వాటిని కూర్చు
కొన్నప్పుడు, అవి నీకును వాటికిని ఆహారమవునని
పలికెను.

నోవహు దాని చేసెను; దేవుడు అతనికి ఆజ్ఞా 22
పించిన అన్నిటి ప్రకారము చేసెను.

## 7. అధ్యాయము.

అప్పుడు యెహోవా — ఈ కాలపు వారిలో 1
నీవే నా ఎదుట నీతిమంతుడవై ఉండుట చూచితిని
గనుక, నీవును నీ ఇంటివారును నావలో ప్రవేశిం
చుడి. । పవిత్ర జంతువులలో ప్రతిజాతి పోతు పెంటు 2
లైనవి ఏడును; పవిత్రములు కాని జంతువులలో
ప్రతిజాతి పోతు పెంటులైనవి రెండును; । మరియు, 3
ఆకాశ పక్షులలో ప్రతిజాతి మగదిని ఆడుదియైనవి
ఏడును, నీవు దేశమంతటి మీద సంతతిని జీవముతో
కాపాడే కొరకు నీ యొద్దికి చేర్చుకొనుము; । ఎందు 4
కంటే ఇంకా ఏడు దినములకు నేను దేశము మీద

*లేక, ఆదాము సంతానము.

నలుబది దినములును నలుబది రాత్రులును వర్షము
కురిపించి, నేను చేసిన సమస్త జీవరాసులను భూమి
మీదనుంచి తుడిచి వేయుదునని నోవహుతో చెప్పెను.

5 నోవహు తనకు యెహోవా ఆజ్ఞాపించిన అన్నిటి
6 ప్రకారము చేసెను. । ఆ జలప్రవాహము భూమి మీ
దికి వచ్చినప్పుడు నోవహు ఆర్నూరు ఏండ్లు గల
వాడు.

7 అప్పుడు నోవహు, అతనితో కూడా అతని కుమా
రులు, అతని భార్య, అతని కుమారుల భార్యలును ఆ
జలప్రళయ జలముల ఎదుటనుంచి తప్పించుకొని, ఆ
8,9 నావలో ప్రవేశించిరి. । దేవుడు నోవహుకు ఆజ్ఞా
పించిన ప్రకారము పవిత్ర జంతువులలోను పవిత్రత
లేని జంతువులలోను, పక్షులలోను, నేల పాకే
వాటి అన్నిటిలోనును మగది ఆడుది జత జతలుగా
10 నావలోనున్న నోవహు యొద్దికి చేరెను. । ఏడు దిన
ములైన తరువాత ఆ ప్రవాహ జలములు భూమి మీద
ఉండెను.

11 నోవహు వయసుయొక్క ఆర్నూరవ సంవత్సర
ము రెండవ నెల పదిహేడవ దినమున మహా గాధము
యొక్క ఊటలన్నియు ఆ దినమందే విడబడెను; ఆకా
12 శపు తూములు విప్పబడెను; । నలుబది దినములును
నలుబది రాత్రులును ప్రచండ వర్షము భూమి మీద
13 కురిసెను. । ఆ దినమందే నోవహును, నోవహు కుమా
రులైన షేము, హాము, యాపెతును, నోవహు భార్య
యును, వారితో కూడా అతని కుమారుల ముగ్గురు
14 భార్యలును ఆ నావలో ప్రవేశించిరి. । వీరే కాదు,
ఆయా జాతి ప్రకారము ప్రతి మృగమును, ఆయా
జాతి ప్రకారము ప్రతి పశువును, ఆయా జాతి
ప్రకారము నేల పాకే ప్రతి పురుగును, ఆయా జాతి
ప్రకారము ప్రతి పక్షియు, నానా విధములైన రెక్క
15 లు గల ప్రతి పిట్టయు ప్రవేశించెను. । జీవాత్మగల
సమస్త శరీరులలో జత జతలుగా నావలోనున్న నో
16 వహు యొద్ద ప్రవేశించెను. । ప్రవేశించినవన్నియు,
దేవుడు అతనికి ఆజ్ఞాపించిన ప్రకారము, సమస్త శరీ
రులలో మగది ఆడుదిని ప్రవేశించెను; అప్పుడు యె
హోవా తలుపు మూసెను.

17 ఆ జలప్రళయము నలుబది దినములు భూమి మీద
ఉన్నప్పుడు జలములు విస్తరించి నావను తేల చేసినం
18 దున అది భూమి మీదనుంచి పైకెత్తబడెను. । జలములు
ఆ దేశము మీద ప్రచండముగా ప్రబలించి మిక్కిలీ
19 విస్తరించినప్పుడు నావ నీళ్ల మీద నడిచెను. । ఆ ప్రచండ
జలములు దేశము మీద అత్యధికముగా ప్రబలించినం
దున, ఆకాశమంతటి కిందనున్న గొప్ప పర్వతములన్ని
యు కప్పబడెను. । పదిహేను మూరల ఎత్తున నీళ్లు 20
ప్రచండముగా ప్రబలించెను. పర్వతములును కప్పబ
డెను. । అప్పుడు పక్షులకేమి, పశువులకేమి, మృగముల 21
కేమి, భూమి మీద విస్తరించే పురుగులకేమి, భూమి
మీద సంచరించే సమస్త శరీరులకేమి, సమస్త నరుల
కేమి ప్రాణములు పోయెను. । ఆరిన నేల మీదనున్న 22
అన్నిటిలోను, నాసికారంధ్రములలో జీవాత్మయొక్క
ఊపిరి గలవన్నియు చనిపోయెను. । నరులు మొదలు 23
కొని పశువులు, పురుగులు, ఆకాశ పక్షుల పర్యంత
మును నేల మీదనున్న జీవరాసులన్నియు తుడిచి
వేయబడెను. అవి భూమి మీదనుంచి తుడిచివేయ
బడెను. నోవహును అతనితో కూడా ఆ నావలో
ఉన్నది యావత్తును మాత్రమే మిగిలి ఉండెను. ।
ఏబది దినముల పర్యంతము నీళ్లు భూమి మీద ప్రచం 24
డముగా ప్రబలించెను.

## 8. అధ్యాయము.

అప్పుడు దేవుడు నోవహును, అతనితో కూడా 1
నావలో ఉన్న సమస్త జంతువులను, సమస్త పశువు
లను జ్ఞాపకము చేసుకొనెను. అప్పుడు దేవుడు ఆ
దేశము మీద వాయువును ప్రసరింప చేసినందువల్ల
నీళ్లు అణిగిపోయెను. । అగాధముయొక్క ఊటలును 2
ఆకాశపు తూములును మూయబడెను; ఆకాశము
నుంచి కురియుచున్న ప్రచండ వర్షము నిలపబడెను. ।
అప్పుడు నీళ్లు భూమి మీదనుంచి క్రమక్రమముగా 3
తీసిపోవుచుండెను. నూట ఏబది దినముల అంతము
నుంచి నీళ్లు తగ్గి పోయెను.

ఏడవ నెల పదిహేడవ దినమందు, నావ అరా 4
రాతు కొండల మీద నిలిచెను. । నీళ్లు పదియవ నెల 5
వరకు తగ్గుచు వచ్చెను. పదియవ నెల మొదటి దిన
మందు, కొండల శిఖరములు కనబడెను.

నలుబది దినముల అంతమందు నోవహు తాను 6
చేసిన నావ కిటికి తీసి, । ఒక కాకోలమును వెలపలికి 7
విడిచెను. అది బైలువెళ్లి భూమి మీదనుంచి నీళ్లు ఇనికి
పోయిన వరకు ఇటు అటు తిరుగుచుండెను. । మరియు, 8
నీళ్లు నేల మీదనుంచి తక్కువైనవో లేదో చూచు
టకు తన యొద్దనుంచి ఒక గువ్వను వెలపలికి విడి
చెను. । అయితే నీళ్లు భూమి అంతటి మీద ఉన్నం 9
దున ఆ గువ్వ విశ్రమించుటకు తన అరకాలికి స్థలము
దొరకక లేదు గనుక నావలో ఉన్న అతని యొద్దికి
తిరిగి వచ్చెను. అప్పుడు అతడు చెయ్యి చాపి దాని
పట్టుకొని నావలోకి తీసుకొనెను.

అతడు మరి ఏడు దినములు తాళి, తిరిగీ గువ్వను 10
నావలోనుంచి వెలపలికి విడిచెను. । సాయంకాలమున 11

ఆ గువ్వ అతని యొద్దికి చేరెను; అప్పుడు ఇదుగో,
త్రుంచబడిన ఒలీవ ఆకు దాని నోటను ఉండెను,
కాబట్టి నీళ్లు భూమి మీదనుంచి తగ్గిపోయెనని నో
12 వహుకు తెలిసెను. । అతడు, ఇంకా మరి ఏడు దిన
ములు తాళి ఆ గువ్వను వెలపలికి విడిచెను. ఆ తరు
వాత అది అతని యొద్దికి తిరిగీ రాలేదు.

13 మరియు, ఆరునూట ఒకటవ సంవత్సరము, మొ
దటి నెల తొలి దినమున, నీళ్లు భూమి మీదనుంచి
ఇనికి పోయెను. నోవహు నావ కప్పును విడదీసి
14 చూచినప్పుడు, ఇదుగో! నేల ఆరి ఉండెను. । రెం
డవ నెల ఇరువది ఏడవ దినమున భూమి ఎండీ
ఉండెను.

15,16 అప్పుడు దేవుడు—నీవును, నీతో కూడా నీ భార్య
యును, నీ కుమారులును, నీ కుమారుల భార్యలును
17 నావలోనుంచి బైలువెళ్లుడి. । పక్షులు, పశువులు, భూ
మి మీద పాకే ప్రతి జాతి పురుగులు మొదలైన
సమస్త శరీరులలో నీతో కూడా ఉన్న ప్రతి జంతు
వును వెంటబెట్టుకొని వెలపలికి రా వలసినది. అవి
భూమి మీద బహుగా విస్తరించి భూమి మీద ఫలాభి
18 వృద్ధి పొంద వలెనని నోవహుతో చెప్పెను. । కాబట్టి
నోవహు, అతనితో కూడా అతని కుమారులు, అతని
భార్యయు అతని కుమారుల భార్యలును బైలువెళ్లిరి. ।
19 ప్రతి జంతువు, పాకే ప్రతి పురుగు, ప్రతి పిట్టయు
భూమి మీద సంచరించేది యావత్తును వాటి వాటి
జాతుల చొప్పున ఆ నావలోనుంచి బైలువెళ్లెను.

20 అప్పుడు నోవహు యెహోవా నిమిత్తము యజ్ఞ
వేదిక కట్టి పవిత్రమైన పశువులన్నిటిలోనును పవిత్ర
మైన పక్షులన్నిటిలోనును కొన్ని తీసుకొని, ఆ వేదిక
21 మీద హోమము చేసెను. । అప్పుడు యెహోవా
ఇంపైన సువాసన చూచి — ఇకమీదట నరుల నిమి
త్తము ఈ నేలను తిరిగీ శపించను; ఎందుకంటే నరుల
హృదయముయొక్క సంకల్పము వారి బాల్యమునుంచి
చెడ్డది. నేను చేసిన ప్రకారముగా ఇకను సమస్త జీవ
22 ములను సంహరించను. । భూమి ఉన్న దినములన్ని, విత్తే
కాలమును, కోతకాలమును, చలివెట్టలును, వసంత శీత
కాలములును, దివారాత్రములును ఉండక మానవని
తన హృదయములో అనుకొనెను.

## 9. అధ్యాయము.

1 మరియు, దేవుడు నోవహును, అతని కుమారు
లను ఆశీర్వదించి — మీరు ఫలాభివృద్ధిని పొంది విస్త
2 రించి భూమిని నిండించుడి. । మీ భయమును మీ బెదు
రును అడవి జంతువులన్నిటికి, ఆకాశ పక్షులన్నిటికి,
నేలను సంచరించే ప్రతి పురుగునకు, సముద్రపు చేప
లన్నిటికిని ఉండును. అవి మీ చేతికి అప్పగించబడి
యున్నవి. । జీవము గల సమస్త చరములు మీకు ఆహా 3
రమై ఉండును: పచ్చని కూరను వలె ఆ సమస్తమును
మీకిచ్చి ఉన్నాను. । అయితే మాంసమును దాని రక్త 4
ముతో మీరు తిన కూడదు; దాని ప్రాణమది.

మరియు, మీకు ప్రాణమై ఉన్న మీ రక్తమును 5
గురించి విచారణ చేయుదును; దాని గూర్చి ప్రతి జం
తువునును, నరులనును విచారణ చేయుదును; ప్రతి
నరుని ప్రాణమును గురించి వాని సహోదరుని విచా
రణ చేయుదును. । నరుని రక్తమును చిందించే వాడె 6
వడో వాని రక్తము నరునివల్ల చిందించబడును. ఎం
దుకంటే దేవుని స్వరూపమందు నరుని చేసెను. ।
మీరు సంతానవంతులై, విస్తరించి భూమియందు మహా 7
భివృద్ధి పొంది విస్తరించుడని వారితో చెప్పెను.

మరియు, దేవుడు నోవహును, అతని కుమారు 8,9
లను చూచి । — ఇదుగో! నేను మీతోను, మీ తరు 10
వాత మీ సంతానముతోను, పక్షులేమి పశువులేమి
మీతో కూడా సమస్తమైన భూజంతువులేమి నావలో
నుంచి బైలువెళ్లినవి మొదలుకొని సమస్తమైన భూజం
తువుల పర్యంతము, మీతో కూడా ఉన్న ప్రతి జీవి
తోను నా నిబంధన స్థిరపరుచుచున్నాను. । నేను 11
మీతో నా నిబంధన స్థిరపరుచుదును; సమస్త శరీరులు
ప్రవాహ జలములవల్ల ఇకను లయపరచబడవు. భూమి
నాశము చేయుటకు ఇకను జలప్రళయము కలగదని
పలికెను.

మరియు, దేవుడు—నాకును మీకును, మీతో కూ 12
డా ఉన్న జీవముగల ప్రతి దానికిని మధ్యను నేను
నిత్యమైన తరముల మట్టుకు నియమించుచున్న నిబంధ
నకు గురుతు ఇదే; । మేఘములో నా ధనుస్సును నియ 13
మించి ఉన్నాను; అది నాకు భూమికి మధ్యను
నిబంధనకు గురుతై ఉండును. । భూమి పైకి నేను మే 14
ఘమును రప్పించేటప్పుడు, ఆ ధనుస్సు మేఘములో
కనబడును. । అప్పుడు నేను నాకును మీకును, సమస్త 15
శరీరులలో జీవముగల ప్రతి దానికిని మధ్యనున్న నా
నిబంధన జ్ఞాపకము చేసుకొందును గనుక సమస్త శరీ
రులను నాశము చేయుటకు, నీళ్లు ఇకను ప్రవాహ
ముగా రావు. । ఆ ధనుస్సు మేఘములోను ఉండును. 16
నేను దేవునికిని, భూమి మీద ఉన్న సమస్త శరీరు
లలో జీవముగల ప్రతి దానికిని మధ్యనున్న నిత్య
నిబంధన జ్ఞాపకము చేసుకొనుటకు దాని చూచెదనని
పలికెను. । అప్పుడు దేవుడు—నాకును భూమి మీద 17
ఉన్న సమస్త శరీరులకును మధ్యను నేను స్థిరపరిచిన
నిబంధనకు గురుతు ఇదే అని నోవహుతో చెప్పెను.

18 నావలోనుంచి బైలువెళ్లిన నోవహు కుమారులు
షేము, హాము, యాపెతనే వారు; హాము కనానుకు
19 తండ్రి. । ఈ ముగ్గురు నోవహు కుమారులు. వీరి
సంతానము భూమి యందంతట వ్యాపించెను.

20 నోవహు వ్యవసాయకుడై, ద్రాక్షతోట వేయుట
21 మొదలుబెట్టి, । దాని ద్రాక్షా రసము తాగి, మత్తుడై,
22 తన గుడారములో వస్త్రహీనుడై ఉండెను. । అప్పుడు
కనానుకు తండ్రియైన హాము తన తండ్రి వస్త్రహీనుడై
ఉండుట చూచి బైటనున్న తన ఇద్దరు సహోదరు
23 లకు ఆ సంగతి తెలిపెను. । అప్పుడు షేమును యా
పెతును వస్త్రమును తీసుకొని తమ ఇద్దరి భుజముల
మీద వేసుకొని వెనుకకు నడిచి వెళ్లి, తమ తండ్రి దిస
మొలను కప్పిరి. వారి ముఖములు వెనుకతట్టు ఉండు
24 టవల్ల, తమ తండ్రి దిసమొలను చూడలేదు. । అప్పుడు
నోవహు తన మత్తునుంచి మేలుకొని, తన చిన్న కుమా
రుడు తనను గూర్చి చేసిన దాని తెలుసుకొనెను. ।
25 అప్పుడు అతడు — కనాను శపించబడినవాడై, తన
26 సహోదరులకు దాసుల దాసుడై ఉండుననెను. । మ
రియు అతడు—షేము దేవుడైన యెహోవా స్తుతిం
చబడునుగాక. అతనికి కనాను దాసుడై ఉండును. ।
27 దేవుడు యాపెతును విశాలపరుచును. షేముయొక్క
గుడారములలో నివసించును. అతనికి కనాను దా
సుడై ఉండునని పలికెను.

28 జలప్రళయము గతించిన తరువాత నోవహు ము
29 న్నూట యేబది ఏండ్లు బ్రతికెను. । నోవహు బ్రతి
కిన దినములన్నియు తొమ్మన్నూట ఏబది ఏండ్లు,
అప్పుడు అతడు మృతిపొందెను.

## 10. అధ్యాయము.

1 ఇది నోవహు కుమారులైన షేము, హాము, యాపె
తనే వారి వంశావళి. వరద తరువాత వారికి కుమా
రులు పుట్టిరి.

2 యాపెతు కుమారులు గోమెరు, మాగోగు, మాదయి,
3 యావాను, తుబాలు, మెషెకు, తీరసనేవారు. । గోమెరు
కుమారులు అష్కనజు, రీపతు, తోగర్మా, అనేవారు. ।
4 యావాను కుమారులు ఎలీషా, తర్షీషు, కిత్తీము, దోదా
5 నీమనేవారు. । వీరివల్ల రాష్ట్రముల ద్వీపములు వారి
వారి రాష్ట్రములలో వారి వారి భాషల ప్రకారము,
వారి వారి వంశముల ప్రకారము, వారి వారి దేశము
లలో వేరుపరచబడెను.

హాము కుమారులు కూషు, మిస్రాయిము, పూతు, 6
కనాననేవారు. । కూషు కుమారులు సబా, హవీలా, 7
సబ్తా, రాయమా, సబ్తకా అనేవారు. రాయమా కుమా
రులు షెబా, దదాను అనేవారు. । కూషు నిమ్రోదును 8
కనెను. అతడు భూమి మీద పరాక్రమశాలియై ఉం
డుటకు ఆరంభించెను. । అతడు యెహోవా ఎదుట 9
పరాక్రమము గల వేటకాడై యుండెను. కాబట్టి—
యెహోవా ఎదుట పరాక్రమము గల వేటకాడైన
నిమ్రోదు వలె అని వాడబడుచున్నది. । షిన్యారు దేశ 10
ములోని బాబెలు, ఎరెకు, అక్కదు, కల్నే అనేవి
అతని రాజ్యమునకు మొదలు. । ఆ దేశములోనుంచి 11
అష్షూరుకు* బైలువెళ్లి, నీనవెను రహోబోతీరును,
కాలహును । నీనవెకును కాలహుకును మధ్యనుండే రెసె 12
నును కట్టించెను. ఇది గొప్ప పట్టణము.

మిస్రాయిము లూదీమును, అనామీమును, లహాబీ 13
మును, నప్తుహీమును, । పత్రుసీమును, పిలిష్తీము బైలు 14
దేరి వచ్చిన కస్లూహీమును, కఫ్తోరీమునును కనెను.

కనాను తన ప్రథమ కుమారుడైన సీదోనును, హే 15
తును । యబూసీయులను అమోరీయులను, గిర్గాషీ 16
యులను । హివ్వీయులను, అర్కీయులను, సీనీయుల 17
ను, । అర్వాదీయులను, సమారీయులను హమాతీయు 18
లను కనెను. తరువాత కనానీయుల వంశములు వ్యా
పించెను. । కనానీయుల ప్రాంతము సీదోనునుంచి 19
గెరారుకు వెళ్లే మార్గములో గాజా మట్టుకును, సొ
దొమ, గొమొర్రా, అద్మా, సబోయిములకు వెళ్లే మా
ర్గములో లాషా మట్టుకును ఉన్నది. । వీరు తమ తమ 20
వంశముల ప్రకారము, తమ తమ భాషల ప్రకారము,
తమ తమ దేశములలోను జనాంగములలోను హాము
కుమారులై ఉన్నారు.

మరియు ఏబెరు సమస్త కుమారులకు తండ్రియును 21
పెద్దైన యాపెతు సహోదరుడునైన షేముకు కూడా
(సంతానము) పుట్టెను. । షేము కుమారులు ఏలాము, 22
అష్షూరు, అర్పక్షదు, లూదు, అరామనేవారు. ।
అరాము కుమారులు ఊసు, హూలు, గెతెరు, మాషనే 23
వారు. । అర్పక్షదు షెలహును కనెను. షెలహు ఏబె 24
రును కనెను. । ఏబెరుకు యిద్దరు కుమారులు పుట్టిరి. 25
(వారిలో) ఒకని పేరు పెలగు;† ఎందుకంటే అతని
దినములలో భూమి విభాగించబడెను. అతని సహో
దరుని పేరు యొక్తాను. । యొక్తాను అల్మోదాదును, 26
షెలపును, హసర్మావెతును, యెరహును, । హదోరమును, 27

* లేక, అష్షూరు. † అనగా, విభాగము.

28 ఊజాలును, దిక్లాను, ఓబాలును, అబీమాయేలును, షె
29 బాను, ఓఫీరును, హవీలాను, యోబాబును కనెను.
30 వీరందరు యొక్తాను కుమారులు. వారి నివాసస్థలము
మేషానుంచి సపారాకు వెళ్లే మార్గములోని తూర్పు
కొండలు.
31 వీరు తమ తమ వంశముల ప్రకారము, తమ తమ
భాషల ప్రకారము, తమ తమ దేశముల యందు తమ
తమ రాష్ట్రముల ప్రకారమును షేము కుమారులు.
32 వారి వారి జనములలో వారి వారి సంతతుల ప్రకా
రము, నోవహు కుమారుల వంశములు ఇవే. జలప్ర
వాహము గతించిన తరువాత వీరివల్ల రాష్ట్రములు
భూమి మీద ప్రత్యేకించబడెను.

## 11. అధ్యాయము.

1 భూమి యందంతట, ఒక్క పలుకును ఒక్క భాష
2 యును ఉండెను. వారు తూర్పున ప్రయాణమై వెళ్లు
చుండగా షిన్యారు దేశమందు ఒక మైదానము వారికి
3 కనబడెను. అక్కడ వారు నివసించి మనము ఇటి
కలు చేసి బాగా కాల్చుదము రండని ఒకనితో ఒకడు
మాట్లాడుకొనిరి. రాళ్లకు ప్రతిగా ఇటికలును, అడు
4 సుకు ప్రతిగా మట్టికీలును వారికి ఉండెను. మరియు
వారు—మనము భూమి యందంతట చెదిరి పోకుండా
ఒక పట్టణమును, ఆకాశమునంటే శిఖరము గల ఒక
గోపురమునను కట్టుకొని మనకు పేరు కలుగచేసు
కొందము రండని మాట్లాడుకొనిరి.
5 అప్పుడు యెహోవా నరుల కుమారులు కట్టిన
పట్టణము గోపురమును చూచుటకు దిగి వచ్చెను.
6 అప్పుడు యెహోవా—ఇదుగో! జనము ఒక్కటే.
వారికందరికి పలుకు ఒకటే. వారి క్రియలకు ఇది
ఆరంభము. ఇక మీదట వారు చేయ తలంచే యే పని
అయినా చేయకుండా వారికి ఆతంకమేమియు ఉం
7 డదు. గనుక మనము దిగివెళ్లి వారిలో ఒకని పలుకు
ఒకనికి తెలియకనుండే కొరకు అక్కడ వారి పలుకు
తారు మారు చేయుదము రండని అనుకొనెను.
8 ఆలాగు యెహోవా అక్కడనుంచి భూమియం
దంతటా వారిని చెదర చేసెను. వారు ఆ పట్టణమును
9 కట్టుట మానిరి. అందుచేతను దానికి బాబెలనే* పేరు
పెట్టిరి. ఎందుకంటే అక్కడ యెహోవా సర్వ
భూమి యందలి పలుకును తారుమారు చేసెను. అక్క
డనుంచి యెహోవా భూమి యందంతట వారిని
చెదర చేసెను.
10 షేము వంశావళి ఇది. షేము నూరేండ్లు గలవాడై
జలప్రవాహము గతించిన రెండేండ్లకు అర్పక్షదును
కనెను. షేము అర్పక్షదును కనిన తరువాత ఏనూరు 11
ఏండ్లు బ్రతికి కుమారులను కుమార్తెలను కనెను.
అర్పక్షదు ముప్పది ఐదేండ్లు బ్రతికి షెలహును 12
కనెను. అర్పక్షదు షెలహును కనిన తరువాత 13
నన్నూట మూడేండ్లు బ్రతికి కుమారులను కుమార్తెలను
కనెను.
షెలహు ముప్పది యేండ్లు బ్రతికి ఏబెరును కనె 14
ను. షెలహు ఏబెరును కనిన తరువాత నన్నూట మూ 15
డేండ్లు బ్రతికి కుమారులను కుమార్తెలను కనెను.
ఏబెరు ముప్పది నాలుగేండ్లు బ్రతికి పెలెగును 16
కనెను. ఏబెరు పెలెగును కనిన తరువాత నన్నూట 17
ముప్పది యేండ్లు బ్రతికి కుమారులను కుమార్తెలను
కనెను.
పెలెగు ముప్పది యేండ్లు బ్రతికి రయూను కనె 18
ను. పెలెగు రయూను కనిన తరువాత ఇన్నూట 19
తొమ్మిది యేండ్లు బ్రతికి కుమారులను కుమార్తెలను
కనెను.
రయూ ముప్పది రెండేండ్లు బ్రతికి శరూగును 20
కనెను. రయూ శరూగును కనిన తరువాత ఇన్నూట 21
ఏడేండ్లు బ్రతికి కుమారులను కుమార్తెలను కనెను.
శరూగు ముప్పది యేండ్లు బ్రతికి నాహోరును 22
కనెను. శరూగు నాహోరును కనిన తరువాత 23
ఇన్నూరేండ్లు బ్రతికి కుమారులను కుమార్తెలను
కనెను.
నాహోరు ఇరువది తొమ్మిది యేండ్లు బ్రతికి 24
తెరహును కనెను. నాహోరు తెరహును కనిన తరు 25
వాత నూట పందొమ్మిది యేండ్లు బ్రతికి కుమారులను
కుమార్తెలను కనెను.
తెరహు డెబ్బది యేండ్లు బ్రతికి అబ్రామును, నా 26
హోరును, హారానును కనెను.
తెరహు వంశావళి ఇది, తెరహు అబ్రామును, నా 27
హోరును, హారానును కనెను. హారాను లోతును
కనెను. హారాను తాను పుట్టిన దేశమందలి కల్దీయుల 28
ఊరనే పట్టణములో తన తండ్రియైన తెరహు కంటే
ముందుగా మృతిబొందెను.
అబ్రామును, నాహోరును స్త్రీలను వివాహము 29
చేసుకొనిరి. అబ్రాముయొక్క భార్య పేరు శారాయి.
నాహోరుయొక్క భార్య పేరు మిల్కా. ఆమె
మిల్కాకును యిస్కాకును తండ్రియైన హారాను
కుమార్తె. శారాయి గొడ్రాలై ఉండెను; ఆమెకు 30
సంతానము లేదు.

* అనగా, తారుమారు.

31 తెరహు తన కుమారుడైన అబ్రామును, తన కుమా
రుని కుమారుడనగా హారాను కుమారుడగు లోతును,
తన కుమారుడైన అబ్రాము భార్యయైన శారాయి అనే
తన కోడలినిని తీసుకొని కనానుకు వెళ్లుటకు కల్దీయుల
ఊరనే పట్టణములోనుంచి వారితో కూడా బైలు వెళ్లి
నప్పుడు హారాను మట్టుకు వచ్చి అక్కడ నివసించిరి.
32 తెరహు బ్రతికిన దినములు ఇన్నూట అయిదేండ్లు.
తెరహు హారానులో మృతిబొందెను.

## 12. అధ్యాయము.

1 మరియు యెహోవా—నీవు లేచి నీ దేశమునుం
చియు, నీ బంధువులలోనుంచియు, నీ తండ్రి యింటి
నుంచియు బైలుదేరి, నేను నీకు చూపించే దేశమునకు
2 వెళ్లుము. । నిన్ను గొప్ప రాష్ట్రముగా చేసి, నిన్ను
ఆశీర్వదించి, నీ నామమును గొప్ప చేయుదును. నీవు
3 ఆశీర్వచనముగా ఉందువు. । నిన్ను ఆశీర్వదించే వారిని
ఆశీర్వదించెదను: నిన్ను దూషించే వాని శపింతును.
భూమియొక్క సమస్త వంశములు నీ ద్వారా ఆశీ
ర్వదించబడునని అబ్రాముతో పలికెను.

4 యెహోవా, అతనితో చెప్పిన ప్రకారము, అబ్రా
ము వెళ్లెను. లోతు అతనితో కూడా వెళ్లెను. అబ్రా
ము హారానునుంచి బైలు వెళ్లినప్పుడు డెబ్బది యై
5 దేండ్లు గలవాడు. । అబ్రాము తన భార్యయైన శారా
యిని, తన సహోదరుని కుమారుడైన లోతును, హా
రానులో తానును వారును ఆర్జించిన యావదాస్తిని,
వారు సంపాదించిన సమస్త జీవులనును తీసుకొని
కనాననే దేశమునకు వెళ్లే నిమిత్తము బైలుదేరి, కనా
6 ననేదేశము చేరిరి. । అప్పుడు అబ్రాము షెకెమందలి
ఒక స్థలము దాకా ఆ దేశ సంచారము చేసి, మోరె
యొక్క ఏలోననే వృక్షము యొద్దికి చేరెను. అప్పుడు
కనానీయులు ఆ దేశములో ఉండిరి.

7 అప్పుడు యెహోవా అబ్రాముకు కనబడి — నీ
సంతానమునకు ఈ దేశమిచ్చెదనని చెప్పెను. అప్పుడు
అతడు తనకు కనబడిన యెహోవా నిమిత్తము ఒక
8 యజ్ఞవేదికను కట్టెను. । అక్కడనుంచి అతడు బైలు
దేరి బేతేలుకు తూర్పుననున్న కొండకు చేరి పడమట
నున్న బేతేలుకును తూర్పుననున్న హాయికిని మధ్యను
గుడారము వేసి, అక్కడ యెహోవా నిమిత్తము
యజ్ఞవేదికను కట్టి యెహోవా పేరట ప్రార్థించెను.*।
9 అబ్రాము ఇంకా ప్రయాణమై దక్షిణ దిక్కుకు వెళ్లు
చునుండెను.

అప్పుడు ఆ దేశములో కరువు కలిగెను. ఆ దేశ 10
ములో కరువు భారముగా ఉన్నందున అబ్రాము
ఐగుప్తులో నివసించుటకు అక్కడికి వెళ్లెను. । అయితే 11
అతడు ఐగుప్తులో ప్రవేశించుటకు సమీపించినప్పుడు
అతడు తన భార్యయైన శారాయితో—ఇదుగో నీవు
సుందరరూపవతివై ఉన్నావని యెరుగుదును. । ఐగు 12
ప్తీయులు నిన్ను చూచి—ఈమె అతని భార్య అని
అనుకొని, నన్ను చంపి నిన్ను బ్రతకనిత్తురు. । నీ వల్ల 13
నాకు మేలు కలుగుటకును, నీ నిమిత్తము నేను బ్రతు
కుటకును నీవు నా సహోదరివని దయచేసి చెప్పు
మని పలికెను.

కాబట్టి అబ్రాము ఐగుప్తులో చేరినప్పుడు ఐగుప్తీ 14
యులు ఆ స్త్రీని మిక్కిలీ సౌందర్యవతియై ఉండుట
చూచిరి. । పరోయొక్క అధిపతులు ఆమెను చూచి, 15
పరో ఎదుట ఆమెను పొగడిరి గనుక ఆ స్త్రీ పరో
ఇంటికి తేబడెను. । అతడు ఆమె నిమిత్తము అబ్రా 16
ముకు మేలు చేసెను. అందువల్ల అతనికి గొర్రెలు,
గొడ్లు, మగగాడిదెలు, దాసులు, పనికత్తెలు, ఆడు
గాడిదెలు, ఒంటెలును కలిగెను. । అయితే యెహో 17
వా అబ్రాము భార్యయైన శారాయి నిమిత్తము పరో
నును అతని ఇంటివారినిని మహా వేదనలచేత వేధిం
చెను. । అప్పుడు పరో అబ్రామును పిలిపించి—నీవు 18
నన్ను గూర్చి చేసినది యేమిటి? ఈమె నీ భార్య
అని నాకెందుకు తెలుపలేదు? । ఈమె నా సహో 19
దరి అని యెందుకు చెప్పితివి? నేను ఆమెను నా భా
ర్యగా చేసుకొందునేమో. అయితేనేమి, ఇదుగో నీ
భార్య! తీసుకొని వెళ్లుమని చెప్పెను. । మరియు పరో 20
అతని గూర్చి, తన జనులకు ఆజ్ఞాపించినందున, వారు
అతనికి అతని భార్యను అతనికి కలిగిన సమస్తము
నిచ్చి పంపివేసిరి.

## 13. అధ్యాయము.

అప్పుడు అబ్రాము తనకు కలిగిన సమస్తమును, 1
తన భార్యను, తనతో కూడా ఉన్న లోతునును వెంట
బెట్టుకొని ఐగుప్తులోనుంచి దక్షిణ దేశమునకు వెళ్లె
ను. । అబ్రాము వెండి, బంగారము, పశువులును కలిగి, 2
బహు ఘనుడై ఉండెను. । అతడు తన ప్రయాణము 3
లలో దక్షిణమునుంచి బేతేలు మట్టుకు, అనగా బేతేలు
కును హాయికిని మధ్యను అతని గుడారము మొదట
ఉండిన స్థలము మట్టుకు వెళ్లి । తాను మొదట యజ్ఞ 4

*లేక, పేరు ప్రకటించెను.

వేదికను కట్టిన చోటికి చేరెను. అక్కడ అబ్రాము
యెహోవా పేరట ప్రార్థించెను.*
5 అబ్రాముతో వెళ్లిన లోతుకు కూడా గొర్రెలు,
6 గొడ్లు, గుడారములును ఉండెను గనుక,। వారు కూడి
నివసించుటకు ఆ భూమి వారికి చాలకపోయెను; ఎం
దుకంటే వారి ఆస్తి విస్తారమైనందున వారు కలిసి
7 నివసించ లేకపోయిరి.। అప్పుడు అబ్రాముయొక్క
పశువుల కాపరులకును లోతు పశువుల కాపరులకును
కలహము పుట్టెను. ఆ కాలమందు, కనానీయులును
8 పరిజ్జీయులును ఆ దేశములో కాపురముండిరి.। కా
బట్టి అబ్రాము—మనము అన్నదమ్ములమై ఉన్నాము
గనుక నాకు నీకును, నా పశువుల కాపరులకు నీ
పశువుల కాపరులకును, కలహము ఉండకూడదు.।
9 ఈ దేశమంతయు నీ యెదుట ఉన్నది గదా, దయచేసి
నన్ను విడిచి వేరుగా ఉండుము. నీవు యెడమ తట్టుకు
వెళ్లితే, నేను కుడి తట్టుకును; నీవు కుడి తట్టుకు
వెళ్లితే, నేను ఎడమ తట్టుకును వెళ్లుదునని లోతుతో
చెప్పెను.
10 అప్పుడు లోతు తన కన్నులెత్తి యొర్దాను ప్రాంత
మంతటిని చూచెను, యెహోవా సొదొమ, గొమొ
ర్రా అనే పట్టణములను నాశము చేయక మునుపు
సోయరుకు వచ్చేమట్టుకు అదంతయు యెహోవా
తోటవలెనును ఐగుప్తు దేశమువలెనును నీళ్లు పారే
11 దేశమైయుండెను.। కాబట్టి లోతు తనకు యొర్దాను
యావత్ప్రాంతమును ఏర్పరుచుకొనెను. తరువాత
లోతు తూర్పున ప్రయాణము చేసెను. ఆలాగున
12 వారు ఒకనినొకడు విడిచి వేరుగా ఉండిరి.। అబ్రా
ము కనానులో నివసించెను. లోతు ఆ ప్రాంతమం
దలి పట్టణములలో కాపురముండి సొదొమ దగ్గర
13 తన గుడారము వేసెను.। అయితే సొదొమ మనుష్యు
లు యెహోవా యెదుట మిక్కిలి చెడ్డవారును పాపి
ష్ఠులునై ఉండిరి.
14 లోతు అబ్రామును విడిచిపోయిన తరువాత యె
హోవా అతనితో—ఇదుగో! నీ కన్నులెత్తి నీవు ఉన్న
చోటనుంచి ఉత్తరపు తట్టు, దక్షిణపు తట్టు, తూర్పు
15 తట్టు, పడమర తట్టును చూడుము;। ఎందుకంటే నీవు
చూచుచున్న ఈ దేశమంతటిని నీకు నీ సంతానమున
16 కును చిరకాల పర్యంతము ఇచ్చెదను.। మరియు, నీ
సంతానమును భూమి రేణువుల వలె (విస్తరింప) చేసె
దను. ఏలాగంటే ఒకడు భూమి రేణువులను లెక్కించ
కలిగితే నీ సంతానము కూడా లెక్కించబడును.।
నీవు లేచి ఈ దేశముయొక్క పొడుగున, వెడల్పున 17
దానిలో సంచరించుము; అది నీకు ఇచ్చెదనని పలి
కెను.। అప్పుడు అబ్రాము తన గుడారము తీసి హె 18
బ్రోనులో ఉన్న మమ్రేయొక్క ఏలోను వనములో
నివసించి అక్కడ యెహోవా నిమిత్తము యజ్ఞవేది
కను కట్టెను.

## 14. అధ్యాయము.

మరియు షీనారు రాజైన అమ్రాపెలు, ఎల్లాసరు 1
రాజైన అర్యోకు, ఏలాము రాజైన కదొర్లాయోమెరు,
రాష్ట్రముల రాజైన తిదాలును అనే వారి దినముల
లో,। వారు సొదొమ రాజైన బెరాతోను, గొమొర్రా 2
రాజైన బిర్షాతోను, అద్మా రాజైన షినాబుతోను,
సబోయీము రాజైన షెమేబెరుతోను, సోయరనే
బెలా రాజుతోనును యుద్ధము చేసిరి.। వీరందరు ఉప్పు 3
సముద్రమైన సిద్దీము లోయలో ఏకీభవించిరి.। పన్నెం 4
డు సంవత్సరములు వారు కదొర్లాయోమెరుకు లో
బడి పదమూడవ సంవత్సరమున తిరుగుబాటు చేసిరి.।
పదునాలుగవ సంవత్సరమున కదొర్లాయోమెరు, 5
అతనితో కూడనున్న రాజులును వచ్చి అష్తరోత్
కర్నాయిములో రఫాయీయులను, హాములో జూజీ
యులను, షావే కిర్యతాయిములో†। హోరీయులను, 6
అరణ్యము దగ్గరనున్న ఏల్పారాను మట్టుకు హో
రీయుల యొక్క శేయీరు పర్వతములో వారిని
కొట్టిన తరువాత,। తిరిగి కాదేషనే ఎన్మిష్పతుకు వచ్చి, 7
అమాలేకీయుల దేశమంతటిని, హససోన్తామారు
లో కాపురమున్న అమోరీయులను కూడా కొట్టిరి.
అప్పుడు సొదొమ రాజును, గొమొర్రా రాజును, 8
అద్మా రాజును, సబోయీము రాజును, సోయరనే
బెలా రాజును బైలువెళ్లి సిద్దీము లోయలో వారితో,।
అనగా ఏలాము రాజైన కదొర్లాయోమెరు, రాష్ట్ర 9
ముల రాజైన తిదాలు, షీనారు రాజైన అమ్రాపేలు,
ఎల్లాసరు రాజైన అర్యోకు అనే నలుగురితో ఆ ఐదు
గురు రాజులు యుద్ధము చేసిరి.। ఆ సిద్దీము లోయలో 10
విస్తారమైన మట్టికీలు గుంటలు ఉండెను. సొదొమ,
గొమొర్రాల రాజులు పారిపోయి అక్కడ పడిరి.
మిగిలిన వారు కొండకు పారిపోయిరి.। అప్పుడు వారు 11
సొదొమ గొమొర్రాల ఆస్తి యావత్తును, వారి భోజన
పదార్థములన్నియు పట్టుకొని వెళ్లిరి.। మరియు, 12
అబ్రాము సహోదరుని కుమారుడైన లోతు సొదొ
మలో కాపురముండెను గనుక అతనిని, అతని ఆస్తిని
పట్టుకొని వెళ్లిరి.

*లేక, పేరు ప్రకటించెను. †లేక, కిర్యతాయిము మైదానములో.

13 అప్పుడు తప్పించుకొనిన ఒకడు వచ్చి ఇబ్రీయు
డైన అబ్రాముకు దాని తెలిపెను. అప్పుడు అతడు
ఎష్కోలు సహోదరుడును, అనేరు సహోదరుడు
నైన మమ్రే అనే అమోరీయుని ఏలోను వనములో
కాపురముండే వాడు. వీరు అబ్రాముతో నిబంధన
14 చేసుకొనిన వారు। అబ్రాము తన తమ్ముడు చెరపట్ట
బడెనని విని, తన యింట్లో పుట్టి అలవరచబడిన ము
న్నూట పదునెనమండ్రుగురిని సిద్ధపరచుకొని, దాను
15 మట్టుకు వారిని తరిమెను। రాత్రివేళను అతడును
అతని దాసులును వారికి విరోధముగా మొనలుతీర్చి,
వారిని కొట్టి, దమ్మశెకుకు యెడమతట్టున్న హోబా
16 మట్టుకు తరిమి, । ఆ ఆస్తి యావత్తును తిరిగీ తెచ్చి, తన
తమ్ముడైన లోతును, అతని ఆస్తిని, స్త్రీలను, ప్రజలను
తిరిగీ తీసుకొని వచ్చెను.

17 అతడు కదొర్లాయోమెరును, అతనితో కూడ
నున్న రాజులనును హతముచేసి, తిరిగీ వచ్చినప్పుడు,
సొదొమ రాజు అతని ఎదురుకొనుటకు రాజు లో
18 వనే షావే లోవమట్టుకు బైలుదేరి వచ్చెను।అప్పుడు
షాలేము రాజైన మెల్కీసెదెకు ఆహారమును, ద్రాక్షా
రసమునును వెలపటికి తీసుకొని వచ్చెను. అతడు సర్వో
19 న్నతుడైన దేవునికి యాజకుడు। అప్పుడు అతడు—
ఆకాశమునకు, భూమికిని కర్తయును సర్వోన్నతుడు
నైన దేవునివల్ల అబ్రాము ఆశీర్వదించబడును గాక
20 నియు, । నీ శత్రువులను నీ చేతికి అప్పగించిన సర్వో
న్నతుడైన దేవుడు స్తుతించబడును గాకనియును అతని
ఆశీర్వదించి పలికెను. అప్పుడు అతడు ఇతనికి అన్ని
టిలో దశమభాగమిచ్చెను.

21 అప్పుడు సొదొమ రాజు—ఈ జనులను నాకిచ్చి,
ఆస్తిని నీవే పుచ్చుకొనుమని అబ్రాముతో చెప్పెను।
22 అయితే అబ్రాము — ఆకాశమునకు భూమికిని కర్త
యును సర్వోన్నతుడగు దేవుడునైన యెహోవాకు
23 నా చెయ్యి ఎత్తి ఉన్నాను। ఏలాగంటే — నేనే
అబ్రామును ధనవంతునిగా చేసితినని నీవు చెప్పక
నుండుటకు ఒక నూలుపోగు మొదలుకొని చెప్పువారు
మట్టుకు నీకు కలిగినవన్నిటిలోను ఏమిన్ని పుచ్చుకో
24 నను। అయితే ఈ పడుచువారు భుజించినది వినాగా,
నాతో కూడా వచ్చిన ఆనేరు, ఎష్కోలు, మమ్రే
అనే మనుష్యులకు ఏయే భాగములు రావలెనో
వారు ఆయా భాగములను పుచ్చుకొననిమ్మని సొదొమ
రాజుతో చెప్పెను.

## 15. అధ్యాయము.

1 అవి జరిగిన తరువాత యెహోవా వాక్యము
అబ్రాముకు దర్శనమందు వచ్చి—అబ్రామా! భయప
డకుము; నేను నీకు డాలును; నీ బహుమానము అత్య
ధికమైనదని చెప్పెను. । అందుకు అబ్రాము — ప్రభు 2
వైన యెహోవా! నాకేమి ఇచ్చెదవు? నేను సంతా
నము లేనివాడనై పోవుచున్నాను గనుక దమ్మెశెకు
ఎలీయెజరే నా ఇంటి ఆస్తికర్త.।మరియు, అబ్రాము— 3
ఇదుగో! నీవు నాకు సంతానమియ్యలేదు; ఇదుగో!
నా ఇంట్లో పుట్టినవాడు నాకు బాధ్యుడవునని చె
ప్పెను.

అప్పుడు ఇదుగో! యెహోవా వాక్యము అతని 4
యొద్దికి వచ్చి—ఇతడు నీకు బాధ్యుడు కాడు; అయితే
నీ కడుపున పుట్టబోయేవాడు నీకు బాధ్యుడవునని
చెప్పెను. । మరియును ఆయన వెలపలికి అతని తీసు 5
కొని వచ్చి—నీవు ఆకాశము తట్టు నిదానించి చూ
డుము. నక్షత్రములను లెక్కించుటకు నీకు శక్తి కలి
గితే వాటిని లెక్కించుమని చెప్పి — నీ సంతానము
ఈలాగున ఉండునని పలికెను. । అప్పుడు అతడు 6
యెహోవాను నమ్మెను. ఆయన అది అతనికి నీతి
అని ఎంచెను. । మరియును ఆయన — నీవు ఈ దేశ 7
మును స్వతంత్రించుకొనుటకై దాని నీకు ఇచ్చే కొ
రకు కల్దీయుల ఊరు అనే పట్టణములోనుంచి నిన్ను
ఇవతలకు తీసుకొనివచ్చిన యెహోవాను నేనే అని
చెప్పినప్పుడు । అతడు — ఓ ప్రభువైన యెహోవా! 8
నేను దీని స్వతంత్రించుకొనుదునని నాకు ఏలాగున
తెలుసును అని పలికెను.

అప్పుడు ఆయన — నా నిమిత్తము మూడేండ్ల 9
పెయ్యను, మూడేండ్ల మేకను, మూడేండ్ల పొట్టేలును,
ఒక గువ్వను, ఒక పావురపు పిల్లను తెమ్మని అతనితో
చెప్పెను. । అతడు అవి అన్నియు తీసుకొని, అవి సగ 10
ములుగా ఖండించి, దేని ఖండమును దాని ఖండము
నకు ఎదురుగా ఉంచెను. అయితే పక్షులను అతడు
ఖండించలేదు. । దుష్ట పక్షులు ఆ కళేబరములమీద 11
వాలినప్పుడు అబ్రాము వాటిని తోలివేసెను.

ప్రొద్దుగ్రుంక బోయినప్పుడు గాఢనిద్ర అబ్రా 12
ముకు పట్టెను. అప్పుడు ఇదుగో! కటిక చీకటి
భయము అతనికి కలిగెను । అప్పుడు ఆయన అబ్రా 13
ముతో—నీ సంతానపువారు తమది కాని పరదేశ
మందు నివసించి ఆ దేశపువారికి దాసులై ఉందురు।
వారు నన్నూరు ఏండ్లు వారిని శ్రమపెట్టుదురు. వారు 14
ఎవరికి దాసులవుదురో ఆ రాష్ట్రమునకు నేనే తీర్పు
చేయుదును. తరువాత వారు మిక్కిలీ ఆస్తితో బైలు
దేరి వచ్చెదరు. । నీవు క్షేమముగా నీ పితృలలో చేరె 15
దవు; మంచి వృద్ధత్వమందు పాతిపెట్టబడుదువు. ।
అమోరీయుల అక్రమము ఇంకా సంపూర్ణము 16

కాలేదు గనుక నీ నాలుగవ తరమువారు ఇక్కడికి
తిరిగి వచ్చెదరని నిశ్చయముగా తెలుసుకొనుమని
చెప్పెను.
17 మరియు, ప్రొద్దు గ్రుంకి కటిక చీకటి పడినప్పుడు,
ఇదుగో! రాజె పొయ్యియును అగ్నిజ్వాలయును అగ
18 పడి ఆ ఖండముల మధ్యనుంచి నడిచిపోయెను.। ఆ
దినమందే యెహోవా — ఐగుప్తు నది మొదలుకొని
గొప్ప నదియైన పరాతనే నది పర్యంతమును ఈ దేశ
19 మును, । కేనీయులను, కనిజ్జీయులను, కద్మోనీయులను,।
20 హిత్తీయులను, పరిజ్జీయులను, రఫాయీయులను,।
21 అమోరీయులను, కనానీయులను, గిర్గాషీయులను,
యబూసీయులనును, నీ సంతానమునకు ఇచ్చియు
న్నానని అబ్రాముతో నిబంధనను ఏర్పరిచెను.

## 16. అధ్యాయము.

1 అబ్రాము భార్యయైన శారయి అతనికి పిల్లను కన
లేదు. అయితే ఆమెకు హాగరు అనే పేరు గల ఐగుప్తీ
2 యురాలైన దాసి ఉండెను. । కాగా శారయి —
ఇదుగో! నేను పిల్లను కనకుండా, యెహోవా నా
గర్భము మూసియున్నాడు. నీవు దయచేసి నా
దాసి యొద్దికి వెళ్లుము. ఒక వేళ ఆమెవల్ల నాకు
సంతానము కలుగ వచ్చునని అబ్రాముతో చెప్పెను.
అబ్రాము శారయి మాట వినెను.

3 కాబట్టి అబ్రాము కనాను దేశములో కాపుర
మున్న పది ఏండ్ల అంతమందు, అబ్రాము భార్య
యైన శారయి తన దాసియైన హాగరనే ఐగుప్తీయురా
లిని తీసుకొని, తన పెనిమిటియైన అబ్రాముకు భా
4 ర్యగా ఉండుటకు, అతనికి ఇచ్చెను. । అతడు హాగరు
యొద్దికి వెళ్లినప్పుడు, అది గర్భవతి ఆయెను. అది
తాను గర్భవతియై ఉండుట తెలుసుకొనినప్పుడు
దాని యజమానురాలు దాని దృష్టియందు తృణీకరిం
చబడినదాయెను.

5 అప్పుడు శారయి—నాకు వచ్చిన బాధ నీదౌను;
నేనే నా దాసిని నీ కౌగిటికిచ్చిన తరువాత, తాను
గర్భవతియై ఉండుట అది తెలుసుకొనినప్పుడు,
నేను దాని దృష్టియందు తృణీకరించబడినదాననైతిని;
నాకు నీకు యెహోవా న్యాయము తీర్చునుగాకని
6 అబ్రాముతో పలికెను. । అందుకు అబ్రాము — ఇదు
గో! నీ దాసి నీ చేతిలో ఉన్నది. దాని నీ మనస్సు
వచ్చినట్టు చేయుమని శారయితో చెప్పెను. అయితే
శారయి దాని శ్రమపెట్టినప్పుడు, ఆమె యొద్దనుంచి
అది పారిపోయెను.

అప్పుడు యెహోవా దూత, అరణ్యములో నీటి 7
బుగ్గయొద్ద అనగా షూరు మార్గములో బుగ్గయొద్ద
ఆమెను కనుగొని। — శారయి దాసివైన ఓ హాగరూ! 8
ఎక్కడనుంచి వచ్చితివి? ఎక్కడికి వెళ్లుచున్నావని
పలికినందుకు అది — నా యజమానురాలైన శారయి
సమ్ముఖమునుంచి పారిపోవుచున్నానని చెప్పెను. ।
అప్పుడు యెహోవా దూత — నీ యజమానురాలి 9
యొద్దికి తిరిగి వెళ్లి, ఆమె చేతికింద అణిగి ఉండుమని
దానితో చెప్పెను. । మరియు, యెహోవా దూత— 10
నీ సంతానమును విస్తరింప చేయనే చేసెదను. అది
విస్తారమవుటవల్ల లెక్కించబడదని దానితో చెప్పెను.।
మరియు, యెహోవా దూత,— ఇదుగో! నీవు గర్భ 11
వతివై ఉన్నావు; నీవు కుమారుని కని అతనికి ఇష్మా
యేలు అనే* పేరు పెట్టుదువు; ఎందుకంటే యె
హోవా నీ శ్రమ ధ్వని వినెను. । అతడు అడవి 12
గాడిదవంటి మనుష్యుడు. అతని చెయ్యి అందరికిని,
అందరి చేతులు అతనికిని విరోధముగా ఉండును.
అతడు తన సహోదరులందరి ఎదుట నివసించునని
దానితో చెప్పెను.

కాబట్టి అది ప్రత్యక్షమయే దేవుడవు నీవే అనే 13
పేరు తనతో మాట్లాడిన యెహోవాకు పెట్టెను.
ఎందుకంటే — ప్రత్యక్షము కలిగిన తరువాత నేను
ఇక్కడ చూచుచున్నాను గదా అని అనుకొనెను. ।
అందుచేతను ఆ నీటిబుగ్గకు, బెయేర్‌లహాయిరోయి† 14
అనే పేరు పెట్టబడెను. అదుగో! అది కాదేషుకును
బెరెదుకును మధ్యను ఉన్నది.

తరువాత హాగరు అబ్రాముకు కుమారుని కనెను. 15
అబ్రాము హాగరు కనిన తన కుమారునికి ఇష్మాయేలనే
పేరు పెట్టెను. । హాగరు అబ్రాముకు ఇష్మాయేలును 16
కనినప్పుడు, అబ్రాము ఎనబదియారు ఏండ్లు గలవాడై
ఉండెను.

## 17. అధ్యాయము.

అబ్రాము తొంబది తొమ్మిది ఏండ్లవాడైనప్పుడు, 1
యెహోవా అతనికి ప్రత్యక్షమై— నేను సర్వశక్తిగల
దేవుడను; నా ఎదుట నడుచుచు, యథార్థపరుడవై
ఉండుము. । నాకు నీకును మధ్యను, నా నిబంధన 2
నియమించి, నిన్ను అత్యధికముగా వృద్ధిపరచెదనని
అతనితో చెప్పెను.

అప్పుడు అబ్రాము సాగిలపడి ఉండగా,। దేవుడు 3,4
అతనితో మాట్లాడి — ఇదుగో! నేను నా నిబంధన
నీతోనున్నది; నీవు రాష్ట్రముల సమూహమునకు తం

*అనగా, దేవుడు వినును. †అనగా, దర్శనమిచ్చే జీవముగలవాని నీటిబుగ్గ.

5 డ్రివై ఉందువు. । మరియు, ఇకమీదట నీ పేరు
అబ్రామని అనబడదు; నిన్ను రాష్ట్రముల సమూహ
మునకు తండ్రినిగా నియమించితిని గనుక నీ పేరు
6 అబ్రాహామని అనబడును. । నీకు అత్యధికముగా సం
తానవృద్ధి పొందించి నిన్ను రాష్ట్రములనుగా నియ
మించితిని. రాజులును నీ సంతతిలో పుట్టెదరు. ।
7 నేను నీకు, నీ తరువాత నీ సంతానమునకును దేవుడనై
ఉండుటకు నాకు నీకు, నీ తరువాత వారి వారి తర
ములలో నీ సంతతికిని, మధ్యను నా నిబంధన చిర
8 కాల నిబంధనగా స్థిరపరచెదను; । నీకును నీ తరువాత
నీ సంతతికిని నీవు పరదేశివైయున్న దేశమనగా కనా
ననే దేశమంతటిని చిరకాల స్వాస్థ్యముగా ఇచ్చి
వారికి దేవుడనై ఉందునని అతనితో చెప్పెను.

9 మరియు, దేవుడు — నీవును, నీవే కాదు నీ తరు
వాత, వారి వారి తరములలో నీ సంతతియు నా
10 నిబంధన గైకొన వలెను. । నాకు నీకు, నీ తరువాత
నీ సంతతికిని మధ్యను మీరు గైకొనవలసిన నా నిబం
ధన ఏదంటే, మీలో ప్రతి మగవాడును ఛేదనసం
11 స్కారము పొంద వలెను. । మీరు మీ గోప్యాంగచర్మ
మున ఛేదనసంస్కారము పొంద వలెను. అది నాకు
నీకు మధ్యనున్న నిబంధనకు గురుతై ఉండును. ।
12 నీ ఇంట్లో పుట్టినవాడును, నీ సంతానపువాడు కాక,
ఏ అన్యుని యొద్దనైనను నీ వెండిచేత కొనబడినవా
డును, మీ తరములలో ఎనిమిది దినముల వయస్సుగల
ప్రతి మగవాడును మీవల్ల ఛేదనసంస్కారము పొంద
13 వలెను. । నీ ఇంట్లో పుట్టినవాడును, నీ వెండిచేత
కొనబడినవాడును నిశ్చయముగా ఛేదనసంస్కారము
పొంద వలెను. అప్పుడు నా నిబంధన మీ శరీరమందు
14 చిరకాల నిబంధనయై ఉండును. । ఛేదనసంస్కారము
పొందని మగవాడు అనగా ఎవని గోప్యాంగచర్మము
ఛేదించబడదో అట్టివాడు తన రాష్ట్రములలోనుంచి
ఖండించబడును. వాడు నా నిబంధన వ్యర్థపరిచి
యున్నాడని అబ్రాహాముతో చెప్పెను.

15 మరియు, దేవుడు—నీ భార్యయైన శారయి పేరు
శారయి అనవద్దు; ఎందుకంటే ఆమె పేరు శారా;* ।
16 నేను ఆమెను ఆశీర్వదించి ఆమెవల్ల నీకు కుమారుని
కలగచేతును. నేను ఆమెను ఆశీర్వదించెదను. ఆమె
రాష్ట్రములకు (జననియై) ఉండును. జనముల రా
జులు ఆమెవల్ల కలుగుదురని అబ్రాహాముతో చెప్పె
17 ను. । అప్పుడు అబ్రాహాము సాగిలపడి నవ్వి — నూ
రేండ్లు గలవానికి సంతానము కలుగునా? తొంబది
యేండ్లుగల శారా కనునా? అని మనస్సులో అను
కొనెను.

అప్పుడు అబ్రాహాము — ఇష్మాయేలు నీ ఎదుట 18
బ్రతుకునుగాకని దేవునితో పలికినప్పుడు, । దేవుడు— 19
నీ భార్యయైన శారా నిశ్చయముగా నీకు కుమారుని
కనును. నీవు అతనికి ఈసాకనే పేరు పెట్టుదువు.
అతని తరువాత అతని సంతానముకొరకు చిరకాల
నిబంధనగా నా నిబంధన అతనితో స్థిరపరచెదను. ।
ఇష్మాయేలును గురించి నీ మనవి వింటిని. ఇదుగో! నేను 20
అతని ఆశీర్వదించి, అతనికి సంతానాభివృద్ధి పొం
దించి, అత్యధికముగా అతని విస్తరింపచేసెదను. అతడు
పన్నెండుమంది రాజులను కనును. అతని గొప్ప రా
ష్ట్రముగా నియమించెదను. । అయితే వచ్చే సంవత్స 21
రము ఈ కాలమందు శారా నీకు కనబోయే ఈసా
కుతో నా నిబంధన స్థిరపరచెదనని చెప్పెను. । దేవుడు 22
అబ్రాహాముతో మాట్లాడుట చాలించిన తరువాత
అతని యొద్దనుంచి పైకి వెళ్లెను.

అప్పుడు అబ్రాహాము తన కుమారుడైన ఇష్మాయే 23
లును, తన ఇంట్లో పుట్టినవారినందరిని, తన వెండిచేత
కొనబడినవారినందరిని, అబ్రాహాము ఇంటి మనుష్యు
లలో ప్రతివానిని పట్టుకొని, దేవుడు తనతో చెప్పిన
ప్రకారముగా, ఆ దినమందే వారి వారి గోప్యాంగ
చర్మము ఛేదించెను. । అబ్రాహాము గోప్యాంగచర్మము 24
ఛేదించబడినప్పుడు అతడు తొంబది తొమ్మిది ఏండ్ల
వాడు. । అతని కుమారుడైన ఇష్మాయేలు గోప్యాంగ 25
చర్మము ఛేదించబడినప్పుడు అతడు పదమూడు ఏండ్ల
వాడు. । ఒక్క దినమందే అబ్రాహామును, అతని కుమా 26
రుడైన ఇష్మాయేలును ఛేదనసంస్కారము పొందిరి. ।
అతని ఇంట పుట్టినవారును, అన్యునియొద్ద వెండిచేత 27
కొనబడినవారును, అతని ఇంటి పురుషులందరును అత
నితోకూడా ఛేదనసంస్కారము పొందిరి.

## 18. అధ్యాయము.

మరియు, మమ్రేయొక్క ఏలోను వనములో, 1
అతడు ఎండవేళను, గుడారపు ద్వారమందు కూర్చుని
ఉన్నప్పుడు యెహోవా అతనికి అగపడెను. । అతడు 2
తన కన్నులెత్తి చూచినప్పుడు అదుగో! ముగ్గురు మను
ష్యులు అతని ఎదుట నిలిచియుండిరి. అతడు వారిని
చూచి గుడారపు వాకిటనుంచి వారిని ఎదురుకొను
టకు† పరుగెత్తి నేల మట్టుకు వంగి ।— ప్రభువా! నీ 3

*అనగా, రాణి. †లేక, పిలుచుటకు.

కన్నుల ఎదుట నేను దయపొందినవాడనైతే, ఇప్పుడు
నీ దాసుని దాటి వెళ్లవద్దు. మీరు దయచేసి నన్ను
కొంచెము నీళ్లు తేనిచ్చి మీ కాళ్లు కడుగుకొని ఈ
చెట్టుకింద అలసట తీర్చుకొనండి. మీ హృదయము
లను బలపరుచుకొనుటకు కొంచెము ఆహారము తెచ్చె
దను. తరువాత మీరు వెళ్ల వచ్చును. ఇందు నిమిత్తము
గదా మీ దాసుని యొద్దికి వచ్చితిరని పలికెను. అం
దుకు వారు—నీవు పలికినట్టు చేయుమనిరి.

6 అప్పుడు అబ్రాహాము గుడారములో ఉన్న శారా
యొద్దికి త్వరగా వెళ్లి—నీవు త్వరపడి మూడు సయీల
సన్నపిండి తెచ్చి, పిసికి, రొట్టెలు చేయుమని చెప్పె
ను. మరియు, అబ్రాహాము పశువుల మందకు పరుగెత్తి
ఒక మంచి లేత దూడను తెచ్చి ఒక పడుచువానికి
అప్పగించెను. ఆ పడుచువాడు దాని సిద్ధపరుచుటకు
త్వరపడెను. తరువాత అతడు పెరుగును, పాలను,
తాను సిద్ధము చేయించిన దూడనును తెచ్చి, వారి
ఎదుట పెట్టి, వారు భోజనము చేయుచున్నప్పుడు,
వారి యొద్ద ఆ చెట్టుకింద నిలుచుండెను.

9 అప్పుడు వారు అతని చూచి—నీ భార్యయైన శారా
ఎక్కడ అని అడిగిరి. అందుకు అతడు — అదుగో!
10 గుడారములో, అని చెప్పెను. అప్పుడు। ఆయన—
జీవకాలము చొప్పున నీ యొద్దికి నిశ్చయముగా తిరిగీ
వచ్చెదను. అదుగో! ఒక కుమారుడు నీ భార్యయైన
11 శారాకు కలుగునని పలికెను.। శారా ఆయన వెనుక
నుండిన గుడారపు ద్వారమందు, వినుచునుండెను.।
12 అబ్రాహామును శారాయును బహు దినములు గతిం
చిన వృద్ధులై ఉండిరి. స్త్రీల మర్యాద శారాకు నిలిచి
13 పోయెను గనుక। శారా—నేను బలము ఉడిగినదాన
నైన తరువాత, నాకు సుఖము కలుగునా? నా ప్రభు
వును వృద్ధుడై ఉన్నాడు అని తనలో నవ్వుకొనెను.

14 అప్పుడు యెహోవా అబ్రాహాముతో — ఇది
యేమి!—వృద్ధనైన నేను నిశ్చయముగా ప్రసవింతునా
అని శారా నవ్వెను. యెహోవాకు అసాధ్యమైనది
ఏదైనా ఉన్నదా? జీవకాలము చొప్పున నిర్ణయకాల
15 మందు నీ యొద్దికి తిరిగీ వచ్చెదను.। అప్పుడు శారాకు
కుమారుడు కలుగునని పలికెను. అప్పుడు శారా భయ
పడి—నేను నవ్వలేదని బొంకెను. అందుకు ఆయన—
లేదు, నీవు నవ్వితివనెను.

16 అప్పుడు ఆ మనుష్యులు అక్కడనుంచి లేచి సొ
దొమతట్టు చూచిరి. అబ్రాహాము వారిని సాగనంపు
17 టకు వారితో కూడా వెళ్లెను.। అప్పుడు యెహోవా—
నేను చేయబోయే దాని అబ్రాహామునకు మరుగు చే
యుదునా?। అబ్రాహాము నిశ్చయముగా బలముగల 18
గొప్ప రాష్ట్రమై ఉండును. అతనియందు* భూమి
యొక్క సమస్త రాష్ట్రములును ఆశీర్వదించబడును
గదా। ఎందుకంటే యెహోవా అబ్రాహామును గూ 19
ర్చిన చెప్పినదాని అతనికి కలుగచేయుటకు అతడు
తన తరువాత తన పిల్లలును తన ఇంటివారును నీతి
న్యాయములు జరిగించుచు, యెహోవా మార్గము
గైకొనేలాగున వారికి ఆజ్ఞాపించే నిమిత్తము అతని
ఎరిగియున్నానని చెప్పెను.

మరియు యెహోవా — సొదొమ గొమొర్రాల 20
మొర గొప్పది గనుకనును, వాటి పాపము బహు
భారమైనది గనుకనును,। నేను దిగి నా యొద్దికి వచ్చిన 21
ఆ మొర చొప్పున వారు సంపూర్ణముగా చేసిరో
లేదో చూచెదను. లేకపోతే తెలుసుకొందుననెను.।
అక్కడనుంచి తిరిగి, ఆ మనుష్యులు సొదొమతట్టు 22
వెళ్లిరి. అయితే అబ్రాహాము ఇంకా యెహోవా
సమ్ముఖమందు నిలుచుచుండెను.

అప్పుడు అబ్రాహాము సమీపించి ఇట్లనెను— 23
దుష్టునితో కూడా నీతిమంతుని నాశము చేయుదు
వా?। ఆ పట్టణములో, ఒక వేళ ఏబదిమంది నీతిమం 24
తులు ఉంటే దానిలో ఉన్న ఏబదిమంది నీతిమం
తుల నిమిత్తము ఆ స్థలమును కాయక నాశము చేయు
దువా?। ఆ చొప్పున చేసి దుష్టునితో కూడా నీతి 25
మంతుని చంపుట నీకు దూరమవు గాక. నీతిమం
తుడు దుష్టునివలెను ఉండుట నీకు దూరమవు గాక.
సర్వలోక న్యాయాధిపతి న్యాయము చేయడా అని
పలికినప్పుడు,। యెహోవా—సొదొమ పట్టణములో 26
ఏబదిమంది నీతిమంతులు నాకు కనబడితే వారి నిమి
త్తము ఆ స్థలమంతటిని కాయుదునని పలికెను.

అప్పుడు అబ్రాహాము—ఇదుగో! ధూళిని బూడి 27
దెనైన నేను ప్రభువుతో మాట్లాడ తెగించియు
న్నాను.। ఏబదిమంది నీతిమంతులలో ఒక వేళ అయి 28
దుగురు తక్కువైతే అయిదుగురు తక్కువైనందున ఆ
పట్టణమంతా నాశము చేయుదువా? అని ప్రత్యుత్త
రము చెప్పెను. అందుకు ఆయన— అక్కడ నలుబది
ఐదుగురు నాకు కనబడితే నాశము చేయనని పలికెను.

అతడు ఇంకా ఆయనతో మాట్లాడుచు—ఒక 29
వేళ అక్కడ నలుబదిమంది కనబడితేనో? అనిన
ప్పుడు, ఆయన—ఆ నలుబదిమంది నిమిత్తము నాశము
చేయనని పలికెను.

*లేక, మూలముగా.

30 అప్పుడు అతడు — ప్రభువుకు కోపము రానివ్వ
కుము; నేను మాట్లాడెదను; ఒక వేళ అక్కడ ముప్పది
మంది కనబడితేనో? అనినప్పుడు, ఆయన—అక్కడ
ముప్పదిమంది నాకు కనబడితే, నాశము చేయనని
పలికెను.

31 అప్పుడు అతడు—ఇదుగో! ప్రభువుతో మాట్లాడ
తెగించి ఉన్నాను. ఒక వేళ అక్కడ ఇరువదిమంది
కనబడితేనో? అనినప్పుడు, ఆయన—ఆ ఇరువదిమంది
నిమిత్తము నాశము చేయనని పలికెను.

32 అప్పుడు అతడు — ప్రభువుకు కోపము రానివ్వ
కుము; నేను ఇంకొకమారు మాట్లాడెదను; ఒక వేళ
అక్కడ పదిమంది కనబడితేనో? అనినప్పుడు, ఆ
యన — ఆ పదిమంది నిమిత్తము నాశము చేయనని
పలికెను.

33 యెహోవా అబ్రాహాముతో మాట్లాడుట చా
లించిన తరువాత, ఆయన వెళ్లిపోయెను. అబ్రాహాము
కూడా తన చోటికి తిరిగీ వెళ్లెను.

## 19. అధ్యాయము.

1 ఆ సాయంకాలమందు ఆ దూతలలో ఇద్దరు సొ
దొమ చేరిరి. లోతు సొదొమ గవినియొద్ద కూర్చుని
ఉండెను. అప్పుడు లోతు వారిని చూచి ఎదురు
2 కొనుటకు లేచి నేల మట్టుకు తలవంచుకొని । — ఓ
నా ప్రభువులారా! దయచేసి మీ దాసుని ఇంటికి
వచ్చి, రాత్రి వెళ్లబుచ్చి మీ కాళ్లు కడుగుకొనండి.
మీరు పెందలాడి, లేచి మీ దోవను వెళ్ల వచ్చున
నెను. అందుకు వారు — ఆలాగు కాదు; నడివీధిలో
3 రాత్రి వెళ్లబుచ్చెదమని పలికిరి. । అయితే అతడు
మిక్కిలీ బలవంతము చేసినప్పుడు, వారు అతనితట్టు
తిరిగి, అతని ఇంట్లో ప్రవేశించిరి. అతడు వారి నిమి
త్తము విందుచేసి పొంగని రొట్టెలు కాల్చెను. వారు
భోజనము చేసిరి.

4 వారు పండుకొనక మునుపు ఆ పట్టణస్థులు
అనగా సొదొమ మనుష్యులు బాలురు మొదలుకొని
వృద్ధుల పర్యంతమును, ఆ ప్రజలందరును నలుదిక్కు
5 లనుంచి కూడి ఆ ఇల్లు చుట్టుకొని । లోతును పిలిచి—
ఈ రాత్రి నీ యొద్దికి వచ్చిన మనుష్యులు ఎక్కడ?
మేము వారిని ఎరిగే నిమిత్తము మా యొద్దికి వారిని
వెలపటికి తీసుకొని రమ్మని అతనితో చెప్పిరి.

6 అప్పుడు లోతు ద్వారమున వారి యొద్దికి వెళ్లి,
7 తన వెనుక తలుపువేసి।—అన్నలారా! ఈ కీడు చేయ
8 కండి; । ఇదుగో! పురుషుని ఎరగని ఇద్దరు కుమా
ర్తెలు నాకు ఉన్నారు. సెలవైతే, వారిని మీ యొ
ద్దికి వెలపటికి తీసుకొని వచ్చెదను; వారిని మీ మన
స్సు వచ్చినట్టు చేయండి. । అయితే ఈ మనుష్యులను 9
ఏమి చేయ కూడదు. ఇందునిమిత్తము గదా వారు
నా ఇంటి నీడకు వచ్చిరని పలికినప్పుడు, వారు —
నీవు అవతలికి పొమ్మనిరి. మరియు వారు—వీడొకడు
మనలోకి పరదేశిగా వచ్చి, ఎల్లప్పుడును న్యాయము
తీర్చేవాడై ఉన్నాడు; కాగా వారికంటె ఎక్కువగా
నీకు కీడు చేసెదమని పలికి లోతనే మనుష్యుని గట్టి
గా ఇరికించి, ఆ తలుపు పగలగొట్టుటకు సమీపిం
చిరి. । అయితే ఆ మనుష్యులు తమ చేతులను చాపి, 10
లోతును ఇంట్లోకి తమ యొద్దికి చేర్చుకొని తలుపు
వేసిరి. । అప్పుడు వారు పిన్నలు మొదలుకొని పెద్దల 11
పర్యంతమును ఆ ఇంటి ద్వారము దగ్గరనున్న మను
ష్యులకు కనుమబ్బు కలుగచేసిరి. వారు ఆ ద్వారము
కనుగొనుటకు తడువులాడుచు విసికిరి.

అప్పుడు ఆ మనుష్యులు లోతుతో — ఇక్కడ 12
నీకు మరి ఎవరు ఉన్నారు? నీ అల్లుని, నీ కుమారు
లను, నీ కుమార్తెలను, ఈ ఊరిలో నీకు కలిగిన
సమస్తమును* వెలపటికి తీసుకొని రమ్ము; । మేము ఈ 13
చోటు నాశముచేయనై ఉన్నాము; వారి మొర యె
హోవా ఎదుట గొప్పది గనుక దాని నాశము చేయు
టకు యెహోవా మమ్మును పంపెనని చెప్పిరి.

అప్పుడు లోతు బైలువెళ్లి, తన కుమార్తెలను పెం 14
డ్లాడనై ఉన్న తన అల్లుళ్లతో మాట్లాడి — లెండి ఈ
చోటు విడిచి వెళ్లండి; యెహోవా ఈ పట్టణము
నాశము చేయబోవుచున్నాడని చెప్పెను. అయితే
అతడు తన అల్లుళ్ల దృష్టికి ఎగతాళి చేసే వానివలెను
ఉండెను.

తెల్లవారినప్పుడు, ఆ దూతలు లోతును త్వరపె 15
ట్టి — లెమ్ము; ఈ ఊరి అక్రమములో† నశించిపోకుం
డా నీ భార్యను, ఇక్కడ ఉన్న నీ ఇద్దరి కుమార్తె
లను తీసుకొని రమ్మని చెప్పిరి. । అతడు తడువు చేసెను. 16
అప్పుడు, అతని మీద యెహోవా కనికరపడు
టవల్ల ఆ మనుష్యులు అతని చేతిని, అతని భార్య
చేతిని, అతని ఇద్దరి కుమార్తెల చేతులను పట్టుకొని
వెలపటికి అతని తీసుకొనివచ్చి, ఆ ఊరి బైట ఉంచిరి.

అప్పుడు వారిని వెలపటికి తీసుకొనివచ్చిన తరు 17
వాత ఆయన—నీ ప్రాణము దక్కించుకొనుటకు పారి
పొమ్ము; నీ వెనుక చూడకుము. ఈ ప్రాంతములో
ఎక్కడను నిలువక, నీవు నశించిపోకుండా ఆ పర్వ
తమునకు పారిపొమ్మని చెప్పెను.

*లేక, అందరిని. †అక్రమదండనలో.

18 అందుకు లోతు — ప్రభువా! ఆలాగు కాదు.।
19 ఇదుగో! నీ కన్నుల ఎదుట నీ దాసుడు దయ పొంది
ఉన్నాడు. నా ప్రాణము రక్షించుటకు, నీవు నా
ఎడల అగుపరిచిన నీ కృపను ఘనపరిచితివి. నేను
తప్పించుకొని ఆ పర్వతమునకు వెళ్లలేను; ఈ కీడు
20 నాకు సంభవించు నేమో; చచ్చిపోదును;। ఇదుగో పారి
పోవుటకు ఈ ఊరు సమీపమై ఉన్నది; అది చిన్నది;
నన్ను అక్కడికి తప్పించుకొని వెళ్లనిమ్ము. అది చిన్నది
21 గదా నేను బ్రతుకుదునని పలికినప్పుడు,। ఆయన—
ఇదుగో! నీవు చెప్పిన ఈ ఊరు నాశము చేయను.
22 ఈ విషయమందును నిన్ను అనుగ్రహించినాను.। నీవు
త్వరపడి తప్పించుకొని అక్కడికి వెళ్లుము; నీవు అ
క్కడ చేరే వరకు నేను ఏమిన్ని చేయలేనని చెప్పె
ను. అందుచేతను ఆ ఊరికి, సోయరు* అనే పేరు
పెట్టబడెను.
23 సూర్యుడు ఆ దేశము పైని ఉదయించెను. లోతు
24 సోయరుకు వెళ్లెను.। అప్పుడు యెహోవా సొదొమ
మీదను, గొమొఱ్ఱా మీదను యెహోవా యొద్ద
నుంచి, గంధకమును అగ్నిని ఆకాశమునుంచి కురిపించి।
25 ఆ పట్టణములను, ఆ సర్వ ప్రాంతమును, ఆ పట్టణ
ములలో నివసించిన వారినందరిని, నేల మొలకలనును
26 నాశము చేసెను.। అయితే లోతు భార్య అతని వెను
కనుండి, తిరిగి చూచి ఉప్పు స్తంభమాయెను.
27 తెల్లవారినప్పుడు అబ్రాహాము లేచి, తాను యె
28 హోవా సమ్ముఖమందు నిలిచిన చోటికి వచ్చి,। సొ
దొమ గొమొఱ్ఱాల తట్టును, ఆ ప్రాంతముయొక్క
సర్వ భూమి తట్టును చూడగా, అదుగో! ఆ భూమి
పొగ, ఆవము పొగ వలె లేచి ఉండెను.
29 దేవుడు ఆ ప్రాంతముల పట్టణములు పాడు చేసి
నప్పుడు, దేవుడు అబ్రాహామును జ్ఞాపకము చేసుకొని,
లోతు కాపురమున్న పట్టణములు తాను నాశము
చేసినప్పుడు, ఆ నాశన మధ్యనుంచి లోతును తప్పిం
చెను.
30 అప్పుడు లోతు సోయరులో నివసించుటకు భయ
పడి, తన ఇద్దరు కుమార్తెలతో కూడా సోయరు
నుంచి వెళ్లి ఆ పర్వతమందు నివసించెను. అప్పుడు
అతడును అతని ఇద్దరు కుమార్తెలును ఒక గుహలో
31 నివసించిరి.। ఆలాగుండగా, అక్క తన చెల్లెలితో—
మన తండ్రి ముసలివాడు; సర్వలోక మర్యాద చొ
ప్పున, మన యొద్దికి చేరుటకు లోకములో ఏ పురు
32 షుడును లేడు.। మన తండ్రికి ద్రాక్షారసము తాగ
నిచ్చి, అతనితో పండుకొని మన తండ్రివల్ల సంతా
నము కలుగచేసుకొందము రమ్మని చెప్పెను.। ఆ రాత్రి 33
వారు తమ తండ్రికి ద్రాక్షారసము తాగనిచ్చిన తరు
వాత, అతని పెద్ద కుమార్తె లోపటికి వెళ్లి, తన
తండ్రితో పండుకొనెను. అయితే ఆమె పండుకొ
నుటయు, ఆమె లేచుటయు అతనికి తెలియ లేదు.।
మరునాడు అక్క తన చెల్లెలితో—నిన్నటి రాత్రి నా 34
తండ్రితో పండుకొంటిని; ఈ రాత్రి అతనికి ద్రాక్షా
రసము తాగనిచ్చిన తరువాత, నీవు లోపటికి వెళ్లి
అతనితో పండుకొనుము; ఆలాగున మన తండ్రివల్ల
సంతానము కలుగచేసుకొందమని చెప్పెను.। ఆ రా 35
త్రిని వారు తమ తండ్రికి ద్రాక్షారసము తాగనిచ్చిరి.
అప్పుడు ఆ చిన్నది లేచి అతనితో పండుకొనెను
ఆమె పండుకొనుటయు, ఆమె లేచుటయు అత
నికి తెలియలేదు.। ఆలాగున లోతుయొక్క ఇద్దరు 36
కుమార్తెలు తమ తండ్రివల్ల గర్భవతులైరి.। వారిలో 37
పెద్దది కుమారుని కని, వానికి మోయాబు† అనే పేరు
పెట్టెను. అతడు నేటివరకు మోయాబీయులకు తండ్రి।
చిన్నది కూడా కుమారుని కని, వానికి బెన్నమ్మి‡ అనే 38
పేరు పెట్టెను. అతడు నేటి వరకు అమ్మోను కుమారు
లకు తండ్రి.

## 20. అధ్యాయము.

అక్కడనుంచి అబ్రాహాము దక్షిణ దేశమునకు 1
తర్లిపోయి, కాదేషుకు షూరుకును మధ్యను నివసించి,
గెరారులోను కొన్నాళ్లు ఉండెను.। అప్పుడు అబ్రా 2
హాము తన భార్యయైన శారాను గూర్చి—ఈమె నా
చెల్లెలని చెప్పెను గనుక, గెరారు రాజైన అబీమెలెకు
శారాను పిలిపించి, ఇంట చేర్చుకొనెను.। అయితే 3
రాత్రివేళ దేవుడు స్వప్నమందు అబీమెలెకు యొద్దికి
వచ్చి—నీవు ఇంట చేర్చుకొనిన స్త్రీ ఒక పురుషునికి
భార్య గనుక, ఆమె నిమిత్తము నీవు చచ్చినవాడవు
సుమీ అని చెప్పెను.। అయితే అబీమెలెకు ఆమె 4
యొద్దికి చేరలేదు గనుక, అతడు—ప్రభువా! నీతిగల
ఈ రాష్ట్రమును కూడా హతము చేయుదువా?।—
ఈమె నా చెల్లెలని అతడు నాతో చెప్పలేదా? మరి 5
యు ఆమె కూడా—అతడు నా అన్న అని చెప్పెను.
నా హృదయ యథార్థతయందు, నా చేతుల నిర్దో
షత యందును దీని చేసితినని చెప్పెను.। అందుకు 6
దేవుడు — అవును, నీ హృదయ యథార్థత యందు
దీని చేసితివని నేను ఎరుగుదును. మరియు నీవు నాకు
విరోధముగా పాపము చేయకుండా, నేను నిన్ను

*అనగా, చిన్న. †అనగా, తండ్రి సంతానము. ‡అనగా, స్వజనపుత్రుడు.

అడ్డగించినాను. అందు నిమిత్తము నేను నిన్ను ఆమెను
7 ముట్టనివ్వలేదు.। కాబట్టి ఆ మనుష్యుని భార్యను తిరిగీ
అప్పగించుము; అతడు ప్రవక్త; అతడు నీ కొరకు
ప్రార్థన చేసును; అప్పుడు నీవు బ్రతుకుదువు. నీవు
ఆమెను తిరిగీ అప్పగించని పక్షమందు, నీవు నీకున్న
వారందరును చావనే చచ్చెదరని తెలుసుకొనుమని
స్వప్నమందు అతనితో చెప్పెను.

8 తెల్లవారినప్పుడు అబీమెలెకు లేచి, తన సేవకుల
నందరిని పిలిపించి, ఈ సంగతులన్నియు వారికి విని
పించినప్పుడు, ఆ మనుష్యులు మిక్కిలి భయపడిరి.।
9 అబీమెలెకు అబ్రాహామును పిలిపించి—నీవు మమ్మును
చేసినది ఏమిటి? నీవు నా మీదికి, నా రాజ్యము
మీదికిని గొప్ప పాపము తెప్పించుటకు నేను నీ
ఎడల చేసిన పాపము ఏమిటి? చేయరాని కార్యము
10 లను నాకు చేసి ఉన్నావని అతనితో చెప్పెను.। మరి
యు అబీమెలెకు — నీవు ఏమి చూచి ఈ కార్యము
చేసినావని అబ్రాహాముతో పలికెను.

11 అందుకు అబ్రాహాము — ఈ స్థలమందు దేవుని
భయము ఎంత మాత్రము లేదు గనుక నా భార్య
నిమిత్తము, నన్ను చంపుదురని అనుకొని చేసితిని.।
12 అంతే కాకుండా — ఆమె నా చెల్లెలు అనే మాట
నిజమే. ఆమె నా తండ్రి కుమార్తె గాని నా తల్లి
13 కుమార్తె కాదు; ఆమె నాకు భార్యయైనది.। దేవుడు
నన్ను నా తండ్రి ఇంటినుంచి దేశాంతరము వెళ్లే చేసి
నప్పుడు, నేను ఆమెను చూచి — మనము చేరే ప్రతి
స్థలమందు—ఇతడు నా సహోదరుడని నన్ను గురించి
చెప్పుము; నీవు నాకు చేయవలసిన ఉపకారము ఇదే
అని పలికితిననెను.

14 అబీమెలెకు గొర్రెలను, గొడ్లను, దాసులను, పని
కత్తెలనును రప్పించి, అబ్రాహాముకు ఇచ్చి, అతని
భార్యయైన శారాను అతనికి తిరిగీ అప్పగించెను.।
15 అప్పుడు అబీమెలెకు—ఇదుగో! నా దేశము నీ ఎదుట
ఉన్నది. నీకు ఇష్టమైన స్థలమందు కాపురముండు
16 మని చెప్పెను.। మరియు, అతడు శారాను చూచి—
ఇదుగో! నీ అన్నకు నేను వెయ్యి వెండి బిళ్లలు ఇచ్చి
ఉన్నాను. ఇదుగో! ఇది* నీకును, నీ యొద్ద ఉన్న
వారికందరికిని, కన్నుల ముసుకై ఉండునని పలికెను.
ఆలాగున అదంతా తీరెను.

17 అప్పుడు అబ్రాహాము దేవుని ప్రార్థించెను
గనుక, దేవుడు అబీమెలెకును, అతని భార్యను, అతని
దాసీలను బాగుచేసెను. అప్పుడు వారు పిల్లలను కనిరి.।
అబ్రాహాము భార్యయైన శారా నిమిత్తము, దేవుడు 18
అబీమెలెకు ఇంటిలో ప్రతి గర్భమును మూసి
ఉండెను.

## 21. అధ్యాయము.

యెహోవా తాను చెప్పిన ప్రకారము శారాను 1
చూడవచ్చెను; యెహోవా తాను ఇచ్చిన మాట
చొప్పున శారాను గురించి చేసెను;। ఏలాగంటే 2
దేవుడు అబ్రాహాముతో చెప్పిన నిర్ణయ కాలము
లో శారా గర్భవతియై, అతని ముసలితనమందు
అతనికి కుమారుని కనెను.। అప్పుడు అబ్రాహాము 3
తనకు పుట్టినవాడును తనకు శారా కనినవాడునైన
తన కుమారునికి ఈసాకు అనే పేరు పెట్టెను.।
మరియు దేవుడు అబ్రాహాముకు ఆజ్ఞాపించిన ప్రకా 4
రము, అతడు ఎనిమిది దినములవాడైన ఈసాకనే
తన కుమారునికి ఛేదనసంస్కారము చేసెను.। అబ్రా 5
హాము కుమారుడైన ఈసాకు అతనికి పుట్టినప్పుడు,
అతడు నూరేండ్లవాడు.। అప్పుడు శారా— 6

దేవుడు నాకు నవ్వు కలుగజేసెను;
వినువారెల్ల నా విషయమై నవ్వుదురనెను.।

మరియు ఆమె— 7

శారా పిల్లలకు స్తన్యమిచ్చునని,
ఎవడు అబ్రాహాముతో చెప్పి ఉండును;
అతని ముదిమిని నేను కుమారుని కంటిని గదా

అని పలికెను.

ఆ పిల్లవాడు పెరిగి చనుపాలు విడిచెను. ఈసాకు 8
చనుపాలు విడిచిన దినమందు, అబ్రాహాము గొప్ప
విందు చేసెను.। అప్పుడు అబ్రాహాముకు ఐగుప్తీయు 9
రాలైన హాగరు కనిన కుమారుడు నవ్వుట శారా
చూచి।— ఈ దాసిని దీని కొడుకును వెళ్లగొట్టుము. 10
ఈ దాసి కొడుకు నా కొడుకైన ఈసాకుతో బాధ్యుడై
ఉండడు అని అబ్రాహాముతో పలికెను.। అతని కు 11
మారుని నిమిత్తము ఆ మాట అబ్రాహాముకు మిక్కిలీ
దుఃఖకరమై ఉండెను। అయితే దేవుడు — ఈ చిన్న 12
వాని నిమిత్తము నీ దాసి నిమిత్తమును ఇది నీకు దుః
ఖకరమై ఉండ కూడదు. శారా నీతో చెప్పే అన్ని
టిలోను ఆమె మాట వినుము; ఈసాకు వల్లనైనదే
నీ సంతానమనబడును.। అయితే ఈ దాసి కుమారుడు 13
నీ సంతానము గనుక అతని కూడా ఒక రాష్ట్రము
గా చేసెదనని అబ్రాహాముతో చెప్పెను.

కాబట్టి తెల్లవారినప్పుడు, అబ్రాహాము లేచి, ఆహా 14
రము, నీళ్ల తిత్తిని తీసుకొని, ఆ పిల్లవానితో కూడా

*లేక, ఆయన.

హాగరుకు అప్పగించి, ఆమె భుజము మీద వాటిని
పెట్టి, ఆమెను పంపివేసెను. ఆమె వెళ్లి బెయేర్షె
15 బా అరణ్యములో దోవ తప్పి తిరుగుచుండెను.। ఆ
తిత్తి నీళ్లు అయిపోయిన తరువాత, ఆమె ఒక పొద
16 కింద ఆ చిన్నవాని పరుండబెట్టి। ఈ పిల్ల చనిపోవుట
నేను చూడ లేనని అనుకొని, వింటి వేత దూరము వెళ్లి,
అతనికి ఎదురుగా కూర్చుండెను. ఆమె ఎదురుగా
కూర్చుండి నోరెత్తి ఏడ్చెను.

17 అయితే దేవుడు ఆ చిన్నవాని మొర వినినప్పుడు,
దేవుని దూత ఆకాశమునుంచి హాగరును పిలిచి—ఓ
హాగరూ! నీకేమి? భయపడకుము; ఆ చిన్నవాడు
ఉన్నచోటను, దేవుడు అతని శబ్దము విని ఉన్నా
18 డు.। నీవు లేచి ఆ చిన్నవాని లేవనెత్తి, నీ చేతితో
వాని పట్టుకొనుము; వాని గొప్ప రాష్ట్రముగా చేసె
దనని ఆమెతో పలికెను.

19 మరియు దేవుడు ఆమె కన్నులు విప్పినందున, ఆమె
నీళ్ల ఊట చూచి, వెళ్లి ఆ తిత్తిని నీళ్లతో నింపి, చిన్న
20 వానికి తాగనిచ్చెను.। దేవుడు ఆ చిన్నవానికి తోడై
ఉండెను. అతడు పెరిగి, ఆ అరణ్యములో కాపుర
21 ముండి విలుకాడాయెను.। అతడు పారాను అరణ్య
ములో ఉన్నప్పుడు అతని తల్లి ఐగుప్తు దేశమునుంచి
ఒక స్త్రీని తెచ్చి అతనికి పెండ్లిచేసెను.

22 ఆ కాలమందు అబీమెలెకు తన సేనాధిపతియైన
పీకోలుతో కూడి, అబ్రాహాముతో మాట్లాడి—నీవు
చేసే పనులన్నిటిలోను దేవుడు నీకు తోడై ఉన్నాడు
23 గనుక। నీవు నన్నైనా, నా పుత్ర పౌత్రాదులనైనా
వంచించక, నేను నీకు చేసిన ఉపకారము చొప్పున
నీవు నాకును, నీవు పరదేశివై ఉన్న ఈ దేశమునకు
ను—చేసెదను దేవునితోడని ఇక్కడ నాతో ప్రమా
24 ణము చేయుమని చెప్పెను.। అందుకు అబ్రాహాము—
ప్రమాణము చేసెదననెను.

25 అప్పుడు అబీమెలెకు దాసులు బలాత్కారముగా
తీసుకొనిన నీళ్ల నూతిని గురించి అబ్రాహాము అబీ
26 మెలెకును ఆక్షేపించెను.। అయితే అబీమెలెకు—ఈ
పని ఎవడు చేసెనో నేను ఎరగను; నీవును నాతో
చెప్పలేదు; నేనును నేడేగాని ఈ సంగతి విన లేదని
పలికెను.

27 అప్పుడు అబ్రాహాము గొర్రెలను, గొడ్లను, తె
ప్పించి, అబీమెలెకుకు ఇచ్చెను. వారిద్దరును ఒక నిబం
28 ధన* చేసుకొనిరి.। తరువాత అబ్రాహాము తన గొ
ర్రెల మందలోనుంచి ఏడు పెంటి పిల్లలను వేరుగా
ఉంచెను గనుక,। అబీమెలెకు అబ్రాహామును చూచి— 29
నీవు వేరుగా ఉంచిన ఈ ఏడు గొర్రె పిల్లలు ఎందుకు
అనెను. అందుకు అతడు।—నేనే ఈ నూతిని తవ్వించి 30
నందుకు, నా కొరకు సాక్ష్యార్థముగా ఈ ఏడు గొర్రె
పిల్లలను నీవు నాచేత పుచ్చుకొన వలెనని చెప్పెను.।
వారిద్దరును అక్కడ ఆలాగు ప్రమాణము చేసుకొని 31
నందున, ఆ చోటు బెయేర్షెబా† అనబడెను.

బెయేర్షెబాలో, వారు ఆలాగు ఒక నిబంధన 32
చేసుకొనిన తరువాత, అబీమెలెకు లేచి తన సేనాధి
పతియైన పీకోలుతో కూడా పిలిష్తీయుల దేశమునకు
తిరిగి వెళ్లెను.

(అబ్రాహాము) బెయేర్షెబాలో ఒక పక్కాచెట్టు 33
నాటి, అక్కడ నిత్యదేవుడైన యెహోవా పేరట
ఆరాధించెను.‡। అబ్రాహాము పిలిష్తీయుల దేశములో, 34
అనేక దినములు పరదేశిగా ఉండెను.

## 22. అధ్యాయము.

ఆ సంగతులు జరిగిన తరువాత, దేవుడు అబ్రా 1
హామును పరిశీలించెను. ఏలాగంటే ఆయన—అబ్రా
హామా! అని పిలిచెను. అందుకు అతడు—ఇదుగో!
ఉన్నాననెను.। అప్పుడు ఆయన—నీకు ఒక్కడై ఉన్న 2
నీ కుమారుని, అనగా నీవు ప్రేమించే ఈసాకును
తీసుకొని మోరీయా దేశమునకు వెళ్లి, నేను నీతో
చెప్పబోయే పర్వతములలో ఒకదాని మీద, అతనిని
అక్కడ హోమము చేయుమని చెప్పెను.

తెల్లవారినప్పుడు అబ్రాహాము లేచి, తన గాడి 3
దెకు గంత కట్టి తన పడుచువారిలో ఇద్దరిని, తన
కుమారుడైన ఈసాకును వెంటబెట్టుకొని, హోమము
కొరకు కట్టెలు చీల్చి, లేచి, దేవుడు తనతో చెప్పిన
చోటికి వెళ్లెను.। మూడవ నాడు అబ్రాహాము తన 4
కన్నులెత్తి దూరమునుంచి ఆ చోటు చూచెను.

అప్పుడు అబ్రాహాము తన పడుచువారితో—మీరు 5
గాడిదెయొద్ద ఇక్కడనే ఉండండి; నేనును ఈ పడు
చువాడును అక్కడికి వెళ్లి ఆరాధన చేసి, మళ్లీ మీ
యొద్దికి వచ్చెదమని చెప్పెను.

అప్పుడు అబ్రాహాము హోమము కొరకైన కట్టెలు 6
తీసుకొని తన కుమారుడైన ఈసాకుమీద పెట్టి, తన
చేతితో నిప్పును కత్తిని పట్టుకొని వారిద్దరు కూడి
వెళ్లుచుండగా। ఈసాకు తన తండ్రియైన అబ్రాహా 7
మును చూచి—నా తండ్రీ! అనెను. అందుకు అతడు—
నా కుమారుడా! ఇదుగో! ఉన్నాననెను; అప్పుడు

* లేక, ఒడంబడికె. † అనగా, ఏడింటి నుయ్యి: లేక, ప్రమాణపు నుయ్యి. ‡ లేక, పేరు ప్రకటించెను.

అతడు—ఇదిగో! నిప్పును కట్టెలును; అయితే హో
8 మము కొరకు గొఱ్ఱెపిల్ల ఎక్కడని పలికెను!। అందుకు
అబ్రాహాము—నా కుమారుడా! దేవుడు హోమము
కొరకు గొఱ్ఱెపిల్లను చూచుకొనునని చెప్పెను.

9 ఆలాగు వారిద్దరును కూడి వెళ్లి, దేవుడు అతనితో
చెప్పిన చోటను చేరినప్పుడు, అబ్రాహాము అక్కడ
యజ్ఞవేదిని కట్టి, కట్టెలు చక్కగా పేర్చి, తన కుమారు
డైన ఈసాకును బంధించి ఆ వేదిపైనున్న కట్టెలమీద
10 ఉంచెను.। అప్పుడు అబ్రాహాము తన కుమారుని వధిం
11 చుటకు, తన చెయ్యి చాపి కత్తి పట్టుకొనెను.।అయితే
యెహోవా దూత — అబ్రాహామా! అబ్రాహామా!
అని ఆకాశమునుంచి అతని పిలిచెను; అందుకు
12 అతడు—ఇదిగో! ఉన్నాననెను.। అప్పుడు ఆయన—
ఆ పడుచువాని మీద నీ చెయ్యి వేయకుము; అతని
ఏమిన్ని చేయకుము; నీకు ఒక్కడే అయ్యున్న నీ
కుమారుని నాకు ఇచ్చుటకు వెనుకతీయలేదు గనుక
నీవు దేవునికి భయపడేవాడవని ఇప్పుడు నేను ఎరు
గుదునని పలికెను.

13 అప్పుడు అబ్రాహాము తన కన్నులెత్తి చూడగా,
పొదలో కొమ్ములు తగులుకొని పట్టుబడిన ఒక పొ
ట్టేలు వెనుక తట్టున కనబడెను. అబ్రాహాము వెళ్లి
ఆ పొట్టేలును పట్టుకొని, తన కుమారునికి మారుగా
14 హోమము చేసెను.। అబ్రాహాము ఆ చోటికి యె
హోవా యీరే* అనే పేరు పెట్టెను. అందుచే
తను నేటివరకు—యెహోవా పర్వతముమీద చూచు
కొనునని† చెప్పబడుచున్నది.

15 యెహోవా దూత రెండవ మారు ఆకాశమునుంచి
16-18 అబ్రాహామును పిలిచి ఇట్లనెను। — నీవు నీకు
ఒక్కడే అయ్యున్న నీ కుమారుని ఇచ్చుటకు వెనుక
తీయక ఈ కార్యము చేసినందున, నేను నిన్ను ఆశీ
ర్వదించనే ఆశీర్వదించి, ఆకాశ నక్షత్రముల వలెను,
సముద్రతీరమందలి ఇసుక వలెను నీ సంతానము విస్త
రింప చేయనే చేసెదను; నీ సంతతివారు తమ శత్రు
వుల గవిని స్వాధీనపరుచుకొందురు; మరియు, నీవు
నా మాట వినినందున భూరాష్ట్రములన్నియు నీ సం
తానమువల్ల ఆశీర్వదించబడును నాతోడని ప్రమా
ణము చేసి ఉన్నాను అని యెహోవా ఆనతిచ్చినా
19 డనెను.। తరువాత అబ్రాహాము తన పడుచువారి
యొద్దికి తిరిగి వచ్చెను. అప్పుడు వారు లేచి కూడి
బెయేర్షెబాకు వెళ్లిరి. అబ్రాహాము బెయేర్షె
బాలో నివసించెను.

ఆ సంగతులు జరిగిన తరువాత, అబ్రాహాముకు 20
తెలుపబడినదేమంటే — మిల్కా అనే ఆమెయు,
నీ సహోదరుడైన నాహోరుకు పిల్లలను కనెను;।
వారు ఎవరంటే, అతని ప్రథమ కుమారుడైన హూసు, 21
ఇతని తమ్ముడైన బూజు, అరాము తండ్రియైన కమూ
యేలు,। కెసెదు, హజో, పిల్దాషు, ఇద్లాపు, బతూయే 22
లును. బతూయేలు రిబ్కాను కనెను.। ఆ ఎనమండు 23
గురిని మిల్కా అబ్రాహాము సహోదరుడైన నా
హోరుకు కనెను.। మరియు రయూమా అనే పేరు 24
గల అతని ఉపపత్నియు, తెబహును, గహమును,
తహషును, మయకాను కనెను.

## 23. అధ్యాయము.

శారా జీవితకాలమనగా, శారా బ్రతికిన ఏండ్లు 1
నూట ఇరువది ఏడు.। శారా కనాను దేశమందలి హె 2
బ్రోననే కిర్యతర్బాలో మృతిబొందెను. అప్పుడు
అబ్రాహాము శారా నిమిత్తము అంగలార్చుటకు,
ఆమెను గూర్చి ఏడ్చుటకును వచ్చెను.। తరువాత 3
అబ్రాహాము మృతిబొందిన తన భార్య ఎదుటనుంచి
లేచి హేతు కుమారులను చూచి।— మీ మధ్యను 4
నేను పరదేశిని పరవాసినినై ఉన్నాను. మృతిబొందిన
నా భార్యను నా ఎదుటనుండకుండా నేను పాతి
పెట్టుటకు, మీ తావున నాకు ఒక శ్మశానభూమి
స్వాస్థ్యముగా ఇవ్వండి అని పలికెను.

అందుకు హేతు కుమారులు—ప్రభువా! మా మాట 5,6
వినుము. నీవు మా మధ్యను మహా రాజవై ఉన్నావు;
మా శ్మశానభూములలో అతిశ్రేష్ఠమైన దానియందు,
మృతిబొందిన నీ భార్యను పాతిపెట్టుము. నీవు మృతి
బొందిన నీ భార్యను పాతిపెట్టుటకు మాలో తన
శ్మశానభూమి ఇవ్వనొల్లనివాడు ఎవడును లేడని
అబ్రాహాముతో ప్రత్యుత్తరము చెప్పిరి.। అప్పుడు 7
అబ్రాహాము లేచి, ఆ దేశ ప్రజలైన హేతు కుమా
రులకు సాగిలపడి।—మృతిబొందిన నా భార్యను నా 8
ఎదుటనుండకుండా నేను పాతిపెట్టుటకు, మీకిష్ట
మైతే, నా మాట విని సోహరు కుమారుడైన ఎఫ్రోను।
తన పొలము చివరను తనకు కలిగి ఉన్న మక్పేలా 9
గుహను నాకిచ్చేలాగున నా కొరకు అతనితో మనవి
చేయండి. మీ మధ్యను శ్మశానభూమి కొరకు స్వా
స్థ్యముగా నిండు వెలకు అతడు దాని నాకు ఇవ్వ
వలెనని వారితో చెప్పెను.

అప్పుడు ఎఫ్రోను హేతు కుమారుల మధ్యను 10
కూర్చుండి ఉండెను. హిత్తీయుడైన ఎఫ్రోను తన

*అనగా, యెహోవా చూచుకొనును. †లేక, చూడబడునని.

ఊరి గవినిని ప్రవేశించేవారందరి ఎదుట, హేతు
కుమారులకు వినబడేలాగున, అబ్రాహాముతో చెప్పిన
11 ప్రత్యుత్తరము ఏదంటే।—ప్రభువా! ఆలాగు కాదు;
నా మనవి ఆలకించుము; ఆ పొలము నీకిచ్చి ఉన్నా
ను; దానిలోనున్న గుహను నీకు ఇచ్చి ఉన్నాను.
నా జనపుత్రుల కన్నుల ఎదుట అది నీకు ఇచ్చి
ఉన్నాను; మృతిబొందిన నీ భార్యను పాతిపెట్టుమనె
12 ను.। అప్పుడు అబ్రాహాము ఆ దేశ ప్రజల ఎదుట
13 సాగిలపడి।— సరేగాని నా మనవి ఆలకించుము. ఆ
పొలము వెల ఇచ్చెదను. అది నా యొద్ద పుచ్చుకొంటే,
మృతిబొందిన నా భార్యను పాతిపెట్టెదనని, ఆ దేశ
ప్రజలకు వినబడేలాగున ఎఫ్రోనుతో చెప్పెను.।
14,15 అందుకు ఎఫ్రోను—ప్రభువా! నా మాట వినుము:
ఆ భూమి నన్నూరు వెండి షెకెలులు* చేసును: అది
నాకు నీకు యే మాత్రము? మృతిబొందిన నీ భార్యను
పాతిపెట్టుమని అబ్రాహాముకు ప్రత్యుత్తరమిచ్చెను.।
16 అబ్రాహాము ఎఫ్రోను మాట వినెను. కాబట్టి హేతు
కుమారులకు వినబడేలాగున ఎఫ్రోను చెప్పిన వెల
అనగా వర్తకులలో చెల్లే నన్నూరు వెండి షెకెలులు
అబ్రాహాము తూచి అతనికి ఇచ్చెను.

17,18 ఆలాగున మమ్రే ఎదుటనున్న మక్పేలా యందలి
ఎఫ్రోను పొలము అనగా ఆ పొలమును, దాని యం
దలి గుహయును, దాని పొలిమేరంతటిలోనున్న ఆ
పొలము చెట్లన్నియును అతని ఊరి గవినిని ప్రవే
శించే వారందరిలో, హేతు కుమారుల ఎదుట అబ్రా
హాముకు సొత్తుగా స్థిరపరచబడెను.

19 ఆ తరువాత అబ్రాహాము కనాను దేశములో
హెబ్రోననే మమ్రే ఎదుటనున్న మక్పేలా పొలము
గుహలో తన భార్యయైన శారాను పాతిపెట్టెను.।
20 ఆ పొలమును దానిలోనున్న గుహయు హేతు కుమా
రులవల్ల శ్మశానము కొరకు అబ్రాహాముకు స్వాస్థ్య
ముగా స్థిరపరచబడెను.

## 24. అధ్యాయము.

1 అబ్రాహాము బహు దినములు గతించిన వృద్ధుడై
ఉండెను. అన్నిటిలోను యెహోవా అబ్రాహా
2 మును ఆశీర్వదించెను.। అప్పుడు అబ్రాహాము తనకు
కలిగిన సమస్తమును ఏలుచుండిన తన ఇంటి పెద్ద
సేవకుని చూచి—నీ చెయ్యి నా తొడ కింద పెట్టుము.।
3 నేను ఎవరి మధ్యను కాపురమున్నానో ఆ కనానీ
యుల కుమార్తెలలో, నా కుమారుని కొరకు నీవు
4 స్త్రీని తేక,। నా స్వదేశమందలి నా బంధువుల యొ
ద్దికి వెళ్లి, ఈసాకనే నా కుమారుని కొరకు ఒక స్త్రీని
భార్యగా తెచ్చేలాగున, ఆకాశముయొక్క దేవుడును
భూమియొక్క దేవుడునైన యెహోవా తోడని
నీచేత ప్రమాణము చేయించెదనని చెప్పెను.

అందుకు ఆ సేవకుడు—ఈ దేశమునకు నా వెంట 5
వచ్చుట ఒకవేళ ఆ స్త్రీకి ఇష్టము కాని ఎడల, నీవు
బైలుదేరి వచ్చిన ఆ దేశమునకు నేను నీ కుమారుని
తీసుకొని వెళ్లవలెనా? అని అడిగెను.

అందుకు అబ్రాహాము—అక్కడికి నా కుమారుని 6
తీసుకొని వెళ్ల కూడదు సుమీ.। నా తండ్రి ఇంటి 7
నుంచియు, నేను పుట్టిన దేశమునుంచియు నన్ను
తెచ్చి నాతో మాట్లాడి—నీ సంతానమునకు ఈ దేశ
ము ఇచ్చెదనని ప్రమాణము చేసి నాతో చెప్పిన
ఆకాశముయొక్క దేవుడైన యెహోవా తన దూ
తను నీకు ముందుగా పంపును; అక్కడనుంచి నీవు
నా కుమారుని కొరకు భార్యగా ఒక స్త్రీని తీసుకొని
వచ్చెదవు.। అయితే నీ వెంట వచ్చుట ఆ స్త్రీకి ఇష్ట 8
ము కాని ఎడల, ఈ ప్రమాణమునుంచి విడుదల పొం
దెదవు. మెట్టుకు నా కుమారుని అక్కడికి తీసుకొని
వెళ్ల కూడదని అతనితో చెప్పెను.। అప్పుడు ఆ సేవ 9
కుడు తన యజమానుడైన అబ్రాహాము తొడ కింద
తన చెయ్యి పెట్టి, ఆ సంగతి విషయమై ప్రమాణము
చేసెను.

యజమానుని ఆస్తి అంతా ఆ సేవకుని చేతి కింద 10
ఉండెను గనుక, అతడు తన యజమానుని ఒంటెలలో
పది ఒంటెలను తీసుకొని వెళ్లెను. అతడు లేచి, అరా
మ్నహరాయిములో ఉన్న నాహోరుయొక్క పట్ట
ణము చేరి। సాయంకాలమందు స్త్రీలు నీళ్లు తోడుకొ 11
నుటకు బైలుదేరి వచ్చే వేళకు ఆ ఊరి బైటనున్న నీళ్ల
నూతియొద్ద తన ఒంటెలను మోకాళ్లబడేటట్టు చేసి
ఇట్లనెను।—అబ్రాహామనే నా యజమానుని దేవుడ 12
వైన యెహోవా! నేడు ఆమె నాకు ఎదురుపడే
టట్టు దయచేసి నా యజమానుడైన అబ్రాహామును
అనుగ్రహించుము, ఏలాగంటే;। ఇదుగో! నేను ఈ 13
నీళ్ల ఊటయొద్ద నిలుచుచున్నాను. ఈ ఊరివారి కు
మార్తెలు నీళ్లు తోడుకొనుటకు బైలుదేరి వచ్చుచు
న్నారు.। కాబట్టి — నేను తాగేనిమిత్తము నీవు దయ 14
చేసి నీ కడవను వంచుమని నేను చెప్పగా — నీవు
తాగుము; నీ ఒంటెలకును తాగనిచ్చెదనని ఏ పడుచు
చెప్పునో ఆమెయే నీ సేవకుడైన ఈసాకు కొరకు

*అది యేనూరు రూపాయీలు కావచ్చును.

నీవు నియమించినది అయ్యుండును గాక. అందువల్ల
నీవు నా యజమానుని అనుగ్రహించినావని తెలుసు
కొందుననెను.
15 అతడు పలుకుట చాలించక మునుపు, ఇదిగో!
అబ్రాహాము సహోదరుడైన నాహోరు భార్య
యగు మిల్కా కుమారుడైన బెతూయేలుకు పుట్టిన
రిబ్కా తన కడవ భుజముమీద పెట్టుకొని బైలుదేరి
16 వచ్చెను.। ఆ పడుచు మిక్కిలీ చక్కనిది. ఆమె కన్యక.
ఏ పురుషుడును ఆమెను ఎరుగలేదు. ఆమె ఆ ఊట
యొద్దికి దిగి వెళ్లి, తన కడవను నీళ్లతో నింపి ఎక్కి
వచ్చెను.
17 ఆ సేవకుడు ఆమెను ఎదురుకొనుటకు పరుగెత్తి—
నీ కడవలో నీళ్లు కొంచెము దయచేసి నన్ను తాగ
18 నిమ్మని పలికెను.। అందుకు ఆమె — అయ్యా! తాగు
మని చెప్పి, త్వరగా తన కడవను చేతిమీదికి దించు
19 కొని అతనికి దాహమిచ్చెను.। మరియు ఆమె అతనికి
దాహమిచ్చుట చాలించి—నీ ఒంటెలు తాగి చాలించే
మట్టుకు వాటి కొరకును నీళ్లు తోడుదునని పలికి।
20 త్వరగా గాడిలో తన కడవ కుమ్మరించి, తిరిగి తోడు
టకు ఆ నూతి యొద్దికి పరుగెత్తి, అతని ఒంటెలన్నిటి
కొరకు నీళ్లు తోడెను.
21 ఆ మనుష్యుడు ఆమెను నిదానించి చూచి, తన
మార్గమును యెహోవా అనుకూలపరిచెనో లేదో
తెలుసుకొనుటకు ఊరకుండెను.
22 ఆ ఒంటెలు తాగుట చాలించిన తరువాత ఆ మను
ష్యుడు బెకా* ఎత్తుగల బంగారపు ముక్కు కమ్మిని
ఆమె చేతులకు పది బంగారు (షెకెలుల) ఎత్తుగల
23 రెండు కడియములను తీసి।—నీవు ఎవని కుమార్తె
వు! దయచేసి నాతో చెప్పుము; నీ తండ్రి ఇంట్లో
మేము ఈ రాత్రి వెళ్లబుచ్చుటకు స్థలము ఉన్నదా
24 అని పలికెను.। అందుకు ఆమె— నేను నాహోరుకు
మిల్కా కనిన కుమారుడగు బెతూయేలు కుమార్తె
25 ననెను.। మరియు ఆమె—మా యొద్ద చాలా గడ్డియు,
మేతయు, రాత్రి వెళ్లబుచ్చుటకు స్థలమును ఉన్నవని
చెప్పెను.
26,27 అప్పుడు ఆ మనుష్యుడు వంగి యెహోవాను
ఆరాధించి — అబ్రాహామనే నా యజమానుని దేవు
డైన యెహోవా స్తుతించబడును గాక. ఆయన నా
యజమానునికి తన కృపను తన సత్యమును చూపుట
మానలేదు. నేను దోవలో ఉండగా, యెహోవా నా
యజమానుని సహోదరుల ఇంటికి నన్ను నడిపించె
నని పలికెను.

అంతట ఆ పడుచు పరుగెత్తి, ఈ మాటలు తన 28
తల్లి ఇంటివారికి తెలిపెను.। రిబ్కాకు లాబాను అనే 29
పేరుగల ఒక సహోదరుడు ఉండెను. అప్పుడు
లాబాను ఆ ఊట దగ్గర వెలపటనున్న ఆ మనుష్యుని
యొద్దికి పరుగెత్తెను.। అతడు ఆ ముక్కు కమ్మిని, తన 30
సహోదరి చేతులనున్న ఆ కడియములను చూచి—
ఆ మనుష్యుడు ఈలాగున నాతో మాట్లాడెనని తన
సహోదరియైన రిబ్కా మాటలు వినినప్పుడు, అతడు
ఆ మనుష్యుని యొద్దికి వచ్చెను. అప్పుడు ఇదిగో!
అతడు ఆ ఊట యొద్ద ఒంటెల దగ్గర నిలిచి ఉం
డెను.। అప్పుడు అతడు—యెహోవావల్ల ఆశీర్వదిం 31
చబడినవాడా! లోపటికి రమ్ము; నీవు బైట నిలుచుట
ఎందుకు? ఇల్లు ఒంటెలకొరకు స్థలమును నేను సిద్ధము
చేసి ఉన్నానని చెప్పెను.
ఆ మనుష్యుడు ఇంటికి వచ్చినప్పుడు, ఇతడు ఒం 32
టెల గంతలు విప్పి, ఒంటెలకు గడ్డియు, మేతయు,
అతని కాళ్లు అతనితో కూడా ఉన్న మనుష్యుల
కాళ్లు కడుగుకొనుటకు నీళ్లును ఇచ్చెను.। అప్పుడు 33
అతడు అతని ఎదుట ఆహారము ఉంచెను. అయితే
అతడు—నేను నా సంగతి చెప్పకమునుపు భోజనము
చేయనని పలికినందుకు అతడు—చెప్పుమనెను.
అప్పుడు అతడు ఇట్లనెను — నేను అబ్రాహాము 34
సేవకుడను.। యెహోవా నా యజమానుని బహుగా 35
ఆశీర్వదించెను గనుక అతడు గొప్పవాడాయెను. అత
నికి గొర్రెలను, గొడ్లను, వెండి బంగారములను, దాసు
లను, పనికత్తెలను, ఒంటెలను, గాడిదెలను దయచే
సెను.। నా యజమానుని భార్యయైన శారా వృద్ధు 36
రాలై ఉన్నప్పుడు, ఆమె నా యజమానునికి కుమా
రుని కనెను. అతడు తనకు కలిగినది యావత్తును అత
నికి ఇచ్చి ఉన్నాడు.। మరియు నా యజమానుడు 37
నన్ను చూచి — నేను ఎవరి దేశమందు నివసించుచు
న్నానో, ఆ కనానీయుల కుమార్తెలలో నీవు నా
కుమారుని కొరకు ఒక స్త్రీని భార్యగా తే కూడదు.।
అయితే నా తండ్రి ఇంటికిని నా వంశస్థుల యొద్దికిని 38
వెళ్లి, నా కుమారుని కొరకు భార్యగా ఒకతెను తీసు
కొని రావలెనని నాచేత ప్రమాణము చేయించెను.।
అప్పుడు నేను నా యజమానునితో—ఆ స్త్రీ నా వెంట 39
రాదు కాబోలునని చెప్పినందుకు। అతడు — ఎవని 40
సమ్ముఖమందు నేను నడిచి ఉన్నానో, ఆ యెహో
వా నీతోకూడా తన దూతను పంపి, నీ మార్గమును
అనుకూలపరుచును గనుక నీవు నా వంశస్థులలో నా

*శేక, (బెకాల.)

తండ్రి ఇంటినుంచి నా కుమారుని కొరకు భార్యగా
41 ఒకతెను తీసుకొని వచ్చెదవు.। నీవు నా వంశస్థుల
యొద్దికి వెళ్లితే సరి; నీవు ఈ ప్రమాణమునుంచి విడు
దల పొందెదవు. వారు ఆమెను ఇవ్వని ఎడలను ఈ
ప్రమాణమునుంచి విడుదల పొందెదవని చెప్పెను.।
42 నేను నేడు ఆ ఊటయొద్దికి వచ్చి—అబ్రాహామనే
నా యజమానుని దేవుడవైన యెహోవా! నేను వెళ్లే
మార్గమును నీవు దయచేసి అనుకూలపరుచుచుంటే,।
43 ఇదుగో! నేను ఈ నీళ్ల ఊటయొద్ద నిలిచి ఉండగా,
నీళ్లు తోడుకొనుటకు బైలుదేరి వచ్చే కన్యకతో
నేను — నీవు దయచేసి నీ కడవలో నీళ్లు కొంచెము
44 నన్ను తాగనిమ్మని చెప్పేటప్పుడు।—నీవు తాగుము నీ
ఒంటెల కొరకును తోడుదునని ఎవతె చెప్పునో,
ఆమెయే నా యజమానుని కుమారుని కొరకు యె
హోవా నియమించిన స్త్రీ అయ్యుండు గాకని పలి
45 కితిని.। నేను నా హృదయములో ఆలాగు అనుకొ
నుట చాలించక మునుపు, ఇదుగో! రిబ్కా భుజము
మీద తన కడవను పెట్టుకొని బైలుదేరి వచ్చి, ఆ
ఊట యొద్దికి దిగి వెళ్లి, నీళ్లు తోడుకొనెను. అప్పుడు
46 నేను—నాకు దాహమిమ్మని ఆమెతో చెప్పితిని.। ఆమె
త్వరపడి తన కడవను దించుకొని—తాగుము; నీ ఒం
టెలకును తాగనిచ్చెదనని చెప్పెను గనుక నేను తాగి
47 నాను. ఆమె ఒంటెలకును తాగనిచ్చెను.। అప్పుడు
నేను — నీవు ఎవని కుమార్తెవని అడిగినందుకు,
ఆమె — మిల్కా నాహోరుకు కనిన కుమారుడైన
బతూయేలు కుమార్తెనని చెప్పినప్పుడు, నేను ఆమె
ముక్కుకు కమ్మి తగిలించి, ఆమె చేతులకు కడియ
48 ములు పెట్టి,। వంగి యెహోవాకు వందనము చేసి
అబ్రాహామనే నా యజమానుని దేవుడైన యెహో
వాను స్తుతించినాను; ఎందుకంటే ఆయన నా యజ
మానుని యొక్క సహోదరుని కుమార్తెను అతని
కుమారుని కొరకు తీసుకొనుటకు సరియైన మార్గ
49 మందు నన్ను నడిపించెను.। కాబట్టి నా యజమానుని
ఎడల మీరు కృపాసత్యములను అగుపరచనై ఉంటే,
అది అయినా నాకు తెలియ చెప్పండి; లేకపోతే
అది అయినా తెలియ చెప్పండి: అప్పుడు నేను కుడి
వైపునకైనా, ఎడమవైపునకైనా వెళ్లెదననెను.

50 అప్పుడు లాబానును బతూయేలును — అది యె
హోవావల్ల కలిగెను. అది చెడ్డదో మంచిదో నీతో
51 చెప్పలేము.। ఇదుగో! రిబ్కా నీ ఎదుట ఉన్నది; ఆ
మెను తీసుకొని వెళ్లుము. యెహోవా చెప్పిన
ప్రకారము ఈమెను నీ యజమానుని కుమారునికి
భార్య అయ్యుండనిమ్మని ప్రత్యుత్తరము చెప్పిరి.

అబ్రాహాము సేవకుడు వారి మాటలు వినినప్పుడు, 52
యెహోవా ఎదుట నేలను సాగిలపడెను.। తరువాత 53
ఆ సేవకుడు వెండి వస్తువులు, బంగారు వస్తువులు,
వస్త్రములును తీసి రిబ్కాకు ఇచ్చెను. మరియు అతడు
ఆమె సహోదరునికిని తల్లికిని విలువగల వస్తువులను
ఇచ్చెను.

అతడు అతనితో కూడా ఉన్న మనుష్యులును 54
అన్నపానములు పుచ్చుకొని అక్కడ ఆ రాత్రి వెళ్ల
బుచ్చిరి. ఉదయమందు వారు లేచినప్పుడు అతడు—
నా యజమానుని యొద్దికి నన్ను పంపించండని చెప్పె
ను.। అందుకు ఆమె సహోదరుడు ఆమె తల్లియు— 55
ఈ పడుచును పది దినములైనా మాయొద్ద ఉండనిమ్ము.
ఆ తరువాత ఆమె వెళ్ల వచ్చునని పలికిరి.। అప్పుడు 56
అతడు—యెహోవా నా మార్గమును అనుకూల
పరిచెను గనుక నాకు తడువు కానివ్వక నన్ను పం
పించండి; నా యజమానుని యొద్దికి వెళ్లుదునని చెప్పి
నప్పుడు। వారు — ఆ పడుచును పిలిచి ఆమె నోట 57
తెలుసుకొందమని చెప్పుకొని। రిబ్కాను పిలిచి—ఈ 58
మనుష్యునితో కూడా వెళ్లుదువా అని ఆమెతో పలి
కినప్పుడు—వెళ్లుతానని చెప్పెను.

కాబట్టి వారు తమ సహోదరియైన రిబ్కాను, 59
ఆమె దాదిని, అబ్రాహాము సేవకుని, అతని మనుష్య
లను సాగనంపినప్పుడు। రిబ్కాను చూచి—నీవు మా 60
సహోదరివి;* నీవు వెయివేలకు తల్లివవుదువు గాక.
నీ సంతతివారు తమ పగవారి గవిని స్వాధీనపరుచు
కొందురు గాకని ఆమెను ఆశీర్వదించిరి.

అప్పుడు రిబ్కాయు ఆమె పనికత్తెలును లేచి 61
ఒంటెలనెక్కి ఆ మనుష్యుని వెంబడి వెళ్లిరి. ఆలాగు
ఆ సేవకుడు రిబ్కాను తోడుకొని వెళ్లెను.

ఈసాకు బయేర్‌లహాయిరోయి మార్గమున వచ్చె 62
ను. అతడు దక్షిణ దేశమందు కాపురముండెను. సా
యంకాలమున। ఈసాకు పొలములో ధ్యానించుటకు 63
బైలువెళ్లి తన కన్నులెత్తి చూచినప్పుడు, ఇదుగో! ఒం
టెలు వచ్చుచుండెను.। రిబ్కా తన కన్నులెత్తి ఈసా 64
కును చూచి, ఒంటె మీదనుంచి దిగి।—మనలను ఎదు 65
రుకొనుటకు పొలములో వచ్చుచున్న ఆ మనుష్యుడు
ఎవడని సేవకుని అడిగెను.। అందుకు అతడు—ఇతడు 66
నా యజమానుడని చెప్పెను గనుక ఆమె ముసుకు
ఎత్తి వేసుకొనెను.

*లేక, మా సహోదరీ!

66 అప్పుడు ఆ సేవకుడు తాను చేసిన కార్యములన్ని
67 యు ఇస్సాకుతో వివరించి చెప్పెను. ఇస్సాకు తన
తల్లియైన శారా గుడారములోకి ఆమెను చేర్చుకొ
నెను. ఆలాగు అతడు రిబ్కాను పరిగ్రహించెను.
ఆమె అతనికి భార్య ఆయెను. అతడు ఆమెను
ప్రేమించెను. అప్పుడు ఇస్సాకు తన తల్లి విషయమై
దుఃఖనివారణ పొందెను.

## 25. అధ్యాయము.

1 అబ్రాహాము తిరిగీ ఒక స్త్రీని వివాహము చేసు
2 కొనెను. ఆమె పేరు కెతూరా. ఆమె అతనికి
జిమ్రాను, యొక్షాను, మదాను, మిద్యాను, ఇష్బాకు,
3 షూవహు అనే వారిని కనెను. యొక్షాను షెబానును
దదానును కనెను. అష్షూరీయులు, లెతూషీయులు,
లెయుమ్మీయులు అనేవారు ఆ దదాను పుత్రులు.
4 గేయిఫా, గేఫెరు, హనోకు, అబీదా, ఎల్దాయా
అనేవారు ఆ మిద్యాను కుమారులు. వీరందరు కెతూ
రా పుత్రులు.

5 అయితే అబ్రాహాము తనకు కలిగినది యావత్తును
6 ఇస్సాకుకు ఇచ్చెను. అబ్రాహాముయొక్క ఉపపత్నుల
కుమారులకు అబ్రాహాము బహుమానములిచ్చి, తాను
సజీవుడై ఉండగా తన కుమారుడైన ఇస్సాకు యొద్ద
నుంచి తూర్పు తట్టుగా తూర్పు దేశమునకు వారిని
పంపివేసెను.

7 అబ్రాహాము బ్రతికిన జీవిత సంవత్సరముల దిన
8 ములు నూట డెబ్బది ఐదు సంవత్సరములు. అప్పుడు
అబ్రాహాము నిండు వృద్ధదశకు వచ్చినవాడై, మంచి
ముసలితనమందు ప్రాణము విడిచి మృతిబొంది తన
9 ప్రజలయొద్దకు చేర్చబడెను. అతని కుమారులైన ఇస్సాకు
ఇష్మాయేలును, హిత్తీయుడైన సోహరు కుమారుడగు
ఎఫ్రోను పొలమందలి మక్పేలా గుహలో అతని పాతి
10 పెట్టిరి; అది మమ్రే ఎదుటనున్నది. అబ్రాహాము
హేతు కుమారులయొద్ద కొనిన పొలములోనే, అబ్రా
హాము అతని భార్యయైన శారాయు పాతిపెట్టబడిరి.
11 అబ్రాహాము మరణమైన తరువాత, దేవుడు అతని
కుమారుడైన ఇస్సాకును ఆశీర్వదించెను. అప్పుడు ఇ
స్సాకు బెయేర్‌లహాయిరోయి దగ్గర కాపురముండెను.

12 ఐగుప్తీయురాలును శారా దాసియునైన హాగరు
అబ్రాహామునకు కనిన అబ్రాహాము కుమారుడైన ఇష్మా
13 యేలు వంశావళి ఇదే: ఇష్మాయేలు ప్రథమ కుమారుడైన
14 నెబాయోతు, కేదారు, అద్బయేలు, మిబ్శాము, మిష్మా,
15 దూమా, మశ్శా, హదరు, తేయిమా, యెతూరు, నాపీ
16 షు, కెదమా, ఇవి వారి వారి వంశావళుల ప్రకారము
వారి వారి పేరుల చొప్పున ఇష్మాయేలు కుమారుల
యొక్క పేరులు. వారి వారి గ్రామములలోను పా
ళెములలోనును ఉన్న ఇష్మాయేలు కుమారులు వీరే;
వారి పేరులు ఇవే. వారి వారి జనముల ప్రకారము
వారు పన్నెండుగురు రాజులు. ఇష్మాయేలు బ్రతికిన 17
సంవత్సరములు నూట ముప్పది ఏడు సంవత్సరములు.
అప్పుడు అతడు ప్రాణము విడిచి మృతిబొంది తన
ప్రజలయొద్దకు చేర్చబడెను. వారు అష్షూరుకు వెళ్లే 18
మార్గమున హవీలా మొదలుకొని ఐగుప్తు ఎదుట
నున్న షూరు పర్యంతము నివసించేవారు. అతడు తన
సహోదరులందరి ఎదుట పాలు పొందెను.

అబ్రాహాము కుమారుడైన ఇస్సాకు వంశావళి ఇదే. 19
అబ్రాహాము ఇస్సాకును కనెను. ఇస్సాకు, పద్దనరా 20
ములో నివసించే అరామీయుడైన బెతూయేలు కుమా
ర్తెయును అరామీయుడైన లాబాను సహోదరియు
నైన రిబ్కాను పెండ్లి చేసుకొనినప్పుడు, అతడు నలు
బది సంవత్సరములవాడు. ఇస్సాకు భార్య గొడ్రాలు 21
గనుక అతడు ఆమె కొరకు యెహోవాను వేడుకొ
నెను. యెహోవా అతని ప్రార్థన వినెను. అప్పు
డు అతని భార్యయైన రిబ్కా గర్భవతి ఆయెను.
ఆమె గర్భములో శిశువులు ఒకనితో ఒకడు పెనుగు 22
లాడిరి గనుక ఆమె—ఈలాగైతే నేను ఎందుకు అని
అనుకొని యెహోవాను అడుగుటకు వెళ్లెను.
అప్పుడు యెహోవా ఆమెతో— 23

రెండు రాష్ట్రములు నీ గర్భములో కలవు;
రెండు జనపదములు నీ కడుపులోనుంచి
ప్రత్యేకించబడును:
ఒక జనపదము కంటే ఒక జనపదము
బలిష్ఠమై ఉండును;
పెద్దవాడు చిన్నవాని సేవించును అని చెప్పెను.

ఆమె ప్రసూతి దినములు సంపూర్ణమైనప్పుడు 24
ఇదుగో! ఆమె గర్భమందు కవలవారు ఉండిరి. మొద 25
టివాడు యెర్రనివాడుగా బైటికి వచ్చెను. అతని ఒళ్లం
తా రోమ వస్త్రము వలెను ఉండెను. అతనికి ఏశావు
అనే పేరు పెట్టిరి. తరువాత అతని సహోదరుడు 26
బైటికి వచ్చినప్పుడు అతని చెయ్యి ఏశావు మడిమెను
పట్టుకొనుచుండెను గనుక అతని పేరు యాకోబు
అనబడెను. ఆమె వారిని కనినప్పుడు, ఇస్సాకు అరు
వది ఏండ్లవాడు.

ఆ పడుచువారు ఎదిగినప్పుడు, ఏశావు వేట ఎరిగి, 27
అరణ్యవాసి అయ్యుండెను. యాకోబు యథార్థవం
తుడై గుడారములలో నివసించేవాడు. ఇస్సాకు ఏశా 28

వును ప్రేమించెను; ఎందుకంటే అతడు ఇతని వేట
మాంసము తినెను. రిబ్కా యాకోబును ప్రేమించెను.

29 యాకోబు కలగూరవంటకము వండుకొన్నప్పుడు,
ఏశావు పొలములోనుంచి వచ్చి అలసి ఉండెను.।
30 అప్పుడు ఏశావు—నేను అలసి ఉన్నాను గనుక ఆ
ఎఱ్ఱ యెఱ్ఱగా ఉన్నదానిలో దయచేసి కొంచెము
నన్ను తిననిమ్మని పలికెను. అందుచేతను అతని పేరు
31 ఎదోము* అనబడెను.। అందుకు యాకోబు—నీ జ్యేష్ఠ
32 త్వము నేడు నాకు అమ్ముమని పలికెను.। ఏశావు—నేను
చావబోవుచున్నాను గదా జ్యేష్ఠత్వము నాకు ఎందుకని
33 పలికినప్పుడు। యాకోబు—నేడు నాకు ప్రమాణము
చేయుమని చెప్పెను. అతడు యాకోబుకు ప్రమాణము
34 చేసి అతనికి తన జ్యేష్ఠత్వమును అమ్మివేసెను.। అప్పుడు
యాకోబు ఆహారమును అలచందల వంటకమును ఏశా
వుకు ఇచ్చెను. అతడు తిని, తాగి, లేచి వెళ్లెను. ఆలా
గున ఏశావు జ్యేష్ఠత్వమును తృణీకరించెను.

## 26. అధ్యాయము.

1 అబ్రాహాము దినములలో కలిగిన మొదటి కరువు
గాక, మరియొక కరువు ఆ దేశములో కలిగెను. అప్పు
డు ఈసాకు గెరారులో ఉన్న పిలిష్తీయుల రాజైన
2 అబీమెలెకు యొద్దికి వెళ్లెను.। అక్కడ యెహోవా
అతనికి అగుపడి—నీవు ఐగుప్తులోకి వెళ్లక, నేను
3 నీతో చెప్పే దేశమందు నివసించుము.। ఈ దేశమందు
పరవాసివై ఉండుము. నేను నీకు తోడై ఉండి, నిన్ను
4 ఆశీర్వదించెదను.। ఎందుకంటే నీకు నీ సంతానమున
కు ఈ దేశములన్నియు ఇచ్చి, నీ తండ్రియైన అబ్రా
హాముకు నేను చేసిన ప్రమాణము నెరవేర్చి, ఆకాశ
నక్షత్రములవలె నీ సంతానము విస్తరింపచేసి, నీ సం
తానమునకు ఈ దేశములన్నియు ఇచ్చెదను. నీ సం
తానమువల్ల సమస్త భూజనులును ఆశీర్వదించబడుదు
5 రు:। ఎందుకంటే అబ్రాహాము నా మాట విని గైకొ
నుటకు, నేను అప్పగించిన నా ఆజ్ఞలను, నా కట్టడ
లను నా బోధనలను గైకొనెనని చెప్పెను.

6,7 ఈసాకు గెరారులో నివసించెను.। ఆ చోటి మను
ష్యులు అతని భార్యను గురించి అడిగినప్పుడు, అత
డు—ఆమె నా సహోదరి అని చెప్పెను; ఎందుకం
టే—రిబ్కా చక్కనిది గనుక ఈ చోటి మనుష్యులు
ఆమె నిమిత్తము నన్ను చంపుదురేమో అనుకొని—
8 నా భార్య అని చెప్పుటకు భయపడెను.। అక్కడ అ
తడు చాలా దినములు ఉండిన తరువాత పిలిష్తీయుల
రాజైన అబీమెలెకు కిటికిగుండా చూచినప్పుడు ఈసా
కు తన భార్యయైన రిబ్కాతో సరసమాడుట కనబడె
ను.। అప్పుడు అబీమెలెకు ఈసాకును పిలిపించి—ఇదు 9
గో! ఆమె నీ భార్యయే—ఆమె నా సహోదరి అని
ఎందుకు చెప్పితివని పలికినప్పుడు ఈసాకు — ఆమె
నుంచి చనిపోదునేమో అనుకొంటినని అతనితో
చెప్పెను.। అప్పుడు అబీమెలెకు—నీవు మమ్మును చేసి 10
నది ఏమిటి! మా జనములో ఒకడు నీ భార్యతో
శయనించుటకు కొంచెము తప్పెను; లేకుంటే నీవు
మాకు అపరాధము కలగజేసియుందువే అని చెప్పె
ను.। అప్పుడు అబీమెలెకు—ఈ మనుష్యుని జోలికైనా 11
ఇతని భార్య జోలికైనా వెళ్లేవాడు నిశ్చయముగా చం
పబడునని తన ప్రజలకందరికిని ఆజ్ఞాపించెను.

అప్పుడు ఈసాకు ఆ దేశములో విత్తి, ఆ సంవత్స 12
రము నూరంతలు ఫలము పొందెను. యెహోవా
అతని ఆశీర్వదించెను. ఆ మనుష్యుడు గొప్పవాడా
యెను.। అతడు మిక్కిలీ గొప్పవాడయ్యే వరకు క్రమ 13
క్రమముగా అభివృద్ధి పొందుచుండెను.। అతనికి గొ 14
ఱ్ఱెల ఆస్తియు, గొడ్ల ఆస్తియు, దాసుల గొప్ప సమూ
హమును కలిగెను. పిలిష్తీయులు అతనియందు అసూ
యపడిరి.। అతని తండ్రియైన అబ్రాహాము దినము 15
లలో, అతని తండ్రి దాసులు తవ్విన నూతులన్నిటిని
పిలిష్తీయులు మన్నుపోసి పూడ్చిరి.

అబీమెలెకు—నీవు మా కంటే బహు బలము గల 16
వాడవు గనుక మా యొద్దనుంచి వెళ్లిపొమ్మని ఈసాకు
తో చెప్పెను.। ఈసాకు అక్కడనుంచి వెళ్లి, గెరారు 17
లోవలో తన గుడారము వేసుకొని అక్కడ నివసిం
చెను.। అప్పుడు ఈసాకు, తన తండ్రియైన అబ్రాహాము 18
దినములలో వారు తవ్విన నీళ్ల నూతులు తిరిగీ తవ్విం
చెను; అబ్రాహాము మరణమైన తరువాత, పిలిష్తీ
యులు వాటిని పూడ్చిరి. అతడు, తన తండ్రి వా
టికి పెట్టిన పేర్ల చొప్పున తిరిగీ వాటికి పేర్లు పెట్టె
ను.। మరియు ఈసాకు సేవకులు ఆ లోవలో తవ్వగా 19
జీవపు నీళ్ల నుయ్యి దొరికెను.। అప్పుడు గెరారు కాప 20
రులు ఈసాకు కాపరులతో జగడమాడి — ఈ నీరు
మాదే అని చెప్పిరి గనుక వారు తనతో కలహించినం
దున, అతడు ఆ నూతికి ఏశెకు† అనే పేరు పెట్టెను.
వారు। మరియొక నుయ్యి తవ్వినప్పుడు దాని కొరకు 21
ను జగడమాడిరి గనుక దానికి శిత్నా‡ అనే పేరు పె
ట్టెను.। అతడు అక్కడనుంచి వెళ్లి మరియొక నుయ్యి 22
తవ్వించెను. దాని కొరకు వారు జగడమాడలేదు
గనుక అతడు—ఇప్పుడు యెహోవా మనకు విశాల
స్థలము కలుగ చేసెను గనుక ఈ దేశమందు అభివృద్ధి

*అనగా, ఎరుపు. †అనగా, కలహము. ‡అనగా, విరోధము.

పొంది ఉన్నామని అనుకొని దానికి రహెూబోతు
23 అనే పేరు పెట్టెను.।అక్కడనుంచి అతడు బెయేర్షె
24 బాకు వెళ్లెను.। ఆ రాత్రియే యెహోవా అతనికి
అగుపడి—నేను నీ తండ్రియైన అబ్రాహాము దేవు
డను: నేను నీకు తోడై ఉన్నాను గనుక భయపడకు
ము: నా సేవకుడైన అబ్రాహాము నిమిత్తము నిన్ను ఆశీ
ర్వదించి నీ సంతానము విస్తరింపచేసెదనని చెప్పెను.
25 అక్కడ అతడు ఒక యజ్ఞవేది కట్టించి యెహోవా
పేరట ప్రార్థించి* అక్కడ తన గుడారము వేసెను.
అప్పుడు ఈసాకు సేవకులు అక్కడ నుయ్యి తవ్విరి.
26 అంతట అబీమెలెకును, అతని స్నేహితుడైన అహు
జ్జతును, అతని సేనాధిపతియైన పీకోలును గెరారునుంచి
27 అతని యొద్దికి వచ్చిరి.।అప్పుడు ఈసాకు—మీరు నా
మీద పగబట్టి, మీ యొద్దనుంచి నన్ను పంపివేసిన
తరువాత, ఎందునిమిత్తము నా యొద్దికి వచ్చి ఉన్నా
28 రని వారితో పలికెను.। అందుకు వారు—యెహోవా
నీకు తోడై ఉండుట నిశ్చయముగా చూచితిమి గను
క—మనకు, అనగా మాకును నీకును మధ్యను ఒక
29 ప్రమాణము ఉండ వలెననియు। మేము నిన్ను ముట్టక,
నీకు మేలే గాని మరి యేమిన్ని చేయక, నిన్ను సమా
ధానముగా పంపివేసినాము గదా నీవును మాకు కీడు
చేయకనుండేటట్టు నీతో నిబంధన చేసుకొందమ
నియు అనుకొంటిమి. ఇప్పుడు నీవు యెహోవా
30 ఆశీర్వాదము పొందినవాడవని పలికిరి.। అప్పుడు అ
తడు వారి కొరకు విందు చేసెను. వారు అన్నపాన
31 ములు పుచ్చుకొనిరి.। తెల్లవారినప్పుడు, వారు లేచి
ఒకనితో ఒకడు ప్రమాణము చేసుకొనిరి. తరువాత
ఈసాకు వారిని సాగనంపెను. వారు అతని యొద్ద
నుంచి సమాధానముగా వెళ్లిరి.
32 ఆ దినమందే ఈసాకు సేవకులు వచ్చి, తాము తవ్విన
నూతిని గురించి అతనికి తెలియచేసి—నీళ్లు కనుగొంటి
33 మని చెప్పిరి గనుక।దానికి షెబా అనే పేరు పెట్టెను.
కాబట్టి నేటివరకు ఆ ఊరి పేరు బెయేర్షెబా.
34 ఏశావు నలుబది సంవత్సరముల వాడైనప్పుడు హిత్తీ
యుడైన బయేరి కుమార్తెయగు యహూదీతును,
హిత్తీయుడైన ఏలోను కుమార్తెయగు బాశెమతును
35 పెండ్లి చేసుకొనెను.। వీరు ఈసాకుకు రిబ్కాకును
మనోదుఃఖము కలుగజేసిరి.

## 27. అధ్యాయము.

1 ఈసాకు వృద్ధుడై అతని కన్నులకు మందదృష్టి
కలిగినప్పుడు, అతడు, తన పెద్ద కుమారుడైన ఏశావును
పిలిచి—నా కుమారుడా! అని అతనితో పలుకగా,
అతడు—ఇదుగో! ఉన్నానని అతనితో చెప్పెను.।
అప్పడు అతడు—ఇదుగో నేను వృద్ధుడను. నా మరణ 2
దినము నాకు తెలియదు.। కాబట్టి నీవు దయచేసి, నీ 3
ఆయుధములైన నీ అంబుల పొది, నీ విల్లును తీసు
కొని అడవికి వెళ్లి, నా కొరకు వేటాడి మాంసము
తెమ్ము.। నేను చావక మునుపు, నిన్ను నేను ఆశీర్వదించే 4
నిమిత్తము, నాకిష్టమైన రుచిగల వాటిని సిద్ధపరిచి,
నేను తినుటకై నాయొద్దికి తెమ్మని చెప్పెను.
ఈసాకు తన కుమారుడైన ఏశావుతో ఆలాగు పలు 5
కగా, రిబ్కా వినుచునుండెను. ఏశావు వేటాడి మాం
సము తెచ్చుటకు అడవికి వెళ్లెను.। అప్పుడు రిబ్కా 6
తన కుమారుడైన యాకోబును చూచి — ఇదుగో! నీ
తండ్రి నీ సహోదరుడైన ఏశావుతో।—నేను మృతి 7
బొందక మునుపు, నేను తిని యెహోవా ఎదుట నిన్ను
ఆశీర్వదించే నిమిత్తము, నా కొరకు మాంసము తెచ్చి
నాకు రుచిగల వాటిని సిద్ధపరుచుమని చెప్పుట విన్నా
ను.।కాబట్టి నా కుమారుడా! నా మాట విని, నేను నీకు 8
ఆజ్ఞాపించే ప్రకారము చేయుము.। నీవు దయచేసి మం 9
దకు వెళ్లి, రెండు మంచి మేకపిల్లలను అక్కడనుంచి
నా యొద్దికి తెమ్ము. వాటితో నీ తండ్రికి ఇష్టమైన
రుచిగల వాటిని అతని కొరకు చేసెదను.। అప్పుడు 10
అతడు మృతిబొందక మునుపు, నిన్ను ఆశీర్వదించే
నిమిత్తము, తినుటకై వాటిని నీ తండ్రి యొద్దికి తీసు
కొని వెళ్లుమని పలికెను.। అందుకు యాకోబు— 11
ఇదుగో! నా సహోదరుడైన ఏశావు రోమములు కల
వాడు; నేనయితే నున్ననివాడను.। ఒకవేళ నా తండ్రి 12
నన్ను తడవి చూచును. అప్పుడు నేను అతని దృష్టికి
వంచకుడనై, నా మీదికి శాపమే గాని ఆశీర్వాదము
తెచ్చుకొనననని పలికెను.।అయితే అతని తల్లి—నా కుమా 13
రుడా! నీ శాపము నా మీదికి రానిమ్ము. నీవు నా మాట
విని, వెళ్లి నా యొద్దికి తీసుకొని రమ్ము, అంతే అని చె
ప్పెను.। అప్పుడు అతడు వెళ్లి వాటిని తన తల్లియొద్దికి 14
తీసుకొని వచ్చెను. అతని తల్లి అతని తండ్రికి ఇష్టమైన
రుచిగల వాటిని సిద్ధపరిచెను.। మరియు తన ప్రథమ 15
కుమారుడైన ఏశావుయొక్క సొగసైన వస్త్రములు
ఇంట్లో తన యొద్ద ఉండెను గనుక। రిబ్కా వాటిని 16
తీసి, తన చిన్న కుమారుడైన యాకోబుకు తొడిగించి,
ఆ మేకపిల్లల చర్మములతో అతని చేతులను అతని మెడ
నునుపును కప్పి। తాను సిద్ధపరిచిన రుచిగల వాటిని 17
రొట్టెను తన కుమారుడైన యాకోబు చేతికి ఇచ్చెను.

*లేక, పేరు ప్రకటించి.

18 అప్పుడు అతడు తన తండ్రి యొద్దకి వచ్చి—నా
తండ్రీ! అని పలుకగా, అతడు—ఇదుగో! ఉన్నాను;
19 నా కుమారుడా! నీవు ఎవడవని పలికెను.। అందుకు
యాకోబు—నేను ఏశావనే నీ ప్రథమ కుమారుడను;
నీవు నాతో చెప్పిన ప్రకారము చేసి ఉన్నాను.
నీవు నన్ను ఆశీర్వదించే నిమిత్తము, దయచేసి లేచి
కూర్చుండి, నేను వేటాడి తెచ్చినదాని తినుమని చెప్పె
20 ను.। అప్పుడు ఈసాకు—నా కుమారుడా! ఇంత శీఘ్ర
ముగా అది నీకు ఏలాగున దొరికెనని పలుకగా,
అతడు—నీ దేవుడైన యెహోవా దాని నా ఎదుటికి
21 రప్పించుటవల్లనే అని చెప్పెను.। అప్పుడు ఈసాకు—
నా కుమారుడా! నీవు ఏశావనే నా కుమారుడవౌదు
వో కావో నేను నిన్ను తడవి చూచుటకై దగ్గరకు
22 రమ్మని చెప్పెను.। యాకోబు తన తండ్రియైన ఈసాకు
దగ్గర చేరినప్పుడు, అతడు అతని తడవి చూచి—స్వ
రము యాకోబు స్వరమే గాని చేతులు ఏశావు చేతు
23 లని పలికెను.। అతని చేతులు అతని సహోదరుడైన
ఏశావు చేతుల వలె రోమములు గలవైనందున, అతడు
అతని గురుతుపట్టలేక అతని ఆశీర్వదించెను.

24 అప్పుడు అతడు—ఏశావనే నా కుమారుడవు నీవే
నా అని అడగగా, అతడు — నేనే అని చెప్పెను.।
25 అంతట అతడు—అది నా యొద్దకి తెమ్ము; నేను నిన్ను
ఆశీర్వదించే కొరకు, నా కుమారుడు వేటాడి తెచ్చినది
తింటానని పలికెను. అతడు తెచ్చినప్పుడు అతడు తినె
ను. ద్రాక్షారసమును తెచ్చినప్పుడు అతడు తాగెను.।
26 తరువాత అతని తండ్రియైన ఈసాకు-నా కుమారుడా!
దగ్గరకు వచ్చి నన్ను ముద్దుబెట్టుకొనుమని అతనితో
27 చెప్పెను.। అతడు దగ్గరకు వచ్చి అతని ముద్దుబెట్టుకొ
నెను. అప్పుడు అతడు అతని వస్త్రములను వాసన
చూచి అతని ఆశీర్వదించి ఇట్లనెను—

చూడుము! నా కుమారుని వాసన!
యెహోవా దీవించిన అడవి వాసన వలెనున్నది.।
28 ఆకాశపు మంచు, భూసారఖండములును,
విస్తారమైన ధాన్య ద్రాక్షారసములును,
దేవుడు నీకు అనుగ్రహించును.।
29 జనములు నిన్ను సేవించును;
రాష్ట్రములు నీకు సాగిలపడును;
నీ సహోదరులకు నీవు ఏలికవై ఉండుము;
నీ తల్లి పుత్రులు నీకు సాగిలపడుదురు;
నిన్ను శపించేవారు శపించబడుదురు;
నిన్ను దీవించేవారు దీవించబడుదురనెను.

ఈసాకు యాకోబును ఆశీర్వదించుట చాలించిన 30
ప్పుడు, యాకోబు తన తండ్రియైన ఈసాకు ఎదుట
నుంచి బైలుదేరి వెళ్లగానే, అతని సహోదరుడైన
ఏశావు వేటాడి వచ్చెను.। అతడును రుచిగల వాటిని 31
సిద్ధపరిచి తన తండ్రియొద్దకి తెచ్చి—తాను నన్ను ఆశీ
ర్వదించే నిమిత్తము, నా తండ్రి లేచి తన కుమారుడు
వేటాడి తెచ్చినదాని తినునుగాకని తన తండ్రితో పలి
కెను.। అతని తండ్రియైన ఈసాకు—నీవు ఎవడవని 32
అతని అడిగినప్పుడు, అతడు—నేను నీ కుమారుడను,
ఏశావనే నీ ప్రథమ కుమారుడను అని చెప్పెను. అ
ప్పుడు। ఈసాకు మిక్కుటమైన వణుకుతో గడగడ 33
వణుకుచు — ఆలాగైతే వేటాడిన దాని నా యొద్దకి
తెచ్చినవాడు ఎవడు? నీవు రాక మునుపు నేను అన్ని
టిలోను తిని అతని ఆశీర్వదించితిని. అంతేకాదు,
అతడు ఆశీర్వదించబడినవాడై ఉండునని పలికెను.

ఏశావు తన తండ్రి మాటలు వినినప్పుడు, అతడు దుః 34
ఖాక్రాంతుడై, పెద్ద కేకవేసి,—ఓ నా తండ్రీ! నన్ను,
నన్నును ఆశీర్వదించుమని తన తండ్రితో చెప్పెను.।
అప్పుడు అతడు—నీ సహోదరుడు కపటోపాయ 35
ముతో వచ్చి, నీ ఆశీర్వాదము పొంది ఉన్నాడని
చెప్పెను.। అందుకు అతడు—అతని పేరు యాకోబు 36
అనబడుటవల్లనా అతడు నన్ను ఈ రెండు మార్లు మోస
పుచ్చెను? నా జ్యేష్ఠత్వము తీసుకొనెను. ఇదుగో!
ఇప్పుడు నా ఆశీర్వాదము పుచ్చుకొన్నాడు అని పలికి;
మరియు—నాకొరకు ఆశీర్వాదమేమిన్ని మిగిలించలేదా
అని పలికెను.। అందుకు ఈసాకు—ఇదుగో! అతని 37
నీకు ఏలికనుగా నియమించి అతని సహోదరులంద
రిని అతనికి దాసులగా ఇచ్చితిని; ధాన్యము ద్రాక్షా
రసమును అతనికి ఆధారముగా ఇచ్చితిని గనుక, నా
కుమారుడా! నీకేమి చేయగలనని ఏశావుతో ప్రత్యు
త్తరము చెప్పెను.। అప్పుడు ఏశావు—నా తండ్రీ! 38
ఆశీర్వాదమొక్కటే నీకు కలదా? నా తండ్రీ! నన్ను
నన్నును ఆశీర్వదించుమని తన తండ్రితో పలికెను.
అప్పుడు ఏశావు నోరెత్తి ఏడ్చెను.
అప్పుడు అతని తండ్రియైన ఈసాకు— 39
నీ నివాసము భూసారము లేకను*
పైనుంచి పడే ఆకాశపు మంచులేకను† ఉండును.।
నీవు నీ కత్తిచేత బ్రతుకుదువు; 40
నీ సహోదరుని సేవించుదువు:
నీవు తిరుగులాడుచునుండగా
నీ మెడమీదనుంచి అతని కాడి విరిచివేయుదువని
అతనితో ప్రత్యుత్తరము చెప్పెను.

* లేక, భూమి సారముతోను. † లేక, మంచుతోను.

41 అప్పుడు తన తండ్రి, యాకోబును ఇచ్చిన ఆశీర్వా
దము నిమిత్తము, ఏశావు అతని మీద పగబట్టెను.
మరియు ఏశావు—నా తండ్రిని గురించిన దుఃఖదిన
ములు సమీపముగా ఉన్నవి; అప్పుడు నా సహోద
రుడైన యాకోబును చంపెదనని తన మనస్సులో అను
42 కొనెను. । ఆమె పెద్ద కుమారుడైన ఏశావు మాటలు
రిబ్కాతో చెప్పబడినప్పుడు, ఆమె తన చిన్న కుమారు
డైన యాకోబును పిలువనంపి అతనితో ఇట్లనెను—
ఇదుగో! నీ సహోదరుడైన ఏశావు నిన్ను చంపెద
నని, నిన్ను గురించి తన్నుతాను ఓదార్చుకొనుచు
43 న్నాడు. । కాబట్టి నా కుమారుడా! నీవు నా మాట విని,
లేచి, హారానులో ఉండే నా సహోదరుడైన లా
బాను యొద్దికి పారిపోయి, నీ సహోదరుని కోపాగ్ని
44,45 చల్లారే మట్టుకు, । నీ సహోదరుని కోపము నీ మీద
నుంచి తొలగి, నీవు అతనికి చేసినవాటిని అతడు మరి
చే మట్టుకు, అతని యొద్ద కొన్నాళ్లు ఉండుము; అప్ప
డు నేను అక్కడనుంచి నిన్ను రప్పించెదను. ఒక్కనా
డే మీ ఇద్దరిని నేను ఎందుకు పోగొట్టుకొనవలెననెను.
46 రిబ్కా ఈసాకును చూచి—హేతు కుమార్తెల
వల్ల నా ప్రాణము విసికినది. ఈ దేశపు కుమార్తె
లైన హేతు కుమార్తెలలో వీరివంటి ఒక దాని, యా
కోబు పెండ్లి చేసుకొంటే నా ప్రాణము నాకు ఎం
దుకని చెప్పెను.

## 28. అధ్యాయము.

1 అప్పుడు ఈసాకు యాకోబును పిలిపించి అతని
చూచి—నీవు కనాను కుమార్తెలలో ఎవతెను వివా
2 హము చేసుకొనకూడదు. । నీవు లేచి పద్దనరాములో
నున్న నీ తల్లియొక్క తండ్రియైన బతూయేలు ఇంటికి
వెళ్లి, అక్కడ నీ తల్లి సహోదరుడైన లాబాను
కుమార్తెలలో ఒకదాని వివాహము చేసుకొనుమని
3 అతనికి ఆజ్ఞాపించి । —సర్వశక్తిగల దేవుడు నిన్ను* ఆశీ
ర్వదించి, నీవు జనపదముల సంఘమయేటట్టు నిన్ను
4 సంతానాభివృద్ధి పొందించునుగాక: । దేవుడు తాను
అబ్రాహామునకు ఇచ్చినదిని, నీవు పరవాసివై ఉన్నది
నైన దేశమును నీవు స్వాధీనపరుచుకొనేటట్టు, అబ్రా
హాము ఆశీర్వాదమును నీకును నీతో కూడా నీ సం
తానమునకును దయచేసును గాకని అతని ఆశీర్వదిం
చెను.

5 అప్పుడు ఈసాకు యాకోబును పంపివేసెను. అత
డు పద్దనరాములో ఉండే అరమీయుడైన బతూయే
లు కుమారుడును, యాకోబు ఏశావు అనే వారి తల్లి
యగు రిబ్కా సహోదరుడునైన లాబాను యొద్దికి
వెళ్లెను.

ఈసాకు యాకోబును ఆశీర్వదించి పద్దనరాములో 6
నుంచి ఒక స్త్రీని భార్యగా తెచ్చుకొనుటకు, అతని
అక్కడికి పంపుటయు, అతని ఆశీర్వదించినప్పుడు—
నీవు కనాను దేశపు కుమార్తెలలో ఎవతెను పెండ్లి
చేసుకొనకూడదని అతనికి ఆజ్ఞాపించుటయు, । యా 7
కోబు తన తండ్రికి తన తల్లికిని విధేయుడై పద్దన
రామునకు వెళ్లి ఉండుటయు ఏశావు చూచెను. ।
మరియు కనాను కుమార్తెలు తన తండ్రియైన ఈసా 8
కుకు ఇష్టలు కాకుండుట ఏశావు చూచినప్పుడు । ఏ 9
శావు ఇష్మాయేలు యొద్దికి వెళ్లి తనకు కలిగిన భార్యలు
గాక అబ్రాహాము కుమారుడైన ఇష్మాయేలు కుమార్తె
యు నెబాయోతు సహోదరియునైన మాహలతును
కూడా పెండ్లి చేసుకొనెను.

యాకోబు బెయేర్షెబానుంచి బైలుదేరి హారాను 10
వైపు వెళ్లుచు । ఒక చోట చేరి, ప్రొద్దు గ్రుంకినం 11
దున, అక్కడ ఆ రాత్రి వెళ్లబుచ్చి, ఆ చోటి రాళ్లు
కొన్ని తీసుకొని, తనకు తలగడలుగా చేసుకొని,
అక్కడ పండుకొనెను. । అప్పుడు అతడు ఒక కల 12
కనెను. అందులో ఒక నిచ్చెన భూమి మీద నిలప
బడి ఉండెను; దాని కొన ఆకాశమును అంటెను.
దాని మీద దేవుని దూతలు ఎక్కుచు దిగుచునుం
డిరి. । మరియు అదుగో! యెహూవా దానికి మీదు 13
గా నిలిచి — నేను నీ తండ్రియైన అబ్రాహాము దేవు
డను, ఈసాకు దేవుడనైన యెహూవాను. నీవు పం
డుకొని ఉన్న ఈ భూమి నీకు నీ సంతానమునకును
ఇచ్చెదను. । నీ సంతానము భూమి ఇసుక వలె ఉం 14
డును. నీవు పడమటి తట్టు తూర్పు తట్టు ఉత్తరము
తట్టు దక్షిణము తట్టు వ్యాపించెదవు. భూమియొక్క
వంశములన్నియు నీ యందు* నీ సంతానమందును ఆశీ
ర్వదించబడును. । ఇదుగో! నేను నీకు తోడై ఉండి 15
నీవు వెళ్లే ప్రతి స్థలమందు నిన్ను కాపాడుచు ఈ
దేశమునకు నిన్ను తిరిగి రప్పించెదను. నేను నీతో
చెప్పినది నెరవేర్చే పర్యంతము, నిన్ను విడువనని
చెప్పెను.

అప్పుడు యాకోబు నిద్ర తెలిసి—నిశ్చయముగా 16
యెహూవా ఈ స్థలమందు ఉన్నాడు; అయితే అది
నాకు తెలియకపోయెనని అనుకొనెను. । అతడు భయ 17
పడి—ఈ స్థలము ఎంతో భయంకరముగా ఉన్నది!
ఇది దేవుని మందిరమే కాని వేరొకటి కాదు; ఇదే
ఆకాశముయొక్క గవిని అని అనుకొనెను. । తెల్లవారి 18
నప్పుడు యాకోబు లేచి తాను తలగడగా చేసుకొనిన
రాయి తీసి, అది స్తంభముగా నిలిపి, దాని కొన మీద
నూనె పోసెను. । మరియు అతడు ఆ స్థలమునకు బేతే 19

*లేక, వల్ల.

లు* అనే పేరు పెట్టెను. అయితే మొదట ఆ ఊరి
20,21 పేరు లూజు.। అప్పుడు యాకోబు—నేను తిరిగీ నా
తండ్రి ఇల్లు సురక్షితముగా చేరేటట్టు దేవుడు నాకు
తోడై ఉండి నేను వెళ్లే ఈ మార్గములో నన్ను కా
పాడి, తినుటకు ఆహారమును, పైని వేసుకొనుటకు
వస్త్రమును నాకు దయచేసితే అప్పుడు యెహోవా
22 నాకు దేవుడై ఉండును.। మరియు స్తంభముగా నేను
నిలిపిన ఈ రాయి దేవుని మందిరము ఔను. మరియు
నీవు నాకు ఇచ్చే అన్నిటిలో పదోవంతు నిశ్చయ
ముగా నీకు చెల్లించెదనని మ్రొక్కుకొనెను.

## 29. అధ్యాయము.

1 అప్పుడు యాకోబు బైలుదేరి, తూర్పు జనుల
2 దేశమునకు వెళ్లెను.। అతడు చూచినప్పుడు, ఇదుగో!
పొలములో ఒక నుయ్యి కనబడెను. అక్కడ దాని
యొద్ద గొఱ్ఱెల మందలు మూడు పండుకొని ఉండెను.
ఎందుకంటే మందలను ఆ నూతి నీళ్లు తాగింతురు.
3 ఒక పెద్ద రాయి నూతి వాత ఉండెను.। అక్కడికి
మందలన్నియు కూడివచ్చేటప్పుడు, నూతి వాతినుంచి
ఆ రాయి పొర్లించి, గొఱ్ఱెలను నీళ్లు తాగించి, తిరిగీ
4 నూతి వాతి రాయి దాని చోటను వేయుదురు.। యా
కోబు వారిని చూచి—అన్నలారా! మీరు ఎక్కడివా
రని అడగగా వారు — మేము హారాను వారమని
5 చెప్పిరి.। అప్పుడు అతడు—నాహోరు కుమారుడైన
లాబానును మీరు ఎరుగుదురా? అని వారిని అడిగి
6 నందుకు వారు—ఎరుగుదుమని చెప్పిరి.। మరియు అత
డు — అతనికి క్షేమమా? అని వారిని అడిగినప్పుడు
వారు — క్షేమమే; ఇదుగో! అతని కుమార్తెయైన
రాహేలు గొఱ్ఱెలతో కూడా వచ్చుచున్నదని చెప్పిరి.
7 అప్పుడు అతడు—ఇదుగో! ఇంకా చాలా ప్రొద్దు
ఉన్నది; పశువులను కూర్చేవేళ కాలేదు; గొఱ్ఱెలను
8 నీళ్లు తాగించి, వెళ్లి వాటిని మేపండని చెప్పెను.। అ
యితే వారు—మందలన్నియు కూడక మునుపు అది
మావల్ల కాదు. తరువాత నూతి వాతి మీదనుంచి
రాయి పొర్లించుదురు; అప్పుడే మేము గొఱ్ఱెలను
నీళ్లు తాగించెదమని చెప్పిరి.
9 అతడు ఇంకా వారితో మాట్లాడుచుండగా, రా
హేలు తన తండ్రి గొఱ్ఱెల మందతో కూడా వచ్చెను।
10 ఆమె వాటిని మేపేది.। అప్పుడు యాకోబు తన తల్లి
సహోదరుడైన లాబాను కుమార్తెయగు రాహే
లును తన తల్లి సహోదరుడైన లాబాను గొఱ్ఱెలను
చూచినప్పుడు, యాకోబు దగ్గరకు వెళ్లి నూతి వాతి
మీదనుంచి రాయి పొర్లించి, తన తల్లి సహోదరు
డైన లాబాను గొఱ్ఱెలను నీళ్లు తాగించెను. యాకోబు
రాహేలును ముద్దుబెట్టుకొని కంఠమెత్తి ఏడ్చెను.।
మరియు యాకోబు తాను ఆమె తండ్రి బంధువుడ 11,12
ననియు, రిబ్కా కుమారుడననియు రాహేలుతో
చెప్పినప్పుడు, ఆమె పరుగెత్తి తన తండ్రితో చెప్పెను.
లాబాను తన సహోదరి కుమారుడైన యాకోబు 13
సమాచారము వినినప్పుడు అతని ఎదురుకొనుటకు
పరుగెత్తి అతని కౌగలించి ముద్దుబెట్టుకొని తన ఇం
టికి తోడుకొని వెళ్లెను. అతడు ఈ సంగతులన్నియు
లాబానుతో చెప్పెను.। అప్పుడు లాబాను—నిజముగా 14
నీవు నా యెముకయు నా మాంసమునై ఉన్నావని
పలికెను. అతడు నెలదినములు అతని యొద్ద నివసిం
చిన తరువాత। లాబాను — నీవు నా బంధువుడవై 15
నందున ఊరకనే నాకు కొలువు చేసితివా? నీకేమి
జీతము కావలెనో నాకు తెలుపుమని యాకోబుతో
చెప్పెను.

లాబానుకు ఇద్దరు కుమార్తెలు ఉండిరి. వారిలో 16
పెద్దదాని పేరు లేయా; చిన్నదాని పేరు రాహేలు.।
లేయా జబ్బుచూపు గలది. అయితే రాహేలు రూ 17
పవతియు సుందరియునై ఉండెను.। యాకోబు రా 18
హేలును ప్రేమించి—నీ చిన్న కుమార్తెయైన రా
హేలు నిమిత్తము నీకు ఏడు సంవత్సరములు కొలువు
చేసెదననెను.। అందుకు లాబాను — ఆమెను అన్య 19
నికి ఇచ్చుటకంటే నీకు ఇచ్చుట మేలు; నా యొద్ద
ఉండుమని చెప్పెను.

యాకోబు రాహేలు నిమిత్తము ఏడు సంవత్సర 20
ములు కొలువు చేసెను. అయితే అతడు ఆమెను
ప్రేమించుటవల్ల, అవి అతనికి కొద్ది దినములుగా కన
బడెను.। తరువాత యాకోబు — నా దినములు సం 21
పూర్ణమైనవి గనుక నేను నా భార్యయొద్ద చేరే
నిమిత్తము ఆమెను నాకు ఇమ్మని లాబానుతో చెప్పె
ను.। అప్పుడు లాబాను ఆ స్థలములో ఉన్న సమస్త 22
మనుష్యులను పోగుచేసి, విందు చేయించి। రాత్రివే 23
ళను తన కుమార్తెయైన లేయాను అతని యొద్దికి
తీసుకొని వెళ్లెను. అప్పుడు అతడు ఆమె యొద్దికి
ప్రవేశించెను.। మరియు, లాబాను తన దాసియైన 24
జిల్పాను తన కుమార్తెయైన లేయాకు దాసిగా
ఇచ్చెను.

ఉదయమందు, ఇదుగో! అది లేయా గనుక అతడు 25
లాబానును చూచి—నీవు నాకు చేసినది ఏమిటి? రా
హేలు నిమిత్తమే గదా నీకు కొలువు చేసినాను; ఎం
దుకు నన్ను మోసపరిచినావనెను.। అందుకు లాబా 26

*ఏల్=దేవుని, బేత్=మందిరము.

ను—పెద్దదాని కంటె ముందుగా చిన్నదానిని ఇచ్చుట
27 మా దేశ మర్యాద కాదు. । ఈమె యొక్క వారము
సంపూర్ణము చేయుము; నీవు ఇక ఏడు సంవత్సర
ములు నాకు చేసే కొలువు నిమిత్తము, ఆమెను కూడా
నీకు ఇచ్చెదమని చెప్పెను.
28 యాకోబు ఆలాగు చేసి ఆమె వారమును నెరవే
ర్చిన తరువాత, అతడు తన కుమార్తెయైన రాహే
29 లును అతనికి భార్యగా ఇచ్చెను. । మరియు, లాబాను
తన దాసియైన బిల్హాను తన కుమార్తెయైన రాహే
లుకు దాసిగా ఇచ్చెను.
30 అతడు రాహేలు యొద్దికి వెళ్లెను. మరియు, అత
డు లేయాకంటె రాహేలును బహుగా ప్రేమించి
31 అతనికి మరి ఏడు ఏండ్లు కొలువు చేసెను. । లేయా
ద్వేషించబడుట యెహోవా చూచి ఆమె గర్భము
తెరవచేసెను. అయితే రాహేలు గొడ్రాలై ఉండెను.।
32 లేయా గర్భవతియై కుమారుని కనెను. అప్పుడు
ఆమె — యెహోవా నా బాధ చూచి ఉన్నాడు
గనుక నా పెనిమిటి నన్ను ప్రేమించును గదా అని
అనుకొని అతనికి రూబేను* అనే పేరు పెట్టెను.
33 ఆమె తిరిగీ గర్భవతియై కుమారుని కని — నేను
ద్వేషించబడితినని యెహోవా విన్నాడు గనుక
ఇతని కూడా నాకు దయ చేసెనని అనుకొని అతనికి
షిమ్యోను† అనే పేరు పెట్టెను.
34 ఆమె తిరిగీ గర్భవతియై కుమారుని కని—తుద
కు, ఈసారి నా పెనిమిటి నాతో హత్తుకొని ఉం
డును; అతనికి ముగ్గురు కుమారులను కంటినని అను
కొనెను. అందుచేతను అతనికి లేవీ‡ అనే పేరు
పెట్టబడెను.
35 ఆమె తిరిగీ గర్భవతియై కుమారుని కని—ఈసారి
యెహోవాను స్తుతించెదనని అనుకొనెను. అందు
చేతను అతనికి యూదా§ అనే పేరు పెట్టెను.
అప్పుడు ఆమెకు కానుపు ఉడిగెను.

## 30. అధ్యాయము.

1 రాహేలు తాను యాకోబుకు పిల్లలను కనకపో
వుట చూచి తన అక్కయందు అసూయపడి యాకో
బుతో — పిల్లలను నాకు ఇమ్ము; లేనిపక్షమందు నేను
2 చచ్చెదనని పలికెను. । అప్పుడు యాకోబు కోపము
రాహేలు మీద రవులుకొని అతడు — నీకు గర్భ
ఫలము ఇవ్వకపోయిన దేవునికి నేను ప్రతిగా, ఉ
3 న్నానా అని పలికెను. । అందుకు ఆమె — నా దాసి
యైన బిల్హా ఉన్నదికదా ఆమె యొద్దికి నీవు వెళ్లుము;
ఆమె నా కొరకు|| పిల్లలను కనును. ఆలాగున ఆమె
వల్ల నాకును పిల్లలు కలుగుదురని చెప్పి, । తన దాసి 4
యైన బిల్హాను అతనికి భార్యగా ఇచ్చెను. యాకోబు
ఆమె యొద్దికి వెళ్లెను. । బిల్హా గర్భవతియై యాకో 5
బుకు కుమారుని కనెను.। అప్పుడు రాహేలు—దేవుడు 6
నాకు న్యాయము తీర్చెను. మరియు ఆయన నా
మొర విని నాకు కుమారుని దయచేసెనని అనుకొనెను.
అందుచేత అతనికి దాను¶ అనే పేరు పెట్టెను.
రాహేలు దాసియైన బిల్హా తిరిగీ గర్భవతియై, 7
యాకోబుకు రెండవ కుమారుని కనెను.। అప్పుడు రా 8
హేలు—నా అక్కతో గొప్ప* పోరాటములు పో
రాడితిని; అంతే కాదు, గెలిచితినని అనుకొని, అత
నికి నఫ్తాలీ† అనే పేరు పెట్టెను.
లేయా తనకు కానుపు ఉడుగుట చూచి, తన 9
దాసియైన జిల్పాను తీసుకొని ఆమెను యాకోబుకు
భార్యగా ఇచ్చెను. । లేయా దాసియైన జిల్పా యా 10
కోబుకు కుమారుని కనెను. । అప్పుడు లేయా — ఇది 11
అదృష్టమువల్ల అని అనుకొని అతనికి గాదు‡ అనే
పేరు పెట్టెను.
లేయా దాసియైన జిల్పా యాకోబుకు రెండవ 12
కుమారుని కనెను. । అప్పుడు లేయా—నా భాగ్యము 13
వల్ల! కుమార్తెలు నన్ను భాగ్యవతి అందురు గదా అని
అతనికి ఆషేరు§ అనే పేరు పెట్టెను.
గోధుముల కోతకాలములో రూబేను వెళ్లి, పొల 14
ములో దూదాయి పండ్లు కనుగొని తన తల్లియైన
లేయాకు తెచ్చి ఇచ్చెను. అప్పుడు రాహేలు — నీ
కుమారుని దూదాయి పండ్లలో కొన్ని నాకు దయ
చేయుమని లేయాతో చెప్పెను.। అందుకు ఆమె— 15
నా పెనిమిటిని తీసుకొనుట అల్పకార్యమా? ఇప్పుడు
నా కుమారుని దూదాయి పండ్లను తీసుకొందువా?
అని పలికెను. అప్పుడు రాహేలు — అందుకు నీ
కుమారుని దూదాయి పండ్ల నిమిత్తము అతడు ఈ
రాత్రి నీతో కూడా పండుకొనునని చెప్పెను.
సాయంకాలమందు యాకోబు పొలమునుంచి వచ్చి 16
నప్పుడు, లేయా అతని ఎదురుకొనుటకు బైలుదేరి—
నీవు నా యొద్దికి రావలెను; నా కుమారుని దూదాయి
పండ్లచేత నిన్ను సంపాదించుకొంటినని చెప్పెను.
కాబట్టి అతడు ఆ రాత్రి ఆమెతో పండుకొనెను.।
దేవుడు లేయా మనవి వినెను గనుక ఆమె గర్భ 17

*అనగా, కుమారుని చూడుము. †అనగా, వినుట. ‡అనగా, హత్తుకొనుట. §అనగా, స్తుతించబడినవాడు.
||హెబ్రీ, నా మోకాళ్లమీద. ¶అనగా, తీర్పరి.
*హెబ్రీ, దేవుని. †అనగా, నా పోరాటము. ‡అనగా, అదృష్టము. §అనగా, భాగ్యము.

వతియై యాకోబుకు ఐదవ కుమారుని కనెను.।
18 లేయా—నేను నా పెనిమిటికి నా దాసిని ఇచ్చినం
దున దేవుడు నా జీతము దయచేసెనని అనుకొని
అతనికి ఇశ్శాకారు* అనే పేరు పెట్టెను.

19 లేయా తిరిగీ గర్భవతియై యాకోబుకు ఆరవ
20 కుమారుని కనెను.। అప్పుడు లేయా—దేవుడు మంచి
బహుమతి నాకు దయచేసెను. నా పెనిమిటికి ఆరు
గురు కుమారులను కని ఉన్నాను గనుక అతడు ఇప్పు
డు నాతో నివసించునని అనుకొని, అతనికి జెబు
21 లూను† అనే పేరు పెట్టెను.। ఆ తరువాత ఆమె
కుమార్తెను కని, ఆమెకు దీనా అనే పేరు పెట్టెను.
22 దేవుడు రాహేలును జ్ఞాపకము చేసుకొని, ఆమె
23 మనవి విని, ఆమె గర్భము తెరవచేసెను.। అప్పుడు
ఆమె గర్భవతియై కుమారుని కని — దేవుడు నా
24 నింద తొలిగించెనని అనుకొనెను.। మరియు ఆమె—
యెహోవా మరియొక కుమారుని నాకు దయచేసు
నని అనుకొని అతనికి యోసేపు‡ అనే పేరు పెట్టెను.

25 రాహేలు యోసేపును కనిన తరువాత యాకోబు
లాబానును చూచి—నన్ను పంపివేయుము; నా చోటికి
26 నా దేశమునకు వెళ్లెదను.। నా భార్యలను నా పిల్లలను
నాకు అప్పగించుము; అప్పుడు నేను వెళ్లిపోతాను;
వారి నిమిత్తము నీకు కొలువు చేసితిని; నేను నీకు
చేసిన నా కొలువు నీకు తెలిసి ఉన్నది గదా అని
27 చెప్పెను.। అందుకు లాబాను — నీ కన్నుల ఎదుట
నేను దయ పొందిన వాడనైతే (వినుము);-నీ నిమి
త్తము యెహోవా నన్ను ఆశీర్వదించినట్టు తెలుసు
28 కొంటినని అతనితో చెప్పెను.। మరియు అతడు—
నీ జీతమింతని నాతో స్పష్టముగా చెప్పుము; అది
ఇచ్చెదననెను.

29 అందుకు అతడు—నేను నీకు చేసిన కొలువు ఎట్టి
దో, నీ మందలు నాయొద్ద ఏలాగు ఉండెనో అది
30 నీకు తెలుసును;। నేను రాక మునుపు నీకు కలిగినది
కొంచెమే; అయితే అది బహుగా అభివృద్ధి పొం
దెను; నేను వచ్చిన తరువాత యెహోవా నిన్ను
ఆశీర్వదించెను. నేనైతేనో నా ఇంటివారి కొరకు
ఎప్పుడు సంపాదించుకొనగలనని అతనితో పలికెను.
31 అప్పుడు అతడు—నేను నీకేమి ఇవ్వవలెను? అని
పలికినందుకు యాకోబు — నీవు నాకేమియు ఇవ్వ
వద్దు. నీవు ఈ చొప్పున నాకు చేసితే నేను తిరిగీ
32 నీ మందను మేపి కాచెదను:। ఏలాగంటే, నేడు నేను
నీ మందంతట నడుచుచు, పొడలైనా మచ్చలైనా గల
ప్రతి గొర్రెను; గొర్రెపిల్లలలో నల్లని ప్రతిదానిని;
మేకలలో మచ్చలైనా పొడలైనా గలవాటిని వేరుప
రిచెదను. అటువంటివి నా జీతమవును.। ఇకమీదట, 33
నీవు నా జీతమును గురించి చూడ వచ్చేటప్పుడు నా
నీతి నా కొరకు ప్రత్యుత్తరమిచ్చును. మేకలలో
పొడలైనా మచ్చలైనా లేనివన్నియు, గొర్రెపిల్లలలో
నలుపు లేనివన్నియు నావల్ల దొంగిలించబడినవిగా
ఎంచబడునని చెప్పెను.

అందుకు లాబాను — సరి; నీ మాట చొప్పున 34
అవును గాకని చెప్పెను.। అప్పుడు అతడు ఆ దిన 35
మందు చారలైనా మచ్చలైనా గల మేకపోతులను,
పొడలైనా మచ్చలైనా గల పెంటెమేకలలన్నిటిని
కొంచెము తెలుపుగల ప్రతిదానిని, గొర్రెపిల్లలలో
నల్లనివన్నిటిని వేరుచేసి, తన కుమారుల చేతికి అప్ప
గించి। తనకు యాకోబునకు మధ్యను మూడు దిన 36
ముల ప్రయాణమంత దూరము పెట్టెను. లాబాను
యొక్క మిగిలిన మందను యాకోబు మేపుచుండెను.

అప్పుడు యాకోబు లేతలిబ్నె, లూజు, అర్మోను 37
అనే చెట్ల చువ్వలను తీసుకొని, ఆ చువ్వలలో తెల్ల
చారలు అగుపడేటట్టు అక్కడక్కడ వాటి తొక్క
ఒలిచెను.। మరియు మందలు నీళ్లు తాగ వచ్చినప్పుడు, 38
అవి చూలు కట్టుటకు అతడు తాను ఒలిచిన చువ్వ
లను మందలు తాగుటకు వచ్చే కాలువలలోను, నీళ్ల
గాళ్లలోను వాటి ఎదుట పెట్టెను.। అప్పుడు మందలు 39
ఆ చువ్వలయొద్ద చూలుకట్టి, చారలైనా పొడలైనా
మచ్చలైనా గల పిల్లలను ఈనెను.। యాకోబు ఆ గొర్రె 40
పిల్లలను వేరు చేసి, చారలు గలవాటి తట్టును, లాబా
ను మందలలో నల్లనివాటి తట్టును, మందల ముఖములు
తిప్పి తన మందలను లాబాను మందలతో ఉంచక
వాటిని వేరుగా ఉంచెను.। మందలో బలమైనవి 41
చూలు కట్టినప్పుడెల్లా, అవి ఆ చువ్వలయొద్ద చూలు
కట్టేటట్టు, యాకోబు మంద కన్నుల ఎదుట కాలువ
లలో ఆ చువ్వలు పెట్టెను.। అయితే మంద బలహీన 42
మైనప్పుడు పెట్టలేదు. ఆలాగు బలహీనమైనవి లాబా
నుకు, బలమైనవి యాకోబుకు కలిగినవాయెను.

ఆ ప్రకారము ఆ మనుష్యుడు అత్యధికముగా అభి 43
వృద్ధిపొంది, విస్తారమైన మందలు, దాసీలు, దాసులు,
ఒంటెలు గాడిదెలును గలవాడాయెను.

## 31. అధ్యాయము.

అయితే లాబాను కుమారులు — మన తండ్రికి 1
కలిగినది యావత్తును యాకోబు తీసుకొని మన తం
డ్రికి కలిగిన దానివల్లనే ఈ యావదాస్తిని సంపాదించి

*అనగా, జీతము. †అనగా, నివసించుట. ‡అనగా, అభివృద్ధి.

ఉన్నాడని చెప్పుకొనిన మాటలు యాకోబు వినెను.।
2 మరియు, అతడు లాబాను ముఖము చూచినప్పుడు,
ఇదుగో! అది నిన్న మొన్న ఉండినట్టు అతని ఎడల
3 ఉండలేదు.। అప్పుడు యెహోవా—నీ పితృల దేశ
మునకు, నీ బంధువుల యొద్దికి తిరిగి వెళ్లుము; నేను
నీకు తోడై ఉండెదనని యాకోబుతో చెప్పెను.
4 అంతట యాకోబు, పొలమునకు తన మంద యొ
ద్దికి రాహేలును, లేయాను పిలువనంపి, వారిని చూ
5 చి।—మీ తండ్రి ముఖము నిన్న మొన్న ఉండినట్టు నా
ఎడల ఉండలేదని నేను చూచుచున్నాను. అయితే
6 నా తండ్రి దేవుడు నాకు తోడై ఉన్నాడు.। మీ తం
డ్రికి నా పూర్ణ శక్తితో కొలువు చేసినానని మీకు
7 తెలిసే ఉన్నది.। మీ తండ్రి నన్ను మోసపుచ్చి, పది
మార్లు నా జీతము మార్చెను; అయితే దేవుడు అతని
8 నాకు హాని చేయనివ్వలేదు.। అతడు—పొడలుగలవి
నీ జీతమవునని చెప్పితే, అప్పుడు మందలన్నీ పొడలు
గల పిల్లలను ఈనెను. అతడు—చారలు కలవి నీ జీత
మవునని చెప్పితే, అప్పుడు మందలన్నీ చారలుగల
9 పిల్లలను ఈనెను.। ఆలాగు దేవుడు మీ తండ్రి పశువు
10 లను తీసి, నాకు ఇచ్చి ఉన్నాడు.। మందలు చూలు
కట్టే కాలమున నేను స్వప్నమందు నా కన్నులెత్తి
చూడగా, ఇదుగో! గొర్రెలను దాటే పొట్టేళ్లు చార
11 లైనా పొడలైనా మచ్చలైనా గలవై ఉండెను.। మరి
యు, ఆ స్వప్నమందు, దేవుని దూత — యాకోబూ!
అని నాతో పలకగా—ఇదుగో! ఉన్నానని చెప్పితిని.।
12 అప్పుడు ఆయన—నీ కన్నులెత్తి చూడుము; గొర్రెలను
దాటుచున్న పొట్టేళ్లన్నీ చారలైనా పొడలైనా మచ్చ
లైనా గలవి; ఎందుకంటే లాబాను నీకు చేయుచు
13 న్నది యావత్తును చూచి ఉన్నాను.। నీవు ఎక్కడ
స్తంభము మీద నూనె పోసితివో, ఎక్కడ నాకు
మ్రొక్కుబడి చేసితివో ఆ బేతేలు దేవుడను నేనే.
ఇప్పుడు నీవు లేచి, ఈ దేశములోనుంచి బైలుదేరి
నీవు పుట్టిన దేశమునకు తిరిగి వెళ్లుమని నాతో చెప్పె
ననెను.
14 అందుకు రాహేలు, లేయాయు — ఇంకా మా
తండ్రి ఇంట్లో మాకు పాలు పంపులు ఉన్నవా?।
15 మేము అతనికి అన్యులముగా ఎంచబడలేదా? అతడు
మమ్మును అమ్మివేసి, మా రూకలు బొత్తిగా తినివేసెను.।
16 దేవుడు మా తండ్రి యొద్దనుంచి తీసివేసిన ధనమంత
యు మాదిని మాపిల్లలదినై ఉన్నది గదా. కాబట్టి
దేవుడు నీతో చెప్పినవన్నియు చేయుమని అతనితో
ప్రత్యుత్తరము చెప్పిరి.
17 అంతట యాకోబు లేచి, తన కుమారులను తన
18 భార్యలను ఒంటెల మీద ఎక్కించి। కనాను దేశ
మునకు తన తండ్రియైన ఈసాకు యొద్దికి వెళ్లుటకై
తన పశువులన్నిటిని, తాను సంపాదించిన తన సం
పద యావత్తును, పద్దనరాములో తాను సంపాదించిన
ఆస్తి యావత్తును తీసుకొని వెళ్లెను.। లాబాను తన గొ 19
ర్రెల బొచ్చు కత్తిరించుటకు వెళ్లి ఉండెను. అప్పుడు
రాహేలు తన తండ్రికి కలిగిన విగ్రహములు దొం
గిలెను.
యాకోబు తాను పారిపోవుచున్నానని అరమీయు 20
డైన లాబానుకు తెలియచేయక, పోవుటవల్ల అతని
మోసపుచ్చెను.। అతడు తనకు కలిగినదంతటితో కూ 21
డా పారిపోయెను. అతడు లేచి నది దాటి గిలాదనే
కొండతట్టు అభిముఖుడై వెళ్లెను.
మూడవ దినమున యాకోబు పారిపోయెనని లాబా 22
నుకు తెలపబడెను.। అతడు తన సహోదరులను వెంట 23
బెట్టుకొని ఏడు దినముల ప్రయాణమంత దూరముగా
వాని తరిమి, గిలాదు కొండ మీద అతని కలుసు
కొనెను.। అయితే ఆ రాత్రి, స్వప్నమందు దేవుడు 24
అరమీయుడైన లాబాను యొద్దికి వచ్చి — నీవు యా
కోబుతో మంచి చెడ్డలు పలుకకుండా జాగ్రత్తపడు
మని అతనితో చెప్పెను.
లాబాను యాకోబును కలుసుకొనెను. యాకోబు 25
తన గుడారము ఆ కొండ మీద వేసి ఉండెను. లాబా
నును తన బంధువులతో గిలాదు కొండ మీద గుడా
రము వేసుకొనెను.। అప్పుడు లాబాను యాకోబును 26
చూచి — నీవు ఏమి చేసితివి! నన్ను మోసపుచ్చి
కత్తితో చెరపట్టబడినవారి లాగున నా కుమార్తెలను
కొంచుపోవనేల?। ఎందుచేతను నీవు నాకు తెలియ 27
చేయక రహస్యముగా పారిపోయి నన్ను మోసపుచ్చి
తివి? సంభ్రమముతోను పాటలతోను మద్దెలతోను
కిన్నెరలతోను నిన్ను సాగనంపింతునే.। అయితే నా 28
కుమారులను నా కుమార్తెలను నన్ను ముద్దుబెట్టు
కొననివ్వక పోతివి. వెర్రి పట్టి ఈలాగున చేసితివి.।
మీకు హానిచేయుటకు నా చేతికి బలము కలదు. 29
అయితే పోయిన రాత్రి మీ తండ్రి దేవుడు — నీవు
యాకోబుతో మంచి చెడ్డలు పలుకకుండా జాగ్రత్త
పడుమని నాతో చెప్పెను.। నీవు నీ తండ్రి ఇంటి 30
మీద బహు వాంఛగలవాడవై వెళ్ల వలెనని ఉంటే
సరి; నా దేవతలను ఎందుకు దొంగిలితివనెను.
అందుకు యాకోబు — నీవు బలవంతముచేత నా 31
యొద్దనుంచి నీ కుమార్తెలను తీసుకొందువేమో అని
అనుకొని భయపడుటవల్లనే (పారిపోతిని).। ఎవని 32
యొద్ద నీ దేవతలను కనుగొందువో వాడు బ్రతుక
కూడదు. నీవు నా యొద్ద ఉన్నవాటిని మన సహో
దరుల ఎదుట శోధించి, నీదాని తీసుకొనుమని లాబా

నుతో ప్రత్యుత్తరము చెప్పెను. రాహేలు వాటిని
దొంగిలెనని యాకోబుకు తెలియలేదు.

33 అప్పుడు లాబాను యాకోబు గుడారములోకి,
లేయా గుడారములోకి, ఇద్దరి దాసుల గుడారముల
లోకి వెళ్లెను గాని అతనికి ఏమిన్ని దొరక లేదు.
తరువాత అతడు లేయా గుడారములోనుంచి బైలు
34 దేరి రాహేలు గుడారములోకి వెళ్లెను.। అప్పుడు
రాహేలు ఆ విగ్రహములు తీసుకొని, ఒంటె సామ
గ్రిలో పెట్టి, వాటిమీద కూచుండెను. కాగా
లాబాను ఆ గుడారమందంతటను తడివి చూచినప్ప
35 టికిని అవి దొరకలేదు.। ఆమె తన తండ్రితో—తమ
ఎదుట నేను లేవ లేనందున నా ప్రభువు కోపపడ
కూడదు; స్త్రీల మర్యాద నాకు ఉన్నదని చెప్పెను.
అతడు ఎంత శోధించినప్పటికిని ఆ విగ్రహములు
దొరకలేదు.

36 అప్పుడు యాకోబు కోపపడి లాబానుతో వా
దించెను. యాకోబు—నీవు ఈలాగు మండిపడి నన్ను
తరుముటకు నా ద్రోహమేమి? నా పాపమేమి?।
37 నీవు నా సమస్త సామగ్రి తడివి చూచిన తర్వాత నీ
ఇంటి వస్తువులన్నిటిలో ఏది దొరికెను? నా సహో
దరుల ఎదుటను నీ సహోదరుల ఎదుటను అది
ఈలాగున తెచ్చి పెట్టుము. వారు మన ఉభయుల
38 మధ్యను తీర్పు చేయుదురు.। ఈ ఇరువది ఏండ్లు నేను
నీ యొద్ద ఉంటిని. నీ గొఱ్ఱెలైనా మేకలైనా ఈచు
కొని పోలేదు. నీ మంద పొట్టేళ్లను నేను తినలేదు.।
39 చీల్చబడినదాని నీ యొద్దికి తేక ఆ నష్టము నేనే పెం
దితిని.* పగటియందు దొంగిలించబడినదాని నేమి,
రాత్రియందు దొంగిలించబడిన దానినేమి నన్ను
40 అడిగి పుచ్చుకొంటివి. నేను ఈలాగు ఉంటిని.। పగటి
ఎండయు, రాత్రి చలియు నన్ను క్షీణింపచేసెను. నిద్ర
41 నా కన్నులనుంచి తొలిగి పోయెను.। ఇదివరకు నీ ఇం
టిలో ఇరువది ఏండ్లు ఉంటిని. నీ ఇద్దరి కుమార్తెల
నిమిత్తము పదునాలుగు ఏండ్లును, నీ మంద నిమిత్తము
ఆరు ఏండ్లును, నీకు కొలువు చేసితిని. అయితే నీవు నా
42 జీతము పది మారులు మార్చినావు.। నా తండ్రి
దేవుడు, అబ్రాహాము దేవుడు, ఈసాకు భయమును†
నాకు తోడై ఉండకపోతే, నిశ్చయముగా నీవు నన్ను
వట్టి చేతులతో పంపివేతువు. దేవుడు నా ప్రయా
సము, నా చేతుల కష్టము చూచి, పోయిన రాత్రి
తీర్పు చేసెనని‡ లాబానుతో ప్రత్యుత్తరము చెప్పెను.

అందుకు లాబాను—ఈ కుమార్తెలు నా కుమా 43
ర్తెలు; ఈ కుమారులు నా కుమారులు; ఈ మంద
నా మంద; నీవు చూచేది అంతయు నాది. ఈ నా
కుమార్తెలనైనా, వీరు కనిన కుమారులనైనా నేడు
నేనేమి చేయగలను.। కాబట్టి నేను నీవు నిబంధన 44
చేసుకొందము రమ్ము; అది నాకు నీకు మధ్యను సాక్షి
గా ఉండునని యాకోబుతో ప్రత్యుత్తరము చెప్పెను.

అప్పుడు యాకోబు ఒక రాయి తీసుకొని, అది 45
స్తంభముగా నిలువబెట్టెను.। మరియు, యాకోబు— 46
రాళ్లు కూర్చుడి అని తన సహోదరులతో చెప్పెను.
వారు రాళ్లు తెచ్చి కుప్ప వేసిరి. అక్కడ వారు ఆ కు
ప్ప మీద భోజనము చేసిరి.। లాబాను దానికి యగర్ 47
శాహదూతా§ అనే పేరు పెట్టెను. అయితే యాకో
బు దానికి గలేదు అనే పేరు పెట్టెను.। లాబాను— 48
నేడు ఈ కుప్ప నాకు నీకు మధ్యను సాక్షిగా ఉన్న
దని పలికి, దానికి గలేదనియు,— మనము ఒకనికి
ఒకడు మరుగుపడి ఉండగా, యెహోవా నాకు
నీకు మధ్యను జరిగే దాని కనిపెట్టునని పలికి,। మిస్పా 49
అనియు పేరుపెట్టె।—నీవు నా కుమార్తెలను బాధ 50
పెట్టినా, నా కుమార్తెలు గాక వేరే స్త్రీలను పెండ్లి
చేసుకొనినా, చూడుము; మన యొద్ద ఎవడును లేడు
గదా నాకు నీకు సాక్షి దేవుడే అని చెప్పెను.

మరియు లాబాను — నాకు నీకు మధ్యను నేను 51
నియమించిన ఈ స్తంభము చూడుము; ఈ కుప్పను
చూడుము. హాని చేయుటకు నేను ఈ కుప్ప దాటి నీ
యొద్దికి రాకను, నీవు ఈ కుప్పను। ఈ స్తంభమును 52
దాటి నా యొద్దికి రాకను ఉండుటకై ఈ కుప్ప సాక్షి,
ఈ స్తంభమును సాక్షి.। అబ్రాహాము దేవుడు, నా 53
హోరు దేవుడు, వారి తండ్రి దేవుడు మన మధ్యను
న్యాయము తీర్చునని చెప్పెను. అప్పుడు యాకోబు
తన తండ్రియైన ఈసాకు భయము‖ తోడని ప్రమాణ
ము చేసెను.

అప్పుడు యాకోబు ఆ కొండ మీద పశువును¶ 54
వధించి, భోజనము చేయుటకు తన సహోదరులను
పిలిచెను. వారు భోజనము చేసి కొండ మీద ఆ రాత్రి
వెళ్లబుచ్చిరి.। తెల్లవారినప్పుడు లాబాను లేచి, తన 55
కుమారులను తన కుమార్తెలను ముద్దుబెట్టుకొని,
వారిని ఆశీర్వదించెను. తరువాత లాబాను బైలుదేరి
తన చోటికి వెళ్లిపోయెను.

*హెబ్రి, నేనే పాపినైతిని. †లేక, భయపడినవాడు. ‡లేక, నిన్ను గద్దించెనని. §అనగా, సాక్షి కుప్ప.
‖లేక, ఈసాకు భయపడిన వాని. ¶లేక, యాగపశువును.

## 32. అధ్యాయము.

1 అప్పుడు యాకోబు తన దోవను వెళ్లుచుండగా,
2 దేవుని దూతలు అతని ఎదురుకొనిరి. । యాకోబు
వారిని చూచి — ఇది దేవుని సేన అని అనుకొని ఆ
చోటికి మహనాయిమ్* అనే పేరు పెట్టెను.

3,4 అప్పుడు యాకోబు ఎదోము అడవియైన శేయీరు
దేశమందున్న తన సహోదరుడైన ఏశావు యొద్దికి
దూతలను తనకు ముందుగా పంపుచు — మీరు నా
ప్రభువైన ఏశావును చూచి–ఇదివరకు నేను లాబాను
5 యొద్ద నివసించి ఉంటిని; । నాకు గొడ్లు, గాడిదెలు,
మందలు, దాసులు, దాసీలును కలరు; తమ దృష్టి
యందు దయ పొందుటకు మా ప్రభువుకు ఇది తెలియ
చేయనంపినానని నీ సేవకుడైన యాకోబు పలికెను
అని చెప్పుటకు వారికి ఆజ్ఞాపించెను.

6 ఆ దూతలు యాకోబు యొద్దికి తిరిగీ వచ్చి—మేము
ఏశావనే నీ సహోదరుని యొద్దికి వెళ్లితిమి; మరియు
అతడు నన్నూరు మందితో కూడా నిన్ను ఎదురుకొ
7 నుటకు వచ్చుచున్నాడని చెప్పిరి. । అప్పుడు యాకోబు
8 మిక్కిలీ భయపడి, తొందరపడి।—ఏశావు ఒక గుంపు
మీదికి వచ్చి దాని హతము చేసితే, మిగిలిన గుంపు
తప్పించుకొని పోవునని తనతో ఉన్న జనులను, మం
దలను, గొడ్లను, ఒంటెలను రెండు గుంపులుగా విభా
గించెను.

9 అప్పుడు యాకోబు—నా తండ్రియైన అబ్రాహాము
దేవా! నా తండ్రియైన ఈసాకు దేవా!—నీ దేశము
నకు నీ బంధువుల యొద్దికి తిరిగీ వెళ్లుము; నీకు మేలు
10 చేసెదనని నాతో చెప్పిన ఓ యెహోవా! । నీవు నీ
సేవకునికి చేసిన సమస్తోపకారములకు, సమస్త సత్య
మునకు అపాత్రుడను. ఏలాగంటే నా చేతి కర్ర
తో మాత్రమే ఈ యొర్దానును దాటితిని; ఇప్పుడు
11 నేను రెండు గుంపులుగా ఉన్నాను. । ఏశావనే నా
సహోదరుని చేతినుంచి నన్ను దయచేసి తప్పించుము;
అతడు వచ్చి పిల్లలతో కూడా తల్లిని నన్ను చంపునే
12 మో అని అతనికి భయపడి ఉన్నాను. । అయితే నీవు—
నేను నీకు తోడై మేలు చేయనే చేసి, విస్తారమవుట
వల్ల లెక్కించలేని సముద్రపు ఇసుకవలె నీ సంతా
నము చేసెదనని చెప్పితివనెను.

13 అతడు అక్కడ ఆ రాత్రి వెళ్లబుచ్చి తనకు కలిగిన
దానిలో తన సహోదరుడైన ఏశావు కొరకు ఒక
14 కానుకను । అనగా ఇన్నూరు మేకలను, ఇరువది మేక
పోతులను, ఇన్నూరు గొర్రెలను, ఇరువది పొట్టేళ్లను,।
ముప్పది పాడి ఒంటెలను, వాటి పిల్లలను, నలుబది 15
ఆవులను, పది ఆబోతులను, ఇరువది ఆడు గాడిదె
లను, పది గాడిదె పిల్లలను తీసుకొని, మంద మందను
వేరు వేరుగా । తన సేవకుల చేతికి అప్పగించి—మీరు 16
మంద మందకు మధ్యను ఎడము ఉంచి, నా కంటే
ముందుగా దాటి వెళ్లుడని తన సేవకులతో చెప్పి,।—
నా సహోదరుడైన ఏశావు నిన్ను ఎదురుకొని—నీవు 17
ఎవనివాడవు? ఎక్కడికి వెళ్లుచున్నావు? నీ ముందర
ఉన్నవి ఎవనివని నిన్ను అడిగితే, । నీవు—ఇవి నీ సేవకు 18
డైన యాకోబువి; ఇది నా ప్రభువైన ఏశావు కొరకు
పంపబడిన కానుక: అదుగో! అతడు మా వెంబడి
వచ్చుచున్నాడు అని చెప్పుటకు మొదటి వానికి
ఆజ్ఞాపించెను. । అలాగున అతడు — నాకు ముందుగా 19
వెళ్లే కానుకవల్ల అతని సమాధానపరిచిన† తరువాత,
నేను అతని ముఖము చూచెదను; అప్పుడు అతడు
ఒకవేళ నన్ను దయగా అంగీకరించుననుకొని—మీరు
ఏశావును ఎదురుకొనేటప్పుడు, ఆ చొప్పున అత
నితో చెప్ప వలెననియు, । మరియు మీరు—ఇదుగో! 20
నీ సేవకుడైన యాకోబు మా వెంబడి వచ్చుచున్నా
డని పలుక వలెననియు రెండవవానికిని, మూడవవాని
కిని, మందల వెంబడి వెళ్లినవారికందరికిని ఆజ్ఞాపిం
చెను.

అప్పుడు ఆ కానుక అతనికి ముందుగా సాగిపో 21
యెను. అయితే అతడు గుంపులో ఆ రాత్రి వెళ్లబు
చ్చెను. । రాత్రివేళ అతడు లేచి తన ఇద్దరు భార్య 22
లను, తన ఇద్దరు దాసీలను, తన పదకొండుమంది పిల్ల
లను తీసుకొని, యబ్బోకు రేవు దాటి పోయెను. ।
అతడు వారిని తీసుకొని ఆ ఏరు దాటించి, తనకు 23
కలిగినదంతయు దాటించెను.

అంతట యాకోబు ఒంటిగా విడువబడెను. అప్పు 24
డు ఒక మనుష్యుడు తెల్లవారే పర్యంతము అతనితో
పెనుగులాడెను. । తాను అతని గెలువ లేదని చూచి 25
ఆయన తొడ గూటిమీద కొట్టెను.‡ అప్పుడు అతడు
ఆయనతో§ పెనుగులాడుటవల్ల, యాకోబు తొడ
గూడు తొలిగెను. । అప్పుడు ఆయన—తెల్లవారుచు 26
న్నది గనుక నన్ను వెళ్లనిమ్మని పలికెను. అయితే అత
డు—నీవు నన్ను ఆశీర్వదించితేనే గాని నిన్ను వెళ్ల
నివ్వనని చెప్పెను. । అప్పుడు ఆయన— నీ పేరేమి 27
అని అతని అడిగెను. అందుకు అతడు—యాకోబని
చెప్పెను. । అప్పుడు ఆయన—నీవు దేవునితోను మను 28

*అనగా, రెండు సేనలు. †హెబ్రిలో, ముఖమును కప్పిన. ‡లేక, ముట్టెను. §లేక, ఆయన అతనితో.

ష్యులతోను పోరాడి గెలిచితివి గనుక ఇకమీదట
నీ పేరు ఇశ్రాయేలే* గాని యాకోబని అనబడదు
29 అని చెప్పెను. । అప్పుడు యాకోబు— నీ పేరు దయ
చేసి తెలుపుమని అడిగెను. అయితే ఆయన — నీవు
ఎందునిమిత్తము నా పేరు అడిగితివని పలికి, అక్కడ
అతని ఆశీర్వదించెను.

30 అప్పుడు యాకోబు—నేను ముఖాముఖిగా దేవుని
చూచితిని; నా ప్రాణము తప్పించబడెనని ఆ స్థలము
31 నకు పెనీయేలు† అనే పేరు పెట్టెను. । అతడు ఆ
పెనూయేలునుంచి సాగి వెళ్లినప్పుడు అతనికి సూర్యు
డు ఉదయించెను. అప్పుడు అతడు తొడ కుంటుచు
32 నడిచెను. । అందుచేతను, ఆయన యాకోబు తొడ
గూటి మీది తుంటి నరము కొట్టినందుకు నేటివరకు
ఇశ్రాయేలు పుత్రులు తొడ గూటి మీదనున్న తుంటి
నరము తినరు.

## 33. అధ్యాయము.

1 యాకోబు తన కన్నులెత్తి చూచినప్పుడు ఇదుగో!
ఏశావును, అతనితో కూడా నన్నూరు మంది మను
2 ష్యులును వచ్చుచుండిరి. । అప్పుడు అతడు తన పిల్ల
లను లేయాకు, రాహేలుకును, ఇద్దరు దాసీలకును
విభాగించి అప్పగించెను—అతడు ముందర దాసీలను,
వారి పిల్లలను, వారి వెనుక లేయాను, ఆమె పిల్లలను,
3 ఆ వెనుక రాహేలును యోసేపునును ఉంచి । తాను
వారి ముందర వెళ్లుచు, తన సహోదరుని సమీపించే
4 పర్యంతము, ఏడు మార్లు నేల సాగిలపడెను. । అప్పుడు
ఏశావు అతని ఎదురుకొనుటకు పరుగెత్తి, అతని కౌగ
లించుకొని, ఆతని మెడ మీద పడి, అతని ముద్దు
5 పెట్టుకొనెను. వారు కన్నీరు విడిచిరి. । అప్పుడు
అతడు కన్నులెత్తి ఆ స్త్రీలను పిల్లలను చూచి — వీరు
నీకేమి కావలెనని అడిగినందుకు, అతడు—వీరు నీ
సేవకునికి దేవుడు దయచేసిన పిల్లలే అని చెప్పెను.

6 అప్పుడు ఆ దాసీలు, వారి వారి పిల్లలును దగ్గ
7 రకు వచ్చి సాగిలపడిరి. । లేయాయు, ఆమె పిల్లలును,
దగ్గరకు వచ్చి సాగిలపడిరి. ఆ తరువాత యోసేపు,
రాహేలును దగ్గరకు వచ్చి సాగిలపడిరి.

8 అప్పుడు అతడు—నాకు ఎదురుగా వచ్చిన ఆ నీ
గుంపంతయు ఎందుకు అని అడగగా, అతడు — నా
ప్రభువు దృష్టియందు దయ పొందుటకే అని చెప్పె
9 ను. । అప్పుడు ఏశావు—సహోదరుడా! నాకు సమృద్ధి
కలదు. నీకు కలిగినది నీ యొద్దనే ఉండనిమ్మని చెప్పె
ను. । అప్పుడు యాకోబు — ఆలాగు కాదు; నేను నీ 10
దృష్టియందు దయ పొంది ఉంటే చిత్తగించి నాచేత
నా కానుక పుచ్చుకొనవలెను; దేవుని ముఖము
చూచినట్టు నీ ముఖము చూచితిని; నీవు నన్ను దయ
గా అంగీకరించితివి గదా. । నీ యొద్దికి తేబడిన నా 11
కానుక‡ చిత్తగించి పుచ్చుకొనుము; దేవుడు నా
యందు దయ ఉంచెను. మరియు నాకు సమస్తము
కలదని చెప్పి, అతని బలవంతము చేసెను గనుక
అతడు దాని పుచ్చుకొని ।— మనము వెళ్లుదాము; 12
నేను నీకు ముందుగా నడిచి వెళ్లెదనని చెప్పెను.

అయితే అతడు— నా యొద్దనున్న పిల్లలు పసిపిల్ల 13
లనియు, గొర్రెలు, మేకలు, గొడ్లు పాలిచ్చేవి అని
యు, నా ప్రభువుకు తెలుసును. ఒక్క దినమే వా
టిని వడిగా తోలితే ఈ మందంతయు చచ్చును. । నా 14
ప్రభువు దయచేసి తన సేవకునికి ముందుగా వెళ్ల
వలెను. నేను నా ప్రభువు యొద్దికి శేయీరుకు వచ్చే
పర్యంతము, నా ముందర ఉన్న మందల నడకకొల
దిని ఈ పిల్లల నడకకొలదిని వాటిని మెల్లగా నడిపిం
చుచు వచ్చెదనని అతనితో చెప్పెను.

అప్పుడు ఏశావు—నీకు ఇష్టమైతే నా యొద్దనున్న 15
ఈ జనులలో కొందరిని నీ యొద్ద విడిచిపెట్టుదునని
చెప్పెను. అందుకు అతడు — అది ఎందుకు? నా
ప్రభువు దృష్టియందు నేను దయ పొందనిమ్మని పలి
కెను. । ఆ దినమున ఏశావు తన దోవను శేయీరుకు 16
తిరిగీ వెళ్లిపోయెను.

అప్పుడు యాకోబు సుక్కోతుకు ప్రయాణమై 17
వెళ్లి, తన కొరకు ఒక ఇల్లు కట్టించుకొని, తన పశు
వుల కొరకు పాకలు వేయించెను. అందుచేతను ఆ
చోటికి సుక్కోతు§ అనే పేరు పెట్టబడెను.

ఆలాగు యాకోబు పద్దనరాములోనుంచి వచ్చిన 18
తరువాత, కనాను దేశములో ఉన్న షకెమనే ఊరికి
సురక్షితముగా వచ్చి, ఆ ఊరి ముందర తన గుడారము
వేసెను. । మరియు, అతడు తన గుడారము వేసిన పొల 19
ముయొక్క భాగమును షకెము తండ్రియైన హమోరు
కుమారులయొద్ద నూరు కశీథాలకు‖ కొని । అక్కడ ఒక 20
యజ్ఞవేది కట్టించి దానికి ఏల్ ఎలోహేయి ఇశ్రా
యేలు¶ అనే పేరు పెట్టెను.

## 34. అధ్యాయము.

లేయా యాకోబుకు కనిన కుమార్తెయైన దీనా 1
ఆ దేశపు కుమార్తెలను చూచుటకు బైలు వెళ్లెను. ।
ఆ దేశము ఏలిన హివ్వీయుడైన హమోరు కుమారు 2

*అనగా, దేవునితో పోరాడేవాడు. †అనగా, దేవుని ముఖము. ‡హెబ్రిలో, దీవెన. §అనగా, పాకలు.
‖అనగా, వెండి బిళ్లలు. ¶అనగా, ఇశ్రాయేలు దేవుడే దేవుడు.

డగు షకెము ఆమెను చూచి, ఆమెను పట్టుకొని
ఆమెతో శయనించి ఆమెను దైన్యము నొందించెను.।
3 అతని మనస్సు యాకోబు కుమార్తెయైన దీనాతో
హత్తుకొనెను. అతడు ఆ పడుచును ప్రేమించి, ఆ
పడుచుతో ప్రీతిగా మాట్లాడెను.

4 అప్పుడు షకెము—ఈ చిన్నదాని నాకు భార్యగా
ఇప్పించుమని తన తండ్రియైన హమోరుతో పలికెను.।
5 యాకోబు తన కుమార్తెను అతడు అపవిత్రపరిచె
నని వినెను. అయితే అతని కుమారులు అతని పశు
వులతో పొలములో ఉండిరి గనుక వారు వచ్చేపర్యం
6 తము యాకోబు ఊరకుండెను.। షకెము తండ్రియైన
హమోరు, యాకోబుతో మాట్లాడుటకు అతని యొద్దికి
7 బైలుదేరి వచ్చెను.। యాకోబు కుమారులు ఆ సంగతి
విని, పొలములోనుంచి వచ్చిరి. అతడు యాకోబు
కుమార్తెతో శయనించి ఇశ్రాయేలులో అవమా
నము చేసెను గనుక ఆ మనుష్యులు సంతాపము పొం
దిరి. వారికి నిండా క్రోధము పుట్టెను. అది చేయ
8 తగని పని.। అప్పుడు హమోరు వారిని చూచి—షకె
మనే నా కుమారుని మనస్సు మీ కుమార్తెను వాంఛిం
చుచున్నది. దయచేసి ఆమెను అతనికి భార్యగా
9 ఇవ్వండి.। మీ కుమార్తెలను మాకిచ్చి, మా కుమా
ర్తెలను మీరు పుచ్చుకొని మాతో వియ్యమంది,
10 మాతో నివసించండి.। ఈ దేశము మీ ఎదుట ఉన్నది;
ఇందులో మీరు నివసించి వ్యాపారము చేసి ఆస్తి
సంపాదించుకొనండని చెప్పెను.

11 మరియు షకెము—మీ దృష్టియందు నన్ను దయ
పొందనివ్వండి. మీరు ఏమి చెప్పుదురో అది ఇచ్చె
12 దను.। ఓలి బహుమానము ఎంతైనా నన్ను అడుగండి.
మీరు నాతో చెప్పే ప్రకారము ఇచ్చెదను. మెట్టుకు
ఆ పడుచును నాకు భార్యగా దయచేయండని ఆమె
తండ్రితోను ఆమె సహోదరులతోను పలికెను.

13 అయితే తమ సహోదరియైన దీనాను అతడు అప
విత్రపరిచినందున, యాకోబు కుమారులు షకెముతో
ను, అతని తండ్రియైన హమోరుతోను కపటముగా
14 ప్రత్యుత్తరమిచ్చి పలికినదేమంటే।—మేము ఈ కా
ర్యము చేయ లేము. మా సహోదరిని గోప్యాంగ
చర్మముగల వానికి ఇవ్వ లేము; అది మాకు నిందవును.।
15 మీలో ప్రతి పురుషుడు ఛేదనసంస్కారము పొంది,
16 మావలె ఉంటే సరి!। ఆ పక్షమందు మీ మాటకు
ఒప్పుకొని, మా కుమార్తెలను మీకిచ్చి, మీ కుమా
ర్తెలను మేము పుచ్చుకొని, మీతో నివసించెదము*
17 అప్పుడు ఏక జనముగా ఉండెదము.। మీరు మా
మాట విని ఛేదనసంస్కారము పొందని పక్షమందు,
మా కుమార్తెను తీసుకొని వెళ్లెదమని చెప్పిరి.

వారి మాటలు హమోరుకును హమోరు కుమారు 18
డైన షకెముకును ఇష్టముగా ఉండెను.। ఆ పడుచు 19
వాడు యాకోబు కుమార్తెయందు ప్రీతి గలవాడు
గనుక అతడు ఆ కార్యము చేయుటకు తడువు చేయ
లేదు. అతడు తన తండ్రి ఇంటివారందరిలో ఘనుడు.

హమోరును అతని కుమారుడైన షకెమును తమ 20
ఊరి గవిని యొద్దికి వచ్చి, తమ ఊరి జనులతో మాట్లా
డుచు।—ఈ మనుష్యులు మనకు అనుకూలులై ఉన్నా 21
రు గనుక, వారిని ఈ దేశమందు ఉండనిచ్చి, ఇందులో
వ్యాపారము చేయనివ్వండి; ఈ భూమి వారికి రెండు
పక్కల† విశాలమై ఉన్నదిగదా, మనము వారి కుమా
ర్తెలను భార్యలగా పుచ్చుకొని, మన కుమార్తెలను
వారికి ఇచ్చుదము.। అయితే ఒకటి; ఆ మనుష్యులు 22
ఛేదనసంస్కారము పొందే ప్రకారము, మనలో ప్రతి
పురుషుడు ఛేదనసంస్కారము పొందిన పక్షమందే
వారు మన మాటకు ఒప్పుకొని మనలో నివసించుచు,
ఏక జనముగా ఉందురు.। వారి మందలు, వారి ఆస్తి, 23
వారి పశువులన్నియు మనవవును గదా. మెట్టుకు
మనము వారి మాటకు ఒప్పుకొందము; అప్పుడు వారు
మనలో నివసించెదరని పలికిరి.

హమోరు, అతని కుమారుడైన షకెమును చెప్పిన 24
మాట అతని ఊరి గవిని ద్వారా బైలువెళ్లే వారంద
రు వినిరి. అప్పుడు అతని ఊరి గవిని ద్వారా బైలు
వెళ్లే వారిలో ప్రతి పురుషుడు ఛేదనసంస్కారము
పొందెను.

మూడవ దినమున, వారు నొప్పితో పడి ఉండ 25
గా, యాకోబు కుమారులలో, దీనా సహోదరులైన
షిమ్యోను, లేవీ అనే ఇద్దరు తన తన కత్తి, చేత పట్టు
కొని, నిర్భయముగా ఆ ఊరి మీదికి వెళ్లి, ప్రతి పురు
షుని చంపిరి.। వారు హమోరును, అతని కుమారుడైన 26
షకెమును కత్తి వాత చంపి, షకెము ఇంట్లోనుంచి
దీనాను తీసుకొని బైలు వెళ్లిరి.

తమ సహోదరిని అపవిత్రపరిచినందున, యాకో 27
బు కుమారులు, చంపబడిన వారి మీదికి వచ్చి ఆ ఊరు
దోచుకొని।వారి గొర్రెలను, వారి గొడ్లను, వారి గాడి 28
దెలను, ఊరిలోనిదేమి పొలములోనిదేమి।వారి ధనము 29
యావత్తును తీసుకొని, వారి పిల్లలనందరిని వారి
స్త్రీలనును చెరపట్టుకొని, ఇంట్లో ఉన్నదంతయు దోచు
కొనిరి.

* లేక, కలిసెదము. † లేక, యిటు అటు, అనగా, మిక్కిలి.

30 అప్పుడు యాకోబు షిమ్యోనును, లేవీని చూ
చి—మీరు నన్ను బాధపెట్టి, ఈ దేశ నివాసులైన కనా
నీయులలోను, పరిజ్జీయులలోను, నన్ను దుర్వాసన
గలవానిగా చేసితిరి; నా జనసంఖ్య కొంచెమే; వారు
నా మీదికి కూడివచ్చి నన్ను చంపుదురు. నేను, నా
31 ఇంటివారును నాశనమవుదుమని పలికెను. । అందుకు
వారు—వేశ్య ఎడల వలెనే మా సహోదరి ఎడలను
జరిగించ వచ్చునా? అని పలికిరి.

## 35. అధ్యాయము.

1 దేవుడు యాకోబుతో—నీవు లేచి బేతేలుకు వెళ్లి,
అక్కడ నివసించి, నీ సహోదరుడైన ఏశావు ఎదుట
నుంచి నీవు పారిపోయినప్పుడు నీకు అగుపడిన దేవు
నికి అక్కడ యజ్ఞవేది కట్టుమని చెప్పెను.
2,3 అప్పుడు యాకోబు తన ఇంటివారితోను, అతని
యొద్ద ఉన్న వారందరితోను—మీయొద్ద ఉన్న అన్య
దేవతలను పరిహరించి, మిమ్మును మీరు శుచిపరుచు
కొని, మీ వస్త్రములను మార్చుకొనండి: మనము
లేచి బేతేలుకు వెళ్లుదము; నా శ్రమ దినమందు నాకు
ప్రత్యుత్తరమిచ్చి, నేను వెళ్లిన మార్గమున నాకు
తోడైై ఉండిన దేవునికి యజ్ఞవేది అక్కడ కట్టెదనని
చెప్పెను.
4 అప్పుడు వారు తమ యొద్దనున్న అన్య దేవతలన్ని
యు, తమ చెవులను ఉన్న పోగులను, యాకోబుకు
అప్పగించిరి. యాకోబు షకెము దగ్గరనున్న ఏలా
5 చెట్టుకింద వాటిని దాచి పెట్టెను. । వారు ప్రయా
ణమై వెళ్లినప్పుడు, దేవుని భయము వారి చుట్టూ
ఉన్న పట్టణములమీద ఉండెను గనుక, వారు యా
కోబు కుమారులను తరమలేదు.
6 యాకోబు, అతనితో కూడా ఉన్న జనులంద
రును కనానులో లూజుకు, అనగా బేతేలుకు వచ్చి ।
7 అతడు తన సహోదరుని ఎదుటనుంచి పారిపోయి
నప్పుడు, దేవుడు అక్కడ అతనికి ప్రత్యక్షమాయెను
గనుక అక్కడ యజ్ఞవేది కట్టి, ఆ చోటికి ఏల్ బేతే
లనే* పేరు పెట్టెను.
8 రిబ్కా దాదియైన దబోరా చనిపోయి, బేతేలుకు
దిగువనున్న అల్లోను చెట్టు కింద పాతిపెట్టబడెను.
దానికి అల్లోను బాకూతు† అనే పేరు పెట్టబడెను.
9 అతడు పద్దనరామునుంచి వచ్చుచుండగా, దేవుడు
తిరిగీ యాకోబుకు అగుపడి అతని ఆశీర్వదించెను. ।
10 అప్పుడు దేవుడు అతనితో—నీ పేరు యాకోబు; ఇక
మీదట నీ పేరు యాకోబనబడదు. అయితే నీ పేరు
ఇశ్రాయేలై ఉండునని చెప్పి, అతనికి ఇశ్రాయేలనే
పేరు పెట్టెను.

మరియు దేవుడు—నేను సర్వశక్తిగల దేవుడను; నీవు 11
సంతానాభివృద్ధి పొందుము. రాష్ట్రము, రాష్ట్రముల
సంఘమును నీ వల్ల కలుగును; రాజులును నీ నడుము
నుంచి పుట్టెదరు. । నేను అబ్రాహాముకు, ఈసాకు 12
కును ఇచ్చిన దేశము నీకు ఇచ్చెదను; నీ తరువాత నీ
సంతానమునకు ఈ దేశము ఇచ్చెదనని అతనితో
చెప్పెను.

దేవుడు, తాను అతనితో మాట్లాడిన స్థలమునుంచి 13
పైకి వెళ్లెను. । అప్పుడు తనతో ఆయన మాట్లాడిన 14
చోటను యాకోబు ఒక స్తంభమనగా రాతి స్తంభము
కట్టి, దాని మీద పేయనైవేద్యము అర్పించి, నూనె
యు దాని మీద పోసెను. । తనతో దేవుడు మాట్లా 15
డిన చోటికి యాకోబు బేతేలనే పేరు పెట్టెను.

వారు బేతేలునుంచి ప్రయాణమై వెళ్లిరి. ఎఫ్రా 16
తాకు వెళ్లే మార్గములో ఇంక కొంత దూరము ఉన్న
ప్పుడు, రాహేలు ప్రసవించుచు, ప్రసవమువల్ల ప్ర
యాసపడెను. । ఆమె ప్రసవమువల్ల ప్రయాసపడుచు 17
న్నప్పుడు, మంత్రసాని ఆమెతో—భయపడకుము, ఇది
కూడా నీకు కుమారుడవునని చెప్పెను. । ఆమె మృతి 18
బొందెను. అయితే ఆమె ప్రాణము బైలువెళ్లుచుం
డగా, ఆమె—అతని పేరు బెనోని‡ అని పలికెను.
అయితే అతనీ తండ్రి అతనికి బెన్యామీను§ అనే
పేరు పెట్టెను. । ఆలాగు రాహేలు మృతిబొంది, బేత్లె 19
హేము అనే ఎఫ్రాతా మార్గమున పాతిపెట్టబ
డెను. । యాకోబు ఆమె సమాధి మీద ఒక స్తంభము 20
కట్టెను. అది నేటివరకు రాహేలు సమాధి స్తంభము.

అప్పుడు ఇశ్రాయేలు ప్రయాణమై వెళ్లి, మిగ్దల్ 21
ఏదెరు¶ అవతల తన గుడారము వేసెను. । ఇశ్రాయేలు 22
ఆ దేశములో నివసించుచున్నప్పుడు, రూబేను వెళ్లి,
తన తండ్రియొక్క ఉపపత్నియైన బిల్హాతో శయనిం
చెను. అది ఇశ్రాయేలు వినెను.

యాకోబు కుమారులు పన్నెండుగురు. యాకోబు 23
ప్రథమ కుమారుడైన రూబేను, షిమ్యోను, లేవీ, యూ
దా, ఇశ్శాకారు, జబూలోను: వీరు లేయా కుమారులు.
రాహేలు కుమారులు, యోసేపు, బెన్యామీను. 24
రాహేలు దాసియైన బిల్హా కుమారులు, దాను, నఫ్తాలీ. 25

---

* అనగా, బేతేలుయొక్క దేవుడు. † బాకూత్ అనగా, ఏడ్పు. ‡ అనగా, నా ప్రయాసపు కుమారుడు.
§ అనగా, కుడిచేతి కుమారుడు. ¶ లేక, మందగోపురము.

26 లేయా దాసియైన జిల్పా కుమారులు, గాదు,
ఆషేరు. వీరు పద్దనరాములో యాకోబుకు పుట్టిన
27 కుమారులు. । అబ్రాహాము, ఈసాకును పరదేశులై ఉం
డిన హెబ్రోనను కిర్యతర్బాను మమ్రేలో నివసించిన
తన తండ్రియైన ఈసాకు యొద్దికి యాకోబు వచ్చెను.
28 ఈసాకు దినములు నూట ఎనబది సంవత్సరములు. ।
29 ఈసాకు, దినములు నిండిన వృద్ధుడై, ప్రాణము విడిచి
మృతిబొంది తన ప్రజల యొద్దికి చేర్చబడెను. అతని
కుమారులైన ఏశావు, యాకోబును అతని పాతిపెట్టిరి.

## 36. అధ్యాయము.

1,2 ఎదోమనే ఏశావు వంశావళి ఇదే; । ఏశావు కనాను
కుమార్తెలలో హిత్తీయుడైన ఏలోను కుమార్తె
యగు ఆదానును, హివ్వీయుడైన సిబ్యోను కుమార్తె
యైన అనాయొక్క కుమార్తెయగు ఒహొలీబామా
3 నును, । ఇష్మాయేలు కుమార్తెయు, నెబాయోతు స
హోదరియునైన బాశెమతునును పెండ్లి చేసుకొనె
4 ను. । ఆదా ఏశావుకు ఎలీపజును కనెను. బాశెమతు
5 రగూయేలును కనెను. । ఒహొలీబామా యెయూషు
ను, యాలామును, కోరహునును కనెను. కనాను దేశ
ములో ఏశావుకు పుట్టిన కుమారులు వీరే.

6 ఏశావు తన భార్యలను, తన కుమారులను, తన
కుమార్తెలను, తన ఇంటివారినందరిని, తన మందలను,
తన సమస్త పశువులను, తాను కనాను దేశములో సంపా
దించిన ఆస్తి యావత్తునును తీసుకొని, తన సహోదరు
డైన యాకోబు యెదుటనుంచి వేరే దేశమునకు వెళ్లిపో
7 యెను; । వారు కూడి నివసించ లేనంత విస్తార సంపద
గలవారైరి. వారి పశువులవల్ల, వారు పరదేశులై ఉం
డిన భూమి వారిని భరించలేక పోయెను. అప్పుడు
8 ఏశావు శేయీరు మన్యములో నివసించెను. । ఏశావే
ఎదోము.

9 ఎదోమీయుల తండ్రియైన ఏశావు శేయీరు మన్య
ములో ఉన్నప్పుడు, అతని వంశావళి ఇదే; ఏశావు
10 కుమారుల పేరులు ఇవే. । ఏశావు భార్యయైన ఆదా
కుమారుడగు ఎలీపజును, ఏశావు భార్యయైన బాశె
మతు కుమారుడగు రగూయేలును.

11 ఎలీపజు కుమారులు తేమాను. ఓమారు, సెపో,
గాతాము, కనజు. తిమ్నా ఏశావు కుమారుడైన ఎలీప
12 జుకు ఉపపత్ని. । ఆమె ఎలీపజుకు అమాలేకును కనెను.
వీరు ఏశావు భార్యయైన ఆదా కుమారులు.

13 రగూయేలు కుమారులు, నహతు, జెరహు, షమ్మా,
మిజ్జా. వీరు ఏశావు భార్యయైన బాశెమతు కుమా
రులు.

ఏశావు భార్యయు, సిబోను కుమార్తెయగు అనా 14
కుమార్తెయునైన ఒహొలీబామా కుమారులు ఎవ
రంటే ఆమె ఏశావుకు కనిన యయూషు, యాలాము,
కోరహు.

ఏశావు కుమారులలో వీరు నాయకులు: ఏశావు 15
ప్రథమ కుమారుడైన ఎలీపజు కుమారులు, తేమాను
నాయకుడు, ఓమారు నాయకుడు, సెపోనాయకుడు,
కనజు నాయకుడు, । కోరహు నాయకుడు, గాతాము 16
నాయకుడు, అమాలేకు నాయకుడు, వీరు ఎదోము
దేశమందు ఎలీపజు నాయకులు: వీరు ఆదా కుమారులు.

వీరు ఏశావు కుమారుడైన రగూయేలు కుమారులు, 17
నహతు నాయకుడు, జెరహు నాయకుడు, షమ్మా నాయ
కుడు, మిజ్జా నాయకుడు: వీరు ఎదోము దేశమందు
రగూయేలు సంతాన నాయకులు. వీరు ఏశావు భార్య
యైన బాశెమతు కుమారులు.

వీరు ఏశావు భార్యయైన ఒహొలీబామా కుమా 18
రులు, యయూషు నాయకుడు, యగ్లాము నాయ
కుడు, కోరహు నాయకుడు; వీరు అనా కుమార్తెయు
ఏశావు భార్యయునైన ఒహొలీబామా పుత్రసంతాన
నాయకులు. । ఎదోమనే ఏశావు కుమారులు వీరు. వారి 19
వారి సంతాన నాయకులు వీరు.

ఆ దేశ నివాసులైన హోరీయుడైన శేయీరు 20
కుమారులు, లోతాను, షోబాలు, సిబ్యోను, అనా, ।
దిషోను, ఏసెరు, దీషాను. వీరు ఎదోము దేశమందు 21
శేయీరు పుత్రులైన హోరీ నాయకులు.

లోతాను కుమారులు, హోరీ, హేమాము. లో 22
తాను సహోదరి తిమ్నా.

శోబాలు కుమారులు, అల్వాను మానహతు, ఏయి 23
బాలు, షపో, ఓనాము.

సిబ్యోను కుమారులు అయ్యా, అనా. ఆ అనా 24
తన తండ్రియైన సిబ్యోను గాడిదెలను మేపుచుండి
అరణ్యములో ఉష్ణధారలు కనుగొనినవాడు.

అనా సంతానము, దిషోను, అనా కుమార్తెయైన 25
ఒహొలీబామా.

వీరు దీషాను కుమారులు, హెమ్దాను, ఎష్బాను, 26
ఇత్రాను, కరాను.

వీరు ఏసెరు కుమారులు, బిల్హాను, జవాను, అకాను. 27

వీరు దీషాను కుమారులు, ఊసు, అరాను. 28

వీరు హోరీ నాయకులు, లోతాను నాయకుడు, 29
షోబాలు నాయకుడు,. సిబోను నాయకుడు, అనా
నాయకుడు, దిషోను నాయకుడు, ఏసెరు నాయకుడు, ।
దీషాను నాయకుడు. శేయీరు దేశమందలి వారి నా 30
యకుల చొప్పున, వీరు హోరీయుల నాయకులు.

31 మరియు, ఏ రాజైనా ఇశ్రాయేలు పుత్రుల పైని
రాజ్యపరిపాలన చేయక మునుపు, ఎదోము దేశములో
32 రాజ్యపరిపాలన చేసిన రాజులు ఎవరంటే. । బెయోరు
కుమారుడైన బెల ఎదోములో రాజ్యపరిపాలన చేసె
33 ను. అతని ఊరి పేరు దిన్హాబా. । బెల చనిపోయిన తరు
వాత, బొస్రావాడైన జెరహు కుమారుడగు యోబాబు
34 అతనికి ప్రతిగా రాజాయెను. । యోబాబు చనిపోయిన
తరువాత, తేమనీయుల దేశపువాడైన హుషాము అత
35 నికి ప్రతిగా రాజాయెను. । హుషాము చనిపోయిన తరు
వాత, మోయాబు దేశమందు మిద్యానును కొట్టివేసిన
బదదు కుమారుడైన హదదు అతనికి ప్రతిగా రాజా
36 యెను. అతని ఊరి పేరు అవీతు. । హదదు చనిపోయిన
తరువాత, మశ్రేకా వాడైన శమ్లా అతనికి ప్రతిగా
37 రాజాయెను. । శమ్లా చనిపోయిన తరువాత, నది తీర
మందలి రహెబోతువాడైన షావూలు అతనికి ప్రతి
38 గా రాజాయెను. । షావూలు చనిపోయిన తరువాత,
అక్బోరు కుమారుడైన బయల్‌హానాను అతనికి ప్రతి
39 గా రాజాయెను. । అక్బోరు కుమారుడైన బయల్‌హా
నాను చనిపోయిన తరువాత, హదరు అతనికి ప్రతిగా
రాజాయెను. అతని ఊరి పేరు పాయు. అతని భార్య
పేరు మహేతబేలు. ఆమె మేజాహాబు కుమార్తె
యైన మత్రేదు కుమార్తె.

40 మరియు, వారి వారి వంశముల ప్రకారము, వారి
వారి స్థలములలో, వారి వారి పేరుల చొప్పున ఏశావు
సంతాన నాయకుల పేరులు ఏవేవంటే, తిమ్నా నాయ
కుడు, అల్వా నాయకుడు, యతేతు నాయకుడు, ।
41 ఒహొలీబామా నాయకుడు, ఏలా నాయకుడు, పీనో
42 ను నాయకుడు, । కనజు నాయకుడు, తేమాను నాయ
43 కుడు, మిబ్సారు నాయకుడు, । మగ్దియేలు నాయకుడు,
ఈరాము నాయకుడు. వీరు, తమ తమ స్వాస్థ్యమైన
దేశమందు తమ తమ నివాసస్థలముల ప్రకారము ఎ
దోము నాయకులు. అతడు ఎదోమీయుల తండ్రి
యైన ఏశావు.

## 37. అధ్యాయము.

1 యాకోబు తన తండ్రి పరదేశిగా ఉండిన కనాను
దేశములో నివసించెను.

2 యాకోబు వంశావళి ఇది. యోసేపు పదిహేడు
ఏండ్లవాడై, తన సహోదరులతో కూడా మందను
మేపుచుండెను. అతడు పడుచువాడై తన తండ్రి భా
ర్యలైన బిల్హా కుమారుల యొద్దను, జిల్పా కుమారుల
యొద్దను ఉండెను. అప్పుడు యోసేపు వారి చెడు
తనమును గురించిన సమాచారము వారి తండ్రికి తెచ్చె
3 ను. । మరియు, యోసేపు అతని వృద్ధదశ కుమారుడు
గనుక ఇశ్రాయేలు తన కుమారులందరి కంటే ఎక్కు
వగా అతని ప్రేమించి, అతని కొరకు విచిత్రమైన
నిలువుటంగీ చేయించెను. । అతని సహోదరులు తమ 4
తండ్రి అతని సహోదరులందరి కంటే అతని ఎక్కు
వగా ప్రేమించుట చూచినప్పుడు, వారు అతని మీద
పగబట్టి, అతనితో సమాధానముగా మాట్లాడ లేకపో
యిరి.

యోసేపు ఒక కల కని, తన సహోదరులతో 5
అది తెలియ చెప్పెను. అప్పుడు వారు అతని మీద
మరీ పగబట్టిరి. । అతడు వారిని చూచి—నేను కనిన ఈ 6
కలను మీరు దయచేసి వినండి. । ఆదేమంటే, మనము 7
చేనులో పనలు కట్టుచుంటిమి; అప్పుడు అదుగో! నా
పన లేచి నిలుచుండెను. అప్పుడు అదుగో! మీ
పనలు నా పన చుట్టుకొని, నా పనకు సాగిలపడెనని
చెప్పెను. । అందుకు అతని సహోదరులు—నీవు మమ్ము 8
ను ఏలనే ఏలెదవా? మా మీద నీకు అధికారము కలు
గునా? అని అతనితో పలికి, అతని కలల నిమిత్తము
అతని మాటల నిమిత్తమును అతని మీద మరీ పగ
బట్టిరి.

అతడు ఇంకొక కల కని, తన సహోదరులకు 9
తెలియచేసి — ఇదుగో! నేను మరియొక కల కంటిని;
అందులో సూర్య చంద్రులు, పదకొండు నక్షత్రము
లును నాకు సాగిలపడెనని చెప్పెను. । అతడు తన తం 10
డ్రితో, తన సహోదరులతోను అది తెలియ చెప్పి
నప్పుడు, అతని తండ్రి అతని చూచి—నీవు కనిన ఈ
కల ఏమిటి? నేను, నీ తల్లియు, నీ సహోదరులును
నిశ్చయముగా వచ్చి నీకు నేల సాగిలపడుదుమా? అని
అతని గద్దించెను. । అతని సహోదరులు అతనియందు 11
అసూయపడిరి. అయితే అతని తండ్రి ఆ మాట జ్ఞాప
కము ఉంచుకొనెను.

అతని సహోదరులు షకెములో తమ తండ్రి మంద 12
మేపుటకు వెళ్లిరి. । అప్పుడు ఇశ్రాయేలు యోసేపును 13
చూచి — నీ సహోదరులు షకెములో మంద మేపు
చున్నారు గదా, నిన్ను వారి యొద్దికి పంపెదను రమ్మని
పలికినప్పుడు అతడు—ఉన్నానని అతనితో చెప్పెను. ।
అప్పుడు అతడు—నీవు వెళ్లి నీ సహోదరుల క్షేమ 14
ము, మంద క్షేమమును తెలుసుకొని, ఆ వర్తమా
నము నాకు తెమ్మని అతనితో చెప్పి, హెబ్రోను లోయ
లోనుంచి అతని పంపెను. అతడు షకెము చేరెను. ।
అయితే అతడు పొలములో తిరుగులాడుచు ఉండగా 15
ఒక మనుష్యుడు అతని కనుగొనెను. ఆ మనుష్య
డు—నీవేమి వెతుకుచున్నావని అతని అడిగెను. । అం 16
దుకు అతడు — నేను నా సహోదరులను వెతుకుచు

న్నాను; వారు ఎక్కడ మంద మేపుచున్నారో అది
17 దయచేసి నాకు తెలుపుమని పలికెను. । అందుకు ఆ
మనుష్యుడు—ఇక్కడనుంచి వారు సాగి వెళ్లిరి. వా
రు—దోతానుకు వెళ్లుదము రండని చెప్పుకొనుట వింటి
నని చెప్పెను. అప్పుడు యోసేపు తన సహోద
రుల వెంబడి వెళ్లి, దోతానులో వారిని కనుగొనెను.
18 అయితే అతడు వారి దగ్గరకు రాక మునుపు, వారు
దూరమునుంచి అతని చూచి, అతని చంపుటకు అతని
19 ఎడల కుయుక్తి చేసిరి. । వారు—ఇదుగో! ఈ స్వప్నకర్త
20 వచ్చుచున్నాడు; । వీని చంపి ఇక్కడనున్న ఒక గుంట
లో పడదోసి, దుష్టమృగము వీని తినివేసెనని చెప్పు
దము. అప్పుడు వీని కలలు ఏమవునో చూచెదము
రండని ఒకనితో ఒకడు మాట్లాడుకొనిరి.
21 రూబేను ఆ మాట విని—మనము వాని చంపరాదని
22 పలికి, వారి చేతులనుంచి అతని విడిపించెను. । ఏలా
గంటే రూబేను అతని తండ్రికి అతని తిరిగి అప్పగించు
టకు, వారి చేతులనుంచి అతని విడిపించ తలంచి—
రక్తము చిందించకండి; అతని మీద చేతులు వేయక
అడవిలో ఉన్న ఈ గుంటలో అతని పడదోయండి
అని వారితో చెప్పెను.
23 యోసేపు తన సహోదరుల యొద్దికి వచ్చినప్పుడు
వారు యోసేపు అంగీని, అతడు వేసుకొని ఉండిన
24 ఆ విచిత్రమైన నిలువుటంగీని తీసివేసి । అతని పట్టు
కొని ఆ గుంటలో అతని పడదోసిరి. ఆ గుంట వట్టిది;
అందులో నీళ్లు లేవు.
25 అప్పుడు వారు భోజనము చేయుటకు కూర్చుండి
తమ కన్నులెత్తి చూచినప్పుడు, ఇదుగో! ఐగుప్తుకు తీసు
కొని వెళ్లుటకు గుగ్గిలము, మస్తికయు, బోళ్లమును
మోయుచున్న తమ ఒంటెలతో కూడా ఇష్మాయేలీయు
లైన మార్గస్థులు గిలాదునుంచి వచ్చుచుండిరి.
26 అప్పుడు యూదా—మనము మన సహోదరుని
చంపి వాని రక్తము మరుగు చేసితే, ఏమి ప్రయోజ
27 నము? । ఈ ఇష్మాయేలీయులకు వాని అమ్మివేయుదము
రండి; వాడు మన సహోదరుడు, మన మాంస సం
బంధి గదా? వాని మీద మన చేతులు వేయరాదని తన
సహోదరులతో చెప్పెను. అందుకు అతని సహో
దరులు సమ్మతించిరి.
28 అప్పుడు మిద్యానీయులైన వర్తకులు తమ్మును
దాటి వెళ్లుచుండగా, వారు ఆ గుంటలోనుంచి యోసే
పును పైకి తీసి, ఆ ఇష్మాయేలీయులకు యోసేపును ఇరు
వది వెండి రూకలకు అమ్మివేసిరి. వారు యోసేపును
ఐగుప్తుకు తీసుకొని వెళ్లిరి.

రూబేను ఆ గుంటకు తిరిగి వచ్చినప్పుడు ఇదుగో! 29
యోసేపు గుంటలో లేడు గనుక అతడు తన బట్టలు
చించుకొని । తన సహోదరుల యొద్దికి తిరిగి వెళ్లి— 30
చిన్నవాడు లేడే; అయ్యో! నేనెక్కడికి పోదునని
పలికెను. । అప్పుడు వారు యోసేపు అంగీని తీసుకొని, 31
ఒక మేక పిల్లను చంపి, దాని రక్తములో ఆ అంగీని
ముంచి । ఆ విచిత్రమైన నిలువుటంగీని పంపిరి. వారు 32
తండ్రియొద్దికి దాని తెచ్చి—ఇది మాకు దొరికెను;
ఇది నీ కుమారుని అంగీ అవునో కాదో గుర్తుపట్టు
మని పలికిరి. । అతడు దాని గుర్తుపట్టి—ఈ అంగీ నా 33
కుమారునిదే; దుష్టమృగము అతని తినివేసెను: యో
సేపు నిశ్చయముగా చీల్చబడెనని పలికెను.
అప్పుడు యాకోబు తన బట్టలు చించుకొని, తన 34
నడుమున గోనెపట్ట కట్టుకొని, అనేక దినములు తన
కుమారుని నిమిత్తము అంగలార్చుచుండెను. । అతని 35
కుమారులందరు, అతని కుమార్తెలందరును అతని ఓదా
ర్చుటకు యత్నముచేసిరి; అయితే అతడు ఓదార్పు
పొందనొల్లక—నేను అంగలార్చుచు, అదృశ్యలోక
మునకు నా కుమారుని యొద్దికి వెళ్లెదనని చెప్పెను.
అతని తండ్రి అతని గురించి ఏడ్చెను.
మదానీయులు ఐగుప్తుకు అతని తీసుకొని వెళ్లి 36
ఫరోయొక్క షండుడు,* తలవర్ల అధిపతియునైన పో
తీఫరునకు అతని అమ్మివేసిరి.

## 38. అధ్యాయము.

ఆ కాలమందు — యూదా తన సహోదరులను 1
విడిచి, హీరా అనే పేరుగల ఒక అదుల్లామీయుని
యొద్ద దిగుటకు వెళ్లెను. । అక్కడ యూదా షూయ 2
అనే పేరుగల ఒక కనానీయుని కుమార్తెను చూచి,
ఆమెను తీసుకొని ఆమె యొద్ద చేరెను. । ఆమె గర్భ 3
వతియై కుమారుని కనెను. అతడు వానికి ఏరు అనే
పేరు పెట్టెను. । ఆమె తిరిగీ గర్భవతియై కుమారుని 4
కని వానికి ఓనాను అనే పేరు పెట్టెను. । ఆమె తిరిగీ 5
గర్భవతియై కుమారుని కని వానికి షేలా అనే పేరు
పెట్టెను. ఆమె వీని కనినప్పుడు అతడు కజీబులో
ఉండెను.
యూదా తన ప్రథమ కుమారుడైన ఏరుకు తా 6
మారు అనే పేరు గలదాని పెండ్లి చేసెను. । అయితే 7
యూదా ప్రథమ కుమారుడైన ఏరు యెహోవా
దృష్టికి చెడ్డవాడు గనుక యెహోవా అతని చం
పెను. । అప్పుడు యూదా ఓనానుతో — నీ అన్న 8
భార్యయొద్దికి వెళ్లి మరిది ధర్మము జరిగించి, నీ అన్నకు

*లేక, ఉద్యోగస్థుడు.

9 సంతానము కలుగజేయుమని చెప్పెను. । అయితే ఓ
నాను ఆ సంతానము తనది కాదని ఎరిగి, ఆమె
యొద్ద చేరినప్పుడు తన అన్నకు సంతానము కలుగ
10 చేయక ఉండేటట్టు నేలను విడిచి చెరిపెను. । అతడు
చేసినది యెహోవా దృష్టికి చెడ్డది గనుక ఆయన
అతని కూడా చంపెను.

11 అప్పుడు యూదా—ఇతడు కూడా ఇతని అన్నల
వలె చనిపోవునేమో అని అనుకొని—నా కుమారుడైన
షేలా పెద్దవాడయే పర్యంతము, నీ తండ్రి ఇంట్లో
విధవగా ఉండుమని తన కోడలైన తామారుతో చె
ప్పెను. కాబట్టి తామారు వెళ్లి తన తండ్రి ఇంట్లో
నివసించెను.

12 చాలా దినములైన తరువాత, షూయ కుమార్తె
యైన యూదా భార్య చనిపోయెను. ఆ తరువాత
యూదా దుఃఖనివారణ పొంది, అదుల్లామీయుడైన
హీరా అనే తన స్నేహితునితో కూడా తిమ్నాతుకు,
తన గొర్రెల బొచ్చు కత్తరించే వారి యొద్దికి వెళ్లెను.।
13 —నీ మామ తన గొర్రెల బొచ్చు కత్తరించుటకు తిమ్నా
14 తుకు వెళ్లుచున్నాడని తామారుకు తెలుపబడెను. । అ
ప్పుడు షేలా పెద్దవాడైనప్పటికిని తాను అతనికి
భార్యగా ఇవ్వబడకుండుట చూచి ఆమె తన వైధవ్య
వస్త్రములు తీసివేసి, ముసుకు వేసుకొని, ఒడలు కప్పు
కొని, తిమ్నాతుకు వెళ్లే మార్గములో ఉండే ఏనా
యిము ద్వారమున కూర్చుండెను.

15 యూదా ఆమెను చూచి, ఆమె తన ముఖము
16 కప్పుకొనినందున, ఆమె వేశ్య అని తలంచికొని । ఆ
మార్గమున ఆమె తట్టు తిరిగి, ఆమె తన కోడలని
తెలియక—నీ యొద్దికి వచ్చెదను రమ్మని చెప్పెను. అం
దుకు ఆమె — నీవు నా యొద్దికి వస్తే నాకేమి ఇచ్చె
17 దవని అడిగెను. । అందుకు అతడు — నేను మందలో
నుంచి మేకపిల్లను పంపెదనని చెప్పినప్పుడు ఆమె—
అది పంపే పర్యంతము కుదువ పెట్టితే సరి అని పలి
18 కినందుకు । అతడు—నేను నీ యొద్ద ఏమి కుదువపెట్ట
వలెనని పలికినప్పుడు, ఆమె — నీ ముద్ర, దాని దార
ము, నీ చేతిలో ఉన్న కర్ర అనేవే అని పలికిన
ప్పుడు అతడు వాటిని ఆమెకిచ్చి ఆమె యొద్దికి వెళ్లె
ను. ఆమె అతనివల్ల గర్భవతి ఆయెను.

19 అప్పుడు ఆమె లేచి వెళ్లి, తన ముసుకు తీసివేసి,
20 తన వైధవ్య వస్త్రములు వేసుకొనెను. । తరువాత
యూదా ఆ స్త్రీ చేతినుంచి ఆ కుదువను పుచ్చుకొ
నుటకు, తన స్నేహితుడైన అదుల్లామీయుని చేత మేక
పిల్లను పంపినప్పుడు, ఆమె అతనికి కనబడలేదు.।
కాబట్టి అతడు — మార్గమందు ఏనాయిము యొద్ద 21
నుండిన ఆ వేశ్య ఎక్కడ అని ఆ చోటి మను
ష్యులను అడిగెను. అయితే వారు — ఈ చో
టను వేశ్య ఉండ లేదని చెప్పిరి. । కాబట్టి అతడు 22
యూదా యొద్దికి తిరిగి వెళ్లి — ఆమె నాకు కనబడ
లేదు. మరియు, ఆ చోటి మనుష్యులు — ఈ చో
టను వేశ్య ఉండ లేదని చెప్పిరి అని పలికినప్పుడు।
యూదా—మనలను అపహాస్యము చేసెదరేమో; ఆమె 23
వాటిని ఉంచుకొననిమ్ము; నేనైతే ఈ మేక పిల్లను
పంపితిని; ఆమె నీకు కనబడ లేదని పలికెను.

మూడు నెలలు కావచ్చిన తరువాత — నీ కోడ 24
లైన తామారు జారత్వము చేసెను. అంతే కాదు,
ఇదుగో! ఆమె, జారత్వమువల్ల గర్భవతియైనది అని
యూదాకు తెలుపబడెను. అప్పుడు యూదా—
ఆమెను బైటికి తీసుకొని రండి; ఆమె కాల్చబడ
వలెనని చెప్పెను. । ఆమె బైటికి తేబడినప్పుడు ఆమె 25
తన మామ యొద్దికి ఆ వస్తువులను పంపి — ఇవి ఎవ
నివో ఆ మనుష్యునివల్ల నేను గర్భవతినైతిని. ఈ
ముద్ర, ఈ దారము, ఈ కర్ర ఎవనివో దయచేసి
గుర్తుపట్టుమని చెప్పించెను. । యూదా వాటిని గుర్తు 26
పట్టి—నేను నా కుమారుడైన షేలాను ఆమెకు ఇవ్వ
లేదు గనుక ఆమె నాకంటే నీతిమంతురాలు అని
పలికి మరి ఎప్పుడును ఆమెను ఎరగక పోయెను.

ఆమె ప్రసవకాలమందు ఇదుగో! కవలవారు ఆమె 27
గర్భమందు ఉండిరి. । ఆమె ప్రసవించుచున్నప్పుడు 28
ఒకడు తన చెయ్యి బైటికి చాచెను గనుక మంత్ర
సాని తొగరు తీసి వాని చేతికి కట్టి—ఇతడు మొదట
బైటికి వచ్చెనని చెప్పెను.। అయితే అతడు తన చెయ్యి 29
వెనుకకు తీసినప్పుడు, ఇదుగో! అతని సహోదరుడు
బైటికి వచ్చెను. అప్పుడు ఆమె—నీవేల భేదించుకొని
వచ్చితివి! భేదము నీ మీద ఉండునని చెప్పెను గనుక
అతనికి పారెసు* అనే పేరు పెట్టబడెను. । తరువాత 30
తన చేతిని తొగరు గల అతని సహోదరుడు బైటికి
వచ్చెను. అతనికి జారహు అనే పేరు పెట్టబడెను.

## 39. అధ్యాయము.

యోసేపు ఐగుప్తుకు తేబడినప్పుడు, ఫరోయొక్క 1
షండుడును† తలవర్ల అధిపతియునైన పోతీఫరనే ఒక
ఐగుప్తీయుడు అక్కడికి అతని తెచ్చిన ఇష్మాయేలీయుల

* అనగా, భేదము, †లేక, ఉద్యోగస్థుడు.

2 యొద్ద అతని కొనెను. । యెహోవా యోసేపుతో
ఉండెను గనుక అతడు మంగళప్రదుడై, తన యజమాను
3 డైన ఆ ఐగుప్తీయుని ఇంట్లో ఉండెను. । యెహోవా
అతనికి తోడై ఉండుటయు, అతడు చేసినదంతయు
అతని చేతిలో యెహోవా సఫలమయేటట్టు చేయు
4 టయు అతని యజమానుడు చూచినప్పుడు, । యో
సేపు అతని దృష్టియందు దయపొంది అతని యొద్ద
పరిచర్య చేసేవాడాయెను. మరియు అతడు తన ఇంటి
మీద విచారణకర్తగా అతని నియమించి, తనకు కలిగిన
5 దంతయు అతని చేతికి అప్పగించెను. । అతడు తన
ఇంటి మీదను, తనకు కలిగినదంతటి మీదను అతని
విచారణకర్తగా నియమించిన కాలము మొదలుకొని
యెహోవా యోసేపు నిమిత్తము ఆ ఐగుప్తీయుని
ఇంటిని ఆశీర్వదించెను. యెహోవా ఆశీర్వాదము
ఇంట్లోనేమి, పొలములోనేమి అతనికి కలిగిన సమ
6 స్తము మీదను ఉండెను. । అతడు తనకు కలిగినదం
తయు యోసేపు చేతికి అప్పగించి, తాను తినే ఆహా
రము తప్ప తనకు కలిగినది ఏదియు తెలుసుకొన
లేదు. యోసేపు రూపవంతుడు, సుందరుడునై ఉం
డెను.

7 అటుతరువాత అతని యజమానుని భార్య యో
సేపు మీద కన్నువేసి — నాతో శయనించుమని చె
8 ప్పెను. । అయితే అతడు ఒప్పక— నా యజమానుడు
తనకు కలిగినదంతయు నా చేతికి అప్పగించెను
గదా, నా వశమున తన ఇంట్లో ఏమి ఉన్నదో అతడు
9 ఎరగడు । ఈ ఇంట్లో నాకంటే గొప్పవాడు ఎవడును
లేడు. నీవు అతని భార్యవైనందున నిన్ను తప్ప మరి
దేనిని నాకు అప్పగించక ఉండలేదు. కాబట్టి నేను
ఏలాగు ఈ గొప్ప దుష్కార్యము చేసి దేవునికి విరో
ధముగా పాపము చేయ గలనని తన యజమానుని
భార్యతో పలికెను.

10 ఆమె దినదినమును యోసేపుతో మాట్లాడుచుం
డెను. అయితే అతడు ఆమె దగ్గర శయనించుట
కైనా ఆమెతో కూడా ఉండుటకైనా ఆమెకు చెవి
నివ్వలేదు.

11 ఆలాగుండగా, ఒకనాడు అతడు తన పని చేయు
టకు ఇంట్లోకి వెళ్లినప్పుడు ఇంటి మనుష్యులలో ఎవ
12 డును అక్కడ ఉండలేదు. । అప్పుడు ఆమె అతని వస్త్ర
ము పట్టుకొని — నాతో శయనించుమని చెప్పెను;
అయితే అతడు తన వస్త్రము ఆమె చేతిలో విడిచి,
13 తప్పించుకొని బైటికి పారిపోయెను. । ఆమె, అతడు
అతని వస్త్రమును తన చేతిలో విడిచి తప్పించుకొని
పోవుట చూచినప్పుడు । ఆమె తన ఇంటి మనుష్య 14
లను పిలిచి — చూడండి అతడు మనలను ఎగతాళి
చేయుటకు, ఒక ఇబ్రీయుని మన యొద్దికి తెచ్చి
ఉన్నాడు. నాతో శయనించ వలెనని వాడు నా
యొద్దికి వచ్చెను. అప్పుడు నేను పెద్ద కేక వేసితిని.।
నేను నోరెత్తి కేకవేయుట వాడు వినినప్పుడు, నా 15
దగ్గర తన వస్త్రము విడిచి, తప్పించుకొని బైటికి పారి
పోయెనని వారితో చెప్పి, । అతని యజమానుడు ఇం 16
టికి వచ్చే పర్యంతము అతని వస్త్రము తన దగ్గర ఉం
చుకొనెను.

అప్పుడు ఆమె అతనితో ఈ మాటల చొప్పున 17
చెప్పెను — నీవు మన యొద్దికి తెచ్చిన ఆ ఇబ్రీదా
సుడు నన్ను ఎగతాళి చేయుటకు నా యొద్దికి వచ్చె
ను. । నేను నోరెత్తి కేక వేసినప్పుడు వాడు తన 18
వస్త్రము నా దగ్గర విడిచి తప్పించుకొని బైటికి పోయె
ననెను. । కాబట్టి అతని యజమానుడు—ఈ ప్రకార 19
ముగా నీ దాసుడు నన్ను చేసెనని తన భార్య తనతో
చెప్పిన మాటలు వినినప్పుడు అతని కోపము మండె
ను. । అప్పుడు యోసేపు యజమానుడు అతని పట్టు 20
కొని, రాజు ఖైదీలు బంధించబడే స్థలమైన చెరసా
లలో వేయించెను. అతడు అక్కడ చెరసాలలో ఉం
డెను. । అయితే యెహోవా యోసేపుతో ఉండి, 21
అతనియందు కనికరపడి, అతడు ఆ చెరసాల అధి
పతి దృష్టియందు దయ పొందేటట్టు చేసెను. । చెర 22
సాల అధిపతి ఆ చెరసాలలో ఉన్న ఖైదీలందరిని
యోసేపు చేతికి అప్పగించెను. వారు అక్కడ ఏమి
చేసిరో, అదంతయు అతడే చేయించేవాడు. । యె 23
హోవా అతనితో ఉండెను గనుక ఆ చెరసాల
అధిపతి అతని చేతికి అప్పగించబడినది ఏదియు చూ
డక ఉండెను. అతడు చేసేదంతయు యెహోవా
సఫలమయేటట్టు చేసెను.

## 40. అధ్యాయము.

అవియైన పిమ్మట ఐగుప్తు రాజుయొక్క పానదా 1
యకుడు, భక్ష్యకారుడును తమ ప్రభువైన ఐగుప్తు
రాజు ఎడల తప్పు చేసిరి. । పరో పానదాయకుల అధి 2
పతియు, భక్ష్యకారుల అధిపతియునైన తన ఇద్దరు
షండులమీద కోపపడి, । వారిని చెరసాలలో తలవర్ల 3
అధిపతికి అప్పగించెను. అది యోసేపు బంధించబ
డిన స్థలము. । అప్పుడు తలవర్ల అధిపతి వారిని యోసేపు 4
వశము చేసెను. అతడు వారికి పరిచర్య చేసెను.
వారు కొన్ని దినములు కావలిలో ఉండిన తరువాత।

5 వారిద్దరు అనగా చెరసాలలో బంధించబడిన ఐగుప్తు
రాజుయొక్క పానదాయకుడు, భక్ష్యకారుడును ఒక
రాత్రియందే కలలు కనిరి; ఒక్కొకడు వెవ్వేరు భా
6 వముగల తన తన కల కనెను.। తెల్లవారినప్పుడు యో
సేపు వారి యొద్దికి వచ్చి వారిని చూడగా, ఇదుగో!
7 వారు చింతాక్రాంతులై ఉండిరి.।అతడు — ఏమి
తెలిసి నేడు మీ ముఖములు చిన్న బోయినవని తన
యజమానుని ఇంట తనతో కావలిలో ఉన్న పరో
8 షండులను అడిగెను.। అందుకు వారు—కల కంటిమి;
అయితే దాని భావము చెప్పేవాడు ఎవడును లేడని
అతనితో పలికిరి. అప్పుడు యోసేపు వారిని చూచి—
భావములు చెప్పుట దేవునిదే గదా, మీరు దయచేసి
ఆ కలలు నాకు వివరించి చెప్పండనెను.

9 అప్పుడు పానదాయకుల అధిపతి యోసేపును
చూచి — నా కలలో ఒక ద్రాక్షావల్లి నా ఎదుట
10 ఉండెను.। ఆ ద్రాక్షావల్లికి మూడు తీగెలు ఉండెను.
అది చిగిరించినట్టు ఉండెను; దాని పువ్వులు వికసిం
11 చెను; దాని గెల పండిన ద్రాక్షఫలములాయెను.। మ
రియు, పరో గిన్నె నా చేతిలో ఉండెను; ఆ ద్రాక్ష
ఫలములు నేను పట్టుకొని పరో గిన్నెలో వాటిని
పిండి, ఆ గిన్నె పరో చేతికి ఇచ్చితినని తన కల అత
నితో వివరించి చెప్పెను.

12 అప్పుడు యోసేపు — దాని భావము ఇదే: ఆ
13 మూడు తీగెలు మూడు దినములు.। ఇంక మూడు దిన
ములలోగా, పరో నీ తలను పైకెత్తి నీ ఉద్యోగము
నీకు తిరిగీ ఇప్పించును. నీవు అతనికి పానదాయకు
డవై ఉండిన మునుపటి మర్యాద చొప్పున, పరో
14 గిన్నె అతని చేతికి అప్పగించెదవు.। కాబట్టి నీకు
క్షేమము కలిగేటప్పుడు నన్ను జ్ఞాపకము చేసుకొని
నాయందు కరుణించి, పరోతో నన్ను గురించి మా
ట్లాడి, ఈ ఇంట్లోనుంచి నన్ను బైటికి రప్పించుము।
15 ఎందుకంటే నిశ్చయముగా నేను ఇబ్రీయుల దేశము
లోనుంచి దొంగిలబడితిని. మరియు, ఈ చెరసాలలో
నన్ను వేయుటకు ఇక్కడను నేనేమియు చేయలేదని
అతనితో చెప్పెను.

16 అతడు తెలిపిన భావము మంచిదని భక్ష్యకారుల
అధిపతి చూచినప్పుడు అతడు—నేనును కల కంటిని;
ఇదుగో! తెల్లని పిండివంటలుగల మూడు గంపలు నా
17 తల మీద ఉండెను.। మీదిగంపలో పరో నిమిత్తము
పిండివంటలైన సమస్త విధ భక్ష్యములు ఉండెను.
పక్షులు నా తల మీదనున్న ఆ గంపలోనుంచి వాటిని
తీసుకొని తినుచుండెనని యోసేపుతో చెప్పెను.

అందుకు యోసేపు — దాని భావము ఇదే: ఆ 18
మూడు గంపలు మూడు దినములు.। ఇంక మూడు దిన 19
ములలోగా, పరో నీనుంచి నీ తలను పైకెత్తి మాను
మీద నిన్ను వ్రేలాడ చేసును. అప్పుడు పక్షులు
నీనుంచి నీ మాంసము తినివేసునని ప్రత్యుత్తరము
చెప్పెను.

మూడవ దినమందు ఆలాగే జరిగెను. అది పరో 20
జన్మదినము గనుక అతడు తన దాసుల మధ్యను, పాన
దాయకుల అధిపతి తలనును భక్ష్యకారుల అధిపతి
తలనును పైకెత్తి। పానదాయకుల అధిపతి ఉద్యోగము 21
తిరిగీ అతనికిచ్చెను గనుక అతడు పరో చేతికి గిన్నెను
ఇచ్చెను.। అయితే యోసేపు వారికి తెలిపిన భావము 22
చొప్పున భక్ష్యకారుల అధిపతిని వ్రేలాడ చేయించెను.

అయినప్పటికిని పానదాయకుల అధిపతి యోసే 23
పును జ్ఞాపకము చేసుకొనక అతని మరిచిపోయెను.

## 41. అధ్యాయము.

రెండేండ్లు గడిచిన తరువాత, పరో ఒక కల కనెను. 1
అందులో అతడు ఏటి దగ్గర నిలిచి ఉండగా, । అదు 2
గో! చూపునకు అందమైనవి బలిసినవియునైన ఏడు
ఆవులు ఏటిలోనుంచి పైకి వచ్చుచు, జమ్ములో మేయు
చుండెను.। అదుగో! వాటి తరువాత, చూపునకు 3
వికారమైనవి చిక్కిపోయినవియునైన వేరే ఏడు ఆ
వులు ఏటిలోనుంచి పైకి వచ్చుచు, ఏటి ఒడ్డున ఆ
ఆవుల దగ్గర నిలుచుచుండెను.। అప్పుడు చూపునకు 4
వికారమైనవి చిక్కిపోయినవియునైన ఆ ఆవులు,
చూపునకు అందమైనవి బలిసినవియునైన ఆవులను
తినివేయుచుండెను. అంతలో పరో మేలుకొనెను.

అతడు నిద్రించి రెండవ సారి కల కనెను. అం 5
దులో, అదుగో! మంచి పుష్టిగల ఏడు వెన్నులు ఒక్క
దంటున పుట్టుచుండెను.। మరియు, అదుగో! తూర్పు 6
గాలిచేత చెడిపోయిన ఏడు పీల వెన్నులు వాటి తరు
వాత మొలుచుచుండెను.। అప్పుడు నిండైన పుష్టిగల 7
ఆ ఏడు వెన్నులను ఆ పీల వెన్నులు మింగివేయుచుం
డెను. అంతలో పరో మేలుకొని అది కల అని
గ్రహించెను.

తెల్లవారినప్పుడు అతని ఆత్మ కలతపడెను గనుక, 8
అతడు ఐగుప్తు జ్ఞానులందరిని అక్కడి విద్వాంసులం
దరిని పిలువనంపెను. పరో తన కలను వారితో వివ
రించి చెప్పెను గాని పరోకు వాటి భావము తెలుప
గలవాడెవడును లేడు.

అప్పుడు పానదాయకుల అధిపతి—నేడు నా తప్పి 9
తములు జ్ఞాపకము చేసుకొనుచున్నాను.। పరో తన 10

దాసుల మీద కోపపడి నన్ను, భక్ష్యకారుల అధి
పతిని మా యుభయులను తలవరుల అధిపతి ఇంట
11 కావలిలో ఉంచెను. । ఒక రాత్రియందే నేను, అతడు
మేమిద్దరము కలలు కంటిమి. ఒక్కొకడు తన తన కల
12 భావము చొప్పున మేము కలలు కంటిమి. । అక్కడ
తలవరుల అధిపతికి దాసుడై ఉండిన ఒక ఇబ్రీ పడుచు
వాడు మాతో కూడా ఉండెను. అతనితో మా కలలు
మేము వివరించి చెప్పినప్పుడు, అతడు వాటి భావము
మాకు తెలిపెను. ఒక్కొకని కల చొప్పున దాని దాని
13 భావము తెలిపెను. । అతడు మాకు ఏయే భావము తెలి
పెనో, ఆయా భావము చొప్పున జరిగెను. నా
ఉద్యోగము నాకు తిరిగీ ఇప్పించి, అతని వ్రేలాడ
చేయించెనని పరోతో చెప్పెను.

14 అప్పుడు పరో యోసేపును పిలువనంపెను. కాబట్టి
చెరసాలలోనుంచి అతని త్వరగా రాజేసిరి. అతడు
క్షౌరము చేయించుకొని, బట్టలు మార్చుకొని, పరో
15 యొద్దికి వచ్చెను. । పరో యోసేపును చూచి— నేను
ఒక కల కంటిని; దాని భావము తెలుపగల వాడు
ఎవడును లేడు. నీవు కలను తెలుసుకొని దాని భావము
తెలుప గలవని నిన్ను గురించి వింటినని అతనితో చెప్పి
16 నందుకు । యోసేపు—నావల్ల కాదు; దేవుడు పరోకు
క్షేమకరమైన ప్రత్యుత్తరమిచ్చునని పరోతో ప్రత్యు
త్తరము చెప్పెను.

17 అప్పుడు పరో—నా కలలో, అదుగో! నేను ఏటి
18 ఒడ్డున నిలుచుచుంటిని. । అదుగో! బలిసినవి, చూపు
నకు అందమైనవియునైన ఏడు ఆవులు ఏటిలోనుంచి
19 పైకి వచ్చి, జమ్ములో మేయుచుండెను. । మరియు, అదు
గో! నీరసమై, బహు వికారరూపము కలిగి, చిక్కి
పోయిన వేరే ఏడు ఆవులు వాటి తరువాత పైకి వచ్చు
చుండెను. వీటివలె వికారమైనవి ఐగుప్తు దేశమందు
20 ఎక్కడను నాకు కనబడలేదు. । చిక్కిపోయి వికార
ముగానున్న ఆవులు, బలిసిన మొదటి ఏడు ఆవులను
21 తినివేయుచుండెను. । అవి వాటి కడుపులో పడుచుం
డెను గాని అవి కడుపులో పడియుండుట తెలియ
లేదు. మొదట ఉండినట్టే అవి చూపునకు వికార
ముగా ఉండెను. అంతలో నేను మేలుకొంటిని.

22 మరియు నా కలలో, నేను చూడగా, అదుగో!
పుష్టిగల ఏడు మంచి వెన్నులు ఒక్క దంటున పుట్టు
23 చుండెను. । మరియు అదుగో! తూర్పు గాలిచేత చెడి
పోయి ఎండిన ఏడు పీల వెన్నులు వాటి తరువాత
24 మొలుచుచుండెను. । ఈ పీల వెన్నులు ఆ మంచి వెన్ను
లను మింగివేయుచుండెను. ఇది జ్ఞానులకు తెలియ
చేసితిని; అయితే దాని భావము తెలుప గలవాడు
ఎవడును లేడని అతనితో చెప్పెను.

అందుకు యోసేపు—పరోయొక్క కల ఒక్కటే. 25
దేవుడు తాను చేయబోయే దాని పరోకు తెలియ
చేసెను. ఆ ఏడు మంచి ఆవులు ఏడు సంవత్సరములు. ।
ఆ ఏడు మంచి వెన్నులును ఏడు సంవత్సరములు. । 26
కల ఒక్కటే. వాటి తరువాత పైకి వచ్చిన చిక్కి 27
పోయి వికారమైన ఏడావులును ఏడు సంవత్సర
ములు. తూర్పుగాలిచేత చెడిపోయిన ఏడు పీల వెన్ను
లు కరువుగల ఏడు సంవత్సరములై ఉండును. । నేను 28
పరోతో చెప్పిన మాట ఇదే. దేవుడు తాను చేయ
బోయే దాని పరోకు చూపించెను. । చూడండి; ఐగుప్తు 29
దేశమందంతటను బహు సమృద్ధిగల ఏడేండ్లు వచ్చు
చున్నవి. । అయితే కరువుగల ఏడు సంవత్సరములు 30
వాటి తరువాత వచ్చును. ఐగుప్తు దేశమందు ఆ సమృద్ధి
యావత్తును మరవబడును. అప్పుడు ఆ కరువు, దేశ
మును పాడుచేసును. । ఆ సమృద్ధి, దాని తరువాత 31
కలిగే కరువువల్ల దేశమందు తెలియబడదు; అది
మిక్కిలీ భారముగా ఉండును.

ఈ కార్యము దేవునివల్ల నిర్ణయించబడి ఉన్నది. 32
అది దేవుడు శీఘ్రముగా జరిగించును. అందుచేతనే
ఆ కల పరోకు రెట్టించబడెను. । కాబట్టి పరో, వివే 33
కము, బుద్ధియు గల ఒక మనుష్యుని విచారించి,
ఐగుప్తు దేశము మీద అతని నియమించ వలెను. । పరో 34
ఆలాగు చేసి ఈ దేశము పైని అధిపతులను నియ
మించి, సమృద్ధి గల ఏడు సంవత్సరములలో ఐగుప్తు
దేశమందంతటను ఐదవ భాగము పుచ్చుకొన వలెను. ।
రాబోయే ఈ మంచి సంవత్సరముల ఆహారమంతయు 35
సమకూర్చి, పరో చేతికింద ధాన్యము పోగుచేసి
పట్టణములలో ఆహారము కాపాడ వలెను. । కరువు 36
చేతను ఈ దేశము నశించి పోకుండా, ఆ ఆహారము
ఐగుప్తు దేశములో కలుగబోయే కరువుగల ఏడు సం
వత్సరములకు ఈ దేశమందు సంగ్రహముగా ఉండు
నని పరోతో చెప్పెను.

ఆ మాట పరో దృష్టికి, అతని సమస్త సేవకుల 37
దృష్టికిని మంచిదై ఉండెను గనుక । అతడు — ఇతని 38
వలె దేవుని ఆత్మ గల మనుష్యుని కనుగొన గలమా?
అని తన సేవకులతో పలికెను. । మరియు పరో—దేవు 39
డు ఇదంతయు నీకు తెలియపరిచెను గనుక నీవలె
వివేకము, బుద్ధియు గలవాడు ఎవడును లేడు. । నీవు 40
నా ఇంటికి అధికారివై ఉండ వలెను. నా ప్రజలం

దరు నీకు విధేయులై ఉందురు.* సింహాసనమందు
మాత్రమే నేను నీకంటే అధికుడనై ఉందునని యో
41 సేపుతో చెప్పెను. । మరియు పరో — చూడుము;
ఐగుప్తు దేశమంతటి మీద నిన్ను నియమించి ఉన్నా
నని యోసేపుతో చెప్పెను.

42 మరియు, పరో తన చేతినున్న తన ఉంగరము
తీసి, యోసేపు చేతిని పెట్టి, సన్నపు నారబట్టలు
అతనికి తొడిగించి, అతని మెడను బంగారు గొలుసు
43 వేసి, । తనకు కలిగిన రెండవ రథము మీద అతని
ఎక్కించెను. అప్పుడు — వందనము చేయుడీ† అని
అతని ముందర నోరెత్తి పలికిరి. ఆలాగు ఐగుప్తు
దేశమంతటి మీద అతని నియమించెను.

44 మరియు, పరో యోసేపును చూచి — పరోను
నేనే; అయితే నీ సెలవు లేక ఐగుప్తు దేశమందంత
టను ఏ మనుష్యుడును తన చేతినైనా తన కాలినైనా
45 ఎత్త కూడదని చెప్పెను. । మరియు, పరో యోసేపుకు
సాపెనత్పనేహు అనే‡ పేరుపెట్టి, అతనికి ఓనుయొ
క్క యాజకుడైన పోథీపెర కుమార్తెయగు ఆసెన
46 తును భార్యగా ఇచ్చెను. । యోసేపు బైలుదేరి ఐగుప్తు
దేశమందంతట సంచరించెను. యోసేపు ఐగుప్తు రా
జైన పరో ఎదుట నిలిచినప్పుడు, ముప్పది సంవత్సర
ముల వాడై ఉండెను. అప్పుడు యోసేపు పరో
ఎదుటనుంచి బైలువెళ్లి, ఐగుప్తు దేశమందంతటను సం
చరించెను.

47 సమృద్ధిగల ఏడు సంవత్సరములలో భూమి కుప్ప
48 కుప్పలుగా ఫలించెను. । ఐగుప్తు దేశమందున్న ఏడు
సంవత్సరముల ఆహారమంతయు అతడు సమకూర్చి
పట్టణములలో ఆహారము ఉంచెను. ఏ పట్టణము
చుట్టు ఉండే పొలముయొక్క ఆహారము ఆ పట్టణ
49 మందే ఉంచెను. । యోసేపు సముద్రపు ఇసుకవలె
అతి విస్తారముగా ధాన్యము పోగు చేసెను. కొలుచు
టకు అసాధ్యమైనది గనుక కొలుచుట మానివేసెను.

50 కరువు సంవత్సరములు రాక మునుపు యోసేపుకు
ఇద్దరు కుమారులు పుట్టిరి. ఓనుయొక్క యాజకుడైన
పోథీపెర కుమార్తెయగు ఆసెనతు అతనికి వారిని
51 కనెను. । అప్పుడు యోసేపు — దేవుడు నా సమస్త
బాధను, నా తండ్రి ఇంటివారినందరినిని నేను మరిచి
పోయేటట్టు చేసెనని అనుకొని, తన ప్రథమ కుమా
52 రునికి మనష్షే§ అనే పేరు పెట్టెను. । తరువాత అత
డు—నాకు బాధ కలిగిన దేశమందు దేవుడు నన్ను
అభివృద్ధి పొందించెనని అనుకొని, రెండవ వానికి
ఎఫ్రాయిము‖ అనే పేరు పెట్టెను.

ఐగుప్తు దేశమందు కలిగిన సమృద్ధి సంవత్సరములు 53
గతించిన తరువాత । యోసేపు చెప్పిన ప్రకారము 54
ఏడు కరువు సంవత్సరములు వచ్చుటకు ఆరంభించెను.
అయితే ఐగుప్తు దేశమందంతటను ఆహారము ఉం
డెను. । ఐగుప్తు దేశమందంతటను కరువు కలిగినప్పుడు, 55
ఆ దేశస్థులు ఆహారము కొరకు పరోతో మొరబెట్టు
కొనిరి; అయితే పరో—మీరు యోసేపు యొద్దికి వెళ్లి,
అతడు మీతో ఏమి చెప్పునో అది చేయండని
ఐగుప్తీయులందరితో చెప్పెను.

ఆ కరువు ఆ దేశమందంతటను ఉండెను గనుక 56
యోసేపు కొట్లన్నియు విప్పించి, ఐగుప్తీయులకు ధా
న్యము అమ్మకము చేసెను. ఐగుప్తు దేశమందు ఆ
కరువు భారముగా ఉండెను. మరియు ఆ కరువు
ప్రతి దేశమందు భారమైనందున । సమస్త దేశస్థులును 57
యోసేపు యొద్ద ధాన్యము కొనుటకు ఐగుప్తుకు వచ్చిరి.

## 42. అధ్యాయము.

ధాన్యము ఐగుప్తులో ఉన్నదని యాకోబు తెలుసు 1
కొనెను. అప్పుడు యాకోబు—మీరు ఎందుకు ఒకని
ముఖము ఒకడు చూచుచున్నారని తన కుమారులతో
పలికెను. । మరియు, అతడు — చూడండి, ఐగుప్తులో 2
ధాన్యము ఉన్నవని వింటిని. మనము చావక బ్రతికే
టట్టు, మీరు అక్కడికి వెళ్లి, మన కొరకు అక్కడ
నుంచి ధాన్యము కొనుకొని రండని చెప్పెను.

అప్పుడు యోసేపుయొక్క పదిమంది సహోదరు 3
లు ఐగుప్తులో ధాన్యము కొనుటకు వెళ్లిరి. । అయితే— 4
అతనికి హాని సంభవించునేమో అని యాకోబు,
యోసేపు సహోదరుడైన బెన్యామీనును అతని
సహోదరులతో కూడా పంపలేదు.

ఆ కరువు కనాను దేశములో ఉండెను గనుక 5
వచ్చుచుండిన వారితో కూడా ఇశ్రాయేలు కుమారులు
ధాన్యము కొనుటకు వచ్చిరి. । అప్పుడు యోసేపు ఆ 6
దేశమంతటి మీద అధికారియై ఉండెను. అతడే ఆ
దేశ ప్రజలందరికిని ధాన్యము అమ్మకము చేసేవాడు.
యోసేపు సహోదరులు వచ్చి ముఖములు నేలను
మోపి అతనికి వందనము చేసిరి.

*ఇబ్రీలో, ముద్దుబెట్టుకొందురు. †లేక, రాజు తండ్రి! ‡అనగా, లోక రక్షకుడు అనే అర్థము కాబోలును.
§అనగా, మరుచుట. ‖అనగా, అభివృద్ధి.

7 యోసేపు తన సహోదరులను చూచి వారిని గుర్తు
పట్టి, వారికి అన్యునివలె అగుపడి, వారితో కఠిన
ముగా మాట్లాడి—మీరు ఎక్కడనుంచి వచ్చితిరని
అడిగెను. అందుకు వారు — ఆహారము కొనుటకు
8 కనాను దేశమునుంచి వచ్చితిమనిరి.। యోసేపు తన
సహోదరులను గుర్తుపట్టెను గాని వారు అతని గుర్తు
పట్టలేదు.

9 అప్పుడు యోసేపు, వారిని గురించి తాను కనిన
కలలు జ్ఞాపకము చేసుకొని—మీరు వేగులవారు; ఈ
దేశపు దిగంబరత్వము చూచుటకు వచ్చితిరని వారితో
10 పలికెను.। అందుకు వారు — లేదు, ప్రభువా! నీ సేవ
కులమైన మేము ఆహారము కొనుటకే వచ్చితిమి;।
11 మేమందరము ఒక్క మనుష్యుని కుమారులము; మేము
యథార్థవంతులమే గాని నీ సేవకులమైన మేము
12 వేగులవారము కామని అతనితో చెప్పిరి.। అయితే
అతడు—లేదు, ఈ దేశపు దిగంబరత్వము చూచుటకే
13 వచ్చితిరని వారితో పలికెను.। అందుకు వారు — నీ
దాసులమైన మేము పన్నెండుమంది సహోదరులము;
కనాను దేశములో ఉన్న ఒక్క మనుష్యుని కుమా
రులము. ఇదుగో! కనిష్ఠుడు నేడు మా తండ్రి యొద్ద
ఉన్నాడు; ఒకడు లేడు అని ప్రత్యుత్తరము చెప్పిరి.

14 అయితే యోసేపు — మీరు వేగులవారని నేను
15 మీతో చెప్పినది సరే.। దీనివల్ల మీరు శోధించబడు
దురు; ఫరో జీవముతోడు, నీ తమ్ముడు ఇక్కడికి
వచ్చితేనే గాని మీరు ఇక్కడనుంచి బైలు వెళ్లరు.।
16 మీ తమ్ముని తీసుకొని వచ్చుటకు మీలో ఒకని పం
పండి; మీరు బంధించబడి ఉందురు. ఆలాగున
మీలో సత్యమున్నదో లేదో మీ మాటలు శోధించ
బడును; లేనిపక్షమందు, ఫరో జీవముతోడు మీరు
17 వేగులవారని చెప్పి। వారిని మూడు దినములు ఖైదులో
వేయించెను.

18 మూడవ దినమున యోసేపు వారిని చూచి—మీరు
బ్రతికేటట్టు దీని చేయండి; నేను దేవునికి భయపడు
19 చున్నాను:। మీరు యథార్థవంతులైతే, మీ సహోద
రులలో ఒకడు ఈ చెరసాలలో బంధించబడ వలెను.
మీరు వెళ్లి మీ కుటుంబముల కరువు తీరుటకు ధా
20 న్యము తీసుకొని వెళ్లండి.। మీ తమ్ముని నా యొద్దికి
తీసుకొని రండి. ఆలాగున మీ మాటలు సత్యమైన
వని అగుపడును గనుక మీరు చావరని పలికెను.
వారు ఆలాగు చేసిరి.

21 అప్పుడు వారు — నిశ్చయముగా మన సహోద
రుని ఎడల మనము చేసిన అపరాధము మోయుచు
న్నాము. అతడు మనలను బతిమాలుకొనినప్పుడు,
మనము అతని బాధ చూచియు వినకపోతిమి; అందు
వల్ల ఈ బాధ మనకు వచ్చెనని ఒకనితో ఒకడు మా
ట్లాడుకొనిరి.। మరియు, రూబేను — ఈ చిన్నవాని 22
ఎడల పాపము చేయకండని నేను మీతో చెప్ప
లేదా? అయితే మీరు వినరైతిరి గనుక ఇదుగో! అతని
రక్తము కూడా అడుగబడుచున్నదని వారికి ప్రత్యు
త్తరమిచ్చెను.

అయితే ద్విభాషి వారి మధ్యనుండెను గనుక, 23
తమ మాట యోసేపు వినెనని వారు తెలుసుకొన
లేదు.। అతడు వారి యొద్దనుంచి తొలగి, ఏడ్చి, తిరిగీ 24
వారి యొద్దికి వచ్చి, వారితో మాట్లాడి, వారిలో
నుంచి షిమ్యోనును పట్టి, వారి కన్నుల ఎదుట అతని
బంధించెను.

మరియు, యోసేపు వారి గోనెలను ధాన్యముతో 25
నిండించుటకును, ఎవని రూకలు వాని గోనెలో తిరిగీ
వేయుటకును, ప్రయాణము కొరకు భోజన పదార్థ
ములు వారికిచ్చుటకును అజ్ఞాపించి వారికి ఆలాగు
చేయించెను.

వారు తాము కొనిన ధాన్యము తమ గాడిదెల 26
మీద ఎక్కించి, అక్కడనుంచి వెళ్లిపోయిరి.। అయితే 27
దిగే చోటను, ఒకడు తన గాడిదెకు మేత పెట్టుటకు
తన గోనె విప్పినప్పుడు, తన రూకలు కనుగొనెను.
అదుగో! అవి అతని గోనె మూతిలో ఉండెను.।
అప్పుడు అతడు — నా రూకలు తిరిగీ ఇవ్వబడెను. 28
అదుగో! అవి నా గోనెలో ఉన్నవని తన సహో
దరులతో చెప్పెను. అంతట వారి గుండె చెదిరి పో
యెను. వారు జడిసి—ఇదేమిటి? దేవుడు మనకు ఇది
చేసెనని ఒకనితో ఒకడు మాట్లాడుకొనిరి.

వారు కనాను దేశమందున్న తమ తండ్రియైన 29
యాకోబు యొద్దికి వచ్చి, తమకు సంభవించినది యా
వత్తును అతనికి తెలియచేసిరి. ఏలాగంటే।–ఆ దేశము 30
నకు ప్రభువైనవాడు మాతో కఠినముగా మాట్లాడి, ఆ
దేశము వేగుచూచేవారమని మమ్మును ఎంచెను.। అప్పు 31
డు మేము — యథార్థవంతులము; వేగులవారము
కాము;। పన్నెండుమంది సహోదరులము; ఒక్క 32
తండ్రి కుమారులము; ఒకడు లేడు; మా తమ్ముడు నేడు
కనాను దేశమందు మా తండ్రియొద్ద ఉన్నాడని అత
నితో చెప్పితిమి.। అందుకు ఆ దేశప్రభువు మమ్మును 33
చూచి — మీరు యథార్థవంతులని దీనివల్ల నేను
తెలుసుకొందును. మీ సహోదరులలో ఒకని నా
యొద్ద విడిచిపెట్టి, మీ కుటుంబముల కరువు తీరుటకు
ధాన్యము తీసుకొని వెళ్లి,। నా యొద్దికి ఆ చిన్నవాని 34

తోడుకొని రండి. అప్పుడు మీరు యథార్థవంతులే
గాని వేగులవారు కారని నేను తెలుసుకొని, మీ
సహోదరుని మీకు అప్పగించెదను; అప్పుడు ఈ
దేశమందు మీరు వ్యాపారము చేసుకొన వచ్చునని
చెప్పెననిరి.

35 వారు తమ గోనెలు కుమ్మరించుచున్నప్పుడు, ఇదు
గో! ఎవని రూకల మూట వాని గోనెలో ఉండెను.
వారు, వారి తండ్రియు ఆ రూకల మూటలు చూచి
36 భయపడిరి. । అప్పుడు వారి తండ్రియైన యాకోబు
వారిని చూచి — నన్ను పుత్రహీనునిగా చేయుదురు;
యోసేపు లేడు; షిమ్యోను లేడు. మీరు బెన్యామీ
నును తీసుకొని వెళ్లుదురు; ఇవి అన్నియు నాకు
37 ప్రతికూలముగా ఉన్నవని వారితో చెప్పెను. । అం
దుకు రూబేను — నేను అతని నీ యొద్దికి తీసుకొని
రాని పక్షమందు, నా ఇద్దరి కుమారులను నీవు చంప
వచ్చును. అతని నా చేతికి అప్పగించుము. అతని
తిరిగీ నీ యొద్దికి తెచ్చి అప్పగించెదనని తన తండ్రి
38 తో చెప్పెను. । అయితే అతడు — నా కుమారుడు
మీతో కూడా వెళ్ల కూడదు. ఇతని సహోదరుడు
చనిపోయెను. ఇతడు మాత్రమే మిగిలి ఉన్నాడు.
మీరు వెళ్లే మార్గమున ఇతనికి హాని సంభవించితే,
నెరిసిన వెంట్రుకలు గల నన్ను సమాధిలోకి దుఃఖ
ముతో దిగ చేతురని చెప్పెను.

## 43. అధ్యాయము.

1 అయితే ఆ దేశమందు కరువు భారముగా ఉండె
2 ను గనుక । వారు ఐగుప్తునుంచి తెచ్చిన ధాన్యము
తినివేసిన తరువాత, వారి తండ్రి—మీరు తిరిగీ వెళ్లి,
మనకొరకు కొంచెము ఆహారము కొనండని వారితో
చెప్పెను.

3 అప్పుడు యూదా అతని చూచి — ఆ మనుష్యు
డు — మీ సహోదరుడు మీతోకూడా ఉంటేనే
గాని మీరు నా ముఖము చూడరని దృఢముగా
4 మాతో చెప్పెను. । కాబట్టి మా సహోదరుని మాతో
కూడా పంపుట నీకిష్టమైతే, మేము వెళ్లి, నీ కొరకు
5 ఆహారము కొందుము. । నీవు పంపనొల్లకపోతే, మేము
వెళ్లము; ఆ మనుష్యుడు — మీ సహోదరుడు
మీతో కూడా ఉంటేనే గాని మీరు నా ముఖము
చూడరని మాతో చెప్పెననెను.

6 అందుకు ఇశ్రాయేలు — మీకు ఇంకొక సహో
దరుడు కలడని మీరు ఆ మనుష్యునితో చెప్పి నా
కింత హాని ఎందుకు కలుగ చేసితిరని పలుకగా ।
7 వారు — ఆ మనుష్యుడు— మీ తండ్రి ఇంకా సజీవుడై
ఉన్నాడా! మీకు సహోదరుడు ఉన్నాడా! అని
మమ్మును గురించియు, మా బంధువులను గురించియు
ఖండితముగా అడిగినప్పుడు, మేము ఆ ప్రశ్నల
చొప్పున అతనికి వాస్తవము తెలియచేసితిమి. అత
డు—మీ సహోదరుని తీసుకొని రండని చెప్పునని
మాకు ఏలాగున తెలిసియుండునని పలికిరి.

మరియు యూదా తన తండ్రియైన ఇశ్రాయేలు 8
తో — ఆ చిన్నవాని నాతో పంపుము. మమ్ము లేచి
వెళ్లనిమ్ము. అప్పుడు మేమే కాదు నీవు, మా పిల్లలును
చావక బ్రతుకుదుము; । నేను అతని గూర్చి పూట 9
పడుదును. నీవు అతని గూర్చి నన్ను అడుగ వలెను.
నేను అతని తిరిగీ నీ యొద్దికి తీసుకొని వచ్చి, నీ
ఎదుట నిలువబెట్టకపోతే, నేను నీ ఎడల చేసిన ఆ
పాపము ఎల్లప్పుడును మోయుచుందును. । మాకు తడవు 10
కాకపోతే, ఈపాటికి రెండవ మారు తిరిగి వచ్చి
ఉందుమని చెప్పెను.

అంతట వారి తండ్రియైన ఇశ్రాయేలు—అలాగైతే 11
మీరు దీని చేయండి; ఈ దేశమందు శ్లాఘ్యములైనవి
అనగా కొంచెము మస్తకీ, కొంచెము తేనె, సుగంధ
నిర్యాసము, బోళము, పిస్తాచ కాయలు, బాదామి
కాయలు మీ గోనెలలో వేసుకొని ఆ మనుష్యునికి
కానుకగా తీసుకొని వెళ్లండి. । రెట్టింపు రూకలు 12
మీరు తీసుకొని, మీ గోనెల మూతిలో ఉంచబడి
తిరిగీ వచ్చిన రూకలు కూడా చేత పట్టుకొని మళ్లీ
ఇచ్చివేయండి; అది పొరబాటు కాబోలును; । మీ 13
సహోదరుని తీసుకొని, లేచి ఆ మనుష్యుని యొద్దికి
తిరిగీ వెళ్లండి. । ఆ మనుష్యుడు మీ ఇతర సహోద 14
రుని, బెన్యామీనును మీకు అప్పగించేటట్టు సర్వశ
క్తుడైన దేవుడు అతని ఎదుట మిమ్మును కరుణించును
గాక. నేను పుత్రహీనుడనైతే పుత్రహీనుడనవుదు
నని వారితో పలికెను.

ఆ మనుష్యులు ఆ కానుక తీసుకొని, తమ చేతు 15
లలో రెట్టింపు రూకలను, వెంట బెన్యామీనును
తీసుకొని లేచి ఐగుప్తుకు వెళ్లి, యోసేపు ఎదుట నిలి
చిరి. । యోసేపు వారితో ఉన్న బెన్యామీనును చూచి, 16
తన ఇంటి విచారణకర్తతో—ఈ మనుష్యులను ఇంటికి
తీసుకొని వెళ్లి, ఒక వేట కోసి సిద్ధము చేయుము.
మధ్యాహ్నమందు ఈ మనుష్యులు నాతో కూడా
భోజనము చేతురని చెప్పెను. । యోసేపు చెప్పిన 17
ప్రకారము అతడు చేసి, ఆ మనుష్యులను యోసేపు
ఇంటికి తీసుకొని వెళ్లెను. । అయితే ఆ మనుష్యులు 18
యోసేపు ఇంటికి తేబడినందున, వారు భయపడి—

మొదట మన గోనెలలో తిరిగీ వేయబడిన రూకల
నిమిత్తము అతడు మన మీదికి దొర్లి వచ్చి, మన మీద
పడి, మనము దాసులమవుటకు మనలను, మన గాడి
దెలను పట్టేలాగున లోపటికి తేబడితిమని అనుకొనిరి.

19 వారు యోసేపు ఇంటి విచారణకర్త యొద్దికి వచ్చి
20 ఇంటి ద్వారమున అతనితో మాట్లాడి।–ఓ ప్రభువా!
ఒక మనవి; మొదట మేము ఆహారము కొనుటకే
21 వచ్చితిమి.। అయితే దిగే చోటికి మేము చేరి, మా
గోనెలు విప్పినప్పుడు, ఇదుగో! మా మా రూకల తూ
నికెకు సరిగా ఎవని రూకలు వాని వాని గోనె మూ
తిలో ఉండెను. అవి తిరిగీ చేత పట్టుకొని వచ్చి
22 తిమి.। ఆహారము కొనుటకు వేరే రూకలను తీసు
కొని వచ్చితిమి; మా రూకలు మా గోనెలలో ఎవడు
23 వేసెనో అది మాకు తెలియదని పలికిరి.। అందుకు
అతడు — మీకు క్షేమమవుగాక; భయపడకండి; మీ
పితృల దేవుడైన మీ దేవుడు మీకు మీ గోనెలలో
ధనమిచ్చెను. మీ రూకలు నాకు అందినవని చెప్పి,
షిమ్యోనును వారి యొద్దికి తీసుకొని వచ్చెను.

24,25 ఆ మనుష్యుడు వారిని యోసేపు ఇంటికి తీసు
కొని వచ్చి వారికి నీళ్లు ఇచ్చెను; వారు తమ కాళ్లు
కడుగుకొనిరి. మరియు అతడు వారి గాడిదెలకు మేత
వేయించెను. అక్కడ తాము భోజనము చేయ వలె
నని వినిరి గనుక, మధ్యాహ్నమందు యోసేపు వచ్చే
వేళకు తమ కానుక సిద్ధము చేసిరి.

26 యోసేపు తన ఇంటికి వచ్చినప్పుడు, వారు తమ చేతు
లలో ఉన్న కానుక ఇంట్లోకి తెచ్చి అతనికిచ్చి, అత
27 నికి నేల సాగిలపడిరి.। అప్పుడు అతడు — మీరు చె
ప్పిన ముసలివాడగు మీ తండ్రి క్షేమముగా ఉన్నా
డా? అతడు ఇంకా సజీవుడై ఉన్నాడా? అని వారి
28 క్షేమ సమాచారమును అడిగినందుకు వారు।— నీ దా
సుడైన మా తండ్రి ఇంకా సజీవుడై క్షేమముగా
ఉన్నాడని చెప్పి వంగి సాగిలపడిరి.

29 అప్పుడు అతడు తన కన్నులెత్తి, తన తల్లి కుమా
రుడు, తన సహోదరుడునైన బెన్యామీనును చూ
చి–మీరు నాతో చెప్పిన మీ తమ్ముడు ఇతడేనా అని
అడిగి — నా కుమారుడా! దేవుడు నీ యందు దయ
30 ఉంచును గాక అని పలికెను.। అప్పుడు తన సహో
దరుని ఎడల యోసేపు కరుణారసము ఉప్పొంగెను
గనుక అతడు త్వరపడి ఏడ్చుటకు చోటు వెతికి,
31 లోపలి గదిలోకి వెళ్లి, అక్కడ ఏడ్చెను.। అప్పుడు
అతడు ముఖము కడుగుకొని వెలపలికి వచ్చి, తన్ను
తాను అణుచుకొని ఆహారము వడ్డించండని చెప్పెను.

అప్పుడు అతనికి, వారికి, అతనితో భోజనము 32
చేయుచున్న ఐగుప్తీయులకును వేరు వేరుగా వడ్డించిరి.
ఐగుప్తీయులు ఇబ్రీయులతో భోజనము చేయరు;
అది ఐగుప్తీయులకు హేయమే.। వారు అతని ఎదుట 33
జ్యేష్ఠుడు మొదలుకొని కనిష్ఠుని పర్యంతము, తమ తమ
ఈడు చొప్పున కూర్చుండిరి గనుక, ఆ మనుష్యులు
ఒకని వైపు ఒకడు చూచి ఆశ్చర్యపడిరి.। మరియు 34
అతడు తన ఎదుటనుంచి వారికి వంతులెత్తి పంపెను.
అయితే బెన్యామీను వంతు వారందరి వంతులకంటే
ఐదంతల గొప్పదై ఉండెను. వారు పానము చేసిరి;
అతనితో కూడా తాగి సంభ్రమపడిరి.

## 44. అధ్యాయము.

తరువాత అతడు—ఆ మనుష్యుల గోనెలను అవి 1
పట్టినంత ఆహారపదార్థములతో నింపి, ఎవని రూ
కలు వాని గోనె మూతిలో పెట్టుమనియు,। కనిష్ఠుని 2
గోనె మూతిలో వెండిదైన నా గిన్నెను, అతని
ధాన్యపు రూకలను పెట్టుమనియు తన ఇంటి విచా
రణకర్తకు ఆజ్ఞాపించెను. యోసేపు చెప్పిన మాట
చొప్పున అతడు చేసెను.

తెల్లవారినప్పుడు ఆ మనుష్యులు వారి గాడిదెలతో 3
కూడా పంపివేయబడిరి.। వారు ఆ పట్టణములోనుంచి 4
బైలుదేరి దూరముగా వెళ్లక మునుపు, యోసేపు తన
ఇంటి విచారణకర్తతో — నీవు లేచి ఆ మనుష్యులను
తరిమి వారిని కలుసుకొని—మీరు ఎందుచేత మేలుకు
కీడు చేసితిరి?। దేనితో నా ప్రభువు పానము చేసునో, 5
దేనివల్ల అతడు దివ్యజ్ఞానము పొందునో, అది ఇదే
కదా? మీరు దీని చేయుటవల్ల, కానిపని చేసితిరని
వారితో పలుకుమని చెప్పెను.

అతడు వారిని కలుసుకొని, ఆ మాటలు వారితో 6
చెప్పినప్పుడు। వారు—మా ప్రభువు ఎందుకు ఈలాగు 7
మాట్లాడుచున్నాడు? ఆ మాట చొప్పున చేయుట నీ
దాసులకు దూరమవుగాక.। ఇదుగో! మా గోనెల మూ 8
తులలో మాకు దొరికిన రూకలు కనాను దేశములో
నుంచి తిరిగీ తీసుకొని వచ్చితిమి. నీ ప్రభువు ఇంటిలో
నుంచి మేము వెండియైనా బంగారమైనా ఏలాగు
దొంగిలుదుము?। నీ దాసులలో అది ఎవని యొద్ద 9
దొరుకునో వాడు చచ్చునుగాక; మేమును మా
ప్రభువుకు దాసులమై ఉందుమని అతనితో పలికిరి.

అందుకు అతడు—మంచిది; మీ మాటల చొప్పున 10
కానివ్వండి; అయితే ఎవని యొద్ద అది దొరుకునో
అతడే నాకు దాసుడై ఉండును; మీరు నిర్దోషులై
ఉందురని చెప్పెను.। అప్పుడు వారు త్వరపడి ప్రతి 11

వాడు తన తన గోనె నేలకు దించి, తన తన గోనె విప్పె
12 ను.। అప్పుడు అతడు, పెద్దవాని మొదలుకొని చిన్న
వాని పర్యంతము వారిని శోధించెను. ఆ గిన్నె బెన్యా
13 మీను గోనెలో దొరికెను.। కాబట్టి వారు తమ బట్టలు
చించుకొని, ప్రతివాడు తన తన గాడిదె మీద గోనెలు
14 ఎక్కించి, తిరిగీ పట్టణమునకు వచ్చిరి.। అప్పుడు
యూదా, అతని సహోదరులును యోసేపు ఇంటికి
వచ్చిరి. అతడు ఇంకా అక్కడ ఉండెను గనుక వారు
15 అతని ఎదుట నేల మీద పడిరి.। అప్పుడు యోసేపు—
మీరు చేసిన ఈ పని ఏమిటి? నా వంటి మనుష్యుడు
దివ్యజ్ఞానమువల్ల తెలుసుకొనునని మీకు తెలియదా
అని వారితో పలికెను.

16 అప్పుడు యూదా—ఏలినవానితో ఏమి చెప్ప
గలము; ఏమి పలుకుదుము; మా నీతి ఏలాగు అగుపరచ
గలము! దేవుడు నీ దాసుల నేరము కనుగొనెను.
ఇదుగో! మేము, ఎవని యొద్ద ఆ గిన్నె దొరికెనో
వాడును ఏలినవానికి దాసులమై ఉన్నామని పలికెను.।
17 అయితే అతడు—ఆలాగు చేయుట నాకు దూరమ
వుగాక. ఎవని చేతిలో ఆ గిన్నె దొరికెనో, వాడే
నాకు దాసుడై ఉండ వలెను. మీరు మీ తండ్రి యొ
ద్దికి సమాధానముగా వెళ్లండని చెప్పెను.

18 అప్పుడు యూదా అతని సమీపించి—ఏలినవాడా!
ఒక మనవి! ఒక మాట ఏలినవానితో నీ దాసుని పలుక
నిమ్ము; నీ కోపము నీ దాసుని మీద రవులుకొన చేయ
19 కుము; నీవు ఫరో వలెనే ఉన్నావుగదా.। ఏలినవాడు—
మీకు తండ్రియైనా సహోదరుడైనా ఉన్నాడా?
20 అని తన దాసులను అడిగెను.। అందుకు మేము—మాకు
ముసలివాడైన తండ్రియు, అతని ముసలితనమున
పుట్టిన ఒక చిన్నవాడును ఉన్నారు; వాని సహోద
రుడు చనిపోయెను. వాని తల్లికి వాడొక్కడే మిగిలి
ఉన్నాడు. వాని తండ్రి వాని ప్రేమించుచున్నాడని
21 చెప్పితిమి.। అప్పుడు నీవు—నేను అతని చూచుటకు
అతని నా యొద్దికి తీసుకొని రండని నీ దాసులతో
22 చెప్పితివి.। అందుకు మేము — ఆ చిన్నవాడు తన
తండ్రిని విడువ లేడు. అతడు తన తండ్రిని విడిచితే,
23 తండ్రి చనిపోవునని ఏలినవానితో చెప్పితిమి.। అయితే
నీవు—మీ తమ్ముడు మీతో కూడా రాకపోతే మీరు
మళ్లీ నా ముఖము చూడరని నీ దాసులతో చెప్పితివి.।
24 కాబట్టి నా తండ్రియైన నీ దాసుని యొద్దికి మేము వెళ్లి,
ఏలినవాని మాటలు అతనికి తెలియ చేసితిమి.।
25 మా తండ్రి—మీరు తిరిగీ వెళ్లి మన కొరకు కొంచెము
26 ఆహారము కొనుకొని రండని చెప్పినప్పుడు,। మేము—
అక్కడికి వెళ్ల లేము; మా తమ్ముడు మాతో కూడా
ఉంటే వెళ్లుదుము; మా తమ్ముడు మాతో కూడా ఉంటే
నే గాని, ఆ మనుష్యుని ముఖము చూడ లేమని చెప్పి
తిమి.। అందుకు నీ దాసుడైన నా తండ్రి— నా భార్య 27
నాకు ఇద్దరిని కనెనని మీరు ఎరుగుదురు.। వారిలో 28
ఒకడు నా యొద్దనుంచి బైలు వెళ్లెను. అతడు నిశ్చ
యముగా చీల్చబడెనని అనుకొంటిని. అప్పటినుంచి
అతడు నాకు అగుపడలేదు.। మీరు నా యెదుటనుంచి 29
ఇతని తీసుకొని వెళ్లిన తరువాత, ఇతనికి హాని సంభ
వించితే నెరిసిన వెంట్రుకలు గల నన్ను సమాధిలోకి
దుఃఖముతో దిగ చేతురని మాతో చెప్పెను.। కాబట్టి 30
నీ దాసుడైన నా తండ్రి యొద్దికి నేను వెళ్లినప్పుడు,
ఈ చిన్నవాడు మా యొద్ద లేనిపక్షమందు,। అతని 31
ప్రాణము ఇతని ప్రాణముతో కట్టబడి ఉన్నందున,
ఈ చిన్నవాడు మా యొద్ద లేకపోవుట అతడు చూడ
గానే చనిపోవును. ఆలాగున నీ దాసులమైన మేము,
నెరిసిన వెంట్రుకలు గల నీ దాసుడైన మా తండ్రిని
సమాధిలోకి దుఃఖముతో దిగ చేతుము.। నీ దాసుడ 32
నైన నేను ఈ చిన్నవాని గురించి నా తండ్రికి పూ
టపడి—నీ యొద్దికి నేను అతని తీసుకొని రాని పక్ష
మందు, నేను నా తండ్రి ఎడల చేసిన ఆ పాపము
ఎల్లప్పుడు మోయుచుందునని పలికితిని.। కాబట్టి నీ 33
దాసుడనైన నన్ను ఈ చిన్నవానికి ప్రతిగా, ఏలిన
వానికి దాసునిగా ఉండనిచ్చి, ఈ చిన్నవాని తన
సహోదరులతో వెళ్లనిమ్ము.। ఈ చిన్నవాడు నాతో 34
కూడా ఉండకపోతే, నా తండ్రి యొద్దికి నేను ఏలాగు
వెళ్లగలను? వెళ్లితే నా తండ్రికి రాబోయే కీడు చూచె
దనేమో అని పలికెను.

## 45. అధ్యాయము.

అప్పుడు యోసేపు తన యొద్ద నిలిచిన వారందరి 1
ఎదుట తన్ను తాను అణుచుకొన చాలక—నా యొద్ద
నుంచి ప్రతి మనుష్యుని వెలపటికి పంపివేయుడని
కేకెత్తి పలికెను. యోసేపు తన సహోదరులకు
తన్ను తాను తెలియ చేసుకొనినప్పుడు, ఎవడును
అతని యొద్ద నిలిచి ఉండలేదు.। అతడు ఎలుగెత్తి 2
ఏడ్చెను. ఐగుప్తీయులును ఫరో ఇంటివారును వినిరి.।
అప్పుడు యోసేపు — నేను యోసేపును; నా తండ్రి 3
ఇంకా సజీవుడై ఉన్నాడా? అని పలికినప్పుడు, అతని
సహోదరులు అతని సమ్ముఖమందు తొందరపడి,
అతనికి ప్రత్యుత్తరమివ్వ లేకపోయిరి.

అంతట యోసేపు — నా దగ్గరకు రండని తన 4
సహోదరులతో చెప్పినప్పుడు, వారు అతని దగ్గ
రకు వచ్చిరి. అప్పుడు అతడు — ఐగుప్తుకు వెళ్లుటకు
మీరు అమ్మివేసిన మీ సహోదరుడగు యోసేపును

5 నేనే.। అయితే మీరు ఇక్కడికి వచ్చుటకు నన్ను
అమ్మివేసినందున దుఃఖపడకండి; అది మీకు సంతాపము
పుట్టించనివ్వకండి; జీవ రక్షణ కొరకు దేవుడు మీకు
6 ముందుగా నన్ను పంపెను.। రెండు సంవత్సరముల
నుంచి కరువు భూమి మీదనున్నది. సేద్యమైనా కోత
యైనా లేని సంవత్సరములు ఇకను ఐదు వచ్చును.
భూమి మీద మిమ్మును శేషముగా నిలువబెట్టుటకును,।
7 గొప్ప విడుదలవల్ల* మిమ్మును ప్రాణముతో కాపాడు
టకును, దేవుడు మీకు ముందుగా నన్ను పంపించెను.।
8 కాబట్టి దేవుడేగాని మీరు నన్ను ఇక్కడికి పంప
లేదు. ఆయన నన్ను ఫరోకు తండ్రిగాను, అతని ఇంటి
వారికందరికి ప్రభువుగాను, ఐగుప్తు దేశమంతటి మీద
9 ఏలికెగాను నియమించెను.। మీరు త్వరపడి నా తండ్రి
యొద్దికి వెళ్లి అతనితో — నీ కుమారుడైన యోసేపు—
దేవుడు నన్ను ఐగుప్తు దేశమంతటికి ప్రభువుగా
నియమించెను; నా యొద్దికి రమ్ము; అక్కడ ఉండ
10 వద్దు;। నీవు గోషెను దేశమందు నివసించెదవు;
అప్పుడు నీవు, నీ పిల్లలు, నీ పిల్లల పిల్లలును, నీ మం
దలు, నీ గొడ్లు, నీకు కలిగినది యావత్తును నాకు
11 సమీపముగా ఉండ వలెను.। ఇకను ఐదు కరువు సం
వత్సరములు వచ్చును గనుక, నీకు, నీ ఇంటివారికి,
నీకు కలిగినవంతటికిని పేదరికము రాకుండా, అక్కడ
12 నిన్ను పోషించెదనన్నాడని చెప్పండి.। ఇదుగో! మీ
తో మాట్లాడుచున్నది నా నోరే అని మీ కన్నులు,
నా సహోదరుడైన బెన్యామీను కన్నులును చూచు
13 చున్నవి.। ఐగుప్తులో నాకు కలిగిన సమస్త ఘనతను,
మీరు చూచినది యావత్తును నా తండ్రికి తెలియ
చేసి, త్వరపడి నా తండ్రిని ఇక్కడికి తీసుకొని రం
డని, తన సహోదరులతో చెప్పి, తన సహోదరు
డైన బెన్యామీను మెడ మీద పడి ఏడ్చెను. బెన్యా
14 మీనును అతని మెడమీద పడి ఏడ్చెను.। అతడు తన
సహోదరులందరిని ముద్దుబెట్టుకొని, వారి మీద పడి
15 ఏడ్చిన తరువాత। అతని సహోదరులు అతనితో
మాట్లాడిరి.

16 యోసేపుయొక్క సహోదరులు వచ్చిన వర్త
మానము ఫరో ఇంట్లో వినబడెను. అది ఫరోకు,
17 అతని సేవకులకును ఇష్టముగా ఉండెను.। అప్పుడు
ఫరో యోసేపును చూచి—నీవు నీ సహోదరులతో—
మీరు దీని చేయండి; మీ పశువుల మీద బరువులు
18 వేసి, కనాను దేశమునకు వెళ్లి,। మీ తండ్రిని, మీ
ఇంటివారిని వెంటబెట్టుకొని, నా యొద్దికి రండి;
ఐగుప్తు దేశమందలి మంచి వస్తువులను మీకు ఇచ్చె
దను; ఈ దేశముయొక్క సారము మీరు అనుభవిం
చెదరు.। నీకు ఆజ్ఞ ఇవ్వడమైనది గదా! దీని చేయండి; 19
మీ పిల్లల కొరకు, మీ భార్యల కొరకును ఐగుప్తులో
నుంచి బండ్లు తీసుకొని వెళ్లి, మీ తండ్రిని వెంటబె
ట్టుకొని రండి.। ఐగుప్తు దేశమంతటిలో ఉన్న మంచి 20
వస్తువులు మీకు కలుగును గనుక మీ సామగ్రి లక్ష్య
పెట్టకండని చెప్పుటకు సెలవిచ్చెను.

ఇశ్రాయేలుయొక్క కుమారులు ఆలాగు చేసిరి. 21
యోసేపు ఫరో నోటి మాట చొప్పున, వారికి బండ్లు
ఇప్పించెను. మార్గమునకు ఆహారమును ఇప్పించెను.।
వారిలో ప్రతివానికిని ఒక్కొక దుస్తు బట్టలు ఇచ్చె 22
ను; అయితే బెన్యామీనుకు మున్నూరు వెండి రూ
కలు, ఐదు దుస్తుల బట్టలును ఇచ్చెను.। అతడు తన 23
తండ్రి నిమిత్తము ఐగుప్తులోనున్న మంచి వస్తువులను
మోయుచున్న పది గాడిదెలను, మార్గమునకు తన
తండ్రి నిమిత్తము తినుబండములైన ధాన్యమును, ఆహా
రమును మోయుచున్న పది ఆడుగాడిదెలను పంపె
ను.। అప్పుడు అతడు తన సహోదరులను సాగనం 24
పెను వారు వెళ్లేటప్పుడు—మార్గమందు కలహపడ
కండని అతడు వారితో చెప్పెను.

వారు ఐగుప్తునుంచి బైలువెళ్లి, కనాను దేశమునకు 25
తమ తండ్రియైన యాకోబు యొద్దికి వచ్చి।—యోసేపు 26
ఇంకా సజీవుడై ఉన్నాడనియు, ఐగుప్తు దేశమంత
టిని ఏలుచున్నాడనియు, అతనికి తెలియచేసిరి. అయి
తే అతడు వారి మాట నమ్మలేదు గనుక నిర్లక్ష్యముగా
ఉండెను.। అప్పుడు వారు యోసేపు తమతో పలికిన 27
మాటలన్నియు అతనితో చెప్పిరి. అతడు తన్ను ఎక్కిం
చుకొని వెళ్లుటకు యోసేపు పంపిన బండ్లను చూచిన
ప్పుడు, వారి తండ్రియైన యాకోబు ఆత్మ బ్రతికెను.।
అప్పుడు ఇశ్రాయేలు — చాలును; నా కుమారుడైన 28
యోసేపు ఇంకా సజీవుడై ఉన్నాడు; నేను చావక
మునుపు వెళ్లి అతని చూచెదనని పలికెను.

## 46. అధ్యాయము.

అప్పుడు ఇశ్రాయేలు తనకు కలిగిన దంతటితో 1
ప్రయాణమై బెయేర్షెబాకు వచ్చి, తన తండ్రియైన
ఇస్సాకుయొక్క దేవునికి యాగపశువులు వధించెను.।
అప్పుడు రాత్రి దర్శనముల యందు దేవుడు ఇశ్రా 2
యేలును—యాకోబూ! యాకోబూ! అని పిలిచెను.
అందుకు అతడు—ఉన్నాననెను.। అప్పుడు ఆయన— 3
నేను సర్వ శక్తుడను; నీ తండ్రి దేవుడను; ఐగుప్తుకు

*లేక, నిమిత్తము.

వెళ్లుటకు భయపడకుము; అక్కడ నిన్ను గొప్ప రాష్ట్ర
4 ముగా చేసెదను. । నేను ఐగుప్తుకు నీతో వచ్చెదను.
అంతేకాదు, నేను నిశ్చయముగా నిన్ను తిరిగీ రప్పిం
చెదను. యోసేపు నీ కన్నుల మీద తన చెయ్యి
ఉంచుననని పలికెను.

5 అంతట యాకోబు లేచి, బెయేర్షెబానుంచి
వెళ్లెను. ఇశ్రాయేలు కుమారులు తమ తండ్రియైన
యాకోబును, తమ పిల్లలను, తమ భార్యలను, పరో
అతని ఎక్కించుటకు పంపిన బండ్ల మీద ఎక్కించిరి. ।
6 తమ పశువులను, తాము కనానులో సంపాదించిన
తమ సంపద యావత్తును తీసుకొని, యాకోబు, అతని
7 సంతానమును ఐగుప్తుకు వచ్చిరి. । అతడు తన కుమారు
లను, తన కుమారుల కుమారులను, తన కుమార్తెలను,
తన కుమారుల కుమార్తెలను, తన సంతానమంతయు
ఐగుప్తుకు తనతో కూడా తీసుకొని వచ్చెను.

8 ఐగుప్తుకు వచ్చిన ఇశ్రాయేలు కుమారుల పేళ్లు ఇవే;
యాకోబు.
అతని కుమారులు.

9 యాకోబు ప్రథమ కుమారుడు రూబేను. । రూ
బేను కుమారులైన హనోకు, పల్లు, హెస్రోను, కర్మీ.

10 షిమ్యోను కుమారులైన యమూయేలు, యామీను,
యోహదు, యాకీను, సోహరు, కనానీయురాలి కుమా
రుడైన షావూలు.

11 లేవీ కుమారులైన గేర్షోను, కహాతు, మరారీ.

12 యూదా కుమారులైన ఏరు, ఓనాను, షేలా,
పెరెసు, జారహు. ఆ ఏరును, ఓనానును కనాను దేశ
మందు చనిపోయిరి. పెరెసు కుమారులైన హెస్రోను,
హామూలు.

13 ఇశ్శాఖారు కుమారులైన తోలా, పువ్వా, యోబు,
షిమ్రోను.

14 జెబులూను కుమారులైన సెరెదు, ఏలోను, యహ్లె
15 యేలు. । వీరు లేయా కుమారులు. ఆమె పద్దనరాములో
యాకోబుకు వారిని, అతని కుమార్తెయైన దీనాను
కనెను. అతని కుమారులు, అతని కుమార్తెలునైన
వారందరును ముప్పదిముగ్గురు.

16 గాదు కుమారులైన సిఫ్యోను, హగ్గీ, షూనీ,
ఎస్బోను, ఏరీ, అరోదీ, అరేలీ.

17 ఆషేరు కుమారులైన ఇమ్నా, ఇష్వా, ఇష్వీ, బరీ
యా; వారి సహోదరియైన శెరహు. ఆ బరీయా
18 కుమారులైన హెబెరు, మల్కీయేలు. । లాబాను తన
కుమార్తెయైన లేయాకు ఇచ్చిన జిల్పా కుమారులు
వీరే. ఆమె ఈ పదహారుమందిని యాకోబుకు కనెను.

యాకోబు భార్యయగు రాహేలు కుమారులైన 19
యోసేపు, బెన్యామీను. । ఐగుప్తు దేశమందు యోసే 20
పుకు పుట్టిన మనష్షే, ఎఫ్రాయిము. ఓనుయొక్క
యాజకుడగు పోతీపెర కుమార్తెయైన ఆసనతు
వారిని అతనికి కనెను.

బెన్యామీను కుమారులైన బెలా, బెకరు, అష్బేలు, 21
గెరా, నయమాను, ఏహీ, రోషు, ముప్పీము, హుప్పీము,
ఆర్దు. । యాకోబుకు రాహేలు కనిన కుమారులగు 22
వీరందరు పదునలుగురు.

దాను కుమారుడైన హుషీము. 23

నఫ్తాలీ కుమారులైన యహసయేలు, గూనీ, యేసెరు, 24
షిల్లేము. । లాబాను తన కుమార్తెయైన రాహేలుకు 25
ఇచ్చిన బిల్హా కుమారులు వీరే. ఆమె వారిని యాకో
బుకు కనెను. వారందరు ఏడుగురు.

యాకోబు కుమారుల భార్యలను వినాయించి, 26
అతని నడుమునుంచి పుట్టి, యాకోబుతో ఐగుప్తుకు
వచ్చిన వారందరు అరువది ఆరుగురు. । ఐగుప్తులో 27
అతనికి పుట్టిన యోసేపు కుమారులు ఇద్దరు. ఐగుప్తుకు
వచ్చిన యాకోబు ఇంటివారందరు డెబ్బదిమంది.

అతడు తనకు ముందర గోషెనుకు దోవ చూపు 28
టకు, యోసేపు యొద్దికి తనకు ముందుగా యూదాను
పంపెను. వారు గోషెను దేశమునకు చేరిరి. । యోసేపు 29
తన రథము సిద్ధము చేయించి, తన తండ్రియైన ఇశ్రాయే
లును ఎదుర్కొనుటకు గోషెనుకు వెళ్లి అతనికి అగుప
డెను. అప్పుడు అతడు అతని మెడమీద పడి అతని
మెడ మీదనే విడువక ఏడ్చెను. । అప్పుడు ఇశ్రాయేలు 30
యోసేపుతో — నీవు ఇంకా సజీవుడవై ఉన్నావు;
నీ ముఖము చూచితిని గనుక నేను ఇకను చావ వచ్చు
నని పలికెను.

మరియు, యోసేపు తన సహోదరులను, తన తండ్రి 31
ఇంటివారిని చూచి—నేను వెళ్లి ఇది పరోకు తెలియచే
యుచు — కనాను దేశములో ఉండిన నా సహో
దరులు, నా తండ్రి ఇంటివారును నా యొద్దికి వచ్చిరి. ।
ఆ మనుష్యులు పశువులు గలవారై యుండిరి గనుక 32
వారు మందల కాపరులు. వారు తమ గొర్రెలను,
గొడ్లను, తమకు కలిగినదంతయు తీసుకొని వచ్చిరని
అతనితో చెప్పెదను. । మందకాపరియైన ప్రతివాడు 33
ఐగుప్తీయులకు హేయుడు గనుక, పరో మిమ్మును పిలి
పించి మీ వృత్తి ఏమిటని అడిగితే । మీరు, గోషెను 34
దేశమందు కాపురముండే నిమిత్తము,—నీ దాసులమైన
మేము, మా తండ్రులును మా చిన్నతనమునుంచి ఇది
వరకు పశువులు గల మనుష్యులమై ఉన్నామని ప్రత్యు
త్తరమివ్వండి అని చెప్పెను.

## 47. అధ్యాయము.

1 అప్పుడు యోసేపు వెళ్లి ఫరోను చూచి—నా తం
డ్రియు, నా సహోదరులును వారి మందలతోను,
వారి గొడ్లతోను, వారికి కలిగినదంతటితోను కనాను
దేశమునుంచి వచ్చి ఉన్నారు. ఇదుగో! వారు గోషె
నులో ఉన్నారని తెలియచేసెను.
2 మరియు, అతడు తన సహోదరులందరిలో ఐదు
గురిని తీసుకొని వెళ్లి, వారిని ఫరో ఎదుట నిలువ
3 బెట్టెను. । అప్పుడు ఫరో అతని సహోదరులతో—
మీ వృత్తి ఏమిటని అడిగినప్పుడు వారు—నీ దాసుల
మైన మేము, మా తండ్రులును మందల కాపరులమై
4 ఉన్నామని ఫరోతో చెప్పిరి. । మరియు వారు—
కనాను దేశమందు కరువు భారముగా ఉన్నందున,
నీ దాసులకు కలిగి ఉన్న మందలకు మేత లేదు
గనుక ఈ దేశములో కొంత కాలము ఉండుటకు
వచ్చితిమి. కాబట్టి గోషెను దేశములో నీ దాసు
లను నివసించనివ్వండని ఫరోతో పలికిరి.
5 అప్పుడు ఫరో—నీ తండ్రియు, నీ సహోదరు
6 లును నీ యొద్దికి వచ్చి యున్నారు. । ఐగుప్తు దేశము
నీ ఎదుట ఉన్నది. ఈ దేశములోని మంచి భాగ
మందు నీ తండ్రిని, నీ సహోదరులను నివసింపచే
యుము. గోషెను దేశములో వారు నివసించ వచ్చు
ను. వారిలో ప్రజ్ఞగల మనుష్యులు ఉన్నారని నీవు
ఎరిగితే, నా మందల మీద వారిని అధిపతులగా
నియమించుమని యోసేపుతో చెప్పెను.
7 మరియు, యోసేపు తన తండ్రియైన యాకోబును
లోపటికి రప్పించి, ఫరో ఎదుట అతని నిలువబెట్టి
8 నప్పుడు, యాకోబు ఫరోను ఆశీర్వదించెను. । ఫరో—
నీ జీవిత సంవత్సరముల దినములెన్ని? అని యాకో
9 బును అడిగినందుకు । యాకోబు—నా సంచారముల
సంవత్సర దినములు నూట ముప్పది సంవత్సరములు.
నా జీవిత సంవత్సర దినములు కొంచెముగాను, దుఃఖ
కరముగాను ఉన్నవి. అవి నా తండ్రులయొక్క
సంచారముల దినములలో వారి జీవిత సంవత్సర దిన
10 ములన్ని కాలేదని ఫరోతో చెప్పెను. । అప్పుడు యా
కోబు ఫరోను ఆశీర్వదించి, ఫరో ఎదుటనుంచి వెళ్లి
పోయెను.
11 ఫరో ఆజ్ఞాపించిన ప్రకారము యోసేపు తన తం
డ్రిని, తన సహోదరులను ఐగుప్తు దేశములో నివ
సింపచేసి, ఆ దేశములో మంచి భాగమైన రామె
సేసు ప్రదేశములో వారికి స్వాస్థ్యము ఇచ్చెను.।
12 మరియు యోసేపు తన తండ్రిని, తన సహోదరు
లను, తన తండ్రి ఇంటివారినందరిని, వారి వారి పిల్లల
లెక్కచొప్పున వారికి ఆహారమిచ్చి పోషించెను.
కరువు మిక్కిలి భారమై ఉన్నందున, ఆ దేశమం 13
దంతటను ఆహారము లేకపోయెను. కరువువల్ల ఐగుప్తు
దేశము, కనాను దేశమును క్షీణించెను. । వారికి ధా 14
న్యము అమ్ముటవల్ల ఐగుప్తు దేశములోను, కనాను దేశ
ములోను దొరికిన రూకలన్నియు యోసేపు కూర్చెను.
ఆ రూకలన్నియు యోసేపు ఫరో ఇంట్లోకి తెప్పిం
చెను.
ఐగుప్తు దేశమందు, కనాను దేశమందును రూ 15
కలు వ్యయమైన తరువాత, ఐగుప్తీయులందరు యో
సేపు యొద్దికి వచ్చి — మాకు ఆహారము ఇప్పించుము.
నీ సమ్ముఖమందు మేము ఎందుకు చావవలెను? రూ
కలు వ్యయమైనవి గదా అని పలికిరి. । అందుకు యో 16
సేపు—మీ పశువులను ఇవ్వండి; రూకలు వ్యయమై
యుంటే మీ పశువులకు ప్రతిగా నేను మీకు ధా
న్యము ఇచ్చెదనని చెప్పెను. కాబట్టి వారు తమ పశు
వులను యోసేపు యొద్దికి తీసుకొని వచ్చిరి. యోసేపు
గుఱ్ఱములను, గొఱ్ఱెల మందలను, గొడ్ల మందలను,
గాడిదెలను పుచ్చుకొని వారికి ఆహారమిచ్చెను. । ఆ 17
సంవత్సరమందు వారి సమస్తమైన మందలకు ప్రతిగా
అతడు వారికి ఆహారము ఇచ్చి వారిని పోషించెను.
ఆ సంవత్సరము గతించిన తరువాత, రెండవ సంవ 18
త్సరమున వారు అతని యొద్దికి వచ్చి—ఇది ప్రభువుకు
మరుగు చేయము; రూకలు వ్యయమై పోయెను. పశు
వుల మందలును ప్రభువు వశమాయెను. ఇప్పుడు మా
దేహములు, మా పొలములును తప్ప, మరి ఏమియు
ప్రభువు ఎదుట మిగిలి ఉండ లేదు. । నీ కన్నుల 19
ఎదుట మా పొలములు, మేమును నశించుట ఎందుకు?
ఆహారమిచ్చి మమ్మును, మా పొలములను కొనుము.
మా పొలములతో కూడా మేము ఫరోకు దాసుల
మవుదుము. మేము చావక బ్రతికేటట్టు, పొలములు
పాడు గాకుండేటట్టును మాకు విత్తనములిమ్మని పలికిరి.।
ఆలాగు యోసేపు ఐగుప్తు భూములన్నియు ఫరో 20
కొరకు కొనెను. కరువు వారికి భారమైనందున
ఐగుప్తీయులందరు తమ తమ పొలములు అమ్మివేసిరి
గనుక, భూమి ఫరోది ఆయెను. । అతడు ఐగుప్తు 21
పొలిమేరలయొక్క ఈ చివరనుంచి ఆ చివర మట్టు
కును జనులను ఊళ్లలోకి రప్పించెను. । యాజకుల 22
భూమి మాత్రమే అతడు కొనలేదు. యాజకులకు
ఫరోచేత కట్టడ నియమించబడెను. వారికి వచ్చే
కట్టడవల్ల వారికి భోజనము జరిగెను గనుక వారు
తమ భూములు అమ్మలేదు.

23 అప్పుడు యోసేపు—ఇదుగో! నేడు మిమ్మును, మీ
భూములను ఫరోకొరకు కొని ఉన్నాను. ఇదుగో!
24 మీకు విత్తనములు; పొలములలో విత్తండి. । పంటలో
ఐదవ భాగము మీరు ఫరోకు ఇవ్వ వలెను. నాలుగు
భాగములు పొలములలో విత్తుట కొరకును, మీకు,
మీ ఇండ్ల వారికిని ఆహారము కొరకును, మీ పిల్లల
ఆహారము కొరకును మీవై ఉండునని ప్రజలతో
25 చెప్పెను. । అందుకు వారు — నీవు మమ్ము బ్రతికించి
తివి; ప్రభువు దృష్టియందు మమ్ము దయ పొందనిమ్ము;
26 ఫరోకు దాసులమవుదుమని చెప్పిరి. । అప్పుడు ఐదవ
భాగము ఫరోదని నేటివరకు యోసేపు ఐగుప్తు భూ
ములను గురించి కట్టడ నియమించెను. యాజకుల
భూములు మాత్రమే వినాయించబడెను; అవి ఫరోవి
కాలేదు.

27 ఇశ్రాయేలు* ఐగుప్తు దేశమందలి గోషెను ప్రదే
శములో నివసించెను. అందులో వారు ఆస్తి సంపా
దించుకొని, సంతానాభివృద్ధిపొంది, బహుగా విస్త
28 రించిరి. । యాకోబు ఐగుప్తు దేశమందు పదిహేడు సం
వత్సరములు బ్రతికెను. కాబట్టి యాకోబు దినము
లనగా అతని జీవిత సంవత్సరములు నూట నలుబది
ఏడు.

29 ఇశ్రాయేలు చావ వలసిన దినములు సమీపించి
నప్పుడు అతడు తన కుమారుడైన యోసేపును పిలి
పించి— నీ దృష్టియందు నేను దయ పొంది ఉంటే,
అనుగ్రహించి నీ చెయ్యి నా తొడ కింద ఉంచి, నా
ఎడల కృపను, సత్యమును కనపరుచుము. నన్ను ఐగు
30 ప్తులో పాతిపెట్టకుము. । నా పితృలతో నన్ను పండు
కొననిమ్ము. ఐగుప్తులోనుంచి నన్ను తీసుకొని వెళ్లి వారి
సమాధిలో నన్ను పాతిపెట్టుమని అతనితో చెప్పెను.।
31 అందుకు అతడు—నేను నీ మాట చొప్పున చేసెదనని
పలికెను. మరియు అతడు — నాతో ప్రమాణము
చేయుమని పలికినప్పుడు అతడు అతనితో ప్రమా
ణము చేసెను. అప్పుడు ఇశ్రాయేలు తన మంచపు
తలాపి† మీద వంగి ఆరాధించెను.

## 48. అధ్యాయము.

1 ఆ సంగతులైన తరువాత — ఇదుగో! నీ తండ్రి
వ్యాధిగలవాడై ఉన్నాడని ఒకడు యోసేపుతో చె
ప్పెను. అప్పుడు అతడు మనష్షె ఎఫ్రాయిము అనే
తన ఇద్దరు కుమారులను వెంటబెట్టుకొని వెళ్లుచుం
2 డగా । ఇదుగో! నీ కుమారుడైన యోసేపు నీ యొద్దికి
వచ్చుచున్నాడని యాకోబుకు తెలుపబడెను గనుక,
ఇశ్రాయేలు బలము తెచ్చుకొని తన మంచము మీద
కూర్చుండెను.

అప్పుడు యాకోబు—కనాను దేశమందలి లూజు 3
లో సర్వశక్తిగల దేవుడు నాకు అగుపడి, నన్ను ఆశీ
ర్వదించి । — ఇదుగో! నిన్ను సంతానాభివృద్ధి పొం 4
దించి, నిన్ను విస్తరింపచేసి, నిన్ను జనముల సంఘ
ముగా నియమించి, నీ తరువాత నీ సంతానమునకు
ఈ దేశము నిత్యస్వాస్థ్యముగా ఇచ్చితినని చెప్పెను.।
ఇదుగో! నేను ఐగుప్తుకు నీ యొద్దికి రాక మునుపు 5
ఐగుప్తు దేశములో నీకు పుట్టిన నీ ఇద్దరు కుమారులు
నావారే; రూబేను షిమ్యోను అనే వారి వలె ఎఫ్రా
యిము మనష్షె నావారై ఉందురు. । అయితే వారి 6
తరువాత నీవు కనిన నీ సంతానము నీదై ఉండును.
వారు తమ సహోదరుల స్వాతంత్ర్య భాగములో
వారి పేళ్ల చొప్పున పిలువబడుదురు. । పద్దనరాము 7
నుంచి నేను వచ్చుచున్నప్పుడు, ఎఫ్రాతాకు వెళ్లు
టకు ఇంకా కొంత దూరము ఉండగా, మార్గమున
రాహేలు కనాను దేశమందు నా యొద్ద మృతిపొం
దెను. అక్కడ బేత్లెహేమనే ఎఫ్రాతా మార్గమున
నేను ఆమెను పాతిపెట్టితినని యోసేపుతో చెప్పెను.

ఇశ్రాయేలు యోసేపుయొక్క కుమారులను చూచి— 8
వీరు ఎవరు అని అడిగినప్పుడు, । యోసేపు—వీరు నా 9
కుమారులు; వీరిని ఈ దేశమందు దేవుడు నాకు ఇచ్చె
నని తన తండ్రితో చెప్పెను. అందుకు అతడు—
నేను వారిని ఆశీర్వదించుటకు, నా దగ్గరకు వారిని
తీసుకొని రమ్మని చెప్పెను.। ఇశ్రాయేలు కన్నులు ము 10
సలితనమువల్ల మందముగా ఉండెను. అతడు చూడ
లేక పోయెను. అయితే అతడు వారిని అతని దగ్గ
రకు తీసుకొని వచ్చినప్పుడు, అతడు వారిని ముద్దు
బెట్టుకొని, కౌగిలించుకొనెను. । ఇశ్రాయేలు — నేను 11
నీ ముఖము చూతునని అనుకొనలేదు; అయితే నీ
సంతానము కూడా దేవుడు నాకు అగుపరిచి ఉన్నా
డని యోసేపుతో చెప్పెను.

అప్పుడు యోసేపు అతని మోకాళ్ల మధ్యనుంచి 12
వారిని తీసుకొని అతని ఎదుట నేల సాగిలపడెను.।
తరువాత యోసేపు ఇశ్రాయేలు ఎడమ చేతి తట్టున 13
తన కుడి చేత ఎఫ్రాయిమును, ఇశ్రాయేలు కుడిచేతి
తట్టున తన ఎడమ చేత మనష్షెను పట్టుకొని, వారిద్ద
రిని అతని దగ్గరకు రాజేసెను. । అయితే మనష్షె పెద్ద 14
వాడైనందున ఇశ్రాయేలు తన చేతులు యుక్తిగా చాచి,

*లేక, ఇశ్రాయేలు పుత్రులు. †లేక, చేతి కర్ర.

చిన్నవాడైన ఎఫ్రాయిము తల మీద తన కుడి చేతిని,
15 మనష్షే తల మీద తన ఎడమ చేతిని ఉంచెను. । అత
డు యోసేపును ఆశీర్వదించి—నా తండ్రులైన అబ్రా
హాము, ఇస్సాకు ఎవని ఎదుట నడుచుచుండిరో, ఆ
దేవుడు, నేను పుట్టినది మొదలుకొని నేటివరకును
16 ఎవడు నన్ను పోషించెనో ఆ దేవుడు, । సమస్తమైన
కీడులలోనుంచి నన్ను విమోచించే దూతయునైన
ఆయన ఈ చిన్నవారిని ఆశీర్వదించును గాక; నా
పేరు, అబ్రాహాము ఇస్సాకనే నా తండ్రుల పేరును
వారికి పెట్టబడును గాక. భూమి యందు వారు
బహుగా విస్తరింతురు గాక అని చెప్పెను.

17 యోసేపు ఎఫ్రాయిము తల మీద తన తండ్రి
కుడి చెయ్యి ఉంచుట చూచినప్పుడు, అది అతనికి
ఇష్టము కాకపోయెను గనుక, అతడు మనష్షే తల
మీద ఉంచుటకు తన తండ్రి చెయ్యి ఎఫ్రాయిము
18 తల మీదనుంచి ఎత్తి।—నా తండ్రీ! ఆలాగు కాదు;
ఇతడే పెద్దవాడు; నీ కుడి చెయ్యి ఇతని తల మీద
19 ఉంచుమని చెప్పెను.। అయితే అతని తండ్రి ఒప్పక—
అది నాకు తెలుసును; నా కుమారుడా! అది నాకు
తెలుసును. ఇతడు కూడా ఒక జనసంఘమై ఉండి
గొప్పవాడవును. అయినప్పటికి, ఇతని తమ్ముడు ఇతని
కంటే గొప్పవాడవును. అతని సంతానము రాష్ట్ర
20 ముల బాహుళ్యమై ఉండునని చెప్పెను.। ఆ దినమందు
అతడు వారిని ఆశీర్వదించి — ఎఫ్రాయిము వలెను
మనష్షే వలెను దేవుడు నిన్ను చేయును గాకని ఇశ్రా
యేలీయులు నీ పేరు చెప్పి ఆశీర్వదించెదరని పలి
కెను. ఆలాగు అతడు మనష్షే కంటే ఎఫ్రాయిమును
అధికునిగా చేసెను.

21 మరియు ఇశ్రాయేలు — ఇదుగో! నేను చనిపోవు
చున్నాను; అయితే దేవుడు మీకు తోడై ఉండి,
తిరిగీ మీ పితృల దేశమునకు మిమ్మును తీసుకొని వెళ్లు
22 ను.। నేను నీ సహోదరులకంటే నీకు ఒక భాగము
ఎక్కువగా ఇచ్చితిని. అది నా కత్తితోను నా వింటి
తోను అమోరీయుల చేతిలోనుంచి తీసుకొంటినని
యోసేపుతో చెప్పెను.

## 49. అధ్యాయము.

1 యాకోబు తన కుమారులను పిలిపించి ఇట్లనెను—
మీరు కూడి రండి. వచ్చే దినముల యందు మీకు
సంభవించ బోయేవాటిని మీకు తెలియచేసెదను;
2 యాకోబు కుమారులారా! కూడివచ్చి ఆలకించుడీ;
మీ తండ్రియైన ఇశ్రాయేలు (మాట) వినుడీ.

రూబేనూ! నీవు నా పెద్ద కుమారుడవు; 3
నా శక్తి, నా బలప్రారంభము,
ఔన్నత్యాతిశయము ప్రాణాతిశయము నీవే.।
నీళ్లవలె చంచలుడవై అతిశయించవు; 4
నీ తండ్రి మంచము మీదికెక్కితివి గదా
అప్పుడు దాని అపవిత్రము చేసితివి;
అతడు నా మంచము మీదికెక్కెను.
షిమ్యోను, లేవీ అనే వారు సహోదరులు; 5
వారి ఒప్పందములు బలాత్కారపుటాయుధములు.।
నా ప్రాణమా! వారి ఆలోచన జోలికి పోవద్దు; 6
నా ఘనమా! వారి సంఘముతో ఏకీభవించవద్దు.
వారు తమ కోపము చేత నరుని చంపి
తమ స్వేచ్ఛ చేత ఎద్దు గుదికాలి నరము తెగగొట్టిరి.।
వేండ్రమైనది గనుక వారి కోపము, 7
కఠినమైనది గనుక వారి ఉగ్రతయు
శపించబడును గాక.
యాకోబులో వారిని విభజించి,
ఇశ్రాయేలులో వారిని చెదరగొట్టెదను.
యూదా! నిన్ను నీ సహోదరులు స్తుతించెదరు; 8
నీ చెయ్యి నీ శత్రువుల మెడమీద ఉండును;
నీ తండ్రి కుమారులు నీ ఎదుట సాగిలపడుదురు.।
యూదా కొదమ సింహము; 9
నా కుమారుడా! చీల్చుటనుంచి నీవు ఎక్కి వెళ్లితివి.
సింహము వలె, గర్జించే ఆడు సింహము వలెను
అతడు కాళ్లు ముడుచుకొని పండుకొనెను;
ఎవడు అతని లేపును?।
శీలో* వచ్చే పర్యంతము 10
యూదా యొద్దనుంచి దండమైనా
అతని కాళ్లమధ్యనుంచి రాజదండమైనా తొలగదు;
అతనికి ప్రజలు విధేయులై ఉందురు.।
ద్రాక్షావల్లికి తన గాడిదెను, 11
ఉత్తమ ద్రాక్షావల్లికి తన గాడిదె పిల్లను కట్టి,
ద్రాక్షా రసములో తన బట్టలు,
ద్రాక్షల రక్తములో తన వస్త్రమును ఉతికెను.।
అతని కన్నులు ద్రాక్షా రసము చేత ఎర్రగాను, 12
అతని పండ్లు పాలచేత తెల్లగాను ఉన్నవి.
జబులోను సముద్రపు రేవున నివసించును; 13
అతడు ఓడలకు రేవుగా ఉండును;
అతని పొలిమేర సీదోను వరకు ఉండును.
ఇశ్శాకారు రెండు దొడ్ల† మధ్యను 14
పండుకొని ఉన్న బలమైన గాడిదెయై ఉన్నాడు;।

*లేక, అది ఎవనిదో అతడు. †లేక, అంకెములు.

15 అతడు విశ్రాంతి మంచిదనియు,
ఆ భూమి రమ్యమైనదనియు చూచెను గనుక
అతడు మోయుటకు భుజము వంచుకొని
పన్ను చెల్లించే దాసుడాయెను.
16 దాను ఇశ్రాయేలు గోత్రములలో ఒక గోత్రమై,
తన ప్రజలకు న్యాయము తీర్చును.।
17 దాను దోవలో సర్పముగాను,
దారిలో కట్లపాముగాను ఉన్నాడు;
అది గుర్రపు మడిమలు కరుచును;
అప్పుడు ఎక్కేవాడు వెనుకతట్టు పడును.
18 ఓ యెహోవా!
నీ రక్షణ కొరకు కనిపెట్టి ఉన్నాను.
19 గాదును బంటుల గుంపు కొట్టును;
అతడు మడిమెను కొట్టును.
20 ఆషేరుయొద్ద ఆహారసారము కలదు;
అతడు రాజుల మధుర పదార్థములిచ్చును.
21 నప్తాలీ విడువబడిన లేడి;
ఇంపైన మాటలు పలుకును.
22 యోసేపు ఫలించెడి కొమ్మ;
ఊటయొద్ద ఫలించెడి కొమ్మ:
రెమ్మలు గోడ మీదికి ఎక్కి వ్యాపించును.।
23 అతనికి కోపము తెప్పించి బాణములు వేసి,
విలుకాండ్లు అతని యందు పగబట్టిరి:
యాకోబుయొక్క పరాక్రమశాలి చేతులవల్ల
ఇశ్రాయేలు బండయు, మేపెడివాడునైన
ఆయన చేతులవల్ల!
24 అతని విల్లు బలమైనదై నిలిచెను:
నీకు సహాయము చేసే నీ తండ్రి దేవునివల్ల,
పైనుంచి మింటి దీవెనలతోను,।
25 కింద దాగి ఉన్న అగాధ జలముల దీవెనలతోను
స్తన గర్భముల దీవెనలతోను,
నిను దీవించే సర్వశక్తుని దీవెనవల్ల
నీ బాహు బలము దిట్టపరచబడెను.।
26 నీ తండ్రి దీవెనలు నా పూర్వికుల దీవెనలపైని
నిత్యమైన కొండల అంతముమట్టుకు ప్రబలమవును.
అవి యోసేపు తలమీదను,
తన సహోదరులనుంచి వేరుపరచబడిన
వాని నడినెత్తి మీదనుండును.
27 బెన్యామీను చీల్చే తోడేలు;
ఉదయమందు ఎరను తిని
అస్తమయమందు దోపుడు సొమ్ము పంచుకొనును,
అని పలికెను.

ఇవియన్నియు ఇశ్రాయేలు పన్నెండు గోత్రము 28
లు. వారి తండ్రి వారిని దీవించుచు వారితో చెప్పి
నది ఇదే. ఎవని దీవెన చొప్పున వాని దీవించెను.।
తరువాత అతడు వారికి ఆజ్ఞాపించుచు ఇట్లనెను,— 29
నేను నా ప్రజల యొద్దికి చేర్చబడుచున్నాను.। హిత్తీ 30
యుడైన ఎఫ్రోను భూమియందున్న గుహలో, నా
తండ్రుల యొద్ద నన్ను పాతిపెట్టండి. ఆ గుహ కనా
ను దేశమందలి మమ్రే ఎదుటనున్న మక్పేలా పొల
ములో ఉన్నది. దానిని, ఆ పొలమును అబ్రాహాము
హిత్తీయుడైన ఎఫ్రోను యొద్ద శ్మశాన భూమి కొరకు
స్వాస్థ్యముగా కొనెను.। అక్కడనే వారు అబ్రాహా 31
మును, అతని భార్యయైన శారాను పాతిపెట్టిరి.
అక్కడనే ఇసాకును, అతని భార్యయైన రిబ్కాను
పాతిపెట్టిరి. అక్కడనే నేను లేయాను పాతిపెట్టితిని.।
ఆ పొలము, అందులో ఉన్న గుహయు, హేతు 32
కుమారుల యొద్ద కొనబడినవనెను.

యాకోబు తన కుమారులకు ఆజ్ఞాపించుట చాలించి, 33
మంచము మీద తన కాళ్లు ముడుచుకొని, ప్రాణము
విడిచి తన ప్రజల యొద్దికి చేర్చబడెను.

## 50. అధ్యాయము.

అప్పుడు యోసేపు తన తండ్రి ముఖము మీద పడి, 1
అతని గురించి ఏడ్చి, అతని ముద్దుపెట్టుకొనెను.।
తరువాత యోసేపు, సుగంధ ద్రవ్యములతో తన 2
తండ్రిని సిద్ధపరిచేలాగున, తన దాసులైన వైద్యులకు
ఆజ్ఞాపించెను గనుక, ఆ వైద్యులు ఇశ్రాయేలును
సుగంధ ద్రవ్యములతో సిద్ధపరిచిరి.। సుగంధ ద్రవ్య 3
ములతో సిద్ధపరచబడే వారి కొరకు దినములు సం
పూర్ణమయేలాగున, అతని కొరకు నలుబది దినములు
సంపూర్ణమాయెను. అతని గూర్చి ఐగుప్తీయులు
డెబ్బది దినములు అంగలార్చిరి.

అతని గూర్చిన అంగలార్పు దినములు గతించిన 4
తరువాత, యోసేపు ఫరో ఇంటి వారితో మాట్లాడి—
నేను మీ కన్నుల ఎదుట దయ పొంది ఉంటే, మీరు
అనుగ్రహించి నా మనవి ఫరో చెవిని వేసి।—
నా తండ్రి నా చేత ప్రమాణము చేయించి—ఇదుగో! 5
నేను చనిపోవుచున్నాను. కనానులో నా కొరకు
సమాధి తవ్వించితిని గదా అందులోనే నన్ను పాతి
పెట్ట వలెనని చెప్పెను. కాబట్టి సెలవైతే, నేను అక్క
డికి వెళ్లి, నా తండ్రిని పాతిపెట్టి, తిరిగీ వచ్చెదనని
పలుకండనెను.। అందుకు ఫరో— అతడు నీ చేత చే 6
యించిన ప్రమాణము చొప్పున వెళ్లి, నీ తండ్రిని పాతి
పెట్టుమని చెప్పెను.

7 కాబట్టి యోసేపు తన తండ్రిని పాతిపెట్టుటకు
వెళ్లెను. అతనితో కూడా ఫరో ఇంటి పెద్దలైన అతని
8 సేవకులందరు, ఐగుప్తుదేశపు పెద్దలందరు, । యోసేపు
ఇంటివారందరు, అతని సహోదరులు, అతని తండ్రి
ఇంటివారును వెళ్లిరి. వారు తమ పిల్లలను, తమ మం
దలను, తమ గొడ్లనును గోషెను దేశమందు విడిచిరి.।
9 మరియు రథములు, రౌతులును అతనితో వెళ్లినందున,
ఆ సమూహము బహు విస్తారమై ఉండెను.

10 యొర్దాను అవతలనున్న ఆఠాదు కళ్లము యొద్దకి
చేరి, అక్కడ బహు కఠినమైన గొప్ప అంగలార్పు
తో అంగలార్చిరి. అతడు తన తండ్రిని గూర్చి ఏడు
దినములు రోదనాచారము సలిపెను.

11 ఆ దేశమందు నివసించిన కనానీయులు, ఆఠాదు
కళ్లము యొద్ద ఆ దుఃఖము చూచి—ఐగుప్తీయులకు ఇది
మిక్కుటమైన దుఃఖమని చెప్పుకొనిరి గనుక దానికి
ఆబేల్ మిస్రాయిమనే* పేరు పెట్టబడెను. అది యొ
ర్దానుకు అవతల ఉన్నది.

12 అతని కుమారులు అతని విషయము, అతడు
13 వారికి ఆజ్ఞాపించిన ప్రకారము చేసిరి. । అతని కుమా
రులు కనాను దేశమునకు అతని తీసుకొని వెళ్లి,
మక్పేలా పొలమందున్న గుహలో అతని పాతిపెట్టిరి.
దాని, ఆ పొలముతో కూడా అబ్రాహాము తనకు
శ్మశానము కొరకు స్వాస్థ్యముగా ఉండుటకై మమ్రే
ఎదుట హిత్తీయుడైన ఎఫ్రోను యొద్ద కొనెను.

14 యోసేపు తన తండ్రిని పాతిపెట్టిన తరువాత,
అతడు, అతని సహోదరులు, అతని తండ్రిని పాతి
పెట్టుటకు వెళ్లిన వారందరును తిరిగి ఐగుప్తుకు వచ్చిరి.

15 యోసేపు సహోదరులు తమ తండ్రి మృతిబొం
దినందున—ఒకవేళ యోసేపు మన యందు పగబట్టి
మనము అతనికి చేసిన కీడంతటి చొప్పున మనకు నిశ్చ
16 యముగా కీడు జరిగించునని చెప్పుకొని । యోసేపుకు
ఈలాగున వర్తమానము పంపిరి—నీ తండ్రి తాను
17 చావక మునుపు, । ఆజ్ఞాపించినదేమనగా,—నీ సహో
దరులు నీకు కీడు చేసిరి గనుక నీవు దయచేసి వారి
నేరమును, వారి పాపమును క్షమించుమని మీరు యో
సేపుతో చెప్ప వలెననెను. కాబట్టి నీ తండ్రియొక్క
దేవుని దాసుల నేరము క్షమించుమని పలికిరి.

వారు అతనితో ఆలాగు మాటలాడినప్పుడు యో 18
సేపు ఏడ్చెను. అంతట అతని సహోదరులు కూడా
వెళ్లి అతని ఎదుట సాగిలపడి — ఇదుగో! మేము నీకు
దాసులమై ఉన్నామని పలికిరి. । అయితే యోసేపు— 19
భయపడకండి నేను దేవుని స్థానమందు ఉన్నానా?।
మీరు నాకు కీడుచేయ ఉద్దేశించితిరి. అయితే దేవుడు 20
నేటి దినమున ఉన్నట్టు బహు ప్రజలను బ్రతికించుటకు
అది మేలయేటట్టు ఉద్దేశించెను. । కాబట్టి భయపడ 21
కండి; నేను మిమ్మును, మీ పిల్లలను పోషించెదనని చెప్పి,
వారిని ఆదరించి వారితో ప్రీతిగా మాటలాడెను.

ఆలాగు యోసేపు, అతని తండ్రి ఇంటివారును 22
ఐగుప్తులో నివసించిరి. యోసేపు నూట పది సంవత్స
రములు బ్రతికెను. । యోసేపు ఎఫ్రాయిముయొక్క 23
మూడవ తరము పిల్లలను చూచెను, మరియు మనష్షే
కుమారుడైన మాకీరుకు కుమారులు పుట్టి యోసేపు
తొడలమీద ఉంచబడిరి.

తరువాత యోసేపు తన సహోదరులతో—నేను 24
చనిపోవుచున్నాను; అయితే దేవుడు నిశ్చయముగా
మిమ్మును చూడ వచ్చి, ఈ దేశములోనుంచి తాను
అబ్రాహాముకు, ఇసాకుకు, యాకోబుకును ప్రమా
ణము చేసి ఇచ్చిన దేశమునకు మిమ్మును తీసుకొని వెళ్లు
నని చెప్పెను.

మరియు యోసేపు—దేవుడు నిశ్చయముగా మిమ్మును 25
చూచుటకు వచ్చును; అప్పుడు మీరు నా ఎము
కలను ఇక్కడనుంచి తీసుకొని వెళ్ల వలెనని ఇశ్రా
యేలు కుమారులచేత ప్రమాణము చేయించుకొనెను.

యోసేపు నూట పది సంవత్సరములవాడై మృతి 26
బొందెను. వారు సుగంధ ద్రవ్యములతో అతని సిద్ధ
పరిచిరి. అప్పుడు ఐగుప్తుయందు అతడు పెట్టెలో
ఉంచబడెను.

*అనగా, ఐగుప్తు దుఃఖము.

నిర్గమకాండమనబడిన.*

# మోషే రెండవ పుస్తకము.

## 1. అధ్యాయము.

1 ఐగుప్తులోకి వచ్చిన ఇశ్రాయేలు కుమారుల పేరులు
2,3 ఏవనగా,। రూబేను, షిమ్యోను, లేవి, యూదా,। ఇశ్శా
4 ఖారు, జెబూలోను, బెన్యామీను,। దాను, నప్తాలీ,
గాదు, ఆషేరు. వీరిలో ప్రతివాడును తన తన ఇంటి
5 వారితో కూడా వచ్చెను.। యాకోబు గర్భమందు
పుట్టిన వారందరు డెబ్బదిమంది. అప్పటికి యోసేఫు
ఐగుప్తులో ఉండెను.

6 యోసేఫును, అతని అన్నదమ్ములందరును, ఆ తరము
7 వారందరును చనిపోయిరి.। అయితే ఇశ్రాయేలు పు
త్రులు బహు సంతానము గలవారై, అభివృద్ధి పొఁది
విస్తరించి, అత్యధికముగా ప్రబలిరి. ఆ దేశము వారి
తో నిండుకొనెను.

8 అప్పుడు యోసేఫును ఎరగని క్రొత్త రాజు ఐగుప్తు
9 పైని అధికారము కలిగెను.। అతడు తన జనులతో ఇట్ల
నెను—ఇదుగో! ఇశ్రాయేలు సంతతియైన ఈ జనము
మనకంటే విస్తారముగాను బలిష్ఠముగాను ఉన్నది.।
10 వారు విస్తరించకుండుటకు మనము వారియెడల యుక్తి
గా జరిగింతము రండి; లేకుంటే యుద్ధము కలిగినప్పు
డు, వారు మన శత్రువులతో కలుసుకొని మనకు విరో
ధముగా యుద్ధము చేసి ఈ దేశములోనుంచి వెళ్లిపో
దురేమో అనెను.

11 కాబట్టి వారి బరువులవల్ల వారిని శ్రమపెట్టుటకు
వెట్టిపనులు చేయించే అధికారులను వారి మీద నియ
మించిరి. వారు పరో కొరకు పిథోము, రయమ్సేసనే
12 బండారముల† పట్టణములను కట్టిరి.। అయితే వారిని
ఎంత శ్రమపెట్టిరో వారు అంత అభివృద్ధి పొంది అంత
ప్రబలిరి. కాబట్టి వారు ఇశ్రాయేలు పుత్రుల యె
13 డల అసహ్యపడిరి.। అప్పుడు ఐగుప్తీయులు ఇశ్రాయే
లు పుత్రులచేత కఠినముగా సేవ చేయించుకొనిరి.
జిగటమంటి పనిలోను ఇటికల పనిలోను, పొలములో
14 చేసే ప్రతి పనిలోను। కఠిన సేవ చేతను వారి ప్రాణ
ములను విసికించిరి. వారు వారిచేత చేయించుకొనిన
సమస్త సేవయు కఠినమైనది.

మరి ఐగుప్తు రాజు షిఫ్రా, పూయా అనే పేళ్లు 15
గల ఇబ్రీయుల మంత్రసానులతో మాటలాడి।—మీ 16
రు ఇబ్రీ స్త్రీలకు మంత్రసాని పని చేయుచు, చిహ్న
ము చూచినప్పుడు మగవాడైతే వాని చంపండి; ఆడ
దైతే, దాని బ్రతుకనియ్యండని వారితో చెప్పెను.।
అయితే ఆ మంత్రసానులు దేవునికి భయపడి ఐగుప్తు 17
రాజు వారికి ఆజ్ఞాపించిన ప్రకారము చేయక మగ
పిల్లలను బ్రతుకనిచ్చిరి.

అప్పుడు ఐగుప్తు రాజు ఆ మంత్రసానులను పిలి 18
పించి—మీరు ఎందుకు మగపిల్లలను బ్రతుకనిచ్చితిరి!
ఈ కార్యమేల చేసినారు? అని అడిగెను.। అందుకు ఆ 19
మంత్రసానులు—ఎందుకా? ఇబ్రీ స్త్రీలు ఐగుప్తు స్త్రీ
లవంటివారు కారు; వారు చురుకైనవారు; మంత్రసాని
వారియొద్దికి చేరక మునుపు, వారు ప్రసవించి యుం
దురని పరోతో చెప్పిరి.

అప్పుడు దేవుడు ఆ మంత్రసానులకు మేలు చేసెను. 20
ఆ జనము విస్తరించి మిక్కిలి ప్రబలెను.। ఆ మంత్రసా 21
నులు దేవునికి భయపడినందున, దేవుడు వారికి కుటుంబ
ములను కలుగచేసెను.। అప్పుడు పరో—పుట్టిన ప్రతి 22
కుమారుని నదిలో పారవేయుడి; ప్రతి కుమార్తెను
బ్రతకనియ్యుడి అని తన జనులకు ఆజ్ఞాపించెను.

## 2. అధ్యాయము.

లేవీ ఇంటివారిలో ఒకడు వెళ్లి, లేవీ కుమార్తెను 1
పెండ్లి చేసుకొనెను.। ఆ స్త్రీ గర్భవతియై, కుమారుని 2
కని, అతడు సుందరుడవుట చూచి, మూడు నెలలు
వాని దాచెను.। తరువాత ఆమె వాని దాచలేక, వాని 3
కొరకు ఒక జమ్ముపెట్టె తీసుకొని, దానికి జిగటమన్ను
కీలును పూచి, దానిలో ఆ పిల్లను పెట్టి, ఏటి అంచున
జమ్ములో దాని ఉంచెను.। వానికి ఏమి సంభవించు 4
నో తెలుసుకొనుటకు వాని అక్క దూరముగా నిలి
చియుండెను.

*అనగా, బైలుదేరుట. Exodus. † లేక, కోటలు.

5 అప్పుడు పరో కుమార్తె స్నానము చేయుటకు
ఏటికి వచ్చెను. ఆమె పనికత్తెలు ఏటి గట్టున నడుచు
చుండిరి. ఆమె జమ్ములోని ఆ పెట్టెను చూచి, తన
6 పనికత్తెను పంపి, దాని తెప్పించి, । దాని తెరిచి, ఆ
పిల్లను చూచినప్పుడు, ఇదుగో! ఆ చిన్నవాడు ఏ
డ్చుచుండెను. కాబట్టి ఆమె అతని యందు కనికరిం
చి — ఇతడు ఇబ్రీయుల పిల్లలలో ఒకడని పలికెను. ।
7 అప్పుడు అతని అక్క — నీ కొరకు ఈ పిల్లను పా
లిచ్చి పెంచుటకు నేను వెళ్లి ఇబ్రీ స్త్రీలలో ఒక దా
దిని, నీ కొరకు పిలుచుకొని రా వచ్చునా? అని పరో
8 కుమార్తెను అడిగెను. । అందుకు పరో కుమార్తె—
వెళ్లుమని చెప్పెను. ఆ పడుచుది వెళ్లి ఆ చిన్నవాని
9 తల్లిని పిలుచుకొని వచ్చెను. । అప్పుడు పరో కుమార్తె
— ఈ పిల్లను తీసుకొని వెళ్లి, నా నిమిత్తము వానికి
పాలిచ్చి పెంచుము. నేను నీకు జీతమిచ్చెదనని ఆమె
తో చెప్పెను. ఆ స్త్రీ ఆ పిల్లను తీసుకొని వెళ్లి వానికి
పాలిచ్చి పెంచెను.

10 ఆ పిల్లవాడు పెద్దవాడైన తరువాత, ఆమె పరో కు
మార్తె యొద్దికి అతని తీసుకొనివచ్చెను. అతడు ఆమెకు
కుమారుడాయెను. ఆమె—నేను ఇతని నీటిలోనుంచి
తీసినాననుకొని అతనికి మోషే అనే పేరు పెట్టెను.

11 ఆ దినములలో మోషే పెద్దవాడై తన సహో
దరుల యొద్దికి బైలుదేరి వెళ్లి, వారి బరువులను చూ
చెను. అప్పుడు అతడు ఐగుప్తీయుడు తన సహోద
12 రులలో ఒక ఇబ్రీయుని కొట్టుట చూచెను. । అతడు
ఇటు అటు తిరిగి చూచి, ఏ మనుష్యుడును లేడు అను
కొని, ఆ ఐగుప్తీయుని చంపి ఇసుకలో వాని దాచి
పెట్టెను.

13 మరునాడు అతడు బైలువెళ్లినప్పుడు, ఇదుగో!
ఇబ్రీయులైన ఇద్దరు మనుష్యులు పోట్లాడుచుండిరి. ।
14 అప్పుడు అతడు—నీవెందుకు నీ పొరుగువాని కొట్టు
చున్నావు? అని అన్యాయము చేసిన వానితో పలికెను.
అందుకు అతడు—అధికారిగాను న్యాయాధిపతిగాను
మా మీద నిన్ను నియమించిన వాడెవడు? నీవు ఆ ఐ
గుప్తీయుని చంపినట్లు నన్ను చంపనై యున్నావా!
అని పలికెను. అప్పుడు మోషే — నిశ్చయముగా ఈ
15 సంగతి బైలుపడెననుకొని, భయపడెను. । పరో ఆ సం
గతి విని, మోషేను చంపుటకు చూచెను. అయితే
మోషే పరో యెదుటనుంచి పారిపోయి, మిద్యాను
దేశములో నివసించెను; బావియొద్ద నివసించెను.

మిద్యాను యాజకునికి ఏడుగురు కుమార్తెలు ఉం 16
డిరి. వారు వచ్చి తమ తండ్రి మంద తాగుటకు (నీళ్లు)
తోడి తొట్లను నింపించుచుండగా. । మందకాపరులు* 17
వచ్చి, వారిని వెళ్లగొట్టిరి; అప్పుడు, మోషే లేచి, వా
రికి సహాయముచేసి మందను తాగనిచ్చెను.

వారు తమ తండ్రియైన రెగూయేలు యొద్దికి వచ్చి 18
నప్పుడు, అతడు—ఈ దినమున మీరు ఇంత త్వరగా
ఏలాగు వచ్చితిరనెను. । అందుకు వారు — ఐగుప్తీయు 19
డైన ఒక మనుష్యుడు మందకాపరుల చేతినుంచి మమ్ము
తప్పించి, వడిగా (నీళ్లు) తోడి, మన మందను తాగ
నిచ్చెనని పలికిరి. । అప్పుడు అతడు — అతడు ఎక్కడ 20
ఉన్నాడు? ఆ మనుష్యుని ఎందుకు విడిచి వచ్చితిరి?
అతడు భోజనము చేయుటకు అతని పిలుచుకొనిరం
డని తన కుమార్తెలతో చెప్పెను.

అప్పుడు మోషే ఆ మనుష్యునితో నివసించుటకు 21
సమ్మతించెను. అతడు తన కుమార్తెయైన సిప్పోరాను
మోషేకు ఇచ్చెను. । ఆమె కుమారుని కనినప్పుడు, అత 22
డు—అన్యదేశములో నేను పరదేశినై యుంటిననుకొని
అతనికి గేర్షోమనే పేరు పెట్టెను.

బహు దినములైన తరువాత, ఐగుప్తు రాజు చనిపో 23
యెను. అప్పుడు ఇశ్రాయేలు పుత్రులు వెట్టివల్ల నిట్టూ
ర్పు విడుచుచు, మొరబెట్టుచుండిరి. వారి దాసత్వము
వల్లనైన వారి మొర దేవుని యొద్దికి ఎక్కెను. । అప్పుడు 24
దేవుడు వారి మూలుగు విని, అబ్రాహాముతోను ఇ
సాకుతోను యాకోబుతోను తాను చేసిన నిబంధన†
దేవుడు జ్ఞాపకము చేసుకొనెను. । దేవుడు ఇశ్రాయేలు 25
పుత్రులను చూచెను. దేవుడు వారిని లక్షించెను.

## 3. అధ్యాయము.

మోషే మిద్యాను యాజకుడైన ఇత్రో అనే తన మా 1
మ మందను మేపుచు, తన మందను అరణ్యము అవత
లకు తోలుకొని, దేవుని పర్వతమైన హోరేబుకు
చేరెను. । అప్పుడు ఒక పొద మధ్యను, అగ్ని జ్వాలలో 2
యెహోవా దూత అతనికి కనబడెను. అతడు చూ
చినప్పుడు, ఇదుగో! అగ్నివల్ల ఆ పొద మండుచుండెను
గాని పొద కాల్చబడలేదు.

అప్పుడు మోషే— ఆ పొద ఎందుకు దహించబడ 3
లేదో, నేను ఆ తట్టు వెళ్లి ఈ గొప్ప వింత చూతు
ననుకొనెను. । అయితే దాని చూచుటకు అతడు ఆ 4
తట్టు వచ్చుట యెహోవా చూచెను. అప్పుడు దే

* లేక, మేపేవారు. † లేక, ఒడంబడిక.

వుడు ఆ పొద మధ్యనుంచి — మోషే! మోషే! అని
అతని పిలిచెను. అందుకు అతడు—ఇదుగో! ఉన్నానని
పలికెను.
5 అప్పుడు ఆయన—దగ్గరకు రా వద్దు; నీ పాదముల
నుంచి నీ చెప్పులు తీసివేయుము! నీవు నిలిచియున్న
6 స్థలము పరిశుద్ధ భూమి యని పలికెను. । మరియు, ఆ
యన—నేను నీ తండ్రి దేవుడను, అబ్రాహాము దేవు
డను, ఇస్సాకు దేవుడను, యాకోబు దేవుడను అని
పలికెను. అప్పుడు మోషే తన ముఖము చాటు చేసు
కొనెను; దేవుని వైపు చూచుటకు భయపడెను.
7 మరియు, యెహోవా—నేను ఐగుప్తులో ఉన్న నా
ప్రజల బాధను నిశ్చయముగా చూచితిని; వెట్టి పని
చేయించే వారి వల్ల కలిగిన వారి మొరను వింటిని; వారి
8 దుఃఖములు నాకు తెలుసును. । కాబట్టి ఐగుప్తీయుల
చేతిలోనుంచి వారిని తప్పించుటకును, ఆ దేశములో
నుంచి విశాలమైన మంచి దేశమునకు, పాలు తేనెలు
ప్రవహించే దేశమునకు అనగా కనానీయులు, హిత్తీ
యులు, అమోరీయులు, పెరిజ్జీయులు, హివ్వీయులు,
యెబూసీయులున్న స్థలమునకు వారిని నడిపించుట
9 కును దిగి వచ్చియున్నాను. । కాబట్టి చూడుము; ఇశ్రా
యేలు పుత్రుల మొర నా యొద్దికి చేరినది. మరియు
ఐగుప్తీయులు వారిని హింసించిన హింసను చూచితిని. ।
10 కాగా నీవు రమ్ము; నిన్ను ఫరోయొద్దికి పంపుదును.
ఇశ్రాయేలు పుత్రులైన నా ప్రజలను నీవు ఐగుప్తులో
నుంచి వెలపటికి నడిపించ వలెనని పలికెను.
11 అప్పుడు మోషే—నేను ఫరో యొద్దికి వెళ్లుటకును
ఇశ్రాయేలు పుత్రులను ఐగుప్తులోనుంచి వెలపటికి
నడిపించుటకును ఎంతవాడనని దేవునితో పలికెను. ।
12 అందుకు ఆయన — ఇదుగో! నేను నీకు తోడైయుం
దును; నేను నిన్ను పంపినాననుటకు ఇది నీకు గురుతై
యుండును; నీవు ఆ జనమును ఐగుప్తులోనుంచి వెలప
టికి నడిపించిన తరువాత, ఈ పర్వతము మీద దేవుని
సేవింతురని చెప్పెను.
13 అప్పుడు మోషే—చూడుము; నేను ఇశ్రాయేలు
పుత్రుల యొద్దికి వెళ్లబోవుచున్నాను. అయితే—మీ
పితృల దేవుడు మీ యొద్దికి నన్ను పంపెనని నేను
వారితో చెప్పినప్పుడు వారు—ఆయన పేరేమి అని
అడిగితే వారితో నేనేమి చెప్ప వలెనని దేవుని అడి
గెను.
14 అందుకు దేవుడు—నేనున్నవాడనై యున్నానని
మోషేతో పలికెను. మరియు ఆయన—ఉన్నాను
నన్ను మీ యొద్దికి పంపెనని నీవు ఇశ్రాయేలు పుత్రు
లతో చెప్ప వలెననెను.
మరియు దేవుడు మోషేతో ఇట్లనెను: 15
—మీ పితృల దేవుడనగా, అబ్రాహాము దేవుడు, ఇస్సా
కు దేవుడు, యాకోబు దేవుడునైన యెహోవా
మీ యొద్దికి నన్ను పంపి యున్నాడని నీవు ఇశ్రా
యేలు పుత్రులతో చెప్ప వలెను. నిరంతరము నా
పేరు ఇది; ఇది తరతరముల మట్టుకు నా జ్ఞాపకార్థ నా
మము. । నీవు వెళ్లి ఇశ్రాయేలు పెద్దలను పోగుచేసి— 16
మీ పితృల దేవుడనగా, అబ్రాహాము, ఇస్సాకు, యా
కోబనే వారి దేవుడైన యెహోవా నాకు ప్రత్యక్ష
మై — నేను మిమ్మును, ఐగుప్తులో మీ యెడల చేయ
బడినదాని నిశ్చయముగా చూచితిననియు, । ఐగుప్తు 17
బాధలోనుంచి, పాలు తేనెలు ప్రవహించే దేశమున
కనగా, కనానీయులు, హిత్తీయులు, అమోరీయులు,
పెరిజ్జీయులు, హివ్వీయులు, యెబూసీయులున్న దేశ
మునకు మిమ్ము తీసుకొని వచ్చెదనని పలికెననియు
వారితో చెప్పుము. । వారు నీ మాట విందురు. అప్పుడు 18
నీవును, ఇశ్రాయేలు పెద్దలును ఐగుప్తు రాజు యొద్దికి
వెళ్లి—ఇబ్రీయుల దేవుడైన యెహోవా మాకు ప్రత్య
క్షమై యున్నాడు గనుక, మేము అరణ్యమునకు మూ
డు దినముల ప్రయాణము వెళ్లి, మా దేవుడైన యె
హోవాకు యాగము చేతుము, సెలవిమ్మని అతనితో
చెప్పవలెను. । ఐగుప్తు రాజు బలవంతుని చేతివల్లనైతే 19
నేగాని మిమ్ము వెళ్లనియ్యడని యెరుగుదును. । అప్పు 20
డు నేను నా చెయ్యి చాపి, ఐగుప్తు మధ్యను నేను
చేయబోయే నా అద్భుతములన్నిటివల్ల, దాని హతము
చేతును; ఆ తరువాత అతడు మిమ్ము పోనిచ్చును. । మరి 21
యు నేను ఈ జనులకు ఐగుప్తీయుల దయాదృష్టి కలుగ
చేతును గనుక మీరు వెళ్లేటప్పుడు వట్టి చేతులతో
వెళ్లరు. । ప్రతి స్త్రీయు తన తన పొరుగుదానిని తన 22
తన ఇంటిలో ఉండే దానిని వెండి నగలు, బంగారు
నగలు, వస్త్రములును అడుగుకొన వలెను. మీరు వాటిని
మీ కుమారులకు, మీ కుమార్తెలకును తొడిగి, ఐగుప్తీ
యులను దోచుకొందురని పలికెను.

4. అధ్యాయము. అందుకు మోషే—అయితే 1
ఇదుగో! వారు నన్ను నమ్మరు; నా మాట వినరు;—యె
హోవా నీకు ప్రత్యక్షము కాలేదందురని ఉత్తరమి
చ్చెను. । అప్పుడు యెహోవా—నీ చేతిలో ఉన్నది 2
యేమిటి? అని అతని అడిగెను. అందుకు అతడు—అది
కర్ర అని పలికెను. । అప్పుడు ఆయన—భూమి మీద 3
దాని పడవేయుమనెను. అతడు భూమి మీద దాని
పడవేయగానే, అది పామాయెను. మోషే దాని యె
దుటనుంచి పారిపోయెను. । అప్పుడు యెహోవా— 4

నీ చెయ్యి చాపి దాని తోక పట్టుకొనుమని చెప్పెను.
అతడు తన చెయ్యి చాపి దాని పట్టుకొనగానే అది
5 అతని చేతిలో కఱ్ఱ ఆయెను. ।—వారు తమ పితృల
దేవుడనగా అబ్రాహాము దేవుడు, ఇస్సాకు దేవుడు,
యాకోబు దేవుడునైన యెహోవా నీకు ప్రత్యక్ష
మాయెనని నమ్ముటకే.

6 మరియు యెహోవా—నీ చెయ్యి నీ రొమ్మున ఉం
చుకొనుమని చెప్పినప్పుడు, అతడు తన చెయ్యి రొ
మ్మున ఉంచుకొని దాని వెలుపటికి తీసినప్పుడు, ఇదుగో!
ఆ చెయ్యి కుష్ఠముగలదై మంచువలె తెల్లగా ఉండెను.।
7 తరువాత ఆయన — నీ చెయ్యి తిరిగి నీ రొమ్మున
ఉంచుకొనుమని చెప్పెను. అతడు తన చెయ్యి తిరిగి
తన రొమ్మున ఉంచుకొని తన రొమ్మునుంచి వెలుపటికి
తీసినప్పుడు, ఇదుగో! అది అతని మిగిలిన శరీరము
8 వలెనే ఉండెను. ।—కాబట్టి వారు నిన్ను నమ్మక, మొ
దటి గురుతు మాట వినకపోతే, తరువాతి గురుతు మాట
9 విందురు. । అయితే వారు ఈ రెండు గురుతులను నమ్మక
నీ మాట వినకపోతే, నీవు ఏటి నీళ్లనుంచి కొంచెము
తీసి ఎండిన నేలమీద పోయ వలెను. అప్పుడు నీవు ఏటి
లోనుంచి తెచ్చిన నీళ్లు ఎండిన నేల మీద రక్తమవు
ననెను.

10 అప్పుడు మోషే—ప్రభువా! ఇంతకు మునుపైనను,
తరువాత నీవు నీ సేవకునితో పలికినప్పటినుంచియై
నను, నేను మాటల నేర్పరిని కాను; నాకు నోటి
మాంద్యము, నాలుక మాంద్యము ఉన్నవని యెహో
11 వాతో పలికెను. । అందుకు యెహోవా — మనుష్యు
లకు నోరు కలుగచేసిన వాడు ఎవడు! మూగవాని
నైనను చెవిటివానినైనను దృష్టిగలవానినైనను గుడ్డి
వానినైనను పుట్టించిన వాడెవడు! యెహోవానగు
12 నేనేగదా! । కాబట్టి నీవు వెళ్లుము. నేను నీ నోటికి
తోడైయుండి, నీవు పలుక వలసిన వాటిని నీకు బో
ధించుదునని అతనితో చెప్పెను.

13 అందుకు అతడు—అయ్యో! ప్రభువా! నీవు పంప
14 తలంచిన వానిచేత పంపుమని పలికెను. । అప్పుడు యె
హోవా మోషే మీద కోపపడి—లేవీయుడైన అహ
రోను నీ అన్న కాడా? అతడు బాగా మాటలాడ గల
డని ఎరుగుదును. ఇదుగో! అతడు నిన్ను ఎదుర్కొ
నుటకు బైలుదేరి వచ్చుచున్నాడు; అతడు నిన్ను చూచి,
15 తన హృదయములో సంతోషించును. । నీవు అతనితో
పలికి, అతని నోటికి మాటలు అందియ్య వలెను. నేను
నీ నోటికి, అతని నోటికితోడై యుండి, మీరు
16 చేయ వలసిన దాని మీకు నేర్పుదును. । అతడే నీ కొ
రకు జనులతో పలుకును. అతడే నీకు నోరుగా ఉం
దును; నీవు అతనికి దేవుడుగా ఉందువు. । ఈ కఱ్ఱను 17
చేత పట్టుకొని, దానితో ఆ గురుతులు చేయ వలెనని
చెప్పెను.
తరువాత మోషే బైలుదేరి, తన మామయైన యిత్రో 18
యొద్దికి తిరిగి వెళ్లి—సెలవైతే, నేను ఐగుప్తులో ఉన్న
నా సహోదరుల యొద్దికి తిరిగి వెళ్లి, వారు ఇంకా
సజీవులై ఉందురేమో చూడ వలెనని అతనితో చెప్పెను.
అందుకు యిత్రో—సమాధానముగా వెళ్లుమని మోషే
తో పలికెను.

మరియు యెహోవా—నీ ప్రాణము వెతికిన మను 19
ష్యులందరు చనిపోయిరి గనుక నీవు ఐగుప్తుకు తిరిగి
వెళ్లుమని మిద్యానులో మోషేతో చెప్పెను. । కాబట్టి 20
మోషే తన భార్యను, తన కుమారులను తీసుకొని,
గాడిదె మీద వారిని ఎక్కించి, ఐగుప్తుకు తిరిగి వెళ్లెను.
మోషే దేవుని కఱ్ఱ తన చేత పట్టుకొనెను.

అప్పుడు యెహోవా మోషేతో ఇట్లనెను:—నీవు 21
ఐగుప్తుకు తిరిగి చేరిన తరువాత, నేను నీ చేతికిచ్చిన
ఆ యద్భుతములన్నియు ఫరో యెదుట చేయుటకు
తలంచుకొనుము. నేను అతని హృదయము దృఢపరు
తును; అతడు ఈ జనులను పంపడు. । అప్పుడు నీవు 22
—ఇశ్రాయేలు నా కుమారుడు, నా ప్రథమ కుమా
రుడు. । మరియు నన్ను సేవించుటకు నా కుమారుని 23
పంపుమని నీతో చెప్పుచున్నాను. వాని పంపనొల్లక
పోతే, ఇదుగో! నేను నీ కుమారుని, నీ ప్రథమ కుమా
రుని చంపుదునని యెహోవా చెప్పుచున్నాడని
ఫరోతో పలుకుమనెను.

ఆ మార్గమున సత్రములో యెహోవా అతని 24
ఎదురుకొని, అతని చంపుటకు చూచెను. । అప్పుడు 25
సిప్పోరా వాడిగల రాయి తీసుకొని, తన కుమారునికి
ఛేదనసంస్కారము చేసి, అతని పాదములయొద్ద పడ
వేసి—నీవు నాకు రక్తసంబంధివని పలికెను. అంతట
ఆయన అతని విడిచెను. । అప్పుడు ఆమె—ఈ ఛేదన 26
సంస్కారము వల్ల నాకు రక్త సంబంధివని పలికెను.

మరియు యెహోవా—మోషేను కలుసుకొనుటకు 27
అరణ్యములోకి వెళ్లుమని అహరోనుతో చెప్పెను. అ
తడు వెళ్లి, దేవుని పర్వతమందు అతని కలుసుకొని,
అతని ముద్దుబెట్టుకొనెను. । అప్పుడు మోషే తన్ను 28
పంపిన యెహోవా మాటలన్నియు, ఆయన తనకు
ఆజ్ఞాపించిన గురుతులన్నియు అహరోనుతో చెప్పెను.
తరువాత మోషే, అహరోనును వెళ్లి ఇశ్రాయేలు 29
పుత్రుల పెద్దలనందరిని పోగుచేసిరి. । అప్పుడు అహ 30
రోను, యెహోవా మోషేతో పలికిన మాటలన్ని
యు పలికెను. అతడు జనుల యెదుట ఆ గురుతులను

31 చేసెను. అప్పుడు జనులు నమ్మిరి. । మరియు—యెహో
వా ఇశ్రాయేలు పుత్రులను చూడ వచ్చి వారి బా
ధను చూచెనని వినినప్పుడు వారు సాగిలపడి ఆరా
ధించిరి.

## 5. అధ్యాయము.

1 తరువాత మోషే అహరోను ప్రవేశించి—ఇశ్రా
యేలు దేవుడైన యెహోవా,— నా జనము అరణ్య
ములో నాకు ఉత్సవము చేయుటకు వారిని పంపు
మన్నాడని ఫరోతో చెప్పిరి.
2 అందుకు ఫరో—యెహోవా ఎవడు? నేను అతని
మాట విని ఇశ్రాయేలును పంపనేల? నేను యెహో
వాను యెరుగను; ఇశ్రాయేలును పంపనని పలికెను.
3 అప్పుడు వారు—ఇబ్రీయుల దేవుడు మమ్మును యె
దురుకొనెను. సెలవైతే మేము అరణ్యములోనికి మూడు
దినముల ప్రయాణము వెళ్లి, మా దేవుడైన యెహో
వాకు యాగము చేయుదుము; లేకపోతే, ఆయన మా
మీదికి తెగులైనను కత్తియైనను రాజేసునేమో అని
పలికిరి.
4 అందుకు ఐగుప్తు రాజు—మోషే! అహరోనూ! ఈ
జనులను వారి పనులనుంచి, మీరు ఎందుకు నిలుపు
చున్నారు? మీ బరువులయొద్దికి వెళ్లండని చెప్పెను. ।
5 మరియు ఫరో — ఇదుగో! ఈ దేశప్రజలు ఇప్పుడు
విస్తరించి యున్నారు. మీరు వారి బరువులనుంచి
వారిని తీరికగా ఉండేటట్టు చేయుచున్నారని వారితో
పలికెను.
6 ఆ దినమున ఫరో, ప్రజల పైనున్న కార్యనియా
మకులకు, వారి నాయకులకును* ఇట్లు ఆజ్ఞాపించెను: ।
7 — మునుపటి వలె మీరు ఇకమీదట ఇటికలు చేయు
టకు ఈ జనులకు వరిగడ్డి ఇయ్య కూడదు; వారు వెళ్లి
8 తమకు తామే వరిగడ్డి కూర్చుకొన వలెను. । అయితే
వారు ఇదివరకు చేసిన ఇటికల లెక్కను వారికి నియ
మించ వలెను. దానిలో తక్కువ చేయ కూడదు; వారు
బద్ధకులై యున్నారు గనుక—మేము వెళ్లి మా గేవునికి
9 యాగము చేయ వలెనని మొరబెట్టుచున్నారు. । ఆ మ
నుష్యుల మీద ఫేధ బరువును ఎక్కువ చేయించ వలె
ను; దానిలో వారు ప్రయాసపడ వలెను; వారు అబ
ద్ధపు మాటలను లక్ష్యపెట్ట కూడదనెను.
10 కాబట్టి జనుల కార్యనియామకులు వారి నాయ
కులును* బైలువెళ్లి జనులను చూచి —నేను మీకు వరి
11 గడ్డి ఇయ్యను; । మీరు వెళ్లి మీకు యెక్కడ వరిగడ్డి
దొరుకునో, అక్కడ మీరు మీరే సంపాదించుకొ
నుడి; మీ పనిలో ఏమాత్రము తక్కువ చేయబడదని
ఫరో చెప్పెననిరి.
అప్పుడు జనులు వరిగడ్డికి మారుగా, కొయ్యకాలు 12
కూర్చుటకు ఐగుప్తు దేశమందంతటను చెదిరిపోయిరి.।
మరియు కార్యనియామకులు వారిని త్వరపెట్టి — 13
వరిగడ్డి ఉన్నప్పుడు ఏలాగో, ఆలాగే ఏనాటి పని
ఆ నాడే సంపూర్ణము చేయుడని పలికిరి.
అప్పుడు ఫరోయొక్క కార్యనియామకులు వారి 14
మీద ఉంచిన ఇశ్రాయేలు పుత్రుల నాయకులు కొట్ట
బడి—మొన్నటి వలె మీ కట్టడ చొప్పున ఇటికలను
నిన్న నేడు మీరు ఎందుకు చేయించ లేదు? అని అడగ
బడిరి.
అప్పుడు ఇశ్రాయేలు పుత్రుల నాయకులు వచ్చి 15
—నీ దాసుల యెడల ఎందుకు ఈలాగు జరిగించుచు
న్నావు? । నీ దాసులకు వరిగడ్డి ఇయ్యబడలేదు. అయి 16
తే — ఇటికలు చేయండని మాతో చెప్పుచున్నారు.
ఇదుగో! నీ దాసులు కొట్టబడిరి; అయితే నీ జను
లయందే తప్పితమున్నదని ఫరోను గూర్చి మొరబె
ట్టిరి. । అందుకు అతడు—మీరు బద్ధకులు, మీరు బద్ధ 17
కులు; అందుచేతను—మేము వెళ్లి యెహోవాకు యా
గము చేయుదుమని మీరు పలుకుచున్నారు. । కాబట్టి 18
మీరు వెళ్లిపోయి పని చేయండి. వరిగడ్డి మీకు ఇయ్య
బడదు; అయితే కట్టడ ఇటికలు మీరు అప్పగించ
వలెనని చెప్పెను.
—మీ ఇటికల లెక్కలో తక్కువ చేయ కూడదు; 19
ఏ నాటి పని ఆ నాడే చేయ వలెనని చెప్పబడి
నప్పుడు, ఇశ్రాయేలు పుత్రుల నాయకులు, తాము
దురవస్థలో పడి ఉన్నామని తెలుసుకొనిరి. । వారు 20
ఫరో యొద్దనుంచి బైలుదేరి వచ్చుచుండగా, వారిని
యెదురుకొనుటకు నిలిచిన మోషేను అహరోనును
కలుసుకొని। —యెహోవా మిమ్ము చూచి న్యాయము 21
తీర్చు గాక; ఫరో యెదుటను అతని దాసుల యెదు
టను మా వాసన దుర్గంధముగా చేసి మమ్ము చంపు
టకు వారి చేతికి ఖడ్గమిచ్చితిరని వారితో పలికిరి.
అప్పుడు మోషే యెహోవా యొద్దికి తిరిగి వెళ్లి— 22
ప్రభువా! నీవెందుకు ఈ జనులకు కీడు చేసితివి?
నన్ను ఎందుకు పంపితివి? । నేను నీ పేర మాటలాడు 23
టకు ఫరో యొద్దికి చేరినప్పటినుంచి అతడు ఈ జను
లకు కీడే చేయుచున్నాడు. నీ జనులను నీవు విడిపిం
చనే లేదని పలికెను. । అప్పుడు యెహోవా—ఫరోకు 6.1
నేను చేయబోవుచున్నదాని నీవు ఇప్పుడు చూతువు;

* లేక, గుమస్తాలు.

బలవంతుని నిర్బంధముచేత అతడు వారిని పంపును;
బలవంతుని నిర్బంధముచేత తన దేశములోనుంచి వా
రిని తోలివేసునని మోషేతో పలికెను.

## 6. అధ్యాయము.

2,3 మరియు దేవుడు మోషేతో మాటలాడుచు,
—నేనే యెహోవాను; నేను సర్వశక్తిగల దేవుడనే
పేరున, అబ్రాహాముకు, ఈసాకుకు, యాకోబుకును
ప్రత్యక్షమైతిని. అయితే, యెహోవాననే నా పేరు
4 వారికి తెలియబడలేదు. । మరియు వారు పరవాసము
చేసిన వారి పరదేశమనగా, ఆ కనానను దేశము వా
రికి ఇచ్చుటకు నా నిబంధన* వారితో స్థిరపరిచితిని.।
5 మరియు ఐగుప్తీయులు దాసత్వమునకు లోపరిచియు
న్న ఇశ్రాయేలు పుత్రుల మూలుగు విని, ఆ నా నిబం
6 ధన జ్ఞాపకము చేసుకొని యున్నాను. । కాబట్టి నీవు
ఇశ్రాయేలు పుత్రులతో ఇట్లు చెప్పుము —నేనే యె
హోవాను; నేను ఐగుప్తీయుల బరువుల కిందనుంచి
మిమ్ము వెలపటికి రావించి, వారి దాసత్వములోనుంచి
మిమ్ము విడిపించి, చాపిన బాహువు వల్లను, గొప్ప న్యా
7 యవిధుల వల్లను మిమ్ము విమోచించి, । మిమ్ము నాకు జను
లగా చేర్చుకొని, మీకు దేవుడనై యుందును. అప్పు
డు ఐగుప్తీయుల బరువుల కిందనుంచి మిమ్ము వెలపటికి
రావించిన మీ దేవుడగు యెహోవాను నేనే అని
8 మీరు తెలుసుకొందురు. । నేను అబ్రాహాముకు, ఈసా
కుకు, యాకోబుకును ఇచ్చెదనని, చెయి ఎత్తి ప్రమా
ణము చేసిన దేశములోకి మిమ్ము చేర్చి, దాని మీకు
స్వాస్థ్యముగా ఇత్తును; నేను యెహోవాను అని
అతనితో పలికెను.
9 ఆ ప్రకారమే మోషే ఇశ్రాయేలు పుత్రులతో
చెప్పెను. అయితే వారు మనోవ్యధ వల్లను, కఠిన
దాసత్వము వల్లను మోషే మాట వినలేదు.
10 తరువాత యెహోవా మోషేతో మాటలాడుచు।
11 —నీవు లోపటికి వెళ్లి ఐగుప్తు రాజైన పరోను చూచి,
—ఇశ్రాయేలు పుత్రులను తన దేశములోనుంచి వెలప
12 టికి పంప వలెనని అతనితో చెప్పుమనెను. । అప్పుడు
మోషే — ఇదుగో! ఇశ్రాయేలు పుత్రులు నా మాట
వినలేదు: అపవిత్రమైన† పెదవులు గల నా మాట
పరో ఏలాగు వినునని యెహోవా యెదుట పలికెను.
13 అప్పుడు యెహోవా మోషేతోను అహరోను
తోను మాటలాడుచు—ఇశ్రాయేలు పుత్రులను ఐగు
ప్తు దేశములోనుంచి వెలపటికి తెచ్చుటకై, ఇశ్రాయేలు
పుత్రుల యొద్దికిని పరో యొద్దికిని (వెళ్ల వలెనని)
వారికి ఆజ్ఞాపించెను.

వారి పితృ కుటుంబముల మూలపురుషులు ఎవరె 14
వరనగా; ఇశ్రాయేలు ప్రథమ కుమారుడైన రూబేను
కుమారులు, హనోఖు, ఫల్లు, హెస్రోను, కర్మీ. వీరు
రూబేను గోత్రికులు.
షిమ్యోను కుమారులు, యెమూయేలు, యామీను, 15
ఓహదు, యాకీను, సోహరు, కనాను స్త్రీకి కుమారు
డైన సౌలు. వీరు షిమ్యోను గోత్రికులు.
లేవీ కుమారుల పేరులు, వాని వాని వంశావళుల 16
చొప్పున ఏవేవంటే, గేర్షోను, కహాతు, మెరారీ.
లెవీ బ్రతికిన ఏండ్లు నూట ముప్పది యేడు.
గేర్షోను కుమారులు, వాని వాని వంశావళుల 17
చొప్పున, లిబ్నీ, షిమీ. । కహాతు కుమారులు, అమ్రా 18
ము, ఇస్సారు, హెబ్రోను, వుజ్జీయేలు. కహాతు బ్రతి
కిన ఏండ్లు నూట ముప్పది మూడు. । మెరారి కుమారు 19
లు, మహ్లి, మూషీ. వీరు తమ తమ వంశావళుల చొ
ప్పున లేవీ వంశకర్తలు.
అమ్రాము తన మేనత్తయైన యోకెబెదును పెం 20
డ్లాడెను. ఆమె అతనికి మోషేను, ఆహరోనును కనె
ను. అమ్రాము బ్రతికిన ఏండ్లు నూట ముప్పది యేడు.
ఇస్హారు కుమారులు కోరహు, నెఫెగు, జిక్రీ. ఉజ్జీ 21,22
యేలు కుమారులు, మిషాయేలు, ఎల్సాపాను, సిత్రీ.
అహరోను అమ్మీనాదాబు కుమార్తెయు నయోను 23
ను సహోదరియునైన యెలీషెబను పెండ్లాడెను.
ఆమె అతనికి నాదాబును, అబీహూను, యెలాజా
రును, ఈతామారును కనెను.
కోరహు కుమారులు, అస్సీరు, ఎల్కానా, అబీ 24
యాసాపు. వీరు కోరహీయుల కుటుంబములు.‡
ఆహరోను కుమారుడైన ఎలాజారు, పూతీయేలు 25
కుమార్తెలలో ఒకతెను పెండ్లి చేసుకొనెను. ఆమె
అతనికి పీనెహాసును కనెను. వీరు తమతమ కుటుంబ
ముల చొప్పున, లైవీయుల పితృ మూలపురుషులు.
ఇశ్రాయేలు పుత్రులను వారి సేనల చొప్పున ఐగుప్తు 26
దేశములోనుంచి వెలపటికి తీసుకొని రండని యె
హోవా ఎవరితో చెప్పెనో, ఆ అహరోను మో
షేయు వీరే. । ఇశ్రాయేలు పుత్రులను ఐగుప్తులో 27
నుంచి వెలపటికి రావించుటకు, ఐగుప్తు రాజైన పరో
తో మాటలాడిన వారు వీరే. ఆ మోషేయు అహ
రోను వీరే.
ఐగుప్తు దేశములో యెహోవా మోషేతో మా 28
టలాడిన దినమున। యెహోవా—నేను యెహోవా 29
ను; నేను నీతో చెప్పేది యావత్తు నీవు ఐగుప్తు రా

* లేక, ఒడంబడిక. † ఇబ్రీభాషలో, ఛేదనసంస్కారములేని. ‡ లేక, గోత్రములు.

30 జైన పరోతో పలుకుమని మోషేతో చెప్పెను. । అప్పు
డు మోషే—ఇదుగో! నేను అపవిత్రమైన పెదవులు
గలవాడను; పరో నా మాట ఏలాగు వినునని యె
హోవా యెదుట పలికెను.

1 7. అధ్యాయము. అందుకు యెహోవా
మోషేతో ఇట్లనెను:—ఇదుగో! నిన్ను పరోకు దేవు
నిగా చేసితిని; నీ అన్నయైన అహరోను నీ ప్రవక్తయై
2 యుండును. । నేను నీకు ఆజ్ఞాపించేది యావత్తు నీవు
పలుక వలెను. పరో తన దేశములోనుంచి ఇశ్రా
యేలు పుత్రులను పంపివేయ వలెనని నీ అన్నయైన
3 అహరోను అతనితో చెప్పును. । అయితే నేను పరో
హృదయమును దృఢపరిచి, ఐగుప్తు దేశములో
నా గురుతులు నా అద్భుతములు విస్తరింప చేతును. ।
4 పరో మీ మాట వినడు. కాగా నేను నా చెయ్యి
ఐగుప్తు మీద వేసి, గొప్ప న్యాయవిధులచేత నా సేన
లను, ఇశ్రాయేలు పుత్రులైన నా జనులను ఐగుప్తు
5 దేశములోనుంచి వెలపటికి తీసుకొని వచ్చెదను. । నేను
ఐగుప్తు మీద నా చెయ్యి చాపి, ఇశ్రాయేలు పుత్రులను
వారి మధ్యనుంచి తీసుకొనివచ్చిన తరువాత, నేను
6 యెహోవానని ఐగుప్తీయులు యెరుగుదురనెను. । మో
షే అహరోను ఆలాగు చేసిరి. యెహోవా తమకు
7 ఆజ్ఞాపించిన ప్రకారమే వారు చేసిరి. । వారు పరోతో
పలికినప్పుడు, మోషేకు ఎనబది ఏండ్లు, అహరోనుకు
ఎనబది మూడు ఏండ్లు ఉండెను.
8,9 మరియు యెహోవా— మీ పక్షముగా ఒక అ
ద్భుతము కనపరుచుడని పరో మీతో పలికినప్పుడు,
—నీవు నీ కర్ర పట్టుకొని, పరో యెదుట దాని పడవే
యుము; అది సర్పమవునని అహరోనుతో చెప్పుమని
మోషేతోను అహరోనుతోను చెప్పెను.
10 కాబట్టి మోషే అహరోను పరో యొద్దికి వెళ్లి
యెహోవా తమకు ఆజ్ఞాపించిన ప్రకారము చేసిరి.
అహరోను పరో యెదుటను, అతని ఉద్యోగస్థుల
యెదుటను తన కర్ర పడవేయగానే అది సర్పమా
11 యెను. । అప్పుడు పరో తన విద్వాంసులను మంత్రజ్ఞు
లను పిలిపించెను. ఐగుప్తు మంత్రజ్ఞులు కూడా తమ
12 మంత్రములచేత ఆలాగే చేసిరి. । వారిలో ప్రతివా
డును తన తన కర్రను పడవేసినప్పుడు, అవి సర్పము
లాయెను. అహరోను కర్ర వారి కర్రలు మింగివేసెను. ।
13 అప్పుడు యెహోవా పలికిన ప్రకారము, పరో
హృదయము దృఢమైనది; అతడు వారి మాట వినలేదు.
14 తరువాత యెహోవా మోషేతో ఇట్లనెను:—ప
రో హృదయము కఠినమైనది. అతడు ఈ జనులను
15 పంపివేయనొల్లక పోయెను. । ప్రొద్దుట నీవు పరో
యొద్దికి వెళ్లుము; ఇదుగో! అతడు ఏటి యొద్దికి జైలు
దేరి వచ్చును. నీవు అతని యెదురుకొనుటకు ఏటి
గట్టున నిలిచి, పాముగా చేయబడిన కర్ర నీ చేత
పట్టుకొని । అతని చూచి—అరణ్యమందు నన్ను సేవిం 16
చుటకు, నా జనులను పంపివేయుమని చెప్పుటకు, ఇ
బ్రీయుల దేవుడైన యెహోవా నన్ను నీ యొద్దికి
పంపెను. అయితే, ఇదుగో! నీవు ఇదివరకు విననైతివి. ।
—నేను యెహోవానని దీనివల్ల నీవు తెలుసుకొందు 17
వని యెహోవా చెప్పుచున్నాడు. ఇదుగో! నా చేతి
లో ఉన్న ఈ కర్రతో నేను ఏటిలోని నీళ్లు కొట్టు
దును; అవి రక్తముగా మార్చబడును. । ఏటిలోని చేపలు 18
చచ్చును; ఏరు కంపు కొట్టును. ఏటి నీళ్లు తాగుట
ఐగుప్తీయులకు అసహ్యమవునని పలుకుమనెను.
తరువాత—నీవు నీ కర్రను పట్టుకొని, ఐగుప్తు జల 19
ముల మీద, అనగా వారి నదుల మీద, వారి కాలు
వల మీద, వారి చెరువుల మీద, వారి నీటి గుంటల
న్నిటి మీదను నీ చెయ్యి చాపుము; అవి రక్తమవును;
ఐగుప్తు దేశమందంతటను, మాను పాత్రలలోను రాతి
పాత్రలలోను రక్తము ఉండునని అహరోనుతో పలు
కుమని యెహోవా మోషేతో చెప్పెను.
యెహోవా ఆజ్ఞాపించిన ప్రకారము, మోషే 20
అహరోను చేసిరి. అతడు పరో యెదుట, అతని
ఉద్యోగస్థుల యెదుటను, తన కర్రను పైకెత్తి ఏటి
నీళ్లు కొట్టెను. అప్పుడు ఏటి నీళ్లన్నియు రక్తమాయె
ను. । ఏటిలోని చేపలు చచ్చెను; ఏరు కంపు కొట్టెను. 21
ఐగుప్తీయులు ఏటి నీళ్లు తాగలేక పోయిరి. ఐగుప్తు
దేశమందంతట రక్తము ఉండెను.
ఐగుప్తు మంత్రజ్ఞులు కూడా తమ మంత్రముల వల్ల 22
ఆ ప్రకారము చేసిరి. అప్పుడు యెహోవా పలికిన
ప్రకారము, పరో హృదయము దృఢమైనది, అతడు
వారి మాట వినలేదు.
పరో తిరిగి తన ఇంటికి వెళ్లి, దీని యందైనను తన 23
మనస్సు ఉంచుకొనలేదు. । అప్పుడు ఐగుప్తీయులందరు 24
ఏటి నీళ్లు తాగలేక, తాగే నీళ్ల కొరకు ఏటిచుట్టు
తవ్విరి.
యెహోవా ఏరు కొట్టి, ఏడు దినములాయెను. 25

8. అధ్యాయము. అప్పుడు యెహోవా 1
—నీవు పరో యొద్దికి వెళ్లి అతనితో — నన్ను సేవిం
చుటకు నా జనులను పంపివేయుము; । నీవు వారిని పం 2
పనొల్లకపోతే ఇదుగో! నేను నీ పొలిమేరలన్నిటిని
కప్పలచేత బాధింతును. । ఏటిలో కప్పలు విస్తారము 3
గా పుట్టును. అవి నీ ఇంటిలోకి, నీవు పండుకొనే
గదిలోకి, నీ మంచము మీదికి, నీ ఉద్యోగస్థుల ఇం

డ్లలోకి, నీ జనుల మీదికి, నీ పొయిలలోకి, నీ పిండి
4 పిసికే తొట్లలోకిని ఎక్కివచ్చును. । ఆ కప్పలు నీ
మీదికి, నీ జనుల మీదికి నీ నవుకరులందరి మీదికి
ఎక్కివచ్చునని యెహోవా చెప్పియున్నాడని పలు
5 కుమని మోషేతో చెప్పెను. । తరువాత—నీవు కాలు
వల మీద, ఏరుల మీద, చెరువుల మీద నీ కర్రతో
నీ చెయ్యి చాపి, ఐగుప్తు దేశము మీదికి కప్పలను
యెక్కిరా చేయుమని అహరోనుతో చెప్ప వలెనని
యెహోవా మోషేతో చెప్పెను.

6 అప్పుడు అహరోను ఐగుప్తు జలముల మీద తన
చెయ్యి చాపెను. కప్పలు ఎక్కివచ్చి ఐగుప్తు దేశము
7 ను కప్పెను. । మంత్రజ్ఞులు కూడా తమ మంత్రముల
వల్ల ఆలాగు చేసి, ఐగుప్తు దేశము మీదికి కప్పలను
8 రాజేసిరి. । అప్పుడు పరో మోషేను అహరోనును పిలి
పించి — నా యొద్దనుంచి నా జనుల యొద్దనుంచి ఈ
కప్పలు తొలగించుటకు యెహోవాను వేడుకొ
నుడి. అప్పుడు ఈ జనులు యెహోవాకు యాగము
చేయుటకు వారిని పంపుదునని పలికెను.

9 అందుకు మోషే—నా మీద అతిశయించుము; నీ
మీదనుంచి, నీ ఇండ్లలోనుంచి ఈ కప్పలు ఎప్పుడు
చంపబడి ఏటిలోనే వాటి శేషము ఉండుటకు నేను
నీ కొరకు, నీ నవుకరుల కొరకు, నీ జనుల కొరకు
వేడుకొన వలెనో అది పలుకుటకు ఈ ఘనత వహిం
10 చుమని పరోను అడిగెను. । అందుకు అతడు—రేపే
అనెను. అప్పుడు అతడు—మా దేవుడైన యెహోవా
వంటి వాడెవడును లేడని, నీకు తెలిసే నిమిత్తము నీ
11 మాట చొప్పున కలుగును. । కప్పలు నీ యొద్దనుంచి, నీ
ఇండ్లలోనుంచి, నీ నవుకరుల యొద్దనుంచి, నీ జనుల
యొద్దనుంచి తొలగి పోవును; అవి ఏటిలోనే ఉం
డునని పలికెను.

12 మోషే అహరోను పరో యొద్దనుంచి బైలు వెళ్లి
నప్పుడు, యెహోవా పరో మీదికి రా జేసిన కప్పల
సంగతి విషయము మోషే అతని కొరకు మొర్రబెట్టె
13 ను. । యెహోవా మోషే మాట చొప్పున చేసెను;
అప్పుడు ఇండ్లలో, గ్రామములలో, పొలములలోను
14 కప్పలు చచ్చిపోయెను. । వాటిని కుప్పకుప్పలుగా కూ
15 ర్చినప్పుడు, భూమి కంపు కొట్టెను. । అయినను పరో
ఉపశమనమవుట చూచి, యెహోవా పలికిన ప్రకా
రము తన హృదయము కఠినపరుచుకొని వారి మాట
వినలేదు.

అప్పుడు—నీవు నీ కర్ర చాపి ఈ దేశపు ధూళిని 16
కొట్టుము; అది ఐగుప్తు దేశమందంతటను పేల* వునని
అహరోనుతో చెప్పుమని యెహోవా మోషేతో
పలికెను. । వారు ఆలాగు చేసిరి. అహరోను తన కర్ర 17
తో చెయ్యి చాపి, ఆ దేశపు ధూళిని కొట్టినప్పుడు
ఆ పేలు* మనుష్యుల మీద, జంతువుల మీదనుండెను.
ఐగుప్తు దేశమందంతటను ఆ దేశపు ధూళియంతయు
పేలైనది.

మంత్రజ్ఞులు కూడా పేలను పుట్టించుటకు తమ 18
మంత్రములచేత ఆలాగు చేసిరి; అయితే అది వారివల్ల
కాకపోయెను. ఆలాగు పేలు మనుష్యుల మీద, జం
తువుల మీదనుండెను. । అప్పుడు మంత్రజ్ఞులు—ఇది 19
దేవుని వేలు† అని పరోతో చెప్పిరి. అయినను యెహో
వా పలికిన ప్రకారము పరో హృదయము దృఢమై
నది; అతడు వారి మాట విన లేదు.

తరువాత — నీవు ప్రొద్దుట లేచి పరో యెదుట 20
నిలువుము. ఇదుగో! అతడు ఏటి యొద్దికి బైలుదేరి
వచ్చును. అప్పుడు నీవు అతనితో — నన్ను సేవించు
టకు నా జనులను పంపివేయుము. । నీవు నా జనులను 21
పంపని పక్షమందు చూడుము, నేను నీ మీదికి, నీ
ఉద్యోగస్థుల మీదికి, నీ జనుల మీదికి, నీ ఇండ్లలో
కిని జోరీగలను పంపుదును. ఐగుప్తీయుల ఇండ్లు, వారు
న్న నేలయు జోరీగలతో నిండి యుండును. । మరియు 22
భూమి మధ్యను నేను యెహోవానని నీకు తెలిసే
నిమిత్తము, ఆ దినమందు నేను నా జనులు నివసించు
చున్న గోషేననే దేశమును వేరుపరిచెదను. అక్కడ
జోరీగలు ఉండవు. । నా జనులను నీ జనులను ప్రత్యే 23
కింతును. రేపు ఈ గురుతు కలుగునని యెహోవా
చెప్పుచున్నాడు అని నీవు చెప్పవలెనని యెహోవా
మోషేతో పలికెను.

యెహోవా ఆలాగు చేసెను. క్రూరమైన జోరీ 24
గలు పరో ఇంటిలోకి, అతని ఉద్యోగస్థుల ఇండ్లలోకి
వచ్చి ఐగుప్తు దేశమంతట వ్యాపించెను. ఆ దేశము
జోరీగల వల్ల చెడిపోయెను. । అప్పుడు పరో మోషేను 25
అహరోను పిలిపించి—మీరు వెళ్లి ఈ దేశములో మీ
దేవునికి యాగము చేయుడని వారితో చెప్పెను.

అందుకు మోషే—ఆలాగు చేయుట తగదు; మేము 26
మా దేవుడైన యెహోవాకు చేయ వలసిన యాగము
ఐగుప్తీయులకు అసహ్యమైనది. ఇదుగో! మేము ఐగుప్తీ
యులకు అసహ్యమైన యాగ పశువులు వారి కన్నుల
యెదుట వేసేటప్పుడు, వారు మమ్మును రాళ్లతో కొట్టక

*లేక, దోమలు. †అనగా, పని.

27 మానుదురా? । మేము అరణ్యములోకి మూడు దినముల
ప్రయాణము వెళ్లి, ఆయన మాతో చెప్పే ప్రకారము
మా దేవుడైన యెహోవాకు యాగము చేతుమని చె
ప్పెను.

28 అప్పుడు పరో — మీరు అరణ్యములో మీ దేవు
డైన యెహోవాకు యాగము చేయుటకు మిమ్మును
పంపుదును. మెట్టుకు, దూరముగా వెళ్ల వద్దు. నా
కొరకు వేడుకొనుడని చెప్పెను.

29 అప్పుడు మోషే — ఇదుగో! నేను నీ యొద్దనుంచి
వెళ్లి, రేపు ఈ జోరీగలు పరో యొద్దనుంచి, అతని
నవుకరుల యొద్దనుంచి, అతని జనుల యొద్దనుంచి
తొలగి పోవుటకు యెహోవాను వేడుకొందును,
గాని యెహోవాకు యాగము చేయుటకు, పరో జను
లను పంపక ఇకను వంచన చేయ కూడదని చెప్పెను.

30 అప్పుడు మోషే పరో యొద్దనుంచి బైలువెళ్లి యె
31 హోవాను వేడుకొనెను. । యెహోవా మోషే మాట
చొప్పున చేసి, పరో యొద్దనుంచి, అతని ఉద్యోగ
స్థుల యొద్దనుంచి అతని జనుల యొద్దనుంచి ఆ జోరీ
గలను వెళ్లగొట్టెను. ఒక్కటి అయినను నిలువ లేదు. ।
32 అయినను పరో ఆ వేళను తన హృదయము కఠినపరు
చుకొని జనులను పంపకపోయెను.

## 9. అధ్యాయము.

1 తరువాత యెహోవా మోషేతో ఇట్లనెను:—
నీవు పరో యొద్దికి వెళ్లి—నన్ను సేవించుటకు నా జను
2 లను పంపివేయుము; । నీవు వారిని పంపనొల్లక, ఇంకా
3 వారిని నిర్బంధించితే, । ఇదుగో! యెహోవా చెయ్యి
పొలములోనున్న నీ పశువుల మీదనుండును, గుర్ర
ముల మీద, గాడిదెల మీద, ఒంటెల మీద, యెద్దుల
మీద, గొఱ్ఱెల మీద నుండును; మిక్కిలి వ్యసనకర
4 మైన తెగులు కలుగును; । అప్పుడు యెహోవా ఇశ్రా
యేలు పశువులను ఐగుప్తు పశువులను వేరుపరుచును.
ఇశ్రాయేలు పుత్రులకున్న అన్నిటిలో ఒక్కటి అయి
నను చావదు అని ఇబ్రీయుల దేవుడైన యెహోవా
5 చెప్పియున్నాడని అతనితో పలుకుమనెను. । మరియు
యెహోవా ఒక కాలము నిర్ణయించి—రేపే యె
హోవా ఈ దేశములో ఆ కార్యము చేసునని చె
ప్పెను.

6 మరునాడు యెహోవా ఆ కార్యము చేసెను;
అప్పుడు ఐగుప్తీయుల పశువులన్నియు చచ్చెను గాని
ఇశ్రాయేలు పుత్రుల పశువులలో ఒకటి అయినను
7 చావ లేదు. । దాని తెలుసుకొనుటకు పరో పంపినప్పుడు,
ఇదుగో! ఇశ్రాయేలు పశువులలో ఒకటి అయినను
చావ లేదు. అయినప్పటికి పరో హృదయము కఠిన
మైనది; అతడు జనులను పంప లేదు.

అప్పుడు యెహోవా—మీరు మీ పిడికిళ్ల నిండా 8
ఆవములోని బుగ్గి తీసుకొనుడి. మోషే పరో కన్నుల
యెదుట, ఆకాశము పైకి దాని చల్ల వలెను. । అప్పుడు 9
అది ఐగుప్తు దేశమంతట సన్నపు ధూళియై, ఐగుప్తు
దేశమంతట, మనుష్యుల మీద జంతువుల మీద, పొ
క్కులు పొక్కే దద్దురులు కలిగించునని మోషేతోను,
అహరోనుతోను చెప్పెను.

కాబట్టి వారు ఆవములోని బుగ్గి తీసుకొని పరో 10
యెదుట వచ్చి నిలిచిరి. అప్పుడు మోషే ఆకాశము
పైకి దాని చల్లగానే అది మనుష్యులకు జంతువులకు
పొక్కులు పొక్కే దద్దురులు కలిగించెను. । ఆ దద్దు 11
రులవల్ల మంత్రజ్ఞులు మోషే యెదుట నిలువ లేక పో
యిరి. ఆ దద్దురులు మంత్రజ్ఞులకు, ఐగుప్తీయులందరి
కిని కలిగెను. । అప్పుడు యెహోవా మోషేతో పలి 12
కిన ప్రకారము, యెహోవా పరో హృదయము
దృఢపరిచెను. అతడు వారి మాట విన లేదు.

తరువాత యెహోవా మోషేతో ఇట్లనెను:—నీవు 13
తెల్లవారగానే లేచి వెళ్లి పరో యెదుట నిలిచి, నన్ను
సేవించుటకు నా జనులను పంపివేయుము; । సర్వభూ 14
మిలో నా వంటివాడు ఎవడును లేడని నీకు తెలిసే
నిమిత్తము, ఈ సారి నేను నా తెగుళ్లన్నియు నీ హృ
దయములోకి, నీ ఉద్యోగస్థుల మీదికి, నీ జనము
మీదికిని పంపుదును. । ఇప్పుడు నీవు భూమి మీద 15
నుంచి నశించిపోయేలాగున, నేను నా చెయ్యి చాపి,
నిన్ను నీ జనులను తెగులుతో కొట్టివేయగలను, । గాని 16
సర్వభూమిలో నా నామము ప్రసిద్ధి కావలెననే
హేతువు చేత నిన్ను నిలువబెట్టితిని; ఈ హేతువు
చేతనే నా బలము నీకు కనపరిచితిని. । ఇంకా నీవు 17
నా జనులను పంపనొల్లక, వారికి విరోధముగా అతి
శయపడుచున్నావు. । ఇదుగో! రేపు యింత వేళను 18
నేను మిక్కిలి బాధకమైన వడిగండ్లను కురిపింతును.
ఐగుప్తు పునాది వేయబడిన దినము మొదలుకొని యిది
వరకు, అందులో అటువంటి వడిగండ్లు పడలేదు. ।
కాబట్టి నీవిప్పుడు పంపి నీ పశువులను, పొలములలో 19
నీకు కలిగినది యావత్తును శరణ స్థలమునకు త్వరగా
చేర్చుడి. పొలమునుండి యింటికి రప్పించబడని ప్రతి
మనుష్యుని మీదను జంతువు మీదను వడిగండ్లు కురు
సును; అప్పుడు చచ్చుననుమనెను.

పరో నవుకరులలో, యెహోవా మాటకు భయ 20
పడిన వాడు తన నవుకరులను తన పశువులను ఇండ్ల
లోకి త్వరగా పారిపోయేటట్టు చేసెను. । యెహో 21

వా మాట లక్ష్యపెట్టని వాడు తన నవుకరులను తన
పశువులను పొలములో విడిచెను.
22 అప్పుడు యెహోవా—నీ చెయ్యి ఆకాశము
వైపు చాపుము; ఐగుప్తు దేశమందలి మనుష్యుల మీ
దను జంతువుల మీదను, పొలముల కూరలన్నిటి మీ
దను వడిగండ్లు ఐగుప్తు దేశమంతట కలుగునని మో
షేతో చెప్పెను.
23 మోషే తన కర్రను ఆకాశము వైపు ఎత్తినప్పుడు
యెహోవా ఉరుములను, వడిగండ్లను కురిపించెను.
అగ్నియు నేల మీదికి వచ్చెను. యెహోవా ఐగుప్తు
24 దేశము మీద వడిగండ్లు కురిపించెను. । ఆలాగున వడి
గండ్లు, వడిగండ్లతో కలిసిన గొలుసుమెరుపు కలిగి
అధిక బాధ కలుగచేసెను. ఐగుప్తు దేశమందంతటను,
అది రాష్ట్రమైనది మొదలుకొని యెన్నడును అటువం
25 టివి కలుగలేదు. । ఆ వడిగండ్లు ఐగుప్తు దేశమందంతట
మనుష్యులు మొదలుకొని జంతువుల మట్టుకు పొల
ములోనున్నది యావత్తును చెడగొట్టెను. వడిగండ్లు
పొలములోని ప్రతి కూరను చెడగొట్టి, పొలములోని
26 ప్రతి చెట్టును విరిచినవి. । ఇశ్రాయేలు పుత్రులున్న
గోషెను దేశములోనే వడిగండ్లు కలుగలేదు.
27 అప్పుడు పరో మోషేను అహరోనును పిలువనం
పించి—నేను ఈ సారి పాపము చేసి యున్నాను. యె
హోవా న్యాయవంతుడు; నేను, నా జనులును
28 దుర్మార్గులము. । ఇది చాలును; ఇకను దేవుని శబ్దము
లు* వడిగండ్లు లేకపోవుటకు యెహోవాను వేడు
కొనుడి. మిమ్ము పంపివేతును; మీరు యికను నిలువరని
వారితో చెప్పెను.
29 అప్పుడు మోషే అతని చూచి—నేను ఈ పట్టణ
మునుంచి బైలు వెళ్లగానే, నా చేతులు యెహోవా
ను గూర్చి ఎత్తుదును. ఈ శబ్దములు* మానును, ఈ
వడిగండ్లును ఇకమీదట నుండవు. అందువల్ల భూమి
30 యెహోవాదని నీకు తెలియబడును. । అయినను నీవు,
నీ నవుకరులును ఇకను దేవుడైన యెహోవాకు భయ
పడరని నాకు తెలుసుననెను.
31 అప్పుడు అవిసె మొక్కలు మొగ్గలు తొడిగినవి;
యవల చేలు వెన్నులు వేసినవి గనుక అవిసెయు, య
32 వల చేలును చెడగొట్టబడెను. । అయితే గోధుములు
ఖుస్సెమెతు† ఎదగనందున అవి చెడ గొట్టబడ లేదు.
33 అప్పుడు మోషే పరో యొద్దనుంచి ఆ పట్టణము
బైలు వెళ్లి యెహోవాను గూర్చి తన చేతులు ఎత్తి
నప్పుడు, ఆ శబ్దములు వడిగండ్లును మానెను. వర్షము
భూమి మీద కురవలేదు.
అయినను పరో, వర్షము వడిగండ్లు, ఉరుములును 34
నిలిచి పోవుట చూచినప్పుడు, అతడు, అతని నవుకరు
లును ఇంకా పాపము చేయుచు, తమ హృదయము
లను మొండుపరుచుకొనిరి. । యెహోవా మోషే ద్వా 35
రా పలికిన ప్రకారము, పరో హృదయము దృఢ
మైనది. అతడు ఇశ్రాయేలు పుత్రులను పంపలేదు.

## 10. అధ్యాయము.

మరియు యెహోవా—నీవు పరోయొద్దికి వెళ్లు 1-2
ము; నేను ఈ నా గురుతులను అతనియెదుట కనపరు
చుటకును, నేను ఐగుప్తులో జరిగించిన వాటిని, నేను
వారిలో కలుగచేసిన నా గురుతులను నీవు నీ కుమా
రునికి, నీ కుమారుని కుమారునికిని వివరించుటకును,
నేను యెహోవానని మీరు తెలుసుకొనుటకును నేను
అతని హృదయము, అతని నవుకరుల హృదయములను
మొండుపరిచితినని మోషేతో చెప్పెను.
కాబట్టి మోషే, అహరోనును పరోయొద్దికి వెళ్లి 3
అతనితో ఇట్లనిరి,—ఇబ్రీయుల దేవుడైన యెహో
వా చెప్పినదేమనగా—నీవు ఎన్నాళ్లి మట్టుకు నాకు
లొంగనొల్లక ఉందువు? నన్ను సేవించుటకు నా జను
లను పంపివేయుము; । నీవు నా జనులను పంపనొల్లని 4
పక్షమందు,ఇదుగో! రేపు నేను మిడతలను నీ ప్రాంత
ములలోకి రప్పింతును; । అవి నేల ముఖము కప్పును; ఎవ 5
డును నేలను చూడ లేకపోవును. తప్పిన శేషమనగా,
వడిగండ్లనుంచి మీకు మిగిలినదాని అవి తినివేసును.
మీ కొరకు పొలములో మొలిచిన ప్రతి చెట్టును
తినును. । మరియు, అవి నీ యిండ్లలోను, నీ నవుకరు 6
లందరి యిండ్లలోను, ఐగుప్తీయులందరి యిండ్లలోను
నిండును. నీ తండ్రులు, నీ తండ్రుల తండ్రులైనను ఈ
భూమి మీదనున్న నాటినుంచి నేటి వరకు వారు అట్టి
వాటిని చూడ లేదని పలికెననిరి. అప్పుడు అతడు
తిరిగి పరో యెదుటనుంచి బైలువెళ్లెను.
అప్పుడు పరో నవుకరులు—ఎన్నాళ్లి మట్టుకు, 7
వీడు మనకు ఉరి వలె నుండును? ఈ మనుష్యులు
తమ దేవుడైన యెహోవాను సేవించుటకు వారిని
పంపుము. ఐగుప్తు నశించినదని నీకు ఇంకను తెలియ
లేదా? అని అతనితో పలికిరి.
అప్పుడు మోషే అహరోను, పరోయొద్దికి తిరిగి 8
రప్పించబడిరి. అప్పుడు అతడు — మీరు వెళ్లి మీ

* లేక, ఉరుములు. † ఒక ధాన్యభేదము.

దేవుడైన యెహోవాను సేవించుడి; ఎవరెవరు వెళ్లు
దురు అని? వారిని అడిగెను.
9 అందుకు మోషే—మా పిన్న పెద్దలతో వెళ్లుదు
ము; మా కుమారులను మా కుమార్తెలను, మా మంద
లను, మా పశువులను తీసుకొని వెళ్లుదుము; మాకు
యెహోవా సంభ్రమము కలుగునని చెప్పెను.
10 అప్పుడు అతడు నేను మిమ్మును మీ చిన్నవారిని
పంపే ప్రకారము, యెహోవా ఆలాగే మీకు తో
డై యుండుగాక. ఇదుగో! కీడు మీ యెదుట ఉన్నది.।
11 ఆలాగు కాదు. । పురుషులైన మీరే వెళ్లి యెహో
వాను సేవించుడి; మీరు కోరినది అదే గదా అని వా
రితో పలికెను. అప్పుడు పరో సమ్ముఖమునుంచి వారు
వెళ్లగొట్టబడిరి.
12 అప్పుడు యెహోవా మోషేతో—మిడతల కొ
రకు ఐగుప్తు దేశము మీద నీ చెయ్యి చాపుము; అవి
ఐగుప్తు దేశము మీదికి వచ్చి ఈ దేశపు పైరులన్నియు
అనగా వడిగండ్లకు తప్పి మిగిలిన యన్నిటిని తినివేసు
నని చెప్పెను.
13 మోషే ఐగుప్తు దేశము మీద తన కర్రను చాపి
నప్పుడు, యెహోవా ఆ పగలంతయు ఆ రాత్రి
అంతయు ఆ దేశము మీద తూర్పు గాలి విసరజేసెను.
ఉదయమందు తూర్పుగాలి మిడతలను తెచ్చెను.।
14 ఆ మిడతలు ఐగుప్తు దేశమంతటి మీదికి వచ్చి ఐగుప్తు
ప్రాంతములన్నిటిలోను దిగి నిలిచెను. అవి మిక్కిలి
బాధకమైనవి. అంతకుమునుపు వాటి వంటి మిడతలు
ఉండ లేదు. వాటి తరువాతను అటువంటివి ఉండవు.।
15 అవి నేలంతయు కప్పెను. । ఆ దేశమున చీకటి కమ్మె
ను. అవి ఆ దేశపు కాయకూరగలన్నియు ఆ వడిగం
డ్లకు తప్పి మిగిలిన వృక్ష ఫలములన్నియు తినివేసెను.
ఐగుప్తు దేశమంతట చెట్ల మీదనేమి పొలముల కూర
లమీదనేమి పచ్చనిది యేదియు మిగిలి యుండలేదు.
16 అప్పుడు పరో మోషేను అహరోనును త్వరగా
పిలిపించి—నేను మీ దేవుడైన యెహోవాకు మీకును
17 విరోధముగా పాపము చేసి యున్నాను; । దయచేసి
ఈ సారి మాత్రమే నా పాపము క్షమించి, నా మీ
దనుంచి ఈ చావు మాత్రమే తొలగించుటకు మీ
దేవుడైన యెహోవాను వేడుకొనుడని చెప్పెను.
18 అతడు పరో యొద్దనుంచి బైలువెల్లి యెహోవా
19 ను వేడుకొనెను. । అప్పుడు యెహోవా మహాబల
మైన పడమటి గాలిని తిప్పి విసరచేసెను. అది ఆ
మిడతలను కొంచుపోయి, ఎర్రసముద్రములో పడ
వేసెను. ఐగుప్తు ప్రాంతములన్నిటిలోను ఒక్క మిడ
తయైనను నిలువ లేదు. । అయినను యెహోవా పరో 20
హృదయము దృఢపరిచెను; అతడు ఇశ్రాయేలు పుత్రు
లను పంప లేదు.
అప్పుడు యెహోవా మోషేతో—ఆకాశము 21
వైపు నీ చెయ్యి చాపుము. ఐగుప్తు దేశము మీద
చీకటి, ముట్టుకొన తగినంత చీకటి* కలుగునని పలి
కెను.
మోషే ఆకాశము వైపు తన చెయ్యి ఎత్తినప్పుడు, 22
ఐగుప్తు దేశమంతట మూడు దినములు గాఢాంధకార
ము కలిగి యుండెను. । మూడు దినముల మట్టుకు ఒక 23
నికి ఒకడు కనబడ లేదు; ఎవడును తానున్న చోట
నుంచి లేవనే లేదు. అయితే, ఇశ్రాయేలు పుత్రులం
దరి నివాస స్థలములలో వారికి వెలుగు ఉండెను.
అప్పుడు పరో మోషేను పిలిపించి—మీరు వెళ్లి 24
యెహోవాను సేవించుడి. మీ మందలు మీ పశు
వులు మాత్రమే నిలువ వలెను. మీ బిడ్డలు మీతో
కూడా వెళ్ల వచ్చునని చెప్పెను.
అందుకు మోషే—మేము మా దేవుడైన యెహో 25
వాకు అర్పించ వలసిన యాగ హోమముల కొరకు
నీవు మాకు పశువులు ఇయ్య వలెను. । మా పశువులును 26
మాతో కూడా రావలెను. ఒక డెక్కయైనను విడువ
బడదు. మా దేవుడైన యెహోవాను సేవించుటకు,
వాటిలోనివి తీసుకొన వలెను. మేము దేనితో యె
హోవాను సేవించ వలెనో, మేము అక్కడికి చేరక
మునుపు అది మాకు తెలియదని చెప్పెను.
అయితే యెహోవా పరో హృదయము దృఢ 27
పరిచెను; అతడు వారిని పంపనొల్లక ఉండెను.
అప్పుడు పరో — నా యెదుటనుంచి పొమ్ము; 28
భద్రము సుమీ! మళ్లి నా ముఖము చూడ వద్దు; నీవు
నా ముఖము చూచితే ఆ దినమున మరణమవుదువని
అతనితో చెప్పెను. । అందుకు మోషే — నీవు పలికి 29
నది సరి; నేను మళ్లి నీ ముఖము చూడనని చెప్పెను.

## 11. అధ్యాయము.

అప్పుడు యెహోవా మోషేతో—పరో మీదికి, 1
ఐగుప్తు మీదికి ఇంకొక బాధను రప్పింతును; తరువాత
అతడు ఇక్కడనుంచి మిమ్ము పంపివేసును. అతడు
మిమ్ము పంపేటప్పుడు, ఇక్కడనుంచి నిశ్చయముగా
మిమ్ము కేవలము తోసివేసును. । కాబట్టి తన తన చెలి 2
కాని యొద్ద ప్రతి మనుష్యుడును, తన తన చెలికత్తె

* లేక, ఆ చీకటిలో తడవులాడుదురు.

యొద్ద ప్రతి స్త్రీయును వెండి నగలను, బంగారు నగ
లను, అడుగుకొనుటకు జనులతో పలుకుమని చెప్పెను.
3 అప్పుడు యెహోవా జనుల యందు ఐగుప్తీయుల
దయాదృష్టి* కలుగ చేసెను. అదియు గాక, ఐగుప్తు
దేశములో మోషేయనే మనుష్యుడు పరో నవుకరుల
దృష్టికిని జనుల దృష్టికిని మిక్కిలి గొప్పవాడై యుం
డెను.
4 మరియు, మోషే యిట్లనెను— యెహోవా చెప్పి
నదేమనగా—అర్ధరాత్రివేళను నేను ఐగుప్తు దేశము
5 లోకి బైలువెళ్లుదును. । అప్పుడు సింహాసనము మీద
కూచున్న పరో తొలిపిల్ల మొదలుకొని, తిరగటి
వెనుకనున్న దాసి తొలిపిల్ల మట్టుకు, ఐగుప్తు దేశమం
దలి తొలి పిల్లలందరును చత్తురు. జంతువులలోను,
6 తొలి పిల్లలన్నియు చచ్చును. । అప్పుడు ఐగుప్తు దేశ
మందంతట పెద్ద ఘోష పుట్టును. అటువంటి ఘోష
అంతకముందు పుట్ట లేదు; అటువంటిది యికమీదట
7 పుట్టదు.। అయినను యెహోవా ఐగుప్తీయులను ఇశ్రా
యేలీయులను వేరుపరుచునని మీకు తెలియబడే నిమి
త్తము, మనుష్యులు మొదలుకొని మృగముల పర్యంత
ము, ఏ కుక్కయును ఇశ్రాయేలు పుత్రులలో యెవ
నికైనను విరోధముగా తన నాలుక వాడి చేయదు.।
8 అప్పుడు నీ నవుకరులైన వీరందరు నా యొద్దికి దిగి
వచ్చి నాకు సాగిలపడి,—నీవును నీ పాదసేవకులైన జను
లందరును బైలువెళ్లుడని చెప్పుదురు. ఆ తరువాత
నేను బైలు వెళ్లుదునని చెప్పి, పరోయొద్దనుంచి అత్యా
గ్రహముతో బైలువెళ్లెను.
9 అప్పుడు యెహోవా—ఐగుప్తు దేశములో నా
అద్భుతములు విస్తారమవుటకు పరో మీ మాట విన
డని మోషేతో చెప్పెను.
10 మోషేయు అహరోను పరోయెదుట ఆ అద్భుత
ములనన్నిటిని చూపిరి. యెహోవా పరో హృద
యము దృఢపరిచెను. అతడు తన దేశములోనుంచి
యిశ్రాయేలు పుత్రులను పంపలేదు.

## 12. అధ్యాయము.

1 మరియు ఐగుప్తు దేశములో యెహోవా మోషే
2 తోను అహరోనుతోను ఇట్లుచెప్పెను.।ఈ నెల మీకు
నెలలలో మొదటిది; ఇది మీ సంవత్సరమునకు మొద
3 టినెల.। మీరు ఇశ్రాయేలు సర్వసంఘముతో పలికి—
ఈ నెల దశమదినమున వారు తమ తమ కుటుంబములు†
కొరకు ఒక్కొకడు గొర్రెపిల్లనైనను మేకపిల్లనైనను
అనగా ప్రతి యింటికిని ఒక గొర్రెపిల్లనైనను ఒక
మేకపిల్లనైనను తీసుకొన వలెను । ఆ పిల్లన అంత తిను 4
టకు ఆ కుటుంబము కొంచెమైనందున, ఒక గొర్రెపిల్ల
ఎక్కువైతే వాడును వాని పొరుగింటివాడును, మను
ష్యుల లెక్కచొప్పున దాని తీసుకొన వలెను.। ఆ గొర్రె 5
పిల్లను ప్రతివాని తిండి మేరకు వాని వాని లెక్కించి
తీసుకొన వలెను.।నిదోషమైన ఏడాది మగపిల్లను తీసు 6
కొన వలెను. గొర్రెలనుంచియైనను మేకలనుంచియై
నను దాని తీసుకొన వచ్చును.

అప్పుడు ఈ నెల పదునాలుగవ దినము పర్యంత 7
ము మీరు దాని ఉంచుకొన వలెను. తరువాత ఇశ్రా
యేలు సంఘమందు అందరు ప్రదోష కాలమందు
దాని చంపి దాని రక్తములో కొంచెము తీసికొని, తా
ము దాని తినే ఇండ్ల ద్వారబంధపు రెండు నిలువు
కమ్ముల మీదను, పైకమ్మి మీదను దాని జల్లి। ఆ రాత్రి 8
యందే, అగ్నిచేత కాల్చబడిన ఆ మాంసమును, పొం
గని భక్ష్యములను తిన వలెను. చేదైన కూరలతో దాని
తిన వలెను.। ఉడికి ఉడకనిదైనను, నీళ్లతో వండబడిన 9
దైనను తినక, అగ్నిచేత కాల్చబడిన దాని తల దాని
కాళ్లు దానిలోపటివాటిని తిన వలెను.। ఉదయపర్యం 10
తము దానిలోనిది యేదియు మిగిలించ కూడదు. ఉద
యకాల పర్యంతము దానిలో మిగిలినదాని అగ్నిచేత
దహించ వలెను.

మీరు దాని తిన వలసిన విధమేదనగా మీ నడుము 11
కట్టుకొని, మీ చెప్పులు తొడుగుకొని, మీ చేతి
కర్రలు చేత పట్టుకొని దాని త్వరగా తిన వలెను; అది
యెహోవా పస్క।‡ ఆ రాత్రి నేను ఐగుప్తు దేశము 12
ద్వారా వెళ్లి, ఐగుప్తు దేశమందలి మనుష్యులు మొద
లుకొని మృగముల పర్యంతమును, తొలి సంతానమం
తయు హతముచేసి, ఐగుప్తు దేవతలకందరికిని న్యాయ
పుతీర్పు నెరవేర్చుదును. నేను యెహోవాను.। ఆ 13
రక్తము మీరు ఉన్న ఇండ్ల మీద మీకు గురుతైయుం
డును. నేను ఆ రక్తము చూచి మిమ్ము విడిచి వెళ్లుదును.
నేను ఐగుప్తు దేశమును హతము చేసేటప్పుడు, (మిమ్ము)
సంహరించుటకు తెగులు మీకు రాదు.। కాబట్టి ఈది 14
నము మీకు జ్ఞాపకార్థమైనదై యుండును. మీ తరతర
ముల మట్టుకు, మీరు యెహోవాకు దాని పండుగగా
ఆచరించ వలెను. నిరంతరము ఈ కట్టడచొప్పున పం
డుగగా దాని ఆచరించ వలెను.।యేడు దినములు పొం 15
గని భక్ష్యమలే తిన వలెను. మొదటి దినమందే మీ
ఇండ్లలో పులిసి పొంగినది యేదియు ఉండకుండా

*లేక, కటాక్షము. †ఇబ్రీలో, తండ్రులయిండ్లచొప్పున. ‡అనగా, విడుచుట.

శుభ్రముచేయ వలెను. మొదటి దినము మొదలుకొని
ఏడవ దినము మట్టుకు ఎవడు పులిసినదాని తినునో, ఆ
మనుష్యుడు ఇశ్రాయేలులోనుంచి ఖండించబడును.
16 ఆ మొదటి దినమున పరిశుద్ధ సంఘముగా, ఏడవ
దినమున పరిశుద్ధ సంఘముగా మీరు కూడ వలెను, ఆ
దినములు, ప్రతి వాడు తినేది మాత్రమే మీవల్ల సిద్ధ
పరచబడ వచ్చును. అదిగాక మరి యే పనియు చేయ
17 బడ కూడదు. । పొంగని భక్ష్యముల పండుగ ఆచరించ
వలెను. ఈ దినమందే నేను మీ సేనలను ఐగుప్తు దేశ
ములోనుంచి వెలపటికి రప్పించితిని గనుక ఈ నిత్య
మైన కట్టడ చొప్పున మీ తరతరములలో ఈ దినము
ఆచరించ వలెను.
18 మొదటి నెల పదునాలుగవ దినమున సాయంకా
లము మొదలుకొని ఆ నెల ఇరువది యొకటో దిన
మున, సాయంకాల పర్యంతము మీరు పొంగని భక్ష్య
19 ములే తిన వలెను. । ఏడు దినములు మీ ఇండ్లలో
పొంగినది యేదియు ఉండ కూడదు. పులిసి పొం
గిన దాని తినే వాడెవడో వాడు అన్యుడైనను, దేశ
ములో పుట్టిన వాడైనను ఇశ్రాయేలు సంఘములో
20 నుంచి ఖండించబడ వలెను. । మీరు పులిసినది యేది
యు తినక, మీ నివాస స్థలములన్నిటిలోను పొంగ
నివే తిన వలెనని చెప్పుమనెను.
21 కాబట్టి మోషే ఇశ్రాయేలు పెద్దలనందరిని పిలి
పించి వారితో—మీరు మీ కుటుంబముల చొప్పున,
మందలోనుంచి ఒక్కొక పిల్లను తీసుకొని పస్కా (పశు
22 వును) వధించుడి. । మరియు హిస్సోపు గుత్తి* తీసు
కొని పళ్లెములో ఉన్న రక్తములో దాని ముంచి దాని
తో ద్వారబంధపు పైకమ్మి మీదను, రెండు నిలువు
కమ్ముల మీదను పళ్లెము లోని రక్తము చల్ల వలెను.
తరువాత మీలో ఎవడును ఉదయకాల పర్యంతము
తన ఇంటి ద్వారములోనుంచి బైలు వెళ్ల కూడదు. ।
23 యెహోవా ఐగుప్తీయులను హతము చేయుటకు దేశ
సంచారము చేసేటప్పుడు, ఆయన ద్వారబంధపు పై
కమ్మి మీదను రెండు నిలువు కమ్ముల మీదను ఉండే
రక్తము చూచును. అప్పుడు యెహోవా ఆ తలు
పును విడిచి, (మిమ్ము) హతము చేయుటకు సంహార
కుని మీ యిండ్లలోకి వెళ్లనియ్యడు.
24 కాబట్టి అది నిరంతరము మీకు మీ కుమారులకును
కట్టడ అని మీరు ఈ కార్యము ఆచరించ వలెను. ।
25 యెహోవా తాను పలికిన ప్రకారము, మీకిచ్చే దేశ
మందు మీరు ప్రవేశించిన తరువాత, మీరు దీని ఆచ
రించ వలెను. । మరియు మీ కుమారులు — మీరు జరి 26
గించే ఈ ఆచారమేమిటి అని! మిమ్ము అడిగినప్పుడు।
మీరు — ఇది యెహోవా పస్కా యాగము; ఆయన 27
ఐగుప్తీయులను హతము చేసి, మన ఇండ్లను తప్పించి
నప్పుడు ఆయన, ఐగుప్తులో ఉన్న ఇశ్రాయేలు పు
త్రుల ఇండ్లను విడిచెనన వలెనని పలికెను. అప్పుడు
జనులు సాగిలపడి నమస్కారము చేసిరి.
అప్పుడు ఇశ్రాయేలు పుత్రులు వెళ్లి ఆలాగు 28
చేసిరి. యెహోవా మోషేకు అహరోనుకును ఆజ్ఞా
పించిన ప్రకారమే చేసిరి.
అర్ధరాత్రివేళ జరిగినదేమనగా, సింహాసనము 29
మీద కూర్చున్న ఫరో తొలిపిల్ల మొదలుకొని, చెర
సాలలోనున్న ఖైదియొక్క తొలిపిల్ల పర్యంతము,
ఐగుప్తు దేశమందలి తొలి పిల్లలనందరిని పశువుల తొలి
పిల్లలనన్నిటిని యెహోవా హతము చేసెను.
ఆ రాత్రి ఫరో అతని నవుకరులందరు ఐగుప్తీ 30
యులందరును లేచినప్పుడు, శవము లేని ఇల్లు ఒక్కటి
అయినను ఉండ లేదు గనుక ఐగుప్తులో పెద్ద ఘోష
పుట్టెను. । ఆ రాత్రివేళ అతడు మోషేను అహరో 31
నును పిలిపించి వారితో—మీరు, ఇశ్రాయేలు పుత్రు
లును లేచి నా జనుల మధ్యనుంచి బైలు వెళ్లుడి. మీ
రు పలికిన ప్రకారము వెళ్లి, యెహోవాను సేవించు
డి. । మరియు మీరు పలికిన ప్రకారము మీ మంద 32
లను మీ పశువులను తీసుకొని వెళ్లుడి; నన్ను దీవించు
డని చెప్పెను.
అప్పుడు ఐగుప్తీయులు — మనమందరము చచ్చిన 33
వారమనుకొని, తమ దేశములోనుంచి ప్రజలను త్వర
గా పంపుచు వారిని బలవంతము చేసిరి. । కాబట్టి ప్ర 34
జలు, పులియకమునుపే పిండి ముద్ద తమ తమ బట్ట
లతో కట్టుకొని, తమ పిండి పిసికే తొట్లతో కూడా
తమ భుజముల మీద వేసుకొని పోయిరి. । ఇశ్రాయే 35
లు పుత్రులు మోషే మాట చొప్పున చేసి, ఐగుప్తీయుల
యొద్ద వెండి నగలను, బంగారు నగలను, వస్త్రము
లను అడుగుకొనిరి. । అప్పుడు యెహోవా ప్రజల 36
యందు ఐగుప్తీయుల దయాదృష్టి కలుగచేసెను, గనుక
వారు వారికి (కావలసినవాటిని) ఇచ్చిరి. ఆలాగు
వారు ఐగుప్తీయులను దోచుకొనిరి.
అప్పుడు ఇశ్రాయేలు పుత్రులు, పిల్లలు గాక పా 37
దచారులైన ఆరు లక్షల మనుష్యులు, రయమ్సేసునుంచి
సుక్కోతుకు ప్రయాణమై వెళ్లిరి. । అనేకులైన అన్య 38
జనుల సమూహము, గొర్రెలు, యెద్దులు మొదలైన

* లేక, కట్ట.

పశువుల గొప్ప సమూహమును వారితో కూడా బైలు
39 వెళ్లెను. । వారు ఐగుప్తులోనుంచి తెచ్చిన పిండిముద్దతో
పొంగని అట్లు వండుకొనిరి. వారు ఐగుప్తులోనుంచి
తోసివేయబడి తడవు చేయ లేరైరి గనుక అది పులి
సియుండ లేదు; మరియు తమకు వేరొక ఆహారము
సిద్ధపరుచుకొన లేదు.
40 ఐగుప్తులో నివసించిన ఇశ్రాయేలు పుత్రుల నివా
41 సకాలము నన్నూట ముప్పది సంవత్సరములు. । ఆ న
న్నూట ముప్పది సంవత్సరములైన తరువాత జరిగిన
దేమనగా, ఆ దినమందే యెహూవా సేనలన్నియు
42 ఐగుప్తు దేశములోనుంచి బైలు దేరి పోయెను. । ఐగుప్తు
దేశములోనుంచి వారిని బైటికి తెచ్చినందున ఇది యె
హూవా నిమిత్తము ఆచరించ తగిన రాత్రి. ఇశ్రా
యేలు పుత్రులందరు తమ తమ తరములలో యెహూ
వాదని ఆచరించ తగిన రాత్రి ఇదే.
43 మరియు యెహూవా మోషేతోను అహరోను
తోను — ఇది పస్కాను గూర్చిన కట్టడ, ఏ అన్యుని
44 కుమారుడు దాని తిన కూడదు, । గాని వెండితో
కొనబడిన ఒకని దాసునికి ఛేదనసంస్కారము చేసిన
45 తరువాత, వాడు దాని తిన వచ్చును. । పరదేశియు,
46 కూలివారును దాని తిన కూడదు. । అది ఒక్క ఇం
ట్లోనే తినబడ వలెను; దాని మాంసములో కొంచెమై
నను ఇంట్లోనుంచి బైటికి తీసుకొనిపో కూడదు. దా
నిలో ఒక్క యెముకనైనను మీరు విరవ కూడదు. ।
47 ఇశ్రాయేలు సంఘము వారందరు ఇది ఆచరించ వలె
48 ను. । పరదేశి నీ యొద్ద నివసించుచు, యెహూవా
పస్కాను ఆచరించ వలెనని యుంటే, అతనికి కలిగిన
ప్రతి మగవాడు ఛేదనసంస్కారము పొంద వలెను.
తరువాత అతడు దాని ఆచరించుటకు చేర వచ్చును.
అతడు మీ దేశములో పుట్టినవాని వలె ఉండును. ఛేద
49 నసంస్కారము లేనివాడు దాని తిన కూడదు. । దేశ
స్థునికిని మీలో నివసించే పరదేశికిని పద్ధతి ఒక్కటే
ఉండ వలెనని చెప్పెను.
50 ఆలాగున ఇశ్రాయేలు పుత్రులందరు చేసిరి. యె
హూవా మోషేకు అహరోనుకు ఆజ్ఞాపించిన ప్రకా
51 రమే చేసిరి. । యెహూవా ఇశ్రాయేలు పుత్రులను,
వారి వారి సేనల చొప్పున ఆ దినమందే ఐగుప్తు దేశ
ములోనుంచి వెలపలికి రప్పించెను.

## 13. అధ్యాయము.

1-2 అప్పుడు యెహూవా మోషేతో—ఇశ్రాయేలు
పుత్రులలో మనుష్యులయొక్కయు పశువులయొక్క
యు ప్రథమ సంతానమనగా, ప్రతి తొలిచూలి పిల్లను
నా కొరకు ఏర్పరుచుము; అది నాదని చెప్పెను.

అప్పుడు మోషే ప్రజలతో ఇటనెను—మీరు దా 3
సులైయున్న ఐగుప్తులోనుంచి మీరు బైలుదేరి వచ్చిన
ఈ దినము జ్ఞాపకము చేసుకొనుడి. భుజబలముచేత
యెహూవా దానిలోనుంచి మిమ్ము బైటికి రప్పించెను.
పులిసినది యేదియు తినబడ కూడదు. । అబీబనే* నెల 4
లో ఈ దినమందే మీరు బైలుదేరి వచ్చితిరి.

కాబట్టి యెహూవా — నీకిత్తునని నీ పితృలకు 5
ప్రమాణము చేసిన ప్రకారము, పాలు తేనె ప్రవ
హించే దేశమనకనగా కనానీయులు, హిత్తీయులు
అమోరీయులు హివ్వీయులు, యెబూసీయులు అనే
వారి దేశమునకు నిన్ను తీసుకొని వచ్చిన తరువాత,
నీవు ఈ కృత్యము ఈ నెలలోనే ఆచరించ వలెను. ।
ఏడు దినములు నీవు పొంగనివే తిన వలెను. ఏడవ 6
దినమున యెహూవా పండుగను ఆచరించ వలెను. ।
పొంగనివే ఏడు దినములు తినబడ వలెను. పులిసినది 7
యేదియు నీ యొద్ద కనబడ కూడదు. నీ ప్రాంతముల
న్నిటిలోను పులిసినది యేదియు నీ యొద్ద కనబడ
కూడదు.

మరియు ఆదినమున నీవు—నేను ఐగుప్తులోనుంచి 8
బైలుదేరి వచ్చినప్పుడు యెహోవా నాకు చేసినదాని
నిమిత్తము, ఇది ఆచరించుచున్నానని నీ కుమారునికి తెలి
యచెప్ప వలెను. । యెహూవా బోధన ప్రమాణము నీ 9
నోట ఉండుటకు, బలమైన చేతితో యెహూవా
ఐగుప్తులోనుంచి నిన్ను బైటికి రప్పించెనని ఇది నీ చేతి
మీద నీకు గురుతుగాను నీ కన్నుల మధ్యను జ్ఞాపకా
ర్థముగానుండును. । కాబట్టి ప్రతి సంవత్సరము ఈ 10
కట్టడ, దాని కాలమున ఆచరించ వలెను.

యెహూవా, తాను నీకు నీ పితృలకును ప్రమా 11
ణము చేసిన ప్రకారము; ఆయన కనానీయుల దేశ
ములోకి నిన్ను చేర్చి, దాని నీకిచ్చిన తరువాత, । ప్రతి 12
తొలిచూలి పిల్లను, నీకు కలిగే పశువుల సంతానము
లో ప్రతి తొలి పిల్లను నీవు యెహూవాకు ఏర్పరచ
వలెను. ఆ మగ సంతానము యెహూవాది, । గాని 13
ప్రతి గాడిదె తొలిపిల్లను, దానికి మారుగా గొర్రె
పిల్లను ఏర్పరిచి, విమోచించ వలెను. ఆలాగున దాని
విమోచించకుంటే, దాని తలను ఛేదించ వలెను. నీ
కుమారులలో తొలిచూలియైన ప్రతి మగవాని (ఆలా
గున) విమోచించ వలెను.

* అనగా, వెన్నుల మాసము.

14 వచ్చేకాలమందు నీ కుమారుడు—ఇది యేమిటి అని
నిన్ను అడిగినప్పుడు, నీవు వానితో—భుజబలముచేత
యెహోవా మనలను దాసుల గృహమైన ఐగుప్తులో
15 నుంచి బైటికి తీసుకొని వచ్చెను.। అప్పుడు ఫరో మన
లను పంపక కఠినుడైనప్పుడు, యెహోవా మనుష్యుల
తొలి సంతానము మొదలుకొని జంతువుల తొలి సం
తాన పర్యంతము, ఐగుప్తు దేశమందు తొలి సంతాన
మంతయు సంహరించెను. ఆ హేతువుచేతను నేను
మగదైన ప్రతి తొలి చూలి పిల్లను, యెహోవాకు
యాగపశువుగా అర్పించుచున్నాను. అయితే నా
కుమారులలో ప్రతి తొలి సంతానమును (మార్పువల్ల)
16 విమోచించుచున్నానని చెప్ప వలెను. । అది నీ చేతి
మీద గురుతుగాను, నీ కన్నుల మధ్యను లలాటపత్రి
కగాను ఉండ వలెను. భుజ బలము చేత యెహోవా
మనలను ఐగుప్తులోనుంచి బైటికి రప్పించెననెను.

17 మరియు ఫరో జనులను పంపిన తరువాత, దేవుడు
—ఈప్రజలు యుద్ధము చూచినప్పుడు, వారు పశ్చా
త్తాపపడి ఐగుప్తుకు తిరుగుదురేమో అనుకొని, ఫిలిష్తీ
యుల దేశము సమీపమైనందున,* ఆ మార్గముగా
18 వారిని నడిపించ లేదు. । అయితే దేవుడు ఎఱ్ఱ సము
ద్రముయొక్క అరణ్య మార్గమున ప్రజలను చుట్టు
గా నడిపించెను. ఇశ్రాయేలు పుత్రులు ఐగుప్తులో
19 నుంచి సన్నద్ధులై వచ్చిరి. । అప్పుడు మోషే యోసేపు
యెముకలను తీసుకొని వచ్చెను; అతడు—దేవుడు నిశ్చ
యముగా మీకు దర్శనమిచ్చును. అప్పుడు మీరు నా
యెముకలను ఇక్కడనుంచి మీతో కూడా తీసుకొని
వెళ్ల వలెనని ఇశ్రాయేలు పుత్రులచేత రూఢిగా ప్ర
మాణము చేయించుకొనెను.†

20 వారు సుక్కోతునుంచి ప్రయాణమై వెళ్లి అరణ్య
21 ము దగ్గరనుండే ఏతాములో దిగిరి. । అప్పుడు వారు
పగలు రాత్రియు ప్రయాణము చేయ వలెనని, యె
హోవా త్రోవలో వారిని నడిపించుటకు, పగటివేళ
మేఘస్తంభములోను, వారికి వెలుగిచ్చుటకు రాత్రి
వేళ అగ్ని స్తంభములోను వారికి ముందుగా నడిచెను.।
22 ఆయన పగటి వేళ మేఘస్తంభమునైనను, రాత్రివేళ
అగ్ని స్తంభమునైనను ప్రజల యెదుటనుంచి తొల
గించ లేదు.

## 14. అధ్యాయము.

1,2 యెహోవా మోషేతో ఇట్లనెను: — ఇశ్రా
యేలు పుత్రులు తిరిగి పీహహీరోతు యెదుటను, అన
గా మిగ్దోలుకు సముద్రమునకు మధ్యనున్న, బయల్సె
ఫోను యెదుటను దిగ వలెనని వారితో చెప్పుము; దాని
యెదుట సముద్రముయొద్ద మీరు దిగ వలెను. । ఫరో 3
ఇశ్రాయేలు పుత్రులను గూర్చి—వారు ఈ దేశము
లో చిక్కుబడి యున్నారు; అరణ్యము వారిని కప్పి
వేసెననుకొనును. । నేను ఫరో హృదయము దృఢ 4
పరిచితిని; అతడు వారిని తరుమును. అప్పుడు నేను
ఫరోవల్లను, అతని సమస్త సేనవల్లను మహిమ పరుచు
కొందును; నేను యెహోవానని ఐగుప్తీయులందరు
తెలుసు కొందురనెను. వారు ఆలాగు చేసిరి.

ప్రజలు పారిపోయిరని ఐగుప్తు రాజుకు తెలుపబడి 5
నప్పుడు, ఫరో హృదయము, అతని సవుకరుల హృద
యము ప్రజలకు విరోధముగా తిప్పబడి,—మనమెం
దుకు యిది చేసితిమి! మన సేవలోనుంచి ఇశ్రాయేలీ
యులను ఎందుకు పంపితిమి! అని చెప్పుకొనిరి.

అప్పుడు అతడు తన రథము సిద్ధపరుచుకొని తన 6
జనమును తనతో కూడా తీసుకొని వెళ్లెను. । మరియు 7
అతడు విశేషమైన ఆర్నూరు రథములను, ఐగుప్తు రథ
ములన్నిటిని వాటిలో ప్రతిదాని మీది అధిపతులను
తీసుకొని వెళ్లెను. । అప్పుడు యెహోవా ఐగుప్తు 8
రాజైన ఫరో హృదయము దృఢపరిచెను. అతడు
ఇశ్రాయేలు పుత్రులను తరిమెను. ఆలాగున ఇశ్రా
యేలు పుత్రులు ఎత్తయిన చేతితో బైలు వెళ్లుచున్నా
రు. । ఐగుప్తీయులనగా, ఫరో రథముల గుఱ్ఱములన్ని 9
యు అతని గుఱ్ఱపు రౌతులు, అతని దండును, వారిని
తరిమి, బయల్సెఫోను యెదుటనున్న పీహహీరోతుకు
సమీపమైన సముద్రము దగ్గర దిగి యున్న వారిని
కలుసుకొనిరి.

ఫరో సమీపించుచుండగా, ఇశ్రాయేలు పుత్ర 10
లు తమ కన్నులెత్తి, ఐగుప్తీయులు తమ వెనుక వచ్చుట
చూచి మిక్కిలి భయపడిరి. ఇశ్రాయేలు పుత్రులు
యెహోవాను గూర్చి మొరబెట్టిరి. । అప్పుడు వారు 11
మోషేతో — ఐగుప్తులో సమాధులు లేనందువల్లనా
ఈ అరణ్యములో చచ్చుటకు మమ్మును రప్పించితివి!
మమ్ము ఐగుప్తులోనుంచి బైటికి తెచ్చి, మమ్ము ఎందుకు
ఈలాగు చేసితివి! । —మా జోలికి రావద్దు, ఐగుప్తీయు 12
లను సేవింతుమని ఐగుప్తులో మేము నీతో పలికిన
మాట ఇదే గదా? మేము ఈ అరణ్యమందు చచ్చుట
కంటే, ఐగుప్తీయులను సేవించుట మాకు మేలని చెప్పి
రి. । అందుకు మోషే—భయపడకుడి; యెహోవా 13
మీ కొరకు నేడు చేయబోయే రక్షణ, మీరు నిలిచి

*లేక, సమీపమైనప్పటికి. †ఆదికాండము. 50. 21.

చూడుడి; మీరు నేడు చూచిన ఐగుప్తీయులను మీరు
14 ఇక మీదట మరి ఎప్పుడును చూడరు; । యెహోవా
మీ కొరకు యుద్ధము చేయును; మీరు ఊరకే ఉందురని
ప్రజలతో చెప్పెను.

15 అప్పుడు యెహోవా మోషేతో — నీవెందుకు
నన్ను గూర్చి మొరబెట్టుచున్నావు? ముందు పోవుడని
16 ఇశ్రాయేలు పుత్రులతో పలుకుము. । నీవు నీ కర్రను
ఎత్తి, ఆ సముద్రము వైపు నీ చెయ్యి చాపి దాని
పాయలుచేయుము. అప్పుడు ఇశ్రాయేలు పుత్రులు
సముద్రమధ్యమందు, ఆరిన భూమిమీద నడిచిపోదు
17 రు. । ఇదుగో! నేను ఐగుప్తీయుల హృదయములు దృఢ
పరిచితిని; వారు వీరిని వెంబడింతురు. నేను ఫరోవ
ల్లను, అతని సమస్త సేన వల్లను, అతని రథముల వల్లను,
అతని గుర్రపు రౌతుల వల్లను నన్ను మహిమపరుచు
18 కొందును. । నేను ఫరో వల్లను, అతని రథముల వల్లను
అతని గుర్రపు రౌతుల వల్లను మహిమపరచబడిన
ప్పుడు, నేను యెహోవానని ఐగుప్తీయులు తెలుసు
కొందురని చెప్పెను.

19 అప్పుడు ఇశ్రాయేలు దండు* ఎదుట నడిచిన దేవ
దూత వారిని దాటి వారి వెనుకను నడిచెను. ఆ
మేఘ స్తంభము వారి యెదుటనుంచి వెళ్లి, వారి వెను
20 కను నిలిచెను. । అది ఐగుప్తీయుల దండుకు, ఇశ్రా
యేలు దండుకు మధ్యను ప్రవేశించెను; అది మేఘ
ము, చీకటియునైయుండెను, గాని అది రాత్రి వెలుగి
చ్చెను గనుక ఆ రాత్రి యంతయు అది దీనికి సమీ
పించ లేదు.

21 అప్పుడు మోషే సముద్రము వైపు తన చెయ్యి
చాపెను. యెహోవా ఆ రాత్రి యంతయు బల
మైన తూర్పు గాలి చేతను సముద్రమును తొలగించి
సముద్రము ఆరిన నేలగా చేసెను. ఆలాగు నీళ్లు
22 పాయలుగా చేయబడెను గనుక । ఇశ్రాయేలు పుత్రు
లు సముద్రమధ్యను ఆరిన భూమిమీద నడిచిపో
యిరి. అప్పుడు ఆ నీళ్లు వారి కుడి పక్కను, వారి
యెడమ పక్కను వారికి గోడగా ఉండెను.

23 అప్పుడు ఐగుప్తీయులనగా, ఫరో గుర్రములు,
అతని రథములు, అతని గుర్రపు రౌతులును వారిని
24 వెంబడించి సముద్ర మధ్యమందు చేరిరి. । అయితే
వేకువ జామున యెహోవా ఆ అగ్ని మేఘముల
స్తంభములనుంచి ఐగుప్తీయుల దండును దర్శించి, ఐగు
25 ప్తీయుల దండును కలవరపరిచి, । వారి రథ చక్రము
లను వీడిపడునట్లు చేసెను గనుక వాటిని కష్టము
తోనే తోలేవారు. అప్పుడు ఐగుప్తీయులు—ఇశ్రా
యేలు ఎదుటనుంచి పారిపోదము రండి; యెహో
వా ఐగుప్తీయులకు విరోధముగా వారి కొరకు యుద్ధ
ము చేయుచున్నాడని చెప్పుకొనిరి.

అప్పుడు యెహోవా మోషేతో—ఐగుప్తీయుల 26
మీదికిని వారి రథముల మీదికిని, వారి గుర్రపు రౌ
తుల మీదికిని నీళ్లు తిరిగి వచ్చునట్లు, సముద్రము
మీద నీ చెయ్యి చాపుమని చెప్పెను. । మోషే సము 27
ద్రము మీద తన చెయ్యి చాపెను. ప్రొద్దు పొడిచి
నప్పుడు, సముద్రము తన అధికబలముతో తిరిగి వచ్చె
ను గనుక ఐగుప్తీయులు దానికి యెదురుగా పారిపో
యిరి. అప్పుడు యెహోవా సముద్ర మధ్యమందు
ఐగుప్తీయులను విదల్చెను. । నీళ్లు తిరిగి వచ్చి ఆ రథ 28
ములను, గుర్రపు రౌతులను, వారి వెనుకను సముద్ర
ములోకి వచ్చిన ఫరోయొక్క సమస్త సేనను కప్పివేసె
ను. వారిలో ఒక్కడైనను మిగిలి యుండ లేదు.

అయితే ఇశ్రాయేలు పుత్రులు ఎండిన త్రోవను 29
సముద్ర మధ్యమందు చేరినప్పుడు, ఆ నీళ్లు వారి కుడి
పక్కను యెడమ పక్కను వారికి గోడగా ఉండెను. ।
ఆ దినమున యెహోవా ఐగుప్తీయుల చేతిలోనుంచి 30
ఇశ్రాయేలీయులను రక్షించెను. అప్పుడు ఇశ్రాయేలీ
యులు సముద్ర తీరమందు చచ్చిన ఐగుప్తీయులను
చూచిరి. । యెహోవా ఐగుప్తీయులకు విరోధముగా 31
చేసిన గొప్ప కార్యమును ఇశ్రాయేలీయులు చూచిరి.
అప్పుడు ఆ ప్రజలు యెహోవాకు భయపడి, యె
హోవా యందు, ఆయన సేవకుడైన మోషేయందు
విశ్వాసముంచిరి.

## 15. అధ్యాయము.

అప్పుడు మోషే ఇశ్రాయేలు పుత్రులును యెహో 1
వాను గూర్చి ఇట్లని కీర్తన పాడిరి:—

యెహోవాను గూర్చి గానము చేతును;
ఆయన అతిశయించి జయించెను:
గుర్రమును దాని రౌతును
సముద్రములో పడదోసెను.
యాహే† నా బలము, నా గానము; 2
ఆయన నాకు రక్షణయునై యున్నాడు:
ఆయన నా దేవుడు, ఆయనను వర్ణింతును;
ఆయన నా తండ్రి దేవుడు,
ఆయన మహిమనుతింతును.
యెహోవా యుద్ధశూరుడు: 3
ఆయన పేరు యెహోవా.
ఆయన ఫరో రథములను, వాని సేనను 4
సముద్రములో పడదోసెను:

* లేక, సమూహము. † అనగా, యెహోవా.

వాని అధిపతులలో శ్రేష్ఠులు
ఎఱ్ఱ సముద్రములో మునిగి పోయిరి.
5 అగాధజలములు వారిని కప్పెను:
వారు రాతి వలె అడుగున దిగిపోయిరి.
6 యెహోవా!
నీ కుడి చెయ్యి బలిమిచేత అతిశయించును;
యెహోవా!
నీ కుడిచెయ్యి శత్రువులను చితక గొట్టును.
7 నీ మీదికి లేచిన వారిని
నీ మహిమాతిశయమువల్ల అణిచివేతువు
నీ కోపాగ్ని పంపుదువు;
అది కొయ్యకాలుల వలె వారిని దహించును.
8 నీ నాసికారంధ్రముల ఊపిరి వల్ల
నీళ్లు రాశిగా కూర్చబడెను;
ప్రవాహములు కుప్పగా నిలిచెను:
అగాధజలములు సముద్రమధ్యమున పేరుకొనెను.
9 —తరుముదును, కలుసుకొందును,
దోపుడు పంచుకొందును:
నా ఆశ వాటివల్ల తీర్చబడును;
నా కత్తి దూయుదును;
నాచెయ్యి వారిని నాశము చేసునని శత్రువనెను.
10 నీవు నీ గాలి విసరచేసితివి;
సముద్రము వారిని కప్పెను:
మహాబలమైన నీళ్లలో సీసమువలె దొర్లి మణిగిరి.
11 యెహోవా! వేల్పులలో నీవంటి వాడెవడు?
పరిశుద్ధతయందు మహనీయుడవు,
భయప్రద స్తుతియందు కీర్తనీయుడవు,
అద్భుతములు చేసేవాడవునైన నీవంటి వాడెవడు?
12 నీవు నీ కుడి చేయి చాపితివి,
భూమి వారిని మింగివేసెను.
13 నీవు విమోచించిన జనులను
నీ దయవల్ల నడిపించితివి;
నీ పరిశుద్ధాలయమునకు
నీ బలముచేత వారిని తెచ్చితివి.
14 జనములు విని దిగులుపడును:
ఫిలిష్తు నివాసులను వేదన పట్టును.
15 అప్పుడు ఏదోము దొరలు కలతపడుదురు;
మోయాబు బలిష్ఠులకు వణుకు పుట్టును:
కనాను నివాసులందరు కరిగి పోదురు.
16 భయము, దిగులు వారికి కలుగును.
యెహోవా! నీ ప్రజలు అద్దరికి వెళ్లే పర్యంతము,
నీవు సంపాదించిన జనులు అద్దరికి వెళ్లే పర్యంతము,
నీ బాహు బలమువల్ల రాతి వలె నిలుతురు.
17 నీవు వారిని లోపటికి తీసుకొని వచ్చెదవు;
నీ స్వాస్థ్యమైన కొండమీద,
యెహోవా!
నీవు నివసించుటకు చేసుకొనిన చోటను,
ప్రభువా!
నీ చేతులు స్థాపించిన పరిశుద్ధ స్థలములో, 18
వారిని స్థాపించెదవు;
యెహోవా నిరంతరము ఏలును.

పరో గుఱ్ఱములు అతని రథములతోను అతని 19
రౌతులతోను సముద్రములోకి వెళ్లినప్పుడు, యెహో
వా వారి మీదికి సముద్రజలములు మళ్లించెను. అయితే
ఇశ్రాయేలు పుత్రులు సముద్ర మధ్యను ఆరిన భూమి
మీద నడిచిరి.

మరియు అహరోను సహోదరియైన మిర్యామనే 20
ప్రవక్తి తంబూరను చేత పట్టుకొనెను. స్త్రీలందరును
తంబూరలతోను నాట్యములతోను ఆమె వెనుకను
బైలువెళ్లిరి. । అప్పుడు మిర్యాము వారితో ఇట్లు పల్లవి 21
పాడెను:—

యెహోవాను గూర్చి గానముచేయుడి;
ఆయన అతిశయించి జయించెను,
గుఱ్ఱమును దాని రౌతును
సముద్రములో పడదోసెను.

తరువాత మోషే యెఱ్ఱ సముద్రమునుంచి జను 22
లను సాగ చేసెను. అప్పుడు వారు షూరు అరణ్యము
లోకి బైలు వెళ్లి, ఆ అరణ్యములో మూడు దినములు
నడిచిరి; ఆకాలమందు వారికి నీళ్లు దొరకలేదు. అప్పు
డు వారు మారాకు చేరిరి. । మారా నీళ్లు చేదైనవి గనుక 23
వారు ఆ నీళ్లు తాగలేరైరి. అందువల్ల దానికి మారా
అనే పేరు కలిగెను.

ప్రజలు—మనమేమి తాగుదుమని, మోషేకు విరో 24
ధముగా సణుగుకొనిరి గనుక । అతడు యెహోవాను 25
గూర్చి మొరబెట్టెను. అప్పుడు యెహోవా అతనికి
ఒక చెట్టు చూపెను. అది ఆ నీళ్లలో వేసిన తరువాత
నీళ్లు తియ్యనివైనవి. అక్కడ ఆయన వారికి కట్టడను,
న్యాయవిధిని నిర్ణయించి, అక్కడ వారిని పరీక్షించి।—
మీరు మీ దేవుడైన యెహోవా శబ్దము శ్రద్ధగా 26
విని, ఆయన దృష్టికి న్యాయమైనది చేసి, ఆయన ఆజ్ఞ
లకు విధేయులై, ఆయన కట్టడలన్నియు అనుసరించితే,
నేను ఐగుప్తీయులకు కలుగచేసిన రోగములలో ఏది
యు మీకు రానియ్యను; నిన్ను స్వస్థపరిచే యెహో
వాను నేనే అని చెప్పెను.

తరువాత వారు ఏలీముకు చేరిరి; అక్కడ పన్నెం 27
డు నీటి బుగ్గలును, డెబ్బది ఖర్జూరపు చెట్లును ఉం
డెను; వారు ఆ నీళ్లయొద్ద దిగిరి.

## 16. అధ్యాయము.

1 తరువాత ఇశ్రాయేలు పుత్రుల సమూహమంత
యు ఏలీమునుంచి ప్రయాణమై వెళ్లి, వారు ఐగుప్తు దేశ
ములోనుంచి బైలుదేరిన రెండవ నెల, పదిహేనో
దినమున ఏలీముకును, సీనాయికిని మధ్యనున్న సీను
2 అరణ్యమునకు చేరిరి. । ఆ అరణ్యములో ఇశ్రాయేలు
పుత్రుల సమూహమంతయు మోషేకు అహరోను
3 కును విరోధముగా సణుగుకొనెను.। ఇశ్రాయేలుపుత్రు
లు—మేము మాంసపు కుండల యొద్ద కూర్చుండి తృప్తి
పడుటకు రొట్టె తినుచున్నప్పుడు,అయ్యో! మేము యె
హోవా చేతివల్ల ఏల చావకపోతిమి? ఈ సమస్త సంఘ
మును ఆకలివల్ల చంపుటకు ఈ అరణ్యములోకి మమ్మును
అక్కడనుంచి తీసుకొని వచ్చితిరని వారితో పలికిరి.

4 అప్పుడు యెహోవా మోషేతో—ఇదుగో! నేను
ఆకాశమునుంచి మీ కొరకు రొట్టె కురిపింతును.
వారు నా బోధన ప్రమాణము చొప్పున నడుతురో
లేదో అని నేను వారిని పరీక్షించుటకు, ఈ ప్రజలు
బైలు వెళ్లి, నేటి బత్తెము నేడే కూర్చుకొన వలెను.।
5 మరియు ఆరవ దినమందు, వారు లోపటికి తెచ్చిన
దాని సిద్ధపరచుకొన వలెను. వారు దినదినమున కూ
ర్చుకొనే దానికంటే అది రెండంతలై యుండ వలెనని
చెప్పెను.

6 అప్పుడు మోషే, అహరోను, ఇశ్రాయేలు పుత్రు
లందరితో—యెహోవా ఐగుప్తు దేశమునుంచి మిమ్ము
బైటికి రప్పించెనని, సాయంకాలమైనప్పుడు మీకు
7 తెలియబడును.। యెహోవాకు విరోధమైన మీ సణు
గులను ఆయన వినుచుండగా ఉదయకాలమున మీరు
యెహోవా మహిమను చూతురు; మేము ఏపాటి
వారము? మాకు విరోధముగా సణగనేల? అని పలి
8 కెను.। మరియు మోషే—సాయంకాలమున తినుటకు
మాంసమును, ఉదయ కాలమున తృప్తిపడుటకు రొ
ట్టెను యెహోవా మీకు ఇచ్చుచుండగా, మీరు
ఆయనకు విరోధముగా సణిగే మీ సణుగులను యె
హోవాయే వినుచుండగా, మేము ఏపాటి వారము?
మీ సణుగులు యెహోవాకే గాని మాకు విరోధమై
నవి కావని చెప్పెను.

9 అప్పుడు మోషే అహరోనుతో — యెహోవా
యెదుటికి సమీపించుడి; ఆయన మీ సణుగులు వినె
నని నీవు ఇశ్రాయేలు పుత్రుల సర్వసమాజముతో పలు
10 కుమని చెప్పెను.। అప్పుడు, అహరోను ఇశ్రాయేలు
పుత్రుల సర్వసమూహముతో పలుకుచుండగా, వారు
అరణ్యము తట్టు చూచిరి. అప్పుడు ఇదుగో! యెహో
వా మహిమ ఆ మేఘములో కనబడెను.

అప్పుడు యెహోవా మోషేతో ఇట్లనెను। — 11
నేను ఇశ్రాయేలు పుత్రుల సణుగులు వింటిని; నీవు 12
వారితో—సాయంకాలమున మీరు మాంసము తిందురు,
ఉదయకాలమున రొట్టెచేత తృప్తిపరచబడుదురు; అ
ప్పుడు మీ దేవుడైన యెహోవాను నేనే అని మీరు
తెలుసుకొందురని పలుకుమనెను.

ఆ ప్రకారము సాయంకాలమున పూరేడులు వచ్చి 13
వారి పాలెము కప్పెను. ఉదయమున మంచు వారి పా
లెము చుట్టు పడి యుండెను. । పడియున్న ఆ మంచు 14
యిగిరిపోయిన తరువాత ఇదుగో! నూగుమంచువలె సన్న
కణములు* అరణ్యభూమి మీద కనబడెను. । ఇశ్రాయే 15
లు పుత్రులు దాని చూచినప్పుడు అది యేమిటో వారికి
తెలియ లేదు గనుక వారు (మాన్‌హు, అనగా) ఇదేమి
అని ఒకనితో ఒకడు చెప్పుకొనిరి.

అప్పుడు మోషే—ఇది తినుటకు యెహోవా మీ 16
కిచ్చిన ఆహారము. యెహోవా ఆజ్ఞాపించినదేమన
గా—ప్రతివాడును తన వారి భోజనమునకు, ప్రతి
వాడు తన కుటుంబములోని తలకు, ఒక్కొక ఓమెరు
చొప్పున దాని కూర్చుకొన వలెను. ఒక్కొకడు
తన గుడారములో ఉన్న వారి కొరకు కూర్చుకొన
వలెనని చెప్పెను.

ఇశ్రాయేలు పుత్రులు ఆలాగు చేసిరి. కొందరు 17
హెచ్చుగాను కొందరు తక్కువగాను కూర్చుకొ
నిరి. । వారు ఓమెరుతో కొలిచినప్పుడు, హెచ్చుగా 18
కూర్చుకొనిన వానికి హెచ్చుగానుండ లేదు; తక్కు
వగా కూర్చుకొనిన వానికి తక్కువగానుండ లేదు.
వారు తమ తమ వారి భోజనమునకు కూర్చుకొని
యుండిరి.

మరి మోషే—దీనిలో ఏమియు, ఉదయకాల పర్యం 19
తము ఎవడును మిగుల్చుకొన కూడదని వారితో చెప్పె
ను. । అయితే వారు మోషే మాట వినకపోయిరి. కొం 20
దరు ఉదయ పర్యంతము, దానిలో కొంచెము మిగు
ల్చుకొనిరి. అది పురుగు పట్టి కంపుకొట్టెను. మోషే
వారి మీద కోపపడెను. । వారు ప్రతి దినమున ఉద 21
యకాలమందు, ఒక్కొకడు తన వారి భోజనమునకు
దాని కూర్చుకొనిరి. సూర్యుని కాకను, అది కరిగి
పోయెను.

ఆరవ దినమందు వారు, ఒక్కొకనికి రెండేసి ఓమె 22
రుల చొప్పున, రెండంతలు ఆహారము కూర్చుకొనిన

*లేక, పొలుసులు.

ప్పుడు సమాజముయొక్క అధికారులందరు వచ్చి,
23 అది మోషేకు తెలిపిరి. । అందుకు ఆయన—యెహో
వా పలికిన మాట ఇది; రేపు విశ్రాంతి దినము, అది
యెహోవాకు పరిశుద్ధమైన సబ్బాతు; మీరు కాల్చు
కొన వలసినది కాల్చుకొనుడి; మీరు ఉడికించుకొన
వలసినది ఉడికించుకొనుడి. ఉదయ పర్యంతము మిగి
లినదంతయు మీ కొరకు ఉంచుకొనుడని వారితో
చెప్పెను.

24 మోషే ఆజ్ఞాపించిన ప్రకారము, వారు ఉదయ
పర్యంతము దాని ఉంచుకొనిరి. అది కంపుకొట్ట
25 లేదు, దానిలో పురుగు పుట్టలేదు. । అప్పుడు మోషే—
ఈ దినమందు దాని తినుడి; ఈ దినము యెహోవా
26 సబ్బాతు, నేడు అది బైట దొరకదు. । ఆరు దినములు
దాని కూర్చుకొందురు; అయితే సబ్బాతున అనగా
ఏడవ దినమందు అది ఉండదని చెప్పెను.

27 ఆలాగు జరిగెను. ప్రజలలో కొందరు ఏడవ దిన
మందు దాని కూర్చుకొనుటకు బైలు వెళ్లినప్పుడు, వా
రికి ఏమియు దొరక లేదు.

28 అప్పుడు యెహోవా మోషేతో—మీరు ఎన్నా
ళ్లమట్టుకు నా ఆజ్ఞలను నా బోధవాక్యములను చేకొన
29 నొల్లరు! । చూడుడి; యెహోవా ఈ సబ్బాతును
మీకు ఇచ్చెను గనుక, ఆరవ దినమందు రెండు దిన
ముల ఆహారము మీకు ఇచ్చుచున్నాడు. ప్రతివాడు
తన తన చోట నిలిచి యుండ వలెను. ఏడవ దిన
మందు ఎవడును తన చోటనుంచి బైలు వెళ్ల కూడదని
30 చెప్పెను. । కాబట్టి ఏడవ దినమందు ప్రజలు విశ్రమిం
చిరి.

31 ఇశ్రాయేలు ఇంటివారు దానికి మన్నా* అనే పేరు
పెట్టిరి. అది తెల్లనిదై కొతిమిర గింజల† వలె ఉం
డెను. దాని రుచి తేనెలో కలిపిన అపూపముల వలె
ఉండెను.

32 మరియు మోషే— యెహోవా ఆజ్ఞాపించినదేమ
నగా—నేను ఐగుప్తు దేశమునుంచి మిమ్ము బైటికి రప్పిం
చినప్పుడు, అరణ్యములో తినుటకు నేను మీకిచ్చిన
ఆహారము మీ వంశస్థులు చూచే నిమిత్తము, వారు
ఉంచుకొనుటకు, దానితో ఒక ఓమెరును నింపుడని
చెప్పెననెను.

33 కాబట్టి మోషే అహరోనుతో—నీవు ఒక గిన్నె
తీసుకొని దానిలో ఒక ఓమెరు మన్నాను నింపి, మీ
వంశస్థులు ఉంచుకొనుటకు, యెహోవా యెదుట
దాని ఉంచుమని చెప్పెను. । యెహోవా మోషేకు 34
ఆజ్ఞాపించిన ప్రకారము, ఉంచబడుటకు సాక్ష్యముల
యెదుట అహరోను దాని బెట్టెను.

ఇశ్రాయేలు పుత్రులు నివసించ వలసిన దేశము 35
నకు చేరే పర్యంతము, నలుబది యేండ్లు మన్నా తిను
చుండిరి. వారు కనాను దేశపు పొలిమేరలకు చేరే
పర్యంతము మన్నాను భుజించిరి.

ఓమెరనగా ఏఫాలో‡ దశమభాగము. 36

## 17 అధ్యాయము.

తరువాత ఇశ్రాయేలు పుత్రుల సర్వసమాజము 1
యెహోవా నోటి మాట చొప్పున, తమ ప్రయా
ణములలో సీను అరణ్యమునుంచి ప్రయాణమై, రపీదీ
ములో పాళెము దిగి యుండెను. జనులు తాగుటకు
అక్కడ నీళ్లు లేనందున । జనులు మోషేతో జగడమా 2
డుచు—మేము తాగుటకు నీళ్లు మాకిమ్మని పలికిరి. అం
దుకు మోషే—మీరు నాతో జగడమాడ నేల? యె
హోవాను పరీక్షించ నేల? అని వారితో పలికెను.

అక్కడ ప్రజలు నీళ్లు లేక, దప్పిగొని మోషేకు 3
విరోధముగా సణుగుచు—ఇది యెందుకు? మమ్మును
మా పిల్లలను మా పశువులను దప్పిచేతను చంపుటకు
ఐగుప్తునుంచి మమ్మును ఇక్కడికి తీసుకొని వచ్చితిర
నిరి. । అప్పుడు మోషే యెహోవాను గూర్చి మొర 4
బెట్టుచు—ఈ ప్రజలను నేనేమి చేయగలను! కొంత
సేపటికి నన్ను రాళ్లతో రువ్వుదురని చెప్పెను.

అప్పుడు యెహోవా మోషేతో—నీవు ఇశ్రా 5
యేలు పెద్దలలో కొందరిని తీసుకొని, ప్రజలకు ముం
దుగా వెళ్లుము. నీవు నదిని కొట్టిన నీ కర్ర చేత
పట్టుకొని వెళ్లుము. । ఇదుగో! అక్కడ హోరేబు 6
లోని బండ మీద నేను నీకు యెదురుగా నిలుతును.
నీవు ఆ బండ కొట్టుము; అప్పుడు ప్రజలు తాగుటకు,
దానిలోనుంచి నీళ్లు బైలుదేరునని చెప్పెను. మోషే
ఇశ్రాయేలీయుల పెద్దల కన్నుల యెదుట ఆలాగు
చేసెను. । అప్పుడు ఇశ్రాయేలు జగడమువల్లను—యె 7
హోవా మన మధ్యను ఉన్నాడో లేడో అని వారు
యెహోవాను పరీక్షించుటవల్లను అతడు ఆచోటికి
మస్సా§ అనియు, మెరీబా‖ అనియు పేరు పెట్టెను.

తరువాత అమాలేకు వచ్చి రపీదీములో ఇశ్రాయే 8
లుతో యుద్ధముచేసెను. । అప్పుడు మోషే యెహోషు 9
వతో—మనకొరకు మనుష్యులను ఏర్పరిచి, తీసుకొని
బైలువెళ్లి, అమాలేకుతో యుద్ధముచేయుము; రేపు నేను

* లేక మాన్‌హు, అనగా, ఇదేమిటి? † లేక, ధనియాలు.
‡ ఏపా అనగా, కొంచెము యెక్కువ తక్కువ రెండు శేరులనర. § అనగా, పరీక్ష. ‖ అనగా, జగడము.

దేవుని కఱ్ఱ చేత పట్టుకొని, ఆ కొండ శిఖరము మీద
నిలిచి యుందునని చెప్పెను.
10 అప్పుడు యెహోషువ, మోషే తనతో చెప్పిన ప్రకా
రము చేసి, అమాలేకుతో యుద్ధము చేసెను. మోషే,
అహరోను, హూరు అనే వారు ఆ కొండ శిఖరము
11 ఎక్కిరి. । అప్పుడు జరిగినదేమనగా, మోషే తన చె
య్యి పైకి ఎత్తినప్పుడు, ఇశ్రాయేలీయులు బలిష్ఠు
లైరి; మోషే తన చెయ్యి దింపినప్పుడు అమాలేకు బలి
12 ష్ఠుడాయెను. । అయితే మోషే చేతులు బరువైనవి
గనుక, వారు ఒక రాయి తీసుకొని వచ్చి, అతడు దాని
మీద కూర్చుండుటకు, అతని కింద పెట్టిరి. అప్పుడు
అహరోను హూరు, ఒకడు ఈ పక్కను, ఒకడు ఆ
పక్కను ఉండి, అతని చేతులను నిలువబట్టిరి. అందు
వల్ల అతని చేతులు సూర్యుడు అస్తమించే మట్టుకు
నిలుకడగా ఉండెను.
13 ఆలాగున యెహోషువ కత్తి వాడి చేత అమాలేకును
అతని జనమును గెలిచెను.
14 అప్పుడు యెహోవా మోషేతో—నేను అమా
లేకు జ్ఞాపకము ఆకాశము కింద ఉండకుండ బొత్తి
గా తుడిచి వేయుదునని దీని జ్ఞాపకార్థముగా గ్రం
థములో వ్రాసి యెహోషువకు వినిపించుమని చెప్పెను.
15 తరువాత మోషే ఒక యజ్ఞవేదిక కట్టి, దానికి
16 యెహోవా నిస్సి * అని పేరు పెట్టి ।— చెయ్యి యె
హోవా సింహాసనము వైపు† ఉండగా, తరతరముల
మట్టుకు అమాలేకీయులతో యుద్ధము యెహోవాకు
కలుగునని చెప్పెను.

## 18. అధ్యాయము.

1 దేవుడు మోషే కొరకు, తన ప్రజలైన ఇశ్రాయే
లుకొరకు చేసినదంతయు, యెహోవా ఇశ్రాయే
లును ఐగుప్తునుంచి వెలపటికి రప్పించిన సంగతియు,
మిద్యాను యాజకుడును మోషే మామయునైన ఇత్రో
2 వినినప్పుడు, । మోషే మామయైన ఆ ఇత్రో, పంపబ
డిన మోషే భార్యయైన సిప్పోరాను ఆమె ఇద్దరు
3 కుమారులను తీసుకొని వచ్చెను. । అతడు—అన్య దేశ
ములో నేను పరదేశిననుకొని, వారిలో ఒకనికి గేర్షో
4 ము అని పేరు పెట్టెను.।—నా తండ్రి దేవుడు నాకు
సహాయమై, ఫరో కత్తినుంచి నన్ను తప్పించెననుకొని,
మరియొకనికి, ఎలీయేజరని పేరు పెట్టెను.
5 మోషే మామయైన ఇత్రో అతని ఇద్దరు కుమారు
లను అతని భార్యను తీసుకొని అరణ్యములో దేవుని
పర్వతము దగ్గిర దిగియున్న మోషే యొద్దికి వచ్చెను.।
అతడు మోషేతో—ఇత్రో అనే నీ మామనైన నేను, 6
నీ భార్యయు, ఆమెతో కూడా ఆమె ఇద్దరు కుమా
రులును నీ యొద్దికి వచ్చి యున్నామని మోషేతో
చెప్పుమని పంపెను. । అప్పుడు మోషే తన మామను 7
యెదురుకొనుటకు వెళ్లి, వందనము చేసి అతని ముద్దు
బెట్టుకొనెను. అప్పుడు వారు ఒకని ఒకడు క్షేమము
అడుగుకొని గుడారములోకి వచ్చిరి.।తరువాత మోషే, 8
యెహోవా ఇశ్రాయేలు కొరకు ఫరోకును ఐగుప్తీ
యులకును, చేసినదంతయు, తోవలో తమకు వచ్చిన
కష్టము యావత్తును యెహోవా తమ్మును విడిపించిన
సంగతియు తన మామతో వివరించి చెప్పెను.
యెహోవా తాను ఐగుప్తీయుల చేతిలోనుంచి 9
విడిపించిన ఇశ్రాయేలుకు చేసిన మేలంతటి విషయము
ఇత్రో సంతోషించెను. । మరియు ఇత్రో — ఐగుప్తీ 10
యుల చేతిలోనుంచియు, ఫరో చేతిలోనుంచియు
మిమ్మును విడిపించి ఐగుప్తీయుల చేతి కిందనుంచి ఈ
ప్రజలను విడిపించిన యెహోవా స్తుతించబడుగాక.।
యెహోవా సమస్త దేవతలకంటే గొప్పవాడని ఇప్పు 11
డు నాకు తెలిసినది. వారు గర్వముతో పొంగి వీరి
మీదికి లేచినప్పుడు ఆయన అధికుడై యుండెననెను.
మరియు మోషే మామయైన ఇత్రో ఒక హో 12
మపశువును యాగపశువులను దేవుని సేవ నిమిత్తము
తీసుకొని వచ్చెను. అప్పుడు అహరోను ఇశ్రాయేలు
పెద్దలందరును మోషే మామతో కూడ దేవుని యె
దుట భోజనము చేయుటకు వచ్చిరి.
మరునాడు మోషే ప్రజలకు న్యాయము తీర్చు 13
టకు కూర్చుండెను. ఉదయము మొదలుకొని సాయం
కాలపర్యంతము ప్రజలు మోషే యొద్ద నిలిచియుం
డిరి.।అయితే అతడు ప్రజలకు చేసినదంతయు మోషే 14
మామ చూచి—నీవు ఈ ప్రజలకు చేయుచున్న ఈ
పని ఏమిటి? ఉదయము మొదలుకొని సాయంకాల
పర్యంతము నీవు మాత్రము కూర్చుండగా జనులు నీ
యొద్ద నిలిచియుండనేల? అని అడిగెను.
అందుకు మోషే—ఎందుకా? ప్రజలు దేవుని సన్ని 15
ధిలో తెలుసుకొనుటకు నా యొద్దికి వచ్చుచున్నారు. ।
వారికి వ్యాజ్యము ఏదైనను కలిగి యుంటే, నా యొ 16
ద్దికి వచ్చుచున్నారు. నేను వారి విషయము న్యాయము
విమర్శ చేసి, దేవుని కట్టడలను ఆయన ఆజ్ఞలను‡ వారికి
తెలుపుచున్నానని తన మామతో చెప్పెను.
అప్పుడు మోషే మామ ఇట్లనెను — నీవు చేయు 17
చున్న పని మంచిదికాదు; । నీవు, నీతోకూడ నున్న 18

* అనగా ధ్వజము. † లేక, మీద. ‡ లేక, బోధవాక్యములను.

ఈ ప్రజలు నిశ్చయముగా క్షీణించి పోదురు; ఈ
పని నీకు మిక్కిలి బరువై యున్నది. అది నీవు ఒక్క
19 డవే చేయ లేవు. । కాబట్టి నా మాట వినుము; నేను
నీకు ఒక ఆలోచన చెప్పుదును; దేవుడు నీకు తోడై
యుండును. నీవు ప్రజల కొరకు నీ దేవుని సమ్ముఖ
మందు ఉండి వారి వ్యాజ్యములు నీ దేవుని యొద్దికి
20 తే వలెను. । నీవు వారికి ఆయన కట్టడలను, ఆజ్ఞలను*
బోధించి, వారు నడవ వలసిన త్రోవను, వారు చేయ
21 వలసిన కార్యమును వారికి తెలుప వలెను. । మరియు
నీవు ప్రజలందరిలో సామర్థ్యము, దేవభక్తి, సత్యాసక్తి,
లోభవిరక్తి గల మనుష్యులను ఏర్పరుచుకొని, వారి
మీద సహస్రాధిపతులగాను శతాధిపతులగాను పం
చాశదధిపతులగాను, దశాధిపతులగాను నియమించ
22 వలెను. । వారు ఎల్లప్పుడును ప్రజలకు న్యాయము
విమర్శించి తీర్పు చేయ వలెను. అప్పుడు ప్రతి గొప్ప
వ్యాజ్యమును నీ యొద్దికి తే వలెను. అయితే ప్రతి
అల్ప సంగతిని వారే విమర్శించి తీర్పు చేయ వచ్చు
ను. ఆలాగైతే వారు నీతో కూడ ఈ భారము మో
23 సినందున, అది నీకు సుళువుగా ఉండును. । దేవుడు నీకు
ఆజ్ఞాపించిన పక్షమందు నీవు ఈ పని చేయుచు నిలు
కడగా ఉండ గలవు. మరియు ఈ ప్రజలందరు తమ
తమ చోట్లకు సమాధానముగా వెళ్లుదురని చెప్పెను.
24 మోషే తన మామ మాట విని అతడు చెప్పినదంత
25 యు చేసెను. । ఇశ్రాయేలీయులందరిలో సామర్థ్యము
గల మనుష్యులను ఏర్పరుచుకొని వెయ్యింటికి అధిప
తులుగాను నూటికి అధిపతులుగాను ఏబదింటికి అధిప
తులుగాను పదింటికి అధిపతులుగాను ఉండుటకు వా
రిని ప్రజల మీద ప్రధానులుగా నియమించెను. ।
26 వారు ఎల్లప్పుడును ప్రజలకు న్యాయము విమర్శించి
తీర్చేవారు. వారు కఠిన వ్యాజ్యములు మోషే యొ
ద్దికి తెచ్చుచు ప్రతి చిన్న వ్యాజ్యమును వారే తీర్చు
చుండిరి.
27 తరువాత మోషే తన మామను పంపివేసెను. అతడు
తన స్వదేశమునకు వెళ్లెను.

## 19. అధ్యాయము.

1 ఇశ్రాయేలు పుత్రులు ఐగుప్తు దేశమునుంచి బైలు
వెళ్లిన మూడవ నెల, ఆ దినమందే వారు సీనాయి అర
2 ణ్యమునకు వచ్చిరి. । వారు రెఫీదీమునుంచి బైలుదేరి,
సీనాయి అరణ్యమునకు వచ్చి, ఆ అరణ్యమందు దిగి
యుండిరి. అక్కడ, ఆ పర్వతము యెదుట ఇశ్రా
యేలు పాలెము దిగెను.

అప్పుడు మోషే దేవుని యొద్దికి ఎక్కి వెళ్లెను. 3
యెహోవా ఆ పర్వతమునుంచి, అతని పిలిచి—నీవు
యాకోబు ఇంటివారితో చెప్పి, ఇశ్రాయేలు పుత్రు
లకు తెలుప వలసినదేమనగా।—నేను ఐగుప్తీయులకు 4
ఏమి చేసితినో మిమ్ము గద్ద రెక్కల మీద మోసి,
మిమ్ము నా యొద్దికి ఏలాగు చేర్చుకొంటినో మీరు
చూచితిరి. । కాగా మీరు నా మాట శ్రద్ధగా విని నా 5
నిబంధన చేకొనిన పక్షమందు, సమస్త భూమియు నా
దేగదా?।మీరు సమస్త దేశజనములలో నాకు స్వకీయ 6
సంపాద్యమైయుందురు. మీరు నాకు యాజక రాజ్య
మును, పరిశుద్ధమైన రాష్ట్రమునై యుందురని పలుకుము;
నీవు ఇశ్రాయేలు పుత్రులతో పలుక వలసిన మాటలు
ఇవే అని చెప్పెను.

అప్పుడు మోషే వచ్చి ప్రజల పెద్దలను పిలిపించి, 7
యెహోవా తనకు ఆజ్ఞాపించిన ఆ మాటలన్నియు
వారి యెదుట తెలియపరిచెను.।అందుకు ప్రజలందరు— 8
యెహోవా పలికినదంతయు చేతుమని ఏకముగా
ఉత్తరమిచ్చిరి. అప్పుడు మోషే తిరిగి వెళ్లి ప్రజల
మాటలు యెహోవాకు తెలియచేసెను.

మరియు యెహోవా—నేను నీతో మాటలాడు 9
నప్పుడు ప్రజలు విని నిరంతరము నిన్ను నమ్ముటకు,
ఇదుగో! నేను ఆ మేఘాంధకారములో నీ యొద్దికి
వత్తునని మోషేతో చెప్పెను. మోషే ప్రజల మా
టలు యెహోవాతో చెప్పెను.

అప్పుడు యెహోవా మోషేతో ఇట్లనియె:— 10
నీవు ప్రజలయొద్దికి వెళ్లి, నేడు రేపు వారిని పరిశుద్ధ
పరుచుము. వారు తమ బట్టలు ఉతుకుకొని, । మూ 11
డవ దినమునకు సిద్ధముగా ఉండ వలెను; మూడవ దిన
మున యెహోవా ప్రజలందరి కన్నుల యెదుట,
సీనాయి పర్వతము మీదికి దిగి వచ్చును. । నీవు చుట్టు, 12
ప్రజలకు మేర ఏర్పరిచి—మీరు ఈ పర్వతము ఎక్క
కూడదు, దాని అంచును ముట్ట కూడదు, భద్రముసుడీ;
ఈ పర్వతము ముట్టే ప్రతి వాడును నిశ్చయముగా
చంపబడును. । ఎవడును చేతితో వాని ముట్ట కూడదు; 13
వాడు రాళ్లతో కొట్టబడ వలెను, లేక పొడవబడ వలె
ను. మనుష్యుడైనను మృగమైనను సరి, బ్రతకనియ్య
కూడదు. బూర దీర్ఘ ధ్వని చేసేటప్పుడు, వారు
పర్వతముయొద్దికి ఎక్క వలెనని చెప్పెను.

అప్పుడు మోషే పర్వతము మీదనుంచి ప్రజల 14
యొద్దికి దిగి వచ్చి ప్రజలను పరిశుద్ధపరిచెను. వారు

*లేక, బోధవాక్యములను.

తమ బట్టలు ఉతుకుకొనిరి. అప్పుడు అతడు—మూడవ
దినమునకు సిద్ధముగా ఉండుడి; స్త్రీయొద్దకు చేరకుడని
ప్రజలతో చెప్పెను.
16 మూడవ దినమున ఉదయమైనప్పుడు, ఆ పర్వతము
మీద శబ్దములు* మెరుపులు, సాంద్రమేఘము, బూర
మహా ధ్వనియు కలిగెను. అప్పుడు పాలెములోనున్న
ప్రజలందరు వణికిరి.
17 అప్పుడు దేవుని ఎదురుకొనుటకు, మోషే పాలె
ములోనుంచి ప్రజలను అవతలకు రప్పించెను. వారు
18 పర్వతము దిగువను నిలిచి యుండిరి. । యెహోవా
అగ్నితో సీనాయి పర్వతము మీదికి దిగి వచ్చినందున,
అదంతయు ధూమమయమై యుండెను. దాని ధూమ
ము ఆవము ధూమము వలె లేచెను. పర్వతమంతయు
19 మిక్కిలి వణికెను. । ఆ బూర ధ్వని రాగా రాగా వడి
గా వినబడెను. మోషే మాటలాడుచుండగా, దేవుడు
శబ్దమువల్ల అతనికి ఉత్తరమిచ్చుచుండెను.
20 యెహోవా సీనాయి పర్వతము మీదికి అనగా
ఆ పర్వత శిఖరము మీదికి దిగి వచ్చెను. అప్పుడు
యెహోవా, పర్వత శిఖరము మీదికి (రమ్మని) మో
21 షేను పిలిచెను; మోషే ఎక్కి వెళ్లెను. । అప్పుడు యె
హోవా—ప్రజలు చూచుటకు, యెహోవా యొద్దకు
మేర మీరి, వారిలో అనేకులు నశించకుండునట్లు,
22 నీవు దిగి వెళ్లి వారికి గట్టిగా ఆజ్ఞాపించుము. । మరియు,
యెహోవా యొద్దకు చేరు యాజకులమీద, యెహో
వా పడి హతము చేయకుండునట్లు, వారు తమ్ము తామే
పరిశుద్ధపరచుకొన వలెనని మోషేతో చెప్పెను.
23 అప్పుడు మోషే యెహోవాతో—ప్రజలు సీనా
యి పర్వతము ఎక్కలేరు; నీవు—పర్వతమునకు మేర
లను ఏర్పరిచి, దాని పరిశుద్ధపరచ వలెనని మాకు గట్టి
24 గా ఆజ్ఞాపించితివని చెప్పెను. । అప్పుడు యెహో
వా—నీవు దిగి వెళ్లుము; నీవు, నీతోకూడ అహరోను
ఎక్కి రావలెను. అయితే యాజకులు ప్రజలు యె
హోవా యొద్దకు వచ్చునట్లు, మేర మీర కూడదు.
ఆయన వారిమీద పడి హతము చేయునేమో అని అత
25 నితో చెప్పెను. । అప్పుడు మోషే దిగి ప్రజల యొద్దకు
వెళ్లి ఆ మాట వారితో చెప్పెను.

## 20. అధ్యాయము.

1 అప్పుడు దేవుడు ఈ వాక్యములన్నియు పలికెను;—
2 నేను నీ దేవుడనైన యెహోవాను; నేను దాసుల
గృహమైన ఐగుప్తు దేశమునుంచి, నిన్ను వెలపటికి
రప్పించితిని.

నా యెదుట వేరొక దేవుడు† నీకు ఉండ కూడదు. 3
పైనున్న ఆకాశమందైనను, కిందనున్న భూమియం 4
దైనను, భూమి కిందనున్న నీళ్లయందైనను ఉండు దేని
రూపమునైనను విగ్రహమునైనను నీవు చేసుకొన వద్దు;।
వాటికి సాగిలపడ వద్దు; వాటిని సేవింప వద్దు; ఎందు 5
కనగా, యెహోవా అను నీ దేవుడనైన నేను సహిం
చని దేవుడను; నన్ను ద్వేషించువారిలో, మూడు నా
లుగు తరములవారి మట్టుకు, తండ్రుల అక్రమమును
కుమారుల మీదికి రప్పించుచు, । నన్ను ప్రేమించి నా 6
ఆజ్ఞలను చేకొనువారిలో వెయ్యి తరములవారికి దయ
చూపుచుండువాడనై యున్నాను.

నీ దేవుడైన యెహోవా నామమును వ్యర్థముగా‡ 7
ఉచ్చరించ వద్దు. యెహోవా తన నామమును వ్యర్థ
ముగా‡ ఉచ్చరించువాని నిర్దోషి అని యెంచడు.

సబ్బాతు దినము పరిశుద్ధపరచుటకు దాని జ్ఞాపక 8
ము ఉంచుకొనుము. । ఆరు దినములు నీవు కష్టపడి నీ 9
పని అంతయు చేయ వలెను. । ఏడవ దినము నీ దేవు 10
డైన యెహోవాయొక్క§ సబ్బాతు. దానిలో నీవై
నను, నీ కుమారుడైనను, నీ కుమార్తెయైనను, నీ దా
సుడైనను, నీ దాసియైనను, నీ పశువైనను, నీ ద్వారము
లలోని పరదేశియైనను ఏపనియు చేయకూడదు; । ఆరు 11
దినములలో యెహోవా ఆకాశము, భూమి, సము
ద్రము, వాటిలోని సమస్తమును సృజించి, ఏడవ దిన
మందు విశ్రమించెను. అందుచేతను యెహోవా
సబ్బాతు దినమును దీవించి దాని పరిశుద్ధపరిచెను.

నీ దేవుడైన యెహోవా నీకు ఇచ్చుచున్న భూ 12
మిమీద, నీ కాలము దీర్ఘముగా నుండునట్లు, నీ తం
డ్రిని నీ తల్లిని సన్మానించుము.

నరహత్య చేయ వద్దు. 13

వ్యభిచరించ వద్దు. 14

దొంగిల వద్దు. 15

నీ పొరుగువాని మీద అబద్ధ సాక్ష్యము పలుక 16
వద్దు.

నీ పొరుగువాని యిల్లు ఆశించ వద్దు; నీ పొరుగు 17
వాని భార్యనైనను, అతని దాసునైనను, అతని దాసినై
నను, అతని యెద్దునైనను, అతని గాడిదనైనను, నీ పొ
రుగువానికి కలిగిన దేనినైనను ఆశించ వద్దని చెప్పెను.

అప్పుడు ప్రజలందరు ఆ శబ్దములు, ఆ మెరుపులు, 18
ఆ బూరధ్వని, ఆ పర్వత ధూమము చూచిరి. ప్రజలు
చూచి తొలగి దూరముగా నిలిచి । — నీవే మాతో 19

* లేక, ఉరుములు. † లేక, మరి ఏ వేల్పులును. ‡ లేక, అబద్ధపక్షమున. § లేక, యెహోవాకు.

మాటలాడుము; మేము విందుము. మేము చావకుండు
నట్లు, దేవుని మాతో మాటలాడనియ్యకుమని మోషే
20 తో చెప్పిరి. । అందుకు మోషే—భయపడకుడి, మిమ్ము
పరీక్షించుటకు, మీరు పాపము చేయకుండుటకు,
ఆయన భయము మీ ఎదుట నుండుటకును దేవుడు
వచ్చెనని ప్రజలతో చెప్పెను.

21 ప్రజలు దూరముగా నిలిచిరి; మోషే దేవుడు ఉన్న
ఆ గాఢాంధకారమునకు సమీపించెను.

22 అప్పుడు యెహోవా మోషేతో ఇట్లనెను,—
ఇశ్రాయేలు పుత్రులతో చెప్పుము:—నేను ఆకాశము
23 నుంచి మీతో మాటలాడితినని గ్రహించితిరి. । మీరు
వెండి వేల్పులను నా యెదుట చేసుకొన వద్దు; బం
గారు వేల్పులను చేసుకొన వద్దు.

24 మంటి వేదిక నా కొరకు చేసి, దానిమీద నీ ఆరో
హణయాగములను, నీ మంగళ* యాగములను, నీ గొఱ్ఱె
లను నీ యెద్దుల నర్పించ వలెను. నేను నా నామ
ము జ్ఞాపకము చేయించు ప్రతి స్థలములోను నీ యొ
ద్దకు వచ్చి నిన్ను దీవించెదను.

25 నీవు నాకు రాళ్లతో వేదిక చేయునప్పుడు, మలి
చిన రాళ్లతో దాని కట్టవద్దు; దానికి నీ పని సరుకు
26 తగిలించితే, దానివల్ల అది అపవిత్రమగును. । మరియు,
నా వేదికమీద నీ దిగంబరత్వము కనబడకుండునట్లు,
మెట్ల మీదుగా దాని నెక్కవద్దు.

## 21. అధ్యాయము.

1 నీవు వారికి నియమించ వలసిన న్యాయవిధులు
2 ఏవేవనగా । — నీవు ఇబ్రీయుడైన దాసుని కొంటే,
అతడు ఆరు సంవత్సరములు దాసుడై, ఏడవ సంవత్సర
మున, ఏమియు నియ్యక స్వతంత్రుడై బైలుదేరి వెళ్ల
3 వచ్చును.। అతడు ఒంటిగా చేరియుంటే, ఒంటిగా బైలు
వెళ్ల వలెను. అతనికి భార్య ఉండిన యెడల, అతని
4 భార్య అతనితో బైలుదేరి వెళ్ల వలెను.। అతని యజమా
నుడు అతనికి భార్యనిచ్చిన తరువాత, ఆమె అతనివలన
కుమారులనైనను కుమార్తెలనైనను కనియుంటే, ఆ
భార్య, ఆమె పిల్లలు ఆమె యజమానునివారై యుం
5 దురు; అతడు ఒంటిగా బైలువెళ్ల వలెను. । అయినను
ఆ దాసుడు—నేను నా యజమానుని నా భార్యను నా
పిల్లలను ప్రేమించుచున్నాను; నేను స్వతంత్రుడనై
6 బైలువెళ్లనని నిజముగా చెప్పిన యెడల, । అతని యజ
మానుడు దేవుని† యెదుటికి అతని తీసుకొని రావలెను.
మరియు తలుపు యొద్దకైనను ద్వారబంధము యొద్దకై
నను అతని తీసుకొని రావలెను. అప్పుడు అతని యజ
మానుడు అతని చెవిని శలాకతో గుచ్చ వలెను. ఆ తరు
వాత అతడు నిరంతరము అతనికి దాసుడై యుండును.

ఒకడు, దాసిగా తన కుమార్తెను అమ్మినయెడల, 7
దాసులైన పురుషులు వెళ్లిపోవునట్లు అది వెళ్లిపో
కూడదు. । దాని ప్రధానము చేసుకొనిన యజమానుని 8
దృష్టికి అది ఇష్టురాలు కాని పక్షమందు, దాని విడి
పించుకొననియ్య వలెను; దాని వంచించినందున, అన్య
జనులకు దాని అమ్ముటకు అతనికి అధికారము లేదు. ।
తన కుమారునికి దాని ప్రధానము చేయించియుంటే, 9
కుమార్తెల విషయమైన న్యాయవిధి దాని యెడల
జరిగించ వలెను. అతనికి వేరొకదాని చేర్చినప్పటికి, 10
దాని ఆహారము, దాని వస్త్రము, దాని సంసార ధర్మమును
తక్కువ చేయ కూడదు. । ఈ మూడును దానికి కలుగ 11
చేయకుంటే, అది యేమియు నియ్యక స్వతంత్రురాలై
వెళ్లిపో వలెను.

నరుని చావగొట్టినవాడు నిశ్చయముగా చంపబ 12
డును; । అయినను అతడు చంప వలెనని పొంచియుండ 13
కనే, దైవికముగా అతని చేతికి ఆ హత్య సంభవించి
తే, అతడు పారిపోవలసిన ఒక స్థలము నీకు నిర్ణయిం
చెదను. । అయితే ఒకడు తన పొరుగువానిమీద ఆగ్ర 14
హపడి, కపటముగా వాని చంప లేచిన పక్షమందు,
వాడు చచ్చునట్లు, నా వేదిక యొద్దనుండినను వాని
తే వలెను.

తన తండ్రినైనను తన తల్లినైనను కొట్టువాడు నిశ్చ 15
యముగా చంపబడును.

ఒకడు నరుని దొంగిలించి, అతని అమ్మినను, వాని 16
యొద్ద అతడు దొరికినను, వాడు నిశ్చయముగా చంప
బడును.

తన తండ్రినైనను తన తల్లినైనను తిట్టువాడు, నిశ్చ 17
యముగా చంపబడును.

నరులు పోట్లాడుచుండగా, ఒకడు తన పొరుగు 18
వాని రాతితోనైనను పిడికిటితోనైనను గుద్దుట వల్ల
అతడు చావక, మంచముమీద పడియుండి, । తరువాత 19
లేచి తన చేతి కఱ్ఱతోటి బైటికి వెళ్లి తిరుగుచుండిన
పక్షమందు, అతని కొట్టినవానికి శిక్ష విధించబడదు.
అయినను అతడు పని చేయలేని కాలమునకు తగిన
సొమ్మిచ్చి అతని కేవలము బాగు చేయించ వలెను.

ఒకడు తన దాసునినైనను తన దాసినినైనను, తన 20
వల్ల చచ్చునట్లు, కఱ్ఱతో కొట్టితే, అతనికి నిశ్చయము
గా ప్రతిదండన చేయవలెను. । అయితే అతడు ఒకటి 21
రెండు దినములు బ్రతికితే ఆ ప్రతిదండన పొందదు;
వాడు అతని సొమ్ము.

* లేక, సమాధాన. † లేక, న్యాయాధిపతి.

22 నరులు పోట్లాడుచు, గర్భవతియైన స్త్రీని హిం
సించుటవల్ల, ఆమెకు గర్భపాతమే గాని మరేమి
హాని రాని పక్షమందు, ఆ స్త్రీపెనిమిటి అతని మీద
మోపినట్లు, జుల్మానా ఇయ్య వలెను; న్యాయాధిపతుల
23 ద్వారా దాని చెల్లించ వలెను. । హాని కలిగితే, నీవు
24 ప్రాణమునకు ప్రాణము, । కంటికి కన్ను, పంటికి
25 పల్లు, చేతికి చెయ్యి, కాలికి కాలు, । వాతకు వాత,
గాయమునకు గాయము, దెబ్బకు దెబ్బయు నియమించ
వలెను.

26 ఒకడు తన దాసుని కంటినైనను తన పనికత్తె కం
టినైనను కొట్టి దాని చెరిపితే, వాని కంటి నిమిత్తము
27 వానిని స్వతంత్రునిగా పోనియ్య వలెను. । అతడు తన
దాసుని పంటినైనను తన పనికత్తె పంటినైనను ఊడ
గొట్టితే ఆ పంటి నిమిత్తము, వారిని స్వతంత్రులగా
పోనియ్య వలెను.

28 ఎద్దు పురుషునైనను స్త్రీనైనను చావ పొడిచితే,
ఆ యెద్దు నిశ్చయముగా రాళ్లతో కొట్టబడును. దాని
మాంసము తిన కూడదు. ఆ యెద్దు యజమానుడు, శిక్షిం
29 చబడడు. । అయితే ఆ యెద్దు అంతకుముందు పొడి
చేది అని దాని యజమానునికి తెలుపబడినప్పటికి,
అతడు దాని జాగ్రత్త చేయకుండుటవల్ల అది పురు
షునైనను స్త్రీనైనను చంపితే, ఆ యెద్దు రాళ్లతో కొట్ట
30 బడవలెను; దాని యజమానుడును చంపబడును. । అత
నికి ఆచ్ఛాదనము నియమించబడితే, అతనికి నియ
మించబడిన సమస్త ప్రకారము తన ప్రాణ విమోచన
31 నిమిత్తము ధనము చెల్లించ వలెను. । అది కుమారుని
పొడిచినను కుమార్తెను పొడిచినను, ఈ విధిచొ
32 ప్పున దానికి చేయ వలెను. । ఆ యెద్దు దాసునినై
నను పనికత్తెనైనను పొడిచితే, వారి యజమానునికి
ముప్పది వెండి షెకెలులను* చెల్లించ వలెను. మరియు,
ఆ యెద్దును రాళ్లతో చావగొట్ట వలెను.

33 ఒకడు గోతిమీది కప్పు తీసుటవల్ల, లేక ఒకడు
గోయి తవ్వి దాని కప్పకపోవుటవల్ల దానిలో యెద్ద
34 యినను గాడిదెయైనను పడితే, । ఆ గోతి యజమానుడు
ఆ నష్టము ఇచ్చుకొన వలెను; వాటి యజమానునికి
సొమ్ము ఇయ్య వలెను; చచ్చినది అతనిదగును.

35 ఒకని యెద్దు చచ్చునట్లు వేరొకని యెద్దు దాని
హింసించితే, సజీవమైన యెద్దును అమ్మి, దాని విలు
వను పంచుకొన వలెను; చచ్చిన యెద్దును పంచుకొన
36 వలెను. । అయితే పూర్వకాలమందు ఆ యెద్దు పొడి
చేది అని తెలియబడియు, దాని యజమానుడు దాని
జాగ్రత్త చేయకుంటే, అతడు నిశ్చయముగా ఎద్దుకు
యెద్దును ఇయ్య వలెను. చచ్చినది అతనిదగును.

## 22. అధ్యాయము.

ఒకడు ఎద్దునైనను గొఱ్ఱెనైనను దొంగిలి, దాని 1
అమ్మినను చంపినను, ఆ యెద్దుకు ప్రతిగా ఐదు ఎద్దు
లను, ఆ గొఱ్ఱెకు ప్రతిగా నాలుగు గొఱ్ఱెలను ఇయ్య
వలెను.

దొంగ కన్నము వేయుచుండగా, వాడు దొరికి, 2
చచ్చునట్లు కొట్టబడితే, అందువల్ల రక్తాపరాధము లేదు.।
వాని మీద సూర్యుడు ఉదయించిన యెడల† అందువల్ల 3
రక్తాపరాధము ఉండును. వాడు సరిగా సొమ్ము తిరిగి
చెల్లించ వలెను. వానికి ఏమియు లేకపోతే, వాడు తన
దొంగతనమునకు అమ్మబడ వలెను. । వాడు దొంగిలినది, 4
ఎద్దయినను గాడిదెయైనను గొఱ్ఱెయైనను సరి, అది సజీ
వమై వానియొద్ద దొరికితే రెండంతలు చెల్లించవలెను.

ఒకడు చేనునైనను ద్రాక్షల తోటనైనను మేపు 5
చు, మేయుటకు తన పశువును తోలి వేరొకని చేను
మేపితే, తన చేలలోని మంచిదియు ద్రాక్షల తోట
లోని మంచిదియు దానికి ప్రతిగా ఇయ్యవలెను.

అగ్ని రగిలి, ముండ్ల కంపలు అంటుకొని ధాన్యపు 6
రాశియైనను పంట పైరైనను చేనైనను కాల్చబడితే,
అగ్ని అంటించినవాడు ఆ నష్టమంతయు ఇచ్చుకొన
వలెను.

ఒకడు సొమ్మయినను సామానైనను జాగ్రత్త పెట్టు 7
టకు, తన పొరుగువానికి అప్పగించునప్పుడు, అది ఆ
మనుష్యుని ఇంటనుంచి దొంగిలబడి, ఆ దొంగ దొరి
కితే, వాడు దానికి రెండంతలు ఇచ్చుకొన వలెను. । ఆ 8
దొంగ దొరకని పక్షమందు, ఆ ఇంటి యజమానుడు
తన పొరుగువాని పదార్థములు పుచ్చుకొన్నాడో
లేదో, (విచారించుటకు) న్యాయాధిపతి‡ యొద్దకు
తేబడ వలెను.

ప్రతి విధమైన ద్రోహమును గూర్చి, అనగా ఎద్దును 9
గూర్చి, గాడిదెను గూర్చి, గొఱ్ఱెను గూర్చి, బట్టను
గూర్చి, పోయినదాని ఒకడు చూచి ఇది నాదని చెప్పి
నదాని గూర్చి ఆ ఇద్దరి వ్యాజ్యము న్యాయాధిపతి‡
యొద్దకు తేబడ వలెను. ఆ న్యాయాధిపతి ఎవనిమీద
నేరము స్థాపించునో వాడు తన పొరుగువానికి రెం
డంతలు ఇచ్చుకొన వలెను.

ఒకడు గాడిదెనైనను, ఎద్దునైనను గొఱ్ఱెనైనను 10
మరి ఏ జంతువునైనను కాపాడుటకు, తన పొరుగు
వానికి అప్పగించినపైని, అది చచ్చినను, చెరపబడినను,

* షెకెలనేది, ఇంచుమించు రూపాయి పావులా. † లేక, ప్రొద్దెక్కిన యెడల.
‡ హెబ్రీలో, దేవుని.

ఎవడును చూడకుండగా తోలుకొని పోబడినను,।
11 వాడు తన పొరుగువాని సొమ్ము పుచ్చుకొన లేదను
టకు, యెహోవా ప్రమాణము వారిద్దరి మధ్యనుండ
వలెను. దాని యజమానుడు దాని అంగీకరించ వలెను;
12 ఆ నష్టము ఇచ్చుకొన నక్కరలేదు. । అది నిజముగా
వాని యొద్దనుంచి దొంగిలబడితే, దాని యజమానునికి
13 ఆ నష్టము ఇచ్చుకొన వలెను. । అది నిజముగా చీల్చ
బడితే, వాడు సాక్ష్యముకొరకు దాని తే వలెను; చీల్చ
బడినదాని నష్టము ఇచ్చుకొన నక్కరలేదు.

14 ఒకడు తన పొరుగువాని యొద్ద దేనినైనను అడిగి
తీసుకొని వెళ్లగా, దాని యజమానుడు దానియొద్ద
లేనప్పుడు, అది చెరపబడినను, చచ్చినను దాని నష్టము
15 ఇచ్చుకొన వలసినది. । దాని యజమానుడు దానితో
కూడ ఉంటే దాని నష్టము ఇచ్చుకొన నక్కరలేదు.
అది అద్దెదైతే, అది దాని అద్దెకు వచ్చెను.

16 ఒకడు ప్రధానము చేయబడని ఒక కన్యకను మరు
లుకొల్పి, ఆమెతో శయనించితే, తనకు భార్యగా
17 ఉండునట్లు ఆమెకు ఓలి ఇయ్యవలెను. । ఆమె తండ్రి
ఆమెను వానికి ఇయ్యనొల్లని పక్షమందు, వాడు కన్య
కల ఓలిచొప్పున సొమ్ము చెల్లించ వలెను.

18 మాంత్రికురాలిని బ్రతుకనియ్యవద్దు.

19 మృగసంయోగము చేయు ప్రతివాడును నిశ్చయ
ముగా చంపబడును.

20 యెహోవాకు మాత్రమే గాక వేరొక దేవునికి
యాగము చేయువాడు శాపగ్రస్తుడగును.

21 పరదేశిని విసికించవద్దు, బాధించ వద్దు; మీరు ఐగుప్తు
దేశములో పరదేశులై యుంటిరి.

22 విధవనైనను, దిక్కులేని పిల్లనైనను బాధించ వద్దు.।
23 నీవు ఏలాగైనను వారిని* బాధించగా, వారు నన్ను
గూర్చి మొరబెట్టితే నేను నిశ్చయముగా వారి మొ
24 రను విందును. । నా కోపాగ్ని రవులుకొని, మిమ్ము కత్తి
చేత చంపించెదను; మీ భార్యలు విధవలవుదురు, మీ
పిల్లలు దిక్కులేనివారవుదురు.

25 నీ యొద్దనుండు నా బీదలైన ప్రజలలో ఒకనికి
సొమ్ము అప్పిచ్చితే, వానికి, వడ్డికిచ్చువాని వలె నుండ
వద్దు; వానికి వడ్డి కట్టవద్దు.

26 నీవు ఎప్పుడైనను నీ పొరుగువాని వస్త్రమును కుద
వగా తీసుకొంటే, సూర్యుడు అస్తమించు వేళకు అది
27 వానికి తిరిగి అప్పగించుము; । వాడు కప్పుకొనేది అదే;
అది వాని చర్మమునకు వస్త్రము; వాడు మరి దేనితో
పండుకొనును? వాడు నన్ను గూర్చి మొరబెట్టితే, నేను
విందును; నేను దయగలవాడను.

నీవు న్యాయాధిపతిని† నిందించవద్దు; నీ ప్రజల 28
లోని అధికారిని తిట్టవద్దు.

నీ మొదటి సస్యములను నీ ద్రవములను అర్పించ 29
తడవు చేయవద్దు. నీ కుమారులలో జ్యేష్ఠుని నాకు
అర్పించ వలెను. । ఆలాగే నీ యెద్దులను, నీ గొర్రెలను 30
అర్పించ వలెను. ఏడు దినములు అది దాని తల్లియొద్ద
నుండ వలెను; ఎనిమిదవ దినమందు, దాని నాకియ్య
వలెను.

మీరు నాకు పరిశుద్ధ మనుష్యులై యుందురు. 31
పొలములో చీల్చబడిన మాంసము తినక, కుక్కలకు
దాని పారవేయ వలెను.

## 23. అధ్యాయము.

లేనివార్త పుట్టించవద్దు. కూటసాక్షివై యుండు 1
నట్లు, చెడ్డవానితో నీవు కలసుకొన వద్దు.

చెడుతనమునకు గొప్పవారిని‡ వెంబడించ వద్దు; 2
న్యాయము తప్పుటకు, గొప్పవారి§ వెంబడి తిరిగి. వ్యా
జ్యమును గూర్చి సాక్ష్యము పలకవద్దు. । బీదవాని వ్యా 3
జ్యములో వానియెడల పక్షపాతముగా నుండవద్దు.

నీ శత్రువుని యెద్దయినను గాడిదెయైనను తప్పి 4
పోవుచు నీకు కనబడితే, నిశ్చయముగా దాని తోలు
కొనివచ్చి వానికి అప్పగించ వలెను. । నీవు నీయందు 5
పగబట్టువాని గాడిదె, దాని బరువు కిందపడియుండుట
చూడగా, దానినుంచి తప్పించుట మాన వలయునని
యున్నప్పటికి, నిశ్చయముగా వానితో కూడి దాని
తప్పించ వలెను.

నీ దరిద్రుని వ్యాజ్యములో అతనికొరకు, న్యాయ 6
ము మాని తీర్పుచేయ వద్దు. । అబద్ధమునకు దూరముగా 7
నుండుము. నిరపరాధినైనను నీతిమంతునినైనను చంప
వద్దు; నేను దుష్టుని నీతిమంతునిగా ఎంచను. । లంచము 8
తీసుకొనవద్దు; లంచము, దృష్టిగల వారికి గుడ్డితనము
కలుగచేసి, నీతిమంతుల మాటలకు అపార్థము చే
యును.

పరదేశిని బాధించవద్దు; పరదేశి హృదయము మీకు 9
తెలుసును; మీరు ఐగుప్తు దేశములో పరదేశులై యుం
టిరి.

ఆరు సంవత్సరములు నీ భూమిలో విత్తి, దాని 10
పంట కూర్చుకొన వలెను. । ఏడవ సంవత్సరమున దాని 11
వదిలి, ఊరక ఉండనియ్య వలెను. అప్పుడు నీ ప్రజల
లోని బీదలు తినిన తరువాత, అడవి మృగములు మిగి
లినది తిన వచ్చును. అటువలె నీ ద్రాక్షలతోటను గూ
ర్చియు, నీ ఒలీవల తోటను గూర్చియు చేయ వలెను.

* హెబ్రీలో, వాని. † లేక, దేవుని. ‡ లేక, అనేకులను. § లేక, అనేకుల.

12 ఆరు దినములు నీ పనులు చేసి, నీ యెద్దు, నీ గా
డిదె, నీ దాసి కుమారుడు, పరదేశియు విశ్రమించు
13 నట్లు, ఏడవ దినమున ఊరక ఉండ వలెను. । నేను మీ
తో చెప్పిన అన్నిటిని జాగ్రత్తగా గైకొన వలెను.
వేరొక దేవుని పేరు ఉచ్చరించ వద్దు; అది నీ నోటి
నుంచి రానియ్యకుము.
14 సంవత్సరమునకు మూడు మారులు, నాకు పండుగ
15 చేయ వలెను. । పొంగనివాటి పండుగ చేయ వలెను.
నేను నీకు ఆజ్ఞాపించిన ప్రకారము, ఆబీబను నెలలో
నియమించబడిన కాలమందు, ఏడు దినములు పొంగని
వాటినే తిన వలెను; ఆ నెలలో ఐగుప్తులోనుంచి బైలు
దేరి వచ్చితివి. నా యెదుట ఎవడును వట్టి చేతులతో
అగపడ కూడదు.
16 నీవు పొలములో విత్తిన నీ వ్యవసాయముల తొలి
పంటయొక్క కోత పండుగను, పొలములోనుంచి నీ
వ్యవసాయ ఫలములు నీవు కూర్చుకొనిన తరువాత,
సంవత్సరాంతమందు ఫలసంగ్రహపు పండుగను చేయ
17 వలెను. । సంవత్సరమునకు మూడు మారులు నీ పురుషు
లందరు ప్రభువైన యెహోవా యెదుట అగపడ
వలెను.
18 నా యాగపశు రక్తము పులిసి పొంగిన ద్రవ్యము
తో అర్పించ వద్దు. నా పండుగ క్రొవ్వు ఉదయ
19 పర్యంతము ఉండ కూడదు. । నీ భూమియొక్క ప్రథమ
ఫలములో మొదటివి నీ దేవుడైన యెహోవా మం
దిరమునకు తే వలెను. మేక పిల్లను దాని తల్లి పాలతో
ఉడకబెట్ట వద్దు.
20 ఇదుగో! నిన్ను త్రోవలో కాపాడుటకు, నేను
సిద్ధపరిచిన చోటికి నిన్ను రప్పించుటకును, ఒక దూ
21 తను నీకు ముందుగా పంపుచున్నాను. । ఆయన యె
దుట జాగ్రత్తగా ఉండి, ఆయన మాట విన వలెను.
ఆయనకు కోపము తెప్పించ వద్దు. మీ ద్రోహము
ఆయన క్షమించడు; నా నామము ఆయన అంతరంగ
22 ములో నున్నది. । అయితే నీవు ఆయన మాట జాగ్రత్త
గా విని, నేను పలికినది యావత్తు చేసినయెడల, నేను
నీ శత్రువులకు శత్రువును, నీ విరోధులకు విరోధినై
23 యుందును; । ఏలాగనగా నా దూత నీకు ముందుగా
వెళ్లుచు, అమోరీయులు, హిత్తీయులు, పెరజ్జీయులు,
కనానీయులు, హివ్వీయులు, యెబూసీయులు ఉన్న
చోటికి నిన్ను రప్పించును; నేను వారిని సంహరిం
చెదను.
24 వారి వేల్పులకు సాగిలపడవద్దు; వారిని సేవించ
వద్దు; వారి క్రియలవంటి క్రియలు చేయక, వారిని
నిశ్చయముగా నిర్మూలము చేసి, వారి విగ్రహములను
బొత్తిగా పగలగొట్ట వలెను. । నీ దేవుడైన యెహోవానే 25
సేవించ వలెను; అప్పుడు ఆయన నీ రొట్టెను, నీ నీళ్లను
దీవించును. నేను నీ మధ్యనుంచి రోగము తొలగిం
చెదను. । కడుపు దిగబడేదియు, గొడ్డుదియు నీ దేశము 26
లో ఉండదు. నీ దినముల లెక్క సంపూర్తి చేసె
దను. । నా భయమును నీకు ముందుగా కలుగచేసెదను. 27
నీవు చేరు సర్వదేశములవారిని ఓడగొట్టి నీ సమస్త
శత్రువులు నీకు వెన్నిచ్చునట్లు చేసెదను. । మరియు 28
కందిరీగలను నీకంటే ముందుగా పంపించెదను; అవి
నీ యెదుటనుంచి హివ్వీయులను, కనానీయులను, హిత్తీ
యులను వెళ్లగొట్టును. । దేశము పాడై, అడవి మృగ 29
ములు నీకు విరోధముగా విస్తరించకుండునట్లు, వారిని
ఒక్క సంవత్సరములోనే నీ యెదుటనుంచి వెళ్లగొట్ట
ను. । నీవు అభివృద్ధి పొంది, ఆ దేశమును స్వాధీనపరు 30
చుకొను* మట్టుకు, కొంచెము కొంచెముగా వారిని నీ
యెదుటనుంచి వెళ్లగొట్టెదను. । మరియు ఎఱ్ఱసము 31
ద్రమునుంచి ఫిలిష్తీయుల సముద్రముమట్టుకును, అర
ణ్యమునుంచి నదిమట్టుకును నీ పొలిమేరలను ఏర్పరి
చెదను, ఆ దేశ నివాసులను నీ చేతికి అప్పగించెదను.
నీవు నీ యెదుటనుంచి వారిని వెళ్లగొట్టెదవు. । నీవు 32
వారితోనైనను వారి వేల్పులతోనైనను నిబంధన చేసు
కొనవద్దు. నీవు వారి వేల్పులను సేవించితే, అది నీకు
ఉరి వలె నుండును గనుక, । వారు నీ చేత నాకు విరో 33
ధముగా పాపము చేయించకుండునట్లు, వారు నీ దేశ
ములో నివసించ గూడదని మోషేతో చెప్పెను.

## 24. అధ్యాయము.

మరియు ఆయన మోషేతో ఇట్లనెను:—నీవు, అహ 1
రోను, నాదాబు, అబీహు, ఇశ్రాయేలు పెద్దలలో
డెబ్బదిమందియు యెహోవా యొద్దకు ఎక్కివచ్చి,
దూరమున సాగిలపడుడి; । మోషే మాత్రము యెహో 2
వాకు సమీపించ వలెను; వారు సమీపించ కూడదు;
ప్రజలు అతనితో ఎక్కి రాకూడదనెను.
మోషే వచ్చి యెహోవా మాటలన్నియు న్యా 3
యవిధులన్నియు ప్రజలతో వివరించి చెప్పినప్పుడు,
ప్రజలందరు — యెహోవా చెప్పిన మాటలన్నియు
చేసెదమని ఏక శబ్దముతో ఉత్తరమిచ్చిరి.
మరియు మోషే యెహోవా మాటలన్నియు వ్రాసి 4
ఉదయమందు లేచి, ఆ కొండ దిగువను యాగవేదికను,
ఇశ్రాయేలు పదిరెండు గోత్రముల చొప్పున పన్నెం
డు స్తంభములను కట్టి, । ఇశ్రాయేలు పుత్రులలో పడు 5

*లేక, స్వతంత్రించుకొను.

చునారిని పంపెను. వారు యెహోవాకు ఆరోహణ
యాగములు అర్పించిరి; మంగళయాగములుగా కోడెలను
6 వధించిరి. । అప్పుడు మోషే ఆ రక్తములో సగము తీసు
కొని, పళ్లెములలో పోసి, ఆ రక్తములో సగము ఆ
7 వేదిక మీద జల్లెను. । తరువాత అతడు నిబంధన పుస్తక
ము పట్టుకొని, ప్రజలకు వినిపించెను. అప్పుడు వారు
— యెహోవా చెప్పినవన్నియు చేయుచు విధేయు
8 లమై యుందుమనిరి. । అప్పుడు మోషే, రక్తము తీసు
కొని ప్రజలమీద జల్లి — ఇదిగో! ఈ మాటలన్నిటి
విషయము యెహోవా మీతో చేసిన నిబంధన రక్త
ము ఇదే అని చెప్పెను.*

9 తరువాత మోషే, అహరోను, నాదాబు, అబీహు,
ఇశ్రాయేలు పెద్దలలో డెబ్బదిమందియు నెక్కి వెళ్లి, ।
10 ఇశ్రాయేలు దేవుని చూచిరి. ఆయన పాదముల కింద
నిగనిగలాడు నీలమయమైన వస్తువు వలెను, ఆకాశ
11 మండల తేజము వలెనుండెను. । ఆయన ఇశ్రాయేలు
పుత్రులలోని ప్రధానులమీద తన చెయ్యి వేయలేదు.
వారు దేవుని చూచి భోజనపానములు చేసిరి.

12 అప్పుడు యెహోవా,—నీవు కొండెక్కి నా యొ
ద్దకు వచ్చి యుండుము; వారికి బోధించునట్లు, నేను
వ్రాసిన బోధనప్రమాణమును, కట్టడను, రాతి పలక
లను నేను నీకిచ్చెదనని మోషేతో చెప్పెను.

13 అప్పుడు మోషే, అతని పరిచారకుడైన యెహోషువ
కూడ లేచిరి. మోషే దేవుని కొండమీదికి వెళ్లెను. ।
14 అతడు — మేము మీ యొద్దకు వచ్చుమట్టుకు ఇక్క
డనే ఉండుడి; ఇదిగో! అహరోను, హూరు, మీతో
కూడ ఉన్నారు; వ్యాజ్యముగలవాడెవడైనను ఉంటే
వారి యొద్దకు వెళ్ల వచ్చునని పెద్దలతో చెప్పెను.

15 మోషే కొండమీదికి వెళ్లినప్పుడు, ఆ మేఘము
16 కొండను కప్పెను. । యెహోవా మహిమ* సీనాయి
కొండమీద నిలిచెను. ఆ మేఘము ఆరు దినములు
దాని కప్పుకొని ఉండెను. ఏడవ దినమున ఆయన ఆ
17 మేఘమునుంచి మోషేను పిలిచెను. । అప్పుడు యెహో
వా మహిమ ఆ కొండ శిఖరము మీద, దహించు అగ్ని
వలె ఇశ్రాయేలు పుత్రుల కన్నులకు అగపడెను. ।
18 అప్పుడు మోషే ఆ మేఘములో ప్రవేశించి, కొండ
మీదికి వెళ్లెను. తరువాత మోషే ఆ కొండమీద
రేయింబగళ్లు నలుబది దినములుండెను.

## 25. అధ్యాయము.

1,2 అప్పుడు యెహోవా మోషేతో ఇట్లనెను: —
ఎత్తబడిన కానుకను నాకొరకు తీసుకొని రండని ఇశ్రా
యేలు పుత్రులతో చెప్పుము. మనః పూర్వకముగా
అర్పించు ప్రతి మనుష్యుని యొద్ద నా కానుకను పుచ్చు
కొన వలెను. । మీరు వారియొద్ద పుచ్చుకొన వలసిన 3
కానుకలు ఏవనగా, బంగారు, వెండి, రాగి, । నీల 4
ధూమ్ర రక్తవర్ణములు గలవి, సన్నపు నార, మేక
వెంట్రుకలు, । ఎరుపు రంగు వేసిన పొట్టేళ్ల తోళ్లు, 5
తాహపను వాటి తోళ్లు, తుమ్మ కర్రలు, । ప్రదీపమునకు 6
తైలము, అభిషేక తైలమునకును పరిమళ ద్రవ్యముల
ధూపమునకును సుగంధ సంభారములు, । లేతపచ్చలు, 7
ఏఫోదుకును పతకమునకును చెక్కు రత్నములనేవే. ।
నేను వారి మధ్యను నివసించుటకు, వారు నా కొరకు 8
పరిశుద్ధాలయము చేయ వలెను. । నేను నీకు అగపరు 9
చుచున్న అన్నిటి వలెనే, ఆలయపు పోలిక చొప్పున,
దాని సమస్తోపకరణముల చొప్పున దాని చేయ వలెను.

వారు తుమ్మ కర్రతో ఒక పెట్టె చేయవలెను. దాని 10
పొడుగు రెండుమూరల నర; దాని వెడల్పు మూరనర;
దాని ఎత్తు మూరనర. । దానిమీద మేలిమి బంగారు 11
రేకును తాపించ వలెను; లోపలను వెలపలను దానికి
తాపించ వలెను. దాని మీద బంగారు జవను చుట్టు
వేయ వలెను. । దానికి నాలుగు బంగారు ఉంగరము 12
లను పోతపోసి ఒక పక్కను రెండు ఉంగరములు
ఎదుటి పక్కను రెండు ఉంగరములుండునట్లు దాని
నాలుగు కాళ్లకు వాటిని వేయ వలెను. । తుమ్మ కర్రతో 13
మోత కర్రలను చేసి వాటికి బంగారు రేకులు తాపిం
చి, । వాటి వలన ఆ పెట్టెను మోయుటకు, ఆ పెట్టె 14
పక్కల మీది ఉంగరములలో ఆ మోత కర్రలను
వేయ వలెను. । ఆ మోత కర్రలు ఆ పెట్టె ఉంగర 15
ములలోనే ఉండ వలెను. । అవి దాని యొద్దనుంచి 16
తియ్య కూడదు. ఆ పెట్టెలో నేను నీకిచ్చు శాసన
మునుంచ వలెను.

మరియు నీవు మేలిమి బంగారుతో ఆచ్ఛాదన 17
పీఠము చేయ వలెను. దాని పొడుగు రెండుమూ
రల నర; దాని వెడల్పు మూరనర. । మరియు, రెండు 18
బంగారు కెరూబులను చేయ వలెను. ఆచ్ఛాదన పీఠ
ముయొక్క రెండు కొనలను నకిషి పనిగా వాటిని
చేయ వలెను. । ఈ కొనను ఒక కెరూబును ఆ కొనను 19
ఒక కెరూబును చేయ వలెను. ఆచ్ఛాదన పీఠమున,
దాని రెండు కొనల మీద కెరూబులను దానితో
ఏకాండముగా చేయ వలెను. । ఆ కెరూబులు పైకి 20
విప్పిన రెక్కలు గలవై ఆచ్ఛాదన పీఠమును తమ
రెక్కలతో కప్పుచుండగా, వాటి ముఖములు ఒండొం
టికి ఎదురుగా నుండ వలెను. ఆ కెరూబుల ముఖ

* లేక, తేజస్సు.

ములు ఆచ్ఛాదన పీఠముతట్టు నుండ వలెను. ఆ ఆచ్ఛా
దన పీఠమును పైకెత్తి ఆ పెట్టె మీద ఉంచ వలెను.।
21 నేను నీకిచ్చు శాసనమును ఆ పెట్టెలో ఉంచ వలె
22 ను.। అక్కడ నేను నిన్ను కలుసుకొని, ఆచ్ఛాదన
పీఠము మీదనుంచి, శాసనము గల పెట్టెమీదనుండు
రెండు కెరూబుల మధ్యనుంచి, నేను ఇశ్రాయేలు
పుత్రుల నిమిత్తము, నీకు ఆజ్ఞాపించు సమస్తమును
నీకు తెలియ చెప్పెదను.

23 మరియు, నీవు తుమ్మ కర్రతో ఒక బల్ల చేయ
వలెను. దాని పొడుగు రెండు మూరలు; దాని వెడల్పు
24 ఒక మూర; దాని ఎత్తు మూరనర.। మేలిమి బంగారు
రేకును దానికి తాపించి, దానికి చుట్టు బంగారు
25 జవను చేయ వలెను.। దానికి చుట్టు బెత్తెడు బద్ద
చేసి, దాని బద్ద పైని చుట్టు బంగారు జవ చేయ వలెను.।
26 దానికి నాలుగు బంగారు ఉంగరములను పోత పోసి,
దాని నాలుగు కాళ్లకుండు నాలుగు మూలలలో ఆ
27 ఉంగరములు వేయ వలెను.। బల్ల మోయుటకు, మోత
కర్రలుండు ఉంగరములు బద్దకు సమీపముగా నుండ
28 వలెను.। ఆ మోత కర్రలు తుమ్మ కర్రతో చేసి,
వాటిమీద బంగారు రేకు తాప వలెను; వాటిచేత
29 బల్ల మోయబడును.। మరియు నీవు దాని పళ్లెములను
దాని ధూపార్తులను, దాని గిన్నెలను, తడుపుటకు దాని
పాత్రలను చేయ వలెను; మేలిమి బంగారుతో వాటిని,
30 చేయ వలెను.। బల్ల మీద నిత్యమును నా యెదుట
సమ్ముఖపు రొట్టెలనుంచ వలెను.

31 మరియు నీవు మేలిమి బంగారుతో దీప వృక్షము
చేయ వలెను; నకసిపనిగా దాని చేయ వలెను. దీప
వృక్షమును దాని ప్రకాండమును దాని శాఖను నకసి
పనిగా చేయ వలెను. దాని కలశలు, దాని మొగ్గలు,
దాని పువ్వులు దానితో ఏకాండమై యుండ వలెను.।
32 దీప వృక్షముయొక్క ఒక పక్కనుంచి మూడు కొ
మ్మలు, దీప వృక్షముయొక్క రెండవ పక్కనుంచి
మూడు కొమ్మలు, దాని పక్కలనుంచి ఆరు కొమ్మలు
33 బైలుదేరుచుండ వలెను.। ఒక కొమ్మలో మొగ్గ పువ్వు
గల బాదామి రూపమైన మూడు కలశలు; రెండవ
కొమ్మలో మొగ్గ పువ్వుగల బాదామి రూపమైన
మూడు కలశలు, అట్లు దీప వృక్షమునుంచి బైలుదేరు
ఆరు కొమ్మలలో నుండ వలెను.

34 మరియు, దీపవృక్ష ప్రకాండములో బాదామి
రూపమైన నాలుగు కలశలును వాటి మొగ్గలును వాటి
35 పువ్వులునుండ వలెను.। దీపవృక్ష ప్రకాండమునుంచి
బైలుదేరు ఆరు కొమ్మలకు, దాని రెండు కొమ్మల కింద
ఏకాండమైన మొగ్గయు, రెండు కొమ్మల కింద ఏకాం
డమైన మొగ్గయు, రెండు కొమ్మల కింద ఏకాండమైన
మొగ్గయు నుండ వలెను.। వాటి మొగ్గలు వాటి కొమ్మ 36
లు దానితో ఏకాండమగును; అదంతయు మేలిమి బం
గారుతో చేయబడిన ఏకాండమైన నకసిపనిగా నుండ
వలెను.। నీవు దాని ఏడు ప్రదీపములు చేయ వలెను; 37
దాని యెదుట వెలుగిచ్చునట్లు దాని ప్రదీపములు వెలి
గించ వలెను.। దాని కత్తెర, దాని కత్తెర చిప్పయు 38
మేలిమి బంగారుతో చేయ వలెను.। ఆ ఉపకరణము 39
లన్నియు, ఒక తలాంతు* మేలిమి బంగారుతో చేయ
వలెను.। కొండ మీద నీకు కనబడిన వాటి పోలిక 40
చొప్పున, వాటిని చేయుటకు జాగ్రత్తపడుము.

## 26. అధ్యాయము.

మరియు, నీవు పది తెరలతో ఒక ఆలయమును 1
చేయ వలెను. నీల ధూమ్ర రక్త వర్ణములు గల పేనిన
సన్నపు నారతో వాటిని చిత్రకారుని పనియైన†
కెరూబులు గల వాటినిగా చేయ వలెను.। ఒక తెర 2
పొడుగు ఇరువదియెనిమిది మూరలు; ఒక తెర వెడల్పు
నాలుగు మూరలు గలవై యుండ వలెను. ఆ తెరల
న్నిటికి ఒకటే కొలత.। ఐదు తెరలు ఒకదానితో 3
నొకటి కూర్చ వలెను. మిగిలిన ఐదు తెరలు ఒక
దానితో నొకటి కూర్చ వలెను.। తెరల కూర్పు చివ 4
రను, మొదటి తెర అంచున నీలి నూలుతో కొలు
కులను చేయ వలెను. రెండవ కూర్పునందలి వెలపటి
తెర చివరను, ఆలాగు చేయవలెను.। ఒక తెరలో ఏ 5
బది కొలుకులను చేసి, ఆ కొలుకులు ఒకదాని నొకటి
తగులుకొనునట్లు, ఆ రెండవ కూర్పునందలి తెర అం
చున ఏబది కొలుకులను చేయ వలెను.। మరియు, ఏబది 6
బంగారు గుండీలను చేసి, ఆ గుండీలచేత ఆ తెరలను
ఒకదానితో నొకటి కూర్చ వలెను. అది ఒకటే ఆల
యమవును.

మరియు, ఆలయము పైని గుడారముగా మేక వెం 7
ట్రుకలతో తెరలను చేయ వలెను. పదకొండు తెరలు
చేయ వలెను.।ఒక తెర పొడుగు ముప్పది మూరలు; 8
ఒక తెర వెడల్పు నాలుగు మూరలు. పదకొండు
తెరల కొలత ఒకటే.। ఐదు తెరలను ఒకటిగాను, 9
ఆరు తెరలు ఒకటిగాను ఒకదానికొకటి కూర్చ వలె
ను. ఆరవ తెరను గుడారపు ఎదుటి భాగమున మడవ
వలెను.। తెరల కూర్పున, వెలపలనున్న తెర అంచున 10
ఏబది కొలుకులను, రెండవ కూర్పునందలి తెర అం
చున ఏబది కొలుకులను చేయ వలెను.। మరియు, 11
ఏబది రాగి‡ గుండీలను చేసి, ఒకటే గుడారమగునట్లు

* బంగారు తలాంతు, 54760-రూపాయలు కావచ్చును. † లేక, నేతపనియైన. ‡ లేక, కంచు.

ఆ గుండీలను ఆ కొలుకులకు తగిలించి, దాని కూర్చ వలె
12 ను. । ఆ గుడారపు తెరలలో మిగిలి వ్రేలాడు భాగము,
అనగా మిగిలిన సగము తెర ఆలయము వెనుక పక్క
13 మీద వ్రేలాడ వలెను. । మరియు గుడారపు తెరల
పొడుగులో మిగిలినది, ఈ పక్కను ఒక మూరయు
ఆ పక్కను ఒక మూరయు, ఆలయమును కప్పుటకు,
ఈ పక్కను ఆ పక్కను, దాని పక్కల మీద వ్రేలా
డ వలెను.

14 మరియు ఎరుపు రంగు వేసిన పొట్టేళ్ల తోళ్లతో
పైకప్పును, దానికి మీదుగా తాహసను దాని తోళ్ల
తో పైకప్పును చేయ వలెను.

15 మరియు; ఆలయమునకు తుమ్మ కర్రతో నిలువుపల
16 కలను చేయవలెను. । పలక పొడుగు పది మూరలు,
17 పలక వెడల్పు మూర నరయు నుండ వలెను. । ప్రతి
పలకలో, ఒకదానికి ఒకటి సరియైన రెండు కుసులు
18 ఉండ వలెను. । అట్లు ఆలయపు పలకలన్నిటికి చేసి
పెట్ట వలెను. ఇరువది పలకలు కుడివైపున, అనగా
దక్షిణ దిక్కున ఉండునట్లు, ఆలయమునకు పలకలను
19 చేయ వలెను. । మరియు, ఒక పలక కింద దాని రెండు
కొనలకు రెండు తొలులను, ఒక పలకకింద దాని రెం
డు కొనలకు రెండు తొలులను, ఆ యిరువది పలకల
20,21 కింద నలుబది వెండి తొలులను చేయ వలెను. । ఆల
యపు రెండవ పక్కను, అనగా, ఉత్తర దిక్కున, ఒక
పలక కింద రెండు తొలులు, ఒక పలక కింద రెండు
తొలులు, ఇరువది పలకలును, వాటి నలుబది వెండి
22 తొలులు నుండ వలెను. । పడమటి తట్టు ఆలయపు
23 వెనుక పక్కకు ఆరు పలకలను చేయ వలెను. । మరియు
ఆ వెనుక పక్కను ఆలయపు మూలలకు రెండు* పలక
24 లను చేయ వలెను. । అవి అడుగున కూర్చబడి, శిఖర
మున మొదటి ఉంగరముదాక ఒకదానితో ఒకటి సం
ధించబడ వలెను. అట్లు ఆ రెంటికి నుండ వలెను. అవి
25 రెండు మూలలకుండును. । పలకలు ఎనిమిది; వాటి
వెండి తొలులు పదహారు తొలులు, ఒక పలకకింద
రెండు తొలులు, ఒక పలకకింద రెండు తొలులుండ
వలెను.

26 మరియు, తుమ్మ కర్రతో అడ్డు కర్రలను చేయ
వలెను. ఆలయపు ఒకపక్క పలకలకు ఐదు అడ్డు
27 కర్రలును, । ఆలయపు రెండవ పక్క పలకలకు ఐదు
అడ్డు కర్రలును; పడమటి వైపున ఆలయపు పక్క
28 పలకలకు ఐదు అడ్డు కర్రలునుండ వలెను; । ఆ పలకల
మధ్యనుండు నడిమి అడ్డు కర్ర ఈ కొననుంచి ఆ కొ
29 సమట్టుకు చేరి యుండ వలెను. । ఆ పలకలకు బం
గారు రేకు తాపించి, వాటి అడ్డు కర్రలుండు వాటి
ఉంగరములను బంగారుతో చేసి, అడ్డు కర్రలకును
బంగారు రేకు తాపించ వలెను. । అప్పుడు కొండ మీద 30
నీకు అగపరచబడిన దాని పోలిక చొప్పున ఆలయ
మును నిలువబెట్ట వలెను.

మరియు నీవు నీల ధూమ్ర రక్త వర్ణములు గల 31
పేనిన సన్నపు నారతో ఒక అడ్డు తెరను చేయ వలెను.
అది చిత్రకారుని పనియైన కెరూబులు గలదిగా చేయ
వలెను. । తుమ్మ కర్రతో చేయబడి బంగారు రేకు తా 32
పిన నాలుగు స్తంభముల మీద దాని వేయ వలెను;
దాని వంకులు బంగారువి; వాటి తొలులు వెండివి. ।
ఆ అడ్డు తెరను ఆ కొలుకుల కింద తగిలించి, శాసనము 33
గల పెట్టె అడ్డు తెర లోపలికి తే వలెను. ఆ అడ్డు
తెర పరిశుద్ధ స్థలమునకును అతి పరిశుద్ధ స్థలమునకును
మీ నిమిత్తము వేరు చేయును. । ఆ అతిపరిశుద్ధ స్థలము 34
లో శాసనము గల పెట్టెమీద ఆచ్ఛాదన పీఠము
నుంచ వలెను. । అడ్డు తెర వెలపల బల్లను ఆ బల్ల 35
యెదుట, దక్షిణపు తట్టున్న ఆలయపు పక్కను దీప
వృక్షము నుంచ వలెను.

మరియు నీల ధూమ్ర రక్త వర్ణములు గల పేనిన 36
సన్నపు నారతో చిత్రకారుని పనియైన తెరను గుడా
రపు ద్వారమునకు చేయ వలెను. । ఆ తెరకు ఐదు 37
స్తంభములను తుమ్మ కర్రతో చేసి, వాటికి బంగారు
రేకు తాపించ వలెను. వాటి వంకులు బంగారువి;
వాటికి ఐదు రాగి తొలులు పోత పోయ వలెను.

## 27. అధ్యాయము.

మరియు, నీవు ఐదు మూరల పొడుగు ఐదు మూ 1
రల వెడల్పు గల వేదికను తుమ్మ కర్రతో చేయ వలె
ను. ఆ వేదిక చదరముగా నుండ వలెను. దాని
యెత్తు మూడు మూరలు; । దాని నాలుగు మూలల మీద 2
దాని కొమ్ములు చేయ వలెను. దాని కొమ్ములు దాని
తో ఏకాండముగా నుండ వలెను. దానికి రాగి† రేకు
తాపించ వలెను. । దాని భూడిదె ఎత్తుటకు దాని కుం 3
డలను, దాని పారలను, దాని గిన్నెలను‡ దాని ముం
డ్లను, దాని అగ్నిపాత్రలను చేయ వలెను; । దాని ఉప 4
కరణములన్నియు రాగి† తో చేయ వలెను. । మరియు 5
వలవంటి రాగి† జల్లెడ దానికి చేయ వలెను. ఆ వల
మీద, దాని నాలుగు మూలలను, నాలుగు రాగి యుం
గరములను చేసి, ఆ వల వేదిక నడిమి మట్టుకు చేరు
నట్లు, దిగువను వేదిక గట్టుకింద దాని ఉంచ వలెను. ।
మరియు వేదిక కొరకు, మోత కర్రలు చేయ వలెను. 6

* లేక, రెండేసి. † లేక, కంచు. ‡ లేక, ప్రోక్షణ పాత్రలను.

ఆ మోత కర్రలు తుమ్మ కర్రతో చేసి, వాటికి రాగి
7 రేకును తాప వలెను. । ఆ మోత కర్రలు దాని ఉంగర
ములలో చొనప వలెను. వేదిక మోయుటకు, ఆ మోత
8 కర్రలు దాని రెండు పక్కల నుండ వలెను. । పలకల
తో గుల్లగా దాని చేయ వలెను. కొండ మీద నీకు
చూపబడిన ప్రకారముగానే వారు దాని చేయ వలెను.

9 మరియు, నీవు ఆలయమునకు ఆవరణమేర్పరచ
వలెను. కుడివైపున, అనగా దక్షిణ దిక్కున, ఆవ
రణ కొరకు నూరు మూరల పొడుగు గల పేనిన
సన్నపు నార తెరలు ఒక పక్కకు నుండ వలెను. ।
10 దాని ఇరువది స్తంభములును వాటి ఇరువది తొ
లును రాగివి. ఆ స్తంభముల వంకులును వాటి పెండె
11 బద్దలును వెండివి. । అట్లే పొడుగులో, ఉత్తర పార్శ్వ
మందు నూరు మూరల పొడుగు గల తెరలు నుండ
వలెను. దాని ఇరువది స్తంభములును వాటి ఇరువది
తొలులును రాగివి.* ఆ స్తంభముల వంకులును, వాటి
12 పెండె బద్దలును వెండివి. । పడమటి దిక్కున ఆవరణ
వెడల్పు కొరకు ఏబది మూరల తెరలు నుండ వలెను.
13 వాటి స్తంభములు పది, వాటి తొలులు పది. । తూర్పు
వైపున, అనగా ఉదయ దిక్కున ఆవరణ వెడల్పు ఏబది
14 మూరలు. । ఒక పక్కను, పదిహేను మూరల తెర
లుండ వలెను; వాటి స్తంభములు మూడు, వాటి తొ
15 లులు మూడు. । రెండవ పక్కను పదిహేను మూరల
తెరలుండ వలెను; వాటి స్తంభములు మూడు, వాటి
16 తొలులు మూడు. । ఆవరణ ద్వారమునకు నీల ధూమ్ర
రక్త వర్ణములు గల పేనిన సన్నపు నారతో చిత్రకా
రుని పనియైన ఇరువది మూరల తెర ఉండ వలెను. వాటి
17 స్తంభములు నాలుగు, వాటి తొలులు నాలుగు. । ఆవ
రణము చుట్టున్న స్తంభములన్నియు వెండి పెండెబద్దలు
కలవి. వాటి వంకులు వెండివి, వాటి తొలులు రాగివి. ।
18 ఆవరణపు పొడుగు నూరు మూరలు; దాని వెడల్పు
ఏబదియే; దాని ఎత్తు ఐదు మూరలు. అవి పేనిన
19 సన్నపు నారవి; వాటి తొలులు రాగివి. । ఆలయము
యొక్క సమస్త సేవలో, దాని ఉపకరణములన్నియు,
దాని మేకులన్నియు, ఆవరణపు మేకులన్నియు, రాగివై
యుండ వలెను.

20 మరియు, దీపము నిత్యము వెలిగించునట్లు, ప్రదీ
పము కొరకు దంచి తీసిన శుద్ధమైన ఒలీవల నూనె తే
21 వలెనని ఇశ్రాయేలు పుత్రులకు ఆజ్ఞాపించుము. । శాస
నము గల పెట్టె యెదుటనున్న తెరకు వెలపల, సం
ఘపు గుడారములో అహరోను అతని కుమారులును
సాయంకాలము మొదలుకొని ఉదయకాల పర్యంతము
యెహోవా యెదుట దాని సవరించ వలెను. అది
ఇశ్రాయేలు పుత్రులకు, వారి తరతరముల మట్టుకు
నిత్యమైన కట్టడ.

## 28. అధ్యాయము.

మరియు, నాకు యాజకుడగునట్లు, నీ సహో 1
దరుడైన అహరోనును అతని కుమారులను, అనగా
అహరోనును అహరోను కుమారులైన నాదాబును, అబీ
హును, ఎలాజారును ఈతామారును ఇశ్రాయేలు పు
త్రులలోనుంచి నీ యొద్దకు చేర్చుకొనుము. । మహిమ 2
కొరకును అలంకారము కొరకును నీ సహోదరుడగు
అహరోనుకు పరిశుద్ధ వస్త్రములను చేయ వలెను. ।
అహరోను నాకు యాజకుడగునట్లు అతని పరిశుద్ధ 3
పరచుటకు, అతని వస్త్రములను చేయ వలెనని, నేను
జ్ఞానాత్మతో నిండించిన జ్ఞాన హృదయము గల వారం
దరితో చెప్పుము. । వారు చేయ వలసిన వస్త్రములు 4
ఏవేవనగా, పతకము, ఏఫోదు, నిలువుటంగి, విచిత్ర
మైన చొక్కాయి, పాగా, దట్టియునవి. అతడు
నాకు యాజకుడై యుండునట్లు, వారు నీ సహోద
రుడైన అహరోను కొరకును, అతని కుమారుల కొర
కును పరిశుద్ధ వస్త్రములను చేయ వలెను. । వారు బంగా 5
రును, నీల ధూమ్ర రక్త వర్ణములు గల నూలును, సన్నపు
నారను తీసుకొని, । బంగారుతోను, నీల ధూమ్ర రక్తవర్ణ 6
ములు గల పేనిన సన్నపు నారతోను, చిత్రకారుని
పనిగా ఏఫోదును చేయ వలెను. । దానికి దాని రెండు 7
అంచులయందు కూర్చబడు రెండు భుజ ఖండములుండ
వలెను; అట్లు సమకూర్చబడి యుండును. । మరియు, 8
ఏఫోదు మీదనుండు విచిత్రమైన దట్టి, దాని పని రీతి
గా ఏకాండమైనదై, బంగారుతోను, నీల ధూమ్ర రక్త
వర్ణములు గల నూలుతోను, పేనిన సన్నపు నార
తోను చేయ వలెను.

మరియు నీవు రెండు లేతపచ్చలను తీసుకొని 9
వాటిమీద ఇశ్రాయేలు పుత్రుల పేరులను, అనగా
వారి జన్మక్రమముల చొప్పున, । ఒక రత్నము మీద 10
వారి పేళ్లలో ఆరును, రెండవ రత్నము మీద తక్కిన
ఆరుగురి పేళ్లను చెక్క వలెను. । ముద్రమీద చెక్కు 11
వాటి వలె, కాసెవాని పనిగా ఆ రెండు రత్నముల
మీద ఇశ్రాయేలు పుత్రుల పేరులు చెక్కి బంగారు
జవలలో వాటిని పొదగ వలెను. । అప్పుడు, ఇశ్రా 12
యేలు పుత్రులకు జ్ఞాపకార్థమైన రత్నములనుగా, ఆ
రెండు రత్నములను ఏఫోదు భుజములమీద నుంచ

* లేక, కంచు.

వలెను. అట్లు, జ్ఞాపకము కొరకు అహరోను తన రెం
డు భుజములమీద యెహోవా సన్నిధిని వారి పేరు
13 లను భరించును. । మరియు, బంగారు జవలను, మేలిమి
14 బంగారుతో రెండు గొలుసులను చేయ వలెను; । సూ
త్రముల వలె అల్లిక పనిగా వాటిని చేసి, అల్లిన గొలు
సులను ఆ జవలకు తగిలించ వలెను.

15 మరియు, చిత్రకారుని పనిగా న్యాయవిధి* పత
కము చేయ వలెను. ఏఫోదు పని వలె దాని చేయ
వలెను. బంగారుతోను, నీల ధూమ్ర రక్త వర్ణములు
గల నూలుతోను, పేనిన సన్నపు నారతోను దాని
16 చేయ వలెను. । అది మడవబడి చదరముగా నుండ వలె
ను; అది జేనెడు పొడుగు జేనెడు వెడల్పు గలదై
17 యుండ వలెను. । దానిలో నాలుగు పంక్తుల రత్నము
లుండునట్లు రత్నముల జవలను చేయ వలెను. మాణి
క్యము,† పుష్యరాగము, పచ్చగల పంక్తి మొదటి పంక్తి; ।
18 కురువిందము, నీలము, వజ్రముగల పంక్తి రెండవ పంక్తి; ।
19 పద్మరాగము, గోమేధికము, సౌగంధికము గల పంక్తి మూ
20 డవ పంక్తి; । పసిమిపచ్చ, లేతపచ్చ, యాస్పె గల పంక్తి
నాలుగవ పంక్తి. అవి బంగారు జవలలో పొదగవలెను. ।
21 ఆ రత్నములు ఇశ్రాయేలు పుత్రుల పేరులు గలవై వారి
పేరుల చొప్పున పదిరెండుండ వలెను. ముద్రమీద
చెక్కిన నాటి వలె, వారిలో ప్రతివాని పేరు చొప్పున,
పదిరెండు గోత్రముల నిమిత్తముండ వలెను.

22 మరియు ఆ పతకము కొరకు, అల్లిక పనిగా, పేనిన
23 గొలుసులను మేలిమి బంగారుతో చేయ వలెను. । పత
24 కము కొరకు రెండు బంగారు ఉంగరములు చేసి, । ఆ
రెండు ఉంగరములను పతకపు రెండు కొనలయందు
వేసి, పతకపు కొనలనున్న రెండు ఉంగరములలో,
అల్లబడిన ఆ రెండు బంగారు గొలుసులను వేయ వలె
25 ను. । అల్లిన ఆ రెండు గొలుసుల కొనలు రెండు, రెం
డు జవలకు తగిలించి, ఏఫోదు యెదుట దాని భుజ
26 ములమీద వేయ వలెను. । మరియు నీవు బంగారుతో
రెండు ఉంగరములు చేసి, ఏఫోదు యెదుటనున్న పత
కపు లోపలి అంచున, దాని రెండు కొనలకు వాటిని
27 తగిలించ వలెను. । మరియు నీవు రెండు బంగారు ఉం
గరములు చేసి, ఏఫోదు విచిత్రమైన దట్టి పైగా, దాని
కూర్పు యొద్ద దాని యెదుటి పక్కకు దిగువను, ఏఫోదు
రెండు భుజ భాగములకు వాటిని తగిలించ వలెను. ।
28 అప్పుడు పతకము, ఏఫోదు విచిత్రమైన దట్టికి పైగా
ఉండునట్లును, అది ఏఫోదునుంచి వదలకుండునట్లును,
వారు పతకపు ఉంగరములకు ఏఫోదు ఉంగరము
లకు నీలి సూత్రముతో దాని కట్ట వలెను.

అట్లు అహరోను పరిశుద్ధ స్థలములోకి వెళ్లునప్పు 29
డు, అతడు తన హృదయము మీద, న్యాయవిధి పత
కములోని ఇశ్రాయేలు పుత్రుల పేరులును నిత్యము
యెహోవా సన్నిధిని జ్ఞాపకార్థముగా భరించ వలెను.

మరియు నీవు న్యాయవిధి పతకములో ఊరీమ్ 30
తుమ్మీమ్ అనునవి పెట్ట వలెను. అహరోను యెహో
వా సన్నిధికి వెళ్లునప్పుడు అవి అతని హృదయము
మీద నుండును. అట్లు, అహరోను యెహోవా సన్ని
ధిని తన హృదయము మీద ఇశ్రాయేలు పుత్రుల
న్యాయవిధిని నిత్యము భరించును.

మరియు, ఏఫోదు నిలువుటంగి కేవలము నీలి నూలు 31
తో చేయ వలెను. । తలకొరకు మెడ రంధ్రము‡ దాని 32
మధ్యనుండ వలెను. అది చినగకుండునట్లు, కవచపు
మెడరంధ్రము వలె దాని మెడ రంధ్రము చుట్టు నేత
పనియైన గోటు ఉండ వలెను. । దాని అంచున, దాని 33
అంచుల చుట్టు నీల ధూమ్ర రక్త వర్ణములు గల దానిమ్మ
పండ్లను, వాటి మధ్యను బంగారు ఘంటలను నిలువు
టంగి చుట్టు చేయవలెను; । బంగారు ఘంటయు దానిమ్మ 34
పండును, బంగారు ఘంటయు దానిమ్మపండును ఆ నిలు
వుటంగి (కింది) అంచున చుట్టు ఉండ వలెను. । సేవ 35
చేయుటకు అది అహరోనుకుండ వలెను. అతడు యె
హోవా సన్నిధిని పరిశుద్ధ స్థలములోకి ప్రవేశించు
నప్పుడు అతడు చావకుండునట్లు దాని శబ్దము విన
బడ వలెను.

మరియు నీవు మేలిమి బంగారు రేకును చేసి, ము 36
ద్ర చెక్కినట్లు దాని మీద—యెహోవాకు పరిశుద్ధ
ము అనుమాట చెక్క వలెను. । అది పాగా మీద నుం 37
డునట్లు నీలి సూత్రముతో దాని కట్ట వలెను. అది
పాగా ముందటి వైపున ఉండ వలెను. । ఇశ్రాయేలు 38
పుత్రులు తమ పరిశుద్ధమైన కానుకలన్నిటిలో, పరి
శుద్ధపరుచు పరిశుద్ధమైనవాటి అక్రమమును అహ
రోను భరించునట్లు అది అహరోను నొసటనుండ
వలెను. వారు§ యెహోవా సన్నిధిని అంగీకరించబడు
నట్లు అది నిత్యమును అతని నొసటనుండ వలెను.

మరియు, సన్నపు నారతో చొక్కాయిని బుట్టా 39
పనిగా నేయ వలెను. సన్నపు నారతో పాగాను చేయ
వలెను. దట్టిని బుట్టాపనిగా చేయ వలెను.

అహరోను కుమారులకును నీవు చొక్కాయిలను 40
చేయ వలెను; వారికి దట్టీలను చేయ వలెను. ఘనత
కొరకును అందము కొరకును కుళ్లాయిలను వారికి చేయ
వలెను. । అప్పుడు నీవు నీ సహోదరుడైన అహరోను 41

* లేక, తీర్పు. † లేక, కెంపు. ‡ లేక, రంధ్రము. § లేక, అవి.

కును, అతనితో అతని కుమారులకును వాటిని తొడి
గించి వారికి అభిషేకము చేసి, వారిని నియోగించి,*
వారిని పరిశుద్ధపరచ వలెను. అప్పుడు వారు నాకు
42 యాజకులవుదురు.। మరియు, వారి మానము కప్పునట్లు
43 నీవు వారికి నారలాగులను చేయ వలెను.। వారు సం
ఘపు గుడారములోకి ప్రవేశించునప్పుడైనను, పరి
శుద్ధ స్థలములో సేవ చేయుటకు వేదికకు సమీపించు
నప్పుడైనను, వారు అక్రమము వహించి చావకుండు
నట్లు, అది అహరోను మీదను, అతని కుమారుల మీద
నుండ వలెను. అది అతనికిని, అతని తరువాత అతని
సంతతికిని నిత్యమైన కట్టడ.

## 29. అధ్యాయము.

1 వారు నాకు యాజకులగునట్లు వారిని పరిశుద్ధపరు
చుటకు, నీవు వారిని గూర్చి చేయ వలసిన కార్యమే
2 మనగా, । ఒక కోడెదూడను, కళంకములేని రెండు
పొట్టేళ్లను, పొంగని రొట్టెను, నూనెతో కలిసి పొం
గని పిండివంటలను, నూనె పూసిన పొంగని పలచని
3 అప్పడములను తీసుకొనుము;। గోధుమ పిండితో వా
టిని చేసి ఒక గంపలో వాటిని పెట్టి, ఆ గంపను,
ఆ కోడెను, ఆ రెండు పొట్టేళ్లను తీసుకొని రావలెను.
4 అప్పుడు నీవు అహరోనును అతని కుమారులను సం
ఘపు గుడారపు ద్వారము యొద్దకు తీసుకొని వచ్చి
5 నీళ్లతో వారికి స్నానము చేయించి, । ఆ వస్త్రములను
తీసుకొని చొక్కాయిని, ఏఫోదు నిలువుటంగిని, ఏఫో
దును, పతకమును అహరోనుకు తొడిగించి, అతనికి
6 ఏఫోదుయొక్క విచిత్రమైన నడికట్టును కట్టి,। అతని
తల మీద పాగా పెట్టి, ఆ పాగామీద పరిశుద్ధ కిరీ
7 టముంచి,। అభిషేకతైలము తీసుకొని, అతని తలమీద
8 పోసి అతని అభిషేకించ వలెను.। మరియు నీవు అతని
కుమారులను సమీపింపచేసి వారికి చొక్కాయిలను
9 తొడిగించ వలెను.। అహరోనుకును అతని కుమారుల
కును దట్టిని కట్టి, వారికి కుళ్లాయిలు పెట్ట వలెను.
నిత్యమైన కట్టడవల్ల యాజకత్వము వారిదై యుండ
వలెను. అట్లు, అహరోనును అతని కుమారులనును
నియోగించ వలెను.

10 మరియు, నీవు సంఘపు గుడారము యెదుటికి ఆ
కోడెను తెప్పించ వలెను. అప్పుడు అహరోను, అతని
కుమారులును కోడె తల మీద తమ చేతులను ఉంచ
11 వలెను.। అప్పుడు సంఘపు గుడారపు ద్వారము యొద్ద
12 యెహోవా సన్నిధిని ఆ కోడెను వధించ వలెను.। ఆ
కోడె రక్తములోనిది కొంచెము తీసుకొని, నీ వేలితో
వేదిక కొమ్ములమీద చమిరి, ఆ రక్త శేషమంతయు
వేదిక అడుగున పోయ వలెను.

మరియు ఆంత్రములను కప్పుకొను కొవ్వంతటిని, 13
కాలేజముమీది వపనును, రెండు మూత్రగ్రంథులను,
వాటిమీది కొవ్వును నీవు తీసి వేదికమీద వాటిని
ధూపము వేయ వలెను. । అయితే ఆ కోడె మాంస 14
మును, దాని చర్మమును, దాని పేడను, పేలమునకు వెల
పట అగ్నివల్ల కాల్చ వలెను; అది పాపార్పితము.†
మరియు నీవు ఆ పొట్టేళ్లలో ఒకదాని తీసుకొన 15
వలెను. అహరోనును అతని కుమారులును, ఆ పొట్టేలు
తల మీద తమ చేతులు ఉంచ వలెను.। అప్పుడు నీవు 16
ఆ పొట్టేలును వధించి, దాని రక్తము తీసి, వేదికకు
చుట్టు దాని ప్రోక్షించ వలెను.

మరియు, నీవు ఆ పొట్టేలును దాని అవయవము 17
లగా కోసి, దాని ఆంత్రములను, దాని కాళ్లను కడిగి,
దాని అవయవములతోను దాని తలతోను చేర్చి,। వేదిక 18
మీద ఆ పొట్టేలంతయు ధూపమువేయ వలెను, అది
యెహోవాకు ఆరోహణయాగము, యెహోవాకు
ఇంపైన సువాసన గల హోమము.

మరియు నీవు రెండవ పొట్టేలును తీసుకొన వలెను. 19
అప్పుడు అహరోనును అతని కుమారులును ఆ పొట్టేలు
తల మీద తమ చేతులను ఉంచ వలెను.। అప్పుడు ఆ 20
పొట్టేలును వధించి, దాని రక్తములోనిది కొంచెము
తీసి, అహరోను కుడిచెవి కొన మీదను, అతని కుమా
రుల కుడిచెవి కొన మీదను, వారి కుడిచేతి బొట్టన
వేలి మీదను, వారి కుడికాలి బొట్టనవేలి మీదను
చమిరి, వేదికకు చుట్టు ఆ రక్తము ప్రోక్షించ వలె
ను. । మరియు నీవు వేదిక మీదనున్న రక్తములోను 21
అభిషేక తైలములోను కొంచెము తీసి, అహరోను
మీదను, అతని వస్త్రముల మీదను, అతనితోనున్న
అతని కుమారుల మీదను, అతని కుమారుల వస్త్రముల
మీదను దాని ప్రోక్షించ వలెను. అప్పుడు అతనికిని
అతని వస్త్రములకును అతనితోనున్న అతని కుమా
రులకును అతని కుమారుల వస్త్రములకును పరిశుద్ధత
కలుగును.

మరియు, అది నియోజకమైన పొట్టేలు గనుక దాని 22
యొక్క కొవ్వును, తోకను, ఆంత్రములను కప్పు కొ
వ్వును, కాలేజము మీది వపనును, రెండు మూత్ర
గ్రంథులను, వాటిమీది కొవ్వును, కుడి జబ్బను;। ఒక 23
గుండ్రని రొట్టెను, నూనె గల పొడిచిన ఒక భక్ష్య
మును, యెహోవా యెదుటనున్న పొంగని వాటి

* లేక, వారి చేతులను నిండించి. † లేక, పాపాచ్ఛాదనము.

24 లో పలచని ఒక అప్పడమును నీవు తీసుకొని, ।అహ
రోను చేతులలోను, అతని కుమారుల చేతులలోను
వాటినన్నిటిని ఉంచి, అల్లాడించబడు కానుకగా వా
25 టిని యెహోవా యెదుట అల్లాడించ వలెను. । తరు
వాత నీవు వారి చేతులలోనుంచి వాటిని తీసుకొని,
యెహోవా సన్నిధిని ఇంపైన సువాసన కలుగునట్లు,
వేదికమీద ఆరోహణయాగము నిమిత్తము వాటిని
ధూపము వేయ వలెను. అది యెహోవాకు హో
మము.
26 మరియు, అహరోను నియోజకమైన పొట్టేలు
నుంచి బోరను తీసి, అల్లాడించు కానుకనుగా యె
హోవా సన్నిధిని దాని అల్లాడించ వలెను; అది నీకు
27 పాలై యుండును. । మరియు, నియోజకమైన పొట్టేళ్ల
నుంచి, అనగా అహరోను దానినుంచియు అతని కుమా
రుల దానినుంచియు ఎత్తబడిన దాని అల్లాడించబడిన
దానిని, అనగా అల్లాడించబడిన దాని బోరను, ఎత్తబ
28 డిన దాని జబ్బను పరిశుద్ధపరచ వలెను. ।అది ఎత్తిన కా
నుక గనుక నిత్యమైన కట్టడవలన, అది ఇశ్రాయేలు
పుత్రులనుంచి అహరోనుకు అతని కుమారులకు నుండ
వలెను. అది ఇశ్రాయేలు పుత్రులు అర్పించు మం
గళయాగములనుంచి తాము ఎత్తిన కానుక, అనగా
వారు యెహోవాకు ఎత్తిన కానుకగా నుండును.
29 మరియు అహరోనుకు కలిగిన పరిశుద్ధ వస్త్రము
లతో అభిషేకము పొందుటకును వాటియందు
నియోగించబడుటకును, అవి అతని తరువాత అతని
30 కుమారులవై యుండ వలెను. । అతని కుమారులలో
ఎవడు అతనికి ప్రతిగా యాజకుడగునో వాడు పరి
శుద్ధ స్థలములో సేవ చేయుటకు సంఘపు గుడారము
లోకి వెళ్లునప్పుడు, ఏడు దినములు వాటిని వేసుకొన
వలెను.
31 మరియు నీవు నియోజకమైన పొట్టేలును తీసుకొని
ఒక పరిశుద్ధ స్థలములో దాని మాంసము వండ వలె
32 ను. ।అప్పుడు అహరోనును అతని కుమారులును సం
ఘపు గుడారపు ద్వారము దగ్గర ఆ పొట్టేలు మాంస
33 మును, గంపలోని రొట్టెలను తిన వలెను. । వారిని
నియోగించుటకును వారిని పరిశుద్ధపరుచుటకును వేటి
వలన ఆచ్ఛాదనము* చేయబడెనో, వాటిని వారు
తిన వలెను; అవి పరిశుద్ధమైనవి గనుక అన్యుడు
34 వాటిని తిన కూడదు. । నియోజకమైన మాంసములో
నైనను ఆ రొట్టెలలోనైనను కొంచెము ఉదయ పర్యం
తము మిగిలి యుంటే, ఆ మిగిలినది అగ్నివలన దహించ
వలెను. అది పరిశుద్ధమైనది గనుక అది తిన కూడదు.

నేను నీకు ఆజ్ఞాపించిన అన్నిటి ప్రకారము, నీవు 35
అట్లు, అహరోనును గూర్చియు అతని కుమారులను గూ
ర్చియు చేయ వలెను. ఏడు దినములు వారిని నియో
గించుచుండ వలెను. । ప్రతిదినము పాపాచ్ఛాదనముల 36
నిమిత్తము, కోడెను పాపార్పితముగా చేసి, వేదిక నిమి
త్తము ఆచ్ఛాదనము చేయుట వలన, దానికి పాపశుద్ధి
కలుగచేసి, దాని పరిశుద్ధపరుచుటకు దానికి అభిషే
కము చేయ వలెను. । ఏడు దినములు నీవు వేదిక నిమి 37
త్తము† పాపాచ్ఛాదనము చేసి, దాని పరిశుద్ధపరచ
వలెను. ఆ వేదిక అతిపరిశుద్ధముగా నుండును. ఆ వేది
కకు తగులునది అంతయు పరిశుద్ధముగా నుండును.
నీవు వేదికమీద నిత్యమును అర్పించ వలసినది 38
ఏమనగా, ఒక సంవత్సరము గల రెండు గొఱ్ఱెపిల్లలను
ప్రతిదినము ఉదయమందు ఒక గొఱ్ఱెపిల్లను, । ప్రదోష 39
కాలమందు రెండవ గొఱ్ఱెపిల్లను అర్పించ వలెను. ।
దంచి తీసిన, హీనులో పావు నూనెతో కలిపిన 40
పదియవవంతు పిండినిని పానార్పణముగా హీనులో
పావు ద్రాక్షారసమును మొదటి గొఱ్ఱెపిల్లతో అర్పించ
వలెను. । ప్రదోషకాలమందు రెండవ గొఱ్ఱెపిల్లను 41
అర్పించ వలెను. అది యెహోవాకు ఇంపైన సువా
సన గల హోమమగునట్లు, ఉదయకాలమందలి కా
నుక వలెను దాని పానార్పితము వలెను దీనితో
అర్పించ వలెను. । ఇది యెహోవా సన్నిధిని సంఘపు 42
గుడారముయొక్క ద్వారము యొద్ద, మీ తరతరముల
మట్టుకు నిత్యమైన ఆరోహణయాగమగును. అక్కడ
నీతో పలుకుటకు అక్కడికి వచ్చి మిమ్మును కలుసు
కొందును. । అక్కడికి వచ్చి ఇశ్రాయేలు పుత్రు 43
లను కలుసుకొందును; అది నా మహిమవలన పరిశుద్ధ
పరచబడును; । నేను సంఘపు గుడారమును వేది 44
కను పరిశుద్ధపరిచెదను. నాకు యాజకులగునట్లు అహ
రోనును అతని కుమారులను పరిశుద్ధపరిచెదను. । నేను 45
ఇశ్రాయేలు పుత్రుల మధ్యను నివసించి, వారికి
దేవుడనై యుందును. । అప్పుడు నేను వారి మధ్యను 46
నివసించునట్లు, ఐగుప్తు దేశములోనుంచి వారిని బైటికి
తీసుకొని వచ్చిన వారి దేవుడనైన యెహోవాను
నేనే అని యెరుగుదురు; నేను వారి దేవుడనైన
యెహోవాను.

## 30. అధ్యాయము.

మరియు, ధూపము వేయుటకు నీవు ఒక వేదికను 1
చేయ వలెను; తుమ్మ కఱ్ఱతో దాని చేయ వలెను. ।
దాని పొడుగు ఒక మూర; దాని వెడల్పు ఒక మూర. 2

* లేక, పాపాచ్ఛాదనము. † లేక, మీద.

అది చదరముగా నుండ వలెను. దాని యెత్తు రెండు
మూరలు. దాని కొమ్ములు దానితో ఏకాండమై యుండ
3 వలెను. ౹ దాని పైభాగమునకును, దాని నాలుగు పక్క
లకును, దాని కొమ్ములకును మేలిమి బంగారు రేకులు తా
పించి దానికి చుట్టు బంగారు జవ చేయ వలెను. ౹
4 దాని జవకు దిగువను, దానికి రెండు బంగారు ఉంగ
రములను చేయ వలెను. దాని రెండు పక్కలయందలి
దాని రెండు మూలల మీద వాటిని వేయ వలెను. ౹
5 అవి దాని మోయు మోత కర్రలకు స్థలములు. ఆ
మోత కర్రలను తుమ్మ కర్రతో చేసి వాటికి బంగారు
6 రేకు తాపించ వలెను. ౹ శాసనముల పెట్టె యొద్దనుండు
అడ్డు తెర యెదుట, అనగా, నేను ఎక్కడ నిన్ను కలు
సుకొందునో ఆ శాసనముల మీది ఆచ్ఛాదన పీఠము
యెదుట నీవు దాని ఉంచ వలెను.

7 అప్పుడు అహరోను దినదినము ప్రాద్దుట దాని
మీద పరిమళద్రవ్య ధూపము వేయ వలెను. అతడు ప్రదీ
పములను చక్కపరచునప్పుడు దాని మీద ఆ ధూపము
8 వేయ వలెను. ౹ మరియు సాయంకాలమందు, అహ
రోను ప్రదీపములు వెలిగించునప్పుడు దాని మీద ధూ
పము వేయ వలెను. అది మీ తరతరముల మట్టుకు
9 యెహోవా సన్నిధిని నిత్యమైన ధూపము. ౹ మీరు
దాని మీద అన్యధూపమునైనను ఆరోహణయాగము
నైనను, కానుకనైనను అర్పించ వద్దు; పానార్పితము
నైనను దాని మీద పోయ వద్దు.

10 మరియు, అహరోను సంవత్సరమునకు ఒకసారి
పాపాచ్ఛాదకమైన అర్పితముల రక్తమువలన, దాని
కొమ్ముల మీద* ఆచ్ఛాదనము చేయ వలెను. మీ తర
తరముల మట్టుకు సంవత్సరమునకు ఒకసారి దాని
మీద ఆచ్ఛాదనము చేయ వలెను. అది యెహో
వాకు అతిపరిశుద్ధమైనదనెను.

11,12 మరియు యెహోవా మోషేతో ఇట్లనెను—
నీవు ఇశ్రాయేలు సంఖ్య ప్రకారము వారిని లెక్కిం
చునప్పుడు, ప్రతి మనుష్యుడు, వారు లెక్కించబడు
వేళను, తన ప్రాణము కొరకు ఆచ్ఛాదనమిచ్చుకొన
వలెను. అప్పుడు నీవు వారిని లెక్కించుచుండగా,
13 వారిలో ఏ తెగులు నుండదు. ౹ వారు ఇయ్య వల
సినది యేమనగా లెక్కించబడినవారిలోకి చేరు ప్రతి
వాడును పరిశుద్ధాలయముయొక్క షెకెలులో అర
షెకెలు ఇయ్య వలెను. ఆ షెకెలు† ఇరువది గేరాలు.
ఆ అర షెకెలు యెహోవాకు ఎత్తబడిన కానుక. ౹
14 ఇరువది సంవత్సరములు గాని, అంతకంటె ఎక్కువ
వయస్సుగాని గలవారై లెక్కించబడినవారిలోకి చేరు
ప్రతి వాడును యెహోవాకు ఎత్తబడిన కానుకను
ఇయ్య వలెను. ౹ మీ ప్రాణముల కొరకు ఆచ్ఛాద 15
నము చేసుకొనునట్లు, మీరు యెహోవాకు ఎత్తబడిన
కానుకను యిచ్చునప్పుడు, అర షెకెలుకంటె ధనవం
తుడు ఎక్కువ ఇయ్య కూడదు, బీదవాడు తక్కువ
ఇయ్య కూడదు. ౹ నీవు ఆ యాచ్ఛాదనముల వెండి, 16
ఇశ్రాయేలు పుత్రుల యొద్దనుంచి తీసుకొని, సంఘపు
గుడారపు సేవ నిమిత్తము, దాని నియమించ వలెను.
మీ ప్రాణముల కొరకు ఆచ్ఛాదనము చేసుకొనునట్లు
అది యెహోవా సన్నిధిని ఇశ్రాయేలు పుత్రులకు
జ్ఞాపకార్థముగా నుండుననెను.

మరియు యెహోవా మోషేతో ఇట్లనెను—కడుగు 17
కొనుటకు నీవు రాగితో ఒక పళ్లెమును, దాని రాగి
కాలును చేసి, ౹ సంఘపు గుడారమునకు వేదికకు మ 18
ధ్యను దాని ఉంచి, దానిలో నీళ్లు నింప వలెను. ౹ దాని 19
లో అహరోనును అతని కుమారులును తమ చేతులను
తమ కాళ్లను కడుగుకొన వలెను. ౹ వారు సంఘపు 20
గుడారములోకి వెళ్లునప్పుడైనను, లేక సేవ చేసి, యె
హోవాకు హోమ ధూపము అర్పించుటకు వేదిక
యొద్దకు వచ్చునప్పుడైనను, వారు చావకుండునట్లు నీళ్ల
తో కడుగుకొన వలెను. ౹ వారు చావకుండునట్లు, 21
తమ చేతులను తమ కాళ్లను కడుగుకొన వలెను. అది
వారికి అనగా అతనికిని అతని సంతతికిని వారి తర
తరముల మట్టుకు నిత్యమైన కట్టడగా నుండుననెను.

మరియు, యెహోవా మోషేతో ఇట్లనెను—నీవు 22
ముఖ్యమైన సుగంధ ద్రవ్యములలో, ౹ పరిశుద్ధాలయము 23
యొక్క షెకెలు చొప్పున, అచ్చమైన బోళము ఏనూరు
షెకెలులను, సువాసన గల కారపు చెక్క సగమనగా
ఇన్నూట ఏబది షెకెలులను, ౹ సువాసన గల వస 24
ఇన్నూట ఏబది షెకెలులను, లవంగపు పట్ట ఏనూరు
షెకెలులను, ఒలీవ నూనె ఒక హీనును తీసుకొని ౹
వాటిని పరిశుద్ధాభిషేక తైలమనగా, సుగంధ ద్రవ్యమే 25
లకుని పనియైన పరిమళ సంభారముగా చేయ వలెను.
అది పరిశుద్ధాభిషేక తైలమగును. ౹ ఆ తైలముతో నీవు 26
సంఘపు గుడారమును, శాసనముల పెట్టెను. ౹ బల్లను, 27
దాని యుపకరణములన్నిటిని, దీప వృక్షమును, దాని
ఉపకరణములను ధూప వేదికను ౹ ఆరోహణ యజ్ఞ 28
వేదికను, దాని ఉపకరణములన్నిటిని, పళ్లెమును, దాని
కాలును అభిషేకించి, ౹ అవి అతిపరిశుద్ధమైనవిగా నుం 29
డునట్లు వాటిని పరిశుద్ధపరచ వలెను. వాటిని తగులు

* లేక, కొరకు. † షెకెలనగా, 1 రూ. 4 అ. కావచ్చును.

30 ప్రతివస్తువు పరిశుద్ధమైనదగును. । మరియు నీవు అహ
రోనును అతని కుమారులును నాకు యాజకులై యుం
డునట్లు, వారిని అభిషేకించి పరిశుద్ధపరచ వలెను.
31 మరియు నీవు ఇశ్రాయేలు పుత్రులను చూచి—
ఇది మీ తరతరముల మట్టుకు నాకు పరిశుద్ధాభిషేక
32 తైలమై యుండును; । అది నరమాంసము మీద పోయ
కూడదు. దాని మేలనముచొప్పున దానివంటిది ఏదై
నను చేయకూడదు. అది పరిశుద్ధమైనది; అది మీకు
33 పరిశుద్ధమైనదిగా నుండును. । దానివంటిది కలుపువా
డును, అన్యుని మీద దానిలోది వేయువాడును తన
ప్రజలలోనుంచి ఛేదించబడునని చెప్పుమనెను.

34 మరియు యెహోవా మోషేతో ఇట్లనెను—నీవు
పరిమళ ద్రవ్యములననగా, నాతాపు, షెహేలెతు,
గంధపుచెక్క అను ఈ పరిమళమైన వాటినిని, స్వచ్ఛ
మైన సాంబ్రాణినిని సమభాగములగా పుచ్చుకొని, ।
35 వాటితో ధూప ద్రవ్యము చేయ వలెను; అది సుగంధ
ద్రవ్యమేలుకుని పని చొప్పున కలపబడి, ఉప్పు గల
దిని, స్వచ్ఛమైనదిని పరిశుద్ధమైనదినైన సుగంధ ధూప
36 సంభారము. । దానిలో కొంచెము పొడి చేసి, నేను
నిన్ను కలుసుకొను సంఘపు గుడారములోని శాసన
ముల పెట్టె యెదుట దాని ఉంచ వలెను. అది మీకు
37 అతిపరిశుద్ధమైనదై యుండును. । నీవు చేయవలసిన ఆ
ధూప ద్రవ్యమును, దాని మేలనము చొప్పున మీ
నిమిత్తము మీరు చేసుకొన వద్దు. అది యెహోవా
38 నిమిత్తము నీకు పరిశుద్ధమైనదై యుండును. । దాని వా
సన చూచుటకు, దానివంటిది చేయువాడు తన ప్రజ
లలోనుంచి ఛేదించబడ వలెను.

## 31. అధ్యాయము.

1,2 మరియు యెహోవా మోషేతో ఇట్లనెను—
చూడుము నేను యూదా గోత్రములో హూరు కుమా
రుడగు ఊరి కుమారుడైన బెసలేలును పేరు పెట్టి పిలి
3,4 చితిని. । విచిత్రమైన పనులు కల్పించుటకును, బం
గారుతోను వెండితోను రాగితోను పని చేయుటకు
5 ను, । పొదుగుటకు రత్నములను సానబట్టుటకును,
కర్రను తొలుచుటకును, సమస్త విధములైన పనులను
చేయుటకును జ్ఞాన విద్యా వివేకములును, సమస్తమైన
పనుల నేర్పును వానికి కలుగునట్లు దేవుని ఆత్మవల్ల వాని
6 నింపించి యున్నాను. । మరియు ఇదుగో! నేను దాను
గోత్రములోని అహీసామాకు కుమారుడైన అహోలీ
యాబును అతనితో నుండనిచ్చి, నేను నీకు ఆజ్ఞాపిం
చినవన్నియు వారు చేయునట్లు, జ్ఞాన హృదయము
గల ప్రతివాని హృదయములో జ్ఞానముంచి యున్నా
7 ను. । సంఘపు గుడారమును, శాసనముల పెట్టెను,
దాని మీదనున్న ఆచ్ఛాదన పీఠమును, గుడారపు
ఉపకరణములనన్నిటిని, । బల్లను దాని ఉపకరణముల 8
ను, నిర్మలమైన దీపవృక్షమును దాని ఉపకరణము
లన్నిటిని, ధూప వేదికను, । ఆరోహణయాగ వేదికను, 9
దాని ఉపకరణములన్నిటిని, పళ్లెమును, దాని కాలు
ను, । పేనిన పర్ణములు గల వస్త్రములను, యాజక సేవ 10
చేయునట్లు యాజకుడైన అహరోను కొరకైన పరిశుద్ధ
వస్త్రములను, అతని కుమారుల వస్త్రములను, । అభిషేక 11
తైలమును, పరిశుద్ధ స్థలము కొరకు పరిమళ ధూప
ద్రవ్యమును, నేను నీకు ఆజ్ఞాపించిన సమస్త ప్రకా
రముగా వారు చేయ వలెననెను.

మరియు యెహోవా మోషేతో ఇట్లనెను— 12,13
నీవు ఇశ్రాయేలు పుత్రులను చూచి—నిజముగా మీరు
నా సబ్బాతులను కాపాడుకొన వలెను; మిమ్మును పరి
శుద్ధపరుచుచుండు యెహోవాను నేనే అని తెలుసు
కొనునట్లు, అది మీ తరతరముల మట్టుకు నాకు
మీకు గురుతు. । కావున మీరు సబ్బాతును కాపాడు 14
కొన వలెను; అది మీకు పరిశుద్ధమైనది. అది సాధా
రణమైనదిగా చేయువాడు నిశ్చయముగా చంపబడ
వలెను; దానిలో ఏ పనినైనను చేయువాడు తన ప్రజల
మధ్యనుంచి ఛేదించబడ వలెను. । ఆరు దినములు పని 15
చేయ వచ్చును. ఏడవ దినమున యెహోవాకు పరి
శుద్ధమైన విశ్రాంతి సబ్బాతు ఉండ వలెను. ఆ సబ్బా
తు వారమున పనిచేయు ప్రతివాడును చావనే చావ
వలెను. । తమ తరతరముల మట్టుకు సబ్బాతును ఆచ 16
రించునట్లు, ఇశ్రాయేలు పుత్రులు ఆ సబ్బాతును కా
పాడుకొన వలెను; అది నిత్యనిబంధన. । నాకును 17
ఇశ్రాయేలు పుత్రులకును అది ఎల్లప్పుడును గురుతై
యుండును; ఎందుకనగా ఆరు దినములు యెహోవా
ఆకాశమును భూమిని చేసి, ఏడవ దినమున మాని
విశ్రమించెనని చెప్పుమనెను.

మరియు యెహోవా సీనాయి కొండమీద మో 18
షేతో పలుకుట చాలించిన తరువాత, ఆయన సాక్ష్యపు
రెండు పలకలను అనగా దేవుని వేలితో వ్రాయబడిన
రాతి పలకలను అతనికి ఇచ్చెను.

## 32. అధ్యాయము.

మోషే తడువుచేసి కొండ దిగకుండుట ప్రజలు 1
చూచినప్పుడు, ఆ ప్రజలు అహరోను యొద్దకు కూడి
వచ్చి—లే! మా ముందర నడుచునట్లు, వేల్పులను మా
కొరకు చేయుము; ఈ మోషే అనగా, ఐగుప్తులోనుంచి
మమ్ము పైకి తీసుకొని వచ్చిన ఈ మనుష్యుడు ఏమా
యెనో అది మాకు తెలియలేదని అతనితో చెప్పిరి. ।
అందుకు అహరోను—మీ భార్యలు, మీ కుమారులు, 2

మీ కుమార్తెలు తమ చెవులనున్న బంగారు పోగు
లను ఊడదీసి, నా యొద్దకు తీసుకొని రండని వారితో
3 చెప్పెను. । అప్పుడు ప్రజలందరు, తమ చెవులనున్న బం
గారు పోగులను ఊడదీసి, అహరోను యొద్దకు తెచ్చి
4 రి. । అతడు వారి చేతులలోనుంచి వాటిని తీసుకొని,
పోగరతో దాని రూపించి, దాని పోత పోసిన దూడ
నుగా చేసెను. అప్పుడు వారు — ఓ ఇశ్రాయేలూ!
ఐగుప్తు దేశములోనుంచి నిన్ను తీసుకొని వచ్చిన నీ
వేల్పులు వీరే అని పలికిరి.
5 అహరోను దాని చూచి దాని యెదుట ఒక వేది
కను కట్టించెను. మరియు అహరోను—రేపు యెహోవా
6 వాకు పండుగ యగునని చాటించెను. । మరునాడు
వారు ఉదయమున లేచి ఆరోహణ యాగములను
త్రేల్చి,* మంగళయాగ ద్రవ్యములను తెచ్చిరి. అ
ప్పుడు ప్రజలు తినను తాగను కూర్చుండి, ఉత్స
హించ లేచిరి.
7 అప్పుడు యెహోవా మోషేతో ఇట్లనెను:—
నీవు దిగి వెళ్లుము. ఐగుప్తు దేశములోనుంచి నీవు తీసు
8 కొని వచ్చిన నీ ప్రజలు చెడిపోయిరి. । నేను వారికి
ఆజ్ఞాపించిన త్రోవనుంచి త్వరగా తొలిగిపోయి, తమ
కొరకు పోత పోసిన దూడను చేసుకొని, దానికి
సాగిలపడి, దానికి యాగము చేసి—ఓ ఇశ్రాయేలూ!
ఐగుప్తు దేశములోనుంచి నిన్ను తీసుకొని వచ్చిన నీ
వేల్పులు వీరే అని చెప్పుకొనిరనెను.
9 మరియు యెహోవా ఇట్లనెను—నేను ఈ ప్రజ
లను చూచి యున్నాను. ఇదుగో! వారు మెడ వంచు
10 కొనని ప్రజలు. । కావున నీవు నా జోలికి రావద్దు†,
నా కోపము వారి మీద మండనిమ్ము; నేను వారిని
కాలజేసి నిన్ను గొప్ప రాష్ట్రముగా కలుగ చేసెదనని
మోషేతో చెప్పెను.
11 అయినను మోషే తన దేవుడైన యెహోవాను‡
బతిమాలుకొని — యెహోవా! నీవు మహా శక్తివలన
బలముగల చేతివలన ఐగుప్తు దేశములోనుంచి తీసు
కొని వచ్చిన నీ ప్రజల మీద నీ కోపము మండనేల?।—
12 ఆయన కొండలలో వారిని చంపునట్లును, భూమి మీద
నుంచి వారిని నశింప చేయునట్లును దుష్టాలోచనతోనే
వారిని తీసుకొని వెళ్లెనని ఐగుప్తీయులు ఏల చెప్ప
కొన వలెను? నీ కోపాగ్నినుంచి మళ్లుకొని, నీ ప్రజ
లకు విరోధమైన ఈ కీడును గూర్చి సంతాపపడుము;।
13 నీ సేవకులైన అబ్రాహామును, ఈసాకును, ఇశ్రాయే
లును జ్ఞాపకము చేసుకొనుము; వారిని గూర్చి నీవు—
ఆకాశ నక్షత్రముల వలె మీ సంతానము అభివృద్ధి
చేసి, నేను చెప్పిన ఈ సమస్త భూమిని మీ సంతాన
మునకు ఇచ్చెదననియు వారు నిరంతరము దాని స్వతం
త్రించుకొందురనియు, నీతోడని ప్రమాణము చేసి
వారితో చెప్పితివనెను. । అప్పుడు యెహోవా తన 14
ప్రజలకు చేసెదనని పలికిన కీడును గూర్చి సంతాప
పడెను.

అప్పుడు మోషే శాసనము గల రెండు పలకలను 15
చేత పట్టుకొని తిరిగి ఆ కొండ దిగి వచ్చెను. ఆ
పలకలు రెండు పక్కలను వ్రాయబడెను; అవి ఈ
పక్కను ఆ పక్కను వ్రాయబడెను. । ఆ పలకలు 16
దేవుని పని; ఆ వ్రాత ఆ పలకల మీద చెక్కబడిన
దేవుని వ్రాత.

ఆ ప్రజలు పెద్ద కేకలు వేయుచుండగా, యెహోవా 17
షువ ఆ ధ్వని విని—పాలెములో యుద్ధ ధ్వని ఉన్న
దని మోషేతో పలికెను. । అందుకు అతడు — అది 18
విజయ ధ్వని శబ్దము కాదు; అది అపజయ ధ్వని శబ్ద
ము కాదు; సంగీత ధ్వని శబ్దము వింటున్నానని
చెప్పెను.

అతడు పాలెముకు సమీపించినప్పుడు, జరిగినదేమ 19
నగా అతడు ఆ దూడను నాట్యమును చూచెను. అప్పు
డు మోషే కోపము మండెను. అతడు ఆ కొండ
దిగువను తన చేతులలోనుంచి ఆ పలకలను పడవేసి,
వాటిని పగల గొట్టెను. । అప్పుడు అతడు వారు చేసిన 20
ఆ దూడను పట్టుకొని, అగ్నిలో కాల్చి, పొడిగా
నూరి, నీళ్ల మీద చల్లి, ఇశ్రాయేలు పుత్రులను దాని
తాగ జేసెను.

అప్పుడు మోషే—నీవు ఈ ప్రజల మీదికి ఈ గొప్ప 21
పాపము రప్పించునట్లు, వారు నిన్ను ఏమిచేసిరని అహ
రోనును అడిగెను. । అందుకు అహరోను—నా ప్రభు 22
వు కోపము మండనియ్యకుము. ఈ ప్రజలు చెడుతన
మందు ఆసక్తులని నీవు వారిని యెరుగుదువు. । వారు 23
—మాకు ముందర నడుచు వేల్పులను మాకు చేయుము;
ఐగుప్తులోనుంచి మమ్మును తీసుకొని వచ్చిన ఈ మోషే
అను మనుష్యుడు ఏమాయెనో అది మాకు తెలియ
దనిరి. । అప్పుడు నేను—ఎవరికి బంగారము ఉన్నదో, 24
వారు దాని ఊడదీసి నాకియ్య వలెనని చెప్పితిని.
నేను అగ్నిలో దాని వేసినప్పుడు ఈ దూడ పుట్టె
ననెను.§

* లేక, ఆరోహింపచేసి. † లేక, నన్ను విడువుము. ‡ హెబ్రీలో, యెహోవా సన్నిధిని.
§ లేక, బైటికి వచ్చెననెను.

25 మరియు మోషే ప్రజలు పోకిరులుగా ఉండుట
చూచెను. వారి విరోధులలో ఎగతాళి కలుగునట్లు
26 అహరోను వారిని పోకిరులగా చేసెను. । అప్పుడు
మోషే దండు పాళెపు ద్వారములో నిలిచి—ఎవడు
యెహోవా పక్షముగా నా యొద్దకు వచ్చునని నెను.
అప్పుడు లేవీ పుత్రులందరును అతని యొద్దకు కూడి
27 వచ్చిరి. । అప్పుడు అతడు వారిని చూచి — మీలో
ప్రతివాడును తన కత్తిని తన నడుమున కట్టుకొని,
దండులో ద్వారమునుంచి ద్వారమునకు వెళ్లుచు తిరిగి
వచ్చుచు, ప్రతివాడు తన సహోదరునిని, ప్రతివాడు
తన చెలికానిని, ప్రతివాడును తన పొరుగువానిని
చంప వలెనని ఇశ్రాయేలు దేవుడైన యెహోవా
చెప్పుచున్నాడనెను.

28 లేవీ పుత్రులు మోషే మాట చొప్పున చేసిరి.
ఆ దినము ప్రజలలో ఇంచుమించు మూడువేల మంది
29 మనుష్యులు చంపబడిరి. । మోషే చెప్పినమాట—నేడు
మీ మీదికి దీవెన రప్పించుకొనునట్లు మీలో ప్రతి
వాడు తన కుమారునికి విరోధముగాను, తన సహోద
రునికి విరోధముగాను ఉండుటవలన, నేడు యెహో
వా కొరకు మిమ్మును మీరు నియోగించుకొనుడని *
చెప్పెను.

30 మరునాడు మోషే ప్రజలతో—మీరు గొప్ప పా
పము చేసితిరి; కావున నేను యెహోవా యొద్దకు
ఎక్కి వెళ్లుదును; ఒకవేళ మీ పాపమును గూర్చి
ఆచ్ఛాదనము చేసెదనని చెప్పెను.

31 అప్పుడు మోషే యెహోవా యొద్దకు తిరిగి వెళ్లి
—అయ్యో! ఈ ప్రజలు గొప్ప పాపము చేసిరి; వారు
32 బంగారు వేల్పును తమ కొరకు చేసుకొనిరి. । అయితే
నీవు వారి పాపము క్షమించితే క్షమించుము; లేని
పక్షమందు, నీవు వ్రాసిన నీ గ్రంథములోనుంచి నన్ను
తుడిచి వేయుమని బతిమాలుకొనుచున్నాననెను.

33 అప్పుడు యెహోవా—ఎవడు నాకు విరోధము
గా పాపము చేసెనో వాని నా గ్రంథములోనుంచి
34 తుడిచివేతును. । కాబట్టి నీవు వెళ్లి, నేను నీతో చెప్పిన
చోటుకు ప్రజలను నడిపించుము. ఇదుగో నా దూత
నీకు ముందర వెళ్లును. అయితే నేను వచ్చు దినమందు
వారి పాపమును వారి మీదికి రప్పించెదనని మోషే
తో చెప్పెను.

35 అహరోను చేసిన దూడను ప్రజలు చేసినందున,
యెహోవా వారిని బాధపెట్టెను.

## 33. అధ్యాయము.

మరియు యెహోవా మోషేతో ఇట్లనెను:— 1
నీవును, నీవు ఐగుప్తు దేశములోనుంచి రప్పించిన ప్రజ
లు బైలుదేరి, నేను అబ్రాహాముకును ఇస్సాకుకును
యాకోబుకును ప్రమాణము చేసి—నీ సంతానమునకు
దీని ఇచ్చెదనని చెప్పిన దేశమునకనగా, పాలు తేనె
ప్రవహించు దేశమునకు లేచి వెళ్లుము. । నేను 2
నీకు ముందుగా దూతను పంపి, కెనానీయులను,
అమోరీయులను హిత్తీయులను, పెరిజ్జీయులను, హివ్వీ
యులను, యెబూసీయులను, వెళ్లగొట్టెదను; । మీరు 3
మెడ వంచుకొనని ప్రజలు గనుక మీతో కూడ †
నేను రాను; త్రోవలో మిమ్మును కాల్చివేసెదనేమో
అని మోషేతో చెప్పెను.

ప్రజలు ఆ దుర్వచనము విని, దుఃఖించిరి; ఎవడును 4
తన అలంకారములను వేసుకొనలేదు; । యెహోవా 5
మోషేతో చెప్పిన మాట—నీవు ఇశ్రాయేలు పుత్రు
లను చూచి—మీరు మెడ వంచుకొనని ప్రజలు; ఒక
క్షణమే నేను మీ మధ్యకు వచ్చి మిమ్మును కాల్చి
వేతును గనుక మిమ్ము నేమిచేయ వలెనో అది నాకు
తెలియునట్లు మీ అలంకారములను మీ మీదనుంచి
తీసివేయుడని చెప్పుమనెను. । కాబట్టి ఇశ్రాయేలు 6
పుత్రులు హోరేబు కొండయొద్ద తమ అలంకార
ములను తీసివేసిరి.

మరియు మోషే గుడారమును తీసుకొని, దండు 7
పాళెము వెలపటికి వెళ్లి, పాళెమునకు దూరముగా
దాని వేసి, దానికి సంఘపు గుడారమను పేరు పెట్టెను.
అప్పుడు యెహోవాను వెతికిన ప్రతివాడును దండు
పాళెమునకు వెలపటనున్న సంఘపు గుడారమునకు
బైలువెళ్లెను. । మరియు మోషే ఆ గుడారమునకు బైలు 8
వెళ్లినప్పుడు, ప్రజలందరును లేచి, ప్రతివాడు తన
గుడారపు ద్వారమందు నిలిచి అతని ఆ గుడారము
లోకి వెళ్లుపర్యంతము, అతని వెనుకతట్టు నిదానించి
చూచుచుండిరి. । మోషే ఆ గుడారములోకి వెళ్లిన 9
ప్పుడు మేఘ స్తంభము దిగి గుడారపు ద్వారమందు
నిలిచెను. అప్పుడు యెహోవా మోషేతో మాట
లాడెను. । ప్రజలందరును ఆ మేఘస్తంభము గుడారపు 10
ద్వారమున నిలుచుట చూచిరి. అప్పుడు ప్రజలందరు
లేచి ప్రతివాడును తనతన గుడారపు ద్వారమందు
సాగిలపడిరి.‡ । అప్పుడు మనుష్యుడు తన స్నేహితుని 11
తో మాటలాడునట్లు యెహోవా మోషేతో ముఖా
ముఖిగా మాటలాడెను. తరువాత అతడు దండు

* హెబ్రీలో, మీ చేతులను నిండించుకొనుడని. † హెబ్రీలో, మధ్యను. ‡ లేక, నమస్కారము చేసిరి.

పాళెములోకి తిరిగి వచ్చెను. అయితే అతని పరిచా
రకుడును నూను కుమారుడునైన యెహోషువ అను
పడుచువాడు గుడారములోనుంచి వెలపటికి రాలేదు.
12 మరియు మోషే యెహోవాతో ఇట్లనెను—చూ
డుము—ఈ ప్రజలను తీసుకొని వెళ్లుమని నీవు నాతో
చెప్పుచున్నావు; అయినను నీవు నాతోకూడ ఎవని
పంపుదువో అది నాకు తెలుప లేదు. అయినప్పటికి
నీవు—నేను నీ పేరునుబట్టి నిన్ను యెరిగియున్నానని
యు, నా కటాక్షము నీకు కలిగినదనియు చెప్పితివి.।
13 కాబట్టి నీ కటాక్షము నాకు కలిగితే, దయచేసి నీ
మార్గమును నాకు తెలుపుము. అప్పుడు నీ కటా
క్షము నాకు కలుగునట్లు నేను నిన్ను ఎరుగుదును.
ఈ రాష్ట్రము నీ ప్రజలని తలంచుకొనుమనెను.
14 అందుకు ఆయన — నా సన్నిధి* వచ్చును;
నేను నీకు విశ్రాంతి కలుగ చేసెదనని చెప్పెను.।
15 అప్పుడు మోషే—నీ, సన్నిధి రానియెడల ఇక్కడనుంచి
16 మమ్మును వెళ్లజేయకుము.। నాకును నీ ప్రజలకును నీ
కటాక్షము కలిగినదని దేనివల్ల తెలియబడును? నీవు
మాతోకూడ వచ్చుటవల్లనే గదా! అట్లు మేము
అనగా నేనును నీ ప్రజలును భూమి మీదనున్న
సమస్త ప్రజలనుంచి వేరుపరచబడుదుమని ఆయనతో
చెప్పెను.
17 అందుకు యెహోవా—నీవు పలికిన మాట చొ
ప్పున ఇది కూడ చేసెదను; నా కటాక్షము నీకు కలి
గినది; నీ పేరునుబట్టి నిన్ను ఎరుగుదునని మోషేతో
18 చెప్పెను.। అప్పుడు అతడు — నీ మహిమను నాకు
19 దయచేసి చూపుమని చెప్పెను.। అందుకు ఆయన—నీ
యెదుట నా మంచితనమంతయు నడిపించెదను; నీ
యెదుట యెహోవా పేరును ప్రకటించెదను. నేను
ఎవనియందు కృప చేసెదనో వానియందు కృపచే
సెదను; నేను యెవని కరుణించెదనో, వాని కరుణించె
20 దనని చెప్పెను.। మరియు ఆయన—నీవు నా ముఖమును
చూడలేవు; ఏ మనుష్యుడును† నన్ను చూచి బ్రతకడని
21 చెప్పెను.। మరియు యెహోవా ఇట్లనెను,—ఇదుగో!
నాయొద్ద ఒక స్థలమున్నది; నీవు ఆ బండమీద నిలువ
22 వలెను.। అప్పుడు నా మహిమ నిన్ను దాటి వెళ్లుచుం
డగా, ఆ బండ బీటలో నిన్ను ఉంచి నేను నిన్ను
దాటి వెళ్లువరకు, నా చేతితో నిన్ను కప్పెదను;।
23 నేను నా చెయ్యి తీసిన తరువాత, నా వెనుకపార్శ్వ
ములను చూచెదవు గాని నా ముఖము కనబడదని
చెప్పెను.

## 34. అధ్యాయము.

మరియు యెహోవా—మొదటి పలకల వలె, మరి 1
రెండు రాతిపలకలను నీకు నీవే చెక్కుకొనుము. నీవు
పగలగొట్టిన మొదటి పలకల మీదనున్న వాక్యములను
నేను ఈ పలకల మీద వ్రాసెదను.। ఉదయమందు 2
నీవు సిద్ధపడి, ఉదయమందు సీనాయి కొండెక్కి,
అక్కడ శిఖరము మీద నా యెదుట నిలిచియుండ
వలెను;। ఏ మనుష్యుడును నీతోకూడ ఎక్కి రా కూ 3
డదు; ఏ మనుష్యుడును ఆ కొండంతటా కనబడ కూ
డదు. ఆ కొండ యెదుట గొర్రెలైనను యెద్దులైనను
మేయ కూడదని మోషేతో చెప్పెను.

కాబట్టి అతడు మొదటి పలకల వలె రెండు రాతి 4
పలకలను చెక్కెను. అప్పుడు మోషే తనకు యె
హోవా ఆజ్ఞాపించినట్లు ఉదయమందు పెందలకడ
లేచి, ఆ రెండు రాతి పలకలను చేత పట్టుకొని సీనా
యి కొండెక్కెను.

అప్పుడు ఆ మేఘములో యెహోవా దిగి, అక్కడ 5
అతనితోకూడ నిలిచి, యెహోవా పేరును ప్రక
టించెను.। అతని యెదుట యెహోవా అతని దాటి 6
వెళ్లెను. ఆయన—యెహోవా, కనికరము దయయు
దీర్ఘశాంతము విస్తారమైన కృపా సత్యములు గల
దేవుడైన యెహోవా;। ఆయన వేల కొరకు కృపను 7
ఉంచుకొనుచు అక్రమమును, అపరాధమును, పాప
మును క్షమించును గాని, ఆయన ఏమాత్రమును దో
షుల నిర్దోషులని యెంచక, మూడు నాలుగు తరముల
పర్యంతము తండ్రుల అక్రమమును కుమారుల మీది
కిని కుమారుల కుమారుల మీదికిని రప్పించునని
ప్రకటించెను.

అప్పుడు మోషే త్వరపడి, నేల ఘట్టుకు తల వం 8
చుకొని సాగిలపడి,। — ఓ ప్రభువా! నీ కటాక్షము 9
నాకు కలిగియుంటే నా మనవి వినుము; నా ప్రభువు
దయచేసి మా మధ్యను‡ రా వలెను. వీరు మెడ వం
చుకొనని ప్రజలు. మా అక్రమమును పాపమును
క్షమించి, మమ్ము నీ స్వాస్థ్యముగా చేసుకొనుమని
చెప్పెను.

అందుకు ఆయన — ఇదుగో! నేను ఒక నిబంధన 10
చేయుచున్నాను. భూమి మీద నెక్కడనైనను, ఏ
రాష్ట్రములోనైనను చేయబడని అద్భుతకార్యములను
నీ ప్రజలందరి యెదుట చేసెదను. నీవు ఏ ప్రజల
మధ్యను ఉన్నావో ఆ ప్రజలందరును యెహోవా
కార్యమును చూచెదరు. నేను నీ యెడల చేయబోవు

* లేక, ముఖము. † హెబ్రీలో, ఆదాము. ‡ లేక, తోకూడ.

11 నది భయంకరమైనది. । నేడు నేను నీకు ఆజ్ఞాపించు
దాని కాపాడుకొనుము. ఇదుగో! నేను అమోరీయు
లను, కెనానీయులను, హిత్తీయులను, పెరిజ్జీయులను,
హివ్వీయులను, యెబూసీయులను నీ యెదుటనుంచి
12 వెళ్లగొట్టుచున్నాను. । నీవు ఎక్కడికి వెళ్లుచున్నావో
ఆ దేశనివాసులతో నిబంధన చేసుకొనకుండ జాగ్రత్త
పడుము. ఒక వేళ అది నీ మధ్యను ఉరి కావచ్చును. ।
13 అయితే మీరు వారి వేదికలను పడగొట్టి, వారి బొ
మ్మలను పగల గొట్టి, వారి కోవెలలను* పడగొట్ట వలె
14 ను; । ఎందుకనగా, నీవు వేరొక దేవునికి† నమస్కార
ము చేయ కూడదు; యెహోవా వేరొకని ఓర్చని
15 దేవుడు. ఆయన వేరొకని పేరు ఓర్చనివాడు. । ఆ
దేశనివాసులతో నిబంధన చేసుకొనక జాగ్రత్తపడు
ము. వారు తమ వేల్పులతో వ్యభిచరించి, తమ వేల్పు
లకు యాగము చేయునప్పుడు, ఒకడు నిన్ను పిలిచితే
16 నీవు వాని యాగద్రవ్యము తిందువేమో. । మరియు నీవు
నీ కుమారుల కొరకు వారి కుమార్తెలను పుచ్చుకొను
నెడల వారి కుమార్తెలు తమ వేల్పులతో వ్యభిచరించి,
నీ కుమారులను తమ వేల్పులతో వ్యభిచరింప చేతురే
17 మో. । పోతపోసిన వేల్పులను నీవు చేసుకొన కూడదు.
18 మీరు పొంగనివాటి పండుగను ఆచరించ వలెను.
నేను నీకు ఆజ్ఞాపించిన ప్రకారము, ఆబీబను నెలలో
నియమించబడిన కాలమందు, పులిసి పొంగనివే ఏడు
దినములు తిన వలెను; ఎందుకనగా ఆబీబను నెలలో
ఐగుప్తులోనుంచి మీరు బైలుదేరి వచ్చితిరి.
19 ప్రతి తొలిచూలు పిల్లయు నాది. నీ పశువులలో
తొలిచూలుదైన ప్రతి మగది, దూడ అయినను గొర్రె
20 పిల్ల అయినను అది నాది. । అయితే గాడిదె తొలి
పిల్లను గొర్రెపిల్లవలన విమోచించ వలెను. దాని విమో
చించకుంటే, దాని తల కొట్టించ వలెను. నీ కుమారుల
లో ప్రతి తొలిచూలువానిని విమోచించ వలెను.
నా యెదుట వారు వట్టి చేతులతో కనపడ కూడదు.
21 ఆరు దినములు నీవు పని చేసి ఏడవ దినము విశ్ర
మించ వలెను. విత్తు కాలమందు కోత కాలమందు
22 విశ్రమించ వలెను. । మరియు నీవు గోధుముల కోత
లో ప్రథమ ఫలములతో వారముల పండుగను, సం
వత్సరాంతమందు, పంటకూర్పు పండుగను ఆచరించ
వలెను.
23 సంవత్సరమునకు ముమ్మారు, నీ పురుషులందరు ఇశ్రా
యేలు దేవుడైన యెహోవాయను ప్రభువు సన్నిధిని
24 కనబడ వలెను. । ఎందుకనగా నీ యెదుటనుంచి రా
ష్ట్రములను వెళ్లగొట్టి, నీ పొలిమేరలను గొప్పవిగా
చేసెదను. మరియు నీవు సంవత్సరమునకు ముమ్మారు
నీ దేవుడగు యెహోవా సన్నిధిని కనబడ వెళ్లునప్పు
డు, ఏ మనుష్యుడును నీ భూమిని ఆశించడు.
నీవు పులిసినదానితో నా యాగపశు రక్తమును అ 25
ర్పించ కూడదు. పస్క పండుగ యాగమాంసము ఉద
యకాల పర్యంతము ఉండ కూడదు.
నీ భూమియొక్క ప్రథమ ఫలములలో మొదటివి 26
నీ దేవుడైన యెహోవా ఇంటిలోకి తే వలెను. మేక
పిల్లను దాని తల్లి పాలతో ఉడకబెట్టవద్దని చెప్పెను.
మరియు యెహోవా మోషేతో ఇట్లనెను:—ఈ 27
వాక్యములను వ్రాసుకొనుము; ఎందుకనగా, ఈ వా
క్యముల ప్రకారము, నేను నీతోను ఇశ్రాయేలుతోను
నిబంధన చేసి యున్నాననెను. । అతడు నలుబది దిన 28
ములు నలుబది రాత్రులు యెహోవాతో కూడ అ
క్కడ నుండెను. అతడు రొట్టె తినలేదు, నీళ్లు తాగ
లేదు. అప్పుడు ఆయన ఆ నిబంధన వాక్యములను
అనగా ఆ పది వాక్యములను ఆ పలకలమీద వ్రాసెను.
మరియు మోషే సీనాయికొండ దిగుచుండగా, శా 29
సనము గల ఆ రెండు పలకలు మోషే చేతిలో నుం
డెను. అతడు ఆ కొండ దిగుచుండగా, యెహోవా
తనతో మాటలాడుచున్నప్పుడు, తన ముఖ చర్మము
ప్రకాశించెనని మోషేకు తెలిసియుండ లేదు. । అహ 30
రోనును ఇశ్రాయేలు పుత్రులందరును మోషేను చూ
చినప్పుడు ఇదుగో! అతని ముఖ చర్మము ప్రకాశిం
చెను గనుక వారు అతనికి సమీపింప భయపడిరి.
మోషే వారిని పిలిచినప్పుడు, అహరోనును, సం 31
ఘ ప్రధానులందరును అతని యొద్దకు తిరిగి వచ్చిరి.
మోషే వారితో మాటలాడెను. । ఆ తరువాత ఇశ్రా 32
యేలు పుత్రులందరు సమీపించిరి. అప్పుడు అతడు
యెహోవా సీనాయి కొండ మీద తనతో పలికినది
యావత్తును వారికి ఆజ్ఞాపించెను. । మోషే వారితో 33
పలుకుట చాలించి, తన ముఖముమీద ముసుకు వేసు
కొనెను. । అయినను, మోషే యెహోవాతో పలుకు 34
టకు ఆయన సన్నిధిని ప్రవేశించినది మొదలుకొని
అతడు వెలపటికి వచ్చుమట్టుకు ఆ ముసుకును తీసివే
సెను. । ఇశ్రాయేలు పుత్రులు మోషే ముఖ చర్మము 35
ప్రకాశించెనని మోషే ముఖమును చూచిరి. మోషే
ఆయనతో పలుకుటకు లోపలికి వెళ్లు మట్టుకు, తన
ముఖము మీద ముసుకు వేసుకొనుచుండెను.

## 35. అధ్యాయము.

అప్పుడు మోషే ఇశ్రాయేలు పుత్రుల జనసమూ 1
హమంతయు పోగుచేసి—మీరు చేయునట్లు యెహో

*లేక, లక్ష్మీ విగ్రహములను. †లేక, దేవుడని వేరొకనికి.

2 వా ఆజ్ఞాపించిన వాక్యములు ఏవనగా,। ఆరు దినములు
పని చేయ వలెను; ఏడవది మీకు పరిశుద్ధ దినము. అది
యెహోవా విశ్రాంతి సబ్బాతు; అందు పని చేయు
3 ప్రతివాడును చంపబడ వలెను. । సబ్బాతు దినమున
మీరు మీకున్న యే యింటను అగ్ని వేయ కూడదని
వారితో చెప్పెను.

4 మరియు, మోషే ఇశ్రాయేలు పుత్రులైన సర్వ జన
సమూహముతో ఇట్లనెను:—యెహోవా ఆజ్ఞాపించి
5 నది యేదనగా। —మీ యొద్దనుంచి యెహోవా నిమి
త్తము పైకెత్తబడిన కానుకను తీసుకొని రావలెను;
తన మనస్సు తనను ప్రేరేపించు ప్రతివాడును యె
హోవా నిమిత్తము బంగారము, వెండి, కంచు,।*
6 నీల ధూమ్ర రక్తవర్ణములు, సన్నపు నార, మేక వెంట్రు
7 కలు, । ఎరుపు రంగు వేసిన పొట్టేళ్ల తోళ్లు, తహసు
8 జంతువుల తోళ్లు, తుమ్మ కర్ర, । ప్రదీపమునకు తైల
ము, అభిషేక తైలమునకును పరిమళ ద్రవ్యముల ధూ
9 పమునకును సుగంధ సంభారములు, । లేతపచ్చలు, ఏఫో
దుకును, పతకమునకును చెక్కు రత్నములనువాటిని కా
నుకగా తీసుకొని రా వలెను.

10 మరియు, వివేక హృదయము గల ప్రతివాడును
వచ్చి, యెహోవా ఆజ్ఞాపించినవన్నియు చేయ వలె
11 ను; । అవేవనగా, ఆలయము, దాని గుడారము, దాని
పైకప్పు, దాని కొలుకులు, దాని పలకలు, దాని అడ్డు
12 కర్రలు, దాని స్తంభములు, దాని తొలులు, । పెట్టె,
13 దాని మోతకర్రలు, ఆచ్ఛాదన పీఠము, కప్పు తెర,।బల్ల,
దాని మోతకర్రలు, దాని ఉపకరణములన్నియు, సమ్ము
14 ఖపు† రొట్టెలు. । వెలుగుకొరకు దీప వృక్షము, దాని
ఉపకరణములు, దాని ప్రదీపములు, వెలుగు కొరకు
15 తైలము,। ధూపవేదిక, దాని మోతకర్రలు, అభిషేక
తైలము, పరిమళ ద్రవ్య సంభారము, ఆలయ ద్వార
16 మున ద్వారమునకు పరదా, । ఆరోహణయాగ వేదిక,
దానికి కలిగియుండు కంచు* జల్లెడ, దాని మోతక
ర్రలు, దాని ఉపకరణములన్నియు, పళ్లెము, దాని
17 కాలు,। ఆవరణ యవనికలు, దాని స్తంభములు, వాటి
18 తొలులు, ఆవరణ ద్వారమునకు పరదా, । ఆలయము
నకు మేకులు, ఆవరణమునకు మేకులు, వాటికి తాళ్లు;।
19 పరిశుద్ధ స్థలములో సేవ చేయుటకు సేవకవస్త్రములు
అనగా, యాజకుడైన అహరోనుకు పరిశుద్ధ వస్త్రములు,
యాజకులగునట్లు అతని కుమారులకు వస్త్రములనేవే
అనెను.

20 అప్పుడు ఇశ్రాయేలు పుత్రుల సమూహమంత
21 యు మోషే యెదుటనుంచి బైలువెళ్లెను. । తరువాత,
ఎవని హృదయము తనను రేపెనో, ఎవని ఆత్మ
తనను ప్రేరేపించెనో వారందరు వచ్చి, సంఘపు
గుడారపు పనికొరకును, దాని సమస్త సేవకొరకును,
పరిశుద్ధ వస్త్రములకొరకును, యెహోవాకు ఎత్తబడిన
కానుకను తెచ్చిరి. । స్త్రీలైనను పురుషులైనను, ఎవరి 22
హృదయము తమ్ము ప్రేరేపించెనో వారందరును,
యెహోవాకు అల్లాడించబడిన బంగారు కానుకను
అల్లాడించిన ప్రతివాడును, ముక్కరలను, పోగులను,
ఉంగరములను, తావళములను, సమస్త విధమైన బం
గారు వస్తువులను తెచ్చిరి. । మరియు, నీల ధూమ్ర 23
రక్త వర్ణములు, సన్నపు నార, మేక వెంట్రుకలు,
ఎర్ర రంగు వేసిన పొట్టేళ్ల తోళ్లు, తహసు జంతు
వుల తోళ్లు, వీటిలో ఏవి ఎవనియొద్ద నుండెనో,
వాడు వాటిని తెచ్చెను. । వెండినైనను కంచునైనను 24
కానుకగా పైకెత్తిన ప్రతివాడును యెహోవాకు
ఆ కానుకను తెచ్చెను. ఆ సేవలో ఏ పనికైనను వచ్చు
తుమ్మకర్ర ఎవని ఎవనియొద్ద నుండెనో వాడువాడు
దాని తెచ్చెను.

మరియు వివేక హృదయము గల స్త్రీలందరు తమ 25
చేతులతో వడికి, తాము వడికిన నీల ధూమ్ర రక్త
వర్ణములు గల నూలును, సన్నపు నార నూలును తెచ్చి
రి. । ఎవరి హృదయములు వివేకమున తమ్మును రేపెనో 26
ఆ స్త్రీలందరు మేక వెంట్రుకలను వడికిరి.

ప్రధానులు ఏఫోదుకొరకును, పతకముకొరకును 27
చెక్కు రత్నములను, లేతపచ్చలను, । సుగంధ ద్రవ్య 28
మును, ప్రదీపమునకును అభిషేక తైలమునకును పరి
మళ ద్రవ్య ధూపమునకును తైలము తెచ్చిరి. । మోషే 29
చేత చేయబడ వలెనని యెహోవా ఆజ్ఞాపించిన పను
లన్నిటికొరకు ఇశ్రాయేలు పుత్రులలో పురుషులేమి
స్త్రీలేమి, తెచ్చుటకు ఎవరి హృదయములు తమ్మును
ప్రేరేపించెనో వారందరు యెహోవాకు స్వేచ్ఛా
ర్పితమైన కానుకను తెచ్చిరి.

మరియు మోషే ఇశ్రాయేలు పుత్రులతో ఇట్ల 30-33
నెను:—చూడుడి; యెహోవా హూరు కుమారుడగు
ఊరియొక్క కుమారుడైన బసలేలును పేరు పెట్టి పిలిచి,
విచిత్రమైన పనులు కల్పించుటకును, బంగారుతోను,
వెండితోను, కంచుతోను పని చేయుటకును, రత్నము
లను పొదగ సానబెట్టుటకును, కర్ర తొలుచుటకును,
విచిత్రమైన పనులన్నియు చేయుటకును, వానికి ప్రజ్ఞ
వివేక జ్ఞానములు కలుగునట్లు, దేవుని ఆత్మను వానిలో
నింపియున్నాను. । మరియు అతడును దాను గోత్రి 34
కుడైన అహీసామాకు కుమారుడగు అహోలీయాబును

* లేక, రాగి. † లేక, సన్నిధి.

నేర్పునట్లు వానికి మనస్సు కలుగ చేసియున్నాను. ।
35 చెక్కువాడేమి, విచిత్రకారుడేమి, నీల ధూమ్ర రక్త
వర్ణములతోను సన్నపు నారతోను బుట్టాపని చేయు
వాడేమి, నేతకాడేమి, వారి సమస్త విధములైన పనులు
అనగా ఏ పనియైనను చేయువారి యొక్కయు విచి
త్రమైన పని కల్పించువారి యొక్కయు పనులు చేయు
నట్లు, ఆయన వారి హృదయములను జ్ఞానముతో నిం
డించి యున్నాడు.

## 36. అధ్యాయము.

1 అప్పుడు బసలేలును అహొలీయాబును పరిశుద్ధ
స్థలముయొక్క సేవలో సమస్త విధములైన పనులను
తెలుసుకొని చేయునట్లు, యెహోవా ఎవనికి ప్రజ్ఞ
వివేకములను ఇచ్చెనో, అట్టి వివేక హృదయము గల
ప్రతివాడును, యెహోవా ఆజ్ఞాపించిన సమస్త ప్రకా
రముగా ఆ పనులు చేసెను.

2 మోషే బసలేలును, అహొలీయాబును, యె
హోవా ఎవని హృదయములో వివేకము నుంచెనో,
అట్టి వివేక హృదయము గల ప్రతివానినగా, ఆ పని
చేయుటకు దానికి వచ్చునట్లు, ఎవని హృదయము
3 తనను రేపెనో, ఆ ప్రతివానిని పిలిపించెను. । వారు
పరిశుద్ధ స్థలముయొక్క సేవ చేయునట్లు ఇశ్రాయేలు
పుత్రులు దానికొరకు ఎత్తి తెచ్చిన కానుకలన్నిటిని
వారు మోషే యెదుటనుంచి పట్టుకొని వెళ్లిరి. అయి
నను వారు ఇంకా ప్రతి ఉదయమందు అతని యొద్ద
4 కు స్వేచ్ఛ కానుకలను తెచ్చిరి. । అప్పుడు పరిశుద్ధ స్థల
సంబంధమైన పనియంతయు చేయుచుండిన వివేకులం
దరిలో ప్రతివాడు తాను తాను చేయుచుండిన పని
5 విడిచి వచ్చి । మోషేను చూచి—చేయుటకు యెహో
వా ఆజ్ఞాపించిన పని సేవ నిమిత్తము ప్రజలు చాలిన
దానికంటే బహు విస్తారము తీసుకొని వచ్చుచున్నా
6 రని చెప్పిరి. । అప్పుడు మోషే—పరిశుద్ధాలయమునకు
ఎత్తబడిన కానుకగా, ఏ పురుషుడైనను ఏ స్త్రీయైనను,
ఇకమీదట పని చేయ వద్దని ఆజ్ఞాపించెను గనుక,
దండు పాలెమందంతటను ఆ మాట చాటిరి. అప్పుడు
7 ప్రజలు తీసుకొని రాకుండ నిలపబడిరి. । ఆ పనియంత
యు చేయునట్లు, దానికొరకు వారు తెచ్చిన సామగ్రి
చాలును; అది అత్యధికమైనది.

8 ఆ పని చేసినవారిలో వివేక హృదయము గల ప్రతి
వాడును ఆలయమును పది తెరలతో చేసెను. అతడు
వాటిని నీల ధూమ్ర రక్త వర్ణములు గల పేనిన సన్నపు
నార నూలుతో చిత్రకారుని పనియైన కెరూబులు
9 గల వాటినిగా చేసెను. । ఒక తెర పొడుగు ఇరు
వది యెనిమిది మూరలు; ఒక తెర వెడల్పు నాలు
గు మూరలు. ఆ తెరలన్నిటి కొలత ఒక్కటే. । ఐదు 10
తెరలను ఒకదానితో నొకటి కూర్చెను; మిగిలిన ఐదు
తెరలను ఒకదానితో నొకటి కూర్చెను. । మొదటి కూ 11
ర్పు చివరనున్న తెర అంచున, నీలి నూలుతో కొలుకు
లను చేసెను. రెండవ కూర్పున, వెలపటి తెర అంచున,
అట్లు చేసెను. । రెండవ కూర్పు చివరను ఏబది కొలుకు 12
లను చేసెను. । మరియు, అతడు ఏబది బంగారు గుం 13
డీలు చేసి, ఆ గుండీలచేత ఆ తెరలను ఒకదానితో
నొకటి కూర్చెను. అప్పుడు అది ఒకటే ఆలయమైనది.

మరియు, ఆలయము పైని గుడారముగా మేక 14
వెంట్రుకలతో తెరలను చేసెను; వాటిని పదకొండు
తెరలనుగా చేసెను. । ఒక తెర పొడుగు ముప్పది మూ 15
రలు; । ఒక తెర వెడల్పు నాలుగు మూరలు; ఆ పద 16
కొండు తెరల కొలత ఒకటే. ఐదు తెరలను ఒకటి
గాను, ఆరు తెరలను ఒకటిగాను కూర్చెను. । మొద 17
టి కూర్పునందలి వెలపటి తెర అంచున ఏబది కొలుకు
లు చేసెను. । ఆ గుడారము ఒక్కటిగా నుండునట్లు, 18
దాని కూర్చుటకు ఏబది కంచు గుండీలు చేసెను. । మరి 19
యు, ఎరుపు రంగు వేసిన పొట్టేళ్ల తోళ్లతో గుడార
ముకొరకు కప్పును, దానికి మీదుగా తహపను దాని
తోళ్లతో పైకప్పు చేసెను.

మరియు, అతడు ఆలయమునకు తుమ్మకర్రతో 20
నిలువు పలకలు చేసెను. । పలక పొడుగు పది మూరలు; 21
పలక వెడల్పు మూరనర. । ప్రతి పలకలోను ఒకదాని 22
కొకటి సమదూరము గల కుసులు రెండు ఉండెను;
అట్లు ఆలయపు పలకలన్నిటికి చేసెను. కుడి వైపున, ।
అనగా దక్షిణ దిక్కున ఇరువది పలకలుండునట్లు, ఆల 23
యమునకు పలకలు చేసెను. । ఒక పలక క్రింద దాని 24
రెండు కుసులకు రెండు దిమ్మలను, ఒక పలక క్రింద దాని
రెండు కుసులకు రెండు దిమ్మలను, ఆ యిరువది పల
కల క్రింద నలుబది వెండి దిమ్మలను చేసెను. । ఆల 25,26
యపు రెండవ పక్కకు, అనగా ఉత్తర దిక్కున,
ఇరువది పలకలను వాటి నలుబది వెండి దిమ్మలను,
అనగా, ఒక పలక క్రింద రెండు దిమ్మలను, ఒక పలక
క్రింద రెండు దిమ్మలను చేసెను. । పడమటి దిక్కున 27
ఆలయపు వెనుక పక్కను ఆరు పలకలను చేసెను. ।
వెనుక పక్కను ఆలయపు మూలలకు రెండు పలకలను 28
చేసెను. । అవి అడుగున కూర్చబడి, మొదటి ఉంగరము 29
దాక ఒకదానితో నొకటిగా శిఖరమున కూర్చబడి
నవి. అట్లు రెండు మూలలలో ఆ రెండు పలకలు
చేసెను. । ఎనిమిది పలకలుండెను; వాటి వెండి దిమ్మ 30
లులు పదహారు దిమ్మలు; ప్రతి పలక క్రింద రెండు
దిమ్మలుండెను.

31 మరియు అతడు తుమ్మ కఱ్ఱతో అడ్డు కఱ్ఱలను
చేసెను. ఆలయపు ఒక పక్క పలకలకు, ఐదు అడ్డు
32 కఱ్ఱలను, । ఆలయపు రెండవ పక్క పలకలకు ఐదు
అడ్డు కఱ్ఱలను, పడమటి వైపున ఆలయపు వెనుక
33 పక్క పలకలకు ఐదు అడ్డు కఱ్ఱలను వేసెను. । పలకల
మధ్యనుండు నడిమి అడ్డు కఱ్ఱను ఈ కొసనుంచి ఆ
34 కొసమట్టుకు చేరియుండ జేసెను. । ఆ పలకలకు బం
గారు రేకులు తాపి, వాటి అడ్డు కఱ్ఱలుండు వాటి
ఉంగరములను బంగారుతో చేసి, అడ్డు కఱ్ఱలకు బం
గారు రేకులు తాపెను.

35 మరియు, అతడు నీల ధూమ్ర రక్త వర్ణములు గల
పేనిన సన్నపు నారతో అడ్డు తెరను చేసెను; చిత్రకా
రుని పనియైన* కెరూబులు గలదానిగా దాని చేసె
36 ను. । దానికొరకు తుమ్మ కఱ్ఱతో నాలుగు స్తంభములను
చేసి, వాటికి బంగారు రేకులు తాపెను; వాటి వం
కులు బంగారువి; వాటికొరకు నాలుగు వెండి దిమ్మ
లను పోత పోసెను.

37 మరియు అతడు గుడారపు ద్వారముకొరకు నీల
ధూమ్ర రక్త వర్ణములు గల పేనిన సన్నపు నారతో
38 బుట్టాపనియైన పరదా చేసెను. । దాని ఐదు స్తంభము
లను వాటి వంకులను చేసి, వాటి బోదెలకును వాటి
పెండెబద్దలకును బంగారు రేకులు తాపెను; వాటి దిమ్మ
లు ఐదు కంచువి.

## 37. అధ్యాయము.

1 మరియు బెసలేలు తుమ్మ కఱ్ఱతో పెట్టె చేసెను.
దాని పొడుగు రెండు మూరలనర, దాని ఎత్తు మూర
2 నర; । లోపలను, వెలపలను దానికి మేలిమి బంగారు
రేకు తాపి, దానికి చుట్టు బంగారు జవను చేసెను. ।
3 దానికి నాలుగు బంగారు ఉంగరములను పోత పోసి,
ఒక పక్కను రెండు ఉంగరములను, ఎదటి పక్కను
రెండు ఉంగరములుండునట్లు, దాని నాలుగు కాళ్లకు
4 వాటిని వేసెను. । మరియు, అతడు తుమ్మ కఱ్ఱతో మోత
కఱ్ఱలను చేసి, వాటికి బంగారు రేకులు తాపెను. ।
5 పెట్టె మోయుటకు, ఆ పెట్టె పక్కల మీది ఉంగర
ములలో ఆ మోత కఱ్ఱలను చొనిపెను.

6 మరియు అతడు మేలిమి బంగారుతో ఆచ్ఛాదన
పీఠము చేసెను. దాని పొడుగు రెండు మూరలనర,
7 దాని వెడల్పు మూరనర; । మరియు, రెండు బంగారు
కెరూబులను చేసెను; ఆచ్ఛాదన పీఠముయొక్క రెండు
8 కొసలను వాటిని నకసి పనిగా చేసెను. । ఈ కొసను
ఒక కెరూబును ఆ కొసను ఒక కెరూబును, ఆచ్ఛాదన
పీఠముతో ఏకాండముగా దాని రెండు కొసలమీద
కెరూబులను చేసెను. । ఆ కెరూబులు పైకి విప్పిన 9
రెక్కలు గలవై, ఆచ్ఛాదన పీఠమును తమ రెక్కలతో
కప్పెను. కెరూబుల ముఖములు ఒండొంటికి ఎదురుగా
నుండెను; వాటి ముఖములు ఆచ్ఛాదన పీఠముతట్టు
నుండెను.

మరియు అతడు తుమ్మ కఱ్ఱతో బల్లను చేసెను. 10
దాని పొడుగు రెండు మూరలు, దాని వెడల్పు ఒక
మూర, దాని ఎత్తు మూరనర. । అతడు దానికి మేలిమి 11
బంగారు రేకు తాపి, దానికి చుట్టు బంగారు జవను
చేసెను; । దానికి చుట్టు బెత్తెడు బద్ద చేసి, దాని బద్ద 12
పైని చుట్టు బంగారు జవ చేసెను. । దానికి నాలుగు 13,14
బంగారు ఉంగరములను పోత పోసి, దాని నాలుగు
కాళ్లకుండిన నాలుగు మూలలయందు ఆ ఉంగరముల
ను వేసెను. । బల్ల మోయుటకు మోత కఱ్ఱలుండు ఆ 15
ఉంగరములు దాని బద్దకు సమీపముగా నుండెను.
తుమ్మ కఱ్ఱతో మోతకఱ్ఱలను చేసి వాటికి బంగారు
రేకులు తాపెను. । మరియు అతడు బల్లమీద నుండు 16
దాని ఉపకరణములను, అనగా, దాని పళ్లెములను,
దాని ధూప కలశములను, దాని గిన్నెలను, తర్పణము
చేయుటకు దాని పాత్రలను మేలిమి బంగారుతో
చేసెను.

అతడు మేలిమి బంగారుతో దీపవృక్షము చేసెను. 17
ఆ దీపవృక్షమును దాని ప్రకాండమును, దాని కొమ్మ
ను, నకసి పనిగా చేసెను. దాని కలశలు దాని మొ
గ్గలు దాని పువ్వులు ఏకాండమైనవి. । దీపవృక్షము 18
యొక్క ఒక పక్కనుంచి మూడు కొమ్మలు, దీపవృక్ష
ముయొక్క ఒక పక్కనుంచి మూడు కొమ్మలు, అట్లు
దాని పక్కలనుంచి ఆరు కొమ్మలు బైలుదేరినవి. । ఒక 19
కొమ్మలో మొగ్గలు పువ్వులు గల బాదామి రూపమైన
మూడు కలశలు; రెండవ కొమ్మలో మొగ్గలు పువ్వు
లు గల బాదామి రూపమైన మూడు కలశలు; అట్లు,
దీపవృక్షమునుంచి బైలుదేరిన ఆరు కొమ్మలలో ఉం
డెను. మరియు దీపవృక్షమందు, దాని మొగ్గలు
దాని పువ్వులు గల బాదామి రూపమైన నాలుగు
కలశలుండెను. । దీపవృక్షమునుంచి బైలుదేరు కొ 20,21
మ్మలలో, రెండు కొమ్మలకింద ఏకాండమైన మొగ్గయు,
రెండు కొమ్మల కింద ఏకాండమైన మొగ్గయు, రెండు
కొమ్మల కింద ఏకాండమైన మొగ్గయు నుండెను. । వాటి 22
మొగ్గలు వాటి కొమ్మలు ఏకాండమైనవి. అదంతయు
ఏకాండమైనదై, మేలిమి బంగారుతో, నకసి పనిగా
చేయబడెను. । మరియు అతడు దాని ఏడు ప్రదీపము 23
లను, దాని కత్తెరను, దాని పట్టుకారును, దాని కత్తెర

* లేక, నేత పనియైన.

చిప్పను మేలిమి బంగారుతో చేసెను. దానిని దాని
24 ఉపకరణములన్నిటిని । ఒక తలాంతు మేలిమి బంగా
రుతో చేసెను.

25 మరియు అతడు తుమ్మ కఱ్ఱతో ధూప వేదిక చేసె
ను. దాని పొడుగు ఒక మూర, దాని వెడల్పు ఒక
మూర; అది చదరముగా నుండెను. దాని ఎత్తు రెండు
26 మూరలు; దాని కొమ్ములు ఏకాండమైనవి. । దానికి అన
గా, దాని కప్పును, దాని నాలుగు పక్కలకును
దాని కొమ్ములకును మేలిమి బంగారు రేకులు తాపి,
27 దానికి చుట్టు బంగారు జవ చేసెను. । దాని మోయు
మోత కఱ్ఱలకు స్థలములగా దానికి రెండు ఉంగర
ములను బంగారుతో చేసి, దాని రెండు పక్కలయందు,
దాని రెండు మూలలయందు దాని జవకు దిగువను
28 వాటిని వేసెను. । దాని మోత కఱ్ఱలను తుమ్మ కఱ్ఱ
29 తో చేసి, వాటికి బంగారు రేకులను తాపెను. । అతడు
పరిశుద్ధమైన అభిషేక తైలమును స్వచ్ఛమైన పరిమళ
ధూపద్రవ్యమును సుగంధద్రవ్యములు కలుపువాని
పనిగా చేసెను.

## 38. అధ్యాయము.

1 మరియు అతడు తుమ్మ కఱ్ఱతో ఆరోహణయాగ
వేదికను చేసెను; దాని పొడుగు ఐదు మూరలు, దాని
వెడల్పు ఐదు మూరలు; అది చదరమైనది. దాని యెత్తు
మూడు మూరలు, దాని నాలుగు మూలల మీద దాని
2 కొమ్ములను చేసెను. । దాని కొమ్ములు దానితో ఏకాం
3 డమైనవి. దానికి రాగి* రేకు తాపెను. । అతడు ఆ
వేదిక ఉపకరణములన్నిటిని, అనగా దాని కుండలను,
దాని పారలను, దాని గిన్నెలను, దాని ముండ్లను, దాని
అగ్నిపాత్రలను చేసెను. దాని ఉపకరణములన్నియు
4 రాగితో† చేసెను. । ఆ వేదిక నిమిత్తము దాని జవకింద,
దాని నడిమి మట్టుకు లోతుగానున్న వలవంటి రాగి
5 జల్లెడ చేసెను. । మరియు, అతడు ఆ రాగి జల్లెడ
యొక్క నాలుగు మూలలలో దాని మోత కఱ్ఱలుండు
6 నాలుగు ఉంగరములను పోత పోసెను. । ఆ మోత
కఱ్ఱలు తుమ్మ కఱ్ఱతో చేసి, వాటికి రాగి రేకులు
7 తాపెను. । ఆ వేదిక మోయుటకు, దాని పక్కలనున్న
ఉంగరములలో ఆ మోత కఱ్ఱలను చొనిపెను. పల
కలతో వేదికను గుల్లగా చేసెను.

8 అతడు సంఘపు గుడారపు ద్వారమున గుంపు కూ
డిన సేవకురాండ్ల అద్దములతో రాగి* పళ్లెమును, దాని
రాగి* కాలును చేసెను.

9 మరియు, అతడు ఆవరణము చేసెను. కుడివైపున అన
గా దక్షిణ దిక్కున, మూడు మూరల పొడుగు గలవిని,
పేనిన సన్నపు నారవైన యవనికలుండెను. । వాటి 10
స్తంభములు ఇరువది, వాటి రాగి తొలులు ఇరువది. ఆ
స్తంభముల వంకులును, వాటి పెండె బద్దలును వెండివి.।
ఉత్తర దిక్కున, యవనికలు నూరు మూరలవి; వాటి 11
స్తంభములు ఇరువది, వాటి రాగి తొలులు ఇరువది;
ఆ స్తంభముల వంకులును వాటి పెండె బద్దలును వెం
డివి. । పడమటి దిక్కున యవనికలు ఏబది మూరలవి; 12
వాటి స్తంభములు పది, వాటి తొలులు పది. ఆ స్తంభ
ముల వంకులును వాటి పెండె బద్దలును వెండివి. ।
తూర్పు వైపున అనగా ఉదయ దిక్కున, ఏబది మూ 13
రలు; । ద్వారముయొక్క ఒక పక్కను యవనికలు 14
పదిహేను మూరలవి; వాటి స్తంభములు మూడు.
వాటి తొలులు మూడు. । అట్లు రెండవ పక్కను 15
అనగా, ఈతట్టు ఆతట్టు, ఆవరణ ద్వారమునకు పది
హేను మూరల యవనికలు ఉండెను; వాటి స్తంభ
ములు మూడు, వాటి తొలులు మూడు.

ఆవరణము చుట్టునున్న దాని యవనికలన్నియు 16
పేనిన సన్నపు నారవి. । స్తంభముల తొలులు రాగివి; 17
స్తంభముల వంకులును వాటి పెండె బద్దలును వెండివి.
వాటి బోదెలకు వెండి రేకులు తాపబడెను. ఆవరణ
స్తంభములన్నియు వెండి బద్దలతో సంధించబడెను.।
ఆవరణ ద్వారపు పరదా, నీల ధూమ్ర రక్త వర్ణములు 18
గలదిని, పేనిన సన్నపు నారతో చేయబడినదైన బుట్టా
పనిది. దాని పొడుగు ఇరువది మూరలు; దాని ఎత్తు,
అనగా వెడల్పు ఆవరణ యవనికలతో సరిగా, ఐదు
మూరలు. । వాటి స్తంభములు నాలుగు; వాటి కంచు 19
తొలులు నాలుగు; వాటి వంకులు వెండివి. । వాటి 20
బోదెలకు వెండి రేకు తాపబడెను; వాటి పెండె బద్దలు
వెండివి. ఆలయమునకును, చుట్టు ఉన్న ఆవరణమునకు
నైన మేకులన్నియు రాగివి. ‡

శాసనాలయమను ఆలయపు వెరసి లెక్కలు ఇవి. 21,22
ఇట్లు అవి యాజకుడగు అహరోను కుమారుడైన ఈతా
మారుచేత, లేవీయుల సేవ నిమిత్తము మోషే మాట
చొప్పున లెక్కించబడెను. యూదా గోత్రికుడైన
హూరు కుమారుడగు ఊరి కుమారుడైన బసలేలు,
యెహోవా మోషేకు ఆజ్ఞాపించినదంతయు చేసెను. ।
మరియు దాను గోత్రికుడైన అహీసామాకు కుమారు 23
డగు అహోలీయాబు అతనితో ఉండెను. ఇతడు
చెక్కువాడును, విచిత్రమైన పని కల్పించువాడును,
నీల ధూమ్ర రక్త వర్ణములతోను సన్నపు నారతోను
బుట్టాపని చేయువాడు. । పరిశుద్ధ స్థల విషయమైన పని 24
అంతటిలోను పనికొరకు వ్యయపరచబడిన బంగార

* లేక, కంచు. † లేక, కంచుతో. ‡ లేక, కంచువి.

మంతయు, అనగా, కానుకగా పైకెత్తబడిన బంగారు,
పరిశుద్ధ స్థలపు షెకెలు చొప్పున ఇరువది తొమ్మిది
25 తలాంతులును, ఏనూట ముప్పది షెకెలులును. । సంఘ
ములో లెక్కించబడినవారి వెండి, పరిశుద్ధ స్థలపు
షెకెలు చొప్పున, నూరు తలాంతులును వెయ్యిని
26 ఏనూట డెబ్బదియైదు షెకెలులును. । ఇది యిరువది
యేండ్లు మొదలుకొని దానిపై ప్రాయము కలిగి
లెక్కించబడుటకు చేరిన వారందరిలో, అనగా, ఆరు
లక్షల మూడువేల యేనూట యేబది మందిలో ప్రతి
తలకు అరషెకెలైన ఒక బెక.*

27 ఆ నూరు వెండి తలాంతులతో, పరిశుద్ధ స్థలపు
తొలులును, అడ్డు తెర తొలులును, అనగా ఒక తొ
లికి ఒక తలాంతు చొప్పున, నూరు తలాంతులకు
28 నూరు తొలులు పోత పోయబడెను. । వెయ్యిని ఏనూట
డెబ్బది యైదు షెకెలుల వెండితో, అతడు స్తంభము
లకు వంకులను చేసి, వాటి బోదెలకు తాపి, వాటిని
వెండి బద్దలచేత కట్టెను.

29 మరియు పైకెత్తబడిన కానుకల రాగి డెబ్బది
తలాంతులును రెండువేల । నన్నూరు షెకెలులును. ।
30 అతడు దానితో సంఘపు గుడారపు ద్వారమునకు
తొలులనును, రాగి వేదికను, దానికి రాగి జల్లెడను,
31 రాగి వేదిక ఉపకరణములన్నిటిని, । చుట్టు ఉన్న ఆవ
రణమునకు తొలులను, ఆవరణ ద్వారమునకు తొ
లులను, ఆలయమునకు మేకులన్నిటిని, చుట్టు ఉన్న
ఆవరణమునకు మేకులన్నిటిని చేసెను.

## 39. అధ్యాయము.

1 పరిశుద్ధ స్థలములో సేవ చేయునట్లు, నీల ధూమ్ర
రక్తవర్ణములుగల వాటితో సేవక వస్త్రములు చేసిరి; అహ
రోను కొరకును పరిశుద్ధ వస్త్రములు చేసిరి; అట్లు
యెహోవా మోషేకు ఆజ్ఞాపించెను.

2 మరియు అతడు బంగారుతోను, నీల ధూమ్ర రక్త
వర్ణములు గల నూలుతోను పేనిన సన్నపు నారతోను
3 ఏఫోదును చేసెను; । నీల ధూమ్ర రక్త వర్ణములు గల
నూలుతోను, సన్నపు నారతోను, చిత్రకారుని పని
గా నేయుటకు, బంగారును రేకులగా కొట్టి, అది
4 తీగెలగా కోసిరి. । దానికి కూర్చు భుజ ఖండములు
చేసిరి; దాని రెండు అంచులయందు కూర్చబడెను. ।
5 దాని మీదనున్న దాని విచిత్రమైన దట్టి ఏకాండమై,
దాని పని రీతిగా, బంగారుతోను నీల ధూమ్ర రక్త
వర్ణములు గల పేనిన సన్నపు నారతోను చేయబడెను;
అట్లు యెహోవా మోషేకు ఆజ్ఞాపించెను.

మరియు, బంగారు జవలలో పొదిగిన లేతపచ్చలను 6
సిద్ధపరిచిరి. ముద్రలు చెక్కబడునట్లు, ఇశ్రాయేలు
పుత్రుల పేరులు వాటిమీద చెక్కబడెను. । అవి ఇశ్రా 7
యేలు పుత్రులకు జ్ఞాపకార్థమైన రత్నములగునట్లు,
ఏఫోదు భుజముల మీద వాటిని ఉంచెను. అట్లు
యెహోవా మోషేకు ఆజ్ఞాపించెను.

మరియు, అతడు ఏఫోదు పనివలె, బంగారుతోను, 8
నీల ధూమ్ర రక్త వర్ణములు గల పంక్తులతోను సన్నపు
నారతోను చిత్రకారుని పనిగా పతకమును చేసెను. ।
అది చదరముగా నుండెను. ఆ పతకమును మడతగా 9
చేసిరి; అది మడవబడినదై జేనెడు పొడుగు, జేనెడు
వెడల్పు గలది. । వారు దానిలో నాలుగు పంక్తుల రత్న 10
ములను పొదిగిరి. మాణిక్యము† పుష్యరాగము, పచ్చ
యు గల పంక్తి మొదటి పంక్తి; । కురువిందము‡ నీలము, 11
వజ్రము గల పంక్తి రెండవ పంక్తి; । పద్మరాగము, గోమే 12
ధికము, సౌగంధికము గల పంక్తి మూడవ పంక్తి; । పసి 13
మిపచ్చ, లేతపచ్చ, యాస్పెయు గల పంక్తి నాలుగవ
పంక్తి; వాటివాటి పంక్తులలో అవి బంగారు జవలలో
పొదుగబడెను. । ఆ రత్నములు ఇశ్రాయేలు పుత్రుల 14
పేరుల చొప్పున పన్నెండు; ముద్రవలె చెక్కబడిన
వారి పేరుల చొప్పున, పన్నెండు గోత్రముల నిమి
త్తము, ఒక్కొక దానిమీద ఒక్కొక పేరు చెక్క
బడెను.

మరియు, వారు ఆ పతకమునకు మేలిమి బంగా 15
రుతో అల్లికపనియైన గొలుసులను చేసిరి. । వారు రెం 16
డు బంగారు జవలను, రెండు బంగారు ఉంగరములను
చేసి, ఆ రెండు ఉంగరములను పతకపు రెండు కొన
లను ఉంచి, । అల్లబడిన ఆ రెండు బంగారు గొలుసు 17
లను, పతకపు కొనలనున్న రెండు ఉంగరములలో
ఉంచి, । అల్లబడిన ఆ రెండు గొలుసుల కొనలను ఆ 18
రెండు జవలకు తగిలించి, ఏఫోదు భుజఖండముల మీద
దాని యెదుట ఉంచెను. । మరియు, వారు రెండు బం 19
గారు ఉంగరములను చేసి, ఏఫోదు యెదుటనున్న పత
కపు లోపలి అంచున, దాని రెండు కొనలకు వాటిని
వేసిరి. । మరియు రెండు బంగారు ఉంగరములు చేసి, 20
ఏఫోదు విచిత్రమైన నడికట్టుకు పైగా, దాని రెండవ
కూర్పుయొద్దనున్న దాని యెదుటి పక్కను, ఏఫోదు
రెండు భుజఖండములకు దిగువను, వాటిని వేసిరి. ।
అప్పుడు ఆ పతకము ఏఫోదు విచిత్రమైన దట్టికి పైగా 21
ఉండునట్లును, అది ఏఫోదునుంచి వదలకుండునట్లును,

* బెక అనేది, తొమ్మిది అణాలు కావచ్చును. † లేక, రత్నములను పొదిగిరి. ‡ లేక, కెంపు.

ఆ పతకమును దాని ఉంగరములకు ఏఫోదు ఉంగర
ములకు నీలి సూత్రముతో కట్టిరి. అట్లు యెహోవా
మోషేకు ఆజ్ఞాపించెను.
22 మరియు అతడు ఏఫోదు చొక్కాయి కేవలము
నీలి నూలుతో అల్లిక పనిగా చేసెను. ఆ చొక్కాయి
మధ్యనున్న రంధ్రము, కవచ రంధ్రము వలె నుండెను.।
23 అది చినుగకుండునట్లు, దాని రంధ్రమునకు చుట్టు ఒక
24 గోటు ఉండెను. । మరియు, వారు చొక్కాయి అం
చులమీద, నీల ధూమ్ర రక్త వర్ణములు గల పేనిన
25 నూలుతో దానిమ్మపండ్లను చేసిరి. । మరియు వారు
మేలిమి బంగారుతో ఘంటలను చేసి, ఆ దానిమ్మ
పండ్ల మధ్యను, అనగా, ఆ చొక్కాయి అంచుల
మీద, చుట్టునున్న దానిమ్మపండ్ల మధ్యను ఆ ఘంటలు
26 పెట్టిరి. । సేవ చేయుటకు, ఘంటయు దానిమ్మపండును,
ఘంట దానిమ్మపండును, ఆ చొక్కాయి అంచుల
మీద చుట్టు నుండెను. అట్లు యెహోవా మోషేకు
ఆజ్ఞాపించెను.
27,28,29 మరియు, వారు అహరోనుకును, అతని కుమా
రులకును నేతపనిదైన సన్నపు నార చొక్కాయిలను,
సన్నపు నార పాగాను, అందమైన సన్నపు నార కుళ్లా
యిలను, పేనిన సన్నపు నారలాగులను, నీల ధూమ్ర
రక్త వర్ణములు గల పేనిన సన్నపు నారతో, బుట్టాపని
యైన నడికట్టును చేసిరి. అట్లు యెహోవా మోషేకు
ఆజ్ఞాపించెను.
30 మరియు, వారు మేలిమి బంగారుతో పరిశుద్ధ
కిరీట భూషణము చేసి, చెక్కిన ముద్రవలె దాని మీ
ద,—యెహోవాకు పరిశుద్ధము* అను వ్రాత వ్రా
31 సిరి. । అది పాగాకు మీదుగా కట్టునట్లు, దానికి నీలి
సూత్రము కట్టిరి. అట్లు యెహోవా మోషేకు ఆజ్ఞా
పించెను.
32 అట్లు సంఘపు గుడారమైన ఆలయముకొరకైన
సేవ యావత్తు సంపూర్తి చేయబడెను. యెహోవా
మోషేకు ఆజ్ఞాపించినట్లే, ఇశ్రాయేలు పుత్రులు చేసిరి.
33 తరువాత వారు ఆలయమును, గుడారమును, దాని
ఉపకరణములన్నిటిని, దాని కొలుకులను, దాని పలక
లను, దాని కమ్ములను, దాని స్తంభములను, దాని తొలు
34 లను, । ఎరుపు రంగువేసిన పొట్టేళ్ల తోళ్ల పైకప్పును,
35 తహషను దాని తోళ్ల పైకప్పును, కప్పుతెరను, । శాస
నముగల పెట్టెను, దాని మోత కర్రలను ఆచ్ఛాదన
36 పీఠమును, । బల్లను, దాని ఉపకరణములన్నిటిని, సమ్ము
37 ఖపు† రొట్టెలను, । స్వచ్ఛమైన దీపవృక్షమును, సవరిం
చు ప్రదీపములైన దాని ప్రదీపములను, దాని ఉప
కరణములన్నిటిని, వెలుగు కొరకు తైలమును, । బంగా 38
రు వేదికను, అభిషేక తైలమును, పరిమళ ధూపద్ర
వ్యములను, ఆలయ ద్వారమునకు పరదాను, । రాగి వేది 39
కను, దానికుండు రాగి జల్లెడను, దాని మోత కర్రలను,
దాని ఉపకరణములన్నిటిని, పళ్లెమును, దాని కాలు
ను, । ఆవరణ యవనికలను, దాని స్తంభములను, దాని 40
తొలులను, ఆవరణ ద్వారమునకు పరదాను, దాని త్రాళ్ల
ను, దాని మేకులను, సంఘపు గుడారము యొక్క
ఆలయ సేవ కొరకైన ఉపకరణములన్నిటిని, పరిశుద్ధ
స్థలములో । సేవక వస్త్రములను, యాజకసేవ చేయునట్లు 41
యాజకుడైన అహరోనుకు పరిశుద్ధ వస్త్రములను, అతని
కుమారుల వస్త్రములను మోషేయొద్దకు తీసుకొని వచ్చి
రి. । యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్లు ఇశ్రా 42
యేలు పుత్రులు ఆ పని అంతయు చేసిరి.
మోషే ఆ పని అంతయు చూచినప్పుడు, ఇదుగో! 43
యెహోవా ఆజ్ఞాపించిన ప్రకారము దాని చేసియుం
డిరి; అట్లు చేసిరి. అప్పుడు మోషే వారిని దీవించెను.

## 40. అధ్యాయము.

మరియు, యెహోవా మోషేతో ఇట్లనెను: — 1
మొదటి నెలలో మొదటి దినము నీవు సంఘపు గుడార 2
మైన ఆలయమును నిలువబెట్ట వలెను. । దానిలో నీవు 3
శాసనము గల పెట్టె ఉంచి, ఆ పెట్టెను అడ్డు తెర
వలన కప్ప వలెను. । నీవు బల్లను లోపలికి తెచ్చి, దాని 4
మీద క్రమపరచ వలసిన వాటిని క్రమపరిచి, దీపవృ
క్షమును లోపలికి తెచ్చి దాని ప్రదీపములను వెలిగించ
వలెను. । శాసనము గల పెట్టె యెదుట ధూపమునకైన 5
బంగారు వేదికను ఉంచి, ఆలయ ద్వారపు పరదా
వేయ వలెను. । సంఘపు గుడారమైన ఆలయము యె 6
దుట ఆరోహణయాగ వేదికను ఉంచ వలెను. । సంఘ 7
పు గుడారమునకును వేదికకును మధ్యను, పళ్లెమును
ఉంచి, దానిలో నీళ్లు నింప వలెను. । ఆవరణమును 8
చుట్టు నిలువబెట్టి, ఆవరణ ద్వారపు పరదా వేయ
వలెను.
మరియు, నీవు అభిషేక తైలము తీసుకొని, ఆలయ 9
మునకును దానిలోని సమస్తమునకును అభిషేకము చేసి,
దానిని దాని ఉపకరణములన్నిటినిని పరిశుద్ధపరచ
వలెను. అప్పుడు అది పరిశుద్ధమై యుండును. । ఆరో 10
హణయాగ వేదికను అభిషేకము చేసి, ఆ వేదికను పరి
శుద్ధపరచ వలెను. అప్పుడు ఆ వేదిక అతిపరిశుద్ధ
మగును. । ఆ పళ్లెమునకు, దాని కాలుకు అభిషేకము 11
చేసి, దాని పరిశుద్ధపరచ వలెను.

* లేక, యెహోవాకు పరిశుద్ధత. † లేక, సన్నిధి.

12 మరియు, నీవు అహరోనును అతని కుమారులను
సంఘపు గుడారపు ద్వారము యొద్దకు తీసుకొని వచ్చి
13 వారిని నీళ్లతో స్నానము చేయించి,। అహరోను నాకు
యాజకుడగునట్లు అతనికి పరిశుద్ధ వస్త్రములను ధరింప
చేసి అతనికి అభిషేకము చేసి, అతని పరిశుద్ధపరచ
వలెను.
14 మరియు నీవు అతని కుమారులను తీసుకొని వచ్చి,
15 వారికి చొక్కాయిలను తొడిగించి,। వారు నాకు
యాజకులగునట్లు నీవు వారి తండ్రికి అభిషేకము
చేసినలాగున వారికిని అభిషేకము చేయవలెను. వారి
అభిషేకము వారి తరతరములమట్టుకు వారికి నిత్య
మైన యాజకత్వము కొరకైనదై యుండుననెను.
16 మోషే అట్లు చేసెను. యెహోవా అతనికి
ఆజ్ఞాపించిన ప్రకారముగానే చేసెను.
17 రెండవ సంవత్సరపు మొదటి నెలలో మొదటి దిన
18 మున ఆలయము నిలువబెట్టబడెను.। మోషే ఆలయ
మును నిలువబెట్టి, దాని తొలులను వేసి, దాని పలక
లను నిలువబెట్టి, దాని పెండె బద్దలను చొనిపి, దాని
19 స్తంభములను నిలువబెట్టి,। ఆలయము మీద గుడార
మును ప్రసరింప చేసి, మీదుగా దాని పైని గుడారపు
కప్పు వేసెను. అట్లు యెహోవా మోషేకు ఆజ్ఞా
పించెను.
20 మరియు, అతడు శాసనము తీసుకొని, పెట్టెలో
ఉంచి, పెట్టెకు మోత కర్రలను వేసి, పెట్టె మీద
21 ఆచ్ఛాదన పీఠమును ఉంచెను;। ఆలయములోకి పెట్టె
తెచ్చి కప్పు తెరను వేసి, శాసనము గల పెట్టెను మరుగు
పరిచెను;* అట్లు, యెహోవా మోషేకు ఆజ్ఞాపించెను.
22 మరియు అతడు సంఘపు గుడారమైన ఆలయము
నకు ఉత్తర దిక్కున అడ్డుతెరకు వెలపట బల్లను ఉంచి,।
23 యెహోవా సన్నిధిని దాని మీద రొట్టెలను క్రమ
పరిచెను. అట్లు యెహోవా మోషేకు ఆజ్ఞాపించెను.
24 మరియు అతడు సంఘపు గుడారములో, ఆలయ
దక్షిణ దిక్కున, బల్ల యెదుట దీపవృక్షమును ఉంచి,।
25 యెహోవా సన్నిధిని ప్రదీపములను వెలిగించెను.
అట్లు యెహోవా మోషేకు ఆజ్ఞాపించెను.

మరియు అతడు సంఘపు గుడారములో అడ్డు తెర 26
యెదుట బంగారు ధూప పీఠమును ఉంచి। దాని మీద 27
పరిమళ ద్రవ్యముల ధూపము వేసెను. అట్లు యెహో
వా మోషేకు ఆజ్ఞాపించెను.
మరియు, అతడు ఆలయ ద్వారపు పరదా వేసి, 28
సంఘపు గుడారమైన ఆలయ ద్వారము యొద్ద ఆరో
హణ యాగ వేదికను ఉంచి,। దాని మీద ఆరోహణ 29
యాగమును, కానుకను సమర్పించెను. అట్లు యె
హోవా మోషేకు ఆజ్ఞాపించెను.
మరియు, అతడు సంఘపు గుడారమునకును వేది 30
కకును మధ్యను పళ్లెమును ఉంచి, కడుగుకొనునట్లు
దానిలో నీళ్లు పోసెను.। దానిలో మోషే, అహరోను, 31
అతని కుమారులును తమ చేతులను తమ కాళ్లను కడు
గుకొనిరి.। వారు సంఘపు గుడారములోకి వెళ్లునప్పు 32
డును వేదికకు సమీపించునప్పుడును కడుగుకొనిరి.
అట్లు యెహోవా మోషేకు ఆజ్ఞాపించెను.
మరియు, అతడు ఆలయమునకును వేదికకును 33
చుట్టు, ఆవరణము నిలువబెట్టి, ఆవరణ ద్వారపు పర
దా వేసెను. అట్లు మోషే ఆ పని సంపూర్తి చేసెను.
అప్పుడు మేఘము సంఘపు గుడారమును మరుగు 34
పరిచెను.* యెహోవా మహిమతో† ఆలయము నిం
డెను.। అప్పుడు మోషే సంఘపు గుడారములోకి వెళ్ల 35
లేక పోయెను; ఎందుకనగా ఆ మేఘము దానిమీద
నిలిచెను; మరియు యెహోవా మహిమతో, ఆలయ
ము నిండెను.
ఆ మేఘము ఆలయము మీదనుంచి పైకి వెళ్లు 36
నప్పుడెల్లను, ఇశ్రాయేలు పుత్రులు తమ సమస్త సం
చారములకు‡ ప్రయాణమై వెళ్లిరి.। అయితే ఆ మేఘ 37
ము పైకి వెళ్లని పక్షమందు, అది వెళ్లు దినమువరకు
వారు ప్రయాణము చేయువారు కారు;। వారి సమస్త 38
సంచారములలో, ఇశ్రాయేలు వంశస్థులందరి కన్నుల
యెదుట, పగటి వేళ, యెహోవా మేఘము, ఆల
యము మీద నుండెను; రాత్రి వేళ, అగ్ని దానిమీద
నుండెను.

*లేక, కప్పెను. †లేక, తేజముతో. ‡లేక, లో.

# లేవీయకాండము

అనగా

# మోషే మూడవ గ్రంథము.

## 1. అధ్యాయము.

1 యెహోవా మోషేను పిలిచి సంఘపు గుడార
ములోనుంచి అతనితో ఇట్లనెను:—
2 నీవు ఇశ్రాయేలు పుత్రులను చూచి,— మీలో ఏ
మనుష్యుడైనను జంతువులలోనిది, అనగా గోవులలోని
దైనను గొర్రెమేకలలోనిదైనను యెహోవాకు అర్పి
తముగా అర్పించునప్పుడు, మీ అర్పితమును దగ్గరకు
తేవలెను.
3 ఆరోహణయాగ నిమిత్తము, అతని అర్పితము గోవు
లలోనిదైతే, నిర్దోషమైన మగదాని, దగ్గరకు తే* వలెను.
తాను యెహోవా సన్నిధిని అంగీకరించబడునట్లు,
సంఘపు గుడారపు ద్వారము దగ్గర దాని అర్పించ
4 వలెను. । అతడు ఆ యారోహణయాగ పశువు తలమీద
తన చెయ్యి ఉంచ వలెను; అతనికి ఆచ్ఛాదనము†
కలుగునట్లు, అది అతనికొరకు అంగీకరించబడును. ।
5 అతడు యెహోవా సన్నిధిని ఆ కోడెదూడను వధిం
చిన తరువాత, అహరోను కుమారులైన యాజకులు దాని
రక్తమును దగ్గరకు తెచ్చి, సంఘపు గుడారము యెదుట
నున్న యజ్ఞవేదికకు చుట్టు ఆ రక్తము ప్రోక్షించ వలె
6 ను. । అప్పుడు అతడు ఆ యారోహణయాగ పశు చర్మ
మును ఒలిచి, దాని అవయవముల చొప్పున దాని ఛే
7 దించిన తరువాత, । యాజకుడైన అహరోను కుమారులు
వేదికమీద అగ్ని వేసి, ఆ అగ్నిమీద కట్టెలను చక్కగా
8 పేర్చ వలెను. । అప్పుడు అహరోను కుమారులైన యాజ
కులు ఆ అవయవములను, దాని తలను, దాని క్రొవ్వును
వేదికమీదనున్న అగ్నిమీది కట్టెల పైని చక్కగా
పేర్చ వలెను; । అయితే దాని ఆంత్రములను, దాని కా
9 ళ్లను నీళ్లతో కడగ వలెను. । అప్పుడు అది యెహో
వాకు ఇంపైన సువాసన గల ఆరోహణ హోమమగు
నట్లు, యాజకుడు అదంతయు వేదికమీద ధూపము
వేయ వలెను.
10 ఆరోహణయాగ నిమిత్తము అతని అర్పితము మంద
లోనిది, అనగా గొర్రెలలోనిదైనను మేకలలోనిదైనను
అయ్యుంటే, నిర్దోషమైన మగదాని, దగ్గరకు తీసుకొని
వచ్చి, । వేదికకు ఉత్తర దిక్కున, యెహోవా సన్నిధిని 11
దాని వధించ వలెను. అప్పుడు అహరోను కుమారులైన
యాజకులు వేదికకు చుట్టు దాని రక్తము ప్రోక్షించ
వలెను. । దాని అవయవ విభాగముల చొప్పున, దానిని 12
దాని తలను దాని క్రొవ్వును ఛేదించిన తరువాత, యాజ
కుడు వేదికమీదనున్న అగ్నిమీది కట్టెల పైని వాటిని
చక్కగా పేర్చ వలెను. । దాని ఆంత్రములను దాని 13
కాళ్లను నీళ్లతో కడగ వలెను. అప్పుడు యాజకుడు
అదంతయు దగ్గరకు తెచ్చి, వేదికమీద దాని ధూపము
వేయ వలెను. అది ఆరోహణయాగము, యెహో
వాకు ఇంపైన సువాసనగల హోమము.
యెహోవాకు ఆరోహణయాగ నిమిత్తము, అతని 14
అర్పితము పక్షిజాతిలోనిదైతే, గువ్వలలోనివైనను, పా
వురపు పిల్లలలోనివైనను దగ్గరకు తే వలెను. । అప్పుడు 15
యాజకుడు వేదిక దగ్గరకు దాని తీసుకొనివచ్చి, దాని
తలను త్రుంచి, వేదికమీద దాని ధూపము వేయ వలె
ను; దాని రక్తము వేదిక పక్కను పిండ వలెను.
మరియు, దాని మలముతోకూడ, దాని గాగను 16
ఊడదీసి, వేదికకు తూర్పు దిక్కున, బూడిదె వేయు
చోట దాని పారవేయ వలెను. । అతడు దాని రెక్కల 17
సందున దాని చీల్చ వలెను, గాని అవయవ విభాగ
ములగా దాని ఛేదించకూడదు. అప్పుడు యాజకుడు
వేదిక మీదననగా, అగ్నిమీదనున్న కట్టెల పైని దాని
ధూపము వేయ వలెను. అది ఆరోహణయాగము,
యెహోవాకు ఇంపైన సువాసన గల హోమము.

## 2. అధ్యాయము.

ఒకప్పుడు యెహోవాకు కానుకయైన అర్పితము 1
అర్పించితే, అతని అర్పితము గోధుముల పిండిదియై
యుండ వలెను. అతడు దానిమీద నూనె పోసి, దాని
మీద సాంబ్రాణి వేసి, । అహరోను కుమారులైన యా 2
జకుల యొద్దకు దాని తే వలెను. అందులోనుంచి,

* లేక, అర్పించ. † లేక, పాపాచ్ఛాదనము. ఆచ్ఛాదనమనగా, కప్పు.

నూనెలోను గోధుముల పిండిలోను తన పిడికెడు పా
లును, దాని సాంబ్రాణి అంతయు యాజకుడు తీసు
కొన వలెను. అప్పుడు యాజకుడు, యెహోవాకు
ఇంపైన సువాసన గల హోమముగా, వేదికమీద
3 దాని జ్ఞాపకార్థ భాగము ధూపము వేయ వలెను.। ఆ
కానుక శేషము అహరోనుకును అతని కుమారులకు
నుండును. అది యెహోవా హోమములలో అతి
పరిశుద్ధమైనది.

4 నీవు పొయిలో కాల్చిన కానుకయైన అర్పితము
అర్పించితే, అది పొంగక, నూనె కలిసిన గోధుముల
పిండి అప్పడములైనను, లేక, పొంగక నూనె రాసిన
పూరీలైనను అయ్యుండ వలెను.

5 నీ అర్పితము పెనముమీద కాల్చిన కానుకయైతే,
అది పొంగక నూనె కలిసిన గోధుముల పిండిదైయుండ
6 వలెను.। నీవు దాని ముక్క ముక్కలగా చేసి వాటి
మీద నూనె రాయ వలెను; అది కానుక.

7 నీ అర్పితము కుండతో వండిన కానుకయైతే, నూనె
కలిసిన గోధుముల పిండితో దాని చేయ వలెను.।
8 యెహోవా నిమిత్తము వాటితో చేసిన కానుకను
తీసుకొని రావలెను. యాజకునికి దాని అర్పించిన
తరువాత, అతడు వేదిక సమీపమునకు దాని తే వలె
9 ను.। అప్పుడు యాజకుడు ఆ కానుకలోనుంచి దాని
జ్ఞాపకార్థ భాగమును ఎత్తుకొని, వేదికమీద యెహో
వాకు ఇంపైన సువాసన గల హోమముగా, దాని ధూ
10 పము వేయ వలెను.। ఆ కానుక శేషము అహరోనుకు
ను అతని కుమారులకునుండ వలెను. యెహోవా
హోమములలో అది అతిపరిశుద్ధము.

11 మీరు యెహోవాకు అర్పించు కానుక యేదియు
పులిసి పొంగినదానితో చేయ కూడదు; ఎందుకనగా,
పులిసి పొంగిన దానినైనను, తేనెనైనను ఎంతమాత్ర
ము యెహోవా నిమిత్తము, హోమధూపము వేయ
12 కూడదు.। అర్పితము ప్రథమ ఫలమైతే, యెహోవాకు
వాటిని అర్పించ వలెను గాని వేదికమీద ఇంపైన సు
వాసనగా ఆరోహింప చేయ గూడదు.

13 నీ అర్పితమైన ప్రతి కానుకకు అంటునట్లు ఉప్పు
వేయ వలెను. నీ దేవుని నిబంధన యుప్పు నీ కానుక
మీద నుండక తప్పదు. నీ అర్పితములన్నిటితోను
ఉప్పు అర్పించ వలెను.

14 నీవు ప్రథమ ఫలముల కానుకను అర్పించునప్పుడు,
సారమైన భూమిలో పుట్టిన పచ్చని వెన్నులను అగ్ని
మీద పేల్చి నూరి నీ ప్రథమ ఫలముల కానుకగా తీసు
15 కొని రా వలెను.। నీవు దానిమీద నూనె పోసి, దాని
16 పైని సాంబ్రాణి వేయ వలెను; అది కానుక.। అప్పు
డు యాజకుడు దాని జ్ఞాపకార్థ భాగమనగా, దాని
సాంబ్రాణి అంతయు, నూరిన ధాన్యములోను నూనె
లోను కొంచెమును, సాంబ్రాణి అంతయు ధూపము
వేయ వలెను; అది యెహోవాకు హోమమగును.

## 3. అధ్యాయము.

అతని అర్పితము మంగళయాగ నిమిత్తమైతే, అతడు 1
గోవులలోనిది తీసుకొని వచ్చిన యెడల, అది మగదై
నను ఆడుదైనను, యెహోవా సన్నిధికి నిర్దోషమైన
దాని తీసుకొని రావలెను.। అప్పుడు అతడు తాను 2
అర్పించిన దాని తలమీద తన చెయ్యి ఉంచి, సంఘపు
గుడారపు ద్వారమున దాని వధించ వలెను. అహరో
ను కుమారులైన యాజకులు వేదికకు చుట్టు దాని రక్త
ము ప్రోక్షించ వలెను.। అతడు మంగళార్పితమైన 3
యాగపశువును యెహోవాకు హోమము చేయ
వలెను.। దాని ఆంత్రములను కప్పు కొవ్వును, ఆంత్ర 4
ములకు మీదుగానున్న కొవ్వంతయు, రెండు మూత్ర
గ్రంథులను, వాటి మీదను డొక్కల మీదనున్న కొ
వ్వును, కాలేజము మీదను, మూత్రగ్రంథుల మీద
నున్న వపను తీసివేయ వలెను.। అహరోను కుమారులు 5
వేదికమీదననగా, అగ్నిమీది కట్టెల మీదనున్న ఆరో
హణయాగ ద్రవ్యము పైని, దాని ధూపము వేయ వలె
ను; అది యెహోవాకు ఇంపైన సువాసన గల హో
మము.

యెహోవాకు మంగళయాగము నిమిత్తము అతని 6
అర్పితము గొర్రె మేకలలోనిదైతే అది మగదైనను ఆడు
దైనను, నిర్దోషమైన దాని తీసుకొని రావలెను.। అత 7
డు గొర్రెను తన అర్పితముగా తీసుకొని వచ్చిన యె
డల, యెహోవా సన్నిధికి దాని తీసుకొని రావలె
ను.। అతడు, తాను అర్పించిన దాని తలమీద, తన 8
చెయ్యి ఉంచి, సంఘపు గుడారము యెదుట దాని
వధించ వలెను. అప్పుడు అహరోను కుమారులు వేది
కకు చుట్టు దాని రక్తము ప్రోక్షించ వలెను.। మరియు, 9
ఆ మంగళార్పితమైన యాగపశువుతో యెహోవాకు
హోమము చేయ వలెను. దాని కొవ్వును, ముడ్డిపూస
యొద్ద తీసిన తోకంతయు, ఆంత్రములను కప్పు కొ
వ్వును, ఆంత్రములకు మీదుగానున్న కొవ్వంతయును,।
రెండు మూత్రగ్రంథులను, వాటిమీద డొక్కల యొ 10
ద్దనున్న కొవ్వును, మూత్రగ్రంథుల మీది కాలేజము
యొక్క వపను తీసివేయ వలెను.। యాజకుడు వేదిక 11
మీద దాని ధూపము వేయ వలెను; అది యెహోవా
నిమిత్తమైన హోమమునకు ఆహారము.

అతని అర్పితము మేకయైతే, యెహోవా సన్ని 12
ధికి దాని తీసుకొని రావలెను.। అతడు దాని తలమీద 13

తన చెయ్యి ఉంచి, సంఘపు గుడారము యెదుట దాని
వధించ వలెను. అప్పుడు అహరోను కుమారులు వేది
14 కను చుట్టు దాని రక్తము ప్రోక్షించ వలెను.।అతడు దా
నిలోని దైన తన అర్పితమును యెహోవాకు హోమ
15 ముగా అర్పించ వలెను.। ఆంత్రములను కప్పు కొవ్వును,
ఆంత్రములకు మీదుగానున్న కొవ్వంతయును, రెండు
మూత్ర గ్రంథులను, వాటిమీద డొక్కల యొద్దనున్న
కొవ్వును, మూత్ర గ్రంథుల మీది కాలేజముయొక్క
16 వపను తీసివేయ వలెను.। అప్పుడు యాజకుడు వేదిక
మీద వాటిని ధూపము వేయ వలెను. కొవ్వంతయు
యెహోవాది; అది సువాసనకొరకైన హోమమునకు
ఆహారము. మీరు కొవ్వునైనను రక్తము నైనను తినకూ
17 డదు.। అది మీ తరతరముల మట్టుకు, మీసమస్త నివా
సస్థలములలోను నిత్యమైన కట్టడ అని చెప్పుమనెను.

## 4. అధ్యాయము.

1,2 మరియు, యెహోవా మోషేతో ఇట్లనెను:।—
నీవు ఇశ్రాయేలు పుత్రులను చూచి—చేయరాని వాటి
విషయము, యెహోవా ఇచ్చిన ఆజ్ఞలన్నిటిలో ఒక
దానికి విరోధముగా, ఒకడు బుద్ధిహీనతవలన పాపము
చేసి, ఆ చేయరాని వాటిలో ఒక్కదానినైనను చేసిన
యెడల, అనగా:
3 ప్రజలు అపరాధులగునట్లు, అభిషిక్తుడైన యాజ
కుడు పాపము చేసిన యెడల, అతడు తాను చేసిన తన
పాపము నిమిత్తము, నిర్దోషమైన కోడెదూడను యె
4 హోవాకు పాపార్పితముగా* అర్పించ వలెను.। అత
డు సంఘపు గుడారపు ద్వారమునకు, యెహోవా
సన్నిధికి ఆ కోడెను తీసుకొనివచ్చి, కోడె తల మీద
చెయ్యి ఉంచి, యెహోవా సన్నిధిని కోడెను వధించ
5 వలెను.। అప్పుడు అభిషిక్తుడైన యాజకుడు ఆ కోడె
దూడ రక్తములోనిది కొంచెము తీసి, సంఘపు గుడార
6 మునకు దాని తే వలెను.। ఆ యాజకుడు ఆ రక్తములో
తన వేలు ముంచి, పరిశుద్ధాలయముయొక్క అడ్డు తెర
యెదుట ఆ రక్తములోనిది కొంచెము ఏడు మారులు
7 యెహోవా సన్నిధిని ప్రోక్షించ వలెను.। అప్పుడు
యాజకుడు, సంఘపు గుడారమున యెహోవా సన్ని
ధినున్న, సుగంధ ద్రవ్యముల ధూప వేదిక కొమ్ముల
మీద, ఆ రక్తములోనిది కొంచెము చమిరి, సంఘపు
గుడారపు ద్వారము నొద్దనున్న, ఆరోహణయాగవేదిక
అడుగున, ఆ కోడె రక్తశేషమంతయు పోయ వలెను.।
8 మరియు అతడు పాపార్పితమైన† ఆ కోడె కొవ్వంత
యును దానినుంచి తీసివేయ వలెను; ఆంత్రములను
కప్పు కొవ్వును, ఆంత్రములకు మీదుగానున్న కొవ్వం
తయును, మూత్ర గ్రంథులను, వాటిమీద డొక్కల
యొద్దనున్న కొవ్వును, మూత్ర గ్రంథులయొద్ద కాలే
జము మీది వపను,। మంగళార్పితమైన యెద్దునుంచి 9
తీయబడినట్లు దీనినుంచియు తీసివేయ వలెను.। అప్పు 10
డు యాజకుడు ఆరోహణయాగ వేదికమీద వాటిని
ధూపము వేయ వలెను.। ఆ కోడె శేషమంతయు, 11,12
అనగా దాని చర్మము, దాని మాంసమంతయు, దాని
తల, దాని కాళ్లు, దాని ఆంత్రములు, దాని పేడ, పా
లెము వెలపటికి, అనగా బూడిదె పారపోయు పవిత్ర
స్థలమునకు పట్టుకొనిపోయి, అగ్నిలో కట్టెలమీద
వాటిని కాల్చివేయ వలెను; బూడిదెపోయు చోటను
అది కాల్చ వలెను.

ఇశ్రాయేలు సంఘమంతయు బుద్ధిహీనతవలన, తప్పి 13
తము చేసిన యెడల, అనగా, అది తప్పితమని సమాజ
మునకు అగపడక మరుగై యుండగా, వారు చేయ
రాని వాటి విషయమైన, యెహోవా ఆజ్ఞలలో ఏ
ఒక దానినైనను మీరి అపరాధులైతే,। వారు దానికి 14
విరోధముగా చేసిన ఆ పాపము తెలియబడునప్పుడు,
సంఘము పాపార్పితముగా* కోడెదూడను అర్పించి,
సంఘపు గుడారపు ద్వారమునకు దాని తీసుకొని రా
వలెను.। సంఘపు పెద్దలు యెహోవా సన్నిధిని ఆ 15
కోడె మీద తమ చేతులను ఉంచిన తరువాత, యె
హోవా సన్నిధిని ఆ కోడెదూడను వధించ వలెను.।
అభిషిక్తుడగు యాజకుడు, ఆ కోడె రక్తములోనిది కొం 16
చెము సంఘపు గుడారములోనికి తీసుకొని రావలెను.।
అప్పుడు ఆ యాజకుడు ఆ రక్తములో తనవేలు ముంచి, 17
అడ్డు తెర తట్టు, యెహోవా సన్నిధిని ఏడు మా
రులు దాని ప్రోక్షించ వలెను.। మరియు, అతడు దాని 18
రక్తములోనిది కొంచెము, సంఘపు గుడారములో యె
హోవా సన్నిధినున్న వేదిక కొమ్ములమీద చమిరి,
సంఘపు గుడారపు ద్వారము నొద్దనున్న ఆరోహణ
యాగ వేదిక అడుగున ఆ రక్త శేషమంతయు పోయ
వలెను.। మరియు, అతడు దాని కొవ్వంతయు తీసి ఆ 19
వేదికమీద దాని ధూపము వేయ వలెను.। అతడు పా 20
పము నిమిత్తమైన కోడెను చేసినప్రకారము, దీని చేయ
వలెను; ఆ ప్రకారమే దీని చేయ వలెను. యాజకుడు
వారికి ఆచ్ఛాదనము చేయును;‡ వారికి విమోచనము
కలుగును.। అప్పుడు ఆ కోడెను పాలెము వెలపటికి 21
మోసి, ఆ మొదటి కోడెను కాల్చినట్లు, దీని కాల్చ
వలెను. ఇది సంఘ పాపము నిమిత్తమైన అర్పితము§.

* లేక, పాపాచ్ఛాదనముగా. † లేక, పాపాచ్ఛాదనమైన. ‡ లేక, వారిని ఆచ్ఛాదించును.
§ లేక, ఇది సంఘ పాపార్పితము; లేక, సంఘ పాపాచ్ఛాదనార్పితము.

22 అధికారి పాపము చేసి, చేయరాని వాటి విషయము
తన దేవుడైన యెహోవా యిచ్చిన ఆజ్ఞలన్నిటిలోను
యే ఒకదానినైనను బుద్ధిహీనతవలన మీరి, అపరాధియై
23 యుండగా, । అతడు ఏ పాపము చేయుటవలన, పాపి
యైనాడో, అది ఒకవేళ అతనికి తెలియబడిన యెడల,
అతడు నిర్దోషమైన మగమేకపిల్లను తన అర్పితముగా
24 తీసుకొని వచ్చి, । ఆ మేకపిల్ల తలమీద తన చెయ్యి
ఉంచి, ఆరోహణయాగ పశువును వధించు చోట, యె
హోవా సన్నిధిని దాని వధించ వలెను; ఇది పాపము
25 నిమిత్తము.* । అప్పుడు యాజకుడు పాపము నిమిత్తమైన†
ఆ రక్తములోనిది కొంచెము తన వేలితో తీసి, ఆరో
హణయాగ వేదిక కొమ్ముల మీద చమిరి, దాని రక్తశేష
ము ఆరోహణయాగ వేదిక అడుగున పోయ వలెను. ।
26 మరియు మంగళయాగ పశువు క్రొవ్వును వలె, వేదిక
మీద దీని క్రొవ్వంతయు ధూపము వేయ వలెను. అట్లు
యాజకుడు అతని పాపము నిమిత్తము, అతనికి పాపా
చ్ఛాదనము చేయును; అతనికి విమోచనము కలుగును.
27 మీ దేశస్థులలో ఎవడైనను బుద్ధిహీనతచేత పాప
ము చేసి, చేయరాని వాటి విషయము యెహోవా
ఇచ్చిన ఆజ్ఞలలో దేనినైనను మీరి అపరాధియై యుం
28 డగా, । అతడు చేసిన అతని పాపము ఒకవేళ అతనికి
తెలియబడిన యెడల, అతడు తాను చేసిన తన పాప
ము నిమిత్తము, నిర్దోషమైన ఆడుమేక పిల్లను తన అర్పి
29 తముగా తీసుకొని వచ్చి, । ఆ పాపార్పితమైన దాని
తల మీద తన చెయ్యి ఉంచి, ఆరోహణయాగ స్థల
30 మున పాపార్పితమును‡ వధించ వలెను. । అప్పుడు యా
జకుడు దాని రక్తములోనిది కొంచెము వేలితో తీసి,
ఆరోహణయాగ వేదిక కొమ్ముల మీద చమిరి, దాని
31 రక్తశేషము ఆ వేదిక అడుగున పోయ వలెను. । మరి
యు, మంగళయాగ పశువునుంచి క్రొవ్వు తీసివేసిన
ప్రకారము, దీని క్రొవ్వంతయు తీసివేయ వలెను.
యెహోవాకు ఇంపైన సువాసనగా, యాజకుడు వే
దికమీద దాని ధూపము వేయ వలెను; అట్లు, యాజ
కుడు అతనికి ఆచ్ఛాదనము§ చేయును; అతనికి విమో
చనము కలుగును.

32 అతడు పాపము నిమిత్తము తన అర్పితముగా గొ
ర్రెను తీసుకొని వచ్చిన యెడల, నిర్దోషమైన దాని తీసు
33 కొని వచ్చి, । ఆ పాపార్పితమైన దాని తలమీద తన
చెయ్యి ఉంచి, ఆరోహణయాగ పశువును వధించు
చోటను పాపార్పితముగా దీని వధించ వలెను. ।
34 అప్పుడు యాజకుడు ఆ పాపార్పితమైన దాని రక్తము
లోనిది కొంచెము తన వేలితో తీసి, ఆరోహణయాగ
వేదిక కొమ్ముల మీద చమిరి, ఆ వేదిక అడుగున, ఆ
రక్తశేషమంతయు పోయ వలెను. । మరియు మంగళ 35
యాగపశువునుంచి క్రొవ్వు తీసిన ప్రకారము, దీని క్రొ
వ్వంతయు తీసివేయ వలెను. యాజకుడు, యెహో
వా హోమముల చొప్పున, వేదిక మీద వాటిని ధూ
పము వేయ వలెను. అతడు చేసిన పాపము నిమిత్తము
యాజకుడు అతనికి ఆచ్ఛాదనము చేయును;|| అతనికి
విమోచనము కలుగును.

## 5. అధ్యాయము.

ఒకడు ప్రమాణవాక్యము విని, తాను చూచిన 1
దాని గూర్చియైనను, తెలిసినదాని గూర్చియైనను సా
క్షియై, దాని తెలియచేయక పాపము చేసినయెడల,
అతడు తన అక్రమమును భరించును.

మరియు, ఒకడు అపవిత్ర వస్తువునైనను, అపవిత్ర 2
జంతు కళేబరమునైనను, పవిత్రపశు కళేబరమునైనను,
అపవిత్ర కీటకళేబరమునైనను ముట్టిన యెడల, అది
అతనికి తెలియకపోయినను అతడు అపవిత్రుడై అప
రాధి యగును.

మరియు, మనుష్యుడు ఏ అపవిత్రతచేత అప 3
విత్రుడగునో అది, అనగా మనుష్యుని అపవిత్రత ఒక
నికి తాకిన యెడల, అతనికి తెలియకపోయినను అది
అతనికి తెలిసిన తరువాత అపరాధి యగును.

మరియు, ఒకడు ఒట్టు బెట్టుకొని, కీడైనను మేలై 4
నను, మనుష్యులు ఒట్టు బెట్టుకొని వ్యర్థముగా పలుకు
వాటిలో మరి దేనినైనను చేసెదనని పెదవులతో
వ్యర్థముగా పలికిన యెడల, అది అతనికి తెలియక
పోయినను, అది తెలిసిన తరువాత, వాటిలో ఒకదాని
విషయము అపరాధి యగును.

కాబట్టి, ఒకడు వాటిలో ఒకదాని విషయము అప 5
రాధి యగునప్పుడు, అతడు తాను చేసిన పాపమును
ఒప్పుకొని । తనను పాపినిగా చేసిన తన పాపము నిమి 6
త్తము యెహోవాకు, తన అపరాధార్పితమును, అన
గా మందలోనుంచి గొర్రెపిల్లనైనను, ఆడు మేకపిల్ల
నైనను, పాపార్పితముగా¶ తీసుకొనిరావలెను. అప్పుడు
యాజకుడు అతనికొరకు పాపాచ్ఛాదనము చేయును.

అతనికి గొర్రెపిల్ల దొరకని యెడల, తన్ను పాపిని 7
గా చేసిన తన పాపమును బట్టి, రెండు గువ్వలనైనను
రెండు పావురపు పిల్లలనైనను, అనగా పాపార్పితము

* లేక, పాపాచ్ఛాదనార్పితము. † లేక, పాపాచ్ఛాదనమైన. ‡ లేక, పాపాచ్ఛాదనార్పితమును.
§ లేక, పాపాచ్ఛాదనము. || లేక, అతని ఆచ్ఛాదించును. ¶ లేక, పాపాచ్ఛాదనముగా.

కొరకు ఒకటియు, ఆరోహణయాగము కొరకు ఒకటి
యు యెహోవాకు అపరాధార్పితముగా తీసుకొని
8 రావలెను. । అతడు యాజకునియొద్దకు వాటిని తీసు
కొని వచ్చిన తరువాత, ఇతడు పాపార్పితమైనది మొ
దట అర్పించి, దాని మెడనుంచి దాని తల నులమ వలె
9 ను, గాని దాని ఊడదీయ కూడదు. । అతడు ఆ పాపా
ర్పిత రక్తములోనిది కొంచెము, వేదిక పక్కను ప్రో
క్షింప వలెను; దాని రక్తశేషము వేదిక అడుగున పిండ
వలెను, అది పాపార్పితము.*

10 ఆ విధి చొప్పున, రెండవదాని ఆరోహణయాగము
చేయవలెను. అతడు† చేసిన అతని పాపము నిమిత్తము,
యాజకుడు అతనికొరకు పాపాచ్ఛాదనము చేయును,
అతనికి విమోచనము కలుగును.

11 రెండు గువ్వలైనను, రెండు పావురపు పిల్లలైనను
అతనికి దొరకని యెడల, పాపార్పితముగా ఏపా‡
గోధుమ పిండిలో పదియవ వంతును తన పాపము
నకు తగిన అర్పితముగా తీసుకొని రావలెను. అది
పాపార్పితము* గనుక, దానిమీద నూనె వేయ కూడదు;
12 సాంబ్రాణి దానిమీద వేయకూడదు. । అతడు యాజ
కుని యొద్దకు దాని తెచ్చిన తరువాత, ఆ యాజకుడు
దాని జ్ఞాపకార్థముగా, దానిలోనిది పిడికెడు తీసి,
యెహోవా హోమద్రవ్యముల రీతిగా§ వేదికమీద
దాని ధూపము వేయ వలెను; అది పాపార్పితము.* ।
13 అట్లు వాటిలో దేని విషయమైనను, పాపము చేసిన
వాని కొరకు, యాజకుడు పాపాచ్ఛాదనము చేయును;
అతనికి విమోచనము కలుగును; దాని శేషము యాజకు
నికి కానుకగా నుండ వలెననెను.

14 మరియు, యెహోవా మోషేతో ఇట్లనెను; । —
15 ఒకడు వంచన చేసి, యెహోవా పరిశుద్ధమైన వాటి
విషయము, బుద్ధిహీనతవలన పాపము చేసిన యెడల,
అతడు యెహోవాకు తన అపరాధము నిమిత్తము
నీవు ఏర్పరుచు వెల చొప్పున, పరిశుద్ధ స్థలముయొక్క
షెకెలు వంటి వెండి షెకెలుల నిర్దోషమైన పొట్టే
లును మందలోనుంచి అపరాధార్పితముగా తీసుకొని
16 రా వలెను. । మరియు, అతడు పరిశుద్ధమైనదాని విష
యము తాను చేసిన పాప నష్టము ఇచ్చుకొని, దాని
తోకూడ ఐదవ వంతు ఆ యాజకునికియ్య వలెను. అట్లు
యాజకుడు అపరాధము నిమిత్తమైన పొట్టేలువలన
అతని కొరకు ఆచ్ఛాదనము చేయును; అతనికి విమో
చనము కలుగును.

ఒకడు చేయ గూడని వాటి విషయము, యెహో 17
వా ఇచ్చిన ఆజ్ఞలన్నిటిలో దేనికైనను విరోధముగా
పాపము చేసిన యెడల, అది అతనికి తెలియకపోయి
నను, అతడు అపరాధియై తన అక్రమము భరించు
ను. । కావున, అతడు, నీవు ఏర్పరచిన వెల చొప్పున, 18
మందలోనుంచి, నిర్దోషమైన పొట్టేలును, అపరాధా
ర్పితముగా యాజకుని యొద్దకు తీసుకొని రా వలెను.
అతడు తెలియకనే, బుద్ధిహీనతవలన చేసిన తప్పును
గూర్చి అతనికొరకు ఆచ్ఛాదనము చేయును; అతనికి
విమోచనము కలుగును. । అది అపరాధార్పితము; అత 19
డు యెహోవాకు విరోధముగా అపరాధము చేసినది
వాస్తవమనెను.

## 6. అధ్యాయము.

మరియు, యెహోవా మోషేతో ఇట్లనెను; । — 1
ఒకడు పాపము చేయుచు యెహోవాకు విరోధముగా 2
వంచన చేసిన యెడల, అనగా తనకు అప్పగించబడిన
దాని గూర్చియైనను, తాకట్టు ఉంచిన దానిగూర్చి
యైనను, దోచుకొనిన దాని గూర్చియైనను, తన పొరుగు
వానితో బొంకెనా, లేక తన పొరుగువాని బలాత్కా
రించెనా, పోయినది తనకు దొరికినప్పుడు, దాని గూర్చి 3
బొంకెనా, మనుష్యులు వేటిని చేయుటవలన పాపులగు
దురో వాటిలో ఒకదాని విషయము అబద్ధపు ప్రమా
ణము చేసెనా, । అతడు పాపము చేయుచు అపరాధి 4
యై యున్నాడు గనుక అతడు తాను దోచుకొనిన
దోపుడును, బలాత్కారము చేతను అపహరించుకొనిన
దాని, తనకు అప్పగించబడినదాని, పోయి తనకు దొరి
కినదాని అనగా, దేని విషయము తాను అబద్ధపు
ప్రమాణము చేసెనో, అదంతయు తిరిగి ఇచ్చుకొన
వలెను. । ఆ మూలధనమును ఇచ్చుకొని, దానితోకూడ, 5
దానిలో ఐదవ వంతు, తన అపరాధార్పణ దినమున
దాని యజమానునికి ఇయ్య వలెను. । అతడు యెహో 6
వాకు తన అపరాధము నిమిత్తము, నీవు ఏర్పరుచు వెల
చొప్పున మందలోనుంచి నిర్దోషమైన పొట్టేలును
యాజకుని యొద్దకు తీసుకొని రా వలెను. । ఆ యాజ 7
కుడు యెహోవా సన్నిధిని అతనికొరకు‖ ఆచ్ఛాద
నము చేయును; అతడు అపరాధి యగునట్లు అతడు
చేసిన అన్నిటిలో ప్రతిదాని విషయము అతనికి
విమోచనము కలుగుననెను.

మరియు యెహోవా మోషేతో ఇట్లనెను; । — 8
నీవు అహరోనును అతని కుమారులను చూచి,—ఇది 9
ఆరోహణయాగమును గూర్చిన బోధన; ఆరోహణ

* లేక, పాపాచ్ఛాదనార్పితము. † అతని పాపినిగా. ‡ ఏపా, రెండు శేరులనర కావచ్చును.
§ లేక, మీద. లేక, మీదకు. ‖ లేక అతనిమీద.

యాగమనునది, ఉదయపర్యంతము రాత్రి అంత, వేదిక
మీద దహనమగుచుండును; అందులో వేదిక అగ్ని
10 దహించుచుండును. । యాజకుడు తన సన్నపు నార
నిలువుటంగీ తొడుగుకొని, తన మానమునకు* తన
నార లాగును తొడుగుకొని, అగ్ని వేదికమీద దహిం
చిన ఆరోహణయాగ ద్రవ్యపు బూడిదె ఎత్తి, వేదిక
11 యొద్ద దాని పోసి, । తన వస్త్రములు తీసి, వేరే వస్త్రము
లను వేసుకొని, దండు వెలపటనున్న పవిత్రస్థలమునకు
ఆ బూడిదె తీసుకొని వెళ్ల వలెను.

12 వేదికమీది అగ్ని దానిలో దహించుచుండ వలెను.
అది ఆరిపో కూడదు. ప్రతి ఉదయమున యాజకుడు
దానిమీద కట్టెలను కాలవేసి, దానిమీద ఆరోహణ
యాగద్రవ్యమును పేర్చి, మంగళార్పితముల కొవ్వును
13 ధూపము వేయ వలెను. । వేదికమీద అగ్ని నిత్యము
దహించుచుండును; అది ఆరిపో కూడదు.

14 కానుకను గూర్చిన బోధన యేదనగా, అహరోను
కుమారులు యెహోవా సన్నిధిని, వేదిక యెదుట,
15 దాని అర్పించ వలెను. । అతడు కానుక నూనెనుంచియు,
దాని గోధుమలపిండినుంచియు, తన పిడికెడు పిండిని,
నూనెను, దాని సాంబ్రాణి యావత్తును దానిలోనుంచి
తీసి, దాని జ్ఞాపకార్థముగా వాటిని వేదికమీద యె
హోవాకు ఇంపైన సువాసన గల ధూపము వేయ
16 వలెను. । దానిలో మిగిలినదాని, అహరోనును అతని
కుమారులును తిన వలెను. అది పులిసి పొంగనిదై పరిశుద్ధ
స్థలములో తినబడ వలెను. వారు సంఘపు గుడారపు
17 ప్రాకారములో, దాని తిన వలెను. । దాని పొంగ బెట్టి
కాల్చ కూడదు; నా హోమ ద్రవ్యములలో వారి
పాలుగా దాని వారికిచ్చియున్నాను. పాపార్పితము
వలెను అపరాధార్పితమువలెను, అది అతిపరిశుద్ధముగా
18 నున్నది. । అహరోను సంతతిలో ప్రతివాడును దాని
తిన వలెను. అది యెహోవా హోమముల విషయ
ము, మీ తరతరములమట్టుకు, నిత్యమైన కట్టడ; వాటికి
తగిలిన ప్రతివస్తువు పరిశుద్ధముగా నుండుననెను.

19 మరియు, యెహోవా మోషేతో ఇట్లనెను: । —
20 అహరోనును అభిషేకము చేసిన దినమున, అతడును
అతని కుమారులును అర్పించ వలసిన వారి అర్పితము
ఏదనగా, ఉదయమందు సగము, సాయంకాలమున
సగము నిత్యమైన కానుకనుగా ఏపా గోధుమల పిం
21 డిలో పదియవ వంతు; । పెనము మీద నూనెతో
దాని కాల్చ వలెను. దాని కాల్చిన తరువాత, దాని
తే వలెను. కాల్చిన ఆ కానుక ముక్కలు, యెహో
వాకు ఇంపైన సువాసనగా అర్పించ వలెను. । అతని 22
కుమారులలో, అతనికి మారుగా అభిషేకము పొందిన
యాజకుడు దాని అర్పించ† వలెను; అది యెహో
వాకు నిత్యమైన కట్టడ; అదంతయు ధూపము వేయ
వలెను. । యాజకుని ప్రతి కానుక సర్వాంగ హోమ 23
మగును; దాని తిన కూడదనెను.

మరియు, యెహోవా మోషేతో ఇట్లనెను: । — 24
నీవు అహరోనును, అతని కుమారులను చూచి, పాపా 25
ర్పిత‡ విషయమైన బోధన ఏదనగా, నీవు ఆరోహణ
యాగ పశువును వధించు చోటను, పాపార్పితమైనది
యెహోవా సన్నిధిని వధించ వలెను; అది అతిపరి
శుద్ధము; । దానిని పాపాచ్ఛాదనముగా చేసిన§ యాజ 26
కుడు దాని తిన వలెను. సంఘపు గుడారము యొక్క
ప్రాకారములో పరిశుద్ధ స్థలమందు దాని తిన వలెను. ।
దాని మాంసమునకు తగులు ప్రతి వస్తువు పరిశుద్ధ 27
మగును; దాని రక్తములోనిది కొంచెమైనను వస్త్రము
మీద ప్రోక్షించిన యెడల, అది దేనిమీద ప్రోక్షించ
బడెనో అది పరిశుద్ధ స్థలములో ఉతక వలెను. । అది 28
వండిన మంటి కుండ పగలగొట్ట వలెను; అది రాగి
బిందెలో వండిన యెడల, దాని తోమి నీళ్లతో తొ
లవ వలెను. । యాజకులలో ప్రతి మగవాడు దాని తిన 29
వలెను; అది అతిపరిశుద్ధము. । అయినను ఏ పాపా 30
చ్ఛాదనార్పిత రక్తములోనిది కొంచెము అతిపరిశుద్ధ
స్థలములో ఆచ్ఛాదనము చేయుటకు, సంఘపు గుడా
రములోకి తేబడునో, అది తిన గూడదు; అది అగ్ని
లో కాల్చ వలెను.

## 7. అధ్యాయము.

అపరాధార్పిత|| విషయమైన బోధన ఏదనగా, 1
అది అతి పరిశుద్ధము. । వారు ఆరోహణయాగ పశు 2
వును వధించు చోటున అపరాధార్పితమును వధించ
వలెను; వేదికమీద, చుట్టు దాని రక్తము ప్రోక్షించ
వలెను. । దానిలోనుంచి దాని కొవ్వంతయు, అనగా 3
దాని తోకను, దాని ఆంత్రములను కప్పు కొవ్వును, ।
రెండు మూత్రగ్రంథులను, డొక్కలయొద్ద, వాటి 4
మీదనున్న కొవ్వును, మూత్రగ్రంథులయొద్ద కాలే
జము మీది వపను తీసి, అదంతయు అర్పించ వలెను. ।
యాజకుడు యెహోవాకు హోమముగా వేదికమీద 5
వాటిని ధూపము వేయ వలెను. అది అపరాధార్పి
తము;¶ యాజకులలో ప్రతి మగవాడు దాని తిన వలె
ను; । పరిశుద్ధ స్థలములో దాని తిన వలెను; అది అతి 6

* హెబ్రీలో, మాంసమునకు. † హెబ్రీలో, చేయ. ‡ లేక, పాపాచ్ఛాదనార్పిత.
§ లేక, పాపార్పితముగా అర్పించిన. || లేక, అపరాధాచ్ఛాదనార్పిత. ¶ లేక, అపరాధాచ్ఛాదనార్పితము.

7 పరిశుద్ధము. । పాపార్పితము ఎట్టిదో అపరాధార్పితము
అట్టిదే; వాటిని గూర్చిన బోధన ఒక్కటే; అది దాని
8 వలన ఆచ్ఛాదనము చేయు యాజకునిదగును. । మరి
యు, ఏ యాజకుడు ఒకని ఆరోహణయాగము చేసె
నో,* ఆయాజకుడు అర్పించిన ఆరోహణయాగ పశు
9 చర్మము అతనిదగును; అది అతనిదే. । పొయిమీద
కాల్చిన ప్రతి కానుకయు బొరుసులోనైనను, పెనము
మీదనైనను వండినది యావత్తును దాని అర్పించిన
యాజకునిదగును; అది అతనిదే అయినను అది నూనె
10 కలిసినదైనను, । అది పొడిదైనను, మీ కానుకలన్నియు
అహరోను కుమారులందరికి సమముగానుండ వలెను.
11 యెహోవాకు అర్పించ వలసిన మంగళార్పణ
12 యాగవిషయమైన బోధన ఏదనగా, । ఒకడు కృతజ్ఞ
తార్పణముగా దాని అర్పించిన యెడల, కృతజ్ఞతార్పణ
యాగమే గాక, నూనెతో కలిసి పొంగని పిండివంట
లను, నూనె పూసిన పొంగని పలచని అప్పడములను,
నూనె కలిపి కాల్చిన గోధుమపిండివంటలను అర్పించ
13 వలెను. । ఆ పిండివంటలే గాక, తన మంగళార్పణ నిమి
త్తమైన కృతజ్ఞతాయాగద్రవ్యముతోకూడ, పొంగిన
14 రొట్టెను తన అర్పితముగా అర్పించ వలెను. । మరియు,
ఆ అర్పితములలో, ప్రతిదానిలోనుంచి ఒకటి, యె
హోవాకు పైకెత్తిన అర్పితముగా అర్పించ వలెను; అది,
మంగళార్పణ రక్తము ప్రోక్షించిన యాజకునిదగును;
15 అది అతనిదే. । మంగళార్పణ నిమిత్తమైన, అతని కృత
జ్ఞతాయాగ మాంసమును అర్పించుదినమే దాని తిన వలె
ను; మరునాటికి దానిలోనిది ఏదియు ఉంచుకొనకూ
16 డదు. । అయితే అతని అర్పణయాగము మ్రొక్కుబడి
అర్పితమైనను, స్వేచ్ఛార్పితమైనను అయ్యుంటే, అతడు
17 తన యాగము చేయు దినమే దాని తిన వలెను; । మిగి
లినది మరునాడు తిన వచ్చునుగాని మూడవ దినమున
ఆ యాగమాంసములో మిగిలినదాని అగ్నిలో కాల్చి
18 వేయ వలెను. । ఒకని మంగళార్పణయాగ మాంసము
లోనిది కొంచెమైనను మూడవ దినమున తినిన యెడల,
అది అంగీకరించబడదు, అది అర్పించినవానికి యెంచ
బడదు; అది హేయము; దానిలోనిది తినువాడు తన
19 అక్రమము భరించును. । అపవిత్రమైన దేనికైనను తగి
లిన మాంసము తిన కూడదు; అగ్నివలన దాని కాల్చ
వలెను. మాంసమైతే పవిత్రులందరు దాని తిన వచ్చు
20 ను, । గాని ఒకడు తనకు అపవిత్రత కలిగియుండగా,
యెహోవా నిమిత్తమైన మంగళార్పణయాగ మాంస
ములోనిది కొంచెమైనను తినిన యెడల, అతని తన

ప్రజలలోనుంచి ఛేదించ వలెను. । మరియు ఎవడు 21
మనుష్యుల అపవిత్రతనైనను, అపవిత్రమైన జంతువు
నైనను, అపవిత్రమైన పురుగునైనను, అపవిత్రమైన
హేయ కీటకమునైనను ముట్టి, యెహోవా నిమిత్త
మైన మంగళార్పణయాగ మాంసము తినునో, అత
నిని అతని ప్రజలలోనుంచి ఛేదించ వలెనని చెప్పుమ
నెను. । మరియు యెహోవా మోషేతో ఇట్లనెను. । 22
— నీవు ఇశ్రాయేలు పుత్రులను చూచి—మీరు ఎద్దు 23
దైనను గొర్రెదైనను । మేకదైనను దేని కొవ్వును తిన 24
కూడదు. చచ్చిన కళేబరపు కొవ్వును, చీల్చిన దాని
కొవ్వును, ఏ పనికైనను వినియోగపరచ వచ్చును గాని
దాని తిననే తిన కూడదు; । ఎందుకనగా, మనుష్యులు 25
యెహోవాకు హోమముగా అర్పించు జంతువుల
లో దేని కొవ్వునైనను తినిన వాని తన ప్రజలలో
నుంచి ఛేదించ వలెను. । మరియు పక్షిదైతేనేమి జం 26
తువుదైతేనేమి ఏ రక్తమును మీ నివాస స్థలములన్ని
టిలో తిన కూడదు. । ఎవడు దేని రక్తము తినునో, 27
అతడు తన ప్రజలలోనుంచి ఛేదించబడ వలెనని చెప్పు
మనెను.

మరియు యెహోవా మోషేతో ఇట్లనెను:— 28,29
మీరు ఇశ్రాయేలు పుత్రులను చూచి — ఎవడు యె
హోవాకు తన మంగళార్పణయాగము చేయునో
వాడు తన మంగళార్పణయాగ పశువులలోనుంచి తన
అర్పితమును యెహోవా సన్నిధికి తీసుకొని రా వలె
ను. । యెహోవా హోమద్రవ్యమనగా, దాని బో 30
రను, యెహోవా సన్నిధిని అల్లాడించబడు నర్పితము
గా అల్లాడించుటకు బోరతోకూడ దాని కొవ్వును
అతని చేతులే తే వలెను. । యాజకుడు వేదికమీద ఆ 31
కొవ్వును ధూపము వేయ వలెను గాని, బోర అహ
రోనుకును అతని కుమారులకును కలిగినదగును. । మీ 32
మంగళార్పణయాగ పశువులలోనుంచి, పైకెత్తిన అర్పి
తముగా యాజకునికి కుడిజబ్బను ఇయ్య వలెను. ।
అహరోను కుమారులలో ఎవడు మంగళార్పణ రక్త 33
మును కొవ్వును అర్పించునో వాని వంతుగా కుడిజబ్బ
వానిదగును. । ఎందుకనగా ఇశ్రాయేలు పుత్రుల యొ 34
ద్దనుంచి వారి మంగళార్పణయాగ పశువులలోనుంచి
అల్లాడించిన బోరను, పైకెత్తిన జబ్బను తీసుకొని నిత్య
మైన కట్టడవలన యాజకుడగు అహరోనుకును అతని
కుమారులకును ఇచ్చియున్నానని చెప్పుమనెను. । వారు 35
యెహోవాకు యాజకులగునట్లు ఆయన వారిని చేర
దీసిన దినమందు, యెహోవా హోమద్రవ్యముల

* హెబ్రీలో, అర్పించెనో.

లోనుంచి ఇది అహరోను అభిషేక కర్మమును, అతని
36 కుమారుల అభిషేక కర్మమును అగును. । వీటిని ఇశ్రా
యేలు పుత్రులు వారికి ఇయ్య వలెనని, యెహోవా
వారిని అభిషేకించిన దినమందు, ఆయన వారి తరతర
37,38 ములమట్టుకు నిత్యమైన కట్టడగా ఆజ్ఞాపించెను. । ఇది
ఆరోహణయాగమును గూర్చియు, కానుకను గూర్చి
యు, పాపార్పితమును* గూర్చియు, అపరాధార్పిత
మును గూర్చియు, నియోగార్పితములను గూర్చియు,
మంగళార్పణ యాగపశువులను గూర్చియునైన బోధన.
ఇశ్రాయేలు పుత్రులు సీనాయి అరణ్యములో
యెహోవాకు తమ అర్పితములను అర్పించ వలెనని
ఆయన ఆజ్ఞాపించిన దినమందు, అట్లే యెహోవా
సీనాయి కొండమీద మోషేకు ఆజ్ఞాపించెను.

## 8. అధ్యాయము.

1,2 యెహోవా మోషేతో ఇట్లనెను:—నీవు అహ
రోనును అతని కుమారులను, వారి వస్త్రములను, అభి
షేక తైలమును, పాపార్పితము కొరకు కోడెను, రెండు
పొట్టేళ్లను, పొంగని భక్ష్యముల గంపను తీసుకొని, ।
3 సంఘపు గుడారపు ద్వారము నొద్దకు సర్వసంఘము
4 కూర్చుమనెను. । మోషే తనకు యెహోవా ఆజ్ఞాపిం
చినట్లు చేసెను; సంఘము సంఘపు గుడారపు ద్వార
5 ము నొద్ద కూర్చబడెను. । అప్పుడు మోషే సంఘమును
చూచి—చేయవలెనని యెహోవా ఆజ్ఞాపించిన మాట
6 యిది అని చెప్పెను. । అప్పుడు మోషే అహరోనును
అతని కుమారులను దగ్గిరకు తీసుకొని వచ్చి నీళ్లతో
7 స్నానము చేయించెను. । తరువాత అతడు అతనికి చొ
క్కాయి తొడిగించి, అతనికి దట్టి కట్టి, నిలువుటంగి
తొడిగించి, వానిమీద ఏఫోదును తొడిగి, ఏఫోదు
విచిత్రమైన నడికట్టును అతనికి కట్టి, దానివలన అతనికి
8 ఏఫోదు కట్టి, అతనికి పతకమువేసి, । ఆ పతకములో
9 ఊరీమ్ తుమ్మీమను వాటిని స్థాపించి, । అతని తలమీద
పాగా పెట్టి, ఆ పాగా యెదుటను అతని నొసటను
పరిశుద్ధ కిరీటమైన బంగారు రేకును పెట్టెను. అట్లు
యెహోవా మోషేకు ఆజ్ఞాపించెను.

10 మరియు మోషే అభిషేకతైలము తీసుకొని, ఆల
యమును, దానిలోనున్న సమస్తమును అభిషేకించి,
11 వాటిని పరిశుద్ధపరిచెను. । అతడు దానిలోనిది కొంచె
ము ఏడుమారులు యజ్ఞవేదికమీద ప్రోక్షించి, యజ్ఞ
వేదికను, దాని ఉపకరణములన్నిటిని, పళ్లెమును, దాని
కాలును పరిశుద్ధపరుచుటకు, వాటిని అభిషేకించెను. ।
మరియు, అతడు అభిషేక తైలములోనిది కొంచెము 12
అహరోను తలమీద పోసి, అతని పరిశుద్ధపరుచుటకు
అతని అభిషేకించెను.

అప్పుడు అతడు అహరోను కుమారులను దగ్గరకు 13
తీసుకొని వచ్చి, వారికి చొక్కాయిలు తొడిగి, వారికి
దట్టీలు కట్టి, వారికి కుళ్లాయిలను పెట్టెను. అట్లు యె
హోవా మోషేకు ఆజ్ఞాపించెను.

అప్పుడు అతడు పాపాచ్ఛాదనమైన† కోడెను 14
తోలుకొని వచ్చెను. అహరోను, అతని కుమారులు,
పాపాచ్ఛాదనమైన ఆ కోడె తలమీద చేతులనుంచిరి. ।
అతడు దాని వధించిన తరువాత, మోషే దాని రక్తము 15
తీసి, యజ్ఞవేదిక కొమ్ములకు చుట్టు వేలితో దాని చమిరి,
వేదికను శుభ్రముచేసి, దాని నిమిత్తము ఆచ్ఛాదనము
చేయుటకు, వేదిక అడుగున రక్తము పోసి దాని పరి
శుద్ధపరిచెను. । మరియు అతడు ఆంత్రముల మీదనున్న 16
కొవ్వంతయు, కాలేజము మీది వపను, రెండు మూత్ర
గ్రంథులను, వాటి కొవ్వును తీసెను. అప్పుడు మోషే
యజ్ఞవేదికమీద వాటిని ధూపము వేసెను. । ఆ కోడె, 17
దాని చర్మము, దాని మాంసము, దాని పేడ, పాళెమునకు
అవతల, అగ్నిచేత కాల్చెను. । తరువాత అతడు ఆరో 18
హణయాగ నిమిత్తము పొట్టేలును దగ్గరకు తెచ్చెను.
అహరోను అతని కుమారులు, ఆ పొట్టేలు తలమీద
తమ చేతులనుంచిరి. । అప్పుడు అతడు దాని వధించెను. 19
మోషే యజ్ఞవేదికకు చుట్టు దాని రక్తము ప్రోక్షించె
ను. । అప్పుడు అతడు ఆ పొట్టేలును అవయవములగా 20
కోసెను. మోషే దాని తలను, అవయవములను, కొ
వ్వును ధూపము వేసెను. । అతడు దాని ఆంత్రములను, 21
కాళ్లను, నీళ్లతో కడిగెను. మోషే ఆ పొట్టేలంతయు,
యజ్ఞవేదికమీద ధూపము వేసెను. యెహోవా మో
షేకు ఆజ్ఞాపించినట్లు, అది యింపైన సువాసన గల
ఆరోహణయాగము; అది యెహోవా హోమము.

అప్పుడు అతడు రెండవ పొట్టేలనగా, నియోజక 22
మైన‡ పొట్టేలును దగ్గరకు తెచ్చెను. అహరోను, అతని
కుమారులు, ఆ పొట్టేలు తలమీద తమ చేతులనుంచిరి. ।
అతడు దాని వధించెను. మోషే దాని రక్తములోనిది 23
కొంచెము తీసి, అహరోను కుడిచెవి కొనమీదను,
అతని కుడిచేతి బొట్టనవేలిమీదను, అతని కుడికాలి
బొట్టనవేలి కొనమీదను, దాని చమిరెను. । అప్పుడు 24
అతడు అహరోను కుమారులను దగ్గరకు తీసుకొనెను.
అప్పుడు మోషే వారి కుడిచెవుల కొనలమీదను, వారి
కుడిచేతుల బొట్టన వేళ్లమీదను, ఆ రక్తములోనిది కొం

* లేక, పాపాచ్ఛాదనార్పితమును. † లేక, పాపార్పితమైన. ‡ లేక, చేతులను నింపించు.

చెము చమిరెను. మరియు మోషే యజ్ఞవేదికకు చుట్టు,
25 రక్తము ప్రోక్షించెను. । అప్పుడు అతడు దాని క్రొవ్వు,
తోక, ఆంత్రములమీది క్రొవ్వంతయు, కాలేజముమీది
వప, రెండు మూత్రగ్రంథులు, వాటి క్రొవ్వు, కుడి
26 జబ్బ తీసి, । యెహోవా సన్నిధిలోనున్న పొంగని
భక్ష్యముల గంపలోనుంచి పొంగని ఒక పిండివంట,
నూనె పిండివంటయైన ఒక రొట్టె, ఒక పలచని అప్ప
డము తీసి, ఆ క్రొవ్వుమీదను ఆ కుడి జబ్బమీదను
27 వాటిని ఉంచి, । అహరోను చేతులమీదను, అతని
కుమారుల చేతులమీదను వాటినన్నిటిని ఉంచి అల్లా
డించబడునర్పితముగా యెహోవా సన్నిధిని వా
28 టిని అల్లాడించెను. । అప్పుడు మోషే వారిచేతుల
మీదనుంచి వాటిని తీసి, యజ్ఞవేదిక మీదనున్న
ఆరోహణ యాగద్రవ్యముమీద వాటిని ధూపము
వేసెను. అవి యింపైన సువాసనగల నియోజకమై
29 నవి; అది యెహోవా హోమము. । మరియు, మోషే
దాని బోరను తీసి, అల్లాడించబడు నర్పితముగా
యెహోవా సన్నిధిని, దాని అల్లాడించెను. నియో
జకమైన పొట్టేలులో అది మోషే వంతు. అట్లు
యెహోవా మోషేకు ఆజ్ఞాపించెను.

30 మరియు మోషే అభిషేక తైలములోనిది కొంచె
ము, యజ్ఞవేదికమీది రక్తములోనిది కొంచెము తీసి,
అహరోను మీదను, అతని వస్త్రముల మీదను, అతని
కుమారుల మీదను, అతనితో కూడ అతని కుమారుల
వస్త్రముల మీదను దాని ప్రోక్షించి, అహరోనును,
అతని వస్త్రములను అతని కుమారులను, అతనితోకూడ
అతని కుమారుల వస్త్రములను పరిశుద్ధపరిచెను.

31 అప్పుడు మోషే అహరోనును అతని కుమారులను
చూచి ఇట్లనెను:—సంఘపు గుడారముయొక్క ద్వార
మున ఆ మాంసము వండి—అహరోను అతని కుమారు
లు దీని తినవలెనని నేను ఆజ్ఞాపించబడినట్లు, అక్క
డనే దానిని, నియోజకద్రవ్యములు గల గంపలోని
32 భక్ష్యమును* తిన వలెను. । ఆ మాంసములోనిదైనను
రొట్టెలోనిదైనను మిగిలినది అగ్నిచేత కాల్చ వలెను.
33 మీ నియోజన దినములు తీరు దినముల పర్యంతము,
ఏడు దినములు, సంఘపు గుడారముయొక్క ద్వారము
నొద్దనుంచి బైలువెళ్ల కూడదు. ఏడు దినములు ఆయన
34 మిమ్ము నియోగించుచుండును.† । మీకొరకు పాపాచ్ఛా
దనము చేయుటకు, యెహోవా నేడు చేసినట్లు చేయ
వలెనని ఆజ్ఞాపించెను.

35 మీరు సంఘపు గుడారముయొక్క ద్వారమున
ఏడు దినములమట్టుకు రేయిం బగల్లు ఉండి, మీరు
చావకుండునట్లు, యెహోవా విధించిన విధి చేకొన
వలెను; అట్లు నేను ఆజ్ఞాపించబడితి ననెను.

అట్లు అహరోను అతని కుమారులు, యెహోవా 36
మోషే ద్వారా ఆజ్ఞాపించినవన్నియు చేసిరి.

## 9. అధ్యాయము.

ఎనిమిదవ దినమున, మోషే అహరోనును అతని 1
కుమారులను, ఇశ్రాయేలు పెద్దలను పిలిపించి, । అహ 2
రోనును చూచి—నీవు పాపాచ్ఛాదనము‡ కొరకు నిర్దో
షమైన ఒక కోడెదూడను, ఆరోహణ యాగముకొరకు
నిర్దోషమైన ఒక పొట్టేలును, యెహోవా సన్నిధికి
తీసుకొని రమ్ము. । మరియు నీవు ఇశ్రాయేలు పుత్రులను 3
చూచి — మీరు యెహోవా సన్నిధిలో యాగము
చేయునట్లు, పాపాచ్ఛాదనము‡ కొరకు నిర్దోషమైన
మేకపిల్లను, ఆరోహణ యాగముకొరకు నిర్దోషమైన
ఏడాది దూడను, గొఱ్ఱెపిల్లను, । మంగళార్పణములకొ 4
రకు కోడెను, పొట్టేలును, నూనె కలిసిన కానుకను
తీసుకొని రండి; నేడు యెహోవా మీకు కనబడును
సుమీ, అని చెప్పుమనెను.

మోషే ఆజ్ఞాపించినవాటిని వారు సంఘపు గుడా 5
రము ఎదుటికి తీసుకొని వచ్చిరి. అప్పుడు సంఘ
మంతయు దగ్గరకు వచ్చి యెహోవా సన్నిధిని నిలి
చెను. । అప్పుడు మోషే—ఇది యెహోవా ఆజ్ఞాపిం 6
చిన మాట; అట్లు చేయుడి; అప్పుడు యెహోవా
మహిమ మీకు కనబడునని చెప్పెను. । అప్పుడు మోషే 7
అహరోనును చూచి — నీవు యజ్ఞవేదికయొద్దకు వెళ్లి,
నీ పాపాచ్ఛాదన యాగము, నీ ఆరోహణ యాగము
చేసి, నీకొరకు ప్రజలకొరకు ఆచ్ఛాదనము చేసి,
ప్రజలకొరకు అర్పణము చేసి, యెహోవా ఆజ్ఞా
పించినట్లు వారికొరకు ఆచ్ఛాదనము చేయుమని
చెప్పెను.

కాబట్టి అహరోను యజ్ఞవేదిక దగ్గరకు వెళ్లి, తన 8
పాపాచ్ఛాదనార్పితమైన దూడను వధించెను. । అహ 9
రోను కుమారులు దాని రక్తము అతని యొద్దకు తెచ్చిరి.
అప్పుడు అతడు ఆ రక్తములో తన వేలు ముంచి యజ్ఞ
వేదిక కొమ్ముల మీద దాని చమిరి, యజ్ఞవేదిక అడు
గున రక్తము పోసెను. । అయితే పాపాచ్ఛాదనార్పిత 10
మైన దాని క్రొవ్వును, మూత్రగ్రంథులను, కాలేజము
మీది వపను యజ్ఞవేదికమీద ధూపము వేసెను; అట్లు
యెహోవా మోషేకు ఆజ్ఞాపించెను. । దాని మాంస 11
ము, చర్మము, పాలెము వెలపట అగ్ని చేత కాల్చివేసెను.।

* లేక, రొట్టె. † లేక, మీచేతులు నిండించుచుండెను. ‡ లేక, పాపార్పితము.

12 అప్పుడు అతడు ఆరోహణ యాగపశువును వధించెను.
అహరోను కుమారులు అతనికి దాని రక్తము అప్పగిం
చిరి; అతడు యజ్ఞవేదికకు చుట్టు దాని ప్రోక్షించెను.।
13 మరియు వారు ఆరోహణ యాగపశువును, దాని తలను,
దాని అవయవముల చొప్పున అతనికి అప్పగించిరి;
అతడు యజ్ఞవేదిక మీద వాటిని ధూపము వేసెను.।
14 అతడు దాని ఆంత్రములు, కాళ్లు కడిగి, యజ్ఞవేదిక
మీద నున్న ఆరోహణ యాగద్రవ్యముమీద ధూప
ము వేసెను.

15 అప్పుడు అతడు ప్రజల అర్పితమును దగ్గరకు తీసు
కొని వచ్చి, ప్రజలకొరకు పాపార్పితమైన మేకను తీసు
కొని, వధించి, మొదటిదాని వలె పాపార్పితముగా *
16 అర్పించెను.। అప్పుడు అతడు ఆరోహణ యాగపశు
17 వును తీసుకొని విధిచొప్పున దాని చేసెను.। అప్పుడు
అతడు కానుకను దగ్గరకు తెచ్చి, దానిలోనుంచి పిడి
కెడు తీసి, ప్రాతఃకాలమందు చేసిన ఆరోహణయా
గము గాక, యజ్ఞవేదిక మీద దాని ధూపము వేసెను.।
18 మరియు అతడు ప్రజలకొరకైన మంగళయాగముగా,
కోడెదూడను పొట్టేలును వధించెను; అహరోను కుమా
రులు దాని రక్తము అతనికి అప్పగించిరి; అతడు యజ్ఞ
19 వేదికకు చుట్టు, దాని ప్రోక్షించెను.। మరియు వారు
ఆ దూడ క్రొవ్వు, మేక క్రొవ్వు, క్రొవ్విన తోక, ఆం
త్రములు కప్పు క్రొవ్వు, మూత్రగ్రంథులు, కాలేజము
20 మీది వప అప్పగించిరి.। వారు బోరలమీద క్రొవ్వు
నుంచిరి; అతడు యజ్ఞవేదికమీద క్రొవ్వు ధూపము
21 వేసెను.। అహరోను, బోరలు, కుడిజబ్బ, యెహోవా
సన్నిధిలో అల్లాడించు కానుకగా అల్లాడించెను. అట్లు
యెహోవా మోషేకు ఆజ్ఞాపించెను.

22 అప్పుడు అహరోను ప్రజలవైపు తన చేతులెత్తి,
వారిని దీవించి, పాపాచ్ఛాదన† యాగము, ఆరోహణ
యాగము, మంగళార్పణ యాగము చేసిన తరువాత
23 దిగి వచ్చెను.। అప్పుడు మోషే అహరోనులు, సంఘపు
గుడారములోకి వెళ్లి, వెలపటికి వచ్చి ప్రజలను దీవిం
చిరి. అప్పుడు యెహోవా మహిమ ప్రజలకందరికి
కనబడెను.

24 అప్పుడు యెహోవా సన్నిధినుంచి అగ్ని బైలు
దేరి యజ్ఞవేదిక మీదనున్న ఆరోహణ యాగద్రవ్యము,
క్రొవ్వును కాల్చివేసెను. ప్రజలందరు దాని చూచి,
ఉత్సాహ ధ్వనిచేసి సాగిలపడిరి.

## 10. అధ్యాయము.

1 అహరోను కుమారులైన నాదాబు అబీహు తన తన
ధూపార్తి పట్టుకొని, దానిలో నిప్పులువేసి, వాటిమీద
ధూపద్రవ్యము వేసి, యెహోవా వారికి ఆజ్ఞాపించక
పోయిన నిర్వైదికాగ్ని‡ ఆయన సన్నిధికి తెచ్చిరి.।
అప్పుడు యెహోవా సన్నిధినుంచి అగ్ని బైలుదేరి 2
వచ్చి వారిని కాల్చెను. వారు యెహోవా సన్నిధి
లో మృతి పొందిరి.। అప్పుడు మోషే అహరోనును 3
చూచి—నా దగ్గరనుండువారిలో పరిశుద్ధపరుచుకొం
దును; ప్రజలందరి యెదుట మహిమపరుచుకొందునని
యెహోవా చెప్పిన మాట యిది అని అహరోనుతో
చెప్పెను. అహరోను మౌనముగా నుండెను.। అప్ప 4
డు మోషే అహరోను పినతండ్రియైన ఉజ్జీయేలు
కుమారులగు మీషాయేలును ఎల్సాపానును పిలిపించి—
మీరు దగ్గరకు వచ్చి, పరిశుద్ధ స్థలము ఎదుటనుంచి
పాళెము వెలపటికి, మీ సహోదరులను మోసుకొని
వెళ్లుడని వారితో చెప్పెను.। మోషే చెప్పినట్లు, వారు 5
దగ్గరకు వచ్చి, చొక్కాయిలు గలవారినిగా పాళెము
వెలపటికి వారిని మోసుకొని వెళ్లిరి.

అప్పుడు మోషే అహరోనును, అతని కుమారులైన 6
ఎల్యాజారు ఈతామారను వారిని చూచి ఇట్లనెను:—
మీరు చావకుండునట్లు, ఆయన ఈ సంఘమంతటి
మీద ఆగ్రహపడకుండునట్లు, మీరు తల విరియబో
సుకొన వద్దు; బట్టలు చించుకొన వద్దు. అయినను,
మీ సహోదరులైన ఇశ్రాయేలు ఇంటివారందరు,
యెహోవా కాల్చిన కాలుపునుగూర్చి ఏడవవచ్చును;।
యెహోవా అభిషేకతైలము మీ మీద నున్నది గనుక, 7
మీరు చావకుండునట్లు, మీరు సంఘపు గుడారము
యొక్క ద్వారములోనుంచి బైలువెళ్ల కూడదనెను.
వారు మోషే చెప్పిన మాట చొప్పున చేసిరి.

మరియు యెహోవా అహరోనుతో ఇట్లనెను:— 8,9
మీరు సంఘపు గుడారములోకి వచ్చునప్పుడు, మీరు
చావకుండునట్లు, నీవు నీతోకూడ నీ కుమారులు
ద్రాక్షారసమునైనను మద్యమునైనను త్రాగకూడదు.।
మీరు పరిశుద్ధమైనదానికిని సాధారణమైనదానికిని, 10
అపవిత్రమైనదానికిని పవిత్రమైనదానికిని వేరు చేయు
నట్లును,। యెహోవా మోషేచేత ఇశ్రాయేలు పుత్రు 11
లతో పలికించిన సమస్త విధులను మీరు వారికి బోధిం
చునట్లును, ఇది మీ తరతరముల నిమిత్తము నిత్యమైన
కట్టడ యనెను.

అప్పుడు మోషే అహరోనును, మిగిలిన అతని 12
కుమారులైన ఎల్యాజారును ఈతామారును చూచి ఇట్ల
నెను:—మీరు యెహోవా హోమద్రవ్యములలో
మిగిలిన కానుకను తీసుకొని, అది పులియకుండ,
యజ్ఞవేదిక దగ్గర దాని తినుడి; అది అతిపరిశుద్ధము;

* లేక, పాపాచ్ఛాదనముగా. † లేక, పాపార్పణ. ‡ లేక, అన్యమైన.

యెహోవా హోమద్రవ్యములలోనుంచి అది నీకు,
13 నీ కుమారులకు నియమించబడిన వంతు । గనుక, మీరు
పరిశుద్ధస్థలములో దాని తినవలెను; అట్లు నేను అజ్ఞా
14 పించబడితిని. । మరియు, అల్లాడించు బోరను, పైకెత్తు
జబ్బను మీరు, అనగా నీవు నీతోకూడ నీ కుమా
రులు నీ కుమార్తెలు, పవిత్రస్థలములో తిన వలెను;
ఎందుకనగా అవి ఇశ్రాయేలు మంగళయాగములలో
నుంచి, నీకు నీ కుమారులకు నియమించబడిన వంతు
15 లు. । హోమద్రవ్యమైన కొవ్వును గాక, యెహో
వా సన్నిధిలో అల్లాడించు కానుకగా అల్లాడించు
నట్లు, పైకెత్తు జబ్బను, అల్లాడించు బోరను తీసుకొని
రావలెను. నిత్యమైన కట్టడ వలన, అది నీకు నీతో
కూడ నీ కుమారులకునుండ వలెను; అట్లు యెహో
వా ఆజ్ఞాపించె ననెను.

16 అప్పుడు మోషే పాపాచ్ఛాదనమైన* మేకను
జాగ్రత్తగా వెతికెను. అదుగో! అది కాల్చివేయబడె
ను. అతడు అహరోను మిగిలిన కుమారులగు ఎల్యా
17 జారు ఈతామారను వారి మీద ఆగ్రహపడి।—మీరు
పరిశుద్ధస్థలములో ఆ పాపార్పితము ఏల తినలేదు? అది
అతిపరిశుద్ధము గదా; సంఘముయొక్క అక్రమము
భరించుటకు, యెహోవా సన్నిధిలో వారికొరకు
ఆచ్ఛాదనము చేయుటకు ఆయన దాని మీకిచ్చెను. ।
18 ఇదుగో! దాని రక్తము అతిపరిశుద్ధ స్థలములోకి తేబడ
లేదు గదా; నేను ఆజ్ఞాపించినట్లు, నిశ్చయముగా పరి
19 శుద్ధ స్థలములో దాని తిన వలెనని చెప్పెను. । అందుకు
అహరోను — ఇదిగో! నేడు వారు తమ పాపాచ్ఛాద
నార్పితము, తమ ఆరోహణ యాగద్రవ్యము యెహో
వా సన్నిధికి తెచ్చిరి†. అట్టివి నాకు సంభవించినప్పు
డు, నేను పాపాచ్ఛాదనమైన దాని నేడు తినిన యె
డల, అది యెహోవా దృష్టికి మంచిదగునా? అని
20 పలికెను. । మోషే ఆ మాట విని అంగీకరించెను.

## 11. అధ్యాయము.

1 అప్పుడు యెహోవా మోషేతోను అహరోను
2 తోను ఇట్లనెను: — మీరు ఇశ్రాయేలు పుత్రులతో
చెప్ప వలసినదేమనగా,-భూమి మీదనున్న జంతువులన్ని
టిలో, మీరు ఈ జీవులను మాత్రము తిన వచ్చును. ।
3 జంతువులలో ఏది విడిగా చీలిన డెక్కలు కలిగినదై,
4 నెమరు వేయునో దాని తిన వచ్చును గాని,। నెమరు
వేయు వాటిలోను చీలిన డెక్కలు గల వాటిలోను
వీటిని తిన కూడదు; ఒంటె నెమరు వేయును గాని
దానికి చీలిన డెక్కలు లేవు గనుక, అది మీకు అప
విత్రము. । పొపానసునది నెమరు వేయునుగాని దానికి 5
చీలిన డెక్కలు లేవు గనుక అది మీకు అపవిత్రము. ।
కుందేలు నెమరు వేయును గాని దానికి చీలిన 6
డెక్కలు లేవు గనుక అది మీకు అపవిత్రము. । పంది 7
విడిగా చీలిన డెక్కలు గలది గాని, అది నెమరు
వేయదు గనుక అది మీకు అపవిత్రము. । వాటి మాం 8
సము మీరు తిన కూడదు; అవి మీకు అపవిత్రములు.

జల జంతువులన్నిటిలో వీటిని తిన వచ్చును; సము 9
ద్రములోనైనను నదులలోనైనను ఏ నీళ్లలోనైనను
వేటికి రెక్కలు పొలుసులు కలవో వాటిని తిన
వచ్చును. । సముద్రములలోనేమి నదులలోనేమి సమస్త 10
జలచరములలోను సమస్త జలజంతువులలోను వేటికి
రెక్కలు పొలుసులు ఉండవో, అవి అన్నియు మీకు
హేయములుగా నుండును; । అవును, అవి మీకు 11
హేయముగా నుండవలెను; వాటి మాంసము తిన కూ
డదు; వాటి మృతకళేబరములు హేయములని యెంచు
కొన వలెను; । నీళ్లలో దేనికి రెక్కలు పొలుసులు 12
ఉండవో అది మీకు హేయము.

పక్షులలో వీటిని హేయమని యెంచుకొన వలెను; 13
వీటిని తిన కూడదు; ఇవి హేయములు; గరుడ, బైరవి,
ఉత్క్రోశము,। రాబందు, ప్రతి విధమైన గద్ద,। ప్రతి 14,15
విధమైన కాకి,। ఉష్ట్రపక్షి, గుడ్లగూబ, సముద్రపు కాకి, 16
ప్రతి విధమైన డేగ,। పైడికంటి, పెద్దకొంగ, ములుగు 17
పిట్ట,। హంస, గూడకొంగ, తెల్లబందు,। వాత్సల్య 18,19
బకము, ప్రతి విధమైన చిలుక, కొండకోడి, గబ్బిలము.

రెక్కలు కలిగి నాలుగు కాళ్లతో చరించు చరము 20
లన్నియు మీకు హేయములు, । అయితే నాలుగు 21
కాళ్లతో చరించుచు, నేల గెంతుటకు కాళ్లమీద తొ
డలు గల పక్షిరాశులన్నిటిలో కొన్నిటిని తిన వచ్చు
ను. । మీరు తిన వచ్చునవి యేవేవనగా, ప్రతివిధమైన 22
అర్బె, ప్రతివిధమైన సాల్యామ్, ప్రతివిధమైన హర్గొల్
ప్రతి విధమైన హగాబ్ ‡అనునవి. । నాలుగు కాళ్లుగల 23
ఇతర పక్షిరాశులన్నియు మీకు హేయములు; । వాటి 24
వలన మీరు అపవిత్రులవుదురు; వాటి మృతకళేబర
ములు ముట్టిన ప్రతివాడు సాయంకాల పర్యంతము అప
విత్రుడగును. । వాటి మృతకళేబరములలోనిది కొంచె 25
మైనను మోసిన ప్రతివాడు తన బట్టలు ఉతుకుకొని,
సాయంకాల పర్యంతము అపవిత్రుడగును.

చీలిన డెక్కలు గల జంతువులన్నిటిలో, విడిగా 26
చీలిన డెక్కలు లేకనైనను నెమరు వేయకనైనను ఉం
డునవి మీకు అపవిత్రములు; వాటి మృతకళేబరములు
ముట్టిన ప్రతివాడు అపవిత్రుడగును. । నాలుగు కాళ్ల 27

* లేక, పాపార్పితమైన. † లేక, సన్నిధిలో అర్పించిరి. ‡ఈ నాలుగు విధములైన మిడతలకు తెలుగుపేరులు లేవు.

తో నడుచు సమస్త జీవరాశులలో, ఏవి అరకాలితో
నడుచునో అవన్నియు అపవిత్రములు. వాటి మృతక
ళేబరములు ముట్టిన ప్రతివాడు సాయంకాల పర్యంతము
28 అపవిత్రుడగును. । వాటి మృతకళేబరము మోసిన ప్రతి
వాడు తన బట్టలు ఉతుకుకొని సాయంకాల పర్యం
తము అపవిత్రుడగును; అవి మీకు అపవిత్రమైనవి.
29 నేల పాకు జీవరాశులలో మీకు అపవిత్రమైనవి
ఏవేవనగా; ముంగి, మూషకము, ప్రతివిధమైన బల్లి, ।
30 ఊసరవెల్లి, పోయహు,* తొండ, సరటము, కృకలా
31 సము; । పాకువాటిలో అవి మీకు అపవిత్రములు. అవి
చచ్చిన తరువాత వాటిని ముట్టిన ప్రతివాడు సాయం
32 కాల పర్యంతము అపవిత్రుడగును. । వాటిలో చచ్చిన
దాని కళేబరము దేనిమీద పడునో అది అపవిత్ర
మగును. అది కఱ్ఱముంతయైనను, బట్టయైనను, చర్మ
మైనను, సంచియైనను, పనిచేయు వస్తువు ఏదైనను
అయ్యుంటే, అది నీళ్లలో నాన వేయ వలెను; అది
సాయంకాల పర్యంతము అపవిత్రమగును. అప్పుడు
అది పవిత్రమగును.
33 వాటిలో ఏదైనను మంటి పాత్రలో పడిన యెడల,
దానిలోనిది అంతయు అపవిత్రమగును; మీరు దాని
34 పగలగొట్ట వలెను. । తిన తగిన ఆహారమంతటిలో దేని
వంటకు నీరు కావలెనో, అది దానివలన అపవిత్ర
మగును; తాగ తగిన పానీయమంతయు అట్టి పాత్ర
35 లోనుంటే అపవిత్రమగును. । వాటి మృతకళేబరముల
లోనిది కొంచెము దేనిమీద పడునో అది అపవిత్రమ
గును; పొయి అయినను కుంపటి అయినను, వాటిని
పగల గొట్ట వలెను; అవి అపవిత్రములు; అవి మీకు
36 అపవిత్రములై యుండ వలెను. । అయినను, లావైన
నీళ్లు గల బావియు, గుంటయు పవిత్రములు; అయితే
వాటి మృతకళేబరమునకు తగిలినది అపవిత్రము. ।
37 వాటి కళేబరములలోనిది కొంచెము విత్తబోవు విత్తన
38 ములమీద పడినను అవి పవిత్రములు కాని, । ఆ విత్తన
ములమీద నీళ్లు వేసిన తరువాత, వాటి మృతకళేబర
ములోనిది కొంచెము వాటిమీద పడిన యెడల, అవి
మీకు అపవిత్రములు.
39 మీకు ఆహారమైన జంతువులలో ఏదైనను చచ్చిన
యెడల, దాని కళేబరము ముట్టువాడు సాయంకాల
40 పర్యంతము అపవిత్రమగును; । దాని కళేబరములోనిది
కొంచెము తినువాడు తన బట్టలు ఉతుకుకొని సాయం
కాల పర్యంతము అపవిత్రుడగును.
41 నేల పాకు జీవరాశులన్నియు హేయములు; వా
42 టిని తిన కూడదు, । నేల పాకు జీవరాశులన్నిటిలో,
కడుపుతో చరించుదానినైనను నాలుగు కాళ్లతో
చరించుదానినైనను, చాలా కాళ్లు గలదానినైనను మీరు
తిన కూడదు; అవి హేయములు. । పాకు జీవరా 43
శులలో దేనివలన మీ జీవాత్మలను హేయపరుచు
కొనవద్దు; వాటివలన అపవిత్రులగునట్లు, వాటివలన
అపవిత్రత కలుగచేసుకొన వద్దు. । ఎందుకనగా, నేను 44
మీ దేవుడనైన యెహోవాను; నేను పరిశుద్ధుడను
గనుక, మీరు పరిశుద్ధులయ్యుండునట్లు, మిమ్ము మీరు
పరిశుద్ధపరుచుకొన వలెను. నేల పాకు జీవరాశులలో
దేని వలన మీ ప్రాణములను అపవిత్రపరుచుకొన
వద్దు. । నేను మీకు దేవుడనై యుండుటకు, ఐగుప్తు 45
దేశములోనుంచి మిమ్ము తీసుకొని వచ్చుచున్న యె
హోవాను; నేను పరిశుద్ధుడను, గనుక మీరు పరిశు
ద్ధులై యుండ వలెను.

అపవిత్రమైనదానికిని, పవిత్రమైనదానికిని, తిన 46
తగిన జంతువులకును, తిన తగని జంతువులకును విభజన
చేయునట్లు, । ఇది జంతువులను గూర్చినది, పక్షులను 47
గూర్చినది, జలచరములైన సమస్తజీవులను గూర్చినది,
నేల పాకు సమస్త జీవులను గూర్చినదియునైన బోధన
యిదే అని పలుకుమని చెప్పెను.

## 12. అధ్యాయము.

మరియు యెహోవా మోషేతో ఇట్లనెను:— 1,2
నీవు ఇశ్రాయేలు పుత్రులతో చెప్పవలసినది యేదన
గా: — ఒక స్త్రీ గర్భవతియై మగపిల్లను కనిన యెడల,
ఆమె యేడు దినములు పురిటాలై యుండ వలెను.
ఆమె తాను ముట్టుదై కడగా నుండు దినముల మేర
చొప్పున, పురిటాలై యుండ వలెను. । ఎనిమిదవ దిన 3
మున వానికి ఛేదన సంస్కారము చేయించ వలెను. ।
ఆమె తన శుద్ధి రక్తమందు, ముప్పది మూడు దినము 4
లుండి, తన శుద్ధి దినములు సంపూర్ణమయ్యే పర్యం
తము ఆమె పరిశుద్ధమైన దేనినైనను ముట్ట కూడదు;
పరిశుద్ధ స్థలములో ప్రవేశించ కూడదు.

ఆమె ఆడు పిల్లను కనిన యెడల, ఆమె తాను కడ 5
గా నుండునట్లు, రెండు వారములు పురిటాలై యుండ
వలెను. ఆమె తన శుద్ధి రక్తముకొరకు అరువది ఆరు
దినములు కడగా నుండ వలెను. । కుమారుని కొరకైనను 6
కుమార్తె కొరకైనను, ఆమె శుద్ధి దినములు పూర్తియైన
తరువాత, ఆమె ఆరోహణ యాగముకొరకు, ఏడాది
గొఱ్ఱెపిల్లను, పాపార్పితముకొరకు పావురపు పిల్లనై
నను, లేక గువ్వనైనను సంఘపు గుడారముయొక్క

* బలమైన ఉడుము కాబోలు.

ద్వారమునకు, యాజకుని యొద్దకు తీసుకొని రా వలె
7 ను. । అతడు యెహోవా సన్నిధిని దాని అర్పించి,
ఆమెకొరకు ఆచ్ఛాదనము చేయును; అప్పుడు ఆమె
తన రక్తస్రావమునుంచి పవిత్రపరచబడును. ఇది, మగ
పిల్లనైనను ఆడుపిల్లనైనను కనిన స్త్రీని గూర్చిన బోధ. ।
8 ఆమెకు గొఱ్ఱెపిల్ల దొరకని యెడల, ఆమె రెండు గు
వ్వలనైనను, లేక రెండు పావురపు పిల్లలనైనను, అనగా
ఆరోహణ యాగముకొరకు ఒకటియు, పాపార్పణము
కొరకు ఒకటియు తీసుకొని రా వలెను. అప్పుడు యా
జకుడు ఆమెకొరకు ఆచ్ఛాదనము చేయును; ఆమెకు
పవిత్రత కలుగును.

## 13. అధ్యాయము.

1 మరియు యెహోవా మోషే అహరోనులతో
2 ఇట్లనెను: ।—ఒకని దేహ చర్మమందు వాపైనను, పక్కై
నను, నిగనిగలాడు* మచ్చయైనను ఉండి, వాని దేహ
చర్మమందు కుష్ఠుపొడ వలె కనబడిన యెడల, యాజ
కుడగు అహరోనుయొద్దకైనను, యాజకులగు అతని
కుమారులలో ఒకనియొద్దకైనను వాని తీసుకొని రావ
3 లెను. । ఆ యాజకుడు వాని దేహ చర్మమందున్న ఆ
పొడ చూచినప్పుడు, ఆ పొడ యందలి వెంట్రుకలు
తెల్లబారిన యెడలను, చూపుకు ఆ పొడ అతని
దేహ చర్మముకంటే పల్లముగా నుండిన యెడలను, అది
కుష్ఠుపొడ; యాజకుడు వాని చూచి అపవిత్రుడని నిర్ణ
4 యించ వలెను. । నిగనిగలాడు మచ్చ చూపుకు చర్మము
కంటే పల్లముకాక, వాని దేహచర్మమందు తెల్లనిదై
యుండిన యెడలను, దాని వెంట్రుకలు తెల్లబారని యె
డలను ఆ యాజకుడు, ఏడు దినములు ఆ పొడ గలవాని
5 మూసిపెట్ట† వలెను. । ఏడవ నాడు యాజకుడు వాని
చూడ వలెను. చూచినప్పుడు ఆ పొడ చర్మమందు వ్యా
పించక, అట్లే ఉండిన యెడల, యాజకుడు మరి ఏడు
6 దినములు వాని మూసిపెట్ట‡ వలెను. । ఏడవ నాడు
యాజకుడు రెండవసారి వాని చూడ వలెను. అప్పుడు
ఆ పొడ చర్మమందు వ్యాపించక, తరగతిగా నుండిన
యెడల, యాజకుడు వాని పవిత్రుడని నిర్ణయించ
వలెను; అది పక్కు; వాడు తన బట్టలు ఉతుకుకొని
7 పవిత్రుడగును. । అయితే వాడు తన శుద్ధి విషయము
యాజకునికి కనబడిన తరువాత, ఆ పక్కు చర్మమందు
విస్తారముగా వ్యాపించిన యెడల, వాడు రెండవసారి
8 యాజకునికి కనబడ వలెను. । అప్పుడు యాజకుని చూ
పుకు, ఆ పక్కు చర్మమందు వ్యాపించిన యెడల, యా
జకుడు వాని అపవిత్రుడని నిర్ణయించ వలెను.

కుష్ఠు పొడ ఒకని దేహమందు పుట్టిన యెడల, 9
యాజకునియొద్దకు వాని తీసుకొని రా వలెను. । అప్పుడు 10
యాజకుని చూపుకు, తెల్లని వాపు చర్మమందు కనబడిన
యెడలను, అది వెంట్రుకలు తెల్లబారించిన యెడలను,
వాపులో పచ్చిమాంస చిహ్నము కనబడిన యెడలను, ।
అది వాని దేహచర్మమందు పాతదైన కుష్ఠము గనుక, 11
యాజకుడు వాని అపవిత్రుడని నిర్ణయించ వలెను;
వాని మూసిపెట్ట కూడదు; వాడు అపవిత్రుడు.

కుష్ఠము§ చర్మమందు విస్తారముగా పుట్టినప్పుడు, యా 12
జకుడు చూచినంతమట్టుకు, ఆ పొడ గలవాని తల మొద
లుకొని పాదముల వరకు, కుష్ఠము§ వాని చర్మమంతయు
వ్యాపించిన యెడల, । యాజకుడు వాని చూడ వలెను. 13
అతని చూపుకు, ఆ కుష్ఠము§ వాని దేహమంతట వ్యా
పించిన యెడల, ఆ పొడ గలవాని పవిత్రుడని నిర్ణ
యించ వలెను; వాని ఒళ్లంతయు తెల్లబారెను; వాడు
పవిత్రుడు. । అయినను వాని ఒంట పచ్చిమాంసము కన 14
బడు దినమున అపవిత్రుడగును. । యాజకుడు ఆ పచ్చి 15
మాంసము చూచి వాని అపవిత్రుడని నిర్ణయించ వలెను;
ఆ పచ్చిమాంసము అపవిత్రమే; అది కుష్ఠము. । అయితే 16
ఆ పచ్చిమాంసము మారుచు తెల్లబారిన యెడల, వాడు
యాజకునియొద్దకు రా వలెను. । యాజకుడు వాని చూ 17
చినప్పుడు, అతని చూపుకు ఆ పొడ తెల్లబారిన యెడల,
యాజకుడు ఆ పొడ పవిత్రమని నిర్ణయించ వలెను;
వాడు పవిత్రుడు.

ఒకని దేహచర్మమందు పుండు పుట్టి, మానిన తరు 18
వాత, । ఆ పుంటి చోటను తెల్లని వాపైనను, తెల్లగాను 19
ఎఱ్ఱగానుండి నిగనిగలాడు తెల్లని పొడయైనను
పుట్టిన యెడల, యాజకునికి దాని కనపరచ వలెను. ।
యాజకుడు దాని చూచినప్పుడు, అతని చూపుకు అది 20
చర్మముకంటే పల్లముగా నుండిన యెడలను, దాని వెం
ట్రుకలు తెల్లబారిన యెడలను, యాజకుడు వాని అప
విత్రుడని నిర్ణయించ వలెను; అది ఆ పుంటివలన పుట్టిన
కుష్ఠు పొడ, । అయితే యాజకుడు దాని చూచినప్పుడు 21
దానిలో తెల్లని వెంట్రుకలు లేకపోయిన యెడలను,
అది చర్మముకంటే పల్లము కాక కొంచెము తరగతిగా
నుండిన యెడలను, యాజకుడు ఏడు దినములు వాని
మూసిపెట్ట వలెను. । అది చర్మమందు విస్తారముగా వ్యా 22
పించిన యెడల, యాజకుడు వాని అపవిత్రుడని నిర్ణ
యించ వలెను. అది కుష్ఠు పొడ. । అయితే నిగనిగ 23
లాడు పొడ వ్యాపించక, అట్లే ఉండిన యెడల, అది
వ్రణతాపమే; యాజకుడు వాని పవిత్రుడని నిర్ణయించ
వలెను.

* లేక, మెరియు. † లేక, పొడ కట్టుకట్ట. ‡ లేక, దాని కట్టుకట్ట. § లేక, బొల్లి.

24 తాపము కలిగిన దేహచర్మమందు, ఆ వాత, ఎర్రె
ర్రగానైనను తెల్లగానైనను, నిగనిగలాడు తెల్లని మచ్చ
గానైనను ఉండిన యెడల, యాజకుడు దాని చూడ
25 వలెను. ၊ అప్పుడు అతని చూపుకు, నిగనిగలాడు ఆ
మచ్చలోని వెంట్రుకలు తెల్లబారిన యెడలను, అది
చర్మముకంటే పల్లముగా నుండిన యెడలను, అది కుష్ఠు
పొడ; ఆ వాతవలన పుట్టెను; యాజకుడు వాని అప
26 విత్రుడని నిర్ణయించ వలెను; అది కుష్ఠు పొడ. ၊ యాజ
కుడు దాని చూచునప్పుడు, అతని చూపుకు, నిగనిగ
లాడు మచ్చలో తెల్లని వెంట్రుకలు లేకనైనను, అది
చర్మముకంటే పల్లముగా నుండకనైనను కొంతమట్టుకు
తరగతిగానుండిన యెడలను, యాజకుడు ఏడు దినము
27 లు వాని మూసిపెట్ట వలెను. ၊ ఏడవనాడు యాజకుడు
వాని చూచినప్పుడు, అది చర్మమందు విస్తారముగా
వ్యాపించిన యెడల, యాజకుడు వాని అపవిత్రుడని
28 నిర్ణయించ వలెను; అది కుష్ఠు పొడయే. ၊ అయితే నిగ
నిగలాడు మచ్చ చర్మమందు వ్యాపించక, ఆ చోటునే
ఉండి, కొంచెము తరగతిగానుండిన యెడల, అది
వాత వాపే; యాజకుడు వాని పవిత్రుడని నిర్ణయించ
వలెను; అది వాత మంటయే.
29 పురుషునికైనను స్త్రీకైనను తలయందేమి గడ్డమం
దేమి పొడ పుట్టిన యెడల, యాజకుడు ఆ పొడ
30 చూడ వలెను. ၊ అప్పుడు అది చూపుకు చర్మముకంటే
పల్లముగాను, సన్నమైన పచ్చ వెంట్రుకలు కలదిగా
నుండిన యెడల, యాజకుడు వాని అపవిత్రుడని నిర్ణ
యించ వలెను; అది చుండు; తల మీదనైనను గడ్డము
31 మీదనైనను పుట్టిన కుష్ఠము. ၊ యాజకుడు ఆ చుండగు
పొడ చూచినప్పుడు, చూపుకు అది చర్మముకంటే పల్ల
ము కాని యెడలను, దానిలో నల్లవెంట్రుకలు లేక
పోయిన యెడలను యాజకుడు ఆ చుండగు పొడ గల
32 వాని, ఏడు దినములు మూసిపెట్ట వలెను. ၊ ఏడవనాడు
యాజకుడు ఆ పొడ చూచినప్పుడు, చూపుకు ఆ చుం
డు వ్యాపించకపోయిన యెడలను, దానిలో పచ్చవెం
ట్రుకలు లేకపోయిన యెడలను, చర్మముకంటే పల్లము
33 కాని యెడలను, ၊ వాడు క్షౌరము చేసుకొన వలెను గాని
ఆ చుండు క్షౌరము చేయకూడదు; యాజకుడు చుండు
గలవాని మరి ఏడు దినములు మూసిపెట్ట వలెను.
34 ఏడవనాడు యాజకుడు ఆ చుండు చూచినప్పుడు,
చూపుకు, చుండు చర్మమందు వ్యాపించకనైనను, చర్మము
కంటే పల్లము కాకనైనను ఉండిన యెడల, యాజకు
డు వాని పవిత్రుడని నిర్ణయించ వలెను. వాడు తన
35 బట్టలు ఉతుకుకొని పవిత్రుడగును. ၊ అయితే వాని పవి
త్రుడని నిర్ణయించిన తరువాత, చుండు విస్తారముగా
వ్యాపించిన యెడల, ၊ యాజకుడు వాని చూడ వలెను. 36
అప్పుడు చూపుకు ఆ చుండు వ్యాపించిన యెడల,
యాజకుడు పచ్చ వెంట్రుకలు వెతకనక్కర లేదు;
వాడు అపవిత్రుడు. ၊ అయితే అతని చూపుకు నిలిచిన 37
ఆ చుండులో నల్ల వెంట్రుకలు పుట్టిన పక్షమందు,
చుండు బాగుపడెను; వాడు పవిత్రుడు; యాజకుడు
వాని పవిత్రుడని నిర్ణయించ వలెను.
మరియు పురుషుని దేహచర్మమందైనను స్త్రీ దేహ 38
చర్మమందైనను నిగనిగలాడు మచ్చలు, అనగా నిగనిగ
లాడు తెల్లని మచ్చలు పుట్టిన యెడల, ၊ యాజకుడు 39
చూడగా, వారి దేహచర్మమందు నిగనిగలాడు మచ్చలు
చూపుకు తరగతిగా నుండిన యెడల అది చర్మమందు
పుట్టిన బోహాకనునది*; వాడు పవిత్రుడు.
తల వెంట్రుకలు రాలినవాడు బట్టతలవాడు కాని 40
వాడు పవిత్రుడు. ၊ ముఖము వైపున తలవెంట్రుకలు 41
రాలినవాడు బట్టనొసటివాడు;† వాడు పవిత్రుడు. ၊
అయితే బట్టతలయందైనను బట్టనొసటియందైనను 42
ఎర్రెర్రగా నుండు తెల్లని మచ్చ‡ పుట్టిన యెడల,
అది వాని బట్టతలయందైనను బట్టనొసటియందైనను
పుట్టిన కుష్ఠము. ၊ యాజకుడు వాని చూడ వలెను. 43
కుష్ఠము దేహచర్మమందు కనుబడునట్లు, ఆ బొల్లి వాపు,
చూపుకు వాని బట్టతలయందైనను వాని బట్టనొసటి
యందైనను, ఎర్రెర్రగానుండు తెల్లని మచ్చ‡ యైతే, ၊
వాడు కుష్ఠరోగి; వాడు అపవిత్రుడు. యాజకుడు 44
వాని బొత్తిగా అపవిత్రుడని నిర్ణయించ వలెను. వాని
కుష్ఠము వాని తలలోనున్నది.
ఆ పొడ‡ గల కుష్ఠరోగి వస్త్రములు చింపివేయ 45
వలెను; వాని తల విరియచేయ వలెను; వాడు తన మీది
పెదవిని కప్పుకొని,—అపవిత్రుడను, అపవిత్రుడను
అని నోరెత్తి పలక వలెను. ၊ ఆ పొడ‡ వానికి కలి 46
గిన దినములన్నియు వాడు అపవిత్రుడగును. వాడు
అపవిత్రుడు గనుక కడగానే నివసించ వలెను. వాని
నివాసస్థలము పాళెమునకు వెలపటనుండ వలెను.
మరియు కుష్ఠుపొడ వస్త్రమందు ఉండునప్పుడు, 47
అది గొర్రె వెంట్రుకల బట్టయందైనను, నారబట్టల
యందైనను, ၊ నారతోనైనను, వెంట్రుకలతోనైనను 48
చేయబడిన పడుగుయందేమి, పేకయందేమి, తోలు
యందేమి, తోలుతో చేయబడు ఏ యొక వస్తువుయం
దేమి పుట్టి, ၊ ఆ మచ్చ‡ ఆ బట్టయందైనను ఆ తోలు 49
యందైనను ఆ పేకయందైనను, తోలుతో చేయబడిన
వస్తువుయందైనను, పచ్చపచ్చగానైనను ఎర్రెర్రగానై

*ఒక విధమైన పొక్కు. † లేక, బోడి. ‡ లేక, బొల్లి.

నను ఉండిన యెడల, అది కుష్ఠుపొడ; అది యాజకునికి
50 కనపరచ వలెను.। యాజకుడు ఆ పొడ* చూచి, పొడ
51 గలవాని, ఏడు దినములు మూసిపెట్ట వలెను. । ఏడవ
నాడు అతడు ఆ పొడను చూడ వలెను. అప్పుడు
ఆ వస్త్రమందు, అనగా, పడుగుయందైనను, పేకయం
దైనను, తోలుయందైనను తోలుతో చేయబడిన వస్తువు
యందైనను ఆ పొడ వ్యాపించిన యెడల, ఆ పొడ
52 నాశకరమైన కుష్ఠము. అది అపవిత్రము. । కావున,
అతడు ఆ పొడ దేనిలో ఉన్నదో ఆ వస్త్రమును, నార
తోనైనను వెంట్రుకలతోనైనను చేయబడిన పడు
గును పేకను, తోలుతో చేయబడిన ప్రతివస్తువును
అగ్నిచేత కాల్చివేయ వలెను; అది నాశకరమైన కుష్ఠ
ము; అది అగ్నిచేత కాల్చివేయ వలెను.
53 అయితే యాజకుడు చూచినప్పుడు, అతని చూ
పుకు ఆ పొడ ఆ వస్త్రమందు, అనగా పడుగుయందై
నను పేకయందైనను, తోలుతో చేయబడిన మరి దేని
54 యందైనను వ్యాపించకపోయిన యెడల, । యాజకుడు
ఆ పొడ గలదాని ఉతక నాజ్ఞాపించి, మరి ఏడు దిన
55 ములు దాని మూసిపెట్ట వలెను. । ఆ పొడ గలదాని
ఉతికిన తరువాత, యాజకుడు దాని చూడ వలెను.
చూపుకు ఆ పొడ మారకనైనను, అది వ్యాపించకనై
నను ఉంటే, అది అపవిత్రము; అగ్నిచేత దానికాల్చ
వలెను. అది పెడతలయందైనను, నొసటియందైనను
నాశకరముగా నుండును.
56 యాజకుడు చూచినప్పుడు, ఆ పొడ గలదాని ఉతి
కిన తరువాత, చూపుకు అది తరగతిగా నుండిన యెడల,
అతడు ఆ వస్త్రములోనుంచి, తోలులోనుంచి, పడుగు
లోనుంచి, పేకలోనుంచి దాని చింపివేయ వలెను. ।
57 అటుతరువాత అది ఆ వస్త్రమందైనను, పడుగుయందై
నను, పేకయందైనను, తోలుతో చేయబడిన దేనియం
దైనను కనబడిన యెడల, అది నాశకరముగా నున్నది.
ఆ పొడ దేనిలో ఉన్నదో దాని అగ్నిచేత కాల్చివేయ
58 వలెను. । నీవు ఏ వస్త్రమునైనను, పడుగునైనను, పేకనై
నను, తోలుతో చేసినదానినైనను కడిగిన తరువాత, ఆ
పొడ* వదిలినపక్షమందు, రెండవమారు దాని కడగ
వలెను; అప్పుడు అది పవిత్రమగును.
59 వెంట్రుకల బట్టయందైనను, నార బట్టయందైనను,
పడుగుయందైనను, పేకయందైనను, తోలు వస్తువుల
యందైనను ఉండు కుష్ఠు పొడను గూర్చి, అది పవిత్ర
మైనదనియైనను, లేక అపవిత్రమైనదనియైనను నిర్ణ
యించుటకు, ఇది బోధ ప్రమాణమని పలికెను.

## 14. అధ్యాయము.

మరియు యెహోవా మోషేతో ఇట్లనెను:।— 1
కుష్ఠరోగిని పవిత్రుడని నిర్ణయించిన దినమున, వాని 2
గూర్చిన బోధన యేదనగా; యాజకునియొద్దకు వాని
తీసుకొని రా వలెను. । యాజకుడు పాళెము వెలపటికి 3
వెళ్ల వలెను. యాజకుడు వాని చూచినప్పుడు, అతని
చూపుకు కుష్ఠు పొడ బాగుపడి, కుష్ఠరోగిని విడిచిన
యెడల, । యాజకుడు, పవిత్రత పొందగోరువాని కొ 4
రకు, జీవము గల రెండు పవిత్రపక్షులను, దేవదారు
కర్రను, రక్తవర్ణము గల నూలును, హిస్సోపును తెప్పించ
నాజ్ఞాపించ వలెను. । అప్పుడు యాజకుడు, మంటి 5
పాత్రలో ప్రవాహ జలము† పైని, ఆ పక్షులలో ఒక
దాని చంప నాజ్ఞాపించి, । జీవము గల పక్షిని, ఆ దేవ 6
దారు కర్రను, రక్తవర్ణము గల నూలును, హిస్సో
పును తీసుకొని, ప్రవాహ జలము† పైని చంపిన పక్షి
రక్తములో, వాటిని, సజీవమైన పక్షిని ముంచి, । కుష్ఠము 7
నుంచి పవిత్రత పొంద గోరువానిమీద ఏడు మారులు
ప్రోక్షించి, వాని పవిత్రుడని నిర్ణయించి, సజీవమైన
పక్షిని పొలము బైట వదిలివేయ వలెను. । అప్పుడు పవి 8
త్రత పొంద గోరువాడు తన బట్టలు ఉతుకుకొని, తన
రోమములన్నిటిని క్షౌరము చేసుకొని, నీళ్లతో కడుగు
కొని‡ పవిత్రుడగును; తరువాత వాడు పాళెములోకి
వచ్చి, తన గుడారము వెలపట, ఏడు దినములు నివ
సించ వలెను.

ఏడవనాడు వాడు తన రోమములన్నియు, తన 9
తలను తన గడ్డమును, తన కనుబొమలను క్షౌరము చేసు
కొన వలెను; తన సమస్త రోమములను క్షౌరము చేసు
కొని తన బట్టలు ఉతుకుకొని, తన దేహమును నీళ్ల
తో కడుగుకొని‡ పవిత్రుడగును.

ఎనిమిదవనాడు, వాడు నిర్దోషమైన రెండు మగ 10
గొఱ్ఱెపిల్లలను, నిర్దోషమైన ఏడాది ఆడు గొఱ్ఱెపిల్లను,
చిన్న పాట్లెళ్లను, కానుకకొరకు నూనెతో కలిపిన మూ
డు పదియవ వంతుల§ గోధుముల పిండిని, ఒక లోగు‖
నూనెను తేవలెను. । వాని పవిత్రపరచు యాజకుడు, 11
పవిత్రత పొంద గోరు మనుష్యుని, వాటిని, సంఘపు
గుడారముయొక్క ద్వారమున, యెహోవా సన్నిధిని
నిలువ బెట్ట వలెను. । అప్పుడు యాజకుడు, ఒక మగ 12
గొఱ్ఱెపిల్లను, ఆ లోగు నూనెను తీసుకొని, అపరాధార్పి
తముగా వాటిని దగ్గరకు తెచ్చి, అల్లాడించబడు నర్పి
తముగా యెహోవా సన్నిధిని వాటిని అల్లాడించ
వలెను. । అతడు ఎక్కడ పాపార్పిత¶ పశువును ఆరో 13

*లేక, బొల్లి. †హెబ్రీలో, జీవజలము. ‡లేక, స్నానముచేసి. §అది, ముప్పావు శేరు కావచ్చును.
‖లోగు, అర్ధశేరు కావచ్చును. ¶లేక, పాపాచ్ఛాదనార్పితమైన.

హణ యాగపశువును వధించుచోట, ఆ పరిశుద్ధ స్థలమందు
ఆ గొఱ్ఱెపిల్లను వధించ వలెను; ఎందుకనగా పాపా
ర్పితము వలె, అపరాధార్పితము యాజకునిది యగును;
14 అది అతిపరిశుద్ధము. అప్పుడు యాజకుడు, ఆ అప
రాధార్పణ రక్తములోనిది కొంచెము తీసుకొని, పవి
త్రత పొంద గోరువాని కుడిచెవి కొన మీదను, వాని
కుడిచేతి బొట్టనవేలి మీదను, వాని కుడికాలి బొట్టన
15 వేలి మీదను, యాజకుడు దాని చమర వలెను. మరియు
ఆ యాజకుడు ఆ లోగు నూనెలోనిది కొంచెము తీసి,
16 తన ఎడమ అరిచేతిలో పోసుకొన వలెను. అప్పుడు
యాజకుడు తన యెడమ అరిచేతిలోనున్న నూనెలో,
తన కుడివేలు ముంచి, యెహోవా సన్నిధిని ఏడు
మారులు తన వేలితో ఆ నూనెలోనిది కొంచెము ప్రో
17 క్షించ వలెను. యాజకుడు తన అరిచేతిలోనున్న కొ
దువ నూనెలోనిది కొంచెము తీసుకొని, పవిత్రత
పొంద గోరువాని కుడిచెవి కొన మీదను, వాని కుడి
చేతి బొట్టనవేలి మీదను, వాని కుడికాలి బొట్టనవేలి
మీదనున్న అపరాధార్పణ రక్తముమీద చమర వలెను.
18 అప్పుడు యాజకుడు తన అరిచేతిలోనున్న కొదువ
నూనె, పవిత్రత పొంద గోరువాని తలమీద చమర
వలెను. అట్లు యాజకుడు యెహోవా సన్నిధిలో
వానికొరకు ఆచ్ఛాదనము చేయ వలెను.

19 అప్పుడు యాజకుడు పాపార్పణము* చేసి, అపవి
త్రతనుంచి పవిత్రత పొంద గోరువానికొరకు ఆచ్ఛా
దనము చేసిన తరువాత, అతడు ఆరోహణ యాగపశు
20 వును వధించ వలెను. అప్పుడు యాజకుడు ఆరోహణ
యాగద్రవ్యమును, కానుకను, యజ్ఞవేదికమీద ఆరో
హింపచేయ వలెను. అట్లు యాజకుడు వానికొరకు
ఆచ్ఛాదనము చేసిన తరువాత వాడు పవిత్రుడగును.

21 వాడు బీదవాడైనందున, అదంతయు వానికి దొర
కని యెడల, తన కొరకు ఆచ్ఛాదనము చేయుటకు,
వాడు అపరాధార్పితముగా అల్లాడించుటకు ఒక చిన్న
పొట్టేలును, కానుకగా ఏఫాలో పదియవవంతు నూ
నెతో కలిపిన గోధుమ పిండిని, ఒక లోగు నూనెను,
22 వానికి దొరికినంత మట్టుకు రెండు గువ్వలనైనను రెండు
పావురపు పిల్లలనైనను, అనగా పాపార్పితము కొరకు
ఒకదాని, ఆరోహణ యాగముకొరకు ఒకదాని తీసు
23 కొని రావలెను. వాడు పవిత్రత పొందుచుండు ఎని
మిదవ నాడు, యెహోవా సన్నిధికి సంఘపు గుడా
రముయొక్క ద్వారమునకు, అహరోనుయొద్దకు వాటిని
24 తీసుకొని రావలెను. యాజకుడు అపరాధార్పణమైన
పొట్టేలును, లోగు నూనెను తీసుకొన వలెను. అప్పుడు
యాజకుడు, అల్లాడించు నర్పితముగా, యెహోవా
సన్నిధిని వాటిని అల్లాడించ వలెను. అప్పుడు అతడు 25
అపరాధార్పణమైన పొట్టేలును వధించ వలెను. అప్పుడు
యాజకుడు ఆ అపరాధార్పణ రక్తములోనిది కొంచెము
తీసుకొని, పవిత్రత పొంద గోరువాని కుడిచెవి కొన
మీదను, వాని కుడిచేతి బొట్టనవేలి మీదను, వాని
కుడికాలి బొట్టనవేలి మీదను దాని చమర వలెను.
మరియు, యాజకుడు, ఆ నూనెలోనిది కొంచెము తన† 26
యెడమ అరి చేతిలో పోసుకొని, తన యెడమ చేతి 27
లోనున్న ఆ నూనెలోనిది కొంచెము తన కుడివేలి
తో యెహోవా సన్నిధిని ఏడు మారులు ప్రోక్షించ
వలెను. మరియు యాజకుడు, తన అరిచేతిలోనున్న 28
నూనెలోనిది కొంచెము, పవిత్రత పొంద గోరువాని
కుడిచెవి కొనమీదను, వాని కుడిచేతి బొట్టనవేలి
మీదను, వాని కుడికాలి బొట్టనవేలి మీదను, ఆ అప
రాధార్పిత రక్తమున్న చోటను వేయ వలెను. యాజ 29
కుని అరిచేతిలోనున్న కొదువ నూనెను, అతడు పవి
త్రత పొందగోరు వానికొరకు, యెహోవా సన్నిధిని
ఆచ్ఛాదనము చేయుటకు, వాని తలమీద వేయ వలెను.
అప్పుడు వానికి దొరికినంతమట్టుకు, ఆ గువ్వలలోనై 30
నను, పావురపు పిల్లలలోనైనను ఒకదాని అర్పించ
వలెను. తన కానుక గాక, వాటిలో, తనకు దొరికినంత 31
మట్టుకు, పాపార్పితముగా ఒకదానిని, ఆరోహణ యా
గముగా ఒకదానిని అర్పించ వలెను. అట్లు యాజ
కుడు పవిత్రత పొందగోరువానికొరకు యెహోవా
సన్నిధిని ఆచ్ఛాదనము చేయ వలెను. కుష్ఠుపొడ కలి 32
గినవాడు పవిత్రత పొంద తగిన వాటిని సంపాదించ
లేని యెడల, వాని విషయమైన బోధన ప్రమాణమదే
అని పలికెను.

మరియు యెహోవా మోషే అహరోనులతో 33,34
ఇట్లనెను;—నేను స్వాస్థ్యముగా మీకిచ్చుచున్న దేశ
మునకు మీరు వచ్చిన తరువాత, మీ స్వాస్థ్యమైన
దేశములోని ఏ యింటనైనను నేను కుష్ఠుపొడ కలుగ
చేసిన యెడల, ఆ యింటి యజమానుడు యాజకుని 35
యొద్దకు వచ్చి—నా యింటిలో కుష్ఠుపొడవంటిది నాకు
కనబడెనని అతనికి తెలియ చెప్ప వలెను. అప్పుడు 36
ఆ యింటనున్నది యావత్తును అపవిత్రము కాకుండు
నట్లు, యాజకుడు ఆ కుష్ఠుపొడ చూడ ప్రవేశించక
మునుపు, అతడు ఆ ఇల్లు సిద్ధపరచ‡ నాజ్ఞాపించ
వలెను. ఆ తరువాత యాజకుడు ఆ ఇల్లు చూడ లో
పలికి రా వలెను. అతడు ఆ పొడ చూచినప్పుడు, 37
అతని చూపుకు ఆ ఇంటి గోడలలో పచ్చపచ్చగానై

* లేక, పాపాచ్ఛాదనార్పితము. † హెబ్రీలో, యాజకుని. ‡ లేక, ఖాలిచేయ.

నను ఎఱ్ఱెఱ్ఱగానైనను ఉండు పల్లములు గలదై, చూ
38 పుకు గోడకంటే పల్లముగానుండిన యెడల, । యాజ
కుడు ఆ ఇంటనుంచి యింటి వాకిటికి బైలువెళ్లి,
ఆ ఇల్లు ఏడు దినములు మూసిపెట్ట వలెను.
39 ఏడవ నాడు యాజకుడు తిరిగివచ్చి, దాని చూడ
వలెను. అప్పుడు చూపుకు ఆ పొడ ఇంటి గోడలయం
40 దు వ్యాపించినదైతే, । యాజకుని సెలవు చొప్పున
ఆ పొడగల రాళ్లను ఊడదీసి, ఊరి వెలపటనున్న అప
41 విత్ర స్థలమున పారవేయ వలెను. । అప్పుడు అతడు
ఆ యింటి లోపలను, చుట్టుగోడలను గీయించ వలెను;
వారు గీసిన పెల్లలు ఊరి వెలపటనున్న అపవిత్ర స్థల
42 మున పారబోసి, । వేరే రాళ్లను తీసుకొని, ఆ రాళ్లకు
ప్రతిగా చేర్చ వలెను. అతడు వేరే సున్నము* తెప్పించి
ఆ ఇంటి గోడకు వేయించ వలెను.
43 అతడు ఆ రాళ్లను విడదీయించిన తరువాతను, ఇల్లు
గీయించిన తరువాతను, దానికి సున్నము* వేసిన తరు
వాతను, ఆ పొడ తిరిగి ఆ యింట బైలుపడిన యెడల, ।
44 యాజకుడు వచ్చి దాని చూడ వలెను. అప్పుడు ఆ పొడ
ఆ ఇంట వ్యాపించినదైతే, అది ఆ ఇంటిలో నాశకర
45 మైన కుష్ఠము; అది అపవిత్రము. । కాబట్టి అతడు
ఆ ఇల్లు, దాని రాళ్లు, దాని కర్రలు, దాని సున్నమం
తయు పడగొట్టించి, ఊరి వెలపటనున్న అపవిత్ర స్థల
మునకు వాటిని మోయించి, పారబోయ వలెను. ।
46 మరియు, ఆ ఇల్లు మూసిపెట్టిన దినములన్నిటను దాని
లోకి వెళ్లువాడు సాయంకాల పర్యంతము అపవిత్రు
47 డగును. । ఆ ఇంటిలో పండుకొనువాడు తన బట్టలు
ఉతుకుకొన వలెను; ఆ ఇంట భోజనము చేయువాడు
తన బట్టలు ఉతుకుకొన వలెను.
48 యాజకుడు వచ్చి లోపల ప్రవేశించి చూచి
నప్పుడు, అతని చూపుకు, ఆ ఇంటికి సున్నము వేసిన
తరువాత, ఆ పొడ ఇంటిలో వ్యాపించక పోయిన యె
డల, పొడ బాగుపడెను గనుక, ఆ ఇల్లు పవిత్రమని యా
49 జకుడు నిర్ణయించ వలెను. । ఆ ఇంటికి పాపశుద్ధి కలుగ
చేయుటకు, అతడు రెండు పక్షులను, దేవదారు కర్రను,
50 రక్తవర్ణపు నూలును, హిస్సోపును తీసుకొని, । ప్రవాహ
జలము పైని మంటిపాత్రలో, ఆ పక్షులలో ఒకదాని
51 వధించి, । ఆ దేవదారు కర్రను, హిస్సోపును, రక్తవర్ణపు
నూలును, సజీవమైన పక్షిని తీసుకొని, వధించబడిన
పక్షి రక్తములోను, ప్రవాహజలములోను వాటిని ముం
చి, ఆ ఇంటిమీద ఏడు మారులు ప్రోక్షించ వలెను. ।
52 అట్లు ఆ పక్షిరక్తముతోను, ఆ ప్రవాహజలముతోను,
సజీవమైన పక్షితోను, దేవదారు కర్రతోను, హిస్సో
పుతోను, రక్తవర్ణపు నూలుతోను, ఆ ఇంటికి పాపశుద్ధి
చేయ వలెను. । అప్పుడు సజీవమైన పక్షిని ఊరి వెలపల 53
నుంచి పొలములలో విడిచిపెట్ట వలెను. అట్లు అతడు
ఆ ఇంటికొరకు ఆచ్ఛాదనము చేయ వలెను; అది పవిత్ర
మగును.
ప్రతి విధమైన కుష్ఠుపొడను గూర్చియు, చుండును 54
గూర్చియు, । వస్త్రకుష్ఠమును గూర్చియు, వస్త్రమునకై 55
నను, ఇంటికైనను కలుగు కుష్ఠమును గూర్చియు, । వా 56
పును గూర్చియు, పక్కును గూర్చియు, నిగనిగలాడు
మచ్చను గూర్చియు, । దాని అపవిత్రత దినమందు దాని 57
పవిత్రత దినమందు, బోధించుటకు, ఇది కుష్ఠమును
గూర్చిన బోధన ప్రమాణమనెను.

## 15. అధ్యాయము.

యెహోవా మోషే అహరోనులతో యిట్లనెను:— 1
మీరు ఇశ్రాయేలు పుత్రులను చూచి వారితో చెప్ప 2
వలసినది యేదనగా—ఒకని దేహమందు స్రావము కలిగి
యుండగా, వాడు ఆ స్రావము వలన అపవిత్రుడు. ।
వాని స్రావము వలని అపవిత్రత ఎట్టిదనగా, వాని 3
దేహము వాని స్రావము కారచేసినను, వాని దేహము
వాని స్రావము అడ్డపరిచినను† అది వానికి అపవిత్రత. ।
ఆ స్రావి పండుకొను ప్రతి పరుపు అపవిత్రము; 4
వాడు కూర్చుండు ప్రతిది అపవిత్రము. । వాని పరుపు 5
ముట్టువాడు తన బట్టలు ఉతుకుకొని, నీళ్లతో ఒళ్లు
కడుగుకొని, సాయంకాల పర్యంతము అపవిత్రుడ
గును. । ఆ స్రావి దేనిమీద కూర్చుండునో దానిమీద 6
కూర్చుండు వాడు తన బట్టలు ఉతుకుకొని, నీళ్లతో
ఒళ్లు కడుగుకొని, సాయంకాల పర్యంతము అపవిత్రు
డగును. । ఆ స్రావి దేహము ముట్టువాడు తన బట్టలు 7
ఉతుకుకొని, నీళ్లతో ఒళ్లు కడుగుకొని సాయంకాల
పర్యంతము అపవిత్రుడగును. । ఆ స్రావి పవిత్రుని 8
మీద ఉమ్మివేసిన యెడల, అతడు తన బట్టలు ఉతుకు
కొని నీళ్లతో ఒళ్లు కడుగుకొని సాయంకాల పర్యం
తము అపవిత్రుడగును. । స్రావి కూర్చుండు ప్రతి జీను 9
అపవిత్రము. । వాని కిందనుండిన ఏ వస్తువునైనను 10
ముట్టు ప్రతివాడు సాయంకాల పర్యంతము అపవిత్రు
డగును; వాటిని మోయువాడు తన బట్టలు ఉతుకుకొని
నీళ్లతో ఒళ్లు కడుగుకొని, సాయంకాల పర్యంతము
అపవిత్రుడగును. । ఆ స్రావి నీళ్లలో చేతులు ముంచక, 11
ఎవని ముట్టునో వాడు తన బట్టలు ఉతుకుకొని, ఒళ్లు
కడుగుకొని సాయంకాల పర్యంతము అపవిత్రుడగును. ।
స్రావి ముట్టు మంటి పాత్రను పగలగొట్ట వలెను; ప్రతి 12

* లేక, మన్ను. † లేక, ఆ శరీరస్థితినిబట్టి స్రవించినను స్రవించక పోయినను.

13 దారు పాత్రను నీళ్లలో ముంచ వలెను. ౹ స్రావి తన
స్రావమునుంచి పవిత్రత పొందునప్పుడు, తన పవిత్రత
విషయము ఏడు దినములు లెక్కించుకొని, తన బట్టలు
ఉతుకుకొని, ప్రవాహజలముతో ఒళ్లు కడుగుకొని
14 పవిత్రుడగును. ౹ ఎనిమిదవ నాడు రెండు గువ్వలనై
నను రెండు పావురపు పిల్లలనైనను తీసుకొని, సంఘపు
గుడారముయొక్క ద్వారమునకు వచ్చి, యెహోవా
సన్నిధిని వాటిని యాజకునికి అప్పగించ వలెను. ౹
15 అప్పుడు యాజకుడు వాటిలో పాపార్పితముగా* ఒక
దానిని, ఆరోహణ యాగముగా ఒకదానిని అర్పించ
వలెను; అట్లు యాజకుడు వాని స్రావమునుంచి, యె
హోవా సన్నిధిని వానికొరకు ఆచ్ఛాదనము చేయ
వలెను.

16 ఒకనికి వీర్యస్ఖలనమైన యెడల, వాడు తన ఒళ్లం
తయు నీళ్లతో కడుగుకొని, సాయంకాల పర్యంతము
17 అపవిత్రుడగును. ౹ ఏ బట్టమీదను, ఏ తోలుమీదను
వీర్యస్ఖలనమగునో, ఆ బట్ట ఆ తోలు నీళ్లతో ఉత
కబడి సాయంకాల పర్యంతము అపవిత్రమగును. ౹
18 వీర్యస్ఖలనమగునట్లు స్త్రీ పురుషులు శయనించిన యె
డల, వారిద్దరు నీళ్లతో ఒళ్లు కడుగుకొని, సాయంకాల
19 పర్యంతము అపవిత్రులై యుందురు. ౹ స్రావముగల
స్త్రీ దేహమందు రక్తస్రావము కలిగిన యెడల, ఆమె
ఏడు దినములు కడగానుండ వలెను. ఆమెను ముట్టు
వారందరు సాయంకాల పర్యంతము అపవిత్రులవు
20 దురు. ౹ ఆమె కడగానున్నప్పుడు ఆమె దేని మీద
పండుకొనునో అది అపవిత్రమగును; ఆమె దేని
21 మీద కూర్చుండునో అది అపవిత్రము. ౹ ఆమె
పరుపు ముట్టు ప్రతివాడు తన బట్టలు ఉతుకుకొని,
నీళ్లతో ఒళ్లు కడుగుకొని సాయంకాల పర్యంతము
22 అపవిత్రుడగును. ౹ ఆమె దేనిమీద కూర్చుండెనో దాని
ముట్టు ప్రతివాడు తన బట్టలు ఉతుకుకొని, నీళ్లతో
ఒళ్లు కడుగుకొని సాయంకాల పర్యంతము అపవిత్రు
23 డగును. ౹ అది ఆమె పరుపుమీదనైనను ఆమె కూ
ర్చుండిన దానిమీదనైనను ఉంటే, దాని ముట్టువాడు
24 సాయంకాల పర్యంతము అపవిత్రుడగును. ౹ ఒకడు
ఆమెతో శయనించుచుండగా ఆమె అపవిత్రత వానికి
తగిలిన యెడల, వాడు ఏడు దినములు అపవిత్రుడ
గును, వాడు పండుకొను ప్రతి మంచము† అపవిత్రము.
25 స్త్రీ రక్త స్రావము ఆమె కడగానుండు కాలము
గాక, ఇంక అనేక దినములు ప్రవించినను, లేక ఆమె
కడగానుండు కాలమైన తరువాత ప్రవించినను, ఆమె
అపవిత్రత ఆమె కడగానుండు దినములలో వలెనే, ఆ
స్రావ దినములన్నిటను ఉండును; ఆమె అపవిత్రు
రాలు. ౹ ఆమె స్రావ దినములన్నిటను, ఆమె పండు 26
కొను ప్రతి మంచము, ఆమె కడగానున్నప్పటి మం
చము వలె ఆమెకుండ వలెను; ఆమె దేని మీద కూ
ర్చుండునో అది ఆమె కడగానున్నప్పటి అపవిత్రత
వలె అపవిత్రమగును. ౹ వాటిని ముట్టు ప్రతివాడు 27
అపవిత్రుడు; వాడు తన బట్టలు ఉతుకుకొని, నీళ్లతో
ఒళ్లు కడుగుకొని, సాయంకాల పర్యంతము అపవి
త్రుడగును. ౹ ఆమె తన స్రావమునుంచి పవిత్రురా 28
లుగా నుండిన యెడల, ఆమె ఏడు దినములు లెక్కిం
చుకొని, అవి తీరిన తరువాత, పవిత్రురాలుగా నుం
డును. ౹ ఎనిమిదవ నాడు, ఆమె రెండు గువ్వలనైనను 29
రెండు పావురపు పిల్లలనైనను తీసుకొని, సంఘపు
గుడారముయొక్క ద్వారమునకు యాజకునియొద్దకు వా
టిని తే వలెను. ౹ యాజకుడు పాపార్పితముగా ఒక 30
దాని, ఆరోహణ యాగముగా ఒకదాని అర్పించ వలెను;
అట్లు యాజకుడు ఆమె స్రావమునుంచి, యెహోవా
సన్నిధిని ఆమెకొరకు ఆచ్ఛాదనము చేయ వలెను.

ఇశ్రాయేలు పుత్రులు, తమ మధ్యనుండు నా 31
నివాస స్థలమును తమ అపవిత్రత వలన అపవిత్రపర
చకుండునట్లు, మీరు వారి అపవిత్రతనుంచి వారిని
విడదీయ వలెను.

స్రావిని గూర్చియు, వీర్యస్ఖలనము వలని అపవి 32
త్రత గలవాని గూర్చియు, కడగానున్న బలహీనురా
లిని గూర్చియు, స్రావముగల స్త్రీ పురుషులను గూర్చి
యు, ఇదే బోధన ప్రమాణమని పలికెను.

## 16. అధ్యాయము.

అహరోను ఇద్దరు కుమారులు యెహోవా సన్ని 1
ధికి సమీపించి చనిపోయిన తరువాత, యెహోవా
మోషేతో మాటలాడెను. అప్పుడు యెహోవా మో
షేతో ఇట్లనెను: ౹ — నేను ఆచ్ఛాదన పీఠము మీద 2
మేఘములో కనబడుదును, గనుక నీ సహోదరు
డైన అహరోను చావకుండునట్లు, అతడు పెట్టె మీద
నున్న ఆచ్ఛాదన పీఠము ఎదుటనున్న అడ్డుతెర లోపటికి
ఎల్లప్పుడు వచ్చుచుండ రాదని అతనితో చెప్పుము. ౹
వీటిని, అనగా, పాపార్పితము కొరకు ఒక కోడెదూ 3
డను, ఆరోహణ యాగముకొరకు ఒక పొట్టేలును
తీసుకొని, పరిశుద్ధ స్థలములోకి రా వలెను. ౹ అతడు పరి 4
శుద్ధమైన చొక్కాయిని తొడుగుకొని, తన మానము
నకు సన్నపునార లాగులు తొడుగుకొని, సన్నపు నార
దట్టి కట్టుకొని, సన్నపు నార పాగా పెట్టుకొన వలెను.

* లేక, పాపాచ్ఛాదనార్పితముగా. † లేక, మంచమంతయు.

అవి పరిశుద్ధ వస్త్రములు గనుక అతడు నీళ్లతో తన
5 ఒళ్లు కడుగుకొని, వాటిని వేసుకొన వలెను. ।మరియు,
అతడు ఇశ్రాయేలు పుత్రుల సంఘము నొద్దనుంచి,
పాపార్పితము కొరకు రెండు మేకపిల్లలను, ఆరోహణ
యాగము కొరకు ఒక పొట్టేలును తీసుకొని రా వలెను.
6 అప్పుడు అహరోను తన కొరకు పాపార్పితమైన*
కోడెను తీసుకొని వచ్చి, తన కొరకు తన ఇంటివారి
7 కొరకు ఆచ్ఛాదనము చేయ వలెను. ।అప్పుడు అతడు
ఆ రెండు మేకపిల్లలను తీసుకొని వచ్చి గుడారము
యొక్క ద్వారమున, యెహూవా సన్నిధిని నిలువబెట్ట
8 వలెను. ।అప్పుడు అహరోను రెండు రాళ్లను, అనగా
యెహూవాకు ఒక రాతిని, అజాజేలుకు† ఒక రాతిని
9 నియమించ వలెను. ।అప్పుడు ఏ మేకనుగూర్చి యె
హూవా రాయి పైకి వచ్చునో, ఆ మేకను అహ
రోను తీసుకొని వచ్చి, పాపార్పణ* యాగము చేయ
10 వలెను. ।అప్పుడు అజాజేలనుదాని రాయి ఏ మేకను
గూర్చి పైకి వచ్చునో దాని వలన ఆచ్ఛాదనము చేసి,
అజాజేలు కొరకు అరణ్యములో విడిచిపెట్టుటకు, దాని
యెహూవా సన్నిధిని సజీవముగా నిలువబెట్ట వలెను.
11 అప్పుడు అహరోను తనకొరకు పాపార్పితమైన*
కోడెను తీసుకొని వచ్చి, తనకొరకు తన ఇంటివారి
కొరకు ఆచ్ఛాదనము చేయ వలెను. అతడు తనకొరకు
12 పాపార్పితమైన* కోడెను వధించి,।యెహూవా సన్నిధి
నున్న ధూపపీఠము మీదనుంచి ధూపార్తెడు నిప్పు
లను, తన పిడికెళ్ల పరిమళ ధూప ద్రవ్యము తీసుకొని,
అడ్డు తెర లోపటికి వాటిని తెచ్చి, తాను చావకుండు
13 నట్లు,। ఆ ధూప మేఘము శాసనముల మీదనున్న
ఆచ్ఛాదన పీఠము కమ్ముటకు, యెహూవా సన్నిధిని
ఆ అగ్నిమీద ఆ ధూప ద్రవ్యము వేయ వలెను. ।
14 అప్పుడు అతడు ఆ కోడె రక్తములోనిది కొంచెము
తీసుకొని, తూర్పు పక్కను ఆచ్ఛాదన పీఠము మీద
తన వేలితో ప్రోక్షించి, ఆచ్ఛాదన పీఠము ఎదుట, తన
వేలితో ఆ రక్తములోనిది కొంచెము ఏడు మారులు
ప్రోక్షించ వలెను.
15 అప్పుడు అతడు ప్రజలకొరకు పాపార్పితమైన* మే
కను వధించి, అడ్డు తెర లోపటికి దాని రక్తమును తీసు
కొని వచ్చి, ఆ కోడె రక్తముతో చేసిన ప్రకారము,
దీని రక్తముతోను చేసి, ఆచ్ఛాదన పీఠము మీదను,
ఆచ్ఛాదన పీఠము ఎదుటను దాని ప్రోక్షించ వలెను. ।
16 అట్లు అతడు ఇశ్రాయేలు పుత్రుల యపవిత్రతనుబట్టి,
వారి సమస్త పాపముల ప్రకారము వారి అతిక్రమ
ములనుబట్టి పరిశుద్ధ స్థలము కొరకు ఆచ్ఛాదనము చేయ
వలెను. అటువలె, అతడు వారి అపవిత్రతతో వారి
తో నివసించు సంఘపు గుడారముకొరకు ఆచ్ఛాదనము
చేయ వలెను. । పరిశుద్ధ స్థలములో ఆచ్ఛాదనము చేయు 17
టకు అతడు లోపటికి వెళ్లునప్పుడు, అతడు బైటికి
వచ్చి, తన కొరకును, తన యింటి వారి కొరకును, ఇశ్రా
యేలు సమస్త సంఘము కొరకును ఆచ్ఛాదనము చేయు
వరకు, ఏ మనుష్యుడు సంఘపు గుడారములో నుండ
రాదు. ।మరియు, అతడు యెహూవా సన్నిధిలో 18
నున్న యజ్ఞవేదిక యొద్దకు బయిలువెళ్లి, దానికొరకు
ఆచ్ఛాదనము చేయ వలెను. అతడు ఆ కోడె రక్తము
లోనిది కొంచెము, ఆ మేక రక్తములోనిది కొంచెము
తీసుకొని, యజ్ఞవేదిక కొమ్ముల చుట్టు వాటిమీద దాని
చమర వలెను. ।అప్పుడు అతడు ఏడు మారులు తన 19
వేలితో ఆ రక్తములోనిది కొంచెము దాని మీద ప్రో
క్షించి, దాని పవిత్రపరిచి, ఇశ్రాయేలు పుత్రుల అప
విత్రతనుంచి దాని పరిశుద్ధపరచ వలెను.
అతడు పరిశుద్ధ స్థలము కొరకు, సంఘపు గుడార 20
ము కొరకు, యజ్ఞవేదిక కొరకు ఆచ్ఛాదనము చేసి
చాలించిన తరువాత, ఆ సజీవమైన మేకను దగ్గరకు
తీసుకొని రా‡ వలెను.। అప్పుడు అహరోను సజీవమైన 21
ఆ మేక తల మీద, తన రెండు చేతులనుంచి, ఇశ్రా
యేలు సమస్త పాపముల ప్రకారము, వారి అక్రమ
ములన్నియు, వారి అతిక్రమములన్నియు దాని మీద
ఒప్పుకొని, ఆ మేక తల మీద వాటిని మోపి, సిద్ధప
డిన మనుష్యుని చేత అరణ్యములోకి దాని పంప వలెను.।
ఆ మేక, ఎడారి దేశమునకు వారి అక్రమములన్నియు 22
భరించి వెళ్లును; అతడు అరణ్యములో ఆ మేకను విడి
చిపెట్ట వలెను.
అప్పుడు అహరోను, సంఘపు గుడారములోకి వచ్చి, 23
తాను పరిశుద్ధ స్థలములోకి వెళ్లినప్పుడు తాను వేసు
కొనిన నారబట్టలు తీసి, అక్కడ వాటిని ఉంచి,। పరి 24
శుద్ధ స్థలములో తన ఒళ్లు నీళ్లతో కడుగుకొని, తన
బట్టలు తిరిగి వేసుకొని, బైలు వెళ్లి తన ఆరోహణ యా
గము, ప్రజల ఆరోహణ యాగము చేసి, తనకొరకు
ప్రజలకొరకు ఆచ్ఛాదనము చేయ వలెను. । పాపార్పి 25
తమైన దాని కొవ్వును యజ్ఞవేదిక మీద ధూపము
వేయ వలెను.
అజాజేలు నొద్దకు§ మేకను విడిచినవాడు, తన 26
బట్టలను ఉతుకుకొని, నీళ్లతో తన ఒళ్లు కడుగుకొని,
ఆ తరువాత పాలెములోకి రా వలెను. । పరిశుద్ధ స్థలము 27
లో ఆచ్ఛాదనము చేయుటకు వేటి రక్తము దాని లోప
టికి తేబడెనో, ఆ పాపార్పితమైన* కోడెను, పాపా

*లేక, పాపాచ్ఛాదనార్పితమైన. †లేక, ఎడబాసినదానికి. ‡లేక, అర్పించ. §లేక, ఎడబాసినదానిగా.

ర్పితమైన* మేకను ఒకడు పాలెము వెలపటికి తీసు
కొని వెళ్ల వలెను; వాటి చర్మములు, వాటి మాంసము,
28 వాటి మలము అగ్నితో కాల్చ వలెను. । వాటిని కా
ల్చినవాడు తన బట్టలను ఉతుకుకొని నీళ్లతో ఒళ్లు
కడుగుకొని, ఆ తరువాత పాలెములోకి రా వలెను.
29 ఇది మీకు నిత్యమైన కట్టడ; మీరు అనగా మీ
స్వదేశి, మీ మధ్యనుండు పరదేశి ఏడవ నెల పదియవ
నాడు ఏ పనినైనను చేయక మిమ్మును మీరు కుందించు
30 కొన వలెను: । ఆ దినమున అతడు మిమ్ము పవిత్రపరు
చుటకు మీ కొరకు ఆచ్ఛాదనము చేయును; మీరు
యెహోవా సన్నిధిని మీ సమస్త పాపములనుంచి
31 పవిత్రులవుదురు. । అది మీకు విశ్రాంతి సబ్బాతు;
మిమ్మును మీరు కుందించుకొన వలెను; ఇది నిత్యమైన
కట్టడ.
32 అభిషేకించబడి, తన తండ్రికి మారుగా యాజకు
డవుటకు నియోగించబడిన యాజకుడు ఆచ్ఛాదనము
33 చేయ వలెను; । అతడు పరిశుద్ధ వస్త్రములైన నార వస్త్ర
ములు వేసుకొని, పరిశుద్ధమైన పరిశుద్ధాలయము కొరకు
ఆచ్ఛాదనము చేయ వలెను; అతడు సంఘపు గుడా
రము కొరకు, యజ్ఞవేదిక కొరకు ఆచ్ఛాదనము చేయ
వలెను; యాజకుల కొరకు, సర్వ జనసంఘము కొరకు
34 ఆచ్ఛాదనము చేయ వలెను. । సంవత్సరమునకు ఒక
సారి ఇశ్రాయేలు పుత్రుల సమస్త పాపములనుంచి,
వారి కొరకు ఆచ్ఛాదనము చేయుటకు ఇది నిత్యమైన
కట్టడ అని చెప్పెను. యెహోవా మోషేకు ఆజ్ఞా
పించినట్లు అతడు చేసెను.

## 17. అధ్యాయము.

1,2 యెహోవా మోషేతో ఇట్లనెను:—నీవు అహరో
నుతోను అతని కుమారులతోను, ఇశ్రాయేలు పుత్రు
లందరితోను చెప్ప వలసినది ఏదనగా:—ఇది యెహో
3,4 వా ఆజ్ఞాపించిన మాట; । ఇశ్రాయేలు యింటివారిలో
ఏ మనుష్యుడు, యెహోవా ఆలయ సన్నిధిని యె
హోవాకు అర్పితము అర్పించుటకు సంఘపు గుడార
ముయొక్క ద్వారమునొద్దకు ముందు తేకపోయిన యె
ద్దును గాని గొర్రెను గాని మేకను గాని పాలెములో
వధించినను, పాలెమునకు వెలపటను వధించినను ఆ
మనుష్యుడు రక్తాపరాధి యని నిర్ణయించ బడును;
5 వాడు రక్తము చిందెను. । ఇశ్రాయేలు పుత్రులు బైట
వధించు యాగపశువులను† తీసుకొని వచ్చి, యెహో
వా నిమిత్తము యాజకునియొద్దకు, సంఘపు గుడారము
యొక్క ద్వారమునకు వాటిని తెచ్చి, మంగళార్పణ
యాగములగా వాటిని వధించునట్లు, ఆ మనుష్యుని
వాని జనులలోనుంచి ఛేదించ వలెను. । అప్పుడు యా 6
జకుడు సంఘపు గుడారముయొక్క ద్వారమునొద్ద
నున్న, యెహోవా యజ్ఞవేదిక మీద వాటి రక్తమును
ప్రోక్షించి, వాటి క్రొవ్వును యెహోవాకు ఇంపైన
సువాసన గల ధూపము వేయ వలెను. । వారు వ్యభి 7
చారులై వేటిని అనుసరించిరో, ఆ దయ్యములకు‡ ఇక
మీదట తమ యాగపశువులను వధించ రాదు. ఇది
వారి తరతరముల మట్టుకు, వారికి నిత్యమైన కట్టడ
యని చెప్పుము.
మరియు నీవు వారిని చూచి,—ఇశ్రాయేలు ఇంటి 8,9
వారిలోనైనను, మీలో నివసించు పరదేశులలోనైనను
ఒకడు ముందుగా యెహోవాకు యాగము చేయు
టకు, సంఘపు గుడారముయొక్క ద్వారమునొద్దకు
తేకపోయిన పశువుతో ఆరోహణ యాగము గాని
వేరొక యాగముగాని చేసిన యెడల, ఆ మనుష్యుని
వాని జనులలోనుంచి ఛేదించ వలెను.
మరియు, ఇశ్రాయేలు ఇంటి వారిలోనయినను, 10
మీలో నివసించు పరదేశులలోనయినను ఒకడు దేని
రక్తమునైనను తినిన యెడల, రక్తము తినువానికి§ విరో
ధముగా నా ముఖము తిప్పుకొని, వాని జనులలోనుంచి
వాని ఛేదించెదను. । దేహ ప్రాణము రక్తములో నుం 11
డును; యజ్ఞవేదిక మీద, మీ ప్రాణములకు ఆచ్ఛాద
నము చేయుటకు దాని మీకిచ్చితిని. రక్తము దాని ప్రా
ణము వలన ఆచ్ఛాదనము చేయును. । కాబట్టి మీలో 12
ఎవడును రక్తము తిన రాదనియు, మీలో నివసించు
నేపరదేశియు రక్తము తిన రాదనియు నేను ఇశ్రా
యేలు పుత్రులతో చెప్పితిని.
మరియు, ఇశ్రాయేలు పుత్రులలోనైనను, మీలో 13
నివసించు పరదేశులలోనైనను ఒకడు తిన తగిన మృగ
మునైనను, పక్షినైనను వేటాడి పట్టిన యెడల, వాడు
దాని రక్తము చింద చేసి మంటితో కప్ప వలెను;
ఎందుకనగా, అది సమస్త దేహములకు ప్రాణము. ।
కాబట్టి నేను ఇశ్రాయేలు పుత్రులతో—మీరు ఏ 14
దేహ రక్తము తిన కూడదు; ఎందుకనగా సర్వ దేహ
ప్రాణము దాని రక్తము; దాని తిను ప్రతివాని ఛేదించ
వలెనని, ఇశ్రాయేలు పుత్రులతో చెప్పితిని.
మరియు, మృతకళేబరమునైనను, చీల్చబడినదాని 15
నైనను తిను ప్రతివాడు దేశమందు పుట్టినవాడేమి, పర
దేశియేమి వాడు తన బట్టలు ఉతుకుకొని నీళ్లతో ఒళ్లు
కడుగుకొని సాయంకాల పర్యంతము అపవిత్రుడ
గును; అప్పుడు పవిత్రుడగును. । అయినను వాడు తన 16

*లేక, పాపాచ్ఛాదనార్పితమైన. †లేక, వధ్యములను. ‡హెబ్రీలో, మేకలు. §హెబ్రిలో, ప్రాణమునకు.

ఒళ్లు కడుగుకొనకపోయిన యెడల, వాడు తన అక్ర
మము భరించుననని చెప్పుమనెను.

## 18. అధ్యాయము.

1,2 యెహోవా మోషేతో ఇట్లనెను;—ఇశ్రా
యేలు పుత్రులతో మాటలాడి,—నేను మీ దేవుడనైన
3 యెహోవాను;। మీరు నివసించిన ఐగుప్తు దేశక్రియల
చొప్పున, మీరు చేయ వద్దు. నేను మిమ్మును తీసుకొని
వచ్చుచున్న కనాను దేశక్రియలను మీరు చేయ వద్దు;
4 వారి కట్టడలనుబట్టి నడవ వద్దు.। మీరు నా విధులను
మన్నించ వలెను; నా కట్టడలనుబట్టి నడుచుటకు,
వాటిని కాపాడుకొన వలెను; నేను మీ దేవుడనైన
5 యెహోవాను.। మీరు నా కట్టడలను నా విధులను
గైకొన వలెను; వాటిని మనుష్యుడు మన్నించి వాటి
వలన బ్రతుకును; నేను యెహోవాను.

6 మీలో ఎవడును తన రక్తసంబంధురాలి మానాచ్ఛా
దము* తీయుటకు ఆమెను సమీపింప కూడదు; నేను
7 యెహోవాను.। నీ తండ్రిదే గదా, నీ తల్లి మానా
చ్ఛాదము తీయ వద్దు; ఆమె నీ తల్లి: ఆమె మానాచ్ఛా
8 దము తీయ వద్దు.। నీ తండ్రి భార్య మానాచ్ఛాదము
9 తీయ వద్దు; అది నీ తండ్రిదే.। నీ సహోదరి మానా
చ్ఛాదము అనగా, ఇంటిలో పుట్టినదేమి, వెలపట
పుట్టినదేమి, నీ తండ్రి కుమార్తెయైనను నీ తల్లి కుమా
10 ర్తెయైనను, వారి మానాచ్ఛాదము తీయ వద్దు.। నీ కుమా
రుని కుమార్తె మానాచ్ఛాదమైనను, నీ కుమార్తె కుమార్తె
మానాచ్ఛాదమైనను, వారి మానాచ్ఛాదము తీయ వద్దు;
11 వారి మానము నీది.। నీ తండ్రివలన పుట్టిన, నీ తండ్రి
భార్య కుమార్తె నీ సహోదరి; ఆమె మానాచ్ఛాదము
12 తీయ వద్దు.। నీ తండ్రి సహోదరి మానాచ్ఛాదము
13 తీయ వద్దు; ఆమె నీ తండ్రి రక్త సంబంధిని.। నీ తల్లి
సహోదరి మానాచ్ఛాదము తీయ వద్దు; ఆమె నీ తల్లి
14 రక్త సంబంధిని.। నీ తండ్రి సహోదరుని మానాచ్ఛా
దము తీయ వద్దు, అనగా అతని భార్యను సమీపింప
15 వద్దు; ఆమె నీ పినతల్లి.। నీ కోడలి మానాచ్ఛాదము తీయ
వద్దు; ఆమె నీ కుమారుని భార్య; ఆమె మానాచ్ఛాద
16 ము తీయ వద్దు.। నీ సహోదరుని భార్య మానాచ్ఛా
దము తీయ వద్దు; అది నీ సహోదరుని మానము.।
17 స్త్రీ మానాచ్ఛాదమును, ఆమె కుమార్తె మానాచ్ఛాద
మును తీయ వద్దు; ఆమె కుమారుని కుమార్తె మానాచ్ఛా
దమునైనను ఆమె కుమార్తె కుమార్తె మానాచ్ఛాదమునై
నను తీయుటకు వారిని చేర్చుకొన వద్దు; వారు ఆమె
18 రక్తసంబంధినులు; అది దుష్కామ ప్రవర్తన.। నీ భార్య
బ్రతికి యుండగా, ఆమెను పీడించుటకు, ఆమె
సహోదరి మానాచ్ఛాదము తీయుటకు ఆమెను
ఆమెతో కూడ పెండ్లి చేసుకొన వద్దు.
స్త్రీ అపవిత్రత వలన కడగానుండునప్పుడు, ఆమె 19
మానాచ్ఛాదము తీయుటకు ఆమెను సమీపింప వద్దు.।
నీ పొరుగువాని భార్యయందు నీ వీర్య స్ఖలనము చేసి 20
ఆమెవలన అపవిత్రత కలుగచేసుకొన వద్దు.। నీవు 21
ఏ మాత్రము నీ సంతానము† మోలెఖు నెద్దకు దాట
నీయ వద్దు; నీ దేవుని నామమును అపవిత్రపరచ వద్దు;
నేను యెహోవాను.। స్త్రీ శయనము వలె, పురుష శయ 22
నము చేయ వద్దు; అది హేయము.। ఏ జంతువునందు 23
నీ స్ఖలనము చేసి దాని వలన అపవిత్రత కలుగ చేసు
కొన వద్దు; జంతువు స్త్రీని పొందునట్లు, ఆమె దాని
యెదుట నిలువ రాదు; అది విపరీతము.

వాటిలో దేనివలన అపవిత్రత కలగచేసుకొనవద్దు.।
నేను మీ యెదుటనుంచి వెళ్లగొట్టుచున్న రాష్ట్రికులు 24
వాటి అన్నిటి వలన అపవిత్రులైరి.। ఆ దేశము అప 25
విత్రత గలది గనుక, నేను దాని మీద దాని అక్రమము
మోపుచున్నాను; ఆ దేశమందు కాపురమున్నవారిని
అది వెళ్లకక్కి వేయుచున్నది.। కాబట్టి, ఆ దేశము, 26-28
మీకంటే ముందుగానున్న ప్రజలను వెళ్లకక్కి వేసిన
ప్రకారము, మీరు దాని అపవిత్రపరచగా, అది మిమ్ము
వెళ్లకక్కి వేయకుండ, మీరు, అనగా మీ స్వదేశియై
నను, మీలో నివసించు పరదేశియైనను ఈ హేయ
క్రియలన్నిటిలో వేటిని చేయక, ఈ నా కట్టడలను
నా విధులను‡ కాపాడుకొన వలెను.। ఎవడు అట్టి 29
హేయ క్రియలలో వేటినైనను చేయునో, వాటిని
చేయువారిని§ వారి ప్రజల మధ్యనుంచి ఛేదించ వలె
ను.। కాబట్టి, మీకంటే ముందుగా చేయబడిన ఆ హే 30
యమైన కట్టడలలో వేటినైనను చేసి, వాటివలన అప
విత్రత కలగచేసుకొనకుండునట్లు, నేను మీకు నియ
మించిన విధి కాపాడుకొన వలెను; నేను మీ దేవుడ
నైన యెహోవానని వారితో చెప్పుమనెను.

## 19. అధ్యాయము.

మరియు యెహోవా మోషేతో ఇట్లనెను;— 1
ఇశ్రాయేలు పుత్రుల సర్వసంఘముతో మాటలాడి, 2
—మీరు పరిశుద్ధులై యుండ వలెను: మీ దేవుడనైన
యెహోవానను నేను పరిశుద్ధుడనై యున్నాను.।
మీలో ప్రతివాడు తన తల్లికి తన తండ్రికి భయపడ 3
వలెను; నా సబ్బాతులను కాపాడుకొన వలెను; నేను
మీ దేవుడనైన యెహోవాను.। మీరు చిల్లర వేల్పుల 4

* లేక, మానము కప్పేది. † లేక, వీర్యము. ‡ లేక, తీర్పులను. § హెబ్రీలో, ప్రాణములను.

తట్లు తిరగ వద్దు; మీ కొరకు పోత వేల్పులను చేసు
కొన వద్దు. నేను మీ దేవుడనైన యెహోవాను.
5 మీరు యెహోవాకు మంగళార్పణ యాగము
చేయునప్పుడు, మీరు అంగీకరించబడుటకు యాగ
6 పశువును వధించ వలెను. । మీరు దాని వధించు నాడై
నను మరునాడైనను దాని తిన వలెను. మూడవ నాటి
వరకు మిగిలి యున్నది అగ్నితో కాల్చివేయ వలెను.।
7 మూడవ నాడు దానిలోనిది కొంచెమైనను తినిన యె
8 డల, అది హేయము; అది అంగీకరించబడదు. । దాని
తినువాడు తన అక్రమము భరించును; వాడు యెహో
వా పరిశుద్ధద్రవ్యము సాధారణమైనదిగా చేసెను. ఆ
జీవుడు తన ప్రజలలోనుంచి ఛేదించబడ వలెను.
9 మీరు మీ భూమి పంట కోయునప్పుడు, నీ పొల
ముయొక్క పక్కలలో బొత్తిగా కోయ వద్దు; నీ కో
తలో రాలిన పరిగెను ఏరుకొన వద్దు, నీ ఫలవృక్షముల
10 తోట పరిగె పండ్లను పుచ్చుకొన వద్దు; నీ ఫలవృక్ష
ముల తోటలో రాలిన పండ్లను ఏరుకొన వద్దు; బీదల
కును అతిథులకును వాటిని విడిచిపెట్ట వలెను: నేను మీ
దేవుడనైన యెహోవాను.
11 దొంగిల వద్దు; బొంక వద్దు; ఒకనితో ఒకడు కల్ల
12 లాడ వద్దు. । నా నామమునుబట్టి అబద్ధ ప్రమాణము
చేయ వద్దు. నీ దేవుని నామము సాధారణమైనదిగా
13 చేయ వద్దు. । నీ పొరుగువాని హింసించ వద్దు; వాని
దోచుకొన వద్దు. కూలివాని కూలి మరునాటి వరకు,
14 నీ యొద్దనుంచుకొన వద్దు. । చెవిటివాని తిట్ట వద్దు; గుడ్డి
వాని యెదుట అడ్డము పెట్ట వద్దు; నీ దేవునికి భయ
15 పడ వలెను; నేను యెహోవాను. । అన్యాయమైన
తీర్పు చేయ వద్దు; బీదవాడని, పక్షపాతము చేయ
వద్దు; గొప్పవాడని సన్మానించ వద్దు; న్యాయమును
బట్టి నీ పొరుగువానికి తీర్పు చేయ వలెను.
16 నీ ప్రజలలో తిరుగుబోతువై కొండెములాడు
చుండ వద్దు; నీ సహోదరుని జీవమునకు* విరోధ
17 ముగా నిలువ వద్దు, నేను యెహోవాను. । నీ హృద
యములో నీ సహోదరుని మీద పగపట్ట వద్దు; నీ
పొరుగువాడు పాపము భరించకుండునట్లు, నీవు వాని
18 గద్దించనే గద్దించ వలెను. । హింసకు ప్రతి హింస
చేయ వద్దు; నీ ప్రజల పుత్రుల మీద కోపపడక,
నిన్నువలె నీ పొరుగువాని ప్రేమించ వలెను.
19 మీరు నా కట్టడలను కాపాడుకొన వలెను. నీ
జంతువులలో వేరే జాతులను కలియనీయ వద్దు; నీ పొ
లములో వేరే జాతుల విత్తనములు చల్ల వద్దు; వెంట్రుక
నారలు కలిసిన బట్ట వేసుకొన వద్దు.

ఒకనికి ప్రధానము చేయబడిన దాసి ఏ మాత్రము 20
విమోచించబడకనైనను, విడిపించబడకనైనను ఉండ
గా, ఒకడు ఆమెతో శయనించి వీర్యస్ఖలనము చేసిన
యెడల, శిక్షించ వలెను; ఆమె విడిపించబడలేదు గనుక
వారిని చంప వద్దు. । అతడు తన అపరాధము కొరకు 21
యాగపశువుననగా, సంఘపు గుడారముయొక్క ద్వా
రమునకు, యెహోవా సన్నిధికి అపరాధార్పితమైన
పొట్టేలును తీసుకొని రా వలెను. । అప్పుడు యాజ 22
కుడు అతనికొరకు†, అతడు చేసిన అతని పాపము
కొరకు†, అపరాధార్పితమైన పొట్టేలు వలన, యెహో
వా సన్నిధిని ఆచ్ఛాదనము చేయ వలెను. అట్లు, అతడు
చేసిన పాపమునుంచి అతనికి విమోచనము కలుగును.
మీరు ఆ దేశమునకు వచ్చి ఆహారము కొరకు నానా 23
విధములైన చెట్లను నాటినప్పుడు, వాటి పండ్లు ఛేదన
సంస్కారము లేనివిగా ఎంచ వలెను; అవి మూడు
సంవత్సరములవరకు, మీకు ఛేదనసంస్కారము లేని
విగానుండ వలెను; వాటిని తిన వద్దు. । నాలుగవ సంవ 24
త్సరమున ఆ ఫలములన్ని యెహోవాకు పరిశుద్ధ
మైన స్తుతియాగ ద్రవ్యములగును. । ఐదవ సంవత్సర 25
మున, ఆ ఫలములు తిన వచ్చును. అట్లు వాటి కాపు
మీకు ఎక్కువగా నుండును: నేను మీ దేవుడనైన యె
హోవాను.
రక్తము గలది యేదియు తిన వద్దు; । శకునములు 26
విచారించ వద్దు; మేఘోత్పాతములు విచారించ వద్దు. ।
మీ తల పక్కలను బటువుగా కత్తిరించ వద్దు; నీ గడ్డపు 27
మూలలను గొరగ వద్దు; । చచ్చినవాని కొరకు మీ దేహ 28
మును నరుకుకొన వద్దు; పచ్చబొట్లు మీ దేహము మీద
పొడుచుకొన వద్దు.
నీ కుమార్తె వ్యభిచారిణి యగునట్లు, ఆమెను వేశ్య 29
గా చేయ వద్దు; దాని వలన మీ దేశము వ్యభిచారము
చేయును; అప్పుడు ఆ దేశము దుష్కామ ప్రవర్తనతో
నిండి యుండును.
నా సబ్బాతులను కాపాడుకొన వలెను; నా పరిశు 30
ద్ధాలయమునకు భయపడ వలెను: నేను యెహోవాను.
కర్ణపిశాచి గలవారితట్టు తిరగ వద్దు; సోదెకాం 31
డ్లను శోధించి వారి వలన అపవిత్రత కలుగచేసుకొన
వద్దు. నేను మీ దేవుడనైన యెహోవాను.
నెరవెంట్రుకల యెదుట లేచి, ముసలివాని ముఖ 32
ము ఘనపరిచి, నీ దేవునికి భయపడ వలెను. । మీ దేశ 33
ములో పరదేశి నీతో నివసించునప్పుడు, వాని బాధించ
వద్దు. । మీతో నివసించు పరదేశి, మీలో పుట్టినవాని 34

* హెబ్రీలో; రక్తమునకు. † లేక, మీద.

వలె మీకుండ వలెను. నిన్ను వలె వాని ప్రేమించ
వలెను. ఐగుప్తుదేశములో, మీరు పరదేశులై యుంటిరి:
నేను మీ దేవుడనైన యెహోవాను.
35 తీర్పులోను, పరిమాణములోను, తూనికెలోను,
36 కొలలోను మీరు అక్రమము చేయ వద్దు. । న్యాయ
మైన త్రాసులు, న్యాయమైన గుండ్లు, న్యాయమైన
ఏపా, న్యాయమైన హీను మీకుండ వలెను. నేను ఐగు
ప్తుదేశములోనుంచి మిమ్మును తీసుకొని వచ్చిన యె
37 హోవాననే మీ దేవుడను, । గనుక మీరు నా కట్టడ
లన్నియు నా తీర్పులన్నియు కాపాడుకొని, వాటిని
చేయ వలెను: నేను యెహోవానని చెప్పుమనెను.

## 20. అధ్యాయము.

1,2 మరియు, యెహోవా మోషేతో ఇట్లనెను; ।—
మరియు, నీవు ఇశ్రాయేలు పుత్రులను చూచి, ।—ఇశ్రా
యేలు పుత్రులలోనైనను, ఇశ్రాయేలు ప్రజలలో నివ
సించు పరదేశులలోనైనను ఒకడు ఏ మాత్రము తన సం
తానము* మోలెఖుకిచ్చిన యెడల, వాని చంప వలెను.
3 మీ దేశప్రజలు రాళ్లతో వాని కొట్ట వలెను. । ఆ మను
ష్యుడు నా పరిశుద్ధాలయము అపవిత్రపరిచి, నా పరి
శుద్ధనామము సాధారణమైనదిగా చేయుటకు తన సం
తానము* మోలెఖుకిచ్చెను గనుక నా సన్నిధి దూతను†
వానికభిముఖముగా నుండచేసి వాని ప్రజలలోనుంచి
4 వాని ఛేదించెదను. । మీ దేశ ప్రజలు వాని చంపక,
వాడు తన సంతానము* మోలెఖుకిచ్చినప్పుడు, ఏ మా
5 త్రమైనను కన్నులను మూసుకొనిన యెడల, । నేను ఆ
మనుష్యునికి విరోధముగాను వాని కుటుంబమునకు
విరోధముగాను నా సన్నిధి దూతను† నిలువబెట్టి వా
నిని, మోలెఖుతో వ్యభిచరించుటకు వాని వెంబడిగా
వ్యభిచారము చేయునందరిని వారి ప్రజలలోనుంచి
6 ఛేదించెదను. । మరియు, కర్ణపిశాచి గలవారితోను సోది
కాండ్లతోను వ్యభిచరించుటకు, వారితట్టు తిరుగువాడె
వడో వానికి విరోధముగా నా సన్నిధి దూతను† నిలు
వబెట్టి, వాని ప్రజలలోనుంచి వాని ఛేదించెదను. ।
7 కావున, మిమ్మును మీరు పరిశుద్ధపరుచుకొని పరిశుద్ధులై
యుండుడి; నేను మీ దేవుడనైన యెహోవాను. ।
8 మీరు నా కట్టడలను కాపాడుకొని, వాటిని అనుస
రించ వలెను; నేను మిమ్మును పరిశుద్ధపరుచు యె
హోవాను.
9 ఎవడు తన తండ్రినైనను తన తల్లినైనను దూషిం
చునో, వాని చంప వలెను; వాడు తన తండ్రినైనను
తన తల్లినైనను దూషించెను గనుక, వాని రక్తాపరాధము
వాని మీదనుండును.
ఒకడు పరుని భార్యతో వ్యభిచరించిన యెడల వాని, 10
అనగా తన పొరుగు వాని భార్యతో వ్యభిచరించిన
వ్యభిచారకుని, ఆ వ్యభిచారిణిని చంప వలెను. । తన 11
తండ్రి భార్యతో శయనించినవాడు తన తండ్రి మా
నాచ్ఛాదము తీసెను; వారిద్దరిని చంప వలెను; వారి
రక్తాపరాధము వారిమీద నుండును. । ఒకడు తన కోడ 12
లితో శయనించిన యెడల, వారిద్దరిని చంప వలెను;
వారు విపరీతము చేసిరి; వారి రక్తాపరాధము వారి మీద
నుండును: । ఒకడు స్త్రీ శయనము వలె పురుషశయనము 13
చేసిన యెడల, వారిద్దరు హేయక్రియ చేసిరి; వారిని
చంప వలెను; వారి రక్తాపరాధము వారిమీద నుండు
ను. । ఒకడు స్త్రీని, ఆమె తల్లినికూడ పెండ్లాడిన యె 14
డల, అది దుష్కామ ప్రవర్తన; దుష్కామ ప్రవర్తన
మీ మధ్య నుండకుండ, వానిని వారిని అగ్నితో కాల్చ
వలెను. । జంతు శయనము చేయువాని చంప వలెను; 15
ఆ జంతువును చంప వలెను. । స్త్రీని జంతువు పొందున 16
ట్లు, ఆమె దాని సమీపించిన యెడల, ఆ స్త్రీని ఆ జం
తువును చంప వలెను ; ఆమెను, దానిని చంప వలెను;
వాటి రక్తాపరాధము వాటిమీద నుండును. । ఒకడు తన 17
సహోదరిని, అనగా తన తండ్రి కుమార్తెనైనను తన
తల్లి కుమార్తెనైనను చేర్చుకొని, ఆమె దిసమొలను వా
డు, వాని దిసమొలను ఆమె చూచిన యెడల, అది దుర
నురాగము; వారిని వారి జనపుత్రుల యెదుట ఛేదించ
వలెను; వాడు తన సహోదరి మానాచ్ఛాదము తీసెను;
తన అక్రమము భరించును. । కడగానున్న స్త్రీతో శయ 18
నించి, ఆమె మానాచ్ఛాదము తీసినవాడు ఆమె రక్త
ధారాచ్ఛాదము తీసెను, ఆమె తన రక్తధారాచ్ఛాదము
తీసుకొనెను; వారిద్దరిని వారి ప్రజలలోనుంచి ఛేదించ
వలెను. । నీ పినతల్లి మానాచ్ఛాదమునైనను, నీ మేనత్త 19
మానాచ్ఛాదమునైనను తీయ వద్దు; తీసినవాడు తన రక్త
సంబంధిని మానాచ్ఛాదము తీసెను; వారు తమ అక్ర
మము భరించెదరు. । పినతల్లి మేనత్తలతో శయనించిన 20
వాడు తన తలి దండ్రుల సహోదరుల మానాచ్ఛాదము
తీసెను; వారు తమ పాపము భరించెదరు; సంతాన
హీనులై మరణమవుదురు. । ఒకడు తన సహోదరుని 21
భార్యను చేర్చుకొనిన యెడల, అది హేయము; వాడు
తన సహోదరుని మానాచ్ఛాదము తీసెను. వారు సం
తాన హీనులై యుందురు.
కాబట్టి మీరు నివసించునట్లు నేను ఏ దేశము 22
నకు మిమ్మును తీసుకొని వచ్చుచున్నానో, ఆ దేశము

* లేక, వీర్యము. † హెబ్రీలో, సన్నిధిని.

మిమ్మును వెళ్లకక్కివేయనట్లు, మీరు నా కట్టడలన్నియు
నా విధులన్నియు కాపాడుకొని, వాటిని అనుసరించ
23 వలెను. । నేను మీ యెదుటనుంచి వెళ్లగొట్టుచున్న రా
ష్ట్రికుల కట్టడలనుబట్టి నడువ వద్దు. వారు ఆ క్రియలన్ని
24 యు చేసిరి; నేను వారియందు అసహ్యపడితిని. । నేను
మీతో చెప్పిన మాట—మీరు వారి భూమి స్వతంత్రిం
చుకొందురు; అది, అనగా పాలు తేనెలు ప్రవహిం
చునా దేశము మీకు స్వాస్థ్యముగా నుండునట్లు, దాని
మీకిచ్చెదను: జనములలోనుంచి మిమ్మును వేరుపరిచిన
25 మీ దేవుడనగు యెహోవాను నేనే. । కావున, మీరు
పవిత్ర జంతువులకును అపవిత్ర జంతువులకును, పవిత్ర
పక్షులకును అపవిత్ర పక్షులకును వేరు చేయ వలెను;
నేను అపవిత్రమైనదని మీకు వేరుచేసిన ఏ జంతువు
వలనైనను ఏ పక్షి వలనైనను, నేలపాకు దేని వలనైనను
26 మిమ్మును* అపవిత్రపరుచుకొన వద్దు. । మీరు నాకు పరి
శుద్ధులై యుండ వలెను; యెహోవానను నేను పరిశు
ద్ధుడను; మీరు నావారై యుండునట్లు, అన్య జనుల
27 లోనుంచి మిమ్మును వేరుపరిచితిని. । పురుషునియందేమి,
స్త్రీయందేమి కర్ణపిశాచియైనను సోదెయైనను ఉండిన
28 యెడల, వారిని చంప వలెను. । వారిని రాళ్లతో చావగొట్ట
వలెను. వారి రక్తాపరాధము వారి మీద నుండునని
చెప్పుమనెను.

## 21. అధ్యాయము.

1 మరియు యెహోవా మోషేతో ఇట్లనెను:—
2 అహరోను కుమారులగు యాజకులతో మాటలాడి—
మీలో ఎవడును తన ప్రజలలో శవము వలన తనను
అపవిత్రపరుచుకొన రాదు. అయినను తనకు సమీప
మైన రక్తసంబంధి కొరకు,† అనగా తన తల్లి కొరకు, తన
తండ్రి కొరకు,† తన కుమారుని కొరకు,† తన కుమార్తె
3 కొరకు,† తన సహోదరుని కొరకు, । † తనకు సమీప
మైన శుద్ధ సహోదరి అవివాహితురాలుగా నుండిన
యెడల, ఆమె కొరకు† అపవిత్రపరుచుకొన వచ్చును. ।
4 అతడు తన ప్రజలలో యజమానుడు గనుక తనను అప
విత్రపరుచుకొని సాధారణునిగా చేసుకొన రాదు. ।
5 వారు తమ తలలు బోడి చేసుకొన రాదు; తమ గడ్డపు
పక్కలను క్షౌరము చేసుకొన రాదు; వారు కత్తితో
6 తమ దేహములను నరుకుకొన రాదు. । వారు తమ దేవునికి
పరిశుద్ధులై యుండ వలెను; వారు తమ దేవుని నామము
సాధారణమైనదిగా చేయ రాదు; ఎందుకనగా వారు తమ
దేవుని ఆహారమనగా, యెహోవా హోమములను
అర్పించువారు; కావున పరిశుద్ధులై యుండవలెను.

వారు జారస్త్రీనైనను భ్రష్టురాలినైనను పెండ్లాడ 7
రాదు; పెనిమిటి విడనాడిన స్త్రీని పెండ్లాడ రాదు;
ఎందుకనగా, యాజకుడు తన దేవునికి పరిశుద్ధుడు. ।
అతడు నీ దేవుని ఆహారము అర్పించువాడు గనుక, 8
అతని పరిశుద్ధపరచ వలెను; మిమ్మును పరిశుద్ధపరుచు
కొను యెహోవానను నేను పరిశుద్ధుడను గనుక
అతడు మీకు పరిశుద్ధుడు కా వలెను. । మరియు యాజ 9
కుని కుమార్తె జారత్వమువలన తనను అపవిత్రపరుచు
కొనిన యెడల, ఆమె తన తండ్రిని అపవిత్రపరుచునది;
అగ్నితో ఆమెను దహించ వలెను.

తన సహోదరులలో ఎవని తలమీద అభిషేక 10
తైలము పోయబడునో, యాజక వస్త్రములు వేసు
కొనుటకు ఎవడు నియోగించబడునో,‡ ఆ ప్రధాన
యాజకుడు తన తలకప్పు తీయ రాదు, తన బట్టలు చిం
పుకొన రాదు. । అతడు శవము దగ్గరకు వెళ్ల రాదు; 11
తన తండ్రికొరకైనను, తన తల్లికొరకైనను తనను అప
విత్రపరుచుకొన రాదు; । అతని దేవుని అభిషేక తైల 12
నియోగము అతని మీదనుండును గనుక అతడు పరి
శుద్ధాలయములోనుంచి బైలు వెళ్ల రాదు; తన దేవుని
పరిశుద్ధాలయము సాధారణమైనదిగా చేయ రాదు;
నేను యెహోవాను.

అతడు శుద్ధస్త్రీని పెండ్లాడ వలెను. । విధవనైనను, 13,14
విడనాడబడిన దానినైనను, భ్రష్టురాలినైనను అనగా
జారస్త్రీనైనను, అట్టివారిని పెండ్లాడక, తన ప్రజల
లోని శుద్ధస్త్రీని పెండ్లాడ వలెను. । యెహోవానను 15
నేను అతని పరిశుద్ధపరుచువాడను గనుక, అతడు తన
ప్రజలలో తన సంతానము సాధారణమైనదిగా చేయ
రాదని వారితో చెప్పుమనెను.

యెహోవా మోషేతో ఇట్లనెను:—నీవు అహరో 16,17
నుతో మాటలాడి—నీ సంతాన తరములలో ఒకనికి
కళంకమేదైనను కలిగిన యెడల, అతడు తన దేవుని
ఆహారము అర్పించుటకు సమీపించ రాదు; । ఎందుకన 18
గా, ఎవనియందు కళంకముండునో, అతడు గుడ్డివాడే
కాని, కుంటివాడే కాని, ముక్కిడివాడే కాని, విపరీత
మైన అవయవము గలవాడే కాని, । కాలైనను, చేయై 19
నను విరిగినవాడే కాని, । గూనివాడే కాని, గుజ్జువాడే 20
కాని, కంటిలో పువ్వుగలవాడే కాని, గారాబను§ రో
గము గలవాడే కాని, చిరుగుడే కాని, వృషణములు నలి
గినవాడే కాని సమీపింప రాదు. । యాజకుడయిన 21
అహరోను సంతానములో కళంకము గల ఏ మనుష్యు
డును యెహోవా హోమములను అర్పించుటకు
సమీపింప రాదు; అతడు కళంకము గలవాడు; అట్టి

* లేక, మీ ప్రాణములను. † లేక, వలన. ‡ లేక, ఎవని చేతులు నిండించబడునో. § Perhaps scurvy.

వాడు తన దేవుని ఆహారము అర్పించుటకు సమీపించ
22 రాదు। అతడు అతి పరిశుద్ధమైనవే కాని, పరిశుద్ధమైనవే
23 కాని, తన దేవుని ఆహారము తిన వచ్చును। మెట్టుకు,
అతడు కళంకము గలవాడు గనుక అడ్డుతెరలోపటికి
వెళ్లి, నా పరిశుద్ధమైనవాటిని సాధారణమైనవాటినిగా
చేయ రాదు; నేను వారిని పరిశుద్ధపరచు యెహో
వానని వానితో చెప్పుమనెను. అట్లు మోషే అహరో
నుతోను, అతని కుమారులతోను, ఇశ్రాయేలు పుత్రు
లందరితోను చెప్పెను.

## 22. అధ్యాయము.

1,2 యెహోవా మోషేతో ఇట్లనెను:—అహరోను,
అతని కుమారులు నా నిమిత్తము పరిశుద్ధపరచువాటి
వలన, నా పరిశుద్ధనామము సాధారణమైనదిగా చేయ
కుండునట్లు, వారు ఇశ్రాయేలు పుత్రుల పరిశుద్ధమైన
వాటినుంచి వేరు చేయబడ వలెనని వారితో చెప్పు
3 ము; నేను యెహోవాను। నీవు వారిని చూచి—మీ
తరతరముల మట్టుకు మీ సమస్త సంతానములలో ఒకడు
అపవిత్రత గలవాడై, ఇశ్రాయేలు పుత్రులు యెహో
వాకు పరిశుద్ధపరచువాటిని సమీపించిన యెడల, అట్టి
వాడు* నా సన్నిధినుంచి ఛేదించబడ వలెను: నేను
4 యెహోవాను। అహరోను సంతానములో ఒకనికి
కుష్ఠమైనను, స్రావమైనను ఉండిన యెడల, అట్టివాడు
పవిత్రత పొందు వరకు, పరిశుద్ధమైన వాటిలో దేనిని
తిన రాదు; శవము వలని అపవిత్రత గల దేనినైనను ము
ట్టువాడు కాని, వీర్యస్ఖలితుడు కాని, తనకు అపవిత్ర
5 మైన పురుగునైనను, ఏ అపవిత్రత వలన తనకు అప
విత్రుడైన మనుష్యునినైనను ముట్టువాడు కాని, అట్టి
అపవిత్రత తగిలినవాడు, సాయంకాల పర్యంతము అప
6 విత్రుడు; అతడు నీళ్లతో ఒళ్లు కడుగుకొను వరకు,
7 పరిశుద్ధమైనవాటిని తిన రాదు। సూర్యుడు అస్తమించి
నప్పుడు, అతడు పవిత్రుడగును; ఆ తరువాత అతడు
పరిశుద్ధమైనవాటిని తిన వచ్చును; వాని ఆహారమది।
8 అతడు కళేబరమునయినను, చీల్చబడినదానినయినను
తిని దానివలన అపవిత్రపరచుకొన రాదు; నేను యె
9 హోవాను। కాబట్టి, కాపాడుకొనుటకు నేను విధిం
చినదాని అపవిత్రపరచినందున, దాని పాప భారము
మోసుకొని దానివలన చావకుండునట్లు దాని కాపా
డుకొన వలెను; నేను వారిని పరిశుద్ధపరచు యె
హోవాను.
10 అన్యుడు పరిశుద్ధమైనదాని తిన రాదు: యాజకుని
యింట నివసించు అన్యుడైనను జీతకాడైనను పరిశుద్ధ
మైనదాని తిన రాదు। అయినను యాజకుడు క్రయ 11
ధనమిచ్చి కొనినవాడును, అతని ఇంట పుట్టినవాడును
వాని ఆహారము తిన వచ్చును। యాజకుని కుమార్తె 12
అన్యునికి భార్యగానుండిన యెడల, ఆమె, పరిశుద్ధార్పి
తములలో పైకెత్తబడిన దేనినైనను తినరాదు। అయితే, 13
యాజకుని కుమార్తెలలో విధవయినను, విడనాడబడిన
దయినను సంతానములేని యెడల, ఆమె తన బాల్య
మందు వలె తన తండ్రి యింటికి తిరిగి చేరి తన తండ్రి
ఆహారము తినవచ్చును, కాని అన్యుడెవడును దాని తిన
రాదు। ఒకడు పరాకున† పరిశుద్ధమయినదాని తినిన 14
యెడల, వాడు ఆ పరిశుద్ధమైన దానిలో అయిదవ వంతు
కలిపి దానితో కూడ యాజకునికియ్య వలెను। ఇశ్రా 15
యేలు పుత్రుల పరిశుద్ధమైనవాటిని, అనగా వారు
యెహోవాకు ఎత్తి అర్పించువాటిని సాధారణమైన
వాటినిగా చేయరాదు; । అన్యులు వారి పరిశుద్ధమైన 16
వాటిని తినిన యెడల, అక్రమ భారము వారిమీద
మోపి అపరాధాచ్ఛాదనము చేయించవలెను: నేను వా
టిని‡ పరిశుద్ధపరచు యెహోవానని చెప్పుమనెను.
యెహోవా మోషేతో ఇట్లనెను;—నీవు అహ 17,18
రోనుతోను అతని కుమారులతోను, ఇశ్రాయేలు పుత్రు
లందరితోను మాటలాడి—ఇశ్రాయేలు ఇంటివారిలో
నేకాని, ఇశ్రాయేలీయులలో నివసించు పరదేశులలో
నేకాని, ఎవడు తన స్వేచ్ఛార్పితములన్నిటి కొరకైనను,
తన మ్రొక్కుబడి అర్పితములన్నిటికొరకైనను, మను
ష్యులు యెహోవా ఆరోహణయాగముగా అర్పించు
నట్టి తన అర్పితమును దగ్గరకు తీసుకొని వచ్చునో।
వాడు§ అంగీకరించబడుటకు గోవులలోనైనను, గొర్రె 19
లలోనైనను, దోషములేని మగదాని దగ్గరకు తీసుకొని
రా వలెను। దేనికి కళంకముండునో దాని అర్పించ 20
రాదు; అది మీ నిమిత్తము అంగీకరించబడదు। ఒకడు 21
మ్రొక్కుబడి చెల్లించుటకు, యెహోవాకు మంగళా
ర్పితమైన యాగమునైనను, గోవులేమి, గొర్రెలేమి,
మేకలేమి స్వేచ్ఛార్పితమునైనను అర్పించునప్పుడు, అది
అంగీకరించబడుటకు దోషములేనిదై యుండ వలెను;
దానిలో నే కళంకమునుండ రాదు। గుడ్డిదేమి, విరిగిన 22
దేమి, కొరత గలదేమి, కంతి గలదేమి, గారాబను రోగ
ము గలదేమి, చిరుగుడు|| గలదేమి, అట్టివాటిని యె
హోవాకు అర్పించ వద్దు; వాటిలో దేనిని యజ్ఞవే
దిక మీద యెహోవాకు హోమము చేయ వద్దు।
అవయవములలో ఎక్కువ తక్కువ గల కోడెనైనను, 23
గొర్రెమేకల మందలోని దానినైనను స్వేచ్ఛార్పితముగా
అర్పించ వచ్చును కాని, అది మ్రొక్కుబడిగా అంగీ

* లేక, ఆ ప్రాణము. † లేక, బుద్ధిహీనత వలన. ‡ లేక, వారిని. § హెబ్రీలో, మీరు. || లేక, తామర.

24 కరించబడదు. । విత్తులు నులిపినదానినైనను, విరిగిన దా
నినైనను, చితికినదానినైనను, కోయబడినదానినైనను,
యెహోవాకు అర్పించ వద్దు; మీ దేశములో అట్టి
25 వికారము చేయ వద్దు. । పరదేశి చేతినుంచి, అట్టి వాటి
లో దేనిని తీసుకొని మీ దేవుని ఆహారముగా అర్పించ
వద్దు వారి* చెరుపు వాటిలోనుండును; వాటిలో కళం
కములుండును; అవి మీకొరకు అంగీకరించబడవని
చెప్పుమనెను.

26,27 యెహోవా మోషేతో మాటలాడి,—దూడ
అయినను, గొఱ్ఱెపిల్ల అయినను, మేకపిల్ల అయినను
పుట్టునప్పుడు, అది ఏడు దినములు దాని తల్లితోనుండ
వలెను. ఎనిమిదవనాడు మొదలుకొని, అది యెహో
వాకు హోమార్పితముగా అంగీకరించబడ వచ్చును. ।
28 అయినను అది ఆవైతేనేమి, గొఱ్ఱెమేకలలోనిదైతే నే
మి, మీరు దానిని దాని పిల్లను ఒక్కనాడే వధించ వద్దు.
29 మీరు కృతజ్ఞతా యాగ పశువును వధించునప్పుడు,
మీరు అంగీకరించబడుటకు దాని అర్పించ వలెను. ।
30 ఆ నాడే దాని తినివేయ వలెను; మరునాటి పర్యంత
ము దానిలోనిది కొంచెమైనను మిగిలించ వద్దు: నేను
యెహోవాను.

31 కావున మీరు నా ఆజ్ఞలను కాపాడుకొని, వాటిని
32 అనుసరించ వలెను: నేను యెహోవాను. । నా పరి
శుద్ధ నామమును సాధారణమైనదానిగా చేయ వద్దు.
నేను ఇశ్రాయేలు పుత్రులలో, నన్ను పరిశుద్ధునిగా
33 చేసుకొందును; । నేను మిమ్మును పరిశుద్ధపరుచు యె
హోవాను; నేను మీకు దేవుడనైయుండుటకు, ఐగు
ప్తుదేశములోనుంచి మిమ్మును తీసుకొనివచ్చిన యెహో
వానని చెప్పెను; నేను యెహోవాను.

## 23. అధ్యాయము.

1,2 యెహోవా మోషేతో ఇట్లనెను:— నీవు ఇశ్రా
యేలు పుత్రులతో మాటలాడి— యెహోవా విశేష
దినములనగా, మీరు పరిశుద్ధ సంఘములని చాటించు
నవి నా విశేషకాలములు.

3 ఆరు దినములు పని చేయ వలెను; ఏడవ దినము
విశ్రాంతి సబ్బాతు; అది పరిశుద్ధ సంఘ దినము; అందు
మీరు ఏ పనినైనను చేయ వద్దు; మీ సమస్త నివాస
ములయందు, అది యెహోవా సబ్బాతు.

4 ఇవి అనగా, యెహోవా విశేషదినములు పరి
శుద్ధ సంఘ దినములు; వాటి నిర్ణయ దినములలో, వాటిని
5 చాటించ వలెను. । మొదటి నెల పదునాలుగవ దినమున,
ప్రదోష కాలమందు, యెహోవా పస్క యుండును. ।
ఆ నెల పదునైదవ దినమున, యెహోవా పొంగని 6
వాటి పండుగ; ఏడు దినములు మీరు పొంగనివాటినే
తిన వలెను. । మొదటి దినమున మీలో పరిశుద్ధ సంఘ 7
ముండ వలెను; అందు మీరు ఏ వ్యాపారములను చేయ
వద్దు. । ఏడు దినములు మీరు యెహోవాకు హో 8
మార్పణము చేయ వలెను; ఏడవ దినమున పరిశుద్ధ సంఘ
ముండ వలెను; అందు మీరు ఏ వ్యాపారమును చేయ
వద్దని వారితో చెప్పుమనెను.

యెహోవా మోషేతో ఇట్లనెను:—నీవు ఇశ్రా 9,10
యేలు పుత్రులతో మాటలాడి— నేను మీకిచ్చుచున్న
దేశమునకు, మీరు వచ్చి, దాని పంట కోయునప్పుడు,
మీ మొదటి పంటలో ఒక పనను యాజకుని యొద్దకు
తే వలెను. । మీరు అంగీకరించబడుటకు, అతడు యెహో 11
వా సన్నిధిలో, ఆ పనను అల్లాడించ వలెను; సబ్బాతు
మరునాటి దినమున, యాజకుడు దాని అల్లాడించ వలె
ను. । మీరు ఆ పనను అర్పించు దినమున, నిర్దోషమైన ఏ 12
డాది గొఱ్ఱెపోతును యెహోవాకు ఆరోహణయాగ
ముగాఅర్పించ వలెను. । దాని కానుక, నూనెతో కలిపిన 13
రెండు పదియవ వంతుల గోధుముల పిండి; అది యె
హోవాకు ఇంపైన సువాసనగల హోమము; దాని
పానార్పణము హీనులో నాలుగవ వంతు ద్రాక్షా
రసము. । ఆ దినము వరకే, అనగా మీరు మీ దేవుని 14
అర్పితము తెచ్చు వరకు, మీరు రొట్టెనేమి, పేలాల
నేమి, పచ్చని వెన్నులనేమి తిన వద్దు. అది మీ తర
తరముల మట్టుకు మీ నివాస స్థలములన్నిటిలో నిత్య
మైన కట్టడ.

మీరు సబ్బాతు మరునాడు మొదలుకొని, అనగా 15
అల్లాడించు నర్పితమైన పనను మీరు తెచ్చిన దినము
మొదలుకొని దినములు లెక్కించుకొన వలెను. కొరత
లేని ఏడు సబ్బాతులుండ వలెను. । ఏడవ సబ్బాతు 16
మరునాటి దినము వరకు, మీరు ఏబది దినములు లెక్కిం
చుకొని, యెహోవాకు క్రొత్త కానుకను అర్పించ
వలెను. । మీరు మీ నివాసములలోనుంచి, రెండేసి పది 17
యవవంతుల రెండు రొట్టెలను, అల్లాడించు నర్పణము
కొరకు తే వలెను. వాటిని గోధుముల పిండితో చేసి,
పొంగబెట్టి కాల్చ వలెను; అవి యెహోవా ప్రథమ
ఫలములు. । మరియు, మీరు ఆ రొట్టెలతో, నిర్దోష 18
మైన ఏడాది ఏడు గొఱ్ఱెపోతులను, ఒక కోడెదూ
డను, రెండు పెద్ద పొట్టేళ్లను అర్పించ వలెను; అవి
వారి కానుకలతోను, వారి పానార్పణములతోను ఆరో
హణయాగమనగా, యెహోవాకు యింపైన సువాసన
గల హోమముగానుండును. । అప్పుడు మీరు మేక 19

* లేక, వాటి.

లలో ఒక పోతును, పాపార్పణముగా* యాగముచేసి,
ఏడాదివైన రెండు మేకపోతులను సమాధానార్పణయాగ
20 ము చేయ వలెను.। యాజకుడు ప్రథమ ఫలముల రొట్టె
లతోకూడ, వాటిని ఆ రెండు పొట్టేళ్లను, యెహో
వా సన్నిధిలో అల్లాడించ వలెను; అవి యెహోవాకు
21 పరిశుద్ధమైనవై యాజకునివగును.। ఆ దినమందే, మీకు
పరిశుద్ధ సంఘముండునని చాటించ వలెను; అందు
మీరు ఏ లౌకిక వ్యాపారమును చేయ వద్దు; అది
మీ సమస్త నివాసములలో, మీ తరతరముల మట్టుకు
నిత్యమైన కట్టడ.

22 మీరు మీ భూమి పంట కోయునప్పుడు, నీ పొల
ముయొక్క పక్కలలో బొత్తిగా కోయ వద్దు; నీ కోత
లో రాలిన పరిగెను ఏరుకొన వద్దు; బీదలకును పర
దేశులకును వాటిని విడిచి పెట్ట వలెను. నేను మీ దేవుడ
నైన యెహోవానని చెప్పుమనెను.

23,24 యెహోవా మోషేతో ఇట్లనెను:—నీవు ఇశ్రా
యేలు పుత్రులతో మాటలాడి—ఏడవ నెలలో ఆ నెల
మొదటి దినము మీకు సబ్బాతు విశ్రాంతి, జ్ఞాపకమైన
25 శృంగధ్వని, పరిశుద్ధ సంఘముండ వలెను. । అందు
మీరు ఏ లౌకిక వ్యాపారమును చేయ వద్దు: అయి
నను యెహోవాకు హోమార్పణము చేయ వలెనని
చెప్పుమనెను.

26,27 యెహోవా మోషేతో ఇట్లనెను;।—విశేషముగా,
ఈ యేడవ నెల పదియవ దినము మహాచ్ఛాదన† దినము;
అందు పరిశుద్ధ సంఘముండ వలెను; మిమ్మును‡ మీరు
దుఃఖపరచుకొని, యెహోవాకు హోమార్పణముచేయ
28 వలెను. । ఆ విశేష దినమున ఏ వ్యాపారమును చేయ
వద్దు మీ దేవుడైన యెహోవా సన్నిధిలో, మీ కొ
రకు ఆచ్ఛాదనము చేయుటకు అది ఆచ్ఛాదన దినము.।
29 ఆ విశేష దినమున తనను తాను దుఃఖపరచుకొనని ప్రతి
30 వాడు తన ప్రజలలోనుంచి ఛేదించబడును.। ఆ విశేష
దినమున, ఏ వ్యాపారమునైనను చేయు ప్రతివానిని,
31 వాని ప్రజలలోనుంచి నాశము చేసెదను.। మీరు ఏ
వ్యాపారమునైనను చేయ వద్దు. అది మీ సమస్త
నివాసములలో, మీ తర తరముల మట్టుకు నిత్యమైన
32 కట్టడ.। అది మీకు విశ్రాంతి సబ్బాతు; మిమ్మును‡
మీరు దుఃఖపరచుకొన వలెను: ఆ నెల తొమ్మిదవ నాటి
సాయంకాలమందు, అనగా సాయంకాలము మొదలు
కొని సాయంకాల పర్యంతము, మీరు ఉంచుకొన వలె
ననెను.

33,34 యెహోవా మోషేతో ఇట్లనెను:—నీవు ఇశ్రా
యేలు పుత్రులతో మాటలాడి,—ఈ యేడవ నెల, పదు
నైదవ దినము మొదలుకొని, ఏడు దినముల వరకు యె
హోవాకు పర్ణశాలల పండుగ యుండ వలెను.। వాటి 35
లో మొదటి దినమున, పరిశుద్ధ సంఘముండ వలెను.
అందు, మీరు ఏ లౌకిక వ్యాపారమును చేయ వద్దు.।
ఏడు దినములు, మీరు యెహోవాకు హోమార్పణ 36
ము చేయ వలెను. ఎనిమిదవ దినమున, మీకు పరిశుద్ధ
సంఘముండ వలెను; మీరు యెహోవాకు హోమా
ర్పణము చేయ వలెను; అది ఆ పండుగ అంత్య దినము;
అందు మీరు ఏ లౌకిక వ్యాపారములను చేయ వద్దు.।
ఇవి యెహోవా విశేష కాలములు; యెహోవా 37,38
సబ్బాతులు గాకను, మీ యీవులు గాకను, మీ మ్రొ
క్కుబళ్లు గాకను, మీరు యెహోవాకు నిచ్చు స్వేచ్ఛా
ర్పితములన్నియు గాకను, యెహోవాకు హోమ
మును, ఆరోహణయాగమును, కానుకను, యాగమును,
పానార్పణములను, దేని దినమున దాని అర్పించుటకు
పరిశుద్ధ సంఘ దినములని, మీరు చాటించ వలసిన, యె
హోవా విశేషకాలములు ఇవి.

అయినను, ఏడవ నెల పదునైదవ దినమున, మీరు 39
భూమి పంట కూర్చుకొనగా, మీరు ఏడు దినములు
యెహోవా పండుగను ఆచరించ వలెను. మొదటి
దినమున సబ్బాతు విశ్రాంతియు, ఎనిమిదవ దినమున
సబ్బాతు విశ్రాంతియు నుండ వలెను. । మొదటి దిన 40
మున మీరు అందమైన చెట్ల పండ్లను, ఖర్జూర కమ్మలను,
గుబురుగానుండు చెట్లకొమ్మలను కాలువల యొద్దనుండు
అరబను చెట్లను పట్టుకొని, ఏడు దినములు మీ దేవు
డైన యెహోవా సన్నిధిని సంతోషముగానుండ వలె
ను.। అట్లు మీరు సంవత్సరమునకు ఏడు దినములు 41
యెహోవాకు పండుగగా వాటిని ఆచరించ వలెను;
అది మీ తరతరములలో నిత్యమైన కట్టడ; ఏడవ నెల
లో, దాని ఆచరించ వలెను.। ఏడు దినములు మీరు 42
పర్ణశాలలలో నివసించ వలెను; ఇశ్రాయేలీయులలో
పుట్టిన వారందరు పర్ణశాలలలో నివసించ వలెను.।
అట్లు, నేను ఐగుప్తు దేశములోనుంచి ఇశ్రాయేలు 43
పుత్రులను తీసుకొని వచ్చినప్పుడు, నేను వారిని పర్ణశా
లలలో నివసింప చేసితినని మీ వంశస్థులు ఎరుగుదురు;
నేను మీ దేవుడనైన యెహోవానని చెప్పుమనెను.

అట్లు, మోషే ఇశ్రాయేలు పుత్రులకు యెహో 44
వా విశేష కాలములను చెప్పెను.

## 24. అధ్యాయము.

యెహోవా మోషేతో ఇట్లనెను:—దీపము నిత్య 1,2
ము వెలిగించునట్లు, ప్రదీపము కొరకు, దంచి తీసిన

* లేక, పాపాచ్ఛాదనార్పణముగా. † హెబ్రీలో, ఆచ్ఛాదనములు. ‡ లేక, మీ ప్రాణములను.

శుద్ధమైన ఒలీవల నూనె తే వలెనని ఇశ్రాయేలు పుత్రు
3 లకు ఆజ్ఞాపించుము. । సంఘపు గుడారములో, శాసన
ముల అడ్డుతెరకు వెలపల, అహరోను సాయంకాలము
మొదలుకొని ఉదయకాల పర్యంతము, యెహోవా
సన్నిధిని దాని సవరించ వలెను; అది మీ తరతరముల
4 మట్టుకు నిత్యమైన కట్టడ. । అతడు నిర్మలమైన దీపవృ
క్షముమీద ప్రదీపములను యెహోవా సన్నిధిలో
నిత్యము సవరించ వలెను.
5 నీవు గోధుముల పిండి తీసుకొని, దానితో పన్నెం
డు పిండివంటలను వండ వలెను. ఒక్కొక పిండివం
6 టకు రెండు పదియవ వంతుల పిండి* కావలెను. । యె
హోవా సన్నిధిని, నిర్మలమైన బల్ల మీద, ఆరేసి పిండి
వంటలు గల రెండు దొంతులగా వాటిని ఉంచ వలె
7 ను. । ఒక్కొక దొంతి మీద, స్వచ్ఛమైన సాంబ్రాణి
వేయ వలెను; అది ఆ యాహారమునకు జ్ఞాపకార్థమును,
8 యెహోవాకు హోమమునై యుండును. । ప్రతి
సబ్బాతు వారమున, అతడు నిత్యమైన నిబంధన బట్టి,
ఇశ్రాయేలు పుత్రుల వలన దాని పుచ్చుకొని, నిత్యము
9 యెహోవా సన్నిధిని దాని సవరించ వలెను. । అది
అహరోనుకు అతని కుమారులకు నుండ వలెను; వారు
పరిశుద్ధ స్థలములో దాని తిన వలెను; నిత్యమైన కట్టడ
వలన, యెహోవా హోమములలో, అది అతనికి
అతిపరిశుద్ధమగుననెను.
10 ఇశ్రాయేలు స్త్రీకి ఐగుప్తు పురుషునికి పుట్టిన కుమా
రుడు, ఇశ్రాయేలు పుత్రుల మధ్యకు బైలుదేరి వచ్చె
11 ను. । ఆ ఇశ్రాయేలు స్త్రీ కుమారుడును, ఇశ్రాయేలు
మనుష్యుడును పాళెములో పోరాడుచుండగా, ఆ
ఇశ్రాయేలు స్త్రీ కుమారుడు నామమును† దూషించి
తిట్టెను; మోషే యొద్దకు వాని తీసుకొని వచ్చిరి. వాని
తల్లి పేరు షెలోమీతు. ఆమె దాను గోత్రస్థుడైన
12 దిబ్రీ కుమార్తె. । యెహోవా నోటి మాటవలన విమర్శ
13 కలుగునట్లు, కావలిలో వాని వేసిరి. । అప్పుడు యె
14 హోవా మోషేతో ఇట్లనెను;—తిట్టినవాని, పాళెము
వెలపటికి తీసుకొని రమ్ము; వాని మాట వినిన వారం
దరు వాని తల మీద తమ చేతుల నుంచ వలెను; సంఘ
15 మంతయు రాళ్లతో వాని కొట్టివేయ వలెను. । మరి
యు, నీవు ఇశ్రాయేలు పుత్రులను చూచి, తన దేవుని
16 తిట్టువాడు తన పాపము భరించ వలెను; । యెహోవా
నామమును దూషించువాడు చంపబడ వలెను. సంఘ
మంతయు రాళ్లతో వాని కొట్టివేయ వలెను; పరదేశి
యైతేనేమి మీ స్వదేశియైతేనేమి నామమును దూషిం
చిన యెడల, వాని చంప వలెను.

ఎవడైనను ఒకని ప్రాణహత్య చేసిన యెడల, వాని 17
చంప వలెను. । జంతు ప్రాణహత్య చేసినవాడు, ప్రా 18
ణమునకు ప్రాణమిచ్చి, దాని నష్టము ఇచ్చుకొన వలె
ను. । ఒకడు తన పొరుగువానికి, కళంకము కలుగ 19
చేసిన యెడల, వాడు చేసినట్లు వానికి చేయ వలెను; ।
విరిగినదానికి విరిగినది, కంటికి కన్ను, పంటికి పల్లు; 20
వాడు ఒకనికి కళంకము చేసినందున, వానికి కళంక
ము చేయ వలెను. । జంతువును చావ గొట్టినవాడు 21
దాని నష్టము ఇచ్చుకొన వలెను; నరహత్య చేయువాని
చంప వలెను. । మీకు ఒక్కటే తీర్పు ఉండ వలెను; 22
మీలో పరదేశికుండునట్లు మీ స్వదేశికుండ వలెను;
నేను మీ దేవుడనైన యెహోవానని వారితో చెప్ప
వలెననెను.

కాబట్టి, మోషే ఇశ్రాయేలు పుత్రులతో మాట 23
లాడి, పాళెము వెలపటికి, తిట్టినవాని తీసుకొని వెళ్లి,
రాళ్లతో వాని కొట్టి వేయ వలెనని చెప్పెను. యెహో
వా మోషేకు ఆజ్ఞాపించిన ప్రకారము, ఇశ్రాయేలు
పుత్రులు చేసిరి.

## 25. అధ్యాయము.

యెహోవా సీనాయి కొండమీద మోషేతో 1
ఇట్లనెను;—ఇశ్రాయేలు పుత్రులతో మాటలాడి — 2
నేను మీకిచ్చు దేశములోకి మీరు వచ్చిన తరువాత,
ఆ భూమి యెహోవాకు సబ్బాతు నాచరించ‡
వలెను. । ఆరు సంవత్సరములు నీ పొలములో విత్తన 3
ములు చల్ల వలెను; ఆరు సంవత్సరములు నీ ఫలవృక్ష
ముల తోట బద్దించి, దాని ఫలములు కూర్చుకొన
వచ్చును; । ఏడవ సంవత్సరమున, భూమికి విశ్రాంతి 4
సబ్బాతు, అనగా యెహోవాకు సబ్బాతు ఉండ
వలెను; నీ పొలములో విత్తనములు చల్ల వద్దు; నీ ఫల
వృక్షముల తోట బద్దించ వద్దు; । నీ కారు చేల పంట 5
కోసుకొన వద్దు; బద్దించబడని నీ ఫలవృక్షముల పండ్లను
ఏర వద్దు; అది భూమికి విశ్రాంతి సంవత్సరము. ।
అప్పుడు భూమి సబ్బాతు (సస్యము) నీకు ఆహారమ 6
గును; నీ దాసునికి, నీ దాసికి, నీ జీతకానికి, నీతో
నివసించు పరదేశికి, । నీ పశువులకు, నీ దేశ జంతువు 7
లకు, దాని రాబడి అంతయు ఆహారమగును.

మరియు, ఏడు విశ్రాంతి సబ్బాతుల సంవత్సరము 8
లను, అనగా ఏడేండ్ల సంవత్సరములను లెక్కించుకొన
వలెను. ఆ ఏడు విశ్రాంతి సబ్బాతుల సంవత్సరముల
కాలము నలుబది తొమ్మిది సంవత్సరములు. । ఏడవ నెల 9
పదియవ నాడు, మీ సర్వదేశమునకు శృంగమును బైలు
దేర్చ వలెను; మహాచ్ఛాదన దినమున మీ దేశమందం

* అది, అరశేరు కావచ్చును. † యెహోవా నామము. ‡ లేక, సబ్బాతు విశ్రాంతి పొంద.

10 తట శృంగనాదము వ్యాపింప చేయ వలెను.। మీరు
ఆ సంవత్సరమును, అనగా ఏబదియవ సంవత్సరమును
పరిశుద్ధపరిచి, మీ దేశమందు, దాని సమస్త నివాసు
లకు విడుదల చాటించ వలెను: అది మీకు సునాదము
గా* నుండును; అప్పుడు మీలో ప్రతివాడు తన స్వా
స్థ్యమునకు† తిరిగి రావలెను; ప్రతివాడు తన కుటుంబ
11 మునకు తిరిగి రావలెను.। ఆ సంవత్సరమనగా, ఏబది
యవ సంవత్సరము మీకు సునాదకాలము;* అందు,
మీరు విత్తనములు చల్ల వద్దు; దాని కారు పంట కోయ
వద్దు; బద్దించబడని నీ ద్రాక్షల‡ పండ్లను ఏరవద్దు.।
12 అది సునాదకాలము; అది మీకు పరిశుద్ధమగును; పొ
13 లము పలనే దాని పంట తినెదరు.। ఆ సునాద సంవ
త్సరమున మీలో ప్రతివాడు తన స్వాస్థ్యమునకు†
14 తిరిగి రావలెను.। నీవు నీ పొరుగు వానికి దేనినైనను
వెలకు అమ్మిన యెడలను, నీ పొరుగువాని వలన దేనినై
నను కొనిన యెడలను, మీరు ఒకని నొకడు మోస
15 బుచ్చ వద్దు.। సునాద సంవత్సరమైన తరువాత గతిం
చిన సంవత్సరముల మేర చొప్పున, నీ పొరుగు వాని
యొద్ద కొన వలెను; పంటల సంవత్సరముల మేర చొ
16 ప్పున, అతడు నీకు అమ్మ వలెను.। ఆ సంవత్సరములు
ఎచ్చిన యెడల, దాని వెలను ఎచ్చించ వలెను; ఆ సంవ
త్సరములు తగ్గిన యెడల, దాని వెలను తగ్గించ వలెను;
ఎందుకనగా పంటల§ లెక్క చొప్పున అతడు నీకు
17 అమ్మవలెను.। కాబట్టి మీరు ఒకని నొకడు మోసపు
చ్చక, నీ దేవునికి భయపడ వలెను; నేను మీ దేవుడ
నైన యెహోవాను.

18 కాబట్టి మీరు నా కట్టడలను అనుసరించి, నా విధు
లను కాపాడుకొని, వాటిని అనుసరించ వలెను; అప్పు
డు మీరు ఆ దేశములో సురక్షితముగా నివసించెదరు.।
19 ఆ భూమి సఫలమగును; మీరు తృప్తిగా భోజనము
20 చేసి, అందు సురక్షితముగా నివసించెదరు.। —ఏడవ
సంవత్సరమున, మేము ఏమి తినుదుము? ఇదుగో! మేము
21 చల్లము; పంట కూర్చము అనుకొందురేమో;। అయినను
నేను ఆరవ సంవత్సరమున నా దీవెన మీకు కలుగ నా
జ్ఞాపించెదను; అది మూడు సంవత్సరములకు పంట
22 కలుగ చేయును.। మీరు ఎనిమిదవ సంవత్సరమున
విత్తనములు చల్లి, తొమ్మిదియవ సంవత్సరము వరకు
పాత పంట తినెదరు; దాని పంట కూర్చబడు వరకు,
పాత దాని తినెదరు.

23 భూమి శాశ్వతముగా అమ్మివేయ వద్దు: ఆ భూమి
నాదే; మీరు నా యొద్ద కాపురమున్న పరదేశులు;।
మీ స్వాస్థ్యమైన సర్వభూమికి విమోచనము కలుగు 24
నట్లు సెలవీయ వలెను.। నీ సహోదరుడు బీదవాడై, 25
తన స్వాస్థ్యములోనిది కొంచెము అమ్మిన తరువాత,
అతనికి చుట్టమైన విమోచకుడు వచ్చిన యెడల, అతడు,
తన సహోదరుడు అమ్మినదాని విమోచించ వచ్చును.।
అయినను ఒకనికి విమోచకుడు లేకనే, దాని విమోచిం 26
చుటకు కావలసినది అతని చెయ్యి సాగి సంపాదించిన
యెడల,। దాని అమ్మినది మొదలుకొని గతించిన సంవ 27
త్సరములు లెక్కించి, ఎవనికి దాని అమ్మెనో వానికి ఆ
శేషము తిరిగి యిచ్చి, తన స్వాస్థ్యమునకు తిరిగి రావ
చ్చును.।అది వానికి తిరిగి వచ్చుటకు కావలసినది వా 28
నికి దొరకని యెడల, వాడు అమ్మినది యోబేలను
సునాదసంవత్సరము వరకు, దాని కొనిన వాని వశము
లోనుండ వలెను; సునాద సంవత్సరమున అది వదిలి
పోవును; అప్పుడు అతడు తన స్వాస్థ్యమునకు† తిరిగి
రావలెను.

ఒకడు ప్రాకారముగల ఊరిలోని నివాస గృహ 29
ము అమ్మిన యెడల, దాని అమ్మిన దినము మొదలుకొని,
నిండు సంవత్సరము వరకు దాని విమోచించ వచ్చును;
ఆ సంవత్సర దినములలోనే దాని విమోచించ వచ్చు
ను.। ఆ సంవత్సర దినములు నిండక మును, దాని 30
విమోచించని యెడల, ప్రాకారముగల ఊరిలోనున్న
ఆ ఇల్లు కొనినవానికి అది వాని తరతరముల మట్టుకు
స్థిరముగా నుండ వలెను; అది సునాదకాలమున వదిలి
రాదు.। చుట్టు ప్రాకారములులు లేని గ్రామములలోని 31
ఇండ్లను, నాటు పొలముల వలె ఎంచ వలెను; దానికి
విమోచనము కా వచ్చును; అది సునాద కాలములో
వదిలి రా వలెను.

అయినను, లేవీయుల పట్టణములనగా, వారి స్వా 32
ధీన పట్టణములలోని ఇండ్లను విమోచించు నధికారము
లేవీయులకు శాశ్వతముగా నుండును.। ఒకడు లేవీ 33
యుల వలన ఇల్లు సంపాదించిన|| యెడల, అతని పితు
రార్జిత పట్టణములో, అమ్మబడిన ఆ ఇల్లు సునాద
సంవత్సరమున వదిలి రా వలెను; లేవీయుల పట్టణముల
యిండ్లు, ఇశ్రాయేలు పుత్రుల మధ్యను వారి స్వాస్థ్య
ము.। అయినను, వారి పట్టణ ప్రాంత భూములు అమ్మ 34
రాదు; అవి వారికి శాశ్వత స్వాస్థ్యము.

నీ సహోదరుడు బీదవాడై నీయొద్ద ఆధారము 35
లేని యెడల, వాడు పరదేశియైనను, నీయొద్ద అతిథియై
నను, అతనికి సహాయము చేయ వలెను; అతడు నీయొద్ద
నివసించ వలెను.।అతని వలన వడ్డినైనను లాభమునైనను 36

* హెబ్రీలో, యోబెలు. † లేక, పితురార్జితమునకు. ‡ లేక, ఫలవృక్షముల.
§ అనగా, సంవత్సరముల. || లేక, విమోచించిన.

పుచ్చుకొన వద్దు; నీ దేవునికి భయపడ వలెను; నీ
37 సహోదరుడు నీయొద్ద నివసించ వలెను. । వడ్డికి నీ
రూకలు అతనికీయ వద్దు; లాభమునకు నీ ఆహారమును
38 అతనికీయ వద్దు. । నేను మీకు కనాను దేశమిచ్చి,
మీకు దేవుడనగునట్లు, ఐగుప్తు దేశములోనుంచి మిమ్ము
ను తీసుకొని వచ్చిన మీ దేవుడనైన యెహోవాను.
39 నీయొద్ద నివసించు నీ సహోదరుడు బీదవాడై,
నీకు అమ్మబడిన యెడల, అతని చేత దాసుని దాస్యము
40 చేయించుకొన వద్దు. । అతడు జీతకాని వలెను, పర
వాసి వలెను నీయొద్ద నివసించి, సునాద సంవత్సరము
41 వరకు నీయొద్ద దాసుడుగా నుండ వలెను. । అప్పుడు
అతడు, అతనితో కూడ అతని పిల్లలు నీయొద్దనుంచి
బైలుదేరి, తన వంశస్థుల యొద్దకు తిరిగి వెళ్ల వలెను;
అతడు తన తండ్రి స్వాస్థ్యమునకు తిరిగి రావలెను. ।
42 వారు నా దాసులు; నేను ఐగుప్తులోనుంచి వారిని
తీసుకొని వచ్చితిని; దాసులను అమ్మినట్లు, వారిని అమ్మ
43 వద్దు. । కఠినముగా అతని నేలక, నీ దేవునికి భయపడ
44 వలెను. ।మీ ప్రాంత రాష్ట్రికులలో దాసులు, పనికత్తెలు,
45 మీకు దొరుకుదురు. । మరియు, మీలో నివసించు
అన్యుల పిల్లలలోని వారిని, మీ దేశములోని వారికి
పుట్టి మీలోనున్న వారి కుటుంబములలోని వారిని
మీరు కొన వచ్చును; వారు మీకు స్వాస్థ్యముగా
46 నుందురు. । మీ తరువాత మీ పిల్లలకు వారిని స్వాస్థ్య
ముగా చేసుకొనుటకు, వారి నిమిత్తము మీరు వారిని
స్వతంత్రించుకొందురు; వారు శాశ్వతముగా మీకు
దాసులవుదురు, కాని ఇశ్రాయేలు పుత్రులగు మీరు
సహోదరులు గనుక, ఒకనినొకడు కఠినముగా నేల
వద్దు.
47 పరదేశియైనను, నీ యొద్ద నివసించు వాడైనను ధన
సంపాద్యము చేసుకొనునప్పుడు, అతని యొద్ద నివ
సించు నీ సహోదరుడు బీదవాడై ఆ పరదేశికైనను
నీయొద్ద నివసించువానికైనను, ఆ పరదేశి కుటుంబ
ములో వేరొకనికైనను తనను అమ్ముకొనిన యెడల, ।
48 తనను అమ్ముకొనిన తరువాత, అతనికి విమోచనము
కా వచ్చును; వాని సహోదరులలో ఒకడు వాని
49 విమోచించ వచ్చును. । అతని పినతండ్రియైనను, పిన
తండ్రి కుమారుడైనను, వాని వంశములో వాని రక్తసం
బంధియైనను వాని విమోచించ వచ్చును; కావలసినది
అతనికి దొరికిన యెడల, తనను తాను విమోచించుకొన
50 వచ్చును. । అప్పుడు అతడు, అమ్మబడిన సంవత్సరము
మొదలుకొని సునాద సంవత్సరము వరకు తనను కొని
నవానితో తాను లెక్క చూచుకొన వలెను; అతని
క్రయధనము ఆ సంవత్సరముల మేర చొప్పున నుండ
వలెను; అతనికి జీతకాని దినముల ప్రకారముగా నుండ
వలెను. । ఇంక అనేక సంవత్సరములు మిగిలిన యెడల, 51
వాటిని బట్టి, తనను అమ్మిన సొమ్ములో తన విమోచన
క్రయము తిరిగి యీయ వలెను. । సునాద సంవత్సర 52
మునకు కొన్ని సంవత్సరములే తగ్గిన యెడల, అతనితో
లెక్క చూచుకొని, తన సంవత్సరముల మేర చొప్పున
తన విమోచన ధనము అతనికి తిరిగి యీయ వలెను. ।
ఏటియేటికి జీతకానివలె అతని యొద్ద నుండ వలెను; 53
మీ కన్నుల యెదుట కఠినముగా అతని నేల రాదు. ।
అతడు వారి వలన* విమోచించబడని యెడల, సునాద 54
సంవత్సరమున, అతడు అతనితో కూడ అతని పిల్లలు
వదిలి రా వలెను. । ఎందుకనగా, ఇశ్రాయేలు పుత్రులు 55
నాకు దాసులు; నేను ఐగుప్తు దేశములోనుంచి తీసు
కొనివచ్చిన నా దాసులే; నేను మీ దేవుడనయిన యె
హోవాను.

## 26. అధ్యాయము.

మీరు మాయ వేల్పులను చేసుకొన వద్దు; విగ్రహ 1
మును, స్తంభమును నిలువబెట్టుకొన వద్దు; చిత్తరువు
గల రాతి మీద సాగిల పడుటకు, మీ భూమిలో అట్టి
దాని ఉంచుకొన వద్దు; నేను మీ దేవుడనైన యె
హోవాను. ।మీరు నా సబ్బాతులను కాపాడుకొని, 2
నా పరిశుద్ధాలయమునకు భయపడ వలెను; నేను
యెహోవాను.

మీరు నా కట్టడలను బట్టి నడుచుకొని, నా ఆజ్ఞ 3
లను కాపాడుకొని, వాటిని అనుసరించిన యెడల, ।మీ 4
వర్ష కాలములలో మీకు వర్షించెదను; మీ భూమి పం
టలిచ్చును; మీ పొలముల చెట్లు సఫలమగును. । మీ 5
ద్రాక్ష పండ్ల మట్టుకు మీ నూర్పు సాగును; మీరు
తృప్తిగా మీ ఆహారము తిని, మీ దేశములో సురక్షి
తముగా నివసించెదరు; । ఆ దేశములో నేను క్షేమమి 6
చ్చెదను;† మీరు పండుకొనునప్పుడు ఎవడును మిమ్మును
భయపెట్టడు; ఆ దేశములో దుష్ట మృగములు ఉండ
కుండ చేసెదను; మీ దేశములోకి ఖడ్గము చేరదు. । మీ 7
రు మీ శత్రువులను తరిమెదరు; వారు మీ యెదుట
ఖడ్గము వలన పడెదరు. । మీలో ఐదుగురు నూరుమం 8
దిని తరిమెదరు; మీలో నూరుమంది పదివేలమందిని
తరిమెదరు; మీ శత్రువులు మీ యెదుట ఖడ్గమువలన
పడుదురు; ।ఏలాగనగా, నేను మీ యందు కటాక్షించి, 9
మీకు సంతానమిచ్చి, మిమ్మును విస్తరింపచేసి, నా నిబం
ధన మీకు స్థాపించెదను. । మీరు పాత పంట ధాన్యము 10

* లేక, వాటివలన. † లేక, సమాధానమిచ్చెదను.

తిని, క్రొత్తదాని యెదుటనుంచి పాత దాని బైటికి తెచ్చె
11 దరు. । నా ఆలయమును మీ మధ్యనుండ నిచ్చెదను;
12 మిమ్మును నా ఆత్మ అసహ్యించదు. । నేను మీ మధ్యను
నడిచెదను; మీకు దేవుడనై యుందును; మీరు నాకు
13 ప్రజలై యుందురు. । మీరు ఐగుప్తీయులకు దాసులు
కాకపోవునట్లు, వారి దేశములోనుంచి మిమ్మును బైటికి
తీసుకొని వచ్చిన నేను మీ దేవుడనైన యెహోవాను;
నేను మీ కాడి పలుపులను తెంపి, మిమ్మును నిలకడగా
నడవ చేసితిని.

14 మీరు నా మాట వినక, ఈ ఆజ్ఞలన్నిటిని అనుసరిం
15 చక, । నా కట్టడలను నిరాకరించినను, నా ఆజ్ఞలన్నిటిని
అనుసరించక నా నిబంధన మీరునట్లు, మీ ఆత్మ నా
16 తీర్పులు అసహ్యించినను, । అప్పుడు నేను మీకు చేయు
నది ఏదనగా, కన్నులను క్షీణింపచేసి, ప్రాణమును
కుందించు తాపజ్వరము, క్షయ, భయము మీ మీదికి
రప్పించెదను; మీరు విత్తనములు చల్లుట వ్యర్థమగును;
17 మీ శత్రువులు వాటి పంట తినెదరు. । నా సన్నిధి
మీకు విరోధముగా నుండచేసెదను; మీ శత్రువుల
సన్నిధిలో మీరు చంపబడెదరు; మిమ్మును పగపట్టు
వారు మిమ్మును ఏలెదరు; మిమ్మును ఎవడును తరుమక
పోయినను, మీరు పారిపోయెదరు.

18 వాటివలన మీరు ఇంక నా మాటలు వినని పక్ష
మందు, నేను మీ పాపములను బట్టి, మరి యేడంతలు
19 గా మిమ్మును దండించెదను; । మీ బలగర్వము భంగప
రిచి, ఇనుము వలె మీ ఆకాశమును, కంచు వలె మీ
20 భూమిని ఉండ జేసెదను; । మీ బలము ఉడిగిపోవును;
మీ భూమి ఫలించదు; మీ దేశ వృక్షములు నిష్ఫల
మగును.

21 మీరు నా మాట విననొల్లక, నాకు విరోధముగా
నడిచిన పక్షమందు, నేను మీ పాపముల చొప్పున,
22 మరి యేడు ఇడుములను మీకు కలుగ జేసెదను; । మీ
లోకి అడవి మృగములను పంపెదను; అవి మిమ్మును సం
తానహీనులగా చేసి, మీ పశువులను హరించి మిమ్మును
కొద్దిమందిగా చేయును; మీ మార్గములు పాడైపోవును.*
23 వాటివలన, మీరు నా యెడల గుణపడక, నాకు
24 విరోధముగా నడిచిన పక్షమందు, । నేను కూడ మీకు
విరోధముగా నడిచెదను; మీ పాపములను బట్టి, ఇక
25 నేడంతలుగా మిమ్మును దండించెదను. । మీ మీదికి ఖడ్గ
ము రప్పించెదను; అది నా నిబంధనకొరకు ప్రతిదం
డన చేయును; మీరు మీ పట్టణములలో కూడి యుం
డగా, మీ మధ్యకు తెగులు పంపెదను; మీరు శత్రు
వుల చేతికి అప్పగించ బడెదరు.

నేను మీ ఆహారమనగా, మీ జీవనోపాధి† విరగ 26
గొట్టిన తరువాత, పదిమంది స్త్రీలు ఒక్క పొయిలోనే
మీ ఆహారము వండి, తూనికె చొప్పున మీ ఆహారము
మీకు తిరిగి పెట్టుదురు; మీరు తినెదరు కాని తృప్తి
పొందరు.

వాటివలన, మీరు నా మాట వినక, నాకు విరోధ 27
ముగా నడిచిన పక్షమందు, । నేను ఆగ్రహపడి మీకు 28
విరోధముగా నడిచెదను; నేనే మీ పాపములను బట్టి,
ఏడంతలుగా మిమ్మును దండించెదను. । మీరు మీ కుమా 29
రుల మాంసము తినెదరు; మీ కుమార్తెల మాంసము
తినెదరు. । నేను మీ ఉన్నత స్థలములను పాడుచేసె 30
దను, మీ విగ్రహములను పడగొట్టెదను; మీ బొమ్మల
పీనుగులమీద మీ పీనుగులను పడవేయించెదను; 31
నా ఆత్మ మిమ్ము నసహ్యించును, నేను మీ పట్టణములను
బీడుగా చేసెదను; మీ పరిశుద్ధస్థలములను పాడు చేసె
దను; మీ సువాసన గల వాటి సువాసన ఆఘ్రాణిం
చను. । నేను మీ దేశము పాడు చేసిన తరువాత, దా 32
నిలో కాపురముండు మీ శత్రువులు దాని చూచి
ఆశ్చర్య పడెదరు. । రాష్ట్రములలోకి మిమ్మును చెదర 33
గొట్టి, మీ వెంటను కత్తి దూసెదను; మీ దేశము
పాడై పోవును, మీ పట్టణములు బీడుగా నుండును.
మీరు మీ శత్రువుల దేశములోనుండగా, మీ 34
దేశము పాడైయున్న దినములన్నిటను, అది తన విశ్రాం
తి సబ్బాతులను అనుభవించును; । అది పాడైయుండు 35
దినములన్నిటను అది విశ్రమించును; మీరు దానిలో
నివసించినప్పుడు, అది సబ్బాతులలో పొందకపోయిన
విశ్రాంతిని, అది పాడైయుండు దినములన్నిటను, అను
భవించును. । మీలో మిగిలిన వారు తమ శత్రువుల 36
దేశములలో నుండగా, వారి హృదయములలోకి వేదన
రప్పించెదను; కొట్టుకొనిపోవుచున్న ఆకు ధ్వని వారిని
తరుమును; ఖడ్గము నెదుటనుంచి పారిపోవునట్లు, వా
రు పారిపోయెదరు; తరుమువాడు లేకనే పడెదరు. ।
తరుమువాడు లేకనే, వారు ఖడ్గము నెదుటనుంచి పా 37
రిపోవునట్లు, ఒకని మీద నొకడు పడెదరు. మీ
శత్రువుల యెదుట మీరు నిలువలేక పోయెదరు. । మీ 38
రు రాష్ట్రములలో నశించెదరు; మీ శత్రువుల దేశము
మిమ్మును తినివేయును; । మీలో మిగిలినవారు, మీ శత్రు 39
వుల దేశములలో, తమ అక్రమముల వలన, క్షీణించి
పోయెదరు; మరియు, వారు తమ తండ్రుల అక్రమ
ములవలన వారితోకూడ క్షీణించి పోయెదరు.

వారు నాకు విరోధముగా వంచించిన తమ వంచ 40
నతో కూడ, తమ అక్రమమును తమ తండ్రుల అక్ర

* లేక, ఎడారిగానుండును. † లేక, ప్రాణాధారము.

మమును ఒప్పుకొని, తాము నాకు విరోధముగా నడి
41 చితిమనియు, । అప్పుడు నేను తమకు విరోధముగా
నడుచుచు తమ శత్రువుల దేశములోకి తమ్మును తీసు
కొని వచ్చితిననియు ఒప్పుకొనిన యెడల, అనగా ఛేద
నసంస్కారము లేని వారి హృదయములు లొంగి, తమ
42 అక్రమము వలని దండన అనుభవించిన యెడల, । నేను
యాకోబుతో చేసిన నా నిబంధన జ్ఞాపకము చేసు
కొందును; నేను ఈసాకుతో చేసిన నా నిబంధన,
నేను అబ్రాహాముతో చేసిన నా నిబంధన జ్ఞాపకము
చేసుకొందును; ఆ దేశమును కూడ జ్ఞాపకము చేసు
కొందును.
43 వారి దేశము వారిచేత విడవబడి, వారు లేనప్పుడు
పాడై, తన విశ్రాంతి సబ్బాతులను అనుభవించును;
వారు నా తీర్పులను ఉపేక్షించి నా కట్టడలను తిరస్క
రించిరి; ఆ హేతువు చేతనే, వారు తమ అక్రమము
44 వలని దండన అనుభవించెదరు. । అయినను, వారు తమ
శత్రువుల దేశములోనున్నప్పుడు, వారిని నిరాకరిం
చను; వారిని కేవలము నశింప చేయుటకు, నా నిబం
ధన భంగపరుచుటకు వారిని అసహ్యించను; ఎందుక
45 నగా, నేను వారి దేవుడనైన యెహోవాను. । నేను
వారికి దేవుడనౌటకు, వారి పూర్వికులను, రాష్ట్రముల
యెదుట, ఐగుప్తులోనుంచి తీసుకొని వచ్చి, వారితో
చేసిన నిబంధన, వీరికొరకు జ్ఞాపకము చేసుకొందును;
నేను యెహోవాను అని చెప్పుమనెను.
46 యెహోవా మోషే ద్వారా, సీనాయి కొండ
మీద, తనకును, ఇశ్రాయేలు పుత్రులకును మధ్యను
నియమించిన కట్టడలు తీర్పులు ఆజ్ఞలు నివే.

## 27. అధ్యాయము.

1,2 యెహోవా మోషేతో ఇట్లనెను:—నీవు ఇశ్రా
యేలు పుత్రులతో మాటలాడి—ఒకడు విశేషమైన
మ్రొక్కుబడి చేసినయెడల, ఆ మనుష్యులు* నీవు
ఏర్పరుచు వెల చొప్పున, యెహోవాకు నుండ వలెను.।
3 నీవు ఏర్పరచ వలసిన వెల మేర ఏదనగా, ఇరువది
యేండ్లు మొదలుకొని అరువది యేండ్ల వరకు మగవాని
గూర్చి, పరిశుద్ధ స్థలముయొక్క షెకెలులవంటి యిరు
4 వది వెండి షెకెలులను ఏర్పరచ వలెను. । ఆడుదైతే
5 ముప్పది షెకెలుల వెలను ఏర్పరచ వలెను. । ఐదేండ్లు
మొదలుకొని ఇరువది యేండ్ల లోపు వయస్సు గల
మగవాని గూర్చి, ఇరువది షెకెలుల వెలను, ఆడుదాని
6 గూర్చి పది షెకెలుల వెలను ఏర్పరచ వలెను. । ఒక
నెల మొదలుకొని ఇరువది యేండ్ల లోపు వయస్సు
గల మగవాని గూర్చి అయిదు వెండి షెకెలుల వెలను,
ఆడుదాని గూర్చి పది వెండి షెకెలుల వెలను ఏర్పరచ
వలెను. । అరువది యేండ్ల ప్రాయము దాటిన మగవాని 7
గూర్చి పదునైదు షెకెలుల వెలను, ఆడుదాని గూర్చి
పదిషెకెలుల వెలను ఏర్పరచ వలెను. । ఒకడు, నీవు 8
ఏర్పరచిన వెలను చెల్లించ లేని బీదవాడయితే, అతడు
యాజకుని యెదుట నిలువ వలెను; అప్పుడు యాజకుడు
అతని వెలను ఏర్పరచ వలెను; మ్రొక్కినవాని కలిమి
మేర చొప్పున వాని గూర్చి వెలను ఏర్పరచ వలెను.
మనుష్యులు తీసుకొనివచ్చి, యెహోవాకు నర్పిం 9
చు పశువులలోనిదైతే, అట్టిదానిలోనిదంత యెహో
వాకు నర్పించుదురో, అదంతయు పరిశుద్ధముగానుండ
వలెను; । దాని మార్చ రాదు; చెడ్డదానికి ప్రతిగా మం 10
చిదానినైనను, మంచిదానికి ప్రతిగా చెడ్డదానినైనను,
దానికి ప్రతిగా వేరొక దాని మార్చ రాదు; పశువు
నకు పశువును మార్చిన పక్షమందు, అదియు, దానికి
మార్చినదియు పరిశుద్ధమగును. । మనుష్యులు యెహో 11
వాకు అర్పణము చేయరాని అపవిత్ర జంతువులలో
నిదైతే, ఆ జంతువును యాజకుని యెదుట నిలువబెట్ట
వలెను; । అది మంచిదైతేనేమి చెడ్డదైతేనేమి, యాజ 12
కుడు దాని వెల నేర్పరచ వలెను; నీవు, అనగా యాజ
కుడు ఏర్పరచిన వెల నిలుచును. । అయినను అతడు 13
దాని విమోచించ గోరిన యెడల, నీవు ఏర్పరిచిన వెల
లో ఐదవ వంతు దానితో కలుప వలెను.
ఒకడు తన ఇల్లు యెహోవాకు పరిశుద్ధమవుటకు 14
దాని పరిశుద్ధపరిచిన యెడల, అది మంచిదైతేనేమి
చెడ్డదైతేనేమి, యాజకుడు దాని వెల నేర్పరచ వలెను;
యాజకుడు ఏర్పరిచిన వెల నిలువ వలెను, । తన ఇల్లు 15
పరిశుద్ధపరిచినవాడు, దాని విమోచించ గోరినయెడల,
అతడు నీవు ఏర్పరిచిన వెలలో ఐదవ వంతు దానితో
కలుప వలెను; అప్పుడు అది అతనిదగును.
ఒకడు తన పితురార్జితమైన పొలములోనిది కొం 16
చెము యెహోవాకు పరిశుద్ధపరిచిన యెడల, దాని
విత్తనముల మేర చొప్పున, దాని వెల నేర్పరచ వలెను;
యవల విత్తనముల హోమెరు, యేబది వెండి షెకెలుల
వెల గలది. అతడు సునాద సంవత్సరము మొదలుకొని 17
తన పొలము పరిశుద్ధపరిచిన యెడల, నీవు ఏర్పరుచు
వెల నిలవ వలెను. । సునాద సంవత్సరమైన తరువాత 18
ఒకడు తన పొలము పరిశుద్ధపరిచిన యెడల, యాజ
కుడు మిగిలిన సంవత్సరముల మేర చొప్పున అనగా
సునాద సంవత్సరము వరకు వానికి వెల నేర్పరచ
వలెను; నీవు ఏర్పరిచిన వెలలో వాని కొట్టివేయ వలెను.।

* హెబ్రీలో, ప్రాణములు.

19 పొలము పరిశుద్ధపరిచినవాడు దాని విమోచించ గోరిన
యెడల, అతడు నీవు ఏర్పరిచిన వెలలో ఐదవ వంతు
20 దానితో కలుప వలెను; అది అతనికి నిలుచును.।అతడు
ఆ పొలము విమోచించిన యెడలనైనను, వేరొకనికి ఆ
పొలమును అమ్మిన యెడలనైనను, ఎన్నడు దాని విమో
21 చించ రాదు.। ఆ పొలము సునాద సంవత్సరమున వదిలి
పోవునప్పుడు, అది మీదు కట్టిన పొలము వలె యె
హోవాకు పరిశుద్ధమగును; ఆ పితురార్జితము యాజ
22 కునిదగును. । ఒకడు తాను కొనిన పొలమును అనగా
తన పితురార్జితమైన పొలములలోనిది కాని పొలమును
23 యెహోవాకు పరిశుద్ధపరిచిన యెడల, । యాజకుడు
సునాద సంవత్సరము వరకు, నీవు ఏర్పరిచిన వెల మేర
చొప్పున, అతనికి నియమించ వలెను. ఆ దినమందే,
యెహోవాకు పరిశుద్ధమైనదిగా, నీవు ఏర్పరిచిన వెల
24 మేర చొప్పున, చెల్లించ వలెను. । సునాద సంవత్సర
మున, ఆ పొలమును అమ్మిన వానికి, అనగా ఆ భూమి
ఎవని పితురార్జితమైనదో వానికి అది తిరిగి రా వలెను.।
25 నీ వెలలన్నియు, పరిశుద్ధ స్థలముయొక్క వెలమేర చొ
ప్పున ఏర్పరచ వలెను, ఒక షెకెలు ఇరువది గేరాలు.*
26 అయినను, జంతువులలో తొలిపిల్ల, యెహోవా
తొలిపిల్ల గనుక ఎవడును దాని పరిశుద్ధపరచ రాదు;
అది ఎద్దయితేనేమి గొఱ్ఱెమేకల మందలోనిదైతేనేమి
27 అది యెహోవాదే. । అది అపవిత్ర జంతువు తొలి
పిల్లయైతే, అతడు నీవు ఏర్పరుచు వెలలో ఐదవ వంతు
దానితో కలిపి, ఆ మేర చొప్పున దాని విడిపించ
వచ్చును; దాని విమోచించని పక్షమందు, నీవు ఏర్పరి
చిన వెలమేర చొప్పున, దాని అమ్మ వలెను.
అయినను మనుష్యులలోనేమి, జంతువులలోనేమి, 28
పితురార్జితమైన పొలములలోనేమి, తనకు కలిగినవన్ని
టిలో దేనినైనను ఒకడు యెహోవాకు మీదు కట్టిన
పక్షమందు, ఆ మీదును అమ్మ రాదు, విమోచించ రా
దు; ప్రతి మీదు యెహోవాకు అతిపరిశుద్ధముగా
నుండును; । మనుష్యులు కట్టుమీదులలో ఏ మీదును 29
విడిపించక, దాని చంప వలెను.

భూ ధాన్యములో నేమి వృక్షఫలములలో నేమి, 30
భూ ఫలములన్నిటిలో దశమ భాగము యెహోవాది;
అది యెహోవాకు పరిశుద్ధముగా నుండును. । ఒకడు 31
తన దశమ భాగములలో దేనినైనను విమోచించ గోరిన
యెడల దానిలో ఐదవ వంతు దానితో కలుప వలెను.
గోవులలోని దేమి గొఱ్ఱెమేకలలోని దేమి కోల 32
క్రింద దాటు అన్నిటిలోను దశమ భాగము యెహో
వాకు పరిశుద్ధముగా నుండ వలెను. । అది మంచిదో చె 33
డ్డదో పరిశోధించ రాదు; దాని మార్చ రాదు; దాని ఏ
మాత్రము మార్చిన పక్షమందు, అదియు, మార్చినది
యు పరిశుద్ధమైనవిగా నుండ వలెను; దాని విమోచించ
రాదని చెప్పుమనెను.
ఇవి యెహోవా సీనాయి కొండ మీద ఇశ్రా 34
యేలు పుత్రుల కొరకు మోషేకు నియమించిన ఆజ్ఞలు.

* గేరా, ఒక అణా కావచ్చును.

సంఖ్యలు అని పిలువఁబడిన

# మోషేయొక్క నాలుగో గ్రంథము.

## 1. అధ్యాయము.

1 ఇశ్రాయేలు పుత్రులు మిస్రయీము దేశములో
నుంచి వెలపటికి వచ్చిన రెండో సంవత్సరము, రెండో
నెల, మొదటి దినమున, సీనై అరణ్యములో సంఘము
యొక్క డేరా యందు యెహోవా మోషేకు సెలవు
2 యిచ్చినదేమంటే, । ఇశ్రాయేలు పుత్రుల సంఘము
అంతటియొక్క మొట్టు లెక్కను వారియొక్క కుటుం
బముల చొప్పుననున్ను వారి పితృలయొక్క యింటి
చొప్పుననున్ను మొగవారందరినిన్ని వారి వారి శిర
స్సుల ప్రకారముగానున్ను వారి పేరులయొక్క లెక్క
3 ప్రకారముగానున్ను మీరు చూతురు గాక. । ఇశ్రా
యేలులో యిరువై సంవత్సరములు మొదలుకొని అం
తకు పై యీడు గలిగి యుద్ధమునకు బయిలుదేర గల
వారందరినిన్ని నీవున్ను అహరోనున్ను వారి వారి సైన్య
4 ముల చొప్పున లెక్కించ వలెను. । మరిన్ని ప్రతి యొ
క్క గోత్రములో ప్రతి యొక్కడు తన తన పితృనియొ
క్క యింటికి ప్రధాన శిరస్కుడై మీతో కూడి వుం
5 డును గాక. । మీతో కూడా నిలిచి వుండ వలసిన వా
రియొక్క పేరులు యేవేవంటే, రూబేను గోత్రములో
6 షెదేయూరు కుమారుడైన ఎలిసూరున్ను, । షిమోను
గోత్రములో సూరీషద్దయి కుమారుడయిన షెలూమీ
7 యేలున్ను, । యూదా గోత్రములో అమ్మీనాదాబు
8 కుమారుడైన నహషోనున్ను, । ఇశ్శాఖారు గోత్రములో
9 సూయారు కుమారుడైన నెతనేలున్ను, । జబూలోను
గోత్రములో హేలోను కుమారుడైన ఏలీయాబున్ను, ।
10 యోసేపుయొక్క సంతతి యందు ఎఫ్రయీము గో
త్రములో అమ్మీహూదు కుమారుడైన ఎలీషామాయి
న్ను, మనస్సే గోత్రములో పెదాహూరు కుమారు
11 డైన గమలియేలున్ను, । బెన్యామీను గోత్రములో
12 గిదోనీ కుమారుడైన అబీదానున్ను, । దాను గోత్రము
లో అమ్మీషద్దయి కుమారుడయిన అహీయెజెరున్ను, ।
13 ఆషేరు గోత్రములో ఒక్రాను కుమారుడయిన పగీ
14 యేలున్ను, । గాదు గోత్రములో దూవేలు కుమారు
15 డయిన ఎల్యాసాపున్ను, । నఫ్తాలీ గోత్రములో ఏనాను
కుమారుడయిన అహీరయున్ను వుందురని సెలవు యి
16 చ్చెను. । వీరు సంఘములో పేరుపడి, తమ పితృలయొ
క్క గోత్రములలో శ్రేష్ఠులై, ఇశ్రాయేలులో సహ
17 స్రములకు ప్రధాన శిరస్కులయి వుండిరి. । యీ పేరు
లచేత పిలువబడిన వారిని మోషేయున్ను అహరోను
న్ను పిలుచుకొని వచ్చిరి. । అప్పుడు వారు రెండో నెల 18
మొదటి దినమందు సంఘమంతటినీ సమకూర్చినం
దున, వారు తమయొక్క కుటుంబముల చొప్పుననున్ను
తమ పితృలయొక్క యింటి చొప్పుననున్ను, యిరువై
సంవత్సరములు మొదలుకొని అంతకు పైని యీడు గల
వారు తమ తమ శిరస్సులచొప్పున, తమ తమ పేరుల
యొక్క లెక్క ప్రకారముగా తమ వంశావళిని తెలియ
చేసిరి. । యెహోవా మోషేకు యేలాగున ఆజ్ఞాపించె 19
నో ఆలాగున అతడు సీనై అరణ్యములో వారిని లెక్కిం
చెను. । యేలాగంటే, ఇశ్రాయేలు ప్రథమ పుత్రుడైన 20
రూబేనుయొక్క పుత్రులలో వారి జన్మముల వరుసగా
నున్ను, వారి కుటుంబముల ప్రకారముగానున్ను, వారి
తండ్రులయొక్క యింటి ప్రకారముగానున్ను వారి పే
రులయొక్క లెక్క ప్రకారముగానున్ను, వారి వారి శిర
స్సుల ప్రకారముగానున్ను, యిరువై సంవత్సరములు
మొదలుకొని అంతకు పైని యీడు కలిగి, యుద్ధమునకు
బైలుదేర శక్తిగల మొగవారందరినిన్ని లెక్క చూడ
గా, । రూబేను గోత్రములో లెక్కకు వచ్చినవారు నలు 21
బై ఆరువేల యేనూరుమంది వుండిరి. । మరిన్ని షిమోను 22
యొక్క పుత్రులలో లెక్కించబడ్డవారు, వారి జన్మముల
వరుసగానున్ను, వారి కుటుంబముల ప్రకారముగాను
న్ను, వారి పేరులయొక్క లెక్క ప్రకారముగానున్ను,
వారి వారి శిరస్సుల ప్రకారముగానున్ను, యిరువై సంవ
త్సరములు మొదలుకొని అంతకు పైని యీడు గలిగి,
యుద్ధమునకు బయిలుదేర శక్తిగల మొగవారందరినిన్ని
లెక్కచూడగా, । షిమోను గోత్రములో లెక్కకు వచ్చి 23
నవారు యాబై తొమ్మిదివేల మున్నూరు మంది వుండిరి. ।
మరిన్ని గాదు పుత్రులలో వారి జన్మముల వరుసగా 24
నున్ను, వారి కుటుంబముల ప్రకారముగానున్ను, వారి
తండ్రులయొక్క యింటి ప్రకారముగానున్ను, వారి
పేరులయొక్క లెక్క ప్రకారముగానున్ను, యిరువై
సంవత్సరములు మొదలుకొని అంతకు పైని యీడు
కలిగి, యుద్ధమునకు బయిలుదేర శక్తి గల వారినందరి
నిన్ని లెక్క చూడగా, । గాదు గోత్రములో లెక్కకు 25
వచ్చినవారు నలుబై అయిదువేల ఆరునూట యాబై
మంది వుండిరి. । మరిన్ని యూదాయొక్క పుత్రులలో 26
వారి జన్మముల వరుసగానున్ను, వారి కుటుంబముల
ప్రకారముగానున్ను, వారి తండ్రులయొక్క యింటి

ప్రకారముగానున్ను, వారి పేరులయొక్క లెక్క ప్ర
కారముగానున్ను, యిరువై సంవత్సరములు మొదలు
కొని అంతకు పయిని యీడు కలిగి, యుద్ధమునకు
బయిలుదేర శక్తిగల వారినందరినిన్ని లెక్క చూడగా,।
27 యూదా గోత్రములో లెక్కకు వచ్చినవారు డెబ్బై
28 నాలుగు వేల ఆర్నూరు మంది వుండిరి.। మరిన్ని ఇశ్శా
ఖారు పుత్రులలో వారి జన్మముల వరుసగానున్ను, వారి
కుటుంబముల ప్రకారముగానున్ను, వారి తండ్రుల
యొక్క యింటి ప్రకారముగానున్ను, వారి పేరుల
యొక్క లెక్క ప్రకారముగానున్ను, యిరువై సంవత్స
రములు మొదలుకొని అంతకు పయిని యీడు కలిగి,
యుద్ధమునకు బైలుదేర శక్తి గల వారినందరినిన్ని లెక్క
29 చూడగా,। ఇశ్శాఖారు గోత్రములో లెక్కకు వచ్చిన
వారు యాబై నాలుగువేల నన్నూరు మంది వుండిరి.।
30 మరిన్ని జబూలోను యొక్క పుత్రులలో వారి జన్మ
ముల వరుసగానున్ను, వారి కుటుంబముల ప్రకారము
గానున్ను, వారి తండ్రులయొక్క యింటి ప్రకారము
గానున్ను, వారి పేరులయొక్క లెక్క ప్రకారముగా
నున్ను, యిరువై సంవత్సరములు మొదలుకొని అంతకు
పైని యీడు కలిగి, యుద్ధమునకు బయిలుదేర శక్తి గల
31 వారినందరినిన్ని లెక్క చూడగా,। జబూలోను గోత్ర
ములో లెక్కకు వచ్చినవారు యాబై యేడువేల నన్నూ
32 రుమంది వుండిరి.। మరిన్ని యోసేపుయొక్క సంతతిని
గురించినది యేమంటే, ఎఫ్రయీము పుత్రులలో వారి
జన్మముల వరుసగానున్ను, వారి కుటుంబముల ప్రకా
రముగానున్ను, వారి తండ్రులయొక్క యింటి ప్రకా
రముగానున్ను, వారి పేరులయొక్క లెక్క ప్రకార
ముగానున్ను, యిరువై సంవత్సరములు మొదలుకొని
అంతకు పైని యీడు కలిగి, యుద్ధమునకు బయిలుదేర
33 శక్తిగల వారినందరినిన్ని లెక్క చూడగా,। ఎఫ్రయీము
గోత్రములో లెక్కకు వచ్చిన వారు నలుబయివేల
34 యేనూరు మంది వుండిరి.। మరిన్ని మనస్సే పుత్రులలో
వారి జన్మముల వరుసగానున్ను, వారి కుటుంబముల
ప్రకారముగానున్ను, వారి తండ్రుల యింటి ప్రకా
రముగానున్ను, వారి పేరులయొక్క లెక్క ప్రకార
ముగానున్ను, యిరువై సంవత్సరములు మొదలుకొని
అంతకు పైని యీడు కలిగి, యుద్ధమునకు బయిలు
35 దేర శక్తిగల వారినందరినిన్ని లెక్క చూడగా,। మనస్సే
గోత్రములో లెక్కకు వచ్చినవారు ముప్పయి రెండు
36 వేల యిన్నూరు మంది వుండిరి.। మరిన్ని బెన్యామీను
పుత్రులలో వారి జన్మముల వరుసగానున్ను, వారి కు
టుంబముల ప్రకారముగానున్ను, వారి తండ్రులయొ
క్క యింటి ప్రకారముగానున్ను, వారి పేరులయొక్క
లెక్క ప్రకారముగానున్ను, యిరువై సంవత్సరములు
మొదలుకొని అంతకు పైని యీడు కలిగి, యుద్ధమునకు
బయిలుదేర శక్తిగల వారినందరినిన్ని లెక్క చూడగా,।
బెన్యామీను గోత్రములో లెక్కకు వచ్చినవారు ము 37
ప్పయి అయిదువేల నన్నూరు మంది వుండిరి.। మరిన్ని 38
దాను పుత్రులలో వారి జన్మముల వరుసగానున్ను, వారి
కుటుంబముల ప్రకారముగానున్ను, వారి తండ్రుల
యొక్క యింటి ప్రకారముగానున్ను, వారి పేరుల
యొక్క లెక్క ప్రకారముగానున్ను, యిరువై సంవ
త్సరములు మొదలుకొని అంతకు పైని యీడు కలిగి,
యుద్ధమునకు బైలుదేర శక్తిగల వారినందరినిన్ని లెక్క
చూడగా,। దాను గోత్రములో లెక్కకు వచ్చినవారు 39
అరువై రెండువేల యేడ్నూరు మంది వుండిరి.। మరిన్ని 40
ఆషేరు పుత్రులలో వారి జన్మముల వరుసగానున్ను,
వారి కుటుంబముల ప్రకారముగానున్ను, వారి తం
డ్రులయొక్క యింటి ప్రకారముగానున్ను, వారి పే
రులయొక్క లెక్క ప్రకారముగానున్ను, యిరువై సం
వత్సరములు మొదలుకొని అంతకు పైని యీడు కలిగి,
యుద్ధమునకు బైలుదేర శక్తిగల వారినందరినిన్ని లెక్క
చూడగా,। ఆషేరు గోత్రములో లెక్కకు వచ్చినవారు 41
నలుబై వొక్కవేల యేనూరు మంది వుండిరి.। మరిన్ని 42
నఫ్తాలీ పుత్రులలో వారి జన్మముల వరుసగానున్ను,
వారి కుటుంబముల ప్రకారముగానున్ను, వారి తం
డ్రులయొక్క యింటి ప్రకారముగానున్ను, వారి పే
రులయొక్క లెక్క ప్రకారముగానున్ను, యిరువై సం
వత్సరములు మొదలుకొని అంతకు పైని యీడు కలిగి,
యుద్ధమునకు బైలుదేర శక్తిగల వారినందరినిన్ని లెక్క
చూడగా,। నఫ్తాలీ గోత్రములో లెక్కకు వచ్చిన వారు 43
యాబై మూడువేల నన్నూరు మంది వుండిరి.। వీరిని 44
మోషేయున్ను అహరోనున్ను ఇశ్రాయేలు యొక్క
శ్రేష్ఠులయిన పండ్రెండు మందిన్ని లెక్క చూచిన
వారైరి; యీ పండ్రెండు మందిన్ని వొక్కొక్కడు
తన తన తండ్రియింటికి కలిగి వుండెను.। యీ ప్రకా 45
రము ఇశ్రాయేలు పుత్రులలో తమ తమ తండ్రుల
యింటి వరుసగా యిరువై సంవత్సరములు మొదలు
కొని అంతకు పయిని యీడు కలిగి, ఇశ్రాయేలులో
యుద్ధమునకు బయిలుదేర శక్తిగల వారందరు లెక్కించ
బడిరి.। యీలాగున లెక్కించబడిన వారందరున్ను 46
ఆరు లక్షల మూడువేల యేనూట యాబయి మంది వుం
డిరి.। అయితే లేవీయులు తమ తండ్రులయొక్క గోత్ర 47
ప్రకారముగా వారిలో లెక్కించబడలేదు.। యెందు 48
కంటే యెహోవా మోషేతో పలికి యుండినదేమం
టే,। ఇశ్రాయేలు పుత్రులలో నీవు లేవీ గోత్రము 49
మాత్రము లెక్కించకనున్ను వారి మొత్తు లెక్కను
చూడకనున్ను వుండ వలెను.। లేవీయులను సాక్ష్యము 50

యొక్క డేరా మీదనున్ను, దాని సమస్తమైన వుపకర
ణముల మీదనున్ను, దానికి కలిగిన సమస్త వస్తువుల
మీదనున్ను వుండేటట్టు నీవు నిర్ణాయించ వలెను;
వారు డేరానున్ను దాని సమస్తమయిన వుపకరణముల
నున్ను మోసుకొంటూ, దానికి సేవచేస్తూ ఆ డేరా
51 చుట్టూ పేట వేసుకొని వుండ వలెను. । మరిన్ని డేరా
తర్లి వెళ్లే సమయమందున లేవీయులే దాన్ని దించ
వలెను; యిదిగాక డేరా పాతేటప్పుడున్ను లేవీయులే
దాన్ని లేవనెత్త వలెను; అన్యుడైన వాడు దాని సమీ
52 పమునకు వస్తే వాడు చంపబడ వలెను. । మరిన్ని ఇశ్రా
యేలు పుత్రులు తమ సైన్యమంతటిలో ప్రతివాడున్ను
తన తన పేట దగ్గిరనున్ను, ప్రతివాడున్ను తన తన
53 నిశానీ దగ్గిరనున్ను డేరాలను వేసుకో వలెను.। అయితే
ఇశ్రాయేలు పుత్రులయొక్క సంఘము పైకి వుగ్రత
రాకుండా లేవీయులు సాక్ష్యముయొక్క డేరా చుట్టూ
తమ తమ డేరాలను వేసుకో వలెను; యేమంటే సాక్ష్య
ముయొక్క డేరా లేవీయులయొక్క వశమయి వుండ
54 వలెనని ఆనతిచ్చెను. । యెహోవా మోషేకు ఆజ్ఞా
పించిన అంతటి ప్రకారము ఇశ్రాయేలు పుత్రులు
చేసిరి; వారు ఆలాగున చేసిరి.

## 2. అధ్యాయము.

1 మరిన్ని యెహోవా మోషేకున్ను అహరోను
2 కున్ను సెలవు యిచ్చినదేమంటే, । ఇశ్రాయేలు పుత్రు
లలో ప్రతి మనుష్యుడు తన నిశానీ దగ్గిర తమ తండ్రి
యింటియొక్క బిరుదుతోను డేరాను వేసుకో వలెను;
సంఘముయొక్క డేరాకు దూరముగా చుట్టున్న వారు
3 వేసుకో వలెను. । సూర్యోదయమయ్యే తూర్పు దిక్కు
యందు యూదా పేటయొక్క నిశానీ సంబంధికులు
తమ సమూహములతో డేరాను వేసుకో వలెను; మరిన్ని
అమ్మీనాదాబు కుమారుడైన నహషోను యూదాయొ
4 క్క పుత్రులకు అధిపతియై వుండ వలెను. । వాని స
మూహములో లెక్కకు వచ్చిన వారు డెబ్బయి నాలు
5 గు వేల ఆరునూరు మంది వుండిరి. । మరిన్ని వాని సమీ
పమందు ఇశ్శాఖారుయొక్క గోత్రీయులు డేరాలను
వేసుకో వలెను; సూయారు కుమారుడైన నెతనేలు
ఇశ్శాఖారు పుత్రులకు అధిపతియై వుండ వలెను. ।
6 వాని సమూహములో లెక్కకు వచ్చిన వారు యాభై
7 నాలుగు వేల నన్నూరు మంది వుండిరి.। తరువాత జబూ
లోను గోత్రము వుండ వలెను; హేలోను కుమారుడైన
ఏలీయాబు జబూలోనుయొక్క పుత్రులకు అధిపతియై
8 వుండ వలెను. । వాని సమూహములో లెక్కకు వచ్చిన
వారందరున్ను యాభై యేడువేల నన్నూరు మంది వుం
9 డిరి.। యూదాయొక్క పేటలో లెక్కకు వచ్చిన వారు
వారి సమూహముల చొప్పున లక్ష యెనభై ఆరువేల
నన్నూరు మంది వుండిరి; వీరు ముందర సాగి వెళ్లవలసి
నది. । అయితే దక్షిణ దిక్కు యందు రూబేను పేట 10
యొక్క నిశానీ వారి వారి సమూహముల చొప్పున
వుండ వలెను; షెదేయూరు కుమారుడైన ఎలీసూరు
రూబేనుయొక్క పుత్రులకు అధిపతియై వుండ వలెను.।
వాని సమూహములో లెక్కకు వచ్చినవారు నలుభై 11
ఆరువేల యేనూరు మంది యుండిరి. । మరిన్ని వాని 12
సమీపమందు షిమోనుయొక్క గోత్రీయులు డేరా
లను వేసుకో వలెను; సూరీషద్దయి కుమారుడయిన షె
లూమీయేలు షిమోనుయొక్క పుత్రులకు అధిపతియై
వుండ వలెను. । వాని సమూహములో లెక్కకు వచ్చిన 13
వారు యాబయి తొమ్మిదివేల మున్నూరు మంది వుం
డిరి. । తరువాత గాదు గోత్రీయులు వుండ వలెను; 14
రెయూవేలు కుమారుడైన ఎల్యాసాపు గాదుయొక్క
పుత్రులకు అధిపతియై వుండ వలెను. । వాని సమూ 15
హములో లెక్కకు వచ్చిన వారు నలుభై అయిదువేల
ఆరునూట యాభై మంది వుండిరి. । రూబేనుయొక్క 16
పేటలో లెక్కకు వచ్చిన వారు వారి సమూహము
చొప్పున లక్ష యాభై వొక్కవెయి నన్నూట యాభై
మంది వుండిరి; వీరు రెండో తెగవారై సాగి వెళ్ల వల
సినది. । అప్పుడు సంఘము యొక్క డేరా పేట మధ్య 17
మందుండి లేవీయుల పేటతో కూడా సాగి వెళ్ల వలె
ను; వారు పేటలు యే ప్రకారముగా వేసుకొందురో
ఆ ప్రకారమే ప్రతి మనుష్యుడూ తన నిశానీ దగ్గిర
తన స్థలమందుండి సాగి నడువ వలెను. । అయితే పడ 18
మటి దిక్కు యందు ఎఫ్రయీము పేటయొక్క నిశానీ
వారి సమూహముల చొప్పున వుండ వలెను; అమ్మి
హూదు కుమారుడయిన ఎలీషామా ఎఫ్రయీముయొ
క్క పుత్రులకు అధిపతి అయి వుండ వలెను. । వాని 19
సమూహములో లెక్కకు వచ్చిన వారు నలుభై వేల
యేనూరు మంది వుండిరి. । మరిన్ని వాని సమీపమందు 20
మనస్సే గోత్రీయులు వుండ వలెను; పిదాహ్సూరు
కుమారుడైన గమలీయేలు మనస్సేయొక్క పుత్రులకు
అధిపతి అయి వుండ వలెను. । వాని సమూహములో 21
లెక్కకు వచ్చిన వారు ముప్పయి రెండువేల యిన్నూరు
మంది వుండిరి. । తరువాత బెన్యామీను గోత్రీయులు 22
వుండ వలెను; గిదోనీ కుమారుడైన అబీదాను బెన్యా
మీనుయొక్క పుత్రులకు అధిపతి అయి వుండ వలెను.।
వాని సమూహములో లెక్కకు వచ్చిన వారు ముప్ప 23
యి అయిదువేల నన్నూరు మంది వుండిరి. । ఎఫ్రయీ 24
ముయొక్క పేటలో లెక్కకు వచ్చిన వారందరున్ను
వారి సమూహముల చొప్పున లక్ష యెనిమిదివేల నూరు
మంది వుండిరి; వీరు మూడో తెగవారై సాగి వెళ్ల వల

25 సినది. । మరిన్ని వుత్తర దిక్కు యందు దాను పేటయొ
క్క నిశానీ వారి సమూహముల చొప్పున వుండ వలెను;
అమ్మీషద్దయి కుమారుడైన అహీయెజెరు దాను పుత్రు
26 లకు అధిపతి అయి వుండ వలెను. । వాని సమూహము
లో లెక్కకు వచ్చిన వారు అరువై రెండు వేల యేళ్నూ
27 రుమంది వుండిరి. । మరిన్ని వాని సమీపమందు ఆషేరు
గోత్రీయులు వుండ వలెను; ఒక్రాను కుమారుడైన
పగీయేలు ఆషేరు పుత్రులకు అధిపతి అయి వుండ
28 వలెను. । వాని సమూహములో లెక్కకు వచ్చిన వారు
29 నలుబై వొక్క వెయి యేనూరు మంది వుండిరి. । తరు
వాత నఫ్తాలీయొక్క గోత్రీయులు వుండ వలెను;
ఏనాను కుమారుడైన అహీర నఫ్తాలీయొక్క పుత్రులకు
30 అధిపతి అయి వుండ వలెను. । వాని సమూహములో
లెక్కకు వచ్చిన వారు యాభై మూడు వేల నన్నూరు
31 మంది వుండిరి. । దానుయొక్క పేటలో లెక్కకు వచ్చిన
వారందరున్ను లక్ష యాభై యేడు వేల ఆరు నూరు
మంది వుండిరి; వీరు తమ తమ నిశానీలతోను వెనుక
32 నుంచి రావలెను అని సెలవు యిచ్చెను. । వీరు తమ తమ
పితృలయొక్క యింటి ప్రకారముగా ఇశ్రాయేలు
పుత్రులలో లెక్కకు వచ్చిన వారు అయిరి; ఆ పేట
లలో వారి సమూహముల చొప్పున లెక్కకు వచ్చిన
వారందరున్ను ఆరు లక్షల మూడు వేల యేనూట యా
33 భైమంది వుండిరి. । అయితే లేవీయులు ఇశ్రాయేలు
యొక్క పుత్రులతో కూడా యెహోవా మోషేకు
34 ఆజ్ఞాపించినట్టు లెక్కకు రాకపోయిన వారైరి. । యె
హోవా మోషేకు ఆజ్ఞాపించిన అంతటి ప్రకారముగా
ఇశ్రాయేలు పుత్రులలో ప్రతి మనుష్యుడు తన తన
కుటుంబముల చొప్పుననున్ను తన తన పితృలయొక్క
యింటిచొప్పుననున్ను తన తన నిశానీ దగ్గిర డేరా వేసు
కొంటూ సాగి వెళ్లుతూ వుండిరి.

## 3. అధ్యాయము.

1 సీనై పర్వతమందు యెహోవా మోషేతో మా
ట్లాడిన దినమందు మోషేయొక్కయున్ను అహరోను
2 యొక్కయున్ను వంశావళి యిదే. । అహరోనుకు పు
ట్టిన కుమారులయొక్క పేరులు, ప్రథమ పుత్రుడైన
నాదాబున్ను, తరువాత అబీహూయున్ను, ఎలాజారు
3 న్ను, ఈతామారున్ను. । అర్చకత్వమందు సేవ చేసేటట్టు
అహరోను సమర్పించినటువంటిన్ని అభిషేకించ బడి
నటువంటిన్ని అర్చకులైన అతని కుమారులయొక్క
4 పేరులు యివే. । నాదాబున్ను అబీహూయున్ను సీనై
అరణ్యమందు యెహోవా యెదుట అన్యమైన అగ్నిని
అర్పించినప్పుడు యెహోవా యెదుట మరణమును
పొందిరి, వీరికి సంతతి లేక వుండెను; తరువాత ఎలా
జారున్ను ఈతామారున్ను తమ తండ్రి అయిన అహ
రోనుయొక్క దృష్టికి అర్చకత్వమందు సేవ చేస్తూ
వుండిరి. । యెహోవా మోషేకు సెలవు యిచ్చినదే 5
మంటే, । నీవు లేవీ గోత్రీకులను నీ యొద్దకు పిలిపిం 6
చుకొని, అర్చకుడైన అహరోనుకు పరిచారకులయ్యే
టట్టు అతని యొద్ద వుంచుదువు గాక. । వారు అతని 7
కిన్ని సంఘమంతటికిన్ని ఆజ్ఞాపించిన ప్రకారమంతటినీ
భద్రముగా చేసి, సంఘముయొక్క డేరా ముందరుండి,
డేరా పని చేస్తూ వుండ వలెను. । వారు సంఘపు డేరా 8
యొక్క వస్తువులన్నిటినిన్ని ఇశ్రాయేలు పుత్రులకు
ఆజ్ఞాపించిన వన్నిటినిన్ని భద్రము చేసి, డేరాయొక్క
సేవ చేయ వలెను. । మరిన్ని నీవు లేవీయులను అహ 9
రోను కిందనున్ను అతని కుమారుల కిందనున్ను వుంచు
దువుగాక; వారు ఇశ్రాయేలు పుత్రులలోనుంచి అతని
కింద పూర్ణముగా యివ్వబడి వున్నారు. । మరిన్ని 10
నీవు అహరోనునున్ను అతనియొక్క కుమారులనున్ను
వారి అర్చకత్వమందు కనిపెట్టుకొని వుండేటట్టుగా
నిర్ణయించ వలసినది; యిందుకై అన్యుడు దగ్గిరకు
వచ్చినట్టాయెనా వాడు చంపబడ వలెనని ఆనతిచ్చెను. ।
మరిన్ని యెహోవా మోషేకు సెలవు యిచ్చినదేమం 11
టే, । నేను, యిదుగో నేను, ఇశ్రాయేలు పుత్రులలో 12
గర్భమును తెరచిన తొలిచూలు అయిన వారందరికి
బదులుగా లేవీయులను ఇశ్రాయేలు పుత్రులలోనుంచి
తీసుకొని యున్నాను, గనుక, లేవీయులు నా వారై
యుండ వలెను. । యేమంటే ప్రథమమందు పుట్టినవ 13
న్నిన్ని నావై యున్నవి; మిస్రయీము దేశములో
ప్రథమమందు పుట్టిన వాటినన్నిటినిన్ని నేను సంహ
రించిన దినమున ఇశ్రాయేలులో ప్రథమమందు పుట్టిన
మనుష్య జాతినిన్ని పశు జాతినిన్ని వీటి నన్నిటినీ నా
కొరకు పరిశుద్ధము చేసుకొంటిని, అవి నా కొరకు
వుండ వలెను; నేను యెహోవాను అని ఆనతిచ్చెను. ।
మరిన్ని యెహోవా సీనై అరణ్యములో మోషేకు 14
సెలవు యిచ్చినదేమంటే, । లేవీ పుత్రులను వారి పితృల 15
యొక్క యింటి చొప్పుననున్ను వారి కుటుంబముల
చొప్పుననున్ను లెక్కించుము; వొక నెల మొదలుకొని
అంతకు పైని యీడు గల మొగవారందరినిన్ని నీవు
లెక్కించ వలెనని సెలవు యిచ్చినందున, । మోషే తనకు 16
యిచ్చిన ఆజ్ఞ చొప్పున యెహోవా వాక్య ప్రకా
రముగా వారిని లెక్కించెను. । గేర్షోను, కెహాతు, 17
మెరారీ, అనే పేరులు గల వీరు లేవీయొక్క కుమా
రులై వుండిరి. । మరిన్ని లిబ్నీ, షిమీ, యీ పేరులు 18
గల వీరు తమ కుటుంబముల ప్రకారముగా గేర్షో
ను కుమారులై వుండిరి. । మరిన్ని అమ్రాము, ఇస్హారు, 19
హెబ్రోను, ఉజ్జీయేలు, వీరు తమ కుటుంబముల ప్రకా

20 రముగాను కెహాతు పుత్రులు. । మరియు మాహ్లీ, మూషి,
వీరు తమ కుటుంబముల ప్రకారముగాను మెరారీ
పుత్రులు; వీరు తమ పితృలయొక్క యింటి ప్రకార
21 ముగాను లేవీయులయొక్క కుటుంబములు. । గేర్షోా
ను వల్లనుంచి లిబ్నీయుల కుటుంబమున్ను షిమీయుల
కుటుంబమున్ను కలిగి వుండెను; వీరు గేర్షోానీయుల
22 కుటుంబములు. । వారిలో లెక్కకు వచ్చినవారు యెంద
రంటే, వొక నెల మొదలుకొని అంతకు పైని యీడు
గల మొగవారందరియొక్క లెక్క చొప్పున యేడు
23 వేల యేనూరు మంది లెక్కకు వచ్చినవారైరి. । యీ
గేర్షోానీయుల కుటుంబములు డేరా వెనుక పడమటి
24 దిక్కుయందు డేరాలను వేసుకో వలెను. । లాయేలు
కుమారుడైన ఎల్యాసాపు గేర్షోానీయుల పితృనియొ
25 క్క యింటికి అధిపతియై యుండ వలెను. । సంఘము
యొక్క డేరా వస్తువులలో గేర్షోాను పుత్రుల వశ
మందు వుండ వలసినవేవంటే, డేరాయున్ను, నివాస
స్థలమున్ను, దాని పైకప్పున్ను, సంఘముయొక్క డేరా
26 ద్వారము పరదాయున్ను, । దాని వాకిటికి చుట్టూ
వున్న పరదాలున్ను, డేరా దగ్గిరనున్ను బలిపీఠము దగ్గి
రనున్ను చుట్టూ వున్న వాకిటి ద్వారముయొక్క పర
దాయున్ను, దాని పని అంతటి కొరకైన త్రాళ్లున్ను,
27 యివి వారి వశమందు వుండ వలెను. । మరియు కెహాతు
వల్లనుంచి అమ్రామీయుల కుటుంబమున్ను ఇస్హారీ
యుల కుటుంబమున్ను, హెబ్రోనీయుల కుటుంబము
న్ను, ఉజ్జీయేలీయుల కుటుంబమున్ను కలిగి వుండెను;
28 వీరు కెహాతీయుల కుటుంబములై వుండిరి. । వొక నెల
మొదలుకొని అంతకు పైని యీడు గల మొగవారి
యొక్క లెక్క యెందరంటే, యెనిమిదివేల ఆరునూ
రు మంది పరిశుద్ధ స్థలమును కనిపెట్టుకొని వుంటూ వుం
29 డిరి. । కెహాతు పుత్రులయొక్క కుటుంబములు డేరా
యొక్క దక్షిణ దిక్కుయందు డేరాలను వేసుకో వలె
30 ను. । అయితే ఉజ్జీయేలు కుమారుడైన ఎలిస్సాఫాను
కెహాతీయుల కుటుంబములయొక్క తండ్రియొక్క యిం
31 టికి అధిపతి అయి యుండ వలెను. । పెట్టెయున్ను,
బల్లయున్ను, దీపస్తంభమున్ను, బలిపీఠములున్ను, వారు
వేటితో సేవ చేయుదురో పరిశుద్ధ స్థలముయొక్క ఆ
వుపకరణములున్ను, వాటి తెరయున్ను, దానియొక్క
పని కొరకైన సమస్తమున్ను వీరి వశమందు వుండ వలె
32 ను. । అర్చకుడయిన అహరోను కుమారుడైన ఎలాజారు
లేవీయులయొక్క అధిపతులకు అధిపతియై, పరిశుద్ధ
స్థలమును కనిపెట్టే వారిమీద విచారణ కర్తయై వుండ
33 వలెను. । మెరారీ వల్లనుంచి మహ్లీయుల కుటుంబము
న్ను, మూషియుల కుటుంబమున్ను కలిగి వుండెను; వీరు
34 మెరారీ కుటుంబములై వుండిరి. । వీరిలో లెక్కకు వచ్చిన
వారు యెందరంటే, వొక నెల మొదలుకొని అంతకు
పైని యీడు గల మొగవారందరియొక్క లెక్క చొ
ప్పున ఆరువేల యిన్నూరు మంది వుండిరి. । అబీహాయీ 35
లు కుమారుడైన సూరీయేలు మెరారీ కుటుంబముల
యొక్క తండ్రి యింటికి అధిపతి అయి వుండెను; వీరు
డేరాయొక్క వుత్తర దిక్కుయందు డేరాలను వేసుకో
వలసినది. । మెరారీయొక్క పుత్రులు డేరాయొక్క బల్ల 36
లనున్ను, దాని దండెలనున్ను, దాని స్తంభములనున్ను,
దాని మట్లనున్ను, దాని వస్తువులన్నిటినిన్ని, దాని పని
కొరకై వున్న సమస్తమునున్ను, । చుట్టూ వున్న వాకిటి 37
యొక్క స్తంభములనున్ను, వాటి మట్లనున్ను, వాటి
మేకులనున్ను, వాటి త్రాళ్లనున్ను, తమ వశమందున వుం
చుకో వలెను. । అయితే మోషేయున్ను అహరోనున్ను 38
అతని కుమారులున్ను డేరాయొక్క తూర్పు దిక్కనే
సంఘపు డేరాయొక్క తూర్పు దిక్కుయందు డేరాల
ను వేసుకో వలెను; వీరు పరిశుద్ధ స్థలమును కనిపెట్ట వల
సిన ఇశ్రాయేలు పుత్రులకు మారుగా పరిశుద్ధ స్థలమును
కనిపెట్టే వారై వుండ వలసినది; యిందుకు అన్యుడు
దగ్గిరకు వచ్చినట్టాయెనా వాడు చంపబడ వలెను అని
ఆనతిచ్చెను. । లేవీయులలో మోషే చేతనున్ను అహరో 39
నుచేతనున్ను యెహోవా యిచ్చిన ఆజ్ఞ ప్రకారము
లెక్కించబడిన వారు యెందరంటే, వారి కుటుంబముల
చొప్పున వొక నెల మొదలుకొని అంతకు పయిని
యీడు గల మొగవారందరున్ను యిరువై రెండువేల
మంది వుండిరి. । మరియు యెహోవా మోషేకు సెలవు 40
యిచ్చినదేమంటే, వొక నెల మొదలుకొని అంతకు
పయిని యీడుగల ఇశ్రాయేలుకు తొలిచూలైన వారిని
లెక్కించి, వారి నామములయొక్క సంఖ్యను చూడు
ము. । నేను యెహోవానై వున్నాను; ఇశ్రాయేలుకు 41
తొలిచూలైన వారికి బదులుగా లేవీయులనున్ను, ఇశ్రా
యేలు పుత్రులయొక్క పశువులలో తొలిచూలు అయిన
వాటికన్నిటికీ మారుగా లేవీయులయొక్క పశువులను
న్ను నా కొరకు నీవు యేర్పరచ వలసినదని సెలవు
యిచ్చెను. । మోషే యెహోవా తనకు ఆజ్ఞాపించిన 42
ప్రకారము ఇశ్రాయేలు పుత్రులలో తొలిచూలైన
వారినందరినిన్ని లెక్కించెను. । వొక నెల మొదలుకొని 43
అంతకు పయిని యీడు గలిగి లెక్కకు వచ్చిన తొలి
చూలైన మొగవారందరున్ను వారి నామములయొక్క
సంఖ్య ప్రకారముగా యిరువై రెండువేల యిన్నూట
డెబ్బయి ముగ్గురు మంది వుండిరి. । మరియు యెహో 44
వా మోషేకు సెలవు యిచ్చినదేమంటే, । ఇశ్రాయేలు 45
పుత్రులయొక్క తొలిచూలైన వారికి బదులుగా లేవీ
యులనున్ను, వారి పశువులకు బదులుగా లేవీయుల
పశువులనున్ను నీవు యేర్పరచ వలెను; లేవీయులు

46 నావారై వుండ వలెను; నేను యెహోవాను.। అయితే
ఇశ్రాయేలు పుత్రులకు ప్రథమమందు పుట్టిన వారు
లేవీయుల కంటే యిన్నూట డెబ్బయి ముగ్గురు అధిక
47 మైనందున విమోచనము చేయబడ వలెను.। యేలాగం
టే శిరస్సు ఒక్కొంటికి పరిశుద్ధ స్థలముయొక్క షెకే
లు ప్రకారము, షెకేలు ఒక్కొంటికి యిరువై గేరాల
చొప్పున, అయిదేసి షెకేలులను పుచ్చుకో వలెను.।
48 అధికమైన వారు విమోచించబడుటకు యియ్యబడే
సొమ్మును నీవు అహరోనుకున్ను అతని కుమారులకున్ను
49 యిత్తువు గాకని సెలవు యిచ్చెను.। అయినందున లేవీ
యులవల్ల విమోచనము పొందిన వారు గాక అధికమై
వున్న వారి కొరకు యిచ్చిన సొమ్మును మోషే పుచ్చుకొ
50 నెను.। యెంతంటే ఇశ్రాయేలు పుత్రులకు ప్రథమ
మందు పుట్టినవారి కొరకు యిచ్చిన సొమ్ము పరిశుద్ధ
స్థలముయొక్క షెకేలు ప్రకారము వెయ్యిన్ని ము
న్నూట అరువై అయిదు షెకేలులను పుచ్చుకొనెను.।
51 యెహోవా వాక్య ప్రకారముగా విమోచించబడిన
ద్రవ్యమును మోషే పుచ్చుకొని, యెహోవా తనకు
ఆజ్ఞాపించినట్టు అహరోనుకున్ను అతని కుమారులకున్ను
యిచ్చెను.

## 4. అధ్యాయము.

1 మరిన్ని యెహోవా మోషేకున్ను అహరోనుకు
2 న్ను సెలవు యిచ్చినదేమంటే,। లేవీ సంతతిలో నీవు
కెహాతు పుత్రులయొక్క లెక్కచేయ వలెను, యేలా
గంటే, వారి కుటుంబముల చొప్పుననున్ను, వారి పితృ
3 లయొక్క యింటి ప్రకారముగానున్ను,। ముప్పయి
సంవత్సరములు మొదలుకొని యాభై సంవత్సరముల
మట్టుకు యీడు గల సంఘపు డేరాయొక్క పని చేయ
డానకు సమూహములో ప్రవేశించే వారందరియొక్క
4 లెక్కను చూడ వలసినది.। సంఘముయొక్క డేరాలో
పరిశుద్ధమైన వస్తువులను గురించి కెహాతు పుత్రులకు
5 వచ్చే వ్యాపార మేమంటే,। పేట సాగి వెళ్లేటప్పుడు
అహరోనున్ను అతని కుమారులున్ను వచ్చి, చాటు
తెరను దించి, దాని చేతను సాక్ష్యముయొక్క పెట్టెను
6 కప్పి,। దాని మీద తేహాషు అనే మృగముయొక్క
చర్మపు కప్పును వేసి, దాని అంతటి పైని యావత్తూ
నీలిరంగు బట్టను పరచి, దాని దండెలను దూర్చ వలె
7 ను.। మరిన్ని సముఖపు రొట్టెలు గల బల్ల మీద నీలి
రంగు బట్టను పరచి, దాని మీద తాంబాళములనున్ను,
ధూపకలశములనున్ను, గిన్నెలనున్ను, పోయుటకు పా
త్రలనున్ను, పెట్ట వలెను; మరిన్ని నిత్యమైన రొట్టెలు
8 దానిమీద వుండ వలెను.। మరిన్ని వారు వాటి మీద
యెరుపు బట్టను పరచి, తేహాషనే మృగముయొక్క
చర్మపు కప్పుచేత దాని కప్పి, దాని దండెలను దూర్చ
వలెను.। మరిన్ని వారు నీలిరంగు బట్టను తెచ్చి, దీప 9
స్తంభమునున్ను, దాని ప్రమిదెలనున్ను, కత్తెరనున్ను,
కత్తెర వుంచే తబుకునున్ను, వారు దానికి వుపయోగించే
తైల పాత్రలనున్ను కప్పి,। దాన్నిన్ని దాని వస్తువు 10
లన్నిటినిన్ని తేహాషనే మృగముయొక్క చర్మపు కప్పు
లో వుంచి, దాన్ని ఒక దండెమీద కట్టిపెట్ట వలెను.।
మరిన్ని బంగారపు బలిపీఠము మీద నీలిరంగు బట్టను 11
పరచి, తేహాషనే మృగముయొక్క చర్మపు కప్పు
చేత దాన్ని కప్పి, దాని దండెలను దూర్చ వలెను,।
మరిన్ని పరిశుద్ధ స్థలమందు వారు సేవ చేసే పని వస్తు 12
వులనన్నిటినీ తీసి, నీలిరంగు బట్టలో వుంచి, తేహా
షనే మృగముయొక్క చర్మపు కప్పుచేత కప్పి, దండె
మీద కట్టిపెట్ట వలెను.। మరిన్ని బలిపీఠములోనుంచి 13
బూడిదెను తీసివేసి, దాని మీద వూదారంగు పట్టను
పరచి,। దాని చుట్టూ వారు సేవ చేసే దాని సమస్త 14
వస్తువులనున్ను, అనగా ధూప కలశములనున్ను, మాం
సమును గుచ్చే ముండ్లనున్ను, చేటలనున్ను, పళ్లెముల
నున్ను, యివి మొదలయిన పీఠముయొక్క వస్తువుల
నన్నిటినిన్ని దాని మీద వేసి, తేహాషనే మృగముయొ
క్క చర్మపు కప్పును దాని పైని పరచి, దాని దండెలను
దూర్చ వలెను.। పేట సాగి వెళ్లేటప్పుడు అహరోను 15
న్ను అతని కుమారులున్ను పరిశుద్ధ స్థలమునున్ను పరి
శుద్ధ స్థలముయొక్క వస్తువులనన్నిటినిన్ని కప్పి వేయడ
మైన తరువాతను, మొయ్యడానకు కెహాతు పుత్రులు
రావలెను; అయితే వారు చావకుండా వుండేటట్టు
పరిశుద్ధమైనది ఒకటయినా వారు ముట్ట కూడదు;
సంఘముయొక్క డేరా వస్తువులలో వీటి భారము
కెహాతు పుత్రులకు కలిగి వుండ వలెను.। అర్చకుడైన 16
అహరోను కుమారుడైన ఎలాజారుయొక్క వ్యాపార
మునకు వచ్చిన వస్తువులు యేమిటేమిటంటే, దీపపు
చమురున్ను, సువాసన గల ధూప చూర్ణమున్ను,
అనుదిన భోజనార్పణయున్ను, అభిషేక తైలమున్ను,
యివిగాక డేరా అంతటి మీదనున్ను దానిలో వున్న
సమస్తము మీదనున్ను పరిశుద్ధ స్థలము మీదనున్ను
దాని వస్తువులన్నిటి మీదనున్ను వాడు కనిపెట్ట వలసి
నదని ఆజ్ఞాపించెను.। మరిన్ని యెహోవా మోషేకు 17
న్ను అహరోనుకున్ను సెలవు యిచ్చినదేమంటే,। కెహా 18
తీయుల కుటుంబముల గోత్రీయులను లేవీయులలో
నుంచి వేరు చేయకండి;। అయితే వారు మహా పరిశు 19
ద్ధమైన వస్తువుల సమీపమునకు వచ్చినప్పుడు వారు మర
ణము కాక బ్రతికి వుండేటట్టు, అహరోనున్ను అతని
కుమారులున్ను ముందుగా లోపలికి ప్రవేశించి, వారి
లో ప్రతి మనుష్యునికి సేవయున్ను మోసే బరువునున్ను

20 వాని వానికి నిర్ణయింతురు గాక; । అయితే పరిశుద్ధ
మయిన వస్తువులను కప్పివేసే సమయమున వారికి
మరణము సంభవించకుండా చూడడానకు వారు లోప
21 లికి ప్రవేశించ కూడదని ఆజ్ఞాపించెను. । మరిన్ని యె
22 హెూవా మోషేకు సెలవు యిచ్చినదేమంటే, । నీవు
గేర్షోను పుత్రులయొక్క లెక్కనున్ను చేయ వలెను;
యేలాగంటే వారి పితృలయొక్క యిండ్ల ప్రకారము
23 గానున్ను, । వారి కుటుంబముల ప్రకారముగానున్ను,
ముప్పయి సంవత్సరములు మొదలుకొని యాభై సంవ
త్సరముల మట్టుకు యీడు గలిగి, సంఘముయొక్క
డేరాలో సేవ చేయడానకు సమూహములో ప్రవే
24 శించే వారందరియొక్క లెక్కను చేయ వలెను.। అయితే
గేర్షోను వారి కుటుంబములయొక్క వ్యాపారము
25 సేవ చేసుటకున్ను మోత కొరకున్ను అవును. । యేలా
గంటే, డేరాయొక్క తెరలనున్ను, సంఘముయొక్క
డేరానున్ను, దాని కప్పునున్ను, దాని పైనున్న తేహా
షనే మృగ చర్మముయొక్క కప్పునున్ను సంఘపు డేరా
26 యొక్క ద్వారము పరదానున్ను, । చుట్టూ వాకిటియొ
క్క పరదాలనున్ను, డేరా దగ్గిరనున్ను బలిపీఠము
దగ్గిరనున్ను వున్న వాకిలి ద్వారముయొక్క పరదాను
న్ను, వాటి తాళ్లనున్ను, వాటి పని వస్తువులనన్నిటి
నిన్ని, వాటికి చేయబడినవన్నిటినిన్ని వారు మోస్తూ
27 యీలాగున సేవ చేయ వలెను.। గేర్షోను పుత్రులయొ
క్క వ్యాపారమంతా వారి మోతలన్నిటి యందున్ను
వారి సేవ అంతటి యందున్ను అహరోను యొక్కానున్ను
అతని కుమారులయొక్కానున్ను నిర్ణయ ప్రకారము
వుండ వలెను; యీలాగున మీరు వారియొక్క మోత
లన్నిన్ని వారి వశమయ్యేటట్టు నిర్ణయించ వలెను. ।
28 సంఘముయొక్క డేరాలో గేర్షోను పుత్రుల కుటుం
బములయొక్క సేవ యీ చొప్పున అయి వుండ వలెను;
వారి వ్యాపారము అర్చకుడైన అహరోను కుమారుడైన
29 ఈతామారు చేతికింద వుండ వలెను. । మెరారీ పుత్రులను
గురించినదేమంటే, నీవు వారి కుటుంబముల చొప్పున
నున్ను, వారి పితృలయొక్క యింటి చొప్పుననున్ను,
30 వారిని లెక్కించ వలెను. । యేలాగంటే, ముప్పయి సంవ
త్సరములు మొదలుకొని అంతకు పైని యేభై సంవత్స
రముల మట్టుకు యీడు గలిగి, సంఘముయొక్క డేరా
లో సేవ చేయడానకు ప్రవేశించే వారందరియొక్క
31 లెక్క చేతువు గాక. । సంఘముయొక్క డేరాలో వారి
సేవయొక్క ప్రకారముగా మోత కొరకు వారి వశ
మయ్యేవి యేవంటే, డేరాయొక్క పలకలున్ను, దాని
దండెలున్ను, దాని స్తంభములున్ను, దాని మట్లున్ను,।
32 చుట్టూ వున్న వాకిటియొక్క స్తంభములున్ను, వాటి
మట్లున్ను, వాటి మేకులున్ను, వాటి తాళ్లున్ను, వాటి
పనికి అయ్యే సమస్తమున్ను: అయితే మొయ్యడానకు
వారి వశమందున్న వస్తువులను పేరు పేరు వరసగా
మీరు లెక్కచేయ వలెను. । యీలాగున మెరారీ పు 33
త్రుల కుటుంబములు అర్చకుడైన అహరోను కుమా
రుడైన ఈతామారు చేతికింద వుండి, వారికి నిర్ణయ
మైన సేవ అంతటి ప్రకారము సంఘముయొక్క డేరా
లో సేవచేయ వలెనని సెలవు యిచ్చెను. । అయినందున 34
మోషేయున్ను అహరోనున్ను సంఘముయొక్క శ్రేష్ఠు
లున్ను కెహాతీయుల పుత్రుల లెక్క చేసిరి; యేలా
గంటే వారి కుటుంబముల చొప్పుననున్ను వారి పితృ
లయొక్క యింటి చొప్పుననున్ను, । ముప్పయి సంవ 35
త్సరములు మొదలుకొని అంతకు పైని యాభై సంవత్స
రముల మట్టుకు యీడు గలిగి, సంఘముయొక్క డేరా
లో సేవ చేయడానకు ప్రవేశించే వారందరియొక్క
లెక్క చేసిరి. । వారి కుటుంబముల చొప్పున వారిలో 36
లెక్కకు వచ్చిన వారు రెండువేల యేడ్నూట యాభై
మంది వుండిరి. । వీరు కెహాతీయుల కుటుంబములలో 37
లెక్కకు వచ్చినవారై, సంఘముయొక్క డేరాలో సేవ
చేసేపాటివారై వుండిరి; వీరిని మోషేయున్ను అహరో
నున్ను యెహెూవా మోషేకు ఆజ్ఞాపించిన ప్రకారము
లెక్క చేసిరి. । మరిన్ని గేర్షోను పుత్రులలో వారి 38
కుటుంబముల చొప్పుననున్ను వారి పితృలయొక్క
యింటి చొప్పుననున్ను లెక్కకు వచ్చిన వారెందరంటే,।
ముప్పై సంవత్సరములు మొదలుకొని అంతకు పైని 39
యాభై సంవత్సరముల మట్టుకు యీడు గలిగి, సంఘ
ముయొక్క డేరాలో సేవ చేయడానకు ప్రవేశించే
వారు, । అనగా వారి కుటుంబముల చొప్పుననున్ను 40
వారి పితృల యింటి చొప్పుననున్ను లెక్కకు వచ్చిన
వారు రెండువేల ఆరునూట ముప్పయి మంది వుండిరి. ।
వీరు గేర్షోను పుత్రులయొక్క కుటుంబములలో 41
లెక్కకు వచ్చిన వారై, అందరున్ను సంఘముయొక్క
డేరాలో సేవ చేసేపాటివారై వుండిరి; వీరిని మోషే
యున్ను అహరోనున్ను యెహెూవా ఆజ్ఞాప్రకారము
లెక్కించిరి. । మరిన్ని మెరారీ పుత్రులయొక్క కుటుం 42
బములలో వారి కుటుంబముల చొప్పుననున్ను వారి
పితృలయొక్క యింటి చొప్పుననున్ను లెక్కకు వచ్చిన
వారెందరంటే, । ముప్పయి సంవత్సరములు మొదలు 43
కొని అంతకు పైని యాభై సంవత్సరముల మట్టుకు
యీడు గలిగి, సంఘముయొక్క డేరాలో సేవ చేయ
డానకు ప్రవేశించేపాటి వారు, । అనగా వారి కుటుం 44
బముల చొప్పున వారిలో లెక్కకు వచ్చినవారు మూ
డువేల యిన్నూరుమంది వుండిరి. । వీరు మెరారీ పుత్రుల 45
కుటుంబములలో లెక్కకు వచ్చినవారై యుండిరి:
మోషేయున్ను అహరోనున్ను యెహెూవా మోషేకు

46 ఆజ్ఞాపించిన ప్రకారము లెక్క చేసిరి. । మోషే చేతను
న్ను అహరోను చేతనున్ను ఇశ్రాయేలుయొక్క శ్రేష్ఠు
లైన వారి చేతనున్ను లేవీయులలో వారి కుటుంబ
ముల చొప్పుననున్ను వారి పితృలయొక్క యింటి చొ
47 ప్పుననున్ను లెక్కించబడిన వారు యెందరంటే,। ముప్ప
యి సంవత్సరములు మొదలుకొని అంతకు పైని యేబై
సంవత్సరముల మట్టుకు యీడు గలిగి, సంఘముయొక్క
డేరాలో వ్యాపారమైన సేవనున్ను మోతపనినిన్ని
48 చేసేపాటి వారందరున్ను,। యెనిమిదివేల యేనూట యె
49 నబైమంది వుండిరి. । వీరు యెహోవా యిచ్చిన ఆజ్ఞా
ప్రకారము ప్రతి మనుష్యుడు వాని వాని సేవ చొప్పు
ననున్ను వాని మోత చొప్పుననున్ను మోషే చేత
లెక్కించ బడిరి; యీలాగున యెహోవా మోషేకు
ఆజ్ఞాపించినట్టు వారు వాని చేత లెక్కించ బడిరి.

## 5. అధ్యాయము.

1 మరిన్ని యెహోవా మోషేకు సెలవు యిచ్చిన
2 దేమంటే, । ఇశ్రాయేలు పుత్రులు ప్రతి కుష్ఠరోగిని
న్ని స్రావము గల ప్రతి మనిషినిన్ని, శవమువల్ల మ
యిల జెందిన ప్రతి వానిన్ని పేటలోనుంచి అవతలకు
3 పంపి వేసేటట్టు వారికి ఆజ్ఞాపించుము. । మొగవానిని
న్ని ఆడుదానినిన్ని మీరు బయిటికి పంపివేయ వలెను;
యే పేటల మధ్యమందు నేను నివసిస్తున్నానో వారి
యొక్క ఆ పేటలను వారు అపవిత్రపరచకుండా పేట
బైటకు వారిని పంపివేయ వలసినదని సెలవు యిచ్చెను.।
4 అయినందున ఇశ్రాయేలు పుత్రులు ఆ ప్రకారము
చేసి, పేట బైటికి వారిని పంపివేసిరి: యెహోవా
మోషేకు ఆజ్ఞాపించిన ప్రకారము ఇశ్రాయేలు పుత్రు
5 లు చేసిరి. । మరిన్ని ఇశ్రాయేలు పుత్రులతో చెప్పు
6 మని యెహోవా మోషేతో అనినదేమంటే, । పురు
షుడైనా స్త్రీ అయినా యెహోవాకు విరోధముగా
తప్పితమయ్యేటట్టు మనుష్యుల విషయమైన దోషముల
లోను యేదైనా యొకటి చేసి, ఆ మనుష్యుడు నేరము
7 స్థాపించుకోబడ్డ వాడయితే, । అప్పుడు వారు తాము
చేసిన పాపమును ఒప్పుకో వలెను; తరువాత వాడు
తన తప్పితమును యిచ్చుకో వలసినది, యేలాగంటే,
దాని మూలముతో అయిదో పాలు కలుపుకొని, తాను
యెవనికి విరోధముగా తప్పు చేసెనో వానికి దానిని
8 యియ్య వలెను. । అయితే ఆ తప్పితమును పుచ్చుకొనే
సంబంధము కలవాడు ఆ మనుష్యునికి లేని పక్షమం
దు, ఆ తప్పితమును యెహోవాకు చెల్లించేటట్టు
అర్చకునికి యివ్వబడ వలసినది; యిదిగాక వాని కొ
రకు శాంతి కలుగ జేయబడేటందుకు శాంతి కొరకైన
9 పొట్టేలున్ను యివ్వబడ వలెను. । మరిన్ని ఇశ్రాయేలు
పుత్రులయొక్క పరిశుద్ధమైన వాటిలో అర్చకుని
యొద్దికి తెచ్చి అర్పించే ప్రతి కానుకయున్ను అర్చ
కునిదై వుండును. । యేమంటే ప్రతి మనుష్యునియొ 10
క్క పరిశుద్ధమైన వస్తువులు అర్చకునివై వుండ వలె
ను; అర్చకునికి యెవడు యేమి యిచ్చినా అది వా
నిదై వుండునని సెలవు యిచ్చెను. । మరిన్ని ఇశ్రాయే 11
లు పుత్రులతో మాట్లాడి చెప్పుమని యెహోవా
మోషేకు సెలవు యిచ్చినదేమంటే, । ఒక మనుష్యుని 12
యొక్క భార్య వ్యభిచరించి వానికి దోషురాలై, । మరి 13
యొకనితో శయనించిన సంగతి దాని పెనిమిటియొ
క్క నేత్రములకు మరుగుగా వుండినానున్ను, అది
రహస్యముగా వుంచబడి యున్నానున్ను, అది అపవి
త్రురాలైనప్పటికిన్ని దాని యందు సాక్షి లేక వున్నా
నున్ను, అది పట్టుబడక పోయినానున్ను, । పెనిమిటికి 14
అనుమానాత్మ వచ్చినందున వాడు తన భార్యనుగూర్చి
అనుమానపడి అది అపవిత్రురాలైనానున్ను లేక వా
నికి అనుమానాత్మ వచ్చినందున తన భార్యను గురించి
అనుమానపడినంతలో అది అపవిత్రురాలు కాకపో
యినానున్ను, । అప్పుడు ఆ మనుష్యుడు తన భార్యను 15
అర్చకుని యొద్దికి తీసుకొని రావలెను; మరిన్ని వాడు
దాని నిమిత్తము అర్పణ తేవలెను; అది ఏఫాలో
పదోపాలు యవలపిండి అయి వుండ వలెను: దానిలో
తైలము పొయ్య కూడదు; దానిలో సాంబ్రాణి వేయ
కూడదు; యెందుకంటే, అది అనుమానార్పణయై వు
న్నది; అక్రమమును జ్ఞాపకము చేసును, కాగా జ్ఞాప
కార్థమైన అర్పణయై యున్నది. । అప్పుడు అర్చ 16
కుడు ఆ స్త్రీని సమీపమునకు తెప్పించి, యెహోవా
సముఖమందు దాని నిలువబెట్టిన తరువాత, । అర్చ 17
కుడు మంటి ఘటముతోటి పరిశుద్ధమైన వుదకమును
తెచ్చి, డేరా కిందనున్న ధూళిలో కొంత తీసి, ఆ వుద
కములో వేయ వలెను. । అప్పుడు అర్చకుడు ఆ స్త్రీని 18
యెహోవా సముఖమందు నిలువబెట్టి, దాని తలమీది
ముసుకు తీసివేసి, జ్ఞాపకార్థమైన అర్పణ అనే
అనుమానార్పణను దాని చేతులలో వుంచ వలెను;
శాపమును పొంద చేసే చేదైన వుదకము అర్చకుని
చేతిలో వుండ వలెను. । అప్పుడు అర్చకుడు ఆ స్త్రీ 19
యొద్ద ప్రమాణమును పుచ్చుకొని దానితో చెప్ప వల
సినదేమంటే, నీవు వర్తన తప్పక, నీ పెనిమిటితో
గాక మరి యెవనితోనూ ప్రవర్తించక, అపవిత్రు
రాలవు కాక వున్నట్టయితే, శాపమును పొంద చేసే
యీ చేదైన వుదకము నుంచి నీవు తప్పించు కొందువు
గాక. । అయితే నీవు వర్తన తప్పి, నీ పెనిమిటితో 20
గాక మరి యెవనితో నైనా ప్రవర్తించి, అపవిత్రు
రాలవై, నీ పెనిమిటి గాక నీతో మరి యెవ్వడైనా

శయనించి వుంటే, నీవు తప్పించుకో లేక పోదువు గా
21 కని చెప్పి; । అర్చకుడు ఆ స్త్రీ యొద్ద శాపము పొందిం
చేటటువంటి ప్రమాణముతోటి ప్రమాణమును పుచ్చు
కొని, అర్చకుడు ఆ స్త్రీతో చెప్పవలసినదేమంటే,
యెహోవా నీ తొడను కుళ్లిపోయేటట్టున్ను, నీ కడు
పును వుబ్బేటట్టున్ను చేసినప్పుడు యెహోవా నీ
జనులలో నిన్ను శాపమునున్ను ప్రమాణమునున్ను
22 చేసును గాక. । మరిన్ని శాపమును పొందచేసే యీ
వుదకము నీ వుదరములోకి వెళ్లి, నీ కడుపు వుబ్బేట
ట్టున్ను, నీ తొడను కుళ్లిపోయేటట్టున్ను చేసునని
చెప్పిన మాటకు ఆ స్త్రీ ఆమెన్, ఆమెన్, అని చెప్ప
23 వలెను. । మరిన్ని అర్చకుడు యీ శాపములను పత్ర
ముమీద వ్రాసి, చేదైన ఆ వుదకముతోను ఆ వ్రాసిన
24 దాని తుడచి, । శాపమును పొందచేసే ఆ వుదకమును
ఆ స్త్రీ తాగేటట్టు చేయ వలెను; అప్పుడు శాపమును
పొందచేసే ఆ వుదకము దానిలో ప్రవేశించి అది
25 చేదైనదవును. । తరువాత అర్చకుడు ఆ అనుమానార్ప
ణను ఆ స్త్రీ చేతిలోనుంచి తీసుకొని, యెహోవా
యెదుట ఆ పర్ణను వూగించి, బలిపీఠము మీద
26 దాన్ని అర్పించ వలెను. । అదిగాక అర్చకుడు జ్ఞాప
కార్థమైన ఆ అర్పణలో పిడికెడు తీసి బలిపీఠము
మీద దాన్ని దహించిన తరువాత, ఆ వుదకమును ఆ స్త్రీ
27 తాగేటట్టు చేయ వలెను. । అతడు వుదకమును అది
తాగేటట్టు చేసిన తరువాత, అప్పుడు సంభవించేదేమం
టే, అది తన పెనిమిటి విషయమై తప్పితముచేసి అప
విత్రురాలయిన పక్షమందు, శాపమును పొందచేసే
ఆ వుదకము దానిలో ప్రవేశించి, చేదైనందున దాని
కడుపు వుబ్బును, దాని తొడ కుళ్లిపోవును; గనుక,
28 ఆ స్త్రీ తన జనులలో శాపగ్రస్తయై వుండును. । అయితే
ఆ స్త్రీ అపవిత్రురాలు కాక పవిత్రురాలయిన పక్ష
మందు, అది తప్పించుకొని గర్భమును ధరించుకొనును. ।
29 యిది అనుమానములను గురించిన న్యాయ ప్రమాణమ
వును; యే స్త్రీ అయినా వర్తన తప్పి దాని పెనిమిటి
తో గాక మరి వొకనితో ప్రవర్తించి అపవిత్రురా
30 లైనప్పుడున్ను, । లేక పెనిమిటికి అనుమానాత్మ వచ్చి
నందున తన భార్య మీద తనకు అనుమానము తోచిన
ప్పుడున్ను, పెనిమిటి ఆ స్త్రీని యెహోవా సముఖ
మందు నిలువబెట్ట వలెను; అప్పుడు అర్చకుడు యీ
న్యాయప్రమాణము చొప్పున దాని యెడల జరిగించ
31 వలెను. । అప్పుడు ఆ మనుష్యుడు నిర్దోషి అవును;
ఆ స్త్రీ తన అక్రమమును భరించునని సెలవు యిచ్చెను.

## 6. అధ్యాయము.

1 మరిన్ని ఇశ్రాయేలు పుత్రులతో మాట్లాడి చెప్ప
2 మని యెహోవా మోషేతో పలికినదేమంటే, । మొగ
నాడయినా ఆడుదైనా నాజరీయునియొక్క మొక్కు
బడి చొప్పున తన్ను తాను యెహోవా కొరకు కేటిం
చుకోవడానకు మొక్కుకొన్నప్పుడు, । వాడు ద్రాక్షా 3
రసమునుంచిన్ని మద్యమునుంచిన్ని తన్ను తాను కేటిం
చుకొని, ద్రాక్షారసపు చిరకానైనా మద్య సంబంధపు
చిరకానైనా తాగకుండానున్ను, ద్రాక్షపండ్లవల్ల చేసి
నదేదైనా తాగకుండానున్ను, పచ్చి ద్రాక్ష పండ్లనై
నా యెండిన ద్రాక్ష పండ్లనైనా తినకుండానున్ను వుం
డవలెను. । వానియొక్క నాజరీయ నియమపు దినము 4
లన్నిటి దాకా వాడు గింజలు మొదలుకొని తొక్క
పర్యంతము ద్రాక్ష చెట్టువల్ల చేయబడ్డది యేదైనా
యెంత మాత్రమూ తిన కూడదు. । మరిన్ని వానియొక్క 5
కేటాయింపు మొక్కుబడియొక్క యావద్దినముల పర్యం
తమూ మంగలకత్తి వాని తల మీదికి రాకూడదు; యె
హోవా కొరకు వాడు తన్ను తాను కేటాయించు
కొనిన దినములు సంపూర్ణమయ్యే పర్యంతమూ వాడు
పరిశుద్ధుడై తన తల వెంట్రుకలను యెదగనివ్వ వలెను. ।
మరిన్ని యెహోవా కొరకు వాడు తన్ను తాను కేటా 6
యించుకొనిన యావద్దినముల పర్యంతము యే శవము
దగ్గిరకైనా చేర కూడదు. । వానియొక్క దేవుని గురిం 7
చిన నాజరనే మొక్కుబడి వాని శిరస్సు మీద వున్నది,
గనుక, తండ్రి అయినా తల్లి అయినా సహోదరుడై
నా సహోదరియైనా మరణమైతే, వారి నిమిత్తము
వాడు అంటుపడ కూడదు. । యేమంటే వానియొక్క 8
కేటాయింపుయొక్క యావద్దినముల పర్యంతమూ వాడు
యెహోవాకు పరిశుద్ధుడౌను. । అయితే వాని దగ్గిర 9
యెవడైనా హఠాత్తుగా చనిపోతే, నాజరనే మొక్కు
బడి గల తన శిరస్సు అపవిత్రమాయెను, గనుక, తాను
శుచిర్భూతుడయ్యే దినమందు తన శిరస్సును గొరిగిం
చుకో వలెను; యేడో దినమందు దాన్ని గొరిగించుకో
వలెను. । యెనిమిదో దినమందు వాడు జోడు గువ్వల 10
నయినా జోడు పావురపు పిల్లలనైనా సంఘముయొ
క్క డేరా ద్వారము యొద్దనున్న అర్చకుని యొద్దికి
తేవలసినది. । అప్పుడు అర్చకుడు వాటిలో నొక దాని 11
పాప పరిహారపు బలి కొరకున్ను, కొదువ దాని హోమా
ర్పణ కొరకున్ను చెల్లించ వలెను; యీలాగున శవ
మువల్ల వాడు పాపుడైనందున వాని నిమిత్తము శాంతి
కలుగ చేసిన తరువాత ఆ రోజు యందునే వాని శిర
స్సును పరిశుద్ధము చేసును గాక. । తిరిగీ వాడు యె 12
హోవా కొరకు తన కేటాయింపుయొక్క దినములను
సమర్పించి, సంవత్సరము యీడు గల వొక గొర్రె
పిల్లను తప్పితపు అర్పణ కొరకు తేవలసినది: అయితే తన
కేటాయింపు అపవిత్రమైనందున పూర్వపు దినములు
వ్యర్థమాయెను. । అయితే నాజరీయునియొక్క కేటా 13

యింపుయొక్క దినములు సంపూర్ణమైనప్పుడు వాని
గురించిన న్యాయప్రమాణము యేమిటంటే, వాడు
సంఘముయొక్క డేరాద్వారము దగ్గిరకు తేబడ వలెను.।
14 అప్పుడు వాడు యెహోవాకు చెల్లించ వలసిన అర్పణ
యేదంటే, తొర్రిలేని వొక సంవత్సరము యీడు గల
వొక మొగ గొర్రెపిల్లను హోమము కొరకున్ను, తొ
ర్రిలేని వొక సంవత్సరము యీడు గల ఆడు గొర్రె
పిల్లను పాప పరిహారపు బలి కొరకున్ను, తొర్రిలేని
యొక పొట్టేలును సమాధానార్పణల కొరకున్ను,।
15 మరిన్ని పులియని రొట్టెలు గల వొక గంపనున్ను, నూ
నెతో కలిపిన సన్నపు పిండి అప్పాలనున్ను, నూనెతో
రాచిన పులియని అట్లనున్ను, వాటియొక్క భోజనా
ర్పణనున్ను, వాటియొక్క పానార్పణలనున్ను చెల్లించ
16 వలసినది.। వీటిని అర్చకుడు యెహోవా సముఖము
నకు తెచ్చి, వానియొక్క పాప పరిహారపు బలినిన్ని
వానియొక్క హోమార్పణనున్ను అర్పించ వలసినది.।
17 మరిన్ని అతడు యెహోవాకు సమాధానార్పణలయొ
క్క బలిగా గంపలో వున్న పులియని రొట్టెతోను
పొట్టేలును అర్పించ వలెను; అదిన్ని గాక అర్చకుడు
వానియొక్క భోజనార్పణనున్ను పానార్పణనున్ను
18 అర్పించ వలసినది.। మరిన్ని ఆ నాజరీయుడు నాజరు
అయిన తన తలను సంఘముయొక్క డేరా ద్వారము
దగ్గిర గొరిగించుకొని, నాజరు అయిన తన తలవెంట్రు
కలను తీసి, సమాధానార్పణలయొక్క బలి కిందనున్న
19 అగ్నిలో వేయ వలెను.। తరువాత అర్చకుడు వండిన
పొట్టేలు జబ్బనున్ను, గంపలోనున్న, పులియని అప్ప
ము వొకటిన్ని, పులియని పలచనైన అప్పము వొకటిన్ని
తీసి, నాజరీయుని తల క్షౌరమయిన తరువాత అతని
20 చేతికి యివ్వ వలెను.। తరువాత అర్చకుడు వాటిని
వూగించే అర్పణగా యెహోవా యెదుట వూగించ
వలెను; యిది వూగించే రొమ్ముతోనున్ను పైకెత్తే జబ్బ
తోనున్ను అర్చకునికి పరిశుద్ధమవును; తరువాత ఆ నా
21 జరీయుడు ద్రాక్షా రసమును తాగ వచ్చును.। యిది
మొక్కుకొనిన నాజరీయుని గురించిన్ని, తన చేతికి
వచ్చేది గాక తన కేటాయింపు నిమిత్తమై యెహో
వా కొరకైన తన అర్పణను గురించిన్ని న్యాయ ప్రమా
ణమౌను: తాను మొక్కిన మొక్కుబడి చొప్పుననున్ను
తన కేటాయింపుయొక్క న్యాయ ప్రమాణము ప్రకా
22 రముగానున్ను చేసును గాకని ఆనతిచ్చెను.। మరిన్ని
అహరోనుతోనున్ను అతని కుమారులతోనున్ను మా
ట్లాడి చెప్పుమని యెహోవా మోషేతో సెలవు యి
23 చ్చినదేమంటే,। మీరు యీ ప్రకారముగాను ఇశ్రా
యేలు పుత్రులను ఆశీర్వదిస్తూ చెప్ప వలసినదేమంటే,।
24 యెహోవా నిన్ను ఆశీర్వదించి కాపాడును గాక:।

యెహోవా తన ముఖమును నీ మీద ప్రకాశింప 25
చేసి, నీయందు దయను వుంచును గాక:। యెహోవా 26
తన ముఖ కాంతిని నీ మీద యెత్తి, నీకు క్షేమమును
యిచ్చును గాకని ఆశీర్వదించ వలెను.। వారు నా నా 27
మమును ఇశ్రాయేలు పుత్రుల మీద వుంచ వలెను;
నేను వారిని ఆశీర్వదింతునని సెలవు యిచ్చెను.

## 7. అధ్యాయము.

మోషే డేరా అంతా లేవనెత్తి అభిషేక తైలమును 1
దాని మీద చల్లి, దాన్నిన్ని దాని వస్తువులన్నిటినిన్ని
పరిశుద్ధము చేసి, మరిన్ని బలిపీఠము మీదనున్ను దాని
సమస్తోపకరణముల మీదనున్ను అభిషేక తైలమును
చల్లి పరిశుద్ధము చేసిన దినమందు సంభవించినదేమంటే,।
ఇశ్రాయేలుయొక్క శ్రేష్ఠులు తమ తమ పితృలయొ 2
క్క యిండ్లకు ప్రధానులున్ను గోత్రములయొక్క
శ్రేష్ఠులున్ను లెక్కించబడిన వారి మీద నిర్ణయించ
బడిన వారున్ను అయి తమ తమ కానుకలను అర్పిం
చిరి.। వీరు తమ కానుకను యెహోవా సముఖమునకు 3
తెచ్చినారు, అది యేదంటే, శ్రేష్ఠులలో యిద్దరిద్దరికి
వొకొక్క బండి చొప్పుననున్ను వొకొక్కనికి
వొకొక్క యెద్దు చొప్పుననున్ను గూళ్లు గల ఆరు
బండ్లున్ను పండ్రెండు యెద్దులున్ను అయి వుండెను;
వీటిని వారు డేరా యెదుటికి తీసుకొని వచ్చినారు.।
అప్పుడు యెహోవా మోషేకు సెలవు యిచ్చినదే 4
మంటే,। వీటిని వారి యొద్దనుంచి పుచ్చుకొనుము, 5
యేమంటే, యివి సంఘపు డేరాయొక్క పని చేయుట
కొరకు వుండును; వీటిని నీవు లేవీయులకు వాని వాని
వ్యాపారము చొప్పున ప్రతివానికి అప్పగించ వలసిన
దని సెలవు యిచ్చెను.। అయినందున మోషే ఆ బండ్ల 6
నున్ను ఆ యెద్దులనున్ను పుచ్చుకొని లేవీయుల వశము
చేసెను.। యేలాగంటే రెండు బండ్లనున్ను నాలుగు 7
యెద్దులనున్ను గేర్షోను పుత్రులకు వారి వ్యాపార
ము చొప్పున యిచ్చెను.। కొదువ నాలుగు బండ్లనున్ను 8
యెనిమిది యెద్దులనున్ను అర్చకుడయిన అహరోను
యొక్క కుమారుడయిన ఈతామారు చేతికింద వుండిన
వారియొక్క వ్యాపారము చొప్పున మెరారీ పుత్రు
లకు యిచ్చెను.। అయితే కెహాతు పుత్రులకు అతడు 9
యివ్వక వుండెను, యెందుకంటే, పరిశుద్ధ స్థలములో
వారికి కలిగిన సేవ భుజముల మోత అయి వుండెను.।
బలిపీఠము మీద అభిషేక తైలమును చల్లిన దినమందు, 10
దాన్ని ప్రతిష్ఠ చేసేటట్టుగా శ్రేష్ఠులు కానుకలను
అర్పించిరి; ఆ శ్రేష్ఠులు తమ తమ కానుకలను బలి
పీఠము యెదుట చెల్లించిరి.। యిందుకు యెహోవా 11
మోషేకు సెలవు యిచ్చినదేమంటే, బలి పీఠమును

ప్రతిష్ఠ చేసేటట్టుగా ప్రతి శ్రేష్ఠుడున్ను తన తన దిన
మందు తన తన కానుకను అర్పించ వలెనసెను. ।
12 అయినందున యూదా గోత్రీయుడున్ను అమ్మీనా
దాబు కుమారుడున్ను అయిన నహ్షోను మొదటి దిన
13 మందు తన కానుకను అర్పించెను. । ఇతని కానుక
యేదంటే, పరిశుద్ధ స్థలముయొక్క షెకేలు చొప్పున
నూట ముప్పయి షెకేలుల వెండి పళ్లెము ఒకటిన్ని,
డెబ్బయి షెకేలుల వెండి గిన్నె ఒకటిన్ని, యీ
రెండున్ను భోజనార్పణ కొరకు నూనెతోటి కలిపిన
14 సన్న పిండితోను నిండి వుండెను. । మరిన్ని ధూప
చూర్ణముతో నిండి యున్న పది షెకేలుల బంగా
15 రపు పాత్ర ఒకటిన్ని, । హోమము కొరకు కోడె
యెద్దు ఒకటిన్ని, పొట్టేలు ఒకటిన్ని, ఒక సంవత్స
16 రము యీడు గల గొఱ్రెపిల్ల ఒకటిన్ని, । పాప పరి
17 హారపు బలి కొరకు మేకపిల్ల ఒకటిన్ని, । సమాధానా
ర్పణల కొరకు జోడు యెద్దులున్ను, అయిదు పొట్టేళ్లు
న్ను, అయిదు మేకపోతులున్ను, ఒక సంవత్సరము
యీడు గల అయిదు గొఱ్రెపిల్లలున్ను; యివి అమ్మీ
నాదాబు కుమారుడైన నహ్షోనుయొక్క కానుకై వుం
18 డెను. । రెండో దినమందు సూయారు కుమారుడున్ను
ఇశ్శాఖారు గోత్రీయ శ్రేష్ఠుడున్ను అయిన నెతన్యేలు
19 తన కానుకను చెల్లించెను. । ఇతడు తన కానుక కొరకు
తెచ్చినదేదంటే, పరిశుద్ధ స్థలముయొక్క షెకేలుల
చొప్పున నూట ముప్పయి షెకేలుల వెండి పళ్లెము
ఒకటిన్ని, డెబ్బయి షెకేలుల వెండి గిన్నె ఒకటిన్ని,
యీ రెండున్ను భోజనార్పణ కొరకు నూనెతో కలి
20 పిన సన్న పిండితోను నిండి వుండెను. । మరిన్ని ధూప
చూర్ణముతో నిండి యున్న పది షెకేలుల బంగా
21 రపు పాత్ర ఒకటిన్ని, । హోమము కొరకు కోడె
యెద్దు ఒకటిన్ని, పొట్టేలు ఒకటిన్ని, ఒక సంవత్స
22 రము యీడు గల గొఱ్రెపిల్ల ఒకటిన్ని, । పాప పరి
23 హారపు బలి కొరకు మేకపిల్ల ఒకటిన్ని, । సమాధానార్ప
ణలయొక్క బలి కొరకు జోడు యెద్దులున్ను, అయిదు
పొట్టేళ్లున్ను, అయిదు మేకపోతులున్ను, సంవత్సరము
యీడు గల అయిదు గొఱ్రెపిల్లలున్ను; యివి సూయారు
కుమారుడయిన నెతన్యేలుయొక్క కానుకై వుండెను. ।
24 మూడో దినమందు హేలోను కుమారుడున్ను జబూ
లోను పుత్రులలో శ్రేష్ఠుడున్ను అయిన ఏలీయాబు
25 తన కానుకను చెల్లించెను. । ఇతని కానుక యేదంటే,
పరిశుద్ధ స్థలముయొక్క షెకేలు చొప్పున నూట ము
ప్పయి షెకేలుల వెండి పళ్లెము ఒకటిన్ని డెబ్బయి
షెకేలుల వెండి గిన్నె ఒకటిన్ని, యీ రెండున్ను
భోజనార్పణ కొరకు నూనెతో కలిపిన సన్నపిండితోను
26 నిండి వుండెను. । మరిన్ని ధూప చూర్ణముతో నిండి
యున్న పది షెకేలుల బంగారపు పాత్ర ఒకటిన్ని, ।
హోమార్పణ కొరకు కోడె యెద్దు ఒకటిన్ని, పొ 27
ట్టేలు ఒకటిన్ని, సంవత్సరము యీడు గల గొఱ్రెపిల్ల
ఒకటిన్ని, । పాప పరిహారపు బలి కొరకు మేకపిల్ల 28
ఒకటిన్ని, । సమాధానార్పణలయొక్క బలి కొరకు 29
జోడు యెద్దులున్ను, అయిదు పొట్టేళ్లున్ను, అయిదు
మేకపోతులున్ను, సంవత్సరము యీడు గల అయిదు
గొఱ్రెపిల్లలున్ను; యివి హేలోను కుమారుడయిన ఏలీ
యాబుయొక్క కానుకై వుండెను. । నాలుగో దినమం 30
దు షెదేయూరు కుమారుడున్ను రూబేను పుత్రులలో
శ్రేష్ఠుడున్ను అయిన ఎలీసూరు తన కానుకను చెల్లిం
చెను. । ఇతని కానుక యేదంటే, పరిశుద్ధ స్థలముయొ 31
క్క షెకేలు చొప్పున నూట ముప్పయి షెకేలుల
వెండి పళ్లెము ఒకటిన్ని, డెబ్బయి షెకేలుల వెండి
గిన్నె ఒకటిన్ని, యీ రెండున్ను భోజనార్పణ కొరకు
నూనెతో కలిపిన సన్న పిండితోను నిండి వుండెను. ।
మరిన్ని ధూప చూర్ణముతోను నిండిన పది షెకేలుల 32
బంగారపు పాత్ర ఒకటిన్ని, । హోమార్పణ కొరకు 33
కోడె యెద్దు ఒకటిన్ని, పొట్టేలు ఒకటిన్ని, సంవత్స
రము యీడు గల గొఱ్రెపిల్ల ఒకటిన్ని, । పాప పరిహా 34
రపు బలి కొరకు మేకపిల్ల ఒకటిన్ని, । సమాధానా 35
ర్పణల బలి కొరకు జోడు యెద్దులున్ను, అయిదు పొ
ట్టేళ్లున్ను, అయిదు మేకపోతులున్ను, సంవత్సరము
యీడు గల అయిదు గొఱ్రెపిల్లలున్ను; యివి షెదే
యూరుయొక్క కుమారుడైన ఎలీసూరుయొక్క కా
నుకై వుండెను. । అయిదో దినమందు సూరీషద్దయి 36
కుమారుడున్ను షిమోను పుత్రులలో శ్రేష్ఠుడున్ను
అయిన షెలూమీయేలు తన కానుకను చెల్లించెను. ।
ఇతని కానుక యేదంటే, పరిశుద్ధ స్థలముయొక్క షెకే 37
లు చొప్పున నూట ముప్పయి షెకేలుల వెండి పళ్లెము
ఒకటిన్ని, డెబ్బయి షెకేలుల వెండి గిన్నె ఒకటిన్ని,
యీ రెండున్ను భోజనార్పణ కొరకు నూనెతో కలి
పిన సన్న పిండితోను నిండి వుండెను. । మరిన్ని ధూప 38
చూర్ణముతోను నిండిన పది షెకేలుల బంగారపు
పాత్ర ఒకటిన్ని, । హోమార్పణ కొరకు కోడె యెద్దు 39
ఒకటిన్ని, పొట్టేలు ఒకటిన్ని, సంవత్సరము యీడు
గల గొఱ్రెపిల్ల ఒకటిన్ని, । పాప పరిహారపు బలి కొ 40
రకు మేకపిల్ల ఒకటిన్ని, । సమాధానార్పణలయొక్క 41
బలి కొరకు జోడు యెద్దులున్ను, అయిదు పొట్టేళ్లు
న్ను, అయిదు మేకపోతులున్ను, సంవత్సరము యీడు
గల అయిదు గొఱ్రెపిల్లలున్ను; యివి సూరీషద్దయి కుమా
రుడైన షెలూమీయేలుయొక్క కానుకై వుండెను. ।
ఆరో దినమందు దూవేలు కుమారుడున్ను గాదు పుత్రు 42
లలో శ్రేష్ఠుడున్ను అయిన ఎల్యాసాపు తన కానుకను

43 చెల్లించెను. । ఇతని కానుక యేదంటే, పరిశుద్ధ స్థలము
యొక్క షెకేలు చొప్పున నూట ముప్పయి షెకేలుల
వెండి పళ్లెము వొకటిన్ని డెబ్బయి షెకేలుల వెండి
గిన్నె వొకటిన్ని, యీ రెండున్ను భోజనార్పణ కొ
రకు నూనెతో కలిపిన సన్న పిండితోను నిండి వుండె
44 ను. । మరిన్ని ధూప చూర్ణముతోను నిండిన పది
45 షెకేలుల బంగారపు పాత్ర వొకటిన్ని, । హోమా
ర్పణ కొరకు కోడె యెద్దు వొకటిన్ని, పొట్టేలు వొక
టిన్ని, సంవత్సరము యీడు గల గొర్రెపిల్ల వొకటిన్ని,।
46 పాప పరిహారపు బలి కొరకు మేకపిల్ల వొకటిన్ని, ।
47 సమాధానార్పణలయొక్క బలి కొరకు రెండు యెద్దు
లున్ను, అయిదు పొట్టేళ్లున్ను, అయిదు మేకపోతులు
న్ను, సంవత్సరము యీడు గల అయిదు గొర్రెపిల్ల
లున్ను; యివి దూవేలు కుమారుడైన ఎల్యాసాపుయొ
48 క్క కానుకై వుండెను. । యేడో దినమందు అమ్మీ
హూదు కుమారుడున్ను ఎఫ్రయీము పుత్రులలో
శ్రేష్ఠుడున్ను అయిన ఎలీషామా తన కానుకను చెల్లిం
49 చెను. । ఇతని కానుక యేదంటే, పరిశుద్ధ స్థలముయొ
క్క షెకేలు చొప్పున నూట ముప్పయి షెకేలుల
వెండి పళ్లెము వొకటిన్ని, డెబ్బయి షెకేలుల వెండి
గిన్నె వొకటిన్ని, యీ రెండున్ను భోజనార్పణ కొరకు
నూనెతో కలిపిన సన్న పిండితోను నిండి వుండెను. ।
50 మరిన్ని ధూప చూర్ణముతోను నిండిన పది షెకేలుల
51 బంగారపు పాత్ర వొకటిన్ని, । హోమార్పణ కొ
రకు కోడె యెద్దు వొకటిన్ని, పొట్టేలు వొకటిన్ని,
52 సంవత్సరము యీడు గల గొర్రెపిల్ల వొకటిన్ని, । పాప
53 పరిహారపు బలి కొరకు మేకపిల్ల వొకటిన్ని, । సమాధా
నార్పణలయొక్క బలి కొరకు జోడు యెద్దులున్ను,
అయిదు పొట్టేళ్లున్ను, అయిదు మేకపోతులున్ను,
సంవత్సరము యీడు గల అయిదు గొర్రెపిల్లలున్ను
యివి అమ్మీహూదు కుమారుడైన ఎలీషామాయొక్క
54 కానుకై వుండెను. । యెనిమిదో దినమందు పెదా
హూస్సరు కుమారుడున్ను మనస్సే పుత్రులలో శ్రేష్ఠ
డున్ను అయిన గమలియేలు తన కానుకను చెల్లించె
55 ను. । ఇతని కానుక యేదంటే, పరిశుద్ధ స్థలముయొక్క
షెకేలు చొప్పున నూట ముప్పయి షెకేలుల వెండి
పళ్లెము వొకటిన్ని, డెబ్బయి షెకేలుల వెండి గిన్నె
వొకటిన్ని, యీ రెండున్ను భోజనార్పణకొరకు నూ
నెతో కలిపిన సన్న పిండితోను నిండి వుండెను. ।
56 మరిన్ని ధూప చూర్ణముతోను నిండిన పది షెకే
57 లుల బంగారపు పాత్ర వొకటిన్ని, । హోమార్పణ
కొరకు కోడె యెద్దు వొకటిన్ని, పొట్టేలు వొకటిన్ని,
సంవత్సరము యీడు గల గొర్రెపిల్ల వొకటిన్ని, ।
58 పాప పరిహారపు బలి కొరకు మేకపిల్ల వొకటిన్ని, ।
సమాధానార్పణలయొక్క బలి కొరకు జోడు యెద్దు 59
లున్ను, అయిదు పొట్టేళ్లున్ను, అయిదు మేకపోతు
లున్ను, సంవత్సరము యీడు గల అయిదు గొర్రెపిల్ల
లున్ను; యివి పెదాహూస్సరు కుమారుడైన గమలియేలు
యొక్క కానుకై వుండెను. । తొమ్మిదో దినమున గిదోనీ 60
కుమారుడున్ను బెన్యామీను పుత్రులలో శ్రేష్ఠుడున్ను
అయిన అబీదాను తన కానుకను చెల్లించెను. । ఇతని 61
కానుక యేదంటే, పరిశుద్ధ స్థలముయొక్క షెకేలు
చొప్పున నూట ముప్పయి షెకేలుల వెండి పళ్లెము
వొకటిన్ని, డెబ్బయి షెకేలుల వెండి గిన్నె వొకటిన్ని,
యీ రెండున్ను భోజనార్పణ కొరకు నూనెతో కలి
పిన సన్న పిండితోను నిండి వుండెను. । ధూప చూర్ణ 62
ముతోను నిండిన పది షెకేలుల బంగారపు పాత్ర
వొకటిన్ని, । హోమార్పణ కొరకు కోడె యెద్దు వొక 63
టిన్ని, పొట్టేలు వొకటిన్ని, సంవత్సరము యీడు గల
గొర్రెపిల్ల వొకటిన్ని, । పాప పరిహారపు బలి కొరకు 64
మేకపిల్ల వొకటిన్ని, । సమాధానార్పణలయొక్క బలి 65
కొరకు జోడు యెద్దులున్ను, అయిదు పొట్టేళ్లున్ను,
అయిదు మేకపోతులున్ను, సంవత్సరము యీడు గల
అయిదు గొర్రెపిల్లలున్ను; యివి గిదోనీ కుమారుడైన
అబీదానుయొక్క కానుకై వుండెను. । పదో దినమందు 66
అమ్మీషద్దయి కుమారుడున్ను దాను పుత్రులలో శ్రేష్ఠ
డున్ను అయిన అహీయెజెరు తన కానుకను చెల్లించె
ను. । ఇతని కానుక యేదంటే, పరిశుద్ధ స్థలముయొక్క 67
షెకేలు చొప్పున నూట ముప్పయి షెకేలుల వెండి
పళ్లెము వొకటిన్ని, డెబ్బయి షెకేలుల వెండి గిన్నె
వొకటిన్ని, యీ రెండున్ను భోజనార్పణ కొరకు
నూనెతో కలిపిన సన్న పిండితోను నిండి వుండెను. ।
మరిన్ని ధూప చూర్ణముతోను నిండిన పది షెకేలుల 68
బంగారపు పాత్ర వొకటిన్ని, । హోమార్పణ కొరకు 69
కోడె యెద్దు వొకటిన్ని, పొట్టేలు వొకటిన్ని, సంవత్స
రము యీడు గల గొర్రెపిల్ల వొకటిన్ని, । పాప పరిహా 70
రపు బలి కొరకు మేకపిల్ల వొకటిన్ని, । సమాధానా 71
ర్పణలయొక్క బలి కొరకు జోడు యెద్దులున్ను, అయి
దు పొట్టేళ్లున్ను, అయిదు మేకపోతులున్ను, సంవత్స
రము యీడు గల అయిదు గొర్రెపిల్లలున్ను; యివి
అమ్మీషద్దయి కుమారుడైన అహీయెజెరుయొక్క కా
నుకై వుండెను. । పదకొండో దినమందు ఒక్రాను 72
కుమారుడున్ను ఆషేరుయొక్క పుత్రులలో శ్రేష్ఠుడు
న్ను అయిన పగీయేలు తన కానుకను చెల్లించెను. ।
ఇతని కానుక యేదంటే, పరిశుద్ధ స్థలముయొక్క షె 73
కేలు చొప్పున నూట ముప్పయి షెకేలుల వెండి పళ్లె
ము వొకటిన్ని, డెబ్బయి షెకేలుల వెండి గిన్నె వొక
టిన్ని, యీ రెండున్ను భోజనార్పణ కొరకు నూనెతో

74 కలిపిన సన్న పిండితోను నిండి వుండెను. । మరిన్ని
ధూప చూర్ణముతోను నిండిన పది షెకేలుల బంగా
75 రపు పాత్ర వొకటిన్ని, । హోమార్పణ కొరకు కోడె
యెద్దు వొకటిన్ని, పొట్టేలు వొకటిన్ని, సంవత్సరము
76 యీడు గల గొర్రెపిల్ల వొకటిన్ని, । పాప పరిహారపు
77 బలి కొరకు మేకపిల్ల వొకటిన్ని, । సమాధానార్పణల
యొక్క బలి కొరకు జోడు యెద్దులున్ను, అయిదు
పొట్టేళ్లున్ను, అయిదు మేకపోతులున్ను, సంవత్సరము
యీడు గల అయిదు గొర్రెపిల్లలున్ను; యివి ఒక్రాను
కుమారుడైన పగీయేలుయొక్క కానుకయి వుండెను. ।
78 పండ్రెండో దినమందు ఏనాను కుమారుడున్ను నఫ్తాలీ
పుత్రులలో శ్రేష్ఠుడున్ను అయిన అహీర తన కాను
79 కను చెల్లించెను. । ఇతని కానుక యేదంటే, పరిశుద్ధ స్థల
ముయొక్క షెకేలు చొప్పున నూట ముప్పయి షెకే
లుల వెండి పళ్లెము వొకటిన్ని, డెబ్బయి షెకేలుల
వెండి గిన్నె వొకటిన్ని, యీ రెండు భోజనార్పణ
కొరకు నూనెతో కలిపిన సన్న పిండితోను నిండి వుం
80 డెను. । ధూప చూర్ణముతోను నిండిన పది షెకేలుల
81 బంగారపు పాత్ర వొకటిన్ని, । హోమార్పణ కొరకు
కోడెయెద్దు వొకటిన్ని, పొట్టేలు వొకటిన్ని, సంవత్స
82 రము యీడు గల గొర్రెపిల్ల వొకటిన్ని, । పాప పరిహా
83 రపు బలి కొరకు మేకపిల్ల వొకటిన్ని, । సమాధానార్ప
ణలయొక్క బలి కొరకు జోడు యెద్దులున్ను, అయిదు
పొట్టేళ్లున్ను, అయిదు మేకపోతులున్ను, సంవత్సరము
యీడు గల అయిదు గొర్రెపిల్లలున్ను; యివి ఏనాను
84 కుమారుడైన అహీరయొక్క కానుకై వుండెను. । బలి
పీఠము మీద అభిషేక తైలము చల్లిన దినమందు ఇశ్రా
యేలుయొక్క శ్రేష్ఠులచేత దాని ప్రతిష్ఠ యీ ప్రకా
రమై వుండెను; యిందు నిమిత్తము పన్నెండు వెండి
పళ్లెములున్ను, పన్నెండు వెండి గిన్నెలున్ను, పన్నెం
85 డు బంగారపు పాత్రలున్ను కలిగి వుండెను. । యిం
దుకు పళ్లెము వొక్కంటికి నూట ముప్పయి షెకేలుల
వెండి వుండెను; గిన్నె వొక్కంటికి డెబ్బయి షెకేలుల
వెండి వుండెను; వెండి పాత్రలన్నిటికీ పరిశుద్ధమైన స్థల
ముయొక్క షెకేలు చొప్పున రెండువేల నన్నూరు
86 షెకేలుల యెత్తు గలిగి వుండెను. । ధూప చూర్ణము
తోను నిండిన బంగారపు పాత్రలు పండ్రెండు వుం
డెను; వీటిలో పాత్ర వొక్కంటికి పరిశుద్ధ స్థలముయొ
క్క షెకేలు ప్రకారము పది షెకేలుల యెత్తు కలిగి
వుండెను: పాత్రలయొక్క బంగారము యావత్తూ
87 నూట యిరువై షెకేలులు వుండెను. । హోమార్పణ
కొరకు తెచ్చిన పశువులు అన్నిన్ని యేవంటే, పన్నెండు
కోడె యెద్దులున్ను, పన్నెండు పొట్టేళ్లున్ను, సంవత్స
రము యీడు గల గొర్రెపిల్లలు పన్నెండున్ను, వీటితో
నున్న భోజనార్పణయున్ను, పాప పరిహారపు బలి కొ
రకు మేకపిల్లలు పన్నెండున్ను కలిగి వుండెను. । మరి 88
న్ని సమాధానార్పణలయొక్క బలి కొరకు తెచ్చిన పశు
వులు యిరువై నాలుగు కోడె యెద్దులున్ను, పొట్టేళ్లు
అరువైయిన్ని, మేకపోతులు అరువైయిన్ని, సంవత్సర
ము యీడు గల గొర్రెపిల్లలు అరువైయిన్ని కలిగి వుం
డెను: బలిపీఠము మీద అభిషేక తైలము చల్లిన దిన
మందు దాని ప్రతిష్ఠ యీ ప్రకారమై వుండెను. । తరు 89
వాత మోషే ఆయనతో మాట్లాడేటందుకు సంఘము
యొక్క డేరాలోకి యెప్పుడు ప్రవేశించెనో అప్పు
డు సాక్ష్యముయొక్క పెట్టె మీదను రెండు కెరూ
బుల మధ్యమందున్న శాంతకము యొద్దనుంచి తనతో
మాట్లాడుతూ వున్న యొకని శబ్దమును అతడు వింటూ
వుండెను; యీలాగున ఆయన అతనికి సెలవు యిస్తూ
వుండెను.

## 8. అధ్యాయము.

మరిన్ని అహరోనుతో మాట్లాడి చెప్పుమని యె 1
హోవా మోషేకు సెలవు యిచ్చినదేమంటే, । నీవు 2
దీపములను వెలుగించేటప్పుడు ఆ యేడు దీపములు
దీపస్తంభమునకు యెదుట వెలుగుతూ వుండ వలెనని సెను. ।
అహరోను ఆలాగున చేసెను; అతడు దీపస్తంభము యె 3
దుట వున్న దీపములను యెహోవా మోషేకు ఆజ్ఞా
పించినట్టు వెలిగించినాడు. । యీ దీపస్తంభము సుత్తి 4
తో చేసిన బంగారపు పనియై వుండెను; దాని స్తంభ
మున్ను దాని పువ్వులున్ను సుత్తిపని అయి వుండెను;
యెహోవా మోషేకు చూపించిన మచ్చు చొప్పున
అతడు ఆ దీపస్తంభమును చేసెను. । మరిన్ని యెహో 5
వా మోషేకు సెలవు యిచ్చినదేమంటే, । నీవు ఇశ్రా 6
యేలు పుత్రులలోనుంచి లేవీయులను తీసి వారిని శుచి
భూతులను చేయుము. । వారిని శుచిభూతులను చేసే 7
విధమేమంటే, పవిత్రము చేసే వుదకమును వారి మీ
దను చల్ల వలెను, అప్పుడు వారు సర్వాంగ క్షౌరమును
చేయించుకొని, తమ బట్టలను వుతుకుకొనిన తరువాత
వారు శుచిభూతులౌదురు. । అప్పుడు వారు కోడె 8
యెద్దునున్ను దానితో భోజనార్పణ అయ్యే నూనెతో
కలిపిన సన్న పిండినిన్ని తేవలెను; యింకొక్క కోడె
యెద్దును నీవు పాప పరిహారపు బలి కొరకు తేవలెను. ।
అప్పుడు నీవు లేవీయులను సంఘముయొక్క డేరా 9
యెదుటికి తీసుకవచ్చి, ఇశ్రాయేలు పుత్రులయొక్క
సంఘము యావత్తును కూర్చిన తరువాత, । లేవీయులను 10
యెహోవా యెదుటికి రప్పించ వలెను, అప్పుడు
ఇశ్రాయేలు పుత్రులు లేవీయుల మీద తమ చేతులను
వుంచ వలెను. । అప్పుడు లేవీయులు యెహోవా 11

యొక్క సేవ జరిగించేటట్టు అహరోను ఇశ్రాయేలు
పుత్రులయొక్క అర్పణగా యెహోవా సముఖమందు
12 వారిని అర్పించ వలెను. । అప్పుడు లేవీయులు ఆ యె
ద్దులయొక్క తలల మీద తమ చేతులను వుంచిన తరు
వాత, నీవు లేవీయుల నిమిత్తము శాంతి కలుగ చేసు
టకు వొక దాన్ని పాప పరిహారపు బలి కొరకున్ను,
కొదువ దాన్ని హోమాపర్ణణ కొరకున్ను, యెహో
13 వాకు అపిర్ణంచ వలెను. । మరిన్ని నీవు లేవీయులను
అహరోను ముందరనున్ను అతని కుమారుల ముందర
నున్ను నిలువబెట్టి, వారిని అర్పణగా యెహోవాకు
14 చెల్లించ వలెను. । యీలాగున నీవు లేవీయులను ఇశ్రా
యేలు పుత్రులలోనుంచి కేటించ వలెను; లేవీయులు
15 నా వారౌదురు. ।అటుతరువాతను లేవీయులు సంఘపు
డేరాయొక్క సేవ చేయడానకు లోపలికి ప్రవేశించ
వలెను; నీవు వారిని శుచిభూర్ణతులను చేసి వారిని అర్ప
16 ణగా అర్పించ వలెను. । యెందుకంటే వారు ఇశ్రా
యేలు పుత్రులలోనుంచి నాకు సంపూర్ణముగా యి
వ్వబడి వున్నారు; ప్రతి గర్భమును తెరిచే వారికి, అన
గా ఇశ్రాయేలు పుత్రులలో తొలిచూలులైన వారికి
బదులుగా నా కొరకు వారిని స్వీకరించి వున్నాను. ।
17 యెందుకంటే ఇశ్రాయేలు పుత్రులలో ప్రథమ
మందు పుట్టినవి మనుష్యులయినా పశువులయినా నావి
అయి వున్నవి; మిస్రయీము దేశములో ప్రథమమం
దు పుట్టిన యావత్తూ నేను సంహరించిన దినమందు
నేను వారిని నాకొరకు పరిశుద్ధులను చేసుకొంటిని. ।
18 ఇదిగాక నేను లేవీయులను ఇశ్రాయేలు పుత్రుల
యొక్క ప్రథమ పుత్రులందరికీ ప్రతిగా యేర్పరచు
19 కొంటిని. । మరిన్ని నేను ఇశ్రాయేలు పుత్రులలో
నుంచి లేవీయులను యేర్పరచి, సంఘముయొక్క డేరా
యందు ఇశ్రాయేలు పుత్రులయొక్క వ్యాపారమును
చేసే కొరకున్ను, ఇశ్రాయేలు పుత్రులు పరిశుద్ధ స్థల
ముయొక్క సమీపమునకు వచ్చినప్పుడు ఇశ్రాయేలు
పుత్రులలో యే తెగులైనా రాకుండా ఇశ్రాయేలు
పుత్రుల నిమిత్తము శాంతి కలుగ చేసే కొరకున్ను,
అహరోనుకున్ను అతని కుమారులకున్ను దానము లా
గున వారిని యిచ్చి యున్నాను అని సెలవు యిచ్చెను. ।
20 కాబట్టి మోషేయున్ను అహరోనున్ను ఇశ్రాయేలు
పుత్రులయొక్క సంఘమంతానున్ను యెహోవా మో
షేకు లేవీయులను గురించి యే ప్రకారముగా ఆజ్ఞా
పించెనో ఆ ప్రకారము చేసిరి; ఆలాగున ఇశ్రా
21 యేలు పుత్రులు వారికి చేసిరి. । యీలాగున లేవీయులు
శుచిభూర్ణతులై తమ బట్టలను వుతుకుకొనిరి; అహ
రోను వారిని యెహోవా సముఖమందు అపర్ణణగా
చెల్లించి, వారు పవిత్రులయ్యేటట్టుగా వారి నిమిత్త
ము శాంతి కలుగ చేసెను. । అటు తరువాతను లేవీ 22
యులు అహరోను ముందరనున్ను అతని కుమారుల
ముందరనున్ను సంఘపు డేరాలో తమ వ్యాపారమును
చేయడానకు లోపలికి ప్రవేశించినారు: యెహోవా
మోషేకు లేవీయులను గురించి యే ప్రకారముగా
ఆజ్ఞాపించెనో ఆ ప్రకారమే వారు వారికి చేసిరి. ।
మరిన్ని యెహోవా మోషేతో మాట్లాడుతూ చెప్పి 23
నదేమంటే, । లేవీయులను గురించిన నిర్ణయము యిదే, 24
వారు యిరువై అయిదు సంవత్సరములు మొదలుకొని
అంతకు పైని యీడు కలిగి, సంఘపు డేరాయొక్క
పని మీద కని పెట్టి వుండుటకు లోపలికి ప్రవేశించ
వలెను. । అయితే యేభై సంవత్సరముల యీడునుంచి 25
వారు యీ వ్యాపారము మీద కనిపెట్టి వుండుట చా
లించి, యికను సేవ చేయకుండా వుండ వలెను. । అయి 26
నప్పటికిన్ని వారు తమ వశమందున్నటువంటివి భద్ర
ము చేసేటట్టుగా తమ సహోదరులతోను సంఘము
యొక్క డేరాలో కనిపెట్టుతూ పని చేయకుండా
వుండ వలెను; యీలాగున నీవు లేవీయులకు తమ వశ
మందున్నటువంటి వాటిని గురించి చేతువు గాకని
సెలవు యిచ్చెను.

## 9. అధ్యాయము.

మరిన్ని మిస్రయీము దేశములోనుంచి వారు యి 1
వతలకు రావడమైన వెనుక రెండో సంవత్సరము మొ
దటి నెల యందు యెహోవా సీనై అరణ్యములో
మోషేకు సెలవు యిచ్చినదేమంటే, । ఇశ్రాయేలు పుత్రు 2
లు పస్కాను దాని నిర్ణయమైన సమయమందు ఆచరించ
వలెను. । యీ నెల పద్నాలుగో దినము అస్తమానమందు 3
దానికి నిర్ణయమైన సమయమందు మీరు దాని ఆచరించ
వలెను; దానియొక్క సకల విధుల ప్రకారముగానున్ను
దానియొక్క సకల నియమముల ప్రకారముగానున్ను
మీరు దాని ఆచరించ వలెనని సెలవిచ్చెను. । అయినం 4
దున మోషే ఇశ్రాయేలు పుత్రులను చూచి మీరు
పస్కాను ఆచరించ వలెనని చెప్పెను. । ఆలాగున వారు 5
సీనై అరణ్యములో మొదటి నెల పద్నాలుగో దినము
అస్తమానమందు పస్కాను ఆచరించిరి; యెహోవా మో
షేకు యేప్రకారముగా ఆజ్ఞాపించెనో ఆ ప్రకారము
గా యావత్తూ ఇశ్రాయేలు పుత్రులు చేసిరి. । అయితే 6
కొందరు వొక మనుష్య శవమువల్ల అంటుపడినందున
ఆ దినమందు పస్కాను ఆచరించ లేక, వారు ఆ దిన
మందు మోషే యొద్దికిన్ని అహరోను యొద్దికిన్ని వచ్చి
చెప్పినదేమంటే, । వొక మనుష్య శవమువల్ల మేము 7
అంటు పడి పేట అవతల వున్న వాండ్లమైనందున,
ఇశ్రాయేలు పుత్రులతో కూడి నిర్ణయమైన సమయ

వుందు యెహోవాకు కానుకను చెల్లించక పోతి
8 మని చెప్పిరి. । అందుకు మోషే వారితో మిమ్మును గు
రించి యెహోవా యిచ్చే ఆజ్ఞ నేను వినే పర్యంత
9 మూ యిక్కడ నిలువండని చెప్పెను. । అప్పుడు ఇశ్రా
యేలు పుత్రులతో మాట్లాడి చెప్పుమని యెహోవా
10 మోషేకు సెలవు యిచ్చినదేమంటే, । మీలో నేమి, మీ
తరువాత మీ పుత్రులలో నేమి, యెవడైనా శవము
వల్ల అంటుపడి వున్నా, ప్రయాణస్థుడై దూరముగా
వున్నా, వాడు యెహోవాను గురించి పస్కాను ఆచ
11 రించ వలెను. । రెండో నెల పద్నాలుగో దినము అస్త
మానపు వేళయందు వారు దాన్ని ఆచరించి, పులియని
రొట్టెతోనున్ను చేదు గల కూరతోనున్ను దాని తిన
12 వలెను. । వుదయము మట్టుకు దానిలో యేదైనా వుంచ
కనున్ను, దాని దుమ్ములలో యేదైనా విరువకనున్ను,
పస్కాయొక్క నిర్ణయములు అన్నిటి ప్రకారముగా
13 వారు దాన్ని ఆచరించ వలెను. । అయితే పవిత్రుడై
ప్రయాణములో వుండకుండా పస్కాను ఆచరించుట
మానిన వాడు యెవడో అటువంటి వాడు తన జనుల
లోనుంచి ఖండించ బడును; యెందుకంటే, వాడు యె
హోవాయొక్క అర్పణను నిర్ణయమైన సమయ
మందు తెచ్చినవాడు కాడు, గనుక, ఆ మనుష్యుడు
14 తన పాపమును మోసుకొనును. । మరిన్ని పరదేశి
అయిన వొకడు మీలో నివసించి వుండి యెహోవాను
గురించిన పస్కాను ఆచరించ వలెనని కోరి వున్నట్టయితే,
వాడు ఆ పస్కాయొక్క నిర్ణయము చొప్పననున్ను
దానికి విధించిన ప్రకారముగానున్ను చేయ వలెను:
మీలోనున్న పరదేశికిన్ని స్వదేశస్థునికిన్ని వొక్క
నిర్ణయమే కలిగి వుండ వలెనని సెలవు యిచ్చెను. ।
15 డేరా లేవనెత్తిన దినమందు మేఘము డేరాను, అనగా
సాక్ష్యముయొక్క డేరాను, కప్పుకొనెను; అస్తమాన
ము మొదలుకొని వుదయ పర్యంతము డేరా మీద
16 అగ్ని స్వరూపమువలె వుండెను. । నిత్యమున్ను యీలా
గుననే వుండెను, యేమంటే, పగటి యందు మేఘము
దాని కప్పుకొనెను; రాత్రియందు అగ్ని స్వరూపము
17 కలిగి యుండెను. । మేఘము డేరా మీదనుంచి యెప్పు
డు పైకి యెత్తబడుతూ వుండునో అప్పుడు ఇశ్రా
యేలు పుత్రులు తర్లి వెళ్లేవారు; ఆ మేఘము యే
స్థలమందు నిలుచునో ఆ స్థలమందు ఇశ్రాయేలు
18 పుత్రులు నిలిచి తమ డేరాలను వేసేవారు. । యీలా
గున ఇశ్రాయేలు పుత్రులు యెహోవాయొక్క ఆజ్ఞ
చేత తర్లి వెళ్లుచూ, యెహోవాయొక్క ఆజ్ఞచేత
నిలిచి డేరాలను వేస్తూ వుండే వారు; మేఘము డేరా
మీద నిలిచి వుండే మట్టుకు వారు తమ డేరాల యందు
19 నిలిచి వుండేవారు. । మేఘము డేరా మీద యెన్ని
దినముల మట్టుకు నిలిచి వుండునో అన్ని దినముల
మట్టుకు ఇశ్రాయేలు పుత్రులు యెహోవా ఆజ్ఞాపిం
చిన నిర్ణయము చొప్పన భద్రము చేస్తూ తర్లి
వెళ్లక వుందురు. । యిందువల్ల సంభవించినదేమంటే, 20
మేఘము అనేక దినములు డేరా మీద నిలిచి వున్న
సమయమందు వారు యెహోవా ఆజ్ఞాపించిన ప్రకా
రము తమ డేరాలయందు నిలిచి వుండిరి; మరిన్ని యె
హోవా ఆజ్ఞాపించిన ప్రకారము వారు తర్లి వెళ్లు
చూ వుండిరి. । మరిన్ని మేఘము అస్తమానము మొదలు 21
కొని వుదయమయ్యే మట్టుకు నిలిచి, వుదయమందు యె
ప్పుడు పయికి యెత్తబడునో, అప్పుడు వారు తర్లి
వెళ్లుదురు; పగటి యందో లేక రాత్రియందో మేఘ
ము పయికి యెత్తబడినప్పుడు వారు తర్లి పోవుదురు. ।
మేఘము రెండు దినముల మట్టుకో, నెల మట్టుకో, 22
సంవత్సరము మట్టుకో, డేరా మీద నిలిచి వుండగా,
ఇశ్రాయేలు పుత్రులు తమ డేరాలలో వుండి తర్లి
పోక వుందురు; అయితే అది యెప్పుడు పయికి యెత్త
బడునో అప్పుడు తర్లి పోవుదురు. । యీలాగున 23
వారు యెహోవా ఆజ్ఞాపించినట్టు తమ డేరాలలో
నిలిచి వుంటూ యెహోవా ఆజ్ఞాపించినట్టు తర్లి
పోతూ వుండే వారు; యెహోవా మోషే ద్వారా
ఆజ్ఞాపించినట్టు యెహోవా అప్పగించిన ఆజ్ఞను వారు
భద్రము చేస్తూ వుండేవారు.

## 10. అధ్యాయము.

మరిన్ని యెహోవా మోషేకు సెలవు యిచ్చిన 1
దేమంటే, । నీ కొరకై నీవు రెండు వెండి బాకాలను 2
చేయించుము; అవి యేకాండముగా చేయించ వలెను;
అవి సంఘమును పిలువడానకున్ను పేటలను తర్లిం
చడానకున్ను నీ దగ్గిర వుంచ వలెను. । వారు వీటిని 3
వూదినప్పుడు సంఘమంతా సంఘపు డేరాయొక్క
ద్వారము దగ్గిర నీ యొద్దికి కూడి రావలెను. । వొకటి 4
మాత్రము వారు వూదితే ఇశ్రాయేలుయొక్క సహ
స్రాధిపతులయిన శ్రేష్ఠులు నీ యొద్దికి కూడి రావలెను. ।
గొప్ప నాదము చేత వూదితే అప్పుడు తూర్పు దిక్కు 5
యందున్న పేటలు తర్లి ముందరికి వెళ్ల వలసినది. ।
రెండో మారు గొప్ప నాదముచేత వూదినప్పుడు దక్షిణ 6
దిక్కుయందున్న పేటలు తర్లి వెళ్ల వలెను; వారు
తర్లి పోవడానకు గొప్ప నాదముగా వూద వలెను. ।
అయితే సంఘమును కూడ చేసుటకు వున్నప్పుడు 7
మీరు గొప్ప నాదము కాకుండా వూద వలసినది. ।
అర్చకులైన అహరోనుయొక్క కుమారులు యీ బా 8
కాలతో వూద వలెను; యివి మీకున్ను మీ తర తర
ముల మట్టుకున్ను నిర్ణయమై వుండును. । మరిన్ని మీ 9

దేశములో మిమ్మును బాధపెట్టే విరోధితో మీరు
యుద్ధము చేయబోయే సమయమందు మీరు గొప్ప
నాదముతోను బాకాలను వూద వలెను; అప్పుడు మీ
దేవుడైన యెహోవాయొక్క సముఖమందు మీరు
జ్ఞాపకము చేయబడి మీ శత్రువులలోనుంచి మీరు
10 రక్షించ బడుదురు. । అదిగాక మీ సంభ్రమ దినమం
దున్ను, మీ వుత్సవ దినములయందున్ను, మీ నెలల
యొక్క ఆరంభముల యందున్ను, మీ హోమార్ప
ణల మీదనున్ను, మీ సమాధానార్పణలయొక్క బలుల
మీదనున్ను మీరు బాకాలను వూద వలెను; అప్పుడు
అవి మీ దేవునియొక్క సముఖమందు మీ కొరకు
జ్ఞాపకార్థముగా వుండును; నేను మీ దేవుడనైన యె
11 హోవానై వున్నానని సెలవు యిచ్చెను. । అయితే
రెండో సంవత్సరము రెండో నెల యిరువైయో దిన
మందు సంభవించినదేమంటే; ఆ మేఘము సాక్ష్యము
యొక్క డేరా మీదనుంచి పయికి యెత్తబడినందున, ।
12 ఇశ్రాయేలు పుత్రులు సీనై అరణ్యములోనుంచి తలిఁ
ప్రయాణములను చేస్తూ వుండిరి; అయితే మేఘము
13 పారాను అరణ్యమందు నిలిచి వుండెను. ।మోషే ద్వారా
యెహోవాయొక్క ఆజ్ఞా ప్రకారముగా వారు తమ
14 ప్రయాణారంభమును చేసిరి. । ముందుగా యూదా
పుత్రుల పేటయొక్క నిశానీ వారి సమూహముల
చొప్పున వెళ్లెను; అతని సమూహము మీద అమ్మీనా
దాబు కుమారుడైన నహ్షోను అధిపతి అయి వుండె
15 ను. । ఇశ్శాఖారు పుత్రులయొక్క గోత్రపు సమూ
హము మీద సూయారు కుమారుడైన నెతన్యేలు అధి
16 పతి అయి వుండెను. । మరిన్ని జెబూలోను పుత్రుల
యొక్క గోత్రపు సమూహము మీద హేలోను కుమా
17 రుడైన ఏలీయాబు అధిపతి అయి వుండెను. । డేరా
దించడమైన తరువాత గేర్షోను పుత్రులున్ను మెరారీ
పుత్రులున్ను డేరాను మోస్తూ ముందర వెళ్లే వారైరి.।
18 అప్పుడు రూబేను పేటయొక్క నిశానీ వారి సమూ
హముల చొప్పున ముందర వెళ్లెను; అతనియొక్క
సమూహము మీద షెదేయూరు కుమారుడైన ఎలి
19 సూరు అధిపతి అయి వుండెను. । షిమోను పుత్రుల
యొక్క గోత్రపు సమూహము మీద సూరీషద్దయి
కుమారుడైన షెలూమీయేలు అధిపతి అయి వుండెను.।
20 మరిన్ని గాదు పుత్రులయొక్క గోత్రపు సమూహము
మీద దూవేలు కుమారుడయిన ఎల్యాసాపు అధిపతి
21 అయి వుండెను. । అప్పుడు కెహాతీయులు పరిశుద్ధ స్థల
ముయొక్క వస్తువులను మోస్తూ ముందర వెళ్లిరి; వీరు
22 వచ్చేటప్పటికి వారు డేరాలను పాతుదురు. । అప్పుడు
ఎఫ్రాయీము పుత్రులయొక్క పేట నిశానీ వారి
సమూహముల చొప్పున ముందర వెళ్లెను; అతనియొ
క్క సమూహము మీద అమ్మీహూదుయొక్క కుమా
రుడైన ఎలీషామా అధిపతి అయి వుండెను. । మనస్సే 23
పుత్రులయొక్క గోత్రపు సమూహము మీద పెదా
హ్సూరు కుమారుడైన గమలీయేలు అధిపతి అయి
వుండెను. । బెన్యామీను పుత్రులయొక్క గోత్రపు 24
సమూహము మీద గిదోనీ కుమారుడైన అబీదాను
అధిపతి అయి వుండెను. । అప్పుడు దాను పుత్రుల 25
పేటయొక్క నిశానీ ముందర వెళ్లెను; యిది వారి
సమూహములకున్ను పేటలన్నిటికిన్ని వెనుక వెళ్లేదై
వుండెను; అతని సమూహము మీద అమ్మీషద్దయి కుమా
రుడైన అహీయెజెరు అధిపతి అయి వుండెను. । ఆషేరు 26
పుత్రులయొక్క గోత్రపు సమూహము మీద ఒక్రాను
కుమారుడయిన పగీయేలు అధిపతి అయి వుండెను. ।
మరిన్ని నఫ్తాలీ పుత్రులయొక్క గోత్రపు సమూహ 27
ము మీద ఏనాను కుమారుడైన అహీర అధిపతి అయి
వుండెను. । వారి సమూహము చొప్పున ఇశ్రాయేలు 28
పుత్రులు తర్లి వెళ్లేటప్పుడు వారి ప్రయాణములు యీ
లాగై వుండెను. । తరువాత మోషే తనకు మామ అయి 29
నటువంటిన్ని మిద్యానీయుడయినటువంటిన్ని రెయూ
వేలు కుమారుడైన హోబాబును చూచి చెప్పినదేమం
టే, యెహోవా మాకు యిస్తానని చెప్పినటువంటి
స్థలమునకు మేము పైనమై వెళ్లుతూ వున్నాము; మా
తో కూడా నీవు రావలసినది, అప్పుడు మేము నీకు
మేలు చేతుము; యెందుకంటే యెహోవా ఇశ్రా
యేలును గురించి మేలు పలికి యున్నాడనెను. । అప్పు 30
డు అతడు అతని చూచి నేను రాలేను; నా స్వదేశ
మునకున్ను నా వంశికుల యొద్దికిన్ని నేను వెళ్ల వలెనని
వున్నానన్నట్టుగా పలికినప్పుడు, । అతడు అతని చూచి 31
నీవు మమ్మును విడువకుండా వుండ కోరుతూ వున్నాను,
యెందుకంటే, మేము అరణ్యములో పేట వేసుకొనే
సంగతి నీకు తెలిసే యున్నది, యిందుకు నీవు మాకు
నేత్రముల వలెనే వుందువు. । మరిన్ని నీవు మాతో కూ 32
డా వస్తివట్టాయెనా అప్పుడు యే మేలు యెహోవా
మాకు చేసునో ఆ మేలు ప్రకారము నీకున్ను మేము
చేతుమని చెప్పెను. । అంతట వారు యెహోవాయొ 33
క్క కొండ దగ్గిరనుంచి తలిఁ మూడు రోజులు పైన
ము చేసిరి; యెహోవాయొక్క ఒడంబడికె గల పెట్టె
ఆ మూడు రోజుల పైనములోను వారి కొరకు విశ్ర
మించే స్థలము చూడడానకు వారికి ముందర వెళ్లెను. ।
వారు పేటలోనుంచి బైలు వెళ్లిన తరువాత యెహో 34
వాయొక్క మేఘము పగటియందు వారిమీద వుంటూ
వుండెను. । అప్పుడు సంభవించినదేమంటే, ఆ పెట్టె 35
ముందర వెళ్లినప్పుడు మోషే యెహోవా, లేచి నీ శత్రు
వులను చెదిరి పోయేటట్టు చేతువుగాక; నిన్ను పగచేసే

వారిని నీ ముందరనుంచి పారి పోయేటట్టు చేయుదువు
36 గాక, అని మోషే పలికెను. । అది నిలిచినప్పుడు అతడు
ఓ యెహోవా, నీవు ఇశ్రాయేలుయొక్క వెయి
వేల మంది దగ్గిరకు తిరిగీ రమ్మని పలికెను.

## 11. అధ్యాయము.

1 అంతట జనులు మొఱ్ఱ పెట్టిరి, ఆ మొఱ్ఱ యె
హోవా చెవులకు అనుకూలము కాకపోయెను; యె
హోవా దాని వినినందున ఆయన కోపము రగులు
కొనెను; యెహోవాయొక్క అగ్ని వారిలో మండి
2 పేట కడ పర్యంతమూ దహించెను. । అప్పుడు జనులు
మోషేయొద్ద బొబ్బ పెట్టినందున మోషే యెహో
వాను వేడుకొనెను, అప్పుడు ఆ అగ్ని ఆరిపోయెను.।
3 యెహోవాయొక్క అగ్ని వారిలో మండెను, గనుక,
అతడు ఆ స్థలమును తబేరా అనే పేరుచేత పిలిచెను.।
4 తరువాత వారిలో వున్న నానా జాతి సమూహము
నకు దురాశ పుట్టెను; మరిన్ని ఇశ్రాయేలు పుత్రులు
తిరుగా యేడ్చి అనుకొనినదేమంటే, తినడానకు మనకు
5 మాంసమును యెవరు యిస్తారు!।మిస్రయీములో మన
ము యదేచ్ఛగా తినిన చేపలున్ను, దోసపండ్లున్ను, కరు
బూజ బుచ్చ పండ్లున్ను, నీరుల్లిపాయలున్ను, వెల్లుల్లి
పాయలున్ను, యింకా సకలమైన కూరలున్ను మనకు
6 జ్ఞాపకమై వున్నవి. । అయితే యిప్పుడు మన జీవము
నీరస గతిని పొందెను; యీ మన్నా గాక మన కన్ను
7 లకు అగుపడినది వొకటీ లేదని అనుకొనిరి.।యీ మన్నా
దణియాలలాగున వుండెను; దాని రంగు ముత్యపు రంగు
8 అయి వుండెను.।జనులు అంతటా తిరిగి దానిని యేరు
కొని, తిరగటిని విసరడమైనా, రోటిని దంపడమైనా
అయిన తరువాత, అది పెనము మీదను కాల్చి అప్పా
లను చేసుకొనిరి; దాని రుచి క్రొత్త నూనె వలెనే వుండె
9 ను. । మరిన్ని మంచు రాత్రి పేట మీద రాలినప్పుడు
10 ఆ మన్నాన్ను దానితో రాలెను.। అప్పుడు మోషే జనుల
లో ప్రతి మనుష్యుడు తన కుటుంబముతో కూడా
తన డేరా ద్వారమందు యేడ్చుచూ వుండేది విన్నాడు;
మరిన్ని యెహోవాయొక్క కోపము బహుగా రగులు
కొనెను; మోషేయున్ను చింతాక్రాంతుడై వుండెను.।
11 అంతట మోషే యెహోవాతో చెప్పినదేమంటే, నీ
సేవకుడనైన నన్ను యెందుకు బాధ పెట్టితివి! యీ యా
వజ్జనులయొక్క భారము నా మీద నీవు పెట్టుటకు నీ
12 దృష్టిలో నేను కరుణ పొందక పోనేల! । యీ జను
లందరున్ను నా గర్భమందు పుట్టిన వారేనా? పాలు
కుడిచే పసిపిల్లను పెంచుకొంటూ వున్న తండ్రి యేలా
గున యెత్తుకొనునో ఆలాగున నీవు వారిని చంక
పెట్టుకొని నీవు వారి పితృలకు సత్యము చేసి యిచ్చిన
దేశమునకు వారిని తీసుక పొమ్మని నీవు నాకు సెలవు
యివ్వడానకు వీరు నాకు పుట్టినవారా? । యీ జను 13
లందరికి యివ్వడానకు మాంసము నాకు యెక్కడ దొ
రుకును? యేమంటే, వారు యేడ్చుచూ నన్ను చూచి
మేము తిన గలందులకు మాకు మాంసము యిమ్మని చెప్పు
తూ వున్నారు.। వొంటరి గాడనైన నేను యీ జనులం 14
దరియొక్క భారమును మొయ్యచాలను, యెందుకంటే
భారము నాకు అధికమై యున్నది.। నీవు నా యెడల 15
యీలాగున జరిగిస్తే నీ దృష్టికి నేను కృప పొందిన
పక్షమందు నా ఆపద నాకు కనపడకుండా నన్ను
సంహరించుమని వేడుకొంటూ వున్నానని పలికెను. ।
అందుకు యెహోవా మోషేకు సెలవు యిచ్చినదే 16
మంటే, ఇశ్రాయేలు పెద్దలలో, అనగా ఆ జనులలో
పెద్దలున్న వారి పైని అధికారులున్ను అయి యున్నా
రని నీకు యెరుక గలిగిన డెబ్బయి మందిని పోగుచేసి,
సంఘముయొక్క డేరా దగ్గిర నీకు తోడై నిలువడా
నకు నీవు నా యొద్దకు వారిని తీసుక రావలెను. । అప్పు 17
డు నేను దిగి అక్కడ నీతోను మాట్లాడుదును; మరిన్ని
నీ మీద వున్న ఆత్మలో తీసి వారి పైని పెట్టుదును,
అప్పుడు నీవు యీ జనులయొక్క భారమును వొంటి
గా మొయ్యకుండా వారున్ను నీతో కూడా భరింతురు.।
మరిన్ని నీవు యీ జనులను చూచి చెప్ప వలసినదే 18
మంటే, రేపటికి మీరు మిమ్మును పరిశుద్ధులను చేసు
కొండి, అప్పుడు మీరు మాంసమును భోజనము చేతురు,
యేమంటే, తినడానకు మనకు మాంసము యెవరు యి
స్తురు? మిస్రయీము దేశములో వున్నప్పుడు మనకు
సుఖమాయెనని పలికి, యెహోవా చెవులతో వినే
టట్టుగా మొఱ్ఱ పెట్టితిరి, గనుక, యెహోవా మీకు
మాంసమును తినేటందుకు యిచ్చును. । వొక దినమున్ను 19
రెండు దినములున్ను అయిదు దినములున్ను పది దిన
ములున్ను యిరువై దినములున్ను మాత్రమే కాదు,।
నెల దినముల మట్టుకు, అది మీ నాసికా రంధ్రముల 20
లోనుంచి బయిటికి వచ్చి మీకు అసహ్యమయ్యే పర్యం
తమూ దాన్ని తిందురు, యేమంటే, మీ నడుమనున్న
యెహోవాను మీరు అలక్ష్యము చేసి ఆయన ముం
దర యేడ్చి మిస్రయీము దేశములోనుంచి మమ్మును
యివతలకు తేనేల అంటిరన్నట్టుగా చెప్పుమని సెలవు
యిచ్చెను.। అందుకు మోషే అనినదేమంటే, నా యొ 21
ద్దనున్న జనులు ఆరు లక్షల కాలిబలము అయి వున్న
ప్పటికిన్ని దానికి నెల రోజుల మట్టుకు మాంస భోజన
మును యిస్తానని సెలవు యిస్తివి. । వీరు తృప్తి బొంద 22
డానకు గొఱ్ఱెలనున్ను యెడ్లనున్ను చంపడమువునా?
లేక వారు తృప్తి పొందడానకు సముద్రములో వున్న
మత్స్యములు యావత్తున్ను కూర్చడమవునా? అని అడిగి

23 నందున, । యెహోవా మోషేకు సెలవు యిచ్చినదే
మంటే, యెహోవాయొక్క హస్తము తక్కువైనదా!
నా వాక్య ప్రకారము సంభవించునో లేదో అది
24 నీవు చూతువు గాకని సెలవు యిచ్చెను. । అప్పుడు
మోషే యివతలకు వచ్చి యెహోవాయొక్క వాక్య
ములను జనులకు తెలియచేసి, జనులయొక్క పెద్దలలో
నుంచి డెబ్బయి మందిని పోగుచేసి డేరాచుట్టూ వా
25 రిని నిలువ బెట్టెను. । అప్పుడు యెహోవా మేఘము
లో దిగి అతనితోను మాట్లాడి, అతని మీద వున్న
ఆత్మలో తీసి ఆ డెబ్బయి మంది పెద్దల పైని వుంచెను:
అయితే ఆత్మ వారి పైని నిలిచినప్పుడు వారు దీర్ఘ
26 దర్శనముగా పలుకుతూ చాలించక వుండిరి. । అయితే
వీరిలో యిద్దరు పేటలో వుండిపోయిరి; వొకని పేరు
ఏల్దాదున్ను, రెండోవాని పేరు మేదాదున్ను; అయితే
ఆ ఆత్మ వారి పయికిన్ని వచ్చెను; వీరు లెక్కలోకి వచ్చి
నవారైనప్పటికిన్ని, డేరా దగ్గిరకు రాక వుండిరి; వీరు
న్ను దీర్ఘదర్శనముగా పేటలో పలుకుతూ వుండిరి.।
27 అయినందున వొక పడుచువాడు మోషే యొద్దికి పరు
గెత్తి వచ్చి, ఏల్దాదున్ను మేదాదున్ను పేటలో దీర్ఘ
దర్శనముగా పలుకుతూ వున్నారని తెలియ చేసెను.।
28 అప్పుడు మోషే యెంచిన పడుచువారిలో నూను
కుమారుడైన యెహోషువ అనే మోషేయొక్క సేవ
కుడు చెప్పినదేమంటే, నా ప్రభువైన ఓ మోషే,
29 వారిని అటకాయించుమనెను. । అందుకు మోషే అతని
చూచి నా విషయమై నీవు రోషము కలవాడవై యు
న్నావా! యెహోవాయొక్క జనులందరున్ను దీర్ఘ
దర్శులయ్యే కొరకు యెహోవా తన ఆత్మను వారం
దరికిన్ని యిస్తే అప్పుడు నా కోరిక యీడేరునని
30 చెప్పెను. । అప్పుడు మోషేయున్ను ఇశ్రాయేలుయొ
31 క్క పెద్దలున్ను పేటలోకి వెళ్లిపోయిరి. । తరువాత యె
హోవా యొద్దనుంచి వాయువు బయిలువెళ్లి, సము
ద్రము దగ్గిరనుంచి లావుక పక్షులను తెచ్చి, పేట మొ
దలుకొని నఖముఖాలా వొక రోజు పైనము దాకా
పేట చుట్టూ భూమి మీద రెండు మూరల యెత్తుగా
32 రాల్చెను. । అయినందున జనులు లేచి ఆ రోజు పగటి
యందున్ను రాత్రియందున్ను మరునాటియందున్ను లా
వుక పక్షులను కూర్చుకొనుచూ వుండిరి; పది హో
మెరులకు తక్కువ యేరుకొనిన వాడు వొకడున్ను లేక
వుండెను; వారు తమ కొరకు వాటిని పేట చుట్టూ పర
33 చినవారైరి. । అయితే ఆ మాంసము వారి దంతముల
మధ్యమందుండి నమలబడక మునుపే యెహోవా
యొక్క కోపము జనుల మీద రగులుకొన్నందుచేత
మిక్కిలి గొప్ప తెగులుతోను యెహోవా వారిని హ
34 తము చేసెను. । అయినందున అతడు ఆ స్థలమును కిబ్రో
థత్తయవా అనే నామము చేత పిలిచెను, యెందుకంటే,
వారు అక్కడ దురాశ పడినవారిని పాతిపెట్టిరి. । అటు 35
తరువాత ఆ జనులు కిబ్రోథత్తయవాను విడచి వెళ్లి,
హస్సేరోతుకు వచ్చి హస్సేరోతులో దిగి వుండిరి.

## 12. అధ్యాయము.

అంతట మిర్యామున్ను అహరోనున్ను మోషే కుషు 1
దేశపు స్త్రీని పెండ్లాడినాడు గనుక, మోషే కుషు
దేశపు స్త్రీని పెండ్లాడినాడని అతనికి విరోధముగా
సణుగుతూ పలికినదేమంటే, । యెహోవా మోషే 2
చేత మాత్రమే సెలవు యిప్పించినాడా! మా చేతను
న్ను సెలవు యిప్పించి వుండ లేదా! అని పలికిరి; యిది
యెహోవాకు వినపడెను. । అయితే యీ మోషే అనే 3
మనుష్యుడు భూమి యందున్న మనుష్యులందరి కంటే
మిక్కిలీ శాంతుడై యుండెను. । కాబట్టి యెహోవా 4
మోషేతోనున్ను అహరోనుతోనున్ను మిర్యాముతో
నున్ను హఠాత్తుగా సెలవు యిచ్చినదేమంటే, మీ ముగ్గు
రున్ను సంఘముయొక్క డేరా యొద్దికి రండని సెలవు
యిచ్చినందున వారు ముగ్గురు యివతలకు వచ్చిరి. । అప్పు 5
డు యెహోవా మేఘస్తంభములోను దిగి, డేరా ద్వా
రమందు నిలిచి, అహరోనునున్ను మిర్యామునున్ను
పిలిచినందున వారిద్దరున్ను యివతలకు వచ్చిరి. । అప్పుడు 6
ఆయన వారితో సెలవు యిచ్చినదేమంటే, నా వా
క్యములను వినండి; మీ లోగా యొక దీర్ఘదర్శి
వున్నట్టయితే యెహోవానయిన నేను దర్శనములో
వానికి ప్రత్యక్షమవును, స్వప్నములో నేను వానితో
మాట్లాడుదును. । అయితే నా సేవకుడయిన మోషే 7
ఆలాగంటివాడు కాడు; అతడు నా యింటి యందు
యథార్థపరుడై వున్నాడు. । గూఢార్థ శబ్దముల 8
తో కాకుండా స్పష్టముగానున్ను ముఖాముఖిగాను
న్ను నేను అతనితో మాట్లాడుదును; యెహోవా
యొక్క పోలికెనున్ను అతడు చూచును; యీలాగుం
డగా నా సేవకుడైన మోషే మీద విరోధపు మాటలు
పలకడానకు మీకు భయము లేకపోనేలని సెలవు
యిచ్చెను. । యిదిగాక యెహోవాయొక్క కోపము 9
వారి మీద రగులుకొనెను, అప్పుడు ఆయన వెళ్లిపో
యెను. । మరిన్ని మేఘమున్ను డేరా మీదనుంచి యె 10
క్కిపోయిన తరువాత, యిదుగో, మిర్యాము మంచు
అయినట్టు కుష్ఠరోగిణి ఆయెను; అహరోను దాని వైపు
చూడగా యిదుగో మిర్యాము కుష్ఠరోగిణి అయి వుం
డెను. । అప్పుడు అహరోను మోషేతో చెప్పినదేమం 11
టే, అయ్యో, నా ప్రభువా, నా మనవి ఆలకించి అవి
వేకులమై అపరాధులమై మేము చేసిన యీ పాపమును
మా మీద పెట్టక, । గర్భములోనే సగము మాంసము 12

క్షీణించిపోయి మరణమయి వున్నట్టు వున్న వొకని
13 వలెనే ఆమెను కానియ్య వద్దని చెప్పినందున, । మోషే
యెహోవాను వేడుకొనెను, యేలాగంటే, వో దేవు
డా, నీవు ఆమెను స్వస్థతను చేయ వలెనని నిన్ను
14 వేడుకొంటూ వున్నానని పలికినప్పుడు, । యెహో
వా మోషేకు సెలవు యిచ్చినదేమంటే, ఆమె తండ్రి
ఆమె ముఖము మీద వుమ్మివేస్తే యేడు దినములు దాకా
సిగ్గుపడదా? కాబట్టి పేట అవతలకు ఆమెను యేడు
దినములు దాకా వుంచు, తరువాత ఆమెను తిరిగీ రా
15 నియ్య వచ్చునని సెలవు యిచ్చెను. । అయినందున
మిర్యాము పేట అవతల యేడు దినముల మట్టుకు
మూసివేయబడెను; మిర్యాము తిరిగీ వచ్చే పర్యంత
16 మూ ఆ జనులు పైనము చేయక వుండిరి. । అటు తరు
వాత జనులు హస్సెరోతు విడచి పారాను అరణ్యము
నకు వచ్చి పేట వేసుకొనిరి.

## 13. అధ్యాయము.

1 తరువాత యెహోవా మోషేకు సెలవు యిచ్చిన
2 దేమంటే, । ఇశ్రాయేలు పుత్రులకు నేను యిచ్చే కెన
యను దేశమును పరిశోధించే కొరకు మనుష్యులను
పంపించుము; వారి పితృలయొక్క గోత్రములలో గోత్ర
ము వొక్కంటికి వొక్కొకని చొప్పున పంప వలెను;
వారు వారిలో శ్రేష్ఠులై వుండ వలెనని సెలవు యిచ్చె
3 ను. । అప్పుడు మోషే యెహోవా ఆజ్ఞా ప్రకారము
వారిని పారాను అరణ్యములోనుంచి పంపించెను; వా
రందరున్ను ఇశ్రాయేలు పుత్రులలో శ్రేష్ఠులై వుండి
4 రి. । వారి పేరులు యేవేవంటే, రూబేను గోత్రములో
5 జిక్కూరు కుమారుడైన షమ్మూయయున్ను, । షిమోను
గోత్రములో హోరీ కుమారుడైన షాపాథున్ను, ।
6 యూదా గోత్రములో యెఫున్నె కుమారుడైన కాలే
7 బున్ను, । ఇశ్శాఖారు గోత్రములో యోసేపు కుమా
8 రుడైన ఇగాలున్ను, । ఎఫ్రయీము గోత్రములో నూను
9 కుమారుడైన హోషేయున్ను, । బెన్యామీను గోత్ర
10 ములో రాఫు కుమారుడైన పల్తీయున్ను, । జెబూలోను
11 గోత్రములో సోరీ కుమారుడైన గద్దీయేలున్ను, । యో
సేపు గోత్రములో అనగా మనస్సే గోత్రములో సూసీ
12 కుమారుడైన గద్దీయున్ను, । దాను గోత్రములో గెమల్లీ
13 కుమారుడయిన అమ్మీయేలున్ను, । ఆషేరు గోత్రము
14 లో మిఖాయేలు కుమారుడైన సెతూరున్ను, । నఫ్తాలీ
గోత్రములో వొప్సీ కుమారుడయిన నహ్బీయున్ను, ।
15 గాదు గోత్రములో మాఖీ కుమారుడైన గెవేలున్ను, ।
16 యీ పేరులు గల మనుష్యులను ఆ దేశమును పరిశో
ధించడానకు మోషే పంపెను; అయితే మోషే నూను
కుమారుడయిన హోషేయను యెహోషువ యని
పిలిచెను. । అప్పుడు కెనయను దేశము పరిశోధించడా 17
నకు మోషే వారిని పింపించేటప్పుడు వారితో చెప్పిన
దేమంటే, మీరు యీలాగున దక్షిణ దిక్కుకు వెళ్లి
పర్వతము యెక్కిపోయి, । ఆ దేశము యెటువంటిదో, 18
అందులో నివసించే జనులు బలాఢ్యులో బలహీను
లో, కొద్దిగానే వున్నారో బహుగానే వున్నారో, ।
వారు నివాసముగా వున్న ఆ దేశము మంచిదో చెడ్డ 19
దో, వారుండే వూళ్లు పల్లెలో లేక ప్రాకారములు
గల పట్టణములో; । మరిన్ని భూమి సారమైనదో నిస్సా 20
రమైనదో, దాని యందు మానులు వున్నవో లేవో;
యివి చూచి ధైర్యము తెచ్చుకొని, ఆ దేశపు పండ్లలో
కొన్నిటిని తీసుక రండని పంపెను: అప్పుడు ద్రాక్ష
గెలలు ముదిరిన కాలమై వుండెను. । కాబట్టి వారు 21
యెక్కి పోయి సీను అరణ్యము మొదలుకొని హమా
తుకు వెళ్లే మార్గములో రెహోబు పర్యంతము దేశ
మును పరిశోధించిరి. । వారు దక్షిణ దిక్కు తట్టు యెక్కి 22
పోయి హెబ్రోనుకు వచ్చిరి; అక్కడ అనాకు పుత్రు
లైన అహీమనున్ను షేషైయున్ను తల్మయియున్ను వుం
డిరి: యీ హెబ్రోను పట్టణము మిస్రయీములో
వున్న సోయను కంటే యేడు సంవత్సరములకు ముందు
కట్టబడెను. । తరువాత వారు ఎష్కోలు గెడ్డకు వచ్చి, 23
వొక ద్రాక్ష గెల గల కొమ్మను నరికి, దండెతో దాని
యిద్దరు మోసుకొని వచ్చిరి; మరిన్ని కొన్ని దానిమ్మ
పండ్లున్ను కొన్ని అంజూరపు పండ్లున్ను తెచ్చినారు. ।
ఇశ్రాయేలు పుత్రులు అక్కడ ద్రాక్ష గెలను తెగ 24
వేసినందున ఆ స్థలము ఎష్కోలు గెడ్డని పిలువ పడె
ను. । నలుబయి దినములు వారు ఆ దేశమును పరిశో 25
ధించి మళ్లినారు. । తరువాత వారు పారాను అరణ్య 26
ములో కాదేషు దగ్గిర వున్న మోషే యొద్దికిన్ని అహ
రోను యొద్దికిన్ని ఇశ్రాయేలు పుత్రులయొక్క సంఘ
మంతటి యొద్దికిన్ని వచ్చి, వారికిన్ని సంఘమంతటి
కిన్ని తెలియచేసి, ఆ దేశపు పండ్లను చూపించిరి. ।
మరిన్ని వారు మోషేతో వైనముగా చెప్పినదేమంటే, 27
నీవు మమ్మున పంపిన దేశమునకు మేము వెళ్లినాము;
ఆ దేశము నిజముగా పాలతోనున్ను తేనెతోనున్ను
ప్రవహిస్తూ వున్నది; మరిన్ని యివిగో దానిపండ్లు. ।
అయినప్పటికిన్ని ఆ దేశమందున్న వారు బలాఢ్యులై 28
వున్నారు; వారి పురములకు మిక్కిలీ గొప్ప ప్రా
కారములు కలిగి వున్నవి; మరిన్ని అనాకుయొక్క
పుత్రులను అక్కడ చూస్తిమి. । అమాలేకీయులు దక్షిణ 29
దేశమందున్ను, హిత్తీయులున్ను యెబూసీయులున్ను
అమొరీయులున్ను పర్వతముల యందున్ను కెనయానీ
యులు సముద్ర సమీపమందున్ను యర్దేను ప్రాంత
మందున్ను కాపురము చేస్తూ వున్నారని చెప్పిరి. ।

30 అప్పుడు కాలేబు జనులను మోషే ముందర సముదా
యించి చెప్పినదేమంటే, మనము యిప్పుడే యెక్కి
పోయి దాన్ని స్వతంత్రించుకొందాము, యేమంటే,
మనము నిజముగా దాన్ని జయించ గలమని చెప్పెను.।
31 అయితే అతనితో వెళ్లిన వారు పలికినదేమంటే, మనము
ఆ జనుల మీదికి వెళ్ల జాలము, యేందుకంటే, మనకం
32 టే వారు బలాఢ్యులై వున్నారని చెప్పి, । తాము పరి
శోధించిన ఆ దేశమును గురించి ఇశ్రాయేలు పుత్రుల
యొద్దికి కాని కబురు తీసుక వచ్చి, వారితో అనినదే
మంటే, మేము వెళ్లి పరిశోధించిన దేశము దానియందు
వున్న వారిని మింగివేసేదై యున్నది; మరిన్ని దాని
యందు మాకు కనిపించిన వారందరున్ను మిక్కిలీ యెత్తు
33 గలవారై వున్నారు. । మరిన్ని అక్కడ దీర్ఘ దేహు
లవల్ల కలిగిన అనాకు పుత్రులైన దీర్ఘ దేహులను
చూస్తిమి; మా దృష్టికి మేము మిడతలమైనట్టు అగుపడి
తిమి, మరిన్ని మేము అలాగుననే వారి దృష్టికి అగు
పడి వుంటిమని పలికిరి.

## 14. అధ్యాయము.

1 అప్పుడు సంఘమంతా తమ కంఠమెత్తి యేడ్చెను;
2 జనులు ఆ రాత్రిదాకా యేడ్చుచూ వుండిరి. । మరిన్ని
ఇశ్రాయేలు పుత్రులందరున్ను మోషే మీదనున్న
అహరోను మీదనున్ను మొర్రపెట్టిరి; సంఘము యా
వత్తూ వారితో పలికినదేమంటే, మిస్రయీము దేశ
ములో మేము చావక పోనేల? లేక, యీ అరణ్యమం
3 దైనా చావక పోనేల? । కత్తిచేత మమ్మును కూలచేయ
డానకున్ను మా భార్యలున్ను మా బిడ్డలున్ను దోపుడు
పడడానకున్ను యెహోవా మమ్మును యీ దేశము
నకు యేల తీసుక వచ్చెను? కాగా తిరిగీ మిస్రయీము
దేశములోకి వెళ్లడము మాకు మేలు కాదా అని పలికీ,।
4 వొకరితో వొకరు మనంతట మనము వొక అధిపతిని
నిర్ణయించుకొని, తిరిగీ మిస్రయీముకు వెళ్లుదామని
5 అనుకొనిరి. । అప్పుడు మోషేయున్ను అహరోనున్ను
కూడి వున్న ఇశ్రాయేలు పుత్రుల సంఘము యెదుట
6 సాగిలబడిరి. । అంతట ఆ దేశమును పరిశోధించిన వారి
లో వున్న నూను కుమారుడైన యెహోషువయున్ను
యెఫున్నె కుమారుడైన కాలేబున్ను తమ తమ బట్టలను
7 చించుకొని, । ఇశ్రాయేలు పుత్రులయొక్క సమూహ
ముతో చెప్పినదేమంటే, మేము తిరిగి పరిశోధించిన
8 దేశము మిక్కిలీ మంచి దేశమై యున్నది. । యెహోవా
మన యందు ఆనందిస్తే ఆ దేశములోకి, అనగా, పాల
తోనున్ను తేనెతోనున్ను ప్రవహిస్తూ వున్న ఆ దేశము
లోకి మనలను పిలుచుకొని పోయి దాని మనకు యి
9 చ్చును. । మీరు మాత్రము యెహోవాకు విరోధము
గా తిరుగుబాటు చేయకనున్ను, ఆ దేశపు జనులకు
భయపడకనున్ను వుండ వలెను, యెందుకంటే, వారు
మనకు ఆహారమౌదురు; వారి నీడ వారియొద్దనుంచి
తప్పిపోయెను; యెహోవా మనకు తోడుగా వున్నా
డు; వారికి భయపడకండని పలికినారు. । అయితే సం 10
ఘమంతా వారిని రాళ్లతోటి కొట్టివేయండని పలికిరి;
అప్పుడు యెహోవాయొక్క మహిమ సంఘముయొ
క్క డేరా యందు ఇశ్రాయేలు పుత్రులందరికీ అగు
పడెను. । అంతట యెహోవా మోషేకు సెలవు యి 11
చ్చినదేమంటే, యెన్నాళ్లి పర్యంతమూ యీ జనులు
నాకు కోపమును కలుగ జేతురు! వారిలో అద్భుత
ములు కలుగ చేసిన నా యందు యెన్నాళ్లి మట్టుకు
నమ్మకుండా వుందురు! । వారిని తెగులుచేత సంహరించి 12
వారిని అస్వతంత్రులుగా చేసి, వారికంటే గొప్ప
యున్న బలమున్ను గల జనమును నీవల్ల కలుగజేతు
నని సెలవు యిచ్చినందున, । మోషే యెహోవాతో 13
చెప్పినదేమంటే ఆలాగైతే మిస్రీయులు విందురు,
యేమంటే, వారిలోనుంచి నీవు యీ జనులను నీ పరా
క్రమము చేత యివతలకు తీసుక వచ్చితివి. । కాబట్టి 14
వారు యీ దేశములో వున్న వారికి తెలియ చెప్పు
దురు, యేమంటే, యెహోవా అనే నీవు యీ జను
లలో వున్నావనిన్ని, యెహోవా అనే నీవు ముఖా
ముఖిగా అగుపడుతూ వున్నావనిన్ని, నీ మేఘము
వారి పైని నిలుస్తూ వున్నదనిన్ని, పగటియందు నీవు
మేఘ స్తంభములోనున్న రాత్రియందు అగ్ని స్తంభము
లోనున్న వారి ముందర వెళ్లుతూ వున్నావనిన్ని వారు
విని యున్నారు. । కాబట్టి యీ జనులను నీవు ఏక 15
మనుష్యునిగా హతము చేస్తే ఆ పక్షమందు నీ వినకరి
వినిన జనులు చెప్పుకొనేదేమంటే, । యెహోవా 16
ప్రమాణ పూర్వకముగా యీ జనులకు యిచ్చిన దేశ
ములోకి ఆయన వారిని ప్రవేశింప చేయలేక అరణ్య
ములో వారిని నశింప చేసెనని పలుకుదురు. । నీవు 17
యిచ్చిన సెలవు యేమంటే, యెహోవా దీర్ఘశాం
తుడున్ను, అధికమయిన కనికరము కలవాడున్ను, అక్ర
మమునున్ను అపరాధమునున్ను క్షమించే వాడున్ను,
అపరాధిని యే మాత్రమైనా నిరపరాధిగా చేయనివా
డున్ను, । తండ్రులయొక్క అక్రమమును పిల్లల యొద్ద 18
మూడు నాలుగు తరముల పర్యంతమూ విచారించే వా
డున్ను అయి వున్నాడని నీవు ఆనతిచ్చిన ప్రకారము
దయచేసి, ప్రభువైన నీయొక్క శక్తిని ఘనపరచి, । నీ 19
కనికరముయొక్క అతిశయ ప్రకారముగా మిస్ర
యీములోనుంచి యివతలకు వచ్చినప్పటినుంచి నేటి
వరకు నీవు యీ జనులను క్షమించి యున్నట్టు యీ
జనులయొక్క అక్రమమును యిప్పుడున్ను క్షమింతువు

20 గాకని వేడుకొనెను. । అందుకు యెహోవా సెలవు
యిచ్చినదేమంటే, నీ వాక్య ప్రకారము నేను క్షమిం
21 చితిని. । అయినప్పటికిన్ని నిజముగా నా జీవముతోడే
లోకమంతా యెహోవాయొక్క మహిమచేత నిండి
22 వుండును. । మిస్రయీములోనున్ను అరణ్యములోను
న్ను నేను చేసిన నాయొక్క అద్భుతములనున్ను నా
మహిమనున్ను చూచిన వీరందరున్ను యిదుగో పది
మారులు నన్ను శోధించి నా నోటి మాటను వినని
23 వారైరి. । నిజముగా వారి పితృలకు నేను ప్రమాణ పూ
ర్వకముగా యిచ్చిన దేశమును వారు చూడలేక పోవు
దురు; నాకు కోపము కలుగ చేసిన వారిలో యెవరు
24 న్ను దాన్ని చూడలేక పోవుదురు. । అయితే నా సేవ
కుడైన కాలేబు వేరైనటువంటి ఆత్మ కలిగి, నన్ను పరి
పూర్ణముగా వెంబడించెను గనుక అతడు వెళ్లిన దేశ
ములోకి అతని ప్రవేశింప చేతును; అతనియొక్క సం
25 తతి దాన్ని స్వతంత్రించుకొనును. । అయితే మీరు
రేపటియందు మీ ముఖములను అరణ్యము తట్టు తిప్పు
కొని, యెర్ర సముద్రపు మార్గముగా తిరిగి పొండని
సెలవు యిచ్చెను. (అమాలేకీయులున్ను కెనయానీయు
26 లున్ను లోవలో కాపురము చేస్తూ వుండిరి.) । యె
హోవా మరిన్ని మోషేకున్ను అహరోనుకున్ను సెలవు
27 యిచ్చినదేమంటే, । నా మీద మొర్రపెట్టే వారైన
యీ దుష్ట సంఘమును యెన్నాళ్లు మట్టుకు సైరించు
దును? ఇశ్రాయేలు పుత్రులు నా మీద మొర్రబెట్టు
తూ వున్న వారియొక్క మొర్రలను నేను విని యు
28 న్నాను. । మీరు వారితో చెప్పవలసినదేమంటే, నా
చెవులలో మీరు పలికినట్టు నేను మీకు చేస్తాను, నా
జీవముతోడే యని యెహోవా పలుకుతూ వున్నా
29 డు. । మీయొక్క కళేబరములు యీ అరణ్యమందు
రాలును; మీ మొట్టు లెక్క చొప్పున యిరువై సంవత్స
రములు మొదలుకొని అంతకు పయిని యీడు కలిగి
లెక్కకు వచ్చిన మీరందరున్ను నా మీద మొర్ర పెట్టి
30 తిరి గనుక, । మిమ్మును నివాసము చేయించడానకు నేను
మీకు ప్రమాణ పూర్వకముగా యిచ్చిన దేశములోకి
నిస్సందేహముగా మీరు రాకపోవుదురు; అయితే యిం
దులో యెఫున్నె కుమారుడయిన కాలేబున్ను, నూను
కుమారుడైన యెహోషువయున్ను వీరిద్దరు మాత్రము
31 వత్తురు. । దోపుడు పోవుదురని మీరు చెప్పిన మీయొ
క్క బిడ్డలను నేను ప్రవేశింప చేతును; మీరు లక్ష్య
32 పెట్టక పోయిన దేశమును వారు అనుభవింతురు. । మి
మ్మును గురించినది యేమంటే మీ కళేబరములు యీ
33 అరణ్యమందు రాలును. । మరిన్ని మీ బిడ్డలు మీ
వ్యభిచారములను భరించి, మీయొక్క కళేబరములు
అరణ్యమందు క్షయమయ్యే పర్యంతమూ నలుబై సంవ
త్సరముల మట్టుకు యీ అరణ్యములోనే తిరుగుతూ
వుందురు. । మీరు ఆ దేశమును పరిశోధించిన నలుబై 34
దినముల లెక్క ప్రకారము దినము 1 ఒక్కంటికి సంవ
త్సరము చొప్పున నలుబై సంవత్సరముల మట్టుకు మీ
అక్రమములను మీరు భరిస్తూ, నా వుద్దేశముయొక్క
భంగమును మీరు గ్రహింతురు. । యెహోవా అనే 35
నేను ఆనతిచ్చితిని, గనుక, నాకు విరోధముగా కూడు
కొనిన యీ దుష్ట సంఘమంతటికీ అది నిజముగా అను
భవింప చేతును. యీ అరణ్యములో నాశు క్షీణించి
యిక్కడనే మరణమౌదురని సెలవు యిచ్చెను. । అయితే 36
మోషే ఆజ్ఞచేత ఆ దేశమును పరిశోధించ వెళ్లి, తిరిగీ
వచ్చి, దేశమును గురించి కాని కబురును తెచ్చినందు
వల్ల సంఘమంతటినీ అతని మీద మొర్రపెట్ట చేసిన
వారు మరణమైరి. । ఆ దేశమును గురించి కాని కబురు 37
తెచ్చిన ఆ మనుష్యులు యెహోవా యెదుట తెగులు
చేత మరణమైరి. । అయితే ఆ దేశమును పరిశోధించ 38
వెళ్లిన వారిలో నూను కుమారుడైన యెహోషువయు
న్ను, యెఫున్నె, కుమారుడైన కాలేబున్ను బ్రతికి వుం
డిరి. । అంతట మోషే ఆ మాటలను ఇశ్రాయేలు పుత్రు 39
లందరితో తెలియ చెప్పినప్పుడు ఆ జనులు బహు
దుఃఖాక్రాంతులైరి. । వుదయమందు వారు త్వరగా 40
లేచి పర్వత శిఖరము యెక్కి చెప్పినదేమంటే, యిదు
గో మేము యిక్కడ వున్నాము, మేము పాపము చే
స్తిమి, అయినప్పటికిన్ని యెహోవా చెప్పిన స్థలము
నకు యిప్పుడు మేము యెక్కిపోదుము అని పలకగా, ।
మోషే చెప్పినదేమంటే, యెహోవాయొక్క ఆజ్ఞను 41
యిప్పుడు మీరు యెందుకు మీరుతూ వున్నారు? కా
గా మీకు జయము కాక పోవును. । యెహోవా 42
మీలో లేదు, కాబట్టి మీరు యెక్కి వెళ్లితిరట్టాయె
నా మీరు మీ శత్రువుల ముందర హతమవుదురు. ।
యేమంటే అమాలేకీయులున్ను కెనయానీయులున్ను 43
మీ యెదుట వున్నారు, మీరు కత్తిచేత కూలుదురు;
యేమంటే మీరు యెహోవా యొద్దనుంచి తిరిగిపోయి
వున్నారు, కాబట్టి మీకు యెహోవా సహాయము
లేక వుండునని చెప్పెను. । అయినప్పటికిన్ని వారు 44
పర్వతము మీదికి యెక్కడానకు సహసించిరి, అయితే
మోషే యెహోవాయొక్క వొడంబడికె గల పెట్టె
తోను పేటను విడువక వుండెను. । అప్పుడు ఆ పర్వ 45
తమందు కాపురస్తులయిన అమాలేకీయులున్ను కెన
యానీయులున్ను దిగి వారిని నరికి హోర్మా పర్యం
తమూ తరిమిరి.

## 15. అధ్యాయము.

మరిన్ని ఇశ్రాయేలు పుత్రులతో మాట్లాడి చెప్పు 1
మని యెహోవా మోషేకు సెలవు యిచ్చినదేమంటే, ।

2 నేను మీకు యిచ్చే మీయొక్క కాపురమయ్యే దేశ
3 ములోకి మీరు ప్రవేశించిన తరువాత, । యెహో
వాకు సువాసన కలుగ చేసుట కొరకు యెడ్ల మంద
లోనుంచైనా గొర్రెల మందలోనుంచైనా యెహో
వాకు దహన బలిగా వొక హోమమునైనా, వొక
మొక్కుబడిని తీర్చుటకు గాని వొక స్వేచ్ఛార్పణలో
గాని మీ వుత్సవములలో గాని వొక బలినైనా చెల్లించ
4 వలెనని మీకు వుంటే, । అప్పుడు యెహోవాకు తన
అర్పణ చెల్లించే వాడు పావు హీను నూనెతో కలిపిన
ఏఫాలో పదోపాలు పిండిని భోజనార్పణ కొరకు
5 తీసుక రావలెను. । మరిన్ని హోమార్పణతోనయినా
బలితోనయినా గొర్రెపిల్ల వొక్కంటికి పావు హీను
ద్రాక్షా రసమును పానార్పణ కొరకు నీవు సిద్ధపరచ
6 వలెను. । పొట్టేలుకయితే భోజనార్పణ కొరకు హీను
లో మూడో భాగము నూనెతో కలిపిన ఏఫాయొక్క
పది భాగములలో రెండు పాళ్ల పిండిని సిద్ధపరచ
7 వలెను. । మరిన్ని పానార్పణ కొరకు యెహోవాకు
సువాసనయ్యేటట్టు హీనులో మూడో పాలు ద్రాక్షా
8 రసమును చెల్లించ వలెను. । హోమార్పణ కొరకో,
మొక్కుబడి తీర్చుట యందైన వొక బలి కొరకో, యె
హోవాకు సమాధానార్పణల కొరకో, నీవు వొక యె
9 ద్దును సిద్ధపరచే వేళ యందు,। వాడు యెద్దుతో కూడా
హీనుయొక్క అర్ధభాగము నూనెతో కలిపి ఏఫాయొ
క్క పది భాగములలో మూడు పాళ్ల పిండి గలదైన
10 భోజనార్పణను తీసుక రావలెను.। మరిన్ని పానార్పణ
కొరకు నీవు హీనులో అర్ధభాగము ద్రాక్షా రసమును
తెప్పించ వలెను; అది యెహోవాకు సువాసన గల
11 హోమము కొరకైనదవును. । యీలాగున యెద్దు వొ
క్కంటికిన్ని పొట్టేలు వొక్కంటికిన్ని గొర్రెపిల్ల వొ
క్కంటికిన్ని మేకపిల్ల వొక్కంటికిన్ని చేయబడ వలెను.।
12 మీరు సిద్ధపరిచినవి యెన్ని వాటి లెక్క చొప్పున
13 ప్రతి దానికి యీలాగున చేయ వలెను. । దేశమందు
పుట్టిన వారందరున్ను యెహోవాకు సువాసన గల
హోమార్పణ చెల్లించేటప్పుడు వాటిని యీ ప్రకా
14 రము చేయ వలెను. । మరిన్ని మీలో నివసించే పరదేశి
యైనా మీ తర తరముల మట్టుకు మీలో వున్న యెవ్వ
డైనా యెహోవాకు సువాసన గల హోమార్పణను
చెల్లించ వలెనని తాత్పర్యము కలవాడై వుంటే, మీరు
15 చేసిన ప్రకారముగా వాడున్ను చేయ వలసినది. । సంఘ
పు వారైన మీకున్ను మీలో నివసించే పరదేశికిన్ని
ఏక నిబంధన కలిగి వుండ వలెను; అది మీ తర తరము
లకు నిత్య నిబంధనయై వుండ వలెను; మీరు యేలాగు
నో ఆలాగుననే యెహోవా సముఖమందు పరదేశి
16 యున్ను వుండును. । వొక్క న్యాయ ప్రమాణమున్ను
వొక్క విధమున్ను మీకున్ను మీలోనున్న పరదేశికిన్ని
కలిగి వుండునని సెలవు యిచ్చెను. । మరిన్ని ఇశ్రా 17
యేలు పుత్రులతో మాట్లాడి చెప్పుమని యెహోవా
మోషేకు సెలవు యిచ్చినదేమంటే, । నేను మిమ్మును 18
ప్రవేశింప చేసే దేశములోకి మీరు ప్రవేశించిన తరు
వాత, । మీరు ఆ దేశపు పంటను తినేటప్పుడు యె 19
హోవాకు పైకెత్తే వొక అర్పణను చెల్లించ వలెను. ।
యేలాగంటే పయికెత్తే యీ అర్పణ నిమిత్తమై మీరు 20
మీ మొదటి పిండి ముద్దలోనుంచి అప్పము వొకటి
చేసి అర్పించ వలెను; కళ్లముయొక్క పయికెత్తే అర్పణ
యేలాగునో ఆలాగున యిది మీరు పైకెత్త వలెను. ।
మీ మొదటి పిండి ముద్దలోనుంచి మీ తర తరముల 21
దాకా మీరు యెహోవాకు పయికెత్తే అర్పణను
చెల్లిస్తూ వుండ వలెను. ।మరిన్ని యెహోవా మోషేకు 22
సెలవు యిచ్చినటువంటి యీ ఆజ్ఞలను, అనగా మో
షేకు యెహోవా ఆజ్ఞాపించిన నాటనుంచి మీ తర
తరముల మట్టుకు నిలిచేటట్టుగా, । మోషేచేత మీకు 23
ఆజ్ఞాపించిన వాటిని మీరు అశ్రద్ధ చేసి తప్పినప్పుడు,
సంభవించేదేమంటే, । సంఘముయొక్క కండ్లకు మరు 24
గుగాను అజ్ఞానముచేత యేదైనా చేయబడినట్టాయెనా
అప్పుడు సంఘమంతా వొక కోడె యెద్దును యెహో
వాకు సువాసనయ్యేటట్టుగా హోమార్పణను చేతురు
గాక; దానితో భోజనార్పణనున్ను పానార్పణనున్ను
నిర్ణయ ప్రకారము అర్పించ వలెను; మరిన్ని పాప పరి
హారపు బలి కొరకు వొక మేకపిల్లను చెల్లించ వలెను.।
యీలాగున అర్చకుడు ఇశ్రాయేలు పుత్రులయొక్క 25
సంఘమంతటి కొరకు శాంతి కలుగ చేసును, అది అజ్ఞా
నమువల్లను వచ్చినది గనుక వారి విషయమయి అది
క్షమించ బడును; కాబట్టి వారు తమ అజ్ఞానము నిమి
త్తము హోమ బలి కొరకున్ను పాప పరిహారపు బలి
కొరకున్ను తమ అర్పణలను యెహోవా సముఖము
నకు తీసుక వచ్చి యెహోవాకు చెల్లించ వలెను. ।
అయినందున అది ఇశ్రాయేలు పుత్రులయొక్క సంఘ 26
మంతటి విషయమైయున్ని వారిలో పరదేశిగా వున్న
వాని విషయమైయున్ని క్షమించ బడును, యేమంటే
జనులందరికిన్ని అది అజ్ఞానకృతమై యుండెను. । మరి 27
న్ని యెవడయినా అజ్ఞానముచేత పాపమును చేస్తే,
వాడు వొక సంవత్సరము యీడు గల ఆడు మేకను
పాప పరిహారపు బలి కొరకు తీసుక రావలసినది. ।
అప్పుడు తెలియక యెహోవా సముఖమందు అజ్ఞా 28
నముచేత పాపమును చేసిన వాని కొరకు శాంతి కలి
గేటట్టుగా అర్చకుడు వాని కొరకు శాంతి పరచే
బలిని చెల్లించ వలెను; అది వానికి క్షమించబడును. ।
ఇశ్రాయేలు పుత్రులలో పుట్టిన వానికయినా సరే, 29

వారిలో పరదేశిగా వున్న వానికయినా సరే, అజ్ఞానము
చేత పాపమును చేసిన వారికందరికిన్ని న్యాయ ప్ర
30 మాణము ఏకరీతిగా వుండ వలెను. । అయితే దేశమందు
పుట్టిన వాడైనా పరదేశియైనా దుస్సాహసముగా యే
దయినా చేస్తే వాడు యెహోవాను నిందించిన వాడా
యెను, గనుక, వాడు తన జనులలోనుంచి ఖండించ
31 బడును. । యెందుకంటే వాడు యెహోవాయొక్క
వాక్యమును నిర్లక్ష్యపెట్టి ఆయనయొక్క ఆజ్ఞను
త్రుంచివేసెను గనుక వాడు బొత్తిగా ఖండించబడును;
వానియొక్క అక్రమము వాని పయిని వుండునన్నట్టు
32 గా చెప్పుమని సెలవు యిచ్చెను. । అంతట ఇశ్రాయేలు
పుత్రులు అరణ్యములో వున్నప్పుడు సబ్బాతు దిన
మందు కర్రలు యేరిన వొకడు వారికి దొరికెను. ।
33 కర్రలు యేరిన వాని చూచిన వారు వాని పట్టుకొని,
మోషే యొద్దికిన్ని అహరోను యొద్దికిన్ని సంఘమం
34 తటి యొద్దికిన్ని తీసుక వచ్చినారు. । అయితే అటువంటి
వాని యేమి చేయవలసినదో అది వారికి తెలియలేదు,
35 గనుక, వాని నిర్బంధములో వుంచిరి. । అందుకు యె
హోవా మోషేకు సెలవు యిచ్చినదేమంటే, నిజము
గా వీడు చంపబడ వలెను; సంఘమంతా పేట అవతల
36 వాన్ని రాళ్లతో కొట్టివేయ వలెనని చెప్పెను. । అయి
నందున సంఘము యావత్తూ వాన్ని పేట బైటికి తీసుక
పోయి, యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్టు వాన్ని
37 రాళ్లతో కొట్టినందున వాడు మరణమాయెను. । మరి
న్ని ఇశ్రాయేలు పుత్రులతో చెప్పుమని యెహోవా
38 మోషేకు సెలవు యిచ్చినదేమంటే, । మీరు మీ తర
తరముల మట్టుకు మీయొక్క వస్త్రముల కొన మీద
జాలరులను చేసుకో వలెను; మరిన్ని కొనల యందు
కలిగిన ఆ జాలరుల మీద నీలి పట్టెడ వేయ వలెను. ।
39 మీరు యెహోవా ఆజ్ఞలన్నిటినీ తలంచుకొని వాటిని
చేసేటట్టుగానున్ను, పూర్వము మీరు వ్యభిచారముగా
మీ మనస్సుకున్ను మీ నేత్రములకున్ను కోరికైనటు
వంటి వాటిని యిక మీరు వెంబడించక వుండేటట్టు
40 గానున్ను, । మీరు నా ఆజ్ఞలన్నిటినీ తలంచుకొని చేసి,
మీ దేవుని విషయమై మీరు పరిశుద్ధ జనులయ్యేటట్టు
గానున్ను, యీ జాలరును మీరు చూచి గ్రాహ్యము
41 చేసుకో వలసినది. । నేను యెహోవా అనే మీ దేవు
డనై వున్నాను; నేను మీకు దేవుడనయ్యేటట్టు మిస్ర
యీము దేశములోనుంచి మిమ్మును తీసుక వస్తిని; నేను
యెహోవా అనే మీ దేవుడనై వున్నానన్నట్టుగా
చెప్పుమని సెలవు యిచ్చెను.

## 16. అధ్యాయము.

1 లేవీ కుమారుడయిన కెహాతుకు పుట్టిన ఇస్హారు
కుమారుడయిన కోరహున్ను, రూబేను పుత్రులలో
ఏలీయాబు కుమారులైన దాతానున్ను అబీరామున్ను,
పెలెథు కుమారుడయిన ఓనున్ను, । వీరు ఇశ్రాయేలు 2
పుత్రులలో కొందరిని, అనగా, సంఘమందు ప్రఖ్యాతి
పొందినటువంటిన్ని సమూహమందు శ్రేష్ఠులైనటువం
టిన్ని యిన్నూట యేభై మందిని జట్టు కూర్చుకొని,
మోషే మీదికి లేచిరి. । వారు కూడుకొని మోషే మీ 3
దికిన్ని అహరోను మీదికిన్ని వచ్చి, వారిని చూచి,
మీ అంతట మీరు బహు అధికారమును తెచ్చుకొం
టూ వున్నారు; సంఘపు వారందరున్ను పరిశుద్ధులయి
వుండగానున్ను, యెహోవా వారికి తోడై వుండగా
నున్ను, యెహోవాయొక్క సంఘము మీద మీ
అంతట మీరే అధికారులు కావడమేమని పలికిరి. । 4
మోషే దాని వినినప్పుడు సాగిల పడెను. । తరువాత 5
అతడు కోరహుతోనున్ను అతని సమూహముతోను
న్ను అనినదేమంటే, రేపటి రోజున యెహోవా తన
వారు యెవరో అదిన్ని, యెవడు పరిశుద్ధుడో అదిన్ని
తెలియ చేసి, వాని తన సన్నిధికి చేర చేసును; నిజము
గా తాను యెంచిన వాని తన సన్నిధికి చేర చేసును. ।
మీరు దీని చేయండి, అది యేదంటే, కోరహున్ను 6
అతని సమూహమైన మీరందరున్ను ధూప కలశము
లను పట్టుకొని, । రేపటి రోజున వాటిలో అగ్నివుంచి, 7
యెహోవా యెదుట ధూప చూర్ణమును వేయండి;
అప్పుడు యెహోవా యెవ్వని యెంచునో వాడు
పరిశుద్ధుడౌను; వో లేవీ పుత్రులారా, మీ యంతట
మీరు బహుగా అతిశయతను వహించుకొంటున్నా
రని చెప్పెను. । మరిన్ని మోషే కోరహుతో అనిన 8
దేమంటే, వో లేవీ పుత్రులారా, వినండి. । యెహో 9
వాయొక్క డేరా పని చేయడానకున్ను, సంఘము
యెదుట నిలిచి వారి కొరకు సేవ చేయడానకున్ను,
ఇశ్రాయేలుయొక్క దేవుడు మిమ్మును ఇశ్రాయేలుయొ
క్క సంఘములోనుంచి కేటాయించి తన సన్నిధికి రా
చేసేది మీకు అల్పమా! । ఆయన నిన్నున్ను లేవీ పుత్రు 10
లయిన నీ సహోదరులనున్ను తన సన్నిధికి చేర
చేసెను; యింకా అచార్యకత్వమునున్ను వెతుకుతూ
వున్నారా? । యిందు నిమిత్తమే గదా నీవున్ను నీ సమూ 11
హమున్ను యెహోవాకు విరోధముగా కూడి వున్నా
రు; అహరోను మీద మీరు మొర్ర పెట్టడానకు అతడు
యెవడు గనుక అని చెప్పెను. । అంతట మోషే ఏలీ 12
యాబుయొక్క కుమారులైన దాతానునున్ను, అబీరా
మునున్ను పిలువనంపించెను; అందుకు వారు మేము
రాము: । పాలతోనున్ను తేనెతోనున్ను ప్రవహించే 13
దేశములోనుంచి యివతలకు నీవు మమ్మును తీసుక వచ్చి,
యీ అరణ్యములో మమ్మును నశింప చేసేది స్వల్ప
కార్యమా? అదిగాక మా మీద నీవు అధికారివి అయి

14 యుండేటట్టు చేసుకొంటున్నావా? । మరిన్ని పాలతో
నున్ను తేనెతోనున్ను ప్రవహించే దేశములోకి నీవు
మమ్మును తీసుక వెళ్లడము మానివేస్తివి; పొలములనున్ను
ద్రాక్ష తోటలనున్ను మాకు స్వాధీనము చేయకపోతివి;
యీ జనుల కన్నులను నీవు పెల్లగిస్తావా? మేము రా
15 మని వుత్తరమిచ్చిరి. । అందుకు మోషే బహుగా కోప
పడి యెహోవాతో చెప్పినదేమంటే, వారి యొద్దను
నేను వొక గాడ్దెనైనా పుచ్చుకోలేదు; వారికి
యే హానినైనా చేయలేదు; వారి అర్పణను అంగీకరిం
16 చక పోదువు గాకని పలికెను. । మరిన్ని మోషే కోర
హుతో చెప్పినదేమంటే, నీవున్ను నీయొక్క సమూ
హమున్ను, మరిన్ని అహరోనున్ను, రేపటిరోజున యె
హోవా సముఖమునకు వచ్చి నిలిచి వుండ వలెను. ।
17 మరిన్ని మీలో ప్రతి మనుష్యుడు తన తన ధూప కలశ
ము పట్టుకొని, వాటిలో ధూప చూర్ణమును వేసి,
ప్రతి మనుష్యుడు వొక్కొక్క ధూప కలశము చొప్పున
యిన్నూట యాభై ధూప కలశములను తీసుకొని వత్తురు
గాక; నీవున్ను అహరోనున్ను తన తన ధూప కలశము
18 లను తీసుకొని రావలెనని చెప్పెను. । అయినందున వారి
లో ప్రతి మనుష్యుడు తన తన ధూప కలశమును తీసు
కొని, దానిలో అగ్ని వుంచి, దాని యందు ధూప చూర్ణ
మును వేసి, మోషేతోనున్ను అహరోనుతోనున్ను కూ
19 డా సంఘపు డేరా ద్వారము దగ్గిర నిలిచిరి. । మరిన్ని
కోరహు వారికి విరోధముగా సంఘమంతటినీ సంఘపు
డేరా దగ్గిర కూర్చెను; అప్పుడు యెహోవాయొక్క
20 మహిమ సంఘమంతటికీ అగుపడెను. । అప్పుడు యె
హోవా మోషేకున్ను అహరోనుకున్ను సెలవు యిచ్చి
21 నదేమంటే, । యీ సంఘమునకు మీరు దూరముగా
వుండండి; క్షణములో నేను వారిని నాశనము చేస్తా
22 నని అనినప్పుడు. । వారు సాగిలపడి పలికినదేమంటే,
సమస్తాత్మలకున్ను దేవుడవైన వో దేవుడా, వొకడు
చేసిన పాపమునుంచి నీవు సంఘమంతటి మీద కోప
23 ముగా వుందువా అని పలికినందున, । యెహోవా మో
షేను చూచి నీవు సంఘమంతటితో చెప్ప వలసిన
24 దేమంటే, । మీరు లేచి, కోరహు దాతాను అబీరాము
లయొక్క డేరాలకు దూరముగా వెళ్లి పొండని చెప్వ
25 మని సెలవు యిచ్చెను. । అప్పుడు మోషే లేచి, దాతాను
యొద్దికిన్ని అబీరాము యొద్దికిన్ని వెళ్లినాడు; ఇశ్రా
26 యేలుయొక్క పెద్దలున్ను అతని వెంబడించిరి. । అప్పుడు
మోషే సంఘముతో చెప్పినదేమంటే, మీరు యీ
దుర్మార్గుల డేరాల యొద్దనుంచి వెళ్లిపొండి, వారి సమస్త
పాపములలో మీరున్ను నాశనము పొందకుండా వారికి
కలిగిన అంతటిలోది యేదైనా ముట్టక వుండండని
27 చెప్పెను. । ఆలాగున కోరహు దాతాను అబీరాముల
యొక్క డేరాల చుట్టూ వున్న వారు లేచి వెళ్లి పోయిరి;
తరువాతను దాతానున్ను అబీరామున్ను వారియొక్క
భార్యలున్ను కుమారులున్ను పసిపిల్లలున్ను బైటకు వచ్చి
వారి డేరాలయొక్క ద్వారములందు నిలిచి వుండిరి. ।
అప్పుడు మోషే చెప్పినదేమంటే, నా స్వబుద్ధిచేత నేను 28
యేదైనా చేయలేదు, యీ క్రియలను చేయడానకు
యెహోవా నన్ను పంపినాడని మీరు యీ విధముగా
తెలుసుకో వలెను. । అది యేమంటే, అందరికి కలిగే 29
సాధారణమైన మరణముచేత యీ మనుష్యులు మర
ణము పొందినా, లేక అందరికి వచ్చే దండన ప్రకా
రము వారికి దండన వచ్చినా, ఆ పక్షమందు యె
హోవా నన్ను పంపి యుండ లేదు. । అయితే వారు 30
జీవములతోటే అగాధములో కూలేటట్టుగా భూమి
తన నోరు తెరచి, వారినిన్ని వారికి గలిగిన అంతటి
నిన్ని మింగివేసేటటువంటి నూతన కార్యమును యె
హోవా కలుగ చేస్తే ఆ పక్షమందు వారు యెహో
వాకు కోపము కలుగ చేసినారని మీరు గ్రహింతురని
చెప్పెను. । అప్పుడు సంభవించినదేమంటే, అతడు యీ 31
మాటలన్నీ చెప్పి చాలించిన తరువాతను వారి కింది
నేల బద్దలాయెను. । యేలాగునంటే భూమి తన నోరు 32
తెరచి, వారినిన్ని వారి యిండ్లనున్ను కోరహుతో
కూడిన వారినందరినిన్ని వారియొక్క సర్వస్వమునున్ను
మింగివేసెను. । వారున్ను వారికి కలిగినది అంతానున్ను 33
జీవముతోటే అగాధములో కూలినప్పుడు భూమి
వారి పైని కప్పుకొన్నందున వారు సంఘములోనుంచి
లయమైన వారైరి. । అయితే వారి చుట్టూ వున్న ఇశ్రా 34
యేలీయులు వారియొక్క రోదనమును విని, భూమి
మనలనున్ను మింగివేసునేమో అని అనుకొని పారిపో
యిరి. । మరిన్ని యెహోవా సన్నిధినుంచి అగ్ని బయి 35
లువెళ్లి, ధూపము సమర్పించిన ఆ యిన్నూట యాభై
మందినీ దహించివేసెను. । తరువాత యెహోవా మో 36
షేకు సెలవు యిచ్చినదేమంటే, । నీవు అర్చకుడైన అహ 37
రోనుయొక్క కుమారుడైన ఎలాజారును చూచి, దహ
నాగ్ని మధ్యనుంచి నీవు ఆ ధూప కలశములను యెత్తి
ఆ ధూపాగ్నులను దూరానకు పారకొట్టుమని చెప్పుము,
యెందుకంటే అవి పరిశుద్ధమై వున్నవి. । తమ ప్రాణ 38
ముల మీదికి వచ్చే పాపము చేసిన వీరియొక్క ధూప
కలశములతోటి బలిపీఠమును కప్పడానకు వెడల్పయిన
రేకులను చేతురుగాక, యేమంటే, వారు వాటిని యె
హోవా సముఖమందు అర్పించినందున అవి పరిశు
ద్ధమై వున్నవి; మరిన్ని అవి ఇశ్రాయేలు పుత్రులకు
ఆనవాలుగా వుండునని సెలవు యిచ్చెను. । ఆలాగున 39
అర్చకుడైన ఎలాజారు యెహోవా మోషేచేత తనకు
ఆజ్ఞాపించినట్టు దహనమైన వారు అర్పించిన యిత్తడి

ధూప కలశములను తీసి, పీఠమును కప్పేటట్టుగా వెడ
40 ల్పయిన రేకులను చేయించినందున, । అవి అహరోను
సంతతి కానటువంటి అన్యుడు కోరహు లాగుననున్ను
అతని సమూహము లాగుననున్ను కాకుండా, యె
హెూవా సముఖమందు ధూపమును సమర్పించడానకు
రా కూడదని ఇశ్రాయేలు పుత్రులకు జ్ఞాపకార్థమై
41 యుండును. । అయితే మరునాటి యందు ఇశ్రాయేలు
పుత్రులయొక్క సంఘము యావత్తు మోషే మీద
నున్ను అహరోను మీదనున్ను మొఱ్ఱబెట్టుతూ, మీరు
యెహెూవాయొక్క జనులను చంపివేసితిరని పలికిరి. ।
2 తరువాత సంభవించినదేమంటే, సంఘము కూడి మోషే
మీదికిన్ని అహరోను మీదికిన్ని వచ్చినప్పుడు వారు
సంఘముయొక్క డేరా తట్టు చూచిరి, అప్పుడు యి
దుగో ఆ మేఘము దానిని కప్పుకొనెను, మరిన్ని యె
3 హెూవాయొక్క మహిమ అగుపడెను.। మోషేయున్ను
అహరోనున్ను సంఘముయొక్క డేరా ముందరికి
4 వచ్చిరి. । అప్పుడు యెహెూవా మోషేకు సెలవు యిచ్చి
5 నదేమంటే, । యీ సంఘమునకు మీరు దూరముగా
తొలిగి పొండి, వొక క్షణములో నేను వారిని నాశనము
6 చేస్తానని చెప్పినప్పుడు వారు సాగిల పడిరి. । అంతట
మోషే అహరోనును చూచి, నీవు వొక ధూప కలశము
పట్టుకొని, బలిపీఠాగ్నిని దానిలో వుంచి, ధూప చూ
ర్ణమును వేసి, త్వరగా సంఘము దగ్గిరకు వెళ్లి, వారి
కొరకు శాంతి కలుగ చేయుము, యెందుకంటే యె
హెూవా సన్నిధినుంచి వుగ్రత బయిలువెళ్లి యున్నది;
7 తెగులు ఆరంభమాయెనని అతనితో చెప్పెను.।అప్పుడు
అహరోను మోషే ఆజ్ఞాపించిన ప్రకారము ధూప కల
శమును పట్టుకొని, పరుగెత్తి పోయి, సంఘములోకి
వచ్చెను: అయితే యిదుగో తెగులు జనులలో ఆరంభ
మైనందున అతడు ధూప చూర్ణమును వేసి, జనుల కొరకు
8 శాంతి కలుగ చేసెను. । అతడు బ్రతికి వున్న వారికిన్ని
మరణమైన వారికిన్ని మధ్యను నిలిచి వున్నందున తెగులు
9 సమాప్తమాయెను. । అయితే యీ తెగులుచేత మరణమ
యిన వారు కోరహుయొక్క విషయమయి చచ్చినవారు
50 గాక పదునాలుగువేల యేడున్నూరు మంది వుండిరి. । తరు
వాత అహరోను సంఘపు డేరా ద్వారము దగ్గిర వున్న
మోషే యొద్దికి తిరిగీ వచ్చెను; అంతట తెగులు నిలిచి
పోయెను.

## 17. అధ్యాయము.

1 మరిన్ని యెహెూవా మోషేకు సెలవు యిచ్చిన
2 దేమంటే, । ఇశ్రాయేలు పుత్రులు తమ పితృలయొక్క
యింటి కూటములలో వొకొక్కనికి వొక కఱ్ఱ చొ
ప్పున వారి పితృల యింటి కూటములకు కలిగే శ్రేష్ఠుల
లెక్క ప్రకారము పండ్రెండు కఱ్ఱలను యివ్వ వలెనని
వారితో చెప్పుము; ఆ కఱ్ఱలను నీవు పుచ్చుకొని
ప్రతి వాని కఱ్ఱ మీద వాని పేరు వ్రాయ వలసినది.।
యిందులో లేవీ గోత్రీయుని కఱ్ఱమీద అహరోను 3
యొక్క పేరు వ్రాయ వలెను; యేమంటే, వారి పితృల
యింటి కూటముయొక్క శిరస్సైన వానికి వొక కఱ్ఱ
వుండ వలెను.। తరువాత నీవు సంఘముయొక్క డేరాలో 4
సాక్ష్యమునకు యెదుట వాటిని వుంచ వలెను; అక్క
డికి నేను వచ్చి నీకు తోడౌదును. । అప్పుడు సంభవించే 5
దేమంటే, నేను యెంచే వానియొక్క కఱ్ఱ పూచును,
అందుచేత ఇశ్రాయేలు పుత్రులు నా యెదుట మీ
మీద పెట్టిన మొఱ్ఱలను నేను మాన్పింతునని సెలవు
యిచ్చెను. । అయినందున మోషే ఇశ్రాయేలు పుత్రు 6
లతో ఆలాగున చెప్పెను; కాబట్టి వారి శ్రేష్ఠులంద
రున్ను తమ తమ పితృలయొక్క యింటి కూటముల
లెక్క ప్రకారము శ్రేష్ఠుడు వొక్కంటికి వొక కఱ్ఱ చొ
ప్పున పండ్రెండు కఱ్ఱలను అతనికి యిచ్చిరి; వారి కఱ్ఱ
లలో అహరోనుయొక్క కఱ్ఱయున్ను వుండెను. । యీ 7
కఱ్ఱలను మోషే సాక్ష్యముగల డేరాలో యెహెూవా
సముఖమందు వుంచెను. । మరునాటి యందు సంభవిం 8
చినదేమంటే, మోషే సాక్ష్యముగల డేరాలో ప్రవేశిం
చినప్పుడు, యిదుగో, లేవీయొక్క యింటి కూటమున
కయి వున్న అహరోనుయొక్క కఱ్ఱ చిగురు పెట్టి
పువ్వులు పూచి బాదంకాయలు కాస్తూ వుండెను. ।
అయినందున మోషే ఆ కఱ్ఱలన్నిన్ని యెహెూవా 9
సముఖమునుంచి ఇశ్రాయేలు పుత్రులయొద్దికి తీసుక
వచ్చెను; అప్పుడు వారు చూచి ప్రతి మనుష్యుడు
తన తన కఱ్ఱను పుచ్చుకొనెను. । అప్పుడు యెహెూవా 10
మోషేకు సెలవు యిచ్చినదేమంటే, నీవు అహరోను
యొక్క కఱ్ఱను తీసుకవచ్చి వ్యతిరిక్తులైనటువంటి వా
రికి ఆనవాలుగా వుండేటట్టు సాక్ష్యమునకు యెదుట
తిరిగీ వుంచుము; యీలాగున వారు మరణము కాకుం
డా నీవు వారియొక్క మొఱ్ఱలను నా యెదుటనుంచి
మానిపింతువని సెలవు యిచ్చెను. । అయినందున మోషే 11
ఆలాగున చేసినాడు; యెహెూవా తనకు ఆజ్ఞాపించిన
ప్రకారము అతడు చేసెను. । అప్పుడు ఇశ్రాయేలు 12
పుత్రులు మోషేతో చెప్పినదేమంటే,యిదుగో మేము
చస్తున్నాము, మేము నశిస్తున్నాము, మేమందరమున్ను
నశిస్తున్నాము. । యెహెూవాయొక్క డేరా సమీపము 13
నకు యేమాత్రమూ చేరిన వాడు మరణమవును; మరణ
ముచేత మేము నశించిపోతూ వున్నాము గదా యని
పలికిరి.

## 18. అధ్యాయము.

1 అప్పుడు యెహోవా అహరోనుకు సెలవు యిచ్చి
నదేమంటే, నీవున్ను నీ కుమారులున్ను నీతో కూడా
నీ పితృనియొక్క యింటికూటమున్ను పరిశుద్ధ స్థలము
యొక్క దోషమును భరింతురు గాక: మరిన్ని నీవున్ను
నీతో కూడా నీ కుమారులున్ను మీయొక్క అర్చకత్వ
2 ముయొక్క దోషమును భరింతురు గాక.।మరిన్ని నీ పితృ
నియొక్క గోత్రము అయి వున్నటువంటి లేవీయొక్క
గోత్రికులైన నీ సహోదరులు నీతో కలుసుకొని, నీకు
పరిచారకులయ్యేటట్టుగా నీవు వారిని పిలుచుకో వలసి
నది; అయితే నీవున్ను నీతో కూడా నీ కుమారులున్ను
సాక్ష్యముయొక్క డేరా యెదుట సేవిస్తూ వుండ వలెను.।
3 వారు నిన్నున్ను డేరా అంతటినిన్ని కనిపెట్టుకొని
వుండ వలెను, గాని, వారికైనా మీకైనా మరణము రా
కుండా వుండేటట్టు వారు పరిశుద్ధ స్థలముయొక్క వుప
కరణముల దగ్గిరకున్ను బలిపీఠము దగ్గిరకున్ను రాకూ
4 డదు.। వారు నీతో కూడా వుండి డేరా పని అంతటి
నిమిత్తమై సంఘముయొక్క డేరాను కనిపెట్టే వారై
వుండ వలెను; యిందుకై అన్యుడైన వాడు మీ సమీ
5 పమునకు రాకూడదు.। అయితే యికను ఇశ్రాయేలు
పుత్రుల మీద ఉగ్రత యెంత మాత్రమూ రాకుండా
మీరు పరిశుద్ధ స్థలమునున్ను బలిపీఠమునున్ను కనిపెట్టు
6 కొని వుండ వలెను.। అయితే నేను, యిదుగో నేను,
లేవీయులైన నీ సహోదరులను ఇశ్రాయేలు పుత్రు
లలోనుంచి యేర్పరచుకొంటిని; సంఘపు డేరాయొ
క్క పని చేయడానకు యెహోవా కొరకు దానము
7 లాగున వారు మీకు యివ్వబడి యున్నారు.। కాబట్టి
నీవున్ను నీతో కూడా నీ కుమారులున్ను బలిపీఠమును
గురించిన సమస్త నిమిత్తమున్ను తెరలోపల వున్న వ్యా
పార నిమిత్తమున్ను మీ అర్చకత్వపు వుద్యోగములను
గైకొంటూ సేవచేస్తూ వుండ వలెను: మీ అర్చకత్వపు
వుద్యోగమును దానము గానయిన సేవ లాగున నీ వశము
చేస్తిని; యిందుకై అన్యుడు యెవడయినా సమీపమునకు
వస్తే వాడు మరణము పొందించ బడునని సెలవు యిచ్చె
8 ను.।యెహోవా మరిన్ని అహరోనుతో సెలవు యిచ్చి
నదేమంటే, యిదుగో ఇశ్రాయేలు పుత్రులు పరిశుద్ధ
ము చేసేవాటిలో పైకెత్తే నా అర్పణలను నీ వశ
మును చేస్తిని; అభిషేక నిమిత్తమై నీకున్ను నీ కుమా
9 రులకున్ను వాటిని నిత్యనిర్ణయముగా యిస్తిని.। దహ
నము కాని అతి పరిశుద్ధమైన వాటిలో నీకు రావలసి
నది యేమిటేమిటంటే, వారియొక్క కానుకలన్నిన్ని,
వారియొక్క భోజనార్పణలన్నిన్ని, వారియొక్క పాప
పరిహారపు బలులన్నిన్ని, వారు నాకు యిచ్చే తప్పిత
ములయొక్క అర్పణలన్నిన్ని, నీకున్ను నీ కుమారుల
కున్ను అతి పరిశుద్ధమైనవిగా వుండును.। అతి పరిశుద్ధ 10
స్థలమందు వాటిని తిందువు గాక; మీలో మొగ వా
రందరున్ను వాటిని తిన వలెను; అది నీకు పరిశుద్ధ మవు
ను.। యింకా నీకు రావలసినవి యేమిటేమిటంటే, 11
ఇశ్రాయేలు పుత్రులు వూగించే అర్పణలన్నిన్ని వారి
కానుకలలో పైకెత్తే అర్పణయున్ను నీకు కలిగి వుం
డును; వాటిని నేను నీకున్ను నీ కుమారులకున్ను నీ
కుమార్తెలకున్ను నిత్య నిర్ణయముగా యిస్తిని; నీ యిం
ట్లో వున్న పవిత్రులందరున్ను వాటిని తిన వచ్చును.।
నూనెలో వుత్తమమయిన దానిన్ని, ద్రాక్షా రసములో 12
నున్ను గోధుమములలోనున్ను వుత్తమమైన వాటినిన్ని,
అనగా, వీటిలో తొలి ఫలములుగా యెహోవాకు
వారు అర్పించే వాటిని నీకు యిస్తిని.। మరిన్ని వారు 13
ప్రథమమందు తమ భూమిలో పండిన పంటలో యె
హోవాకు చెల్లించినదంతానున్ను నీదయి వుండును; నీ
యింట్లో వున్న పవిత్రులందరున్ను దానిని తినవచ్చును.।
ఇశ్రాయేలులో మొక్కుబళ్లన్నిన్ని నీవై వుండును.। 14
వారు సకల మాంసములలో యెహోవాకు చెల్లించే 15
ప్రథమమందు గర్భమును విప్పుకొని వచ్చినవన్నిన్ని,
మనుష్య సంబంధమయినా, మృగ సంబంధమయినా
అవి నీవై వుండును; అయినప్పటికిన్ని మనుష్యునియొ
క్క తొలి చూలును నీవు నిశ్చయముగా విమోచనము
చేయ వలెను; అపవిత్రమైన మృగములయొక్క తొలి
చూలునున్ను నీవు విమోచనము చేయ వలెను.। అయితే 16
విమోచించబడ వలసిన వాటికి నెల అయిన తరువాత
నీ మదింపు ప్రకారము యిరువై గేరాలు చేసే పరి
శుద్ధ స్థలముయొక్క షెకేలు చొప్పున శిరస్సు ఒక్కం
టికి అయిదేసి షెకేలుల ద్రవ్యమును పుచ్చుకొని విమో
చనమును చేయ వలెను.। అయితే ఆవుకున్ను గొర్రె 17
కున్ను మేకకున్ను ప్రథమమందు పుట్టినవి పరిశుద్ధము
లైనవైనందున వీటిని విమోచనము చేయ గూడదు; వాటి
రక్తము బలిపీఠము మీద చల్లి, వాటి క్రొవ్వు యెహో
వాకు సువాసనయ్యేటట్టు హోమార్పణగా దహించ
వలెను.। అయితే వూగించే రొమ్మున్ను కుడి భుజము 18
న్ను నీవైనట్టు వాటియొక్క మాంసమున్ను నీదై వుం
డును.। ఇశ్రాయేలు పుత్రులు యెహోవాకు అ 19
ర్పించే పరిశుద్ధమైన వాటిలో పైకెత్తే అర్పణలన్నిన్ని
నీకున్ను నీ కుమారులకున్ను నీ కుమార్తెలకున్ను నిత్య నిర్ణ
యముగా యిస్తిని; అది యెహోవా సముఖమందు
నీకున్ను నీ సంతతికిన్ని నిత్యమున్ను వుప్పుయొక్క ని
బంధనకైయై వుండునని సెలవు యిచ్చెను.। మరిన్ని యె 20
హోవా అహరోనుకు సెలవు యిచ్చినదేమంటే, వారి
దేశమందు నీకు స్వాతంత్ర్యపు భాగము యెంతమా

త్రము లేక వుండును; వారిలో నీకు పాలు లేక వుం
డును; ఇశ్రాయేలు పుత్రులలో నేనే నీకు పాలున్ను
21 స్వాతంత్ర్యపు భాగమున్ను అయి వున్నాను.। మరిన్ని
యిదుగో, లేవీ పుత్రులు చేసే సేవ కొరకు, అనగా,
సంఘపు డేరాయొక్క సేవ కొరకు ఇశ్రాయేలులో
స్వాతంత్ర్యపు భాగముగాను పదో పాలు యావత్తూ
22 వారికి యిచ్చి వున్నాను.। ఇశ్రాయేలు పుత్రులు పాప
భరితులై మరణము కాకుండా యికను సంఘముయొ
23 క్క డేరా సమీపమునకు రాకూడదు.। అయితే లేవీ
యులు సంఘపు డేరాయొక్క సేవ చేస్తూ తమ దో
షమును భరించ వలెను; మరిన్ని ఇశ్రాయేలు పుత్రు
లలో వారికి స్వాతంత్ర్యపు భాగము లేక వుండునని
మీ తర తరములలో నిత్య నిర్ణయమై వుండును గాక.।
24 అయితే ఇశ్రాయేలు పుత్రులు యెహోవాకు పై
కెత్తే అర్పణగా అర్పించే వాటియొక్క పదో భాగ
ములను నేను లేవీయులకు స్వాతంత్ర్యపు భాగములు
గా యిచ్చి వున్నాను; అందుకే ఇశ్రాయేలు పుత్రు
లలో మీకు స్వాతంత్ర్యపు భాగము లేక వుండునని
నేను వారితో చెప్పి యున్నానని సెలవు యిచ్చెను.।
25 మరిన్ని లేవీయులతో మాట్లాడి చెప్పుమని యెహోవా
26 మోషేకు సెలవిచ్చినదేమంటే,। నేను ఇశ్రాయేలు
పుత్రులలోనుంచి మీ స్వాతంత్ర్య భాగము కొరకు
నేను మీకు యిచ్చిన వారియొక్క పదోవి అయిన
భాగములను మీరు వారి యొద్దను పుచ్చుకొనేటప్పుడు
మీరు ఆ పాళ్లలో పదింటికి వొక్కొక్క పాలును
తీసి యెహోవాకు పైకెత్తే అర్పణగా చెల్లించ వల
27 సినది.। యేమంటే యీ మీయొక్క పైకెత్తే అర్పణ
కళ్లము పంటైనట్టున్ను గానుగయొక్క మొదటి రస
28 మైనట్టున్ను మీ కొరకు యెంచబడును.। యీలాగున
మీరు ఇశ్రాయేలు పుత్రుల యొద్ద పుచ్చుకొన్న వారి
పదోవైన భాగములలోవి యెహోవాకు మీరు పయి
కెత్తే అర్పణగాను చెల్లించ వలెను; మరిన్ని వాటి వల్ల
యెహోవాకు వచ్చిన పైకెత్తే అర్పణను మీరు అర్చ
29 కుడైన అహరోనుకు యిత్తురుగాక.। మీకు వచ్చిన కాను
కలు అన్నిటిలోనుంచి మీరు యెహోవాకు చెల్లించే
పైకెత్తే అర్పణలన్నిన్ని వాటిలో విశేష భాగములుగా
నున్ను పరిశుద్ధమయిన భాగములుగానున్ను వుండ వలె
30 ను.। వాటిలో వున్న విశేషమయిన భాగములను మీరు
పైకెత్తినప్పుడు అవి కళ్లముకు అభివృద్ధియైనట్టున్ను
గానుగకు అభివృద్ధియైనట్టున్ను లేవీయులయిన మీ
31 కొరకు యెంచబడును.। అయినందున యే స్థలమందైనా
మీరున్ను మీ యింటి వారందరున్ను దాని తినవచ్చును,
యేమంటే, అది సంఘముయొక్క డేరా యందు మీరు
32 చేసే సేవకు ఫలమై వుండును.। అయితే అందువల్ల మీ
మీదికి పాపము రాకుండా మీరు దానిలో వున్న మంచి
భాగమును అర్పించ వలెను; మరిన్ని మీకు మరణము
రాకుండా ఇశ్రాయేలు పుత్రులయొక్క పరిశుద్ధమైన
వాటిని అపవిత్రము చేయ కూడదు అని వారితో
చెప్పుమనేదిగా సెలవు యిచ్చెను.

## 19. అధ్యాయము.

మరిన్ని యెహోవా మోషేతోనున్ను అహరో 1
నుతోనున్ను మాట్లాడుతూ అనినదేమంటే,। యెహో 2
వా ఆజ్ఞాపించిన న్యాయ ప్రమాణముయొక్క నిబంధన
యిదే, అది యెట్టిదంటే, కాడి పూచనిదైనటువంటిన్ని,
తొర్రియున్ను మచ్చయున్ను లేని యెర్రని ఆవు
పడ్డను మీ యొద్దికి తీసుక వచ్చేటట్టుగా ఇశ్రాయేలు
పుత్రులతో చెప్పండి,। ఆ యావు పడ్డను మీరు అర్చ 3
కుడైన ఎలాజారుకు అప్పగించండి; అతడు దాన్ని పేట
బైటకు తీసుక వచ్చిన తరువాత మరి యొకడు అతని
యెదుట దాన్ని చంప వలెను.। అప్పుడు అర్చకుడైన 4
ఎలాజారు దాని రక్తములో తన వేలు ముంచి, సంఘ
ముయొక్క డేరా ముందర దాని రక్తమును యేడు మా
రులు చల్ల వలెను.। తరువాతను వొకడు అతని యెదుట 5
దాన్ని దహించ వలెను; దాని చర్మమున్ను దాని మాం
సమున్ను దాని రక్తమున్ను దాని పేడనున్ను అత
డు దహించ వలసినది.। అప్పుడు అర్చకుడు సీదరు కర్ర 6
నున్ను హిస్సోపునున్ను యెరుపైన నూలునున్ను ఆవు
పడ్డను దహనము చేసిన అగ్నిలో వేయ వలెను.। తరు 7
వాతను అర్చకుడు తన బట్టలను వుతుకుకొని, తన మాం
సమును నీటిలో కడుగుకొని, అటుపిమ్మట పేటలో
ప్రవేశించ వలెను; అర్చకుడు అస్తమాన పర్యంతమూ
అపవిత్రుడు అయ్యే వుండును.। మరిన్ని దాన్ని దహిం 8
చిన వాడు తన బట్టలను వుతుకుకొని, తన మాంసమును
నీటిలో కడుగుకొని, అస్తమాన పర్యంతమూ అపవి
త్రుడయి వుండును.। మరిన్ని పవిత్రుడయిన వాడు 9
ఆవుపడ్డయొక్క భస్మమును పోగుచేసి, పేట బయిట
వున్న శుభ్రమైన స్థలమందు వుంచ వలెను; ఆ భస్మము
అంట్లను పరిహరించే వుదకము కొరకు ఇశ్రాయేలు
పుత్రులయొక్క సంఘము నిమిత్తము వుంచబడ వలెను;
అది పాపము కొరకు పవిత్రము చేసేదియౌను.। మరిన్ని 10
ఆవుపడ్డయొక్క భస్మమును పోగుచేసిన వాడున్ను తన
బట్టలను వుతుకుకొని, అస్తమాన పర్యంతమూ అపవిత్రు
డై వుండును: యీ నిర్ణయము ఇశ్రాయేలు పుత్రుల
కున్ను వారిలో పరదేశిగా వుండే వానికిన్ని నిత్యమై
వుండును గాక.। చచ్చినవాని కళేబరమును తగిలిన వాడు 11
యేడు దినముల పర్యంతమూ అంటుతోనే వుండును.।
మూడో నాటియందు వాడు దానితోటి తన్ను శుచి 12

భూాతుని చేసుకొని, యేడో నాటియందు పవిత్రు
డవును; మూడో నాటియందు తన్ను శుచిభూాతుని
చేసుకోక పోతే వాడు యేడో నాటియందు పవిత్రు
13 డు కాక వుండును. । యెవడైనా చచ్చిన వాని కళేబ
రము తగిలి తన్ను శుచిభూాతుని చేసుకోక పోతే,
వాడు యెహోవాయొక్క డేరాను అపవిత్రము చేసు
ను; వాడు ఇశ్రాయేలులోనుంచి ఖండించ బడును;
అంటుబాపే వుదకము వాని మీద చల్లబడ లేదు,
గనుక, వాడు అపవిత్రుడై వుండును; వాని అపవిత్రత
14 వాని పైని వుండే వుండును. । డేరాలోనే యొకడు
చస్తే అందును గురించిన న్యాయ ప్రమాణము యేమం
టే, ఆ డేరాలో ప్రవేశించిన వారందరున్ను ఆ డేరా
లో వున్న వారందరున్ను యేడు దినముల పర్యంతమూ
15 అపవిత్రులై వుందురు. । మరిన్ని మూత లేక తెరచి
16 వున్న ప్రతి వస్తువున్ను అపవిత్రమవును. । మరిన్ని బైట
భూమిలో కత్తిచేత హతమైన వానినైనా, చచ్చిపో
యిన దాని కళేబరమునైనా, మనుష్యుని యెముకనైనా,
సమాధినైనా, తగిలిన వాడు యేడు దినముల పర్యంత
17 మూ అపవిత్రుడవును. । అయితే అపవిత్రుడైన వాని
కొరకు వారు పాప పరిహారము చేసే దహనమైన ఆవు
పడ్డయొక్క భస్మములోది కొంత తీసి, పాత్రలో వేసి,
18 దాని మీద పారే నీళ్లు పొయ్య వలెను. । అప్పుడు
అపవిత్రుడైన యొకడు హిస్సోపు తీసుకొని, అది ఆ
నీళ్లలో ముంచి, డేరా మీదనున్ను వస్తువులన్నిటి మీ
దనున్ను అందులో వున్న వారందరి మీదనున్ను, యె
ముకనైనా నరుకుచేత పడిన వానినైనా మరణమైన
వానినైనా సమాధినైనా తగిలిన వాని మీదనున్ను,
19 చల్ల వలెను. । అయితే ఆ పవిత్రుడైన వాడు మూడో
నాటి యందున్ను యేడో నాటి యందున్ను అపవి
త్రుడైన వాని మీద చల్లవలెను; తరువాత యేడోనాటి
యందు తన్ను తాను శుచిభూాతుని చేసుకొని, తన
బట్టలను వుతుకుకొని, నీటిలో స్నానమును చేసుకొని,
20 వాడు అస్తమానమునకు పవిత్రుడౌను. । అయితే అంటు
బడి తన్ను తాను శుచిభూాతుని చేసుకొనిన వాడు
సంఘములోనుంచి ఖండించబడును, యెందుకంటే,
వాడు యెహోవాయొక్క పరిశుద్ధమైన స్థలమును
అపవిత్రమును చేసి యున్నాడు; అంటుబాపే వుదక
మును వాని మీద చల్లడము లేకపోయెను, గనుక,
21 వాడు అపవిత్రుడై వుండును. । మరిన్ని వారికి నిత్య
నిర్ణాయము యేమంటే, యెవడు అంటుబాపే వుదక
మును చల్లునో వాడు తన బట్టలను వుతుకుకో వలెను;
యెవడు అంటుబాపే వుదకమును ముట్టునో వాడు
అస్తమాన పర్యంతమూ అపవిత్రుడయి వుండును. ।
22 మరిన్ని అపవిత్రుడైన వాడు తగిలినది యేదో అది
అపవిత్రమైనదౌను; మరిన్ని దానిని తగిలిన వాడు
అస్తమాన పర్యంతమూ అపవిత్రుడవును అని చెప్పెను.

## 20. అధ్యాయము.

తరువాత మొదటి నెల యందు ఇశ్రాయేలు 1
పుత్రులయొక్క సంఘమంతా సీను అరణ్యములోకి
వచ్చి, ఆ జనము కాదేషులో దిగి వుండెను; అక్కడ
మిర్యాము మృతిబొంది అక్కడనే పాతిపెట్టబడెను. ।
అంతట సంఘమునకు నీళ్లులేక పోయినందున వారు 2
కూడి మోషే మీదికిన్ని అహరోను మీదికిన్ని వచ్చి
నారు. । అప్పుడు ఆ జనులు మోషేతో జగడమాడి 3
పలికినదేమంటే, మా సహోదరులు యెహోవా యె
దుట చచ్చిపోయినప్పుడు మేమున్ను చచ్చిపోక యేల
వుంటిమి. । మరిన్ని మేమున్ను మాయొక్క పశువులు 4
న్ను అరణ్యమందు చచ్చేటట్టుగా మీరు యెహోవా
యొక్క సంఘమును యిక్కడికి యేల రాచేస్తిరి! ।
యింత చెడ్డ స్థలములోకి మమ్మును తీసుక రావడము 5
కోసమా మిస్రయీములోనుంచి తీసుక వస్తిరి! యీ
స్థలమందు గింజలున్ను అంజూరపు పండ్లున్ను ద్రాక్ష
పండ్లున్ను దానిమ్మ పండ్లున్ను లేవు, సరే గదా, తాగ
డానకు నీళ్లే లేవని పలికిరి. । అప్పుడు మోషేయున్ను 6
అహరోనున్ను సంఘము యెదుటనుంచి బయిలు వెళ్లి
సంఘపు డేరాయొక్క ద్వారము దగ్గిరకు వచ్చి సాగి
లపడిరి; అప్పుడు యెహోవాయొక్క మహిమ వారికి
అగుపడెను. । అంతట యెహోవా మోషేకు సెలవు 7
యిచ్చినదేమంటే, । ఆ దండమును నీవు పట్టుకొని, 8
నీవున్ను నీ సహోదరుడయిన అహరోనున్ను సంఘ
మును కూడ చేసుకొని, వారు చూస్తూ వుండగా ఆ
శిలా పర్వతముతో చెప్పండి, అప్పుడు అది తన వుద
కములను వుబక చేసును; యీలాగున నీవు శిలా పర్వ
తములోనుంచి వారి కొరకు నీళ్లు బయిట ప్రవహింప
చేసినందున సంఘమునున్ను వారియొక్క పశువులను
న్ను తాగించిన వాడవౌదువని సెలవు యిచ్చెను. ।
అయినందున మోషే యెహోవా తనకు ఆజ్ఞాపించి 9
నట్టు యెహోవా యెదుటనుంచి దండమును పట్టు
కొని వెళ్లి, । మోషేయున్ను అహరోనున్ను సంఘమును 10
కూడచేసి, ఆ శిలా పర్వతము ముందరకు తీసుకపోయి,
అప్పుడు మోషే వారిని చూచి, ద్రోహ తిరుగుబాటు
చేసే వారలారా, వినండి, యీ శిలా పర్వతములో
నుంచి మీ కొరకు నీళ్లను వుబకచేతుమా అని చెప్పి, ।
మోషే తన చెయ్యి యెత్తి తన దండముతోను ఆ శిలా 11
పర్వతమును రెండు మారులు కొట్టెను, అప్పుడు వుద
కములు విస్తారముగా వుబికినందున సంఘమున్ను వారి
యొక్క పశువులున్ను తాగెను. । అయితే అప్పుడు 12

యెహోవా మోషేకున్ను అహరోనుకున్ను సెలవు
యిచ్చినదేమంటే, మీరు ఇశ్రాయేలు పుత్రులయొక్క
దృష్టికి నన్ను పరిశుద్ధ పరచుటకు నా యందు నమ్మక
మును వుంచకపోతిరి, గనుక, మీరు యీ సంఘము
తోను వారికి నేను యిచ్చిన దేశములోకి ప్రవేశించ
13 లేకపోదురని సెలవు యిచ్చెను. । యీ వుదకములు మె
రీబా అని పిలువపడెను, యెందుకంటే, ఇశ్రాయేలు
పుత్రులు అక్కడ యెహోవాతో జగడమాడిరి,
అయితే ఆయన వారి విషయమై పరిశుద్ధపరచబడెను.।
14 తరువాత మోషే కాదేషునుంచి ఎదోముయొక్క రాజు
యొద్దికి దూతలను పంపి చెప్పుమనినదేమంటే, నీయొ
క్క సహోదరుడైన ఇశ్రాయేలు పడిన ప్రయాసము
15 యావత్తూ నీకు తెలిసి వున్నది. । అది యేలాగంటే,
మా పితృలు మిస్రయీములోకి దిగి వెళ్లినందున మేము
మిస్రయీములో అనేక దినములు కాపురము చేస్తిమి,
అయితే మిస్రీయులు మమ్మునున్ను మా పితృలనున్ను
16 హింస పెట్టిరి. । అందుకు మేము యెహోవాకు మొర్ర
పెట్టినప్పుడు ఆయన మా మొర్రను ఆలకించి, దూతను
పంపి, మిస్రయీములోనుంచి మమ్మును యివతలకు
తీసుక వచ్చెను; మరిన్ని యిదుగో మేము నీ సరిహద్దు
చివరయందున్న కాదేషు పురము దగ్గిర వున్నాము. ।
17 నీవు దయ చేసి నీ దేశములోబడి మమ్ములను వెళ్లని
య్యి; పొలములలోబడిన్ని ద్రాక్ష తోటలలోబడిన్ని
వెళ్లక, నూతులలోనున్న వుదకములను తాగక, రాజ
మార్గమున వెళ్లుదుము; నీ సరిహద్దులను మేము దాటే
పర్యంతమూ కుడికైనా యెడమకైనా తిరగక వెళ్లిపో
18 దుమని వర్తమానము పంపెను. । అందుకు ఎదోము రాజు
చెప్పినదేమంటే, నా తట్టు నిన్ను రానియ్యను; వొక
వేళ వస్తివట్టాయెనా కత్తితోకూడా నీకు యెదురుగా
19 వత్తునని చెప్పుమని చెప్పెను. । తిరిగీ ఇశ్రాయేలు పు
త్రులు చెప్పినదేమంటే, రాజ మార్గముననే వెళ్లిపోదు
ము; మేమైనా మా పశువులైనా నీయొక్క నీళ్లు తాగి
నట్టయితే అప్పుడు దాని విలువను యిచ్చుకొందుము;
మాతో మరియేమీ లేకుండా కాలి నడకచేత మాత్ర
20 మే మేము వెళ్లుదుమని చెప్పిరి. । అయితే అతడు నా
దేశములోబడి మిమ్మును రానివ్వనని చెప్పి, ఎదోము
రాజు గొప్ప సమూహముతోనున్ను బలమైన హస్తము
21 తోనున్ను యెదురుగా వచ్చెను. । యీలాగున ఎదోము
ఇశ్రాయేలును తన సరిహద్దులలోబడి గడవనియ్యక
పోయెను; అయినందున ఇశ్రాయేలు అతని యొద్ద
22 నుంచి తిరిగిపోయెను. । అంతట ఇశ్రాయేలు పుత్రుల
సంఘము యావత్తూ కాదేషునుంచి తర్లి, హోరు
23 పర్వతమునకు వచ్చిరి. । అప్పుడు యెహోవా ఎదోము
దేశపు సరిహద్దు దగ్గిర వున్న హోరు పర్వతము మీద
మోషేకున్ను అహరోనుకున్ను సెలవు యిచ్చినదేమం
టే, । అహరోను తన జనులయొద్దికి చేర్చబడును; అతడు 24
ఇశ్రాయేలు పుత్రులకు నేను యిచ్చిన దేశములోకి
ప్రవేశించడు, యెందుకంటే, మీరు మెరీబా వుదకము
దగ్గిర నా ఆజ్ఞకు వ్యతిరిక్తము చేస్తిరి. । నీవు అహరోనును 25
న్ను అతని కుమారుడైన ఎలాజారునున్ను పిలుచుకొని,
హోరు పర్వతము మీదికి వారిని తీసుక వచ్చి, ।
అహరోను మీదనున్న వస్త్రములను తీసి, అతని కుమా 26
రుడైన ఎలాజారు పయిని వేయుము, యెందుకంటే,
అక్కడ అహరోను మృతిబొంది తన జనులయొద్ద
చేర్చబడును అని సెలవు యిచ్చెను. । అప్పుడు మోషే 27
తనకు యెహోవా ఆజ్ఞాపించిన ప్రకారము చేసెను;
వారు సంఘమంతా చూస్తూ వుండగా హోరు పర్వ
తము మీదికి యెక్కి వెళ్లిరి. । అక్కడ మోషే అహరోను 28
వస్త్రములను తీసి, అతని కుమారుడయిన ఎలాజారు
పయిని వేసిన తరువాత, అహరోను ఆ పర్వతము మీ
దనే మృతిబొందెను: అప్పుడు మోషేయున్ను ఎలాజా
రున్ను పర్వతము మీదనుంచి దిగి వచ్చిరి. । సంఘమం 29
తా అహరోను మృతిబొందెనని చూచి, ఇశ్రాయేలు
యింటి కూటము యావత్తూ అహరోను కొరకు ము
ప్పయి దినములు దాకా యేడ్చుచూ వుండెను.

## 21. అధ్యాయము.

అయితే దక్షిణ దిక్కు యందున్న కెనయను రాజైన 1
ఆరాదు ఇశ్రాయేలీయులు వేగుల వారియొక్క మార్గము
గా వస్తూ వున్నారన్న సంగతి విని, తాను వచ్చి ఇశ్రా
యేలుతో యుద్ధము చేసి, వారిలో కొందరిని పట్టి చెర
తీసుకపోయినాడు. । అప్పుడు ఇశ్రాయేలు యెహో 2
వాకు మొక్కుకొని, నీవు యీ జనులను మా చేతికి
అప్పగించితివట్టాయెనా మేము వారియొక్క పురముల
ను సర్వ నాశనము చేతుమని పలికిరి. । అయినందున యె 3
హోవా ఇశ్రాయేలు శబ్దమును ఆలకించి ఆ కెనయానీ
యులను వారికి అప్పగించినందున వారు వారినిన్ని వారి
యొక్క పట్నములనున్ను సర్వ నాశనము చేసిరి; అతడు
ఆ స్థలమును హొర్మా అని పిలిచెను. । తరువాత వారు 4
హోరు పర్వతమునుంచి తర్లి ఎదోము దేశము చుట్టూ
గడచిపోవడానకు యెర్ర సముద్రపు మార్గమున వచ్చిరి,
అయితే ఆ మార్గము చేతను ఆ జనులయొక్క ప్రాణ
ములు మిక్కిలీ అవస్థబడెను. । ఆ జనులు దేవునికిన్ని 5
మోషేకున్ను వ్యతిరిక్తులై చెప్పినదేమంటే, యీ అర
ణ్యములో మృతిబొందేటట్టుగా మమ్మును మిస్రయీ
ములోనుంచి యేల పిలుచుకొని వచ్చితిరి? యెందుకం
టే, యిక్కడ ఆహారమున్ను నీళ్లున్ను యెంతమాత్రమూ
లేవు; మా ప్రాణములు యీ అల్పమైన ఆహారమును

6 అసహ్యిస్తున్నవని పలికిరి.। అందుకు యెహోవా జను
లలోకి అగ్ని సర్పములను పంపెను; అవి ఆ జనులను
కరిచినందున ఇశ్రాయేలులో అనేక జనులు మృతి
7 బొందిరి. । అప్పుడు ఆ జనులు మోషే యొద్దికి వచ్చి
మేము పాపము చేస్తిమి; యేమంటే, యెహోవా విష
యమయిన్ని నీ విషయమయిన్ని వ్యతిరిక్తపు మాటలు
పలికితిమి; అయినప్పటికీ యెహోవా యీ సర్పము
లను మాలోనుంచి తొలగ చేసేటట్టు నీవు వేడుకో
వలెనని వారు కోరినందున మోషే ఆ జనుల కొరకు
8 వేడుకొనెను. । అప్పుడు యెహోవా మోషేకు సెలవు
యిచ్చినదేమంటే, నీవు అగ్ని సర్పపు రూపమును చేసి
ధ్వజ స్తంభము మీద దాని వుంచుము; అప్పుడు సం
భవించేదేమంటే, కాటు తినిన వాడు దానివైపు పార
చూచినట్టాయెనా వాడు బ్రతుకునని సెలవు యిచ్చి
9 నందున, । మోషే యిత్తడి సర్పమును చేసి ధ్వజ స్తంభ
ము మీద దానిని యెత్తెను; అప్పుడు సంభవించినదే
మంటే, సర్పముచేత కాటు తినిన వాడు ఆ యిత్తడి
10 సర్పమును చూచినంతలో వాడు బ్రతికెను. । తరువాత
ఇశ్రాయేలు పుత్రులు అక్కడనుంచి తర్లి ఒబోతుకు
11 వచ్చి పేట వేసుకొనిరి. । ఒబోతునుంచి తర్లి ఈయేయ
బారీముకు వచ్చి పేట వేసుకొనిరి: యీ స్థలము మో
యాబు దేశము ముందర సూర్యోదయ దిక్కుయందు
12 అరణ్యములో వున్నది. । అక్కడనుంచి వారు తర్లి
13 జెరెదు లోవకు వచ్చి పేట వేసుకొనిరి. । మరిన్ని అక్క
డనుంచి వారు తర్లి అర్నోను అవతలకు వచ్చి పేట
వేసుకొనిరి; యిది ఎమోరీయులయొక్క సరిహద్దుల
యొద్ద వున్న అరణ్యములో వున్నది, యేమంటే అర్నో
ను మోయాబుకు సరిహద్దుయై మోయాబు దేశమున
14 కున్ను ఎమోరీయులకున్ను మధ్యను వున్నది. । కాబట్టి
యెహోవాయొక్క యుద్ధములను గురించిన గ్రంథ
మందు యెర్ర సముద్రము దగ్గిరనున్న వాహబూను
15 న్ను, అర్నోను గెడ్డలున్ను, । మోయాబు దేశము తట్టు
నున్న ఆరు పట్నానకు పారే గెడ్డలయొక్క ప్రవాహ
16 మున్ను అని చెప్పబడి వున్నది. । మరిన్ని ఆ స్థలమును
విడచి బెయేరుకు వచ్చిరి; యీ బెయేరు యెహోవా
మోషేతో చెప్పిన నుయ్యి అయి వున్నది; యేమంటే,
నీవు జనులను కూడచేయుము, నేను వారికి నీళ్లు యి
17 త్తునని సెలవు యిచ్చెను. । అప్పుడు ఇశ్రాయేలు పా
డిన పాట యేమంటే, వో నుయ్యా, పయికి వుబు
18 కుము; దీనిని గూర్చి మీరు పాడండి. । శ్రేష్ఠులైన వారు
యీ నూతిని తవ్విరి; జనులయొక్క ప్రభువులు తమ
దండములచేత న్యాయ కర్తయొక్క సెలవు చొప్పున
తవ్విరని పాడిరి. తరువాత అరణ్యమును విడచి మత్తా
19 నాకు వచ్చిరి. । మత్తానాను విడచి నహలీయేలుకు
వచ్చిరి; నహలీయేలును విడచి బామోతుకు వచ్చిరి. ।
మరిన్ని మోయాబు దేశపు లోవలోనున్న యీ బా 20
మోతును విడచి పిస్గా పర్వతము మీదికి వచ్చిరి; యిది
యెషిమోనుకు అభిముఖముగా వున్నది.। అప్పుడు ఇశ్రా 21
యేలు పుత్రులు ఎమోరీయులయొక్క రాజైన సీహోను
యొద్దికి దూతలను పంపి చెప్పుమనినదేమంటే, । నీ దే 22
శములోబడి మమ్మును రానియ్యి; పొలములలోకైనా
ద్రాక్ష తోటలలోకైనా తిరగకుండా, నూతి నీళ్లను తా
గకుండా వుండి, నీ సరిహద్దులను దాటి వెళ్లేపర్యంత
మూ రాజ మార్గాననే వెళ్లుదుమని చెప్పిరి. । అప్పుడు 23
సీహోను ఇశ్రాయేలును తన సరిహద్దును గడవని
య్యక, తన జనులందరినిన్ని కూర్చుకొని అరణ్యము
లోనున్న ఇశ్రాయేలుకు యెదురుగా వెళ్లి, యహస్సుకు
వచ్చి ఇశ్రాయేలుతో యుద్ధము చేసెను. । అయితే 24
ఇశ్రాయేలు కత్తి వాడిచేత వాని సంహరించి, వాని
దేశమును అర్నోను మొదలుకొని యబ్బోకు పర్యంత
మూ అమ్మోను పుత్రుల దేశము మట్టుకు సహా స్వతం
త్రించుకొనెను, యేమంటే, అమ్మోను పుత్రుల దేశపు
సరిహద్దు బహు బలముగా వుండెను. । అయితే ఇశ్రా 25
యేలు యీ పట్టణములన్నిటినిన్ని స్వాధీనము చేసు
కొనినందున ఇశ్రాయేలు ఎమోరీయులయొక్క పట్టణ
ములందున్ను హెష్బోను యందున్ను దాని గ్రామము
లన్నిటి యందున్ను కాపురము చేసిరి. । యేమంటే 26
హెష్బోను ఎమోరీయులయొక్క రాజైన సీహోను
పట్టణమై వుండెను: యితడు పూర్వమందున్న మో
యాబుయొక్క రాజుతో యుద్ధము చేసి, అర్నోను
మట్టుకు అతని దేశము యావత్తూ స్వాధీనము చేసు
కొనెను. । అందుకు వుపమానములతో పలికేవారు 27
చెప్పుదురు, యేమంటే, హెష్బోనుకు రండి, సీహో
నుయొక్క పట్టణము తిరిగీ కట్టబడి అమర్చబడును
గాక. । యెందుకంటే హెష్బోనులోనుంచి అగ్నియు 28
న్ను సీహోనుయొక్క పట్టణములోనుంచి మంట
యున్ను బయిలువెళ్లి, మోయాబుయొక్క ఆరునున్ను
అర్నోనుయొక్క వున్నత స్థలముయొక్క ప్రభువుల
నున్ను దహించివేసెను. । వో మోయాబూ, నీకు 29
అయ్యో; వో కెమోషుయొక్క జనులారా మీరు నశిం
చిపోతిరి: అతడు తప్పించుకొనిన తన కుమారులనున్ను
తన కుమార్తెలనున్ను చెర పడే వారిగా ఎమోరీయు
లయొక్క రాజయిన సీహోను చేతికి అప్పగించెను.।
వారియొక్క దీపము ఆరిపోయెను; హెష్బోను దీబోను 30
మట్టుకు క్షయమాయెను; మేదబా యొద్దనున్న నో
ఫహు మట్టుకు వారిని పాడుగా చేస్తిమని పలుకుదురు.।
యీలాగున ఇశ్రాయేలు ఎమోరీయుల దేశమందు 31
కాపురము చేసిరి. । మరిన్ని మోషే యజేరును పరిశో 32

ధించడానకు వేసులవారిని పంపిన తరువాత వారు దాని
యొక్క గ్రామములను స్వాధీనపరచుకొని అక్కడ
33 నున్న ఎమోరీయులను తోలివేసిరి.। అటుతరువాత వారు
తిరిగీ బాషాను మార్గముగా యెక్కి వెళ్లిరి; అప్పుడు
బాషాను రాజైన ఓగు తానున్ను తన జనులున్ను వారికి
యెదురుగా బైలువెళ్లి ఎద్రెయీలో యుద్ధము చేయ
34 వచ్చిరి. । అప్పుడు యెహోవా మోషేకు సెలవు యి
చ్చినదేమంటే, అతనికి నీవు భయపడ వద్దు, యెందు
కంటే, నేను వానినిన్ని వాని జనులందరినిన్ని వాని
దేశమునున్ను నీ చేతికి అప్పగిస్తిని; హెష్బోనులో కా
పురము చేసిన ఎమోరీయులకు రాజయిన సీహోనును
నీవు యేమి చేస్తివో ఆ చొప్పున యితని చేతువు గా
35 కని సెలవు యిచ్చెను. । కాబట్టి వారు వానినిన్ని వాని
కుమారులనున్ను వాని జనులందరినిన్ని వాని వారిలో
వొకడైనా బ్రతకకుండా సంహరించి, వానియొక్క
దేశమును స్వతంత్రించుకొనిరి.

## 22. అధ్యాయము.

1 అటు తరువాతను ఇశ్రాయేలు పుత్రులు సాగి
వెళ్లి యర్దేను నది అవతలి యెరిఖో పట్నము దగ్గిర
మోయాబుయొక్క మయిదానపు భూమియందు పేట
2 వేసుకొనిరి.। అయితే సిప్పోరు కుమారుడైన బాలాకు
ఇశ్రాయేలు ఎమోరీయులకు చేసినదంతాను చూచి
3 వుండెను. । కాబట్టి మోయాబు యీ జనులకు బహు
భయపడెను, యెందుకంటే, వారు అధికమై యుండిరి
గనుక మోయాబు ఇశ్రాయేలు పుత్రుల నిమిత్తము
4 కళవిళపడుతూ వుండెను. । అప్పుడు మోయాబు మి
ద్యాను పెద్దలతో చెప్పినదేమంటే, బీటి గడ్డిని యెద్దు
యేలాగున దవురునో యిప్పుడు ఆలాగున యీ సమూ
హము మన చుట్టూ వున్న సమస్తమును దవురునని పలి
కెను: సిప్పోరు కుమారుడైన బాలాకు ఆ కాలమందు
5 మోయాబీయులకు రాజై వుండెను. । కాబట్టి అతడు
తన జనుల పుత్రులయొక్క దేశపు నదీప్రాంతమం
దలి పెతోరులో వున్న బెయోరు కుమారుడైన బలా
మును పిలువడానకు రాయభారులను పంపి అతనితో
చెప్పుమనినదేమంటే, యిదుగో, మిస్రయీములోనుంచి
వొక జన సమూహము యిక్కడికి వచ్చి వున్నది, యి
దుగో, వారు భూమి ముఖము కప్పుకొని వున్నారు;
6 మరిన్ని వారు నాకు యెదురుగానే వున్నారు. । కాబట్టి
నీవు దయచేసి యిక్కడికి వచ్చి, నా పక్షమై యీ
జనులను శపించ వలసినది, యెందుకంటే, వారు నాకు
మిక్కుటమై వున్నారు; కాబట్టి నీవు శపిస్తే నేను వా
రిని సంహరించి యీ దేశములోనుంచి పారదోలుదు
నేమో, యేమంటే, నీవు ఆశీర్వదించిన వాడు ఆశీర్వా
దమును పొందును, నీవు శపించిన వాడు శాపమును
పొందునన్నట్టు నాకు తోస్తూ వున్నదని చెప్పుమని పం
పెను. । కాబట్టి మోయాబుయొక్క పెద్దలున్ను మిద్యా 7
నుయొక్క పెద్దలున్ను యక్షిణీ బహుమానములను
పట్టుకొని, బలాముయొద్దికి వచ్చి బాలాకు పంపిన వర్త
మానమును చెప్పిరి. । అప్పుడు అతడు వారితో చెప్పిన 8
దేమంటే, యీ రాత్రి యిక్కడ వుండండి, నేను మీ
యొద్దికి వచ్చి యెహోవా నాకు సెలవు యిచ్చిన ప్ర
కారము మీతో చెప్పుదునని చెప్పినందున మోయాబు
యొక్క శ్రేష్ఠులు బలాము యొద్ద వుండిరి. । అయితే 9
దేవుడు బలాము యొద్దికి వచ్చి నీ యొద్దనున్న యీ
మనుష్యులు యెవరని అడిగెను.। అందుకు బలాము 10
దేవునితో చెప్పినదేమంటే, సిప్పోరు కుమారుడయిన
బాలాకు అనే మోయాబు రాజు నా యొద్దకు వర్తమా
నము పంపినదేమంటే, । యిదుగో మిస్రయీములో 11
నుంచి వొక జనసమూహము వచ్చివున్నది; వారు భూమి
ముఖము కప్పుకొని వున్నారు; నీవు యిక్కడికి వచ్చి
నా పక్షమయి వారిని శపించ వలసినది; వారిని నీవు
శపిస్తే నేను వారిని జయించి పారతోలుదునేమో అని
పలికెనని చెప్పెను. । అందుకు దేవుడు నీవు వారితో 12
వెళ్లకూడదు; యీ జనులను నీవు శపించ కూడదు; యెం
దుకంటే, వారు ఆశీర్వాదమును పొంది యున్నారని
బలాముతో సెలవు యిచ్చెను. । తరువాత బలాము వుద 13
యమందున లేచి బాలాకుయొక్క శ్రేష్ఠులను చూచి,
మీ దేశమునకు పొండి, యేమంటే మీతో కూడా
వచ్చుటకు యెహోవా నాకు సెలవు యివ్వలేదని
చెప్పెను. । అప్పుడు మోయాబుయొక్క శ్రేష్ఠులు లేచి 14
బాలాకు యొద్దికి వచ్చి, బలాము మాతో కూడా రా
నన్నాడని చెప్పిరి. । అయినప్పటికిన్ని బాలాకు యింకా 15
వారి కంటే బహు ఘనమైనటువంటిన్ని విస్తారమైన
టువంటిన్ని శ్రేష్ఠులను పంపినాడు. । వీరు బలాము యొ 16
ద్దికి వచ్చి అతని చూచి, సిప్పోరు కుమారుడైన బాలాకు
నీకు పంపిన వర్తమానమును వినుము; నీవు నా యొద్దికి
రావడానకు ఆటంకము చేయవద్దు; । యెందుకంటే, 17
నేను నిన్ను బహుగా ఘనము చేతును; నీవు నాతో
యేమి చెప్పుదువో అది అంతా చేతును; కాబట్టి నీవు
వచ్చి నా పక్షమై యీ జనులను శపించ వలెనని చెప్పె
నని చెప్పిరి. । అందుకు బలాము బాలాకుయొక్క సేవ 18
కులతో చెప్పినదేమంటే, బాలాకు తన యిల్లు వెండి
చేతనున్ను బంగారము చేతనున్ను నిండుచేసి నాకు
యిచ్చినప్పటికిన్ని యెహోవా అనే నా దేవుని ఆజ్ఞను
వెల్తియైనా అధికమైనా చేసి మీరలేను. । అయినా యె 19
హోవా యింకా యేమైనా సెలవు యిచ్చునేమో
అది తెలిసే పర్యంతమూ మీరు యిక్కడ యీ రాత్రి

20 వుండండని చెప్పెను.। అప్పుడు ఆ రాత్రి యందు దేవు
డు బలాము యొద్దికి వచ్చి అతనికి సెలవు యిచ్చినదే
మంటే, ఆ మనుష్యులు నిన్ను పిలువ వస్తే నీవు లేచి
వారితో కూడా వెళ్లు; అయినప్పటికిన్ని నేను నీకు
యే వాక్యము యిత్తునో ఆ వాక్య ప్రకారము చేతు
21 వు గాకని సెలవు యిచ్చెను.। అంతట బలాము వుదయ
మందు లేచి, తన గార్ద్భమునకు గంతను కట్టి, మోయా
22 బు శ్రేష్ఠులతో కూడా వెళ్లెను.। అయితే అతడు ఆశ
కలిగి వెళ్లినందుచేత దేవునియొక్క కోపము రగులు
కొనెను; కాబట్టి యెహోవాయొక్క దూత అతనికి
అడ్డుగా మార్గమందు విరోధి వలె నిలిచి వుండెను;
అతడు తన యిద్దరు సేవకులతో కూడా తన గార్ద్భ
23 మును యెక్కి వెళ్లుతూ వుండెను.। అప్పుడు వర దూ
సిన కత్తిని చేత పట్టుకొని మార్గమందు నిలిచి వుండే
యెహోవాయొక్క దూత ఆ గార్ద్భమునకు అగు
పడినందున ఆ గార్ద్భము మార్గమునుంచి పొలము
లోకి వెళ్లెను; అందుకు బలాము గార్ద్భమును మార్గ
24 మునకు మళ్లించడానకు దాన్ని కొట్టెను.। అయితే
యెహోవాయొక్క దూత వుభయ పార్శ్వములను
గోడలు గల ద్రాక్ష తోట మార్గమందు నిలిచి వుం
25 డెను.। గార్ద్భము యెహోవాయొక్క దూతను చూచి
గోడను తాకి బలాముయొక్క పాదమును గోడ మీద
అణిచి పట్టినందున అతడు దాన్ని తిరిగీ కొట్టెను.।
26 అప్పుడు యెహోవాయొక్క దూత కొంచెము దూ
రముగా వెళ్లి, కుడి పార్శ్వముననున్ను యెడమ
పార్శ్వముననున్ను వెళ్లేటందుకు దారి లేనటువంటి
27 యిరుకు సందు యందు నిలిచి వుండెను.। అంతట గా
ర్ద్భము యెహోవాయొక్క దూతను చూచి బలా
ము పయిని వుండగానే కింద పడుకొనెను; అప్పుడు
బలాముయొక్క కోపము రగులుకొనినందున అతడు
28 కర్రతోటి గార్ద్భమును కొట్టెను.। అప్పుడు యెహో
వా గార్ద్భముకు వాక్కు యిచ్చినందుచేత అది బలా
మును చూచి నీవు నన్ను మూడు మారులు కొట్టడా
29 నకు నిన్ను యేమి చేస్తినని అడిగినందున,। నీవు నన్ను
అలక్ష్యము చేస్తివి, యిప్పుడు నా చేతిలో కత్తి లేక
పోయెను, వుంటే నిన్ను చంపి వేతునని బలాము గా
30 ర్ద్భముతో పలికినందున.। గార్ద్భము బలామును చూచి,
నీ దాననైన అప్పటినుంచి నేటి పర్యంతము నీవు
యెక్కుతున్న నీ గార్ద్భమును నేను కానా? యే కాల
మందైనా నేను నిన్ను యీలాగున చేసేది కలదా అని
31 అడిగినప్పుడు అతడు లేదనెను.। అప్పుడు యెహో
వా బలాముయొక్క నేత్రములను తెరిచేటట్టు చేసినం
దున కత్తి చేత పట్టుకొని మార్గమందు నిలిచి యున్న
యెహోవాయొక్క దూత అతనికి అగుపడెను; అప్పు
డు అతడు వొంగి సాగిలపడెను.। అప్పుడు యెహో 32
వాయొక్క దూత నీవు మూడు మారులు నీ గార్ద్భ
మును కొట్టితివేమి? యిదుగో, నీవు నడిచిన మార్గము
నాకు వంకరగా వున్నది గనుక నిన్ను అడ్డడానకు నేను
బయిలువెళ్లి వస్తిని,। అయితే గార్ద్భము నన్ను చూచి 33
నా ముందరనుంచి మూడు మారులు తిరిగి పోయెను;
అది నా ముందరనుంచి తిరగని పక్షమందు యీ పా
టికి నిన్ను చంపివేసి దాని ప్రాణమును రక్షింతునని
అతనితో చెప్పినందున,। బలాము యెహోవాయొక్క 34
దూతతోను చెప్పినదేమంటే, నేను పాపము చేస్తిని,
యేమంటే, నీవు నాకు మార్గమందు అడ్డముగా నిలి
చిన సంగతి నాకు తెలిసినది కాదు; అయితే యిది నీ
దృష్టికి అనుకూలము కాకపోతే నేను తిరిగీ వెళ్లుదునని
చెప్పినప్పుడు,। యెహోవాయొక్క దూత బలాముతో 35
చెప్పినదేమంటే, యీ మనుష్యులతో కూడా వెళ్లు;
అయినప్పటికిన్ని నీకు నేను యే వాక్యమును చెప్పు
దునో ఆ ప్రకారమును నీవు పలుకుదువు గాకని
చెప్పెను: యీలాగున బలాము బాలాకుయొక్క శ్రేష్ఠు
లతో కూడా వెళ్లెను.। అంతట బలాము వచ్చెనని బా 36
లాకు విన్నప్పుడు అతడు అతని యెదుర్కొనడానకు
ఆ దేశపు సరిహద్దుకు అవతల వున్న అర్నోను సమీ
పము మట్టుకు వచ్చెను.। అప్పుడు బాలాకు బలామును 37
చూచి చెప్పినదేమంటే, నీ యొద్దికి నేను వర్తమానము
పంపి నిన్ను బహుగా పిలువనంపిస్తినే; నీవు నా యొ
ద్దికి రాక పోవడమేమి? నిన్ను ఘనము చేసే పాటి
శక్తి నాకు లేదా అని అడిగినందున,। బలాము బాలా 38
కును చూచి, యిదుగో, నేను నీ దగ్గిరకు వస్తిని; వస్తే
నేమి గనుక, యేమి చెప్పడానకున్ను నాకు స్వతంత్ర
ము కలదా? యే వాక్యమును దేవుడు నా నోట వుం
చునో అదే కాని వేరే చెప్పలేనని పలికెను.। అప్పుడు 39
బలామున్ను బాలాకున్ను కూడి కిర్యత్హుసోతుకు వెళ్లిరి.।
అప్పుడు బాలాకు యెడ్లనున్ను గొర్రెలనున్ను బలిగా 40
చెల్లించి, బలామునున్ను అతని యొద్దనున్న శ్రేష్ఠులను
న్ను పిలువనంపించినాడు.। మరునాటి యందు బాలాకు 41
బలామును పిలుచుకొని, ఆ జనులను కడముట్టా చూ
చుటకు బయలుయొక్క వున్నతమైన స్థలముల మీదికి
తీసుక పోయినాడు.

## 23. అధ్యాయము.

అప్పుడు బలాము బాలాకుతో చెప్పినదేమంటే, 1
యిక్కడను యేడు బలిపీఠములు కట్టించి, యిక్కడ
యేడు యెడ్లనున్ను యేడు పొట్టేళ్లనున్ను నా కొరకు
సిద్ధపరచుమని చెప్పెను.। బాలాకు బలాము చెప్పిన 2
ప్రకారము చేసెను; అప్పుడు బాలాకున్ను బలామున్ను

బలిపీఠము వొక్కంటికి వొక్కొక యెద్దునున్ను వొ
3 క్కొక పొట్టేలునున్ను అర్పించిరి. । తరువాతను బలా
ము బాలాకుతో చెప్పినదేమంటే, నీ హోమార్పణ
దగ్గిర నీవు నిలిచి వుండు; నేను వెళ్లుతాను; యెహో
వా నన్ను యెదుర్కోనునేమో: ఆయన వచ్చి నాకు
యేది అగుపర్చునో అది నీకు తెలియ చేతునని చెప్పి,
4 వున్నతమైన స్థలమునకు వెళ్లెను. । అక్కడ దేవుడు బలా
మును యెదుర్కోనెను; అప్పుడు యితడు ఆయనతో
చెప్పినదేమంటే, నేను యేడు బలిపీఠములను ఆయత్త
ము చేయించి, బలిపీఠము వొక్కంటికి వొక్కొక యెద్దు
నున్ను వొక్కొక పొట్టేలునున్ను అర్పించితినని చెప్పె
5 ను. । అప్పుడు యెహోవా బలాముయొక్క నోట
వొక వాక్యమును వుంచి, నీవు తిరిగీ బాలాకు యొద్దికి
వెళ్లి అతనితో యీ ప్రకారము చెప్పుమని పంపెను.।
6 అయినందున యితడు తిరిగీ అతని యొద్దకు వచ్చినప్పుడు
యిదుగో అతడున్ను మోయాబు శ్రేష్ఠులందరున్ను
7 అతని హోమార్పణ దగ్గిర నిలిచి వుండిరి. । అప్పుడు
అతడు తన వుపమానమును యెత్తి పలికినదేమంటే, అరా
మునుంచి బాలాకు నన్ను పిలువనంపించెను; తూర్పు
పర్వతములలోనుంచి మోయాబు రాజు నన్ను పిలువ
నంపించి, నా పక్షమయి యాకోబును శపించ రమ్ము,
నా పక్షమై ఇశ్రాయేలును దూషించ రమ్మని చెప్పె
8 ను. । దేవుడు శపించని వాని నేను యేలాగు శపింతును;
యెహోవా దూషించని వాని నేను యేలాగు దూషిం
9 తును. । శిలా పర్వత శిఖరముల మీదనుంచి వాని కను
చున్నాను; కొండల మీదనుంచి వాని చూస్తున్నాను;
యిదుగో ఆ జనులు ప్రత్యేక నివాసులై యితర జను
10 లలో యెంచబడక వుందురు. । యాకోబుయొక్క ధూ
ళిని యెవరు గణన చేయ గలరు? ఇశ్రాయేలుయొక్క
నాలుగో భాగమును యెవరు లెక్కించ గలరు! నీతి
మంతుని మరణము లాగున నేను మృతిబొందుదును
గాక; నా తదనంతర స్థితి అతని దాని లాగున వుండును
11 గాక అని పలికెను. । అప్పుడు బాలాకు బలామును
చూచి, నా శత్రువులను శపించడానకు నిన్ను పిలుచు
కొంటెని, యిదుగో, నీవు వారిని పరిపూర్ణముగా
ఆశీర్వదిస్తివి; నీవు నా కొరకు యేమి చేస్తివని చెప్పి
12 నప్పుడు, । అతడు యితని చూచి, యే వాక్యమును
యెహోవా నా నోట వుంచెనో దాని భద్రముగా
13 పలుకవద్దా అని చెప్పినప్పటికిన్ని, । బాలాకు తిరిగీ
అతనితో చెప్పినదేమంటే, నాతో కూడా నీవు మరి
వొక స్థలమునకు రావలసినది; అక్కడ వారు నీకు కన
పడుదురు; అయితే అందరున్ను కనపడరు, వెనుక వున్న
వారు మాత్రమే నీకు కనపడుదురు, గనుక, నా పక్షమై
14 వారిని శపించ వలసినదని చెప్పి, । పిస్గా పర్వతమం

దున్న సోఫీము పొలములోకి అతని తీసుక పోయెను;
అక్కడ అతడు యేడు బలిపీఠములను కట్టించి, పీఠము
వొక్కంటికి వొక యెద్దునున్ను వొక పొట్టేలునున్ను
అర్పించెను. । అప్పుడతడు బాలాకును చూచి, నేను 15
యెహోవాను యెదుర్కోనేటందుకు అల్లక్కడికి వెళ్లి
తిరిగీ వచ్చే పర్యంతమూ నీ హోమార్పణ దగ్గిరనే
నీవు నిలిచి వుండుమని చెప్పి వెళ్లెను. । అప్పుడు యె 16
హోవా బలాముకు యెదురుగా వచ్చి, అతని నోట
వొక వాక్యమును వుంచి, నీవు తిరిగీ బాలాకు యొద్దికి
వెళ్లి యీ ప్రకారము చెప్పుమని పంపెను. । తిరిగీ 17
అతడు అతని దగ్గిరకు వచ్చినప్పుడు యిదుగో అతడు
అతని హోమార్పణ దగ్గిర నిలిచి వుండెను; మరిన్ని
మోయాబుయొక్క శ్రేష్ఠులు అతనితో కూడి వుండిరి;
అప్పుడు బాలాకు యెహోవా యిచ్చిన సెలవు యే
మిటని అతని అడిగినాడు. । అందుకు అతడు తన వుప 18
మానమును యెత్తి పలికినదేమంటే, వో బాలాకూ, లేచి
వినుము; వో సిప్పోరు కుమారుడా నేను చెప్పిన దాని
ఆలకించుము. । బొంకుటకు దేవుడు మనుష్యుడు కాడు; 19
మనస్సును తిప్పుకోనేటందుకు ఆయన నర పుత్రుడు
కాడు; ఆయన సెలవు యిచ్చి వుండి దాని చేయక పో
వునా? ఆయన పలికి వుండి దాని దృఢపరచక పోవు
నా? । యిదుగో ఆశీర్వదించడానకు నాకు ఆజ్ఞ ఆయె 20
ను; ఆయనే ఆశీర్వదించి యున్నాడు, గనుక, దాని
నేను తిప్పలేను. । యాకోబు యందు అక్రమము 21
ఆయనకు అగుపడక పోయెను; ఇశ్రాయేలు యందు
అన్యాయము ఆయనకు కనిపించక పోయెను; అతని
దేవుడైన యెహోవా అతనికి తోడుగా వున్నాడు;
మరిన్ని రాజుయొక్క వుత్సాహ ధ్వని వారిలో కలిగి
వున్నది. । దేవుడు వారిని మిస్రయీములోనుంచి యి 22
వతలకు తీసుకొని వచ్చెను; ఖడ్గ మృగముయొక్క శక్తి
అతనికి వున్నట్టు వున్నది. । నిజముగా యాకోబు మీద 23
యే మంత్రమైనా పారక వుండును; ఇశ్రాయేలు మీద
యే చిల్లంగియైనా తగలక వుండును; యాకోబు పట్ల
నున్ను ఇశ్రాయేలు పట్లనున్ను దేవుడు యింత మాహా
త్మ్యము కలుగ చేసినాడని నేటినుంచి పలుకడమవును.।
యిదుగో యీ జనము గొప్ప సింహము లాగున లేచు 24
ను; కొదమ సింహము లాగున లేచి పొంగును; అతడు
వేటాడి పట్టిన దాని తిని, హతమైన దాని రక్తమును
తాగితేనేగాని పడుకోక వుండునని పలికెను.।అప్పుడు 25
బాలాకు బలామును చూచి, వారిని నీవు శపించనూ
వద్దు, ఆశీర్వదించనూ వద్దని చెప్పెను.।అందుకు బలాము 26
యెహోవా నాకు యే ఆజ్ఞను యిచ్చునో ఆ ఆజ్ఞా
ప్రకారము నేను చేయక విధిలేదన్నట్టుగా నీతో చెప్పి
వుంటినని బాలాకుతో చెప్పెను. । తరువాత బాలాకు 27

బలాముతో చెప్పినదేమంటే, మనము మరియొక చో
టుకు వెళ్లుదాము, పద, నా పక్షమై నీవు వారిని అక్క
డనుంచి శపించడము దేవునికి అనుకూలమవునేమో
28 అని, । బాలాకు బలామును తీసుకొని యెషిమోనుకు
అభిముఖముగా వున్న పెయోరు పర్వతము మీదికి
29 వచ్చెను. । అప్పుడు బలాము బాలాకుతో చెప్పినదేమం
టే, యిక్కడను యేడు బలిపీఠములు కట్టించి, యిక్క
డికి యేడు యెద్దులనున్ను యేడు పొట్టేళ్లనున్ను తెప్పిం
30 చి సిద్ధముగా వుంచుమని చెప్పెను. । బాలాకు బలాము
చెప్పినట్టు చేసి, బలిపీఠము వొక్కంటికి వొక యెద్దు
నున్ను వొక పొట్టేలునున్ను అర్పించెను.

## 24. అధ్యాయము.

1 అయితే యెహోవా ఇశ్రాయేలును ఆశీర్వదించ
డమందే చిత్తమై వున్నాడని బలాముకు తెలిసి, మును
పటి లాగున యే యంత్రమును విచారించక, అరణ్య
2 ము వైపు అభిముఖుడై పారచూచి, । ఇశ్రాయేలు తమ
తమ గోత్రముల చొప్పున నివాసము చేసేది కనెను;
మరిన్ని దేవునియొక్క ఆత్మ తన మీదికి దిగినందున
అతడు తన వుపమానమును యెత్తి పలికినదేమంటే, ।
3 బెయోరు కుమారుడయిన బలాము పలుకుతూ వున్నా
డు; కండ్లు మూతలు పడిన వాడు పలుకుతూ వున్నా
4 డు. । కిందపడి, తిరిగీ కండ్లు తెరచి, సర్వ శక్తునియొ
క్క ప్రత్యక్షమును చూచి, దేవునియొక్క వాక్యము
5 లను వినినవాడు పలుకుతూ వున్నాడు. । వోా యాకో
బూ నీ డేరాలున్ను, వోా ఇశ్రాయేలూ నీ కాపుర
ములున్ను, యెంతో శృంగారములైనవై వున్నవి. ।
6 లోవలున్ను నదీ ప్రాంతమందున్న వనములున్ను యె
హోవా నాటిన అహాల చెట్లున్ను వుదకముల యొద్ద
నున్న ఆర్జున వృక్షములున్ను అల్లుకొని వున్నట్టు అవి
7 అల్లుకొని యున్నవి. । అతడు తన గూడలచేతను నీరు
పారించును; అతని విత్తనములు విస్తారమైన వుదకముల
దగ్గిర విత్తడమవును; అగగు రాజు కంటే అతని రాజు
8 ఘనుడౌను, అతని రాజ్యమున్ను అధికమౌను. । దేవుడు
అతని మిస్రయీములోనుంచి యివతలకు తీసుక వచ్చె
ను; ఖడ్గ మృగముయొక్క శక్తి అతనికి కలిగి వున్నది;
అతడు అన్య జనులయిన తన శత్రువులను భక్షించి,
వారి యెముకలను విరచి, తన బాణములచేత వారిని
9 దూసిపో చేసును. । అతడు సింహము వలె కుంగి పదు
కొనును; గొప్ప సింహము వంటి వాని యెవరు దురుసు
చేయగలరు; నిన్ను ఆశీర్వదించిన వాడు ఆశీర్వాదము
పొందును, నిన్ను శపించిన వాడు శాపము పొందునని
10 పలికినప్పుడు, । బాలాకు బలాము మీద రౌద్రుడై,
మండిపడి, చేతులను చరచుకొని, బలాముతో చెప్పిన
దేమంటే, నా శత్రువులను శపించడానకు నిన్ను పిలి
చితే యిదుగో తప్పకుండా మూడు మారులు వారిని
ఆశీర్వదిస్తివి. । కాగా యిప్పుడు నీవు నీ స్థలమునకు 11
వేగిరమే వెళ్లు; నిన్ను బహు ఘనము చేయ దలచి వుం
టిని, అయితే యిదుగో నీవు ఆ ఘనమును పొందకుం
డా యెహోవా ఆటంకము చేసినాడని అనగానే. ।
బలాము బాలాకుతో చెప్పినదేమంటే, నీవు నా యొ 12
ద్దికి పంపిన రాయభారులను నేను చూచి, బాలాకు
తన యింటిని బంగారముతోటిన్ని వెండితోటిన్ని నింపి
నాకు యిచ్చినప్పటికిన్ని నా స్వబుద్ధిచేత మేలైనా
కీడైనా చేయడానకు నేను యెహోవా ఆజ్ఞను మీ
రలేను; । యేమంటే యే వాక్యమును యెహోవా 13
నాకు యిచ్చునో అదే నేను పలుక వలెనని చెప్పి
వుంటినే. । యిదుగో యిప్పుడు నేను నా జనుల యొ 14
ద్దికి వెళ్లుతూ వున్నాను; కాగా, నీవు యిప్పుడు రా,
కడపటి దినములందు యీ జనులు నీ జనులను యేమి
చేతురో అది నీకు తెలియ చేతునని చెప్పి, । తన వుప 15
మానమును యెత్తి పలికినదేమంటే, బెయోరు కుమారు
డయిన బలాము పలుకుతూ వున్నాడు; కండ్లు మూత
లు పడినవాడు పలుకుతూ వున్నాడు. । కిందపడి, తిరిగీ 16
కండ్లు తెరచి, సర్వశక్తునియొక్క ప్రత్యక్షమును చూ
చి, మహోన్నతమయిన వానియొక్క తెలివిని గుర్తె
రిగి, దేవునియొక్క మాటలను వినిన వాడు పలుకు
తూ వున్నాడు. । యిప్పుడు కాదు గాని ముందర అతని 17
చూడ గలను; సమీపము కాదు గాని అతని కన గలను;
యాకోబులోనుంచి నక్షత్రము బయిలు వెళ్లును; ఇశ్రా
యేలులోనుంచి రాజదండము లేచి, మోయాబుయొ
క్క సరిహద్దులను కొట్టి, సేథుయొక్క పుత్రులందరి
నిన్ని సంహరించును. । మరిన్ని ఎదోము స్వాధీనమవును; 18
శెయీరున్ను ఆయన శత్రువుల కొరకు స్వాధీనమ
వును; ఇశ్రాయేలు పరాక్రమముగా ప్రవర్తించును. ।
మరిన్ని యాకోబులోనుంచి పాలన కర్త లేచి పట్ట 19
ణమందున్న హత శేషులను లయము చేసునని చెప్పి, ।
అమాలేకు వైపు చూచి, తన వుపమానమును యెత్తి 20
పలికినదేమంటే, అమాలేకు సకల జనాంగములలోను
ప్రధానుడైనప్పటికిన్ని వానియొక్క కడపటి అంతము
యేదంటే నిత్య నాశనము పొందుట, అని చెప్పి, ।
కేనీయుల వైపు చూచి, తన వుపమానమును యెత్తి పలి 21
కినదేమంటే, నీ కాపురము బలమైనదై వున్నది; నీవు
నీ గూడు శిలా పర్వతమందు కట్టుకొంటివి. । అయి 22
నప్పటికిన్ని అష్షూరు నిన్ను చెరగా కొంచబోయీ
యీ సందున కేనీయులు క్రమశః క్షీణగతిని పొందు
దురని చెప్పి, । తన వుపమానమును యింకా యెత్తి పలి 23
కినదేమంటే, అయ్యయ్యో, దేవుడు యిది చేసినప్పుడు

24 యెవరు బ్రతుకుదురు! । అయితే కిత్తీము ప్రాంతము
నుంచి వోడలు వచ్చి అష్షూరును అవిధి పెట్టును; మరి
న్ని ఏబెరునున్ను అవిధి పెట్టును, అయితే అతనికిన్ని
25 నాశనము నిత్యమౌనని చెప్పి, । బలాము లేచి తన స్థల
మునకు తిరిగీ వెళ్లిపోయెను; బాలాకున్ను తన మార్గ
మున వెళ్లెను.

## 25. అధ్యాయము.

1 అయితే ఇశ్రాయేలు షిత్తీములో వుంటూ వుండె
ను, అప్పుడు ఆ జనులు మోయాబు కుమార్తెలతో
2 వ్యభిచారము చేయ సాగిరి. । ఇదిగాక వారు జనులను
తమ దేవుండ్లయొక్క బలులకు పిలిచిరి, అప్పుడు జను
లు అక్కడ తిని వారియొక్క దేవుండ్లకు వంగి నమ
3 స్కారము చేసిరి. । యీలాగున ఇశ్రాయేలు బయెల్పె
యోరుతో కలుసుకొన్నందున యెహూవాయొక్క
4 కోపము ఇశ్రాయేలు మీద రగులుకొనెను. । అప్పుడు
యెహూవా మోషేకు సెలవు యిచ్చినదేమంటే, యె
హూవాయొక్క తీక్ష్ణమైన కోపము ఇశ్రాయేలు
మీదనుంచి తిరిగి పోయేటట్టుగా నీవు ఆ జనులలో
ప్రధానులందరినిన్ని పట్టుకొని, సూర్యాభిముఖముగా
యెహూవా యెదుట వురి తీతువు గాకని సెలవు యి
5 చ్చెను. । కాబట్టి మోషే ఇశ్రాయేలుయొక్క న్యాయా
ధిపతులను చూచి మీరందరున్ను బయెల్పెయోరుతో
6 కలుసుకొనిన మీ వారిని సంహరించండని చెప్పెను. ।
వెంబడినే యిదుగో ఇశ్రాయేలు పుత్రులలో వొకడు
మిద్యాను దేశపు స్త్రీని తీసుకొని, మోషే చూస్తూ
వుండగా తన సహోదరుల సమీపమునకు వచ్చెను;
మరిన్ని యీ సంగతి సంఘముయొక్క డేరా ద్వారము
దగ్గిర నిలిచి యేడుస్తూ వున్న ఇశ్రాయేలు పుత్రుల
7 యొక్క యావత్సంఘము దృష్టికి అగుపడెను. । అయి
తే అహరోను అనే అర్చకునికి పుట్టిన ఎలాజారు
కుమారుడయిన పీనెహాసు యిది చూచి సంఘములో
8 నుంచి లేచి, యీటె చేత పట్టుకొని, । ఆ ఇశ్రాయే
లు వాని తరిమి, డేరా లోపలికి చొచ్చి, వారిద్దరిని
అనగా ఆ ఇశ్రాయేలు వానిన్ని ఆ స్త్రీనిన్ని దాని
వుదరము దూసి పోయేటట్టు పొడిచి వేసెను; అప్పుడు
ఇశ్రాయేలు పుత్రులలోనుంచి తెగులు విడిచి పో
9 యెను. । ఆ తెగులువల్ల మరణమయిన వారు యిరువై
10 నాలుగువేల మంది వుండిరి. । అప్పుడు యెహూవా
11 మోషేకు సెలవు యిచ్చినదేమంటే, । అర్చకుడయిన
అహరోనుకు పుట్టిన ఎలాజారు కుమారుడయిన పీనెహా
సు ఇశ్రాయేలు పుత్రులలో నా పట్ల భక్త్యావేశుడై
నా వుగ్రతను వారి మీదనుంచి తిరుగచేసెను, కాబట్టి
నేను నా రోషములో ఇశ్రాయేలు పుత్రులను దహిం

చడము మానివేస్తిని. । అయినందున నీవు చెప్ప వలసిన 12
దేమంటే, యిదుగో నేను అతనికి నా సమాధానమయిన
వొడంబడికెను యిస్తున్నాను. । అది యేదంటే, అతడు 13
న్ను అతని తదనంతరమందయిన అతని సంతతిన్ని అర్చ
కత్వమును నిత్య నిర్ణయముగా అనుభవింతురు, యేమం
టే, అతడు తన దేవుని విషయమై భక్త్యావేశుడై వుండి,
ఇశ్రాయేలు పుత్రుల కొరకు శాంతి కలుగ చేసెనని
చెప్పుమని సెలవు యిచ్చెను. । మిద్యాను దేశపు స్త్రీతో 14
హతుడయిన ఆ ఇశ్రాయేలు వాని పేరు జిమ్రి యని
వుండెను; వీడు షిమోనీయులలో ప్రధానమైన యింటి
కూటములో శ్రేష్ఠుడైన సాలూ కుమారుడై వుండెను. ।
హతయయిన మిద్యాను దేశపు స్త్రీ పేరు కొజ్బీ అని 15
వుండెను; యిది సూరు కుమార్తె అయి వుండెను;
వీడు మిద్యానులో వొక జనమునకున్ను వొక ప్రధాన
మైన యింటి కూటమునకున్ను అధిపతియై వుండెను. ।
తరువాత యెహూవా మోషేకు తిరిగీ చెప్పినదేమం 16
టే, । నీవు మిద్యానీయులను పీడించి సంహరించుము;। 17
యేమంటే వారు తమ తంత్రముల వల్ల మిమ్మును పీడిం 18
తురు; పెయోరు విషయమైయున్ని కొజ్బీ విషయమై
యున్ని తంత్రము చేసి మిమ్మును మోసపుచ్చిరని సెలవు
యిచ్చెను. ఆ కొజ్బీ మిద్యాను వాండ్లలో శ్రేష్ఠునికి
కొమార్తెయైయున్ని వారికి సహోదరియైయున్ని
వుండి, పెయోరు నిమిత్తము తెగులు వచ్చిన దినమందు
హతినొందినదాయెను.

## 26. అధ్యాయము.

ఆ తెగులు కడతేరిన తరువాత సంభవించినదేమం 1
టే, యెహూవా మోషేకున్ను అర్చకుడయినటువంటి
అహరోను కుమారుడయిన ఎలాజారుకున్ను సెలవు యి
చ్చినదేమంటే, । ఇశ్రాయేలు పుత్రుల సంఘమంతటి 2
యొక్క మొట్టు లెక్కను చూచుకొండి; వారి పితృల
యింటి కూటమందు ఇశ్రాయేలు సమూహములో యు
ద్ధమునకు బయిలువెళ్లె శక్తి కలిగి, యిరువై సంవత్సర
ములు మొదలుకొని అంతకు పైని యీడు కలిగిన వారి
నందరినిన్ని లెక్క చేయ వలెనని సెలవు యిచ్చెను. ।
అప్పుడు మోషేయున్ను అర్చకుడైన ఎలాజారున్ను 3
మోయాబు మైదానములందు యెరిఖో పట్నపు య
ర్దేను నది సమీపాన వారితో చెప్పినదేమంటే, ।
మోషేతోనున్ను మిస్రయీములోనుంచి యివతలకు 4
వచ్చిన ఇశ్రాయేలు పుత్రులతోనున్ను యెహూవా
యిచ్చిన సెలవు చొప్పున యిరువై సంవత్సరములు మొ
దలుకొని అంతకు పయిని యీడు గల వారందరి లెక్క
చేయండని చెప్పిరి. । రూబేను ఇశ్రాయేలుకు ప్రథమ 5
పుత్రుడై వుండెను: రూబేనుయొక్క కుమారులు యెవ

రంటే, హనోఖు, వీనివల్ల హనోఖీయుల యింటి కూ
టము కలిగి వుండెను: పల్లూ, వీనివల్ల పల్లూలీయుల
6 యింటి కూటము కలిగి వుండెను: । హెస్రోను, వీనివల్ల
హెస్రోనీయుల యింటి కూటము కలిగి వుండెను;
కర్మి, వీనివల్ల కర్మీయుల యింటి కూటము కలిగి వుండె
7 ను. । యివి రూబేనుయొక్క యింటి కూటములయి
వుండెను: వీరిలో లెక్కకు వచ్చిన వారు నలుబయి మూ
8 డువేల యేడ్నూట ముప్పయి మంది వుండిరి. । మరిన్ని
9 పల్లూ కుమారుడు ఏలీయాబని వుండెను. । ఏలీయాబు
కుమారులు, నెమూయేలున్ను, దాతానున్ను, అబీరా
మున్ను అని వుండిరి. యీ దాతానున్ను అబీరాము
న్ను సంఘములో పేరుపడినవారై కోరహుయొక్క
సమూహము యెహోవాకు వ్యతిరిక్తము చేసినప్పుడు
వారితో కూడి, మోషే మీదనున్ను అహరోను మీద
10 నున్ను తిరుగుబాటు చేసిన వారయి వుండిరి. । అయితే
వారికి మరణము సంభవించినప్పుడు వారినిన్ని కోర
హునున్ను భూమి తన నోరు తెరచి మింగివేసెను;
అప్పుడు అగ్ని యిన్నూట యాభై మందిని దహించి
11 వేసెను గనుక వారు గురుతుగా వుండిరి. । అయినప్పటి
కిన్ని కోరహుయొక్క పిల్లలు మరణము కాక వుండిరి.।
12 షిమోను పుత్రులయొక్క యింటి కూటములను గురిం
చినది యేమంటే, నెమూయేలు, వీనివల్ల నెమూయేలీ
యుల యింటి కూటము కలిగి వుండెను: మరిన్ని యా
మీను, వీనివల్ల యామీనీయుల యింటి కూటము కలిగి
వుండెను: మరిన్ని యాఖీను, వీనివల్ల యాఖీనీయుల
13 యింటి కూటము కలిగి వుండెను: । మరిన్ని జెరా, వీని
వల్ల జర్హీయుల యింటి కూటము కలిగి వుండెను:
మరిన్ని షౌలు, వీనివల్ల షాయూలీయుల యింటి కూ
14 టము కలిగి వుండెను. । యివి షిమోనీయుల యింటి
కూటములై, యిరువై రెండువేల యిన్నూరు మంది అయి
15 వుండిరి. । గాదు పుత్రుల యింటి కూటములను గురించి
నది యేమంటే, సెఫోను, వీనివల్ల సెఫోనీయుల యింటి
కూటము కలిగి వుండెను: మరిన్ని హగ్గి, వీనివల్ల హగ్గీ
యుల యింటి కూటము కలిగి వుండెను: మరిన్ని షూని,
వీనివల్ల షూనీయుల యింటి కూటము కలిగి వుండెను.।
16 మరిన్ని ఒజ్నీ, వీనివల్ల ఒజ్నీయుల యింటి కూటము
కలిగి వుండెను: మరిన్ని ఏరీ, వీనివల్ల ఏరీయుల యింటి
17 కూటము కలిగి వుండెను: । మరిన్ని అరోదు, వీనివల్ల
అరోదీయుల యింటి కూటము కలిగి వుండెను: మరిన్ని
అరేలీ, వీనివల్ల అరేలీయుల యింటి కూటము కలిగి
18 వుండెను. । యివి గాదు పుత్రులయొక్క యింటి కూట
ములయి, లెక్కకు వచ్చిన వారు నలుబైవేల యేనూరు
19 మంది అయి వుండిరి. । యూదా కుమారులు ఏరు,
ఓనాను, అని వుండిరి: అయితే ఏరున్ను ఓనానున్ను

కెనయను దేశమందు మరణమైరి. । కాబట్టి యూదా 20
పుత్రుల యింటి కూటములను గురించినదేమంటే,
షెలా, వీనివల్ల షెలానీయుల యింటి కూటము కలిగి
వుండెను: మరిన్ని పెరెసు, వీనివల్ల పర్సీయుల యింటి
కూటము కలిగి వుండెను: మరిన్ని జెరా, వీనివల్ల జర్హీ
యుల యింటి కూటము కలిగి వుండెను. । మరిన్ని 21
పెరెసు కుమారులు హెస్రోను; వీనివల్ల హెస్రోనీ
యుల యింటి కూటము కలిగి వుండెను: మరిన్ని హామూ
లు, వీనివల్ల హామూలీయుల యింటి కూటము కలిగి
వుండెను. । యివి యూదా పుత్రుల యింటి కూటము 22
లయి, లెక్కకు వచ్చిన వారు డెబ్బయి ఆరువేల యే
నూరు మంది అయి వుండిరి. । ఇశ్శాఖారు పుత్రుల 23
యింటి కూటములను గురించినదేమంటే, తోలా, వీని
వల్ల తోలాయీయుల యింటి కూటము కలిగి వుండెను:
మరిన్ని పువా, వీనివల్ల పూనీయుల యింటి కూటము
కలిగి వుండెను: । మరిన్ని యాషూబు, వీనివల్ల యషు 24
బీయుల యింటి కూటము కలిగి వుండెను: మరిన్ని
షిమ్రోను, వీనివల్ల షిమ్రోనీయుల యింటి కూటము
కలిగి వుండెను. । యివి ఇశ్శాఖారుయొక్క యింటి కూ 25
టములై, లెక్కకు వచ్చినవారు అరువయి నాలుగు వేల
మున్నూరు మంది అయి వుండిరి. । జెబూలోను పుత్రుల 26
యింటి కూటములను గురించినదేమంటే, సెరెదు, వీనివల్ల
సర్దీయుల యింటి కూటము కలిగి వుండెను: మరిన్ని
ఏలోను, వీనివల్ల ఏలోనీయుల యింటి కూటము కలిగి
వుండెను: మరిన్ని యెహ్లాయేలు, వీనివల్ల యెహ్లాయే
లీయుల యింటి కూటము కలిగి వుండెను. । యివి 27
జెబూలోనీయుల యింటి కూటములై, లెక్కకు వచ్చిన
వారు అరువైవేల యేనూరు మంది అయి వుండిరి. ।
యోసేపు కుమారులు మనస్సే, ఎఫ్రయీము అని వుం 28
డిరి: వీరి యింటి కూటములను గురించినదేమంటే, ।
మనస్సేయొక్క కుమారుడు, మాఖీరు, వీనివల్ల మాఖీరీ 29
యుల యింటి కూటము కలిగి వుండెను: మాఖీరుకు గిలా
దు పుట్టెను; గిలాదువల్ల గిలాదీయుల యింటి కూటము
కలిగి వుండెను. । గిలాదు కుమారులలో ఈయెజెరు, వీని 30
వల్ల ఈయెజెరీయుల యింటి కూటము కలిగి వుండెను:
మరిన్ని హేలెకు, వీనివల్ల హేలెకీయుల యింటి కూట
ము కలిగి వుండెను. । మరిన్ని అశ్రీయెలు, వీనివల్ల అశ్రీ 31
యెలీయుల యింటి కూటము కలిగి వుండెను: మరిన్ని
షెఖెము, వీనివల్ల షిక్మీయుల యింటి కూటము కలిగి వుం
డెను: । మరిన్ని షెమీదా, వీనివల్ల షెమీదాయీయుల 32
యింటి కూటము కలిగి వుండెను: మరిన్ని హేఫెరు, వీని
వల్ల హెఫ్రీయుల యింటి కూటము కలిగి వుండెను. ।
అయితే హేఫెరు కుమారుడైన సెలోఫెహాదుకు కుమా 33
రులు లేకుండా కుమార్తెలే పుట్టిరి: సెలోఫెహాదు కుమా

ర్తెలయొక్క పేరులు మహ్లా, నోయా, హొగ్లా,
34 మిల్కా, తిర్సా అని వుండెను. । యివి మనస్సేయొక్క
యింటి కూటములయి, లెక్కకు వచ్చినవారు యేబయి
35 రెండువేల యేడ్నూరు మంది అయి వుండిరి. । ఎఫ్రయీ
ము యింటి కూటములను గురించినదేమంటే, షూతెల
హు, వీనివల్ల షూతల్హీయుల యింటి కూటము కలిగి వుం
డెను; మరిన్ని బెఖెరు, వీనివల్ల బఖ్రీయుల యింటి కూట
ము కలిగి వుండెను: మరిన్ని తహను, వీనివల్ల తహనీ
36 యుల యింటి కూటము కలిగి వుండెను. । అయితే షూ
తెలహు కుమారుడైన ఏరానువల్ల ఏరానీయుల యింటి
37 కూటము కలిగి వుండెను. । యివి ఎఫ్రయీము పుత్రుల
యింటి కూటములై, లెక్కకు వచ్చినవారు ముప్పయి
రెండువేల యేనూరు మంది అయి వుండిరి: యివి యో
38 సేఫుయొక్క యింటి కూటములై వున్నవి. । బెన్యా
మీను పుత్రుల యింటి కూటములను గురించినదేమం
టే, బెల, వీని వల్ల బలీయుల యింటి కూటము కలిగి
వుండెను: మరిన్ని అష్బేలు, వీనివల్ల అష్బేలీయుల
యింటి కూటము కలిగి వుండెను: మరిన్ని అహీరాము,
వీనివల్ల అహీరామీయుల యింటి కూటము కలిగి వుం
39 డెను: । మరిన్ని షూఫాము, వీనివల్ల షూఫామీయుల
యింటి కూటము కలిగి వుండెను: మరిన్ని హూఫాము,
వీనివల్ల హూఫామీయుల యింటి కూటము కలిగి వుం
40 డెను. । అయితే బెల కుమారులు అర్దు, నయమాను, అని
వుండిరి: అర్దువల్ల అర్దీయుల యింటి కూటము కలిగి
వుండెను: నయమానువల్ల నయమీయుల యింటి కూట
41 ము కలిగి వుండెను. । ఇవి బెన్యామీను పుత్రుల యింటి
కూటములై, లెక్కకు వచ్చినవారు నలుబై అయిదువేల
42 ఆరు నూరు మంది అయి వుండిరి. । దాను పుత్రుల
యింటి కూటములను గురించినదేమంటే, షూహాము, వీని
వల్ల షూహామీయుల యింటి కూటము కలిగి వుండెను:
యీ యింటి కూటములు దాను పుత్రులయొక్క యింటి
43 కూటములై వున్నవి. । షూహామీయుల కూటములన్ని
టిలో లెక్కకు వచ్చినవారు అరువయి నాలుగువేల
44 నన్నూరుమంది అయి వుండిరి. । ఆషేరు పుత్రుల యింటి
కూటములను గురించినదేమంటే, ఇమ్నా, వీనివల్ల ఇమ్నీ
యుల యింటి కూటము కలిగి వుండెను: మరిన్ని ఇష్వి,
వీనివల్ల ఇష్వీయుల యింటి కూటము కలిగి వుండెను:
మరిన్ని బెరీయా, వీనివల్ల బెరీహీయుల యింటి కూట
45 ము కలిగి వుండెను. । బెరీయా కుమారులలో హెబెరు,
వీనివల్ల హెబ్రీయుల యింటి కూటము కలిగి వుండెను:
మరిన్ని మల్కీయేలు, వీనివల్ల మల్కీయేలీయుల యింటి
46 కూటము కలిగి వుండెను. । ఆషేరు కుమార్తె పేరు శారా
47 అని వుండెను. । యివి ఆషేరు పుత్రుల యింటి కూట
ములై, లెక్కకు వచ్చినవారు యేబై మూడువేల నన్నూ
రు మంది అయి వుండిరి. । నఫ్తాలీ పుత్రుల యింటి 48
కూటములను గురించినదేమంటే, యహ్సయేలు, వీని
వల్ల యహ్సయేలీయుల యింటి కూటము కలిగి వుం
డెను: మరిన్ని గూనీ, వీనివల్ల గూనీయుల యింటి కూ
టము కలిగి వుండెను: । మరిన్ని యేసెరు, వీనివల్ల 49
ఇస్రీయుల యింటి కూటము కలిగి వుండెను: మరిన్ని
షిల్లేము, వీనివల్ల షిల్లెమీయుల యింటి కూటము కలిగి
వుండెను. । యివి నఫ్తాలీ పుత్రులయొక్క యింటి కూ 50
టములై, లెక్కకు వచ్చినవారు నలుబై అయిదువేల
నన్నూరు మంది అయి వుండిరి. । యీలాగున ఇశ్రా 51
యేలు పుత్రులలో లెక్కకు వచ్చినవారు ఆరు లక్షల
వెయ్యిన్ని యేడ్నూట ముప్పయి మంది వుండిరి. । తరు 52
వాత యెహోవా మోషేకు సెలవు యిచ్చిన దేమం
టే, । వీరికి వీరి వీరి పేరుల లెక్క చొప్పున ఆ దేశ 53
మును పాళ్లువేసి స్వాధీనపర్చ వలసినది. । అధికమైన 54
వారికి నీవు విస్తారమైన భూమిని స్వాధీనపర్చ వలెను;
కొద్దిగా వున్న వారికి కొంచమైన భూమిని స్వాధీన
పర్చ వలెను; ప్రతి మనుష్యునికి స్వాధీనముగా నిర్ణ
యించ వలసిన భూమి వాని యొద్దనున్న వారియొక్క
లెక్క చొప్పున వుండ వలసినది. । మరిన్ని ఆ భూమిని 55
చీట్లు వేసి పంచ వలసినది; వారి తండ్రుల గోత్రముల
నామముల చొప్పున వారు స్వతంత్రించుకో వలెను. ।
విస్తారముగా వున్న వారికిన్ని కొద్దిగా వున్న వారికిన్ని 56
చీటి ప్రకారముగా పాళ్లు వేసి, వారి వారికి స్వాధీ
నము చేయ వలసినదని సెలవు యిచ్చెను. । అయితే లేవీ 57
యులలో తమ యింటి కూటముల చొప్పున లెక్కకు
వచ్చినవారు యెవరెవరంటే, గెర్షోను, వీనివల్ల గెర్షో
నీయుల యింటి కూటము కలిగి వుండెను: మరిన్ని
కెహాతు, వీనివల్ల కెహాతీయుల యింటి కూటము కలిగి
వుండెను: మరిన్ని మెరారీ, వీనివల్ల మెరారీయుల
యింటి కూటము కలిగి వుండెను. । లేవీయుల యింటి 58
కూటములలో లిబ్నీయుల యింటి కూటమున్ను, హె
బ్రోనీయుల యింటి కూటమున్ను, మహ్లీయుల యింటి
కూటమున్ను, మూషీయుల యింటి కూటమున్ను, కొ
ర్హీయుల యింటి కూటమున్ను, కలిగి వుండెను:
కెహాతువల్ల అమ్రాము పుట్టెను. । అమ్రాము భార్య 59
పేరు యొకెబెదు అని వుండెను; అది లేవీ కుమార్తె
అయి, మిస్రయీములో పుట్టెను; యిది అమ్రాముకు
అహరోనునున్ను మోషేనున్ను వీరియొక్క సహో
దరి అయిన మిర్యామునున్ను కనెను. । మరిన్ని అహరో 60
నుకు నాదాబున్ను, అబీహూయున్ను, ఎలాజారున్ను,
ఈతామారున్ను పుట్టిరి. । అయితే నాదాబున్ను అబీ 61
హూయున్ను యెహోవా సముఖమందు వేరైనటు
వంటి అగ్నిని అర్పించినప్పుడు మరణమైరి. । వారిలో 62

నెల మొదలుకొని అంతకు పయిని యీడు కలిగి
లెక్కకు వచ్చిన మొగవారందరున్ను యిరువై మూడు
వేలమంది వుండిరి: అయితే వీరు ఇశ్రాయేలు పుత్రుల
లెక్కలోకి వచ్చినవారు కారు, యెందుకంటే, ఇశ్రా
యేలు పుత్రులతో కూడా వీరికి భూమిని స్వాధీన
63 మయ్యేలాగున యివ్వడము లేకపోయెను.। వీరు మో
యాబు మైదానములందలి యెరిఖో పట్నపు యర్దేను
నదీ సమీపాన ఇశ్రాయేలు పుత్రులను లెక్కించిన
మోషే చేతనున్ను అచర్యకుడైన ఎలాజారు చేతనున్ను
64 లెక్కించబడినవారై వుండిరి.। అయితే వీరిలో సీనై
అరణ్యమందు మోషేయున్ను అచర్యకుడైన అహరో
నున్ను ఇశ్రాయేలు పుత్రులను లెక్కించినప్పుడు
65 లెక్కకు వచ్చినవాడు వొకడున్ను లేకపోయెను.। యే
మంటే నిజముగా వీరు అరణ్యములో మరణమాదురు
గాకని యెహోవా వారిని గురించి ఆనతిచ్చెను; అయి
నందున యెఫున్నె కుమారుడయిన కాలేబున్ను, నూను
కుమారుడైన యెహోషువయున్ను, వీరు గాక వారి
లో మిగిలినవాడు వొకడున్ను లేకపోయెను.

## 27. అధ్యాయము.

1 యోసేపు కుమారుడయిన మనస్సేయొక్క యింటి
కూటములలో జరిగినదేలాగంటే, ఆ మనస్సేకు మాఖీరు
పుట్టెను, అతనికి గిలాదు పుట్టెను, అతనికి హేఫెరు
2 పుట్టెను, అతనికి సెలోఫెహాదు పుట్టెను;। యీ సెలో
ఫెహాదు కుమార్తెలైన మహ్లా, నోయా, హొగ్లా, మి
ల్కా, తిర్జా అనే వీరు మోషే యెదుటికిన్ని అచర్య
కుడైన ఎలాజారు యెదుటికిన్ని శ్రేష్ఠుల యెదుటికిన్ని
సంఘమంతటి యెదుటికిన్ని వచ్చి సంఘముయొక్క
3 డేరా ద్వారము దగ్గిర నిలిచి పలికినదేమంటే,। మా
తండ్రి అరణ్యములో మరణమాయెను, అయితే కోర
హుయొక్క సమూహము యెహోవాకు వ్యతిరిక్తము
చేసినప్పుడు ఆ సమూహముతోను అతడు కలుసుకో
నిన వాడు గాక తన పాపముచేత తానే మరణమా
4 యెను: అయితే అతనికి కుమారులు లేకవుండిరి.। అత
నికి కుమారులు లేనందుచేత మా తండ్రియొక్క నామ
ము అతని వంశములోనుంచి పోనేల? కాబట్టి మా
తండ్రియొక్క సహోదరులతో కూడా మాకున్ను
భూమి స్వాధీనమయ్యేటట్టు యిప్పించ వలసినదని అడి
5 గిరి.। అప్పుడు మోషే ఆ సంగతిని పరిష్కరించడా
6 నకు యెహోవా సముఖమునకు దాని తెచ్చెను.। అం
దుకు యెహోవా మోషేకు సెలవు యిచ్చినదేమం
7 టే,। సెలోఫెహాదు కుమార్తెలు చెప్పుకొన్న మా
టలు యథార్థమే; వారి తండ్రియొక్క సహో
దరులతో కూడా నీవు వారి తండ్రి వంతు వచ్చిన భూ
భాగమును వారికి స్వాధీనమయ్యేటట్టుగా వారి వశము
చేయ వలెను.। మరిన్ని నీవు ఇశ్రాయేలు పుత్రులకు 8
ఆజ్ఞాపించ వలసినదేమంటే, కుమారుడు లేనివాడు మర
ణమయ్యే పక్షమందు మీరు వాని స్వతంత్రమైన భూ
మిని వాని కుమార్తె వశము చేతురు గాక.। వానికి 9
కుమార్తె లేని పక్షమందు వానియొక్క సహోదరు
లకు యిత్తురు గాక.। వానికి సహోదరులు లేని పక్ష 10
మందు వాని తండ్రియొక్క సహోదరులకు యిత్తురు
గాక.। వాని తండ్రికిన్ని సహోదరులు లేని పక్ష 11
మందు వాని వంశ్యులలో సన్నిహితుడైన వానికి యి
త్తురు గాక; వాడు దాన్ని స్వతంత్రించుకొనును: యిది
యెహోవా మోషేకు ఆజ్ఞాపించిన ప్రకారము ఇది
ఇశ్రాయేలు పుత్రులకు న్యాయ నిబంధన అయి
యుండును గాకని చెప్పుమని సెలవు యిచ్చెను.। తరు 12
వాత యెహోవా మోషేకు సెలవు యిచ్చినదేమంటే,
నీవు యీ అబారీము పర్వతము మీదికి యెక్కి ఇశ్రా
యేలు పుత్రులకు నేను యిచ్చిన దేశమును చూడు
ము.। దానిని నీవు చూచిన తరువాత నీ సహోదరు 13
డైన అహరోను చేర్చబడినట్టు నీవున్ను నీ జనుల
యొద్దికి చేర్చబడుదువు.। యెందుకంటే సీను అరణ్య 14
మందు మీరిద్దరున్ను సంఘము వ్యతిరిక్తము చేసినప్పుడు
నా ఆజ్ఞ నతిక్రమించి, ఆ వుదకము దగ్గిర వారి దృష్టికి
నన్ను పరిశుద్ధ పరచకపోతిరని సెలవు యిచ్చెను: అది
మెరీబా వుదకమై సీను అరణ్యములో కాదేషు దగ్గి
రనే వున్నది.। అప్పుడు మోషే యెహోవాతో పలి 15
కినదేమంటే,। సమస్త జీవాత్మలకు దేవుడవైన వో యె 16
హోవా, నీయొక్క సంఘము కాపరిలేని గొర్రెల లా
గున కాకుండా.। వారి ముందర అవతలకు వెళ్లుటకున్ను 17
లోపలికి వచ్చుటకున్ను, వారిని బయిటకు కొంచ పోవు
టకున్ను లోపలకు తెచ్చుటకున్ను, తగిన మనుష్యని
సంఘము మీద నిర్ణయింతువు గాకని చెప్పినప్పుడు,।
యెహోవా మోషేకు సెలవు యిచ్చినదేమంటే, నూను 18
కుమారుడైనటువంటిన్ని ఆత్మ గల వాడైనటువంటిన్ని
యెహోషువను నీవు తీసుకొని, నీ హస్తమును అతని
మీద వుంచి,। అర్చకుడైన ఎలాజారు ముందరనున్ను 19
సంఘమంతటి ముందరనున్ను అతనిని నిలిపి, వారు
చూస్తూ వుండగా అతనికి ఆజ్ఞను యిత్తువు గాక.।
మరిన్ని ఇశ్రాయేలు పుత్రుల సంఘమంతా అతనికి 20
లోపడి వుండేటట్టుగా నీయొక్క ఘనతను అతని
మీద వుంచ వలసినది.। మరిన్ని అతడు అచర్యకుడైన 21
ఎలాజారు ముందర నిలువ వలెను; ఇతడు అతని విష
యమై యెహోవా సముఖమందు న్యాయమును గుర్తె
రుగ చేసే ఊరీముతోటి ఆలోచన అడుగ వలెను: అత
డున్ను ఇశ్రాయేలు పుత్రులయొక్క సంఘమంతా

నున్ను ఆయన వాక్యము చొప్పున బయిలు వెళ్లుతూ
22 యివతలకు వస్తూ వుండ వలెనని ఆనతిచ్చెను. । మోషే
యెహోవా తనకు ఆజ్ఞాపించిన ప్రకారము సమస్తము
ను చేసి, యెహోషువను తీసుకొని, అర్చకుడయిన
ఎలాజారు ముందరనున్ను సంఘమంతటి ముందరనున్ను
23 నిలిపి, । యెహోవా మోషేకు ఆజ్ఞాపించిన ప్రకా
రము అతని మీద చేతులను వుంచి అతనికి ఆజ్ఞను
యిచ్చెను.

## 28. అధ్యాయము.

1 మరిన్ని యెహోవా మోషేకు సెలవు యిచ్చిన
2 దేమంటే, । నీవు ఇశ్రాయేలు పుత్రులను చూచి వారికి
ఆజ్ఞాపించ వలసినదేమంటే, నా కొరకయిన సువాసన
గల నా హోమార్పణల కొరకు నా ఆహారమునున్ను
నా కానుకనున్ను వాటి నిర్ణయమైన కాలమందు నాకు
3 అర్పించుటకు మీరు జాగ్రతపడి వుండ వలెను. । మరి
న్ని వారిని చూచి నీవు చెప్ప వలసినదేమంటే, మీరు
యెహోవాకు అగ్నిచేత చెల్లించ వలసిన అర్పణ యే
మిటంటే, నిత్య హోమార్పణ కొరకు దిన దినమున్ను
సంవత్సరము యీడుగల మొర్రిలేని రెండు గొర్రె పిల్ల
4 లను అర్పించ వలెను. । వొక గొర్రెపిల్లను వుదయమం
దున్ను వొక గొర్రెపిల్లను సాయంతనమందున్ను నీవు
5 అర్పించ వలెను. । మరిన్ని భోజనార్పణ కొరకు దంచి
తీసిన హీనులో పావు నూనెతో కలిపిన ఎఫాలో
6 పదో పాలు పిండి చెల్లించ వలెను. । అది యెహో
వాకు సువాసనయ్యేటట్టు హోమార్పణ నిమిత్తమయి
సీనై పర్వతమందు నిర్ణయమైన నిత్య హోమమై
7 యున్నది. । దాని పానార్పణ యేదంటే, వొక్కొక్క
గొర్రెపిల్ల నిమిత్తము హీనులో పావు ద్రాక్షా రసము
కావలెను; పరిశుద్ధ స్థలమందు బలమైన ద్రాక్షా రస
మును పానార్పణగా యెహోవాకు కుమ్మరించ వలెను. ।
8 మరిన్ని కొదువ గొర్రెపిల్లను సాయంతనమందు అర్పించ
వలెను; వుదయమందలి భోజనార్పణ వలెనున్ను పానా
ర్పణ వలెనున్ను దానిని చెల్లించ వలెను; అది యెహో
వాకు సువాసనయ్యేటట్టు హోమార్పణగా చెల్లించ
9 వలెను. । అయితే సబ్బాతు దినమందు మొర్రిలేనివిగా
సంవత్సరము యీడు గల గొర్రెపిల్లలు రెండున్ను, నూ
నెతో కలిపిన ఎఫాయొక్క పది పాళ్లలో రెండు పాళ్ల
పిండిగల భోజనార్పణతోనున్ను దాని పానార్పణతో
10 నున్ను చెల్లించ వలెను. । నిత్యమయిన హోమార్పణ
యున్ను దాని పానార్పణయున్ను గాక యిది ప్రతి
సబ్బాతు దినమునకు కావలసిన హోమార్పణయై యు
11 న్నది. । మీయొక్క మాసారంభములందు మీరు యె
హోవాకు హోమార్పణను చెల్లించ వలెను: దీనికి
కావలసినవి యేవేవంటే, కోడె యెద్దులు రెండున్ను
పొట్టేలు వొకటిన్ని, మొర్రిలేని సంవత్సరము యీడు
గల గొర్రెపిల్లలు రెండున్ను కావలెను. । భోజనార్పణ 12
కొరకు యేమిటంటే, యెద్దు వొక్కంటికి నూనెతో
కలిపిన ఎఫాయొక్క పది పాళ్లలో మూడు పాళ్ల పిం
డిన్ని; పొట్టేలు వొక్కంటికి నూనెతో కలిపిన ఎఫా
యొక్క పది పాళ్లలో రెండు పాళ్ల పిండిన్ని; । గొర్రె 13
పిల్ల వొక్కంటికి నూనెతో కలిపిన ఎఫాయొక్క పది
పాళ్లలో వొక పాలు పిండిన్ని కావలెను. యిది యె
హోవాకు సువాసనయ్యేటట్టు హోమార్పణగా
చెల్లించ వలసినది. । వాటియొక్క పానార్పణలు యే 14
వేవంటే, యెద్దు వొక్కంటికి అర్ధహీను ద్రాక్షా
రసమున్ను, పొట్టేలు వొక్కంటికి హీను ద్రాక్షా రస
ములో మూడో భాగమున్ను, గొర్రెపిల్ల వొక్కంటికి
హీనులో పావు ద్రాక్షా రసమున్ను కావలెను; యిది
సంవత్సరముయొక్క నెలలలో నెల నెలకూ కావలసిన
హోమార్పణయై యున్నది. । మరిన్ని నిత్యమైన హో 15
మార్పణయున్ను దాని పానార్పణయున్ను గాక వొక
మేకపిల్ల పాప పరిహారపు బలిగా యెహోవాకు
చెల్లించ బడవలెను. । అయితే మొదటి నెల పద్నాలుగో 16
దినమందు యెహోవాయొక్క పస్కా గనుక, । మొదటి 17
నెల పదిహేనో దినమందు దాని పండుగను ఆచరించ
వలెను; యేడు దినములమట్టుకు పులుసు లేని రొట్టెను
తిన వలెను. । వీటిలో మొదటి దినమందు పరిశుద్ధమైన 18
జన సమాగమము కలిగి వుండ వలెను; అందులో యే
వ్యాపారమైనా చేయ కూడదు. । అయితే మీరు యె 19
హోవాకు హోమార్పణలను అగ్నిచేత చెల్లించ
వలెను; అది యేలాగంటే, కోడె యెద్దులు రెండున్ను,
పొట్టేలు వొకటిన్ని, సంవత్సరము యీడు గల గొర్రె
పిల్లలు యేడున్ను కావలెను; యివి మొర్రిలేనివిగా
వుండ వలెను. । మరిన్ని వాటికన్నిటికీ నూనెతో కలి 20
పిన పిండిగల భోజనార్పణ కావలెను; యేలాగంటే,
యెద్దు వొక్కంటికి ఎఫాయొక్క పది పాళ్లలో మూడు
పాళ్ల పిండిన్ని, పొట్టేలు వొక్కంటికి ఎఫాయొక్క
పదిపాళ్లలో రెండు పాళ్ల పిండిన్ని కావలెను. । మరిన్ని 21
యేడు గొర్రెపిల్లలకున్ను పిల్ల వొక్కంటికి ఎఫాలో
పదో పాలు చొప్పున చెల్లించ వలెను. । మరిన్ని మీ 22
కొరకు శాంతి కలుగ చేయడానకు వొక మేకను పాప
పరిహారపు బలిగా చెల్లించ వలెను. । మీరు వుదయ 23
మందున చెల్లించ వలసిన నిత్య హోమార్పణ గాక
వీటిని చెల్లించ వలెను. । యీ ప్రకారముగా మీరు ఆ 24
యేడు దినముల పర్యంతమూ ప్రతి దినమందున్ను యె
హోవాకు సువాసనయ్యేటట్టు హోమార్పణనున్ను
భోజనార్పణనున్ను చెల్లించ వలెను; యిది నిత్య హో

మార్పణయున్ను దాని పానార్పణయున్ను గాక
25 చెల్లించ వలసినది. । మరిన్ని యేడో దినమందు పరిశుద్ధ
మయిన జన సమాగమము కలిగి వుండ వలెను; అప్పుడు
26 మీరు యే వ్యాపారమైనా చేయ కూడదు. । మరిన్ని
తొలి ఫలముయొక్క దినమందు మీకు నిర్ణయించిన
వారములు గతించిన తరువాత మీరు యెహోవాకు
నూతనమైన భోజనార్పణ చెల్లించినప్పుడు మీకు పరి
శుద్ధమైన జన సమాగమము కలిగి వుండ వలెను; ఆ దిన
మందు మీరు యే వ్యాపారమైనా చేయ కూడదు. ।
27 అయితే మీరు యెహోవాకు సువాసనయ్యేటట్టు
హోమార్పణను చెల్లించ వలెను; అది యేలాగంటే,
కోడె యెద్దులు రెండున్ను, పొట్టేలు వొకటిన్ని, సం
వత్సరము యీడు గల గొర్రెపిల్లలు యేడున్ను కావ
28 లెను. । మరిన్ని వాటికన్నిటికీ నూనెతో కలిపిన పిండి
గల భోజనార్పణ కావలెను, యేలాగంటే, యెద్దు వొ
క్కంటికి ఎఫాయొక్క పది పాళ్లలో మూడు పాళ్ల
పిండిన్ని; పొట్టేలు వొక్కంటికి ఎఫాయొక్క పది పా
29 ళ్లలో రెండు పాళ్ల పిండిన్ని;। యేడు గొర్రెపిల్లలకున్ను
పిల్ల వొక్కంటికి ఎఫాలో పదో పాలు పిండిన్ని కా
30 వలెను. । మరిన్ని మీ కొరకు శాంతి కలుగచేయడా
31 నకు వొక మేకపిల్లను చెల్లించ వలెను. । వీటిని మీరు
నిత్య హోమార్పణయున్ను దాని భోజనార్పణయు
న్ను వాటి పానార్పణలున్ను గాక మీరు చెల్లించ
వలెను: యివి మొర్రిలేనివిగా వుండ వలెను.

## 29. అధ్యాయము.

1 మరిన్ని యేడో నెల మొదటి దినమున పరిశుద్ధమైన
జన సమాగమము మీకు కలిగి వుండ వలెను; దాని
యందు మీరు యే వ్యాపారమయినా చేయకూడదు,
యేమంటే అది మీకు బాకాల నాదము చేసే దినమై
2 వున్నది. । అప్పుడు మీరు యెహోవాకు సువాసన
య్యేటట్టు హోమార్పణను చెల్లించ వలెను; అది యే
మిటంటే కోడె యెద్దు వొకటిన్ని పొట్టేలు వొకటిన్ని,
మొర్రిలేనటువంటిన్ని సంవత్సరము యీడు గలిగిన
3 టువంటిన్ని గొర్రెపిల్లలు యేడున్ను; । మరిన్ని వాటికి
నూనెతో కలిపిన పిండి గల భోజనార్పణయున్ను కా
వలెను; యేలాగంటే, యెద్దు వొక్కంటికి ఎఫాయొక్క
పది పాళ్లలో మూడు పాళ్ల పిండిన్ని, పొట్టేలు వొ
క్కంటికి ఎఫాయొక్క పది పాళ్లలో రెండు పాళ్లు
4 పిండిన్ని; । యేడు గొర్రెపిల్లలకున్ను పిల్ల వొక్కంటికి
5 ఎఫాలో పదోపాలు పిండిన్ని కావలెను. । మరిన్ని మీ
కొరకు శాంతి కలుగ చేయడానకు వొక మేకపిల్లను
6 పాప పరిహారపు బలిగా చెల్లించ వలెను. । నెల నెలకు
వచ్చిన హోమార్పణయున్ను దాని భోజనార్పణయు
న్ను నిత్య హోమమున్ను దాని భోజనపు అర్పణ
యున్ను వాటి పానార్పణలున్ను గాక వీటి వీటి
నిర్ణయము చొప్పున వీటిని మీరు యెహోవాకు
సువాసనయ్యేటట్టు హోమార్పణగా చెల్లించ వలసి
నది. । మరిన్ని యీ యేడో నెల పదో దినమున పరి 7
శుద్ధమైన జన సమాగమము మీకు కలిగి వుండ వలెను;
అప్పుడు మీరు మీ ఆత్మలను వెతపరచ వలెను; ఆ దిన
మందు యే వ్యాపారమునైనా మీరు చేయకూడదు. ।
అయితే యెహోవాకు సువాసనయ్యేటట్టు హో 8
మార్పణను చెల్లించ వలెను; అది యేమిటంటే, కోడె
యెద్దు వొకటిన్ని, పొట్టేలు వొకటిన్ని, సంవత్సరము
యీడు గల గొర్రెపిల్లలు యేడున్ను కావలెను; యివి
మొర్రి లేనివిగా వుండ వలెను. । మరిన్ని వీటికి నూనె 9
తో కలిపిన పిండి గల భోజనార్పణ కావలెను; అది
యేలాగంటే, యెద్దు వొక్కంటికి ఎఫాయొక్క పది
పాళ్లలో మూడు పాళ్ల పిండిన్ని; పొట్టేలు వొక్కంటికి
ఎఫాయొక్క పది పాళ్లలో రెండు పాళ్ల పిండిన్ని; ।
యేడు గొర్రెపిల్లలకున్ను పిల్ల వొక్కంటికి ఎఫాలో 10
పదో పాలు పిండిన్ని కావలెను. । మరిన్ని పాప పరి 11
హారపు బలికొరకు మేకపిల్లను చెల్లించ వలెను; శాంతి
కొరకైన పాప పరిహారపు బలిన్ని నిత్యమైన హోమా
ర్పణయున్ను దాని భోజనార్పణయున్ను వాటి పా
నార్పణలున్ను గాక వాటిని చెల్లించ వలసినది.। మరిన్ని 12
యేడో నెల పదిహేనో దినమున మీకు పరిశుద్ధమైన
జన సమాగమము కలిగి వుండ వలెను; దానియందు
మీరు యే వ్యాపారమునైనా చేయ కూడదు; యేడు
దినముల మట్టుకు యెహోవాకు పండుగ చేయ వలసి
నది. । మొదటి దినమున యెహోవాకు సువాసనయ్యే 13
టట్టు అగ్నితో అర్పించిన హోమార్పణను చెల్లించ
వలసినది; అది యేమిటంటే, కోడె యెద్దులు పదమూ
డున్ను, పొట్టేళ్లు రెండున్ను, సంవత్సరము యీడు గల
గొర్రెపిల్లలు పద్నాలుగున్ను కావలెను; యివి మొర్రి
లేనివిగా వుండ వలసినది. । వాటికి నూనెతో కలిపిన 14
పిండి గల భోజనార్పణ కావలెను; అది యేలాగంటే,
ఆ పదమూడు యెద్దులకున్ను యెద్దు వొక్కంటికి ఎఫా
యొక్క పది పాళ్లలో మూడు పాళ్ల పిండిన్ని; రెండు
పొట్టేళ్లకున్ను పొట్టేలు వొక్కంటికి ఎఫాయొక్క పది
పాళ్లలో రెండు పాళ్ల పిండిన్ని; పద్నాలుగు గొర్రె
పిల్లలకున్ను పిల్ల వొక్కంటికి ఎఫాలో పదోపాలు పిం
డిన్ని కావలెను. । మరిన్ని పాప పరిహారపు బలికొరకు 15
వొక మేకపిల్లను చెల్లించ వలెను. । నిత్య హోమార్ప 16
ణయున్ను దాని భోజనార్పణయున్ను పానార్పణయు
న్ను గాక వీటిని చెల్లించ వలసినది. । రెండో దినమున 17
కోడె యెద్దులు పన్నెండున్ను, పొట్టేళ్లు రెండున్ను,

మొర్రిలేనటువంటిన్ని సంవత్సరము యీడు గలిగినటు
వంటిన్ని గొర్రెపిల్లలు పద్నాలుగున్ను చెల్లించ వలెను.।
18 మరిన్ని వీటియొక్క భోజనార్పణలున్ను పానార్పణలు
న్ను యెడ్లకున్ను పొట్టేళ్లకున్ను గొర్రెపిల్లలకున్ను వాటి
లెక్క చొప్పుననున్ను వాటి నిర్ణయ ప్రకారముగాను
19 న్ను వుండ వలెను.। మరిన్ని పాప పరిహారపు బలికొరకు
వొక మేకపిల్లను చెల్లించ వలెను; నిత్య హోమార్పణ
యున్ను దాని భోజనార్పణయున్ను వాటి పానార్పణ
20 లున్ను గాక వీటిని చెల్లించ వలసినది. । మూడో దిన
మున యెద్దులు పదకొండున్ను, పొట్టేళ్లు రెండున్ను, సం
వత్సరము యీడు గల మొర్రిలేని గొర్రెపిల్లలు పద్నా
21 లుగున్ను చెల్లించ వలెను.। వీటి భోజనార్పణలున్ను పా
నార్పణలున్ను యెద్దులకున్ను పొట్టేళ్లకున్ను గొర్రెపిల్ల
లకున్ను వాటి లెక్క చొప్పుననున్ను వాటి నిర్ణయ
22 ప్రకారముగానున్ను వుండ వలెను.। మరిన్ని పాప పరి
హారపు బలికొరకు వొక మేక పిల్లను చెల్లించ వలెను;
నిత్య హోమార్పణయున్ను దాని భోజనార్పణయున్ను
దాని పానార్పణయున్ను గాక వీటిని చెల్లించ వలసి
23 నది.। నాలుగో దినమున యెద్దులు పదిన్ని పొట్టేళ్లు
రెండున్ను, సంవత్సరము యీడు గల మొర్రిలేని గొ
24 ర్రెపిల్లలు పద్నాలుగున్ను చెల్లించ వలసినది.। వీటి భోజ
నార్పణలున్ను పానార్పణలున్ను యెద్దులకున్ను పొట్టే
ళ్లకున్ను గొర్రెపిల్లలకున్ను వాటి లెక్క చొప్పుననున్ను
వాటి నిర్ణయ ప్రకారముగానున్ను వుండ వలెను.।
25 మరిన్ని పాప పరిహారపు బలికొరకు వొక మేకపిల్లను
చెల్లించ వలెను; నిత్య హోమార్పణయున్ను దాని
భోజనార్పణయున్ను దాని పానార్పణయున్ను గాక
26 వీటిని చెల్లించ వలసినది.। అయిదో దినమున యెద్దులు
తొమ్మిదిన్ని, పొట్టేళ్లు రెండున్ను, సంవత్సరము యీడు
గల మొర్రిలేని గొర్రెపిల్లలు పద్నాలుగున్ను చెల్లించ
27 వలెను.। వీటి భోజనార్పణలున్ను పానార్పణలున్ను
యెద్దులకున్ను పొట్టేళ్లకున్ను గొర్రెపిల్లలకున్ను వాటి
లెక్క చొప్పుననున్ను వాటి నిర్ణయ ప్రకారముగా
28 నున్ను వుండ వలెను.। మరిన్ని పాప పరిహారపు బలి
కొరకు వొక మేకను చెల్లించ వలెను; నిత్యమైన హో
మార్పణయున్ను దాని భోజనార్పణయున్ను దాని పా
29 నార్పణయున్ను గాక వీటిని చెల్లించ వలసినది.। ఆరో
దినమున యెద్దులు యెనిమిదిన్ని, పొట్టేళ్లు రెండున్ను,
సంవత్సరము యీడు గల మొర్రిలేని గొర్రెపిల్లలు
30 పద్నాలుగున్ను చెల్లించ వలెను.। వాటి భోజనార్పణ
లున్ను పానార్పణలున్ను యెద్దులకున్ను పొట్టేళ్లకున్ను
గొర్రెపిల్లలకున్ను వాటి లెక్క చొప్పుననున్ను వాటి
31 నిర్ణయ ప్రకారముగానున్ను వుండ వలెను.। మరిన్ని
పాప పరిహారపు బలి కొరకు వొక మేకపిల్లను చెల్లించ
వలెను; నిత్య హోమార్పణయున్ను దాని భోజనా
ర్పణయున్ను దాని పానార్పణయున్ను గాక వీటిని
చెల్లించ వలసినది.। యేడో దినమున యెద్దులు యేడు 32
న్ను, పొట్టేళ్లు రెండున్ను, సంవత్సరము యీడు గల
మొర్రిలేని గొర్రెపిల్లలు పద్నాలుగున్ను చెల్లించ వలె
ను.। వాటి భోజనార్పణలున్ను పానార్పణలున్ను యె 33
ద్దులకున్ను పొట్టేళ్లకున్ను గొర్రె పిల్లలకున్ను వాటి
లెక్క చొప్పుననున్ను వాటి నిర్ణయ ప్రకారముగా
నున్ను వుండ వలెను.। మరిన్ని పాప పరిహారపు బలి 34
కొరకు వొక మేకపిల్లను చెల్లించ వలెను; నిత్య హో
మార్పణయున్ను దాని భోజనార్పణయును దాని పానా
ర్పణయున్ను గాక వీటిని చెల్లించ వలసినది.। అయితే 35
యెనిమిదో దినమందు మీకు పరిశుద్ధమైన జన సమాగ
మము కలిగి వుండ వలెను; ఆ దినమందు మీరు యే
వ్యాపారమునైనా చేయ కూడదు.। అయితే మీరు 36
యెహోవాకు సువాసనయ్యేటట్టు అగ్నితో హో
మార్పణను చెల్లించ వలెను; అది యేమిటంటే, యెద్దు
వొకటిన్ని, పొట్టేలు వొకటిన్ని, సంవత్సరము యీడు
గల మొర్రిలేని గొర్రెపిల్లలు యేడున్ను కావలెను.।
వాటి భోజనార్పణలున్ను పానార్పణలున్ను యెద్దు 37
కున్ను పొట్టేలుకున్ను గొర్రెపిల్లలకున్ను వాటియొక్క
లెక్క చొప్పుననున్ను వాటి నిర్ణయ ప్రకారముగా
నున్ను వుండ వలెను.। మరిన్ని పాప పరిహారపు బలి 38
కొరకు వొక మేకను చెల్లించ వలెను; నిత్య హోమా
ర్పణయున్ను దాని భోజనార్పణయున్ను దాని పానా
ర్పణయున్ను గాక వీటిని చెల్లించ వలసినది.। వీటిని 39
మీరు మీకు నిర్ణయమైన పండుగ వేళల యందు మీ
మొక్కుబళ్లున్ను స్వేచ్ఛార్పణలున్ను గాక మీ హో
మార్పణల కొరకున్ను మీ భోజనార్పణల కొరకున్ను
మీ పానార్పణల కొరకున్ను మీ సమాధానార్పణల
కొరకున్ను యెహోవాకు చెల్లించ వలసినదని వారికి
ఆజ్ఞాపించుమని సెలవు యిచ్చెను.। మోషే యెహో 40
వా తనకు ఆజ్ఞాపించినవి అన్నిన్ని ఇశ్రాయేలు పుత్రు
లతో చెప్పినవాడాయెను.

## 30. అధ్యాయము.

మరిన్ని గోత్రికులయొక్క పెద్దలతో మోషే 1
ఇశ్రాయేలు పుత్రులను గురించి యెహోవా ఆజ్ఞా
పించినట్టు చెప్పినదేమంటే,। యెవడయినా యెహో 2
వాకు మొక్కుకొనినా, బంధకముతో ప్రమాణముగా
తన ఆత్మను కట్టుకొనినా, వాడు తన మాట తాను
తప్పక తన నోటనుంచి బయిలు వచ్చిన అంతటి ప్రకా
రము చేసును గాక.। మరిన్ని స్త్రీ తన తండ్రి యింట 3
చిన్నతనమున వుండి యెహోవాకు మొక్కుకొనినా,

4 బంధకముతో తన్ను బంధించుకొనినా, । అప్పుడు దాని
తండ్రి దాని మొక్కుబడినిన్ని యే బంధకము చేత
అది బంధించుకో బడునో దాన్నిన్ని విని, అందుకు
యేమీ చెప్పక వూరకున్న పక్షమందు, దాని మొక్కు
బళ్లన్నిన్ని రూఢమవును; యే బంధకములచేత అది
5 బంధించుకోబడెనో అవి అన్నీ రూఢమవును. । అయి
తే దాని తండ్రి విని దానితో వద్దని చెప్పితే, దాని
మొక్కుబళ్లన్నిన్ని అది బంధించుకోబడిన బంధకముల
న్నిన్ని రూఢము కాకపోవును; మరిన్ని తండ్రి దాని
తో వద్దని చెప్పెను గనుక యెహూవా దాన్ని క్షమిం
6 చును. । మరిన్ని పెనిమిటి గల స్త్రీ మొక్కుబడి మొ
క్కినా, తాను బంధించ పడేటట్టు యే మాటయినా
7 పలికినా, । పెనిమిటి ఆ సంగతి విని అందుకు యేమీ
చెప్పక వూరకున్న పక్షమందు, దాని మొక్కుబళ్లు రూ
ఢమవును; యే బంధకముచేత అది బంధించ పడెనో
8 అదిన్ని రూఢమవును. । అయితే పెనిమిటి ఆ సంగతి విని
దానితో వద్దని చెప్పితే, అది మొక్కిన మొక్కుబడిన్ని
యే మాటచేత అది బంధించబడెనో అదిన్ని అతడు
వ్యర్థము చేసెను గనుక యెహూవా దాన్ని క్షమిం
9 చును. । అయితే విధవ అయినా పరిత్యజించపడినదైనా
తాను బంధక పడేటట్టు మొక్కుబడి మొక్కితే అది
10 దాని పయిని నిలుచును. । అయితే అది పెనిమిటి
యింట్లో వుండి మొక్కుబడి మొక్కినా, ప్రమాణము
11 యొక్క బంధకము దాని పయికి వున్నా, । పెనిమిటి
ఆ సంగతి విని అందుకు వద్దని చెప్పక వూరకొనిన
పక్షమందు, దాని మొక్కుబళ్లన్నిన్ని తాను బంధించు
కోబడేటట్టు పలికిన బంధకములన్నిన్ని రూఢమవును. ।
12 అయితే పెనిమిటి ఆ సంగతులను విని వద్దని చెప్పిన
పక్షమందు దాని నోట బయిలు వచ్చినటువంటి మొ
క్కుబడిన్ని బంధించుకోబడినటువంటి బంధకమున్ను
రూఢము కాక పోవును; దాని పెనిమిటి వాటిని
వ్యర్థము చేసెను గనుక యెహూవా దాన్ని క్షమిం
13 చును. । సమస్తమైన మొక్కుబళ్లనున్ను అది బంధించు
కొనిన సమస్త ప్రమాణములనున్ను దాని పెనిమిటి
స్థిరపర్చుటకున్ను స్థిరపర్చక పోవుటకున్ను స్వతంత్రు
14 డౌను. । అయితే దాని పెనిమిటి యే నాటికైనా దాని
తో యేమీ చెప్పక వూరకొన్నట్టయితే, వాడు దాని
మీద వున్న దాని మొక్కుబళ్లనున్ను దాని బంధకము
లనున్ను రూఢము చేసును; అవి వానికి వినపడినప్పుడు
వాడు దానితో యేమీ చెప్పక వూరకుండెను గనుక
15 వాటిని రూఢము చేసినవాడవును. । అయితే వాడు
వాటిని వినిన తరువాతను వాటిని వ్యర్థము చేసిన
పక్షమందు, వాడు దాని అపరాధమును మోసుకొను
16 నని చెప్పెను. । యివి భార్యాభర్తలను గురించిన్ని,
చిన్నతనమున పుట్టినింట వున్న కుమార్తెను గురించి
న్ని, దాని తండ్రిని గురించిన్ని, యెహూవా మోషేకు
ఆజ్ఞాపించిన నిర్ణయములై వున్నవి.

## 31. అధ్యాయము.

మరిన్ని యెహూవా మోషేకు సెలవు యిచ్చిన 1
దేమంటే, । మిద్యానీయుల మీద ఇశ్రాయేలు పుత్రుల 2
పగ నీవు తీర్చ వలెను; తరువాత నీవు నీ జనుల యొ
ద్దికి చేర్చ బడుదువని సెలవు యిచ్చెను. । అప్పుడు 3
మోషే జనులతో చెప్పినదేమంటే, మీలో కొందరు
యుద్ధ సన్నద్ధులై, బయిలు వెళ్లి, యెహూవా విష
యమై మిద్యానీయులకు ప్రతి శిక్ష మీవల్ల కలిగే
కొరకు వారి మీదికి పోవలసినది. । అందుకై ఇశ్రా 4
యేలు పుత్రులయొక్క గోత్రములలో గోత్రము
వొక్కంటికి వెయిమందు చొప్పున యుద్ధమునకు పం
పించ వలసినదని చెప్పెను. । అయినందున వేల కొలది 5
వున్న ఇశ్రాయేలీయులలోనుంచి గోత్రము వొక్కం
టికి వెయిమంది చొప్పున యుద్ధ సన్నద్ధులయిన పన్నెం
డువేల మంది అప్పగించ బడిరి. । కాబట్టి మోషే వా 6
రిని యుద్ధమునకు పంపించెను; గోత్రము వొక్కంటికి
వెయిమంది చొప్పున అయిన వారినిన్ని, అర్చకుడైన
ఎలాజారు కుమారుడైన పీనెహాసునున్ను, యుద్ధము
నకు పంపెను; అతడు నాదము చేసే బాకాలను చేత
పట్టుకొని పరిశుద్ధమయిన వస్తువులతోను వెళ్లినాడు. ।
వారు యెహూవా మోషేకు ఆజ్ఞాపించినట్టు మిద్యా 7
నీయుల మీద యుద్ధము చేసి, మొగవారందరినిన్ని
హతము చేసిరి. । మరిన్ని వీరిని హతముచేసి యింకా 8
మిద్యాను రాజులనున్ను హతము చేసిరి; వీరు ఎవీ,
రేకెము, సూరు, హూరు, రేబ, అనే పేళ్లు గల యీ
మిద్యాను రాజుల అయిదు గురినిన్ని, బెయోరు కుమా
రుడయిన బలామునున్ను కత్తిచేత హతము చేసిరి. ।
మరిన్ని ఇశ్రాయేలు పుత్రులు మిద్యాను స్త్రీలనున్ను 9
వారి చిన్న వారినిన్ని చెరపట్టుకొని, వారి పశువులన్ని
టినిన్ని వారి గొర్రెలన్నిటినిన్ని వారు ఆస్తి అంతటిని
న్ని దోచుకొనిరి. । మరిన్ని వారి కాపురమైన పట్టణ 10
ములనున్ను వారి కోటలనున్ను అగ్నిచేత కాల్చివేసిరి. ।
వారు దోపుడు సొమ్ము అంతటినిన్ని దొరికిన ఆస్తి 11
అంతటినిన్ని మనుష్యులనున్ను మృగములనున్ను తీసు
కొనిరి. । మరిన్ని వారు చెరపడిన వారినిన్ని దొరికిన 12
ఆస్తినిన్ని దోపుడు సొమ్మునున్ను పట్టుకొని, మోషే
యున్ను అర్చకుడయిన ఎలాజారున్ను ఇశ్రాయేలు
పుత్రుల సంఘమున్ను వున్న యెరిఖో పట్నపు యర్దేను
నదీ సమీపమయిన మోయాబు మయిదానములందున్న
పేటకు వచ్చిరి. । అప్పుడు మోషేయున్ను అర్చకుడైన 13

ఎలాజారున్ను సంఘముయొక్క శ్రేష్ఠులున్ను వారిని
యెదుర్కొనేటందుకు పేటలోనుంచి బయిలువెళ్లిరి. ।
14 అప్పుడు మోషే సైన్యాధిపతుల మీద, అనగా, యు
ద్ధమునుంచి వచ్చిన సహస్రాధిపతుల మీదనున్ను శతా
15 ధిపతుల మీదనున్ను కోపగించి, । వారిని చూచి, ఆడు
16 వారందరినిన్ని బ్రతుక నిస్తిరా? । యిదుగో వీరే బలా
ముయొక్క ఆలోచనవల్ల పెయోరు విషయమై ఇశ్రా
యేలు పుత్రులచేతను యెహోవాకు తప్పితము చేయిం
చినవారై వున్నారే; అందువల్లనే కాదా యెహోవా
17 యొక్క సంఘము మీదికి తెగులు వచ్చెను. । కాబట్టి
మొగపిల్లలనందరినిన్ని పురుషులతో శయనించ నేర్చిన
18 స్త్రీలనందరినిన్ని సంహరించండి. । అయితే పురుషుల
తో శయనించ నేరని కన్యలనందరినిన్ని మీ కొరకు
19 బ్రతకనివ్వండి. । మరిన్ని మీరు యేడు దినములు పేట
అవతల వుండ వలెను; మీలో మనుష్యుని చంపిన వా
రున్ను, హతమయిన వాని ముట్టిన వారున్ను, మూడో
దినమందున్ను యేడో దినమందున్ను తమ్మును తాము
పవిత్రము చేసుకో వలసినది; మరిన్ని మీరు చెరపట్టి
20 తెచ్చిన వారినిన్ని పవిత్రము చేయ వలసినది. । మరిన్ని
మీ బట్టలన్నిటినిన్ని చర్మపు వస్తువులన్నిటినిన్ని మేక
వెంట్రుకల పని అంతటినిన్ని కర్ర వస్తువులన్నిటినిన్ని
21 పవిత్రము చేయ వలెనని చెప్పెను. । అర్చకుడయిన
ఎలాజారు యుద్ధమునకు వెళ్లి వచ్చిన సైన్యస్థులతో
యెహోవా మోషేకు ఆజ్ఞాపించిన న్యాయ ప్రమా
22 ణము చొప్పున చెప్పినదేమంటే, । అగ్నిలో వేసేటటు
వంటి వస్తువులు, బంగారము, వెండి, యిత్తడి, యినుము,
తగరము, సీసము మొదలయిన వస్తువులు అగ్నిలో
23 వేయ వలెను. । అప్పుడు అవి శుభ్రమవును; అయినప్ప
టికిన్ని అంటుబాపే వుదకముచేత వాటిని పవిత్రప
రచ వలసినది; అయితే అగ్నిలో వెయ్యని వస్తువులను
24 వుదకములో వేయ వలసినది. । మరిన్ని మీరు యేడో
దినమందు మీ బట్టలను వుతుకుకొని పవిత్రులైన తరు
వాతను పేటలోకి ప్రవేశించ వచ్చునని చెప్పెను. ।
25 అప్పుడు యెహోవా మోషేకు సెలవు యిచ్చినదే
26 మంటే, । నీవున్ను అర్చకుడయిన ఎలాజారున్ను సం
ఘముయొక్క పెద్దలలో ప్రధానులున్ను పట్టుకొన్న
దోపుడు సొమ్ము మనుష్యుని సంబంధమైనదైనా మృగ
సంబంధమయినదయినా దాని మొట్టు లెక్క చూచి, ।
27 ఆ దోపుడు సొమ్మును రెండు పాళ్లు వేసి యుద్ధమునకు
వెళ్లి వచ్చినవారికి వొక పాలున్ను సంఘమంతటికీ వొక
28 పాలున్ను పంచిపెట్టండి. । అయితే యుద్ధమునకు వెళ్లి
వచ్చిన సమూహము యొద్ద యెహోవా నిమిత్తము
కట్టుబడి పుచ్చుకో వలెను, యేలాగంటే, మనుష్యుల
లోనైనా యెద్దులలోనైనా గార్దభములలోనైనా
గొర్రెలలోనైనా యేనూటి వొక్కంటికి వొక్కొక్కటి
చొప్పున తీయ వలసినది. । వారికి వచ్చిన పాలులో 29
నుంచి వీటిని తీసి, యెహోవాకు పైకెత్తే అర్పణగా
అర్చకుడయిన ఎలాజారుకు యివ్వ వలెను. । మరిన్ని 30
ఇశ్రాయేలు పుత్రులయొక్క పాలులోనుంచి మను
ష్యులలోనున్ను యెద్దులలోనున్ను గార్దభములలో
నున్ను గొర్రెలలోనున్ను నానా విధమయిన పశువుల
లోనున్ను నీవు యేభై యింటిలో వొక పాలును తీసు
కొని యెహోవాయొక్క డేరాను కనిపెట్టే లేవీయు
లకు యివ్వ వలెనని సెలవు యిచ్చెను. । అయినందున 31
మోషేయున్ను అర్చకుడైన ఎలాజారున్ను యెహో
వా మోషేకు ఆజ్ఞాపించినట్టు చేసినారు. । సైన్యస్థులకు 32
దోపుడుగా దొరికిన సొమ్ములో కొంత పోగా మిగిలి
నది యెంతంటే, గొర్రెలు ఆరు లక్షల డెబ్బయి అయి
దువేలు వుండెను. । యెద్దులు డెబ్బయి రెండువేలు వుం 33
డెను. । గార్దభములు అరువై వొక్కవేలు వుండెను. । 34
పురుషులతో శయనించ నేరని కన్యకలు ముప్పయి 35
రెండువేల మంది వుండిరి. । యుద్ధమునకు వెళ్లిన వారి 36
సగము పాలున్ను యెంతంటే, గొర్రెలు మూడు లక్షల
ముప్పయి యేడువేల యేనూరు లెక్క అయి వుండెను. ।
యీ గొర్రెలలోనుంచి యెహోవాకు కట్టుబడిగా 37
వచ్చినవి ఆరునూట డెబ్బయి అయిదు వుండెను. । యె 38
ద్దులు యెన్నంటే, ముప్పయి ఆరువేలు వుండెను; వీటి
లోనుంచి యెహోవాకు కట్టుబడిగా వచ్చినవి డెబ్భై
రెండు వుండెను. । గార్దభములు యెన్నంటే, ముప్పై 39
వేల యేనూరు వుండెను; వీటిలోనుంచి యెహోవాకు
కట్టుబడిగా వచ్చినవి అరువై వొకటి వుండెను. । మను 40
ష్యులు యెందరంటే, పదహారువేలు వుండిరి; వీరిలో
నుంచి యెహోవాకు కట్టుబడిగా వచ్చినవారు ము
ప్పయి యిద్దరు వుండిరి. । అయితే మోషే యెహో 41
వాకు చెల్లించ వలసిన కట్టుబడి యెహోవా మోషేకు
ఆజ్ఞాపించినట్టు అర్చకుడయిన ఎలాజారుకు యిచ్చెను. ।
యుద్ధము చేసిన వారి యొద్ద మోషే ఇశ్రాయేలు పు 42
త్రుల సంఘము కొరకు తీసిన సగము యెంతంటే, ।
గొర్రెలు మూడు లక్షల ముప్పయి యేడువేల యేనూరు 43
వుండెను. । యెద్దులు ముప్పయి ఆరువేలు వుండెను. । 44
గార్దభములు ముప్పయివేల యేనూరు వుండెను. । 45
మనుష్యులు పదహారువేలు వుండిరి. । అయితే మోషే 46,47
ఇశ్రాయేలు పుత్రులయొక్క సంఘములోనుంచి మను
ష్యులలోనున్ను మృగములలోనున్ను యేభై యింటికి
వొక పాలును తీసి, యెహోవా డేరాను కనిపెట్టే
లేవీయులకు యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్టు
యిచ్చెను. । అయితే సమూహములో వేల తరబడిమంది 48
మీద నిర్ణయబడిన వారు, అనగా, సహస్రాధిపతు

లున్ను శతాధిపతులున్ను మోషే యొద్దికి వచ్చి అతని
49 చూచి, । నీ సేవకులమైన మేము మాకు వశమై యున్న
సైన్యపు వారియొక్క మొత్తము లెక్కను చూస్తిమి; మా
50 లో వొకడయినా తక్కువ లేకుండెను. । అయినందున
మాలో ప్రతి మనుష్యునికి దొరికిన బంగారపు వస్తు
వులలోనుంచి గొలుసులనున్ను కడియములనున్ను వుం
గరములనున్ను పోగులనున్ను వడ్డాణములనున్ను యె
హోవా సముఖమందు మా ఆత్మల కొరకు శాంతి
కలుగ చేసేటట్టుగా యెహోవాకు కానుకను తెచ్చి
51 నామని పలికిరి. । అప్పుడు మోషేయున్ను అర్చకు
డయిన ఎలాజారున్ను ఆ బంగారపు నగలన్నిటిన్ని
52 పుచ్చుకొనిరి. । అయితే సహస్రాధిపతుల యొద్దనుం
చిన్ని శతాధిపతుల యొద్దనుంచిన్ని పుచ్చుకొని యె
హోవాకు అర్పించిన కానుక బంగారము యావత్తూ
పదహారువేల యేళ్నూట యాభై షెకేలుల యెత్తయి
53 వుండెను. । యేమంటే సైన్యములో యెవడి మట్టుకు
54 వాడే దోపుడు సొమ్మును దోచుకొనెను. । అయినందున
మోషేయున్ను అర్చకుడయిన ఎలాజారున్ను సహ
స్రాధిపతుల యొద్దనుంచిన్ని శతాధిపతుల యొద్దనుం
చిన్ని ఆ బంగారమును పుచ్చుకొని, సంఘముయొక్క
డేరాలోకి తెచ్చి, ఇశ్రాయేలు పుత్రులయొక్క జ్ఞాప
కార్థము కొరకు యెహోవా సముఖమందు వుంచిరి.

## 32. అధ్యాయము.

1 అయితే రూబేను పుత్రులకున్ను గాదు పుత్రుల
కున్ను బహు విస్తారమైన పశువులు గలవు; కాబట్టి
వారు యజేరు దేశమునున్ను గిలాదు దేశమునున్ను
చూచి, యిదుగో, యీ స్థలము పశువులకు యోగ్య
2 మని అనుకొన్నందున, । గాదు పుత్రులున్ను రూబేను
పుత్రులున్ను మోషే యొద్దికిన్ని అర్చకుడయిన ఎలా
జారు యొద్దికిన్ని సంఘముయొక్క శ్రేష్ఠులయొద్దికిన్ని
3 వచ్చి చెప్పినదేమంటే, । అతారోతు, దీబోను, యజేరు,
నిమ్రా, హెష్బోను, ఎలాలే, షెబాము, నెబో, బేయో
4 ను, అనే పేరులు గలిగినటువంటివిన్ని, । ఇశ్రాయేలు
పుత్రులయొక్క సంఘము ముందర యెహోవా సం
హరించినటువంటివిన్ని యీ స్థలములు గల దేశము పశు
వులకు యుక్తమైనదై యున్నది; మీ సేవకులమయిన
5 మాకు పశువులు కలవు. । కాబట్టి మీ దృష్టికి మేము
కృప పొందిన వారమైతే మమ్మును యర్దేను నది అవ
తలకు దాటించక, మీ సేవకులమైన మాకు యీ దేశ
6 మును స్వతంత్రముగా యివ్వవలసినదని పలికిరి. । అం
దుకు మోషే గాదు పుత్రులతోనున్ను రూబేను పు
త్రులతోనున్ను చెప్పినదేమంటే, మీ సహోదరులు
యుద్ధమునకు వెళ్లుతూ వుండగా మీరు యిక్కడ స్థా
వరముగా వుండవచ్చునా? । ఇశ్రాయేలు పుత్రులకు 7
యెహోవా యిచ్చిన దేశమునకు వారు దాటి వెళ్ల
కుండా వారియొక్క హృదయములను మీరు చెదర
చేయనేల? । కాదేషబర్నేయనుంచి ఆ దేశమును చూడ 8
డానకు మీ పిత్రులను నేను పంపినప్పుడు వారున్ను
యీలాగునే చేసిరి. । యేమంటే వారు ఎష్కోలు 9
లోయకు యెక్కి వెళ్లి, ఆ దేశమును చూచిన తరువాత
ఇశ్రాయేలు పుత్రులకు యెహోవా యిచ్చిన దేశము
నకు వారు వెళ్లక వుండేటట్టుగా వారి హృదయములను
చెదర చేసిరి. । అందువల్ల ఆ దినమందు యెహోవా 10
యొక్క కోపము రగులుకొనినందున ఆయన ప్రమాణ
పూర్వకముగా చెప్పినదేమంటే, । అబ్రాహామునకున్ను 11
ఇస్సాకునకున్ను యాకోబునకున్ను నేను ప్రమాణ పూ
ర్వకముగా యిచ్చిన భూమిని మిస్రయీములోనుంచి
వెలపటికి వచ్చిన యిరువై సంవత్సరములు మొదలు
కొని అంతకు పయిని యీడు గల వారిలో చూచే
వాడు వొకడున్ను లేక పోవును గాక; యెందుకంటే
వారు నన్ను మనఃపూర్తిగా వెంబడించిన వారు కారు. ।
అయితే యిందులో కినిజ్జీయుడయిన యెఫున్నె కుమా 12
రుడు కాలేబున్ను నూను కుమారుడయిన యెహోషు
వయున్ను వీరు మాత్రమే కారు, వీరు యెహోవాను
మనఃపూర్తిగా వెంబడించిరని సెలవు యిచ్చెను. ।
అప్పుడు యెహోవాయొక్క కోపము ఇశ్రాయేలు 13
మీద రగులుకొనినందున యెహోవా దృష్టికి కీడు
చేసిన ఆ తరము వారు యావత్తూ గతించే పర్యంత
మూ అరణ్యములోనే నలుభై సంవత్సరముల మట్టుకు
వారిని ఆయన తిప్పుల పెట్టెను. । అయినప్పటికిన్ని 14
యిదుగో మీరు మీ తండ్రులకు ప్రతిగా లేచి, విస్తార
జనులయి, యెహోవాయొక్క తీక్ష్ణమయిన కోపము
ఇశ్రాయేలు మీద మరీ యధికమయ్యేటట్టు చేసే పా
పాత్ములయి వున్నారు. । యేమంటే మీరు ఆయన వెం 15
బడినుంచి మళ్లితే ఆయన తిరిగీ యీ అరణ్యములో
వారిని విడచి వేసును; కాబట్టి మీ వల్లనే యీ జను
లందరికి లయము కలుగునని చెప్పెను. । అప్పుడు వారు 16
అతని దగ్గిరకు వచ్చి చెప్పినదేమంటే, యిక్కడ మేము
మా మందల కొరకు దొడ్లనున్ను, మా చిన్నవాండ్ల
కొరకు పురములనున్ను కట్టుకొందుము. । అయినప్పటి 17
కిన్ని మేము యుద్ధ సన్నద్ధులమై, ఇశ్రాయేలు పుత్రుల
ముందర వెళ్లి, వారి స్థలములలోకి వారిని ప్రవేశింప
చేసే పర్యంతము వారితోటే వుందుము; యీ మధ్యను
యీ దేశపు కాపురస్తులకు మరుగుగా ప్రాకారములు
గల పట్టణములందు మా చిన్నవాండ్లు నివసించేటట్టు
చేతుము. । ఇశ్రాయేలు పుత్రులలో ప్రతి మనుష్యుడు 18
తన తన భూ భాగమును స్వతంత్రించుకొనే పర్యం

తము మా యిండ్ల యొద్దికి మేము తిరిగీ రాక వుందుము.।
19 యర్దేను నది తూర్పు దిక్కు యందున్న భూమి మాకు
ప్రాప్తమయిన పక్షమందు యర్దేను నది అవతల దేశ
పు భూమిని వారితో కూడా మేము స్వతంత్రించు
20 కోమని చెప్పిరి. ।అందుకు మోషే వారితో చెప్పినదే
మంటే, మీరు చెప్పినట్టు మీరందరున్ను యుద్ధ సన్న
21 ద్ధులై, । యెహోవా ముందరనుంచి యర్దేను నది
22 దాటి, యుద్ధమునకు వెళ్లి, । యెహోవా తన ముందర
నుంచి తన శత్రువులను అవతలకు వెళ్లగొట్టి దేశమును
తనకు లోపు చేసుకొనే పర్యంతమూ వుంటిరట్టాయె
నా అప్పుడు మీరు తిరిగీ వచ్చి, యెహోవా ముంద
రనున్ను ఇశ్రాయేలు ముందరనున్ను నిరపరాధులై వుం
దురు; మరిన్ని యీ భూమి యెహోవా ముందర
23 మీకు స్వతంత్రపు భాగమవును.। అయితే ఆ ప్రకా
రముగా మీరు చేయని పక్షమందు, యిదుగో, యె
హోవా విషయమై మీరు పాపము చేసిన వారవు
దురు; మరిన్ని మీ పాపమే మిమ్మును చిక్కు చేసునని
24 తెలుసుకోండీ. । అది కాకుండా మీ చిన్నవాండ్ల కొ
రకు పురములనున్ను మీ గొర్రెల కొరకు దొడ్లనున్ను
కట్టుకొని, మీరు చెప్పిన ప్రకారము చేయండని చెప్ప
25 గా; । గాదు పుత్రులున్ను రూబేను పుత్రులున్ను మో
షేతో చెప్పినదేమంటే, నీ సేవకులమైన మేము మా కర్త
26 వైన నీవు సెలవు యిచ్చిన ప్రకారము చేతుము. । మా
మా చిన్నవాండ్లున్ను మా భార్యలున్ను మా మందల
తోనున్ను మా పశువులన్నిటితోనున్ను గిలాదు దేశ
ములో వున్న పట్టణములందు వుంటూ వుందురు. ।
27 అయితే నీ సేవకులమయిన మేమందరమున్ను యుద్ధ
సన్నద్ధులమై, మా కర్తవైన నీవు చెప్పినట్టు యుద్ధము
చేసుటకు యెహోవా ముందరనుంచి నది దాటి వెళ్లు
28 దుమని చెప్పిరి.।అయినందున వీరిని గురించి మోషే అర్చ
కుడయిన ఎలాజారుకున్ను నూను కుమారుడయిన యె
హోషువకున్ను ఇశ్రాయేలు పుత్రుల గోత్రములయొ
క్క పెద్దలలో ప్రధానులకున్ను ఆజ్ఞాపించినదేమంటే,।
29 గాదు పుత్రులున్ను రూబేను పుత్రులున్ను యుద్ధము
చేసుటకు సిద్ధమై, మీతో కూడా యెహోవా ముం
దరనుంచి యర్దేను నదిని దాటిన పక్షమందున్ను, ఆ
దేశము మీ కింద యున్న పక్షమందున్ను, మీరు వారికి
గిలాదు దేశమును స్వతంత్రించుకొనే లాగున యివ్వ
30 వలసినది. । అయితే వారు యుద్ధమునకు సిద్ధపడక,
మీతో కూడా నది దాటక వున్న పక్షమందు, వారికి
భూ భాగములు మీతో కెనయను దేశమందు వుండు
31 నని చెప్పినప్పుడు, । గాదు పుత్రులున్ను రూబేను
పుత్రులున్ను చెప్పినదేమంటే, నీ సేవకులమైన మాకు
యెహోవా యే ప్రకారము సెలవు యిచ్చెనో ఆ
ప్రకారము మేము చేతుము. । యర్దేను నది యివతల 32
వున్న భాగమునే మేము స్వతంత్రించుకొనేటట్టుగా
మేము యుద్ధ సన్నద్ధులమయి, యెహోవా ముందర
నుంచి నది దాటి కెనయను దేశమునకు వెళ్లుదుమని
చెప్పిరి. । అప్పుడు మోషే గాదు పుత్రులకున్ను రూ 33
బేను పుత్రులకున్ను యోసేపు కుమారుడయిన మనస్సే
యొక్క గోత్రములో సగము మందికిన్ని అమోరీయుల
రాజైన సీహోనుయొక్క రాజ్యమునున్ను, బాషాను
రాజైన ఓగుయొక్క రాజ్యమునున్ను యిచ్చెను: యీ
దేశమును దాని సరిహద్దులలోనున్న పట్టణములతోను
న్ను చుట్టూ వున్న పురములతోనున్ను యిచ్చెను. ।
అంతట గాదు పుత్రులు దీబోను, అతారోతు, అరో 34
యేరు, । అత్రోతు, షోఫాను, యజేరు, యొగ్బెహా, । 35
బేత్నిమ్రా, బేతారాను, అనే పేళ్లు గల ప్రాకార 36
పట్టణములనున్ను, గొర్రెల దొడ్లనున్ను తిరిగీ కట్టిరి. ।
మరిన్ని రూబేను పుత్రులు హెష్బోను, ఎలాలే, కిర్యా 37
తయీము, । నెబో, బయల్మెయోను, శిబ్మా, అన్న పేర్లు 38
గల పట్టణములను తిరిగీ కట్టిరి: అయితే యీ పేరులను
మానివేసి తాము కట్టిన పట్టణములకు వేరే పేరులను
పెట్టిరి. । మనస్సే కుమారుడైన మాఖీరు పుత్రులు గిలా 39
దుకు వెళ్లి అందులో వున్న అమోరీయులను బయిటకు
వెళ్లకొట్టి, దానిని స్వాధీనముగా చేసుకొనినందున, ।
మోషే మనస్సే కుమారుడయిన మాఖీరుకు గిలాదును 40
యిచ్చెను, గనుక, అతడు అందులో కాపురము చేసె
ను. । మరిన్ని మనస్సే కుమారుడయిన యాయీరు వెళ్లి, 41
దానియొక్క గ్రామములను స్వతంత్రించుకొని, వా
టికి యాయీరు గ్రామములనే పేరు పెట్టెను. । మరి 42
న్ని నోబహు వెళ్లి కెనాతు పట్నమునున్ను దాని
గ్రామములనున్ను స్వతంత్రించుకొని, దానికి తన పేరు
చొప్పున నోబహు అని పిలిచినాడు.

## 33. అధ్యాయము.

మోషేయొక్కాయున్ను అహరోనుయొక్క 1
యున్ను చేతి కింద మిస్రయీము దేశములోనుంచి
తమ సమూహములతో వెలపటికి వచ్చిన ఇశ్రాయేలు
పుత్రులయొక్క ప్రయాణములు యివే. । మోషే యె 2
హోవా యిచ్చిన ఆజ్ఞా ప్రకారము వారి ప్రయాణ
ముల ప్రకారమైన నడకలను వ్రాసెను; వారు వెళ్లిన
ప్రయాణములు యేమిటేమిటంటే, । వారు మొదటి 3
నెల పదిహేనో దినమున రమెసేసులోనుంచి బైలు
దేరిరి: పస్కా దినము మరునాటి యందు ఇశ్రాయేలు
పుత్రులు మిస్రీయులందరున్ను చూస్తూ వుండగా
వున్నతమయిన హస్తముచేత బయిలుదేరిరి. । యేమంటే 4
మిస్రీయులలో యెహోవా సంహరించిన వారియొ

క్కు ప్రథమ పుత్రులను వారు పాతి పెట్టుకుంటూ
వుండిరి; మరిన్ని వారి దేవుండ్ల మీదనున్న యెహో
5 వా న్యాయములను తీర్చెను. । అప్పుడు ఇశ్రాయేలు
పుత్రులు రమెసేసునుంచి తర్లి, సుక్కోతుకు వచ్చి
6 పేట వేసుకొనిరి. । సుక్కోతునుంచి తర్లి, అరణ్యము
7 కడనున్న ఏతాముకు వచ్చి, పేట వేసుకొనిరి. । ఏతా
మునుంచి తర్లి, బయల్సెపోను యెదుటనున్న పీహ
హీరోతు తట్టు వెళ్లి, మిగ్దోలు ముందరకు వచ్చి పేట
8 వేసుకొనిరి. । పీహహీరోతునుంచి తర్లి, సముద్ర
మధ్యములోనుంచి పోయి, అరణ్యములోకి వచ్చి, ఏతా
ము అరణ్యములో మూడు రోజుల పైనము నడచి,
9 మారాకు వచ్చి పేట వేసుకొనిరి. । మారానుంచి
తర్లి, యేలీముకు వచ్చిరి; యేలీములో నీటి జలలు
పండెండున్ను ఖర్జూరపు చెట్లు డెబ్బయిన్ని కలవు,
10 గనుక, అక్కడ పేట వేసుకొనిరి. । ఏలీమునుంచి
తర్లి, యెర్ర సముద్రము దగ్గిరకు వచ్చి పేట వేసు
11 కొనిరి. । యెర్ర సముద్రమునుంచి తర్లి, సీను అరణ్య
12 ములోకి వచ్చి, పేట వేసుకొనిరి. । సీను అరణ్యము
లోనుంచి తర్లి, దొప్కాకు వచ్చి, పేట వేసుకొనిరి. ।
13 దొప్కానుంచి తర్లి, ఆలూషుకు వచ్చి, పేట వేసు
14 కొనిరి. । ఆలూషునుంచి తర్లి, రెఫీదీముకు వచ్చి, పేట
వేసుకొనిరి: అక్కడ జనులకు తాగుటకు నీళ్లు లేక
15 వుండెను. । రెఫీదీమునుంచి తర్లి, సీనై అరణ్యములోకి
16 వచ్చి, పేట వేసుకొనిరి. । సీనై అరణ్యమునుంచి తర్లి,
17 కిబ్రోథత్తయవాకు వచ్చి, పేట వేసుకొనిరి. । కిబ్రోథత్త
యవానుంచి తర్లి హస్సెరోతుకు వచ్చి, పేట వేసు
18 కొనిరి. । హస్సెరోతునుంచి తర్లి, రిత్మాకు వచ్చి, పేట
19 వేసుకొనిరి. । రిత్మానుంచి తర్లి, రిమోన్పెరెస్సుకు
20 వచ్చి, పేట వేసుకొనిరి. । రిమోన్పెరెస్సునుంచి తర్లి,
21 లిబ్నాకు వచ్చి, పేట వేసుకొనిరి. । లిబ్నానుంచి తర్లి,
22 రిస్సాకు వచ్చి, పేట వేసుకొనిరి. । రిస్సానుంచి తర్లి,
23 కెహేలాతాకు వచ్చి, పేట వేసుకొనిరి. । కెహేలా
తానుంచి తర్లి, షాఫెరుకు వచ్చి, పేట వేసుకొనిరి. ।
24 షాఫెరునుంచి తర్లి, హరాదాకు వచ్చి, పేట వేసు
25 కొనిరి. । హరాదానుంచి తర్లి, మఖేలోతుకు వచ్చి,
26 పేట వేసుకొనిరి. । మఖేలోతునుంచి తర్లి, తహ
27 తుకు వచ్చి, పేట వేసుకొనిరి. । తహతునుంచి తర్లి,
28 తారహుకు వచ్చి, పేట వేసుకొనిరి. । తారహునుంచి
29 తర్లి, మిత్కాకు వచ్చి, పేట వేసుకొనిరి. । మిత్కా
నుంచి తర్లి, హష్మోనాకు వచ్చి, పేట వేసుకొనిరి. ।
30 హష్మోనానుంచి తర్లి, మొసేరోతుకు వచ్చి, పేట వేసు
31 కొనిరి. । మొసేరోతునుంచి తర్లి, బెనేయాకానుకు
32 వచ్చి, పేట వేసుకొనిరి. । బెనేయాకానునుంచి తర్లి,
హోర్గిద్గాదు పర్వతమునకు వచ్చి, పేట వేసుకొ
నిరి. । హోర్గిద్గాదు పర్వతమునుంచి తర్లి, యొ 33
థ్బాతాకు వచ్చి, పేట వేసుకొనిరి. । యొథ్బాతానుంచి 34
తర్లి, ఎబ్రోనాకు వచ్చి, పేట వేసుకొనిరి. । ఎబ్రో 35
నానుంచి తర్లి, ఎస్యోన్గెబెరుకు వచ్చి, పేట వేసు
కొనిరి. । ఎస్యోన్గెబెరునుంచి తర్లి, సీను అరణ్యము 36
లోకి వచ్చి, పేట వేసుకొని: దీనికి కాదేషు అని పేరు
కలదు. । మరిన్ని కాదేషునుంచి తర్లి, ఎదోము దేశ 37
ము సరిహద్దున వున్న హోరు పర్వతమునకు వచ్చి,
పేట వేసుకొనిరి. । అప్పుడు అర్చకుడయిన అహరోను 38
మిస్రయీము దేశములోనుంచి ఇశ్రాయేలు పుత్రులు
బయిలుదేరి వచ్చిన నలుబైయో సంవత్సరముయొక్క
అయిదో నెల మొదటి దినమున యెహోవా ఆజ్ఞా
ప్రకారము హోరు పర్వతము మీదికి యెక్కి అక్కడ
మరణమాయెను. । అహరోను హోరు పర్వతమందు 39
మరణమాయనప్పటికి నూట యిరువై మూడు సంవత్స
రములు గలవాడై యుండెను. । మరిన్ని కెనయను దేశ 40
ముయొక్క దక్షిణ దిక్కు యందు నివాసముచేసే కెన
యానీయుడయిన ఆరాదు రాజుకు ఇశ్రాయేలు పుత్రు
లు వచ్చిన సంగతి వినబడెను. । తరువాత వారు హోరు 41
పర్వతమునుంచి సల్మోనాకు వచ్చి, పేట వేసుకొనిరి. ।
సల్మోనానుంచి తర్లి, పూనోనుకు వచ్చి, పేట వేసు 42
కొనిరి. । పూనోనునుంచి తర్లి, ఒబోతుకు వచ్చి, 43
పేట వేసుకొనిరి. । ఒబోతునుంచి తర్లి, మోయాబు 44
దేశపు సరిహద్దు దగ్గిర వున్న ఈయేయ బారీముకు వచ్చి,
పేట వేసుకొనిరి. । ఈయీమునుంచి తర్లి దీబోను 45
గాదుకు వచ్చి, పేట వేసుకొనిరి. । దీబోను-గాదునుంచి 46
తర్లి, అల్మోందిబ్లాతయీముకు వచ్చి, పేట వేసుకొని
రి. । అల్మోందిబ్లాతయీమునుంచి తర్లి, నెబో యెదు 47
టనున్న అబారీము కొండలకు వచ్చి, పేట వేసుకొనిరి. । 48
అబారీము కొండలనుంచి తర్లి, యెరిఖో పట్టణపు
యర్దేను నదీ సమీపమైన మోయాబు మైదానములకు
వచ్చి, పేట వేసుకొనిరి. । అయితే వారు మోయాబు 49
మైదానములందు బేత్యెషీమోతు దగ్గిరనుంచి ఆబేలు
షిద్ధీము మట్టుకు యర్దేను నదీ ప్రాంతమందు పేట వేసు
కొనిరి. । యెరిఖో పట్టణపు యర్దేను నదీ సమీపమైన 50
మోయాబు మైదానములందు యెహోవా మోషేకు
సెలవు యిచ్చిన ప్రకారము, । నీవు ఇశ్రాయేలు పుత్రు 51
లను చూచి చెప్పవలసినదేమంటే, మీరు యర్దేను
నది దాటి కెనయను దేశములోకి వచ్చిన తరువాత, ।
ఆ దేశములో కాపురస్తులనందరినిన్ని మీ ముందర 52
నుంచి అవతలకు వెళ్లదోలి, వారియొక్క ప్రతిమలన
న్నిటినిన్ని వారియొక్క పోత విగ్రహముల నన్నిటి
నిన్ని లయముచేసి, వారి ఉన్నతమైన స్థలములన్నిటి
నిన్ని సర్వనాశనము చేయ వలసినది. । మరిన్ని వారిని 53

బయిటకు వెళ్లగొట్టిన తరువాత మీరు దాని యందు
నివాసము చేయ వలెను; యేమంటే ఆ దేశమును మీరు
54 స్వతంత్రించుకొనేటట్టు యిస్తిని. । మరిన్ని మీ యింటి
కూటముల చొప్పున మీరు చీట్లు వేసుకొని ఆ దేశ
మును స్వతంత్రించుకో వలసినది: అధికమయిన వారికి
విస్తారమయిన భూమినిన్ని; కొంచెమైన వారికి కొం
చెమైన భూమినిన్ని స్వాధీనము చేయ వలెను; ప్రతి
మనుష్యునియొక్క చీటిన్ని యే స్థలమందు పడునో
అతని భూ భాగము ఆ స్థలమందు వుండ వలెను; పితృ
లయొక్క గోత్రము చొప్పున మీరు స్వతంత్రించుకో
55 వలసినది. । అయితే మీ ముందరనుంచి మీరు ఆ దేశపు
కాపురస్తులను బయిలు వెళ్లగొట్టని పక్షమందు వారిలో
శేషించిన వారు మీ కండ్లకు ముండ్లుగానున్ను మీ
పక్కలకు శూలములుగానున్ను వుండి, మీరు నివాస
56 ము చేసే దేశమందు మిమ్మును పీడ పెట్టుదురు. । మరిన్ని
యే చొప్పున వారిని చేయదలచి వుంటినో ఆ చొ
ప్పున నేను మిమ్మును చేతునని చెప్పుమని సెలవు
యిచ్చెను.

## 34. అధ్యాయము.

1 మరిన్ని ఇశ్రాయేలు పుత్రులకు ఆజ్ఞాపించి చెప్పు
మని యెహూవా మోషేకు సెలవు యిచ్చినదేమంటే. ।
2 కెనయను దేశము దాని సరిహద్దులతో మీకు స్వాధీ
నముగా ప్రాప్తమవును, మీరు ఆ కెనయను దేశము
3 లోకి ప్రవేశించిన తరువాతను, । మీ దక్షిణపు సరి
హద్దు సీను అరణ్యము మొదలుకొని ఎదోము దేశము
మట్టుకు సాగినదవును; మరిన్ని మీ దక్షిణపు సరిహద్దు
వుప్పు సముద్రపు అంచునుంచి తూర్పు దిక్కుతట్టు
4 సాగును. । మరిన్ని మీ సరిహద్దు దక్షిణపు దిక్కునుంచి
తిరిగి, అక్రబ్బీముయొక్క యెక్కుడుకు వచ్చి, సీను
మట్టుకు సాగినదవును; అప్పుడు దక్షిణపు దిక్కునుంచి
సాగి కాదేషబర్నెయమట్టుకు వచ్చి, అక్కడనుంచి
హస్సరద్దారుకు వచ్చి, అస్మోనా మట్టుకు సాగినదవును. ।
5 అప్పుడు యీ సరిహద్దు అస్మోనానుంచి తిరిగి, మిస్ర
యీము నదియొద్దికి వెళ్లి, సముద్రముమట్టుకు సాగును. ।
6 పశ్చిమ దిక్కు సరిహద్దు యేలాగంటే, గొప్ప సము
ద్రము మీకు సరిహద్దౌను; అదే మీకు పశ్చిమపు సరి
7 హద్దౌను. । మీ వుత్తర దిక్కు సరిహద్దు యేలాగంటే,
గొప్ప సముద్రమునుంచి హోరు పర్వతము మట్టుకు
8 మీ నూలు సాగించ వలెను. । మరిన్ని హోరు పర్వ
తమునుంచి హామాతు ద్వారము మట్టుకు నూలు సా
గించ వలెను; అక్కడనుంచి సరిహద్దు సెదాదు మట్టుకు
9 సాగివుండును. । అక్కడనుంచి సరిహద్దు జిప్రోను పర్యం
తమూ వచ్చి, దానిని విడచి, హస్సరేనాను మట్టుకు
సాగును; యిది మీకు వుత్తర దిక్కు సరిహద్దౌను. ।
మరిన్ని మీకు తూర్పు సరిహద్దు కావడానకు హస్స 10
రేనానునుంచి షెఫాము మట్టుకు నూలు సాగించ
వలెను. । మరిన్ని యీ సరిహద్దు షెఫామునుంచి అయ్యీ 11
ను పట్టణపు తూర్పు దిక్కులో వున్న రిబ్లా మట్టుకు
దిగును; అక్కడనుంచి యీ సరిహద్దు దిగి, తూర్పు
దిక్కులో వున్న కిన్నెరెతు సముద్రము మట్టుకు సా
గును. । మరిన్ని అక్కడనుంచి సరిహద్దు యర్దేను 12
నదికి దిగి, వుప్పుసముద్రము మట్టుకు సాగును; యీ
సరిహద్దులతో చుట్టూ వున్న దేశము మీదై వుండు
నని చెప్పుమని సెలవు యిచ్చెను. । అందున మోషే 13
ఇశ్రాయేలు పుత్రులకు ఆజ్ఞాపించినదేమంటే, యీ
దేశము మీరు చీట్లు వేసుకొనుటవల్లను స్వతంత్రించు
కొనే దేశమై యున్నది; కాబట్టి యిది తొమ్మిది గో
త్రాలు నరమందికి యిమ్మని యెహూవా ఆజ్ఞాపించెను. ।
యేమంటే, రూబేను పుత్రులు తమ పితృలయొక్క 14
యింటి కూటముల చొప్పుననున్ను, గాదు పుత్రులు
తమ పితృలయొక్క యింటి కూటముల చొప్పుననున్ను
భూ భాగములను పొందిరి: మరిన్ని మనస్సేయొక్క
గోత్రములో సగము మందికి భూ భాగములు కలిగి
వుండెను. । యీ రెండు గోత్రములు నరమందిన్ని తమ 15
భూ భాగములను యెరిఖో పట్టణమునకు సమీపము
గా వున్న యర్దేను నది యివతలనున్న తూర్పు
దిక్కులో పొందిన వారైరని చెప్పెను. । తరువాత యె 16
హూవా మోషేకు మరిన్ని సెలవు యిచ్చినదేమంటే, ।
ఆ దేశమును మీకు పాళ్లువేసి పంచిపెట్టే వారు యె 17
వరెవరంటే, అర్చకుడయిన ఎలాజారున్ను, నూను కుమా
రుడైన యెహూషువయున్ను, । మరిన్ని ఆ దేశమును 18
మీకు పంచి పెట్టడానకు ప్రతి గోత్రములోనుంచి
వొకొక్క శ్రేష్ఠుని పిలుచుకో వలెను. । ఆ మనుష్య 19
లు యెవరెవరంటే, యూదా గోత్రములో యెఫున్నె
కుమారుడైన కాలేబున్ను: । షిమోను పుత్రుల గోత్ర 20
ములో అమ్మీహూదు కుమారుడైన షెమూయేలున్ను: ।
బెన్యామీను గోత్రములో కిస్లోను కుమారుడైన ఎలీ 21
దాదున్ను: । దాను పుత్రుల గోత్ర శ్రేష్ఠుడు యొగ్లీ 22
కుమారుడైన బుక్కీయున్ను: । మనస్సే పుత్రుల గోత్ర 23
ము కొరకు యోసేపు పుత్ర శ్రేష్ఠుడు ఏఫోదు కుమా
రుడైన హన్నీయేలున్ను: । ఎఫ్రయీము పుత్రుల గోత్ర 24
శ్రేష్ఠుడు షిప్తాను కుమారుడైన కెమూయేలున్ను: ।
జెబూలోను పుత్రుల గోత్ర శ్రేష్ఠుడు పర్నాఖు కుమా 25
రుడైన ఎలీస్సాఫానున్ను: । ఇశ్శాఖారు పుత్రుల గోత్ర 26
శ్రేష్ఠుడు అజ్జాను కుమారుడైన పల్తీయేలున్ను: । ఆషేరు 27
పుత్రుల గోత్ర శ్రేష్ఠుడు షెలోమీ కుమారుడైన అహీ
హూదున్ను: । నఫ్తాలీ పుత్రుల గోత్ర శ్రేష్ఠుడు అమ్మీ 28

29 హూదు కుమారుడైన పెదహేలున్ను: । వీరు కెనయను
దేశములో ఇశ్రాయేలు పుత్రులకు పాళ్లు పంచి పెట్టు
టకు యెహోవా చేత నిర్ణయించపడిన వారై వుండిరి.

## 35. అధ్యాయము.

1 మరిన్ని యెహోవా యెరిఖో పట్టణపు యర్దేా
ను నదీ సమీపమయిన మోయాబు మయిదానములలో
2 మోషేకు సెలవు యిచ్చిన ప్రకారము, । నీవు ఇశ్రా
యేలు పుత్రులకు ఆజ్ఞాపించ వలసినదేమంటే, వారు
తమకు స్వాధీనమయ్యే దేశములో లేవీయులకు కాపు
రము చేయడానకు పట్టణములను యివ్వ వలసినది.
అదిన్నిగాక మీరు ఆ పట్టణముల చుట్టూ వున్న భూ
3 ములను లేవీయులకు యివ్వ వలెను. । యేమంటే,
ఆ పట్టణములు వారికి నివసించే కొరకై వుండును;
అయితే వాటి చుట్టూ వున్న భూములు వారి పశువుల
కొరకున్ను వారి సొమ్ముల కొరకున్ను వారి మృగముల
4 న్నిటి కొరకున్ను వుండును. । కాబట్టి మీరు లేవీయు
లకు యిచ్చే పట్టణముల చుట్టూ వున్న భూములు పట్ట
ణపు గోడ మొదలుకొని వేయి మూళ్ల మట్టుకు చుట్టూ
5 వుండ వలెను. । అయినందున మీరు ప్రతి పట్టణపు
బయిలున్ను తూర్పు దిక్కుకు రెండువేల మూళ్లున్ను,
దక్షిణపు దిక్కుకు రెండువేల మూళ్లున్ను, పశ్చిమ
దిక్కుకు రెండు వేల మూళ్లున్ను, ఉత్తర దిక్కుకు రెండు
వేల మూళ్లున్ను, వుండేటట్టు కొలువ వలెను; మధ్యను
ఆ పట్టణము వుండ వలెను; యిది వారి పట్టణముల
6 చుట్టూ భూమి అయి వుండును. । అయితే లేవీయు
లకు మీరు యిచ్చే పట్టణములలో ఆరు పట్టణములు
ఆశ్రయము కొరకు వుండ వలెను; వీటిని మీరు నరుని
చంపిన వాడు పరుగెత్తి వెళ్లుటకు నిర్ణాయించ వలసి
నది; యిదిగాక మీరు యింకా నలుబై రెండు పట్టణ
7 ములను వారికి యివ్వ వలెను. । యీలాగున లేవీయు
లకు మీరు యిచ్చే పట్టణములు అన్నిన్ని నలుబై యెని
మిది పట్టణములయి వుండును; వీటినిన్ని వీటి కింద
8 నున్న భూములనున్ను యివ్వ వలసినది. । యీ పట్టణ
ములను మీరు ఇశ్రాయేలు పుత్రులయొక్క భూము
లలోనుంచి యివ్వ వలెను; అనేకము గలవారి యొద్ద
అనేకమునున్ను, కొంచెము గలవారి యొద్ద కొంచెము
నున్ను పుచ్చుకొని యియ్య వలెను: ప్రతి గోత్ర
మున్ను దాని దాని భూమి ప్రకారము లేవీయులకు
9 పట్టణములను యివ్వ వలెనని సెలవు యిచ్చెను. । అయి
తే యెహోవా మరిన్ని మోషేకు సెలవు యిచ్చిన
10 ప్రకారము, । నీవు ఇశ్రాయేలు పుత్రులను చూచి
ఆజ్ఞాపించ వలసినదేమంటే, మీరు యర్దేాను నదీ
దాటి కెనయను దేశములో ప్రవేశించిన మీదట, ।
అజ్ఞాన కృతముగా వొకని చంపిన వాడు వాటిలోకి 11
పరుగెత్తి వెళ్లగలందులకు ఆశ్రయమైన పట్టణములను
మీరు నిర్ణాయించ వలెను. । యేమంటే యివి మీకు 12
ఆశ్రయ పట్టణములై, నరుని చంపిన వాడు విమర్శాపడ
డానకు సంఘము ముందర నిలువపడక మునుపే ప్రతి
హతి చేసే వానివల్లను చావకుండా తప్పించుకొని పోవ
డానకు వుండును. । కాబట్టి మీరు యిచ్చే పట్టణములలో 13
ఆరు పట్టణములు మీకు ఆశ్రయ పట్టణములై వుండు
ను. । యర్దేాను నది యివతల మూడు పట్టణములనున్ను, 14
కెనయను దేశములో మూడు పట్టణములనున్ను, మీకు
ఆశ్రయ పట్టణములయ్యేటట్టుగా నిర్ణాయించుకో
వలెను. । యీ ఆరు పట్టణములున్ను అజ్ఞానకృతముగా 15
వొకని చంపిన వాడు వాటిలో వొక దానిలోకి పరు
గెత్తి రావడానకు ఇశ్రాయేలు పుత్రుల కొరకున్ను
పరదేశి కొరకున్ను వారిలో నివాసము చేసే వాని
కొరకున్ను ఆశ్రయ స్థలములుగా వుండ వలెను. । అయి 16
తే వొకడు యినుప సరుకుతోను వొకని కొట్టినందున
వాడు చచ్చిపోతే, వాడు నరహంతకుడై యుండును; ఆ
నరహంతకుడు నిశ్చయముగా చంపబడ వలెను. । మ 17
రిన్ని వొకడు వొకని చంప వలెనని రాయి విసరినందున
వాడు చస్తే, వాడు నరహంతకుడుయై యుండును; ఆ
నరహంతకుడు నిశ్చయముగా చంపబడ వలెను. । మరి 18
న్ని వొకడు చేకర్ర పట్టుకొని వొకని చంప వలెనని
కొట్టినందున వాడు చస్తే, వాడు నరహంతకుడై యుం
డును; ఆ నరహంతకుడు నిశ్చయముగా చంపబడ వలె
ను. । రక్తమునకు ప్రతి క్రియ చేసే వాడే ఆ నరహం 19
తకుని చంప వచ్చును; యెప్పుడు వాడు వీనికి దొరు
కునో అప్పుడు వీడు వానిని చంప వచ్చును. । మరిన్ని 20
వొకడు పగ కలిగి వొకని పొడిచియైనా, లేక పొంచి
వుండి వాని మీద యేదైనా వేసి అయినా, । వైరము 21
వల్ల తన హస్తము చేత వానిని కొట్టియైనా, చంపితే,
కొట్టిన వాడు నిశ్చయముగా చంపబడ వలెను; యే
మంటే వాడు నరహంతకుడై యున్నాడు; రక్తమునకు
ప్రతి క్రియ చేసే వాడు వాడు తారసిల్లినప్పుడు వాని
చంప వచ్చును. । అయితే వొకడు పగ లేకుండా మరి 22
వొకని హఠాత్తుగా పొడిచియైనా, పొంచి వుండకుం
డా వాని మీద యేదైనా వేసియైనా, । మనుష్యుడు 23
చచ్చే రాయి వాని మీద పడవేసి అయినా చంపితే,
వీడు వానికి శత్రువుడు కానందుననున్ను, మోసము
చేయ తలచ లేనందుననున్ను, । సంఘపువారు వానికిన్ని 24
రక్తమునకు ప్రతి క్రియ చేసేవానికిన్ని యీ న్యాయ

25 పద్ధతుల చొప్పున తీర్చవలసినది. । యీలాగున సం
ఘపువారు రక్తమునకు ప్రతి క్రియ చేసే వాని చేతు
లలోనుంచి చంపిన వానిని విడిపించి, యే ఆశ్రయ
పట్టణమునకు వాడు వెళ్లెనో తిరిగీ వానిని ఆ పట్టణ
మునకు పంపించ వలసినది; అక్కడ వాడు పరిశుద్ధ
తైలముచేత అభిషేకమును పొందిన ప్రధానార్చకుడు
26 మరణమయ్యే పర్యంతమూ వుండ వలసినది. । అయితే
చంపిన వాడు వొకవేళ తాను పారిపోయి, తన ఆశ్ర
27 య పట్టణపు సరిహద్దు యివతలకు వచ్చినప్పుడు, । రక్త
మునకు ప్రతి క్రియ చేసే వానికి తన ఆశ్రయ పట్ట
ణపు సరిహద్దు యివతల తాను దొరికితే, రక్తమునకు
ప్రతి క్రియ చేసే వాడు ఆ చంపిన వానిని నరికి వేసి
నప్పటికిన్ని రక్త దోషము వానికి తగలక పోవును. ।
28 యెందుకంటే వాడు తన ఆశ్రయ పట్టణమందు ప్రధా
నార్చకుడు మరణమయ్యే పర్యంతమూ వుండ వలసి
నది; వుండి ప్రధానార్చకుడు మరణమైన తరువాత
చంపినవాడు తన స్వస్థలమునకు తిరిగీ రావచ్చును. ।
29 యీ నిర్ణయములు మీ కాపురములన్నిటి యందూ
మీ తర తరముల మట్టుకు మీకు న్యాయ నిర్ణయ
30 ములై వుండ వలసినది. । యెవడైనా వొకని చంపితే చం
పినవాడు సాక్షుల వాఙ్మూలమువల్ల మరణశిక్షను పొంద
వలసినది; అయితే ఏక సాక్ష్యమువల్లను యెవనినీ మర
31 ణమును పొందించ కూడదు. । మరణమునకు పాత్రు
డయిన నరహంతకునియొక్క ప్రాణికి బదులుగా తప్ప
పుచ్చుకో కూడదు; వాడు నిశ్చయముగా మరణ శిక్షను
32 పొంద వలసినది. । మరిన్ని ఆశ్రయ పట్టణమునకు పరు
గెత్తి వెళ్లినవాడు అర్చకుడు మరణము కాక మునుపే
తన భూమికి తిరిగీ వెళ్లి నివాసము చేసేటట్టుగా వాని
33 యొద్ద తప్ప పుచ్చుకో కూడదు. । మీకు కాపురమైన
దేశమును మీరు అపవిత్రము చేయకుండా యీలా
గున వుండ వలెను; యేమంటే, రక్తము దేశమును అప
విత్రము చేసును, మరిన్ని దేశము తనలో చిందిన రక్త
మునుంచి చిందచేసిన వాని రక్తముచేతనే గాని పవి
34 త్రము కాకపోవును. । కాబట్టి నేను నివాసము చేసే
టటువంటిన్ని మీకు కాపురమయ్యేటటువంటిన్ని దేశ
మును మీరు అపవిత్రము చేయకుండా వుండుదురు
గాక; యేమంటే, యెహోవాను అయిన నేను ఇశ్రా
యేలు పుత్రులలో నివాసినై యున్నానని చెప్పుమని
సెలవు యిచ్చెను.

## 36. అధ్యాయము.

1 యోసేపుకు మనస్సే పుట్టెను; మనస్సేకు మాఖీరు
పుట్టెను; మాఖీరుకు గిలాదు పుట్టెను; గిలాదుయొక్క
యింటి కూటములకు ప్రధానులైన పెద్దలు మోషే యొ
ద్దికి వచ్చి, అతని ముందరనున్న ఇశ్రాయేలు పుత్రు
లకు ప్రధానులుగా వున్న పెద్దలైన శ్రేష్ఠుల ముందర
నున్ను చెప్పినదేమంటే, । యెహోవా దేశమును ఇశ్రా 2
యేలు పుత్రులకు చీట్లు వేసి పాళ్లు పంచి స్వాధీనప
ర్చుమని మా కర్తనైన నీకు ఆజ్ఞాపించెను, మరిన్ని మా
కర్తవైన నీవు మా సహోదరుడైన సెలోపెహాదు
యొక్క భూ భాగమును అతని కుమార్తెలకు యి
మ్మన్న ఆజ్ఞ యెహోవా యొద్దనుంచి పుచ్చుకొంటివి. ।
కాబట్టి వారు ఇశ్రాయేలు పుత్రులలో అన్య గోత్రి 3
కులతోను వివాహమును చేసుకొన్నట్టయితే వారి భా
గము మా పితృలయొక్క భాగములోనుంచి కేటా
అయి, యే గోత్రములోకి వారు వెళ్లుదురో ఆ గోత్ర
ముయొక్క భాగముతో కలుసుకొనును; యీలాగున
అది మాయొక్క భాగములలోనుంచి వేరై పోవును. ।
మరిన్ని ఇశ్రాయేలు పుత్రులకు విమోచన సంవత్సర 4
ము వచ్చినప్పుడు వారి భాగము వారు వెళ్లిన గోత్ర
ముయొక్క భాగములో కలసి వుండును; యీలాగున
వారియొక్క భాగము మా పితృల గోత్రముయొక్క
భాగములోనుంచి వేరౌనని చెప్పిరి. । అందుకు మోషే 5
యెహోవాయొక్క ఆజ్ఞా ప్రకారము ఇశ్రాయేలు
పుత్రులకు చెప్పినదేమంటే, యోసేపు పుత్రులయొక్క
గోత్రికులు చెప్పిన మాటలు బాగా వున్నవి. । అయినం 6
దున యెహోవా సెలోపెహాదుయొక్క కుమార్తె
లను గురించి ఆజ్ఞాపించేదేమంటే, వారు తమకు అను
కూలమైన వారితోను వివాహము చేసుకో వచ్చును;
అయినప్పటికిన్ని వారి పితృలయొక్క గోత్రమైన యిం
టి కుటుంబములోనే గాని వేరే వివాహము చేసుకో
కూడదు. । యీలాగున ఇశ్రాయేలు పుత్రులయొక్క 7
భూ భాగములు యీ గోత్రమునుంచి యీ గోత్రము
నకు తిరిగీ పోనేరవు, యేమంటే, ఇశ్రాయేలు పుత్రు
లలో ప్రతి మనుష్యుడు తన తన పితృ గోత్రము
యొక్క భాగముతో కూడి వుండవలసినది. । మరిన్ని 8
ఇశ్రాయేలు పుత్రులయొక్క గోత్రములలో దేని
యందైనా స్త్రీకి భూ భాగము కలిగినట్టయితే, అది
తన తండ్రి గోత్రముయొక్క యింటి కూటములలో
వొకనితో వివాహము చేసుకో వలెను; అయినందువల్ల
ఇశ్రాయేలు పుత్రులందరున్ను వారి వారి పితృలయొ
క్క భూ భాగములను అనుభవింతురు. । యేమంటే 9
భూ భాగము యీ గోత్రమునుంచి యీ గోత్రము
నకు తిరిగీ పోకుండా ఇశ్రాయేలు పుత్రులలో ప్రతి
మనుష్యుడు తన తన భాగముతో కూడి వుండ వలె
నని ఆజ్ఞాపించెనని చెప్పెను. । సెలోపెహాదుయొక్క 10

కుమార్తెలు యెహోవా మోషేకు ఆజ్ఞాపించిన
11 ప్రకారము చేసిరి. । యేలాగంటే మహ్లా, తిర్సా, హో
గ్లా, మిల్కా, నోయా, అనే పేరులు గల సెలొఫె
హాదుయొక్క కుమార్తెలు తమ పిన తండ్రులయొక్క
12 కుమారులతోను వివాహము చేసుకొనిరి. । యీలాగున
వారు యోసేపు కుమారుడైన మనస్సే పుత్రులయొక్క
యింటి కుటుంబములలో వివాహము చేసుకొన్నందున
వారియొక్క భూ భాగము వారి తండ్రియొక్క గో
త్రమైన యింటి కూటములో వుండెను. । యివి యెరి 13
ఖో యర్దాను నదీ సమీపమున మోయాబు మైదాన
ములందు ఇశ్రాయేలు పుత్రులకు మోషేచేత యెహో
వా ఆజ్ఞాపించిన న్యాయ నిర్ణయములై యున్నవి.

# ద్వితీయోపదేశకాండము

అనగా

# మోషే ఐదవ గ్రంథము.

## 1. అధ్యాయము.

1 యర్దేను నది యివతలి అరణ్యములో, పారాను,
తోఫెలు, లాబాను, హస్సెరోతు, దీజాహాబు అనే
స్థలముల మధ్యమందు సుఫుతట్టు వున్న మైదానములో
మోషే ఇశ్రాయేలు వారందరికీ చెప్పిన మాటలు యివి.।
2 హోరేబునుంచి శెయీరు పర్వతపు మార్గముగా
వెళ్లుట కాదేషు—బర్నేయ మట్టుకు పదకొండు రో
3 జుల పయినమై యున్నది.। నలుబయో సంవత్సరము
పదకొండో నెల మొదటి దినమున సంభవించినదే
మంటే, ఇశ్రాయేలు పుత్రులను గురించి యెహోవా
తనకు యిచ్చిన ఆజ్ఞ అంతటి ప్రకారముగా మోషే
4 వారితో చెప్పెను.। హెష్బోనులో నివాసము చేసిన
అమొరీయులకు రాజైన సీహోనునున్ను, ఎద్రెయీ
దగ్గిర ఆష్టారోతులో నివాసము చేసిన బాషాను రాజైన
5 ఓగునున్ను, మోషే హతము చేసిన తరువాత,। అతడు
యర్దేను యివతల మోయాబు దేశమందు యీ న్యా
6 యప్రమాణము చెప్పనారంభించెను.। అది యేలాగు
నంటే, హోరేబులో మన దేవుడయిన యెహోవా
మనకు సెలవు యిచ్చినదేమంటే, మీరు యీ పర్వత
మందు నివసించి వుండుట చాలా కాలమాయెను.।
7 మీరు మళ్లుకొని, తర్లి, అమొరీయుల పర్వతమున
కున్ను దాని సమీపమైన మైదానమునకున్ను కొండల
కున్ను లోవలకున్ను, మరిన్ని దక్షిణ దిక్కు యందలి
సముద్ర ప్రాంతమందున్న కెనయానీయుల దేశమున
కున్ను, లెబానోనుకున్ను ఫెరాతు నది అనే గొప్ప
8 నది మట్టుకున్ను వెళ్లండి.। యిదుగో మీ ముందర
వున్న ఆ దేశమును నేను మీకు యిచ్చితిని; అబ్రా
హాము, ఇస్సాకు, యాకోబు అనే మీ పితృలకున్ను
వారి వెనుక వచ్చే వారి సంతతికిన్ని యెహోవా
ప్రమాణ పూర్వకముగా యిచ్చిన ఆ దేశములోకి
మీరు ప్రవేశించి దాని స్వతంత్రించుకొండని ఆన
9 తిచ్చెను.। అప్పుడు నేను మీతో చెప్పిన మాట యే
10 మంటే, నేను వొంటిగా మిమ్మును భరించలేను.। మీ
దేవుడైన యెహోవా మిమ్మును అభివృద్ధి చేసినందున,
యిదుగో, యీ దినమున మీరు ఆకాశ నక్షత్రముల
లాగున విస్తారమై వున్నారు.। అయితే మీ పితృలకు 11
దేవుడైన యెహోవా మీకు యిచ్చిన వాగ్దత్త ప్రకా
రము మిమ్మును ఆశీర్వదించి, మీకు కలిగిన లెక్క
కంటే వెయి రెట్లు అధికము చేసును గాక.। నేను 12
వొంటిగా మీయొక్క కష్టమునున్ను మీ భారము
నున్ను మీ కలహమునున్ను యేలాగు భరింతును?।
మీరు మీ గోత్రములలోను బుద్ధి గల జ్ఞానవంతులని 13
పేరుపడిన వారు యెవ్వరో వారిని యెంచుకో వలెను,
వీరిని నేను మీ మీద ప్రధానులుగా వుంతునని చెప్పి
నప్పుడు,। మీరు నన్ను చూచి నీవు మాతో చెప్పిన 14
సంగతిని చేసుటకు అనుకూలమని చెప్పితిరి.। అయినం 15
దున నేను మీ గోత్రములలో కలిగిన ప్రధానులనే
పేరుపడిన జ్ఞానవంతులను పిలిపించి, మీ మీద సహ
స్రాధి పతులగానున్ను శతాధిపతులగానున్ను అర్ధ
శతాధిపతులగానున్ను దశాధిపతులగానున్ను మీ గో
త్రములకు అధిపతులగానున్ను వుంచితిని; యీలాగున
మీ మీద ప్రధాన శిరస్కులగా వారిని వుంచితిని.।
మరిన్ని అప్పుడు నేను మీ న్యాయాధిపతులకు ఆజ్ఞా 16
పించినదేమంటే, మీరు మీ సహోదరులలో పుట్టిన
న్యాజ్యములను విని, ప్రతివానికిన్ని వానివాని సహో
దరునికిన్ని యిదిగాక పరదేశికిన్ని నీతిగా న్యాయ
మును తీర్చుదురు గాక.। ముఖములను కనిపెట్టి న్యా 17
యపు తీర్పు చేయ కూడదు; మీరు పెద్దలు చెప్పేది
విన్నట్టు పిన్నలు చెప్పేదిన్ని విన వలసినది; యేమంటే,
న్యాయపు తీర్పు దేవునిదైనందున మీరు మనుష్య
ముఖమునకు వెరువ కూడదు: యే నిమిత్తమైనా మీకు
మిక్కిలీ కఠినమైనట్టాయెనా దాని నా దగ్గిరకు తీసుక
వస్తే నేను విందునని చెప్పితిని.। అదిగాక మీరు చేయ 18
వలసినవన్నిన్ని అప్పుడు మీకు నేను ఆజ్ఞాపించితిని.।
మరిన్ని మనము మన దేవుడైన యెహోవా మనకు ఆజ్ఞా 19
పించినట్టు హోరేబు పర్వతమునుంచి తర్లినప్పుడు,

అమొరీయులయొక్క పర్వతపు మార్గములో మీరు
చూచిన ఆ ఘోరమైన గొప్ప అరణ్యములోనుంచి వెళ్లి
20 కాదేషుబర్నేయకు వచ్చినాము. । అప్పుడు నేను మీ
తో చెప్పిన మాట యేమంటే, అమొరీయులయొక్క
పర్వతమునకు మీరు చేరితిరి, దానిని మన దేవుడైన
21 యెహోవా మనకు యిచ్చును. । యిదుగో నీ దేవుడైన
యెహోవా నీ ముందర వున్న యీ దేశమును నీకు
యిచ్చి వున్నాడు, గనుక, నీ పితృలయొక్క దేవుడైన
యెహోవా నీకు సెలవు యిచ్చినట్టు పయికి వెళ్లి
స్వతంత్రించుకొనుము: భయపడకనున్ను అధైర్యపడ
22 కనున్ను వుండుమని నేను చెప్పినప్పుడు, । మీరంద
రున్ను నా యొద్దికి వచ్చి, మాకంటే ముందుగా మను
ష్యులను పంపుదుము; వారు ఆ దేశమును పరిశోధించి
యే మార్గముచేత మేము పయికి వెళ్ల వలెనో
అదిన్ని, యే పట్టణములకు మేము రావలెనో అదిన్ని,
వారు తిరిగీ వచ్చి ఆ వర్తమానమును మాకు తెలియ
23 చేతురని మీరు చెప్పితిరి. । ఆ మాట నాకు బహు అను
కూలమైనందున గోత్రము వొక్కంటికి వొక మను
ష్యుడు చొప్పున పండ్రెండు మందిని యెంచి పంపి
24 తిని. । వీరు చుట్టూ తిరిగి, పర్వతము మీదికి యెక్కి,
ఎష్కోలు లోవకు వచ్చి, దానిని పరిశోధించి, ।
25 ఆ దేశపు పండ్లను చేత పట్టుకొని మా దగ్గిరకు తెచ్చి,
మాతో చెప్పిన సంగతి యేమంటే, మన దేవుడైన
యెహోవా మనకు యిచ్చే దేశము మంచి దేశమై
26 యున్నదని చెప్పిరి. । అయినప్పటికిన్ని మీరు పయికి
వెళ్లక, మీ దేవుడైన యెహోవా ఆజ్ఞకు వ్యతిరిక్తులై,
27 మీ డేరాలలో మొర్రపెట్టి అనినదేమంటే,। యెహో
వా మనయందు పగగా వున్నందుచేత అమొరీయుల
యొక్క చేతులలోకి మనలను అప్పగించి, లయము
చేయడానకు మిస్రయీము దేశములోనుంచి యివత
28 లకు కొంచువచ్చెను. । మనము పయికి వెళ్లుట యె
క్కడ? మన సహోదరులు మన హృదయములు కరి
గేటట్టు చెప్పినదేమంటే, ఆ జనులు మనకంటే గొప్ప
గానున్ను పొడుగుగానున్ను వున్నారు; మరిన్ని వారి
యొక్క పట్టణములు గొప్పవై, వాటి ప్రాకారములు
ఆకాశమంత పొడుగు కలిగినవై యున్నవి; మరిన్ని
అనాకీయుల పుత్రులను అక్కడ చూస్తిమని చెప్పిర
29 నేదిగా పలికితిరి. । అప్పుడు నేను మీతో చెప్పిన
దేమంటే, మీరు జడియకండి, వారికి భయపడకండి—
30 మీకు ముందుగా వెళ్లేటటువంటి మీ దేవుడైన యె
హోవా మీ కొరకు యుద్ధము చేసును; మీ కండ్ల
ముందర ఆయన మిస్రయీము యందున్ను అరణ్య
మందున్ను మీ విషయమై చేసిన ప్రకారము యిప్పు
31 డున్ను చేసును. । మీరు నడిచిన మార్గమంతటిలోను
యీ స్థలమునకు మీరు చేరిన పర్యంతమూ మీ దేవు
డైన యెహోవా తండ్రి తన కుమారుని మోసినట్టు
మిమ్మును మోయుట మీరు అక్కడ చూచియున్నారు
గదా, అని చెప్పినప్పటికిన్ని,। మీ డేరాల కొరకు స్థలము 32
చూడడానకున్ను, మీరు వెళ్ల వలసిన మార్గమును
చూపించడానకున్ను, । రాత్రిలో అగ్నిచేతనున్ను పగ 33
టిలో మేఘముచేతనున్ను మీకు ముందుగా మార్గ
మందు వెళ్లిన మీ దేవుడైన యెహోవాను మీరు
నమ్మకపోతిరి. । అప్పుడు మీ మాటలయొక్క శబ్దమును 34
యెహోవా విని, వుగ్రుడై ప్రమాణ పూర్వక
ముగా పలికినదేమంటే, । నిజముగా యీ చెడ్డ తర 35
ముయొక్క జనులలో మీ పితృలకు నేను ప్రమాణ
పూర్వకముగా యిచ్చిన దేశమును చూచేవాడు వొక
డున్ను లేకపోవును. । అయితే యిందులో యెఫున్నె 36
కుమారుడైన కాలేబు మాత్రము దానిని చూచును;
అతడు యెహోవాను మనఃపూర్తిగా వెంబడించెను,
గనుక, యే భూమిని అతడు తొక్కెనో ఆ భూమిని
నేను అతనికిన్ని అతని బిడ్డలకున్ను యిత్తునని సెలవు
యిచ్చెను. । మరిన్ని మీ నిమిత్తముచేత యెహోవా 37
నా మీదనున్ను కోపగించి, ఆనతిచ్చినదేమంటే, నీవు
న్ను దానిలో ప్రవేశించలేకపోదువు. । అయితే నీ 38
ముందర నిలిచి వున్న నూను కుమారుడైన యెహో
షువ దానిలో ప్రవేశించును; అతని దృఢపచుర్చము,
యెందుకంటే, అతడు ఇశ్రాయేలు దానిని స్వతం
త్రించుకొనేటట్టు చేసును. । మరిన్ని దోపుడు పోవు 39
దురని మీరు చెప్పిన మీయొక్క చిన్నవాండ్లున్ను ఆ
దినమందు మేలు కీడ్లు గుర్తెరగని మీయొక్క పిల్ల
లున్ను దానిలో ప్రవేశింతురు; దానిని నేను వారికి
యిత్తును గనుక వారు దానిని స్వతంత్రించుకొందు
రు. । మిమ్మును గురించినదేమంటే, మీరు మళ్లుకొని, 40
యెర్ర సముద్రపు మార్గముచేత అరణ్యములోకి తర్లి
పొండని సెలవు యిచ్చెను. । అప్పుడు మీరు ప్రత్యు 41
త్తరముగా నాతో చెప్పినదేమంటే, మేము యెహో
వా విషయమై పాపము చేస్తిమి; మేము పైకి వెళ్లి, మా
దేవుడైన యెహోవా మాకు యిచ్చిన ఆజ్ఞ అంతటి
ప్రకారముగా యుద్ధము చేతుమని చెప్పితిరి: అయితే
మీలో ప్రతి మనుష్యుడు తన ఆయుధములను నడు
ముకు కట్టుకొని, ఆ పర్వతము మీదికి యెక్కడానకు
సిద్ధమై యున్నప్పుడు, । యెహోవా నాకు సెలవు 42
యిచ్చినదేమంటే, నీవు వారితో చెప్ప వలసిన ప్రకా
రము, మీ శత్రువుల ముందర మీరు తెగిపోకుండా
యుద్ధము కొరకు పయికి వెళ్లకండి, యెందుకంటే,
నేను మీకు తోడయ్యేవాడను కానని చెప్పుమని
సెలవు యిచ్చినందున, । మీతో ఆలాగున నేను చెప్పి 43

నప్పటికిన్ని మీరు వినక, యెహోవా ఆజ్ఞకు వ్యతిరి
క్తులై గర్వపడి, పర్వతము మీదికి యెక్కి పోతిరి. ।
44 కాబట్టి ఆ పర్వతమందు నివసించి వున్న అమోరీ
యులు మీకు యెదురుగా వచ్చి, కందిరీగలలాగున
మిమ్మును తరిమి, శేయీరులో హోర్మా మట్టుకు మిమ్ము
45 ను హతము చేసిరి. । అప్పుడు మీరు తిరిగీ వచ్చి యె
హోవా ముందర యేడిస్తిరి; అయితే మీ రోదన
మును యెహోవా ఆలకించక మీరు చెప్పిన మాటలు
46 విననివాడాయెను. । కాబట్టి మీరు కాదేషులో యెన్ని
దినములు నివాసము చేస్తిరో అన్నిదినములు నివా
సము చేస్తిరి.

## 2. అధ్యాయము.

1 అటుతరువాత మనము మళ్లుకొని, యెహోవా
నాకు సెలవు యిచ్చిన ప్రకారము యెర్ర సముద్రపు
మార్గమున అరణ్యములోకి వెళ్లి, అనేక దినముల
మట్టుకు శేయీరు పర్వతము చుట్టూ తిరుగులాడిన
2 వారమైతిమి. । అప్పుడు యెహోవా నాకు సెలవు
3 యిచ్చినదేమంటే, । యీ పర్వతము చుట్టూ చాలి
నంత కాలము మట్టుకు తిరిగితిరి, యిప్పుడు వుత్తర
4 దిక్కుకు అభిముఖులై వెళ్లండి. । నీవు జనులను చూచి
ఆజ్ఞాపించ వలసినదేమంటే, శేయీరు యందు నివసి
స్తూ వున్న ఏశావు పుత్రులైన మీ సహోదరుల
యొక్క సరిహద్దులలోనుంచి మీరు గడచి పోవలసి
నది; వారు మీకు భయపడుదురు; అయినప్పటికిన్ని
మీరు వారి జోలికి వెళ్లక జాగ్రతగా వుండండి. ।
5 యెందుకంటే వారి దేశములో మీకు అడుగెడు భూ
మైనా యిచ్చేవాడను కాను, యెందుకంటే,—శే
యీరు పర్వతమును నేను ఏశావుకు స్వాధీనపర్చి
6 తిని. । మీరు తిన గలందులకు వారి యొద్దను ద్రవ్య
ముచేత ఆహారమును కొనుక్కో వలెను; తాగ గలం
దులకు వారి యొద్దను ద్రవ్యముచేతను నీరున్ను కొన
7 వలసినది. । యెందుకంటే నీ దేవుడైన యెహోవా
నీ హస్త కృత్యములన్నిటి యందు నిన్ను ఆశీర్వదించి
యున్నాడు; యీ గొప్ప అరణ్యములో నీ నడకను
ఆయన యెరుగును; యీ నలుబయి సంవత్సరములు నీ
దేవుడైన యెహోవా నీకు తోడుగా వున్నందున నీకు
యేదిన్ని వెల్తి లేకపోయెనని చెప్పుమని సెలవు యిచ్చె
8 ను. । అంతట మనము శేయీరు యందు నివాసము చేసి
నటువంటి మన సహోదరులైన ఏశావు పుత్రులయొద్ద
నుంచి గడచి, మైదానపు మార్గముచేతనున్ను ఏలతు
మార్గముచేతనున్ను ఎస్యోన్గెబెరు మార్గముచేత
నున్ను వెళ్లి, తిరిగీ మోయాబు అరణ్యము మార్గమును
9 గడచివచ్చినాము. । అప్పుడు యెహోవా నాకు సెలవు
యిచ్చినదేమంటే, నీవు మోయాబీయులను అవస్థ పెట్ట
కనున్ను వారితో యుద్ధము చేయకనున్ను వుండ వలె
ను, యెందుకంటే, వారి దేశములోది నేను నీకు యెంత
మాత్రమైనా యిచ్చేది లేదు; యేమంటే నేను ఆరు
అనే దేశమును లోతు పుత్రులకు స్వాధీనపర్చితినని
చెప్పెను. । పూర్వమందు ఏమీయులు అక్కడ నివా 10
సము చేసిరి; అనాకీయులలాగున గొప్పయున్ను పొడు
గున్ను విస్తారమున్ను గల జనులై వుండిరి. । వారు అనా 11
కీయుల వలెనే దీర్ఘదేహులని యెంచబడిరి; వీరిని
మోయాబీయులు ఏమీయులని పిలుతురు. । హోరీ 12
యులున్ను పూర్వము శేయీరులో నివాసము చేసిరి;
అయితే ఏశావు పుత్రులు తమ ముందర వారిని సంహ
రించిన తరువాత వారికి మారుగా కాపురముచేసి, యె
హోవా తమకు యిచ్చిన స్వాతంత్ర్యపు దేశమందు
ఇశ్రాయేలు జరిగించిన ప్రకారముగా వారున్ను చేసి
నవారైరి. । అప్పుడు మీరు లేచి జెరదు గెడ్డ దాటం 13
డని సెలవు అయినందున మనము జెరదు గెడ్డ దాటి
తిమి. । అయితే కాదేషు—బర్నేయను మనము విడచి 14
వెళ్లినది మొదలుకొని జెరెదు గెడ్డ దాటేటప్పటికి ము
ప్పయి యెనిమిది సంవత్సరములు అయినవి; యీ లో
పైనము యుద్ధపు మనుష్యుల ఆ తరమంతా యెహో
వా వారిని గురించి ప్రమాణ పూర్వకముగా చెప్పినట్టు
సమూహములోనుంచి క్షీణించిపోయిరి. । యేమంటే 15
వారు నాశనమయ్యే పర్యంతమూ యెహోవాయొక్క
హస్తము వారిని సమూహములోనుంచి నశింప చేసేట
ట్టుగా వారికి విరోధముగా వుండెను. । కాబట్టి ఆ 16
యుద్ధపు మనుష్యులందరున్ను జనులలోనుంచి క్షీణించి
మరణమును పొందిన తరువాత సంభవించినదేమంటే, । 17
యెహోవా నాకు సెలవు యిచ్చినది, । నేటి రోజున 18
నీవు మోయాబుయొక్క ఆరు అనే సరిహద్దులోనుంచి
గడచిపోవలసినది. । నీవు అమ్మోను పుత్రులయొద్దికి 19
వచ్చినప్పుడు వారిని అవస్థపెట్టకనున్ను వారి జోలికి
వెళ్లకనున్ను వుండ వలెను; యెందుకంటే అమ్మోను
పుత్రులయొక్క దేశములోది యెంత మాత్రమైనా
నేను నీకు యిచ్చేది లేదు; అది నేను లోతు పుత్రులకు
స్వాధీనపర్చితినని చెప్పెను. । యిదిన్ని దీర్ఘదేహుల 20
దేశమని యెంచబడెను; పూర్వమందు దీర్ఘదేహులు
అక్కడ నివాసము చేసిరి; వారిని అమ్మోనీయులు జంజు
మ్మీయులని పిలుతురు. । వీరు అనాకీయులలాగున గొప్ప 21
యున్ను విస్తారమున్ను పొడుగున్ను గల జనులై యుం
డిరి; అయితే యెహోవా వీరిని వారి ముందర నశింప
చేసినందున వారు వీరికి మారుగా కాపురము చేసిరి. ।
యీలాగున ఆయన శేయీరు యందు నివాసము చేసిన 22
ఏశావు పుత్రుల కొరకున్ను చేసెను, యేమంటే, ఆయన

వారి ముందర హోరీయులను నశింప చేసినందున
వారు వీరికి మారుగా కాపురముచేసి, నేటిపర్యంతము
23 న్ను వుంటూ వుండిరి. । మరిన్ని హస్సెరీములో అజ్జా
మట్టుకు కాపురము చేసిన అవ్వీయులను కప్తోరులో
నుంచి వచ్చిన కప్తోరీయులు నశింప చేసి, వారికి మారు
24 గా కాపురము చేసిరి. । అయితే మీరు లేచి తర్లీ
అర్నోను నది దాటండి, యిదుగో, హెష్బోను రాజు
న్ను అమోరీయుడున్నయిన సీహోనునున్ను వాని
దేశమునున్ను నీ చేతికి అప్పగిస్తిని, దానిని స్వతంత్రిం
చుకొన నారంభించి, వానితో యుద్ధమునకు కలుసు
25 కొండి. । నేటి రోజున నేను నీయొక్క వెరపునున్ను
భీతినిన్ని ఆకాశము కిందనున్న జనులందరి మీద వుంచ
నారంభింతును; వారు నీయొక్క వినకరిని విని వణకి,
నీ నిమిత్తమై మనో వేదన పడుదురని సెలవు యిచ్చె
26 ను. । అప్పుడు నేను కెదేమోతు అరణ్యములోనుంచి
హెష్బోను రాజైన సీహోను యొద్దికి దూతలను సమా
ధానమైన మాటలతోను పంపి చెప్పుమనినదేమంటే, ।
27 నీ దేశములోనుంచి నీవు నన్ను గడిచిపోనియ్య వలెను;
కుడి యెడమలకు తిరగకుండా రాజమార్గమున వెళ్లు
28 దును. । నేను తినగలందులకు ద్రవ్యమునకు ఆహారము
ను నీవు అమ్మ వలెను; నేను తాగ గలందులకు ద్రవ్య
29 మునకు నీవు నీరు యియ్య వలెను. । శెయీరు యందు
నివసిస్తున్న ఏశావు పుత్రులున్ను ఆరు దేశమందు నివ
సిస్తున్న మోయాబీయులున్ను ఆలాగున నాకు చేసి
వుండిరి; మా దేవుడైన యెహోవా మాకు యిచ్చిన
దేశములో ప్రవేశించుటకు యర్దేను నది నేను దాటే
పర్యంతమూ కాలినడకనే నీ దేశమును గడచి పోదు
30 నని చెప్పినప్పటికిన్ని, । హెష్బోను రాజైన సీహోను
మనలను వాని సరిహద్దులోనుంచి దాటి పోనిచ్చినాడు
కాడు, యేమంటే, మీ దేవుడైన యెహోవా అతనిని
నీ చేతికి అప్పగించ గలందులకు యీ దినమున కను
పించి వున్నట్టు అతని ఆత్మను కఠిన పరచి, అతని హృ
31 దయమునందు పెంకెతనము కలుగ జేసెను. । అప్పుడు
యెహోవా నాకు సెలవు యిచ్చినదేమంటే, యిదుగో
నీ యెదుటనున్న సిహోనునున్ను అతని దేశమునున్ను
అప్పగించ నారంభిస్తిని; అతని దేశమును నీవు స్వతం
త్రించుకొనేటట్టు స్వాధీనపరుచుకొన నారంభించు
32 మని సెలవు యిచ్చెను. । అప్పుడు సీహోను తానున్ను
తన జనులందరున్ను యుద్ధము చేయడానకు మన మీ
33 దికి యహస్సుకు వచ్చిరి. । అయితే మన దేవుడైన యె
హోవా మన చేతికి అతనిని అప్పగించినందున మనము
అతనినిన్ని అతని కుమారులనున్ను అతని జనులనందరి
34 నిన్ని సంహరించి, । అతని పట్టణములన్నిటినిన్ని అప్పు
డే స్వాధీనపచుర్చుకొని, పట్టణములన్నిటిలో వున్న
పురుషులనున్ను స్త్రీలనున్ను చిన్నవాండ్లనున్ను హత
ము చేసి, ఒకనినైనా శేషించినట్టు వుండనివ్వక
పోతిమి. । అయితే పశువులనున్ను మనము స్వాధీనప 35
ర్చుకొనిన పట్టణములలో వున్న దోపుడు సొమ్మునున్ను
మాత్రమే పుచ్చుకొంటిమి. । మరిన్ని అర్నోను నది 36
దరిని వున్న అరోయేరునుంచిన్ని నది దగ్గిర వున్న పట్ట
ణమునుంచిన్ని గిలాదు మట్టుకు మనకు అసాధ్యమైన
పట్టణము ఒకటిన్ని లేకపోయెను; మన దేవుడైన
యెహోవా మనచేతికి సమస్తమూ అప్పగించెను. ।
అయితే అమ్మోను పుత్రులయొక్క దేశము యొద్దికిన్ని 37
యబ్బోకు నదీ ప్రాంతము యొద్దికిన్ని ఆ పర్వతము
లలో వున్న పట్టణముల యొద్దికిన్ని యింకా మన దేవు
డైన యెహోవా మనకు నిషేధించిన స్థలముల యొద్ది
కిన్ని నీవు రాక వుంటివి.

## 3. అధ్యాయము.

తరువాత మనము తిరిగి బాషాను మార్గముచేత 1
పయికి వెళ్లితిమి; అప్పుడు బాషాను రాజైన ఓగు తా
నున్ను తన జనులందరున్ను మనతో యుద్ధము చేసు
టకు మనకు యెదురుగా ఎద్రయీకి వచ్చిరి. । అప్పు 2
డు యెహోవా నాకు సెలవు యిచ్చినదేమంటే, అత
నికి భయపడకుము, యెందుకంటే, నీ చేతికి నేను
అతనినిన్ని అతని జనులందరినిన్ని అతని దేశమునున్ను
అప్పగింతును; హెష్బోనులో నివసించిన అమోరీయుల
రాజైన సీహోనును నీవు చేసినలాగున యితనిన్ని
చేయ వలసినదని సెలవు యిచ్చెను. । ఆలాగున మన 3
దేవుడైన యెహోవా మన చేతులలోకి బాషాను రా
జైన ఓగునున్ను అతని జనులందరినిన్ని అప్పగించినం
దున అతనికి ఒకడున్ను మిగలకుండా మనము అత
నిని సంహరించితిమి. । మరిన్ని అప్పుడు అతని పట్టణ 4
ములనన్నిటినిన్ని స్వాధీనపర్చుకుంటిమి; వారి పట్టణ
ములలో మనము స్వాధీనపర్చుకొనిన పట్టణము ఒక
టిన్ని లేకపోయెను; అరువై పట్టణములనున్ను బాషా
నులో వుండిన ఓగుయొక్క రాజ్యమైన అర్గోబు
దేశమంతటినిన్ని స్వాధీనపర్చుకొంటిమి. । యీ పట్టణ 5
ములన్నిటికిన్ని గొప్ప ప్రాకారములున్ను పురద్వార
ములున్ను గడియలున్ను కలిగి వున్నవి; యివిగాక ప్రా
కారములు లేని గ్రామములనున్ను అనేకముగా ఆక్ర
మించితిమి. । మరిన్ని వారిని శర్వనాశనము చేస్తిమి; 6
హెష్బోను రాజైన సీహోనును మనము చేసినట్టు
ప్రతిపట్టణములోనున్న పురుషులనున్ను స్త్రీలనున్ను
చిన్నవాండ్లనున్ను నశింపచేస్తిమి. । అయితే పశువుల 7
న్నిటినిన్ని పట్టణములలో దొరికిన దోపుడు సొమ్ము
నున్ను మన కొరకు ఆక్రమించుకొంటిమి. । యీలాగున 8

ఆ వేళ యందు మనము యర్దేను నది యివతల వున్న
అర్నోను నదికిన్ని హెర్మోను పర్వతమునకున్ను సం
దున వున్న దేశమును అమోరీయులయొక్క యిద్దరు
9 రాజుల చేతులలోనుంచి పుచ్చుకొంటిమి. । ఆ హె
ర్మోనును షిర్యోను అని సీదోనీయులు పిలుతురు;
10 దాని షెనీరు అని అమోరీయులు పిలుతురు. । మైదా
నముయొక్క పట్టణములన్నిటినిన్ని, గిలాదు అంతటి
నిన్ని, బాషానులో వున్న ఓగు రాజ్యముయొక్క పట్ట
ణములయిన సల఼్ా ఎద్రెయీ పర్యంతమున్ను, బాషాను
11 దేశమంతటినిన్ని స్వాధీనపర్చుకుంటిమి. । యేమంటే
బాషాను రాజైన ఓగు మాత్రమే దీర్ఘదేహులయొక్క
వంశములో శేషించి యుండెను; యిదుగో, అతని
మంచము యినుప మంచమై యున్నది; అది అమ్మోను
పుత్రులయొక్క రబ్బతు పట్టణమందు వున్నది గదా!
మనుష్యుని మూర కొల ప్రకారము దాని పొడుగు
తొమ్మిది మూళ్లున్ను దాని వెడల్పు నాలుగు మూళ్లు
12 న్ను అయి వున్నది. । అయితే ఆ వేళ యందు అర్నో
ను నదీ తీరమందున్న అరోయేరు మొదలుకొని గిలాదు
పర్వతము సగము మట్టుకు మనకు దొరికిన దేశము
న్ను దాని పట్టణములనున్ను నేను రూబేనీయులకున్ను
13 గాదీయులకున్ను యిస్తిని. । అయితే గిలాదుయొక్క
కొదువ సగమునున్ను, ఓగుయొక్క రాజ్యమైన బా
షాను అంతటినిన్ని, మనస్సే గోత్రములో సగము
మందికి యిస్తిని; బాషానుతోను అర్గోబు దేశమంత
టినిన్ని వారికే యిస్తిని; యిది దీర్ఘదేహులయొక్క
14 దేశమని పిలువపడెను. । మనస్సే కుమారుడైన యాయీ
రు అర్గోబు దేశమంతటినిన్ని గెషూరీయులయొక్క
యున్ను మయఖాతీయులయొక్కయున్ను సరిహద్దు
మట్టుకు స్వాధీనము చేసుకొని, వాటికి యాయీరు
బాషాను గ్రామములని తన పేరు నేటి వరకూ వున్న
15 ట్టు పిలిచెను. । మరిన్ని గిలాదును నేను మాఖీరుకు
16 యిస్తిని. । అయితే గిలాదుకున్ను అర్నోను నదికిన్ని
నందున వున్న భూమినిన్ని, యబ్బోకు నది సరిహద్దు,
అనగా, అమ్మోను పుత్రులయొక్క సరిహద్దుకు వున్న
17 భూమినిన్ని, । మైదానమునున్ను, యర్దేను నదినిన్ని,
కిన్నెరెతు మొదలుకొని తూర్పు దిక్కున అష్దోద్పిస్గా
పర్వతము కిందనున్న వుప్పుసముద్రమనగా మైదానపు
సముద్రము మట్టుకు దాని సరిహద్దునున్ను, రూబేనీ
18 యులకున్ను గాదీయులకున్ను నేను యిస్తిని. । మరిన్ని
అప్పుడు నేను మీకు ఆజ్ఞాపించి చెప్పినదేమంటే, మీ
దేవుడైన యెహోవా మీకు స్వతంత్రించుకోవడా
నకు యీ దేశమును యిచ్చెను; మీలో యుద్ధమునకు
యుక్తులైనవారందరున్ను ఆయుధములను కట్టుకొని
ఇశ్రాయేలు పుత్రులైన మీ సహోదరుల ముందర
దాటవలసినది. । యెహోవా మీ సహోదరులకు 19
న్ను మీకున్ను నెమ్మది కలుగచేసే పర్యంతమున్ను, మీ
దేవుడైన యెహోవా యర్దేను అవతల వారికి యి
చ్చిన దేశమును వారు స్వతంత్రించుకొనే పర్యంతము
న్ను, । మీ భార్యలున్ను మీ చిన్నవాండ్లున్ను మీ పశు 20
వులున్ను నేను మీకు యిచ్చిన పట్టణములలో నివసించి
వుండవలెను; మీకు విస్తారమైన పశువులు కలవని నేను
యెరుగుదును; తరువాతను మీరందరున్ను మీకు నేను
యిచ్చిన భూ భాగములకు తిరిగీ రావలెనని చెప్పితిని. ।
అప్పుడు నేను యెహోషువకు ఆజ్ఞాపించినదేమంటే, 21
మీ దేవుడైన యెహోవా యీ యిద్దరు రాజులను
యేమి చేసెనో అది నీ నేత్రములతోటి నీవు చూస్తివి;
యెహోవా ఆ ప్రకారముగానే నీవు వెళ్లేరాజ్యముల
నున్ను చేసును. । కాబట్టి మీరు వారికి భయపడకూ 22
డదు, యెందుకంటే, మీ దేవుడైన యెహోవా తానే
మీ కొరకు యుద్ధము చేసునని చెప్పితిని. । మరిన్ని 23
అప్పుడు నేను యెహోవాను వేడుకొనినదేమంటే, ।
హో ప్రభువైన దేవుడా, నీ మహత్తునున్ను, నీ బల 24
హస్తమునున్ను, నీ సేవకుడనైన నాకు నీవు అగుపర్చ
నారంభిస్తివి, యేమంటే, నీ కార్యముల ప్రకారముగా
నున్ను నీ శక్తి ప్రకారముగానున్ను చేయగల దేవుడు
పరలోకమందైనా భూలోకమందైనా వున్నాడా! ।
యర్దేను నది అవతల వున్న ఆ మంచి దేశమునున్ను, 25
ఆ రమ్యమైన పర్వతమునున్ను, లెబానోనునున్ను,
నేను చూచేటట్టు దయచేసి, నన్ను దాటనివ్వవలెనని
వేడుకొంటిని. । అయితే యెహోవా మీ నిమిత్తము 26
చేత నా మీద కోపపడి, నేను చెప్పుకొన్న మనవిని
ఆలకించక పోయెను; యిందుకు యెహోవా నాకు
సెలవు యిచ్చినదేమంటే, యింత మట్టుకు చాలును,
యీ నిమిత్తము గురించి యికను నాతో చెప్ప వద్దు. ।
నీవు పిస్గా పర్వతము మీదికి యెక్కి, పడమటి తట్టు 27
న్ను వుత్తరపు తట్టున్ను దక్షిణపు తట్టున్ను తూర్పు
తట్టున్ను నీ కన్నులను తెరచి, నీ నేత్రములతో దానిని
చూడుము, యేమంటే, నీవు యీ యర్దేను నదిని
దాట కూడదు. । అయితే నీవు యెహోషువకు ఆజ్ఞ 28
యిచ్చి అతని దృఢపర్చి దిట్టము చేయ వలెను, యేమం
టే, అతడు యీ జనుల ముందర దాటి నీవు చూచే
దేశమును వారికి స్వాధీనపర్చునని సెలవు యిచ్చెను. ।
అప్పుడు మనము బేత్పెయోరుకు యెదుట వున్న లోవ 29
లో వుంటూ వుంటిమి.

## 4. అధ్యాయము.

కాబట్టి హో ఇశ్రాయేలా, మీ పితృలయొక్క 1
దేవుడైన యెహోవా మీకు యిచ్చే దేశములోకి

మీరు ప్రవేశించి స్వతంత్రించుకొనేటట్టుగానున్ను
మీరు బ్రతికేటట్టుగానున్ను నేను మీకు బోధచేసే
నిబంధనలనున్ను విధులనున్ను చేసే కొరకు వాటిని
2 యిప్పుడు వినుదురు గాక. । నేను మీకు ఆజ్ఞాపించే మీ
దేవుడైన యెహోవాయొక్క ఆజ్ఞలను మీరు గైకొనే
టట్టుగా నేను మీకు ఆజ్ఞాపించే వాక్యమునకు యె
క్కువ సమకూర్చకనున్ను అందులో యేమైనా
3 లోపము చేయకనున్ను వుండ వలెను. । బయల్పెయోరు
నిమిత్తముచేత యెహోవా యేమిచేసెనో అది మీ
కన్నులు చూచినవి, యేమంటే, బయల్పెయోరును వెం
బడించిన మనుష్యులనందరినిన్ని నీ దేవుడైన యెహో
4 వా మీలోనుంచి నశింపచేసి వున్నాడు. । అయితే మీ
దేవుడైన యెహోవాతో హత్తుకొని యున్న మీరం
5 దరున్ను నేటి వరకు బ్రతికి వున్నారు. । యిదుగో
మీరు వెళ్లి స్వతంత్రించుకొనే దేశమందు మీరు చేయ
వలసిన నిబంధనలనున్ను విధులనున్ను నా దేవుడైన
యెహోవా నాకు సెలవు యిచ్చినట్టు మీకు బోధిం
6 చితిని. । అయినందున మీరు వాటిని గైకొని చేతురు
గాక, యేమంటే, జనాంగములయొక్క దృష్టికి యిది
మీయొక్క జ్ఞానమున్ను సుబుద్ధిన్ని అయి వుండును;
వారు యీ నిబంధనలను విని నిజముగా యీ గొప్ప
జనాంగము జ్ఞానమున్ను సుబుద్ధిన్ని గలదై యున్నదని
7 పలుకుదురు. । యెందుకంటే మనము సకలవిషయముల
యందున్ను మన దేవుడైన యెహోవాను వేడుకొని
నంతలో ఆయన మనకు సమీపించినలాగున తమకు
సమీపించిన దేవుడు గల గొప్ప జనాంగము యేది? ।
8 మరిన్ని యీ దినమందు నేను మీ యెదుట బెట్టే
యీ న్యాయ ప్రమాణము అంతటివలె నీతి నిబంధన
లున్ను విధులున్ను గల గొప్ప జనాంగము యేది?. ।
9 నీ కన్నులు చూచినవాటిని నీవు మరువకనున్ను, నీవు
బ్రతికే దినములన్నిటి పర్యంతమూ నీ హృదయము
లోనుంచి అవి పోకుండానున్ను వుండేటట్టు, నిన్ను
గూర్చి నీవు జాగ్రతపడి నీ యాత్మను భద్రముగా
కాపాడుకొని, వాటిని నీ కుమారులకున్ను నీ కుమారుల
10 కుమారులకున్ను నేర్ప వలసినది. । హోరేబులో నీ
దేవుడైన యెహోవా ముందర నీవు నిలువపడిన దిన
మందు యెహోవా నన్ను చూచి జనులను నా యె
ద్దికి కూర్చ వలెను, అప్పుడు వారు భూమి యందు జీవిం
చే దినములన్నిటి పర్యంతమూ నా యందు భయపడుట
నేర్చుకునేటట్టుగానున్ను, వారి బిడ్డలకు వారు నేర్పే
టట్టుగానున్ను, నా వాక్యములను వారికి వినిపింతు
11 నని సెలవు యిచ్చినందున, । మీరు దగ్గిరకు వచ్చి ఆ
పర్వతము అడుగున నిలువబడితిరి, అయితే ఆ పర్వ
తము అగ్నిచేత ఆకాశమధ్య పర్యంతమూ మండెను,
అంధకారమున్ను మేఘములున్ను గాఢాంధకారము
న్ను కలిగి వుండెను. । అప్పుడు యెహోవా అగ్ని 12
మధ్యనుంచి మీతో మాట్లాడెను, ఆ మాటలయొక్క
ధ్వనిని మీరు వింటిరిగాని యే స్వరూపమునూ
చూడ లేదు; శబ్దముమాత్రము మీరు వింటిరి. । అప్పు 13
డు ఆయన పది ఆజ్ఞలు గల తన యొడంబడికెను మీకు
తెలియ చేసి, దానిని చేయండని మీకు ఆజ్ఞాపించి,
రెండు రాతిపలకల మీద వాటిని వ్రాసెను. । మరిన్ని 14
మీరు దాటి స్వతంత్రించుకొనే దేశమందు వాటిని
చేసేకొరకు నిబంధనలనున్ను విధులనున్ను మీకు వుప
దేశించుమని యెహోవా నాకు ఆజ్ఞాపించెను. । కా 15
బట్టి మీకు మీరు గట్టి జాగ్రతపడ వలెను, యెందు
చేతనంటే, హోరేబులో యెహోవా అగ్ని మధ్య
నుంచి మీతో మాట్లాడిన దినము యే విధమైన స్వరూ
పమునూ మీరు చూడ లేదు. । అందుచేత మీ కొరకు 16
మీరు చెక్కిన విగ్రహమునైనా, స్వరూపముయొక్క
పోలికనైనా, మొగ పోలిక ఆడు పోలికనైనా, ।
భూమియందుండే యే మృగము పోలికనైనా, ఆకా 17
శమునందు యెగిరే యే పక్షియొక్క పోలికనైనా, ।
నేలను పాకే యే యొక దాని పోలికనైనా, భూమి 18
కింది జలములలో వున్న యే చేపయొక్క పోలికనైనా
చేసుకొని, మిమ్మును మీరు చెరుపుకోకుండానున్ను; ।
మరిన్ని నీ దేవుడైన యెహోవా ఆకాశము కింద 19
నున్న సకల జనములకొరకు విభాగించిన ఆకాశ సమూ
హమంతటినీ, అనగా, సూర్య చంద్ర నక్షత్రములను
ఆకాశముతట్టు మీ కన్నులు పైకెత్తి చూచినప్పుడు
వాటికి మ్రొక్కక ఆరాధించక వుండేటట్టున్ను మీరు
జాగ్రత పడవలెను. । యెహోవా మిమ్మును పిలుచు 20
కొని యీ దినమందు వున్న ప్రకారము తనకు స్వా
తంత్ర్యపు జనులయ్యేటట్టుగా యినుప కొలిమిలో
నుంచి, అనగా, మిస్రయీములోనుంచి యివతలకు
మిమ్మున రప్పించెను. । మరిన్ని యెహోవా మీ నిమి 21
త్తము నా మీద కోపపడి, నేను యర్దేనును దాట
కూడదనిన్ని, నీ దేవుడైన యెహోవా నీకు స్వాతం
త్ర్యముగా యిచ్చే ఆ మంచి దేశములోకి నేను ప్రవే
శించ కూడదనిన్ని సత్యము చేసెను. । కాబట్టి నేను 22
యీ దేశమందే మరణమవుతాను గాని యర్దేనును
దాటను; అయితే మీరు దాటి ఆ మంచి దేశమును
స్వతంత్రించుకొందురు. । మీ దేవుడైన యెహోవా 23
మీతో కూడా చేసిన తన వొడంబడికెను మీరు మరచి,
నీ దేవుడైన యెహోవా నీతో వద్దనిన యే చెక్కిన
విగ్రహమునైనా, యే యొక దానియొక్క పోలిక
నైనా, చేసుకోకుండా వుండేటట్టు మీకు మీరు
జాగ్రత పడండి. । యెందుకంటే మీ దేవుడయిన 24

యెహోవా దహించే అగ్నిన్ని, సహించని దేవుడు
25 న్నయి వున్నాడు. । నీవు కుమారులనున్ను కుమారుల
కుమారులనున్ను కని, బహుకాలము ఆ దేశమందు
మీరు వుండిన తరువాత మిమ్మును మీరు చెరుపుకొ
నేటట్టు చెక్కిన విగ్రహమునైనా యే వొక దాని
పోలికనైనా చేసి, నీ దేవుడైన యెహోవాకు కోప
ము కలుగ చేసేలాగున ఆయన దృష్టికి కీడు చేసిన
26 ట్టయితే, । యే దేశమును స్వతంత్రించుకోవడానకు
మీరు యర్దేనును దాటుదురో ఆ దేశములోనుంచి
మీరు త్వరగా సర్వ నాశనమవుదురని నేను యీ
రోజున మీ విషయమై ఆకాశమునున్ను భూమినిన్ని
సాక్ష్యము కొరకు పిలుస్తున్నాను; దాని యందు మీ
దినములను మీరు విస్తరింప చేయక సర్వ నాశనమవు
27 దురు. । యెహోవా మిమ్మును అన్యజనులలోకి చెదర
చేసినందున, యే జనాంగములోకి యెహోవా మిమ్ము
ను పో చేసునో అక్కడ మీ లెక్క స్వల్పమవును. ।
28 మరిన్ని అక్కడ మీరు మనుష్యుల హస్త కృత్యములు
కలిగినటువంటివిన్ని, చూడని వినని తినని వాసనగనని
దారు శిలామయమయినటువంటివిన్ని దేవుండ్లకు సేవచే
29 తురు. । అయినప్పటికిన్ని అక్కడనుంచి నీ దేవుడైన
యెహోవాను నీవు వెతికితే, నీ హృదయమంతటి
తోనున్ను నీ ఆత్మ యంతటితోనున్ను నీవు వెతికితే,
30 నీవు ఆయనను కనుకొందువు. । తరువాతి దినములందు
యీ సంగతులన్నీ నీకు సంభవించినందున నీవు వుప
ద్రవములో వున్నప్పుడు నీవు నీ దేవుడైన యెహో
వా తట్టుకు తిరిగి, ఆయన శబ్దమును వింటివట్టాయెనా, ।
31 నీ దేవుడైన యెహోవా కనికరము కల దేవుడు గనుక
ఆయన నిన్ను విడువక, నశింప చేయక, ప్రమాణ
పూర్వకముగా ఆయన నీ పితృలతో చేసిన వొడంబ
32 డికెను మరువకుండా వుండును. । యెందుకంటే భూమి
మీద దేవుడు మనుష్యుని సృష్టించిన నాటనుంచి
నీకంటే ముందుగా గతమయిన దినములలో యీ కా
ర్యమంత ఘనమయిన కార్యము యెక్కడనయినా కలి
గెనా, దీనిలాటిది వినబడెనా, అని అడుగుము;
ఆకాశముయొక్క యీ దిక్కు మొదలుకొని ఆ దిక్కు
33 పర్యంతమూ అడుగుము. । అగ్ని మధ్యనుంచి మాట్లా
డిన దేవునియొక్క శబ్దమును నీవు వినినట్టు మరి యే
34 జనమైనా విని బ్రతికెనా? । మరిన్ని మీ దేవుడయిన
యెహోవా మిస్రయీములో మీ కండ్ల ముందర
మీ కొరకు చేసినలాగున, శోధనల చేతనున్ను, గురు
తుల చేతనున్ను, అద్భుతముల చేతనున్ను, యుద్ధము
చేతనున్ను, మహత్తుగల చేతి చేతనున్ను, చాపిన బాహు
చేతనున్ను గొప్పవైన భీకరత్వముల చేతనున్ను, దేవుడు
వెళ్లి తన కొరకు వొక జనమును మరి వొక జనములో
నుంచి తీసుకొనుటకు యత్నించెనా? । అయితే యె 35
హోవా దేవుడై వున్నాడు; ఆయన గాక మరి వొకడు
లేడని మీకు తెలియ గలందులకు అది మీకు అగుప
డినదాయెను. । ఆయన నీకు బోధించే కొరకు ఆయన 36
ఆకాశములోనుంచి తన శబ్దమును నీకు వినచేసెను;
భూమి యందు తన ఘనమైన అగ్నిని నీకు చూపిం
చెను; మరిన్ని అగ్నిలోనుంచి ఆయన మాటలను నీవు
వింటివి. । మరిన్ని ఆయన నీ పితృల యందు ప్రియ 37
ముగా వున్నందున వారి తరువాతనయిన వారియొక్క
సంతతిని యెంచి, । నీకంటే బలమైన గొప్ప జనములను 38
నీ ముందరనుంచి బయిటికి వెళ్లగొట్టుటకున్ను, నిన్ను
లోపలికి తెచ్చుటకున్ను, యీ దినమున వున్నట్టు వారి
దేశమును నీకు స్వాతంత్ర్యముగా యిచ్చుటకున్ను,
తన గొప్ప సామర్థ్యముచేత మిస్రయీములోనుంచి
తన దృష్టియందు నిన్ను వెలపటికి తీసుకవచ్చెను. ।
కాబట్టి పై ఆకాశమందున్ను కింది భూమి యందున్ను 39
యెహోవా తానే దేవుడై యున్నాడనిన్ని, మరి వేరే
లేడనిన్ని, యీ దినమున తెలుసుకొని, నీ హృదయ
మందు విచారించుము. । అందుచేత నీకున్ను నీ తరు 40
వాత నీ పిల్లలకున్ను బాగా జరిగేటట్టుగానున్ను, నీ
దేవుడైన యెహోవా నీకు శాశ్వతముగా యిచ్చే
భూమి మీద నీ దినములను నీవు విస్తరింప చేసేటట్టు
గానున్ను, యీ దినమున నేను నీకు ఆజ్ఞాపించే ఆయన
నిబంధనలనున్ను ఆయన ఆజ్ఞలనున్ను నీవు గైకొందువు
గాక అని చెప్పెను. । అప్పుడు మోషే యర్దేను యివ 41
తల సూర్యోదయపు దిక్కుతట్టు మూడు పట్టణము
లను యేర్పరచి, । యెవడైనా పూర్వమందు పగవుం 42
చక అజ్ఞానమున తన పొరుగువానిని చంపినట్టాయెనా,
ఆ చంపినవాడు యీ పట్టణములలో వొక దానిలోకి
పరుగెత్తి వచ్చి బ్రతికేటట్టు నిర్ణయము చేసెను. ।
అవి యేవంటే, రూబేనీయుల కొరకు మైదానదేశపు 43
అరణ్యమందు బెస్సెరున్ను, గాదీయుల కొరకు గిలా
దులో వున్న రామోతునున్ను; మనస్సీయుల కొరకు
బాషానులో వున్న గోలానున్ను, । యిది మోషే ఇశ్రా 44
యేలు పుత్రుల ముందర వుంచిన న్యాయప్రమాణమై
యున్నది. । యీ సాక్ష్యములున్ను నిబంధనలున్ను 45
విధులున్ను ఇశ్రాయేలు పుత్రులు మిస్రయీములో
నుంచి బయిటికి వచ్చిన తరువాత, । యర్దేను యివ 46
తల హెష్బోనులో కాపురము చేసిన అమోరీయుల
రాజైన సీహోను దేశములోనున్న బేత్పెయోరు
యెదుట లోవలో మోషే వారితో చెప్పినవై వున్నవి:
యీ సీహోనును మోషేయున్ను ఇశ్రాయేలు పుత్రు
లున్ను తాము మిస్రయీములోనుంచి బయిటికి వచ్చిన
తరువాత సంహరించి, । అతని దేశమునున్ను బాషాను 47

రాజైన ఓగు దేశమునున్ను స్వాధీనము చేసుకొని,।
48 అర్నోను నదీ తీరమందున్న అరోయేరుయొక్క
హెర్మోను యనే సియోను పర్వతముయొక్క సందు
49 నున్న భూమినిన్ని,। యర్దేను యివతల తూర్పు
దిక్కు మైదానమునకున్ను అష్దోదు పిస్గా పర్వతము
కింద మైదానపు సముద్రముకున్ను సందున వున్న భూ
మినిన్ని ఆక్రమించుకొనిరి: ఆ రాజులు యర్దేను
యివతల సూర్యోదయ దిక్కునున్న అమొరీయుల
యొక్క యిద్దరు రాజులై వుండిరి.

5. అధ్యాయము.

1 అప్పుడు మోషే ఇశ్రాయేలు వారినందరినిన్ని
పిలిచి వారితో చెప్పినదేమంటే, వో ఇశ్రాయేలా,
నేను యీ దినమున మీ చెవులలో పలికే నిబంధనల
నున్ను విధులనున్ను మీరు నేర్చుకొని, వాటిని గైకొ
2 ని చేసుటకై ఆలకించండి.। మన దేవుడైన యెహో
వా హోరేబు పర్వతమందు మనతో ఒడంబడికెను
3 చేసెను.। యీ ఒడంబడికెను యెహోవా మన పితృ
లతో కాదు, మనతో, అనగా, నేటి వరకు సజీవులమై
4 వున్న మన అందరితోనూ చేసెను.। యెహోవా అగ్ని
మధ్యనుంచి పర్వతము మీద ముఖాముఖిగా మీతో
5 మాట్లాడెను.। అప్పుడు నేను యెహోవాయొక్క
వాక్యమును మీకు తెలియ చేసుటకు యెహోవాకు
న్ను మీకున్ను మధ్యను నిలిచితిని, యెందుకంటే, ఆ
అగ్ని వల్లను మీకు భయము కలిగినందున మీరు పర్వ
తము మీదికి వెళ్లలేక పోతిరి; అప్పుడు యెహోవా
6 ఆనతిచ్చినదేమంటే,। దాస్య గృహమైన మిస్రయీము
దేశములోనుంచి నిన్ను వెలపటికి తీసుకవచ్చిన నేను
7 నీ దేవుడనైన యెహోవానై యున్నాను.। నా యెదు
ట నీకు యితరమైన దేవుండ్లు కలిగి వుండకూడదు.।
8 నీ కొరకు నీవు వొక చెక్కిన విగ్రహమునైనా, పై ఆకా
శమందు గానీ కింద భూమిలో గానీ భూమి కింద
నున్న జలములో గానీ వున్న యే వొక దాని పోలిక
9 నైనా, కలుగ చేసుకోకూడదు.। నీవు వాటికి నమస్క
రించి సేవించ కూడదు, యెందుకంటే, యెహోవా
అనే నీ దేవుడనయిన నేను సహించని దేవుడనై
యుండి, నాకు పగ చేసేవారియొక్క మూడో నా
లుగో తరముల మట్టుకు తండ్రులయొక్క అక్రమ
మును బిడ్డల పయిని వుంచి, శిక్షించే వాడనై యున్నా
10 ను.। అయితే నన్ను స్నేహించి నా ఆజ్ఞలను గైకొనే
వారికి వెయి తరముల మట్టుకు కృప అగుపరచే వాడనై
11 యున్నాను.। నీవు నీ దేవుడైన యెహోవాయొక్క
నామమును వ్యర్థముగా యెత్త కూడదు, యెందుకంటే,
యెహోవా తన నామమును వ్యర్థముగా యెత్తే
వానిని నిరపరాధి యని యెంచడు.। నీ దేవుడైన యె 12
హోవా నీకు ఆజ్ఞాపించినట్టు పరిశుద్ధ పరచుటకు
సబ్బాతు దినమును గైకొన వలెను.। ఆరు దినములు 13
కష్టపడి నీ పని అంతా చేసుకో వలెను;। అయితే 14
యేడో దినము నీ దేవుడైన యెహోవాయొక్క
సబ్బాతై వున్నది; దాని యందు నీవైనా, నీ కుమారుడై
నా, నీ కుమార్తె అయినా, నీ పనివాడైనా, నీ పనికత్తె
అయినా, నీ యెద్దయినా, నీ గార్దభమైనా, నీ పశు
వులలో యే వొకటైనా, నీ వాకిట వుండే పరదేశి
అయినా, యేపనినిన్ని చేయ కూడదు; యేమంటే, నీ
పనివాడున్ను నీ పనికత్తెయున్ను నీ వలెనే విశ్ర
మించ వలెను.। మరిన్ని నీవు మిస్రయీము దేశములో 15
దాసుడవై యుంటివనిన్ని, నీ దేవుడైన యెహోవా
మహత్తు గల చేతి చేతనున్ను చాపిన బాహువు చేత
నున్ను దానిలోనుంచి నిన్ను వెలపటికి తీసుక వచ్చెన
నిన్ని జ్ఞాపకము చేసుకొనుము; అందుచేత నీ దేవుడైన
యెహోవా సబ్బాతు దినమును గైకొనుమని నీకు
ఆజ్ఞాపించెను.। నీ దేవుడయిన యెహోవా నీకు 16
యిచ్చే దేశమందు నీ దినములు అనేకమయ్యేటట్టుగా
నున్ను, నీకు బాగా జరిగేటట్టుగానున్ను, నీ దేవుడైన
యెహోవా నీకు ఆజ్ఞాపించినట్టు నీ తల్లిదండ్రులను
బహుమానముగా నడుపుదువు గాక.। నీవు నరహత్య 17
చేయ కూడదు.। నీవు వ్యభిచారమును చేయకూడదు.। 18
నీవు దొంగతనమును చేయ కూడదు.। నీవు నీ 19,20
పొరుగువాని మీద అబద్ధపు సాక్ష్యము పలుక కూడ
దు.। నీవు నీ పొరుగువాని భార్యను కోర కూడదు; 21
నీవు నీ పొరుగువానియొక్క గృహమునైనా, వాని
యొక్క పొలమునైనా, వానియొక్క పనివానినైనా,
వానియొక్క పనికత్తెనైనా, వానియొక్క యెద్దునై
నా, వానియొక్క గార్దభమునైనా, నీ పొరుగువా
నిది మరి దేనినైనానున్ను అపేక్షించ కూడదని,। యీ 22
మాటలను యెహోవా ఆ పర్వతమందు అగ్నిమేఘ
ము గాఢాంధకారముల మధ్యనుంచి మహా శబ్దము
తోను మీ సంఘ మంతటికీ ఆనతిచ్చెను; యివికాగ
మరి యేమిన్ని చెప్ప లేదు: వాటిని రెండు రాతి పల
కల మీద వ్రాసి నాకు అప్పగించెను.। అయితే ఆ 23
పర్వతము అగ్నిచేత మండుతూ వుండగా మీరు అంధ
కార మధ్యనుంచి ఆ శబ్దమును విన్నప్పుడు సంభవిం
చినది యేమంటే, మీరు మీ గోత్రములకు కలిగిన
ప్రధానులతోనున్ను పెద్దలతోనున్ను నా యొద్దికి
వచ్చి చెప్పినదేమంటే,। యిదుగో, మా దేవుడైన యె 24
హోవా మాకు తన మహిమనున్ను తన ఘనతనున్ను
అగుపరిచి యున్నాడు; అగ్నిమధ్యనుంచి ఆయన
శబ్దమును వింటిమి; దేవుడు మనుష్యునితో మాట్లాడిన

ప్పటికిన్ని వాడు బ్రతికి వుండేది యీ దినమందు
25 మేము చూచిన వారమైతిమి. । కాబట్టి యిప్పుడు
మేము యేల చావ వలెను? యెందుకంటే యీ గొప్ప
అగ్ని మమ్మును దహించును; యికను మా దేవుడైన యె
హెూవాయొక్క శబ్దమును మేము వింటిమట్టాయెనా
26 మేము మృతిబొందుదుము. । యెందుకంటే సమస్త
మైన దేహులలో మాలాగున యెవడు అగ్నిలోనుంచి
మాట్లాడిన సజీవ దేవునియొక్క శబ్దమును విని బ్రతికి
27 వుండెను. । అయినందున నీవు సమీపమునకు వెళ్లి, మా
దేవుడైన యెహెూవా ఆనతిచ్చేదంతాను విని, మా
దేవుడైన యెహెూవా నీకు సెలవు యిచ్చేది అంతా
మాతోను తెలియ చెప్పితే మేము అది విని చేతుమని
28 చెప్పితిరి. । అయితే మీరు నాతో మాట్లాడినప్పుడు
యెహెూవా మీ మాటల శబ్దమును వినెను: అప్పుడు
యెహెూవా నాకు సెలవు యిచ్చినదేమంటే, యీ
జనులు నీతో పలికిన మాటలయొక్క శబ్దమును నేను
వింటిని; వారు మాట్లాడిన మాటలెల్లా మంచివై వున్న
29 వి. । వారు నాకు భయపడి, నా ఆజ్ఞలను యావత్తూ
సదా గైకొనేటటువంటి హృదయము వారికి కలిగితే
మేలవును; అప్పుడు వారికిన్ని వారి బిడ్డలకున్ను శాశ్వ
30 తముగా బాగా జరుగును. । నీవు వెళ్లి, వారిని చూచి,
31 మీ డేరాలలోకి తిరిగి వెళ్లిపొండని చెప్పుము. । అయితే
నీవు నా సమీపమందు నిలిచి వుండు; నేను వారికి
స్వాతంత్ర్యముగా యిచ్చే దేశమందు వారు చేయ
వలసిన నా సకలమైన ఆజ్ఞలనున్ను నిబంధనలనున్ను
విధులనున్ను వారికి బోధించేటట్టుగా నీకు తెలియ
32 చెప్పుదునని సెలవు యిచ్చెను. । అయినందున మీరు
మీ దేవుడైన యెహెూవా మీకు యిచ్చిన ఆజ్ఞలను
గైకొని, వాటి ప్రకారము చేతురు గాక; మీరు కుడి
వైపుకయినా యెడమ వైపుకయినా తిరుగ కూడదు. ।
33 మీరు స్వతంత్రించుకొనే దేశమందు మీరు బ్రతికే
టట్టుగానున్ను, మీకు బాగా జరిగేటట్టుగానున్ను,
మీ దినములు అనేకమయ్యేటట్టుగానున్ను, మీ దేవు
డైన యెహెూవా మీకు ఆజ్ఞాపించిన మార్గము
లన్నిటి యందూ మీరు నడుతురు గాక.

## 6. అధ్యాయము.

1 మీరు దాటి స్వతంత్రించుకొనే దేశమందు
చేసేటట్టుగానున్ను, నీ దేవుడైన యెహెూవాకు నీవు
భయపడేటట్టుగానున్ను, నేను నీకు ఆజ్ఞాపించే ఆయ
నయొక్క సకల నిబంధనలనున్ను ఆజ్ఞలనున్ను నీవు
న్ను, నీ కుమారుడున్ను, నీ కుమారుని కుమారుడున్ను,
నీవు జీవించే యావద్దినములు గైకొనేటట్టుగానున్ను, ।
2 నీ దినములు విస్తారమయ్యేటట్టుగానున్ను, మీ దేవు
డైన యెహెూవా మీకు బోధించుమని ఆజ్ఞాపించిన
ఆజ్ఞలున్ను నిబంధనలున్ను విధులున్ను యివే. । కాబట్టి 3
ఓ ఇశ్రాయేలా, నీకు బాగా జరిగేటట్టుగానున్ను,
నీ పితృలయొక్క దేవుడైన యెహెూవా నీకు వాగ్ద
త్తము చేసిన ప్రకారము పాలతోనున్ను తేనెతోను
న్ను ప్రవహించే దేశమందు మీరు బహుగా అభివృద్ధి
పొందేటట్టుగానున్ను, వాటిని విని గైకొని చేయుము. ।
ఓ ఇశ్రాయేలా, వినుము; మన దేవుడైన యెహెూ 4
వా ఒకడే యెహెూవా అయి వున్నాడు. । మరిన్ని నీ 5
దేవుడైన యెహెూవాను నీ యావద్హృదయముతోను
న్ను, నీ యావదాత్మతోనున్ను, నీ యావచ్ఛక్తితోను
న్ను, నీవు ప్రేమించ వలెను. । యీ దినమందు నేను 6
నీకు ఆజ్ఞాపించే యీ మాటలు నీ హృదయములో
వుండ వలెను. । మరిన్ని వీటిని నీ పిల్లలకు నీవు జాగ్ర 7
తగా అభ్యసింప చేయ వలెను; యింట్లో నీవు కూర్చు
న్నప్పుడున్ను, మార్గమందు నీవు నడిచేటప్పుడున్ను,
నీవు పండుకొనేటప్పుడున్ను, నీవు లేచేటప్పుడున్ను,
వాటిని గురించి సంభాషించుకొంటూ వుండ వలెను. ।
మరిన్ని వాటిని గురుతుగా నీ చేతి మీద నీవు కట్టు 8
కో వలెను; అవి నీ కండ్లనడుమ లలాటపత్రముల వలె
వుండ వలెను. । మరిన్ని నీయింటి ద్వారబంధముల మీ 9
దనున్ను, నీ ద్వారముల మీదనున్ను, వాటిని వ్రాయ
వలెను. । అయితే నీ దేవుడైన యెహెూవా నీ పితృ 10
లైన అబ్రాహాముకున్ను ఇస్సాకుకున్ను యాకోబుకు
న్ను ప్రమాణ పూర్వకముగా యిచ్చిన దేశములోకి
నిన్ను ప్రవేశింపచేసి, నీవు కట్టనటువంటి గొప్పయు
న్ను రమ్యమున్ను అయిన పట్టణములనున్ను, నీవు నింప
నటువంటి సకలమైన మేళ్లతోటి నిండైన యిండ్లనున్ను, ।
నీవు తవ్వనటువంటి నూతులనున్ను, నీవు నాటనటు 11
వంటి ద్రాక్ష తోటలనున్ను యిప్ప చెట్లనున్ను నీకు
యిచ్చిన తరువాత, నీవు భుజించి, తృప్తిని పొందినప్పు
డు, । దాస్య గృహమైన మిస్రయీములోనుంచి నిన్ను 12
వెలపటికి రప్పించిన యెహెూవాను మరువక వుండే
టట్టుగా జాగ్రత పడుదువు గాక. । నీ దేవుడైన యె 13
హెూవాకు నీవు భయపడి, ఆయనను సేవించి, ఆయన
నామము చేత ప్రమాణము చేయ వలెను. । నీ దేవు 14
డైన యెహెూవాయొక్క కోపము నీ మీద రగులు
కొని, భూ ముఖములోనుంచి నిన్ను నశింప చేయక
వుండేటట్టు । మీ చుట్టూ వున్న జనులయొక్క దేవుం 15
డ్ల సంబంధమైన యితరమైన దేవుండ్ల వెంబడిని మీరు
వెళ్లకూడదు: యెందుకంటే నీ దేవుడైన యెహెూవా
సహించని దేవుడై యున్నాడు. । మీ దేవుడైన యె 16
హెూవాను మస్సాలో మీరు పరీక్షించినట్టు పరీక్షిం
చకండి. । మీ దేవుడైన యెహెూవాయొక్క ఆజ్ఞలనున్ను 17

ఆయన నీకు ఆజ్ఞాపించిన ఆయన సాక్ష్యములనున్న
ఆయన నిబంధనలనున్న మీరు జాగ్రతగా గైకొన
18 వలెను. । మరిన్ని నీకు బాగా జరిగేటట్టుగానున్న,
యెహోవా నీ పితృలకు ప్రమాణ పూర్వకముగా
యిచ్చిన ఆ మంచి దేశములోకి నీవు ప్రవేశించి
19 స్వతంత్రించుకొనేటట్టుగానున్న, । యెహోవా
పలికినట్టు నీ యెదుటనుంచి నీ శత్రువులనందరినిన్ని
బయిటికి వెళ్లగొట్టేటట్టుగానున్న, యెహోవాయొ
క్క దృష్టికి యుక్తమున్న వుత్తమమున్న అయిన దానిని
20 నీవు చేయ వలెను. । అయితే యిక మీదట నీ కుమారు
డు నిన్ను చూచి, మన దేవుడైన యెహోవా మీకు
ఆజ్ఞాపించిన యీ సాక్ష్యములున్న నిబంధనలున్న
విధులున్న యేమిటని అడిగితే, అప్పుడు నీ కుమారు
21 నితో నీవు చెప్పవలసినదేమంటే, । మిస్రయీములో
మేము ఫరోయొక్క దాసులమై వుంటిమి, అయితే
యెహోవా బలహస్తముచేత మమ్మును మిస్రయీము
22 లోనుంచి యివతలకు తీసుక వచ్చెను. । మరిన్ని యె
హోవా మా కండ్ల ముందర మిస్రయీము మీదను
న్ను ఫరో మీదనున్న అతని యింటి వారందరి మీద
నున్న గొప్పయున్న బాధా కరమున్నైన గురుతుల
23 నున్న అద్భుతములనున్న అగుపర్చి, । మా పితృలకు
ఆయన ప్రమాణ పూర్వకముగా యిచ్చిన దేశములోకి
మమ్మును ప్రవేశింపచేసి, మాకు దానిని యివ్వడానకు
24 అక్కడనుంచి మమ్మును బయిటికి రప్పించెను. । మరిన్ని
యీ నిబంధనలన్నిటినిన్ని చేయుటకున్న, మన దేవు
డైన యెహోవాకు భయపడుటకున్న యెహోవా
ఆజ్ఞాపించెను; అందువల్ల మనకు సదా భాగ్యము కలు
గును; యీ దినమందైనట్టు ఆయన మన జీవములను
25 పోషించును. । కాబట్టి మన దేవుడైన యెహోవా
మనకు ఆజ్ఞాపించినట్టు యీ ఆజ్ఞలన్నిటినీ గైకొని,
ఆయన యెదుట చేస్తిమట్టయెనా అది మనకు నీతి అయి
వుండునని చెప్పండి.

## 7. అధ్యాయము.

1 నీవు వెళ్లి స్వతంత్రించుకొనే దేశములోకి నీ దేవు
డైన యెహోవా నిన్ను ప్రవేశింపచేసి, నీ ముందర
నుంచి అనేకమైన జనములను, అనగా హిత్తీయులను
న్ను, గిర్గాషీయులనున్న, అమొరీయులనున్న, కెన
యానీయులనున్న, పెరిజ్జీయులనున్న, హీవీయులను
న్ను, యెబూసీయులనున్న, నీకంటే గొప్పయున్న
బలమున్నైన యీ యేడు జనములను వెళ్లగొట్టినప్పు
2 డున్న, । నీ దేవుడైన యెహోవా నీ ముందర వారిని
అప్పగించినప్పుడున్న, నీవు వారిని సంహరించి సర్వ
నాశనము చేయ వలెను: వారితో యే వొడంబడికెను
చేయకనున్న, వారియందు కనికరించకనున్న, । వారి 3
తో వివాహములు చేసుకోకనున్న వుండ వలెను; నీ
కుమార్తెను అతని కుమారునికి యివ్వకుండానున్న
అతని కుమార్తెను నీ కుమారుని కొరకు పుచ్చుకో
కుండానున్న వుండ వలెను. । యెందుకంటే వారు నీ 4
కుమారుని నా వెంబడినుంచి మళ్లేటట్టు చేసి, యితర
మైన దేవుండ్లకు సేవ చేయింతురు; అందువల్ల యెహో
వాయొక్క కోపము మీ మీద రగులుకొని మిమ్మును
హఠాత్తుగా నశింప చేసును. । వారికి మీరు చేయవల 5
సిన ప్రకారము యేమంటే, వారి బలిపీఠములను కూల
దోసి, వారి విగ్రహములను పగలగొట్టి, వారి తోపు
లను నరికివేసి, వారియొక్క చెక్కిన ప్రతిమలను అగ్ని
చేత కాల్చి వేయ వలెను. । యెందుకంటే నీవు నీ 6
దేవుడైన యెహోవాకు పరిశుద్ధమైన జనమై యున్నా
వు; నీ దేవుడైన యెహోవా భూమి ముఖము మీద
వుండే సకల జనులలో నిన్ను తనకు స్వజనమయ్యేట
ట్టుగా యెంచి యున్నాడు. । మీరు సమస్తమైన జనుల 7
కంటే విస్తారమైన జనులని యెహోవా తన ప్రియ
మును మీ మీద వుంచి మిమ్మును యెంచలేదు; యేమం
టే సమస్తమైన జనులకంటే మీరు కొంచెమై యుం
టిరి. । అయితే యెహోవా మిమ్మును స్నేహించి, మీ 8
పితృలకు యిచ్చిన ప్రమాణ ప్రకారము చేసేవాడై
యున్నాడు గనుక; యెహోవా మిమ్మును బలహస్త
ముచేత యివతలకు తీసుక వచ్చి, దాసుల యింటిలో
నుంచిన్ని మిస్రయీము రాజైన ఫరో చేతిలోనుంచిన్ని
మిమ్మును విమోచించి యున్నాడు. । కాబట్టి నీకు తెలి 9
య వలసినదేమంటే, నీ దేవుడైన యెహోవా తానే
దేవుడై వున్నాడు; యథార్థముగల దేవుడై, తన్ను
స్నేహించి తన ఆజ్ఞలను గైకొని చేసే వారి విషయ
మయి వెయి తరముల మట్టుకు వొడంబడికెనున్న కృప
నున్న వుంచే వాడై యున్నాడు. । అయితే తన్ను 10
పగ చేసే వారిని నశింప చేసుటకు వారి ముఖము
యెదుట ప్రతి క్రియను చేసును; తన్ను పగ చేసే
వాని విషయమై ఆలస్యము చేయక వాని ముఖము
యెదుట ప్రతి క్రియ చేసును. । కాబట్టి యీ దిన 11
మందు నేను నీకు ఆజ్ఞాపించే ఆజ్ఞలనున్న నిబంధనల
నున్న విధులనున్న నీవు గైకొని చేతువు గాక. । యీ 12
విధులను మీరు విని గైకొని చేస్తిరట్టాయెనా అప్పుడు
సంభవించేదేమంటే, నీ దేవుడైన యెహోవా నీ
పితృలకు ప్రమాణ పూర్వకముగా నిర్ణయించిన వొడం
బడికెనున్న కృపనున్న నీ విషయమై రూఢపరచును. ।
ఆయన నిన్ను స్నేహించి, నిన్ను ఆశీర్వదించి, వృద్ధి 13
పొందింప చేసును: నీ గర్భఫలమునున్న, నీ భూఫ
లమునున్న, నీ ధాన్యమునున్న, నీ ద్రాక్షరసమును

న్ను, నీ తైలమునున్ను, నీ గోగర్భములనున్ను, నీ
గొర్రెమందలనున్ను, నీకు యిచ్చుటకు నీ పితృలకు
14 ప్రమాణము చేసిన దేశమందు ఆశీర్వదించును.। సమస్త
మైన జనులకంటే నీవు ఆశీర్వాదమును పొందుదువు;
మీలో మొగవారికైనా ఆడువారికైనా గొడ్డుతనము
లేకపోవును; మీ పశువులు సహా గొడ్డు వీగక పోవును.।
15 మరిన్ని యెహూవా నీలోనుంచి సకల రోగములను
పరిహరించి, నీకు తెలిసి యున్న మిస్రయీముయొక్క
దుష్ట వ్యాధులను నీ మీద పెట్టక, నిన్ను పగ చేసే
16 వారి అందరి పైని వుంచును.। అయితే నీ దేవుడైన
యెహూవా నీ చేతికి అప్పగించే జనులందరినిన్ని నీవు
లయము చేయ వలెను; నీ నేత్రము వారి యందు కని
కరించ కూడదు; వారి దేవుండ్లకు సేవ చేయకూడదు;
17 యేమంటే అది నీకు వురి అయి వుండును.। మరిన్ని
నీవు నీ హృదయమందు యీ జనులు నాకంటే విస్త
రించి వున్నారు గదా వారిని యేలాగు వెళ్లగొట్టి వేతు
18 నని నీవు అనుకొనేవు, గనుక, ।నీ దేవుడైన యెహూ
వా ఫరోకున్ను మిస్రయీమంతటికిన్ని యేమి చేసె
19 నో అదిన్ని, ।యెటువంటి మహా శోధనలను నీ నేత్ర
ములు చూచెనో అవిన్ని, యెటువంటి గురుతులచేత
నున్ను అద్భుతములచేతనున్ను మహాత్తైన చేతి చేత
నున్ను చాపిన బాహువు చేతనున్ను నీ దేవుడైన యె
హూవా నిన్ను యివతలకు తీసుక వచ్చెనో అదిన్ని,
తలంచుకొని, వారికి భయపడకుండా వుండ వలెను,
యేమంటే, ఆలాగు నీ దేవుడైన యెహూవా నీవు
20 భయపడే జనులందరికిన్ని కలుగజేసును.। మరిన్ని నీ
యెదుటనుంచి దాగి యుండి శేషించిన వారు లయ
మయ్యే పర్యంతమూ నీ దేవుడైన యెహూవా వారి
21 లోకి విషపుటీగలను పంపును.। నీవు వారికి భయపడ
కుము, యేమంటే, నీ దేవుడైన యెహూవా మీలో
వున్నాడు; ఆయన మహత్తు అయినటువంటిన్ని భయం
22 కరమైనటువంటిన్ని దేవుడై వున్నాడు.। నీ దేవుడైన
యెహూవా ఆ జనులను నీ ముందరనుంచి క్రమ
క్రమముగా తోలివేసును; అడవి మృగములు విస్తా
రమై నీ మీదికి రాకుండా నీవు వారిని వెుక్కమారే
23 లయము చేయ కూడదు.। అయితే నీ దేవుడైన యె
హూవా నీ ముందరనే వారిని నీకు అప్పగించి, వారు
లయమయ్యే పర్యంతమూ గొప్ప నాశనముతో వారిని
24 నశింప చేసును.। మరిన్ని ఆయన వారి రాజులను నీ
చేతికి అప్పగించును; వారి నామములను ఆకాశము
కిందనుంచి నీవు లయము చేయ వలెను; నీవు నీ ముం
దర నిలిచేవాడు వొకడున్ను లేకపోయేటట్టు వారిని
25 లయము చేతువు.। వారి దేవుండ్లయొక్క ప్రతిమలను
అగ్నిచేత కాల్చి వేయ వలెను; నీకు వురి తగులుకో
కుండా వాటి మీదనున్న వెండికైనా బంగారముకైనా
అపేక్షించక, నీ కొరకు వాటిని తీసుకో కూడదు,
యేమంటే, నీ దేవుడైన యెహూవాకు అది అసహ్యమై
యుండును.। మరిన్ని అసహ్యమైన దానిని నీ యింటి 26
లోకి తే కూడదు, తెస్తే నీవు దాని వలెనే శాపమునకు
లోనౌదువు; నీవు దాని బొత్తిగా రోసి, దాని బొత్తి
గా అసహ్యించ వలెను, యెందుకంటే అది శాపగ్ర
స్తమైనదై వున్నది.

## 8. అధ్యాయము.

మీరు బ్రతికి, అభివృద్ధి పొంది, యెహూవా 1
మీ పితృలకు ప్రమాణ పూర్వకముగా యిచ్చిన దేశ
ములోకి ప్రవేశించి స్వతంత్రించుకో గలందులకు యీ
దినమందు నీకు నేను ఆజ్ఞాపించే ఆజ్ఞలన్నిటినిన్ని
గైకొని చేతురుగాక.। నిన్ను దీనునిగా చేయడాన 2
కున్ను, నిన్ను శోధించి నీ హృదయములో యేమి
వున్నదో ఆయన ఆజ్ఞలను నీవు గైకొందువో లేదో
అది చూడ గలందులకున్ను, యీ నలుబై సంవత్సర
ములు అరణ్యములో యే మార్గము చేత నీ దేవుడైన
యెహూవా నిన్ను నడిపించెనో అది యావత్తూ
తలంచుకొందువు గాక.। మరిన్ని మనుష్యుడు రొట్టె 3
మాత్రము చేతనే బ్రతుకకుండా, యెహూవా నోట
నుంచి బయిటికి వచ్చే ప్రతి మాటచేత మనుష్యుడు
బ్రతుకునని నీవు తెలియ గలందులకు, ఆయన నిన్ను
దీనుని చేసి, నీకు ఆకలి పొందింపచేసి, నీవున్ను నీ
పితృలున్ను యెరుగనటువంటి మాన్నాతో నిన్ను పోషిం
చెను.। యీ నలుబై సంవత్సరములున్ను నీ బట్టలు 4
పాతగిలి పోకుండానున్ను, నీ కాలు వాయకుండా
నున్ను వుండెను.। మరిన్ని తండ్రి తన కుమారుని శిక్షిం 5
చినట్టు నీ దేవుడైన యెహూవా నిన్ను శిక్షిస్తున్నా
డని నీ హృదయములో నీవు తలంచుకో వలసినది.।
కాబట్టి నీ దేవుడైన యెహూవాకు భయపడుటకున్ను 6
ఆయన మార్గములలో నడుచుటకున్ను ఆయన ఆజ్ఞ
లను గైకొంటూ వుండ వలెను.। యెందుకంటే నీ దేవు 7
డైన యెహూవా నిన్ను మంచి దేశములోకి ప్రవే
శింప చేసును; అది వుదకములు గల నదులున్ను, లోయ
లలోనుంచిన్ని పర్వతములలోనుంచిన్ని వుబికే వూట
లున్ను, అగాధములున్ను, గల దేశము.। గోధుమలున్ను 8
యవలున్ను ద్రాక్ష చెట్లున్ను అంజూరపు చెట్లున్ను
దానిమ్మ చెట్లున్ను గల దేశము, యిప్పనూనెయున్ను
తేనెయున్ను గల దేశము.। ఆ దేశమందు నీవు వెల్తి 9
లేకుండా ఆహారమును భుజింతువు; అందులో నీకు
యే వొకటిన్ని వెల్తిలేక వుండును: ఆ దేశపు రాళ్లు
యినుమై యుండును; దాని పర్వతములలోనుంచి నీవు

10 యిత్తడిని తవ్వి తీయగలవు. । నీవు భుజించి తృప్తి
పొందినప్పుడు నీ దేవుడైన యెహోవా నీకు యిచ్చిన
ఆ మంచి దేశము నిమిత్తము ఆయనను స్తుతించ వలె
11 ను. । యీ దినమందు నేను నీకు ఆజ్ఞాపించే ఆయన
యొక్క ఆజ్ఞలనున్ను విధులనున్ను నిబంధనలనున్ను
గైకొని, నీ దేవుడైన యెహోవాను మరువకుండా
12 జాగ్రతపడుము. । నీవు భుజించి తృప్తిపొంది, మంచి
యిండ్లను కట్టుకొని, వాటిలో కాపురము చేసినప్పు
13 డున్ను; । నీ యెద్దులున్ను నీ గొర్రెలున్ను వృద్ధి పొం
దినప్పుడున్ను; నీ వెండిన్ని నీ బంగారమున్ను నీకు కలి
14 గిన సమస్తమున్ను విస్తరించినప్పుడున్ను; । నీ హృద
యము అతిశయించినంతలో దాస్యగ్రహమైన మిస్ర
యీము దేశములోనుంచి నిన్ను వెలపటికి తీసుక
15 వచ్చినటువంటిన్ని; । అగ్ని సర్పములున్ను తేళ్లున్ను
ఆర్చుకొపోవుటయున్ను కలిగినటువంటిన్ని నీళ్లు లేన
టువంటిన్ని గొప్పయున్ను ఘోరమున్నైన ఆ అరణ్య
ములోబడి నిన్ను నడిపించినటువంటిన్ని; అగ్గి రాళ్ల
కొండలోనుంచి నీ కొరకు వుదకములను బయిటికి
16 రప్పించినటువంటిన్ని; । నిన్ను దీనునిగా చేయడానకు
న్ను, అటుతరువాత నీకు మేలు కలుగ చేసే నిమిత్తము
నిన్ను శోధించడానకున్ను, నీ పితృలు యెరుగనటు
వంటి మాన్నాతోను నిన్ను అరణ్యములో పోషించిన
టువంటిన్ని నీ దేవుడయిన యెహోవాను మరచి; ।
17 నీ హృదయములో నా సామర్థ్యము చేతనున్ను నా
బలహస్తము చేతనున్ను యింత భాగ్యము నాకు కలిగె
18 నని నీవు అనుకొందువేమో. । ఆలాగున కాకుండా, నీ
దేవుడైన యెహోవాను నీ జ్ఞాపకమందు వుంచుకో
వలెను; యెందుకంటే, ఆయన నీ పితృలకు తాను ప్రమా
ణము చేసిన వొడంబడికెను రూఢ పర్చడానకు యీ
దినమందు వున్నట్టు నీవు ఆస్తి సంగ్రహించుకొనే కొర
19 కు నీకు శక్తి యిస్తున్నాడు. । అయితే నీ దేవుడయిన
యెహోవాను నీవు వొక వేళ మరచి, యితరమైన
దేవుండ్లను వెంబడించి, వాండ్లకు సేవ చేసి, వొంగి,
నమస్కరించినట్టయితే, నిజముగా మీరు లయమవుదు
రని నేను మీకు యీ రోజున రూఢముగా చెప్పుతు
20 న్నాను. । మీ దేవుడయిన యెహోవాయొక్క శబ్ద
మును మీరు వినక పోయినట్టయితే మీ ముందర యె
హోవా లయము చేసే జనాంగముల వలెనే మీరున్ను
లయమవుదురు.

## 9. అధ్యాయము.

1 ఓ ఇశ్రాయేలా, వినుము; నీకంటే గొప్పయున్న
బలమున్ను గల జనములనున్ను, ఆకాశపర్యంతమూ
వున్న ప్రాకారములు గల గొప్ప పట్టణములనున్ను, ।
అనాకు పుత్రుల ముందర యెవరు నిలువగలరు అని 2
నీవు వినినటువంటిన్ని నీవు యెరిగినటువంటిన్ని ఆ
అనాకీయుల పుత్రులయిన గొప్పయున్ను పొడుగున్ను
గల జనమునున్ను, స్వతంత్రించుకొనుటకు యీ దిన
మున యర్దేనును దాటబోతున్నావు. । కాబట్టి యీ 3
దినమందు నీ దేవుడైన యెహోవా తానే నీకు ముం
దరగా వెళ్లేవాడై వున్నాడని నీవు గ్రహించుకో వల
సినది: దహించే అగ్నివలెను ఆయన వారిని లయము
చేసి, నీ ముందర వారిని కూల చేసును: అయినందున
యెహోవా నీకు సెలవు యిచ్చినట్టు నీవు వారిని
బయిటికి వెళ్లగొట్టి త్వరగా లయము చేతువు. । అయితే 4
నీ దేవుడైన యెహోవా నీ ముందరనుంచి వారిని తో
లివేసిన తరువాతను నా నీతి కొరకే కదా యెహో
వా యీ దేశమును స్వతంత్రించుకోవడానకు నన్ను
ప్రవేశింప చేసెనని నీ హృదయములో తలంచకుము;
ఆలాగు కాదు, గాని, యీ జనాంగములయొక్క
దుర్మార్గత నిమిత్తమై యెహోవా నీ ముందరనుంచి
వారిని తోలివేసును. । నీ నీతి నిమిత్తము చేతనున్ను 5
నీ హృదయముయొక్క యథార్థ నిమిత్తము చేత
నున్ను నీవు వారి దేశమును స్వతంత్రించుకొన పోతు
న్నావు కావు, గాని, అబ్రాహాము ఇస్సాకు యాకోబు
అనే నీ పితృలకు యెహోవా ప్రమాణ పూర్వక
ముగా చెప్పిన వాక్యమును నెరవేర్చేటట్టుగా యీ
జనాంగములయొక్క దుర్మార్గత నిమిత్తము చేతను
నీ దేవుడైన యెహోవా నీ ముందరనుంచి వారిని
తోలివేసును. । కాబట్టి నీ దేవుడైన యెహోవా నీ 6
నీతి నిమిత్తముచేత యీ మంచి దేశమును నీవు స్వతం
త్రించుకొనుటకు యిస్తున్నాడు కాడని నీవు గ్రహించ
వలెను, యేమంటే, నీవు వంచని మెడగల జనమై
వున్నావు. । నీ దేవుడైన యెహోవాకు నీవు అరణ్య 7
ములో కోపము కలుగ చేసిన సంగతులన్నీ తలంచు
కొని మరువకుము; మిస్రయీము దేశములోనుంచి
నీవు బయిలుదేరిన నాటనుంచి యీ స్థలమునకు వచ్చే
పర్యంతమూ మీరు యెహోవాకు వ్యతిరిక్తులై వుం
టిరి. । హోరేబు పర్వతమందున్ను మీరు యెహో 8
వాకు కోపమును కలుగ చేసితిరి; అందువల్ల యెహో
వా మిమ్మును నశింపచేయుటకు మీ మీద కోపముగా
వుండెను. । ఆ రాతి పలకలను, అనగా, యెహోవా 9
మీతో చేసిన వొడంబడికె గల పలకలను పుచ్చుకొను
టకు నేను కొండమీదికి యెక్కి వెళ్లినప్పుడు, నలుబై
దినములు దివా రాత్రములు కొండమీద ఆహారమును
భుజించకనున్ను నీరు పానము చేయకనున్ను వుంటూ
వుంటిని. । అప్పుడు యెహోవా దేవుని వేలుచేత 10
వ్రాసిన రెండు రాతి పలకలను నా చేతికి అప్పగిం

చెను; సంఘము కూడిన దినమున యెహోవా కొండ
మీద అగ్ని మధ్యనుంచి మీతోటి ఆనతిచ్చిన వాక్య
ముల ప్రకారము ఆ పలకల మీద వ్రాసి వుండెను.।
11 ఆ నలుబై దివారాత్రములు అయిన తరువాతను సంభ
వించినదేమంటే, యెహోవా ఆ రెండు రాతి పలక
లను అనగా, వొడంబడికె గల పలకలను నా చేతికి
12 అప్పగించెను. । మరిన్ని యెహోవా నన్ను చూచి,
నీవు లేచి యిక్కడనుంచి శీఘ్రముగా దిగి వెళ్లుము,
యేమంటే, మిస్రయీములోనుంచి నీవు యివతలకు
తీసుక వచ్చిన నీయొక్క జనులు తమ్ముల తాము చెరు
పుకొన్నారు; వారికి నేను ఆజ్ఞాపించిన మార్గములో
నుంచి వేగముగా తొలిగిపోయి యున్నారు; తమ
కొరకు వొక పోత విగ్రహము చేసుకొని యున్నారని
13 ఆనతిచ్చి; । మరిన్ని యెహోవా నాకు సెలవు యిచ్చి
నదేమంటే, యీ జనమును నేను చూస్తిని, యిదుగో,
14 యిది వంచని మెడగల జనము. । నన్ను వద్దనకు, నేను
వారిని నశింపచేసి, వారి నామమును ఆకాశము కింద
వుండకుండా తుడచివేసి, నీ వల్లను వారికంటే, బల
మున్ను గొప్పయున్ను గల జనమును కలుగచేతునని
15 ఆనతిచ్చెను. । అంతట నేను మళ్లీ పర్వతము మీద
నుంచి దిగితిని; పర్వతము అగ్నితో కాలుతూ వుం
డెను; వొడంబడికె గల ఆ రెండు పలకలు నా రెండు
16 చేతులలో వుండెను. । అప్పుడు నేను చూచినంతలో,
యిదుగో, మీరు దేవుడైన యెహోవాకు విరోధము
గా పాపము చేసి, మీ కొరకు వొక పోత దూడను
కలుగ చేసుకొని యుంటిరి; యెహోవా మీకు ఆజ్ఞా
పించిన మార్గములోనుంచి మీరు వేగముగా తొలి
17 గిపోయి యుంటిరి. । అప్పుడు నేను మీ కండ్ల ముం
దర ఆ పలకలను నా చేతులలోనుంచి కింద వేసి పగల
18 గొట్టితిని. । మరిన్ని నేను మునుపటి వలెనే యెహో
వాయొక్క సముఖమందు సాగిలపడి, యెహోవా
దృష్టి యెదుట ఆయనకు కోపము కలుగ జేసేటట్టు
మీరు అక్రమముగా చేసిన మీయొక్క సకల పాప
ముల నిమిత్తము నలుబై దినములు దివారాత్రములు
ఆహారము తినకనున్ను నీరు తాగకనున్ను వుంటిని.।
19 యెందుకంటే మిమ్మును నశింపచేసే కొరకు మీ విష
యమై యెహోవా పొందిన అహంకారము కొర
కున్ను తీక్ష్ణమైన కోపము కొరకున్ను నేను భయపడి
తిని; అయితే యెహోవా ఆ వేళయందున్ను నా
20 మనవి ఆలకించెను. । మరిన్ని యెహోవా అహరో
నును నశింప చేయుటకు అతని మీద బహు కోపము
గా వుండెను; అయితే ఆ వేళయందు అహరోను
21 కొరకున్ను ప్రార్థన చేస్తిని. । మరిన్ని నేను మీయొక్క
పాపమును, అనగా, మీరు కలుగ చేసుకొనిన దూ
డను తీసుకొని, దాని అగ్నిలో కాల్చి, దంచి, అది
ధూళి అంత మెత్తగా వుండే పర్యంతమూ మిక్కిలీ
మెత్తగా నూరి, ఆ పొడుమును కొండనుంచి పారే
గెడ్డలో పారబోసితిని. । మరిన్ని తబేరాలోనున్ను, 22
మశ్శాలోనున్ను, కిబ్రోథత్తయవాలోనున్ను, మీరు
యెహోవాకు కోపమును కలుగ జేసితిరి. । అదిగాక 23
కాదేశబర్నేయనుంచి మీరు పయికి వెళ్లి మీకు నేను
యిచ్చిన దేశమును స్వతంత్రించుకొండని మిమ్మును
యెహోవా పంపించినప్పుడు, మీరు మీ దేవుడైన
యెహోవాయొక్క ఆజ్ఞకు వ్యతిరిక్తులై, ఆయనను
నమ్మకుండానున్ను ఆయన శబ్దమును వినకుండానున్ను
వుంటిరి. । నేను మిమ్మును యెరిగిన నాటనుంచీ మీరు 24
యెహోవాకు వ్యతిరిక్తులైన వారై వుంటూ వచ్చితిరి.।
అయినందున నేను మునుపటివలెనే యెహోవా సము 25
ఖమందు సాగిలపడి, నలుబై దినములు దివారాత్ర
ములు వుంటూ వుంటిని, యేమంటే నేను వారిని నశిం
పచేతునని యెహోవా ఆనతిచ్చెను. । కాబట్టి నేను 26
యెహోవాను ప్రార్థన చేసినదేమంటే, వో ప్రభు
వైన దేవుడా, నీ ఘనతచేత నీవు విమోచించినటువం
టిన్ని బలహస్తముచేత నీవు మిస్రయీములోనుంచి వెల
పటికి తీసుక వచ్చినటువంటిన్ని నీ జనులనున్ను నీ స్వా
స్థ్యమునున్ను నశింప చేయకుము. । నీ సేవకులైన అబ్రా 27
హామునున్ను ఇస్సాకునున్ను యాకోబునున్ను జ్ఞాప
కము చేసుకొనుము; యీ జనులయొక్క మూర్ఖత్వ
మునున్ను దుర్మార్గమునున్ను పాపమునున్ను చూడకు
ము. । మమ్మును నీవు యే దేశములోనుంచి యివతలకు 28
తీసుక వస్తివో ఆ దేశస్థులు యెహోవా వీరికి వాగ్ద
త్తము చేసిన దేశములోకి వారిని ప్రవేశింప చేయు
టకు శక్తిలేక వున్నందుననున్ను, వారిమీద పగ కలిగి
వున్నందుననున్ను, అరణ్యమందు వారిని హతము చేసు
టకు యివతలకు తీసుక వచ్చెనని చెప్పుకొందురేమో,।
అయినప్పటికిన్ని వీరు నీ బలమయిన పరాక్రమము 29
చేతనున్ను నీ చాపిన బాహువు చేతనున్ను నీవు వెల
పటికి తీసుక వచ్చిన నీ జనులున్ను నీ స్వాస్థ్యమైన
వారున్నై వున్నారు అని ప్రార్థించితిని.

## 10. అధ్యాయము.

అప్పుడు యెహోవా నాకు సెలవు యిచ్చిన 1
దేమంటే, మునుపటిలాగున రెండు రాతి పలకలను
చెక్కించి, వాటిని పట్టుకొని కొండ మీదికి యెక్కి
నా యొద్దికి రా; మరిన్ని వొక కర్ర పెట్టెను చేయిం
చుము. । అప్పుడు నేను నీవు పగలకొట్టిన మునుపటి 2
పలకలనున్న వాక్యములను యీ పలకలందు వ్రాసిన
తరువాత నీవు ఆ పెట్టెలో వాటిని వుంచ వలెనని

3 సెలవు యిచ్చెను. । అందుకు నేను షిట్టీము కఱ్ఱ
పెట్టెను చేయించి, మునుపటిలాగున రెండు రాతి
పలకలను చెక్కించి, ఆ రెండు పలకలను చేత పట్టు
4 కొని కొండ మీదికి యెక్కితిని. । అప్పుడు సంఘము
కూడిన దినములో యెహోవా కొండ మీద అగ్ని
మధ్యనుంచి మీతో పలికిన ఆ పది ఆజ్ఞలను మును
పటి వ్రాత వలెనే ఆయన ఆ పలకలందు వ్రాసి, యె
5 హోవా వాటిని నాకు యిచ్చెను. । అప్పుడు నేను
మళ్లి, కొండ దిగి, ఆ పలకలను నేను చేయించిన పెట్టె
లో వుంచినాను; మరిన్ని అవి నాకు యెహోవా
6 ఆజ్ఞాపించినట్టు దానిలో వుండి వున్నవి. । అంతట ఇశ్రా
యేలు పుత్రులు బెయేరోతు బెనేయాకానునుంచి
తర్లి వెళ్లి మోసేరాకు వచ్చిరి: అక్కడ అహరోను
మరణమైనందున అక్కడనే పాతి పెట్టబడెను: అతని
కుమారుడైన ఎలాజారు అతనికి మారుగా అర్చకత్వ
7 వ్యాపారము జరిగిస్తూ వుండెను. । అక్కడనుంచి వారు
తర్లి గుద్గోదకు వచ్చిరి; గుద్గోదనుంచి తర్లి వుదక
8 నదులు గల దేశమైన యొత్బాతుకు వచ్చిరి. । ఆ వేళను
యెహోవా లేవీ గోత్రికులను యెహోవాయొక్క
వొడంబడికె గల పెట్టెను మోసుటకున్ను, యెహో
వా సముఖమందు నిలిచి వుండి ఆయనకు సేవ చేయు
టకున్ను, ఆయన నామముచేత ఆశీర్వదించుటకున్ను,
నేటి వరకు జరుగుతూ వున్న ప్రకారము కేటా పర
9 చెను. । అందుచేతను లేవీకి అతని సహోదరులతో
పాలైనా స్వాస్థ్యమైనా లేదు; నీ దేవుడైన యెహో
వా అతనికి యిచ్చిన వాగ్దత్తము చొప్పున యెహో
10 వాయే అతనికి స్వాస్థ్యమయి వున్నాడు. । అయితే
మునుపటి వలెనే నేను ఆ కొండ మీద నలుబై దిన
ములు దివారాత్రములు వుంటిని; మరిన్ని ఆ వేళయం
దున్ను యెహోవా నా మనవిని ఆలకించెను, గనుక,
11 యెహోవా నిన్ను నశింప చేయకపోయెను. । అంతట
యెహోవా నాకు సెలవు యిచ్చినదేమంటే, నీవు
లేచి, ప్రయాణమై, యీ జనుల ముందర నడువుము,
యేమంటే, వారి పితృలకు నేను ప్రమాణపూర్వకము
గా యిచ్చిన దేశములోకి ప్రవేశించి, వారు దాని
12 స్వతంత్రించుకొందురని సెలవు యిచ్చెను. । యిప్పుడు
వో ఇశ్రాయేలా, నీ దేవుడైన యెహోవాకు భయ
పడడమున్ను, ఆయన మార్గములన్నిటిలో నడవడము
న్ను, ఆయనను స్నేహించడమున్ను, నీ హృదయమం
తటితోనున్ను నీ యాత్మ అంతటితోనున్ను నీ దేవు
13 డైన యెహోవాను సేవించడమున్ను, । నీ మేలు
కొరకు నేను యీ దినమందు నీకు ఆజ్ఞాపించే యెహో
వాయొక్క ఆజ్ఞలనున్ను నిబంధనలనున్ను గైకొనడ
మున్ను గాక, నీ దేవుడైన యెహోవా నీ యెడల
మరి కోరేది యేమి వున్నది! । యిదుగో ఆకాశమున్ను 14
ఆకాశముల ఆకాశమున్ను నీ దేవుడైన యెహో
వావై వున్నవి; మరిన్ని భూమిన్ని దానిలోనున్న సమ
స్తమున్ను ఆయనవై వున్నవి. । అయినప్పటికిన్ని యె 15
హోవా నీ పితృల యందు ప్రేమ వుంచుటకు వారి
యందు ఆనందించి, వారి తరువాత అయిన వారి సంత
తియై యున్న మిమ్మును యీ దినమందు వున్నట్టు సమ
స్తమైన జనులకంటే యేర్పరచుకొనెను. । కాబట్టి మీ 16
హృదయముయొక్క ముందోలును సున్నతీ చేసి, యి
కను వంచని మెడగల వారై యుండకుడీ. । యెందు 17
కంటే మీ దేవుడైన యెహోవా దేవ దేవుడున్ను,
ప్రభు ప్రభువున్ను, గొప్పయున్ను బలమున్ను భయం
కరత్వమున్ను గల దేవుడున్ను, మనుష్యరూపమును
లక్ష్యపెట్టకనున్ను, లంచము పుచ్చుకొకనున్ను వుండే
వాడున్ను, । తల్లిదండ్రులు లేని వారికిన్ని విధవలకున్ను 18
న్యాయము తీర్చి, పరదేశిని ప్రీతిచేసి, అతనికి అన్న
వస్త్రములను యిచ్చేవాడున్నై యున్నాడు. । కాబట్టి 19
మీరు పరదేశిని ప్రీతి చేతురుగాక; యెందుకంటే,
మిస్రయీము దేశమందు మీరు పరదేశులై వుంటిరి. ।
నీవు నీ దేవుడైన యెహోవాకు భయపడి, ఆయనను 20
సేవించి, ఆయనతో హత్తుకొని, ఆయన నామముచేత
ప్రమాణమును చేయ వలెను. । ఆయన నీ నేత్రములు 21
చూచిన యీ గొప్పయున్ను భయంకరమున్నైనటు
వంటి కార్యములను నీ కొరకు చేసిన నీయొక్క స్తుతిన్ని
నీ దేవుడున్నై వున్నాడు. । నీ పితృలు మిస్రయీము 22
లోకి దిగి వెళ్లినప్పుడు డెబ్బయిమంది మాత్రమే వుండిరి;
యిప్పుడు నీ దేవుడైన యెహోవా నిన్ను ఆకాశ
నక్షత్రములైనట్టు విస్తరింప చేసి యున్నాడు.

## 11. అధ్యాయము.

కాబట్టి నీవు నీ దేవుడైన యెహోవాను స్నేహించి, 1
నీకు ఆయన అప్పగించిన దానినిన్ని, ఆయన నిబంధన
లనున్ను, ఆయన విధులనున్ను, ఆయన ఆజ్ఞలనున్ను,
నిత్యమున్ను గైకొన వలెను. । మరిన్ని యీ దినమందు 2
మీరు గ్రహించ వలెను, యేమిటంటే, మీ దేవుడైన
యెహోవాయొక్క శిక్షనున్ను, ఆయన మహత్తును
న్ను, ఆయన బలహస్తమునున్ను, ఆయన చాపిన బాహు
వునున్ను; । మరిన్ని మిస్రయీము మధ్యమందు మిస్ర 3
యీము రాజయిన ఫరోకున్ను అతని దేశమంతటి
కిన్ని ఆయన కలుగ చేసిన ఆయన అద్భుతములనున్ను,
ఆయన కార్యములనున్ను; । మరిన్ని మిస్రయీము 4
సైన్యమునకున్ను వారి గుఱ్ఱములకున్ను వారి రథముల
కున్ను ఆయన చేసిన దానినిన్ని, వారు మిమ్మును తరి
మినప్పుడు ఆయన వారి మీద యెఱ్ఱ సముద్రము

యొక్క జలము వచ్చేటట్టు యేలాగు చేసెనో, యీ
దినము పర్యంతమూ యెహోవా వారిని యేలాగు
5 నశింప చేసియున్నాడో అదిన్ని; మరిన్ని మీరు యీ
స్థలమునకు వచ్చే పర్యంతమూ అరణ్యములో మీకు
6 ఆయన చేసిన దానినిన్ని; రూబేనుకు పుట్టిన ఏలీ
యాగుయొక్క కుమారులైన దాతానుకున్ను అబీరాము
కున్ను ఆయన చేసిన దానినిన్ని, భూమి తన నోరు
తెరచి వారినిన్ని వారి యింటి వారినిన్ని వారి డేరా
లనున్ను వారి వశమందుండిన సమస్తమునున్ను ఇశ్రా
యేలు అందరి మధ్యను యేలాగు మింగివేసెనో, యివి
యన్నిటిని చూడనటువంటిన్ని యెరగనటువంటిన్ని
మీ పిల్లలతో నేను పలుకుతున్నాను కాను, గాని,
7 యెహోవా చేసిన ఆయన సకలమైన గొప్ప కార్య
8 ములను మీ నేత్రములు చూచి యున్నవి. కాబట్టి
మీరు దృఢము తెచ్చుకొని, మీరు స్వతంత్రించుకొన
పోయే దేశములోకి ప్రవేశించి, దాని స్వతంత్రించు
కొని, యెహోవా మీ పితృలకున్ను వారి సంతతి
కిన్ని ప్రమాణ పూర్వకముగా యిచ్చిన దేశమందు,
అనగా, పాలతోనున్ను తేనెతోనున్ను ప్రవహించే
9 ఆ దేశమందు మీ దినములు విస్తారమయ్యేటట్టుగా
యీ దినమందు నేను మీకు ఆజ్ఞాపించే ఆజ్ఞలన్నిటి
10 నిన్ని మీరు గైకొన వలెను. యేమంటే నీవు వెళ్లి
స్వతంత్రించుక బోయే దేశము మీరు విడచి వచ్చిన
మిస్రయీము దేశము వంటిది కాదు; అక్కడ నీవు
విత్తనమును విత్తి, కూర తోట తడిపినట్టు దానిని నీ
11 పాదముతోటి తడుపుతూ వుంటివి. అయితే మీరు
వెళ్లి స్వతంత్రించుకొనే దేశము పర్వతములున్ను లో
వలున్ను గల దేశమై, ఆకాశముయొక్క వర్షపు
12 నీరును అనేది యాను. ఆ దేశమును నీ దేవుడైన
యెహోవా లక్ష్యపెట్టుతూ వున్నాడు; నీ దేవుడైన
యెహోవాయొక్క నేత్రములు సంవత్సరాది మొద
లుకొని సంవత్సరాంతము పర్యంతమూ దానిమీదనే
13 వుంటూ వున్నవి. యిందుకు యెహోవా సెలవు
యిచ్చినదేమంటే, యీ దినమందు నేను మీకు ఆజ్ఞా
పించే ఆజ్ఞలను మీరు జాగ్రతగా ఆలకించి, మీ దేవు
డైన యెహోవాను స్నేహించి మీ హృదయమంతటి
తోనున్ను మీ యాత్మ యంతటితోనున్ను ఆయనను
14 సేవించితిరట్టాయెనా, మీ దేశమునకు తగిన సమయ
మందు వర్షమును వర్షింప చేతును; మీ ధాన్యము
నున్ను మీ ద్రాక్షారసమునున్ను మీ తైలమునున్ను
మీరు కూర్చుకొనేటట్టుగా మొదటి వర్షమునున్ను కడ
15 వర్షమునున్ను నేను కురువచేతును. మరిన్ని నీవు
భుజించి తృప్తి పొందేటట్టుగా నీ పొలములలో నీ
పశువుల కొరకు గడ్డి బలిపింతునని సెలవు యిచ్చెను.

అయితే మీ హృదయము భ్రమపడి, మీరు గతి తప్పిన 16
వారై, వేరే దేవుండ్లను సేవించి వాటికి వంగి నమ
స్కారము చేయకుండా జాగ్రత పడండి. వొకవేళ 17
జాగ్రత పడకపోతే యెహోవాయొక్క కోపము
మీ మీద రగులుకొనును; వర్షము కురవకుండానున్ను
భూమి దాని ఫలము యివ్వకుండానున్ను ఆయన ఆకా
శమును మూసివేసును; అప్పుడు యెహోవా మీకు
యిచ్చే ఆ మంచి దేశములోనుంచి మీరు అతి శీఘ్ర
ముగా లయమై పోదురు. కాబట్టి నా యీ మాట 18
లను మీరు మీ హృదయమందున్ను మీ ఆత్మయందు
న్ను వుంచుకొని, మీ చేతుల మీద గురుతులుగా
నున్ను మీ నేత్రముల మధ్యమందు లలాట పత్రము
గానున్ను మీరు కట్టుకో వలెను. మరిన్ని యింట్లో 19
కూర్చున్నప్పుడున్ను, మార్గమందు నడుస్తూ వున్న
ప్పుడున్ను, పరున్నప్పుడున్ను, లేచినప్పుడున్ను, వాటిని
గురించిన ప్రసంగము తెచ్చుకొని, వాటిని మీ పిల్ల
లకు నేర్పి, మీ యింటి ద్వారబంధముల మీదనున్ను 20
మీ ద్వారముల మీదనున్ను వాటిని వ్రాయవలెను.
అప్పుడు యెహోవా మీ పితృలకు ప్రమాణ పూర్వ 21
కముగా యిచ్చిన దేశమందు మీ దినములున్ను మీ
పిల్లలయొక్క దినములున్ను భూమి మీద ఆకాశము
యొక్క దినములైనట్టు అనేకమై వుండును. యెందు 22
కంటే నేను మీకు ఆజ్ఞాపించే యీ ఆజ్ఞలన్నిటినీ
మీరు జాగ్రతగా గైకొని, వాటిని చేసి, మీ దేవు
డైన యెహోవాను స్నేహించి, ఆయన మార్గము
లన్నిటిలో నడిచి, ఆయనతో హత్తుకొని వుంటిరట్టా
యెనా, అప్పుడు యెహోవా యీ సకలమైన 23
జనాంగములను మీ ముందరనుంచి వెళ్లగొట్టును, గనుక,
మీరు మీకంటే గొప్పయున్ను బలమున్ను గల జనాం
గములను జయించి స్వతంత్రించుకొందురు. యే స్థల 24
మందు మీ పాదము పడునో ఆ స్థలము మీదై వుం
డును; అరణ్యమున్ను, లెబానోనున్ను, నదిన్ని అనగా
ఫెరాతు నదిన్ని, యివి మొదలుకొని పడమటి సము
ద్రము మట్టుకు మీ సరిహద్దు అయి వుండును. మీ 25
ముందర నిలువ గలవాడు వొకడున్ను లేక వుండును,
యెందుకంటే, మీ దేవుడైన యెహోవా మీకు ఆన
తిచ్చినట్టు మీయొక్క భీతినిన్ని వెరుపునున్ను మీరు
నడిచే దేశమంతటి మీద ఆయన పెట్టును. యిదుగో 26
నేటి దినమున నేను మీ ముందర ఆశీర్వాదమునున్ను
శాపమునున్ను పెట్టుతున్నాను. నేటి దినమున నేను 27
మీకు ఆజ్ఞాపించే మీ దేవుడైన యెహోవాయొక్క
ఆజ్ఞలను మీరు మనస్కరించి చేసితిరట్టాయెనా ఆశీ
ర్వాదమున్ను, మీ దేవుడైన యెహోవాయొక్క ఆ 28
జ్ఞలను మీరు మనస్కరించక, యీ దినమందు నేను

మీకు నిర్ణయించే మార్గములోనుంచి తొలిగిపోయి,
మీరు యెరుగనటువంటి వేరైన దేవుండ్లను వెంబడించి
29 తిరట్టాయెనా శాపమున్ను, । అయితే మీరు వెళ్లి స్వతం
త్రించుకొనే దేశములోకి మీ దేవుడైన యెహోవా
మిమ్మును ప్రవేశింప చేసినప్పుడు సంభవించేదేమంటే,
మీరు ఆ ఆశీర్వాదమును గెరిజ్జీము కొండ మీదనున్ను,
ఆ శాపమును ఏబాలు కొండ మీదనున్న వుంచ
30 వలెను. । అవి యర్దేను అవతల అస్తాద్రి దిక్కులో
గిల్గాలు యెదుట బయిలుగా వున్న భూమి యందు
కాపురము చేసే కనయానీయుల దేశమందున్న మోరే
31 యొక్క మైదానముల దగ్గిర వున్నవి గదా! । యెందు
కంటే మీరు మీ దేవుడైన యెహోవా మీకు యిచ్చే
దేశములోకి స్వతంత్రించుకొనే నిమిత్తము ప్రవేశిం
చుటకు యర్దేనును దాటుదురు, దానిని స్వతంత్రిం
32 చుకొని, దానిలో కాపురము చేతురు. । కాబట్టి యీ
దినమందు నేను మీ యెదుట పెట్టే నిబంధనలనున్న
విధులనున్న మీరు గైకొని చేతురు గాక.

## 12. అధ్యాయము.

1 మీ పితృలయొక్క దేవుడైన యెహోవా మీకు
స్వాతంత్ర్యముగా యిచ్చే దేశమందు మీరు భూమి
యందు బ్రతికే దినములన్నిటి దాకా భద్రము చేయ
వలసిన నిబంధనలున్ను విధులున్ను యేమిటంటే, ।
2 మీరు లోంగతీసుకొనే జనాంగములు వారి దేవుండ్లకు
వున్నతమైన పర్వతముల మీదనున్ను కొండల మీద
నున్ను పచ్చని వృక్షములన్నిటి కిందనున్ను సేవ చేస్తూ
వుందురు, గనుక, వాటిని మీరు సర్వనాశనము చేయ
3 వలెను. । మరిన్ని వారి బలిపీఠములను కూలదోసి, వారి
మూల విగ్రహములను పగల కొట్టి, వారి తోపులను
అగ్నిచేత కాల్చివేసి, వారి దేవుండ్లయొక్క ప్రతిమ
లను నరికివేసి, వారి నామములను ఆ స్థలములోనుంచి
4 లయము చేతురు గాక. । ఆలాగు మీరు మీ దేవుడైన
5 యెహోవాకు చేయ కూడదు. । యేమంటే మీ దేవు
డైన యెహోవా మీ గోత్రములలో యే స్థలమందు
తన నామమును వుంచుటకు యెంచునో ఆ స్థలమనగా
ఆయన కాపురమును మీరు వెతికి అక్కడికి రావలె
6 ను. । మరిన్ని అక్కడికి మీరు మీ హోమార్పణల
నున్ను, మీ బలులనున్ను, మీ పదోపాళ్లనున్ను, మీ
చేతియొక్క పైకెత్తే అర్పణలనున్ను, మీ మొక్కుబళ్ల
నున్ను, మీ స్వేచ్ఛార్పణలనున్ను, మీ యెద్దుల మంద
లలోనున్న మీ గొర్రెల మందలలోనున్న తొలిచూ
7 లువాటినిన్ని, తీసుక రావలెను. । అక్కడ మీరు మీ
దేవుడైన యెహోవా సముఖమందు భుజియించి, మీ
దేవుడైన యెహోవా మీరు చేపట్టిన అంతటి యందు

మిమ్మును ఆశీర్వదించెనని మీరున్ను మీ యింటి కూట
ములున్ను సంతోషించ వలసినది. । యీ దినమందు 8
మనలో ప్రతి మనుష్యుడూ యిక్కడ తన కంటికి
యేది న్యాయమని అగుపడుతున్నదో అది చేస్తూ
వున్నాడు, అయితే అక్కడ మీరు ఆ ప్రకారము
చేయ కూడదు. । యెందుకంటే మీ దేవుడైన యెహో 9
వా మీకు యిచ్చే ఆ విశ్రమమునకున్ను స్వాస్థ్య
మునకున్ను మీరు యింకా వచ్చి వుండ లేదు. ।
అయితే మీరు యర్దేనును దాటి, మీ దేవుడైన 10
యెహోవా మీకు స్వాతంత్ర్యముగా యిచ్చే దేశ
మందు మీరు నివసించేటప్పుడున్ను, మీరు నిర్భయ
ముగా నివసించేటట్టుగా చుట్టూ వున్న మీ సమస్త
శత్రువులలోనుంచి ఆయన మిమ్మును తప్పించి మీకు
నెమ్మది యిచ్చేటప్పుడున్ను, । మీ దేవుడైన యెహో 11
వా వొక స్థలమును తన నామము నివాసము చేసేటట్టు
యెంచును; అక్కడికి మీకు నేను ఆజ్ఞాపించేటటు
వంటి సమస్తమున్ను, అనగా, మీ హోమార్పణలను
న్ను, మీ బలులనున్ను, మీ పదోపాళ్లనున్ను, మీ
చేతియొక్క పైకెత్తే అర్పణనున్ను, యెహోవాకు
మీరు యెంచి వుంచిన మొక్కుబళ్లనున్ను, మీరు తీసుక
వత్తురు గాక. । అప్పుడు మీరున్ను, మీ కుమారులున్ను, 12
మీ కుమార్తెలున్ను, మీ దాసులున్ను, మీ దాసురాం
డ్లున్ను, లేవీయునికి మీతో కూడా పాలైనా స్వాస్థ్య
మైనా లేదు గనుక మీ వాకిటిలో వుండే లేవీయుడు
న్ను, మీ దేవుడైన యెహోవా సముఖమందు సంతో
షించ వలసినది. । నీకు కనిపించే ప్రతి స్థలములో నీ 13
హోమార్పణలను నీవు చెల్లించక జాగ్రతగా వుండు
ము. । అయితే నీ గోత్రములలో యే వొక దాని 14
యందు యెహోవా వొక స్థలమును యెంచునో
దాని యందే నీవు నీ హోమార్పణలను చెల్లిస్తూ, నీకు
నేను ఆజ్ఞాపించేదంతాను అక్కడనే చేస్తూ వుండ వలె
ను. । అయినప్పటికిన్ని నీ దేవుడైన యెహోవా నిన్ను 15
ఆశీర్వదించి, నీకు యిచ్చిన వాటిలో నీ యాత్మ దేని
యిచ్ఛయించునో నీవు దాన్ని నీ ఆవరణలలో చంపు
కొని మాంసమును తిన వచ్చును, అది దుప్పి వలెనున్న
లేడి వలెనున్న అంటు పడినవాడున్ను అంటు పడని
వాడున్న తిన వచ్చును. । అయితే రక్తము మాత్రము 16
మీరు తిన కూడదు; అది వుదకము వలె నేల మీద
మీరు కుమ్మరించ వలెను. । నీ ధాన్యము నీ ద్రాక్షార 17
సము నీ తైలము వీటిలో పదో పాళ్లున్న, నీ యెద్దుల
మందలోనున్న నీ గొర్రెల మందలోనున్న తొలి
చూలున్న, నీవు మొక్కుకొనిన నీ మొక్కుబళ్లనున్న,
నీ స్వేచ్ఛార్పణలున్న, నీ చేతియొక్క పైకెత్తే అర్ప
ణయున్న, వీటిలో యేదైనానున్న నీ ఆవరణలలోపల

18 నీవు తిన కూడదు. । గాని, నీవున్ను నీ కుమారుడున్ను
నీ కుమార్తెయున్ను నీ దాసుడున్ను నీ దాసియున్ను
నీ వాకిటిలో వున్న లేవీయుడున్ను నీ దేవుడైన యె
హోవా యెంచే స్థలమునకు వచ్చి, నీ దేవుడైన యె
హోవా సముఖమందు వాటిని తిన వలెను; మరిన్ని
నీవు చేపట్టిన అంతటిని గురించి నీ దేవుడైన యెహో
19 వా సముఖమందు నీవు సంతోషించ వలెను. । భూమి
యందు నీవు బ్రతికే దినములన్నిటి పర్యంతమూ నీవు
20 లేవీయుని వదలకుండా జాగ్రతపడుము. । నీ దేవుడైన
యెహోవా నీకు యిచ్చిన వాక్ప్రకారము ఆయన నీ
సరిహద్దు విస్తరింప చేసిన తరువాత, నీ మనస్సు మాం
సపు భోజనమును కోరుతుంది గనుక మాంసమును
తింటానని నీవు అనుకొన్నట్టయితే, యే మాంసమును
నీ యాత్మ యిచ్ఛయించునో దాని నీవు తిన వచ్చు
21 ను. । నీ దేవుడైన యెహోవా తన నామమును యె
క్కడ వుంచడానకు యెంచునో ఆ స్థలము నీకు
దూరముగా వున్నట్టయితే, అప్పుడు నీకు నేను ఆజ్ఞా
పించినట్టు యెహోవా నీకు యిచ్చిన నీ యెద్దుల
మందలోనుంచిన్ని నీ గొర్రెల మందలోనుంచిన్ని
తీసి చంపి, నీ యాత్మ యిచ్ఛయించే దాని నీవు నీ
22 ఆవరణ లోపల తిన వచ్చును. । దుప్పినిన్ని లేడినిన్ని
నీవు తినినట్టు వాటిని నీవు తిన వచ్చును; అంటు పడిన
వాడున్ను అంటు పడని వాడున్ను కూడి తిన వచ్చును. ।
23 అయినా రక్తమును యే మాత్రమూ తినకుండా భద్ర
ముగా వుండుము, యెందుకంటే, రక్తము జీవమై
యున్నది, మాంసముతో ఆ జీవమును నీవు తిన కూడ
24 దు. । నీవు దాని తినవద్దు; వుదకము వలెనే నీవు దానిని
25 భూమి మీద కుమ్మరించ వలెను. । యెహోవా దృష్టికి
యుక్తమైన దానిని నీవు చేసినప్పుడు నీకున్ను నీ తరు
వాత నీ పిల్లలకున్ను బాగా జరిగే కొరకు దానిని నీవు
26 తినకూడదు. । అయితే నీయొద్దనున్న పరిశుద్ధమైన వాటి
నిన్ని నీ మొక్కుబళ్లనున్ను నీవు తీసుకొని, యెహో
27 వా యెంచే స్థలమునకు వెళ్ల వలెను. । నీ హోమార్ప
ణలను మాంసముతోనున్ను రక్తముతోనున్ను నీ దేవు
డైన యెహోవా బలిపీఠము మీద నీవు చెల్లించ వలె
ను; అయితే నీ బలులయొక్క రక్తము నీ దేవుడైన యె
హోవా బలిపీఠము మీద పొయ్యబడ వలెను, వాటి
28 మాంసమును నీవు తిన వలెను. । నీ దేవుడైన యెహో
వా దృష్టకి వుత్తమమున్ను యుక్తమున్ను అయిన దానిని
నీవు చేసినప్పుడు నీకున్ను నీ తరువాత నీ పిల్లలకున్ను
శాశ్వతముగా బాగా జరిగే కొరకు నీకు నేను ఆజ్ఞా
29 పించే యీ మాటలన్నిటిని విని గైకొనుము. । నీ దేవు
డైన యెహోవా నీవు వారిని స్వాధీనము చేసుకోవ
డానకు వెళ్లే దేశమందున్న జనాంగములను నీ ముం
దరనుంచి ఖండించి వేసిన తరువాత నీవు వారికి మారు
గా వారి దేశమందు కాపురము చేస్తూ వున్నప్పుడు, ।
నీ ముందరనే నశించి పోయిన వారియొక్క మర్యాద 30
లను అనుసరించి, నీవు వురిలో చిక్కు పడకుండాను
న్ను, యీ జనాంగములు వారి దేవుండ్లకు యేలాగు
సేవ చేసెనో ఆలాగున నేనున్ను చేతునని అనుకొని
వారి దేవుండ్లను గురించి ప్రశంసించకుండానున్ను జా
గరూకుడవై యుండుము. । నీ దేవుడయిన యెహో 31
వాకు నీవు ఆ ప్రకారము చేయ కూడదు, యెందు
కంటే, యెహోవా ద్వేషిస్తూ వున్నటువంటిన్ని తనకు
అసహ్యమైనటువంటిన్ని సకలమున్ను వారు వారి
దేవుండ్ల విషయమై చేసియున్నారు; యేమంటే వారు
తమ కుమాళ్లనున్ను తమ కుమార్తెలనున్ను సహా వారి
దేవుండ్ల విషయమై అగ్నిలో దహనము చేసి యున్నా
రు. । యే సంగతి నేను నీకు ఆజ్ఞాపిస్తినో అది గైకొని 32
చేయుము; దానికి యెక్కువ సమకూర్చకనున్ను
అందులో యేమయినా తక్కువ చేయకనున్ను వుండ
వలెను.

## 13. అధ్యాయము.

మీలోగా దీర్ఘదర్శి అయినా, స్వప్నములు 1
కనేవాడైనా బయిలుదేరి, నీకు వొక గురుతునయినా
వొక వింతనైనా చూపించి, । నీవు యెరుగనటువంటి 2
వేరైన దేవుండ్లను వెంబడించి, వాటికి మనము సేవ
చేతామని చెప్పిన తరువాత, వాడు చెప్పిన గురుతైనా
వింత అయినా సంభవించినప్పటికిన్ని, । నీవు ఆ దీర్ఘ 3
దర్శియొక్కయైనా ఆ స్వప్నములను కనిన వానియొక్క
యైనా మాటలను వినకూడదు; యెందుకంటే, మీరు
మీ హృదయమంతటితోనున్ను మీ ఆత్మ అంతటితో
నున్ను మీ దేవుడయిన యెహోవాను స్నేహింతురో
లేదో అని మీ దేవుడైన యెహోవా మిమ్మును శో
ధించేవాడై వున్నాడు. । మీ దేవుడైన యెహోవా 4
వెంబడి నడిచి, ఆయనకు మీరు భయపడి, ఆయన
ఆజ్ఞలను గైకొంటూ, ఆయన శబ్దమును వింటూ, ఆయ
నను సేవిస్తూ, ఆయనతో హత్తుకొని వుండ వలెను. ।
కాబట్టి అటువంటి దీర్ఘదర్శిన్ని స్వప్నములు కనే 5
వాడున్ను మరణ శిక్షను పొంద వలసినది; యెందు
కంటే, మిస్రయీము దేశములోనుంచి మిమ్మును రప్పిం
చి, దాస్య గృహములోనుంచి మిమ్మును విమోచించిన
మీ దేవుడైన యెహోవా యొద్దనుంచి మిమ్మును మళ్లిం
చుటకున్ను, మీ దేవుడైన యెహోవా మీకు నిర్ణ
యించిన మార్గములోనుంచి మిమ్మును తప్పించుటకు
న్ను చెప్పిన వాడు అవును; యీలాగున నీ మధ్య

6 నుంచి నీవు కీడును పరిహరించ వలెను. । నీ తల్లి కుమా
రుడైన నీ సహోదరుడైనా, నీ కుమారుడైనా, నీ కుమా
ర్తెగా అయినా, నీ కౌగిటి భార్య అయినా, నీ ప్రా
ణములాటి నీ స్నేహితుడైనా నిన్ను చూచి, మనము
వెళ్లి యితరమైన దేవుండ్లను సేవింతామని నిన్ను రహ
స్యముగా లాలించినప్పుడు, నీవైనా నీ పితృలైనా
7 యెరగనటువంటిన్ని, । భూమియొక్క యీతట్టు మొద
లుకొని ఆ తట్టు పర్యంతమూ నీకు సమీపముగాన
యినా లేక దూరముగానయినా నీ చుట్టూ వున్న
జనులు సేవించేటటువంటిన్ని దేవుండ్లను గురించి యీ
8 లాగు నీతో చెప్పితే; । నీవు వానితో సమ్మతించకుం
డానున్ను వాని మాట వినకుండానున్ను వుండ వలెను;
నీ కన్ను వాని యందు కనికరించ కూడదు; వాని
యందు నీవు దయ తలచి, వాని మరుగుగా వుంచ
9 కూడదు. । నీవు అవశ్యముగా వాని చంపి వేయ వలెను;
వాని చంపడానకు ముందుగా నీ చెయ్యిన్ని తరువాత
10 జనులందరి చేతులున్ను వాని మీద పడవలసినది. । యెం
దుకంటే మిస్రయీము దేశములోనుంచి, అనగా,
దాస్య గృహములోనుంచి నిన్ను బయిటకు తీసుకవ
చ్చిన నీ దేవుడైన యెహోవా యొద్దనుంచి వాడు
నిన్ను తొలిగించుటకు వెతికెను, గనుక, వాడు మరణ
మవుటకు నీవు రాళ్లతో వాని కొట్టివేయ వలెను. ।
11 అయినందున ఇశ్రాయేలు వారందరున్ను విని, భయ
పడి, మీలో అటువంటి దుష్క్రియను యిక చేయక
12 వుందురు. । నీ దేవుడైన యెహోవా నీకు కాపురము
చేయడానకు యిచ్చిన పట్టణములలో యే వొక దాని
యందైనా కొందరు దుర్మార్గులు మీలోనుంచి బైలు
13 వెళ్లి, । తమ పట్టణపు వారితో మనము పోయి, మీరు
యెరుగనటువంటి వేరైన దేవుండ్లను సేవ చేతామని
చెప్పి, వారిని పిలుచుకొని పోయినారన్న సంగతి నీకు
14 వినపడినట్టయితే, । అప్పుడు నీవు విచారించి, పరిశీ
లించి, జాగ్రతగా బోగట్టా చేయ వలెను: యిదుగో
అటువంటి అసహ్యత మీలోగా చేయడమాయెనన్న
సంగతి వాస్తవమున్ను నిశ్చయమున్ను అయి యుంటే, ।
15 నీవు ఆ పట్టణపు కాపురస్థులను కత్తి వాడి చేత అవ
శ్యముగా సంహరించి, దానినిన్ని దానిలో వున్న సమ
స్తమునున్ను దాని పశువులనున్ను కత్తి వాడి చేత సర్వ
16 నాశనము చేయ వలెను. । మరిన్ని దానిలో దొరికిన
సొమ్ము అంతటినిన్ని దాని వీధిలో కుప్ప పోసి, ఆ
పట్టణమునున్ను దానిలో దొరికిన సొమ్ము అంతటినిన్ని
నీ దేవుడైన యెహోవా విషయమై అగ్ని చేత దహ
నము చేయ వలెను; అది యెప్పటికి పాడు దిబ్బయై
17 తిరిగీ కట్టబడక పోవును. । యెహోవా తన తీక్ష్ణ
మైన కోపమునుంచి మళ్లుకొని, నీకు కృపను అగప
రచి, నీ యందు కనికరించి, ఆయన నీ పితృలకు ప్రమా
ణము చేసిన ప్రకారము నిన్ను విస్తరింప చేసేకొరకు
ఆ శాపగ్రస్తమైన దానిలోనుంచి యేదిన్ని నీ చేతికి
అంటబడ కూడదు. । యీ దినమున నేను నీకు ఆజ్ఞా 18
పించే ఆయన ఆజ్ఞలన్నిటినిన్ని గైకొనుటకున్ను, నీ
దేవుడైన యెహోవాయొక్క దృష్టికి యుక్తమైన
దాని చేసుటకున్ను, నీవు నీ దేవుడైన యెహోవా
యొక్క శబ్దమును విన వలెను.

## 14. అధ్యాయము.

మీరు మీ దేవుడైన యెహోవాయొక్క పిల్లలై 1
వున్నారు: మరణమైన వారిని గురించి మిమ్మును మీరు
కోసుకోకనున్ను, మీ నేత్రముల మధ్యమందు మున్నన
చేసుకోకనున్ను వుండ వలెను. । యెందుకంటే నీవు నీ 2
దేవుడైన యెహోవాకు పరిశుద్ధ జనమై యున్నావు;
భూమి యందున్న సకల జనులకంటే యెహోవా
నిన్ను తనకు స్వజనమయ్యేటట్టుగా యెంచి యున్నా
డు. । యేహ్యమయినది యేదైనా నీవు తిన కూడదు. । 3
మీరు తిన వలసిన మృగములు యేమిటేమిటంటే, యె 4
ద్దున్ను, గొర్రెయున్ను, మేకయున్ను, । లేడిన్ని, దుప్పి 5
న్ని, యెనుమున్ను, కారు మేకయున్ను, కణుసున్ను,
కారు యెద్దున్ను, చమరమున్ను. । మరిన్ని మృగముల 6
లో డెక్కను భేదించి యేర్పాటుగా రెండు డెక్కలు
గల అడుగు కలిగినటువంటిన్ని, నెమరు వేసేటటువంటి
న్ని, సకల మృగములనున్ను మీరు తిన వచ్చును. । అయి 7
తే నెమరు వేసే వాటిలోనైనా, డెక్కలు భేదించే వా
టిలోనయినా, మీరు తిన కూడని మృగములు యేవం
టే, వొంటె, కుందేలు, చెవులపిల్లి; యివి నెమరు వేసే
వైనప్పటికిన్ని డెక్కలు భేదించనివై యున్నవి గనుక
అవి మీకు అపవిత్రమవును. । మరిన్ని పంది; అది 8
డెక్కలు భేదించేదై యున్నప్పటికిన్ని నెమరు వేయ
నిదై యున్నది గనుక అది మీకు అపవిత్రమవును:
వీటి మాంసమును యేమాత్రమైనా మీరు తినకుండా
నున్ను, వీటి కళేబరములను ముట్టకుండానున్ను వుండ
వలెను. । జలచరములలో మీరు తిన వలసినవి యేమిటే 9
మిటంటే, రెక్కలున్ను పొలుసులున్ను కలిగిన సకల
మైన వాటినిన్ని మీరు తినవచ్చును. । అయితే రెక్క 10
లున్ను పొలుసులున్ను లేని దానిని మీరు తిన కూడ
దు, అది మీకు అపవిత్రమవును. । పవిత్రమైన సకల 11
పక్షులను మీరు తిన వచ్చును. । మీరు తిన కూడనివి 12
యేమిటేమిటంటే, పక్షి రాజున్ను, ఫెరసు పక్షి
యున్ను, వుత్క్రోశమున్ను, । రాహా పక్షియున్ను, గద్ద 13
యున్ను, జాతిభేదము గల రాంబొందున్ను, । జాతి 14
భేదము గల కాకిన్ని, । యానాహు పక్షియున్ను, 15

రాత్రిడేగయున్ను, శాఖాపు పక్షియున్ను, జాతి
16 భేదము గల డేగయున్ను, । చిన్న గుడ్లగూబయున్ను,
పెద్ద గుడ్లగూబయున్ను, తిన్నెమెతు పక్షియున్ను, ।
17 గూడకొంగయున్ను, తెల్ల రాంబోందున్ను, శాలాఖు
18 పక్షియున్ను, । సారసమున్ను, జాతి భేదము గల కొం
గయున్ను, దార్వాఘాటమున్ను, ఋషి పక్షియున్ను,।
19 యెగిరేటటువంటి పాకే జంతువులు అన్నిన్ని మీకు
20 అపవిత్రమవును; అవి తిన బడ కూడదు. । అయితే
పవిత్రమైన సకల పక్షులనూ మీరు తినవచ్చును. ।
21 దానంతటను అదే చచ్చిన దేనినైనా మీరు తిన కూ
డదు; నీ ఆవరణలలో వున్న పరదేశికి తినేటట్టు
యియ్య వలసినది, లేకపోతే అన్యునికి నీవు దానిని
అమ్మ వచ్చును; యెందుకంటే నీవు నీ దేవుడయిన యె
హోవాకు పరిశుద్ధమైన జనమయి వున్నావు. మేక
22 పిల్లను దాని తల్లి పాలతోను వండ కూడదు. । యేటా
యేటా పొలములో పండిన నీ పంటయొక్క వృద్ధిలో
23 మంచి నీవు పదో పాలును తీసి వుంచ వలసినది. । యిది
గాక నీ ధాన్యము నీ ద్రాక్షారసము నీ తైలము వీటి
లో పదో పాలునున్ను, నీ యెద్దుల మందలోనున్ను
నీ గొర్రెల మందలోనున్ను తొలిచూలైన వాటినిన్ని,
నీ దేవుడైన యెహోవాకు నీవు నిత్యమున్ను భయ
పడ నేర్చుకొ గలందులకై నీ దేవుడైన యెహోవా
తన నామమును వుంచుటకు యెంచే స్థలములో ఆయన
24 సముఖమందు తిన వలెను. । మార్గము బహు దీర్ఘ
మైనందున దానిని మొయ్య శక్తి నీకు లేకపోయినాను
న్ను, నీ దేవుడైన యెహోవా నిన్ను ఆశీర్వదించిన
తరువాత నీ దేవుడైన యెహోవా తన నామమును
వుంచుటకు యెంచే స్థలము నీకు దూరమైనానున్ను, ।
25 నీవు దానిని విక్రయించి ఆ ద్రవ్యము మూట కట్టు
కొని, నీ దేవుడైన యెహోవా యెంచే స్థలమునకు
26 వెళ్లి, । ఆ ద్రవ్యమును నీ యాత్మ యిచ్ఛయించే దానికి,
అనగా, యెద్దులకైనా, గొర్రెలకైనా, ద్రాక్షారసము
కైనా, మద్యముకైనా, నీ మనస్సు కోరేది యేదో దాని
కొరకు యిచ్చి, అక్కడ నీ దేవుడైన యెహోవా
సముఖమందు దానిని తిని, నీవున్ను నీ యింటి కూటము
టున్ను నీ వాకిట్లో వున్న లేవీయుడున్ను సంతోషించ
27 వలసినది. । నీతో కూడా లేవీయునికి పాలయినా
స్వాస్థ్యమయినా లేదు గనుక నీవు వానిని వదల కూ
28 డదు. । మరిన్ని మూడు సంవత్సరముల అంతమందు,
అనగా, మూడో సంవత్సరమందే నీ ఫలవృద్ధిలో పదో
పాలు యావత్తూ తీసుక వచ్చి, నీ వాకిట పోగుగా
29 వుంచ వలెను. । అప్పుడు నీతో కూడా లేవీయునికి
పాలయినా స్వాస్థ్యమైనా లేదు; గనుక, వాడున్ను
నీ ఆవరణలోనున్న పరదేశియున్ను తండ్రిలేని వాడు
న్ను విధవయున్ను వచ్చి, దానిని తిని, తృప్తిని పొందు
దురు; అందువల్ల నీ దేవుడైన యెహోవా నీవు చేసే
హస్త కృత్యములన్నిటి యందూ నిన్ను ఆశీర్వదించును.

## 15. అధ్యాయము.

యేడో సంవత్సరాంతమందు నీవు విడుదలను చేయ 1
వలెను. । ఆ విడుదలయొక్క విధము యెట్టిదంటే, తన 2
పొరుగు వానికి అప్పు యిచ్చిన వాడు దానిని విడచి
వేయ వలెను; వాడు తన పొరుగు వాని యొద్దనైనా
తన సహోదరుని యొద్దనైనా అడగ కూడదు, యెం
దుకంటే అది యెహోవాయొక్క విడుదల అనబ
డును. । పరదేశి యొద్ద నీవు అడుగ వచ్చును, అయితే 3
నీ సహోదరుని యొద్ద వున్న నీ దానిని నీ చెయ్యి
విడిచిపెట్ట వలెను. । అయినా గాని మీలో బీదవాం 4
డ్లు వుండరాదు, యెందుకంటే, నీ దేవుడైన యెహో
వా నీకు స్వాతంత్ర్యముగా యిచ్చే దేశమందు నిన్ను
బహుగా ఆశీర్వదించును. । యిందుకు యేమంటే, నీ 5
దేవుడైన యెహోవాయొక్క శబ్దమును నీవు ఆలకించి,
యీ దినమందు నేను నీకు ఆజ్ఞాపించే ఆయన యొక్క
ఆజ్ఞలన్నిటినీ గైకొని చేతువు గాక. । యెందుకంటే నీ 6
దేవుడైన యెహోవా నీకు యిచ్చిన మాట చొప్పున
నిన్ను ఆశీర్వదించును; నీవు అనేక జనాంగములకు
అప్పు యిత్తువు, అయితే నీవు అప్పు చేయక పోదువు;
అనేక జనాంగములను నీవు యేలుదువు, అయితే
వారు నిన్ను యేలేది లేక పోవును. । అయితే నీ దేవు 7
డైన యెహోవా నీకు యిచ్చే దేశమందు నీయొక్క
ఆవరణలలో దేనియందైనా నీ సహోదరులలో వొక
బీదవాడు వున్నట్టాయెనా, నీవు నీ హృదయమును
కఠిన పర్చక, బీదవాడైన నీ సహోదరునికి నీ చెయ్యి
ముయ్య కూడదు. । నీ చెయ్యి వానికి నిండా విప్పి, 8
వానికి యేది అవసరమవునో వాని అవసరమునకు చా
లినంత మట్టుకు నీవు నిశ్చయముగా అప్పు యివ్వ వలె
ను. । యేడో సంవత్సరము అనే విడుదల సంవత్సరము 9
సమీపమాయెనన్న యోజన నీ దుష్ట హృదయమందు
కలగకుండా జాగ్రతపడుము; యేమంటే, బీదవాడైన
నీ సహోదరుని మీద నీ కన్ను చెడ్డగా వుండి, వా
నికి యేమిన్ని యివ్వక పోతే, వాడు నీ విషయమై యె
హోవా యొద్ద మొర్ర పెట్టినందున నీకు పాపము
వచ్చును. । నీవు నిశ్చయముగా వానికి యివ్వ వలెను; 10
వానికి యిచ్చినప్పుడు నీ హృదయములో చింతపడ కూ
డదు; యెందుకంటే, యీ నిమిత్తము కొరకు నీ దేవుడైన
యెహోవా నీ పనులన్నిటి యందున్ను నీవు చేపట్టిన
వాటి అన్నిటి యందున్ను నిన్ను ఆశీర్వదించును. । యెం 11
దుకంటే దరిద్రులు దేశమందు వుండక మానరు; కా

బట్టి నేను నీకు యిచ్చే ఆజ్ఞ యేమంటే, నీ సహో
దరునికిన్ని నీ దేశములో యిక్కట్టు పడినవానికిన్ని దరి
12 ద్రునికిన్ని నీ చెయ్యి నిండా విప్పవలెను. । మరిన్ని
నీ సహోదరులలో ఇబ్రీయుడైనా ఇబ్రీయురాలైనా
నా నీకు అమ్ముడు పోయి, నీ కింద ఆరు సంవత్సర
ములు సేవ చేస్తే, యేడో సంవత్సరమందు నీ యొద్ద
13 నుంచి వారిని విడచి పెట్ట వలెను. । అయితే నీవు వా
నిని విడచి పెట్టేటప్పుడు వట్టివానిగా విడచిపెట్ట
14 కూడదు; । నీ మందలోదియైనా నీ కళ్లములోదియైనా
నీ ద్రాక్ష గానుగలోదియైనా వానికి యిచ్చి, చాలా
సహాయము చేయ వలెను; నీ దేవుడైన యెహోవా
నిన్ను ఆశీర్వదించిన ప్రకారము వానికి యివ్వ వలసి
15 నది. । మిస్రయీము దేశమందు నీవు దాసుడవై యుం
టివనిన్ని, నీ దేవుడైన యెహోవా నిన్ను విమోచిం
చినాడనిన్ని నీవు జ్ఞాపకము చేసుకోవలసినది; అందు
నిమిత్తము యీ దినమందు నేను నీకు యీ మాటలను
16 ఆజ్ఞాపిస్తున్నాను. । అయినప్పటికిన్ని వాడు నీ యొద్ద
బాగా వుండి, నీ యందున్ను నీ యింటియందున్ను
ప్రేమగా వున్నందున, నిన్ను చూచి, నీ యొద్దనుంచి
17 నేను పోలేనని చెప్పితే, । నీవు శలాకను పట్టుకొని,
వాని చెవిని ద్వారమున మోపి, రంధ్రము పొడిచిన
తరువాత వాడు సదా నీ దాసుడై వుండును. నీ దాసి
18 కిన్ని నీవు ఆ ప్రకారమే చేయ వలెను. । అయితే
నీవు వానిని స్వతంత్రునిగా విడచి పెట్టేటప్పుడు
యిది నాకు ఆయాసమని విచారించ కూడదు; యెందు
కంటే నీ కింద ఆరు సంవత్సరములు సేవ చేసినందున
కూలివానికంటే రెండు రెట్లు వానివల్ల నీకు ప్రయో
జనమాయెను: అదిగాక నీ దేవుడైన యెహోవా నీవు
19 చేసిన అంతటిలో నిన్ను ఆశీర్వదించును. । మరిన్ని నీ
యెద్దుల మందలోనున్ను నీ గొర్రెల మందలోనున్ను
తొలిచూలైన మొగవాటిని నీవు నీ దేవుడైన యెహో
వా కొరకు పరిశుద్ధము చేయ వలెను: నీ ఆవుయొక్క
తొలిచూలుతో నీవు యే పనిని చేయకనున్ను, నీ
గొర్రెను తొలిచూలయిన దాని వెంట్రుకలను కత్తిరిం
20 చకనున్ను వుండ వలెను. । యేటా యేటా నీవున్ను
నీ యింటి కూటమున్ను నీ దేవుడైన యెహోవా
యెంచే స్థలములో యెహోవా సమ్ముఖమందు దాని
21 తిన వలెను. । అయితే దానికి యే తొర్రియయినా
వుంటే, అనగా, సొట్టయినా, గుడ్డి అయినా, యే చెడ్డ
తొర్రి అయినా కలిగియుంటే, దాని నీ దేవుడైన
22 యెహోవాకు బలిగా చెల్లించ కూడదు. । నీ వాకిటి
లో నీవు దాని తిన వలెను; అంటుపడిన వాడున్ను అం
టు పడని వాడున్ను కూడి, దుప్పినిన్ని లేడినిన్ని తిన్న

ట్టు దాన్ని తిన వచ్చును. । అయితే రక్తము మాత్రము 23
నీవు తినకూడదు; అది వుదకము వలె నేలమీద నీవు
పొయ్య వలెను.

## 16. అధ్యాయము.

ఆబీబు మాసమును నీవు గైకొని, నీ దేవుడైన 1
యెహోవా కొరకు పస్కాపండుగను ఆచరింతువు
గాక; యెందుకంటే, ఆబీబు మాసములోనే నీ దేవు
డైన యెహోవా నిన్ను రాత్రి మిస్రయీములో
నుంచి బైటికి రప్పించెను. । కాబట్టి యెహోవా తన 2
నామమును వుంచుటకు యెంచే స్థలమందు నీ దేవు
డైన యెహోవాకు పస్కాబలినిన్ని, గొర్రెల మంద
లోదిన్ని యెద్దుల మందలోదిన్ని నీవు చెల్లించ
వలెను. । దానితో నీవు పులుసు గల రొట్టెను తినకూ 3
డదు; నీవు మిస్రయీము దేశములోనుంచి వెలపటికి
వచ్చిన దినమును నీ యావజ్జీవ పర్యంతమూ నీవు తలం
చుకొనే కొరకు ఆ యేడు దినములూ క్లేశముయొక్క
రొట్టె, అనగా, పులుసులేని రొట్టెను నీవు దానితో
తిన వలెను; యెందుకంటే, మిస్రయీము దేశములో
నుంచి నీవు త్వరగా బయలుదేరి వస్తివి. । అయినం 4
దున యేడు దినములూ నీ సరిహద్దంతటిలో పులుసు
గల రొట్టె నీ యొద్ద వుండకూడదు; మరిన్ని ప్రథమ
దినము సాయంతనమందు నీవు బలి చెల్లించిన మాం
సము ఆ రాత్రి అంతా తెల్లవారే పర్యంతమూ వుండ
కూడదు. । నీ దేవుడైన యెహోవా నీకు యిచ్చే ఆవ 5
రణలలో యే యొక దాని యందైనా పస్కా బలిని నీవు
చెల్లించ కూడదు. । యే స్థలమందు నీ దేవుడైన యె 6
హోవా తన నామమును వుంచుటకు యెంచునో
అక్కడ సాయంతనమందు సూర్యాస్తమానమందు
మిస్రయీములోనుంచి నీవు బయటికి వచ్చిన వేళ
ప్పుడు నీవు పస్కాబలిని చెల్లించ వలెను. । మరిన్ని నీ 7
దేవుడైన యెహోవా యెంచే స్థలమందు నీవు దానిని
కాల్చుకొని, తిని, వుదయమందు నీవు తిరిగి నీ నివా
సములకు వెళ్లవలెను. । ఆరు దినములు నీవు పులుసు 8
లేని రొట్టెను తిన వలెను; యేడో దినమందు నీ దేవు
డైన యెహోవా కొరకు పరిశుద్ధ సమాజము కలిగి
యుండ వలెను, అందులో యే వ్యాపారమైనా నీవు
చేయ కూడదు. । మరిన్ని నీవు యేడు వారములను 9
లెక్కించ వలెను; యెప్పుడు నీవు కొడవలితో పంట
కోయుటకు ఆరంభింతువో అది మొదలుకొని యేడు
వారములను లెక్కించ వలెను. । అప్పుడు నీవు వార 10
ముల పండుగ చేసి, నీ దేవుడైన యెహోవా నిన్ను
ఆశీర్వదించిన చొప్పున నీ స్వేచ్ఛార్పణయొక్క కాను
కను చేత పట్టుకొని వచ్చి, నీ దేవుడైన యెహోవా

11 కొరకు చెల్లించ వలెను. । అప్పుడు నీవున్ను, నీ కుమా
రుడున్ను, నీ కుమార్తెయున్ను, నీ దాసుడున్ను, నీ
దాసియున్ను, నీ వాకిటిలో వున్న లేవీయుడున్ను, నీ
యొద్దయున్న పరదేశియున్ను, తండ్రి లేనివాడున్ను,
విధవయున్ను, నీ దేవుడైన యెహోవా తన నామ
మును వుంచుటకు యెంచిన స్థలములో నీ దేవుడైన
యెహోవా సముఖమందు సంతోషించ వలెను. ।
12 మరిన్ని మిస్రాయీములో నీవు దాసుడవై వున్న సంగ
తిని తలంచుకొని, యీ నిబంధనలను గైకొని చేతువు
13 గాక. । నీ పంటనున్ను నీ ద్రాక్షారసమునున్ను, నీవు
సమకూర్చిన తరువాత యేడు దినములు పర్ణశాలల
14 పండుగను చేయ వలెను. । అప్పుడు నీవున్ను, నీ కుమా
రుడున్ను, నీ కుమార్తెయున్ను, నీ దాసుడున్ను, నీ
దాసియున్ను, నీ వాకిటిలోనున్న లేవీయుడున్ను, పర
దేశియున్ను, తండ్రి లేనివాడున్ను, విధవయున్ను, నీ
15 పండుగ యందు సంతోషించ వలెను. । యేడు దినములు
నీవు యెహోవా యెంచే స్థలమందు నీ దేవుడైన
యెహోవా కొరకు పండుగను చేయ వలెను; యెం
దుకంటే, నీ దేవుడైన యెహోవా నీ అభివృద్ధి అం
తటి యందున్ను నీ హస్తకృత్యములన్నిటి యందున్ను
నిన్ను ఆశీర్వదించును గనుక నీవు నిశ్చయముగా
16 సంతోషించ వలెను. । ప్రతి సంవత్సరమూ మూడు
మారులు, అనగా, పులుసులేని రొట్టె పండుగ యం
దున్ను, వారముల పండుగ యందున్ను, పర్ణశాలల
పండుగ యందున్ను, నీ మొగవారందరున్ను నీ దేవు
డైన యెహోవా యెంచే స్థలములో ఆయన సము
ఖమందు అగుపడ వలెను; అయితే విడి చేతులతోను
17 యెహోవా సముఖమునకు రాకూడదు. । నీ దేవుడ
యిన యెహోవా నీకు యిచ్చిన ఆశీర్వాదము చొ
ప్పున తనకు కలిగిన శక్తికొద్దీ ప్రతి మనుష్యుడూ యివ్వ
18 వలెను. । నీ దేవుడైన యెహోవా నీ గోత్రములలో
నీకు యిచ్చిన పురద్వారములన్నిటి యందూ న్యాయా
ధిపతులనున్ను అధికారులనున్ను నీవు నిర్ణయించు
కో వలెను; వారు నీతి న్యాయములచేత జనులకు న్యా
19 యము తీర్చ వలెను. । నీవు న్యాయమును తిప్పి వేసి
తీర్చకూడదు; పక్షపాతము చేయకుండానున్ను, లంచ
ము పుచ్చుకోకుండానున్ను వుండ వలెను; యెందు
కంటే, లంచము జ్ఞానవంతులయొక్క నేత్రములకు
అంధత్వము కలుగజేసి, నీతి మంతులయొక్క మాట
20 లను తిప్పును. । నీవు జీవించే కొరకున్ను నీ దేవుడైన
యెహోవా నీకు యిచ్చే దేశమును నీవు స్వతంత్రిం
చుకొనే కొరకున్ను కేవలము న్యాయమునే అనుస
21 రించ వలెను. । నీవు చేసుకొనే నీ దేవుడైన యెహో
వా బలిపీఠము దగ్గిర యే తోపు వృక్షములనైనా నాట

కూడదు. । మరిన్ని నీ దేవుడైన యెహోవా అసహ్యి 22
స్తున్నటువంటి యే విగ్రహమునైనా నీవు నిలుప
కూడదు.

## 17. అధ్యాయము.

నీవు నీ దేవుడైన యెహోవాకు తొర్రి అయినా 1
మరి యే అవలక్షణమైనా గల యెద్దునైనా గొర్రెనై
నా బలి యర్పించ కూడదు, యెందుకంటే, అది నీ
దేవుడైన యెహోవాకు అసహ్య మవును. । నీ దేవు 2
డైన యెహోవాయొక్క వొడంబడికెను మీరి, ఆయన
దృష్టికి దుర్మార్గతను జరిగించి వున్నటువంటిన్ని నేను
ఆజ్ఞాపించనటువంటిన్ని యితరమైన దేవుండ్లను సేవిం
చి, । వాటికైనా సూర్యునికైనా చంద్రునికైనా ఆకాశ 3
సమూహములో యే వొకదానికైనా మ్రొక్కి వున్న
టువంటి పురుషుడైనా స్త్రీ అయినా నీ దేవుడైన యె
హోవా నీకు యిచ్చే నీ పురద్వారములలో వొక
దానిలోనూ మీలోనూ కనుపడితే, । ఆ సంగతి నీకు 4
తెలియ చేయబడినంతలో నీవు విని జాగ్రతగా పరిశీ
లించినప్పుడు, యిదుగో, ఇశ్రాయేలులో అటువంటి
అసహ్యత జరిగి వుండుట వాస్తవమున్ను నిశ్చయమున్ను
అయి వున్నట్టయితే, । అప్పుడు ఆ దుష్క్రియను చేసిన 5
యీ పురుషునైనా స్త్రీనైనా నీవు నీ పురద్వారముల
యొద్దకి తీసుక వచ్చి, వారు మృతిబొందే పర్యంతమూ
వారిని, అనగా, ఆ పురుషునైనా ఆ స్త్రీనైనా రాళ్లతో
కొట్ట వలెను. । యిద్దరు ముగ్గురు సాక్షుల నోటి మా 6
టచేత మరణపాత్రుడైనవాడు మరణము పొందించ
బడును గాక; అయితే యేక సాక్షి నోటి మాటచేత
వాడు మరణము పొందింప బడ కూడదు. । సాక్షుల 7
యొక్క చేతులు వానిని మరణమును పొందించుటకు
వాని మీద ముందుగా పడ వలెను; తరువాత జనులం
దరి చేతులూ పడ వలెను; ఈలాగు నీవు ఆ చెడ్డతన
మును మీలోనుంచి పరిహరించుకో వలెను. । రక్తము 8
నకు రక్తమున్ను వాదమునకు వాదమున్ను, దెబ్బకు
దెబ్బయున్ను, యీ విషయములను గురించినటువంటి
వ్యాజ్యములు నీ పురద్వారములలో పుట్టినప్పుడు,
వీటిలో యే యొక దాని గురించియైనా న్యాయపు
తీర్పు చేయుట నీకు మిక్కిలీ కఠినమైంతే, । అప్పుడు 9
నీవు లేచి నీ దేవుడైన యెహోవా యెంచే స్థలము
నకు వెళ్లి, లేవీయులైన అర్చకుల యొద్దికిన్ని ఆ దినము
లలో వుండే న్యాయాధిపతి యొద్దికిన్ని వచ్చి, వారిని
అడుగ వలెను, వారు నీకు న్యాయపు తీర్పును చూ
పింతురు. । నీ దేవుడైన యెహోవా యెంచే స్థలము 10
లో వుండే వారు నీతో తెలియ చెప్పిన మాట ప్రకా
రము యావత్తూ నీవు చేయ వలెను; వారు నీకు నేర్పి

11 నదంతాను భద్రముగా చేయ వలెను. । వారు నీకు
నేర్పిన న్యాయప్రమాణముయొక్క విధింపు ప్రకా
రముగానున్ను వారు నీకు తెలియచేసే తీర్పు ప్రకార
ముగానున్ను నీవు చేయ వలెను; వారు నీకు అగుప
రచే విధింపునుంచి కుడి యెడమలకు తిరగ కూడదు. ।
12 అయితే అక్కడ నీ దేవుడైన యెహోవా సముఖ
మందు నిలిచి కనిపెట్టే అర్చకుని మాటనైనా న్యా
యాధిపతియొక్క మాటనైనా గర్వముచేత వినక పోతే,
ఆ మనుష్యుడు మరణ శిక్షను పొందును గాక; యీ
లాగున ఇశ్రాయేలులోనుంచి నీవు చెడ్డతనమును పరి
13 హరించుకో వలెను. । అప్పుడు జనులందరున్ను విని
14 భయపడి యిక గర్వపడకుండా వుందురు. । నీ దేవు
డైన యెహోవా నీకు స్వతంత్రించుకొనుటకు యిచ్చే
దేశములోకి నీవు వచ్చి కాపురము చేసిన తరువాత,
మన చుట్టూ వుండే జనులలాగున మనమున్ను మన
మీద రాజును నిర్ణయించుకొందామని నీవు అను
15 కొన్నట్టయితే, । నీ దేవుడైన యెహోవా యెవని
యెంచునో వానిని నీవు నీ మీద రాజుగా నిర్ణ
యించుకో వలెను; నీ సహోదరులలో వుండే వొక
నిని నీవు నీ మీద రాజుగా నిర్ణయించుకో వలెను;
నీకు సహోదరుడు కానటువంటి అన్యుని నీ మీద
16 నిర్ణయించుకో కూడదు. । అయితే వాడు గుర్రములను
విస్తరించి సంగ్రహించకుండానున్ను, అనేకమయిన
గుర్రములను సంగ్రహించుటకు జనులను మిస్రయీ
ముకు తిరిగీ పంపకుండానున్ను వుండ వలెను; యెందు
కంటే, యికను నీవు ఆ మార్గమును తిరిగిపో కూడ
దని యెహోవా నీకు సెలవు యిచ్చియున్నాడు. ।
17 మరిన్ని అతడు తన హృదయము తిరిగి పోకుండా
అనేక భార్యలను పెండ్లాడ కూడదు; మరిన్ని వెండి
బంగారము అతడు విస్తరించి సంగ్రహించ కూడదు. ।
18 మరిన్ని అతడు తన రాజ్యాసనమందు ఆసీనుడై వున్న
ప్పుడు, అతడు లేవీయులైన అర్చకుల యొద్ద వుండే
గ్రంథములోనుంచి యీ న్యాయ ప్రమాణమునకు వొక
ప్రతిని వొక గ్రంథములో తన కొరకు వ్రాసుకో వలె
19 ను. । మరిన్ని అది తన దగ్గిరను వుంచుకొని, తన హృద
యము తన సహోదరుల మీద అతిశయ పడకుండా
నున్ను, దైవాజ్ఞనుంచి కుడి యెడమలకు తప్పి పోకుండా
నున్ను, తానున్ను తన బిడ్డలున్ను ఇశ్రాయేలులో అనేక
20 దినములు రాజ్యపాలనము చేసేటట్టుగానున్ను, ।తన దేవు
డైన యెహోవా యందు భయభక్తిగా వుండి, యీ
న్యాయ ప్రమాణముయొక్క వాక్యములనున్ను నిబంధ
నలనున్ను భద్రముగా చేయ నేర్చుకోవడానకున్ను,
తాను బ్రతికే దినములన్నిటి దాకా అందులో చదు
వుతూ వుండ వలెను.

## 18. అధ్యాయము.

లేవీయులైన అర్చకులకున్ను లేవీ గోత్రమంతటి 1
కిన్ని ఇశ్రాయేలుతో కూడా పాలైనా స్వాస్థ్యమై
నా కలిగి యుండ కూడదు; వారు యెహోవాకు
చెల్లించే హోమార్పణలనున్ను ఆయన స్వాస్థ్యము
నున్ను అనుభవింతురు; । గనుక, వారు తమ సహో 2
దరులతో కూడా స్వాస్థ్యమును పొందక పోదురు;
యెహోవా వారికి చెప్పినట్టు వారి స్వాస్థ్యమై
వున్నాడు. । అయితే జనుల యొద్దనుంచి, అనగా, యె 3
ద్దునైనా గొర్రెనైనా బలి యర్పించే వారి యొద్దనుంచి
అర్చకునియొక్క వంతు యిదే, వారు అర్చకునికి
ముందరి తొడనున్ను, రెండు దవడలనున్ను, పొట్ట
సంచినిన్ని, యివ్వ వలెను. । మరిన్ని నీ ధాన్యముయొ 4
క్కయున్ను నీ ద్రాక్షారసముయొక్కయున్ను నీ
తైలముయొక్కయున్ను తొలి ఫలమునున్ను, ముందు
గా కత్తిరించిన నీ గొర్రె వెండ్రుకలనున్ను అతనికి
యివ్వ వలెను. । యెందుకంటే యెహోవా నామ 5
మందు సదా నిలిచి సేవ చేసుట కొరకు నీ గోత్రము
లన్నిటిలోనుంచి నీ దేవుడైన యెహోవా అతనినిన్ని
అతని కుమారులనున్ను యెంచి యున్నాడు. । మరిన్ని 6
ఇశ్రాయేలందరియొక్క పురద్వారములలో యే వొక
దాని యందైనా నివసించి వుండిన లేవీయుడు అక్క
డనుంచి బయిలుదేరి, యెహోవా యెంచే స్థలము
నకు తన మనఃపూర్తియైన యిచ్ఛతోటి వస్తే, । అక్కడ 7
యెహోవా సముఖమందు నిలిచి వున్న లేవీయులైన
తన సహోదరులందరి వలెను తానున్ను తన దేవుడైన
యెహోవా నామమందు సేవ చేస్తూ వుండ వలెను. ।
అతని పిత్రార్జితముయొక్క విక్రయమువల్ల వచ్చి 8
నది వినా భుజించుటకు అందరికీ సమ భాగము వుండ
వలసినది. । నీ దేవుడైన యెహోవా నీకు యిచ్చే 9
దేశములోకి నీవు ప్రవేశించిన తరువాత నీవు ఆ జనాం
గములయొక్క అసహ్యతల ప్రకారము చేసుటకు
నేర్చుకో కూడదు. । తన కుమారుని చేతనైనా తన 10
కుమార్తె చేతనైనా అగ్ని గుండము తొక్కించే వా
డున్ను, శకునము చూచేవాడున్ను, ముహూర్తములు
విచారించే వాడున్ను, గారడివాడున్ను, చిల్లంగిదిన్ని, ।
మంత్రగాడున్ను, కర్ణపిశాచోపాసకుడున్ను, చిల్లం 11
గివాడున్ను, భూత మంత్రగాడున్ను, మీలో వుండ
కూడదు. । యెందుకంటే యిటువంటి వాటిని చేసే 12
వారందరూ యెహోవాకు అసహ్యులై యున్నారు:
యీ అసహ్యతల నిమిత్తముచేత నీ దేవుడైన యెహో
వా వారిని నీ ముందరనుంచి వెళ్లగొట్టేవాడై వున్నా
డు. । నీ దేవుడైన యెహోవా యెడల నీవు యథా 13

14 ర్థపరుడవై వుందువు గాక. । యెందుకంటే నీవు
స్వతంత్రించుకొనే ఈ జనాంగములు ముహూర్తజ్ఞుల
నున్ను శకునకాండ్లనున్ను నమ్మిన వారైరి; నిన్ను గురించి
అయితేనో నీ దేవుడైన యెహోవా నిన్ను ఆలాగు
15 చేయనిచ్చి యున్నాడు కాడు. । నీ దేవుడైన యెహో
వా నీ సహోదరులలోనుంచి నావంటి వొక దీర్ఘ
దర్శిని నీ కొరకు లేవ చేసును; ఆయన మాటలను
16 మీరు ఆలకింతురు గాక. । యిది హోరేబులో సంఘ
ము కూడిన దినమందు నీవు నీ దేవుడైన యెహో
వాను అడిగిన అంతటి ప్రకారమై యున్నది, యేమం
టే, యికను నా దేవుడైన యెహోవాయొక్క శబ్ద
మును నన్ను విననియ్యకనున్ను, నేను మరణము కా
కుండా యికను యీ గొప్ప అగ్నిని నన్ను చూడని
17 య్యకనున్ను వుండేలాగు చేయుమంటివి. । అప్పుడు
యెహోవా నాకు సెలవు యిచ్చినదేమంటే, వారు
18 పలికిన మాటలన్నీ బాగానే పలికిరి. । వారి సహో
దరులలోనుంచి నీవంటి యొక దీర్ఘదర్శిని వారి
కొరకు లేవచేసి, ఆయన నోట నా వాక్యములను
వుంతును; నేను ఆయనకు ఆజ్ఞాపించేదంతాను ఆయన
19 వారికి తెలియ చేసును. । అయితే సంభవించేదేమంటే,
నా నామమందు ఆయన పలికే నా వాక్యములను
యెవడు వినక పోవునో నేను వాని గురించి విచా
20 రింతును. । అయితే యే దీర్ఘదర్శి నేను వానిని పలు
కుమని ఆజ్ఞాపించనటువంటి వాక్యమును నా నామ
మందు పలుకుటకు సాహసించునో, లేక యితరమైన
దేవుండ్లయొక్క నామమందు పలుకునో, ఆ దీర్ఘ
21 దర్శి మృతిబొందును. । యెహోవా పలుకనటు
వంటి వాక్యమును మేము యేలాగు తెలుసుకొంటాము
అని నీ హృదయములో నీవు అనుకొనినట్టయితే, ।
22 అందుకు యెహోవా నామమందు వొక దీర్ఘదర్శి
పలికినప్పుడు, ఆ సంగతి తటస్థించకనున్ను సంభవిం
చకనున్ను వున్న పక్షమందు, అది యెహోవా చెప్పిన
మాట కాక వుండును; ఆ దీర్ఘదర్శి దాని దుస్సా
హసముగా పలికి యున్నాడు; నీవు వానికి భయపడ
కూడదు.

## 19. అధ్యాయము.

1 నీ దేవుడైన యెహోవా నీకు యిచ్చే దేశమం
దుండే జనాంగములను నీ దేవుడైన యెహోవా సంహ
రించినంతలో, నీవు వారిని స్వతంత్రించుకొని, వారి
పట్టణములందున్ను వారి గృహములందున్ను నివసించి
2 నప్పుడు, । నీ దేవుడైన యెహోవా నీకు స్వతంత్రిం
చుకొనే కొరకు యిచ్చే దేశమధ్యమందు మూడు పట్టణ
3 ములను నీవు నీ నిమిత్తము యేర్పరచుకో వలెను. । హతము
చేసిన ప్రతివాడున్ను వాటిలోకి తప్పించుకొని పోగ
లందులకు నీ దేవుడయిన యెహోవా నీకు స్వతం
త్రించుకొనే కొరకు యిచ్చే దేశపు సరిహద్దులను
మూడు భాగములుగా విభాగించి త్రోవలను సిద్ధప
రుచుకో వలెను. । హతముచేసి బ్రతికే కొరకు అక్క 4
డికి పారిపోయే వాని గురించిన నిర్ణయము యేమం
టే, వొకడు కర్రలు నరుకుటకు తన పొరుగు వాని
తో కూడా అడవికి వెళ్లి వొక మాను నరకడానకు
గొడ్డలితో వొక దెబ్బ వేసినప్పుడు, । ఆ గొడ్డలి పిడి 5
లోనుంచి వూడి తన పొరుగువాని మీద పడినందున
వాడు చచ్చును; యీలాగున తన పొరుగువానియందు
అంతకు పూర్వము పగలేక వుండిన వొకడు వానిని
అజ్ఞానముగా చంపితే, । రక్తమునకు ప్రతి హతము చేసే 6
వాడు తన హృదయము మండుతూ వుండగా, ఆ
చంపిన వానిని మార్గము దూరము అయినందున తరిమి
పట్టి చంపక వుండే కొరకు, వాడు ఆ పట్టణములలో
వొక దానిలోకి పరుగెత్తి బ్రతుకును; యేమంటే పూ
ర్వము వీనికి వాని యందు పగ లేదు గనుక మరణమునకు
పాత్రుడు కాడు. । కాబట్టి నేను నీకు ఆజ్ఞాపించినట్టు 7
నీవు నీ కొరకు మూడు పట్టణములను యేర్పరచుకో
వలెను. । అయితే నీ దేవుడైన యెహోవా యందు 8
నీవు ప్రేమ వుంచి, ఆయన మార్గములందు సదా
నడిచి, యీ దినమందు నేను నీకు ఆజ్ఞాపించే ఆజ్ఞ
లన్నిటినీ గైకొని చేసినంతలో, । నీ దేవుడైన యెహో 9
వా నీ పితృలకు ప్రమాణ పూర్వకముగా చెప్పినట్టు నీ
సరిహద్దును విస్తరింపచేసి, నీ పితృలకు ఆయన వాగ్దత్త
ముగా యిచ్చిన దేశము యావత్తూ నీకు యిస్తే, । అప్పు 10
డు నీ దేవుడైన యెహోవా నీకు స్వాతంత్ర్యము
గా యిచ్చే ఆ దేశమందు నిరపరాధియొక్క రక్తము
చిందబడకుండానున్ను నీ మీద రక్త దోషము పడకుం
డానున్ను ఆ మూడు పట్టణములూ గాక మరి మూడు
పట్టణములను నీ కొరకు సమకూర్చ వలెను. । అయితే 11
యెవడైనా తన పొరుగువాని యందు పగ వుంచి,
వాని కొరకు పొంచి వుండి, వానికి విరోధముగా లేచి,
వాడు చచ్చేటట్టు వానిని కొట్టి, యీ పట్టణములలో
వొకదానిలోకి పరుగెత్తి పోయి ప్రవేశించినట్టయితే, ।
అప్పుడు వాని పట్టణపు పెద్దలు కొందరిని పంపి, 12
అక్కడనుంచి వారిని తెప్పించి, వాడు మరణము పొం
దేటట్టుగా రక్తమునకు ప్రతిహతము చేసేవాని చేతికి
అప్పగించ వలెను. । నీ నేత్రము వానియందు కరు 13
ణించ కూడదు; నీకు బాగా జరిగే కొరకు ఇశ్రాయేలు
నుంచి నిరపరాధి రక్త దోషమును నీవు పరిహరించ
వలెను. । నీ దేవుడయిన యెహోవా నీవు స్వతంత్రిం 14
చుకొనే కొరకు నీకు యిచ్చే దేశమందు నీవు స్వతం

త్రించుకొనే భూ భాగములో పూర్వీకులు వుంచిన
నీ పొరుగింటి వానియొక్క పొలిమేర గురుతును నీవు
15 తీసివేయ కూడదు.। వొకడు యే పాపమునైనా యే
దోషమునైనా చేస్తే, యిద్దరు ముగ్గురు సాక్షుల నోటి
మాటచేత రూఢము కావలసినది, గాని, వొకడు మా
త్రమే వానిమీద సాక్ష్యము పలుకుటకు వుద్యుక్తుడు
16 కా కూడదు.। అబద్ధపు సాక్షి వుద్యుక్తుడై, వొకని
మీద అన్యాయముగా సాక్ష్యము పలికినట్టయితే,।
17 ఆ వ్యాజ్యము కలిగిన ఉభయులున్ను యెహోవా
ముందరనున్ను ఆ దినములలోనుండే అర్చకులయొక్క
న్యాయాధిపతులయొక్క ముందరనున్ను నిలువపడ
18 వలెను.। అప్పుడు న్యాయాధిపతులు బాగా విమర్శించి,
యిదిగో, సాక్షి అబద్ధపు సాక్షి అయి, తన సహో
దరుని మీద అబద్ధము పలికినాడన్న సంగతి అగుపడి
19 నట్టాయెనా,। వాడు వాని సహోదరుని యేమి చేయ
తలంచెనో అది మీరు వానికే చేతురుగాక: యీ
ప్రకారముగాను నీవు ఆ కీడును మీలోనుంచి పరి
20 హరింప చేయ వలెను.। తతిమ్మా వారు యిది విని, భయ
పడి, యిక మీలో అటువంటి చెడ్డతనమును చేయ
21 కుండా వుందురు.। మరిన్ని నీ నేత్రము కనికరముగా
వుండ కూడదు; ప్రాణమునకు ప్రాణమున్ను, కంటికి
కన్నున్ను, పంటికి పల్లున్ను, చేతికి చెయ్యిన్ని, కా
లుకు కాలున్ను, ప్రతిగా యివ్వ బడ వలెను.

## 20. అధ్యాయము.

1 నీవు నీ శత్రువుల మీదికి యుద్ధము కొరకు బయి
లు వెళ్లినప్పుడు, గుర్రములనున్ను, రథములనున్ను, నీ
కంటే అధికమైన జనమునున్ను చూస్తివట్టాయెనా,
వారికి నీవు భయపడకుము; యెందుకంటే, మిస్రయీ
ము దేశములోనుంచి నిన్ను వెలపటికి తీసుకొ వచ్చిన
నీ దేవుడైన యెహోవా నీకు తోడుగా వున్నాడు.।
2 అయితే మీరు యుద్ధమునకు సమీపించినప్పుడు అర్చ
కుడు దగ్గిరకు వచ్చి, జనులతో మాట్లాడి చెప్పవలసిన
3 దేమంటే,। వో ఇశ్రాయేలా, నేటి దినమున మీరు
మీ శత్రువులతో యుద్ధము చేయ సాగితిరి; మీ హృద
యములు మెత్తపడ కూడదు; మీరు భయపడకనున్ను,
తొందరపడకనున్ను, వారి కొరకు విభ్రాంతిపడకను
4 న్ను వుండుడి.। యేమంటే మీ శత్రువులతో మీ
కొరకు యుద్ధము చేసి, మిమ్మును రక్షించుటకు మీ దేవు
డయిన యెహోవా మీతో కూడా వచ్చేవాడౌను.।
5 మరిన్ని అధికారులు జనులను చూచి చెప్పవలసినదేమం
టే, కొత్త యిల్లు కట్టుకొని దాని సంప్రోక్షణ చేయక
నున్నవాడు యెవ్వడో యుద్ధమందు వాడు మృతి
బొందకనున్ను, అన్యుడు దాని సంప్రోక్షించకనున్ను
వుండేటట్టు, వాడు తన యింటికి తిరిగీ వెళ్లును గాక.।
మరిన్ని ద్రాక్ష తోటను నాటి దాని ఫలమును యిం 6
కా అనుభవించక వున్నవాడు యెవ్వడో యుద్ధమందు
వాడు మృతిబొందకనున్ను, అన్యుడు దాని ఫలమును
అనుభవించకనున్ను వుండేటట్టు వాడు తన యింటికి
తిరిగీ వెళ్లును గాక.। మరిన్ని భార్యను నిశ్చితార్థము 7
చేసుకొని, దాని పరిగ్రహించకనున్నవాడు యెవ్వ
డో యుద్ధమందు వాడు మృతిబొందకనున్ను, అన్యు
డు దాని పరిగ్రహించకనున్ను వుండేటట్టు వాడు తన
యింటికి తిరిగీ వెళ్లును గాకని చెప్ప వలెను.। మరిన్ని 8
అధికారులు జనులను చూచి, యింకా చెప్పవలసిన
దేమంటే, భయస్థుడున్ను మెత్తని హృదయము గలవా
డున్ను యెవ్వడో వాడు తన హృదయములాగున తన
సహోదరుల హృదయమున్ను కరుగకుండా వుండే
టట్టు తన యింటికి తిరిగీ వెళ్లును గాకని చెప్ప వలె
ను.। అధికారులు జనులతో యీలాగున చెప్పడము 9
సమాప్తమైన తరువాత వారు జనులను నడిపించే కొరకు
సేనాధిపతులను నిర్ణయించ వలెను.। యుద్ధము చేసుట 10
కొరకు నీవు వొక పట్టణమునకు సమీపించినప్పుడు
నీవు దాని యొద్దికి సమాధానమును గురించిన వార్తను
చెప్పి అంపించుము.। అది నీకు సమాధాన ప్రత్యుత్త 11
రమునిచ్చి, తన ద్వారమును నీకు తీస్తే, అప్పుడు దాని
యందుండే జనులందరున్ను నీకు పన్ను కట్టేవారున్ను
నీకు సేవ చేసేవారున్ను కావలెను.। అది నీతో సమా 12
ధానపడక, నీతో యుద్ధము చేయ వలెనని వున్న పక్ష
మందు, నీవు దానిని ముట్టడి వేయ వలెను.। నీ దేవు 13
డైన యెహోవా దానిని నీ చేతులకు అప్పగించినం
తలో నీవు దాని యందుండే మొగవారినందరినిన్ని
కత్తి వాడిచేత సంహరించ వలెను.। అయితే ఆడువాం 14
డ్లనున్ను, చిన్నవాండ్లనున్ను, పశువులనున్ను, పట్టణ
మందుండే యావత్తు దోపుడు సొమ్మునున్ను నీవు తీసు
కొని, నీ దేవుడైన యెహోవా నీకు అప్పగించిన నీ
శత్రువులయొక్క దోపుడు సొమ్మును నీవు తిందువు
గాక.। యీలాగున నీవు యీ జనాంగములయొక్క 15
పట్టణముల సంబంధము కానటువంటి నీకు బహు
దూరమైన పట్టణములకు చేయ వలసినది.। అయితే 16
నీ దేవుడైన యెహోవా నీకు స్వాతంత్ర్యముగా
యిచ్చే యీ జనులయొక్క పట్టణములందు వూపిరి
కలిగినటువంటి వాటిలో వొక దానినైనా నీవు సజీ
వముగా రక్షించక వుండ వలెను.। వారు తమ దేవుం 17
డ్లకు చేసిన అసహ్యతల ప్రకారము మీరున్ను చేసే
కొరకు మీకు నేర్పకుండా, ఆలాగున మీరు చేస్తే
మీ దేవుడైన యెహోవాకు విరోధముగా పాపము
చేతురు గనుక,। నీ దేవుడైన యెహోవా నీకు ఆజ్ఞా 18

పించినలాగున నీవు వారిని, అనగా, హిత్తీయులనున్ను,
ఆమొరీయులనున్ను, కెనయానీయులనున్ను, పెరిజ్జీయు
లనున్ను, హివ్వీయులనున్ను, యెబూసీయులనున్ను,
19 బొత్తిగా నాశనము చేయ వలెను. । నీవు వొక పట్టణ
మును స్వాధీనపర్చుకొనుటకు అనేక దినములు దానిని
ముట్టడివేసి యుద్ధము చేస్తూ వుండగా, నీవు దాని
చెట్లను గొడ్డలిచేత కొట్టివేసి నశింపచేయ కూడదు,
యేమంటే, వాటి ఫలమును నీవు తిందువు; పొలము
చెట్టు మనుష్యుని కొరకై వున్నందున ముట్టడికై వా
20 డుకొనుటకు వాటిని నరికివేయ కూడదు. । అయినప్పు
టికిన్ని ఆహారమునకు వుపయోగించవని నీకు తెలిసి
నటువంటి చెట్లను నరికివేసి, నీతో యుద్ధము చేసే
పట్టణము మీద అది మీకు కిందయ్యే ముట్టుకూ బురు
జులను కట్టుకో వలెను.

## 21. అధ్యాయము.

1 నీ దేవుడైన యెహోవా నీవు స్వతంత్రించు
కొనే కొరకు నీకు యిచ్చే దేశములో వొకడు హతుడై
పొలములో పడి వుండుట అగుపడినంతలో, వానిని
చంపిన వాడు యెవ్వడో తెలియకుండా వున్నట్టయి
2 తే, । అప్పుడు నీ పెద్దలున్ను నీ న్యాయాధిపతులున్ను
బయలువెళ్లి, హతుడైన వానికి చుట్టూ వుండే పట్టణ
3 ములు ముట్టుకు క్రొలిపించ వలెను. । అప్పుడు హతుడైన
మనుష్యునికి సమీపమైన పట్టణపు పెద్దలు కాడిని
యీడ్చకనున్ను యే పని అయినా చేయకనున్ను వుం
4 డిన పడ్డను తాము పట్టుకొని, । ఆ పట్టణపు పెద్దలు
ఆ పడ్డను దున్నడమున్ను విత్తడమున్ను లేనటువంటి
కొనుగా లోవకు తీసుక వచ్చి, ఆ లోవయందునే ఆ
5 పడ్డయొక్క తలను ఖండించ వలెను. । అప్పుడు లేవీ
యొక్క పుత్రులైన అర్చకులు దగ్గిరకు రావలెను,
యేమంటే, వారిని నీ దేవుడైన యెహోవా తనను కని
పెట్టుకొని వుండుటకున్ను, యెహోవా నామమందు
దీవించుటకున్ను యెంచి వున్నాడు; మరిన్ని వారి
నోటి మాటచేత సకల వ్యాజ్యములున్ను దెబ్బలాట
6 లున్ను తీర్చబడును. । అయితే చంపబడిన వానికి సమీ
పమైన పట్టణపు పెద్దలు లోవలో తల ఖండించిన పడ్డ
మీద తమ తమ చేతులను కడుగుకొని చెప్ప వలసిన
7 దేమంటే, । యీ రక్తము మా చేతుల చేత చిందపడినది
8 కాదు; అది మా కన్నులకు అగుపడినది కాదు, । వో
యెహోవా, నీవు విమోచించిన నీ జనులైన ఇశ్రా
యేలును కరుణించి, నీ జనులైన ఇశ్రాయేలు మీద
నిరపరాధియొక్క రక్త దోషమును మోపవద్దు, అని
పలికిన తరువాత ఆ రక్త దోషమును గురించి వారికి
9 క్షమింపు కలుగును. । యీలాగున యెహోవా దృష్టికి
యేది సరియై వున్నదో అది నీవు చేస్తూ, నిరపరాధి
రక్త దోషమును నీవు పరిహరించ వలెను. । నీ శత్రు 10
వులతో యుద్ధము చేసుటకు నీవు బైలు వెళ్లినప్పుడు,
నీ దేవుడయిన యెహోవా వారిని నీ చేతులకు అప్ప
గించినందున వారిని చెరగా తీసుకపోయి, । ఆ చెర 11
బడిన వారిలో యొక చక్కని స్త్రీని చూచి, నీవు కోరి,
భార్య అయ్యేటట్టు చేసుకొందునన్నట్టుగా వున్నట్ట
యితే, । దానిని నీ యింటికి రప్పించుకొని రావలెను; 12
అప్పుడు అది తన తల గొరిగించుకొని, తన గోరులను
తీసుకొని, । తన చెరబట్టలను తీసివేసి, నీ యింట్లో 13
నివాసముచేసి, తన తల్లిదండ్రుల నిమిత్తము నెల ముట్టు
కు యేడ్చిన తరువాత నీవు దాని యొద్దికి ప్రవేశించ
వచ్చును; అప్పుడు నీవు దానికి పెనిమిటివిగానున్ను,
అది నీకు భార్యగానున్ను వుండ వలెను. । అటుతరు 14
వాత దాని యందు నీకు సమ్మతి లేకపోతే, దానికి
అనుకూలమైన చోటుకు దానిని వెళ్లనియ్య వలెను;
దానిని సొమ్ము కొరకు నీవు యెంతమాత్రమూ అమ్మ
కూడదు; నీవు దానిని దైన్య పరచితివి గనుక దానిని
అమ్మి యీదాయమును పొంద కూడదు. । వొకడు యి 15
ద్దరు భార్యలను పెండ్లాడి, వొక దాని యందు ప్రేమ
యున్ను రెండవ దాని యందు పగయున్ను కలిగి
వుండగా, ప్రేమ గలదిన్ని పగ గలదిన్ని వానికి పిల్ల
లను కనే యెడల, జ్యేష్ఠుడు పగ పొందిన దాని కుమా
రుడై వుండగా, । వాడు తన కుమాళ్లను తనకు కలిగిన 16
సంపాద్యమును స్వతంత్రింప చేసేటప్పుడు పగ పొం
దిన దాని కుమారుడే జ్యేష్ఠుడైనందున వానికంటే
ప్రేమ గల దాని కుమారుని అధికుని చేయక, । పగ 17
పొందిన దాని కుమారునికి తనకు కలిగిన అంతటిలో
ద్విగుణ భాగమిచ్చి, వీడే ప్రథమ పుత్రుడని యెరుక
చేయ వలసినది, యేమంటే, వీడు వాని బలముయొక్క
ఆరంభమై యున్నాడు; జ్యేష్ఠ పుత్రాధికారము వా
నిదై వుండును. । తన తండ్రియొక్క శబ్దమునకైనా 18
తన తల్లియొక్క శబ్దమునకైనా విధేయుడు కాని వా
డున్ను, మూర్ఖుడున్ను, తిరగబడేవాడున్ను, అయిన
వొక కుమారుడు వొకనికి కలిగి వుండి, వారు వానిని
శిక్షించినప్పటికిన్ని వాడు వారికి వినక వున్నట్టయితే, ।
అప్పుడు వాని తల్లి దండ్రులు వానిని పట్టి, పట్టణపు 19
పెద్దల యొద్దికిన్ని వాని స్థలద్వారము యొద్దికిన్ని కొం
చువచ్చి, పెద్దలను చూచి చెప్ప వలసినదేమంటే, । మా 20
కుమారుడైన వీడు మూర్ఖుడున్ను తిరగబడేవాడు
న్ను అయి, మా మాటలను వినక, తిండిపోతున్ను తా
గుబోతున్ను అయి వున్నాడని చెప్ప వలెను. । అప్పుడు 21
వాని పట్టణపు వారు అందరున్ను రాళ్లచేత వాడు
మరణమయ్యే ముట్టుకు రువ్వ వలెను: యీలాగున నీవు

మీలోనుంచి చెడ్డతనమును పరిహరింతువు; అప్పుడు
22 ఇశ్రాయేలు అందరున్ను విని భయపడుదురు.। మరిన్ని
యెవడైనా మరణమునకు పాత్రమైన పాపము చేసి
నందున నీవు వానిని మాను మీద వురి తీస్తే, వాని
కళేబరము రాత్రి దాకా మాను మీద వుండ కూడ
23 దు.। నీ దేవుడైన యెహోవా నీకు స్వాతంత్ర్యము
గా యిచ్చే దేశము అపవిత్రము కాకుండా, ఆ దిన
మందే నీవు వానిని పాతి పెట్ట వలెను; యేమంటే
వురిని పడ్డవాడు దేవునివల్ల శపించబడిన వాడవును.

## 22. అధ్యాయము.

1 నీ సహోదరునియొక్క యెద్దయినా గొర్రె
యైనా తప్పిపోయి నీకు కనపడినట్టయితే, వాటికి
నీవు దాగి వుండ కూడదు; అవశ్యముగా నీ సహో
2 దరుని దగ్గిరకు వాటిని మళ్లించ వలెను.। నీ సహో
దరుడు నీకు దగ్గిర కాకపోయినా, నీవు వానిని యెరు
గక పోయినా, నీవు దానిని నీ యింటికి తోలుకుపో
వలసినది; నీ సహోదరుడు వచ్చి దానిని గురించి
అడిగే పర్యంతమూ దానిని నీ దగ్గిరనే వుంచుకొని
3 దానిని వానికి తిరిగీ యిత్తువు గాక.। వాని గాడ్దెభ
మును గురించిన్ని వాని వస్త్రమును గురించిన్ని నీ
సహోదరుడు పోగొట్టుకొనినటువంటి నీకు దొరికిన
సమస్తమును గురించిన్ని నీవు ఆలాగున చేయ వలెను;
4 నీవు దాగి వుండ కూడదు.। నీ సహోదరుని గాడ్దె
భమైనా యెద్దయినా మార్గములో పడియుండుట
నీకు కనపడితే, నీవు వాటికి దాగి వుండ కూడదు;
అవశ్యముగా వాటిని తిరిగీ లేవనెత్తుటకు వానికి సహా
5 యము చేయ వలెను.। పురుష సంబంధమైన దానిని
స్త్రీ ధరించుకో కూడదు; పురుషుడు స్త్రీ వస్త్రమును
ధరించుకో కూడదు; యేమంటే ఆలాగున చేసే వారు
నీ దేవుడైన యెహోవాకు అసహ్యమైన వారవుదురు.।
6 పిల్లలైనా గుడ్లయినా కలిగిన పక్షిగూడు మార్గములో
నీ ముందర చెట్టు మీదనయినా నేల మీదనైనా నీకు
కనపడినంతలో, తల్లి పిల్లల మీదనైనా గుడ్ల మీదనై
నా, అణిగి వున్నట్టయితే, నీవు పిల్లలనున్ను తల్లినిన్ని
7 పట్టుకో కూడదు.। నీవు బాగా జరిగేటట్టుగానున్ను
నీ దినములను నీవు విస్తరింప చేసేటట్టుగానున్ను నీవు
అవశ్యముగా తల్లిని విడచిపెట్టి, పిల్లలను నీ కొరకు
8 తీసుకో వచ్చును.। నీవు కొత్త మేడను కట్టుకొన్నప్పు
డు దాని మీదనుంచి యెవడయినా పడినంతలో నీ
యింటి మీదికి నీవు రక్త దోషమును తెచ్చుకోకుండా
9 దానిమీద అడ్డు గోడను పెట్టింతువు గాక.। నీవు విత్తిన
విత్తనముయొక్క ఫలమున్ను నీ ద్రాక్షతోట ఫలము
న్ను చెడిపోకుండా నీ ద్రాక్షతోట యందు యిం
కొక జాతి విత్తనమును విత్త కూడదు.। యెద్దునున్ను 10
గాడ్దెభమునున్ను పూచి భూమిని దున్న కూడదు.।
బొచ్చు నారా కలిపి నేసిన వస్త్రమును ధరించుకో కూ 11
డదు.। నీ పైని కప్పుకొనే ఉత్తరీయముయొక్క నా 12
లుగు కొనల మీద జాలరును వేసుకో వలెను.। యెవ 13
డైనా భార్యను పెండ్లాడి, దాని యొద్దికి ప్రవేశించిన
తరువాత దాని యందు సమ్మతి లేక,। దాని మీద లేని 14
పోనివి పుట్టించి; దానికి తగని పేరు పెట్టి ప్రకటన
చేసి, యీ స్త్రీని నేను పరిగ్రహించినాను, యిదుగో
దీని దగ్గిరకు నేను వచ్చినప్పుడు యిది కన్య గానట్టు
గా నాకు తెలిసెనని చెప్పినట్టయితే,। ఆ చిన్నదాని 15
తల్లిదండ్రులు ఆ చిన్నదానియొక్క కన్య చెర విడ్డటు
వంటి గురుతులను పట్టుకొని, పురద్వారమందుండే
పెద్దల దగ్గిరకు వచ్చి,। చిన్నదాని తండ్రి పెద్దలను 16
చూచి యీ మనుష్యునికి నా కుమార్తెను పెండ్లి
చేసినాను,। యిదుగో వాడు దాని యందు సమ్మతి 17
లేక, దాని మీద లేని పోనివి పుట్టించి, నీ కుమార్తె
కన్యక కానట్టు తెలిసినానని చెప్పినాడు, అయితే
యిదుగో నా కుమార్తెయొక్క కన్య చెర విడ్డటు
వంటి గురుతులని చెప్పవలెను; వారు ఆ పట్టణపు
పెద్దల ముందర ఆ బట్టను పరచవలెను.। అప్పుడు ఆ 18
పట్టణపు పెద్దలు ఆ మనుష్యుని పట్టుకొని, దండించి,।
వాడు ఇశ్రాయేలు కన్యకలలో యొక దాని మీద 19
తగని పేరు పెట్టి ప్రకటన చేసెను గనుక వాని యొద్ద
నూరు షెకేలుల వెండి తప్పు పుచ్చుకొని, ఆ చిన్న
దాని తండ్రికి యివ్వ వలసినది: అయితే అది వానికి
భార్య అయినందున వాడు తన దినములన్నిటి దాకా
దానిని పరిహరించ కూడదు.। అయితే ఆ మాట నిజమై, 20
కన్య చెర విడ్డటువంటి గురుతులు ఆ చిన్నదాని విష
యమై కనుపడక పోతే,। అప్పుడు వారు ఆ చిన్న 21
దానిని తీసుకొని దాని తండ్రి యింటి ద్వారము యొ
ద్దికి వచ్చిన తరువాత, అది తన తండ్రి యింట వ్యభి
చరించి, ఇశ్రాయేలులో అవివేకము చేసెను గనుక,
దాని పట్టణపు వారు దానిని రాళ్లు రువ్వి మరణమును
పొందించ వలెను; ఆలాగున నీవు చెడ్డతనమును మీ
లోనుంచి పరిహరించ వలెను.। మరిన్ని యెవడైనా 22
పెనిమిటి గల స్త్రీతో కలుసుకొంటూ వుండగా దొరికి
నట్టయితే, అప్పుడు ఆ స్త్రీనిన్ని దానితో కలుసుకొనిన
వానినిన్ని మరణమును పొందింతురు గాక; ఆలాగున
నీవు చెడ్డతనమును ఇశ్రాయేలులోనుంచి పరిహరించ
వలెను.। మరిన్ని పెనిమిటికి నియమించపడిన కన్యక 23
అయిన చిన్నది వుండగా, పట్టణమందు పొకడు దానిని
చూచి దానితో కలుసుకొన్నట్టయితే,। మీరు వారి 24
నిద్దరినీ పట్టుకొని ఆ పట్టణపు ద్వారము దగ్గిరకు

తీసుక వచ్చి, చిన్నది పట్టణమందుండగా కేక వేసినది
కాదు గనుక దానినిన్ని, తన పొరుగింటి వానియొక్క
భార్యను దైన్య పరచెను గనుక వానినిన్ని, రాళ్లు రువ్వి
మరణమును పొందించ వలసినది; ఆలాగున నీవు మీ
25 లోనుంచి చెడ్డతనమును పరిహరించ వలసినది. । అయితే
ఒకడు నియమించపడిన చిన్న దానిని బైట భూమి
యందు చూచి బలవంతమున దానిని పొందినట్టయితే
అప్పుడు దానిని పొందిన వానిని మాత్రమే మరణ
26 మును పొందించ వలసినది. । అయితే చిన్న దానిని యే
మిన్ని చేయ కూడదు; మరణమును పొందించే దోషము
దానియందు లేదు; యేమంటే ఒకడు తన పొరుగింటి
వాని మీదికి లేచి వానిని చంపినలాగు యీ కార్య
27 మున్ను వున్నది. । యేమంటే యిది బైట భూమియందు
వానికి దొరికెను; నియమించ పడిన చిన్నది కేక వేసి
నప్పటికిన్ని దానిని విడిపించేవాడు ఒకడూ లేక పో
28 యెను. । ఒకడు నియమించ పడనటువంటి కన్యక
అయిన చిన్నదానిని చూచి పట్టుకొని, దానితో కలుసు
29 కొన్నంతలో వారు కనుబడితే, । అప్పుడు దానితో కలు
సుకొనిన వాడు చిన్నదాని తండ్రికి యేబై షెకేలుల
వెండి యివ్వ వలసినది; మరిన్ని వాడు దానిని దైన్య
పరచెను గనుక అది వానికి భార్యయై వుండ వలెను;
వాడు తన దినములన్నిటి దాకా దానిని పరిహరించ
30 కూడదు. । యెవడైనా తన తండ్రియొక్క భార్యను
చేర్చుకో కూడదు, మరిన్ని తన తండ్రియొక్క కట్టు
చెంగును యెత్త కూడదు.

## 23. అధ్యాయము.

1 అండములు విచ్ఛిత్తయిన వాడున్ను, మర్మాంగము
తెగిపోయిన వాడున్ను, యెహోవాయొక్క సంఘ
2 ములోకి రా కూడదు. । కుండుడు యెహోవాయొక్క
సంఘములోకి రా కూడదు; వానియొక్క పదోతరము
మట్టుకున్ను యెహోవాయొక్క సంఘములోకి రా
3 కూడదు. । అమ్మోనీయుడున్ను మోయాబీయుడున్ను
యెహోవాయొక్క సంఘములోకి రా కూడదు; వారి
యొక్క పదోతరము మట్టుకున్ను వారు యెహోవా
యొక్క సంఘములోకి యెప్పటికి రా కూడదు. ।
4 యెందుకంటే మిస్రయీములోనుంచి మీరు బయిలు
దేరి యివతలకు వచ్చినప్పుడు వారు రొట్టెతోనున్ను
నీళ్లతోనున్ను మీకు యెదురుగా రాలేదు; మరిన్ని
మిమ్మున శపించుటకు అగాములోనున్న పెతోరువాడైన
బెయోరుయొక్క కుమారుడైన బలాముకు దక్షిణ యిచ్చి
5 పిలువనంపించిరి. । అయినప్పటికిన్ని నీ దేవుడైన యె
హోవా బలాము చెప్పిన దానిని వినక పోయెను;
అయితే నీ దేవుడైన యెహోవా నీ యందు ప్రేమ
వుంచి వున్నాడు; గనుక, నీ దేవుడైన యెహోవా
ఆ శాపమును తిప్పి నీ విషయమై ఆశీర్వాదముగా
చేసెను. । నీవు వారి క్షేమమునున్ను వారి మేలునున్ను 6
నీ యావద్దినముల పర్యంతమూ వెతక కూడదు. । నీవు 7
ఎదోమీయుని అసహ్యించ కూడదు; యెందుకంటే,
అతడు నీకు సహోదరుడై వున్నాడు; నీవు మిస్రీ
యుని అసహ్యించ కూడదు; యెందుకంటే, అతని
దేశమందు నీవు పరదేశివై వుంటివి. । మూడో తర 8
మందుండే వారి పిల్లలు యెహోవాయొక్క సంఘ
ములోకి ప్రవేశించ వచ్చును. । సైన్యము నీ శత్రువు 9
లకు యెదురుగా వెళ్లేటప్పుడు ప్రతి చెడ్డ దానినుంచి
నిన్ను నీవు కాపాడుకొనుము. । రాత్రిలో తటస్థించిన 10
అంటువల్ల అంటుపడిన మనుష్యుడు మీలో వుంటే,
వాడు పేటలోనుంచి అవతలకు వెళ్లిపో వలెను; పేట
లోపలికి వాడు రా కూడదు. । అయితే సాయంతనము 11
కాక మునుపే వాడు స్నానముచేసుకొని, సూర్యా
స్తమానమయిన తరువాత పేటలోకి ప్రవేశించ వచ్చు
ను. । పేట వెలపట నీవు బాహ్యమునకు వెళ్లుటకు 12
నీకు ఒక స్థలము కలిగి వుండ వలెను. । నీ మొలను 13
ఒక తర్వగోల వుండ వలెను; నీవు బయిట కూచున్నా
న్నప్పుడు దానితోటి గొయ్యి తవ్వి, వెనుక తిరిగి, నీలో
నుంచి పడిన దానిని కప్పుదువు గాక. । యెందుకంటే 14
నీ దేవుడైన యెహోవా నిన్ను విడిపించుటకున్ను నీ
శత్రువులను నీ యెదుట అప్పగించుటకున్ను నీ పేట
మధ్యమందు నడుస్తూ వున్నాడు; కాబట్టి నీ పేట
పరిశుద్ధమై వుండ వలసినది: ఆయన నీ యొద్దనుంచి తొ
లిగిపోకుండా నీలో ఆయనకు యే అపవిత్రతయైనా
కనుపడ కూడదు. । తన యజమానుని యొద్దనుంచి నీ 15
యొద్దికి తప్పించుకొని వచ్చిన దాసుని నీవు వాని యజ
మానునికి తిరిగీ అప్పగించ కూడదు. । నీ దగ్గిరనే వాడు 16
వుండ వలసినది; మీకు కలిగిన ఆవరణలలో యేది వా
నికి అనుకూలమవునో దాని యందు మీలో వాడు
కాపురము చేయ వచ్చును; నీవు వాని బాధపెట్ట
కూడదు. । ఇశ్రాయేలు కుమార్తెలలో యే ఒకతె 17
యైనా వేశ్యయైయిన్ని, ఇశ్రాయేలు కుమారులలో
యే ఒకడైనా పురుష సంసర్గియైయిన్ని వుండ కూ
డదు. । పడుపు సొమ్మునైనా కుక్క విలవనైనా యే 18
మొక్కుబడి కొరకున్ను నీ దేవుడైన యెహోవా
మందిరములోకి తే కూడదు; యేమంటే, యీ రెండు
న్ను నీ దేవుడైన యెహోవాకు అసహ్యమై వుండును. ।
వడ్డి కొరకు ద్రవ్యమునున్ను, వడ్డి కొరకు ఆహా 19
రమునున్ను, యింకా వడ్డికొరకు యివ్వపడేటటు
వంటి వాటిలో యేదైనానున్ను వడ్డికి ఆశించి నీ
సహోదరునికి యివ్వ కూడదు. । అన్యునికి వడ్డి కొరకు 20

బదులం యివ్వ వచ్చును, అయితే నీ సహోదరునికి
అప్పు యిచ్చే యెడల వడ్డీ పుచ్చుకో కూడదు; యే
మంటే నీవు వెళ్లి స్వతంత్రించుకొనే దేశమందు నీవు
చేపట్టే యంతటి యందూ నిన్ను నీ దేవుడైన యెహో
21 వా ఆశీర్వదించును. । నీ దేవుడైన యెహోవాకు
నీవు మొక్కుబడి మ్రొక్కినప్పుడు నీవు దానిని
తీర్చుటకు ఆలస్యము చేయ కూడదు; యెందుకంటే
నీ దేవుడైన యెహోవా నీ యొద్ద దానిని అవశ్యము
గా అడుగును; మరిన్ని అది నీకు పాతక మవును. ।
22 అయితే నీవు మొక్కుబడి మ్రొక్కక పోయినందు
23 వల్ల అది నీకు పాపమై యుండదు. । నీ పెదవులలో
నుంచి బయిలు వచ్చిన దానిని నీవు జాగ్రతగా తీర్చు
కో వలెను; నీవు నీ దేవుడైన యెహోవాకు వాగ్ద్వ
యము చేసిన మొక్కుబడి చొప్పున నీవు నీ మనః
24 పూర్తిగా చెల్లించ వలెను. । నీ పొరుగువాని ద్రాక్ష
తోటలోకి నీవు వచ్చినప్పుడు ద్రాక్షపండ్లను నీ మన
స్సు వచ్చినట్టూ తిన వచ్చును, గాని నీ వుడిలో యెం
25 తమాత్రమూ వేసుకో కూడదు. । నీ పొరుగువాని
యొక్క పంట చేనులోకి నీవు వెళ్లినప్పుడు వెన్నులను
నీవు నీ చేతితో తెంచుకో వచ్చును, అయితే నీ కొడ
వలి నీ పొరుగువానియొక్క పంట చేనులో చాప
కూడదు.

## 24. అధ్యాయము.

1 ఒకడు వొక దానిని భార్యగా చేసుకొనిన తరు
వాత, దానికి కలిగిన అపవిత్రత యేదో వొకటి వా
నికి కనుపడినందున దాని యందు వానికి అనుకూలము
లేకపోతే, వాడు దానికి విడాకు వ్రాసి దాని చేతికి
యిచ్చి తన యింట్లోనుంచి పంపి వేయ వచ్చును. ।
2 అయితే అది వాని యింట్లోనుంచి బయిలు వెళ్లిన తరు
3 వాత మరి యొకనికి భార్య కావచ్చును. । అయితే ఆ
రెండవ పెనిమిటికిన్ని దానియందు సమ్మతిలేక దానికి
వాడు విడాకు వ్రాసి దాని చేతికి యిచ్చి తన యిం
ట్లోనుంచి దానిని పంపివేసినా, లేక దానిని భార్యగా
పరిగ్రహించిన ఆ రెండవ పెనిమిటి మరణమైనా, ।
4 దానిని పంపివేసిన దాని మొదటి పెనిమిటి అపవి
త్రమై పోయిన యీ దానిని తనకు భార్య అయ్యే
టట్టు తిరిగీ చేసుకో కూడదు; యేమంటే అది యె
హోవా దృష్టికి అసహ్యమై వుండును, అందుచేత
నీవు నీ దేవుడైన యెహోవా నీకు స్వాతంత్ర్యము
గా యిచ్చే దేశమును పాపమైనదిగా చేయ కూడదు. ।
5 కొత్తగా భార్యను పెండ్లాడిన వాడు యుద్ధమునకు
బయిలువెళ్ల కూడదు; యే వ్యాపారమునైనా వాని
వశము చేయ కూడదు: యేడాది మట్టుకు వాడు తన
యింట్లో తీరుబడిగా వుండి తాను పెండ్లాడిన భార్యను
సంతోషింప చేస్తూ వుండ వలెను. । తిరగట్రాయి 6
మీదిదైనా కిందిదైనా యెవడున్ను తాకట్టు పట్ట కూ
డదు, యెందుకంటే వాడు మనుష్య ప్రాణమును తాక
ట్టుపట్టిన వాడవును. । ఇశ్రాయేలు పుత్రులలో వొక 7
సహోదరుని దొంగిలి, వానివల్లను లాభమును కలుగ
చేసుకొంటూ, వానిని అమ్మజూపే వొకడు కనుబడితే,
ఆ దొంగ చంపబడ వలెను; ఆలాగున మీలోనుంచి
కీడును నీవు పరిహరించ వలెను. । కుష్ఠరోగ విషయమై 8
లేవీయులైన అర్చకులు మీకు వుపదేశించే అంతటి
ప్రకారము భద్రముగా గైకొని చేసుటకు జాగ్రత
పడుము; నేను వారికి ఆజ్ఞాపించిన ప్రకారము మీరు
గైకొంటూ చేయ వలెను. । మిస్రయీములోనుంచి 9
మీరు బయిలు వచ్చిపోయిన మార్గమందు నీ దేవు
డైన యెహోవా మిర్యాముకు యేమి చేసెనో అది
జ్ఞాపకమందు వుంచుకొనుము. । నీ సహోదరునికి 10
యేమైనా నీవు అప్పు యిచ్చే యెడల, వాని యొద్ద
తాకట్టు పట్టుటకు వాని యింట్లోకి ప్రవేశించ కూ
డదు. । అయితే నీవు బయిట వున్నప్పుడు నీ యొద్ద 11
అప్పు పుచ్చుకొనిన వాడు తాకట్టు బయిటకు తీసుక
వచ్చి నీ చేతికి యివ్వ వలెను. । వాడు బీదవాడైతే 12
వాని తాకట్టును వుంచుకొని నీవు నిద్రపో కూడదు. ।
సూర్యాస్తమానమైనప్పుడు నీవు ఆ తాకట్టును వానికి 13
అవశ్యముగా తిరిగీ యివ్వ వలెను, అప్పుడు వాడు
పరుచుకొన్న తన బట్ట మీద పండుకొని నిన్ను దీవిం
చును; మరిన్ని అది నీ దేవుడైన యెహోవా సముఖ
మందు నీకు నీతి అని యెంచబడును. । నీ సహోద 14
రులలోనయినా నీ దేశములో నీకు గలిగిన ఆవరణ
లందుండే అన్యులలోనయినా బీదవాడున్ను దీనుడున్ను
అయిన కూలివానిని బాధపెట్ట కూడదు. । వాని రోజు 15
కూలి సూర్యాస్తమానము కాక మునుపే యిచ్చివేయ
వలసినది, యేమంటే, వాడు బీదవాడు గనుక వాని
మనస్సు దానియందే వుండును; యివ్వని పక్షమందు
వాడు యెహోవాకు మొర్ర పెట్టితే అది నీకు పాప
మవును. । పిల్లలకు మారుగా తండ్రులను మరణము పొం 16
దించ కూడదు; తండ్రులకు మారుగా పిల్లలను మరణ
మును పొందించ కూడదు; ప్రతి మనుష్యుడూ తన
పాపము నిమిత్తము తానే మరణమవు గాక. । నీవు పర 17
దేశికిన్ని తండ్రి లేని వానికిన్ని రావలసిన న్యాయపు
తీర్పు తిప్పి వేయకుండానున్ను, విధవయొక్క వస్త్ర
మును తాకట్టు పట్టకుండానున్ను వుండ వలెను. ।
యేమంటే నీవు మిస్రయీములో దాసుడవై వుంటి 18
వనిన్ని, నీ దేవుడైన యెహోవా నిన్ను అక్కడనుంచి
విమోచించినాడనిన్ని, నీవు నీ జ్ఞాపకమందు వుం

చుకో వలెను; కాబట్టి యీ కార్యములు చేయుమని
19 నేను నీకు ఆజ్ఞాపిస్తున్నాను. । నీ పొలము పంటను
నీవు కోసినప్పుడు, పొలములో వొక పన మరచిపోతే
దానిని తెచ్చుటకు నీవు మళ్లీ కూడదు; నీ దేవుడైన
యెహోవా నీ హస్త కృత్యములన్నిటియందు నిన్ను
ఆశీర్వదించేటట్టుగా అది పరదేశికిన్ని తండ్రి లేని
20 వానికిన్ని విధవకున్ను వుండ వలెను. । నీ యిప్ప
చెట్టును నీవు దులుపుకొన్న తరువాత, తిరిగీ దాని
వంక చూడ కూడదు; అది పరదేశికిన్ని తండ్రి లేని
21 వానికిన్ని విధవకున్ను వుండ వలెను. । నీ ద్రాక్షతోట
పండ్లను నీవు సమకూచుకొనిన తరువాతను తిరిగీ
యేర కూడదు; అది పరదేశికిన్ని తండ్రి లేని వానికిన్ని
22 విధవకున్ను వుండ వలెను. । మిస్రయీము దేశమందు
నీవు దాసుడవై వుంటివని జ్ఞాపకమందు వుంచ వలెను;
కాబట్టి యీ కార్యమును చేయుమని నేను నీకు
ఆజ్ఞాపిస్తున్నాను.

## 25. అధ్యాయము.

1 ఉభయులకు వ్యాజ్యము కలిగి, అది తీర్చుకోవడా
నకు వారు న్యాయాధిపతుల యొద్దికి వచ్చినట్టయితే,
వారు నీతి గల వాని నీతిమంతుడని తీర్చి, దుర్మార్గుని
2 శిక్షకు విధించ వలెను. । ఆ దుర్మార్గుడు కొట్టబడుటకు
పాత్రుడైన పక్షమందు, న్యాయాధిపతి వాని సాగిల
బడేటట్టు చేసి, వాని నేరము చొప్పున నిర్ణయమైన
లెక్క మట్టుకు తన యెదుటనే వాని కొట్టించ వలెను. ।
3 నలుబయి దెబ్బల మట్టుకు కొట్టించ వచ్చును, అంతకు
మించ కూడదు; వీటికంటే అధికమైన దెబ్బలు కొట్టిస్తే
4 నీ సహోదరుడు నీకు నీచుడుగా అగుపడును. । నూ
5 చేు యెద్దు మూతి కట్ట కూడదు. । కూడా నివాసము
చేస్తూ వున్న సహోదరులలో వొకడు సంతానము
లేకుండా మరణమైతే, ఆ మరణమైన వాని భార్య అవ
తల అన్యుని పెండ్లాడ కూడదు; దాని పెనిమిటి
సహోదరుడు దానితో కలుసుకొని తనకు భార్య
అయ్యేటట్టుగా దానిని పరిగ్రహించి, పెనిమిటి
సహోదరునియొక్క విధి దాని యెడల జరిగించ వలె
6 ను. । మరణమైన వాని సహోదరుని పేరు ఇశ్రాయే
లులోనుంచి పోకుండా వుండేటట్టు, ఆమె కనే తొ
7 లిచూలు బిడ్డ వాని పేరట నిలువబడ వలెను. । ఆ మను
ష్యునికి తన సహోదరుని భార్యను పరిగ్రహించుటకు
మనస్సులేని పక్షమందు, వాని సహోదరుని భార్య
లేచి, పురద్వారమందుండే పెద్దల యొద్దికి వచ్చి, వారిని
చూచి, నా మరిది వాని సహోదరునికి ఇశ్రాయేలు
లో నామము వుద్భవింప చేసే కొరకు సమ్మతి లేక
వున్నాడనిన్ని, నా పెనిమిటి సహోదరునియొక్క
విధి జరిగించుటకు వొప్పక వున్నాడనిన్ని చెప్ప వలెను. ।
అప్పుడు వాని పట్టణపు పెద్దలు వాని పిలిపించి, 8
వానితో మాట్లాడ వలెను; వాడు దానిని పరిగ్రహిం
చుటకు నాకు యిచ్ఛ లేదని రూఢముగా చెప్పిన పక్ష
మందు, । వాని సహోదరుని భార్య పెద్దల యెదుట 9
వాని దగ్గిరకు వచ్చి, వాని పాద రక్షను విప్పి వూడ
దీసి, వాని ముఖము మీద వుమ్మివేసి, తన సహోద
రుని యిల్లు కట్ట నిచ్ఛయించని యీ మనుష్యునకు యీ
లాగున చేయబడును గాక అని చెప్ప వలెను. । అప్పుడు 10
ఇశ్రాయేలులో వాని పేరు పాదరక్ష వదిలిన వాని యి
ల్లని పిలువబడును. । ఉభయులు పోట్లాడుతూ వుండ 11
గా, వొకని భార్య తన పెనిమిటిని కొట్టూతూ వున్న
వాని చేతిలోనుంచి విడిపించుటకు వచ్చి, తన చెయ్యి
చాపి వృషణములను పట్టుకొన్నట్టయితే, । అప్పుడు నీవు 12
దాని చెయ్యి ఖండించ వలెను; నీ నేత్రము దానియందు
కనికరించ కూడదు. । యెక్కువ తక్కువ యెత్తు గుండ్లు 13
నీ సంచులలో వుంచ కూడదు. । మరిన్ని యెక్కువ 14
తక్కువ కొలతూములు నీ యింట్లో వుంచ కూడదు. ।
నీ దేవుడైన యెహోవా నీకు యిచ్చే దేశమందు నీ 15
దినములు అధికమయ్యేటట్టుగా, నిండైన యథార్థపు
గుండ్లనున్ను, నిండైన యథార్థపు తూములనున్ను నీ
యొద్ద వుంచుకో వలసినది. । యేమంటే అటువంటి 16
క్రియలను చేసే వారందరున్ను అన్యాయము చేసే
వారందరున్ను నీ దేవుడైన యెహోవాకు అసహ్యు
లవుదురు. । మిస్రయీములోనుంచి నీవు బయులుదేరి 17
వచ్చిన తరువాత, మార్గమందు అమాలేకు నీకు చేసిన
దానిని నీ జ్ఞాపకమందు వుంచుకొనుము. । వాడు యేమి 18
చేసెనంటే, మార్గమునకు వాడు నీకు యెదురుగా
వచ్చి, నీవు అలసటచేత సొమ్మసిల్లి వుండగా చూచి, శక్తి
హీనులై వెనుక చిక్కిన వారినందరినిన్ని నరికి వేసెను;
వాడు దేవునికి భయపడక వుండెను. । అయినందున నీ 19
దేవుడైన యెహోవా నీకు స్వాతంత్ర్యముగా యిచ్చే
దేశమందు నీ చుట్టూ వున్న శత్రువులనుంచి నిన్ను
నిమ్మళింప చేసిన తరువాత, నీవు అమాలేకుయొక్క
జ్ఞాపకమును ఆకాశము కిందనుంచి తుడచి వేయ వలె
ను; యిది నీవు మరచి పో కూడదు.

## 26. అధ్యాయము.

అయితే నీ దేవుడైన యెహోవా నీకు స్వాతం 1
త్ర్యముగా యిచ్చే దేశములోకి నీవు ప్రవేశించి స్వ
తంత్రించుకొని నివాసము చేసేటప్పుడు, । నీవు నీ దేవు 2
డైన యెహోవా యిచ్చే దేశమునుంచి నీ చేతికి
వచ్చిన భూమి ఫలము అంతటిలో ప్రథమ ఫలమును
తీసి, గంపలో వేసి, నీ దేవుడైన యెహోవా తన

నామమును వుంచుకోవడానకు యెంచే స్థలమునకు
3 తీసుక వచ్చి, । ఆ దినములలో వుండే అర్చకుని యొ
ద్దికి వెళ్లి, అతని చూచి, యెహోవా మన పితృలకు
ప్రమాణ పూర్వకముగా యిచ్చే దేశములోకి నేను
వచ్చిన సంగతిని యీ దినమందు నీ దేవుడైన యెహో
వా యెుద్దను ఝెప్పుకొంటూ వున్నానని పలుక వలెను.।
4 అప్పుడు అర్చకుడు నీ చేతిలోనుంచి గంపను తీసుకొని,
నీ దేవుడైన యెహోవాయొక్క బలిపీఠము ముందర
5 వుంచ వలెను. । అప్పుడు నీవు నీ దేవుడైన యెహోవా
సముఖమందు పలుక వలసినదేమంటే, అరామీయుడ
యిన నా పితృడు నశించుటకు సమీపించి వుండగా,
మిస్రయీముకు దిగి వెళ్లి, కొద్ది మందితో అక్కడ
నివసించి, గొప్పయున్ను బలమున్ను విస్తారమున్న
6 అయిన జనము అయినాడు. । మిస్రీయులు మన యెడల
కీడుగా ప్రవర్తించి మనలను బాధించి, మనచేత కఠిన
7 మయిన వెట్టిపని చేయించినారు. । అయితే మనము మన
పితృలయొక్క దేవుడయిన యెహోవాకు మొఱ్ఱ
పెట్టినప్పుడు, యెహోవా మన కేక విని, మన ఆప
దనున్ను మన కష్టమునున్ను మన ప్రయాసమునున్ను
8 చూచెను. । అప్పుడు యెహోవా బలమయిన హస్తము
చేతనున్ను చాపిన బాహువు చేతనున్ను బహు భీకర
త్వము చేతనున్ను గురుతుల చేతనున్ను అద్భుతముల
చేతనున్ను మిస్రయీములోనుంచి మనలను యివతలకు
9 రప్పించి, యీ స్థలములోకి తీసుక వచ్చి, పాలతోను
న్ను తేనెతోనున్ను ప్రవహించే దేశమయిన యీ దేశ
10 మును మనకు యిచ్చెను. । అయినందున యిప్పుడు ఓ
యెహోవా, యిదుగో, నీవు నాకు యిచ్చిన దేశము
యొక్క ఫలములో ప్రథమ ఫలమును నేను తీసుక
వచ్చినానని పలికి; నీ దేవుడైన యెహోవా సముఖ
మందు దానిని వుంచి, నీ దేవుడైన యెహోవా సము
11 ఖమందు ఆరాధించ వలెను. । మరిన్ని నీవున్ను నీలో
వున్న లేవీయుడున్ను పరదేశియున్ను నీ దేవుడయిన
యెహోవా నీకున్ను నీ యింటికిన్ని యిచ్చిన సమస్త
12 మైన మేలులయందు సంతోషించ వలెను. । మరిన్ని
మూడో సంవత్సరము, అనగా, పదో పాలును తీసే
సంవత్సరము నీకు కలిగిన వృద్ధిలో పదో పాలును తీసు
ట సమాప్తించి, దాని లేవీయునికిన్ని పరదేశికిన్ని తండ్రి
లేని వానికిన్ని విధవకున్ను నీ ఆవరణలో తిని తృప్తి
13 బొందేటట్టు వారికి యిచ్చిన తరువాత, । నీవు నీ దేవు
డైన యెహోవా సముఖమందు పలుక వలసినదేమం
టే, నా యింటిలోనుంచి నేను పరిశుద్ధమైన వాటిని
తీసుక వచ్చి, నీవు నాకు ఆజ్ఞాపించిన నీ ఆజ్ఞలన్నిటి
ప్రకారము వాటిని లేవీయునికిన్ని పరదేశికిన్ని తండ్రి
లేని వానికిన్ని విధవకున్ను యిచ్చియున్నాను; నేను
నీయొక్క ఆజ్ఞలను మీరుటయైనా వాటిని మరుచుట
యైనా లేదు. । నా దుఃఖమందు నేను వాటిలోది తినిన 14
వాడను కాను; యే అపవిత్రమైన నిమిత్తమునకైనా
వాటిలో దేనినిన్ని నేను వాడుకోకుండానున్ను, మర
ణమైన వారి నిమిత్తమునకైనా వాటిలోనుంచి తీసి యి
వ్వకుండానున్ను, నా దేవుడైన యెహోవాయొక్క
శబ్దమును విని, నీవు నాకు ఆజ్ఞాపించిన అంతటి ప్రకా
రము చేసినాను. । పరమండలమై యున్న నీ పరిశుద్ధ 15
నివాసమునుంచి నీవు కిందికి చూచి, నీ జనులైన ఇశ్రా
యేలునున్ను, మా పితృలకు నీవు సత్యము చేసిన ప్రకా
రము మాకు యిచ్చిన దేశము, అనగా పాలతోనున్న
తేనెతోనున్న ప్రవహించే దేశమునున్న ఆశీర్వదిం
తువు గాకని పలుక వలెను. । నీ దేవుడైన యెహో 16
వా యీ నిబంధనలనున్న విధులనున్న చేయుమని
యీ దినమందు నీకు ఆజ్ఞాపించి యున్నాడు: కాబట్టి
నీవు నీ హృదయమంతటితోనున్న నీ ఆత్మ అంతటి
తోనున్న వాటిని గైకొని చేయ వలసినది. । యీ దిన 17
మందు యెహోవా నీ దేవుడై యుండుటకున్న,
ఆయన మార్గములందు నడుచుటకున్న, ఆయన నిబం
ధనలనున్న ఆయన ఆజ్ఞలనున్న ఆయన విధులనున్న
గైకొనుటకున్న, ఆయన శబ్దమును వినుటకున్న నీవు
అంగీకరించి యున్నావు. । మరిన్ని యీ దినమందు యె 18
హోవా నీకు చేసిన వాగ్దత్త ప్రకారము నీవు ఆయ
నకు స్వజనమవుటకున్న, నీవు ఆయనయొక్క ఆజ్ఞల
న్నిటినిన్ని గైకొనుటకున్న, । ఆయన కలుగచేసిన సమ 19
స్తమైన జనాంగములకంటే కీర్తి చేతనున్న పేరు చేత
నున్న ఘనత చేతనున్న నిన్ను హెచ్చింప చేసుటకున్న,
నీవు నీ దేవుడైన యెహోవాకు ఆయన ఆనతిచ్చి
నట్టు పరిశుద్ధమైన జనమవుటకున్న ఆయన అంగీకరించి
యున్నాడని చెప్పెను.

## 27. అధ్యాయము.

మరిన్ని మోషే ఇశ్రాయేలు పెద్దలతో కూడా 1
జనులకు ఆజ్ఞాపించినదేమంటే, యీ దినమందు నేను
మీకు ఆజ్ఞాపించే ఆజ్ఞలన్నిటినిన్ని మీరు గైకొందురు
గాక. । మీరు యర్దేనును దాటి, నీ దేవుడైన యె 2
హోవా నీకు యిచ్చే దేశములోకి వచ్చిన దినమందు
సంభవించేది యేమంటే, నీవు గొప్పరాళ్లను దొంతర
పెట్టి, వాటి మీద సున్నము రాచి, । నీ పితృలయొక్క 3
దేవుడైన యెహోవా నీకు చేసిన వాగ్దత్త ప్రకారము
నీ దేవుడైన యెహోవా నీకు యిచ్చే దేశమనగా
పాలతోనున్న తేనెతోనున్న ప్రవహించే దేశము
లోకి ప్రవేశించుటకు నీవు దాటిన తరువాత, వాటి
మీద యీ న్యాయ ప్రమాణముయొక్క వాక్యముల

4 న్నిటినీ వ్రాయ వలసినది. । కాబట్టి యర్దేనును దాటిన
తరువాతను నీవు యీ దినమందు నేను నీకు ఆజ్ఞాపిం
చినట్టు ఆ రాళ్లను ఈ బాలు కొండ మీద దొంతర
5 పెట్టి, వాటి మీద సున్నమును రాతువు గాక. । మరిన్ని
అక్కడ నీ దేవుడయిన యెహూవా కొరకు రాళ్ల
యొక్క బలిపీఠమును కట్టవలెను; వాటి మీద యినుప
6 సరుకు యెత్త కూడదు. । నీ దేవుడైన యెహూవా
యొక్క బలిపీఠమును యేకాండపు రాళ్లతోనే కట్టి,
దాని మీద నీ దేవుడయిన యెహూవాకు హూమ
7 పణాలను అర్పించ వలెను. । మరిన్ని నీవు సమాధానా
ర్పణలను చెల్లించి, అక్కడనే తిని, నీ దేవుడయిన
8 యెహూవా సముఖమందు సంతోషించవలెను. । అది
గాక యీ న్యాయప్రమాణముయొక్క వాక్యములన్ని
టెనిన్ని ఆ రాళ్ల మీద బహు విరళముగా వ్రాయ
9 వలసినదని చెప్పెను. । మరిన్ని మోషేయున్ను అర్చ
కులయిన లేవీయులున్ను ఇశ్రాయేలు అందరినీ చూచి
చెప్పినదేమంటే, ఓ ఇశ్రాయేలా జాగ్రతపడి ఆల
కించుము; యీ దినమందు నీవు నీ దేవుడయిన యె
10 హూవాయొక్క జనము అయి వున్నావు. । కాబట్టి
నీవు నీ దేవుడయిన యెహూవాయొక్క శబ్దమును
విని, యీ దినమందు నేను నీకు ఆజ్ఞాపించే ఆయన
యొక్క ఆజ్ఞలనున్ను నిబంధనలనున్ను చేతువు గాకని
11 చెప్పెను. । మరిన్ని మోషే ఆ దినమందే జనులకు ఆజ్ఞా
12 పించినదేమంటే, । మీరు యర్దేనును దాటిన తరు
వాత షిమోను, లేవీ, యూదా, ఇశ్శాఖారు, యోసేపు,
బెన్యామీను అనే వీరు జనులను ఆశీర్వదించుటకు
13 గెరిజ్జీము కొండ మీద నిలువ వలసినది. । మరిన్ని రూ
బేను, గాదు, ఆషేరు, జబూలోను, దాను, నఫ్తాలీ
అనే వీరు శపించుటకు ఈబాలు కొండమీద నిలువ
14 వలసినది. । అప్పుడు లేవీయులు పెద్ద బొబ్బచేత
ఇశ్రాయేలు వారందరితో చెప్పవలసినదేమంటే, ।
15 పనివానియొక్క హస్త కృత్యమైనటువంటిన్ని యె
హూవాకు అసహ్యమైనటువంటిన్ని ఏక చెక్కిన
విగ్రహమునైనా పోత విగ్రహమునైనా చేయించి,
దానిని అంతరంగ స్థలములో వుంచుకొనే వాడు
శపించబడును గాకని చెప్పినప్పుడు జనులందరున్ను
అందుకు ఆమెన్ అని ప్రత్యుత్తరముగా పలుక
16 వలెను. । మరిన్ని తండ్రినైనా తల్లినైనా నిర్లక్ష్య
ము చేసిన వాడు శపించబడును గాకని చెప్పిన
ప్పుడు జనులందరున్ను ఆమెన్ అని పలుక వలెను. ।
17 మరిన్ని తన పొరుగువాని స్థలముయొక్క ఆనవాలును
తీసివేసిన వాడు శపించబడును గాకని చెప్పినప్పుడు
జనులందరున్ను అందుకు ఆమెన్ అని పలుక వలెను. ।
18 గుడ్డివానిని మార్గమునుంచి తప్పేటట్టు చేసేవాడు శపిం
చబడును గాకని చెప్పినప్పుడు జనులందరున్ను అం
దుకు ఆమెన్ అని పలుక వలెను. । పరదేశికిన్ని తండ్రి 19
లేనివానికిన్ని విధవకున్ను న్యాయపు తీర్పును తప్పించే
వాడు శపించబడును గాకని చెప్పినప్పుడు జనులంద
రున్ను అందుకు ఆమెన్ అని పలుక వలెను. । తన తం 20
డ్రియొక్క భార్యతో శయనించినవాడు తన తండ్రి
కట్టు చెంగును బయిలుపరచేవాడవును గనుక వాడు
శపించ బడును గాకని చెప్పినప్పుడు జనులందరున్ను
ఆమెన్ అని పలుక వలెను. । యే మృగ జాతితోనైై 21
నా కలుసుకొనేవాడు శపించబడును గాకని చెప్పిన
ప్పుడు జనులందరున్ను అందుకు ఆమెన్ అని పలుక
వలెను. । తన తండ్రి కుమార్తెయైనా తన తల్లి కుమార్తె 22
యైనా అయి యున్నటువంటి తన సహోదరితో
శయనించిన వాడు శపించబడును గాకని చెప్పినప్పుడు
జనులందరున్ను అందుకు ఆమెన్ అని పలుక వలెను. ।
తన అత్తతో శయనించిన వాడు శపించబడును గాకని 23
చెప్పినప్పుడు జనులందరున్ను అందుకు ఆమెన్ అని
పలుక వలెను. । చాటుగా తన పొరుగింటి వానిని 24
కొట్టినవాడు శపించబడును గాకని చెప్పినప్పుడు జను
లందరున్ను అందుకు ఆమెన్ అని పలుక వలెను. । నిరప 25
రాధిని నరుకుటకు లంచము పుచ్చుకొనిన వాడు శపించ
బడును కాకని చెప్పినప్పుడు జనులందరున్ను అందుకు
ఆమెన్ అని పలుక వలెను. । యీ న్యాయ ప్రమాణ 26
ముయొక్క వాక్యములను చేసుటకు నిర్ధారణ చేసు
కొనిన వాడు శపించబడును గాకని చెప్పినప్పుడు
జనులందరున్ను అందుకు ఆమెన్ అని పలుక వలెను.

## 28. అధ్యాయము.

నీ దేవుడైన యెహూవాయొక్క శబ్దమును నీవు 1
జాగ్రతగా విని, యీ దినమందు నేను నీకు ఆజ్ఞా
పించే ఆయనయొక్క ఆజ్ఞలన్నిటినీ గైకొని చేస్తే,
అప్పుడు సంభవించేది యేమంటే, భూమియొక్క
సకల జనములకంటే నీ దేవుడైన యెహూవా నిన్ను
హెచ్చింప చేసును. । మరిన్ని నీ దేవుడైన యెహూ 2
వాయొక్క శబ్దమును నీవు వినినట్టయితే, యీ సకల
మైన ఆశీర్వాదములున్ను నీ మీదికి వచ్చి నిన్ను
చేపట్టును. । పట్టణమందు నీవు ఆశీర్వదించ బడుదువు, 3
పొలమందు నీవు ఆశీర్వదించ బడుదువు. । నీ గర్భ 4
ఫలమున్ను, నీ భూమి ఫలమున్ను, నీ పశుఫలమున్ను,
నీ గోవుల వృద్ధియున్ను నీ గొర్రెల మందలున్ను,
ఆశీర్వదించ బడును. । నీ గంపయున్ను, నీ సామగ్రి 5
యున్ను, ఆశీర్వదించ బడును. । నీవు లోపలికి వచ్చిన 6
ప్పుడు ఆశీర్వదించ బడుదువు, నీవు బయిటికి వెళ్లిన
ప్పుడు ఆశీర్వదించ బడుదువు. । నీ మీదికి లేచే నీ 7

శత్రువులు నీ ముఖము యెదుట కొట్టబడుట యె
హోవా కలుగ చేసును; ఒక మార్గముచేత వారు
నీకు యెదురుగా వత్తురు, యేడు మార్గములచేత నీ
8 ముందరనుంచి పారిపోవుదురు. । నీ కొట్ల యందున్ను,
నీవు చేపట్టే అన్నిటి యందున్ను, యెహోవా నీ
మీద ఆశీర్వాదమును కలుగ చేసును; యీలాగున
నీ దేవుడైన యెహోవా నీకు యిచ్చే దేశమందు
9 నిన్ను ఆశీర్వదించును. । నీ దేవుడయిన యెహోవా
యొక్క ఆజ్ఞలను నీవు గైకొని, ఆయన మార్గము
లందు నడచితే, ఆయన నీకు ప్రమాణము చేసిన
ప్రకారము నిన్ను తన కొరకు పరిశుద్ధ జనముగా
10 స్థిరపరచును. । యెహోవాయొక్క నామముచేత నీవు
పిలువబడి యున్నావని లోకులందరున్ను చూచి నీకు
11 భయపడుదురు. । మరిన్ని యెహోవా నీకు యిచ్చు
టకు నీ పితృలతో ప్రమాణము చేసిన దేశములో
మేలు యందున్ను, నీ గర్భఫలమందున్ను, నీ పశుఫ
లమందున్ను, నీ భూమిఫలమందున్ను, యెహోవా
12 నీకు అభివృద్ధి కలుగ చేసును. । మరిన్ని నీ భూమికి
దాని కాలమందు వర్షమును యిచ్చుటకున్ను, నీ
చేతియొక్క పని అంతటినీ ఆశీర్వదించుటకున్ను, ఆ
కాశమనే తన మంచి ధనాగారమును యెహోవా
నీ కొరకు విప్పును; కాబట్టి అనేక జనాంగములకు
నీవు అప్పు యిత్తువు, నీవు అప్పు చేయకపోదువు. ।
13 మరిన్ని యెహోవా నిన్ను తోకగా చేయక శిరస్స
య్యేటట్టు చేసును; యీ దినమందు నేను నీకు ఆజ్ఞా
పించే నీ దేవుడైన యెహోవాయొక్క ఆజ్ఞలను నీవు
గైకొని చేస్తివట్టాయెనా, నీవు మీదుగానే వుందువు
14 గాని కిందుగా వుండవు. । కాబట్టి యీ దినమందు
నేను నీకు ఆజ్ఞాపించే వాక్యములలో యే ఒక దాని
నుంచైనా తప్పి, వేరైన దేవుండ్లను వెంబడించి సేవిం
చుటకు కుడికైనా యెడమకైనా తిరుగకుండా వుం
15 దువు గాక. । అయితే నీ దేవుడయిన యెహోవా
యొక్క శబ్దమును నీవు వినక, యీ దినమందు నేను
నీకు ఆజ్ఞాపించే ఆయనయొక్క ఆజ్ఞలన్నిటినిన్ని ఆ
యన నిబంధనలనున్ను గైకొని చేయకపోతే, సంభవిం
చేదేమంటే, యీ శాపములన్నీ నీ మీదికి వచ్చి
16 నిన్ను చేపట్టును. । పట్టణమందు నీవు శపించబడుదువు,
17 పొలమందు నీవు శపించబడుదువు, ।నీ గంపయున్ను,
18 నీ సామగ్రియున్ను శపించబడును. । నీ గర్భ ఫల
మున్ను, నీ భూమి ఫలమున్ను, నీ గోవులవృద్ధియున్ను,
19 నీ గొర్రెల మందలున్ను శపించబడును. । నీవు లోప
లికి వచ్చినప్పుడు శపించబడుదువు, నీవు వెలపటికి
20 వెళ్లినప్పుడు శపించబడుదువు. । వేటివల్ల నీవు నన్ను
విడచిపెట్టితివో ఆ నీ కార్యములయొక్క చెడ్డత

నము కొరకు నీవు సంహరించబడి, త్వరగా శినంచే
పర్యంతమూ చేసుట కొరకు నీవు చేపట్టే అంతటి
యందు యెహోవా నీ మీదికి శాపమునున్ను మనో
వేదననున్ను గద్దింపునున్ను పంపును. । నీవు వెళ్లి స్వతం 21
త్రించుకొనే దేశములోనుంచి నిన్ను నశింపచేసే
పర్యంతమూ యెహోవా తెగులు నిన్ను అంటుకొనే
టట్టు చేసును. । క్షయరోగము చేతనున్ను, జ్వరము 22
చేతనున్ను, తాపముచేతనున్ను, మిక్కిలీ కాక చేతను
న్ను, వరపు చేతనున్ను, గాడ్పు దెబ్బ చేతనున్ను,
చిత్తపట్టుట చేతనున్ను, యెహోవా నిన్ను కొట్టును;
మరిన్ని నీవు లయమయ్యే పర్యంతమూ అవి నిన్ను
వెంటబెట్టును. । మరిన్ని నీ శిరస్సు పయిని వుండే 23
ఆకాశము యిత్తడిన్ని, నీ కిందనుండే భూమి యిను
మున్ను అయి వుండును. । యెహోవా నీ భూమి 24
యొక్క వర్షమును బుగ్గిగానున్ను ధూళిగానున్ను కలుగ
చేసును; నీవు నశించే పర్యంతమూ అది ఆకాశము
నుంచి నీ మీదికి వచ్చును. । యెహోవా నీ శత్రు 25
వుల ముందరనుంచి నీవు కొట్టబడేటట్టు చేసును; ఒక
మార్గముచేత నీవు వారికి యెదురుగా వెళ్లుదువు,
అయితే యేడు మార్గములచేత వారి యెదుటనుంచి
పారి పోయి, లోకముయొక్క రాజ్యములన్నిటిలోకీ
కొంచుపోబడుదువు. । మరిన్ని నీ కళేబరము ఆకాశ 26
ముయొక్క సకల పక్షులకున్ను, భూమిలోనుండే మృ
గములకున్ను ఆహారమవును; వాటిని తోలివేసే వాడు
ఒకడున్ను లేకపోవును. । మరిన్ని యెహోవా మిస్ర 27
యీముయొక్క రక్తపు గడ్డలతోనున్ను, మూల వ్యాధి
తోనున్ను, కుష్ఠరోగముతోనున్ను, గజ్జితోనున్ను, ని
న్ను కొట్టును; వీటినుంచి నీవు స్వస్థపడలేకపోదువు. ।
మరిన్ని యెహోవా నిన్ను వెర్రితనముతోటిన్ని, అం 28
ధత్వముతోటిన్ని, హృదయ విస్మయముతోటిన్ని కొ
ట్టును. । మరిన్ని గుడ్డివాడు అంధకారమందు తడివి 29
నట్టు నీవు మధ్యాహ్నమందే తడువుదువు; నీ మార్గ
ములలో నీవు బాగుపడక పోదువు; నీవు బాధపెట్ట
బడుతూ నిత్యమున్ను దోచుకోబడుతూనే వుందువు;
నిన్ను రక్షించేవాడు ఒకడూ లేకపోవును. । నీవు పెం 30
డ్లాడినప్పటికిన్ని అన్యుడు దానితో శయనించును;
నీవు యిండ్లను కట్టుకొనినప్పటికిన్ని దానిలో కాపు
రము చేయలేక పోదువు; నీవు ద్రాక్ష తోటను నాటు
కొన్నప్పటికిన్ని దాని పండ్లను కూర్చుకోలేక పో
దువు. । నీ యెద్దు నీ కన్నుల యెదుట చంపబడినప్ప 31
టికిన్ని దానిని నీవు తినకపోదువు; నీ గార్దభము
నీ యెదుటనుంచి బలవంతముచేత తీసుకొని పోబ
డును, అది నీకు తిరిగీ యియ్యబడక పోవును; నీ
గొర్రెలు నీ శత్రువుల వశమవును, వాటిని విడిపించే

32 వాడు వొకడూ నీకు లేకపోవును. । నీ కుమారులున్ను
నీ కుమార్తెలున్ను అన్య జనుల వశమైపోవుదురు;
నీ కన్నులు వారినిమిత్తము దినమంతా నిరీక్షిస్తూ వుం
డుటవల్ల క్షీణించి పోవును; మరిన్ని నీకు హస్తబలము
33 లేకపోవును. । నీ భూమి పంటనున్ను నీ కష్టార్జిత
మునున్ను నీకు తెలియని జనాంగము భక్షించును;
మరిన్ని నీవు బాధపెట్టబడుతూ నిత్యమున్ను క్షీణింప
34 చేయబడుతూ వుందువు. । అయినందున నీ కండ్ల యె
దుట జరిగిన.దానిని చూచి నీవు వెర్రిపడుదువు. ।
35 మరిన్ని నీ ముడుకుల మీదనున్ను నీ పిక్కల మీద
నున్ను నీ పాదాది శిరఃపర్యంతమూ స్వస్థము కాన
టువంటిన్ని బాధాకరమైనటువంటిన్ని వ్రణముతో
36 యెహోవా నిన్ను మొత్తును. । మరిన్ని యెహోవా
నిన్నున్ను నీ మీద నీవు నిర్ణయించుకొనే రాజునున్ను
నీవైనా నీ పితృలయినా యెరుగని జనాంగము యొ
ద్దికి తీసుకొని పోవును; అక్కడ నీవు దారు శిలా మయ
37 ములయిన యితర దేవుండ్లను సేవింతువు. । మరిన్ని
నిన్ను యే జనాంగములలోకి యెహోవా చెదర చేసు
నో ఆ జనాంగములలో నీవు విభ్రాంతికిన్ని హేళ
38 నకున్ను సామితెకున్ను హేతువై యుందువు. । నీవు
విస్తరించి విత్తనములను పొలములోకి తీసుకొని పోదువు,
అయితే నీవు కొంచెమే కూర్చుకొందువు; యెందు
39 కంటే మిడతలు దానిని కొట్టివేసును. । నీవు ద్రాక్ష
తోటలను నాటి వాటిని చక్కబెడుతూ వున్నప్పటి
కిన్ని వాటి రసమును తాగుటయైనా ఫలములను సమ
కూర్చుటయైనా చేయలేక పోదువు; యెందుకంటే
40 పురుగులు వాటిని తినివేసును. । నీ సరిహద్దులన్నిటి
లో నీకు యిప్పచెట్లు వున్నప్పటికిన్ని వాటి తైలము
తోటి నిన్ను నీవు పూసుకోలేక పోదువు; యెందు
41 కంటే నీ యిప్పచెట్టు తన కాయలు రాల్చివేసును. । నీవు
కుమాళ్లనున్ను కుమార్తెలనున్ను కందువు, అయితే
వారివల్లను నీకు సంతోషానుభవము లేక పోవును;
యెందుకంటే వారు చెరలోకి కొంచుపోబడుదురు. ।
42 నీ భూమి యందుండే వృక్షము లన్నిటినిన్ని ఫలము
43 లన్నిటినిన్ని మిడతలు తినివేసును. । నీలో వుండే పర
దేశి నీకంటే మిక్కిలీ హెచ్చుగా వుండును, అయితే
44 నీవు మిక్కిలి తక్కువై పోదువు. । వాడు నీకు అప్పును
యిచ్చును, అయితే నీవు వానికి అప్పు యివ్వకపో
దువు; వాడు శిరస్సయి వుండును, నీవు తోక అయి
45 వుందువు. । అదిగాక యీ శాపములన్నీ నీ మీదికి
వచ్చి, నీవు నశించే పర్యంతమూ నిన్ను వెంట తగిలి
నిన్ను పట్టుకొనును; యెందుకంటే నీ దేవుడైన యె
హోవాయొక్క శబ్దమును నీవు వినక, ఆయన నీకు
ఆజ్ఞాపించిన ఆయన ఆజ్ఞలనున్ను ఆయన నిబంధనల
నున్ను గైకొనక పోతివి. । అవి ఆనవాలుగానున్ను 46
విస్మయముగానున్ను నీ మీదనున్ను నీ సంతతి మీద
నున్ను యెప్పటికీ నిలిచి వుండును. । యెందుచేతనంటే 47
సకల పరిపూర్ణత కలిగిన్ని నీవు సంతోషముతో
నున్ను హృదయానందముతోనున్ను నీ దేవుడైన యె
హోవాను సేవించక పోతివి. । కాబట్టి నీకు విరోధ 48
ముగా యెహోవా పంపే నీయొక్క శత్రువులను
నీవు ఆకలితోటిన్ని దప్పికితోటిన్ని దిగంబరత్వము
తోటిన్ని సకల దారిద్ర్యముతోటిన్ని సేవిస్తూ వుం
దువు; ఆయన నిన్ను నశింపచేసే పర్యంతమూ నీ మెడ
మీద యినుప కాడి మోపును. । మరిన్ని దూరము 49
నుంచి, అనగా, భూమియొక్క కడనుంచి యెహో
వా పక్షిరాజు యెగిరేటంత వేగముగా వొక జనాంగ
మును నీ మీదికి రా చేసును; అది నీకు తెలియని
భాషగల జనాంగము. । అది కఠిన ముఖము కలిగి, 50
వృద్ధులందు కనికరించకుండానున్ను, బాలురందు దయ
దలచకుండానున్ను వున్న జనాంగము. । మరిన్ని వాడు 51
నీవు క్షీణించిపోయే పర్యంతమూ నీ పశు ఫలముల
నున్ను నీ భూమి ఫలమునున్ను తినివేసును; వాడు
నిన్ను క్షీణింప చేసే పర్యంతమూ ధాన్యమునైనా
ద్రాక్షారసమునైనా తైలమునైనా నీ గోవుల వృద్ధినై
నా నీ గొర్రెల మందలనైనా నీకు విడచిపెట్టక వుండు
ను. । మరిన్ని నీవు నమ్ముకొనిన నీ బురుజులు గల పొడు 52
గైన ప్రాకారములు కూలే పర్యంతమూ నీ దేశమంత
టిలో నీ ద్వారములన్నిటి యందూ వాడు నిన్ను
ముట్టడి వేసును; యీలాగున వాడు నీ దేవుడైన యె
హోవా నీకు యిచ్చిన దేశమంతటిలో వున్నటువంటి
నీ ద్వారములన్నిటి యందూ నిన్ను ముట్టడి వేసును. ।
ముట్టడివల్లనున్ను యిక్కట్టువల్లనున్ను శత్రువులు నిన్ను 53
బాధపెట్టినప్పుడు నీ దేవుడైన యెహోవా నీకు యి
చ్చిన నీ గర్భ ఫలమును, అనగా, నీ కుమారులయొక్క
నీ కుమార్తెలయొక్క మాంసమును నీవు తిందువు. ।
అప్పుడు మీలో మృదువున్ను అతి సుకుమారమున్ను 54
కలిగిన మనుష్యుడు, తన కన్ను తన సహోదరుని
యెడలనున్ను, తన కౌగిటి భార్య యెడలనున్ను, శేషిం
చిన తన పిల్లల యెడలనున్ను చెడ్డదైనందువల్ల, । వాడు 55
తాను తినే తన పిల్లలయొక్క మాంసమును వారిలో
యెవరికైనా యెంతమాత్రమున్ను యివ్వక వుండును;
యెందుకంటే నీ శత్రువులు నీ ద్వారములన్నిటి యం
దూ వేట్టిచేతను నిన్ను బాధపెట్టుదురో ఆ ముట్టడి
లోనున్ను ఆ యిక్కట్టులోనున్ను వానికి యేమిన్ని
వుండక పోవును. । మరిన్ని మీలో మృదువున్ను సుకు 56
మారమున్ను కలిగిన స్త్రీ, తన సుకుమారతవల్లనున్ను
మృదుత్వమువల్లనున్ను తన పాదము నేల మీద పెట్టు

టకు భయము గలదైనప్పటికిన్ని, దాని కన్ను తన
కౌగిటి పెనిమిటి యెడలనున్ను, తన కుమారుని యెడ
లనున్ను, తన కుమార్తె యెడలనున్ను, తన పాదముల
మధ్యలోనుంచి బయిటికి వచ్చిన పసిపిల్ల యెడలనున్ను,
తాను కన్న బిడ్డల యెడలనున్ను చెడ్డదై వుండును;।
57 యేమంటే నీ శత్రువులు నీ ద్వారములన్నిటి యందూ
వేటిచేత నిన్ను బాధ పెట్టుదురో, ఆ ముట్టడిలో
నున్ను ఆ యిక్కట్టులోనున్ను దానికి యేమిన్ని లేనం
58 దుచేత అది వాటిని రహస్యముగా తినును.। మహిమ
గలిగినటువంటిన్ని భీకరమైనటువంటిన్ని నీ దేవుడ
యిన యెహోవా అనే యీ నామమునకు నీవు
భయపడేటట్టు, యీ గ్రంథములో వ్రాసిన యీ న్యా
యప్రమాణముయొక్క వాక్యములన్నిటినీ నీవు భద్ర
59 ముగా చేయకపోతే;। అప్పుడు యెహోవా నీయొ
క్క తెగుళ్లనున్ను నీ సంతతియొక్క తెగుళ్లనున్ను
ఆశ్చర్యమైనవిగా చేసును; అవి గొప్పవైయున్ను, బహు
కాలము మట్టుకు వుండే తెగుళ్లున్ను, బాధాకరము
న్ను, బహు కాలము మట్టుకు వుండే వ్యాధులున్ను
60 అయి వుండును.। మరిన్ని వేటికి నీవు భయపడుతూ
వుంటివో ఆ మిస్రయీము రోగములను ఆయన నీ
మీదికి వచ్చేటట్టు చేసును; అవి నిన్ను అంటి వుండు
61 ను.। మరిన్ని యీ న్యాయప్రమాణ గ్రంథములో
వ్రాయనటువంటి సకల రోగములనున్ను సకలమైన
తెగుళ్లనున్ను నీవు నశించే పర్యంతమూ యెహోవా
62 నీ మీదికి వచ్చేటట్టు చేసును.। మీరు ఆకాశ నక్ష
త్రములలాగున అనేకముగా వుండినప్పటికిన్ని మీరు
లెక్కకు కొంచెమవుదురు, యెందుకంటే దేవుడయిన
యెహోవాయొక్క శబ్దమును నీవు వినక పోతివి.।
63 మరిన్ని సంభవించేదేమంటే, యెహోవా మీకు మేలు
చేసుటకున్ను, మిమ్మును విస్తరింప చేసుటకున్ను, మీ
మీద యేలాగు సంతోషించెనో ఆలాగున మిమ్మును
యెహోవా నశింప చేసుటకున్ను, మిమ్మును శూన్య
పరచుటకున్ను, మీ మీద సంతోషించును; నీవు వెళ్లి
స్వతంత్రించుకొనే దేశములోనుంచి మీరు పెళ్లగించ
64 బడుదురు.। మరిన్ని యెహోవా సమస్తమయిన జను
లలోనూ భూమియొక్క యీ తట్టునుంచి ఆ తట్టు
మట్టుకు నిన్ను చెదర చేసును; అక్కడ నీవైనా నీ
పితృలైనా యెరుగనటువంటి దారు శిలా మయములైన
65 యితర దేవుండ్లను సేవింతువు.। ఆ జనాంగములలో
నీకు నెమ్మది లేకపోవును; నీ అరికాలుకైనా విశ్రమ
ము లేకపోవును; అయితే యెహోవా నీకు అక్కడ
కంపించే హృదయమునున్ను నేత్రక్షీణతనున్ను మనో
66 విచారమునున్ను యిచ్చును.। మరిన్ని నీ ప్రాణము
నీ ముందర అనుమానాస్పదముగా వుండును, యేమం
టే, దివారాత్రములు నీవు భయపడుతూ, నీ ప్రాణ
మును గురించి నీకు యేమీ నమ్మకము లేక పోవును.।
నీ హృదయమునకు వచ్చే బెంగవల్ల నీవు భయపడి 67
నందు చేతనున్ను, నీ దృష్టికి కనుపించే దాని చేతనున్ను,
నీవు వుదయమందు దైవమా, యెప్పుడు అస్తమానమ
యీననిన్ని! అస్తమానమందు దైవమా, యెప్పుడు వుద
యము అయీననిన్ని! పలుకుదువు.। మరిన్ని యెహో 68
వా దానిని నీవు కానక పోదువని దేని గురించి నీకు
నేను చెప్పితినో, ఆ మార్గముచేత నిన్ను వోడల
మీదనుంచి తిరిగీ మిస్రయీము దేశమునకు పోచేసును;
అక్కడ మీరు మీ శత్రువులకు దాసులుగానున్ను
దాసురాండ్లుగానున్ను అమ్మ జూపబడుదురు, అయితే
మిమ్మును కొనేవాడు వొకడున్ను లేక వుండునని
చెప్పెను.। యివి హోరేబులో యెహోవా ఇశ్రా 69
యేలు పుత్రులతో చేసుకొనిన వొడంబడికె గాక,
మోయాబు దేశములో యెహోవా వారితో చేయు
మని మోషేకు ఆజ్ఞాపించిన వొడంబడికెయొక్క వాక్య
ములై వున్నవి.

## 29. అధ్యాయము.

మరిన్ని మోషే ఇశ్రాయేలందరినిన్ని పిలిపించి వా 1
రితో చెప్పినదేమంటే, మిస్రయీము దేశమందు యె
హోవా మీ యెదుట ఫరోకున్ను అతని సేవకులంద
రికిన్ని అతని దేశమంతటికిన్ని చేసినదంతాను మీరు
చూస్తిరి.। ఆ గొప్ప శోధనలనున్ను గురుతులనున్ను ఆ 2
గొప్ప అద్భుతములనున్ను మీ కన్నులు కనెను.।
అయినప్పటికిన్ని యెహోవా మీకు గ్రహించ గల 3
హృదయమునున్ను, చూడ గల కన్నులనున్ను, విన గల
చెవులనున్ను, నేటి వరకు యిచ్చి వున్నాడు కాడు.।
మరిన్ని నలుబయి సంవత్సరములు నేను మిమ్ము అర 4
ణ్యమందు నడిపిస్తిని; మీ బట్టలు మీ మీద పాతగిలక
వున్నవి; నీ పాదరక్ష నీ పాదము మీద పాతగిలక
వున్నది.। నేనే మీ దేవుడైన యెహోవానని మీరు 5
యెరిగేటట్టుగా మీరు రొట్టె తినకుండానున్ను ద్రా
క్షారసమునైనా మద్యమునైనా తాగకుండానున్ను
వుంటిరని దేవుడు ఆనతిచ్చెను.। మరిన్ని మీరు 6
యీ స్థలమునకు చేరినప్పుడు, హెష్బోను రాజైన
సీహోనున్ను బాషాను రాజైన ఓగున్ను యు
ద్ధమునకు మనకు యెదురుగా బయిలు వచ్చిరి;।
అయితే మనము వారిని సంహరించి, వారి దేశమును 7
స్వాధీనము చేసుకొని, దానిని రూబేనీయులకున్ను
గాదీయులకున్ను మనస్సే గోత్రములో సగము మంది
కిన్ని స్వాతంత్ర్యము కొరకు యిస్తిమి.। కాబట్టి మీరు 8
చేసే అన్నిటియందు మీరు బాగుపడేటట్టు యీ వొడం

బడికెయొక్క వాక్యములన్నిటినీ గైకొని చేయండి. ।
9 నీ దేవుడయిన యెహోవా నిన్ను తనకు స్వజన
మయ్యేటట్టు స్థిరపర్చుటకున్ను, ఆయన నీతో ఆనతి
చ్చినట్టు అబ్రాహాము ఇస్సాకు యాకోబు అనే నీ
పితృలకు ఆయన ప్రమాణము చేసినట్టున్ను ఆయన
10 నీకు దేవుడు అయ్యేటట్టున్ను, । యీ దినమందు నీ
దేవుడయిన యెహోవా నీతో చేసే ప్రమాణములో
కిన్ని ఆయన విషయమైన వొడంబడికెలోకిన్ని నీవు
11 ప్రవేశించ గలందులకు, । ఇశ్రాయేలు వారైన మీరంద
రున్ను, మీ గోత్రాధిపతులున్ను, పెద్దలున్ను, అధికా
రులున్ను, మీ చిన్నవాండ్లున్ను, మీ భార్యలున్ను, ।
12 మీకు కర్రలు నరికేవాడు మొదలుకొని నీళ్లు తోడే
13 వాని పర్యంతమూ, । యింకా మీ పేటలో వున్న పర
దేశి సహా యీ దినమందు మీ దేవుడైన యెహోవా
14 ముందర నిలిచి వున్నారు. । అయితే యీ వొడంబడికె
నున్ను యీ ప్రమాణమునున్ను మీ యొద్ద మాత్రమే
15 కాదు, । యీ దినమందు మన దేవుడయిన యెహోవా
యెదుట నిలిచి వున్న వాని యొద్దనున్ను, యీ దిన
మందు మనతో కూడా లేనివాని యొద్దనున్ను పుచ్చు
16 కొంటున్నాను. । యెందుకంటే మిస్రయీము దేశమం
దు మనము యేలాగున వుంటిమో అదిన్ని, మనము
జనాంగములలోనుంచి యేలాగున నడిచి వస్తిమో అది
17 న్ని మీరు యెరుగుదురు. । మరిన్ని వారియొక్క అస
హ్యతలనున్ను, వారి యొద్ద వున్నటువంటి కర్ర రాయి
వెండి బంగారముల విగ్రహములనున్ను మీరు చూస్తిరి.।
18 కాబట్టి మీలో పురుషుడైనా, స్త్రీ అయినా, కుటుంబ
మయినా, గోత్రమైనా, యీ దినమందు తన హృద
యమును మన దేవుడైన యెహోవా యొద్దనుంచి తిప్పు
కొని వెళ్లి, యీ జనాంగములయొక్క దేవుండ్లను సేవిం
చునేమో, అది కాకుండానున్ను మీలోగా చేదున్ను
విషమున్ను గల వేరు కలుగునేమో, అది కాకుండా
19 నున్ను చూచుకోండి. । అటువంటి వాడు యీ శాప
వాక్యములను విని, దాహమునకు మత్తత కూర్చి, నా
హృదయ మూర్ఖత్వ ప్రకారము నేను నడిచినప్పటి
కిన్ని నాకు క్షేమము కలుగునని తన హృదయములో
20 తన్ను తాను దీవించుకొన్నట్టయితే; । యెహోవా వా
నిని వదిలి వేయడు; యేమంటే, యెహోవాయొక్క
కోపమున్ను ఆయన అసూయయున్ను ఆ మనుష్యుని
మీద రాజును; మరిన్ని యీ గ్రంథమందు వ్రాసిన
శాపములన్ని వాని మీదికి వచ్చును; యింకా వాని
నామమును యెహోవా ఆకాశము కిందనుంచి తుడచి
21 వేసును. । మరిన్ని యెహోవా వానిని ఇశ్రాయేలు
గోత్రములన్నిటిలోనుంచి కేటించి, యీ న్యాయ
ప్రమాణముయొక్క గ్రంథమందు వ్రాయబడ్డ వొడం
బడికెయొక్క శాపములన్నిటి ప్రకారముగా కీడుకు
అప్పగించును. । అయినందున వచ్చే తరమువారు, అన 22
గా, మీ పిమ్మట లేచే మీ బిడ్డలున్ను దూర దేశము
నుంచి వచ్చే పరదేశియున్ను, ఆ దేశముయొక్క తెగు
ళ్లనున్ను, యెహోవా దాని మీద పెట్టిన వ్యాదుల
నున్ను చూచి, । వారే చెప్పుకోవడము కాకుండా సమ 23
స్తమయిన జనాంగములున్ను యీ దేశమంతా గంధ
కము చేతనున్ను వుప్పుచేతనున్ను దహిస్తూ, యెహో
వా తన కోపము చేతనున్ను, వుగ్రత చేతనున్ను
పాలిణంచిన సొదొము, గొమొర్రా, అద్మా, సెబోయీ్యా
ము అనే పట్టణములలాగున విత్తబడకనున్ను ఫలిం
చకనున్ను గడ్డి మొలవకనున్ను పాలిణంచ బడినదై
వున్నదని చూచి, । యెహోవా యీ దేశమును యీ 24
లాగు యెందుకు చేసెను? యీ మహా కోపాగ్నియొ
క్క హేతువు యేమని అడిగినప్పుడు, మనుష్యులు
చెప్పేదేమంటే, । వీరి పితృలయొక్క దేవుడయిన యె 25
హోవా వీరిని మిస్రయీము దేశములోనుంచి యివ
తలకు తీసుక వచ్చిన తరువాత వీరికి నిణయించిన
వొడంబడికెను వీరు విడచి వెళ్లి, । వీరికి తెలియనటు 26
వంటి దేవుండ్లను, అనగా, వీరికి యే మేలునయినా
యివ్వనటువంటి వేరైన దేవుండ్లను సేవించినందున, ।
యీ గ్రంథమందు వ్రాయబడ్డ శాపములన్నిటినీ యీ 27
దేశము మీదికి వచ్చేటట్టు చేసుటకు యెహోవాయొ
క్క కోపము దీని మీద రగులుకొనెను. । మరిన్ని యె 28
హోవా కోపము చేతనున్ను రౌద్రము చేతనున్ను
మిక్కిలీ అహంకారము చేతనున్ను వారి దేశములో
నుంచి వారిని వేరుతోటి పెళ్లగించి, యీ దినమందయి
నట్టు పరదేశములోకి వెళ్లదోసి యున్నాడని చెప్పు
దురు. । రహస్యమైన సంగతులు మన దేవుడయిన యె 29
హోవావై యున్నవి; అయితే మనము యీ న్యాయ
ప్రమాణముయొక్క వాక్యములన్నిటినీ చేసేటట్టుగా
బయిలుపరచబడ్డ సంగతులు మనవిన్ని మన పిల్లలవిన్ని
చిరకాలము మట్టుకు అయి వున్నవి.

## 30. అధ్యాయము.

అయితే యీ సమస్తమయిన సంగతులు, అనగా, 1
నేను నీ ముందర పెట్టిన ఆశీర్వాదమున్ను శాపమున్ను
నీ మీదికి వచ్చి, నీ దేవుడయిన యెహోవా యే
జనాంగములలోకి నిన్ను తోలివేసెనో వారిలో
వుండి, నీవు వాటిని మనస్సుకు తెచ్చుకొని, । నీ దేవు 2
డయిన యెహోవా యొద్దికి మళ్లుకొని వచ్చి, నీవున్ను
నీ బిడ్డలున్ను యీ దినమందు నేను నీకు ఆజ్ఞాపించే
అంతటి ప్రకారముగా ఆయనయొక్క శబ్దమును నీ
హృదయమంతటితోనున్ను నీ ఆత్మ అంతటితోనున్ను

3 వినినట్టయితే, అప్పుడు సంభవించేదేమంటే, । నీ దేవు
డయిన యెహోవా నిన్ను చెరలోనుంచి విమోచించి,
నీ యందు జాలిపడి, తిరిగీ వచ్చి, నీ దేవుడైన యెహో
వా సకల జనాంగములలోనుంచి చెదర చేసిన నిన్ను
4 కూర్చును. । నీ సంబంధులు ఆకాశముయొక్క కడ
దాకా తోలివేయిబడ్డప్పటికిన్ని, నీ దేవుడైన యెహో
వా అక్కడనుంచిన్ని నిన్ను కూర్చును, అక్కడనుం
5 చిన్ని ఆయన నిన్ను రప్పించును. । నీ దేవుడయిన యె
హోవా నీ పితృలు స్వతంత్రించుకొనిన దేశములోకి
నిన్ను తీసుక వచ్చినందున నీవు దానిని స్వతంత్రించు
కొందువు; మరిన్ని ఆయన నీకు మేలుచేసి నీ పితృల
6 కంటే నిన్ను విస్తరింప చేసును. । మరిన్ని నీ దేవుడయిన
యెహోవా నీ హృదయమునున్ను నీ సంతతియొక్క
హృదయమునున్ను సున్నతీ చేసినందున, నీవు నీ హృద
యమంతటితోటిన్ని నీ అత్మ అంతటితోటిన్ని నీ దేవు
డయిన యెహోవాను స్నేహింతువు, గనుక, నీవు
7 బ్రతుకుదువు. । మరిన్ని నీ దేవుడైన యెహోవా నీ
శత్రువుల మీదనున్ను నీకు పగచేసి తరిమిన వారి మీద
8 నున్ను యీ శాపములన్నిటినీ పెట్టును. । కాబట్టి నీవు
తిరిగీ వచ్చి, యెహోవాయొక్క శబ్దమును విని, యీ
దినమందు నేను నీకు ఆజ్ఞాపించే ఆయనయొక్క ఆజ్ఞ
9 లన్నిటినీ చేతువు గాక. । యేమంటే నీ దేవుడైన యె
హోవాయొక్క శబ్దమును నీవు విని, యీ న్యాయ
ప్రమాణముయొక్క గ్రంథమందు వ్రాయబడిన ఆయ
నయొక్క ఆజ్ఞలనున్ను నిబంధనలనున్ను గైకొని, నీ
దేవుడయిన యెహోవా యొద్దికి నీ హృదయమంతటి
తోనున్ను నీ ఆత్మ అంతటితోనున్ను తిరిగీ వచ్చివట్టా
10 యెనా, । నీ దేవుడయిన యెహోవా నీ హస్త కృత్య
ములన్నిటి యందున్ను, నీ గర్భ ఫలమందున్ను, నీ
పశువృద్ధి యందున్ను, నీ భూమి పంట యందున్ను,
నీకు మేలు కలిగేటట్టుగా విస్తరింప చేసును: యేమంటే
నీ పితృల యందు యెహోవా యేలాగు సంతోషిం
చెనో ఆలాగున నీయందున్ను మేలుకొరకు సంతో
11 షించును. । యెందుకంటే యీ దినమందు నేను నీకు
ఆజ్ఞాపించే యీ ఆజ్ఞ నీకు మరుగైనది కాదు, నీకు
12 దూరమైనదిన్ని కాదు. । దానిని మనము విని చేయ
గలందులకు మన కొరకు పరలోకమునకు యెక్కి, దా
నిని మన దగ్గిరకు యెవరు తీసుక వత్తురని నీవు అను
కొనేటందుకు అది పరలోకమందున్నది కాదు. ।
13 మరిన్ని దానిని మనము విని చేయ గలందులకు మన
కొరకు సముద్రమును దాటి, దానిని మన దగ్గిరకు యె
వరు తీసుకవత్తురని నీవు అనుకొనేటందుకు అది సము
14 ద్రమవతల వున్నది కాదు. । గాని ఆ వాక్యమును నీవు
చేయ గలందులకు అది నీ నోటి యందున్ను నీ హృ
దయమందున్ను వుండి, నీకు బహు సమీపమై వున్నది.।
యిదుగో యీ దినమందు నేను నీ యెదుట జీవము 15
నున్ను మేలునున్ను, మరణమునున్ను కీడునున్ను, వుంచి
తిని; । యేమంటే నీవు బ్రతికి అభివృద్ధి పొందేటట్టు 16
గాను నీ దేవుడైన యెహోవాను స్నేహించి, ఆయన
మార్గములందు నడిచి, ఆయనయొక్క ఆజ్ఞలనున్ను
నిబంధనలనున్ను విధులనున్ను గైకొనుమని యీ దినమం
దు నేను నీకు ఆజ్ఞాపిస్తున్నాను: అప్పుడు నీ దేవు
డైన యెహోవా నీవు స్వతంత్రించుకొనే దేశమందు
నిన్ను ఆశీర్వదించును. । అయితే నీ హృదయము అట 17
నుంచి తిరిగినందున నీవు వినక, అవతలకు ఆకర్షించ
బడి, యితరమయిన దేవుండ్లను ఆరాధించి, వారెని సేవిం
చినట్టయితే, । మీరు నిశ్చయముగా నశిస్తారనిన్ని, యే 18
దేశమును స్వతంత్రించుకొనుటకు నీవు యర్దేనును
దాటి వెళ్లుదువో అక్కడ మీ దినములను మీరు విస్త
రింప చేయలేరనిన్ని, యీ దినమందు నేను నీకు రూ
ఢిగా తెలియ చేస్తున్నాను. । జీవమునున్ను మరణము 19
నున్ను, ఆశీర్వాదమునున్ను శాపమునున్ను, మీ యె
దుట పెట్టినానని నీ విషయమై సాక్ష్యము పలుకుట
కొరకు ఆకాశమునున్ను భూమినిన్ని నేను పిలుస్తు
న్నాను. । కాబట్టి నీవున్ను నీ సంతతిన్ని జీవించేటట్టు 20
గానున్ను, ఆయన నీ జీవమున్ను నీ దినములయొక్క
దీర్ఘతయున్నై వున్నాడు గనుక నీ దేవుడైన యె
హోవాను నీవు స్నేహించి, ఆయన శబ్దమును విని
ఆయనతో హత్తుకొని యుండేటట్టుగానున్ను, నీ పితృ
లైన అబ్రాహాము ఇస్సాకు యాకోబు అనే వారికి
యిచ్చుటకు యెహోవా ప్రమాణము చేసిన దేశమందు
నీవు నివసించేటట్టుగానున్ను, జీవమును కోరి యేర్ప
రచుకొనుమని చెప్పెను.

## 31. అధ్యాయము.

తరువాత మోషే వెళ్లి, ఇశ్రాయేలందరితో యీ 1
మాటలు పలికి అతడు వారితో చెప్పినదేమంటే, ।
నేటి వరకు నేను నూట యిరువై సంవత్సరములు గల 2
వాడనై వున్నాను; యికను నేను వెలపటికి వెళ్లలేను,
లోపటికి రాలేను: మరిన్ని నీవు యీ యర్దేనును
దాట కూడదని యెహోవా నాకు అనతిచ్చి వున్నా
డు. । అయితే నీ దేవుడయిన యెహోవా తానే 3
నీకంటే ముందుగా దాటి వెళ్లి, ఆ జనాంగములను నీ
ముందరనుంచి నశింప చేసును; నీవు వారిని లోపు చేసు
కొందువు; మరిన్ని యెహోషువ యెహోవా అనతి
చ్చినట్టు నీకంటే ముందర దాటును. । మరిన్ని యెహో 4
వా అమోరీయులయొక్క రాజులైన సీహోనునున్ను,
ఓగునున్ను, ఆయన నశింపచేసిన వారి దేశమునున్ను,

యేలాగు చేసెనో, ఆలాగున ఆయిన వారినిన్ని చేసు
5 ను. । ఇదిగాక నేను మీకు ఆజ్ఞాపించిన ఆజ్ఞలన్నిటి
ప్రకారముగా మీరు వారికి చేయ గలందులకు యె
హోవా వారిని మీ ముఖము యెదుట అప్పగించును.।
6 పౌరుషము వహించుకొని ధైర్యముగా వుండి, భయ
పడకనున్ను వారికి జడియకనున్ను వుండుము; యెం
దుకంటే నీకు తోడుగా వెళ్లేవాడు నీ దేవుడైన యె
హోవా అయి వున్నాడు; ఆయన నీ యెడల తప్పక
7 నున్ను నిన్ను విడువకనున్ను వుండునని చెప్పెను. । తరు
వాత మోషే యెహోషువను పిలిపించి, ఇశ్రాయేలం
దరున్ను చూస్తూ వుండగా అతనితో చెప్పినదేమంటే,
నీవు పౌరుషము వహించుకొని ధైర్యముగా వుండుము,
యెందుకంటే, నీవు యీ జనులయొక్క పితృలకు యె
హోవా యిచ్చుటకు ప్రమాణము చేసిన దేశములోకి
వారితో కూడా ప్రవేశించి, వారిని దానిని స్వతం
8 త్రించుకొనేటట్టు చేయ వలెను. । నీకు ముందుగా
వెళ్లేవాడు యెహోవాయై వున్నాడు; ఆయన నీకు
తోడై వుండి, నీ యెడల తప్పకనున్ను నిన్ను విడువక
నున్ను వుండును; భయపడకనున్ను వెరవకనున్ను వుం
9 డుమని చెప్పెను. । తరువాత మోషే యీ న్యాయ ప్ర
మాణమును వ్రాసి, యెహోవాయొక్క నిబంధనకె
గల పెట్టెను మోసేటటువంటి లేవీ పుత్రులైన అర్చ
కులకున్ను ఇశ్రాయేలు పెద్దలందరికిన్ని అప్పగించెను.।
10 మరిన్ని మోషే వారికి ఆజ్ఞాపించినదేమంటే, యేడో
సంవత్సరాంతమందు, అనగా, విడుదల సంవత్సరము
యొక్క నిర్ణయ కాలమందయ్యే డేరాల పండుగయం
11 దు, । ఇశ్రాయేలు యావత్తూ నీ దేవుడయిన యెహో
వా యెంచే స్థలమందు అగపడే నిమిత్తమై ఆయన
సముఖమునకు వచ్చినప్పుడు, నీవు ఇశ్రాయేలందరి యె
దుట యీ న్యాయప్రమాణమును చదివి వారికి విని
12 పించ వలెను. । యిందుకు పురుషులున్ను స్త్రీలున్ను
పిల్లలున్ను నీ ఆవరణలలోనున్న పరదేశియున్ను విని,
గ్రహించి, మీ దేవుడైన యెహోవాకు భయపడి,
యీ న్యాయప్రమాణముయొక్క వాక్యములన్నిటినీ
13 భద్రముగా చేసేటట్టుగానున్ను, । వారియొక్క తెలివి
లేని పిల్లలున్ను విని, మీరు యర్దేనును దాటి వెళ్లి
స్వతంత్రించుకొనే దేశమందు మీరు బ్రతికే దినముల
న్నిటి దాకా మీ దేవుడయిన యెహోవాకు భయ
పడ నేర్చుకొనేటట్టుగానున్ను, వారినందరినిన్ని
14 పోగుచేయుమని చెప్పెను. । అప్పుడు యెహోవా
మోషేకు ఆనతిచ్చినదేమంటే, యిదుగో నీకు మరణ
దినములు సన్నిహితమాయెను; కాబట్టి యెహోషు
వను పిలువనంపించు, నేను అతనికి ఆజ్ఞ యిచ్చేకొరకు
మీరు సంఘముయొక్క డేరా యందు అగుపడి వుండ
వలెనని సెలవు యిచ్చెను: ఆ ప్రకారము మోషేయు
న్ను యెహోషువయున్ను వెళ్లి, సంఘముయొక్క
డేరాలోకి వచ్చి, నిలిచి వుండిరి. । అప్పుడు యెహో 15
వా డేరాలో మేఘస్తంభమందు ప్రత్యక్షమాయెను;
మరిన్ని ఆ మేఘస్తంభము డేరా ద్వారము పయిని
నిలిచి వుండెను. । అప్పుడు యెహోవా మోషేకు 16
సెలవు యిచ్చినదేమంటే, యిదుగో నీవు నీ పితృలతో
కూడా నిద్రపోదువు; తరువాత యీ జనులు లేచి,
నివాసము చేయుటకు వారు వెళ్లే దేశమందున్న
అన్యులయొక్క దేవుండ్ల వెంబడిని వ్యభిచరించి, నన్ను
విడచి, నేను వారితో చేసిన నిబంధనను అతిక్ర
మింతురు. । అప్పుడు నా కోపము ఆ దినమందు వారి 17
మీద రగులుకొనును; నేను వారిని విడచిపెట్టి, నా
ముఖము వారికి మరుగు చేతును; వారు భక్షించ బడు
దురు; అనేకమయిన కీళ్లున్ను శ్రమలున్ను వారికి ప్రా
ప్తించును; అందువల్ల ఆ దినమందు వారు మన దేవుడు
మనలోగా లేనందున యీ కీళ్లు మనకు ప్రాప్తించెను
గదా అని అనుకొందురు. । యేమంటే వారు వేరైన 18
దేవుండ్ల తట్టు తిరిగినందువల్ల వారు చేసిన దుష్క్రియల
అంతటి నిమిత్తమూ నేను ఆ దినమందు నా ముఖము
వారికి మరుగుగా చేతును. । కాబట్టి యీ పాటను 19
మీరు వ్రాసుకొని, ఇశ్రాయేలు పుత్రులకు నేర్పండి;
యీ పాట నా పక్షమందు ఇశ్రాయేలు పుత్రుల మీద
సాక్షి అయ్యేటట్టుగా వారి నోటను దానిని వుంచండి.।
యెందుకంటే వారి పితృలకు నేను ప్రమాణము చేసిన 20
టువంటిన్ని, పాలతోనున్ను తేనెతోనున్ను ప్రవహిం
చేటటువంటిన్ని దేశములోకి వారిని తీసుక వచ్చిన
తరువాత, వారు తిని, తృప్తిపొంది, మదించినప్పుడు,
వారు వేరైన దేవుండ్ల తట్టు తిరిగి, వారిని సేవించి, నాకు
కోపము కలుగచేసి, నా నిబంధనను అతిక్రమింతు
రు. ।అందుకు అనేకమయిన కీళ్లున్ను శ్రమలున్ను వారికి 21
ప్రాప్తించినప్పుడు సంభవించేదేమంటే, యీ పాట
వారి మీద సాక్షిగా సాక్ష్యము పలుకును; యేమంటే,
ఆ పాట వారి సంతతి నోట వుండి మరువపడక వుండు
ను: యెందుకంటే యిప్పుడే, అనగా నేను ప్రమాణము
చేసిన దేశములోకి వారిని తీసుక రాక మునుపే వారు
చేసుకొనే యోజన యేదో అది నేను యెరుగుదునని
సెలవు యిచ్చెను. । కాబట్టి మోషే యీ పాటను ఆ 22
దినమందు వ్రాసి, ఇశ్రాయేలు పుత్రులకు నేర్పెను. ।
అంతట ఆయన నూను కుమారుడయిన యెహోషువకు 23
ఆజ్ఞ యిచ్చి చెప్పినదేమంటే, నీవు పౌరుషము వహిం
చుకొని ధైర్యముగా వుండుము; యెందుకంటే, నేను
ఇశ్రాయేలు పుత్రులకు ప్రమాణము చేసిన దేశములోకి
నీవు వారిని తీసుక వత్తువు; మరిన్ని నేను నీకు తోడు

24 గా వుంటానని ఆనతిచ్చెను. । మోషే యీ న్యాయప్ర
మాణముయొక్క వాక్యములను యావత్తూ ముగించడ
మయ్యే మట్టుకు గ్రంథమందు వ్రాయుట సమాప్తమ
25 యిన తరువాత సంభవించినదేమంటే, । మోషే యె
హెూవావాయొక్క వుడంబడికె గల పెట్టెను మోసేట
26 టువంటి లేవీయులకు ఆజ్ఞాపించినదేమంటే, । యీ
న్యాయప్రమాణమయిన గ్రంథమును పుచ్చుకొని, అది
మీ మీద సాక్షి అయ్యేటట్టుగా దానిని మీ దేవుడ
యిన యెహెూవావాయొక్క వుడంబడికె గల పెట్టె
27 యొక్క పక్కలో వుంచుకోండి. । యెందుకంటే నీ
తిరుగుబాటునున్ను నీ వంగని మెడనున్ను నేను యెరు
గుదును; యిదుగో నేను సజీవుడనై మీయొద్ద వున్న
యీ దినమందునే మీరు యెహెూవావాకు విరోధము
గా తిరుగుబడిన వారైతిరి; నేను మరణమైన తరువాత
28 మరి యెంత చేతురో?। కాబట్టి మీ గోత్రములలో
వున్న పెద్దలకున్ను మీ అధికారులకున్ను యీ మాట
లను నేను వినిపించి, ఆకాశమునున్ను భూమినిన్ని
వారి మీద సాక్షులుగా చేయ గలందులకు వారిని కూ
29 డ్చుకోండి.। యెందుకంటే నేను మరణమైన తరు
వాత మిమ్మును మీరు చెరుపుకొని, నేను మీకు ఆజ్ఞా
పించిన మార్గమునుంచి తప్పి పోదురని నేను యెరు
గుదును: మీరు యెహెూవా దృష్టియెదుట మీ హస్త
కృత్యములవల్ల చెడ్డతనము చేసి, ఆయనకు కోపము
కలుగ చేతురు, గనుక, తదనంతరమైన దినములందు కీడు
30 మీకు సంభవించునని చెప్పెను.। అప్పుడు మోషే యీ
పాటయొక్క వాక్యములు ముగించడమయ్యే మట్టుకూ
వాటిని ఇశ్రాయేలు సంఘము యావత్తుతోను చెప్పెను.

## 32. అధ్యాయము.

1 ఓ ఆకాశములారా, చెవి యొగ్గండి, అప్పుడు నేను
మాట్లాడుదును; ఓ భూమీ, నా నోటి మాటలను
2 వినుము. । నా బోధ వర్షములాగున ప్రవించును;
మంచులాగుననున్ను లేతకూర మీది చినుకులాగునను
న్ను గడ్డిమీద కురిసిన వర్షములాగుననున్ను రాలును.।
3 యెందుకంటే నేను యెహెూవావాయొక్క నామమును
ప్రకటన చేతును; మన దేవునికి మహత్తును చెల్లించండి,।
4 ఆయన శిలా పర్వతమై వున్నాడు; ఆయన కార్యము
పరిపూర్ణమై యున్నది; యెందుకంటే, ఆయనయొక్క
మార్గములన్నీ న్యాయమవును: సత్యము గల దేవుడై,
అక్రమ రహితుడై, న్యాయమున్ను నీతిన్ని గలవాడై
5 వున్నాడు. । వారు తమ్ము తాము చెరుపుకొని యున్నా
రు; వారు ఆయనయొక్క పిల్లలు కాకపోయిరి, అది
వారికి డాగు; వారు ముష్కరమున్ను వంకరయునైన్న
6 తరము. । అవివేకమున్ను అజ్ఞానమున్ను గల ఓ జను
లారా, మీరు యీలాగున యెహెూవావాకు ప్రతికా
రము చేతురా? ఆయన నిన్ను కొనిన నీ తండ్రి అయి
వున్నాడు కాడా? ఆయన నిన్ను కలుగ చేసి స్థిరపరచి
వున్నాడు కాడా? । పూర్వదినములను జ్ఞాపకము చేసు 7
కొనుము; అనేకమయిన తరములయొక్క సంవత్సరము
లను తలంచుకొనుము: నీ తండ్రిని అడుగుము, అతడు
నీకు అగుపర్చును; నీ పెద్దలనున్ను వారు నీకు తెలి
య చెప్పుదురు. । మహోన్నతుడైన వాడు జనాంగ 8
ములకు వారివారి స్వాస్థ్యములను విభాగించినప్పుడు
న్ను, ఆదాముయొక్క పుత్రులను విభజన చేసినప్పు
డున్ను, ఇశ్రాయేలు పుత్రుల లెక్క చొప్పున జను
లకు సరిహద్దులను నిర్ణయించెను. । యెందుకంటే 9
యెహెూవావాయొక్క భాగము ఆయన జనమై వున్నది;
యాకోబు ఆయన స్వాస్థ్యముయొక్క పాలయి వున్నా
డు. । అరణ్య దేశమందున్ను, పట్టిదిన్ని ఘోషము గల 10
దిన్నైన అడవి యందున్ను ఆయన అతనిని కనుకొని,
అతనిని తిప్పుటబెట్టి, అతనికి బుద్ధి చెప్పి, తన కను గుడ్డు
వలెనే అతనిని కాపాడెను. । పక్షిరాజు తన గూడును 11
కదలించి, తన పిల్లలను పొదుగుతూ, తన రెక్కలను
చాపి, వాటిని పట్టి, తన రెక్కల పయిని యేలాగున మో
సునో, । ఆలాగున యెహెూవా అతనిని యొంటిగా 12
తోడుకొని వచ్చెను; అతనికి అన్యమైన దేవుడు లేక
వుండెను. । అతడు పొలముల పంటను తినగలందులకు 13
ఆయన అతనిని భూమియొక్క వున్నత స్థలముల మీ
దికి యెక్కేటట్టు చేసెను; మరిన్ని ఆయన అతన్ని
శిలా పర్వతములోనుంచి తేనెనున్ను అగ్గిరాతి కొండ
లోనుంచి తైలమునున్ను పీల్చ చేసెను. । ఆవు వెన్న 14
యున్ను, గొర్రెపాలున్ను, గొర్రెపిల్లయొక్క కొవ్వు
న్ను, బాషాను దేశపు పొట్టేళ్లున్ను, మేకలున్ను, గుం
డెకాయల కొవ్వువంటి కొవ్వు గల గోధుమలున్ను
నీకు ఆహారము అయి వుండెను; మరిన్ని ద్రాక్షా ఫల
ముయొక్క స్వచ్ఛమైన రక్తమును నీవు పానము చేసి
తివి. । అయితే యెషురూను మదించి తన్నెను; నీవు 15
మదించి వున్నావు; నీవు బలసి కొవ్వుచేత కప్ప
బడి వున్నావు; అప్పుడు అతడు తన్ను కలుగచేసిన
దేవుని విడచి, తన రక్షణయొక్క శిలా పర్వతమును
నిర్లక్ష్యము చేసెను. । వారు యితరమైన దేవుండ్లచేత 16
ఆయనకు అసూయను కలుగ చేసి, అసహ్యతలవల్ల
ఆయనకు కోపమును కలుగ చేసిరి. । వారు దయ్యము 17
లకు బలుల చెల్లించిరి గాని దేవునికి కాదు; తమరు
తెలియని దేవుండ్లకు, అనగా, మీ పితృలు భయపడ
నటువంటిన్ని నూతనముగా లేచినటువంటిన్ని కొత్త
దేవుండ్లకు చెల్లించిరి. । నిన్ను పుట్టించిన శిలా పర్వత 18
మును గురించి నీవు జ్ఞాపకము చేసుకోకనున్నావు;

19 నిన్ను రూపించిన దేవుని నీవు మరచి పోతివి. । యె
హోవా అది చూచినప్పుడు తన కుమారులున్ను
కుమార్తెలున్ను తనను విసికించిరి గనుక వారిని తృణీ
20 కరించెను. । మరిన్ని ఆయన అనుకొనినదేమంటే, నా
ముఖమును నేను వారికి మరుగుగా చేతును; వారి
అంతమేదో అది చూతును, యెందుకంటే, వారు వికట
మైన తరమై, విశ్వాసహీనులైన పిల్లలై వున్నారు. ।
21 దేవుడు కానటువంటి దానిచేత వారు నాకు అసూ
యను పుట్టించిరి; వారియొక్క వ్యర్థమైన వాటిచేత
నాకు కోపమును కలుగచేసిరి; అయినందున నేను
జనము కానటువంటి వారిచేత వీరికి అసూయను
కలుగ చేతును; అవివేకమైన జనాంగమువల్లను వారికి
22 కోపము కలుగ చేతును. । యెందుకంటే నా కోపము
చేత అగ్ని రగులుకొని, అది పాతాళము కింది మట్టుకు
కాలి, భూమిని దాని పంటతోను దహించి పర్వత
23 ములయొక్క పునాదులను మండిపో చేసును. । వారి
మీదను నేను కీడుల కుప్ప వేతును; నా బాణము
24 లను వారి మీద ప్రయోగింతును. । కరువుచేత వారు
దహించబడి, కణకణలాడే నిప్పులచేతనున్ను చేదైన
నాశనము చేతనున్ను భక్షించ బడుదురు; మరిన్ని
మృగములయొక్క కోరలనున్ను మంటిలోనున్న సర్ప
25 విషమునున్ను వారి మీదికి పంపుదును. । బైట కత్తిన్ని,
లోపల బెంగయున్ను, పడుచువానినిన్ని, కన్యకను
న్ను, పసిపిల్లనున్ను, నెరసిన వెంట్రుకలు గల వాని
26 నిన్ని హతము చేసును. । మూల మూలలకు వారిని
చెదర చేతును; వారి జ్ఞాపకము మనుష్యులలోనుంచి
27 చాలించేటట్టు చేతునని అనుకొంటిని, గాని, । వారి
యొక్క విరోధులు యిదియంతా యెహోవా చేసి
నది కాదు, మన వున్నతమైన హస్తమే చేసెనని పొర
పాటు బడి యెక్కడ చెప్పుదురో అని నేను శత్రు
28 వుని కోపము కొరకు జడిసి వుంటిని. । యెందుకంటే
వారు ఆలోచనహీనమైన జనులు; వారి యందు వివే
29 కము లేదు. । వారు జ్ఞానులై, దీనిని గ్రహించి, తమ
30 అంతమును యోజించుకొంటే యెంతో మేలు! । వారి
శిలా పర్వతము వారిని అమ్మివేసి, యెహోవా వా
రిని అప్పగించి వుంటేనేగాని, వొకడు వెయిమందిని
యేలాగు తరుమును, యిద్దరు పదివేలమందిని యేలాగు
31 పలాయనము చేతురు! । యెందుకంటే వారి శిలా
పర్వతము మన శిలా పర్వతము వంటిది కాదు, యిం
32 దుకు మన శత్రువులే తీర్పరులు. । వారి ద్రాక్షచెట్టు
సొదొమ ద్రాక్షచెట్టు వంటిదైయున్ని, గొమొర్రా
యొక్క పొలములదైయున్ని యున్నది; వారి ద్రాక్ష
పండ్లు విషపు పండ్లయి, వారి గెలలు చేదువై యు
33 న్నవి. । వారి ద్రాక్షారసము ఘటసర్పములయొక్క
విషమున్ను, మిడినాగుయొక్క గరళమున్ను అయి
వున్నది. । యిది నా యొద్ద వుంచబడి, నా పదార్థ 34
ములలో ముద్రించబడి వుండలేదా! । ప్రతి దండన 35
చేసుటయున్ను ప్రతి ఫలప్రాప్తి చేసుటయున్ను
నాదై యున్నది; సమయము వచ్చినప్పుడు వారి పా
దము జారును; యెందుకంటే వారి ఆపద్దినము సమీ
పించి వున్నది; వారి మీదికి వచ్చేవి త్వరపడుతున్నవి. ।
యెందుకంటే యెహోవా తన జనులకు న్యాయ 36
మును విధించును; అయితే వారి బలము పోయెననిన్ని,
బంధించబడిన వాడయినా విడిపించబడిన వాడయినా
వొకడున్ను లేడనిన్ని ఆయన చూచినప్పుడు, ఆయన
తన జనులకొరకు మనస్తాపము పొందును. । మరిన్ని 37
ఆయన అనుకొనేదేమంటే, వారి బలులయొక్క కొ
వ్వును తినినటువంటిన్ని, । వారి పానార్పణలయొక్క 38
ద్రాక్షారసమును తాగినటువంటి వారి దేవుండ్లున్ను,
వారు నమ్మిన శిలా పర్వతమున్ను యెక్కడ? వారే
లేచి మీకు సహాయముచేసి, మీకు అడ్డ మవుదురు
గాక. । నేనే ఆయన; నాతో యే దేవుడూ లేడని 39
చూడండి: నేను సంహరించి బ్రతికించే వాడను;
నేను గాయములను పొందించి స్వస్థపరచే వాడను;
నా చేతిలోనుంచి విడిపించ గలవాడు వొకడున్ను
లేడు. । యెందుకంటే నా హస్తమును నేను పరలోక 40
ముతట్టు యెత్తి, నేను యెన్నటికిన్ని జీవించే వాడనని
చెప్పుతున్నాను. । తళతళలాడే నా ఖడ్గమును నేను 41
నూరి, నా చెయ్యి న్యాయ విధింపును పట్టితే, నా
శత్రువులకు ప్రతి దండన చేసి, నాయందు పగగా
వున్న వారికి ప్రతి ఫలమును యిత్తును. । రక్తముచేత 42
నా బాణములు మత్తతను పొందేటట్టు చేతును; నా
ఖడ్గము హతులయినటువంటిన్ని చెరపడినటువంటిన్ని
వారి రక్తము, అనగా, శత్రు ప్రభువుల శిరస్సులలో
నుంచి వచ్చిన రక్తముతో మాంసమును భక్షించును. ।
వో జనాంగములారా, మీరు ఆయన జనులతోను 43
సంతోషించండి; యెందుకంటే, ఆయన తన సేవకుల
రక్తము కొరకు ప్రతి దండన చేసి, తన విరోధులకు
ప్రతి ఫలప్రాప్తి కలుగ చేసి, తన దేశమందున్ను
తన జనమందున్ను కనికరించును అని చెప్పెను. । యీ 44
లాగున మోషేయున్ను నూను కుమారుడైన యెహో
షువయున్ను వచ్చి, యీ పాటయొక్క వాక్యములన్ని
టినీ జనులందరికీ చెప్పి వినుపించిరి. । మోషే యీ వా 45
క్యములన్నిన్ని ఇశ్రాయేలు వారందరితో చెప్పుట
ముగించిన తరువాత, వారిని చూచి చెప్పినదేమంటే, ।
యీ దినమందు నేను మీతో రూఢముగా చెప్పిన 46
మాటలన్నిటి యందూ మీ హృదయములను వుంచండి;
వాటిని అనగా యీ న్యాయ ప్రమాణముయొక్క

వాక్యములన్నిటిని మీ పిల్లలు గైకొని చేయడానకు
47 ఆజ్ఞాపింతురుగాక.। యెందుకంటే అది మీకు వ్యర్థ
మైన సంగతికాదు, అది మీయొక్క జీవము: మరిన్ని
దీనివల్ల మీరు యర్దేనును దాటి స్వతంత్రించుక
బోయే దేశమందు మీ దినములను మీరు విస్తరింప
48 చేతురని చెప్పెను.। అంతట ఆ దినమందే యెహోవా
49 నా మోషేకు సెలవు యిచ్చినదేమంటే,। యెరిఖో పట్ట
ణము యెదుట మోయాబు దేశమందున్న యీ అబా
రీము పర్వత సంబంధమయిన నెబో అనే కొండను
నీవు యెక్కి, ఇశ్రాయేలు పుత్రులకు స్వాతంత్ర్య
ముగా నేను యిచ్చే కెనయను దేశమును చూడుము.।
50 నీ సహోదరుడయిన అహరోను హోరుకొండ
మీద మరణమై తన జనుల యొద్దికి చేర్చబడినట్టు,
నీవు యెక్కబోయే కొండమీద నీవున్ను మరణమై
51 నీ జనుల యొద్దికి చేర్చబడ వలెను.। యెందుకంటే
మీరిద్దరున్ను సీను అరణ్యమందు మెరీబాకాదేషు
వుదకము దగ్గిర ఇశ్రాయేలు పుత్రులలో నా విష
యమై తప్పితము చేస్తిరి; ఇశ్రాయేలు పుత్రుల మధ్య
52 మందు నన్ను పరిశుద్ధ పరచక పోతిరి.। అయినప్పటి
కిన్ని నీ ముందర వున్న ఆ దేశమును నీవు చూతువు
గాని, నేను ఇశ్రాయేలు పుత్రులకు యిచ్చే ఆ దేశ
ములోకి ప్రవేశించక పోదువని సెలవు యిచ్చెను.

## 33. అధ్యాయము.

1 అయితే దేవ జనుడైన మోషే తాను మరణము
కాక మునుపు, ఇశ్రాయేలు పుత్రులను ఆశీర్వదించిన
2 ఆశీర్వాదము యిదే,। అది యేదంటే, యెహోవా
సీనైనుంచి వచ్చి శెయీరునుంచి వారి విషయమై ఉద
యించెను; పారాను కొండనుంచి ఆయన ప్రకాశించి,
పరిశుద్ధులయిన పదివేలమందితోను వచ్చెను: ఆయన
కుడిచేతిలోనుంచి అగ్ని న్యాయ ప్రమాణము వారి
3 కొరకు బైలు వెళ్లెను.। నిజముగా ఆయన జనులను
స్నేహించెను; ఆయన పరిశుద్ధులందరున్ను నీ చేతికిందనే
వున్నారు; వారు నీ పాదముల దగ్గిర కూర్చుని, నీ
4 వాక్యములను అంగీకరింతురు.। మోషే మనకు యా
కోబు సంఘముయొక్క స్వాస్థ్యమై యున్న యొక
5 న్యాయప్రమాణమును ఆజ్ఞాపించెను.। జనులయొక్క
అధిపతులున్ను ఇశ్రాయేలు గోత్రికులున్ను కూడిన
కాలమందు అతడు యెషురూనులో రాజై వుండెను.।
6 రూబేను మృతిబొందక జీవించును గాక; అతని మను
7 ష్యులు కొంచెము కాకపోదురు గాక.। మరిన్ని యూ
దాను గురించి అతడు చెప్పినదేమంటే, ఓ యెహో
వా యూదాయొక్క శబ్దమును విని అతని జనుల
యొద్దికి అతని తీసుక రమ్ము; అతని చేతులు అతనికి
చాలియుండేటట్టు చేసి, అతని శత్రువులలోనుంచి
నీవు అతనికి సహాయుడవై యుందువు గాక.। మరిన్ని 8
లేవీని గురించి అతడు చెప్పినదేమంటే: నీయొక్క
తుమ్మీమున్ను ఊరీమున్ను నీ పరిశుద్ధుడైన వాని వశ
మవును గాక: నీవు అతని మశ్శాలో పరిశోధించితివి,
మెరీబా వుదకము దగ్గిర నీవు అతనితో పోరాడితివి.।
నేను అతని చూడలేదని అతడు తన తండ్రితోనున్ను 9
తన తల్లితోనున్ను చెప్పెను; అతడు తన సహోదరు
లను గురించి యెరుగనని చెప్పి తన పిల్లలను తెలియక
వుండెను; యెందుకంటే వారు నీ వాక్యమును భద్రము
చేసి నీ నిబంధనను గైకొని వున్నారు.।వారు నీ విధు 10
లను యాకోబుకున్ను నీ న్యాయప్రమాణమును ఇశ్రా
యేలుకున్ను వుపదేశింతురు: వారు నీ సముఖమందు
ధూపమునున్ను నీ బలిపీఠము మీద సర్వాంగ దహన
బలినిన్ని పెట్టుదురు.। ఓ యెహోవా, అతని కలి 11
మిని ఆశీర్వదించి అతని హస్తకృత్యమును అంగీకరిం
చుము; అతని మీదికి లేచిన వారియొక్కనున్ను
అతని యందు పగ వుంచే వారియొక్కనున్ను నడు
ములను వారు తిరిగీ లేవకుండేటట్టుగా కొట్టివేయు
ము.। మరిన్ని బెన్యామీనును గురించి అతడు చెప్పిన 12
దేమంటే యెహోవాకు ప్రియమైనవాడు ఆయన
యొద్ద నిర్భయముగా నివాసము చేసును. దినమం
తా ఆయన అతనిని కప్పుకొని అతని సరిహద్దుల
నడుమను నివాసము చేసును.। మరిన్ని యోసేపును 13
గురించి అతడు చెప్పినదేమంటే, ఆకాశముయొక్క
ప్రియమైన వాటిచేతనున్ను, మంచుచేతనున్ను, కింద
దకు కుంగి వుండే అగాధము చేతనున్ను,। సూర్యుని 14
వల్ల పుట్టిన ప్రియమైన పంటచేతనున్ను, చంద్రునివల్ల
పుట్టినటువంటి ప్రియమైన వాటిచేతనున్ను,। పురాతన 15
పర్వతములయొక్క అతిశయ వస్తువుల చేతనున్ను,
సదా వుండే కొండలయొక్క ప్రియమైన వస్తువుల
చేతనున్ను,। భూమి యందుండే ప్రియమైన వస్తువుల 16
చేతనున్ను దాని పరిపూర్ణత చేతనున్ను, పొదలో
వుండిన ఆయనయొక్క కరుణచేతనున్ను, అతని దేశ
ము యెహోవావల్ల ఆశీర్వాదము పొందును గాక:
యోసేపుయొక్క తలమీద, అనగా తన సహోదరు
లలోనుంచి కేటించబడిన అతని నడినెత్తి మీదికి ఆశీ
ర్వాదము వచ్చి వుండును గాక.। అతని మహిమ 17
అతని గోవుయొక్క తొలిచూలు వంటిదై వున్నది;
అతని కొమ్ములు ఖడ్గ మృగముయొక్క కొమ్ములవంటివై
యున్నవి; వీటిచేత అతడు జనులను పొడచి, వారిని
భూమియొక్క కడకు వెళ్ల వేసును: యివి ఎఫ్రాయీము
యొక్క పదివేలమందిన్ని మనస్సేయొక్క వేలమందిన్ని
అయి వున్నవి.। మరిన్ని జబూలోనును గురించి అతడు 18

చెప్పినదేమంటే, ఓ జబూలోనూ, నీ బైలుదేరుట
యందున్ను, ఓ ఇశ్శాఖారూ, నీ డేరాల యందున్ను
19 సంతోషించండి. । వీరు జనులను కొండమీదికి పిలుచు
కొని పోదురు; అక్కడ నీతి బలులను చెల్లింతురు;
యెందుకంటే, వారు సముద్రముయొక్క పరిపూ
ర్ణతవల్లనున్ను యిసుకయందు దాగివున్న ధనమువల్ల
20 నున్ను పీల్చే వారవుదురు. । మరిన్ని గాదును గురించి
అతడు చెప్పినదేమంటే, గాదును విస్తరింప చేసేవాడు
స్తుతించబడును గాక; సింహములాగున అతడు నివా
సము చేసి హస్తమును నడుదలతో చీల్చి వేసును. ।
21 తనకు తాను ప్రధాన భాగమును యెంచుకొనెను, కా
బట్టి అక్కడ న్యాయకర్త గదవల్ల అతనికి నివాసము
కలిగెను; అయినందున అతడు జనులయొక్క ప్రధాన
శిరస్కులతోను వచ్చి, యెహోవాయొక్క న్యాయ
మునున్ను విధింపునున్ను ఇశ్రాయేలుతో కూడా చేసె
22 ను. । మరిన్ని దానును గురించి అతడు చెప్పినదేమంటే,
దాను పడుచు సింహమై యున్నాడు; అతడు భాషా
23 నులోనుంచి దాటును. । నఫ్తాలీని గురించి అతడు చెప్పి
నదేమంటే, దయవల్ల సంతుష్టుడవున్ను యెహోవా
యొక్క ఆశీర్వాదముచేత పూర్ణుడవున్ను అయిన ఓ
నఫ్తాలీ, పశ్చిమ దిక్కునున్ను దక్షిణ దిక్కునున్ను స్వతం
24 త్రించుకొమ్ము. । మరిన్ని ఆషేరును గురించి అతడు
చెప్పినదేమంటే, ఆషేరు పిల్లలచేత ఆశీర్వదించ బడును
గాక; తన సహోదరులకు అనుకూలుడై, తన పాదము
25 తైలములో ముంచుకొనును గాక. । నీ పాదరక్షల కింద
యినుమున్ను యిత్తడిన్ని కలిగి వుండును; నీ దినముల
26 ప్రకారము నీ శక్తి వుండును. । యెషురూనుయొక్క
దేవునికి సమమయిన వాడు ఒకడూ లేడు; ఆయన
ఆకాశము మీదనున్ను తన మాహాత్మ్యముచేత వాయువు
మీదనున్ను నీ సహాయము కొరకు రౌతై వున్నాడు. ।
27 అనంత దేవుడు నీయొక్క ఆశ్రయమయి యున్నాడు,
నీ కింద నిరంతరమైన హస్తములు వుంటూ వుండును;
ఆయన నీ ముందరనుంచి శత్రువును తోలివేసి వారిని
28 నశింప చేయండని సెలవు యిచ్చెను. । అప్పుడు ఇశ్రా
యేలు ఒంటిగానున్ను నిర్భయముగానున్ను నివా
సము చేసును; యాకోబుయొక్క వూట ధాన్యమున్ను
ద్రాక్షారసమున్ను గల దేశము మీద వుండును; మరిన్ని
అతని పైనున్న ఆకాశములు మంచును రాలచేసును. ।
29 ఓ ఇశ్రాయేలా, నీవు భాగ్యవంతుడవై వున్నావు:
నీ సహాయముయొక్క డాలున్ను నీ మహిమయొక్క
ఖడ్గమున్ను అయినటువంటి యెహోవా వల్ల రక్షించ
బడ్డ ఓ జనమా, నీ వలెనున్న వారు యెవ్వరు! నీ
శత్రువులు నీకు అబద్ధికులుగా కనుబడుదురు; నీవు
వారి వున్నతమయిన స్థలములను తొక్కుదువని చెప్పెను.

## 34. అధ్యాయము.

తరువాత మోషే మోయాబు మైదానములనుంచి 1
బయిలు వెళ్లి, యెరిఖో యెదుట నెబో కొండకు వచ్చి,
పిస్గా శిఖరము మీదికి యెక్కెను: అప్పుడు యెహో
వా దాను మట్టుకు గిలాదు దేశమంతటినిన్ని, । నఫ్తాలీ 2
దేశమంతటినిన్ని, ఎఫ్రయీము దేశమంతటినిన్ని, మన
స్సే దేశమంతటినిన్ని, అవతల సముద్రము మట్టుకు
యూదా దేశమంతటినిన్ని, । దక్షిణ దేశమంతటినిన్ని, 3
ఖర్జూరపు చెట్లుగల యెరిఖో పట్టణపు లోవయొక్క
మైదానమునున్ను సోయరు మట్టుకున్ను అతనికి చూ
పించెను. । అప్పుడు యెహోవా అతనితో చెప్పినదే 4
మంటే, యిది నీ సంతతికి యిస్తానని అబ్రాహాము
కున్ను ఇస్సాకుకున్ను యాకోబుకున్ను ప్రమాణ పూర్వ
కముగా చెప్పిన దేశము యిదే: నీ నేత్రములకు నేను
దానిని అగుపరిస్తిని అయితే నీవు అక్కడికి దాటి
వెళ్లకూడదని ఆనతిచ్చెను. । అయినందున యెహో 5
వాకు సేవకుడయిన మోషే అక్కడ యెహోవా
యొక్క వాక్యప్రకారము మోయాబు దేశమందు మర
ణమాయెను. । మరిన్ని ఆయన అతని బేత్పెయోరు 6
యెదుట మోయాబు దేశమందున్న లోవలో పాతి
పెట్టెను: అయితే అతని సమాధి యెక్కడ వున్నదో
అది నేటివరకు యెవరికీ తెలియదు. । మోషే మరణ 7
మైనప్పుడు నూట యిరువై సంవత్సరములు గలవాడై
వుండెను: అతని కన్ను మంద దృష్టి లేనిదై యుండెను,
అతని శక్తి తరగక వుండెను. । ఇశ్రాయేలు పుత్రులు 8
మోషే నిమిత్తము మోయాబు మైదానములందు ముప్పై
దినముల మట్టుకు యేడ్చిరి: యీలాగున మోషే నిమి
త్తము యేడ్చి మూల్గిన దినములు సమాప్తమాయెను. ।
అయితే నూను కుమారుడయిన యెహోషువ జ్ఞానము 9
గల ఆత్మతోను నిండై వుండెను; యెందుకంటే, మోషే
తన చేతులను అతనిమీద వుంచి వుండెను: ఇశ్రాయేలు
పుత్రులు అతడు చెప్పిన దానిని విని యెహోవా
మోషేకు ఆజ్ఞాపించినట్టు చేసిరి. । అప్పటినుంచి ఇశ్రా 10
యేలులో మోషే వంటి దీర్ఘదర్శి కలుగ లేదు; యె
హోవా అతని ముఖాముఖిగా యెరిగి వుండెను. ।
మరిన్ని యెహోవా అతని పంపినందుచేత మిస్రయీ 11
ము దేశమందు ఫరోకున్ను అతని సేవకులందరికిన్ని
అతని దేశమంతటికిన్ని యే గురుతులనున్ను ఆశ్చర్య
ములనున్ను చేసెనో వాటిచేతనున్ను, । ఇశ్రాయేలం 12
దరి దృష్టి యెదుట మోషే అగుపరచిన బలహస్తము
చేతనున్ను మహా భీకరత్వము చేతనున్ను అతడు ఘన
మైన దీర్ఘదర్శియై వుండెను.

# యెహోషువయొక్క గ్రంథము.

## 1. అధ్యాయము.

1 యెహోవాయొక్క సేవకుడైన మోషే మరణ
మైన తరువాత సంభవించినదేమంటే, నూనుయొక్క
కుమారుడున్ను మోషేయొక్క పరిచారకుడున్ను అయిన
యెహోషువకు యెహోవా సెలవు యిచ్చినదేమం
2 టే, । నా సేవకుడయిన మోషే మరణమాయెను, కాబట్టి
నీవు లేచి నీవున్ను యీ జనులందరున్ను యీ యర్దే
నును దాటి, ఇశ్రాయేలు పుత్రులయిన వారికి నేను
3 యిచ్చే దేశమునకు వెళ్లండి. । మీ అరికాలు మట్టే
ప్రతి స్థలమును నేను మోషేతో చెప్పినట్టు మీకు
4 యిచ్చి వున్నాను. । యీ అరణ్యమున్ను యీ లెబానో
నున్ను మొదలుకొని ఫెరాతు అనే పెద్ద నది మట్టు
కున్న దేశమున్ను, హిత్తీయుల దేశమున్ను అస్తాద్రి
తట్టు గొప్ప సముద్రము మట్టుకున్న దేశమున్ను మీకు
5 సరిహద్దు అవును. । నీవు బ్రతికే దినములన్నిటిదాకా
నీ ముందర నిలువ గల వాడు వొకడూ లేక పోవును:
నేను యేలాగున మోషేతో వుంటినో ఆలాగున నేను
నీతోనున్ను వుంటాను; నీ యెడల తప్పకనున్ను నిన్ను
6 విడువకనున్ను వుంటాను. । నీవు పౌరుషము వహించు
కొని ధైర్యముగా వుండుము, యెందుకంటే, నేను
వారి పితృలకు యిచ్చుటకు ప్రమాణము చేసిన దేశ
మును నీవు యీ జనులకు స్వాతంత్ర్యముగా పంచి
7 పెట్టుదువు. । కాబట్టి నా సేవకుడైన మోషే నీకు ఆజ్ఞా
పించిన న్యాయప్రమాణమంతటి ప్రకారము నీవు
గైకొని చేసేకొరకు పౌరుషము వహించుకొని మిక్కిలీ
ధైర్యముగా వుండుము: యెక్కడికి నీవు వెళ్లుదువో
అక్కడ నీవు సుబుద్ధిగా ప్రవర్తించ గలందులకు
దానినుంచి కుడీ తట్టయినా యెడమ తట్టయినా తిరు
8 గకుండా వుందువు గాక. । న్యాయప్రమాణమయిన
యీ గ్రంథము నీ నోటిలోనుంచి తప్పిపోకూడదు;
దాని యందు వ్రాయబడ్డ అంతటి ప్రకారము నీవు
గైకొని చేయ గలందులకు దివారాత్రములు దానిని
ధ్యానించ వలెను, యెందుకంటే, అప్పుడు నీవు సుబు
9 ద్ధిగా ప్రవర్తించినందున నీకు జయమవును. । నీకు
నేనే ఆజ్ఞాపించి వున్నాను కానా? కాబట్టి పౌరుషము
వహించుకొని; ధైర్యముగా వుండి, భయపడకనున్ను
జడియకనున్ను వుండుము; యెందుకంటే యెక్కడికి
నీవు వెళ్లుదువో అక్కడ నీ దేవుడైన యెహోవా
నీకు తోడుగా వుండునని సెలవు యిచ్చెను. । అప్పుడు 10
యెహోషువ జనులయొక్క అధికారులకు ఆజ్ఞాపిం
చినదేమంటే, । మీరు పేటలోబడి వెళ్లుతూ జనులను 11
చూచి ఆజ్ఞాపించ వలసినదేమంటే, మీ కొరకు మీరు
భోజనమును సిద్ధపర్చుకొండి, యెందుకంటే, యిక
మూడు దినములైనప్పుడు మీరు యీ యర్దేనును
దాటి, మీ దేవుడైన యెహోవా మీకు స్వాతంత్ర్య
ముగా యిచ్చే దేశమును స్వతంత్రించుకోవడానకు
వెళ్లుదురని చెప్పండని చెప్పెను. । మరిన్ని రూబేనీయు 12
లకున్ను గాదీయులకున్ను మనస్సే గోత్రములో సగము
మందికిన్ని యెహోషువ చెప్పినదేమంటే, । యెహో 13
వాయొక్క సేవకుడైన మోషే మీకు ఆజ్ఞాపించిన మాట
లను తలంచుకొండి, యేమంటే, మీ దేవుడయిన యె
హోవా మీకు నెమ్మది యిచ్చి యీ దేశమును మీకు
యిచ్చి వున్నాడు. । మీ భార్యలున్ను మీ చిన్నవాం 14
డ్లున్ను మీ పశువులున్ను యర్దేను యివతల మోషే
నీకు యిచ్చిన దేశమందు వుండవలెను; అయితే మీలో
ప్రతాపముగల బలాఢ్యులందరున్ను మీ సహోద
రుల ముందర యుద్ధసన్నద్ధులై దాటి, । యెహోవా 15
మీకు కలుగచేసినట్టు మీ సహోదరులకు నెమ్మది
యిచ్చే పర్యంతమున్ను మీ దేవుడయిన యెహోవా
వారికి యిచ్చే దేశమును వారు స్వతంత్రించుకొనే
పర్యంతమున్ను వారికి సహాయము చేతురుగాక: అప్పు
డు మీరు తిరిగీ సూర్యోదయము తట్టు యర్దేను యివ
తల యెహోవాయొక్క సేవకుడయిన మోషే మీకు
యిచ్చిన మీ స్వాతంత్ర్యమయిన దేశమునకు వచ్చి
దానిని అనుభవించ వలెనని చెప్పెను. । అప్పుడు వారు 16
యెహోషువకు ప్రత్యుత్తరముగా చెప్పినదేమంటే,
నీవు మాకు ఆజ్ఞాపించిన యావత్తూ మేము చేతుము;
యెక్కడికి నీవు మమ్మును పంపుదువో అక్కడికి మేము
వెళ్లుదుము. । సమస్తవిషయముల యందూ మోషే చెప్పిన 17
మాటను యేలాగు వింటిమో ఆలాగున నీవు చెప్పే
మాటనున్ను విందుము; మీ దేవుడయిన యెహోవా
మోషేకు తోడుగా వున్నట్టు నీకున్ను తోడుగా వుం
డును గాక. । యెవడు నీయొక్క ఆజ్ఞకు వ్యతిరిక్తుడై నీవు 18
వానికి ఆజ్ఞాపించే మాటలన్నిటినిన్ని వినకపోవునో
వాడు మరణమవు గాక: నీవు మాత్రము పౌరుషము
వహించుకొని ధైర్యముగా వుండుమని చెప్పిరి.

## 2. అధ్యాయము.

1 అప్పుడు నూను కుమారుడయిన యెహోషువ
యిద్దరు మనుష్యులను పిలిచి, మీరు ఆ దేశమునున్ను
యెరిఖో పట్టణమునున్ను చూచుటకు వెళ్లండని చెప్పి,
షిత్తీమునుంచి రహస్యముగా వాటిని పరిశోధించుటకు
వారిని పంపెను; అప్పుడు వారు వెళ్లి రాహాబు అనే
2 వేశ్య యింటికి వచ్చి అక్కడ దిగినారు. । అంతట్లో
యెరిఖో దేశమును శోధించుటకు ఇశ్రాయేలు పుత్రుల
సంబంధులయిన మనుష్యులు రాత్రి యిక్కడికి వచ్చి
నారని యెరిఖో రాజుకు తెలియ చేయబడెను. ।
3 అప్పుడు యెరిఖో రాజు నీ యొద్దికి వచ్చి నీ యింట్లో
ప్రవేశించిన మనుష్యులను బయిటికి తీసుకరమ్ము; యెం
దుకంటే వారు యీ దేశమంతా పరిశోధించుటకు వచ్చి
యున్నారని రాహాబు యొద్దికి కబురు పంపెను. ।
4 అయితే ఆ స్త్రీ వారిద్దరిని దాచి చెప్పినదేమంటే, మను
ష్యులు నా యొద్దికి వచ్చిరి, యెక్కడనుంచి వారు
5 వచ్చిరో అది నాకు తెలియలేదు. । అయితే చీకటి అయి
వుండగా పట్టణపు గవిని మూసే వేళయందు ఆ మను
ష్యులు బయిటికి వెళ్లి పోయినారు; యెక్కడికి వెళ్లిరో
అది నాకు తెలియలేదు; మీరు త్వరగా వారిని వెంటా
డండి, యేమంటే, మీరు వారిని పట్టుకో గలరని చెప్పె
6 ను. । అయితే ఆమె మిద్దె మీదికి వారిని తీసుక వెళ్లి
ఆ మిద్దె మీద తాను పరిచిన జనప చొప్పతో వారిని
7 కప్పి వేసెను. । అప్పుడు ఆ పట్టణపు వారు యర్దేను
మార్గముగా రేవుల మట్టుకు వారిని తరుముటకు
వెళ్లిరి: తరిమే వారు బయిలు వెళ్లగానే ఆ పట్టణపు
8 ద్వారమును మూసినారు. । అయితే వారు పండుకోక
మునుపు ఆమె యింటిమీదికి యెక్కి వారి దగ్గిరకు
9 వచ్చి చెప్పినదేమంటే, । యెహోవా యీ దేశమును
మీకు యిచ్చియున్నాడనిన్ని, మీ భయంకరత్వము
మా మీద ఆవరించినదనిన్ని, యీ దేశపు కాపురస్తు
లందరున్ను మీ కొరకు కరిగిపోతున్నారనిన్ని నేను
10 యెరుగుదును. । యెందుకంటే మీరు మిస్రయీములో
నుంచి బయిటికి వచ్చినప్పుడు యెహోవా మీ కొరకు
యెర్రసముద్రపు నీళ్లను యింకిపో చేసిన సంగతిన్ని,
యర్దేను నది అవతల వుండినటువంటిన్ని మీరు సర్వ
లయము చేసినటువంటిన్ని అమోరీయులకు యిద్దరు
రాజులైన సీహోనునున్ను ఓగునున్ను మీరు యేమి
11 చేస్తిరో అదిన్ని మాకు వినబడెను. । యీ సంగతులు
మేము విన్నప్పుడే మా హృదయములు కరిగి పోయెను;
మీ నిమిత్తముచేత మరి ధైర్యము యే మనుష్యుని యం
దైనా వుండక పోయెను, యెందుకంటే, మీ దేవుడ
యిన యెహోవా తానే పయిని ఆకాశమందున్ను
కింది భూమి యందున్ను దేవుడై వున్నాడు. । కాబట్టి 12
యిప్పుడు నేను మీకు ఉపకారము చేసినాను, గనుక,
మీరున్ను నా తండ్రి యింటికి ప్రత్యుపకారము చేసి, ।
నా తండ్రినిన్ని నా తల్లినిన్ని నా సహోదరులనున్ను 13
నా అక్క చెల్లెళ్లనున్ను వారికి కలిగి వున్న వారినంద
రినిన్ని బ్రతుకనిచ్చి, మరణమునుంచి మా ప్రాణము
లను రక్షించేటట్టుగా సత్యమైన వొక ఆనవాలు యిచ్చి
యెహోవా విషయమయి దయచేసి ప్రమాణము
చేయుమని పలికెను. । అప్పుడు వారు ఆమెను చూచి 14
యీ మాయొక్క సంగతి మీరు తెలియ చేయక వున్న
పక్షమందు మీ ప్రాణమునకు మా ప్రాణము అడ్డమ
వును గాక: మరిన్ని సంభవించేదేమంటే, యెహోవా
యీ దేశమును మాకు యిచ్చిన తరువాత మేము నీ
యెడల ఉపకారముగానున్ను యథార్థముగానున్ను
ప్రవర్తింతుమని చెప్పిన తరువాత, । ఆమె తాడు 15
తోటి దిడ్డీలోనుంచి వారిని దించెను, యేమంటే, ఆమె
యిల్లు పట్టణపు గోడమీద వుండెను, ఆమె గోడ మీద
కాపురము చేసెను. । మరిన్ని ఆమె వారిని చూచి, 16
మిమ్మును తరుమ వెళ్లిన వారు మీకు యెదురుగా వత్తు
రేమో అది కాకుండా మీరు పర్వతము మీదికి వెళ్లి,
మిమ్మును తరిమే వారు తిరిగి వచ్చే మట్టుకూ అక్కడ
మూడు దినములు దాగి వుండి, తరువాత మీ మార్గ
మున మీరు వెళ్లండని చెప్పెను. । అప్పుడు వారు ఆమె 17
తో చెప్పినదేమంటే, నీవు మా యొద్ద పుచ్చుకొనిన
ప్రమాణవిషయమై నిరపరాధులమై వుండేటట్టుగా యి
దుగో మేము యీ దేశములో ప్రవేశించినప్పుడు, ।
యీ యెర్రటి నూలుదారము నీవు మమ్మున దించిన 18
దిడ్డీకి కట్ట వలెను; మరిన్ని నీ తండ్రినిన్ని నీ తల్లినిన్ని
నీ సహోదరులనున్ను నీ తండ్రియొక్క యింటి వా
రినందరినిన్ని నీ యింటికి పిలుచుకోవలసినది. । అప్పుడు 19
సంభవించేదేమంటే, యెవడైనా నీ యింటి ద్వారము
లోనుంచి వీధిలోకి వస్తే వాని రక్తము వాని శిరస్సు
మీదికే వచ్చును, మేము నిరపరాధులమై వుందుము;
అయితే యెవడైనా నీ యింటిలో నీ యొద్ద వుండగా
యెవనియొక్క చెయ్యియైనా వాని మీద పడిన పక్ష
మందు వాని రక్తము మా శిరస్సు మీదికి వచ్చును. ।
యీ మా సంగతిని నీవు తెలియ చేసిన పక్షమందు 20
నీవు మా యొద్ద పుచ్చుకొనిన ప్రమాణమునుంచి మేము
పరిహరించ బడుదుమని చెప్పినప్పుడు, । ఆమె వారిని 21
చూచి మీరు చెప్పిన ప్రకారము అవుగాకని చెప్పి
వారిని పంపెను: వారు తర్లిపోయిన తరువాత ఆమె
ఆ యెరుపు దారమును దిడ్డీకి కట్టెను. । అయితే వారు 22
తర్లి పర్వతమునకు వెళ్లి అక్కడ మూడు దినములు
తరిమే వారు తిరిగి వచ్చే పర్యంతమూ నిలిచిరి; తరిమే

వారు వారిని మార్గమంతటి యందూ వెతికినప్పటి
23 కిన్ని కానక పోయిరి. । అంతట ఆ యిద్దరు మను
ష్యులు తిరిగీ పర్వతము మీదనుంచి దిగి, నది దాటి,
నూను కుమారుడైన యెహోషువ యొద్దికి వచ్చి,
తమకు సంభవించిన యావత్తూ అతనికి తెలియ చేసిరి. ।
24 మరిన్ని వారు యెహోషువను చూచి, నిజముగా
యెహోవా ఆ దేశమంతాను మన చేతులకు అప్ప
గించి యున్నాడు, యెందుకంటే, ఆ దేశపు కాపుర
స్తులందరున్ను మన నిమిత్తముచేత కరిగి పోతున్నారని
చెప్పిరి.

## 3. అధ్యాయము.

1 అంతట యెహోషువ త్వరగా వుదయాననే లేచి,
అతడున్ను ఇశ్రాయేలు పుత్రులందరున్ను షిత్తీమునుంచి
సాగివెళ్లి, యర్దేను దగ్గిరకు వచ్చి, దానిని దాటక
2 అక్కడ దిగినారు. । మూడు దినములయిన తరువాత
సంభవించినదేమంటే, అధికారులు పేటలోబడి వెళ్లు
3 తూ జనులను చూచి ఆజ్ఞాపించినదేమంటే, । మీ దేవు
డయిన యెహోవాయొక్క వొడంబడికె గల పెట్టెను
అర్చకులు మోయుటను మీరు చూచినప్పుడు మీరు
మీ స్థలమును విడచి దాని వెంబడిగా రావలెను. ।
4 అయితే దానికిన్ని మీకున్ను 'రెండువేల మూరల యె
డము వుండ వలెను: వెళ్ల వలసిన మార్గము మీకు
తెలియగలందులకు మీరు దానిని సమీపించ కూడదు,
యెందుకంటే, యింతకు మునుపు మీరు యీ మార్గ
5 మున నడవ లేదని చెప్పిరి. । మరిన్ని యెహోషువ
జనులను చూచి రేపటి దినమందు యెహోవా మీలో
వింతలను చేసును గనుక మిమ్మును మీరు పరిశుద్ధులను
6 చేసుకొందురు గాకని చెప్పెను. । మరిన్ని యెహో
షువ అర్చకులను చూచి, మీరు వొడంబడికె గల
పెట్టెను యెత్తుకొని జనులముందర వెళ్లండని చెప్పిన
ప్పుడు వారు వొడంబడికె గల పెట్టెను యెత్తుకొని
7 జనుల ముందర వెళ్లిరి. । అప్పుడు యెహోవా యెహో
షువతో ఆనతిచ్చినదేమంటే, నేను మోషేకు తోడ
యి యేలాగు వుంటినో ఆలాగున నేను నీకున్ను
తోడై వుంటానని ఇశ్రాయేలు వారందరున్ను యెరిగే
టట్టుగా యీ దినమున నేను వారి దృష్టి యెదుట
8 నిన్ను ఘనపర్చ ఆరంభింతును. । నీవు వొడంబడికె
గల పెట్టె మోసే అర్చకులను చూచి, యర్దేను వుద
కముయొక్క వొడ్డుకు మీరు వచ్చినప్పుడు యర్దేను
లో నిలిచి వుండండని ఆజ్ఞాపించుమని సెలవు యిచ్చె
9 ను. । అప్పుడు యెహోషువ మీ దేవుడయిన యెహో
వాయొక్క వాక్యములను వినుటకు యిక్కడికి రండని
10 ఇశ్రాయేల పుత్రులతో చెప్పె, । యెహోషువ తిరిగీ
వారితో అనినదేమంటే, జీవము గల దేవుడు మీ
లో వున్నాడనిన్ని, ఆయన తప్పకుండా నీ యెదు
టనుంచి కెనయా నీయులనున్ను హిత్తీయులనున్ను
హివీయులనున్ను పెరిజ్జీయులనున్ను గిర్గాషీయు
లనున్ను అమోరీయులనున్ను యెబూసీయులనున్ను
తోలివేస్తాడనిన్ని దీనివల్లను మీరు తెలుసుకొం
దురు. । యేమంటే యిదుగో యావద్భూమియొక్క 11
ప్రభువుయొక్క వొడంబడికె గల పెట్టె మీ ముం
దరనుంచి యర్దేనుకు వెళ్లుతూ వున్నది. । కాబట్టి 12
ఇశ్రాయేలు గోత్రములలోనుంచి ప్రతి గోత్రములో
వొక్కొక్క మనుష్యుని చొప్పున పండ్రెండుగురిని
తీసుకొండి. । యావద్భూమికి ప్రభువైన యెహోవా 13
యొక్క వొడంబడికె గల పెట్టె మోసే అర్చకుల
యొక్క అరికాళ్లు యర్దేనుయొక్క వుదకమందు
పడినప్పుడే సంభవించేదేమంటే, యర్దేను నీళ్లు యెగు
వనుంచి వచ్చే నీళ్లకు కేటించబడినందున అవి రాశిగా
నిలిచి వుండునని చెప్పెను. । అయితే యర్దేనును దా 14
టుటకు జనులు తమతమ డేరాలను విడచి వెళ్లుతూ
వుండగా, అర్చకులు వొడంబడికె గల పెట్టె యెత్తు
కొని జనుల ముందర వెళ్లిరి. । అయితే యర్దేను కోత 15
కాలము పర్యంతమూ తన వొడ్డు మీదనుంచి పొర్లి
పారును; కాబట్టి పెట్టె మోసేవారు యర్దేను దగ్గి
రకు వచ్చి, పెట్టె మోసే అర్చకులయొక్క పాదములు
నీటియొక్క వుపరి భాగమందు పడినప్పుడు యెగువ
నుంచి వచ్చిన నీళ్లు నిలిచి సారెతాను స్థల పార్శ్వ
మున ఆదాము పట్టణమునకు బహు దూరము మట్టుకు
రాశిగా వుండెను; । మరిన్ని మైదానముయొక్క సము 16
ద్రమనగా, వుప్పుసముద్రమునకు దిగి వచ్చిన నీళ్లు
పారి కేటించ బడినందున జనులు యెరికో పట్టణము
నకు యెదురుగానే గడచిపోయిరి. । యెహోవాయొ 17
క్క వొడంబడికె గల పెట్టె మోస్తూ వున్న అర్చకులు
యర్దేను మధ్యమందు పొడి నేల మీదను స్థిరము
గా నిలిచి, ఇశ్రాయేలు వారందరున్ను పొడి నేల
మీద వెళ్లుతూ జనులందరున్ను యర్దేను గడుచుట
సమాప్తమయ్యే పర్యంతమూ వారు వుంటూ వుండిరి.

## 4. అధ్యాయము.

జనులందరున్ను యర్దేనును దాటి వెళ్లిన తరు 1
వాత యెహోవా యెహోషువకు సెలవు యిచ్చిన
దేమంటే, । మీరు జనులలోనుంచి ప్రతి గోత్రములో 2
నుంచిన్ని వొక్కొక్క మనుష్యుని చొప్పున పండ్రెం
డుగురిని తీసి వారికి ఆజ్ఞాపించ వలసినదేమంటే, ।
మీరు యర్దేను మధ్యమందు అర్చకుల పాదములు 3
స్థిరముగా నిలిచిన స్థలములోనుంచి పండ్రెండు రాళ్లను

యెత్తుకొని, వాటిని యివతలకు తీసుక వచ్చి, యే స్థల
మందు యీ రాత్రి మీరు దిగుదురో అక్కడ వుంచం
4 డని ఆజ్ఞాపించుమని సెలవు యిచ్చెను.। అప్పుడు యె
హోషువ ప్రతి గోత్రములోనుంచిన్ని వొక్కొక్క
మనుష్యుని చొప్పున తాను ఇశ్రాయేలు పుత్రులలో
నిర్ణయించిన పండ్రెండుగురిని పిలిపించి వారితో
5 చెప్పినదేమంటే,। మీరు మీ దేవుడైన యెహోవా
పెట్టె ముందర నడచి, యర్దేను మధ్యకు వెళ్లి, మీలో
ప్రతి మనుష్యుడూ ఇశ్రాయేలు పుత్రుల గోత్రముల
యొక్క లెక్క ప్రకారము మీలో ఆనవాలు అయ్యే
కొరకు వొక్కొక్క రాయి యెత్తి తన తన భుజము
6 మీద పెట్టుకొని రావలెను.। యెందుకంటే యిటుమీ
దట మీ పిల్లలు మిమ్మును చూచి యెందుకు యీ రా
ళ్లని అడిగితే, మీరు వారిని చూచి, యర్దేను నీళ్లు
యెహోవాయొక్క వొడంబడికె గల పెట్టె ముందర
7 విభజన పడెను.। ఆ పెట్టె యర్దేనును గడచినప్పుడు
యర్దేను నీళ్లు విభజన పడెనని చెప్ప వలెను: కాబట్టి
యీ రాళ్లు ఇశ్రాయేలు పుత్రులకు సదా జ్ఞాపకా
8 ర్థమై యుండునని చెప్పెను.। ఇశ్రాయేలు పుత్రులు
యెహోషువ ఆజ్ఞాపించినట్టు చేసి, యెహోవా
యెహోషువకు సెలవు యిచ్చినట్టు ఇశ్రాయేలు పుత్రు
లయొక్క గోత్రముల లెక్క చొప్పున వారు పండ్రెండు
రాళ్లను యర్దేను మధ్యనుంచి యెత్తి తాము దిగిన
9 స్థలమునకు తీసుక వచ్చి అక్కడ వుంచిరి.। మరిన్ని
యెహోషువ వొడంబడికె గల పెట్టె మోసిన అర్చ
కుల పాదములు యర్దేను మధ్యములో నిలిచిన స్థల
మందు పండ్రెండు రాళ్లను దొంతి పెట్టించెను; అవి
10 నేటి వరకూ అక్కడ వుంటూ వున్నవి.। యెందుకంటే
యెహోషువకు మోషే ఆజ్ఞాపించిన యావత్తూ ప్రకా
రము జనులతో చెప్పుటకు యెహోవా యెహోషు
వకు ఆజ్ఞాపించిన సమస్తమూ ముగించిన పర్యంతమూ
యర్దేను మధ్యను పెట్టెను మోసే అర్చకులు
నిలిచి వుండిరి; అప్పుడు జనులు త్వరపడి దాటి
11 వెళ్లిరి.। జనులందరున్ను దాటి వెళ్లిన తరువాత సంభవిం
చినదేమంటే, అర్చకులు యెహోవాయొక్క పెట్టె
12 తోను జనులందరి యెదుట దాటి వెళ్లిరి.। మరిన్ని
రూబేను పుత్రులున్ను గాదు పుత్రులున్ను మన
స్సే గోత్రములో సగము మందిన్ని మోషే వా
రికి చెప్పిన మాట చొప్పున ఇశ్రాయేలు పుత్రుల
13 ముందర ఆయుధస్థులై దాటి వెళ్లిరి.। దాదాపు నలుబై
వేలమంది యుద్ధ సన్నద్ధులై, యుద్ధము కొరకు యెరి
ఖో మైదానపు భూమికి యెహోవా యెదుట దాటి
14 వెళ్లిరి.। ఆ దినమందు యెహోవా ఇశ్రాయేలు వారం
దరియొక్క దృష్టి యెదుట యెహోషువను ఘనపర

చెను; అందువల్ల మోషే యందు వారు యేలాగు భయ
పడిరో ఆలాగున అతని యందున్ను అతడు జీవించిన
దినములన్నిటి పర్యంతమూ భయపడుతూ వుండిరి.।
మరిన్ని యెహోవా యెహోషువకు సెలవు యిచ్చిన 15
దేమంటే,। సాక్ష్యముయొక్క పెట్టెను మోసే అర్చ 16
కులు యర్దేనులోనుంచి పయికి వచ్చేటట్టు ఆజ్ఞాపిం
చుమని సెలవు యిచ్చెను.। అయినందున యెహోషువ 17
మీరు యర్దేనులోనుంచి పయికి రండని అర్చకు
లకు ఆజ్ఞాపించెను.। అయితే యెహోవాయొక్క 18
వొడంబడికె గల పెట్టె మోస్తూ వున్న అర్చకులు
యర్దేను మధ్యనుంచి పయికి వస్తూ వుండగా, ఆ
అర్చకులయొక్క అరికాళ్లు పొడి నేల పయికి యెత్త
బడినప్పుడు సంభవించినదేమంటే, యర్దేను నీళ్లు
యథాస్థానమునకు తిరిగీ వచ్చి మునుపటిలాగున వొడ్డు
పయికి పొర్లి పారెను.। అయితే జనులు మొ 19
దటి నెల పదో దినమందు యర్దేను నదిలోనుంచి
పయికి వచ్చి, యెరిఖో పూర్వపార్శ్వమందున్న గిల్గా
లులో పేట వేసుకొనిరి.। మరిన్ని యర్దేనులోనుంచి 20
వారు తీసిన పండ్రెండు రాళ్లను యెహోషువ గిల్గాలు
యందు దొంతి పెట్టించి ఇశ్రాయేలు పుత్రులతో
చెప్పినదేమంటే,। మీ పిల్లలు యిటు మీదట మిమ్మును 21
చూచి యెందుకు యీ రాళ్లని అడిగినప్పుడు మీరు
మీ పిల్లలకు తెలియ చెప్ప వలసినదేమంటే,। ఇశ్రా 22
యేలు వారు పొడి నేలగా యీ యర్దేనును దాటి
వచ్చినారు.। యేమంటే యెహోవాయొక్క హస్తము 23
బలమైనటువంటిదని లోకులందరున్ను యెరుగ గలం
దులకున్ను, మీ దేవుడైన యెహోవా యందు మీరు
సదా భయపడేటట్టుగానున్ను,। మీ దేవుడయిన యె 24
హోవా మేము యెఱ్ఱ సముద్రమునకు వచ్చి దాటే
పర్యంతమూ దానిని మన ముందర యేలాగు యింకిపో
చేసెనో ఆలాగున మీ దేవుడైన యెహోవా య
ర్దేను నీళ్లను మీరు దాటే పర్యంతమూ మీ ముందర
యింకి పోచేసెనని చెప్ప వలెనని చెప్పెను.

## 5. అధ్యాయము.

అయితే యెహోవా ఇశ్రాయేలు పుత్రుల ముం 1
దర యర్దేను వుదకములను మేము గడిచే పర్యంత
మూ యింకిపో చేసినాడని యర్దేను పశ్చిమ పార్శ్వ
మందున్న అమోరీయుల రాజులందరున్ను, సముద్ర
ప్రాంతమందున్న కెనయానీయుల రాజులందరున్ను
విన్నప్పుడు సంభవించినదేమంటే, వారి హృదయము
కరిగి పోయెను, ఇశ్రాయేలు పుత్రుల ముఖము ముం
దర వారికి ధైర్యము యెంతమాత్రమూ లేక పోయెను.।
ఆ కాలమందు యెహోవా నీవు వాడి గల కత్తులను 2

చేసుకొని, తిరిగీ ఇశ్రాయేలు పుత్రులకు రెండో
మారు సున్నతీ చేయుమని యెహోషువకు సెలవు
3 యిచ్చినందున, యెహోషువ వాడి గల కత్తులను చేసు
కొని ఇశ్రాయేలు పుత్రులకు గిబ్యాహారాలోతు దగ్గిర
4 సున్నతీ చేసెను. । యెహోషువ సున్నతీ చేయు
టకు కారణమేమంటే, మిస్రయీములోనుంచి బయిలు
వచ్చిన జనులందరు, అనగా, ఆయుధస్థులయిన మొగ
వారందరున్ను మిస్రయీములోనుంచి బయిలు వచ్చిన
5 తరువాత అరణ్య మార్గమందు మరణమైరి. । బయిలు
వచ్చిన వారందరున్ను సున్నతీ అయినప్పటికిన్ని మిస్ర
యీములోనుంచి బయిలు వచ్చిన తరువాత అరణ్య
మందు మార్గములో పుట్టిన వారికందరికిన్ని సున్నతీ
6 చేయక వుండిరి. । యెందుకంటే మిస్రయీములో
నుంచి బయిలు వచ్చిన ఆయుధస్థులయిన వారందరు
న్ను యెహోవాయొక్క శబ్దము వినకపోయిరి, గనుక,
వారు కడతేరే పర్యంతమూ ఇశ్రాయేలు పుత్రులు
నలుబై సంవత్సరములూ అరణ్యమందు సంచరిస్తూ
వుండిరి: యెహోవా మనకు యిస్తానని వారి పితృలకు
సత్యముచేసిన దేశము; అనగా, పాలతోనున్ను తేనె
తోనున్ను ప్రవహించే దేశమును వారికి చూపించనని
7 యెహోవా ప్రమాణము చేసెను. । అయితే ఆయన
వారికి బదులుగా వుద్భవింప చేసిన వారి పిల్లలకు యె
హోషువ సున్నతీ చేసెను; యెందుకంటే మార్గ
మందు వారు వారిని సున్నతీ చేయ లేదు గనుక వారు
8 సున్నతీ పొందక పోయిరి. । అంతట వారు జనులందరి
కిన్ని సున్నతీ చేయుట ముగించిన తరువాత సంభవిం
చినదేమంటే, వారు స్వస్థులయ్యే పర్యంతమూ పేటలో
9 తమతమ స్థలములందు వుంటూ వుండిరి. । అప్పుడు యె
హోవా యెహోషునకు సెలవు యిచ్చినదేమంటే,
యీ దినమందు నేను మీ యొద్దనుంచి మిస్రయీము
యొక్క నిందను పొర్లించి వేస్తినని ఆనతిచ్చినందున,
ఆ స్థలము గిల్గాలు అని నేటివరకు పిలువబడి వున్నది. ।
10 ఇశ్రాయేలు పుత్రులు గిల్గాలు యందు పేట వేసు
కొని, ఆ నెల పద్నాలుగో దినము సాయంకాలమందు
యెరిఖో మైదానములో పస్ఖాపండుగను ఆచరించి
11 నారు. । పస్ఖాపండుగ మరునాటి యందు వారు ఆ
దేశపు పాత గింజలను తినిరి; పులుసు లేని అప్పాల
నున్ను వేపుడు గింజలనున్ను వారు ఆ దినమందు తినిరి. ।
12 ఆ మరునాటి యందు వారు ఆ దేశపు పాత గింజలను
తినిన తరువాత మాన్నా నిలిచి పోయెను, అంతటనుంచి
మాన్నా ఇశ్రాయేలు పుత్రులకు లేక వుండెను; అయితే
ఆ సంవత్సరమందు వారు కెనయను దేశపు ఫలమును
13 తినిన వారైరి. । అంతట యెహోషువ యెరిఖో దగ్గిర
వుంటూ వుండగా సంభవించినదేమంటే, తన నేత్రము
లను యెత్తి చూచినంతలో, యిదుగో, వొకడు తన
చేతిలో వర దూసిన కత్తితోటి అతినికి యెదురుగా
నిలిచి వుండెను; అప్పుడు యెహోషువ అతని దగ్గిరకు
వెళ్లి అతనితో నీవు మా నిమిత్తమై యున్నావా, లేక
మా విరోధుల నిమిత్తమై యున్నావా, అని అడిగిన
ప్పుడు, । అతడు కాదు, నేను యెహోవాయొక్క 14
సేనాధిపతిగా వచ్చియున్నానని చెప్పెను; అప్పుడు
యెహోషువ వొంగి సాష్టాంగనమస్కారము చేసి,
వొ నా ప్రభువా, నీ సేవకుడనైన నాకు యేమి సెల
వని అడిగినప్పుడు, । యెహోవాయొక్క సేనాధిపతి 15
నీవు నిలిచి వుండే స్థలము పరిశుద్ధమై యున్నది గనుక
నీ పాద రక్షను విప్పి నీ పాదమునుంచి తీసివేయుమని
యెహోషువతో చెప్పినందున యెహోషువ ఆలా
గున చేసెను.

## 6. అధ్యాయము.

అయితే యెరిఖో పట్టణము ఇశ్రాయేలు పుత్రుల 1
నిమిత్తముచేత బిగువుగా ముయ్యబడి వుండెను; యెవ
డూ వెలపటికి వెళ్లక వుండెను, యెవడూ లోపటికి
రాక వుండెను. । అంతట యెహోవా యెహోషు 2
వకు సెలవు యిచ్చినదేమంటే, యిదుగో యెరిఖో
పట్టణమునున్నదాని రాజునున్ను ప్రతాపము గల బలా
ఢ్యులనున్ను నీ చేతికి అప్పగిస్తిని. । ఆయుధస్థులయిన 3
మీరందరున్ను ఆ పట్టణమును ఆవరించుకొని, వొక
మారు దాని చుట్టూ తిరగవలెను; యీలాగున నీవు
ఆరు దినములు చేయవలెను. । మరిన్ని యేడుగురు అర్చ 4
కులు పొట్టేళ్లయొక్క కొమ్ములయిన యేడు బాకాలను
తీసుకొని పెట్టెముందర వెళ్లవలెను; అయితే యేడో
దినమందు మీరు యేడు మారులు పట్టణము చుట్టూ
తిరుగ వలెను, అప్పుడు అర్చకులు బాకాలను వూద
వలెను. । అయితే వారు పొట్టేలు కొమ్ములతో దీర్ఘ 5
నాదము చేసినప్పుడున్ను బాకాయొక్క ధ్వనిని మీరు
వినినప్పుడున్ను సంభవించేదేమంటే, జనులందరున్ను
ఆర్భటముతో ఆర్భటించ వలెను, అప్పుడు ఆ పట్టణపు
గోడ కూలి పడును; అంతట జనులలో ప్రతి మను
ష్యుడూ తనకు యెదుట వున్న స్థలము మీదికి యెక్క
వలెనని సెలవు యిచ్చెను. । అప్పుడు నూను కుమారు 6
డైన యెహోషువ అర్చకులను పిలిపించి వారిని
చూచి, మీరు వొడంబడికె గల పెట్టెను యెత్తు
కొని, యేడుగురు అర్చకులు పొట్టేళ్లయొక్క కొమ్ము
లైన యేడు బాకాలను తీసుకొని, యెహోవాయొ
క్క పెట్టె ముందర నడువ వలెనని చెప్పి; । మరిన్ని 7
అతడు జనులతో చెప్పినదేమంటే, మీరు ముందర
వెళ్లి ఆ పట్టణమును ఆవరించుకొండి; మరిన్ని ఆయు

ధములను కట్టుకొనిన వారు యెహోవాయొక్క పెట్టె
8 ముందర నడుతురు గాకని చెప్పెను.। అయితే యెహో
షువ జనులతో మాట్లాడిన తరువాత సంభవించిన
దేమంటే, పొట్టేళ్లయొక్క కొమ్ములైన యేడు బాకా
లను తీసుకొనిన యేడుగురు అర్చకులు యెహోవా
ముందర నడచి ఆ బాకాలను వూదిరి, యెహోవా
యొక్క యొడంబడికె గల పెట్టె వారి వెంబడిగా
9 వచ్చెను.। మరిన్ని ఆయుధములను కట్టుకొనిన వారు
బాకాలను వూదే అర్చకుల ముందర వెళ్లిరి, వెనుక
నున్న సమూహము పెట్టె వెనుకనుంచి వచ్చెను, అర్చ
10 కులు బాకాలను వూదుతూ వెళ్లిరి.। అయితే యె
హోషువ జనులను చూచి, మీరు ఆర్భటించకనున్న
మీ యెలుగుతో యే ధ్వనిన్ని చేయకనున్న మీ నో
టనుంచి యే శబ్దమూ రాకుండానున్న వుండవలెను:
యే దినమందు మీరు ఆర్భటించండని చెప్పుతానో
అప్పుడు మీరు ఆర్భటించండి అని ఆజ్ఞాపించి వుం
11 డెను.। యీలాగున యెహోవాయొక్క పెట్టె ఆ పట్ట
ణమును ఆవరించి దాని చుట్టూ వొక మారు తిరిగెను, తరు
12 వాత వారు తిరిగీ పేటకు వచ్చి పేటలో దిగిరి.। మరిన్ని
యెహోషువ వుదయమందు త్వరగా లేచెను, అర్చ
కులు యెహోవాయొక్క పెట్టెను యెత్తుకొనిరి.।
13 మరిన్ని పొట్టేళ్ల కొమ్ములైన యేడు బాకాలను తీసు
కొనిన యేడుగురు అర్చకులు యెహోవాయొక్క
పెట్టె ముందర బాకాలను వూదుతూ వెళ్లుతూ వుం
డిరి; ఆయుధములను కట్టుకొనిన వారు వారి ముందర
వెళ్లిరి, వెనుక సమూహము యెహోవాయొక్క పెట్టె
వెనుకనుంచి వచ్చెను, అర్చకులు వెళ్లుతూ బాకాలను
14 వూదుతూ వుండిరి.। యీలాగున రెండో దినమందు
న్ను వారు వొకమారు పట్టణము చుట్టూ తిరిగి పేటకు
వచ్చిరి; యీ ప్రకారమే వారు ఆరు దినములు చేసిరి.।
15 అయితే యేడో దినమందు సంభవించినదేమంటే, వారు
తెల్లవారే వేళకు త్వరగా లేచి, ఆ పట్టణమును ఆ
ప్రకారముగా యేడు మారులు చుట్టూ తిరిగిరి; ఆ దిన
మందు మాత్రమే పట్టణమును యేడు మారులు తిరిగిరి.।
16 అయితే యేడో మారు అర్చకులు బాకాలను వూదు
తూవుండగా సంభవించినదేమంటే, యెహోషువ జను
లను చూచి ఆర్భటించండి, యెందుకంటే, యెహో
17 వా మీకు యీ పట్టణమును యిచ్చి వున్నాడు.। యీ
పట్టణమున్ను దానిలోనున్న సమస్తమున్ను యెహో
వా విషయమై శపించ బడును; వేశ్య అయినటువంటి
రాహాబున్ను దాని యింట్లో దాని వొద్ద వున్న వారం
దరున్ను మాత్రమే బ్రతుకుదురు, యెందుకంటే, మన
18 ము పంపించిన దూతలను అది దాచెను.। శాపగ్రస్త
మైన దానిని మీరు పుచ్చుకొన్న పక్షమందు మిమ్మున

మీరు శాప గ్రస్తులుగా చేసుకొని, ఇశ్రాయేలు పే
టను శాపగ్రస్తమయ్యేటట్టు చేసి, దానిని బాధపరచు
దురేమో, అది లేకుండా వుండేటట్టు ఆ శాపగ్రస్త
మయిన దాని యొద్దనుంచి మిమ్మున మీరు అవశ్యము
గా కాపాడుకొనుడీ.। అయితే వెండిన్ని బంగార 19
మున్ను యిత్తడియొక్కయున్ను యినుముయొక్కయు
న్ను పాత్రలున్ను యెహోవా కొరకు పరిశుద్ధ పరచ
బడినవై యున్నవి, అవి యెహోవాయొక్క ధనా
గారములోకి రావలెను అని చెప్పెను.। యీలాగున 20
అర్చకులు బాకాలతో వూదినప్పుడు జనులు ఆర్భటిం
చిరి; అయితే బాకాల నాదము జనులకు వినబడినప్పు
డున్ను జనులు గొప్ప ఆర్భటముతో ఆర్భటించినప్పు
డున్ను సంభవించినదేమంటే, ఆ గోడ కింద కూలెను;
అందు వల్లను జనులలో ప్రతి మనుష్యుడూ తనకు
యెదురైన మార్గముచేత యెక్కి పట్టణము లోపలికి
ప్రవేశించి పట్టణమును పుచ్చుకొనిరి.। అప్పుడు వారు 21
ఆ పట్టణములోనున్న సమస్తమున్ను, అనగా, పురు
షులనున్ను స్త్రీలనున్ను చిన్నవాండ్లనున్ను పెద్దవాండ్లను
న్ను గోవులనున్ను గొర్రెలనున్ను గార్దభములనున్ను
కత్తివాడిచేత సర్వనాశనము చేసిరి.। అయితే దేశమును 22
శోధించిన ఆ యిద్దరు మనుష్యులను యెహోషువ
చూచి, మీరు వెళ్లి ఆ వేశ్య యింట్లో ప్రవేశించి, దానికి
మీరు యిచ్చిన ప్రమాణ ప్రకారముగా ఆ స్త్రీనిన్ని దా
నికి కలిగిన సమస్తమున్ను బయిటికి తీసుక రండని చెప్పి
వుండెను.। అయినందున చొప్పు కాన్లైన యీ పడుచు 23
వాండ్లు ప్రవేశించి, రాహాబున్ను దాని తండ్రినిన్ని
దాని తల్లినిన్ని దాని సహోదరులనున్ను దానికి కలి
గిన సమస్తమున్ను బయిటికి తీసుక వచ్చిరి; మరిన్ని
దాని బంధువులందరినిన్ని బైటికి తీసుకొని ఇశ్రాయేలు
పేట అవతల వుంచిరి.। ఆ పట్టణమునున్ను దానిలో 24
నున్న సమస్తమునున్ను అగ్నిచేత వారు కాల్చివేసిరి;
వెండినిన్ని బంగారమునున్ను యినుముయొక్కయున్ను
యిత్తడియొక్కయున్ను పాత్రలనున్ను వీటిని మాత్ర
ము వారు యహోవా మందిరముయొక్క ధనాగార
ములో వేసిరి.। అయితే యెహోషువ వేశ్య అయిన 25
రాహాబునున్ను దాని తండ్రి యింటి కూటమునున్ను
దానికి కలిగిన సమస్తమునున్ను ప్రాణముతో రక్షిం
చెను; కాబట్టి అది నేటివరకు ఇశ్రాయేలులో కాపు
రస్తురాలై వున్నది, యెందుకంటే, యెరిఖో పట్టణము
శోధించుటకు యెహోషువ పంపిన దూతలను అది
దాచి వుండెను.। ఆ కాలమందు యెహోషువ ప్రమా 26
ణముతో చెప్పినదేమంటే, యెవడు వుద్యుక్తుడై యీ
యెరిఖో పట్టణమును తిరిగీ కట్టిస్తాడో ఆ మనుష్యుడు

యెహోవా సముఖమందు శపించబడును గాక; వాడు
తన ప్రథమ పుత్రుని యందు దాని పునాది వేసి, తన
కనిష్ఠపుత్రుని యందు దాని గవునులు యెత్తునని పలి
27 కెను. । ఈలాగున యెహోవా యెహోషువకు
తోడుగా వుండెను; మరిన్ని అతనియొక్క కీర్తి దేశమం
దంతటా వ్యాపించెను.

## 7. అధ్యాయము.

1 అయితే శాపగ్రస్తమయిన దానిని గురించి ఇశ్రా
యేలు పుత్రులు తప్పు చేసిరి; యేలాగంటే యూదా
సంబంధుడయిన జెరాయొక్క కుమారుడయిన జబ్దీకి
పుట్టిన కర్మియొక్క కుమారుడయిన ఆఖాను ఆ శాప
గ్రస్తమయిన దానిలోనుంచి పుచ్చుకొనెను; అందువ
ల్లను యెహోవాయొక్క కోపము ఇశ్రాయేలు
2 పుత్రుల మీద రగులుకొనెను. । అంతట యెహో
షువ మనుష్యులను చూచి మీరు పయికి వెళ్లి ఆ దేశ
మును శోధించి రండని యెరిఖోనుంచి బేతేలు తూర్పు
దిక్కు యందున్న బేతావెను సమీపమందుండే హాయికి
3 పంపించెను. । ఆ మనుష్యులు పయికి వెళ్లి హాయిని
శోధించి తిరిగీ యెహోషువయొద్దికి వచ్చి అతనితో
చెప్పినదేమంటే, జనులందరినిన్ని పయికి వెళ్లనియ్యకు;
హాయిని కొట్టుటకు రెండు మూడు వేలమందిని హాయికి
వెళ్లనిమ్ము; వారు కొద్దిగా వున్నారు గనక అక్కడికి
వెళ్లుటకు జనులందరినిన్ని ప్రయాసపడనివ్వకుమని
4 చెప్పినందున, । జనులలో దాదాపు మూడువేలమంది
అక్కడికి పయికి వెళ్లినారు; అయితే వీరు హాయియొ
5 క్క మనుష్యుల ముందరనుంచి పారిపోయిరి. । హాయి
పట్టణపు మనుష్యులు వారిలో దాదాపు ముప్పయి
ఆరుగురిని హతము చేసిరి, యేమంటే, వారు ద్వారము
ముందరనుంచి షెబారీము మట్టుకు వారిని తరిమి దిగు
డులోను వారిని హతముచేసిరి; అయినందున జనుల
యొక్క హృదయములు కరిగి నీరు వలెనాయెను. ।
6 అప్పుడు యెహోషువ తన బట్టలను చించుకొని,
తానున్ను ఇశ్రాయేలు పెద్దలున్ను యెహోవా పెట్టె
ముందర సాయంకాలము మట్టుకు సాగిలబడి, తమ
7 శిరస్సులమీద బుగ్గి పోసుకొనిరి. । మరిన్ని యెహో
షువ పలికినదేమంటే, అయ్యో, నా ప్రభువయిన ప్రౌ
యెహోవా, మమ్మున అమోరీయుల చేతులలోకి అప్ప
గించి లయము చేసేటట్టుగా యీ జనులను యర్దే
నును దాటించనేల! యర్దేను అవతల మేము నివా
8 సము చేసుటకు మాకు సమ్మతి కాకపోనేల! । ప్రౌ
యెహోవా, ఇశ్రాయేలు వారు తమ శత్రువుల యె
దుట తమ ముఖములను తిప్పుకొంటూ వున్నప్పుడు
9 నేను యేమి చెప్పుదును! । యెందుకంటే, కెనయానీ
యులున్ను దేశపు కాపురస్తులందరున్ను విని మమ్మును
చుట్టుకొని, మా నామమును భూమిలోనుంచి నశింప
చేతురు; అప్పుడు నీవు నీ ఘనమైన నామమునకు యేమి
చేతువని పలికెను. । అప్పుడు యెహోవా యెహో 10
షువకు సెలవు యిచ్చినదేమంటే, లే, నీవు యెందుకు
సాగిలపడి వున్నావు? । ఇశ్రాయేలు పాపము చేసెను; 11
నేను వారికి ఆజ్ఞాపించిన నాయొక్క వుడంబడికెను
వారు అతిక్రమించి యున్నారు; యేమంటే, వారు
ఆ శాపగ్రస్తమైన దానిని పుచ్చుకొని వున్నారు;
దొంగిలి, మాయచేసి, తమ సామగ్రిలో దానిని వుంచి
వున్నారు. । అందుచేత ఇశ్రాయేలు పుత్రులు తమ 12
శత్రువుల ముందర నిలువలేక పోయిరి; వారు శపిం
చబడి యున్నారు గనుక తమ శత్రువుల ముందర
తమ ముఖములను తిప్పుకొనిరి; ఆ శాపగ్రస్తుని మీరు
మీలోనుంచి నశింప చేస్తేనే గాని యికను నేను మీకు
తోడుగా వుండను. । లేచి, జనులను పరిశుద్ధపరచి; వా 13
రిని చూచి రేపటికి మిమ్మును మీరు పరిశుద్ధ పరచు
కొండి, యెందుకంటే, ఇశ్రాయేలుయొక్క దేవుడైన
యెహోవా యిచ్చిన సెలవు యేమంటే, ఓ ఇశ్రా
యేలా, నీ మధ్యమందు శాపగ్రస్తమైనది వొకటి కలిగి
వున్నది; ఆ శాపగ్రస్తమైన దాన్ని మీరు మీలోనుంచి
తీసివేసే పర్యంతము నీ శత్రువుల ముందర నీవు నిలు
వలేక పోదువని చెప్ప వలెను. । కాబట్టి వుదయమందు 14
మీరు మీ గోత్రముల చొప్పున తేబడుదురు; అప్పుడు
సంభవించేదేమంటే, యే గోత్రమును యెహోవా
యెంచుకొనునో అది దాని వంశముల ప్రకారము రా
వలెను; అప్పుడు యే వంశమును యెహోవా యెంచు
కొనునో అది దాని యింటి కూటముల చొప్పున రా
వలెను; మరిన్ని యే యింటి కూటమును యెహోవా
యెంచుకొనునో అది మనిషి మనిషిగా రావలెను. ।
అప్పుడు సంభవించేదేమంటే, యెవడు ఆ శాపగ్రస్త 15
మైన దానితోటి పట్టబడునో వాడున్ను వానికి కలి
గిన సమస్తమున్ను అగ్నిచేత దహించబడ వలెను; యెం
దుకంటే, వాడు యెహోవాయొక్క వుడంబడికెను
అతిక్రమించి, ఇశ్రాయేలులో దుష్టత్వమును జరిగించి
వున్నాడని సెలవు యిచ్చెను. । కాబట్టి యెహోషువ 16
వుదయమందు త్వరగా లేచి, ఇశ్రాయేలును వారి వారి
గోత్రముల చొప్పున తీసుక వచ్చెను; అప్పుడు
యూదా గోత్రము పరిగ్రహించ పడెను. । తరువాత 17
అతడు యూదా వంశములను తీసుక వచ్చినప్పుడు
జహీయుల వంశమును ఆయన పరిగ్రహించెను;
అతడు జహీయుల వంశమును మనిషి మనిషిగా
తీసుక వచ్చినప్పుడు జబ్దీ పరిగ్రహించ బడెను. । తరు 18
వాత అతడు వాని యింటి కూటమును మనిషిమనిషిగా

తీసుక వచ్చెను, అప్పుడు యూదా గోత్రికుడైన
జెరాయొక్క కుమారుడైన జబ్దీకి పుట్టిన కర్మీయొక్క
19 కుమారుడయిన ఆఖాను పరిగ్రహించబడెను. । అప్పుడు
యెహోషువ ఆఖానుతో చెప్పినదేమంటే, ఓ నా
కుమారుడా, నీవు ఇశ్రాయేలుయొక్క దేవుడైన యె
హోవాకు మహిమను చెల్లించి, ఆయన యెదుట
వొప్పుకొనుము; నీవు చేసినది యేదో దాని నాకు తెలి
యచెప్పు, దాని నాకు మరుగు చేయకుము అని చెప్పి
20 నప్పుడు; । ఆఖాను యెహోషువకు ప్రత్యుత్తరము
గా చెప్పినదేమంటే, నిజముగా నేను ఇశ్రాయేలు
యొక్క దేవుడైన యెహోవాకు విరోధముగా పాప
21 ము చేస్తిని; యీలాగు యీలాగున చేస్తిని. । యేమం
టే, దోపుడు సొమ్ములో షిన్యారుయొక్క అందమైన
వొక వస్త్రమునున్ను, యిన్నూరు షెకేలుల వెండినిన్ని,
యాబయి షెకేలుల బంగారపు కడ్డినిన్ని నేను చూ
చినప్పుడు వాటిని ఆశించి పుచ్చుకొన్నాను; అవిగో
నా డేరా మధ్యమందు అవి భూమిలో దాచబడి
22 యున్నవి; దాని కింద వెండి వున్నదని చెప్పెను. । అం
తట యెహోషువ దూతలను పంపినప్పుడు వారు
డేరా యొద్దికి పరుగెత్తిరి, అదుగో, అది డేరాలో
23 దాచబడెను; దాని కింద ఆ వెండి వుండెను. । వారు
వాటిని ఆ డేరా మధ్యనుంచి తీసి యెహోషువ యొ
ద్దకున్ను ఇశ్రాయేలు పుత్రులందరి యొద్దకున్ను వచ్చి
24 యెహోవా సముఖమందు వేసినారు. । అప్పుడు
యెహోషువయున్ను ఇశ్రాయేలు వారందరున్ను
జెరాయొక్క కుమారుడయిన ఆఖానునున్ను, ఆ వెండి
నిన్ని, వస్త్రమునున్ను, బంగారపు కడ్డినిన్ని వాని కుమా
రులనున్ను, వాని కుమార్తెలనున్ను, వాని యెద్దులనున్ను,
వాని గార్దభములనున్ను, వాని గొర్రెలనున్ను, వాని
డేరానున్ను, వానికి కలిగిన సమస్తమునున్ను తీసుకొని
25 ఆఖోరు లోవకు వచ్చిరి. । అప్పుడు యెహోషువ
వాని చూచి, నీవు మమ్ములను యెందుకు బాధ
పరచితివి? యీ దినమందు యెహోవా నిన్ను బాధ
పరచును అని చెప్పెను; అప్పుడు ఇశ్రాయేలు వారం
దరున్ను రాళ్లచేత వాన్ని కొట్టిరి; వారిని రాళ్లచేత
26 కొట్టిన తరువాత అగ్నిచేత వారిని కాల్చివేసిరి. । మరి
న్ని వాని మీద రాళ్లను పెద్ద కుప్పగా వేసిరి, అది
నేటివరకు వున్నది: అప్పుడు యెహోవా తన కోప
ముయొక్క తీక్ష్ణమునుంచి తిరిగెను: కాబట్టి ఆ స్థలము
ఆఖోరు లోవయని నేటివరకు పిలువబడినదై వుండెను.

## 8. అధ్యాయము.

1 అప్పుడు యెహోవా యెహోషువకు సెలవు
యిచ్చినదేమంటే, నీవు భయపడకనున్ను వెరువకను
న్ను వుండుము: యుద్ధపు మనుష్యులనందరినిన్ని నీతో
కూడా తీసుకొని హాయి మీదికి వెళ్లు: యిదుగో
హాయియొక్క రాజునున్ను అతని జనులనున్ను అతని
పట్టణమునున్ను అతని దేశమునున్ను నీ చేతికి యిస్తిని. ।
యెరిఖో పట్టణమునున్ను దాని రాజునున్ను నీవు యే 2
లాగున చేస్తివో ఆలాగున హాయినిన్ని దాని రాజును
న్ను నీవు చేయ వలెను: అయితే దాని దోపుడు సొ
మ్మునున్ను దాని పశువులనున్ను మాత్రము మీరు మీ
కొరకు కొల్లగా తీసుకో వలెను: పట్టణమునకు వెనుకను
మాటు వుంచుకొమ్మని సెలవు యిచ్చెను. । అయినందున 3
యెహోషువయున్ను యుద్ధపు మనుష్యులందరున్ను
హాయి మీదికి వెళ్లడానకు లేచినారు; అప్పుడు యె
హోషువ ముప్పయివేల ప్రతాపము గల బలాఢ్యు
లను యెంచి రాత్రియందు వారిని పంపెను. । అతడు 4
వారితో చెప్పినదేమంటే, యిదుగో మీరు పట్టణము
వెనుక పొంచి వుండ వలెను; పట్టణమునకు దూరము
గా వెళ్లకండి; అందరున్ను సర్వసిద్ధముగా వుండ వలె
ను. । నేనున్ను నాతోనున్న జనులందరున్ను పట్టణము 5
దగ్గిరకు చేరుదుము, అప్పుడు సంభవించేదేమంటే,
వారు మా మీదికి వత్తురు గనక మునుపటిలాగున
వారు మా మీదికి వచ్చినప్పుడు మేము వారిని పట్ట
ణమునుంచి ఆకర్షించే పర్యంతము మేము వారి ముం
దరనుంచి పారిపోదుము; । యెందుకంటే, మునుపటి 6
లాగున వీరు మన ముందరనుంచి పారిపోతున్నారని
వారు అనుకొందురు, కాబట్టి మేము వారి ముందర
నుంచి పారిపోదుము. । అప్పుడు మీరు మాటులో 7
నుంచి లేచి పట్టణమును పట్ట వలెను, యెందుకంటే, యె
హోవా దాన్ని మీ చేతులకు అప్పగించును. । మీరు 8
పట్టణమును స్వాధీనము చేసుకొనిన తరువాత సంభవిం
చేదేమంటే, మీరు ఆ పట్టణమును తగల బెట్టవలెను;
యెహోవాయొక్క ఆజ్ఞా ప్రకారము మీరు చేయ
వలెను; యిదుగో నేను మీకు ఆజ్ఞాపిస్తినని చెప్పెను. ।
కాబట్టి యెహోషువ వారిని పంపిన తరువాత వారు 9
పొంచి వుండడానకు వెళ్లి, హాయియొక్క పశ్చిమ పా
ర్శ్వమున బేతేలుకున్ను హాయికిన్ని మధ్యను నిలిచి
వుండిరి; అయితే యెహోషువ ఆ రాత్రి జనుల
యొద్ద వుంటూ వుండెను. । ఉదయమందు యెహో 10
షువ త్వరగా లేచి జనులను లెక్కించుకొని, తానున్ను
ఇశ్రాయేలు పెద్దలున్ను జనుల ముందర హాయికి
వెళ్లిరి. । మరిన్ని అతనితోనున్న ఆయుధస్థులందరున్ను 11
పయికి వెళ్ల సమీపించి, పట్టణము ముందరకు వచ్చి,
హాయి వుత్తర పార్శ్వమందు దిగిరి; వారికిన్ని హాయి
కిన్ని సందున వొక లోవ వుండెను. । మరిన్ని అతడు 12
దాదాపుగా అయిదువేల మందిని తీసుకొని, పట్టణపు

పశ్చిమ పాశ్వర్ణమందు బేతేలుకున్ను హాయికిన్ని
13 మధ్యను మాటుగా వుంచినాడు. । అయితే పట్టణపు
ఉత్తర పార్శ్వమందున్న సమూహమైన వాండ్లనున్ను
పట్టణపు పశ్చిమ పాశ్వర్ణమందున్న వాండ్లయొక్క
పొంచేవాండ్లనున్ను వుంచడమైన తరువాత యెహో
14 షువ ఆ రాత్రియందు లోవ మధ్యకు వెళ్లెను. । హాయి
యొక్క రాజు అది చూచినప్పుడు సంభవించినదే
మంటే, వారు త్వరపడి వేగిరముగా లేచి, పట్టణపు
మనుష్యులు అనగా తానున్ను తన జనులందరున్ను
నిర్ణయమైన సమయమందు ఇశ్రాయేలుతో మైదా
నము ముందర యుద్ధము చేయడానకు వెలపటికి
వచ్చిరి; అయితే పట్టణము వెనుక వానికొరకు పొం
చుండేవారు యున్న సంగతి అతనికి తెలియక వుం
15 డెను. । అంతట యెహోషువయున్ను ఇశ్రాయేలు
వారందరున్ను వారి ముందర కొట్టబడిన వారై
నట్టుగా అగుపించి, అరణ్య మార్గముగా పారిపోయి
16 నారు. । అప్పుడు హాయిలో వున్న జనులందరున్ను వా
రిని తరమడానకు పిలువబడిరి: వారు యెహోషువను
17 తరిమినందున పట్టణమునుంచి లాగబడిరి. । అందువల్ల
ఇశ్రాయేలు వెంబడిని రానివాడు హాయి యందునై
నా బేతేలు యందునైనా వొకడూ లేకుండెను; వారు
పట్టణపు ద్వారములను ముయ్యక ఇశ్రాయేలును తరి
18 మినారు. । అప్పుడు యెహోవా యెహోషువకు
సెలవు యిచ్చినదేమంటే, నీవు చేత పట్టుకొనిన యీటె
హాయితట్టు చాపు, యెందుకంటే నీ చేతికి దాన్ని
యిత్తునని ఆనతిచ్చినప్పుడు, యెహోషువ తాను
19 చేత పట్టిన యీటె పట్టణము తట్టు చాపెను. । అతడు
తన చెయ్యి చాపినప్పుడు దక్షిణమందు పొంచివున్న
వారు త్వరగా తమ మాటులోనుంచి, లేచి, పరుగెత్తి
పట్టణములో ప్రవేశించి, దాన్ని పట్టి, ఆ పట్టణమును
20 దబ్బున తగలబెట్టిరి. । అయినందున హాయియొక్క మను
ష్యులు వెనుక తిరిగి చూచినప్పుడు యిదుగో పట్టణ
ముయొక్క ధూమము ఆకాశము తట్టు యెక్కుతూ
వుండెను, అందువల్ల యిటూ అటూ పరుగెత్తుటకు
వారికి శక్తి లేక పోయెను; అప్పుడు అరణ్యము తట్టు
పారిపోయిన జనులు తిరిగీ తరమ వచ్చిన వారి మీద
21 పడిరి. । మరిన్ని యెహోషువయున్ను ఇశ్రాయేలంద
రున్ను పొంచి వుండినవారు పట్టణమును పట్టినార
నిన్ని, పట్టణపు ధూమము యెక్కుతూ వున్నదనిన్ని
చూచినప్పుడు, వారు తిరిగీ వచ్చి హాయి పట్టణపు వా
22 రిని హతము చేసిరి. । అది గాక పట్టణమందున్నవా
రున్ను బయిలు వెళ్లి వారి మీదికి వచ్చిరి; యీలాగున
వారు ఇశ్రాయేలు మధ్యమందు కొందరు యీతట్టు
న్ను కొందరు ఆ తట్టున్ను వుండిరి; కాబట్టి వారు
వారిలో వొకడైనా వుండి పోకుండానున్ను వొకడ
యినా తప్పించుకోకుండానున్ను వుండేటట్టు వారిని
హతము చేసిరి. । అప్పుడు వారు హాయియొక్క రాజు 23
ను ప్రాణముతోటి పట్టుకొని యెహోషువ యొద్దికి
తీసుక వచ్చిరి. । అయితే ఇశ్రాయేలు హాయియొక్క 24
కాపురస్తులందరినిన్ని బయిట భూమి యందున్న
వారు వీరిని తరిమిన అరణ్యమందున్ను హతము చేయుట
సమాప్తమయిన తరువాతనున్ను, వారందరున్ను నాశన
మయ్యే మట్టుకు కత్తి వాడిచేత పడిన తరువాతనున్ను,
సంభవించినదేమంటే, ఇశ్రాయేలీయులందరున్ను తిరిగీ
హాయికి వచ్చి కత్తి వాడిచేత దాని కొట్టిరి. । కాబట్టి 25
ఆ దినమందు పడినవాండ్లు మొగవాండ్లున్ను ఆడువాం
డ్లున్ను పండ్రెండువేలమంది అయి వుండిరి, హాయియొ
క్క మనుష్యులందరున్ను నశించిరి. । యెందుకంటే యె 26
హోషువ హాయియొక్క కాపురస్తులందరినిన్ని సర్వ
నాశనము చేసే పర్యంతము యీటెతో చాపిన తన
చేతిని మళ్లీ తీసుకోకుండా వుండెను. । అయినప్పటికిన్ని 27
ఆ పట్టణపు పశువులనున్ను దోపుడు సొమ్మునున్ను ఇశ్రా
యేలు యెహోవా యెహోషువకు ఆజ్ఞాపించిన మా
ట ప్రకారము కొల్లగా తమకొరకు తీసుకొనిరి. । అంతట 28
యెహోషువ హాయిని కాల్చివేశి నేటివరకు వున్నట్టు
యెప్పటికి పాడయిన దిబ్బగా చేసెను. । మరిన్ని హాయి 29
యొక్క రాజును మాను మీద వురితీసి సాయంతనము
మట్టుకు వుంచినాడు; సూర్యుడు అస్తమించగానే యె
హోషువ అతని కళేబరమును మాను మీదనుంచి
దించి పట్టణపు ద్వారము వాకిటిలో వేసి దాని మీద
రాళ్లను పెద్ద కుప్పగా వేయండని ఆజ్ఞాపించెను; అది
నేటివరకు వున్నది. । తరువాత యెహోషువ ఏబాలు 30
పర్వతము మీద ఇశ్రాయేలుయొక్క దేవుడైన యె
హోవాకు వొక బలిపీఠమును కట్టించెను. । యిది యె 31
హోవాయొక్క సేవకుడైన మోషే ఇశ్రాయేలు
పుత్రులకు ఆజ్ఞాపించిన ప్రకారముగానున్ను మోషే
న్యాయ ప్రమాణముయొక్క గ్రంథములో వ్రాసిన
ప్రకారముగానున్ను కలిగి వుండెను; యేమంటే అది
యేకాండమయినటువంటిన్ని వాటి మీద యెవడయి
నా యినుప సరుకు యెత్తనటువంటిన్ని రాళ్లు గల బలి
పీఠమై యుండెను; దాని మీద వారు యెహోవాకు
హోమార్పణలను అర్పించి సమాధానార్పణలను చెల్లిం
చిరి. । అక్కడ అతడు ఆ రాళ్లమీద మోషే న్యాయ 32
ప్రమాణముయొక్క ప్రతి వ్రాసినాడు, ఇశ్రాయేలు
పుత్రుల యెదుట అది వ్రాసినాడు. । మరిన్ని ఇశ్రా 33
యేలు వారందరున్ను వారి పెద్దలున్ను అధికారులున్ను
న్యాయాధిపతులున్ను అన్యుడున్ను వారిలో పుట్టిన
వాడున్ను యెహోవాయొక్క వొడంబడికె గల పెట్టె

మోస్తూ వున్న అర్చకులయిన లేవీయుల ముందర
పెట్టె యివతలనున్ను పెట్టె అవతలనున్ను నిలిచి, వా
రిలో సగముమంది యెహోవాయొక్క సేవకుడైన
మోషే పూర్వమందు ఆజ్ఞాపించినట్టు ఇశ్రాయేలు జను
లను ఆశీర్వదించడానకు గెరిజ్జీము పర్వతమునకు యెదు
రుగానున్ను; సగము మంది ఏబాలు పర్వతమునకు
34 యెదురుగానున్ను, వుండిరి. । తరువాత అతడు న్యాయ
ప్రమాణముయొక్క వాక్యములన్నిటినిన్ని ఆశీర్వా
దములనున్ను శాపములనున్ను న్యాయప్రమాణముయొ
క్క గ్రంథములో వ్రాసిన యావత్తు ప్రకారముగా
35 చదివినాడు. । ఇశ్రాయేలు సంఘము యావత్తూ స్త్రీలు
న్ను చిన్నవాండ్లున్ను వారిలో సంచారులయిన పరదే
శులున్ను వీరందరి ముందర యెహోషువ మోషే
ఆజ్ఞాపించిన అంతటిలో చదవని మాట వొకటి లేక
వుండెను.

## 9. అధ్యాయము.

1 యర్దేను యివతల వున్న కొండల యందున్ను
లోవల యందున్ను లెబానోను యెదుటనున్న గొప్ప
సముద్ర ప్రాంతములన్నిటిలోనున్ను వున్న రాజులంద
రున్ను, హిత్తీయుడున్ను, అమోరీయుడున్ను, కెనయా
నీయుడున్ను, పెరిజ్జీయుడున్ను, హివ్వీయుడున్ను,
జెబూసీయుడున్ను యీ సంగతి విన్నప్పుడు సంభవిం
2 చినదేమంటే, । వారు యెహోషువతోనున్ను ఇశ్రాయే
లుతోనున్ను యుద్ధము చేయడానకు యేకగ్రీవముగా
3 కూడుకొన్నారు. । మరిన్ని గిబోను కాపురస్తులు యె
హోషువ యెరిఖో పట్టణమునకున్ను హాయి పట్టణ
4 మునకున్ను యేమి చేసెనో అది విన్నప్పుడు, । వారు
కపటోపాయము చేసుకొని వెళ్లి, తాము రాయభార
కర్తలనిపించుకొని, తమ గాడిదల మీద పాత
గిలిన గోనెలనున్ను చినిగి పోయి కుట్టపడిన పాత
5 ద్రాక్షారసపు సిద్దెలనున్ను తీసుకొని, । తమ పాదముల
మీద మాసికలు గల పాతగిలిన పాదరక్షలను తొడు
గుకొని, పాతగిలిన వస్త్రములను ధరించుకొని, తమ
సామగ్రిలో యెండిపోయి బూజుపట్టిన రొట్టెలను
6 వేసుకొని, । గిల్గాలుపేటలో వుండే యెహోషువ
యొద్దికి వెళ్లి, అతనితోనున్ను ఇశ్రాయేలీయులతోను
న్ను చెప్పినదేమంటే, మేము దూరదేశమునుంచి వచ్చిన
వారమై వున్నాము, కాబట్టి యిప్పుడు మీరు మా
తోటి వొక వొడంబడికెను చేయ వలసినదని చెప్పిరి. ।
7 అప్పుడు ఇశ్రాయేలీయులు ఆ హివ్వీయులను చూచి,
మీరు మాలో నివసించేవారేమో, అట్లయితే మీతో
వొడంబడికెను యేలాగు చేసుకొందుమని చెప్పిరి. ।
8 అందుకు వారు యెహోషువతో మేము నీ సేవకుల
మని చెప్పినప్పుడు, యెహోషువ మీరు యెవ్వరు,
యెక్కడనుంచి వస్తిరని వారిని అడిగెను. । అందుకు 9
వారు నీ సేవకులమైన మేము నీ దేవుడైన యెహో
వాయొక్క నామము నిమిత్తముచేత బహు దూర
దేశమునుంచి వస్తిమి, యెందుకంటే ఆయన కీర్తినిన్ని
ఆయన మిస్రయీములో చేసినదంతానున్ను, । య 10
ర్దేను అవతల వున్న అమోరీయుల యిద్దరు రాజు
లకు, అనగా, హెష్బోను రాజైన సీహోనుకున్ను
అష్తారోతులో వుండిన బాషాను రాజైన ఓగుకున్ను
ఆయన చేసినదంతానున్ను మేము విని యున్నాము. ।
అందునల్ల మా పెద్దలున్ను మా దేశపు కాపురస్తులంద 11
రున్ను మాతో చెప్పినదేమంటే, ప్రయాణమునకు సా
మగ్రి తీసుకొని వారికి యెదురుగా వెళ్లి, వారిని చూచి,
మేము మీ సేవకులము గనుక మాతో వొడంబడికెను
చేసుకొండని చెప్పుమని చెప్పి మమ్మును పంపినారు. ।
మీ యొద్దికి రావడానకు మేము బయిలుదేరిన దిన 12
మందు మా సామగ్రికోసము యీ రొట్టెలను మా
యిండ్లలోనుంచి వేడివిగా కట్టుకొన్నప్పటికిన్ని యిప్పు
డు యివిగో యెండిపోయి బూజు పట్టినవి. । మరిన్ని 13
యీ ద్రాక్షారసపు సిద్దెలు మేము నిండా పోసినప్పుడు
కొత్తవై వుండెను, అయితే యిప్పుడు యివిగో చినిగి
పోయినవి; మరిన్ని యీ మా వస్త్రములున్ను మా పా
దరక్షలున్ను ప్రయాణము బహు దూరము గనుక పాత
గిలి పోయినవని చెప్పిరి. । అప్పుడు ఇశ్రాయేలీయులు 14
యెహోవా వాక్య సన్నిధిని ఆలోచన అడగకుండా
ఆ మనుష్యులను వారి సామగ్రిని చూచి చేర్చుకొ
నిరి. । మరిన్ని యెహోషువ వారితో సమాధానము 15
నున్ను వారిని బ్రతకనిచ్చేటట్టుగా వొడంబడికెనున్ను
చేసుకొనెను; మరిన్ని సంఘాధిపతులు వారి విషయమై
సత్యము చేసిరి. । అయితే వారు వారితో వొడంబడి 16
కెను చేసుకొనిన మూడు దినములైన తరువాత సంభవిం
చినదేమంటే, వారు తమకు పొరుగువారయి యున్నా
రనిన్ని తమలోనే నివసించేవారయి యున్నారనిన్ని,
వారు వినిరి. । యేమంటే ఇశ్రాయేలు పుత్రులు సాగి 17
వెళ్లి మూడో దినమందు వారి పట్నములకు వచ్చినారు:
వారి పట్టణపు పేరులు యేమిటంటే, గిబోను, కెఫీరా,
బెయేరోతు, కిర్యత్యారీము అని వున్నవి. । అయితే 18
ఇశ్రాయేలు పుత్రులు వారిని కొట్ట లేదు, యెందు
కంటే, సంఘాధిపతులు ఇశ్రాయేలుయొక్క దేవుడైన
యెహోవా పేరట వారి విషయమై సత్యము చేసి
వుండిరి: కాబట్టి సంఘమంతా అధిపతుల మీద మొ
ర్రబెట్టెను. । అయితే అధిపతులు సంఘమంతటితో 19
చెప్పినదేమంటే, మనము ఇశ్రాయేలుయొక్క దేవుడ
యిన యెహోవా పేరట వారికి సత్యము చేస్తిమి,

20 కాబట్టి మనము వారిని ముట్ట కూడదు. । మనము వా
రికి యిచ్చిన ప్రమాణమువల్ల మన మీదికి కోపము
రాకుండా వుండేటట్టు వారికి చేసేదేమంటే, మనము
21 వారిని బ్రతకనిస్తామని చెప్పి, । అధిపతులు మరిన్ని
వారితో చెప్పినదేమంటే, వారిని సంఘమంతటికీ కర్ర
లు నరికే వాండ్లుగానున్ను నీళ్లు తోడేవాండ్లుగానున్ను
నిర్ణయించి, అధిపతులమయిన మేము వారితో చెప్పి
22 నట్టు బ్రతకనివ్వండని చెప్పిరి. । అయినందున యె
హోషువ వారిని పిలిపించి చూచి మీరు మాలో
నివాసులయి యుండిన్ని మీకు బహు దూరముగా
23 వున్నామని చెప్పి మమ్మును భ్రమపెట్టితిరేమి? । కాబట్టి
యిప్పుడు మీరు శపించబడి వున్నారు, యేమంటే
మీరు దాసులైయున్ని, నా దేవునియొక్క మందిరము
కొరకు కర్రలు నరికే వారైయున్ని నీళ్లు తోడేవారై
యున్ని వుండకుండా మీలో వదిలివేయబడేవాడు ఒక
24 డూ లేడని చెప్పినప్పుడు, । వారు యెహోషువకు
ప్రత్యుత్తరముగా చెప్పినదేమంటే, నీ దేవుడైన యె
హోవా యీ దేశము మీకు యిచ్చి దాని కాపుర
స్తులనందరినిన్ని మీ ముందరనుంచి నశింప చేతుమన్న
ట్టు తన సేవకుడైన మోషేకు యిచ్చిన సెలవు మీ సేవ
కులమయిన మాకు నిశ్చయముగా తెలియ చేయబడెను,
గనుక యీ హేతువుచేత మేము మా ప్రాణములను
గురించి మహా భయపడి యీ కార్యమును చేస్తిమి. ।
25 కాబట్టి యిదుగో మేము నీ వశమయి యున్నాము,
నీ దృష్టికి యేది మంచిదో యేది సరియయినదో అ
26 చొప్పున మమ్మును చేయండని చెప్పినందున, । అతడు
ఆలాగున చేసి, ఇశ్రాయేలు పుత్రులు వారిని హతము
చేయక వుండేటట్టు వారి చేతులలోనుంచి వారిని విడి
27 పించెను. । మరిన్ని యెహోషువ సంఘము కొరకున్ను
యే స్థలమును యెహోవా యెంచునో అక్కడ
ఆయన బలిపీఠము కొరకున్ను వారిని కర్రలు నరికే
వారుగానున్ను నీళ్లు తోడేవారుగానున్ను నేటి పర్యం
తము వున్నట్టు ఆ దినమందు నిర్ణయించెను.

## 10. అధ్యాయము.

1 అయితే యెహోషువ హాయి పట్టణమును పట్టి
సర్వనాశము చేసెననిన్ని, యెరిఖోకున్ను దాని రాజు
కున్ను యేలాగున చేసెనో ఆలాగున హాయికిన్ని
దాని రాజుకున్ను చేసెననిన్ని, గిబోనుయొక్క కాపు
రస్తులు ఇశ్రాయేలుతో సమాధానము చేసి వారిలో
వున్నారనిన్ని, యెరూశలేముయొక్క రాజైన అదోనీ
సెదెకు వినినప్పుడు సంభవించినదేమంటే, వారు మిక్కిలీ
2 భయపడిరి; । యెందుకంటే గిబోను గొప్ప పట్టణమై,
రాజ పట్టణములలో వొక దాని వలె వుండెను; మరిన్ని
హాయికంటే అది గొప్పదై వుండెను, దాని మనుష్యు
లందరున్ను బలాఢ్యులయి వుండిరి. । కాబట్టి యెరూ 3
శలేముయొక్క రాజైన అదోనీసెదెకు హెబ్రోను
రాజైన హోహాము యొద్దికిన్ని, యర్మూతు రాజైన
పిరాము యొద్దికిన్ని లాఖీషు రాజైన యాఫీయ యొద్ది
కిన్ని, ఎగ్లోను రాజైన దెబీరు యొద్దికిన్ని వర్తమా
నము పంపినదేమంటే, । మీరు వచ్చి గిబోనును కొట్టే 4
టట్టుగా నాకు సహాయము చేయండి, యెందుకంటే
అది యెహోషువతోనున్ను ఇశ్రాయేలు పుత్రులతో
నున్ను సమాధానము చేసుకొనెనని చెప్పి పిలిచినాడు. ।
కాబట్టి అమోరీయులయొక్క ఆ అయిదుగురు రాజులు, 5
అనగా, యెరూశలేము రాజున్ను, హెబ్రోను రాజు
న్ను, యర్మూతు రాజున్ను, లాఖీషు రాజున్ను, ఎగ్లోను
రాజున్ను కూడుకొని, తామున్ను తమ సైన్యములున్ను
పైకి వెళ్లి, గిబోను ముందర దిగి దాని మీద యుద్ధము
చేసిరి. । అప్పుడు గిబోను మనుష్యులు గిల్గాలు పేట 6
లో వున్న యెహోషువ యొద్దికి వర్తమానము పంపి
నదేమంటే, నీ సేవకులమైన మాకు నీ చెయ్యి వదలక
త్వరగా వచ్చి మాకు సహాయము చేసి, మమ్మును రక్షిం
చుము, యెందుకంటే పర్వతములందు కాపురస్తులైన
అమోరీయులయొక్క రాజులందరున్ను కూడుకొని మా
మీదికి వచ్చిరని చెప్పి పిలువనంపించిరి. । అయినందున 7
యెహోషువ తానున్ను తన యొద్దనున్న ఆయుధస్థు
లందరున్ను ప్రతాపము గల బలాఢ్యులందరున్ను గిల్గా
లునుంచి పయికి వెళ్లిరి. । యింతలో యెహోవా యె 8
హోషువకు సెలవు యిచ్చినదేమంటే, వారికి భయ
పడ వద్దు, యెందుకంటే నేను వారిని నీ చేతికి అప్ప
గిస్తిని; వారిలో నీ ముందర నిలువ గలవాడు వొకడూ
లేక వుండునని సెలవు యిచ్చెను. । కాబట్టి యెహో 9
షువ గిల్గాలునుంచి రాత్రి అంతా వెళ్లి వారి మీదికి
అథాత్తుగా వచ్చెను. । అప్పుడు యెహోవా వాం 10
డ్లను ఇశ్రాయేలు ముందర వోడగొట్టి, గిబోను దగ్గిర
ఘోరమైన హతముచేత వారిని సంహరించి, బేథో
రోనుకు వెళ్లే మార్గముగా వారిని తరిమి, అజేకా
మట్టుకున్ను మక్కేదా మట్టుకున్ను వారిని కొట్టివేసె
ను. । మరిన్ని వారు ఇశ్రాయేలు ముందరనుంచి పరు 11
గెత్తుతూ బేథోరోనుకు దిగుతూ వుండగా సంభవిం
చినదేమంటే, యెహోవా ఆకాశమునుంచి గొప్ప
రాళ్లను వారి మీద అజేకా మట్టుకు పడవేసినందున
వారు మరణమైపోయిరి: ఇశ్రాయేలు పుత్రులు కత్తి
చేత హతము చేసిన వారికంటే వడగండ్లచేత మరణ
మైనవారు అనేకులై వుండిరి. । యెహోవా అమోరీ 12
యులను ఇశ్రాయేలు పుత్రులకు అప్పగించిన దిన
మందు యెహోషువ యెహోవాతో మాట్లాడెను;

అప్పుడు అతడు ఇశ్రాయేలు దృష్టి యెదుట చెప్పిన
దేమంటే, వో సూర్యుడా, నీవు గిబోను మీదనున్న,
వో చంద్రుడా, నీవు ఆయాలోను లోవ యందున్న
13 నిలిచి వుండుడీ అని చెప్పినందున, । జనులు తమ
శత్రువులను ప్రతి హతము చేసే పర్యంతము సూర్యు
డు స్థిరపడెను, చంద్రుడు నిలిచెను: యీ సంగతి యా
షేరు గ్రంథములో వ్రాయబడి వుండలేదా? ఆలాగున
సూర్యుడు ఆకాశ మధ్యమందు నిలిచి వొక నిండు
దినమంత మట్టుకు అస్తమించుటకు త్వరపడక వుండె
14 ను. । యెహోవా మనుష్యుని శబ్దమును వినిన ఆ దిన
ములాటి దినము దానికి మునుపైనా దాని తరువాత
యైనా లేకుండెను, యేమంటే యెహోవా ఇశ్రా
15 యేలు కొరకు యుద్ధము చేసెను. । అప్పుడు యెహో
షువయున్ను అతనితో కూడా ఇశ్రాయేలందరున్ను
16 గిల్గాలు పేటకు తిరిగీ వచ్చిరి. । అయినప్పటికిన్ని ఆ
అయిదుగురు రాజులు పరుగెత్తి పోయి మక్కేదా
17 దగ్గిరనున్న వొక గుహలో దాగుకొనిరి. । అప్పుడు ఆ
అయిదుగురు రాజులు మక్కేదా దగ్గిరనున్న వొక
గుహలో దాగి వుండగా దొరికినారని యెహోషు
18 వకు తెలియచేయపడెను. । అందుకు యెహోషువ
చెప్పినదేమంటే, ఆ గుహ మూతి మీద గొప్ప రాళ్లను
పొర్లించి దాని దగ్గిర వారిని కాచుటకు మనుష్యులను
19 వుంచండి. । అయితే మీరు నిలువకుండా మీ శత్రు
వులను తరిమి, వెనుక వున్న వారిని కొట్టి, వారిని వారి
పట్టణములలో ప్రవేశించనివ్వకండి, యెందుకంటే మీ
దేవుడైన యెహోవా వారిని మీ చేతికి అప్పగించి
20 వున్నాడని చెప్పెను. । అయితే యెహోషువయున్ను
ఇశ్రాయేలు పుత్రులున్ను ఘోరమైన హతముచేత
వారు నాశనమయ్యే పర్యంతము వారిని హతము చేస్తూ
చాలించిన తరువాత సంభవించినదేమంటే, వారిలో
వుండిపోయిన శేషులు బురుజులు గల పట్టణములలోకి
21 ప్రవేశించిరి. । అంతట జనులందరున్ను మక్కేదా యం
దలి పేటలో వున్న యెహోషువయొద్దికి క్షేమము
గా తిరిగీ వచ్చిరి; ఇశ్రాయేలు పుత్రులలో యెవనిని
గురించైనా తన నాలుక ఆడించినవాడు వొకడూ లేక
22 వుండెను. । అప్పుడు యెహోషువ చెప్పినదేమంటే,
ఆ గుహయొక్క మూతి తీసి, ఆ గుహలోనున్న ఆ
అయిదుగురు రాజులను నా యొద్దికి తీసుకరండని
23 చెప్పినప్పుడు, । వారు ఆలాగున చేసి, ఆ అయిదుగురు
రాజులను, అనగా, యెరూశలేము రాజునున్ను, హె
బ్రోను రాజునున్ను, యర్మూతు రాజునున్ను, లాఖిషు
రాజునున్ను, ఎగ్లోను రాజునున్ను గుహలోనుంచి
24 అతని యొద్దికి తీసుక వచ్చిరి. । ఆ రాజులను వారు
బయిటతీసి యెహోషువ వొద్దికి తీసుకొని వచ్చినప్పు
డు సంభవించినదేమంటే, యెహోషువ ఇశ్రాయేలు
వారినందరినిన్ని పిలిపించి, తనతో బయిలువెళ్లిన ఆయు
ధస్థుల కధిపతులను చూచి, మీరు దగ్గిరకు పోయి యీ
రాజులయొక్క మెడలమీద మీ పాదములను వేయుం
డని చెప్పినప్పుడు వారు దగ్గిరకు పోయి తమ పాద
ములను వారి మెడల మీద వేసిరి. । అప్పుడు యెహో 25
షువ వారిని చూచి మీరు భయపడకనున్ను వెరువకను
న్ను వుండి, పౌరుషము వహించుకొని, ధైర్యముగా
వుండండి, యెందుకంటే మీరు యుద్ధముచేసే మీ
శత్రువులందరినిన్ని యెహోవా యీలాగున చేసు
నని చెప్పిన తరువాత, । యెహోషువ వారిని కొట్టి 26
హతము చేసి, అయిదు మానుల మీద వారిని వురి
తీసెను; వారు సాయంతనమయ్యే పర్యంతము ఆ మా
నుల మీదనే వ్రేలాడుతూ వుండిరి. । సూర్యుడు అస్త 27
మించే వేళలో సంభవించినదేమంటే, యెహోషువ
ఆజ్ఞాపించినందున వారు వారిని మానుల మీదనుంచి
దించి, వారు దాగి వుండిన గుహలోనే వారిని వేసి,
ఆ గుహ మూతి మీద గొప్ప రాళ్లను వేసిరి; అవి నేటి
వరకు వున్నవి. । మరిన్ని ఆ దినమందు యెహోషువ 28
మక్కేదాను పట్టి కత్తి వాడిచేత దాని కొట్టి, దాని
రాజునున్ను దానిలోనున్న వారినందరినిన్ని సర్వనాశ
నము చేసెను; అతడు వొకడైనా వుండి పోకుండా
చేసెను; అతడు యెరిఖో రాజుకు యేలాగున చేసెనో
ఆలాగున మక్కేదా రాజుకున్ను చేసెను. । తరువాత 29
యెహోషువయున్ను తనతోకూడా ఇశ్రాయేలంద
రున్ను మక్కేదాను విడచి వెళ్లి, లిబ్నాకు వచ్చి లిబ్నా
మీద యుద్ధము చేసిరి. । యెహోవా దాన్నిన్ని దాని 30
రాజునున్ను ఇశ్రాయేలు చేతిలోకి అప్పగించెను; అత
డు దాన్నిన్ని దానిలోనున్న వారినందరినిన్ని కత్తి
వాడిచేత సంహరించెను; అతడు వొకడయినా దాని
లో వుండిపోయేటట్టు చేయక, యెరిఖో రాజుకు
అతడు యేలాగు చేసెనో ఆలాగున దాని రాజుకున్ను
చేసెను. । తరువాత యెహోషువయున్ను తనతో 31
కూడా ఇశ్రాయేలందరున్ను లిబ్నాను విడచి లాఖి
షుకు వచ్చి దాని యెదుట దిగి దాని మీద యుద్ధము
చేసెను. । యెహోవా లాఖిషును ఇశ్రాయేలు చేతికి 32
అప్పగించినందున అతడు రెండో దినమందు దాన్ని
పట్టి దాన్నిన్ని దానిలోనున్న వారినందరినిన్ని అతడు
లిబ్నాకు చేసిన యావత్తు ప్రకారము కత్తి వాడిచేత
నరికివేసెను. । అంతలో గెజెరు రాజైన హోరాము 33
లాఖిషుకు సహాయము చేయడానకు వచ్చినాడు; అయి
తే యెహోషువ వాన్నిన్ని వాని జనులనున్ను వానికి
వొకడూ లేక పోయేటట్టుగా నరికివేసెను. । తరువాత 34
యెహోషువయున్ను తనతో కూడా ఇశ్రాయేలంద

రున్ను లాఖీషును విడచి వెళ్లి ఎగ్లోనుకు వచ్చి దాని
35 యెదుట దిగి దాని మీద యుద్ధము చేసిరి.। ఆ దిన
మందు వారు దాన్ని పట్టి కత్తి వాడిచేత నరికివేసి,
దానిలోనున్న వారినందరినిన్ని తాను లాఖీషుకు చేసిన
36 యావత్ప్రకారము సర్వనాశనము చేసెను.। తరువాత
యెహోషువయున్ను తనతో కూడా ఇశ్రాయేలంద
రున్ను ఎగ్లోనును విడచి వెళ్లి హెబ్రోనుకు వచ్చి దాని
37 మీద యుద్ధము చేసి,। దాన్ని పట్టి, కత్తి వాడిచేత
దాన్నిన్ని దాని రాజునున్ను దాని పట్టణములన్నిటి
నిన్ని దానిలో వున్న వారినందరినిన్ని నరికివేసి, తాను
ఎగ్లోనుకు చేసిన యావత్ప్రకారము శేషమైన వొకని
నైనా వుండనివ్వక దాన్నిన్ని దానిలో వున్న వారినం
38 దరినిన్ని సర్వనాశము చేసెను.। తరువాత యెహోషువ
యున్ను తనతో కూడా ఇశ్రాయేలందరున్ను మళ్లు
కొని దెబీరుకు వచ్చి దాని మీద యుద్ధము చేసి,।
39 దాన్నిన్ని దాని రాజునున్ను దాని పట్టణములన్నిటి
నిన్ని పట్టి, కత్తి వాడిచేత నరికివేసి, శేషమయిన వొకని
నైనా వుండనివ్వకుండా దానిలో వున్న వారినం
దరినిన్ని సర్వనాశనము చేసెను; అతడు హెబ్రోను
కున్ను లిబ్నాకున్ను దాని రాజుకున్ను యేలాగున
చేసెనో ఆలాగున అతడు దెబీరుకున్ను దాని రాజు
40 కున్ను చేసెను.। యీలాగున యెహోషువ కొండల
దేశములనున్ను దక్షిణ దేశములనున్ను లోవ దేశముల
నున్ను జెలలు గల దేశములనున్ను వాటి రాజులనున్ను
కొట్టివేసెను; అతడు వొకనినైనా వుండనివ్వకుండా
ఇశ్రాయేలుయొక్క దేవుడయిన యెహోవా ఆజ్ఞా
పించిన ప్రకారము వూపిరి గల వారినందరినిన్ని సర్వ
41 నాశనము చేసెను.। యెహోషువ కాదేష బర్నేయ
మొదలుకొని గాజా మట్టుకున్ను గోషెను దేశమం
42 తా గిబోను మట్టుకున్ను వారిని నరికి వేసెను.। యీ
రాజులందరినిన్ని వారి దేశమునున్ను యెహోషువ
వొక్క సమయమందు పట్టినాడు, యెందువల్లనంటే
ఇశ్రాయేలుయొక్క దేవుడైన యెహోవా ఇశ్రాయే
43 లు కొరకు యుద్ధము చేసెను.। అప్పుడు యెహోషు
వయున్ను తనతో కూడా ఇశ్రాయేలందరున్ను మళ్లు
కొని గిల్గాలు పేటకు వచ్చిరి.

## 11. అధ్యాయము.

1 అయితే యీ సంగతులను హాసోరు రాజైన యా
బీను వినినప్పుడు సంభవించినదేమంటే, అతడు మా
దోను రాజైన యోబాబుకున్ను, షిమ్రోను రాజు
2 కున్ను, అక్షాపు రాజుకున్ను,। కొండలయొక్క ఉత్తర
దిక్కుల యందున్ను కిన్నెరెతుకు దక్షిణపు మయి
దానములందున్ను లోవ యందున్ను పశ్చిమమందు
దోరు సరిహద్దులలోనున్ను వున్న రాజులకున్ను,। తూ 3
ర్పుయందున్ను పశ్చిమము యందున్ను వున్న కెనయా
నీయునికిన్ని, అమోరీయునికిన్ని, హిత్తీయునికిన్ని,
పెరిజ్జీయునికిన్ని, పర్వతములందున్న జెబూసీయుని
కిన్ని, మిస్పెదేశమందున్న హెర్మోను కిందవుండే
హీవీయునికిన్ని వర్తమానము పంపినందున,। వా 4
రున్ను వారితో కూడా వారి యావత్తు సైన్యము
లున్ను సముద్రతీరమందున్న యిసుకంత విస్తారమైన
జనము అతి విస్తారమైన గుర్రములతోనున్ను రథముల
తోనున్ను బయిలు వెళ్లిరి.। యీ రాజులందరున్ను కూ 5
డుకొనినప్పుడు ఇశ్రాయేలుతో యుద్ధము చేసుటకు
మెరోము వుదకముల సమీపమునకు వచ్చి దిగిరి.।
అప్పుడు యెహోవా యెహోషువకు సెలవు యిచ్చి 6
నదేమంటే, వారి నిమిత్తము భయపడకుము, యెందు
కంటే రేపు యీ వేళప్పుడు నేను వారిని ఇశ్రాయేలు
ముందర హతమైన వారినిగా అప్పగింతును; వారి గుర్ర
ముల కాళ్ల నరములను నరికి, వారి రథములను అగ్ని
చేత కాల్చుదువు గాకని సెలవు యిచ్చెను.। అంతట 7
యెహోషువయున్ను అతనితో కూడా ఆయుధస్థు
లందరున్ను మెరోము వుదకముల సమీపమందున్న
వారి యెదుటికి హఠాత్తుగా వచ్చి వారి మీద పడిరి.।
అప్పుడు యెహోవా వారిని ఇశ్రాయేలు చేతికి అప్ప 8
గించెను, వారు వారిని కొట్టి, మహా సీదోను మట్టుకున్ను
మిశ్రెఫోత్మయీము మట్టుకున్ను తూర్పుగా మిస్పెలోవ
మట్టుకున్ను తరిమి, శేషమైన వొకనినయినా వుండని
వ్వకుండా వారిని హతము చేసిరి.। మరిన్ని యెహో 9
షువ వారి గుర్రముల కాళ్లనరములను నరికి, వారి రథ
ములను అగ్నిచేత కాల్చి, యెహోవా తనకు యిచ్చిన
సెలవు చొప్పున వారికి చేసెను.। ఆ వేళప్పుడున్ను 10
యెహోషువ తిరిగీ వచ్చి, హాసోరును పట్టి దాని రా
జును కత్తిచేత హతము చేసెను, యెందుకంటే పూర్వ
ము హాసోరు ఆ రాజ్యములన్నిటికిన్ని ప్రధానమయి
వుండెను.। అందులో వున్న వారినందరినిన్ని వారు 11
కత్తి వాడిచేత నరికి సర్వనాశనము చేసిరి; వూపిరి
విడుచుటకు వొకడైనా విడువబడలేదు; అతడు హాసో
రును అగ్నిచేత కాల్చివేసెను.।ఆ రాజులయొక్క పట్టణ 12
ములనున్ను వాటి రాజులనున్ను యెహోషువ పట్టి, కత్తి
వాడిచేత నరికి, యెహోవాయొక్క సేవకుడైన మోషే
ఆజ్ఞాపించినట్టు వారిని సర్వనాశనము చేసెను.। అయితే 13
కొండల మీద వుండే పట్టణములలో హాసోరు గాక
ఇశ్రాయేలు వొకటైనా కాల్చక వుండెను, దాని
మాత్రము యెహోషువ కాల్చి వేసెను.। ఆ పట్టణ 14
ముల దోపుడు సొమ్మునున్ను పశువులనున్ను ఇశ్రా

యేలుపుత్రులు కొల్లగా తమ కొరకు తీసుకొనిరి;
అయితే వారు వారిని నశింప చేసే పర్యంతము కత్తి
వాడిచేత వారు ప్రతి మనిషినిన్ని సంహరించిరి; వూ
పిరి విడుచుటకు వారు వొకనినయినా వుండనివ్వలేదు.।
15 యెహోవా యే ప్రకారము తన సేవకుడైన మోషేకు
ఆజ్ఞాపించెనో ఆలాగున మోషే యెహోషువకు
ఆజ్ఞాపించెను, ఆ ప్రకారమే యెహోషువ చేసెను;
యెహోవా మోషేకు ఆజ్ఞాపించిన అన్నిటిలో వొక
16 దానినైనా అతడు చేయకుండా వుండలేదు.। యీలా
గున యెహోషువ ఆ దేశమంతటినిన్ని, కొండలను
న్ను, దక్షిణ దేశమంతటినిన్ని, గోషెను దేశమంతటి
నిన్ని, లోవనున్ను, మైదానమునున్ను, ఇశ్రాయేలు
17 పర్వతమునున్ను, దాని లోవనున్ను,। శెయీరుకు వెళ్లే
హాలాకు పర్వతము మొదలుకొని హెర్మోను పర్వతము
కింద వున్న లెబానోను లోవయందున్న బయల్గాదు
మట్టుకున్న పట్టినాడు; అతడు వాటి రాజులనున్ను
18 పట్టి కొట్టి హతము చేసెను.। చాలా కాలము మట్టుకు
ఆ రాజులందరితో యెహోషువ యుద్ధము చేసెను.।
19 గిబోను కాపురస్థులైన హీవీయులు గాక ఇశ్రాయేలు
పుత్రులతో సమాధానము చేసుకొనిన పట్టణము వొక
టీ లేక పోయెను; వారు యితరమైన వాటినన్నటినిన్ని
20 యుద్ధములో పట్టిరి.। యెందుకంటే వారు ఇశ్రాయే
లుతో యుద్ధము చేయడానకు వచ్చినందున అతడు
వారిని సర్వనాశనము చేసేటట్టుగానున్ను, యెహో
వా మోషేకు ఆజ్ఞాపించిన ప్రకారము వారు కనికరించ
బడకుండా అతడు వారిని సంహరించేటట్టుగానున్ను
వారి హృదయములను కఠినపరచుట యెహోవా
21 యొక్క వుద్దేశమై యుండెను.। మరిన్ని ఆ వేళప్పుడు
యెహోషువ వచ్చి, పర్వతములలోనున్న హెబ్రో
నులోనున్న దెబీరులోనున్న అనాబులోనున్న యూ
దా పర్వతములన్నిటిలోనున్న ఇశ్రాయేలు పర్వతము
లన్నిటిలోనున్ను వున్న అనాకీయులను సంహరించెను;
వారిని వారి పట్టణములతోను యెహోషువ సర్వనాశ
22 నము చేసెను.। ఇశ్రాయేలు పుత్రులయొక్క దేశమం
దు అనాకీయులలో వొకడైనా విడువబడ లేదు; గాజా
లోనున్న గాతులోనున్న అష్డోదులోనున్న మాత్ర
23 ము వారు వుండిరి.। యీలాగున యెహోషువ యె
హోవా మోషేకు ఆజ్ఞాపించిన అంతటి ప్రకారము
ఆ దేశమంతాను పట్టి ఇశ్రాయేలుకు వారి వారి గో
త్రముల విభాగముల ప్రకారము స్వాతంత్ర్యము
గా యెహోషువ యిచ్చెను: అప్పుడు ఆదేశము యు
ద్ధము చాలించి విశ్రమించెను.

## 12. అధ్యాయము.

ఇశ్రాయేలు పుత్రులు సూర్యోదయపు తట్టు 1
యర్దేను అవతల అర్నోను నది మొదలుకొని హె
ర్మోను పర్వతము మట్టుకున్న దేశమునున్ను తూర్పు
యందున్న మైదానమంతటినిన్ని స్వతంత్రించుకొని
నంతలో, వారు సంహరించిన ఆ దేశపు రాజులు యెవ
రెవరంటే,। అమోరీయుల రాజైన సీహోను; యిత 2
డు హెష్బోనులో నివసించిన వాడై, అర్నోను నదీ
తీరమందున్న అరోయేరునుంచిన్ని, నదీ మధ్యమునుం
చిన్ని, గిలాదు సగమునుంచిన్ని, అమ్మోను పుత్రుల
యొక్క సరిహద్దయిన యబ్బోకు నదీ పర్యంతమున్ను,।
మరిన్ని మైదానము మొదలుకొని తూర్పున యందున్న 3
కిన్నెరోతు సముద్రము పర్యంతమున్ను, బేత్యేషీమో
తుకు వెళ్లే మార్గమున మైదానపు సముద్రము అనగా
తూర్పుయందున్న వుప్పు సముద్ర పర్యంతమున్ను,
అష్దోత్పిస్గా కింద దక్షిణమునుంచిన్ని వున్న ప్రదేశ
మును యేలిన వాడై వుండెను.। మరిన్ని బాషాను రా 4
జైన ఓగు; యితడు దీర్ఘదేహులలో మిగిలిన వారిలో
వొకడై, అష్తారోతులోనున్న ఎద్రెయీలోనున్న నివ
సించిన వాడై వుండెను.। ఇతడు హెర్మోను పర్వత 5
మందున్న, సల్కాయందున్న, బాషాను యంతటి యం
దున్న గెషూరీయులు మయఖాతీయులు అనే వీరి
యొక్క సరిహద్దు మట్టుకున్న, హెష్బోను రాజైన
సీహోనుయొక్క సరిహద్దు అయిన సగము గిలాదు
మట్టుకున్న యేలినవాడై వుండెను.। వీరిని యెహో 6
వాయొక్క సేవకుడయిన మోషేయున్న ఇశ్రాయేలు
పుత్రులున్న సంహరించిన తరువాత యెహోవాయొ
క్క సేవకుడయిన మోషే ఆ దేశమును రూబేనీయు
లకున్న గాదీయులకున్న మనస్సే గోత్రములో సగ
ము మందికిన్ని స్వాతంత్ర్యముగా యిచ్చెను.। యెహో 7
షువయున్న ఇశ్రాయేలు పుత్రులున్న కొట్టినటువంటి
యర్దేను యివతల పశ్చిమమందు లెబానోనుయొక్క
లోవ యందుండే బయల్గాదు మొదలుకొని శెయీ
రుకు వెళ్లే మార్గమున వున్న హాలాకు పర్వతము మట్టు
కున్న వున్న దేశముయొక్క రాజులు వీరే; దాన్ని
యెహోషువ ఇశ్రాయేలు గోత్రములకు వారి వారి
విభాగముల చొప్పున స్వాతంత్ర్యముగా యిచ్చెను.।
పర్వతములందున్న, లోవలందున్న, మైదానములందు 8
న్ను, జెలలయందున్న, అరణ్యమందున్న, దక్షిణ దేశ
మందున్న వున్న హిత్తీయులున్న, అమోరీయులున్న,
కెనయానీయులున్న, పెరిజ్జీయులున్న, హీవీయులు
న్ను, జెబూసీయులున్న అనే వీరి రాజు లెవరెవరంటే,।
యెరిఖో రాజు వొకడున్న; బేతేలు పార్శ్వమందున్న 9

10 హాయి రాజు వొకడున్ను; । యెరూశలేము రాజు
11 వొకడున్ను; హెబ్రోను రాజు వొకడున్ను; । యర్మూ
తు రాజు వొకడున్ను; లాఖిషు రాజు వొకడున్ను; ।
12 ఎగ్లోను రాజు వొకడున్ను; గెజెరు రాజు వొకడున్ను; ।
13 దెబీరు రాజు వొకడున్ను; గెదెరు రాజు వొకడున్ను; ।
14 హోర్మా రాజు వొకడున్ను; అరాదు రాజు వొకడున్ను; ।
15 లిబ్నా రాజు వొకడున్ను; అదుల్లాము రాజు వొక
16 డున్ను; । మక్కేదా రాజు వొకడున్ను; బేతేలు రాజు
17 వొకడున్ను; । తప్పూయహ రాజు వొకడున్ను; హేఫె
18 రు రాజు వొకడున్ను; । ఆఫేకు రాజు వొకడున్ను;
19 షారోను రాజు వొకడున్ను; । మాదోను రాజు వొక
20 డున్ను; హాసోరు రాజు వొకడున్ను; । షిమ్రోన్మెరోను
21 రాజు వొకడున్ను; అక్షాఫు రాజు వొకడున్ను; । తయ
నఖు రాజు వొకడున్ను; మెగిద్దో రాజు వొకడున్ను; ।
22 కెదెషు రాజు వొకడున్ను; కర్మెలు సమీపమందున్న
23 యొక్నెయాము రాజు వొకడున్ను; । దోరు ప్రాంతమం
దున్న దోరు రాజు వొకడున్ను; గిల్గాలు జనాంగముల
24 రాజు వొకడున్ను; । తిర్స రాజు వొకడున్ను; యీ రాజు
లు ముప్పయి వొక్కమందై వుండిరి.

## 13. అధ్యాయము.

1 అంతట యెహోషువ వృద్ధుడైయున్ని బహు
దినములు గతించిన వాడైయున్ని వుండెను; అప్పుడు
యెహోవా అతనికి సెలవు యిచ్చినదేమంటే, నీవు
వృద్ధుడవైయున్ని బహు దినములు గతించిన వాడవైయున్ని
వున్నావు, అయితే స్వతంత్రించుకొనేటందుకు యింకా
2 చాలా దేశము వున్నది. । యింకా వున్న దేశము యే
మంటే, ఫెలిష్తీయుల సరిహద్దులనిన్ని, గెషూరీ అంత
3 యున్ను, । మిస్రయీము యెదుట వున్న సీహోరు
మొదలుకొని వుత్తరమందున్న ఎక్రోను సరిహద్దులమట్టు
కున్ను; అది కెనయానీయునికి యెంచబడి వున్నది:
ఫెలిష్తీయుల అయిదుగురు అధిపతులున్ను, అనగా,
గజాతీయులున్ను, అష్డోదీయులున్ను, ఎష్కెలోనీ
యులున్ను, గిత్తీయులున్ను, ఎక్రోనీయులున్ను; మరి
4 న్ని అవ్వీయులున్ను: । మరిన్ని దక్షిణ దిక్కునుంచి
కెనయానీయుల దేశము యావత్తున్ను, సీదోనీయుల
ప్రాంతమందున్న మెయారా మొదలుకొని ఆఫేకు
మట్టుకున్ను అమోరీయుల సరిహద్దుల పర్యంతమున్ను:।
5 మరిన్ని గిబ్లీయుల దేశమున్ను, సూర్యోదయము తట్టు
వుండే లెబానోను యావత్తున్ను, హెర్మోను పర్వ
తము కింద వున్న బయల్గాదు మొదలుకొని హమాతు
6 ప్రవేశ పర్యంతమున్ను: । లెబానోను మొదలుకొని మి
శ్రెఫోత్మయీము పర్యంతమున్ను వున్న కాపురస్థులంద
రున్ను, సీదోనీయులందరున్ను, వీరినందరినిన్ని నేను
ఇశ్రాయేలు పుత్రుల ముందరినుంచి తోలివేతును;
నేను నీకు ఆజ్ఞాపించినట్టు చీట్లు వేసుటచేత దాని
ఇశ్రాయేలీయులకు స్వాతంత్ర్యముగా పంచిపెట్టు
దువు గాక. । కాబట్టి నీవు యీ దేశమును తొమ్మిది 7
గోత్రములకున్ను మనస్సే గోత్రములో సగము మంది
కిన్ని స్వాతంత్ర్యముగా పంచిపెట్ట వలెనని సెలవు
యిచ్చెను. । యీ కొదువ సగము మందితో రూబేనీ 8
యులున్ను గాదీయులున్ను తమ స్వాతంత్ర్యములను
పొందినారు; అది మోషే వారికి తూర్పు యందు యొ
ర్దాను అవతల యిచ్చెను; అది యెహోవాయొక్క
సేవకుడైన మోషే వారికి యిచ్చినట్టు వారికి కలిగి వుం
డెను. । అర్నోను నదీ తీరమందున్న అరోయేరునుంచి 9
సాగిన భూమిన్ని, నదీ మధ్యమందున్న పట్టణమున్ను,
దీబోను మట్టుకు సాగిన మేదెబా మైదానము యావ
త్తున్ను; । అమ్మోను పుత్రులయొక్క సరిహద్దు మట్టు 10
కు వుండే హెష్బోనులో యేలిన అమోరీయుల రాజైన
సీహోనుయొక్క పట్టణములను యావత్తున్ను; । గిలా 11
దున్ను, గెషూరీయులు మయఖాతీయులు అనే వీరి
యొక్క సరిహద్దున్ను, హెర్మోను పర్వతము యావ
త్తున్న సల్కా మట్టుకు బాషాను దేశము యావత్తున్ను; ।
దీర్ఘ దేహుల శేషులలో మిగిలిన వాడైయున్ని అష్తా 12
రోతు యందున్ను ఎద్రెయీయందున్ను యేలిన వాడై
యున్ని వున్న ఓగుకు కలిగిన బాషానులో వుండే రా
జ్యము యావత్తున్ను వారికి కలిగి వుండెను; వీరిని
మోషే కొట్టి అవతలకు వెళ్లచేసెను. । అయినప్పటికిన్ని 13
ఇశ్రాయేలు పుత్రులు గెషూరీయులనున్ను మయఖా
తీయులనున్ను తోలివేయలేదు, అయితే గెషూరీయు
లున్ను మయఖాతీయులున్ను నేటివరకు ఇశ్రాయేలీ
యులలో కాపురస్థులై వున్నారు. । లేవీ గోత్రమునకు 14
మాత్రమే అతడు స్వాతంత్ర్యపు భాగమును యివ్వ
లేదు; ఇశ్రాయేలుయొక్క దేవుడయిన యెహోవాకు
చెల్లించే హోమార్పణలు ఆయన వారితో చెప్పి
నట్టు వారి స్వాతంత్ర్యపు భాగమవును. । రూబేను 15
పుత్రులయొక్క గోత్రమునకు మోషే వారి యింటి
కూటముల ప్రకారము వారికి స్వాతంత్ర్య భాగము
నిచ్చెను. । వారి సరిహద్దు అర్నోను నదీ తీరమందు 16
న్న అరోయేరునుంచి సాగి, నదీ మధ్యమందున్న పట్ట
ణమున్ను, మేదెబా మైదానము యావత్తున్ను; । హె 17
ష్బోనున్ను, మైదానమందుండే పట్టణములై యున్న
దీబోను, బామోత్బయలు, బేత్బయల్మెయోను; । యహ్సా, 18
కెదేమోతు, మేఫయతు, । కిర్యాతయీము, శిబ్మా, లోయ 19
యందుండే కొండ మీద సెరత్షహరు, । బేత్పయోరు, అ 20
ష్డోత్పిస్గా, బేత్యెషీమోతు, । వీటినిన్ని మైదానమందుండే 21
పట్టణముల యావత్తునున్ను, హెష్బోనులో యేలిన

అమొరీయుల రాజైన సీహోనుయొక్క రాజ్యమం
తౌనున్ను; యితన్ని మిద్యాను అధిపతులైన ఎవీయిన్ని,
రేకెమున్ను, సూరున్ను, హూరున్ను, రేబయున్ను
అనే వారితో మోషే సంహరించెను; వీరు సీహోను
యొక్క ప్రధానులై ఆ దేశమందు కాపురము చేసిరి.।
22 మరిన్ని బెయోరు కుమారుడయిన బలామనే సోదెకా
నిని ఇశ్రాయేలు పుత్రులు తమచేత హతమయిన వా
23 రిలో కత్తిచేత హతము చేసిరి. । మరిన్ని యర్దేను
నదిన్ని దాని సరిహద్దున్ను రూబేను పుత్రులకు సరి
హద్దయి వుండెను: యీ దేశముయొక్క పట్టణములు
న్ను దాని గ్రామములున్ను రూబేను పుత్రులకు వారి
యింటి కూటముల చొప్పన స్వాతంత్ర్యపు భాగ
24 మయి యుండెను. । మరిన్ని మోషే గాదు పుత్రులకు
వారి యింటి కూటముల చొప్పన ఆ గాదు పుత్రులకు
25 స్వాతంత్ర్యపు భాగము యిచ్చెను. । వారికి సరిహద్దు
యేమంటే, యజేరున్ను, గిలాదు పట్టణములన్నిన్ని,
రబ్బా యెదుట వుండే ఆరోయేరు మట్టుకు వున్న
26 అమ్మోను పుత్రులయొక్క భూమిలో సగమున్ను,। హె
ష్బోను మొదలుకొని రామత్మిస్పె పర్యంతమున్ను, బెథో
నీమున్ను, మహనయీము మొదలుకొని దెబీరు సరిహద్దు
27 పర్యంతమున్ను, । లోవ యందుండే బేతారామున్ను, బే
త్నిమ్రాయున్ను, సుక్కోతున్ను, సాఫోనున్ను, హె
ష్బోను రాజైన సీహోనుయొక్క రాజ్యములో కొదువ
దిన్ని, తూర్పు యందు యర్దేను అవతల వుండే కిన్నె
రెతు సముద్రపు దరి మట్టుకు యర్దేను నదిన్ని దాని
28 సరిహద్దున్ను; । యివి వాటి వాటి పట్టణములతోటిన్ని
గ్రామములతోటిన్ని గాదు పుత్రులకు వారి యింటి
కూటముల చొప్పన స్వాతంత్ర్యపు భాగమై వుండె
29 ను. । మరిన్ని మోషే మనస్సే గోత్రములో సగము మం
దికి స్వాతంత్ర్య భాగము యిచ్చెను; మనస్సే పుత్రుల
గోత్రములో సగము మందికి వారి యింటి కూటముల
30 చొప్పన స్వాతంత్ర్యపు భాగము యిది. ।వారి సరిహద్దు
యేమంటే, మహనయీమునుంచి సాగి, బాషాను యా
వత్తున్ను, బాషాను రాజైన ఓగుయొక్క రాజ్యము
యావత్తున్ను, బాషానులో వుండే యాయీరుయొ
క్క వూళ్లు అనగా అరువై పట్టణముల యావ
త్తున్ను, । గిలాదు సగమున్ను, బాషానులో ఓగు
రాజ్యమునకు కలిగిన పట్టణములై వున్న అష్తారో
తున్ను, ఎద్రెయీయున్ను; యివి మనస్సేయొక్క
కుమారుడైన మాఖీరు పుత్రులకు అనగా మాఖీరు
పుత్రులలో సగము మందికి వారి యింటి కూటముల
32 చొప్పన స్వాతంత్ర్యపు భాగమై యుండెను. । యీ
దేశములను మోషే యెరిఖో యెదుట తూర్పు యందు
యర్దేను నది అవతల వుండే మోయాబు మైదానము
లందు స్వాతంత్ర్యపు భాగములుగా పంచిపెట్టెను. ।
అయితే లేవీ గోత్రమునకు మోషే స్వాతంత్ర్యపు 33
భాగమును యిచ్చినాడు కాదు; ఇశ్రాయేలుయొక్క
దేవుడైన యెహోవా తాను వారితో చెప్పినట్టు
స్వాతంత్ర్యపు భాగమై యుండెను.

## 14. అధ్యాయము.

మరిన్ని కెనయను దేశమందు ఇశ్రాయేలు పుత్ర 1
లు స్వతంత్రించుకొనిన భాగములు యివి: వాటిని అర్చ
కుడయిన ఎలాజారున్ను నూను కుమారుడయిన యె
హోషువయున్ను ఇశ్రాయేలు పుత్రుల గోత్రముల
యొక్క పితృలలో ప్రధానులున్ను వారికి స్వాతం
త్ర్యముగా పంచిపెట్టిరి. । అయితే తొమ్మిది గోత్ర 2
ములనరమందికి ప్రాప్తించిన స్వాతంత్ర్యపు భాగములు
యెహోవా మోషే ద్వారా ఆజ్ఞాపించినట్టు చీట్లు
వేయడముచేత వారికి ప్రాప్తమాయెను. । యేమంటే 3
మోషే యర్దేను అవతల రెండు గోత్రములనరమం
దికి స్వాతంత్ర్యపు భాగమును యిచ్చెను, అయితే
వారిలో లేవీయులకు అతడు స్వాతంత్ర్యపు భాగ
మును యివ్వలేదు. । యెందుకంటే యోసేపు పుత్రుల 4
యిన మనస్సేయున్ను ఎఫ్రయీమున్ను రెండు గోత్ర
ములయి వుండిరి; కాబట్టి దేశమందు లేవీయులకు
వారు కాపురము చేయడానకు పట్టణములనున్ను వారి
పశువుల కొరకున్ను సామగ్రి కొరకున్ను పట్టణముల
కింద భూములనున్ను గాక మరి యే భాగమునైనా
యివ్వలేదు. । యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్టు 5
ఇశ్రాయేలు పుత్రులు చేసి, దేశమును పంచి పెట్టిన
వారైరి. । అంతట యూదా పుత్రులు గిల్గాలులో 6
వుండే యెహోషువ యొద్దికి వచ్చిరి; అప్పుడు కెని
జ్జీయుడైన యెఫున్నె కుమారుడైన కాలేబు అతనితో
చెప్పినదేమంటే, కాదెష బర్నేయలో యెహోవా
నన్ను గురించిన్ని నిన్నుగురించిన్ని దేవుని మనుష్యుడైన
మోషేతో చెప్పిన మాట నీవు యెరుగుదువు.। యెహో 7
వాయొక్క సేవకుడైన మోషే దేశమును పరిశోధించు
టకు నన్ను పంపినప్పుడు నేను నలుబై సంవత్సరముల
యీడు కలవాడనై వుంటిని; అప్పుడు నా హృదయ
మందు తోచినట్టు నేను అతనికి తిరిగీ వర్తమానము
తీసుక వచ్చినాను. । అయితే నాతో కూడా వచ్చిన 8
నా సహోదరులు జనులయొక్క హృదయమును కరి
గేటట్టు చేసినారు, అయినప్పటికిన్ని నేను నా దేవు
డైన యెహోవాను పరిపూర్ణముగా వెంబడించిన
వాడనయితిని. । కాబట్టి ఆ దినమందు మోషే సత్యము 9
చేసి చెప్పినదేమంటే, నీవు నా దేవుడయిన యెహో
వాను పరిపూర్ణముగా వెంబడించితివి గనుక అవశ్య

ముగా నీ పాదములు త్రొక్కిన భూమి నీకున్ను నీ
పుత్రులకున్ను నిత్యముగా స్వాతంత్ర్యపు భాగమై
10 వుండునని చెప్పెను. । అయినందున యిప్పుడు యిదు
గో యెహోవా తాను ఆనతిచ్చినట్టు యీ నలుబై
అయిదు సంవత్సరములు, అనగా, ఇశ్రాయేలు అరణ్య
మందు సంచరిస్తూ వుండగా యెహోవా యీ మాట
మోషేతో చెప్పినప్పటినుంచి నన్ను సజీవునిగా కా
పాడినందున యిప్పుడు యిదుగో యీ దినమందు నేను
యెనభై అయిదు సంవత్సరముల యీడు కలవాడనై
11 యున్నాను. । మోషే నన్ను పంపిన నాటియందు నాకు
యెంత శక్తి కలిగి వుండెనో అంత శక్తి నేటికి నాకు
కలిగి వున్నది; నా శక్తి అప్పుడు యేలాగునో ఆలా
గుననే యిప్పుడున్ను యుద్ధము కొరకున్ను వెలపటికి
వెళ్లుటకున్ను లోపటికి వచ్చుటకున్ను నా శక్తి వుంటూ
12 వున్నది. । కాగా ఆ దినమందు యెహోవా యే
పర్వతమును గూర్చి పలికెనో ఆ యీ పర్వతము
నీవు నాకు యివ్వవలసినది, యేమంటే నీవు ఆ దిన
మందు అనాకీయులు అక్కడ వున్నారనిన్ని పట్టణ
ములు బురుజులు కలిగి గొప్పవై యున్నవనిన్ని వింటివి;
అయినా యెహోవా నాకు తోడుగా వుండే పక్ష
మందు యెహోవా చెప్పినట్టు నేను వారిని తోలి
13 వేయ గలవాడనవుదునని చెప్పెను. । అప్పుడు యెహో
షువ అతని దీవించి, యెఫున్నె కుమారుడైన కాలేబుకు
14 హెబ్రోనును స్వాతంత్ర్యముగా యిచ్చెను. । కాబట్టి
హెబ్రోను కెనిజ్జీయుడయిన యెఫున్నె కుమారుడైన
కాలేబుకు నేటివరకు స్వాతంత్ర్యపు భాగమాయెను;
యెందుకంటే అతడు ఇశ్రాయేలుయొక్క దేవుడైన
యెహోవాను పరిపూర్ణముగా వెంబడించెను. ।
15 తత్పూర్వమందు హెబ్రోనుకు కిర్యతర్బా అనే పేరు
కలిగి వుండెను; యీ అర్బ అనాకీయులలో ఘనుడై
వుండెను. అప్పుడు దేశము యుద్ధము చేయడము మాని
విశ్రమించెను.

## 15. అధ్యాయము.

1 యూదా పుత్రుల గోత్రమునకు వారి యింటి
కూటముల చొప్పున ప్రాప్తించిన భాగము ఎదోము
సరిహద్దు మట్టుకు సాగినదాయెను; దక్షిణమందు సీను
అరణ్యము దక్షిణపు హద్దుయొక్క కడ భాగము అయి
2 వుండెను. । మరిన్ని వారి దక్షిణపు సరిహద్దు వుప్పు
సముద్ర తీరమునుంచి, అనగా, దక్షిణాభిముఖముగా
3 వున్న నాలుకనుంచి సాగి, । దక్షిణపు వైపుగా మయ
లేయక్రబ్బీముకు వచ్చి, సీనుకు వెళ్లి, దక్షిణ మార్గము
గా కాదెషబర్నెయకు యెక్కి, హెస్రోనును గడచి,
4 అదారుకు వెళ్లి, కర్కాకు చుట్టు తిరిగెను. । అక్కడ
నుంచి సాగి, అస్మోనా తట్టు గడచి, మిస్రయీము నది
మట్టుకు వెళ్లెను; యీ సరిహద్దుయొక్క కొన సము
ద్రము మట్టుకు వుండెను: యిది మీకు దక్షిణపు సరి
హద్దు అయి వుండును. । మరిన్ని తూర్పు సరిహద్దు 5
యేమంటే, వుప్పు సముద్రమున్ను యర్దేనుయొక్క
కొన మట్టుకు వుండెను; ఉత్తరమందున్న సరిహద్దు య
ర్దేనుయొక్క కడభాగమందున్న సముద్రపు నాలుక
నుంచి సాగి వుండెను. । యీ సరిహద్దు బేత్హొగ్లాకు 6
వెళ్లి, బేతరాబాను ఉత్తరపు వైపుగా గడచి, రూబేను
పుత్రుడైన బోహనుయొక్క రాతికి వచ్చెను. । మరిన్ని 7
యీ సరిహద్దు ఆఖోరు లోవనుంచి సాగి, దెబీరు తట్టు
వెళ్లి, ఆలాగున ఉత్తరముగా అనగా నదియొక్క దక్షిణ
పార్శ్వమందుండే అదుమ్మీముయొక్క యెక్కుడుకు
యెదుట వుండే గిల్గాలుకు అభిముఖముగా వెళ్లెను;
అక్కడనుంచి యీ సరిహద్దు సాగి, ఎన్షెమెషు వుదక
ములను గడచి, దాని కొన ఏన్రోగేలు దగ్గిర వుండెను. ।
మరిన్ని యీ సరిహద్దు హిన్నోము కుమారునియొక్క 8
లోవనుంచి యెక్కి, జెబూసీయునియొక్క దక్షిణ పా
ర్శ్వమున వెళ్లెను, అదే యెరూషలేము: మరిన్ని యీ
సరిహద్దు పశ్చిమపు తట్టు వున్న హిన్నోము లోవ
యెదుట వుండే పర్వతముయొక్క శిఖరము మట్టుకు
యెక్కెను; ఆ పర్వతము ఉత్తరమందుండే రెఫాయీ
యులయొక్క లోవ కొన యందు వున్నది. । అప్పుడు 9
యీ సరిహద్దు ఆ పర్వతము మీదనుంచి సాగి, మేనె
ప్తోయహుయొక్క జెల దగ్గిరకు వచ్చి, ఎఫ్రోను పర్వ
తముయొక్క పట్టణములకు వెళ్లెను; తరువాత యీ సరి
హద్దు బయలా మట్టుకు సాగెను; అది కిర్యత్యెహారీము
అయి వున్నది. । అప్పుడు యీ సరిహద్దు పశ్చిమముగా 1
బయలానుంచి చుట్టూ తిరిగిపోయి, శెయీరు పర్వత
ము మట్టుకు సాగి, యెహారీము అనే కెసాలోను పర్వ
తము ఉత్తర పార్శ్వమును గడచి, బేత్షెమెషుకు దిగి,
తిమ్నాతును గడిచెను. । అప్పుడు యీ సరిహద్దు ఉత్తర 1
మార్గముగా ఎక్రోను పార్శ్వమునకు వెళ్లెను; తరు
వాత యీ సరిహద్దు షిక్రోనుకు సాగి, బయలా పర్వ
తమును గడచి, యబ్నెయేలుకు వెళ్లెను; మరిన్ని యీ
సరిహద్దు కొన సముద్రము మట్టుకు వుండెను. । అయితే 1
పశ్చిమపు సరిహద్దు పెద్ద సముద్రమునకున్ను దాని సరి
హద్దుకున్ను సాగి వుండెను: యిది యూదా పుత్రు
లకు వారి యింటి కూటముల చొప్పున చుట్టూ అయిన
సరిహద్దు అయి వుండెను. । అయితే యెహోషువ యె 1
హోవా తనకు యిచ్చిన ఆజ్ఞ చొప్పున యూదా
పుత్రులలో జెఫున్నె కుమారుడైన కాలేబుకు భాగ
మును యిచ్చెను, అది యేమంటే, హెబ్రోను అనే
అనాకుయొక్క పితృడైన అర్బయొక్క పట్టణమై

14 యుండెను. । అయినందున కాలేబు అనాకుయొక్క
ముగ్గురు పుత్రులైన షేషై, అహీమను, తల్మయి అనే
పేరులు గల అనాకుకు పుట్టిన వీరిని అవతలకు తోలి
15 వేసెను. । మరిన్ని అతడు అక్కడనుంచి దెబీరు కాపు
రస్తుల యొద్దికి వచ్చెను; తత్పూర్వమందు దెబీరుకు
16 కిర్యత్సెఫెరు అనే పేరు కలిగి వుండెను. । కాలేబు
చెప్పినదేమంటే, కిర్యత్సెఫెరును కొట్టి పట్టిన వాడు
యెవడో వానికి నేను నా కుమార్తె అయిన అక్సాను
17 పెండ్లి చేతునని చెప్పెను. । అయినందున కాలేబు
సహోదరుడైన కెనజుయొక్క కుమారుడైన ఒత్ని
యేలు దాన్ని పట్టెను; కాబట్టి అతడు తన కుమార్తె
18 అయిన అక్సాను అతనికి పెండ్లి చేసెను. । అయితే
అది అతని యొద్దికి రాగానే సంభవించినదేమంటే,
నా తండ్రియొద్ద వొక పొలమును అడగ వలెనని అత
నికి తాత్పర్యము పుట్టించి తాను గార్దభము మీద
నుంచి దిగగానే, కాలేబు దాన్ని చూచి నీకు యేమి
19 కావలెనని అడిగినప్పుడు, । అది అతని చూచి ఆశీర్వా
దము వొకటి నాకు యిప్పించవలెను, యేమంటే నీవు
నాకు దక్షిణ భూమిని యిస్తివి, యింకా నాకు వుద
కపు జెలలు గల భూమిని యిప్పించ వలెనని చెప్పి
నప్పుడు అతడు దానికి మీది జెలలు గల భూమిన్ని
20 కింది జెలలు గల భూమిన్ని యిచ్చెను. । యిది యూదా
పుత్రులకు వారి యింటి కూటముల చొప్పున స్వాతం
21 త్ర్యపు భాగమై వుండెను. । మరిన్ని దక్షిణమందు
ఎదోము సరిహద్దు తట్టు యూదా పుత్రులకు కడ
భాగములందున్న పట్టణములు యేవేవంటే, కబ్సెయేలు,
22 ఏదెరు, యాగూరు, । కీనా, దీమోనా, అదాదా, ।
23,24 కెదెషు, హాసోరు, ఇత్నాను, । జీఫు, థెలెము, బెయా
25 లోతు, । హాసోరు, హదత్తా, కెరీయోతు, హాసోరు
26 అనే హెస్రోను, । అమాము, షెమా, మోలాదా, ।
27,28 హస్సర్గద్దా, హెష్మోను, బేత్పెలెథు, । హస్స
29 షూయాలు, బెయేర్షెబ, బిజోత్యా, । బయలా,
30 ఈయీము, అస్సెము, । ఎల్తోలదు, ఖెసీలు, హొ
31,32 ర్మా, । సిక్లగు, మద్మన్నా, సన్సన్నా, । లెబాయోతు,
షిల్హీము, అయీను, రిమ్మోను అనేవి: యీ పట్టణ
ములు వాటియొక్క గ్రామములతోను యిరువై తొ
33 మ్మిదై వున్నవి. । మరిన్ని లోవయందు ఎష్టావోలు,
34 సోరా, అష్నా, । జానోహ, ఏన్గన్నీము, తతూప్పయహ,
35 ఏనాము, । యర్మూతు, అదుల్లాము, శోఖో, అజే
36 కా, । షారాయీము, అదీతయీము, గెదేరా, గెదెరో
తాయీము; యివిఅన్ని వాటి గ్రామములతోను పద్నా
37 లుగు పట్టణములై వున్నవి. । మరిన్ని సెనాను, హదా
38 షా, మిగ్దల్గాదు, । దిల్యాను, మిస్పె, యొక్తెయేలు, ।
39,40 లాఖీషు, బొస్కతు, ఎగ్లోను, । కబ్బోను, లహ్మాము,
కిత్లీషు, । గెదేరోతు, బేత్దాగోను, నయమా, మక్కేదా; 41
యివి అన్ని వాటియొక్క గ్రామములతోను పదహారు
పట్టణములై వున్నవి. । మరిన్ని లిబ్నా, ఎతెరు, అషా 42
ను, । ఇప్తాహు, అష్నా, నెసీబు, । కెయీలా, 43,44
అక్జీబు, మారేషా; యివి అన్ని వాటియొక్క గ్రామ
ములతోను తొమ్మిది పట్టణములై వున్నవి. । మరిన్ని 45
ఎక్రోనున్ను దాని సంబంధపు పట్టణములున్ను గ్రా
మములున్ను: । ఎక్రోను మొదలుకొని సముద్రము 46
పర్యంతమూ అష్డోదు సమీపమందుండే వాటి గ్రామ
ములున్ను: । మరిన్ని అష్డోదున్ను దాని సంబంధపు 47
పట్టణములున్ను గ్రామములున్ను; మరిన్ని గాజాయు
న్ను మిస్రయీము నది మట్టుకు వున్న దాని సంబం
ధపు పట్టణములున్ను గ్రామములున్ను, పెద్ద సముద్ర
మున్ను దాని సరి హద్దున్ను: । మరిన్ని పర్వతములయం 48
దు షామీరు, యత్తీరు, శోఖో, । దన్నా, కిర్యత్సన్నా 49
అనే దెబీరు, । అనాబు, ఎష్టెమో, ఆనీము, । గోషె 50,51
ను, హోలోను, గీలో; యివి అన్ని వాటియొక్క
గ్రామములతోను పదకొండు పట్టణములై వున్నవి. ।
మరిన్ని అరాబు, దూమా, ఎషాను, । యానూము, 52,53
బేతప్పూయహు, అఫేకా, । హుమ్థా, కిర్యతర్బా అనే 54
హెబ్రోను, సీయోరు; యివి అన్ని వాటియొక్క
గ్రామములతోను తొమ్మిది పట్టణములయి వున్నవి. ।
మాయోను, కర్మెలు, జీఫు, యూత్తా, । ఇజ్రెయేలు, 55,56
యొక్దెయాము, జానోహ, । కయీను, గిబా, తిమ్నా; 57
యివి అన్ని వాటియొక్క గ్రామములతోను పది
పట్టణములయి వున్నవి. । మరిన్ని హల్హూలు, బేత్సూరు, 58
గెదోరు, । మయరాతు, బెతనోతు, ఎల్తెకోను; యివి 59
అన్ని వాటియొక్క గ్రామములతోను ఆరు పట్టణ
ములై వున్నవి. । మరిన్ని కిర్యత్బయలు అనే కిర్యత్యెహా 60
రీము, రబ్బా; యివి అన్ని వాటియొక్క గ్రామముల
తోను రెండు పట్టణములై వున్నవి. । మరిన్ని అరణ్య 61
మందు బేతరాబా, మిద్దీను, సెఖాఖా, । నిబ్షాను, 62
ఈర్మెలహు, ఏన్గెదీ; యివి అన్ని వాటి గ్రామములతోను
ఆరు పట్టణములయి వున్నవి. । యెరూశలేములో కాపు 63
రస్తులైన యెబూసీయులను గురించినదేమంటే, యూ
దా పుత్రులు వారిని తోలివేయలేక పోయిరి; అయి
నందున యెబూసీయులు నేటి వరకు యెరూశలేము
యందు యూదా పుత్రులతో కూడా కాపురము
చేస్తూ వున్నారు.

## 16. అధ్యాయము.

మరిన్ని యోసేపు పుత్రులయొక్క పాలు యే 1
దంటే, అది యెరిఖో దగ్గిర వున్న యర్దానునుంచి
తూర్పు యందుండే యెరిఖో వుదకము మట్టుకు సాగి,

యెరిఖోనుంచి బేతేలు పర్వతము కడాకు వెళ్లే అర
2 ణ్యమును గడచి, । అప్పుడు బేతేలునుంచి లూజుకు
సాగి వెళ్లి, అర్కీ సరిహద్దు వైపు ఆథారోతుకు వచ్చి, ।
3 పశ్చిమముగా యఫ్లేథియుల సరిహద్దుకున్ను కింద
వున్న బేథ్‌హోరోను సరిహద్దుకున్ను గెజెరుకున్ను దిగెను;
4 మరిన్ని దాని కొన సముద్రము మట్టుకు వున్నది. । యీ
లాగున యోసేపు పుత్రులైన మనస్సేయున్ను ఎఫ్ర
యీమున్ను తమ భాగమును స్వతంత్రించుకొనిరి. ।
5 అయితే ఎఫ్రయీము పుత్రులయొక్క సరిహద్దు వారి
యింటి కూటముల చొప్పున వుండేది యేలాగంటే,
తూర్పున యందు అత్రోతద్దారునుంచి మీద వున్న
6 బేథ్‌హోరోను మట్టుకు సాగెను. । అక్కడనుంచి ఆ సరి
హద్దు వెళ్లి, వుత్తరమందు సముద్రము వైపున వుండే
మిక్మెతాకు సాగెను: అప్పుడు ఆ సరిహద్దు తూర్పుగా
చుట్టూ తిరిగి, తయనత్షిలోకి వచ్చి, తూర్పు పార్శ్వ
7 మున దాన్ని గడచి యనోహాకు వచ్చి, । యనోహా
నుంచి ఆథారోతుకున్ను నయరాతుకున్ను దిగి, యెరి
8 ఖోకు వచ్చి, యర్దేను యొద్దికి వెళ్లెను. । మరిన్ని
ఆ సరిహద్దు తప్పూయహునుంచి పశ్చిమముగా కానా
నదికి సాగి వెళ్లి, దాని కొన సముద్రము యొద్ద వుండె
ను: యిది ఎఫ్రయీము పుత్రులయొక్క గోత్రమునకు
వారి యింటి కూటముల చొప్పున స్వాతంత్ర్యపు భా
9 గమై వుండెను. । మరిన్ని మనస్సే పుత్రులకు ప్రాప్తిం
చిన భాగములో ఎఫ్రయీము పుత్రుల కొరకు కేటిం
చబడిన పట్టణములు వుండెను, ఆ పట్టణములన్నిన్ని
10 వాటి గ్రామములున్ను. । గెజెరులో కాపురస్థులైన
కెనయానీయులను వారు తోలి వేయలేదు; అయితే
కెనయానీయులు నేటివరకు ఎఫ్రయీమీయులలో
కాపురము చేసి పన్నుకు లోనైన సేవకులై వున్నారు.

## 17. అధ్యాయము.

1 మనస్సే యోసేపుయొక్క ప్రథమ పుత్రుడైనం
దున అతని గోత్రమునకున్ను పాలు ప్రాప్తించెను:
మనస్సేకు ప్రథమ పుత్రుడైన గిలాదుయొక్క తండ్రి
అయిన మాఖీరుకు ఆ పాలు ప్రాప్తించెను, యెందు
కంటే అతడు యుద్ధపు మనుష్యుడు గనుక అతనికి
2 గిలాదున్ను బాషానున్ను ప్రాప్తించెను. । మనస్సే
పుత్రులలో కొదువ వారికి కూడా వారి యింటి కూట
ముల చొప్పున పాలు ప్రాప్తించెను; అది అబీ
యెజెరు పుత్రులకున్ను హేలెకు పుత్రులకున్ను అశ్రీ
యేలు పుత్రులకున్ను షెఖెము పుత్రులకున్ను హే
ఫెరు పుత్రులకున్ను షెమీదా పుత్రులకున్ను కలి
గెను; వీరు తమ యింటి కూటముల చొప్పున యోసేపు
కుమారుడైన మనస్సేయొక్క మొగపిల్లలై యున్నారు. ।
అయితే మనస్సేయొక్క కుమారుడయిన మాఖీరుకు 3
పుట్టిన గిలాదుయొక్క కుమారుడైన హేఫెరుకు కలి
గిన కుమారుడైన సెలోఫెహాదుకు కుమార్తెలే గాని
కుమాళ్లు లేక వుండిరి: అతని కుమార్తెల పేరులు
యేవంటే, మహ్లా, నోయా, హొగ్లా, మిల్కా, తిర్సా
అనేవై వున్నవి. । వీరు అచార్యుడైన ఎలాజారు యొ 4
ద్దికిన్ని నూను కుమారుడైన యెహోషువ యొద్దికిన్ని
అధిపతుల యొద్దికిన్ని వచ్చి చెప్పినదేమంటే, యెహో
వా మన సహోదరులలోగా మాకు స్వాతంత్ర్యపు
భాగము యిచ్చేటట్టు మోషేకు ఆజ్ఞాపించెనని చెప్పిరి,
కాబట్టి అతడు వారి తండ్రియొక్క సహోదరులలో
యెహోవా యిచ్చిన ఆజ్ఞాప్రకారము వారికి స్వా
తంత్ర్యపు భాగమును యిచ్చెను. । అయినందున య 5
ర్దేను అవతల వున్న గిలాదున్ను బాషానున్ను గాక
మనస్సేకు పది పాళ్లు ప్రాప్తించెను. । యెందుకంటే 6
మనస్సేయొక్క కుమార్తెలు అతని కుమాళ్లలో
స్వాతంత్ర్యపు భాగమును పొందిరి; అయితే మన
స్సేయొక్క కొదువ కుమాళ్లకు గిలాదు దేశము
ప్రాప్తించెను. । మనస్సేయొక్క సరిహద్దు ఆషేరునుంచి 7
షెఖెముయెదుట వుండే మిక్మెతాకు సాగెను; ఆ సరి
హద్దు కుడిపార్శ్వముగా సాగి, ఏన్తప్పూవ కాపురస్థుల
వైపు వెళ్లెను. । యీ తప్పూవ భూమి మనస్సేకు ప్రాప్తిం 8
చెను, అయితే మనస్సే సరిహద్దు యొద్ద వున్న తప్పూవ
ఎఫ్రయీము పుత్రులకు కలిగెను. । మరిన్ని ఆ సరి 9
హద్దు కానా నదికి, అనగా, ఆ నదియొక్క దక్షిణ
భాగము పర్యంతము దిగెను; ఎఫ్రయీముకు వున్న
యీ పట్టణములు మనస్సేయొక్క పట్టణములలోగా
వున్నవి: మరిన్ని మనస్సేయొక్క సరిహద్దు ఆ నది
యొక్క వుత్తర పార్శ్వమున వుండి సాగి, దాని కొన
సముద్రము మట్టుకు వుండెను. । దక్షిణపు తట్టు భూమి 10
ఎఫ్రయీముకున్ను వుత్తరపు తట్టు భూమి మనస్సేకు
న్ను కలిగి వుండెను; సముద్రము అతనికి సరిహద్దయి
వున్నది. యివి వుత్తరమందు ఆషేరుతోనున్ను తూర్పు
యందు ఇశ్శాఖారుతోనున్ను కలిసి వుండెను. । మరిన్ని 11
ఇశ్శాఖారు యందున్ను ఆషేరు యందున్ను మనస్సేకు
బేత్షెయానున్ను దాని వూరులున్ను, ఇబ్లెయామున్ను
దాని వూరులున్ను, దోరు కాపురస్థులున్ను దాని వూరు
లున్ను, ఏన్దోరు కాపురస్థులున్ను దాని వూరులున్ను,
తయనకు కాపురస్థులున్ను దాని వూరులున్ను, మెగి
ద్దో కాపురస్థులున్ను దాని వూరులున్ను, అని మూడు
ఖండములు కలిగి వుండెను. । అయితే మనస్సే పుత్రులు 12
ఆ పట్టణముల కాపురస్థులను తోలివేయలేక పోయిరి;
యేమంటే ఆ కెనయానీయులు ఆ దేశమందు కాపు
రము చేయడానకు మనస్సు గలవారై వుండిరి. । అయిన 13

ప్పటికిన్ని ఇశ్రాయేలు పుత్రులకు శక్తి కలిగినప్పుడు
వారు ఆ కెనయానీయుల మీద పన్ను కట్టిరి, అయితే
14 వారిని బొత్తిగా తోలివేయలేదు. । మరిన్ని యోసేపు
పుత్రులు యెహోషువతో చెప్పినదేమంటే, నేను
విస్తారమయిన జనమై వుండగా స్వతంత్రించుకొను
టకు వొక పాలు వొక భాగము మాత్రమే యిచ్చె
దేమి? యేమంటే యింతమట్టుకు యెహోవా నన్ను
15 ఆశీర్వదించి యున్నాడని చెప్పినప్పుడు; । యెహో
షువ వారితో చెప్పినదేమంటే, నీవు విస్తారమైన జన
మైనా ఎఫ్రయీము పర్వతము నీకు యిరుకయినా
అయి వుంటే నీవు అరణ్య భూమికి వెళ్లి, అక్కడ
పెరిజ్జీయుల దేశమునున్ను రెఫాయీయుల దేశము
నున్ను నీ కొరకు నీవే నరికి వేయుమని చెప్పెను. ।
16 అందుకు యోసేపు పుత్రులు అతని చూచి, ఆ పర్వతము
మాకు చాలదు, అదిగాక లోవ దేశమందు నివసించే
కెనయానీయులందరున్ను బేత్షెయానులోనున్ను దాని
వూరులలోనున్ను ఇజ్రెయేలు లోవయందున్ను వున్న
వారున్ను యినుప రథములు కలవారై వున్నారని
17 చెప్పిరి. । అయినందున యెహోషువ యోసేపు యింటి
కూటమునకు, అనగా, ఎఫ్రయీముతోటిన్ని మనస్సె
తోటిన్ని చెప్పినదేమంటే, నీవు అనేక జనమై వున్నం
దున నీకు విస్తారమయిన బలము కద్దు; వొక పాలు
మాత్రమే నీకు కాకుండా ఆ పర్వతమంతయున్ను నీదై
18 వుండును. । అయితే అది అడవి అయినప్పటికిన్ని
దాన్ని నీవు నరికివేతువు; దాని కొన కూడా నీదై వుం
డును; యేమంటే కెనయానీయులు యినుప రథములు
కలవారై మహా బలవంతులై యున్నప్పటికిన్ని నీవు
వారిని తోలివేయ వలెనని చెప్పెను.

## 18. అధ్యాయము.

1 అంతట ఇశ్రాయేలు పుత్రులయొక్క సంఘము
యావత్తూ షీలోకు కూడివచ్చి, సంఘముయొక్క డేరా
అక్కడ యెత్తి నిలిపిరి. దేశము వారి వశీకరమై వుం
2 డెను. । అయితే ఇశ్రాయేలు పుత్రులలో తమ స్వాతం
త్ర్యపు భాగము యింకా పొందక యుండే వారు
3 యేడు గోత్రములై వుండిరి. । కాబట్టి యెహోషువ
ఇశ్రాయేలు పుత్రులతో చెప్పినదేమంటే, మీ పితృల
యొక్క దేవుడైన యెహోవా మీకు యిచ్చిన దేశ
మును స్వతంత్రించుకొనేటట్టుగా వెళ్లడానకు యెన్నా
4 ళ్లమట్టుకు జబ్బు చేతురు. । మీలోనుంచి ప్రతి గోత్ర
మునకు ముగ్గురి ముగ్గురిని యివ్వండి; నేను వారిని పంపు
దును: వారు లేచి దేశములోబడి వెళ్లుతూ, తాము
నిర్ణయించుకొనిన స్వాతంత్ర్యమయ్యే భాగములను
5 వివరించి తిరిగీ నా యొద్దికి వత్తురుగాక. । వారు ఆ
భూమిని యేడు పాళ్లుగా విభజించ వలెను: యూదా
దక్షిణమందు తమ సరిహద్దులో వుంటూ వుండును;
యోసేపు యింటి కూటము వుత్తరమందు తమ సరిహ
ద్దులో వుంటూ వుండును. । కాబట్టి మీరు యీ దేశ 6
మును యేడు పాళ్లుగా వివరించి, నేను యిక్కడ మన
దేవుడైన యెహోవా సముఖమందు మీ కొరకు
చీట్లు వేయడానకు ఆ వివరము యిక్కడికి నా యొ
ద్దికి తీసుకొని వత్తురుగాక. । అయితే మీలో లేవీయు 7
లకు భాగము లేదు, యెందుకంటే యెహోవాయొ
క్క అర్చకత్వము వారికి స్వాతంత్ర్యపు భాగమై
వున్నది: మరిన్ని గాదున్ను రూబేనున్ను మనస్సె
గోత్రములో సగమున్ను వీండ్లు తూర్పుయందు య
ర్దేను అవతల యెహోవాయొక్క సేవకుడైన మోషే
వారికి యిచ్చిన తమ తమ స్వాతంత్ర్యపు భాగమును
పొంది వున్నారని చెప్పెను. । అప్పుడు ఆ మనుష్యులు 8
లేచి వెళ్లి పోయిరి: అయితే యెహోషువ దేశ
మును వివరించుటకు వెళ్లినవారికి ఆజ్ఞాపించినదేమంటే,
మీరు దేశములోబడి వెళ్లి, దాన్ని వివరించి, యి
క్కడ షీలోయందు నేను మీ కొరకు యెహోవా
సముఖమందు చీట్లు వేసేటట్టుగా తిరిగీ నా యొద్దికి
రండని ఆజ్ఞాపించి పంపెను. । అంతట ఆ మనుష్యులు 9
వెళ్లి దేశములోబడి గడచి, దాన్ని వొక గ్రంథములో
పట్టణము పట్టణము చొప్పున యేడు పాళ్లుగా వివ
రించి, తిరిగీ షీలోయందు సమూహముతో వుండే
యెహోషువ యొద్దికి వచ్చిరి. । అప్పుడు యెహో 10
షువ వారి కొరకు షీలోయందు యెహోవా సము
ఖమందు చీట్లు వేసినందున యెహోషువ అక్కడ
ఆ దేశమును ఇశ్రాయేలు పుత్రులకు వారి వారి విభా
గముల చొప్పున పంచిపెట్టెను. । అంతట బెన్యామీను 11
పుత్రులయొక్క గోత్రమునకు వారి యింటి కూటముల
చొప్పున పాలు ప్రాప్తించెను; వారి పాలుయొక్క
సరిహద్దు యూదా పుత్రులకున్ను యోసేపు పుత్రు
లకున్ను మధ్యఖండము ప్రాప్తించెను. । వారి సరిహద్దు 12
వుత్తరదిక్కు యందు యర్దేనునుంచి సాగెను; ఆ సరి
హద్దు యెరిఖో పక్కగా వుత్తర పార్శ్వము మందు వెళ్లి
పర్వతములలోబడి పశ్చిమముగా సాగెను; దాని కొన
బేతావెను అరణ్యము మట్టుకు వుండెను. । మరిన్ని ఆ 13
సరిహద్దు దక్షిణ మార్గముగా లూజుతట్టు వెళ్లి, లూజు
అనే బేతేలు పార్శ్వమునకు సాగెను; అప్పుడు ఆ
సరిహద్దు కింద వున్న బేథోరోనుకు దక్షిణపు వైపున
వున్న పర్వతము దగ్గిర వుండే అత్రోతద్దారుకు దిగిపో
యెను. । అక్కడనుంచి ఆ సరిహద్దు సాగి, దక్షిణమం 14
దుండే బేథోరోను అభిముఖముగా వున్న పర్వతము
నుంచి దక్షిణమందున్న సముద్రపు మూల చుట్టూ తిరిగి

పోయి, దాని కొన కిర్యత్బయలు మట్టుకు వుండెను;
అది కిర్యత్యెయారీము అయి యూదా పుత్రులకు కలి
గిన పట్టణమై వుండెను; యిది వారియొక్క పశ్చిమ
15 దిక్కయి వుండెను. । దక్షిణదిక్కు యేమంటే, కిర్యత్యె
యారీము కడనుంచి సాగెను; మరిన్ని ఆ సరిహద్దు
పశ్చిమము తట్టుగా వెళ్లి మేనెప్తోయహు నూతి మట్టు
16 కు సాగి పోయెను. । అప్పుడు ఆ సరిహద్దు వుత్తరమం
దుండే రెఫాయీయులయొక్క లోవ యందుండే
హిన్నోము కుమారుని లోవ యెదుటనున్న పర్వత
ముయొక్క కడ మట్టుకు దిగి, హిన్నోము లోవలో
నుంచి పోయి, దక్షిణమందుండే యెబూసీ పార్శ్వ
17 మునకు సాగి, ఏన్రోగేలుకు దిగివచ్చి, । వుత్తర దిక్కు
నుంచి సాగి వెళ్లి ఎన్షెమెషుకు వచ్చి, అదుమ్మీముయొ
క్క యెక్కుడు యెదుట వుండే గెలీలోతు తట్టుగా
సాగి, రూబేను కుమారుడైన బోహనుయొక్క రాతి
18 దగ్గరకు దిగి, । అరాబా పార్శ్వమున వుత్తరముగా
19 గడచి అరాబాకు దిగిపోయెను. । అప్పుడు ఆ సరిహద్దు
బేత్హోగ్లా పక్కను వుత్తరముగా సాగిపోయెను; మరి
న్ని ఆ సరిహద్దుయొక్క కొన యర్దేనుయొక్క దక్షి
ణపు కడదగ్గిర వుప్పు సముద్రముయొక్క వుత్తరపు
నాలుక మట్టుకు వుండెను; యిది దక్షిణపు సరిహద్దయి
20 వున్నది. । అయితే తూర్పు దిక్కులో యర్దేను దానికి
సరిహద్దయి వుండెను. యిది బెన్యామీను పుత్రు
లకు వారి యింటి కూటముల చొప్పున దాని చుట్టు
వున్న సరిహద్దుల ప్రకారముగా వున్న స్వాతంత్ర్యపు
21 భాగమై వుండెను. । అయితే తమ తమ యింటి కూట
ముల చొప్పున బేన్యామీను పుత్రులకు కలిగిన పట్ట
ణముల పేరులు యేమిటంటే, యెరిఖో, బేత్హోగ్లా,
22 కెఫ్సీసు లోవ, । బేతరాబా, సెమారయీము, బేతేలు, ।
23,24 అవ్వీము, పారా, ఒఫ్రా, । కెఫర్హాయమ్మోనాయి,
ఒఫ్నీ, గాబ; యివి వాటి గ్రామములతోను పండ్రెం
25 డు పట్టణములై వుండెను. । మరిన్ని గిబోను, రామా,
26,27 బేయేరోతు, । మిస్పె, కెఫీరా, మోసా, । రేకెము,
28 ఇర్పయేలు, తరలా, । సేల, ఎలెఫు, యెబూసీ అనే
యెరూశలేము, గిబాతు, కిర్యతు; యివి వాటి గ్రామ
ములతోను పద్నాలుగు పట్టణములై వుండెను. యిది
బెన్యామీను పుత్రులకు వారి యింటి కూటముల
చొప్పున స్వాతంత్ర్యపు భాగమై వున్నది.

## 19. అధ్యాయము.

1 తరువాత రెండో పాలు షిమోను, అనగా, షిమో
ను పుత్రులకు వారి యింటి కూటముల చొప్పున
ప్రాప్తించెను; వారి స్వాతంత్ర్యపు భాగము యూదా
2 పుత్రుల స్వాతంత్ర్యపు భాగములో వుండెను. । వారికి
స్వాతంత్ర్యముగా కలిగిన వేవంటే, బేయేర్షెబ, షెబా,
మోలాదా, । హస్సర్షూయాలు, బాలా, అస్సెము, । 3
ఎల్తోలదు, బెతూలు, హోర్మా, । సిక్లగు, బేత్మర్కా 4,5
బోతు, హస్సర్సూసా, । బేత్లెబాయోతు, షారుహెను; 6
యివి వాటి గ్రామములతోను పదమూడు పట్టణ
ములై వున్నవి. । మరిన్ని అయీను, రిమ్మోను, ఎతెరు, 7
అషాను; యివి వాటి గ్రామములతోను నాలుగు
పట్టణములై వున్నవి. । యివి గాక దక్షిణమందుండే 8
బయలత్బెయేరు అనే రామతు మట్టుకు యీ పట్టణ
ముల చుట్టూ వున్న గ్రామములన్నిన్ని వారికి కలవు.
యిది షిమోను పుత్రులకు వారి యింటి కూటముల
చొప్పున స్వాతంత్ర్యపు భాగమయి యున్నది. । షిమో 9
ను పుత్రుల స్వాతంత్ర్యపు భాగము యూదా పుత్రు
లయొక్క పాలులోనుంచి తియ్యబడినదై వుండెను,
యెందుకంటే యూదా పుత్రులయొక్క పాలు వారికి
అధికమై వుండెను; కాబట్టి షిమోను పుత్రులు వారి
స్వాతంత్ర్యపు భాగ మధ్యమందు భాగమును స్వతం
త్రించు కొనిరి. । మరిన్ని మూడో పాలు జెబూలోను 10
పుత్రులకు వారి యింటి కూటముల చొప్పున ప్రా
ప్తించెను; వారియొక్క స్వాతంత్ర్యపు భాగమయిన
సరిహద్దు శారీదు మట్టుకు సాగెను. । మరిన్ని వారి 11
సరిహద్దు సముద్రము మట్టుకున్ను మరలా మట్టుకున్ను
వెళ్లి, దబ్బాషెతుకు సాగి, యొక్నెయాము యెదుట
వుండే నదికి సాగెను. । తరువాత శారీదునుంచి సూ 12
ర్యోదయమయ్యే తూర్పుగా తిరిగి, కిస్లోత్తాబోరు
సరిహద్దు మట్టుకు వెళ్లి, దాబెరతుకు వచ్చి, యాఫీయకు
యెక్కి, । అక్కడనుంచి తూర్పుగా గిత్తాహెఫెరుకు 13
న్ను ఇత్తాకస్సీనుకున్ను వచ్చి, రిమ్మోను-మెతోయా
రు పక్కను నేయాకు వెళ్లిపోవును. । అప్పుడు ఆ సరి 14
హద్దు చుట్టూ తిరిగి, వుత్తర పార్శ్వమున హన్నాతో
నుకు పోవును, దాని కొన ఇఫ్తహేలు లోవ మట్టుకు
వున్నది. । మరిన్ని కత్తతు, నహల్లాలు, షిమ్రోను, ఇద 15
లా, బేత్లెహేము; యివి వాటి గ్రామములతోను పం
డ్రెండు పట్టణములై వున్నవి. । యిది జెబూలోను 16
పుత్రులకు వారి యింటి కూటముల చొప్పున స్వాతం
త్ర్యపు భాగమై యుండెను; యీ పట్టణములు వాటి
గ్రామములతోను వారికి కలిగి వుండెను. । నాలుగో 17
పాలు ఇశ్శాఖారుకు, అనగా, ఇశ్శాఖారు పుత్రులకు
వారి యింటి కూటముల చొప్పున వుండెను. । వారి 18
సరిహద్దు ఇజ్రెయేలున్ను, కెసుల్లోతున్ను, షూనేము
న్ను, । హఫారయీమున్ను, షీయోనున్ను, అనాహరా 19
తున్ను, । రబ్బీతున్ను, కిష్యోనున్ను, ఆబెస్సున్ను, । 20
రెమెతున్ను, ఏన్గన్నీమున్ను, ఏన్హద్దాయున్ను, బేత్ప 21
స్సేసున్ను, అనే వీటికి తట్టు వుండెను. । మరిన్ని ఆ 22

సరిహద్దు తాబోరుకున్ను, షహస్సీముకున్ను, బేత్షెమె
షుకున్ను సాగి వున్నది; వారి సరిహద్దు కొన యర్దే
ను నది మట్టుకు వుండెను; యివి వాటి గ్రామముల
23 తోను పదహారు పట్టణములై వుండెను. । యిది ఇశ్శా
ఖారు పుత్రులకు వారి యింటి కూటముల చొప్పున
స్వాతంత్ర్యపు భాగమై యుండెను; యీ పట్టణము
లున్ను వాటి గ్రామములున్ను వారికి కలిగి వుండెను.।
24 మరిన్ని అయిదో పాలు ఆషేరు పుత్రుల గోత్రము
నకు వారి యింటి కూటముల చొప్పున ప్రాప్తించెను.।
25 వారియొక్క సరిహద్దు హెల్కతున్ను, హలీయున్ను,
26 బెతెనున్ను, అక్షాపున్ను, । అలమ్మెలెఖున్ను, అమాదు
న్ను, మిషాలున్ను అల్లుకొని, పశ్చిమముగా కర్మెలు
27 కున్ను, షీహోర్లిబ్నాతుకున్ను సాగి, । సూర్యోదయ
ము తట్టు తిరిగి, బేత్దాగోనుకు వెళ్లి, జెబూలోనుకున్ను
బేతేమెకుకు వుత్తర పార్శ్వమందుండే ఇప్తహేలు లో
28 వకున్ను నీయేలుకున్ను సాగి, । యెడమ పార్శ్వమం
దుండే కాబూలుకున్ను, హెబ్రోనుకున్ను, రెహో
బుకున్ను, హమ్మోనుకున్ను, కానాకున్ను, మహాసీదోను
29 పట్టణము మట్టుకున్ను వెళ్లును. । అప్పుడు ఆ సరిహద్దు
తిరిగి, రామాకున్ను బలము గల సోరు పట్టణమునకు
న్ను వెళ్లును; అప్పుడు ఆ సరిహద్దు తిరిగి, హోసా
మట్టుకు సాగును; దాని కొన అక్జీబుమట్టుకు సాగే
30 సూలు దగ్గిర సముద్రము మట్టుకు వుండును. । మరిన్ని
ఉమ్మా, ఆఫేకు, రెహోబు, యివి కూడా వుండెను;
వారికి యిరువై రెండు పట్టణములున్ను వాటి గ్రామ
31 ములున్ను కలిగి వుండెను. । యిది ఆషేరు పుత్రుల
గోత్రమునకు వారి యింటి కూటముల చొప్పున
స్వాతంత్ర్యపు భాగమయి యున్నది, యీ పట్టణము
లున్ను వాటి గ్రామములున్ను వారికి కలిగి వున్నవి.।
32 ఆరో పాలు నఫ్తాలీ పుత్రులకు, అనగా, నఫ్తాలీ
పుత్రులకు వారి యింటి కూటముల చొప్పున ప్రాప్తిం
33 చెను. । వారి సరిహద్దు హేలెపునుంచిన్ని అల్లోలునుం
చిన్ని సాగి, సయనన్నీముకున్ను, ఆదామీకిన్ని, నెకె
బుకున్ను, యబ్నెయేలుకు వచ్చి, లక్కూము మట్టుకు
వెళ్లెను; దాని కొన యర్దేను నది మట్టుకు వుండెను.।
34 మరిన్ని ఆ సరిహద్దు పశ్చిమముగా తిరిగి, అజ్నోత్
తాబోరుకు వెళ్లి, అక్కడనుంచి హుక్కోకుకు పోయి,
దక్షిణ దిక్కులో జెబూలోనుకున్ను పశ్చిమ దిక్కులో
ఆషేరుకున్ను సూర్యోదయపు తట్టు యర్దేను తీర
35 మందుండే యూదాకున్ను సాగును. । బురుజులు గల
పట్టణములు యేవంటే, సిద్దీము, సేరు, హమ్మతు, రక్కతు,
36,37 కిన్నెరెతు, । ఆదామా, రామా, హాసోరు, । కెదెషు,
38 ఎద్రెయీ, ఏన్హాసోరు, । ఇరోను, మిగ్దలేలు, హొ
రేము, బేతనాతు, బేత్షెమెషు; యివి వాటి గ్రామము
లతోను పందొమ్మిది పట్టణములై వుండెను. । యిది నఫ్తాలీ 39
పుత్రుల గోత్రమునకు వారి యింటి కూటముల చొ
ప్పున స్వాతంత్ర్యపు భాగమై యున్నది; యీ పట్టణ
ములున్ను వాటి గ్రామములున్ను వారికి కలవు. ।
యేడో పాలు దాను పుత్రుల గోత్రమునకు వారి 40
యింటి కూటముల చొప్పున ప్రాప్తించెను. । వారి 41
స్వాతంత్ర్యపు భాగముయొక్క సరిహద్దు సోరా,
ఎష్తాయోలు, ఈర్షెమెషు, । షయలబ్బీను, అయా 42
లోను, ఇత్లా, । ఏలోను, తిమ్నాతాహు, యెక్రోను, । 43
ఎల్తెకే, గిబ్బెతోను, బయలాతు, । యెహూదు, 44,45
బెనేబెరకు, గాత్రిమ్మోను, । మెయర్కోను, రక్కోను, 46
వీటినిన్ని యాఫో యెదుట వుండే సరిహద్దునున్ను
అల్లుకొనెను. । అయితే దాను పుత్రులయొక్క సరిహద్దు 47
వారికి చాలక పోయెను గనుక దాను పుత్రులు లెషె
ము మీద యుద్ధము చేయడానకు వెళ్లి దాన్ని పట్టి,
కత్తి వాడిచేత నరికి స్వతంత్రించుకొని, దాని యందు
కాపురము చేసి, ఆ లెషెము దాను అనే తమ పితృ
డయిన దాను పేరట పిలిచిరి. । యిది దాను పుత్రుల 48
గోత్రమునకు వారి యింటి కూటముల చొప్పున స్వాతం
త్ర్యపు భాగమై వున్నది; యీ పట్టణములున్ను వాటి
గ్రామములున్ను వారికి కలవు. । అయితే వారు దేశ 49
మును దాని సరిహద్దుల చొప్పున స్వాతంత్ర్యపు భాగ
ములుగా పంచిపెట్టుట ముగించిన తర్వాతను ఇశ్రా
యేలు పుత్రులు తమలోగా నూను కుమారుడైన యె
హోషువకు స్వాతంత్ర్యపు భాగమును యిచ్చిరి. ।
యెహోవాయొక్క ఆజ్ఞాప్రకారము అతడు అడిగిన 50
పట్టణమును అతనికి యిచ్చిరి, అది యేమంటే, ఎఫ్ర
యీము పర్వతమందుండే తిమ్నత్సెరహు అయి వుం
డెను; ఆ పట్టణమును అతడు కట్టించి దానిలో కాపు
రము చేసెను. । యివి అర్చకుడయిన ఎలాజారున్ను 51
నూను కుమారుడయిన యెహోషువయున్ను ఇశ్రా
యేలు పుత్రుల గోత్రములయొక్క పితృలలో ప్రధా
నులున్ను షీలోయందుండే సంఘముయొక్క డేరా
ద్వారము దగ్గిర చీట్లు చేత యెహోవా సముఖమందు
స్వాతంత్ర్యమయ్యేటట్టుగా పంచిపెట్టిన స్వాతంత్ర్య
పు భాగములై వున్నవి. యీలాగున వారు దేశమును
పంచిపెట్టుట సమాప్తము చేసిరి.

## 20. అధ్యాయము.

మరిన్ని యెహోవా యెహోషువకు సెలవుయి 1
చ్చినదేమంటే, నీవు ఇశ్రాయేలు పుత్రులతో చెప్పవల
సినదేమంటే, । నేను మోషే ద్వారా మీతో చెప్పినటు 2
వంటి ఆశ్రయ పట్టణములను మీ కొరకు మీరు నిర్ణ
యించ వలెను. । అకస్మాత్తుగానున్ను అజ్ఞానముగానున్ను 3

వొకని చంపినవాడు అక్కడికి పరుగెత్తేటట్టు వాటిని
నిర్ణయించుకోండి; అవి రక్తమునకు ప్రతిహతము చేసే
4 వానినుంచి మీకు ఆశ్రయమై వుండును. । ఆ పట్టణ
ములలో వొక దానిలోకైనా పరుగెత్తినవాడు ఆ పట్ట
ణపు ద్వారముయొక్క వాకిటిలో నిలిచి, ఆ పట్టణపు
పెద్దలు వినేటట్టుగా తన కార్యమును తెలియ చెప్పి
నప్పుడు వారు అతని పట్టణము లోపటికి చేర్చుకొని,
అతడు వారిలో నివసించేటట్టుగా అతనికి స్థలము యి
5 త్తురు గాక. । అయితే రక్తమునకు ప్రతిహతము చేసే
వాడు అతని తరిమినట్టయితే, వారు ఆ చంపినవాని
అతని చేతికి అప్పగించ కూడదు, యెందుకంటే వాడు
తన పొరుగింటివాని తత్పూర్వమందు పగచేయకుండా
6 అజ్ఞానముగా చంపెను. । మరిన్ని అతడు ఆ పట్టణమం
దు తాను సంఘము ముందర విమర్శ కొరకు నిలిచే
పర్యంతమున్ను, ఆ దినములందుండే ప్రధానాచార్య
కుడు మరణమయ్యే పర్యంతమున్ను నివాసము చేస్తూ
వుండును; తరువాత అతడు యే పట్టణమునుంచి తాను
పరుగెత్తి పోయెనో దానికి అనగా తన పట్టణమున
కున్ను తన యింటికిన్ని తిరిగీ వచ్చును గాకని సెలవు
7 యిచ్చెను. । కాబట్టి వారు గాలీలులో నఫ్తాలీ పర్వత
మందుండే కెదెషునున్ను, ఎఫ్రాయీము పర్వతమందుం
డే షెకెమునున్ను, యూదా పర్వతమందుండే కిర్య
8 తర్బా అనే హెబ్రోనునున్ను కేటించిరి. । మరిన్ని
యర్దేను అవతల యెరిఖోకు తూర్పుగాను రూబేను
గోత్రములోనుంచి మైదానము మీదనున్న అరణ్యమం
దుండే బెస్సెరునున్ను, గాదు గోత్రములోనుంచి గిలా
దులో వుండే రామోతునున్ను మనస్సే గోత్రములో
నుంచి బాషానులో వుండే గోలానునున్ను నిర్ణయిం
9 చిరి. । యీ పట్టణములు అజ్ఞానముగా వొకని చంపిన
వాడు సంఘము ముందర నిలిచే పర్యంతమూ రక్తము
నకు ప్రతిహతము చేసే వానిచేత మరణము కాకుండా
అక్కడికి పరుగెత్తి పోయేటట్టుగా ఇశ్రాయేలు పుత్రు
లందరి కొరకున్ను వారిలో నివాసము చేసే పరదేశి
కొరకున్ను నిర్ణయించ బడినవై వుండెను.

## 21. అధ్యాయము.

1 అంతట లేవీయుల పితృలలో ప్రధానులు ఆచార్య
కుడయిన ఎలాజారు యొద్దికిన్ని నూనుయొక్క కుమా
రుడైన యెహోషువ యొద్దికిన్ని ఇశ్రాయేలు పుత్రుల
గోత్రములయొక్క పితృలలో ప్రధానుల యొద్దికిన్ని
వచ్చి, కెనయను దేశమందుండే షీలోలో వారితో
2 చెప్పినదేమంటే, నివసించే కొరకు పట్టణములనున్ను
మా పశువుల కొరకు వాటికింద వున్న భూములనున్ను
మాకు యివ్వ వలెనని యెహోవా మోషే ద్వారా
ఆజ్ఞాపించెనని చెప్పిరి. । అయినందున ఇశ్రాయేలు 3
పుత్రులు యెహోవాయొక్క ఆజ్ఞాప్రకారము లేవీ
యులకు తమ స్వాతంత్ర్యపు భాగములోనుంచి చెప్ప
బోయే యీ పట్టణములనున్ను వాటి కింద వున్న
భూములనున్ను యిచ్చిరి. । అప్పుడు పాలు కెహాతీయుల 4
యింటి కూటములకు ప్రాప్తించెను: అయితే ఆచార్యకు
డైన అహరోనుయొక్క పుత్రులైన లేవీయులకు చీట్లు
వేయడము చేత యూదా గోత్రములోనుంచిన్ని
షిమోను గోత్రములోనుంచిన్ని బెన్యామీను గోత్ర
ములోనుంచిన్ని పదమూడు పట్టణములు ప్రాప్తిం
చెను. । కెహాతు పుత్రులలో కొదువ వారికి చీట్లు 5
వేయడముచేత ఎఫ్రాయీము గోత్రపు యింటి కూట
ములలోనుంచిన్ని దాను గోత్రములోనుంచిన్ని మన
స్సే సగము గోత్రములోనుంచిన్ని పది పట్టణములు
ప్రాప్తించెను. । మరిన్ని గేర్షోను పుత్రులకు చీట్లు 6
వేయడముచేత ఇశ్శాఖారు గోత్రపు యింటి కూటము
లలోనుంచిన్ని ఆషేరు గోత్రములోనుంచిన్ని నఫ్తాలీ
గోత్రములోనుంచిన్ని బాషానులో వుండే మనస్సే
సగము గోత్రములోనుంచిన్ని పదమూడు పట్టణములు
ప్రాప్తించెను. । మెరారీ పుత్రులకు వారి యింటి కూట 7
ముల చొప్పున రూబేను గోత్రములోనుంచిన్ని గాదు
గోత్రములోనుంచిన్ని జెబూలోను గోత్రములోనుం
చిన్ని పండ్రెండు పట్టణములు ప్రాప్తించెను. । యీలా 8
గున ఇశ్రాయేలు పుత్రులు యెహోవా మోషే ద్వా
రా ఆజ్ఞాపించినట్టు యీ పట్టణములనున్ను వాటి కింద
వున్న భూములనున్ను చీట్లు వేయడముచేత లేవీయు
లకు యిచ్చిరి. । యూదా పుత్రుల గోత్రములోనుం 9
చిన్ని షిమోను పుత్రుల గోత్రములోనుంచిన్ని వాటి
వాటి పేరులచేత పిలువబడ్డ యీ పట్టణములను యి
చ్చిరి. । అవి లేవీ పుత్రులలో కెహాతీయుల యింటి 10
కూటములందుండే అహరోను పుత్రులకు కలిగి వుండె
ను; యెందుకంటే మొదటి పాలు వారిదై వుండెను. ।
అయినందున వారు వారికి యూదా కొండ దేశమం 11
దుండే అనాకు పితృడైన అర్బాయొక్క పట్టణమైన
హెబ్రోనున్ను దాని కింద చుట్టూ వున్న భూములను
న్ను యిచ్చిరి. । అయితే పట్టణముయొక్క పొలము 12
లున్ను దాని గ్రామములున్ను యెఫున్నె కుమారుడైన
కాలేబుకు స్వాతంత్ర్యముగా యిచ్చిరి. । యీలాగున 13
వారు ఆచార్యుడైన అహరోను పుత్రులకు మనిషిని
చంపినవానికి ఆశ్రయమైన పట్టణమయ్యేటట్టుగా
హెబ్రోనునున్ను దాని కిందైన భూములతోనున్ను,
లిబ్నానున్ను దాని కిందైన భూములతోనున్ను, । యత్తీ 14
రునున్ను దాని కిందైన భూములతోనున్ను ఎష్టెమో
యనున్ను దాని కిందైన భూములతోనున్ను, । హోలో 15

లోనునున్ను దాని కిందైన భూములతోనున్ను, దెబీరు
16 నున్ను దాని కిందైన భూములతోనున్ను, । ఆయ్యాను
నున్ను దాని కిందైన భూములతోనున్ను, యుత్తానున్ను
దాని కిందైన భూములతోనున్ను, బేత్షెమెషునున్ను
దాని కిందైన భూములతోనున్ను, యీ తొమ్మిది పట్ట
ణములనున్ను ఆ రెండు గోత్రములలోనుంచి యిచ్చిరి. ।
17 మరిన్ని బెన్యామీను గోత్రములోనుంచి గిబోనున్ను
దాని కిందైన భూములతోనున్ను, గెబనున్ను దాని
18 కిందైన భూములతోనున్ను, । అనాతోతునున్ను దాని
కిందైన భూములతోనున్ను, అల్మోనునున్ను దాని కిం
దైన భూములతోనున్ను, యీ నాలుగు పట్టణములను
19 యిచ్చిరి. । అయినందున అహరోను పుత్రులైన అర్చ
కులయొక్క పట్టణములు వాటి కిందైన భూములతో
20 పదమూడయి వుండెను. । మరిన్ని కెహాతు పుత్రుల
యింటి కూటములు, అనగా కెహాతు పుత్రులలో కొ
దువ లేవీయులున్ను ఎఫ్రయీము గోత్రములోనుంచి
21 తమకు పాలైన పట్టణములను పొందిరి. । యేలాగంటే
వారు వారికి మనిషిని చంపిన వాని కొరకు ఆశ్రయ
మైన పట్టణమయ్యేటట్టుగా ఎఫ్రయీము పర్వతమం
దుండే షెకెమునున్ను దాని కిందైన భూములతోను
న్ను, గెజెరునున్ను దాని కిందైన భూములతోనున్ను, ।
22 కిబ్సయీమునున్ను దాని కిందైన భూములతోనున్ను,
బేథోరోనునున్ను దాని కిందైన భూములతోనున్ను
23 యీ నాలుగు పట్టణములనున్ను యిచ్చిరి. । మరిన్ని
దాను గోత్రములోనుంచి ఎల్తెకానున్ను దాని కిందైన
భూములతోనున్ను, గిబ్బెతోనునున్ను దాని కిందైన
24 భూములతోనున్ను, । అయ్యాలోనునున్ను దాని కిందైన
భూములతోనున్ను, గాత్రిమ్మోనునున్ను దాని కిందైన
భూములతోనున్ను, యీ నాలుగు పట్టణములనున్ను
25 యిచ్చిరి. । మరిన్ని మనస్సే సగము గోత్రములోనుంచి
తానాకునున్ను దాని కిందైన భూములతోనున్ను, గా
త్రిమ్మోనునున్ను దాని కిందైన భూములతోనున్ను,
26 యీ రెండు పట్టణములను యిచ్చిరి. । యీ పది పట్ట
ణములున్ను వాటి కిందైన భూములతోను కెహాతు
పుత్రులలో కొదువ వారి యింటి కూటముల కొరకు
27 కలిగెను. । మరిన్ని లేవీయుల యింటి కూటములలో
గెర్షోను పుత్రుల కొరకు మనస్సే కొదువ సగము
గోత్రములోనుంచి మనిషిని చంపిన వానికి ఆశ్రయ
మయిన పట్టణమయ్యేటట్టుగా బాషానులో వుండే గో
లానునున్ను దాని కిందైన భూములతోనున్ను, బెయెష్త్రా
నున్ను దాని కిందైన భూములతోనున్ను, యీ రెండు
28 పట్టణములను యిచ్చిరి. । ఇశ్శాఖారు గోత్రములో
నుంచి కీషోనునున్ను దాని కిందైన భూములతోనున్ను
దాబెరహునున్ను దాని కిందైన భూములతోనున్ను, ।

యర్మూతునున్ను దాని కిందైన భూములతోనున్ను, 29
ఏన్గన్నీమునున్ను దాని కిందైన భూములతోనున్ను,
యీ నాలుగు పట్టణములను యిచ్చిరి. । మరిన్ని ఆషేరు 30
గోత్రములోనుంచి మిషాలునున్ను దాని కిందైన భూ
ములతోనున్ను, అబ్దోనునున్ను దాని కిందైన భూము
లతోనున్ను, । హెల్కతునున్ను దాని కిందైన భూము 31
లతోనున్ను, రెహోబునున్ను దాని కిందైన భూముల
తోనున్ను, యీ నాలుగు పట్టణములను యిచ్చిరి. ।
మరిన్ని నఫ్తాలీ గోత్రములోనుంచి మనిషిని చంపిన 32
వానికి ఆశ్రయమయిన పట్టణమయ్యేటట్టుగా గాలీ
లులో వుండే కెదెషునున్ను దాని కిందైన భూముల
తోనున్ను, హమ్మోత్దోరునున్ను దాని కిందైన భూ
ములతోనున్ను, కర్తానునున్ను దాని కిందైన భూముల
తోనున్ను, యీ మూడు పట్టణములను యిచ్చిరి. ।
గెర్షోనీయులయొక్క పట్టణములన్నిన్ని వారి యింటి 33
కూటముల చొప్పున వాటి కిందైన భూములతోను
పదమూడు పట్టణములై వుండెను. । మరిన్ని కొదువ 34
లేవీయులకు, అనగా, మెరారీ పుత్రుల యింటి కూట
ములకు జెబూలోను గోత్రములోనుంచి యొక్నెయా
మునున్ను దాని కిందైన భూములతోనున్ను, కర్తా
నున్ను దాని కిందైన భూములతోనున్ను, । దిమ్నానున్ను 35
దాని కిందైన భూములతోనున్ను, నహలాలునున్ను
దాని కిందైన భూములతోనున్ను, యీ నాలుగు పట్ట
ణములను యిచ్చిరి. । మరిన్ని రూబేను గోత్రములో 36
నుంచి బెస్సెరునున్ను దాని కిందైన భూములతోను
న్ను, యహస్సనున్ను దాని కిందైన భూములతోనున్ను, ।
కెదేమోతునున్ను దాని కిందైన భూములతోనున్ను, మేఫ 37
యతునున్ను దాని కిందైన భూములతోనున్ను, యీ
నాలుగు పట్టణములనున్ను యిచ్చిరి. । మరిన్ని గాదు గో 38
త్రములోనుంచి మనిషిని చంపినవానికి ఆశ్రయమయిన
పట్టణమయ్యేటట్టుగా గిలాదులో వుండే రామోతును
న్ను దాని కిందైన భూములతోనున్ను, మహనయీము
నున్ను దాని కిందైన భూములతోనున్ను, । హెష్బోను 39
నున్ను దాని కిందైన భూములతోనున్ను, యజేరునున్ను
దాని కిందైన భూములతోనున్ను, యీ నాలుగు పట్ట
ణములనున్ను యిచ్చిరి. । యీలాగున లేవీయుల యింటి 40
కూటములలో కొదువ వారైన మెరారీ పుత్రులకయిన
పట్టణములు వారి యింటి కూటముల చొప్పుననున్ను
వారికి ప్రాప్తించిన పాలు చొప్పుననున్ను పండ్రెండు
పట్టణములై వుండెను. । ఇశ్రాయేలు పుత్రుల స్వాతం 41
త్ర్యపు భాగ మధ్యమందుండే లేవీయుల పట్టణములు
వాటి కిందైన భూములతోను నలుబై యెనిమిది పట్ట
ణములై వుండెను. । యీ పట్టణములలో ప్రతి పట్టణ 42
ము దాని కిందైన భూములతో వుండెను, యీ ప్రకా

43 రమే యీ పట్టణములన్నీ వుండెను.।తరువాత యెహో
వా ఇశ్రాయేలుకు వారి పితృలకు యిస్తానని తాను
సత్యముతో చెప్పిన దేశమంతా యిచ్చినందున వారు
దాన్ని స్వతంత్రించుకొని దానిలో కాపురము చేసిరి.।
44 మరిన్ని యెహోవా వారి పితృలకు తాను చేసిన
సత్యప్రకారము వారికి నఖముఖాలా విశ్రమము యి
చ్చెను: వారి శత్రువులందరిలో వారి ముందర నిలువ
గలవాడు వొకడూ లేక వుండెను, వారి శత్రువులనం
దరినిన్ని యెహోవా వారి చేతికి అప్పగించెను.।
45 ఇశ్రాయేలు యింటి కూటముతోను యెహోవా
చెప్పిన మంచి మాటలలో వొకటైనా తప్పక వుండెను,
అంతా సంభవించెను.

## 22. అధ్యాయము.

1 అప్పుడు యెహోషువ రూబేనీయులనున్ను గా
దీయులనున్ను మనస్సే గోత్రములో సగము మందిని
2 న్ని పిలిపించి వారితో చెప్పినదేమంటే,। యెహోవా
యొక్క సేవకుడైన మోషే మీకు ఆజ్ఞాపించిన యావ
త్తునున్ను మీరు గైకొని, నేను మీకు ఆజ్ఞాపించిన
3 అన్నిటిలో నా శబ్దమును విని తిరిగితిరి.।అనేక దిన
ములనుంచి నేటి వరకు సహా మీరు మీ సహోదరు
లను విడువక, మీ దేవుడైన యెహోవా మీకు నియో
4 గించిన ఆజ్ఞను మీరు గైకొంటిరి.।యిప్పుడు మీ దేవు
డైన యెహోవా మీ సహోదరులకు తాను వారికి
యిచ్చిన మాటచొప్పున విశ్రమము యిచ్చి వున్నాడు;
కాబట్టి యిప్పుడు మీరు తిరిగీ, మీ కాపురములకు
న్ను యెహోవాయొక్క సేవకుడైన మోషే యర్దేను
ను అవతల మీకు యిచ్చిన మీ స్వాతంత్ర్యపు దేశ
5 మునకున్ను వెళ్లిపొండి.।అయితే మీరు జాగ్రతగా
వుండి, యెహోవాయొక్క సేవకుడైన మోషే మీకు
నిర్ణయించిన ఆజ్ఞనున్ను న్యాయప్రమాణమునున్ను
చేస్తూ, మీ దేవుడైన యెహోవాను స్నేహించి,
ఆయన మార్గములందు నడచి, ఆయన ఆజ్ఞలను గైకొ
ని, ఆయనతో సాత్తుకొని వుండి, మీ హృదయమంత
టితోనున్ను మీ ఆత్మ యంతటితోనున్ను ఆయనను సేవి
6 స్తూ వుండండని చెప్పెను.।యీలాగున యెహోషువ
వారిని దీవించి పంపివేసెను; వారు తమ తమ కాపు
7 రములకు వెళ్లిపోయిరి.।అయితే మనస్సే గోత్రములో
సగము మందికి మోషే బాషానులో భాగమును యి
చ్చి వుండెను; అయితే దాని కొదువ సగము మందికి
యెహోషువ పశ్చిమమందు యర్దేను యివతల వారి
సహోదరులలో భాగమును యిచ్చెను: యెహోషువ
వారి కాపురములకు వారిని పంపేటప్పుడు వారిని ఆశీ
8 ర్వదించి చెప్పినదేమంటే,।మీ కాపురములకు మీరు
విస్తారమైన కలిమితోనున్ను విస్తారమయిన పశువుల
తోనున్ను వెండితోనున్ను బంగారముతోనున్ను యిత్త
డితోనున్ను యినుముతోనున్ను బహు విస్తారమైన
వస్త్రములతోనున్ను తిరిగి పోయి, మీ సహోదరుల
తోను మీ శత్రువుల దోపుడు సొమ్మును పంచుకొం
డని చెప్పెను.।అయినందున రూబేను పుత్రులున్ను 9
గాదు పుత్రులున్ను మనస్సే గోత్రములో సగము మం
దిన్ని గిలాదు దేశమునకు, అనగా, మోషే ద్వారా యె
హోవా యిచ్చిన ఆజ్ఞా ప్రకారముగా వారు స్వతం
త్రించుకొనినటువంటి వారి స్వాస్థ్యమయిన దేశము
నకు తిరిగీ వెళ్లుటకు కెనయను దేశమందుండే షీలో
లో వున్న ఇశ్రాయేలు పుత్రుల యొద్దనుంచి తర్లిపో
యిరి.।వారు కెనయను దేశమందుండే యర్దేను తీర 10
మునకు వచ్చినప్పుడు, రూబేను పుత్రులున్ను గాదు
పుత్రులున్ను మనస్సే గోత్రములో సగము మందిన్ని
యర్దేను పార్శ్వమున వొక బలిపీఠమును, అనగా,
చూచుటకు వొక గొప్ప బలిపీఠమును కట్టిరి.।అంతట 11
యిదుగో రూబేను పుత్రులున్ను గాదు పుత్రులున్ను
మనస్సే గోత్రములో సగము మందిన్ని కెనయను దేశ
మునకు అభిముఖముగా యర్దేను తీరమందు ఇశ్రా
యేలు పుత్రులు దాటిన స్థలము దగ్గిర వొక బలిపీఠ
మును కట్టిరని ఇశ్రాయేలు పుత్రులకు వినపడెను.।
ఇశ్రాయేలు పుత్రులు అది విన్నప్పుడు ఇశ్రాయేలు 12
పుత్రులయొక్క సంఘమంతా వారి మీదికి యుద్ధము
కొరకు వెళ్లుటకు షీలోలో కూడిరి.।అప్పుడు ఇశ్రా 13
యేలు పుత్రులు ఎలాజారు కుమారుడైన ఫీనెహాసును
న్ను,।అతనితోను ఇశ్రాయేలు గోత్రములన్నిటిలో 14
ప్రతి పితృని యింటికి వొకొక్క మనిషి చొప్పున
పదిమంది ప్రభువులనున్ను, గిలాదు దేశమందున్న రూ
బేను పుత్రుల యొద్దకున్ను గాదు పుత్రుల యొద్దకు
న్ను మనస్సే గోత్రములో సగము మంది యొద్దకున్ను
పంపిరి: యీ పది మందిలో ప్రతి మనుష్యుడు ఇశ్రా
యేలు వెయివేల మందిలో తన తన పితృని యింటికి
అధిపతి అయి వుండెను.।వీరు గిలాదు దేశమందున్న 15
రూబేను పుత్రుల యొద్దకున్ను గాదు పుత్రుల యొద్ద
కున్ను మనస్సే గోత్రములో సగము మంది యొద్దకు
న్ను వచ్చి వారితో యీలాగున పలికిరి;।యెహో 16
వాయొక్క సంఘమంతా మీతో చెప్పేదేమంటే, యీ
దినమందు యెహోవా వెంబడినుంచి మీరు తిరిగి
పోయేటట్టు ఇశ్రాయేలు దేవుని విషయమై మీరు
చేసిన యీ తప్పు యేమిటి? యీ దినమందు మీరు
యెహోవాకు విరోధముగా తిరుగుబాటు చేసేటట్టు
గా మీరు మీ కొరకు వొక బలిపీఠమును కట్టుకొని
వున్నారు.।పెయోరుయొక్క అక్రమము మనకు అతి 17

స్వల్పమైనదా! యెహోవావారియొక్క సంఘము మీద
తెగులు సంభవించినప్పటికిన్ని అందులోనుంచి మనము
18 నేటి వరకున్ను పవిత్రులము కాక వున్నాము. । యిం
కా యిప్పుడున్ను యెహోవా వెంబడినుంచి తిరిగి
పోయేవారయి యున్నారా? నేడు మీరు యెహో
వాకు విరోధముగా తిరుగు బాటు చేసేవారయితే
రేపు ఆయన ఇశ్రాయేలుయొక్క సంఘమంతటి మీద
19 కోపముగా వుంటాడు. । మీ స్వాస్థ్యమైన దేశము
అపవిత్రమయితే యెహోవావారియొక్క డేరా యెక్క
డ నివాసముగా వున్నదో యెహోవావారియొక్క స్వా
స్థ్యమయిన ఆ దేశమునకు మీరు దాటి వచ్చి మాలో
స్వాస్థ్యమును తీసుకొండి; అయితే మన దేవుడయిన
యెహోవావారియొక్క బలిపీఠము గాక మరి వొక బలి
పీఠమును కట్టుకొనుటవల్ల యెహోవాకు విరోధము
గా తిరుగుబాటు చేయకనున్ను మాకు విరోధముగా
20 తిరుగుబాటు చేయకనున్ను వుండండి. । జెరా కుమారు
డయిన ఆఖాను శాపగ్రస్తమయిన దాని విషయమై
తప్పుచేసినందువల్ల ఇశ్రాయేలు సంఘమంతటి మీద
కోపము పడలేదా! ఆ మనుష్యుడు తన అక్రమమందు
వొంటరిగా నశించ లేదు అని వారు చెప్పినప్పుడు; ।
21 రూబేను పుత్రులున్ను గాదు పుత్రులున్ను మనస్సే
గోత్రములో సగము మందిన్ని ప్రత్యుత్తరముగా
ఇశ్రాయేలుయొక్క వెయివేల మందియొక్క ప్రధాను
22 లతో చెప్పినదేమంటే; । దేవతలకు దేవుడయిన యె
హోవా తాను యెరుగును, ఇశ్రాయేలున్ను తెలుసు
కొనును; యెహోవాకు విరోధముగా యిది తిరుగు
బాటుచేతనో, లేక అతిక్రమముచేతనో అయి వున్న
పక్షమందు మమ్మును నేడు రక్షించక పోవును గాక. ।
23 యెహోవా వెంబడినుంచి మేము తిరిగిపోవుటకో,
లేక దాని మీద హోమార్పణనైనా భోజనార్ప
ణనైనా చెల్లించుటకో, లేక దాని మీద సమాధానా
ర్పణలను చెల్లించుటకో, మేము యీ బలిపీఠమును
కట్టి యున్న పక్షమందు యెహోవా తానే యీ
24 సంగతిని విచారించును గాక. । అది కాదు గాని యీ
నిమిత్తముచేత మేము జడిసి దాని చేసితిమి; మేము
అనుకొనినదేమంటే, ఇక మీదట మీ పుత్రులు మా
పుత్రులతో, మీకున్ను ఇశ్రాయేలుయొక్క దేవుడైన
25 యెహోవాకున్ను నిమిత్తమేమి! । యెందుకంటే యె
హోవా యర్దానును మాకున్ను మీకున్ను సరిహద్దు
గా నిర్ణయించెను; ఓ రూబేను పుత్రులారా, గాదు
పుత్రులారా, యెహోవా యందు మీకు భాగము
లేదని పలుకుదురేమో; అందువల్ల మీ పుత్రులు మా
పుత్రులను యెహోవాకు భయపడుట మాన్పివేతు
26 రు. । అందు కొరకు మేము అనుకొనినదేమంటే, యి

ప్పుడు మనము వొక బలిపీఠమును కట్టుకొందాము,
అది హోమార్పణ కొరకైనా బలి కొరకైనా కాకుం
డా, । మేము యెహోవా సముఖమందు మా హోమా 27
ర్పణలచేతనున్ను మా బలులచేతనున్ను మా సమాధా
నార్పణలచేతనున్ను ఆయనకు సేవ చేసేటట్టుగాను
న్ను, యిక మీదట మీ పుత్రులు మా పుత్రులతో
యెహోవా యందు మీకు భాగము లేదని చెప్పక
వుండేటట్టుగానున్ను, అది మాకున్ను మీకున్ను మన
తదనంతరమైన తరములకున్ను సాక్షిగా నిలిచి వుండు
ను. । మరిన్ని మేము అనుకొనినదేమంటే, వారు యిక 28
మీదట మా తోటయినా మా తరముల వారి తోట
యినా ఆలాగున అంటే, అందుకు మేము యిదుగో
యెహోవా బలిపీఠముయొక్క పోలిక యిది: మా
పితృలు దాన్ని హోమార్పణల కొరకు కాదు, బలుల
కొరకు కాదు, గాని మీకున్ను మాకున్ను సాక్షి అయ్యే
టట్టుగా చేసిరని చెప్పుదుము. । మన దేవుడయిన యె 29
హోవా నివాసస్థలము ముందర వుండే ఆయనయొ
క్క బలిపీఠము గాక మేము హోమార్పణల కొర
కైనా భోజనార్పణల కొరకయినా బలుల కొరక
యినా మరి వొక బలిపీఠమును కట్టుకొని, యిప్పుడు
యెహోవా వెంబడినుంచి తిరిగి పోయి, యెహోవా
కు విరోధముగా తిరుగుబాటు చేయక పోదుము గాక
అని చెప్పిరి. । కాబట్టి అర్చకుడయిన ఫీనెహాసున్ను 30
అతనితో వుండే సంఘపు ప్రభువులున్ను ఇశ్రాయేలు
యొక్క వెయివేల మందియొక్క ప్రధానులున్ను రూ
బేను పుత్రులున్ను గాదు పుత్రులున్ను మనస్సే
పుత్రులున్ను చెప్పిన మాటలు విన్నప్పుడు వాటికి సమ్మ
తించిరి. । అప్పుడు అర్చకుడైన ఎలాజారుయొక్క 31
కుమారుడైన ఫీనెహాసు రూబేను పుత్రులతోనున్ను
గాదు పుత్రులతోనున్ను మనస్సే పుత్రులతోనున్ను
చెప్పినదేమంటే, యెహోవా విషయమై మీరు యీ
తప్పు చేయని వారైనందున యెహోవా మనలో
వున్నాడని యిప్పుడు మేము యెరుగుదుము; యిప్పు
డు మీరు ఇశ్రాయేలు పుత్రులను యెహోవా చేతి
లోనుంచి విడిపించిన వారైతిరని చెప్పిన తరువాత, ।
అర్చకుడైన ఎలాజారు కుమారుడైన ఫీనెహాసున్ను 32
ప్రభువులున్ను గిలాదు దేశమందుండే రూబేను పుత్రు
ల దగ్గిరనుంచిన్ని గాదు పుత్రుల దగ్గిరనుంచిన్ని తిరిగి
వెళ్లి, కెనయను దేశమందుండే ఇశ్రాయేలు పుత్రుల
యొద్దికి వచ్చి, వారితో వర్తమానమును తెలియ
చేసిరి. । ఆ వర్తమానము ఇశ్రాయేలు పుత్రులకు అను 33
కూలమయినందున ఇశ్రాయేలు పుత్రులు దేవుని స్తుతిం
చి, రూబేను పుత్రులున్ను గాదు పుత్రులున్ను నివా
సము చేసే దేశమును పాడు చేసేటట్టుగా వారి మీదికి

యుద్ధము చేయడానకు వెళ్లుదామన్న వుద్దేశము మాని
34 వేసిరి. । అయితే రూబేను పుత్రులున్ను గాదు పుత్రు
లున్ను ఆ బలిపీఠమునకు ఏదు అనే పేరు పెట్టి అను
కొనినదేమంటే, యెహోవా దేవుడై వున్నాడని యిది
మీకున్ను మాకున్ను సాక్షి అయి వుండునని చెప్పిరి.

## 23. అధ్యాయము.

1 అయితే యెహోవా ఇశ్రాయేలుకు సఖము
ఖాలా వుండే వారియొక్క శత్రువులలోనుంచి విశ్ర
మము యిచ్చిన అనేక దినముల పిమ్మట సంభవించిన
దేమంటే, యెహోషువ వృద్ధుడైయున్ని కాలము
2 మల్లిన వాడైయున్ని వుండెను. । అప్పుడు యెహోషువ
ఇశ్రాయేలు వారినందరినిన్ని, అనగా, వారి పెద్దలను
న్ను వారి ప్రధానులనున్ను వారి న్యాయాధిపతులను
న్ను వారి అధికారులనున్ను పిలిపించి, వారితో చెప్పి
నదేమంటే, నేను వృద్ధునైయున్ని కాలము మల్లినవాడ
3 నైయున్ని వున్నాను, । యీ జనాంగములందరికిన్ని మీ
నిమిత్తముగా యెహోవా యేమి చేసినాడో అది
యావత్తూ మీరు చూస్తిరి, యేమంటే మీ దేవుడైన
యెహోవా తానే మీ కొరకు యుద్ధము చేసెను. ।
4 యిదుగో శేషమయిన యీ జనాంగములను చీట్లు
వేయడముచేత మీకు పంచిపెట్టితిని; అవి నేను సంహ
రించిన జనాంగములతో కూడా యర్దేను నదినుంచి
పశ్చిమమందుండే పెద్ద సముద్రము మట్టుకు మీ గోత్ర
5 ములకు స్వాతంత్ర్యమై యుండును. । మీ దేవుడైన
యెహోవా తానే మీ ముందరనుంచి వారిని అవత
లకు వెళ్ల చేసి మీ దృష్టి యెదుటనుంచి వారిని తో
లివేసును, అప్పుడు మీరు మీ దేవుడైన యెహోవా
మీకు యిచ్చిన మాటప్రకారము వారి దేశమును స్వ
6 తంత్రించుకొందురు. । కాబట్టి మీరు మహా ధైర్యము
తెచ్చుకొని, మోషేయొక్క న్యాయప్రమాణము గల
గ్రంథమందు వ్రాసిన అన్నిటిని గైకొంటూ చేస్తూ,
దానినుంచి కుడి తట్టయినా యెడమ తట్టయినా తిరు
7 గకుండా వుండి, । మీలో వుండే యీ శేషమయిన
జనాంగములలో ప్రవేశించక, వారి దేవుండ్ల పేరులు
వుచ్చరించక, వాటి మీద ఒట్టు వేయక, వాటిని సేవిం
8 చకనున్ను, వాటిని నమస్కరించకనున్ను వుండి, । నేటి
వరకు మీరు చేస్తూ వుండినట్టు మీ దేవుడైన యెహో
9 వాతో హత్తుకొని వుండండి. । యెందుకంటే యెహో
వా మీ ముందరనుంచి బలము గల గొప్ప జనాంగము
లను బయిటకు తోలివేసి వున్నాడు; మిమ్మును గురిం
చైతేనో నేటి వరకూ మీ ముందర నిలువ గలవాడు
10 వొకడూ లేకవుండెను. । మీలో వొకడు వెయిమందిని
తరుమును, యేమంటే మీ దేవుడైన యెహోవా తానే
మీ కొరకు మీకు యిచ్చిన మాటప్రకారము యుద్ధ
ము చేస్తూ వున్నాడు. । కాబట్టి మీరు మీ దేవుడయిన 11
యెహోవాను స్నేహించేటట్టుగా మీకు మీరు జాగ్ర
తగా వుండండి. । అయితే మీరు యే విధముచేతనైనా 21
తొలిగిపోయి, మీలో వుండే యీ శేషమయిన జనాం
గములతో హత్తుకొని, వారితో వివాహ సంబంధము
లు చేసుకొని, వారిలో మీరున్ను మీలో వారున్ను
ప్రవేశించినట్టయితే, । అందుకై మీకు రూఢముగా 13
తెలియవలసినదేమంటే, మీ దేవుడైన యెహోవా
యిక మీదట యీ జనాంగములను మీ ముందర
నుంచి తోలివేయడు, గాని మీ దేవుడైన యెహో
వా మీకు యిచ్చిన యీ మంచి దేశములోనుంచి మీరు
లయమయ్యే పర్యంతము వారు మీకు వురులైనట్టున్ను
వలలైనట్టున్ను మీ పక్కల మీద జేరుబాండులైనట్టు
న్ను మీ కండ్లలో ముళ్లయినట్టున్ను వుంటూ వుందు
రు. । మరిన్ని యిదుగో యీ దినమున నేను లోకులం 14
దరియొక్క మార్గముగా వెళ్లుతూ వున్నాను; అయితే
మీ దేవుడైన యెహోవా మీ విషయమై చెప్పిన
దొడ్డ మాటలన్నిటిలో తప్పినది వొకటీ లేదని మీ
హృదయమంతటిచేతనున్ను మీ మనస్సంతటి చేతను
న్ను మీరు యెరుగుదురు; వాటిలో వొకటయినా తప్పి
పోక సమస్తము మీకు సంభవించెను. । కాబట్టి మీ 15
దేవుడయిన యెహోవా మీతో చెప్పిన మంచి
మాటలన్నిన్ని మీకు సంభవించినట్టు మీ దేవుడయిన
యెహోవా మీకు యిచ్చిన మంచి దేశములోనుంచి
యెహోవా మిమ్మును నశింప చేసే పర్యంతము మీ
మీద సకలమయిన కీళ్లను రాచేసును. । మీ దేవుడయిన 16
యెహోవా మీకు ఆజ్ఞాపించిన ఆయనయొక్క వొడం
బడికెను యెప్పుడు మీరు అతిక్రమించి వెళ్లి వేరైన
దేవుండ్లను సేవించి వాటికి వొంగి నమస్కారము చేతు
రో, అప్పుడు యెహోవాయొక్క కోపము మీ మీద
రగులుకొనినందున ఆయన మీకు యిచ్చిన యీ మంచి
దేశములోనుంచి మీరు అతివేగిరముగా లయమవుదు
రని చెప్పెను.

## 24. అధ్యాయము.

అప్పుడు యెహోషువ ఇశ్రాయేలుయొక్క గో 1
త్రములన్నిటినీ షెఖెముకు కూర్చి, ఇశ్రాయేలుయొ
క్క పెద్దలనున్ను వారి ప్రధానులనున్ను వారి న్యా
యాధిపతులనున్ను వారి అధికారులనున్ను పిలిపించినం
దున తమ్మున తాము దేవుని సముఖమందు అగుపచ్చు
కొనిరి. । అప్పుడు యెహోషువ జనులందరితో చెప్పి 2
నదేమంటే, ఇశ్రాయేలుయొక్క దేవుడైన యెహో
వా యీలాగున సెలవిస్తున్నాడు, యేమంటే పూర్వ

కాలమందు మీ పితృలు, అనగా, అబ్రాహాముయొ
క్క తండ్రిన్ని నాఖోరు తండ్రిన్ని అయిన తెరహు
గొప్పనది అవతల కాపుముచేసి యితరమైన దేవుండ్లను
3 సేవించేవారు. । అప్పుడు నేను మీ పితృడయిన అబ్రా
హామును ఆ నది అవతలనుంచి తీసి, కెనయను దేశమం
తటి దాకా నడిపించి, అతని సంతతిని అభివృద్ధి పొం
4 దచేసి, అతనికి ఇస్సాకును యిచ్చినాను. । ఇస్సాకుకు
యాకోబునున్ను ఏశావునున్ను యిచ్చినాను: ఏశావుకు
నేను శెయీరు పర్వతమును స్వాతంత్ర్యముగా యి
చ్చినాను; అయితే యాకోబున్ను అతని పుత్రులున్ను
5 మిస్రయీము దేశమునకు దిగి పోయిరి. । మరిన్ని నేను
మోషేనున్ను అహరోనునున్ను పంపి, మిస్రీయులలో
నేను చేసిన దాని ప్రకారము మిస్రయీమును తెగు
ళ్లతో పీడించినాను, తరువాత మిమ్మును వెలపటికి
6 రప్పించినాను. । మీ పితృలను నేను మిస్రయీములో
నుంచి రప్పించినప్పుడు మీరు సముద్రము దగ్గరకు
వచ్చినారు; అప్పుడు మిస్రీయులు రథములతోనున్ను
రౌతులతోనున్ను మీ పితృలను యెర్ర సముద్రము
7 మట్టుకు తరిమినారు. । వారు యెహోవాకు మొరపె
ట్టినప్పుడు ఆయన మీకున్ను వారికిన్ని మధ్యను అంధ
కారమును కలుగచేసి, వారి మీదికి సముద్రము వచ్చే
టట్టు చేసి వారిని కప్పివేసెను: మిస్రయీములో నేను
చేసినదంతాను మీ నేత్రములు చూచెను: తరువాత
మీరు అరణ్యమందు అనేక దినములు కాపురము చేస్తూ
8 వుంటిరి. । అంతట నేను యర్దేను అవతల కాపురస్తు
లయిన అమోరీయుల దేశములోకి మిమ్మును ప్రవేశింప
చేసినాను; వారు మీతో యుద్ధము చేసినప్పుడు నేను
వారి దేశమును మీరు స్వతంత్రించుకొనేటట్టుగా మీ
చేతిలోకి వారిని అప్పగించి, మీ ముందరనుంచి వారిని
9 నశింప చేసినాను. । అప్పుడు మోయాబు రాజు అయిన
సిప్పోరు కుమారుడయిన బాలాకు లేచి, ఇశ్రాయేలు
తో యుద్ధము చేసి, మిమ్మును శపియించడానకు బెయో
10 రు కుమారుడైన బలామును పిలువనంపించెను. । అయి
తే బలాము చెప్పిన దాని నేను ఆలకించక వున్నందున
అతడు మిమ్మును ఆశీర్వదిస్తూ వుండెను; అతని చేతిలో
11 నుంచిన్ని నేను మిమ్మును విడిపించితిని. । తరువాత
మీరు యర్దేను నది దాటి, యెరిఖో పట్టణము దగ్గి
రకు వచ్చినారు: యెరిఖో పట్టణపు వారున్ను అమొ
రీయులున్ను పెరిజ్జీయులున్ను కెనయానీయులున్ను
హిత్తీయులున్ను గిర్గాషీయులున్ను హివీయులున్ను
జెబూసీయులున్ను మీతో యుద్ధము చేసినప్పుడు
12 నేను వారిని మీ చేతిలోకి అప్పగించినాను. । మరిన్ని
మీకు ముందుగా నేను విషపుటీగలను పంపినాను;
యివి వారిని అనగా అమొరీయుల యిద్దరు రాజులను
మీ ముందరనుంచి అవతలకు తోలివేసెను, నీ కత్తిచేత
నున్ను నీ వింటిచేతనున్ను కాదు. । యీలాగున మీ 13
యొక్క కష్టార్జితము కాని దేశమునున్ను మీరు
కట్టని పట్టణములనున్ను నేను మీకు యిచ్చినందున
మీరు వాటి యందు కాపురము చేస్తూ వున్నారు:
మీరు నాటనటువంటి ద్రాక్ష తోటలవల్లనున్ను
యిప్ప తోటలవల్లనున్ను మీరు తింటూ వున్నారని
సెలవు యిస్తున్నాడు. । కాబట్టి మీరు యెహోవాకు 14
భయపడి, ఆయనను యథార్థముతోనున్ను సత్య
ముతోనున్ను సేవిస్తూ, గొప్ప నది అవతలనున్ను మిస్ర
యీములోనున్ను మీ పితృలు సేవించినటువంటి దేవుం
డ్లను మీరు పరిహరించి, యెహోవాను సేవిస్తూ వుం
డండి. । అయితే యెహోవాను సేవించుట మీకు కీడు 15
గా తోచినట్టయితే యెవరిని సేవింతురో యీ దిన
మందు యేర్పరచుకొండి, గొప్ప నది అవతల వుండిన
మీ పితృలు సేవించిన దేవుండ్లనో, లేక మీరు నివసి
స్తున్న దేశముయొక్క అమొరీయులయొక్క దేవుండ్ల
నో: నన్ను గురించిన్ని నా యింటి వారిని గురించిన్ని
అయితేనో మేము యెహోవాను సేవింతుమని చెప్పి
నప్పుడు; । జనులు ప్రత్యుత్తరముగా మేము యితర 16
మైన దేవుండ్లను సేవించుటయున్ను యెహోవాను
విడచి వేయుటయున్ను కాకపోవునుగాక. । యెందు 17
కంటే మన దేవుడైన యెహోవా తానే మనలనున్ను
మన పితృలనున్ను దాస్యగృహమైన మిస్రయీము దేశ
ములోనుంచి యివతలకు రప్పించి, మన దృష్టి యెదుట
ఆ గొప్ప గురుతులను చేసి, మనము వెళ్లిన మార్గమం
తటి యందున్ను మనము గడచిన జనులందరిలోనున్ను
మనలను కాపాడెను. । మరిన్ని యెహోవా ఆ జను 18
లందరినీ అనగా యీ దేశమందు కాపురము చేసిన
అమొరీయులను మన ముందరనుంచి తోలివేసి వున్నా
డు; కాబట్టి మేమున్ను యెహోవాకు సేవ చేతుము
యెందుకంటే, ఆయనే మా దేవుడై వున్నాడని చెప్పిరి. ।
అందుకు యెహోషువ జనులను చూచి, మీరు యె 19
హోవాను సేవించ నేరరు, యెందుకంటే ఆయన
పరిశుద్ధుడైన దేవుడై వున్నాడు; ఆయన సహించని
దేవుడై వున్నాడు; ఆయన మీ అపరాధములనున్ను మీ
పాపములనున్ను క్షమించడు. । మీరు యెహోవాను 20
విడిచి అన్య దేవుండ్లను సేవిస్తే అప్పుడు ఆయన మీకు
మేలు చేసి వుండినప్పటికిన్ని తిరిగీ మిమ్మును హింసించి
దహింపచేసునని చెప్పెను. । అప్పుడు జనులు యెహో 21
షువతో ఆలాగు కాదు మేము యెహోవానే సేవి
స్తామని చెప్పిరి. । అందుకు యెహోషువ జనులతో 22
చెప్పినదేమంటే, మీరు యెహోవాను సేవించుటకు
యేర్పరచుకొన్నారని మిమ్మును గురించి మీరు సాక్షులై

వున్నారని చెప్పినప్పుడు వారు మేము సాక్షులమై
23 వున్నామని చెప్పిరి. । అప్పుడు అతడు వారితో ఆలా
గైనందున యిప్పుడు మీలో వున్న యితరమైన దేవుం
డ్లను పరిహరించి, ఇశ్రాయేలుయొక్క దేవుడైన యె
హోవాతట్టు మీ హృదయమును తిప్పుకొండని చెప్ప
24 గా, । ఆ జనులు యెహోషువతో మా దేవుడయిన
యెహోవాను మేము సేవించి ఆయన శబ్దమునకు
25 విధేయముగా వుంటామని చెప్పిరి. । అయినందున యె
హోషువ ఆ దినమందు జనులతో వొక వొడంబడి
కెను చేసుకొని, షెఖెములో వారికి వొక నిబంధనను
26 న్ను వొక కట్టడనున్ను నిర్ణయించెను. । మరిన్ని యె
హోషువ యీ మాటలను దేవునియొక్క న్యాయప్ర
మాణమైన గ్రంథమందు వ్రాసి, వొక గొప్ప రాయి
తీసి, యెహోవాయొక్క పరిశుద్ధమైన స్థల సమీప
మందుండే వొక ఏలాచెట్టు కింద దాన్ని నిలిపిన తరు
వాత యెహోషువ జనులందరితో చెప్పినదేమంటే, ।
27 యిదుగో యీ రాయి మన విషయమై సాక్షిగా వుం
డును, యేమంటే యెహోవా మనతో ఆనతిచ్చిన
తన వాక్యములన్నిన్ని అది విని యున్నది: కాగా మీ
దేవుని విషయమై మీరు బొంకుదురేమో అది కాకుం
డా యీ రాయి మీకు సాక్షి అయి వుండునని చెప్పిన
28 తరువాత; । యెహోషువ జనులకు సెలవు యిచ్చినం
దున వారు తమ తమ స్వాతంత్ర్యపు భాగములకు వెళ్లి
పోయిరి. । యీ సంగతులయిన తరువాత సంభవించిన 29
దేమంటే, యెహోవాయొక్క సేవకుడయినటువంటి
న్ని నూను కుమారుడైనటువంటిన్ని యెహోషువ
నూటపది సంవత్సరముల యీడు గలవాడై మృతిబొం
దెను. । వారు అతని గయషు పర్వతముయొక్క వుత్తర 30
పార్శ్వములో వున్న ఎఫ్రయీము పర్వతమందుండే
తిమ్నత్సెరహు అనే తన స్వాతంత్ర్యపు భాగము
యొక్క సరిహద్దులో పాతిపెట్టిరి. । ఇశ్రాయేలు యె 31
హోషువ బ్రతికినదినములన్నిటి దాకానున్ను, యె
హోవా ఇశ్రాయేలు కొరకు చేసిన కార్యములు
యావత్తు తెలిసినటువంటిన్ని యెహోషువ తరువాత
యింకా బ్రతికినటువంటిన్ని పెద్దలయొక్క దినముల
న్నిటిదాకానున్ను యెహోవాను సేవించిరి. । మరిన్ని 32
ఇశ్రాయేలు పుత్రులు మిస్రయీములోనుంచి తీసుక
వచ్చిన యోసేపుయొక్క శల్యములను యాకోబు షెఖె
ముయొక్క తండ్రియైన హామోరుయొక్క కుమారుల
యొద్ద నూరు తులముల వెండికి కొనిన షెఖెమందుండే
వొక భూ భాగమందు వారు పాతిపెట్టిరి: అది యో
సేపు పుత్రులకు ప్రాప్తించిన స్వాతంత్ర్యపు భాగ
మాయెను. । మరిన్ని అహరోను కుమారుడయిన ఎలా 33
జారు మృతిబొందెను; ఎఫ్రయీము పర్వతమందు
అతని కుమారుడైన ఫీనెహాసుకు యివ్వబడినటువంటి
వొక కొండయందు వారు అతని పాతిపెట్టిరి.

# న్యాయాధిపతుల గ్రంథము.

## 1. అధ్యాయము.

1 యెహోషువ మరణమైన తరువాత సంభవించిన
దేమంటే, ఇశ్రాయేలు పుత్రులు కెనయానీయులతో
యుద్ధము చేయడానకు మాకొరకు యెవ్వరు ముందు
గా వారి మీదికి యెక్కి పోవలెనని యెహోవాను
2 అడిగిరి. । అందుకు యెహోవా యూదా యెక్కిపో
వలెను, ఇదుగో ఆ దేశమును నేను అతని చేతికి అప్ప
3 గిస్తినని సెలవు యిచ్చెను. । అయినందున యూదా తన
సహోదరుడైన షిమోనుతో చెప్పినదేమంటే, మేము
కెనయానీయులతో యుద్ధము చేసేటట్టుగా నా భాగ
మునకు నాతో కూడా పయికి రమ్ము, ఆలాగున నేను
న్ను నీతో కూడా నీ భాగమునకు వత్తునని చెప్పినం
4 దున షిమోను అతనితో కూడా వెళ్లెను. । అంతట
యూదా పైకి వెళ్లెను; అప్పుడు యెహోవా కెనయా
నీయులనున్ను పెరిజ్జీయులనున్ను వారి చేతికి అప్పగిం
చినందున వారు వారిలో బెజెకు యందు పదివేలమం
5 దిని హతము చేసిరి. । మరిన్ని బెజెకు యందు అదోనీ
బెజెకు అనే రాజు వారికి దొరికెను; వారు అతనితో
యుద్ధముచేసి కెనయానీయులనున్ను పెరిజ్జీయులను
6 న్ను హతము చేసిరి. । అయితే అదోనీ బెజెకు పారిపో
యినాడు; కాబట్టి వారు అతని తరిమి, అతని పట్టు
కొని, అతని చే బొట్టన వేళ్లనున్ను కాలి బొట్టన వేళ్ల
7 నున్ను తెగవేసిరి. । అప్పుడు అదోనీ బెజెకు అనినదే
మంటే, డెబ్బయిమంది రాజులు తమ చేతుల బొట్టన
వేళ్లనున్ను తమ కాళ్ల బొట్టన వేళ్లనున్ను తెగవేయబ
డ్డవారై, నా భోజనపు బల్ల కిందనుంచి యెంగిళ్లను
యేరుకొంటూ వుండిరి; నేను చేసినట్టు దేవుడు నాకు
ప్రతి ఫలము యిచ్చి వున్నాడనెను: వారు అతని యె
రూశలేముకు తీసుక వచ్చిరి అక్కడ అతడు చచ్చెను. ।
8 అయితే యూదా పుత్రులు యెరూశలేము మీద
యుద్ధము చేసి దాన్ని పట్టి, కత్తి వాడిచేత దాన్ని
9 కొట్టి, దాన్ని తగలబెట్టి వుండిరి. । తరువాత యూదా
పుత్రులు పర్వతమందున్ను దక్షిణమందున్ను లోవ
యందున్ను కాపురము చేసిన కెనయానీయులతో
10 యుద్ధము చేయడానకు దిగి వెళ్లినారు. । మరిన్ని
యూదా హెబ్రోనులో కాపురము చేసిన కెనయానీ
యులకు యెదురుగా వెళ్లి, షేషై, అహీమను, తల్మయి
అనే వీరిని హతము చేసిరి: పూర్వము హెబ్రోనుకు
కిర్యతర్బా అనే పేరు కద్దు. । అక్కడనుంచి అతడు 11
దెబీరు కాపురస్తుల మీదికి వెళ్లెను; పూర్వమందు దెబీ
రుకు కిర్యత్సేఫెరు అనే పేరు కద్దు. । అయితే కాలేబు 12
యెవడు కిర్యత్సేఫెరును కొట్టి పట్టునో అతనికి
నా కుమార్తె అయిన అఖ్సాను పెండ్లికి యిత్తునని
చెప్పినందున, । కాలేబు తమ్ముడైన కెనజు పుత్రుడైన 13
ఒత్నియేలు దాన్ని పట్టెను; కాబట్టి అతడు తన కుమా
ర్తెయైన అఖ్సాను అతనికి పెండ్లి చేసెను, । అయితే 14
అది అతని యొద్దికి రాగానే సంభవించినదేమంటే, నా
తండ్రియొద్ద వొక పొలమును అడుగవలెనని అతనికి
తాత్పర్యము పుట్టించి, తాను గార్దభము మీదనుంచి
దిగగానే కాలేబు దాన్ని చూచి నీకు యేమి కావలె
నని అడిగినప్పుడు, । అది అతని చూచి ఆశీర్వాదము 15
వొకటి నాకు యిప్పించవలెను; యేమంటే నీవు నాకు
దక్షిణ భూమిని యిస్తివి; యింకా నాకు వుదకపు
జెలలు గల భూమిని ఇప్పించ వలెనని చెప్పినప్పుడు,
కాలేబు దానికి మీది జెలలు గల భూమిన్ని కింది
జెలలు గల భూమిన్ని యిచ్చెను. । అయితే మోషే 16
యొక్క మామ అయిన కెనీయునియొక్క పుత్రులు
ఖర్జూరపు చెట్లు గల పట్టణములోనుంచి యూదా
పుత్రులతో కూడా ఆరాదుకు దక్షిణమందుండే
యూదా అరణ్యమునకు వెళ్లిపోయి వచ్చినారు; మరి
న్ని వారు వచ్చి ఆ జనులలో వాసము చేసిరి. । మరిన్ని 17
యూదా తన సహోదరుడైన షిమోనుతో కూడా
వెళ్లెను; వారు సెఫాతులో కాపురస్తులైన కెనయానీ
యులను సంహరించి, దాన్ని బొత్తిగా నాశనము
చేసిరి: ఆ పట్టణము హోర్మా అని పిలువబడెను. । మరి 18
న్ని యూదా గాజానున్ను దాని సరిహద్దుతోనున్ను,
అష్కెలోనునున్ను దాని సరిహద్దుతోనున్ను, ఎక్రోను
నున్ను దాని సరిహద్దుతోనున్ను పట్టెను. । యెహో 19
వా యూదాకు తోడైనందున పర్వతమందుండే వారిని
అతడు అవతలకు తోలివేసెను; అయితే లోవలో
కాపురస్తులకు యినుప రథములు కలిగి వున్నందున
వారిని తోలివేయలేకపోయెను. । అయితే హెబ్రో 20
నును వారు మోషే యిచ్చిన సెలవు ప్రకారము కాలే
బుకు యిచ్చిరి; అతడు అనాకుయొక్క ముగ్గురు కుమా
ళ్లను అక్కడనుంచి అవతలకు తోలివేసెను. । అయితే 21
బెన్యామీనుయొక్క పుత్రులు యెరూశలేము యం

దుండే యెబూసీయులను అవతలకు తోలీవేయలేదు;
కాబట్టి యెబూసీయులు బెన్యామీను పుత్రులతో
కూడా యెరూశలేము యందు నేటి వరకు కాపురము
22 చేస్తూ వున్నారు. । మరిన్ని యోసేపు కుటుంబమున్ను
బేతేలు మీదికి యెక్కి వెళ్లెను; యెహోవా వారికి
23 తోడుగా వుండెను. । పూర్వమందు యీ పట్టణము
నకు లూజు అనే పేరు కలదు; యోసేపు కుటుంబీకులు
24 బేతేలు దగ్గిరికి చొప్పుకాండ్లను పంపినారు. । ఆ
చొప్పుకాండ్లు పట్టణములోనుంచి బయిలు వచ్చిన
వొక మనిషిని చూచి, నీకు వుపకారము చేతుము, యీ
పట్టణము చొచ్చే మార్గము మాకు చూపించ వలెనని
25 చెప్పిరి. । అతడు వారికి పట్టణము చొచ్చే మార్గమును
చూపించినందున వారు కత్తి వాడిచేత దాన్ని నరికిరి;
అయితే ఆ మనుష్యునిన్ని అతని యింటిల్లిపాదిన్ని
26 విడిచిపెట్టిరి. । ఆ మనుష్యుడు హిత్తీయుల దేశమునకు
వెళ్లి, వొక పట్టణమును కట్టి, దానికి లూజు అనే పేరు
పెట్టెను; అది నేటివరకున్ను ఆ పేరుతోనే వున్నది.।
27 అయితే బేత్షెయానున్ను దాని సంబంధపు వూళ్లున్ను,
తయనకున్ను దాని సంబంధపు వూళ్లున్ను, దోరున్ను
దాని సంబంధపు వూళ్లున్ను, ఇబ్లెయామున్ను దాని
సంబంధపు వూళ్లున్ను, మెగిద్దోయున్ను దాని సంబం
ధపు వూళ్లున్ను వీటిలో వున్న కాపురస్తులను మనస్సే
అవతలకు తోలివేయలేదు; అయితే కెనయానీయులు
ఆ దేశమందు కాపురము చేయడానకు మనస్సు కల
28 వారై వుండిరి. । అయితే ఇశ్రాయేలుకు శక్తి కలిగిన
ప్పుడు సంభవించినదేమంటే, వారు కెనయానీయుల
మీద పన్ను కట్టి, వారిని అవతలకు బొత్తిగా తోలి
29 వేయ లేదు. । మరిన్ని ఎఫ్రయీము గెజెరులో కాపు
రస్తులైన కెనయానీయులను అవతలకు తోలివేయ లేదు;
అయినందున కెనయానీయులు వారిలోగా గెజెరు
30 యందు కాపురము చేసిరి. । మరిన్ని జెబూలోను
కిద్రోను కాపురస్తులనున్ను నహలోలు కాపురస్తుల
నున్ను అవతలకు తోలివేయ లేదు; అయినందున కెన
యానీయులు పన్నుకు లోనై వారిలో నివాసము
31 చేస్తూ వుండిరి. । మరిన్ని ఆషేరు, అక్కో, సీదోను,
అహ్లాబు, అక్జీబు, హెల్బా, ఆఫీకు, రెహోబు వీటి
32 లో కాపురస్తులను అవతలకు తోలివేయ లేదు. । అయి
నందున ఆషేరీయులు ఆ దేశమందు కాపురస్తులయిన
కెనయానీయులలో కాపురము చేసిరి, యెందుకంటే
33 వారు వారిని అవతలకు తోలివేయ లేదు. । మరిన్ని
నఫ్తాలీ బెత్షెమెషు కాపురస్తులనున్ను బేతనాతు కా
పురస్తులనున్ను అవతలకు తోలివేయక, ఆ దేశమందు
కాపురస్తులయిన కెనయానీయులలో కాపురము చేసె
ను, అయినప్పటికిన్ని బెత్షెమెషు కాపురస్తులున్ను బేత
నాతు కాపురస్తులున్ను వారికి పన్ను యిచ్చేవారైరి. ।
మరిన్ని అమోరీయులు దాను పుత్రులను పర్వతము 34
నకు వెళ్లజేసి, లోవలోకి వారిని దిగనివ్వలేదు. । అయి 35
తే అమోరీయులు హెరెసు పర్వతమందున్న అయ్యా
లోను యందున్ను షయల్బీము యందున్ను కాపురము
చేసిరి; అయితే యోసేపు కుటుంబముయొక్క హస్తము
జయకరమైనందువల్ల వారు పన్నుకు లోనైనవారైరి. ।
అమోరీయుల సరిహద్దు మయులేయ క్రబ్బీమునుంచి 36
సాగి, శిలా పర్వతమునుంచి యెక్కి పోయినదై
యుండెను.

## 2. అధ్యాయము.

అంతట యెహోవాయొక్క దూత గిల్గాలునుంచి 1
యెక్కి బోఖీముకు వచ్చి చెప్పినదేమంటే, నేను మిస్ర
యీములోనుంచి మిమ్మును పయికి వెళ్లేటట్టు చేసి, మీ
పితృలకు నేను ప్రమాణము చేసిన దేశమునకు మిమ్మును
తీసుక వచ్చి, మీతో వున్న నా వొడంబడికెను నేను
యెప్పటికీ త్రుంచి వేయను అనిన్ని, । మీరు యీ 2
దేశపు కాపురస్తులతో యే వొడంబడికెనయినా చేసు
కోక, వారియొక్క బలిపీఠములను పడత్రోయుదురు
గాకనిన్ని చెప్పితిని; అయితే మీరు నా శబ్దమును
వినకపోతిరి; యీలాగున యెందుకు చేస్తిరి! । కాబట్టి 3
నేను అనుకొనినదేమంటే, నేను మీ ముందరనుంచి
వారిని వెళ్లజేయను, గాని వారు మీ పక్కలకు శూల
ములుగా వుందురు; మరిన్ని వారియొక్క దేవుండ్లు మీకు
వురులుగా వుందురని అనుకొంటినన్నట్టుగా చెప్పెను. ।
యెహోవాయొక్క దూత యీ మాటలు ఇశ్రా 4
యేలు పుత్రులందరికిన్ని చెప్పినప్పుడు సంభవించినదే
మంటే, ఆ జనులు కంఠములు యెత్తి యేడ్చిరి. । వారు 5
ఆ స్థలమునకు బోఖీము అన్న పేరు పెట్టిరి: మరిన్ని
అక్కడ వారు యెహోవాకు బలులను చెల్లించిరి. ।
యెహోషువ జనులకు సెలవు యిచ్చినప్పుడు ఇశ్రా 6
యేలు పుత్రులలో ప్రతిమనిషీ దేశమును స్వతంత్రిం
చుకోవడానకు తనతన భూ భాగమునకు వెళ్లిపోయి
నాడు. । ఆ జనులు యెహోషువ బ్రతికిన దినముల 7
న్నిటిదాకానున్ను, యెహోవా ఇశ్రాయేలు కొరకు
చేసిన తనయొక్క యావద్ఘనమైన కార్యములను
చూచి యెహోషువ తరువాత యింకా బ్రతికిన పెద్ద
లయొక్క దినములన్నిటిదాకానున్ను యెహోవాకు
సేవ చేస్తూ వుండిరి. । అయితే యెహోవాకు సేవకు 8
డైనటువంటిన్ని నూను కుమారుడయినటువంటిన్ని యె
హోషువ నూటపది సంవత్సరముల యీడు గలవాడై
మరణమాయెను. । వారు అతని గయషు పర్వతముయొ 9
క్క వుత్తర పార్శ్వములో వున్న ఎఫ్రయీము పర్వత

మందుండే తిమ్న హెరసు అనే అతని స్వాతంత్ర్యము
0 యొక్క సరిహద్దులో పాతి పెట్టిరి. । మరిన్ని ఆ తరము
వారందరున్ను తమ పితృల యొద్దకు చేర్చబడిరి: వారి
తరువాతను యెహోవానున్ను ఇశ్రాయేలు కొరకు
ఆయన చేసి వుండిన కార్యములనున్ను యెరుగనటు
1 వంటి యింకొక తరము వుద్భవించెను. । అప్పుడు ఇశ్రా
యేలు పుత్రులు యెహోవా యెదుట కీడు చేసి,
2 బయలీముకు సేవ చేసిరి. । మిస్రయీము దేశములో
నుంచి వారిని తీసుక వచ్చిన వారి పితృలయొక్క దేవు
డయిన యెహోవాను వారు విడచిపెట్టి, తమ చుట్టూ
వున్న జనాంగములయొక్క దేవుండ్ల సంబంధమైన
యితరమైన దేవుండ్లను వెంబడించి, వారికి వొంగి నమ
స్కారము చేసినందుచేత యెహోవాకు కోపము
3 కలుగ చేసిరి. । యేమంటే వారు యెహోవాను విడచి,
4 బయలుకున్ను అష్టారోతుకున్ను సేవ చేసిరి. । అయినం
దున యెహోవాయొక్క కోపము ఇశ్రాయేలు మీద
మండెను; ఆయన వారిని దోచుకొనే వారి చేతికి
వారిని అప్పగించినందున వీరు వారిని దోచుకొనిరి;
మరిన్ని వారి చుట్టూ వుండే వారియొక్క శత్రువుల
చేతులలోకి ఆయన వారిని అమ్మి వేసెను; అందువల్ల
వారు తమ శత్రువులముందర మరి నిలువలేక పోయిరి।.
5 యెహోవా వారితో చెప్పిన ప్రకారముగానున్ను
యెహోవా వారితో చేసుకొనిన సత్య ప్రకారముగా
నున్ను యెక్కడికి వారు బైలువెళ్లినా అక్కడ యె
హోవాయొక్క హస్తము కీడు కొరకు వారికి విరో
ధముగా వున్నందున వారు బహు బాధపడిన వారైరి. ।
6 అయినప్పటికిన్ని యెహోవా న్యాయాధి పతులను
లేవజేసెను; వీరు వారిని దోచుకొనిన వారిచేతిలోనుంచి
7 వారిని రక్షించిరి. । అయినా వారు తమ న్యాయాధిప
తుల మాట వినక, యితరమైన దేవుండ్ల వెంబడిని వ్య
భిచరించి, వారికి వొంగి నమస్కారము చేసి, తమ
పితృలు యెహోవాయొక్క ఆజ్ఞలకు లోబడుతూ
నడిచిన మార్గములోనుంచి వారు వేగిరముగా తిరిగి
8 పోయిరి: వారు ఆలాగున చేయక వుండిరి. । అయితే
యెహోవా న్యాయాధిపతులను వారి కొరకు యెప్పు
డు లేవజేసినాడో అప్పుడు ఆయన ఆ న్యాయాధిప
తికి తోడుగా వుండి, ఆ న్యాయాధిపతియొక్క యావ
ద్దినముల పర్యంతము వారిని వారి శత్రువులలోనుంచి
రక్షించెను; యేమంటే వారికి వుపద్రవమునున్ను బాధ
నున్ను పెట్టేవారి నిమిత్తము వారు మూల్గినప్పుడు యె
9 హోవా పశ్చాత్తప్తుడాయెను. । అయితే ఆ న్యాయా
ధిపతియైన వాడు మరణమైనప్పుడు సంభవించినదే
మంటే వారు తిరిగీ యితరమైన దేవుండ్ల వెంబడిని
పోయి, వారికి సేవచేసి, వొంగి నమస్కరించి, తమ
పితృలకంటే తమ్మును యెక్కువగా చెరుపుకొని, తమ
క్రియలలో యే వొక దానినైనానున్ను తమ మూర్ఖ
మైన మార్గమునైనానున్ను విడవకుండా వుండిరి. ।
అయినందున యెహోవాయొక్క కోపము ఇశ్రాయే 20
లు మీద మండి, ఆయన అనుకొన్నదేమంటే, యీ
జనులు వారి పితృలకు నేను ఆజ్ఞాపించిన వొడంబడి
కెను మీరి, నా శబ్దమును విననైతిరి, । గనుక యికను 21
నేను యెహోషువ చేత వాడు మరణమైనప్పుడు విడు
వపడిన జనాంగములలో యే వొకటయినా వారి ముం
దరనుంచి తోలివేయక, । ఇశ్రాయేలు యెహోవా 22
యొక్క మార్గమందు నడువడానకు తమ పితృలు
గైకొన్నట్టు తాము గైకొంటారో లేదో అని వారి
మూలముగా వారిని పరీక్ష చేతునన్నట్టుగా అను కొ
నెను. । కాబట్టి యెహోవా ఆ జనాంగములను వేగి 23
రముగా బయిట తోలివేయక వారిని వుండ నిచ్చెను:
యెహోషువ చేతికిన్ని ఆయన వారిని అప్పగించ లేదు.

## 3. అధ్యాయము.

యెహోవా వుండనిచ్చిన జనాంగములు యేవం 1
టే, ఫిలిష్తీయుల అయిదుగురు అధిపతులున్ను, కెన
యానీయులందరున్ను, సీదోనీయులున్ను, బయల్హెర్మో
ను పర్వతము మొదలుకొని హమాతులో ప్రవేశించే
స్థలము మట్టుకు లెబానోను పర్వతమందు కాపురస్తు
లయిన హివ్వీయులున్ను అనే వీరు. । ఇశ్రాయేలీయు 2
లలో కెనయను దేశపు యుద్ధములు యావత్తు చూడ
నటువంటి వారిని వీరిచేత పరీక్షించడానకు మాత్రమే
కాకుండా, । ఇశ్రాయేలు పుత్రుల తరములవారు పూర్వ 3
మందు యుద్ధమును గురించి యెరుగనటువంటి వారికి
దాన్ని నేర్పగలందులకు యెహోవా వీరిని వుండని
చ్చెను. । కాబట్టి ఇశ్రాయేలీయులు మోషే ద్వారా 4
తమ పితృలకు యెహోవా ఆజ్ఞాపించిన ఆయన ఆజ్ఞ
లకు విని లోబడుదురో లేదో అని వారిని పరీక్షించ
డానకు ఆ జనాంగములు వుండిరి. । అయినందున ఇశ్రా 5
యేలు పుత్రులు కెనయానీయులలోనున్ను, హిత్తీయు
లలోనున్ను, అమోరీయులలోనున్ను, పెరిజీయులలో
నున్ను, హివ్వీయులలోనున్ను, యెబూసీయులలోనున్ను
కాపురస్తులై, । వారి కుమార్తెలను భార్యలుగా తీసు 6
కొని, తమ కుమార్తెలను వారి కుమాళ్లకు యిచ్చి, వారి
దేవుండ్లకు సేవచేసిరి. । యీలాగున ఇశ్రాయేలు పుత్రులు 7
యెహోవా దృష్టి యెదుట కీడు చేసి, తమ దేవుడయిన
యెహోవాను మరచి, బయలీముకున్ను తోపులకున్ను
సేవ చేసిరి. । కాబట్టి యెహోవాయొక్క కోపము 8
ఇశ్రాయేలు మీద మండి, అరమ్నహరయీము రాజ
యిన కూషన్ రెషాతయీము చేతిలోకి వారిని అమ్మి

వేసెను: ఇశ్రాయేలు పుత్రులు యెనిమిది సంవత్సర
ములు కూషన్ రెషాతయీాము కింద సేవచేస్తూ వుండిరి.।
9 అంతట ఇశ్రాయేలు పుత్రులు యెహోవాకు మొర
బెట్టినప్పుడు యెహోవా ఇశ్రాయేలు పుత్రుల కొ
రకు వొక రక్షకుని లేవ చేసినందున అతడు వారిని
రక్షించెను; అతడు కాలేబు తమ్ముడయిన కెనజు కుమా
10 రుడయిన ఒత్నియేలు.। యెహోవాయొక్క ఆత్మ అ
తని మీదికి వచ్చినందున అతడు ఇశ్రాయేలుకు న్యా
యాధిపతియై, బయిలు వెళ్లి యుద్ధము చేసినప్పుడు,
యెహోవా అరమ్నహరయీాము రాజయిన కూషన్
రెషాతయీామును అతని చేతికి యిచ్చినందున అతని
చెయ్యి కూషన్ రెషాతయీాము మీద జయకరముగా
11 వుండెను.। దేశము నలుబై సంవత్సరములు నిమ్మళించెను:
అంతట కెనజుయొక్క కుమారుడయిన ఒత్నియేలు
12 మరణమాయెను.। తరువాత ఇశ్రాయేలు పుత్రులు
తిరిగీ యెహోవా దృష్టి యెదుట కీడు చేసిరి: అప్పు
డు యెహోవా మోయాబు రాజైన ఎగ్లోనును ఇశ్రా
యేలుకు విరోధముగా బలపరచెను, యెందుకంటే
వారు యెహోవా దృష్టి యెదుట కీడుచేసి వుండిరి.।
13 అయినందున అతడు అమ్మోను పుత్రులనున్ను అమా
లేకు పుత్రులనున్ను కూచుకొని బైలు వెళ్లి, ఇశ్రా
యేలీయులను నరికి, ఖర్జూరపు చెట్లు గల పట్టణ
14 మును స్వాధీనము చేసుకొనెను.। యీాలాగున ఇశ్రా
యేలు పుత్రులు మోయాబుయొక్క రాజైన ఎగ్లోను
15 కింద పద్ధెనిమిది సంవత్సరములు సేవ చేసిరి.। అయితే
ఇశ్రాయేలు పుత్రులు యెహోవాకు మొరపెట్టినప్పు
డు యెహోవా వారి కొరకు బెన్యామీనీయుడైన
గేరాయొక్క కుమారుడున్ను యెడమ చెయ్యి వాట
ము గల వాడున్ను అయిన ఏహూదు అనే వొక రక్ష
కుని లేవ చేసెను; అతనిచేత ఇశ్రాయేలు పుత్రులు
మోయాబు రాజైన ఎగ్లోనుకు వొక కానుకను పంపి
16 నారు,। అయితే ఏహూదు మూరెడు నిడువైన రెండు
తెగువలు గల కటారిని చేసుకొని, తన వస్త్రము కింద
17 కుడి తొడ మీద దాని కట్టుకొని,। ఆ కానుకను తీసు
కొని మోయాబు రాజయిన ఎగ్లోనుయొద్దికి వచ్చినాడు,
యీా ఎగ్లోను మిక్కిలీ స్థూలమయినవాడయి వుండెను.।
18 అయితే అతడు కానుకను చెల్లించడము సమాప్తమయిన
తరువాత కానుకను మోసుకొని వచ్చిన వారికి సెలవు
19 యిచ్చి,। తాను తిరిగి, గిల్గాలు యెదుట వుండే రాతి
గనుల యొద్దనుంచి మళ్లీ వచ్చి, వొా రాజా, మీాతో
రహస్యముగా చెప్పవలసినది నాది వొక మనవి కలదని
చెప్పెను; అప్పుడు అతడు వూరకొమ్మని నియోగించి
నందున అతని దగ్గిర నిలువబడిన వారందరున్ను అతని
యొద్దనుంచి బయిలువెళ్లి పోయిరి.। అంతట ఏహూదు 20
అతని యొద్దికి చేరెను; అతడు తనకొరకై కలిగి వున్న
చల్లని మేడ గదిలో వొంటిగా కూచుకొని వుండెను:
అప్పుడు ఏహూదు నీతో చెప్ప వలసిన దైవ వాక్య
ము నా యొద్ద కద్దని చెప్పినందున అతడు తన ఆసన
మునుంచి లేచినాడు.। అప్పుడు ఏహూదు తన యెడ 21
మ చేతిని చాపి, తన కుడి తొడ యొద్దనుంచి కటారిని
తీసి, అతని వుదరములో పొడిచినాడు.। అయితే పిడి 22
కూడా కత్తి వెంబడిని దూసెను; మరిన్ని మదము
కత్తిని చిక్కపట్టినందున ఇతడు అతని వుదరములో
నుంచి కటారిని మళ్లీ తీయలేకపోయెను; కాగా అశు
ద్ధము బయిటికి వచ్చెను.। అప్పుడు ఏహూదు బయిట 23
సాలలోకి వెళ్లి, గది తలుపులను వేసి తాళములు తిప్పె
ను.। ఇతడు తలిగిపోయిన తరువాత అతనియొక్క 24
సేవకులు వచ్చి, గది తలుపులయొక్క తాళములు తిప్ప
బడి వుండెనని చూచి, నిశ్చయముగా అతడు చల్లని
మేడ గదిలో కాళ్లు కప్పుకొని వరున్నాడని అనుకొ
నిరి.। అయితే వారు సిగ్గుపడే మట్టుకు కనిపెట్టినప్ప 25
టికిన్ని యిదుగో అతడు గది తలుపులను తీయలేదని
చూచి, వారు తాళమును తీసుక వచ్చి తలుపులు విప్పి
నప్పుడు, యిదిగో వారి యజమాని మరణమయి నేల
మీద పడి వుండెను.। అయితే వారు నిశ్చేష్టులై నిలు 26
వబడి వుండగా, ఏహూదు పారిపోయి రాతి గను
లను గడచి శేయీారాకు వచ్చి తప్పించుకొనెను.।
అతడు వచ్చినప్పుడు సంభవించినదేమంటే, ఎఫ్రయీా 27
ము పర్వతమందు బాకా వూదినందున ఇశ్రాయేలు
పుత్రులు అతనితో పర్వతము మీాదనుంచి దిగినారు.।
అతడు వారి ముందుగా వెళ్లి వారిని చూచి, నన్ను 28
వెంబడించి రండి, యేమంటే యెహోవా మీా శత్రు
వులయిన మోయాబీయులను మీా చేతిలోకి అప్పగించి
వున్నాడని చెప్పినందున, వారు అతని వెంబడిని దిగి,
మోయాబు అభిముఖముగా వున్న యర్దేనుయొక్క
రేవులను ఆక్రమించుకొని, యెవ్వరినిన్ని దాటనివ్వక
వుండిరి.। మరిన్ని వారు ఆ కాలమందు మోయాబులో 29
పదివేలమంది మట్టుకు సంహరించిరి; వీరందరున్ను పరా
క్రమమయిన ఆయుధస్థులైన వారు తప్పించుకొనిన
వాడు వొకడూ లేక పోయెను.। యీాలాగున ఆ దిన 30
మందు మోయాబు ఇశ్రాయేలు చేతికింద అణచపడి
నందున దేశము యెనబై సంవత్సరములు నిమ్మళించెను.।
అతని తరువాత ఆనాతుయొక్క కుమారుడయిన షమ్గ 31
రు లేచినాడు; ఇతడు మునికోల కర్రతోటి ఫెలిష్తీ
యులలో ఆరునూరు మందిని చంపినాడు; ఇతడున్ను
ఇశ్రాయేలును రక్షించెను.

## 4. అధ్యాయము.

1 ఏహూదు మరణమైన తరువాత ఇశ్రాయేలు పుత్రు
లు తిరిగీ యెహోవా దృష్టి యెదుట కీడు చేసినం
2 దున, । యెహోవా హాసోరు యందు యేలిన కెనయ
ను రాజైన యాబీను చేతిలోకి వారిని అమ్మివేసెను;
అతని సైన్యాధిపతి పేరు సీసెరా అని వుండెను; ఇత
డు అన్య జనాంగములకు కలిగిన హరోషెతులో కా
3 పురము చేసెను. । అతడు తొమ్మిదినూర్లు యినుప రథ
ములు కలవాడై, యిరువై సంవత్సరములు ఇశ్రాయేలు
పుత్రులను బహు బాధ పెట్టినందున, ఇశ్రాయేలు
4 పుత్రులు యెహోవాకు మొరపెట్టిరి. । ఆ వేళప్పుడు
లప్పిదోతు భార్య అయిన దెబోరా అనే దీర్ఘదర్శి
రాలు ఇశ్రాయేలుకు న్యాయము తీర్చేదై వుండె
5 ను. । ఆవిడె ఎఫ్రయీము పర్వతమందు రామాకున్ను
బేతేలుకున్ను మధ్యమందు వున్న దెబోరాయొక్క
ఖర్జూరపు చెట్టుకింద నివాసురాలై వుండెను; ఆవి
డె యొద్దికి ఇశ్రాయేలు పుత్రులు న్యాయపు తీర్పు
6 కొరకు వచ్చిరి. । ఆవిడె అబీనోయము కుమారుడైన బా
రాకును కెదెషు నఫ్తాలీలోనుంచి పిలువనంపించి, అత
నితో నీవు నఫ్తాలీ పుత్రులలోనుంచిన్ని జెబూలోను
పుత్రులలోనుంచిన్ని పదివేల మందిని తీసుకొని, తా
బోరు పర్వతము దగ్గిరకు వెళ్లి పొమ్మని ఇశ్రాయేలుయొ
క్క దేవుడైన యెహోవా సెలవు యిచ్చి వున్నాడు
7 గదా? । మరిన్ని కీషోను నదీ ప్రాంతమున నీ దగ్గిరకు
యాబీనుయొక్క సేనాధిపతియైన సీసెరాను అతని రథ
ములతోటిన్ని అతని సమూహము తోటిన్ని వచ్చేటట్టు
చేసి, నీ చేతిలోకి అతని అప్పగింతునని ఆనతిచ్చెనని
8 చెప్పినప్పుడు. । బారాకు ఆవిడెను చూచి నాతోటి
నీవు వస్తే అప్పుడు నేను వెళ్లుతాను; నీవు నాతోటి
9 రాకపోతే అప్పుడు నేను వెళ్లనని చెప్పెను. । అందుకు
ఆవిడె నీతో కూడా రానే వస్తాను; అయినప్పటికిన్ని
నీవు వెళ్లే ప్రయాణము నీ ఘనమునకు వుండదు; యెం
దుకంటే, యెహోవా సీసెరాను వొకస్త్రీచేతికి అమ్మి
వేసునని చెప్పెను. అప్పుడు దెబోరా లేచి బారా
10 కుతో కూడా కెదెషుకు వెళ్లి పోయెను. । అప్పుడు
బారాకు జెబూలోనునున్ను నఫ్తాలీనిన్ని కెదెషుకు
పిలిపించి, అతని వెంబడించి వచ్చిన పదివేల మందితో
కూడా యెక్కి పోయెను; మరిన్ని దెబోరా అతనితో
11 కూడా యెక్కి వెళ్లెను. । యింతకు మునుపు మోషేయొ
క్క మామ అయిన హోబాబు పుత్రుల సంబం
ధము గల కేనీయుడయిన హేబెరు తన్ను తాను కేనీ
యులలోనుంచి విభజన చేసుకొని, తన డేరా కెదెషు
దగ్గిర వున్న నయన్నయీము మైదానమందు వేసుకొని
వుండెను. । వారు అబీనోయము కుమారుడైన బారాకు 12
తాబోరు పర్వతము మీదికి యెక్కి పోయిన సంగతిని
సీసెరాకు తెలియచేసిరి. । అప్పుడు సీసెరా యెన్ని రథ 13
ములు తనకు కలిగి వున్నవో అనగా తొంబన్నూరు
యినుప రథములనున్ను, తన దగ్గిరనున్న జనులందరినిన్ని
కూర్చి తీసుకొని, అన్య జనాంగములకు కలిగిన హరో
షెతునుంచి కీషోను నది దగ్గిరకు వచ్చినాడు. । అప్పుడు 14
దెబోరా బారాకుతో లెమ్ము, యెందుకంటే యెహో
వా సీసెరాను నీ చేతికి యిచ్చే వేళ యీ దినమేవే; నీ
ముందరనుంచి యెహోవా బయిలు వెళ్లినాడు కాడా
అని పలికినందున బారాకు తన వెంబడి వచ్చిన పదివేల
మందితో తాబోరు పర్వతము మీదనుంచి దిగి వెళ్లెను. ।
అప్పుడు యెహోవా సీసెరానున్ను అతని రథములన్ని 15
టినిన్ని అతని సమూహమంతానున్ను కత్తి వాడిచేత
బారాకు ముందర కళవిళ చేయించినందున, సీసెరా
తన రథములోనుంచి దిగి కాలి నడకచేత పారి పోయె
ను. । అయితే బారాకు రథములనున్ను సమూహము 16
నున్ను అన్య జనాంగముల హరోషెతు మట్టుకు తరిమి
నందున శేషమయిన వొకడూ వుండకుండా సీసెరా
యొక్క సమూహము యావత్తు కత్తి వాడిచేత పడి
పోయెను. । అయినప్పటికిన్ని సీసెరా కాలినడకచేత 17
పారిపోయి, కేనీయుడైన హేబెరుకు భార్యయైన
యాయేలుయొక్క డేరాకు వచ్చెను, యేమంటే హాసోరు
రాజైన యాబీనుకున్ను కేనీయుడయిన హేబెరు కుటుం
బమునకున్ను సమాధానము కలిగి వుండెను. । యాయేలు 18
సీసెరాను యెదుర్కొనుటకు బైలు వెళ్లి, అతని చూచి
నా ప్రభువా లోపలికి రండి, భయపడక నా యింటి
లోపలికి రండని పిలిచెను. అతడు దాని డేరా లో
పలికి వచ్చిన తరువాత అది దుప్పటితో అతని కప్పె
ను. । అప్పుడు అతడు నా దాహము తీరేటందుకు 19
కొంచెము నీళ్లు యిమ్మని దాన్ని అడిగినందున అది
పాలతో వున్న వొక బుడ్డి విప్పి అతనికి తాగనిచ్చి
మళ్లి కప్పెను. । తిరిగీ అతడు దానితో డేరా ద్వారము 20
యొద్ద నిలిచి వుండు, యెవడైనా వచ్చి యీ లోపల
యెవడైనా వున్నాడా అని నిన్ను అడిగితే లేడని
చెప్ప వలెనన్నట్టుగా చెప్పెను. । అప్పుడు హేబెరు 21
యొక్క భార్యయైన యాయేలు డేరామేకు తీసుకొని,
సుత్తి చేతపట్టుకొని, అతని యొద్దికి మెల్లిగా వచ్చి,
అతని కణతలలో మేకు కొట్టి, భూమి యందు గట్టిగా
నాటెను; యేమంటే అతడు అలసటచేత నిద్రపోయి
వుండెను; కాబట్టి అతడు మరణమాయెను. । మరిన్ని 22
యిదుగో బారాకు సీసెరాను తరుముకొని వస్తూవుం
డగా యాయేలు అతని యెదుర్కొనడానకు బయిలు
వెళ్లి, అతని చూచి, నీవు వెతుకుతూవున్న వాని నీకు

చూపింతును, రమ్మని చెప్పినందున, అతడు డేరా లో
పలకు వచ్చినప్పుడు యిదుగో సీసెరా మరణమై పడి
23 వుండెను, మేకు అతని కణతలలో వుండెను. । యీ
లాగున దేవుడు ఆ దినమందు కెనయను రాజయిన
యాబీనును ఇశ్రాయేలు పుత్రుల ముందర అపజయము
24 చేసెను. । మరిన్ని ఇశ్రాయేలు పుత్రులయొక్క చెయ్యి
కెనయను రాజయిన యాబీను మీద అంతకంతకు ప్రబ
లించి, వారు కెనయను రాజయిన యాబీనును నాశ
నము చేసే పర్యంతము జయకరముగా వుండెను.

## 5. అధ్యాయము.

1 ఆ దినమందు దెబోరాయున్ను అబీనోయము
కుమారుడయిన బారాకున్ను సంగీతమును పాడినదేమం
2 టే, । జనులు తమ్మును తాము సిద్ధపరుచుకొనినప్పుడు
ఇశ్రాయేలు పట్ల అయిన ప్రతిహతముకొరకు యె
3 హోవాను స్తుతించండి. । వో రాజులారా వినండి,
అధిపతులారా చెవినొగ్గండి; నేను, నిశ్చయముగా
నేను, యెహోవాకు పాడుతూ ఇశ్రాయేలుయొక్క
దేవుడయిన యెహోవాకు సంగీతమును చేతును. ।
4 వో యెహోవా, శెయీరునుంచి నీవు బయిలు వెళ్లి
నప్పుడున్ను, ఎదోము భూమినుంచి నీవు అవతలకు
నడచినప్పుడున్ను భూమి కంపించెను, ఆకాశము వర్షిం
5 చెను, మేఘములు నీళ్లు కురిపించెను. । యెహోవా
ముందర పర్వతములు, సీనై పర్వతము సహా, యాకోబు
యొక్క దేవుడయిన యెహోవా ముందర కరిగి
6 పోయెను. । ఆనాతు కుమారుడైన షమ్గరు దినములం
దున్ను యాయేలుయొక్క దినములందున్ను రాజమార్గ
ములు మానివేయబడెను; మార్గస్థులు రహస్యపు
7 మార్గములలో వెళ్లేవారు. । దెబోరా అనే నేను
లేచేమట్టుకు, ఇశ్రాయేలులో నేను తల్లిగా లేచేమ
ట్టుకు, గ్రామములు విడువ బడ్డవి, ఇశ్రాయేలులో
8 అవి విడువబడ్డవి. । వారు కొత్త దేవుండ్లను యేర్పరచు
కొనిరి, అప్పుడు ద్వారములయందు యుద్ధము లేచెను;
ఇశ్రాయేలు యందు నలుబై వేలమందిలో డాలైనా
9 యీటైనా కనపడెనా? । జనులలో తమ్మును తాము
సిద్ధపర్చుకొనిన ఇశ్రాయేలుయొక్క అధిపతుల తట్టు
నా హృదయము వున్నది: యెహోవాను స్తుతించం
10 డి. । ధావళ్యమైన గార్దభముల మీద యెక్కే మీరు
న్యాయాసనములందు ఆసీనులయి మార్గములో నడిచే
11 మీరు పలకండి. । నీళ్లు తోడే స్థలములలో విలుకాం
డ్లయొక్క ధ్వనినుంచి రక్షించబడిన వారు అక్కడ
యెహోవాయొక్క నీతికార్యములకు, అనగా, ఇశ్రా
యేలుయొక్క గ్రామముల కొరకైన నీతి కార్యములను
తెలియచేతురు; అప్పుడు యెహోవాయొక్క జనులు
ద్వారములకు దిగి వెళ్లుదురు. । లే, లే, వో దెబోరా; 12
లే, లే, పాటను పాడుము: వో బారాకా, లే, వో
అబీనోయము కుమారుడా నీవు పట్టుకొనిన వారిని
చెరలోకి కొంచపొమ్ము. । అప్పుడు ఆయన శేషమయి 13
వుండేవారిని మహత్తు కలవారి మీద ప్రభుత్వము
గలవారినిగా చేసెను: పరాక్రమశాలుల మీద యె
హోవా నన్ను ప్రభుత్వము గలవానిగా చేసెను. ।
ఎఫ్రయీములోనుంచి అమాలేకు మీద వారి మూల 14
ము వుండెను; నీ తరువాత నీ జనులలో బెన్యామీను
వుండెను; మాఖీరులోనుంచి అధికారులు దిగి వచ్చిరి;
మరిన్ని జెబూలోనులోనుంచి వ్రాతగానియొక్క కల
మును వాడికె చేసేవారు వచ్చిరి. । ఇశ్శాఖారుయొక్క 15
ప్రభువులు దెబోరాతో కూడా వుండిరి; ఇశ్శాఖారు
గాక బారాకున్ను వుండెను; అతడు తన కాలి నడక
చేత లోవలోకి పంపబడెను: రూబేనువల్ల కలిగిన విభ
జన నిమిత్తము మహా మనో విచారములు కలిగి వుం
డెను. । గొర్రెల దొడ్లలో నీవు యెందుకు వుండిపోతివి, 16
మందలయొక్క అరుపులు వినడానకా? రూబేనువల్ల
కలిగిన విభజనల నిమిత్తము బహు మనో విచారములు
కలిగి వుండెను. । గిలాదు యర్దేను అవతల నిలిచెను; 17
దాను వోడ మీద యెందుకు నిలిచెను? ఆషేరు సము
ద్రపు దరిని వుండి తన రాతి స్థలములలో వుండి
పోయెను. । జెబూలోనున్ను నఫ్తాలీయున్ను భూమి 18
యొక్క అగ్రస్థలములందు తమ ప్రాణములు మర
ణానకు అగుపర్చే జనులై వుండిరి. । రాజులు వచ్చి 19
యుద్ధము చేసిరి; కెనయనుయొక్క రాజులు మెగిద్దో
వుదకము దగ్గిర తయనఖు యందు యుద్ధము చేసిన
ప్పటికిన్ని సొమ్ము యెంత మాత్రము దోచుకో లేక
పోయిరి. । ఆకాశమునుంచి వారు యుద్ధము చేసిరి; 20
నక్షత్రములు తమ గతులలో సీసెరా మీద యుద్ధము
చేసెను. । కీషోను నది వారి మీద పొర్లి పారెను; 21
ఆ వృద్ధనది అనే కీషోను నది వారి మీద పొర్లి
పారెను; వో నా ఆత్మా, నీవు బలమును తొక్కితివి. ।
అప్పుడు గుర్రములయొక్క డెక్కలు దాట్లవల్ల బద్ద 22
లయిపోయెను, వారి పరాక్రమశాలులయొక్క దాట్ల
వల్ల బద్దలయిపోయెను, । మేరోజును శపించండని 23
యెహోవాయొక్క దూత చెప్పెను; దాని కాపు
రస్తులు యెహోవాకు సహాయముగా పరాక్రమ
శాలులతోను రాకపోయినందున ఘోరమైన శాపము
తోటి వారిని శపించండి. । కేనీయుడైన హేబరుకు 24
భార్యయైన యాయేలు స్త్రీలలో ఆశీర్వదించబడినదిగా
వుండును గాక; డేరా యందు వుండే స్త్రీలందరిలో
అది ఆశీర్వదించ బడినదిగా వుండును గాక. । అతడు 25
నీళ్లు అడిగినప్పుడు ఆమె పాలు యిచ్చెను; ఘనమైన

26 గిన్నెతోను వెన్న తెచ్చెను. । ఆమె తనచేత మేకున్ను
కుడిచేత పనివానియొక్క సుత్తిన్ని పట్టుకొని, ఆ సుత్తి
తో సీసెరాను కొట్టెను; మేకు నాటించి అతని కణ
తలు దూసిపోచేసిన తరువాత అతని తలను ఖండించె
27 ను. । అతడు వంగి దాని పాదముల సందున కూలిపడెను,
దాని పాదముల సందున వంగి కూలెను; యెక్కడ
28 వంగెనో అక్కడ కూలి నాశనమాయెను. । సీసెరా
యొక్క తల్లి కిటికీ ద్వారములోనుంచి బయిట చూచి
అనుకొన్నదేమంటే, అతని రథము యిప్పటికీ యేల
రాకపోయెను? అతని రథచక్రములకు యింత ఆల
29 స్యము యెందుకని అడిగినందును, । ఆమె యొద్దనున్న
ప్రజ్ఞ గల స్త్రీలు ఆమెకు ప్రత్యుత్తరము యిచ్చిరి; తనకు
30 తాను ప్రత్యుత్తరము యిచ్చుకొన్నదేమంటే, । వారు
దొరికించుకో లేదా? దోపుడు సొమ్మును పాళ్లు పంచు
కో లేదా? వొక్కొక్కనికి వొక తెనైనా లేక యిద్దరి
నైనా పడుచులున్ను; సీసెరాకు వివిధ వర్ణములు
గల కొల్లయిన వస్తువు, సూదిచేత కుట్టబడి వివిధ వర్ణ
ములు గల వస్త్రములున్ను, నిజముగా సొమ్ము దోచు
కొనిన వారియొక్క కంఠములకు తగిలించ తగినటు
వంటిన్ని రెండు పక్కల యందూ సూదిచేత కుట్టబడిన
వివిధ వర్ణములు గల వస్త్రమున్ను ప్రాప్తించ లేదా
31 యేమి అని చెప్పుకొన్నది. । వో యెహోవా, ఆలా
గున నీ శత్రువులందరున్ను లయమవుదురు గాక: అయితే
ఆయనను స్నేహించేవారు తన బలముతో బయిలు
వెళ్లే సూర్యుని వలెనే అవుదురు గాకని పాడిరి.
అటు తరువాత నలుబై సంవత్సరముల మట్టుకు దేశ
ములో నెమ్మది కలిగి యుండెను.

## 6. అధ్యాయము.

1 అయినప్పటికిన్ని ఇశ్రాయేలు పుత్రులు మళ్లీ యె
హోవా దృష్టి యెదుట కీడు చేసినందున, యెహో
వా యేడు సంవత్సరముల మట్టుకు వారిని మిద్యాను
2 చేతిలోకి అప్పగించెను. । మిద్యాను చెయ్యి ఇశ్రాయే
లు మీద ప్రబలముగా వుండెను; కాబట్టి మిద్యానీ
యుల నిమిత్తము ఇశ్రాయేలు పుత్రులు పర్వతముల
యందుండే మరుగు స్థలములనున్ను గుహలనున్ను గట్టి
3 స్థలములనున్ను చేసుకొనిరి. । అయితే ఇశ్రాయేలు
విత్తినప్పుడెల్లా మిద్యానీయులు వారి మీదికి వచ్చే
వారు; మరిన్ని అమాలేకీయులున్ను తూర్పు దేశపు
4 పుత్రులున్ను వారి మీదికి వచ్చి, । వారి యెదుట దిగి,
గాజా పట్టణము మట్టుకు భూమి పంట పాడు చేసి,
ఇశ్రాయేలీయులకు గొర్రెనైనా యెద్దునైనా గార్ద
భమునైనా ఆహారము నిమిత్తము మరి యేమినైనా
5 వుంచలేదు. । యేమంటే వారు తమ పశువులనున్ను తమ
డేరాలనున్ను తీసుకొని, మిడతల సమూహమంత విస్తా
రముగా వచ్చిరి; వారున్ను వారియొక్క వొంటెలున్ను
లెక్కలేక వుండి, దేశమును పాడు చేయడానకు ప్రవే
శించిరి. । యీలాగున ఇశ్రాయేలు మిద్యానీయులచేత 6
క్షీణగతి అయినందున, ఇశ్రాయేలు పుత్రులు యెహో
వాకు మొర్ర పెట్టిరి. । ఇశ్రాయేలు పుత్రులు మిద్యానీ 7
యుల నిమిత్తము యెహోవాకు మొర్ర పెట్టినప్పుడు
సంభవించినదేమంటే, । యెహోవా వొక దీర్ఘదర్శిని 8
ఇశ్రాయేలు పుత్రుల యొద్దికి పంపించెను; అతడు
వచ్చి వారితో ఇశ్రాయేలుయొక్క దేవుడైన యెహో
వా సెలవు యిచ్చేదేమంటే, నేను మిమ్మును మిస్రయీ
ములోనుంచి యివతలకు తీసుకవచ్చి, దాస్య గృహము
లోనుంచి మిమ్మును విడిపించిన వాడనయితిని. । మరి 9
న్ని మిస్రీయుల చేతిలోనుంచిన్ని మిమ్మును బాధపె
ట్టిన వారందరి చేతిలోనుంచిన్ని మిమ్మును విడిపించి,
మీ ముందరనుంచి వారిని అవతలకు వెళ్ల జేసి, వారి
దేశమును మీకు దయ చేసితిని. । మరిన్ని నేను మీకు 10
సెలవు యిచ్చినదేమంటే, నేను మీయొక్క దేవుడన
యిన యెహోవాను; యెవరి దేశమందు మీరు కాపు
రస్తులవుదురో ఆ అమోరీయులయొక్క దేవుండ్లకు
భయపడకండని చెప్పితిని, అయితే మీరు నా వాక్య
మును వినకపోతిరని సెలవు యిచ్చెనని చెప్పెను. ।
అది గాక యెహోవా యొక్క దూత వచ్చి అబీ 11
యెజ్రీయుడయిన యోవాషుకు స్వాధీనమైన ఒఫ్రా
లో వున్న వొక ఆలచెట్టు కింద కూచుండెను; అప్పు
డు అతని కుమారుడైన గిదోను మిద్యానీయులకు దా
చుట కొరకు గానుగ దగ్గిర గోధుమను దుళ్లగొట్టుతూ
వుండెను. । అప్పుడు యెహోవాయొక్క దూత అత 12
నికి ప్రత్యక్షమయి, వో ప్రతాపము గల బలాఢ్యుడా,
యెహోవా నీకు తోడుగా వున్నాడని చెప్పెను. ।
అందుకు గిదోను వో నా కర్తా, యెహోవా మాకు 13
తోడుగా వున్న పక్షమందు యిది అంతా మాకు యేల
సంభవించి యున్నది? యెహోవా మమ్మును మిస్ర
యీములోనుంచి యివతలకు తీసుకొని రాలేదా అని
మా పితృలు మాకు తెలియ చెప్పిన ఆయనయొక్క
అద్భుతములన్నిన్ని యెక్కడ? అయితే యిప్పుడు యె
హోవా మమ్మును విడచిపెట్టి మిద్యానీయుల చేతుల
లోకి మమ్మును యిచ్చివేసి యున్నాడని చెప్పెను. ।
అప్పుడు యెహోవా అతని చూచి, నీకు కలిగిన యీ 14
పరాక్రమముచేత నీవు వెళ్లు, యేమంటే నీవు మిద్యా
నీయుల చేతిలోనుంచి ఇశ్రాయేలును రక్షింతువు,
నేనే నిన్ను పంపితినని సెలవు యిచ్చినప్పుడు, । అతడు 15
అనినదేమంటే, వో నా కర్తా యిదుగో నా కు
టుంబము మనస్సేలో స్వల్పమై యున్నది; మరిన్ని

నా తండ్రి యింట్లో నేను అతి అల్పుడనయి వున్నాను;
ఇశ్రాయేలును నేను రక్షించేది యేలాగునని అడగగా;।
16 యెహోవా అతనితో నిశ్చయముగా నేను నీకు తో
డుగా వుంటాను, అయినందున నీవు మిద్యానీయులను
వొక్క మనిషినిగా సంహరించుదువని ఆనతిచ్చెను.।
17 అంతట అతడు ఆయనను చూచి, నీ సముఖమందు
నాకు దయ కలిగినట్టయితే నాతో మాట్లాడుతున్న
వాడు నీవే అని వొక గురుతు నాకు దయచేయవలెను.।
18 నేను నీ యొద్దికి తిరిగీ వచ్చి, నా కానుకను తీసుక
వచ్చి, నీ యెదుట దాన్ని పెట్టేపర్యంతము యిక్కడ
నుంచి వెళ్లిపోకుమని నిన్ను వేడుకొంటున్నానని చెప్పి
నప్పుడు, ఆయన నీవు తిరిగీ వచ్చే పర్యంతమూ యిక్క
19 డనే వుంటానని చెప్పెను.। అప్పుడు గిదోను లోపలికి
వెళ్లి, వొక మేకపిల్లనున్ను ఏఫా అంత గోదుమ పిండి
తో చేయబడ్డ పులుసు లేని అప్పాలనున్ను సిద్ధము
చేసి, మాంసము వొక గంపలోనున్ను రసము వొక
కుండలోనున్ను వేసి, ఆల చెట్టు కింద వున్న ఆయన
20 దగ్గిరకు తీసుక వచ్చి అర్పించెను.। అంతట యెహో
వాయొక్క దూత అతనితో చెప్పినదేమంటే, నీవు
యీ మాంసమునున్ను పులుసులేని యీ అప్పాలనున్ను
తీసి యీ రాతి మీద వుంచి, రసము పొయ్యుమని
21 సెలవు యివ్వగానే ఆతడు ఆలాగున చేసెను.। అప్పు
డు యెహోవాయొక్క దూత తన చేతిలో వున్న
కర్ర చాపి, దాని చివరతోటి ఆ మాంసమునున్ను పులు
సులేని అప్పాలనున్ను ముట్టినందున అగ్ని రాతిలో
నుంచి బయిలు వెళ్లి, మాంసమునున్ను పులుసులేని
అప్పాలనున్ను దహించెను. అప్పుడు యెహోవా
యొక్క దూత అతనియొక్క దృష్టి యెద్దనుంచి అదృ
22 శ్యుడాయెను.। అయితే ఆయన యెహోవాయొక్క
దూతని గిదోను గ్రహించినప్పుడు గిదోను అయ్యో!
వో దేవుడైన యెహోవా! యెందుకంటే నేను ముఖా
ముఖిగా యెహోవాయొక్క దూతను చూస్తినని
23 చెప్పెను.। కాబట్టి యెహోవా అతనితో నీకు క్షేమ
మవు గాక, భయపడ వద్దు, నీవు చావక వుందువని
24 ఆనతిచ్చెను.। అప్పుడు గిదోను వొక బలిపీఠమును
అక్కడ యెహోవా పేరట కట్టి, దానికి యెహో
వా షాలోమనే పేరు పెట్టెను; అది అబీయెజ్రీయుల
25 యొక్క ఒఫ్రాలో నేటి వరకూ వున్నది.। ఆ రాత్రి
లోనే సంభవించినదేమంటే, యెహోవా అతనితో
నీవు నీ తండ్రియొక్క కోడె యెద్దును, అనగా, యేడు
సంవత్సరముల యీడు గల రెండో యెద్దును తీసుకొని
నీ తండ్రి యొద్ద వున్న బయలుయొక్క బలిపీఠమును
26 పడదోసి, దాని దగ్గిర వున్న తోపును నరికివేసి,। నీ
దేవుడైన యెహోవా పేరట వొక బలిపీఠమును యీ
గట్టి రాతిమీద తగినట్టుగా కట్టి, ఆ రెండో యెద్దును
తీసుకొని, నీవు నరికివేసే తోపుయొక్క కర్రలతోటి
హోమ బలిని చెల్లించుమని సెలవు యిచ్చెను.। అప్పు 27
డు గిదోను తన సేవకులలో పదిమందిని పిలుచుకొని,
యెహోవా తనకు యిచ్చిన సెలవు చొప్పున చేసెను;
అయితే అతడు తన తండ్రి యింటి వారి యందున్ను
వూరి వారి యందున్ను భయముగా వుండెను, గనుక
అది పగటి యందు చేయలేక రాత్రియందు చేసెను.।
అయినందున ఉదయమందు వూరివారు లేచినప్పుడు 28
యిదుగో బయలుయొక్క బలిపీఠము పడదోయపడి
నదిన్ని, దాని దగ్గిర వున్న తోపు నరకపడినదిన్ని,
రెండో యెద్దు కట్టబడిన బలిపీఠము మీద చెల్లించప
డినదిన్ని చూచినారు.। అందుకు వొకరిని వొకరు చూ 29
చుకొని యీ కార్యమును యెవడు చేసెనని అనుకొ
నిరి; నఖముఖాలా వెతికి అడిగిన తరువాత యీ కార్య
మును చేసినవాడు యోవాషు కుమారుడైన గిదోను
అని చెప్పుకొన్నారు.। అప్పుడు ఆ వూరివాండ్లు యో 30
వాషుతో చెప్పినదేమంటే, నీ కుమారుడు మరణము
కావడానకు అతని బయిటికి తీసుకరమ్ము, యెందుకంటే
అతడు బయలుయొక్క బలిపీఠమును పడదోసి, దాని
దగ్గిర వున్న తోపును నరికివేసెనని చెప్పిరి.। అప్పుడు 31
యోవాషు తన యెదురుగా నిలువబడిన వారిని చూచి,
బయలు పక్షముగా మీరు వాదింతురా! మీరు వాని
రక్షింతురా? వాని పక్షమందు వాదించేవాడు యీ
వుదయమందే చంపబడును గాక; వాడు దేవుడైతే
వొకడు వాని బలిపీఠము పడదోసెను గనుక తన పక్ష
మందు తాను వాదించుకొనును గాక అని చెప్పెను.।
కాబట్టి ఆ దినమున తన కుమారుని యెరుబ్బయలు 32
అని పిలిచి అనుకొన్నదేమంటే, యితడు వానియొ
క్క బలిపీఠమును పడదోసెను గనుక బయలు అతనికి
విరోధముగా వాదించుకొనును గాక అని అనుకొ
నెను.। అంతట మిద్యానీయులందరున్ను అమాలేకీయు 33
లున్ను తూర్పు దేశపు పుత్రులున్ను కూడుకొని, అవ
తలకు దాటి, ఇశ్రాయేలు లోవలో దిగిరి.। అయితే 34
యెహోవాయొక్క ఆత్మ గిదోను మీదికి వచ్చెను;
అతడు బాకా వూదినందున అబీయెజెరు అతని వెంబడి
కూడి వచ్చెను.। మరిన్ని అతడు మనస్సే అంతటి దాకా 35
దూతలను పంపించినందున అతడున్ను అతని వెంబడి
కూడి వచ్చెను; ఆలాగే ఆషేరు యొద్దికిన్ని జెబూ
లోను యొద్దికిన్ని నఫ్తాలీ యొద్దికిన్ని దూతలను పంపిం
చినందున వారున్ను అతనితో కలుసుకొనుటకు వచ్చిరి.।
అప్పుడు గిదోను దేవునితో చెప్పినదేమంటే, నీవు 36
యిచ్చిన సెలవు చొప్పున నాచేత ఇశ్రాయేలును రక్షిం
చే వాడవైతివట్టాయెనా,। యిదుగో నేను కత్తిరించిన 37

బొచ్చు వాకిటిలో పెట్టుతాను; మంచు బొచ్చు మీద
మాత్రమే కురిసి భూమి అంతా పొడిగా వున్నట్టయితే
అప్పుడు నీవు యిచ్చిన సెలవు చొప్పున నీవు నాచేత
ఇశ్రాయేలును రక్షింతువని నేను యెరుగుదునన్నట్టుగా
38 పలికెను. । అయితే అది ఆలాగునే ఆయెను; యేమంటే
మరునాడు అతడు త్వరగా లేచి బొచ్చు పట్టుకొని
పిండి, బొచ్చులోనుంచి నిండు పళ్లెమంత మంచు పిడి
39 చినాడు. । అప్పుడు గిదోను దేవునితో చెప్పినదేమంటే,
నీ కోపము నా మీద మండనివ్వ వద్దు; యింకా యీ
వొక్కమారు మాత్రమే చెప్పుతాను; నాయందు జాలి
వుంచు; యింకా వొక్కమారు యీ బొచ్చుచేత నన్ను
శోధించనియ్యి; యేలాగంటే బొచ్చు మాత్రమే పొడి
గా వుండి భూమి అంతటి మీదా మంచు వుండనిమ్మని
40 వేడుకొనెను. । కాబట్టి దేవుడు ఆ రాత్రి ఆలాగునే
చేసెను; యేమంటే బొచ్చు మాత్రమే పొడిగా వుండె
ను; అయితే మంచు భూమి అంతటి మీదా వుండెను.

## 7. అధ్యాయము.

1 అంతట యెరుబ్బయలు అనే గిదోనున్ను అతని
యొద్దనున్న జనులందరున్ను త్వరగా లేచి వెళ్లి హరో
దుయొక్క జెల దగ్గిర దిగిరి; అయినందున మిద్యానీ
యులయొక్క సమూహము వారి వుత్తర పార్శ్వమందు
2 లోవలో వుండే మోరే కొండ దగ్గిర వుండెను. । అప్పు
డు యెహోవా గిదోనుతో సెలవు యిచ్చినదేమంటే,
ఇశ్రాయేలు నా హస్తమే నన్ను రక్షించెనని నా ముం
దర తమ్మును తామే ఘనపరచుకొందురేమో, అది
కాకుండా నేను మిద్యానీయులను వారి చేతులలోకి
అప్పగించే కొరకు నీ యొద్దనున్న జనులు అతి విస్తా
3 రమై యున్నారు. । కాబట్టి జనుల చెవులలో నీవు
ప్రకటన చేయవలసినదేమంటే, జంకుతూ భయపడు
తూ వున్నవాడు యెవడో వాడు త్వరగా తిరిగి గిలా
దు పర్వతమునుంచి వెళ్లిపోవును గాకని చెప్పుమన్న
ట్టుగా ఆజ్ఞాపించెను: అయినందున జనులలో యిరువై
రెండువేలమంది తిరిగీ వెళ్లిపోయిరి; పదివేలమంది నిలిచి
4 వుండిరి. । తిరిగీ యెహోవా గిదోనుతో జనులు యిం
కా అధికమై యున్నారు; వుదకము దగ్గిరకు వారిని
దిగచేయుము, నీ కొరకు అక్కడ నేను వారిని శోధిం
తును; అప్పుడు సంభవించేదేమంటే, వీడు నీతోటి
వచ్చునని యెవని గురించి నేను నీతో చెప్పుదునో
వాడు నీతోటి వచ్చును; వీడు నీతోటి రాక వుండు
నని యెవని గురించి నేను నీతో చెప్పుదునో వాడు
5 నీతోటి రాక వుండునని సెలవు యిచ్చెను. । ఆలాగున
అతడు జనులను వుదకము దగ్గిరకు దిగచేసెను; అప్పుడు
యెహోవా కుక్క కతికినట్టు తన నాలుకచేత నీళ్లు
కతికే ప్రతివానిన్ని మోకాళ్లు వూని తాగే ప్రతి
వానిన్ని నీవు వేరు వేరుగా వుంచ వలెనని గిదోనుతో
సెలవు యిచ్చెను. । అప్పుడు తమ తమ నోటి దగ్గిరకు 6
చెయ్యి యెత్తి కతికినటువంటి వారియొక్క లెక్క
మున్నూరై వుండెను; కొదువ జనులందరున్ను మో
కాళ్లు వూని నీళ్లు తాగిరి. । అప్పుడు యెహోవా 7
కతికిన యీ మున్నూరు మందివల్ల నేను మిమ్ము
రక్షించి, మిద్యానీయులను నీ చేతిలోకి అప్పగింతును;
కాబట్టి కొదువ వారినందరినిన్ని వారి వారి స్థలములకు
పోనియ్యమని గిదోనుతో సెలవు యిచ్చెను. । అంతట 8
జనులు తమ తమ ఆహారమునున్ను బాకాలనున్ను చేత
పట్టుకొనిన తరువాత అతడు కొదువ ఇశ్రాయేలందరి
నిన్ని వారి వారి డేరాలకు పంపించి ఆ మున్నూరు
మందిని వుంచుకొనెను: మిద్యానీయుల సమూహము
దిగువ లోవలో వుండెను. । ఆ రాత్రి సంభవించిన 9
దేమంటే, యెహోవా అతనితో నీవు లేచి ఆ సమూ
హము యొద్దికి దిగి వెళ్లు, యేమంటే దానిని నీ చేతి
లోకి అప్పగిస్తిని. । నీకు దిగడానకు భయము వున్నట్ట 10
యితే, నీవు నీ సేవకుడయిన పురాతో కూడా సమూ
హము యొద్దికి వెళ్లుము. । అప్పుడు వారు చెప్పేదాని 11
నీవు వినిన తరువాత సమూహము యొద్దికి దిగి వెళ్లు
టకు నీ చేతులు బలముగా వుండునని సెలవు యిచ్చి
నందున, అతడున్ను అతని సేవకుడైన పురాయున్ను
సమూహమందుండే ఆయుధస్థుల సమీపమునకు దిగి
వెళ్లిరి. । అయితే మిద్యానీయులున్ను అమాలేకీయులు 12
న్ను తూర్పు దేశపు పుత్రులున్ను మిడతల సమూహ
ములలాగున లోవ అంతా ఆవరించి వుండిరి: వారి
వొంటెలయొక్క సమూహము సముద్రపు దరియందు
న్న యిసుక లాగున లెక్కలేనిదయి వుండెను. । అయితే 13
గిదోను వచ్చినప్పుడు యిదిగో వొకడు తన జతకాని
తో స్వప్నమును తెలియచేస్తూ వుండెను; యేలాగం
టే, యిదుగో నేను వొక స్వప్నమును కంటిని, అది
యేమంటే యిదుగో యవ రొట్టె వొకటి మిద్యాను
సమూహములో వొక డేరా మీదికి దొర్లివచ్చి అది
కిందకు పడేటట్టు దానికి తగిలెను, ఆ డేరా బోర్ల
బడి నేల మీద పడెనని చెప్పెను. । అప్పుడు అతని 14
జతకాడు అతనితో యిది ఇశ్రాయేలీయుడైన యో
వాషుకు పుట్టిన గిదోనుయొక్క ఆయుధమై యున్నదే
గాని మరి వొకటి గాదు; దేవుడు మిద్యానీయులనున్ను
యీ సమూహమంతటినిన్ని అతని చేతిలోకి యిచ్చె
నని చెప్పెను. । అయితే గిదోను ఆ స్వప్నమును చెప్ప 15
డమున్ను దాని తాత్పర్యమున్ను విన్నప్పుడు అతడు
వందనము చేసి, తిరిగీ ఇశ్రాయేలు పేటలోకి వచ్చి,
వారితో లెండి, యేమంటే యెహోవా మిద్యాను

సమూహమును మీ చేతిలోకి అప్పగించెనని చెప్పి,।
16 ఆ మున్నూరు మందిని మూడు మొనలుగా చేసి, ప్రతి
మనిషి చేతికి బాకా వొకటిన్ని దివిటీ గల వట్టి కుండ
17 వొకటిన్ని యిచ్చి,। వారితో చెప్పినదేమంటే, నన్ను
కనిపెట్టి నేను చేసినట్టు మీరున్ను చేయవలసినది;
యిదుగో నేను పేట బయిటికి వచ్చినప్పుడు సంభ
వించేదేమంటే నేను యేలాగు చేస్తానో మీరున్ను
18 ఆలాగుననే చేయవలసినది.। నేనున్ను నాతో వున్న
వారున్ను బాకాలను యెప్పుడు వూదుతామో అప్పు
డు మీరున్ను పేటచుట్టూ అంతటా బాకాలను వూది,
యెహోవా యొక్కానున్ను గిదోనుయొక్కానున్ను
19 ఆయుధము అని అర్చండని ఆజ్ఞాపించెను.। అంతట
గిదోనున్ను అతని యొద్దనున్న నూరు మందిన్ని నడి
జాము ఆరంభమందు వారు కావువారిని పెట్టిన తక్ష
ణమందే పేట బయిట దగ్గిరకు వచ్చి, బాకాలను వూది,
20 తమ చేతులలో వున్న కుండలను పగల కొట్టిరి.। ఆలా
గున ఆ మూడు మొనలు బాకాలను వూది, కుండలు
పగల గొట్టి, దివిటీలు తమ యెడమ చేతిలోనున్ను
వూదడానకు బాకాలు తమ కుడి చేతులలోనున్ను
పట్టుకొని, యెహోవాయొక్కానున్ను గిదోనుయొ
క్కానున్ను ఆయుధము అని అర్చి, పేట చుట్టూ
21 ప్రతి మనిషీ తన తన స్థలమందు నిలిచెను.। అయితే
సమూహమంతా పరుగెత్తి కేకలువేసి పారిపోయెను.।
22 మరిన్ని ఆ మున్నూరు మంది బాకాలు వూదినప్పుడు
యెహోవా ఆ సమూహమంతటిలో వీని కత్తి వాని
మీదనున్ను వాని కత్తి వీని మీదనున్ను పడే లాగున
చేసినాడు; ఆ సమూహము సెరేరాతాలో వున్న బేత్షి
త్తకున్ను తబ్బాతు దగ్గిర ఆబేల్మెహోలాయొక్క సరి
23 హద్దుకున్ను పారిపోయెను.। మరిన్ని ఇశ్రాయేలీయులు
నఫ్తాలీనుంచిన్ని ఆషేరునుంచిన్ని మనస్సే అంతటినుం
చిన్ని కూడుకొని వచ్చి, మిద్యానీయులను తరిమినా
24 రు.। మరిన్ని గిదోను ఎఫ్రాయీము పర్వతమంతటి
దాకా మిద్యానీయులకు యెదురుగా దిగి, వారికి
ముందుగా యర్దేను నది బేత్బారా రేవును ఆక్ర
మించుకొండన్న వర్తమానము పంపినందున, ఎఫ్ర
యీమీయులందరున్ను కూడుకొని యర్దేను నది
25 బేత్బారా రేవును ఆక్రమించుకొనిరి.। వారు ఓరేబు
జెయేబు అనే మిద్యానీయులలో యిద్దరు అధికారు
లను పట్టుకొని, ఓరేబు శిల మీద ఓరేబునున్ను, జెయేబు
ద్రాక్షపండ్ల గానుగ దగ్గిర జెయేబునున్ను చంపివేసి,
మిద్యానీయులను తరిమి, ఓరేబు జెయేబు అనే వీరిద్దరి
యొక్క తలలను యర్దేను నది అవతల వున్న గిదోను
యొద్దకు తీసుక వచ్చిరి.

## 8. అధ్యాయము.

అప్పుడు ఎఫ్రాయీమీయులు అతని చూచి, నీవు 1
మిద్యానీయులతో యుద్ధము చేసుటకు వెళ్లేటప్పుడు
మమ్మున పిలువకపోయిన హేతువేమని అడిగి, అతని
తో కఠినముగా వాదించిరి.। అప్పుడు అతడు వారి 2
తో చెప్పినదేమంటే, మీ చేతనయినటువంటి దాని
తోటి నా చేతనయినది యేది సమమవును! ఎఫ్రాయీ
ముయొక్క ద్రాక్ష పండ్లను యేరుట అబీయెజెరు కోత
కంటే అధికము కాదా!। దేవుడు మీ చేతులలోకి 3
ఓరేబు జెయేబు అనే మిద్యానీయులయొక్క అధి
కారులను అప్పగించెను; మీరు చేసిన దానిలో నేను
చేసినది యెంతని పలికినందున అతని మీద వున్న వారి
కోపము చల్లారెను.। అంతట గిదోను యర్దేను నదికి 4
వచ్చి దాని దాటి, తానున్ను తన యొద్దనున్న మున్నూ
రు మందిన్ని అలసటగా వున్నప్పటికిన్ని వారిని తరు
ముతూ వుండిరి.। అప్పుడు అతడు సుక్కోతు జను 5
లను చూచి, నా వెంబడి వస్తూ వున్న జనులకు రొట్టె
లను దయచేయండి, యెందుకంటే వారు అలసి వున్నా
రు; మరిన్ని నేను మిద్యాను రాజులయిన జెబహు
నున్ను సల్మున్నానున్ను తరుముతూ వున్నానని చెప్పి
నప్పుడు,। సుక్కోతు అధికారులు అతని చూచి జెబ 6
హున్ను సల్మున్నా అనే వీరియొక్క చేతులు యిప్పుడే
నీ చేతిలోకి వచ్చెను గనుకనా మేము నీ సమూహము
నకు రొట్టెలు యిచ్చుటకని చెప్పిరి.। అందుకు గిదోను 7
చెప్పినదేమంటే, యెహోవా జెబహునున్ను సల్ము
న్నానున్ను నా చేతిలోకి అప్పగించిన తరువాత అడవి
ముండ్ల కంపలతోను మీ శరీరములను కొట్టి గీతునని
చెప్పి,। అక్కడనుంచి పెనూయేలుకు వెళ్లి, ఆ ప్రకా 8
రమే వారితోనున్ను చెప్పెను, అయితే పెనూయేలు
జనులున్ను సుక్కోతు జనులు అతనికి యిచ్చిన ప్ర
త్యుత్తర ప్రకారమే ప్రత్యుత్తరమిచ్చిరి.। అయినం 9
దున అతడు పెనూయేలు జనులను చూచి, నేను క్షేమ
ముగా తిరిగి వచ్చినప్పుడు యీ కోట పడగొట్టుతానని
చెప్పెను.। అయితే జెబహున్ను సల్మున్నాయున్ను 10
యెక్కువ తక్కువ పదిహేనువేల సంఖ్య గల తమ జన
సమూహముతోను కర్కోరు అనే స్థలమందు వుండిరి;
వీరు మాత్రమే తూర్పు పుత్రులైన సమూహములన్ని
టికీ శేషించి వుండిరి, యేమంటే కత్తి దూసిన లక్ష
యిరువై వేల మంది హతమయి పోయిరి.। అయితే 11
గిదోను నోబహుకున్ను యొగ్బెహాకున్ను తూర్పున
దిక్కుయందుండే డేరాలలో కాపురము వున్నవారి
మార్గానుగా వచ్చి ఆ సమూహమును నరికి వేసెను,
యెందుకంటే ఆ సమూహము నిర్భయముగా వుండెను.।

12 జెబహుయున్ను సల్మున్నాయున్ను పారిపోయినప్పుడు
అతడు వారిని తరిమి, జెబహున్ను సల్మున్నా అనే
మిద్యానీయులయొక్క రాజులయిన వీరిద్దరినిన్ని పట్టు
13 కొని, సమూహమంతటినీ కళవిళ పరచెను. । అంతట
యోవాషు కుమారుడయిన గిదోను సూర్యుడు మధ్యా
హ్నము కాక ముందే యుద్ధములోనుంచి తిరిగి వస్తూ
14 వుండగా, । సుక్కోతు జనులలో పడుచువాడయిన
వొకని పట్టుకొని వాని అతడు అడిగినప్పుడు వాడు
అతనికి సుక్కోతుయొక్క అధికారులున్ను పెద్దలు
న్ను అయి యున్న డెబ్బయియేడు మందిని వివరించెను. ।
15 అప్పుడు అతడు సుక్కోతు జనుల దగ్గిరకు వచ్చి చెప్పిన
దేమంటే, యిదుగో జెబహున్ను సల్మున్నాయున్ను;
వీరిని గురించి మీరు అపహాస్యముగా నాతో చెప్పి
వుంటిరి, యేమంటే జెబహు సల్మున్నా అనే వారి చేతు
లు యిప్పుడు నీ చేతిలోకి వచ్చినది గనుకనా మేము
అలసటపడిన నీయొక్క జనులకు రొట్టెలను యిచ్చు
16 టకని చెప్పితిరనేదిగా చెప్పి, । ఆ వూరివాండ్ల పెద్ద
లను పట్టుకొని, అడవి ముండ్ల కంపలను తీసి వాటిచేత
17 ఆ సుక్కోతు జనులకు బుద్ధి చెప్పెను. । మరిన్ని అతడు
పెనుయేలు కోటను కొట్టి పడదోసి, ఆ వూరివారిని
18 హతము చేసెను. । అప్పుడు అతడు జెబహునున్ను సల్ము
న్నానున్ను చూచి, తాబోరు దగ్గిర మీరు చంపిన
వారు యెటువంటివారని అడిగెను; అందుకు వారు
చెప్పినదేమంటే, నీవున్నలాగున వారున్ను వుండిరి,
ప్రతివాడున్ను, రాజకుమారులయొక్క రూపము కల
19 వాడయి యుండెనని చెప్పిరి. । అప్పుడు అతడు వారు
నా సహోదరులు, అనగా, నా తల్లి కుమారులయి
వున్నారు; మీరు వారిని బ్రతుకనిచ్చి వుంటే మిమ్మును
హతము చేయక పోదును, యెహోవా జీవముతోడే
20 అని చెప్పి, । తన పెద్ద కుమారుడయిన యెతెరును
చూచి, నీవు లేచి వారిని చంపివేయుమని చెప్పెను;
అయితే అతడు యింకా బాలుడయినందున భయపడి
21 తన కత్తి దూయకుండా వుండెను. । అప్పుడు జెబహు
న్ను సల్మున్నాయున్ను అతనితో మనిషి యెంతో తన
శక్తి అంతే గనుక నీవే లేచి మా మీద పడుమని
చెప్పిరి: కాగా గిదోను లేచి, జెబహునున్ను సల్మున్నా
నున్ను చంపి, వారి వొంటెలయొక్క మెడలనున్న ఆభ
22 రణములను తీసుకొనెను. । అప్పుడు ఇశ్రాయేలీయులు
గిదోనును చూచి, నీవున్ను నీ కుమారుడున్ను నీ కుమా
రునియొక్క కుమారుడున్ను మమ్మున యేల వలెను,
యేమంటే నీవు మమ్మును మిద్యానీయుల చేతిలోనుంచి
23 రక్షించినావని చెప్పినప్పుడు; । గిదోను వారితో నేను
న్ను నా కుమారుడున్ను మిమ్మున యేలము, యెహోవా
24 మిమ్మున యేలునని చెప్పి; । తిరుగా గిదోను వారితో
అనిన మాట మిమ్మును వొక మనవి అడుగుతాను, యే
మంటే మీలో ప్రతి మనిషీ దోచుకొనిన కర్ణ భూ
షణములను నాకు యివ్వవలసినదని అడిగెను, యేమం
టే వారు ఇష్మాయేలీయులు గనుక వారికి బంగారపు
కర్ణ భూషణములు కలవు. । కాబట్టి వారు అవశ్యము 25
గా యిత్తుమని చెప్పి, వారు వొక బట్టపరచి, ప్రతి
మనిషీ తాను తాను దోచుకొనిన కర్ణ భూషణము
లను అందులో వేసిరి. । అతడు అడిగిన ఆ కర్ణ భూషణ 26
ములు వెయ్యిన్ని యేనూరు షెకేలుల యెత్తు బంగా
రమై వుండెను; యివిగాక మిద్యాను రాజులు ధరించు
కొనిన ఆభరణములున్ను కంఠమాలికలున్ను వూదా
బట్టలున్ను వారి వొంటెల మెడల మీదనున్న గొలు
సులున్ను కలవు. । వీటిచేత గిదోను వొక ఎఫోదును 27
చేసుకొని, ఒఫ్రా అనే తన వూరిలో దాని వుంచెను,
అయితే ఇశ్రాయేలీయులందరున్ను దాని వెంబడి వ్య
భిచారముగా వెళ్లినందున అది గిదోనుకున్ను అతని
యింటికిన్ని వురిలాగునే వుండెను. । యీలాగున మి 28
ద్యాను ఇశ్రాయేలు పుత్రుల ముందర అపజయము
పొంది, తమ శిరస్సులను మరి యెత్తలేక పోయిరి;
గిదోను బ్రతికిన నలుబై సంవత్సరముల మట్టుకు దేశ
ము నిమ్మళముగా వుండెను. । యోవాషుయొక్క కుమా 29
రుడయిన యెరుబ్బయలు వెళ్లి తన యింట్లో నివాసము
చేసెను. । మరిన్ని యీ గిదోనుకు అనేక భార్యలు కలి 30
గినందున, తన గర్భముపల్లనుంచి తనకు డెబ్బయి
మంది కుమాళ్లు పుట్టిరి. । మరిన్ని షెఖెమందు తనకు 31
వుండిన వుపపత్ని కూడా అతనికి వొక కుమారుని కనె
ను; అతనికి అతడు అబీమెలెఖు అనే పేరు పెట్టెను. ।
అంతట యోవాషుయొక్క కుమారుడయిన గిదోను 32
మంచి వృద్ధాప్యమందు మరణమై, అబీయెజ్రీయుల
యొక్క ఒఫ్రాలో తన తండ్రి అయిన యోవాషుయొ
క్క సమాధియందు పాతిపెట్టబడెను. । గిదోను మరణ 33
మయిన తరువాత సంభవించినదేమంటే, ఇశ్రాయేలు
పుత్రులు తిరిగీ వ్యభిచారముగా బయలీము వెంట
పోయి, బయల్బెరీతును తమకు దేవుడుగా చేసుకొనిరి. ।
యీలాగు ఇశ్రాయేలు పుత్రులు వారి చుట్టూ వున్న 34
శత్రువుల చేతులలోనుంచి వారిని విడిపించిన యెహో
వా అయిన తమ దేవుని తమ జ్ఞాపకమందు వుంచుకోక
పోయిరి. । మరిన్ని ఇశ్రాయేలుకు యెరుబ్బయలు అనే 35
గిదోను చేసిన వుపకారమునకు ప్రత్యుపకారము అతని
యింటికి వారు చేయకపోయిరి.

## 9. అధ్యాయము.

అటుతరువాత యెరుబ్బయలుయొక్క కుమారుడ 1
యిన అబీమెలెఖు షెఖెములో వున్న తన తల్లియొక్క

సహోదరుల యొద్దికి వెళ్లి, వారితోటిన్ని తన తల్లి
తండ్రియొక్క యింటివారియొక్క కుటుంబమంతటి
2 తోటిన్ని మాట్లాడినదేమంటే, । మీరు షెఖెములో
వున్న జనులందరియొక్క చెవులలో చెప్పవలసినదేమం
టే, మీకు యేమి వుత్తమమవును? డెబ్బయి మంది
అయి యున్న యెరుబ్బయలుయొక్క కుమారులందరు
న్ను మిమ్మును యేలడము మంచిదా; లేక వొకడు మిమ్మ
ను యేలడము మంచిదా అని చెప్పి, నేను మీయొ
క్క యెముకయున్ను మీ మాంసమున్ను అని తలం
3 చుకో వలసినదన్నట్టుగా బోధించి చెప్పెను. । అప్పు
డు అతని తల్లియొక్క సహోదరులు అతని గురించి
ఆ మాటలన్నిటినిన్ని షెఖెముయొక్క జనులందరి చెవు
లలో చెప్పినందున వారి హృదయములు అబీమెలెఖు
తట్టు మళ్లెను, యెందుకంటే అతడు మా సహోదరు
4 డని చెప్పిరి. । మరిన్ని వారు బయల్బెరీతు మందిరము
లోనుంచి డెబ్బయి వెండి బిళ్లలు తీసి అతనికి యిచ్చిరి;
వీటిచేత అబీమెలెఖు వ్యర్థమయిన దుర్మార్గులకు
5 కూలి యిచ్చినందున వారు అతని వెంబడించిరి. । అప్పు
డు అతడు ఒఫ్రాలో వున్న తన తండ్రియొక్క యిం
టికి వెళ్లి, తన సహోదరులయినటువంటిన్ని యెరు
బ్బయలుయొక్క కుమాళ్లయినటువంటిన్ని డెబ్బయి
మందిని వొక రాతిమీద చంపివేసెను, అయినప్పటి
కిన్ని యెరుబ్బయలుయొక్క కనిష్ఠ కుమారుడయిన
6 యోతాము దాగి వున్నందున విడువబడెను. । అప్పుడు
షెఖెము జనులందరున్ను మిల్లో యింటి వాండ్లున్ను
కూడుకొని వచ్చి, షెఖెమందు నిలువబడి వున్న ఆల
అనే మాను దగ్గిర అబీమెలెఖుకు పట్టాభిషేకము చే
7 సిరి. । అయితే యీ సంగతి యోతాముకు వినబడినప్పు
డు అతడు గెరిజ్జీము పర్వత శిఖరము మీద నిలిచి,
తన కంఠమెత్తి అర్చి వారికి చెప్పినదేమంటే, షెఖెము
యొక్క జనులారా, మీరు చెప్పేదాని దేవుడు వినే
8 టట్టుగా నేను చెప్పేదాని మీరు వినుడి: । యేమంటే
వొకప్పుడు వృక్షములు తమ మీద వొక రాజును అభి
షేకము చేసుకొనుటకు బయిలు వెళ్లి, యిప్ప చెట్టును
9 చూచి నీవు మమ్మును యేల వలెనని చెప్పెను. । అయి
తే యిప్ప చెట్టు వాటితో చెప్పినదేమంటే, నావల్ల
కలిగే దేనితో వారు దేవునికిన్ని మనుష్యులకున్ను
సన్మానము చేతురో ఆ నా రసమును నేను విడచిపెట్టి,
వృక్షముల మీద హెచ్చింపబడుటకు నేను వచ్చేదా
10 అని చెప్పెను. । అప్పుడు వృక్షములు అంజూరపు చెట్టు
ను చూచి నీవు వచ్చి మమ్మును యేలుమని చెప్పెను. ।
11 అంజూరపు చెట్టు వాటితో నేను నా మాధుర్యము
నున్ను నా మంచి ఫలమునున్ను విడచిపెట్టి, వృక్ష
ముల మీద హెచ్చింపబడుటకు నేను వచ్చేదా అని
చెప్పెను. । అప్పుడు వృక్షములు ద్రాక్షచెట్టును చూచి 12
నీవు వచ్చి మమ్మును యేలుమని చెప్పెను. । ద్రాక్షచె 13
ట్టు వాటితో చెప్పినదేమంటే, నేను దేవునిన్ని మను
ష్యునిన్ని సంతోషింప చేసే నా రసమును నేను విడచి
పెట్టి, వృక్షములమీద హెచ్చింపబడుటకు వచ్చేదా
అని చెప్పెను. । అప్పుడు వృక్షములన్నీ ముండ్ల చెట్టు 14
ను చూచి నీవు వచ్చి మమ్మును యేల వలెనని చెప్పగా, ।
ముండ్లచెట్టు వృక్షములతో అన్న మాట, మీరు నన్ను 15
నిజముగా మీ మీద రాజ్యాభిషేకము చేస్తిరట్టాయె
నా మీరు వచ్చి నా నీడ యందు నమ్మి వుండండి,
లేకపోతే ముండ్ల చెట్టులోనుంచి అగ్ని బయిలువెళ్లి
లెబానోనుయొక్క సీదరు వృక్షములను దహించును
గాకని చెప్పెను. । కాబట్టి మీరు అబీమెలెఖును రా 16
జుగా నియమించినందువల్ల మీరు సత్యముగానున్న
యథార్థముగానున్న చేసినవారైయున్ని, యెరుబ్బ
యలు యెడలనున్న అతని యింటి యెడలనున్న మీరు
బాగా జరిగించి అతని చేతుల కార్యములకు తగినట్టు
గా మీరు అతనికి చేసిన వారైయున్ని వుంటే సరి; ।
యెందుకంటే నా తండ్రి మీ కొరకు యుద్ధము చేసి, 17
తన ప్రాణమును బహుగా సాహసించి, మిమ్మును మి
ద్యానీయుల చేతిలోనుంచి విడిపించెను. । అయినప్పటి 18
కిన్ని యీ దినమున మీరు నా తండ్రి యింటి మీదికి
లేచి, వొక రాతి మీద అతని కుమారులైన డెబ్బయి
మందిని హతము చేసి, అతని దాసీ కుమారుడయిన అబీ
మెలెఖు మీ సహోదరుడు గనుక షెఖెముయొక్క
జనుల మీద అతని రాజుగా నియమించుకొని వున్నా
రు. । కాబట్టి యీ దినమున మీరు యెరుబ్బయలు యె 19
డలనున్ను అతని యింటియెడలనున్ను సత్యముగాను
న్ను యథార్థముగానున్ను జరిగించిన పక్షమందు
మీరు అబీమెలెఖు యందున్న సంతోషించండి, అత
డు మీయందున్ను సంతోషించును గాక. । లేని పక్ష 20
మందు అబీమెలెఖులోనుంచి అగ్ని బయిలు వెళ్లి, షెఖె
ముయొక్క జనులనున్ను మిల్లో యింటినిన్ని దహిం
చును గాక: మరిన్ని షెఖెముయొక్క జనులలోనుం
చిన్ని మిల్లో యింటిలోనుంచిన్ని అగ్ని బయిలు వెళ్లి
అబీమెలెఖును దహించును గాకని చెప్పెను. । అప్పుడు 21
యోతాము పారిపోయి బెయేరుకు వచ్చి అక్కడ తన
సహోదరుడయిన అబీమెలెఖు భయముచేత నివా
సము చేస్తూ వుండెను. । అబీమెలెఖు ఇశ్రాయేలును 22
మూడు సంవత్సరములు యేలిన తరువాత, । దేవుడు 23
యెరుబ్బయలుయొక్క డెబ్బయి మంది కుమాళ్లకు చేయ
బడ్డ క్రూరతయున్ను వారి రక్తమున్ను వారిని హతము
చేసిన వారి సహోదరుడయిన అబీమెలెఖు మీద
నున్ను వారి సహోదరులను చంపేటందుకు సహా

యము చేసిన షెకెముయొక్క జనుల మీదనున్ను
24 వచ్చి నిలువబడేటట్టుగా, । దేవుడు అబీమెలెకుకున్ను
షెకెముయొక్క జనులకున్ను భేదము చేసే దురా
25 త్మను పంపెను. । అయినందున షెకెముయొక్క జను
లు అతని నిమిత్తము పర్వత శిఖరములందు మాటు
కాండ్లను పెట్టి, ఆ మార్గమున వచ్చిన వారినందరి
నిన్ని దోచుకొనిరి; యీ సంగతి అబీమెలెకుకు చెప్ప
26 బడెను. । మరిన్ని ఎబెదుయొక్క కుమారుడైన గయలు
తన సహోదరులతో కూడా వచ్చి షెకెమునకు
వచ్చెను; అతని యందు షెకెముయొక్క జనులు నమ్మ
27 కము వుంచిరి. । మరిన్ని వారు పొలములలోకి వెళ్లి,
ద్రాక్షపండ్లను కోసి త్రొక్కి సంభ్రమము చేసి,
తమ దేవాలయమందు ప్రవేశించి, తిని తాగి అబీమె
28 లెకును శపించిరి. । అప్పుడు ఎబెదుయొక్క కుమారుడ
యిన గయలు చెప్పినదేమంటే, మనచేత సేవ గైకొన
డానకు అబీమెలెకు యెవడు? షెకెము యెవడు?
వాడు యెరుబ్బయలుయొక్క కుమారుడు కాడా?
జెబులు వానికి ప్రధాని కాడా? వానికి సేవ చేయడ
ము యేల! షెకెముయొక్క తండ్రియయిన హమోరు
29 యొక్క జనులకు సేవ చేయండి. । అహహా ఈ జనులు
నా చేతి కింద వుంటే, అప్పుడు నేను అబీమెలెకును
తీసివేతునని పలికి, నీ సమూహమును విస్తారము చేసు
కొని బయిటికి రమ్మని అబీమెలెకుతో చెప్పెను. ।
30 అయితే పట్టణపు ప్రధాని అయిన జెబులు ఎబెదు
యొక్క కుమారుడయిన గయలు చెప్పిన మాటలు విని
నప్పుడు కోపగించి, రహస్యముగా దూతలను అబీమె
31 లెకు యొద్దికి పంపించెను. । అప్పుడు వారు యిదుగో
ఎబెదుయొక్క కుమారుడైన గయలున్ను వాని సహో
దరులున్ను షెకెముకు వచ్చి, నీకు విరోధముగా పట్ట
32 ణమును బలపరచుకొని వున్నారని పలికెను. । కాబ
ట్టి నీవున్ను నీ యొద్ద వున్న జనులున్ను రాత్రి వేళ
33 లేచి పొలములో పొంచి వుండండి. । ఉదయమందు
నీవు చేయ వలసినదేమంటే, సూర్యోదయమందే త్వర
గా లేచి, పట్టణము మీదికి రావలసినది; వాడున్ను
వాని యొద్దనున్న జనులున్ను నీకు యెదురుగా వచ్చి
నప్పుడు నీ చేతనైనట్టు వారిని నీవు చేతువుగాకని
34 వర్తమానము పంపెను. । అయినందున అబీమెలెకున్ను
వాని యొద్దనున్న జనులందరున్ను రాత్రివేళ లేచి వచ్చి,
నాలుగు మొనలుగా షెకెము తట్టు పొంచి వుండిరి. ।
35 అయితే ఎబెదుయొక్క కుమారుడయిన గయలు బయి
లు వెళ్లి పట్టణ ద్వార ప్రవేశమందు నిలిచినప్పుడు,
అబీమెలెకున్ను అతని యొద్దనున్న జనులున్ను లేచి
36 మాటులోనుంచి వచ్చిరి. । అయితే గయలు ఆ జనులను
చూచి జెబులుతో చెప్పినదేమంటే, అదుగో పర్వత
ముల మీదనుంచి జనులు వస్తూ వున్నారని చెప్పినప్పు
డు, జెబులు అతనితో పర్వతముల నీడను నీవు చూచి
మనుష్యులని తలంచుకొంటున్నావని చెప్పెను. । తరు 37
వాత గయలు తిరుగా అతనితో, అదుగో, ఆ సందు
లోనుంచి జనులు వస్తూ వున్నారు; మరిన్ని మరి యొక
సమూహము మెయోనేనీముయొక్క మైదానపు మార్గ
మున వస్తూ వున్నారని చెప్పినప్పుడు; । జెబులు అతని 38
చూచి, మనచేత సేవ గైకొనడానకు అబీమెలెకు యెవ
డని పలికిన నీయొక్క నోరు యెక్కడ? నీవు నిర్ల
క్ష్యము చేసిన జనులు వీరే గదా? అయితే యిప్పుడు
నీవు బయిలు దేరి వారితో పోట్లాడుమని చెప్పెను. ।
కాబట్టి గయలు షెకెముయొక్క జనుల యెదుట బయి 39
లు దేరి, అబీమెలెకుతోను యుద్ధము చేసెను. । అయి 40
తే యితడు అతని ముందర నిలువలేక పారిపోయినం
దున అబీమెలెకు అతని తరిమెను; పట్టణ ప్రవేశము
మట్టుకు అనేకులు గాయములను పొంది పడిరి. । అం 41
తట అబీమెలెకు అరూమాలో నివాసము చేసెను;
అయితే గయలునున్ను అతని సహోదరులనున్ను
షెకెములో నివసించకుండా జెబులు అవతలకు తోలి
వేసెను. । మరునాటియందు సంభవించినది యేమంటే, 42
జనులు బయిటి పొలములోకి వెళ్లినారు; యీ సంగతి
అబీమెలెకుకు వినబడినప్పుడు, । అతడు తన జనులను 43
పిలుచుకొని, మూడు సమూహములుగా చేసి పొల
ములో పొంచి, జనులు పట్టణములోనుంచి రావడము
చూచి, లేచి, వారి మీదికి వచ్చి కొట్టెను. । యేమంటే 44
అబీమెలెకున్ను అతని యొద్దనున్న సమూహమున్ను
ముందర తోసుకుపోయి, పట్టణద్వార ప్రవేశమందు
నిలువగా కొదువ రెండు సమూహములున్ను పొల
ములో వున్న జనుల మీదికి పరుగెత్తి వచ్చి వారిని
హతము చేసెను. । మరిన్ని అబీమెలెకు ఆ దినమంతా 45
పట్టణము మీద యుద్ధము చేసి, దాని స్వాధీనపర్చు
కొని, దానియందున్న జనులను చంపి, పట్టణమును
పడగొట్టి దానిలో వుప్పు చల్లెను. । అయితే షెకెము 46
కోటలో వున్న వారికి యీ సంగతి తెలిసినప్పుడు
వారు బెరీతు దేవాలయమందున్న గట్టి స్థలములోకి
ప్రవేశించినారు. । అయితే షెకెముయొక్క కోటలో 47
వున్నవారు కూడి వున్నారన్న సంగతి అబీమెలెకుకు
వినబడినప్పుడు, । అతడున్ను అతని యొద్దనున్న జను 48
లున్ను సల్మోను పర్వతము యెక్కిరి; అబీమెలెకు గొ
డ్డలి పట్టుకొని, వృక్షములయొక్క వొక కొమ్మను నరికి,
అది తీసి తన భుజము మీద పెట్టుకొని, తనతో కూడా
వున్న జనులను చూచి నేను చేసినలాగున మీరున్ను
త్వరగా చేయండన్నట్టు చెప్పెను. । అయినందున జను 49
లందరున్ను ప్రతిమనిషీ వొక్కొక్క కొమ్మను నరికి,

అబీమెలెకును వెంటాడి, ఆ గట్టి స్థలము మీద వాటిని
వేసి దాని కాల్చినందున, షెకెము కోటలో వున్న
వారందరున్ను, అనగా, స్త్రీలున్ను పురుషులున్ను యె
50 క్కువ తక్కువ వెయిమంది చచ్చి పోయిరి. । తరువాత
అబీమెలెకు తేబేస్సుకు వచ్చి, దాని ముందర దిగి, దాని
51 స్వాధీనము చేసుకొనెను. । అయితే ఆ పట్టణమందు
వొక గట్టి కోట కలిగినందున ఆ పట్టణపు వారంద
రున్ను స్త్రీ పురుషులందరున్ను అక్కడికి పరుగెత్తి
పోయి, వారికి యెదురుగా దాని మూసివేసి, కోటయొ
52 క్క శిఖరము మీదికి యెక్కిపోయిరి. । అప్పుడు అబీ
మెలెకు కోటకు సమీపించి యుద్ధము చేసి, అగ్నితో
53 కాల్చడానకు ద్వారము ముందరికి వచ్చెను. । అప్పుడు
వొక స్త్రీ అబీమెలెకు తల బద్దలయ్యేటట్టుగా అతనిమీ
54 ద తిరగట్రాతి ముక్క యెత్తివేసెను. । అప్పుడు అతడు
తన ఆయుధములను మోసే పడుచువాని త్వరగా పిలిచి,
వొక స్త్రీ అతని చంపెనని జనులు పలుకకుండా నీవు
కత్తి దూసి నన్ను చంపివేయుమని చెప్పినప్పుడు, అతని
యొక్క పడుచువాడు అతని కుమ్మివేసినందున అతడు
55 మరణమయినాడు. । అయితే అబీమెలెకు మరణమవుట
ఇశ్రాయేలు జనులు చూచినప్పుడు ప్రతి మనిషీ తన
56 తన స్థలమునకు వెళ్లిపోయెను. । ఈలాగున అబీమెలెకు
తన సహోదరులను డెబ్బయి మందిని హతము చేసి
నందున తాను తన తండ్రికి చేసిన కీడుకు ప్రతిగా
57 దేవుడు కీడు చేయించెను. । మరిన్ని షెకెముయొక్క
జనులు చేసిన కీడు యావత్తూ దేవుడు వారి శిరస్సుల
మీదికి తిరిగీ రప్పించినందువల్ల యెరుబ్బయలుయొక్క
కుమారుడయిన యోతాము పలికిన శాపము వారి
మీద పడెను.

## 10. అధ్యాయము.

1 అబీమెలెకు తరువాత తోలా ఇశ్రాయేలును
రక్షించే కొరకు లేచెను; అతడు ఇశ్శాఖారు వాడైన
దోదోకు పుట్టిన పూవాయొక్క కుమారుడై, ఎఫ్ర
యీము పర్వతమందుండే షామీరుయందు నివాసము
2 చేసెను. । అతడు ఇశ్రాయేలుకు యిరువై మూడు సంవ
త్సరములు న్యాయాధిపతిగా వుండి, మరణమై, షామీ
3 రులో పాతిపెట్టబడెను. । అతని తరువాత గిలాదీయు
డయిన యాయీరు లేచెను; అతడు యిరువై రెండు
సంవత్సరములు ఇశ్రాయేలుకు న్యాయాధిపతిగా వుం
4 డెను. । అతనికి ముప్పయి గార్దభముల పిల్లల మీద
యెక్కే ముప్పయి మంది కుమాళ్లు గలరు; వీరికి ముప్ప
యి గ్రామములు కలిగి వుండెను; యివి గిలాదు దేశ
ములో వుండి నేటివరకూ యాయీరు గ్రామములని
5 పిలువబడి యున్నవి. । అయితే యాయీరు మరణ
మయి, కామోను పట్టణమందు పాతిపెట్టబడెను. ।
తిరుగా ఇశ్రాయేలు పుత్రులు యెహోవాయొక్క 6
దృష్టి యెదుట కీడు చేసి, బయలీముకున్ను అష్టారో
తుకున్ను అరాము దేశపు దేవుండ్లకున్ను సీదోను దేశపు
దేవుండ్లకున్ను మోయాబీయుల దేవుండ్లకున్ను అమ్మోను
పుత్రుల దేవుండ్లకున్ను పెలిష్తీయుల దేవుండ్లకున్ను
సేవచేసి, యెహోవాను విడచిపెట్టి ఆయనకు సేవ
చేయకుండా వుండిరి. । కాబట్టి యెహోవాయొక్క 7
కోపము ఇశ్రాయేలు మీద రగులుకొనినందున ఆయన
వారిని పెలిష్తీయుల చేతులలోకిన్ని అమ్మోను పుత్రుల
యొక్క చేతులలోకిన్ని అప్పగించెను. । కాబట్టి వీరు 8
పద్దెనిమిదో సంవత్సరము పర్యంతము ఇశ్రాయేలు
పుత్రులను నలిపివేసి, యర్దేను నది అవతల గిలాదు
భూమిలో అమోరీయుల దేశమందుండే ఇశ్రాయేలు
పుత్రులందరినీ బాధ పెట్టిరి. । మరిన్ని అమ్మోను పుత్రు 9
లు యర్దేను నది దాటి, యూదా మీదనున్ను బెన్యా
మీను మీదనున్ను ఎఫ్రయీముయొక్క యింటివారి
మీదనున్ను యుద్ధము చేయుటకు వచ్చినందున ఇశ్రా
యేలుకు బహూపద్రవము కలిగి ఉండెను. । అప్పుడు 10
ఇశ్రాయేలు పుత్రులు యెహోవాకు మొర్రపెట్టిన
దేమంటే, మేము బయలీముకు సేవ చేయుటకు మా
దేవుడవైన నిన్ను విడచిపెట్టినందుచేత నీకు విరోధ
ముగా పాపము చేసితిమని పలికినప్పుడు; । యెహో 11
వా ఇశ్రాయేలు పుత్రులకు సెలవు యిచ్చినదేమంటే,
మిస్రీయులలోనుంచిన్ని అమోరీయులలోనుంచిన్ని అ
మ్మోను పుత్రులలోనుంచిన్ని పెలిష్తీయులలోనుంచిన్ని
నేను మిమ్మున రక్షించ లేదా? । సీదోనీయులున్ను అమా 12
లేకీయులున్ను మాయోనీయులున్ను మిమ్మున పీడ పెట్టి
నందున మీరు నన్ను గూర్చి మొర్ర పెట్టినప్పుడు
మిమ్మును వారి చేతిలోనుంచి రక్షించితిని. । అయినప్ప 13
టికిన్ని మీరు నన్ను విడచిపెట్టి యితరమైన దేవుం
డ్లకు సేవ చేస్తిరి; కాబట్టి యికను మిమ్మును రక్షించను. ।
మీరు వెళ్లి మీరు యెంచుకొనిన దేవుండ్లకు మొర్ర 14
పెట్టండి; మీ శ్రమకాలమందు వారు మిమ్మును రక్షిం
తురు గాక అని ఆనతిచ్చినప్పుడు; । ఇశ్రాయేలు 15
పుత్రులు యెహోవాతో చెప్పినదేమంటే, మేము
పాపము చేస్తిమి; నీకు యేది అనుకూలమో అది మాకు
చేయుము; అయితే యీ దినమున మాత్రము మమ్మును
రక్షించుమని వేడుకొంటున్నామనిరి. । అప్పుడు వారు 16
తమ యొద్దనున్న యితరమైన దేవుండ్లను తీసివేసి
యెహోవాకు సేవ చేసినందున, ఆయన ఆత్మ ఇశ్రా
యేలుయొక్క అవిధి నిమిత్తము నొచ్చుకొనెను. । అం 17
తట అమ్మోను పుత్రులు కూడుకొని గిలాదులో దిగిరి;
ఇశ్రాయేలు పుత్రులున్ను కూడుకొని మిస్పెలో దిగిరి. ।

18 అప్పుడు గిలాదుయొక్క జనులున్ను అధిపతులున్ను
ఒకరితో ఒకరు అనుకొనినదేమంటే, అమ్మోను పుత్రు
లతో పోట్లాడుటకు ఆరంభించినవాడు యెవడో వాడు
గిలాదు కాపురస్తులందరి మీదను అధిపతిగా వుండు
నని అనుకొనిరి.

## 11. అధ్యాయము.

1 అయితే గిలాదీయుడైన యెప్తా బహు పరాక్రమ
శాలియై వుండెను; అతడు వేశ్యయొక్క కుమారుడు;
2 యీ యెప్తా గిలాదుకు పుట్టెను. । గిలాదుయొక్క
భార్య అతనికి కుమాళ్లను కనెను; అతని భార్యయొక్క
కుమాళ్లు పెరిగిన తరువాత వారు యెప్తాను చూచి నీవు
అన్యస్త్రీయొక్క కుమారుడవు; మా తండ్రి యింట్లో
నీకు స్వాతంత్ర్యము లేదని అతని వెలపటికి తోలివే
3 సిరి. । అయినందున యెప్తా తన సహోదరుల యొద్ద
నుంచి పారిపోయి, థోబు దేశమునకు వచ్చి, కాపు
రము చేసెను; అక్కడ పనికిమాలిన వాండ్లు యెప్తాతో
కలుసుకొని అతనితో కూడా బయిలు వెళ్లినారు. ।
4 కొంతకాలమయిన తరువాత అమ్మోను పుత్రులు ఇశ్రా
5 యేలుతో యుద్ధము చేసిరి. । అమ్మోను పుత్రులు ఇశ్రా
యేలుతో యుద్ధము చేసినప్పుడు సంభవించినదేమం
టే, గిలాదుయొక్క పెద్దలు యెప్తాను థోబు దేశము
లోనుంచి తీసుక రావడానకు వెళ్లి, యెప్తాతో చెప్పి
6 నదేమంటే; । నీవు వచ్చి మేము అమ్మోను పుత్రులతో
పోట్లాడ గలందులకు మా మీద అధిపతిగా వుండుమ
7 నిరి. । అయితే యెప్తా గిలాదు పుత్రులతో అనినదే
మంటే, మీరు నాయందు ద్వేషపడి నా తండ్రి యిం
ట్లోనుంచి అవతలకు తోలివేస్తిరి గదా? మీకు వుపద్ర
వమైనప్పుడు నాయొద్దకు రావడము యెందుకని పలి
8 కెను. । అందుకు గిలాదుయొక్క పెద్దలు యెప్తాతో
చెప్పినదేమంటే, నీవు మాతో కూడా వచ్చి అమ్మోను
పుత్రులతో యుద్ధము చేసి, గిలాదు కాపురస్తులందరి
పయిని అధిపతి అయ్యేటందుకే యిప్పుడు తిరిగీ నీ
9 యొద్దికి వస్తిమని చెప్పినప్పుడు; । యెప్తా గిలాదు పెద్ద
లతో అనినదేమంటే, అమ్మోను పుత్రులతో పోట్లా
డుటకు మీరు నన్ను తిరుగా తీసుకపోయిన వెనుక
యెహోవా వారిని నా చేతికి యిచ్చినట్టయితే నేను
10 మీకు అధిపతి అవుతానా అని అనగా; । గిలాదు
యొక్క పెద్దలు నీ మాటల చొప్పున మేము చేయక
పోతే యెహోవా మన వుభయుల మధ్యను సాక్షి
11 అవును గాకని యెప్తాతో చెప్పిరి. । అప్పుడు యెప్తా
గిలాదుయొక్క పెద్దలతోను వచ్చినందున జనులు తమ
పయిని అతని అధిపతిగానున్ను అధికారిగానున్ను
నిర్ణయించుకొనిరి; మరిన్ని యెప్తా తన మాటలు యా
వత్తూ మిస్పెలో యెహోవా సముఖమందు పలికి
నాడు. । అంతట యెప్తా అమ్మోను పుత్రులయొక్క 12
రాజుకు దూతలచేత పంపిన వర్తమానము యేమంటే,
నీవు నా దేశమునకు వచ్చి నాతో యుద్ధము చేయు
టకు నీకున్ను నాకున్ను నిమిత్తమేమని చెప్పుమనెను. ।
అప్పుడు అమ్మోను పుత్రులయొక్క రాజు యెప్తా 13
పంపిన దూతలతో చెప్పినదేమంటే, ఇశ్రాయేలు
మిస్రయీములోనుంచి వచ్చినప్పుడు నా దేశమును
అర్నోను మొదలుకొని యబ్బోకున్ను యర్దేను
న్ను అనే నదుల పర్యంతము ఆక్రమించుకొనెను;
కాబట్టి యిప్పుడు ఆ దేశములు సమాధానముగా తిరిగీ
యివ్వవలసినదని చెప్పుమనెను. । తిరుగా యెప్తా దూ 14
తలను అమ్మోను పుత్రులయొక్క రాజుయొద్దకు పంపి
అతనితో చెప్పుమనినదేమంటే, । యెప్తా యీలాగున 15
అంటున్నాడు, ఇశ్రాయేలు మోయాబు దేశమునైనా
అమ్మోను పుత్రుల దేశమునైనా ఆక్రమించలేదు. ।
అయితే ఇశ్రాయేలు మిస్రయీములోనుంచి బైలుదేరి 16
అరణ్యములో బడి యెర్ర సముద్రము యొద్దకు నడిచి
కాదేషుకు చేరినప్పుడు, । ఇశ్రాయేలు ఎదోము రాజు 17
యొద్దకు దూతలను పంపి, నీ దేశములోబడి నన్ను
వెళ్లనీయ్యుమని అడిగెను; అయితే ఎదోము రాజు
అందుకు వినకపోయెను; ఆ ప్రకారము వారు మో
యాబు రాజు యొద్దకు వర్తమానము పంపిరి, అయితే
అతడున్ను ఒప్పకపోయెను; అయినందున ఇశ్రా
యేలు కాదేషులో నివాసము చేసెను. । అటుతరువాత 18
వారు అరణ్యములోబడి గడుస్తూ, ఎదోము దేశము
న్ను మోయాబు దేశమున్ను చుట్టూ తిరిగీ, మోయాబు
దేశము కుడి పార్శ్వమునకు వచ్చి, మోయాబు సరి
హద్దులో ప్రవేశించక అర్నోను అవతల పేట వేసు
కొనిరి, యెందుకంటే అర్నోను మోయాబుయొక్క
సరిహద్దయి వుండెను. । మరిన్ని ఇశ్రాయేలు అమోరీ 19
యులను యేలే హెష్బోనులోనున్న రాజయిన సీ
హోను యొద్దకు దూతలను పంపి, మీ దేశములో
బడి మమ్మును మా స్థలమునకు వెళ్ల నివ్వండని అడిగిం
చెను. । అయితే సీహోను సమ్మతించక ఇశ్రాయేలును 20
తన సరిహద్దులోబడి రానిచ్చినాడు కాడు; అయితే
సీహోను తన జనులందరిని కూర్చుకొని యహస్సు
లో దిగి ఇశ్రాయేలుతో యుద్ధము చేసెను. । ఇశ్రా 21
యేలుయొక్క దేవుడయిన యెహోవా సీహోను
నున్ను అతని జనులందరినిన్ని ఇశ్రాయేలు చేతిలోకి
అప్పగించినందున వారు వారిని కొట్టిరి; కాబట్టి ఇశ్రా
యేలు ఆ దేశపు కాపురస్తులయిన అమోరీయుల
యొక్క భూమి అంతాను స్వతంత్రించుకొనెను. ।
వారు అర్నోను మొదలుకొని యబ్బోకు పర్యంత 22

మున్ను అరణ్యము మొదలుకొని యర్దేను పర్యంత
మున్ను వున్న అమోరీయులయొక్క సరిహద్దులన్నీ
23 స్వతంత్రించుకొనిరి.। యీలాగున ఇశ్రాయేలుయొక్క
దేవుడయిన యెహోవా తన జనులయిన ఇశ్రాయేలు
ముందరనుంచి అమోరీయులను స్వతంత్రులు కాకుం
డా చేసిన తరువాత నీవు దాని స్వతంత్రించుకొం
24 దువా?। కెమోషు అనే నీ దేవుడు నీకు స్వాతంత్ర్య
ముగా యిచ్చేదాన్ని నీవు స్వతంత్రించకుండా వుం
దువా? అటువలెనే యెవరిని మా దేవుడైన యెహో
వా మా ముందరనుంచి అవతలకు తోలివేసునో
25 వారిని మేము స్వతంత్రించుకొందుము. । సిప్పోరు
కుమారుడైనటువంటిన్ని మోయాబు రాజైనటువంటిన్ని
బాలాకుకంటే నీవు యేమైనా యెక్కువైన వాడవా!
అతడు యెప్పుడయినా ఇశ్రాయేలుతో పోరాడినా
డా! లేక యెప్పుడయినా వారితో యుద్ధము చేసి
26 నాడా!। ఇశ్రాయేలు హెష్బోనులోనున్న దాని గ్రా
మములలోనున్ను అరోయేరులోనున్ను దాని గ్రామ
ములలోనున్ను అర్నోను ప్రాంతమందుండే పట్టణ
ములన్నిటిలోనున్ను మున్నూరు సంవత్సరములు కాపు
రము చేస్తూ వుండెను గదా! ఆ కాలములో మీరు
వాటిని యెందుకు తిరిగీ స్వాధీనము చేసుకోక పోతిరి!।
27 కాబట్టి నేను నీ విషయమై యే పాపమైనా చేయ
లేదు; అయితే నాతో యుద్ధమునకు వచ్చుటవల్ల
నీవు నాకు అన్యాయము చేస్తూ వున్నావు: న్యాయ
కర్తయైన యెహోవా యీ దినమున ఇశ్రాయేలు
పుత్రుల మధ్యనున్ను అమ్మోను పుత్రుల మధ్యనున్ను
28 న్యాయకర్త అవును గాకని చెప్పి పంపెను.। అయి
నప్పటికిన్ని అమ్మోను పుత్రులయొక్క రాజు తనకు
యెప్తా అంపించిన వర్తమానము వినక వుండెను.।
29 అప్పుడు యెహోవాయొక్క ఆత్మ యెప్తా మీదికి
వచ్చినందున అతడు గిలాదునున్ను మనస్సేనున్ను గడచి,
మరిన్ని గిలాదు మిస్పెను గడచి, గిలాదు మిస్పె
30 నుంచి అమ్మోను పుత్రుల దగ్గిరకు వచ్చెను.। అప్పుడు
యెప్తా యెహోవాకు మొక్కుకొనినదేమంటే, నీవు
నిశ్చయముగా అమ్మోను పుత్రులను నా చేతులలోకి
31 అప్పగిస్తివట్టాయెనా, । అప్పుడు సంభవించేదేమంటే,
నేను క్షేమముగా అమ్మోను పుత్రుల యొద్దనుంచి తిరిగీ
వచ్చేటంతలో నాకు యెదురుగా నా యింటి ద్వార
ములోనుంచి వచ్చేదేదైనప్పటికిన్ని అది యెహోవా
దవును, లేక అది హోమార్పణగానైనా అర్పింతు
32 నని ప్రమాణము చేసెను.। యీలాగున యెప్తా యు
ద్ధము చేయుటకు అమ్మోను పుత్రులయొద్దకు గడచి
వెళ్లెను; అప్పుడు యెహోవా అతని చేతిలోకి వారిని
33 అప్పగించినందున, । అతడు వారిని అరోయేరు మొద
లుకొని మిన్నీతుకు వచ్చే మట్టుకున్ను యిరువై పట్ట
ణములనున్ను ద్రాక్షతోటలు గల మైదానము మట్టు
కున్ను మిక్కిలీ గొప్ప హతముచేసి కొట్టినాడు: యీ
లాగున అమ్మోను పుత్రులు ఇశ్రాయేలు పుత్రుల
ముందర అణచివేయబడిరి.। తరువాత యెప్తా మిస్పె 34
లో వున్న తన యింటికి వచ్చినప్పుడు, యిదుగో,
అతని కుమార్తె తంబురలతోటిన్ని నాట్యములతో
టిన్ని అతని యెదుర్కొనుటకు బయిలు వెళ్లి వచ్చెను:
అది అతనికి ఏక పుత్రికయై వుండెను; అది గాక
కుమారుడైనా కుమార్తె అయినా అతనికి మరి లేక
వుండెను.। అతడు దాని చూచినప్పుడు సంభవించిన 35
దేమంటే, తన బట్ట చించుకొని, అయ్యో నా కుమారీ!
నీవు నన్ను మిక్కిలీ కుంగ చేసితివి, నీవు నన్ను తల్ల
డింప చేసితివి, యెందుకంటే నేను యెహోవాను
గూర్చి నా నోరు తెరచితిని, మరిన్ని నేను వెనుక
తియ్యచాలనని చెప్పినప్పుడు; । అది అతనితో నా 36
తండ్రీ, నీవు యెహోవాను గూర్చి నీ నోరు
తెరచి యున్నట్టయితే, నీ నోట బయిలు వెళ్లిన దాని
ప్రకారము నాకు చేయుము, యెందుకంటే యె
హోవా అమ్మోను పుత్రులయిన నీ శత్రువుల పయిని
నీ విషయమై పగ తీర్చుకొనెనని పలికి; । మరిన్ని తన 37
తండ్రితో అనినమాట, నీవు నాకు చేయ వలసిన
దేమంటే, నేను పర్వతములయందు రెండు నెలల
పర్యంతమూ తిరుగుతూ, నా చెలికత్తెలతోటి నా
కన్యాత్వమును గురించి యేడ్చేటట్టుగా నాకు సెలవు
యివ్వ వలసినదని అడిగెను.। అప్పుడు అతడు పొమ్మని 38
చెప్పి, రెండు నెలల మట్టుకు సెలవు యిచ్చి పంపెను;
అది తన చెలికత్తెలతోటి వెళ్లి తన కన్యాత్వమును
గురించి పర్వతముల యందు యేడ్చెను.। రెండు నెలలు 39
అయినప్పుడు సంభవించినది యేమంటే, అది తన
తండ్రి యొద్దికి తిరిగీ వచ్చినందున అతడు తన మొ
క్కుబడి చొప్పున దానికి చేసెను; కాబట్టి అది పురు
షుని యెరుగక వుండెను.। అప్పటినుంచి ఇశ్రాయేలు 40
లో మర్యాద యేమంటే, ఇశ్రాయేలు కుమార్తెలు
సంవత్సరమునకు నాలుగు దినములు గిలాదీయుడైన
యెప్తాయొక్క కుమార్తెతో కూడా యేడ్వడానకు
వెళ్లుతూ వుందురు.

## 12. అధ్యాయము.

అయితే ఎఫ్రయీముయొక్క జనులు కూడుకొని, 1
వుత్తర దిక్కుకు వెళ్లి, యెప్తాతో అనినదేమంటే,
నీవు అమ్మోను పుత్రులతో పోట్లాడుటకు వెళ్లినప్పుడు
మమ్మును పిలువకపోతివేమి! నీ పయిని వున్న నీ
యిల్లు అగ్నితోటి కాల్చివేతుమని చెప్పినప్పుడు:।

2 యెఫ్తా వారితో చెప్పినదేమంటే, నా జనులతో కూడా
నాకున్ను అమ్మోను పుత్రులకున్ను బహు వ్యాజ్యము
కలిగినందున నేను మిమ్మును పిలిచినప్పుడు మీరు వారి
3 చేతులలోనుంచి విడిపించలేదు. । మీరు నన్ను విడిపించ
లేదని నేను చూచినప్పుడు నా ప్రాణము నా చేతిలో
నేను వుంచుకొని, అమ్మోను పుత్రుల యొద్దికి గడిచి
వెళ్లితిని; అప్పుడు యెహోవా వారిని నా చేతిలోకి
అప్పగించెను: కాబట్టి యీ దినమున పోట్లాడుటకు
నా మీదికి మీరు యెందుకు వస్తిరని పలికెను. ।
4 అయితే యెఫ్తా గిలాదు జనులందరినిన్ని కూర్చుకొని
ఎఫ్రయీముతో పోట్లాడినాడు; గిలాదు జనులు
ఎఫ్రయీమును కొట్టినారు, యెందుకంటే ఓ గిలా
దీయులారా, మీరు ఎఫ్రయీమీయులలోనున్ను మన
స్సీయులలోనున్ను ఎఫ్రయీముయొక్క పారిపోయి
5 నవారై యున్నారని వారు చెప్పిరి. ।అయితే గిలాదీయు
లు ఎఫ్రయీమీయులకంటే ముందుగా యర్దేను
నది రేవులను పట్టుకొనిరి: తప్పించుకొనిన ఎఫ్రయీమీ
యులలో యెవడైనా వచ్చి నన్ను దాటనివ్వండని అడిగి
నప్పుడు సంభవించినదేమంటే, గిలాదు జనులు అతని
6 చూచి నీవు ఎఫ్రయీమీయుడవా అని అడిగిరి. । అత
డు కానని చెప్పిన పక్షమందు వాడు అతని చూచి,
షిబ్బోలెతనే శబ్దము పలుకుమని చెప్పినప్పుడు, అతడు
షిబ్బోలెతని పలికెను, యెందుకంటే అది చక్కగా
పలుకడము అతని నోటికి రాకవుండెను: అప్పుడు
వారు అతని పట్టుకొని యర్దేను రేవుల దగ్గిర చంపి
వేసిరి: యీలాగున ఆ కాలమందు ఎఫ్రయీమీయు
7 లలో నలుబై రెండువేల మంది పడిపోయిరి. । అయితే
యెఫ్తా ఆరు సంవత్సరములు ఇశ్రాయేలుకు న్యాయా
ధిపతి అయి వుండెను. అప్పుడు గిలాదీయుడయిన
యెఫ్తా మరణమయి, గిలాదు పట్టణములలో వొక
8 దానియందు పాతిపెట్టబడెను. । అతని వెనుక బేత్లె
హేమీయుడయిన యిబ్సాను ఇశ్రాయేలుకు న్యా
9 యాధిపతియై వుండెను. । అతనికి ముప్పయి మంది
కుమారులున్ను ముప్పయి మంది కుమార్తెలున్ను గలరు:
అతడు తన కుమార్తెలను అన్య స్థలములకు పంపి,
తన కుమారులకొరకు ముప్పయి మంది కోడండ్లను
బయటనుంచి తెప్పించుకొనెను. అతడు యేడు సంవ
త్సరములు ఇశ్రాయేలుకు న్యాయాధిపతి అయి వుం
10 డెను. । అంతట ఇబ్సాను మరణమయి, బేత్లెహేము
11 యందు పాతిపెట్టబడెను. । అతని వెనుక జెబూలోనీ
యుడైన ఏలోను ఇశ్రాయేలుకు న్యాయాధిపతి అయి
వుండెను; పది సంవత్సరములు అతడు ఇశ్రాయేలుకు
12 న్యాయము తీర్చినాడు. । అప్పుడు జెబూలోనీయు
డయిన ఏలోను మరణమయి, జెబూలోను దేశమం
దుండే అయ్యాలోనులో పాతిపెట్టబడెను. । అతని 13
వెనుక పిరాతోనీయుడైన హిల్లేలు కుమారుడైన అ
బ్దోను ఇశ్రాయేలుకు న్యాయాధిపతి అయి వుండెను. ।
అతనికి నలుబై మంది కుమారులున్ను ముప్పయి మంది 14
మనములున్ను కలరు; వీరు డెబ్బయి గార్దభముల
పిల్లల మీద యెక్కేవారు: అతడు యెనిమిది సంవత్సర
ములు ఇశ్రాయేలుకు న్యాయము తీర్చెను. । అప్పుడు 15
పిరాతోనీయుడయిన హిల్లేలుకు పుట్టిన అబ్దోను మర
ణమై, అమాలేకీయుల పర్వతములో ఎఫ్రయీము దేశ
మందుండే పిరాతోనులో పాతిపెట్టబడెను.

## 13. అధ్యాయము.

తరువాత ఇశ్రాయేలు పుత్రులు మళ్లీ యెహో 1
వా దృష్టి యెదుట కీడు చేసిరి; అయినందున యె
హోవా వారిని నలుబై సంవత్సరముల మట్టుకు పెలి
ష్తీయుల చేతులలోకి అప్పగించెను. । అయితే సోరా 2
పట్టణమందు దాను గోత్రికుడయిన వాడు వొకడు
గలడు; అతని పేరు మానోహ; అతని భార్య గొడ్రా
లయి కానుపు లేక వుండెను. । అయితే ఆ స్త్రీకి యె 3
హోవాయొక్క దూత ప్రత్యక్షమై, దానితో యిదు
గో, నీవు గొడ్రాలవు, నీకు కానుపు లేక వున్నది, అయి
నప్పటికిన్ని నీవు గర్భవతివై కుమారుని కందువు. ।
కాబట్టి నీవు భద్రముగా వుండి, ద్రాక్షారసమునైనా 4
మధ్యమునయినా తాగక, యే అపవిత్రమయినదైనా
తినకుండా వుండ వలసినది. । యెందుకంటే నీవు గర్భ 5
వతివై కుమారుని కందువు; అతని శిరస్సుమీదికి
క్షౌరపు కత్తి రాక వుండును; యెందుకంటే ఆ పిల్ల
గర్భములోనుంచి పుట్టినప్పటినుంచి దేవుని విషయమై
నాజరీయుడయి వుండును: మరిన్ని అతడు ఇశ్రాయే
లును పెలిష్తీయుల చేతిలోనుంచి రక్షించ నారంభిం
చునని చెప్పి వెళ్లెను. । అప్పుడు ఆ స్త్రీ తన పెనిమిటి 6
యొద్దకు వచ్చి చెప్పినదేమంటే, నా దగ్గిరకు వొక దివ్య
పురుషుడు వచ్చెను; అతని ముఖము దేవునియొక్క
దూత ముఖము వలెనే బహు భయంకరముగా వుం
డెను: యెక్కడనుంచి వస్తివని నేను అడిగినాను కాను;
ఆయన తన పేరు నాతో చెప్పడమున్ను లేదు. ।
అయితే నాతో ఆయన చెప్పినదేమంటే, యిదుగో 7
నీవు గర్భవతివై కుమారుని కందువు; కాబట్టి నీవు
ద్రాక్షారసమునైనా మద్యమునైనా తాగక, యే అప
విత్రమైనదైనా తినకుండా వుండుము; యెందుకంటే
ఆ పిల్ల గర్భములోనుంచి పుట్టినప్పటినుంచి మరణ
మయ్యే దినము మట్టుకు దేవుని విషయమై నాజరీయు
డుగా వుండునని చెప్పెనని చెప్పెను. । అప్పుడు మా 8
నోహ యెహోవాను ప్రార్థన చేసినదేమంటే,

ఓ నా కర్తా, నీవు పంపిన దివ్య పురుషుని మా
దగ్గిరకు తిరిగీ రానిచ్చి, పుట్ట బోయే పిల్లకు యేమి
చేయ వలసినదో అది మాకు నేర్పేటట్టుగా దయ
9 చేయుమని వేడుకొనెను. । దేవుడు మానోహాయొక్క
ప్రార్థన విన్నందున దేవునియొక్క దూత పొల
మందు కూర్చుని వుండే ఆ స్త్రీ దగ్గిరకు మళ్లీ వచ్చెను:
అయితే దాని పెనిమిటి అయిన మానోహా దాని
10 సమీపమున లేక వుండెను. । కాబట్టి ఆ స్త్రీ శీఘ్ర
ముగా పరుగెత్తి, తన పెనిమిటితో తెలియ చెప్పిన
దేమంటే, యిదుగో వాడు నా యొద్దకు వచ్చిన పురు
11 షుడు తిరిగీ నాకు అగుపడినాడని చెప్పినప్పుడు, । మా
నోహా లేచి తన భార్యను వెంటాడి, ఆ పురుషుని
యొద్దికి వచ్చి, యీ స్త్రీతో మాట్లాడిన వాడవు నీవే
నా, అని అతని అడిగినప్పుడు అతడు నేనే అని చెప్పె
12 ను. । అప్పుడు మానోహా చెప్పినదేమంటే, నీ మాటలు
యీడేరును గాక; అయితే ఆ పిల్లకు యేమేమి మర్యాద
చొప్పున చేతుము! అతనికి చేయ వలసినవి యేమిటే
13 మిటి అని అడిగెను. । అప్పుడు యెహోవాయొక్క
దూత మానోహాతో చెప్పినదేమంటే, నేను స్త్రీతోను
చెప్పిన యావత్తుయందున్ను అది భద్రముగా వుండ
14 వలెను. । అది ద్రాక్ష చెట్టువల్ల వచ్చిన దేనినైనా తినక,
ద్రాక్షారసమునయినా మద్యమునయినా తాగక, అప
విత్రమైన దేదైనా తినకుండా వుండ వలసినది; దానికి
నేను ఆజ్ఞాపించినది యావత్తు అది గైకొన వలసినదని
15 చెప్పెను. । అప్పుడు మానోహా యెహోవాయొక్క
దూతతో అనిన మాట యేమంటే, మేము నీ కొరకు
వొక మేక పిల్లను ఆయత్తము చేసే పర్యంతము నీవు
16 నిలిచి వుండుమని వేడుకొనెను. । అయినందున యె
హోవాయొక్క దూత మానోహాతో చెప్పినదేమం
టే, నీవు నన్ను నిలిపినప్పటికిన్ని నీ ఆహారమును
తినను; మరిన్ని నీవు హోమ బలిని అర్పించవలెనని
వుంటే అది యెహోవా కొరకే అర్పించవలసినదని
చెప్పెను: యెందుకంటే అతడు యెహోవాయొక్క
17 దూతని మానోహాకు తెలియక వుండెను. । అప్పుడు
మానోహా యెహోవాయొక్క దూతతో నీ మాట
లు యీడేరినప్పుడు మేము నిన్ను బహుమానించే
18 కొరకు నీ పేరేమని అడిగినంతటు, । యెహోవాయొ
క్క దూత అతనితో నా పేరు యెందుకు అడుగుతా
19 వు! అది రహస్యమై యున్నదని చెప్పెను. । అప్పుడు
మానోహా వొక మేక పిల్లను భోజనార్పణతోటి రాతి
మీద యెహోవాకొరకు అర్పించెను; అయితే మానో
హాయున్ను అతని భార్యయున్ను చూస్తూ వుండగా
20 ఆ దూత వింతయిన కార్యము చేసెను. । యేమంటే
మంట బలిపీఠము మీదనుంచి ఆకాశము తట్టు యెక్కి
నప్పుడు, యెహోవాయొక్క దూత ఆ బలిపీఠము
యొక్క మంటలో యెక్కి పోయెను: అప్పుడు మా
నోహాయున్ను అతని భార్యయున్ను అది చూచి సా
గిలపడిరి. । అయితే ఆ పిమ్మట యెహోవాయొక్క 21
దూత మానోహాకున్ను అతని భార్యకున్ను మరి అగు
పడలేదు. అప్పుడు ఆయన యెహోవాయొక్క దూతని
మానోహాకు తెలిసెను. । మరిన్ని మానోహా తన భార్య 22
ను చూచి, మనము దేవుని చూస్తిమి గనుక మనము అవ
శ్యముగా చత్తుమని చెప్పెను. । అయితే అతని భార్య 23
అతని చూచి, యెహోవా మనలను చంపుటకు అనుకూ
లించినట్టయితే హోమబలినిన్ని భోజనార్పణనున్ను
మన చేత అంగీకరించక వుండును; అది గాక యీలా
టి కార్యములు చూపించకనున్ను యిటువంటివాటిని
యిప్పుడు వినిపించకనున్ను పోవునని చెప్పెను. । తరు 24
వాత ఆ స్త్రీ వొక కుమారుని కని అతని పేరు సంసో
నని పిలిచెను: ఆ పిల్ల యెదిగెను; యెహోవా అతని
ఆశీర్వదించెను. । మరిన్ని సోరాకున్ను ఎష్తాయోలుకు 25
న్ను మధ్యమందున్న దానుయొక్క పేటలో యెహో
వాయొక్క ఆత్మ అతని అప్పుడప్పుడు ప్రేరేపణ చేయ
నారంభించెను.

## 14. అధ్యాయము.

అయితే సంసోను తిమ్నా వూరికి దిగి వెళ్లి, పెలి 1
ష్తీయులయొక్క కుమార్తెలలో వొక స్త్రీని తిమ్నాయం
దు చూచెను. । అప్పుడు అతడు అక్కడనుంచి యెక్కి 2
తన తల్లి తండ్రుల యొద్దికి వచ్చి చెప్పినదేమంటే,
తిమ్నాయందు పెలిష్తీయుల కుమార్తెలలో వొక
స్త్రీని చూచితిని; దాని మీరు నా కొరకు పెండ్లికి అడు
గండని చెప్పినప్పుడు, । అతని తల్లిదండ్రులు అతని 3
చూచి, నీ సహోదరులయొక్క కుమార్తెలలోనైనా
మన జనులందరిలోనైనా స్త్రీ లేదు గనుకనా సున్నతీ
లేని పెలిష్తీయులలోనుంచి పెండ్లామును తెచ్చుకో
నుటకు వెళ్లుతావు అని అనెను. అయితే సంసోను
తన తండ్రితో అది నాకు మహా అనుకూలమయి వున్నది
గనుక నా కొరకు దాని అడుగుమని పలికెను. ।
అయితే అది దేవునివల్లనైనదని అతని తల్లి దండ్రులకు 4
తెలియక వుండెను, యేమంటే అతడు పెలిష్తీయుల
మీద హేతువు వెతుకుతూ వుండెను, యేమంటే ఆ
కాలమందు పెలిష్తీయులు ఇశ్రాయేలు మీద అధి
కారులయి వుండిరి. । అప్పుడు సంసోనున్ను, అతని 5
తల్లి దండ్రులున్ను తిమ్నాకు దిగి వెళ్లి, తిమ్నాలో వున్న
ద్రాక్ష తోటలకు వచ్చినారు; అయితే యిదుగో వొక
కొదమ సింహము అతని యెదురించి రంకె వేసెను. ।
అయితే యెహోవాయొక్క ఆత్మ అతని మీదికి బల 6

ముగా వచ్చినందున అతని చేతిలో యేమీ లేక పోయి
నప్పటికిన్ని అతడు మేకపిల్లను చీల్చినట్టుగానే దాని
చీల్చివేసెను: అయితే తాను చేసిన కార్యము తన తం
7 డ్రికైనా తన తల్లికైనా చెప్పలేదు. । అప్పుడు అతడు
దిగి వెళ్లి ఆ స్త్రీతోను మాట్లాడినాడు; మరిన్ని అది
8 సంప్సోనుకు మహా అనుకూలమై వుండెను. । కొంత
కాలము గడచిన తరువాత అతడు దాని తీసుక రావ
డానకు తిరిగీ వస్తూ వుండగా, సింహపు కళేబరమును
చూడడానకు అటు తిరిగినప్పుడు, యిదుగో సింహము
యొక్క కళేబరములో తేనెటీగలున్ను తేనెయున్ను
9 కలిగి వుండెను. । కాబట్టి అతడు దానిచేత పట్టుకొని
వెళ్లుతూ తింటూ, తన తల్లి దండ్రుల యొద్దికి వచ్చి
వారికిన్ని యిచ్చినందున వారున్ను తిన్నారు; అయితే
తాను సింహముయొక్క కళేబరములోనుంచి తేనె
10 తీసిన సంగతి వారికి తెలియ చేయలేదు. । అంతట
అతని తండ్రి దిగి ఆ స్త్రీయొద్దికి వచ్చెను; మరిన్ని సం
ప్సోను అక్కడ విందు వొకటి చేసెను, యేమంటే
ఆలాగున చేసే మర్యాద పడుచువాండ్లకు కలదు. ।
11 అయితే వారు అతని చూచినప్పుడు అతని యొద్ద
వుండుటకు ముప్పయి మంది చెలికాండ్లను తీసుక వ
12 చ్చిరి. । అప్పుడు సంప్సోను వారిని చూచి మీకు పొడు
పుడు కథ వొకటి చెప్పుతాను, దాని తాత్పర్యము
మీరు యీ పండుగ యేడు దినముల యీ లోపట
గ్రహించి నాకు చెప్పితిరట్టాయెనా నేను మీకు ము
ప్పయి దుప్పట్లున్ను ముప్పయి దుస్తులున్ను యిత్తును. ।
13 మీరు దాని నాకు చెప్ప లేక పోయిన పక్షమందు
మీరు నాకు ముప్పయి దుప్పట్లున్ను ముప్పయి దుస్తు
లున్ను యిత్తురు గాకని పలికినప్పుడు, వారు నీ పొడు
పుడు కథ మేము వినేటట్టుగా పలుకుమని చెప్పిరి. ।
14 అప్పుడు అతడు తినే దానిలోనుంచి ఆహారమున్ను
బలమైన దానిలోనుంచి మధురత్వమున్ను బయిలు వెళ్లె
నని పలికెను. అయితే మూడు దినములయినప్పటికిన్ని
వారు ఆ పొడుపుడు కథ తాత్పర్యము చెప్పలేక వుం
15 డిరి. । తరువాత యేడో దినమందున వారు సంప్సోను
భార్య యొద్దికి వచ్చి చెప్పినదేమంటే, నీ పెనిమిటి
మాకు యీ పొడుపుడు కథ తాత్పర్యము తెలియ
చేసేటట్టు అతని లాలన చేయలేక పోతే నిన్నున్ను నీ
తండ్రి యింటినిన్ని అగ్నిచేత కాల్చివేతుము, యే
మంటే మా సంసారము ఆక్రమించుకోవడానకే కదా
16 మీరు మమ్మును పిలిపిస్తిరని పలికినారు. । అయినందున
సంప్సోను భార్య అతని యొద్ద యేడుస్తూ వుండి, అత
నితో నీవు నన్ను పగ చేస్తివే గాని స్నేహము చేసి
నావు కావు, యేమంటే నా జనులయొక్క పుత్రులకు
నీవు వొక పొడుపుడు కథ చెప్పితివి, దాని తాత్పర్య
ము నాకు తెలియ చేయలేదని అనెను. అందుకు అత
డు నా తల్లిదండ్రులకు సహా అది చెప్పినాను కాను,
నీకు చెప్పుతానా అని పలికెను. । కాబట్టి అది ఆ పం 17
డుగ యేడు దినముల దాకా అతని యొద్ద యేడుస్తూనే
వుండెను; అయినందున అతడు యేడో దినమున అది
అతని తొందర చేసెను గనుక దానికి తెలియ చెప్పె
ను; అప్పుడు అది వెళ్లి ఆ పొడుపుడు కథ తాత్పర్య
ము తన జనులయొక్క పుత్రులకు తెలియ చేసెను. ।
కాబట్టి యేడో దినమున సూర్యాస్తమానము కాక 18
మునుపు ఆ వూరి జనులు అతని చూచి, తేనెకంటే
మధురమయినదేది? సింహముకంటే బలము గలదేది
అని పలికిరి; అందుకు అతడు నా ఆవు పడ్డతోటి మీరు
దున్నక పోతే నా పొడుపుడు కథ తాత్పర్యము మీరు
కనుకోలేక పోదురని చెప్పెను. । అయితే యెహోవా 19
యొక్క ఆత్మ అతని మీదికి వచ్చినందున అతడు దిగి
అష్కెలోనుకు వచ్చి, వారిలో ముప్పయి మందిని
చంపి, వారి బట్టలను దోచుకొని, తన పొడుపుడు కథ
తాత్పర్యము చెప్పినవారికి ఆ దుస్తులు యిచ్చెను. అతని
కోపము రగులుకొనినందున అతడు తన తండ్రి
యింటికి వెళ్లిపోయెను. । అయితే సంప్సోనుయొక్క 20
భార్య అతకి స్నేహితుడయిన చెలికానికి యివ్వ
పడెను.

## 15. అధ్యాయము.

కొంత కాలము గడచిన తరువాత గోధుముల కోత 1
కాలమందు సంప్సోను తన భార్యను చూడడానకు
వొక మేకపిల్లను పట్టుకొని వచ్చి, గదిలోనున్న నా
భార్య యొద్దకు వెళ్లుతానని చెప్పెను: అయితే దాని
తండ్రి అతని ప్రవేశించనివ్వక అతనితో చెప్పిన
దేమంటే, । నీవు దాని నిండా పగ చేస్తివని నాకు రూ 2
ఢముగా తోచినది గనుక దాని నీ చెలికానికి యిచ్చి
నాను; దాని చెల్లెలు దానికంటే చక్కనిది కాదా?
దానికి బదులుగా దీని పుచ్చుకొమ్మని వేడుకొనెను. ।
అప్పుడు సంప్సోను వారిని గురించి అనుకొన్నదేమంటే, 3
యిప్పుడు నేను పెలిష్తీయులకు యెంత కీడు చేసినప్పటి
కిన్ని నేను వారికంటే నిరపరాధిగా వుందునని అనుకొ
నెను. । అప్పుడు సంప్సోను వెళ్లి మున్నూరు నక్కలను 4
పట్టుకొని, దివిటీలు తీసుకొని, తోకతో తోకను
కలిపి, రెండు తోకల మధ్యను దివిటీ కట్టెను. ।
ఆ దివిటీలు అతడు ముట్టించిన తరువాత పెలిష్తీయు 5
లయొక్క గోధుమ పయిరులోకి వాటిని పంపివేసెను;
అవి చేల కుప్పలనున్ను పయిరులనున్ను ద్రాక్ష చెట్ల
నున్ను యిప్ప చెట్లనున్ను కాల్చివేసెను. । అప్పుడు 6
పెలిష్తీయులు యిది యెవడు చేసెనని అనుకొన్నప్పుడు,

కొందరు యిది తిమ్నాయునియొక్క అల్లుడయిన
సంసోను చేసిన పని; యెందుకంటే అతడు యితని
భార్యను తీసుకొని అతని చెలికానికి యిచ్చినాడని
చెప్పిరి; అయినందున ఫెలిష్తీయులు వచ్చి దానినిన్ని
7 దాని తండ్రినిన్ని అగ్నిచేత కాల్చివేసిరి. । అప్పుడు
సంసోను వారితో చెప్పినదేమంటే, మీరు యీలా
గున చేసినప్పటికిన్ని మీ మీద నా పగ తీర్చుకొం
8 దును, తరువాత చాలింతునని చెప్పి, । వాండ్లను తుంట్లు
తొడలు సమేతము కొట్టి బహుగా హతము చేసి, దిగి
వెళ్లి, ఏథాము అనే పర్వతపు శిఖరము మీద నివాస
9 ము చేసెను. । అప్పుడు ఫెలిష్తీయులు యెక్కి యూదా
దేశమందు దిగి, లెహీయందు వ్యాపించి వుండిరి. ।
10 అప్పుడు యూదా జనులు మీరు మా మీదికి యెందు
కు వస్తిరని వారిని అడిగినప్పుడు, వారు సంసోనును
బంధించి అతడు మాకు చేసినట్టు అతనికిన్ని చేసేటం
11 దుకు వస్తిమని చెప్పిరి. । కాబట్టి యూదా జనులలో
మూడువేల మంది ఏథాము పర్వత శిఖరమునకు వచ్చి
సంసోనుతో అనిన మాట, ఫెలిష్తీయులు మన మీద
అధికారులని నీకు తెలియదా? నీవు మాకు చేసినది
యేమని అడిగినందుకు, నాకు వారు చేసినట్టుగా వా
12 రికి నేనున్ను చేసినానని చెప్పినప్పుడు; । వారు నిన్ను
బంధించి ఫెలిష్తీయుల చేతిలోకి అప్పగించేటందుకు
వస్తిమని చెప్పిరి; అప్పుడు సంసోను వారితో మీరు
నా మీద పడకుండా వుంటామని నాతో ప్రమాణము
13 చేయండని చెప్పెను. । అందుకు వారు అది కాదు,
నిన్ను గట్టిగా బంధించి వారి చేతిలోకి అప్పగింతుము,
యింతే కాని నిశ్చయముగా నిన్ను చంపమని చెప్పి,
రెండు కొత్త తాళ్లతో అతని కట్టి, పర్వతము మీది
14 నుంచి తీసుక వచ్చినారు. । అతడు లెహీ దగ్గిరకు వచ్చి
నప్పుడు ఫెలిష్తీయులు అతని చూచి బొబ్బలు పెట్టి
నారు; అయితే యెహోవాయొక్క ఆత్మ అతని మీద
బలముగా వచ్చినందున అతని దండలకు కట్టిన తాళ్లు
అగ్నిచేత కాల్చబడిన దూది వలెనై, అతని చేతుల
15 కట్లు వీడిపోయెను. । అప్పుడు గాడిదెయొక్క పచ్చి
దవడ యెముక అతనికి దొరికినందున అతడు అది చేత
16 పట్టుకొని, దానితో వెయి మందిని చంపెను. । అప్పుడు
సంసోను అనుకొన్నదేమంటే, గాడిదెయొక్క దవడ
యెముకతో కుప్ప కుప్పలుగా, గాడిదెయొక్క దవడ
యెముకతో వెయి మందిని చంపితినని అనుకొనిన తరు
17 వాత, । దవడ యెముక చేతిలోనుంచి పారవేసి, ఆ
18 స్థలము రామత్లెహి అని పిలిచినాడు. । అయితే అత
నికి బహు దాహము పుట్టెను; కాబట్టి అతడు యె
హోవాను స్మరించి పలికినదేమంటే, నీ సేవకుడనైన
నా హస్తము చేత నీవు యింత గొప్ప రక్షణ్యమును
కలుగ చేసిన తరువాత నేను దాహముచేత మరణనై,
సున్నతి లేని వారి చేతిలోకి బడుదునా అని పలికిన
ప్పుడు; । దేవుడు లెహీలో వున్న వొక పల్లపు స్థల 19
మును భేదించినందున అందులోనుంచి నీళ్లు బయలు
వెళ్లెను: అతడు తాగిన తరువాత అతని జీవము తిరగీ
వచ్చినందున అతడు తెప్పరిల్లెను; కాబట్టి అతడు
దాను ఏన్హక్కోరే అనే పేరున పిలిచినాడు, అది నేటివ
రకు లెహీ యందు వున్నది. । అతడు ఫెలిష్తీయుల 20
యొక్క దినములయందు ఇశ్రాయేలుకు యిరువై సం
వత్సరములు న్యాయము తీర్చెను.

## 16. అధ్యాయము.

అంతట సంసోను గాజాకు వెళ్లి, అక్కడ వొక 1
వేశ్యను చూచి దాని దగ్గిరకు ప్రవేశించెను. । అప్పుడు 2
సంసోను యిక్కడికి వచ్చినాడని గాజాతీయులకు
వినబడెను; కాబట్టి వారు అతని ఆవరించుకొని, పట్టణ
ద్వారమందు రాత్రి అంతా అతని కొరకు పొంచి
వుండి, రాత్రి అంతా వూరకొని, వుదయమందు
వెలుగు వచ్చినప్పుడు అతని సంహరింతామని అనుకొ
నిరి. । అయితే సంసోను మధ్య రాత్రి దాకా పండు 3
కొని, మధ్య రాత్రి యందు లేచి, పట్టణ ద్వారము
యొక్క తలుపులనున్ను రెండు ద్వారబంధములనున్ను
దండె కర్రతో కూడా తీసి, అవి తన భుజము మీద
పెట్టుకొని, హెబ్రోను యెదుట వున్న కొండ మీ
దికి మోసుకొని పోయెను. । అటు తరువాత సంభవిం 4
చినదేమంటే, అతడు సోరేకు గెడ్డ దగ్గిర వున్న దెలీ
లా అనే స్త్రీయందు వాంఛపడెను. । అప్పుడు ఫెలిష్తీ 5
యులయొక్క అధికారులు దాని యొద్దికి వచ్చి, మేము
పదకొండు నూరుల వెండి తులములు నీకు యిస్తాము;
నీవు అతని లాలనచేసి, అతని గొప్ప శక్తి యెక్కడ
వున్నదో అది తెలుసుకొని, అతని మేము జయించి
అతని బాధ పెట్టేటట్టుగా యే వుపాయముచేత కట్ట
వచ్చునో అది మాకు తెలియ చెప్పమని దానితో
పలికిరి. । అయినందున దెలీలా సంసోనును చూచి, 6
నీయొక్క గొప్ప శక్తి యెక్కడ వున్నదో అదిన్ని,
నిన్ను బాధ పెట్టేటట్టుగా వేటితో నీవు కట్టబడ వచ్చు
నో అదిన్ని, దయచేసి చెప్పమని అడిగెను. । అం 7
దుకు సంసోను యెండనటువంటి యేడు పచ్చి నార
తడపలతోటి నన్ను కట్టినట్టయితే నేను అన్యుని వలెనే
బలహీనుడనై పోదునని పలికెను. । అందుకు ఫెలిష్తీ 8
యులయొక్క అధికారులు దాని యొద్దికి యెండ తగ
లని యేడు పచ్చి నారతడపలు తీసుక వచ్చిరి, వాటి
తో అది అతని కట్టెను. । అయితే గదిలో దాని దగ్గిర 9
కొందరు మనుష్యులు పొంచి వుండిరి; అప్పుడు అది

అతనితో ఔరా సంసోనా, పెలిష్తీయులు వచ్చి నీ
మీద పడుతారని చెప్పెను; అయితే అగ్ని అంటుకొన్న
నూలు యేలాగు తెగిపోవునో ఆలాగున అతడు ఆ
కట్లను తెంపివేసెను; కాబట్టి అతని శక్తి తెలియబడక
10 పోయెను. । అప్పుడు దెలీలా సంసోనుతో, యిదుగో,
నీవు అబద్ధమాడి నన్ను అపహాస్యము చేస్తివి; యిప్పుడు
వేటితో నీవు కట్టబడ వచ్చునో అది దయచేసి
11 నాతో చెప్ప వలసినదని చెప్పెను. । అందుకు అతడు
వాడికలోకి రాని కొత్త తాళ్లతోటి నన్ను గట్టిగా
కట్టితే అన్యుని వలెనే నేను బలహీనుడనై పోదునని
12 చెప్పెను. । అయినందున దెలీలా కొత్త తాళ్లను తీసు
కొని అతని కట్టి, ఔరా సంసోనా, పెలిష్తీయులు
వచ్చి నీ మీద పడుతారని చెప్పెను; గదిలో కొందరు
పొంచి వుండిరి: అయితే అతడు తన దండలను కట్టిన
13 తాళ్లను నూలులాగున తెంపుకొనెను. । కాబట్టి దెలీ
లా తిరుగా సంసోనుతో యిప్పటికీ నీవు అబద్ధమాడి
నన్ను అపహాస్యము చేస్తివి; వేటితో నీవు కట్టబడ
వచ్చునో నాతో తెలియ చెప్పుమని చెప్పెను: అతడు
దానితో నా తల జడలు యేడున్ను మగ్గములో నేస్తే
14 నేను బంధింపబడుదునని చెప్పెను. । అప్పుడు అది
ఆలాగున చేసి, అంతా శీలలతో దిగ కొట్టి, ఔరా సం
సోనా, పెలిష్తీయులు వచ్చి నీ మీద పడుతారని
అతనితో చెప్పెను; అప్పుడు అతనికి నిద్ర తెలిసి
లేచి, నేసే దాని శీలతోటిన్ని మగ్గముతోటిన్ని వెళ్లి
15 పోయినాడు. । అప్పుడు అది నీ హృదయము నాకు
దూరమై వుండగా నిన్ను స్నేహిస్తున్నానని యే
లాగు చెప్ప గలవు? యీ మూడు మార్లు నీవు
నన్ను అపహాస్యము చేస్తివి; నీ గొప్ప శక్తి యెక్కడ
వున్నదో అది నాతో తెలియ చెప్పవైతివని అతనితో
16 పలికెను. । యీలాగున అది ప్రతి దినము అతనితో
చెప్పుతూ అతని బాధపెట్టి తొందర చేసినందున,
అతని మనస్సు మరణమయ్యేలాగున విసికి, అప్పుడు
అతడు తన హృదయములో వున్నదంతా దానితో
17 తెలియచేసి చెప్పినదేమంటే; । నా తల్లి గర్భమునుంచి
పుట్టినప్పటినుంచీ నేను దేవుని గురించి నాజరీయుడనై
నందున, క్షౌరపు కత్తి యెన్నడూ నా శిరస్సు మీదికి
వచ్చినది కాదు; కాబట్టి నేను క్షౌరమైతే నా శక్తి
పోయి అన్యుని వలెనే బలహీనుడనై వుందునని చెప్పె
18 ను. । అయితే అతడు తన హృదయములో వున్నదంతా
తెలియ చేసెనని దెలీలా చూచి, పెలిష్తీయులయొక్క
అధికారులను పిలువనంపించి చెప్పినదేమంటే, అతడు
తన హృదయములో వున్నదంతా తెలియ చేసినాడు;
కాబట్టి మీరు యిక నొకమారు రావలసినదని చెప్పిన
ప్పుడు, పెలిష్తీయులయొక్క అధికారులు ద్రవ్యమును
చేత పట్టుకొని దాని దగ్గిరకు వచ్చిరి. । అప్పుడు అది 19
అతని తన తొడ మీద నిద్రను పొందచేసి, వొక
మనిషిని పిలువనంపించి, వానిచేత అతనియొక్క తల
జడలు యేడున్ను క్షౌరము చేయించి, అతని బాధప
చను నారంభించినందున అతని శక్తి అతని విడచి పో
యెను. । అప్పుడు అది అతనితో ఔరా సంసోనా, 20
పెలిష్తీయులు వచ్చి నీ మీద పడుతారని చెప్పినప్పుడు,
అతడు నిద్ర తెలసి లేచి, మునుపటిలాగునే నేను
బయిలువెళ్లి దులుపుకొందునని అనుకొనెను; యెహో
వా తన్ను వదిలిన సంగతి తనకు తెలియక వుండెను. ।
అయితే పెలిష్తీయులు అతని పట్టుకొని, అతని కన్ను 21
లను వూడతీసి, గాజా పట్టణమునకు అతని తీసుక
వచ్చి, యిత్తడి సంకెళ్లతో అతని బంధించి, బందీగృ
హములో అతనిచేత తిరగలి విసరించినారు. । అయితే 22
అతడు క్షౌరమైన తరువాత అతని తల వెంట్రుకలు
తిరిగీ యెదగ నారంభించెను. । తరువాత పెలిష్తీయుల 23
యొక్క అధికార్లు కూడుకొని, మన దేవుడు మన
శత్రువుడయిన సంసోనును మన చేతిలోకి అప్పగిం
చెనని అనుకొని, దాగోను అనే తమ దేవునికి గొప్ప
బలినిన్ని సంభ్రమమునున్ను చేయడానకు వచ్చినారు. ।
మరిన్ని జనులు అతని చూచినప్పుడు అనుకొన్నదేమం 24
టే, మనలో అనేకులను చంపి మన దేశము పాడు
చేసిన మన శత్రువును మన దేవుడు మన చేతులలోకి
అప్పగించెనని పలికి, తమ దేవుని స్తోత్రము చేసిరి. ।
యీలాగున వారి హృదయములు సంతోషమై వున్న 25
ప్పుడు సంభవించనదేమంటే, సంసోను మనలను నవ్విం
చేటట్టుగా అతని పిలువండని చెప్పుకొనిరి: కాబట్టి
వారు బందీ గృహములోనుంచి సంసోనును పిలువ
నంపించినప్పుడు అతడు వచ్చి వారిని నవ్వించిన తరు
వాత వారు అతని స్తంభముల మధ్యను వుంచినారు. ।
అప్పుడు సంసోను తన చెయ్యి పట్టుకొనిన పడుచు 26
వానితో యీ మందిరమునకు ప్రాపుగావుండే స్తంభ
ముల మీద నేను చేరబడుటకు నన్ను వాటిని అంట
నియ్యుమని అడిగెను. । అయితే యీ మందిరము మొ 27
గవాండ్లతోనున్ను ఆడువాండ్లతోనున్ను నిండై వుం
డెను; మరిన్ని పెలిష్తీయులయొక్క అధికారులందరు
న్ను అక్కడ వుండిరి; మరిన్ని మందిరము మీద మొ
గవాండ్లున్ను ఆడువాండ్లున్ను యెక్కువ తక్కువ
మూడువేల మంది సంసోను చేసే హాస్యపు క్రియ
లను చూస్తూ వుండిరి. । అప్పుడు సంసోను యెహో 28
వాను స్మరించినదేమంటే, ఔరా దేవుడవైన యెహో
వా, నీవు నా యందు దయగా వుండి, నన్ను జ్ఞాప
కము తెచ్చుకొని, నా రెండు కన్నుల నిమిత్తము నేను
పెలిష్తీయుల మీద నా పగ తీర్చుకొనేటట్టుగా

యింకొకమారు మాత్రము వో దేవుడా నాకు బలము
29 దయచేయుము అని పలికి; । మందిరమునకు ప్రాపుగా
వుండే రెండు స్తంభములనూ వొకటి కుడిచేతి చేత
నున్ను వొకటి యెడమచేతి చేతనున్ను పట్టుకొని, ।
30 ఫెలిష్తీయులతోటి నేను మరణమవుదును గాకని పలికి,
తన యావచ్ఛక్తితోను వంగినప్పుడు ఆ మందిరము
అధికారుల మీదనున్ను ఆ లోపలనున్న జనులందరి
మీదనున్ను పడెను: యీలాగున అతనికి మరణము
వచ్చిన దినమందు అతడు చంపిన వారియొక్క లెక్క
అతడు బ్రతికిన దినములందు అతడు చంపిన వారి
31 యొక్క లెక్కకంటే అధికమై వుండెను. । అప్పుడు
అతని సహోదరులున్ను అతని తండ్రియొక్క యిం
టివారందరున్ను దిగి, అతని మోసుకవచ్చి, సోరాకున్ను
ఎష్తావొలుకున్ను మధ్యను వుండే తన తండ్రియైన
మానోహను పాతిపెట్టిన స్థలమందు పాతిపెట్టినారు.
అతడు యిరువై సంవత్సరములు ఇశ్రాయేలీయులకు
న్యాయము తీర్చెను.

## 17. అధ్యాయము.

1 ఎఫ్రయీము పర్వతమందు మీఖా అనే పేరు
2 గల వొక మనుష్యుడు వుండెను. । అతడు తన తల్లిని
చూచి, నీ యొద్దనుంచి తియ్యబడిన యే పదకొండు
నూర్ల షెకేలుల వెండిని గురించి నీవు శపించి నా
చెవులలో చెప్పి వుంటివో, యిదుగో, ఆ వెండి నా
యొద్ద వున్నది; నేను దాని పుచ్చుకొంటినని చెప్పిన
ప్పుడు, అతని తల్లి వో నా కుమారుడా, యెహో
వావల్ల నీకు ఆశీర్వచనము కలుగును గాకని దీవించె
3 ను. । అతడు ఆ పదకొండు నూర్ల షెకేలుల వెండిని
తన తల్లికి తిరిగీ యిచ్చినప్పుడు అతని తల్లి అనిన మాట
యేమంటే, నా కుమారుని నిమిత్తము వొక చెక్కిన
ప్రతిమనున్ను ఒక పోత ప్రతిమనున్ను చేయుటకు
నేను ఆ వెండిని యెహోవాకు సమర్పించినాను; కా
బట్టి అది నీకు తిరిగీ యిస్తానని పలికినప్పటికిన్ని, ।
4 అతడు ఆ ద్రవ్యము తన తల్లిచేతికే తిరిగీ యిచ్చివేసె
ను; అప్పుడు అతని తల్లి రెండు నూర్ల షెకేలుల వెండి
తీసి కంసాలివాని చేతికి యిచ్చెను; వాడు వాటిచేత
వొక చెక్కిన ప్రతిమనున్ను వొక పోత ప్రతిమనున్ను
చేసిన తరువాత అవి మీఖాయొక్క యింట్లో వుంచ
5 బడెను. । అయితే యీ మీఖా అనే మనుష్యునికి వొక
దేవాలయము కలిగి వుండెను; అతడు ఏఫోదునున్ను
తెరఫీమునున్ను చేయించి, తన కుమారులలో వొకనికి
ప్రతిష్ఠ చేసెను; అతడు అతనికి అర్చకుడు ఆయెను. ।
6 ఆ దినములయందు ఇశ్రాయేలులో రాజు లేడు; ప్రతి
మనుష్యుడు తన తన దృష్టికి యేది మంచిదో అది చేస్తూ
వుండెను. । అంతట యూదా గోత్ర సంబంధమైన బేత్లె 7
హేము-యూదాలో వొక పడుచువాడైన లేవీయుడు
వుండెను, అతడు అక్కడ నివాసి అయి వుండెను. ।
తరువాత అతడు బేత్లెహేము-యూదాను విడచి, 8
యెక్కడ స్థలము దొరుకునో అక్కడ నివసించుటకు
వెళ్లిపోయెను; అతడు ప్రయాణవశాత్తుగా ఎఫ్రయీ
ము పర్వతమందుండే మీఖాయొక్క యింటికి వచ్చె
ను. । అప్పుడు మీఖా అతని చూచి యెక్కడనుంచి 9
వస్తివని అడిగినప్పుడు, అతడు నేను బేత్లెహేము-
యూదా వూరివాడనైన వొక లేవీయుడను; యెక్కడ
స్థలము నాకు దొరుకునో అక్కడ నివసించుటకు
వెళ్లుతూ వున్నానని చెప్పెను. । అప్పుడు మీఖా అత 10
నితో యేడాది వొక్కంటికి మీకు పది షెకేలుల వెం
డినిన్ని వొక దుస్తు బట్టలనున్ను అన్న పానాదులను
న్ను యిస్తాను; నీవు నా యొద్ద నివాసము చేసి, నాకు
తండ్రిగానున్ను అర్చకుడుగానున్ను వుండ వలసినదని
చెప్పినందున ఆ లేవీయుడు లోపలికి ప్రవేశించెను. ।
ఆ లేవీయుడు అతనితో నివసించుటకు సమ్మతించెను; 11
అతడు అతని కుమారులలో వొకని వలెనే ఆయెను. ।
మరిన్ని మీఖా ఆ లేవీయుని ప్రతిష్ఠ చేసినందున 12
అతడు అతనికి అర్చకుడయి మీఖా యింట్లో వుం
డెను. । అప్పుడు మీఖా అనుకొనినదేమంటే, లేవీయు 13
డు నాకు అర్చకుడుగా కలిగి వున్నందున యెహో
వా నాకు మేలు చేసునని యెరుగుదునని అనుకొనెను.

## 18. అధ్యాయము.

ఆ దినములయందు ఇశ్రాయేలులో రాజు లేడు; 1
మరిన్ని ఆ దినములలో దాను గోత్రికులు తమకు తాము
స్వాతంత్ర్యమైన నివాసము వెతక వచ్చినారు, యెం
దుకంటే నాటి వరకు ఇశ్రాయేలు గోత్రములలో
స్వాతంత్ర్యపు భాగము యావత్తు వారికి ప్రాప్తము
కాకపోయెను. । కాబట్టి దానుయొక్క పుత్రులు దేశ 2
మును శోధించి తెలుసుకోవడానకు తమ కుటుంబము
లో నుంచి అయిదుగురు పరాక్రమశాలులను తమ సరి
హద్దులలోనుంచి అనగా సోరానుంచిన్ని ఎష్తావొలు
నుంచిన్ని అవతలకు పంపినారు: వారు వారితో మీరు
వెళ్లి దేశమును శోధించి తెలుసుకొని రండని చెప్పిరి.
వారు ఎఫ్రయీము పర్వతమందు మీఖాయొక్క
యింటికి వచ్చి అక్కడ దిగినారు. । అయితే వారు 3
మీఖాయొక్క యింటి దగ్గిర వున్నప్పుడు పడుచువా
డయిన లేవీయునియొక్క శబ్దమును తెలుసుకొని, ఆ
లోపటికి తిరిగీ వచ్చి అతని చూచి, నిన్ను యెవడు
యిక్కడికి తీసుక వచ్చెను? యిక్కడ యేమి చేస్తూ
వున్నావు! యిక్కడ నీకు యేమి కలిగి వున్నదని అడిగి

4 నారు. । అప్పుడు అతడు యీలాగీలాగున మీఖా
నాకు చేసి నన్ను కూలికి వుంచినందున నేను అతనికి
5 అర్చకునిగా వున్నానని వారితో చెప్పెను. । అయి
నందున వారు అతనితో మేము వెళ్లే మార్గము శుభ
ముగా వుండునో లేదో అది మాకు తెలియగలందు
లకు దేవుని యొద్ద ఆలోచన అడుగుమని చెప్పిరి. ।
6 ఆ అర్చకుడు వారితో చెప్పినదేమంటే; క్షేమముగా
వెళ్లండి; మీరు వెళ్లే మార్గము యెహోవా దృష్టికి
7 తిన్ననిదని చెప్పెను. । కాబట్టి ఆ అయిదుగురు వెళ్లి,
లాయీషు వూరికి వచ్చి అందులో వున్న జనులను
చూడగా, వారు సీదోనీయుల రీతిగా అజాగ్రతగా
నున్ను నిమ్మళముగానున్ను నిర్భయముగానున్ను కా
పురము చేస్తూ వున్నారనిన్ని, దేని గురించి అయినా
వారిని సిగ్గుపర్చ గలందులకు దేశమందు అధికారి లేడ
నిన్ని, సీదోనీయులకు దూరమయి వున్నారనిన్ని, వారి
కిన్ని అన్యులకున్ను పని లేదనిన్ని తెలుసుకొని, ।
8 సోరాలోనున్ను ఎష్తాయోలులోనున్ను వున్న తమ
సహోదరుల యొద్దికి తిరిగి వచ్చిరి; వారి సహోద
రులు వారిని చూచి వర్తమానమేమని అడిగినప్పుడు. ।
9 వారు వారితో లెండి, మనము వారి మీదికి వెళ్లుదాము,
యేమంటే మేము ఆ దేశమును చూస్తిమి; అదుగో అది
మిక్కిలీ మంచి దేశమై వున్నది; మీరు వూరకే వుండ
నేల? అక్కడికి వచ్చి ఆ దేశమును స్వతంత్రించుకొనే
10 టందుకు ఆలస్యము చేయకండి. । మీరు వచ్చినప్పుడు
అజాగ్రతగా వుండే జనుల యొద్దికిన్ని గొప్ప దేశము
నకున్ను మీరు వత్తురు, యెందుకంటే దేవుడు దాని
మీ చేతులకు యిచ్చి వున్నాడు; భూమియందు కలి
గిన వస్తువులలో యే వొకటి అయినా తక్కువలేని
11 స్థలమై యున్నదని చెప్పిరి. । అయినందున అక్కడ సో
రాలోనుంచిన్ని ఎష్తాయోలులోనుంచిన్ని దానీయుల
యొక్క గోత్రికులలో ఆరునూరు మంది యుద్ధ సన్న
ద్ధులై బయలు వెళ్లి, యూదా దేశమందుండే కిర్యత్యె
12 హారీముకు వచ్చి దిగిరి. । కాబట్టి ఆ స్థలము వారిచేత
దానుపేట అని నేటి వరకూ పిలువబడెను; అదుగో
13 అది కిర్యత్యెహారీము వెనుక వున్నది. । అక్కడనుంచి
వారు తలీ ఎఫ్రాయీము పర్వతమునకు వెళ్లి, మీఖా
14 యొక్క యింటి యొద్దకు వచ్చినారు. । అప్పుడు లా
యీషు దేశము చూడడానకు వెళ్లిన ఆ అయిదుగురు
తమ సహోదరులతో చెప్పినదేమంటే, యీ యిండ్ల
లో ఎఫోదున్ను తెరఫీమున్ను చెక్కిన ప్రతిమయు
న్ను పోత ప్రతిమయున్ను కలిగి వున్నవని మీరు యె
రిగి వున్నారా? కాబట్టి మీరు చేయవలసినది యేదో
15 అది విచారించుకొండని చెప్పినందున; । వారు అటు
తిరిగి వచ్చి, పడుచువాడయిన లేవీయుని యింటికి,
అనగా, మీఖాయొక్క యింటికి వచ్చి, అంతా క్షేమ
ముగా వున్నారా అని అతని అడిగినారు. । అంతట 16
దానుయొక్క పుత్రులలో యుద్ధ సన్నద్ధులైన ఆ
ఆరునూరు మంది ద్వారపు వాకిటి దగ్గిర నిలిచి వుండిరి.।
అప్పుడు ఆ దేశము చూడడానకు వెళ్లిన ఆ అయిదు 17
గురు యెక్కి, ఆ లోపల ప్రవేశించి, చెక్కిన ప్రతి
మనున్ను ఎఫోదునున్ను తెరఫీమునున్ను పోత ప్రతి
మనున్ను తీసుక వెళ్లిరి: యింతట్లో ఆ అర్చకుడు
యుద్ధ సన్నద్ధులయిన ఆ ఆరునూరు మందితో ద్వారపు
వాకిటి దగ్గిర నిలిచి వుండెను. । వారు మీఖాయొక్క 18
యింట్లో ప్రవేశించి, చెక్కిన ప్రతిమనున్ను ఎఫోదు
నున్ను తెరఫీమునున్ను పోత విగ్రహమునున్ను తీసుక
పోయినప్పుడు అర్చకుడు మీరు చేసేది యేమిటి అని
వారిని అడిగినాడు. । అప్పుడు వారు అతనితో నీవు 19
వూరకొని, నీ చేతితోటి నీ నోరు మూసుకొని,
మాతో కూడా వచ్చి, మాకు తండ్రిగానున్ను అర్చకు
డుగానున్ను వుండుము: వొకని యింటికి అర్చకుడు
గా వుండేది నీకు మంచిదా? లేక ఇశ్రాయేలులో వొక
కుటుంబమునకున్ను గోత్రమునకున్ను అర్చకుడుగా
వుండేది నీకు మంచిదా అని పలికినందున, । అర్చకు 20
డు తన హృదయమందు సంతోషించి, ఎఫోదునున్ను
తెరఫీమునున్ను చెక్కిన ప్రతిమనున్ను తీసుకొని జనుల
మధ్యకు వచ్చెను. । అప్పుడు వారు తిరిగీ చిన్నవాండ్ల 21
నున్ను పశువులనున్ను సామగ్రినిన్ని ముందర వుంచి
తలీపోయిరి. । వారు మీఖాయొక్క యింటికి బహు 22
దూరమై వున్నప్పుడు మీఖాయొక్క యింటి దగ్గిర
యింట్లో వున్నవారు కూడుకొని వచ్చి, దానుయొక్క
పుత్రులను కలుసుకొనిరి. । అప్పుడు వారు దానుయొ 23
క్క పుత్రుల కొరకు ఆర్చినందున వారు ముఖములను
తిప్పి మీఖాతో అనిన మాట, నీవు సమూహమును
కూర్చుకొని రావడానకు నిమిత్తమేమని అడిగినప్పుడు;।
అతడు వారితో నేను చేసుకొనిన నా దేవుండ్లనున్ను 24
అర్చకునిన్ని మీరు తీసుకొని వెళ్లినారు; యిప్పుడు
నాయొద్ద యేమి వున్నది? యీలాగున వుండగా నన్ను
చూచి నీకు యేమి నిమిత్తమని చెప్పేదేమని పలికెను.।
అయితే దానుయొక్క పుత్రులు అతనితో చెప్పిన 25
దేమంటే, కొందరు కోపగించి నీ మీద పడితే నీ
ప్రాణమునకున్ను నీ యింటివారియొక్క ప్రాణమున
కున్ను నష్టము రాకుండా మాలో నీ శబ్దము వినపడని
య్యవద్దని చెప్పినారు. । అప్పుడు దానుయొక్క పుత్రు 26
లు తమ మార్గమున వెళ్లి పోయినారు; మరిన్ని మీఖా
వారి బలము తన బలముకంటే అధికమని చూచి, తిరి
గిపోయి, తన యింటికి వచ్చెను. । తరువాత వారు 27
మీఖా చేసుకొనిన వస్తువులనున్ను అతనికి కలిగిన

అర్చకునిన్ని తీసుకొని, నిమ్మళముగానున్ను నిర్భయ
ముగానున్ను వున్న లాయీషులో వుండే జనుల మీ
దికి వచ్చి, వారిని కత్తి వాడిచేత కొట్టి, పట్టణము అ
28 గ్నిచేత కాల్చివేసిరి. । అక్కడ విడిపించేవాడు వొకడూ
లేడు; యేమంటే అది సీదోనుకు దూరమయి వుండెను;
మరిన్ని వారికిన్ని అన్యులకున్ను పని లేదు; అది బేత్రె
హోబు దగ్గిర లోవయందు వుండెను: అయితే
వారు అక్కడ వొక పట్టణము కట్టుకొని అందులో
29 కాపురము చేసిరి. । ఆ పట్టణమునకు ఇశ్రాయేలుకు
పుట్టిన దాను అనే తమ పితృని పేరట దాను అనే
పేరు పెట్టిరి: అయితే పూర్వము ఆ పట్టణపు పేరు
30 లాయీషు అని వుండెను. । మరిన్ని దానుయొక్క
పుత్రులు ఆ చెక్కిన ప్రతిమ అక్కడ నిలిపినారు;
మరిన్ని మనస్సేకు పుట్టిన గేర్షోముయొక్క పుత్రు
డైన యోనాతానున్ను అతని కుమారులున్ను దేశము
చెర పట్టబడే పర్యంతము దానుయొక్క గోత్రమునకు
31 అర్చకులుగా వుంటూ వుండిరి. । మరిన్ని వారు మీఖా
యొక్క చెక్కిన ప్రతిమను నిలిపి, దేవునియొక్క
మందిరము షీలోలో వున్నంత కాలము మట్టుకు వుంచు
కొనిరి.

## 19. అధ్యాయము.

1 మరిన్ని ఇశ్రాయేలులో రాజు లేని దినముల
యందు సంభవించినదేమంటే, ఎఫ్రయీము పర్వత
పార్శ్వమున లేవీయుడయిన వొకడు నివసిస్తూ వుం
డెను; అతడు బేత్లెహేము-యూదాలోనుంచి వొక
2 వుపపత్నిని చేర్చుకొనెను. । అయితే అతని వుపపత్ని
అతనికి విరోధముగా వ్యభిచారము చేసి, అతని విడచి,
బేత్లెహేము-యూదాలో తన తండ్రి యింటికి వెళ్లి,
అక్కడ నాలుగు మాసముల పర్యంతమూ వున్న తరు
3 వాత, । దాని పెనిమిటి లేచి దాని వెంట వెళ్లి, దాని
తో స్నేహముగా మాట్లాడి, తిరిగి తీసుక రావడా
నకు సేవకునితోనున్ను రెండు గార్దభములతోనున్ను
వచ్చినాడు: అతడు వచ్చినప్పుడు అది తన తండ్రి
యింట్లోకి అతని తీసుక వచ్చెను; ఆ చిన్నదానియొక్క
4 తండ్రి అతని చూచి సంతోషపడినాడు. । మరిన్ని
అతనికి మామ అయి వున్న ఆ చిన్నదానియొక్క
తండ్రి నిలిపినందువల్లను అతడు మూడు దినములు
అతని యొద్ద వుండెను; యీలాగున వారు అక్కడ
5 దిగి భోజనము చేస్తూ తాగుతూ వుండిరి. । నాలుగో
దినమున ప్రాతఃకాలమందున వారు లేచినప్పుడు అతడు
వెళ్లిపోవుటకు లేచెను; అయితే ఆ చిన్నదాని తండ్రి
తన అల్లునితో నీవు కొంచెము రొట్టెతో నీ హృద
యము బలపచుకొని తరువాత నీ మార్గమున వెళ్లు
దువు గాక అని చెప్పినప్పుడు, । వారు కూర్చుండి 6
వారు యిద్దరున్ను కూడా భోజనము చేస్తూ తాగుతూ
వుండిరి, యేమంటే ఆ చిన్నదానియొక్క తండ్రి ఆ
మనుష్యుని చూచి నీవు సమ్మతిగా రాత్రిదాకా వుండి
నీ హృదయము సంతోషపచుకొమ్మని వేడుకొనె
ను. । అయితే ఆ మనుష్యుడు వెళ్లడానకు లేచిన 7
ప్పుడు అతని మామ అతని మళ్లీ బలవంతము చేసి
నందున అతడు యింకా అక్కడనే దిగి వుండె
ను. । అయితే అయిదో నాటి వుదయమందు ఆ 8
తడు వెళ్లడానకు త్వరగా లేచినప్పుడు చిన్నదా
నియొక్క తండ్రి యింకా అతనితో నీ హృదయ
ము బలపచుకో అని వేడుకొనెను; కాబట్టి వారు
మధ్యాహ్నము మించిన దాకా నిలిచి యిద్దరున్ను
భోజనము చేస్తూ వుండిరి. । తరువాత ఆ మనుష్య 9
డున్ను అతని వుపపత్నిన్ని అతని సేవకుడున్ను వెళ్ల
డానకు లేచినప్పుడు, ఆ చిన్నదానియొక్క తండ్రి
అతనితో చెప్పినదేమంటే, యిదుగో ప్రొద్దు చాలా
గడిచినది, రాత్రి అంతా వుండు; అదుగో సూర్యా
స్తమానము కావచ్చెను; యిక్కడ దిగి వుండి నీ హృ
దయమును సంతోషపచుకొని, రేపు యింటికి పోవ
డానకు త్వరగా లేచి నీ మార్గమున వెళ్లవచ్చునని
వేడుకొనెను. । అయితే ఆ మనుష్యుడు ఆ రాత్రి 10
వుండుటకు అనుకూలించక, అతడు లేచి తర్లి, యె
బూసు అనే యెరూశలేము యెదుటికి వచ్చినాడు;
అతని యొద్ద గంతలు కట్టిన రెండు గార్దభములున్ను
అతని వుపపత్నిన్ని వుండెను. । వారు యెబూసు దగ్గి 11
రకు వచ్చినప్పుడు ప్రొద్దు చాలా పోయెను; అయినం
దున సేవకుడు తన యజమానుని చూచి, దయచేసి
రండి, మనము యెబూసీయులయొక్క యీ పట్టణ
ములోకి వెళ్లి దానిలో దిగుదామని పలికెను. । అందుకు 12
వాని యజమానుడు వానితో ఇశ్రాయేలు పుత్రులది
కానటువంటి అన్యునియొక్క యీ పట్టణములోకి
వెళ్లము; గిబాకు వెళ్లిపోదామని చెప్పి, । మళ్లీ తన సేవ 13
కునితో పద, మనము వెళ్లి గిబాలోనైనా రామాలో
నైనా యీ రెండింటిలో వొక దానియందు రాత్రి
దిగేటందుకు సమీపింతామని చెప్పి, వారు తమ మా
ర్గమున వెళ్లిపోయిరి. । అయితే వారు బెన్యామీను 14
సంబంధమైన గిబా వూరికి చేరినప్పుడు సూర్యుడు
అస్తమించెను. । అప్పుడు వారు తిరిగి రాత్రి దిగడా 15
నకు గిబాలోకి ప్రవేశించిరి; అక్కడ యెవని యిం
ట్లోనైనా దిగడానకు చేర్చుకొనినవాడు వొకడూ
లేడు, గనుక ఆ పట్టణపు వీధిలో అతడు కూర్చుని
వుండెను. । అయితే యిదుగో ముసలివాడు వొకడు 16
అస్తమానమప్పుడు పని విడచి పొలములోనుంచి వస్తూ

వుండెను; అతడు ఎఫ్రాయీము పర్వతపువాడయి
గిబాలో నివసిస్తూ వుండెను; అయితే ఆ పట్టణపు
17 జనులు బెన్యామీనీయులయి వుండిరి.। అతడు కండ్లెత్తి
నప్పుడు పట్టణపు వీధిలో మార్గస్థుడైన వొకని చూ
చెను; అప్పుడు ఆ ముసలివాడు అతనితో యెక్కడికి
వెళ్లుతావు? యెక్కడినుంచి వచ్చినావు అని అడిగినం
18 దున,। అతడు అతనితో మేము బేత్లెహేము-యూ
దానుంచి ఎఫ్రాయీము పర్వత పార్శ్వమునకు వెళ్లు
తూ వున్నాము; నేను అక్కడివాడనై బేత్లెహేము-
యూదాకు వెళ్లినాను; యిప్పుడు తిరిగీ యెహోవా
మందిరమునకు వెళ్లుతూ వున్నాను; అయితే తన యిం
19 టిలో నన్ను చేర్చుకొనేవాడు వొకడూ లేడు.। అయి
నప్పటికిన్ని మా గాడిదెలకు గడ్డిన్ని మేతయున్ను
కలదు; మరిన్ని నాకున్ను నీ దాసీకిన్ని నీ సేవకుల
మైన మా యొద్ద వున్న పడుచువానికి సహా రొట్టె
యున్ను ద్రాక్షారసమున్ను కలదు; మాకు యేమీ
20 అక్కర లేదని చెప్పినప్పుడు;। ఆ ముసలివాడు అనిన
మాట, నీకు క్షేమమవు గాక; నీకు కావలసినది అం
తా నా మీద వుంచుము; వీధిలో మాత్రము రాత్రి
21 దిగ కూడదని చెప్పి;। వారిని తన యింట్లోకి తీసుక
వచ్చి, వారి గాడిదెలకు మేత యిచ్చినాడు;
అప్పుడు వారు కాళ్లను కడుగుకొని భోజనము చేస్తూ
22 పానము చేస్తూ వుండిరి.। అయితే వారు తమ హృద
యములను సంతోషపరచుకొంటూ వుండగా, యిదు
గో ఆ పట్టణపు వారిలో కొందరు దుర్మార్గులు ఆ
యిల్లు చుట్టుకొని, తలుపుకొట్టి, ఆ యింటి యజమా
నుడయిన ఆ ముసలివానితో చెప్పినదేమంటే, నీ యిం
ట్లోకి వచ్చినవాని మేము తెలుసుకొనేకొరకు బయి
23 టకు తీసుకరా అని చెప్పినారు.। అయితే యింటి
యజమానుడయిన ఆ మనుష్యుడు వారి యొద్దికి వెళ్లి
వారిని చూచి నా సహోదరులారా, ఆలాగు కూడ
దు, అటువంటి అక్రమము చేయవద్దు; యీ మనుష్యు
డు నా యింట్లోకి వచ్చినవాడు, కాబట్టి యీ దుష్ట
24 తను చేయవద్దు.। యిదుగో కన్య అయి యున్న నా
కుమార్తెయున్ను అతని వుపపత్నియిన్ని వున్నారు;
వారిని మీ యొద్దికి తీసుక వస్తాను; వారిని దైన్యపరచి
మీ మనస్సుకు యేది మంచిదో అది వారికి చేతురు,
గాని యీ మనుష్యునికి అటువంటి అక్రమము చేయ
25 వద్దని వేడుకొన్నప్పటికిన్ని;। వారు అతని మాటలు
వినక పోయిరి; అప్పుడు ఆ మనుష్యుడు తన వుపప
త్నిని వారి యొద్దికి తీసుకొని వచ్చెను; అయినందున
వారు దాని తీసుకొని, రాత్రి అంతా తెల్లవారే పర్యం
తమూ దానితో ప్రవర్తించి, అరుణోదయమైనప్పుడు
26 దాని విడచిపెట్టిరి.। అరుణోదయమందు ఆ స్త్రీ తన
యజమానుడు వుండే ఆ మనుష్యుని యింటి ద్వారము
దగ్గిరకు వచ్చి కింద పడి, వెలుగు వచ్చే పర్యంతమూ
అక్కడనే వుండెను.। అయితే దాని యజమానుడు 27
వుదయమందు లేచి, యింటి తలుపులను విప్పి, తన
మార్గమున వెళ్లేటందుకు బయిటికి వచ్చినప్పుడు,
యిదుగో తన వుపపత్ని అయి యున్న ఆ స్త్రీ యింటి
ద్వారము దగ్గిర కింద పడి, చేతులు గడప మీద చాపి
వుండెను.। అప్పుడు అతడు దానితో లే, వెళ్లిపోదా 28
మని చెప్పెను; అయితే ప్రత్యుత్తరము లేకపోయెను.
అప్పుడు ఆ మనుష్యుడు దాని యెత్తి, గాడిదె మీద
మీద వుంచుకొని తన స్థలమునకు వెళ్లిపోయి వచ్చి
నాడు.। అతడు తన యింటికి వచ్చినప్పుడు, కత్తి తీసి, 29
తన వుపపత్నిని పట్టుకొని, యెముకలతోను పండ్రెండు
భాగములను చేసి, ఇశ్రాయేలు దిక్కులన్నిటికిన్ని పంపి
వేసెను.। అప్పుడు దాని చూచిన వారందరున్ను అను 30
కొన్నదేమంటే, ఇశ్రాయేలు పుత్రులు మిస్రయీము
దేశములోనుంచి బయలు వచ్చినప్పటినుంచీ నేటి వరకు
యిటువంటి క్రియ చేసినదిన్ని చూచినదిన్ని లేక వుం
డెను; దీన్ని మీరు మనస్కరించి ఆలోచన చేసి చెప్పం
డని అనుకొనిరి.

## 20. అధ్యాయము.

అప్పుడు ఇశ్రాయేలు పుత్రులందరున్ను బైలు 1
వెళ్లి, ఆ సమూహమంతా దాను మొదలుకొని బెయే
రషెబ పర్యంతమూ గిలాదు దేశముతోటి మిస్పెలో
వొక్కడుగా కూడుకొని యెహోవా సన్నిధికి వచ్చి
నారు.। మరిన్ని జనులందరిలో అనగా ఇశ్రాయేలు 2
యొక్క గోత్రములలో వున్న మూలమైన వారు దేవు
నియొక్క సంఘమందు కత్తిదూసే నాలుగు లక్షల కా
లుబలముగా తమ్ముతాము అగుపరచుకొన్నారు.। అం 3
తట ఇశ్రాయేలు పుత్రులు మిస్పెకు వెళ్లినారన్న
వర్తమానము బెన్యామీను పుత్రులకు వినబడినది;
అప్పుడు ఇశ్రాయేలు పుత్రులు చంపబడిన దాని పెని
మిటి అయిన ఆ లేవీయుని చూచి, యీ చెడ్డతనము
యేలాగాయెనో అది మాతో చెప్పుమని అనినప్పుడు,।
అతడు అనిన మాట, నేనున్ను నా వుపపత్నియున్ను 4
దిగడానకు బెన్యామీను సంబంధమైన గిబాకు వచ్చి
నాము.। అయితే గిబాయొక్క జనులు నా మీదికి 5
లేచి, రాత్రిలో నేను వున్న యిల్లు చుట్టుకొని, నన్ను
చంప యోచన చేసిరి; మరిన్ని నా వుపపత్నిని వారు
బలవంతము చేసినందున అది చచ్చిపోయెను.। అప్పుడు 6
నేను నా వుపపత్నిని తీసుకొని, భాగములుగా కోసి,
ఇశ్రాయేలుయొక్క స్వాతంత్ర్యమైన దేశమంతటికీ
పంపివేసితిని, యెందుకంటే వారు ఇశ్రాయేలులో

7 కొంటెతనమున్ను దుష్టతనున్ను జరిగించిరి. । యిదు
గో మీరందరున్ను ఇశ్రాయేలు పుత్రులై వున్నారు;
దీనికి మీరు యోచనన్ను బోధనున్ను చెప్పండని
8 పలికెను. । అప్పుడు జనులందరున్ను యేకముగా
లేచి అనుకొనినదేమంటే, మనలో యెవడున్ను తన
డేరాకయినా తన యింటికయినా తిరిగి వెళ్లము. ।
9 అయితే మనము గిబాకు చేయ వలసినదేమంటే, చీట్లు
10 వేయుడముచేత దాని మీదికి వెళ్లుదాము. । జనుల
కొరకు ఆహారము తేవడానకు ఇశ్రాయేలు గోత్రము
లన్నిటియందూ నూరు మందిలోనుంచి పది మందినిన్ని
వెయి మందిలోనుంచి నూరు మందినిన్ని పదివేల మంది
లోనుంచి వెయి మందినిన్ని తీసుకొందుము; అప్పుడు
వారు బెన్యామీను సంబంధమైన గిబాకు వచ్చి
నప్పుడు ఇశ్రాయేలులో వారు చేసిన దుష్టతలన్ని
11 టికీ తగినట్టుగా చేతురు గాకని విధించిరి. । కాబట్టి
ఇశ్రాయేలు జనులు యేకముగా కూడుకొని, ఆ పట్ట
12 ణమునకు యెదురుగా వచ్చినారు. । మరిన్ని ఇశ్రాయే
లుయొక్క గోత్రములు బెన్యామీను గోత్రమంతటి
దాకా మనుష్యులను పంపి చెప్పమనినదేమంటే, మీలో
13 జరిగిన యీ చెడ్డతనము యేమిటి? । కాబట్టి యిప్పుడు
గిబాలో వున్న ఆ దుర్మార్గులను మేము చంపి, ఆ
కీడు ఇశ్రాయేలులోనుంచి తీసి వేసేటట్టుగా వారిని
14 మా చేతికి అప్పగించండని పలికిరి. । అయితే బెన్యా
మీను పుత్రులు ఇశ్రాయేలు పుత్రులయిన తమ
సహోదరులయొక్క శబమును వినని వారై, ఇశ్రా
యేలు పుత్రులతో యుద్ధముకొరకు బైలువెళ్లి, తమ
తమ వూళ్లలోనుంచి కూడుకొని గిబాకు వచ్చినారు. ।
15 అయితే వూళ్లలోనుంచి కూడి వచ్చిన బెన్యామీను
పుత్రులు కత్తి దూసే యిరువైఆరువేల మంది అయి
వుండిరి; వీరు గాక గిబా కాపురస్థులలో యెంచబడిన
16 యేడ్నూరు మందిన్ని వుండిరి. । యీ జన సమూహ
మందు యెంచబడిన యేడ్నూరు మంది యెడమ చేతి
వాటము గలవారయి వుండిరి; వారిలో ప్రతి మను
ష్యుడు వడిశెలతో తల వెంట్రుకను సహా తప్పక కొట్ట
17 గలవాడయి వుండెను. । మరిన్ని బెన్యామీను వారు
గాక ఇశ్రాయేలు జనులు కత్తి దూసే నాలుగు లక్షల
సంఖ్య గలవారయి వుండిరి; వీరందరున్ను యుద్ధపు
18 మనుష్యులై వుండిరి. । అంతట ఇశ్రాయేలు పుత్రులు
లేచి దైవ మందిరమునకు వెళ్లి, బెన్యామీను పుత్రుల
తో పోట్లాడడానకు మాలో యెవరు ముందుగా వెళ్ల
వలెనని దేవుని ఆలోచన అడిగినప్పుడు యెహోవా
యూదా ముందుగా వెళ్ల వలెనని సెలవు యిచ్చెను. ।
19 అప్పుడు ఇశ్రాయేలు పుత్రులు వుదయమందు లేచి
20 గిబాకు యెదురుగా దిగిరి. । ఇశ్రాయేలు జనులు బెన్యా
మీనుతో యుద్ధము చేయుడానకు బయిలు వెళ్లి, ఇశ్రా
యేలు జనులు వారితో పోట్లాడడానకు తమ్మును వ్యూ
హముగా యేర్పరచుకొనిరి. । అప్పుడు బెన్యామీను 21
పుత్రులు గిబాలోనుంచి వచ్చి, ఇశ్రాయేలీయులలో
ఆ దినమందు యిరువై రెండువేల మందిని యుద్ధభూమి
మీద సంహరించి పడజేసిరి. । అయినప్పటికిన్ని ఇశ్రా 22
యేలు జనులు ధైర్యము తెచ్చుకొని, మొదటి దినమందు
తాము యెక్కడ వ్యూహముగా యేర్పరచుకొనిరో
అక్కడ మళ్లీ తమ్మును తాము వ్యూహముగా యేర్పర
చుకొనిరి. । మరిన్ని ఇశ్రాయేలు పుత్రులు యెహో 23
వా సన్నిధికి వచ్చి, అస్తమానమయ్యే పర్యంతమూ
యేడ్చి, యెహోవాను ఆలోచన అడిగినదేమంటే,
నేను తిరిగీ నా సహోదరుడయిన బెన్యామీను పుత్రు
లతో పోట్లాడుదునా అని అడిగినప్పుడు, యెహోవా
అతనికి యెదురుగా వెళ్లుమని సెలవు యిచ్చెను. । కా 24
బట్టి ఇశ్రాయేలు పుత్రులు రెండో దినమందు బెన్యా
మీను పుత్రుల సమీపానకు యెదురుగా వచ్చిరి. ।
అయితే బెన్యామీను రెండో దినమందున్ను వారికి 25
యెదురుగా గిబాలోనుంచి వచ్చి, ఇశ్రాయేలు పుత్రు
లలో పద్దెనిమిదివేల మందిని యుద్ధ భూమి మీద తిరిగీ
సంహరించి పడజేసిరి; వీరందరున్ను కత్తి దూసే వారై
వుండిరి. । అప్పుడు ఇశ్రాయేలు పుత్రులందరున్ను ఆ 26
జనులందరున్ను పయికి వెళ్లి దైవ మందిరమునకు వచ్చి,
యెహోవా యెదుట కూర్చుండి, అస్తమాన పర్యంత
మూ అక్కడ యేడ్చుచూ ఆ దినము సాయంకాలము
దాకా వుపవాసము చేస్తూ వుండి, యెహోవా సము
ఖమందు హోమ బలులనున్ను సమాధాన బలుల
నున్ను చెల్లించిరి. । ఆ దినములయందు దేవునియొక్క 27
నిబంధనకు గల పెట్టె అక్కడ వుండెను; మరిన్ని ఆ
దినములయందు దాని యెదుట అహరోనుకు పుట్టిన
ఎలాజారుయొక్క కుమారుడైన పీనెహాసు నిలిచి వుం
డెను. । అప్పుడు ఇశ్రాయేలు పుత్రులు యెహో 28
వాను ఆలోచన అడిగినదేమంటే, నేను మళ్లీ నా
సహోదరుడయిన బెన్యామీను పుత్రులతో పోట్లా
డడానకు బయిలు వెళ్లుదునా, మానుదునా, అని అడి
గినప్పుడు, యెహోవా నీవు వెళ్లుము, యేమంటే రేపు
వారిని నీ చేతిలోకి అప్పగింతునని సెలవు యిచ్చెను. ।
అప్పుడు ఇశ్రాయేలు గిబా చుట్టూ పొంచేవారిని వుం 29
చెను. । మరిన్ని ఇశ్రాయేలు పుత్రులు మూడో దిన 30
మందు మునుపటిలాగున బెన్యామీను పుత్రులకు యె
దురుగా వెళ్లి, గిబా ముందర తమ్ము తాము వ్యూహ
ముగా యేర్పరచుకొనిరి. । అప్పుడు బెన్యామీను పుత్రు 31
లు జనులకు యెదురుగా బయిలు వెళ్లి, పట్టణము యొ
ద్దనుంచి లాగబడి, బయిట భూమిలో దైవ మందిర

మునకు వెళ్లే మార్గమందున్ను గిబాకు వెళ్లేమార్గమం
దున్ను ఇశ్రాయేలీయులలో ముప్పయి మంది మట్టుకు
మునుపటిలాగున కొట్టేటందుకున్ను చంపేటందుకు
32 న్ను ఆరంభించిరి. । అప్పుడు బెన్యామీను పుత్రులు
అనుకొన్నదేమంటే, పూర్వమందయినట్టు మన ముం
దర వారు కొట్టబడుతున్నారని అనుకొనిరి. అయితే
ఇశ్రాయేలు పుత్రులు మనము పారిపోయి పట్టణము
దగ్గిరనుంచి బయిటి మార్గముల మట్టుకు వారిని లా
33 గుదామని అనుకొని వుండిరి. । అప్పుడు ఇశ్రాయేలు
జనులందరున్ను తమ తమ స్థలములలోనుంచి లేచి,
బయల్తామారులో తమ్ము తాము వ్యూహముగా యేర్ప
రచుకొనిరి: మరిన్ని ఇశ్రాయేలు సంబంధమయిన మా
టుకాండ్లు తమ తమ స్థలములలోనుంచి, అనగా, గిబా
యొక్క బీటి పొలములలోనుంచి బయిలు వెళ్లినారు.।
34 యీలాగున ఇశ్రాయేలీయులందరిలోనుంచి యెంచ
బడినవారు పదివేల మంది గిబాకు యెదురుగా వచ్చి
నారు, అప్పుడు యుద్ధము ఘోరమై వుండెను; అయితే
తమ దగ్గిర గండము వున్నదని తమకు తెలియక
35 పోయెను. । యెహోవా బెన్యామీనును ఇశ్రాయేలు
ముందర కొట్టెను; కాబట్టి ఇశ్రాయేలు పుత్రులు
బెన్యామీనీయులలో యిరువయి అయిదువేల నూరు
మందిని ఆ దినమున సంహరించినారు; వీరందరున్ను
36 కత్తి దూసే వారై వుండిరి. । యీలాగున బెన్యామీను
పుత్రులు తాము కొట్టబడినామని తెలుసుకొనిరి;
యేమంటే ఇశ్రాయేలీయులు గిబా దగ్గిర తాము వుం
చిన మాటుకాండ్లను నమ్మి, బెన్యామీనీయులకు చోటు
37 యిచ్చిరి. । అప్పుడు మాటుకాండ్లు త్వరపడి గిబాలో
చొరబడ్డారు; మరిన్ని మాటుకాండ్లు సాగి వెళ్లి పట్ట
38 ణమంతాను కత్తివాడిచేత నరికివేసినారు. । అయితే
ఇశ్రాయేలు జనులకున్ను మాటుకాండ్లకున్ను వొక
కాలము నిర్ణయమాయెను, అది యేదంటే, వారు
పట్టణమందు గొప్ప అగ్ని రాజబెట్టి ధూమము పయికి
39 యెగిరేటట్టు చేయవలెనని నిర్ణయించుకొనిరి. । అయి
నందున ఇశ్రాయేలీయులు యుద్ధములోనుంచి వెనుక
తీసినప్పుడు, బెన్యామీను ఇశ్రాయేలీయులలో ముప్ప
యి మందిని కొట్టేటందుకున్ను చంపేటందుకున్ను ఆరం
భించి అనుకొన్నదేమంటే, మొదటి యుద్ధమందైనట్టు
వీరు మన ముందర కొట్టబడుతున్నారని అనుకొనిరి. ।
40 అయితే మంటయున్ను ధూమ మేఘమున్ను పట్టణ
ములోనుంచి యెగర నారంభించినప్పుడు బెన్యామీనీ
యులు మొగము తిప్పుకొని, అదుగో, పట్టణము
యొక్క మంట ఆకాశము మీదికి యెగురుతూ వున్న
41 దని చూచిరి. । కాబట్టి ఇశ్రాయేలీయులు యిటు తిరిగి
వచ్చినప్పుడు బెన్యామీను జనులు విభ్రాంతిపడినారు,
యెందుకంటే గండము తమ మీదికి వచ్చెనని తెలు
సుకొనిరి. । కాబట్టి వారు ఇశ్రాయేలీయుల ముందర 42
నుంచి తిరిగి, అరణ్యపు మార్గమున పారిపోయినారు;
అయినప్పటికిన్ని యుద్ధము వారికి తగులుకొనెను;
మరిన్ని పట్టణములలోనుంచి వచ్చిన వారిని వారు తమ
మధ్యమందు నాశనము చేసిరి. । యీలాగున వారు 43
బెన్యామీనీయులను నఖముఖాలా చుట్టుకొని తరిమి,
సూర్యోదయ దిక్కుతట్టు గిబా యెదుట వారిని చుల
కనగా త్రొక్కివేసిరి. । అప్పుడు బెన్యామీనులో 44
పద్దెనిమిదివేల మంది పడినారు; వీరందరున్ను పరాక్ర
మశాలులై వుండిరి. । అయితే వారు తిరిగీ అరణ్య 45
మార్గమున రిమ్మోను శిలాపర్వతమునకు వెళ్లిరి; అంతట
వారు మార్గములందు వారిలో యేర్చి అయిదువేల
మందిని నరికివేసిరి; మరిన్ని గిదోము మట్టుకు వారిని వేగి
రముగా తరిమి యింకా వారిలో రెండువేల మందిని
చంపినారు. । కాగా ఆ దినమందు బెన్యామీనులో 46
కత్తి దూసిన యిరువై అయిదువేల మంది పడిరి; వీరం
దరున్ను పరాక్రమశాలులై వుండిరి. । అయితే ఆరు 47
నూరు మంది తిరిగీ అరణ్యమార్గమున వెళ్లి, రిమ్మోను
శిలాపర్వతము మట్టుకు వచ్చి, రిమ్మోను శిలాపర్వత
ములో నాలుగు నెలలు నివాసము చేసిరి. । మరిన్ని 48
ఇశ్రాయేలు జనులు తిరిగీ బెన్యామీను పుత్రుల మీద
పడి, పట్టణపు జనులనున్ను పశువులనున్ను వారి చేతికి
యేది దొరికెనో దాన్నిన్ని కత్తివాడిచేత నరికి వేసిరి;
మరిన్ని వారు వచ్చిన పట్టణములన్నిటినీ కాల్చివేసిరి.

## 21. అధ్యాయము.

అయితే ఇశ్రాయేలు జనులు తమలో యెవడైనా 1
తన కుమార్తెను బెన్యామీను వానికి యివ్వకుండా
మిస్పెలో ప్రమాణము చేసుకొనిరి. । అప్పుడు ఆ జను 2
లు దైవ మందిరమునకు వచ్చి, దేవుని యెదుట అస్త
మాన పర్యంతమూ వుండి, తమ కంఠమెత్తి బహుగా
యేడ్చి పలికినదేమంటే,। ఇశ్రాయేలు దేవుడయిన వో 3
యెహోవా, నేటి దినమున ఇశ్రాయేలులో వొక
గోత్రము తక్కువౌట ఇశ్రాయేలుకు సంభవించనేలని
పలికిరి. । మరునాటియందు సంభవించినదేమంటే, జను 4
లు త్వరగా లేచి, అక్కడ ఒక బలిపీఠము కట్టి,
హోమ బలులనున్ను సమాధాన బలులనున్ను చెల్లిం
చిరి. । అప్పుడు ఇశ్రాయేలు పుత్రులు ఇశ్రాయేలు 5
గోత్రములన్నిటిలో సంఘముతో కూడా యెహో
వా సన్నిధికి రాక వుండిన వాడు యెవ్వడని అడి
గిరి; యెందుకంటే మిస్పెలో యెహోవా యొద్దికి
యెవడు రాకపోయెనో వాడు నిశ్చయముగా మర
ణమవు గాకని వారు గొప్ప ప్రమాణము చేసుకొ

6 నిరి. । అయితే ఇశ్రాయేలు పుత్రులు తమ సహో
దరుడయిన బెన్యామీనును గురించి పశ్చాత్తాపపడి
పలికినదేమంటే, యీ దినమున ఇశ్రాయేలులోనుంచి
7 వొక గోత్రము తెగ వేయపడెను. । శేషమైన వారికి
భార్యలు కలిగే కొరకు యేమి చేతుము! యేమంటే
మన కుమార్తెలలో వొకదానినయినా వారికి పెం
డ్లికి యివ్వమని మనము యెహోవాను గురించి ప్రమా
8 ణము చేస్తిమని పలికిరి. । మరిన్ని ఇశ్రాయేలు గోత్ర
ములలో మిస్పెలో యెహోవా యొద్దకు రాకపో
యిన వాడు యెవడో యని వారు చెప్పుకొనినప్పుడు,
యిదుగో యాబేష్గిలాదులోనుంచి పేటలో వున్న
సంఘమునకు వచ్చిన వాడు వొకడూ లేడని తెలుసు
9 కొన్నారు. । యేమంటే జనులు లెక్కించపడినప్పుడు
యిదుగో యాబేష్గిలాదు కాపురస్తులలో వొకడయినా
10 లేక వుండెను. । అంతట సంఘము పరాక్రమశాలు
లయిన పండెందువేల మందిని యేర్పరచి, మీరు వెళ్లి
యాబేష్గిలాదు కాపురస్తులనున్ను స్త్రీలనున్ను పిల్లలను
11 న్ను కత్తివాడిచేత నరికివేయండి. । యిందుకు మీరు
చేయ వలసినదేమంటే, మొగవారినందరినిన్ని మొగ
వారితో శయినించిన ఆడువారినందరినిన్ని సర్వ నాశ
నము చేతురు గాకని ఆజ్ఞాపించి అక్కడికి పంపిరి. ।
12 అప్పుడు పురుషునితో శయనింపనెరుగని నాలుగు
నూర్ల పడుచు కన్యలు యాబేష్గిలాదు కాపురస్తులలో
వారికి దొరికినందున వారు వారిని కెనయను దేశమం
దున్న షీలోలో వుండే పేటకు తీసుక వచ్చిరి. ।
13 అప్పుడు సంఘమంతా కొందరిని రిమ్మోను శిలా పర్వ
తములో వున్న బెన్యామీను పుత్రులతో సమాధాన
14 ముగా మాట్లాడి పిలిచేటట్టుగా పంపిరి. । కాబట్టి
బెన్యామీను ఆ వేళయందు తిరిగి వచ్చినందున వారు
యాబేష్గిలాదు స్త్రీలలోనుంచి జీవముతోటి బ్రతక
నిచ్చిన వారికి భార్యలుగా యిచ్చినప్పటికిన్ని వీరు
15 వారికి చాలకపోయిరి. । కాబట్టి జనులు బెన్యామీను
విషయమై పశ్చాత్తాపపడినారు, యేమంటే యెహో
వా ఇశ్రాయేలు గోత్రములలోనుంచి వొకటి తెగవే
16 సెను. । అప్పుడు సంఘపు పెద్దలు పలికినదేమంటే,
బెన్యామీనులోనుంచి ఆడువాండ్లు నాశనమయి పో
యిరి; శేషించిన వారికి భార్యలు కలిగే కొరకు యే
17 లాగు చేతుమని పలికి; । మరిన్ని చెప్పుకొన్నదేమంటే
ఇశ్రాయేలులో వొక గోత్రము నశించిపోకుండా
బెన్యామీనులో తప్పించుకొనిన వారి కొరకు వొక
భూ భాగము కలిగి వుండ వలెను. । అయినప్పటికిన్ని 18
మన కుమార్తెలలో యెవరినీ వారికి పెండ్లికి యివ్వ
కూడదు, యేమంటే ఇశ్రాయేలు పుత్రులు బెన్యా
మీనుకు యెవడు పెండ్లికి యిచ్చునో వాడు శాపము
పొందును గాకని ప్రమాణము చేశినారని చెప్పుకొని,
తిరిగీ పలికినదేమంటే; । యిదుగో ప్రతి సంవత్సర 19
మందూ లెబోనా దక్షిణ దిక్కులో బేతేలునుంచి షెఖె
ముకు వెళ్లే మార్గముయొక్క తూర్పు పార్శ్వమందు
న్ను బేతేలు వుత్తర పార్శ్వమందున్ను వుండే షీలోలో
యెహోవా విషయమయి వొక పండుగ కలిగి
వున్నదని చెప్పుకొని, బెన్యామీను పుత్రులకు ఆజ్ఞా
పించినదేమంటే, । మీరు వెళ్లి ద్రాక్ష తోటలలో 20
పొంచి వుండి కనిపెట్టి, షీలో కుమార్తెలు నాట్య
మాడడానకు బయిలు వెళ్లడము చూచినప్పుడు, । మీరు 21
ద్రాక్ష తోటలలోనుంచి వచ్చి, ప్రతి మనిషీ తన
తన కొరకు షీలో కుమార్తెలలో వొక్కొక దాని
భార్యగా పరిగ్రహించి, బెన్యామీను దేశమునకు
వెళ్లి పొండి. । వారియొక్క తండ్రులయినా సహోదరు 22
లయినా మొర్ర పెట్టడానకు మా యొద్దకు వచ్చినప్పు
డు వారితో మేము చెప్పేదేమంటే, మీరు మా నిమిత్త
ముచేత వారి విషయమై దయ చేయ వలసినది, యే
మంటే యుద్ధమందు మనము వొక్కొక్కనికి వాని
వాని భార్యను వుంచకపోతిమి, యిప్పుడు మీరు వా
రికి యివ్వకపోతే మీకు తప్పు కలుగునని చెప్పుదా
మని పలికిరి. । అయినందున బెన్యామీను పుత్రులు 23
ఆలాగున చేసిరి, యేమంటే నాట్యమాడిన వాండ్లలో
నుంచి తమ తమ లెక్క ప్రకారము తమ కొరకు భా
ర్యలను పరిగ్రహించిరి; వారు తిరిగీ తమ భూ భాగ
ములకు వెళ్లి, వూళ్లను బాగుచేసుకొని, వాటిలో కాపు
రము చేసిరి. । అప్పుడు ఇశ్రాయేలు పుత్రులు ఆ స్థల 24
మును విడచి, ప్రతి మనుష్యుడు తన గోత్రమునకు
న్ను తన కుటుంబమునకున్ను వెళ్లిపోయెను; యీలా
గున ప్రతి మనిషీ అక్కడనుంచి తన తన భూ భాగ
మునకు వెళ్లిపోయెను. । ఆ దినములలో ఇశ్రాయేలు 25
లో రాజు లేదు; ప్రతి మనిషీ తన తన దృష్టికి యేది
మంచిదో అది చేస్తూ వుండెను.

# రూథును గురించిన గ్రంథము.

## 1. అధ్యాయము.

1 న్యాయాధిపతులు యేలే దినములయందు సంభవిం
చినదేమంటే, దేశమందు క్షామము పుట్టెను; అప్పుడు
యూదా-బేత్లెహేము వూరివాడయిన వొకడు తా
నున్ను తన భార్యయున్ను తన యిద్దరు కుమారులున్ను
నివసించుటకు మోయాబు దేశములోకి వెళ్లిపోయినా
2 రు. । ఆ మనుష్యుని పేరు ఎలీమెలెఖున్ను, అతని భార్య
పేరు నావొమిన్ని అని వుండెను; అతని కుమారులలో
వొకనికి మహ్లోను, యింకొకనికి కిల్యోను అనే పే
రులు కలిగి వుండెను; వారు యూదా-బేత్లెహేములో
ఎఫ్రాతీయులై వుండిరి; వారు మోయాబు దేశములోకి
3 వచ్చి అక్కడ నివాసము చేసినారు. । అంతట నావొమి
యొక్క పెనిమిటియైన ఎలీమెలెఖు మరణమయినం
దున, ఆమెయున్ను ఆమె యిద్దరు కుమారులున్ను
4 వుండిపోయిరి. । అయితే వారు మోయాబు స్త్రీలలో
నుంచి భార్యలను తీసుకొన్నారు; వొకదాని పేరు
ఒర్పా అనిన్ని, రెండో దాని పేరు రూథు అనిన్ని
వుండెను; వారు అక్కడ దాదాపు పది సంవత్సరములు
5 కాపురము చేసిరి. । తరువాత మహ్లోనున్ను కిల్యోను
న్ను అనే ఆ యిద్దరున్ను మరణమైరి; కాబట్టి తన పెని
మిటిన్ని తన యిద్దరు కుమారులున్ను పోగా ఆ స్త్రీమా
6 త్రము విడువపడెను. । అప్పుడు ఆమె తన కోడండ్లతో
కూడా మోయాబు దేశములోనుంచి తిరిగి వెళ్లిపోవ
డానకు లేచెను, యెందుకంటే యెహోవా తన జను
లను దర్శించి వారికి ఆహారమును యిస్తూ వున్నాడని
7 మోయాబు దేశమందు ఆమెకు వినపడెను. । కాబట్టి
ఆమె తాను వున్న స్థలములోనుంచి బయిలు వెళ్లెను;
మరిన్ని ఆమె యిద్దరు కోడండ్లు ఆమెతో కూడా
వెళ్లిపోయి వచ్చినారు; అయితే యూదా దేశమునకు
మళ్లుటకు వారు మార్గమున వెళ్లుతూ వుండగా, ।
8 నావొమి తన యిద్దరు కోడండ్లను చూచి చెప్పినదేమం
టే, మీరు మీ మీ తల్లుల యిండ్లకు వెళ్లండి; మీరు
చనిపోయిన వారికిన్ని నాకున్ను వుపకారము చేసిన
లాగున యెహోవా మీకున్ను వుపకారము చేసును
9 గాక. । మీలో వొక్కొక్కతె తన తన పెనిమిటి యిం
టిలో నెమ్మదిని అనుభవించేలాగున యెహోవా
కలుగ చేసును గాకని చెప్పి, వారిని ముద్దు పెట్టు
10 కొనెను. । అప్పుడు వారు తమ కంఠమెత్తి యేడ్చి,
ఆమెతో నిశ్చయముగా మేము నీతో కూడా నీ జనుల
యొద్దికి వత్తుమని చెప్పిరి. । అప్పుడు నావొమి వారిని 11
చూచి, వో నా కుమార్తెలారా, మీరు తిరిగి పొండి;
నాతో యెందుకు వస్తారు! మీకు పెనిమిట్లుగా వుండే
టందుకు యింకా నా గర్భమందు కుమారులు వున్నా
రా?। తిరిగి పొండి, నా కుమార్తెలారా, యేమంటే 12
పెనిమిటి నాకు కలిగేటందుకు నేను ముసలిదాననైతిని:
అయినా నాకు నిరీక్షణము కలిగి యీ రాత్రి నాకు
పెనిమిటి వుండి నేను కుమారులను కంటినట్టాయెనా
వారు పెద్దవారయ్యే పర్యంతమూ మీరు వారి కొరకు
నిరీక్షిస్తూ వుందురా?। పెనిమిట్లు లేకుండా మీరు 13
వారి కొరకు కనిపెట్టి వుందురా? వో నా కుమార్తె
లారా, అది కూడదు; యెహోవాయొక్క హస్తము
నాకు విరోధముగా వచ్చినదని మీ కొరకు నేను బహు
గా దుఃఖిస్తున్నానని పలికెను. । అప్పుడు మళ్లీ వారు 14
తమ కంఠమెత్తి యేడ్చినారు; మరిన్ని ఒర్పా తన
అత్తను ముద్దు పెట్టుకొని పోయెను, అయితే రూథు
ఆమెతో హత్తుకొనెను. । అయితే ఆమె దాన్ని చూచి 15
చెప్పినదేమంటే, యిదుగో నీ తోటికోడలు తన జనుల
యొద్దికిన్ని తన దేవుండ్ల యొద్దికిన్ని తిరిగీ పోయెను;
నీవున్ను నీ తోటికోడలి వెంబడినే తిరిగి పొమ్మని
చెప్పెను. । అప్పుడు రూథు ఆమెతో అనిన మాట, 16
నిన్ను విడచి పెట్టుటకయినా నీ వెంబడినుంచి తిరిగి
పోవుటకైనా నన్ను బతిమాల వద్దు; యెందుకంటే
యెక్కడికి నీవు వెళ్లుదువో అక్కడికి నేను వస్తాను;
యెక్కడ నీవు దిగుదువో అక్కడ నేను దిగుతాను;
నీ జనులు నా జనులవుదురు, నీ దేవుడు నా దేవుడ
వును. । నీవు యెక్కడ మరణమవుదువో అక్కడ 17
నేనున్ను మరణమై పాతిపెట్టబడుదును; మన యిద్దరి
కిన్ని మరణము గాక మరి యేదైనా యెడబాపు చేస్తే
అప్పుడు యెహోవా నాకు ఆలాగుననున్ను అంత
కంటే యెక్కువనున్ను చేసును గాకని పలికెను.। అం 18
తట తనతో కూడి రావడానకు ఆమెకు స్థిరబుద్ధి కల
దని ఆమె చూచి, ఆమెతో అప్పుడు మరి మాట్లాడక
వుండెను. । కాబట్టి వీరిద్దరున్ను బయిలు వెళ్లి బేత్లె 19
హేముకు వచ్చినారు; వారు బేత్లెహేములో ప్రవే
శించినప్పుడు సంభవించినదేమంటే, ఆ పట్టణమంతా
వారిని గురించి కళవిళపడి, యిది నావొమి గదా అని

20 చెప్పుకొనిరి. । అప్పుడు ఆమె వారితో చెప్పినదేమం
టే, నావొమి అని నన్ను పిలువక మారా అని పిలు
వండి; యేమంటే సర్వ శక్తి గలవాడు నా విషయమై
21 మహా కఠినముగా జరిగించెను. । నేను నిండుగా బయిలు
వెళ్లినాను, అయితే యెహోవా నన్ను యింటికి వట్టి
దానిగా రా చేసెను; యెహోవా నాకు విరోధము
గా పలికి, సర్వశక్తి గల ఆయన నన్ను శ్రమపెట్టెను
గనుక నన్ను నావొమి యని యెందుకు పిలుస్తారు అని
22 పలికెను. । ఈలాగున నావొమి తిరిగీ వచ్చెను; మరిన్ని
మోయాబు దేశపు స్త్రీయైన రూథు అనే దాని కోడలు
దానితో కూడా వచ్చెను; వీరు యవలకోత ఆరంభిం
చిన కాలమందు బేత్లెహేముకు వచ్చిరి.

## 2. అధ్యాయము.

1 అయితే నావొమికి తన పెనిమిటియొక్క బంధు
వుడు వొకడు గలడు; అతడు ఎలీమెలెఖుయొక్క
కుటుంబికుడై చాలా ఆస్తి గలవాడయి వుండెను;
2 అతని పేరు బోయజు అని వుండెను. । మరిన్ని మో
యాబీయురాలయిన రూథు నావొమితో నేను పొల
ములోకి వెళ్లి, యెవరి దృష్టియందు నాకు దయ దొరు
కునో అతని వెనుక గోధుమ చేనులో లేకి యేరుకొనే
టట్టుగా సెలవు యిమ్మని అడిగినందున, ఆమె, వెళ్లుము,
3 నా కుమారీ, అని చెప్పెను. । అప్పుడు ఆమె పొలము
లోకి వెళ్లి, కోసేవాండ్ల వెనుక లేకి యేరుకొనెను;
అయితే ఎలీమెలెఖుయొక్క బంధువుడైన బోయజుకు
కలిగిన పొలము భాగమందు లేకి యేరుకొనేది దానికి
4 ప్రాప్తమాయెను. । అంతట యిదుగో బోయజు బేత్లె
హేమునుంచి వచ్చి, కోసేవాండ్లను చూచి, యెహో
వా మీకు తోడుగా వుండును గాకని దీవించెను.
అందుకు వాండ్లు యెహోవా నిన్ను ఆశీర్వదించును
5 గాకని ప్రత్యుత్తరమిచ్చిరి. । తరువాత బోయజు కోసే
వాండ్ల మీద వున్న తన సేవకుని చూచి, యీ చిన్నది
6 యెవరిది అని అడిగినాడు. । కోసేవాండ్ల మీద వున్న
సేవకుడు అతనికి ప్రత్యుత్తరముగా చెప్పినదేమంటే,
యీమె మోయాబు దేశమునుంచి నావొమితో తిరిగీ
7 వచ్చిన ఆ మోయాబీయురాలయిన చిన్నది. । ఆమె
వచ్చి నేను కోసేవాండ్ల వెనుక చేనుల మోపులలో
లేకి యేరుకొనుటకు సెలవు యివ్వండని చెప్పినందున,
ఆమె వచ్చి వుదయము మొదలుకొని యిప్పటి పర్యం
తమూ వుండి, యిప్పుడే మానివేసి యింట్లో వుండెనని
8 చెప్పెను. । అప్పుడు బోయజు రూథుతో అనిన మాట,
వో నా కుమారీ, నీవు నా మాట వినవా? మరి వొక
పొలములోకి లేకి యేరుకొనుటకు వెళ్లవద్దు, యిది
9 విడువ వద్దు, నా పడుచుల యొద్ద వుండ వలెను. । వాం
డ్లు కోసే పొలమును కనిపెట్టి వారి వెంబడిని వుండు
ము; పడుచువాండ్లు నిన్ను ముట్టకుండా ఆజ్ఞాపించి
నాను; మరిన్ని నీకు దాహమయితే కుండల యొద్దకు
వచ్చి, పడుచువాండ్లు తోడినది తాగుమని చెప్పెను. ।
అప్పుడు ఆమె వంగి సాగిలపడి, పరదేశిని అయిన 10
నన్ను మీరు గుర్తెరుగుటకు మీ దృష్టికి నేను యేలాగు
కృపబొందితినని పలికెను. ।అందుకు బోయజు ప్రత్యు 11
త్తరముగా నీ పెనిమిటి చనిపోయిన వెనుక నీవు నీ
అత్తకు చేసిన యావత్తు నాకు చూపించబడెను, యేమం
టే నీ తల్లిదండ్రులనున్ను పుట్టిన దేశమునున్ను నీవు
విడచిపెట్టి, పూర్వము నీవు యెరుగనటువంటి జనుల
లోకి వస్తివి. । యెహోవా నీ చేతనయిన కార్యము 12
నకు ప్రతిగా యిచ్చును గాక; యెవరి రెక్కల కింద
కమ్ముటకు నీవు వస్తివో ఇశ్రాయేలుకు దేవుడయిన ఆ
యెహోవా వల్ల నీకు నిండయిన ఫలము కలుగును
గాకని దీవించెను. । అప్పుడు ఆమె అతనితో వో 13
నా ప్రభువా, నీవు నన్ను ఆదరించితివి; నీ సేవకు
రాళ్లలో యే వొక దానితోటయినా నేను సమము
కాక పోయినప్పటికిన్ని నీ సేవకురాలినయిన నాతో
స్నేహముగా పలికితివి; కాబట్టి నీ దృష్టియెదుట
నాకు దయ కలుగనియ్యుమని చెప్పెను. । అప్పుడు 14
బోయజు ఆమెతో నీవు భోజనకాలమందు యిక్కడికి
వచ్చి, చిరకాలో నీ తునకముంచి, భోజనము చేయు
మని చెప్పెను. అయినందున ఆమె కోసేవాండ్ల యొద్ద
కూర్చుని వుండగా, అతడు కాల్చిన గింజలు దానికి
అందిచ్చెను; ఆమె వాటిని తిని తృప్తి పొంది మాని
వేసెను. । తరువాత ఆమె లేకి యేరుకొనుటకు లేచిన 15
ప్పుడు బోయజు తన పడుచువారిని చూచి ఆజ్ఞాపిం
చినదేమంటే, ఆమెను చేనుల మోపులలో లేకి యేరు
కొననిచ్చి సిగ్గుపరచకండి. । మరిన్ని లేకి యేరే నిమి 16
త్తము ఆమె కొరకు కొంత గుప్పెడు గుప్పెడుగా
పడవేసి విడచి, ఆమెను గద్దించ వద్దని సెలవు యిచ్చె
ను. । కాబట్టి ఆమె పొలములో అస్తమాన పర్యంత 17
మూ లేకి యేరుకొనిన వాటిని దుళ్ల గొట్టినప్పుడు అవి
ఎఫా యంత యవలై వుండెను. । అప్పుడు ఆమె వా 18
టిని యెత్తుకొని వూరిలోకి వెళ్లి పోయెను; ఆమె అత్త
ఆమె లేకి యేరుకొనిన వాటిని చూచెను; మరిన్ని ఆమె
తాను తృప్తిబొందిన తరువాత వుంచిన వాటిని బయి
టకు తీసుకొని వచ్చి ఆమెకు యిచ్చెను. । అప్పుడు 19
ఆమె అత్త ఆమెను చూచి, నేటి దినమున యెక్కడ
లేకి యేరితివి? యెక్కడ పని చేస్తివి? నిన్ను గుర్తెరిగిన
వాడు ఆశీర్వదించ బడును గాకని చెప్పెను. అప్పుడు
ఆమె బోయజు అనే పేరిటి వాని యొద్ద నేటి దిన
మున పని చేస్తినని యెవని యొద్ద తాను పని చేసెనో

20 అది తన అత్తకు చెప్పెను. ।అప్పుడు నాయొమి తన కో
డలను చూచి చెప్పినదేమంటే, బ్రతికి వున్నవారికిన్ని
మరణమయిన వారికిన్ని వుపకారము చేయడము మా
నని వాడు యెహోవా వల్ల ఆశీర్వదించబడును గా
కని చెప్పి, నాయొమి మరిన్ని ఆమెతో ఈ మనుష్యుడు
మనకు సన్నిహిత జ్ఞాతియై, మన భూ వసతి విమో
చించ వలసిన వారిలో వొకడయి వున్నాడని చెప్పెను.।
21 అప్పుడు మోయాబీయురాలయిన రూథు ఆమెతో
అతడు మరిన్ని చెప్పినదేమంటే, నా పడుచువారి
యొక్క కోతంతా ముగించే పర్యంతమూ నీవు వారి
యొద్ద వుండ వలసినదని పలికెనని చెప్పెను. ।అందుకు
22 నాయొమి తన కోడలైన రూథుతో చెప్పినదేమంటే,
వో నా కుమారీ, మరి వొక పొలములో వాండ్లు నీ
మీదికి రాకుండా అతనియొక్క పడుచులతో బయిలు
23 వెళ్లేది మంచిదే అని చెప్పెను. ।ఈలాగున ఆమె
యవల కోతయున్ను గోధుమ కోతయున్ను సమాప్త
మయ్యే పర్యంతమూ బోయజుయొక్క పడుచుల
దగ్గిర వుండి లేకి యేరుతూ తన అత్తయొద్ద కాపురము
చేస్తూ వుండెను.

## 3. అధ్యాయము.

1 అంతట ఆమె అత్త అయిన నాయొమి ఆమెతో
అనిన మాట, వో నా కుమారీ, నీవు బాగా వుండ
డానకు నీ కొరకు నెమ్మదిని నేను వెతుక కూడదా?।
2 యెవని పడుచుల దగ్గిర నీవు వుంటివో ఆ బోయజు
మన జ్ఞాతులలో వొకడు కాడా? యిదుగో ఈ రాత్రి
3 అతడు కళ్లములో యవలు తూర్పును. ।కాబట్టి నీవు
స్నానము చేసుకొని, నూనె రాచుకొని, బట్టలు కట్టు
కొని, కళ్లము దగ్గిరకు వెళ్లు; అయితే అతడు భోజన
పానములు చేసే పర్యంతమూ నిన్ను నీవు అతనికి
4 తెలియ చేసుకో వద్దు. ।అతడు పడుకొనేటప్పుడు
అతడు పడుకొనే స్థలము నీవు కనుక్కొని, ఆ లోప
లికి వెళ్లి, అతని పాదాల మీద కప్పిన బట్టలను తీసి
పడుకో; అప్పుడు నీవు చేయవలసినది యేదో అది
5 నీతో అతడు తెలియ చెప్పునని బోధించెను.।అప్పుడు
ఆమె నీవు నాతో చెప్పినదెల్లా నేను చేస్తానని ఆమె
6 తో పలికెను. ।అంతట ఆమె కళ్లముకు దిగి వెళ్లి, తన
7 అత్త తనతో చెప్పిన యావత్తు ప్రకారము చేసెను.।అ
యితే బోయజు భోజన పానములు చేసి హృదయమందు
సంతోషముగా వున్నప్పుడు అతడు వచ్చి చేల కుప్ప
దగ్గిర పడుకొన్నాడు, అప్పుడు ఆమె మెల్లిగా వచ్చి
అతని పాదముల మీద కప్పిన బట్టను తీసివేసి పడు
8 కొనెను. ।అయితే మధ్య రాత్రియందు సంభవించిన
దేమంటే, అతడు తుల్లి పడి లేచి భయపడెను; అప్పుడు
యిదుగో వొక స్త్రీ అతని పాదముల దగ్గిర పడుకొని
వుండెను. ।అంతట అతడు నీవు యెవరని అడిగితే, 9
అందుకు ఆమె నేను మీ సేవకురాలనైన రూథును;
నీవు నాకు సన్నిహిత జ్ఞాతివి; కాబట్టి నీ రెక్క నీ
సేవకురాలినైన నా పయిని చాపుమని చెప్పెను. ।
అప్పుడు అతడు ఆమెతో వో నా కుమారీ, యె 10
హోవావల్ల నీవు ఆశీర్వదించబడుదువు గాక, యే
మంటే దరిద్రులైనా ఐశ్వర్యవంతులైనా అయి వున్న
పడుచువారిని నీవు వెంబడించక, మునుపటి వుపకా
రముకంటే కడసారిలో అధికోపకారమును చేస్తివి. ।
కాబట్టి నా కుమారీ, నీవు భయపడ వద్దు; నీ కోరిక 11
అంతా నేను తీర్చుదును, యేమంటే నీవు యథార్థ
పరురాలవని నా పట్టణపు జనులందరికిన్ని తెలిసెను.।
నేను నీకు సన్నిహిత జ్ఞాతిని, అది నిజమే; అయినప్ప 12
టికిన్ని నాకంటే సన్నిహిత జ్ఞాతి వొకడు కలడు.।
కాబట్టి యీ రాత్రి యిక్కడ వుండు; వుదయమందు 13
అతడు నీ విషయమై జ్ఞాతి చేయ వలసిన దాని చేయ
నిచ్చ గలవాడయితే సరే; అతడు అలాగునే చేయ
నియ్యుము; లేని పక్షమందు యెహోవా జీవము
తోడు నేను నీ విషయమయి జ్ఞాతి చేయ వలసిన దాని
చేతును; వుదయ పర్యంతమూ పడుకొమ్మని చెప్పెను.।
అయినందున ఆమె వుదయ పర్యంతమూ అతని పాద 14
ముల దగ్గిర పడుకొని, వొకరికి వొకరు తెలియక
మునుపు చీకటితోనే లేచెను. అప్పుడు అతడు కళ్ల
ములోకి నీవు వచ్చిన సంగతి యెవరితోనయినా తెలియ
చెప్ప వద్దని చెప్పి; ।మరిన్ని ఆమెతో నీ మీద వున్న 15
ముసుకు పట్టుమని చెప్పెను; ఆమె ముసుకు పట్టిన
ప్పుడు అతడు ఆరుకొలల యవలు కొలిచి ఆమె మీద
యెత్తెను; అప్పుడు ఆమె వూరిలోకి వెళ్లి, ।తన అత్త 16
యొద్దికి వచ్చినప్పుడు ఆమె అత్త నీవు యెవరవు, నా
కుమార్తెవేనా అని ఆమెను అడిగెను; అప్పుడు ఆమె
తనకున్ను అతనికిన్ని జరిగినదంతా ఆమెతో తెలియ
చెప్పి; ।మరిన్ని చెప్పినదేమంటే, అతడు నీ అత్త దగ్గి 17
రకు విడి చేతులతోటి వెళ్ల వద్దని చెప్పి, యీ ఆరు
కొలల యవలున్ను నాకు యిచ్చినాడని చెప్పినప్పుడు;।
ఆమె దానితో వో నా కుమారీ, యీ కార్యమువల్ల 18
యేమి అవుతుందో అది తెలిసే పర్యంతమూ వూరకె
వుండు; యేమంటే నేటి దినమున అతడు యీ కార్య
ము ముగించే పర్యంతమూ నిమ్మళించకుండా వుండునని
చెప్పెను.

## 4. అధ్యాయము.

అప్పుడు బోయజు పట్టణపు ద్వారము దగ్గిరకు 1
వెళ్లి కూర్చుని వుండెను; అయితే బోయజు జ్ఞాతి

ఆ మార్గమున వస్తూ వున్నప్పుడు అతడు అతని పిలిచి,
వోయి యిక్కడికి వచ్చి కూర్చుండుమని చెప్పెను.।
2 అప్పుడు అతడు అటు తిరిగి కూర్చుండెను; మరిన్ని
బోయజు పట్టణపు పెద్దలలో పదిమందిని పిలుచుకొని,
మీరు యిక్కడ కూర్చుండని చెప్పినందున, వారు
కూర్చుని వుండగా అతడు ఆ జ్ఞాతితో అనిన మాట,।
3 మోయాబు దేశములోనుంచి తిరిగి వచ్చిన నావొమి
మన సహోదరుడైన ఎలీమెలెఖుకు కలిగి వుండిన
4 భూభాగమును అమ్ముతూ వున్నది. । కాబట్టి నీవు పట్ట
ణపు వారి యెదుటనున్ను నా జనులలో పెద్దల యెదు
టనున్ను దాని కొనుమని నీ చెవిలో చెప్పనైవుంటిని.
దాని విమోచించుటకు నీకు మనస్సు అయితే విమో
చించుము, విమోచించుటకు మనస్సు లేక పోతే నాకు
తెలిసే కొరకు చెప్పుము; యెందుకంటే దాని విమో
చించుటకు నీవు గాక మరి యెవడూ లేడూ; నీ వెను
కటి వాడను నేనని చెప్పినప్పుడు, అతడు నేను విమో
5 చింతునని చెప్పెను. । అప్పుడు బోయజు అనిన మాట,
నావొమియొక్క చేతినుంచి నీవు ఆ పొలమును కొనే
నాటి యందు నీవు మరణమైన వానియొక్క స్వాతం
త్ర్యపు భాగము మీద అతని నామము లేవనెత్తడా
నకు మరణమయిన అతనియొక్క భార్యయున్ను మో
యాబీయురాలున్ను అయిన రూథు యొద్దనుంచిన్ని
6 కొన వలసినదని చెప్పెను. । అందుకు ఆ జ్ఞాతి అనిన
మాట, ఆలాగైతే నా స్వాతంత్ర్యపు భాగము చెడిపో
తుందేమో; కాబట్టి అది నా కొరకు నేను విమోచించ
లేను; నా స్వాతంత్ర్యమును నీవే విమోచించుకో,
యెందుకంటే అది నేను విమోచించుకోలేనని చెప్పె
7 ను. । పూర్వమందు ఇశ్రాయేలులో విమోచించే దాని
యందున్ను మాచేదాని యందున్ను సమస్తమూ రూ
ఢము చేయడానకు వొకడు తన చెప్పు తీసి తన తోటి
వానికి యిచ్చేది మర్యాదగా వుండెను; ఇశ్రాయేలు
8 లో యిది సాక్ష్యము అయి వుండెను. । కాబట్టి ఆ
జ్ఞాతి బోయజుతో దాని నీవు కొనుమని చెప్పినప్పుడు
9 అతడు తన చెప్పు తీసివేసెను. । అప్పుడు బోయజు
పెద్దలతోటిన్ని జనులందరితోటిన్ని అనిన మాట యే
మంటే, ఎలీమెలెఖుకున్ను కిల్యోనుకున్ను మహ్లోను
కున్ను కలిగి వున్నదంతాను నేను నావొమి చేతినుంచి
10 కొంటిననిన్ని; । మరిన్ని మోయాబీయురాలైనటువం
టిన్ని మరణమైన మహ్లోనుయొక్క భార్య అయిన
టువంటిన్ని రూథును నేను మరణమయిన వానియొక్క
నామము వాని సహోదరులలోనుంచిన్ని వాని స్థల
ముయొక్క ద్వారములోనుంచిన్ని తెగవేయపడకుం
డా మరణమయిన వానియొక్క నామము అతని స్వా
తంత్ర్యపు భాగము మీద లేవనెత్తడానకు నాకు భార్య
అయ్యేటట్టుగా కొంటిననిన్ని మీరు యీ దినమున
సాక్షులై వున్నారని చెప్పెను. । అప్పుడు ద్వారమం 11
దున్న జనులందరున్ను పెద్దలందరున్ను చెప్పినదేమంటే,
మేము సాక్షులమై వున్నాము; యెహోవా నీ యిం
ట్లోకి వచ్చిన యీ స్త్రీని ఇశ్రాయేలుయొక్క యింటిని
స్థాపించిన రాహేలు లేయా అనే వారిద్దరి వలెను
కలుగచేసును గాక; నీవు ఎఫ్రాతులో గొప్పగానున్ను
నీ నామము బేత్లెహేములో ప్రసిద్ధిగానున్ను వుండుము
గాక. । మరిన్ని యీ పడుచువల్ల యెహోవా నీకు 12
యిచ్చే సంతతిచేత నీ యిల్లు తామారు యూదాకు
కనిన పెరెసుయొక్క యిల్లువలె వుండును గాకని దీవిం
చినారు. । కాబట్టి బోయజు రూథును తీసుకొన్నం 13
దున అది అతనికి భార్యగా నుండెను; అతడు ఆమె
యొద్దకు ప్రవేశించినప్పుడు యెహోవా ఆమెను గర్భ
వతిగా చేసెను; ఆమె వొక కుమారుని కనెను. । అప్పుడు 14
స్త్రీలు నావొమితో చెప్పినదేమంటే, నేటి దినమున
జ్ఞాతి లేనట్టుగా నిన్ను విడువని యెహోవాకు స్తోత్ర
ము కలిగి వుండును గాక; అతనియొక్క నామము
ఇశ్రాయేలులో ప్రసిద్ధిగా వుండును గాక. । అతడు 15
ప్రాణమును నీకు తిరిగీ రాచేసి, వృద్ధాప్యమైన కాల
మందు నిన్ను పోషించే వాడవును, యేమంటే యేడు
గురు కుమాళ్లకంటే నీకు విశేషముగా వున్నటువం
టిన్ని నిన్ను స్నేహిస్తూ వున్నటువంటిన్ని నీ కోడలు
అతని కనెనని పలికిరి. । అయితే నావొమి ఆ పిల్లను 16
తీసుకొని, తన కౌగిటిలో వుంచుకొని, వానికి
మాత్రు స్థానముగా వుండెను. । అయితే దాని పొరు 17
గింటి స్త్రీలు వానికి పేరు పెట్టి అనుకొన్నదేమంటే,
కుమారుడు నావొమికి పుట్టెనని పలికి, వాని పేరు
ఓబేదు అని పిలిచిరి: యితడు దావీదుయొక్క తండ్రి
అయిన యెష్షైకు తండ్రియై వుండెను. । అయితే పెర 18
సువల్ల పుట్టిన వంశాంతరములు యేవంటే, పెరసుకు
హెస్రోను పుట్టినాడు: । హెస్రోనుకు రాము పుట్టి 19
నాడు: రాముకు అమ్మీనాదాబు పుట్టినాడు: । అమ్మీ 20
నాదాబుకు నయస్సోను పుట్టినాడు: నయస్సోనుకు శల్మో
ను పుట్టినాడు: । శల్మోనుకు బోయజు పుట్టినాడు: బో 21
యజుకు ఓబేదు పుట్టినాడు: । ఓబేదుకు యెష్షై పుట్టి 22
నాడు: యెష్షైకు దావీదు పుట్టినాడు.

# సమూయేలుయొక్క మొదటి గ్రంథము.

## 1. అధ్యాయము.

1 ఎఫ్రయీము పర్వతమందు రామాతయీమ్సో
ఫీము పట్టణపు వాడు వొకడు గలడు, అతని పేరు
ఎల్కానా అని వుండెను; అతడు ఎఫ్రాతీయుడయిన
సూఫుకు పుట్టిన తోహూయొక్క కుమారుడయిన ఎలీ
హుకు పుట్టిన యెరోహాముయొక్క కుమారుడై వుం
2 డెను. । అతనికి యిద్దరు భార్యలు గలరు; వీరిలో వొక
దాని పేరు హన్నా అనిన్ని, యింకొక దాని పేరు
పెనిన్నా అనిన్ని వుండెను: పెనిన్నాకు పిల్లలు కలిగి
వుండిరి, అయితే హన్నాకు పిల్లలు లేకపోయిరి. ।
3 యీ మనుష్యుడు ప్రతిసంవత్సరము షీలో యందున్న
సైన్యములయొక్క యెహోవాను ఆరాధించుటకున్ను
బలి చెల్లించుటకున్ను తన పట్టణములోనుంచి బయిలు
వెళ్లే వాడు: అప్పుడు ఏలీయొక్క యిద్దరు కుమారు
లైనటువంటిన్ని యెహోవాయొక్క అర్చకులయినటు
వంటిన్ని హొఫ్నీయున్ను పీనెహాసున్ను అక్కడ
4 వుండిరి. । ఎల్కానా తాను అర్పించిన నాటి యందు
తన భార్య అయిన పెనిన్నాకున్ను దాని కుమారులకు
న్ను కుమార్తెలందరికిన్ని పాళ్లు పంచిపెట్టెను. ।
5 అయితే హన్నా తనకు ప్రియముగా వున్నది గనుక
హన్నాకు అధికమయిన పాలు పెట్టెను: అయితే యె
6 హోవా ఆమె గర్భమును మూసివేసెను. । యెహో
వా ఆమె గర్భము మూసినందువల్ల ఆమె విరోధు
రాలు దాని విసికించే కొరకు దాని మిక్కిలీ కోపింప
7 చేసెను. । అతడు ఆలాగున ప్రతి సంవత్సరమూ చేస్తూ
వుండగా, యీమె యెహోవా మందిరానకు యెక్కి
పోయినప్పుడు ఆమె యీమెకు కోపము పుట్టించినం
దువల్ల ఆమె భోజనము చేయక యేడుస్తూ వుండెను. ।
8 అప్పుడు ఆమె పెనిమిటియైన ఎల్కానా ఆమెతో
వోహన్నా, యెందుకు యేడ్చుతావు? నీవు భోజనము
చేయక వుండేదేమి! నీకు మనో విచారము యెందుకు?
పది మంది కుమాళ్లకంటే నేను నీకు విశేషమైన వాడను
9 కానా అని పలికెను. । అప్పుడు అర్చకుడయిన ఏలీ
యెహోవా మందిర స్తంభము దగ్గిర వున్న ఆసనము
మీద కూర్చుని వుండెను; మరిన్ని వారు షీలోలో
భోజన పానములను చేసిన తరువాత హన్నా లేచి, ।
10 బహు దుఃఖాక్రాంతయై వచ్చి, యెహోవాను ప్రా
ర్థన చేసి బహుగా యేడ్చెను. । మరిన్ని ఆమె 11
మొక్కుకొని పలికినదేమంటే, సైన్యములయొక్క వో
యెహోవా, నీ సేవకురాలనయిన నాకు కలిగిన అవి
ధిని నీవు చూచి, నా యందు జ్ఞాపకము తెచ్చుకొని,
నీ సేవకురాలనయిన నన్ను మరువక, నీ సేవకురాలనైన
నాకు మొగపిల్లను దయచేస్తివట్టాయెనా, అప్పుడు నేను
వాడు బ్రతికే దినములన్నిటి పర్యంతమూ వాని యె
హోవావయిన నీకు అర్పింతును; మరిన్ని వాని శిర
స్సు మీద క్షౌరపుకత్తి యెన్నటికీ రాక వుండునని పలి
కెను. । ఆమె యెహోవా యెదుట ప్రార్థన చేస్తూ 12
వుండగా సంభవించినదేమంటే, ఏలీ ఆమె నోరు కని
పెట్టుతూ వుండెను. । యేమంటే హన్నా తన హృద 13
యములోనే పలుకుతూ వుండెను; ఆమె పెదవులు
మాత్రమే ఆడుతూ వుండెను, కాని ఆమె శబ్దము విన
పడక వుండెను; కాబట్టి ఏలీ ఆమె మత్తురాలై వున్న
దని తలంచుకొని, ఆమెతో అనిన మాట, । యెంత పర్యం 14
తమూ నీవు మత్తురాలవై వుందువు? నీవు నీ ద్రాక్షారస
మును నీ యొద్దనుంచి తీసివేయుమని చెప్పగా; । హన్నా 15
ప్రత్యుత్తరముగా అనినదేమంటే, అది కాదు, నా
ప్రభువా, నేను దుఃఖాత్మ గల స్త్రీనై వున్నాను; నేను
ద్రాక్షారసమునయినా మద్యమునయినా పానము
చేయక, నా యాత్మను యెహోవా యెదుట కుమ్మ
రిస్తిని. । నీ సేవకులరాలనయిన నన్ను దుర్మార్గుని కుమా 16
ర్తెగా యెంచ వద్దు; యెందుకంటే నా యోజనయొ
క్కయున్ను దుఃఖముయొక్కయున్ను పరిపూర్తివ
ల్లను నేను యింత మట్టుకు పలుకుతూ వుంటిని అని
చెప్పెను. । అప్పుడు ఏలీ ఆమెతో ప్రత్యుత్తరముగా 17
అనినదేమంటే, నీవు క్షేమముగా వెళ్లు; ఇశ్రాయేలు
యొక్క దేవునితో నీవు చేసుకొన్న మనవి ఆయన
నీకు దయచేసును గాకని పలికెను. । అప్పుడు ఆమె 18
అతనితో నీ సేవకురాలనైన నేను నీ దృష్టికి కృప
పొందుదును గాకని చెప్పెను; అప్పుడు ఆ స్త్రీ తన
మార్గాన వెళ్లి భోజనము చేసెను; అంతట ఆమెయొ
క్క ముఖము ఖిన్నమైనది గాకుండా వుండెను. । తరు 19
వాతను వారు వుందయమందు వేగిరమే లేచి, యెహో
వాను ఆరాధించి, తిరిగీ రామాలో తమ యింటికి వచ్చి
నారు; అంతట ఎల్కానా తన భార్యయైన హన్నాను
యెరిగెను; యెహోవా ఆమెను జ్ఞాపకము తెచ్చు

20 కొనెను, । గనుక హన్నా గర్భము ధరించి, దినములు
గడిచినప్పుడు వొక కుమారుని కని, నేను యెహొ
వాను వీని అడిగితినని అనుకొని వాని పేరు సమూ
21 యేలు అని పిలిచెను. । ఎల్కానా అనే మనుష్యుడు
న్ను అతని యింటివారందరున్ను సంవత్సరపు బలినిన్ని
అతని మొక్కుబడినిన్ని యెహోవాకు చెల్లించుటకు
22 పయికి వెళ్లిరి. । అయితే హన్నా వెళ్లక వుండెను, యెం
దుకంటే పిల్ల పాలు మానే పర్యంతమూ నేను రాను;
అప్పుడు వాడు యెహోవా యెదుట అగుపడి
అక్కడ సార్వ కాలము వుండేటట్టుగా వాని తీసుక
23 వత్తునని ఆమె తన పెనిమిటితో చెప్పెను. । కాబట్టి
ఆమె పెనిమిటి అయిన ఎల్కానా ఆమెతో నీ దృష్టికి
యేది మంచిదో అది చేయుము, వానికి నీవు పాలు
మాన్పించే పర్యంతమూ నిలిచి వుండు; యెహో
వా తన వాక్యము మాత్రము స్థిరపర్చును గాక అని
చెప్పెను; అయినందున ఆస్త్రీ అక్కడనే వుండి తన
కుమారునికి పాలు మాన్పించే పర్యంతము పాలు యి
24 స్తూ వుండెను. । పాలు మాన్పించినప్పుడు ఆమె వాని
యెత్తుకొని, మూడు కోడెయెద్దులనున్ను, ఎఫా అంత
పిండినిన్ని, ద్రాక్షారసపు సిద్దెనున్ను తీసుకొని; షీలో
లో యెహోవా మందిరమునకు వచ్చెను: అయితే
25 ఆ పిల్ల యింకా చిన్నవాడై వుండెను. । అప్పుడు వారు
వొక కోడె యెద్దును వేట వేసి, పిల్లను ఏలీ యొద్దికి
26 తీసుక వచ్చిరి. । అప్పుడు ఆమె అతనితో వో నా
కర్తా, మీ ప్రాణము తోడు మీ యొద్ద నిలిచి యె
27 హోవాను ప్రార్థన చేసిన ఆ స్త్రీ నేనే. । యీ
పిల్ల కోసము నేను ప్రార్థన చేస్తిని; మరిన్ని యె
హోవా యొద్దనుంచి నేను అడిగిన మనవి ఆయన
28 నాకు దయచేసెను. । కాబట్టి నేను వాని తిరిగీ యెహో
వాకు చెల్లిస్తిని; వాడు బ్రతికినంత మట్టుకు యెహో
వాకు సమర్పించబడిన వాడని చెప్పెను. అప్పుడు
వాడు యెహోవాను అక్కడ ఆరాధించెను.

## 2. అధ్యాయము.

1 అప్పుడు హన్నా ప్రార్థనచేసి పలికినదేమంటే,
నా హృదయము యెహోవా యందు సంతోషిస్తు
న్నది; నా శృంగము యెహోవాచేత హెచ్చించబడి
యున్నది; నేను నీ రక్షణ యందు సంతోషిస్తూ వున్నా
ను గనుక నా నోరు నా విరోధుల మీద విస్తారము
2 అయి వున్నది. । యెహోవా వలెను పరిశుద్ధమయిన
వాడు వొకడూ లేడు, యెందుకంటే నీవు గాక మరి
యెవడూ లేడు; మన దేవునివలె యే శిలా పర్వతమైనా
3 లేదు. । యికను అంత అతిశయముగా పలుకకండి; కఠిన
త్వమును మీ నోటనుంచి రానివ్వకండి; యెందుకంటే
యెహోవా తెలివి గల దేవుడై వున్నాడు; ఆయ
నవల్ల కార్యములు తూచబడుతున్నవి. । బలాఢ్యుల 4
యొక్క విండ్లు విరువపడి యున్నవి; తొట్రిల్లిన వారు
బలమును ధరించుకొని యున్నారు. । తృప్తిగా వున్న 5
వారు ఆహారము నిమిత్తము కూలికి వెళ్లిరి; ఆకలిగొనిన
వారికి ఆకలి మానెను. మరిన్ని గొడ్రాలు యేడు
గురు పిల్లలను కనెను; అనేకమైన పిల్లలను కనినది శక్తి
హీనురాలాయెను. । యెహోవా మరణము కలగ 6
చేస్తూ జీవింప చేస్తూ వున్నాడు; ఆయన సమాధికి రాచే
స్తూ లేవనెత్తుతూ వున్నాడు. । యెహోవా దారిద్ర్య 7
మును కలుగచేస్తూ ఐశ్వర్యమునున్ను కలుగచేస్తూ
వున్నాడు; ఆయన కుంగచేస్తూ లేవనెత్తుతూ వున్నా
డు. । ప్రభువులతో కూర్చుండబెట్టుటకున్ను మహిమ 8
గల సింహాసనమును వారిని స్వతంత్రింప చేసుటకున్ను
ఆయన దరిద్రుని మంటిలోనుంచి యెత్తి, లేమి గలవాని
పెంట కుప్పలోనుంచి లేవనెత్తుతున్నాడు: యెందుకం
టే భూమియొక్క స్తంభములు యెహోవావి, వాటి
మీద ఆయన లోకమును వుంచి వున్నాడు. । ఆయన 9
తన పరిశుద్ధులయొక్క పాదములను కాపాడును; దుర్మా
ర్గులు అంధకారమందు మౌనముగా వుందురు, యెం
దుకంటే బలముచేత యెవడయినా జయించేది లేదు. ।
యెహోవాయొక్క విరోధులు భిన్నభిన్నములు అవు 10
దురు; పరమండలములోనుంచి ఆయన వారి మీద
వురుమును: యెహోవా లోకముయొక్క సరిహద్దుల
పర్యంతమూ వుండే వారికి న్యాయము తీర్చును; తన
రాజుకు తాను శక్తియిచ్చి, తాను అభిషేకించిన వాని
యొక్క శృంగమును హెచ్చింపచేసునని పలికెను. ।
తరువాత ఎల్కానా రామాలో తన యింటికి వెళ్లిపో 11
యెను; అయితే ఆ చిన్నవాడు అర్చకుడయిన ఏలీ
యెదుట యెహోవాకు సేవ చేస్తూ వుండెను. । అయితే 12
ఏలీయొక్క కుమారులు దుర్మార్గులయి, యెహోవాను
తెలియకుండా వుండిరి. । జనుల విషయమై అర్చకుని 13
మర్యాద యేమంటే, యెవడయినా బలి చెల్లిస్తే మాం
సము వుడుకుతూ వుండగా అర్చకుని సేవకుడు మూడు
ముండ్లు గల మాంసపు కొంకి తీసుక వచ్చి, । బోరు 14
సులో గానీ తపేలలో గానీ గూనలో గానీ కుండ
లో గానీ అది గుచ్చి, అప్పుడు ఆ మాంసపు కొంకి
చేత బయిటకు వచ్చినదంతాను అర్చకుడు తన కొరకు
పుచ్చుకొనును; యీలాగున వారు షీలోలో అక్క
డికి వచ్చిన ఇశ్రాయేలీయులందరికిన్ని చేసిరి. । మరిన్ని 15
వారు కొవ్వు దహింప చేయక మునుపు అర్చకుని
సేవకుడు వచ్చి, బలి చెల్లించేవాని చూచి; అర్చకుని
కోసము కాల్చడానకు మాంసము యిమ్ము; యేమంటే
అతడు నీ యొద్దనుంచి వుడక బెట్టిన మాంసము పుచ్చు

6 కోడు, పచ్చి మాంసము కావలెనని చెప్పును. । అప్పుడు
యెవడైనా వాని చూచి, తత్క్షణమందే వారు కొవ్వు
దహింప చేతురు, తరువాత నీ మనస్సు వచ్చినంత
మట్టుకు పుచ్చుకోవచ్చునని వానితో చెప్పితే, వాడు
అది కాదు, యిప్పుడే యివ్వవలెను, లేకపోతే బలవం
7 తముచేత పుచ్చుకొందునని చెప్పును. । అందువల్ల ఆ ప
డుచు వాండ్ల పాపము యెహోవా సముఖమందు
మిక్కిలీ గొప్పదిగా వుండెను; యేమంటే యెహో
వాయొక్క అర్పణ జనులకు యేహ్యముగా వుండెను. ।
8 అయితే చిన్నవాడైన సమూయేలు నారచేత నేయబడిన
ఏఫోదనే దానిచేత నడుము బిగించుకొని, యెహో
9 వా సముఖమందు సేవచేస్తూ వుండెను. । మరిన్ని వాని
తల్లి ప్రతి సంవత్సరము వానికొరకు చిన్న అంగీ వొకటి
కుట్టి, యేటి బలి చెల్లించడానకు తన పెనిమిటితో
వచ్చేటప్పుడు దాని తీసుక వచ్చి వానికి యిచ్చును. ।
20 మరిన్ని ఏలీ ఎల్కానానున్ను అతని భార్యనున్ను
ఆశీర్వదించినదేమంటే, యెహోవాను యీమె అడి
గిన మనవి కొరకు యెహోవా యీ స్త్రీ వల్ల నీకు
సంతానము కలుగ చేసును గాకని దీవించిన తరువాత
21 వారు తమ యింటికి వెళ్లిరి. । కాబట్టి యెహోవా
హన్నాకు దర్శన మిచ్చినందున ఆమె గర్భవతి అయి,
ముగ్గురు కుమాళ్లనున్ను యిద్దరు కుమార్తెలనున్ను
కనెను. మరిన్ని చిన్నవాడైన సమూయేలు యెహో
22 వా సన్నిధి యందు పెరిగెను. । అయితే ఏలీ బహు
వృద్ధయి, ఇశ్రాయేలీయులకు తన కుమాళ్లు చేసిన
కార్యములన్నిటినిన్ని, వారు సంఘముయొక్క డేరా
ద్వారము దగ్గిరకు గుంపు గుంపుగా వచ్చిన స్త్రీలతో
23 శయనించుటయున్ను విన్నాడు. । కాబట్టి అతడు వా
రిని చూచి, యీలాటి కార్యములు మీరు యెందుకు
చేయుచున్నారు! యేమంటే యీ జనుల ముందర
24 మీరు చేసిన చెడ్డ కార్యములు నాకు వినపడినవి. । వొ
నా కుమారులారా, యిది కూడదు, నాకు వినపడినది
మంచిది కాదు; యెహోవాయొక్క జనులను మీరు
25 అతిక్రమింప చేస్తూ వున్నారు. । వొకడు మరి వొక
నికి విరోధముగా పాపము చేస్తే న్యాయాధిపతి విమ
ర్శించి తీర్చును; అయితే వొకడు యెహోవా విష
యమయి పాపము చేస్తే వానికొరకు యెవడు బతిమా
లునని పలికినప్పటికిన్ని వారి తండ్రియొక్క మొర్రను
వారు వినకపోయిరి; కాబట్టి వాండ్లను చంప వలెనని
26 యెహోవా వుండెను. । అయితే చిన్నవాడయిన
సమూయేలు యింకా యెదుగుతూ, యెహోవాకున్ను
27 మనుష్యులకున్ను అనుకూలుడయి వుండెను. । అంతట
దివ్యపురుషుడు వొకడు ఏలీ యొద్దికి వచ్చి, అతనితో
అనిన మాట, యెహోవా నీకు యిచ్చిన సెలవు
యేమంటే, నీ పితృని యింటివారు మిస్రయీము దేశ
మందు ఫరో యింటిలో వున్నప్పుడు నేను వారికి
స్పష్టముగా ప్రత్యక్షమయితినే. । అతడు నా ముందర 28
ఏఫోదును కట్టుకొని, నా బలిపీఠము మీద అర్పణ
మున్ను ధూపమున్ను చెల్లించే నిమిత్తము నాకు
అర్చకుడై వుండేటట్టుగా అతని ఇశ్రాయేలు గోత్ర
ములలోనుంచి యెంచితినే! ఇశ్రాయేలు పుత్రులు
అర్పించిన హోమబలులన్నిటినిన్ని నీ పితృని యిం
టివారికి యిస్తినే. । నా నివాస స్థలమునకు నేను నిర్ణ 29
యించిన బలినిన్ని నా అర్పణనున్ను మీరు యేల తన్ను
తున్నారు! నా జనులయిన ఇశ్రాయేలుయొక్క అర్పణ
లన్నిటియందు వున్న విశేషముచేత మిమ్ము మీరు
క్రొవ్వచేసుకొని, నాకంటే నీ కుమాళ్లను నీవు బహు
మానిస్తున్నావు. । కాబట్టి ఇశ్రాయేలుకు దేవుడయిన 30
యెహోవా సెలవు యేమంటే, నీ యింటివారున్ను
నీ తండ్రి యింటివారున్ను నా సముఖమందు సార్వ
కాలము నడుస్తూ వుందురని యెహోవా అనుకొన్న
ప్పటికిన్ని యిప్పుడు యేమంటే, అది నాకు దూరమ
వును గాక; యెందుకంటే నన్ను ఘనపర్చే వారిని
నేను ఘనపర్తును, నన్ను అలక్ష్యము చేసేవారు తృణీక
రించబడుదురు. । యిదుగో దినములు వస్తూ వున్నవి, 31
అప్పుడు నీ హస్తమున్ను నీ తండ్రి యింటి హస్తము
నున్ను తెగవేతును; అప్పుడు నీ యింట ముసలివాడు
వొక్కడయినా లేక వుండును. । మరిన్ని ఇశ్రాయేలుకు 32
నేను యివ్వ దలచిన భాగ్యమునకు బదులుగా నీవు
నా నివాస స్థలమందు వుపద్రవమును చూతువు.
మరిన్ని యెప్పటికిన్ని నీ యింట ముసలివాడు వొక్క
డూ లేక వుండును. । మరిన్ని నా బలిపీఠము యొద్ద 33
నుంచి తెగవేయబడని వాడు వుంటే, వాడు నీ కండ్లను
క్షీణింప చేయుటకున్ను నీ హృదయమును నొప్పించు
టకున్ను వుండును. నీ యింట వృద్ధి పొందిన వారం
దరున్ను వారి వయఃకాలమందు మరణమవుదురు. ।
మరిన్ని నీ యిద్దరు కుమారులైన హొప్నీకున్ను పీనె 34
హాసుకున్ను సంభవించే దానికి నీకు ఆనవాలు యేమం
టే, వొక్కనాటి యందే వారిద్దరున్ను మరణమవుదు
రు. । అప్పుడు నేను నా కొరకు నమ్రత గల అర్చకుని 35
వుద్భవింప చేతును; నా హృదయములోనున్ను నా
మనస్సులోనున్ను వున్న ప్రకారముగా అతడు చేసు
ను; నేను అతనికి దృఢమయిన యిల్లు కట్టుదును;
అతడు నా అభిషిక్తుని ముందర యెప్పటికిన్ని నడు
చును. । మరిన్ని సంభవించేదేమంటే, నీయింట శేషిం 36
చిన వారిలో ప్రతి మనిషీ అతని యొద్దికి వెండి
ముక్కకోసమున్ను రొట్టె ముక్కకోసమున్ను వచ్చి
వంగి, నేను రొట్టె ముక్క తినేటట్టుగా మీరు దయ

చేసి అర్చకులయొక్క వుద్యోగములలో వొక దాని
యందు నన్ను ప్రవేశింపచేయండని వేడుకొనునన్న
ట్టుగా యెహోవా సెలవు యిచ్చెనని చెప్పెను.

## 3. అధ్యాయము.

1 అయితే చిన్నవాడైన సమూయేలు ఏలీ యెదుట
యెహోవాకు సేవ చేస్తూ వుండెను. మరిన్ని ఆ దిన
ముల యందు యెహోవా వాక్యము అమూల్యముగా
వుండెను; దృశ్యమైన ప్రత్యక్షము లేక వుండెను. ।
2 ఆ కాలమందు సంభవించినదేమంటే, ఏలీ తన స్థల
మందు పడుకొని వుండెను; మరిన్ని అతని కండ్లు మంద
3 దృష్టి కలవైనందున అతడు చూడలేక వుండెను. । మరి
న్ని దేవుని పెట్టె వున్న యెహోవాయొక్క మందిర
మందుండే దీపము ఆరిపోక మునుపు సమూయేలు
4 పడుకొని వుండెను. । అప్పుడు యెహోవా సమూ
యేలును పిలిచినాడు; వాడు యిదుగో నేను అని
5 పలికి, । ఏలీ దగ్గిరకు వచ్చి, నన్ను పిలిస్తివి గనుక యి
దుగో వచ్చినాననెను. అయితే అతడు నేను పిలువ
లేదు, నీవు మళ్లీ పడుకొమ్మని చెప్పినందున వాడు వెళ్లి
6 పడుకొన్నాడు. । తిరిగీ యెహోవా సమూయేలును
పిలిచినాడు; అప్పుడు సమూయేలు లేచి, ఏలీ యొద్దికి
వచ్చి, నీవు నన్ను పిలిస్తివి గనుక యిదుగో వచ్చినా
నని చెప్పెను: అప్పుడు అతడు వొా నా కుమారుడా,
నేను నిన్ను పిలువలేదు, మళ్లీ పడుకొమ్మని చెప్పెను. ।
7 అయితే సమూయేలు అప్పటికీ యెహోవాను యెరు
గకుండా వుండెను; మరిన్ని యెహోవా యొక్క
వాక్యము వానికి యింకా బయిలుపరచబడక వుండె
8 ను. । అయితే యెహోవా మూడోమారు సమూయే
లును పిలిచెను; అప్పుడు వాడు లేచి, ఏలీ దగ్గిరకు
వచ్చి, నీవు నన్ను పిలిస్తివి గనుక వచ్చినానని పలికెను;
అప్పుడు ఏలీ యెహోవా ఆ చిన్నవాని పిలిచెనని
9 గ్రహించెను. । కాబట్టి ఏలీ సమూయేలుతో అనిన
మాట, నీవు వెళ్లి పడుకొమ్ము; తరువాత ఆయన నిన్ను
పిలిస్తే, వొా యెహోవా సెలవివ్వండి, యేమంటే నీ
సేవకుడనయిన నేను వినేనాడనని చెప్పుమనెను. తరు
వాత సమూయేలు వెళ్లి తన స్థలమందు పడుకొన్నా
10 డు. । అప్పుడు యెహోవా వచ్చి నిలిచి, మునుపటి
లాగున వొా సమూయేలా, సమూయేలా, అని పిలిచి
నప్పుడు, సమూయేలు నీ సేవకుడనయిన నేను వింటూ
11 వున్నాను, సెలవు యివ్వండని పలికెను. । అప్పుడు
యెహోవా సమూయేలుతో సెలవు యిచ్చినదేమం
టే, యిదుగో నేను ఇశ్రాయేలులో వొక కార్యమును
చేయబోతున్నాను, అది వినిన వారందరియొక్క చెవు
12 లకు దిమ్మ పట్టును. । ఆ దినమున ఏలీయొక్క యింటిని
గురించి నేను చెప్పినదంతాను వాని మీదికి నేను రా
చేతును; నేను ఆరంభము చేసినప్పుడు సమాప్తము నున్ను
చేతును. । యేమంటే అతనికి తెలిసిన అక్రమము నిమి 13
త్తము అతని యింటికి నిత్యమున్ను న్యాయము తీర్తు
నని నేను అతనితో తెలియ చేస్తిని: యెందుకంటే
అతని కుమారులు తమ్మును తాము శాపగ్రస్తులగా
చేసుకొన్నప్పటికిన్ని అతడు వారిని అడ్డగించలేదు. ।
కాబట్టి నేను ఏలీయొక్క యింటిని గురించి సత్యము 14
చేసినదేమంటే, ఏలీ యింటియొక్క అక్రమము బలి
చేతనయినా అర్పణ చేతనైనా యెన్నటికీ పరిహరిం
చబడక వుండునని సెలవు యిచ్చెను. । తరువాత సమూ 15
యేలు వుదయ పర్యంతమూ పడుకొని లేచి, యెహో
వా మందిరముయొక్క తలుపులను తీసెను; అయితే
సమూయేలు తనకు అగుపడిన ప్రత్యక్షము ఏలీతో
చెప్పుటకు భయపడినాడు. । అప్పుడు ఏలీ వొా నా 16
కుమారుడవైన సమూయేలా, అని సమూయేలును పిలి
చెను; అతడు యిదుగో నేను యిక్కడ వున్నానని
చెప్పెను. । అప్పుడు అతడు నీతో యెహోవా యేమి 17
సెలవు యిచ్చెను? దయచేసి అది నాకు దాచ వద్దు;
ఆయన నీతోటి సెలవు యిచ్చిన సంగతులలో యే
వొకటయినా నీవు దాచినట్టయితే దేవుడు ఆలాగున
నున్ను అంతకంటే అధికమునున్ను నీకు చేసును గాకని
చెప్పెను. । అప్పుడు సమూయేలు అతనికి వొకటయినా 18
దాచక, అంతా తెలియ చెప్పెను; అప్పుడు అతడు
అనినదేమంటే, ఆయన యెహోవా; తనకు యేది
మంచిదో అది చేసును గాకని చెప్పెను. । అంతట 19
సమూయేలు యింకా పెరుగుతూ వుండెను; మరిన్ని
యెహోవా తాను అతనికి తోడుగా వున్నందున
అతని మాటలలో వొకటయినా నేలమీద పడిపోని
చ్చినాడు కాడు. । సమూయేలు యెహోవాయొక్క 20
దీర్ఘదర్శిగా స్థిరపర్చపడెనని దాను మొదలుకొని
బెయేర్షెబ పర్యంతము వుండే ఇశ్రాయేలీయులంద
రికిన్ని తెలియపడెను. । మరిన్ని యెహోవాయొక్క 21
ప్రత్యక్షము షీలోలో తిరగా అగుపడెను, యేమంటే
యెహోవా షీలోలో తనయొక్క వాక్యము చేత
తన్ను సమూయేలుకు ప్రత్యక్షము చేసెను.

## 4. అధ్యాయము.

అయితే సమూయేలుయొక్క వాక్యము ఇశ్రాయే 1
లీయులందరికిన్ని కలిగెను. అంతట ఇశ్రాయేలీయులు
పెలిష్తీయులతో యుద్ధము చేయుటకు బైలు వెళ్లి వచ్చి,
ఎబెనెజరులో దిగిరి; అయితే పెలిష్తీయులు ఆఫెకు
లో దిగిరి. । పెలిష్తీయులు ఇశ్రాయేలు మీద వ్యూహ 2
ముగా తమ్మును యేర్పరచుకొనిరి; అయితే యుద్ధము

కొరకు వారు కలుసుకొనినప్పుడు ఇశ్రాయేలీయులు
ఫిలిష్తీయుల ముందర కొట్టబడినందున వారు యుద్ధ
భూమి యందు ఇశ్రాయేలీయులలో యెక్కువ తక్కువ
3 నాలుగువేల మందిని హతము చేసిరి. । కాబట్టి ఆ జనులు
పేటలోకి తిరుగా వచ్చినప్పుడు ఇశ్రాయేలు పెద్దలు
అనుకొనినదేమంటే, యెహోవా నేటి రోజున మన
లను ఫిలిష్తీయుల ముందర యెందుకు కొట్టెను? షీలో
లో వుండే యెహోవాయొక్క వొడంబడికె గల
పెట్టెను మన దగ్గిరకు తెప్పించుదాము; అది మనలో
వుంటే మన శత్రువుల చేతిలోనుంచి మనలను రక్షిం
4 చునని పలికిరి. । కాబట్టి జనులు షీలోకి కొందరిని
పంపి, అక్కడనుంచి ఖెరుబుల మధ్యమందు నివసిస్తున్న
సైన్యములయొక్క యెహోవా వొడంబడికె గల పెట్టె
ను తెప్పించినారు: మరిన్ని అక్కడ ఏలీయొక్క యిద్దరు
కుమారులైన హొఫ్నీయున్ను ఫీనెహాసున్ను దేవుని
5 యొక్క వొడంబడికె గల పెట్టె యొద్ద వుండిరి. । యె
హోవాయొక్క వొడంబడికె గల పెట్టె పేటలోకి
వచ్చినప్పుడు ఇశ్రాయేలీయులందరున్ను భూమి వాగే
6 టట్టుగా బహుగా ఆర్చినారు. । అయితే ఫిలిష్తీ
యులు ఆ ఆర్పుయొక్క ధ్వని విని, ఇబ్రీయుల
యొక్క పేటలో యీ గొప్ప ఆర్పుయొక్క ధ్వని
యేమని అడిగి, యెహోవాయొక్క పెట్టె పేటలోకి
7 వచ్చెనని తెలుసుకొన్నారు. । అప్పుడు ఫిలిష్తీయులు
జడిసి, దేవుడు పేటలోకి వచ్చెనని అనుకొని, యింకా
పలికినదేమంటే, మనకు అయ్యో, యెందుకంటే యిం
తకు మునుపు యీలాటి కార్యము సంభవించలేదు. ।
8 అయ్యయ్యో! యీ మహాత్వము గల దేవుండ్ల చేతి
లోనుంచి మనలను యెవ్వరు విడిపించగలరు? అరణ్య
మందు అనేకమయిన తెగుళ్లచేత మిస్రీయులను కొట్టిన
9 దేవుండ్లు వీరే సుమా. । వో ఫిలిష్తీయులారా, ఇబ్రీ
యులు మీకు సేవకులైనట్టు మీరు వారికి సేవకులు
కాకుండా ధైర్యము తెచ్చుకొని, బలాఢ్యులై, పోట్లా
10 డండని చెప్పుకొనిరి. । తరువాత ఫిలిష్తీయులు పోట్లా
డినప్పుడు ఇశ్రాయేలీయులు కొట్టబడి, ప్రతి మనిషి
తన తన డేరాకు పరుగెత్తి వచ్చినాడు; ఆ కాలమందు
అత్యధికమైన హతమాయెను, యేమంటే ఇశ్రాయేలీ
11 యులలో ముప్పయివేల కాల్బలము కూలెను. । మరిన్ని
దేవునియొక్క పెట్టె పట్టబడెను; అదిగాక ఏలీయొక్క
యిద్దరు కుమారులయిన హొఫ్నీయున్ను ఫీనెహాసు
12 న్ను హతులయిరి. । అయితే బెన్యామీనీయుడు వొకడు
దండులోనుంచి పరుగెత్తి, ఆ రోజునే చినిగిన బట్టల
తోటిన్ని తల మీది ధూళి తోటిన్ని షీలోలోకి
13 వచ్చెను. । అతడు వచ్చినప్పుడు, యిదుగో, ఏలీ మా
ర్గమందు ఆసనము మీద కూర్చుండి యెదురు చూస్తూ
వుండెను, యెందుకంటే దేవునియొక్క పెట్టె నిమి
త్తము అతని హృదయము వణికెను. ఆ మనుష్యుడు
పట్టణములోకి వర్తమానము తెచ్చినప్పుడు పట్టణ
మంతా కేక వేసెను. । ఏలీ ఆ కేక విన్నప్పుడు యీ 14
ధ్వని యేమి నిమిత్తమని అడిగినాడు; అప్పుడు ఆ మను
ష్యుడు త్వరగా వచ్చి, ఏలీతో చెప్పినాడు. । అయితే 15
ఏలీ తొంభై యెనిమిది సంవత్సరములు గలవాడై వుం
డెను; అతని కండ్లు మంద దృష్టి కలవైనందున అతడు
చూడలేక వుండెను. । ఆ మనుష్యుడు ఏలీతో అనిన 16
దేమంటే, దండులోనుంచి వచ్చినవాడు నేనేను; నేటి
రోజున దండులోనుంచి పరుగెత్తి వచ్చినానని చెప్పిన
ప్పుడు, అతడు వో నా కుమారుడా, అక్కడ యేమి
జరిగెనని అడిగితే, । వాడు చెప్పిన వర్తమానము యే 17
మంటే, ఇశ్రాయేలీయులు ఫిలిష్తీయుల ముందరనుంచి
పారిపోయిరి; జనులలో అత్యధికమయిన హతమా
యెను; నీ యిద్దరు కుమారులైన హొఫ్నీయున్ను ఫీనె
హాసున్ను మరణమయినారు; మరిన్ని దేవునియొక్క
పెట్టె పట్ట పడెనని చెప్పెను. । అయితే దేవునియొక్క 18
పెట్టెను గురించి వాడు చెప్పినప్పుడు సంభవించినదే
మంటే, ఏలీ ద్వార సమీపాసనము మీదనుంచి వెను
కకు పడి, మెడ విరిగిపోయినందున మరణమాయెను,
యేమంటే అతడు వృద్ధుడయి భారము గలవాడై వుండెను.
అతడు నలుబై సంవత్సరములు ఇశ్రాయేలుకు న్యాయ
ము తీర్చెను. । అయితే ఫీనెహాసుయొక్క భార్య 19
అయిన అతని కోడలు అప్పటికీ గర్భిణి అయి, ప్రస
వము కాబోయేదై వుండెను. ఆమె దేవునియొక్క
పెట్టె పట్టపడెననిన్ని తన మామయున్ను తన పెని
మిటిన్ని మరణమైనారనిన్ని విన్నప్పుడు, ప్రసవ వేదన
ఆమె మీదికి వచ్చినందున ఆమె వంగి ప్రసవమాయె
ను. । అయితే ఆమెకు మరణము సంభవించినప్పుడు, 20
దగ్గిర నిలిచి వున్న స్త్రీలు ఆమెతో భయపడవద్దు,
కుమారుని కంటివని చెప్పినప్పుడు, ఆమె ప్రత్యుత్త
రము యివ్వక లక్ష్యపెట్టక వుండెను. । అయితే మహిమ 21
ఇశ్రాయేలులోనుంచి వెళ్లి పోయెనని చెప్పి, పిల్లకు
ఈఖాబోదు అనే పేరు బెట్టెను, యెందుకంటే దేవు
నియొక్క పెట్టె చేరలోకి తీసుకపోపడెననిన్ని, తన
మామయున్ను తన పెనిమిటిన్ని మరణమయిరనిన్ని, ।
దేవునియొక్క పెట్టె పట్ట బడినందున మహిమ ఇశ్రా 22
యేలులోనుంచి వెళ్లి పోయెనని ఆమె పలికెను.

## 5. అధ్యాయము.

అయితే ఫిలిష్తీయులు దేవునియొక్క పెట్టెను 1
పట్టుకొని, ఎబెనెజరునుంచి అష్డోదుకు తీసుక వచ్చి
నారు. । మరిన్ని ఫిలిష్తీయులు దేవునియొక్క పెట్టెను 2

పట్టినప్పుడు వారు దాని దాగోను గుడిలోకి తీసుక
3 వచ్చి దాగోను యెదుట పెట్టినారు. । అయితే మరు
నాటి యందు అష్డోదువారు ప్రాతఃకాలమందు లేచి
నప్పుడు, యిదుగో దాగోను యెహోవాయొక్క
పెట్టె ముందర కూలి, నేల మీద బోర్లపడి వుండెను.
అప్పుడు వారు దాగోనును పట్టుకొని యథా స్థాన
4 మందు తిరిగి వుంచిరి. । ఆ మరునాటి యందున్ను
వారు వుదయాననే లేచినప్పుడు, యిదుగో దాగోను
యెహోవాయొక్క పెట్టె యెదురుగా కూలి, నేల
మీద బోర్లపడి వుండెను: దాగోనుయొక్క శిరస్సు
న్ను అరిచేతులు రెండున్ను తెగవేయపడి గడప దగ్గిర
వుండెను; మొండెము మాత్రము అతనికి వుండిపో
5 యెను. । కాబట్టి అష్డోదులో దాగోనుయొక్క గుడి
గడపను దాగోనుయొక్క అర్చకులున్ను దాగోను
గుడికి వచ్చేవారందరున్ను నేటి వరకు తొక్కకుండా
6 వున్నారు. । అయితే యెహోవాయొక్క హస్తము
అష్డోదు వారి మీద భారముగా వుండెను, యేమంటే
ఆయన వారిని మూలశంక రోగముతో మొత్తి, అష్డో
దునున్ను దాని ప్రాంతములనున్ను పాడు చేసెను. ।
7 అష్డోదు జనులు సంభవించిన దాని చూచి అనుకొన్న
దేమంటే, ఇశ్రాయేలుయొక్క దేవుని పెట్టె మనలో
వుండ కూడదు, యేమంటే ఆయనయొక్క హస్తము
మన మీదనున్ను మన దేవుడైన దాగోను మీదనున్ను
8 బహు కఠినముగా వున్నదని చెప్పుకొనిరి. । కాబట్టి
వారు పెలిష్తీయులయొక్క అధికారులనందరినిన్ని పిలు
వనంపించి, వారిని చూచి, ఇశ్రాయేలుయొక్క దేవుని
పెట్టె యేమి చేతామని అడిగినారు. అందుకు వారు
ఇశ్రాయేలుయొక్క దేవుని పెట్టె యిక్కడనుంచి గాతు
పట్టణమునకు పంప వచ్చునని పలికినందున ఇశ్రాయే
లుయొక్క దేవుని పెట్టెను యిక్కడనుంచి అక్కడికి
9 మోసుక వెళ్లిరి. । అయితే యిక్కడనుంచి అక్కడికి వారు
దాని మోసుకపోయిన తరువాత సంభవించినదేమంటే
యెహోవాయొక్క హస్తమువల్ల ఆ పట్టణమునకు గొప్ప
నాశనము కలిగెను; యేమంటే ఆయన ఆ పట్టణపు
పెద్దలనున్ను పిన్నలనున్ను మొత్తినందున వారియొ
క్క రహస్య స్థానముల యందు మూలశంకలు కలిగి
10 వుండెను. । కాబట్టి వారు దేవునియొక్క పెట్టెను
ఎక్రోనుకు పంపివేసినారు; అయితే దేవునియొక్క
పెట్టె ఎక్రోనులోకి వచ్చినప్పుడు సంభవించినదేమం
టే, ఎక్రోనీయులు కేకవేసి, వీరు మనలనున్ను మన
జనులనున్ను చంపివేసే కొరకు ఇశ్రాయేలు దేవునియొ
క్క పెట్టెను అక్కడనుంచి యిక్కడికి తీసుక వచ్చి
11 రని చెప్పుకొనిరి. । అయినందున వారు పెలిష్తీయుల
యొక్క అధికారులనందరినిన్ని పిలువనంపించి, వారిని
చూచి, ఇశ్రాయేలుయొక్క దేవుని పెట్టె మనలనున్ను
మన జనులనున్ను చంపకుండా స్వస్థానమునకు దాని
పంపించండని చెప్పిరి; యెందుకంటే దేవునియొక్క
హస్తము అక్కడ బహు భారముగా వున్నందున ఆ
పట్టణమంతటికీ మరణకరమయిన నాశనము కలిగివుం
డెను. । మరిన్ని మరణము కాక వుండిన వారు మూల 12
శంకలచేత మొత్తబడిరి. కాబట్టి ఆ పట్టణపు కేక ఆకా
శము మీదికి యెక్కెను.

## 6. అధ్యాయము.

అయితే యెహోవాయొక్క పెట్టె యేడు నెల 1
లు పెలిష్తీయులయొక్క దేశమందు వుండెను. । అప్పు 2
డు పెలిష్తీయులు అర్చకులనున్ను శకునము చూచే
వారినిన్ని పిలువనంపించుకొని, యెహోవాయొక్క
పెట్టె యేమి చేతుము? స్వస్థలమునకు దాని యేలాగున
పంపుదుమో అది మాతో చెప్పండని పలికిరి. । అందుకు 3
వారు చెప్పినదేమంటే, ఇశ్రాయేలుయొక్క దేవుని
పెట్టెను పంపివేయవలెనని మీకు వుంటే దాని వట్టి
దిగా పంపకూడదు, యే విధముచేతనైనా ఆయనకు
వొక తప్పితపు అర్పణ చెల్లించ వలసినది, అప్పుడు
మీరు స్వస్థపడుదురు; ఆయన హస్తము మీ మీదనుంచి
యెందుకు తియ్యబడక వుండెనో అది మీకు తెలి
యబడునని చెప్పిరి. । అప్పుడు వారు ఆయనకు మనము 4
చెల్లించ వలసిన తప్పితపు అర్పణ యెట్టిదని వారిని అడి
గితే అందుకు వారు చెప్పినదేమంటే, పెలిష్తీయుల
యొక్క అధికారుల లెక్క చొప్పున అయిదు బంగా
రపు మూలశంకల రూపములున్ను అయిదు బంగా
రపు చుంచులున్ను కావలెను, యేమంటే మీ అందరి
మీదనున్ను మీ అధికారులందరి మీదనున్ను వున్న
తెగులు వొక్కటై వుండెను. । కాబట్టి మీకు కలిగిన 5
మూలశంకలకున్ను భూమిని పాడుచేసే చుంచులకున్ను
రూపములు చేసుకొని, ఇశ్రాయేలుయొక్క దేవునికి
మహిమను చెల్లించ వలసినది; అప్పుడు ఆయన మీ
మీదనుంచిన్ని మీ దేవుండ్ల మీదనుంచిన్ని మీ భూమి
మీదనుంచిన్ని తన భారమయిన హస్తమును తీసును
కాబోలును. । మిస్రీయులున్ను ఫరోయున్ను తమ 6
తమ హృదయములను కఠినము చేసుకొనినలాగున
మీరు మీ హృదయములను కఠినము చేయనేల? వారి
లో ఆయన వింతలను చేసిన తరువాత వారు యీ జను
లను పోనిచ్చినందున వారు తర్లిపోయిరిగదా! ।
కాబట్టి మీరు వొక కొత్త బండిని చేయించి, కాడి 7
మొయ్యని పాడి ఆవులను రెంటిని తెచ్చి, బండికి కట్టి,
వాటి పెయ్యలను వాటి దగ్గిరనుంచి యింటికి పంపించి, ।
యెహోవాయొక్క పెట్టె ఆ బండి మీద యెత్తి, 8

ఆయనకు మీరు తప్పితపు అర్పణగా యివ్వ వలసిన
బంగారపు వస్తువులు దాని పక్కనే చిన్న పెట్టెలో
వుంచి, అది దాని మార్గమున వెళ్లేటట్టుగా విడచి
9 పెట్టండి. । అది దాని దిక్కుయొక్క మార్గమున బేత్షె
మెషుకు తర్లిపోతే ఆయనే యీ గొప్ప మోసము
మనకు చేసెనని యెంచుకో వలెను, లేని పక్షమందు
ఆయన హస్తము మనలను కొట్టినది కాదు, అయితే
మన దురదృష్టముచేత మనకు అది సంభవించెనని తెలు
10 సుకొందుమని చెప్పిరి. । కాబట్టి వారు ఆలాగున రెండు
పాడి ఆవులను తెచ్చి బండికి కట్టి, వాటి పెయ్యలను
11 యింటిలోపల మూసి, । యెహోవాయొక్క పెట్టె
నున్ను బంగారపు చుంచులున్ను మూలశంక రూప
ములు గల చిన్న పెట్టెనున్ను బండిమీద యెత్తిరి. ।
12 అప్పుడు ఆ ఆవులు బేత్షెమెషు మార్గమునకు వెళ్లే
మార్గమున తిన్నగా వెళ్లుతూ, అంభాయని అరుస్తూ,
యీ తట్టు ఆ తట్టు తిరుగకుండా వెళ్లిపోయెను; మరి
న్ని పెలిష్తీయులయొక్క అధికారులు వాటి వెంబడినే
13 బేత్షెమెషు సరిహద్దు మట్టుకు వెళ్లినారు. । అయితే
బేత్షెమెషు వారు లోవలో తమ గోధుమ చేనులను
కోస్తూ వుండిరి; అప్పుడు వారు తమ కన్నులెత్తి పెట్టెను
14 చూడగా దాని చూచుటకు సంతోషించిరి. । అయితే
ఆ బండి బేత్షెమీయుడయిన యెహోషువయొక్క
పొలములోకి వచ్చి అక్కడ వున్న వొక పెద్ద రాతి
దగ్గిర నిలిచెను; అప్పుడు వారు బండియొక్క కర్రలను
పగల గొట్టి; ఆవులను యెహోవాకు హోమబలిగా
15 అర్పించిరి. । అయితే లేవీయులు యెహోవాయొక్క
పెట్టెనున్ను బంగారపు వస్తువులు గల చిన్న పెట్టె
నున్ను దించి, ఆ పెద్ద రాతి మీద పెట్టినారు; మరిన్ని
ఆ దినమందే బేత్షెమీయులు హోమార్పణలనున్ను
16 బలులనున్ను యెహోవాకు చెల్లించినారు. । అయితే
పెలిష్తీయులయొక్క అధికారులు అయిదుగురు దాని
చూచి తిరిగీ ఆ దినమందే ఎక్రోనుకు వచ్చినారు. ।
17 పెలిష్తీయులు తప్పితపు అర్పణలుగా యెహో
వాకు చెల్లించిన బంగారపు మూలశంక రూపములు
యేవేవంటే, అష్డోదు నిమిత్తము వొకటిన్ని, గాజా
నిమిత్తము వొకటిన్ని, అష్కెలోను నిమిత్తము వొక
టిన్ని, గాతు నిమిత్తము వొకటిన్ని, ఎక్రోను నిమి
18 త్తము వొకటిన్ని అయి వుండెను. । మరిన్ని బంగా
రపు చుంచులు అయిదుగురు అధికారుల సంబంధమైన
పెలిష్తీయులయొక్క పట్టణముల లెక్కచొప్పనవై వుం
డెను: వీరి కింద ప్రాకారములు గల పట్టణములున్ను
బయిట వూళ్లున్ను ఆబేలు అనే పెద్ద రాతి మట్టుకు
వుండే దేశమంతానున్ను వుండెను; ఆ రాతి మీద వారు
యెహోవాయొక్క పెట్టెను దించిరి; అది నేటివరకు
బేత్షెమీయుడయిన యెహోషువయొక్క పొలములో
వున్నది. । అయితే బేత్షెమీయులు యెహోవాయొక్క 19
పెట్టె లోపల చూచిరి గనుక ఆయన వారిని కొట్టి
నాడు; ఆ జనులలో ఆయన యాభైవేల డెబ్బయిమం
దిని కొట్టినాడు; అయినందున జనులు రోదనము
చేసిరి, యెందుకంటే యెహోవా మహా హత్యచేత
జనులలో అనేకులను కొట్టినాడు. । అప్పుడు బేత్షెమీ 20
యులు అనుకొన్నదేమంటే, పరిశుద్ధుడయిన యెహో
వా అనే యీ దేవుని యెదుట యెవరు నిలువ గలరు?
ఆయన మన యొద్దనుంచి మరి యెవరి యొద్దికి వెళ్లును
అని అనుకొనిరి. । అంతట వారు కిర్యత్యెయారీము కా 21
పురస్తులకు దూతలను పంపి చెప్పుమనినదేమంటే, పెలి
ష్తీయులు యెహోవాయొక్క పెట్టెను తిరుగా
తీసుక వచ్చినారు; మీరు దిగి వచ్చి మీ యొద్దికి దాని
తీసుక పోవలెనని చెప్పుమనిరి.

## 7. అధ్యాయము.

అంతట కిర్యత్యెయారీము జనులు వచ్చి, యెహో 1
వాయొక్క పెట్టెను తీసుకపోయి, కొండయందుండే
అబీనాదాబుయొక్క యింటిలోకి తెచ్చి వుంచి, అతని
కుమారుడయిన ఎలాజారును యెహోవాయొక్క
పెట్టెను కనిపెట్టడానకు పరిశుద్ధుని చేసిరి. । అయితే 2
పెట్టె కిర్యత్యెయారీములో వుంటూ వున్నప్పుడు దీర్ఘ
కాలమాయెను, అనగా, యిరువై సంవత్సరములాయెను;
అప్పుడు ఇశ్రాయేలు యింటివారందరున్ను యెహో
వా విషయమై దుఃఖిస్తూ వుండిరి. । అప్పుడు సమూ 3
యేలు ఇశ్రాయేలు యింటి వారందరితో అనినదేమం
టే, యెహోవా యొద్దికి మీ పూర్ణ హృదయము
లతోను మీరు మళ్లుకొనే వారైతే మీరు యితర
దేవుండ్లనున్ను అష్తారోతునున్ను మీలోనుంచి పరిహ
రించి యెహోవా విషయమై మీ హృదయములను
సిద్ధపర్చి ఆయనకు మాత్రమే సేవించ వలసినది, అప్పు
డు ఆయన మిమ్మును పెలిష్తీయుల చేతిలోనుంచి విడి
పించునని చెప్పెను. । అప్పుడు ఇశ్రాయేలు పుత్రులు 4
బయలీమునున్ను అష్తారోతునున్ను పరిహరించి, యె
హోవాను మాత్రమే సేవించిరి. । అంతట సమూయేలు 5
ఇశ్రాయేలీయులందరినిన్ని మిస్పెకు పిలువండి, అప్పు
డు మీ కొరకు యెహోవాను ప్రార్థన చేతునని
చెప్పినందున, । వారు మిస్పెలో కూడుకొని నీళ్లు తోడి 6
యెహోవా యెదుట కుమ్మరించి, ఆ రోజున వుపవా
సము వుండి, యెహోవాకు విరోధముగా మేము
పాపము చేస్తిమని పలికిరి: మరిన్ని సమూయేలు మిస్పె
లో ఇశ్రాయేలు పుత్రులకు న్యాయము తీర్చెను. ।
అయితే ఇశ్రాయేలు పుత్రులు మిస్పెలో కూడి యు 7

న్నారని పెలిష్తీయులు విన్నప్పుడు పెలిష్తీయులయొక్క
అధికారులు ఇశ్రాయేలు మీదికి వచ్చిరి: యీ సంగతి
ఇశ్రాయేలు పుత్రులు విని, పెలిష్తీయులకు భయపడి,।
8 సమూయేలుతో చెప్పినదేమంటే, మన దేవుడయిన
యెహోవా మనలను పెలిష్తీయుల చేతిలోనుంచి
రక్షించేటట్టుగా మా కొరకు ఆయనను ప్రార్థన
9 చేయుట మాన వద్దని వేడుకొనిరి.। అయినందున సమూ
యేలు పాలు విడువని వొక గొర్రెపిల్లను తెచ్చి, అది
అంతా యెహోవాకు హోమ బలిగా అర్పించి,
ఇశ్రాయేలు కొరకు యెహోవాను ప్రార్థన చేసె
ను; అప్పుడు యెహోవా అతని ప్రార్థన వినెను.।
10 యేమంటే సమూయేలు హోమబలి చెల్లిస్తూ వుండ
గా పెలిష్తీయులు యుద్ధము చేయుటకు ఇశ్రాయేలుకు
యెదురుగా వచ్చిరి; అయితే యెహోవా ఆ రోజున
పెలిష్తీయుల మీద గొప్పగా వురిమేటట్టు చేసి, వారిని
విభ్రాంతి పర్చినందున వారు ఇశ్రాయేలు ముందర
11 కొట్టబడిరి.। మరిన్ని ఇశ్రాయేలీయులు మిస్పెలో
నుంచి బయిలు వెళ్లి, బేత్కారు మట్టుకు పెలిష్తీయు
12 లను తరిమి కొట్టినారు.। అప్పుడు సమూయేలు వొక
రాయి తీసి, మిస్పెకున్ను షేనుకున్ను మధ్యను నిలిపి,
యిప్పటికి యెహోవా మనకు సహాయము చేసెనని
పలికి, దాని ఎబెనెజరు అనే పేరున పిలిచినాడు.।
13 యీలాగున పెలిష్తీయులు అణచబడినందున అప్పటి
నుంచి ఇశ్రాయేలు సరిహద్దులోకి తిరుగా రాకుండా
వుండిరి; మరిన్ని యెహోవాయొక్క హస్తము సమూ
యేలుయొక్క యావద్దినముల పర్యంతమూ పెలిష్తీ
14 యుల మీద వుండెను.। మరిన్ని పెలిష్తీయులు ఇశ్రా
యేలు యొద్దనుంచి తీసుకొనిన పట్టణములు ఇశ్రాయే
లుకు తిరిగీ వచ్చెను, యేమంటే ఎక్రోను మొదలు
కొని గాతు పర్యంతము వున్న వూళ్లనున్ను వాటి
సంబంధమయిన భూములనున్ను ఇశ్రాయేలు పెలిష్తీ
యుల చేతిలోనుంచి విడిపించెను: అయితే ఇశ్రాయే
లీయులకున్ను ఎమొరీయులకున్ను సమాధానము కలిగి
15 వుండెను.। మరిన్ని సమూయేలు తాను బ్రతికిన దిన
ములన్నిటి పర్యంతమూ ఇశ్రాయేలుకు న్యాయమును
16 తీర్చుతూ వుండెను.। అతడు ప్రతి సంవత్సరమందు
బేతేలుకున్ను గిల్గాలుకున్ను మిస్పెకున్ను సంచరిస్తూ,
ఆ స్థలముల యందు ఇశ్రాయేలీయులకు న్యాయము
17 తీర్చి రామాకు తిరిగీ వస్తూ వుండెను.। యేమంటే
అతని యిల్లు అక్కడ వుండెను; అక్కడ అతడు
ఇశ్రాయేలుకు న్యాయము తీర్చెను; మరిన్ని అక్కడ
అతడు యెహోవా విషయమై వొక బలిపీఠమును
కట్టెను.

## 8. అధ్యాయము.

సమూయేలు వృద్ధుయినప్పుడు సంభవించినదేమం 1
టే, అతడు తన కుమారులను ఇశ్రాయేలుమీద న్యాయా
ధిపతులగా నిర్ణయించెను.। అతని ప్రథమ పుత్రుని 2
పేరు యోవేలు అనిన్ని, రెండో పుత్రుని పేరు అబీ
యా అనిన్ని వుండెను; వీరు బెయేర్షెబలో న్యాయా
ధిపతులయి వుండిరి.। అయితే అతని కుమారులు అతని 3
మార్గములయందు నడవక, ధనాపేక్షులై తిరిగి, లంచ
ములు పుచ్చుకొని న్యాయము తిప్పిన వారైరి.। అప్పు 4
డు ఇశ్రాయేలు పెద్దలందరున్ను కూడుకొని రామాలో
సమూయేలు యొద్దికి వచ్చి,। అతనితో అనినదేమంటే, 5
ఇదుగో నీవు ముసలి వాడవై యున్నావు; నీ కుమా
రులు నీ మార్గముల యందు నడవక యున్నారు; కా
బట్టి సకల జనాంగములయొక్క ప్రకారము మాకు
న్యాయము తీర్చేటట్టుగా మా కొరకు వొక రాజును
నిర్ణయించ వలెనని చెప్పిరి.। అయితే మాకు న్యా 6
యము తీర్చేటట్టుగా రాజును నిర్ణయించుమని
వారు చెప్పిన మాట సమూయేలు దృష్టికి యోగ్యము
కాక వుండెను; అయినందున సమూయేలు యెహో
వాను ప్రార్థన చేసెను.। అప్పుడు యెహోవా 7
సమూయేలుకు సెలవు యిచ్చినదేమంటే, జనులు నీతో
చెప్పిన మాటలు అన్నిన్ని విని చేయుము, యేమంటే
వారు నిన్ను విసర్జించ లేదు గాని నేను వారిని
యేలకుండా వారు నన్నే విసర్జించుకొని వున్నారు.।
అయితే యిది నేను వారిని మిస్రయీములోనుంచి 8
యివతలకు రప్పించిన నాటనుంచి నేటి వరకు వారు
చేసిన కార్యములన్నిటి ప్రకారముగానే వున్నది,
యేమంటే వాటివల్ల వారు నన్ను విడచి పెట్టి యితర
దేవుండ్లకు కొలిచిరి, ఆలాగున నీ పట్లనున్ను చేస్తూ
వున్నారు.। కాబట్టి వారు చెప్పిన మాటలు నీవు ఆల 9
కించుము; అయినప్పటికిన్ని నీవు వారితో దృఢము
గా పలికిన తరువాత అప్పుడు వారిని యేలే రాజు
యొక్క కర్తృత్వము వారికి తెలియ చేయుమని సెలవు
యిచ్చెను.। అప్పుడు సమూయేలు తనను రాజును అడి 10
గిన జనులతో యెహోవాయొక్క వాక్యములన్నిన్ని
చెప్పి,। మరిన్ని వారితో అనినదేమంటే, మిమ్మును 11
యేలే రాజుయొక్క కర్తృత్వము యీ ప్రకారముగా
వుండును; అతడు మీ కుమారులను పట్టి తన కొర
కున్ను తన రథముల కొరకున్ను తనకు రౌతులౌటకున్ను
నిర్ణయించును; కొందరు తన రథముల ముందర పరు
గెత్తుదురు.। మరిన్ని రాణువలో సహస్రాధి పతులగా 12
నున్ను శతాధి పతులగానున్ను తన కొరకు నిర్ణ
యించుకొనును; మరిన్ని తన భూములను దున్ను

టకున్ను తన కోత కోయుటకున్ను తన యుద్ధపు
ఆయుధములనున్ను తన రథముల ఆయుధములనున్ను
13 చేయుటకున్ను నిర్ణయించుకొనును. । మరిన్ని మీ
కుమార్తెలను కజ్జపు వాండ్లగానున్ను పచనకర్తల
గానున్ను రొట్టెలు కాల్చే వాండ్లగానున్ను తీసుకొ
14 నును. । మరిన్ని మీ పొలములనున్ను మీ ద్రాక్ష
తోటలనున్ను యిప్ప తోటలనున్ను అనగా వాటిలో
విశేషమైన వాటిని పుచ్చుకొని తన సేవకులకు
15 యిచ్చును. । మరిన్ని మీ పంటలోనున్ను ద్రాక్ష
పండ్లలోనున్ను పదో భాగము తీసి, తన ప్రధానుల
16 కున్ను సేవకులకున్ను యిచ్చును. । మరిన్ని మీ పని
వాండ్లనున్ను పనికత్తెలనున్ను మీ పడుచువాండ్లలో
యింపయిన వాండ్లనున్ను మీ గార్దభములనున్ను
17 పట్టి తన పని కొరకు వుంచుకొనును. । మీ మందలో
పదోభాగము పుచ్చుకొనును; మరిన్ని మీరు అతనికి
18 దాసులౌదురు. । కాబట్టి ఆ దినమందు మీరు యెంచు
కొనిన రాజు నిమిత్తము మీరు మొర్రబెట్టుదురు,
అయితే ఆ దినమందు యెహోవా మీ మొర్ర వినక
19 వుండునని చెప్పెను. । అయినప్పటికిన్ని జనులు సమూ
యేలుయొక్క మాట వినుటకు మనస్సు లేక వుండి
20 పలికినదేమంటే, ఆలాగు కాదు, । మేము సకల జనాం
గముల వలెనే వుండుటకున్ను మా రాజు మాకు న్యా
యము తీరుస్తూ మాకు ముందుగా బయలు వెళ్లి మా యు
ద్ధములను చేస్తూ వుండుట కొరకున్ను మా పయిని వొక
21 రాజు కావలెనని పలికిరి. । అయినందున సమూయేలు
జనులయొక్క మాటలన్నిన్ని విని, యెహోవా సన్ని
22 ధియందు చెప్పెను. । అప్పుడు యెహోవా సమూ
యేలుకు చెప్పినదేమంటే, నీవు వారియొక్క మాటలు
విని, వారికి వొక రాజును నిర్ణయించుమని చెప్పెను;
అప్పుడు సమూయేలు ఇశ్రాయేలీయులను చూచి
మీలో ప్రతిమనిషీ తన తన వూరికి వెళ్లండని చెప్పెను.

## 9. అధ్యాయము.

1 అఫీయకు పుట్టిన బెఖోరతు కుమారుడయిన సెరో
రుకు పుట్టిన అబీయేలుయొక్క కుమారుడైన కీషు అనే
పేరుగల బెన్యామీను సంబంధమయిన వొకడు కలడు;
అతడు బెన్యామీనీయుడై గొప్ప బలశాలియై వుం
2 డెను. । అతనికి సౌలు అనే పేరు గల కుమారుడు
కలిగి వుండెను; వీడు బహు సౌందర్యము గల పడుచు
వాడై వుండెను; చూచుటకు ఇశ్రాయేలు పుత్రులలో
వానికంటే సౌందర్యము గల వాడు వొకడూ లేడు;
భుజములు మొదలుకొని పయిగా జనులందరికంటే
3 అతడు పొడవుగా వుండెను. । అయితే సౌలుకు తండ్రి
యైన కీషుయొక్క గార్దభములు తప్పి పోయెను;
కాబట్టి కీషు తన కుమారుడయిన సౌలును చూచి, నీవు
లేచి సేవకులలో వొకని తీసుకొని వెళ్లి గార్దభము
లను వెతుకుమని చెప్పెను. । అప్పుడు అతడు తర్లి 4
ఎఫ్రాయీము పర్వతమును గడచి, షాలీషా దేశమును
దాటినాడు; అయితే అవి కనిపించినవి కావు; తరు
వాత వారు షయలీము దేశమును దాటినారు, అయితే
అవి అక్కడ లేవు; మరిన్ని బెన్యామీనీయుల దేశ
ము దాటినాడు అయితే అవి వారికి దొరక లేదు. ।
అయితే వారు సూఫు దేశానకు వచ్చినప్పుడు సౌలు 5
తన యొద్ద వున్న సేవకునితో అనిన మాట, రా, మనము
తిరిగి వెళ్లుదాము; నా తండ్రి గార్దభముల కొరకు
చింతించక మన కొరకు విచారపడునేమో యని చెప్పె
ను. । అందుకు అతనితో వాడు యిదుగో, యీ పట్ట 6
ణమందు దివ్య పురుషుడువొకడు గలడు, అతడు బహు
ఘనుడు; యే మాట అతడు చెప్పునో అది సంభవిం
చును; మనము వెళ్లవలసిన మార్గము అతడు తెలియ
చేసునేమో అతని యొద్దకు వెళ్లుదామని చెప్పినప్పుడు;।
సౌలు తన సేవకునితో యిదుగో, మనము వెళ్లినట్టయితే 7
ఆ మనిషి నిమిత్తము యేమి తీసుక వత్తాము? యేమంటే
మన సామగ్రిలో వుండే రొట్టెలు సరిపడినవి; ఆ దివ్య
పురుషునికి కానుక తీసుక రావడానకు యేమీ లేదు;
మన యొద్ద యేమి వున్నదని పలికినందున; । ఆ సేవ 8
కుడు సౌలుతో యిదుగో, నా చేతిలో పావు షెకేలు
వెండి వున్నది, అది మన మార్గము తెలియ చెప్పడా
నకు ఆ దివ్య పురుషునికి యిస్తానని ప్రత్యుత్తరము
గా చెప్పెను. । పూర్వము ఇశ్రాయేలులో యెవడయి 9
నా దేవుని యొద్ద ఆలోచన పుచ్చుకొనుటకు వెళ్లే
వాడయితే మనము ప్రదర్శకుని యొద్దకు వెళ్లుదా
మని చెప్పును, యెందుకంటే యిప్పుడు దీర్ఘదర్శి
యని పిలువబడుతున్న వాడు పూర్వము ప్రదర్శకు
డని పిలువబడుతూ వుండెను. । అయితే సౌలు తన 10
సేవకునితో ఆ మాట యోగ్యమే, వెళ్లుదాము రమ్మని
చెప్పెను. । కాబట్టి వారు దివ్య పురుషుడు వుండే 11
వూరిలోకి వెళ్లిరి. అయితే వూరిలోకి వెళ్లే కొండ
వారు యెక్కుతూ వుండగా నీళ్లు తోడడానకు వచ్చిన
పడుచువాండ్లను వారు చూచి, యిక్కడ ప్రదర్శ
కుడు వున్నాడా అని అడిగిరి. । అందుకు వారు ప్రత్యు 12
త్తరముగా అతడు వున్నాడు, అదుగో మీ యెదు
టనే వున్నాడు, త్వరగా వెళ్లండి, యీ రోజున అతడు
యీ వూరికి వచ్చినాడు, యేమంటే నేటి రోజున
జనులు వున్నతమయిన స్థలమందు బలి చెల్లిస్తూ వున్నా
రు. । వూరిలోకి మీరు వచ్చిన తక్షణమందు అతడు 13
భోజనము చేయుటకు వున్నతమయిన స్థలమునకు
వెళ్లక మునుపే మీరు అతని కనుగొందురు; అతడు

రాక మునుపు జనులు భుజించరు, యేమంటే అతడు
బలిని ఆశీర్వదించ వలెను; అది అయిన తరువాత పిలు
వబడిన వారు భుజింతురు; కాబట్టి మీరు యెక్కి
పొండి, అతని చూచుటకు ఇదే సమయమని చెప్పిరి.।
14 అయినందున వారు యెక్కి వూరికి వచ్చినారు; అయితే
వూరిలోకి ప్రవేశించినప్పుడు, యిదుగో, సమూయేలు
వున్నతమయిన స్థలమునకు వెళ్లడానకు వారికి యెదు
15 రుగా వచ్చినాడు.। సౌలు వచ్చిన నాటి వెనుకటి రో
జున యెహోవా సమూయేలు చెవిలో తెలియచేసిన
16 దేమంటే,। రేపు యీ వేళప్పుడు నేను బెన్యామీను
దేశములోనుంచి వొకని నీ యొద్దకు వచ్చేటట్టు చేతును;
వాడు నా జనులను పెలిష్తీయుల చేతిలోనుంచి విడి
పించేటట్టుగా మా జనులైన ఇశ్రాయేలు మీద వాని
అధిపతిగా అభిషేకము చేయుము; నా జనులయొక్క
మొర్ర నా యొద్దికి వచ్చెను గనుక నేను వారిని
17 దృష్టించి వున్నాను అని సెలవు యిచ్చి వుండెను.। కా
బట్టి సమూయేలు సౌలును చూచినప్పుడు, యెహోవా
అతనితో, యిదుగో, నేను నీతో చెప్పిన మనిషి వీడే,
వీడు నా జనులపై ప్రభుత్వము చేసునని సెలవు యి
18 చ్చెను.। సౌలు గవిని యందు సమూయేలును చేరి ప్రద
ర్శకుని యిల్లు యెక్కడో దయ చేసి నాతో చెప్పు
19 మని అడగగా,। సమూయేలు సౌలుతో నేనే ప్రద
ర్శకుడను, నాకంటే ముందుగా మీరు వున్నతమైన
స్థలమునకు వెళ్లండి, యేమంటే నేటి రోజున మీరు
నాతో కూడా భుజించ వలెను; రేపు నీ హృదయము
లో వున్నదంతా నీకు తెలియచేసి నిన్ను వెళ్లనిస్తాను.।
20 మూడు రోజులు కిందట తప్పిపోయిన నీయొక్క గా
ర్దభములను గూర్చి విచారపడకు, యేమంటే అవి
దొరికినవి; ఇశ్రాయేలుయొక్క అభీష్టము యెవరి
యందు వున్నది? నీ యందున్ను నీ తండ్రియొక్క
21 యింటి అంతటి యందున్ను లేదా అని పలికెను.। అం
దుకు సౌలు ప్రత్యుత్తరముగా చెప్పినదేమంటే, నేను
బెన్యామీనీయుడను కానా? నా గోత్రము ఇశ్రా
యేలు గోత్రములలో స్వల్పమైనది కాదా? మరిన్ని
నా యింటి కూటము బెన్యామీను గోత్రపు యింటి
కూటములన్నిటిలో అల్పమైనది కాదా? కాబట్టి నా
తో యీలాగున యెందుకు పలుకుతున్నావు అని పలి
22 కెను.। అయితే సమూయేలు సౌలునున్ను అతని సేవ
కునిన్ని భోజనపు సాలలోకి తీసుక వచ్చి, దాదాపుగా
ముప్పయి మంది సంఖ్య గల పిలువబడిన వారిలో ప్ర
23 ధాన స్థలమందు వారిని కూర్చుండబెట్టెను.। అప్పుడు
సమూయేలు పచనకర్తను చూచి నేను నీ దగ్గిర వుం
చుమని చెప్పి నీ చేతికి యిచ్చిన భాగమును తీసుక
24 రమ్మనెను.। అప్పుడు పచనకర్త జబ్బనున్ను దానిమీద
వున్న దానిన్ని తీసుక వచ్చి సౌలు ముందర పెట్టెను:
అప్పుడు సమూయేలు సౌలుతో, యిదుగో, యిది దాచి
పెట్టబడినది, అది నీ ముందర పెట్టుకొని తినుము,
యేమంటే జనులను పిలిస్తిని అని నేను చెప్పినప్పటి
నుంచీ యిప్పటికి నీ కొరకు వుంచబడినదై వున్నదని
చెప్పెను: ఆలాగున సౌలు ఆ దినమందు సమూయేలు
తో భోజనము చేసెను.। అంతట వారు వున్నతమయిన 25
స్థలముమీదనుంచి దిగి వూరిలోకి వచ్చిన తరువాత
సమూయేలు సౌలుతో మేడ మీద మాట్లాడినాడు.।
మరునాటి యందు వారు వుదయాన లేచినారు; తెల్ల 26
వారే సమయమున సమూయేలు సౌలును మేడ మీదికి
పిలుచుకొని పోయి నేను నిన్ను సాగనంపించడానకు
లెమ్ము అని చెప్పినప్పుడు, సౌలు లేచిన తరువాత వారి
ద్దరున్ను అనగా అతడున్ను సమూయేలున్ను బైలు వెళ్లి
నారు.। అయితే వారు వూరి కడకు సమీపిస్తూ వుం 27
డగా సమూయేలు సౌలును చూచి, యీ సేవకునితో
మనకంటే ముందుగా వెళ్లుమని చెప్పు, అయితే నేను
దేవునియొక్క సెలవు నీకు వినిపించే మట్టుకు నీవు
యిక్కడ నిలిచి వుండుమని చెప్పెను; అంతట వాడు
వెళ్లెను.

## 10. అధ్యాయము.

అప్పుడు సమూయేలు తైలపు బుడ్డి తీసి అతని 1
శిరస్సు మీద కుమ్మరించి, అతని ముద్దు పెట్టుకొని,
యెహోవా తన స్వాస్థ్యము మీద నిన్ను అధిపతి
గా అభిషేకము చేయించినందునే కదా యిది చేస్తిని.।
యీ రోజున నీవు నా యొద్దనుంచి తలీన తరువాత 2
బెన్యామీను సరిహద్దులో సెల్సహు యందు వుండే
రాహేలు సమాధి దగ్గిర యిద్దరు మనుష్యులు నీకు
కనుపింతురు; వారు నిన్ను చూచి నీవు వెతుక వెళ్లిన
గాడిదలను దొరికినవి, మరిన్ని యిదుగో నీ తండ్రి
గార్దభముల కొరకు చింతించక నా కుమారుని నిమి
త్తము యేమి చేతునని నీ కొరకు విచారపడుతూ
వున్నాడని చెప్పుదురు.। తరువాత నీవు అక్కడనుంచి 3
వెళ్లి తాబోరు మైదానమునకు వత్తువు; అక్కడ బేతే
లుకు దేవుని యొద్దకు వెళ్లే ముగ్గురు మనుష్యులు నీకు
యెదురుగా వత్తురు; వొకడు మూడు మేకపిల్లలనున్ను
వొకడు మూడు రొట్టెలనున్ను యింకొకడు ద్రాక్షా
రసపు బుడ్డినిన్ని మోస్తూ వుందురు.। వారు నీకు నమ 4
స్కరించి నీకు రెండు రొట్టెలను యిత్తురు; అది వారి
చేత నీవు పుచ్చుకో వలెను.। తరువాత నీవు దేవుని 5
కొండకు వత్తువు, అక్కడ పెలిష్తీయులయిన దొంపు
కాపుకాండ్లు వున్నారు; అయితే అక్కడ ఆ వూరి
దగ్గిరకు నీవు వచ్చినప్పుడు సంభవించేదేమంటే, నీవు

తంబుర పిల్లనగ్రోవి కిన్నెర వీటిని వాయించేవారి
వెనుక వున్నతమైన స్థలమునుంచి దిగి వచ్చే దీర్ఘ
దర్శుల సమూహమును చూతువు, మరిన్ని వారు దీర్ఘ
6 దర్శనముగా పలుకుదురు. । అప్పుడు యెహోవా
యొక్క ఆత్మ దిగి నీ మీదికి వచ్చినందున నీవు వారితో
కూడా దీర్ఘ దర్శనముగా పలుకుదువు, నీవు వేరైన
7 మనుష్యుడవౌదువు. । అయితే యీ గురుతులు నీకు
సంభవించిన తరువాత నీ చేతికి వచ్చినదంతాను చేతువు
గాక, యేమంటే దేవుడు నీకు తోడుగా వున్నాడు. ।
8 మరిన్ని నీవు నాకంటే ముందుగా గిల్గాలుకు వెళ్ల
వలెను, అప్పుడు యిదుగో నేను హోమార్పణలను
అర్పించుటకున్ను సమాధానార్పణలయొక్క బలులను
చెల్లించుటకున్ను నీ యొద్దికి దిగి వత్తును; నీవు చేయ
వలసిన వాటిని నీకు నేను అగుపచుర్చటకు నీ యొద్దికి
నేను వచ్చే పర్యంతము యేడు దినముల పర్యంతమూ
9 నీవు అక్కడ నిలువ వలసినదని చెప్పెను. । అయితే
అతడు సమూయేలు యొద్దనుంచి వెళ్లిపోవుటకు తన
వీపు తిప్పుకొనినప్పుడు దేవుడు అతనికి వేరైన హృద
యమును దయచేసెను; మరిన్ని ఆ గురుతులన్నిన్ని
10 ఆ దినమందు సంభవించెను. । అయితే వారు ఆ కొండ
దగ్గిరకు వచ్చినప్పుడు, యిదుగో, దీర్ఘదర్శుల సమూ
హము అతనికి యెదురుగా వచ్చెను, అప్పుడు దేవుని
యొక్క ఆత్మ అతని మీదికి వచ్చినందున అతడు వారి
11 లో దీర్ఘదర్శిగా పలికెను. । అయితే పూర్వము
అతని యెరిగిన వారందరున్ను అతడు దీర్ఘదర్శుల
లో దీర్ఘదర్శిగా పలికినాడని చూచి వొకరితో
వొకరు అనుకొనినదేమంటే, కీషుయొక్క కుమారునికి
సంభవించిన యిది యేమిటి? సౌలున్ను దీర్ఘదర్శుల
12 లో వున్నాడా అని అనుకొనినప్పుడు; । ఆ స్థలమం
దుండే వొకడు వారి తండ్రి యెవడని అనెను: కాబట్టి
సౌలున్ను దీర్ఘదర్శులలో వున్నాడా అన్న మాట
13 సామ్యమై వుండెను. । అంతట అతడు దీర్ఘదర్శిగా
పలుకుట చాలించి వున్నతమైన స్థలమునకు వచ్చెను. ।
14 సౌలుయొక్క పినతండ్రి అతనిన్ని అతని సేవకునిన్ని
చూచి మీరిద్దరు యెక్కడికి వెళ్లినారని అడిగెను; అం
దుకు అతడు గార్దభములను వెతుకుటకు వెళ్లినాము;
అవి కనుపించినవి కావు గనుక సమూయేలు యొద్దికి
15 వెళ్లినామని చెప్పినప్పుడు; । సౌలు పినతండ్రి అతని
తో సమూయేలు నీతో చెప్పినది నాతో చెప్ప వలె
16 ననెను. । అప్పుడు సౌలు తన పినతండ్రితో చెప్పిన
దేమంటే, అతడు నిజముగా గార్దభములు దొరికిన
వని చెప్పెననెను; అయితే రాజ్యమును గురించి సమూ
17 యేలు చెప్పిన మాటను చెప్పకుండా వుండెను. । అయితే
సమూయేలు మిస్పెలోకి దేవుని యొద్దికి జనులందరినిన్ని
పిలువనంపించి ఇశ్రాయేలు పుత్రులతో చెప్పినదేమం
టే, । ఇశ్రాయేలుయొక్క దేవుడయిన యెహోవా 18
యీలాగున సెలవిస్తున్నాడు, నేను ఇశ్రాయేలీయు
లైన మిమ్మును మిస్రయీము దేశములోనుంచి యివత
లకు తీసుకవచ్చి మిస్రీయుల చేతిలోనుంచిన్ని మిమ్మును
బాధ పెట్టిన రాజాంగములన్నిటి చేతిలోనుంచిన్ని
విడిపించితిని. । అయినప్పటికిన్ని మీ సకల దుర్దశ 19
లలోనుంచిన్ని వుపద్రవములలోనుంచిన్ని మిమ్మును విడి
పించిన మీ యొక్క దేవుని మీరు యీ దినమందు
విసర్జించి, మా మీద వొకని రాజుగా నిర్ణయిం
చండని ఆయనను అడిగినారు: కాబట్టి యిప్పుడు
మీ గోత్రముల చొప్పుననున్ను మీ వెయివేల సమూ
హము చొప్పుననున్ను మిమ్మును మీరు యెహోవా
సముఖమందు అగుపర్చుకొండెను. । అయితే సమూ 20
యేలు ఇశ్రాయేలుయొక్క గోత్రములన్నిన్ని సమీ
పమునకు వచ్చేటట్టు చేసినప్పుడు బెన్యామీను యొక్క
గోత్రము పట్టుబడెను. । మరిన్ని అతడు బెన్యామీను 21
గోత్రమును వారి యింటి కూటముల ప్రకారముగా
సమీపమునకు వచ్చేటట్టు చేసినప్పుడు మత్రీయింటి
కూటము పట్టుబడెను; తరువాత కీషుయొక్క కుమా
రుడయిన సౌలు పట్టుబడెను; అయితే వారు అతని
వెతికినప్పుడు అతడు కనిపించక వుండెను. । అప్పుడు 22
వారు యెహోవా యొద్ద ఆలోచన చేసినదేమంటే,
ఆ మనుష్యుడు యిక యిక్కడికి వస్తాడా అని అడి
గిరి; అందుకు యెహోవా అడుగో సామానులో దాగి
వున్నాడని ప్రత్యుత్తరము యిచ్చెను. । అయినందున 23
వారు పరుగెత్తిపోయి అక్కడనుంచి అతని తీసుక
వచ్చిరి; అయితే అతడు జనసమూహములో నిలిచిన
ప్పుడు భుజములు మొదలుకొని పయిగా జనులందరి
కంటే పొడవుగా వుండెను. । అప్పుడు సమూయేలు 24
జనులందరితో అనిన మాట, యెహోవా యెంచిన
వాడు అడుగో చూడండి; జనులందరిలో అతనివంటి
వాడు వొకడూ లేడని చెప్పినప్పుడు, జనులందరున్ను
బొబ్బలు పెట్టుతూ రాజు జీవించును గాకని పలికిరి. ।
తరువాత సమూయేలు రాజ్యమార్గమును జనులతో 25
చెప్పి, అది వొక గ్రంథమందు వ్రాసి, యెహోవా
సముఖమందు పెట్టెను; అంతట సమూయేలు జనులం
దరినిన్ని వారి వారి యిండ్లకు పంపెను. । సౌలున్ను 26
గిబాలో వున్న తన యింటికి వచ్చినాడు; అయితే
జనులలో యెవరి హృదయములను యెహోవా ప్రేరే
పించినాడో వారు అతనితో కూడి వచ్చినారు. ।
అయితే కొందరు దుర్మార్గులు యీ మనుష్యుడు మన 27
లను యేలాగున రక్షించ గలడని పలికి, అతని నిర్ల

త్స్యము చేసి, అతనికి కానుకలు తీసుక రాకుండా
వుండిరి; అయితే అతడు వూరకుండెను.

## 11. అధ్యాయము.

1 అప్పుడు అమ్మోనీయుడయిన నాహాషు పయికివచ్చి
యాబేష్గిలాదుకు యెదురుగా దిగెను; అయినందున
యాబేషు వారందరున్ను నీకు సేవ చేస్తాము మాతో
వొడంబడికెను చేసుకొమ్ము అని నాహాషుతో పలికిరి.
2 అందుకు అమ్మోనీయుడయిన నాహాషు యీ పక్షమం
దైతే మీతో వొడంబడికెను చేస్తాను, అది యేలాటి
దంటే, మీ అందరియొక్క కుడి కన్నులు పెల్లగించి
ఇశ్రాయేలు అందరిమీద దాని నిందగా పెట్టుతానని
3 ప్రత్యుత్తరముగా చెప్పెను. అప్పుడు యాబేషు పెద్ద
లు అతనితో అనిన మాట, మేము ఇశ్రాయేలుయొక్క
సరిహద్దులన్నిటికీ దూతలను పంపేటందుకు యేడుదిన
ముల వ్యవధి మాకు యివ్వండి; మమ్మును రక్షించుటకు
వొకడూ లేకపోతే అప్పుడు బయిలు వెళ్లి మీ యొద్దికి
4 వస్తుమని చెప్పిరి. అంతట దూతలు సౌలుయొక్క గిబా
కు వచ్చి జనులయొక్క చెవులలో ఆ వర్తమానములు
తెలియ చెప్పిరి; అప్పుడు జనులందరున్ను తమ కంఠ
5 ములెత్తి యేడ్చిరి. యీలాగు వుండగా యిదుగో సౌలు
పొలములోనుంచి పశువుల వెనకనే వచ్చి జనులు
యేడ్చేటందుకు యేమి సంభవించెను అని అడిగినప్పు
డు, వారు యాబేషు వారు తెచ్చిన వర్తమానములు
6 అతనితో తెలియ చెప్పిరి. యీ వర్తమానములు
సౌలు విన్నప్పుడు దేవునియొక్క ఆత్మ అతని మీదికి
వచ్చినందున అతని కోపము బహుగా రవులుకొనెను.
7 అప్పుడు అతడు వొక యేరు యెడ్లను తీసి తునకలుగా
కోసి, ఇశ్రాయేలు దిక్కులన్నిటికి దూతలచేత పంపి
చెప్పుమనినదేమంటే, సౌలు వెంబడినిన్ని సమూయేలు
వెంబడినిన్ని రానివాడెవడో వాని యెడ్లకు యీ
ప్రకారముగా చేయబడునని చెప్పినప్పుడు, యెహో
వాయొక్క భయము జనుల మీద వచ్చినందున వారు
8 ఏకముగా వచ్చినారు. అయితే అతడు వారిని బెజె
కులో లెక్క చేసినప్పుడు ఇశ్రాయేలు పుత్రులు మూడు
లక్షల మందిన్ని యూదావారు ముప్పయివేల మందిన్ని
9 అయి వుండిరి. అప్పుడు వచ్చిన దూతలతో వారు
అనిన మాట, యాబేష్గిలాదు వారితో మీరు చెప్ప
వలసినదేమంటే, రేపు సూర్యుడు తీక్ష్ణముగా వున్న
ప్పుడు మీకు సహాయము కలుగునని చెప్పండని పంపి
నారు: కాబట్టి దూతలు వచ్చి యాబేషు వారితో
10 చెప్పినందున వారు సంతోషపడిరి. కాబట్టి యాబేషు
వారు వారితో అనిన మాట, రేపు మేము బైలువెళ్లి మీ
యొద్దికి వస్తాము, అప్పుడు మీ దృష్టికి యేది మంచిదో
అది మాకు చేతురు గాకని చెప్పిరి. మరునాటియందు 11
సౌలు జనులను మూడు సమూహములుగా చేసిన తరు
వాత వారు వుదయ కాలమందున పేటు మధ్యలోకి
చొచ్చి పగటి యెండ తీక్ష్ణమయ్యే పర్యంతము అమ్మో
నీయులను హతము చేస్తూ వున్నందున మిగిలిన వారు
చెదరిపోయిరి; వొకరు నొకరు కలుసుకొనకుండా లేక
పోయెను. అప్పుడు జనులు సమూయేలుతో చెప్పిన 12
దేమంటే, సౌలు మనలను యేలునా అని పలికిన వాడు
యెవడు? మేము వారిని చంపేటట్టుగా ఆ మనుష్యు
లను తెప్పించుమని చెప్పిరి. అందుకు సౌలు చెప్పినదే 13
మంటే, యీ రోజున యే మనుష్యుడయినా మరణము
కాకూడదు, యేమంటే నేటి రోజున యెహోవా
ఇశ్రాయేలులో రక్షణ కలుగ చేసెనని చెప్పెను.
అప్పుడు సమూయేలు జనులతో అనిన మాట, మనము 14
గిల్గాలుకు వెళ్లి తిరుగా సౌలుకు పట్టాభిషేకము చేతా
ము రండని చెప్పినందున, జనులందరున్ను గిల్గాలుకు 15
వచ్చి గిల్గాలులో యెహోవా సన్నిధిని సౌలుకు
పట్టాభిషేకము చేసినారు: మరిన్ని అక్కడ యెహో
వా సన్నిధిని వారు సమాధానార్పణలయొక్క
బలులను అర్పించి, సౌలున్ను ఇశ్రాయేలీయులందరు
న్ను అక్కడ బహుగా సంతోషించిరి.

## 12. అధ్యాయము.

అప్పుడు సమూయేలు ఇశ్రాయేలీయులందరితో 1
చెప్పినదేమంటే, యిదుగో, మీరు నాతో చెప్పిన
మాటలెల్లా నేను ఆలకించి మీ మీద వొకని రాజుగా
చేస్తిని. కాబట్టి యిదుగో రాజు మీ యెదుట సంచ 2
రిస్తూ వున్నాడు; నా తల నెరిసినది, యిప్పుడు నేను
ముసలివాడనైతిని; నా కుమారులు మీతో కూడా
వున్నారు; బాల్యము నాటినుంచి నేటి వరకు నేను మీ
యెదుట సంచరిస్తూ వుంటిని. యిదుగో నేను యిక్కడ 3
వున్నాను; యెవరి యెద్దును నేను పుచ్చుకొన్నానో,
యెవరి గాడిదను నేను పుచ్చుకొన్నానో, యె
వరికి నేను అన్యాయము చేసినానో, యెవరిని నేను
బాధపెట్టినానో, కండ్లు మూతలు పడడానకు నేను
యెవని యొద్ద లంచము పుచ్చుకొన్నానో, వాడు యె
హోవా సముఖమందున్ను ఆయన అభిషేకము
చేయించినవాని యెదుటనున్ను నా మీద సాక్ష్యము
పలుక వలసినది, అప్పుడు నేను మీకు దాని తిరిగి
యిత్తునని అతడు పలికినందున; వారు అతని చూచి 4
నీవు మాకు యే అన్యాయమయినా యే బాధలయినా
చేసినావు కావు; యే మనుష్యుని యొద్దనయినా నీవు
దేనినీ పుచ్చుకొన్నావు కావని చెప్పిరి. అప్పుడు 5
అతడు వారితో చెప్పినదేమంటే, నా చేతిలో యేద

యువారికి మీకు దొరకలేదని యెహోవాయున్ను
ఆయన అభిషేకము చేయించిన వాడున్ను యీరోజున
మీ విషయమై సాక్షులయి వున్నారు అని చెప్పినప్పు
డు, సాక్షులయి వున్నారని వారు ప్రత్యుత్తరమిచ్చిరి.
6 మరిన్ని సమూయేలు జనులతో చెప్పినదేమంటే, మోషే
నున్ను అహరోనున్ను నియమించి, మీ పితృలను
మిస్రయీము దేశములోనుంచి యువతలకు రప్పించిన
7 వాడు యెహోవాయే. కాబట్టి యెహోవా మీకు
న్ను మీ పితృలకున్ను చేసిన నీతి కార్యములను గురించి
యెహోవా సముఖమందు న్యాయముగా నేను
మీతో మాట్లాడేటందుకు మీరు యిక్కడ నిలిచి వుం
8 డండి. యేమంటే యాకోబు మిస్రయీములోకి
వచ్చిన వెనుక మీ పితృలు యెహోవాకు మొర్రపె
ట్టినప్పుడు ఆయన మోషేనున్ను అహరోనునున్ను పంపి
నందున వారు మీ పితృలను మిస్రయీములోనుంచి
తీసుక వచ్చి యీ స్థలమందు నివాసము చేయించిరి.
9 అయితే వారు తమకు దేవుడయిన యెహోవాను
మరచినప్పుడున్ను ఆయన వారిని హాసోరుయొక్క సమూ
హాధిపతి అయిన సీసెరాయొక్క చేతికిన్ని ఫిలిష్తీయు
లయొక్క చేతికిన్ని మోయాబు రాజుయొక్క చేతికిన్ని
అమ్మివేసినందున వీరు వారి మీద యుద్ధము చేసిరి.
10 అంతట వారు మేము యెహోవాను విడచి బయలీ
ముకున్ను అష్తారోతుకున్ను కొలువు చేసినందున పాప
ము చేసినాము; అయితే యిక మేము నీకు సేవ చేతుము;
మా శత్రువులయొక్క చేతిలోనుంచి మమ్మును విడిపిం
చుమని యెహోవాకు మొరపెట్టి వేడుకొన్నప్పుడు,
11 యెహోవా యెరుబ్బయలునున్ను బెదానునున్ను
యెప్తానున్ను సమూయేలునున్ను పంపి, నలుదిక్కులా
మీ శత్రువులయొక్క చేతిలోనుంచి మిమ్మును విడిపిం
చినందున మీరు నిర్భయముగా కాపురము చేస్తిరి.
12 అయితే అమ్మోను పుత్రులకు రాజైన నాహాషు మీకు
యెదురుగా వచ్చుట మీరు చూచినప్పుడు మీ దేవుడ
యిన యెహోవా మీకు రాజై వున్నప్పటికిన్ని నన్ను
చూచి మమ్మును యేలుటకు వొక రాజు కావలెనని పలి
13 కితిరి. కాబట్టి అడుగో మీరు కోరి యెంచిన రాజు;
యిడుగో యెహోవా అతని మీ మీద రాజుగా
14 నియమించెను. మీరు యెహోవా యందు భయ
పడి, ఆయన శబ్దమును విని, ఆయనను సేవించి, యె
హోవాయొక్క ఆజ్ఞకు వ్యతిరిక్తముగా చేయక వున్న
ట్టయితే మీరున్ను మిమ్మును యేలే రాజున్ను మీ దేవు
15 డయిన యెహోవాను వెంబడిస్తూ వుందురు. మీరు
యెహోవాయొక్క శబ్దమును వినక యెహోవా
యొక్క ఆజ్ఞకు వ్యతిరిక్తముగా చేస్తే, యెహోవా
యొక్క హస్తము మీ పితృలకు యేలాగు విరోధ
ముగా వుండెనో ఆలాగున మీకున్ను విరోధముగా
వుండును. కాబట్టి యిక్కడ నిలిచి యెహోవా మీ 16
నేత్రముల యెదుట చేసే యీ ఘన కార్యమును చూ
తురు గాక. యిది గోధుమ కోత కాలము కాదా? 17
మీరు రాజును అడిగినందుచేత యెహోవాయొక్క
దృష్టికి మీయొక్క చెడ్డతనము గొప్పదయి యున్నదని
మీరు గ్రహించి చూచేలాగున నేను యెహోవాను
వేడుకొందును, అప్పుడు ఆయన వురుమునున్ను వర్ష
మునున్ను పంపునని చెప్పెను. కాబట్టి సమూయేలు 18
యెహోవాను వేడుకొనినప్పుడు యెహోవా ఆ
రోజున వురుమునున్ను వర్షమునున్ను పంపెను; అయి
నందున జనులందరున్ను యెహోవా యందున్ను
సమూయేలు యందున్ను బహు భయముగా వుండిరి.
మరిన్ని జనులందరున్ను సమూయేలుతో చెప్పినదేమం 19
టే, మేము మరణము కాకుండా నీ సేవకులమైన మా
కొరకు నీ దేవుడయిన యెహోవాను ప్రార్థన
చేయుము, యేమంటే మేము మా కొరకు వొక రాజును
అడిగినందున యీ కీడు మా సకల పాపములతోటి
కలిపినామని పలికిరి. అయినందున సమూయేలు జను 20
లతో చెప్పినదేమంటే, భయపడకండి, మీరు యీ
చెడ్డతనమంతా చేస్తిరి, అయినప్పటికిన్ని యెహో
వాను విడువక మీ హృదయమంతటితోను యెహో
వాను సేవించి వ్యతిరేకముగా తిరుగకండి; తిరిగితే 21
మీరు వట్టివైనటువంటి వాటి వెంబడిని వెళ్లే వారౌ
దురు; అవి వట్టివై యున్నవి గనక ప్రయోజనము
నయినా రక్షణనయినా యివ్వ నేరవు. యేమంటే యె 22
హోవా తన ఘనమయిన నామము నిమిత్తము తన
జనులను విడువడు, యేమంటే యెహోవా మిమ్మును
తన జనులుగా చేసుకొనే కొరకు అనుకూలముగా
వున్నాడు. నన్ను గురించి అయితే మంచియున్ను 23
తిన్ననయున్ను అయిన మార్గము మీకు నేర్పుదును;
అయితే మీ కొరకు ప్రార్థన చేయడము మానుట
వల్ల యెహోవా విషయమయి పాపము చేసేది నావల్ల
యెన్నడూ కాక వుండును గాక. మీరు యెహో 24
వా యందు భయపడి, నిండయిన హృదయములో
ఆయనకు నిజముగా సేవ చేస్తే అంతే చాలును; యెం
దుకు ఆయన మీ కొరకు యెన్ని గొప్ప కార్యములను
చేసెనో అవి మీరు తలంచుకో వలసినది. అయితే 25
యిక మీరు కీడు చేసే వారైతే మీరున్ను మీ రాజు
న్ను కూడా నాశనమవుదురని చెప్పెను.

## 13, అధ్యాయము.

సౌలు వొక సంవత్సరము యేలెను; రెండు సంవ 1
త్సరములు ఇశ్రాయేలును యేలిన తరువాత, సౌలు 2

ఇశ్రాయేలులో మూడు వేల మందిని తన కొరకు యేం
చుకొన్నాడు; వీరిలో రెండువేల మంది మిక్మషులో
నున్న బేతేలు కొండలోనున్ను సౌలు యొద్దను వుం
డిరి; మరిన్ని వెయిమంది బెన్యామీను గిబాలో యో
నాతాను యొద్దను వుండిరి; తక్కినవారిని అతడు
3 వారి వారి డేరాలకు పంపెను. అయితే యోనాతాను
గెబలో వున్న పెలిష్తీయుల యొక్క రణపు కాపులను
కొట్టినాడు; యీ సంగతి పెలిష్తీయులకు వినబడెను;
మరిన్ని సౌలు దేశమంతటి పర్యంతమూ ఇబ్రీయులు
4 వినదురు గాకని బూర వూదించినాడు. మరిన్ని సౌలు
పెలిష్తీయుల యొక్క రణపు కాపులను కొట్టినాడ
నిన్ని ఇశ్రాయేలీయులు పెలిష్తీయులవల్లను అసహ్య
ముగా యెంచబడినారనిన్ని ఇశ్రాయేలీయులకు వినబ
డినది; అప్పుడు జనులు గిల్గాలులో సౌలు యొద్దికి
5 పిలువనంపించబడిరి. మరిన్ని పెలిష్తీయులు ఇశ్రాయే
లులతో యుద్ధము చేయడానకు కూడి వచ్చినారు; ముప్ప
యివేల రథములున్ను ఆరువేల గుర్రపు రౌతులున్ను
జనసమూహమున్ను సముద్రపు దరిని వుండే యిసుక
లాగున వుండెను; వీరు యెక్కి బేతావెను తూర్పు
6 దిక్కు మిక్మషులో పేట వేసుకొనిరి. ఇశ్రాయేలు
జనులు తాము యిరుకులో వున్నామని చూచినప్పుడు,
యెందుకంటే జనులు తొందరపడుతూ వుండిరి; అప్పు
డు ఆ జనులు గుహాలలోనున్ను పొదలలోనున్ను మెట్ట
లలోనున్ను వున్నత స్థలములలోనున్ను కూపములలో
7 నున్ను తాము దాగుకొనిరి. మరిన్ని కొందరు ఇబ్రీ
యులు యర్దేను నది దాటి గాదు దేశమునకున్ను
గిలాదుకున్ను వెళ్లి పోయినారు; అయితే సౌలు యింకా
గిల్గాలులో వుండెను; జనులందరున్ను వణుకుతోటి అతని
8 వెంబడించిరి. అయితే అతడు సమూయేలు చెప్పిన
కాలమునే యేడు దినముల మట్టుకు నిలిచి వుండెను,
అయితే సమూయేలు గిల్గాలుకు రావడము లేక వుండెను;
మరిన్ని జనులు అతని యొద్దనుంచి చెదిరినారు.
9 అప్పుడు సౌలు చెప్పినదేమంటే, నా యొద్దికి హో
మార్పణలనున్ను సమాధానార్పణలనున్ను తీసుక రా
10 అని చెప్పి, హోమ బలిని అర్పించినాడు. అయితే
అతడు హోమ బలిని అర్పించిన తరువాత యిదుగో
తత్క్షణమందు సమూయేలు వచ్చెను; అప్పుడు సౌలు
అతని పరామర్శించుటకు బయిలు వెళ్లి అతనికి యెదు
11 రుగా వచ్చెను. అప్పుడు సమూయేలు అతని చూచి
నీవు యేమి చేస్తివని అడిగెను; అందుకు సౌలు చెప్పిన
దేమంటే, జనులు నా యొద్దనుంచి చెదిరినారనిన్ని
నిర్ణయ కాలమందు నీవు రాలేదనిన్ని పెలిష్తీయులు
12 మిక్మషులో కూడుకొన్నారనిన్ని నేను చూచి, పెలి
ష్తీయులు గిల్గాలుకు వచ్చి నా మీద పడుదురు, అయితే
యింకా నేను యెహోవా సముఖమందు వేడుకొ
న్నాను కానని అనుకొని, నా యంతట నేను సాహ
సించి హోమ బలి చెల్లిస్తినని చెప్పినప్పుడు, సమూ 13
యేలు అతని చూచి నీవు అవివేకముగా చేస్తివి, యే
మంటే నీ దేవుడయిన యెహోవా నీకు ఆజ్ఞాపించిన
ఆజ్ఞను నీవు భద్రము చేయక వుంటివి; నీ రాజ్యము
ఇశ్రాయేలు మీద సదా కాలము మట్టుకు స్థిరముగా
చేసుటకు యెహోవాకు వుండినప్పటికిన్ని యిప్పుడు
నీ రాజ్యము నిలువక పోవును; యేమంటే యెహో 14
వా తన హృదయ ప్రకారముగా వున్న వొకని వెతికి
యున్నాడు; యెహోవా అతని తన జనులమీద అధి
పతి అయ్యేటట్టుగా నిర్ణయించెను, యేమంటే యె
హోవా నీకు ఆజ్ఞాపించిన దాని నీవు భద్రము చేసి
నావు కావని చెప్పెను. అప్పుడు సమూయేలు లేచి 15
గిల్గాలును విడచి బెన్యామీను గిబాకు వచ్చెను; అప్పు
డు సౌలు తన యొద్ద వుండే జనులను లెక్క చేయగా
యెక్కువ తక్కువ ఆరునూరు మంది వుండిరి. అయితే 16
సౌలున్ను అతని కుమారుడయిన యోనాతానున్ను వారి
దగ్గిర వున్న వారితో కూడా బెన్యామీను గిబాలో
వుండిరి; అయితే పెలిష్తీయులు మిక్మషులో పేట వేసు
కొని వుండిరి. మరిన్ని పెలిష్తీయులయొక్క పేటలో 17
నుంచి దోపుడు కాండ్లు మూడు తెగలుగా బయిలు
వచ్చి, వొక తెగ షూయాలు దేశమున ఒఫ్రాకు వెళ్లే
మార్గమున తిరిగి పోయెను. రెండో తెగ బేథో 18
రోను మార్గమున తిరిగి పోయెను; యింకొక తెగ
అరణ్య సమీపమందుండే సెబోయీయ్యము మైదానము
చూచే సరిహద్దు మార్గమున తిరిగి పోయెను. అయితే 19
ఇబ్రీయులు తమ కొరకు కత్తులనున్ను యీటెలనున్ను
చేయింతురేమో అని పెలిష్తీయులు అనుకొని, ఇశ్రా
యేలు దేశమందంతటా కంసాలిని లేకుండా చేసిరి.
కాబట్టి ఇశ్రాయేలీయులందరున్ను తన నక్కుమున్ను తన 20
పారనున్ను తన గొడ్డలినిన్ని తన పోటకత్తినిన్ని పదును
చేయించుకోవడానకు పెలిష్తీయుల దగ్గిరకు దిగి వెళ్లు
తూ వుండిరి. అయితే తమ నక్కుల కొరకున్ను పా 21
రల కొరకున్ను మూడు ముండ్లు గల కొంకుల కొరకున్ను
గొడ్డళ్ల కొరకున్ను ములుకోల కర్రలు సరిచేయుట
కున్ను ఆకు రాయి కద్దు. కాబట్టి యుద్ధమైన దిన 22
మందు సౌలు యొద్దనున్ను యోనాతాను యొద్దనున్ను
వున్న జనులలో యే వొకని చేతిలోనయినా కత్తి
యైనా యీటెయైనా లేకపోయెను; అయితే సౌలు
కున్ను అతని కుమారుడైన యోనాతానుకున్ను అవి
కలిగి వుండెను. అయితే పెలిష్తీయులయొక్క రణపు 23
కాపులు బయిలు వెళ్లి మిక్మషుకు గడచేలోవకు వచ్చిరి.

## 14. అధ్యాయము.

1 అయితే వొకనాటియందు సౌలుయొక్క కుమా
రుడయిన యోనాతాను తన ఆయుధాదులను మోసే
పడుచువాని చూచి అవతల వున్న ఫెలిష్తీయులయొక్క
రణపు కావరుల యొద్దికి వెళ్లుదాము రమ్మనెను; అయితే
2 అతడు తన తండ్రితో చెప్పలేదు. । సౌలు గిబా అవ
తల మిగ్రోనులో దానిమ్మ చెట్టుకింద వుంటూ వుం
డెను; అతని యొద్ద వున్న జనులు యెక్కువ తక్కువ
3 ఆర్నూర్ఱు మంది వుండిరి. । మరిన్ని షీలోలో యెహో
వా అర్చకుడైన ఏలీయొక్క కుమారుడైన పీనెహా
సుకు పుట్టిన ఈఖాబోదుయొక్క సహోదరుడయిన
ఆహీథూబుకు పుట్టిన అహీయా ఏఫోదును తొడుగు
కొని అక్కడ వుండెను; అయితే యోనాతాను వెళ్లిన
4 సంగతి జనులకు తెలియక వుండెను. । యోనాతాను
ఫెలిష్తీయులయొక్క రణపు కావరుల స్థలమునకు వెళ్లే
టందుకు గడిచే లోవకు యివతల శృంగము గల వొక
పర్వతమున్ను అవతల శృంగము గల వొక పర్వతము
న్ను కలవు; వొకదాని పేరు బొస్సేసు అనిన్ని, మరి
5 యొకదాని పేరు సెనె అనిన్ని వుండెను. । వొకదాని
శృంగము మిక్మషు యెదుట వుత్తరపుతట్టు వుండెను;
మరియొక దాని శృంగము గిబా యెదుట దక్షిణపుతట్టు
6 వుండెను. । అప్పుడు యోనాతాను తన ఆయుధాదు
లను మోసే పడుచువానితో చెప్పినదేమంటే, పద,
యీ సున్నతీ లేనివారియొక్క రణపు కావరుల స్థల
మునకు గడచి వెళ్లుదాము; యెహోవా మనకు సహా
యము చేసునేమో; యేమంటే అనేకుల చేతనయినా
కొద్దిమంది చేతనయినా రక్షించుటకు యెహోవాకు
7 ప్రయాసము లేదని చెప్పినప్పుడు, । అతని ఆయుధా
దులను మోసేవాడు నీ హృదయములో వున్నదంతా
చేయుము, గడిచి పద, యిదుగో నీ హృదయ ప్రకా
రముగా నేను నీకు తోడుగా వున్నానని అతనితో
8 చెప్పెను. । అప్పుడు యోనాతాను అనిన మాట, యి
దుగో మనము వారి యొద్దికి గడిచి మనలను వారికి
9 అగుపచుకొందాము. । వారు మనలను చూచి మేము
మీ యొద్దికి వచ్చే పర్యంతము అక్కడ వుండండని
చెప్పితే, మనము మన స్థలమందు నిలిచి వారి యొద్దికి
10 యెక్కి వెళ్లక వుందాము. । మా యొద్దికి యెక్కి రండని
వారు చెప్పిన పక్షమందు మనము యెక్కి వెళ్లుదాము,
యేమంటే అది యెహోవా వారిని మన చేతికి అప్ప
గించెనన్న గురుతు అయి వుండును అని చెప్పెను. ।
11 అంతట వీరిద్దరూ తమ్మును తాము ఫెలిష్తీయులయొక్క
రణపు కావరులకు అగుపర్చుకొన్నారు; అప్పుడే ఫెలి
ష్తీయులు అదుగో ఇబ్రీయులు తాము దాగి వుండిన
గుహలలోనుంచి బయిలు వెళ్లి వస్తూ వున్నారని చెప్పు
కొని, । యోనాతానున్ను అతని ఆయుధాదులను మో 12
సేవానినిన్ని చూచి, మేము మీకు వొకటి చూపిం
తుము యెక్కి రండని అనినప్పుడు, యోనాతాను తన
ఆయుధాదులను మోసేవానితో నా వెనుక రమ్ము,
యేమంటే యెహోవా వారిని ఇశ్రాయేలు చేతికి
అప్పగించెనని చెప్పి, । యోనాతానున్ను అతని వెనుక 13
అతని ఆయుధాదులను మోసేవాడున్ను తమ చేతుల
తోనున్ను కాళ్లతోనున్ను యెక్కినప్పుడు వారు యో
నాతాను ముందర కూలిరి; మరిన్ని అతని ఆయుధా
దులు మోసేవాడు అతని వెనుక వచ్చి హతము చేసెను. ।
యోనాతానున్ను అతని ఆయుధాదులను మోసేవా 14
డున్ను చేసిన ఆ మొదటి హతమందు యెక్కువ తక్కువ
యిరువై మంది పడిరి; యీ హతము వొక దినమున
యేరు యెడ్లచేత దున్నే సగము నేలంత మట్టుకు కలుగ
చేయబడెను. । అయినందున పేట యందున్ను పొలము 15
యందున్ను జనులందరి యందున్ను కంపము పుట్టెను;
మరిన్ని రణపు కావరులున్ను దోపుడుకాండ్లున్ను వణి
కిరి; మరిన్ని భూమి కంపించెను; యీలాగున అత్యధి
కమయిన కంపము కలిగెను. । అప్పుడు బెన్యామీను 16
గిబాలో సౌలుయొక్క కావువాండ్లు చూచినప్పుడు,
అదుగో, సమూహము కరుగుతూ వుండి, వొకరినొకరు
కొట్టేవారై వుండిరి. । అప్పుడు సౌలు తన యొద్ద 17
వున్న జనులతో మీరు లెక్కచేసి, మన యొద్దనుంచి
యెవరు వెళ్లిరో అది చూడుమని చెప్పెను; వారు
లెక్క చూడగా యిదుగో యోనాతానున్ను అతని
ఆయుధాదులు మోసేవాడున్ను లేరని తెలుసుకొ
నిరి. । అప్పుడు సౌలు అహీయాను చూచి దేవుని 18
యొక్క పెట్టె యిక్కడికి తీసుకురా అని చెప్పెను,
యేమంటే దేవునియొక్క పెట్టె అప్పుడు ఇశ్రాయేలు
పుత్రులయొద్ద వుండెను. । అయితే సౌలు అర్చకుని 19
తో మాట్లాడుతూ వుండగా ఫెలిష్తీయులయొక్క
పేటలో వున్న ధ్వని అధికాధికముగా వుండెను; కా
బట్టి సౌలు అర్చకుని చూచి నీ చెయ్యి వెనకకు తియ్యు
మని చెప్పెను. । వెంబడిగానే సౌలున్ను అతని యొద్ద 20
వున్న జనులందరున్ను కూడుకొని యుద్ధమునకు వచ్చి
నప్పుడు యిదుగో వీనికత్తి వాని మీదనున్ను వాని
కత్తి వీని మీదనున్ను వుండుటవల్లను అత్యధికమయిన
హతము కలిగి వుండెను. । మరిన్ని అంతకు మునుపు 21
ఫెలిష్తీయులతో వుండి చుట్టూ వున్న దేశములోనుంచి
వారితో కూడా పేటకు వచ్చిన ఇబ్రీయులున్ను తిరిగీ
సౌలు యొద్దనున్ను యోనాతాను యొద్దనున్ను వున్న
ఇశ్రాయేలుతో కలుసుకొనిరి. । అదిగాక ఎఫ్రాయీ 22
ము పర్వతమందు దాగి వున్న ఇశ్రాయేలీయులున్ను

ఫిలిష్తీయులు పారిపోయినారని వినినప్పుడు వారున్ను
23 యుద్ధమందు వారిని తరిమిరి. । యీలాగున యెహోవా
తా ఆ దినమందు ఇశ్రాయేలును రక్షించెను; మరిన్ని
24 యుద్ధము బేతావెను మట్టుకు సాగెను. । అయితే
ఆ దినమందు ఇశ్రాయేలీయులకు మిక్కిలీ తల్లడము
కలిగెను, యేమంటే నేను నా శత్రువుల మీదను పగ
తీర్చుకొనే కొరకు సాయంత్రము కాక మునుపు
యెవడు ఆహారము తినునో వాడు శపించబడును
గాకని సౌలు జనులయొద్ద ప్రమాణము పుచ్చుకొనెను;
అందువల్ల జనులు ఆహారము రుచి చూడకుండా వుం
25 డిరి. । అంతట ఆ దేశపు వారందరున్ను వొక అడవి
లోకి వచ్చిరి; అక్కడ నేల మీద తేనె పడి వుండెను.
26 జనులు ఆ అడవిలోకి ప్రవేశించినప్పుడు యిదుగో
తేనె కాలుతూ వుండెను, అయినప్పటికిన్ని జనులు
ఆ ప్రమాణమందు భయపడినందున చెయ్యి నోట్లో
27 పెట్టుకొన్నవాడు వొకడూ లేక వుండెను. । అయితే
యోనాతాను తన తండ్రి జనులకు ప్రమాణము చేత
ఆజ్ఞాపించుట వినిన వాడు కానందున తన చేతి కర్ర
చాపి దాని చివర తేనెపట్టులో ముంచి తన చెయ్యి
నోట్లో పెట్టుకొనిన తరువాత తన కనుదృష్టికి వెలుగు
28 కలిగెను. । అప్పుడు జనులలో వొకడు అతని చూచి
నీ తండ్రి ప్రమాణము చేత జనులకు ఖండితముగా
ఆజ్ఞాపించినదేమంటే, యీ దినమందు యెవడు ఆహా
రము పుచ్చుకొనునో వాడు శపించబడును గాకని
యనెను, అందుచేత జనులు మిక్కిలీ అలసటగా
29 వున్నారని చెప్పినప్పుడు; । యోనాతాను చెప్పినదేమం
టే, నా తండ్రి దేశమును కష్టపెట్టెను; నేను యీ
తేనె కొంచెము పుచ్చుకొన్నందున నా కనుదృష్టికి
30 యెంత వెలుగు కలిగెనో చూడండి. । కాబట్టి జనులు
తాము దొరికించుకొనిన తమ శత్రువులయొక్క దో
పుళ్లవల్ల బాగా భోజనము చేసినవారయితే బలము
మిక్కిలీ యెక్కువై, ఫిలిష్తీయులలో మరీ అధికమ
31 యిన హతము కలిగి వుండునని చెప్పెను. । అయితే
ఆ దినమందు వారు ఫిలిష్తీయులను మిక్మషు మొదలు
కొని అయ్యాలోను మట్టుకు కొట్టినారు; అయితే
32 జనులు మిక్కిలీ అలసటగా వుండిరి. । కాబట్టి జనులు
దోపుడు వస్తువులు పట్టుకొన్నప్పుడు గొర్రెలనున్ను
యెద్లనున్ను పెయ్యలనున్ను తీసుకొని, నేల మీద
చంపి రక్తముతోనే భక్షించినందున కొందరు సౌలు
33 తో చెప్పినదేమంటే, । యిదుగో జనులు రక్తముతోటే
తిని యెహోవావాకు విరోధముగా పాపము చేస్తూ
వున్నారనిరి; అప్పుడు అతడు అనిన మాట, మీరు
ఆజ్ఞను మీరితిరే; పెద్ద రాయి వొకటి నా దగ్గిరకు
34 బొర్లించి తెండని చెప్పి; । తిరుగా వారితో అనిన
దేమంటే, మీరు అక్కడక్కడికి జనులలోకి వెళ్లి,
ప్రతి మనిషి తన తన యెద్దునున్ను తన తన గొర్రె
నున్ను నా దగ్గిరకు తీసుక వచ్చి, యిక్కడ చంపి
భక్షించవలెను; యెహోవావాకు విరోధముగా పాప
ము చేసేటట్టు రక్తముతోటే తిన కూడదని వారితో
చెప్పండని పంపెను. । కాబట్టి జనులందరిలో ప్రతి
మనిషి ఆ రాత్రి తన తన యెద్దును తీసుక వచ్చి
అక్కడ చంపెను. । మరిన్ని సౌలు యెహోవావా కొ 35
రకు వొక బలిపీఠము కట్టించెను; అది యెహోవావా
కొరకు అతడు కట్టించిన ప్రథమ బలిపీఠమయి వుం
డెను. । మరిన్ని సౌలు చెప్పినదేమంటే, మనము రాత్రి 36
లో దిగి ఫిలిష్తీయులను తెల్లవారే పర్యంతము కలత
పెట్టి, శేషించేవాడు వొకడూ లేకుండా చేతుము
గాకని చెప్పినప్పుడు వారు నీ దృష్టికి యేది మంచి
దో అది చేతువుగాకని చెప్పిరి; అప్పుడు ఆచార్యుడు
యిక్కడ దేవుని యొద్దికి చేరుదామని చెప్పెను. । కా 37
బట్టి సౌలు దేవుని ఆలోచన అడిగినదేమంటే, ఫిలిష్తీ
యుల వెనుక నేను దిగి వెళ్లుదునా? నీవు వారిని ఇశ్రా
యేలు చేతికి అప్పగింతువా అని అడిగినప్పటికిన్ని
ఆ సమయాన ఆయన అతనికి ప్రత్యుత్తరము యివ్వక
వుండెను. । అయినందున సౌలు చెప్పినదేమంటే, జను 38
లలో శ్రేష్ఠమైన వారు నా సమీపమునకు వచ్చి,
నేటి రోజున యెవ్వరివల్ల యీ పాపము కలిగెనో
అది విచారించి తెలుసుకొందురు గాక. । ఇశ్రాయేలును 39
రక్షించే యెహోవానా జీవముతోడు అది నా కుమా
రుడైన యోనాతానువల్ల కలిగినా నిజముగా వాడు
మరణమవునని చెప్పెను; అయితే జనులందరిలో అత
నికి ప్రత్యుత్తరము యిచ్చినవాడు వొకడూ లేక వుం
డెను. । అప్పుడు అతడు ఇశ్రాయేలీయులందరితో 40
చెప్పినదేమంటే, మీరు ఆ తట్టున్ను నేనున్ను నా
కుమారుడయిన యోనాతానున్ను యీ తట్టున్ను వుండ
వలెనని చెప్పినప్పుడు, జనులు సౌలుతో నీ దృష్టికి
యేది మంచిదో అది చేయుమని చెప్పిరి. । అయినం 41
దున సౌలు ఇశ్రాయేలుకు దేవుడవయిన వో యెహో
వా, చీటి నిజము కాచేయుమని వేడుకొనెను. అప్ప
డు సౌలున్ను యోనాతానున్ను పట్టుబడిరి; అయితే
జనులు తప్పించుకొనిరి. । అప్పుడు సౌలు చెప్పినదేమం 42
టే, నా మధ్యమున్ను నా కుమారుడైన యోనాతాను
మధ్యనున్ను చీట్లు వేయండని చెప్పెను; అయినందున
యోనాతాను పట్టుబడెను. । అప్పుడు సౌలు యోనా 43
తానును చూచి నీవు చేసినది యేమిటో అది నాతో
చెప్పుమనెను. అందుకు యోనాతాను అతనితో
చెప్పినదేమంటే, నా చేతి కర్ర చివరతో కొంచెము
తేనె మాత్రము పుచ్చుకొన్నందువల్ల యిదుగో నేను

44 మరణమవుదువని చెప్పినప్పుడు, । సౌలు ప్రత్యుత్తర
ముగా అనినదేమంటే, దేవుడు ఆలాగునున్ను అంత
కంటే అధికమునున్ను చేయును గాక, యెందుకంటే
వూ యోనాతానా, నీవు అవశ్యముగా మరణము
45 కావలెను అని పలికెను. । అయితే జనులు సౌలును
చూచి యింత ఘనమైన రక్షణను ఇశ్రాయేలులో
కలుగ చేసిన యోనాతాను మరణము కావలెనా? అది
కూడదు; యెహోవా జీవముతోడు అతని తలవెం
ట్రుకలలో వొకటియైనా నేలను పడేది లేదు, యే
మంటేం యీ దినమున అతడు దేవునితో కూడా కా
ర్యము చేసెనని చెప్పి, యోనాతాను మరణము కా
46 కుండా జనులు అతని విడిపించిరి. । అప్పుడు సౌలు
ఫిలిష్తీయులను తరమడము మాని యెక్కి పోయెను;
47 మరిన్ని ఫిలిష్తీయులు తమ స్థలమునకు వెళ్లిరి. । యీ
లాగున సౌలు ఇశ్రాయేలును యేలనారంభించి, నఖ
ముఖాలా తన శత్రువులయిన వారందరితో, అనగా,
మోయాబీయులతోనున్ను అమ్మోను పుత్రులతోనున్ను
ఎదోమీయులతోనున్ను సోబా దేశపు రాజులతో
నున్ను ఫిలిష్తీయులతోనున్ను యుద్ధమును చేసెను;
మరిన్ని యెక్కడికి అతడు తిరిగి వెళ్లినాడో అక్కడ
48 వారిని బాధపెట్టెను. । మరిన్ని అతడు సమూహమును
కూర్చి అమాలేకీయులను కొట్టి, ఇశ్రాయేలీయులను
కలత పెట్టిన వారి చేతులలోనుంచి వారిని విడిపిం
49 చెను. । సౌలుకు పుట్టిన కుమారుల పేరులేవంటే, యో
నాతాను, ఇష్వీ, మెల్కీషూవా అని వుండిరి: అతని
యిద్దరు కుమార్తెల పేరులు యేమంటే, పెద్దదాని
పేరు మేరబు అనిన్ని, చిన్నదాని పేరు మీఖాలు
50 అనిన్ని పిలువ బడిరి. । సౌలుయొక్క భార్య పేరు
యేమంటే, అహీనోయము అని వుండెను; యీమె
అహిమయస్సుయొక్క కుమార్తె అయి వుండెను:
అతని సైన్యాధిపతి పేరు యేమంటే అబ్నేరు అని
వుండెను; యితడు సౌలుకు పినతండ్రియైన నేరుయొ
51 క్క కుమారుడై వుండెను. । సౌలుయొక్క తండ్రి
కీషు అని వుండెను; అబ్నేరుకు తండ్రియైన నేరు
52 అబీయేలుకు పుట్టెను. । అయితే సౌలు బ్రతికిన దిన
ములన్నిటి దాకా ఫిలిష్తీయులతో యుద్ధము కలిగి
వుండెను; మరిన్ని సౌలు బలాఢ్యునిన్ని పరాక్రమ
శాలినిన్ని చూస్తే వాని తన యొద్దకు చేర్చుకొనెను.

## 15. అధ్యాయము.

1 మరిన్ని సమూయేలు సౌలుతో చెప్పినదేమంటే,
యెహోవా తన జనులమీద అనగా ఇశ్రాయేలు
మీద నిన్ను పట్టాభిషిక్తునిగా చేయుటకు నన్ను పం
పెను; కాబట్టి నీవు యెహోవా వాక్కుయొక్క
శబ్దమును వినవలసినది. । సైన్యములయొక్క యెహో 2
వా యిచ్చిన సెలవు యేమంటే, అమాలేకు ఇశ్రాయే
లుకు చేసినది నాకు జ్ఞాపకమున్నది, యేమంటే, అత
డు మిస్రయీములోనుంచి యివతలకు రాగా నేయు
తడు మార్గమందు అతనికి విరోధియాయి యెదురుగా
వచ్చెను. । కాబట్టి నీవు వెళ్లి అమాలేకును కొట్టి, వా 3
రిని కనికరించక, పురుషునున్ను స్త్రీనిన్ని బాలునున్ను
పసిపిల్లనున్ను యెద్దునున్ను గొర్రెనున్ను వొంటెనున్ను
గాడిదెనున్ను చంపి, వారికి కలిగినదంతా బొత్తి
గా పాడు చేయుమని చెప్పెనన్నెను. । కాబట్టి సౌలు 4
జనులను పోగుచేసి, తెలాయీములో వారిని లెక్క
చేయగా, కాలి బలము రెండులక్షల మందిన్ని యూ
దావారు పదివేల మందిన్ని వుండిరి. । అప్పుడు సౌలు 5
అమాలేకు సంబంధమైన యొక పట్టణమునకు వచ్చి లో
వలో పొంచి వుండెను. । అయితే సౌలు కేనీయులకు 6
వర్తమానము పంపినదేమంటే, అమాలేకీయులతో కూ
డా నేను మిమ్మును నాశనము చేయకుండా వుండేలా
గున మీరు వారిలోనుంచి బైలు వెళ్లి పొండి, యేమంటే
ఇశ్రాయేలు పుత్రులు మిస్రయీములోనుంచి యివత
లకు వచ్చినప్పుడు మీరు వారికి వుపకారము చేసితిరని
చెప్పినందున కేనీయులు అమాలేకీయులలోనుంచి అవ
తలకు వెళ్లిరి. । తరువాత సౌలు అమాలేకీయులను హవీ 7
లా మొదలుకొని మిస్రయీముకు యెదుట వున్న
షూరు మట్టుకు కొట్టి, । అమాలేకీయులయొక్క రాజైన 8
అగగును జీవముతోటి పట్టుకొని, జనులందరినిన్ని
కత్తివాడిచేత సర్వ నాశనము చేసెను. । అయితే సౌలు 9
జనులతో కూడా అగగునున్ను మంచి గొర్రెలనున్ను
యెడ్లనున్ను కొవ్విన గొర్రెపిల్లలు మొదలైనటువంటి
మంచి వాటినిన్ని కనికరించి నాశనము చేయ లేదు,
అయితే యేది నీచముగానున్న పనికిరానిదిగానున్న
అగపడెనో అది అంతా సర్వ నాశనము చేసెను. ।
అప్పుడు యెహోవాయొక్క వాక్యము సమూయే 10
లుకు వచ్చినదేమంటే, । నేను సౌలును రాజుగా నియ 11
యించినందుకు పశ్చాత్తాపపడుతున్నాను, యేమంటే
అతడు నా యొద్దనుంచి వెనుకతీసి, నా ఆజ్ఞలను చేయ
కపోయెనని ఆనతిచ్చినందున, సమూయేలు దుఃఖా
క్రాంతుడై, రాత్రి అంతా యెహోవాను గూర్చి
మొర్ర పెట్టుతూ వుండెను. । అయితే సమూయేలు 12
వుదయమందు లేచి, సౌలును యెదుర్కొనుటకు వెళ్లి
నప్పుడు, సౌలు కర్మెలుకు వచ్చి అక్కడ అదుగో శాస
నపు రాయి నిలిపి తిరిగి గడచి గిల్గాలుకు పోయినా
డని తనకు చెప్పబడెను. । తరువాత సమూయేలు సౌలు 13
యొద్దికి వచ్చెను; సౌలు అతని చూచి యెహోవా
వల్ల నీవు ఆశీర్వాదమును పొందుదువు గాక; యెహో

వాయొక్క ఆజ్ఞ చొప్పున నేను చేస్తినని చెప్పగా; ।
14 సమూయేలు అనిన మాట, ఆలాగైతే నేను వింటూవు
న్న గొఱ్ఱెలయొక్క అర్పునకున్ను యెడ్లయొక్క రంకె
15 కున్ను హేతువు యేమని అడిగెను. । అందుకు సౌలు
చెప్పినదేమంటే, అమాలేకీయుల యొద్దనుంచి వారు
వీటిని తీసుక వచ్చినారు, యేమంటే నీ దేవుడయిన
యెహోవాకు బలులు చెల్లించడానకు జనులు గొఱ్ఱె
లలోనున్ను యెడ్లలోనున్ను మంచివాటిని వుండనిచ్చిరి;
అయితే తతిమ్మా అంతాను మేము సర్వనాశనము చేస్తి
16 మని చెప్పెను. । అప్పుడు సమూయేలు సౌలుతో నీ
మాటలు నిలుపు; యెహోవా రాత్రి నాతో చెప్పి
నది నీకు చెప్పుతానని అనగా, అతడు అతనితో అది
17 తెలియ చెప్పుమనెను. । అప్పుడు సమూయేలు చెప్పినదే
మంటే, నీ దృష్టికి నీవు అల్పుడవుగా అగుపడినప్పుడు
ఇశ్రాయేలు గోత్రములకు శిరస్సుగా నిర్ణయించ
బడితివే; యెహోవా నిన్ను ఇశ్రాయేలు మీద పట్టా
18 భిషిక్తునిగా చేసినాడే. । మరిన్ని యెహోవా నీకు
సెలవు యిచ్చినదేమంటే, నీవు వెళ్లి ఆ పాపాత్ములైన
అమాలేకీయులను సర్వనాశనము చేసి, వారు లయమ
య్యే మట్టుకు వారితో యుద్ధము చేతువు గాకని
చెప్పి, నిన్ను యీ మార్గమున వెళ్లేటట్టు చేసెను. ।
19 కాబట్టి నీవు యెహోవాయొక్క ఆజ్ఞను విని లోబ
డక, దోపుడు మీద ఆశపడి యెహోవా దృష్టికి
20 కీడు చేసితివేమని పలికెను. । అప్పుడు సౌలు సమూ
యేలుతో చెప్పినదేమంటే, అది కాదు; నేను యె
హోవాయొక్క ఆజ్ఞను విని, యెహోవా నన్ను పం
పిన మార్గమున వెళ్లి, అమాలేకీయులయొక్క రాజైన
అగగును తీసుక వచ్చినప్పటికిన్ని అమాలేకీయులను
21 సర్వనాశనము చేస్తిని. । అయితే జనులు దోపుడు సొమ్ము
లో అనగా గొఱ్ఱెలనున్ను యెడ్లనున్ను నాశనము
చేయ వలసిన వాటిలో ముఖ్యమైన వాటినిన్ని గిల్గా
లులో నీ దేవుడైన యెహోవాకు బలి చెల్లించేటం
22 దుకు తీసుక వచ్చినారని చెప్పెను. । అందుకు సమూ
యేలు చెప్పినదేమంటే, యెహోవాయొక్క వాక్య
ము వినడమందు యెంత అనుకూలమో హోమార్పణల
యందున్ను బలులయందున్ను యెహోవాకు అంత
అనుకూలమై యున్నదా? యిదుగో బలికంటే విధేయ
పడడమున్ను పొట్టేలుయొక్క కొవ్వుకంటే వినడము
23 న్ను వుత్తమమై యున్నది. । యెందుకంటే తిరుగుబాటు
యక్షిణీయొక్క పాపము వంటిదిన్ని, మూర్ఖత్వము
అపరాధము వంటిదిన్ని విగ్రహారాధన వంటిదిన్ని అయి
యున్నది. నీవు యెహోవాయొక్క వాక్యమును విస
ర్జించితివి గనుక ఆయన నిన్ను రాజుగా వుండకుండా

విసర్జించెనని చెప్పెను. । అప్పుడు సౌలు సమూయే 24
లుతో అనిన మాట, నేను పాపము చేస్తిని, యేమంటే
జనుల యందు భయపడి వారియొక్క వాక్యములను
విన్నందున యెహోవాయొక్క ఆజ్ఞనున్ను నీయొ
క్క మాటలనున్ను మీరితిని. । కాబట్టి నీవు నా పాప 25
మును క్షమించి, నేను యెహోవాను ఆరాధించేట
ట్టుగా నాతో తిరిగి రావలసినదని వేడుకొన్నప్పటి
కిన్ని, । సమూయేలు సౌలును చూచి నీతో నేనుతిరిగి 26
రాను, యెందుకంటే నీవు యెహోవాయొక్క వాక్య
మును విసర్జించితివి గనుక యెహోవా నిన్ను ఇశ్రా
యేలు మీద రాజుగా వుండకుండా విసర్జించెనని
చెప్పి, । అవతలకు వెళ్లేటందుకు సమూయేలు తిరిగి 27
నప్పుడు సౌలు అతని దుప్పటి చెంగు పట్టుకొన్నం
దున అది చినిగిపోయెను. । అప్పుడు సమూయేలు అతని 28
చూచి యీ రోజున యెహోవా ఇశ్రాయేలు రాజ్య
మును నీపైనుంచి చింపివేసి నీకంటే వుత్తముడయిన నీ
పొరుగువానికి దాని యిచ్చి యున్నాడు. । మరిన్ని 29
ఇశ్రాయేలును జయింపచేసే కర్త అబద్ధమైనా పలు
కడు, పశ్చాత్తాపమయినా పడడు, యేమంటే, పశ్చా
త్తాపపడుటకు ఆయన నరుడు కాడని చెప్పినప్పుడు, ।
అతడు తిరిగి చెప్పినదేమంటే, నేను పాపము చేస్తిని, 30
అయినప్పటికిన్ని నీవు నా జనులయొక్క పెద్దల ముం
దరనున్ను ఇశ్రాయేలు ముందరనున్ను నన్ను నిర్ల
క్ష్యము చేయక, నేను యెహోవాను ఆరాధించేట
ట్టుగా నాతో తిరిగీ రావలసినదని వేడుకొన్నందున, ।
సమూయేలు తిరిగీ సౌలు వెనుకనుంచి వచ్చెను; మరిన్ని 31
సౌలు యెహోవాను ఆరాధించెను. । అప్పుడు సమూ 32
యేలు అమాలేకీయులయొక్క రాజైన అగగును నా
దగ్గిరకు తీసుకరండని చెప్పెను; కాబట్టి అగగు అతని
దగ్గిరకు మృదువుగా వచ్చి నిజముగా మరణముయొక్క
ఘోరత్వము గడచి పోయెనని పలికెను. । అయితే 33
సమూయేలు అతని చూచి, నీ కత్తి స్త్రీలకు సంతతి
లేకుండా చేసినట్టు నీ తల్లిన్ని స్త్రీలలో సంతతి లేకుం
డా వుండును గాకని చెప్పి, గిల్గాలులో యెహోవా
సముఖమందు అగగును తునక తునకలుగా కోసివే
సెను. । అప్పుడు సమూయేలు రామాకు వెళ్లిపోయి 34
నాడు; సౌలున్ను సౌలు గిబాలో తన యింటికి వెళ్లి
పోయెను. । అయితే సమూయేలు సౌలు బ్రతికిన దిన 35
ములన్నిటి దాకా అతని చూడ వెళ్లక వున్నప్పటికిన్ని
సమూయేలు సౌలును గురించి దుఃఖాక్రాంతుడై వుం
డెను; మరిన్ని యెహోవా సౌలును ఇశ్రాయేలు
మీద రాజుగా నిర్ణయించినందుకు పశ్చాత్తాపము
పొందెను.

## 16. అధ్యాయము.

1 అంతట యెహోవా సమూయేలుతో సెలవు యిచ్చి
నదేమంటే, ఇశ్రాయేలు మీద రాజుగా వుండకుండా
నేను విసర్జించిన సౌలును గురించి యెంత పర్యంత
మూ దుఃఖింతువు? నీవు నీ కొమ్మును తైలముతో
నింపి వెళ్లుము; బేత్లెహేమీయుడయిన యెష్షై యొ
ద్దికి నిన్ను పంపుతున్నాను, యెందుకంటే అతని కుమా
రులలో నేను వొకని రాజుగా యేర్పరచితిని అని పలి
2 కెను. । అప్పుడు సమూయేలు నేను యేలాగు వెళ్లు
దును? సౌలు వింటే నన్ను చంపుతాడని చెప్పినందున,
యెహోవా సెలవు యిచ్చినదేమంటే, నీవు వొక
పెడ్డను తీసుక వెళ్లి, యెహోవాకు బలి చెల్లించడా
3 నకు వస్తినని చెప్పి, । యెష్షైని బలి నిమిత్తము పిలువు;
అప్పుడు నీవు చేయ వలసినది యేదో అది నీకు చూపిం
తును; యెవ్వని పేరు నేను నీకు చెప్పుదునో అతని
నీవు నా కొరకు అభిషేకించ వలెనని సెలవు యిచ్చెను.।
4 అప్పుడు సమూయేలు యెహోవా యిచ్చిన సెలవు
చొప్పున చేసి, బేత్లెహేముకు వచ్చెను; అయితే ఆ వూరి
పెద్దలు అతని రాకటకు వణుకుతూ సమాధానముగా
5 వస్తూ వున్నావా అని అడిగినారు. । అందుకు అతడు
చెప్పినదేమంటే, సమాధానముగానే వస్తిని; యెహో
వాకు బలి చెల్లించేటందుకు వచ్చినాను; మీరు శుచి
ర్భూతులయి నాతో కూడా బలికి రండని చెప్పి;
యెష్షైనున్ను అతని కుమారులనున్ను శుచిర్భూతు
6 లుగా చేసి బలికి పిలిచెను. । వారు వచ్చినప్పుడు సంభ
వించినదేమంటే, అతడు ఏలీయాబును చూచి నిజము
గా యెహోవా అభిషేకించేవాడు ఆయన యెదుట
7 నిలిచి వున్నాడని అనుకొనెను. । అయితే యెహో
వా సమూయేలుతో సెలవు యిచ్చినదేమంటే, అతని
ముఖమునున్ను అతని యెత్తునున్ను చూడకుము; నేను
అతని విసర్జించితిని, యెందుకంటే మనుష్యుడు
చూచినట్టు యెహోవా చూడడు; యెందుకంటే
మనుష్యుడు పై రూపమును చూచును, అయితే యె
8 హోవా హృదయమును చూచునని చెప్పెను. । అప్పు
డు యెష్షై అబీనాదాబును పిలిచి సమూయేలు
యెదుట అతని వెళ్లేటట్టు చేసెను; అయితే అతడు
9 యెహోవా యితని యెంచ లేదని చెప్పెను. । అప్పు
డు యెష్షై షమ్మాను యెదుట వెళ్లేటట్టు చేసెను;
అప్పుడు అతడు యెహోవా యితనిన్ని యెంచ లేదని
10 చెప్పెను. । మరిన్ని యెష్షై తన కుమారులలో యేడు
గురుని సమూయేలు ముందర వెళ్లేటట్టు చేసెను.
అయితే సమూయేలు యెష్షైని చూచి యెహోవా
11 వీరినిన్ని యెంచ లేదని చెప్పి; । మరిన్ని సమూయేలు
నీ కుమారులందరూ యిక్కడ వున్నారా అని యెష్షైని
అడిగినప్పుడు, యింకా కడసారపు వాడు వొకడు
వున్నాడు, అదుగో వాడు గొర్రెలను కాస్తూ వున్నా
డని చెప్పెను; అప్పుడు సమూయేలు యెష్షైతో నీవు
వాని పిలువనంపించు, యేమంటే వాడు యిక్కడికి
వచ్చే పర్యంతము మనము కూర్చుండమని చెప్పినప్పు
డు, । అతడు వాని పిలువనంపించి లోపలికి తీసుక 12
వచ్చెను; అయితే వాడు యెర్రనివాడున్ను చక్కని
నేత్రములు గలవాడున్ను చూచుటకు సుందరమైన
వాడున్నై యుండెను: అప్పుడు వీడు వాడేను, నీవు
లేచి వాని అభిషేకించుమని యెహోవా సెలవు
యిచ్చినందున, । సమూయేలు తైలపు కొమ్మును తీసి, 13
వాని సహోదరుల మధ్యను వాని అభిషేకము చేసెను:
మరిన్ని ఆ రోజునుంచి యెహోవాయొక్క ఆత్మ
దావీదు మీదికి వచ్చి వుండెను. తరువాత సమూయేలు
లేచి రామాకు వెళ్లిపోయెను. । అయితే యెహోవా 14
యొక్క ఆత్మ సౌలు యొద్దనుంచి వెళ్లిపోయెను; మరిన్ని
యెహోవాయొద్దనుంచి దురాత్మ వొకటి అతని బెద
రించెను. । అప్పుడు సౌలుయొక్క సేవకులు అతని 15
చూచి యిదుగో దేవుని యొద్దనుంచి దురాత్మ నిన్ను
బెదిరిస్తూ వున్నది. । మా యజమానుడవైన నీవు నిన్ను 16
కనిపెట్టియున్న నీ సేవకులమయిన మాకు కిన్నెరను
చమత్కారముగా వాయించ గల వొకని చూచుటకు
సెలవు యివ్వ వలెను, యేమంటే దేవునియొద్దనుంచి
దురాత్మ నిన్ను పట్టినప్పుడు వాడు తన చేతితో వా
యించినందున నీవు బాగా వుందువని చెప్పిరి. । అయి 17
నందున సౌలు తన సేవకులతో బాగా వాయించ గల
వొకని చూచి నా యొద్దికి తెండని చెప్పినప్పుడు
అతని సేవకులలో వొకడు చెప్పినదేమంటే, । యిదుగో 18
బేత్లెహేమీయుడైన యెష్షైయొక్క కుమారుని వొకని
చూస్తిని, అతడు చమత్కారముగా వాయించ గలడు;
బహు ధైర్యవంతుడున్ను యుద్ధపు మనుష్యుడున్ను
వ్యవహారమందు వివేకము గలవాడున్ను సుందరమైన
వాడున్ను అయి వున్నాడు; మరిన్ని యెహోవా వా
నికి తోడుగా వున్నాడని చెప్పెను. । కాబట్టి సౌలు 19
యెష్షై యొద్దికి దూతలను పంపి, గొర్రెల యొద్ద
వున్న నీ కుమారుడయిన దావీదును నా యొద్దకు పంప
వలసినదని చెప్పుమనెను. । అప్పుడు యెష్షై రొట్టెలను 20
వేసిన వొక గాడిదెను, ద్రాక్షారసపు బుడ్డి
నిన్ని వొక మేకపిల్లనున్ను తన కుమారుడయిన దావీదు
చేత సౌలు యొద్దికి పంపెను. । కాబట్టి దావీదు సౌలు 21
దగ్గిరకు వచ్చి అతని ముందర నిలువబడెను; యితని
మీద అతడు బహు ప్రేమగా వుండెను; యితడు
అతనికి ఆయుధాదులను మోసేవాడాయెను. । సౌలు 22

యెష్షై యొద్దికి పంపిన మాట యేమంటే, దావీదు
నా దృష్టికి అనుగ్రహము పొందెను గనుక అతని
నా ముందర కనిపెట్టి వుండనివ్వ వలసినదని చెప్పెను.।
23 మరిన్ని దేవుని యొద్దనుంచి దురాత్మ సౌలును పట్టిన
సమయమున దావీదు కిన్నెర పట్టుకొని తన చేతితో
వాయించినప్పుడు దురాత్మ అతని విడచిపెట్టినందున
అతడు సేద తీర్చుకొని బాగా వుండెను.

## 17. అధ్యాయము.

1 అయితే పెలిష్తీయులు తమ సైన్యములను యుద్ధ
మునకు సమకూర్చిరి; యూదా దేశమందుండే శో
ఖోలో కూడుకొని, ఎఫెస్దమ్మీము దగ్గిర శోఖోకున్ను
2 అజేకాకున్ను మధ్యను వుండిరి. । మరిన్ని సౌలున్ను
ఇశ్రాయేలీయులున్ను కూడుకొని ఏలా లోవలో దిగి
3 పెలిష్తీయుల ముందర యుద్ధమునకు సిద్ధమయిరి.। అయి
తే పెలిష్తీయులు ఆ తట్టు పర్వతము మీదనున్ను ఇశ్రా
యేలీయులు యీ తట్టు పర్వతము మీదనున్ను నిలిచి
యుండిరి; వుభయుల మధ్యను వొక లోవ వుండెను.।
4 అయితే పెలిష్తీయులయొక్క పేటలోనుంచి గాతు
సంబంధమైన గొల్యతు అనే పేరుగల పరాక్రమశాలి
యైన వొకడు బయిలు వెళ్లెను, అతని పొడవు ఆరు
5 మూళ్ల జానెడు.। అతని శిరస్సు మీద యిత్తడి పాగా
వుండెను, అతనికి యుద్ధ కవచము గలదు; ఆ కవచము
6 అయిదువేల షెకేలుల యిత్తడి యెత్తు గలది.। మరిన్ని
అతని కాళ్లకు యిత్తడి కవచమున్ను అతని భుజముల
7 మధ్యను యిత్తడి డాలున్ను కలవు.। అతని యీటె
కర్ర నేతకాని పలకవలె వుండెను; మరిన్ని అతని
యీటె శిరస్సు ఆరునూరు షెకేలుల యినుము యెత్తు
గలది: వొకడు డాలు మోస్తూ అతని ముందర వెళ్లెను.।
8 అతడు నిలిచి ఇశ్రాయేలు సైన్యస్థులకు బొబ్బ పెట్టిన
దేమంటే, మీరు యుద్ధమునకు సిద్ధపడి యెందుకు
బయిలుదేరి వస్తిరి? నేను పెలిష్తీయుడను కానా? మీరు
సౌలుయొక్క సేవకులు కారా? మీ కొరకు మీరు
వొకని యెంచుకొని వాని నా యొద్దికి రానివ్వండి.।
9 వాడు నాతో పోట్లాడి నన్ను చంప గలిగితే మేము
మీకు సేవకులమౌదుము; నేను వాని జయించి చంపి
నట్టయితే ఆ పక్షమందు మీరు మాకు సేవకులయి మాకు
10 కొలువు చేతురని చెప్పి,। ఆ పెలిష్తీయుడు మరిన్ని
అనినదేమంటే, యీ రోజున నేను ఇశ్రాయేలుయొ
క్క సైన్యములను నిరాకరిస్తున్నాను, పోట్లా
11 డుటకు వొకని యివ్వండని పలికెను.। అయితే సౌలు
న్ను ఇశ్రాయేలీయులందరున్ను ఆ పెలిష్తీయునియొక్క
మాటలు విన్నప్పుడు బహుగా బెంగపెట్టుకొని జడి
12 సిరి.। అయితే దావీదు యూదా బేత్లెహేముయొక్క
ఎఫ్రాతీయుడయిన యెష్షై అనే పేరుగల అతనియొ
క్క కుమారుడై యుండెను: అతనికి యెనమండుగురు
కుమాళ్లు గలరు: అంతట సౌలు బ్రతికిన కాలమందు
జనులలో ముసలివాడై వుండెను.। అయితే యెష్షై 13
యొక్క ముగ్గురు పెద్ద కుమారులు వెళ్లి సౌలును యుద్ధ
మునకు వెంబడించిరి: యుద్ధమునకు వెళ్లిన అతని ముగ్గు
రు కుమారుల పేరులు యేమంటే, ప్రథమ పుత్రుడు
ఎలీయాబనిన్ని, రెండోవాడు అబీనాదాబనిన్ని, మూ
డోవాడు షమ్మా అనిన్ని యుండెను.। దావీదు కడసా 14
రపు వాడయి యుండెను; పెద్దవారైన ముగ్గురు సౌలును
వెంబడించిరి.। అయితే దావీదు బేత్లెహేములో తన 15
తండ్రియొక్క గొర్రెలను మేపే కొరకు సౌలు యొద్ద
నుంచి తిరిగీ వచ్చెను.। అంతట ఆ పెలిష్తీయుడు వుదయ 16
మందున్ను సాయంతనమందున్ను చేరుతూ, నలుబయి
దినములు తన్ను తాను అగుపరుచుకొనెను.। అప్పుడు 17
యెష్షై తన కుమారుడయిన దావీదుతో చెప్పినదే
మంటే, నీ సహోదరుల కొరకు నీవు యీ కాల్చిన
గోధుములలో వొక ఎఫానున్ను యీ పది రొట్టెల
నున్ను తీసుకొని పేటలో నీ సహోదరుల దగ్గిరకు
త్వరగా వెళ్లుము.। మరిన్ని యీ పది జున్ను ముక్కలు 18
తీసుకుపోయి సహస్రాధిపతికి యివ్వ వలసినది; నీ
సహోదరులు బాగా వున్నారో లేదో అది తెలుసు
కొని వాండ్ల యొద్ద ఆనవాలు వొకటి తీసుక రా అని
పంపెను.। అప్పుడు సౌలున్ను వారున్ను ఇశ్రాయేలు 19
వారందరున్ను ఏలా లోవలో పెలిష్తీయులతోటి పో
ట్లాడుతూ వుండిరి.। అప్పుడు దావీదు వుదయమందు 20
లేచి, వొక కాపరికి గొర్రెలను అప్పగించి, ఆ వస్తువు
లను తీసుకొని యెష్షై తనకు యిచ్చిన ఆజ్ఞ చొప్పున
తన మార్గమున వెళ్లిపోయెను; అయితే అతడు కంద
కమునకు వచ్చినప్పుడు సమూహము పోట్లాడుటకు
వెళ్లుతూ యుద్ధము నిమిత్తము అర్చుతూ వుండెను.।
యేమంటే ఇశ్రాయేలున్ను పెలిష్తీయులున్ను యీ 21
సైన్యమును ఆ సైన్యమునకున్ను ఆ సైన్యమును యీ
సైన్యమునకున్ను యుద్ధ ప్రకారముగా సిద్ధపర్చి వుం
డిరి.। అప్పుడు దావీదు తన యొద్ద వున్న వస్తువులను 22
కనిపెట్టే వాని వశము చేసి, పరుగెత్తి పోయి సైన్య
ములోకి వచ్చి, తన సహోదరులను క్షేమ విషయమై
అడిగెను.। అతడు వారితో మాట్లాడుతూ వుండగా, 23
యిదుగో, గాతు పెలిష్తీయుడయిన గొల్యతు అనే
నామము గల ఆ పరాక్రమశాలి పెలిష్తీయులయొక్క
సైన్యములోనుంచి వచ్చి ఆ మాటల చొప్పున పలికి
నాడు, అది దావీదు వినెను.। ఇశ్రాయేలీయులందరు 24
న్ను ఆ మనుష్యుని చూచినప్పుడు మహా బెంగపడి
వాని ముందరినుంచి పారిపోయిరి.। మరిన్ని ఇశ్రాయే 25

లీయులు చెప్పుకొన్నదేమంటే, ఆ వచ్చిన మనిషిని
మీరు చూస్తిరే; నిజముగా ఇశ్రాయేలును నిలక్ష్య
ము చేసే కొరకు వాడు వచ్చి వున్నాడు; కాబట్టి వాని
చంపినవాడు యెవడో వానికి రాజు బహు ద్రవ్యము
చేత ఐశ్వర్యమును కలుగ చేసి, తన కుమార్తెను వా
నికి యిచ్చి, వాని తండ్రి యింటి కూటము ఇశ్రాయే
26 లులో స్వతంత్రులుగా చేసునని చెప్పుకొనిరి. । అప్పు
డు దావీదు తన యొద్ద నిలిచినవారిని చూచి యీ పెలి
ష్తీయుని చంపి ఇశ్రాయేలునుంచి యీ నిందను తీసి
వేసిన వానికి యేమి చేయబడును? యేమంటే జీవము
గల దేవునియొక్క సైన్యములను నిర్లక్ష్యము చేసిన యీ
సున్నతీలేని పెలిష్తీయుడు యెంత గనుక అని పలి
27 కెను. । అందుకు జనులు ప్రత్యుత్తరముగా వాని చం
పిన వానికి యీలాగీలాగున చేయబడునని పలికిరి. ।
28 అయితే అతడు వారితో మాట్లాడుతూ వుండగా అతని
పెద్ద సహోదరుడయిన ఏలీయాబు వినెను: అప్పుడు
ఏలీయాబుయొక్క కోపము దావీదు మీద రగులుకొని,
అతడు అతని చూచి యిక్కడికి యెందుకు వస్తివి? అర
ణ్యములో ఆ చిన్న గొర్రెమందను యెవ్వరి వశము
చేస్తివి? నీ గర్వమునున్ను నీ హృదయముయొక్క చెడ్డ
తనమునున్ను నేను యెరుగుదును; యుద్ధము చూచే
9 టందుకే నీవు వస్తివని పలికెను. । అందుకు దావీదు
అనిన మాట, నేను యిప్పుడు యేమి చేస్తిని? హేతువు
0 లేదా అని చెప్పి; । అతని యొద్దనుంచి యిటు తిరిగి
మరి వొకని ఆ ప్రకారము అడిగినప్పుడు జనులు వా
1 నికి మునుపటిలాగున ప్రత్యుత్తరమిచ్చిరి. । అయితే
దావీదు పలికిన మాటలు ప్రసిద్ధి అయినప్పుడు వారు
సౌలుతో తెలియ చెప్పిరి, కాబట్టి అతడు అతని పిలు
2 వనంపించెను. । అప్పుడు దావీదు సౌలును చూచి వాని
నిమిత్తము యెవ్వని హృదయమైనా సొమ్మసిల్లవద్దు; మీ
సేవకుడనయిన నేను వెళ్లి యీ పెలిష్తీయునితో పోట్లా
3 డుతానని చెప్పినప్పుడు, । సౌలు దావీదుతో నీవు యీ
పెలిష్తీయునికి యెదురుగా వెళ్లి వానితో పోట్లాడడా
నకు నీవు చాలవు; నీవు బాలుడవు, వాడు బాల్యము
నుంచీ యుద్ధమందు అభ్యాసము గలవాడని చెప్పెను.।
4 అందుకు దావీదు సౌలుతో చెప్పినదేమంటే, నీ సేవకు
డనైన నేను నా తండ్రియొక్క గొర్రెలను కాస్తూ
వుండగా సింహమున్ను యెలుగుబంటిన్ని వచ్చి మంద
లోనుంచి వొక గొర్రెపిల్లను యెత్తుకొని పోయెను. ।
5 దాని వెంబడి నేను బయిలు వెళ్లి దాని కొట్టి దాని నోటి
లోనుంచి విడిపించుకొన్నాను; అది నా మీదికి లేచిన
ప్పుడు దాని గడ్డము పట్టుకొని దాని కొట్టి చంపి వేసి
6 నాను. । నీ సేవకుడనైన నేను ఆ సింహమునున్ను యెలు
గుబంటినిన్ని చంపివేస్తిని; యిప్పుడు జీవము గల దేవుని
యొక్క సైన్యములను నిలక్ష్యము చేసిన యీ సున్నతీ
లేని పెలిష్తీయుడు వాటిలో వొకటి వలెనై వుండునని
చెప్పి; । మరిన్ని దావీదు చెప్పినదేమంటే, సింహము 37
యొక్క పాదమునుంచిన్ని యెలుగుబంటియొక్క పా
దమునుంచిన్ని నన్ను రక్షించిన యెహోవా యీ పెలి
ష్తీయునియొక్క చేతిలోనుంచిన్ని నన్ను విడిపించు
నని చెప్పినప్పుడు, సౌలు వెళ్లు యెహోవా నీకు తో
డుగా వుండును గాకని దావీదుతో చెప్పెను. । మరిన్ని 38
సౌలు తన ఆయుధాదులను దావీదుకు ధరింప చేసి,
రాగి పాగా వాని శిరస్సు మీద పెట్టి, యుద్ధ కవచ
మును ధరింపచేసెను. । అప్పుడు దావీదు తాను తొడి 39
గిన వాటి పయిని కత్తి కట్టుకొని వెళ్లగలనో లేదో
అని చూచుకొనెను, యేమంటే అది తనకు వాడికె
లేదు; కాబట్టి దావీదు సౌలును చూచి యివి నాకు
వాడికె లేదు గనుక వీటితోను నేను వెళ్లలేనని చెప్పి,
వాటిని తీసి వేసి, । తన కర్ర చేత పట్టుకొని, గడ్డలో 40
నుంచి అయిదు నున్నటి రాళ్లను యెంచుకొని తన యొ
ద్దనున్న చిక్కములో వుంచి, వడిశనున్ను చేత పట్టు
కొని వెళ్లి ఆ పెలిష్తీయుని దగ్గిరకు చేరెను. । అప్పుడు 41
ఆ పెలిష్తీయుడు వచ్చి దావీదు దగ్గిరకు చేరెను; మరిన్ని
డాలుమోసే వాడు వాని ముందర వెళ్లెను. । అయితే 42
పెలిష్తీయుడు చుట్టూ పారచూచి దావీదును కన్నప్పుడు
అతని నిలక్ష్యపెట్టినాడు, యేమంటే అతడు బాలుడై
యెర్రటివాడున్ను సుందరమయిన ముఖము గలవాడు
నైన్ని వుండెను. । మరిన్ని పెలిష్తీయుడు దావీదుతో 43
నేను కుక్కను గనుకనా నా దగ్గిరకు కర్రలతోటి
వస్తున్నావని పలికి, తన దేవుళ్ల పట్టి దావీదును శపిం
చెను. । మరిన్ని పెలిష్తీయుడు దావీదుతో చెప్పినదే 44
మంటే, నా దగ్గిరకు రమ్ము, నీ మాంసము ఆకాశము
యొక్క పక్షులకున్ను భూమియొక్క మృగములకున్ను
యిచ్చి వేతునని చెప్పినప్పుడు, । దావీదు పెలిష్తీయుని 45
చూచి నీవు కత్తితోటిన్ని యీటెతోటిన్ని డాలుతో
టిన్ని నా యొద్దికి వస్తూ వున్నావు; అయితే నేను
నీవు నిలక్ష్యము చేసిన ఇశ్రాయేలుయొక్క సైన్య
ములయొక్క దేవుని అనగా సైన్యములయొక్క యె
హోవా నామమందు నీ యొద్దికి వస్తున్నాను. । యీ 46
రోజున యెహోవా నిన్ను నా చేతికి అప్పగించును;
నేను నిన్ను కొట్టి నీ శిరస్సును తెగవేతును; ఇశ్రాయే
లులో దేవుడు వున్నాడని లోకులందరున్ను తెలుసు
కొనే కొరకు నేను యీ రోజున పెలిష్తీయులయొక్క
కళేబరములను ఆకాశ పక్షులకున్ను భూమియొక్క
మృగములకున్ను యిత్తును. । మరిన్ని యెహోవా కత్తి 47
చేతనున్ను యీటెచేతనున్ను రక్షించేవాడు కాడని
యీ సమూహమంతటికీ తెలుసును, యెందుకంటే యీ

యుద్ధము యెహోవాదై వున్నది, ఆయన మిమ్మును
48 మాచేతికి అప్పగించునని చెప్పెను. । అంతట పెలిష్తీ
యుడు లేచి దావీదుకు యెదురుగా దగ్గిరకు వచ్చిన
ప్పుడు సంభవించినదేమంటే, దావీదు త్వరచేసి ఆ
పెలిష్తీయుని యెదుర్కొనుటకు సైన్యపు తట్టు పరు
49 గెత్తి, । తన సంచిలోనుంచి రాయి వొకటి తీసి దాని
వడిశతో విసరి ఆ పెలిష్తీయుని నుదుటను కొట్టెను;
ఆ రాయి వాని నుదుట చొచ్చినందున వాడు నేలను
50 బోర్లపడెను. । యీలాగున దావీదు వడిశతోనున్ను
రాతితోనున్ను ఆ పెలిష్తీయుని కొట్టి చంపి వాని
మీద జయము పొందెను; అయితే దావీదు చేతిలో
51 కత్తి లేదు గనుక, । దావీదు పరుగెత్తి పోయి పెలిష్తీ
యుని తొక్కి పట్టి వాని కత్తి వర దూసి దానితో
వాని చంపి వాని శిరస్సును తెగవేసెను: పెలిష్తీయులు
తమ పరాక్రమశాలి అయినవాడు మరణమాయెనని
52 చూచి పారిపోయిరి. । అప్పుడు ఇశ్రాయేలీయులున్ను
యూదావారున్ను లేచి ఆర్చి పెలిష్తీయులను ఎక్రోను
లోవ మట్టుకున్ను పట్టణ ద్వారము మట్టుకున్ను తరి
మినందున గాయము పొందిన పెలిష్తీయులు షయర
యీము గాతు ఎక్రోను యీ పట్టణములకు వెళ్లే మా
53 ర్గములందు కూలిరి. । మరిన్ని ఇశ్రాయేలు పుత్రులు
పెలిష్తీయులను తరమడము మాని తిరిగి వచ్చి వారి
54 డేరాలను దోచుకొనిరి. । అయితే దావీదు ఆ పెలిష్తీ
యునియొక్క శిరస్సును తీసుకొని యెరూశలేముకు
వచ్చినాడు; అతడు తన ఆయుధాదులు తన డేరాలో
55 వుంచెను. । సౌలు దావీదు పెలిష్తీయునికి యెదురుగా
వెళ్లేది చూచినప్పుడు తన సైన్యాధిపతి యయిన అబ్నే
రును చూచి, వో అబ్నేరా, యీ పడుచువాడు యె
వని కుమారుడని అడిగెను; అబ్నేరు వో రాజా, నీ
ప్రాణముతోడు నాకు తెలియలేదని చెప్పినప్పుడు, ।
56 రాజు అతనితో యీ పడుచువాడు యెవని కుమారు
57 డో అని అడిగి తెలుసుకొమ్మని చెప్పెను. । కాబట్టి
దావీదు పెలిష్తీయుని హతము చేసి తిరిగీ వచ్చినప్పుడు
అబ్నేరు అతని పిలుచుకొని పెలిష్తీయునియొక్క శిర
స్సును చేత నుండగా అతని సౌలు దగ్గిరకు తీసుక
58 వచ్చెను. । అప్పుడు సౌలు అతని చూచి వో పడుచు
వాడా, నీవు యెవని కుమారుడవని అడిగినప్పుడు, దా
వీదు బేత్లెహేమీయుడైన యెష్షై అనే మీ సేవకుని
కుమారుడనై వున్నానని ప్రత్యుత్తరము చెప్పెను.

## 18. అధ్యాయము.

1 అయితే అతడు సౌలుతో మాట్లాడడము ముగిం
చిన తరువాత సంభవించినదేమంటే, యోనాతాను
యొక్క హృదయము దావీదుయొక్క హృదయము
తో అతకపడెను, యోనాతాను తన ప్రాణము వలెనే
అతని స్నేహించెను. । మరిన్ని సౌలు ఆ రోజున అతని 2
చేర్చుకొని అతని తండ్రి యింటికి తిరిగీ అతని వెళ్ల
నివ్వకపోయెను. । అప్పుడు యోనాతానున్ను దావీ 3
దున్ను స్నేహంబడికను చేసుకొనిరి, యేమంటే యితని
అతడు తన ప్రాణము వలెనే స్నేహిస్తూ వుండెను. ।
మరిన్ని యోనాతాను తన దుప్పటినిన్ని తన కత్తినిన్ని 4
తన విల్లునున్ను మొలతాడు మొదలైన వాటినిన్ని తీసి
దావీదుకు యిచ్చెను. । అయితే దావీదు యెక్కడికి 5
సౌలుచేత పంపబడెనో అక్కడికి వెళ్లి సుబుద్ధిగా
జరిగించెను; కాబట్టి సౌలు సైన్యస్థుల మీద అతని
వుంచినాడు; మరిన్ని అతడు జనులందరి దృష్టికిన్ని
సౌలుయొక్క సేవకుల దృష్టికిన్ని అనుకూలుడై వుం
డెను. । అయితే దావీదు పెలిష్తీయులను హతము చేసి 6
తిరిగీ జనులతో వచ్చినప్పుడు సంభవించినదేమంటే,
స్త్రీలు ఇశ్రాయేలు వూళ్లన్నిటిలోనుంచి తంబురలతో
నున్ను సంభ్రమముతోనున్ను వాద్యములతోనున్ను
పాడుతూ నాట్యమాడుతూ రాజైన సౌలును యెదు
ర్కొనేటందుకు వచ్చిరి. । ఆ స్త్రీలు వాయిస్తూ వొకరి 7
నొకరిని చూచుకొని, సౌలు తన వేల కొలదినిన్ని దా
వీదు తన పదివేల కొలదినిన్ని హతము చేసినారని
పాడిరి. । అయితే ఆ మాటలు సౌలుకు అనుకూలము 8
కానందున అతడు బహుగా కోపము తెచ్చుకొని అను
కొన్నదేమంటే, వారు దావీదుకు పదివేల కొలదిన్ని
నాకు వేల కొలది మాత్రము చెల్లించిరి, యిక రాజ్య
ము వినాగా అతనికి యేమి తక్కువని పలికెను. । కా 9
బట్టి నాటినుంచి సౌలు దావీదును కాచి కనిపెట్టు
తూ వుండెను. । అయినందున మరునాటియందు సంభ 10
వించినదేమంటే, దేవుని యొద్దనుంచి దురాత్మ సౌలు
మీదికి వచ్చినందున అతడు యింటి మధ్యమందు దీర్ఘ
దర్శిగా పలుకుతూ వుండెను, అప్పుడు దావీదు మును
పటిలాగున తన చేతితో వాయిస్తూ వుండెను. । సౌలు 11
చేతిలో వొక యీటె వున్నందున నేను గోడ మట్టుకు
దావీదును కొట్టుతానని అనుకొని సౌలు ఆ యీటెను
విసరెను.—అయితే దావీదు రెండు మారులు అతని
సముఖమునుంచి తప్పించుకొని పోయెను. । మరిన్ని 12
సౌలు యొద్దనుంచి యెహోవా తొలగి దావీదుతో
కూడా వున్నందున సౌలు దావీదుకు భయపడెను. ।
కాబట్టి సౌలు అతని తనకు దూరపర్చి అతని సహ 13
స్రాధిపతిగా చేసెను; అతడు జనుల ముందర బయిలు
వెళ్లుతూ వస్తూ వుండెను. । మరిన్ని దావీదు తన సకల 14
మార్గములలో సుబుద్ధిగా నడిచెను, యెహోవా
అతనికి తోడుగా వుండెను. । అయితే దావీదు మిక్కిలీ 15
సుబుద్ధిగా నడుస్తూ వున్నాడని సౌలు చూచినప్పుడు

16 అతడు అతనికి భయపడెను. । అయితే ఇశ్రాయేలంద
రున్ను యూదాయున్ను దావీదును ప్రేమించిరి, యెం
దుకంటే అతడు వారి ముందర బయిలు వెళ్లుతూ వస్తూ
17 వుండెను. । అంతట సౌలు నా చెయ్యి కాదు పెలి
ష్తీయులయొక్క చెయ్యి అతని మీద పడును గాకని
అనుకొని, దావీదును చూచి యిదుగో నా పెద్ద కుమా
ర్తెయైన మేరబును నీకు యిత్తును, నీవు నా పట్ల
ధైర్యవంతుడవై యెహోవాయొక్క యుద్ధములను
18 బాగా చేయ వలెనని చెప్పినప్పుడు; । దావీదు సౌలు
తో అనిన మాట, రాజుకు అల్లుడనై వుండేటందుకు
నేనెంత వాడను? నా ప్రాణమైనా ఇశ్రాయేలు
లో నా తండ్రి యింటి కూటమయినా యెంతని
19 చెప్పెను. । అయితే సౌలుయొక్క కుమార్తె అయిన
మేరబును దావీదుకు యివ్వవలసినప్పుడు సంభవించిన
దేమంటే, ఆమె మెహోలాతీయుడయిన అద్రీయే
20 లుకు భార్యగా యివ్వపడెను. । అయితే సౌలుయొక్క
కుమార్తెయైన మీఖాలు దావీదు యందు ప్రేమ
వుంచెను; యీ సంగతి సౌలుకు వినపడినప్పుడు అత
21 నికి అనుకూలముగా వుండెను. । అప్పుడు ఆమె అత
నికి వురిగా వుండేటట్టుగానున్ను పెలిష్తీయులయొక్క
చెయ్యి అతని మీద వుండేటట్టుగానున్ను నేను ఆమెను
అతనికి యిత్తునని అనుకొని, దావీదును చూచి యి
ప్పుడు నీవు మరివొక దానిచేత నాకు అల్లుడవౌదువని
22 చెప్పెను. । మరిన్ని సౌలు తన సేవకులకు యీలాగున
ఆజ్ఞాపించెను, మీరు దావీదుతో ఏకాంతముగా మా
ట్లాడ వలసినదేమంటే, యిదుగో రాజు నీ యందు
సంతోషముగా వున్నాడు, మరిన్ని అతని సేవకులంద
రున్ను నీయందు స్నేహముగా వున్నారు; కాబట్టి నీవు
రాజుకు అల్లుడవై వుండవలసినదని చెప్పండనినందున,।
23 సౌలుయొక్క సేవకులు ఆ మాటల చొప్పున దావీదు
చెవిలో పలికినారు. అందుకు దావీదు అనిన మాట,
నేను దరిద్రుడనైయిన్ని స్వల్పముగా యెంచబడే వాడ
నైయిన్ని వుండగా రాజుకు అల్లుడనయ్యేది చులకనని
24 మీకు తోస్తూ వున్నదా అని పలికెను. । కాబట్టి సౌలు
యొక్క సేవకులు దావీదు పలికిన మాటలు అతనితో
25 తెలియ చెప్పినప్పుడు, । సౌలు మీరు దావీదుతో చెప్ప
వలసినదేమంటే, రాజు ఓలిని కోరేది లేదు గాని రాజు
శత్రువుల మీద పగ తీర్చుకొనే కొరకు పెలిష్తీయుల
యొక్క నూరు ముందోలులు కోరుతూ వున్నాడని
చెప్పుమనెను. యేమంటే సౌలు దావీదును పెలిష్తీ
యులయొక్క చేతులచేత పడచేయ తాత్పర్యము కల
26 వాడై వుండెను. । అంతట అతని సేవకులు ఆ మాటలు
దావీదుతో తెలియ చెప్పిరి; మరిన్ని దావీదు రాజుకు
అల్లుడు కావడానకు మనస్సు కలవాడై వుండెను. ।
కాబట్టి దినములు గతించక మునుపు దావీదు లేచి, 27
తానున్ను తన వారున్ను వెళ్లి పెలిష్తీయులలో యి
న్నూరు మందిని చంపి వారి ముందోలులు తీసుక వచ్చి
రాజుకు అల్లుడు కావడానకు నిండుగా లెక్క పెట్టి
యిచ్చినాడు: సౌలు తన కుమార్తెయైన మీఖాలును
అతనికి భార్యగా యిచ్చెను. । మరిన్నీ సౌలు యెహో 28
వా దావీదుకు తోడుగా వున్నాడని చూచెను; మరిన్ని
సౌలుయొక్క కుమార్తె అయిన మీఖాలు అతని
స్నేహించెను. । అప్పుడు సౌలు దావీదుకు యింకా 29
భయపడి యెల్లప్పుడున్ను దావీదుకు విరోధముగానే
వుండెను. । అప్పుడు పెలిష్తీయులయొక్క అధికారులు 30
బయిలు వెళ్లిరి; వారు బయిలు వెళ్లిన తరువాతను సంభ
వించినదేమంటే, దావీదు సౌలుయొక్క సేవకులందరి
కంటే మిక్కిలీ సుబుద్ధిగా ప్రవర్తించెను, అందువల్ల
అతని నామము బహు ప్రసిద్ధి పొందెను.

## 19. అధ్యాయము.

అంతట సౌలు మీరు దావీదును చంప వలెనని 1
తన కుమారుడయిన యోనాతానుతోనున్ను తన సేవ
కులందరితోనున్ను చెప్పెను. । అయితే సౌలుయొక్క 2
కుమారుడయిన యోనాతాను దావీదుయందు బహుగా
ఆనందించి వున్నందున అతడు దావీదుతో చెప్పినదే
మంటే, నా తండ్రియైన సౌలు నిన్ను చంపడానకు
తాత్పర్యము కలవాడై వున్నాడు; కాబట్టి నీవు జాగ్ర
తపడి వుదయము దాకా రహస్యమైన స్థలమందు
దాగి వుండుము. । నేను బయిలు వెళ్లి నీవు వున్న పొల 3
ములో నా తండ్రియొద్ద నిలిచి నిన్ను గురించి అతనితో
మాట్లాడుతాను, నాకు యేమి అగుపడునో అది
నీతో తెలియ చెప్పుదునని చెప్పెను. । అప్పుడు యో 4
నాతాను తన తండ్రియైన సౌలుతో దావీదును గురించి
బాగా పలికి చెప్పినదేమంటే, రాజు తన సేవకుడైన
దావీదు విషయమై పాపము చేయక వుండును గాక,
యెందుకంటే అతడు మీకు విరోధముగా యే పాప
ము చేయలేదు, మీ విషయమై అతని క్రియలు మిక్కిలీ
బాగా వున్నవి. । యేలాగంటే తన ప్రాణము తన చేతి 5
లో వుంచుకొని ఆ పెలిష్తీయుని చంపినప్పుడు యె
హోవా ఇశ్రాయేలందరి నిమిత్తము గొప్ప రక్షణను
కలగ చేసెను: అది మీరే చూచి సంతోషిస్తిరే; నిష్కా
రణముగా దావీదును చంపి నిరపరాధి రక్తమునకు పాప
ముచేయనేలని పలికినందున, । సౌలు యోనాతానుయొ 6
క్క మాటలను ఆలకించి చెప్పినదేమంటే, యెహోవా
యొక్క జీవముతోడు అతడు చంపపడ కూడదని
సత్యము చేసెను. । అప్పుడు యోనాతాను దావీదును 7
పిలుచుకొని ఆ సంగతులన్నిన్ని అతనికి చూపించెను;

మరిన్ని యోనాతాను దావీదును సౌలుయొద్దికి తీసుక
వచ్చినందున అతడు మునుపటిలాగున అతని సన్నిధి
8 యందు వుంటూ వుండెను. । తరువాత యుద్ధము తిరిగీ
కలిగెను; అప్పుడు దావీదు బయిలు వెళ్లి ఫెలిష్తీయు
లతో పోట్లాడి బహు హతముచేత వారిని చంపెను;
9 వారు అతని ముందరనుంచి పారిపోయిరి. । అయితే యె
హోవా యొద్దనుంచి దురాత్మ సౌలు మీదికి వచ్చెను;
అప్పుడు సౌలు తనచేత యీటె పట్టుకొని తన యింట్లో
కూర్చుని వుండెను, దావీదున్ను తన చేతితో వాయి
10 స్తూ వుండెను. । అంతలో సౌలు గోడ మట్టుకు దావీ
దును పొడుచుటకు తాత్పర్యము కలిగి యీటె విస
రెను; అయితే అతడు అతని ముందరనుంచి తప్పించు
కొన్నందున యీటె గోడను నాటెను; దావీదు ఆ
11 రాత్రియందు పారిపోయి తప్పించుకొనెను. । అయితే
సౌలు దావీదును కనిపెట్టి వుదయమందు అతని చంపు
టకు దూతలను అతని యింటికి పంపినాడు; కాబట్టి
దావీదు భార్యయైన మీఖాలు అతని చూచి యీ
రాత్రిలోనే నీ ప్రాణమును నీవు రక్షించుకోకపోతే
12 రేపటి రోజున నీవు చంపబడుదువని చెప్పి, । కిటికీ
ద్వారములోనుంచి దావీదును దించినందున అతడు
13 పారిపోయి తప్పించుకొనెను. । తరువాత మీఖాలు
వొక బొమ్మను తీసుకొని మంచము మీద దాని పెట్టి
మేక వెంట్రుకలు గల తలగడ వుంచి అంతా దుప్ప
14 టితో కప్పివేసెను. । సౌలు దావీదును పట్టడానకు
దూతలను పంపినప్పుడు ఆమె అతడు సంకటములో
15 వున్నాడని చెప్పెను. । మరిన్ని సౌలు దావీదును చూ
చుటకు దూతలను పంపి చెప్పినదేమంటే, నేను అతని
చంపేకొరకు మంచముతోటే తీసుక రండని పంపెను. ।
16 అయితే దూతలు వచ్చి లోపల ప్రవేశించి చూచి
యిదుగో మంచము మీద మేక వెంట్రుకలు గల తల
17 గడతో వున్న బొమ్మ కనపడెను. । అప్పుడు సౌలు
మీఖాలుతో చెప్పినదేమంటే, నా శత్రువుని తప్పిం
చుకొనేటట్టుగా పంపి నీవు నన్ను యీలాగున భ్రమ
పెట్టేదేమని అడిగినప్పుడు మీఖాలు సౌలుతో ప్రత్యు
త్తరముగా అతడు నన్ను చూచి నేను నిన్ను యెందుకు
18 చంపవలెను, నన్ను పోనిమ్మని చెప్పెననెను. । అయితే
ఆలాగున దావీదు తప్పించుకొని పారిపోయి రామాలో
సమూయేలు యొద్దికి వచ్చి తనకు సౌలు చేసినదంతా
అతనితో తెలియ చేసెను; అప్పుడు అతడున్ను సమూ
యేలున్ను వెళ్లి నాయోతుకు వచ్చి నివాసము చేసిరి. ।
19 అప్పుడు యిదుగో దావీదు రామా దగ్గిర నాయోతులో
20 వున్నాడని సౌలుకు చెప్పబడెను. । కాబట్టి సౌలు దావీ
దును పట్టడానకు దూతలను పంపినాడు; అయితే వీరు
వచ్చి దీర్ఘదర్శుల సమూహము దీర్ఘదర్శనమును
పలకడమున్ను వారిమీద నిర్ణయపడిన సమూయేలు
నిలువడమున్ను చూచినప్పుడు దేవునియొక్క ఆత్మ సౌలు
యొక్క దూతల మీదికి వచ్చినందున వారున్ను దీర్ఘ
దర్శులుగానే పలికిరి. । యీ సంగతి సౌలుకు వినపడి 21
నప్పుడు అతడు వేరే దూతలను పంపినాడు, వారున్ను
అటువలెనే దీర్ఘదర్శులుగా పలికినారు; యింకా
సౌలు మూడోమారు దూతలను పంపినాడు అయితే
వారున్ను దీర్ఘదర్శులుగానే పలికినారు. । కడవరి 22
లో తానే రామాకు వెళ్లి సేఖూ దగ్గిర వున్న గొప్ప నూతి
యొద్దికి వచ్చి సమూయేలున్ను దావీదున్ను యెక్కడ
వున్నారని అడిగెను; వొకడు అదుగో రామా దగ్గిర
నాయోతులో వున్నారని చెప్పెను. । కాబట్టి అతడు 23
రామా దగ్గిర నాయోతుకు వెళ్లెను; అయితే దేవుని
యొక్క ఆత్మ అతని మీదికిన్ని వచ్చినందున అతడు
వెళ్లుతూ రామా దగ్గిర నాయోతుకు చేరే పర్యంతమూ
దీర్ఘదర్శిగా పలుకుతూ వుండెను. । మరిన్ని అతడు 24
తన వస్త్రములు తీసివేసి సమూయేలు ముందర దీర్ఘ
దర్శిగా పలికి సాష్టాంగపడి ఆ పగలున్ను ఆ రాత్రి
న్ని దిగంబరిగానే వుండెను. కాబట్టి సౌలున్ను దీర్ఘ
దర్శులలో వున్నాడా అన్న సామ్యము పుట్టెను.

## 20. అధ్యాయము.

అయితే దావీదు రామా యందున్న నాయోతు 1
నుంచి పారిపోయి యోనాతాను యొద్దికి వచ్చి చెప్పి
నదేమంటే, నేను యేమి చేస్తిని! నావల్ల యే తప్పు
కలిగెను? నా ప్రాణము వెతుకడానకు యే పాపము
నా యందు నీ తండ్రికి అగుపడెనని పలికెను. । అప్పు 2
డు అతడు అతనితో అనిన మాట, అది కాదు, నీవు
చావక వుందువు; యిదుగో నా తండ్రి నాతో తెలియ
చేయకుండా చిన్నదయినా గొప్పదయినా యే క్రియ
నూ చేయడు; కాబట్టి నా తండ్రి యిది యెందుకు
నాకు దాచును? అది కాదని చెప్పినప్పటికిన్ని; ।
దావీదు చెప్పినదేమంటే, నేను నీ దృష్టి యందు అను 3
గ్రహము పొందిన సంగతి నీ తండ్రికి రూఢముగా
తెలిసినది; కాబట్టి యోనాతానుకు చింత రాకుండా
యిది అతనికి తెలపరాదు అని చెప్పుతున్నాడు;
అయితే యెహోవా జీవముతోడు నీ జీవముతోడు
నిజముగా నాకున్ను మరణమునకున్ను అడుగు మాత్ర
ము వున్నదని సత్యము చేసి పలికెను. । అప్పుడు యో 4
నాతాను దావీదుతో అనిన మాట, నీ యాత్మ దేని
కోరుతున్నదో అది నీ కొరకు నేను చేస్తానని చెప్పి
నప్పుడు, । దావీదు యోనాతానుతో చెప్పినదేమంటే, 5
యిదుగో రేపు అమావాస్య అవును, అప్పుడు నేను
తప్పక రాజుతోను కూచుకొని భోజనము చేయ వలసి

నది; అయితే యెల్లుండి సాయంతన పర్యంతము నేను
పొలములో దాగుకొనే కొరకు నన్ను వెళ్లనిమ్ము. ।
6 యింతట్లో నీ తండ్రి నన్ను లేనివానిగా చూచినట్టా
యెనా అప్పుడు నీవు చెప్ప వలసినది యేమంటే,
దావీదు బేత్లెహెమనే తన పట్టణమునకు వెళ్లిపోవడా
నకు నా యొద్ద సెలవు పుచ్చుకొన్నాడు, యేమంటే
తన యింటి కూటమునకు యేటి బలి చెల్లించడము
7 కద్దని చెప్పినప్పుడు; । అతడు మంచిదని అంటే నీ
సేవకుడనయిన నాకు చల్లదనమౌను; అతడు బహుగా
కోపపడితే అప్పుడు అతడు నాకు మోసము చేయ
తాత్పర్యము కలవాడయి యున్నాడని గ్రహించు
8 ము. । కాబట్టి నీ సేవకుడనయిన నా యెడల వుపకా
రముగా జరిగించుము, యెందుకంటే నీ సేవకుడన
యిన నాకున్ను నీకున్ను యెహూవాయొక్క వొడం
బడికెను నీవు కలుగ చేసితివి, అయినప్పటికిన్ని నా
వల్ల తప్పు యేదయినా వుంటే నీవే నన్ను చంప
వలసినది, నీ తండ్రి యొద్దికి నన్ను తీసుకపోనేలని
9 పలికెను. । అందుకు యోనాతాను అనిన మాట, అది
నాకు దూరమవును గాక; నీకు మోసము చేయ తాత్ప
ర్యము నా తండ్రికి కద్దని నాకు నిశ్చయమయితే నీతో
10 తెలియ చెప్పనా అని పలికినప్పుడు, । దావీదు యో
నాతానును చూచి నీ తండ్రి కఠినమయిన వుత్తరము
నీతో పలికితే అది యెవరు నాతో తెలియ చేతురు
11 అని అడిగినందున; । యోనాతాను రమ్ము పొలములోకి
వెళ్లుదామని పలికి యిద్దరున్ను పొలములోకి వెళ్లిరి. ।
12 అప్పుడు యోనాతాను అనిన మాట, ఇశ్రాయేలుకు
దేవుడైన యెహూవా సాక్షి; నేను రేపయినా యె
ల్లుండయినా నా తండ్రిని శోధించినప్పుడు యిదుగో
దావీదుకు క్షేమమవునని చూచి నేను ఆ వృత్తాంత
మును నీకు పంపి చూపించకపోతే యెహూవా అదిన్ని
13 దానికంటే అధికమున్ను నాకు చేసును గాక: । అయితే
నీకు మోసము చేసే తాత్పర్యము నా తండ్రికి కలిగి
నట్టాయెనా అప్పుడు అది నీకు చూపించి నీవు నీ
మార్గమున క్షేమముగా వెళ్లేటట్టు నిన్ను పంపుదును;
మరిన్ని యెహూవా నా తండ్రికి తోడుగా యేలాగు
వుండెనో ఆలాగున నీకున్ను ఆయన తోడుగా వుం
14 డును గాక. । మరిన్ని నేను చావక వుండేలాగున
నేను బ్రతికే దాకా నీవు నాకు యెహూవా కృపను
15 అగుపర్చడము మాత్రమే కాకుండా, । యెహూవా
దావీదువయిన నీయొక్క శత్రువుల నందరినిన్ని భూ
ముఖము మీదనుంచి తెగవేసినప్పుడున్ను నీ కృపను
నీవు నా యింటిలోనుంచి యెన్నటికిన్ని తెగవేయక
16 వుండుదువు గాకని పలికెను. । యీలాగున యోనా
తాను దావీదుయొక్క శత్రువుల యొద్దను యెహూ
వా విచారించును గాకని చెప్పి, దావీదుయొక్క
యింటి వారితో కూడా వొడంబడికెను చేసుకొనెను. ।
అయితే యోనాతాను దావీదును స్నేహించినందున 17
అతడు తిరిగీ వొట్టు బెట్టుకొనేటట్టు చేసెను, యేమం
టే తన ప్రాణము వలెనే అతడు అతని స్నేహించెను. ।
మరిన్ని యోనాతాను దావీదుతో అనిన మాట రేపు 18
అమావాస్య అవును; అప్పుడు నీవు వుండే స్థలము
పట్టిదిగా వుండినందున నీవు కనపడక పోదువు. ।
అయితే నీవు మూడు దినముల మట్టుకు నిలిచి వుండి, 19
యీ పని జరుగుతూ వుండగా నీవు దాగి వున్న స్థల
మునకు త్వరగా వెళ్లి, ఏస్సెలు అనే రాతి దగ్గిర వుం
దువు గాక. । అప్పుడు నేను దాని పార్శ్వమునకు 20
గురి చూచి వేసినట్టు మూడు బాణములను ప్రయోగి
స్తాను. । అప్పుడు యిదుగో నీవు వెళ్లి బాణములను 21
వెతుకుమని వొక చిన్నవానితో చెప్పుతాను; యిదుగో
బాణములు నీకు యీ తట్టు వున్నవి పట్టుకొని రమ్మని
నేను ఆ చిన్నవానితో తేటగా చెప్పే పక్షమందు
నీవు బయిటికి రావలసినది, యేమంటే యెహూవా
జీవముతోడు నీకు నష్టము కాదు నీకు క్షేమమవును. ।
అయితే అదుగో బాణములు నీ అవతల వున్నవని నేను 22
ఆ చిన్నవానితో చెప్పితే, నీవు నీ మార్గమున వెళ్లు
ము, యేమంటే యెహూవా నిన్ను దూరమునకు పంపి
నాడని గ్రహించ వలెను. । అయితే మనమిద్దరము 23
పలుకుకొనిన నిమిత్తమును గురించి యిదుగో యెహూ
వా నీ నా మధ్యను యెన్నటికీ వుండును గాకని
చెప్పెను. । కాబట్టి దావీదు పొలములో దాగుకొనెను; 24
అమావాస్య అయినప్పుడు రాజు భోజనము చేయడా
నకు కూర్చుండెను. । మునుపటిలాగున రాజు గోడ 25
దగ్గిర వున్న స్థలమందుండే తన ఆసనము మీద కూ
ర్చుని వున్నప్పుడు యోనాతాను లేచినందున అబ్నేరు
సౌలు పార్శ్వమున కూర్చుని వుండెను; అయితే దా
వీదుయొక్క స్థలము పట్టిదిగా వుండెను. । అయినప్పటి 26
కిన్ని సౌలు అతనికి యేదో వొకటి సంభవించినందున
అతడు అపవిత్రుడయి యుండును; నిజముగా అతడు
అపవిత్రుడై వుండును అని అనుకొని, ఆ రోజున యేమీ
చెప్పక వుండెను. । అయితే మరునాడు అనగా మాస 27
ముయొక్క రెండో దినమందు దావీదు కూర్చుని వుండే
స్థలము పట్టిదిగానే వుండెను; అందుకు సౌలు యోనా
తానును చూచి నిన్నటి రోజునానున్ను నేడున్ను యె
స్సైయొక్క కుమారుడు భోజనమునకు రాక పోవడ
మేమని అడిగెను. । అప్పుడు యోనాతాను సౌలుతో 28
ప్రత్యుత్తరముగా చెప్పినదేమంటే, దావీదు బేత్లెహె
ముకు వెళ్లడానకు అవసరపడి నాయొద్ద సెలవు అడిగి
నాడు. । అతడు చెప్పినలాగు యేమంటే, నీవు దయ 29

చేసి నన్ను పోనిమ్ము, యేమంటే పట్టణమందు మా
కుటుంబికులు బలి చెల్లిస్తున్నారు, అక్కడ వుండుమని
నా సహోదరుడు నాకు ఆజ్ఞాపించెను గనుక నీ దృష్టి
యందు నేను అనుగ్రహము పొందినవాడయితే నేను
వెళ్లి నా సహోదరులను చూచేటట్టుగా నాకు సెలవు
యిమ్ము అని బతిమాలినాడు; అందు నిమిత్తమే అతడు
రాజుగారియొక్క భోజనపు బల్లకు రావడము లేదని
30 చెప్పెను. । అప్పుడు సౌలుయొక్క కోపము యోనా
తాను మీద రగులుకొనినందున అతడు అతని చూచి
వొరా వ్యతిరిక్తుడవైన వికటపు కుమారుడా, నీకున్ను నీ
తల్లియొక్క మానమునకున్ను సిగ్గు కలిగేటట్టుగా నీవు
యెష్షైయొక్క కుమారుని యెంచుకొన్న సంగతి నాకు
31 తెలిసినది కాదా? । యేమంటే యెష్షైయొక్క కుమా
రుడు భూమియందు బ్రతికే మట్టుకు నీవైనా నీ రా
జ్యమైనా స్థిరతను పొందేది లేదు; కాబట్టి నీవు పంపి
అతని నా దగ్గిరకు తెప్పించు, యేమంటే అతడు అవ
32 శ్యముగా మరణము కావలెనని చెప్పినప్పుడు; । యో
నాతాను తన తండ్రిని చూచి అతడు యెందుకు చంప
బడ వలెను? అతడు యేమి చేసెనని అడిగినప్పుడు; ।
33 సౌలు అతని పొడిచేటట్టుగా యీటె విసరెను; అం
దువల్ల దావీదును చంప తాత్పర్యము తన తండ్రికి
34 కద్దని యోనాతానుకు తెలియపడెను. । కాబట్టి యో
నాతాను తీక్ష్ణమయిన కోపముతో బల్ల యొద్దనుంచి
లేచి, మాసముయొక్క రెండో దినమందు భోజనము
చేయక వుండెను, యెందుకంటే తన తండ్రి దావీదుకు
అవమానము చేసినందున అతని నిమిత్తము దుఃఖాక్రాం
35 తుడయి వుండెను. । వుదయమందు సంభవించినదేమం
టే, యోనాతాను దావీదుతో నిర్ణయించుకొన్న
కాలమందు వొక చిన్నవాని తీసుకొని పొలములోకి
36 వెళ్లెను. । అప్పుడు అతడు ఆ చిన్నవాని చూచి నీవు
పరుగెత్తిపోయి నేను వేసే బాణములను వెతుకుమని
చెప్పెను; ఆ చిన్నవాడు పరుగెత్తుతూ వుండగా అత
37 డు వొక బాణము వాని అవతలకు వేసెను. । అయితే
ఆ చిన్నవాడు యోనాతాను వేసిన బాణము వున్నచో
టుకు వచ్చినప్పుడు యోనాతాను చిన్నవాని వెనుక
నుంచి కేకవేసి బాణము నీ అవతల వున్నదని పలికి, ।
38 మరిన్ని యోనాతాను చిన్నవాని వెనుకనుంచి కేక
వేసి నీవు ఆలస్యము చేయక దబ్బున రమ్మని చెప్పెను:
కాబట్టి యోనాతానుయొక్క చిన్నవాడు బాణములను
కూర్చుకొని తన యజమానుని యొద్దికి వచ్చెను. ।
39 అయితే ఆ చిన్నవాడు యేమిన్ని తెలుసుకో లేదు;
యోనాతానుకున్ను దావీదుకున్ను మాత్రమే ఆ సంగతి
40 తెలుసును. । అప్పుడు యోనాతాను తన ఆయుధము
లను చిన్నవాని చేతికి యిచ్చి వాని చూచి వీటిని
పట్టణమునకు తీసుక పొమ్మని పంపెను. । ఆ చిన్నవాడు 41
వెళ్లిపోయిన తరువాత దావీదు దక్షిణపు దిక్కులో
నుంచి బయిటికి వచ్చి మూడు మారులు వంగి సాష్టాం
గపడిన తరువాత వొకరినొకరు ముద్దుబెట్టుకొని యే
డ్చిరి, అయితే దావీదు అధికముగా యేడ్చెను. । అప్పు 42
డు యోనాతాను దావీదుతో చెప్పినదేమంటే, నీవు
క్షేమముగా వెళ్లుము; మనమిద్దరమున్ను యెహోవా
యొక్క నామమందు చేసుకొనిన సత్యమును గురించి
యెహోవా నీ నా మధ్యనున్ను నీ సంతతి నా సంతతి
మధ్యనున్ను యెన్నటెన్నటికీ వుండును గాకని చెప్పిన
తరువాత, దావీదు లేచి తన మార్గమున వెళ్లిపో
యెను: యోనాతానున్ను పట్టణమునకు తిరిగీ వచ్చెను.

## 21. అధ్యాయము.

అప్పుడు దావీదు నోబులో అర్చకుడైన అహీ 1
మెలెఖు యొద్దికి వచ్చెను; అయితే అహీమెలెఖు దా
వీదు రావడమునకు భయపడి అతనితో అనిన మాట,
నీవు వొంటరిగా రావడమేమని అడిగినాడు. । అప్పుడు 2
దావీదు అర్చకుడైన అహీమెలెఖుతో చెప్పినదేమం
టే, రాజు నాకు వొక పని నిర్ణయించి నన్ను చూచి
నేను నీకు ఆజ్ఞాపించి పంపిన పని యేదో అది యెవ
నితోనైనా చెప్పవద్దని చెప్పెను; కాబట్టి నేను నా
సేవకులను ఫలాని ఫలాని స్థలమునకు వెళ్ల నిర్ణయి
స్తిని. । నీ చేతి కింద యేమి వున్నది? అయిదు రొట్టె 3
లయినా లేక మరి యేదైనా వుంటే అది నా చేతికి
యివ్వ వలసినదని చెప్పెను. । అప్పుడు అర్చకుడు 4
దావీదుతో చెప్పినదేమంటే, సాధారణమైన రొట్టె
నా చేతి కింద లేదు గాని పడుచు వాండ్లు స్త్రీలకు
యెడముగా వున్న వారైతే పరిశుద్ధమైన రొట్టెలు కల
వని చెప్పెను. । అప్పుడు దావీదు అర్చకునితో ప్రత్యు 5
త్తరముగా చెప్పినదేమంటే, నిజముగా నేను బయిలు
వచ్చినప్పటినుంచి అనగా యీ మూడు దినములనుంచి
స్త్రీలు మాకు దూరముగానే వుంటూ వుండిరి; పడుచు
వాండ్లయొక్క ఘటములు పరిశుద్ధమైనవై వున్నవి;
మరిన్ని ఆ రొట్టెలు వొకలాగున సాధారణమైనవై
వున్నవి; నేడు పరిశుద్ధ పరచబడిన వేరే రొట్టెలు
పాత్రలో కలవని పలికినప్పుడు, । అర్చకుడు పరిశుద్ధ 6
మైన రొట్టెలు అతనికి యిచ్చినాడు, యెందుకంటే
యెహోవా యెదుటనుంచి తీసి వేయబడిన సముఖపు
రొట్టెలు గాక అక్కడ వేరే రొట్టెలు లేవు; వెచ్చని
రొట్టెలు వేసే దినమందు అవి తీసివేయబడెను. । అయి 7
తే ఆ రోజున సౌలుయొక్క సేవకులలో వొకడు అక్కడ
యెహోవా సముఖమందు వుంటూ వుండెను, వాని
పేరు దోయేగు; వాడు ఎదోమీయుడు; సౌలుయొక్క

8 పశువుల కాపర్లలో ప్రముఖుడై యుండెను.। తరు
వాత దావీదు అహీమెలెఖుతో అనిన మాట, యిక్కడ
నీ చేతి కింద కత్తి అయినా యీటె అయినా వున్నదా?
యెందుకంటే రాజుగారియొక్క పని జరూరుగా
వున్నందున నా కత్తినైనా నా ఆయుధములనైనా నేను
9 తేలేదని చెప్పెను.। అప్పుడు అర్చకుడు చెప్పినదేమం
టే, ఏలా లోయలో నీవు చంపిన గొల్యాతు అనే ఫెలి
ష్తీయునియొక్క కత్తి యిదుగో బట్టతో చుట్టబెట్ట
బడి ఎఫోదు వెనుక వున్నది; అది పుచ్చుకొనుటకు
నీకు మనస్సు అయితే పుచ్చుకొనుము, యేమంటే అది
గాక యిక్కడ మరి వేరే లేదని చెప్పినప్పుడు, దావీదు
అనిన మాట, దానికి సమమైనది వొకటీలేదు, అది
10 నాకు యిమ్మని చెప్పెను.। అంతట దావీదు లేచి సౌలుకు
భయపడినందున ఆ రోజుననే పారిపోయి గాతుయొ
11 క్క రాజైన ఆఖీషు యొద్దికి వచ్చెను.। అప్పుడు ఆఖీ
షుయొక్క సేవకులు అతని చూచి యీ దావీదు ఆ
దేశపు రాజు కాడా? వారు నాట్యమాడుతూ వొకరి
నొకరిని చూచుకొని సౌలు తన వేల కొలదినిన్ని దా
వీదు తన పదివేల కొలదినిన్ని హతము చేసినారని
పాడిన పాటలు యితని గురించినవి కావా అని పలి
12 కిరి.। అయితే దావీదు యీ మాటలు తన మనస్సులో
వుంచుకొని గాతుయొక్క రాజైన ఆఖీషుకు బహు
13 భయపడెను.। మరిన్ని అతడు వారి ముందర తన నడక
మార్చి, ద్వారముల తలుపుల మీద గీస్తూ, వుమ్మి తన
గడ్డము మీదికి కారనిస్తూ, తన్ను వెర్రివాని వలెను
14 వారికి తోపింప జేసుకొనెను.। అప్పుడు ఆఖీషు తన
సేవకులను చూచి, అడుగో ఆ మనుష్యుడు వెర్రివాడు,
15 నా యొద్దికి అతని యెందుకు తీసుకొని వస్తిరి?। వెర్రి
వాండ్లతో నాకేమి? నా ముందర వెర్రి కార్యాలు
చేసేటందుకేనా యితని తీసుకొని వస్తిరి? యితడు నా
యింట్లోకి రావచ్చునా అని పలికెను.

## 22. అధ్యాయము.

1 కాబట్టి దావీదు అక్కడనుంచి తర్లి అదుల్లాము
గుహలోకి తప్పించుకొని వచ్చినాడు; అతని సహోదా
దరులున్ను అతని తండ్రియొక్క యింటివారందరున్ను
ఆ సంగతి వినినప్పుడు వారు దిగి అక్కడ అతని యొద్దికి
2 వచ్చిరి.। మరిన్ని శ్రమలో వున్న వారందరున్ను అప్పు
లు కలిగిన వారందరున్ను ప్రాణము మీద విసుకుదల
పుట్టిన వారందరున్ను అతని యొద్దికి కూడుకొన్నందున
అతడు వారి మీద అధిపతి ఆయెను. ఈలాగున
అతని యొద్ద యెక్కువ తక్కువ నన్నూరుమంది వుండిరి.।
3 తరువాత దావీదు అక్కడనుంచి బయిలుదేరి మోయా
బు మిస్పెకు వచ్చి మోయాబు రాజుతో చెప్పినదేమం
టే, దేవుడు నాకు యేమి చేసునో అది నాకు తెలియ
పడే పర్యంతమూ నా తల్లి దండ్రులు వచ్చి నీ యొద్ద
వుండనిమ్మని సెలవు అడిగి,। మోయాబు రాజుయొద్దికి 4
వారిని తీసుక వచ్చినందున వారు దావీదు మాటులో
వుండే దాకా అతని యొద్ద కాపురము చేసిరి.। అటు 5
తరువాత దీర్ఘదర్శి అయిన గాతు వచ్చి దావీదుతో
యీ మాటులో వుండకుము, యూదా దేశములోకి
వెళ్లిపొమ్మని చెప్పినందున దావీదు తర్లిపోయి హారెతు
అడవిలోకి వచ్చెను.। దావీదు తన జనులతో కూడా 6
అగుపడెనని సౌలుకు వినపడెను; అయితే సౌలు గిబా
దగ్గిర రామాలో వొక చెట్టు కింద బస చేసుకొని
యుండెను; అతని చేతిలో యీటె వుండెను, అతని
సేవకులు అతని చుట్టూ నిలిచి యుండిరి.। అప్పుడు 7
సౌలు తన చుట్టూ నిలిచి వున్న సేవకులతో అనిన
మాట, వో బెన్యామీనీయులారా ఆలకించండి; యె
స్సైయొక్క కుమారుడు మీకందరికిన్ని పొలముల
నున్ను ద్రాక్షతోటలనున్ను యిచ్చి మీ యందరి
నిన్ని సహస్రాధిపతులగానున్ను శతాధిపతులగానున్ను
నిర్ణయించేటట్టుగా మీరందరూ నామీద జట్టు
కూడితిరే:। యేమంటే నా కుమారుడు యెస్సైయొక్క 8
కుమారునితో వొడంబడిక చేసుకొన్న సంగతి మీలో
యెవని చేతనైనా నాకు వినపడినది కాదు, నా నిమి
త్తము మీలో యెవడూ దుఃఖపడలేదు; నా సేవకుడు
యీ రోజున వున్నట్టు నా నిమిత్తము పొంచి వుండే
టట్టుగా నా కుమారుడు అతని ప్రేరేపణ చేసిన సంగతి
మీలో యెవని చేతనైనా నాకు వినపడినది కాదని
పలికెను.। అప్పుడు సౌలుయొక్క సేవకుల మీద నిర్ణ 9
యించబడిన ఎదోమీయుడైన దోయేగు చెప్పినదేమం
టే, యెస్సైయొక్క కుమారుడు నోబులో అహీ
థూబు కుమారుడైన అహీమెలెఖు దగ్గిరకు పరుగెత్తి
వచ్చేది నేను చూస్తిని.। ఇతడు అతని కొరకు యెహో 10
వా యొద్ద ఆలోచన చేసి అతనికి ఆహారమున్ను
ఫెలిష్తీయుడైన గొల్యాతుయొక్క కత్తినిన్ని అతనికి
యిచ్చినాడని చెప్పెను.। అప్పుడు రాజు అహీథూబు 11
కుమారుడున్ను అర్చకుడున్ను అయి యున్న అహీమె
లెఖునున్ను నోబులో వున్న అతని తండ్రియొక్క
యింటి వారైన అర్చకులనందరినిన్ని పిలువనంపించి
నందున వారందరున్ను రాజు యొద్దికి వచ్చినారు.।
అప్పుడు సౌలు అహీథూబుయొక్క కుమారుడా, విను 12
ము అని చెప్పినప్పుడు, అతడు వో యేలినవాడా,
యిదుగో వున్నానని చెప్పగా,। సౌలు అతనితో నీవు 13
యెస్సైయొక్క కుమారునికి ఆహారమున్ను కత్తినిన్ని
యిచ్చి, అతని కొరకు దేవుని యొద్ద ఆలోచనచేసి,
అతడు నా మీదికి లేచి యీ రోజున వున్నలాగున

పొంచి వుండేటట్టుగా అతడున్ను నీవున్ను జత పడి
14 తిరేమని అడిగినప్పుడు; । అహీమెలెఖు రాజుతో
ప్రత్యుత్తరముగా చెప్పినదేమంటే, నీ సెలవు మీద
వెళ్లుతూ వున్నటువంటిన్ని నీ యింటిలో ఘనుడు
అయినటువంటిన్ని రాజు అల్లుడైన దావీదులాగున నీ
సేవకులందరిలో అంత నమ్రత గలవాడు యెవడు? ।
15 అతని కొరకు నేను దేవుని యొద్ద ఆలోచన చేసుటకు
ఆరంభించినానా? అది నాకు దూరముగా వుండును
గాక; రాజుగారు తమ సేవకుడయిన నా మీదనున్ను
నా తండ్రి యింటివారందరి మీదనున్ను యేమిన్ని
మోపక వుండును గాక; యేమంటే యీ సంగతిని
గూర్చిన కొద్దీ గొప్ప యేమైనా నాకు తెలిసినది కాదని
16 చెప్పినప్పటికిన్ని; । రాజు అనిన మాట, ఓ అహీమె
లెఖూ, నీవున్ను నీ తండ్రి యింటివారందరున్ను నిశ్చ
17 యముగా మరణము కావలెను అని చెప్పి, । తన చుట్టూ
నిలిచిన పరిచారకులను చూచి మీరు తిరిగి యెహోవా
వాయొక్క యీ అర్చకులను చంపండి, యెందుకంటే
వారియొక్క చేతులు దావీదుతో కూడి వుండెను;
అతడు పారిపోయిన సంగతి వారు తెలిసిన్ని నాకు
తెలియ చేయక వుండిరని చెప్పెను. అయితే రాజు
యొక్క సేవకులు యెహోవా అర్చకుల మీద చెయ్యి
18 చాపడమునకు ఒప్పలేదు. । అప్పుడు రాజు దోయే
గును చూచి నీవు తిరిగి యీ అర్చకుల మీద పడుమని
చెప్పినప్పుడు ఎదోమీయుడైన దోయేగు తిరిగి అర్చ
కుల మీద పడి ఆ దినమందు ఎఫోదు ధరించుకొన్న
19 యెనభైఅయిదు మందిని హతము చేసెను. । మరిన్ని
అతడు అర్చకులయొక్క పట్టణమైన నోబును కత్తి
వాడిచేత సంహరించెను; మొగవాండ్లనున్ను ఆడువాం
డ్లనున్ను బాలులనున్ను పసిపిల్లలనున్ను యెడ్లనున్ను
గాడిదలనున్ను గొర్రెలనున్ను కత్తి వాడిచేత
20 సంహరించెను. । అయితే అహీటూబుయొక్క కుమారు
డైన అహీమెలెఖుయొక్క కుమాళ్లలో అబ్యాతారు
అనే పేరు గల ఒకడు తప్పించుకొని పారిపోయి
21 దావీదు యొద్దికి వచ్చి, । సౌలు యెహోవాయొక్క
అర్చకులను చంపించిన సంగతి దావీదుతో తెలియ
22 చెప్పెను. । అయినందున దావీదు అబ్యాతారుతో చెప్పి
నదేమంటే, ఆ రోజున ఎదోమీయుడైన దోయేగు
అక్కడ వున్నందున వాడు సౌలుకు నిశ్చయముగా
తెలియచేసునని నేను వూహించుకొన్నాను; నీ తండ్రి
యొక్క యింటివారందరియొక్క మరణమునకు నేను
23 కారణభూతుడనైతిని. । నీవు భయపడక నా యొద్ద
వుండుము, యేమంటే నా ప్రాణము వెతికేవాడు నీ
ప్రాణము కూడా వెతికేవాడౌను; అయితే నీవు నా
యొద్దను నిర్భయముగా వుండుమని చెప్పెను.

## 23. అధ్యాయము.

అంతలో అదుగో పెలిష్తీయులు కెయీలా మీద 1
యుద్ధము చేసి కళ్లములను దోచుకొంటూ వున్నారని
దావీదుకు వినబడెను. । అయినందున దావీదు నేను వెళ్లి 2
యీ పెలిష్తీయులను కొట్టుదునా అని యెహోవాను
ఆలోచన అడిగెను; అప్పుడు యెహోవా నీవు వెళ్లి
పెలిష్తీయులను కొట్టి కెయీలాను రక్షింతువు గాకని
దావీదుతో సెలవు యిచ్చెను. । అయితే దావీదుయొక్క 3
జనులు అతని చూచి యిదుగో యూదా దేశమందు
మేము భయముగా వున్నామే; పెలిష్తీయులయొక్క
సైన్యములకు యెదురుగా కెయీలాకు మేము వస్తే
అధిక భయము కాదా అని పలికిరి. । అప్పుడు దావీదు 4
తిరుగా యెహోవాను ఆలోచన అడిగెను; అయి
నందున యెహోవా ప్రత్యుత్తరమిచ్చినదేమంటే,
నీవు లేచి కెయీలాకు వెళ్లుము, యెందుకంటే పెలి
ష్తీయులను నీ చేతిలోకి అప్పగింతునని సెలవు యిచ్చి
నప్పుడు; । దావీదున్ను తన జనులున్ను కెయీలాకు 5
వచ్చి పెలిష్తీయులతో పోట్లాడి, వారిని మహా హత
ముచేత కొట్టి, వారి పశువులను దోచుకొని వచ్చిరి.
యీలాగున దావీదు కెయీలాయొక్క కాపురస్థులను
రక్షించెను. । అయితే అహీమెలెఖుయొక్క కుమారుడైన 6
అబ్యాతారు కెయీలాలో దావీదు యొద్దికి పారి
పోయి వచ్చినప్పుడు ఎఫోదుచేత పట్టుకొని వచ్చెను. ।
తరువాత దావీదు కెయీలాకు వచ్చిన సంగతి సౌలుకు 7
వినబడెను: అప్పుడు సౌలు అనుకొన్నదేమంటే, దేవు
డు అతని నా చేతికి అప్పగించెను, యేమంటే అతడు
ద్వారములున్ను అడ్డగడలున్ను వున్న పట్టణములోకి
ప్రవేశించినందున అందులో ముయ్యబడి వున్నాడని
అనుకొనెను. । కాబట్టి సౌలు కెయీలాకు వెళ్లి యుద్ధము 8
చేసి, దావీదునున్ను అతని జనులనున్ను ముట్టడి వేసే
కొరకు జనులనందరినిన్ని పిలువనంపించెను. । అయితే 9
దావీదు తన మీద యీ మోసము పెట్టుటకు సౌలుకు
తాత్పర్యము కలదని తెలుసుకొని, అర్చకుడైన అబ్యా
తారుతో ఎఫోదు తెమ్మని చెప్పెను. । అప్పుడు దావీదు 10
చెప్పినదేమంటే, ఇశ్రాయేలుకు దేవుడైన ఓ యెహో
వా, సౌలు కెయీలాకు వచ్చి నా విషయమై పట్టణము
పాడుచేయ తాత్పర్యము కలవాడై వున్నాడని నీ సేవకు
డనైన నాకు రూఢముగా వినబడెను. । కెయీలా జను 11
లు నన్ను అతని చేతికి అప్పగింతురా? నీ సేవకుడనైన
నాకు వినబడినట్టు సౌలు దిగి వచ్చునా? ఇశ్రాయేలుకు
దేవుడవయిన ఓ యెహోవా, దయచేసి నీ సేవకుడ
నైన నాకు తెలియచేయుము అని అడిగినప్పుడు, అతడు
దిగి వచ్చునని యెహోవా సెలవు యిచ్చెను. । అప్పుడు 12

దావీదు తిరుగా అడిగినదేమంటే, కెయీలా జనులు
నన్నున్ను నా జనులనున్ను సౌలుయొక్క చేతికి అప్ప
గింతురా అని అడిగినప్పుడు, యెహోవా వారు నిన్ను
13 అప్పగింతురని సెలవు యిచ్చెను. । అంతట దావీదున్ను
యెక్కువ తక్కువ ఆరునూరు మంది తన జనులున్ను
లేచి, కెయీలాలోనుంచి తర్లి, యెక్కడికి వెళ్ల గల
రో అక్కడికి వెళ్లి పోయినారు: అప్పుడు దావీదు
కెయీలాలోనుంచి తప్పించుకొనిన సంగతి సౌలుకు
వినబడినందున అతడు బైలు వెళ్లడము మానెను. ।
14 అయితే దావీదు అరణ్యములో గట్టి స్థలములందున్న
జీఫు అనే అరణ్యమందున్న వొక పర్వతమందు నివాస
ము చేస్తూ వుండెను; సౌలు ప్రతి రోజున అతని వెతికిన
ప్పటికిన్ని దేవుడు యితని చేతికి అతని అప్పగించ
15 లేదు. । అయితే తన ప్రాణమును వెతికేటందుకు సౌలు
బైలు వచ్చెనని దావీదు చూచినాడు; మరిన్ని దావీదు
జీఫు అనే అరణ్యమందుండే అడవిలో వుండెను. ।
16 అప్పుడు సౌలుయొక్క కుమారుడైన యోనాతాను
లేచి, అడవిలో దావీదు యొద్దికి వచ్చి అతనితో అనిన
మాట, నీవు భయపడవద్దు, యేమంటే నా తండ్రియైన
17 సౌలుయొక్క చెయి నిన్ను పట్టనేరదు. । నీవు ఇశ్రా
యేలు మీద రాజువు అవుదువు; నీ కింద నేనుందును;
యిది నా తండ్రియైన సౌలుకు తెలిసి వున్నది అని
చెప్పి, అతని హస్తమును దేవుని యందు బలపరచెను. ।
18 మరిన్ని వీరిద్దరూ యెహోవా సముఖమందు వొడం
బడికెను చేసుకొనిరి; అప్పుడు దావీదు అడవిలోనే
యింకా వుండెను, యోనాతాను తన యింటికి తిరిగీ
19 వచ్చెను. । అప్పుడు జీఫీయులు యెక్కి గిబాలో సౌలు
యొద్దికి వచ్చి, యెషీమోనుకు దక్షిణమందుండే హఖీ
లా పర్వతములో అడవియొక్క గట్టి స్థలములయందు
20 మాలో దావీదు దాగి వున్నాడు కాడా! । కాబట్టి
వో రాజా, నీ మనోభీష్ట ప్రకారముగా దిగి రమ్ము;
అతని రాజువైన నీ చేతిలోకి అప్పగించుటకు మా పని
21 అవునని చెప్పినప్పుడు; । సౌలు వారితో అనిన మాట,
మీరు యెహోవా వల్ల ఆశీర్వాదము పొందుదురు
గాక, యేమంటే మీరు నా యందు కనికరించి వున్నా
22 రు. । అయితే మీరు జాగ్రత చేయడానకు వెళ్లి, అతడు
వుండే స్థలము యెక్కడో అదిన్ని, అతని చూచిన
వాడు యెవడో అదిన్ని తెలుసుకొండి, యేమంటే
అతడు బహు తంత్రముగా ప్రవర్తిస్తూ వున్నాడని
23 నాకు వినపడెను. । కాబట్టి మీరు భద్రముగా అతడు
వుండే మాటు స్థలములను చూచి తెలుసుకొని, వున్న
సంగతి అంతా నాకు తెలియచేయడానకు తిరుగా
నా యొద్దికి రండి; అప్పుడు నేను మీతో కూడా
వస్తాను; అతడు దేశమందు వున్నట్టాయెనా యూదా
యొక్క వేల కొలదిలో నేను అతని కొరకు వెతుకు
తానని చెప్పినప్పుడు; । వారు లేచి సౌలుకు ముందు 24
గా జీఫుకు తిరిగి వెళ్లిరి; అయితే దావీదున్ను అతని
జనులున్ను యెషీమోనుకు దక్షిణపు మయిదానమం
దుండే మాయోనుయొక్క అరణ్యములో వుండిరి. ।
సౌలున్ను అతని జనులున్ను అతని వెతుకడానకు బైలు 25
వెళ్లిరి; అది దావీదుకు వినపడెను గనుక అతడు శిలా
పర్వతమును దిగి మాయోనుయొక్క అరణ్యమందు
నివాసము చేసెను; సౌలు అది వినినప్పుడు మాయో
నుయొక్క అరణ్యమందు దావీదును తరమ వెళ్లెను. ।
అయితే సౌలు పర్వతము యీ తట్టున్ను దావీదున్ను 26
తన జనులున్ను పర్వతము ఆ తట్టున్ను వెళ్లిరి; అప్పుడు
దావీదు సౌలు దగ్గిరనుంచి తప్పించుకొనే కొరకు త్వర
పడెను, యెందుకంటే సౌలున్ను అతని జనులున్ను
దావీదునున్ను అతని జనులనున్ను పట్టడానకు వారిని
చుట్టుకొనిరి. । అయితే దూత వొకడు సౌలు యొద్దికి 27
వచ్చి నీవు త్వరగా రమ్ము, యేమంటే పెలిష్తీయులు
వచ్చి దేశమును ఆవరించుకొని వున్నారని చెప్పినం
దున; । సౌలు దావీదును తరమడము మాని, తిరిగీ పెలి 28
ష్తీయులకు యెదురుగా వచ్చెను; కాబట్టి ఆ స్థలము
సెలహమ్మలెకోతు అని పిలిచినారు. । అయితే దావీదు 29
అక్కడనుంచి వెళ్లి ఏన్గెదీకి వచ్చి గట్టి స్థలములందు
నివాసము చేసెను.

## 24. అధ్యాయము.

అంతట సౌలు పెలిష్తీయులను తరమడము మాని 1
తిరిగీ వచ్చినప్పుడు సంభవించినదేమంటే, యిదుగో
దావీదు ఏన్గెదీ అరణ్యమందు వున్నాడని అతనికి చెప్ప
పడెను. । అప్పుడు సౌలు ఇశ్రాయేలీయులందరిలో 2
నుంచి యెంచబడిన మూడువేల మందిని తీసుకొని,
అడవి మేకలు వుండే శిలాపర్వతముల మీద దావీదు
నున్ను అతని జనులనున్ను వెతికేటందుకు బయిలు
వెళ్లెను. । అతడు మార్గవశాత్తుగా గొర్రె దొడ్లకు 3
వచ్చెను; అక్కడ గుహ వొకటి కలదు, అందులో
సౌలు తన పాదములను కప్పుకోవడానకు వెళ్లినాడు;
అయితే దావీదున్ను అతని జనులున్ను ఆ గుహ పక్క
లలో వుండిరి. । అప్పుడు దావీదుయొక్క జనులు అత 4
నితో అనిన మాట, యిదుగో నీ దృష్టికి యేది మంచి
దో అది నీవు అతనికి చేసేకొరకు నీ శత్రువుని నీ చేతి
లోకి అప్పగింతునని యెహోవా నీతో చెప్పిన సమ
యము యిదుగో అని వారు చెప్పినప్పుడు దావీదు
లేచి వచ్చి సౌలుయొక్క వస్త్రపు చెంగును మెల్లిగా
కోసెను. । తరువాత సంభవించినదేమంటే, సౌలుయొ 5
క్క వస్త్రమును కోసితినని దావీదు తన హృదయ

6 ములో నొచ్చుకొనెను. । అప్పుడు అతడు తన జనుల
తో చెప్పినదేమంటే యెహోవాయొక్క అభిషిక్తు
డైన నా యజమానునికి నేను యీ కార్యము చేసు
టకు అనగా అతడు యెహోవాయొక్క అభిషిక్తుడై
నందున అతని మీదికి నా చెయ్యి చాపే కొరకు యె
హోవా నన్ను నిరోధించును గాక అని చెప్పెను. ।
7 యీలాగున దావీదు యీ మాటలచేత తన సేవకులను
అటకాయించి సౌలు మీదికి వారిని లేవనివ్వక వుం
డెను, తరువాత సౌలు లేచి గుహలోనుంచి బయలు
8 వెళ్లి తన మార్గమున పోయెను. । తరువాత దావీ
దున్ను లేచి గుహలోనుంచి బయలు వెళ్లి సౌలు వెను
కనుంచి కేక వేసినదేమంటే, నా యేలినవాడవైన
ఓ రాజా అని పిలిచినాడు; సౌలు వెనుక చూచి
నప్పుడు దావీదు ముఖము మట్టుకు నేలకు వొంగి
9 నమస్కారము చేసెను. । అప్పుడు దావీదు సౌలుతో
చెప్పినదేమంటే, యిదుగో దావీదు నీకు మోసము చేయ
డానకు తాత్పర్యము గలవాడై యున్నాడని మను
10 ష్యులు పలికిన మాటలు నీవు విననేల? । యిదుగో యీ
రోజున యెహోవా నిన్ను యేలాగు నా చేతిలోకి
అప్పగించెనో అది నీ కండ్లు చూచెను; కొందరు
నిన్ను చంపుమని నాతో చెప్పినప్పటికిన్ని నేను నీ
యందు కనికరించి, యితడు యెహోవాయొక్క
అభిషిక్తుడు గనుక నా ప్రభువు మీదికి నేను నా
11 చెయ్యి చాపనని పలికితిని. । మరిన్ని వో నా తండ్రీ
చూడుము; నా చేతిలో వున్న వస్త్రపు చెంగు చూడు
ము; నిన్ను చంపక నీ వస్త్రపు చెంగు మాత్రమే కోసి
నందుచేత నావల్ల కీడున్ను తప్పితమున్ను యెంతమా
త్రమూ లేదని నీవు తెలుసుకోవలెను; నీ విషయమై
యే పాపమైనా చేయని వాడనై వుండగా నీవు నా
ప్రాణము తీసి వేయడానకు నన్ను తరుముతూ వున్నా
12 వు. । నీ నా మధ్యను యెహోవా న్యాయమును
తీర్చును గాక; యెహోవా నా పట్ల నీ మీద ప్రతి
క్రియ చేసును గాక; అయితే నీ మీద నా చెయ్యి వేయ
13 బడదు. । పూర్వికులయొక్క సామ్య ప్రకారము దుష్టు
లచేతనే దుర్మార్గత కలుగును; అయితే నా చెయ్యి
14 నీ మీదికి రాక వుండును. । ఇశ్రాయేలు రాజు యెవని
వెంబడి బైలు వచ్చియున్నాడు? యేపాటి వానిని తరు
ముతూ వున్నావు? చచ్చిన కుక్కను, కుక్క పేనును. ।
15 కాబట్టి యెహోవా న్యాయాధిపతి అయి నీ నా
మధ్యను విమర్శించి చూచి నా వ్యాజ్యము తీర్చి
నీ చేతిలోనుంచి నన్ను విడుపించును గాకని చెప్పెను. ।
16 దావీదు యీ మాటలు సౌలుతో పలుకడము ముగిం
చినప్పుడు సంభవించినదేమంటే, సౌలు అనిన మాట,
నా కుమారుడవైన వో దావీదా, యీ పలుకు నీదేనా
అని సౌలు తన కంఠమెత్తి యేడ్చి, । దావీదుతో అనిన 17
దేమంటే, నాకంటే నీవు నీతిపరుడవు, యేమంటే నా
అపకారమునకు నీవు వుపకారము చేస్తివి. । నీవు నా 18
యెడల మేలుగా జరిగించినావని యీ రోజున అగ
పరిస్తివి, యేమంటే యెహోవా నీ చేతిలోకి నన్ను
అప్పగించినప్పటికిన్ని నీవు నన్ను చంపవైతివి. । మని 19
షికి తన శత్రువుడు దొరికితే సుఖముగా విడిచి పెట్టు
నా? కాబట్టి యీ రోజున నీవు నాకు చేసిన దాని
నిమిత్తము యెహోవా నీకు మేలు చేసును గాక. ।
అయితే యిదిగో నీవు నిశ్చయముగా రాజవవుతావ 20
నిన్ని ఇశ్రాయేలు రాజ్యము నీ చేతికి వస్తుందనిన్ని
నాకు బాగా తెలుసును. । కాబట్టి నీవు నా వెనుకటి 21
నా సంతతిని ఖండించి వేయకుండానున్ను నా తండ్రి
యింటిలోనుంచి నా పేరు నీవు నశింపచేయకుండా
నున్ను యిప్పుడు యెహోవా మీద నా కొరకు
ప్రమాణము చేయ వలెనని చెప్పినప్పుడు, దావీదు సౌ
లుకు ప్రమాణము చేసెను. । అప్పుడు సౌలు యింటికి 22
తిరిగీ వచ్చెను, అయితే దావీదున్ను అతని జనులున్ను
తమ గట్టి స్థలమునకు వెళ్లిపోయిరి.

## 25. అధ్యాయము.

అంతట సమూయేలు మృతిబొందెను; అప్పుడు 1
ఇశ్రాయేలీయులందరున్ను కూడుకొని అతని కొరకు
దుఃఖపడి, రామాలో వున్న అతని యింట్లో అతని
పాతిపెట్టిరి. అప్పుడు దావీదు లేచి పారాను అనే
అరణ్యములోకి వెళ్లెను. । అయితే కర్మెలులో భూ వస 2
తులు గల వొకడు మాయోనులో వుండెను; అతడు
మిక్కిలీ గొప్పవాడై వుండెను; అతనికి మూడువేల
గొఱ్రెలున్ను వెయి మేకలున్ను కలవు; అతడు కర్మెలు
లో తనయొక్క గొఱ్రెల వెంట్రుకలను కత్తిరింపచేస్తూ
వుండెను. । అతనికి నాబాలు అనే పేరు కద్దు; అతని 3
భార్య పేరు అబీగయీలు అని వుండెను; యీ స్త్రీ
సుబుద్ధిన్ని సుందరమయిన ముఖమున్ను గలదై వుండెను;
అయితే దాని పెనిమిటి కఠినుడున్ను దుర్మార్గుడు
న్ను అయి వుండెను; మరిన్ని అతడు కాలేబు యింటి
సంబంధుడై వుండెను. । నాబాలు తన గొఱ్రెవెంట్రుక 4
లను కత్తిరింప చేస్తూ వున్నాడని అరణ్యమందున్న దావీ
దుకు వినపడెను. । అప్పుడు దావీదు పదిమంది పడుచు 5
వాండ్లను పిలిచి వారితో చెప్పినదేమంటే, మీరు కర్మె
లుకు వెళ్లి, నాబాలు యొద్దికి వచ్చినప్పుడు నా పేరు
చెప్పి, అతని యోగక్షేమమును అడిగి, । ఆ భాగ్యవం 6
తుని చూచి, నీకున్ను నీ యింటికిన్ని నీకు కలిగిన
అంతటికిన్ని క్షేమమౌను గాకని చెప్పిన తరువాత,
మీరు చెప్పే క్రమము యేమంటే, । నీ యొద్ద గొఱ్రె 7

వెంట్రుకలు కత్తిరించేవాండ్లు వున్నారని నేను వింటిని,
అయితే మా దగ్గిర వున్న నీ కాపువాండ్లకు మేము యే
మోసమైనా చేసినవాండ్లము కాము; వాండ్లు కర్మె
లులో వున్నంత కాలము యేది అయినా పోగొట్టు
8 కొన్నారు కారు. । నీ పడుచువాండ్లను నీవు అడిగినట్ట
యితే అది చెప్పుదురు, కాబట్టి యీ పడుచువాండ్లు
నీ దృష్టి యందు అనుగ్రహము పొందనిమ్ము; మేము
మంచి రోజు యందు వస్తిమి గనుక నీ చేతికి యేమి
వచ్చునో అది నీ సేవకులకున్ను నీ కుమారుడయిన
దావీదుకున్ను యివ్వవలసినదని చెప్పండని పంపెను. ।
9 దావీదుయొక్క పడుచువాండ్లు వచ్చి దావీదుయొక్క
పేరు చెప్పి ఆ మాటలన్నిటి చొప్పున నాబాలుతో
10 పలికి వూరకుండిరి. । అప్పుడు నాబాలు దావీదుయొ
క్క సేవకులతో ప్రత్యుత్తరము చెప్పినదేమంటే, దా
వీదు అనగా యెవడు? యెష్షయియొక్క కుమారుడు
అనగా యెవడు? తన తన యజమానులను విడచి పారి
పోయిన దాసులు యీ దినముల యందు అనేకులు
11 గలరు. । కాబట్టి నేను నా రొట్టెలున్ను నా నీళ్లున్ను
నా గొర్రె వెంట్రుకలు కత్తిరించే వాండ్ల కోసము నేను
చంపిన మృగమాంసమున్ను తీసి, నేను యెక్కడ యెరు
గనటువంటి వాండ్లకు యిత్తునా అని పలికినందున, ।
12 దావీదుయొక్క పడుచువాండ్లు అటు తిరిగి తమ మా
ర్గమున వెళ్లి, అతనితో యీ మాటలన్నిన్ని తెలియ
13 చెప్పిరి. । అప్పుడు దావీదు తన జనులను చూచి, మీలో
ప్రతి మనిషీ తన తన కత్తిని కట్టుకొమ్మని చెప్పెను;
కాబట్టి ప్రతి మనిషీ తన తన కత్తిని కట్టుకొనెను;
దావీదున్ను తన కత్తిని కట్టుకొనెను; యీలాగున యె
క్కువ తక్కువ దావీదు వెనుక నన్నూరు మంది యెక్కి
పోయిరి; మరిన్ని యిన్నూరు మంది సామాను దగ్గిర
14 కనిపెట్టి వుండిరి. । అయితే పడుచువాడు వొకడు
నాబాలుయొక్క భార్యయైన అబీగయీలుతో చెప్పిన
దేమంటే, యిదుగో దావీదు అరణ్యములోనుంచి మా
యజమానుని పరామర్శించడానకు దూతలను పంపిం
15 చెను, అయితే అతడు వారి మీద మొరిగెను. । అయితే
ఆ మనుష్యులు మాకు బహు వుపకారులయినందున
మేము పొలములో వారిలో సంచరిస్తూ వున్నంతసేపు
మాకు మోసమైనా నష్టమైనా యెంత మాత్రము రాక
16 వుండెను. । మేము గొర్రెలను కాస్తూ వున్నంతసేపు
వారు రాత్రి పగళ్లు మాకు చుట్టూ ప్రాకారముగా
17 వుండిరి. । యిప్పుడు నీవు చేయబోయేది యేదో అది
నీవు విచారించుకోవలసినది, యెందుకంటే మా యజ
మానుని మీదనున్ను అతని యింటివారందరి మీద
నున్ను కీడు వుద్దేశించబడి వున్నది, యేమంటే అతడు
బెలియాలు కుమారుడు గనుక యెవడయినా అతనితో
మాట్లాడ లేడని చెప్పినప్పుడు; । అబీగయీలు త్వర 18
చేసి, యిన్నూరు రొట్టెలనున్ను రెండు ద్రాక్షారసపు
బుడ్లనున్ను వండిన అయిదు గొర్రెలనున్ను అయిదు
కొలలు వేచిన గింజలనున్ను నూరు ద్రాక్ష గెలలనున్ను
యిన్నూరు అంజూరపు ముద్దలనున్ను గార్దభముల
మీద వేయించి, । తన సేవకులను చూచి, మీరు నా 19
కంటే ముందుగా వెళ్లండి; యిదుగో మీ వెనుకనుంచి
నేను వస్తానని చెప్పి, తన పెనిమిటి అయిన నాబాలు
తోను చెప్పక వుండెను. । అయితే ఆమె గార్దభము 20
మీద యెక్కి పర్వతమందుండే లోవలోకి వస్తూ వుం
డగా, అదుగో దావీదున్ను అతని జనులున్ను ఆమెకు
యెదురుగా వస్తూ వున్నందున ఆమె వారిని కలుసు
కొనెను. । అయితే అంతకు మునుపు దావీదు అనుకొ 21
నినదేమంటే, వానికి కలిగిన అంతటిలో యే వొకటి
పోకుండా యీ అరణ్యములో నేను అతనికి కలిగిన
దంతా వ్యర్థముగా కాస్తూ వుంటిని: వుపకారము
నకు నాకు అపకారము చేసి యున్నాడు. । కాబట్టి 22
అతనికి కలిగిన అంతటిలో గోడ మీద మూత్రమును
విడిచే యెవనినైనా తెల్లవారేటప్పటికి నేను వుండనిస్తే
దేవుడు అదిన్ని దానికంటే అధికమున్ను దావీదుయొ
క్క శత్రువులకు చేయును గాకని అనుకొనెను. ।
అయితే అబీగయీలు దావీదును చూచి, గార్దభము 23
మీదనుంచి దిగి, దావీదు ముందర ముఖము నేల మట్టుకు
వంచుకొని సాష్టాంగపడి అతని పాదములు పట్టుకొని
చెప్పినదేమంటే, । వొ నా యేలినవారా, యీ తప్పి 24
తము నా మీద పెట్టవచ్చును గాని మీరు వినడానకు
మీ సేవకురాలనైన నన్ను చెప్పనిచ్చి మీ సేవకురాల
నైన నేను చెప్పే మాటలు వినవలసినది. । నా యేలిన 25
వారైన మీరు బెలియాలువాడైన యీ నాబాలును
లక్ష్య పెట్ట వద్దు, యేమంటే అతని పేరుకు అతడు
సరిపడును; అతని పేరు నాబాలు గనుక అవివేకమే
అతని యందు వున్నది; అయితే మీ సేవకురాలనైన
నేను నా యేలినవారైన మీరు పంపించిన పడుచు
వాండ్లను చూచినాను కాను. । అయితే వొ నా యేలి 26
నవారా, యెహోవా జీవముతోడు నీ జీవముతోడు
మీరు రక్తము చిందించుటకు రాకుండానున్ను మీ
హస్తముచేత మీరు పగతీర్చకుండానున్ను యెహో
వా మిమ్మును ఆతంకము చేసెను గనుక మీ శత్రువు
లున్ను నా యేలినవారైన మీకు మోసము చేయ తా
త్పర్యము గలవారున్ను నాబాలు వలెనే వుందురు
గాక. । అయితే నేను నా యేలినవారైన మీ యొద్దికి 27
తెచ్చిన యీ కానుకను నా యేలినవారైన మిమ్మును
వెంబడించే పడుచువాండ్లకు మీరు యిప్పించి, । మీ 28
సేవకురాలనైన నా తప్పు దయచేసి క్షమించ వలసినది,

యేమంటే యెహోవా నా యేలినవారైన మీకు
శాశ్వతమైన యిల్లు కలుగ చేసును, యేమంటే నా
యేలినవారైన మీరు యెహోవాయొక్క యుద్ధము
లను చేస్తూ వున్నారు; మరిన్ని మీరు బ్రతికిన దిన
ములన్నిటి యందూ మీ యందు తప్పు కనిపించకపో
29 యెను. । అయినప్పటికిన్ని వొకడు మిమ్మును తరుముట
కున్ను మీ ప్రాణము వెతుకుటకున్ను లేచి వున్నాడు;
అయితే నా యేలినవారైన మీయొక్క ప్రాణము మీకు
దేవుడైన యెహోవా యొద్ద జీవపు మూటలో కట్ట
బడును; మీ శత్రువులయొక్క ప్రాణములను ఆయన
30 వడిశెలలోనుంచి విసరినట్టు విసరివేసును. । యెహోవా
నా యేలినవారైన మీకు చెప్పిన మేలు అంతటి ప్రకా
రమూ మీకు చేసి, మిమ్మును ఇశ్రాయేలు మీద అధి
పతిగా నిర్ణయించిన తరువాత సంభవించేదేమంటే, ।
31 నా యేలినవారైన మీరు రక్తమును నిష్కారణముగా
చిందించిన విషయమైయిన్ని నా యేలినవారైన మీరు
పగ తీర్చిన విషయమైయిన్ని మనోవిచారమైనా
దుఃఖమైనా నా యేలినవారైన మీకు యెంతమా
త్రము రాకపోవును గాక; అయితే యెహోవా
నా యేలినవారైన మీ కొరకు మేలుచేసిన తరువాత
మీరు మీ సేవకురాలనైన నా యందు జ్ఞాపకము
32 చేయుదురు గాకని పలికెను. । అప్పుడు దావీదు అబీ
గయీలుతో అనిన మాట, నాకు యెదురుగా రావ
డానకు నిన్ను పంపిన ఇశ్రాయేలుకు దేవుడైన యె
33 హోవాకు స్తోత్రము కలుగును గాక. । నీవు చెప్పిన
ఆలోచనకున్ను ఆశీర్వాదమవును గాక; మరిన్ని యీ
రోజున నా హస్తము చేత పగ తీర్చుకొనుటకున్ను
రక్తము చిందించుటకు నేను రావడమునకున్ను ఆతంక
34 పరచిన నీవు ఆశీర్వదించబడుదువు గాక. । నీకు హాని
చేయకుండా నన్ను ఆతంకపరచిన ఇశ్రాయేలు దేవు
డైన యెహోవాయొక్క జీవముతోడు నీవు త్వరపడి
యెదురుగా నాకు రాకపోతివట్టాయెనా, నిజముగా
తెల్లవారే పర్యంతమూ గోడ మీద తన మూత్రమును
విడిచిన వొకడైనా నాబాలుకు వుండకపోవునని చెప్పి, ।
35 దావీదు ఆమె తన యొద్దికి తెచ్చిన వాటిని ఆమె చేతి
వల్ల అంగీకరించి, మరిన్ని ఆమెతో అనిన మాట, నీవు
నీ యింటికి సుఖముగా వెళ్లు, యిదుగో నీ మాటలు
నేను విని నీ ముఖవచనములను అంగీకరిస్తినని చెప్పెను. ।
36 అప్పుడు అబీగయీలు తిరిగీ నాబాలు యొద్దికి వచ్చి
నప్పుడు యిదుగో అతడు రాజుయొక్క సంభ్రమము
లాగున సంభ్రమము తన యింట్లో చేస్తూ వుండెను;
మరిన్ని అతడు మత్తుడై హృదయమందు ఆనందిస్తూ
వుండెను; కాబట్టి తెల్లవారే పర్యంతమూ ఆమె అత
నితో కొద్ది గొప్ప మరేదైనా చెప్పక వుండెను. ।
అయితే వుదయమందు ద్రాక్షారసపు మత్తు నాబా 37
లును విడిచిపోయిన తరువాతను అతని భార్య అతని
తో ఆ సంగతులను తెలియ చెప్పినప్పుడు అతని
హృదయము అతనిలో మూర్ఛిల్లినందున అతడు రా
యైనట్టు వుండెను. । మరిన్ని పది దినములు అయిన 38
తరువాతను యెహోవా నాబాలును మొత్తినందున
అతడు మరణమును పొందెను. । నాబాలు మరణమా 39
యెనని దావీదు విని అనుకొనినదేమంటే, తన సేవకుడ
నైన నన్ను కీడునుంచి కాపాడి, నాబాలువల్ల నేను
పొందిన అవమానము తీర్చిన యెహోవాకు స్తోత్ర
ము కలుగును గాక, యేమంటే యెహోవా నాబాలు
యొక్క కీడు అతని శిరస్సు మీదికే తిరిగీ రాచేసెనని
అనుకొనెను. తరువాత దావీదు అబీగయీలును పెండ్లి
చేసుకోవడానకు ఆమెతో మాట్లాడ తగిన వారిని పంపి
నాడు. । దావీదుయొక్క సేవకులు కర్మెలులో అబీగయీ 40
లు యొద్దికి వచ్చి చెప్పినదేమంటే, దావీదు మమ్మును
పిలిచి తన కొరకు నిన్ను భార్యగా తీసుకొనేటందుకు
పంపినాడని చెప్పినందున; । ఆమె లేచి ముఖము నేల 41
మట్టుకు వంచుకొని యిదుగో నా యేలినవారియొక్క
సేవకుల కాళ్లు కడిగేటందుకు మీ సేవకురాలనైన నేను
వుందును గాకని చెప్పెను. । మరిన్ని అబీగయీలు త్వర 42
గా లేచి గాదర్భము మీద యెక్కి తన వెనుకనుంచి
వచ్చే అయిదుగురు పడుచులతోను దావీదు పంపిన
దూతల వెంబడి వచ్చి దావీదుకు భార్య ఆయెను. ।
మరిన్ని దావీదు ఇజ్రెయేలు స్త్రీ అయిన అహీనోయ 43
మునున్ను తీసుకొనెను; వీరిద్దరూ అతనికి భార్యలైరి. ।
అయితే సౌలు తన కుమార్తెయైన మీఖాలు అనే 44
దావీదుయొక్క భార్యను పల్థీయేలనే గల్లీమువాడైన
లాయీషుయొక్క కుమారునికి యిచ్చి వుండెను.

## 26. అధ్యాయము.

అంతట జీఫీయులు గిబాలో సౌలు యొద్దికి 1
వచ్చి, దావీదు యెషీమోను యెదుట హాఖిలా పర్వ
తమందు దాగి వున్నాడే అని చెప్పిరి. । అప్పుడు సౌలు 2
లేచి ఇశ్రాయేలీయులలో యెంచబడిన మూడువేల
మందిని తీసుకొని, జీఫు అనే అరణ్యములో దావీదును
వెతికేటందుకు జీఫు అనే అరణ్యమునకు దిగి వచ్చెను. ।
సౌలు యెషీమోను యెదుట వున్న హాఖిలా పర్వత 3
మందు మార్గము దగ్గిర దిగెను: అయితే దావీదు అర
ణ్యములోనే వుంటూ వుండి, సౌలు తన వెనుకను
అరణ్యమునకు వచ్చెనని తెలుసుకొనెను. । కాబట్టి దావీ 4
దు చొప్పుకాండ్లను బయిటికి పంపినందువల్ల సౌలు
నిశ్చయముగా వచ్చినాడని గ్రహించెను. । తరువాత 5
దావీదు లేచి సౌలు దిగిన స్థలము దగ్గిరకు వచ్చి,

సౌలున్ను నేరు కుమారుడైనటువంటిన్ని అతని సైన్యా
ధిపతి అయినటువంటిన్ని అబ్నేరున్ను పడుకొనే స్థల
మును చూచెను; సౌలు కందకమందు పడుకొని వుం
6 డెను, జనులు అతని చుట్టూ వుండిరి. । అప్పుడు దావీ
దు హిత్తీయుడైన అహీమెలెఖునున్ను సెరూయా
కుమారుడున్ను యోవాబుకు సహోదరుడున్ను అయి
వున్న అబీషైనున్ను చూచి, సౌలు దగ్గిరకు పేటలోకి
నాతోను యెవరు దిగి వత్తురని అడిగినప్పుడు నీతో
7 నేను దిగి వత్తునని అబీషై పలికెను. । కాబట్టి దావీదు
న్ను అబీషైయున్ను రాత్రి ఆ జనుల దగ్గిరకు వచ్చిరి;
అప్పుడు యిదుగో సౌలు కందకమందు పడుకొని
నిద్రపోతూ వుండెను; అతని యీటె అతని తలగడ
దగ్గిర భూమిలో నాటబడి యుండెను, మరిన్ని అబ్నే
రున్ను జనులున్ను అతని చుట్టూ పడుకొని వుండిరి. ।
8 అప్పుడు అబీషై దావీదును చూచి, దేవుడు నీ శత్రువుని
యీ దినమందు నీ చేతిలోకి అప్పగించెను; కాబట్టి
నీకు అనుకూలమైతే నేను వెళ్లి ఆ యీటెచేత వొక్క
పోటు పొడిచి అతని భూమికి నాటివేతును, రెండో
9 మారు పొడిచేది అక్కర లేదని చెప్పెను. । అందుకు
దావీదు అబీషైతో అనిన మాట, అతని సంహరించ
కూడదు, యేమంటే యెహోవాయొక్క అభిషిక్తునికి
విరోధముగా యెవడు తన చెయి చాపి నిరపరాధిగా
10 వుండ గలడని చెప్పి; । దావీదు యింకా చెప్పినదేమంటే,
యెహోవా జీవముతోడు యెహోవాయే అతని
కొట్టును, లేక అతడు చచ్చే దినమైనా వచ్చును; అది
11 కాకపోతే అతడు యుద్ధమునకు వెళ్లి నశించును. । యె
హోవాయొక్క అభిషిక్తుని మీదికి నా చెయ్యి చాప
కుండా యెహోవా నన్ను నిరోధించునుగాక; అయితే
నీవు వెళ్లి అతని తలగడ దగ్గిర వున్న యీటెనున్ను నీళ్ల
బుడ్డినిన్ని పట్టుకొని రమ్ము, అప్పుడు మనము వెళ్లిపో
12 దామని చెప్పెను. । ఆలాగున దావీదు సౌలుయొక్క
తలగడ దగ్గిర వున్న యీటెనున్ను నీళ్ల బుడ్డినిన్ని
తెప్పించుకొని వారిద్దరూ వెళ్లిపోయిరి; అయితే చూచిన
వాడున్ను యెరిగిన వాడున్ను మేలుకొనిన వాడున్ను
వొకడూ లేకపోయెను, యేమంటే యెహోవావల్ల
నుంచి గాఢ నిద్ర వారికి కలిగినందున వారందరున్ను
13 నిద్రిస్తూ వుండిరి. । తరువాత దావీదు ఆవలకు వెళ్లి
దూరముగా వున్న కొండమీద నిలిచి, వుభయుల
14 మధ్యను చాలా యెడము వుండగా, । జనులకున్ను
నేరుయొక్క కుమారుడయిన అబ్నేరుకున్ను కేక వేసి,
వో అబ్నేరా, నీవు ప్రత్యుత్తరము యియ్యవా అనిన
ప్పుడు, అబ్నేరు రాజుగారికి కేక వేసిన నీవు యెవడవు
15 అని అడిగితే; । దావీదు అబ్నేరుతో చెప్పినదేమంటే,
నీవు మొగవాడవు కావా? ఇశ్రాయేలీయులలో నీవంటి
వాడు యెవడు! కాబట్టి నీ యేలినవారైన రాజును
యెందుకు భద్రము చేయకపోతివి! యేమంటే నీ
యేలినవారైన రాజును నశింప చేయడానకు జనులలో
వొకడు దగ్గిరికి వచ్చినాడు. । నీవు చేసినది మంచిది 16
కాదు; యెహోవా జీవముతోడు మీరు మరణానకు
పాత్రులై వున్నారు, యేమంటే మీ యజమానుడయిన
యెహోవాయొక్క అభిషిక్తుని భద్రము చేసినవారు
కారు; రాజుగారియొక్క యీటె యెక్కడ వున్నదో
అతని తలగడ వద్ద వున్న నీళ్ల బుడ్డి యెక్కడ వున్న
దో అది చూడుమని చెప్పుతూ వుండగా; । సౌలు 17
దావీదుయొక్క శబ్దమును గ్రహించి, నా కుమారుడ
వైన వో దావీదా, యిది నీ శబ్దమేనా అని అన్నప్పు
డు, దావీదు రాజైన వో నా యేలినవాడా, యీ శబ్దము
నాదే అని చెప్పి, । మరిన్ని అనినదేమంటే, నా యేలి 18
నవారు తమ సేవకుని యీలాగున యెందుకు తరుము
తారు? నేను యేమి చేస్తిని? నావల్ల యే తప్పు కలిగెను. ।
కాబట్టి రాజైన నా యేలినవారు తమ సేవకుడు చెప్పే 19
మాటలు వినవలసినది. యెహోవా మిమ్మును నా
మీద ప్రేరేపణ చేసెనట్టాయెనా ఆయనను అర్పణ
యొక్క సువాసన చూడనిమ్ము; యిది నరపుత్రులవల్ల
నైనదైతే యెహోవా సముఖమందు వారు శపించ
బడుదురుగాక, యేమంటే యీవేళ వారు యెహో
వాయొక్క స్వాతంత్ర్యపు భాగమందు నేను వుండ
కుండా నన్ను బయిటకు తోలివేసి అన్య దేవుండ్లను
కొలువుమని నాతో చెప్పివున్నారు. । అయితే భూమి 20
మీద యెహోవా సముఖమందు నా రక్తము రాలక
పోగాక, యేమంటే వొకడు పర్వతముల మీద కౌజు
పిట్టను తరిమినట్టు రాజైన మీరు కుక్క పేనును
వెతికేటట్టు బైలుదేరి వస్తిరని చెప్పెను. । అప్పుడు సౌలు 21
చెప్పినదేమంటే, నేను పాపము చేస్తిని, నా కుమారు
డవైన వో దావీదా, నీవు మళ్లీ రావలసినది; యిక నీకు
నేను మోసము చేసేవాడను కాను, యేమంటే యీ
రోజున నా ప్రాణము నీ దృష్టికి ప్రియముగా వుం
డెను; నేను వెర్రివాడనై బహుగా తప్పు చేస్తినని
చెప్పెను. । అప్పుడు దావీదు చెప్పినదేమంటే, యిదు 22
గో రాజైన మీయొక్క యీటె! పడుచువాండ్లలో
వొకడు దాని కోసము యివతలకు రావలసినది. । యె 23
హోవా ప్రతి మనిషికి వానివాని నీతినిన్ని విశ్వా
సమునున్ను నిర్ణయించునుగాక, యేమంటే యెహో
వా యీ రోజున మిమ్మున నా చేతిలోకి అప్పగించిన
ప్పటికిన్ని యెహోవాయొక్క అభిషిక్తుని మీదికి నా
చెయ్యి చాపుటకు అనుకూలించనైతిని. । కాబట్టి యి 24
దుగో మీ ప్రాణము యీ రోజున నా దృష్టికి ప్రియ
మైనట్టు నా ప్రాణము యెహోవా దృష్టికి ప్రియమై

వుండును; మరిన్ని ఆయన సమస్తమైన అవిధిలోనుంచి
25 నన్ను రక్షించును గాకని చెప్పెను. । అప్పుడు సౌలు
దావీదుతో అనిన మాట, నా కుమారుడవయిన వో
దావీదా, నీవు ఆశీర్వాదమును పొందుదువు గాక;
నీవు ఘన కార్యములను చేసి విజయమును పొందుదు
వని చెప్పెను. అప్పుడు దావీదు తన మార్గమున వెళ్లి
పోయెను; సౌలున్ను తన స్థలమునకు తిరిగి వచ్చెను.

## 27. అధ్యాయము.

1 తరువాత దావీదు అనుకొనినదేమంటే, యేదో
వొక దినమున నేను సౌలుచేత నశింప పడుదును; నేను
త్వరగా పెలిష్తీయులయొక్క దేశములోకి తప్పించు
కొని పోవుటకంటే మేలు మరి లేదు; అప్పుడు సౌలు
ఇశ్రాయేలు సరిహద్దులలో నన్ను వెతుకడానకు కోరిక
లేక వున్నందువల్ల నేను అతని చేతిలోనుంచి తప్పిం
చుకొందునని తన హృదయములో అనుకొనెను. ।
2 అంతట దావీదు లేచి తనయొద్ద వున్న ఆరునూరు మం
దితో కూడా గడచి పోయి, మాయోఖుయొక్క కుమా
రుడున్ను గాతుయొక్క రాజున్ను అయినటువంటి
3 ఆఖీషు యొద్దికి వచ్చెను. । అప్పుడు దావీదు గాతులో
ఆఖీషుయొద్ద నివసిస్తూ వుండెను; తానున్ను తన వా
రందరున్ను తమ తమ యింటెల్లి పాదితో వుండిరి: దా
వీదున్ను ఇజ్రెయేలీయురాలైన అహీనోయమున్ను
నాబాలు భార్యయున్ను కర్మెలీయురాలున్ను అయిన
అబీగయీలున్ను అనే తన యిద్దరు భార్యలతోను
4 వుండెను. । దావీదు గాతుకు పారిపోయిన సంగతి సౌ
లుకు వినపడెను, అయితే అతడు అతని మరి వెతుక
5 కుండా వుండెను. । అంతట దావీదు ఆఖీషుతో అనిన
మాట, నీ దృష్టియందు నేను అనుగ్రహమును పొంది
నవాడనైతే నాటు పట్టణములలో వొక దానియందు
నేను కాపురము చేసే కొరకు వొక స్థలము యిప్పించ
వలసినది, యెందుకంటే రాజపురమందు నీ యొద్ద నీ
సేవకుడనైన నేను కాపురము చేయనేలని అడిగినందున, ।
6 ఆఖీషు సిక్లగు అనే వూరును ఆ దినమున అతనికి యి
చ్చెను; కాబట్టి సిక్లగు నేటివరకు యూదా రాజుల
7 కింద వున్నది. । అయితే దావీదు పెలిష్తీయులయొక్క
దేశమందు కాపురము చేసిన కాలమంతా సంవత్స
8 రము మీద నాలుగు నెలలై వుండెను. । అంతలో దావీ
దున్ను అతనివారున్ను యెక్కి, గెషూరీయుల మీద
నున్ను గిర్జీయుల మీదనున్ను అమాలేకీయుల మీద
నున్ను పడిరి: యేమంటే పూర్వమునుంచి వీరు షూరు
మొదలుకొని మిస్రయీము పర్యంతమూ వున్న దేశ
9 మందు కాపురస్తులై యుండిరి. । ఆ దేశమును దావీదు
కొట్టి మొగవానినైనా ఆడుదానినైనా జీవముతోటి
విడువక, గొర్రెలనున్ను యెడ్లనున్ను గాడిదెభములను
న్ను వొంటెలనున్ను అలంకారములనున్ను దోచుకొని,
తిరిగీ ఆఖీషు యొద్దికి వచ్చెను. । ఆఖీషు మీరు యీ 10
దినమున యెంత పర్యంతము తోవ చేసుకొంటిరని అడి
గినప్పుడు దావీదు అనిన మాట, యూదా దక్షిణమున
కున్ను యెరహ్మేయేలీయుల దక్షిణమునకున్ను కేనీ
యుల దక్షిణమునకున్ను మేము వెళ్లి వస్తిమని చెప్పెను. ।
దావీదు యీలాగున చేసెను, మరిన్ని అతడు పెలిష్తీ 11
యులయొక్క దేశములో నివసించినంత కాలము యీ
ప్రకారముగా చేస్తాడని తమ్మును గురించి వారు చెప్ప
దురేమో అని అనుకొని, గాతుకు వర్తమానము
తేగల మొగవానినైనా ఆడుదానినైనా జీవముతోటి
దావీదు విడువలేదు. । అయితే ఆఖీషు దావీదు చెప్పి 12
నమాట నమ్మి అనుకొనినదేమంటే, అతడు తన జనుల
యిన ఇశ్రాయేలు తన విషయమై బొత్తిగా అసహ్య
పడేలాగున చేసుకొనినందున అతడు సదా కాలము
నాకు సేవకుడై వుండునని అనుకొనెను.

## 28. అధ్యాయము.

ఆ దినముల యందు సంభవించినదేమంటే, పెలిష్తీ 1
యులు ఇశ్రాయేలీయులతో పోట్లాడడానకు తమ
సైన్యములను కూర్చుకొని యుద్ధమునకు సిద్ధపర్చిరి.
అప్పుడు ఆఖీషు దావీదును చూచి, నీకు రూఢముగా
తెలియవలసినదేమంటే, నీవున్ను నీ జనులున్ను నాతో
కూడా యుద్ధమునకు బైలుదేరి రావలెనని చెప్పిన
ప్పుడు, । దావీదు అతనితో నీ సేవకుడనైన నేను 2
చేయగల కార్యము యేదో అది నీవు నిజముగా
చూతువు గాని అని చెప్పినందున ఆఖీషు దావీదును
చూచి ఆలాగైతే నా శిరస్సును కాచే వానిగా నిన్ను
సదా నిర్ణయింతునని చెప్పెను. । అయితే సమూ 3
యేలు మృతిబొంది యుండెను; ఇశ్రాయేలీయులు
అతని గురించి దుఃఖపడి రామా అనే అతని పట్టణమం
దు అతని పాతిపెట్టి వుండిరి. మరిన్ని సౌలు కర్ణపిశా
చములు గలవారినిన్ని చిల్లంగి వారినిన్ని దేశములో
నుంచి పరిహరించి వుండెను. । పెలిష్తీయులు కూడుకొని 4
వచ్చి షూనేములో దిగిరి; సౌలున్ను ఇశ్రాయేలీయులం
దరినిన్ని కూర్చెను, వారు గిల్బోవలో దిగిరి. । అయితే 5
సౌలు పెలిష్తీయులయొక్క సమూహమును చూచినప్పు
డు భయపడి హృదయమందు తల్లడించెను. । మరిన్ని 6
సౌలు యెహోవాను ఆలోచన అడిగినప్పుడు యె
హోవా స్వప్నము ద్వారానైనా ఊరీము ద్వారాన
యినా దీర్ఘదర్శుల ద్వారానైనా ప్రత్యుత్తరము
యివ్వక వుండెను. । అప్పుడు సౌలు తన సేవకులతో 7
చెప్పినదేమంటే, నా కొరకు మీరు కర్ణపిశాచము గల

వొక స్త్రీని చూడండి; నేను వెళ్లి దానియొద్ద ఆలోచన
చేతునని చెప్పినప్పుడు, వారు అతనితో అదుగో ఎన్దోరు
8 లో కర్ణపిశాచము గల వొక తె కలదని చెప్పిరి. । కాబట్టి
సౌలు వేరే బట్టలు తొడుగుకొని మారు వేషము ధరించి,
యిద్దరు మనుష్యులతో కూడా వెళ్లి రాత్రి ఆ స్త్రీ
యొద్దికి వచ్చి ఆమెను చూచి, కర్ణపిశాచము ద్వారా
నాకు శకునము చెప్పి, నేను నీతో చెప్పే అతని నా
కొరకు మీదికి వచ్చేలాగు చేయవలెనని వేడుకొన్న
9 ప్పుడు, । ఆ స్త్రీ అతనితో అనిన మాట, యిదుగో
సౌలు చేయించినది నీకు తెలిసినది కాదా? యేమంటే
కర్ణపిశాచములు గలవారెనిన్ని చిల్లంగి వారినిన్ని
దేశములోనుంచి తీసి వేయించెను; నేను మరణమయ్యే
టట్టుగా నా ప్రాణమునకు వురి వేసెదవేమని చెప్పిన
10 ప్పుడు; । సౌలు దానికి యెహోవా మీద ప్రమాణ
ము యిచ్చినదేమంటే, యెహోవా జీవముతోడు,
యీ నిమిత్తమువల్ల సిక్ష నీకు యెంత మాత్రము రాక
11 పోవునని చెప్పినందున, । ఆ స్త్రీ నీ కొరకు మీదికి
యెవని తీసుకు రావలసినదని అడిగితే అతడు సమూ
12 యేలును మీదికి రాచేయ వలెనని చెప్పెను. । ఆ స్త్రీ
సమూయేలును చూచినప్పుడు మహా శబ్దముచేత కేక
వేసెను; మరిన్ని ఆ స్త్రీ సౌలును చూచి నీవు నన్ను
యెందుకు మోసపుచ్చితివి? యేమంటే నీవే సౌలువు
13 అని చెప్పెను. । కాబట్టి రాజు దాని చూచి నీవు
భయపడవద్దు; అయితే నీకు యేమి కనపడినదని అడి
గినప్పుడు, అది నేను దేవుండ్లు భూమిలోనుంచి పైకి
14 రావడము చూస్తినని చెప్పెను. । అందుకు అతడు యే
రూపముతోటి వున్నాడని దానిని అడిగినప్పుడు, అది
ముసలివాడు దుప్పటితో కప్పబడి మీదికి వస్తూ
వున్నాడని చెప్పినందున, సౌలు అతడు సమూయేలు
అని గ్రహించి ముఖమును భూమి మట్టుకు వంచు
15 కొని సాష్టాంగ పడెను. । అప్పుడు సమూయేలు సౌలు
తో అనిన మాట, నేను మీదికి వచ్చేకొరకు నీవు నన్ను
యెందుకు తొందర పెట్టితివని అడిగినప్పుడు, సౌలు
ప్రత్యుత్తరముగా చెప్పినదేమంటే, నేను బహు వ్యా
కుల పడుతున్నాను, యేమంటే ఫెలిష్తీయులు నా మీద
యుద్ధము చేస్తూ వున్నారు; మరిన్ని దేవుడు నన్ను
యెడబాసి, యిప్పుడు దీర్ఘదర్శుల ద్వారానైనా
స్వప్నముల ద్వారానైనా నాకు ప్రత్యుత్తరము యి
వ్వక వున్నాడు; కాబట్టి నేను చేయవలసినది యేదో
అది నాతో తెలియ చెప్పేటందుకు నిన్ను పిలిపిస్తినని
16 చెప్పినప్పుడు; । సమూయేలు అతని చూచి, యెహో
వా నిన్ను విడిచి పెట్టి నీకు శత్రువుడైన తరువాత
17 నన్ను అడుగనేల? । యెహోవా నా ద్వారా ఆనతి
చ్చినదానిని చేసెను, యేమంటే నీ చేతిలోనుంచి
రాజ్యమును తీసివేసి నీ పొరుగింటివాడైన దావీదుకు
అది యిచ్చివున్నాడు. । యెహోవాయొక్క అజ్ఞకు 18
నీవు లోబడక, అమాలేకీయుల మీద ఆయన తీక్ష్ణమైన
కోపము నెరవేర్చకపోతివి; కాబట్టి యీ వేళ యె
హోవా యిది నీకు చేసి వున్నాడు. । మరిన్ని యె 19
హోవా నిన్నున్ను ఇశ్రాయేలీయులనున్ను ఫెలిష్తీ
యుల చేతిలోకి అప్పగించును; రేపు నీవున్ను నీ కుమా
రులున్ను నాయొద్ద వుందురు, యేమంటే యెహో
వా ఇశ్రాయేలుయొక్క సమూహమును ఫెలిష్తీయుల
యొక్క చేతిలోకి అప్పగించునని చెప్పినంతలో; । సౌలు 20
సమూయేలు చెప్పిన మాటలకు బహు భయపడి,
భూమి మీద సాగిలపడెను; ఆ దినమున అతడు పగ
టియందున్ను రాత్రియందున్ను భోజనము చేయక
వుండినందున అతనికి శక్తిలేకపోయెను. । అప్పుడు 21
ఆ స్త్రీ సౌలును చేరి, అతడు విభ్రాంతి పడెనని చూచి,
అతనితో చెప్పినదేమంటే, యిదుగో నీ సేవకురాల
నైన నేను నీ ఆజ్ఞకు లోబడి నా ప్రాణము నా చేతి
లో పెట్టుకొని నీవు నాతో సెలవు యిచ్చిన మాటలను
ఆలకించి చేస్తిని. । యిప్పుడు నీ సేవకురాలనైన నేను 22
చెప్పే మాటలను ఆలకించుము; నేను నీకు యింత
ఆహారమును వడ్డించనిమ్ము; నీ మార్గమున నీవు వెళ్ల
డానకు నీకు శక్తి కలిగే కొరకు అది భోజనము చేయ
వలసినదని చెప్పెను. । అయితే అతడు వొప్పక భోజ 23
నము చేయననెను; అయితే అతని సేవకులు ఆ స్త్రీతో
కూడా బలవంతము చేసినందున అతడు వారు చెప్పిన
మాటలను ఆలకించి భూమి మీదనుంచి లేచి మంచము
మీద కూర్చుండెను. । ఆ స్త్రీ తన యింట్లో కొవ్విన 24
పెయ్య వొకటి వున్నందున త్వరపడి దాని చంపి,
పిండి తెచ్చి పిసికి పులుసులేని రొట్టెలను కాల్చి, ।
అంతా తీసుక వచ్చి సౌలుకున్ను అతని సేవకులకున్ను 25
వడ్డించినందున వారు భోజనము చేసి లేచి, ఆ రాత్రి
లోనే వెళ్లిపోయిరి.

## 29. అధ్యాయము.

అంతలో ఫెలిష్తీయులు తమ సైన్యములను ఆఫే 1
కులో కూర్చుకొని వుండిరి; మరిన్ని ఇశ్రాయేలీ
యులు ఇజ్రెయేలు యందున్న జెలదగ్గిర దిగిరి. ।
ఫెలిష్తీయులయొక్క అధికారులు నూరేసి మందితో 2
నున్ను వెయ్యేసి మందితోనున్ను వెళ్లినారు; అయితే
దావీదున్ను అతని జనులున్ను ఆఖీషు యొద్ద వెనుక
బలమందు వుండిరి. । అయితే ఫెలిష్తీయులయొక్క అధి 3
కారులు యెందుకు యీ ఇబ్రీయులని పలికినప్పుడు,
ఆఖీషు ఫెలిష్తీయులయొక్క అధికారులతో చెప్పిన
దేమంటే, యీ దినములు అనగా యెన్నో సంవత్స

రములు నా యొద్ద వుండినటువంటిన్ని ఇశ్రాయేలుకు
రాజైన సౌలుయొక్క సేవకుడైనటువంటిన్ని దావీదు
యితడే కాడా! అతడు నా యొద్దికి వచ్చిన నాట
నుంచి నేటివరకు అతనివల్ల యే తప్పు అయినా నాకు
4 కనిపించినది కాదని చెప్పినప్పుడు; । ఫెలిష్తీయులయొ
క్క అధికారులు అతని మీద కోపపడి అతనితో
చెప్పినదేమంటే, యీ మనుష్యుడు నీవు నిర్ణయిం
చిన స్థలమునకు తిరిగీ వెళ్లజేయుము; యుద్ధమందు అతడు
మనకు విరోధి యౌనేమో; ఆలాగున కాకుండా అతడు
మనతోను యుద్ధమునకు దిగి రాకూడదు; యేమంటే
యీ మనుష్యులయొక్క శిరస్సులచేత కాకపోతే మరి
వేటిచేత అతడు తన యజమానుని సమాధాన పర్చు
5 కొనును! । వేలకొలది మందిని సౌలున్ను పదివేలకొలది
మందిని దావీదున్ను హతము చేసిరని వారు నాట్యమా
డుతూ పాడిన దావీదు యితడే కదా అని చెప్పిరి. ।
6 కాబట్టి ఆఖీషు దావీదును పిలిచి అతనితో చెప్పిన
దేమంటే, యెహోవాయొక్క జీవముతోడు నీవు
నిజముగా యథార్థ పరుడవై వుంటివి; సైన్యములో
నీవు నాతో కూడా రావడమున్ను పోవుటయున్ను
నా దృష్టికి బాగై వుండెను; నీవు నా యొద్దికి వచ్చిన
నాటనుంచీ నేటివరకు నీ వల్ల యే కీడైనా నాకు కను
పడినది కాదు; అయినప్పటికిన్ని నీ యందు అధికారు
7 లకు దయ లేకపోయెను. । కాబట్టి ఫెలిష్తీయుల అధి
కారులయొక్క దృష్టికి నీవు ప్రతికూలుడవని అగుపడ
కుండా నీవు తిరిగీ నీ స్థలమునకు సుఖముగా వెళ్లుమని
8 చెప్పినప్పుడు; । దావీదు ఆఖీషుతో అనిన మాట, నేను
యేమి చేస్తిని? నా యేలినవాడున్ను రాజున్ను అయిన
నీ శత్రువులతో పోట్లాడుటకు వెళ్లకుండా నేను నీ
యొద్దికి వచ్చిన నాటనుంచి నేటివరకు నీ సేవకుడనైన నా
9 యందు యేమి చూస్తివి అని అడిగినప్పుడు; । ఆఖీషు
దావీదుతో ప్రత్యుత్తరముగా చెప్పినదేమంటే, నీవు
దేవునియొక్క దూతలాగున నా దృష్టికి అనుకూలు
డవై అగుపడితివి; అయినప్పటికిన్ని ఫెలిష్తీయులయొ
క్క అధికారులు యితడు మనతోను యుద్ధమునకు రా
10 కూడదని చెప్పి వున్నారు. । కాబట్టి నీవు వుదయమందు
నీతోను వచ్చిన నీ యజమానునియొక్క సేవకులతోను
త్వరగా లేవవలసినది; వుదయమందు త్వరగా లేచి
11 తెల్లవారిన తరువాత వెళ్లిపొమ్మని చెప్పినందున, । దావీ
దున్ను అతని జనులున్ను వుదయమందు త్వరగా లేచి
తర్లి, ఫెలిష్తీయులయొక్క దేశమునకు తిరిగి వచ్చిరి;
ఫెలిష్తీయులు ఇశ్రాయేలుకు యెక్కిపోయిరి.

## 30. అధ్యాయము.

1 అయితే దావీదున్ను తన జనులున్ను మూడో దిన
మందు సిక్లగుకు వచ్చినప్పుడు సంభవించినదేమంటే,
అమాలేకీయులు దక్షిణ దేశము మీదనున్ను సిక్లగుమీ
దనున్ను పడి దోచుకొని, సిక్లగును కొట్టి తగలబెట్టి, ।
అందులో వున్న ఆడువాండ్లను చెరలోకి తీసుకొని, 2
పెద్ద చిన్నలలో యెవరినైనా చంపక వారిని తీసుకొని,
తమ మార్గమున వెళ్లిపోయి వుండిరి. । అప్పుడు దావీ 3
దున్ను తన జనులున్ను వూరికి వచ్చినంతలో యిదుగో
అది కాల్చపడి వుండెననిన్ని, తమ భార్యలున్ను కుమా
ళ్లున్ను కుమార్తెలున్ను చెరలోకి కొంచపోపడినార
నిన్ని తెలిసిరి. । అప్పుడు దావీదున్ను తన యొద్ద వున్న 4
జనులున్ను తమ కంఠమెత్తి యేడ్వడానకు శక్తి లేక
వుండే మట్టుకు యేడ్చిరి. । మరిన్ని ఇశ్రాయేలీయురా 5
లైన అహీనోయమున్ను కర్మెలీయుడైన నాబాలుయొ
క్క భార్య అయిన అబీగయీలున్ను అనే దావీదు
యొక్క యిద్దరు భార్యలున్ను చెరలోకి కొంచపోప
డిరి. । అందుకు దావీదు మిక్కిలీ వ్యాకులపడెను, యే 6
మంటే జనులలో ప్రతి మనిషికి తన తన కుమాళ్ల కుమా
ర్తెల నిమిత్తము ప్రాణము విసికినందున అతని రాళ్ల
చేత కొట్టుండని వారు చెప్పుకొనిరి; అయితే దావీదు
తన దేవుడైన యెహోవా యందు ధైర్యము తెచ్చు
కొనెను. । అయినందున దావీదు అహీమెలెఖుయొక్క 7
కుమారుడున్ను అర్చకుడున్ను అయిన అబ్యాతారుతో
ఎఫోదు తెమ్మని చెప్పినప్పుడు, అబ్యాతారు ఎఫోదును
దావీదు యొద్దికి తీసుక వచ్చినాడు. । అప్పుడు దావీ 8
దు యెహోవాను ఆలోచన అడిగినదేమంటే, ఆ గుం
పును నేను తరుముదునా? వారిని నేను కలియుదునా?
అని అడిగినప్పుడు, ఆయన తరుము, నీవు నిశ్చయము
గా వారిని కలిసి, తప్పక సమస్తమును విడిపించుకొం
దువని ప్రత్యుత్తరమిచ్చెను. । కాబట్టి దావీదు తాను 9
న్ను తన యొద్ద వున్న ఆరునూరు మందిన్ని బైలుదేరి,
బెశోరు గెడ్డకు వచ్చిరి; అక్కడ వెనుక విడువబడిన
వారు నిలిచి వుండిరి. । అయినప్పటికిన్ని దావీదు తాను 10
న్ను నన్నూరు మందిన్ని యింకా తరుముతూ వెళ్లినారు,
యేమంటే యిన్నూరు మంది అలసట పడి, బెశోరు
గెడ్డ దాటడానకు శక్తి లేక వెనుకకు వుండిరి. । అయితే 11
వారు పొలములో వొక మిస్రీయుని చూచి, అతని
దావీదు యొద్దికి కొంచ వచ్చి, అతనీ భోజనము చేయిం
చి తాగించి, అంజూరపు ముద్దలో ముక్కనున్ను
రెండు ద్రాక్ష గెలలనున్ను అతనికి యిచ్చిరి; । అతడు 12
భోజనము చేసిన తరువాత అతని జీవాత్మ అతనికి తిరిగీ
వచ్చెను, యేమంటే అతడు మూడు దివారాత్రములు
రొట్టె తినక నీళ్లు తాగక వుండెను. । అప్పుడు దావీ 13
దు నీవు యెవరి మనిషివి? యెక్కడనుంచి వస్తివని అతని
అడిగినప్పుడు, వాడు నేను మిస్రయీము పడుచువా
డనై, అమాలేకీయుడైన వొకనికి సేవకుడనై వున్నాను;

మూడు రోజుల కిందట నేను సంకటపడినాను గనుక
14 నా యజమానుడు నన్ను విడిచి వెళ్లినాడు. । మేము
కెరేతీయుల దక్షిణ దేశము మీదనున్ను యూదా దేశ
ము మీదనున్ను కాలేబు దక్షిణ దేశము మీదనున్ను
పడి, వాటిని దోచుకొని, సిక్లగును అగ్నిచేత కాల్చి
15 వేస్తిమని చెప్పెను. । నీవు ఆ సమూహము దగ్గిరకు
నన్ను కొంచపోగలవా అని దావీదు అతని అడిగిన
ప్పుడు, వాడు చెప్పినదేమంటే, నీవు నన్ను చంపకను
న్ను నా యజమానునియొక్క చేతులలోకి నన్ను అప్ప
గించకనున్ను వుంటానని దేవుని మీద నాకు ప్రమాణ
ము చేయుము; అప్పుడు నేను ఆ సమూహమునకు నిన్ను
16 కొంచపోతానని చెప్పెను. । తరువాత యితడు అతని
వారి దగ్గిరకు కొంచ వచ్చినప్పుడు, యిదుగో వారు
భూమి అంతటి మీద చెదరపడి, పెలిష్తీయుల దేశము
లోనుంచిన్ని యూదా దేశములోనుంచిన్ని దోచుకొ
నిన సొమ్ము బహు విస్తారము గనక భోజనము చేస్తూ
17 తాగుతూ నాట్యమాడుతూ వుండిరి. । అప్పుడు దావీ
దు మరునాడు తెల్లవారినది మొదలుకొని సాయంత
నము మట్టుకు వారిని కొట్టినందున, వొంటెల మీద
యెక్కి పారిపోయిన నన్నూరు మంది పడుచువాండ్లు
గాక తప్పించుకొనినవాడు వొకడూ లేకపోయెను. ।
18 కాబట్టి దావీదు అమాలేకీయులు యెత్తుక పోయినదం
తాను తిరిగీ విడిపించుకొనెను; మరిన్ని తన యిద్దరు
19 భార్యలనున్ను విడిపించుకొనెను. । కుమాళ్లు కుమార్తెల
లోనున్ను దోపుడు సొమ్ములోనున్ను వారు యెత్తుక
పోయిన కొద్దీ గొప్ప అంతటిలోనున్ను యేమీ తక్కు
వలేకుండా దావీదు యావత్తున్ను తిరిగీ విడిపించుకొ
20 నెను. । మరిన్ని దావీదు గొర్రెలనున్ను యెడ్లనున్ను
అన్నిటినీ పట్టుకొన్నాడు; వీటిని వారు తతిమ్మా పశు
వులకంటే ముందర తోలివేసి, యివి దావీదుయొక్క
21 దోపుడు సొమ్మని పలికినారు. । అప్పుడు అలసటచేత
దావీదును వెంబడించ లేనటువంటిన్ని బెశోరు గెడ్డ
దగ్గిర వారు నిలిపినటువంటిన్ని ఆ యిన్నూరు మంది
యొద్దికి దావీదు వచ్చెను; వారు దావీదునున్ను అతని
యొద్ద వున్న జనులనున్ను యెదుర్కొనుటకు బైలుదేరి
వచ్చినారు; మరిన్ని దావీదు యీ జనుల యొద్దికి వచ్చి
22 నప్పుడు వారి యోగక్షేమమును అడిగెను. । అయితే
దావీదుతో వెళ్లిన వారిలో వున్న దుర్మార్గులున్ను
బెలియాలు వారున్ను చెప్పినదేమంటే, వీరు మనతో
కూడా రాకపోయిరి గనుక ప్రతి మనిషియొక్క భార్య
నున్ను పిల్లలనున్ను గాక మనము తిరిగీ విడిపించుకొ
నిన దోపుడు సొమ్ములో యేదైనా వీరికి యివ్వము;
వీరిని వారు తీసుకొని వెళ్లిపోవచ్చునని పలికినందున, ।
23 దావీదు వారితో అనిన మాట, నా సహోదరులారా,
మనలను కాపాడి, మన మీదికి వచ్చిన గుంపును మన
చేతిలోకి అప్పగించిన యెహోవా మనకు దయ చేసిన
దాని పట్ల ఆలాగున చేయ కూడదు. । యిందుకు మీరు 24
చెప్పినదాని యెవ్వరు విందురు? యేమంటే యుద్ధము
నకు వెళ్లిన వాని భాగము యెంతో సామానుయొద్ద
నిలిచిన వానియొక్క భాగము అంతే అవును; అంద
రికీ వొక రీతిగానే పాలు పంచడమానని నిర్ణయిం
చెను. । యిది నాటినుంచి నేటివరకు అతనిచేత ఇశ్రా 25
యేలుకు నిబంధనగానున్ను విధిగానున్ను నిర్ణయిం
చబడెను. । తరువాత దావీదు సిక్లగుకు వచ్చినప్పుడు 26
దోపుడు సొమ్ములోనుంచి కొంత తన స్నేహితులైన
యూదాయొక్క పెద్దల యొద్దికి యిదుగో యెహో
వా శత్రువుల యొద్దనుంచి దోచుకొనిన సొమ్ములో
కొంత మీకు కానుక అని పంపించెను. । బేతేలులో 27
నున్ను, దక్షిణ రామోతులోనున్ను, యత్తీరులోనున్ను,।
అరోయేరులోనున్ను, షిప్మోతులోనున్ను, ఎష్టెమోయ 28
లోనున్ను, । రాఖాలులోనున్ను, యెరహ్మెయేలీయుల 29
వూళ్లలోనున్ను, కేనీయుల వూళ్లలోనున్ను,। హొర్మా 30
లోనున్ను, కోరాషానులోనున్ను, అతాఖులోనున్ను,।
హెబ్రోనులోనున్ను వున్న వాండ్లకున్ను, దావీదున్ను 31
తన జనులున్ను సంచరించిన స్థలములన్నిటియందున్న
వారికిన్ని కానుకలను పంపించినాడు.

## 31. అధ్యాయము.

అంతట పెలిష్తీయులు ఇశ్రాయేలీయులతో యు 1
ద్ధము చేసిరి: అయితే ఇశ్రాయేలీయులు పెలిష్తీయుల
ముందరనుంచి పారిపోయి, గిల్బోవ పర్వతమందు హ
తులయి కూలిరి. । పెలిష్తీయులు సౌలునున్ను అతని 2
కుమారులనున్ను చుట్టుకొనిరి; యోనాతాను అబీనా
దాబు మెల్కీషూవ అనే సౌలుయొక్క ముగ్గురు కుమా
రులను పెలిష్తీయులు హతము చేసిరి. । యుద్ధము సౌలు 3
మీద బహు భారమై వుండెను, యేమంటే విలుకాం
డ్లు అతని కనుగొనినందున అతడు బాణములచేత కఠి
నమైన గాయములను పొందినాడు. । అప్పుడు సౌలు 4
తన ఆయుధములను మోసేవాని చూచి, యీ సున్నతీ
లేనివాండ్లు వచ్చి నన్ను దూసి పోయేటట్టుగా పొడిచి
అపహాస్యము చేయకుండా నీవు కత్తి వర దూసి దాని
చేత నన్ను దూసి పోయేలాగున పొడువుమని చెప్పిన
ప్పటికిన్ని అతని ఆయుధములు మోసేవాడు భయపడి
అది చేయక వుండెను; కాబట్టి సౌలు వొక కత్తి తీసు
కొని దాని మీద పడినాడు. । సౌలు మరణమైనాడని 5
అతని ఆయుధములను మోసేవాడు చూచినప్పుడు తా
నున్ను తన కత్తిమీద పడి అతనితో కూడా మరణ
మాయెను. । యీలాగున సౌలున్ను అతని ముగ్గురు 6

కుమారులున్ను అతని ఆయుధముల మోతకాడున్ను
అతని వారందరున్ను వొక దినమందే కూడా మరణమై
7 నారు. । అయితే లోయ యివతల వున్న ఇశ్రాయేలీయు
లున్ను యర్దేను యివతల వున్న వారున్ను ఇశ్రాయే
లీయులు పారిపోయినారనిన్ని, సౌలున్ను అతని కుమా
రులున్ను మరణమైనారనిన్ని చూచినప్పుడు వూళ్లను
విడిచి పారిపోయినందున పెలిష్తీయులు వచ్చి వాటి
8 యందు కాపురము చేసిరి. । మరునాటి యందు సంభ
వించినదేమంటే, పెలిష్తీయులు హతమైన వాండ్లను
దోచుకోవడానకు వచ్చి, గిల్బోవ పర్వతమందు పడి
పోయిన సౌలునున్ను అతని ముగ్గురు కుమారులనున్ను
9 చూచి, । అతని శిరస్సును ఖండించి, అతని ఆయుధము
లను తీసి, తమ ప్రతిమల మందిరములోనున్న జనుల
లోనున్ను ప్రసిద్ధిచేయుటకు వాటిని నఖముఖాలా
పెలిష్తీయుల దేశమునకు పంపినారు. । మరిన్ని వారు 10
అతని ఆయుధములను ఆష్తారోతు మందిరమందు వుంచి,
అతని మొండెమును బేత్షెయాను పట్టణపు గోడను తగి
లించినారు. । అయితే యాబేష్గిలాదు కాపురస్తులు పెలి 11
ష్తీయులు సౌలుకు చేసినదాని వినినప్పుడు, । బలశాలు 12
లందరున్ను లేచి, రాత్రి అంతా నడిచివచ్చి, సౌలు
యొక్క మొండెమునున్ను అతని కుమారులయొక్క
కళేబరములనున్ను బేత్షెయాను పట్టణపు గోడ మీద
నుంచి తీసి, యాబేషుకు తిరిగి వచ్చి, వాటిని దహన
ముచేసి, । వారి శల్యములను తీసి, యాబేషులో వొక 13
చెట్టు కింద పాతిపెట్టి, యేడు దినములు వుపవాసము
చేసిరి.

# సమూయేలుయొక్క రెండో గ్రంథము.

## 1. అధ్యాయము.

1 అయితే సౌలు మరణమైన వెనుక దావీదు అమా
లేకీయులను హతము చేసి తిరిగీ వచ్చి, సిక్లగులో రెండు
2 దినములు వుండిన తరువాత, । మూడో దినమందు సంభ
వించినదేమంటే, యిదుగో వొకడు తన బట్టలను చించు
కొని, తలమీద బుగ్గి పోసుకొని, సైన్యములోనుండి
సౌలు యొద్దనుంచి వచ్చినాడు; అతడు దావీదు యొ
ద్దికి వచ్చినప్పుడు నేలమీద సాష్టాంగ పడినాడు. ।
3 అప్పుడు దావీదు వాని చూచి, యెక్కడనుంచి వస్తి
వని అడిగినప్పుడు, వాడు ఇశ్రాయేలు సైన్యములో
4 నుంచి నేను తప్పించుకొని వస్తినని చెప్పినందున, । దా
వీదు వానితో ఆ కార్యము యేలాగు జరిగెను? నాతో
చెప్పుమని అడిగినప్పుడు, వాడు ప్రత్యుత్తరముగా
చెప్పినదేమంటే, జనులు యుద్ధములోనుంచి పారిపో
యిరి; అనేకులు పడి మరణమైరి; సౌలున్ను అతని
కుమారుడైన యోనాతానున్ను మరణమైనారని చెప్పె
5 ను. । అప్పుడు దావీదు తనతో చెప్పిన పడుచువాని
చూచి, సౌలున్ను అతని కుమారుడైన యోనాతానున్ను
మరణమైనారని నీకు యేలాగు తెలిసినది? అని అడిగి
నందున, అతనితో చెప్పిన పడుచువాడు అనినదేమం
6 టే, । నేను గిల్బోవ పర్వతమునకు అకస్మాత్తుగా వచ్చి
నాను; వచ్చినప్పుడు యిదుగో సౌలు తన యీటెను
ఆనుకొని వుండెను; మరిన్ని రథములున్ను రౌతులున్ను
7 అతని వెనుక సమీపిస్తూ వుండెను. । అతడు వెనుక
తిరిగీ చూచినప్పుడు నన్ను కని పిలిచినందున యిదుగో
8 నేనని అంటిని. । అప్పుడు అతడు నీవు యెవ్వడవని
9 అడిగినందున నేను అమాలేకీయుడనని చెప్పితిని. । అప్పు
డు అతడు నీవు నా మీద నిలువబడి నన్ను చంప
వలెను; నా ప్రాణము యింకా నాలో వున్నందున
0 బహు బాధపడుతూ వున్నానని చెప్పెను. । కాబట్టి
నేను అతని మీద నిలిచి అతని చంపినాను, యేమంటే
పడిన తరువాత అతడు బ్రతకడని నిశ్చయించుకొం
టిని: అయితే అతని శిరస్సుమీద వున్న కిరీటమున్ను
హస్తకంకణములనున్ను తీసుకొని, నా యేలినవారైన
1 మీ యొద్దికి వస్తినని చెప్పినప్పుడు, । దావీదు తన వస్త్ర
ములను పట్టి చించుకొనెను; మరిన్ని అతని యొద్దనున్న
2 వారందరున్ను ఆలాగున చేసిరి. । మరిన్ని వీరు కత్తిచేత
కూలిరని సౌలు కొరకున్ను యోనాతాను కొరకున్ను
యెహోవాయొక్క జనుల కొరకున్ను ఇశ్రాయేలు
యింటి కాండ్ల కొరకున్ను వారు దుఃఖపడుతూ యే
డుస్తూ సాయంత్రము మట్టుకు వుపవాసముగా వుం
డిరి. । అయితే దావీదు తనతో చెప్పిన ఆ పడుచువాని 13
చూచి, నీవు యెక్కడనుంచి వస్తివని అడిగినందున,
వాడు నేను అమాలేకీయుడైన పరదేశి కుమారుడనని
చెప్పెను. । అప్పుడు దావీదు వానితో చెప్పినదేమంటే, 14
యెహోవా అభిషేకించినవాని నశింప చేసుటకై నీవు
చెయ్యి చాపుటకు భయపడక పోతివేమని చెప్పి, ।
తన పడుచువాండ్లలో వొకని పిలిచి నీవు వెళ్లి వీని మీద 15
పడుమని చెప్పెను; కాబట్టి వీడు వాని కొట్టి చంపెను. ।
అప్పుడు దావీదు అనిన మాట, నీ రక్తము నీ శిరస్సు 16
మీదనే వుండును గాక, యేమంటే యెహోవా అభి
షేకించినవాని నేను చంపితినని చెప్పినందున నీ నో
టిమాటే నీ మీద సాక్ష్యమాయెననెను. । అయితే దా 17
వీదు విల్లును యూదా పుత్రులకు అభ్యాసము చేయ
వలెనని చెప్పిన తరువాత, । సౌలు మీదనున్ను అతని 18
కుమారుడైన యోనాతాను మీదనున్ను కలిగిన దుఃఖ
ము యాషేరుయొక్క గ్రంథమందు వ్రాయబడినది
అది యేలాగునంటే, । వో ఇశ్రాయేలా, నీ సౌందర్య 19
ము నీ వున్నతమైన స్థలముల మీద హతమాయెను;
బలాఢ్యులు యేలాగు పడిపోయినారు! । ఫెలిష్తీయు 20
లయొక్క కుమార్తెలు సంతోషింపకుండానున్ను, సు
న్నతీ లేని వారి కుమార్తెలు జయానందమును పొం
దకుండానున్ను యిది గాతులో చెప్పకుడీ; అష్కె
లోను వీధులలో యిది ప్రకటన చేయకుడీ. । వో 21
గిల్బోవ పర్వతములారా, మీ మీద మంచైనా వర్ష
మైనా పైరుగల పొలములైనా లేక వుండును గాక,
యెందుకంటే అక్కడ బలాఢ్యునియొక్క డాలు అవ
మానముగా పారవేయబడెను; తైలముచేత అభిషే
కించబడనట్టు సౌలుయొక్క డాలు పారవేయబడెను. ।
హతులయొక్క రక్తము లేకుండా బలాఢ్యుల కొవ్వు 22
లేకుండా యోనాతానుయొక్క విల్లు తిరిగీ రాకనున్ను
సౌలుయొక్క కత్తి వట్టిదిగా రాకనున్ను వుండెను. ।
సౌలున్ను యోనాతానున్ను తమ బ్రతుకులో స్నేహ 23
ముగానున్ను మనోహరముగానున్ను వుండిరి; తమ
మరణములో సహా కేటించపడక వుండిరి: పక్షిరాజుల
కంటే వారు చురుకుగానున్ను సింహములకంటే బల

24 ముగానున్ను వుండిరి. । ఓ ఇశ్రాయేలుయొక్క కుమా
ర్తెలారా, రక్తవర్ణ వస్త్రములను యింపుగా మిమ్మును
ధరింప చేసి, మీ వస్త్రముల మీద బంగారపు నగలు
25 పెట్టిన సౌలు కొరకు యేడ్వండి. । యుద్ధరంగమందు
బలాఢ్యులు యేలాగు పడిరి! నీ వున్నతమైన స్థలముల
యందు ఓ యోనాతానా నీవు హతి నొందితివి. ।
26 నా సహోదరుడవైన ఓ యోనాతానా, నీ నిమిత్తము
నేను బహు దుఃఖపడుతూ వున్నాను; నీవు నాకు
బహుగా మనోహరుడవై యుంటివి, నా యందు నీకు
కలిగిన ప్రేమ బహు వింతగలదై, స్త్రీలయొక్క ప్రేమ
27 కంటే అధికముగా వుండెను. । బలాఢ్యులు యేలాగు
పడిపోయినారు! యుద్ధపు ఆయుధములు యేలాగున
నశించిపోయెనని దుఃఖపడెను.

## 2. అధ్యాయము.

1 ఇది జరిగిన తరువాత సంభవించినదేమంటే, యూ
దా పట్టణములలో యే వొక దానిలోకైనా వెళ్లుదునా
అని దావీదు యెహోవాను అడిగినప్పుడు, యెహో
వా వెళ్లుమని అతనికి సెలవు యిచ్చెను; అప్పుడు దా
వీదు యెక్కడికి వెళ్లనని అడిగినప్పుడు హెబ్రోనుకని
2 ఆయన సెలవు యిచ్చెను. । కాబట్టి దావీదు ఇజ్రెయే
లీయురాలయిన అహీనోయమున్ను కర్మెలీయుడైన
నాబాలుయొక్క భార్య అయిన అబీగయీలున్ను
అనే తన భార్యలు యిద్దరితోనున్ను అక్కడికి వెళ్లెను. ।
3 మరిన్ని దావీదు తన యొద్ద వున్నవాండ్లను ప్రతిమని
షినీ వాని వాని యింటివాళ్ల పొదితో కూడా తీసుక
వచ్చినాడు; వీరు హెబ్రోను వూళ్లలో కాపురము
4 చేసిరి. । అంతట యూదా జనులు అక్కడికి వచ్చి
యూదా యింటి కూటముల మీద దావీదును పట్టా
భిషిక్తుని చేసిరి. సౌలును పాతిపెట్టినవారు యాబేష్గి
లాదువారై వుండిరని వారు దావీదుకు తెలియ చేసిరి. ।
5 కాబట్టి దావీదు దూతలను యాబేష్గిలాదు వాండ్ల దగ్గి
రకు పంపి వారితో చెప్పుమనినదేమంటే, మీ అధి
కారి అయిన సౌలును మీరు పాతి పెట్టినందువల్లను
అతనికి వుపకారమును చేస్తిరి గనుక యెహోవావల్ల
6 మీరు ఆశీర్వచనమును పొందుదురు గాక. । కాబట్టి
యెహోవా మీకు కృపనున్ను సత్యమునున్ను అగు
పరచును గాక; మీరు యీ క్రియ చేస్తిరి గనుక నేను
న్ను మీకు యీ వుపకారమునకు ప్రతిగా చేతును. ।
7 కాబట్టి మీ చేతులను బలపర్చుకొని మీరు బలాఢ్యులై
వుండండి, యేమంటే మీ యజమానుడయిన సౌలు
మరణమైనాడు, మరిన్ని యూదా యింటికాండ్లు తమ
మీద నన్ను పట్టాభిషిక్తునిగా చేసినారని చెప్పుమనెను. ।
8 అయితే నేరుయొక్క కుమారుడైన అబ్నేరు అనే
సౌలుయొక్క సైన్యాధిపతి సౌలుయొక్క కుమారుడైన
ఇష్బోషెతును తీసుకొని, మహనయీముకు వచ్చి, ।
గిలాదు మీదనున్ను అషూరీయుల మీదనున్ను ఇజ్రె 9
యేలు మీదనున్ను ఎఫ్రయీము మీదనున్ను బెన్యా
మీను మీదనున్ను ఇశ్రాయేలీయులందరి మీదనున్ను
పట్టాభిషిక్తుని చేసినాడు. । సౌలు కుమారుడైన ఇష్బో 10
షెతు ఇశ్రాయేలు మీద యేలుటకు ఆరంభించినప్పు
డు నలుబై సంవత్సరముల వాడయి వుండి, రెండు సంవ
త్సరములు పాలించెను; అయితే యూదా యింటికాం
డ్లు దావీదును వెంబడించిరి. । దావీదు హెబ్రోనులో 11
యూదా యింటి కాండ్ల మీద యేలిన కాలమంతా
యేడు సంవత్సరములనర అయి వుండెను. । అంతలో 12
నేరుయొక్క కుమారుడయిన ఇష్బోషెతుయొక్క సేవ
కులున్ను మహనయీములోనుంచి బయిలువెళ్లి గిబో
నుకు వచ్చిరి. । కాబట్టి సెరూయా కుమారుడయిన యో 13
వాబున్ను దావీదుయొక్క సేవకులున్ను బయిలువెళ్లి,
గిబోను కొలనుకు వచ్చి, వారిని కలుసుకొని, వీరు
కొలనుకు యీ తట్టున్ను వారు కొలనుకు ఆ తట్టు
న్ను కూర్చుండిరి. । అప్పుడు అబ్నేరు యోవాబుతో 14
అనిన మాట, పడుచువాండ్లు లేచి మన ముందర పో
ట్లాడనిమ్మని చెప్పితే యోవాబు వారు లేవ వచ్చునని
చెప్పెను. । కాబట్టి వారు లేచి లెక్కకు సరిగా అవతలకు 15
వెళ్లిపోయి వచ్చిరి, యేమంటే సౌలుయొక్క కుమారుడైన
ఇష్బోషెతు సంబంధులయిన పన్నెండు మంది బెన్యా
మీనీయులున్ను దావీదుయొక్క సేవకులు పన్నెండు
మందిన్ని వుండిరి. । వీరు వచ్చి వొక్కొకడు తన తన 16
పొరుగువాని శిరస్సును చేత పట్టుకొని, తన పొరుగువాని
పక్కలో తన కత్తి గుచ్చినందున వారు కూడా పడిరి;
కాబట్టి ఆ స్థలము హెల్కథస్సూరీమని పిలువపడెను,
అది గిబోను దగ్గిర వున్నది. । తరువాత ఆ దినమందు 17
మహా ఘోర యుద్ధమాయెను, అయితే అబ్నేరున్ను
ఇశ్రాయేలీయులున్ను దావీదుయొక్క సేవకుల ముం
దర కొట్లపడిరి. । అయితే సెరూయాయొక్క ముగ్గురు 18
కుమారులైన యోవాబున్ను అబీషైయున్ను అశాహే
లున్ను అక్కడ వుండిరి: అశాహేలు అడవి లేడిలా
గున చులకనైన పాదములు గలవాడై వుండెను. । యీ 19
అశాహేలు అబ్నేరును తరిమెను; పరుగులో అబ్నేరు
వెంబడినుంచి అతడు కుడికైనా యెడమకైనా తిరగక
వుండెను. । అప్పుడు అబ్నేరు వెనుకకు తిరిగి అతని 20
చూచి, అశాహేలువు నీవేనా అని అడిగినందున,
అతడు నేనే అని చెప్పెను, । కాబట్టి అబ్నేరు అతని 21
తో నీవు కుడికైనా యెడమకైనా తిరిగి, పడుచువా
రిలో వొకని పట్టుకొని, వాని ఆయుధములను తీసుకొ
మ్మని చెప్పినప్పటికిన్ని అశాహేలు యీ తట్టయినా

ఆ తట్టయినా తిరుగక అతని తరుముతూనే వుండెను.।
2 కాబట్టి అబ్నేరు మరిన్ని అశాహేలుతో నన్ను తరు
ముట మాని అటుతిరుగు; నిన్ను నేను నేలకు నూటి
వేయనేల! నీ సహోదరుడైన యోవాబు ముందర
నా ముఖము యేలాగు యెత్తుదునని చెప్పినప్పటికిన్ని,।
3 అతడు అటు తిరగలేదు గనుక అబ్నేరు యీటె మడ
మతోటి అతని అయిదో పక్కటెముక కింద పొడి
చెను; యీటె అతని వెనుకకు దూసుకొని వచ్చినం
దున అతడు పడి ఆ స్థలమందే మరణమాయెను. అయితే
అశాహేలు పడి మరణమైన స్థలమునకు వచ్చిన వారం
4 దరున్ను నిలిచి వుండిరి. । అయితే యోవాబున్ను అబీ
షైయున్ను అబ్నేరును తరుముతూ వుండిరి; వారు
గిబోననే అరణ్య మార్గమందుండే గీయ యెదుట
అమ్మాఅనే కొండకు వచ్చినప్పుడు సూర్యుడు అస్తమిం
5 చెను. । అప్పుడు బెన్యామీను పుత్రులు అబ్నేరు వెం
బడి కూడుకొని వొక గుంపు అయి వొక కొండమీద
6 నిలిచి వుండిరి. । అప్పుడు అబ్నేరు యోవాబును పిలిచి
చెప్పినదేమంటే, కత్తి చిరకాలము మట్టుకు భక్షించు
నా! తుదకు అది చేదు అవునని నీకు తెలియదా!
యెంత పర్యంతము జనులు తమ సహోదరులను తరు
మ వద్దని నీవు చెప్పక వుందువని చెప్పినందున, । యో
వాబు అనిన మాట, దేవునియొక్క జీవముతోడు నీవు
చెప్పక వుంటే నిజముగా జనులలో ప్రతి మనిషీ తన
తన సహోదరులను వెంబడించక వుదయమందు తలిగి
పోయి వుండునని చెప్పెను. । అప్పుడు యోవాబు
బాకా వూదినందున జనులందరున్ను నిలిచి, ఇశ్రాయే
లీయులను తరమడమున్ను వారితో పోట్లాడడమున్ను
మానిరి. । అప్పుడు అబ్నేరున్ను అతని వారున్ను ఆ
రాత్రిదాకా మైదానపు భూమినుంచి నడచి, యర్దే
ను నది దాటి, బిత్రోను గడచి, మహనయీముకు
వచ్చినారు. । యోవాబు అబ్నేరును తరమడము మాని,
తిరిగీ వచ్చి జనులను కూడా రప్పించి లెక్క చూచిన
ప్పుడు, దావీదుయొక్క సేవకులలో అశాహేలు గాక
3 పందొమ్మిది మంది తక్కువై వుండిరి. । అయితే దావీదు
యొక్క సేవకులు బెన్యామీనీయులలోనున్న అబ్నే
రుయొక్క జనులలోనున్న మున్నూట అరువై మందిని
3 హతము చేసి వుండిరి. । అయితే వారు అశాహేలును
యెత్తుకపోయి బేత్లెహేములో అతని తండ్రియొక్క
సమాధిలో అతని పాతిపెట్టిరి. అయితే యోవాబున్ను
అతని జనులున్ను రాత్రిదాకా నడచి తెల్లవారేటప్ప
టికి హెబ్రోనుకు వచ్చిరి.

### 3. అధ్యాయము.

అయితే సౌలుయొక్క యింటికిన్ని దావీదుయొ
క్క యింటికిన్ని యుద్ధము బహు కాలము మట్టుకు
కలిగి వుండెను: అయితే దావీదు అంతకంతకు మరీ
బలముగానున్ను సౌలుయొక్క యిల్లు అంతకంతకు మరీ
నీరసగానున్ను అవుతూ వుండెను. । మరిన్ని హెబ్రో 2
నులో దావీదుకు కుమాళ్లు పుట్టిరి; అమ్నోను అనే
అతని ప్రథమ పుత్రుడు ఇజ్రెయేలీయురాలైన అహీ
నోయముకు పుట్టెను. । కిల్యాబు అనే రెండోవాడు 3
కర్మెలీయుడయిన నాబాలుయొక్క భార్య అయిన అబీ
గయీలుకు పుట్టెను; అబ్షాలోము అనే మూడోవా
డు గెషూరుకు రాజైన తల్మయియొక్క కుమార్తెయైన
మయఖాకు పుట్టెను. । అదోనియా అనే నాలుగో 4
వాడు హగ్గీతుకు పుట్టెను: షెఫటీయా అనే అయిదో
వాడు అబీథలుకు పుట్టెను. । ఇత్రెయాము అనే ఆరో 5
వాడు దావీదుయొక్క భార్య అయిన ఎగ్లాకు పుట్టె
ను. వీరు హెబ్రోనులో దావీదుకు పుట్టిరి. । సౌలు 6
యొక్క యింటికిన్ని దావీదుయొక్క యింటికిన్ని యు
ద్ధము జరుగుతూ వుండగా సంభవించినదేమంటే, అబ్నే
రు సౌలుయొక్క యింటి కొరకు తనను తాను బలప
రుచుకొనెను.।అయితే సౌలుయొక్క వుపపత్ని యొకతె 7
కలిగి వుండెను; అది అయ్యాయొక్క కుమార్తె అయి,
రిస్పా అనే పేరు కలిగినదై వుండెను. ఇష్బోషెతు
అబ్నేరును చూచి, నా తండ్రియొక్క వుపపత్నియొ
ద్దికి నీవు యెందుకు వెళ్లితివని అడిగినప్పుడు; । అబ్నేరు 8
ఇష్బోషెతు మాటకు బహు కోపము తెచ్చుకొని,
అతని చూచి, యూదాకు విరోధముగా వుండి, నీ
తండ్రియైన సౌలుయొక్క యింటికిన్ని అతని సహో
దరులకున్ను అతని స్నేహితులకున్ను యీ వేళయందు
వుపకారము చేసి, నిన్ను దావీదుయొక్క చేతిలోకి
అప్పగించక వుండిన నేను కుక్కతలను గనుక నా యీ
దినమున ఆ స్త్రీ నిమిత్తము నీవు నా మీద తప్పు మో
పడానకు? । నిజముగా యెహోవా దావీదుకు చేసిన 9
సత్యము చొప్పున నేను అతని కొరకు చేయక పోతే
దేవుడు ఆలాగుననున్ను మరిన్ని అధికముగానున్ను
నాకు చేయునుగాక. । అది యేమంటే రాజ్యము సౌలు 10
యొక్క యింటి యొద్దనుంచి పోయేటట్టు చేసి, దావీ
దుయొక్క గద్దె దాను మొదలుకొని బెయేర్షెబ
మట్టుకు ఇశ్రాయేలు మీదనున్ను యూదా మీదను
న్ను స్థిరపరచేవాడను అవుదునని చెప్పెను. । అయితే 11
అతడు అబ్నేరుకు భయపడినందున ప్రత్యుత్తరము
యెంత మాత్రము యివ్వక వుండెను. । అయినందున 12
అబ్నేరు తన నిమిత్తము చేత దావీదు యొద్దికి దూతను
పంపి చెప్పుమనినదేమంటే, యీ దేశము యెవరిది
అనిన్ని, యిదుగో ఇశ్రాయేలీయులందరినీ నీ తట్టు
తిప్పడానకు నా చెయ్యి నీకు తోడుగా వుండును
నాతోటి ప్రమాణము చేసుకొమ్మనిన్ని చెప్పుమనెను.।

13 అందుకు అతడు చెప్పినదేమంటే, మంచిది, నీతోటి
నేను ప్రమాణము చేసుకొందును, అయితే నీవు వొకటి
చేయ వలసినది, అది యేదంటే, నీవు నా దర్శనము
చేయడానకు వచ్చేటప్పుడు సౌలుయొక్క కుమార్తె
అయిన మీఖాలును ముందుగా నీవు నా యొద్దికి తీసు
కొని వస్తేనే గాని నీవు నా దర్శనము చేయ కూడ
14 దని చెప్పెను. । మరిన్ని దావీదు సౌలుయొక్క కుమారు
డైన ఇష్బోషెతు యొద్దికి దూతను పంపి చెప్పమనిన
దేమంటే, నేను పెలిష్తీయులయొక్క నూరు మంది ముం
దోలుల వల్ల నాకు నియమించుకొనిన నా భార్యయైన
15 మీఖాలును నాకు యిమ్మని చెప్పుమనెను. । కాబట్టి
ఇష్బోషెతు పంపి, లాయీషుయొక్క కుమారుడైన
పల్తీయేలు అనే దాని పెనిమిటి యొద్దనుంచి దాన్ని
16 తీసుక వచ్చెను. । దాని పెనిమిటి బాహూరీము మట్టుకు
దాని వెనుక యేడ్చుచూ వచ్చెను; అప్పుడు అబ్నేరు
అతని చూచి నీవు తిరిగి వెళ్లుమని చెప్పినందున అత
17 డు తిరిగి పోయినాడు. । అంతలో అబ్నేరు ఇశ్రా
యేలు పెద్దలతో మాట్లాడుకొనినదేమంటే, దావీదు
మమ్మును యేలవలెనని మీరు యింతకు మునుపు కోరి
18 వుంటిరి. । కాబట్టి యిప్పుడు అది చేయండి, యెందు
కంటే, నా సేవకుడైన దావీదు చేత నా జనులైన ఇశ్రా
యేలును పెలిష్తీయులయొక్క చేతులలోనుంచిన్ని వారి
శత్రువులందరియొక్క చేతులలోనుంచిన్ని విడిపింప
చేతునని దావీదును గురించి యెహోవా ఆనతిచ్చెనని
19 చెప్పెను. । మరిన్ని అబ్నేరు బెన్యామీనీయులయొక్క
చెవులలో చెప్పెను; మరిన్ని అబ్నేరు ఇశ్రాయేలీయుల
దృష్టికిన్ని బెన్యామీనీయుల దృష్టికిన్ని ప్రయోజన
మని అనుకొనినదంతాను దావీదు చెవులలో చెప్పడా
20 నకు హెబ్రోనుకు వచ్చెను. । యీలాగున అబ్నేరు
హెబ్రోనులో వున్న దావీదు యొద్దికి యిరువై మం
దితో కూడా వచ్చినాడు; అప్పుడు దావీదు అబ్నేరు
కున్ను అతని యొద్ద వున్నవారికిన్ని విందు చేయించె
21 ను. । అంతట అబ్నేరు దావీదుతో అనిన మాట, నేను
లేచి వెళ్లి, ఇశ్రాయేలీయులందరినీ నా యేలినవారైన
మీ దగ్గిరకు సమకూర్చి, మీతోను వారు వొడంబడి
కెను చేసుకొనేటట్టుగానున్ను మీరు కోరినంతటినీ మీ
రు యేలేటట్టుగానున్ను చేతునని చెప్పి, దావీదు యొద్ద
22 సెలవు పుచ్చుకొని సుఖముగా వెళ్లిపోయెను. । వెంబ
డినే యిదుగో దావీదుయొక్క సేవకులున్ను యోవా
బున్ను వొక గుంపు యొద్దనుంచి దోపుడు సొమ్ము
బహు విస్తారముగా తీసుకవచ్చినారు; అయితే అబ్నేరు
హెబ్రోనులో దావీదు యొద్ద లేక వుండెను, యేమం
టే దావీదు అతనికి సెలవు యిచ్చినందున అతడు సుఖ
23 ముగా వెళ్లి వుండెను. । అయితే యోవాబున్ను అతని
యొద్ద వున్న సమూహమున్ను వచ్చినప్పుడు యోవా
బుకు వినపడినదేమంటే, నేరుయొక్క కుమారుడైన
అబ్నేరు రాజుగారి యొద్దికి వచ్చినాడనిన్ని, వారు
అతనికి సెలవు యిచ్చినందున అతడు సుఖముగా వెళ్లి
పోయినాడనిన్ని చెప్పపడెను. । కాబట్టి యోవాబు 24
రాజు యొద్దికి వచ్చి చెప్పినదేమంటే, నీవు యేమి
చేస్తివి? యిదుగో అబ్నేరు నీ యొద్దికి వచ్చెను, అతడు
నిరాతంకముగా వెళ్లుటకు అతనికి యెందుకు సెలవు
యిస్తివి! । నేరుయొక్క కుమారుడైన అబ్నేరును నీవు 25
యెరగవా? నిన్ను మోసపుచ్చి, నీ రాకట పోకటల
నున్ను నీవు చేసే అంతటినిన్ని తెలుసుకొనుటకు వచ్చె
నని చెప్పెను. । అయితే యోవాబు దావీదు యొద్ద 26
నుంచి బైటికి వచ్చి, అబ్నేరు వెంటనే దూతలను పం
పెను; వారు వెళ్లి సిరా అనే నూతి దగ్గిరనుంచి అతని
తిరిగీ తీసుక వచ్చిరి; యిది దావీదుకు తెలిసినది కాదు. ।
అబ్నేరు తిరిగీ హెబ్రోనుకు వచ్చినప్పుడు యోవాబు 27
అతనితో సమాధానమైనట్టు మాట్లాడడానకు ద్వారము
లోకి ఏకాంతముగా పిలిచి, తన సహోదరుడైన అశా
హేలుయొక్క రక్తము నిమిత్తము అయిదో పక్కటెముక
కింద అతని పొడిచినందున అతడు మరణమాయెను. ।
యిది దావీదుకు వినపడిన తరువాత అతడు అనుకొని 28
నదేమంటే, నేనున్ను నా రాజ్యమున్ను సదా కాలము
యెహోవా సముఖమందు నేరుయొక్క కుమారుడైన
అబ్నేరు రక్తము విషయమై నిరపరాధులమై వున్నా
ము. । అది యోవాబుయొక్క శిరస్సు మీదనున్ను అతని 29
తండ్రియొక్క యింటి వారందరి మీదనున్ను నిలిచి
వుండును గాక; మరిన్ని యోవాబు యింటను స్రావ
ము గలవాడైనా కుష్ఠరోగి అయినా కర్ర వూత పట్టు
కొనేవాడైనా కత్తి మీద పడేవాడైనా ఆహారము
లేనివాడైనా వుండుట తప్పకపోవును గాకని పలికె
ను. । ఆలాగున యోవాబున్ను అతని సహోదరుడైన 30
అబీషైయున్ను అబ్నేరు గిబోను యుద్ధమందు తమ
సహోదరుడైన అశాహేలును చంపినాడు గనుక
అతని చంపిరి. । అప్పుడు దావీదు యోవాబుతోటిన్ని 31
అతని యొద్ద వున్నవారందరితోటిన్ని చెప్పినదేమంటే,
మీ బట్టలను చించుకొని గోనె కట్టుకొని, అబ్నేరు
ముందర వెళ్లి దుఃఖపడండని చెప్పెను. మరిన్ని రాజైన
దావీదు పాడె వెనుక నడిచెను. । అయితే వారు అబ్నే 32
రును హెబ్రోనులో పాతిపెట్టినప్పుడు, రాజున్ను
తన కంఠము యెత్తి అబ్నేరు సమాధి దగ్గిర యేడ్చెను,
జనులందరున్ను యేడ్చిరి. । అప్పుడు రాజు అబ్నేరు 33
మీద దుఃఖపడి పలికినదేమంటే, వొూ అబ్నేరా, బుద్ధి
లేనివాడు మరణమైనటు మరణమైతివా! । నీ చేతు 34
లకు కట్లు లేవు, నీ కాళ్లున్ను సంకెళ్లలో వేయపడి

నవి కావు; దుర్జనుల ముందర ఒకడు పడినట్టు
నీవు పడితివా? అని పలికినప్పుడు జనులందరున్ను
35 యింకా యేడ్చిరి. । మరిన్ని జనులందరున్ను వెలుగు
వుండగా దావీదును భోజనము చేయించుటకు వచ్చిన
ప్పుడు దావీదు అనిన మాట, నేను సూర్యాస్తమానము
కాక మునుపు భోజనమైనా మరి యేదైనా రుచి చూ
చినట్టయితే దేవుడు అదిన్ని యింకా అధికమునున్ను
36 నాకు చేసును గాకని సత్యముగా పలికెను. । అయితే
జనులందరున్ను అది తెలుసుకొన్నప్పుడు అది వారి
దృష్టికి మంచిదిగా అగుపడెను; రాజు చేసినదంతా
37 జనులందరికిన్ని బాగా అగుపడెను. । యేమంటే నేరు
యొక్క కుమారుడైన అబ్నేరును చంపడము రాజువల్ల
నైనది కాదని ఆ దినమున ఇశ్రాయేలు జనులందరికీ
38 తెలిసి వుండెను. । మరిన్ని రాజు తన సేవకులను చూచి,
యీ దినమున ఇశ్రాయేలులో శ్రేష్ఠుడయిన పెద్దవా
39 డు పడిపోయినాడని మీకు తెలిసినదే. । నేను పట్టా
భిషిక్తుడను అయినప్పటికిన్ని నేడు బలహీనుడనై యు
న్నాను; సెరూయాయొక్క కుమారులైన యీ మను
ష్యులు నాకు బహు కఠినముగా వున్నారు; కీడు చేసి
నవానికి వాని దుర్మార్గతకు తగినట్టు యెహోవా ప్రతి
ఫలము కలుగ చేసును అని చెప్పెను.

## 4. అధ్యాయము.

1 హెబ్రోనులో అబ్నేరు మరణమైనాడన్న సంగతి
సౌలుయొక్క కుమారునికి వినపడినప్పుడు, అతని చేతు
లు నిబ్బలములైనవాయెను; ఇశ్రాయేలీయులందరున్ను
2 కలవిలపడిరి. । అయితే సౌలుయొక్క కుమారునికి సై
న్యాధిపతులైన వారు యిద్దరు గలరు; వారిలో ఒకని
పేరు బయనా అనిన్ని, రెండవ వాని పేరు రేఖాబు
అనిన్ని వుండెను; వీరు బెన్యామీను పుత్రుల సంబం
ధపు బెయేరోతీయుడయిన రిమ్మోనుయొక్క కుమా
రులై వుండిరి, యేమంటే బెయేరోతున్ను బెన్యామీ
3 ను సంబంధమని యెంచపడెను. । అయితే బెయేరోతీ
యులు గిత్తయీముకు పారిపోయి అక్కడ నేటి వరకు
4 నివాసులై వుండిరి. । మరిన్ని సౌలుయొక్క కుమారుడ
యిన యోనాతానుకు కుంటి కాళ్లు గల కుమారుడు
గలడు; వాడు ఇజ్రెయేలులోనుంచి సౌలును గురించిన్ని
యోనాతానును గురించిన్ని వర్తమానములు వచ్చిన
ప్పుడు అయిదు సంవత్సరములు గలవాడై వుండెను;
అప్పుడు వాని దాది వాని యెత్తుకొని పారిపోయెను;
అది వేగిరముగా పారిపోయినందున వాడు పడి కుంటి
వాడాయెను; వాని పేరు మెఫీబోషెతని వుండెను. ।
5 అయితే రేఖాబున్ను బయనాయున్ను అనే బెయేరో
తీయుడైన రిమ్మోనుయొక్క కుమారులు సూర్యకాంతి
తీక్ష్ణముగా వున్నప్పుడు బైలుదేరి ఇష్బోషెతుయొక్క
యింటికి వచ్చిరి; అతడు మధ్యాహ్న కాలము గనుక
మంచము మీద పడుకొని వుండెను. । వారు గోధుమ 6
గింజలు తెచ్చినవారైనట్టు యింట్లోకి వచ్చి, అయిదో
పక్కటెముక కింద అతని పొడిచిరి; అయితే రేఖాబు
న్ను అతని సహోదరుడైన బయనాయున్ను తప్పించు
కొని పోయిరి. । యేమంటే వారు యింట్లోకి వచ్చిన 7
ప్పుడు అతడు శయన గృహములో తన మంచము
మీద పడుకొని వుండెను; అప్పుడు వారు అతని పొ
డిచి చంపి, అతని శిరస్సును ఖండించి, దాని పట్టు
కొని రాత్రి అంతా మైదానపు భూమిలోబడి హె
బ్రోనులో దావీదు యొద్దికి ఇష్బోషెతుయొక్క శిర
స్సును తీసుక వచ్చి, । రాజును చూచి, యిదుగో మీ 8
ప్రాణమును వెతికిన మీ శత్రువుడైన సౌలు కుమారు
డనే ఇష్బోషెతుయొక్క శిరస్సు: యెహోవా యీ
దినమున సౌలుకున్ను అతని సంతతికిన్ని మా యేలిన
వారున్ను రాజున్ను అయిన మీ నిమిత్తము ప్రతి క్రి
యను చేసెనని చెప్పిరి. । అయితే దావీదు బెయేరోతీ 9
యుడైన రిమ్మోనుయొక్క కుమారులైన రేఖాబునున్ను
బయనానున్ను చూచి చెప్పినదేమంటే, సకలోపద్రవ
ములోనుంచి నన్ను విడిపించిన యెహోవాయొక్క
జీవముతోడు, । ఒకడు మంచి వర్తమానములను తెస్తు 10
న్నానని తలంచుకొని, యిదుగో సౌలు చచ్చెనని నాతో
చెప్పినప్పుడు నేను వాని పట్టి సిక్లగులో చంపించితిని;
వాడు తన వర్తమానములకు నేను తనకు బహుమాన
ము యిస్తానని అనుకొనెను. । అది గనుక దుర్మార్గు 11
లైన మీరు అతని యింట్లో అతని మంచము మీదనే
నీతిపరుని చంపినప్పుడు మీ చేతి యొద్ద అతనియొక్క
రక్త విచారణ చేయక, మిమ్మును భూమి మీదనుంచి
తీసి వేయక వుందునా? అని చెప్పి, । దావీదు తన పడు 12
చువాండ్లకు ఆజ్ఞ యిచ్చినందున వారు వారిని చంపి,
వారి చేతులనున్ను కాళ్లనున్ను కోసి, వారిని హెబ్రో
ను కొలను దగ్గిర వ్రేలాడ కట్టిరి; అయితే వారు ఇష్బో
షెతుయొక్క శిరస్సును తీసుక వెళ్లి, హెబ్రోనులో
అబ్నేరుయొక్క సమాధిలో పెట్టినారు.

## 5. అధ్యాయము.

అప్పుడు ఇశ్రాయేలుయొక్క సకల గోత్రములు 1
హెబ్రోనులో దావీదు యొద్దికి వచ్చి అతనితో చెప్పి
నదేమంటే, యిదుగో మేము నీ రక్త మాంసపు సంబం
ధులమై వున్నాము. । మరిన్ని పూర్వ కాలమందు సౌలు 2
మా మీద రాజుగా వున్నప్పుడు నీవు ఇశ్రాయేలీయు
లను వచ్చేటట్టున్ను వెళ్లేటట్టున్ను చేస్తూ వుంటివి;
యింకా యెహోవా నీకు యిచ్చిన సెలవు యేమంటే,

ఇశ్రాయేలనే నా జనులకు నీవు మేపి, ఇశ్రాయేలు
మీద నీవు అధిపతిగా వుందువని సెలవు యిచ్చెనని
3 చెప్పిరి. । యీలాగున ఇశ్రాయేలుయొక్క పెద్దలు
హెబ్రోనులో రాజు యొద్దికి వచ్చినందున రాజైన
దావీదు హెబ్రోనులో యెహోవా సముఖమందు
వారితో వొడంబడికెను చేసెను; కాబట్టి వారు దా
4 వీదును ఇశ్రాయేలు మీద పట్టాభిషిక్తుని చేసిరి. । దావీ
దు యేల నారంభించినప్పుడు ముప్పయి సంవత్సరముల
యీడు గలవాడై, నలుబై సంవత్సరములు యేలుతూ
5 వుండెను. । హెబ్రోనులో అతడు యూదా అంతటి
మీద యేడు సంవత్సరములనరయున్ను, యెరూశలే
ములో ఇశ్రాయేలు యూదా అంతటి మీద ముప్ప
6 యి మూడు సంవత్సరములున్ను యేలెను. । అంతట రా
జున్ను అతనివారున్ను దేశపు కాపురస్తులైన యెబూ
సీయులదైన యెరూశలేముకు వచ్చినారు; వీరు యీ
లోపటికి దావీదు చొరబడుటకు శక్తిమంతుడుకాడని
తలంచుకొని దావీదుతో చెప్పినదేమంటే, యీ గుడ్డి
వాండ్లనున్ను కుంటివాండ్లనున్ను నీవు తీసివేస్తేనే గాని
యీ లోపలికి చొరబడుటకు శక్తుడవు కాకపోదువని
7 చెప్పినప్పటికిన్ని, । దావీదు సియోననే కోటను స్వా
ధీనపర్చుకొనెను, అది దావీదుయొక్క పురమై వున్నది. ।
8 దావీదు ఆ దినమందు అనినదేమంటే, యెవడు కాలువ
దగ్గిరకు యెక్కి, యెబూసీయులనున్ను దావీదుకు యే
హ్యమైన గుడ్డివాండ్లనున్ను కుంటివాండ్లనున్ను చంపు
తాడో అతడు ముఖ్యుడున్ను అధిపతిన్ని అవునెను;
యెందుకంటే గుడ్డివాండ్లున్ను కుంటివాండ్లున్ను యిం
9 ట్లోకి రాకూడదని వారు చెప్పి వుండిరి. । ఆలాగున
దావీదు ఆ కోటలో కాపురము చేసి, దానికి దావీదు
పురమనే పేరు పెట్టెను. మరిన్ని దావీదు మిల్లో మొ
10 దలుకొని లోపల పర్యంతమూ కట్టించెను. । యీలా
గున దావీదు క్రమముగా వృద్ధిపొంది బహు ఘను
డాయెను; సైన్యములయొక్క దేవుడైన యెహోవా
11 అతనికి తోడుగా వుండెను. । అంతట తూరుకు రాజైన
హీరాము దూతలనున్ను ఆరాన మానులనున్ను వడ్ల
వాండ్లనున్ను కాసెవాండ్లనున్ను పంపినందున వారు
12 దావీదు కొరకు వొక మందిరము కట్టిరి. । అప్పుడు
దావీదు ఇశ్రాయేలు మీద యెహోవా తనను రాజు
గా స్థిరపచేశాననిన్ని, ఇశ్రాయేలనే ఆయన జనుల
నిమిత్తము తన రాజ్యము హెచ్చింప చేసెననిన్ని
13 గ్రహించెను. । అయితే దావీదు హెబ్రోనులోనుంచి
వచ్చిన తరువాత యెరూశలేములోనుంచి యింకా అనే
కమైన వుపపత్నులనున్ను భార్యలనున్ను తీసుకొనెను;
అయినందున దావీదుకు యింకా కుమారులున్ను కుమా
14 ర్తెలున్ను పుట్టిరి. । యెరూశలేములో అతనికి పుట్టిన
వారి పేరులు యేమంటే, షమ్మూయయున్ను, షోబా
బున్ను, నాతానున్ను, సోలొమోనున్ను, । ఇభారున్ను, 15
ఎలీషూవయున్ను, నెఫెగున్ను, యాఫీయయున్ను, ।
ఎలీషామాయున్ను, ఎల్యాదాయున్ను, ఏలీఫాలెథున్ను 16
అని వుండెను. । అయితే ఇశ్రాయేలు మీద వారు దా 17
వీదును పట్టాభిషిక్తునిగా చేసినారన్న సంగతి ఫిలిష్తీ
యులకు వినపడినప్పుడు దావీదును వెతుకుటకు ఫిలి
ష్తీయులందరున్ను వచ్చిరి; అది దావీదు విని కోటలోకి
వెళ్లిపోయెను. । ఫిలిష్తీయులు వచ్చి రేఫాయీము లో 18
వలో వ్యాపించి వుండిరి. । అప్పుడు దావీదు యెహో 19
వాను ఆలోచన అడిగినదేమంటే, నేను ఫిలిష్తీయులకు
యెదురుగా వెళ్లుదునా? నా చేతిలోకి వారిని అప్ప
గింతువా అని అడిగినప్పుడు, యెహోవా దావీదుకు
సెలవు యిచ్చినదేమంటే, వెళ్లు, నిస్సందేహముగా వా
రిని నీ చేతిలోకి అప్పగింతునని సెలవు యిచ్చెను. ।
కాబట్టి దావీదు బయల్పెరాసీముకు వచ్చి, అక్కడ 20
వారిని కొట్టి, యెహోవా వుదక ప్రవాహములైనట్టు
నా ముందర వున్న నా శత్రువుల మీద ప్రవహించె
నని అనుకొని, ఆ స్థలమునకు బయల్పెరాసీమనే పేరు
పెట్టెను. । అక్కడ వారు తమ ప్రతిమలను విడచి పె 21
ట్టిరి; దావీదున్ను అతని వారున్ను వాటిని కాల్చి
వేసిరి. । మరిన్ని ఫిలిష్తీయులు తిరిగీ వచ్చి, రేఫాయీ 22
ము లోవలో వ్యాపించి వుండిరి. । అంతట దావీదు 23
యెహోవా యొద్ద ఆలోచన అడిగినప్పుడు ఆయన
అతనికి సెలవు యిచ్చినదేమంటే, నీవు వారికి యెదు
రుగా వెళ్లక, చుట్టు తిరిగిపోయి, తోపులోనుంచి వారి
మీద పడ వలసినది. । అది యేలాగంటే, తోపు మీద 24
నడక వంటిది వొక చప్పుడు నీవు వినినప్పుడే వేగిర
ముగా వెళ్ల వలసినది, యేమంటే అప్పుడు యెహో
వా ఫిలిష్తీయులయొక్క సమూహమును కొట్టుటకు
నీకంటే ముందుగా బైలు వెళ్లునని సెలవు యిచ్చెను. ।
అయితే దావీదు తనకు యెహోవా ఆజ్ఞాపించిన 25
ప్రకారము చేసి ఫిలిష్తీయులను గిబా మొదలుకొని
గాజేరు మట్టుకు కొట్టెను.

## 6. అధ్యాయము.

మరిన్ని దావీదు ముప్పయివేల మందిని, అనగా, 1
ఇశ్రాయేలులో యెంచబడిన వారందరిని సమకూ
ర్చెను. । అప్పుడు దావీదు లేచి కెరూబుల మధ్యమం 2
దు నివసించే సైన్యములయొక్క యెహోవా నామ
ముచేత పిలువబడిన దేవునియొక్క పెట్టెను అక్కడ
నుంచి తీసుకొని రావడానకు తన యొద్ద వున్నవారం
దరితోటి బయులీ యూదాలోనుంచి వెళ్లెను. । అప్పు 3
డు వారు దేవునియొక్క పెట్టెను కొత్త బండి మీదను

యెక్కించి, గిబాలో అబీనాదాబుయొక్క యింట్లో
నుంచి తీసుక వచ్చిరి; మరిన్ని ఉజ్జాయున్ను అహ్యో
యున్ను అనే అబీనాదాబుయొక్క కుమారులు ఆ
4 క్రొత్త బండిని నడిపించిరి. । మరిన్ని దేవునియొక్క పెట్టె
గల బండిని గిబాలో అబీనాదాబుయొక్క యింట్లో
నుంచి తీసుక వచ్చిన తరువాత అహ్యో ఆ పెట్టె ముం
5 దర నడిచెను. । మరిన్ని దావీదున్ను ఇశ్రాయేలు యింటి
వారందరున్ను యెహోవా యెదుట దారుమయము
యిన నానా విధ వాద్యములను, అనగా, కిన్నెరలనున్ను
వీణెలనున్ను తంబురలనున్ను కొమ్ములనున్ను తాళములను
6 న్నువాయిస్తూ వుండిరి.। అయితే వారు నాఖోనుయొక్క
కళ్లము దగ్గిరకు వచ్చినప్పుడు యెద్దులు బండిని కుదిపెను
గనుక ఉజ్జా తన చెయ్యి చాపి దేవునియొక్క పెట్టెను
7 పట్టుకొనెను. । అప్పుడు యెహోవాయొక్క కోపము
ఉజ్జామీద రగులుకొనెను; అతని తప్పు నిమిత్తము
దేవుడు అతని అక్కడ కొట్టినందున అతడు అక్కడనే
8 దేవునియొక్క పెట్టె యొద్ద మరణమాయెను. । అయితే
యెహోవా ఉజ్జాకు ఘాత చేసినందున దావీదు చిం
తపడి, ఆ స్థలమునకు పెరెస్సుజ్జా అనే పేరు బెట్టెను;
9 అది నేటివరకూ కలిగి వుండెను. । కాబట్టి ఆ దినమందు
దావీదు యెహోవాకు భయపడి యెహోవాయొ
క్క పెట్టె నా యొద్ద వుండకూడదని అనుకొనెను. ।
10 యీలాగున దావీదు యెహోవాయొక్క పెట్టెను
దావీదు పురములో తన యొద్దికి తెప్పించక, తిరిగీ
పోయి గిత్తీయుడైన ఓబేదెదోము యింటికి తీసుక
11 వచ్చి వుంచినాడు. । కాబట్టి యెహోవాయొక్క
పెట్టె మూడు నెలలు గిత్తీయుడయిన ఓబేదెదోము
యొక్క యింట్లో వుండెను; అంతలో యెహోవా
ఓబేదెదోమునున్ను అతని యింటెల్లిపాదినిన్ని ఆశీర్వ
12 దించెను. । అయితే దేవునియొక్క పెట్టె నిమిత్తము
యెహోవా ఓబేదెదోము యింటెల్లిపాదినిన్ని అతనికి
కలిగినదంతటినిన్ని ఆశీర్వదిస్తూ వున్నాడని దావీదుకు
వినబడినప్పుడు, దావీదు వెళ్లి దేవునియొక్క పెట్టెను
ఓబేదెదోముయొక్క యింట్లోనుంచి దావీదు పురము
13 లోకి సంభ్రమముతో తీసుక వచ్చినాడు. । యేలాగం
టే యెహోవాయొక్క పెట్టెను మోసేవాండ్లు ఆరు
అడుగులు నడచినప్పుడు అతడు యెద్దులు మొదలయిన
14 టువంటి కొవ్విన వాటిని బలిగా అర్పించెను. । మరి
న్ని దావీదు నారబట్ట ఏఫోదు కట్టుకొని, తన శక్తి
15 కొద్దీ యెహోవా ముందర నాట్యము చేసెను. । యీ
లాగున దావీదున్ను ఇశ్రాయేలు యింటివారందరున్ను
ఆర్పులతోనున్ను బాకా నాదముతోనున్ను యెహో
16 వాయొక్క పెట్టెను తీసుక వచ్చిరి. । అయితే యెహో
వాయొక్క పెట్టె దావీదు పురములోకి రాగానే సౌలు
యొక్క కుమార్తెయైన మీఖాలు కిటికీలోనుంచి
చూచి, యెహోవా ముందర దాటుతూ నాట్యమా
డుతూ వున్న దావీదును కని తన హృదయమందు
అతని హీనపర్చెను. । అయితే వారు యెహోవాయొ 17
క్క పెట్టెను తీసుక వచ్చి దాని స్థలమందు, అనగా,
దావీదు దాని కొరకు యెత్తిన డేరా మధ్యమందు దాని
పెట్టిరి: అప్పుడు దావీదు హోమార్పణలనున్ను
సమాధానార్పణలనున్ను యెహోవా సముఖమందు
చెల్లించెను. । దావీదు హోమార్పణలనున్ను సమా 18
ధానార్పణలనున్ను చెల్లించడము చాలించిన తరు
వాత సైన్యములయొక్క యెహోవా నామముచేత
జనులను ఆశీర్వదించి, । జనులందరికిన్ని అనగా ఇశ్రా 19
యేలు సమూహమంతటిలో ప్రతి పురుషునికిన్ని ప్రతి
స్త్రీకిన్ని వొక రొట్టెనున్ను వొక మంచి మాంసపు
తునకనున్ను వొక ద్రాక్షారసపు బుడ్డినిన్ని పంచి పె
ట్టెను, అప్పుడు జనులందరున్ను తమ తమ యిండ్లకు
వెళ్లిపోయిరి. । దావీదున్ను తన యింటిల్లిపాదిని ఆశీర్వ 20
దించడానకు తిరిగీ వచ్చినాడు. అయితే సౌలుయొ
క్క కుమార్తెయైన మీఖాలు దావీదును యెదుర్కొనను
టకు బైలుదేరి వచ్చి చెప్పినదేమంటే, వ్యర్థులలో
వొకడు తాను కప్పుకొనిన బట్టలను తీసి వేసినట్టు మీ
సేవకులయొక్క పనికత్తెల కన్నుల ముందర మీరు కప్పు
కొనిన బట్టలను నేటి దినమున తీసివేసి, ఇశ్రాయేలుకు
రాజయిన మీరు యెంత ఘనముగా యీ దినమున
అగుపడితిరని అపహాస్యము చేసినప్పుడు; । దావీదు 21
మీఖాలుతో అనినదేమంటే, ఇశ్రాయేలనే యెహో
వాయొక్క జనులమీద నన్ను అధిపతిగా నిర్ణయిం
చడానకు నీ తండ్రికంటేనున్ను అతని యింటివారంద
రికంటేనున్ను నన్ను యెంచిన యెహోవా సముఖమం
దు యిది చేస్తిని; మరిన్ని యెహోవా సముఖమందు
నేను ఆట ఆడుదును. । ఇదిగాక దీనికంటే నేను మరీ 22
అల్పుడనవుదును, నిజముగా నా దృష్టికిన్ని నీవు
చెప్పిన పనికత్తెల దృష్టికిన్ని నేను నీచుడనౌదును;
కాబట్టి వారివల్ల నేను ఘనమును పొందుదునని చెప్పె
ను. । అయితే సౌలు కుమార్తె అయిన మీఖాలుకు 23
దాని మరణ పర్యంతమూ వొక పిల్ల అయినా లేక
పోయెను.

## 7. అధ్యాయము.

అటుతరువాత యెహోవా నఖముఖాలా అతని 1
శత్రువుల వల్లనుంచి అతనికి నెమ్మది కలుగ చేసినందున
రాజు తన యింట్లో కూర్చుండి వున్నప్పుడు సంభవిం
చినదేమంటే, । రాజు నాతాను అనే దీర్ఘదర్శితో 2
అనినమాట, యిదుగో నేను ఆరాన కర్రతో చేయ

బడ్డ యింట్లో నివాసము చేస్తూ వుండగా, దేవునియొ
క్క పెట్టె పరదాల లోపల నివసించి వున్నది అని
3 చెప్పినప్పుడు; । నాతాను రాజుతో చెప్పినదేమంటే,
నీవు వెళ్లి నీ మనస్సంతటి ప్రకారముగా చేయుము,
యేమంటే యెహోవా నీకు తోడుగా వున్నాడని
4 చెప్పెను. । అయితే ఆ రాత్రిలోనే యెహోవాయొ
క్క వాక్యము నాతాను యొద్దకు వచ్చి చెప్పినదేలా
5 గంటే, । నీవు వెళ్లి నా సేవకుడైన దావీదుతో చెప్ప
వలసినదేమంటే, యెహోవా యీ ప్రకారముగా
నీకు సెలవు యిస్తున్నాడు, నేను నివసించుటకు నీవు
6 నా కొరకు మందిరమును కట్టింతువా? । మిస్రయీము
లోనుంచి నేను ఇశ్రాయేలు పుత్రులను యివతలకు
కొంచవచ్చిన వాటినుంచీ నేటివరకు యే మందిరమం
దయినా నివసించక పరదాలలోనున్న డేరాలలోను
7 న్ను సంచరిస్తూ వుంటిని. । ఇశ్రాయేలు పుత్రులతో
నేను యే స్థలమందు సంచరించినా ఇశ్రాయేలనే నా
జనులకు మేపుటకు నేను ఆజ్ఞాపించిన ఇశ్రాయేలు
గోత్రములలో యే వొక దానితోనైనా నా కొరకు
ఆరాన కర్రతో చేయబడ్డ మందిరము కట్టించక పో
8 తివేమన్న మాట యెన్నడయినా చెప్పితినా? । కాబట్టి
నీవు నా వేవకుడైన దావీదుతో చెప్పవలసినదేమంటే,
సైన్యములయొక్క యెహోవా యీలాగున సెలవు
యిస్తున్నాడు, గొర్రెల దొడ్డిలోనుంచి గొర్రెల వెనుక
వచ్చిన నిన్ను తీసి, ఇశ్రాయేలనే నా జనుల మీద అధిప
9 తిగా నిర్ణయిస్తిని. । యెక్కడికి నీవు వెళ్లినా అక్కడ
నీకు తోడుగా వుండి, నీ శత్రువులనందరినీ నీ
ముందరనుంచి నరికివేసి, నీ నామము లోకమందుండే
ఘనమైన వారియొక్క నామమయినట్టు ఘనపర్చి
10 తిని. । మరిన్ని ఇశ్రాయేలనే నా జనులు యికను కద
లకుండా తమ స్వస్థలమందు కాపురము చేసేటట్టుగా
వారికి వొక స్థలము నిర్ణయించి, దానియందు వా
రిని నాటి, పూర్వమైనట్టు ఇశ్రాయేలనే నా జనుల
మీద నేను న్యాయాధిపతులను నిర్ణయించిన వెనుక
దుర్బుద్ధి గల జనులు యికను వారిని కష్టపెట్టక
11 వుండేటట్టుగా చేసి, । నీ శత్రువుల వల్లనుంచి నీకు
నెమ్మది కలుగ చేసిన వాడనయితిని; మరిన్ని యె
హోవా అనే నేను నీకు తెలియ చేసేదేమంటే,
12 నేను నీకు యిల్లు కలుగ చేతును. । నీ దినములు సంపూ
ర్ణములైనప్పుడు నీవు నీ పితృలతోను నిద్రపొందిన తరు
వాత నీ గర్భములోనుంచి నీకు వెనుక కలిగే నీ సంత
13 తిని లేవనెత్తి అతని రాజ్యమును స్థిరపర్తును. । అత
డు నా నామము కొరకు మందిరమును కట్టించును;
మరిన్ని అతని రాజ్యముయొక్క గద్దె చిరకాలము
14 స్థిరపర్తును. । నేను అతనికి తండ్రిగానున్ను అతడు
నాకు కుమారుడుగానున్ను వుండును. అతడు అక్ర
మము చేస్తే నరులయొక్క దండముతోటిన్ని నరపుత్రు
లయొక్క దెబ్బలతోటిన్ని అతని శిక్షింతును. । నీ ముం 15
దరనుంచి నేను పరిహరించిన సౌలుయందు నా దయను
నేను తీసివేసిన లాగున నా దయ అతని యొద్దనుంచి
తొలగక వుండును. । నీ యిల్లున్ను నీ రాజ్యమున్ను 16
నీ ముందర చిరకాలము మట్టుకు స్థిరమౌను; నీ గద్దె
సదా స్థిరపరచ బడును అని, । యీ మాటలన్నిటి 17
చొప్పునను్న యీ దర్శనమంతటి ప్రకారముగా
నున్ను నాతాను దావీదుతో చెప్పెను. । అప్పుడు రా 18
జైన దావీదు లోపల ప్రవేశించి, యెహోవా సము
ఖమందు కూర్చుని వుండి చెప్పినదేమంటే, దేవుడవ
యిన వొ యెహోవా, యింత మట్టుకు నీవు నన్ను
తెచ్చుటకు నేను యెంతటివాడను? నా యిల్లు యెంత
గనుక? । అయితే దేవుడవయిన వొ యెహోవా, 19
యిది నీ దృష్టికి కొంచెముగానే వుండెను, యేమంటే
నీ సేవకుడనైన నా యింటిని గురించిన్ని బహు కాలము
మట్టుకు సెలవు యిస్తివి. దేవుడవయిన వొ యెహో
వా, యిది నరుల పద్ధతి ప్రకారమా? । అయితే దావీదు 20
అనే నేను యిక నీతో యేమి చెప్పేది? యేమంటే
దేవుడవయిన వొ యెహోవా, నీవు నీ సేవకుడనైన
నన్ను యెరుగుదువు. । నీ వాక్కు నిమిత్తము చేతనున్ను 21
నీ హృదయ ప్రకారముగానున్ను యీ గొప్ప కార్య
ములను నిర్ణయించి నీ సేవకుడనైన నాకు తెలియ
చేస్తివి. । కాబట్టి దేవుడవైన వొ యెహోవా, నీవు 22
గొప్పవాడవై వున్నావు; నీ లాటివాడు వొకడూ
లేడు; మా చెవుల చేత మేము విన్నంతటి ప్రకారము
నీవు గాక మరి యే దేవుడూ లేడు. । మరిన్ని లోక 23
ములో ఇశ్రాయేలనే నీ జనులకు యే జనాంగము
సమమౌను? వీరు నీ జనులై యుండేటట్టు విమోచిం
చుటకున్ను, నీవు నీ కొరకు వొక నామము కలుగ
చేసుటకున్ను, నీ దేశము కొరకున్ను నీ జనుల కొర
కున్ను ఘోరమైన గొప్ప కార్యములను చేయుటకు
న్ను, దేవుడవైన నీవు వెళ్లి మిస్రయీము దేశములో
నుంచిన్ని ఆ జనాంగములలోనుంచిన్ని వారి దేవుండ్ల
యొద్దనుంచిన్ని వీరిని నీ కొరకు విమోచించితివి. ।
మరిన్ని ఇశ్రాయేలనే నీ జనులను చిరకాలము నీ జనులై 24
వుండేటట్టు నిర్ధారణ చేస్తివి; యేమంటే యెహోవా
అయిన నీవు వారికి దేవుడవై వున్నావు. । కాబట్టి 25
దేవుడవైన వొ యెహోవా, నీ సేవకుడనైన నన్ను
గురించిన్ని నా యింటిని గురించిన్ని నీవు పలికిన వా
క్యము దృఢపర్చి, నీవు చెప్పిన ప్రకారము చేసి, ।
సైన్యములయొక్క యెహోవా ఇశ్రాయేలు పై దేవుడై 26
వున్నాడన్న మాటచేతను నీ నామము ఘనపర్చపడి,

నీ సేవకుడనైన దావీదు యిల్లు నీ సముఖమందు స్థిర
27 పచఱబడునుగాక. । యేమంటే ఇశ్రాయేలుకు దేవుడ
వైన సైన్యములయొక్క ప్రభువా యెహోవా, యిల్లు నీ
కొరకు కట్టుదునని నీ సేవకుడనైన నాకు నీవు తెలియ
చేస్తివి; అయినందున యీలాగున నీకు మనవి చేయ
డానకు నీ సేవకుడనైన నా హృదయమందు తాత్ప
28 ర్యము పుట్టెను. । దేవుడవైన ప్రభువా యెహోవా, నీవు
ఆ దేవుడవైనందున నీ వాక్యములు సత్యమై వుండును;
మరిన్ని యీ మేలును గురించి నీ సేవకుడనైన నాకు
29 వాగ్దత్తము చేస్తివి. । కాబట్టి నీవు దయచేసి, నీ సేవకు
డనైన నా యిల్లు నీ సముఖమందు చిరకాలము వుం
డేటట్టుగా ఆశీర్వదించుము, యేమంటే దేవుడవైన ప్రభువా
యెహోవా, నీవు చెప్పినందున నీ ఆశీర్వాదము చేత
నీ సేవకుడనైన నా యిల్లు సదా కాలము ఆశీర్వదించ
పడును గాకని పలికెను.

## 8. అధ్యాయము.

1 ఇది అయిన తరువాత దావీదు పెలిష్తీయులను
కొట్టి లోపరచుకొని, వారి చేతిలోనుంచి మెతగమ్మా
2 ను పుచ్చుకొనెను. । మరిన్ని అతడు మోయాబీయు
లను కొట్టి, భూమి మీద పడదోసి, వారిని తాడుతో
కొలిచెను, అనగా, మరణమును పొందించుటకు రెండు
తాళ్లతోటిన్ని బ్రతుకనివ్వడానకు వొక నిండైన తాడు
తోటిన్ని కొలిచినందున మోయాబీయులు దావీదుకు
3 సేవకులై కానుకలను తెచ్చిరి. । మరిన్ని దావీదు ఫెరా
తు నది యొద్ద వున్న తన సరిహద్దును తిరిగీ స్వాధీనము
చేసుకొనుటకు వెళ్లినప్పుడు రెహోబుయొక్క కుమా
రుడైన హదదెజెరు అనే సోబాయొక్క రాజును
4 కొట్టి, । అతని యొద్దనుంచి వెయి రథములనున్ను యే
భ్నూరు మంది గుర్రపు రౌతులనున్ను యిరువై వేల
మంది కాలుబలమునున్ను పుచ్చుకొనెను. అయితే
దావీదు నూరు రథముల కొరకు వుంచుకొనిన గుర్ర
ములు గాక తతిమ్మా గుర్రములు అన్నిటినిన్ని తొడ
5 నరములను కోయించెను. । మరిన్ని దమస్కులో వున్న
అరామీయులు సోబాయొక్క రాజైన హదదెజెరుకు
సహాయము చేయ వచ్చినప్పుడు దావీదు అరామీయు
లలో యిరువై రెండువేల మందిని హతము చేసెను. ।
మరిన్ని దావీదు దమస్కు కింద వున్న అరాము దేశ
మందు రణపు కాపరులను వుంచెను; యీలాగున అరా
మీయులు దావీదుకు సేవకులై కానుకలను తెచ్చిరి.
మరిన్ని యెక్కడికి దావీదు వెళ్లినా అక్కడ యెహో
వా అతని కాపాడుతూ వుండెను. । అయితే దావీదు
హదదెజెరుయొక్క సేవకులకు కలిగిన బంగారపు డా
లులను పుచ్చుకొని యెరూశలేముకు తీసుక వచ్చినా
డు. । మరిన్ని బెథహు బేరోతై అనే హదదెజెరుయొ 8
క్క పట్టణములలోనుంచి రాజైన దావీదు విస్తారమైన
యిత్తడిని పుచ్చుకొనెను. । మరిన్ని దావీదు హదదె 9
జెరుయొక్క సమూహమంతటినీ కొట్టినాడన్న సంగతి
హమాతుయొక్క రాజైన తోయికి వినపడినప్పుడు, ।
తోయి దావీదు హదదెజెరుతో పోట్లాడి అతని కొ 10
ట్టెను గనుక దావీదును పరామర్శించనున్ను ఆశీర్వ
దించనున్ను తన కుమారుడయిన యెహోరామును పం
పెను, యేమంటే హదదెజెరుకున్ను తోయికిన్ని యుద్ధ
ములు కలిగి యుండెను. యెహోరాము వెండి బం
గారు యిత్తడులయొక్క పాత్రలను తనతోకూడా తీసు
కొని వచ్చెను. । యివి రాజైన దావీదు తాను స్వాధీన 11
పచఱకొనిన జనాంగముల యొద్దనుంచి తీసుకొనిన
వెండి బంగారములతోటి యెహోవాకు సమర్పించెను. ।
అనగా అరాము యొద్దనుంచిన్ని మోయాబుయొద్దనుం 12
చిన్ని అమ్మోను పుత్రులయొద్దనుంచిన్ని పెలిష్తీయుల
యొద్దనుంచిన్ని అమాలేకు యొద్దనుంచిన్ని రెహోబు
యొక్క కుమారుడైన హదదెజెరు అనే సోబాయొక్క
రాజు యొద్దనుంచిన్ని దోచుకొనిన వాటిని అతడు
సమర్పించెను. । దావీదు వుప్పు లోవలో అరామీ 13
యులైన పద్ధెనిమిదివేల మందిని హతము చేసి, తిరిగీ
వచ్చినప్పుడు ప్రసిద్ధి అయిన నామమును పొందెను. ।
మరిన్ని అతడు ఎదోము దేశమందు కాపు బలములను 14
వుంచెను; ఎదోము దేశమంతటి యందు కాపు బల
మును వుంచినందున ఎదోమీయులు దావీదుయొక్క
సేవకులైరి. యెక్కడికి దావీదు వెళ్లినా అక్కడ యె
హోవా అతని రక్షించెను. । యీలాగున దావీదు 15
ఇశ్రాయేలు అంతటి మీద యేలుతూ తన జనులందరి
కిన్నీ నీతి న్యాయములను యిస్తూ వుండెను. । సెరూ 16
యా కుమారుడైన యోవాబు సైన్యమునకు అధిపతి
అయి వుండెను; అహీలూదుయొక్క కుమారుడయిన
యెహోషాఫాథు సమాచార లేఖకుడై వుండెను. ।
అహీథూబుయొక్క కుమారుడైన సాదోకున్ను అబ్యా 17
తారుయొక్క కుమారుడైన అహీమెలెఖున్ను అచఱకు
లయి వుండిరి; శెరాయా కరణమై యుండెను. । మరిన్ని 18
యెహోయాదాయొక్క కుమారుడైన బేనాయ్యా కెరే
తీయుల మీదనున్ను పెలేథీయుల మీదనున్ను వుం
డెను; దావీదుయొక్క కుమారులు ప్రధానులై వుండిరి.

## 9. అధ్యాయము.

తరువాత దావీదు అడిగినదేమంటే, యోనాతాను 1
నిమిత్తము నేను వుపకారము చేయడానకు సౌలుయొ
క్క యింట్లో యెవడయినా వొకడు శేషించి వున్నా
డా అని అడిగెను. । అయితే సౌలుయొక్క యింటి 2

సంబంధుడైన సీబా అనే పేరు గల సేవకుడు వొకడు
గలడు. వారు అతని దావీదు యొద్దికి పిలిచినప్పుడు
రాజు అతని చూచి సీబా అనేవాడవు నీవేనా? అని
అడిగినప్పుడు అతడు మీ సేవకుడనైన నేనే అని
3 చెప్పెను. । కాబట్టి రాజు అడిగినదేమంటే, నేను వా
నికి దేవ్యమయిన వుపకారము చేయడానకు సౌలుయొ
క్క యింట్లో యెవడైనా వొకడు శేషించి వున్నాడా
అని అడిగినప్పుడు, సీబా రాజుతో అనిన మాట,
యోనాతానుకు కుంటి కాళ్లు గల కుమారుడు వొకడు
4 కలడని చెప్పెను. । అతడు యెక్కడ వున్నాడని రాజు
అడిగినప్పుడు, సీబా రాజుతో, అడుగో లోదెబారు
లో అమ్మీయేలుయొక్క కుమారుడైన మాఖీరు యింట్లో
5 వున్నాడని చెప్పెను. । అప్పుడు రాజైన దావీదు పంపి
లోదెబారులో అమ్మీయేలుయొక్క కుమారుడైన మా
6 ఖీరు యింట్లోనుంచి అతని తెప్పించెను. । సౌలుయొక్క
కుమారుడైన యోనాతానుకు పుట్టిన మెఫీబోషెతు
దావీదు యొద్దికి వచ్చి సాష్టాంగపడి నమస్కరించగానే
దావీదు వో మెఫీబోషెతా అని పిలిచినప్పుడు, అత
డు యిదుగో మీ సేవకుడనైన నేను అని చెప్పెను. ।
7 అప్పుడు దావీదు అతనితో నీవు భయపడ వద్దు; నిజ
ముగా యోనాతాననే నీ తండ్రి నిమిత్తము నేను
నీకు వుపకారము చేసి, నీ పితృడయిన సౌలుయొక్క
భూమి అంతా తిరిగీ నీకు యిప్పింతును; మరిన్ని
నీవు సదా కాలము నా బల్లమీదనే భోజనము చేయ
8 వలసినదని చెప్పినందున; । అతడు నమస్కరించి చెప్పి
నదేమంటే, మీరు చచ్చిన కుక్కనైన నా మీద కనిక
రించడానకు మీ సేవకుడనైన నేను యెంతటివాడను
9 గనక అని చెప్పెను. । అప్పుడు రాజు సౌలుయొక్క
సేవకుడైన సీబాను పిలిచి అతనితో చెప్పినదేమంటే,
సౌలుకున్ను అతని యింటికిన్ని కలిగి వున్నది అంతా
10 నీ యజమానునియొక్క కుమారునికి యిస్తిని. । కాబట్టి
నీవున్ను నీ కుమారులున్ను నీ సేవకులున్ను భూమిని
అతని కొరకు దున్ని, నీ యజమానునియొక్క కుమా
రుడు తినేటందుకు ఆహారము కలిగేటట్టుగా పంట
తేవలసినది; అయినప్పటికిన్ని నీ యజమానునియొక్క
కుమారుడయిన మెఫీబోషెతు యెల్లప్పుడున్ను నా
బల్లమీదనే భోజనము చేసునని చెప్పెను. యీ సీ
బాకు పదిహేను మంది కుమారులున్ను యిరువైమంది
11 సేవకులున్ను గలరు. । అప్పుడు సీబా రాజుతో చెప్పి
నదేమంటే, నా యేలినవారయిన రాజు తన సేవకునికి
ఆజ్ఞాపించిన అంతటి ప్రకారము మీ సేవకుడనైన
నేను చేతునని చెప్పెను. అయితే మెఫీబోషెతు రా
జుయొక్క కుమారులలో వొకడైనట్టు నా బల్ల మీదనే
12 భోజనము చేసునని రాజు చెప్పి యుండెను. । అయితే
మెఫీబోషెతుకు వొక చిన్న కుమారుడు గలడు, వాని
పేరు మీఖా అని వుండెను. మరిన్ని సీబా యింట్లో
కాపురము చేసిన వారందరున్ను మెఫీబోషెతుకు సేవ
కులయి వుండిరి. । ఆలాగున మెఫీబోషెతు యెరూశ 13
లేములో కాపురము చేసి, సదాకాలము రాజుయొక్క
బల్లమీదనే భోజనము చేస్తూ వుండెను; అతనికి కాళ్లు
రెండున్ను కుంటిగా వుండెను.

## 10. అధ్యాయము.

ఇది అయిన తరువాత అమ్మోను పుత్రులయొక్క 1
రాజు మరణమైనందున అతని కుమారుడైన హనూను
అతనికి బదులుగా యేలుతూ వుండెను. । అప్పుడు దా 2
వీదు అనుకొన్నదేమంటే, హనూనుయొక్క తండ్రి
యైన నాహాషు నాకు చేసిన యుపకారమునకు నేను
హనూనుకు ప్రత్యుపకారము చేతునని అనుకొని,
అతని తండ్రి నిమిత్తము అతని వోదార్చడానకు తన
సేవకులచేత పంపించినందున దావీదుయొక్క సేవకులు
అమ్మోను పుత్రులయొక్క దేశములోకి వచ్చిరి. । అప్పు 3
డు అమ్మోను పుత్రులలో శ్రేష్ఠులయినవారు తమ
కర్తయైన హనూనుతో చెప్పినదేమంటే, దావీదు
మీ తండ్రిని బహుమానము చేయడానకు వోదార్చే
వారిని మీ యొద్దికి పంపించెనని మీకు తోస్తున్నదా?
లేక యీ పట్టణము శోధించి అంతా తెలుసుకొని నశిం
పచేసేటందుకోసము పంపించెనని తోస్తున్నదా? అని
పలికినందున, । హనూను దావీదుయొక్క సేవకులను 4
పట్టుకొని, సగము గడ్డము గొరిగించి, తొడుగుకొనిన
బట్టలను పిర్రల మట్టుకు మధ్యను కత్తిరించి, వారిని
వెళ్లగొట్టెను. । యీ సంగతి దావీదుకు వినపడినప్పుడు 5
ఆ మనుష్యులు మిక్కిలీ సిగ్గును పొందినందున అతడు
వారికి యెదురుగా పంపించి వారితో చెప్పుమనిన
దేమంటే, మీ గడ్డములు పెరిగేమట్టుకు యెరిఖో పట్ట
ణమందు నిలిచి అటు తరువాత రండని చెప్పుమనెను. ।
అయితే అమ్మోను పుత్రులు తమ్మును దావీదుకు దుర్గం 6
ధము గలవారలగా చేసుకొంటిమని తెలుసుకొన్న
ప్పుడు, అమ్మోను పుత్రులు పంపి బేత్రెహోబుయొ
క్క అరామీయులలోనుంచిన్ని సోబాయొక్క అరా
మీయులలోనుంచిన్ని యిరువయివేల కాలుబలము
నున్ను, మయఖాయొక్క రాజు యొద్దనుంచి వెయి
మందినిన్ని, ఇష్టోబులోనుంచి పన్నెండువేల మందినిన్ని
కూలికి కుదిర్చి పిలిపించుకొనిరి. । యిది దావీదుకు 7
వినపడినప్పుడు అతడు యోవాబునున్ను బలాఢ్యుల
యొక్క సమూహమంతటినిన్ని పంపెను. । అప్పుడు 8
అమ్మోను పుత్రులు బైలుదేరి ప్రవేశపు ద్వారము
ముందర యుద్ధ ప్రకారముగా నిలిచి వుండిరి; అయితే

సోబా అరామీయులున్ను రెహోబు అరామీయు
లున్ను మయఖావారున్ను ఇష్టోబువారున్ను బయట
9 భూమి యందు ప్రత్యేకముగా వుండిరి. । కాబట్టి తన
వెనుకనున్ను ముందరనున్ను వారు యుద్ధ ప్రకారము
గా వుండేది యోవాబు చూచినప్పుడు, ఇశ్రాయేలీ
యులలో యుక్తమైన వారిని యెంచి, అరామీయులకు
0 యెదురుగా నిలిపి, । తతిమ్మా వారిని తన సహోదరు
డైన అబీషై చేతి కింద అమ్మోను పుత్రులకు యెదురు
గా నిలిపేటందుకు వుంచి, అతనితో చెప్పినదేమంటే, ।
1 అరామీయులు నాకన్న బలముగా వుంటే నీవు నాకు
సహాయము చేయవలెను; అయితే అమ్మోను పుత్రులు
నీకన్న బలముగా వుంటే నేను వచ్చి నీకు సహాయము
2 చేతును. । ధైర్యము తెచ్చుకో మన జనుల కొరకున్ను
మన దేవునియొక్క పట్టణముల కొరకున్ను బలాఢ్యు
లమై వుందాము; అప్పుడు యెహోవా దృష్టికి యేది
మంచిదో అది ఆయన చేయును గాకని పలికిన తరు
3 వాత, । యోవాబున్ను అతని యొద్ద వున్నవారున్ను
అరామీయులతో పోట్లాడుటకు చేరగానే వారు
1 అతని ముందరనుంచి పారిపోయిరి. । మరిన్ని అరామీ
యులు పారిపోవుట అమ్మోను పుత్రులు చూచినప్పు
డు, వారున్ను అబీషై ముందరినుంచి పారిపోయి పట్ట
ణములో చొరబడిరి. అప్పుడు యోవాబు అమ్మోను
పుత్రుల యొద్దనుంచి తిరిగీ యెరూశలేముకు వచ్చెను. ।
అయితే అరామీయులు తాము ఇశ్రాయేలు పుత్రుల
ముందరినుంచి కొట్లపడితిమని చూచినప్పుడు తమ్మును
తాము కూర్చుకొనిరి. । మరిన్ని హదరెజెరు పంపి,
నది అవతల వున్న అరామీయులను పిలిపించినందున,
వారు హేలాముకు వచ్చిరి; వీరికి ముందర హదరెజెరు
1 యొక్క సైన్యాధిపతియైన షోబఖు వెళ్లెను. । అయితే
అది దావీదుకు వినపడినప్పుడు అతడు ఇశ్రాయేలీయు
లందరినీ కూర్చి, యర్దేను నది దాటి, హేలాముకు
వచ్చెను; అప్పుడు అరామీయులు దావీదుకు యెదు
రుగా యుద్ధ ప్రకారముగా వచ్చి అతనితో పోట్లా
1 డిరి. । అయితే అరామీయులు ఇశ్రాయేలీయుల ముం
దరినుంచి పారిపోయినందున దావీదు అరామీయుల
లో యేడునూరు రథికులనున్ను నలుబైవేల మంది గుర్ర
పు రౌతులనున్ను హతము చేసెను; మరిన్ని వారియొ
క్క సైన్యాధిపతియైన షోబఖును నరికినందున అతడు
1 న్ను అక్కడ మరణమాయెను. । అయితే హదరెజెరుకు
సేవకులైన రాజులందరున్ను తాము ఇశ్రాయేలీయుల
ముందరినుంచి కొట్లపడితిమని చూచుకొనినప్పుడు,
ఇశ్రాయేలీయులతో సమాధానపడి, వారికి సేవకులైరి;
మరిన్ని నాటినుంచి అరామీయులు అమ్మోను వారికి
సహాయము చేయుటకు భయపడిరి.

## 11. అధ్యాయము.

ఆ సంవత్సరము గతించిన తరువాత రాజులు పో 1
ట్లాడడానకు బైలుదేరే సమయాన సంభవించినదేమం
టే, దావీదు యోవాబునున్ను అతని సేవకులనున్ను
ఇశ్రాయేలీయులనందరినిన్ని పంపినందున వారు అమ్మో
ను పుత్రులను సంహరించి, రబ్బా అనే పట్టణమును
ముట్టడి వేసిరి: అయితే దావీదు యెరూశలేము యందు
నిలిచి వుండెను. । వొకనాటి అస్తమానమందు సంభ 2
వించినదేమంటే, దావీదు శయనము మీదనుంచి లేచి,
రాజ మందిరము మీదికి యెక్కి నడుస్తూ వుండగా,
మందిరము మీదనుంచి స్నానము చేసే వొక స్త్రీని
చూచినాడు; ఆ స్త్రీ చూడడానకు బహు సౌందర్యము
గా వుండెను. । అప్పుడు దావీదు ఆ స్త్రీ సమాచారము 3
తెలిసేటందుకు పంపినందున యీమె ఎలీయాముయొ
క్క కుమార్తెయున్ను హిత్తీయుడైన ఊరియాయొక్క
భార్యయున్ను అయిన బత్షెబ కాదా అని వొకడు
చెప్పినాడు. । అప్పుడు దావీదు దూతలను పంపి ఆమె 4
ను పిలిపించినందున ఆమె అతని యొద్దికి వచ్చెను; ఆమె
తన అపవిత్రతలోనుంచి పవిత్రమాయెను గనుక అత
డు ఆమెతో శయనించెను; అప్పుడు ఆమె తన యిం
టికి తిరిగీ వచ్చెను. । అయితే ఆ స్త్రీ గర్భవతియై నేను 5
గర్భవతినైతినన్న వర్తమానము దావీదు యొద్దికి
పంపెను. । అప్పుడు దావీదు యోవాబు యొద్దికి పం 6
పిన వర్తమానము యేమంటే, హిత్తీయుడైన ఊరీయా
ను నా యొద్దికి పంపుమనెను; కాబట్టి యోవాబు ఊరీ
యాను దావీదు యొద్దికి పంపెను. । ఊరీయా దావీ 7
దు యొద్దికి వచ్చినప్పుడు అతడు యోవాబు యోగ
క్షేమమునున్ను జనులయొక్క యోగక్షేమమునున్ను
యుద్ధ సమాచారమునున్ను అడిగినాడు. । తరువాత దా 8
వీదు ఊరీయాతో చెప్పినదేమంటే, నీ యింటికి వెళ్లి నీ
కాళ్లు కడిగి వేసుకొమ్మని సెలవు యిచ్చినందున, ఊరీ
యా రాజ మందిరములోనుంచి బయిలు వెళ్లినాడు;
మరిన్ని అతని వెనుక రాజు యొద్దనుంచి కొంత ఆహార
ము అతనికి వచ్చెను. । అయితే ఊరీయా తన యేలినవా 9
రియొక్క సేవకులతో కూడా రాజ మందిర ద్వారమం
దు పడుకొని తన యింటికి వెళ్లక వుండెను. । కాబట్టి 10
ఊరీయా తన యింటికి వెళ్లినాడు కాడని వారు
దావీదుతో చెప్పినప్పుడు దావీదు ఊరీయాతో అనిన
మాట, నీవు ప్రయాణము చేసి వస్తివి గదా? నీ యిం
టికి వెళ్లక వుంటివేమని అడిగినప్పుడు; । ఊరీయా 11
దావీదుతో చెప్పినదేమంటే, పెట్టెయున్ను ఇశ్రాయే
లీయులున్ను యూదావారున్ను డేరాలయందున్ను
నా కర్తయైన యోవాబున్ను నా యేలినవారైన

మీయొక్క సేవకులున్ను బయిట భూములలో పేట
యందున్ను వుంటూ వుండగా, నేను భోజనము చేయ
డానకున్ను నా భార్యతో శయనించడానకున్ను నా
యింటికి వెళ్లుదునా? మీతోడే మీ ప్రాణముతోడే
12 నేను ఆలాగున చేయనని చెప్పెను. । అప్పుడు దావీదు
ఊరీయాతో అనిన మాట, నేడున్ను నీవు యిక్కడ
వుండు, రేపు నీకు సెలవు యిత్తునని చెప్పినందున, ఊరీ
యానాటి దినమున్ను మరునాడున్ను యెరూశలేములో
13 నిలిచి వుండెను. । అంతలో దావీదు అతని పిలిపించి
భోజనము చేయబెట్టి తాగించి మత్తును పొందించెను;
అయితే అస్తమానమందు అతడు బయిలు వెళ్లి తన
యేలినవారియొక్క సేవకులలో తన శయనము మీద
14 పడుకొని తన యింటికి వెళ్లక వుండెను. । వుదయ
మందు సంభవించినదేమంటే, దావీదు యోవాబుకు
15 వుత్తరము వ్రాసి ఊరీయా చేత పంపెను; । ఆ వుత్తర
ములో వ్రాసి వున్నదేమంటే, యుద్ధము యెక్కడ
గట్టిగా వుండునో అక్కడ ముందుగా ఊరీయాను
వుంచి, అతడు కొట్లపడి మరణమయ్యేటట్టుగా మీరు
16 వెనక్కు రావలసినదని వ్రాసెను. । కాబట్టి యోవాబు
పట్టణము జాగ్రతగా చూచి ధైర్యవంతులు వుండే
స్థలము యెక్కడనో అది తెలుసుకొని, ఆ స్థలమునకు
17 ఊరీయాను నిర్ణయించెను. । అప్పుడు ఆ పట్టణపువారు
బయిలు వచ్చి యోవాబుతో పోట్లాడినందున, దావీ
దుయొక్క సేవకులలో కొందరు కూలి పడిరి; హిత్తీ
18 యుడైన ఊరీయాయున్ను మరణమాయెను. । అప్పుడు
యోవాబు యుద్ధముయొక్క వర్తమానమంతా దావీ
19 దు యొద్దికి పంపెను; । అతడు దూతకు ఆజ్ఞాపించినదే
మంటే, యుద్ధముయొక్క వర్తమానములు రాజుతో
20 చెప్ప చాలించినప్పుడు, । రాజు కోపము తెచ్చుకొని,
యుద్ధము చేసేటప్పుడు పట్టణము దగ్గిరకు యెందుకు
చేరితిరి! గోడమీదనుంచి వారు బాణప్రయోగములను
21 చేతురని మీకు తెలియక పోయినదా! । యేరుబ్బెషె
తుయొక్క కుమారుడైన అబీమెలెఖును యెవడు చం
పెను! వొక స్త్రీ తిరగట్రాతి ముక్క యెత్తి గోడ మీ
దనుంచి వానిమీద వేసినందున వాడు తేబేస్సు దగ్గిర
మరణమాయెను; గోడ దగ్గిరకు యెందుకు చేరితిరని
అడిగితే, నీవు మీ సేవకుడైన ఊరీయాయున్ను మర
22 ణమైనాడని చెప్పుమని బోధించి పంపెను. । ఆ దూత
వెళ్లి యోవాబు పంపిన వర్తమానమంతా దావీదుకు
23 అగపర్చి చెప్పినదేమంటే, । నిజముగా ఆ మనుష్యులు
మా మీద విజయులై, బయిట భూమిలో మాకు యెదు
రుగా వచ్చిరి; అయితే మేము వారిమీద తిరగబడి
24 ద్వార ప్రవేశము మట్టుకు వెళ్లినాము. । అప్పుడు గోడ
మీదనుండి బాణప్రయోగములు చేసేవారు మీ సేవ
కుల మీద ప్రయోగించినందున రాజు సేవకులలో కొం
దరు మరణమైనారు; హిత్తీయుడనే మీ సేవకుడైన ఊరీ
యాయున్ను మరణమైనాడని చెప్పెను. । అప్పుడు దా 25
వీదు ఆ దూతతో అనిన మాట, నీవు యోవాబుతో చెప్ప
వలసినదేమంటే, ఆ సంగతివల్ల నీవు చింతపడకు; యే
మంటే కత్తి వొకప్పుడు వీనిన్ని వొకప్పుడు వానిన్ని
మింగును; నీ యుద్ధము పట్టణము మీద మరీ బలపర్చి
దానిని పడదోసివేయుమని అతడు ధైర్యపడేటట్టుగా
నీవు చెప్పుమని పంపినాడు. । అయితే ఊరీయా భార్య 26
తన పెనిమిటి అయిన ఊరీయా మరణమాయెనని విని
నప్పుడు తన పెనిమిటి కొరకు అంగలాచ్చెను. । అంగ 27
లార్పు అయిన తరువాత దావీదు పంపి తన యింటికి
ఆమెను తెప్పించుకొనినందున ఆమె అతనికి భార్య
అయి అతనికి వొక కుమారుని కనెను. అయితే దావీదు
చేసిన కార్యము యెహోవా దృష్టికి కీడై యుండెను.

## 12. అధ్యాయము.

అప్పుడు యెహోవా నాతానును దావీదు యొ 1
ద్దికి పంపెను. అతడు వచ్చి అతనితో చెప్పినదేమంటే,
వొక పట్టణమందు యిద్దరు మనుష్యులు వుండిరి; వొక
డు ఐశ్వర్యవంతుడున్ను వొకడు దరిద్రుడున్ను అయి
వుండిరి. । ఐశ్వర్యవంతునికి బహుగా గొర్రెలున్ను యె 2
ద్లున్ను కలిగి వుండగా, । దరిద్రునికి వొక చిన్న ఆడు 3
గొర్రెపిల్ల మాత్రమే వుండెను, గాని మరి యేమీ
లేదు. అది వాడు కొని పెంచుకొంటూ వున్నందున
అది వాని యొద్దనున్ను వాని బిడ్డల యొద్దనున్ను పెరిగి,
వాని భోజనపు ముక్కలోది తింటూ, వాని పాత్ర
లోది తాగుతూ, వాని కౌగిటిలో పడుకొంటూ, వా
నికి కుమార్తెవలె వుండెను. । అంతట వొక మార్గ
స్థుడు ఐశ్వర్యవంతుని యొద్దికి వచ్చెను; అతడు తన
యొద్దికి వచ్చిన మార్గస్థునికి ఆయత్తము చేయడా
నకు తన గొర్రెలనున్ను యెద్లనున్ను కనికరించి వీటి
లో దేనిని తియ్యక, ఆ దరిద్రునియొక్క గొర్రెపిల్లను
పట్టుకొని, తన యొద్దికి వచ్చినవాని కొరకు ఆయత్తము
చేసెనని చెప్పినప్పుడు; । దావీదుయొక్క కోపము ఆ
మనుష్యుని మీద బహుగా రగులుకొనినందున, అతడు
నాతానును చూచి, యెహోవాయొక్క జీవముతోడు
నిజముగా యీ కార్యము చేసినవాడు మరణపాత్రు
డౌను. । మరిన్ని వాడు కనికరించక యీలాటి కార్య
ము చేసెను గనుక ఆ గొర్రె పిల్లకు నాలుగు పిల్లలను
ప్రతిగా యివ్వవలెనని చెప్పగా; । నాతాను దావీ
దును చూచి, నీవే ఆ మనుష్యుడవు. ఇశ్రాయేలుకు
దేవుడయిన యెహోవా యిచ్చిన సెలవు యేమం
టే, నేను ఇశ్రాయేలు మీద నిన్ను పట్టాభిషిక్తునిగా

చేసి, సౌలుయొక్క చేతిలోనుంచి నిన్ను విడుపించి,।
8 నీ యజమానునియొక్క యిల్లు నీకు యిచ్చి, నీ యజ
మానునియొక్క స్త్రీలను నీ కౌఁగిటిలోకి రానిచ్చి,
ఇశ్రాయేలుయొక్క యిల్లునున్ను యూదాయొక్క
యిల్లునున్ను నీకు యిస్తిని; యివి చాలకపోతే వాటిని
9 వాటిని నీకు యిత్తును.। నీవు యెహోవాయొక్క
ఆజ్ఞోల్లంఘన చేసి, ఆయన దృష్టి యెదుట కీడు చేసి
తివేమి? యేమంటే హిత్తీయుడైన ఊరీయాను కత్తిచేత
చంపించి, అతని భార్యను నీకు భార్య అయ్యేటట్టుగా
తీసుకొంటివి; అమ్మోను పుత్రుల కత్తిచేత అతని చంపి
10 తివి.। కాబట్టి కత్తి నీ యింటిని విడువక సదా కాల
ము నిలిచి వుండును, యేమంటే నీవు నన్ను నిర్లక్ష్య
పెట్టి, హిత్తీయుడైన ఊరీయా భార్యను నీకు భార్య
11 అయ్యేటట్టుగా తీసుకొంటివి.। అయినందున యెహో
వాను అయిన నేను చెప్పేదేమంటే, యిదుగో నీ యిం
ట్లోనుంచి నేను నీకు కీడును లేవ చేతును; నీ భార్య
లను నీ కన్నుల ముందర నేను తీసి నీ చేరువవానికి
అప్పగింతును; వాడు యీ సూర్యుని దృష్టి యెదుట
12 వారితో శయనించును.। యేమంటే నీవు అది రహ
స్యముగా చేస్తివి, అయితే యీ కార్యము నేను ఇశ్రా
యేలీయులందరి ముందరనున్ను సూర్యుని ముందరను
13 న్ను చేయింతునని సెలవు యిచ్చెననెను.। అప్పుడు దా
వీదు నాతానుతో అనిన మాట, నేను యెహోవా
విషయమై పాపము చేస్తినని చెప్పినందున, నాతాను
దావీదుతో చెప్పినదేమంటే, యెహోవా నీ పాప
మును పరిహరించెను, నీవు చావకుండా వుందువు.।
14 అయినప్పటికిన్ని యీ కార్యమువల్ల దూషించుటకు
యెహోవాయొక్క శత్రువులకు గొప్ప హేతువు
నీవు కలుగ చేస్తివి గనుక నీకు పుట్టిన పిల్ల అవశ్యము
15 గా మరణమౌనని చెప్పెను.। అప్పుడు నాతాను తన
యింటికి వెళ్లెను. యెహోవా ఊరీయా భార్య దా
వీదుకు కనిన పిల్లను మొత్తినందున అది బహు రోగిగా
16 వుండెను.। అందు నిమిత్తము దావీదు తన పిల్ల కొరకు
దేవుని బతిమాలెను; మరిన్ని దావీదు వుపవాసముగా
వుండి లోపటికి వెళ్లి రాత్రి అంతా భూమి మీద పడి
17 వుండెను.। కాబట్టి అతని యింటి పెద్దలు లేచి, భూమి
మీదనుంచి అతని లేవనెత్తుటకు వచ్చిరి; అయితే అత
డు వొప్పక వారితో కూడా భోజనము చేయక వుం
18 డెను.। అయితే యేడో దినమందు ఆ పిల్ల మరణ
మాయెను; దావీదుయొక్క సేవకులు పిల్ల పోయినదన్న
సంగతి అతనితో చెప్పుటకు భయపడిరి. వారు అను
కొనినదేమంటే యిదుగో పిల్ల ప్రాణముతో వుండగా
మేము అతనితో చెప్పినప్పుడు అతడు మా మాటలు
వినక వుండెను; యిప్పుడు పిల్ల పోయినదని అతనితో
చెప్పితే తనకు తాను మోసము చేసుకొనునేమో అని
అనుకొనిరి.। అయితే దావీదు తన సేవకులు గుసగుస 19
లాడేది చూచినప్పుడు, పిల్ల పోయినదని గ్రహించి,
తన సేవకులను చూచి, పిల్ల పోయినదా అని అడిగిన
ప్పుడు పోయినదని వారు చెప్పిరి.। అందుకు దావీదు 20
భూమి మీదనుంచి లేచి, స్నానము చేసుకొని, తైలము
పూసుకొని, యెహోవా మందిరములో ప్రవేశించి
మ్రొక్కి, తన యింటికి తిరిగీ వచ్చి, భోజనము తెమ్మని
చెప్పగా వారు వడ్డించిరి; అప్పుడు అతడు భుజియిం
చెను.। కాబట్టి అతని సేవకులు అతని చూచి, యీ 21
పిల్ల జీవముతో వున్నప్పుడు మీరు వుపవాసము చేసి
పిల్ల కొరకు యేడ్చుతూ వుంటిరి; పిల్ల మరణమైనప్పుడు
మీరు లేచి భోజనము చేస్తిరి; మీరు చేసిన యిది యే
మిటని అడిగినప్పుడు;। అతడు వారితో చెప్పినదేమం 22
టే, పిల్ల ప్రాణముతో వున్నప్పుడు దేవుడు నా యందు
కనికరించి పిల్లను బ్రతికించునేమో అని అనుకొని,
నేను వుపవాసము చేసి యేడ్చితిని.। యిప్పుడు వాడు 23
పోయినాడు గనుక నేను యెందుకు వుపవాసము చేయ
వలెను? తిరిగీ వాని రాచేయ గలనా? నేను వాని యొ
ద్దికి వెళ్లుదును గాని నా యొద్దికి వాడు రాడు అని
చెప్పెను.। అప్పుడు దావీదు తన భార్య అయిన బత్షె 24
బను వోదార్చి, దాని యొద్దికి పోయి దానితో
శయనించినందున ఆమె వొక కుమారుని కనెను; అతడు
వాని సొలమోను అనే పేరున పిలిచెను; యెహోవా
వాని యందు ప్రియముగా వుండెను.। మరిన్ని ఆయన 25
నాతాను అనే దీర్ఘదర్శి ద్వారా పంపెను; అతడు
అతని యెహోవా నిమిత్తము యెదీద్యా అనే పేరున
పిలిచెను.। అంతలో యోవాబు రబ్బా అనే అమ్మోను 26
పుత్రులయొక్క పట్టణము మీద యుద్ధము చేసి, రాజు
పట్టణమును పుచ్చుకొనెను.। అప్పుడు యోవాబు దా 27
వీదుకు దూతలను పంపి చెప్పుమనినదేమంటే, నేను
రబ్బా మీద యుద్ధము చేసి వుదకము గల పట్టణమును
పుచ్చుకొంటిని; । నేను పట్టణమును పుచ్చుకొనినం 28
దున అది నా పేరట పిలువబడకుండా నీవు తతిమ్మా
జనులను కూర్చుకొని వచ్చి, పట్టణమును కవిసి పుచ్చు
కోవలసినదని చెప్పెను.। కాబట్టి దావీదు జనులంద 29
రినిన్ని కూర్చుకొని, రబ్బాకు వచ్చి దాని మీద యు
ద్ధము చేసి దాని పుచ్చుకొనెను.। అతడు వారి రాజు 30
యొక్క కిరీటమును అతని శిరస్సు మీదనుంచి తీసు
కొనెను; ఘనమైన రత్నములతో కూడా దాని యెత్తు
బంగారపు తలాంతు అంత యెత్తేయి వుండెను; అది
దావీదు శిరస్సు మీద పెట్ట పడెను. మరిన్ని అతడు
పట్టణములోనుంచి బహు విస్తారమైన దోపుడు సొమ్ము
ను వెలపలికి తీసెను.। మరిన్ని అతడు పట్టణములో 31

వున్నవారిని బయిటికి తెప్పించి, రంపాల కిందనున్ను
యినుప నెల్ల బల్లల కిందనున్ను యినుప గొడ్డండ్ల కిం
దనున్ను వేసి, యిటికెల ఆమములోనుంచి గడవచేసి
నాడు; యీలాగున అమ్మోను పుత్రుల పట్టణములన్ని
టికీ చేసెను. ఆ తరువాత దావీదున్ను జనులందరున్ను
తిరిగీ యెరూశలేముకు వచ్చిరి.

## 13. అధ్యాయము.

1 ఇది అయిన తరువాత సంభవించినదేమంటే, దావీ
దుయొక్క కుమారుడైన అబ్షాలోముకు వొక సుందర
వతియైన సహోదరి గలదు, ఆమె తామారు అని పిలు
వబడెను; ఆమెను దావీదుయొక్క కుమారుడైన అమ్నో
2 ను మోహించెను. । యీ అమ్నోను తన సహోదరి
యైన తామారు నిమిత్తము రోగి అయ్యేటట్టు చింతా
క్రాంతుడై వుండెను, యేమంటే, ఆమె కన్యక అయి
వుండెను గనుక ఆమెకు యేదైనా చేసుటకు కఠినము
3 గా అమ్నోనుకు తోచెను. । అయితే అమ్నోనుకు మి
త్రుడు వొకడు గలడు; అతడు దావీదుయొక్క సహో
దరుడైన షిమాకు పుట్టిన కుమారుడై యెహోనాదా
బు అని పిలువపడెను; యీ యెహోనాదాబు మి
4 క్కిలీ కపటము గలవాడు; । ఇతడు అతని చూచి రాజ
కుమారుడవైన నీవు దిన దినమున్ను క్షీణించి పోవుటకు
హేతువు యేమి? నాకు తెలియ చెప్పవా? అని అడి
గినందున, అమ్నోను అతనితో నా సహోదరుడైన
అబ్షాలోముయొక్క సహోదరియైన తామారును మో
5 హించి వున్నానని చెప్పినందున, । యెహోనాదాబు
అతనితో చెప్పినదేమంటే, నీవు రోగివైనట్టుగా మంచ
ము మీద పడుకో; నీ తండ్రి నిన్ను చూడడానకు
వచ్చినప్పుడు అతనితో చెప్పవలసినదేమంటే, నా
సహోదరి అయిన తామారు చేతివల్ల నేను తినేటం
దుకు ఆమె వచ్చి నేను చూచేటట్టుగా నా కండ్ల ముం
దర భోజనము ఆయత్తము చేసి నాకు యిచ్చేటట్టు
6 సెలవు యిమ్మనుమని బోధించెను. । కాబట్టి అమ్నోను
రోగి అయినట్టు పడుకొనెను; అతని చూడడానకు
రాజు వచ్చినప్పుడు అమ్నోను రాజుతో చెప్పినదేమం
టే, నా సహోదరియైన తామారు చేతివల్ల నేను
తినేటందుకై ఆమె వచ్చి నా కండ్ల ముందర రెండు
అప్పాలు చేయడానకు సెలవు యివ్వవలెనని చెప్పిన
7 ప్పుడు, । దావీదు తామారు యింటికి కబురు పంపిన
దేమంటే, నీ సహోదరుడైన అమ్నోను యింటికి
వెళ్లి, అతని కొరకు భోజనము ఆయత్తము చేయుమని
8 చెప్పుమనెను. । కాబట్టి తామారు తన సహోదరుడ
యిన అమ్నోనుయొక్క యింటికి వెళ్లెను; అతడు పడు
కొని వుండెను. । అప్పుడు ఆమె పిండి పిసికి, అతని
కండ్ల ముందర అప్పాలు చేసి కాల్చి, । బొరుసు పట్టు 9
కొని అతని ముందర దిమ్మరించి, అతనికి వడ్డించినప్పు
డు, అతడు తినక, నా యొద్దనుంచి ప్రతి మనిషి అవ
తలకు పొమ్మని చెప్పినందున, వారందరున్ను బయిటికి
వెళ్లిరి. । అప్పుడు అమ్నోను తామారుతో చెప్పినదేమం 10
టే, నీ చేతివల్ల నేను తినేటందుకు భోజనము గది
లోకి తెమ్మని చెప్పినందున తామారు తాను చేసిన
అప్పాలను తీసుకొని, గదిలో వున్న తన సహోదరు
డయిన అమ్నోను యొద్దికి వచ్చెను. । అయితే ఆమె 11
వాటిని అతడు తినడానకు తీసుక వచ్చినప్పుడు అతడు
ఆమెను పట్టుకొని, నాసహోదరీ, నాతో శయనించు
రా అనెను. । అయితే ఆమె అతనితో చెప్పినదేమం 12
టే, వొ అన్నా, అదికాదు; నన్ను బలవంతము చేయ
వద్దు; యీలాటి కార్యము ఇశ్రాయేలులో చేయబడ
కూడదు; ఆ వెర్రితనము చేయ వద్దు. । నా సిగ్గును తో 13
లగ చేసుకొనుటకు నేను యెక్కడికి వెళ్లుదును? నీవు
న్ను ఇశ్రాయేలు యందు వెర్రివాండ్లలో వొకడవవు
దువు; కాబట్టి యిందుకు రాజుతో చెప్పు, వారు నీ
విషయమై నన్ను నివారించరని చెప్పినప్పటికిన్ని; ।
అతడు ఆమె మాటలు వినక, ఆమెకంటే యెక్కువ 14
శక్తి గలవాడైనందున ఆమెను బలవంతము చేసి ఆమె
తో శయనించెను. । తరువాత అమ్నోను బహు ద్వేష 15
ముతో దాని పగ చేసెను, యేమంటే ఆమెను పగ
చేసిన పగ పూర్వము స్నేహించిన స్నేహముకంటే అధి
కమై వుండెను. కాబట్టి అమ్నోను ఆమెను చూచి,
లేచి వెళ్లిపొమ్మని చెప్పినందున, । ఆమె అతనితో ఆలా 16
గున నిమిత్తము లేదు; నన్ను తోలివేసుటవల్లనైన కీడు
నీవు నాకు చేసిన కార్యముకంటే అధికమవునని చెప్పి
నప్పటికిన్ని, అతడు ఆమె మాటలు వినక, । తన్ను కని 17
పెట్టి వున్న పడుచువాని పిలిచి, దీని నా లోపలనుంచి
అవతలకు తోలి, తలుపు గెడ వేయుమని చెప్పెను. ।
అయితే ఆమెకు వివిధవర్ణములు గల చీరె వొకటి 18
కలిగి వుండెను, యేమంటే అటువంటి చీరెలను రాజు
లయొక్క కన్యకలైన కుమార్తెలు ధరింతురు; అయి
తే అతని సేవకుడు ఆమెను బైటికి కొంచ వచ్చి,
ఆమె వెనుక తలుపు గెడ వేసెను. । అప్పుడు తామారు 19
తన నెత్తి మీద బుగ్గి పోసుకొని, తాను కట్టుకొనిన
నానావర్ణములు గల చీరెను చింపి, నెత్తిమీద చేతు
లు పెట్టుకొని, యేడ్చుతూ వెళ్లెను. । కాబట్టి ఆమె 20
సహోదరుడైన అబ్షాలోము ఆమెతో అనిన మాట,
నీ సహోదరుడయిన అమ్నోను నీతోటి కలుసుకొ
న్నాడా? అయితే వొ నా సహోదరీ, నీవు వూర
కొని వుండు; అతడు నీ సహోదరుడు; యీ కార్య
ము లక్ష్యము చేయ వద్దని చెప్పెను. కాబట్టి తామారు

తన సహోదరుడైన అబ్షాలోముయొక్క యింట్లో
21 దీనవృత్తిగా వుండెను. । అయితే యీ సమాచారములు
రాజైన దావీదుకు వినపడినప్పుడు అతడు బహు రౌ
22 ద్రము తెచ్చుకొనెను. । అబ్షాలోము తన సహోదరు
డైన అమ్నోనుతో మేలైనా కీడైనా చెప్పక వుండెను,
యేమంటే అమ్నోను తన సహోదరియైన తామా
రును బలవంతము చేసెను గనుక అబ్షాలోము అతని
23 యందు పగ వుంచెను. ।అయితే రెండు పూర్ణ సంవ
త్సరములు అయిన తరువాత ఎఫ్రాయీము సమీపమం
దుండే బయల్హాసోరులో అబ్షాలోము గొఱ్ఱె వెంట్రు
కలు కత్తిరించే కాలము వచ్చెను; కాబట్టి అబ్షాలోము
24 రాజుయొక్క కుమారులనందరినిన్ని పిలిచినాడు. । యిం
దుకు అబ్షాలోము రాజు యొద్దికి వచ్చి అతనితో
చెప్పినదేమంటే, యిదుగో మీ సేవకుడనైన నాకు
గొఱ్ఱె వెంట్రుకలు కత్తిరించే కాలము వచ్చెను; రా
జైన మీరున్ను మీ సేవకులున్ను మీ సేవకుడనైన
నాతో రావడానకు కోరి వున్నాను అని చెప్పినప్పు
25 డు, । రాజు అబ్షాలోముతో అనిన మాట, నా కుమా
రుడా, అది కాదు; మావల్ల నీకు అధిక భారమవును;
యిప్పుడు మేమందరమూ రా కూడదని చెప్పినప్పటి
కిన్ని, అతడు అతని బలవంతము చేసెను; అయినప్ప
26 టికిన్ని, అతడు వెళ్లకనే అతని ఆశీర్వదించెను. । అప్పు
డు అబ్షాలోము అతనితో ఆలాగు కాకపోతే నా
సహోదరుడయిన అమ్నోనును మాతో కూడా రావ
డానకు సెలవు యిప్పించ వలసినదని చెప్పినప్పుడు,
రాజు వాడు నీతో యెందుకు రావలెనని చెప్పినప్పటి
27 కిన్ని, । అబ్షాలోము బతిమాలినందున రాజు అమ్నోను
నున్ను తన కుమారులనందరినిన్ని అతనితో వెళ్లని
28 చ్చెను. । అంతలో అబ్షాలోము తన పడుచువాండ్లకు
ఆజ్ఞాపించినదేమంటే, అమ్నోను హృదయము ద్రాక్షా
రసమువల్ల సంతోషించి వున్నప్పుడు బాగా కనిపె
ట్టండి; నేను మిమ్మును చూచి అమ్నోనును కొట్టండని
చెప్పినప్పుడు భయపడక అతని చంపండి; నేనే మీకు
ఆజ్ఞాపిస్తిని; ధైర్యము తెచ్చుకొండి; బలముగా వుండం
29 డని చెప్పెను. । కాబట్టి అబ్షాలోముయొక్క పడుచు
వాండ్లు అబ్షాలోముయొక్క అజ్ఞ చొప్పున చేసిరి;
అప్పుడు రాజుయొక్క కుమారులందరున్ను లేచి, ప్రతి
మనిషీ తన తన కంచర గాడిదెను యెక్కి పారిపో
30 యిరి. । అయితే వారు మార్గములో వుంటూ వుండ
గానే యీ వర్తమానము దావీదు యొద్దికి వచ్చెను;
అది యేలాగంటే అబ్షాలోము వొకడూ వుండిపోకుం
డా రాజుయొక్క కుమారులనందరినిన్ని హతము చేసె
31 నని వచ్చెను. । అప్పుడు దావీదు లేచి, తన వస్త్రములను
చింపుకొని, భూమి మీద పడివుండెను; మరిన్ని
అతని సేవకులందరున్ను బట్టలు చింపుకొని, దగ్గిర నిలిచి
వుండిరి. । అప్పుడు దావీదుయొక్క సహోదరుడైన 32
షిమాకు పుట్టిన యెహోనాదాబు చెప్పినదేమంటే,
వాండ్లు రాజుయొక్క కుమారులైన పడుచువారినందరి
నిన్ని చంపినారని నా యేలినవారైన మీరు తలంచ
వద్దు; అమ్నోను మాత్రమే మరణమైనాడు, యేమంటే
అతడు అబ్షాలోముయొక్క సహోదరియైన తామా
రును బలవంతము చేసిన నాటనుంచి అబ్షాలోమువల్ల
యిది నిర్ణయించబడి వుండెను. । కాబట్టి నా యేలి 33
నవారైన మీరు రాజుయొక్క కుమారులందరున్ను మర
ణమైనారని తలంచుకొని, మనోవిచారపడవద్దు, యే
మంటే అమ్నోను మాత్రమే మరణమైనాడని చెప్పె
ను. । అయితే అబ్షాలోము పారిపోయెను; కాచుకొని 34
వుండే పడుచువారు కండ్లతో పారచూచి, యిదుగో
అతని వెనుక కొండ దగ్గిర మార్గమందు అనేక జనులు
వస్తూ వున్నారని చూచిరి. । అప్పుడు యెహోనాదా 35
బు రాజుతో అనిన మాట, యిదుగో రాజకుమారులు
వచ్చిరి; మీ సేవకుడనైన నేను చెప్పినప్రకారముగానే
ఆయెనని చెప్పుతూ వుండగానే, । యిదుగో రాజకుమా 36
రులు వచ్చి, తమ తమ కంఠమెత్తి యేడ్చిరి, రాజున్ను
అతని సేవకులందరున్ను బహుగా యేడ్చిరి. । అయితే 37
అబ్షాలోము పారిపోయి, అమ్మీహూదుయొక్క కుమా
రుడైన తల్మయి అనే గెషూరుయొక్క రాజు యొద్దికి
వచ్చి వుండెను. దావీదు తన కుమారుని నిమిత్తము దిన
దినమున్ను అంగలార్చుతూ వుండెను. । అయితే అబ్షా 38
లోము పారిపోయి, గెషూరుకు వచ్చి, అక్కడ మూడు
సంవత్సరములు వుండెను. । అప్పుడు రాజైన దావీదు 39
యొక్క మనోరథము అబ్షాలోము వెంట పారెను,
యేమంటే అతడు మరణమైన అమ్నోనును గురించి
వోదార్పు తెచ్చుకొనెను.

## 14. అధ్యాయము.

అయితే రాజుయొక్క హృదయము అబ్షాలోము 1
తట్టు వున్నదని సెరూయాయొక్క కుమారుడైన యో
వాబు గ్రహించెను. । అప్పుడు యోవాబు తెకోవ 2
నుంచి బుద్ధి గల వొక స్త్రీని పిలువనంపించి, దానితో
చెప్పినదేమంటే, నీవు అంగలార్చుతూ వున్నదాన
వైనట్టు దుఃఖ వస్త్రములను తొడుగుకొని, తైలమును
పూసుకొని, మరణమైన వానిగురించి బహు కాలము
దుఃఖపడిన స్త్రీవలెనే వుండి, । రాజు యొద్దికి వచ్చి, 3
యీ ప్రకారముగా చెప్ప వలసినదని యోవాబు దాని
నోటికి మాటలు అందిచ్చెను. । అయితే తెకోవ వూరి 4
స్త్రీ రాజుతో మాటలు చెప్పబోయేటప్పుడు సాష్టాంగ
నమస్కారము చేసి, రక్షించుము రాజా, అని పలికెను. ।

5 అందుకు రాజు నీకు యేమి కష్టము వచ్చెనని అడిగి
నప్పుడు, ఆమె చెప్పినదేమంటే, నేను నిజముగా విధ
6 వనై యున్నాను; నా పెనిమిటి చనిపోయినాడు. । నీ
సేవకురాలనైన నాకు యిద్దరు కుమారులు గలరు; వారి
ద్దరు పొలములో జగడమాడుతూ వుండగా విడిపించే
వాడు వొకడూ లేనందున వొకడు వొకని కొట్టి చంపి
7 వేసెను. । కాబట్టి నా యింటి వారందరున్ను నీ సేవకు
రాలనైన నా మీదికి లేచి, సహోదరుని కొట్టిన వాని
అప్పగించు; సహోదరుని చంపిన వానియొక్క ప్రా
ణము కొరకు మేము వాని తిరిగీ చంపి, ఆ స్వతంత్రుని
నాశనము చేతుమని చెప్పిరి: యీలాగున వారు మిగి
లిన నిప్పును ఆరిపోచేసి, లోకమందు నా పెనిమిటికి
నామమైనా శేషమైనా వుంచకపోదురని చెప్పినందున;।
8 రాజు ఆమెతో నీవు నీ యింటికి వెళ్లు; నీ నిమిత్తము
9 ఆజ్ఞ యిప్పింతునని చెప్పినప్పుడు, । తెకోవ వూరి స్త్రీ
రాజుతో అనినదేమంటే, నా యేలినవారైన వొ రాజా,
దోషము నా మీదనున్ను నా తండ్రి యింటిమీద
నున్ను వుండును గాని రాజుకున్ను రాజుయొక్క గద్దె
10 కున్ను దోషము లేక వుండును గాకని చెప్పితే; । రాజు
యెవడైనా నీతో యేమైనా చెప్పితే వాని నా దగ్గిరకు
తెప్పించు, అప్పటినుంచి వాడు నిన్ను ముట్టక వుండు
11 నని ఆమెతో చెప్పెను. । అప్పుడు ఆమె రాజైన మీరు
మీ కర్తయైన యెహోవాను తలంచుకొని, రక్తము
నకు ప్రతి రక్తము వెదకేవారు నా కుమారుని నశింప
చేయకుండా యికను నాశనము చేయనివ్వక వుండవల
యునని చెప్పినందున, అతడు ఆమెను చూచి యెహో
వాయొక్క జీవముతోడు నీ కుమారునియొక్క తలవెం
ట్రుకలలో వొకటయినా భూమి మీద రాలక వుండు
12 నని చెప్పెను. । అప్పుడు ఆ స్త్రీ చెప్పినదేమంటే,
మీరు దయచేసి, మీ సేవకురాలనైన నేను నా యేలి
నవారైన మీతో యింకా వొక మాట చెప్పుకొనుటకు
సెలవు యివ్వవలసినదనగా రాజు చెప్పుమనినందున, ।
13 ఆ స్త్రీ అనినదేమంటే, మీరు దేవునియొక్క జనుల
మీద యీలాగున తలంచితిరేమి? యెందుకంటే తోలి
వేయబడిన మీవాని మీ యింటికి పిలువనంపించక
వుండే రాజైన మీకే దోషము కలిగినట్టుగా మీరు యిది
14 చెప్పితిరి. । యెందుకంటే మనమందరమున్ను మరణమై
పోదుము; భూమిమీద వొలికి తిరిగీ యెత్తలేని నీళ్ల
వలెనే వున్నాము; దేవుడు ప్రాణము తీయక వున్నం
దున తోలివేయబడిన తనవాడు తన యొద్దనుంచి తోలి
వేయబడకుండా సాధనములను యోజిస్తూ వున్నాడు.।
15 అందువల్ల నేను దీని గురించి నా యేలినవారయిన
మీతో చెప్పడానకు వస్తిని, యేమంటే జనులు
నన్ను భయపెట్టిరి; కాబట్టి మీ సేవకురాలనయిన
నేను అనుకొనినదేమంటే, నేను రాజుతో చెప్పుతాను;
రాజు తమ సేవకురాలనైన నా మనవి చొప్పున చేతురు
కాబోలును. । యేమంటే రాజు విని నన్నున్ను నా 16
కుమారునిన్ని దేవుని స్వాస్థ్యములోనుంచి నాశనము
చేయ కోరిన వాని చేతిలోనుంచి తమ సేవకురాలనైన
నన్ను విడిపించునని అనుకొంటిని. । మరిన్ని మీ సేవ 17
కురాలనైన నేను నా యేలినవారైన రాజుయొక్క వా
క్యము విశ్రాంతి కొరకు వుండునని అనుకొంటిని,
యెందుకంటే దేవునియొక్క దూత యేలాగునో
ఆలాగున నా యేలినవారున్ను రాజున్ను అయిన మీరు
యేది మంచిదో యేది చెడ్డదో అది గ్రహించ గల
వారై యున్నారు; కాబట్టి దేవుడైన యెహోవా
మీకు తోడుగా వుండునని చెప్పెను. । అప్పుడు రాజు 18
ప్రత్యుత్తరముగా ఆ స్త్రీతో అనిన మాట, నేను నిన్ను
యేది అడుగుదునో అది నాకు మరుగు చేయవద్దని
పలికినందున, ఆ స్త్రీ నా యేలినవారైన మీరు చెప్పుం
డని చెప్పినప్పుడు, । రాజు దాని చూచి, యిది అంతా 19
యోవాబుచేత అయినదా లేదా! అని అనినప్పుడు, ఆ
స్త్రీ చెప్పినదేమంటే, నా యేలినవారైన వొ రాజా,
మీ ప్రాణముతోడు, నా యేలినవారున్ను రాజున్ను
అయిన మీరు చెప్పిన దానికి కుడికైనా యెడమకైనా
పో గల వాడు వొకడూ లేడు; మీ సేవకుడైన యో
వాబు నాకు బోధించి, యీ మాటలన్నిన్ని మీ సేవ
కురాలనయిన నా నోటికి అందిచ్చెను. । నేను యీ 20
విధమైన పలుకు చెప్పుటకు మీ సేవకుడైన యోవాబు
యిది చేసెను; నా యేలినవారైన మీరు లోకమందున్న
సమస్తము యెరుగడానకు దైవ దూతయొక్క తెలివి
చొప్పున జ్ఞానము గలవారై యున్నారనెను. । అప్పు 21
డు రాజు యోవాబుతో అనినదేమంటే, యిదుగో
నేను యీ కార్యమును చేస్తిని; కాబట్టి నీవు వెళ్లి
పడుచువాడైన అబ్షాలోమును రాచేయుమని చెప్పిన
ప్పుడు; । యోవాబు సాష్టాంగ నమస్కారమున్ను వంద 22
నమున్ను రాజుకు చేసి, రాజైన మీరు మీ సేవకుడ
నైన నా మనవి చెల్లించినందున నేను నా యేలినవా
రైన మీ దృష్టి యెదుట అనుగ్రహము పొందితి
నని నాకు తెలిసి వున్నదనెను. । అప్పుడు యోవాబు 23
లేచి గెషూరుకు వెళ్లి అబ్షాలోమును తీసుకొని, యె
రూశలేముకు వచ్చెను. । అప్పుడు రాజు చెప్పినదేమం 24
టే, వాడు నా దర్శనము చేయక వాడు తన యిం
టికి తిరిగీ వెళ్లవలసినదనినందున, అబ్షాలోము రాజ
దర్శనము చేయక తన యింటికి తిరిగీ వెళ్లెను. ।
అయితే ఇశ్రాయేలు అంతటిలో అబ్షాలోమంత సౌం 25
దర్యము గలవాడు వొకడూ లేడు; అరికాళ్లు మొదలు
కొని శిరోగ్ర పర్యంతమూ యే మొఱ్రి అయినా

26 అతనియందు లేక వుండెను. । అతని తలవెంట్రుకలు
భారముగా వున్నందున ప్రతి సంవత్సరాంతమందు
కత్తిరిస్తూ వుండేవాడు; కత్తిరించినప్పుడు వాటి యెత్తు
రాజు తూనిక ప్రకారము యిన్నూరు తులముల యెత్తు
27 కలదై వుండెను. । అబ్షాలోముకు ముగ్గురు కుమారులు
న్ను వొక కుమార్తెయున్ను పుట్టిరి, దాని పేరు తా
మారు; ఆమె సుందర ముఖము గల స్త్రీ అయి వుండె
28 ను. । అయితే రెండు సంవత్సరములు సంపూర్ణమ
య్యే పర్యంతమూ అబ్షాలోము యెరూశలేములో
29 వుండి, రాజ దర్శనము చేయకుండా వుండెను. । కా
బట్టి అబ్షాలోము యోవాబును రాజుయొద్దికి పంపడా
నకు అతని పిలిచెను; అయితే అతడు అతని యొద్దికి
రాక వుండెను; రెండో మారు పిలిపించినప్పటికిన్ని
30 అతడు రాక వుండెను. । అప్పుడు అబ్షాలోము తన
సేవకులను చూచి, యిదుగో యోవాబుయొక్క పొల
ము నా పొలము దగ్గిర వున్నది; అక్కడ యవల చేలు
గలవు; మీరు వెళ్లి వాటిని కాల్చి వేయండని చెప్పి
నందున, అబ్షాలోముయొక్క సేవకులు ఆ పొలమును
31 కాల్చి వేసిరి. । అప్పుడు యోవాబు లేచి, అబ్షాలో
ము యింటికి వచ్చి అతని చూచి, నీ సేవకులు నా పొల
32 మును కాల్చిరేమని అడిగినప్పుడు, । అబ్షాలోము యో
వాబుతో ప్రత్యుత్తరముగా చెప్పినదేమంటే, యిదు
గో గెషూరునుంచి నేను వచ్చిన ఫలమేమి? అక్కడ
నేను నిలిచి వుండేది మంచిది; నీ చేత రాజుకు చెప్పించే
నిమిత్తమై నిన్ను రాజు యొద్దికి పంపడానకు పిలిస్తిని;
కాబట్టి నాకు రాజు ముఖ దర్శనము చేయించ వల
సినది; నావల్ల తప్పు వుండెనా అతడు నన్ను చంపవ
33 చ్చునని చెప్పినందున; । యోవాబు రాజు యొద్దికి వచ్చి
అతనితో తెలియ చెప్పెను; అప్పుడు అతడు అబ్షా
లోమును పిలువనంపించినందున అతడు రాజు యొద్దికి
వచ్చి, రాజు ముందర సాష్టాంగపడినప్పుడు, రాజు
అబ్షాలోమును ముద్దుబెట్టుకొనెను.

## 15. అధ్యాయము.

1 ఇది అయిన తరువాత అబ్షాలోము తన కొరకు
రథములనున్ను గుర్రములనున్ను తనకు ముందరగా
పరుగెత్తే యాభైమందినిన్ని ఆయత్తము చేయించెను. ।
2 మరిన్ని అబ్షాలోము వుదయమందు త్వరగా లేచి,
పట్టణ ద్వారపు మార్గములో వొకతట్టు నిలిచేటం
దుకు వచ్చెను, యేమంటే వ్యాజ్యము తీర్చబడేటందుకు
రాజు యొద్దికి యెవ్వడైనా వచ్చినప్పుడు, అబ్షాలోము
అతని పిలిచి నీవు యే వూరివాడవు అని అడుగును;
వాడు మీ సేవకుడనైన నేను ఇశ్రాయేలు గోత్రము
3 లలో వొక గోత్రపువాడనని చెప్పినప్పుడు, । అబ్షా
లోము అతని చూచి, నీ కార్యము యిదుగో సరిగా
నున్ను బాగానున్ను వున్నది, అయితేనేమి, నీ సంగతి
వినడానకు రాజువల్ల నియమించబడ్డవాడు వొకడూ
లేడని చెప్పి; । మరిన్ని అబ్షాలోము నేను యీ దేశ 4
మునకు న్యాయాధిపతినైతే మేలై వుండును, అప్పుడు
వ్యాజ్యమైనా నిమిత్తమేమైనా కలిగినవాడు నా యొ
ద్దికి వస్తే నేను వాని కొరకు న్యాయము తీర్తునని
చెప్పెను. । మరిన్ని యెవడయినా అతనికి నమస్కార 5
ము చేసుటకు దగ్గిరకు వస్తే అప్పుడు అతడు తన చెయ్యి
చాపి అతని పట్టుకొని ముద్దుబెట్టుకొనును. । యీ 6
ప్రకారము అబ్షాలోము న్యాయపు తీర్పుకోసము
రాజు యొద్దికి వచ్చిన ఇశ్రాయేలీయులందరికీ చేస్తూ
వున్నవాడై, ఇశ్రాయేలీయులయొక్క హృదయములను
స్వాధీన పర్చుకొనెను. । అయితే నలుబై సంవత్సరములు 7
అయిన తరువాత అబ్షాలోము రాజుతో చెప్పినదేమం
టే, నేను వెళ్లి హెబ్రోనులో యెహోవాకు నా
మొక్కుబడిని తీర్చుకోవడానకు నాకు సెలవు యివ్వ
వలసినది. । యెందుకంటే మీ సేవకుడనైన నేను అరా 8
ములో గెషూరుయందు వున్నప్పుడు యెహోవా
నన్ను తిరిగీ యెరూశలేముకు రప్పించినట్టాయెనా యె
హోవాకు సేవ చేతునని మ్రొక్కుకొంటినని చెప్పి
నప్పుడు, । రాజు అతనితో సుఖముగా వెళ్లుమని సెల 9
వు యిచ్చినందున అతడు లేచి హెబ్రోనుకు వచ్చి
నాడు. । అయితే అబ్షాలోము ఇశ్రాయేలుయొక్క 10
గోత్రములన్నిటి యొద్దికి చొప్పుకాండ్లను పంపి వారి
తో చెప్పినదేమంటే, యెప్పుడు మీరు బాకానాద
ము విందురో అప్పుడు అబ్షాలోము హెబ్రోనులో
యేలుతూ వున్నాడని చెప్పవలెననేదిగా పంపెను. ।
యెరూశలేములోనుంచి పిలువబడిన యిన్నూరు మంది 11
తో కూడా అబ్షాలోము బైలువెళ్లెను; వీరు యేమీ తెలి
యక నిష్కపటముగా వెళ్లినారు. । అప్పుడు అబ్షాలో 12
ము గిలోనీయుడైన అహీతోఫెలు అనే దావీదుయొ
క్క మంత్రిని యితడు బలి చెల్లిస్తూ వుండగా గిలో
అనే అతని పట్టణములోనుంచి పిలిచెను. మరిన్ని
అబ్షాలోము యొద్దనున్న జనులు బహు విస్తరించినం
దున జట్టు బహు బలముగా వుండెను. । అప్పుడు వర్త 13
మానము దావీదుకు వచ్చినదేమంటే, ఇశ్రాయేలీయుల
యొక్క హృదయములు అబ్షాలోముతట్టు వున్న వని
వచ్చెను. । కాబట్టి దావీదు యెరూశలేములో వున్నతన 14
జనులందరితో చెప్పినదేమంటే, లెండి, మనము పారి
పోతేనే గాని అబ్షాలోము ముందరనుంచి తప్పించుకో
లేము; అతడు హఠాత్తుగా వచ్చి, మనలను పట్టి మనకు
కీడుచేసి, కత్తి వాడిచేత పట్టణమును కొట్టకుండా
మనము త్వరగా వెళ్లిపోదామని చెప్పెను. । అప్పుడు 15

రాజుయొక్క సేవకులు చెప్పినదేమంటే, యిదుగో మీ
సేవకులమయిన మేము మా యేలినవారైన రాజు అనే
మీరు చెప్పిన యావత్తూ చేయడానకు సిద్ధమై వున్నా
16 మని చెప్పిరి. । అప్పుడు రాజున్ను అతని యింటివారం
దరున్ను కాలినడకచేత బయిలు వెళ్లిరి; అయితే యిం
టిని భద్రము చేయుడానకు రాజు వుపపత్నులైన పది
17 మంది స్త్రీలను యింట్లో కావు పెట్టెను. । ఆలాగున
రాజున్ను జనులందరున్ను కాలినడకచేత బైలు వెళ్లి,
18 దూరమైన స్థలమునకు వచ్చి నిలిచి వుండిరి. । అయితే
అతని సేవకులందరున్ను అతని యిరు పార్శ్వములగా
నడిచి వచ్చినారు; మరిన్ని కెరేతీయులందరున్ను పెలె
థీయులందరున్ను గాతునుంచి వచ్చిన ఆరునూరు మంది
గిత్తీయులున్ను రాజు ముందుగా వెళ్లుతూ వుండిరి. ।
19 అప్పుడు రాజు గిత్తీయుడైన ఇత్తయిని చూచి, నీవు
మాతోకూడా రావడమేమి! నీవు తిరిగీ రాజు యొద్ద
పోయి వుండు; యేమంటే నీవు పరదేశిగానున్ను యె
రుగనివాడుగానున్ను వున్నావు గనుక నీ స్థలమునకు
20 వెళ్ల వచ్చును. । నిన్న వచ్చిన నీవు యీ వేళ మాతో
కూడా సంచారము చేయు నేల! యెక్కడికి నేను వెళ్ల
గలనో అక్కడికి వెళ్లుటకు వున్నాను గనుక నీవు
తిరిగీ నీ సహోదరులను తీసుకపో; కృపా సత్యములు
21 నీకు తోడుగా వుండును గాకని చెప్పినప్పుడు; । ఇత్త
యి రాజుతో చెప్పినదేమంటే, యెహోవాయొక్క
జీవముతోడు, నా యేలినవారున్ను రాజున్ను అయిన
మీయొక్క జీవముతోడు, యే స్థలమందు నా యేలి
నవారున్ను రాజున్ను అయిన మీరు వుందురో, చావ
డానకో లేక బ్రతకడానకో మీ సేవకుడనైన నేను
22 అక్కడ వుందునని చెప్పినందున; । దావీదు ఇత్తయితో
అనిన మాట; ఆలాగైతే నీవు వెళ్లి దాటుమని చెప్పెను:
కాబట్టి గిత్తీయుడైన ఇత్తయియున్ను అతని వారందరు
న్ను అతని యొద్ద వున్న చిన్నవారందరున్ను దాటి
23 నారు. । అయితే దేశమంతా మహా ధ్వనితో యేడ్చెను;
యీలాగున జనులందరున్ను రాజుతో కూడా కిద్రో
ను గెడ్డ దాటి, జనులందరున్ను అరణ్యమునకు వెళ్లే
24 మార్గమున వెళ్లిరి. । అయితే సాదోకున్ను లేవీయు
లందరున్ను దేవునియొక్క ఫ్రుడంబడికె గల పెట్టెను
మోసుకొని అతని యొద్ద వుండిరి; వారు దేవునియొక్క
పెట్టెను దించినప్పుడు అబ్యాతారు వుక స్థలము మీ
దికి యెక్కి పట్టణములోనుంచి వచ్చినవారందరున్ను
25 దాటే పర్యంతమూ నిలిచెను. । అప్పుడు రాజు సాదో
కుతో చెప్పినదేమంటే, దేవునియొక్క పెట్టెను పట్ట
ణములోకి తిరిగీ తీసుకపో; యెహోవా దృష్టికి నేను
అనుగ్రహము పొందినట్టయితే ఆయన నన్ను తిరిగీ
రప్పించి, దాన్నిన్ని ఆయన కాపురమునున్ను చూచు
టకు దయచేసును. । ఆయన నీవు నాకు అనుకూలడవు 26
కావని అంటే, అందుకు నేను వొప్పివున్నాను; ఆయ
నకు యేది మంచిదో అదే నాకు చేసును గాకని చెప్పి; ।
మరిన్ని రాజు అర్చకుడైన సాదోకుతో చెప్పినదేమం 27
టే, నీవు ప్రదర్శకుడవు కావా! కాబట్టి సుఖముగా
తిరిగి పట్టణమునకు వెళ్లు; మరిన్ని నీ యిద్దరు కుమారు
లు, అనగా, నీ కుమారుడైన అహిమయస్సున్ను అబ్యా
తారుయొక్క కుమారుడైన యోనాతానున్ను వెళ్లవల
సినది. । యిదుగో నీ యొద్దనుంచి నాకు రూఢమైన 28
వర్తమానము వచ్చేపర్యంతమూ నేను అరణ్యపు
మైదాన భూమిలో నిలిచి వుందునని చెప్పినందున, ।
సాదోకున్ను అబ్యాతారున్ను తిరిగీ దేవునియొక్క 29
పెట్టెను యెరూశలేముకు తీసుకవచ్చి, అక్కడ వుం
టూ వుండిరి. । అప్పుడు దావీదు యిప్పకొండ యెక్కు 30
డు మీదికి యేడుస్తూ, తన శిరస్సు కప్పుకొని విడిగా
కాలినడకచేత యెక్కి వెళ్లిపోయినాడు; అతని యొద్ద
నున్న జనులందరున్ను శిరస్సు కప్పుకొని యేడుస్తూ
యెక్కి పోయిరి. । అంతలో వొకడు వచ్చి అహీతో 31
ఫెలు అబ్షాలోముతో కలుసుకొన్న జట్టులో వొకడ
యి వున్నాడని చెప్పెను. అందుకు దావీదు వో యె
హోవా, దయ చేసి అహీతోఫెలుయొక్క ఆలోచన
భ్రష్టు కానిమ్మని చెప్పెను. । అయితే దావీదు కొండ 32
మీదికి వచ్చి యెహోవాకు వందనము చేస్తూ వుండ
గా, యిదుగో అర్కీయుడైన హూషై వస్త్రము చించు
కొని శిరస్సుమీద బుగ్గి పోసుకొని అతనికి యెదురు
గా వచ్చెను. । ఇతనికి దావీదు చెప్పినదేమంటే, నీవు 33
నాతోటి వస్తివట్టాయెనా నాకు భారమై వుందువు; ।
పట్టణమునకు తిరిగి వెళ్లి, అబ్షాలోమును చూచి, వో 34
రాజా, యిప్పటికి మీ తండ్రికి నేను యేలాగునో
ఆలాగున యికను మీకు చేవ చేతునని చెప్పితివట్టా
యెనా, అప్పుడు నీవు నా కొరకు అహీతోఫెలుయొ
క్క ఆలోచన భ్రష్టు చేయగలవాడవౌదువు. । మరిన్ని 35
అక్కడ అర్చకులైన సాదోకున్ను అబ్యాతారున్ను
నీ యొద్దవున్నారే; కాబట్టి రాజు యింట్లో నీకు యేమై
నా వినపడితే అది నీవు అర్చకుడైన సాదోకు తో
టిన్ని అబ్యాతారు తోటిన్ని చెప్పవలసినది. । అదుగో 36
వారిద్దరు కుమారులు, అనగా, సాదోకు కుమారుడైన
అహిమయస్సున్ను అబ్యాతారు కుమారుడైన యోనా
తానున్ను అక్కడ వారి యొద్ద వున్నారు; వారిచేత
మీకు వినపడినదంతా నా యొద్దికి పంపించండని
చెప్పెను. । కాబట్టి దావీదుయొక్క స్నేహితుడైన హూ 37
షై పట్టణమునకు తిరిగీ వచ్చెను; అబ్షాలోమున్ను
యెరూశలేముకు వచ్చెను.

## 16. అధ్యాయము.

1 దావీదు కొండ శిఖరము అవతల కొంచెము దూ
రము వెళ్లిన తరువాత, మెఫీబోషెతుయొక్క సేవకు
డైన సీబా గంతలు కట్టిన రెండు గార్దభములను
తీసుకొని వచ్చెను; వాటిమీద యిన్నూరు రొట్టెలు
న్ను నూరు ద్రాక్ష పండ్ల గెలలున్ను వేసవికాలపు
పండ్లు నూరున్ను ద్రాక్షారసపు తిత్తి వొకటిన్ని వీటిని
2 గార్దభముల మీద వేసెను. । అప్పుడు రాజు సీబా
ను చూచి యివి యెందుకు తెస్తివని అడిగినప్పుడు,
సీబా చెప్పినదేమంటే, యీ గార్దభములు రాజుయొ
క్క యింటివారు యెక్కడానకున్ను రొట్టెలున్ను
వేసవికాలపు పండ్లున్ను పడుచువారు తినడానకున్ను
ద్రాక్షారసము అరణ్యమందు సొమ్మసిల్లినవారు తాగ
3 డానకున్ను అని చెప్పెను. । అప్పుడు రాజు నీ యజ
మానునియొక్క కుమారుడు యిక్కడ వున్నాడని అడ
గగా, సీబా రాజుతో, అడుగో యెరూశలేములో
వున్నాడు; అతడు అనుకొనినదేమంటే, యీ వేళ
ఇశ్రాయేలు యింటివారు నా తండ్రియొక్క రాజ్య
మును నాకు తిరిగీ రాచేతురని అనుకొనెనని చెప్పెను. ।
4 అప్పుడు రాజు సీబాతో అనిన మాట, యిదుగో మె
ఫీబోషెతుకు కలిగినదంతా నీకు కలుగును గాకని చెప్పి
నప్పుడు, సీబా అనిన మాట, నా యేలినవారైన వో
రాజా, మీ దృష్టియందు నేను అనుగ్రహము పొందే
5 టట్టు వినయముగా బతిమాలుకొంటున్నాననెను. । అం
తట రాజైన దావీదు బాహూరీము దగ్గిరకు వచ్చినప్పు
డు, యిదుగో సౌలుయొక్క యింటి కూటములో
గెరాయొక్క కుమారుడైన షిమీ అనే వొకడు బైలు
వచ్చెను; అతడు వస్తూ, వస్తూ, దావీదును శపియిస్తూ
6 వుండెను. । మరిన్ని జనులందరున్ను బలాఢ్యులందరు
న్ను దావీదు యిరుపార్శ్వములను వుండగా, అతడు
రాళ్లు రాజైన దావీదు మీదనున్ను అతని సేవకులందరి
7 మీదనున్ను విసరెను. । యీ షిమీ శపియించినలాగు
యేమంటే, వో నరాంతకుడా, దుర్మార్గుడా, యివ
8 తలకు రమ్ము, రమ్ము. । యెవనికి బదులుగా నీవు యేలితి
వో ఆ సౌలుయొక్క యింటి కూటపు రక్తమంతా
యెహోవా నీ మీద తిరగబడ చేసెను; మరిన్ని యె
హోవా నీ కుమారుడైన అబ్షాలోముయొక్క చేతికి
రాజ్యమును అప్పగించెను; నీవు నరాంతకుడవు గనుక
యిదుగో నీ మోసములో నీవు చిక్కుపడితివని చెప్పి
9 నప్పుడు, । సెరూయా కుమారుడైన అబీషై రాజుతో
అనిన మాట, యీ చచ్చిన కుక్క నా యేలినవారున్ను
రాజున్ను అయిన మిమ్మును శపియించ వచ్చునా? మీకు
అనుకూలమైతే నేను అవతలకు పోయి, వాని శిరస్సును
ఖండించి వస్తానని చెప్పగా; । రాజు అనిన మాట, 10
వో సెరూయాయొక్క కుమారులారా, మీకున్ను నా
కున్ను యేమి? వాడు శపియించనియ్యండి, యేమంటే
యెహోవా దావీదును శపియించుమని వానికి సెలవు
యిచ్చెను; యీలాగున యెందుకు చేస్తివని యెవరు
అడగ గలరని చెప్పి: దావీదు మరిన్ని అబీషైతోనున్ను 11
తన సేవకులందరితోనున్ను చెప్పినదేమంటే, యిదుగో
నా గర్భములోనుంచి పుట్టిన నా కుమారుడు నా
ప్రాణమును వెతుకుతూ వున్నాడు; యీ బెన్యామీ
నీయుడు ఆలాగున చేసేది యెంత గనుక? వాని పోని
వ్వండి; యెహోవా వానికి సెలవు యిచ్చెను గనుక
వాడు శపియించనివ్వండి. । నా దుఃఖమందు యెహో 12
వా దృష్టిని వుంచును, కాబోలును; యీ దినమున వాని
శాపమునకు బదులుగా యెహోవా నాకు మేలు
చేసునని చెప్పెను. । అయితే దావీదున్ను తన వారు 13
న్ను మార్గమున వెళ్లుతూ వుండగా, షిమీ అతనికి
యెదురుగా కొండ పార్శ్వమున వెళ్లెను; వెళ్లగా అతని
మీద రాళ్లు వేస్తూ ధూళి యెగరచేస్తూ వెళ్లెను. ।
అయితే రాజున్ను అతని యొద్దనున్న జనులందరున్ను 14
వొక స్థలమునకు వచ్చి, అలసట తీర్చుకొనిరి. । అయితే 15
అబ్షాలోమున్ను ఇశ్రాయేలీయులందరున్ను యెరూశ
లేముకు వచ్చిరి; మరిన్ని అహీతోఫెలు అతనితో
కూడా వుండెను. । అర్కీయుడైన హూషై అనే దా 16
వీదుయొక్క స్నేహితుడు అబ్షాలోము యొద్దికి వచ్చి
నప్పుడు, హూషై అబ్షాలోమును చూచి, రాజు
జీవించును గాక, రాజు జీవించును గాక అని అనగా:।
అబ్షాలోము హూషైను చూచి, నీ స్నేహితునికి చేసే 17
వుపకారము యిదేనా? నీ స్నేహితునితో కూడా నీవు
వెళ్లక వుంటివేమని అడిగినందున; । హూషై అబ్షా 18
లోముతో చెప్పినదేమంటే, అది కాదు గాని యెవని
యెహోవాయున్ను యీ జనులున్ను ఇశ్రాయేలీయు
లందరున్ను యెంచుదురో నేను అతని వాడనవుదును,
అతని యొద్ద నేను వుందును. । మరిన్ని నేను యెవనికి 19
సేవచేయ వలెను? అతని కుమారుని సముఖమందు సేవ
చేయ వద్దా? మీ తండ్రి సముఖమందు యేలాగునో
ఆలాగున మీ సముఖమందు నేను సేవ చేతునని చెప్పె
ను. । అప్పుడు అబ్షాలోము అహీతోఫెలును చూచి, 20
మీలో మీరు ఆలోచనచేసి, మనము యేమి చేయ
వలసినదో అది మీరు తెలుసుకొని చెప్పండనెను. ।
అప్పుడు అహీతోఫెలు అబ్షాలోముతో అనిన మాట, 21
నీ తండ్రిచేత యింటికి కాపు పెట్టబడిన అతని వుప
పత్నుల యొద్దికి ప్రవేశించు; అందువల్ల నీవు నీ తండ్రి
చేత అసహ్యాపరచబడి వున్నావని ఇశ్రాయేలీయులం
దరున్ను తెలుసుకొన్నందున, నీ యొద్ద వున్న వారం

దరియొక్క చేతులు బలముగా వుండునని చెప్పెను.।
22 కాబట్టి మేడ మీద వారు అబ్షాలోము కొరకు డేరా
వేసినప్పుడు, అతడు ఇశ్రాయేలీయులందరున్ను చూస్తూ
వుండగా తన తండ్రియొక్క వుపపత్నుల యొద్దికి
23 వెళ్లెను. । ఆ దినముల యందు అహీతోఫెలు ఆలోచిం
చిన ఆలోచన దైవవాక్యముచేత వొకడు చేసిన ఆలో
చన అయినట్టుగా వుండెను: యీలాగున అహీతోఫె
లుయొక్క ఆలోచన దావీదుకున్ను అబ్షాలోముకున్ను
వుండెను.

## 17. అధ్యాయము.

1 మరిన్ని అహీతోఫెలు అబ్షాలోముతో చెప్పినదే
మంటే, నీకు అనుకూలమైతే నేను పన్నెండువేల మం
దిని యెంచుకొని లేచి, యీ రాత్రిలోనే దావీదును
2 తరుముదును. । యేమంటే అతడు అలసటగానున్ను
అతని చేతులు బలహీనముగానున్ను వుంటూ వుండగా,
నేను అతని మీద పడి, అతని భయపర్తును; అందున
అతని యొద్ద వున్న జనులందరున్ను పారిపోదురు; ।
3 అప్పుడు రాజును మాత్రమే నేను కొట్టివేసి, జనులం
దరినీ నీ యొద్దికి రప్పింతును; నీవు వెతికే మనిషి పట్ట
బడితే అందరున్ను వచ్చినట్టుగా వుండును; ఆలాగున
4 జనులందరున్ను నిమ్మళముగా వుందురని చెప్పెను.।యీ
బోధ అబ్షాలోముకున్ను ఇశ్రాయేలు పెద్దలందరికిన్ని
5 యుక్తమని అగుపడెను. । అప్పుడు అబ్షాలోము చెప్పిన
దేమంటే, అర్కీయుడైన హూషైని కూడా పిలువండి;
6 అతడు యేమి చెప్పునో అది విందామనెను.। హూషై
అబ్షాలోము యొద్దికి రాగానే అబ్షాలోము అహీతో
ఫెలు యీ ప్రకారముగా పలికి యున్నాడు; అతని
మాట చొప్పున మనము చేయ వచ్చునా? లేక చేయ
7 కూడదా? నీవు చెప్పుమని అతనితో చెప్పగా;। హూషై
అబ్షాలోముతో చెప్పినదేమంటే, అహీతోఫెలు చెప్పిన
8 ఆలోచన యీ సమయమందు మంచిది కాదు. । యెం
దుకంటే నీ తండ్రిన్ని అతని వారున్ను మహా బలా
ఢ్యులయి వున్నారనిన్ని, పిల్లలను పోగొట్టుకొనిన
అడవి వెలుగుబంటి లాగున విసికిన మనస్సుతోటి
వున్నారనిన్ని నీకు తెలుసును: మరిన్ని నీ తండ్రి యు
ద్ధమందు బహు ప్రజ్ఞావంతుడై జనులతో కూడా దిగి
9 వుండడు. । యిదుగో అతడు యేదో వొక గుహాయం
దో లేక మరి వొక స్థలమందో వుండును; కాబట్టి
వారిలో కొందరు కూలి పడినప్పుడు వెంబడిగానే ఆ
సంగతి వినినవారు అబ్షాలోమును వెంబడించిన వారి
10 లో హతము అవుతున్నదని చెప్పుదురు. । అందువల్ల
సింహపు హృదయము వంటి హృదయము గల ధైర్య
వంతుడు సహా కరిగి పోవును, యేమంటే నీ తండ్రి
మహా బలాఢ్యుడనిన్ని అతని యొద్ద వున్నవారు ధైర్య
వంతులనిన్ని ఇశ్రాయేలీయులందరున్ను యెరుగుదురు.।
కాబట్టి నా ఆలోచన యేమంటే, ఇశ్రాయేలీయులం 11
దరున్ను నఖముఖాలా దాను మొదలుకొని బెయే
షెబ మట్టుకు సముద్రపు యిసుక లాగున సమూ
హముగా నీ యొద్దికి కూర్చబడ వలెను; నీవున్ను
యుద్ధమునకు రావలసినది. । అప్పుడు మనము అతడు 12
వుండే స్థలములలో వొక దానియందు అతని మీద
పడుదుము; మంచు భూమి మీద వాలినట్టు అతని
మీదికి మనము వత్తుము; అప్పుడు అతనిలోనున్ను
అతని యొద్ద వున్న వారందరిలోనున్ను వొకడు సహా
వుండక పోవును. । మరిన్ని అతడు వొక పట్టణములోకి 13
చొచ్చినట్టయితే అప్పుడు ఇశ్రాయేలీయులందరున్ను
ఆ పట్టణమునకు తాళ్లు తీసుకొని వచ్చి, వొక చిన్న
రాయి అక్కడ కనపడకుండా దాన్ని నదిలోకి లాగుదు
నని చెప్పెను. । అప్పుడు అబ్షాలోమున్ను ఇశ్రాయేలీ 14
యులందరున్ను అర్కీయుడైన హూషైయొక్క ఆలో
చన అహీతోఫెలు ఆలోచనకంటే యోగ్యమై వున్న
దని పలికిరి; యేమంటే యెహోవా తాను అబ్షాలో
ము మీదికి వుపద్రవము రాచేయుటకై అహీతోఫెలు
యొక్క తగిన ఆలోచన వ్యర్థము చేయడానకు నిర్ణ
యించెను. । అప్పుడు హూషై అర్చకుడైన సాదోకు 15
తోనున్ను అబ్యాతారుతోనున్ను చెప్పినదేమంటే,
అహీతోఫెలు అబ్షాలోముకున్ను ఇశ్రాయేలు పెద్ద
లందరికిన్ని ఆలాగున ఆలోచన యిచ్చినాడు; అయితే
నేను యీలాగున ఆలోచన యిచ్చినాను. । కాబట్టి 16
మీరు త్వరగా కబురు పంపించి, దావీదుతో చెప్పు
మన వలసినదేమంటే, యీ రాత్రిలో అరణ్యముయొ
క్క మైదానపు భూమి యందు వుండక, రాజున్ను
అతని యొద్ద వున్న జనులందరున్ను నశించకుండా,
శీఘ్రముగా దాటుండని చెప్పుమని చెప్పెను. । అయితే 17
యోనాతానున్ను అహిమయస్సున్ను పట్టణములోకి
రావడము అగపడ కూడదనందున ఏన్రోగేలు దగ్గిర
నిలిచి వుండిరి; అప్పుడు వొక చిన్నది వెళ్లి వారితో
వర్తమానము చెప్పినందున వారు వచ్చి రాజయిన
దావీదుతో తెలియ చెప్పిరి. । అయినప్పటికిన్ని వొక 18
చిన్నవాడు వారిని చూచి అబ్షాలోముతో తెలియ
చెప్పెను; అయితే వారిద్దరూ త్వరగా వెళ్లి, బాహూ
రీములో వొకని యింటికి వచ్చిరి; అతని వాకిటిలో
వొక నుయ్యి కలదు; వారు దాని బిలములోకి దిగి
దాగి వుండిరి. । మరిన్ని ఆ యింటి స్త్రీ కప్పు వొకటి 19
తీసుకొవచ్చి, నూతి బిలము మీద పరచి, దానిమీద
నూరిన గోధుమగుండ వేసినందున అది తెలియబడక
పోయెను. । అబ్షాలోముయొక్క సేవకులు ఆ యింటి 20

స్త్రీ యొద్దికి వచ్చి, అహిమయస్సున్ను యోనాతా
నున్ను యెక్కడ వున్నారని అడిగినప్పుడు, ఆ స్త్రీ వారి
తో అనిన మాట, వారు గెడ్డ దాటి పోయినారని
చెప్పెను; వీరు పోయి వారిని వెతికి కానక యెరూశ
21 లేముకు తిరిగీ వచ్చిరి. । అయితే వారు తర్లిన తరు
వాత వీరు నూతిలోనుంచి బయిటికి వచ్చి, దావీదు
యొద్దికి పోయి, నీవు లేచి, త్వరగా నది దాటు, యే
మంటే అహీతోఫెలు నీకు విరోధముగా యీలాగు
22 ఆలోచన చేసినాడని అతనితో చెప్పిరి. । అప్పుడు దా
వీదున్ను అతని యొద్ద వున్న జనులందరున్ను లేచి,
యర్దేను నది దాటిరి; తెల్లవారేటప్పటికి యర్దేను
దాటక వుండిన వాడు వొకడూ లేక వుండెను. ।
23 అహీతోఫెలు తన ఆలోచన చొప్పున చేయ బడక
పోవుటను చూచి, గాడిదె మీద గంతకట్టి యెక్కి,
తన వూరికిన్ని తన యింటికిన్ని వెళ్లి, తన యింటిని
గురించి నిర్ణయము చేసి, వురి బోసుకొని చనిపోయి,
24 తన తండ్రి సమాధిలో పెట్ట పడెను. । అయితే దావీదు
మహనయీముకు వచ్చెను; మరిన్ని అబ్షాలోము ఇశ్రా
యేలీయులందరితో కూడా యర్దేను నది దాటి వచ్చె
25 ను. । మరిన్ని అబ్షాలోము యోవాబుకు బదులుగా
అమాశాను సైన్యాధిపతిగా చేసెను; యీ అమాశా
ఇత్రా అనే పేరుగల ఇశ్రాయేలీయునికి పుట్టెను;
వీడు యోవాబుయొక్క తల్లియైన సెరూయా సహో
దరియైన నాహాషుయొక్క కుమార్తెయైన అబీగయీ
26 లుతోటి పోయెను. । అయితే అబ్షాలోమున్ను ఇశ్రా
27 యేలీయులున్ను గిలాదు దేశములో దిగిరి. । దావీదు
మహనయీముకు వచ్చినప్పుడు అమ్మోను పుత్రులయొ
క్క రబ్బాపట్టణపువాడైన నాహాషుయొక్క కుమారు
డనే షోబీయున్ను లోదెబారు వూరివాడైన అమ్మీయే
లుయొక్క కుమారుడయిన మాఖీరున్ను రోగెలీము
వూరివాడున్ను గిలాదీయుడున్ను అయిన బర్జిల్లయి
28 యున్ను, । పరుపులనున్ను పాత్రలనున్ను కుండలను
న్ను గోధుములనున్ను యవలనున్ను పిండినిన్ని వేచిన
గోధుములనున్ను చిక్కుడుకాయలు మొదలైనటువం
29 టివిన్ని, । తేనెనున్ను వెన్ననున్ను గొర్రెలనున్ను జున్ను
ముద్దలనున్ను యివన్నీ దావీదున్ను అతని యొద్ద
వున్న జనులున్ను తినడానకు తీసుకొవచ్చిరి, యేమం
టే అరణ్యమందు జనులు అలసటతోటిన్ని ఆకలితో
టిన్ని దప్పితోటిన్ని వుందురని వారు అనుకొనిరి.

## 18. అధ్యాయము.

1 అప్పుడు దావీదు తన యొద్ద వున్న జనులను
లెక్కించి, వారి మీద సహస్రాధిపతులనున్ను శతాధి
2 పతులనున్ను నిర్ణయించెను. । మరిన్ని దావీదు జను
లను మూడు భాగములను చేసి, యోవాబు చేతికింద
వొక భాగమునున్ను, సెరూయాయొక్క కుమారుడైన
అబీషై అనే యోవాబు సహోదరుని చేతికింద వొక
భాగమునున్ను, గిత్తీయుడైన ఇత్తయి చేతికింద వొక
భాగమునున్ను వుంచి, నిజముగా నేనున్ను మీతో
కూడా బైలు వెళ్లుదునని జనులతో చెప్పెను. । అందుకు 3
జనులు చెప్పినదేమంటే, నీవు బైలువెళ్ల కూడదు; మేము
పారిపోయినా వారు మమ్మున లక్ష్యపెట్టరు, మాలో
సగము మంది చనిపోయినా వారు మమ్మున లక్ష్యపెట్ట
రు; మాలో పదివేల మందితో నీవు సమానుడవు; కా
బట్టి నీవు పట్టణమందు నిలిచి, మాకు సహాయము
చేయ వలసినదని చెప్పినప్పుడు; । రాజు మీ దృష్టికి 4
యేది మంచివో అది నేను చేస్తాననెను. అప్పుడు
రాజు ద్వారముయొక్క పార్శ్వమందు నిలిచి వుండగా,
జనులందరున్ను నూరేసి మందిగానున్ను వేయ్యేసి మంది
గానున్ను బయిలుదేరిరి. । అప్పుడు రాజు యోవాబు 5
నున్ను అబీషైనిన్ని ఇత్తయినిన్ని చూచి, నా నిమిత్తమై
పడుచువాడైన అబ్షాలోము యెడల మృదువుగా ప్రవ
ర్తించండి అని ఆజ్ఞాపించెను. మరిన్ని రాజు అబ్షా
లోమును గురించి అధిపతులందరికి యిచ్చిన ఆజ్ఞను
జనులందరు వినిరి. । యీలాగున జనులు ఇశ్రాయేలీ 6
యులకు యెదురుగా బయిటి భూమికి వచ్చిరి; యుద్ధ
ము ఎఫ్రయీము అడవిలో కలిగి వుండెను. । అక్కడ 7
ఇశ్రాయేలీయులు దావీదు సేవకుల ముందర నరకప
డిరి; అక్కడ ఆ దినమున యిరువై వేల మంది హతిసెం
దిరి. । యేమంటే అక్కడ యుద్ధము ఆ దేశమందున 8
అంతటా వ్యాపించెను; మరిన్ని కత్తికంటే అడవి అనే
కులను నాశనము చేసెను. । అయితే అబ్షాలోము వేస 9
డము మీద యెక్కి వెళ్లుతూ దావీదుయొక్క సేవకు
లకు యెదురాయెను; అయితే వేసడము పెద్ద ఆలచెట్టు
యొక్క చిక్కనైన కొమ్మలకు కిందుగా వెళ్లినప్పుడు
అతని తల ఆల చెట్టుకు తగులుకొనినందున అతడు
యెత్తపడి ఆకాశమునకున్ను భూమికిన్ని మధ్యను
వ్రేలాడుతూ వుండెను; అతని కింద వున్న వేసడము
వెళ్లిపోయెను. । అయితే వొకడు అది చూచి వచ్చి; 10
యోవాబుతో తెలియ చెప్పినదేమంటే, యిదుగో
అబ్షాలోము ఆల చెట్టున వ్రేలాడేది నేను చూస్తిని
అని చెప్పెను. । అప్పుడు యోవాబు తనతో చెప్పిన 11
వాని చూచి, యిదుగో నీవు చూస్తివి, భూమి మీద
పడేటట్టు నీవు అతని కొట్టకపోతివేమి? కొట్టితే నీకు
పది తులముల వెండిన్ని వొక మొలతాడున్ను యిత్తు
నని చెప్పినప్పుడు; । ఆ మనుష్యుడు యోవాబుతో 12
అనిన మాట, వెయి తులముల వెండి నా అరిచేతికి
వచ్చినప్పటికైనా రాజ కుమారుని మీద నా చెయ్యి

చాపను; యేమంటే పడుచువాడైన అబ్షాలోమును
యెవడైనా ముట్టకుండా భద్రముగా వుండండని రాజు
నీకున్ను అబీషైకిన్ని ఇత్తయికిన్ని యిచ్చిన ఆజ్ఞను మేము
13 వింటిమి. । నేను ఆలాగున చేస్తినా నా ప్రాణమునకు
విరోధముగా నేను అబద్ధము చేసుకొందును, యేమం
టే రాజుకు మరుగుగా వుండేది వొకటీ లేదు; మరిన్ని
14 నీవే నాకు విరోధివై వుందువని చెప్పగా: । యోవాబు
అతనితో నీ యొద్ద నేను నిలువ కూడదని పలికి, మూ
డు బల్లెములు చేత పట్టుకొని వెళ్లి, ఆల చెట్టులో
యింకా జీవించియున్న అబ్షాలోముయొక్క గుండె
15 లో పొడిచెను. । మరిన్ని యోవాబుయొక్క ఆయుధ
ములనుమోసే పడుచువాండ్లు పది మందిన్ని చుట్టు
16 కొని, అబ్షాలోమును కొట్టి చంపివేసిరి. । అప్పుడు
యోవాబు బాకా వూదించినందున ఇశ్రాయేలీయులను
తరమ పోయిన జనులు తిరిగీ వచ్చిరి, యేమంటే యో
17 వాబు జనులను వెనుకకు వుంచెను. । తరువాత వారు
అబ్షాలోమును తీసి, అడవిలో వున్న గొప్ప గోతిలో
అతని పడవేసి, అతనిమీద రాళ్లను గొప్ప కుప్పగా
వేసిరి: అప్పుడు ఇశ్రాయేలీయులందరున్ను తమ తమ
18 యిండ్లకు వెళ్లిరి. । అయితే అబ్షాలోము తాను బ్రతికి
వున్నప్పుడు వొక స్తంభమును తెచ్చి తన కొరకు యెత్తిం
చెను; అది రాజు లోవలో వున్నది, యెందుకంటే నా
నామము జ్ఞాపకము వుంచుకొనుటకు నాకు కుమారు
డు లేడని అనుకొని, అతడు ఆ స్తంభమును తన పేరట
పిలిచెను, అది నేటి వరకు అబ్షాలోము స్థలము అని
19 పిలువబడి యున్నది. । అప్పుడు సాదోకు కుమారుడైన
అహిమయస్సు పలికినదేమంటే, నేను పరుగెత్తి, యె
హోవా అతని శత్రువుల మీద అతని పగ యేలా
గున తీర్చెనో ఆ వర్తమానము రాజుతోను చెప్పు
20 దునని చెప్పగా; । యోవాబు యీ దినమున నీవు వర్త
మానములతో వెళ్ల కూడదు; మరి వొక దినమున నీవు
వెళ్ల వచ్చును; రాజు కుమారుడు మరణమైనాడు గనుక
యీ దినమున వర్తమానములతో వెళ్ల కూడదని అత
21 నితో చెప్పెను. । అయితే యోవాబు కూషీని చూచి,
నీవు వెళ్లి నీవు చూచినది రాజుతో తెలియ చెప్పుమని
చెప్పినప్పుడు, కూషీ యోవాబును వందనముచేసి పరు
22 గెత్తి పోయెను. । తిరుగా సాదోకు కుమారుడైన అహి
మయస్సు అయితేనేమి కూషీ వెనుక నేను పరుగెత్తి
వెళ్లుటకు సెలవు యిమ్మని యోవాబుతో చెప్పినప్పుడు,
యోవాబు నా కుమారుడా యెందుకు వెళ్లుతావు!
చెప్పడానకు నీ యొద్ద శుభసమాచారములు లేవని అత
23 నితో అనినప్పుడు; । అయితేనేమి నేను పరుగెత్తి వెళ్లు
టకు సెలవు యిమ్మని అడిగినందున, అతడు అతనితో
పరుగెత్తి పొమ్మని చెప్పెను; అప్పుడు అహిమయస్సు
మయిదానపు భూమితట్టు పరుగెత్తి కూషీకంటే ముం
దుగా పోయెను. । దావీదు రెండు ద్వారముల మధ్యను 24
కూర్చుండి వుండెను; మరిన్ని కాపరి ద్వారము పైగోడ
మీదికి యెక్కి కండ్లెత్తి పార చూచినప్పుడు; అడుగో
వంటరిగా పరుగెత్తి వస్తూవున్న వొకని చూచి, బొబ్బ
యెత్తి రాజుతో తెలియ చెప్పెను. । అందుకు రాజు 25
వాడు వంటరిగా వుంటే వాని నోట వర్తమానములు
గలవని చెప్పెను; అప్పుడు వాడు వేగిరమే చేరుతూ
వుండెను. । తరువాత కాపరి పరుగెత్తివచ్చే మరి వొకని 26
చూచి, ద్వారపాలకుని పిలిచి, అడుగో మరియొకడు
వంటరిగానే పరుగెత్తి వస్తూ వున్నాడు అని చెప్పిన
ప్పుడు, రాజు వాడున్ను వర్తమానములతో వస్తూ
వున్నాడని చెప్పెను. । అప్పుడు కాపరి మొదటి వాని 27
యొక్క పరుగు సాదోకు కుమారుడైన అహిమయస్సు
యొక్క పరుగులాగు వున్నదని నాకు తోస్తుందని
చెప్పగా, రాజు వాడు మంచివాడు, శుభసమాచార
ములతోనే వస్తూ వున్నాడని చెప్పెను. । అప్పుడు 28
అహిమయస్సు బొబ్బ యెత్తి క్షేమమని రాజుతో
చెప్పి, రాజు ముందర సాష్టాంగ నమస్కారము చేసి
పలికినదేమంటే, నా యేలినవారున్ను రాజున్ను అయిన
మీ మీద చెయ్యి యెత్తినవాండ్లను అప్పగించిన మీ
యొక్క దేవుడైన యెహోవాకు స్తోత్రము కలుగును
గాకని పలికినప్పుడు; । రాజు అతని పడుచువాడైన 29
అబ్షాలోము బాగా వున్నాడా అని అడిగెను; అందు
కు అహిమయస్సు యోవాబు రాజైన మీ సేవకునిన్ని
మీ సేవకుడయిన నన్నున్ను పంపినప్పుడు గొప్ప గల్ల
త్తు నాకు కనపడెను, అది యేమిటో నాకు తెలిసినది
కాదని చెప్పెను. । అప్పుడు రాజు వారితో నీవు అటు 30
తిరిగి నిలువుమనినందున వాడు అటు తిరిగి నిలిచెను. ।
అప్పుడు కూషీ వచ్చి చెప్పినదేమంటే, వో నా యేలి 31
నవారైన రాజా, శుభ సమాచారములను తీసుక వస్తిని,
యేమంటే యీ దినమున యెహోవా మీ మీదికి
లేచిన వారందరి మీద పగ తీర్చెనని చెప్పినప్పుడు; ।
రాజు కూషీని చూచి, పడుచువాడైన అబ్షాలోము 32
బాగా వున్నాడా అని అడిగినప్పుడు, కూషీ చెప్పిన
దేమంటే, నా యేలినవారున్ను రాజున్ను అయిన మీ
యొక్క శత్రువులున్ను మీకు మోసము చేసుటకు మీ
మీదికి లేచినవారందరున్ను ఆ పడుచువాడు యేలాగు
వున్నాడో ఆలాగు వుందురు గాకని చెప్పినందున; ।
రాజు మిక్కిలీ చింతాక్రాంతుడై, ద్వారము పైనున్న 33
గదికి యెక్కి పోయి యేడ్చెను; మరిన్ని యెక్కిపో
తూ అతడు వో నా కుమారుడైన అబ్షాలోమా, వో
నా కొడుకా, అబ్షాలోమునే నా కుమారుడా, నేను

యేల మరణము కాకపోతిని! హా నా కొడుకా,
అబ్షాలోమనే నా కుమారుడా, అని యేడ్చెను.

## 19. అధ్యాయము.

1 అప్పుడు అడుగో రాజు అబ్షాలోము నిమిత్తము
దుఃఖిస్తూ యేడుస్తూ వున్నాడని యోవాబుకు చెప్ప
2 బడెను. । అయినందున ఆ దినమున జయము జనులంద
రికీ దుఃఖమునకు తిప్పబడెను, యేమంటే రాజు తన
కుమారుని నిమిత్తము చింతాక్రాంతుడై వున్నాడని
3 జనులందరికి ఆ దినమున వినపడెను. । కాబట్టి యుద్ధ
మందు పారిపోయిన జనులు సిగ్గుచేతను చాటుగా
యేలాగున వత్తురో ఆలాగున ఆ దినమున జనులు చా
4 టుగా పట్టణములో ప్రవేశించిరి. । అయితే రాజు తన
ముఖమును కప్పుకొని, మహా శబ్దముతోటి హా అబ్షా
లోమనే నా కుమారుడా, హా అబ్షాలోమా, నా
కొడుకా, నా కొడుకా, అని యేడుస్తూ వుండెను. ।
5 అప్పుడు యోవాబు యింట్లో వున్న రాజు యొద్దికి
వచ్చి చెప్పినదేమంటే, నీ ప్రాణమునున్ను నీ కుమారుల
కుమార్తెలయొక్క ప్రాణములనున్ను నీ భార్యలయొ
క్క ప్రాణములనున్ను నీ వుపపత్నులయొక్క ప్రాణ
ములనున్ను యీ దినమున రక్షించిన నీ సేవకులందరి
యొక్క ముఖములను నీవు యీ దినమున సిగ్గుపరచి, ।
6 నీ స్నేహితులకంటే నీ శత్రువులయందు ప్రియము
చేస్తివి, యేమంటే యీ దినమున అధిపతులున్ను సేవకు
లున్ను నీకు అక్కర లేదని చూపించితివి, యేమంటే
అబ్షాలోము బ్రతికి వుండి మేమందరమున్ను చనిపో
యి వుంటే నీ దృష్టికి బాగా వుండునని యీ దినమున
7 నాకు అగుపడినది. । కాబట్టి నీవు యిప్పుడు లేచి బైలు
దేరి, నీ సేవకులయొక్క హృదయమునకు తగినట్టుగా
మాట్లాడు; యేమంటే నీవు బయిలు వెళ్లక వుంటే,
యీ రాత్రి నీ యొద్ద వుండేవాడు వొకడున్ను లేక
పోవునని యెహోవా పైని ప్రమాణము జేసి నేను
చెప్పుతున్నాను; నీ బాల్యమునుంచీ నేటి వరకు నీకు
ప్రాప్తించిన కీళ్లు అన్నిటికంటే యిది చెడ్డదిగా వుం
8 డునని చెప్పినందున; । రాజు లేచి వచ్చి ద్వారమందు
కూచుండి వుండెను; అప్పుడు అడుగో రాజు ద్వార
మందు కూచుండి వున్నాడని జనులందరికీ చెప్పబ
డెను; అప్పుడు జనులందరున్ను రాజు సన్నిధికి వచ్చిరి;
అయితే ఇశ్రాయేలీయులు తమ తమ యిండ్లకు పారి
9 పోయిరి. । మరిన్ని ఇశ్రాయేలు గోత్రములలో జను
లందరున్ను వాదించుకొనినదేమంటే, రాజు మన శత్రు
వుల చేతిలోనుంచిన్ని ఫిలిష్తీయుల చేతిలోనుంచిన్ని
మనలను విడిపించెను; అయితే అతడు అబ్షాలోము
నిమిత్తమై దేశములోనుంచి పారిపోయి వున్నాడు. ।
మన మీద మనము అభిషేకించిన అబ్షాలోము యుద్ధ 10
ములో మరణమాయెను; కాబట్టి రాజును తిరిగీ తీసు
కొని రావడమును గురించిన మాట చెప్పకోక పోతి
రేమని అనుకొనిరి. । అంతలో రాజైన దావీదు అర్చ 11
కులైన సాదోకుకున్ను అబ్యాతారుకున్ను వర్తమానము
పంపినదేమంటే, మీరు యూదా పెద్దలతో చెప్ప వల
సినదేమంటే, రాజు అతని యింటికి తిరిగీ తీసుకొని
రావడానకు మీరు వెనుక అయినారేమి? యేమంటే
ఇశ్రాయేలీయులందరియొక్క పలుకు రాజు యొద్దకు
న్ను రాజు యింటి యొద్దకున్ను వచ్చెను. । మీరు నా 12
సహోదరులున్ను నా శల్య మాంస సంబంధికులున్ను
అయి వుండగా, రాజును తిరిగీ తీసుకొరావడానకు
మీరు యెందుకు వెనుక అయితిరి? । మరిన్ని అమాశా 13
తో చెప్పవలసినదేమంటే, నీవు నా శల్య మాంసముల
సంబంధికుడవు కావా? నీవు యోవాబుకు బదులుగా
నా యెదుట సదాకాలము సైన్యాధిపతివి కాకపోతే
దేవుడు ఆలాగుననున్ను అంతకంటే అధికముగానున్ను
నాకు చేసును గాకని చెప్పండనెను. । యిందుచేత 14
అతడు యూదావారియొక్క హృదయములను వొక
మనిషియొక్క హృదయమైనట్టు లోపు చేసుకొనెను;
అయినందున వారు రాజుయొద్దికి వర్తమానము పంపి
నదేమంటే, మీరున్ను మీ సేవకులందరున్ను తిరిగీ
వత్తురు గాకని పలికిరి. । కాబట్టి రాజు తిరిగీ యర్దా 15
ను నది యొద్దికి వచ్చెను; మరిన్ని యూదావారు రాజును
యెదుర్కొనుటకున్ను రాజును యర్దాను నది యివత
లకు తీసుకొని రావడానకున్ను గిల్గాలుకు వచ్చిరి. ।
అంతలో బాహూరీములో వున్న బెన్యామీనీయుడైన 16
గెరాయొక్క కుమారుడైన షిమీ త్వరపడి, రాజైన దా
వీదును యెదుర్కోవడానకు యూదావారితో కూడా
వచ్చెను. । అతని యొద్ద వెయిమంది బెన్యామీనీయులు 17
వుండిరి; మరిన్ని సౌలుయొక్క యింటికి సేవకుడైన
సీబాయున్ను అతని కుమారులు పదిహేను మందిన్ని
అతని సేవకులు యిరువై మందిన్ని అతనితో కూడా
వుండిరి; వీరు రాజుకు యెదురుగా యర్దాను నది దా
టిరి. । అయితే రాజు యింటిల్లి పాదినిన్ని అవతలకు 18
దాటించుటకున్ను రాజు దృష్టికి యేది అనుకూలమో
అది చేయుటకున్ను రేవు పడవ యివతలకు వచ్చెను;
అంతట గెరా కుమారుడైన షిమీ వచ్చి రాజు య
ర్దాను నది దాటి పోగానే అతనికి సాష్టాంగపడి
చెప్పినదేమంటే; । హా నా యేలినవారా, నా అక్ర 19
మము నా యందు యెంచవద్దు; నా యేలినవారున్ను
రాజున్ను అయిన మీరు యెరూశలేమును విడచిన
వేళ యందు మీ సేవకుడనైన నేను వంకర బుద్ధిగా
చేసిన దాని యందు మీరు జ్ఞాపకము వుంచుకొని

20 విచారపడకండి. । యేమంటే నేను పాపము చేస్తినని
యెరుగుదును; కాబట్టి యిదుగో యోసేపు యింటి
కాండ్లందరిలో నేను నా యేలినవారున్ను రాజున్ను
అయిన మిమ్మును యెదుర్కోవడానకు ముందుగా వస్తి
21 నని చెప్పెను. । అయితే సెరూయాయొక్క కుమారు
డైన అబీషై అనిన మాట, యెహోవా అభిషేకించి
నవాని శపియించిన యీ షిమీ మరణమును పొంద
22 వద్దా అని చెప్పెను. । అయితే అందుకు దావీదు అని
నదేమంటే, సెరూయాయొక్క కుమారులారా, యీ
వేళ మీరు నాకు విరోధులౌటకు మీకున్ను నాకున్ను
యేమి? ఇశ్రాయేలులో యెవడైనా యీ దినమున
మరణమును పొందవచ్చునా? యిప్పుడు నేను ఇశ్రా
యేలు మీద రాజునని నాకు తెలిసి వున్నదే అని
23 చెప్పెను. । కాబట్టి రాజు షిమీని చూచి నీవు మరణ
ము కాక వుందువని చెప్పి, అతనికి ప్రమాణమిచ్చెను. ।
24 మరిన్ని సౌలుయొక్క కుమారుడైన మెఫీబోషెతు రా
జును యెదుర్కొనుటకు వచ్చెను; అతడు రాజు తర్లి
పోయిన దినము మొదలుకొని అతడు సుఖముగా
వచ్చిన నాటి వరకు కాళ్లు కడగక గడ్డము కత్తిరించు
25 కోక బట్టలు వుతికించక వుండెను. । అతడు రాజును
యెదుర్కోవడానకు యెరూశలేముకు వచ్చినప్పుడు
సంభవించినదేమంటే, రాజు అతని చూచి, వౌ మెఫీ
బోషెతా, నీవు నాతో కూడా రాక పోతివేమని
26 అడిగినప్పుడు; । అతడు చెప్పినదేమంటే, నా యేలిన
వారైన వౌ రాజా, నా సేవకుడు నన్ను వంచించినా
డు; మీ సేవకుడనైన నేను కుంటివాడను గనుక నేను
గాడిదెమీద గంత కట్టించి యెక్కి, రాజు యొ
27 ద్దికి వెళ్లుతాను అని అనుకొని చెప్పితిని. । మరిన్ని అత
డు మీ సేవకుడనైన నన్ను గురించి నా యేలినవా
రున్ను రాజున్ను అయిన మీతోటి అబద్ధము పలికి
నాడు; అయితే నా యేలినవారున్ను రాజున్ను అయిన
మీరు దేవ దూతలాగున వున్నారు; కాబట్టి మీ
28 దృష్టికి యేది మంచిదో అది చేతురు గాక. । యేమంటే
నా తండ్రి యింటి కాండ్లందరున్ను నా యేలినవా
రున్ను రాజున్ను అయిన మీ యెదుట చచ్చినవారి
లాగున వున్నప్పటికిన్ని మీరు మీ భోజనపు బల్లమీద
భోజనము చేసేవారిలో మీ సేవకుడనయిన నన్ను వుం
చితిరి. కాబట్టి యికను నేను రాజైన మీకు మొర్ర
29 బెట్టుట నాకు న్యాయమేమని చెప్పినప్పుడు; । రాజు
అతనితో అనిన మాట, నీ సంగతులను గురించి యికను
చెప్పనేల? నీవున్ను సీబాయున్ను భూమిని పంచుకొం
30 డని చెప్పినప్పుడు; । మెఫీబోషెతు రాజుతో నా యే
లినవారున్ను అయిన మీరు మీ యింటికి సుఖముగా
తిరిగి వస్తిరి గనుక అతడు అంతా పుచ్చుకోవచ్చునని

చెప్పెను. । మరిన్ని గిలాదీయుడైన బర్జిల్లయి య 31
ర్దేను నది యివతలకు రాజును తీసుకొని రావడానకు
రోగెలీము వూరినుంచి వచ్చి, అతనితో కూడా య
ర్దేను నది దాటెను. । అయితే బర్జిల్లయి మిక్కిలి 32
ముసలివాడై, అనగా, యెనభై సంవత్సరముల వయస్సు
గలవాడై వుండెను; మరిన్ని అతడు బహు భాగ్యవం
తుడైనందున రాజు మహనయీములో వున్నప్పుడు
అతనికి పోషణ చేస్తూ వుండెను. । రాజు బర్జిల్లయి 33
తో చెప్పినదేమంటే, నిన్ను నేను యెరూశలేములో
నా యొద్ద వుంచి పోషింతును, నాతో కూడా నీవు
దాటవలెనని చెప్పినప్పుడు; । బర్జిల్లయి రాజైన మీతో 34
కూడా యెరూశలేములోకి వచ్చేటందుకు యికను
నేను యెన్ని దినములు బ్రతుకుదును? । నేటికి నాకు 35
యెనభై సంవత్సరములు అయినవి; మేలు కీళ్లలో కలి
గిన భేదమును నేను కన గలనా? తినే తాగే వాటి
యొక్క రుచి మీ సేవకుడనైన నేను చూడ గలనా!
గాయకులయొక్క గాయకురాండ్లయొక్క శబ్దమును
నేను వినగలనా? కాబట్టి మీ సేవకుడనైన నేను నా
యేలినవారున్ను రాజున్ను అయిన మిమ్మును భారము
పెట్టనేల? । మీ సేవకుడనైన నేను రాజైన మీతోటి 36
యర్దేను నది దాటి అవతలకు కొంత దూరము వస్తాను;
అయితే రాజైన మీరు నాకు అంత ప్రత్యుపకారము
చేయనేల! । నేను నా పట్టణమందు మరణమై, నా 37
తల్లిదండ్రుల సమాధిలో పెట్టబడేటట్టుగా తిరిగీ వెళ్ల
డానకు మీ సేవకుడనైన నాకు సెలవు యివ్వ వలసి
నది. అయితే యిదుగో మీ సేవకుడైన కింహాము;
నా యేలినవారున్ను రాజున్ను అయిన మీతో వీని
దాటనివ్వండి, అప్పుడు మీ దృష్టికి యేది మంచిదో
అది చేతురు గాకని చెప్పెను. । అప్పుడు రాజు చెప్పి 38
నదేమంటే, కింహాము నాతో కూడా దాటును; నీ
దృష్టికి యేది మంచిదో అది వానికి నేను చేతును;
మరిన్ని నావల్ల నీవు కోరినదంతాను నేను చేతునని
చెప్పెను. । అప్పుడు జనులందరున్ను యర్దేను నది 39
దాటిరి; మరిన్ని రాజు యివతలకు వచ్చినప్పుడు, రాజు
బర్జిల్లయిని ముద్దుబెట్టుకొని, ఆశీర్వదించిన తరువాత
అతడు తన స్థలమునకు తిరిగీ వెళ్లెను. । అప్పుడు రాజు 40
గిల్గాలుకు వచ్చెను; కింహాము అతనితో కూడా వచ్చె
ను; మరిన్ని యూదావారందరున్ను ఇశ్రాయేలీయు
లలో సగము మందిన్ని రాజును తీసుకొవచ్చిరి. । అయితే 41
ఇశ్రాయేలీయులందరున్ను రాజు యొద్దికి వచ్చి చెప్పిన
దేమంటే, మా సహోదరులైన యూదావారు మిమ్మును
దొంగిలించుకొని మిమ్మునున్ను మీ యింటిల్లిపాదినిన్ని
దావీదు అనే మీ వారినిన్ని యర్దేను యివతలకు
తీసుక వచ్చిరేమని పలికినప్పుడు; । యూదావారంద 42

రున్ను ఇశ్రాయేలీయులకు ప్రత్యుత్తరముగా చెప్పిన
దేమంటే, రాజు మాకు సమీప బంధువుడై వుండగా
మీరు యెందుకు కోపపడుతారు? రాజు సొమ్ము యే
మైనా మేము తింటిమా? అతడు మాకు యే కానుక
43 అయినా యిచ్చెనా అని పలికిరి. । అందుకు ఇశ్రాయే
లీయులు యూదావారితో ప్రత్యుత్తరముగా చెప్పిన
దేమంటే, రాజులో పది భాగములు మాకు కలవు;
మీకంటే మేము దావీదు యందు అధికము గలవారమై
యున్నాము; రాజును తిరిగీ తీసుకొని వచ్చే నిమిత్తము
మాతో ముందుగా ఆలోచన చేయక మమ్మును నిర్ల
క్ష్యము చేసితిరేమని, యీలాగున చెప్పినప్పటికిన్ని
యూదావారియొక్క మాటలు ఇశ్రాయేలీయుల మా
టలకంటే కఠినమై యుండెను.

## 20. అధ్యాయము.

1 అయితే షెబా అనే పేరుగల వొక దుర్మార్గు
డు అక్కడ వుండుట సంభవించెను; వాడు బెన్యా
మీనీయుడైన బిక్రియొక్క కుమారుడు; వాడు బాకా
వూది ప్రకటన చేసినదేమంటే, దావీదులో మనకు
భాగము లేదు, యెష్షయియొక్క కుమారుని యందు
మనకు స్వాతంత్ర్యము యెంతమాత్రమూ లేదు; వో
ఇశ్రాయేలీయులారా, మీరందరున్ను మీ మీ కాపుర
2 ములకు రండని పలికినందున; । ఇశ్రాయేలీయులలో
ప్రతిమనిషీ దావీదును విడచి, బిక్రియొక్క కుమారు
డైన షెబాను వెంబడించెను; అయితే యూదావారు
యర్దేను నది మొదలుకొని యెరూశలేము మట్టుకు
3 తమ రాజుతో కలుసుకొని వుండిరి. । అంతట దావీదు
యెరూశలేములో తన యింటికి వచ్చెను; అప్పుడు
రాజు యింటికి కాపరులగా తాను వుంచిన తన వుప
పత్నులైన పదిమంది స్త్రీలను తీసి, బందీగృహములో
వుంచి పోషిస్తూ వుండెను; యింతే కాని లోపల వారి
యొద్దికి రాక వుండెను; యీలాగున వారు దానియందు
ముయ్యబడి బ్రతికినంత మట్టుకు విధవరాండ్లయినట్టు
4 వుండిరి. । అప్పుడు రాజు అమాశాతో చెప్పినదేమంటే,
నీవు మూడు దినములలో నా దగ్గిరకు యూదావారి
నందరినీ కూర్చి నీవున్ను యిక్కడ వుండుమని ఆజ్ఞా
5 పించెను. । కాబట్టి అమాశా యూదావారిని కూర్చ
డానకు వెళ్లెను; అయితే అతడు ఆలస్యము చేసినందున
అతనికి నిర్ణయించిన కాలము మీరినప్పుడు దావీదు
6 అబీషైతో చెప్పినదేమంటే, । యిప్పుడు బిక్రియొక్క
కుమారుడైన షెబా అబ్షాలోముకంటే మనకు యెక్కువ
హింస చేసును; కాబట్టి నీవు నీ యేలినవారమైన మా
యొక్క సేవకులను తీసుకొని, వాడు ప్రాకారములు
గల పట్టణములలో చొచ్చి మనకు దొరకక పోవు
నేమో గనుక వాని తరుముమని ఆజ్ఞాపించెను. । కాబట్టి 7
అతని వెనుకనుంచి యోవాబువారున్ను కెరేతీయులు
న్ను పెలెతీయులున్ను బలాఢ్యులందరున్ను బైలు వెళ్లిరి;
బిక్రియొక్క కుమారుడైన షెబాను తరమడానకు వారు
యెరూశలేములోనుంచి బయిలు వెళ్లిరి. । వారు గిబోను 8
లో వున్న పెద్ద రాతి దగ్గిరకు రాగానే, అమాశా వారికి
ముందుగా వెళ్లెను; అయితే యోవాబు తాను తొడుగు
కొనిన చొక్కా బిగించుకొని యుండెను; దానిమీద
మొలతాడు వుండెను; మొలతాడుమీద వరగల కత్తి
కట్టపడెను; అయితే అతడు యివతలకు రాగానే కత్తి
వరలోనుంచి కింద పడెను. । అప్పుడు యోవాబు అమా 9
శాను చూచి, నా సహోదరుడా, బాగా వున్నావా
అని అమాశాను ముద్దు పెట్టుకొనేలాగున కుడి చేతితో
అతని గడ్డము పట్టుకొనెను. । అయితే అమాశా యో 10
వాబు చేతిలో వున్న కత్తిని గూర్చి జాగ్రత పడక
పోయినందున అతడు అతని పక్కటెముకలలో అయి
దో దాని గుచ్చి, రెండో మారు గుచ్చకుండా పేగు
లను భూమిమీద పడేటట్టు చేసినందున అతడు చని
పోయెను. అప్పుడు యోవాబున్ను అతనియొక్క
సహోదరుడైన అబీషైయున్ను వెళ్లి బిక్రియొక్క
కుమారుడైన షెబాను తరిమిరి. । అయితే యోవాబు 11
వారిలో వొకడు అతని దగ్గిర నిలిచి, యోవాబు పక్ష
మందున్ను దావీదు పక్షమందున్ను యెవరెవరు వున్నా
రో వారు యోవాబును వెంబడింతురు గాకని ప్రక
టన చేసెను. । అయితే అమాశా తన రక్తములో పొర్లి 12
మార్గ మధ్యమందు పడి వుండెను; అయితే ఆ మను
ష్యుడు అతని యొద్దకు వచ్చిన జనులందరున్ను నిలువ
బడి వుండుటను చూచినప్పుడు, అతడు అమాశాను
మార్గములోనుంచి తీసి పొలములో వేసి, అందరున్ను
వచ్చి వూరికె నిలుతురని బట్టతోటి అతని కప్పివేసె
ను. । అతడు మార్గములోనుంచి తియ్యపడినప్పుడు 13
జనులందరున్ను బిక్రియొక్క కుమారుడైన షెబాను
తరమడానకు యోవాబు వెంబడిని వెళ్లిరి. । మరిన్ని 14
అతడు ఇశ్రాయేలు గోత్రములన్నిటినీ దాటి వెళ్లి ఆబే
లుకున్ను బేత్మయకాకున్ను బెరీయులందరి యొద్దికిన్ని
వచ్చెను; వారు కూడుకొని అతని వెంబడించిరి. । యీ 15
లాగున వారు వచ్చి ఆబేలు బేత్మయకాలో వాని ము
ట్టడివేసి, పట్టణము దగ్గిర కందకము యెదుట బురుజు
కట్టిరి; యోవాబు యొద్ద వున్నవారందరున్ను ప్రాకా
రమును పడవేయడానకు దాని కొట్టిరి. । అప్పుడు వొక 16
బుద్ధిశాలిని పట్టణములోనుంచి వచ్చి బొబ్బపెట్టినదేమం
టే, వొహో వినండి, నేను మాట్లాడేటందుకు యో
వాబును యిక్కడికి పిలువండని చెప్పెను. । అతడు 17
ఆమె దగ్గిరకు వచ్చినప్పుడు ఆ స్త్రీ అతని చూచి, యో

వాబువు నీవేనా అని అడగగా, నేనే అని చెప్పెను;
అప్పుడు ఆమె అతనితో నీ సేవకురాలనైన నా మా
టలు విందువా అని అడగగా, విందునని చెప్పెను.।
18 కాబట్టి ఆమె పలికినదేమంటే, ఆబేలు యొద్ద వారు
నిజముగా ఆలోచన అడిగి ఆలాగున చాలింతురని
19 పూర్వమందు వారు పలికేవారట.। నేను ఇశ్రాయేలు
లో నిమ్మళమున్ను యథార్థమున్ను గల దాననై వు
న్నాను; నీవు ఇశ్రాయేలులో వొక పట్టణమునున్ను
వొక తల్లినిన్ని లయము చేయవలెనని వెతుకుతూ వున్నా
వు; యెహోవాయొక్క స్వాస్థ్యమును నీవు యెం
20 దుకు మింగివేతువని అనినప్పుడు;। యోవాబు ఆమె
తో చెప్పినదేమంటే, మింగివేసుటకైనా లయముచేసు
టకైనా నాకు దూరమవును గాక, నాకు దూరమవును
21 గాక.। ఆలాగున కాదు గాని బిక్రియొక్క కుమారు
డైన షెబా అనే పేరు కలిగిన ఎఫ్రయీము పర్వత
పువాడైన వొకడు రాజైన దావీదు మీదికి తన చెయ్యి
యెత్తినాడు; వాని మాత్రము మీరు అప్పగిస్తే అప్పుడు
నేను యీ పట్టణము యొద్దనుంచి వెళ్లిపోతానని చెప్పి
నప్పుడు, ఆ స్త్రీ యోవాబును చూచి, యిదుగో వాని
శిరస్సు గోడమీదనుంచి నీకు వేయపడునని చెప్పి,।
22 వెళ్లి, తనకు కలిగిన సుబుద్ధిచేత జనులందరి యొద్దికి
వచ్చినందున వారు బిక్రియొక్క కుమారుడైన షెబా
శిరస్సును ఖండించి బైట యోవాబు దగ్గిర వేసిరి.
అప్పుడు అతడు బాకా వూదించినందున జనులందరు
న్ను పట్టణమును విడచి తమ తమ కాపురాలకు వెళ్లి
పోయిరి: యోవాబున్ను యెరూశలేములో రాజు యొ
23 ద్దికి తిరిగీ వచ్చెను.। అయితే యోవాబు ఇశ్రాయేలు
యొక్క సమూహమంతటికీ అధిపతి అయి వుండెను;
కెరేతీయులకున్ను పెలేథీయులకున్ను యెహోయా
దాయొక్క కుమారుడైన బేనాయ్యా అధిపతి అయి
24 వుండెను.। మరిన్ని అదోరాము పన్ను కూర్చే అధి
కారి అయి వుండెను; అహీలూదుయొక్క కుమారుడైన
యెహోషాపాథు సమాచార లేఖకుడు అయి వుండె
25 ను.। షెవా కరణము అయి వుండెను: సాదోకున్ను
26 అబ్యాతారున్ను అర్చకులు అయి వుండిరి.। మరిన్ని
యాయీరీయుడైన ఈరా దావీదుకింద ప్రధాని అయి
వుండెను.

## 21. అధ్యాయము.

1 అంతట దావీదు దినములయందు ప్రతి సంవత్సర
ము మూడు సంవత్సరముల పర్యంతము క్షామము కలిగి
వుండెను; అప్పుడు దావీదు యెహోవా సముఖమం
దు ఆలోచన చేసెను; అందుకు యెహోవా యిచ్చిన
ప్రత్యుత్తరము యేమంటే, యిది సౌలు నిమిత్తముచేత
నున్ను రక్తాపరాధులైన అతని యింటివారి నిమిత్తము
చేతనున్ను అయి వున్నది, యేమంటే అతడు గిబోనీ
యులను హతము చేసెనని ఆనతిచ్చెను.। యీ గిబోనీ 2
యులు ఇశ్రాయేలు పుత్రుల సంబంధికులు కారు, గాని
ఎమోరీయులలో శేషించినవారై వుండిరి; వీరికి ఇశ్రా
యేలు పుత్రులు ప్రమాణమిచ్చినప్పటికిన్ని సౌలు
ఇశ్రాయేలు యూదా అనే వీరి పుత్రుల విషయమైన
భక్తివల్ల చంపుటకు వెతికి వుండెను.। అయినందున రా 3
జైన దావీదు గిబోనీయులను పిలువనంపించి అడిగిన
దేమంటే, మీకు నేను యేమి చేయవలెను? మీరు
యెహోవాయొక్క స్వాస్థ్యమును ఆశీర్వదించేటట్టు
దేనిచేత యీ దోషమును పరిహరింతునని అడిగినప్పు
డు;। గిబోనీయులు అతనితో చెప్పినదేమంటే, సౌలు 4
వైనా అతని యింటివారివైనా వెండి బంగారములు
మాకు అక్కర లేదు; మరిన్ని మా కొరకు నీవు ఇశ్రా
యేలీయులలో యెవనినైనా చంప నక్కరలేదు అని
చెప్పినప్పుడు; దావీదు వారిని చూచి, మీరు చెప్పే
దేదో అది నేను మీ కొరకు చేతునని పలికినప్పుడు;।
వారు రాజుతో అనినదేమంటే, మమ్మును నాశనము 5
చేస్తూ, మేము ఇశ్రాయేలు సరిహద్దులలోనుంచి లయ
మయ్యేటట్టుగా మాకు విరోధము చేసిన అతనియొక్క
పుత్రులలో యేడుగురిని మాకు అప్పగించవలసినది;।
అప్పుడు యెహోవావల్ల యెంచబడ్డ సౌలుయొక్క 6
గిబాలో మేము వారిని యెహోవా విషయమై వురి
తీతుము అని చెప్పినప్పుడు రాజు నేను వారిని అప్ప
గింతునని చెప్పెను.। అయితే రాజు సౌలుయొక్క 7
కుమారుడైన యోనాతానుకు పుట్టిన మెఫీబోషెతును
వదలక వుండెను, యేమంటే వారిద్దరకున్ను అనగా
దావీదుకున్ను సౌలుయొక్క కుమారుడైన యోనాతా
నుకున్ను యెహోవా ప్రమాణము కలిగి వుండెను.।
అయితే రాజు అయ్యాయొక్క కుమార్తె అయిన 8
రిస్పా సౌలుకు కనిన యిద్దరు కుమారులైన అర్మోనీ
నిన్ని మెఫీబోషెతునున్ను, మరిన్ని సౌలు కుమార్తె అ
యిన మీఖాలు మెహోలతీయుడైన బర్జిల్లైయొక్క
కుమారుడైన అద్రీయేలుకు కనిన అయిదుగురు కుమా
రులనున్ను తీసుకొని,। గిబోనీయుల చేతులకు అప్ప 9
గించెను; వీరు వారిని తీసుకొపోయి, కొండమీద యె
హోవా సముఖమందు వురి తీసినందున, యీ యేడు
గురు కూడా చనిపోయిరి; కోత సమయమందు అన
గా యవల కోత ఆరంభపు దినమందు వారు మరణ
మును పొందిరి.। అప్పుడు అయ్యా కుమార్తె అయిన 10
రిస్పా గోనెపట్టెలను తీసుకొవచ్చి, కొండమీద పరు
చుకొని, కోతయొక్క ఆరంభము మొదలుకొని ఆకా
శమునుంచి వర్షము ఆ కళేబరముల మీద కురిసే

పర్యంతమూ అక్కడ కాచి, పగటియందు ఆకా
శపు పక్షులను వాటి మీద వాలనివ్వకుండానున్ను
రాత్రి భూమియొక్క మృగములను రానివ్వకుండా
11 నున్ను వుండెను. । అయ్యా కుమార్తెయైన రిస్పా అనే
సౌలుయొక్క వుపపత్ని చేసినది దావీదుకు వినపడె
12 ను. । అంతట దావీదు వెళ్లి, సౌలుయొక్క శల్యముల
నున్ను అతని కుమారుడైన యోనాతానుయొక్క శల్య
ములనున్ను యాబేష్గిలాదు వారి యొద్దనుంచి తీసుక
వచ్చెను, యేమంటే పెలిష్తీయులు గిల్బోవలో సౌలును
హతము చేసినప్పుడు ఆ పెలిష్తీయులు వారిని బేత్షె
యాను పట్టణపు వీధిలో వ్రేలాడ కట్టిరి. అక్కడ
నుంచి యాబేష్గిలాదు వారు వాటిని దొంగిలి తీసు
13 కొని వచ్చిరి. । దావీదు అక్కడనుంచి సౌలుయొక్క
శల్యములనున్ను అతని కుమారుడైన యోనాతానుయొ
క్క శల్యములనున్ను తీసుక వచ్చెను; మరిన్ని వురి
తియ్యబడిన వారియొక్క శల్యములనున్ను వారు యేరి
14 నారు. । మరిన్ని సౌలుయొక్కయున్ను అతని కుమారు
డైన యోనాతానుయొక్కయున్న శల్యములను వారు
బెన్యామీను దేశమందు సేల దగ్గిర వున్న అతని తండ్రి
యైన కీషుయొక్క సమాధిలో పెట్టిరి; రాజు ఆజ్ఞాపిం
చినదంతాను వారు చేసిరి: అప్పుడు దేవుడు దేశము కొ
15 రకు విజ్ఞాపనమును వినెను. । మరిన్ని పెలిష్తీయులకున్ను
ఇశ్రాయేలీయులకున్ను యుద్ధము కలిగినందున దావీదు
తన సేవకులతో కూడా దిగివచ్చి పెలిష్తీయులతో పో
16 ట్లాడెను, అయితే దావీదు సొమ్మసిల్లెను. । అప్పుడు
దీర్ఘ దేహునియొక్క కుమారులలో ఇష్బిబెనోబు
అనే యొకడు కొత్త కత్తి కట్టుకొనినవాడై, దావీదును
చంపుతానని వుండెను. వీని యీటెకు మున్నూరు
17 షెకేలుల యెత్తు యిత్తడి కలిగి యుండెను. । అయితే
సెరూయాయొక్క కుమారుడైన అబీషై రాజుకు సహా
యుడై, ఆ పెలిష్తీయుని కొట్టి చంపివేసెను. అప్పుడు
దావీదుయొక్క జనులు ఇశ్రాయేలుయొక్క దీపము
నీతోటి ఆరిపోకుండా నీవు యిక మాతో కూడా యు
ద్ధమునకు రాకూడదని అతనికి ప్రమాణమిచ్చి చెప్పిరి.।
18 యిది అయిన తరువాత పెలిష్తీయులతో గోబు దగ్గిర
తిరిగీ యొక యుద్ధము కలిగెను; అప్పుడు హూషాతీ
యుడైన సిబ్బెకై దీర్ఘ దేహునియొక్క కుమారుల
19 లో సఫు అనేవాని చంపెను, । మరిన్ని గోబు దగ్గిర
పెలిష్తీయులతో యింకొక యుద్ధము తటస్థించెను;
అక్కడ బేత్లెహేమీయుడైన యహరేయోరెగీముయొ
క్క కుమారుడైన ఎల్హానాను గిత్తీయుడైన గొల్యాతు
యొక్క సహోదరుని చంపెను; వీని యీటె కర్ర
20 నేతకానియొక్క పలక వలెనే వుండెను. । మరిన్ని
యింకా గాతు దగ్గిర యుద్ధము కలిగెను; అక్కడ
మిక్కిలీ పొడుగైనవాడు వొకడు వుండెను; వొక్కొక్క
చేతికి ఆరున్ను వొక్కొక్క కాలుకు ఆరున్ను అన్నీ
యిరువై నాలుగు వేళ్లు గలవాడై వుండెను; వీడున్ను
ఆ దీర్ఘదేహునికి పుట్టెను. । వీడు ఇశ్రాయేలీయు 21
లను తిరస్కరించినప్పుడు దావీదుయొక్క సహోదరు
డైన షిమాకు పుట్టిన యోనాతాను వచ్చి వాని చంపె
ను. । యీ నలుగురున్ను గాతులో వున్న దీర్ఘ దేహు 22
నికి పుట్టి, దావీదుయొక్క చేతివల్లనున్ను అతని సేవ
కులయొక్క చేతివల్లనున్ను కూలిరి.

## 22. అధ్యాయము.

అంతట దావీదు యెహోవా తన్ను సౌలు చేతి 1
లోనుంచిన్ని తన శత్రువులందరియొక్క చేతిలోనుం
చిన్ని విడిపించిన దినమందు యీ కీర్తనయొక్క వా
క్యములను యెహోవా విషయమై పలికెను. । అతడు 2
అనినదేమంటే, యెహోవా నా శిలా పర్వతమున్ను,
నా కోటయున్ను, నా రక్షకుడున్ను, । నా శిలా పర్వ 3
తముయొక్క దేవుడున్ను అయి వున్నాడు; ఆయన
యందు నేను నమ్మికె వుంతును; ఆయన నా డాలున్ను,
నా రక్షణ శృంగమున్ను, నా వున్నతమైన బురుజున్ను,
నా ఆశ్రయమున్ను, నా రక్షకుడున్ను అయి వున్నాడు;
బలవంతమునుంచి నీవు నన్ను రక్షించితివి. । స్తోత్రపా 4
త్రుడైన యెహోవాను నేను స్మరింతును; ఆలాగున
నేను నా శత్రువులలోనుంచి రక్షణను పొందుదును.।
మరణముయొక్క తరంగములు నన్ను చుట్టుకొనెను; 5
దుర్మార్గులయొక్క ప్రవాహములు నన్ను భయపె
ట్టెను. । పాతాళముయొక్క బంధములు నన్ను ఆవరిం 6
చెను; మృత్యువుయొక్క వురులు నా ముందర వేయ
పడెను. । నా అవస్థలో నేను యెహోవాను స్మరి 7
స్తిని; నా దేవునికీ నేను మొరబెట్టితిని; అప్పుడు
ఆయన తన మందిరములోనుంచి నా శబ్దమును వినె
ను; నా కేక ఆయన కర్ణములందు ప్రవేశించెను. ।
అప్పుడు భూమి తత్తళించి కంపించెను; ఆయన కోప 8
ముగా వుండెను గనుక పరమండలముయొక్క పునా
లుదు కలవిల పడి తత్తళించెను. । ఆయన ముక్కుయొ 9
క్క రంధ్రములలోనుంచి ధూమము బయిటికి వచ్చి
పైకి యెక్కెను; ఆయన నోట్లోనుంచి అగ్ని బైలువెళ్లి
దహించెను; అందువల్ల బొగ్గులు అంటుకొనెను. । ఆయన 10
ఆకాశములను వంగేటట్టు చేసి దిగి వచ్చెను; ఆయన
పాదముల కింద అంధకారము వుండెను. । ఆయన 11
కెరూబు మీదయెక్కి యెగిరెను; వాయువు రెక్కల
మీద ఆయన అగుపడెను. । మరిన్ని ఆయన అంధకార 12
మును, అనగా, అంధకారమైన వుదకములనున్ను ఆకా
శముయొక్క చిక్కని మేఘములనున్ను తన చుట్టూ

13 తెరగా చేసుకొనెను. । ఆయన ముందర వున్న తేజస్సు
14 వల్ల బొగ్గులు అంటుకొనెను. । ఆకాశములోనుంచి
యెహోవా వురిమెను; మహోన్నతుడు తన శబ్ద
15 మును వినపడేటట్టు చేసెను. । ఆయన తన బాణము
లను ప్రయోగించి, వారిని చెదర చేసెను; మెరుపు
16 లను ప్రయోగించి, వారిని అపజయపరిచెను. । అప్పుడు
సముద్రముయొక్క అగాధములు అగుపడెను; యె
హోవాయొక్క గద్దించుటవల్లనున్ను ఆయన ముక్కు
రంధ్రముల శ్వాస బలముచేతనున్ను భూ మండలము
17 యొక్క పునాదులు కనుపించినవి. । ఆయన పైనుంచి
హస్తమును చాపి, నన్ను పట్టి విస్తారమైన వుదకముల
18 లోనుంచి నన్ను పైకి తీసెను. । ఆయన నా బలమైన
శత్రువునుంచిన్ని నాయందు పగ వుంచినవారినుంచిన్ని
నన్ను రక్షించెను, యెందుకంటే వారు నాకంటే మి
19 క్కిలి బలము గలవారై వుండిరి. । నా వుపద్రవ దిన
మందు వారు నన్ను యెదురించిరి, అయినప్పటికిన్ని
20 యెహోవా నాకు వూతగా వుండెను. । ఆయన నా
యందు ఆనందించినందున ఆయన నన్ను విడిపించి,
విశాలమైన స్థలములోకి నన్ను తీసుకొని నచ్చి వుంచె
21 ను. । నా నీతికి తగినట్టు యెహోవా ఫలమును నాకు
దయచేసెను; నా చేతి శుభ్రతకు తగినట్టు ఆయన నాకు
22 ప్రతి ఫలమును యిచ్చెను. । యేమంటే యెహోవా
యొక్క మార్గములయందు నేను నడిచితిని; దుర్మా
23 ర్గతచేత నా దేవుని నేను విడువలేదు. । యేమంటే
ఆయన ఆజ్ఞలు నాముందర వుండెను; ఆయన నిర్ణయ
24 ములలోనుంచి నేను తొలగక వుంటిని. । ఆయనకు నేను
యథార్థపరుడనై భద్రముచేసుకొని, అక్రమమునకు
25 దూరమై వుంటిని. । కాబట్టి యెహోవా నా నీతి చొ
ప్పుననున్ను ఆయన దృష్టికి కనుపించిన నాయొక్క పవి
26 త్రత చొప్పుననున్ను నాకు ఫలమును యిచ్చెను. । దయా
పరునకు దయాపరుడననిన్ని, యథార్థపరునకు యథా
27 ర్థపరుడననిన్ని నీవు తెలియచేతువు. । పరిశుద్ధునికి పరి
శుద్ధుడననిన్ని, వంకర బుద్ధి గల వానికి అనిష్టుడననిన్ని
28 నీవు తెలియచేతువు. । శ్రమపడేవారిని నీవు రక్షిం
తువు; అయితే గర్వవంతులను నీవు అణచి వేసేటం
29 దుకు నీ నేత్రములు వారి మీద వుండును. । యేమం
టే వో యెహోవా నీవు నాకు దీపమై యున్నావు;
యెహోవా నా అంధకారమును వెలుగుగా చేసును. ।
30 నీవల్లను నేను వొక గుంపులోనుంచి దూసి వెళ్లితిని;
31 నా దేవునివల్లను నేను వొక గోడను దాటితిని. । దేవు
నియొక్క మార్గము సంపూర్ణమైనది; యెహో
వాయొక్క వాక్యము పరీక్షించబడినది; ఆయనను
నమ్మిన వారందరికి ఆయన డాలు అయి వున్నాడు. ।
32 యేమంటే యెహోవా గాక దేవుడు యెవడు! మన

దేవుడు గాక శిలా పర్వతమైనవాడు యెవడు! । దేవు 33
డు నాకు శక్తిన్ని బలమున్ను అయి వున్నాడు; ఆయన
నా మార్గమును సంపూర్ణముగా చేస్తూ వున్నాడు. ।
ఆయన నా కాళ్లను లేడి కాళ్లవలె చేసి, నా వున్నత 34
మైన స్థలములమీద నన్ను నిలుపుతున్నాడు. । యుద్ధ 35
ము కొరకు ఆయన నా చేతులకు నేర్పుతున్నాడు,
అందువల్ల వుక్కువిల్లు నా చేతి బలిమిచేత విరువపడు
ను. । మరిన్ని నీవు నీరక్షణయొక్క డాలును నాకు దయ 36
చేస్తివి; నీ మృదుత్వముచేతను నేను ఘనుడనైతిని. ।
నా అడుగులను నీవు విస్తారపరచినందున నా గుత్తులు 37
బెణకకుండా వుండెను. । నా శత్రువులను నేను తరిమి 38
నాశనము చేస్తిని; నేను వారిని నశింపచేసే పర్యంత
మూ నేను తిరిగీ రాక వుంటిని. । నేను వారిని నశింప 39
చేస్తిని; వారు లేవలేక వుండేటట్టు నేను వారిని గా
యములను పొందిస్తిని; నిశ్చయముగా వారు నా పాద
ముల కింద పడి యున్నారు. । యేమంటే నీవు బలము 40
తోటి యుద్ధమునకు నా నడుము బిగించితివి; నా మీ
దికి లేచిన వారిని నా కింద పడచేస్తివి. । నాయందు 41
పగ వుంచినవారిని నేను నశింపచేసేటట్టు నా శత్రు
వులయొక్క కంఠములను నీవు నాకు యిస్తివి. । వారు 42
కనిపెట్టినప్పటికిన్ని రక్షించుటకు యెవడూ లేకపో
యెను; యెహోవాను సహోస్మరించినప్పటికిన్ని ఆయన
ప్రత్యుత్తరము యివ్వక వుండెను. । అప్పుడు నేను 43
వారిని భూమి ధూళివలె సన్నముగా కొట్టితిని; వీధి
యొక్క బురదవలె నేను వారిని త్రొక్కి చెదరగొ
ట్టితిని. । నీవు నా జనులయొక్క కలహములలోనుంచి 44
నన్ను విడిపించి, అన్య జనాంగముల మీద నన్ను అధి
కారినిగా వుంచితివి; నేను యెరుగని జనులు నాకు
సేవ చేతురు. । అన్యులు నాకు లోబడుదురు; వారు 45
వినగానే నాకు వశీకరము అవుదురు. । అన్యులు వాడి 46
పోయి, తమ మరుగు స్థలములనుంచి భయపడుదురు. ।
యెహోవా జీవస్థుడై వున్నాడు; నా శిలా పర్వత 47
మైన వానికి స్తోత్రములు కలుగును గాక; నా రక్షణ
యొక్క శిలా పర్వతమైన దేవుడు హెచ్చించబడును
గాక. । నా పట్ల దేవుడు నా శత్రువులకు ప్రతి హత 48
ముచేసి, జనులను నా కింద పడచేసి, । నా శత్రువుల 49
లోనుంచి నన్ను విడిపించేవాడై వున్నాడు; నా మీదికి
లేచినవారికంటే నీవు నన్ను హెచ్చింపచేస్తివి; మోస
కాని యొద్దనుంచి నీవు నన్ను విడిపిస్తివి. । కాబట్టి వో 50
యెహోవా, అన్య జనాంగములలో నిన్ను స్తుతించి
నీ నామమునకు స్తోత్రపు సంగీతములను పాడుదును. ।
తనవల్లనైన రాజుకు ఆయన గొప్ప రక్షణను దయచేసి, 51
తాను అభిషేకించిన దావీదుకున్ను అతని సంతతికిన్ని
సదా కాలము మట్టుకున్ను కనికరముగా వుండును.

## 23. అధ్యాయము.

1 దావీదుయొక్క కడవరి మాటలు యివే. యెష్షై
కుమారుడైన దావీదు పలికెను, అనగా, యాకోబు
దేవునియొక్క అభిషిక్తుడు పైగా హెచ్చించపడినవా
డు, ఇశ్రాయేలుయొక్క మధుర సంగీతకుడు అయిన
2 అతడు, పలికినదేమంటే; । యెహూవాయొక్క ఆత
నా ద్వారా పలికెను; ఆయన వాక్యము నా నాలుక
3 యందు వుండెను. । ఇశ్రాయేలుయొక్క దేవుడు సెలవు
యిచ్చెను; ఇశ్రాయేలుకు శిలా పర్వతమైనవాడు నా
తో ఆనతిచ్చెను. యేమంటే మనుష్యులను యేలేవాడు
నీతిపరుడై, దేవుని యందు భయభక్తిగా వుండి యేలు
4 ను. । యీయన మేఘములు లేనటువంటి వుదయమం
దు సూర్యుడు వుదయించినప్పటి వుదయ కాంతి వలె
నున్ను, వర్షము కురిసిన పిమ్మట నిర్మలమైన కాంతిచేత
భూమిలోనుంచి పుట్టిన లేత గడ్డి వలెనున్ను వుండు
5 నని చెప్పెను. । నా యిల్లు దేవుని యెడల ఆలాగున
వుండకపోయినప్పటికిన్ని ఆయన నాతో నిత్యమయిన
వొడంబడికెను చేసియున్నాడు; అది సమస్తమందూ
సర్వ సిద్ధమై రూఢమై వున్నది; ఆయన దాని అభివృద్ధి
చేయకపోయినప్పటికిన్ని అది నా నిండైన రక్షణయు
6 న్ను నా నిండైన కోరికెయున్ను అయి వున్నది. । అయి
తే దుర్మార్గులందరున్ను పారవేసిన ముండ్లలాగున వుం
7 దురు, యెందుకంటే అవి చేత పట్టవల్ల కావు; । పట్ట
బోయేవాడు యినుము గల కర్రనైనా సూది గల
కర్రనైనా పట్టుకోవలెను; వాటి స్థలమందు అవి అగ్ని
8 చేత బొత్తిగా దహించబడునని చెప్పెను. । దావీదుకు
కలిగిన బలాఢ్యులు యెవరంటే, ముగ్గురిలో ముఖ్యు
డై, ఆ స్థానమందు కూచుండిన తక్మోనీయుడు; ఇతడే
ఎస్నీయుడైన అదీనో: యితడు యెనమన్నూరుమంది
9 మీద లేచి వొక్కమారే వారిని సంహరించెను. । యితని
వెనుక అహోహీయుడైన దోదోయొక్క కుమారు
డైన ఎలాజారు కలడు; యితడు దావీదుయొక్క బలా
ఢ్యులైన ముగ్గురిలో వొకడై వుండి, యుద్ధమునకు
కూడి వచ్చిన పెలిష్తీయులకు శౌర్యము యెక్కించిన
ప్పుడు ఇశ్రాయేలీయులు వెళ్లిపోయిన తరువాత లేచి, ।
10 తన చేతి బలిమి తక్కువయ్యే మట్టుకున్ను తన చేతిని
కత్తి అంటుకొని వుండే మట్టుకున్ను పెలిష్తీయులను
హతము చేస్తూ వుండెను; ఆ దినమందు యెహూవా
మహా జయము కాచేసెను; మరిన్ని దోపుడు సొమ్ము
పుచ్చుకోవడానకు మాత్రమే జనులు అతని వెనుక
11 నుంచి వచ్చిరి. । ఇతని తరువాత యెవరంటే, హరారీ
యుడైన అగేయొక్క కుమారుడైన షమ్మా: పెలిష్తీయు
లు పయురులతోను నిండైన స్థలమందు గుంపుగా కూడి
నందున జనులు పెలిష్తీయుల ముందరినుంచి పారిపో
యిరి; । అప్పుడు యితడు ఆ భూమి మధ్యమందు 12
నిలిచి, దాని కాపాడి, పెలిష్తీయులను హతము చేసె
ను; యీలాగున యెహూవా బహు జయము కాచే
సెను. । మరిన్ని ముప్పైమంది అధిపతులలో శ్రేష్ఠులైన 13
ముగ్గురు కోత సమయమందు అదుల్లాము గుహలో
వున్న దావీదు యొద్దికి దిగి వచ్చిరి; పెలిష్తీయులు
సమూహముతోను రెఫాయీము లోవలో దిగి వుం
డిరి. । మరిన్ని అప్పుడు దావీదు వొక దుర్గములో వుం 14
డెను, పెలిష్తీయుల కాపు బలము బేత్లెహేములో
వుండెను. । అప్పుడు దావీదు బేత్లెహేము ద్వారము 15
దగ్గిర వున్న నూతి నీళ్లు తాగుటకు యెవడైనా నాకు
యిస్తే యెంతో సంతోషింతునని అధికాశతో అనిన
ప్పుడు; । ఆ ముగ్గురు బలాఢ్యులు పెలిష్తీయులయొక్క 16
సమూహములోనుంచి దూసిపోయి, బేత్లెహేము ద్వా
రము దగ్గిర వున్న నూతి నీళ్లు తోడి, దావీదు యొద్దికి
తీసుక వచ్చిరి; అయితే అతడు వాటిని తాగక యె
హూవా సముఖమందు అవి కుమ్మరించి, అనుకొనిన
దేమంటే; । వో యెహూవా యీలాగున నేను 17
చేసుట నాకు దూరమవును గాక, యీ నీళ్లు తమ
తమ ప్రాణాపాయమునకు వొప్పి వెళ్లిన వారియొక్క
రక్తము సుమీ, అని అనుకొని తాగక వుండెను; యీ
కార్యములను ఆ ముగ్గురు బలాఢ్యులు చేసిరి. । మరిన్ని 18
సెరూయాకు పుట్టిన యోవాబుయొక్క సహోదరు
డైన అబీషై వేరే ముగ్గురిలో శ్రేష్ఠుడై వుండెను:
యితడు తన యీటె మూన్నూరుమంది మీదికి యెత్తి
దానిచేత హతము చేసెను; యితడు యీ ముగ్గురిలో
పేరుపడినవాడై వుండెను. । యితడు యీ ముగ్గురిలో 19
ఘనుడు కాడా? అయినందున యితడు వారికి అధిపతి
ఆయెను; అయినప్పటికిన్ని మొదటి ముగ్గురితో యెం
చబడక వుండెను. । మరిన్ని కబ్సయేలు వూరివాడై 20
అనేక క్రియలను చేసిన పరాక్రమశాలికి పుట్టిన యె
హూయాదాయొక్క కుమారుడైన బేనాయ్యా అనే
వొకడు కలడు; యితడు సింహము వలెనున్న యిద్దరు
మోయాబీయులను నరికి వేసెను; మరిన్ని మంచు కురి
సిన కాలమందు కూపములోకి దిగి దాని మధ్యమం
దున్న యొక సింహమును చంపివేసెను. । మరిన్ని యి 21
తడు రూపశాలి అయిన వొక మిస్రీయుని చంపెను;
యీ మిస్రీయుడు యీటె చేత పట్టుకొన్న వాడైన
ప్పటికిన్ని వాడు దుడ్డుకర్ర పట్టుకొని వాని యొద్దికి
దిగి వెళ్లి, ఆ మిస్రీయుని చేతిలోనుంచి యీటె లాగు
కొని, వాని యీటెతోను వాని చంపెను. । యీ 22
కార్యములు యెహూయాదాయొక్క కుమారుడైన
బేనాయ్యా చేసినందున యీ ముగ్గురు బలాఢ్యులలో

23 పేరు గలవాడై వుండెను. । వీడు ముప్పైమందిలో ఘను
డైనప్పటికిన్ని మొదటి ముగ్గురితో యెంచబడకపో
యెను. వీని దావీదు తన కాపుబంట్ల మీద వుంచు
24 కొనెను. । ఆ ముప్పైమంది యెవరెవరంటే, యోవా
బుకు సహోదరుడైన అశాహేలు; బేత్లెహేమీయు
25 డయిన దోదోకు పుట్టిన ఎల్హానాను; । హరోదీయుడ
26 యిన షమ్మా; హరోదీయుడైన ఎలీకా; । పల్తీయుడైన
హేలెస్సు; తెకోవీయుడైన ఇక్కేషుయొక్క కుమారు
27 డైన ఈరా; । అన్నెతోతీయుడైన అబీయెజరు; హుషా
28 తీయుడయిన మెబున్నయి; । అహోహీయుడైన సల్మో
29 ను; నెథోఫాతీయుడైన మహరై; । నెథోఫాతీయుడ
యిన బయనాకు పుట్టిన హేలెబు; బెన్యామీను
పుత్రుల సంబంధియున్ను గిబాతీయుడున్ను అయిన
30 రీబైకు పుట్టిన ఇత్తయి; । పిరాతోనీయుడైన బేనాయ్యా;
31 గయషు గెడ్డలయొద్ద వున్న హిద్దయి; । అర్బాతీయు
డైన అబీయల్బోను; బహూర్మీయుడైన అజ్మావెతు; ।
32 షయల్బోనీయుడైన ఎల్యహ్బా; యాషేనుయొక్క
33 కుమారులలో యోనాతాను; । హరారీయుడైన షమ్మా;
హరారీయుడైన షారారుకు పుట్టిన అహీయాము; ।
34 మయఖాతీయునికి పుట్టిన అహస్బయియొక్క కుమా
రుడైన ఎలీఫెలెథు; గిలోనీయుడైన అహీతోఫెలుకు
35 పుట్టిన ఎలీయాము; । కర్మెలీయుడయిన హెస్రై; అర్బీ
36 యుడైన పయరై; । సోబావాడైన నాతానుకు పుట్టిన
37 ఇగాలు; గాదీయుడైన బానీ; । అమ్మోనీయుడైన సెలెకు;
బెయేరోతీయుడైన నహరై; వీడు సెరూయాకు పుట్టిన
యోవాబుయొక్క ఆయుధాదులను మోసేవాడై వుం
38 డెను. । ఇత్రీయుడైన ఈరా; ఇత్రీయుడైన గారేబు; ।
39 హిత్తీయుడైన ఊరియా; వీరు అందరున్ను ముప్పై
యేడుగురు.

## 24. అధ్యాయము.

1 తిరుగా యెహోవాయొక్క కోపము ఇశ్రాయే
లీయుల మీద రగులుకొనెను; నాడు వారి విషయమై
దావీదును ప్రేరేపణ చేసినందున అతడు ఇశ్రాయేలు
యూదావారియొక్క లెక్క చూచి రమ్మనుమని ఆజ్ఞ
2 యిచ్చెను. । యిందుకు రాజు తనయొద్ద వున్న సైన్యాధి
పతియైన యోవాబుతో అనిన మాట, నీవు త్వరగా
దాను మొదలుకొని బెయేర్షెబ పర్యంతమూ ఇశ్రా
యేలు గోత్రములలోకి వెళ్లి, జనులయొక్క లెక్క
యెంతో అది నాకు తెలియ గలందులకు చూడుమని
3 చెప్పి వుండెను. । అయితే యోవాబు రాజును చూచి,
జనులయొక్క లెక్క యెంతో దాని మీ దేవుడైన యె
హోవా నూరంతలు యెక్కువచేసి, అది నా యేలిన
వారున్ను రాజున్ను అయిన మీ కండ్లకు అగుపర్చును
గాక; అయితే నా యేలినవారున్ను రాజున్ను అయిన
మీకు దీనియందు కోరిక యేలని చెప్పినప్పటికిన్ని; ।
రాజుయొక్క ఆజ్ఞ యోవాబుకున్ను సైన్యాధిపతుల 4
కున్ను అధికమైనందున యోవాబున్ను సైన్యాధిపతు
లున్ను ఇశ్రాయేలు జనులయొక్క లెక్కచూడడానకు
రాజు సముఖములోనుంచి బయిలువెళ్లి, । యర్దేను 5
నది దాటి, యజేరు తట్టు గాదు నది మధ్యమందుండే
పట్టణము కుడి పార్శ్వమున వున్న అరోయేరులో
దిగి, । అక్కడనుంచి గిలాదుకున్ను తహ్తీంహొద్షీ దేశ 6
మునకున్ను వచ్చిరి; తరువాత దాన్యానుకు వచ్చి, తిరిగి
వెళ్లి, సీదోనుకు వచ్చిరి. । అక్కడనుంచి గట్టి బురుజు 7
లుగల సోరు పట్టణమునకున్ను హివ్వీయులయొక్క
కెనయానీయులయొక్క పట్టణములన్నిటికిన్ని వచ్చి,
యూదా దక్షిణ దిక్కుకు అనగా బెయేర్షెబ మట్టు
కు బైలువెళ్లిరి. । యీలాగున వారు దేశమంతా గడచి 8
వెళ్లి, తొమ్మిది నెలల యిరువై దినములు అయినప్పుడు
యెరూశలేముకు తిరిగి వచ్చిరి. । అప్పుడు యోవాబు 9
జనులయొక్క లెక్క వెరసి రాజుకు అప్పగించెను, యే
మంటే ఇశ్రాయేలు యందు కత్తి దూసిన యెనిమిది
లక్షల ఆయుధస్థులు గలరు; మరిన్ని యూదావారు
అయిదు లక్షలు కలరు. । అయితే జనులయొక్క లెక్క 10
చూడడమైన తరువాత దావీదు తన హృదయములో
నొచ్చుకొనెను. కాబట్టి దావీదు యెహోవాతో
చెప్పినదేమంటే, నేను చేసిన దానివల్లను బహు పాపి
నైతిని; కాబట్టి ఓ యెహోవా, నీవు దయచేసి,
నీ సేవకుడనైన నాయొక్క దోషమును పరిహరించుము;
యేమంటే నేను మిక్కిలి అవివేకముగా జరిగిస్తినని
చెప్పెను. । యేమంటే దావీదు వుదయమందు లేచిన 11
ప్పుడు యెహోవాయొక్క వాక్యము దీర్ఘదర్శి
యైన గాదు అనే దావీదుయొక్క ప్రదర్శకునికి కలి
గినదేలాగంటే; । నీవు వెళ్లి, దావీదుతో చెప్పవలసిన 12
లాగు, యెహోవా నీకు సెలవు యిచ్చినదేమంటే,
మూడు సంగతులు నీ ముందర పెట్టుతున్నాననిన్ని,
వాటిలో వొకటి నీకు చేతును; కాబట్టి వాటిలో నీవు
వొకదాని యెంచుకొమ్మనుమనిన్ని సెలవు యిచ్చినం
దున; । గాదు దావీదు యొద్దికి వచ్చి, తెలియచెప్పి 13
అడిగినదేమంటే, నీ దేశమందు నీకు యేడు సంవత్సర
ముల క్షామము కావలెనా? లేక నిన్ను తరుముతూ
వున్న నీ శత్రువుల ముందరనుంచి మూడు నెలలు పారి
పోవుట కావలెనా? లేక నీ దేశమందు మూడు నెలల
మట్టుకు తెగులు పుట్టుట కావలెనా? వీటి యందు
యోజన చేసుకొని విచారించి, నన్ను పంపిన వారికి
యే ప్రత్యుత్తరము యివ్వ వలసినదో అది నిర్ణయిం
తువు గాకని చెప్పెను. । అప్పుడు దావీదు గాదుతో

అనిన మాట, నేను బహు యిబ్బందిగా వున్నాను;
అయితే యెహోవాయొక్క కృపలు అధికమై వున్నవి
గనుక మనుష్యుని చేతిలో పడకుండా యెహోవా
15 చేతిలో పడుదుము గాకని చెప్పినందున; । యెహో
వా ఇశ్రాయేలు మీద తెగులు వచ్చేటట్టు చేసెను; ఆ
దినము వుదయము మొదలుకొని నిర్ణయమైన కాల
ము మట్టుకు అది కలిగి వుండెను; అందుచేత దాను
మొదలుకొని బెయేర్షెబ మట్టుకు డెబ్బైవేల మంది
16 మరణమైరి. । అయితే దూత యెరూశలేము పయిని
తన హస్తము చాపి నశింపచేయ బోయేటప్పుడు, యె
హోవా ఆ కీడును గురించి పశ్చాత్తప్తుడై, జనులను
నశింప చేసే దూతను చూచి, యిది చాలును; నీ చెయ్యి
తీయుమని చెప్పెను. అప్పుడు యెహోవాయొక్క
దూత యెబూసీయుడైన అరౌనాయొక్క కళ్లము
17 దగ్గిర వుండెను. । అప్పుడు దావీదు జనులను నశింపచే
సిన దూతను చూచి, యెహోవాతో అనినదేమంటే,
యిదుగో నేను పాపము చేస్తిని, నేను దుర్మార్గము
గా చేస్తిని, అయితే యీ గొర్రెలు వీరు యేమి చేసిరి!
నీ హస్తము నాకున్ను నా తండ్రి యింటికిన్ని విరోధ
18 ముగా కానిమ్మని వేడుకొనెను. । మరిన్ని నాటియందు
గాదు దావీదు యొద్దికి వచ్చి, నీవు వెళ్లి, యెబూసీయు
డయిన అరౌనాయొక్క కళ్లములో యెహోవా పే
రట వొక బలిపీఠమును కట్టించుమని అతనితో చెప్పి
19 నందున; । దావీదు గాదుచేత యెహోవా యిప్పిం
20 చిన ఆజ్ఞ చొప్పున పైకి వెళ్లెను. । అంతట అరౌనా
రాజున్ను అతని సేవకులున్ను తన సమీపమునకు వచ్చు
టను చూచి, బైలుదేరి, రాజుకు సాష్టాంగ నమస్కార
ము చేసి, నా యేలినవారున్ను రాజున్ను అయిన మీరు
మీ సేవకుడనైన నా యొద్దికి వచ్చిన నిమిత్తమేమని
అడిగినప్పుడు, । దావీదు అనిన మాట, నీ యొద్ద యీ 21
కళ్లము కొనుకొని, యీ తెగులు నిలిచి మనుష్యులను
తాకకుండా వుండేటట్టు యెహోవా పేరట వొక
బలిపీఠము కట్టించేటందుకు వస్తినని చెప్పినప్పుడు; ।
అరౌనా దావీదుతో చెప్పినదేమంటే, నా యేలినవా 22
రైన మీరు చూచి యేది మీకు అనుకూలమో అది
తీసుకొని అర్పించండి; యిదుగో హోమ బలి కొ
రకు యెద్దున్ను వున్నవి; మరిన్ని నూర్చే కర్రవస్తు
వులు మొదలైనవి కలవని చెప్పెను. । యివన్నీ అరౌనా 23
తాను రాజైనట్టు రాజుకు యిచ్చెను; మరిన్ని అరౌనా
రాజును చూచి, మీ దేవుడైన యెహోవా మిమ్మును
అంగీకరించును గాకని చెప్పెను. । అయితే రాజు అరౌ 24
నాతో చెప్పినదేమంటే, అది కాదు; దాని వెల నీకు
యిచ్చి నీ యొద్ద కొనుక్కొందును, యేమంటే వెలవల్ల
నాకు రానటువంటి దానివల్ల నేను నా దేవుడైన యె
హోవాకు హోమ బలిని అర్పించనని చెప్పి, దా
వీదు ఆ కళ్లమునున్ను యెద్లనున్ను యాభై షెకేలుల
వెండికి కొనుక్కొనెను. । అక్కడ దావీదు యెహో 25
వా పేరట వొక బలిపీఠము కట్టించి, హోమ బలుల
నున్ను సమాధాన బలులనున్ను అర్పించినందున యె
హోవా దేశము కొరకైన ప్రార్థనలను ఆలకించెను;
ఆ తెగులు నిలిచి ఇశ్రాయేలును విడచి పోయెను.

# రాజులను గురించిన మొదటి గ్రంథము.

## 1. అధ్యాయము.

1 రాజైన దావీదు బహు దినములు గడచి వృద్ధయి
నప్పుడు వారు అతని బట్టలతోటి కప్పినప్పటికిన్ని
2 అతనికి వెట్ట కలుగక వుండెను. । కాబట్టి అతని సేవ
కులు అతనితో అనినదేమంటే మా యేలినవారున్న
రాజున్ను అయిన మీ కొరకు పడుచురాలైన వొక
కన్యకను చూడబడనివ్వండి; ఆమె రాజైన మీ సము
ఖమందు నిలిచి, మిమ్మును ఆదరించి, మీకు వెట్ట కలి
గేటందుకు మీ కౌగిటిలో పడుకొననియ్యండని చెప్పి ।
3 ఇశ్రాయేలు దిక్కులన్నిటిలోకి పోయి, వొక చక్కని
చిన్నదాని వెతికి, అబీషగు అనే షూనమ్మీయురాలిని
4 చూచి, రాజుయొద్దికి తీసుక వచ్చిరి. । యీ చిన్నది
బహు చక్కనిదై వుండి, రాజును ఆదరించి, కనిపెట్టి
వుండెను; అయినప్పటికిన్ని రాజు దాని యెరుగకుం
5 డా వుండెను. । అంతలో హగ్గీతుకు పుట్టిన అదోనీ
యా తన్ను తాను హెచ్చింప చేసుకొని, నేనే రాజు
నౌదునని అనుకొని, రథములనున్ను గుర్రపు రౌతుల
నున్ను తనకంటే ముందుగా పరుగెత్తే యాభై మందిని
6 న్ని ఆయత్తపరచుకొనెను. । అయితే అతని తండ్రి
నీవు యీలాగున యెందుకు చేసినావన్న మాటచేత
యే కాలమందైనా అతని నొప్పించ లేదు; మరిన్ని
అతడు చూచుటకు బహు సౌందర్యముగా వుండెను;
అతని తల్లి అబ్షాలోమును కనిన తరువాత అతని కనెను.।
7 అతడు సెరూయా కుమారుడైన యోవాబుతోనున్ను
అర్చకుడైన అబ్యాతారుతోనున్ను ఆలోచన చేసెను;
వారు అదోనీయాను వెంబడించి అతనికి సహాయులైరి.।
8 అయితే అర్చకుడైన సాదోకున్ను యెహోయాదా
కుమారుడయిన బేనాయ్యాయున్ను దీర్ఘదర్శియ
యిన నాతానున్ను షిమీయున్ను రేయీయున్ను దా
వీదుయొక్క బలాఢ్యులున్ను అదోనీయాతోను కలు
9 సుకోక వుండిరి. । అప్పుడు అదోనీయా ఎన్రోగేలు
సమీపమందుండే జోహెలేతు అనే రాతి దగ్గిర గొ
ర్రెలనున్ను యెద్లు మొదలైన కొవ్విన పశువులనున్ను
వేటవేసి, రాజపుత్రులనే తన సహోదరులందరినిన్ని
యూదా వారనే రాజుయొక్క సేవకులనందరినిన్ని
10 పిలిపించెను. । అయితే దీర్ఘదర్శియయిన నాతాను
నున్ను బేనాయ్యానున్ను ఆ బలాఢ్యులనున్ను తనకు
సహోదరుడైన సొలొమోనునున్ను పిలువ లేదు. ।
అప్పుడు నాతాను సొలొమోనుయొక్క తల్లియయిన 11
బత్షెబతో అనిన మాట, హగ్గీతుయొక్క కుమారుడైన
అదోనీయా యేలుతూ వున్న సంగతి నీకు వినపడలే
దా? అయితే యీ సంగతి మన యేలినవారైన దావీ
దుకు తెలియక వున్నది. । కాబట్టి నీవు రా, నీ ప్రాణ 12
మునున్ను నీ కుమారుడైన సొలొమోనుయొక్క ప్రా
ణమునున్ను నీవు తప్పించుకోవడానకు నీకు బోధిం
తును. । నీవు రాజైన దావీదు యొద్దికి వచ్చి చెప్పవల 13
సిన విధమేమంటే, నా యేలినవారయిన వో రాజా, మీ
సేవకురాలనైన నాకు మీరు ప్రమాణము యిచ్చి, అవ
శ్యముగా నీ కుమారుడైన సొలొమోను నా వెనుక యే
లేవాడై, నా గద్దె మీద కూచుండునని చెప్పితిరే;
కాబట్టి అదోనీయా యేలుతూ వుండుట యేమని చెప్ప
వలెను. । రాజుతో నీవు చెప్పుతూ వుండగా, యిదు 14
గో నేను నీ వెనుకనుంచి లోపలికి వచ్చి, నీవు చెప్పిన
మాటలను రూఢ పరతునని చెప్పెను. । కాబట్టి బత్షెబ 15
వెళ్లి గదిలో వున్న రాజు యొద్దికి వచ్చెను; అయితే
రాజు బహు వృద్ధయినందున షూనమ్మీయురాలైన అబీ
షగు రాజును కనిపెట్టుతూ వుండెను. । బత్షెబ వచ్చి 16
రాజుకు వంగి నమస్కారము చేసినప్పుడు, రాజు
ఆమెను చూచి, నీ కోరికె యేమని అడగగా, ఆమె
చెప్పినదేమంటే, । వో నా యేలినవారా, మీరు మీ 17
దేవుడైన యెహోవాచేత మీ సేవకురాలనయిన నాకు
ప్రమాణము యిచ్చి, అవశ్యముగా నీ కుమారుడయిన
సొలొమోను నా వెనుక యేలేవాడై, నా గద్దెమీద
కూచుండునని చెప్పితిరి; । అయినప్పటికిన్ని యిదు 18
గో అదోనీయా యేలుతూ వున్నాడు; యీ సంగతి
నా యేలినవారున్న రాజున్ను అయిన మీకు తెలి
యక వున్నది. । మరిన్ని వాడు యెద్లు మొదలైన కొ 19
వ్విన పశువులనున్ను గొర్రెలనున్ను వేటవేసి రాజు
పుత్రులనందరినిన్ని అర్చకుడైన అబ్యాతారునున్న
సైన్యాధిపతియైన యోవాబునున్ను పిలిపించి, మీ సేవ
కుడైన సొలొమోనును పిలువడము లేదు. । అయితే 20
నా యేలినవారైన వో రాజా, ఇశ్రాయేలీయులందరు
న్ను నా యేలినవారున్న రాజున్ను అయిన మీ
వెనుక గద్దెమీద యెవడు ఆసీనుడవునో అది వారికి
సెలవు యిప్పించ గలందులకు మిమ్మును కనిపెట్టి

21 యున్నారు. । యిదిగాక నా యేలినవారున్ను రాజు
న్ను అయిన మీరు మీ పితృలతోను నిద్రపొందిన
తరువాత నేనున్ను నా కుమారుడైన సొలొమోను
న్ను అపరాధులమన్నట్టుగా యెంచపడుదుమని ఆమె
22 రాజుతో మాట్లాడుతూ వుండగా, । దీర్ఘదర్శి
యైన నాతానున్ను లోపటికి వచ్చెను; కాబట్టి యి
దుగో దీర్ఘదర్శియైన నాతాను అని వారు రాజు
23 తో తెలియ చెప్పిరి. । అతడు రాజు సన్నిధికి వచ్చి
నప్పుడు అతడు రాజు యెదుట వంగి సాష్టాంగ పడెను. ।
24 అప్పుడు నాతాను చెప్పినదేమంటే, నా యేలినవారైన
రాజా, అదోనీయా మీ వెనుక యేలేవాడై, మీ
గద్దె మీద కూర్చుండునని మీరు సెలవు యిస్తిరేమో?।
25 యేమంటే యీ దినమున వాడు దిగి వెళ్లి, యెడ్లు మొ
దలైన కొవ్విన పశువులనున్ను గొర్రెలనున్ను విస్తార
ముగా వేటవేసి, రాజ పుత్రులందరినిన్ని సైన్యాధి
పతులనున్ను అర్చకుడైన అబ్యాతారునున్ను పిలిపించి
నందున వారు వాని ముందర భుజిస్తూ తాగుతూ, దేవు
డు రాజైన అదోనీయాను రక్షించును గాకని పలుకు
26 తూ వున్నారు. । అయితే మీ సేవకుడనైన నన్నున్ను
అర్చకుడైన సాదోకునున్ను యెహోయాదాయొక్క
కుమారుడయిన బేనాయ్యానున్ను మీ సేవకుడయిన
27 సొలొమోనునున్ను వాడు పిలిచినాడు కాడు. । యీ
కార్యము నా యేలినవారున్ను రాజున్ను అయిన మీ
సెలవు చొప్పున అయినదా? నా యేలినవారున్ను రా
జున్ను అయిన మీ వెనుక మీ గద్దె మీద యెవడు
ఆసీనుడై వుండునో అది మీ సేవకుడనైన నాతో
28 చెప్పక వుందురా అని చెప్పెను. । అప్పుడు దావీదు
బత్షెబను పిలువుమన్న సెలవు యివ్వగా, ఆమె రాజు
29 సన్నిధికి వచ్చి, రాజు ముందర నిలిచి వుండెను. । అప్పు
డు రాజు ప్రమాణముగా చెప్పినదేమంటే, సకలోప
ద్రవములోనుంచి నన్ను విడిపించిన యెహోవాయొ
30 క్క జీవముతోడు, । అవశ్యముగా నీ కుమారుడైన
సొలొమోను నా వెనుక యేలేవాడై, నాకు బదులుగా
నా గద్దె మీద కూర్చుండునని నేను ఇశ్రాయేలు
యొక్క దేవుడైన యెహోవా చేత నీకు యేలాగు
ప్రమాణమిచ్చి చెప్పితినో ఆలాగున యీ దినమున
31 ముఖ్యముగా చేతునని చెప్పినందున; । బత్షెబ వంగి రా
జుకు నమస్కారము చేసి, నా యేలినవారున్ను రాజున్ను
అయిన దావీదు సదా కాలము బ్రతుకును గాకని పలి
32 కెను. । అప్పుడు రాజైన దావీదు నా యొద్దికి అర్చకు
డైన సాదోకునున్ను దీర్ఘదర్శియయిన నాతాను
నున్ను యెహోయాదా కుమారుడైన బేనాయ్యాను
న్ను పిలువుమని సెలవు యిచ్చినందున వారు రాజు
33 సన్నిధికి వచ్చిరి. । అప్పుడు రాజు మీరు మీ యేలిన
వారమైన మా సేవకులను పిలుచుకొని, నా కుమారు
డైన సొలొమోనును నా వేసడము మీద యెక్కించి,
గిహోనుకు దిగి వెళ్లి, । అర్చకుడైన సాదోకున్ను 34
దీర్ఘదర్శియైన నాతానున్ను అతనికి అక్కడ ఇశ్రా
యేలు మీద పట్టాభిషేకము చేసిన తరువాత మీరు
బాకానాదము చేసి, దేవుడు రాజైన సొలొమోనును
రక్షించును గాకని పలికి, అతని వెనుకనుంచి రావలసి
నది; । యేమంటే అతడు వచ్చి, నా గద్దె మీద కూ 35
ర్చుండి, నాకు బదులుగా రాజవును; ఇశ్రాయేలు
మీదనున్ను యూదా మీదనున్ను అతని అధికారిని
గా నిర్ణయిస్తినని వారితో చెప్పగా; । యెహో 36
యాదా కుమారుడైన బేనాయ్యా రాజుకు ప్రత్యుత్తర
ముగా అనిన మాట, అది అవునుగాక; నా యేలిన
వారున్ను రాజున్ను అయిన మీయొక్క దేవుడైన యె
హోవా ఆలాగున ఆనతిచ్చును గాక. । యెహోవా 37
నా యేలినవారున్ను రాజున్ను అయిన మీకు తోడుగా
యేలాగున వుండెనో ఆలాగున ఆయన సొలొమో
నుకు తోడుగా వుండి, నా యేలినవారున్ను రాజున్ను
అయిన దావీదుయొక్క గద్దెకంటే అతని గద్దె ఘన
ముగా చేసును గాకని పలికెను. । కాబట్టి అర్చకుడైన 38
సాదోకున్ను దీర్ఘదర్శియైన నాతానున్ను యెహో
యాదా కుమారుడైన బేనాయ్యాయున్ను కెరేతీయు
లున్ను పెలెథీయులున్ను సొలొమోనును రాజైన దా
వీదుయొక్క వేసడము మీద యెక్కించి, గిహోనుకు
తీసుకొవచ్చిరి. । అప్పుడు అర్చకుడైన సాదోకు డేరా 39
లోనుంచి కొమ్ముతోను తైలము తీసి, సొలొమోనుకు
పట్టాభిషేకము చేసెను; అప్పుడు వారు బాకా వూద
గా జనులందరున్ను దేవుడు రాజైన సొలొమోనును
రక్షించును గాకని పలికిరి. । మరిన్ని జనులందరున్ను 40
అతని వెనుకనుంచి వచ్చి, పిల్లనగ్రోవులను వూది, వాటి
నాదముచేత భూమి బద్దలయ్యేటట్టు బహు సంభ్రమ
ముగా సంతోషించిరి. । అయితే అదోనీయాయున్ను 41
అతని యొద్దికి పిలువబడినవారందరున్ను భోజనాంత
మందు యిది విన్నారు; అయితే యోవాబు బాకా
నాదము విన్నప్పుడు పట్టణమందు యీ గల్లత్తుగా వున్న
ధ్వని యెందుకని అతడు అనగానే; । యిదుగో అర్చ 42
కుడైన అబ్యాతారు కుమారుడైన యోనాతాను వచ్చెను;
అదోనీయా యితని చూచి లోపటికి రా, యేమంటే
నీవు ధైర్యవంతుడవై శుభసమాచారములతోను వత్తువని
చెప్పగా; । యోనాతాను అదోనీయాతో ప్రత్యుత్తర 43
ముగా చెప్పినదేమంటే, నిజముగా మన యేలినవారున్ను
రాజున్ను అయిన దావీదు సొలొమోనును రాజుగా
నిర్ణయించి వున్నారు. । మరిన్ని రాజు అతనితో 44
కూడా అర్చకుడైన సాదోకునున్ను దీర్ఘదర్శియైన

నాతానున్ను యెహోయాదా కుమారుడైన బెనా
య్యానున్ను కెరేతీయులనున్ను పెలెతీయులనున్ను పం
పించినందున వారు అతని రాజుయొక్క వేసడము మీద
45 యెక్కించిరి. । మరిన్ని అర్చకుడైన సాదోకున్ను దీర్ఘ
దర్శియైన నాతానున్ను అతనికి గిహోను దగ్గిర
పట్టాభిషేకము చేసి, అక్కడనుంచి సంతోషముగా
వచ్చిరి; అందువల్ల పట్టణము మోగినది; మీకు వినపడిన
46 ధ్వని యిదేను. । మరిన్ని సొలొమోను రాజ్యపు గద్దె
47 మీద ఆసీనుడయి వున్నాడు. । మరిన్ని రాజుయొక్క
సేవకులు మన యేలే రాజైన దావీదును ఆశీర్వదించ
డానకు వచ్చి, దేవుడు మీ నామముకంటే సొలొమో
నుయొక్క నామమును అతిశయముగానున్ను మీ గద్దె
కంటే అతని గద్దె ఘనముగానున్ను చేసును గాకని
పలికినందున రాజు తన మంచము మీద వంగి నమ
48 స్కారము చేసి, పలికినదేమంటే; । యీ దినమున నా
కండ్లకు అగుపడినట్టుగా నా గద్దె మీద కూర్చుండ
డానకు వొకని నాకు దయచేసిన ఇశ్రాయేలుయొక్క
దేవుడయిన యెహోవాకు స్తోత్రము కలిగి వుండును
49 గాకని పలికెనని చెప్పెనందున; । అదోనీయా యొద్ద
నున్న పిలువపడినవారు భయపడి లేచి, ప్రతివాడు
50 తన తన మార్గమున వెళ్లిపోయెను. । మరిన్ని అదోనీ
యా సొలొమోనుకు భయపడి లేచి, బైలుదేరి, బలి
51 పీఠపు కొమ్ములను పట్టుకొనెను. । అప్పుడు సొలొమో
నుకు వినపడినదేమంటే, యిదుగో అదోనీయా రాజైన
సొలొమోనుకు భయపడుతున్నాడు, యేమంటే అత
డు బలిపీఠపు కొమ్ములను పట్టుకొని, రాజైన సొలొ
మోను తన సేవకుడనైన నన్ను కత్తిచేత చంపకుండా
యీ దినమున నాకు సత్యము చేయ వలెనని పలికి
52 వున్నాడని వినపడినప్పుడు; । సొలొమోను చెప్పినదే
మంటే, అతడు తన్ను తానే తగినవానిగా అగుప
రచుకొంటే, అతని తల వెండ్రుకలలో వొకటయినా
కిందపడేది లేదు; అతని యందు దుష్టత కనపడితే
53 అతడు మరణమౌనని చెప్పి; । బలిపీఠము యొద్దనుంచి
అతని పిలువనంపించినందున అతడు వచ్చి రాజైన సొ
లొమోను యెదుట సాష్టాంగపడెను: అప్పుడు సొలొ
మోను అతని చూచి నీ యింటికి నీవు వెళ్లుమని సెలవు
యిచ్చెను.

## 2. అధ్యాయము.

1 అయితే దావీదు మృతి బొందుటకు దినములు
సమీపించినప్పుడు అతడు తన కుమారుడైన సొలొ
2 మోనుకు ఆజ్ఞ యిచ్చినదేమంటే; । యిదుగో లోకు
లందరి మార్గమున నేను వెళ్లుతూ వున్నాను; కాబట్టి
3 నీవు బలాఢ్యుడైన పురుషుడవై; । నీ దేవుడయిన యె
హోవాయొక్క ఆజ్ఞను గైకొని, ఆయన మార్గముల
లో నడిచి, యే పనిమీద నీవు వుండినా యెక్కడికి
నీవు తిరిగినా సమస్తమైన వాటి యందు సుబుద్ధిగా
నీవు వుండ గలందులకు నీవు ఆయనయొక్క కట్టడల
నున్ను కల్పనలనున్ను ఆజ్ఞలనున్ను ప్రమాణములనున్ను
మోషేయొక్క న్యాయప్రమాణములో వ్రాసినట్టు
గైకొని చేయుము. । అప్పుడు యెహోవా తాను నన్ను 4
గురించి ఆనతిచ్చిన వాక్యము రూఢము చేసును; అది
యేమంటే నీ పిల్లలు తమ తమ మార్గములందు భద్ర
ముగా వుండి, నా యెదుట తమ నిండైన హృదయ
ముతోనున్ను నిండైన మనస్సుతోనున్ను యథార్థ
ముగా నడిచిరట్టాయెనా ఇశ్రాయేలుయొక్క గద్దె
మీద కూర్చుండడానకు నీకు వొకడైనా వుండక
పోడని ఆనతిచ్చెను. । అయితే సెరూయా కుమారు 5
డైన యోవాబు నాకు యేమి చేసెనో అదిన్ని, నేరు
యొక్క కుమారుడైన అబ్నేరున్ను యెతెరు కుమారు
డైన అమాశాయున్ను ఇశ్రాయేలు సమూహాధిపతు
లైన వీరిద్దరికిన్ని వాడు యేమి చేసెనో అదిన్ని నీవు
యెరుగుదువు; యేమంటే వాడు వారిని సమాధానకాల
మందు చంపి, యుద్ధపు రక్తమును చిందించి, యుద్ధపు
రక్తము తన మొలతాడు మీదనున్ను తన పాదరక్షల
మీదనున్ను వేసెను. । కాబట్టి నీకు కలిగిన బుద్ధిప్రకా 6
రము చేసి, వానియొక్క నెరసిన తల నెమ్మదిగా సమా
ధికి దిగనియ్యవద్దు. । అయితే గిలాదీయుడైన బర్జి 7
ల్లయియొక్క కుమారులకు దయ అగుపరచి, నీ బల్ల
మీద భోజనము చేసేవారితో కూడా వారిని వుండని
మ్ము; యేమంటే నేను నీ సహోదరుడైన అబ్షాలోము
ముందరినుంచి పారిపోయినప్పుడు వారు నా యొద్దికి
వచ్చిరి. । మరిన్ని బాహూరీముయొక్క బెన్యామీనీ 8
యుడైన గేరాయొక్క కుమారుడైన షిమీ నీ యొద్ద
వున్నాడు; నేను మహనయీముకు వెళ్లుతూ వున్నప్పు
డు వాడు నన్ను కఠినమైన శాపముచేత శపించెను;
అయితే వాడు నన్ను యెదుర్కొనడానకు యర్దేను
నది యొద్దికి దిగి వచ్చెను; అప్పుడు యెహోవా పేర
వానికి ప్రమాణమిచ్చి, కత్తిచేత నిన్ను చంపించకుండా
వుందునని చెప్పితిని. । అయినప్పటికిన్ని వాని నిర్దో 9
షిగా యెంచవద్దు; నీవు సుబుద్ధి గలవాడవై, వాని
యేమి చేయ వలసినదో అది నీకు తెలుసును; వానియొ
క్క నెరిసిన తల రక్తముతోటే సమాధికి దిగేటట్టు
చేతువు గాకని చెప్పెను. । అప్పుడు దావీదు తన పితృ 10
లతోకూడా నిద్ర పొంది, దావీదు పట్టణమందు సమా
ధిలో పెట్టబడెను. । దావీదు ఇశ్రాయేలును యేలిన 11
దినములు నలుబై సంవత్సరములై వుండెను; హెబ్రో
నులో అతడు యేడు సంవత్సరములున్ను, యెరూశలే

ములో ముప్పై మూడు సంవత్సరములున్ను యేలెను.।
12 అప్పుడు సొలొమోను తన తండ్రియైన దావీదుయొ
క్క గద్దెమీద ఆసీనుడాయెను; మరిన్ని అతని రాజ్య
13 ము అధికముగా స్థిరపరచబడెను. । అంతలో హగ్గీతుకు
పుట్టిన అదోనీయా సొలొమోను తల్లియైన బత్షెబ
యొద్దికి వచ్చెను. ఆమె అతని చూచి సమాధానముగా
వస్తూ వున్నావా అని అడిగినప్పుడు, అతడు సమాధా
14 నముగానే అని చెప్పి, । నీతోను చెప్ప వలసిన మాట
15 వొకటి కద్దని అనగా, ఆమె అది చెప్పుమనెను. । అప్పు
డతడు అనిన మాట, రాజ్యము నాదై వుండెననిన్ని,
నేను యేలవలెనని ఇశ్రాయేలీయులందరు తమ నేత్ర
ములు నా మీద వుంచిరనిన్ని నీవు యెరుగుదువు;
అయినప్పటికిన్ని రాజ్యము తిరిగిపోయి నా సహో
దరునిదై వున్నది; యేమంటే అది యెహోవావల్ల
16 అతనికి ప్రాప్తమాయెను. । యిప్పుడు నేను నిన్ను వొక
మనవి అడుగుదును; నన్ను వద్దని చెప్పకు అని చెప్పిన
17 ప్పుడు ఆమె అతనితో అడుగుమని చెప్పెను. । కాబట్టి
అతడు రాజైన సొలొమోను షూనమ్మీయురాలైన అబీ
షగును నాకు పెండ్లికి యిచ్చేటందుకోసము దయచేసి
అతనితో నీవు చెప్ప వలెను; అతడు నిన్ను వద్దని చెప్ప
18 డని చెప్పినప్పుడు; । బత్షెబ అతనితో మంచిది, నిన్ను
19 గురించి రాజుతో చెప్పుతానని చెప్పెను. । కాబట్టి
బత్షెబ రాజైన సొలొమోను యొద్దికి అదోనీయా కొ
రకు చెప్పడానకు వచ్చెను: వచ్చినప్పుడు రాజు లేచి,
ఆమెకు యెదురుగా వచ్చి, ఆమెకు సమస్కారము చేసి,
గద్దె మీద కూచుండి, తన తల్లి కొరకు ఆసనము
వొకటి వేయించినందున ఆమె అతని కుడిపార్శ్వమందు
20 కూచుండెను. । అప్పుడు ఆమె అతనితో వొక చిన్న
మనవి చేయ కోరి వున్నాను; నన్ను వద్దనకుమని చెప్పి
నప్పుడు, రాజు వో నా తల్లి, చెప్పుము, నిన్ను వద్దని
21 అనను అని అన్నప్పుడు; । ఆమె షూనమ్మీయురాలైన
అబీషగును నీ సహోదరుడైన అదోనీయాకు పెండ్లికి
22 యిప్పించ వలసినదనినప్పుడు; । రాజైన సొలొమోను
తన తల్లితో చెప్పినదేమంటే, షూనమ్మీయురాలైన అబీ
షగును మాత్రమే అదోనీయా కొరకు అడిగేదేమి?
రాజ్యమునున్ను అతని కొరకు అడుగుము, యేమంటే
అతడు నా అన్న; కాబట్టి అతని కొరకున్ను అర్చ
కుడైన అబ్యాతారు కొరకున్ను సెరూయా కుమారుడైన
యోవాబు కొరకున్ను రాజ్యమును అడుగుమని చెప్పి;।
23 రాజైన సొలొమోను యెహోవా పేర ప్రమాణము
చేసి చెప్పినదేమంటే, అదోనీయా చెప్పిన యీ మాట
వల్ల అతని ప్రాణమునకు నష్టము రాకపోతే దేవుడు
అట్లన్ని దానికంటే అధికమున్ను నాకు చేసును గాక. ।
24 కాబట్టి నన్ను స్థిరపర్చి, నా తండ్రియొక్క గద్దె మీద
నన్ను ఆసీనునిగా చేసి, తన వాగ్దత్తప్రకారము నాకు
యిల్లు కలుగ చేసిన యెహోవా జీవముతోడు, అదో
నీయా యీ దినమున మరణమౌను గాకని చెప్పి; ।
రాజైన సొలొమోను యెహోయాదాయొక్క కుమా 25
రుడైన బేనాయ్యాను పంపెను, వీడు వాని మీద పడి
నందున వాడు మరణమాయెను. । తరువాత రాజు అర్చ 26
కుడైన అబ్యాతారుకు యిచ్చిన సెలవు యేమంటే, నీవు
అనాతోతులో నీకు కలిగిన పొలములకు వెళ్లు; నీవు
మరణానకు పాత్రుడవైనప్పటికిన్ని నీవు నా తండ్రి
యైన దావీదు ముందర దేవుడైన యెహోవాయొక్క
పెట్టె మోసి, నా తండ్రికి ప్రాప్తించిన శ్రమలన్నిటి
యందు శ్రమ పొందితివి గనుక, యీ వేళ నిన్ను మర
ణమును పొందించకుండా వుందునని చెప్పి, । సొలొ 27
మోను అబ్యాతారును యెహోవాకు అర్చకునిగా
వుండకుండా బయిలు వెళ్లవేసెను; అందువల్ల యెహో
వా ఏలీయొక్క యింటిని గురించి షీలోలో ఆన
తిచ్చిన వాక్యము నెరవేరెను. । అప్పుడు యీ వర్త 28
మానములు యోవాబుకు వచ్చెను; యోవాబు యేమం
టే అబ్షాలోమును వెంబడించక పోయినప్పటికిన్ని
అదోనీయా తట్టు తిరిగి వాని వెంబడించెను; కాబట్టి
యోవాబు పారిపోయి, యెహోవాయొక్క డేరాకు
వచ్చి, బలిపీఠపు కొమ్ములను పట్టుకొనెను. । అప్పుడు 29
రాజైన సొలొమోనుకు వినపడినదేమంటే, యోవాబు
పారిపోయి, యెహోవాయొక్క డేరాకు వచ్చినాడ
నిన్ని, అదుగో బలిపీఠము యొద్ద వున్నాడనిన్ని వినప
డినందున, సొలొమోను యెహోయాదా కుమారుడైన
బేనాయ్యాను చూచి, నీవు వెళ్లి వాని మీద పడుమని
పంపెను. । కాబట్టి బేనాయ్యా యెహోవాయొక్క 30
డేరాకు వచ్చి, వానితో రాజు నిన్ను బయిటికి రమ్మన్న
సెలవు యిచ్చెనని చెప్పినప్పుడు, వాడు అది కాదు,
నేను యిక్కడనే మరణమౌదునని చెప్పెను. కాబట్టి
బేనాయ్యా తిరిగీ రాజు యొద్దికి వచ్చి, యోవాబు
యీలాగున నాతో ప్రత్యుత్తరము చెప్పెనని చెప్పిన
ప్పుడు; । రాజు వానితో వాడు నీతో చెప్పినట్టుగా 31
వాని మీద పడి, యోవాబు చిందించిన నిరపరాధుల
యొక్క రక్తమును నాకున్ను నా తండ్రి యింటికిన్ని
నీవు పరిహారము చేసేటట్టుగా వాని చంపి పాతి
పెట్టుము. । ఆలాగున యెహోవా వాని రక్తము వాని 32
శిరస్సు మీదనే తిరిగి రాచేసును, యేమంటే వాడు
తనకంటే నీతిపరులైన యిద్దరు వుత్తముల మీద పడి,
నా తండ్రియైన దావీదు యెరుగకుండా కత్తిచేత వా
రిని చంపివేసెను; వారు యెవరంటే, నేరుయొక్క
కుమారుడైనటువంటిన్ని ఇశ్రాయేలు సమూహాధిపతి
అయినటువంటిన్ని అబ్నేరున్ను, యెతెరుయొక్క కుమా

రుడైనటువంటిన్ని యూదా సమూహాధిపతియైనటు
33 వంటిన్ని అమాశాయున్ను. । కాబట్టి వీరి రక్తము తిరిగీ
యోవాబు శిరస్సుమీదనున్ను సదాకాలము మట్టుకు
వాని సంతతి శిరస్సుమీదనున్ను పడును; అయితే దా
వీదుకున్ను అతని సంతతికిన్ని అతని యింటికిన్ని అతని
గద్దెకున్ను సమాధానము యెన్నటెన్నటికీ యెహోవా
34 వావల్ల కలిగి వుండునని చెప్పెను. । కాబట్టి యెహోవా
యూదా కుమారుడైన బేనాయ్యా వచ్చి, వాని మీద
పడి వాని చంపెను; వాడు అరణ్యమందుండే తన
35 యింట్లో పాతి పెట్టబడెను. । అప్పుడు రాజు వానికి
బదులుగా యెహోయాదా కుమారుడైన బేనాయ్యా
ను సమూహాధిపతిగా నిర్ణయించెను; మరిన్ని రాజు
అర్చకుడయిన సాదోకును అబ్యాతారు స్థలమందు
36 వుంచెను. । తరువాత రాజు షిమీని పిలువనంపించి వా
నితో చెప్పినదేమంటే, నీవు యెరూశలేములో యిల్లు
కట్టించుకొని అందులో కాపురము చేసి, బయిట యే
37 వూరికయినా వెళ్లకుండా వుండు. । యేమంటే నీవు యే
దినమున బయిలు వెళ్లి, కిద్రోను గెడ్డ దాటుదువో,
ఆ దినమున నీవు నిశ్చయముగా మరణమాదువని రూ
ఢముగా యెరిగి వుండు; నీ రక్తము నీ శిరస్సుమీదనే
38 పడియుండునని చెప్పినప్పుడు; । షిమీ మీరు యిచ్చిన
సెలవు మంచిదేను; నా యేలినవారున్ను రాజున్ను
అయిన మీరు చెప్పిన ప్రకారము మీ సేవకుడనయిన
నేను చేతునని రాజుతో చెప్పెను. కాబట్టి షిమీ
యెరూశలేములో అనేక దినములు నివాసము చేస్తూ
39 వుండెను. । అయితే మూడు సంవత్సరములైన తరువాత
సంభవించినదేమంటే, షిమీయొక్క సేవకులలో యి
ద్దరు పారిపోయి, మయఖా కుమారుడైన ఆఖీషు అనే
గాతుయొక్క రాజు యొద్దికి వచ్చివుండిరి; అంతట
యిదుగో నీ సేవకులు గాతులో వున్నారన్న వర్తమా
40 నము షిమీకి చెప్పబడెను. । అప్పుడు షిమీ లేచి తన
గార్దభము మీద గంత కట్టి, తన సేవకులను వెతికే
టందుకు గాతులో ఆఖీషు యొద్దికి వెళ్లెను; యీలా
గున షిమీ వెళ్లి గాతులోనుంచి తన సేవకులను తీసు
41 కొ వచ్చెను. । అయితే షిమీ యెరూశలేములోనుంచి
గాతుకు వెళ్లి తిరిగీ వచ్చెనని సొలొమోనుకు వినప
42 డెను. । అప్పుడు రాజు షిమీని పిలువనంపించి, వాని
తో యెహోవా పేరట మేము నీ యొద్ద ప్రమాణ
మును పుచ్చుకొని, నీవు యే దినమందున బయిటికి
తర్లి, యే స్థలమునకైనా వెళ్లుదువో, ఆ దినమున నీవు
మరణమాదువని ముఖ్యముగా తెలుసుకో వలెనని నీ
తో ఖండితముగా నేను చెప్పలేదా? అందుకు నేను
43 విన్న సెలవు మంచిదని నీవు ఒప్పితివే. । కాబట్టి
యెహోవా సాక్షియైన ప్రమాణమునున్ను మేము
నీకు ఆజ్ఞాపించిన ఆజ్ఞనున్ను నీవు గైకొనక పోతివేమని
అడిగి; । రాజు షిమీతో మరిన్ని చెప్పినదేమంటే, నీవు 44
మా తండ్రియైన దావీదుకు చేసినటువంటిన్ని నీ హృ
దయమునకు యెరుకపడి వున్నటువంటిన్ని కీడంతా
నీకు తెలుసును; కాబట్టి యెహోవా నీవు చేసిన
కీడు నీ శిరస్సు మీదికే తిరిగి రాచేసును. । రాజైన సొ 45
లొమోను ఆశీర్వాదము పొందును; దావీదుయొక్క
గద్దె యెహోవా సముఖమందు సదాకాలము మట్టుకు
స్థిరపర్చబడునని చెప్పి; । రాజు యెహోయాదా 46
కుమారుడైన బేనాయ్యాకు సెలవు యిచ్చినందున,
వాడు బయిలు వెళ్లి వాని మీద పడి చంపెను; యీ
లాగున రాజ్యము సొలొమోను వశముగా స్థిరపరచ
బడెను.

## 3. అధ్యాయము.

తరువాత సొలొమోను మిస్రయీము రాజైన 1
ఫరోతో సంబంధము చేసుకొని, ఫరోయొక్క కుమా
ర్తెను తీసుకొని, తన యిల్లునున్ను యెహోవాయొ
క్క మందిరమునున్ను యెరూశలేము చుట్టూ ప్రాకా
రమునున్ను కట్టించడము సమాప్తమయ్యే మట్టుకు దా
వీదు పట్టణమందు దాని వుంచెను. । ఆ దినముల పర్యం 2
తము యెహోవా పేరట కట్టించబడ్డ మందిరము లేక
పోయెను గనుక జనులు వున్నతమైన స్థలములయందు
మాత్రము బలులను చెల్లిస్తూ వుండిరి. । సొలొమోను 3
యెహోవా యందు ప్రేమ వుంచి, తన తండ్రియైన
దావీదుయొక్క నిబంధనల యందు నడుస్తూ వుండెను;
వున్నతమయిన స్థలములయందు మాత్రము అతడు బలు
లను చెల్లిస్తూ ధూపమును సమర్పిస్తూ వుండెను. । అంత 4
లో రాజు బలులను చెల్లించడానకు గిబోనుకు వెళ్లెను,
యెందుకంటే అది ముఖ్యమైన వున్నత స్థలమయి వుం
డెను; ఆ బలిపీఠము మీద సొలొమోను వెయి హోమ
ములను చెల్లించెను. । గిబోనులో యెహోవా 5
రాత్రి సమయాన సొలొమోనుకు స్వప్నమందు ప్రత్య
క్షమై, నేను దేని యిచ్చుటకు నీకు అనుకూలమో
అది అడుగుమని దేవుడు అతనితో చెప్పినందున; ।
సొలొమోను అననిదేమంటే, నీ సేవకుడున్ను నా 6
తండ్రిన్ని అయిన దావీదు నీ సముఖమందు సత్యము
తోనున్ను నీతితోనున్ను యథార్థమయిన హృదయ
ముతోనున్ను నడిచినందున, నీవు అతనికి బహు కటా
క్షము అగుపర్చి, యీ దినమున వున్నలాగు అతని
గద్దె మీద అతని కుమారుని కూర్చుండ బెట్టుటకు
అతని కొరకు యీ గొప్ప దయను వుంచితివి. । యిప్పు 7
డు నా దేవుడవయిన వో యెహోవా, నీవు నా
తండ్రియయిన దావీదుకు బదులుగా నీ సేవకుడనైన

నన్ను రాజుగా చేస్తివి; అయితే నేను బాలుడను; బయి
టికి వెళ్లుటకున్ను లోపలికి వచ్చుటకున్ను నేనెరు
8 గను. । నీ సేవకుడనయిన నేను నీవు యెంచుకొనిన
జనుల మధ్యమందు వున్నాను; వీరు లెక్కించబడుట
కున్ను యెంచబడుటకున్ను అసాధ్యమున్ను విస్తార
9 మున్ను అయిన జనసమూహమై వున్నారు. । కాబట్టి
నేను మేలు కీళ్లలో వున్న భేదము గ్రహించి, నీ జను
లకు న్యాయము, తీర్చేకొరకు నీ సేవకుడనయిన నాకు
బుద్ధిగల హృదయమును దయచేయుము, యేమంటే
యింత గొప్పదైన నీయొక్క జనమునకు న్యాయము
10 తీర్చేపాటి వాడు యెవ్వడని చెప్పెను. । సాలొమోను
చెప్పుకొన్న మనవి యెహోవాకు యిష్టముగా వుం
11 డెను. । కాబట్టి దేవుడు అతనికి సెలవు యిచ్చినదే
మంటే, నీవు దీని అడిగితివి గాని నీ కొరకు దీర్ఘా
యువునయినా ఐశ్వర్యమునయినా నీ శత్రువులయొ
క్క ప్రాణమునయినా అడగక, న్యాయపు తీర్పును
గ్రహించేటందుకు నీ కొరకు బుద్ధిని అడిగితివి గనుక,।
12 యిదుగో నీ మనవి చొప్పున నేను చేస్తిని; యిదుగో
నీకు బుద్ధిన్ని వివేకమున్ను గల హృదయమును నీకు
యిస్తిని; అందువల్ల నీకంటే పూర్వులలో నీవంటివాడు
వొకడూ లేడు, యిట మీదటనున్ను నీవంటివాడు
13 వొకడూ లేక వుండును. । మరిన్ని నీవు అడగనటు
వంటి వాటిని, అనగా, ఐశ్వర్యమునున్ను ఘనతనున్ను
నీకు యిస్తిని; అందువల్ల నీ దినములన్నిటియందు రాజు
14 లలో నీ వంటివాడు వొకడూ లేక వుండును. । మరిన్ని
నీ తండ్రియైన దావీదు నడిచినలాగున నీవు నా మా
ర్గములలో నడిచి, నా కట్టడలనున్ను నా ఆజ్ఞల
నున్ను గైకొని చేస్తివట్టాయెనా నీ దినములను పొడుగు
15 చేతునని ఆనతిచ్చెను. । అంతట సాలొమోను మేలు
కొన్నప్పుడు, యిదుగో, యిది స్వప్నమని తెలుసుకొ
నెను. అప్పుడు అతడు యెరూశలేముకు వచ్చి, యె
హోవాయొక్క వొడంబడికె గల పెట్టె ముందర
నిలిచి, హోమ బలులను అర్పించి, సమాధాన బలు
లను చెల్లించి, తన సేవకులందరికిన్ని విందు చేయిం
16 చెను. । తరువాత వేశ్యలైన యిద్దరు స్త్రీలు రాజు యొ
17 ద్దికి వచ్చి, అతని ముందర నిలిచిరి. । అందులో వొకతె
అనినదేమంటే, వో నా యేలినవారా, నేనున్ను యీ
స్త్రీయున్ను వొక యింట్లో నివసించి వున్నాము; దాని
తో కూడా యింట్లో వుండి నేను వొక పిల్లను కంటిని.।
18 నేను కనిన మూడో నాటియందు సంభవించినదేమం
టే, యిదిన్ని పిల్లను కనెను; మేమిద్దరమున్ను కూడి
యున్నాము; మేమిద్దరము గాక యింట్లో మరి అన్యు
19 లు లేరు. । అయితే రాత్రిలో యీమె తన పిల్ల మీద
20 పడినందున అది చనిపోయెను. । కాబట్టి యిది మధ్య
రాత్రిలో లేచి, మీ సేవకురాలనైన నేను నిద్రిస్తూ
వుండగా వచ్చి, నా పక్కలోనుంచి నా కుమారుని
తీసుకొని, తన కౌగిటిలో పెట్టుకొని, చనిపోయిన తన
పిల్లను కౌగిటిలో వేసెను. । వుదయమందు నేను లేచి, 21
నా పిల్లకు పాలు యివ్వబోయినప్పుడు, యిదుగో, పిల్ల
చనిపోయి వుండెను; అయితే వుదయమందు నేను
దాని తేరి చూచినప్పుడు, యిదుగో వాడు నా కడు
పున పుట్టినవాడు కాడని రాజుతో చెప్పెను. । అంత 22
లో రెండో స్త్రీ అనిన మాట, ఆలాగున కాదు, బ్రతికి
వున్నవాడు నా కుమారుడు, చనిపోయినవాడు నీ కుమా
రుడు అని చెప్పినప్పుడు; యీమె కాదు, చనిపోయిన
వాడే నీ కుమారుడు, బ్రతికి వున్నవాడే నా కుమా
రుడు అని యీ ప్రకారముగా వీరు రాజు ముందర
పలికిరి. । అప్పుడు రాజు వీరిలో వొకతె బ్రతికి వున్న 23
వాడు నా కుమారుడనిన్ని; చనిపోయినవాడు నీ కుమా
రుడనిన్ని చెప్పుతున్నది; యింకొకతె ఆలాగు కాదు,
చనిపోయినవాడే నీ కుమారుడనిన్ని, బ్రతికి వున్న
వాడే నా కుమారుడనిన్ని చెప్పుతున్నది అని పలికి; ।
వొక కత్తి నా దగ్గిరికి తెమ్మని రాజు అనగా, వారు 24
వొక కత్తిని రాజు సన్నిధికి తెచ్చిరి. । అప్పుడు రాజు 25
బ్రతికి యుండే పిల్లను చెరి సగము చేసి, సగము దీని
కిన్ని సగము దానికిన్ని యిమ్మని చెప్పెను. । అప్పుడు 26
బ్రతికియున్న పిల్లయొక్క తల్లికి తన పిల్ల విషయమై
కడుపు మండినందున అది రాజుతో చెప్పినదేమంటే,
వో నా యేలినవారా, పిల్లను యెంతమాత్రమూ చంపక
దానికే యిప్పించండని చెప్పినప్పుడు; ఆ రెండో స్త్రీ
అనినది యేమంటే, అది నాదైనా కాకుండా నీదైనా
కాకుండా చెరిసగము చేయనియ్యుమని చెప్పినందున;।
రాజు బ్రతికి వున్న పిల్లను యెంతమాత్రము చంపక 27
దానికి యియ్యండి; ఆమె దాని తల్లి అని తీర్చెను. ।
అంతట ఇశ్రాయేలీయులందరున్ను రాజు తీర్చిన న్యా 28
యపు తీర్పును విని, రాజుయందు భయముగా వుం
డిరి; యేమంటే, న్యాయము నిర్ణయించడానకు దైవ
జ్ఞానము అతనికి కద్దని వారు తెలుసుకొనిరి.

## 4. అధ్యాయము.

ఈలాగున రాజైన సాలొమోను ఇశ్రాయేలు అం 1
తటి మీద రాజయి వుండెను. । అతని యొద్ద వున్న 2
శ్రేష్ఠులు యెవరెవరంటే, సాదోకు కుమారుడైన అజ
ర్యా; వీడు ప్రధానియై వుండెను. । మరిన్ని షీషా 3
కుమారులైన ఎలీహోరెపున్ను అహీయాయున్ను; వీరు
కరణములై వుండిరి: అహీలూదుయొక్క కుమారుడైవ
యెహోషాఫాథు సమాచార లేఖకుడై వుండెను. ।
మరిన్ని యెహోయాదా కుమారుడైన బెనాయ్యా 4

సైన్యాధిపతియై వుండెను; సాదోకున్ను అబ్యాతారు
5 న్ను అర్చకులై వుండిరి. । నాతాను కుమారుడైన
అజర్యా అధికారుల మీద వుండెను; నాతాను కుమారు
డైన జాబూదు రాజుకు మంత్రిన్ని మిత్రుడున్ను అయి
6 వుండెను. । మరిన్ని అహీషారు యింటి కారకుడై వుం
డెను; అబ్దాయొక్క కుమారుడైన అదోనీరాము పన్ను
7 మీద అధికారి అయి వుండెను. । మరిన్ని ఇశ్రాయేలు
అంతటి మీద సొలొమోనుకు పండెండుమంది అధి
కారులు గలరు; వీరు రాజుకున్ను అతనియొక్క యిం
టివారికిన్ని ఆహారమును సంగ్రహము చేసేవారై,
వొక్కొక్క సంవత్సరమందు వొక్కొక్క నెలకు వొ
క్కొక్కడు ఆహారమును సంగ్రహము చేసేవాడై వుం
8 డెను. । వారి పేరులు యేవంటే, ఎఫ్రయీము పర్వ
9 తమందు హూరు కుమారుడు. । మాకస్సులోనున్ను
షయల్బీములోనున్ను బేత్షెమెషులోనున్ను ఏలోన్బె
10 థానానులోనున్ను దెకెరు కుమారుడు. । అరుబ్బోతు
లో హెసెదు కుమారుడు; వీనికి షోఖో దేశమున్ను
11 హేఫెరు దేశమంతయున్ను కలిగి వుండెను. । మరిన్ని
అబీనాదాబు కుమారుడు; వీనికి దోరు దేశమంతా కలిగి
వుండెను; వీనికి సొలొమోను కుమార్తెయైన థాఫతు
12 భార్య అయి వుండెను. । మరిన్ని అహీలూదు కుమా
రుడైన బయనా; వీనికి తయనఖు, మెగిద్దో, యావత్తు
బేత్షెయాను కలవు; యిది ఇజ్రెయేలు కింద వున్న సా
రేతాను దగ్గిర వుండి, బేత్షెయాను మొదలుకొని ఆబేల్మె
హోలా మట్టుకున్ను యొక్నెయాము అవతల స్థలము
13 మట్టుకున్ను వున్నది. । మరిన్ని గెబెరు కుమారుడు
రామోత్గిలాదు యందు వుండెను; వీనికి గిలాదులో
వున్న మనస్సేయొక్క కుమారుడైన యాయీరుయొక్క
గ్రామములు కలిగి వుండెను; మరిన్ని వీనికి బాషాను
లో వున్న అర్గోబు దేశమున్ను కలిగి వుండెను; ఇం
దులో ప్రాకారములున్ను యిత్తడి అడ్డుగడలున్ను గల
14 అరువై గొప్ప పట్టణములు గలవు. । మరిన్ని యిద్దో
యొక్క కుమారుడయిన అహీనాదాబు మహనయీ
15 ములో వుండెను. । నఫ్తాలీము దేశమందు అహీమయ
స్సు వుండెను; వీడు సొలొమోనుయొక్క కుమార్తె
16 యైన బాశ్మతును వివాహము చేసుకొనెను. । ఆషేరు
లోనున్ను ఆలోతులోనున్ను హూషై కుమారుడైన
17 బయనా గలడు. । యిశ్శాఖారు దేశమందు పరూయ
18 హు కుమారుడైన యెహోషాఫాథు గలడు. । బెన్యా
మీను దేశమందు ఏలా కుమారుడైన షిమీ కలడు. ।
19 గిలాదు దేశమందున్ను ఎమోరీయులకు రాజైన సీహో
ను దేశమందున్ను బాషాను రాజైన ఓగు దేశమందు
న్ను ఊరీ కుమారుడైన గెబెరు కలడు; వీడు గాక ఆ
20 దేశమందు అధికారి వొకడూ లేడు. । అయితే యూ

దావారున్ను ఇశ్రాయేలీయులున్ను సముద్రపు దరి
యందున్న యిసుకలాగున విస్తార సమూహమై, భో
జనము చేస్తూ తాగుతూ సంభ్రమపడుతూ వుండిరి. ।
సొలొమోను నది మొదలుకొని ఫిలిష్తీయుల దేశము 21
మట్టుకున్ను మిస్రయీము సరిహద్దు మట్టుకున్ను యీ
మధ్యనున్న రాజ్యములన్నిటిని యేలుతూ వుండెను;
వారు కానుకలు తెచ్చి సొలొమోనుకు బ్రతికిన దిన
ములన్నిటిదాకా అతనికి సేవచేసిరి. । నానాటికి సొలొ 22
మోనుయొక్క భోజనపు సామగ్రి యెంతంటే, ఆరు
గరిసెలు సన్నపు గోధుమ పిండిన్ని, పండెండు గరి
సెలు ముతక పిండిన్ని; । పది కొవ్విన యెద్లున్ను, యి 23
రువై విడి యెద్లున్ను, నూరు గొర్రెలున్ను; యివిగాక
లేళ్లూ, దుప్పులు, ఇర్రులు, కొవ్విన పక్షులున్ను గల
వు. । యేమంటే అతని అధికారము నది యివతల తిప్స 24
హు మొదలుకొని అజ్జా మట్టుకున్ను నది యివతల
వున్న రాజులందరి మీదికిన్ని కలిగి వుండెను; మరిన్ని
అతనికి నఖముఖాలా నెమ్మది కలిగి వుండెను. । కాబట్టి 25
ఇశ్రాయేలు యూదావారు సొలొమోనుయొక్క దిన
ములన్నిటిలో దాను మొదలుకొని బెయేర్షెబ మట్టుకు
తమ తమ ద్రాక్షచెట్ల కిందనున్ను అంజూరపు చెట్ల
కిందనున్ను నిర్భయముగా నివాసము చేసిరి. । మరిన్ని 26
సొలొమోనుయొక్క రథములకు నలభైవేల గుర్రపు
సాలలున్ను, పండెండువేల గుర్రపు రౌతులున్ను కలిగి
వుండెను. । మరిన్ని అధికారులు రాజైన సొలొమోను 27
కున్ను రాజైన సొలొమోనుయొక్క భోజనపు బల్ల
లకు వచ్చినవారందరికిన్ని ప్రతిమనిషీ తన తన నెల
లో ఆహారము సంగ్రహము చేసినందున వారికి
తక్కువ యేమైనా లేక వుండెను. । మరిన్ని గుర్రముల 28
కొరకున్ను పాటు పశువుల కొరకున్ను యవలున్ను
వరిగడ్డిన్ని ప్రతి స్థలమునకు ప్రతి మనిషీ తనకు
తనకు యిచ్చిన నిర్ణయము చొప్పున తెప్పించెను. ।
మరిన్ని దేవుడు జ్ఞానమునున్ను బుద్ధిని్ని విస్తార 29
మైన హృదయమునున్ను సముద్రపు దరి యిసుకంత
విస్తారమైనట్టుగా సొలొమోనుకు దయ చేసెను. । కా 30
బట్టి సొలొమోనుయొక్క జ్ఞానము తూర్పు దేశపు
పుత్రుల జ్ఞానముకంటేనున్ను మిస్రయీము జ్ఞానమం
తటికంటేనున్ను అధికమయి వుండెను. । యేమంటే 31
అతడు సమస్తమైన వారికంటేనున్ను, ఎజ్రాహీయుడైన
ఏతానుకంటేనున్ను, మాహోలు కుమారులైన హే
మాను, కల్కోలు, దర్ద అనే వీరికంటేనున్ను జ్ఞాన
వంతుడై వుండెను; యేమంటే అతని కీర్తి చుట్టూ వున్న
జనాంగములలో ప్రబలమై వుండెను. । అతడు మూడు 32
వేల సామితెలను చెప్పెను; అతని సంగీతములు వెయ్యి
న్నియైదు అయి వుండెను. । మరిన్ని చెట్లనుగురించి, 33

అనగా, గోడలోనుంచి పుట్టిన హిసపు మొక్క
మొదలుకొని, లెబానోనులో వుండే ఆర్జ వృక్షముల
పర్యంతమూ చెప్పెను; మరిన్ని అతడు మృగములు
పక్షులు పాకే జంతువులు జల చరములు వీటిని గురించి
34 న్ని చెప్పెను. । కాబట్టి అతని జ్ఞానముయొక్క కీర్తి వినిన
భూపతులు మొదలైన సమస్త జనులలోనుంచిన్ని సొలొ
మోనుయొక్క జ్ఞానమును వినడానకు అనేకులు వచ్చిరి.

## 5. అధ్యాయము.

1 తరువాత సోరుయొక్క రాజైన హీరాము తన
సేవకులను సొలొమోను యొద్దికి పంపెను, యెందు
కంటే అతని తండ్రికి బదులుగా అతని పట్టాభిషేక
ము చేసినారని అతడు విని వుండెను; యేమంటే హీ
రాము యెప్పటికీ దావీదుకు స్నేహితుడై వుండెను. ।
2 అప్పుడు హీరాము యొద్దికి సొలొమోను వర్తమాన
3 ము పంపినదేమంటే; । నా తండ్రియైన దావీదు తన
దేవుడైన యెహోవా పేరట వొక మందిరము కట్టించ
లేకపోయెనని నీవు యెరుగుదువు; యేమంటే యె
హోవా అతని శత్రువులను అతని పాదముల కింద
వేసే పర్యంతమూ అతని చుట్టూ అన్ని వైపులా యు
4 ద్ధములు కలిగి వుండెను. । అయితే యిప్పుడు నా దేవు
డైన యెహోవా అన్ని వైపులా నాకు నెమ్మదిని దయ
చేసి వున్నాడు; అందువల్ల విరోధియైనా లేడు, హిం
5 సయైనా లేదు. । కాబట్టి యిదుగో నా దేవుడైన యె
హోవా పేరట వొక మందిరము కట్టించుటకు తాత్ప
ర్యము కలవాడనై యున్నాను; యిందుకు యెహో
వా నా తండ్రియైన దావీదుకు ఆనతిచ్చినదేమంటే,
నీ గద్దె మీద నేను నీకు బదులుగా కూర్చుండబెట్టే
నీ కుమారుడు నా పేరట యొక మందిరము కట్టించు
6 నని ఆనతిచ్చెను. । కాబట్టి నా కొరకు లెబానోనులో
ఆర్జ మానులను నరుకుటకు సెలవు యివ్వవలసినది; నా
సేవకులు నీ సేవకులతో కూడా పని చేతురు; నీ సేవ
కుల కొరకు అయిన జీతము నీవు చేసే నిర్ణయమం
తటి ప్రకారముగా నేను నీకు యిత్తును; యేమంటే
మానులు నరకడమందు మాలో సీదోనీయులకు సమ
మైనవాడు వొకడూ లేడని నీకు తెలుసునని చెప్ప
7 మనెను. । హీరాము సొలొమోనుయొక్క మాటలు
వినినప్పుడు సంభవించినదేమంటే, అతడు బహు సం
తోషపడి పలికినదేమంటే, యీ గొప్ప జనులను యేలే
టందుకు జ్ఞానముగల కుమారుని దావీదుకు దయ చేసిన
యెహోవాకు యీ దినమున స్తోత్రము కలుగును
8 గాకని పలికెను. । మరిన్ని హీరాము సొలొమోనుకు
వర్తమానము పంపినదేమంటే, నా యొద్దికి నీవు పం
పిన వర్తమానములను నేను అంగీకరిస్తిని; ఆర్జమా
నులను గురించిన్ని దేవదారుమానులను గురించిన్ని నీ
యొక్క కోరికె అంతా నేను చేయింతును. । నా సేవ 9
కులు వాటిని లెబానోనునుంచి సముద్రము యొద్దికి
తెత్తురు; అప్పుడు నీవు నాకు నిర్ణయించే స్థలమునకు
తెప్పల మీద వాటిని సముద్రము మీద రవాణా చేసి,
అక్కడ నీకు అప్పగింత అయ్యేలాగు నేను చేతును;
నీవు వాటిని తీసుకొని నా యింటి కుటుంబము కొ
రకు ఆహారము మొదలైనవి పంపించి నా కోరికె చొ
ప్పున చేయింతువు గాకని పలికెను. । కాబట్టి హీరా 10
ము సొలొమోనుకు అతని కోరికె అంతటి చొప్పున
ఆర్జమానులనున్ను దేవదారు మానులనున్ను పంపిం
చెను. । కాబట్టి సొలొమోను హీరాముకున్ను అతని 11
యింటి కుటుంబమునకున్ను ఆహారము కొరకు రెండు
వేల ఆరునూట అరువై గరిసెల గోధుములనున్ను రెండు
గరిసెలనర స్వచ్ఛమైన నూనెనున్ను పంపించెను; యీ
లాగున సొలొమోను ప్రతి సంవత్సరమూ హీరాముకు
యిచ్చేవాడు. । అయితే యెహోవా సొలొమోనుకు 12
యిచ్చిన వాగ్దత్త ప్రకారము అతనికి జ్ఞానమును దయ
చేసెను; మరిన్ని హీరాముకున్ను సొలొమోనుకున్ను
సమాధానము కలిగినందున వీరిద్దరూ వొడంబడికెను
చేసుకొనిరి. । మరిన్ని రాజైన సొలొమోను ఇశ్రాయే 13
లీయులందరిలోనుంచి వెట్టివారిని యేర్పరచెను; యీ
వెట్టివారు ముప్పైవేల మంది అయి వుండిరి. । వీరిని 14
అతడు వంతులుగా నెల వొక్కంటికి పదివేల మంది
చొప్పున లెబానోనుకు పంపించేవాడు; వొక నెల
లెబానోనులోనున్ను రెండు నెలలు యింటి యొ
ద్దనున్ను యీలాగున వారు వుండిరి; ఆ వెట్టివారి
మీద అదోనీరాము అధికారియై వుండెను. । మరిన్ని 15
సొలొమోనుకు బరువులు మోసేవారు డెబ్బై వేల మం
దిన్ని, పర్వతములందు మానులు నరికే వారు యెనబై
వేల మందిన్ని కలరు. । వీరు గాక పనిమీద వున్న 16
సొలొమోనుయొక్క శిల్పికారులకు అధికారులు మూ
డువేల మున్నూరు మంది కలరు; వీరు పనివారి మీద
అధికారులై వుండిరి. । మరిన్ని రాజు సెలవైనందున 17
వారు మందిరముయొక్క పునాది వేయడానకు గొప్ప
రాళ్లున్ను మిక్కిలి వెలగల రాళ్లున్ను చెక్కిన రాళ్లున్ను
తెప్పించిరి. । యీలాగున సొలొమోను యొక్కన్ను 18
హీరాము యొక్కన్ను శిల్పికారులు మానులను
నరికి, రాళ్లను దొలిచి చెక్కి, మందిరము కట్టడానకు
మానులనున్ను రాళ్లనున్ను ఆయత్తము చేసిరి.

## 6. అధ్యాయము.

అయితే ఇశ్రాయేలు పుత్రులు మిస్రయీము 1
దేశములోనుంచి బయిలుదేరి వచ్చిన పిమ్మట నన్నూట

యెనభైయవో సంవత్సరమందు, అనగా, సొలొమోను
ఇశ్రాయేలును యేలుతూ వున్న నాలుగో సంవత్సర
మందు సీపు అనే రెండో మాసమందు అతడు యె
హోవాయొక్క మందిరమును కట్టించనారంభించెను.।
2 రాజయిన సొలొమోను యెహోవా కొరకు కట్టిం
చిన మందిరము అరువై మూరల పొడుగున్ను యిరువై
మూరల వెడల్పున్ను ముప్ఫయి మూరల యెత్తున్ను
3 గలదై వుండెను. । మందిరముయొక్క మంటపము మం
దిరముయొక్క వెడల్పు ప్రకారమే యిరువై మూరల
పొడుగు గలదై వుండెను; మందిరము ముందర అది
4 పది మూరల వెడల్పు గలదై వుండెను.। మందిరమునకు
లోపల వెడల్పున్ను బయిట యిరుకున్ను అయిన వె
5 లుగు కిటికీలను అతడు చేయించెను. । మరిన్ని మంది
రపు గోడ చుట్టూ గదులు కట్టించెను; మందిరపు గో
డలకున్ను గుడికిన్ని వాక్యస్థలమునకున్ను నఖముఖాలా
6 గదులు కట్టించెను. । కింది అంతస్తు గది అయిదు మూ
రల వెడల్పున్ను మధ్య అంతస్తు గది ఆరు మూరల
వెడల్పున్ను మూడో అంతస్తు గది యేడు మూరల
వెడల్పున్ను అయి వుండెను; యేమంటే మందిరపు
గోడ లోపట దూలములు వేయబడకుండా మందిరపు
గోడయొక్క మొలతాడు పయిని వుంచి తరగతిగా
7 చేయించెను. । అయితే మందిరము కట్టుతూ వుండగా
ముందుగా రాళ్లు సిద్ధము చేసి తెచ్చి కట్టిరి; కాబట్టి మం
దిరము కట్టుతూ వుండగా సుత్తె గొడ్డలి మొదలైన యి
నుప సరుకులయొక్క శబ్దము యెంత మాత్రమైనా లో
8 పల వినపడలేదు. । మధ్య అంతస్తుకు తలుపు మందిరపు
కుడిపార్శ్వమున వుండెను; మలుపు మెట్లచేత మధ్య
అంతస్తు గదికిన్ని మధ్య అంతస్తు గదిలోనుంచి మూడో
9 అంతస్తు గదికిన్ని యెక్కిపోయిరి.। యీలాగున అతడు
మందిరమంతా కట్టించి తయారుచేసి, మందిరమును
ఆర్జ దూలములతోటిన్ని బల్లలతోటిన్ని కప్పించెను. ।
10 మరిన్ని మందిరమునకు చుట్టూ అంతటా గదులు కట్టిం
చెను; యివి అయిదు మూరల యెత్తుగలవై; ఆర్జ
దూలాలచేత మందిరముతో దిట్టముగా అతకబడెను. ।
11 అంతలో యెహోవాయొక్క వాక్యము సొలొమో
12 నుకు వచ్చినదేమంటే, । నీవు యీ మందిరమును కట్టి
స్తూ వున్నావు; కాబట్టి నీవు నా కట్టడల యందు
నడిచి, నా ఆజ్ఞలను గైకొని, నా నిర్ణయానులను జరి
గించి నడిచిన పక్షమందు, నీ తండ్రియైన దావీదుతో
నేను ఆనతిచ్చిన వాక్యము నీకు రూఢపతుర్నను. ।
13 మరిన్ని నేను ఇశ్రాయేలు పుత్రులలో నివాసము చేసి,
నా జనులైన ఇశ్రాయేలును విడిచిపెట్టను అని చెప్పె
14 ను. । యీలాగున సొలొమోను యీ మందిరమును
15 కట్టించి ముగించెను. । అతడు మందిరముయొక్క అడుగు
మొదలుకొని మందిరముయొక్క లోపలి గోడలను
పయి కప్పు పర్యంతమూ ఆర్జ బల్లలచేత కట్టించెను;
వాటిని లోపల కర్రలతో కప్పి, మందిరపు నట్టిల్లు
దేవదారు బల్లలతో కప్పి వేసెను. । మరిన్ని మందిరము 16
పక్కల యందు దిగువనుంచి గోడల పయి మట్టుకు
ఆర్జ బల్లల చేత యిరువై మూరలు కట్టించెను; వీటిని
లోపలను వాక్య స్థలము కొరకు అనగా అతి పరిశుద్ధ
మైన స్థలము కొరకు అతడు కట్టించెను. । అయితే 17
దాని ముందర వున్న మందిరపు గుడి నలుభై మూరల
పొడుగై వుండెను. । మందిరము లోపలనున్న ఆర్జ 18
కర్రల యందు గుబ్బలున్ను వికసించిన పువ్వులున్ను
చెక్కబడి వుండెను; అంతా ఆర్జ కర్రయై వుండెను;
వొక రాయి అయినా అగుపడ లేదు. । అతడు యె 19
హోవాయొక్క వొడంబడికె గల పెట్టెను వుంచడా
నకు మందిరము లోపల వాక్య స్థలమును సిద్ధపర్చెను.।
వాక్య స్థలము ముందర పొడుగు యిరువై మూరలున్ను 20
వెడల్పు యిరువై మూరలున్ను యెత్తు యిరువై మూర
లున్ను గలదై వుండెను; దీనిని మేలిమి బంగారముతో
అతడు పొదిగించెను; ఆర్జ కర్రతో చేయబడ్డ బలి
పీఠమునున్ను యీలాగునే పొదిగించెను. । యీలాగున 21
సొలొమోను మందిరము లోపలను మేలిమి బంగార
ముతో పొదిగించి, వాక్య స్థలము ముందర బంగా
రపు గొలుసులుగల తెరచేసి, బంగారముచేత దాన్ని
పొదిగించెను. । యీలాగున మందిరమంతా ముగించే 22
పర్యంతమూ మందిరము యావత్తు బంగారముచేత
పొదిగించెను; వాక్య స్థలము యొద్దనున్న బలిపీఠమం
తానున్ను బంగారముచేత పొదిగించెను. । మరిన్ని వాక్య 23
స్థలమందు పదేసి మూరల యెత్తు గల రెండు కెరూ
బులను యిప్ప కర్రచేత అతడు చేయించెను. । వొక్క 24
కెరూబు యీ రెక్క అయిదు మూరలున్ను ఆ రెక్క
అయిదు మూరలున్ను కలిగి, యీ రెక్క చివర మొ
దలుకొని ఆ రెక్క చివర మట్టుకు పది మూరల పొడవు
కలదై వుండెను; । రెండో కెరూబున్ను పది మూరలు 25
కలదై వుండెను; కెరూబులు రెంటికిన్ని ఏక ప్రమాణ
మున్ను ఏకాకారమున్ను కలిగి వుండెను. । వొక కెరూ 26
బు పది మూరలు యెత్తు కలదై వుండెను; రెండో
కెరూబు దాని వలెనే వుండెను. । అంతర్మందిరములో 27
యీ కెరూబులను అతడు వుంచెను; ఆ కెరూబులు
తమ రెక్కలను చాచినప్పుడు వొక దాని రెక్క వొక
గోడకున్ను రెండో దాని రెక్క వొక గోడకున్ను
అంటి వుండెను; వీటి రెక్కలు మందిర మధ్యమందు
వొక దానితో వొకటి అంటుకొని వుండెను. । యీ 28
కెరూబులను అతడు బంగారముతో పొదిగించెను. ।
మరిన్ని మందిరముయొక్క యావత్తు గోడల లోపలా 29

వెలపలా కెరూబులనున్ను పోనీకి చెట్లనున్ను వికసిం
చిన పుష్పములనున్ను చెక్కించి బహు విచిత్రముగా
30 చేయించెను. । మరిన్ని మందిరముయొక్క నట్టిల్లు లో
31 పలా వెలపలా బంగారముచేత పొదిగించెను. । వాక్య
స్థలముయొక్క ద్వారము కొరకు యిప్ప కర్రచేత తలు
పులు చేయించెను; ద్వారబంధము మీది కమ్మిన్ని పక్క
32 కమ్ములున్ను అయిదు పలకలుగా వుండెను. । రెండు
తలుపులూ యిప్ప కర్రవై వుండెను; మరిన్ని వాటి
మీద కెరూబులనున్ను పోనీకి చెట్లనున్ను వికసించిన
పుష్పములనున్ను చెక్కించి బంగారముచేత పొదిగించె
ను; కెరూబుల మీదనున్ను పోనీకి చెట్లమీదనున్ను బం
33 గారము మొలామా చేయించెను. । మరిన్ని గుడి తలుపు
లకు యిప్ప కర్రచేత రెండు స్తంభములను చేయిం
34 చెను; యివి నాలుగు పలకలుగా వుండెను. । అయితే
రెండు తలుపులు దేవదారు కర్రచేత చేయబడి వుం
డెను; వొక తలుపుకు రెండు మడత రెక్కలున్ను
రెండో తలుపుకు రెండు మడత రెక్కలున్ను కలిగి
35 వుండెను. । వాటి మీద అతడు కెరూబులనున్ను పోనీకి
చెట్లనున్ను వికసించిన పుష్పములనున్ను చెక్కించి,
ఆ చెక్కిన వాటిమీద పనికి సిద్ధమయిన బంగారము
36 చేత పొదిగించెను. । మరిన్ని లోపల వున్న సాలను
మూడు వరసల చెక్కిన రాళ్లచేతనున్ను వొక వరస
37 ఆజ్ఞా దూలాల చేతనున్ను కట్టించెను; । నాలుగో
సంవత్సరము సీపు అనే మాసమందు యెహోవా
యొక్క మందిరముయొక్క పునాది వేయడమాయెను. ।
38 పదకొండో సంవత్సరము బూలు అనే యెనిమిదో
మాసమందు మందిరము దాని హద్దులన్నిటితోటిన్ని
దాని ఆకారము ప్రకారముగా సమాప్తమాయెను; కా
బట్టి అతడు యేడు సంవత్సరములు దాని కట్టిస్తూ
వుండెను.

## 7. అధ్యాయము.

1 అయితే సాలొమోను పదమూడు సంవత్సరములు
తన కొరకు నగరు కట్టిస్తూ తన మందిరమును యావ
2 త్తూ సమాప్తము చేసెను. । మరిన్ని అతడు లెబానోను
అరణ్యపు మందిరమును కట్టించెను; దీని పొడుగు నూరు
మూరలున్ను వెడల్పు యేభై మూరలున్ను యెత్తు
ముప్పై మూరలున్ను అయి వుండెను; నాలుగు వరసల
ఆజ్ఞాస్తంభముల మీద ఆజ్ఞా దూలాలు వేయపడెను. ।
3 మరిన్ని నలుబై అయిదు స్తంభములచేత మోయబడ్డ
దూలములు ఆజ్ఞా కర్రలచేత కప్పబడెను; ఆ స్తంభ
ములు పదిహేనేసి చొప్పున మూడు వరసల వుండెను. ।
4 మరిన్ని మూడు వరసల కిటికీలు వుండెను; యీ వెలుగు
ఆ వెలుగుకున్ను ఆ వెలుగు యీ వెలుగుకున్ను మూడు
వరసలను అభిముఖముగా వుండెను. । మరిన్ని తలుపు 5
లున్ను స్తంభములున్ను కిటికీలున్ను చచ్చౌకముగా
వుండెను; మూడు వరసలలో యీ వెలుగు ఆ వెలు
గుకున్ను ఆ వెలుగు యీ వెలుగుకున్ను అభిముఖము
గా వుండెను. । మరిన్ని అతడు స్తంభములు గల వొక 6
మంటపమును చేయించెను; దాని పొడుగు యేభై
మూరలున్ను వెడల్పు ముప్పై మూరలున్ను అయి
వుండెను; యీ మంటపము వాటికి యెదురుగా వుం
డెను; మరిన్ని స్తంభములున్ను దలసరి అయిన దూల
ములున్ను వాటికి యెదురుగా వుండెను. । తరువాత 7
అతడు న్యాయము తీర్చే గద్దె కొరకు వొక మంటప
మును చేయించెను; యిది న్యాయ మంటపమై యుం
డెను; దాని నట్టిల్లు యీతట్టు మొదలుకొని ఆ తట్టు
మట్టుకూ ఆజ్ఞా కర్రచేత కప్పపడెను. । మరిన్ని తాను 8
నివానము చేసిన మందిరముకు మంటపము వెనుక మరి
వొక సాల కలిగి వుండెను; యిది ఆ పని ప్రకారము
గానే వుండెను. మరిన్ని యీ మంటప ప్రకార
ముగా సాలొమోను తాను వివాహమైన ఫరోయొక్క
కుమార్తె కొరకు వొక యిల్లు కట్టించెను. । యీ 9
కట్టుటలన్నీ పునాది మొదలుకొని గోడ చూరు
మట్టుకు లోపటనున్ను బయిటనున్ను ప్రమాణముల
ప్రకారముగా దొలవబడినటువంటిన్ని రంపములచేత
కోయపడినటువంటిన్ని మిక్కిలీ వెలగల రాళ్లచేతనైన
వయి వుండెను; యీ ప్రకారమే గొప్ప సాల వైపు
వున్న వెలపలి భాగమున్ను వుండెను. । మరిన్ని పునాది 10
పదేసి యెనిమిదేసి మూరలు గలిగినటువంటిన్ని పెద్ద
వైనటువంటిన్ని మిక్కిలీ వెల గలిగినటువంటిన్ని రాళ్ల
చేతనైనవై వుండెను. । మరిన్ని మీద ప్రమాణముల 11
ప్రకారముగా చెక్కబడిన మిక్కిలీ వెలగల రాళ్లున్ను
ఆజ్ఞా కర్రలున్ను కలవు. । మరిన్ని గొప్ప సాలకు 12
చుట్టూ మూడు వరసల చెక్కిన రాళ్లున్ను వొక వరస
ఆజ్ఞా దూలములున్ను కలవు; యెహోవా మందిర
ముయొక్క లోపటి సాలయున్ను ఆ మందిరముయొ
క్క మంటపమున్ను ఆలాగునే వుండెను. । అప్పుడు 13
రాజైన సాలొమోను హీరాము అనే వొకని సోరు
పట్టణమునుంచి పిలువనంపించెను. । ఇతడు వొక విధ 14
వకు కుమారుడున్ను నఫ్తాలీము గోత్రపువాడున్నయి
వుండెను: ఇతని తండ్రి సోరు పట్టణపువాడున్ను యి
త్తడి పనివాడున్ను అయి యుండెను; యీ హీరాము
నిండైన ప్రజ్ఞ గల బుద్ధిమంతుడున్ను యిత్తడిచేత చేసే
సమస్తమైన పనులు చేయడానకు బహు చమత్కారపు
పనివాడున్ను అయి వుండెను. అతడు సాలొమోను
యొద్దికి వచ్చి అతని పని యావత్తూ చేసెను. । యేమం 15
టే అతడు రెండు యిత్తడి స్తంభములు పోత పోసెను;

వొక్కొక్క స్తంభము పద్ధెనిమిది మూరల నిడివి కలదై
వుండెను; వొక్కొక్కటి పన్నెండు మూరల కైవారము
16 గలదై వుండెను. । మరిన్ని స్తంభముల మీద వేయుడా
నకు యిత్తడిచేత రెండు పై మట్లను పోత పోసెను;
వొక మట్టుయొక్క యెత్తు అయిదు మూరలున్ను
రెండో మట్టుయొక్క యెత్తు అయిదు మూరలున్ను
17 అయి వుండెను. । మరిన్ని స్తంభముల మీదనున్న మట్లకు
మల్లు మల్లుగా వున్న వలలున్ను గొలుసు దండలున్ను
కలవు; వొక మట్టుకు యేడున్ను రెండో మట్టుకు యేడు
18 న్ను కలిగి వుండెను. । యీలాగున అతడు స్తంభములను
చేసి, మీదనున్న మట్లను కప్పడానకు వలలాటి పని
చుట్టూ రెండు వరసల దానిమ్మ పండ్లతో చేసెను;
యీ ప్రకారముగా అతడు రెండో మట్టుకున్ను
19 చేసెను. । మరిన్ని స్తంభముల మీదనున్న మట్లు మంట
పములోనున్న వాటివలె నాలుగు మూరల మట్టుకు
20 తామర పువ్వులాటి పని కలవై వుండెను. । మరిన్ని
రెండు స్తంభముల మీదనున్న మట్లకు వలలాటి పని
దగ్గిరనున్న కడుపుకు పైగా దానిమ్మ పండ్లు వుం
డెను; యిన్నూరు దానిమ్మ పండ్లు ఆ మట్టుమీద
21 వరస వరసల చుట్టూ వుండెను. । యీ స్తంభములను
అతడు గుడి మంటపములో యెత్తించెను; కుడిపా
ర్శ్వపు స్తంభమును యెత్తి యాకీను అనే పేరు
పెట్టెను, యెడమ పార్శ్వపు స్తంభమును యెత్తి
22 బోయజు అనే పేరు పెట్టెను. । యీ స్తంభముల మీద
తామర పువ్వులాటి పని వుండెను; యీలాగున స్తంభ
23 ములయొక్క పని సమాప్తమాయెను. । మరిన్ని అతడు
పోతపనిచేత వొక సముద్రమును చేసెను; అది యీ
తట్టు పయి అంచు మొదలుకొని ఆ తట్టు పయి అంచు
మట్టుకు పదిమూరలై వుండెను; అది అయిదు మూరల
యెత్తు గలదై, గుండ్రగా వుండెను; దాని కైవారము
24 ముప్ఫయి మూరలు అయి వుండెను. । దాని పై అంచుకు
కిందను చుట్టూ గుబ్బలు వుండెను; మూర వొక్కంటికి
పది గుబ్బల చొప్పున ఆ గుబ్బలు సముద్రము చుట్టూ
పరివేష్టించెను; అది పోత పోయపడినప్పుడు ఆ గుబ్బ
25 లు రెండు వరసలగా పోత పోయపడెను. । అది పం
డ్రెండు యెడ్లమీద నిలువబడి వుండెను; వీటిలో
మూడు వుత్తర దిక్కునున్ను, మూడు పడమర దిక్కు
నున్ను, మూడు దక్షిణపు దిక్కునున్ను, మూడు తూ
ర్పు దిక్కునున్ను చూస్తూ వుండెను; వీటి మీద ఆ
సముద్రము యెత్తపడి యుండెను; వాటి వెనుక భాగ
26 ములన్ని లోపలి తట్టు వుండెను. । అది బెత్తెడు దళసరి
గలదై వుండెను; దాని పయి అంచు పాత్రయొక్క
పయి అంచు ప్రకారముగా తామర పువ్వులలాటి
పనితోటి చేయపడి వుండెను; అది యిరువై అయిదు
గరిసెలు పట్టును. । మరిన్ని అతడు పది యిత్తడి 27
మట్లుచేసెను; మట్టు వొక్కంటికి నాలుగు మూరల
పొడుగున్ను నాలుగు మూరల వెడల్పున్ను మూడు
మూరల యెత్తున్ను కలిగి వుండెను. । యీ మట్లు పని 28
యొక్క విధమేమంటే, వాటికి పక్క పలకలు కలవు;
ఆ పక్క పలకలు జవల మధ్యను వుండెను. । జవల 29
మధ్యనున్న పక్క పలకల మీద సింహములున్ను యె
డ్లున్ను కెరూబులున్ను వుండెను; మరిన్ని జవల మీద
మట్టు వుండెను; సింహములయొక్క యెడ్లయొక్క కిం
దను వ్రేలాడే తీగె దండలలాటి పని కలిగి వుండెను. ।
మరిన్ని ప్రతిమట్టుకు నాలుగేసి యిత్తడి చక్రములు 30
న్ను యిత్తడి యిరుసులున్ను కలిగి వుండెను; దాని నా
లుగు మూలలలో దిమ్మలు కలవు; యీ దిమ్మలు తొట్టి
కింద అతికిన ప్రతి స్థలము దగ్గిర పోత పోయపడెను. ।
మరిన్ని దాని మూతి పై మట్టు యందున్ను మీదను 31
న్ను మూరెడు నిడివి అయి వుండెను; అయితే మూతి
కింది మట్టు పని చొప్పున గుండ్రగా వుండి మూరె
డునర నిడివి అయి వుండెను; మరిన్ని ఆ మూతిమీద
పక్క పలకలు గల చెక్కిన పనులు గలవు; యివి గుం
డ్రనివి కాకుండా చచ్చౌకముగా వుండెను. । మరిన్ని 32
పక్క పలకల కింద నాలుగు చక్రములు కలవు; చక్ర
ములయొక్క యిరుసులు మట్టుతో అతకపడి వుండె
ను; వొక్కొక్క చక్రము మూరెడునర నిడివి గలదై
వుండెను. । యీ చక్రముల పని రథ చక్రముల పని 33
ప్రకారముగా వుండెను; వాటి యిరుసులున్ను అడ్డలు
న్ను గుండ్రని కమ్ములున్ను లోపటి కమ్ములున్ను పోత
పనివి అయి వుండెను. । వొక్కొక్క మట్టుయొక్క 34
నాలుగు మూలలకు నాలుగు దిమ్మలు కలవు; యీ దిమ్మ
లున్ను మట్టున్ను యేకాండముగా వుండెను. । మరిన్ని 35
మట్టు పైని చుట్టూ జానెడు నిడివి గల గుండు గలిగి
వుండెను; మరిన్ని ఆ మట్టు పైని జవలున్ను పక్క
పలకలున్ను దానితో అఖండముగా వుండెను. । యే 36
మంటే దాని జవలయొక్క పలకల మీదనున్న దాని
పక్క పలకల మీదనున్ను అతడు కెరూబులనున్ను
సింహములనున్ను పోనీకి చెట్లనున్ను వాటి వాటి ప్రకా
రములుగానున్ను చుట్టూ వున్న అతికిన చోట్ల ప్రకా
రముగానున్ను చెక్కెను. । యీలాగున అతడు పది 37
మట్లను చేసెను; అన్నిటియొక్క పోతయున్ను ప్రమా
ణమున్ను మితియున్ను ఏక రీతిగా వుండెను. । తరు 38
వాత అతడు పది యిత్తడి తొట్లను చేసినాడు; ప్రతి
తొట్టి రెండు గరిసెలను పట్టును; వొక్కొక్క తొట్టి
నాలుగు మూరలు అయి వుండెను; ఆ మట్లలో ప్రతి
మట్టు మీద తొట్టి వొక్కొక్కటి పెట్టపడెను. । మంది 39
రముయొక్క కుడి పార్శ్వమున అయిదు మట్లనున్ను

మందిరముయొక్క యెడమ పాశ్వర్ముమున అయిదు మట్లనున్ను అతడు వుంచెను; సముద్రమును దక్షిణమునకు
యెదురుగా తూర్పు తట్టు మందిరముయొక్క కుడి
40 పాశ్వర్ముమున వుంచెను. । మరిన్ని హీరాము తొట్లను
న్ను చేటలనున్ను గిన్నెలనున్ను చేసెను; యీలాగున
హీరాము రాజయిన సొలొమోనుకు యెహోవాయొ
క్క మందిరము కొరకైన పని యంతా సమాప్తి చేసెను. ।
41 రెండు స్తంభములనున్ను, ఆ రెండు స్తంభముల మీద
నున్న పై మట్టుయొక్క పళ్లెములనున్ను, ఆ స్తంభముల
మీదనున్న పై మట్లుయొక్క పళ్లెములను కప్పిన రెండు
42 వలలనున్ను, । ఆ స్తంభముల మీదనున్న పై మట్లుయొ
క్క రెండు పళ్లెములను కప్పినవల వొక్కంటికి రెండు
వరసల ప్రకారము రెండు వలల కొరకున్ను నన్నూరు
43 దానిమ్మ పండ్లనున్ను, । పది మట్లనున్ను మట్ల మీద పది
44 తొట్లనున్ను, । వొక సముద్రమునున్ను, సముద్రము
45 కింద పండ్రెండు యెడ్లనున్ను, । కుండలనున్ను, చేటల
నున్ను, గిన్నెలనున్ను, వీటిని అన్నిటినీ హీరాము రా
జైన సొలొమోనుకు యెహోవాయొక్క మందిరము
కొరకు చేసెను; యీ వస్తులన్నీ మెరుగు పెట్టిన యిత్త
46 డివై వుండెను. । యర్దేను మైదానమందు సుక్కోతు
కున్ను సారెతానుకున్ను మధ్యను జిగట భూమియందు
47 రాజు వాటిని పోత పోయించెను. । అయితే యీ వస్తు
వులు బహు విస్తారమైనందున సొలొమోను యెత్తు చూ
డడము మానివేసెను; యిత్తడియొక్క యెత్తు యెంతో
48 అది తెలియబడక పోయెను. । మరిన్ని సొలొమోను
యెహోవాయొక్క మందిర సంబంధమైన తతిమ్మా
వస్తువులన్నిటినీ చేయించెను; బంగారపు బలిపీఠమును
న్ను, యెదుట పెట్టే రొట్టెలు గల బంగారపు బల్లను
49 న్ను, । వాక్య స్థలము ముందర పది బంగారపు దీప
స్తంభములను, అనగా, కుడి పాశ్వర్ముమున అయిదున్ను
యెడమ పాశ్వర్ముమున అయిదున్ను, బంగారపు పుష్ప
50 ములనున్ను, ప్రమిదెలనున్ను, కారులనున్ను, । పాత్రల
నున్ను, కత్తెరలనున్ను, గిన్నెలనున్ను, మేలిమి బంగా
రపు ధూప కలశములనున్ను, అంతర్మందిరముయొక్క
అనగా అతిపరిశుద్ధమయిన స్థలముయొక్క తలుపులకు
న్ను మందిరముయొక్క అనగా గుడియొక్క తలుపుల
కున్ను కలిగిన బంగారపు బందులనున్ను, వీటిని అన్ని
51 టినీ చేయించెను. । యీలాగున రాజయిన సొలొ
మోను యెహోవాయొక్క మందిరము కొరకు చేసిన
పని అంతా సమాప్తమాయెను; మరిన్ని సొలొమోను
తన తండ్రియైన దావీదు సమర్పించినటువంటి వెండిన్ని
బంగారమున్ను పాత్రలనున్ను తెప్పించి, యెహోవా
మందిరముయొక్క ద్రవ్యపు పెట్టెలలో వుంచెను.

## 8. అధ్యాయము.

అప్పుడు సొలొమోను ఇశ్రాయేలుయొక్క పెద్ద 1
లనున్ను గోత్రములయొక్క ప్రధానులను, అనగా,
ఇశ్రాయేలు పుత్రులయొక్క తండ్రులలో శ్రేష్ఠులను
న్ను సీయోను అనే దావీదు పురములోనుంచి యె
హోవాయొక్క వొడంబడికె గల పెట్టెను తీసుక
రావడానకు యెరూశలేములో రాజయిన సొలొమోను
అనే తన యొద్దికి పిలిపించి వారిని సమకూర్చెను. ।
కాబట్టి ఇశ్రాయేలీయులందరున్ను ఎతానీమనే యేడో 2
మాసమందు పండుగ కోసము రాజయిన సొలొమోను
యొద్దికి కూడుకొనిరి. । మరిన్ని ఇశ్రాయేలు పెద్దలంద 3
రున్ను వచ్చిరి; అప్పుడు అర్చకులు పెట్టె యెత్తుకొ
నిరి. । వారు యెహోవాయొక్క పెట్టెను తీసుక 4
వచ్చిరి; మరిన్ని సంఘముయొక్క డేరానున్ను డేరాలో
వున్న పరిశుద్ధ వస్తువులనున్ను వీటినన్నిటినీ అర్చకులు
న్ను లేవీయులున్ను తీసుక వచ్చిరి. । అప్పుడు రాజ 5
యిన సొలొమోనున్ను అతని యొద్దికి కూడి వచ్చిన
ఇశ్రాయేలు సంఘము యావత్తున్ను పెట్టె ముందర
నిలిచి, లెక్కింప శక్యము కాని సమూహమైన గొర్రె
లనున్ను యెడ్లనున్ను బలులుగా చెల్లించిరి. । మరిన్ని 6
అర్చకులు యెహోవాయొక్క వొడంబడికె గల
పెట్టెను దాని స్థలమునకు, అనగా, మందిరముయొక్క
వాక్యస్థలము అయినటువంటి అతి పరిశుద్ధ స్థలములో
కెరూబులయొక్క రెక్కల కిందికి తీసుక వచ్చిరి. ।
యేమంటే కెరూబులు తమ రెక్కలను పెట్టెయొక్క 7
స్థలము మీదికి చాపినందున ఆ కెరూబులు పయినుంచి
పెట్టెనున్ను దాని దండెలనున్ను కప్పినవి. । అయితే 8
వారు దండెలయొక్క చివరలు వాక్య స్థలము ముందర
పరిశుద్ధ స్థలములో కనపడేటట్టుగా ఆ దండెలను వెలికి
లాగిరి; అయితే యివి బయిటికి అగుపడ లేదు; మరిన్ని
అవి నేటి పర్యంతము అక్కడనే వున్నవి. । పెట్టెలో 9
ఆ రెండు రాతి పలకలు గాక మరి యేమీ లేకపో
యెను; ఇశ్రాయేలు పుత్రులు మిస్రయీము దేశము
లోనుంచి యివతలకు వచ్చినప్పుడు యెహోవా వా
రితో వొడంబడికెను చేసిన తరువాత మోషే తాను
హోరేబు యందు వున్న కాలమందు వాటిని దాని
లో వుంచెను. । అర్చకులు పరిశుద్ధ స్థలములోనుంచి 10
బైటికి వచ్చినప్పుడు సంభవించినదేమంటే, మేఘము
యెహోవాయొక్క మందిరమును నిండుకొనెను. ।
కాబట్టి ఆ మేఘమునుంచి అర్చకులు సేవ చేయు 11
టకు నిలువలేక పోయిరి, యేమంటే యెహోవాయొ
క్క మహిమ యెహోవాయొక్క మందిరము నిండు
కొనెను. । అప్పుడు సొలొమోను చెప్పినదేమంటే, 12

యెహోవా తాను గాఢాంధకారమందు నివాసము
13 చేసుననిఆనతిచ్చెను. । అయితే నీవు నివాసము చేయ
డానకు మందిరము కట్టించితిని; సదాకాలము అందులో
వుండడానకు నీకు శాశ్వతమయిన స్థలము ఆయత్తము
14 చేస్తినని రాజు పలికి, । తన ముఖము యిటు తిప్పుకొని,
ఇశ్రాయేలుయొక్క సంఘమంతా నిలిచి వుండగా
ఇశ్రాయేలుయొక్క సంఘమంతటినీ ఆశీర్వదించి చెప్పి
15 నదేమంటే; । నా తండ్రియయిన దావీదుతో తన నోట
ఆనతిచ్చి తన చేతి చేత దాని నెరవేర్చిన ఇశ్రాయే
లుయొక్క దేవుడైన యెహోవాకు స్తోత్రము కలిగి
16 వుండును గాక. । ఆయన ఆనతిచ్చినదేమంటే, నేను
ఇశ్రాయేలనే నా జనులను మిస్రయీము దేశములో
నుంచి యివతలకు రప్పించిన నాటనుంచీ నా నామము
అందులో వుంచేటట్టుగా ఇశ్రాయేలుయొక్క గోత్ర
ములలో యే పట్టణమునైనా మందిరము కట్టించడా
నకు నేను యెంచ లేదు; అయితే ఇశ్రాయేలనే నా
జనుల మీద వుంచడానకు దావీదును యెంచితినని
17 ఆనతిచ్చెను. । అయితే ఇశ్రాయేలుయొక్క దేవుడైన
యెహోవాయొక్క పేరట వొక మందిరము కట్టిం
తునని నా తండ్రియైన దావీదుకు మనస్సు పుట్టెను. ।
18 అప్పుడు యెహోవా నా తండ్రియైన దావీదుతో
సెలవు యిచ్చినదేమంటే, నా పేరట నీవు వొక మం
దిరమును కట్టించడానకు తాత్పర్యము కలిగి వుంటివి
19 గనుక ఆ తాత్పర్యము మంచిదే. । అయినప్పటికిన్ని
మందిరమును నీవు కట్టించ కూడదు; అయితే నీ నడు
ములోనుంచి పుట్టబోయే నీ కుమారుడు నా పేరట
20 వొక మందిరమును కట్టించునని ఆనతిచ్చెను. । యెహో
వా తాను ఆనతిచ్చిన వాక్యము నెరవేర్చెను; యే
మంటే నేను నా తండ్రియైన దావీదుకు మారుగా
లేచి, యెహోవా నాకు చేసిన వాగ్దత్తము చొప్పున
ఇశ్రాయేలుయొక్క గద్దె మీద ఆసీనుడనై వుండి, ఇ
శ్రాయేలుకు దేవుడైన యెహోవాయొక్క పేరట
21 మందిరమును కట్టించినాను. । మరిన్ని అందులో యె
హోవాయొక్క వొడంబడికెగల పెట్టెకు స్థలము
నిర్ణయించితిని; అది ఆయన మిస్రయీము దేశము
లోనుంచి మన పితృలను యివతలకు రప్పించినప్పుడు
వారితో చేసుకొనిన వొడంబడికె యిది అయి యు
22 న్నది. । మరిన్ని సొలొమోను ఇశ్రాయేలుయొక్క
యావత్తు సంఘపు సముఖమందు యెహోవాయొక్క
బలిపీఠము ముందర నిలువబడి తన చేతులను ఆకాశ
23 ము తట్టు చాపి, పలికినదేమంటే; । ఇశ్రాయేలుయొక్క
దేవుడవైన వో యెహోవా, పయినున్న ఆకాశమం
దయినా కిందనున్న భూమి యందయినా నీ లాటి
దేవుడు వొకడూ లేడు; నీ ముందర మనఃపూర్తిగా
నడిచే నీ సేవకుల విషయమై నీవు వొడంబడికెనున్ను
కనికరమునున్ను రూఢపరచే వాడవై యున్నావు. ।
నీ సేవకుడైనటువంటిన్ని నా తండ్రి అయినటువంటి 24
న్ని దావీదుకు నీవు చేసిన వాగ్దత్తమును నీవు రూఢ
పర్చి, నీ నోట నీవు యేది ఆనతిచ్చితివో అది
యీ దినమున వున్న లాగున నీవు నీ చేతిచేత నెర
వేర్చితివి. । కాబట్టి యిప్పుడు ఇశ్రాయేలుయొక్క 25
దేవుడవైన వో యెహోవా, నీవు నీ సేవకుడైనటు
వంటిన్ని నా తండ్రియైనటువంటిన్ని దావీదుకు యి
చ్చిన వాగ్దత్తమును రూఢపరచుదువుగాక; నీవు అత
నికి ఆనతిచ్చినదేమంటే, నీ బిడ్డలు తమ తమ మార్గ
మును భద్రము చేసి, నీవు నా సముఖమందు నడిచి
నట్టు వారున్ను నా సముఖమందు నడిచినట్టయితే,
ఇశ్రాయేలుయొక్క గద్దె మీద కూర్చుండే కొరకు
నా సముఖమందు నీకు వొకడు వుండక మానడని సెల
వు యిస్తివి. । కాబట్టి యిప్పుడు వో ఇశ్రాయేలుయొ 26
క్క దేవుడా! దయచేసి, నీ సేవకుడయినటువంటిన్ని
నా తండ్రియైనటువంటిన్ని దావీదుతో ఆనతిచ్చిన వా
క్యమును నిశ్చయపరచుదువుగాక. । అయితే దేవుడు 27
యీ లోకమందు నిశ్చయముగా నివాసము చేసునా!
యిదుగో ఆకాశమున్ను ఆకాశాకాశములు సహా
నిన్ను పట్ట చాలవు; కాబట్టి నేను కట్టించిన యీ
మందిరము యేలాగు పట్టును! । అయినప్పటికిన్ని నా 28
దేవుడవైన వో యెహోవా, నీ సేవకుడనయిన నా
యొక్క ప్రార్థన యందున్ను విన్నపము యందున్ను
నీవు లక్ష్యముంచి, యీ దినమున నీ సేవకుడనయిన
నేను నిన్ను ప్రార్థించే ప్రార్థనను పెట్టే మొ
ర్రనున్ను ఆలకించుము. । అది యేమంటే, నా నామ 29
ము అక్కడ వుండునని యే స్థలమును గురించి నీవు
చెప్పితివో ఆ స్థలమైనటువంటి యీ మందిరము తట్టు
నీ నేత్రములు రాత్రిం బగలూ తెరవబడి యుండేట
ట్టున్ను, యీ స్థలముతట్టు నీ సేవకుడనయిన నేను చేసే
ప్రార్థన నీవు ఆలకించేటట్టున్ను అనుగ్రహించుము. ।
మరిన్ని నీ సేవకుడనయిన నేనున్ను నీ జనులయిన ఇ 30
శ్రాయేలున్ను యీ స్థలము తట్టు యెప్పుడు ప్రార్థన
చేతుమో అప్పుడు మాయొక్క విన్నపమును ఆల
కించుము; నీ నివాస స్థలమై యున్న ఆకాశమందు
వినుము; మరిన్ని నీవు వినేటప్పుడు క్షమించుము. ।
యెవడయినా తన పొరుగింటి వానికి యే తప్పయినా 31
చేస్తే, అతనిచేత ప్రమాణము చేయించుటకు అతని
మీద వొట్టు పెట్టబడితే, యీ మందిరమందున్న నీ
బలిపీఠము ముందరికి ఆ వొట్టు యెప్పుడు వచ్చునో, ।
అప్పుడు నీవు ఆకాశమందు విని, నీ సేవకులకు న్యా 32
యము తీర్చి, అపరాధి శిరస్సు మీదికి తన మార్గము

చొప్పున తనకు వచ్చేటట్టు వానికి శిక్షావిధిని చేస్తూ,
నీతిపరునికి తన నీతి చొప్పున యిచ్చుటకు వానికి
33 నీతి నిర్ధారణ చేస్తూ వుందువు గాక. । మరిన్ని
ఇశ్రాయేలనే నీ జనులు నీకు విరోధముగా పాపము
చేసి, అందువల్ల శత్రువుల ముందర వారు కూలచేయ
బడేటప్పుడు వారు నీ తట్టు తిరిగి, నీ నామమును
ఒప్పుకొని, యీ మందిరమందు ప్రార్థననున్ను
34 విన్నపమునున్ను నీకు యెప్పుడు చేతురో, । అప్పుడు
నీవు ఆ కాశమందు విని, ఇశ్రాయేలనే నీ జనులయొ
క్క పాపమును క్షమించి, వారి పితృలకు నీవు యి
35 చ్చిన దేశములోకి తిరిగీ రప్పింతువుగాక. । మరిన్ని
వారు నీకు విరోధముగా పాపము చేసినందువల్ల ఆకా
శము మూయబడి వర్షము లేక పోయేటప్పుడు, నీవు
వారిని యీలాగున శ్రమ పెట్టేటప్పటికీ వారు నీ
నామము ఒప్పుకొని, తమ పాపాలను విడిచి, యీ
36 స్థలముతట్టు ప్రార్థన చేసినట్టయితే, । అప్పుడు నీవు ఆ
కాశమందు విని, నీ సేవకులైన ఇశ్రాయేలనే నీ జనుల
యొక్క పాపమును క్షమించి, వారు నడవవలసిన
37 సన్మార్గమును వారికి చూపించి, నీ జనులకు నీవు
స్వాస్థ్యముగా యిచ్చిన భూమి మీద వర్షము కురి
పింప చేతువుగాక.। మరిన్ని దేశమందు క్షామము గానీ,
తెగులు గానీ, గాడ్పుదెబ్బ గానీ, చిత్తపట్టుట గానీ,
మిడతలు గానీ, గొంగళిపురుగు గానీ, కలిగినా; వారి
శత్రువు వారి దేశపు పట్టణములలో వారిని ముట్టడి
వేసినా; యే తెగులు అయినా వ్యాధియైనా కలిగినా;।
38 అప్పుడు యే మనిషి అయినా ఇశ్రాయేలనే నీ జను
లందరైనా వీరిలో ప్రతిమనిషీ తన తన హృదయ
వ్యాధిని తెలుసుకొని, యీ మందిరము తట్టు తన చేతు
లను చాపి, ప్రార్థననున్ను విన్నపమునున్ను చేసినట్ట
39 యితే;। అప్పుడు నీవు ఆకాశమనే నీ నివాసస్థలమందు
విని క్షమించి, దయచేసి, ప్రతి మనిషియొక్క హృద
యము నీవు యెరిగియున్నావు గనుక వాని మార్గ
40 ములన్నిటి ప్రకారముగా వానికి యిచ్చి, । నీవు మా
పితృలకు దయచేసిన దేశమందు వారు బ్రతికే దినము
లన్నిటి పర్యంతము నీ యందు భయపడి వుండే లాగు
చేతువుగాక. యెందుకంటే నరపుత్రులందరియొక్క
హృదయములను నీవు మాత్రమే తెలుసుకొని వున్నా
41 వు. । మరిన్ని ఇశ్రాయేలనే నీ జనుల సంబంధము కా
నటువంటిన్ని నీ నామము నిమిత్తము దూరదేశములో
నుంచి వచ్చినటువంటిన్ని పరదేశిని గురించినదేమంటే,।
42 నీ ఘనమైన నామముయొక్కానున్ను నీ బలమైన హ
స్తముయొక్కానున్ను నీవు చాపిన చేతియొక్కానున్ను
ప్రసిద్ధిని వారు విందురు; కాబట్టి వాడు వచ్చి యీ
43 మందిరముతట్టు ప్రార్థన చేసినట్టయితే; । అప్పుడు
ఆకాశమనే నీ నివాస స్థలమందు నీవు విని, పరదేశి
నిన్ను వేడుకొనే దాని ప్రకారము యావత్తు దయ
చేతువు గాక; అప్పుడు లోకముయొక్క జనులందరు
న్ను నీ నామమును యెరిగి; ఇశ్రాయేలనే నీ జనుల
వలెనే నీ యందు భయపడి, నేను కట్టించిన యీ
మందిరము నీ పేరట పిలువ పడినదని తెలుసుకొం
దురు.। మరిన్ని నీ జనులు తమ శత్రువుల మీదికి యు 44
ద్ధము కొరకు నీవు వారిని పంపించే యే స్థలమునకైనా
బయిలుదేరేటప్పుడు, నీవు యెంచుకొనిన పట్టణము
తట్టున్ను నీ పేరట నేను కట్టించిన మందిరము తట్టు
న్ను యెహోవా అయిన నీకు ప్రార్థనచేస్తే; । అ 45
ప్పుడు ఆకాశమందు నీవు వారి ప్రార్థననున్ను వారి
విన్నపమునున్ను విని, వారి కార్యమును నిర్వహించు
దువు గాక. । వారు నీకు విరోధముగా పాపము చేస్తే 46
(యేమంటే పాపము చేయనివాడు ఒకడూ లేడు)
నీవు వారి మీద కోపగించుకొని, వారిని శత్రువుల
చేతికి అప్పగించినందున వారు వీరిని దూరమునకైనా
దగ్గిరకైనా ఆ శత్రువుని దేశములోకి చెరగా కొంచ
బోయినప్పటికిన్ని, । వారు చెరగా కొంచపోబడిన 47
దేశమందు యోజించుకొని, మేము పాపము చేస్తిమ
నిన్ని దుర్బుద్ధిగా ప్రవర్తించితిమనిన్ని, దుష్టతను
జరిగించితిమనిన్ని, తమ్మును చెరగా కొంచపోయిన
వారి దేశమందు పలికి, పశ్చాత్తాపపడి, నీకు విన్నప
ము చేసుకొని. । తమ్మును చెరగా కొంచపోయిన వారి 48
యొక్క దేశమందు నిండు హృదయముతోనున్ను
నిండు ఆత్మతోనున్ను నీ తట్టు తిరిగి, నీవు వారి పితృ
లకు దయచేసిన దేశము తట్టున్ను నీవు యెంచుకొన్న
పట్టణము తట్టున్ను నీ పేరట నేను కట్టించిన మంది
రము తట్టున్ను నీ ప్రార్థనచేస్తే; । అప్పుడు ఆకా 49
శమనే నీ నివాస స్థలమందు నీవు వారి ప్రార్థనను
న్ను వారి విన్నపమునున్ను విని, వారి కార్యము నిర్వ
హించి, । నీకు విరోధముగా పాపము చేసిన నీ జనుల 50
నున్ను యే తప్పులచేత వారు నీ విషయమై అపరాధు
లైరో ఆ తప్పులనున్ను క్షమించి, వారిని చెరలోకి
కొంచపోయిన వారు వారిని కనికరించేలాగు వారి
విషయమయి కనికరమును పుట్టింతువు గాక. । యేమం 51
టే వారు మిస్రయీము దేశమనే యినుప కొలిమి
మధ్యనుంచి నీవు తీసిన నీ జనులున్ను నీ స్వాస్థ్యము
న్ను అయి వున్నారు. । కాబట్టి నీ సేవకుడనైన నా 52
విన్నపము తట్టున్ను ఇశ్రాయేలనే నీ జనులయొక్క
విన్నపము తట్టున్ను నీ కన్నులు తెరవబడనిచ్చి, వారు
నిన్ను వేడుకొనేది యావత్తూ ఆలకింతువు గాక. ।
యేమంటే దేవుడవైన ఓ యెహోవా, మా పితృ 53
లను నీవు మిస్రయీములోనుంచి యివతలకు రప్పించి

నప్పుడు, నీవు నీ సేవకుడైన మోషే ద్వారా ఆనతిచ్చి
నట్టు నీవు వారిని నీ స్వాస్థ్యమయ్యేటట్టుగా లోక
మందున్న జనులందరిలోనుంచి కేటించితివని ప్రార్థన
54 చేసెను. । అయితే సొలొమోను యీ ప్రార్థన యా
వత్తున్ను యీ విన్నపము యావత్తునున్ను చేయడము
సమాప్తమైన తరువాత ఆకాశము తట్టు తన చేతులను
చాచి, మోకాళ్లూనుటనుంచిన్ని యెహోవాయొక్క
55 బలిపీఠము ముందరనుంచిన్ని లేచి నిలిచి, । మహా శబ
ముతో ఇశ్రాయేలుయొక్క సంఘమంతటిని ఆశీర్వ
56 దించి చెప్పినదేమంటే; । తాను చేసిన వాగ్దత్తప్రకా
రము ఇశ్రాయేలనే తన జనులకు నెమ్మదిని యిచ్చిన
యెహోవాకు స్తోత్రము కలిగి వుండును గాక: తన
సేవకుడైన మోషే ద్వారా తాను చేసిన వాగ్దత్తములో
57 వొక మాట అయినా తేలిపోలేదు. । కాబట్టి మన దేవు
డైన యెహోవా మనలను వదలకనున్ను విడచిపెట్టక
నున్ను, మన పితృలకు తోడుగా వున్నలాగున మన
58 కున్ను తోడుగా వుండి, । తన మార్గములన్నిటియం
దు నడవడానకున్ను తాను మన పితృలకు ఆజ్ఞాపించిన
ఆజ్ఞలనున్ను నిబంధనలనున్ను విధులనున్ను గైకొనేట
ట్టుగానున్ను మన హృదయములను తన తట్టు తిప్పు
59 కొనును గాక. । మరిన్ని ఆయన తన సేవకుడనైన నా
యొక్క కార్యమునున్ను ఇశ్రాయేలనే తన జనుల
యొక్క కార్యమునున్ను దాని అవసరము ప్రకార
ముగా యెల్లప్పుడున్ను నిర్వహించేటట్టుగా నేను యె
హోవా యెదుట విన్నపము చేసిన యీ నా మాటలు
రాత్రింబగలూ మన దేవుడైన యెహోవా ముందర
60 వుండును గాక. । అప్పుడు లోకమందున్న జనులంద
రున్ను యెహోవా దేవుడై వున్నాడనిన్ని, ఆయన
61 గాక మరి యెవడూ లేడనిన్ని యెరుగుదురు.। కాబట్టి
ఆయనయొక్క కట్టడల యందు నడిచేటందుకు యీ
దినమందు వున్నలాగున ఆయనయొక్క నిర్ణయము
లను గైకొనుటకున్ను మీ హృదయము మీ దేవుడైన
యెహోవా విషయమై సర్వసిద్ధముగా వుండును
62 గాకని చెప్పెను. । అయితే రాజున్ను తనతో కూడా
ఇశ్రాయేలీయులందరున్ను యెహోవా సముఖమందు
63 బలులను చెల్లించిరి. । సొలొమోను సమాధానపు బలు
లను చెల్లించెను, యేమంటే యిరువై రెండువేల యె
డ్లున్ను, లక్ష యిరువైవేల గొర్రెలున్ను, యివి యె
హోవాకు బలులుగా చెల్లించెను. యీలాగున రా
జున్ను ఇశ్రాయేలు పుత్రులందరున్ను యెహోవా
64 యొక్క మందిరమును సంప్రోక్షణ చేసిరి. । ఆ దిన
మందే రాజు యెహోవా మందిరము ముందరనున్న
సాల మధ్యను వుండే స్థలమును పరిశుద్ధపరిచెను, యే
మంటే అక్కడ అతడు హోమార్పణలనున్ను భోజ
నార్పణలనున్ను సమాధాన బలులయొక్క కొవ్వు
నున్ను చెల్లించెను; యేమంటే యెహోవా సముఖ
మందున్న యిత్తడి బలిపీఠము హోమార్పణలనున్ను
భోజనార్పణలనున్ను సమాధానార్పణలయొక్క కొ
వ్వునున్ను పట్టుటకు మిక్కిలీ చిన్నదై వుండెను. ।
మరిన్ని ఆ కాలమందు సొలొమోనున్ను అతనితో 65
కూడా ఇశ్రాయేలీయులందరున్ను గొప్ప సంఘముగా
హమాతులోకి ప్రవేశించే స్థలము మొదలుకొని, మి
స్రయీము నది పర్యంతమూ రెండు వారములు, అన
గా, పద్నాలుగు దినములు మన దేవుడైన యెహోవా
సముఖమందు వుత్సవము చేసిరి. । యెనిమిదో దినమున 66
అతడు జనులకు సెలవు యిచ్చినందున వారు రాజును
ఆశీర్వదించి, యెహోవా తన సేవకుడైన దావీదు
కున్ను ఇశ్రాయేలనే తన జనులకున్ను చేసిన మేలం
అంతటియందూ సంతోషముతోటిన్ని ఆనందపు హృ
దయముతోటిన్ని తమ తమ స్థానములకు వెళ్లిపోయిరి.

## 9. అధ్యాయము.

సొలొమోను యెహోవాయొక్క మందిరము 1
నున్ను రాజ మందిరమునున్ను మరిన్ని తాను చేయ
కోరినదంతానున్ను సమాప్తము చేసిన తరువాత సంభ
వించినదేమంటే, । యెహోవా గిబోనులో సొలొ 2
మోనుకు ప్రత్యక్షమైనట్టు రెండోమారు అతనికి ప్ర
త్యక్షమాయెను. । అప్పుడు యెహోవా అతనితో అని 3
నదేమంటే, నా సముఖమందు నీవు చేసిన ప్రార్థన
నున్ను విన్నపమునున్ను నేను వింటిని; నా నామమును
అక్కడ సదాకాలను వుంచడానకు నీవు కట్టించిన
యీ మందిరమును పరిశుద్ధపరచితిని; మరిన్ని నా
కన్నులున్ను నా హృదయమున్ను యెల్లప్పుడున్ను
అక్కడ వుండును. । నీ తండ్రియైన దావీదు నడచి 4
నట్టు నీవున్ను యథార్థ హృదయముతోనున్ను నీతి
తోనున్ను నడచి, నీకు నేను సెలవు యిచ్చినదంతటి
ప్రకారము చేసి, నా నిబంధనలనున్ను నా విధులనున్ను
గైకొన్నట్టయితే, । అప్పుడు ఇశ్రాయేలు గద్దె మీద 5
కూర్చుండుటకు నీకు వొకడూ వుండక పోడని నీ తం
డ్రియైన దావీదుకు నేను యిచ్చిన వాగ్దత్తప్రకారము
ఇశ్రాయేలు మీద నీ గద్దెను చిరకాలము మట్టుకు
స్థిరపరుతును. । అయితే మీరయినా మీ బిడ్డలైనా 6
యేమాత్రమైనా నన్ను వెంబడించుటనుంచి మళ్లుకొని,
మీ యెదుట నేను పెట్టిన ఆజ్ఞలనున్ను నిబంధనలను
న్ను గైకొనక, యితరమైన దేవుండ్లను సేవించి మ్రొ
క్కినట్టయితే, । అప్పుడు నేను ఇశ్రాయేలుకు యిచ్చిన 7
యీ దేశములోనుంచి వారిని తెగవేసి, నా నామము
కొరకు నేను పరిశుద్ధపచిర్చిన యీ మందిరమును నా

దృష్టినుంచి పరిహరింతును; అప్పుడు ఇశ్రాయేలు సమ
స్తమైన జనులలో సామితగానున్ను హేళనగానున్ను
8 చేయబడుదురు. । మరిన్ని వున్నతముగా వున్న యీ
మందిరము తట్టున వచ్చే వారందరున్ను దాని చూచి,
ఆశ్చర్యపడి తిరస్కరించి, యెహోవా యీ దేశము
నకున్ను యీ మందిరమునకున్ను యీలాగున యెందు
9 కు చేసెనని పలికేటప్పటికి; । వారు యిచ్చే ప్రత్యు
త్తరమేమంటే, మిస్రయీము దేశములోనుంచి తమ
పితృలను యివతలకు రప్పించిన యెహోవా అనే తమ
దేవుని తమరు విడచి, యితర దేవుండ్లను చేపట్టి మ్రొ
క్కి సేవ చేసిరి గనుక యెహోవా యీ కీడంతా
వారి మీదికి రాచేసెనని చెప్పుదురని ఆనతిచ్చెను. ।
10 అయితే సోరుయొక్క రాజైన హీరాము సొలొమోను
కోరినంత మట్టుకు ఆజ్జ మానులనున్ను దేవదారు మా
11 నులనున్ను బంగారమునున్ను యిచ్చినందున, । సొలొ
మోను యెహోవాయొక్క మందిరమునున్ను రాజు
యొక్క మందిరమునున్ను యీ రెంటినిన్ని కట్టించిన
యిరువై సంవత్సరములైనప్పుడు సొలొమోను గాలీలు
దేశమందున్న యిరువై పట్టణములను హీరాముకు యి
12 చ్చెను.। అప్పుడు హీరాము తనకు సొలొమోను యిచ్చిన
పట్టణములను చూడడానకు సోరునుంచి వచ్చెను; అవి
13 అతని దృష్టికి బాగా వుండనందున, । నా సహోదరుడా
నీవు నాకు యిచ్చిన యీ పట్టణములు యేపాటివని
14 నేటివరకు వాటిని కాబూలు దేశమని పిలిచెను. । అం
తట హీరాము నూట యిరువై బంగారపు తలాంతులను
15 రాజుకు అంపించెను. । అయితే సొలొమోను వెట్టివాం
డ్లను పెట్టిన హేతువు యేమంటే, యెహోవా మం
దిరమునున్ను తన మందిరమునున్ను మిల్లోనున్ను యె
రూశలేమయొక్క ప్రాకారమునున్ను హాసోరు మెగి
ద్దో గెజెరు అనే పట్టణములనున్ను కట్టించడానకు నిర్ణ
16 యించెను. । యేమంటే మిస్రయీము రాజైన ఫరో
గెజెరు మీదికి వచ్చి, దాని పుచ్చుకొని అగ్నిచేత కా
ల్చి, ఆ పట్టణమందున్న కెనయానీయులను హతము
చేసి, దానిని తన కుమార్తెయైన సొలొమోనుయొక్క
17 భార్యకు కట్నముగా యిచ్చెను. । కాబట్టి సొలొమోను
గెజెరును కట్టించెను; మరిన్ని దిగువనున్ను బేథోరోను
18 నున్ను, । బయలతునున్ను, దేశమందున్న అరణ్యములో
19 తద్మోరునున్ను, । సొలొమోనుయొక్క పదార్థముల కొ
రకయిన పట్టణములనున్ను, రౌతులకొరకైన పట్టణము
లనున్ను, మరిన్ని సొలొమోను యెరూశలేము యం
దున్ను లెబానోనుయందున్ను తాను యేలిన దేశమం
తటియందున్ను, యేది కట్టుటకు కోరెనో అదిన్ని
20 కట్టించినాడు. । అయితే ఇశ్రాయేలు పుత్రులు కాన
టువంటి ఎమోరీయులున్ను హిత్తీయులున్ను పెరిజ్జీయు
లున్ను హివీయులున్ను యెబూసీయులున్ను అనే
వీరిలో శేషించిన వారిని గురించినదేమంటే, । ఇశ్రా 21
యేలు పుత్రులు సర్వనాశనము చేయ లేక పోయిన
వారి తరువాత దేశమందు శేషించిన వారి పిల్లలను సొ
లొమోను దాసత్వము చేయుట కొరకు నేటివరకున్ను
నిర్ణయించెను. । అయితే ఇశ్రాయేలు పుత్రులలో 22
సొలొమోను యెవనినయినా దాసునిగా చేయ లేదు,
యేమంటే వారు ఆయుధస్థులున్ను అతనికి సేవకులు
న్ను శ్రేష్ఠులున్ను సైన్యాధిపతులున్ను అతని రథాధి
పతులున్ను రౌతులున్ను అయి వుండిరి. । అయితే సొ 23
లొమోనుయొక్క పనిమీద వున్న ప్రధానులు యే
నూట యేభైమంది అయి వుండిరి; వీరు పనివాండ్ల
మీద అధికారులు అయి వుండిరి. । అయితే ఫరో 24
కుమార్తె దావీదు పురమునుంచి సొలొమోను తనకు
కట్టించిన మందిరమునకు వచ్చెను; అప్పుడు అతడు
మిల్లోను కట్టించెను. । మరిన్ని యేడాదిలో సొలొ 25
మోను మూడు మారులు హోమార్పణలనున్ను సమా
ధానార్పణలనున్ను యెహోవా కొరకు తాను కట్టిం
చిన బలిపీఠము మీద చెల్లిస్తూ, యెహోవా సముఖ
మందున్న పీఠము మీద ధూపచూర్ణము వేస్తూ వుం
డెను. యీలాగున అతడు మందిరమును సమాప్తము
చేసెను. । మరిన్ని రాజయిన సొలొమోను ఎదోము 26
దేశపు యెర్ర సముద్రపు తీరమందున్న ఏలోతు
దగ్గిర ఎస్యోన్గెబెరు యందు వోడలను కట్టించెను. ।
హీరాము సొలొమోనుయొక్క సేవకులతో కూడా 27
సముద్రమును యెరిగిన వోడవాండ్లయిన తన సేవకు
లను వోడలమీద పంపెను. । వారు ఓఫీరనే స్థలము 28
నకు వచ్చి, నన్నూట యిరువై బంగారపు తలాంతులను
రాజయిన సొలొమోను యొద్దికి తీసుక వచ్చిరి.

## 10. అధ్యాయము.

అంతట షెబ అనే దేశముయొక్క రాణి యెహో 1
వా నామమును గురించి సొలొమోనుయొక్క కీర్తి
వినినప్పుడు, గూఢార్థము గల మాటలచేత అతని
శోధించడానకు వచ్చెను. । ఆమె గొప్ప పరివారము 2
తోనున్ను గంధవర్గమునున్ను విస్తారపు బంగారము
నున్ను రత్నములనున్ను మోస్తూవున్న ఒంటెలతో
నున్ను యెరూశలేమునకు వచ్చెను; ఆమె సొలొమోను
యొద్దికి వచ్చినప్పుడు తన హృదయమందున్న అంతటిని
గురించి అతనితో మాట్లాడెను. । అయితే సొలొమోను 3
ఆమె అడిగిన వాటికన్నిటికి ప్రత్యుత్తరములను యి
చ్చెను; రాజుకు మరుగైనది యేదీ లేదు గనుక ఆమెకు
అంతా చెప్పెను. । అయితే షెబయొక్క రాణి సొలొ 4
మోనుయొక్క జ్ఞానమునున్ను, అతడు కట్టించిన మంద

5 రమునున్ను, । అతని బల్లమీద వున్న భోజన ద్రవ్యముల
నున్ను, అతని సేవకుల కూచుండుటనున్ను, అతని
పరిచారకుల కనిపెట్టుటనున్ను, వారి వస్త్రములనున్ను,
అతనికి గిన్నెనందిచ్చేవారినిన్ని, యెహోవాయొక్క
మందిరమందు అతడు అర్పించిన అర్పణనున్ను చూ
6 చినప్పుడు, తాను మరి జీవాత్మ లేనిదాయెను. । అప్పుడు
ఆమె రాజుతో చెప్పినదేమంటే, మీ కార్యములను
గురించిన్ని జ్ఞానమునుగురించిన్ని నా దేశమందు నేను
7 వినిన మాట నిజమై వున్నది. । అయినప్పటికిన్ని నేను
వచ్చి నా కండ్లతో చూడక మునుపు ఆ మాటలను
నమ్మక వుంటిని; అయితే యిదుగో అందులో సగమ
యినా నాతో చెప్పపడక వుండెను; మీ జ్ఞానమున్ను
మీ భాగ్యమున్ను నేను వినిన ప్రసిద్ధిని బహుగా
8 మించినవై వున్నవి. । మీ జనులు భాగ్యవంతులు; మీ
ముందర యెల్లప్పుడున్ను నిలిచి మీ జ్ఞానమును వింటూ
9 వున్న యీ మీ సేవకులున్ను భాగ్యవంతులు. । మీ
యందు ఆనందించి మిమ్మును ఇశ్రాయేలు గద్దె మీద
కూచుండబెట్టిన మీ దేవుడైన యెహోవాకు స్తో
త్రము కలుగును గాక; యేమంటే యెహోవా యె
ప్పుడున్ను ఇశ్రాయేలును స్నేహించెను గనుక నీతి
న్యాయములను నడిపించే కొరకు మిమ్మును రాజుగా
10 చేసెనని పలికెను. । అప్పుడు ఆమె రాజుకు నూట
యిరువై బంగారపు తలాంతులనున్ను బహు విస్తార
మైన గంధవర్గమునున్ను రత్నములనున్ను యిచ్చెను;
షెబ దేశపు రాణి రాజైన సొలొమోనుకు యిచ్చిన
గంధవర్గములంత విస్తారము మరి యెన్నడయినా రా
11 లేదు. । మరిన్ని ఓఫీరు దేశమునుంచి బంగారముతో
వచ్చిన హీరాముయొక్క వోడలు ఓఫీరునుంచి అల్మా
గు మానులనున్ను రత్నములనున్ను బహు విస్తారముగా
12 తెచ్చెను. । యీ అల్మాగు మానులచేత రాజు యెహో
వాయొక్క మందిరమునకున్ను రాజ మందిరమునకున్ను
స్తంభములనున్ను గాయకులకు కిన్నరలనున్ను వీణెల
నున్ను చేయించెను; నేటివరకు ఆలాటి అల్మాగు మా
13 నులు రావడమైనా చూడబడడమైనా లేదు. । అయితే
సొలొమోను స్వేచ్ఛచేత షెబ దేశపు రాణికి యిచ్చి
నది గాక ఆమె కోరిన ప్రకారమే ఆమెయొక్క
యిచ్ఛా పూర్తిగా ఆమెకు యిచ్చెను. అప్పుడు ఆమె
యున్ను ఆమె సేవకులున్ను తమ దేశమునకు తిరిగీ
14 వెళ్లిరి. । అయితే సంవత్సరము వొక్కంటికి సొలొమో
నుకు వచ్చిన బంగారము ఆరునూట అరువై ఆరు బం
15 గారపు తలాంతుల యెత్తు కలదై వుండెను. । యిదిగాక
గంధవర్గములు మొదలైన వాటి వర్తకుల యొద్దనుం
చిన్ని అరబి రాజుల యొద్దనుంచిన్ని దేశాధికారుల యొ
16 ద్దనుంచిన్ని అతనికి చాలా వచ్చినవి. । మరిన్ని రాజ
యిన సొలొమోను సుత్తెతో కొట్టిన బంగారముచేత
అలుగులు గల యిన్నూరు డాళ్లను చేయించెను; డాలు
వొక్కంటికి ఆనూరు బంగారపు తులముల యెత్తు
గలిగి వుండెను. । మరిన్ని సుత్తెతో కొట్టిన బంగారము 17
చేత అతడు మున్నూరు కేడెములను చేయించెను; కేడె
ము వొక్కంటికి మున్నూరు బంగారపు తులముల
యెత్తు కలిగి వుండెను, వీటిని రాజు లెబానోను అర
ణ్యపు మందిరమందు వుంచెను. । మరిన్ని రాజు దంత 18
ముచేత పెద్ద సింహాసనము చేయించి, సువర్ణముచేత
దాని పొదిగించెను. । యీ సింహాసనమునకు ఆరు 19
మెట్లు గలవు; సింహాసనముయొక్క మీది భాగము వెను
కతట్టు గుండ్రగా వుండెను; ఆసనమునకు యిటున్న
అటున్న వూతలు గలవు; వూతల దగ్గిర రెండు సింహ
ములు నిలిచి వుండెను; । యీ పార్శ్వమునను ఆ 20
పార్శ్వమునను ఆరు మెట్లు మీద పండెండు సిం
హములు నిలిచి వుండెను. ఆలాటిది యే రాజ్యమం
దైనా చేయబడుట లేదు. । మరిన్ని రాజైన సొలొ 21
మోనుయొక్క పాన పాత్రలు బంగారపువై వుండెను;
లెబానోను అరణ్యపు మందిరపు పాత్రలున్ను బంగా
రపువై వుండెను; వెండిది వొకటీ లేదు, యేమంటే
వెండి సొలొమోనుయొక్క దినములలో తక్కువగా
యెంచపడెను. । యెందుచేతనంటే సముద్రమందు హీ 22
రాముయొక్క వోడలతో కూడా తర్షీషు వోడలు
న్ను రాజుకు కలిగి వుండెను; యీ తర్షీషు వోడలు
మూడు సంవత్సరములకు వొక మారు బంగారమునున్ను
వెండినిన్ని దంతమునున్ను కోతులనున్ను నెమలి పిట్టల
నున్ను తీసుకొని వస్తూ వుండేవి. । యీలాగున రాజైన 23
సొలొమోను ధనముచేతనున్ను జ్ఞానము చేతనున్ను
భూపతులందరిలో అతిశయపరుడై వుండెను. । అతని 24
హృదయమందు దేవుడు వుంచిన జ్ఞానమును వినడానకు
లోకులందరున్ను అతని చూడ కోరిరి. । కాబట్టి ప్రతి 25
మనిషీ యేటా వెండి వస్తువులు గానీ, బంగారపు
వస్తువులు గానీ, వస్త్రములు గానీ, ఆయుధములు గానీ,
గంధవర్గములు గానీ, గుర్రములు గానీ, వేసడములు
గానీ, తన తన వంతు చొప్పున కట్నమును తీసుకొని
వచ్చేవాడు. । మరిన్ని సొలొమోను రథములనున్ను 26
రౌతులనున్ను కూర్చెను; అతడు వేయిన్ని నన్నూరు
రథములున్ను పండెండువేల మంది రౌతులున్ను కల
వాడై వుండెను; వీరిని అతడు రథముల నిమిత్తము పట్ట
ణములలోనున్ను యెరూశలేము యందున్న రాజుయొ
ద్దనున్ను వుండుటకు నిర్ణయించెను. । అయితే రాజు 27
యెరూశలేములో వెండి రాళ్లవలెను వాడికె చేసెను;
ఆర్జ మానులనున్ను లోవలో వున్న రావిచెట్లవలె విస్త
రింప చేసెను. । మరిన్ని సొలొమోను గుర్రములనున్ను 28

నార నూళ్లనున్ను మిస్రయీమునుంచి తెప్పించెను;
యీ నార నూళ్లను రాజుయొక్క వర్తకులు నిర్ణ
29 యమైన ధర చొప్పున పుచ్చుకొనిరి. । మరిన్ని రథము
వొక్కంటికి ఆరునూరు వెండి తులముల చొప్పునను
న్ను గుర్రము వొక్కంటికి నూట యేభై తులముల
చొప్పుననున్ను మిస్రయీము దేశములోనుంచి అవి
బయులువెళ్లి వచ్చెను; మరిన్ని యీ చొప్పుగా హిత్తీ
యుల రాజులకున్ను అరాము రాజులకున్ను వారు
వాటిని యివతలకు తీసుక వచ్చిరి.

## 11. అధ్యాయము.

1 అయితే రాజైన సొలొమోను ఫరోయొక్క కుమా
ర్తెను గాక యింకా అనేక పరస్త్రీలను, అనగా,
మోయాబీయులు అమ్మోనీయులు ఎదోమీయులు
సీదోనీయులు హిత్తీయులు అనే జనులయొక్క స్త్రీలను
2 మోహించెను. । యీ జనులను గురించి యెహోవా
ఇశ్రాయేలు పుత్రులకు యిచ్చిన సెలవు యేమంటే,
మీరు వారి లోపలికి వెళ్లకూడదు; వారు మీ లోప
లికి రాకూడదు; యెందుకంటే నిశ్చయముగా వారు
మీ హృదయములను వారి దేవుండ్ల తట్టుకు తిప్పు
దురని ఆనతిచ్చినప్పటికిన్ని సొలొమోను ప్రేమచేత
3 వారితో హత్తుకొనెను. । అతనికి యేడూన్నరుమంది రాజ
కుమార్తెలైన భార్యలున్ను మున్నూరుమంది వుపపత్న
లున్ను కలిగి వుండిరి; అతని భార్యలు అతని హృద
4 యమును తిప్పివేసిరి. । యేమంటే సొలొమోను వృద్ధు
అయినప్పుడు సంభవించినదేమంటే, అతని భార్యలు
అతని హృదయమును యితరమైన దేవుండ్ల తట్టుకు
తిప్పిరి; అతని తండ్రియైన దావీదు హృదయము వుం
డినలాగున అతని హృదయము దేవుడైన యెహో
5 వా విషయమై పూర్ణము కాక పోయెను. । యేమంటే
సొలొమోను అష్తారోతనే సీదోనీయులయొక్క దేవ
తనున్ను మిల్కోము అనే అమ్మోనీయులయొక్క యే
6 హ్యమైన దానినిన్ని వెంబడించెను. । యీలాగున సొ
లొమోను యెహోవా దృష్టి యెదుట కీడుచేసి, తన
తండ్రియైన దావీదు వెంబడించినట్టు యెహోవాను
7 పూర్ణముగా వెంబడించ లేదు. । అప్పుడు సొలొ
మోను కెమోషు అనే మోయాబీయులయొక్క యే
హ్యమైన దానికిన్ని మోలెఖు అనే అమ్మోను పుత్రుల
యొక్క యేహ్యమైనదానికిన్ని యెరూశలేము యెదుట
వున్న కొండమీద వున్నతమైన స్థలమును కట్టించెను. ।
8 మరిన్ని తమ దేవుండ్లకు ధూపమును వేస్తూ బలులను
చెల్లిస్తూ వుండిన పరస్త్రీలయిన తన భార్యల కొరకున్ను
9 అతను ఆ ప్రకారముగానే చేసెను. । కాబట్టి యెహో
వా సొలొమోనుమీద కోపముగా వుండెను, యేమంటే
తనకు రెండు మారులు ప్రత్యక్షమైన ఇశ్రాయేలుయొ
క్క దేవుడైన యెహోవా యొద్దనుంచి అతని హృద
యము తిరిగిపోయెను. । ఆయన నీవు యితర దేవుండ్లను 10
వెంబడించ కూడదని యిందును గురించి అతనికి ఆజ్ఞా
పించి వున్నప్పటికిన్ని అతడు యెహోవా యిచ్చిన
ఆజ్ఞను గైకొనక పోయెను. । కాబట్టి యెహోవా సొ 11
లొమోనుకు ఆనతిచ్చినదేమంటే; నేను నీకు ఆజ్ఞాపించిన
నా వొడంబడికెనున్ను నా కట్టడలనున్ను గైకొనక
యీ కార్యమును చేస్తివి గనుక నేను అవశ్యముగా
యీ రాజ్యమును నీ యొద్దనుంచి ఖండించి నీ సేవ
కునికి యిత్తును. । అయినప్పటికిన్ని నీ తండ్రియైన 12
దావీదు నిమిత్తము దీని నీ దినముల యందు చేయక
వుందును; అయితే నీ కుమారునియొక్క చేతిలోనుంచి
దాని ఖండించివేతును. । అయినా రాజ్యమంతా ఖం 13
డించను గాని నా సేవకుడైన దావీదు నిమిత్తమున్ను
నేను యెంచుకొనిన యెరూశలేము నిమిత్తమున్ను
వొక గోత్రము నీ కుమారునికి యిత్తునని ఆనతిచ్చెను. ।
మరిన్ని యెహోవా సొలొమోనుకు విరోధిగా ఎదో 14
మీయుడైన హదదనే వొకని ప్రేరేపించెను; వీడు
ఎదోము దేశమందు రాజ వంశపువాడై వుండెను. ।
దావీదు ఎదోము దేశమందు వుండగా సైన్యాధిపతి 15
యైన యోవాబు ఎదోము దేశమందున్న మొగవారి
నందరినిన్ని నరికివేసిన తర్వాతను హతులైన వారిని
పాతి పెట్టుటకు అతడు కయికి వెళ్లి వుండగా, । (యే 16
మంటే యోవాబు ఎదోములో వున్న మొగవారినంద
రినిన్ని నరికివేసే పర్యంతము ఆరు నెలలు అక్కడ
ఇశ్రాయేలీయులందరితో కూడా వుండెను). । అప్పుడు 17
సంభవించినదేమంటే, హదదు తానున్ను తనతో కూ
డా తన తండ్రియొక్క సేవకులలో కొందరు ఎదో
మీయులున్ను మిస్రయీము దేశములోకి వెళ్లుటకు
పారిపోయిరి; హదదు అప్పుడు చిన్నవాడై వుండెను. ।
వీరు మిద్యాను దేశములోనుంచి యెక్కి పారాను దేశ 18
మునకు వచ్చి, పారాను దేశమందు కొందరిని తీసుకొని,
మిస్రయీములోకి ఫరో అనే మిస్రయీము రాజయొ
ద్దికి వచ్చిరి; యీ రాజు అతనికి యిల్లునున్ను భూమి
నిన్ని యిచ్చి ఆహారమునున్ను నిర్ణయించెను. । మరిన్ని 19
హదదు ఫరో దృష్టి యెదుట బహుగా దయను పొంది
నందున యితనికి అతడు తన భార్యయొక్క సహోదరిని
అనగా రాణి అయిన తహ్పెనేసుయొక్క సహో
దరిని భార్యగా యిచ్చెను. । యీ తహ్పెనేసుయొక్క 20
సహోదరి అతనికి గెనుబతు అనే కుమారుని కనెను;
వీనికి తహ్పెనేసు ఫరో యింట్లో పాలు విడిపించెను;
కాబట్టి గెనుబతు ఫరో కుటుంబికులలో వుండి ఫరో
యొక్క కుమారులలో వొకడై వుండెను. । అంతట హదదు 21

దావీదు తన పితృలతో కూడా నిద్ర పొందిన సంగ
తినిన్ని సైన్యాధిపతియైన యోవాబు మరణమైన సంగ
తినిన్ని మిస్రయీము దేశమందు విన్నప్పుడు హదదు
ఫరోను చూచి నేను నా స్వదేశమునకు వెళ్లేటట్టుగా
22 సెలవు యివ్వండని అడిగెను. । అందుకు ఫరో అనిన
మాట నా యొద్ద నీకు యేమి తక్కువై వున్నది నీ స్వ
దేశమునకు వెళ్ల కోరడానకు? అని అడిగితే, తక్కువై
నది యేమీ లేదు, అయినప్పటికిన్ని యేలాగునయినా
23 నన్ను వెళ్లనివ్వండని అతడు పలికెను. । మరిన్ని దేవుడు
అతని మీద ఎల్యాదాయొక్క కుమారుడైన రెజోను
అనే యింకొక విరోధిని ప్రేరేపణ చేసెను; వీడు
సోబాయొక్క రాజైన హదదెజెరు అనే తన యజమా
24 నుని యొద్దనుంచి పారిపోయినాడు. । మరిన్ని వీడు దా
వీదు సోబా వారిని హతము చేసినప్పుడు కొందరిని
కూర్చుకొని, కూడిన సమూహమునకు అధిపతియై
వుండెను; తరువాత దమస్కుకు వచ్చి నివాసము చేసి
25 దమస్కులో యేలెను. । వీడు హదదు చేసిన మోసము
గాక సొలొమోను బ్రతికిన దినములన్నిటి పర్యంతము
ఇశ్రాయేలుకు విరోధియై వుండి ఇశ్రాయేలును రోసి
26 అరాము దేశమందు యేలినవాడై వుండెను. । మరిన్ని
సొలొమోనుయొక్క సేవకుడైన యారొబాము సహా
తన చెయ్యి రాజు మీదికి యెత్తెను; వీడు సెరేదా సం
బంధమైన ఎఫ్రాతీయుడైన నెబాథుయొక్క కుమా
రుడై వుండెను; వాని తల్లి పేరు సెరూహా, యిది విధవ
27 అయి వుండెను. । వాడు తన చేతిని రాజు మీదికి
యెత్తిన హేతువు యేమంటే, సొలొమోను మిల్లో
కట్టించి తన తండ్రియైన దావీదు పురమునకు కలిగిన
28 బీటలు బాగుచేస్తూ వుండెను. । అయితే యారొబాము
అనే ఆ మనుష్యుడు మహా బలాఢ్యుడై వుండెను;
మరిన్ని పడుచువాడైన వీడు పని యందు ప్రాపికగా
వున్నాడని సొలొమోను చూచి యోసేపు యింటి
భారము మీద వాని అధికారినిగా నిర్ణయించెను. ।
29 అంతట యారొబాము యెరూశలేములోనుంచి బైలు
వెళ్లి మార్గమందుండగా షీలోనీయుడనే దీర్ఘదర్శి
యైన అహీయా వాని చూచెను; వాడు కొత్త వస్త్రమును
ధరించుకొని వుండెను; వారిద్దరు గాక పొలములో
30 మరి యెవడు లేడు. । అయితే అహీయా వాని మీద
నున్న కొత్త వస్త్రమును పట్టుకొని పండెండు తునకలు
గా చించి, యారొబాముతో యీ పది తునకలు
31 నీవు పుచ్చుకో; । యిందుకు ఇశ్రాయేలుయొక్క దేవు
డైన యెహోవా యిచ్చిన సెలవు యేమంటే, యిదు
గో సొలొమోను చేతిలోనుంచి రాజ్యమును ఖండించి
32 పది గోత్రములను నీకు యిత్తును. । అయితే నా సేవ
కుడైన దావీదు నిమిత్తమున్ను యెరూశలేము అనే
ఇశ్రాయేలు గోత్రములలోనుంచి నేను యెంచుకొనిన
పట్టణము నిమిత్తమున్ను వానికి వొక గోత్రము వుం
డును. । యేమంటే వారు నన్ను విడచిపెట్టి, అష్తారోతు 33
అనే సీదోనీయులయొక్క దేవతకున్ను కెమోషు అనే
మోయాబీయులయొక్క దేవునికిన్ని మిల్కోము అనే
అమ్మోను పుత్రులయొక్క దేవునికిన్ని మ్రొక్కి, అతని
తండ్రియయిన దావీదు చేసినట్టు నా దృష్టికి యోగ్య
మైన దాని చేయుటకున్ను నా కట్టడలనున్ను నా ఆజ్ఞల
నున్ను చేసుటకున్ను నా మార్గముల యందు నడవక
పోయిరి. । అయినా రాజ్యము వాని చేతిలోనుంచి 34
బొత్తిగా తీయను, యేమంటే నేను యెంచుకొనిన నా
సేవకుడైన దావీదు నా ఆజ్ఞలనున్ను నా కట్టడలనున్ను
గైకొనెను గనుక దావీదు నిమిత్తము వాని దినముల
న్నిటి పర్యంతమూ వాని ప్రభువుగావుండ చేతును. ।
అయినప్పటికిన్ని వాని కుమారుని చేతిలోనుంచి రా 35
జ్యమును తీసివేసి, అందులో నీకు పది గోత్రములను
యిత్తును. । నేను నా నామమును అక్కడ వుంచుటకు 36
యెంచుకొనిన పట్టణమయిన యెరూశలేములో నా
యెదుట వొక దీపము నా సేవకుడైన దావీదుకు యెల్ల
ప్పుడున్ను వుండే కొరకు అతని కుమారునికి వొక గో
త్రమును యిత్తును. । అయితే నేను నిన్ను తీసుకొని 37
నందున నీవు నీ ఆత్మ కోరేదంతటి ప్రకారముగా యేలి
ఇశ్రాయేలు మీద రాజువై వుందువు. । కాబట్టి నేను 38
నీకు ఆజ్ఞాపించినదంతాను నీవు విని, నా మార్గముల
యందు నడచి, నా దృష్టికి యేది మంచిదో అది జరి
గించి, నా సేవకుడైన దావీదు చేసినట్టు నా కట్టడల
నున్ను నా ఆజ్ఞలనున్ను గైకొన్నట్టయితే, అప్పుడు
నేను నీకు తోడుగా వుండి, నేను దావీదుకు శాశ్వత
మైన యిల్లు స్థిరపచ్చినట్టు నీకున్ను స్థిరపచ్చి ఇశ్రా
యేలును నీకు యిత్తును. । అయితే యీ హేతువు 39
చేతను నేను దావీదుయొక్క సంతతిని బాధ పరుతును
గాని అది నిత్యము కాదని సెలవు యిచ్చెనని చెప్పె
ను. । యిందు కొరకే సొలొమోను యారొబామును 40
చంప వెతికెను; కాబట్టి యారొబాము లేచి మిస్ర
యీము దేశములోకి పారిపోయి, మిస్రయీము రాజ
యిన షీషకు యొద్దికి వచ్చి, సొలొమోను మరణమయ్యే
పర్యంతమూ మిస్రయీములోనే వుండెను. । అయితే 41
సొలొమోను చేసిన తతిమ్మా కార్యములున్ను అతడు
చేసినదంతానున్ను అతని జ్ఞానమున్ను సొలొమోనుయొ
క్క కార్యములను గురించిన గ్రంథమందు వ్రాయబడి
యున్నవి కావా? । సొలొమోను యెరూశలేము యం 42
దు ఇశ్రాయేలంతటి మీద యేలిన కాలము నలుబై
సంవత్సరములై వుండెను. । అంతట సొలొమోను తన 43
పితృలతో కూడా నిద్ర పొంది, తన తండ్రియైన

దావీదు పురమందు సమాధిలో పెట్టబడెను; తరువాత
అతని కుమారుడైన రెహబాము అతనికి మారుగా
యేలెను.

## 12. అధ్యాయము.

1 అప్పుడు రెహబాము షెకెమునకు వెళ్లెను, యే
మంటే అతనికి పట్టాభిషేకము చేయడానకు ఇశ్రా
2 యేలీయులందరున్ను షెకెమునకు వచ్చి యుండిరి. । అ
యితే యింకా మిస్రయీములోనే వున్న నెబాతు
యొక్క కుమారుడైన యారొబాము ఆ సంగతి విని
నప్పుడు, (యేమంటే యీ యారొబాము రాజైన సొ
లొమోను యొద్దనుంచి పారిపోయి మిస్రయీములో
3 నివాసము చేసి వుండెను); । అప్పుడు సంభవించినదే
మంటే, వారు అతని పిలువనంపించిరి; తరువాత యా
రొబామున్ను ఇశ్రాయేలు సంఘమంతయున్ను వచ్చి
4 రెహబాముతో చెప్పినదేమంటే, । మీ తండ్రి మా
యొక్క కాడిని కఠినము అయిన దానిగా చేసెను;
కాబట్టి మీ తండ్రియొక్క కఠినమైన సేవనున్ను మా
మీద అతడు వుంచిన బరువైన కాడినిన్ని చులకనగా
5 చేస్తే మేము మీకు సేవ చేతుమని చెప్పిరి. । అందుకు
అతడు మీరు వెళ్లి మూడు దినములైన తరువాత మా
యొద్దికి తిరిగీ రండని వారితో చెప్పినందున జనులు
6 వెళ్లిపోయిరి. । అప్పుడు రాజైన రెహబాము తన తండ్రి
యైన సొలొమోను బ్రతికి వున్నప్పుడు అతని ముం
దర నిలిచియుండే పెద్దలతోను ఆలోచించి, యీ
జనులకు యేలాగున ప్రత్యుత్తర మిత్తామని వారిని అడి
7 గెను. । వారు అతని చూచి, యీ దినమున నీవు యీ
జనులకు సేవకుడవై, వారికి సేవచేసి, వారికి ప్రత్యు
త్తరమిచ్చి, మృదువైన మాటలను వారితో పలికితివట్టా
యెనా అప్పుడు వారు సదా కాలము నీకు సేవకులౌ
8 దురని చెప్పిరి. । అయితే అతడు పెద్దలు తనతో చెప్పిన
ఆలోచన నిర్లక్ష్యము చేసి, తనతో పెరిగి తన ముం
దర నిలిచి వుండే పడుచువాండ్లతోను ఆలోచన చేసి
9 వారితో చెప్పినదేమంటే, । మా మీద మీ తండ్రి వుం
చిన కాడిని చులకనగా చేయండని మాతో చెప్పిన
యీ జనులకు ప్రత్యుత్తరము యివ్వడానకు యే ఆలో
10 చన మీరు యిచ్చెదరని అడిగెను. । అప్పుడు అతనితో
కూడా యెదిగిన ఆ పడుచువాండ్లు అతని చూచి, మీ
తండ్రిమాయొక్క కాడిని బరువు అయిన దానిగా చేసె
ను, అయితే మీరు మా కొరకు చులకనగా చేయవలె
నని మీతో చెప్పిన యీ జనులను మీరు చూచి, మా
తండ్రియొక్క నడుముకంటే మా చిటికినవేలు దళసరి
11 గా వుండును. । మరిన్ని మా తండ్రి మీ మీద బరు
వైన కాడిని పెట్టెను సరే, మేము ఆ కాడిని యింకా
బరువుగా చేతుము; మా తండ్రి మిమ్ములను చబుకుల
తో శిక్షించెను సరే, మేము తేళ్లతో మిమ్మును శిక్షిం
తుము అని చెప్పవలెనని అతనికి ఆలోచన యిచ్చిరి. ।
అంతట మూడో దినమందు మా యొద్దికి రండని రాజు 12
నిర్ణయము చేసినట్టు యారొబామున్ను జనులంద
రున్ను మూడో నాటియందు రెహబాము యొద్దికి
వచ్చిరి. । అప్పుడు రాజు పెద్దలు యిచ్చిన ఆలోచన 13
నిర్లక్ష్యముచేసి, పడుచువాండ్లు యిచ్చిన ఆలోచన
చొప్పున వారికి కఠినముగా ప్రత్యుత్తరమిచ్చిన దేమం
టే, । మా తండ్రి మీ కాడిని బరువుగా చేసినప్పటి 14
కిన్ని మీ కాడిని మేము యింకా బరువుగా చేతుము;
మా తండ్రి చబుకులతో మిమ్మును శిక్షించెను అయితే
మేము తేళ్లతో మిమ్మును శిక్షింతుమని చెప్పెను. । యీ 15
లాగున రాజు జనులు చెప్పినది వినకపోయెను, యే
మంటే యెహోవా షీలోనీయుడైన అహీయాచేత
తాను నెబాతుయొక్క కుమారుడైన యారొబాముతో
పలికించిన వాక్యము నెరవేర్చడానకు యీ హేతువు
యెహోవా వల్లనై యుండెను. । కాబట్టి ఇశ్రాయేలీ 16
యులందరున్ను రాజు మన విన్నపమును వినలేదని
చూచినప్పుడు, జనులు రాజును చూచి దావీదు యం
దు మాకు భాగమేమి? యెష్షయియొక్క కుమారుని యం
దు మాకు స్వాస్థ్యము లేదు; వో ఇశ్రాయేలీయులా
రా, మీ మీ డేరాలకు పొండి; వో దావీదా, నీ
యింటిని నీవే యిక చూచుకొమ్మని పలికి, ఇశ్రాయే
లీయులు తమ తమ స్వస్థానములకు వెళ్లిపోయిరి. ।
అయితే యూదా పట్టణముల యందున్న ఇశ్రాయేలు 17
పుత్రులను రెహబాము యేలెను. । తరువాత రాజైన 18
రెహబాము పన్ను మీద అధికారి అయిన అదోరా
మును పంపినప్పుడు ఇశ్రాయేలీయులందరున్ను రాళ్ల
తో వాని కొట్టినందున వాడు మరణమాయెను; కా
బట్టి రాజైన రెహబాము యెరూశలేమునకు పారిపోయే
కొరకు తన రథము మీద యెక్కుటకు త్వరపడెను. ।
యీలాగున ఇశ్రాయేలీయులు నేటి వరకూ వున్నట్టు 19
దావీదుయొక్క యింటి మీద తిరగబడిరి. । మరిన్ని 20
యారొబాము మళ్లీ వచ్చెనని ఇశ్రాయేలీయులందరు
న్ను విన్నప్పుడు, వారు సంఘము యొద్దకు అతని
పిలువనంపించి, ఇశ్రాయేలు అంతటి మీద అతనికి
పట్టాభిషేకము చేసిరి; యూదా గోత్రము గాక దా
వీదు యింటిని వెంబడించినది వొకటీ లేక పోయెను. ।
కాబట్టి రెహబాము యెరూశలేమునకు వచ్చిన తరువాత 21
ఇశ్రాయేలు యింటివారితో పోట్లాడి, రాజ్యము సొ
లొమోను కుమారుడైన రెహబాము అనే తనకు తిరిగీ
రప్పించుకొనుటకు యూదా యింటివారినందరినిన్ని
బెన్యామీను గోత్రికులనున్ను యుద్ధప్రవీణులైనటు

వంటివిన్ని లక్ష యెనభయి వేల మంది అయిన వీరిని పోగు
22 చేసెను. । అంతట దేవునియొక్క వాక్యము దైవ జనుడైన
23 షెమయాకు వచ్చినదేమంటే, । నీవు సొలొమోనుయొ
క్క కుమారుడైనటువంటివిన్ని యూదా రాజైనటువం
టివిన్ని రెహబాముతోనున్ను యూదాయొక్క బెన్యా
మీనుయొక్క యింటి వారందరితోనున్ను తక్కిమ్మ
24 వారందరితోనున్ను చెప్ప వలసినలాగు, । యెహోవా
మీకు ఆనతిచ్చినదేమంటే, మీరు ఇశ్రాయేలు పుత్రు
లనే మీ సహోదరుల మీద యుద్ధము చేయడానకు
వెళ్లక, మీలో ప్రతిమనిషి తన తన యింటికి తిరిగి
పొండి, యేమంటే యిది నా వల్లనైనదని చెప్పుమని
సెలవు యిచ్చెను; కాబట్టి వారు యెహోవాయొక్క
మాట విని యెహోవాయొక్క వాక్యప్రకారముగా
25 తిరిగి వెళ్లిరి. । తరువాత యారొబాము ఎఫ్రయీము
పర్వతమందు షెఖెమనే పట్టణము కట్టించి అక్కడ
కాపురము చేసి, అక్కడినుంచి బయిలువెళ్లి పెనూయే
26 లును కట్టించెను. । అయితే యారొబాము తన హృద
యమందు అనుకొన్నదేమంటే, యిప్పుడు రాజ్యము
27 దావీదుయొక్క యింటికి తిరిగి వచ్చును. । యీ జను
లు యెరూశలేము యందున్న యెహోవాయొక్క
మందిరమందు బలులను చెల్లించడానకు వెళ్లితే అప్పుడు
యీ జనులయొక్క హృదయము యూదాయొక్క
రాజైన రెహబాము అనే తమ యజమానుని తట్టు
తిరిగి పోవును, అప్పుడు వారు నన్ను చంపి యూదా
యొక్క రాజైన రెహబాము యొద్దికి తిరిగి పోవుదు
28 రని అనుకొని, । ఆలోచనచేసి రెండు బంగారపు దూ
డలను చేసి, వారిని చూచి, యెరూశలేముకు వెళ్లడము
29 మీకు బహు కష్టము; । వో ఇశ్రాయేలీయులారా, యి
దుగో, మిస్రాయీము దేశములోనుంచి మిమ్మును యివ
తలకు రప్పించిన మీయొక్క దేవుండ్లని చెప్పి, వొకటి
బేతేలు యందున్ను వొకటి దానుయందున్ను వుంచెను. ।
30 అయితే యిది పాపమునకు కారణమైనది, యేమంటే
జనులు దానులో వుంచిన ఆ వొకదాన్ని ఆరాధించు
31 టకు వెళ్లిరి. । మరిన్ని అతడు వున్నతమైన స్థలములు గల
వొక మందిరమును కట్టించి, లేవీ పుత్రులు కానటు
వంటి సామాన్యమైన వారిలో కొందరిని అర్చకులు
32 గా చేసెను. । మరిన్ని యారొబాము యూదా దేశ
మందున్న వుత్సవము వలెనే యెనిమిదో మాసము పది
హేనో నాటియందు వుత్సవమును నిర్ణయించి,
బలిపీఠము మీద బలులను చెల్లించెను. యీలాగున
బేతేలుయందున్ను తాను చేయించిన దూడలకు బలు
లను చెల్లిస్తూ వుండెను; మరిన్ని తాను చేయించిన
వున్నతమయిన స్థలములయొక్క అర్చకులను బేతేలు
33 యందు వుంచెను. । ఆలాగున అతడు తన హృదయ
ములో యోజించిన కాలము, అనగా, యెనిమిదో మాస
ము పదిహేనో నాటి యందు బేతేలులో తాను
చేయించిన పీఠము మీద అర్పణలను చెల్లించి, ఇశ్రా
యేలు పుత్రులకు వొక వుత్సవమును నిర్ణయించెను:
మరిన్ని అతడు పీఠము మీద బలులను అర్పించి ధూప
ము వేసెను.

## 13. అధ్యాయము.

అంతట యిదుగో దైవ జనుడైన వొకడు యెహో 1
వాయొక్క సెలవు ప్రకారము యూదా దేశమునుంచి
బేతేలుకు వచ్చెను; అప్పుడు యారొబాము బలిపీఠ
ము యొద్ద నిలిచి, ధూపమును వేస్తూ వుండగా; । యె 2
హోవాయొక్క వాక్యముచేత అతడు బలిపీఠమును
గురించి మహా శబ్దముతోను పలికినలాగు, వో పీఠమా,
పీఠమా, యెహోవా యిచ్చిన సెలవు యేమంటే,
యిదుగో దావీదుయొక్క యింటికి యోషీయా అనే
పేరు గల వొక పిల్ల పుట్టును; అతడు నీ మీద ధూప
ము వేసిన వున్నతమైన స్థలములయొక్క అర్చకులను
నీ మీదనే చెల్లించును; మనుష్య శల్యములు నీ మీద
దహనమౌను అని పలికి, । ఆ దినమందే వొక గురుతు 3
యిచ్చి అనినదేమంటే, యిదుగో యీ పీఠము బద్ద
లైపోయి, దాని మీదనున్న బుగ్గి వొలికిపోవును; యిది
యెహోవా ఆనతిచ్చిన గురుతై వున్నదని చెప్పెను. ।
అయితే రాజైన యారొబాము బేతేలు యందున్న 4
పీఠమును గురించి కేక వేసిన ఆ దైవ జనుడు చెప్పిన
దాని విన్నప్పుడు సంభవించినదేమంటే, అతడు పీఠ
ము మీదనుంచి తన చెయ్యి చాపి వాని పట్టుకొమ్మని
చెప్పగానే, తాను వాని మీద చాపిన చెయ్యి యెం
డిపోయినందున దాన్ని తిరిగీ తీసుకొనుటకు తనకు
శక్తి లేకపోయెను. । మరిన్ని యెహోవా వాక్య 5
ప్రకారము దైవ జనుడు యిచ్చిన గురుతు చొ
ప్పున పీఠము బద్దలైనందున బుగ్గి పీఠము మీదనుంచి
వొలికిపోయెను. । అప్పుడు రాజు దైవ జనుడైన వాని 6
చూచి, నా చెయ్యి మునుపటిలాగున బాగయ్యేట
ట్టుగా నీ దేవుడైన యెహోవా సముఖమందు నా
కొరకు వేడ వలసినదని బతిమాలెను; కాబట్టి దైవ జను
డు యెహోవా సముఖమందు బతిమాలినందున రాజు
యొక్క చెయ్యి తిరిగీ బాగై మునుపటిలాగున ఆయె
ను. । అప్పుడు రాజు దైవ జనునితో నీవు నా యింటికి 7
వచ్చి సేద తీర్చుకోవలసినది; నీకు బహుమతి యిస్తా
నని చెప్పెను. । అయితే దైవ జనుడు రాజును చూచి, 8
నీ యింట్లో వున్న సగము నీవు నాకు యిచ్చినప్పటి
కిన్ని నీతో కూడా లోపలికి నేను ప్రవేశించను, యీ
స్థలమందు నేను భోజనమునైనా పానమునైనా పుచ్చు

9 కోను. ၊ యిందుకు భోజనమునైనా పానమునైనా పు
చ్చుకోక, నీవు వచ్చిన మార్గముచేత తిరిగీ పోవద్దని
నాకు యెహోవా వాక్కుచేత సెలవు ఆయెనని
10 చెప్పెను. ၊ కాగా అతడు బేతేలుకు తాను వచ్చిన
మార్గముచేత కాకుండా మరి యొక మార్గముచేత
11 తిరిగీ వెళ్లి పోయెను. ၊ అంతట బేతేలు యందు దీర్ఘ
దర్శియైన వొక ముసలివాడు నివసిస్తూ వుండెను;
యితని కుమారులు వచ్చి బేతేలులో దైవ జనునిచేత
ఆ దినమున చేయబడిన క్రియలు అన్నిటిని అతనితో
తెలియ చెప్పిరి; అతడు రాజుతో చెప్పిన మాటలన్ని
12 న్ని వారు తమ తండ్రితో తెలియ చెప్పిరి. ၊ అప్పుడు
వారి తండ్రి యే మార్గముచేత అతడు వెళ్లిపోయె
నని వారిని అడిగెను, యేమంటే అతని కుమారులు
యూదా దేశములోనుంచి వచ్చిన దైవజనుడు వెళ్లి
13 పోయిన మార్గమును చూచిరి. ၊ అప్పుడు అతడు తన
కుమారులను చూచి, గార్దభము నా కొరకు సిద్ధము
చేయండని చెప్పినందున వారు అతని కొరకు గార్ద
భమును సిద్ధము చేసిరి; అతడు దాని మీద యెక్కి,
14 దైవ జనుని వెనుకనుంచి వెళ్లి, ၊ ఆలవృక్షము కింద కూ
చుండి వున్న అతని కని, అతనితో యూదా దేశ
ములోనుంచి వచ్చిన దైవజనుడవు నీవేనా అని అడిగి
15 నప్పుడు, అతడు నేనే అని చెప్పెను. ၊ అప్పుడు అత
డు నా యింటికి వచ్చి భోజనము చేయ వలసినదని
16 చెప్పెను; ၊ అందుకు అతడు నేను నీతో తిరిగి నీ లో
పల ప్రవేశించ కూడదు; మరిన్ని యీ స్థలమందు భో
17 జనమునైనా పానమునైనా పుచ్చుకోను. ၊ యిందుకు
యెహోవా వాక్కుచేత నాకు సెలవు వచ్చినదేమం
టే, నీవు అక్కడ భోజనమునైనా పానమునైనా పు
చ్చుకోక, నీవు వచ్చిన మార్గముచేత వెళ్లడానకు
18 తిరుగ వద్దని నాకు చెప్పబడెనని పలికెను. ၊ అప్పుడు
అతడు నేనున్ను నీవలెనే దీర్ఘదర్శినై వున్నాను;
మరిన్ని యెహోవా వాక్యముచేత వొక దూత వచ్చి,
వాడు భోజనమునున్ను పానమునున్ను పుచ్చుకొనే
కొరకు నీ యింటికి వాని తీసుకురమ్మని నాతో చెప్పె
నని పలికెను; అయితే యితడు అతనితో అబద్ధమాడి
19 నాడు. ၊ అయినందున ఇతడు తిరిగి అతనితో వెళ్లి,
అతని యింట్లో భోజనమున్ను పానమున్ను పుచ్చుకొ
20 నెను. ၊ అయితే వారు భోజనము చేస్తూ వుండగా యేమి
సంభవించెనంటే, యెహోవాయొక్క వాక్యము అతని
తిరిగీ తీసుకొని వచ్చిన ఆ దీర్ఘదర్శికి వచ్చెను. ၊
21 అతడు బొబ్బ యెత్తి, యూదా దేశములోనుంచి
వచ్చిన దైవ జనునితో అనిన మాట, యెహోవా
సెలవు యిచ్చినలాగు యేమంటే, యెహోవాయొక్క
వాక్కు నీవు వినక, నీ దేవుడైన యెహోవా నీకు
ఆజ్ఞాపించిన ఆజ్ఞను గైకొనక, ၊ తిరిగీ వచ్చి అక్కడ 22
భోజనమునైనా పానమునైనా పుచ్చుకోవద్దని యే స్థల
మును గురించి యెహోవా నీకు ఆనతిచ్చెనో ఆ స్థల
మందు నీవు భోజనమునున్ను పానమునున్ను పుచ్చు
కొంటివి గనుక నీ కళేబరము నీ పితృలయొక్క సమా
ధిలోకి రాకపోవునని ఆనతిచ్చెనని చెప్పెను. ၊ అంతట 23
అతడు భోజనమునున్ను పానమునున్ను పుచ్చుకొన్న
తరువాత ఇతడు అతని కొరకు అనగా తాను తిరిగీ
రప్పించిన ఆ దీర్ఘదర్శి కొరకు గార్దభము మీద
గంత కట్టించెను. ၊ అయితే అతడు బయిలు వెళ్లి మా 24
ర్గమున పోతూ వుండగా, వొక సింహము అతనికి
యెదురుగా వచ్చి అతని చంపెను, అప్పుడు అతని
కళేబరము మార్గమందు పడి వుండెను; గార్దభము
దాని దగ్గిర నిలిచి వుండెను; సింహమున్ను శవము దగ్గిర
నిలిచి వుండెను. ၊ మరిన్ని యిదుగో కొందరు మనుష్యు 25
లు ఆలాగున వచ్చి, శవము మార్గమందు పడి వుండే
దిన్ని సింహము శవము దగ్గిర నిలిచి వుండేదిన్ని చూచి,
ఆ ముసలి దీర్ఘదర్శి వాసమైన పట్టణమునకు వచ్చి
ఆ వర్తమానము తెలియ చేసిరి. ၊ అతని మార్గము 26
లోనుంచి తప్పించి తిరిగీ తీసుక వచ్చిన ఆ దీర్ఘద
ర్శి దాని విన్నప్పుడు అతడు చెప్పినదేమంటే, వీడు
యెహోవాయొక్క వాక్యమును వినని దైవజనుడేవే,
కాబట్టి యెహోవా అతని సింహమునకు అప్పగించె
ను; అది అతని చెండాడి యెహోవా అతనికి ఆన
తిచ్చిన వాక్యప్రకారము చంపెనని చెప్పి; ၊ తన కుమా 27
రులను చూచి, గార్దభము మీద నా కొరకు గంత
కట్టండని చెప్పినందున వారు అతని కొరకు గంత కట్టి
రి. ၊ అప్పుడు అతడు వెళ్లి, అతని శవము మార్గమందు 28
పడి వుండేదిన్ని గార్దభమున్ను సింహమున్ను శవము
దగ్గిర నిలిచి వుండేదిన్ని చూచెను; సింహము శవము
ను తినేదిన్ని గార్దభమును చెండాడేదిన్ని లేకపో
యెను. ၊ అప్పుడు ఆ దీర్ఘదర్శి దైవ జనునియొక్క 29
శవమును యెత్తి గార్దభము మీద పెట్టుకొని తిరిగి
వచ్చెను; యీలాగున ఆ ముసలి దీర్ఘదర్శి అంగ
లార్చడానకున్ను సమాధిలో అతని పెట్టడానకున్ను
పట్టణమునకు వచ్చెను. ၊ అయితే అతడు తనయొక్క 30
సమాధిలో అతని శవమును పెట్టినప్పుడు వారు కట
కటా, నా సహోదరుడా, అని యేడ్చిరి. ၊ మరిన్ని 31
ఇతడు సమాధిలో అతని పెట్టిన తరువాత తన కుమా
రులను చూచి, నేను మరణమైనప్పుడు దైవ జను
డైన ఇతడు పెట్టబడిన సమాధిలో నన్ను పెట్టండి;
నా శల్యములను అతని శల్యముల దగ్గిర వుంచం
డి. ၊ యేమంటే బేతేలు యందున్న పీఠమును గురిం 32
చిన్ని షోమ్రోను పట్టణములలో వున్న వున్నతమైన

స్థలములయొక్క మందిరములన్నిటిని గురించిన్ని అత
డు యెహోవా వాక్యప్రకారము బొబ్బ పెట్టి చెప్పి
33 నది అవశ్యముగా సంభవించునని చెప్పెను.। యీ సం
గతి అయిన తరువాత యారొబాము తన దుర్మార్గ
మును విడువక, మళ్లీ సామాన్యపు వారిలో కొందరిని
వున్నతమైన స్థలములకు అర్చకులగా చేసెను; కోరిన
వాడు యెవడో వాని అతడు నిర్ణయించెను, అప్పు
డు వాడు వున్నతమైన స్థలములయొక్క అర్చకులలో
34 వొకడయి వుండెను.। అయితే యిది యారొబాము
యొక్క యింటిని ఖండించుటకున్ను భూమి ముఖము
మీదనుంచి దాని నశింప చేసుటకున్ను ఆ యింటికి
పాపమాయెను.

## 14. అధ్యాయము.

1 ఆ కాలమందు యారొబాముయొక్క కుమారు
2 డయిన అబీయా రోగస్థుడై వుండెను.। అప్పుడు యా
రొబాము తన భార్యను చూచి, నీవు లేచి యారొబా
ముయొక్క భార్య అని తెలియ పడకుండా మారు వే
షము వేసుకొని, షీలోకు వెళ్లుము; యిదుగో యీ
జనుల మీద నేను రాజునవుదునని నాకు తెలియ చె
ప్పిన దీర్ఘదర్శియైన అహీయా అక్కడ వున్నాడు.।
3 కాబట్టి నీవు పది రొట్టెలున్ను అప్పాలున్ను తేనెతో
వున్న బుడ్డిన్ని చేతపట్టుకొని అతని దగ్గిరకు వెళ్లుము;
అతడు పిల్ల యేమి అవుతుందో అది నీకు తెలియ చే
4 సునని చెప్పినందున;। యారొబాముయొక్క భార్య
ఆలాగున చేసి, లేచి షీలోకు వెళ్లి, అహీయా యిం
టికి వచ్చెను. అయితే అహీయా చూడలేకుండెను,
యేమంటే వృద్ధాప్యము చేత అతని దృష్టి నిలిచి వుం
5 డెను.। అంతట యెహోవా అహీయాతో ఆనతిచ్చిన
దేమంటే, యిదుగో యారొబాముయొక్క భార్య తన
కుమారుడు సంకటముతో వున్నాడు గనుక అతని
గురించి నిన్ను అడుగడానకు వస్తూ వున్నది. నీవు యీ
లాగున దానితో చెప్ప వలసినది, యెందుకంటే అది
మాయ చేసి మరి వొకతె అయినట్టుగా వచ్చునని ఆన
6 తిచ్చెను.। అంతట అహీయా ద్వారము లోపలికి వచ్చే
దాని కాలి చప్పుడు విని, దానితో వో యారొబా
ముయొక్క భార్యా, లోపలికి రా; మరి వొకతె అయి
నట్టుగా వుండెదవేమి? నేను నీకు కఠినమైన మాటలు
7 చెప్ప నిర్ణయించ పడితిని.। నీవు వెళ్లి యారొబాము
తో చెప్ప వలసినదేమంటే, ఇశ్రాయేలుయొక్క దేవు
డైన యెహోవా యీలాగున సెలవిస్తున్నాడు, నేను
నిన్ను జనులలోనుంచి తీసి హెచ్చింప చేసి, ఇశ్రా
యేలనే నా జనుల మీద నిన్ను ప్రభువుగా చేసి,।
8 దావీదుయొక్క యింటి యొద్దనుంచి రాజ్యమును తీసి
నీకు యిచ్చినప్పటికిన్ని, నా ఆజ్ఞలను గైకొని తన మనః
పూర్తిగా నన్ను వెంబడించి నా దృష్టికి యేది అను
కూలమో అది మాత్రమే చేసిన నా సేవకుడైన దావీ
దు వలెనే నీవు వుండకుండా,। నీకంటే ముందుగా 9
వుండిన వారందరికంటే నీవు కీడు చేసితివి, యేలాగం
టే నీవు యితరమైన దేవుండ్లనున్ను పోత విగ్రహము
లనున్ను చేసుకొని, నాకు కోపమును కలుగ చేసి, నీ
వెనుకకు నీవు నన్ను వెళ్లచేసితివి.। కాబట్టి యిదుగో 10
యారొబాముయొక్క యింటి మీద నేను కీడు వచ్చే
టట్టు చేసి, గోడ మీద తన మూత్రమును విడచేవాని
నిన్ని ఇశ్రాయేలులో బంధించబడిన వానినిన్ని విడి
పించబడిన వానినిన్ని యారొబాము యొద్దినుంచి తెగ
వేసి, పెంట అంతా పోయే మట్టుకు వొకడు అవతలకు
దాని తీసివేసినట్టు యారొబాముయొక్క యింట శే
షించిన వారినిన్ని నేను తీసివేతును.। పట్టణమందు 11
యారొబాము సంబంధులలో యెవడు మరణమౌనో
వాని శునకములు భక్షించును; బయిట భూమిలో యె
వడు మరణమౌనో వాని ఆకాశ పక్షులు భక్షించు
ను; యెందుకంటే యెహోవా యీలాగున ఆనతిచ్చి
వున్నాడు.। కాబట్టి నీవు లేచి నీ యింటికి వెళ్లిపో; 12
మరిన్ని యెప్పుడు నీ పాదములు పట్టణములో ప్రవే
శించునో అప్పుడే నీ పిల్ల మరణమౌను.। వాని నిమిత్త 13
ము ఇశ్రాయేలీయులందరున్ను దుఃఖపడి వాని సమా
ధిలో పెట్టుదురు; యారొబాము సంబంధులలో వాడు
మాత్రమే సమాధికి వచ్చును; యేమంటే యారొబా
ము యింట వున్న వాని యందు ఇశ్రాయేలుయొక్క
దేవుడైన యెహోవా విషయమై వుత్తమమైనది వొకటి
కనపడి వున్నది.।అదిన్ని గాక యెహోవా తన నిమిత్త 14
ము వొకని ఇశ్రాయేలుమీద రాజుగా వుద్భవింపచేసును;
ఆ దినమందు అతడు యారొబాముయొక్క యిల్లును
తెగవేసును;। యింకా మరి యేమంటే, వుదకమునందు 15
వున్న రెల్లు యిటూ అటూ వూగినట్టు యెహోవా
ఇశ్రాయేలును కొట్టి, వారి పితృలకు తాను యిచ్చిన
యీ మంచి దేశములోనుంచి వేరుతో ఇశ్రాయేలును
పెల్లగించి, నది అవతలకు వారిని చెదర కొట్టును, యే
మంటే వారు తమ కొరకు తోపులను వేసుకొని యె
హోవాకు కోపమును కలుగ చేసిరి.। మరిన్ని తాను 16
పాపము చేసి ఇశ్రాయేలును కూడా పాపము చేయిం
చిన యారొబాముయొక్క పాపముల నిమిత్తము ఆయన
ఇశ్రాయేలును అప్పగించి వేసునని చెప్పెను.। అప్పు 17
డు యారొబాముయొక్క భార్య లేచి వెళ్లిపోయి,
తిర్సా పట్టణమునకు వచ్చెను; తన యింటి ద్వారము
గడప యొద్దికి అది వచ్చినప్పుడే ఆ చిన్నవాడు చని
పోయెను.। వారు సమాధిలో వాని పెట్టిరి; మరిన్ని 18

తన సేవకుడైన దీర్ఘదర్శి అనే అహీయా ద్వారా
యెహోవా ఆనతిచ్చిన వాక్యప్రకారము ఇశ్రాయే
19 లీయులందరున్ను వాని కొరకు దుఃఖ పడిరి. । అయితే
యారొబాముయొక్క తతిమ్మా కార్యములున్ను అతడు
యేలాగున యుద్ధము చేసెనో యేలాగున యేలెనో
అవి అన్నిన్ని ఇశ్రాయేలు రాజులయొక్క వృత్తాంత
20 ముల గ్రంథమందు వ్రాయబడి యున్నవి. । యారొ
బాము యేలిన దినములు యిరువయి రెండు సంవత్సర
ములై వుండెను; అప్పుడు అతడు తన పితృలతో కూ
డా నిద్రపొందెను; అతనికి మారుగా అతని కుమారు
21 డైన నాదాబు యేలెను. । అయితే యూదా దేశమందు
సొలొమోనుయొక్క కుమారుడైన రెహబాము యేలు
తూ వుండెను. రెహబాము యేలనారంభించినప్పుడు
నలుబైయొక్క సంవత్సరముల యీడు గలవాడై వుం
డెను; మరిన్ని యెహోవా తన నామమును పెట్టడా
నకు ఇశ్రాయేలు గోత్రములన్నిటిలోనుంచి యెంచు
కొన్న యెరూశలేమనే పట్టణమందు అతడు పదిహే
డు సంవత్సరములు యేలెను. అతని తల్లి అమ్మోను స్త్రీ
22 అయిన నయమా అనే పేరు కలిగినదై వుండెను. । అయి
తే యూదా వారు యెహోవా దృష్టి యెదుట కీడు
చేసి, తమ పితృలు చేసినదంతటికంటే అధికముగా
వారు చేసిన పాపములచేత ఆయనకు అసూయ కలుగ
23 చేసిరి. । యేమంటే వారున్ను వున్నతమైన ప్రతి కొండ
మీదనున్ను పచ్చని ప్రతి వృక్షము కిందనున్ను వున్న
తమైన స్థలములనున్ను విగ్రహములనున్ను తోపులను
24 న్ను కలుగ చేసుకొనిరి. । మరిన్ని పురుష సంగమపు
వారు సహా దేశమందు వుండిరి, యేమంటే ఇశ్రాయే
లు పుత్రుల ముందరినుంచి యెహోవా అవతలికి వెళ్ల
చేసిన జనాంగములయొక్క అసహ్యమైన కార్యముల
25 న్నిటి ప్రకారముగా వారు చేసిరి. । అయితే రాజైన
రెహబాముయొక్క అయిదో సంవత్సరమందు మిశ్ర
యీము రాజైన షీషకు యెరూశలేము మీదికి వచ్చి, ।
26 యెహోవా మందిరముయొక్క పదార్థములనున్ను
రాజు నగరియొక్క పదార్థములనున్ను యెత్తుకొని
పోయెను; అతడు సమస్తమున్ను యెత్తుకొని పోయెను:
సొలొమోను చేయించిన బంగారపు డాళ్లనున్ను అత
27 డు యెత్తుకొని పోయెను. । రాజైన రెహబాము వీటికి
మారుగా యిత్తడి డాళ్లను చేయించి, వాటిని తలవర్ల
యొక్క అధికారి వశము చేసెను, యేమంటే వాడు
28 రాజు నగరియొక్క ద్వార పాలకుడై వుండెను. । అయి
నందున రాజు యెహోవాయొక్క మందిరమునకు
వెళ్లేటప్పుడు తలవర్లు వాటిని మోసుకొనిపోయి,
తలవర్లయొక్క గదిలోకి తిరిగీ తీసుకొని వస్తూ వుం
29 డిరి. । అయితే రెహబాముయొక్క తతిమ్మా కార్యము
లున్ను అతడు చేసినదంతానున్ను యూదా రాజుల
యొక్క వృత్తాంతముల గ్రంథమందు వ్రాయబడి
యున్నవి గదా? । రెహబామునున్ను యారొబామును 30
న్ను తమ దినములన్నిటిదాకా యుద్ధము కలిగి యుం
డెను. । అయితే రెహబాము తన పితృలతో కూడా 31
నిద్రపొంది, దావీదుయొక్క పురమందున్న తన పితృల
సమాధిలో పెట్టబడెను. అతని తల్లి అమ్మోను స్త్రీయైన
నయమా అనే పేరు కలిగినదై వుండెను. అతని కుమా
రుడైన అబీయాము అతనికి మారుగా యేలెను.

## 15. అధ్యాయము.

నెబాథు కుమారుడున్ను రాజున్ను అయిన యారొ 1
బాము యేలుటయొక్క పద్దెనిమిదో సంవత్సరమందు
అబీయాము యూదాను యేలనారంభించెను. । అతడు 2
మూడు సంవత్సరములు యెరూశలేము యందు యేలె
ను; అతని తల్లిపేరు మయఖా అని వుండెను; అది
అబీషాలోముయొక్క కుమార్తెయై వుండెను. । అత 3
డు పూర్వము తన తండ్రి చేసిన పాప మార్గముల
న్నిటి యందు నడిచెను; అతని హృదయము అతని
పితృడైన దావీదు హృదయము లాగున అతని దేవుడైన
యెహోవా విషయమై సంపూర్ణము అయినది కాక
పోయెను. । అయినప్పటికిన్ని దావీదు నిమిత్తము అతని 4
తరువాత అతని కుమారుని నిలుపుటకున్ను యెరూశ
లేమును స్థిరపరచుటకున్ను అతని దేవుడైన యెహో
వా యెరూశలేము యందు అతనికి దీపమును వుండ
నిచ్చెను. । యెందుకంటే దావీదు హిత్తీయుడైన ఊరీ 5
యాయొక్క సంగతి మాత్రము వొకటి వినాగా యె
హోవా దృష్టికి నీతిగా నడుచుకొని, అతని దినము
లన్నిటి పర్యంతము ఆయన అతనికి యిచ్చిన ఆజ్ఞలలో
వొకటైనా తప్పించి నడువలేదు. । అయితే రెహబా 6
ము బ్రతికిన దినములన్నిటి పర్యంతము అతనికిన్ని
యారొబాముకున్ను యుద్ధము కలిగి వుండెను. । అయి 7
తే అబీయాముయొక్క తతిమ్మా కార్యములున్ను అతడు
చేసినదంతానున్ను యూదా రాజులయొక్క వృత్తాం
తముల గ్రంథమందు వ్రాయబడి యున్నవి గదా?
అబీయాముకున్ను యారొబాముకున్ను యుద్ధము కలిగి
వుండెను. । అయితే అబీయాము తన పితృలతో కూడా 8
నిద్రపొందెను, వారు అతని దావీదుయొక్క పురమం
దు సమాధిలో పెట్టిరి; అతని కుమారుడైన ఆసా అత
నికి మారుగా యేలెను. । ఇశ్రాయేలుకు రాజైన యా 9
రొబాము యేలుటయొక్క యిరువైయో సంవత్సరమం
దు ఆసా యూదాను యేలనారంభించెను. । అతడు 10
నలుబై వొక్క సంవత్సరములు యెరూశలేము యందు
యేలుతూ వుండెను. అతని అవ్వ పేరు మయఖా అని

వుండెను; యీమె అబీషాలోముయొక్క కుమార్తె
11 అయి వుండెను.। అయితే ఆసా తన పితృడైన దావీదు
లాగున యెహోవా దృష్టి యెదుట నీతిగా నడుచుకొ
12 ని,। పురుష సంగమపు వారిని దేశములోనుంచి అవ
తలకు తోలివేసి, తన పితృలు చేయించిన విగ్రహము
13 లన్నిటినిన్ని తీసివేయించెను.। మరిన్ని తన అవ్వ అయిన
మయఖాను పట్టపు రాణి కాకుండా తీసివేసెను, యే
మంటే అది వొక విగ్రహమును చేయించి వొక తో
పులో వుంచెను; అయితే ఆసా దాని విగ్రహమును
ఛిన్నాభిన్నములుగా చేసి, కిద్రోను గెడ్డ దగ్గిర దహ
14 నము చేసెను.। అయితే వున్నతమైన స్థలములు తీసివే
యబడ లేదు; అయినప్పటికిన్ని ఆసాయొక్క హృద
యము అతని దినములన్నిటి పర్యంతమూ యెహోవా
15 విషయమై సంపూర్ణముగా వుండెను.। మరిన్ని అత
డు తన తండ్రి పరిశుద్ధపచిన వస్తువులనున్ని తాను
పరిశుద్ధపచిన వస్తువులనున్ని వెండినిన్ని బంగారము
నున్ని పాత్రలనున్ని యెహోవాయొక్క మందిర
16 ములోకి తెప్పించెను.। అయితే ఆసాకున్ని ఇశ్రాయే
లు రాజైన బయెషాకున్ని వారి దినములన్నిటి పర్యం
17 తము యుద్ధము కలిగి వుండెను.। ఇశ్రాయేలు రాజైన
బయెషా యూదా దేశము పయిని విరోధిగా వెళ్లి,
యూదా రాజైన ఆసా యొద్దికి యెవరయినా రాకుం
డానున్ని పోకుండానున్ని రామా పట్టణమును కట్టించ
18 వచ్చెను.। అయినందున ఆసా యెహోవా మందిర
ముయొక్క పదార్థములలోనున్ని రాజు మందిరము
యొక్క పదార్థములలోనున్ని వున్న శేషమైన వెండి
బంగారములన్నిన్ని తీసి, తన సేవకుల చేతికి అప్ప
గించి, హెజ్యోనుకు పుట్టిన థబ్రిమ్మోను కుమారుడై
నటువంటిన్ని దమష్కులో నివాసము చేసిన అరా
ముకు రాజైనటువంటిన్ని బెన్హదదుకు పంపి చెప్పుమనిన
19 దేమంటే,। నీకున్ని నాకున్ని మరిన్ని నీ తండ్రికిన్ని
నా తండ్రికిన్ని వొక వొడంబడికె కద్దు; యిదుగో
నీకు కానుకగా వెండి బంగారములను పంపితిని; నీవు
నచ్చి ఇశ్రాయేలు రాజైన బయెషా నా యొద్దనుంచి
తిరిగి పోయేటట్టుగా నీకున్ని అతనికిన్ని కలిగి వున్న
వొడంబడికెను తప్పించ వలసినదని చెప్పుండసెను.।
20 కాబట్టి బెన్హదదు రాజైన ఆసా చెప్పిన మాట యందు
ఆమోదించి, తనకు కలిగిన సమూహములయొక్క అధి
పతులను ఇశ్రాయేలు పట్టణముల మీదికి పంపి, ఈయో
నునున్ని దానునున్ని ఆబెల్బేత్మయఖానున్ని కిన్నె
రోతునున్ని నఫ్తాలీము దేశమునున్ని కొట్టించినాడు.।
21 అది బయెషా విన్నప్పుడు రామా పట్టణము కట్టడము
22 మాని, తిర్సాకు వెళ్లి నివాసము చేసెను.। అప్పుడు
రాజైన ఆసా యూదా దేశమంతటిలో వొకడైనా
వినా గాకుండా ప్రకటన చేయించినందున జనులు
వెళ్లి బయెషా కట్టిస్తూ వుండిన రామా పట్టణపు రాళ్ల
నున్ని కర్రలనున్ని యెత్తుక వచ్చినందున, రాజైన
ఆసా వాటిచేత బెన్యామీను సంబంధమైన గెబనున్ని
మిస్పెనున్ని కట్టించెను.। అయితే ఆసాయొక్క తతి 23
మ్మా కార్యములున్ని అతని బలమంతానున్ని అతడు
చేసినదంతానున్ని అతడు కట్టించిన పట్టణములున్ని
యూదా రాజులయొక్క వృత్తాంతముల గ్రంథమందు
వ్రాయపడి యున్నవి గదా? అయితే అతడు వృద్ధు
అయిన తరువాత అతని పాదములకు రోగము సంభ
వించెను.। అంతట ఆసా తన పితృలతో కూడా నిద్ర 24
పొంది, తన పితృడైన దావీదుయొక్క పురమందు తన
పితృల సమాధిలో పెట్టబడెను; అతనికి మారుగా యె
హోషాఫాథు అనే అతని కుమారుడు యేలెను.।
అయితే యారోబాముయొక్క కుమారుడైన నాదాబు 25
యూదా రాజైన ఆసా యేలుబడియొక్క రెండో సం
వత్సరమందు ఇశ్రాయేలును యేలనారంభించి, ఇశ్రా
యేలును రెండు సంవత్సరములు యేలెను.। అతడు యె 26
హోవా దృష్టికి కీడు చేసి, తన తండ్రియొక్క మా
ర్గమందున్ని అతడు దేనిచేత ఇశ్రాయేలును పాప
ము చేయించెనో అతనిదైన ఆ పాపమునందున్ని నడి
చెను.। అయితే ఇతని మీద ఇశ్శాఖారు యింటి సం 27
బంధుడున్ని అహీయాయొక్క కుమారుడున్ని అయిన
బయెషా జట్టు కూర్చుకొని వచ్చి ఫెలిష్తీయుల సం
బంధమైన గిబ్బెతోనులో అతని చంపెను, యేమంటే
అప్పుడు నాదాబున్ని ఇశ్రాయేలీయులందరున్ని గిబ్బె
తోనును ముట్టడి వేసియుండిరి.। రాజైన ఆసా యేలు 28
బడియొక్క మూడో సంవత్సరమందు బయెషా అతని
చంపి అతనికి మారుగా యేలెను.। అయితే యితడు 29
యేలుతూ వుండగా సంభవించిన దేమంటే, ఇతడు
యారోబాముయొక్క యింటివాండ్లందరినిన్ని కొట్టి,
యెవనినైనా యారోబాముకు జీవితునిగా వుండనివ్వ
క, ప్రతివానిన్ని నశింపచేసెను; యిదంతా యెహో
వా తన సేవకుడైన షీలోనీయుడైన అహీయా ద్వారా
ఆనతిచ్చిన ప్రకారముగా సంభవించెను.। మరిన్ని 30
యిది యారోబాము తాను చేసిన పాపముల చేతనున్ని
ఇశ్రాయేలుచేత చేయించిన పాపములవల్లనున్ని ఇశ్రా
యేలుకు దేవుడైన యెహోవాకు కోపము పుట్టించి
నందుననున్ని సంభవించినదై వుండెను.। అయితే నా 31
దాబుయొక్క తతిమ్మా కార్యములున్ని అతడు చేసిన
దంతానున్ని ఇశ్రాయేలు రాజులయొక్క వృత్తాంత
ముల గ్రంథమందు వ్రాయబడి యున్నవి గదా?।
ఆసాకున్ని ఇశ్రాయేలు రాజైన బయెషాకున్ని వారి 32
దినములన్నిటి పర్యంతము యుద్ధము కలిగి వుండెను.।

33 యూదా రాజైన ఆసా యేలుబడియొక్క మూడో సం
వత్సరమందు అహీయా కుమారుడైన బయెషా తిర్సా
యందు ఇశ్రాయేలు అంతటినీ యేలనారంభించి, యి
34 రువై నాలుగు సంవత్సరములు యేలెను. ఇతడు యె
హోవా దృష్టికి కీడు చేసి, యరొబాముయొక్క
మార్గమందున్ను అతడు దేనిచేత ఇశ్రాయేలును పా
పము చేయించెనో అతనిదైన ఆ పాపమందున్ను
నడిచెను.

## 16. అధ్యాయము.

1 అప్పుడు యెహోవాయొక్క వాక్యము బయెషాను
విరోధముగా హనానీ కుమారుడైన యెహూయొద్దకు
2 వచ్చిన దేమంటే, నేను నిన్ను ధూళిలోనుంచి తీసి హె
చ్చింప చేసి, ఇశ్రాయేలనే నా జనులమీద ప్రభువుగా
చేస్తిని; అయినప్పటికిన్ని నీవు యరొబాము మార్గ
మందు నడిచి, ఇశ్రాయేలనే నా జనులచేత పాపము చే
యించి, వారి పాపములచేత నాకు కోపమును పుట్టించి
3 తివి. కాబట్టి యిదుగో బయెషాయొక్క వెనుకటి వాం
డ్లనున్ను అతని కుటుంబముయొక్క వెనుకటి వాండ్ల
నున్ను నేను తీసివేసి, నీ యిల్లు నాబాతు కుమారుడైన
4 యరొబాముయొక్క యింటిలాగున చేతును. పట్ట
ణమందు బయెషా సంబంధికులలో యెవడు మరణ
మానో శునకములు వాని తినును; బయిట భూముల
యందు వాని సంబంధికులలో యెవడు మరణమానో
5 ఆకాశ పక్షులు వాని తినునని చెప్పెను. అయితే
బయెషాయొక్క తతిమ్మా కార్యములున్ను అతడు చేసి
నదంతాన్నున్ను అతని బలమున్ను ఇశ్రాయేలు రాజుల
యొక్క వృత్తాంతముల గ్రంథమందు వ్రాయబడి
6 యున్నవి గదా? బయెషా తన పితృలతో కూడా నిద్ర
పొంది తిర్సాలో సమాధియందు పెట్టబడెను; అతనికి
7 మారుగా అతని కుమారుడయిన ఏలా యేలెను. మరిన్ని
యెహోవాయొక్క వాక్యము బయెషాకున్ను అతని
యింటికిన్ని విరోధముగా హనానీ కుమారుడైన యె
హూద్వారా అతడు యరొబాము యింటి కాండ్లవలెనే
యుండి, యెహోవాకు తన కార్యములచేత కోపము
పుట్టించి, ఆయన దృష్టి యెదుట చేసిన కీడంతటి నిమి
త్తమున్ను అతడు అతని చంపిన దాని నిమిత్తమున్ను
8 వచ్చెను. యూదా రాజైన ఆసా యేలుబడియొక్క
యిరువై ఆరో సంవత్సరమందు బయెషా కుమారుడైన
ఏలా తిర్సాయందు ఇశ్రాయేలు అంతటిని యేలనా
9 రంభించి, రెండు సంవత్సరములు యేలెను. తిర్సాలో
ఆ తిర్సాలో తనకు కలిగిన యింటి కాపరి యయిన
అర్సా యింట్లో అతడు మత్తుగా తాగుతూ వుండ
గాన్, తన రథములలో సగము మీద అధికారియైన
జిమ్రీ అతని మీద జట్టు కూడుకొని, లోపటికి
చొచ్చి, అతని కొట్టి చంపి, అతనికి మారుగా యే 10
లెను; యిది యూదా రాజైన ఆసా యేలుబడియొక్క
యిరువై యేడో సంవత్సరమందు సంభవించెను. అతడు 11
గద్దెమీద ఆసీనుడై యేలనారంభించగానే బయెషా
యింటి కాండ్లందరినీ సంహరించెను; అతని బంధువుల
లోనేమి అతని మిత్రులలోనేమి గోడమీద తన మూ
త్రమును విడిచే వొకనినైనా వానికి వుండనిచ్చినాడు
కాడు. యీలాగున జిమ్రీ దీర్ఘదర్శియైన యెహూ 12
ద్వారా యెహోవా బయెషాయొక్క పాపముల నిమి
త్తమున్ను అతని కుమారుడైన ఏలాయొక్క పాపముల
నిమిత్తమున్ను బయెషాకు విరోధముగా ఆనతిచ్చిన
వాక్యప్రకారము బయెషా యింటికాండ్లందరినీ నా
శనము చేసెను. యేమంటే వారు పాపమును చేసి, 13
ఇశ్రాయేలుచేత పాపమును చేయించి, తమ వ్యర్థ
మైన వాటిచేత ఇశ్రాయేలుయొక్క దేవుడైన యెహో
వాకు కోపము పుట్టించిరి. ఏలాయొక్క తతిమ్మా కా 14
ర్యములున్ను అతడు చేసినదంతాన్నున్ను ఇశ్రాయేలు
రాజులయొక్క వృత్తాంతముల గ్రంథమందు వ్రాయ
బడి వున్నవి గదా? యూదా రాజైన ఆసాయొక్క 15
యిరువై యేడో సంవత్సరమందు జిమ్రీ తిర్సాలో
యేడు దినములు యేలెను. అంతట జనులు ఫెలిష్తీ
యుల సంబంధమైన గిబ్బెతోను మీదికి వచ్చి అక్కడ
దిగి వుండిరి. అప్పుడు అక్కడ దిగి వున్న జనులు 16
జిమ్రీ జట్టు కూడుకొని వచ్చి, రాజును చంపివేసె
నని వినిరి; కాబట్టి ఇశ్రాయేలీయులందరున్ను ఆ దిన
మున సైన్యాధిపతియైన ఒమ్రీని దండు పేటలో
ఇశ్రాయేలు మీద రాజుగా చేసిరి. వెంబడిగానే 17
ఒమ్రీ గిబ్బెతోనును విడచి, తానున్ను ఇశ్రాయేలీ
యులందరున్ను తిర్సకు వచ్చి, దాని ముట్టడి వేసిరి.
అయితే పట్టణము పట్టుపడెనని జిమ్రీ చూచినప్పుడు, 18
తాను రాజ మందిరములోకి వెళ్లి, తన్నున్ను రాజ మం
దిరమునున్ను తగలపెట్టుకొని మరణమయినాడు. యిది 19
యరొబాముయొక్క మార్గమందున్ను అతడు ఇశ్రా
యేలును పాపము చేయించుట వల్లనైన పాపమందు
న్ను అతడు నడచి, యెహోవా దృష్టి యెదుట కీడు
చేసినందువల్లనైన పాపముల నిమిత్తము సంభవించెను.
అయితే జిమ్రీయొక్క తతిమ్మా కార్యములున్ను వాడు 20
చేసిన ద్రోహమున్ను ఇశ్రాయేలు రాజులయొక్క
వృత్తాంతముల గ్రంథమందు వ్రాయబడి వున్నవి
గదా? అప్పుడు ఇశ్రాయేలీయులు రెండు జట్లుగా 21
విభజించబడి, జనులలో సగముమంది గీనతు కుమారు
డైన తిబ్నీని రాజుగా చేయుటకు అతని వెంబడించిరి;
రెండో సగనుమంది ఒమ్రీని వెంబడించిరి. అయితే 22

ఓమ్రీని వెంబడించిన వారు గీనతు కుమారుడైన తిబ్నీని
వెంబడించిన వారిని జయించిరి; కాబట్టి తిబ్నీ మరణ
23 మైనందున ఓమ్రీ యేలెను. । యూదా రాజైన ఆసా
యొక్క ముప్పై వొకటో సంవత్సరమందు ఓమ్రీ
ఇశ్రాయేలును యేలనారంభించి, పండెండు సంవత్సర
ములు యేలెను; వీటిలో ఆరు సంవత్సరములు అతడు
24 తిర్సాలో వుండి యేలెను. । అతడు షెమెరు యొద్ద
షోమ్రోను కొండను రెండు తలాంతుల వెండికి కొను
కొని, ఆ కొండ మీద కట్టించి, తాను కట్టించిన పట్ట
ణము ఆ కొండ యజమానుడు అయిన షెమెరు అనే
25 అతని పేరట షోమ్రోను అని పిలిచెను. । అయితే యీ
ఓమ్రీ యెహోవా దృష్టికి కీడు చేసి, తన పూర్వీకు
26 లందరికంటే మరీ చెడ్డగా ప్రవర్తించెను. । యేమం
టే అతడు నెబాతు కుమారుడైన యారోబాముయొక్క
మార్గమంతటి యందున్ను దేనిచేత అతడు ఇశ్రా
యేలువల్ల పాపమును చేయించి వారి వ్యర్థమైన
వాటిచేత ఇశ్రాయేలు దేవుడయిన యెహోవాకు కో
పమును కలుగ చేసెనో అతనిదైన ఆ పాపమందున్ను
27 నడిచెను. । అయితే ఓమ్రీ చేసిన తతిమ్మా కార్యములు
న్ను అతడు అగుపరిచిన బలమున్ను ఇశ్రాయేలు
రాజులయొక్క వృత్తాంతముల గ్రంథమందు వ్రాయ
28 బడి వున్నవి గదా! । అయితే ఓమ్రీ తన పితృలతో
కూడా నిద్ర పొంది, షోమ్రోనులో సమాధి యందు
పెట్టబడెను; అప్పుడు అతని కుమారుడయిన అహాబు
29 అతనికి మారుగా యేలెను. । యూదా రాజయిన ఆసా
యొక్క ముప్పయి యెనిమిదో సంవత్సరమందు ఓమ్రీ
కుమారుడయిన అహాబు ఇశ్రాయేలును యేలనారం
భించి, షోమ్రోనులో ఇశ్రాయేలును యిరువై రెండు
30 సంవత్సరములు యేలెను. । అయితే ఓమ్రీ కుమారుడ
యిన అహాబు తన పూర్వీకులందరికంటే యెహోవా
31 దృష్టి యెదుట కీడు చేసెను. । నెబాతు కుమారుడైన
యారోబాముయొక్క పాప మార్గముల యందు నడ
చుట అతనికి కొంచెపు సంగతి అయినట్టు, అతడు
సీదోనీయులయొక్క రాజయిన ఏత్బయలుయొక్క
కుమార్తె అయిన యెజబెలును వివాహము చేసుకొని,
32 వెళ్లి బయలుకు సేవచేసి మ్రొక్కెను. । మరిన్ని షో
మ్రోనులో తాను కట్టించిన బయలుయొక్క మందిర
మందు బయలు కొరకు వొక బలిపీఠమును కట్టించెను. ।
33 మరిన్ని అహాబు తోపు వొకటి వేయించెను; యీలా
గున యీ అహాబు తన పూర్వీకులైన ఇశ్రాయేలు రా
జులందరికంటే ఇశ్రాయేలు దేవుడైన యెహోవాకు
కోపము పుట్టించడానకు అధికముగా పాపమును చేసె
34 ను. । అతని దినముల యందు బేతేలీయుడయిన హీ
యేలు వచ్చి, యెరిఖో పట్టణమును కట్టించెను; అబీ
రాము అనే తన ప్రథమ పుత్రుని యందు దాని
పునాదివేసి, శెగూబు అనే తన కనిష్ఠ పుత్రుని యందు
దాని గవునులు యెత్తెను: యిది నూను కుమారుడయిన
యెహోషువ ద్వారా యెహోవా ఆనతిచ్చిన వాక్య
ప్రకారముగా సంభవించెను.

## 17. అధ్యాయము.

అంతట గిలాదు కాపురస్తుల సంబంధియున్న 1
తిష్బీయుడున్నైన ఏలీయా అహాబుతో అనిన మాట,
యెవని సముఖమందు నేను నిలిచి వున్నానో ఇశ్రా
యేలు దేవుడైన ఆ యెహోవా యొక్క జీవముతోడు
నా మాట ప్రకారమైతేనే గాని యీ సంవత్సరము
లలో మంచైనా వర్షమైనా లేక వుండునని చెప్పిన
తరువాత, । యెహోవాయొక్క వాక్యము అతనికి 2
వచ్చినదేమంటే, । నీవు యిక్కడనుంచి తర్లి తూర్పు 3
వైపు తిరిగి, యర్దాను యెదుటనున్న కెరీతు గెడ్డ
దగ్గిర దాగి వుండుము; । అప్పుడు నీవు ఆ గెడ్డలోది 4
తాగుదువు; మాలకాకులు అక్కడ నీకు ఆహారము
పెట్టుటకు వాటికి ఆజ్ఞాపిస్తినని అతనికి చెప్పబడెను. ।
కాబట్టి అతడు వెళ్లి యెహోవా వాక్యప్రకారము 5
చేసెను; యేమంటే అతడు వెళ్లి యర్దాను యెదుట
నున్న కెరీతు గెడ్డ దగ్గిర నివాసము చేసెను. । అక్కడ 6
మాలకాకులు వుదయమందు రొట్టెనున్ను మాంసము
నున్ను అస్తమానమందు రొట్టెనున్ను మాంసమునున్న
అతని యొద్దికి తీసుకొని వస్తూ వుండెను; అతడు గెడ్డ
లోది తాగెను. । మరి కొంత కాలమైన తరువాత సంభ 7
వించినదేమంటే, దేశములో వర్షము లేకపోయినం
దుచేత ఆ గెడ్డ యెండిపోయెను. । అప్పుడు యెహో 8
వాయొక్క వాక్యము అతనికి వచ్చినదేమంటే, । నీవు 9
సీదోనులో సారెఫతు అనే వూరికి వెళ్లి అక్కడ వుం
డుము; యిదుగో నిన్ను పోషించడానకు అక్కడ వున్న
వొక విధవకు సెలవు యిస్తినని చెప్పబడినందున, । అతడు 10
లేచి సారెఫతుకు వెళ్లెను; పట్టణపు గవిని యొద్దికి
అతడు వచ్చినప్పుడు యిదుగో ఆ విధవ అక్కడ
కర్రలు యేరుతూ వుండెను; అప్పుడు అతడు దాని
పిలిచి చెప్పినదేమంటే, నేను తాగడానకు పాత్రతో
కొద్దిగా నీళ్లు తీసుకొని రమ్మని వేడుకొనెను. । అది 11
నీళ్లు తీసుక రావడానకు వెళ్లుతూ వుండగా అతడు
దాని తిరిగీ పిలిచి, నా కొరకు రొట్టెముక్కనున్ను నీ
చేతితో తీసుకొని రమ్మని చెప్పెను. । అప్పుడు అది 12
అతనితో నీ దేవుడైన యెహోవా జీవముతోడు నా
యొద్ద వొక అప్పము సహా లేదు; కుండలో పట్టెడు పిం
డిన్ని బుడ్డిలో కొంత నూనెయున్ను కలవు; కాబట్టి
నేను కొన్ని కర్రలు యేరి యింట్లోకి ప్రవేశించి అవి

నా కొరకున్ను నా కుమారుని కొరకున్ను సిద్ధము చేసిన
తరువాత మేము వాటిని తిని మరణము కావడానకు
13 వస్తిమని చెప్పెను. । అప్పుడు ఏలీయా దానితో నీవు
భయపడవద్దు, నీవు చెప్పినట్టు వెళ్లి చేయుము; అయితే
ముందుగా అందులో నా కొరకు వొక చిన్న అప్ప
మును చేసి నా యొద్దికి తీసుకొని రమ్ము; తరువాత
నీ కొరకున్ను నీ కుమారుని కొరకున్ను అప్పములను
14 చేసుకొనుము. । యేమంటే యెహోవా భూమిమీద
వర్షమును కురిపించచేసే పర్యంతమూ ఆ కుండలో
వున్న పిండి తక్కువ కాకుండా వుండుననిన్ని బుడ్డిలో
నూనె సరిపడకుండా వుండుననిన్ని ఇశ్రాయేలు దేవు
15 డైన యెహోవా ఆనతిచ్చెనని చెప్పెను. । అయినం
దున అది వెళ్లి ఏలీయా చెప్పిన మాట ప్రకారము చేసి,
తానున్ను అతడున్ను తన యింటివారున్ను అనేక దిన
16 ముల మట్టుకు తింటూ వుండిరి. । మరిన్ని యెహోవా
ఏలీయా ద్వారా ఆనతిచ్చిన వాక్య ప్రకారముగా
కుండలో వున్న పిండి తక్కువ కాకుండానున్ను బుడ్డి
17 లో వున్న నూనె సరిపడకుండానున్ను వుండెను. । యీ
సంగతులైన తరువాత సంభవించినదేమంటే, ఆ యింటి
యజమానురాలైన ఆ స్త్రీయొక్క కుమారుడు రోగి
ఆయెను; అతని రోగము బహు కఠినమైనందున అత
18 నికి శ్వాసము మరి లేకపోయెను. । అప్పుడు అది ఏలీ
యాతో అనిన మాట, వో దైవ జనుడా, నాకున్ను
నీకున్ను యేమి? నా పాపము నాకు జ్ఞాపకము చేయ
డానకున్ను నా కుమారుని చంపడానకున్ను నా యొ
19 ద్దికి వస్తివా అని చెప్పగా; । అతడు దాని చూచి, నీ
కుమారుని నా చేతికి యిమ్మని దాని కౌగిటిలోనుంచి
అతని తీసుకొని, తాను వున్న పై అంతస్తు గదిలోకి
వెళ్లి, తన మంచము మీద అతని పెట్టి, యెహోవాకు
20 మొరబెట్టి అనినదేమంటే, । నా దేవుడవైన వో యె
హోవా, యే విధవ యొద్ద నేను వున్నానో దాని
కుమారుని చంపుటవల్ల దాని మీదికి కీడు రాచేస్తివా
21 అని పలికి; । ఆ చిన్నవాని మీద ముమ్మారు తాను నిడు
పుగా పడుకొని, యెహోవాకు తిరిగీ మొరబెట్టి అనిన
దేమంటే, నా దేవుడవైన వో యెహోవా, యీ
చిన్నవానియొక్క జీవము వాని లోపలికి తిరిగీ ప్రవే
22 శించేటట్టు దయచేయుమని వేడుకొనెను. । యెహో
వా ఏలీయాయొక్క శబ్దము వినినందున ఆ చిన్నవాని
యొక్క ప్రాణము వాని లోపలికి తిరిగీ ప్రవేశించినం
23 దున వాడు బ్రతికెను. । అప్పుడు ఏలీయా ఆ చిన్న
వాని తీసుకొని, గదిలోనుంచి దిగి, యింట్లోకి ప్రవే
శించి, వాని తల్లికి అప్పగించి, యిదుగో నీ కుమారుడు
24 బ్రతుకుతున్నాడని చెప్పెను. । అప్పుడు ఆ స్త్రీ ఏలీ
యాతో చెప్పినదేమంటే, యిందుచేతనే నీవు దైవ
జనుడవై వున్నావనిన్ని నీ నోటనున్న యెహోవా
యొక్క వాక్యము నిజమనిన్ని నేను యెరుగుదునని
పలికెను.

## 18. అధ్యాయము.

అయితే అనేకదినములైన తరువాత యెహోవా 1
యొక్క వాక్యము మూడో సంవత్సరమందు ఏలీయా
కు వచ్చినదేమంటే, నీవు వెళ్లి అహాబుకు అగుపడు,
యేమంటే నేను భూమి మీద వర్షమును కురిపింతు
ననెను. । కాబట్టి యేలీయా తాను అహాబుకు అగుపడ 2
డానకు వెళ్లెను; అప్పుడు షోమ్రోనులో ఘోరమైన
క్షామము కలిగి వుండెను. । అంతట అహాబు తన యింటి 3
కాపరియైన ఓబద్యాను పిలిచెను; యీ ఓబద్యా యె
హోవా యందు బహుగా భయపడేవాడు. । యేమం 4
టే యెజబెలు యెహోవాయొక్క దీర్ఘదర్శులను
ఖండింపచేసినప్పుడు ఓబద్యా నూరుమంది దీర్ఘద
ర్శులను తీసుకొని, వారిని యేభైయేసి యేభైయేసి
మందిగా వొక్కొక్క గుహలో దాచి, రొట్టెతోనున్ను
నీళ్లతోనున్ను వారిని పోషించెను. । అహాబు ఓబద్యాను 5
చూచి చెప్పినదేమంటే, నీవు దేశములో సకలమైన
వుదక ధారలకున్ను సకలమైన గెడ్డలకున్ను వెళ్లి, మన
ము పశువులన్నిటినీ పోగొట్టుకోకుండా గుఱ్ఱముల
నున్ను వేసడములనున్ను ప్రాణములతో కాపాడే
లాగున గడ్డి మనకు దొరుకునేమో చూడుమని చెప్పె
ను. । కాబట్టి వారు దేశమంతటిలోకి గడవడానకు చెరి 6
సగము చేసుకొని, అహాబు యీ మార్గమున వొంట
రిగానున్ను ఓబద్యా ఆ మార్గమున వొంటరిగానున్ను
వెళ్లిరి. । అయితే ఓబద్యా మార్గమున వుండగా, యి 7
దుగో, ఏలీయా అతని యెదుర్కొనెను; అతడు ఇతని
యెరిగి సాగిలపడి, నా యేలినవాడవైన ఏలీయావు
నీవేనా అని పలికెను. । అందుకు అతడు నేనేను; అయి 8
తే నీవు నీ యేలినవాని దగ్గిరకు పోయి, యిదుగో
ఏలీయా యిక్కడ వున్నాడని చెప్పుమనినందున; । అత 9
డు అతనితో అనినదేమంటే, నన్ను చంపే కొరకు
నీ సేవకుడవైన నన్ను అహాబుయొక్క చేతికి నీవు
అప్పగించుటకు నేను యేమి పాపము చేస్తిని? నీ దేవు 10
డైన యెహోవా జీవముతోడు నా యేలినవాడు
అక్కడ నిన్ను వెతికించడానకు పంపించనటువంటి
జనాంగమైనా రాజ్యమైనా ఒకటీ లేదు; వారు వాడు
యిక్కడ లేడని చెప్పినప్పుడు నిన్ను చూడలేదని ఆ
జనాంగము చేతనున్ను రాజ్యము చేతనున్ను అతడు
ప్రమాణము పుచ్చుకొనెను. । అయితే నీవు నీ యేలిన 11
వాని దగ్గిరకు పోయి అదుగో ఏలీయా యిక్కడ
వున్నాడని చెప్పుమన్న సెలవు నాకు యిస్తివి. । అయితే 12

నేను నీ యొద్దనుంచి వెళ్లే క్షణమందే యెహోవా
యొక్క ఆత్మ నాకు తెలియని స్థలమునకు నిన్ను యెత్తు
కొని పోవును; అప్పుడు నేను వచ్చి అహాబుతో తెలి
య చెప్పిన తరువాత నీవు అతనికి దొరకని పక్షమందు
అతడు నన్ను చంపివేసును; అయితే నీ సేవకుడనైన
నేను బాల్యమునుంచి యెహోవా యందు భయము
13 గలవాడనై యున్నాను. । యెజబెలు యెహోవా
యొక్క దీర్ఘదర్శులను చంపించిన సమయమున
నేను చేసినది నా యేలినవాడవైన నీకు వినపడినది
కాదా? అది యేమంటే నేను యెహోవాయొక్క
దీర్ఘదర్శులలో నూరు మందినీ యేభైయేసి యేభై
యేసి మందిగా వొక్కొక్క గుహయందు దాచి, రొట్టె
14 తోనున్ను నీళ్లతోనున్ను వారిని పోషించినాను.। అయి
తే యిప్పుడు నీ యేలినవాని దగ్గిరకు వెళ్లి, అదుగో
ఏలీయా యిక్కడ వున్నాడని చెప్పుమని నీవు నాకు
సెలవు యిస్తివి; అందువల్ల అతడు నన్ను చంపివేసునని
15 చెప్పినందున; । ఏలీయా అతనితో యెవని సముఖమం
దు నేను నిలిచి వున్నానో ఇశ్రాయేలు దేవుడైన ఆ
యెహోవా జీవముతోడు, నిజముగా యీ దినమున
16 నేను అహాబుకు అగుపడుదునని చెప్పెను. । అప్పుడు
ఓబద్యా వెళ్లి, అహాబుకు యెదురుగా వచ్చి అతనితో
తెలియ చెప్పినందున అహాబుకు ఏలీయాను యెదుర్కోన
17 వడానకు వచ్చెను. । అహాబు ఏలీయాను చూచినప్పుడు
సంభవించినదేమంటే, ఇశ్రాయేలును శ్రమ పెట్టుతు
న్నవాడవు నీవే సుమీ, అని అహాబు అతనితో పలికి
18 నందున; । అతడు అతనితో అనిన మాట; నేను కాను;
యెహోవాయొక్క ఆజ్ఞలను విడచిపెట్టి, బయలును
వెంబడించిన నీవున్ను నీ తండ్రి యింటివాండ్లున్ను
ఇశ్రాయేలును శ్రమ పెట్టుతున్నవారయి వున్నారు.।
19 అయితే యిప్పుడు నీవు ఇశ్రాయేలీయులందరినిన్ని
యెజెబెలుయొక్క బల్ల మీద భోజనము చేసే బయలు
యొక్క దీర్ఘదర్శులయిన నన్నూట యేభైమందినిన్ని
తోపుయొక్క దీర్ఘదర్శులయిన నన్నూరు మంది
నిన్ని నా యొద్దికి వచ్చే లాగున కర్మేలు పర్వతము
20 నకు పిలువనంపించుమని చెప్పెను. । ఆలాగున అహాబు
ఇశ్రాయేలు పుత్రులందరి యొద్దికి పంపి, దీర్ఘదర్శు
21 లను కర్మేలు పర్వతమునకు సమకూర్చెను. । అప్పుడు
ఏలీయా జనులందరి దగ్గిరకు వచ్చి యెన్నాళ్ల మట్టుకు
మీరు రెండు తలంపుల మధ్యను తడబడుతూ వుంటా
రు? యెహోవా దేవుడయితే ఆయనను వెంబడించం
డి; బయలు దేవుడయితే వాని వెంబడించండని చెప్పె
ను: అయితే జనులు అతనికి ప్రత్యుత్తరముగా వొక
22 మాటయయినా పలుకక వుండిరి. । అప్పుడు ఏలీయా
తిరిగీ ఆ జనులతో అనినదేమంటే, నేను మాత్రమే
యెహోవాయొక్క దీర్ఘదర్శినై శేషించి వున్నా
ను; అయితే బయలుయొక్క దీర్ఘదర్శులు నన్నూట
యేభయి మంది అయి వున్నారు. । కాబట్టి వారు మాకు 23
రెండు యెడ్లను యివ్వవలసినది; అప్పుడు వారు వాటి
లో వొక దానిని యెంచుకొని, దాని తునకలుగా
కోసి, కర్రలమీద వేసి, కింద అగ్ని వేయకుండా
వుండ వలెను; ఆ రెండో యెద్దును నేను సిద్ధము చేసి,
కర్రల మీద పెట్టి, కింద అగ్ని వేయకుండా వుంటా
ను. । తరువాత మీరు మీ దేవుండ్లయొక్క నామమును 24
స్మరింతురు గాక; నేనున్ను యెహోవాయొక్క నా
మమును స్మరింతును; అప్పుడు యే దేవుడు అగ్నిచేత
ప్రత్యుత్తరమిచ్చునో ఆయనే దేవుడని తీర్చబడు
నని చెప్పినప్పుడు, జనులందరున్ను ఆ మాట మంచి
దని ప్రత్యుత్తరముగా పలికిరి. । అప్పుడు ఏలీయా 25
బయలుయొక్క దీర్ఘదర్శులను చూచి, మీరు అనే
కులై వున్నారు, గనుక, ప్రథమము మీరు వొక యె
ద్దును యెంచుకొని సిద్ధము చేసి, మీ దేవుండ్లయొక్క
నామమును స్మరించండి; అయితే కింద అగ్ని వేయ
వద్దని చెప్పెను. । అప్పుడు వారు తమకు యివ్వపడిన 26
యెద్దును తీసుకొని సిద్ధము చేసి, వుదయము మొదలు
కొని మధ్యాహ్నము పర్యంతమూ వో బయలా! మా
ప్రార్థన వినుము, అని బయలుయొక్క నామమును
స్మరిస్తూ వుండిరి. అయితే శబ్దమైనా ప్రత్యుత్తర
మిచ్చినవాడైనా లేక వుండెను. మరిన్ని వారు తాము
చేసిన బలిపీఠము యొద్ద గంతులు వేస్తూ వుండిరి. ।
అయితే మధ్యాహ్నమైనప్పుడు ఏలీయా వారిని అప 27
హాస్యము చేసి పలికినదేమంటే, పెద్ద కేకలు వేయండి,
యేమంటే వాడు దేవుడై వున్నాడు; వాడు మాట్లా
డుతూ వున్నాడో, లేక తిరుగుతూ వున్నాడో, లేక
ప్రయాణమే చేస్తూ వున్నాడో; యివి కాకపోతే
నిద్రపోతూ వుండునేమో లేపబడ వలసినది అని పలి
కెను.। కాబట్టి వారు బహుగా బొబ్బ పెట్టుతూ, తమ 28
మర్యాదా ప్రకారము కత్తులతోటిన్ని శస్త్రములతో
టిన్ని తమ మీదికి రక్తము కారే మట్టుకు కోసుకొం
టూ వుండిరి. । యీలాగున మధ్యాహ్నమైన తరువాత 29
అస్తమానాపర్ణ చెల్లించే కాలము పర్యంతమూ వారు
దీర్ఘదర్శనముగా పలికినప్పటికిన్ని శబ్దమైనా
ప్రత్యుత్తరమిచ్చే వాడైనా లక్ష్యము చేసిన వాడైనా
లేక వుండెను. । అప్పుడు ఏలీయా జనులందరినిన్ని 30
చూచి, నా దగ్గిరకు రండని చెప్పినందున జనులందరు
న్ను అతని దగ్గిరకు వచ్చిరి; అతడు కింద పడద్రోయ
పడిన యెహోవాయొక్క బలిపీఠమును తిరుగా బా
గు చేసెను.। మరిన్ని ఏలీయా నీ నామము ఇశ్రాయేలు 31
అవునని యెవనికి యెహోవా వాక్యము వచ్చెనో

ఆ యాకోబుయొక్క కుమారుల గోత్రముల లెక్క
32 చొప్పున పండ్రెండు రాళ్లను తీసుకొని, । ఆ రాళ్లచేత
యెహోవాయొక్క పేరట వొక బలిపీఠము కట్టి, ఆ
పీఠము చుట్టూ రెండు గరిసెల గింజలు పట్టేపాటి
33 కందకము తవ్వించెను. । అతడు కర్రలను క్రమముగా
పేర్చి, యెద్దును తునకలుగా కోసి, ఆ కర్రల మీద
పెట్టి, వారిని చూచి, నాలుగు తొట్లలో నిండుగా
నీళ్లు పోసి, హోమ బలిమీదనున్న కర్రల మీద
34 నున్ను కుమ్మరించండని చెప్పెను. । అది అయిన తరు
వాత రెండో మారు ఆలాగునే చేయండని చెప్పెను,
వారు రెండో మారున్ను చేసిరి; మూడో మారున్ను
చేయండని చెప్పెను, వారు మూడో మారున్ను చేసి
35 నందున; । ఆ నీళ్లు బలిపీఠము చుట్టూ పారెను; మరిన్ని
36 అతడు కందకమునున్ను నీళ్లచేత నింపెను. । అప్పుడు
అస్తమానాపర్ణణ చెల్లించే సమయమందు సంభవించిన
దేమంటే, దీర్ఘదర్శియైన ఏలీయా దగ్గిరకు వచ్చి
పలికినదేమంటే, అబ్రాహాముకున్ను ఇస్సాకుకున్ను
ఇశ్రాయేలుకున్ను దేవుడవైన వో యెహోవా, ఇశ్రా
యేలు యందు నీవే దేవుడవై వున్నావనిన్ని నేను
నీ సేవకుడనై వున్నాననిన్ని యీ కార్యములన్నీ నీ
సెలవుచేత చేసినాననిన్ని యీ దినమున తెలియ చేయు
37 ము. । వో యెహోవా, నా ప్రార్థన వినుము;
యీ జనులు యెహోవా అయిన నీవే దేవుడవై యు
న్నావనిన్ని నీవు వారియొక్క హృదయములను నీ
తట్టుకు తిరగ చేస్తివనిన్ని యెరిగేటట్టుగా నా ప్రార్థన
38 వినుమని పలికెను. । అప్పుడు యెహోవాయొక్క
అగ్నికింద పడి, హోమ బలినిన్ని కర్రలనున్ను రాళ్ల
నున్ను బుగ్గినిన్ని దహించి, కందకమందున్న నీళ్లను
39 ఆరిపోయేటట్టు చేసెను. । జనులందరున్ను దాని చూచి
నప్పుడు వారు సాగిల పడి, యెహోవా దేవుడై
యున్నాడు, యెహోవా దేవుడై వున్నాడని పలికిరి.।
40 అప్పుడు యేలీయా వారితో బయలుయొక్క దీర్ఘ
దర్శులను పట్టి వొకనినైనా తప్పిపోనివ్వకండని చెప్పి
నందున, వారు వారిని పట్టుకొనిరి. అప్పుడు ఏలీయా
వారిని కిద్రోను గెడ్డ దగ్గిరకు కొంచబోయి, అక్కడ
41 వారిని సంహరించెను. । అప్పుడు ఏలీయా అహాబును
చూచి, నీవు యెక్కి వెళ్లి, భోజనమునున్ను పానము
నున్ను పుచ్చుకొనుము, యేమంటే విస్తారమైన వర్షము
వచ్చేలాగు ధ్వని కలిగి వున్నదని చెప్పినందున, ।
42 అహాబు భోజనమునున్ను పానమునున్ను పుచ్చుకోవ
డానకు వెళ్లెను; అయితే ఏలీయా కర్మేలు పర్వతము
మీదికి యెక్కి వెళ్లి, నేల మీదపడి ముఖము మోకాళ్ల
43 మధ్యను వుంచుకొనెను. । అప్పుడు అతడు తన సేవ
కుని చూచి, నీవు పయికి వెళ్లి, సముద్రము తట్టు చూ
డుమనెను; వాడు యెక్కి పారచూచి, యేమిన్ని అగు
పడినది కాదని చెప్పెను; అప్పుడు అతడు యింకా
యేడు మారులు వెళ్లుమని చెప్పెను. । అయితే యేడో 44
మారు సంభవించినదేమంటే, అదుగో మనిషి చెయ్యి
లాగున వొక చిన్న మేఘము సముద్రమునుంచి పయికి
యెక్కుతూ వున్నదని వాడు చెప్పెను; అప్పుడు అతడు
నీవు అహాబు దగ్గిరకు వెళ్లి, వర్షము మిమ్మును నిలిపి
వేయకుండా మీ రథము సిద్ధపర్చి దిగండని చెప్పు
మని పంపెను. । అంతట్లో ఆకాశము మేఘముల చేత 45
నున్ను వాయువు చేతనున్ను అంధకారమైనందున
విస్తారముగా వర్షము కురిసెను; అయితే అహాబు
రథమును యెక్కి ఇజ్రెయేలుకు వెళ్లి పోయెను.। అయి 46
తే యెహోవాయొక్క హస్తము ఏలీయా మీద వు
న్నందున అతడు నడుము బిగించుకొని, అహాబుకంటే
ముందుగా పరుగెత్తి పోయి, ఇజ్రెయేలు ప్రవేశ స్థల
మునకు వచ్చెను.

## 19. అధ్యాయము.

అంతట అహాబు ఏలీయా చేసినదంతానున్ను మరి 1
న్ని అతడు కత్తిచేత దీర్ఘదర్శులనందరిని చంపించిన
సంగతినిన్ని యెజబెలుతో తెలియ చెప్పెను.। అప్పుడు 2
యెజబెలు ఏలీయాకు దూతను పంపి చెప్పుమనినదే
మంటే, రేపు యీ వేళప్పుడు నేను నీ జీవమును వా
రిలో వొకని జీవమునకైనట్టు చేయక పోతే దేవుండ్లు
అదిన్ని యింకా అధికమున్ను నాకు చేతురు గాకని
చెప్పుమనెను. । కాబట్టి అతడు యిది చూచి, లేచి, 3
తన ప్రాణము నిమిత్తము వెళ్లి, యూదా సంబంధమైన
బెయేర్షబకు వచ్చి, అక్కడ తన సేవకుని వుండ చేసె
ను. । అయితే అతడు వొక దినమున ప్రయాణము అర 4
ణ్యములోకి వెళ్లి వొక రోతెము చెట్టు కింద కూర్చుని,
తాను మరణము కావడానకు వేడుకొని అనినదేమం
టే, వో యెహోవా యింత మట్టుకు చాలును; నా
ప్రాణమును తీసుకొనుము; యేమంటే నా పితృలకంటే
నేను విశేషపువాడను కానని చెప్పెను. । అయితే 5
అతడు రోతెము చెట్టు కింద పడుకొని నిద్రపొందు
తూ వుండగా, యిదిగో వొక దూత అతని ముట్టి నీవు
లేచి భోజనము చేయుమని చెప్పెను. । అప్పుడు అత 6
డు చూచినంతలో యిదుగో అతని శిరస్సు దగ్గిర
నిప్పుల మీద కాల్చబడిన అప్పమున్ను నీళ్లతో బుడ్డిన్ని
వుండెను; కాబట్టి అతడు భోజనమునున్ను పానము
నున్ను పుచ్చుకొని తిరిగీ పడుకొనెను. । అయితే యె 7
హోవాయొక్క దూత రెండో మారు వచ్చి అతని
ముట్టి, ప్రయాణము నీకు మిక్కిలీ గొప్పదై వున్నది;
కాబట్టి లేచి భోజనము చేయుమని చెప్పెను. । అయి 8

నందున అతడు లేచి, భోజనమునున్ను పానమునున్ను
పుచ్చుకొని, ఆ భోజనపు బలముచేత దివా రాత్ర
ములు నలుబై దినముల మట్టుకు ప్రయాణము చేసి,
దేవుని పర్వతమని పిలువబడిన హోరేబుకు వచ్చి,।
9 అక్కడ వున్న వొక గుహ యొద్దికి చేరి అక్కడ దిగెను:
అయితే యిదుగో యెహోవాయొక్క వాక్యము అత
నికి వచ్చెను; అప్పుడు ఆయన వొ ఏలీయా, యిక్కడ
10 యేమి చేస్తున్నావని అతని అడిగినందున;। అతడు అని
నదేమంటే, సైన్యములయొక్క దేవుడయిన యెహో
వా నిమిత్తము నేను బహు భక్త్యావేశము గలవాడనై
తిని, యేమంటే ఇశ్రాయేలు పుత్రులు నీ వొడంబడి
కెను విడచిపెట్టి, నీ బలిపీఠములను పడదోసి, నీ దీర్ఘ
దర్శులను కత్తిచేత హతము చేసిరి; నేనొకడను మా
త్రమే శేషించి వున్నాను; మరిన్ని వారు నా ప్రాణ
మునున్ను తీసివేయడానకు వెతుకుతూ వున్నారని చె
11 ప్పినప్పుడు;। ఆయన అతనితో నీవు అవతలకు వెళ్లి,
పర్వతము మీద యెహోవాహ సముఖమందు నిలిచి
వుండుమనెను. అప్పుడు యిదుగో యెహోవా ఆ
వైపును గడచెను; అప్పుడు మహా బలముగల వాయువు
లేచి; యెహోవా ముందర పర్వతములను బద్దలుగా
నున్ను శిలలను ఛిన్నాభిన్నములుగానున్ను చేసెను,
అయితే యెహోవా ఆ వాయువు యందు వుండ
లేదు; ఆ వాయువు తరువాత భూకంపము కలిగెను,
అయితే యెహోవా ఆ భూకంపమందు వుండలేదు.।
12 మరిన్ని ఆ భూకంపమైన తరువాత అగ్ని కలిగెను,
అయితే యెహోవా ఆ యగ్నిలో వుండలేదు; అయి
తే ఆ యగ్ని యయిన తరువాత నిమ్మళమైన సన్నపు
13 శబ్దము కలిగెను.। అప్పుడు ఏలీయా అది విని, తన
దుప్పటితోటి ముఖము మూసుకొని బయిలు వెళ్లి గుహ
వాకిటియందు నిలిచెను. అప్పుడు యిదుగో వొ ఏలీ
యా, యిక్కడ యేమి చేస్తున్నావని వొక శబ్దము
14 అతనికి వినబడెను.। అప్పుడు అతడు అనినదేమంటే,
నేను సైన్యములయొక్క దేవుడైన యెహోవా కొరకు
బహు భక్త్యావేశము గలవాడనైతిని; యేమంటే ఇశ్రా
యేలు పుత్రులు నీ వొడంబడికెను విడచిపెట్టి, నీ బలి
పీఠములను పడదోసి, నీ దీర్ఘదర్శులను కత్తిచేత
హతము చేసిరి; నేనొకడను మాత్రమే శేషించి వున్నా
ను; మరిన్ని వారు నా ప్రాణమునున్ను తీసివేయడా
15 నకు వెతుకుతూ వున్నారని చెప్పెను.। అప్పుడు యె
హోవా అతనికి సెలవు యిచ్చినదేమంటే, నీవు తిరిగీ
అరణ్య మార్గముచేత దమస్కుకు వెళ్లి దానిలో ప్ర
వేశించగా అరాము దేశము మీద హజాయేలుకు
16 పట్టాభిషేకము చేతువుగాక.। మరిన్ని నింషీ కుమారు
డైన యెహూను ఇశ్రాయేలు మీద పట్టాభిషేకము
చేయ వలెను: మరిన్ని నీకు మారుగా దీర్ఘదర్శి
అయ్యేటట్టుగా ఆబేల్మెహోలా సంబంధుడయిన షా
పాతు కుమారుడైన ఎలీషాను అభిషేకము చేయవలె
ను.। అప్పుడు సంభవించేదేమంటే, హజాయేలుయొక్క 17
కత్తిని తప్పించుకొనేవాని యెహూ చంపివేసును; యె
హూ కత్తిని తప్పించుకొనేవాని ఎలీషా చంపును.।
అయినప్పటికిన్ని యింకా ఇశ్రాయేలీయులలో బయ 18
లుకు మోకాళ్లు వూనక నోళ్లచేత వాని ముద్దు పెట్టు
కొనక వుండేటటువంటి యేడువేల మంది నాకు శేషించి
వున్నారని ఆనతిచ్చెను.। అంతట అతడు అక్కడనుంచి 19
వెళ్లిన తరువాత షాఫాతు కుమారుడయిన ఎలీషాను
చూచెను; అతడు తన ముందర వున్న పండ్రెండు యెడ్ల
అరకలచేత దుక్కి దున్నిస్తూ పండ్రెండో దానితో
వుండెను; ఏలీయా అతని దగ్గిరకు వెళ్లి తన దుప్పటి
అతని మీద వేసినందున,। అతడు యెడ్లను విడచి, ఏలీ 20
యా వెనుకనుంచి పరుగెత్తి, అతనితో నేను వెళ్లి నా
తల్లి దండ్రులను ముద్దుబెట్టుకొని మళ్లీ వచ్చి నిన్ను వెం
బడింతునని అతని సెలవు అడిగెను; అప్పుడు అతడు
వెళ్లి రమ్ము, నేను నీకు యేమి చేసితిని అని చెప్పినం
దున;। అతడు అతని విడచి వెళ్లి కాడి యెడ్లను తీసి, 21
వేటవేసి, వాటి మాంసము యెడ్ల సరుకులచేత వంట
చేసి, జనులను వడ్డించి, వారు భోజనము చేసిన తరు
వాత లేచి, ఏలీయా వెంబడిని వెళ్లి అతని కనిపెట్టు
తూ వుండెను.

## 20. అధ్యాయము.

అంతట అరాము రాజైన బెన్హద్దు తన సైన్యమం 1
తటినీ కూర్చుకొనెను; అతని యొద్ద గుర్రములతో
నున్ను రథములతోనున్ను ముప్పయి యిద్దరు రాజులు
వుండిరి; అప్పుడు అతడు యెక్కిపోయి షోమ్రోను
ముట్టడి వేసి దాని మీద యుద్ధము చేసెను.। మరిన్ని 2
అతడు పట్టణమందున్న ఇశ్రాయేలు రాజైన అహాబు
యొద్దికి దూతలను పంపి చెప్పుమనినదేమంటే, బెన్హ
దు నీతో చెప్పినలాగు,। నీ వెండిన్ని నీ బంగారము 3
న్ను నావై వున్నవి; నీ భార్యలున్ను నీ పిల్లలున్ను సౌం
దర్యము గల వాండ్లున్ను నా వారై వున్నారని చెప్పం
డనెను.। అందుకు ఇశ్రాయేలుయొక్క రాజు యిచ్చిన 4
ప్రత్యుత్తరమేమంటే, నా యేలినవారైన వొ రాజా,
మీరు యిచ్చిన సెలవు ప్రకారము నేనున్ను నాకు కలి
గిన సమస్తమున్ను మీకు స్వాధీనము అయి వున్నాము
అని చెప్పండనిన తరువాత,। ఆ దూతలు తిరిగీ వచ్చి 5
అనినదేమంటే, బెన్హద్దు యీ ప్రకారముగా చెప్పు
తున్నాడు, నీవు నీ వెండినిన్ని నీ బంగారమునున్ను నీ
భార్యలనున్ను నీ పిల్లలనున్ను నాకు అప్పగించ వలెనని

నీకు వర్తమానము పంపినప్పటికిన్ని రేపు యీ వేళకు
6 నేను నీ యొద్దికి నా సేవకులను పంపుదును; । వారు నీ
యింటినిన్ని నీ సేవకుల యిండ్లనున్ను పరిశోధింతురు;
అప్పుడు నీ కంటికి యేది యింపుగా వున్నదో అది
వారు చేత పట్టుకొని తీసుకొ పోదురని చెప్పండని
7 పలికెననిరి. । అప్పుడు ఇశ్రాయేలుయొక్క రాజు దేశ
పు పెద్దలనందరినిన్ని పిలువనంపించి చెప్పినదేమంటే,
ఆ మనుష్యుడు మోసము యేలాగు చేయ కోరుతు
న్నాడో అది మీరు చూడండి; యేమంటే అతడు నా
భార్యల కొరకున్ను నా పిల్లల కొరకున్ను నా వెండి బం
గారముల కొరకున్ను నా యొద్దికి కబురు పంపినప్పటి
8 కిన్ని నేను యివ్వనన లేదని చెప్పినప్పుడు, । ఆ పెద్దలు
న్ను జనులందరున్ను మీరు అతని మాట వినవద్దు; దా
9 నికి వొప్ప వద్దని అతనితో చెప్పిరి. । కాబట్టి అతడు
బెన్హదదుయొక్క దూతలతో అనిన మాట, మీరు రా
జైన నా యేలినవారితో చెప్పవలసినదేమంటే, ప్రథ
మము మీరు మీ సేవకుడనైన నాకు పంపించి యిచ్చిన
సెలవంతా నేను చేస్తాను గాని యిది నేను చేయలేనని
చెప్పండనెను; అప్పుడు దూతలు వెళ్లి అతని యొద్దికి
10 వచ్చి ఆ ప్రత్యుత్తరము చెప్పిరి. । బెన్హదదు తిరిగీ అతని
యొద్దికి పంపి చెప్పుమనినదేమంటే, షోమ్రోనుయొక్క
ధూళి నన్ను వెంబడించి వచ్చేవారందరున్ను వొకొ్క
క్కడు పిడికెడేసి యెత్తుక పోవడానకు చాలినట్టయితే
దేవుండ్లు ఆలాగుననున్ను అంతకంటే అధికమునున్ను
11 నాకు చేతురుగాకని చెప్పుమనెను. । అప్పుడు ఇశ్రా
యేలుయొక్క రాజు యిచ్చిన ప్రత్యుత్తరము యేమం
టే, మీరు అతని చూచి, తన ఆయుధమును నడుమున
బిగించుకొంటూ వున్నవాడు దాని విప్పి తీసివేస్తూ
వున్న వాని లాగున అతిశయపడ కూడదని చెప్పండ
12 నెను. । బెన్హదదు తానున్ను ఆ రాజులున్ను డేరాల యం
దు తాగుతూ వుండగా యీ ప్రత్యుత్తరమును వినెను;
అప్పుడు సంభవించినదేమంటే, అతడు తన సేవకులను
చూచి యుద్ధమునకు సిద్ధపడండని ఆజ్ఞాపించినందున
13 వారు సన్నద్ధులై పట్టణము యెదుట నిలిచిరి. । అంతట
యిదుగో దీర్ఘదర్శియైన వొకడు ఇశ్రాయేలు రా
జయిన అహాబు యొద్దికి వచ్చి, అతనితో యెహోవా
యిచ్చిన సెలవు యేమంటే, యీ గొప్ప సమూహామం
తా నీవు చూస్తివే; యిదుగో నేను యెహోవానని
నీవు యెరిగేటట్టుగా నేటి దినమున దాని నీ చేతిలోకి
14 అప్పగింతునని ఆనతిచ్చెనని చెప్పినప్పుడు; । అహాబు
యెవరి చేతనని అడిగెను; అందుకు అతడు రాజ్యాధి
పతులలో వున్న పడుచువారిచేతనని యెహోవా
యిచ్చిన సెలవని చెప్పెను; అప్పుడు అతడు యెవడు
యుద్ధమును ఆరంభింపచేసును అని అడిగితే, అతడు

నీవే అని ప్రత్యుత్తరమును యిచ్చెను. । వెంబడినే అత 15
డు రాజ్యాధిపతులలో వున్న పడుచువారి లెక్క చూ
డగా, యిన్నూటముప్పై యిద్దరై వుండిరి; తరువాత
జనులను అనగా ఇశ్రాయేలీయులందరినీ లెక్కించిన
ప్పుడు వారు యేడువేల మంది అయి వుండిరి. । వీరు 16
మధ్యాహ్నకాలమైనప్పుడు బైలుదేరిరి: అయితే బెన్హద
దున్ను ఆ రాజులున్ను అనగా అతనికి సహాయము
చేసిన ముప్పై యిద్దరు రాజులున్ను డేరాలలో మత్తు
గా తూగుతూ వుండిరి. । అప్పుడు రాజ్యాధిపతులలో 17
వున్న ఆ పడుచువాండ్లు ముందుగా బయిలు వెళ్లిరి;
ఆ సమయమున బెన్హదదు బయిటికి పంపిన వాండ్లు
వచ్చి షోమ్రోనులోనుంచి కొందరు బయిలు వచ్చిరని
అతనికి చెప్పిరి. । అందుకు అతడు వారు సమాధానము 18
కోసము వచ్చినా, యుద్ధము కోసము వచ్చినా, జీవము
తోటి వారిని పట్టుకొని రండని ఆజ్ఞాపించెను. । అయి 19
తే రాజ్యాధిపతులలో వున్న ఆ పడుచువాండ్లున్ను వా
రిని వెంబడించిన సమూహామున్ను పట్టణములోనుంచి
బయిలు వెళ్లి, । ప్రతి మనిషీ తన్నుతన్ను యెదురించిన 20
వాని చంపినందున అరామీయులు పారిపోయిరి; ఇశ్రా
యేలీయులు వారిని తరిమిరి; అయితే అరాముయొక్క
రాజైన బెన్హదదు గుర్రమును యెక్కి రౌతులతో కూడా
తప్పించుకొని పోయెను. । అయితే ఇశ్రాయేలుయొక్క 21
రాజు బయిలు వచ్చి, గుర్రములనున్ను రథములనున్ను
కొట్టి, బహు హతముచేత అరామీయులను హతము
చేసెను. । అప్పుడు ఆ దీర్ఘదర్శి ఇశ్రాయేలుయొక్క 22
రాజు యొద్దికి వచ్చి అతనితో నీవు వెళ్లి నిన్ను బలప
చుర్చకొనుము; నీవు యేమి చేయవలసినదో అది కని
పెట్టి వుండుము; యేమంటే సంవత్సరము తిరిగిన సమ
యమున అరాముయొక్క రాజు నీ మీదికి తిరిగీ వచ్చు
నని చెప్పెను. । అయితే అరాము రాజుయొక్క సేవ 23
కులు అతని చూచి అనినదేమంటే, వారి దేవుండ్లు
కొండ దేవుండ్లయి వున్నారు; కాబట్టి వారు మనకం
టే శక్తిమంతులైరి; అయితే మనము మైదానమందు వా
రితో పోట్లాడితే నిశ్చయముగా వారికంటే శక్తిమం
తులమవుదుము. । యిందుకు మీరు చేయ వలసినదేమం 24
టే, ఆ రాజులలో వొకొ్కక్కని వాని వాని స్థలము
లోనుంచి తీసివేసి, వారి స్థలములకు ప్రధానులను నిర్ణ
యించి, । నీవు పోగొట్టుకొనిన బలము యెంతో అంత 25
బలమును గుర్రమునకు గుర్రమున్ను రథమునకు రథము
న్ను లెక్కించి పోగుచేయుము; అప్పుడు మనము మై
దానమందు వారితో పోట్లాడుదాము; అవశ్యముగా
మనము వారికంటే శక్తిమంతులమాదుమని చెప్పిరి. అత
డు వారు చెప్పిన బోధ విని ఆ ప్రకారము చేసెను. ।
కాబట్టి సంవత్సరము తిరిగిన సమయమున బెన్హదదు 26

అరామీయులను కూర్చుకొని లెక్క చూచి యెక్కి
పోయి, ఇశ్రాయేలీయులతో పోట్లాడడానకు ఆఫే
27 కుకు వచ్చెను. । అప్పుడు ఇశ్రాయేలు పుత్రులందరున్ను
లెక్క చేయపడి సిద్ధమై వారి మీదికి బయిలు వెళ్లిరి;
ఇశ్రాయేలు పుత్రులు మేక పిల్లల రెండు మందలైనట్టు
వారి యెదుట దిగి వుండిరి; అయితే దేశము అరామీ
28 యులచేత కప్పబడి వుండెను. । అప్పుడు దైవ జనుడైన
వొకడు వచ్చి ఇశ్రాయేలు రాజుతో యిట్లనెను, యె
హోవా యిచ్చిన సెలవు యేమంటే, అరామీయులు
యెహోవా కొండలయొక్క దేవుడై వున్నాడు గాని
లోపలయొక్క దేవుడు కాడని పలికిరి గనుక నేను
యెహోవాను అయి యున్నాను అని మీరు యెరిగే
టట్టుగా యీ గొప్ప సమూహమంతటినీ నీ చేతిలోకి
29 అప్పగింతునని ఆనతిచ్చెనని చెప్పెను. । అయితే వారు
వొకరికి వొకరు అభిముఖముగా యేడు దినములు డేరా
లు వేసుకొని వుండిరి; యేడో దినమందు యుద్ధమునకు
కలియ పడినవారైనందున ఇశ్రాయేలు పుత్రులు వొక్క
నాటి యందే అరామీయుల కాల్బలములో లక్షమం
30 దిని హతము చేసిరి. । తక్కినవారు ఆఫేకు పట్టణము
లోకి పారిపోయిరి; అక్కడ వున్న వొక ప్రాకారము
శేషించిన వారిలో యిరువయి యేడువేల మంది మీద
పడెను. అయితే బెన్హదదు పారిపోయి ఆ పట్టణమందు
31 ప్రవేశించి అంతఃపురములోకి చొచ్చెను. । అప్పుడు
అతని సేవకులు అతనితో యిదుగో ఇశ్రాయేలు యిం
టికాండ్లయిన రాజులు దయాపరులై వున్నారని మేము
వింటిమి; కాబట్టి మీకు అనుకూలమైతే మేము గోనె
లను నడుముకు కట్టుకొని, శిరస్సుల మీద తాళ్లను
వేసుకొని, ఇశ్రాయేలు రాజు యొద్దికి బైలు వెళ్లుదు
ము; అతడు మీ ప్రాణమును రక్షించునేమో అని చె
32 ప్పిరి. । కాబట్టి వారు తమ నడుములకు గోనెలను కట్టు
కొని, శిరస్సుల మీద తాళ్లను వేసుకొని, ఇశ్రాయేలు
రాజు యొద్దికి వచ్చి, మీ సేవకుడైన బెన్హదదు మీరు
దయచేసి నన్ను బ్రతుకనివ్వండని చెప్పుమన్నాడని చె
ప్పిరి: అప్పుడు అతడు అనినదేమంటే, అతడు యిప్ప
టికి జీవస్థుడై వున్నాడా? అతడు నా సహోదరుడని
33 పలికెను. । అయితే ఆ మనుష్యులు జాగ్రతపడి అతని
మనస్సు యేలాగు వున్నదో అది భద్రముగా గురుతె
రిగి, ఆ మాట పట్టుకొని, బెన్హదదు మీ సహోదరుడై
వున్నాడని చెప్పిరి; అప్పుడు అతడు వారితో మీరు
వెళ్లి అతని తీసుక రండని చెప్పినందున బెన్హదదు అతని
యొద్దికి బయిలు వచ్చెను; అప్పుడు అతడు తన రథము
34 మీద అతని యెక్కించు కొనెను. । అంతట బెన్హదదు
అతనితో నీ తండ్రి యొద్ద నా తండ్రి పుచ్చుకొనిన
పట్టణములను నేను తిరిగీ యిత్తును; మరిన్ని నా తండ్రి
షోమ్రోనులో వీధులను చేయించుకొన్నట్టు దమస్కు
లో నీ కొరకు నీవు వీధులను చేయించుకో వచ్చునని
చెప్పగా, అహాబు యీ వొడంబడికతో నిన్ను పంపి
వేస్తానని చెప్పి, అతనిచేత వొడంబడికెను పుచ్చుకొని
అతని పోనిచ్చెను. । అంతట దీర్ఘదర్శుల పుత్రుల 35
లో వొకడు యెహోవాయొక్క వాక్యముచేత తన
పొరుగింటి వానితో నన్ను కొట్టుమని చెప్పెను;
అయితే అతడు అతని కొట్టుటకు వొప్పినాడు కాడు. ।
కాబట్టి అతడు అతనితో నీవు యెహోవాయొక్క 36
శబ్దమునకు లోపడక పోతివి గనుక యిదుగో నీవు
నన్ను విడచిపోయినప్పుడే సింహము నిన్ను చంపునని
చెప్పెను; అతడు అతని యొద్దనుంచి తర్లి పోగానే
వొక సింహము అతనికి తాగసిల్లి అతని చంపెను. । తరు 37
వాత మరి వొకడు అతనికి కనుపడెను; అప్పుడు అత
డు నన్ను కొట్టుమని అతనితో చెప్పినప్పుడు అతడు
అతని కొట్టి గాయములను పొందించెను. । అప్పుడు ఆ 38
దీర్ఘదర్శి వెళ్లి, మార్గమందు రాజు రావడమును
కనిపెట్టి వుండెను; మరిన్ని అతడు తన ముఖము మీద
బుగ్గి పోసుకొని మారు వేషముగా వుండెను. । అంతట 39
రాజు గడచి పోతూ వుండగా, యితడు రాజుకు కేక
వేసి చెప్పినదేమంటే, మీ సేవకుడనైన నేను యుద్ధరం
గమునకు వెళ్లినాను; అప్పుడు యిదుగో వొకడు యిటు
తిరిగి వొక మనుష్యుని నా యొద్దికి తీసుకొని వచ్చి వీని
భద్రముగా వుంచుము; యే విధముగానైనా వాడు
లేకపోతే నీ ప్రాణము వాని ప్రాణమునకు మారుగా
యివ్వబడ వలెను, లేదా నీవు వొక తలాంతు వెండిని
యివ్వవలెనని చెప్పెను. । అయితే మీ సేవకుడనైన నేను 40
అక్కడక్కడ పని మీద వుండగా వాడు అగుపడక
పోయెనని చెప్పెను. అప్పుడు ఇశ్రాయేలు రాజు
అతనితో ఆలాగే నీకు న్యాయ విధింపు అవును; నీ
కొరకు నీవే తీర్చుకొంటివని చెప్పెను. । అప్పుడు అత 41
డు త్వరపడి, తన ముఖము మీద బుగ్గి తుడచి వేసు
కొన్నందున రాజు అతడు దీర్ఘదర్శులలో వొకడని
పోల్చెను. । అప్పుడు అతడు రాజుతో అనిన మాట, యె 42
హోవా యిచ్చిన సెలవు యేమంటే, నేను లయము
నకు నిర్ణయించిన మనిషిని నీవు నీచేతిలోనుంచి తప్పి
స్తివి గనుక నీ ప్రాణము వాని ప్రాణమునకున్ను నీ
జనులు వాని జనులకున్ను మారౌదురని ఆనతిచ్చెనని
చెప్పెను. । అందుకు ఇశ్రాయేలు రాజు దుఃఖముతో 43
నున్ను కోపముతోనున్ను తన యింటికి వెళ్లి షోమ్రో
నుకు వచ్చెను.

## 21. అధ్యాయము.

ఈ సంగతులైన తరువాత సంభవించినదేమంటే, 1
ఇజ్రెయేలు వాడయిన నాబోతుకు వొక ద్రాక్షతోట

కలిగి వుండెను; ఇశ్రాయేలులో యిది షోమ్రోను రాజ
2 యిన అహాబు నగరు దగ్గిర వుండెను. । అహాబు నాబో
తును చూచి, నీ ద్రాక్షతోట నా యింటి దగ్గిర
వున్నది గనుక అది నాకు కూరతోట నిమిత్తము యివ్వ
వలసినది; దానికి బదులుగా దానికంటె మంచి ద్రాక్ష
తోట నీకు యిస్తాను; లేదా నీకు అనుకూలమైతే దాని
3 విలువ నీకు యిస్తానని చెప్పెను. । అందుకు నాబోతు
అహాబుతో చెప్పినదేమంటే, నా పితృల స్వాస్థ్యమును
నేను నీకు యిచ్చుట నాకు దూరమవును గాకని చెప్పె
4 ను. । అయితే అహాబు ఇశ్రయేలీయుడైన నాబోతు
తనతో ఆలాగున చెప్పినందున మనశ్చింతతోనున్ను
కోపముతోనున్ను తన యింటికి వచ్చెను; యేమంటే
అతడు నా పితృల స్వాస్థ్యమును నీకు యివ్వనని చెప్పి
యుండెను; కాబట్టి అతడు తన మంచము మీద పడు
కొని ముఖము తిప్పుకొని భోజనమును చేయ మనస్సు
5 లేక వుండెను. । అయినందున అతని భార్య అయిన యె
జబెలు వచ్చి, నీవు మనస్సులో విచారపడి భోజనము
6 చేయక వుండెదవేమని అతని అడిగినప్పుడు, । అతడు
దానితో నేను నీకు ద్రవ్యము యిస్తాను, నీ ద్రాక్ష
తోట నాకు యివ్వవలసినది, లేక నీకు అనుకూలమ
యితే దానికి ప్రతిగా మరి వొక ద్రాక్షతోటను యి
స్తానని ఇశ్రయేలీయుడైన నాబోతుతో మాట్లాడి
చెప్పినప్పటికిన్ని అతడు నా ద్రాక్షతోట నీకు యివ్వ
7 ననెనని చెప్పినప్పుడు; । అతని భార్య అయిన యెజబెలు
అతని చూచి, ఇశ్రాయేలులో నీవు యిప్పుడు రాజరి
కము చేస్తూ వున్నావా? లేచి భోజనము చేసి మనస్సుకు
సుఖము తెచ్చుకో; నేనే ఇశ్రయేలీయుడైన నాబోతు
8 ద్రాక్షతోటను నీకు యిప్పింతునని చెప్పెను. । అప్పు
డు అది అహాబు నామమున వుత్తరములు వ్రాయించి,
అతని ముద్రతోటి ముద్రించి, ఆ వుత్తరములను పట్ట
ణమందు నాబోతుతో కూడా నివాసము చేస్తున్న పె
9 ద్దలకున్ను సామంతులకున్ను పంపెను. । ఆ వుత్తరము
లలో వ్రాయించినదేమంటే, మీరు వుపవాసమును
చాటించి, జనులలో నాబోతును శ్రేష్ఠమయిన స్థల
10 మందు కూర్చుండబెట్టి, । నీవు దేవునినిన్ని రాజునున్ను
దూషించితివని అతని మీద సాక్ష్యము పలికేటట్టుగా
దుర్మార్గులైనటువంటి యిద్దరు మనుష్యులను అతని
యెదుట నిలుపండి; అప్పుడు అతని బైటికి తీసుకొ
పోయి, అతడు మరణమయ్యేటట్టుగా రాళ్లచేత కొట్టం
11 డని వ్రాయించి పంపెను. । అయితే ఆ పట్టణపు వాం
డ్లు, అనగా, అతని పట్టణపు కాపురస్థులైన పెద్దలున్ను
సామంతులున్ను తమకు యెజబెలు పంపిన వుత్తరము
12 లందున్న లిఖితప్రకారము చేసిరి. । యేమంటే వారు
వుపవాసమును చాటించి, జనులలో నాబోతును
శ్రేష్ఠమైన స్థలమందు కూర్చుండ బెట్టిరి. । అప్పుడు 13
దుర్మార్గులైనటువంటి యిద్దరు మనుష్యులు సంఘ
ములో ప్రవేశించి, అతని యెదుట కూర్చుని వుండిరి;
అప్పుడు యీ దుర్మార్గులు జనుల ముందర నాబో
తుకు విరోధమైన సాక్ష్యముగా నాబోతు దేవునినిన్ని
రాజునున్ను దూషించెనని పలికినందు, వారు అతని
పట్టణపు బైటికి తీసుకొ పోయి అతడు మరణమయ్యే
మట్టుకు రాళ్లచేత అతని కొట్టిరి. । అప్పుడు వారు యె 14
జబెలుకు వర్తమానము నాబోతు రాళ్ల వేతచేతను
మరణమయినాడని చెప్పి పంపిరి. । నాబోతు రాళ్ల వేత 15
చేతను మరణమయినాడని యెజబెలు విన్నప్పుడు సంభ
వించినదేమంటే, యీ యెజబెలు అహాబును చూచి,
నీవు లేచి ఇశ్రయేలీయుడయిన నాబోతు ద్రవ్యము
నకు నీకు యివ్వ వొప్పుకొనని అతని ద్రాక్షతోటను
నీవు పుచ్చుకో, యేమంటే నాబోతు జీవస్తుడు కాడు
మరణమాయెనని చెప్పెను. । నాబోతు మరణమైనాడని 16
అహాబు విన్నప్పుడు సంభవించినదేమంటే, అహాబు
లేచి ఇశ్రయేలీయుడైన నాబోతుయొక్క ద్రాక్షతో
టను తన స్వాధీనము చేసుకోవడానకు దిగి వెళ్లెను. ।
అంతట యెహూవాయొక్క వాక్యము తిష్బీయుడ 17
యిన యేలీయాకు వచ్చినదేమంటే, । నీవు లేచి షోమ్రో 18
నులో వున్న ఇశ్రాయేలు రాజయిన అహాబును యెదు
ర్కోవడానకు దిగి వెళ్లు; అదుగో నాబోతుయొక్క
ద్రాక్షతోటలో వున్నాడు; దాని తాను స్వాధీనము
చేసుకోవడానకు దిగిపోయినాడు. । నీవు అతని చూచి 19
చెప్పవలసినదేమంటే, చంపివేసి స్వాధీనము చేసుకొం
టివా? అని యెహూవా సెలవు యిచ్చెనని చెప్పి;
మరిన్ని నీవు అతనితో చెప్పవలసినదేమంటే, యే స్థల
మందు శునకములు నాబోతు రక్తమును నాకెనో ఆ
స్థలమందే శునకములు నీ రక్తమును నిజముగా నీ రక్త
మును నాకునని యెహూవా సెలవు యిచ్చెనని చెప్పు
మనెను. । అయితే అహాబు యేలీయాను చూచినప్పుడు, 20
వొ నా శత్రువుడా, నీవు నన్ను కనుగొంటివా? అని
అనినప్పుడు, అతడు అతనితో అవును నేను నిన్ను
కనుగొంటిని, యేమంటే యెహూవా దృష్టి యెదుట
కీడు చేయడానకు నిన్ను నీవే అమ్ముకొంటివి. । యిదు 21
గో నీ మీదికి నేను కీడును రప్పింతును; నీ వెనుకటి
వాండ్లను నేను తీసివేతును; గోడ మీద తన మూత్ర
మును విడచేవానినిన్ని ఇశ్రాయేలులో బంధించబడి
నవానినిన్ని విడిపించబడినవానినిన్ని అహాబుయొద్ద
నుంచి తెగవేతును. । నీవు నాకు పుట్టించిన కోపము 22
నిమిత్తమున్ను ఇశ్రాయేలు చేత చేయించిన పాపము
నిమిత్తమున్ను నీ యిల్లు నెబాతు కుమారుడయిన యా
రొబాముయొక్క యింటిలాగునన్ను అహీయా

కుమారుడయిన బయెషాయొక్క యింటిలాగుననున్ను
23 చేతునని యెహోవా ఆనతిచ్చెను. । మరిన్ని యెజబె
లును గురించి యెహోవాయొక్క సెలవు యేమంటే,
ఇజ్రెయేలు ప్రాకారము యొద్ద శునకములు యెజబె
24 లును తినివేసుననిన్ని; । పట్టణమందు అహాబు సంబం
ధికులలో యెవడు మరణమౌనో శునకములు వాని
తినుననిన్ని; బయిట భూములలో యెవడు మరణమౌ
నో ఆకాశ పక్షులు వాని తినుననిన్ని సెలవు యిచ్చె
25 నని చెప్పెను. । అతని భార్య అయిన యెజబెలు చేసిన
ప్రేరేపణ చేత యెహోవా దృష్టికి కీడు చేయడా
నకు తన్ను తాను అమ్ముకొన్నటువంటి అహాబుతో సమ
26 మైనవాడు యెవ్వడూ అగుపడలేదు. । మరిన్ని అతడు
ఇశ్రాయేలు పుత్రుల ముందరినుంచి యెహోవా అవ
తలికి తోలివేసిన ఎమోరీయులు చేసిన అన్నిటి ప్రకా
రముగా బొమ్మలను వెంటాడి బహు యేహ్యముగా
27 ప్రవర్తించెను. । అయితే అహాబు ఆ మాటలు విన్న
ప్పుడు సంభవించినదేమంటే, అతడు తన వస్త్రములను
చించుకొని, తన శరీరమున గోనెలు కట్టుకొని, వుపవా
సము చేసి, గోనెయందు పడుకొని నిమ్మళముగా వెళ్లె
28 ను. । అప్పుడు యెహోవాయొక్క వాక్యము తిష్బీ
29 యుడైన ఏలీయాకు వచ్చినదేమంటే, । నా సముఖమందు
అహాబు తన్ను తాను దీనునిగా చేసుకొన్నలాగు చూ
స్తివా? తన్ను తాను నా సముఖమందు దీనునిగా చేసు
కొన్నందున ఆ కీడు అతని దినములందు కాదు గాని
అతని కుమారునియొక్క దినములందు అతని యింటి
మీదికి రప్పింతునని సెలవు యిచ్చెను.

## 22. అధ్యాయము.

1 అయితే మూడు సంవత్సరములు అరాముకున్ను
2 ఇశ్రాయేలుకున్ను యుద్ధము లేక వుండెను. । మూడో
సంవత్సరమందు సంభవించినదేమంటే, యూదా రాజ
యిన యెహోషాఫాథు దిగి, ఇశ్రాయేలు రాజు యొ
3 ద్దికి వచ్చెను. । ఇశ్రాయేలు రాజు తన సేవకులను చూచి,
రామోత్గిలాదు మన సంబంధమైనదని మీరు యెరుగు
దురు; అయితే మనము అరాము రాజు చేతిలోనుంచి
దాని పుచ్చుకోకుండా వూరకొని వున్నామని చెప్పి; ।
4 యెహోషాఫాథును చూచి, యుద్ధము చేసుటకు
నాతో కూడా రామోత్గిలాదుకు వస్తావా అని అడిగి
నప్పుడు, యెహోషాఫాథు ఇశ్రాయేలు రాజుతో
అనినదేమంటే, నేను నీ వలెనే వున్నాను; నా జనులు
నీ జనుల వలెనే వున్నారు; నా గుర్రములు నీ గుర్ర
5 ముల వలెనే వున్నవని చెప్పెను. । అప్పుడు యెహో
షాఫాథు ఇశ్రాయేలు రాజుతో అనిన మాట, నేటి
దినమున యెహోవాయొక్క వాక్యము యొద్ద విచా
రించ వలెనని చెప్పినప్పుడు; । ఇశ్రాయేలు రాజు యె 6
క్కువ తక్కువ నన్నూరు మంది దీర్ఘదర్శులను పిలు
వనంపించి, వారిని చూచి, యుద్ధము చేసుటకు రామో
త్గిలాదు మీదికి వెళ్లుదునా, మానుదునా? అని అడిగి
నప్పుడు, వారు యెక్కిపో, యేమంటే, యెహోవా
దానిని రాజయిన మీ చేతిలోకి అప్పగించునని చెప్పిరి. ।
అయితే యెహోషాఫాథు తిరిగీ అనిన మాట, విచా 7
రణ చేయడానకు వీరు గాక యెహోవాయొక్క
దీర్ఘదర్శి యింకొకడు యిక్కడ వున్నాడా అని
అడిగినందున, । ఇశ్రాయేలు రాజు యెహోషాఫాథు 8
తో చెప్పినదేమంటే, ఇమ్లా కుమారుడయిన మిఖాయ్యా
అనే వొకడు కలడు; అతని ద్వారా మనము యెహో
వా యొద్ద ఆలోచన అడుగ వచ్చును గాని నేను అతని
యందు సహించక వున్నాను, యెందుకంటే అతడు
నన్ను గురించి మేలును పలుకక కీడును మాత్రము
దీర్ఘదర్శనముగా పలుకునని చెప్పినప్పుడు యె
హోషాఫాథు రాజయిన మీరు ఆలాగున పలుక
వద్దుండని చెప్పెను. । అప్పుడు ఇశ్రాయేలు రాజు పరి 9
చారికుడయిన వొకని పిలిచి, శీఘ్రముగా ఇమ్లా కుమా
రుడైన మిఖాయ్యాను యిక్కడికి రప్పించుమని సెలవు
యిచ్చెను. । అయితే ఇశ్రాయేలు రాజున్ను యెహో 10
షాఫాథనే యూదా రాజున్ను షోమ్రోనుయొక్క
ప్రవేశపు గవిని దగ్గిర విశాలమయిన వొక స్థలమందు
రాజ వస్త్రములను ధరించుకొని, తమ తమ గద్దెల మీద
ఆసీనులై వుండిరి; దీర్ఘదర్శులందరున్ను వారి ముం
దర దీర్ఘదర్శనముగా పలుకుతూ వుండిరి. । అంతట 11
కెనయనా కుమారుడయిన సిద్కియా యినుప కొమ్ములు
చేసుకొని చెప్పినదేమంటే, వీటిచేత అరామీయులను
నీవు నాశనము చేసే పర్యంతమూ వారిని పొడుతువని
యెహోవా ఆనతిచ్చెనని చెప్పెను. । ఆ చొప్పున 12
దీర్ఘదర్శులందరున్ను దీర్ఘదర్శనముగా పలికి
చెప్పినదేమంటే, నీవు రామోత్గిలాదు మీదికి వెళ్లి
జయింతువు గాక, యేమంటే యెహోవా రాజయిన
నీ చేతిలోకి దాని అప్పగించునని చెప్పిరి. । అయితే 13
మిఖాయ్యాను పిలువడానకు వెళ్లిన పరిచారికుడు అత
నితో మాట్లాడినదేమంటే, యిదుగో దీర్ఘదర్శులు
యేక ముఖముగా రాజుతో మంచి మాటలు పలుకు
తూ వున్నారు; కాబట్టి నీ వాక్యము వారిలో వొకని
వాక్యము వలెనే కానిచ్చి అనుకూలముగా పలుకుమని
చెప్పినప్పుడు; । మిఖాయ్యా అనిన మాట, యెహో 14
వా జీవముతోడు నాకు యెహోవా యేమి చెప్పు
నో అదే నేను పలుకుతానని చెప్పెను. । యీలాగున 15
అతడు రాజుయొద్దికి వచ్చెను; అప్పుడు రాజు వొ
మిఖాయ్యా, మేము యుద్ధము చేసుటకు రామోత్గిలాదు

మీదికి వెళ్లుదుమా మానుదుమా? అని అడిగినప్పుడు,
అతడు అతనితో వెళ్లు జయించుము, యేమంటే యె
హోవా రాజయిన మీ చేతిలోకి దానిని అప్పగించు
16 నని చెప్పెనందున; । రాజు అతనితో నిజమయిన మా
టలు మాత్రమే యెహోవా నామమందు పలుకు
దువు గాకని యెన్ని మారులు నీ యొద్ద ప్రమాణము
17 పుచ్చుకొనుదునని పలికినప్పుడు, । అతడు పలికినదే
మంటే, ఇశ్రాయేలీయులందరున్ను కాపరి లేని గొర్ర
లవలెనే కొండల మీద అక్కడక్కడ చెదిరి వుండు
టను చూస్తిని; వీరికి యజమానుడు లేడు, కాబట్టి వా
రిలో ప్రతి మనిషినీ తన తన యింటికి నెమ్మదిగా వెళ్ల
18 నిమ్మని యెహోవా ఆనతిచ్చెనని చెప్పెను. । అప్పుడు
ఇశ్రాయేలు రాజు యెహోషాపాథును చూచి, ఇత
డు నన్ను గురించి మేలును పలుకక కీడును మాత్రము
దీర్ఘదర్శనముగా పలుకునని నేను నీతో చెప్పలే
19 దా అని అనెను. । అప్పుడు అతడు యింకా చెప్పిన
దేమంటే, యెహోవాయొక్క వాక్యము నీవు విందువు
గాక; నేను యెహోవా తన గద్దెమీద ఆసీనుడై
వుండుటనున్ను, పరలోక సమూహములు ఆయన కుడి
పార్శ్వమునను్ను యెడమపార్శ్వమునను్ను నిలిచి
20 వుండుటనున్ను చూస్తిని. । అప్పుడు యెహోవా అహా
బు రామోత్గిలాదు మీదికి వెళ్లి అక్కడ పడేటట్టుగా
యెవడు అతని ప్రేరేపించునని పలికినప్పుడు, వొకడు,
యీ విధముగానున్ను మరి వొకడు ఆ విధముగాను
21 న్ను అనిరి. । అప్పుడు వొక ఆత్మ బయలు వెళ్లి, యెహో
వా సముఖమందు నిలిచి, నేను అతని ప్రేరేపింతునని
22 చెప్పెను. । అప్పుడు యెహోవా యేలాగునని అతని
అడిగితే, అతడు నేను అవతలకు వెళ్లి, అతని దీర్ఘ
దర్శులయొక్క నోట అబద్ధమాడే, ఆత్మను అయి
వుందునని చెప్పెను. అప్పుడు ఆయన నీవు అతని
ప్రేరేపించి జయింతువు; నీవు వెళ్లి ఆలాగున చేయు
23 మని అతనికి సెలవు యిచ్చెను. । కాబట్టి యిదుగో
యెహోవా యీ నీ దీర్ఘదర్శులయొక్క నోట
అబద్ధమాడే ఆత్మను వుంచి వున్నాడు; మరిన్ని యె
హోవా నిన్ను గురించి కీడును పలికెనని చెప్పినప్పు
24 డు; । కెనయనా కుమారుడైన సిద్కీయా చేరి, మిఖా
య్యాను చెంప మీద కొట్టి చెప్పినదేమంటే, నీతోటి
మాట్లాడడానకు యెహోవాయొక్క ఆత్మ నా యొద్ద
25 నుంచి యేలాగున వెళ్లెనని పలికినందున; । మిఖాయ్యా
చెప్పినదేమంటే, యిదుగో నీవు దాగి యుండేటందుకు
వొక అంతఃపురములోకి వెళ్లే దినమందు నీకు తెలు
26 సునని చెప్పెను. । అప్పుడు ఇశ్రాయేలు రాజు మిఖా
య్యాను పట్టి తిరిగీ తీసుకుపోయి, పట్టణపు అధికారి
యైన ఆమోనుకున్ను రాజు కుమారుడైన యోవాషు
కున్ను అప్పగించి, । యితని బందీగృహములో వుంచి, 27
మేము క్షేమముగా తిరిగీ వచ్చే పర్యంతమూ క్లేశపు
రొట్టెతోనున్ను క్లేశపు నీళ్లతోనున్ను ఇతని పోషిం
చుమని రాజు సెలవు అయినదని వారితో చెప్పుమ
నెను. । అప్పుడు మిఖాయ్యా అనిన మాట, నీవు యే 28
మాత్రమైనా క్షేమముగా తిరిగీ వచ్చిన పక్షమందు
యెహోవా నాతో సెలవు యివ్వనే లేదని వొూ
సకల జనులారా విని తెలుసుకొండని చెప్పెను. ।
అయితే ఇశ్రాయేలు రాజున్ను యెహోషాపాథు 29
అనే యూదా రాజున్ను రామోత్గిలాదు మీదికి వెళ్లిరి. ।
ఇశ్రాయేలు రాజు యెహోషాపాథుతో చెప్పిన 30
దేమంటే, నేను మారు వేషము వేసుకొని యుద్ధము
లోకి ప్రవేశింతును; నీవు నీ వస్త్రములను ధరించుకొ
మ్మని చెప్పెను. కాబట్టి ఇశ్రాయేలు రాజు మారు
వేషము ధరించుకొని యుద్ధమందు ప్రవేశించెను. ।
అయితే అరాము రాజు తన రథముల మీద అధికారు 31
లైన ముప్పై యిద్దరు అధిపతులకు ఆజ్ఞాపించినదేమంటే,
పిన్నలతోనైనా పెద్దలతోనైనా వద్దు, ఇశ్రాయేలు
రాజుతో మాత్రమే పోట్లాడండని చెప్పి వుండెను. ।
కాబట్టి రథాధిపతులు యెహోషాపాథును చూచి, 32
యితడు ఇశ్రాయేలు రాజు సుమా, అని అనుకొని,
అతనితో పోట్లాడడానకు తిరిగీ వచ్చినందున యెహో
షాపాథు కేక వేసెను. । అప్పుడు రథాధిపతులు ఇతడు 33
ఇశ్రాయేలు రాజు కాడని చూచి, అతని తరుముట
మానివేసిరి. । అయితే వొకడు తన విల్లు తీసి, గురి 34
చూడకనే విడచి, అతని కవచపు కీలు మధ్యను ఇశ్రా
యేలు రాజును కొట్టెను; అప్పుడు అతడు తన సారథి
తో నీవు మళ్లి సమూహములోనుంచి నన్ను అవతలకు
తీసుకపో, యేమంటే నేను గాయము పొందినానని
చెప్పెను. । అయితే నాటి యుద్ధము బహు ప్రబలమా 35
యెను; రాజు అరామీయుల యెదుట తన రథములో
వుండిపోయి, అస్తమానమందు మరణమాయెను; అతని
రక్తము గాయములోనుంచి రథము మధ్యను కారినది. ।
అయినందున సూర్యాస్తమయ సమయమందు సమూ 36
హమందంతటా ప్రచురమైనదేమంటే, ప్రతి మనిషీ
తనతన పట్టణమునకున్ను ప్రతి మనిషీ తన తన దేశ
మునకున్ను వెళ్లిపోవును గాకని ఆయెను. । యీలాగున 37
రాజు మరణమై షోమ్రోనుకు కొంచపోపడెను; వారు
రాజును షోమ్రోనులో పాతిపెట్టిరి. । అయితే వొకడు 38
ఆ రథమును షోమ్రోను కొలనులో కడిగినప్పుడు,
యెహోవా ఆనతిచ్చిన వాక్యప్రకారము శునక
ములు వచ్చి అతని రక్తమును నాకెను; అతని ఆయు
ధములున్ను వారు కడిగిరి. । అహాబుయొక్క తతిమ్మా 39
కార్యములున్ను అతడు చేసినదంతానున్ను అతడు

కట్టించిన దంతపు యిల్లున్ను అతడు కట్టించిన పట్టణ
ములున్ను ఇశ్రాయేలు రాజులయొక్క వృత్తాంతముల
40 గ్రంథమందు వ్రాయబడి యున్నవి గదా! । యీలా
గున అహాబు తన పితృలతో కూడా నిద్రపొందెను;
అతని కుమారుడైన అహజ్యా అతనికి మారుగా యే
41 లెను. । అయితే ఆసా కుమారుడైన యెహోషాఫాథు
ఇశ్రాయేలు రాజైన అహాబు యేలుబడియొక్క నాలు
గో సంవత్సరమందు యూదాను యేలనారంభించెను.।
42 యెహోషాఫాథు యేలనారంభించినప్పుడు ముప్పై
అయిదు సంవత్సరములవాడై, యెరూశలేములో యి
రువై అయిదు సంవత్సరములు యేలెను; అతని తల్లి
పేరు అజూబా; ఆమె షిల్హీ కుమార్తె అయి వుం
43 డెను. । ఇతడు తన తండ్రియైన ఆసాయొక్క మార్గ
ములన్నిటి యందూ తిరిగి పోకుండా నడిచి, యెహో
వా దృష్టికి యేది మంచిదో అది చేస్తూ వుండెను; అయి
నప్పటికిన్ని వున్నతమైన స్థలములు తీసివేయబడలేదు,
యేమంటే ఆ వున్నతమైన స్థలములందు జనులు యింకా
అర్పణలు చెల్లిస్తూ ధూపమును వేస్తూ వుండిరి. ।
44 మరిన్ని యెహోషాఫాథు ఇశ్రాయేలు రాజుతో సమా
45 ధానమును చేసుకొనెను. । అయితే యెహోషాఫాథు
యొక్క తతిమ్మా కార్యములున్ను అతడు అగుపర్చిన
బలమున్ను అతడు యుద్ధము చేసిన విధమున్ను యూదా
రాజులయొక్క వృత్తాంతముల గ్రంథమందు వ్రాయ
46 బడి యున్నవి గదా! । అయితే అతని తండ్రియైన
ఆసాయొక్క దినములందు శేషించి వుండిన పురుష
సంఘముపు కాండ్లను అతడు దేశములోనుంచి తీసి
వేసెను. । ఆ కాలమందు ఎదోము దేశమందు రాజు 47
లేడు గాని ప్రధాని అయిన వొకడు రాజరికము
చేస్తూ వుండెను. । మరిన్ని యెహోషాఫాథు బంగా 48
రము కొరకు ఓఫీరు దేశమునకు వెళ్లడానకు తర్షీషు
వోడలను; కట్టించెను; అయితే ఆ వోడలు ఎస్యోన్
గెబెరు యొద్ద బద్దలై పోయినందున అవి వెళ్లడము
లేదు. । అప్పుడు అహాబు కుమారుడైన అహజ్యా యె 49
హోషాఫాథుతో అనిన మాట, నా సేవకులను నీ సేవ
కులతో కూడా వోడల మీద వెళ్లనిమ్మని చెప్పెను;
అయితే యెహోషాఫాథు అందుకు వొప్పలేదు.। అం 50
తట యెహోషాఫాథు తన పితృలతో కూడా నిద్ర
పొంది, తన పితృడైన దావీదుయొక్క పురమందు తన
పితృలతో కూడా పాతిపెట్టబడెను; అతని కుమారు
డైన యెహోరాము అతనికి మారుగా యేలెను. ।
అహాబు కుమారుడైన అహజ్యా యూదా రాజైన యె 51
హోషాఫాథు యేలుబడియొక్క పదిహేడో సంవ
త్సరమందు షోమ్రోనులో ఇశ్రాయేలును యేలనారం
భించి, రెండు సంవత్సరములు ఇశ్రాయేలును యే
లెను. । అతడు యెహోవా దృష్టి యెదుట కీడుచేసి, 52
తన తండ్రి మార్గమందున్ను ఇశ్రాయేలును పాపము
చేయించిన నెబాథు కుమారుడైన యరొబాముయొక్క
మార్గమందున్ను నడిచెను. । యేమంటే అతడు బయ 53
లుకు సేవచేసి మ్రొక్కి, తన తండ్రి చేసిన అన్నిటి
ప్రకారముగా ఇశ్రాయేలు దేవుడైన యెహోవాకు
కోపమును పుట్టించెను.

# రాజులను గురించిన రెండో గ్రంథము.

## 1. అధ్యాయము

1 అహాబు మరణమైన తరువాత మోయాబీయులు
2 ఇశ్రాయేలీయుల మీద తిరగ బడిరి. । అంతట అహ
జ్యా షోమ్రోనులో వున్న తన మేడ అంతస్తు గది కిటి
కీలోనుంచి కిందపడినందున, అతడు రోగస్థుడయి
వుండెను; అప్పుడు అతడు మీరు ఎక్రోను దేవుడైన
బయల్జెబూబు యొద్దికి పోయి, యీ వ్యాధినుంచి నేను
స్వస్థపడుదునో లేదో అని అడుగండని దూతలను
3 పంపెను. । అయితే యెహోవాయొక్క దూత తిష్బీ
యుడైన ఏలీయాతో అనిన మాట, నీవు లేచి, షో
మ్రోను రాజుయొక్క దూతలను యెదుర్కొనుటకు
వెళ్లి, వారిని చూచి, ఇశ్రాయేలులో దేవుడు లేడు
గనుకనా ఎక్రోను దేవుడైన బయల్జెబూబు యొద్ద
4 అడుగబోతున్నారు? । కాబట్టి యే మంచము మీద
నీవు యెక్కితివో దాని మీదనుంచి దిగి రాకుండా
మరణము నీకు నిశ్చయముగా సంభవించునని యె
హోవా సెలవు యిచ్చి పలుకుమని చెప్పినందున ఏలీ
5 యా వెళ్లిపోయెను. । ఆ దూతలు తిరిగీ అతని యొద్దికి
వచ్చినప్పుడు, అతడు వారిని చూచి యెందుకు తిరిగి
6 వస్తిరని అడిగితే; । వారు అనిన మాట, వొక మనుష్యు
డు మాకు యెదురుగా వచ్చి మమ్మును చూచి, మిమ్మును
పంపిన రాజు యొద్దికి తిరిగి వెళ్లి అతనితో చెప్ప వల
సినదేమంటే, యెహోవా యీలాగున సెలవిస్తున్నా
డు; ఇశ్రాయేలులో దేవుడు లేడు గనుకనా ఎక్రోను
దేవుడైన బయల్జెబూబును అడుగడానకు పంపుతు
న్నావు? కాబట్టి యే మంచము మీద నీవు యెక్కితి
వో దాని మీదనుంచి నీవు దిగి రాకుండా మరణము
నీకు నిశ్చయముగా సంభవించునని చెప్పుమనెనని
7 అనినప్పుడు; । మిమ్మును యెదుర్కొనుటకు వచ్చి యీ
మాటలు చెప్పినవాడు యేలాటివాడని అతడు అడి
8 గెను. । అందుకు వారు అతడు గొంగళిని ధరించుకొని,
నడుముకు తోలు దట్టిని కట్టుకొన్నవాడయి వుండె
నని ప్రత్యుత్తరమిచ్చినప్పుడు, అతడు తిష్బీయుడయిన
9 ఏలీయా అని అతడు చెప్పెను. । వెంబడిగానే రాజు
యేభయి మందికి అధిపతి అయిన వొకని వాని యే
భయి మందితో కూడా అతని యొద్దికి పంపెను; అత
డు కొండ మీద కూర్చుని యుండెను; కాబట్టి వీడు
యెక్కి అతని సమీపమునకు వచ్చి, వో దైవ జనుడా,
నీవు దిగి రావలెనని రాజు చెప్పినాడని అనినప్పుడు; ।
ఏలీయా యేభయి మందికి అధిపతి అయిన వానితో 10
నేను దైవ జనుడనయితే అగ్ని ఆకాశములోనుంచి దిగి,
నిన్నున్ను నీ యేభయి మందినిన్ని దహించును గాకని
చెప్పగా; అగ్ని ఆకాశములోనుంచి దిగి, వానినిన్ని
వాని యేభయి మందినిన్ని దహించెను. । తిరుగా అత 11
డు యింకా యేభయి మంది మీద అధిపతియయిన
మరి వొకని వాని యేభయి మందితో కూడా పంపె
ను; వీడు వచ్చి, వో దైవ జనుడా, త్వరగా దిగి రమ్మని
రాజు చెప్పినాడని అనగా; । ఏలీయా నేను దైవ జను 12
డనయితే అగ్ని ఆకాశములోనుంచి దిగి, నిన్నున్ను
నీ యేభయి మందినిన్ని దహించును గాకని చెప్పగా;
ఆకాశములోనుంచి దేవుని అగ్ని దిగి, వానినిన్ని వాని
యేభయి మందినిన్ని దహించెను. । తిరిగీ అతడు యేభయి 13
మందికి అధిపతియయిన వొకని వాని యేభయి మం
దితో కూడా పంపెను; అయితే యేభయి మంది మీద
అధిపతి అయిన ఆ మూడోవాడు వచ్చి ఏలీయా ముం
దర మోకాళ్లూని వేడుకొనినదేమంటే, వో దైవ
జనుడా, దయచేసి నా ప్రాణమునున్ను యీ నీ సేవ
కులైన యేభయి మంది ప్రాణములనున్ను నీ దృష్టికి
ప్రియమైనవిగా వుండనిమ్ము. । యిదుగో ఆకాశము 14
లోనుంచి అగ్ని దిగి, ముందర యేభయి యేభయి
మంది మీద అధిపతులయిన ఆ యిద్దరినిన్ని ఆయా
యేభయి యేభయి మందినిన్ని దహించెను; కాబట్టి
నా ప్రాణమును నీ దృష్టికి ప్రియమైనదిగా వుండ
నిమ్మని వేడుకొనెను. । అప్పుడు యెహోవాయొక్క 15
దూత ఏలీయాతో వాని యందు భయపడక వానితో
కూడా దిగి వెళ్లుమని చెప్పెను; కాబట్టి అతడు లేచి
వానితో కూడా రాజు యొద్దికి వచ్చెను. । అప్పుడు 16
అతడు అతని చూచి, ఇశ్రాయేలులో ఆయన వాక్య
ము యొద్ద అడుగడానకు దేవుడు లేడు గనుకనా
ఎక్రోను దేవుడైన బయల్జెబూబు యొద్ద నీవు అడుగ
డానకు దూతలను పంపితివి? కాబట్టి యే మంచము
మీద నీవు యెక్కితివో దాని మీదనుంచి దిగి రా
కుండా మరణము నీకు నిశ్చయముగా సంభవించునని
యెహోవా సెలవు యిచ్చెనని చెప్పెను. । ఆలాగున 17
ఏలీయా ద్వారా యెహోవా ఆనతిచ్చిన వాక్యప్ర
కారము అతడు మరణమును పొందెను. యితనికి కుమా

రుడు లేడు గనుక యెహోరాము యూదా రాజ
యిన యెహోషాపాథు కుమారుడైన యెహోరాము
యేలుబడియొక్క రెండో సంవత్సరమందు అతనికి మా
18 రుగా యేలెను. । అయితే అహజ్యాయొక్క తక్కిమ్మా
కార్యములు ఇశ్రాయేలు రాజులయొక్క వృత్తాంత
ముల గ్రంథమందు వ్రాయబడి వున్నవిగదా?

## 2. అధ్యాయము.

1 యెహోవా సుడిగాలిచేత ఏలీయాను ఆకాశ
ములోకి యెక్కించి చేర్చుకొనుటకు వున్నప్పుడు
సంభవించినదేమంటే, ఏలీయా ఎలీషాతో కూడా గిల్గా
2 లునుంచి వెళ్లెను. । అప్పుడు ఏలీయా ఎలీషాతో అనిన
మాట, నీవు దయచేసి యిక్కడ వుండు, యేమంటే
యెహోవా నన్ను బేతేలుకు వెళ్లుమన్నాడని చెప్పి
నప్పుడు, ఎలీషా అతనితో యెహోవా జీవముతోడు,
నీ జీవముతోడు, నిన్ను నేను విడువనని చెప్పెను;
3 కాబట్టి వారిద్దరూ బేతేలుకు దిగి వెళ్లిరి. । అప్పుడు
బేతేలులో వున్న దీర్ఘదర్శులయొక్క పుత్రులు
ఎలీషా యొద్దికి వచ్చి, నేటి దినమున యెహోవా నీ
శిరస్సు మీదనుంచి నీ గురువును తీసుక పోవునని నీవు
యెరుగుదువా అని అనినప్పుడు, నేను యెరుగుదును,
4 మీరు వూరకొండని అతడు చెప్పెను. । అంతట ఏలీ
యా అతనితో ఓ ఎలీషా, దయచేసి యిక్కడ వుం
డుము, యేమంటే యెహోవా నన్ను యెరిఖోకు
వెళ్లుమన్నాడని చెప్పినప్పుడు, అతడు యెహోవా
జీవముతోడు, నీ జీవముతోడు, నేను నిన్ను విడువనని
5 చెప్పెను; కాబట్టి వారిద్దరు యెరిఖోకు వచ్చిరి. । అప్పు
డు యెరిఖోలో వున్న దీర్ఘదర్శులయొక్క పుత్రులు
ఎలీషా యొద్దికి వచ్చి, నేటి దినమున యెహోవా నీ
శిరస్సు మీదనుంచి నీ గురువును తీసుకొని పోవునని
నీవు యెరుగుదువా అని అడిగినప్పుడు, నేను యెరుగు
6 దును, మీరు వూరకొండని అతడు చెప్పెను. । అంతట
ఏలీయా అతనితో దయచేసి యిక్కడ వుండుము, యే
మంటే యెహోవా నన్ను యర్దేనుకు వెళ్లుమన్నా
డని చెప్పినప్పుడు, అతడు యెహోవా జీవముతోడు,
నీ జీవముతోడు, నిన్ను నేను విడువనని చెప్పినందున,
7 యిద్దరున్ను సాగి వెళ్లిరి. । అయితే దీర్ఘదర్శులయొ
క్క పుత్రులలో యేభైమంది వచ్చి చూడడానకు
దూరమున నిలిచి వుండిరి; వారిద్దరు యర్దేను నది
8 దగ్గిర నిలిచి వుండిరి. । అప్పుడు ఏలీయా తన దుప్పటి
తీసుకొని, మడతబెట్టి, వుదకముల మీద కొట్టినందున
అవి యివతలకున్ను అవతలకున్ను విభజనయినందున
9 వారిద్దరూ పొడి నేలమీద దాటి వెళ్లిరి. । వారు దాటి
వెళ్లిన తరువాత సంభవించినదేమంటే, ఏలీయా ఎలీ
షాను చూచి, నేను నీ యొద్దనుంచి తీయబడక మునుపు
నావల్ల నీకు యేమి కావలసినదో అది అడుగుమని
చెప్పినప్పుడు; ఎలీషా అనిన మాట నా యందు దయ
చేసి నీకు కలిగిన ఆత్మలో రెండంతలు నా మీద వుం
డనిమ్మని పలికెను. । అందుకు అతడు నీవు కఠినమైన 10
దాని అడిగితివి; అయినప్పటికిన్ని నీ యొద్దనుంచి నేను
తీయపడినప్పుడు నీవు నన్ను చూచితివట్టాయెనా ఆలా
గున నీకు ప్రాప్తమౌను; చూడకపోతివట్టాయెనా అది
కాక పోవునని చెప్పెను. । అయితే వారు యింకా వెళ్లు 11
తూ మాట్లాడుతూ వుండగా సంభవించినదేమంటే,
యిదుగో అగ్ని విమానమున్ను అగ్ని గుర్రములున్ను
అగుపడి వీరిద్దరిని విభజన చేసెను; అప్పుడు ఏలీయా
సుడిగాలిచేత ఆకాశములోకి యెక్కిపోయెను. । ఎలీషా 12
అది చూచి కేక వేసినదేమంటే, ఓ నా తండ్రీ, నా
తండ్రీ, ఇశ్రాయేలుయొక్క రథమున్ను రౌతులున్ను
అని పలికెను: అయితే అతడు అతని మరి చూడక
వుండెను; అప్పుడు అతడు తన వస్త్రమును పట్టుకొని
రెండు తునకలుగా చేసెను. । మరిన్ని ఏలీయా మీద 13
నుంచి కింద పడిన దుప్పటిని అతడు యెత్తుకొని, య
ర్దేను వొడ్డు దగ్గిరకు వచ్చి నిలిచెను. । మరిన్ని అతడు 14
ఏలీయా పైనుంచి కింద పడిన ఆ దుప్పటిని పట్టుకొని,
వుదకముల మీద కొట్టి, ఏలీయాయొక్క దేవుడైన
యెహోవా యెక్కడ వున్నాడని పలికెను; అయితే
అతడు వుదకముల మీద కొట్టినప్పుడు అవి యిటు
అటు విభాగించబడినందున ఎలీషా అవతల వొడ్డుకు
నడిచిపోయెను. । అయితే యెరిఖో దగ్గిర వుండి కని 15
పెట్టుతూ వుండిన దీర్ఘదర్శులయొక్క పుత్రులు
అతని చూచినప్పుడు ఏలీయాయొక్క ఆత్మ ఎలీషా
మీద నిలిచి వున్నదని అనుకొని, అతని యెదుర్కోవ
డానకు వచ్చి, అతని ముందర సాష్టాంగపడిరి. । తరు 16
వాత వారు అతనితో చెప్పినదేమంటే, యిదిగో నీ
సేవకులమయిన మా యొద్ద యేభై మంది బలము గల
వాండ్లు వున్నారు; మా యందు దయచేసి వాండ్లను
నీ గురువును వెతుకుటకు వెళ్లనిమ్ము; యెహోవా
యొక్క ఆత్మ అతని యెత్తి వొక పర్వతము మీదనయి
నా లోయ యందైనా వేసెనేమో అని చెప్పినప్పుడు
అతడు పంప వద్దని చెప్పెను. । అయినప్పటికిన్ని విసికే 17
మట్టుకు వారు అతని బతిమాలినందున అతడు పంపు
మని చెప్పెను; కాబట్టి వారు యేభైమందిని పంపిరి;
వీండ్లు వెళ్లి మూడు దినములు అతని వెతికినప్పటికిన్ని
అతడు వారికి కనపడకపోయెను. । కాబట్టి వారు యె 18
రిఖో పట్టణమందు నిలిచియున్న ఎలీషా యొద్దికి తిరిగీ
వచ్చినప్పుడు అతడు వారిని చూచి వెళ్ల వద్దని నేను
మీతో చెప్పలేదా అని అనెను. । అంతట ఆ పట్ట 19

ణపు వారు ఎలీషాను చూచి అతనితో, యిదుగో,
మా యేలినవారైన మీకు అగుపడినట్టు యీ పట్టణపు
స్థలము రమ్యమైనదైనప్పటికిన్ని నీళ్లు మంచివి కావు;
20 భూమి నిష్ఫలమైనదై వున్నదని చెప్పినప్పుడు;। అతడు
వారితో క్రొత్త పాత్రలో వుప్పువేసి నా యొద్దికి తీసు
కొని రండని చెప్పినందున వారు దాని తీసుకొని వచ్చిరి.।
21 అప్పుడు అతడు ఆ జలములయొక్క వూట యొద్దికి
వెళ్లి అందులో వుప్పు వేసి, యీ నీళ్లను నేను బాగు
చేసి వున్నాను గనుక యిక వీటివల్ల యే మరణమైనా
రాకుండా భూమి నిష్ఫలము గాకుండా వుండునని
22 యెహోవా ఆనతిచ్చెనని చెప్పెను. । కాబట్టి వుదక
ములు నేటి వరకూ ఎలీషా పలికిన వాక్య ప్రకారము
23 బాగా వున్నవి. । అక్కడనుంచి అతడు బేతేలుకు
వచ్చెను; అయితే మార్గమందు వస్తూ వుండగా చిన్న
వాండ్లు పట్టణములోనుంచి బయిలు వెళ్లి, అతని అప
హాస్యము చేసి, వోరీ బోడివాడా యెక్కిపొమ్ము, బోడి
24 వాడా యెక్కిపొమ్మని పలికినందున, । అతడు తిరిగి,
వారిని చూచి, యెహోవా నామమందు వారిని శపిం
చెను; అప్పుడు రెండు ఆడు వెలుగు బంట్లు అడవిలో
నుంచి వచ్చి వారిలో నలుబై యిద్దరు చిన్నవాండ్లను
25 చెండాడెను. । అక్కడనుంచి అతడు వెళ్లి కర్మెలు పర్వ
తమునకు వచ్చెను; అదిన్ని విడచి షోమ్రోనుకు తిరిగీ
వచ్చెను.

## 3. అధ్యాయము.

1 అయితే అహాబు కుమారుడైన యెహోరాము
యూదా రాజైన యెహోషాఫాథు యేలుబడియొక్క
పద్దెనిమిదో సంవత్సరమందు షోమ్రోనులో ఇశ్రాయే
లును యేలనారంభించి పండెండు సంవత్సరములు
2 యేలెను. । ఇతడున్ను యెహోవా దృష్టి యెదుట
కీడు చేసెను, గాని తన తల్లిదండ్రులు చేసినలాగు
కాదు, యేమంటే తన తండ్రి చేయించిన బయలు
3 యొక్క విగ్రహమును ఇతడు తీసివేసెను. । అయిన
ప్పటికిన్ని ఇశ్రాయేలు చేతను పాపము చేయించిన
నెబాథు కుమారుడైన యరొబాముయొక్క పాపము
లతో అతడు హత్తుకొని వాటిలోనుంచి తొలగి పో
4 లేదు. । అయితే మోయాబు రాజైన మేషా అనేకమైన
గొర్రెలు గలవాడై, లక్ష గొర్రె పిల్లలనున్ను బొచ్చు
గల లక్ష గొర్రె పొట్టేళ్లనున్ను ఇశ్రాయేలు రాజుకు
5 పన్ను కింద యిస్తూ వుండేవాడు. । అయితే అహాబు
మరణమైన తరువాత సంభవించినదేమంటే, మోయాబు
6 రాజు ఇశ్రాయేలు రాజు మీద తిరగబడెను.। అప్పుడు
యెహోరాము షోమ్రోనులోనుంచి బయిలువెళ్లి,
ఇశ్రాయేలీయులందరియొక్క లెక్క చూచుకొని వెళ్లి,।
యూదా రాజైన యెహోషాఫాథుకు వర్తమానము 7
పంపినదేమంటే, మోయాబు రాజు నా మీద తిరగ
బడినాడు; నీవు వచ్చి నాతో కూడా మోయాబీయుల
మీద యుద్ధము చేస్తావా? అని అడిగినప్పుడు, నేను
నీ వలెనే వున్నాను, నా జనులు నీ జనుల వలెనే
వున్నారు, నా గుర్రములు నీ గుర్రముల వలెనే వున్న
వి, నేను యెక్కి వస్తానని చెప్పినందున; । అతడు యే 8
మార్గమున యెక్కిపోదుమని అడిగినప్పుడు అతడు
ఎదోము అరణ్య మార్గమున యెక్కిపోవలెనని
చెప్పెను. । కాబట్టి ఇశ్రాయేలు రాజున్ను యూదా 9
రాజున్ను ఎదోము రాజున్ను బయిలువెళ్లి, యేడు దిన
ముల ప్రయాణము చుట్టు తిరిగిన తరువాత వారిని వెం
బడించిన సమూహమునకున్ను పశువులకున్ను నీళ్లు
లేకపోయెను. । అప్పుడు ఇశ్రాయేలు రాజు అనిన 10
మాట, కటకటా, యెహోవా ముగ్గురు రాజులమైన
మనలను మోయాబీయులయొక్క చేతిలోకి అప్పగిం
చడానకు కూడా రప్పించెనని అనెను. । అందుకు 11
యెహోషాఫాథు పలికినదేమంటే, యెహోవా
యొక్క దీర్ఘదర్శియైన వొకడు యిక్కడ లేడా;
అతని ద్వారా యెహోవా యొద్ద ఆలోచన అడుగు
టకు, అని అడిగినప్పుడు, ఇశ్రాయేలు రాజుయొక్క
సేవకులలో వొకడు అనిన మాట ఏలీయా చేతుల మీద
నీళ్లు పోసిన షాఫాథు కుమారుడైన ఎలీషా వొకడు
యిక్కడ వున్నాడని చెప్పెను.। అప్పుడు యెహో 12
షాఫాథు అనిన మాట, యెహోవాయొక్క వాక్యము
అతని యొద్ద వున్నదని చెప్పెను. కాబట్టి ఇశ్రా
యేలు రాజున్ను యెహోషాఫాథున్ను ఎదోము రా
జున్ను దిగి అతని యొద్దికి వచ్చిరి.। అప్పుడు ఎలీషా 13
ఇశ్రాయేలు రాజును చూచి, నీకున్ను నాకున్ను యేమి?
నీ తండ్రియొక్క దీర్ఘదర్శుల యొద్దికిన్ని నీ తల్లి
యొక్క దీర్ఘదర్శుల యొద్దికిన్ని పొమ్మని చెప్పినం
దున, ఇశ్రాయేలు రాజు అతనితో ఆలాగు కాదు,
యేమంటే రాజులమైన మా ముగ్గురను మోయాబీయుల
చేతిలోకి అప్పగించడానకు యెహోవా రప్పించెనని
చెప్పెను. ।అప్పుడు ఎలీషా అనిన మాట, యెవని 14
సముఖమందు నేను నిలిచి వున్నానో ఆ సైన్యముల
యొక్క యెహోవా జీవముతోడు, యూదా రాజ
యిన యెహోషాఫాథు స్వరూపమును నేను లక్ష్య
పెట్టుతున్నాను, లేని పక్షమందు నిన్ను చూచుటకైనా
లక్ష్యపెట్టుటకైనా వొప్పకపోదును.। అయినప్పటికిన్ని 15
నాయొద్దికి వాద్దికాని వొకని తీసుక రమ్మని చెప్పెను:
వాద్దికాడు వచ్చి వాయిస్తూ వుండగా, యెహోవా
యొక్క హస్తము అతని మీదికి వచ్చినందున అతడు
చెప్పినదేమంటే, । యెహోవా యీలాగున సెలవు 16

యిస్తున్నాడు, యీ లోవలో అనేకనుయిన గోతులను
17 తవ్వించండి. । యేమంటే మీరు వాయువునయినా
వర్షమునయినా చూడకపోయినప్పటికిన్ని మీరున్ను
మీ పశువులున్ను మీ మృగములున్ను తాగడానకు యీ
లోవ వుదకములచేత నిండి వుండునని యెహోవా
18 ఆనతిచ్చెనని చెప్పెను. । అయితే యీ కార్యము యె
హోవా దృష్టికి అల్పముగా వుండును; ఆయన మో
19 యాబీయులనున్ను మీ చేతిలోకి అప్పగించును. । మీరు
ప్రాకారములు గల ప్రతి పట్టణమునున్ను రమ్యమైన
ప్రతి పట్టణమునున్ను కొట్టి, ప్రతి మంచి చెట్టునున్ను
నరికి, జలములు గల నూతులన్నిన్ని కప్పి, సమస్తమైన
మంచి భూములనున్ను రాళ్లచేత చెరిపివేతురు గాకని
20 చెప్పెను. । అయినందున వుదయమున భోజనార్పణ
చెల్లించే సమయమందు సంభవించినదేమంటే, వుదక
ములు ఎదోము మార్గమున వచ్చినందున దేశము
21 వుదకములతో నిండి వుండెను. । అయితే మోయాబీ
యులు తమ మీద యుద్ధము చేయడానకు రాజులు
వచ్చినారని విన్నప్పుడు చిన్నవాండ్లు మొదలుకొని పెద్ద
లపర్యంతమూ ఆయుధములను ధరించుకోగల వారి
నందరినిన్ని వారు కూచుకొని వచ్చి దేశపు సరిహద్దు
22 యందు నిలిచి వుండిరి. । వీరు వుదయమందు లేచినప్పు
డు సూర్యుడు వుదకముల మీద ప్రకాశించినందున
అవతల వుదకము రక్తములాగున మోయాబీయులకు
23 అగుపడెను. । గనుక వారు అది రక్తము సుమా,
యేమంటే, రాజులు వొకరినొకరు కొట్టుకొని నిజము
గా హతులైరి; వో మోయాబీయులారా, దోపుడు
24 సొమ్ము కొరకు రండని చెప్పుకొనిరి. । అయితే వీరు
ఇశ్రాయేలుయొక్క దండు దగ్గిరకు వచ్చినప్పుడు ఇశ్రా
యేలీయులు లేచి వారిని కొట్టినందున మోయాబీయులు
వారి ముందరనుంచి పారిపోయిరి; వారు వారి దేశము
25 మట్టుకు మోయాబీయులను తరిమి కొట్టిరి. । మరిన్ని
వారు పట్టణములను కింద పడదోసి, సమస్తమైన మంచి
భూభాగముల మీదను ప్రతి మనిషీ వొక రాయి వేసి
నింపించి, సమస్తమైన జలములు గల నూతులను కప్పి,
మంచి వృక్షములన్నిన్ని నరికివేసిరి; కీర్హరెశెతు పట్ట
ణము మాత్రమే వారు విడచిపెట్టినందున దాని రాతి
కట్లు నిలిచి వుండెను; అయినప్పటికిన్ని వడిశలు విస
26 రేవాండ్లు దాన్ని చుట్టుకొని కొట్టిరి. । అయితే మో
యాబు రాజు యుద్ధము తనకు మిక్కిలీ కఠినమని
చూచి, అతడు ఆయుధములను కట్టుకొనిన యేడున్నూరు
మందిని యెంచుకొని, ఎదోము రాజుయొద్దికి తోసు
కొనిపోవడానకు వచ్చినప్పటికిన్ని వారివల్ల కాకపో
27 యెను. । అప్పుడు అతడు తనకు మారుగా యేలవలసిన
తనయొక్క ప్రథమ పుత్రుని తీసుకొని, పట్టణపు
ప్రాకారము మీద హోమబలిగా చెల్లించెను. అయి
నందున ఇశ్రాయేలీయుల మీద బహు కోపము పుట్టె
ను; కాబట్టి వారు అతని విడచి తమ దేశములోకి
తిరిగీ వచ్చిరి.

## 4. అధ్యాయము.

అంతట దీర్ఘదర్శులయొక్క పుత్రులలో వొకని 1
భార్య ఎలీషాకు మొర్రపెట్టినదేమంటే, నీ సేవకుడ
యిన నా పెనిమిటి చనిపోయెను; అతడు యెహో
వా యందు భక్తి గలవాడై వుండెనని నీకు తెలుసును;
యిప్పుడు ఆ అప్పులవాడు నా యిద్దరు కుమారులు
దాసులు అయ్యేటట్టు వారిని పట్టుకొని పోవడానకు
వచ్చి యున్నాడని చెప్పినప్పుడు; । ఎలీషా దానితో 2
నావల్ల నీకు యేమి కావలెను! నీ యింట్లో యేమి వున్న
దో అది నాకు తెలియ చెప్పుమని చెప్పగా, అది నీ
సేవకురాలనైన నా యింట్లో నూనె కుండ వొకటి కద్దు,
ఆదిగాక మరి యేమీ లేదని చెప్పెను. । అప్పుడు అత 3
డు దానితో నీవు బయిటికి వెళ్లి, నీ యిరుగు పొరుగు
వారందరి యొద్ద కొద్ది కాకుండా వట్టి పాత్రలను యె
రువు పుచ్చుకో. । అప్పుడు నీ లోపలికి నీవు వచ్చిన 4
ప్పుడు నీవున్ను నీ కుమారులున్ను లోపలనుండి తలుపు
మూసి, ఆ పాత్రలన్నిటిలో నూనె పోసి, నిండినవి
వొకతట్టు వుంచుమని చెప్పెను. । కాబట్టి అది అతని 5
యొద్దనుంచి వెళ్లి, తానున్ను తన కుమారులున్ను లోపల
నుంచి తలుపు మూసి, తన కుమారులు తెచ్చిన పాత్ర
లలో పోసెను. । పాత్రలన్ని నిండిన తరువాత సంభ 6
వించినదేమంటే, యింకా పాత్రలు తెమ్మని తన కుమా
రునితో చెప్పెను; వాడు మరి లేవని చెప్పెను; అప్పుడు
నూనె సరిపడినది. । అప్పుడు అది దైవ జనుడైన అతని 7
యొద్దికి వచ్చి తెలియ చెప్పెను; అతడు దానితో నీవు
వెళ్లి ఆ నూనెను అమ్మివేసుకొని, నీ అప్పు తీర్చి,
మిగిలిన దాని చేత నీవున్ను నీ పిల్లలున్ను బ్రతుకుమని
చెప్పెను. । తరువాత వొక నాటియందు ఎలీషా షూనే 8
ము పట్టణమునకు వెళ్లినాడు; అక్కడ ఘనురాలైన వొక
స్త్రీ కలదు; అది అతని భోజనము చేయడానకు బల
వంతము చేసెను; కాబట్టి అతడు యెప్పుడెప్పుడు ఆ
మార్గమున వచ్చినా అప్పుడప్పుడు అతడు ఆ లోప
లికి వెళ్లి భోజనము చేసేవాడు. । అంతట అది తన పెని 9
మిటిని చూచి, యిదుగో, మన తట్టు వస్తూ వున్న
వాడు పరిశుద్ధమైన దైవ జనుడని నేను తలస్తున్నాను. ।
కాబట్టి మనము అతని కొరకు గోడ మీద వొక చిన్న 10
గది కట్టించి, అందులో అతని కొరకు మంచమునున్న
బల్లనున్ను పీటనున్ను దీపపు స్తంభమునున్ను వుంచు
దాము; అప్పుడు అతడు మన యొద్దకి వచ్చేటప్పుడెల్ల

11 అందులోకి వెళ్లి వుండ వచ్చునని చెప్పెను. । యిది అ
యిన తరువాత అతడు అక్కడికి వొకనాడు వచ్చిన
12 ప్పుడు అతడు ఆ గదిలోకి వెళ్లి అక్కడ పడుకొనెను. ।
అప్పుడు అతడు తన సేవకుడైన గేహజీని చూచి,
యీ షూనమ్మీయురాలిని పిలువుమని చెప్పెను; వాడు
దాన్ని పిలిచినందున అది వచ్చి అతని ముందర నిలిచి
13 వుండెను. । అప్పుడు అతడు నీవు దానితో చెప్పవలసిన
దేమంటే, యిదుగో, నీవు యింత చింతతో మా కొరకు
మిక్కిలీ జాగరూకత గలదానవై వున్నావు; కాబట్టి
నీకు యేమి చేయబడవలెను? రాజుతోనైనా సమూహా
ధిపతితోనైనా నిన్ను గురించి నేను మాట్లాడుటకు
కోరుతూ వున్నావా అని అడుగుమని వానితో
చెప్పెను. అందుకు అది నేను నా స్వజనులలో కాపు
14 రము చేస్తూ వున్నానని చెప్పినందున; । అతడు దాని
కొరకు యేమి చేయబడవలెనని వాని అడిగినప్పుడు,
గేహజీ అతనితో నిశ్చయముగా దానికి పిల్ల లేదు;
15 మరిన్ని దాని పెనిమిటి ముసలివాడని చెప్పెను. । అప్పు
డు అతడు దానిని పిలువుమనెను; వాడు దానిని పిలి
చినందున అది వచ్చి ద్వారమందు నిలిచి వుండెను. ।
16 అప్పుడు అతడు దానితో యీ నిర్ణయకాలమందు
జీవకాలప్రకారముగా నీవు వొక కుమారుని కౌగలిం
చుకొందువు అని చెప్పెను. అయితే అతనితో అది
అనిన మాట, దైవ జనుడవైన వో నా యేలినవాడా,
ఆలాగున కాదు; నీ సేవకురాలనైన నాతో అబద్ధ
17 మాడవద్దని చెప్పెను. । అప్పుడు ఆ స్త్రీ గర్భవతియై,
ఎలీషా దానితో చెప్పిన కాలమందు జీవకాల ప్రకార
18 ముగా వొక కుమారుని కనెను. । అంతట ఆ పిల్ల యెది
గిన తరువాత వొకనాడు కోతకాండ్ల యొద్ద వున్న
తన తండ్రి యొద్దికి బయిలు వెళ్లి, వాడు అక్కడ
వున్నప్పుడు తన తండ్రితో నా తల, నా తల, అని
19 చెప్పెను. । కాబట్టి అతడు పడుచువాడైన వొకనితో
తల్లి యొద్దికి వాని యెత్తుకొని పొమ్మని చెప్పెను. ।
20 ఇతడు వాని యెత్తుకొని వాని తల్లి యొద్దికి తీసుకపో
యెను; వాడు దాని తొడమీద మధ్యాహ్నము పర్యం
21 తము పడుకొని మరణమాయెను. । అప్పుడు అది వెళ్లి,
దైవ జనుడైన అతని మంచము మీద వాని పెట్టి,
22 బయిలు వచ్చి తలుపు వేసి వెళ్లిపోయి, । తన పెనిమిటి
తో మాట్లాడి చెప్పినదేమంటే, వొక పడుచువానినిన్ని
గాదఀభములలో వొకటిన్ని నా యొద్దికి పంపు; నేను
దైవ జనుడయిన అతని యొద్దికి వెళ్లి మళ్లీ వస్తానని
23 చెప్పినప్పుడు; । అతడు నేడు అమావాస్య కాదు సబ్బా
తు కాదు గదా; అతని యొద్దికి యెందుకు వెళ్లెదవని
పలికెను; అందుకు అది వెళ్లితే క్షేమమవునని చెప్పెను. ।
24 అప్పుడు అది గాదఀభము మీద గంత కట్టించి,
తాను యెక్కి, తన సేవకునితో శీఘ్రముగా తోలు
ము; నేను నీకు సెలవు యిస్తేనేగాని జబ్బు చేయవద్దని
చెప్పెను. । యీలాగున అది వెళ్లి, కమేఀలు పర్వత 25
మందున్న దైవ జనుడైన అతని యొద్దికి వచ్చెను;
అయితే దైవ జనుడైన అతడు దూరమునుంచి దానిని
చూచి, తన సేవకుడైన గేహజీతో చెప్పినదేమంటే,
అదుగో ఆ షూనమ్మీయురాలు అక్కడ వున్నది. । నీవు 26
దానిని యెదుర్కోవడానకు పరుగెత్తిపోయి, దానిని
చూచి, నీవున్ను నీ పెనిమిటిన్ని నీ పిల్లయున్ను సుఖ
ముగా వున్నారా అని అడుగుమని చెప్పి పంపెను;
యిందుకు అది సుఖముగా వున్నామని చెప్పెను. ।
అయితే అది కొండ మీదనున్న దైవ జనుడైన అతని 27
యొద్దికి వచ్చి అతని కాళ్లను పట్టుకొనెను; అప్పుడు
గేహజీ దాని తోలివేయుటకు సమీపమునకు వచ్చెను;
కాబట్టి దైవ జనుడు వానితో దానిని వదిలివేయుము,
యేమంటే దాని మనస్సు బహు చింతగా వున్నది; ఆ
సంగతి యెహోవా నాకు చెప్పక మరుగుగా వుంచె
నని అనెను. । అప్పుడు అది అతనితో అనిన మాట, నేను 28
నా యేలినవాడవైన నీ యొద్ద కుమారుని అడిగినానా?
నన్ను భ్రమ పెట్ట వద్దని నేను చెప్ప లేదా అని పలి
కెను. । అప్పుడు అతడు గేహజీతో సెలవు యిచ్చినదే 29
మంటే, నీ నడుము బిగించుకొని, నా దండమును చేత
పట్టుకొని వెళ్లిపో; యెవడైనా నీకు యెదురుగా వస్తే
వానికి నమస్కరించ వద్దు; యెవడైనా నీకు నమస్క
రించితే వానికి ప్రత్యుత్తరము యివ్వ వద్దు; అక్కడికి
వెళ్లి నా దండము పిల్లయొక్క ముఖము మీద పెట్టు
మని చెప్పి పంపెను. । అయితే పిల్ల తల్లి మరిన్ని చెప్పిన 30
దేమంటే, యెహోవా జీవముతోడు, నీ జీవముతో
డు, నిన్ను నేను విడువనని అనెను; అప్పుడు అతడు
లేచి దానిని వెంబడించెను. । అయితే గేహజీ వారికం 31
టే ముందుగా వెళ్లి, ఆ దండము పిల్ల ముఖము మీద
పెట్టెను; అయితే శబ్దమైనా వినడమైనా లేక వుండె
ను; కాబట్టి వాడు అతని యెదుర్కోవడానకు వచ్చి,
పిల్ల మేలుకో లేదని చెప్పెను. । ఎలీషా ఆ యింట్లో 32
ప్రవేశించినప్పుడు, యిదుగో, పిల్ల మరణమైయుండి,
తన మంచము మీద పెట్టబడి వుండెను. । కాబట్టి అత 33
డు లోపటికి వెళ్లి, యిద్దరి వెనుకనుంచి తలుపు మూసి,
యెహోవాను ప్రార్థన చేసి, । మంచము మీద 34
యెక్కి, పిల్లమీద పడుకొని, తన నోరు వాని నోరు
మీదనున్ను తన కండ్లు వాని కండ్ల మీదనున్ను తన చే
తులు వాని చేతుల మీదనున్ను పెట్టి, పిల్లమీద నిడు
పుగా పడుకొన్న తరువాత పిల్లయొక్క వొంటికి వెట్ట
వచ్చెను. । అప్పుడు అతడు దిగి యింట్లో తిరుగలాడి, 35
మళ్లీ యెక్కి వాని మీద నిడుపుగా పడుకొన్న తరు

వాత పిల్ల యేడు మారులు తుమ్మి తన కండ్లను విప్పెకొ
36 నెను. । అప్పుడు అతడు గేహజీని పిలిచి, యీ షూన
మ్మీయురాలిని పిలువుమనెను; వీడు దానిని పిలిచెను;
అది అతని యొద్దికి వచ్చినప్పుడు అతడు దానితో నీ
37 కుమారుని యెత్తుకొమ్మని చెప్పినందున, । అది లోపటికి
వచ్చి అతని కాళ్ల మీద పడి నేల మట్టుకు వంగి లేచి,
38 తన కుమారుని యెత్తుకొని బయిలు వెళ్లెను. । యిది అ
యిన తరువాత ఎలీషా గిల్గాలుకు తిరిగీ వచ్చెను; ఆ దేశ
మందు క్షామము కలిగి యుండెను; అంతట దీర్ఘ
దర్శులయొక్క పుత్రులు అతని ముందర కూచుండి
వుండగా, అతడు తన సేవకుని చూచి, పెద్ద కుండ పొ
యి మీద పెట్టి, దీర్ఘదర్శులయొక్క పుత్రుల కొ
39 రకు కూర వంట చేయుమని సెలవు యిచ్చెను. । అయి
తే వొకడు కూరలు యేరడానకు పొలములోకి వెళ్లి,
అడవి ద్రాక్ష చెట్టును చూచి దాని తీగెలను తెంపి,
వొడినిండా యేరుకొని వచ్చి, వాటిని తరిగి కూర కుం
డలో వేసెను; అయితే వీటి లక్షణములు వారికి తెలి
40 య లేదు. । అప్పుడు వారు ఆ మనుష్యులు తినడానకు
కుమ్మరించిరి; అయితే వారు యీ కూర తింటూ వుండ
గా, వో దైవ జనుడా, ఆ కుండలో మరణము వున్న
41 దని బొబ్బ పెట్టి, అది తినలేక పోయిరి. । అప్పుడు
అతడు పిండి కొంత తెమ్మనెను; అది అతడు కుండలో
వేసి చెప్పినదేమంటే, జనులు తినడానకు కుమ్మరించుం
డని చెప్పెను; కుమ్మరించినప్పుడు కుండలో మరి యేద
42 యినా హాని కనిపించక పోయెను. । అంతట వొకడు
బయల్షాలిషానుంచి మొదటి పంటవి అయిన యిరువై
గోధుమ రొట్టెలనున్ను కొద్దిగా గోధుమలనున్ను తీసుక
వచ్చి, దైవ జనుడయిన అతనికి కానుకగా యిచ్చెను;
అప్పుడు అతడు జనులు తినడానకు వడ్డించుమనెను. ।
43 అయితే అతని సేవకుడు అతని చూచి, యివి నూరు
మందికి వడ్డించడానకు యెంతని పలికినప్పటికిన్ని అత
డు తిరిగీ అనినదేమంటే, జనులు తినడానకు వడ్డించు,
యేమంటే వారు తిని విడచిపెట్టుదురని యెహోవా
44 సెలవు యిచ్చెనని చెప్పెను. । కాబట్టి వాడు అవి వా
రికి వడ్డించిన తరువాత వారు తిని యెహోవాయొక్క
సెలవు ప్రకారము విడచి పెట్టిరి.

## 5. అధ్యాయము.

1 అయితే అరాము రాజుయొక్క సైన్యాధిపతియైన
నయమాను తన యజమానుని కంటికి ఘనుడుగానున్ను
దయ పొందినవాడుగానున్ను వుండెను, యెందుచేతనం
టే అతనిచేత యెహోవా అరాము దేశమునకు జయ
ము కలుగ చేసెను; మరిన్ని అతడు మహా పరాక్రమ
2 శాలియయినప్పటికీ కుష్ఠరోగియై వుండెను. । అంతట
అరామీయులు గుంపు గుంపులుగా బయిలువెళ్లి, ఇశ్రా
యేలు దేశములోనుంచి వొక చిన్నదానిని చెరగా కొంచ
వచ్చి వుండిరి; యిది నయమానుయొక్క భార్యను కని
పెట్టేదై వుండెను. । యిది తన యజమానురాలిని చూచి, 3
నా యేలినవారు షోమ్రోనులో వున్న దీర్ఘదర్శి
యొద్ద వుంటే నా మనోరథము యీడేరును, యేమం
టే అతడు అతనికి కలిగిన కుష్ఠరోగమును బాగుచేసు
నని అనెను. । అంతట వొకడు లోపటికి వెళ్లి, తన యజ 4
మానునితో ఇశ్రాయేలు దేశపు చిన్నది యీలాగున
పలికెనని తెలియ చెప్పెను. । అప్పుడు అరాముయొక్క 5
రాజు అనిన మాట, నీవు వెళ్లవలసినది గనుక వెళ్లు;
ఇశ్రాయేలు రాజుకు వుత్తరమును పంపుతానని అనెను;
కాబట్టి అతడు పది వెండి తలాంతులనున్ను ఆరువేల
బంగారపు బిళ్లలనున్ను పది దుస్తుల బట్టలనున్ను తీసు
కుని వెళ్లి, ఇశ్రాయేలు రాజుకు వుత్తరమును అప్పగించె
ను: । ఆ వుత్తరములో వున్నదేమంటే, యిదుగో యీ 6
వుత్తరము మా సేవకుడయిన నయమానుచేత మీకు పం
పిస్తిమి; మీరు అతనికి కలిగిన కుష్ఠరోగమును బాగు
చేయ వలసినదని వుండెను. । అయితే ఇశ్రాయేలుయొ 7
క్క రాజు యీ వుత్తరము చదివినప్పుడు అతడు తన
వస్త్రములను చించుకొని అనుకొనినదేమంటే, నేను చం
పడానకున్ను బ్రతికించడానకున్ను దేవుడనై వున్నానా
వొకనికి కలిగిన కుష్ఠరోగమును బాగు చేయుమని
నా యొద్దికి యితడు పంపడానకు? కాబట్టి మీరు
విచారించి, అతడు నాతో కలహము యేలాగు వెతు
కుతున్నాడో చూడండని చెప్పెను. । అయితే ఇశ్రా 8
యేలు రాజు తన వస్త్రములను చించుకొన్న సంగతి దైవ
జనుడైన ఎలీషాకు వినపడినప్పుడు అతడు రాజుకు
వర్తమానము పంపినదేమంటే, నీ వస్త్రములను నీవు
యెందుకు చించుకొంటివి? అతని నా యొద్దికి రానిమ్ము;
ఇశ్రాయేలులో దీర్ఘదర్శి కలడని అతనికి తెలియ
బడుతుంది అని చెప్పుమనెను. । కాబట్టి నయమాను 9
తన గుర్రములతోనున్ను రథముతోనున్ను వచ్చి, ఎలీ
షా యింటి ద్వారము ముందర నిలిచి వుండెను. । అప్పు 10
డు ఎలీషా నీవు యర్దేను నదికి వెళ్లి, యేడు మారులు
స్నానము చేయుము; అప్పుడు నీ మాంసము నీకు తిరిగీ
వచ్చినందున నీవు శుద్ధుడవవుదువని అతనితో చెప్పు
మని వొక దూతను పంపెను. । అయితే నయమాను కో 11
పము తెచ్చుకొని, తిరిగీ వెళ్లి పలికినదేమంటే, యిదు
గో అతడు నా యొద్దికి వచ్చి నిలిచి, తన దేవుడైన
యెహోవా నామమును స్మరించి, తన చెయ్యి రోగ
ముగా వున్న స్థలము మీద పెట్టి, కుష్ఠరోగమును బాగు
చేసునని నేను అనుకొంటిని. । దమస్కు నదులైన అబ 12
నాయున్ను పర్పరున్ను ఇశ్రాయేలుయొక్క జలము

లన్నిటికంటే విశేషమైనవి కావా? వాటిలో స్నానము
చేసి శుద్ధిని పొందలేనా? అని అనుకొని, రౌద్రుడై
13 తిరిగీ వెళ్లిపోయెను. । అయితే అతని సేవకులలో వొక
డు చేరి అతనితో అనిన మాట, వో నా తండ్రీ, ఆ
దీర్ఘదర్శి యేదో వొక గొప్ప కార్యము చేయుమం
టే చేయక వుందువా? అయితే స్నానము చేసి శుద్ధు
డవు కమ్మన్న మాట దానికంటే యోగ్యము కాదా?
14 అని చెప్పినందున; । అతడు వెళ్లి, దైవ జనుడు చెప్పిన
ప్రకారము యర్దేను నదిలో యేడు మారులు తాను
మునిగిన తరువాత అతని మాంసము పసిపిల్ల మాంసము
15 లాగున తిరిగీ వచ్చి అతడు శుద్ధుడాయెను. । అప్పుడు
అతడు తానున్ను తన గుంపున్ను తిరిగీ దైవ జనుడైన
అతని దగ్గిరకు వచ్చి, అతని ముందర నిలిచి, యిదుగో
ఇశ్రాయేలులో వున్న దేవుడు గాక లోకమంతటి
యందూ మరి యొకడు లేడని నేను యెరుగుదును;
యిప్పుడు నీవు నీ సేవకుడనైన నా యొద్ద బహుమాన
ము పుచ్చుకోవలసినదని అతనితో చెప్పినప్పుడు; ।
16 యెవని సముఖమందు నేను నిలిచి వున్నానో ఆ
యెహోవా జీవముతోడు నేను యేమిన్ని పుచ్చు
కోను అని చెప్పెను; అతడు అతని బహుగా బతిమాలి
17 నప్పటికిన్ని అతడు వొప్పక వుండెను. । అప్పుడు నయ
మాను రెండు వేసడములు మోసేపాటి మన్ను నీ సేవ
కుడనైన నాకు యిప్పించబడ కూడదా? యేమంటే యి
కను నేను హోమబలినైనా మరి యేబలి అర్పణనై
నా యితరమైన దేవుండ్లకు చెల్లించక యెహోవాకు
18 మాత్రమే చెల్లింతును. । అయితే నా యజమానుడు
మ్రొక్కడానకు రిమ్మోను గుడిలోకి ప్రవేశించి నా
చేతిమీద ఆనుకొనేటప్పుడు, నేను రిమ్మోను గుడిలో
వంగినట్టయితే రిమ్మోను గుడిలో నేను వంగిన కార్య
మును గురించి యెహోవా నీ సేవకుడనైన నన్ను
19 క్షమించును గాకని చెప్పినప్పుడు; । అతడు అతనితో
సుఖముగా వెళ్లుమని చెప్పెను; కాబట్టి అతడు అతని
20 యొద్దనుంచి వెళ్లి, కొంత దూరము వచ్చెను. । అయితే
దైవ జనుడైన ఎలీషాయొక్క సేవకుడైన గేహజీ అను
కొనినదేమంటే, యిదుగో, నా యజమానుడు అరామీ
యుడైన యీ నయమాను తీసుకొ వచ్చిన వాటిని
అతని యొద్దనుంచి పుచ్చుకోక పోవుట అతని మన
స్సుకు అడ్డమాయెను; అయితే యెహోవా జీవము
తోడు నేను అతని వెనుకనుంచి పరుగెత్తి పోయి, అతని
21 యొద్ద యేదైనా పుచ్చుకుందునని అనుకొనెను. । కాబట్టి
గేహజీ నయమాను వెనుకనుంచి వస్తూ వుండెను; నయ
మాను తన వెనుకనుంచి పరుగెత్తి వస్తూ వున్నవాని
చూచినప్పుడు, తన రథము మీదనుంచి దిగి, వాని యె
దుర్కొని, అంతా క్షేమమా అని అడిగితే, అంతా
క్షేమమే అని పలికి; । నా యజమానుడు నా చేత పం 22
పిన వర్తమానము యేమంటే, యిదుగో దీర్ఘదర్శుల
యొక్క పుత్రులలో యిద్దరు పడుచువాండ్లు ఎఫ్ర
యీము పర్వతమునుంచి నా యొద్దికి యిప్పుడే వచ్చి
యున్నారు; కాబట్టి నీవు వారికి వొక వెండి తలాంతు
నున్ను రెండు దుస్తుల బట్టలనున్ను యివ్వ వలసినదని చె
ప్పెనని చెప్పినందున; । నయమాను వానితో నీకు అను 23
కూలమైతే రెండు తలాంతులు పుచ్చుకో అని చెప్పి,
మరిన్ని బతిమాలి రెండు సంచులతో రెండు వెండి
తలాంతులనున్ను రెండు దుస్తుల బట్టలనున్ను యిచ్చి
తన పడుచువాండ్లలో యిద్దరి మీద అవి వేయించెను;
వీండ్లు వానిముందర వాటిని మోసుకు పోయిరి. । అయి 24
తే గుమ్మము దగ్గిరకు వచ్చినప్పుడు వాడు వాండ్ల యొద్ద
నుంచి అవి పుచ్చుకొని యింట్లో వుంచి, వాండ్లకు సె
లవు యిచ్చినందున వాండ్లు వెళ్లిపోయిరి. । అయితే వీడు 25
లోపలికి వెళ్లి తన యజమానుని ముందర నిలిచి వుం
డెను; అప్పుడు ఎలీషా వాని చూచి, వో గేహజీ,
యెక్కడనుంచి వస్తివని అడగగా, వాడు నీ సేవకుడ
నైన నేను యెక్కడికీ వెళ్ల లేదని అనెను. । అయితే 26
అతడు వాని చూచి, ఆ మనుష్యుడు తన రథము దిగి,
నిన్ను యెదుర్కోవడానకు తిరిగీ వచ్చినప్పుడు నా
హృదయము నీతో కూడా రాలేదా? ద్రవ్యమునైనా
వస్త్రములనైనా ఇప్ప తోటలనైనా ద్రాక్ష తోటలనై
నా గొర్రెలనైనా యెద్లనైనా సేవకులనైనా సేవకురాం
డ్లనైనా సంగ్రహించడానకు యిది సమయమా! । కా 27
బట్టి నయమానుయొక్క కుష్ఠరోగము నీకున్ను సదాకా
లము నీ సంతతికిన్ని అంటి వుండునుగాకని చెప్పినప్పు
డు, వాడు అతని ముందరనుంచి మంచులాటి తెలుపు
కలిగిన కుష్ఠరోగి అయి బయిటికి వెళ్లెను.

## 6. అధ్యాయము.

అంతట దీర్ఘదర్శులయొక్క పుత్రులు ఎలీషా 1
ను చూచి, యిదుగో నీతో కూడా మేము వుండే స్థల
ము మాకు యిక్కట్టుగా వున్నది. । నీ సెలవు అయితే 2
మేము యర్దేను నది దగ్గిరకు వెళ్లి, ప్రతి మనిషీ
అక్కడనుంచి మాను వొకటి తీసుక వచ్చి, అక్కడ
నివాసస్థలము కట్టుకొందుమని చెప్పినప్పుడు అతడు
వెళ్లుమని ప్రత్యుత్తరమిచ్చెను. । అప్పుడు వొకడు అత 3
నితో దయచేసి నీ సేవకులమైన మాతో కూడా నీవు
రావలెనని చెప్పెను, అందుకు అతడు నేను వస్తానని
అనెను. । కాబట్టి అతడు వారితో కూడా వెళ్లెను: 4
వారు యర్దేనుకు వచ్చినప్పుడు మానులను నరికిరి. ।
అయితే వొకడు దూలమును నరుకుతూ వుండగా గొ 5
డ్డటి యినుము నీట్లో పడిపోయినందున వాడు అయ్యో!

కర్తా, అది యెరవై యుండెనని మొర్ర పెట్టెను. ।
6 అందుకు ఆ దైవ జనుడు వాని చూచి, యెక్కడ పడె
నని అడిగినందున వాడు అతనికి ఆ స్థలము చూపించె
ను; అప్పుడు అతడు కర్ర వొకటి కోసి అందులో వేసి
7 నందున యినుము తేలెను. । అప్పుడు అతడు వానితో
దాని పట్టుకొమ్మని చెప్పెను; వాడు తన చెయ్యి చాపి
8 దాని పట్టుకొనెను. । అంతట అరాము రాజు ఇశ్రా
యేలు మీద యుద్ధము చేసి తన సేవకులతో ఆలోచన
చేసి, ఫలాని స్థలమందు మన దండు పేట వుంచుదమని
9 చెప్పెను. । అయితే ఆ దైవ జనుడు ఇశ్రాయేలు రాజుకు
వర్తమానము పంపినదేమంటే, ఫలాని స్థలము తట్టున
నీవు వెళ్లవద్దు, యేమంటే అక్కడికి అరామీయులు
10 వచ్చి దిగి వున్నారని చెప్పుమనెను. । కాబట్టి ఇశ్రా
యేలు రాజు దైవ జనుడు తనకు తెలిపి హెచ్చరిక
చేసిన స్థలమునకు పంపినందున వొకటి రెండు మారులు
మాత్రము కాకుండా తన్ను తాను రక్షించుకొనెను. ।
11 అందు నిమిత్తము అరాము రాజు బహుగా మనస్సులో
విచారపడి, తన సేవకులను పిలిచి, మనలో ఇశ్రాయేలు
రాజు పక్షమందు యెవరు వున్నారో అది మాకు తెలి
12 య చెప్పరా అని వారిని అడిగినప్పుడు; । అతని సేవ
కులలో వొకడు అనిన మాట, రాజయిన వో నా యే
లినవారా, యెవరూ లేరు; అయితే ఇశ్రాయేలులో
వున్న దీర్ఘదర్శియైన ఎలీషా మీ అంతఃపురమందు
మీరు అనుకొనిన మాటలు ఇశ్రాయేలు రాజుకు తెలి
13 యచేస్తాడని చెప్పినందున; । అతడు నీవు వెళ్లి అతడు
వుండే స్థలము యెక్కడో అది చూచి రమ్ము, మేము
పంపి అతని తెప్పింతుమని చెప్పెను: అయితే అడుగో
14 దోతానులో వున్నాడని అతనికి చెప్పబడెను. । కాబట్టి
అతడు అక్కడికి గుర్రములనున్ను రథములనున్ను
బహు సమూహమునున్ను పంపినందున వారు రాత్రి
వేళప్పుడు వచ్చి నఖముఖాలా పట్టణమును చుట్టుకొ
15 నిరి. । కాబట్టి దైవ జనుడయిన అతని సేవకుడు పెంద
లాడా లేచి, బయిటికి వచ్చినప్పుడు, అదుగో పట్టణ
ము గుర్రములున్ను రథములున్ను గల సమూహము
చేత చుట్టుకోబడెనని చూచెను. అప్పుడు అతని సేవ
కుడు అతనితో అయ్యో, కర్తా, యేమి చేతుమని
16 పలికినప్పుడు; । అతడు భయపడవద్దు, యేమంటే మన
పక్షమున వున్నవారు వారికంటే అధికులై వున్నారని
17 చెప్పెను. । మరిన్ని ఎలీషా ప్రార్థన చేసినదేమంటే,
వో యెహోవా, వీడు చూచేటట్టు దయ చేసి వీని
కండ్లు తెరవ చేయుమని ప్రార్థన చేసినప్పుడు యె
హోవా ఆ పడుచువానియొక్క కండ్లను తెరవ చేసి
నందున వాడు ఎలీషా చుట్టూ అగ్ని గుర్రముల చేత
నున్ను రథముల చేతనున్ను పర్వతము నిండీ వుండుటను
చూచెను. । అయితే వారు అతని యొద్దికి వచ్చినప్పుడు 18
ఎలీషా యెహోవాను ప్రార్థన చేసినదేమంటే,
యీ జనులను అంధత్వముతో మొత్తుమని వేడుకొని
నందున ఆయన ఎలీషా అడిగిన మాట ప్రకారము వా
రిని అంధత్వముతో మొత్తెను. । అప్పుడు ఎలీషా వారి 19
తో అనిన మాట, యిది మార్గము కాదు, యిది పట్ట
ణము కాదు, నా వెనుక రండి; మీరు వెతికే వాని
యొద్దికి మిమ్మును కొంచుబోదునని చెప్పి, షోమ్రోను
పట్టణమునకు వారిని కొంచుపోయెను. । వారు షోమ్రో 20
నులోకి వచ్చినప్పుడు సంభవించినదేమంటే, ఎలీషా
వో యెహోవా, వీరు చూచేటట్టుగా వీరి కండ్లను
తెరవచేయుమని వేడుకోగా, యెహోవా వారి కం
డ్లను తెరవచేసినందున వారు తాము షోమ్రోను మధ్య
మందు వున్నామని తెలుసుకొనిరి. । అయితే ఇశ్రాయే 21
లు రాజు వారిని చూచి, ఎలీషాతో అనిన మాట, వో
నా తండ్రీ, వీరిని కొట్టుదునా! కొట్టుదునా! అని
అడిగినప్పుడు, । అతడు నీవు కొట్టకూడదు, యేమంటే 22
నీ కత్తిచేతనున్ను నీ విల్లుచేతనున్ను నీవు చెరలోకి
కొంచు వచ్చిన వారిని కొట్టవచ్చునా? వారి యెదుట
అన్నపానాదులను పెట్టుము, అప్పుడు వారు భుజించి
పానము చేసిన తరువాత వారు వారి యజమానుని
యొద్దికి వెళ్లుదురని చెప్పెను. । అతడు వారి కొరకు భో 23
జనమును బహు విస్తారముగా సిద్ధపర్చెను; కాబట్టి
వారు తిని తాగిన తరువాత అతడు సెలవు యిచ్చినం
దున వారు తమ యజమానుని యొద్దికి వెళ్లిరి. అప్పటి
నుంచి అరాముయొక్క గుంపులు ఇశ్రాయేలు దేశము
లోకి రాకుండా వుండెను. । అటుతరువాత అరాము 24
రాజైన బెన్హదదు తన సమూహమంతా కూర్చుకొని
షోమ్రోను మీదికి వచ్చి ముట్టడి వేసెను. । అప్పుడు 25
షోమ్రోనులో గొప్ప క్షామము కలిగి వుండెను; గాడి
దెయొక్క తలకాయ యెనభయి వెండి బిళ్లలకున్ను,
కవ అనే కొల నాలుగో భాగమంత పావుర పక్షియొ
క్క రెట్ట అయిదు వెండి బిళ్లలకున్ను అమ్మే మట్టుకు
వారు దాన్ని ముట్టడి వేసిరి. । అంతట ఇశ్రాయేలు 26
రాజు పట్టణపు ప్రాకారము మీద నడిచి పోతూ
వుండగా, వొక స్త్రీ కేక వేసి, రాజయిన నా యేలిన
వారా సహాయము చేయుమని పలికెను. । అందుకు 27
అతడు యెహోవా నీకు సహాయము చేయకపోతే
యెక్కడనుంచి నీకు నేను సహాయము చేతును! కళ్ల
మునుంచి సహాయము చేయనా, లేక ద్రాక్ష గానుగ
నుంచి సహాయము చేయనా! అని పలికి; । దానితో 28
నీవు విచారపడేదేమని పలికినప్పుడు అది చెప్పినదేమం
టే, యీ స్త్రీ నన్ను చూచి, నా కుమారుని రేపు మన
ము భక్షింతుము, నేటి ఆహారమునకు నీ కుమారుని

29 యివ్వవలసినదని చెప్పెను. । కాబట్టి మేము నా కుమా
రుని వంటచేసుకొని తింటిమి; అయితే మరునాటి
యందు నేను దాన్ని చూచి, నేటి ఆహారమునకు నీ
కుమారుని యిమ్మని చెప్పితిని; అయితే అది తన కుమా
30 రుని దాచిపెట్టెనని చెప్పెను. । రాజు ఆ స్త్రీ మాటలను
విని, తన వస్త్రములను చించుకొని, యింకా ప్రాకార
ము మీద నడిచి పోతూ వుండగా, జనులు చూచి
యిదుగో, లోపల అతని శరీరమునకు గోనెపట్టె కట్ట
31 బడుటను చూచిరి. । అప్పుడు రాజు అనినదేమంటే,
షాఫాతు కుమారుడైన ఎలీషాయొక్క శిరస్సు అతని
పైని యీ దినమున నిలిచి వుంటే దేవుడు ఆలాగున
నున్ను అంతకంటే అధికమునున్ను నాకు చేయును గా
32 కని చెప్పెను. । అయితే ఎలీషా తన యింట్లో కూర్చుని
వుండెను; పెద్దలు అతనితో కూడా కూర్చుని వుండిరి;
అంతట రాజు వొక మనిషిని పంపి వుండెను: అయితే
ఆ పంపబడిన వాడు ఎలీషా దగ్గిరకు రాకమునుపే
అతడు ఆ పెద్దలను చూచి, యీ నరాంతకుని కుమా
రుడు నా శిరస్సును తీసివేయడానకు వొకని పంపి
వున్నాడని మీకు తెలిసినదా? అయితే మీరు కనిపెట్టి,
పంపబడినవాడు వచ్చినప్పుడు తలుపు మూసి, వాడు
లోపలకు రాకుండా తలుపు దగ్గిర వాని గట్టిగా పట్టు
కొండి; వాని యజమానునియొక్క కాళ్ల చప్పుడు వాని
33 వెనుక లేదా అని వారితో పలుకుతూ వుండగా; । యి
దుగో పంపబడిన వాడు అతని యొద్దకు వచ్చెను; అత
డు చెప్పినదేమంటే, యిదుగో యీ కీడు యెహోవా
చేతనై యున్నది; యిక యెహోవాను కనిపెట్టడ
మేమని చెప్పెను.

## 7. అధ్యాయము.

1 అప్పుడు ఎలీషా పలికిన మాట, యెహోవా
యొక్క వాక్యమును వినండి; యెహోవా ఆనతిచ్చిన
లాగు యేమంటే రేపు యీ వేళకు షోమ్రోను ద్వార
మందు షెకేలు వొక్కంటికి వొక కొల సన్నపు పిం
డిన్ని షెకేలు వొక్కంటికి రెండు కొలలు యవ గోధు
2 మలున్ను అమ్మడమౌనని పలికెనని చెప్పెను. । అప్పుడు
యే అధిపతి చేతి మీద రాజు ఆనుకొని వుండెనో
అతడు దైవ జనుని చూచి, యిదుగో, యెహోవా
ఆకాశమందు కిటికీలు తెరచినప్పటికిన్ని అది అవునా?
అని ప్రత్యుత్తరము యిచ్చినందున, అతడు అతనితో
నీ కండ్లతో నీవు చూతువుగాని దాని తినకుండా
3 వుందువని చెప్పెను. । అంతట పట్టణపు ద్వారము అవ
తల నలుగురు కుష్ఠరోగులు గలరు; వీరు వొకరినొకరిని
చూచి, మనము మరణమయ్యే పర్యంతమూ యిక్కడ
4 యెందుకు కూర్చుండి వుండవలెను? । పట్టణములోకి
ప్రవేశింతామని అనుకొంటే పట్టణమందు క్షామము
వున్నందున అక్కడ మరణమవుదుము; యిక్కడ వూ
రక కూర్చుండి వుంటే యిక్కడనున్ను మరణమవుదు
ము; కాబట్టి పదండి, అరామీయులయొక్క దండు
పేటలో పడుదాము, వారు మనలను బ్రతుకనిస్తే బ్రతు
కుదాము, మనలను చంపితే మరణమే పొందుతామని
అనుకొని; । వెలుగు వుండగానే అరామీయులయొక్క 5
దండు పేటలోకి వెళ్లడానకు లేచిరి; అయితే వాండ్లు
అరామీయుల దండు బైటికి వచ్చినప్పుడు యిదుగో
అక్కడ వొకడయినా వుండక పోయెను. । యేమంటే 6
యెహోవా రథములయొక్క శబ్దమునున్ను గుఱ్ఱము
లయొక్క శబ్దమునున్ను గొప్ప సమూహముయొక్క
శబ్దమునున్ను అరామీయుల సమూహమునకు వినపడే
టట్టు చేసెను; కాబట్టి వారు వొకరినొకరు చూచి,
యిదుగో, మన మీదికి రావడానకు ఇశ్రాయేలు రాజు
హిత్తీయులయొక్క రాజులకున్ను మిస్రీయులయొక్క
రాజులకున్ను బత్తెము యిచ్చెనని చెప్పుకొని, । లేచి, 7
వెలుగు వుండగానే పారిపోయిరి; తమ డేరాలనున్ను
గుఱ్ఱములనున్ను గార్దభములనున్ను దండు పేట యే
లాగున్నదో ఆలాగుననే దానిన్ని విడచి, తమతమ
ప్రాణముల నిమిత్తము పారిపోయిరి. । కాబట్టి ఆ కుష్ఠ 8
రోగులు దండు పేట బయిటకు వచ్చినప్పుడు వొక
డేరాలోకి వెళ్లి భోజనమునున్ను పానమునున్ను చేసి,
అక్కడనుంచి వెండిన్ని బంగారమునున్ను బట్టలనున్ను
యెత్తుకుపోయి దాచబెట్టి, మళ్లీ వచ్చి మరి వొక డేరా
లోకి ప్రవేశించి అక్కడనుంచి సొమ్ము యెత్తుకుపోయి
దాచిపెట్టిరి. । అప్పుడు వారు వొకరితో వొకరు అను 9
కొనినదేమంటే, మనము చేసేది మంచిది కాదు; నేటి
దినము శుభసమాచారములు గల దినమయినప్పటికిన్ని
వూరకే వున్నాము; తెల్లవారే పర్యంతమూ మనము
యిక్కడ వుంటే యేదయినా వొక మోసము మనకు
సంభవించును; కాబట్టి రండి, మనము వెళ్లి రాజుయొ
క్క యింటివారితో తెలియ చెప్పుదామని అనుకొని, ।
వచ్చి, పట్టణపు ద్వారపాలకుని పిలిచి, వానితో మేము 10
అరామీయులయొక్క దండు పేటకు వెళ్లినాము; యి
దుగో అక్కడ యే మనిషి అయినా లేదు; మనిషి
చప్పుడైనా లేదు అయితే కట్టపడిన గుఱ్ఱములున్ను
కట్టపడిన గార్దభములున్ను వున్నవి; డేరాలున్ను ఆ
లాగుననే వున్నవని చెప్పిరి. । అప్పుడు వాడు ద్వార 11
పాలకులను పిలిచినందున వారు లోపలనున్న రాజు
యింటివారితో తెలియ చెప్పిరి. । కాబట్టి రాజు రాత్రి 12
లో లేచి, తన సేవకులను చూచి, అరామీయులు మ
నకు చేసిన దానిని మీకు చూపింతును; మనము ఆకటి
తోటి వున్న సంగతి వారికి తెలిసినందున వారు అను

కొన్నదేమంటే, వీండ్లు పట్టణములోనుంచి బైటకు వస్తే
మనము వారిని జీవముతోటి పట్టుకొని పట్టణములోకి
వెళ్లగలమని యోచన చేసి, పేట విడచి పొలములోకి
13 వెళ్లి పొంచి వున్నారని చెప్పినప్పుడు; । అతని సేవకుల
లో వొకడు ప్రత్యుత్తరముగా చెప్పినదేమంటే, మీకు
అనుకూలమయితే కొందరిని యీ పట్టణమందు శేషించి
యున్న అయిదు గుఱ్ఱములను తీసుకొని పోనివ్వండి;
(యిదిగో అవి పట్టణములో శేషించి వున్న ఇశ్రా
యేలు సమూహమువలె వున్నవి, యిదిగో అవి లయమై
పోయిన ఇశ్రాయేలు సమూహమువలె వున్నవి); మన
14 ము పంపి చూతామని చెప్పెను.। కాబట్టి వారు జోడు
రథములయొక్క గుఱ్ఱములను తీసుకొన్నప్పుడు రాజు
వారితో అరామీయులయొక్క సమూహము వెనుక
15 నుంచి వెళ్లి చూచి రండని చెప్పి పంపెను. । కాబట్టి
వీరు వారి వెనుకనుంచి యర్దేను నది మట్టుకు వెళ్లి,
యిదుగో మార్గమంతా తొందరగా పోయిన అరామీ
యులు పారవేసిన వస్త్రములచేతనున్ను సామానులచేత
నున్ను నిండి వున్నదని చూచి, యీ దూతలు తిరిగీ వచ్చి
16 రాజుతో తెలియ చెప్పిరి. । అప్పుడు జనులు బయిలు
వెళ్లి అరామీయులయొక్క పేటను దోచుకొనిరి.
కాబట్టి యెహోవాయొక్క వాక్యప్రకారము షె
కేలు వొక్కంటికి వొక కొల సన్నపు పిండిన్ని, షెకేలు
వొక్కంటికి రెండు కొలలు యవ గోధుములున్ను అమ్మ
17 బడెను. । అయితే రాజు యే అధిపతి చేతి మీద తాను
ఆనుకొన్నాడో వాని ఆ ద్వారమునకు నిర్ణయించి
వుండెను; కాబట్టి జనులు ద్వారమందున్న వాని తొ
క్కినందున రాజు దైవ జనుని యొద్దికి వచ్చినప్పుడు వా
నితో ఆ దైవ జనుడు చెప్పిన ప్రకారము వాడు మర
18 ణమాయెను. । మరిన్ని షెకేలు వొక్కంటికి రెండు
కొలలు యవగోధుములున్ను, షెకేలు వొక్కంటికి వొక
కొల సన్నపు పిండిన్ని రేపు యీ వేళప్పుడు షోమ్రో
నులో అమ్మబడునని దైవ జనుడు రాజుతో చెప్పిన
19 ప్రకారముగా సంభవించెను. । ఆ అధిపతి దైవ జను
డయిన అతని చూచి, ఆతనితో యిదుగో యెహో
వా ఆకాశమందు కిటికీలు తెరచినప్పటికిన్ని అది
అవునా అని పలికి వుండెను; కాబట్టి అతడు వీనితో
నీవు నీ కండ్లతో చూతువు గాని దాని తినకపోదువని
20 చెప్పెను. । అది ఆలాగున యిప్పుడు వానికి సంభవిం
చెను; యేమంటే జనులు ద్వారమందున్న వాని తొ
క్కినందున వాడు మరణమాయెను.

## 8. అధ్యాయము.

1 అంతట ఎలీషా యే స్త్రీ కుమారుని తాను బ్రతి
కించెనో దాని చూచి చెప్పినదేమంటే, నీవు లేచి,
నీవున్ను నీ యింటివారున్ను యెక్కడ వుండడానకు
యోగ్యమో అక్కడికి వెళ్లి వుండుము, యేమంటే
యెహోవా క్షామము వచ్చేటట్టు చేసి యున్నాడు;
అది దేశము మీద యేడు సంవత్సరములు వుంటూ
వుండునని చెప్పెను. । కాబట్టి ఆ స్త్రీ లేచి, దైవ జనుని 2
మాట ప్రకారము చేసి, తన యింటివారిని తీసుకొని,
పెలిష్తీయుల దేశమునకు పోయి, యేడు సంవత్సరములు
అక్కడ వుండెను. । అయితే యేడు సంవత్సరములు 3
గతించిన తరువాత ఆ స్త్రీ పెలిష్తీయుల దేశములో
నుంచి తిరిగీ వచ్చి, తన యింటి నిమిత్తమున్ను భూమి
నిమిత్తమున్ను మొఱ్ఱ పెట్టడానకు రాజు యొద్దికి
వచ్చెను. । అంతట రాజు దైవ జనునియొక్క సేవకు 4
డయిన గేహజీతో మాట్లాడుతూ ఎలీషా చేసిన గొప్ప
కార్యములన్నిటినీ నాకు తెలియ చెప్పుమని అతని
తోను అనెను. । కాబట్టి వాడు అతడు వొక శవమునకు 5
తిరిగీ ప్రాణమును రప్పించిన సంగతి రాజుకు తెలియ
చెప్పుతూ వుండగా, యిదుగో యే స్త్రీ కుమారుని అత
డు తిరిగీ బ్రతికించెనో ఆ స్త్రీ తన యింటి నిమిత్తము
న్ను తన భూమి నిమిత్తమున్ను రాజు యొద్ద మొఱ్ఱ
పెట్టెను; అప్పుడు గేహజీ అనిన మాట, రాజయిన
వో నా యేలినవారా, ఆ స్త్రీ యిదే, మరిన్ని ఎలీషా
తిరిగీ బ్రతికించిన దీని కుమారుడు వీడే అని చెప్పెను. ।
అప్పుడు రాజు ఆ స్త్రీని అడిగినందున అది అతనితో 6
తెలియ చెప్పెను; కాబట్టి రాజు దాని నిమిత్తము వొక
పరిచారకుని నిర్ణయించి చెప్పినదేమంటే, దాని
స్వంతమైనది యావత్తున్ను అది దేశము విడిచినప్పటి
నుంచీ నేటి వరకు భూమి ఫలించిన పంట అంతానున్ను
దానికి తిరిగీ యిమ్మని సెలవు యిచ్చెను. । అయితే 7
ఎలీషా దమస్కుకు వచ్చెను; అప్పుడు అరాము రాజ
యిన బెన్హదదు రోగి అయి వుండెను; మరిన్ని దైవ
జనుడైన అతడు యిక్కడికి వచ్చి వున్నాడని అతనికి
చెప్పబడెను: । కాబట్టి రాజు హజాయేలుతో అనిన 8
మాట, నీవు కానుక వొకటి చేత పట్టుకొని, దైవ జను
డయిన అతని యెదుర్కోవడానకు వెళ్లి, యీ రోగ
మునుంచి నేను బాగు పడుదునో లేదో అని అతని
ద్వారా యెహోవాను అడుగుమని చెప్పి పంపెను. ।
కాబట్టి హజాయేలు నలభై వొంటెలు మోషే దమ 9
స్కులో వున్న విశేషమైన వస్తువులను కానుకగా
తీసుకొని, అతని యెదుర్కోవడానకు వచ్చి, అతని
ముందర నిలిచి చెప్పినదేమంటే, నీ కుమారుడున్ను
అరాము రాజున్ను అయిన బెన్హదదు యీ రోగము
నుంచి నేను బాగుపడుదునో లేదో అని అడుగడా
నకు నన్ను పంపినాడని చెప్పెను. । అప్పుడు ఎలీషా 10
అతనితో నీవు అతని యొద్దికి వెళ్లి నిశ్చయముగా నీకు

స్వస్థత కలుగ వచ్చునని చెప్పుము, అయినప్పటికిన్ని
అతనికి అవశ్యముగా మరణము సంభవించునని యె
11 హోవా నాకు తెలియ చేసెనని పలికి, ।తన ముఖము
చిన్నబోయే మట్టుకు నిబ్బరముగా స్థిరపర్చుకొనెను;
12 అప్పుడా దైవ జనుడు కన్నీళ్లను రాల్చెను. ।అప్పుడు
హజాయేలు అతనితో నా యేలినవాడవైన నీవు కన్నీ
ళ్లను రాల్చెదవేమని అడిగినందున, అతడు ప్రత్యు
త్తరముగా చెప్పినదేమంటే, ఇశ్రాయేలు పుత్రులకు
నీవు చేయబోయే కీడును నేను యెరుగుదును గనుక
కన్నీళ్లను రాల్చితిని; యేమంటే వారి గట్టి స్థలములను
నీవు కాల్చివేతువు; వారి పడుచువాండ్లను కత్తిచేత హ
తము చేతువు; వారి పిల్లలను నేలతో కొట్టివేతువు;
వారి గర్భిణీ స్త్రీలయొక్క కడుపులను చించివేతువని
13 చెప్పినందున; ।హజాయేలు అతని చూచి, నీ సేవకుడ
నైన నేను యింత కార్యము చేయడానకు కుక్కనై
యున్నానా? అని అనెను; అందుకు ఎలీషా నీవు అరా
ము మీద రాజవవుదువని యెహోవా నాకు చూపించి
4 వున్నాడని చెప్పెను. ।అప్పుడు అతడు ఎలీషాను విడచి
వెళ్లి, తన యజమానుని యొద్దికి వచ్చెను; ఇతడు అతని
చూచి ఎలీషా నీతో చెప్పినది యేమని అడిగితే, అత
డు నిజముగా నీవు బాగుపడుదువని చెప్పినాడని చెప్పె
5 ను. ।అయితే మరునాటి యందు ఇతడు దళసరి అయిన
బట్టను తీసుకొని, నీట్లో ముంచి, అతని ముఖము మీద
పరచినందున అతడు మరణమాయెను; అప్పుడు హజా
6 యేలు అతనికి మారుగా యేలెను. ।అహాబు కుమారు
డున్ను ఇశ్రాయేలు రాజున్ను అయిన యెహోరాము
యేలుబడియొక్క అయిదో సంవత్సరమందు యెహో
షాఫాథు యూదా రాజై వుండగా యూదా రాజైన
యెహోషాఫాథుయొక్క కుమారుడైన యెహోరా
7 ము యేలనారంభించెను. ।అతడు యేలనారంభించినప్పు
డు ముప్పైరెండు సంవత్సరములవాడై వుండి, యెరూ
శలేము యందు యెనిమిది సంవత్సరములు యేలెను. ।
8 అయితే అహాబుయొక్క యింటిలాగున యితడు ఇశ్రా
యేలు రాజులయొక్క మార్గములందు నడిచి, యె
హోవా దృష్టి యెదుట కీడు చేసెను; యేమంటే
అహాబుయొక్క కుమార్తె యితనికి భార్యయై వుండె
9 ను. ।అయినప్పటికిన్ని యెహోవా తన సేవకుడైన
దావీదు కొరకు యూదాను నశింప చేయడానకు మన
స్సు లేక వుండెను; యేమంటే సదా కాలము అతని
కిన్ని అతని బిడ్డలకున్ను దీపము వుండ చేతునని వాగ్దత్త
0 మిచ్చి వుండెను. ।యితని దినములందు ఎదోమీయులు
యూదాయొక్క కర్తృత్వములోనుంచి వ్యతిరిక్తులై
1 లేచి తమ మీద వొకని రాజుగా చేసుకొనిరి. ।కాబట్టి
యెహోరాము రథములన్నిన్ని తీసుక వెళ్లి, సాయీ
రా అనే స్థలమునకు వచ్చి, రాత్రిలో లేచి తనకు చు
ట్టూ వున్న ఎదోమీయులనున్ను రథములయొక్క అధి
పతులనున్ను కొట్టినందున జనులు తమ తమ డేరాలకు
పారిపోయిరి. ।అయినప్పటికిన్ని నేటివరకు ఎదోమీ 22
యులు యూదా కర్తృత్వమునకు తిరగబడిరి; లిబ్నా
పట్టణమున్ను ఆ సమయమందు తిరగబడినది. ।అయితే 23
యెహోరాముయొక్క తతిమ్మా కార్యములున్ను అత
డు చేసినదంతానున్ను యూదా రాజులయొక్క వృ
త్తాంతముల గ్రంథమందు వ్రాయబడి యున్నవి గదా?।
యెహోరాము తన పితృలతో కూడా సమాధిలో 24
పెట్టబడెను; అతని కుమారుడైన అహజ్యా అతనికి మా
రుగా యేలెను. ।అహాబు కుమారుడున్ను ఇశ్రాయేలు 25
రాజున్ను అయిన యెహోరాము యేలుబడియొక్క
పండెండో సంవత్సరమందు యూదా రాజైన యె
హోరాముయొక్క కుమారుడైన అహజ్యా యేలనా
రంభించెను. ।అహజ్యా యేలనారంభించినప్పుడు యిరు 26
వైరెండు సంవత్సరములు గలవాడై వుండి, యెరూశ
లేములో వొక సంవత్సరము యేలెను; అతని తల్లి పేరు
అతల్యా అని వుండెను; యిది ఇశ్రాయేలు రాజైన
ఒమ్రియొక్క కుమార్తె అయి వుండెను. ।అతడు 27
అహాబుయొక్క యింటిమార్గమందు నడచి అహాబు
యొక్క యింటివాండ్లలాగున యెహోవా దృష్టి యె
దుట కీడు చేసెను, యేమంటే అతడు అహాబుయొక్క
యింటికి అల్లుడై వుండెను. ।అతడు అహాబుయొక్క 28
కుమారుడైన యెహోరాముతో కూడా రామోత్గిలాదు
యందు అరాము రాజైన హజాయేలు మీద యుద్ధము
చేయడానకు వెళ్లెను; అప్పుడు అరామీయులు యె
హోరామును గాయములను పొందించిరి. ।అప్పుడు 29
రాజైన యెహోరాము అరాము రాజైన హజాయేలు
మీద తాను రామాలో యుద్ధము చేసినప్పుడు అరా
మీయులవల్ల పొందిన గాయములనుంచి తనకు స్వస్థత
కలుగుటకు ఇజ్రెయేలు వూరికి తిరిగీ వచ్చెను; అయినం
దున యూదా రాజైన యెహోరాముయొక్క కుమా
రుడైన అహజ్యా అహాబు కుమారుడైన యెహోరా
మును చూడడానకు ఇజ్రెయేలు వూరికి దిగివచ్చెను,
యెందుకంటే అతడు రోగియై వుండెను.

## 9. అధ్యాయము.

అంతట దీర్ఘదర్శియైన ఎలీషా దీర్ఘదర్శుల 1
యొక్క పుత్రులలో వొకని పిలువనంపించి వానితో
అనిన మాట, నీ నడుమును బిగించుకొని, తైలముతో
వున్న యీ గిన్నె చేత పట్టుకొని, రామోత్గిలాదుకు
వెళ్లుము. ।అక్కడ ప్రవేశించినప్పుడు నింషీకి పుట్టిన 2
యెహోషాఫాథుయొక్క కుమారుడైన యెహూయె

క్క స్థలమును వెలికి లోపల ప్రవేశించి, అతని సహో
దరులలోనుంచి అతని లేవచేసి, అంతరంగపు గదిలోకి
3 పిలుచుకొని, । తైలముతో వున్న గిన్నె తీసుకొని అతని
శిరస్సు మీద పోసి, అతనితో నేను నిన్ను ఇశ్రాయేలు
మీద పట్టాభిషిక్తునిగా చేస్తినని యెహోవా ఆనతిచ్చె
నని చెప్పి, తలుపు తీసి ఆలస్యము చేయక పారిపొమ్మని
4 చెప్పి పంపెను. । ఆ పడుచువాడైన దీర్ఘదర్శి అనే
5 వాడు వెళ్లి రామోత్గిలాదుకు వచ్చెను. । వచ్చినప్పుడు
యిదుగో సమూహాధిపతులు కూచుండని వుండిరి; అప్పు
డు వాడు ఓయీ అధిపతీ, నీకు ఒక కబురు తెస్తినని
చెప్పినప్పుడు, యెహూ మా అందరిలో యెవరిని గు
రించి అని అడుగగా అతడు ఓయీ అధిపతీ నిన్ను గురిం
చే అని చెప్పినందున అతడు లేచి యింట్లో ప్రవేశిం
6 చెను; । అప్పుడు అతడు అతని శిరస్సుమీద తైలము
పోసి, అతనితో నేను ఇశ్రాయేలనే యెహోవాయొ
7 క్క జనుల మీద నిన్ను పట్టాభిషిక్తునిగా చేస్తిని; । కా
బట్టి నా సేవకులైన దీర్ఘదర్శులయొక్క రక్తము నిమి
త్తమున్ను యెహోవా సేవకులందరియొక్క రక్తము
నిమిత్తమున్ను యెజబెలు మీద పగ తీర్చుకోవడానకు
నీవు నీ యజమానుడైన అహాబుయొక్క యిల్లు కొట్టు
8 దువు గాక. । యేమంటే అహాబుయొక్క యిల్లంతా
నాశనమౌను; గోడ మీద తన మూత్రము విడిచేవాని
నిన్ని ఇశ్రాయేలులో బంధించబడినవానినిన్ని విడిపిం
చబడినవానినిన్ని అహాబు యొద్దనుంచి తెగ వేతును. ।
9 యీలాగున అహాబుయొక్క యిల్లు నెబాథు కుమారు
డైన యారొబాముయొక్క యింటిలాగుననున్ను అహీ
యా కుమారుడైన బయషాయొక్క యింటిలాగుననున్ను
10 చేతును. । మరిన్ని శునకములు ఇజ్రెయేలు భూ భాగ
మందు యెజబెలును తినివేసినందున అది పాతిపెట్ట
బడక పోవును అని యెహోవా ఆనతిచ్చెనని చెప్పి,
11 తలుపు తీసి పారిపోయెను. । అప్పుడు యెహూ బయి
లు వెళ్లి తన యజమానునియొక్క సేవకుల యొద్దికి వచ్చె
ను; ఒకడు అతని చూచి అంతా బాగా వున్నదా? ఆ
వెర్రివాడు నీ యొద్దికి వచ్చిన హేతువు యేమని అడి
గెను; అందుకు అతడు వానినిన్ని వానియొక్క వర్త
12 మానమునున్ను మీరు యెరుగుదురని చెప్పెను. । కాబట్టి
వారు వానిని చూచి, అది అంతా అబద్ధము, మాకు
తెలియ చెప్పుమనినందున అతడు అనిన మాట, నేను
నిన్ను ఇశ్రాయేలు మీద పట్టాభిషిక్తునిగా చేస్తినని
యెహోవా ఆనతిచ్చెనని అతడు నాతో తెలియ చె
13 ప్పెనని చెప్పినప్పుడు; । వారు అతి వేగిరమే తన తన
వస్త్రమును ప్రతి మనిషీ పట్టుకొని, మెట్లు మీదను అతని
కింద పరిచి, బాకాలను వూదించి, యెహూ రాజై
14 వున్నాడని చాటించిరి. । యీలాగున నింషీకి పుట్టిన
యెహోషాఫాథుయొక్క కుమారుడైన యెహూ యె
హోరాము మీద జట్టు కూర్చుకొనెను; అంతట
యెహోరామున్ను ఇశ్రాయేలీయులందరున్ను అరా
ము రాజైన హజాయేలు నిమిత్తము రామోత్గిలాదును
కాస్తూ వుండిరి. । అయితే యెహోరాము అరాము 15
రాజైన హజాయేలుతో తాను పోట్లాడినప్పుడు అరా
మీయులవల్ల పొందిన గాయములనుంచి స్వస్థపడుటకు
ఇజ్రెయేలు వూరికి తిరిగీ వచ్చి వుండెను; కాబట్టి యె
హూ చెప్పినదేమంటే, మీకు అనుకూలమైతే యీ
సంగతి తెలియచేసే కొరకు ఇజ్రెయేలు వూరికి వెళ్ల
డానకు యీ పట్టణములోనుంచి యెవనినైనా తప్పిం
చుకొని పోనివ్వకండని చెప్పిన తరువాత, । యెహూ 16
రథమును యెక్కి ఇజ్రెయేలు వూరికి రావడానకు వెళ్లె
ను, యేమంటే అక్కడ యెహోరాము మంచము పట్టి
వుండెను; మరిన్ని యూదా రాజైన అహజ్యా యె
హోరామును చూడడానకు అక్కడికి వచ్చి వుండె
ను. । అప్పుడు ఇజ్రెయేలు గోపురము మీద కాచేవాడు 17
నిలిచి వుండి, వస్తూ వున్న యెహూయొక్క గుంపును
చూచి, గుంపు నాకు కనపడుతున్నదని తెలియ చెప్పి
నందున యెహోరాము ఒక రౌతును పిలిచి, వారిని
యెదుర్కోవడానకు వెళ్లి అంతా క్షేమమా అని అడు
గుమని చెప్పి పంపుమనెను. । కాబట్టి ఒకడు గుర్ర 18
మును యెక్కి వెళ్లి అతని యెదుర్కొని, క్షేమమా అని
రాజు అడుగుమన్నాడనెను; అందుకు యెహూ వాని
తో క్షేమమును గురించి నీకేమి? నీవు నా వెనుకకు
తిరిగి పొమ్మని చెప్పెను; అప్పుడు ఆ కాచేవాడు అనిన
మాట, పంపబడినవాడు వారిని కలుసుకొనెను, అయి
తే తిరిగీ రాలేదని చెప్పెను. । కాబట్టి అతడు రెండో 19
రౌతును బయిలు పంపెను; వీడు వారి యొద్దికి వచ్చి
క్షేమమా అని రాజు అడుగుమని చెప్పినప్పుడు యె
హూ వానితో క్షేమమును గురించి నీకేమి! నా వెనుక
కు తిరిగి పొమ్మని చెప్పెను. । అప్పుడు కాచేవాడు చెప్పి 20
నదేమంటే, వీడున్ను వారిని కలుసుకొని తిరిగీ రాలేదు;
మరిన్ని ఆ తోలడము నింషీ కుమారుడైన యెహూ
తోలడము వలెనే వున్నది, యేమంటే అతడు ప్రచం
డముగా తోలేవాడని చెప్పెను. । అప్పుడు యెహో 21
రాము రథము సిద్ధము చేయుమని సెలవిచ్చినందున అత
ని రథము సిద్ధము చేయబడెను; అప్పుడు ఇశ్రాయేలు
రాజైన యెహోరామున్ను యూదా రాజయిన అహ
జ్యాయున్ను తమ తమ రథములను యెక్కి, యెహూ
కు యెదురుగా పోయి, ఇజ్రెయేలీయుడైన నాబోతు
యొక్క భూ భాగమందు అతని యెదుర్కొనిరి. ।
అప్పుడు యెహోరాము యెహూను చూచి, ఓయీ 22
యెహూ, క్షేమమా అని అడిగితే, యెహూ అతనితో

నీ తల్లియైన యెజబెలుయొక్క జారత్వములున్ను చిల్లంగి
తనములున్ను యింత విస్తారమై వుండగా క్షేమమేదని
23 పలికినందున; । యెహోరాము రథము తిప్పి, అహ
జ్యాను చూచి, వో అహజ్యా, యిది ద్రోహమని
24 చెప్పి పారిపోయెను. । అప్పుడు యెహూ తన నిండు
బలముతో వింటిచేతను యెహోరాము భుజముల
మధ్యను కొట్టెను; కోల అతని గుండె దూసిపోయినం
25 దున అతడు తన రథమందునే వొరిగెను. । అప్పుడు
యెహూ తన అధిపతి అయిన బిద్కరుతో అనిన
మాట, అతని యెత్తి ఇజ్రెయేలీయుడైన నాబోతుయొ
క్క భూభాగమందు పడవేయుము, యేమంటే మేమి
ద్దరమున్ను అతని తండ్రియైన అహాబు వెనుకనుంచి
గుర్రమును యెక్కి వచ్చినప్పుడు యెహోవా అతని
మీద యీ భారము పెట్టిన సంగతి నీకు జ్ఞాపకము
26 కావలెను. । అప్పుడు యెహోవా సెలవు యిచ్చినలా
గు యేమంటే, నిన్నను నేను నాబోతుయొక్క రక్తము
నున్ను వాని కుమారుల రక్తమునున్ను నిజముగా చూ
స్తిని గనుక యీ భూ భాగమందు నేను దీనికి సమ
ముగా తీర్చునని ఆనతిచ్చెను; కాబట్టి నీవు అతని
యెత్తి యెహోవాయొక్క వాక్య ప్రకారము యీ
27 భూ భాగమందు పడవేయవలసినదని చెప్పెను. । అయి
తే యూదా రాజైన అహజ్యా యిది చూచినప్పుడు
తోట యింటి మార్గముగా పారిపోయెను; అయితే
యెహూ అతని తరిమి, రథమునందు అతని కొట్టండని
చెప్పినందున వారు ఇబ్లెయాము దగ్గిర వున్న గూరుకు
వెళ్లే మార్గమందు ఆలాగున చేసిరి; అప్పుడు అతడు
28 మెగిద్దోకు పారిపోయి అక్కడ మరణమాయెను. । అప్పు
డు అతని సేవకులు అతని రథము మీద వేసి, యెరూ
శలేముకు తీసుకపోయి, దావీదుయొక్క పురమందు
29 అతని పితృల సమాధిలో అతని పెట్టిరి. । అహజ్యా
అహాబు కుమారుడయిన యెహోరాము యేలుబడి
యొక్క పదకొండో సంవత్సరమందు యూదాను యే
30 లనారంభించెను. । అంతట యెహూ ఇజ్రెయేలు వూ
రికి వచ్చిన సంగతి యెజబెలుకు వినబడెను; కాబట్టి
అది తన ముఖము మీద రంగు రాచుకొని, శిరోభూష
ణములను ధరించుకొని, కిటికీలోనుంచి చూస్తూ వుండి, ।
31 యెహూ ద్వారములో ప్రవేశించినప్పుడు అతని చూచి,
తన యజమానుని చంపిన జిమ్రికి క్షేమము కలిగెనా
32 అని పలికెను. । అప్పుడు అతడు కిటికీ తట్టు ముఖము
యెత్తి చూచి, నా పక్షమందు యెవరెవరున్నారని అడ
గగా, యిద్దరు షండులు మీదనుంచి తమ్మును అగుప
33 చుకొనిరి. । అప్పుడు అతడు దాన్ని కింద పడవేయం
డని చెప్పినప్పుడు వారు దాన్ని కింద పడవేసినందున,
దాని రక్తములో కొంత గోడ మీదనున్ను గుర్రముల
మీదనున్ను చిందెను; మరిన్ని అతడు దాన్ని కాళ్లతో
మట్టెను. । అయితే అతడు లోపలికి ప్రవేశించి భోజ 34
నము చేసిన తరువాత అతడు చెప్పినదేమంటే, మీరు
వెళ్లి ఆ శపించబడిన దానిని చూచి పాతి పెట్టండి,
యేమంటే అది రాజ కుమార్తె అని చెప్పెను. । కా 35
బట్టి దానిని పాతి పెట్టడానకు వారు వెళ్లిరి; అయితే
దాని కపాలమున్ను పాదములున్ను అరిచేతులున్ను
గాక మరి యేవైనా వారికి అగుపడలేదు. । కాబట్టి వారు 36
తిరిగీ వచ్చి అతనితో తెలియ చెప్పినప్పుడు అతడు
అనిన మాట, యిది యెహోవా తన సేవకుడున్ను
తిష్బీయుడున్ను అయిన ఏలీయా ద్వారా ఆనతిచ్చిన
వాక్య ప్రకారమై వున్నది, యేమంటే ఇజ్రెయేలు
భూ భాగమందు శునకములు యెజబెలుయొక్క మాం
సమును తినివేసును. । మరిన్ని యెజబెలుయొక్క కళే 37
బరము ఇజ్రెయేలు భూ భాగమందున్న పెంటలాగున
వుండును; కాబట్టి యిది యెజబెలు అని వారు చెప్ప
లేక పోదురని చెప్పె ననెను.

## 10. అధ్యాయము.

అయితే షోమ్రోనులో అహాబుకు డెబ్బయిమంది 1
కుమారులు గలరు. అంతట యెహూ వుత్తరములు
వ్రాసి, షోమ్రోనులో వుండే ఇజ్రెయేలుయొక్క అధి
పతులకున్ను పెద్దలకున్ను అహాబు పిల్లలను పెంచిన
వారికిన్ని పంపినదేమంటే; । మీ యజమానునియొక్క 2
కుమారులు మీ యొద్ద వున్నారు; మరిన్ని మీకు రథ
ములున్ను గుర్రములున్ను ప్రాకారము గల పట్టణము
న్ను ఆయుధములున్ను కలవు. । కాబట్టి యీ వుత్తరము 3
మీ చేతికి వచ్చిన తత్క్షణమందు మీ యజమానుని
యొక్క కుమారులలో వుత్తముడున్ను తగినవాడున్ను
అయిన వొకని యెంచుకొని, అతని తండ్రియొక్క
గద్దె మీద కూచుండబెట్టి, మీ యజమానునియొక్క
యింటికొరకు పోట్లాడండని చెప్పెను. । అయితే వారు 4
బహుగా భయపడి, యిదుగో యిద్దరు రాజులు అతని
ముందర నిలువ లేక పోయిరి, మనము యేలాగున
నిలువ గలమని అనుకొనిరి. । అప్పుడు యింటి అధికా 5
రిన్ని పట్టణపు అధికారిన్ని పెద్దలున్ను పిల్లలను పెంచిన
వారున్ను యెహూకు వర్తమానము పంపినదేమంటే,
మేము మీకు సేవకులము, మీరు మాకు యే సెలవయి
నా యిస్తే అది అంతా చేసేవారమౌదుము; మేము యె
వనినయినా రాజుగా చేసుకోము; మీ దృష్టికి యేది
మంచిదో అది చేయండని చెప్పిరి. । అప్పుడు అతడు 6
రెండో వుత్తరము వ్రాసి, మీరు మా వారయి వుండి
మేము చెప్పిన మాట విన మనస్సు కలవారయితే మీ
యజమానునియొక్క కుమారుల శిరస్సులను తీసుకొని,

రేపు యీ వేళకు ఇశ్రాయేలులో మా యొద్దికి రండని
పంపెను; అయితే రాజకుమారులు డెబ్బయి మందిన్ని
వారిని పెంచిన పట్టణపు గొప్పవారియొద్ద వుండిరి. ।
7 కాబట్టి ఆ వుత్తరము వారి చేతికి వచ్చినప్పుడు వారు
రాజు కుమారులను డెబ్బయిమందినీ పట్టుకొని చంపి,
వారి శిరస్సులను గంపలలో పెట్టి, ఇశ్రాయేలులో
8 వున్న అతని యొద్దికి పంపిరి. । అప్పుడు వొక దూత
అతని యొద్దికి వచ్చి, రాజు కుమారులయొక్క శిరస్సు
లను తెచ్చినారని చెప్పినప్పుడు వుదయము పర్యంత
మూ ద్వారము బయిటి స్థలమందు రెండు కుప్పలుగా
9 వాటిని వేయించుమనెను. । వుదయమయినప్పుడు అత
డు బయిలువెళ్లి నిలిచి, జనులందరిని చూచి, వారితో
మీరు నీతిపరులై వున్నారు; యిదుగో నేను నా యజ
మానుని మీద జత కూర్చుకొని, అతని చంపితిని, అయి
10 తే వీరందరినీ యెవరు చంపినారు? । యిందువల్ల మీకు
తెలియ వలసినదేమంటే, అహాబుయొక్క యింటిని
గురించి యెహోవా ఆనతిచ్చిన వాక్యములో వొకటైనా
నా నేల మీద పడేది లేదు, యేమంటే తన సేవకుడ
యిన ఏలీయా ద్వారా యెహోవా యేమి ఆనతిచ్చె
11 నో అదే ఆయన నెరవేర్చెనని చెప్పెను. । యీలా
గున యీ యెహూ ఇశ్రాయేలులో అహాబుయొక్క
యింట్లో వున్నవారినందరినిన్ని అతని గొప్పవారినం
దరినిన్ని అతని బంధువులనందరినిన్ని అర్చకులనున్ను
చంపించెను. అతనికి వొకనినయినా వుండనివ్వలేదు. ।
12 అప్పుడు అతడు లేచి వెళ్లి, షోమ్రోను పట్టణ
మునకు వచ్చెను; అయితే అతడు మార్గవశాత్తు గొర్రె
13 వెంట్రుకలను కత్తిరించే యింటికి వచ్చినప్పుడు, । యె
హూ యూదా రాజైన అహజ్యాయొక్క సహోద
రులను యెదుర్కొని, వారిని చూచి మీరు యెవరని
అడగగా, వారు మేము అహజ్యాయొక్క సహోద
రులము; రాజుయొక్క కుమారులనున్ను రాణియొక్క
కుమారులనున్ను పరామర్శించడానకు వెళ్లుతూ వున్నా
14 మని చెప్పినప్పుడు; । వీరిని జీవముతోటి పట్టుకొండని
అతడు చెప్పినందున వారు వారిని జీవముతోటి పట్టు
కొని, గొర్రె వెంట్రుకలను కత్తిరించేయింటి గోతిదగ్గిర
నలభయి యిద్దరినీ చంపిరి; అతడు వొకనినైనా వుండ
15 నివ్వలేదు. । అక్కడనుంచి అతడు వెళ్లిన తరువాత
తన్ను యెదుర్కోవడానకు వచ్చిన రేఖాబుయొక్క
కుమారుడయిన యెహోనాదాబును చూచి, అతని
పరామర్శించి, నా హృదయము నీ హృదయముతో
వున్నట్టు నీ హృదయము సరిగా వున్నదా అని అతని
అడిగినప్పుడు, యెహోనాదాబు సరిగా వున్నదని
చెప్పెను; ఆలాగైతే నీ చెయ్యి నా చేతికి యిమ్మని
అనగా అతడు తన చెయ్యి యితని చేతికి యిచ్చినం
దున యితడు తన రథము మీద అతని యెక్కించు
కొని, । అతనితో యెహోవాను గురించి నాకు కలి 16
గిన ఆ సక్తిని చూచుటకు నాతో కూడా రమ్మని చెప్పె
ను; కాబట్టి వారు యితని రథము మీద కూర్చుండ
బెట్టిరి. । యీలాగున అతడు షోమ్రోనుకు వచ్చినప్పు 17
డు షోమ్రోనులో అహాబుకు కలిగి వున్న వారినందరి
నిన్ని చంపి, ఏలీయాతో యెహోవా ఆనతిచ్చిన
వాక్య ప్రకారము అతని సర్వనాశనము చేసే పర్యంత
మూ హతముచేయుట మానక వుండెను. । అప్పుడు 18
యెహూ జనులందరినీ కూర్చుకొని వారితో చెప్పిన
దేమంటే, అహాబు బయలుకు కొద్దిగా సేవ చేసెను,
అయితే యెహూ అనే నేను బహుగా సేవ చేతును. ।
కాబట్టి బయలుయొక్క దీర్ఘదర్శులనందరినిన్ని 19
వాని సేవకుల నందరినిన్ని వాని అర్చకులనందరినిన్ని
వొకడైనా వుండిపోకుండా నా యొద్దికి పిలువనంపిం
చండి, యేమంటే నేను బయలు కొరకు గొప్ప బలిని
అర్పించ బోతున్నాను; కాబట్టి రాకపోయినవాడు
యెవడో వాని బ్రతుక నివ్వనని చెప్పెను. అయితే
యెహూ బయలును మ్రొక్కినవారిని నాశనము
చేయడానకు యీలాగున కపటోపాయము చేసెను. ।
మరిన్ని యెహూ బయలు కొరకు నియమించబడ్డ సం 20
భ్రమము చాటించండని చెప్పినందున వారు చాటిం
చిరి; । మరిన్ని యెహూ ఇశ్రాయేలు దేశమంతటిలోకి 21
కబురు పంపించినందున బయలుకు మ్రొక్కినవారంద
రున్ను వచ్చిరి, రానివాడు వొకడూ లేదు; వారు వచ్చి
బయలుయొక్క గుడిలో ప్రవేశించినందున బయలు గుడి
యీ తట్టునుంచి ఆ తట్టు పర్యంతమూ నిండి వుండెను. ।
అప్పుడు అతడు వస్త్రములను వుంచిన గది మీద వున్న 22
అధికారిని చూచి, బయలుకు మ్రొక్కిన వారందరి
కొరకు వస్త్రములను బయిటికి తెప్పించుమని చెప్పినం
దున వాడు తెప్పించెను. । అప్పుడు యెహూయున్ను 23
రేఖాబు కుమారుడైన యెహోనాదాబున్ను బయలు
గుడిలో ప్రవేశించి, బయలుకు మ్రొక్కినవారితో
అనిన మాట, యెహోవాయొక్క సేవకులలో వొక
డైనా యిక్కడ మీ యొద్ద వుండకుండా బయలుకు
మ్రొక్కినవారు మాత్రమే వుండేటట్టుగా చూడం
డని చెప్పెను. । అయితే వారు బలులనున్ను హోమా 24
ర్పణలనున్ను చెల్లించడానకు లోపల ప్రవేశించినప్పుడు
యెహూ యెనభయి మందిని బయిట కాపు వుంచి
వారితో చెప్పినదేమంటే, నేను మీ వశము చేసిన
వారిలో వొకడైనా తప్పించుకొని పోయినట్టయితే
వీని ప్రాణము వాని ప్రాణమునకు మారుగా తీసు
కుందునని చెప్పెను. । అయితే హోమార్పణ చెల్లించ 25
డము సమాప్తమయినప్పుడు యెహూ ఆ తలవర్లతో

నున్ను అధిపతులతోనున్ను మీరు లోపలికి చొచ్చి
వొకడయినా బయిటికి రాకుండా వారిని చంపండని
చెప్పినందున వారు వారిని కత్తి వాడిచేత కొట్టిరి;
మరిన్ని తలవర్లున్ను అధిపతులున్ను వారిని బయి
టకు తోసివేసిరి; అప్పుడు వారు బయలు గుడి వున్న
26 పట్టణమునకు వెళ్లి, । బయలు గుడిలో నిలువబడిన
విగ్రహములను బయిటికి తీసుకు వచ్చి వాటిని కాల్చి
27 వేసిరి. । మరిన్ని బయలుయొక్క ప్రతిమనున్ను గుడి
నిన్ని కింద పడగొట్టి, దాని నేటివరకు పెంట యిల్లుగా
28 చేసిరి. । యీలాగు యెహూ బయలును ఇశ్రాయే
29 లులోనుంచి నాశనము చేసెను. । అయినప్పటికిన్ని
యెహూ ఇశ్రాయేలును పాపము చేయించిన నెబాథు
కుమారుడైన యారొబాముయొక్క పాపములు, అన
గా, బేతేలు దాను అనే యీ స్థలములందున్న బంగా
30 రపు దూడలను విడచిపెట్ట లేదు. । కాబట్టి యెహో
వా యెహూతో సెలవు యిచ్చినదేమంటే, నీవు
నా మనస్సులో వున్న అంతటి ప్రకారముగా అహాబు
యింటికి చేసి, నా నేత్రములకు యేది నీతిగా వుం
డునో అది జరిగించి బాగా చేస్తివి గనుక నీ బిడ్డలు
నాలుగో తరము మట్టుకు ఇశ్రాయేలు గద్దె మీద
31 ఆసీనులౌదురని ఆనతిచ్చెను. । అయితే యెహూ నిం
డైన హృదయముతో ఇశ్రాయేలు దేవుడైన యెహో
వాయొక్క న్యాయ ప్రమాణమందు నడవడానకు నిర్వి
చారుడై వుండెను, యేమంటే ఇశ్రాయేలును పాపము
చేయించిన యారొబాముయొక్క పాపములను అతడు
32 విడచినాడు కాడు. । ఆ దినములయందు యెహోవా
ఇశ్రాయేలీయులను తక్కువగా చేయనారంభించెను. ।
33 యేమంటే హజాయేలు వారిని ఇశ్రాయేలు సరిహద్దు
లలోనున్న యర్దేనుకు తూర్పు దిక్కుయందున్న
గాదీయుల రూబేనీయులయొక్క గిలాదు దేశమంత
టినిన్ని అర్నోను నది దగ్గిర వున్న అరోయేరు
మొదలుకొని మనస్సీయుల దేశమునున్ను అనగా గిలా
34 దునున్ను బాషానునున్ను కొట్టెను. । అయితే యెహూ
యొక్క తతిమ్మా కార్యములున్ను అతడు చేసినదంతా
నున్ను అతని పరాక్రమమున్ను ఇశ్రాయేలు రాజుల
యొక్క వృత్తాంతముల గ్రంథమందు వ్రాయపడి
35 యున్నవి గదా! । అంతట యెహూ తన పితృలతో
కూడా నిద్ర పొంది, షోమ్రోనులో సమాధియందు
పెట్టపడెను; అతని కుమారుడైన యెహోయాహాజు
36 అతనికి మారుగా యేలెను. । షోమ్రోనులో యెహూ
ఇశ్రాయేలును యేలిన కాలము యిరువై యెనిమిది
సంవత్సరములై వుండెను.

## 11. అధ్యాయము.

అహజ్యా తల్లియైన అతల్యా తన కుమారుడు మృతి 1
పొందెనని చూచినప్పుడు లేచి, రాజ పుత్రుల నంద
రినీ నాశనము చేసెను. । అయినప్పటికిన్ని రాజయిన 2
యెహోరాముయొక్క కుమార్తెయున్న అహజ్యాకు
సహోదరియున్ను అయిన యెహోషెబ అహజ్యా
కుమారుడైన యోవాషును హతమైన రాజ పుత్రుల
లోనుంచి రహస్యముగా తీసుకొనెను; తరువాత వారు
అతనినిన్ని అతని దాదినిన్ని పడక గదిలో అతల్యాకు
మరుగుగా వుంచినందున అతడు చంపపడక వుండెను. ।
ఇతడు ఆరు సంవత్సరములు యెహోవాయొక్క మం 3
దిరమందు దానితో కూడా దాచపడి వుండెను; అది
వరకు అతల్యా దేశమును యేలుతూ వుండెను. । యేడో 4
సంవత్సరమందు యెహోయాదా కాచేవాండ్ల మీద
నున్ను అధికారుల మీదనున్ను వున్న శతాధిపతులను
పిలువనంపించి, యెహోవాయొక్క మందిరములోకి
వారిని తీసుకు పోయి, యెహోవాయొక్క మందిర
మందు వారి యొద్ద ప్రమాణము పుచ్చుకొని, వారితో
వొడంబడికెను చేసుకొని, వారికి ఆ రాజ కుమారుని
అగుపర్చి ఆజ్ఞాపించినదేమంటే, । మీరు దీని చేయ 5
వలసినది, అది యేమంటే, సబ్బాతు దినమున లోపల
ప్రవేశించే మీరు మూడు భాగములై అందులోను
వొక భాగము వారు రాజుయొక్క మందిరముకు కాపు
వారై వుండ వలెను. । యొక భాగము వారు సూరు 6
అనే ద్వారము దగ్గిర వుండ వలెను; వొక భాగము
వారు ద్వారము యొద్ద కాచేవారి వెనుకను వుండ
వలెను; యీలాగున మందిరము కింద పడగొట్టబడ
కుండా మీరు దానిని కాచి వుండవలెను. । మరిన్ని 7
సబ్బాతు దినమున బైలు వెళ్లే మీ అందరిలో రెండు
భాగముల వారు రాజు దగ్గిర యెహోవాయొక్క
మందిరముకు కాపువారై వుండ వలెను. । మీలో ప్రతి 8
మనిషీ తన తన ఆయుధములను చేత పట్టుకొని రాజు
చుట్టూ కాచి వుండవలెను; యెవడైనా పజ్తులలో
ప్రవేశిస్తే వాడు చంపబడ వలసినది; రాజు బయిలు
వెళ్లినప్పుడున్ను లోపలికి వచ్చినప్పుడున్ను అతని యొద్ద
మీరు వుండవలెనని నిర్ణయించెను. । అయితే శతాధి 9
పతులు అర్చకుడైన యెహోయాదా ఆజ్ఞాపించిన
అన్నిటి ప్రకారము చేసిరి, యేమంటే ప్రతి మనిషీ
తన తన వారిని తీసుకొని, సబ్బాతు దినమున లోపల
ప్రవేశించవలసిన వారితోనున్ను సబ్బాతుదినమున బైలు
వెళ్ల వలసిన వారితోనున్ను అర్చకుడైన యెహో
యాదాయొద్దికి వచ్చెను. । అప్పుడు అర్చకుడు మంది 10

రములో వున్న దావీదుయొక్క యీటెలనున్ను డాళ్ల
11 నున్ను శతాధిపతులకు అప్పగించెను. । అప్పుడు కాచే
వారిలో ప్రతి మనిషి తన తన ఆయుధములను చేత
పట్టుకొని, బలిపీఠము తట్టున్ను మందిరము తట్టున్ను
మందిరముయొక్క కుడి కొన మొదలుకొని యెడమ
కొన పర్యంతమున్ను రాజు చుట్టున్ను నిలిచి వుండిరి. ।
12 అప్పుడు అర్చకుడు రాజు కుమారుని బైటకు తీసుక
వచ్చి, కిరీటము అతని శిరస్సు మీద పెట్టి, ప్రమాణ
లిఖితమును అతని చేతికి యిచ్చిన తరువాత వారు
అతని పట్టాభిషిక్తుని చేసి, చప్పట్లు చరచి, దేవుడు రా
13 జును రక్షించును గాకని పలికిరి. । అయితే అతల్యా
కాచే వారియొక్కనున్ను జనులయొక్కనున్ను ఆ
ధ్వనిని విని, యెహోవాయొక్క మందిరమందున్న
14 జనుల దగ్గిరకు వచ్చి చూచినప్పుడు, । యిదుగో రాజు
మర్యాదా ప్రకారము వొక స్తంభము దగ్గిర నిలిచి
వుండెను; అధిపతులున్ను బాకావాండ్లున్ను రాజు
యొద్ద నిలిచి వుండిరి; దేశపు వారందరున్ను సంతో
షించి బాకాలను వూదుతూ వుండిరి; అప్పుడు అత
ల్యా తన వస్త్రములను చించుకొని ద్రోహము ద్రోహ
15 మని కేక వేసెను. । అయితే అర్చకుడయిన యెహో
యాదా సమూహములో వున్న శతాధిపతులకు ఆజ్ఞా
పించినదేమంటే, పజ్తుల బైటికి దానిని వెళ్లగొట్ట వలె
ననిన్ని, దానిని వెంబడించే వాని కత్తిచేత చంపవలెన
నిన్ని చెప్పెను, యేమంటే అర్చకుడు యెహోవా
మందిరమందు దానిని చంప కూడదని చెప్పి వుండెను. ।
16 అయినందున వారు దాని మీద చేతులు వేసిరి; అది
రాజ మందిరములోకి గుర్రములు వచ్చే మార్గమున
17 వెళ్లిపోయెను; అక్కడ అది చంప బడెను. । అప్పుడు
యెహోయాదా యెహోవా మధ్యనున్ను రాజు
యొక్కజనులయొక్క మధ్యనున్ను వారు యెహోవా
యొక్క జనులయ్యేటట్టుగా వొడంబడికెను చేయిం
చెను; మరిన్ని రాజుకున్ను జనులకున్ను మధ్యను వొడం
18 బడికెను చేయించెను. । అప్పుడు దేశపు జనులందరు
న్ను బయలు గుడిలోకి వెళ్లి దానిని కింద పడగొట్టి,
దాని బలిపీఠములనున్ను ప్రతిమలనున్ను ఛిన్నాభిన్న
ములుగా చేసి, బలిపీఠముల ముందర మత్తాను అనే
బయలుయొక్క అర్చకుని చంపివేసిరి. మరిన్ని అర్చ
కుడైన యెహోయాదా యెహోవా మందిరము
19 కొరకు వ్యాపారకులను నిర్ణయించెను. । అప్పుడు
అతడు శతాధిపతులనున్ను అధికారులనున్ను కాచే
తలవర్లనున్ను దేశపు జనులందరినిన్ని పిలిపించుకొ
న్నందున వారు రాజును యెహోవాయొక్క మంది
రములోనుంచి తీసుకొని, కాచే వారియొక్క ద్వా
రపు మార్గమున రాజు మందిరమునకు వచ్చిరి; అప్పుడు
అతడు రాజులయొక్క గద్దె మీద ఆసీనుడై వుండెను. ।
మరిన్ని వారు రాజుయొక్క మందిరము దగ్గిర అత 20
ల్యాను కత్తిచేత చంపిన తరువాత దేశపు జనులందరున్ను
సంతోషముగా వుండిరి; పట్టణమున్ను నిమ్మళముగా వుం
డెను. । యెహోయాషు యేల నారంభించినప్పుడు 21
యేడు సంవత్సరములు గలవాడై వుండెను.

## 12. అధ్యాయము.

యెహూ యేలుబడియొక్క యేడో సంవత్సర 1
మందు యెహోయాషు యేలనారంభించి, యెరూశ
లేములో నలుబై సంవత్సరములు యేలెను; అతని తల్లి
బెయేర్షెబ సంబంధురాలై సిబ్యా అనే పేరు గలదై
వుండెను. । యెహోయాషు తన దినములన్నిటియందూ 2
తనకు బుద్ధి నేర్పడానకు అర్చకుడైన యెహోయా
దా వుండగా యెహోవా దృష్టికి యేది మంచిదో అది
చేస్తూ వుండెను. । అయినప్పటికిన్ని వున్నతమైన స్థలము 3
లు తీసివేయబడక వుండెను, యేమంటే జనులు వున్న
తమైన స్థలములందు బలులనున్ను ధూపములనున్ను
యింకా చెల్లిస్తూ వుండిరి. । అంతట యెహోయాషు 4
అర్చకులతో చెప్పినదేమంటే, యెహోవాయొక్క
మందిరములోకి తేబడే పరిశుద్ధ వస్తువులయొక్క విలు
వనున్ను, లెక్కకు దాటిపోయే ప్రతి మనిషియొక్క
ద్రవ్యమునున్ను, మదింపు చొప్పున ప్రతి మనిషికి
నిర్ణయమైన ద్రవ్యమునున్ను, స్వేచ్ఛచేత యెవడైనా
యెహోవాయొక్క మందిరములోకి తెచ్చిన ద్రవ్య
మునున్ను, । అర్చకులలో ప్రతి మనిషీ తనకు నెల 5
వైన వారియొద్ద పుచ్చుకొని మందిరమందు యెక్కడె
క్కడ శిథిలమైన స్థలములు వున్నవో అవి బాగు
చేయించ వలెనని చెప్పెను. । అయితే యెహోయాషు 6
యేలుబడియొక్క యిరువై మూడో సంవత్సరము
సరికి అర్చకులు మందిరముయొక్క శిథిలమైన స్థల
ములను బాగు చేయించడము లేదు. । అప్పుడు యె 7
హోయాషు అర్చకుడైన యెహోయాదానున్ను
తతిమ్మా అర్చకులనున్ను పిలువనంపించి వారితో చెప్పిన
దేమంటే, మందిరముయొక్క శిథిలమైన స్థలములను
బాగు చేయించక పోతిరేమి? కాబట్టి యికను మీరు
నెలవైన వారి యొద్ద ద్రవ్యము పుచ్చుకోకుండా మం
దిరముయొక్క శిథిలమైన స్థలములను బాగు చేసుటకు
దాని అప్పగించండని చెప్పినందున, । అర్చకులు జనుల 8
యొద్ద ద్రవ్యము పుచ్చుకోక వుండుటకున్ను మందిర
ముయొక్క శిథిలమైన స్థలములను బాగు చేయించక
వుండుటకున్ను సమ్మతించిరి. । అయితే అర్చకుడైన 9
యెహోయాదా వొక పెట్టెను తెచ్చి, దాని కప్పుకు
రంధ్రము చేసి బలిపీఠము తట్టు యెహోవా మందిర

ములో ప్రవేశించే వాని కుడి పార్శ్వమందు దాని
పెట్టెను; అప్పుడు ద్వారము కాచే అర్చకులు యె
హోవాయొక్క మందిరములోకి వచ్చిన ద్రవ్యమం
10 తాను అందులో వేసిరి. । పెట్టెలో ద్రవ్యము విస్తా
రముగా వున్నదని వారు చూచినప్పుడు రాజుయొక్క
కరణమున్ను ప్రధానాచర్యకుడున్ను వచ్చి, యెహో
వాయొక్క మందిరమందు దొరికిన ద్రవ్యము లెక్క
11 చూచి సంచులలో వుంచిరి. । అప్పుడు వారు ఆ ద్రవ్య
మును తూచి, యెహోవాయొక్క మందిరపు కాప
రులకు అనగా పని చేయించే వారి చేతికి అప్పగించిరి;
వీరు యెహోవాయొక్క మందిరమందు పని చేసిన
కంసాలివాండ్లకున్ను శిల్పికారులకున్ను తాపీవాండ్ల
12 కున్ను రాతి పనివాండ్లకున్ను, । మరిన్ని యెహోవా
యొక్క మందిరమందున్న శిథిలమైన స్థలములను బాగు
చేసుటకు మానులనున్ను చెక్కబడిన రాళ్లనున్ను కొన
డానకు మందిరము బాగు చేయుట కొరకు అయ్యే
13 ఖర్చుకున్ను ఆ ద్రవ్యమును యిచ్చిరి. । అయితే యె
హోవా మందిరములోకి వచ్చిన ద్రవ్యముచేత యె
హోవా మందిరము కొరకు వెండి పళ్లెములైనా మాం
సపు ముండ్లయినా గిన్నెలైనా బాకాలైనా బంగారపు
వస్తువులైనా వెండి వస్తువులైనా చేయబడ లేదు. ।
14 యేమంటే బాగు పని చేసిన వారికి ఆ ద్రవ్యమును
యిచ్చి, యెహోవాయొక్క మందిరము తిరిగీ బాగు
15 చేయించిరి. । మరిన్ని పనివారికి యిచ్చేటందుకు యెవ
రికి ఆ ద్రవ్యము యిచ్చిరో వారియొద్ద లెక్క పుచ్చు
కోలేదు, యెందుకంటే వారు యథార్థముగా ప్రవ
16 ర్తించిరి. । తప్పితము నిమిత్తమున్ను పాపము నిమిత్త
మున్ను చెల్లించిన సొమ్ము అర్చకులదైనందున యె
హోవా మందిరములోకి అది తేబడక వుండెను. ।
17 అంతట అరాము రాజైన హజాయేలు గాతు పట్టణము
మీదికి వెళ్లి యుద్ధముచేసి దానిని పుచ్చుకొనెను; తరు
వాత హజాయేలు యెరూశలేము మీదికి వెళ్లడానకు
18 తన ముఖమును దిట్టము చేసుకొనెను. । కాబట్టి యూ
దా రాజైన యెహోయాషు తన పితృలైన యెహో
షాఫాథు యెహోరాము అహజ్యా అనే యూదా
రాజులు అర్పితము చేసిన పరిశుద్ధ వస్తువులన్నిటినిన్ని
తాను పరిశుద్ధపర్చిన వస్తువులనున్ను యెహోవా
యొక్క మందిరములోనున్ను రాజ మందిరములోను
న్ను వున్న పదార్థములలో కనపడిన బంగారమం
తానున్ను తీసుకొని, అరాము రాజైన హజాయేలుకు
పంపినందున అతడు యెరూశలేము యొద్దనుంచి తిరిగి
19 పోయెను. । అయితే యెహోయాషుయొక్క తతిమ్మా
కార్యములున్ను అతడు చేసినదంతానున్ను యూదా
రాజులయొక్క వృత్తాంతముల గ్రంథమందు వ్రాయ
బడి యున్నవి గదా? । అయితే అతని సేవకులు లేచి, 20
జట్టు కూడి, శిల్లా అనే స్థలమునకు వెళ్లే మార్గమందున్న
మిల్లో అనే యింట్లో యెహోయాషును చంపిరి. ।
యేమంటే షిమాతు కుమారుడైన యోజాఖారున్ను 21
సోమేరు కుమారుడైన యెహోజాబాదున్ను అనే
అతని సేవకులు అతని కొట్టినందున అతడు మరణమా
యెను; వారు దావీదు పురమందు అతని పితృల సమా
ధిలో అతని పాతిపెట్టిరి: అతని కుమారుడైన అమస్యా
అతనికి మారుగా యేలెను.

## 13. అధ్యాయము.

యూదా రాజయిన అహజ్యా కుమారుడయిన 1
యోవాషు యేలుబడియొక్క యిరువయి మూడో సం
వత్సరమందు యెహూ కుమారుడైన యెహోయాహాజు
షోమ్రోనులో ఇశ్రాయేలును యేల నారంభించి పది
హేడు సంవత్సరములు యేలెను. । యితడు యెహో 2
వా దృష్టి యెదుట కీడు చేసెను, యేమంటే ఇశ్రా
యేలును పాపము చేయించిన నెబాథు కుమారుడైన
యారొబాముయొక్క పాపములను విడువక వాటిని
వెంబడించెను. । కాబట్టి యెహోవాయొక్క కోపము 3
ఇశ్రాయేలు మీద రగులుకొనినందున ఆయన అరాము
రాజైన హజాయేలు చేతిలోకిన్ని హజాయేలు కుమారు
డయిన బెన్హదదు చేతిలోకిన్ని వారి దినములన్నిటి
పర్యంతమూ వారిని అప్పగించెను. । అప్పుడు యెహో 4
యాహాజు యెహోవాను వేడుకొన్నందున యెహో
వా అతని వేడుటలు వినెను, యేమంటే ఆయన అరా
ము రాజువల్ల బాధ పొందిన ఇశ్రాయేలును కనికరిం
చెను. । అయినందున యెహోవా ఇశ్రాయేలుకు వొక 5
రక్షకుని యిచ్చెను; అతని చేత ఇశ్రాయేలు పుత్రులు
అరామీయులయొక్క ఆధిపత్యమునుంచి విముక్తులై,
మునుపటిలాగున స్వస్థానములందు కాపురము చేసిరి. ।
అయినప్పటికిన్ని వారు ఇశ్రాయేలును పాపము చేయిం 6
చిన యారొబాముయొక్క యింటి పాపములను విడు
వక నాటియందు నడుస్తూ వుండిరి; మరిన్ని ఆ తోపు
షోమ్రోనులో యింకా వుండెను. । అయితే అప్పుడు 7
రౌతులలో యేభై మందిన్ని రథములలో పదిన్ని కా
ల్బలములో పదివేలమందిన్ని మాత్రమే యెహోయా
హాజు యొద్ద వుండిరి, యేమంటే తతిమ్మా వారిని అరా
ము రాజు దుళ్లగొట్టిన ధూళిలాగున నాశనము చేసె
ను. । అయితే యెహోయాహాజుయొక్క తతిమ్మా కా 8
ర్యములున్ను అతడు చేసినదంతానున్ను అతనియొక్క
పరాక్రమమున్ను ఇశ్రాయేలు రాజులయొక్క వృత్తాం
తముల గ్రంథమందు వ్రాయబడి యున్నవి గదా? ।
అయితే యెహోయాహాజు తన పితృలతో కూడా 9

నిద్ర పొంది, షోమ్రోనులో సమాధియందు పెట్ట
బడెను; అప్పుడు అతని కుమారుడైన యెహోయాషు
10 అతనికి మారుగా యేలెను. । యూదా రాజయిన యె
హోయాషు యేలుబడియొక్క ముప్పయి యేడో
సంవత్సరమందు యెహోయాహాజు కుమారుడైన యె
హోయాషు షోమ్రోనులో ఇశ్రాయేలును యేల నా
11 రంభించి పదహారు సంవత్సరములు యేలెను. । ఇతడు
న్ను యెహోవా దృష్టి యెదుట కీడు చేసెను, యే
మంటే ఇశ్రాయేలును పాపము చేయించిన నెబాతు
కుమారుడయిన యారొబాముయొక్క పాపములను
12 విడువక వాటియందు నడిచెను. । అయితే యెహో
యాషుయొక్క తతిమ్మా కార్యములున్ను అతడు చేసిన
దంతానున్ను యూదా రాజయిన అమస్యాతో యు
ద్ధము చేసేటప్పుడు అతడు అగుపర్చిన పరాక్రమము
న్ను ఇశ్రాయేలు రాజులయొక్క వృత్తాంతముల గ్రం
13 థమందు వ్రాయబడి యున్నవిగదా? । అయితే యె
హోయాషు తన పితృలతో కూడా నిద్ర పొందిన
తరువాత యారొబాము అతని గద్దె మీద ఆసీనుడై
వుండెను; యెహోయాషు షోమ్రోనులో ఇశ్రా
యేలు రాజులయొక్క సమాధియందు పెట్ట బడెను. ।
14 అంతట ఎలీషా తనకు మరణ హేతువైన రోగముచేత
రోగియై యుండెను; అప్పుడు ఇశ్రాయేలు రాజయిన
యెహోయాషు అతని యొద్దికి దిగివచ్చి, అతని ము
ఖము మీద కన్నీళ్లను రాల్చి, ఓ నా తండ్రీ, నా
తండ్రీ, ఇశ్రాయేలుయొక్క రథమున్ను రౌతులున్ను
15 అని యేడ్చెను. । ఎలీషా అతనితో అనిన మాట, నీవు
వింటినిన్ని బాణములనున్ను పట్టుకొమ్మనినందున అత
16 డు వింటినిన్ని బాణములనున్ను పట్టుకొనెను. । అతడు
మరిన్ని ఇశ్రాయేలు రాజుతో అనిన మాట, నీ చెయ్యి
వింటి మీద వేయుమనినందున అతడు తన చెయ్యి
వింటి మీద వేసినప్పుడు, ఎలీషా తన చేతులను రాజు
17 చేతుల మీద వేసి,। తూర్పు వైపున వున్న కిటికీ
విప్పుమని చెప్పినందున అతడు విప్పెను; అప్పుడు
ఎలీషా బాణము వేయుమనినప్పుడు అతడు బాణము
వేసెను; అప్పుడు అతడు అనిన మాట, అది యెహో
వాయొక్క రక్షణ బాణమున్ను అరామీయులలో
నుంచి రక్షణ బాణమున్ను అయి వున్నది; యేమంటే
నీవు ఆఫేకులో అరామీయులు నాశనమయ్యే మట్టు
18 కు వారిని కొట్టుదువని చెప్పి; । మరిన్ని అతనితో బా
ణములను పట్టుకొమ్మని చెప్పినప్పుడు అతడు పట్టు
కొనెను; అంతట అతడు ఇశ్రాయేలు రాజును చూచి
నేలను కొట్టుమనినప్పుడు అతడు ముమ్మారు కొట్టి మా
19 నెను. । అయితే అందు నిమిత్తము దైవ జనుడు అతని
మీద కోప పడి చెప్పినదేమంటే, నీవు అయిదు మారు
లయినా ఆరు మారులయినా కొట్టినపక్షమందు అరా
మీయులు నాశనమయ్యే మట్టుకు వారిని కొట్టుదువు;
అయితే యిప్పుడు ముమ్మారు మాత్రము అరామీ
యులను కొట్టుదువని చెప్పెను. । అప్పుడు ఎలీషా మృతి 20
బొందెను, వారు అతని సమాధిలో పెట్టిరి. మరిన్ని
ఆ సంవత్సరము ఆరంభమందు మోయాబీయులయొక్క
గుంపులు వచ్చి దేశము మీద పడిరి. । అయితే కొం 21
దరు వొక శవమును పాతిపెట్టుతూ వున్నప్పుడు వొక
గుంపును కని ఆ శవమును ఎలీషాయొక్క సమాధిలో
వేసిరి; అయితే దించిన ఆ శవము ఎలీషాయొక్క శల్య
ములను తాకినప్పుడు తిరిగీ బ్రతికి కాళ్లతో నిలిచెను. ।
అయితే అరాము రాజయిన హజాయేలు యెహో 22
యాహాజు దినములన్నిటి యందూ ఇశ్రాయేలీయులను
బాధ పెట్టుతూ వుండెను. । కాబట్టి యెహోవా 23
వారియందు కృప గలవాడయి, వారిని గూర్చి కనిక
రించి, అబ్రాహాముతోనున్ను ఇస్సాకుతోనున్ను యా
కోబుతోనున్ను వున్న ఆయన వొడంబడికె నిమిత్తము
వారి యందు లక్ష్యముంచి, వారిని నాశనము చేయ
కుండానున్ను యిప్పటికీ తన సముఖములోనుంచి వెళ్ల
వేయకుండానున్ను వుండెను. । అయితే అరాము రాజ 24
యిన హజాయేలు మరణమాయెను; అప్పుడు అతని
కుమారుడయిన బెన్హదదు అతనికి మారుగా యేలెను. ।
అంతట యెహోయాహాజు కుమారుడయిన యెహో 25
యాషు హజాయేలు కుమారుడయిన బెన్హదదుయొక్క
చేతిలోనుంచి తన తండ్రియైన యెహోయాహాజు
యొక్క చేతిలోనుంచి అతడు యుద్ధమందు ఆక్రమిం
చుకొనిన పట్టణములను తిరిగీ తీసుకొనెను. ముమ్మారు
యెహోయాషు అతని జయించి ఇశ్రాయేలు పట్టణ
ములను తిరిగీ సంపాదించుకొనెను.

## 14. అధ్యాయము.

ఇశ్రాయేలు రాజైన యెహోయాహాజు కుమారు 1
డైన యోవాషు యేలుబడియొక్క రెండో సంవత్సర
మందు యూదా రాజైన యోవాషు కుమారుడైన అమ
స్స్య యేలెను. । అతడు యేలనారంభించినప్పుడు 2
యిరువై అయిదు సంవత్సరములు గలవాడై యెరూశ
లేముయందు యిరువై తొమ్మిది సంవత్సరములు యేలె
ను. అతని తల్లి యెరూశలేము సంబంధురాలై యె
హోయద్దాను అనే పేరు గలదై వుండెను. । ఇతడు 3
యెహోవా దృష్టి యెదుట నీతిగా జరిగించినప్పటి
కిన్ని తన పితృడైన దావీదులాగున కాకుండా తన
తండ్రియైన యోవాషుయొక్క మార్గప్రకారము
చేసెను. । అయితే వున్నతమైన స్థలములు తీయసడలేదు; 4
జనులు వున్నతమైన స్థలములందు బలులనున్ను ధూప

5 మునున్ను యింకా చెల్లిస్తూ వుండిరి. । అయితే రాజ్య
ము తన చేతికింద దృఢపర్చబడినప్పుడు సంభవించిన
దేమంటే, అతడు తన తండ్రియైన రాజును చంపిన తన
6 సేవకులను హతము చేయించెను. । అయితే ఆ నరాంత
కులయొక్క పిల్లలను అతడు చంపక, మోషేయొక్క
న్యాయప్రమాణ గ్రంథమందున్న లిఖిత ప్రకారము
గా నడిచెను, యేమంటే తండ్రులు పిల్లలకు మారుగా
నున్ను పిల్లలు తండ్రులకు మారుగానున్ను చంపపడ
కుండా ప్రతి మనిషీ తాను చేసిన పాపము కొరకు
తానే చంపబడ వలెనని యెహోవా అందులో ఆజ్ఞా
7 పించెను. । మరిన్ని ఉప్పు లోవలో అతడు ఎదోమీ
యులైన పదివేల మందిని హతము చేసి, యుద్ధముచేత
సెల పట్టణమును పుచ్చుకొని, దానికి యొక్తెయేలన్న
8 పేరు నేటి వరకు వున్నట్టు పెట్టెను. । అప్పుడు అమ
స్స్యా ఇశ్రాయేలు రాజైన యెహూకు పుట్టిన యె
హోయాహాజు కుమారుడైన యెహోయాషు యొ
ద్దికి దూతలను పంపి, మనము వుకరి ముఖమును వుకరు
9 చూచుకొనుటకు రమ్మనుమని అనెను. । అందుకు ఇశ్రా
యేలు రాజయిన యెహోయాషు యూదా రాజ
యిన అమస్స్యాకు పంపిన కబురు యేమంటే, లెబా
నోనులో వున్న ముండ్ల చెట్టు నీ కుమార్తెను నీవు
నా కుమారునికి యివ్వ వలసినదని లెబానోనులో
వున్న ఆర్జ చెట్టుకు వర్తమానము అంపెను; అయితే
అంతట్లో లెబానోనులో వున్న దుష్ట మృగము వచ్చి
10 ఆ ముండ్ల చెట్టును త్రొక్కి వేసెను. । నీవు ఎదోమీ
యులను కొట్టినందున నీ హృదయము నిన్ను అతిశ
యింప చేస్తూ వున్నది, సరే; యిప్పుడు నీ యింట్లో
నీవు వుండి ఆ ఘనతను అనుభవించు; నీవు మాత్రమే
కాదు నీతో కూడా యూదావారున్ను కూలేటట్టుగా
మోసమును ప్రేరేపణ చేసేదేమని బుద్ధి చెప్పినప్పటి
11 కిన్ని; । అమస్స్యా విననివాడయినందున ఇశ్రాయేలు
రాజయిన యెహోయాషు యెక్కిపోయి, యూదా
సంబంధమయిన బేత్షెమెషు పట్టణము దగ్గిర అతడున్ను
యూదా రాజైన అమస్స్యాయున్ను వుకరి ముఖమును
12 వుకరు చూచుకొనిరి. । అయితే యూదావారు ఇశ్రా
యేలీయుల ముందర అపజయులైనందున ప్రతి మనిషీ
13 తన తన స్థలమునకు పారిపోయెను. । మరిన్ని ఇశ్రాయేలు
రాజైన యెహోయాషు బేత్షెమెషు దగ్గిర అహజ్యాకు
పుట్టిన యెహోయాషు కుమారుడైన అమస్స్యా అనే
యూదా రాజును పట్టుకొని, యెరూశలేముకు వచ్చి,
యెరూశలేముయొక్క ప్రాకారమును ఎఫ్రయీాము
ద్వారము మొదలుకొని మూల ద్వారము పర్యంతము
14 నన్నూరు మూళ్ల మట్టుకు కింద పడగొట్టెను. । మరిన్ని
యెహోవాయొక్క మందిరమందున్న రాజుయొక్క

మందిర మందున్న కనపడిన బంగారము వెండి మొద
లైన సమస్త వస్తువులనున్ను కుదవ పెట్టబడిన వాండ్లను
న్ను తీసుకొని షోమ్రోనుకు తిరిగీ వచ్చెను. । యెహో 15
యాషుయొక్క తతిమ్మా కార్యములున్ను అతని పరా
క్రమమున్ను యూదా రాజైన అమస్స్యాతో యేలా
గున పోట్లాడినాడో అదిన్ని ఇశ్రాయేలు రాజులయొ
క్క వృత్తాంతముల గ్రంథమందు వ్రాయబడి వున్నవి
గదా? । అంతట యెహోయాషు తన పితృలతో కూ 16
డా నిద్ర పొంది, షోమ్రోనులో ఇశ్రాయేలు రాజుల
యొక్క సమాధి యందు పెట్టబడెను; అతని కుమారు
డయిన యారొబాము అతనికి మారుగా యేలెను. ।
అయితే యూదా రాజైన యెహోయాషు కుమారు 17
డైన అమస్స్యా ఇశ్రాయేలు రాజయిన యెహోయా
హాజు కుమారుడయిన యెహోయాషు మరణమయిన
తరువాత పదిహేను సంవత్సరములు బ్రతికెను. । అమ 18
స్స్యాయొక్క తతిమ్మా కార్యములు యూదా రాజుల
యొక్క వృత్తాంతముల గ్రంథమందు వ్రాయబడి
వున్నవి గదా? । అయితే అతని మీద యెరూశలేము 19
లో జట్టు కూడినందున అతడు లాఖీషు పట్టణమునకు
పారిపోయెను; అయితే వారు లాఖీషుకు అతని వెనుక
నుంచి కొందరిని పంపిరి; । వారు వచ్చి అక్కడ అతని 20
చంపి, యెరూశలేముకు గుర్రముల మీద అతని తె
ప్పించి, దావీదు పురమందు అతని పితృలయొక్క సమా
ధిలో పెట్టిరి. । అప్పుడు యూదా జనులందరున్ను 21
పదహారు సంవత్సరముల వాడైన అజర్యాను తీసుకొని,
అతని తండ్రియైన అమస్స్యాకు మారుగా రాజును
చేసుకొనిరి. । ఇతడు రాజైన తన తండ్రి అతని పితృల 22
తో నిద్ర పొందిన తరువాత ఏలతు పట్టణమును బా
గుగా కట్టించి, యూదావారికి దాని తిరిగీ యిచ్చెను. ।
యూదా రాజైన యెహోయాషు కుమారుడయిన 23
అమస్స్యా యేలుబడియొక్క పదిహేనో సంవత్సర
మందు ఇశ్రాయేలు రాజయిన యెహోయాషు కుమా
రుడయిన యారొబాము షోమ్రోనులో యేలనారం
భించి, నలుబై వుక సంవత్సరములు యేలెను. । అయితే 24
అతడున్ను యెహోవా దృష్టి యెదుట కీడు చేసి,
ఇశ్రాయేలును పాపము చేయించిన నెబాతు కుమారు
డైన యారొబాముయొక్క పాపములను విడచి పెట్ట
లేదు. । గాతుహేఫెరు వూరివాడైన అమిత్తయికు 25
పుట్టిన తన సేవకుడయిన యోనా అనే దీర్ఘదర్శి
ద్వారా ఇశ్రాయేలు దేవుడైన యెహోవా ఆనతిచ్చిన
వాక్య ప్రకారము అతడు ఇశ్రాయేలుయొక్క సరి
హద్దును హమాతులో ప్రవేశ స్థలము మొదలుకొని
మైదానపు సముద్రము పర్యంతమూ తిరిగీ స్వాధీనము
చేసుకొనెను. । యేమంటే యెహోవా ఇశ్రాయేలీ 26

యులు పొందిన బాధ మహా ఘోరమయినదని చూ
చెను; యేమంటే మూయబడిన వాడైనా విడిపించ
బడిన వాడయినా ఇశ్రాయేలుకు సహాయము చేసే
27 వాడయినా లేక వుండెను. । అయితే ఇశ్రాయేలనే
పేరు ఆకాశము కిందనుంచి తుడచివేతునని యెహెూ
వా చెప్పక, యెహెూయాషు కుమారుడైన యారో
28 బాము ద్వారా వారిని రక్షించెను. । యారొబాము
యొక్క తతిమ్మా కార్యములున్ను అతడు చేసినదంతా
నున్ను అతని పరాక్రమమున్ను అతడు యేలాగున
యుద్ధము చేసెనో అదిన్ని యూదా వారికి కలిగి
వున్న దమస్కు పట్టణమున్ను హమాతు పట్టణమున్ను
ఇశ్రాయేలీయుల కొరకు తిరిగీ యేలాగున తీసుకొనె
నో అదిన్ని ఇశ్రాయేలు రాజులయొక్క వృత్తాంత
29 ముల గ్రంథమందు వ్రాయబడి వున్నవి గదా! । యా
రొబాము తన పితృలైన ఇశ్రాయేలు రాజులతో కూ
డా నిద్ర పొందిన తరువాత అతని కుమారుడైన జెఖ
ర్యా అతనికి మారుగా యేలెను.

## 15. అధ్యాయము.

1 ఇశ్రాయేలు రాజయిన యారొబాము యేలుబడి
యొక్క యిరువై యేడో సంవత్సరమందు యూదా
రాజయిన అమస్స్యా కుమారుడయిన అజర్యా యేల
2 నారంభించెను. । అతడు యేల నారంభించినప్పుడు పద
హారు సంవత్సరముల వాడై యెరూశలేము యందు
యేభయి రెండు సంవత్సరములు యేలెను; అతని తల్లి
యెరూశలేము సంబంధురాలై యెఖొల్యాహు అనే
3 పేరు గలదయి వుండెను. । యితడు తన తండ్రియైన
అమస్స్యా చేసిన అంతటి ప్రకారముగా యెహెూ
4 వా దృష్టికి నీతిగా ప్రవర్తించెను. । వున్నతమైన
స్థలములు మాత్రము తీసివేయ బడలేదు; జనులు ఆ
వున్నతమయిన స్థలములందు యింకా బలులను చెల్లి
5 స్తూ ధూపమును వేస్తూ వుండిరి. । అయితే యెహెూ
వా యీ రాజును మొత్తినందున అతడు మరణమయ్యే
నాటి పర్యంతమూ కుష్ఠ రోగియై, వేరే వొక యింట్లో
నివసించి వుండెను. అప్పుడు రాజు కుమారుడైన
యోతాము మందిరము మీద అధికారిగానున్ను దేశ
పు జనులకు న్యాయము తీర్చేవాడుగానున్ను వుం
6 డెను. । అజర్యాయొక్క తతిమ్మా కార్యములున్ను
అతడు చేసినదంతానున్ను యూదా రాజులయొక్క
వృత్తాంతముల గ్రంథమందు వ్రాయబడి యున్నవి
7 గదా? । అజర్యా తన పితృలతో కూడా నిద్రపొంది,
దావీదు పురములో తన పితృల సమాధియందు పెట్ట
బడెను; అప్పుడు అతని కుమారుడయిన యోతాము
8 అతనికి మారుగా యేలెను. । యూదా రాజయిన అజ
ర్యా యేలుబడియొక్క ముప్పయి యెనిమిదో సంవ
త్సరమందు యారొబాము కుమారుడైన జెఖర్యా షో
మ్రోనులో ఇశ్రాయేలును ఆరు నెలలు యేలెను. ।
అతని పితృలు చేసినట్టుగా ఇతడున్ను యెహెూవా 9
దృష్టి యెదుట కీడు చేసి, ఇశ్రాయేలును పాపము
చేయించిన నెబాతు కుమారుడయిన యారొబాము
యొక్క పాపములను విడచి పెట్టలేదు. । అయితే యా 10
బేషు కుమారుడైన షల్లూము అతని మీద జట్టు కూడు
కొని, జనుల ముందర అతని కొట్టి చంపి, అతనికి మా
రుగా యేలెను. । జెఖర్యాయొక్క తతిమ్మా కార్యములు 11
ఇశ్రాయేలు రాజులయొక్క వృత్తాంతముల గ్రంథ
మందు వ్రాయబడి వున్నవి. । యెహెూవా యెహూ 12
తో ఆనతిచ్చిన వాక్యము యిదే, యేమంటే నీయొక్క
కుమారులు నాలుగో తరము మట్టుకు ఇశ్రాయేలు గద్దె
మీద ఆసీనులై వుందురని ఆనతిచ్చినందున అది ఆలా
గున సంభవించెను. । యూదా రాజైన ఉజ్జీయా యే 13
లుబడియొక్క ముప్పయి తొమ్మిదో సంవత్సరమందు
యాబేషు కుమారుడైన షల్లూము యేల నారంభించి,
షోమ్రోనులో వొక నెల దినములు యేలెను. । యేమం 14
టే గాదీ కుమారుడయిన మెనహేము తిర్సాలోనుంచి
బయిలుదేరి షోమ్రోనుకు వచ్చి, షోమ్రోనులో వుండే
యాబేషు కుమారుడైన షల్లూమును కొట్టి చంపి, అత
నికి మారుగా యేలెను. । షల్లూముయొక్క తతిమ్మా కా 15
ర్యములున్ను అతడు కూడుకొనిన జట్టున్ను ఇశ్రా
యేలు రాజులయొక్క వృత్తాంతముల గ్రంథమందు
వ్రాయబడి యున్నవి. । అప్పుడు మెనహేము తిప్స 16
హు పట్టణమునున్ను దానిలోనున్న వారినందరినిన్ని
తిర్సా మొదలుకొని దాని సరిహద్దులనున్ను కొట్టెను;
వారు తమ ద్వారములు అతని కొరకు తీయలేదు గనుక
అతడు దాని కొట్టెను; మరిన్ని దానిలో వున్న గర్భిణీ
స్త్రీల అందరియొక్క గర్భములను చించి వేసెను. ।
యూదా రాజైన అజర్యా యేలుబడియొక్క ముప్పయి 17
తొమ్మిదో సంవత్సరమందు గాదీ కుమారుడయిన మెన
హేము ఇశ్రాయేలును యేలనారంభించి, షోమ్రోను
లో పది సంవత్సరములు యేలెను. । ఇతడున్ను యెహెూ 18
వా దృష్టి యెదుట కీడు చేసి, ఇశ్రాయేలును పాపము
చేయించిన నెబాతు కుమారుడైన యారొబాముయొక్క
పాపములను తన దినములన్నిటిదాకా విడచిపెట్ట లేదు. ।
అంతట అష్షూరు రాజైన పూలు దేశము మీదికి వచ్చి 19
నందున మెనహేము పూలు చెయ్యి తన చేతికి తో
డుగా వుండి తన చేతి కింద రాజ్యము దృఢ పర్చే
కొరకు వెయి వెండి తలాంతులను పూలుకు యిచ్చె
ను. । యీ ద్రవ్యము మెనహేము ఇశ్రాయేలులో 20
భాగ్యవంతులయిన గొప్పవారిలో ప్రతిమనిషి యొద్ద

యేభయియేసి వెండి తులములను పుచ్చుకొని అష్షూరు
రాజుకు యిచ్చెను; కాబట్టి అష్షూరు రాజు దేశమును
21 విడచి తిరిగీ వెళ్లిపోయెను. । మెనహేముయొక్క తతి
మ్మా కార్యములున్ను అతడు చేసినదంతానున్ను ఇశ్రా
యేలు రాజులయొక్క వృత్తాంతముల గ్రంథమందు
22 వ్రాయపడి వున్నవి గదా? । మెనహేము తన పితృల
తో కూడా నిద్రపొందిన తరువాత అతని కుమారు
23 డైన పెకహ్యా అతనికి మారుగా యేలెను. । యూదా
రాజైన అజర్యా యేలుబడియొక్క యేభయ్యో సంవ
త్సరమందు మెనహేము కుమారుడైన పెకహ్యా షో
మ్రోనులో ఇశ్రాయేలును యేలనారంభించి రెండు
24 సంవత్సరములు యేలెను. । యితడున్ను యెహోవా
దృష్టికి కీడు చేసి, ఇశ్రాయేలును పాపము చేయించిన
నెబాతు కుమారుడైన యారొబాముయొక్క పాపము
25 లను విడువలేదు. । ఇతని కింది అధిపతి అయిన రెమ
ల్యా కుమారుడైన పెకహు జట్టు కూడుకొని, అర్గో
బుతోనున్ను అరీహేతోనున్ను వీని యొద్దనున్న గిలా
దీయులైన యేభయి మందితోనున్ను కలుసుకొని, షో
మ్రోనులో వున్న రాజు మందిరముయొక్క అంతః
పురమందు అతని చంపి అతనికి మారుగా యేలెను. ।
26 పెకహ్యాయొక్క తతిమ్మా కార్యములున్ను అతడు చేసి
నదంతానున్ను ఇశ్రాయేలు రాజులయొక్క వృత్తాంత
27 ముల గ్రంథమందు వ్రాయపడి వున్నవి. । యూదా
రాజైన అజర్యా యేలుబడియొక్క యేభయి రెండో
సంవత్సరమందు రెమల్యా కుమారుడయిన పెకహు షో
మ్రోనులో ఇశ్రాయేలును యేలనారంభించి యిరువై
28 సంవత్సరములు యేలెను. । యితడున్ను యెహోవా
దృష్టికి కీడు చేసి, ఇశ్రాయేలును పాపము చేయించిన
నెబాతు కుమారుడైన యారొబాముయొక్క పాపము
29 లను విడవలేదు. । ఇశ్రాయేలు రాజైన పెకహు దినము
లందు అష్షూరు రాజైన తిగ్లత్పిలేసెరు వచ్చి, ఈయోను
పట్టణమున్ను ఆబేల్బేత్మయకా పట్టణమున్ను యె
నోయహు పట్టణమున్ను కెదెషు పట్టణమున్ను హా
సోరు పట్టణమున్ను గిలాదు దేశమున్ను గాలీలు
దేశమున్ను నఫ్తాలీ దేశమంతానున్ను పుచ్చుకొని, వా
రిని అష్షూరు దేశమునకు చెరగా తీసుకొని పోయెను. ।
30 అప్పుడు ఏలా కుమారుడైన హోషేయ ఇశ్రాయేలు
రాజైన రెమల్యా కుమారుడైన పెకహు మీద జట్టు కూ
డుకొని, అతని కొట్టి చంపి, యూదా రాజైన ఉజ్జీ
యా కుమారుడైన యోతాము యేలుబడియొక్క యిరు
వైయ్యో సంవత్సరమందు అతనికి మారుగా యేలెను. ।
31 పెకహుయొక్క తతిమ్మా కార్యములున్ను అతడు చేసిన
దంతానున్ను ఇశ్రాయేలు రాజులయొక్క వృత్తాంతముల
32 గ్రంథమందు వ్రాయపడి వున్నవి. । ఇశ్రాయేలు రాజు
అయిన రెమల్యా కుమారుడైన పెకహు యేలుబడియొ
క్క రెండో సంవత్సరమందు యూదా రాజైన ఉజ్జీయా
కుమారుడైన యోతాము యేల నారంభించెను. । అతడు 33
యేల నారంభించినప్పుడు యిరువై అయిదు సంవత్సర
ములవాడై, యెరూశలేము యందు పదహారు సంవత్స
రములు యేలెను; అతని తల్లి సాదోకు కుమార్తెయై
యెరూషా అని పిలువబడెను. । ఇతడు యెహోవా 34
దృష్టి యెదుట నీతిగా ప్రవర్తించి, తన తండ్రియైన
ఉజ్జీయా చేసిన ప్రకారమంతటినీ చేసెను. । అయిన 35
ప్పటికిన్ని వున్నతమైన స్థలములు తీసివేయబడక వుం
డెను; జనులు వున్నతమైన స్థలములందు యింకా బలు
లను చెల్లిస్తూ ధూపమును వేస్తూ వుండిరి. యితడు
యెహోవా మందిరముయొక్క పొడవైన ద్వారమును
కట్టించెను. । యోతాముయొక్క తతిమ్మా కార్యము 36
లున్ను అతడు చేసినదంతానున్ను యూదా రాజుల
యొక్క వృత్తాంతముల గ్రంథమందు వ్రాయబడి
వున్నవి గదా? । ఆ దినముల యందు యెహోవా 37
అరాము రాజైన రెస్సీనున్ను రెమల్యా కుమారుడైన
పెకహునున్ను యూదా దేశము మీదికి పంప నారం
భించెను. । యోతాము తన పితృలతో నిద్ర పొంది, తన 38
పితృడైన దావీదు పురమందు తన పితృలయొక్క సమా
ధిలో పెట్టబడెను, అతని కుమారుడైన ఆహాజు అతనికి
మారుగా యేలెను.

## 16. అధ్యాయము.

రెమల్యా కుమారుడయిన పెకహు యేలుబడియొ 1
క్క పదిహేడో సంవత్సరమందు యూదా రాజైన
యోతాము కుమారుడైన ఆహాజు యేల నారంభించెను. ।
ఆహాజు యేల నారంభించినప్పుడు యిరువై సంవత్సర 2
ములవాడై, యెరూశలేము యందు పదహారు సంవత్స
రములు యేలెను; యితడు తన పితృడైన దావీదులా
గున తన దేవుడైన యెహోవా దృష్టికి నీతిగా ప్రవ
ర్తించక, ఇశ్రాయేలు రాజులయొక్క మార్గ ప్రకా
రము నడిచెను; । నిజముగా ఇశ్రాయేలు పుత్రుల ముం 3
దరనుంచి యెహోవా వెలికి తోలివేసిన జనాంగముల
యొక్క యేహ్యమైన మార్గ ప్రకారము తన కుమా
రుని అగ్ని హోత్రములోనుంచి నడిపించెను. । మరెన్ని 4
అతడు వున్నతమైన స్థలములందున్ను కొండల మీద
నున్ను సమస్తమైన పచ్చని వృక్షముల కిందనున్ను బలు
లను చెల్లించి ధూపమును వేసినాడు. । అప్పుడు అరా 5
ము రాజైన రెస్సీనున్ను ఇశ్రాయేలు రాజైన రెమల్యా
కుమారుడైన పెకహున్ను యెరూశలేము మీదికి యు
ద్ధము కొరకు వచ్చి, ఆహాజును ముట్టడి వేసినప్పటికిన్ని
అతని జయించలేక పోయిరి. । ఆ కాలమందు అరాము 6

రాజైన రెసీనును అరామీయుల కొరకు ఏలతు పట్టణ
మును తిరిగీ పుచ్చుకొని, ఏలతులోనుంచి యూదా
వారిని తోలివేసెను; కాబట్టి అరామీయులు ఏలతు
పట్టణముకు వచ్చి నేటి వరకూ అక్కడ కాపురము
7 చేస్తూ వున్నారు. । అయినందున ఆహాజు అష్షూరు రా
జైన తిగ్లత్పిలేసెరు యొద్దికి దూతలను పంపి చెప్పు
మనినదేమంటే, నేను నీ సేవకుడనున్ను నీ కుమారుడ
నున్ను అయి వున్నాను; కాబట్టి నీవు వచ్చి నా మీ
దికి లేచిన అరాము రాజుయొక్క చేతిలోనుంచిన్ని
ఇశ్రాయేలు రాజుయొక్క చేతిలోనుంచిన్ని నన్ను
8 రక్షించ వలసినది చెప్పుమనెను. । మరిన్ని ఆహాజు యె
హెూవాయొక్క మందిరమందున్ను రాజు మందిరము
యొక్క పదార్థములందున్ను కనపడిన వెండినిన్ని
బంగారమునున్ను తీసుకొని అష్షూరు రాజుకు కాను
9 కగా పంపెను. । అయినందున అష్షూరు రాజు అతని
మాటలను వినెను, యేమంటే అష్షూరు రాజు దమస్కు
పట్టణము మీదికి వచ్చి దానిని పుచ్చుకొని, రెసీనును
చంపి, జనులను కీరు పట్టణమునకు చెర తీసుకొని పో
10 యెను. । అప్పుడు రాజైన ఆహాజు అష్షూరు రాజైన
తిగ్లత్పిలేసెరును యెదుర్కోవడానకు దమస్కు పట్టణ
మునకు వచ్చి, దమస్కు పట్టణమందు వొక బలిపీఠ
మును చూచెను; అప్పుడు రాజైన ఆహాజు ఆ బలిపీఠ
ముయొక్క పోలికనున్ను మచ్చునున్ను దాని పని విధ
11 మంతానున్ను అర్చకుడైన ఊరీయాకు పంపెను. । కా
బట్టి అర్చకుడైన ఊరీయా రాజైన ఆహాజు దమస్కు
పట్టణమునుంచి పంపిన విధమునకు సమమైన వొక బలి
పీఠమును కట్టించెను; రాజైన ఆహాజు దమస్కునుంచి
తిరిగీ రాకమునుపే అర్చకుడైన ఊరీయా దానిని సిద్ధ
12 పర్చెను. । అంతట రాజు దమస్కునుంచి వచ్చి ఆ బలి
పీఠమును చూచెను; మరిన్ని రాజు ఆ బలిపీఠమును చేరి,
13 దాని మీద అర్పణలను చెల్లించి, । హెూమార్పణను
న్ను భోజనార్పణనున్ను కాల్చి, పానార్పణను కుమ్మ
రించి, తాను అర్పించిన సమాధానార్పణలయొక్క రక్త
14 మును బలిపీఠము మీద చిలకరించెను. । మరిన్ని అతడు
యెహెూవా సముఖమందున్న యిత్తడి బలిపీఠమును
మందిరము ముంగిటి స్థలమునుంచి అనగా యెహెూవా
బలిపీఠమునకున్ను మందిరమునకున్ను మధ్యనుంచి
తెప్పించి, ఆ బలిపీఠము వుత్తరపార్శ్వమందు దాని
15 వుంచెను. । అప్పుడు రాజైన ఆహాజు అర్చకుడైన ఊరీ
యాకు ఆజ్ఞాపించినదేమంటే, పెద్ద బలిపీఠము మీద
వుదయపు హెూమార్పణనున్ను అస్తమానపు భోజ
నార్పణనున్ను రాజుయొక్క హెూమార్పణనున్ను
అతని భోజనార్పణనున్ను దేశపు జనులందరియొక్క
హెూమార్పణనున్ను భోజనార్పణనున్ను పానా
ర్పణనున్ను కాల్చి, దాని మీద హెూమార్పణయొ
క్క రక్తమంతానున్ను సకల బలులయొక్క రక్తమంతా
నున్ను చిలకరించ వలసినది, యేమంటే యిత్తడి బలిపీ
ఠమును దాని యొద్దను నేను ఆలోచన చేయడానకు
వుంచ వలెనని నిర్ణయము చేసెను. । అయినందున అర్చ 16
కుడైన ఊరీయా రాజైన ఆహాజు ఆజ్ఞాపించిన ప్రకా
రమంతా చేసెను. । మరిన్ని రాజైన ఆహాజు పట్లయొ 17
క్క అంచులను కోసివేసి, వాటిమీదనున్న తొట్టి
తీసివేసెను; యిత్తడి యెడ్లమీదనున్న సముద్రమును
డించి రాతి కట్టుమీద దాని వుంచెను. । మరిన్ని మంది 18
రములో సబ్బాతు దినము కొరకు కట్టబడిన మంటప
మునున్ను రాజుయొక్క బయిటి ప్రవేశపు ద్వారము
నున్ను అష్షూరు రాజు నిమిత్తము యెహెూవాయొక్క
మందిరమునుంచి అతడు తీసివేసెను. । ఆహాజు చేసిన 19
తతిమ్మా కార్యములు యూదా రాజులయొక్క వృత్తాం
తముల గ్రంథమందు వ్రాయబడి వున్నవి గదా? ।
ఆహాజు తన పితృలతో కూడా నిద్ర పొంది, దావీదు 20
పురమందు తన పితృలయొక్క సమాధిలో పెట్టబడెను;
అతని కుమారుడైన హిజ్కియా అతనికి మారుగా
యేలెను.

## 17. అధ్యాయము.

యూదా రాజయిన ఆహాజు యేలుబడియొక్క 1
పండెండో సంవత్సరమందు ఏలా కుమారుడయిన
హెూషేయ షోమ్రోనులో ఇశ్రాయేలును యేల నా
రంభించి తొమ్మిది సంవత్సరములు యేలెను. । ఇతడు 2
తన పూర్వీకులైన ఇశ్రాయేలు రాజులు చేసినంత మట్టు
కు చేయకపోయినప్పటికిన్ని యెహెూవా దృష్టి యె
దుట కీడు చేసెను. । ఇతని మీదికి అష్షూరు రాజైన 3
షల్మనేసెరు వచ్చినందున హెూషేయ అతనికి సేవకుడై
పన్ను యిస్తూ వుండెను. । అయితే హెూషేయ జట్టు 4
ను కూడుర్చుకోవడము అష్షూరు రాజుకు బయిలుపడ
డెను, యేమంటే అతడు మిస్రయీము రాజయిన సో
యొద్దికి దూతలను పంపి, పూర్వము తాను ప్రతి సంవ
త్సరమూ యిస్తూ వున్న ప్రకారము అష్షూరు రాజుకు
యిచ్చిన పన్ను యివ్వక పోయినందున అష్షూరు రాజు
అతని బందీగృహములో బంధించెను. । అంతట అష్షూ 5
రు రాజు దేశమంతటి మీదికి వచ్చెను; మరిన్ని అతడు
షోమ్రోను మీదికి వచ్చి మూడు సంవత్సరములు దా
నిని ముట్టడి వేసెను. । హెూషేయ యేలుబడియొక్క 6
తొమ్మిదో సంవత్సరమందు అష్షూరు రాజు షోమ్రోను
పట్టణమును పుచ్చుకొని ఇశ్రాయేలీయులను అష్షూరు
దేశములోకి చెర తీసుకొని పోయి, గోజాను నది దగ్గిర
వున్న హాలహు హాబోరు అనే స్థలములందున్ను మాదీ

7 యులయొక్క పట్టణములందున్ను వుంచెను. । యేమం
టే ఇశ్రాయేలు పుత్రులు మిస్రయీము దేశములో
నుంచిన్ని మిస్రయీము రాజయిన ఫరోయొక్క బల
ము కిందనుంచిన్ని తమ్మును విడిపించిన తమ దేవుడయిన
యెహోవా విషయమై పాపము చేసి, యితర దేవుండ్ల
8 యందు భయభక్తులు కలవారై, । ఇశ్రాయేలు పుత్రుల
ముందరనుంచి యెహోవా అవతలవేసిన జనాంగము
లయొక్క కట్టడలందున్ను ఇశ్రాయేలు రాజులు నిర్ణ
9 యించిన కట్టడలందున్ను నడిచిరి. । మరిన్ని ఇశ్రాయే
లు పుత్రులు తమ దేవుడయిన యెహోవా విషయ
మై మంచివి కాని కార్యములు రహస్యముగా చేసి,
కాపరుల గోపురము మొదలుకొని ప్రాకారములు
గల పట్టణము పర్యంతమూ తమ పురములన్నిటియం
10 దూ వున్నతమైన స్థలములను కట్టుకొని, । వున్నతమైన
కొండలన్నిటి మీదనున్ను సకలమైన పచ్చని వృక్షముల
కిందనున్ను విగ్రహములను స్థాపించి, తోపులను నాటి, ।
11 తమ ముందరనుంచి యెహోవా వెళ్లవేసిన జనాంగ
ములలాగున వున్నతమైన స్థలములందు ధూపమును
చెల్లించి, యెహోవాకు కోపము పుట్టేలాగున కీడు
12 చేసిరి. । యీలాగున చేయవద్దని వేటిని గురించి యె
హోవా ఆజ్ఞాపించెనో ఆ విగ్రహములకు వారు
13 సేవ చేసిరి. । మరిన్ని యెహోవా సమస్తమయిన దీర్ఘ
దర్శుల చేతనున్ను ప్రదర్శకుల చేతనున్ను ఇశ్రాయే
లీయుల మీదనున్ను యూదా వారి మీదనున్ను సా
క్ష్యము పలికించి, మీ దుర్మార్గములను విడచిపెట్టి
నేను మీ పితృలకు ఆజ్ఞాపించినటువంటిన్ని నా సేవ
కులైన దీర్ఘదర్శుల ద్వారా మీకు అప్పగించినటువం
టిన్ని న్యాయ ప్రమాణమందున్న నా ఆజ్ఞలనున్ను
కట్టడలనున్ను భద్రముగా గైకొండని సెలవు యిచ్చి
14 నప్పటికిన్ని, । వారు విననివారై, తమ దేవుడయిన యె
హోవాకు అవిశ్వాసులయిన తమ పితృలయొక్క కంఠ
ముల వలెను తమ కంఠములనున్ను కఠిన పరుచుకొనిరి. ।
15 వారు ఆయనయొక్క కట్టడలనున్ను తమ పితృలతో
ఆయన చేసుకొనిన వొడంబడికెనున్ను ఆయన వారికి
నిర్ణయించిన నిర్ణయములనున్ను విసర్జించి, వ్య
ర్థమైన దానిని వెంబడించినందున వారు వ్యర్థులై,
యెవరిని గురించి వారి మర్యాదల ప్రకారము మీరు
చేయ వద్దని యెహోవా సెలవు యిచ్చెనో తమకు
చుట్టూ వున్న ఆ జనాంగములను వెంబడించి వారి
16 వలెనే అయిపోయిరి. । వారు తమ దేవుడైన యెహో
వాయొక్క ఆజ్ఞలన్నిన్ని విడచిపెట్టి, పోత బొమ్మలైన
రెండు దూడలనున్ను తోపులనున్ను చేసి, ఆకాశ
సమూహమునకు వంగి నమస్కరించి, బయలునున్ను
17 చేవచేసిరి. । మరిన్ని తమ కుమారులనున్ను కుమార్తెల
నున్ను అగ్నిలోనుంచి గడవజేసి, శకునమునున్ను చిల్లంగి
తనమునున్ను వాడిక చేసుకొని, యెహోవాకు కోప
ము పుట్టేలాగున ఆయన దృష్టి యెదుట కీడు చేయ
డానకు తమ్మును తాము అమ్ముకొనిరి. । కాబట్టి యెహో 18
వా ఇశ్రాయేలీయుల యందు బహుగా కోపగించి తన
సముఖములోనుంచి వారిని వెళ్లవేసినందున యూదా
గోత్రము మాత్రమే గాని మరి యే గోత్రమైనా లేక
పోయెను. । అయితే యూదావారున్ను తమ దేవుడ 19
యిన యెహోవాయొక్క ఆజ్ఞలను విడచిపెట్టిన వారై,
ఇశ్రాయేలీయులు చేసుకొనిన కట్టడలయందు నడి
చిరి. । అంతట యెహోవా ఇశ్రాయేలుయొక్క సం 20
తతి అంతటినీ విసర్జించి, వారిని శ్రమ పెట్టి, దోపు
డుగాండ్ల చేతులలోకి అప్పగించి, వారిని తన సము
ఖమునుంచి వెళ్లవేసెను. । యేమంటే ఆయన ఇశ్రాయే 21
లు గోత్రములను దావీదుయొక్క యింటి యొద్దనుంచి
తెగవేసినప్పుడు వారు నెబాథు కుమారుడైన యరో
బామును రాజుగా చేసుకొనిరి; యీ యరోబాము
ఇశ్రాయేలీయులు యెహోవాను వెంబడించకుండా
తిరిగిపోజేసి, వారిచేత ఘోరమైన పాపమును చేయిం
చెను. । యేమంటే ఇశ్రాయేలు పుత్రులు యరోబా 22
ము చేసిన పాపములన్నిటి యందూ నడిచి వాటిని
విడవ లేదు. । అయినందున యెహోవా తన సేవకు 23
లైన దీర్ఘదర్శుల ద్వారా ఆనతిచ్చిన వాక్య ప్రకా
రము ఇశ్రాయేలీయులను తన సముఖములోనుంచి వెళ్ల
వేసినందున ఇశ్రాయేలీయులు తమ స్వదేశములోనుంచి
అష్షూరు దేశములో నేటి వరకూ చెరగా వుండిరి. ।
అప్పుడు అష్షూరు రాజు బాబెలు కూతా అవ్వా హ 24
మాతు సెఫర్వయీము అనే దేశములలోనుంచి జను
లను తెప్పించి, ఇశ్రాయేలు పుత్రులకు మారుగా షో
మ్రోను పట్టణములలో వుంచినందున వారు షోమ్రో
ను దేశమును స్వతంత్రించుకొని, దాని పట్టణములందు
కాపురము చేసిరి. । అయితే వారు కాపురము చేయ 25
నారంభించినప్పుడు యెహోవా యందు భయ పడక
వున్నందున యెహోవా వారిలోకి సింహములను పంపె
ను, అవి వారిలో కొందరిని చంపి వేసెను. । కాబట్టి 26
వారు అష్షూరు రాజుతో చెప్పినదేమంటే, మీరు
తీయించి షోమ్రోను పట్టణములలో వుంచిన జనాంగ
ములకు ఆ దేశపు దేవునియొక్క మర్యాద తెలియనం
దున ఆయన వారిలోకి సింహములను రప్పించెను; అవి
వారిని చంపుతూ వున్నవి; యేమంటే ఆ దేశపు దేవుని
యొక్క మర్యాద వారికి తెలియ లేదని చెప్పిరి. । అప్పు 27
డు అష్షూరు రాజు ఆజ్ఞాపించినదేమంటే, అక్కడ
నుంచి మీరు తెప్పించిన అర్చకులలో వొకనిని అక్క
డికి తిరిగీ పో చేయండి; వాడు అక్కడికి వెళ్లి కా ఫ

రము చేసి, ఆ దేశపు దేవునియొక్క మర్యాద వారికి
28 నేర్ప వలసినదని చెప్పినందున,। షోమ్రోనులోనుంచి
వారు తీసుకొనిపోయిన అర్చకులలో వొకడు వచ్చి,
బేతేలు వూరిలో కాపురము చేసి, యెహోవా యందు
వారు యేలాగు భయపడ వలెనో అది వారికి బోధిం
29 చెను.। అయినప్పటికిన్ని ప్రతి జనాంగము తమకు
తాము దేవుండ్లను చేసుకొని, షోమ్రోనీయులు కట్టు
కొనిన వున్నత స్థలములయొక్క మందిరములందు వా
టిని వుంచినందున ప్రతి జనాంగముయొక్క పురము
30 లందూ అవి వారికి కలిగి వుండెను.। బాబెలు వారు
సుక్కోత్బెనోతును చేసుకొనిరి; కూతువారు నెర్గలును
చేసుకొనిరి; హమాతువారు అషీమాను చేసుకొనిరి.।
31 అవ్వీయులు నిభజునున్ను తర్తాకునున్ను చేసుకొనిరి;
సెఫర్వీయులు తమ పిల్లలను అద్రమ్మెలెఖు అనమ్మె
లెఖు అనే సెఫర్వయీముయొక్క దేవుండ్ల విషయమై
32 అగ్నిహోత్రమందు కాల్చి వేస్తూ వుండిరి.। యీ
లాగున వారు యెహోవా యందు భయపడి, నీచ
మయిన వారిలో కొందరిని వున్నతమయిన స్థలముల
కొరకు అర్చకులగా చేసుకొనిరి; వీరు వారి కొరకు
వున్నతమయిన స్థలములయొక్క మందిరములందు బలు
33 లను చెల్లిస్తూ వుండిరి.। వారు యెహోవా యందు
భయపడుతూ, యే జనాంగములలోనుంచి వారు తీసు
కుపోబడిరో వారియొక్క మర్యాదా ప్రకారము తమ
34 దేవుండ్లకు సేవ చేస్తూ వుండిరి.। వారు నేటి వరకు
తమ పూర్వ మర్యాదల ప్రకారము చేస్తూ వున్నారు;
యెహోవా యందు భయపడక, ఆయనచేత ఇశ్రా
యేలని పిలువబడిన యాకోబుయొక్క పుత్రులకు
ఆజ్ఞాపించిన కట్టడలు న్యాయ ప్రమాణములు ఆజ్ఞలు
35 వీటి ప్రకారముగా చేస్తున్నారు కారు.। యెహోవా
వారితో వొడంబడికె చేసుకొని వారికి ఆజ్ఞాపించిన
దేమంటే, మీరు యితర దేవుండ్లకు భయపడక, వారికి
వంగి నమస్కరించక, సేవ చేయక, బలులను చెల్లిం
36 చక,। మిస్రయీము దేశములోనుంచి మిమ్మును బహు
బలముచేతనున్ను చాపిన హస్తము చేతనున్ను యివ
తలకు తెప్పించిన యెహోవా అనే ఆయన యందే
భయపడి ఆయనకు వంగి నమస్కారము చేసి బలు
37 లను చెల్లించ వలసినది.। మరిన్ని ఆయన మీ కొ
రకు వ్రాయించిన నిబంధనలనున్ను కట్టడలనున్ను
న్యాయ ప్రమాణమునున్ను ఆజ్ఞలనున్ను మీయొక్క
దినములన్నిటి దాకా భద్రము చేసి, యితర దేవుండ్లకు
38 భయపడకుండా వుండవలెను.। మరిన్ని నేను మీతో
చేసుకొనిన వొడంబడికెను మీరు మరువక, యితర
39 దేవుండ్లకు భయపడక,। మీ దేవుడైన యెహోవా
యందే భయపడుతూ వుండుదురు గాక; అప్పుడు
ఆయన మీ శత్రువులయొక్క చేతిలోనుంచి మిమ్మును
విడిపించునని ఆనతిచ్చినప్పటికిన్ని,। వారు వినక తమ 40
పూర్వపు మర్యాద ప్రకారమే చేసిరి.। యీలాగున 41
ఆ జనాంగములు యెహోవాకు భయపడుతూ, తాము
చేసుకొనినటువంటి వాటికి సేవ చేస్తూ వుండిరి; మరిన్ని
వారి బిడ్డలున్ను వారి బిడ్డలయొక్క బిడ్డలున్ను వారి
పితృలు చేసినలాగున నేటి వరకూ చేస్తూ వున్నారు.

## 18. అధ్యాయము.

అయితే ఇశ్రాయేలు రాజున్ను ఏలా కుమారు 1
డున్ను అయిన హోషేయా యేలుబడియొక్క మూ
డో సంవత్సరమందు యూదా రాజున్ను ఆహాజు
కుమారుడున్ను అయిన హిజ్కియా యేల నారంభిం
చెను.। అతడు యేల నారంభించినప్పుడు యిరువై 2
అయిదు సంవత్సరముల వాడయి, యెరూశలేము
యందు యిరువై తొమ్మిది సంవత్సరములు యేలెను.
అతని తల్లి జఖర్యా కుమార్తె అయి అబీ అని పిలువ
పడెను.। యితడు తన పితృడైన దావీదు చేసిన ప్రకా 3
రమంతా యెహోవా దృష్టి యెదుట నీతిగా చేసె
ను.। అతడు వున్నతమయిన స్థలములను తీసివేసి, ప్రతి 4
మలను పగలకొట్టి, తోపులను నరికించి, మోషే చేయిం
చిన ఇత్తడి సర్పమును చిన్నాభిన్నములుగా చేసెను,
యేమంటే నాటి వరకు ఇశ్రాయేలు పుత్రులు దానికి
ధూపములను వేస్తూ వుండిరి; అతడు దానికి నెహు
ష్టాను అనే పేరు పెట్టెను.। మరిన్ని అతడు ఇశ్రా 5
యేలు దేవుడైన యెహోవా యందు నమ్మి వుండెను;
అతని తరువాత యూదా రాజులలోనున్ను అతని
పూర్వికులైన రాజులలోనున్ను అతనితో సమమైన
వాడు వొకడూ లేడు.। యేమంటే అతడు యెహో 6
వాతో హత్తుకొని, ఆయన వెనుకనుంచి తిరగక, యె
హోవా మోషేకు ఆజ్ఞాపించిన ఆజ్ఞలన్నిటినీ గైకొ
నెను.। కాబట్టి యెహోవా అతనికి తోడుగా వుం 7
డెను; యెక్కడికి అతడు బైలు వెళ్లినా అక్కడ అతడు
జయమును పొందెను; అతడు అష్షూరు రాజు మీద
తిరగబడినందున అతనికి సేవ చేయ లేదు.। మరిన్ని 8
అతడు ఫెలిష్తీయులను గాజా పట్టణ పర్యంతమున్ను
దాని సరిహద్దుల పర్యంతమున్ను కాపరుల గోపురము
మొదలుకొని ప్రాకారములు గల పట్టణముల పర్యం
తమున్ను కొట్టెను.। అయితే రాజైన హిజ్కియా యేలు 9
బడియొక్క నాలుగో సంవత్సరమందున్ను ఇశ్రాయేలు
రాజైన ఏలా కుమారుడైన హోషేయ యేలుబడి
యొక్క యేడో సంవత్సరమందున్ను అష్షూరు రాజైన
షల్మనేసెరు షోమ్రోను పట్టణము మీదికి నచ్చి ము
ట్టడి వేసెను.। మూడో సంవత్సరము సమాప్తమైనప్పుడు 10

వారు దానిని పుచ్చుకొనిరి; హిజ్కియా యేలుబడి
యొక్క ఆరో సంవత్సరమందున్ను ఇశ్రాయేలు రా
జైన హోషేయ యేలుబడియొక్క తొమ్మిదో సంవ
త్సరమందున్ను షోమ్రోను పట్టణము పట్టుపడెను.।
11 అప్పుడు అష్షూరు రాజు ఇశ్రాయేలీయులను అష్షూరు
దేశములోకి తీసుకొనిపోయి, గోజాను నది దగ్గిర వున్న
అలహు హాబోరు అనే పట్టణములందున్ను మాదీయుల
12 యొక్క పట్టణములందున్ను వారిని వుంచెను.। యే
మంటే వారు తమ దేవుడయిన యెహోవాయొక్క
వాక్యము వినని వారై, ఆయనయొక్క ఫ్రెడంబడికె
నున్ను ఆయన సేవకుడయిన మోషే ఆజ్ఞాపించినదంత
టినిన్ని అతిక్రమించి వినకనున్ను చేయకనున్ను వుం
13 డిరి.। అయితే రాజయిన హిజ్కియా యేలుబడియొక్క
పధ్నాలుగో సంవత్సరమందు అష్షూరు రాజైన సన్హే
రీబు యూదా దేశమందున్న ప్రాకారములు గల
పట్టణములన్నిటి మీదికి వచ్చి వాటిని పుచ్చుకొనెను.।
14 అప్పుడు యూదా రాజైన హిజ్కియా లాఖీషు పట్ట
ణమందున్న అష్షూరు రాజు యొద్దికి వర్తమానము
పంపినదేమంటే, నావల్ల తప్పు వచ్చినది; నా మీద
మీరు యేది మోపుతారో అది నేను భరింతును; మీరు
నా యొద్దనుంచి తిరిగి పోవలెనని చెప్పుమనినందున
అష్షూరు రాజు యూదా రాజయిన హిజ్కియాకు
మున్నూరు వెండి తలాంతులనున్ను ముప్పయి బంగా
15 రపు తలాంతులనున్ను నిర్ణయము చేసెను.। అయి
నందున హిజ్కియా యెహోవా మందిరమందున్న
రాజ మందిరముయొక్క పదార్థములందున్న కనప
16 డిన వెండి అంతా అతనికి యిచ్చెను.। మరిన్ని ఆ కాల
మందు హిజ్కియా గుడి తలుపులకు కలిగిన బంగార
మునున్ను తాను కట్టించిన స్తంభములకు కలిగిన బం
గారమునున్ను తీయించి, అష్షూరు రాజుకు యిచ్చెను.।
17 అంతట అష్షూరు రాజు తర్తానునున్ను, రబ్సారీసును
న్ను, రబ్షాకేనున్ను బహు గొప్ప సమూహముతోను
లాఖీషు పట్టణమునుంచి యెరూశలేము యందున్న
రాజైన హిజ్కియా మీదికి పంపెను. వారు యె
రూశలేము మీదికి వచ్చిరి; వారు చాకలిరేవు మార్గ
మందున్న మెరక కొలనుయొక్క కాలువ యొద్దికి వచ్చి
8 నిలిచి రాజును పిలిచిరి.। అప్పుడు యింటివారి పైని
వున్న హిల్కియా కుమారుడైన ఎల్యాకీమున్ను కరణ
మయిన షెబ్నాయున్ను సమాచార లేఖికుడైన ఆసాపు
కుమారుడైన యోవాహున్ను వారి యొద్దికి బైలు
9 వెళ్లిరి.। అప్పుడు రబ్షాకే వారితో అనిన మాట, మహా
రాజు అయిన అష్షూరు రాజు సెలవు యిచ్చినలాగు,
మీరు హిజ్కియాతో చెప్ప వలసినదేమంటే, నీవు
దేనియందు నమ్ముతున్నావో ఆ నమ్మకముయొక్క

ఆస్పదము యేది?। యుద్ధమునకు కావలసిన బుద్ధిన్ని 20
బలమున్ను నాకు కలవని నీవు అనుకొంటున్నావు గాని
అవి వ్యర్థమైన మాటలు; నా మీద తిరగబడుటకు
యెవరియందు నమ్ముతున్నావు?। యిదుగో మిస్రయీ 21
ము, అనగా, యీ చితికిన రెల్లు కర్రయందు నీవు
నమ్ముకొంటున్నావు; దాని మీద వొకడు ఆనుకొంటే
అది వాని చేతికి యేలాగున గుచ్చుకొని దూసిపోవు
నో ఆలాగుననే మిస్రయీము రాజయిన ఫరో
అతని నమ్మిన వారికి వుండును.। అయితే మేము మా 22
దేవుడైన యెహోవా యందు నమ్మి వున్నామని మీరు
నాతో చెప్పేరు గనుక చెప్పితే హిజ్కియా యూదా
వారినిన్ని యెరూశలేము వారినిన్ని చూచి యెరూశ
లేము యందున్న యీ బలిపీఠము యొద్ద మాత్రమే
మీరు మ్రొక్క వలెనని చెప్పి, యెవని వున్నతమైన
స్థలములనున్ను బలిపీఠములనున్ను అతడు తీసివేసెనో
ఆయనే యెహోవా గదా?। యిప్పుడు నీకు అను 23
కూలమైతే అష్షూరు రాజయిన నా యేలిన వారికి
కుదువ యిమ్ము, అప్పుడు నీవు రెండువేల గుర్రముల
మీద రౌతులను యెక్కించుటకు శక్తి గలవాడవైతే
అవి నీకు అప్పగింతును.। యీలాగుండగా నా యజ 24
మానునియొక్క సేవకులలో నీచమయిన అధిపతి ఆ
యిన వొకని ముఖమును యేలాగున తిప్పుదువు? రథ
ముల కొరకున్ను రౌతుల కొరకున్ను మిస్రయీము
రాజు యందు నమ్ముదువా?। అయితే యీ స్థలము నా 25
శనము చేయడానకు యెహోవా సెలవు లేకుండానే
వస్తినా? ఆ దేశము మీదికి వెళ్లి దాని నాశనము చేయు
మని యెహోవా నాకు సెలవిచ్చెను అని చెప్పినప్పు
డు;। హిల్కియా కుమారుడయిన ఎల్యాకీమున్ను షె 26
బ్నాయున్ను యోవాహున్ను రబ్షాకేతోను అనిన
మాట, ప్రాకారము మీద వున్న వారు వింటూ వుం
డగా యూదా భాషచేత వద్దు అరాము భాషచేత
మీ సేవకులమైన మాతో మాట్లాడండి, యేమంటే అది
మాకు తెలుసునని చెప్పగా;। రబ్షాకే వారితో అనిన 27
మాట, యీ మాటలు పలుకడానకు నా యజమానుడు
నీ యజమానుని యొద్దికిన్ని నీ యొద్దికిన్ని నన్ను పంపి
నాడా? ప్రాకారము మీద కూర్చున్నవారు మీతో
కూడా తమ మలమును తినేటట్టున్ను తమ మూత్ర
మును తాగేటట్టున్ను వారి యొద్దికి నన్ను పంపలేదా?
అని రబ్షాకే పలికి నిలిచి,। గొప్ప శబ్దముతోటి యూ 28
దా భాషచేత చెప్పినదేమంటే, మహా రాజైన అష్షూరు
రాజుయొక్క మాటలు మీరు వినండి; రాజు చెప్పినలాగు
యేమంటే,। హిజ్కియా మోసములో మీరు పడ 29
కండి, యేమంటే అతని చేతిలోనుంచి మిమ్మును విడి
పించ శక్తి వానికి చాలదు.। హిజ్కియా మిమ్మును 30

చూచి యెహోవా మనలను విడిపించును, యీ
పట్టణము అష్షూరు రాజు చేతిలోకి దొరకక వుండు
నని చెప్పునేమో, మీరు యెహోవా యందు నమ్మ
31 వద్దండి. । హిజ్కియా చెప్పిన మాటలు వినవద్దు;
అష్షూరుయొక్క రాజు చెప్పినది యేమంటే, కానుక
చేత మాతో సమాధానము చేసుకొని, మా యొద్దికి
బైటికి రండి; అప్పుడు మీలో ప్రతి మనిషీ తన
ద్రాక్ష చెట్టుదిన్ని తన అంజూరపు చెట్టుదిన్ని తింటూ,
32 తన నూతి నీళ్లు తాగుతూ, । మేము వచ్చి మీ దేశము
వంటి దేశము, అనగా, గోధుమున్ను ద్రాక్షారసమున్ను
గల దేశమునకున్ను ఆహారమున్ను ద్రాక్ష చెట్లున్ను
గల దేశమునకున్ను ఇప్పచెట్ల తైలమున్ను తేనెయున్ను
గల దేశమునకున్ను మీరు చావక బ్రతికేటట్టుగా
మిమ్మును తీసుకు పోయే పర్యంతమూ సుఖముగా వుం
డవచ్చును; కాబట్టి హిజ్కియా మిమ్మును బోధించి
యెహోవా మిమ్మును విడుపించునని చెప్పితే వాని
33 మాటలను వినవద్దండి. । జనాంగములయొక్క దేవుండ్ల
లో యెవడయినా తన దేశమును అష్షూరు రాజు చేతి
34 లోనుంచి విడిపించెనా! । హమాతుయొక్క దేవుండ్లు
యెక్కడ! అర్పాదుయొక్క దేవుండ్లు యెక్కడ! సెఫ
ర్వయీముయొక్క దేవుండ్లు యెక్కడ! హేన ఇవా
వీటియొక్క దేవుండ్లు యెక్కడ! వీరు షోమ్రోను
35 దేశమును మా చేతిలోనుంచి విడిపించిరా! । దేశముల
యొక్క దేవుండ్లలో యెవరయినా తమ దేశములను
మా చేతిలోనుంచి విడిపించిరి గనుక నా యెహోవా
మా చేతిలోనుంచి యెరూశలేము విడిపించడానకు అని
36 పలికెను. । అయితే జనులు వూరకొని ప్రత్యుత్తరము
యెంత మాత్రమూ యివ్వకుండా వుండిరి; యేమంటే
అతనికి ప్రత్యుత్తరమివ్వవద్దని రాజు సెలవు వుండెను. ।
37 అప్పుడు యింటి వారి పైని వున్న హిల్కియా కుమా
రుడయిన ఎల్యాకీమున్ను కరణమైన షెబ్నాయున్ను
సమాచార లేఖికుడైన ఆసాపు కుమారుడైన యోవా
హున్ను బట్టలు చించుకొని, హిజ్కియా యొద్దికి వచ్చి,
రబ్షాకే పలికిన మాటలెల్లా తెలియ చెప్పిరి.

## 19. అధ్యాయము.

1 అయితే హిజ్కియా యిది విన్నప్పుడు సంభవిం
చినదేమంటే, తన బట్టలను చించుకొని, గోనె కప్పు
కొని, యెహోవాయొక్క మందిరములోకి వచ్చి, ।
2 యింటి పైని వున్న ఎల్యాకీమునున్ను కరణమైన షెబ్నా
నున్ను అర్చకులలో పెద్దలనున్ను ఆమోసు కుమారు
డున్ను దీర్ఘదర్శిన్ని అయిన యెషయా యొద్దికి
3 పంపెను. । వీరు గోనె కట్టుకొని, అతని యొద్దికి వచ్చి,
అతనితో హిజ్కియా చెప్పినదేమంటే, యీ దినము
శ్రమయున్ను గద్దింపున్ను దూషణయున్ను కల దినమై
యున్నది; పిల్లలు పుట్టుటకు సిద్ధమైనప్పటికిన్ని తల్లు
లకు కనుటకు శక్తి లేదు. । జీవముగల దేవుని నిర్లక్ష్య 4
పెట్టడానకు అష్షూరు రాజైన తన యజమానునిచేత
పంపబడిన రబ్షాకే చెప్పిన మాటలెల్లా నీ దేవుడైన
యెహోవా విని అహంకారపడునేమో; కాబట్టి
శేషించియున్న వారి కొరకు నీ ప్రార్థన యొక్క
టట్టు చేయుమని చెప్పుమని పంపినందున, । రాజైన 5
హిజ్కియాయొక్క సేవకులు యెషయా యొద్దికి వచ్చిరి. ।
అప్పుడు యెషయా వారితో యెహోవా పలికిన 6
వాక్యము యేమంటే, అష్షూరు రాజుయొక్క సేవకులు
నన్ను దూషించినటువంటిన్ని నీవు వినినటువంటిన్ని
మాటలకు భయపడ వద్దు. । యిదుగో నేను వాని మీద 7
వొక వాయువును విసరచేతును; వాడు వొక కబురు
విని, తన దేశమునకు వెళ్లిపోవును; అయితే నేను వాని
దేశమందు కత్తిచేత వాని కూలచేతునని యీ ప్రకా
రము మీ యజమానునితో చెప్ప వలెనని చెప్పెను. ।
అయినందున రబ్షాకే తిరిగీ వెళ్లి, అష్షూరు రాజు లిబ్నా 8
మీద యుద్ధము చేస్తూ వుండుటను చూచెను, యేమం
టే లాకీషు పట్టణమును అతడు విడచి వెళ్లిన సంగతి
అతడు వినెను. । మరిన్ని అదుగో కుషు రాజైన తిర్హా 9
కా నీ మీద యుద్ధము చేయడానకు వచ్చెనని అష్షూరు
రాజుకు వినపడినప్పుడు, అతడు తిరుగా హిజ్కియా
యొద్దికి దూతలచేత పంపిన వర్తమానము యేమంటే, ।
యెరూశలేము అష్షూరు రాజు చేతికి అప్పగించబడ 10
దని అనుటవల్ల నీవు నమ్ముతూ వున్న నీ దేవునిచేత
నీవు వంచించబడకుము. । యిదుగో అష్షూరు రాజులు 11
సకల దేశములను బొత్తిగా నశింప చేసిన సంగతి నీకు
వినపడినదే; నీవు విడిపించబడుదువా? । నా పితృలు 12
నశింప చేసిన జనాంగములయొక్క, అనగా, గోజాను
హారాను రెస్సెపు తెలాస్సారులో వుండిన ఏదెనుయొ
క్క పుత్రులు అనే వీరియొక్క దేవుండ్లు వీరిని విడి
పించిరా? । హమాతుయొక్క రాజు యెక్కడ! అర్పా 13
దుయొక్క రాజు యెక్కడ! సెఫర్వయీము హేన
ఇవా యీ పట్టణములయొక్క రాజులు యెక్కడ!
అని యీలాగున యూదా రాజైన హిజ్కియాతో
చెప్పండని పంపెను. । ఆ వుత్తరమును హిజ్కియా దూ 14
తల చేతిలోనుంచి పుచ్చుకొని చదివెను; అప్పుడు
హిజ్కియా యెహోవాయొక్క మందిరములోకి వెళ్లి
యెహోవా సముఖమందు దాని విప్పి పరిచెను. ।
మరిన్ని హిజ్కియా యెహోవా సముఖమందు ప్రా 15
ర్థన చేసినదేమంటే, కెరూబుల మధ్యను నివసిస్తున్న
ఇశ్రాయేలు దేవుడవైన వో యెహోవా, నీవు మా
త్రమే లోకమందున్న సకల రాజ్యములకు దేవుడవై

వున్నావు; నీవు ఆకాశమునున్ను భూమినిన్ని కలుగ
16 చేసితివి. । ఓ యెహోవా, నీ చెవిని యొగ్గి వినుము;
ఓ యెహోవా నీ నేత్రములను తెరచి చూడుము;
జీవము గల దేవుడవైన నిన్ను నిర్లక్ష్యము చేయడా
17 నకు సన్హేరీబు పంపిన మాటలను వినుము. । ఓ యె
హోవా, నిజముగా అష్షూరు రాజులు ఆ జనాంగ
18 ములనున్ను వారి దేశములనున్ను నాశనము చేసి, । వారి
దేవుండ్లను అగ్నిలో వేసిరి, యేమంటే అవి దేవుండ్లు
కావు మనుష్యుల చేతిపని గల దారు శిలామయములు;
19 కాబట్టి వారు వాటిని నశింప చేసిరి. । అయినందున
మా దేవుడవైన ఓ యెహోవా, లోకమందున్న
సమస్త రాజ్యములు నీవే నిజముగా నీవు మాత్రమే
యెహోవా అనే దేవుడవని యెరిగేటట్టుగా అతని
చేతిలోనుంచి మమ్మును రక్షించుమని ప్రార్థన చేసె
20 ను. । అప్పుడు ఆమోసు కుమారుడైన యెషయా హిజ్కి
యా యొద్దకు వర్తమానము పంపినదేమంటే, ఇశ్రా
యేలు దేవుడైన యెహోవా ఆనతిచ్చినలాగు, అష్షూరు
రాజయిన సన్హేరీబు విషయమై నీవు నన్ను గురించి
21 చేసిన ప్రార్థన నేను వింటిని. । అతని గురించి యె
హోవా యిచ్చిన సెలవు యేమంటే, సీయోనుయొక్క
కుమార్తెయైన కన్యక నిన్ను నిర్లక్ష్యపెట్టి అపహా
స్యము చేసెను; యెరూశలేముయొక్క కుమార్తె నీ
22 తట్టు తన తల వూచెను. । నీవు యెవరిని నిర్లక్ష్యపెట్టి
దూషించితివి? యెవరికి విరోధముగా నీవు నీ కంఠమెత్తి
నీ నేత్రములను పయికెత్తితివి; ఇశ్రాయేలుయొక్క పరి
23 శుద్ధుని మీదికి గదా? । నీ దూతలచేత నీవు యెహో
వాను నిర్లక్ష్యపెట్టి పలికినదేమంటే, నా రథముల
సముదాయముతోను నేను పర్వత శిఖరము మీది
కిన్ని లెబానోనుయొక్క పార్శ్వముల యొద్దికిన్ని
వచ్చి, దానియొక్క పొడవయిన ఆర్జ వృక్షముల
నున్ను అతిశయమైన దేవదారు వృక్షములనున్ను నరికి
వేస్తిని; వాని సరిహద్దులలో వున్న సత్రములలోకిన్ని
24 కర్మెలు అనే వాని అడవిలోకిన్ని ప్రవేశిస్తిని. । నేను
తవ్వి అన్యమైన నీళ్లు తాగితిని; నా అరికాలిచేత నేను
ముట్టడి వేయబడిన స్థలములయొక్క నదులన్నిన్ని
25 యెండి పోయేటట్టు చేస్తినని అతిశయపడితివి. । అయితే
పూర్వమందే నేను దీని చేస్తినన్ని పురాతన కాల
ములందు దీని నిర్ణయిస్తినన్ని నీవు వినలేదా? ఆలా
గున నీవు వుండేటట్టుగానున్ను ప్రాకారములు గల
పట్టణములను నీవు పాడు దిబ్బలుగా చేసేటట్టుగా
26 నున్ను నేను యిప్పుడు సంభవింప చేస్తిని. । కాబట్టి వాటి
కాపురస్థులు బలహీనులైనందున వారు జడిసి విభ్రాం
తులైరి; వారు బయిట వున్న గడ్డి అయినట్టున్ను యెద
గక మునుపు మాడిన వెన్నులైనట్టున్ను వుండిరి. । అయితే 27
నీ కూర్చుండుటయున్ను నీ బైలు వెళ్లుటయున్ను
లోపలికి వచ్చుటయున్ను నా మీద నీకు వున్న రౌ
ద్రమున్ను నాకు తెలిసి యున్నవి. । నా మీద నీకు 28
వున్న రౌద్రమున్ను నీవు చేసిన కలహమున్ను నా చెవు
లలో చొచ్చెను; కాబట్టి నా గాలము నీ ముక్కు
కున్ను నా కళ్లెము నీ నోటికిన్ని వేసి నిన్ను మళ్లించి,
నీవు యే మార్గముచేత వస్తివో ఆ మార్గముననే
తిరిగి వెళ్లచేతునని వాని గురించిన ఆజ్ఞ అయి వున్నది. ।
మరిన్ని నీకు కలిగే గురుతు యేమంటే, యీ సంవత్స 29
రమందు వాటికి అవే పెరిగే వాటినిన్ని రెండో సంవ
త్సరమందు ఆ ప్రకారముగా పుట్టేవాటినిన్ని మీరు
భక్షించండి; మూడో సంవత్సరము మీరు విత్తనము
విత్తి చేనులను కోతురు, ద్రాక్ష తోటలను నాటి వాటి
పండ్లను అనుభవింతురు. । మరిన్ని యూదాయొక్క 30
యింటివారిలో తప్పించుకొనిన శేషము యింకా వేరు
తన్ని మీద ఫలమును ఫలించును. । యేమంటే శేషించి 31
వుండేవారు యెరూశలేములోనుంచిన్ని తప్పించుకొనిన
వారు సీయోను కొండలోనుంచిన్ని బయిలు వెళ్లుదురు.
యెహోవాయొక్క ఆసక్తి దీని సంభవింప చేసెను. ।
కాబట్టి అష్షూరు రాజును గురించి యెహోవా యి 32
చ్చిన సెలవు యేమంటే, అతడు యీ పట్టణములోకి
రాకపోవును; దాని మీద వొక బాణము సహా వేయక
వుండును; వొక డాలు సహా దానికి అగుపర్చక వుం
డును; దాని యెదుట బురుజు కట్టక వుండును. ।
యే మార్గముచేత అతడు వచ్చెనో ఆ మార్గ 33
ముచేతనే అతడు వెళ్లును గాని యీ పట్టణము లో
పలికి రాలేకపోవునని యెహోవా ఆనతిచ్చెను. ।
యేమంటే నా కొరకున్ను నా సేవకుడయిన దావీదు 34
కొరకున్ను నేను యీ పట్టణమును కాపాడి రక్షింతునని
సెలవు యిచ్చెనని చెప్పెను. । అయితే ఆ రాత్రిలోనే 35
సంభవించినదేమంటే, యెహోవాయొక్క దూత బయి
లు వెళ్లి, అష్షూరు వారియొక్క దండు పేటలో ప్రవే
శించి, లక్ష యెనభై అయిదువేల మందిని కొట్టినందున
వారు ప్రాతఃకాలమందు లేచి చూడగా యిదుగో
వారందరున్ను శవములై వుండిరి. । అప్పుడు అష్షూరు 36
రాజయిన సన్హేరీబు తిరిగి పోయి, నీనెవే పట్టణము
నకు వచ్చెను. । అయితే అతడు తన దేవుడైన నిస్రోకు 37
యొక్క మందిరమందు మొక్కుతూ వున్నప్పుడు తన
కుమారులయిన అద్రమ్మెలెకున్ను షరెస్సెరున్ను వచ్చి,
కత్తిచేత అతని నరికి, అరారాథు దేశములోకి తప్పిం
చుకొని పోయిరి. అప్పుడు అతని కుమారుడయిన ఏస
హర్దోను అతనికి మారుగా యేలెను.

## 20. అధ్యాయము.

1 ఆ దినములందు హిజ్కియా రోగియై మరణమునకు
సిద్ధమైనట్టు అగు పడెను. అప్పుడు ఆమోజు కుమా
రుడున్ను దీర్ఘదర్శిన్నియైన యెషయా అతని దగ్గి
రకు వచ్చి, అతనితో నీ యింటిని గురించి నిర్ణయము
చేసుకోనుము, యేమంటే నీవు బ్రతుకక మరణమవు
2 దువని యెహోవా ఆనతిచ్చెనని చెప్పినప్పుడు; । అత
డు తన ముఖమును గోడతట్టు తిప్పుకొని యెహోవా
3 వాను ప్రార్థన చేసినదేమంటే, । ఓ యెహోవా,
నేను యథార్థముగానున్ను మనఃపూర్తిగానున్ను
నీ ముందర నడచి, నీ దృష్టికి యేది మంచిదో అది నేను
చేసినానని నా యందు జ్ఞాపకము వుంచి, దయ చేయు
4 మని హిజ్కియా కన్నీళ్లతోను వేడుకొనెను. । అయి
నందున యెషయా మధ్యశాలలోనుంచి అవతలకు
వెళ్లక మునుపే యెహోవావాయొక్క వాక్యము అతనికి
5 వచ్చినదేమంటే, । నీవు తిరిగీ నా జనులయొక్క అధిప
తియైన హిజ్కియా యొద్దికి వెళ్లి అతనితో చెప్ప వల
సినలాగు, నీ పితృడైన దావీదుయొక్క దేవుడైన యె
హోవా నీకు యిచ్చిన సెలవు యేమంటే ప్రార్థన
నేను వింటిని; నీ కన్నీళ్లు నేను చూస్తిని; యిదుగో
నిన్ను నేను బాగుచేస్తాను; నీవు మూడో దినమున యె
హోవావాయొక్క మందిరమునకు యెక్కి పోదువు. ।
6 మరిన్ని నీ దినములు యింకా పదిహేను సంవత్సర
ములు వుండేటట్టు చేస్తాను; మరిన్ని నిన్నున్ను యీ
పట్టణమునున్ను అష్షూరు రాజుయొక్క చేతిలోనుంచి
విడిపింతును; నా కొరకున్ను నా సేవకుడైన దావీదు
కొరకున్ను యీ పట్టణమును కాపాడుతానని చెప్పు
7 మనెను. । మరిన్ని యెషయా అంజూరపు పండ్ల ముద్ద
తీసుకొమ్మని చెప్పినందున వారు అది తీసి కురుపు మీద
8 వేసిన తరువాత అతడు తిరిగీ బాగుపడెను. । అయితే
హిజ్కియా యెషయాను చూచి, యెహోవా నన్ను
స్వస్థపరచడానకున్ను నేను మూడో దినమున యె
హోవావాయొక్క మందిరమునకు యెక్కి వెళ్లడానకున్ను
9 గురుతు యిమ్మని అడిగెను. । అందుకు యెషయా అనిన
మాట యెహోవా యే మాట చెప్పెనో అది చేసు
నని తెలియడానకు యే గురుతు కావలెను! నీడ పది
అంశలు ముందరకు నడవడమా, లేక పది అంశలు వెన
10 కకు నడవడమా? అని అడిగినప్పుడు; । హిజ్కియా అనిన
మాట, నీడ పది అంశలు ముందరికి నడుచుట అల్పమై
వుండును; ఆలాగున కాకుండా నీడ పది అంశలు వెన
11 కకు నడిచిపోవలెనని చెప్పినందున, । దీర్ఘదర్శియైన
యెషయా యెహోవాను వేడుకొనెను; అప్పుడు
ఆయన ఆహాజుయొక్క గడియారపు బిళ్లమీద నీడ
యే పది అంశలను ముందర అతిక్రమించి వచ్చెనో
ఆ పది అంశలను దాని వెనకకు తిరిగి పో చేయించెను. ।
ఆ కాలమందు బాబెలు రాజున్ను బలదాను కుమారు 12
డున్ను అయిన బెరోదక్బలదాను వుత్తరములున్ను కా
నుకనున్ను హిజ్కియా యొద్దికి పంపెను, యేమంటే
అతడు రోగి అయిన సంగతి అతనికి వినబడినది.
అప్పుడు హిజ్కియా వారికి వినయముగా వుండి, తన 13
పదార్థములు గల కొట్టునున్ను వెండి బంగారముల
నున్ను గంధవర్గములనున్ను పరిమళ తైలమునున్ను
ఆయుధాదులు గల యిల్లునున్ను తన పదార్థములలో
వున్న సమస్తమునున్ను చూపించెను; తన యింటనున్ను
రాజ్యమందున్ను వున్న సమస్తములో హిజ్కియా
వారికి చూపించనిది వొకటైనా లేక వుండెను. । అప్పు 14
డు దీర్ఘదర్శియైన యెషయా రాజైన హిజ్కియా
యొద్దికి వచ్చి ఆ మనుష్యులు యేమి చెప్పినారు! నీ
యొద్దికి యెక్కడనుంచి వచ్చిరని అడిగెను; అందుకు
హిజ్కియా వారు దూరదేశమునుంచి అనగా బాబె
లునుంచి వచ్చిరని చెప్పగా; । అతడు నీ యింట్లో 15
వారు యేమి చూచిరని అడిగినప్పుడు, హిజ్కియా
నా యింట్లో వున్న సమస్తమూ వారు చూచిరి; నా
పదార్థములలో వారికి నేను చూపించనది వొకటీ
లేదని చెప్పినందున, । యెషయా హిజ్కియాతో అనిన 16
మాట, యెహోవా యిచ్చిన సెలవు వినుము, । యే 17
మంటే యిదుగో దినములు వస్తూ వున్నవి, అప్పుడు
నీ యింట్లో వున్న సమస్తమున్ను నీ పితృలు నేటి వరకు
కూర్చి దాచి పెట్టినదంతానున్ను బాబెలు పట్టణము
నకు యెత్తుకు పోపడును; వొకటైనా వుండకపోవునని
యెహోవా ఆనతిచ్చెను. । మరిన్ని నీ గర్భమందు 18
పుట్టిన నీయొక్క పుత్ర సంతతిని వారు తీసుకొ పో
దురు; అప్పుడు వారు బాబెలు రాజుయొక్క నగరిలో
పండులై వుందురని చెప్పినప్పుడు; । హిజ్కియా యెష 19
యాను చూచి నీవు చెప్పిన యెహోవావాయొక్క వా
క్యము మంచిదని, మరిన్ని అనినదేమంటే, నాయొక్క
దినములందు క్షేమమున్ను సత్యమున్ను కలిగి వుండును
గనుక ఆ వాక్యము యోగ్యమే అని చెప్పెను. । హి 20
జ్కియాయొక్క తతిమ్మా కార్యములున్ను అతని పరా
క్రమమంతానున్ను అతడు కొలను తవ్వించి కాలువ
చేయించి పట్టణములోకి నీళ్లు యేలాగు రప్పించెనో
అదిన్ని యూదా రాజులయొక్క వృత్తాంతముల గ్రం
థమందు వ్రాయబడి వున్నవి గదా! । అయితే హిజ్క 21
యా తన పితృలతో కూడా నిద్రపొందెను; అప్పుడు
అతని కుమారుడైన మనస్సే అతనికి మారుగా యేలెను.

## 21. అధ్యాయము.

1 మనస్సే యేలనారంభించినప్పుడు పండెండు సంవ
త్సరములవాడై, యెరూశలేములో యేభయి అయిదు
సంవత్సరములు యేలెను; అతని తల్లి పేరు హెఫ్సిబా
2 అని వుండెను.। అతడు యెహోవా దృష్టి యెదుట
కీడు చేసి, ఇశ్రాయేలు పుత్రుల ముందరనుంచి యె
హోవా అవతలకు వెళ్లవేసిన జనాంగములయొక్క
3 యేహ్య మార్గములందు నడిచెను.। యేమంటే అతని
తండ్రియైన హిజ్కియా పడగొట్టిన వున్నతమైన స్థల
ములను అతడు తిరిగీ కట్టించి, బయలు కొరకు బలిపీ
ఠములను కలుగచేసి, ఇశ్రాయేలు రాజైన అహాబు చేసి
నట్టు తోపులను నాటించి, ఆకాశ సమూహమంతటికీ
4 మ్రొక్కి సేవ చేసెను.। మరిన్ని యెరూశలేము యందు
నా నామము వుంచుదునని యెహోవా సెలవు యిచ్చి
నప్పటికిన్ని అతడు యెహోవాయొక్క మందిరమం
5 దు బలిపీఠమును కట్టించెను.। మరిన్ని యెహోవా
యొక్క మందిరమునకు కలిగిన రెండు సాలలలో ఆకాశ
సమూహమునకు అతడు బలిపీఠములను కట్టించెను.।
6 మరిన్ని అతడు తన కుమారుని అగ్నిలోనుంచి గడవ
చేసెను; అతడు కాలపు గురుతులనున్ను శకునములను
న్ను వాడికె చేసి, యెక్షిణులతోనున్ను సోదెకాండ్ల
తోనున్ను సాంగత్యము చేసెను; యీలాగున అతడు
యెహోవా దృష్టి యెదుట మిక్కిలీ కీడుచేసి, ఆయ
7 నకు కోపమును పుట్టించెను.। మరిన్ని తాను చేయించిన
తోపులో వున్నటువంటి చెక్కిన ప్రతిమను యెహో
వాయొక్క మందిరమందు వుంచెను; దాని గురించి యె
హోవా దావీదుకున్ను అతని కుమారుడైన సొలొమో
నుకున్ను ఆనతిచ్చినదేమంటే, యీ మందిరమందున్ను
ఇశ్రాయేలు గోత్రములోనుంచి నేను యెంచుకొనిన
యెరూశలేము యందున్ను నా నామము సదా కాలము
8 వుంచుదును.। యేమంటే ఇశ్రాయేలీయులకు నేను
ఆజ్ఞాపించిన అంతటి ప్రకారముగానున్ను నా సేవకు
డైన మోషే వారికి ఆజ్ఞాపించిన న్యాయ ప్రమాణమం
తటి ప్రకారముగానున్ను వారు భద్రముగా చేస్తే,
వారి పితృలకు నేను యిచ్చిన దేశములోనుంచి వారి
పాదములను యిక తొలగి పోనివ్వనని ఆనతిచ్చినప్ప
9 టికిన్ని వారు వినక పోయిరి;। యేమంటే ఇశ్రాయేలు
పుత్రుల ముందరనుంచి యెహోవా లయము చేసిన
జనాంగములు చేసిన కీడుకంటే యెక్కువ కీడు చేయు
10 టకు మనస్సే వారిని ప్రేరేపించెను.। అయినందున యె
హోవా తన సేవకులైన దీర్ఘదర్శుల ద్వారా ఆన
11 తిచ్చినదేమంటే,। యూదా రాజైన మనస్సే యీ అస
హ్యమైన కార్యములను చేసి, తనకంటే పూర్వికులైన
ఎమోరీయులు చేసిన అంతటికంటే మిక్కిలీ చెడ్డగా
ప్రవర్తించి, తన విగ్రహములవల్ల యూదా వారిని
పాపము చేయించినాడు,। గనుక ఇశ్రాయేలు దేవు 12
డైన యెహోవా ఆనతిచ్చినదేమంటే, యిదుగో వినే
వాని రెండు చెవులు దిమ్మ పట్టేటంత కీడు యెరూశ
లేము మీదనున్ను యూదా వారి మీదనున్ను వచ్చే
టట్టు చేస్తాననిన్ని;। మరిన్ని నేను యెరూశలేము మీద 13
షోమ్రోనుయొక్క కొలిచే నూలునున్ను అహాబు యిం
టియొక్క నూలు గుండునున్ను సాగచేతుననిన్ని;
మరిన్ని వొకడు పళ్లెమును తుడిచేటప్పుడు దాని బో
ర్లించి తుడచినట్టు నేను యెరూశలేమును తుడచివే
తుననిన్ని;। నా స్వాస్థ్యముయొక్క శేషించిన వారిని 14
నేను విడచిపెట్టి, వారి శత్రువులయొక్క చేతిలోకి
వారిని అప్పగింతుననిన్ని;। వారు తమ పితృలు మిస్ర 15
యీము దేశములోనుంచి యివతలకు వచ్చిన నాట
నుంచీ నేటి మట్టుకు నా దృష్టికి కీడుచేసి నాకు కోప
మును పుట్టిస్తూ వున్నందున వారు తమ శత్రువులం
దరిచేత దోపుడు పడి నష్టమును పొందుదురనిన్ని ఆన
తిచ్చెను.। మరిన్ని మనస్సే యెహోవా దృష్టికి కీడు 16
చేసుటవల్ల యూదా వారిని పాపము చేయించిన పా
పము గాక, యెరూశలేము యీ తట్టు మొదలుకొని
ఆ తట్టు పర్యంతమూ పూర్తి అయ్యే మట్టుకు నిరపరా
ధులయొక్క రక్తమును మిక్కిలిగా చిమ్మినాడు.। మన 17
స్సేయొక్క తతిమ్మా కార్యములున్ను అతడు చేసినదం
తానున్ను అతడు చేసిన దోషమున్ను యూదా రాజు
లయొక్క వృత్తాంతముల గ్రంథమందు వ్రాయబడి
వున్నవి గదా?। మనస్సే తన పితృలతో కూడా నిద్ర 18
పొంది, తన యింటి తోట అనగా ఉజ్జాయొక్క తో
టలో సమాధియందు పెట్టబడెను; అతని కుమారుడ
యిన ఆమోను అతనికి మారుగా యేలెను.। ఆమోను 19
యేల నారంభించినప్పుడు యిరువై రెండు సంవత్సర
ములవాడై, యెరూశలేము యందు రెండు సంవత్సర
ములు యేలెను; అతని తల్లి యొత్బా దేశస్థుడయిన హా
రూసుయొక్క కుమార్తెయై మెషుల్లెమెతు అనే పేరు
గలదై వుండెను.। అయితే యితడున్ను తన తండ్రియ 20
యిన మనస్సే చేసినట్టు యెహోవా దృష్టికి కీడు
చేసెను.। యేమంటే తన తండ్రి నడచిన మార్గములం 21
దు తాను నడచి, తన తండ్రి సేవించిన విగ్రహములను
తానున్ను సేవించి,। తన పితృల దేవుడైన యెహోవాను 22
విడచి పెట్టెను, యెహోవాయొక్క మార్గమందు
నడవక వుండెను.। అయినందున ఆమోనుయొక్క సేవ 23
కులు అతని మీద జట్టు కూడి, అతని మందిరమందే
అతని చంపిరి.। అయితే దేశపు జనులు రాజయిన 24
ఆమోను మీద జట్టు కూడిన వారినందరినిన్ని చంపి,

అతని కుమారుడైన యోషీయాను అతనికి మారుగా
25 రాజును చేసుకొనిరి. । ఆమోను చేసిన తక్కిన్ని కార్య
ములు యూదా రాజులయొక్క వృత్తాంతముల గ్రంథ
26 మందు వ్రాయబడి వున్నవి గదా? । ఉజ్జాయొక్క తో
టలో అతనికి కలిగిన సమాధియందు అతడు పెట్టబ
డెను; అప్పుడు అతని కుమారుడైన యోషీయా అతనికి
మారుగా యేలెను.

## 22. అధ్యాయము.

1 యోషీయా యేల నారంభించినప్పుడు యెనిమిది
సంవత్సరములవాడై, యెరూశలేము యందు ముప్పై
యొక్క సంవత్సరములు యేలెను; అతని తల్లి బొస్కతు
వూరివాడయిన అదాయాయొక్క కుమార్తెయై యెదీ
2 దా అని పిలువ బడెను. । యితడు యెహోవా దృష్టికి
నీతిగా చేసి, తన పితృడయిన దావీదుయొక్క మార్గ
మంతటి ప్రకారముగా నడిచి, కుడికైనా యెడమకైనా
3 తిరగకుండా వుండెను. । రాజైన యోషీయా యేలుబడి
యొక్క పద్ధెనిమిదో సంవత్సరమందు సంభవించిన
దేమంటే, రాజు మెషుల్లాముకు పుట్టిన అస్సల్యాహు
కుమారుడున్ను కరణమున్ను అయిన షాఫానును యె
హోవా యొక్క మందిరమునకు వెళ్లుమని అతనితో
4 చెప్పినదేమంటే; । నీవు ప్రధానాచార్యుడయిన హిల్కీ
యా యొద్దికి వెళ్లి, ద్వార పాలకులు జనులయొద్దనుంచి
కూర్చిన, యెహోవాయొక్క మందిరములో వుంచిన
ద్రవ్యముయొక్క సముదాయమును అతని చూడుమని
5 అతనితో చెప్పుము. । మరిన్ని వారు యెహోవా మం
దిరముయొక్క పై కాపరులైనటువంటిన్ని పని జరిగించే
టటువంటిన్ని వారి చేతికి ఆ ద్రవ్యమును అప్పగిం
చిన తరువాత యెహోవా మందిరముయొక్క శిథిల
మైన స్థలములను బాగు చేయడానకు మందిరముయొ
6 క్క పని వారికి దాని యివ్వ వలసినది. । అనగా వడ్ల
వాండ్లకున్ను శిల్పికారులకున్ను తాపీవాండ్లకున్ను మం
దిరము బాగుచేసుటకు మానులనున్ను చెక్కిన రాళ్లను
న్ను కొనుటకున్ను యివ్వ వలసినదని చెప్పుమనెను. ।
7 అయినప్పటికిన్ని వారి చేతికి అప్పగించిన ద్రవ్యమును
గురించి వారి యొద్దనుంచి లెక్క పుచ్చుకోవడము లేక
వుండెను, యేమంటే వారు యథార్థముగా ప్రవ
8 ర్తించిరి. । అంతట ప్రధానాచార్యుడయిన హిల్కీ
యా షాఫాను అనే కరణముతో అనిన మాట, యె
హోవా మందిరమందు న్యాయప్రమాణముగల గ్రం
థము నాకు దొరికెనని చెప్పి, హిల్కీయా షాఫానుకు
ఆ గ్రంథము యిచ్చినందున అతడు అది చదివెను. ।
9 అప్పుడు షాఫాను అనే కరణము రాజుయొద్దికి తిరిగీ
వచ్చి వర్తమానము చెప్పినదేమంటే, మీ సేవకులు
మందిరమందు దొరికిన ద్రవ్యమును కూర్చిన, యెహో
వా మందిరముయొక్క పై కాపరులైనటువంటిన్ని పని
జరిగించేటటువంటిన్ని వారి చేతికి అప్పగించిరని చెప్పె
ను. । మరిన్ని షాఫాను అనే కరణము రాజుతో తెలియ 10
చెప్పినదేమంటే, అచార్యుడయిన హిల్కీయా నాకు
వొక గ్రంథమును అప్పగించెనని చెప్పి, షాఫాను ఆ
గ్రంథమును రాజ సముఖమందు చదివెను. । రాజు న్యా 11
యప్రమాణము గల ఆ గ్రంథముయొక్క మాటలు
వినినప్పుడు సంభవించినదేమంటే, అతడు తన బట్టలు
చించుకొనెను. । మరిన్ని రాజు అచార్యుడయిన హిల్కీ 12
యాకున్ను షాఫాను కుమారుడయిన అహీకాముకున్ను
మిఖాయా కుమారుడయిన అక్బోరుకున్ను షాఫాను
అనే కరణముకున్ను అశాయా అనే రాజ సేవకులలో
వొకనికిన్ని ఆజ్ఞాపించినదేమంటే, । మీరు వెళ్లి, దొరికిన 13
యీ గ్రంథముయొక్క మాటను గురించి నా కొరకు
న్ను జనుల కొరకున్ను యూదా వారందరి కొరకున్ను
యెహోవాయొద్ద ఆలోచన అడగండి, యేమంటే
మన పితృలు మన విషయమై వ్రాయబడి వున్న అంతటి
ప్రకారముగా చేసుట కొరకు యీ గ్రంథముయొక్క
మాటలను వినినివారైరి, గనుక మన మీద మండుతూ
వున్న యెహోవా కోపాగ్ని అధికమై యున్నదని
చెప్పెను. । కాబట్టి అర్చకుడయిన హిల్కీయాయున్ను 14
అహీకామున్ను అక్బోరున్ను షాఫానున్ను అశాయా
యున్ను దీర్ఘదర్శరాలయిన హుల్దా యొద్దికి వచ్చిరి;
యీమె వస్త్రముల కొట్టు పైని వుండేటటువంటిన్ని
హర్హసుకు పుట్టిన తిక్వాయొక్క కుమారుడైనటు
వంటిన్ని షల్లూముయొక్క భార్య అయి, యెరూశ
లేములో రెండో చోటు యందు కాపురస్థురాలై వుం
డెను; యీమె యొద్దికి వారు వచ్చి మాట్లాడిరి. । అప్పు 15
డు ఆమె వారితో అనిన మాట, మిమ్మును నా యొద్దికి
పంపిన వానితో యెహోవా ఆనతిచ్చిన వాక్యము
మీరు చెప్పవలసినది, । అది యేమంటే, యిదుగో నేను 16
యీ స్థలము మీదికిన్ని దానియొక్క కాపురస్థుల
మీదికిన్ని కీడు, అనగా, యూదాయొక్క రాజు చది
వించిన గ్రంథపు మాటల చొప్పున అంతటిని రప్పిం
తును; । యెందుకంటే వారు నన్ను విడచిపెట్టి, యితర 17
దేవుండ్లకు ధూపము వేసి, తమ సకల కార్యముల వల్ల
నాకు కోపమును పుట్టించి వున్నారు; కాబట్టి నా కోపా
గ్ని యీ స్థలము మీద రగులుకొని ఆరిపోకుండా
మండుతూ వుండునని యెహోవా చెప్పుమనెను. ।
అయితే యెహోవాయొద్ద ఆలోచన అడుగడానకు 18
మిమ్మును పంపిన యూదా రాజుతో మీరు చెప్పవలసిన
దేమంటే, నీవు వినిన మాటలను గురించి యెహోవా
యీలాగున సెలవు యిస్తున్నాడు: । యీ స్థలము పట్టి 19

దిన్ని దాని కాపురస్థులు శాపగ్రస్తులున్ను అవుదురని
వారిని గురించి నేను చెప్పిన మాటలను నీవు విన్నప్పుడు,
నీ హృదయము మెత్తపడి, యెహోవా సముఖమందు
నీవు దీనత్వమును వహించుకొని, నీ బట్టలను చించు
కొని, నా సన్నిధిని కన్నీళ్లు రాల్చితివి గనుక నీయొ
20 క్క మొరను నేను వింటిని. । కాబట్టి యిదుగో నీ
పితృల యొద్దికి నేను నిన్ను కూర్చుదును; నీ సమాధికి
నీవు చల్లదనముతో చేరుదువు; అయినందున యీ స్థల
ము మీదికి నేను రప్పించబోయే కీడును నీ కండ్లు
యెంత మాత్రము కానక పోవునని యెహోవా ఆన
తిచ్చెనని చెప్పవలెనసెను. వారు యీ వర్తమానము
రాజు యొద్దికి తీసుకు వచ్చిరి.

## 23. అధ్యాయము.

1 అప్పుడు రాజు తన యొద్దికి యూదా పెద్దలనంద
రినిన్ని యెరూశలేము పెద్దలనందరినిన్ని పిలువనంపిం
2 చెను. । మరిన్ని రాజు యూదా వారినందరినిన్ని యెరూ
శలేము కాపురస్థులందరినిన్ని అర్చకులనున్ను దీర్ఘ
దర్శులనున్ను పెద్దలున్ను పిన్నలున్ను అయిన జను
లందరినిన్ని పిలుచుకొని, యెహోవాయొక్క మంది
రమునకు వచ్చి, వారు వింటూ వుండగా యెహోవా
మందిరమందు దొరకిన వొడంబడికె గల గ్రంథముయొ
3 క్క మాటలెల్లా చదివినాడు. । అప్పుడు రాజు వొక
స్తంభము దగ్గిర నిలిచి, యెహోవా సముఖమందు
వొడంబడికెను చేసుకొనినది, యేమంటే, యెహో
వాయొక్క మార్గమందు నడచి, ఆయన ఆజ్ఞలనున్ను
కట్టడలనున్ను నిర్ణయములనున్ను నిండైన హృదయ
ముతోనున్ను నిండయిన ఆత్మతోనున్ను గైకొని యీ
గ్రంథమందు వ్రాయపడిన వొడంబడికెయొక్క వా
క్యములన్నిటిని స్థిరపర్చుదుమని వొడంబడికెను చేసు
కొనెను; మరిన్ని జనులందరున్ను ఆ వొడంబడికెకు
4 సమ్మతించిరి. । అప్పుడు రాజు ప్రధానాచార్యుడైన హి
ల్కీయాకున్ను రెండో వరసయొక్క అర్చకులకున్ను
ద్వారపాలకులకున్ను బయలు కొరకున్ను తోపు కొర
కున్ను ఆకాశ సమూహముల కొరకున్ను చేయ పడిన
టువంటి వస్తువులను యెహోవాయొక్క గుడిలో
నుంచి యివతలకు తీసుకు రావలెనని ఆజ్ఞ యిచ్చెను:
అప్పుడు అతడు వాటిని యెరూశలేము అవతల కిద్రోను
పొలమందు కాల్చి, బేతేలు వూరికి ఆ బూడిదెను
5 తీసుకు వెళ్ల చేసెను. । మరిన్ని యూదా పట్టణములందు
న్న వున్నతమైన స్థలములలోనున్ను యెరూశలేము
చుట్టూ వున్న చోట్లలోనున్ను ధూపము వేయడానకు
యూదా రాజులు నిర్ణయించిన బొమ్మ పూజారుల
నున్ను బయలుకున్ను సూర్య చంద్ర గ్రహాదులైన
ఆకాశ సమూహమునకున్ను ధూపము వేసినవాండ్లను
న్ను అతడు మాన్పించెను. । మరిన్ని అతడు యెహో 6
వా మందిరమందున్న తోపు ప్రతిమను యెరూశలేము
అవతల కిద్రోను గెడ్డ దగ్గిరకు తెప్పించి, కిద్రోను గెడ్డ
యొద్ద దాని కాల్చి త్రొక్కి, పొడుము అయ్యేటట్టు
గా చేసి, ఆ పొడుమును జనుల పుత్రులయొక్క సమా
ధుల మీద వేసెను. । మరిన్ని యెహోవా మందిర సమీ 7
పమందున్న పురుష సంగమపు కొండయొక్క యిండ్లను
కింద పడగొట్టించెను; అక్కడ ఆడువాండ్లు ఆ తోపు
ప్రతిమ కొరకు తెరలను నేస్తూ వుండిరి. । మరిన్ని అత 8
డు యూదా పట్టణములలో వున్న అర్చకులనందరినిన్ని
అవతలకు వెళ్ల వేసెను; గెబ మొదలుకొని బెయేర్శెబ
పర్యంతమూ అర్చకులు ధూపము వేసిన వున్నతమైన
స్థలములను అతడు అపవిత్రము చేసి, పట్టణములోకి
ప్రవేశించే వాని యెడమ పార్శ్వమున పట్టణపు అధికా
రియైన యెహోషువయొక్క గుమ్మము దగ్గిరనున్న ద్వా
రముల దగ్గిరనున్ను వుండే వున్నతమైన స్థలములను కింద
పడగొట్టించెను. । ఆ వున్నతమైన స్థలములయొక్క అర్చ 9
కులు యెరూశలేములయందున్న యెహోవాయొక్క
బలిపీఠము యొద్దికి రాకపోయినప్పటికిన్ని తమ సహో
దరులలోగా పులుసులేని రొట్టెలను భక్షించేవారు. ।
మరిన్ని యెవడైనా తన కుమారునైనా తన కుమార్తె 10
నైనా మోలెకు విషయమై అగ్నిలోనుంచి గడవ చేయ
కుండా హిన్నోము పుత్రులయొక్క లోయలో వున్న
తోఫెతు అనే భూమిని అతడు అపవిత్రము చేసెను. ।
మరిన్ని అతడు పరూరిమనే స్థలమందున్న పరిచారకు 11
డైన నెతన్మెలెకుయొక్క గది దగ్గిర యెహోవా మం
దిర ద్వారము యొద్దనుంచి యూదా రాజులు సూర్యు
నికి యిచ్చిన గుర్రములను తీసివేసి, సూర్యునియొక్క
రథములను అగ్నిలో కాల్చి వేసెను । మరిన్ని యూదా 12
రాజులు చేయించిన ఆహాజుయొక్క మీద అంతస్తు
గది పైని వున్న బలిపీఠములనున్ను యెహోవా మంది
రముయొక్క రెండు సాలలలో మనస్సే చేయించిన
బలిపీఠములనున్ను రాజు కింద పడవేసి, ఛిన్నాభిన్న
ములుగా కొట్టించి, ఆ ధూళిని కిద్రోను గెడ్డలో పో
యించెను. । మరిన్ని అష్తారెతు అనే సీదోనీయుల 13
యొక్క యేహ్యమైన దాని కొరకున్ను కెమోషు అనే
మోయాబీయులయొక్క యేహ్యమైన దాని కొరకున్ను
మిల్కోము అనే అమ్మోనీయులయొక్క యేహ్యమైన
దాని కొరకున్ను ఇశ్రాయేలు రాజైన సొలొమోను
కట్టించినటువంటివిన్ని యెరూశలేము యెదుట మశీఘతు
పర్వతముయొక్క కుడిపార్శ్వమందున్నటువంటివిన్ని
వున్నతమైన స్థలములను రాజు అపవిత్ర పరిచెను. ।
అతడు ఆ ప్రతిమలను తునకలుగా కొట్టించి, తోపు 14

లను నరికివేసి, వాటి స్థలములను మనుష్య శల్యముల
15 తోను నింపెను. । మరిన్ని బేతేలులో వున్న బలిపీఠము
నున్ను వున్నతమైన స్థలమునున్ను అనగా, ఇశ్రాయేలీ
యులచేత పాపము చేయించిన నెబాతు కుమారుడైన
యారొబాము కట్టించిన ఆ వున్నతమైన స్థలమునున్ను
ఆ బలిపీఠమునున్ను అతడు కింద పడగొట్టించి, ఆ వున్న
తమైన స్థలమును కాల్చి పొడుము అయ్యేటట్టుగా త్రొ
16 క్కించి తోపులను కాల్చి వేసెను. । అయితే యోషీ
యా అటు తిరిగి, అక్కడ పర్వతమందున్న సమాధులను
చూచి, కొందరిని పంపి, సమాధులలో వున్న శల్యములను
తెప్పించి, దైవ జనుడైన అతడు యెహోవాయొక్క
వాక్యము చాటించినప్పుడు చెప్పిన మాటల ప్రకార
ముగా బలిపీఠము మీద వాటిని కాల్పించి దాన్ని అప
17 విత్ర పరిచెను. । అంతట అతడు నాకు కనుపడుతున్న
ఆ శాసనము యేమిటని అడిగినప్పుడు, పట్టణపు వాండ్లు
అది యూదా దేశమునుంచి వచ్చి, బేతేలుయొక్క బలి
పీఠము విషయమై నీవు చేసిన క్రియలు భవిష్యత్తు
గా చెప్పిన దైవ జనుడైన అతనియొక్క సమాధియై
18 వున్నదని చెప్పిరి. । అప్పుడు అతడు అనిన మాట,
అతని వుండనివ్వండి; యెవడున్ను అతని శల్యములను
కదల్చకూడదని చెప్పినందున వారు అతని శల్యముల
నున్ను షోమ్రోను పట్టణములోనుంచి వచ్చిన దీర్ఘ
19 దర్శియొక్క శల్యములనున్ను వుండనిచ్చిరి. । మరిన్ని
యెహోవాకు కోపము పుట్టించేటట్టుగా ఇశ్రాయేలు
రాజులు షోమ్రోను పట్టణములందు చేయించిన వున్న
తమైన స్థలములయొక్క మందిరములను యోషీయా
తీసివేసి, బేతేలులో తాను చేసిన ప్రకారమంతా వా
20 టిని చేసెను. । యేమంటే అతడు అక్కడి వున్నత
మైన స్థలములయొక్క అర్చకులనందరినిన్ని బలిపీఠ
ముల మీద చంపించి, వాటి మీద మనుష్యుల శల్య
21 ములను కాల్చి యెరూశలేముకు తిరిగీ వచ్చెను. । అం
తట రాజు జనులందరికిన్ని మీ దేవుడైన యెహోవా
విషయమై పస్ఖా పండుగను ఈ నిబంధన గల గ్రంథ
మందు వ్రాసిన ప్రకారముగా ఆచరించండని ఆజ్ఞా
22 పించెను. । అయినందున ఇశ్రాయేలీయులకు న్యాయ
ము నడిపించిన న్యాయాధిపతులయొక్క దినములనుంచి
ఇశ్రాయేలు రాజులయొక్కానున్ను యూదా రాజుల
యొక్కానున్ను దినములన్నిటి దాకా యీ కాలమందు
ఆచరించిన పస్ఖా పండుగవంటి పండుగ లేక వుండెను. ।
23 అయితే యీ పండుగ రాజయిన యోషీయా యేలు
బడియొక్క పద్దెనిమిదో సంవత్సరమందు యెరూశ
లేములో యెహోవా విషయమై ఆచరించపడెను. ।
24 మరిన్ని యెక్షిణీ కాండ్లనున్ను చిల్లంగి పెట్టేవాండ్లను
న్ను విగ్రహములనున్ను గృహ దేవతలనున్ను యూదా
దేశమందున్ను యెరూశలేము యందున్ను కనపడిన
యేహ్య వస్తువులనున్ను యోషీయా తీసివేసి, యెహో
వాయొక్క మందిరమందు అర్చకుడైన హిల్కీయాకు
దొరికిన గ్రంథమందు వ్రాసిన న్యాయ ప్రమాణము
యొక్క మాటలను స్థిరపర్చడానకు ప్రయత్నము
చేసెను. । అతని పూర్వికులైన రాజులలో అతని వలెనే 25
నిండైన హృదయముతోనున్ను నిండైన ఆత్మతోనున్ను
నిండైన బలముతోనున్ను యెహోవా తట్టు తిరిగి,
మోషేయొక్క న్యాయప్రమాణము చొప్పున చేసిన
వాడు లేక వుండెను; అతని తరువాతనైనా అతని వంటి
వాడు వొకడూ లేడు. । అయినప్పటికిన్ని యెహో 26
వా తన కోపాగ్ని చల్లార్చకుండా వుండెను, యేమంటే
మనస్సే అతనికి కోపము పుట్టించినందున ఆ ప్రేరేప
ణల నిమిత్తము ఆయన కోపాగ్ని యూదా మీద మం
డినదై వుండెను. । కాబట్టి యెహోవా అనుకొన్న 27
దేమంటే, నేను ఇశ్రాయేలును తీసివేసినలాగున యూ
దానున్ను నా సముఖమునకు దూరముగా చేసి, నేను
యెంచుకొనిన యీ యెరూశలేము పట్టణమునున్ను
అక్కడ నా నామమును వుంచుదునని నేను చెప్పిన
మందిరమునున్ను నేను విడనివేతునని అనుకొని వుం
డెను. । యోషీయాయొక్క తతిమ్మా కార్యములున్ను 28
అతడు చేసినదంతానున్ను యూదా రాజులయొక్క
వృత్తాంతముల గ్రంథమందు వ్రాయబడి యున్నవి
గదా? । అతని దినములందు మిస్రయీము రాజైన ఫరో 29
నెఖో అష్షూరు రాజు మీద యుద్ధము చేయడానకు
ఫెరాతు నది దగ్గరకు వచ్చెను; అతనికి యెదురుగా
రాజైన యోషీయా వచ్చెను; అయితే మెగిద్దో దగ్గర
అతడు అతని చూచినప్పుడు అతడు అతని చంపెను. ।
అప్పుడు అతని సేవకులు అతని శవమును రథము 30
మీద పెట్టి, మెగిద్దోనుంచి యెరూశలేముకు తీసుకు
వచ్చి, అతని సమాధియందు పెట్టిరి; అప్పుడు దేశపు
జనులు యోషీయా కుమారుడైన యెహోయాహా
జును తీసుకొని పట్టాభిషేకము చేసి, అతని తండ్రికి
మారుగా రాజును చేసుకొనిరి. । యెహోయాహాజు 31
యేలనారంభించినప్పుడు యిరువైమూడు సంవత్సరముల
వాడై, యెరూశలేములో మూడు మాసములు యేలెను;
అతని తల్లి లిబ్నా వూరివాడైన ఇర్మీయా కుమార్తెయై
హమూథలు అని పిలువపడెను. । యితడు తన పితృలు 32
చేసినలాగున యెహోవా దృష్టి యెదుట కీడు చేసె
ను; । అయితే ఫరోనెఖో యెరూశలేములో అతడు 33
యేలకుండా హమాతు దేశమందున్న రిబ్లా పట్టణమందు
అతని బంధించి, దేశము మీద నూరు వెండి తలాంతు
లనున్ను వొక బంగారపు తలాంతునున్ను పన్ను నిర్ణ
యించెను. । మరిన్ని ఫరోనెఖో యోషీయా కుమారు 34

డైన ఏల్యాకీమును అతని తండ్రియైన యోషీయాకు
మారుగా రాజును చేసి, అతనికి యెహోయాకీమనే
మారు పేరు బెట్టి, యెహోయాహాజును మిస్రయీ
ము దేశమునకు తీసుకు వచ్చినందున అతడు అక్కడ
35 మృతి బొందెను. । యెహోయాకీము ఆ వెండినిన్ని
బంగారమునున్ను ఫరోకు యిచ్చెను; అయితే ఫరో
యిచ్చిన ఆజ్ఞ చొప్పున ఆ సొమ్మును యివ్వడానకు
అతడు దేశము మీద పన్ను నిర్ణయించెను; దేశపు
జనుల యొద్దనుంచి ఒక్కొక్క మనిషికి నిర్ణయించిన
6 చొప్పున యెత్తి ఫరోనెఖోకు యిచ్చెను. । యెహో
యాకీము యేలనారంభించినప్పుడు యిరువై అయిదు
సంవత్సరములవాడై, యెరూశలేము యందు పదకొం
డు సంవత్సరములు యేలెను; అతని తల్లి రూమా వూరి
వాడైన పెదాయా కుమార్తెయై జెబూదా అని పిలువ
7 పడెను. । యితడున్ను తన పితృలు చేసిన అంతటి ప్రకా
రముగా యెహోవా దృష్టి యెదుట కీడు చేసెను.

## 24. అధ్యాయము.

1 అతని దినములందు బాబెలు రాజైన నెబూఖద్నె
స్సరు యెరూశలేము మీదికి వచ్చినందున యెహో
యాకీము మూడు సంవత్సరములు అతనికి సేవకుడై వుం
డెను, తరువాత అతడు అతని మీద తిరగబడెను. ।
2 మరిన్ని యెహోవా అతని మీదికిన్ని తన సేవకులైన
దీర్ఘదర్శుల ద్వారా యెహోవా ఆనతిచ్చిన వాక్య
ప్రకారము యూదా దేశము నాశనము చేయడానకు
దాని మీదికిన్ని కల్దీయుల సమూహములనున్ను అరా
మీయుల సమూహములనున్ను మోయాబీయుల సమూ
హములనున్ను అమ్మోను పుత్రుల సమూహములనున్ను
3 రప్పించెను. । అవశ్యముగా యిది యెహోవాయొక్క
ఆజ్ఞవల్ల యూదా వారి మీదికి వచ్చి, మనస్సే చేసిన
క్రియలన్నిటి నిమిత్తమున్ను అతడు చిమ్మిన నిరపరా
ధుల రక్తము నిమిత్తమున్ను వారిని తన సముఖమునకు
దూరము చేసేటట్టుగా సంభవించెను, । యేమంటే అత
డు నిరపరాధుల రక్తముతో యెరూశలేము పట్టణమును
నింపెను, దాని క్షమించుటకు యెహోవా అనుకూ
లించక వుండెను. । యెహోయాకీముయొక్క తతిమ్మా
కార్యములున్ను అతడు చేసినదంతానున్ను యూదా
రాజులయొక్క వృత్తాంతముల గ్రంథమందు వ్రాయ
బడి యున్నవి గదా! । యెహోయాకీము తన పితృ
లతో కూడా నిద్ర పొందెను, అప్పుడు అతని కుమా
రుడయిన యెహోయాఖీను అతనికి మారుగా యేలె
ను. । అప్పటినుంచి మిస్రయీము రాజు తన దేశములో
నుంచి బయిలు రావడము మానెను, యేమంటే బా
బెలు రాజు మిస్రయీము నదికిన్ని ఫెరాతు నదికిన్ని
మధ్యను మిస్రయీము రాజు కింద వున్న భూమి
అంతా పుచ్చుకొని వుండెను. । యెహోయాఖీను యేల 8
నారంభించినప్పుడు పద్ధెనిమిది సంవత్సరముల వాడై,
యెరూశలేములో మూడు మాసములు యేలెను; యె
రూశలేమువాడైన ఎల్నాతాను కుమార్తెయైన అతని
తల్లి నెహుస్తా అని పిలువబడెను. । ఇతడున్ను తన తండ్రి 9
చేసిన అంతటి ప్రకారముగా యెహోవా దృష్టి
యెదుట కీడు చేసెను. । ఆ కాలమందు బాబెలు రాజైన 10
నెబూఖద్నెస్సరుయొక్క సేవకులు యెరూశలేము
మీదికి వచ్చినందున పట్టణము ముట్టడి వేయబడెను. ।
మరిన్ని బాబెలు రాజైన నెబూఖద్నెస్సరుయొక్క 11
సేవకులు పట్టణమును ముట్టడి వేస్తూ వుండగా, తాను
న్ను దాని మీదికి వచ్చెను. । అప్పుడు యూదా రాజైన 12
యెహూయాఖీను తానున్ను తన తల్లిన్ని తన సేవకులు
న్ను తన కింద వున్న అధిపతులున్ను తన పరిచారికు
లున్ను బైలు వెళ్లి, బాబెలు రాజుయొద్దికి వచ్చినందున
బాబెలు రాజు అతనియొక్క యేలుబడి పద్ధెనిమిదో
సంవత్సరమందు అతని పట్టుకొనెను. । మరిన్ని అతడు 13
అక్కడనుంచి యెహోవా మందిరముయొక్క పదా
ర్థములనున్ను రాజుయొక్క పదార్థములనున్ను
యెత్తుక పోయెను; ఇశ్రాయేలు రాజైన సొలొమోను
యెహోవా గుడిలో చేయించిన బంగారపు వస్తువు
లన్నిటినీ యెహోవా ఆనతిచ్చిన వాక్యము చొప్పున
అతడు తునకలుగా చేయించెను. ! మరిన్ని అతడు యె 14
రూశలేము పట్టణమంతటిలో వున్న అధిపతులనందరి
నిన్ని పరాక్రమశాలులను పదివేల మందిన్ని వీరు గాక
కంసాలివాండ్లనున్ను కమ్మరి వాండ్లనున్ను చెర తీసుక
పోయెను; దేశపు జనులలో దరిద్రులయిన వారుగాక
మరి యెవరూ వుండకపోయిరి. । అతడు యెహోయా 15
ఖీనునున్ను రాజుయొక్క తల్లినిన్ని రాజుయొక్క భా
ర్యలనున్ను అతని పరిచారికులనున్ను దేశముయొక్క
గొప్పవాండ్లనున్ను యెరూశలేమునుంచి బాబెలు పుర
మునకు చెర తీసుక పోయెను. । మరిన్ని పరాక్రమ 16
శాలులను యేడువేలమందినిన్ని కంసాలివాండ్లను కమ్మరి
వాండ్లను వెయిమందినిన్ని యుద్ధమందు తీరిన శక్తిమం
తులనందరినిన్ని బాబెలుయొక్క రాజు బాబెలు పుర
మునకు చెర తీసుక వచ్చెను. । అయితే బాబెలు రాజు 17
అతని పినతండ్రియైన మత్తన్యాను అతనికి మారుగా
రాజును చేసి, వానికి సిద్కీయా అనే మారు పేరు పె
ట్టెను. । సిద్కీయా యేలనారంభించినప్పుడు యిరువై 18
యొక్క సంవత్సరములవాడై, యెరూశలేము యందు
పదకొండు సంవత్సరములు యేలెను; లిబ్నా వూరివా
డయిన ఇర్మీయాయొక్క కుమార్తెయైన అతని తల్లి
హమూథలు అని పిలువపడెను. । అయితే యితడు 19

యెహోయాకీను చేసిన అంతటిలాగున యెహోవా
20 దృష్టి యెదుట కీడు చేసెను. । అయినందున యూదా
మీదనున్ను యెరూశలేము మీదనున్ను యెహోవా
తెచ్చుకొనిన కోపము చేత ఆయన తన సముఖములో
నుంచి వారిని తోలివేసేమట్టుకు సిద్కీయా బాబెలు
యొక్క రాజు మీద తిరగబడడము సంభవించెను.

## 25. అధ్యాయము.

1 కాబట్టి అతని యేలుబడియొక్క తొమ్మిదో సం
వత్సరమందు పదో మాసముయొక్క పదో దినమున
బాబెలు రాజైన నెబూఖద్నెస్సరున్ను అతని సమూహ
మంతానున్ను యెరూశలేము మీదికి వచ్చి, దాని యె
2 దుట దిగి చుట్టూ బురుజులను కట్టిరి. । యీలాగున పట్ట
ణము రాజైన సిద్కీయా యేలుబడియొక్క పద
కొండో సంవత్సరము పర్యంతమూ ముట్టడి వేయబడె
3 ను. । అయితే నాలుగో నెల తొమ్మిదో నాటి యందు
క్షామము పట్టణములో అధికమై యుండెను, దేశపు
4 జనులకు ఆహారము లేకపోయెను. । అప్పుడు పట్టణము
విరగ గొట్టబడినందున ఆయుధస్థులందరున్ను రాత్రి
లో రాజు తోట దగ్గిర రెండు గోడల మధ్యనున్న
ద్వారపు మార్గమున పారిపోయిరి; కల్దీయులు పట్ట
ణము యెదుట చుట్టూ వుండినందున రాజు మైదాన
5 మునకు వెళ్లే మార్గమున వెళ్లినాడు. । అయితే కల్దీ
యుల సైన్యము రాజును తరిమి, యెరిఖో మైదాన
మందు అతని పట్టుకొనినందున, అతని సైన్యము అత
6 నికి దూరముగా చెదరి పోయెను. । అప్పుడు వారు
రాజును పట్టుకొని, రిబ్లా పట్టణమందున్న బాబెలు
రాజు యొద్దికి తీసుకొవచ్చి, అక్కడ వారు అతనికి
7 శిక్షను విధించిరి. । వారు సిద్కీయాయొక్క కుమారు
లను అతని కండ్ల ముందర చంపించి, సిద్కీయాయొక్క
కండ్లను వూడతీయించి, యిత్తడి సంకెళ్లతో అతని బం
8 ధించి, బాబెలు పట్టణమునకు తీసుకు పోయిరి. । మరిన్ని
బాబెలు రాజైన నెబూఖద్నెస్సరు యేలుబడియొక్క
పందొమ్మిదో సంవత్సరమందు అయిదో మాసముయొ
క్క యేడో దినమందు తలవర్లకు అధిపతియైనటు
వంటిన్ని బాబెలు రాజుయొక్క సేవకుడైనటువంటిన్ని
9 నెబూజరదాను యెరూశలేముకు వచ్చి, । యెహోవా
మందిరమునున్ను రాజ మందిరమునున్ను యెరూశలేము
యందున్న యిండ్లనున్ను గొప్పవాండ్లయొక్క యిండ్ల
10 నున్ను అగ్నితో కాల్పించెను. । మరిన్ని తలవర్లయొ
క్క అధిపతియొద్దనున్న కల్దీయుల సైన్యస్థులందరున్ను
యెరూశలేము చుట్టూ వున్న ప్రాకారములను కింద
11 కూల గొట్టిరి. । అయితే యింకా పట్టణమందుండిన
కొదువ వాండ్లనున్ను బాబెలు రాజుతట్టు పోయిన
వాండ్లనున్ను జన సమూహములో శేషించిన వాండ్ల
నున్ను తలవర్లయొక్క అధిపతియైన నెబూజరదాను
తీసుకొ పోయెను. । అయితే తలవర్లయొక్క అధిపతి 12
వ్యవసాయదారులగానున్ను ద్రాక్షతోటవారుగాను
న్ను అయ్యేలట్టు దేశపు దరిద్రులను కొందరిని వుండ
నిచ్చెను. । మరిన్ని యెహోవా మందిరమునందున్న 13
యిత్తడి స్తంభములనున్ను మట్లనున్ను యెహోవా
మందిరమందున్న యిత్తడి సముద్రమునున్ను కల్దీయులు
తునకలుగా కొట్టి, ఆ యిత్తడిని బాబెలు పట్టణమునకు
యెత్తుకు పోయిరి. । మరిన్ని సేవ కొరకు వున్న కుండలను 14
న్ను చేటలనున్ను ముండ్లనున్ను ధూపార్తులనున్ను
యిత్తడి పాత్రలనున్ను వారు తీసుక పోయిరి. । మరిన్ని 15
కుంపట్లు పళ్లెములు మొదలైన వెండి బంగారములయొ
క్క వస్తువులనున్ను తలవర్లయొక్క అధిపతి తీసుక
పోయెను. । మరిన్ని సొలొమోను యెహోవా మందిర 16
మునకు చేయించిన రెండు స్తంభములనున్ను వొక సము
ద్రమునున్ను మట్లనున్ను తీసుక పోయెను; యీ యి
త్తడి వస్తువులయొక్క యెత్తు లెక్క అపరిమితమై వుం
డెను. । వొక స్తంభముయొక్క నిడివి పద్ధెనిమిది మూ 17
రలై వుండెను; దాని పై మట్టు యిత్తడిదై వుండెను;
పై మట్టుయొక్క నిడివి మూడు మూరలై వుండెను;
మరిన్ని ఆ పై మట్టు చుట్టూ నున్న అల్లిన వలలున్ను
దానిమ్మ పండ్లున్ను యిత్తడివై వుండెను; రెండో స్తం
భము వీటిలాగున వలల పనితోటి వుండెను. । మరిన్ని 18
తలవర్లయొక్క అధిపతి ప్రధానార్చకుడైన శెరా
యానున్ను రెండో అర్చకుడైన సెఫన్యానున్ను ద్వార
పాలకులను ముగ్గురినిన్ని పట్టుకొనెను. । మరిన్ని పట్టణ 19
ములోనుంచి ఆయుధస్థులమీద నిర్ణయించబడిన పరి
చారకుని వొకనినిన్ని రాజు సముఖమును కనిపెట్టినటు
వంటి పట్టణమందు దొరికిన అయిదుగురినిన్ని దేశపు
జనులయొక్క లెక్క చేస్తూ వున్నటువంటి సమూహ
ముయొక్క ప్రధాన కరణమునున్ను దేశపు జనులలో
పట్టణమందు దొరికిన అరువైమందినిన్ని పట్టుకొనెను. ।
తలవర్లయొక్క అధిపతియైన నెబూజరదాను వీరిని 20
తీసుకొని, రిబ్లా పట్టణమందున్న బాబెలు రాజుయొద్దికి
వచ్చెను. । వీరిని బాబెలు రాజు హమాతు దేశమందున్న 21
రిబ్లా పట్టణములో కొట్టించి, చంపించెను; యీలాగున
యూదావారు తమ దేశములోనుంచి అవతలకు యె
త్తుకు పోబడిరి. । అయితే బాబెలు రాజైన నెబూఖద్నె 22
స్సరు యూదా దేశమందు విడిచి వుండనిచ్చిన వారిని
గురించినదేమంటే, వీరి మీద అతడు షాఫానుకు
పుట్టిన అహీకాము కుమారుడైన గెదల్యాను అధిపతి
గా నిర్ణయించెను. । అయితే సమూహాధిపతులందరున్ను
వారి జనులందరున్ను బాబెలు రాజు గెదల్యాను అధి

పతిగా నిర్ణయించిన సంగతి విన్నప్పుడు, మిస్పె పట్ట
ణమందున్న గెదల్యా యొద్దికి నెతన్యా కుమారుడైన
ఇష్మాయేలున్ను కరేయ కుమారుడైన యోహానానున్ను
నెథోఫాతీయుడైన తన్హుమెతు కుమారుడైన శెరాయా
యున్ను మయఖాతీయుడైన వొకనికి పుట్టిన యాజ
24 న్యాహున్ను తమ తమ జనులతో వచ్చిరి.। అప్పుడు
గెదల్యా వారికిన్ని వారి జనులకున్ను ప్రమాణము చేసి
చెప్పినదేమంటే, కల్దీయులకు సేవకులయ్యేటందుకు భయ
పడ వద్దు; దేశమందు కాపురము చేసి, బాబెలు రా
జుకు సేవ చెయ్యండి; అప్పుడు మీకు మేలు కలుగు
25 నని చెప్పెను.। అయితే యేడో మాసమందు సంభ
వించినదేమంటే, రాజ సంతతియైన ఎలీషామాకు పుట్టిన
నెతన్యా కుమారుడైన ఇష్మాయేలు పది మందిని పిలుచు
కొని వచ్చి, గెదల్యాను కొట్టినందున అతడు మరణ
మాయెను; మరిన్ని మిస్పెలో అతని యొద్దనున్న యూ
26 దీయులనున్ను కల్దీయులనున్ను అతడు కొట్టెను.। అప్పు
డు జనులందరున్ను పిన్నలున్ను పెద్దలున్ను సమూహాధి
పతులున్ను లేచి, మిస్రయీము దేశమునకు వెళ్లిపో
యిరి; యేమంటే కల్దీయులయందు వారు భయపడిరి.।
అయితే యూదా రాజైన యెహోయాఖీను చెర 27
పడిన ముప్ఫయి యేడో సంవత్సరమందు పండ్రెండో
మాసముయొక్క యిరువై యేడో దినమందు సంభవిం
చినదేమంటే, బాబెలు రాజైన ఎవిల్మెరోదఖు తాను
యేలనారంభించిన సంవత్సరమందు బందీగృహములో
నుంచి యూదా రాజైన యెహోయాఖీను తలను
పైకెత్తించి,। అతనితో స్నేహముగా మాట్లాడి, అతని 28
గద్దె బాబెలులో తన యొద్దనున్న రాజులయొక్క గద్దె
కంటె వున్నతముగా పెట్టెను.। అయినందున అతడు 29
తన బందీగృహపు బట్టలను తీసివేసి, వేరే వస్త్రములను
ధరించుకొని, తాను బ్రతికిన దినములన్నిటి పర్యంత
మూ అతని సన్నిధియందు భోజనము చేస్తూ వుండెను.।
మరిన్ని అతని బత్తెము దినము వొక్కంటికి రాజువల్ల 30
నిర్ణయ పడినదై, అతడు బ్రతికిన దినములన్నిటి
దాకా ఆ చొప్పున గడుచుతూ వుండెను.

39 యుడైన మిభారు, । అమ్మోనీయుడయిన సెలెకు, సెరూ
యా కుమారుడైన యోవాబుయొక్క ఆయుధములు
40 పట్టుకొనే బెరోతీయుడైన నహరై, । ఇత్రీయుడైన
41 ఈరా, ఇత్రీయుడైన గారెబు, ।హిత్తీయుడైన ఊరీ
42 యా, అహ్లాయి కుమారుడైన జాబాదు, । రూబేనీయు
డైన షిజా కుమారుడున్ను రూబేనీయులలో అధిపతిన్ని
అయిన అదీనా, అతనితో ముప్పయి మంది వుండిరి, ।
43 మయఖా కుమారుడైన హానాను, మిత్నీయుడైన యె
44 హోషాఫాతు, । అష్తెరాతీయుడైన ఉజ్జీయా, అరో
యేరీయుడైన హోతాను కుమారులైన షామాయున్ను
45 యెహీయేలున్ను, । షిమ్రీ కుమారుడైన యెదీయవేలు,
46 తిస్సీయుడైన వాని సహోదరుడైన యోహా, । మహా
వీయుడైన ఎలీయేలు, ఎల్నయము కుమారులైన యెరీ
బైయున్ను యోషవ్యాయున్ను, మోయాబీయుడైన
47 ఇత్మా, । మెస్సోబాయీయా వూరివారైన ఎలీయేలు, ఓబేదు,
యహశీయేలు అనేవారు.

## 12. అధ్యాయము.

1 దావీదు కీషు కుమారుడైన సౌలు నిమిత్తము యిం
కా మరుగుగా వుండగా, సిక్లగు యందు వుండే అతని
యొద్దికి వచ్చి, యుద్ధమునకు సహాయము చేసే అంబుల
2 వాండ్లున్ను, । వడిసెలు వేసేటందుకున్ను కమానుతో
అంబులు వేసేటందుకున్ను కుడిచెయ్యి యెడమచెయ్యి
వాటమైన పరాక్రమశాలులైన కొదువ మనుష్యులు
3 యెవరంటే, । సౌలు సహోదరులైన బెన్యామీను గో
త్రమందు గిబాతీయుడైన షెమాయా కుమారులైన
అహీయెజెరు అనే అధిపతిన్ని, వాని తరువాత యో
వాషున్ను, అజ్మావెతు కుమారులైన యెజీయేలున్ను,
పెలెతున్ను, బెరాఖాయున్ను, అంతోతీయుడైన యె
4 హూ అనేవాడున్ను, । ముప్పైమందిలో పరాక్రమ
శాలిన్ని ముప్పైమందికి పెద్దవాడున్ను అయిన ఇష్మయా
అనే గిబోనీయుడున్ను, ఇర్మీయా, యహజీయేలు, యో
5 హానాను, గెదేరాతీయుడైన యోజాబాదున్ను, । ఏలూ
జై, యెరీమోతు, బెయల్యా, షెమర్యా, హరీఫీయుడైన
6 షెఫటీయా, । ఎల్కానా, యెషయ్యా, అజరేలు, యో
హెజెరు, యాషోబాము అనే కోహీనీయులున్ను, ।
7 యోహేలా, జెబద్యా, అనే గెదోరు వూరివాడైన యె
8 రోహాము కుమారులైన వీరున్ను. । మరిన్ని గాదీయుల
లో డాలునున్ను యీటెనున్ను పట్టుకొని సింహముల
ముఖమువంటి ముఖములు గల వారున్ను కొండలలో
వుండే జింకలవలె పాదవేగము గల వారున్ను యుద్ధ
ములో ప్రవీణులున్ను పరాక్రమశాలులున్ను అయిన
కొందరున్ను అరణ్యమందు వున్న వున్నతమైన స్థల
మందు వుండే దావీదు యొద్దికి చేరినారు; వీరు యెవ
రంటే, । మొదటి వాడైన ఏజెరు, రెండోవాడైన ఓబ 9
ద్యా, మూడో వాడైన ఏలీయాబు, । నాలుగో వాడైన 10
మిష్మన్నా, అయిదో వాడైన ఇర్మీయా, । ఆరో వాడైన 11
అత్తయి, యేడో వాడైన ఎలీయేలు, । యెనిమిదో వా 12
డైన యోహానాను, తొమ్మిదో వాడైన ఎల్జాబాదు, ।
పదో వాడైన ఇర్మీయా, పదకొండో వాడైన మక్బన్న 13
యి, । గాదు పుత్రులైన వీరు రాణువ అధిపతులై వుం 14
డిరి; వారిలో చిన్నవాడు నూరుమందికిన్ని పెద్దవాడు
వెయిమందికిన్ని అధిపతులై వుండిరి. । యర్దేను తన 15
దరుల మీద అంతటానున్ను పొర్లిపోయి వుండే
మొదటి నెలయందు అది దాటి తూర్పునను పడ
మరనున్ను పల్లపు స్థలముయందు వుండే అందరినిన్ని
తరిమిన వారు వీండ్లే. । మరిన్ని బెన్యామీను పుత్రుల 16
లోనున్ను యూదా పుత్రులలోనున్ను కొందరు యె
త్తయిన స్థలమందుండే దావీదు యొద్దికి వచ్చినారు. ।
దావీదు బైలు వెళ్లి వారికి యెదురుగా పోయి, వారికి 17
ప్రత్యుత్తరమిచ్చినదేమంటే మీరు నాకు సహాయము
చేయుటకు సమాధానముగా నా యొద్దికి వచ్చినవా
రైతే నా హృదయము మీతో కలసియుండును; నా
చేతులయందు కీడు లేకుండా వుండగా నన్ను నా శత్రు
వులకు అప్పగించుటకు వచ్చిన వారైతే మా పితృల
యొక్క పరాత్పరుడు చూచి గద్దించును గాక అని
పలికెను. । అప్పుడు ముప్పయి మందికి అధిపతి అయిన 18
అమాశై మీద ఆత్మ దిగినందున వాడు ఓ దావీదూ,
మేము మీ వాండ్లము; యెష్షయి కుమారుడా, మీ
స్వాధీనముగా వున్నాము; మీకు సమాధానము, సమా
ధానము, మీకు సహాయము చేసే వారికిన్ని సమాధా
నము; యేమంటే మీ పరాత్పరుడు మీకు సహాయము
చేస్తాడు అని చెప్పెను. అప్పుడు దావీదు వారిని చేర్చు
కొని తరువాత వారిని దండుకు అధిపతులుగా చేసెను. ।
సౌలుమీద యుద్ధము చేయబోయే ఫిలిష్తీయులతో 19
కూడా దావీదు వచ్చేటప్పుడు మనస్సే సంబంధులలో
కొందరు అతని యొద్దికి చేరిరి, అయితే వారికి సహా
యము కాలేదు, యేమంటే ఫిలిష్తీయుల ప్రభువులు
యోచన చేసి, అతడు మా తలలకు మోసముగా తన
యజమానుడైన సౌలు పక్షముగా పోవునని అతని
అంపివేసిరి. । అంతట అతడు సిక్లగుకు తిరిగి పోతూ 20
వుండగా, మనస్సే సంబంధులైన అద్నా, యోజాబాదు,
యెదీయవేలు, మిఖాయేలు, యోజాబాదు, ఎలీహు,
సిల్లెతై అనే మనస్సే గోత్రపు వారి సహస్రాధిపతులు
అతనికి స్వాధీనముగా వచ్చినారు. । ఆ దండుకు విరో 21
ధముగా వీరు దావీదుకు సహాయము చేసినారు, యే
మంటే వారందరున్ను పరాక్రమశాలులున్ను సైన్యా
ధిపతులున్ను అయి వుండిరి. । యేమంటే దావీదు దండు 22

పరాత్పరుని సైన్యమువలె హెచ్చేమట్టుకు ఆ కాల
మందు ప్రతి దినమున్ను అతనికి సహాయము చేసే మను
23 ష్యులు అతని యొద్దికి వచ్చినారు.। యెహోవా మాట
ప్రకారమే సౌలుయొక్క రాజ్యమును దావీదు తట్టు
తిప్పుటకు హెబ్రోనులో వుండే అతని యొద్దికి యుద్ధ
సన్నద్ధులై వచ్చిన ఆయుధస్థులు అయిన అధిపతుల
24 లెక్క యెంతంటే,। యూదా పుత్రులలో డాలును
న్ను యీటెనున్ను పట్టుకొని యుద్ధ సన్నద్ధులైన వారు
25 ఆరువేల యెనమన్నూరుమంది.। షిమోను పుత్రులలో
యుద్ధమునకు పరాక్రమశాలులైన వారు యేడువేల
26 నూరుమంది.। లేవీ పుత్రులలో నాలుగువేల ఆరునూరు
27 మంది.। అహరోనీయులలో యెహోయాదా మొన
గాడై వుండెను; అతనితో కూడా వున్న మూడువేల
28 యేడునూరు మందిన్ని;। పరాక్రమశాలియైన సాదోకు
అనే పడుచువాడున్ను అతని తండ్రి యింటివారైన
29 యిరువై యిద్దరు ప్రభువులైనవారున్ను.। బెన్యామీను
పుత్రులలో సౌలు సహోదరులలో మూడు వేలమంది;
యేమంటే అప్పటి పర్యంతము వారిలో బహుమంది
30 సౌలు యిల్లు కాపాడుతూ వుండిరి.। ఎఫ్రయీము
పుత్రులలో తమ పితృల యింటి వారియందు పేరు
పడిన మనుష్యులైన పరాక్రమశాలులు యిరువై వేల
31 యెనిమిది నూరుమంది.। మనస్సేయొక్క అర్ధగోత్ర
ము వారి యందు దావీదును రాజుగా చేసేటందుకు
వచ్చి పేరు పేరుగా నియమించబడిన వారు పద్దెని
32 మిది వేలమంది.। ఇశ్శాఖారు పుత్రులలో ఇశ్రాయేలు
యేమి చేయ వలసినదో అది యెరిగి కాలములకు తగిన
తెలివి కలవారైన యిన్నూరుగురు అధిపతులున్ను; వీరి
33 సహోదరులందరున్ను వీరి ఆజ్ఞకింద వుండిరి.। జెబూ
లోనులో సకల విధమైన యుద్ధపు ఆయుధములతో
నున్ను యుద్ధము చేసేటందుకున్ను మనోవంచన లేని
వారుగా నిలిచేటందుకున్ను వాడికెపడి యుద్ధమునకు
34 పోతగిన వారు యేభై వేల జనులు.। నఫ్తాలీలో వెయి
మంది ప్రభువులున్ను వారితో కూడా డాలునున్ను
యీటెనున్ను పట్టుకొన్న ముప్పయి యేడువేల మం
35 దిన్ని.। దానీయులలో యుద్ధమునకు ఆయత్తపడిన వారు
36 యిరువై యెనిమిది వేల ఆరునూరుమంది.। ఆషేరులో
యుద్ధమునకు ఆయత్తపడి యుద్ధపు నేర్పు గల వారు
37 నలుభైవేల మంది.। మరిన్ని యర్దేను నది అవతల
వుండే రూబేనీయులలోనున్ను గాదీయులలోనున్ను
మనస్సే అర్ధ గోత్రపు వారిలోనున్ను యుద్ధము చేసే
సకల విధమైన ఆయుధములను ధరించుకొన్న వారు లక్ష
38 యిరువై వేల మంది.। దావీదును ఇశ్రాయేలు మీద
రాజును చేసేటందుకు యీ యుద్ధపు మనుష్యులందరు
న్ను ఆయుధస్థులుగా వుత్తమ హృదయములతో హె
బ్రోనుకు వచ్చిరి; ఇశ్రాయేలులో కొదువ వారందరు
న్ను దావీదును రాజును చేసేటందుకు ఏక మనస్సుగా
వుండిరి.। వారు అక్కడ దావీదుతో కూడా మూడు 39
దినములు వుండి అన్న పానములు చేస్తూ వుండిరి, యే
మంటే వారి సహోదరులు వారి నిమిత్తము సిద్ధము
చేసిరి.। మరిన్ని ఇశ్శాఖారు జెబూలోను నఫ్తాలీ అనే 40
వారి పొలిమేర మట్టుకున్ను వారికి సమీపమై వుండిన
వారున్ను గాడిదెల మీదనున్ను వొంటెల మీదనున్ను
కంచర గాడిదెల మీదనున్ను యెద్దుల మీదనున్ను
యెత్తిన ఆహారపు వస్తువులైన పిండి దినుసులనున్ను అం
జూరపు అడలనున్ను యెండిన ద్రాక్ష పండ్లనున్ను
ద్రాక్షారసమునున్ను నూనెనున్ను గొర్రెలనున్ను పశు
వులనున్ను విస్తారముగా తీసుకొని వచ్చిరి, యేమంటే
ఇశ్రాయేలులో సంతోషము కలిగి వుండెను.

## 13. అధ్యాయము.

దావీదు సహస్రాధిపతులతోనున్ను శతాధిపతుల 1
తోనున్ను యావత్తు ప్రభువులతోనున్ను ఆలోచన
చేసి ఇశ్రాయేలు సభవారందరికిన్ని చెప్పినదేమంటే,।
మీకు సమ్మతిగానున్ను మా పరాత్పరుడైన యెహో 2
వాకు అనుకూలముగానున్ను వుంటే, ఇశ్రాయేలు దేశ
ము అంతటానున్ను వుండే మన కొదువ సహోదరు
లున్ను వారితో కూడా పట్టణములోనున్ను పేటలలో
నున్ను వుండే అర్చకులున్ను లేవీయులున్ను మాతో
కూడుకొనేటట్టుగా శీఘ్రముగా వారి యొద్దికి మను
ష్యులను అంపి,। మన పరాత్పరుని పెట్టెను తిరుగా 3
మన యొద్దికి కొంచవత్తుము గాక, యేమంటే సౌలు
దినములలో దాని యొద్ద మనము ఆలోచన అడగక
పోతిమని పలికెను.। అప్పుడు సభ యావత్తున్ను యీ 4
ప్రకారము చేతామని పలికెను, యేమంటే యీ
కార్యము యావత్తు జనుల చూపుకు చక్కగా వుం
డెను.। ఆ ప్రకారమే పరాత్పరుని పెట్టెను కిర్యత్యెా 5
హారీమునుంచి కొంచవచ్చుటకు దావీదు మిస్రయీ
ముయొక్క షీహోరు నది మొదలుకొని హేమాతు
పొలిమేర మట్టుకున్ను వుండే ఇశ్రాయేలునందరి
నిన్ని కూర్చి,। కెరూబుల నడుమను నివాసముచేసే 6
యెహోవా అయిన పరాత్పరుని నామముచేత పిలువ
బడిన ఆయన పెట్టెను యూదాలో వుండే కిర్యత్యెహా
రీము అనే బయలానుంచి కొంచవచ్చుటకు అతడున్ను
ఇశ్రాయేలు యావత్తున్ను ఆ స్థలమునకు యెక్కి పోయి
నారు.। వారు పరాత్పరుని పెట్టెను అబీనాదాబు 7
యింటినుంచి వొక కొత్త రథము మీద యెక్కించుకొని
వచ్చినారు; ఉజ్జాయున్ను అహ్యోయున్ను రథమును
నడిపించినారు.। దావీదున్ను ఇశ్రాయేలు వారందరున్ను 8

తమ బలమంతటితోను పరాత్పరుని ముందర పాటలు
పాడి, వీణెలనున్ను కిన్నెరలనున్ను తంబురలనున్ను
తాళములనున్ను బూరగలనున్ను వాయిస్తూ వుండిరి. ।
9 వారు కీదోను కళ్లము మట్టుకు వచ్చేటప్పుడు పశువులు
తొట్రిల్లినందున ఉజ్జా పెట్టెను పట్టుకునేటందుకు తన
10 చెయ్యి చాపెను. । అప్పుడు యెహూవా కోపము
అతని మీద మండెను; అతడు తన చెయ్యి పెట్టె యొ
ద్దికి చాపినందున ఆయన అతని కొట్టెను; అతడు
11 అక్కడ పరాత్పరుని ముందర చనిపోయెను. । యె
హూవా ఉజ్జాను వినాశము చేసెను గనుక దావీదు
మనస్తాపపడెను; అందుచేత ఆ స్థలము నేటి పర్యంత
12 ము పెరెస్సుజ్జా అని పిలువపడి వున్నది. । ఆ దినమున
దావీదు పరాత్పరునికి భయపడి, పరాత్పరుని పెట్టెను
నేను నా యొద్దికి కొంచవచ్చేది యెట్లా అని అను
13 కొని,। పెట్టె తన యొద్దికి దావీదు పట్టణమునకు కొంచ
రాకుండా దానిని గిత్తీయుడైన ఓబేదెదోము యింట్లోకి
14 కొంచపోయెను. । పరాత్పరుని పెట్టె ఓబేదెదోము
యింట్లో అతని కుటుంబము యొద్ద మూడు నెలలు వుం
డెను; యెహూవా ఓబేదెదోము యింటినిన్ని వానికి
కలిగిన అంతటినిన్ని ఆశీర్వదించెను.

## 14. అధ్యాయము.

1 సోరు రాజు అయిన హీరాము దావీదు యొద్దికి
దూతలనున్ను అతనికి వొక యిల్లు కట్టేటందుకు దేవ
దారు చెట్లనున్ను కాసెవాండ్లనున్ను వడ్లవాండ్లనున్ను
2 అంపెను. । యెహూవా తన్ను ఇశ్రాయేలు మీద
రాజుగా స్థిరపర్చినాడని దావీదు గ్రహించెను, యే
మంటే ఇశ్రాయేలు అనే ఆయన జనుల నిమిత్తము
3 అతని రాజ్యము హెచ్చించబడెను. । యెరూశలేము
యందు దావీదు యింకా కొందరు స్త్రీలను వివాహము
చేసుకొని యింకా కుమాళ్లనున్ను కుమార్తెలనున్ను
4 కనెను.। యెరూశలేము యందు అతనికి పుట్టిన కుమాళ్ల
పేరులు యేవంటే, షమ్మూయ, షోబాబు, నాతాను, సొ
5,6 లొమోను, । ఇభారు, ఎలీషూవ, ఎల్పెలెతు, । నో
7 గహు, నెఫెగు, యాఫీయా, । ఎలీషామా, బేల్యాదా,
8 ఎలీఫాలెతు, అనేవారు. । దావీదు ఇశ్రాయేలందరి
మీద రాజుగా అభిషేకము చేయబడెనని పెలిష్తీయు
లు విన్నప్పుడు పెలిష్తీయులందరున్ను దావీదును వెతికే
టందుకు యెక్కి వచ్చినారు; అది దావీదు విన్నప్పుడు
9 వారికి యెదురుగా బయిలువెళ్లెను.। పెలిష్తీయులు వచ్చి
10 రెఫాయీము పల్లపు స్థలమందు దిగినారు. । పెలిష్తీ
యుల మీదికి యెక్కిపోనా? వారిని నా చేతికి అప్ప
గిస్తావా? అని దావీదు పరాత్పరుని అడిగేటప్పటికి
యెహూవా వానితో యెక్కు, వారిని నీ చేతికి అప్ప
గిస్తానని చెప్పెను. । వారు బయల్పెరాసీముకు యెక్కి 11
వచ్చినప్పుడు దావీదు అక్కడ వారిని కొట్టి, నీళ్లు పగి
లిపోయినట్టు పరాత్పరుడు నా చేత నా శత్రువులను
పగిలిపోయేటట్టు చేసినాడని దావీదు చెప్పెను; అందు
నిమిత్తము ఆ స్థలమునకు బయల్పెరాసీము అనే పేరు
వుంచినారు. । అక్కడ వారు తమ దేవుండ్లను విడిచి 12
పెట్టి పారిపోయినారు; అవి దావీదు సెలవు యిచ్చి
నట్టు అగ్నితో కాల్చివేయపడెను. । అయితే పెలి 13
ష్తీయులు తిరుగానున్ను ఆ పల్లపు స్థలపు బైలుయందు
వచ్చి దిగినారు. । అప్పుడు దావీదు తిరుగా పరాత్ప 14
రుని అడిగినందున పరాత్పరుడు అతనికి నీవు వారి
వెనుకగా యెక్కిపోకుండా వారి పక్కను చుట్టు
కొని మునుకచ్ఛెట్లకు యెదురుగా వుండి, । వారి 15
మీదికి వచ్చి, మునుకచ్ఛెట్ల కొనలయందు నడిచి
వచ్చే ఘోషము నీవు వినినప్పుడు యుద్ధమునకు బైలు
వెళ్లు, యేమంటే అప్పుడు పెలిష్తీయుల దండును విరగ
కొట్టేటందుకు పరాత్పరుడు నీకు ముందుగా బైలు వెళ్లి
వుండును అని చెప్పెను. । పరాత్పరుడు తనకు సెలవు 16
యిచ్చిన ప్రకారమే దావీదు చేసెను; వారు పెలిష్తీ
యుల సైన్యమును గిబోను మొదలుకొని గాజేరు మట్టు
కున్ను విరగ కొట్టినారు. । ఆ ప్రకారముగా దావీదు 17
కీర్తి యావత్తూ దేశములో ప్రసిద్ధియైనందున అతని భయ
మును యెహూవా సకల జాతుల మీదను రాచేసెను.

## 15. అధ్యాయము.

తర్వాత దావీదు తన కొరకు దావీదు పట్టణమందు 1
యిండ్లు కట్టించి, పరాత్పరుని పెట్టెకు వొక స్థలమును
ఆయత్తపరచి, దాని మీద వొక గుడారమును వేయిం
చెను. । తరువాత దావీదు లేవీయులే గాక మరి యెవ 2
రూ పరాత్పరుని పెట్టెను యెత్త కూడదు, యేమంటే
పరాత్పరుని పెట్టెను యెత్తుటకున్ను యెన్నటికిన్ని
ఆయనకు సేవ చేయుటకున్ను యెహూవా వారిని
యేర్పరచుకొనెనని చెప్పెను. । అంతట దావీదు తాను 3
యెహూవా పెట్టెకు ఆయత్తపరచిన దాని స్థలమునకు
దానిని తీసుకొని వచ్చుటకు ఇశ్రాయేలునందరినిన్ని
యెరూశలేమునకు సమకూర్చెను. । దావీదు అహరోను 4
పుత్రులనున్ను, । లేవీయులైన కెహాతు పుత్రులలో 5
ప్రభువైన ఊరీయేలునున్ను వాని సహోదరులైన
నూట యిరువై మందినిన్ని; । మెరారీ పుత్రులలో ప్ర 6
భువైన అశాయానున్ను వాని సహోదరులైన యి
న్నూట యిరువై మందినిన్ని; । గెర్షోము పుత్రులలో 7
ప్రభువైన యోవేలునున్ను వాని సహోదరులైన నూట
ముప్పయి మందినిన్ని; । ఎలిసాఫాను పుత్రులలో 8
ప్రభువైన షెమయానున్ను వాని సహోదరులైన

9 యిన్నూరు మందినిన్ని; । హెబ్రోను పుత్రులలో
ప్రభువైన ఎలీయేలునున్ను వాని సహోదరులైన యె
10 నభయి మందినిన్ని; । ఉజ్జీయేలు పుత్రులలో ప్రభువైన
అమ్మినాదాబునున్ను వాని సహోదరులైన నూట పం
11 డ్రెండుగురినిన్ని వచ్చేటట్టుగా చేసెను. । తరువాత
దావీదు అర్చకులయిన సాదోకునున్ను, అబ్యాతారు
నున్ను, లేవీయులైన ఊరీయేలు, అశాయా, యోవేలు,
షెమయా, ఎలీయేలు, అమ్మినాదాబు, అనే వారినిన్ని
12 పిలుపించి, వారితో, । లేవీయుల పితృల సంతతులకు
మీరు పెద్దలై యున్నారు; మీరు ఇశ్రాయేలుయొక్క
పరాత్పరుడైన యెహోవా పెట్టెను దానికి నేను
ఆయత్తము చేసిన స్థలమునకు తెచ్చుటకు మిమ్ములనున్ను
మీ సహోదరులనున్ను పరిశుద్ధులను చేసుకొండి. ।
13 యేమంటే మొదట మీరు దానిని మోయక పోయి
నందుననున్ను మనము మన పరాత్పరుడైన యెహో
వాను తగిన విధిప్రకారము వెతుకక పోయినందు
ననున్ను ఆయన మనలో నాశమును చేసినాడని
14 చెప్పెను. । యీ ప్రకారముగా అర్చకులున్ను లేవీ
యులున్ను ఇశ్రాయేలు పరాత్పరుడైన యెహోవా
పెట్టెను తెచ్చుటకు తమ్మును తాము శుద్ధులను చేసు
15 కొనిరి. । తరువాత లేవీ పుత్రులు యెహోవా మాట
ప్రకారము మోషే ఆజ్ఞాపించిన లాగున పరాత్పరుని
పెట్టెను దాని దండెలతో తమ భుజముల మీదికి
16 యెక్కించుకొనిరి. । దావీదు లేవీయుల ప్రభువులతో
మీరు మీ సహోదరులైన పాటకులను చూచి, వా
ద్యములైన కిన్నరలతోనున్ను వీణెలతోనున్ను తాళ
ములతోనున్ను మీ స్వరము సంతోషముతో యెత్తి
17 వినపడేటట్టుగా చేయుమని చెప్పుమనెను. । ఆ ప్రకా
రముగా లేవీయులు యోవేలు కుమారుడైన హేమా
నునున్ను వాని సహోదరులలో బెరెఖ్యా కుమారు
డైన ఆసాపునున్ను మెరారీ పుత్రులైన తమ సహో
దరులలో కూషాయాహు కుమారుడైన ఏతానునున్ను, ।
18 వీరితో కూడా రెండో వరసగా వున్న తమ సహో
దరులైన జెఖర్యా, బేను, యహజీయేలు, షెమీరామో
తు, యెహీయేలు, ఉన్నీ, ఏలీయాబు, బేనాయ్యా,
మయశేయా, మత్తిత్యా, ఎలీఫ్లేహు, మిక్నేయాహు,
ఓబేదెదోము, యెహీయేలు, అనే ద్వారపాలకులనున్ను
19 నిర్ణయించిరి. । యీలాగున పాటకులయిన హేమా
నున్ను ఆసాపున్ను ఏతానున్ను పంచలోహముల తాళ
20 ములు వాయించుటకు నిర్ణయించబడిరి. । జెఖర్యా,
అజీయేలు, షెమీరామోతు, యెహీయేలు, ఉన్నీ, ఏలీ
యాబు, మయశేయా, బేనాయ్యా, అనే వారు అలా
మోతుతో కిన్నెరలను వాయించుటకు నిర్ణయించ
21 బడిరి. । మరిన్ని మత్తిత్యా, ఎలీఫ్లేహు, మిక్నేయాహు,
ఓబేదెదోము, యెహీయేలు, అజజ్యాహు, అనేవారు
రాగము యెత్తేటందుకు వీణెలను వాయించుటకు నిర్ణ
యించబడిరి. । లేవీయుల ప్రభువులైన కెనన్యా రాగ 22
ము కొరకు వుండెను; వాడు గట్టివాడైనందున రాగ
మును నేర్పేవాడు. । బెరెఖ్యాయున్ను ఎల్కానా 23
యున్ను పెట్టెకు ముందుగా కావలిగా నడిచినారు. ।
అయితే షెబన్యా, యెహోషాఫాథు, నెతన్యేలు, 24
అమాశై, జెఖర్యా, బేనాయ్యా, ఎలీయెజెరు, అనే
అర్చకులు పరాత్పరుని పెట్టెకు ముందుగా బూర
గలను వూదినారు; ఓబేదెదోమున్ను యెహీయాయు
న్ను పెట్టె వెంబడి కనిపెట్టుతూ వచ్చినారు, । యీ 25
ప్రకారము దావీదున్ను ఇశ్రాయేలు పెద్దలున్ను సహ
స్రాధిపతులున్ను యెహోవాయొక్క వొడంబడికె
పెట్టెను ఓబేదెదోము యింట్లోనుంచి వుత్సాహముతో
తెచ్చుటకు వెళ్లిరి. । యెహోవాయొక్క వొడంబడికె 26
పెట్టెను మోషే లేవీయులకు పరాత్పరుడు సహాయము
చేసినప్పుడు సంభవించిన దేమంటే, వారు యేడు కోడె
లనున్ను యేడు గొర్రె పొట్టేళ్లనున్ను బలి అర్పించిరి. ।
దావీదున్ను పెట్టెను మోషే యావత్తు లేవీయులున్ను 27
పాటకులున్ను పాటకుల పని విచారించే ప్రభువైన
కెనన్యాయున్ను సన్నపు నూలు వస్త్రములను ధరించు
కొని వుండిరి; దావీదు సన్నపు నూలైన ఎఫోదును
వేసుకొని వుండెను. । ఆ ప్రకారముగా ఇశ్రాయేలంద 28
రున్ను యెహోవాయొక్క వొడంబడికె పెట్టెను
ఆర్పులతోనున్ను కొమ్ములయొక్కయున్ను బూరల
యొక్కయున్ను తాళములయొక్కయున్ను ధ్వనులతో
నున్ను కిన్నెరలనున్ను వీణెలనున్ను వాయించే శబ్దము
తోనున్ను యెత్తుకొని వచ్చిరి. । యెహోవా వొడం 29
బడికె పెట్టె దావీదు పట్టణమునకు వచ్చేటప్పుడు సం
భవించినదేమంటే, సౌలు కుమార్తె అయిన మీఖాలు
కిటికీలోనుంచి రాజైన దావీదు నాట్యము చేసేదిన్ని
వాయించేదిన్ని చూచెను, అప్పుడు అది తన హృదయ
మందు అతని అలక్ష్యము చేసెను.

## 16. అధ్యాయము.

ఈలాగున వారు పరాత్పరుని పెట్టెను తీసుకొని 1
వచ్చి, దావీదు దాని కొరకు వేసిన గుడారము నడు
మను దాని వుంచి, పరాత్పరుని సన్నిధియందు దహన
బలులనున్ను సమాధాన బలులనున్ను చెల్లించినారు. ।
దావీదు దహన బలులనున్ను సమాధాన బలులనున్ను 2
చెల్లించి చాలించిన తరువాత అతడు జనులను యె
హోవా నామముచేత ఆశీర్వదించి, । పురుషులు మొ 3
దలుకొని స్త్రీలమట్టుకున్ను ఇశ్రాయేలు వారందరిలో
వొకొక్కనికి వొక రొట్టెనున్ను వొక మాంసపు

తునకనున్ను వొక మానిక ద్రాక్షారసమునున్ను పంచి
4 పెట్టెను. ౹ మరిన్ని ఇశ్రాయేలు పరాత్పరుడైన యె
హెూవాను తలంచి స్తోత్రము చేసి పొగడేటందుకు
యెహెూవా పెట్టెకు ముందర సేవించ తగిన లేవీయు
5 లలో కొందరిని అతడు వుంచెను. ౹ వారిలో ఆసాఫు
అధిపతిన్ని జెఖర్యా వానికి రెండో వాడున్ను అయి
వుండెను, యెహీయేలు, షెమీరామోతు, యెహీయేలు,
మత్తిత్యా, ఏలీయాబు, బేనాయ్యా, ఓబేదెదోము, యె
హీయేలు, అనేవారు కిన్నెరలతోనున్ను వీణెలతో
నున్ను వుండిరి; అయితే ఆసాఫు తాళములను వాయి
6 స్తూ వుండెను.౹ బేనాయ్యా యహజీయేలు అనే అర్చ
కులు యెప్పుడున్ను పరాత్పరుని వొడంబడికె పెట్టెకు
7 ముందర బూరగలు వూదుతూ వుండిరి. ౹ ఆ ప్రకా
రము ఆ దినమందు యెహెూవాను స్తుతించుటకు ముం
దుగా దావీదు ఆసాఫు చేతికిన్ని వాని సహెూదరుల
చేతికిన్ని యీ కీర్తనను అప్పగించెను, అది యేదం
8 టే, ౹ యెహెూవాను స్తుతించి ఆయన నామమును
తలంచి ఆయన కార్యములు జన సమూహములలో
9 తెలుపండీ. ౹ ఆయనను గూర్చి పాడి ఆయనను గూర్చి
కీర్తనలు పాడి ఆయన ఆశ్చర్యమైన కార్యముల యా
10 వత్తును గురించి మాట్లాడండి. ౹ ఆయన పరిశుద్ధ నామ
మందు అతిశయపడండి; యెహెూవాను వెతికే వారి
11 హృదయము ఆనందపడునుగాక. ౹ యెహెూవానున్ను
ఆయన బలమునున్ను వెతుకండి, ఆయన ముఖమును
12 నిత్యమున్ను వెతుకండి. ౹ ఆయన దాసులైన ఇశ్రా
యేలు వంశపు వారలారా, ఆయన యేర్పరచుకొనిన
13 వారయిన యాకోబు పుత్రులారా, ౹ ఆయన చేసిన
ఆయన అతిశయములైన కార్యములనున్ను ఆయన
అద్భుతములనున్ను ఆయన నోటియొక్క న్యాయపు
14 తీర్పులనున్ను తలంచండి. ౹ ఆయనే మన పరాత్పరు
డైన యెహెూవా; ఆయన న్యాయపు తీర్పులు భూమి
15 యందంతటాను కలిగి వున్నవి. ౹ నీకు కెనయను దేశ
16 మును మీ స్వతంత్ర ప్రకారముగా యిత్తునని,౹ ఆయన
అబ్రాహాముతో మీరు అంచనాకు కొద్దిగానున్ను నిజ
17 ముగా స్వల్పముగానున్ను, ౹ దానియందు పరదేశులు
గానున్ను వుండగా చేసిన ఆయన వొడంబడికెనున్ను
ఇస్సాకుకు పెట్టిన వొట్టున్ను అయిన ఆయన యేర్పా
18 టునున్ను, ౹ ఆయన వెయితరములకు ఆజ్ఞ యిచ్చిన మాట
19 నున్ను యెన్నటికిన్ని మీరు తలంచండి; ౹ అది యాకో
బుకు ఆజ్ఞగానున్ను ఇశ్రాయేలుకు నిత్యమయిన వొడం
20 బడికెగానున్ను దృఢపరచినాడు. ౹ వారు వొక జాతి
లోనుంచి మరియొక జాతిలోకిన్ని వొక రాజ్యము
నుంచి యింకొక జనము యొద్దికిన్ని నడిచిపోయినప్పు
21 డు, ౹ ఆయన యే మనుష్యుని అయినా వారిని అణచ

నివ్వకుండా వుండెను; ౹ నేను అభిషేకము చేసిన వారిని 22
మీరు ముట్టకుండానున్ను నా దీర్ఘదర్శులకు కీడు
చేయకుండానున్ను వుండండి అని వారి నిమిత్తము రా
జులను గదిమినాడు. ౹ భూమియొక్క యావత్తు కాపు 23
రస్తులారా, యెహెూవాను గూర్చి పాడి, దినదినము
ఆయన రక్షింపును తెలుపండి. ౹ జాతులలో ఆయన 24
యొక్క మహిమయున్ను యావత్తు జన సమూహముల
లో ఆయన అతిశయములైన కార్యములనున్ను తెలియ
చేయండి. ౹ యేమంటే యెహెూవా గొప్పవాడున్ను 25
బహుగా స్తుతిచేయ తగినవాడున్ను సకలమైన దేవుండ్ల
కంటే ఆయన భయము వుంచ తగినవాడున్ను అయి
యున్నాడు. ౹ యేమంటే జన సమూహములయొక్క 26
యావత్తు దేవుండ్లు విగ్రహములై యున్నవి; అయితే
యెహెూవా ఆకాశములను కలుగ చేసినాడు. ౹ మ 27
హిమయున్ను ప్రకాశమున్ను ఆయన సముఖమందు
వున్నవి; బలమున్ను సంతోషమున్ను ఆయన స్థలమందు
వున్నవి. ౹ జన సమూహముల వంశములారా, యెహెూ 28
వాకు మహిమనున్ను బలమునున్ను చెల్లించండి; యె
హెూవాకు వాటిని చెల్లించండి. ౹ యెహెూవాకు 29
ఆయన నామమునకు తగిన మహిమను చెల్లించి, కాను
కలు తెచ్చి ఆయన ముందరను చేరండి; యెహెూవాకు
పరిశుద్ధాలంకారముతో మ్రొక్కండి. ౹ భూమియొక్క 30
యావత్తు కాపురస్తులారా, ఆయనకు భయపడండి,
భూలోకము కదలకుండా వుండేటట్టు దృఢపరచబ
డును. ౹ ఆకాశములు ఆనందించును గాక; భూమి 31
వుత్సాహము పొందును గాక; యెహెూవా యేలుతు
న్నాడని జాతులలో చెప్పబడును గాక. ౹ సముద్రము 32
న్ను దానియొక్క సంపూర్ణతయున్ను ఘోషించును
గాక; పొలములున్ను వాటి యందున్న సమస్తమున్ను
సంతోషించును గాక. ౹ అప్పుడు అడవియొక్క వృక్ష 33
ములు యెహెూవా సముఖమందు గానము చేసును,
యేమంటే ఆయన భూలోకమునకు న్యాయము తీర్చు
టకు వస్తాడు. ౹ యెహెూవాను స్తుతి చేయండి, యెం 34
దుకంటే ఆయన మంచివాడు; ఆయన కృప యెన్నటి
కిన్ని వుండును. ౹ మా రక్షింపుయొక్క పరాత్పరుడా, 35
మేము నీ పరిశుద్ధ నామమునకు వందనము చేసి, నిన్ను
స్తుతించినందువల్ల మేము ఘనము పొందేటట్టుగా మమ్ము
లను రక్షించి, మమ్మును చేర్చుకొని, జాతులలోనుంచి
మమ్మును విడిపించుము అని చెప్పండి. ౹ ఇశ్రాయేలు 36
యొక్క పరాత్పరుడైన యెహెూవా సదాకాలము
స్తోత్రము చేయబడును గాక, అని పాడినప్పుడు, జను
లందరున్ను ఆమెన్ అని యెహెూవాను స్తుతి చేసిరి. ౹
తరువాత పెట్టెముందర దినదినమున్ను అవసరమైనట్టు 37
నిత్యమున్ను సేవ చేసే కొరకు అతడు అక్కడ యెహెూ

వా వొడంబడికె పెట్టె ముందర ఆసాపునున్ను అతని
సహోదరులనున్ను ఓబేదెదోమునున్ను వారి సహో
దరులు అయిన అరువై యెనిమిది మందిన్ని వుంచి, ।
38 యెదూతూను కుమారుడైన ఓబేదెదోమునున్ను హో
39 సానున్ను ద్వారపాలకులుగా వుంచెను. । అయితే గిబో
నులో వుండే మెట్ట మీద వున్న యెహోవా గుడా
రము ముందర దహన బలిపీఠము మీద దహన బలు
లను దినదినమున్ను వుదయాస్తమానములందు యెహో
వా ఇశ్రాయేలుకు ఆజ్ఞాపించిన న్యాయప్రమాణ
40 మందు వ్రాసి వున్న ప్రకారము, । యెహోవాకు చెల్లిం
చేటందుకు అక్కడ అతడు అర్చకుడైన సాదోకు
నున్ను వాని సహోదరులైన అర్చకులనున్ను వుంచి, ।
41 వీరితోకూడా హేమానునున్ను యెదూతూనునున్ను
పేరు పేరుగా యేర్పరచబడ్డ యింకా కొందరినిన్ని
యెహోవా కృప యెన్నటికిన్ని వుండునని ఆయ
42 నను స్తుతి చేసుటకున్ను; । వీరిలోనుండే హేమాను
నున్ను యెదూతూనునున్ను బూరగలనున్ను తాళముల
నున్ను పరాత్పరునికి పాడే గీత వాద్యములనున్ను విను
పించుటకున్ను వుంచి, యెదూతూను కుమాళ్లను ద్వార
43 పాలకులుగా కట్టడ చేసెను. । తరువాత జనమంతా
నున్ను తమ తమ యిండ్లకు వెళ్లిపోయినారు; దావీ
దున్ను తన యింటివారిని ఆశీర్వదించుటకు మళ్లెను.

## 17. అధ్యాయము.

1 దావీదు తన యింట్లో కూర్చుని వున్నప్పుడు
సంభవించినదేమంటే, అతడు దీర్ఘదర్శియైన నాతా
నుతో, యిదుగో, నేను దేవదారు మానుల యింట్లో
నివాసము చేస్తూ వున్నాను; అయితే యెహోవా
వొడంబడికె పెట్టె తెరల కింద వున్నది అని చెప్పెను. ।
2 అప్పుడు నాతాను దావీదుతో నీ హృదయమందు
వున్నదంతాను చేయుము, యేమంటే పరాత్పరుడు
3 నీతో కూడా వున్నాడని చెప్పెను. । ఆ రాత్రియందు
సంభవించినదేమంటే, పరాత్పరుని మాట నాతానుకు
4 కలిగినదేమంటే, । నీవు పోయి, నా దాసుడైన దావీ
దుతో చెప్పవలసినదేమంటే, యెహోవా యిట్లా
చెప్పుతున్నాడు, నేను నివసించేటందుకు నీవు నాకు
5 వొక యిల్లు కట్టించ వద్దు; । యేమంటే నేను ఇశ్రా
యేలును యెక్కి రాచేసిన దినములు మొదలుకొని యీ
దినము పర్యంతము నేను వొక యింట్లో నివాసము
చేయకుండా గుడారమునుంచి గుడారమునకున్ను వొక
నివాస స్థలమునుంచి మరి వొక నివాస స్థలమునకున్ను
6 వస్తూ వుంటిని. । నేను ఇశ్రాయేలు అంతటితోను సం
చరించి వచ్చిన యే స్థలమందు అయినా నా జనమును
మేపుమని నేను ఆజ్ఞాపించి, ఇశ్రాయేలు యొక్క
న్యాయాధిపతులలో వొకనితోనయినా మీరు నాకొ
రకు దేవదారు మానుల యిల్లు కట్టకుండా వుంటిరేమి
అని యేమైనా వొక మాట చెప్పినానా? । కాబట్టి 7
యిప్పుడు నీవు నా దాసుడైన దావీదుతో చెప్పవలసిన
దేమంటే, సైన్యములయొక్క యెహోవా యీలాగు
చెప్పుతున్నాడు, నీవు నా జనమైన ఇశ్రాయేలు మీద
అధిపతివై వుండేటట్టు గొర్రెల వెంబడి నడిచిన నిన్ను
గొర్రెమందనుంచి తప్పించి, । నీవు వెళ్లిన స్థలమందంత 8
టానున్ను నీతో కూడా వుండి, నీ పగవాండ్లనందరి
నిన్ని నీ ముందరనుంచి నిర్మూలము చేసి, భూమియందు
వుండే గొప్పవాండ్లవంటి నామమును నీకు కలుగ
చేస్తిని. । మరిన్ని నేను నా జనమైన ఇశ్రాయేలు 9
కొరకు వొక స్థలమును యేర్పరచి వారిని నాటుదును;
వారు తమ స్థానమందు కాపురము చేసి, మరి కద
లక వుందురు; మునుపటి వలెనున్ను నేను నా జను
లయిన ఇశ్రాయేలుమీద న్యాయాధిపతులను నిర్ణ
యించిన కాలము మొదలుకొని నడిచిన హాని వలెను
న్ను అక్రమ పుత్రులు వారిని యిక శ్రమ పెట్టకుండా
వుందురు. । మరిన్ని నీ పగవారినందరినిన్ని నేను అణచి 10
వేతును; అదిగాక యెహోవా నీకు వొక యిల్లు కట్టిం
చునని నేను నీకు తెలుపుతూ వున్నాను. । నీవు నీ 11
పితృల యొద్దికి వెళ్లేటందుకు నీ దినములు అయిన తరు
వాత సంభవించేదేమంటే, నీ తరువాత నీ పుత్రుల
సంబంధమైన నీ సంతతిని నేను లేవ చేసి, అతని రా
జ్యమును దృఢపరతును. । అతడు నా కొరకు వొక 12
యిల్లు కట్టించును; నేను అతనికి సింహాసనమును
యెన్నటికిన్ని స్థిరపరతును. । నేను అతనికి తండ్రినై 13
వుంటాను, అతడు నాకు కుమారుడై వుండును; నీకం
టే ముందుగా వున్నవాని యొద్దనుంచి నా కృపను
నేను తొలగచేసినట్టు అతనియొద్దనుంచి నేను తొలగ
చేయకుండా, । నా యింట్లోనున్ను నా రాజ్యమం 14
దున్ను యెన్నటికిన్ని అతని స్థిరపరతును; అతని సింహా
సనము యెన్నటికిన్ని స్థిరముగా వుండును అని చెప్పు
మని చెప్పెను. । నాతాను యీ యావత్తు మాటల 15
ప్రకారముగానున్ను యీ యావత్తు దర్శన ప్రకార
ముగానున్ను దావీదుతో చెప్పెను. । అప్పుడు రాజైన 16
దావీదు వచ్చి యెహోవా సముఖమందు కూర్చుండి
చెప్పినదేమంటే, పరాత్పరుడవైన వో యెహోవా,
యింత పర్యంతము నీవు నన్ను కొంచ వచ్చినందుకు
నేను యెంతవాడను! నా యిల్లు యెంతమాత్రము? ।
వో పరాత్పరుడా, యిది యింకా నీ చూపుకు 17
కొంచెపు కార్యమై వున్నది, యేమంటే వో పరాత్ప
రుడవైన యెహోవా, నీ సేవకుని యింటిని గురించి
రాబోయే బహు కాలము మట్టుకు చెప్పి, మహా ఘన

మైన వొకని స్థితి ప్రకారముగా నా యందు లక్ష్యము
18 వుంచితివి. । నీ సేవకుడనైన నాకు కలిగే ఘనమును
గురించి దావీదు నీతో మరి యేమి చెప్పగలడు? యే
19 మంటే నీవు నీ సేవకుని యెరుగుదువు. । వో యెహో
వా, నీ సేవకుని నిమిత్తము నీ చిత్తప్రకారము యీ
గొప్ప కార్యములన్నిటినిన్ని తెలియచేసేటట్టుగా యీ
20 గొప్ప కార్యమంతటినిన్ని చేస్తివి. । వో యెహోవా,
మేము మా చెవులతో వినిన అంతటి ప్రకారముగాను
నీవంటివాడు లేడు; నీవు గాక వేరే దేవుడు లేడు. ।
21 నీ జనమైన ఇశ్రాయేలువంటి జనము భూలోకమందు
యేది? మిస్రయీములోనుంచి నీవు విమోచించిన నీ
జనము ముందరనుంచి అనేక జాతులను బయిటికి తోలి
వేసినందువల్ల నీవు గొప్పయున్ను భయంకరత్వమున్ను
గల నామమును పొందేటందుకు పరాత్పరుడవైన నీవు
నీ స్వంతమైన జనమయ్యే కొరకు దాని విమోచించు
22 టకు వెళ్లితివి. । యేమంటే నీ జనులైన ఇశ్రాయేలును
యెన్నటికిన్ని నీ జనులై వుండేటట్టు చేసితివి; యెహో
23 వావైన నీవు వారికి పరాత్పరుడవైతివి. । కాబట్టి యి
ప్పుడు వో యెహోవా, నీ సేవకుని గురించిన్ని
అతని యింటిని గురించిన్ని నీవు చెప్పిన మాట యెన్న
24 టికిన్ని స్థిరముగా వుండును గాక. । సైన్యములయొక్క
యెహోవా, ఇశ్రాయేలుయొక్క పరాత్పరుడున్ను
ఇశ్రాయేలుకు పరాత్పరుడున్ను అయి వున్నాడని నీ
పేరు యెన్నటికిన్ని ఘనపరచబడేటట్టు అది నిశ్చయ
ముగా స్థిరపరచపడనిమ్ము; మరిన్ని నీ దాసుడనయిన
దావీదుయొక్క యిల్లున్ను నీ యెదుట స్థిరపరచబడ
25 నిమ్ము. । యేమంటే నీకు యిల్లు కట్టిస్తానని వో నా
పరాత్పరుడా, నీవు నీ సేవకునికి తెలియ చేస్తివి; అయి
నందున నీ సముఖమందు విన్నపము చేయుటకు నీ సేవ
26 కునికి మనోధైర్యము కలిగెను. । వో యెహోవా,
నీవు పరాత్పరుడవై యున్నావు, నీ సేవకుని గురించి
27 యీ మేలు దయ చేస్తానని చెప్పితివి. । కాబట్టి యి
ప్పుడు నీ సేవకుని యిల్లు యెన్నటికిన్ని నీ ముందర
వుండేటట్టుగా దానిని ఆశీర్వదించుటకు దయచేయు
ము, యేమంటే వో యెహోవా, నీవు ఆశీర్వదిస్తే
అది యెన్నటికిన్ని ఆశీర్వదించపడి వుండును అని
పలికెను.

## 18. అధ్యాయము.

1 ఇది అయిన తరువాత సంభవించినదేమంటే, దా
వీదు ఫెలిష్తీయులను గొట్టి వారిని నాశము చేసి, గాతు
పట్టణమునున్ను దాని గ్రామములనున్ను ఫెలిష్తీయుల
2 చేతిలోనుంచి తీసుకొనెను. । అతడు మోయాబునున్ను
కొట్టినందున మోయాబీయులు దావీదుకు సేవకులై
అతనికి కానుకలు చెల్లించిరి. । సోబా రాజు అయిన 3
హదరెజెరు ఫెరాతు నది మట్టుకు తన అధికారము
ను నిలుపుటకు పోయేటప్పుడు దావీదు అతనినిన్ని
హమాతు వొద్దను కొట్టెను. । అతని యొద్దనుంచి వెయి 4
రథములనున్ను యేడు వేల గుర్రపు రౌతులనున్ను యి
రువై వేల కాల్బలమునున్ను దావీదు పట్టుకొనెను;
దావీదు ఆ రథములలో నూరు రథములను వుంచుకొని
కొదువ వాటినన్నిటినిన్ని విరిచివేయించెను. । సోబా 5
రాజు అయిన హదరెజెరుకు సహాయము చేయుటకు
దమస్కుయొక్క అరామీయులు వచ్చినప్పుడు దా
వీదు ఆ అరామీయులలో యిరువై రెండువేల మం
దిని చంపివేసెను. । తరువాత దావీదు అరాము సంబం 6
ధమయిన దమస్కులో కావు బలమును వుంచెను;
అప్పుడు అరామీయులు దావీదుకు సేవకులై అతనికి
కానుకలు చెల్లించిరి. యీలాగున దావీదు పోయిన
స్థలమంతటిలో యెహోవా అతని రక్షించెను. । మరిన్ని 7
హదరెజెరుయొక్క సేవకులకు వున్న బంగారపు డాలు
లను దావీదు తీసుకొని, యెరూశలేముకు వాటిని
కొంచ వచ్చెను. । హదరెజెరుయొక్క పట్టణములైన 8
థిభతునుంచిన్ని కూనునుంచిన్ని దావీదు బహు విస్తా
రమైన యిత్తడిని తీసుక వచ్చెను, దానితోటి సొలో
మోను యిత్తడి సముద్రమునున్ను స్తంభములనున్ను
యిత్తడి వస్తువులనున్ను చేయించెను. । అయితే దావీదు 9
సోబా రాజు అయిన హదరెజెరుయొక్క సైన్యమంత
టినిన్ని కొట్టిన వర్తమానము హమాతు రాజు అయిన
తోహూ విన్నప్పుడు, । హదరెజెరుకున్ను తోహూకు 10
న్ను యుద్ధము కలిగి వున్నందున అతడు రాజైన దావీదు
యొక్క క్షేమ సమాచారము విచారించుటకున్ను అత
నికి శుభ వచనములు చెప్పుటకున్ను తన కుమారుడైన
హదోరామును బంగారమున్ను వెండిన్ని యిత్తడిన్ని
అయిన సకల విధమైన వస్తువులతోను అతని యొద్దికి
పంపెను, యెందుకంటే దావీదు హదరెజెరుతో పో
ట్లాడి అతని కొట్టెను. । ఆ వస్తువులనున్ను తాను ఎదో 11
మీయులు యొయాబీయులు అమ్మోను పుత్రులు ఫెలి
ష్తీయులు అమాలేకీయులు అనే యీ సకల జాతుల
యొద్దనుంచి తీసుకొన్న వెండి బంగారములనున్ను రా
జైన దావీదు యెహోవాకు పరిశుద్ధము చేసెను. ।
మరిన్ని సెరూయా కుమారుడైన అబీషై వుప్పు పల్లపు 12
స్థలమందు ఎదోమీయులలో పద్దెనిమిదివేల మందిని
సంహరించెను. । అయితే దావీదు ఎదోములో కావు 13
బలమును వుంచెను, ఎదోమీయులందరున్ను అతనికి
సేవకులైరి; దావీదు పోయిన స్థలమందంతటానున్ను
యెహోవా అతని రక్షించెను. । యీలాగున దావీదు 14
ఇశ్రాయేలు యావత్తున్ను యేలి, తన జనులందరికిన్ని

15 నీతి న్యాయములను యిచ్చెను. । సెరూయా కుమారు
డైన యోవాబు సైన్యాధిపతియై వుండెను; అహీలూదు
కుమారుడైన యెహోషాపాతు మంత్రి అయి వుం
16 డెను. । అహీటూబు కుమారుడైన సాదోకున్ను అబ్యా
తారు కుమారుడైన అబీమెలెకున్ను అర్చకులై వుం
17 డిరి; షవ్షా సంప్రతి అయి వుండెను. । యెహోయా
దా కుమారుడైన బెనాయ్యా కెరేతీయులకున్ను పెలె
తీయులకున్ను అధిపతి అయి వుండెను; అయితే దావీ
దుయొక్క కుమారులు రాజుకు సహాయులై వుండిరి.

## 19. అధ్యాయము.

1 ఇది అయిన తరువాత సంభవించినదేమంటే,
అమ్మోను పుత్రుల రాజు అయిన నాహాషు చనిపో
యెను, అతని కుమారుడు అతనికి బదులుగా యేలుతూ
2 వుండెను. । అప్పుడు దావీదు హానూను తండ్రి అయిన
నాహాషు నా యందు దయ చూపించెను గనుక నేను
అతని కుమారునికి దయ చూపింతును అని చెప్పి, అతని
తండ్రి నిమిత్తము అతని పరామర్శించుటకు దూతలను
అంపెను; ఆలాగున దావీదుయొక్క సేవకులు హానూ
నును పరామర్శించుటకు అమ్మోను పుత్రుల దేశమునకు
3 వచ్చిరి. । అయితే అమ్మోను పుత్రుల ప్రభువులు హానూ
నుతో చెప్పినదేమంటే, దావీదు పరామర్శించే వారిని
నీ యొద్దికి పంపినందున నీ తండ్రిని ఘనము చేస్తున్నా
డని నీకు తోస్తుందా? దేశమును శోధించి చూచి దా
నిని తల కిందుగా చేయడానకే గదా అతని సేవకులు
నీ యొద్దికి వచ్చి యున్నారు అని చెప్పినందున, ।
4 హానూను దావీదు సేవకులను పట్టుకొని, వారిని గొరి
గించి, వారి వస్త్రములు నడుము మట్టుకు మాత్రము
వుంచి కొదువ సగము కత్తిరించి, వారిని పంపివేసెను. ।
5 అంతట ఆ మనుష్యులు వచ్చేటప్పటికి వారి సమాచా
రము దావీదుకు తెలుపబడెను; అప్పుడు ఆ మనుష్యులు
మిక్కిలీ సిగ్గు పొందిరి గనుక అతడు వారికి యెదురు
గా మనుష్యులను పంపి, మీ గడ్డములు పెరిగేమట్టుకు
మీరు యెరికోలో వుండి తరువాత తిరుగా రండి
6 అని రాజు చెప్పుమని పంపెను. । అయితే అమ్మోను
పుత్రులు దావీదుకు తమకు తామే అసహ్యులగా చేసు
కొన్నామని తెలుసుకొన్నప్పుడు, హానూనున్ను అమ్మో
ను పుత్రులున్ను అరమ్న హరయీములోనుంచిన్ని
అరాము మయకాలోనుంచిన్ని సోబాలోనుంచిన్ని
తమ కొరకు రథములున్ను గుర్రపు రౌతులున్ను బాడి
గెకు వచ్చేటట్టుగా వెయి తలాంతుల వెండి అంపి, ।
7 ముప్పయి రెండు వేల రథములనున్ను మయకా రాజు
నున్ను అతని జనులనున్ను కూలికి కుదుర్చుకొన్నారు;
వీరు వచ్చి మేదెబా ముందరి తట్టున దిగినారు; అమ్మోను
పుత్రులున్ను తమ తమ పట్టణములలోనుంచి కూడు
కొని యుద్ధము చేయుటకు వచ్చినారు. । దావీదు అది 8
విన్నప్పుడు యోవాబునున్ను బలిష్ఠమైన సైన్యమంతా
నున్ను అంపెను. । అమ్మోను పుత్రులు బయిలు వెళ్లి పట్ట 9
ణపు గవినియొద్దనున్ను వచ్చిన రాజులు ప్రత్యేకముగా
బయిట భూమిలోనున్ను యుద్ధమునకు ఆయత్తముగా
నిలిచినారు. । యుద్ధపు సైన్యముయొక్క ముఖము తనకు 10
ముందుగానున్ను వెనుకగానున్ను వుండేది యోవాబు
చూచినప్పుడు వాడు ఇశ్రాయేలులో యేర్పరచబడ్డ
అందరిలోనున్ను వొక భాగమును యెంచి దానిని అరా
మీయులకు యెదురుగా నిలిపి, । కొదువ జనులను 11
అమ్మోను పుత్రులకు యెదురుగా యుద్ధమునకు ఆయత్త
ముగా వుండచేసి, తన సహోదరుడైన అబీషైకు
అప్పగించి చెప్పినదేమంటే, । అరామీయులు నా 12
కంటే బలవంతులైతే నీవు నాకు సహాయము చేయవ
లెను; అమ్మోను పుత్రులు నీకంటే బలవంతులైతే
నేను నీకు సహాయము చేతును. । ధైర్యముగా వుండు; 13
మనము మన జనుల నిమిత్తమున్ను మన పరాత్పరుని
పట్టణముల నిమిత్తమున్ను ధైర్యముగా వుందుము గాక;
యెహోవా తన చూపుకు మంచిదైన దాని చేసును
గాక అని చెప్పెను. । ఆలాగున యోవాబున్ను తనతో 14
కూడా వున్న జనమున్ను అరామీయులతో యుద్ధము
చేయుటకు చేరిరి; అయితే వారు వానికి ముందుగా
తిరిగి పారిపోయిరి. । అరామీయులు తిరిగి పారిపో 15
యినారని అమ్మోను పుత్రులు చూచినప్పుడు వారున్ను
వాని సహోదరుడైన అబీషై ముందర తిరిగి పారి
పోయి పట్టణములోకి ప్రవేశించినారు; యోవాబు
తిరుగా యెరూశలేముకు వచ్చెను. । తాము ఇశ్రాయేలు 16
ముందర విరుగ కొట్టబడినామని అరామీయులు యెరి
గినప్పుడు వారు దూతలను పంపి, యేటికి ఆవల వుండే
అరామీయులను పిలిపించుకొనిరి; హదరెజెరుయొక్క
సైన్యాధిపతియైన షోఫకు వారికి ముందర నడిచెను. ।
అది దావీదుకు తెలుపబడినప్పుడు అతడు ఇశ్రాయేలు 17
నందరినిన్ని కూర్చుకొని, యర్దేను దాటి వారికి
సమీపముగా వచ్చి, వారికి యెదురుగా సైన్యములను
నిలిపెను; దావీదు అరామీయులకు యెదురుగా సైన్య
ములను యుద్ధమునకు ఆయత్తముగా చేసిన తరువాత
వారు అతనితో యుద్ధము చేసినారు. । అయితే అరా 18
మీయులు ఇశ్రాయేలుకు ముందర తిరిగి పారిపోయిరి;
దావీదు అరామీయులలో యేడువేల రథికులనున్ను
నలుబై వేల కాల్బలమునున్ను చంపివేసి, సైన్యాధిపతి
యైన షోఫకును సంహరించెను. । తాము ఇశ్రాయేలు 19
ముందర విరగ కొట్ట బడినామని హదరెజెరుయొక్క
సేవకులు తెలుసుకొన్నప్పుడు వారు దావీదుతో సమా

ధానము చేసుకొని అతనికి సేవకులైరి; తరువాత
అమ్మోను పుత్రులకు సహాయము చేయుటకు అరామీ
యులకు మనస్సు లేకుండా వుండెను.

## 20. అధ్యాయము.

1 ఆ సంవత్సరము గతించిన తరువాత రాజులు యుద్ధ
మునకు బైలువెళ్లే కాలమందు సంభవించినదేమంటే,
యోవాబు సైన్య బలమును కూర్చుకొని అమ్మోను
పుత్రుల దేశమును పాడు చేసి వచ్చి రబ్బాను ముట్టడి
వేసెను; అయితే దావీదు యెరూశలేములో నిలిచెను;
2 యోవాబు రబ్బాను కొట్టి పాడు చేసెను. । దావీదు
వచ్చి వారి రాజు తలమీద వున్న కిరీటమును తీసుకొ
నెను; అది వొక తలాంతు బంగారము యెత్తు వుండెను;
అందులో రత్నములున్ను వుండెను; అది దావీదు తల
మీద వుంచబడెను; అతడు బహు విస్తారమైన కొల్ల
సొమ్మును ఆ పట్టణములోనుంచి తీసుకొపోయెను. ।
3 అయితే దాని యందు వున్న జనులను అతడు వెలప
టికి కొంచపోయి, వారిని రంపపు కోత పనికిన్ని
యినుప కొలిమి పనికిన్ని గొడ్డళ్ల పనికిన్ని వుంచి,
యీ ప్రకారము అమ్మోను పుత్రుల పట్టణములన్నిన్ని
చేసెను; అంతట దావీదు యావత్తు జనులతో కూడా
4 యెరూశలేముకు తిరిగి వచ్చెను . । అటుతరువాత సంభ
వించినదేమంటే, గెజెరులో వున్న పెలిష్తీయులతో
యుద్ధము కలిగెను; అప్పుడు హుషాతీయుడైన సిబ్బెఖై
దీర్ఘదేహి పుత్రులలో సిప్పయి అనే వొకని హతము
5 చేసెను, అందువల్ల వారు తగ్గిపోయిరి. । తిరుగా పెలిష్తీ
యులతో యుద్ధము కలిగెను; అప్పుడు యాయీరు
కుమారుడైన ఎల్హానాను గిత్తీయుడైన గొల్యతు సహో
దరుడైన లహ్మీని కొట్టివేసెను; వాని యీటె నేతకా
6 నియొక్క దోనె లాగున వుండెను. । తిరుగానున్ను
వొక యుద్ధము గాతులో కలిగెను; అక్కడ పొడవు
అయిన వొక మనుష్యుడు వుండెను; వానికి ఆరేసి
చొప్పున యిరువై నాలుగు వేళ్లు వుండెను; వాడున్ను
7 దీర్ఘదేహి పుత్రుడై వుండెను. । అయితే వాడు
ఇశ్రాయేలును దూషించినప్పుడు దావీదుయొక్క
సహోదరుడైన షిమీకి పుట్టిన యోనాతాను వాని
8 సంహరించెను. । గాతులో వున్న దీర్ఘదేహికి పుట్టిన
వీరు దావీదు చేతనున్ను అతని సేవకుల చేతనున్ను
హతులైరి.

## 21. అధ్యాయము.

1 తరువాత సాతాను ఇశ్రాయేలుకు విరోధముగా
లేచి, దావీదును ఇశ్రాయేలును లెక్కించుటకు ప్రేరే
2 పించెను. । అప్పుడు దావీదు యోవాబుకున్ను జనుల
యొక్క అధిపతులకున్ను మీరు పోయి బెయేర్షెబ
మొదలుకొని దాను పర్యంతము వుండే ఇశ్రాయేలును
యెంచి, వారి లెక్క నేను యెరిగేటట్టుగా నా వద్దికి
కొంచరండి అని చెప్పెను. । అప్పుడు యోవాబు అనిన 3
దేమంటే, యెహోవా తన జనులను యిప్పుడు వున్న
లెక్క కంటే నూరంతలుగా వృద్ధి చేయును గాక;
అయితే రాజు అయిన నా యేలినవాడా వారందరున్ను
నా యేలినవాని సేవకులు కారా? నా యేలినవాడు
దీనిని విచారించేదేమి! ఇశ్రాయేలు మీద తప్పు కలి
గేటట్టుగా యిది నడువ వలసినదేమి అని పలికెను. ।
అయినప్పటికిన్ని రాజు మాట యోవాబు మీద జయ 4
కరముగా వుండెను; కాబట్టి యోవాబు ఇశ్రాయేలం
తటికి వెళ్లి తిరిగీ యెరూశలేముకు వచ్చి జనుల లెక్క
వెరసి దావీదుకు యిచ్చెను; । ఇశ్రాయేలులో యావ 5
త్తున్ను కత్తి దూసేవారు పదకొండు లక్షల మందిన్ని
యూదాలో కత్తి దూసేవారు నాలుగు లక్షల డెబ్బయి
వేల మందిన్ని వుండిరి. । అయితే లేవీ బెన్యామీను అనే 6
గోత్రములలో వున్న వాండ్లు వారి లెక్కలో పడ
లేదు, యేమంటే రాజు మాట యోవాబుకు అసహ్య
ముగా వుండెను. । యీ కార్యము పరాత్పరుని చూ 7
పుకు తగనిదైనందున ఆయన ఇశ్రాయేలును బాధ
పెట్టెను. । కాబట్టి దావీదు పరాత్పరునితో నేను యీ 8
కార్యము చేసినందున బహు పాపము చేస్తిని, అయిన
ప్పటికిన్ని యిప్పుడు నీ సేవకుని అక్రమమును పరిహా
రము చేయుమని వేడుకొంటున్నాను, యేమంటే నేను
మిక్కిలి అవివేకముగా ప్రవర్తించితినని పలికెను. ।
అప్పుడు యెహోవా దావీదుయొక్క జ్ఞాన దృష్టి 9
పురుషుడైన గాదుతో మాట్లాడి, నీవు పోయి దావీ
దుతో చెప్పవలసినదేమంటే, । మూడు కార్యములు 10
నేను నీ ముందర వుంచుతాను, నేను నీకు చేసేటం
దుకు వాటిలో వొక దాని యేర్పరచుకొమ్మని యె
హోవా చెప్పుతున్నాడని చెప్పుమనెను. । ఆ ప్రకా 11
రమే గాదు దావీదు యొద్దికి వచ్చి వానితో యెహో
వా యీలాగు చెప్పుతున్నాడు, । మూడు సంవత్సర 12
ములు కరువునైనా, మూడు నెలలు నీ పగవాండ్ల కత్తి
నిన్ను వెంబడించుటవల్ల నీవు నీ శత్రువులకు ముందర
నశించిపోవుటనైనా, మూడు దినములు యెహోవా
దూత ఇశ్రాయేలు భూమి అంతటానున్ను నాశనము
చేసేటట్టుగా దేశమందు యెహోవా కత్తిని అనగా
తెగులును అయినా, వీటిలో యేదో వొక దాని యేర్ప
రచుకో అని చెప్పుతున్నాడు; యిప్పుడు నన్ను అంపిన
వానికి నేను యేమి మారుత్తరము కొంచపో వలెనో
అది చూడుము అని పలికెను. । అప్పుడు దావీదు గాదు 13
తో నేను మిక్కిలీ యిరుకులో చిక్కి వున్నాను, యి
ప్పుడు యెహోవా చేతిలో చిక్కుతాను, యేమంటే

ఆయన కృపలు మహా గొప్పవి, మనుష్యుల చేతిలో
14 చిక్కకుండా వుందును గాక అని పలికెను. । ఆలాగున
యెహోవా ఇశ్రాయేలు మీద తెగులు పంపినందున
ఇశ్రాయేలులో డెబ్బయివేల మంది పడిపోయిరి. ।
15 యెరూశలేమును నాశనము చేయడానకు పరాత్పరుడు
వొక దూతను అంపినాడు; అతడు నాశనము చేస్తూ
వుండగా యెహోవా చూచి ఆ చేటుకు మనస్తాప
పడి, నాశనము చేసే దూతతో చాలును, యిప్పుడు
నీచెయ్యి తీసుకో అని చెప్పెను; అప్పుడు యెహో
వా దూత యెబూసీయుడైన ఒర్నాను కళ్లము వొద్ద
16 నిలిచి వుండెను. । దావీదు తన కన్నులు యెత్తి భూమి
కిన్ని ఆకాశమునకున్ను నడుమను నిలుచుని వుండే
యెహోవా దూత వరదీసిన కత్తి చేతపట్టుకొని,
యెరూశలేము మీద చాపినట్టుగా చూచెను; అప్పుడు
దావీదున్ను పెద్దలైన వాండ్లున్ను గోనె పట్టె కప్పు
17 కొన్నవాండ్లై సాగిలపడినారు. । దావీదు పరాత్పరు
నితో జనులను యెంచుమన్నవాడను నేనే కదా!
పాపము చేసి చెడ్డతనము నడిపించినవాడను నేనే
కదా! అయితే యీ గొర్రెలు వీరు యేమి చేసిరి!
నా పరాత్పరుడవైన వో యెహోవా, బాధ పెట్టే
నీ చెయ్యి నీ జనుల మీద కాకుండా నాకున్ను నా
తండ్రి యింటికిన్ని విరోధముగా వుండనిమ్ము అని పలి
18 కెను. । అప్పుడు యెబూసీయుడైన ఒర్నాను కళ్లమందు
యెహోవాకు వొక బలిపీఠమును కట్టించేటట్టుగా
దావీదు అక్కడికి వెళ్ల వలెనని దావీదుకు చెప్పుమని
19 యెహోవా దూత గాదుకు చెప్పెను. । ఆ ప్రకారమే
దావీదు యెహోవా పేరట గాదు చెప్పిన మాట
20 ప్రకారము పోయెను. । అయితే ఒర్నాను తిరిగి దూతను
చూచినప్పుడు వాడున్ను వానితో కూడా వుండే వాని
నలుగురు కుమాళ్లున్ను దాగుకొనిరి; ఒర్నాను అప్పుడు
21 గోధుములను నూర్చుతూ వుండెను. । దావీదు ఒర్నాను
వొద్దికి వచ్చినప్పుడు ఒర్నాను దృష్టించి దావీదును చూ
డగా వాడు కళ్లములోనుంచి బైలు వెళ్లి నేలమట్టుకు తల
22 వంచుకొని దావీదుకు మ్రొక్కెను. । అప్పుడు దావీదు
ఒర్నానుతో యీ కళ్లపు భూమి యందు నేను యె
హోవాకు వొక బలిపీఠము కట్టించేటట్టుగానున్ను
యీ రోగము జనులను విడిచిపోయేటట్టుగానున్ను
నాకు దానిని తగిన క్రయమునకు యిమ్మని పలికెను. ।
23 అప్పుడు ఒర్నాను దావీదుతో రాజు అయిన నా యేలి
నవాడు దానిని పుచ్చుకొని, తన దృష్టికి సరి అయి
నట్టు చేసును గాక; యిదుగో దహన బలులకు యె
ద్దులనున్ను కర్రల కొరకు నూర్చే సరుకులనున్ను కాను
కకు గోధుమ పిండినిన్ని యీ యావత్తున్ను యిస్తాను

అని పలికెను. । అయితే రాజైన దావీదు ఒర్నానుతో 24
ఆలాగు కాదు, నేను నీది పూరికే తీసుకొని యె
హోవాకు దహన బలులను చెల్లించకుండా దానిని
చేసే వెలకు తీసుకొందును అని చెప్పి; । దావీదు ఆ 25
భూమికి ఆరునూరు షెకేలుల యెత్తు బంగారమును
ఒర్నానుకు యిచ్చి, । అక్కడ యెహోవాకు వొక బలి 26
పీఠమును కట్టించి, దహన బలులనున్ను సమాధాన బలు
లనున్ను చెల్లించి, యెహోవాను పిలిచెను; అప్పుడు
ఆయన ఆకాశములోనుంచి దహన బలిపీఠము మీద
దిగిన అగ్నితోను అతనికి మారుత్తరము యిచ్చెను. ।
అదిగాక యెహోవా దూతకు ఆజ్ఞాపించినందున 27
అతడు తన కత్తిని దాని వరలో తిరుగా వేసెను. । యె 28
బూసీయుడైన ఒర్నాను కళ్లమందు యెహోవా తనకు
వుత్తరము యిచ్చెనని దావీదు చూచి అక్కడనే బలి
యిచ్చెను. । యేమంటే మోషే అరణ్యమందు కలుగ 29
చేసిన యెహోవా నివాస స్థలమున్ను దహన బలిపీఠ
మున్ను ఆ కాలమందు గిబోను మెట్టమీద వుండగా, ।
దావీదు దాని ముందరకు పోయి పరాత్పరుని యొద్ద 30
విచారించుటకు వెళ్ల లేకుండా వుండెను, యేమంటే
యెహోవా దూతయొక్క కత్తికి అతడు భయపడి
వుండెను.

## 22. అధ్యాయము.

అప్పుడు దావీదు పరాత్పరుడైన యెహోవా 1
యొక్క యిల్లు వుండే స్థలము యిదే కదా, ఇశ్రా
యేలు బలి యిచ్చే దహన బలిపీఠము వుండే స్థలము
యిదే కదా అని పలికెను. । తరువాత దావీదు ఇశ్రా 2
యేలు దేశమందు వుండే అన్య జాతి వాండ్లను కూ
చుర్చుకొమ్మని చెప్పి, పరాత్పరుని యిల్లు కట్టే రాళ్లు
చెక్కుటకు కాసె వాండ్లను నిర్ణయము చేసెను. ।
దావీదు వాకిళ్ల తలుపులకు కావలసిన మేకులకున్ను, 3
చీలలకున్ను, విస్తారమైన యినుమునున్ను, తూచుటకు
శక్యము కాని విస్తారమైన యిత్తడినిన్ని, । యెంచ శక్యము 4
కాని అరత్స మానులనున్ను సంపాదించెను, యేమంటే
సీదోనీయులున్ను సోరీయులున్ను దావీదుకు విస్తార
మైన అరత్స మానులను కొంచువచ్చినారు. । దావీదు అని 5
నదేమంటే, నా కుమారుడైన సాలొమోను పడుచు వా
డున్ను లేత వాడున్ను అయి వున్నాడు; యెహోవాకు
కట్టబోయే యిల్లు సకల దేశములలో మిక్కిలీ కీర్తిని
న్ని మహిమనున్ను ఘనమునున్ను పొందేటట్టుగా చాలా
గొప్పదై వుండవలెను; అయితే అందు నిమిత్తము నేను
వస్తువులను జాగ్రత చేస్తానని చెప్పి, దావీదు తన మర
ణమునకు ముందే విస్తారముగా వస్తువులను కూర్చు
కొని వుంచెను. । తరువాత అతడు తన కుమారుడైన 6

సొలొమోనును పిలిచి, ఇశ్రాయేలు పరాత్పరుడైన
యెహోవాకు వొక యిల్లు కట్టేటందుకు అతనికి
7 ఆజ్ఞాపించెను. । మరిన్ని దావీదు సొలొమోనుతో చెప్పి
నదేమంటే, నా కుమారుడా నేను నా పరాత్పరుడైన
యెహోవా పేరట వొక యిల్లు కట్టించుటకు నా
8 హృదయమందు తాత్పర్యము వుండెను. । అయితే యె
హోవా మాట నాకు కలిగినదేమంటే, నీవు విస్తార
ముగా రక్తమును చిందించి గొప్ప యుద్ధములు చేస్తివి,
గనుక నీవు నా పేరట యిల్లు కట్టించ కూడదు; యే
మంటే నా దృష్టికి నీవు విస్తారముగా రక్తమును నేల
9 మీద చింద చేస్తివి. । యిదుగో నీకు పుట్టబోయే వొక
కుమారుడు నెమ్మది గలవాడై వుండును; చుట్టున్న వుండే
అతని శత్రువులనందరినిన్ని నేను తోలివేసి అతనికి
నెమ్మది యిత్తును, యేమంటే అతనికి సొలొమోను
అనే పేరు కలుగును. అతని దినముల యందు ఇశ్రా
యేలుకు సమాధానమునున్ను విశ్రాంతినిన్ని దయ
10 చేతును. । అతడు నా పేరట వొక యిల్లు కట్టించును;
అతడు నాకు కుమారుడై వుండును, నేను అతనికి తం
డ్రిని అయి వుందును; ఇశ్రాయేలు మీద అతని రాజ్య
సింహాసనమును యెన్నటికిన్ని స్థిరపరతును అని యె
11 హోవా చెప్పెను. । యిప్పుడు నా కుమారుడా,
యెహోవా నీతో కూడా వుండును గాక; నీవు
వృద్ధిని పొంది, నీ పరాత్పరుడైన యెహోవా నిన్ను
గురించి చెప్పిన ప్రకారముగా నీవు ఆయనయొక్క
12 యిల్లు కట్టింతువుగాక. । యెహోవా నీకు వివేకము
నున్ను తెలివినిన్ని యిచ్చి, నీ పరాత్పరుడైన యెహో
వాయొక్క న్యాయ ప్రమాణమును గైకొనేటట్టుగా
ఇశ్రాయేలును గురించి నీకు అధికారము దయచేయును
13 గాక. । యెహోవా ఇశ్రాయేలును గురించి మోషేకు
యిచ్చిన కట్టడల ప్రకారముగానున్ను న్యాయముల
ప్రకారముగానున్ను చేయుటకు నీవు జాగ్రతగా
వుంటే అప్పుడు నీవు వృద్ధిని పొందుదువు; బలముగా
నున్ను ధైర్యముగానున్ను వుండుము; భయపడకను
14 న్ను దిగులుపడకనున్ను వుండుము. । యిదుగో నేను
నా యిబ్బందిలో యెహోవా యింటి నిమిత్తము
వొక లక్ష తలాంతుల బంగారమునున్ను పది లక్షల
తలాంతుల వెండినిన్ని తూచ శక్యము కాని విస్తార
మైన యిత్తడినిన్ని యినుమునున్ను కూర్చి వున్నాను; మా
నులనున్ను రాళ్లనున్ను కూర్చి వుంచితిని; నీవు యింకా
వాటికంటే అధికముగా సంపాదించి వుందువు గాక. ।
15 మరిన్ని పని చేయ తగిన విస్తారమైన శిల్పి కారులున్ను
కాసె వాండ్లున్ను వడ్ల వాండ్లున్ను నానా విధములైన
పనులకు అనేక తరహాలయిన మంచి పనివాండ్లున్ను
16 నీతో కూడా వున్నారు. । బంగారమునకున్ను వెండి
కిన్ని ఇత్తడికిన్ని యినుముకున్ను లెక్క లేదు; కాబట్టి
లేచి, కార్యము నడుపుము; యెహోవా నీతో కూడా
వుండును గాక అని చెప్పెను. । అది గాక తన కుమా 17
రుడైన సొలొమోనుకు సహాయము చేయుమని దావీదు
ఇశ్రాయేలుయొక్క ప్రభువులందరికిన్ని ఆజ్ఞాపించిన
దేమంటే, । మీ పరాత్పరుడైన యెహోవా మీతో 18
కూడా వున్నాడు కాడా? చుట్టూ వున్న వాండ్లవల్లను
ఆయన మీకు నెమ్మది యివ్వలేదా? యేమంటే దేశము
యొక్క కాపురస్థులను ఆయన నా చేతికి యిచ్చి
వున్నాడు; యెహోవా ముందరనున్ను ఆయన జనుల
ముందరనున్ను దేశము లోపరచబడి వున్నది. । యిప్పుడు 19
మీరు మీ హృదయమునున్ను మీ ఆత్మనున్ను మీ
పరాత్పరుడైన యెహోవాను వెతికేటందుకు సిద్ధపర
చండి; కాబట్టి యెహోవా వొడంబడికెయొక్క పెట్టె
నున్ను పరాత్పరుని పరిశుద్ధ వస్తువులనున్ను యెహో
వా పేరట కట్టబడే ఆ యింట్లోకి కొంచపోయేటం
దుకు మీరు లేచి, పరాత్పరుడైన యెహోవాయొక్క
పరిశుద్ధ స్థలము కట్టండి అని చెప్పెను.

## 23. అధ్యాయము.

దావీదు ముసలివాడున్ను పరిపూర్ణ వయస్సు 1
గలవాడున్ను అయి యున్నప్పుడు అతడు తన కుమా
రుడయిన సొలొమోనును ఇశ్రాయేలుమీద రాజును
చేసెను. । మరిన్ని అతడు ఇశ్రాయేలుయొక్క యా 2
వత్తు ప్రభువులనున్ను అర్చకులనున్ను లేవీయులను
న్ను కూర్చుకొనెను. । లేవీయులు అప్పుడు ముప్పయి 3
సంవత్సరములు మొదలుకొని అంతకు పై యీడు గల
వారుగా యెంచబడిరి; వారి లెక్క తలల ప్రకారము
ముప్పయి యెనిమిది వేల పురుషులు. । వీరిలో యిరువై 4
నాలుగువేల మంది యెహోవా యింటి పని విచా
రించే వారున్ను ఆరువేల మంది అధిపతులున్ను న్యా
యాధిపతులున్ను అయి వుండిరి. । నాలుగువేల మంది 5
ద్వారపాలకులై వుండిరి; యింకా నాలుగువేల మంది
స్తుతించుటకు దావీదు చేయించిన వాద్య విశేషముల
తోను యెహోవాను స్తుతించేవారై యుండిరి. ।
గేర్షోను కెహాతు మెరారీ అనే లేవీ పుత్రులైన 6
వారిలో దావీదు వారిని వరసలుగా విభాగించెను. ।
గేర్షోనీయులలో లద్దాను, షిమీ, అనే వారు వుం 7
డిరి. । లద్దాను కుమాళ్లు యెహీయేలు, అనే పెద్దవా 8
డున్ను, జేతామున్ను, యోవేలున్ను, అనే ముగ్గురు. ।
షిమీ కుమాళ్లు షెలోమీతు, హజీయేలు, హారాను, అనే 9
ముగ్గురు; వీరు లద్దాను వంశముయొక్క పితృల అధిపతు
లై వుండిరి. । యహతు, జీనా, యెవూషు, బెరీయా, 10
అనే నలుగురున్ను షిమోను కుమాళ్లు అయి వుండిరి. ।

11 యహాతు పెద్దవాడు అయి వుండెను,జీజా రెండో కుమా
రుడై వుండెను; అయితే యెవూషుకున్ను, బెరీయాకు
న్ను అనేకులైన కుమారులు లేనందున వారి పితృల
యింటివారిలో వారు వొక్క వంశము యెంచబడిరి. ।
12 కెహాతు కుమాళ్లు అమ్రాము, ఇస్హారు, హెబ్రోను,
13 ఉజ్జీయేలు, అనే నలుగురు. । అమ్రాము కుమాళ్లు అహ
రోను, మోషే, అనేవారు; అయితే అహరోనున్ను
అతని కుమాళ్లున్ను యెన్నటికిన్ని అతి పరిశుద్ధమైన
వస్తువులను పరిశుద్ధపరచుటకున్ను యెహోవా ముం
దర ధూపము వేసుటకున్ను ఆయనను సేవించుటకున్ను
ఆయన పేరట యెన్నటికిన్ని ఆశీర్వాదము యిచ్చేటం
14 దుకున్ను కేటాయించపడినారు. । పరాత్పరుని మను
ష్యుడైన మోషేను గురించినదేమంటే, అతని కుమాళ్లు
15 లేవీ గోత్రపు వారిలో యెంచపడిరి.। మోషే కుమాళ్లు
16 గేర్షోము, ఎలీయెజెరు, అనే వారు. । గేర్షోము
కుమారులలో షెబూయేలు పెద్దవాడై వుండెను. ।
17 ఎలీయెజెరు కుమారులలో రెహబ్యా అనే పెద్దవాడు:
ఎలీయెజెరుకు యింకా కుమారులు వుండలేదు, అయితే
18 రెహబ్యా కుమారులు అనేకముగా వుండిరి. ।ఇస్హారు
కుమారులలో షెలోమీతు పెద్దవాడయి వుండెను. ।
19 హెబ్రోను కుమారులలో యెరీయా అనే పెద్దవాడున్ను
అమర్యా అనే రెండో వాడున్ను యహజీయేలు అనే
మూడో వాడున్ను యెకమాము అనే నాలుగో వా
20 డున్ను. । ఉజ్జీయేలు కుమారులలో మీఖా అనే పెద్ద
21 వాడున్ను యెషీయా అనే రెండో వాడున్ను. । మె
రారీ కుమారులు మహ్లీ, మూషి, అనే వారు; మహ్లీ
22 కుమారులు ఎలాజారు, కీషు అనేవారు. । ఎలాజారు
చచ్చేటప్పుడు వానికి కుమార్తెలే గాని కుమారులు
కలిగి వుండలేదు, వీరిని కీషు కుమారులైన వీరి సహో
23 దరులు వివాహము చేసుకొనిరి. । మూషి కుమారులు
24 మహ్లీ, ఏదెరు, యెరేమోతు, అనే ముగ్గురు. । వీరు తమ
పితృల యింటివారి ప్రకారముగా లేవీ పుత్రులై యుం
డిరి; పితృల పెద్దలైన వీరు యిరువై సంవత్సరములు
మొదలుకొని అంతకు పై యీడు గలవారై, తమ తమ
తలల చొప్పున తమ తమ పేరుల లెక్క ప్రకారము
యెంచబడి, యెహోవా యింటి సేవయొక్క పనిని
25 చేసేవారు. । యేమంటే ఇశ్రాయేలు పరాత్పరుడైన
యెహోవా తన జనులకు నెమ్మది దయచేసి వున్నాడు,
వారు యెన్నటికిన్ని యెరూశలేములో నివాసము
26 చేతురు అనిన్ని; । మరిన్ని లేవీయులకు కూడా ఆలా
గున యిచ్చి వున్నాడు, వారు యికమీదట నివాస
స్థలమునైనా దాని సేవ కొరకైన దాని వస్తువులనైనా
27 మోయ కూడదు అనిన్ని దావీదు చెప్పెను.। యేమంటే
దావీదు కడవరి మాటల ప్రకారము లేవీ పుత్రులు
యిరువై సంవత్సరములు మొదలుకొని అంతకు పై
యీడు గలవారుగా యెంచపడిరి. । యెందుకంటే 28
అహరోను కుమారుల చేతికింద యెహోవా యింటి
పని కొరకు సాలలోనున్ను గదులలోనున్ను యావత్తు
పరిశుద్ధ వస్తువులను శుద్ధి చేయుటకున్ను పరాత్పరుని
యింటి సేవయొక్క పనిని విచారించుటకున్ను, । సము 29
ఖపు రొట్టెనున్ను కానుకకు సన్నపు పిండినిన్ని పు
లుసు లేని అరిసెలనున్ను పెనములో కాల్చే దాన్నిన్ని
పేల్చే దాన్నిన్ని నానా విధమైన ప్రమాణమునున్ను
కొలతనున్ను విచారించేటందుకున్ను; । మరిన్ని ప్రతి 30
దినము వుదయమందున్ను ఆ ప్రకారమే సాయంత్ర
మందున్ను యెహోవాను కొనియాడి స్తుతి చేసి,
సబ్బాతు దినముల యందున్ను అమావాస్యల యందు
న్ను పండుగల యందున్ను యెహోవాకు దహన
బలులను చెల్లించపడే యావత్తు వేళయందు లెక్కకు
తగినవాండ్లు తమ న్యాయ ప్రకారమును యెప్పుడున్ను
చేసేటందుకున్ను యెహోవా ముందర నిలిచేటందుకు
న్ను;। ఆచరింపు గుడారపు కావలినిన్ని పరిశుద్ధ స్థలము 31
యొక్క కావలినిన్ని యెహోవా యింటి సేవలో
తమ సహోదరులైన అహరోను కుమారుల కావలినిన్ని
చూచేటందుకున్ను వారు నియమించబడి యుండిరి.

## 24. అధ్యాయము.

అహరోను పుత్రుల విభాగములు యేవంటే, అహ 1
రోను కుమారులు నాదాబు, అబీహూ, ఎలాజారు,
ఈతామారు, అనేవారు. । అయితే నాదాబున్ను అబీ 2
హూయున్ను తమ తండ్రికంటే ముందుగా సంతతి
లేకుండా చనిపోయినందుచేత ఎలాజారున్ను ఈతా
మారున్ను అర్చకుని సేవ చేసిరి. । దావీదు ఎలీయెజరు 3
పుత్రులలో సాదోకు అనే వానినిన్ని ఈతామారు
పుత్రులలో అహీమెలెఖు అనే వానినిన్ని వారి వారి
సేవకావృత్తి మర్యాదల చొప్పున విభజించెను.। వారు 4
వారు విభజించబడినప్పుడు ఈతామారు పుత్రుల కం
టేను ఎలాజారు పుత్రులలో అధికమైన పెద్దవాండ్ల
యిన పురుషులు కనుపడినందున ఎలాజారు పుత్రుల
లో పదహారుగురు తమ పితృల యింటివారికిన్ని ఈతా
మారు పుత్రులలో యెనమండ్రు తమ పితృల యింటి
వారికిన్ని పెద్దలుగా వుంచబడిరి. । ఎలాజారు పుత్రు 5
లున్ను ఈతామారు పుత్రులున్ను పరిశుద్ధ స్థలముయొ
క్క అధికారులుగానున్ను పరాత్పరుని యింటియొక్క
అధిపతులుగానున్ను వుండేటట్టుగా తెగ తెగలుగా
వుంచబడిరి.. । లేవీయులలో సంప్రతి అయిన షెమ 6
యా అనే నెతన్యేలు కుమారుడు వారిని రాజు ముం
దరనున్ను ప్రభువుల ముందరనున్ను అర్చకుడయిన

సాదోకు ముందరనున్ను అబ్యాతారు కుమారుడైన అహీ
మెలెఖు ముందరనున్ను అర్చకులున్ను లేవీయులున్ను
అయిన పితృల అధిపతుల ముందరనున్ను వివరించెను;
వొక పితృని యింటి చీటి ఎలాజారు నిమిత్తమున్ను
యింకొకటి ఈతామారు నిమిత్తమున్ను తియ్యబడెను.।
7 అయితే మొదటి చీటి యెహోయారీబుకు కలిగెను,
8 రెండోది యెదాయాకు,। మూడోది హారీముకు, నాలు
9 గోది శెయొరీముకు,। అయిదోది మల్కీయాకు, ఆరోది
10 మీయామీనుకు,। యేడోది హక్కోస్సుకు, యెనిమి
11 దోది అబీయాకు,। తొమ్మిదోది యేషూవకు, పదోది
12 షెకన్యాకు,। పదకొండోది ఎల్యాషీబుకు, పండ్రెం
13 డోది యాకీముకు,। పదమూడోది హుప్పాకు, పదు
14 నాలుగోది యెషెబాబుకు,। పదిహేనోది బిల్గాకు,
15 పదహారోది ఇమ్మెరుకు,। పదిహేడోది హెజీరుకు,
16 పద్ధెనిమిదోది పిస్సేసుకు,। పందొమ్మిదోది పెతహ్యాకు,
17 యిరువైయోది యెహెజ్కేలుకు,। యిరువై వొకటోది
18 యాఖీనుకు, యిరువయి రెండోది గమూలుకు,। యిరువై
మూడోది దెలాయ్యాకు, యిరువై నాలుగోది మయ
19 జ్యాకు కలిగెను.। ఇశ్రాయేలుయొక్క పరాత్పరుడైన
యెహూవా వారి తండ్రియైన అహరోనుకు ఆజ్ఞా
పించిన ప్రకారమే వారు అతని కట్టడ ప్రకారముగా
తమ పద్ధతి చొప్పున యెహూవా యింట్లోకి ప్రవే
శించి తమ తమ సేవకావృత్తి నిమిత్తము చేయబడ్డ
20 విభజనలు యివే.। లేవీయొక్క కొదువ పుత్రులలో
వుండే వారెవరంటే, అమ్రాము పుత్రులలో షూబా
యేలున్ను, షూబాయేలు కుమారులలో యెహ్దెయాహు
21 న్ను,। రెహబ్యాను గురించినదేమంటే, యీ రెహబ్యా
22 కుమారులలో పెద్దవాడైన ఇష్షీయాయున్ను;। ఇస్హారీ
యులలో షెలోమోతున్ను; షెలోమోతు కుమారుల
23 లో యహతున్ను.। హెబ్రోను కుమారులలో పెద్ద
వాడైన యెరీయా, రెండో వాడైన అమర్యా, మూడో
వాడైన యహజీయేలు, నాలుగో వాడైన యెకమాము.।
24 ఉజ్జీయేలు పుత్రులలో మీఖాయున్ను; మీఖా కుమా
25 రులలో షామీరున్ను.। ఇష్షీయా మీఖా సహోద
రుడై వుండెను; ఇష్షీయా కుమారులలో జెఖర్యా.।
26 మెరారీ కుమారులు మహ్లీ, మూషి, అనేవారు; యహ
27 జీయాహు కుమారులలో బెనో అనే వొకడు.। యహ
జీయాహువల్ల మెరారీకి కలిగిన కుమారులు యెవరం
టే, బెనో, షోహము, జక్కూరు, ఇబ్రీ, అనేవారు.।
28 మహ్లీకి ఎలాజారు కలిగెను; వీనికి పుత్రులు లేరు.।
29 కీషును గురించినదేమంటే, యీ కీషు కుమారుడు యెర
30 హ్మెయేలు.। మూషి కుమారులు మహ్లీ, ఏదెరు, యెరీ
మోతు, అనేవారు. వీరు తమ పితృల యిండ్ల ప్రకా
31 రము లేవీయుల పుత్రులు అయి వుండిరి.। వీరున్ను
రాజు అయిన దావీదు ముందరనున్ను సాదోకున్ను
అహీమెలెఖున్ను అర్చకులలోనున్ను లేవీయులలో
నున్ను పితృలై వుండే పెద్దల ముందరనున్ను తమ
సహోదరులైన అహరోను పుత్రులు చేసినట్టుగాను
తమలో వుండే పితృలయిన పెద్దలకున్ను వారి చిన్న
సహోదరులకున్ను చీట్లు వేసుకొనిరి.

## 25. అధ్యాయము.

మరిన్ని వీణెలతోనున్ను కిన్నెరలతోనున్ను తాళ 1
ములతోనున్ను దీర్ఘదర్శనము చెప్పుటకు ఆసాపు
హేమాను యెదూతూను అనే వాండ్ల కుమారులలో
కొందరిని దావీదున్ను సైన్యాధిపతులున్ను సేవ నిమి
త్తము కేటాయించి వుంచినారు; తమ సేవకావృత్తికి
నియమించపడిన మనుష్యుల లెక్క యేదంటే,। ఆసాపు 2
కుమారులలో రాజు ఆజ్ఞా ప్రకారముగా దీర్ఘదర్శ
నము చెప్పిన ఆసాపు చేతి కింద వుండే ఆసాపు కుమా
రులు జక్కూరు, యోసేపు, నెతన్యా, అషరేలా, అనే
వారున్ను.। యెదూతూను సంబంధులలో యెహూ 3
వాను కొనియాడి స్తుతించుటకు వీణెతో దీర్ఘదర్శ
నము చెప్పే తమ తండ్రియైన యెదూతూను చేతికింద
వున్న యెదూతూను కుమారులయిన గెదల్యా, సెరీ,
యెషయ్యా, హషబ్యా, మత్తిత్యా అనే ఆరుగురున్ను.।
హేమాను సంబంధులలో హేమాను కుమారులయిన 4
బుక్కీయాహు, మత్తన్యా, ఉజ్జీయేలు, షెబూయేలు,
యెరీమోతు, హనన్యా, హనానీ, ఎలీయ్యాతా, గిద్దల్తి,
రోమమ్తీయెజెరు, యొష్బెకాషా, మల్లోతి, హోతీరు,
మహజీయోతు, అనేవారు.। కొమ్ము వూదుటకు వీరం 5
దరున్ను పరాత్పరుని మాటలలో రాజుయొక్క జ్ఞాన
దృష్టి కలవాడైన హేమానుయొక్క కుమారులై వుం
డిరి. పరాత్పరుడు హేమానుకు పదునలుగురు కుమా
ళ్లనున్ను ముగ్గురు కుమార్తెలనున్ను యిచ్చి వుండెను.।
వీరందరున్ను ఆసాపుకున్ను యెదూతూనుకున్ను హే 6
మానుకున్ను కలిగిన రాజు కట్టడ ప్రకారముగా యె
హూవా యింట్లో గానము కొరకు తాళములతోనున్ను
కిన్నెరలతోనున్ను వీణెలతోనున్ను పరాత్పరుని యింటి
సేవ కొరకు తమ తండ్రుల చేతికింద వుండిరి.। యీ 7
లాగున యెహూవా గానములలో నేర్పు పొంది గట్టి
వాండ్లయిన తమ సహోదరులతో కూడా వున్న వారి
లెక్క యిన్నూట యెనభయి యెనిమిది మంది అయి
వుండెను.। వారు చిన్నవాడున్ను పెద్దవాడున్ను నేర్పే 8
వాడున్ను నేర్చుకొనేవాడున్ను సమానముగా వంతు
ప్రకారముగా చీట్లు వేసుకొనిరి.। మొదటి చీటి ఆ 9
సాపు వశమైన యోసేపుకు బైలు వచ్చెను; రెండోది
గెదల్యాకు, వీడున్ను వీని సహోదరులున్ను కుమారు

10 లున్ను పండ్రెండుగురు అయి వుండిరి. । మూడోది
జక్కూరునకు, వీడున్ను వీని కుమారులున్ను సహో
11 దరులున్ను పండ్రెండుగురు. । నాలుగోది ఇస్రీకి, వీడు
న్ను వీని కుమారులున్ను సహోదరులున్ను పండ్రెండు
12 గురు. । అయిదోది నెతన్యాకు, వీడున్ను వీని కుమారు
13 లున్ను సహోదరులున్ను పండ్రెండుగురు. । ఆరోది బు
క్కీయాహునకు, వీడున్ను వీని కుమారులున్ను సహోద
14 రులున్ను పండ్రెండుగురు. । యేడోది యెషరేలాకు, వీడు
న్ను వీని కుమారులున్ను సహోదరులున్ను పండ్రెండు
15 గురు. । యెనిమిదోది యెషయ్యాకు, వీడున్ను వీని కుమా
16 రులున్ను సహోదరులున్ను పండ్రెండుగురు. । తొమ్మి
దోది మత్తన్యాకు, వీడున్ను వీని కుమారులున్ను సహో
17 దరులున్ను పండ్రెండుగురు. । పదోది షిమీకి, వీడు
న్ను వీని కుమారులున్ను సహోదరులున్ను పండ్రెం
18 డుగురు. । పదకొండోది అజరేలుకు, వీడున్ను వీని
కుమారులున్ను సహోదరులున్ను పండ్రెండుగురు. ।
19 పండ్రెండోది హషబ్యాకు, వీడున్ను వీని కుమారు
20 లున్ను సహోదరులున్ను పండ్రెండుగురు. । పదమూ
డోది షూబాయేలుకు, వీడున్ను వీని కుమారులున్ను
21 సహోదరులున్ను పండ్రెండుగురు. । పద్నాలుగోది
మత్తిత్యాకు, వీడున్ను వీని కుమారులున్ను సహోద
22 రులున్ను పండ్రెండుగురు. । పదిహేనోది యెరేమో
తుకు, వీడున్ను వీని కుమారులున్ను సహోదరులున్ను
23 పండ్రెండుగురు. । పదహారోది హనన్యాకు, వీడున్ను
వీని కుమారులున్ను సహోదరులున్ను పండ్రెండు
24 గురు. । పదిహేడోది యెష్బెకాషాకు, వీడున్ను వీని
కుమారులున్ను సహోదరులున్ను పండ్రెండుగురు. ।
25 పద్దెనిమిదోది హనానీకి, వీడున్ను వీని కుమారులున్ను
26 సహోదరులున్ను పండ్రెండుగురు. । పందొమ్మిదోది
మల్లోతీకి, వీడున్ను వీని కుమారులున్ను సహోదరు
27 లున్ను పండ్రెండుగురు. । యిరువైయ్యోది ఎలీయ్యా
తాకు, వీడున్ను వీని కుమారులున్ను సహోదరులున్ను
28 పండ్రెండుగురు. । యిరువై వొకటోది హోతీరుకు,
వీడున్ను వీని కుమారులున్ను సహోదరులున్ను పం
29 డ్రెండుగురు. । యిరువై రెండోది గిద్దల్తికి, వీడున్ను వీని
కుమారులున్ను సహోదరులున్ను పండ్రెండుగురు. ।
30 యిరువై మూడోది మహజీయోతుకు, వీడున్ను వీని
కుమారులున్ను సహోదరులున్ను పండ్రెండుగురు. ।
31 యిరువై నాలుగోది రోమమ్తీయెజెరుకు, వీడున్ను వీని
కుమారులున్ను సహోదరులున్ను పండ్రెండుగురు.

## 26. అధ్యాయము.

1 ద్వారపాలకుల విభాగమును గురించినదేమంటే,
కొర్హీయుల వంశమైన ఆసాపు పుత్రులలో కోరే
కుమారుడైన మెషెలెమ్యా అనేవాడు. । మెషెలెమ్యా 2
కుమారులు యెవరంటే, జెకర్యా అనే పెద్దవాడున్ను,
యెడీయవేలు అనే రెండోవాడున్ను, జెబద్యా అనే
మూడోవాడున్ను, యత్నీయేలు అనే నాలుగోవా
డున్ను, । ఏలాము అనే అయిదోవాడున్ను, యెహో 3
హనాను అనే ఆరోవాడున్ను, ఎల్యోయేనై అనే
యేడోవాడున్ను. । ఓబేదెదోము కుమారులు యెవ 4
రంటే, షెమయా అనే పెద్దవాడున్ను, యెహోజా
బాదు అనే రెండోవాడున్ను, యోవాహు అనే
మూడోవాడున్ను, సాఖారు అనే నాలుగోవాడున్ను,
నెతనేలు అనే అయిదోవాడున్ను, । అమ్మీయేలు 5
అనే ఆరోవాడున్ను, ఇశ్శాఖారు అనే యేడోవా
డున్ను, పెయుల్లెతై అనే యెనిమిదోవాడున్ను;
యేమంటే పరాత్పరుడు వాని ఆశీర్వదించి వుండెను. ।
వాని కుమారుడైన షెమయాకున్ను కుమాళ్లు పుట్టిరి; 6
వీరు తమ తండ్రి యింటివారిని యేలినారు, యేమంటే
వారు పరాక్రమశాలులై వుండిరి. । షెమయాయొక్క 7
కుమాళ్లు ఒత్నిన్ని, రెఫాయేలున్ను, ఓబేదున్ను, ఎల్జా
బాదున్ను, బలాఢ్యులైన ఎలీహు, సెమక్యా, అనే
వాని సహోదరులున్ను. । ఓబేదెదోముయొక్క పుత్రు 8
లైన వీరున్ను వీరి కుమాళ్లున్ను వీరి సహోదరులున్ను
సేవకు బలాఢ్యులై అరువై యిద్దరు మంది అయి వుం
డిరి. । మెషెలెమ్యాకు కలిగిన కుమాళ్లున్ను సహోదరు 9
లున్ను అయిన పరాక్రమశాలులు పద్దెనిమిది మంది. ।
మెరారీ పుత్రులలో హోసా అనే వానికిన్ని 10
పుత్రులు కలిగి వుండిరి, యెవరంటే షిమ్రీ అనే
ప్రముఖుడు, (వీడు పెద్దవాడై వుండక పోయినా
వాని తండ్రి వాని ప్రముఖునిగా చేసెను;) । హిల్కీ 11
యా అనే రెండోవాడున్ను, టెబల్యాహు అనే
మూడోవాడున్ను, జెకర్యా అనే నాలుగోవాడున్ను;
హోసాయొక్క కుమాళ్లున్ను సహోదరులందరున్ను
పదముగ్గురు. । యెహోవా యింటిలో వంతుల ప్రకా 12
రముగా సేవ చేయుటకు వీరి సంబంధమైన ముఖ్యమైన
వారిలో ద్వారపాలకులయొక్క విభాగములు కలిగి
వుండెను. । తమ పితృల యింటివారైన చిన్నవాండ్లున్ను 13
పెద్దవాండ్లున్ను కూడా వొక్కొక్క ద్వారమునకు
చీట్లు వేసుకొనిరి. । తూర్పు తట్టుకు షెలెమ్యాకు చీటి 14
కలిగెను; తరువాత వివేకముగల ఆలోచన కర్త అయిన
జెకర్యా అనే వాని కుమారునికి చీటి వేసినప్పుడు
ఉత్తరపు తట్టుకైన చీటి వానికి కలిగెను. । ఓబేదెదో 15
ముకు దక్షిణపు వైపున్ను వాని కుమాళ్లకు అసుప్పీము
యిల్లున్ను కలిగెను. । షుప్పీమునకున్ను హోసాకున్ను 16
పడమట తట్టున్ను వేసి యెత్తు చేయబడిన త్రోవయున్ను షల్లె
ఖెతు ద్వారమున్ను పడమట తట్టున్ను గల చీటి కలి

17 గెను. । తూర్పున లేవీయులైన ఆరుగురున్ను వుత్తర
మున పగటి వేళ నలుగురున్ను దక్షిణమున పగటి వేళ
నలుగురున్ను అసుప్పీము యొద్దను యిద్దరిద్దరున్ను. ।
18 బయిట ద్వారము పెద్దను పడమటవుండే యెత్తయిన
త్రోవకు నలుగురున్ను వెలపటి త్రోవ యందు యిద్ద
19 రున్ను వుండేవారు. । కోరహు పుత్రులలోనున్ను
మెరారీ పుత్రులలోనున్ను ద్వారము కనిపెట్టే వారి
20 యొక్క విభజన యిదే. । కొదువ లేవీయులలో అహీ
యా అనేవాడు పరాత్పరుని యింటి బొక్కసము
నున్ను పరిశుద్ధము చేయబడిన వస్తువుల బొక్కసముల
21 నున్ను విచారించేవాడై వుండెను. । లద్దాను కుమాళ్లు
యెవరంటే, గేర్షోనీయుడైన లద్దాను కుమాళ్లయిన
పితృల అధిపతులై వున్న వారిలో యెహీయేలీ. ।
22 యెహీయేలీ కుమాళ్లయిన జేతామున్ను వాని సహో
దరుడైన యోవేలున్ను యెహోవా యింటి బొక్క
23 సములను విచారించే వారై వుండిరి. । అమ్రామీయుల
లోనున్ను ఇస్హారీయులలోనున్ను హెబ్రోనీయులలో
నున్ను ఉజ్జీయేలీయులలోనున్ను కొందరు ఆలాగే
24 వుండిరి. । మోషే కుమారుడైన గేర్షోముకు పుట్టిన
షెబూయేలు బొక్కసము మీద ప్రధాని అయి
25 వుండెను. । ఎలీయెజరు సంబంధమైన వాని సహో
దరులైన వాండ్లున్ను, వీని కుమారుడైన రెహబ్యా
యున్ను, వీని కుమారుడైన యెషయ్యాయున్ను, వీని
కుమారుడైన యెహోరామున్ను, వీని కుమారుడైన
జిఖ్రీయున్ను, వీని కుమారుడైన షెలోమీతున్ను. ।
26 రాజు అయిన దావీదున్ను సహస్రాధిపతులున్ను శతా
ధిపతులున్ను అయిన పితృల అధిపతులున్ను సైన్యాధి
పతులున్ను యుద్ధములలో పట్టుకొనిన కొల్ల వస్తువుల
27 నున్ను, । యెహోవా యిల్లు బలము చేసే కొరకు
పరిశుద్ధము చేసిన ద్రవ్యములయొక్క బొక్కసముల
నున్ను షెలోమీతున్ను వాని సహోదరులున్ను
28 విచారించినారు. । జ్ఞాన దృష్టి పురుషుడైన సమూయే
లున్ను కీషు కుమారుడైన సౌలున్ను నేరు కుమారుడైన
అబ్నేరున్ను సెరూయా కుమారుడైన యోవాబున్ను
పరిశుద్ధము చేసిన అంతానున్ను షెలోమీతు చేతి
కిందనున్ను వాని సహోదరుల చేతి కిందనున్ను
29 వుండెను. । ఇస్హారీయులలో కెనన్యాయున్ను వాని
కుమాళ్లున్ను బయిట పనికి వుంచబడి, ఇశ్రాయేలు
మీద పారపత్యకాండ్లున్ను న్యాయాధిపతులున్ను
30 అయి వుండిరి. । హెబ్రోనీయులలో హషబ్యా
యున్ను వాని సహోదరులున్ను అయిన వెయ్యిన్ని
యేడునూరు పరాక్రమశాలులు యర్దాను యీవల
పడమట వైపున వుండే ఇశ్రాయేలు మీద యెహో
వాయొక్క యావత్తు పనికిన్ని రాజు సేవకావృత్తికిన్ని
వుంచబడినారు. । హెబ్రోనీయులలో యెరీయా వుం 31
డెను, వాడు తన పితృల వంశములైన హెబ్రోనీయు
లలో అధిపతి అయినవాడు. దావీదు యేలుబడి
యొక్క నలుబైయ్యో సంవత్సరమందు వారు వెతుక
బడి వారిలో గిలాదు దేశ సంబంధమైన యజేరు
యందు బలమైన మనుష్యులు దొరకబడినారు. । బలి 32
ష్ఠులైన వాని సహోదరులు రెండు వేల యేడు
నూరు మంది ముఖ్యమైన అధిపతులు అయి వుండిరి;
వారిని దావీదు రాజు పరాత్పరుని యావత్తు కార్య
ముల నిమిత్తమున్ను రాజు కార్యముల నిమిత్తమున్ను
రూబేనీయుల మీదనున్ను గాదీయుల మీదనున్ను
మనస్సే అర్ధ గోత్రము మీదనున్ను వుంచెను.

## 27. అధ్యాయము.

తమ లెక్క ప్రకారముగా వుండే ఇశ్రాయేలు 1
పుత్రులు, అనగా, ముఖ్య పితృలున్ను సహస్రాధి
పతులున్ను శతాధిపతులున్ను సంవత్సరపు నెలలన్ని
టిలో వొక్కొక్క నెలకు లోపలికి వస్తూ బయిటికి
వెళ్లుతూ తమ భాగములలో రాజుకు యే పనిని గురిం
చియైనా సేవ చేస్తూ వుండే వారి అధిపతులున్ను
వొక్కొక్క భాగము చొప్పున యిరువై నాలుగు వేల
మంది అయి వుండిరి. । మొదటి నెలకు మొదటి 2
భాగము మీద జబ్దీయేలు కుమారుడైన యాషోబాము
వుండెను; వాని భాగములో యిరువై నాలుగు వేల
మంది వుండిరి. । పెరెస్సు సంతతి అయిన వొకడు 3
మొదటి నెలకు వున్న సైన్యాధిపతులందరికి ముఖ్యుడై
వుండెను. । రెండో నెలయొక్క భాగము మీద 4
అహోహీయుడైన దోదై వుండెను; వీని భాగమందు
మిక్లోతున్ను అధిపతి అయి వుండెను; వీని భాగములో
యిరువై నాలుగు వేల మంది వుండిరి. । మూడో నెలకు 5
యెహోయాదా కుమారుడున్ను ప్రధానాచార్యు
డున్ను అయిన బెనాయ్యా మూడో అధిపతి అయి
వుండెను; వీని భాగములో యిరువై నాలుగు వేల
మంది వుండిరి. । యీ బెనాయ్యా ఆ ముప్పయి మంది 6
పరాక్రమ శాలులలో వొకడున్ను ఆ ముప్పయి
మందికి అధిపతిన్ని అయి వుండెను; వీని భాగమందు
తన కుమారుడైన అమ్మీజాబాదు వుండెను. । నాలుగో 7
నెలకు యోవాబు సహోదరుడైన అశాహేలు
నాలుగో అధిపతి అయి వుండెను; వాని తరువాత
వాని కుమారుడైన జెబద్యా వుండెను; వాని భాగ
ములో యిరువై నాలుగు వేల మంది వుండిరి. । అయిదో 8
నెలకు ఇస్రాహీయుడైన షమ్హూతు అయిదో అధిపతి
అయి వుండెను; వాని భాగములో యిరువై నాలుగు
వేల మంది వుండిరి. । ఆరో నెలకు తెకోవీయుడైన 9

ఇక్కెషుకు పుట్టిన ఈరా ఆరో అధిపతి అయి
వుండెను; వాని భాగములో యిరువై నాలుగు వేల
10 మంది వుండిరి. । యేడో నెలకు ఎఫ్రయీాము సంతతి
వాడున్ను పెలోనీయుడున్ను అయిన హేలెస్సు
యేడో అధిపతి అయి వుండెను; వాని భాగములో
11 యిరువై నాలుగువేల మంది వుండిరి. । యెనిమిదో
నెలకు జహీాయుల సంబంధుడున్ను హుషాతీయు
డున్ను అయిన సిబ్బెఖయి యెనిమిదో అధిపతి అయి
వుండెను; వాని భాగములో యిరువై నాలుగు వేల
12 మంది వుండిరి. । తొమ్మిదో నెలకు బెన్యామీనీయుల
సంబంధుడున్ను అన్నేతోతీయుడున్ను అయిన అబీ
యెజెరు తొమ్మిదో అధిపతి అయి వుండెను; వాని
భాగములో యిరువై నాలుగువేల మంది వుండిరి. ।
13 పదో నెలకు బహీాయుల సంబంధుడున్ను నెథోఫా
తీయుడున్ను అయిన మహరై పదో అధిపతి అయి
వుండెను; వాని భాగములో యిరువై నాలుగు వేల
14 మంది వుండిరి. । పదకొండో నెలకు ఎఫ్రయీాము
సంతతి వాడున్ను పిరాతోనీయుడున్ను అయిన బేనా
య్యా పదకొండో అధిపతి అయి వుండెను; వాని
భాగములో యిరువై నాలుగువేల మంది వుండిరి. ।
15 పండ్రెండో నెలకు ఒత్నియేలు సంబంధుడున్ను నెథో
ఫాతీయుడున్ను అయిన హెల్దయి పండ్రెండో అధి
పతి అయి వుండెను; వాని భాగములో యిరువై నా
16 లుగువేల మంది వుండిరి. । మరిన్ని ఇశ్రాయేలు గోత్ర
ముల మీాద వున్న వారెవరంటే, జిఖ్రీ కుమారుడైన
ఎలీయెజెరు రూబేనీయులకు అధిపతి అయి వుండెను;
మయఖా కుమారుడయిన షెఫట్యా షిమోనీయులకు;।
17 లేవీయులకు కెమూయేలు కుమారుడైన హషబ్యా;
18 అహరోనీయులకు సాదోకు;। యూదాకు దావీదు
సహోదరులలో వొకడు అయిన ఎలీహు; ఇశ్శాఖా
19 రుకు మిఖాయేలు కుమారుడైన ఒమ్రి;। జెబూలో
నుకు ఓబద్యా కుమారుడైన ఇష్మయా; నఫ్తాలీకి అజ్రీయే
20 లు కుమారుడైన యెరీమోతు;। ఎఫ్రయీాము పుత్రులకు
అజజ్యాహు కుమారుడయిన హోషేయ; మనస్సే
అర్ధ గోత్రమునకు పెదాయా కుమారుడైన యో
21 వేలు;। గిలాదులో వున్న మనస్సే అర్ధ గోత్రమునకు
జెఖర్యా కుమారుడైన ఇద్దో; బెన్యామీనుకు అబ్నేరు
22 కుమారుడైన యహసీయేలు;। దానుకు యెరోహాము
కుమారుడయిన అజరేలు. వీరు ఇశ్రాయేలు గోత్ర
23 ములకు అధిపతులై వుండిరి. । అయితే యిరువై యేండ్లు
మొదలుకొని అంతకు తక్కువ వయస్సుగల వారిని
దావీదు లెక్క చేయకుండా వుండెను, యేమంటే
ఇశ్రాయేలును ఆకాశ నక్షత్రములలాగున హెచ్చింప
24 చేతునని యెహోవా చెప్పి వుండెను. । సెరూయా
కుమారుడైన యోవాబు లెక్కించుటకు ఆరంభించెను
గాని ముగించకుండా పోయెను, యేమంటే అందు
నిమిత్తము ఇశ్రాయేలు మీాద కోపము వచ్చెను; కాబట్టి
లెక్క దావీదు రాజుయొక్క వృత్తాంతములలో వేయ
బడ లేదు. । మరిన్ని రాజు బొక్కసముల మీాద అదీ 25
యేలు కుమారుడైన అజ్మావెతు వుండెను; పొలములలో
నున్ను పట్టణములలోనున్ను గ్రామములలోనున్ను
దుర్గములలోనున్ను వుండే బొక్కసముల మీాద ఉజ్జీ
యా కుమారుడైన యెహోనాతాను వుండెను. । పొల 26
ముయొక్క పని చేసేవారి మీాదనున్ను భూమి దున్నే
వారి మీాదనున్ను కెలూబు కుమారుడయిన ఎజ్రీ
వుండెను. । ద్రాక్ష తోటల మీాద రమాతీయుడైన 27
షిమీా వుండెను; ద్రాక్షతోటల ఆదాయమైన ద్రాక్షా
రసము వుంచే వాటిమీాద షిఫ్మీయుడైన బబ్దీ వుండెను. ।
పల్లపు భూములలో వుండే ఇప్ప చెట్ల మీాదనున్ను 28
బొడ్డ చెట్ల మీాదనున్ను గెదేరీయుడయిన బయల్హా
నాను వుండెను; నూనె వుంచే వాటి మీాద యోవాషు
వుండెను. । షారోనులో మేసే పశువుల మీాద షారోనీ 29
యుడయిన షిత్రయి వుండెను; పల్లపు స్థలములందు
వుండే పశువుల మీాద అద్లయి కుమారుడైన షాఫాథు
వుండెను. । ఒంటెల మీాద ఇష్మాయేలీయుడైన ఓబీలు 30
వుండెను; గాడిదెల మీాద మేరోనోతీయుడైన యె
హ్దెయాహు వుండెను. । గొర్రెల మీాద హగ్రీయుడైన 31
యాజీజు వుండెను. వీరందరున్ను దావీదు రాజుకు
వున్న ఆస్తికి అధిపతులై వుండిరి. । దావీదు పిన తండ్రి 32
అయిన యోనాతాను బుద్ధిగల మనుష్యుడున్ను ఆలో
చనకాడున్ను సంప్రతిన్ని అయి వుండెను; హక్మోనీ
కుమారుడైన యెహీయేలు రాజు కుమాళ్లతో కూడా
వుండెను. । అహీతోఫెలు రాజుకు ఆలోచనకాడై 33
వుండెను; అర్కీయుడయిన హూషై రాజు స్నేహి
తుడై వుండెను. । అహీతోఫెలుకు తరువాత బేనా 34
య్యా కుమారుడైన యెహోయాదాయున్ను అబ్యా
తారున్ను వుండిరి; యోవాబు రాజుయొక్క సేనాధి
పతి అయి వుండెను.

## 28. అధ్యాయము.

గోత్రముల పెద్దలనున్ను రాజును వంతులుగా 1
సేవించే అధిపతులనున్ను సహస్రాధిపతులనున్ను శతా
ధిపతులనున్ను రాజుకున్ను రాజు కుమాళ్లకున్ను కలిగిన
యావత్తు ఆస్తినిన్ని మృగ జీవాలనున్ను విచారించే
అధిపతులనున్ను ఇశ్రాయేలు యావత్తు పెద్దలనున్ను
ప్రధానులనున్ను బలిష్ఠులనున్ను యావత్తు పరాక్రమ
వంతులనున్ను దావీదు యెరూశలేముకు కూర్చెను. ।
అప్పుడు రాజు అయిన దావీదు లేచి కాళ్లమీాద నిలిచి 2

చెప్పినదేమంటే, నా సహోదరులారా, నా జను
లారా, నేను చెప్పేది వినండి; యెహోవా వొడంబ
డికె పెట్టె కొరకున్ను మన పరాత్పరుని పాదపీఠము
కొరకున్ను వొక విశ్రమ గృహమును కట్టించుటకు
నేను నా మనస్సులో తలంచి, ఆ కట్టుపనికి ఆయత్తము
3 చేస్తిని. । అయితే పరాత్పరుడు నాతో నీవు నా పేరట
యిల్లు కట్టించ కూడదు, యేమంటే నీవు యుద్ధపు
4 మనిషివై రక్తమును చిందితివి అని చెప్పెను. । అయిన
ప్పటికిన్ని ఇశ్రాయేలు మీద యెన్నటికిన్ని రాజునై
వుండేటట్టు ఇశ్రాయేలుయొక్క పరాత్పరుడైన యె
హోవా నా తండ్రి యింటివారందరిలోనున్న నన్ను
యేర్పరచుకొనెను, యేమంటే ఆయన యూదానున్ను
యూదా యింట్లో నా తండ్రి యింటినిన్ని యేర్పర
చుకొని నన్ను యావత్తు ఇశ్రాయేలు మీద రాజుగా
చేసేటందుకు నా తండ్రి కుమారులలో నా మీద
5 ప్రియము వుంచెను. । యెహోవా నాకు అనేక కుమా
ళ్లను దయ చేసెను, అయితే ఇశ్రాయేలు పైని యె
హోవా రాజ్య సింహాసనము మీద కూర్చుండేటం
దుకు ఆయన నా యావత్తు కుమారులలోను నా కుమా
రుడైన సాలొమోనును యేర్పరచుకొని నాతో చెప్పిన
6 దేమంటే, । నీ కుమారుడైన సాలొమోనే నా యింటి
నిన్ని నా ప్రాకారములనున్ను కట్టించునుగాక, యే
మంటే అతని నాకు కుమారునిగా యేర్పరచుకొంటిని;
7 నేను అతనికి తండ్రినై వుందును. । మరిన్ని యీ దిన
ములలో నడిచినట్టుగా అతడు నా కట్టడల ప్రకార
మున్ను నా న్యాయముల ప్రకారమున్ను చేయుటకు
నిలకడ గల వాడైతే అతని రాజ్యమును యెన్నటికిన్ని
8 దృఢపరతును అని చెప్పి వున్నాడు. । కాబట్టి మీరు
యెన్నటికిన్ని యీ మంచి దేశమును స్వతంత్రముగా
అనుభవించి, మీ తరువాత మీ పుత్రులకు స్వతంత్ర
ముగా దాని వుంచేటట్టు మీరు మీ పరాత్పరుడయిన
యెహోవా కట్టడలన్నిన్ని గైకొని విచారించండి అని
యెహోవా సభ అయిన ఇశ్రాయేలు యావత్తు దృష్టి
ముందరనున్ను మన పరాత్పరుని చెవులకు ముందరనున్ను
9 మీకు బుద్ధి చెప్పుతూ వున్నాను. । నా కుమారుడవైన
వో సాలొమోనా, నీవు నీ తండ్రియొక్క పరాత్పరుని
యెరిగి, పరిపూర్ణ హృదయముతోనున్ను అనుకూల
మైన మనస్సుతోనున్ను ఆయనను సేవించుము, యేమం
టే యెహోవా సకలమైన హృదయములనున్ను పరి
శోధించి ఆలోచన సంకల్పములన్నిన్ని తెలిసే వాడై
యున్నాడు; నీవు ఆయనను వెతికితే ఆయన నీకు కను
పడుతాడు; నీవు ఆయనను విడచి పెట్టితే ఆయన నిన్ను
10 యెన్నటికిన్ని పరిహరించును. । యిప్పుడు హెచ్చరి
కెగా వుండుము, యేమంటే పరిశుద్ధ స్థలముకొరకు
వొక యిల్లు కట్టించేటందుకు యెహోవా నిన్ను యే
ర్పరచు కొన్నాడు, నీవు ధైర్యము పొంది అది నడి
పించుమని చెప్పెను. । అప్పుడు దావీదు తన కుమారు 11
డైన సాలొమోనుకు మంటపమున్ను అరలున్ను బొక్క
సపు శాలయున్ను మేడలున్ను లోపలి గదులున్ను
కృపాసనపు గదిన్ని అనే వీటియొక్క మచ్చునున్ను, ।
ఆత్మచేత తనకు కట్టడ చేయబడిన ప్రకారము అంతా 12
నున్ను వాడు చేయవలసిన యింటి ప్రాకారములున్ను
పరాత్పరుని యింటి బొక్కసములున్ను పరిశుద్ధము
చేయబడిన వాటి బొక్కసములనున్ను వుంచే యావ
త్తు గదులున్ను వుండే మచ్చునున్ను, । అర్చకులనున్ను 13
లేవీయులనున్ను వరుసలుగా విభజన చేసేటందుకున్ను
యెహోవా యింటి సేవకావృత్తి అంతటికిన్ని యె
హోవా యింటి పని వస్తువులంతటికిన్ని అయిన కట్ట
డనున్ను యిచ్చెను. । అతడు నానా విధమైన పనులకు 14
కావలసిన బంగారపు వస్తువులన్నిటి నిమిత్తము యెత్తు
ప్రకారము బంగారమునున్ను నానా విధమైన పనికి
కావలసిన వెండి వస్తువులన్నిటి నిమిత్తము యెత్తు ప్రకా
రము వెండినిన్ని, । బంగారపు దీపస్తంభములకున్ను 15
వాటి బంగారపు ప్రమిదెలకున్ను వొకొక దీపస్తంభ
మునకున్ను దాని ప్రమిదెలకున్ను యెత్తు ప్రకారము
కావలసినంత బంగారమునున్ను, వెండి దీపస్తంభము
లలో వొకొక దీపస్తంభమునకున్ను దాని ప్రమిదెలకు
న్ను యెత్తు ప్రకారము కావలసినంత వెండినిన్ని, ।
సముఖపు రొట్టెలు వుంచే వొకొక బల్లకు యెత్తు ప్రకా 16
రము కావలసినంత బంగారమునున్ను, వెండి బల్లలకు కా
వలసిన వెండినిన్ని, । ముండ్ల కొంకులకున్ను గిన్నెలకున్ను 17
పాత్రలకున్ను కావలసిన అచ్చ బంగారమునున్ను, బం
గారపు గిన్నెలలో వొకొక గిన్నెకు యెత్తు ప్రకారము
కాబట్టినంత వెండినిన్ని, । ధూప పీఠమునకు యెత్తు 18
ప్రకారము కాబట్టిన పుటము చేయబడిన బంగారమును
న్ను, రెక్కలు విప్పుకొని యెహోవా వొడంబడికె
పెట్టెను కప్పే కెరూబుల వాహనముయొక్క మచ్చుకు
బంగారమునున్ను యిచ్చి, । యీ మచ్చుయొక్క యా 19
వత్తు క్రియలనున్ను యివి అంతానున్ను యెహోవా
నా మీద వున్న తన చేతిచేత వ్రాయించి నాకు తెలియ
చేసెనని చెప్పెను. । మరిన్ని దావీదు తన కుమారుడైన 20
సాలొమోనుకు చెప్పినదేమంటే, నీవు బలమున్ను ధైర్య
మున్ను పొంది యిది నడిపించు; భయపడకుండాను
న్ను వెరవకుండానున్ను వుండు, యేమంటే పరాత్పరు
డైన యెహోవా అనే నా పరాత్పరుడు నీతో కూడా
వుండును; యెహోవా మందిరపు సేవయొక్క పని
యావత్తున్ను నీవు ముగించే మట్టుకున్ను ఆయన నిన్ను
తప్పకనున్ను విడువకనున్ను వుండును. । యిదుగో 21

పరాత్పరుని మందిరపు సేవకంతటికిన్ని లేవీయులయొ
క్క విభాగములు వున్నవి; ఆ యావత్తు క్రియలకున్ను
సకల విధములైన పనికిన్ని జ్ఞానము కల మనఃపూర్వక
మైన యావత్తు మనుష్యులున్ను నీ మాట ప్రకారము
అంతానున్ను వినే ప్రభువులున్ను సకలమైన జను
లున్ను నీ యొద్ద వున్నారు అని చెప్పెను.

## 29. అధ్యాయము.

1 తరువాత రాజైన దావీదు సభ అంతటితో చెప్పిన
దేమంటే, పరాత్పరుడు యేర్పరచుకొనిన నా కుమా
రుడైన సొలొమోను యింకా బాలుడున్ను లేతవాడు
న్ను అయి వున్నాడు, అయితే పని గొప్పదై యున్నది,
యేమంటే నగరు మనుష్యునికి కాదు పరాత్పరుడైన
2 యెహోవాకు. । నేను నా శక్తి అంతటితోను నా
పరాత్పరుని యింటి నిమిత్తము బంగారపు పనికి బంగా
రమునున్ను వెండిపనికి వెండినిన్ని యిత్తడిపనికి యిత్త
డినిన్ని యినుపపనికి యినుమునున్ను కర్రపనికి కర్ర
లనున్ను గోమేధికపు రాళ్లనున్ను చెక్కే రాళ్లనున్ను
వింత అయిన అనేక వర్ణముల రాళ్లనున్ను మిక్కిలీ
వెలగల నానా విధ రత్నములనున్ను తెల్ల చాప రాళ్ల
3 నున్ను హేరాళముగా సంపాదిస్తిని. । మరిన్ని నా
పరాత్పరుని యింటి మీద నాకు వుండే అపేక్షచేత
నేను ఆ పరిశుద్ధమైన యింటి నిమిత్తము సంపాదించిన
యావత్తున్ను గాక నా స్వంతమైన బంగారమునున్ను
వెండినిన్ని నా పరాత్పరుని యింటి నిమిత్తము యి
4 స్తాను. । యేమంటే గదుల గోడలను మూసేటందుకున్ను
బంగారపు పనికి బంగాగమునున్ను వెండిపనికి వెండి
నిన్ని పనివాండ్లు చేసే యావత్తు పనికిన్ని ఓఫీరు బంగా
రమైన మూడు వేల తలాంతుల బంగారమునున్ను
పుటము వేయపడిన వెండి యేడు వేల తలాంతులను
5 న్నుయిస్తూ వున్నాను;। అయితే మీలో యీ దినమున
యెహోవాకు తన సేవ చెల్లించుటకు అనుకూలము
6 గలవాడు యెవడు అని చెప్పెను. । అప్పుడు వంశ
ముల ప్రభువులున్ను ఇశ్రాయేలు గోత్రముల ప్రభువు
లున్ను సహస్రాధిపతులున్ను శతాధిపతులున్ను రాజు
7 పనివాండ్లయిన ప్రభువులున్ను, । మనఃపూర్వకముగా
పరాత్పరుని యింటి పనికి అయిదువేల తలాంతుల
బంగారమునున్ను పదివేల బంగారపు ద్రాములనున్ను
పదివేల తలాంతుల వెండినిన్ని పద్దెనిమిదివేల తలాం
తుల యిత్తడినిన్ని లక్ష తలాంతుల యినుమునున్ను యి
8 చ్చినారు. । యెవరికి రత్నములు కలిగి వుండెనో వారు
వాటినిన్ని యెహోవా యింటి బొక్కసము నిమిత్తము
గేర్షోనీయుడైన యెహీయేలు చేతికి యిచ్చినారు. ।
9 యీ ప్రకారముగా మనఃపూర్వకముగా యిచ్చినం
దున జనులు సంతోషపడిరి, యేమంటే వారు వుత్తమ
మనస్సుతోనున్ను వుత్సాహముతోనున్ను యెహో
వాకు యిచ్చినారు, దావీదు రాజున్ను బహుగా సంతో
షపడెను. । కాబట్టి దావీదు యావత్తు సభికుల ముంద 10
రను యెహోవాకు స్తోత్రము చెల్లించి చెప్పినదేమం
టే, మా తండ్రియైన ఇశ్రాయేలుయొక్క పరాత్పరు
డవైన ఓ యెహోవా, నీవు సదాకాలమున స్తోత్ర
ము చేయ తగిన వాడవు. । ఓ యెహోవా, మహి 11
మయున్ను బలమున్ను ప్రకాశమున్ను జయమున్ను
ఘనమున్ను నీవై యున్నవి, యేమంటే ఆకాశమందు
న్ను భూమియందున్ను వుండే సమస్తమున్ను నీవి; ఓ
యెహోవా, రాజ్యము నీది, నీవు అందరి మీదనున్న
అధిపతివై హెచ్చించబడి వున్నావు. । ఐశ్వర్యమున్ను 12
ఘనమున్ను నీ వల్ల కలుగుతున్నవి; నీవు సమస్తమున్ను
యేలేవాడవు; నీ చేతిలో బలమున్ను శక్తియున్ను
వున్నవి; నీ చేతివల్ల గొప్ప చేసుటయున్ను అందరికి
బలము యిచ్చుటయున్ను కలదు. । కాబట్టి యిప్పుడు 13
మా పరాత్పరుడా, మేము నీకు స్తోత్రము చెల్లించి,
నీ మహిమగల నామమును కొనియాడుతున్నాము. ।
అయితే యీ ప్రకారము మనఃపూర్వకముగా యిచ్చే 14
సామర్థ్యము మాకు వుండేటందుకు నేను యెంతమా
త్రము, నా జనులు యెంతమాత్రము, యేమంటే సమ
స్తమున్ను నీ వల్ల కలుగును; నీవయిన వాటిని మేము
నీకు యిస్తిమి. । యేమంటే మాయొక్క యావత్తు పితృ 15
లవలెనే మేమున్ను నీ ముందర అన్యులమున్ను పరదే
శులమున్ను అయి వున్నాము; భూలోకము మీద వున్న
మా దినములు వొక నీడ వలెనే వున్నవి; స్థిరముగా
వున్నవాడు యెవడూ లేడు.। మా పరాత్పరుడవైన ఓ 16
యెహోవా, నీ పరిశుద్ధ నామము కొరకు వొక యిల్లు
కట్టేటందుకు మేము సమకూర్చిన యీ సమస్తము
న్ను నీ చేతినుంచి వచ్చెను, అంతా నీది. । నా పరా 17
త్పరుడా, నీవు హృదయమును శోధించి, యథార్థత
యందు అనుకూలిస్తున్నావని నేను యెరుగుదును; నన్ను
గురించినదేమంటే, నా హృదయముయొక్క యథా
ర్థత చేత మనఃపూర్వకముగా యివి అన్ని యిస్తిని;
యిప్పుడు యిక్కడ వుండే నీయొక్క జనులున్ను నీకు
మనఃపూర్వకముగా యిచ్చుటను సంతోషముతో చూ
స్తిని. । అబ్రాహాము ఇస్సాకు ఇశ్రాయేలు అనే మా 18
పితృలయొక్క పరాత్పరుడవయిన ఓ యెహోవా; నీ
జనుల హృదయములో కలిగే యీ చింతనున్ను తలం
పులనున్ను యెన్నటికిన్ని కాచుకొని, వారి హృదయ
మును నీకు తిన్నగా చేయుము. । నా కుమారుడైన సొ 19
లొమోను నీ కట్టడలనున్ను నీ సాక్ష్యములనున్ను
నీ నిబంధనలనున్ను గైకొనేటట్టుగానున్ను వీటినన్నిటి

నిన్ని చేసి నేను ఆయత్తము చేసిన యీ నగరు కట్టిం
చేటట్టుగానున్ను అతనికి వుత్తమ హృదయమును దయ
20 చేయుము అని పలికె; । ఆ తరువాత దావీదు సభ అం
తటితో యిప్పుడు మీ పరాత్పరుడైన యెహోవాను
స్తుతించండి అని చెప్పెను; అప్పుడు సభవారందరున్ను
తమ పితృలయొక్క పరాత్పరుడైన యెహోవాను
స్తుతించి, యెహోవా ముందరనున్ను రాజు ముందర
21 నున్ను వంగి మ్రొక్కిరి. । అప్పుడు వారు యెహో
వాకు బలులను యిచ్చి, మరునాటి యందు దహన బలు
లుగా వెయ్యి యెద్దులనున్ను వెయ్యి గొర్రె పొట్టేళ్ల
నున్ను వెయ్యి గొర్రె పిల్లలనున్ను వాటి పానార్పణల
నున్ను యావత్తు ఇశ్రాయేలు నిమిత్తమున్ను విస్తారము
22 గా చెల్లించినారు. । వారు ఆ దినమున యెహోవా
ముందర భోజనములనున్ను పానములనున్ను బహు సం
తోషముతో అనుభవించినారు; దావీదు కుమారుడైన
సొలొమోనును రెండోసారి రాజును చేసి యెహో
వా ముందర అతని అధిపతిగానున్ను సాదోకును
23 అర్చకునిగానున్ను అభిషేకము చేసినారు. । అప్పుడు
సొలొమోను తన తండ్రియైన దావీదు స్థలమందు యె
హోవా గద్దె మీద రాజుగా కూర్చుండి వృద్ధి
పొందుతూ వుండెను; ఇశ్రాయేలందరున్ను అతనికి
24 అధీనులైరి. । యావత్తు ప్రభువులున్ను పరాక్రమశా
లులున్ను దావీదు రాజుయొక్క యావత్తు కుమారులు
న్ను కూడా రాజు అయిన సొలొమోనుకు లోబడిరి. ।
యెహోవా సొలొమోనును యావత్తు ఇశ్రాయేలం 25
దరి దృష్టికి మిక్కిలి గొప్పగా చేసి, అతనికంటే
మునుపు ఇశ్రాయేలులో వున్న యే రాజుకైనా లేని
రాజ్య మహిమను అతనికి యిచ్చెను. । యీ ప్రకార 26
ముగా యెష్షై కుమారుడైన దావీదు యావత్తు ఇశ్రా
యేలుమీద రాజు అయి వుండెను. । అతడు ఇశ్రా 27
యేలును రాజుగా యేలిన కాలము నలుబై సంవత్సర
ములు; హెబ్రోనులో యేడు సంవత్సరములున్ను యె
రూశలేములో ముప్పయి మూడు సంవత్సరములున్ను
యేలెను. । అతడు పూర్ణ వయస్సున్ను ఐశ్వర్యము 28
న్ను మహిమయున్ను కలవాడై, మంచి ముదిమిలో
మరణము పొందిన తరువాత అతని కుమారుడైన సొలొ
మోను అతని స్థలమందు రాజుగా యేలెను. । దావీదు 29
రాజుయొక్క పూర్వోత్తరములున్ను అతని యావత్తు
రాజ్య భారమున్ను బలమున్ను అతని మీదనున్ను
ఇశ్రాయేలు మీదనున్ను దేశముల యావత్తు రాజ్య
ముల మీదనున్ను గతించి పోయిన కాలములు కూడా, ।
యిదుగో జ్ఞాన దృష్టి పురుషుడైన సమూయేలు గ్రంథ 30
మందున్ను దీర్ఘదర్శియైన నాతాను గ్రంథమందు
న్ను జ్ఞాన దృష్టి పురుషుడైన గాదు గ్రంథమందున్ను
వ్రాయబడి వున్నవి.

# రాజుల దిన వృత్తాంతముల రెండో గ్రంథము.

## 1. అధ్యాయము.

1 దావీదు కుమారుడైన సొలొమోను తన రాజరిక
మందు బలపరచబడెను, యేమంటే వాని పరాత్పరు
డైన యెహొవా వానితో కూడా వుండి వాని మి
2 క్కిలి గొప్పవానిగా చేసినాడు.। సొలొమోను సహ
స్రాధిపతులతోనున్ను శతాధిపతులతోనున్ను న్యా
యాధిపతులతోనున్ను ఇశ్రాయేలు యందంతటా వుం
డే పిత్రులకు ప్రధానుడైన ప్రతి అధికారితోనున్ను
3 ఇశ్రాయేలు జనమంతటితోనున్ను మాట్లాడెను.। సొ
లొమోను యావత్తు సభతో కూడా గిబోను యందు
వుండే మెట్టకు వెళ్లినాడు, యేమంటే దావీదు పరా
త్పరుని పెట్టెను కిర్యత్యెయారీమునుంచి దానికి యెరూ
శలేము యందు గుడారము చేసి తాను ఆయత్తపరచిన
4 స్థలమునకు తెప్పించి వుండినప్పటికిన్ని,। యెహొవా
సేవకుడైన మోషే వనాంతరమందు చేయించిన పరాత్ప
5 రుని ఆచరింపు గుడారము అక్కడ వుండెను.। హూరు
కుమారుడైన ఊరీకి పుట్టిన బెస్సలీలు కలుగచేసిన
యిత్తడి బలిపీఠము అక్కడ యెహొవా నివాసస్థల
మునకు యెదురుగా వుండెను; దాని యొద్ద సొలొమో
6 నున్ను సభయున్ను విచారించిరి.। ఆచరింపు గుడారము
ముందరనున్న యెహొవా సన్నిధియందున్ను వుండే
యిత్తడి బలిపీఠముయొద్దికి సొలొమోను వెళ్లి దానిమీద
7 వెయ్యి దహన బలులను చెల్లించెను.। ఆ రాత్రియందు
పరాత్పరుడు సొలొమోనుకు దర్శనమిచ్చి వానితో
నేను నీకు యేమి యివ్వవలెనో అడుగుమని చెప్పి
8 నాడు.। అప్పుడు సొలొమోను పరాత్పరునితో చెప్పిన
దేమంటే, నీవు నా తండ్రి అయిన దావీదుకు గొప్ప
కృప చూపించి అతనికి బదులుగా నన్ను రాజును
9 కాచేస్తివి.। యిప్పుడు పరాత్పరుడవైన యెహొవా
వా, నీవు నా తండ్రి అయిన దావీదుకు చేసిన నీ వాగ్ద
త్తము దృఢ మవునుగాక, యేమంటే నీవు భూమియొ
క్క మన్నంత విస్తారమైన జనుల మీద నన్ను రాజుగా
10 చేస్తివి.। యిప్పుడు నేను యీ జనుల ముందర బైలు
వెళ్లేటట్టున్ను లోపలకు వచ్చేటట్టున్ను తగిన జ్ఞానము
నున్ను తెలివినిన్ని నాకు దయ చేయుము, యేమంటే
యీ నీయొక్క గొప్ప జనముకు న్యాయము విచా
11 రించ శక్తి గలవాడు యెవడు అని పలికెను.। అప్పుడు
పరాత్పరుడు సొలొమోనుతో చెప్పినదేమంటే, యిది
నీవు నీ మనస్సు యందు వుంచుకొని, ఐశ్వర్యమునైనా
భాగ్యమునయినా మహిమనైనా నీ పగవాండ్లయొక్క
ప్రాణమునైనా అడుగక, దీర్ఘాయువునయినా అడు
గక, నేను నిన్ను రాజుగా యెవరి మీద చేసితినో
ఆ నా జనులకు న్యాయము విచారించుటకు తగిన
జ్ఞానమునున్ను తెలివినిన్ని అడిగితివి,। గనుక జ్ఞానము 12
న్ను తెలివిన్ని నీకు కలుగును గాక: నీకన్న ముందుగా
వున్న రాజులకు అయినా నీ తరువాత వచ్చే వాండ్లకు
అయినా లేని ఐశ్వర్యమునున్ను భాగ్యమునున్ను మహి
మనున్ను నీకు యిత్తునని చెప్పినాడు.। యీ ప్రకా 13
రము సొలొమోను గిబోనులో వుండే మెట్టకు పోయి
ఆచరింపు గుడారపు సన్నిధిలోనుంచి యెరూశలేముకు
వచ్చి ఇశ్రాయేలు మీద రాజుగా యేలెను.। సొలొ 14
మోను రథములనున్ను గుర్రపు రౌతులనున్ను కూ
ర్చెను; వెయ్యిన్ని నన్నూరు రథములున్ను పండ్రెండు
వేల గుర్రపు రౌతులున్ను అతనికి వుండెను; వీరిని
రథములు వుండే పట్టణములలోనున్ను రాజు అయిన
తనయొద్ద వుండుటకు యెరూశలేములోనున్ను వుం
చెను.। రాజు యెరూశలేము యందు వెండిన్ని బంగార 15
మున్ను రాళ్లవలెనున్ను సీదరు మానులను పల్లపు స్థల
మందుండే రావి చెట్లవలెనున్ను విస్తారముగా వుండే
టట్టు చేసెను.। సొలొమోనుకు వుండే గుర్రములున్ను 16
వస్త్రములున్ను మిస్ర యీమునుంచి తేపడెను; రాజు
వర్తకులు వస్త్రములను వొప్పందము ప్రకారము కొను
కుందురు.। వాండ్లు మిస్రయీమునుంచి వొక రథము 17
ఆరునూరు వెండి షెకేలులకున్ను వొక గుర్రము నూట
యేభై వెండి షెకేలులకున్ను కొంచవత్తురు; ఆ ప్రకార
ముగానే హిత్తీయుల రాజులందరి నిమిత్తమున్ను అరాము
రాజుల నిమిత్తమున్ను వారి ద్వారా కొంచరాపడెను.

## 2. అధ్యాయము.

సొలొమోను యెహొవా నామము కొరకు వొక 1
యిల్లున్ను తన రాజ్యము కొరకు వొక యిల్లున్ను కట్టే
టందుకు నిర్ణయము చేసుకొని,। బరువులు మోసే 2
టందుకు డెబ్బై వేల మందినిన్ని పర్వతమందు మా
నులు కొట్టేటందుకు యెనభై వేల మందినిన్ని వీండ్లమీద
అధిపతులుగా మూడు వేల ఆరునూరు మందినిన్ని
యెంచి వుంచెను.। సొలొమోను తురు రాజు అయిన 3
హూరాముకు పంపిన మాట యేమంటే, నా తండ్రి

అయిన దావీదు నివసించుటకు వొక యిల్లు అతనికి
కట్టించే కొరకు మీరు దయచేసి అతనికి సీదరు చెట్లను
4 అంపినట్టుగా నాకున్ను దయచేయండి. । యిదుగో
నా పరాత్పరుడైన యెహోవా ముందర సుగంధవర్గ
ముల ధూపము వేసేటందుకున్ను సముఖపు రొట్టెలు
యెప్పుడున్ను వుంచేటందుకున్ను వుదయాస్తమానముల
యందున్ను సబ్బాతు దినముల యందున్ను అమావా
స్యలయందున్ను మా పరాత్పరుడైన యెహోవాయొ
క్క వుత్సవముల యందున్ను ఇశ్రాయేలీయులు నిత్య
మున్ను చెల్లించవలసిన ప్రకారము దహన బలులను
చెల్లించేటందుకున్ను ఆయన నామము కొరకు యిల్లు
ఆయనకు ప్రతిష్ఠ చేసేటట్టుగా దానిని నేను కట్టించ
5 బోతాను. । నేను కట్టించబోయే యిల్లు గొప్పదై వుం
డును, యేమంటే మా పరాత్పరుడు సకలమైన దేవుండ్ల
6 కంటే గొప్పవాడు. । ఆయనకు యిల్లు కట్టించుటకు
సామర్థ్యము కలవాడు యెవడు? యేమంటే ఆకా
శములున్ను ఆకాశముల ఆకాశములున్ను ఆయనను
పట్టచాలవు; ఆయన యెదుట దహన బలులను చెల్లిం
చేటందుకే గాని ఆయనకు యిల్లు కట్టించేటందుకు
7 నేను యెంత మాత్రుడను. । అయితే నా తండ్రి అయిన
దావీదు నియమించినటువంటిన్ని యూదాలోనున్ను
యెరూశలేములోనున్ను నాయొద్ద వున్నటువంటిన్ని
ప్రజ్ఞగల వారితో కూడా వుండి, బంగారము యం
దున్ను వెండి యందున్ను యిత్తడి యందున్ను యినుము
యందున్ను వూదా నూలు యందున్ను యెర్రనూలు
యందున్ను నీలి నూలు యందున్ను పని చేసుటకు
చెక్కడపు పని యెరిగిన ప్రజ్ఞగల వొక మనిషిని నా
8 కొరకు పంపండి. । లెబానోనునుంచి సీదరు చెట్ల
నున్ను దేవదారు వృక్షములనున్ను అల్మగీము అనే వృక్ష
ములనున్ను నాకు పంపండి, యేమంటే లెబానోను
యందు మానులు కొట్టేటందుకు మీ పనివాండ్లకు
9 తెలివి కలదని నాకు తెలుసును; । యిదుగో నాకు
మానులు విస్తారముగా ఆయత్త పరచేటందుకు నా పని
వాండ్లు మీ పనివాండ్లతో కూడా వుందురు, యేమం
టే నేను కట్టించబోయే యిల్లు గొప్పదిగానున్ను ఆశ్చ
10 ర్యకరమైనదిగానున్ను వుండును. । యిదుగో ఆ మా
నులు కొట్టే మీ పనివాండ్లకు దంచిన యిరువై వేల
కుంచముల గోధుములనున్ను యిరువై వేల కుంచముల
తోక గోధుములనున్ను యిరువై వేల కడవల ద్రాక్షా
రసమునున్ను యిరువై వేల కడవల నూనెనున్ను యిత్తు
11 నని చెప్పి అంపెను. । అప్పుడు తూరు రాజు అయిన
హీరాము సొలొమోనుకు వ్రాసి పంపించిన వుత్తరము
యేమంటే, యెహోవా తన జనమును స్నేహించినం
దున నిన్ను వారి మీద రాజుగా వుంచినాడు అని
చెప్పెను. । యింకా హీరాము వ్రాసినదేమంటే, యె 12
హోవాకు వొక యిల్లున్ను నీ రాజ్యమునకు వొక
యిల్లున్ను కట్టించుటకు తగిన వివేకమున్ను తెలివిన్ని కలి
గిన బుద్ధిగల కుమారుని దావీదు అనే రాజుకు దయ
చేసినటువంటిన్ని ఆకాశమునున్ను భూమినిన్ని కలుగ
జేసినటువంటిన్ని ఇశ్రాయేలుయొక్క పరాత్పరుడైన
యెహోవా స్తుతించ పడునుగాక. । యిప్పుడు హీ 13
రాము అనే తెలివి కలిగినటువంటిన్ని బుద్ధి యెరిగిన
టువంటిన్ని మనుష్యుని పంపిస్తిని:। వాడు దాను కుమా 14
తెకాలలో వుండే వొక స్త్రీ కుమారుడు; వాని తండ్రి
తూరు మనుష్యుడై వుండెను; వాడు బంగారము యం
దున్ను వెండి యందున్ను యిత్తడి యందున్ను యిను
ము యందున్ను రాళ్ల యందున్ను మానుల యందున్ను
వూదానూలు యందున్ను నీలినూలు యందున్ను సన్న
పునూలు యందున్ను యెర్రనూలు యందున్ను పని
చేయ గలవాడున్ను, సకల విధమైన చెక్కడపు పని
యందున్ను యేమేమి వానికి కనుపరచబడునో మీ
బుద్ధిగల మనుష్యులతోనున్ను మీ తండ్రి అయిన
దావీదు అనే నా యేలినవానియొక్క బుద్ధిగల మను
ష్యులతోనున్ను అది అంతా కనుక్కొనేటందుకు
వుపాయము కలవాడున్ను అయి వున్నాడు. । యిప్పుడు 15
నా యేలినవాడు చెప్పివున్న గోధుములనున్ను తోక
గోధుములనున్ను నూనెనున్ను ద్రాక్షారసమునున్ను నీ
సేవకులకు పంపనిమ్ము. । అప్పుడు మేము నీకు కావల 16
సిన వృక్షములన్నిన్ని లెబానోను యందు కొట్టించి,
వాటిని మీకు సముద్రము మీద తెప్పలవల్ల యొప్పెకు
కొంచవత్తుము; తరువాత మీరు వాటిని యెరూశలే
ముకు తెప్పించవచ్చును అని వ్రాసెను. । అంతట సొలొ 17
మోను తన తండ్రి అయిన దావీదు ఇశ్రాయేలు దేశ
మందు వుండిన అన్య జాతి వాండ్లనందరినీ యెంచిన
అంచనా ప్రకారము వాండ్లను లెక్కించెను; వాండ్లు
లక్ష యేనభై మూడువేల ఆరునూరు మందిగా కనుప
డెను. । వీరిలో అతడు డెబ్భైవేల మందిని బరువులు 18
మోసేటందుకున్ను యెనభైవేల మందిని పర్వతమందు
మానులు కొట్టుటకున్ను మూడువేల ఆరునూరు మందిని
జనుల మీద పని చేయించే అధిపతులుగా వుండుట
కున్ను వుంచెను.

## 3. అధ్యాయము.

తరువాత సొలొమోను యెరూశలేములో తన 1
తండ్రి అయిన దావీదుకు యెహోవా అగుపడిన
మోరీయా అనే పర్వతమందు దావీదు ఆయత్తపరచిన
స్థలమైనటువంటి యెబూసీయుడైన ఒర్నాను యొక్క
కళ్లమందు యెహోవా యిల్లు కట్ట నారంభించెను. ।

2 అతడు తన యేలుబడియొక్క నాలుగో సంవత్సరము
రెండో నెల రెండో దినమందు కట్ట నారంభించెను.।
3 పరాత్పరుని యిల్లు కట్టేటందుకు సొలొమోను బోధిం
చపడెను, యేలాగంటే తొలికొల చొప్పున పొడవు
అరువై మూరలున్ను వెడల్పు యిరువై మూరలున్ను
4 వుండెను.। యింటి ముందర వున్న మంటపము యింటి
వెడల్పు ప్రకారమే యిరువై మూరలు పొడవున్ను
నూట యిరువై మూరలు యెత్తున్ను అయి వుండెను;
దాని లోపలను ప్రశస్తమైన బంగారముతో అతడు
5 పొదిగించెను.। పెద్ద యిల్లు దేవదారు పలకలతోనున్ను
తరువాత మంచి బంగారముతోనున్ను కప్పి, దాని
మీద ఖర్జూరపు చెట్టువంటి పనిన్ని గొలుసులవంటి
6 పనిన్ని చేసి,। ఆ యింటిని చక్కని ప్రశస్తమైన రత్న
ములతో అలంకరించెను; ఆ బంగారము పర్వాయీము
7 బంగారమై వుండెను.। ఆ యింటి దూలములున్ను
స్తంభములున్ను దాని గోడలున్ను దాని తలుపులున్ను
బంగారముతో పొదిగించి, గోడలమీద కెరూబులను
8 చెక్కించెను.। మరిన్ని అతడు అతి పరిశుద్ధమైన
యిల్లున్ను కట్టించెను; దాని పొడవు యింటి వెడల్పు
ప్రకారముగానే యిరువై మూరలున్ను దాని వెడల్పు
యిరువై మూరలున్ను వుండెను; ఆరు నూరు తలాం
తులు చేసేపాటి బంగారముతో దాని పొదిగించెను.।
9 మేకుల యెత్తు యేభై బంగారపు షెకేలులంత వుండెను:
10 మీది గదులు బంగారముతో పొదిగించెను.। అతడు
అతి పరిశుద్ధమైన యింట్లో రెండు కెరూబులను వూగు
లాడేటట్టు చేసి, వాటిని బంగారముతో పొదిగించెను.।
11 ఆ కెరూబుల రెక్కల పొడవు యిరువై మూరలు:
వొక రెక్క అయిదు మూరలు వుండి యింటి గోడను
తాకెను; దాని కొదువ రెక్క అయిదు మూరలు వుండి
12 రెండో కెరూబు రెక్కను తాకి వుండెను.। రెండో
కెరూబు రెక్కయున్ను అయిదు మూరలు వుండి
యింటి గోడను తాకి వుండెను; దాని కొదువ రెక్క
యున్ను అయిదు మూరలు వుండి రెండో కెరూబు
13 యొక్క రెక్కను కలిసి వుండెను.। యీ ప్రకారమే
యీ కెరూబుల రెక్కలు యిరువై మూరల మట్టుకు
పరుచుకొని వుండెను; అవి వాటి కాళ్లతో నిలువబడి,
వాటి ముఖములు యింటి లోపలి వైపున వుండెను.।
14 అతడు నీలి నూలుతోనున్ను వూదా నూలుతోనున్ను
యెఱ్ఱ నూలుతోనున్ను సన్నపు నూలుతోనున్ను
వొక తెర చేసి, దాని మీద కెరూబులను వేయించెను.।
15 యిదిన్ని గాక అతడు యింటికి ముందర ముప్పయి
అయిదు మూరలు యెత్తు అయిన రెండు స్తంభము
లున్ను వాటి మీదను అయిదు మూరలు యెత్తయిన
16 మట్లున్ను చేయించి,। వాక్య స్థలములో వున్నట్టుగానే
గొలుసులున్ను చేయించి, స్తంభముల తలల మీద
వాటిని వుంచి; నూరు దానిమ్మ పండ్లను చేయించి, ఆ
గొలుసుల మీద వాటిని తగిలించెను.। అతడు దేవా 17
లయమునకు ముందర కుడి తట్టున వొకటిన్ని యెడమ
తట్టున వొకటిన్ని రెండు స్తంభములను నిలిపి, కుడి
తట్టు దానికి యాఖీను అనిన్ని యెడమ తట్టు దానికి
బోయజు అనిన్ని పేరు పెట్టెను.

## 4. అధ్యాయము.

అతడు యిరువై మూరలు పొడవున్ను యిరువై 1
మూరలు వెడల్పున్ను పది మూరలు యెత్తున్ను గల
వొక యిత్తడి బలిపీఠమున్ను చేయించెను.। వొక సము 2
ద్రపు తొట్టియున్ను పోత పోయించెను; దాని
అంచు వొక తట్టు మొదలుకొని కొదువ అంచు తట్టు
మట్టుకు పది మూరలు వెడల్పున్ను అయిదు మూరలు
యెత్తున్ను నూలు కొలత చొప్పున దాని కైవారము
ముప్పై మూరలున్ను వుండెను.। దాని కింద తట్టు 3
యెద్దుల రూపములు వున్నవి; వొక్కొక మూరకు
పదేసి రూపములుగా అవి ఆ సముద్రపు తొట్టిని
ఆవరించి యుండెను; తొట్టితో కూడా రెండు వరసలు
యెద్దులున్ను పోత పోయించబడెను.। అది పండ్రెండు 4
యెద్దుల మీద నిలువబడెను; మూడు వుత్తరము తట్టు
నున్ను మూడు పడమర తట్టునున్ను మూడు దక్షిణము
తట్టునున్ను మూడు తూర్పు తట్టునున్ను దృష్టించుతూ
వుండెను; సముద్రపు తొట్టి వాటి పైని యెత్తపడెను;
వాటి వెనుక పార్శ్వములన్ని లోపలకు వుండెను.।
దాని దలసరి బెత్తెడున్ను దాని అంచు తామర పువ్వుల 5
ఆకారము వలె గిన్నె అంచులాటిదిన్నై వుండెను;
అది మూడు వేల కడవల నీళ్లు పట్టును.। మరిన్ని 6
దహన బలుల విషయమై అర్పించేవి వాటిలో కడగ
డానకు అయిదు కుడి తట్టుననున్ను అయిదు యెడమ
తట్టుననున్ను పది స్నానపు గోలెములు కలుగ చేసెను;
అయితే సముద్రపు తొట్టి అర్చకులు దానియందు
స్నానము చేసుకొనేటందుకు వుండెను.। అతడు పది 7
బంగారపు దీపస్తంభములనున్ను వాటి ప్రమాణము
చొప్పున చేయించి వాటిని దేవాలయమందు అయిదు
కుడి తట్టున్ను అయిదు యెడమ తట్టున్ను వుంచినాడు.।
అతడు పది బల్లలను చేసి వాటిని దేవాలయమందు 8
అయిదు కుడి తట్టున్ను అయిదు యెడమ తట్టున్ను
వుంచెను; నూరు బంగారపు తొట్లను చేయించెను.।
అతడు అర్చకుల లోగిలిన్ని గొప్ప లోగిలిన్ని లోగిళ్ల 9
వాకిండ్లున్ను కలుగ చేసి, వాటి తలుపులను యిత్తడితో
పొదిగించెను.। సముద్రపు తొట్టిని అతడు తూర్పు 10
తట్టు కుడి పార్శ్వమందు దక్షిణమునకు యెదురుగా

11 వుంచెను. ‌। హీరాము పాత్రలనున్ను బూడిదె యెత్తే
చేటలనున్ను గిన్నెలనున్ను కలుగ చేసెను; ఆ ప్రకా
రముగా హీరాము యెహోవా యింటి కొరకు రాజు
అయిన సొలొమోను విషయమై చేయవలసిన పని
12 సమాప్తి చేసెను. ‌। అది యేదంటే, రెండు స్తంభముల
నున్ను, ఆ రెండు స్తంభముల మీదనున్న పైమట్ల
యొక్క పళ్లెములనున్ను; స్తంభముల మీద వుండే మట్ల
యొక్క రెండు పళ్లెములను కప్పేటందుకు రెండు
13 అల్లిన వలలనున్ను; ‌। స్తంభముల మీద వున్న మట్లు
అయిన రెండు పళ్లెములను కప్పేటందుకు వల వొక్కొం
టికి రెండు వరసల ప్రకారము రెండు వలల కొరకున్న
14 అల్లిన నన్నూరు దానిమ్మ పండ్లనున్ను; ‌। మట్లనున్ను,
15 మట్ల మీద వుండే తొట్లనున్ను; ‌। వొక సముద్రముని
న్ను, దాని కింద వుండే పండ్రెండు యెద్దులనున్ను; ‌।
16 కుండలనున్ను, బూడిదె యెత్తే చేటలనున్ను, ముండ్ల
కొంకులు మొదలైన వస్తువులనున్ను హీరాము రాజు
అయిన సొలొమోను నిమిత్తము యెహోవాయొక్క
యింటి కొరకు మెరుగు బెట్టిన ఇత్తడితో చేసెను. ‌।
17 యర్దేను మయిదానమందు సుక్కోతుకున్ను సెరే
దాతాకున్ను మధ్యను రాజు వాటిని జిగట భూమి
18 యందు పోత పోయించెను. ‌। యీ వస్తువులన్నిన్ని
సొలొమోను బహు విస్తారముగా చేయించెను, యే
మంటే యిత్తడి యెత్తుయొక్క అంచనా తెలియబడక
19 వుండెను. ‌। పరాత్పరుని యింటికి కావలసిన యావత్తు
వస్తువులనున్ను, బంగారపు బలిపీఠమునున్ను, సముఖపు
20 రొట్టెలు వుంచే బల్లలనున్ను, ‌। మర్యాద ప్రకారము
వాక్య స్థలము ముందర వెలుగుతూ వుండేటందుకు
వాటి ప్రమిదెలతో కూడా ప్రశస్తమైన బంగారపు
21 దీపస్తంభములనున్ను, ‌। పువ్వులనున్ను, ప్రమిదెలనున్ను,
కత్తెరలనున్ను, కారులనున్ను, తొట్టులనున్ను, గిన్నెల
నున్ను, ధూప కలశములనున్ను, సొలొమోను బహు
22 ప్రశస్తమైన బంగారముతో చేయించెను. ‌। మరిన్ని
యింటి వాకిలిన్ని అతి పరిశుద్ధ స్థలమునకు వుండే లో
తలుపులున్ను దేవాలయపు యింటి తలుపులున్ను యి
వన్ని బంగారపువై వుండెను.

## 5. అధ్యాయము.

1 ఈలాగున యెహోవా యింటి నిమిత్తము సొలొ
మోను తాను చేసిన పని అంతయున్ను సమాప్తి పరచి
నప్పుడు, సొలొమోను తన తండ్రియయిన దావీదు
పరిశుద్ధము చేసి కొంచు వచ్చిన వెండినిన్ని బంగార
మునున్ను యావత్తు వస్తువులనున్ను పరాత్పరుని యింటి
2 బొక్కసములలో వుంచెను. ‌। తరువాత యెహోవా
వొడంబడికె పెట్టెను సీయోను అనే దావీదు పట్టణము
నుంచి కొంచు వచ్చుటకు సొలొమోను ఇశ్రాయేలు
యొక్క పెద్దలనున్ను ఇశ్రాయేలు పుత్రులయందు
వంశములకు ప్రభువులైన యావత్తు గోత్రముల పెద్దలను
న్ను యెరూశలేముకు కూడి రా చేసెను. ‌। ఆ ప్రకారమే 3
ఇశ్రాయేలులందరున్ను యేడో నెల పండుగ యందు
రాజు యొద్దికి కూడినారు. ‌। ఇశ్రాయేలుయొక్క పెద్ద 4
లందరున్ను వచ్చిన తరువాత, లేవీయులు పెట్టెను
తీసుకొని. ‌। పెట్టెనున్ను ఆచరింపు గుడారమునున్ను 5
గుడారమందు వుండే పరిశుద్ధమయిన యావత్తు వస్తువు
లనున్ను కొంచు వచ్చినారు; వీటిని లేవీయులున్ను అర్చ
కులున్ను కొంచు వచ్చినారు. ‌। అయితే రాజు అయిన 6
సొలొమోనున్ను అతని వెంబడి కూడిన ఇశ్రాయేలు
సభ అంతానున్ను పెట్టెకు ముందర యెంచేటందుకున్ను
లెక్కించేటందుకున్ను శక్యము కాని గొర్రెలనున్ను
పశువులనున్ను హోరాళముగా అర్పించినారు. ‌। ఆ ప్ర 7
కారమే అర్చకులు యెహోవా వొడంబడికె పెట్టెను
వాక్య స్థలమనే అతి పరిశుద్ధమైన స్థలమందు కెరూబుల
రెక్కలకు కిందుగా కొంచ వచ్చి వుంచినారు. ‌। యేమం 8
టే కెరూబులు పెట్టె వుండే స్థలముమీద తమ రెండు
రెక్కలు విప్పుకొని, పెట్టెనున్ను దాని దండెలనున్ను
కప్పుకొని వుండెను. ‌। పెట్టెకు వున్న దండెల మూలలు 9
వాక్య స్థలమునకు ముందుగా కనుపడేటట్టుగా ఆ దం
డెలను యీడ్చినారు; అయితే బయిటికి అవి కనుపడ
లేదు; అది యింత పర్యంతమున్ను అక్కడనే వున్నది. ‌।
ఇశ్రాయేలు పుత్రులు మిస్రయీములోనుంచి బయి 10
లువెళ్లిన తరువాత యెహోవా హోరేబు యందు
వాండ్లతో వొడంబడికె చేసినప్పుడు మోషే ఆ పెట్టె
యందు వుంచిన రెండు రాతి పలకలు గాక దాని
యందు మరి యేమైనా వుండలేదు. ‌। వంతులు చూడ 11
కుండా వుండే యావత్తు అర్చకులున్ను తమ్మును పరిశు
ద్ధము చేసుకొని వుండిరి: ‌। ఆసాఫు హేమాను యెదూ 12
తూనుల సంబంధమైన వారున్ను వాండ్ల కుమారుల
సహోదరులయొక్క సంబంధులున్ను పాఠకులున్ను
అయి వున్న లేవీయులందరున్ను సన్నపు వస్త్రములను
ధరించుకొని, తాళములనున్ను తంబురలనున్ను వీణెల
నున్ను పట్టుకొని, బలిపీఠమునకు తూర్పున నిలిచినారు; ‌।
వాండ్లతోకూడా బూరగలు వూదే అర్చకులు నూట 13
యిరువైమంది నిలుచున్నారు; అయితే బూరగలు వూ
దేవారున్ను పాఠకులున్ను వొక శబ్దముతో యెహో
వాకు స్తుతి వందనములు చేసి పాడగా సంభవించినదే
మంటే, అర్చకులు పరిశుద్ధ స్థలములోనుంచి బయిలు
వెళ్లేటప్పుడు బూరగలతోనున్ను తాళములతోనున్ను
వాద్యములతోనున్ను తమ తమ శబ్దమును యెత్తి, యె
హోవా వుత్తముడు అనిన్ని, ఆయన కృప యెన్నటి

14 కిన్ని వున్నదనిన్ని స్తోత్రము చేసినారు. । అప్పుడు యె
హోవా యిల్లు వొక మేఘముతో నిండి వుండెను;
ఆ మేఘమునుంచి అర్చకులు సేవ చేసుటకు నిలువ
లేకుండా వుండిరి, యేమంటే యెహోవా మహిమ
పరాత్పరుని యింటిని నిండుకొని వుండెను.

## 6. అధ్యాయము.

1 అప్పుడు సొలొమోను అనినదేమంటే, మిక్కుట
మైన చీకటిలో నివాసము చేస్తానని యెహోవా
2 చెప్పినాడు;। అయితే నీవు యెప్పటికిన్ని వుండే నివాస
స్థానము కొరకున్ను నిత్యమైన కాపురము కొరకున్ను
3 వొక యిల్లు నేను నీకు కట్టించితినని చెప్పి, । రాజు
తన ముఖమును తిప్పుకొని ఇశ్రాయేలు సభ అంతటి
నిన్ని ఆశీర్వదించెను; ఇశ్రాయేలు సభ అంతానున్ను
4 నిలిచి వుండెను. । అతడు చెప్పినదేమంటే నా తండ్రి
అయిన దావీదుకు తన వాక్కుతోను చెప్పినది తన
చేతులతో నెరవేర్చిన ఇశ్రాయేలుయొక్క పరాత్ప
5 రుడైన యెహోవా స్తుతించబడ తగిన వాడు: । యే
మంటే నేను నా జనులను మిస్రయీము దేశములో
నుంచి బయిలు వెళ్ల చేసిన నాటనుంచి నాయొక్క నా
మము వుండేటట్టు వొక యిల్లు కట్టించ వలెనని నేను
ఇశ్రాయేలుయొక్క యావత్తు గోత్రములలో యే వొక
పట్టణమునైనా యేర్పరచుకోకుండానున్ను, నా జను
లయిన ఇశ్రాయేలు మీద అధిపతి అయి వుండేటట్టు
యే వొకనినయినా యేర్పరచుకోకుండానున్ను వుంటిని:।
6 అయితే నా పేరు వుండే స్థానముగా యెరూశలేము
నున్ను, నా జనులైన ఇశ్రాయేలు మీద అధిపతి అయి
వుండేటట్టు దావీదునున్ను యేర్పరచుకొంటిని అని
7 ఆయన చెప్పి వుండెను. । ఇశ్రాయేలుయొక్క పరా
త్పరుడైన యెహోవా నామము కొరకు వొక యిల్లు
కట్టించ వలెనని నా తండ్రి అయిన దావీదు మనస్సు
8 యందు వుండెను. । అయితే యెహోవా నా తండ్రి
అయిన దావీదుతో నా నామము కొరకు యిల్లు కట్ట
వలెనని నీవు నీ మనస్సు యందు తలంచినది మంచి తలం
9 పే: । అయినప్పటికిన్ని నీవు ఆ యిల్లు కట్ట కూడదు;
నీ వల్ల పుట్టబోయే నీ కుమారుడే నా నామము కొరకు
10 ఆ యిల్లు కట్టునని చెప్పెను. । యిప్పుడు యెహోవా
తాను చెప్పి వున్న తన మాటను నెరవేర్చినాడు, యే
మంటే యెహోవా చెప్పి వున్న ప్రకారమే నేను
నా తండ్రి అయిన దావీదుయొక్క స్థలమందు లేచి,
ఇశ్రాయేలుయొక్క రాజాసనమందు కూర్చుండి, ఇశ్రా
యేలుయొక్క పరాత్పరుడైన యెహోవా కొరకు
11 యిల్లు కట్టి, । యెహోవా ఇశ్రాయేలు పుత్రులతో
చేసిన వొడంబడికె వుండే పెట్టెను దాని యందు
వుంచితినని చెప్పి: । యెహోవాయొక్క బలిపీఠము 12
ముందర ఇశ్రాయేలు సభ అంతటికిన్ని యెదురుగా
నిలిచి, తన చేతులను చాపెను. । యేమంటే సొలొ 13
మోను అయిదు మూరల పొడవున్ను అయిదు మూరల
వెడల్పున్ను మూడు మూరల యెత్తున్ను అయిన వొక
యిత్తడి పీఠమును కలుగ చేసి, దాని లోగిటి మధ్య
మందు వుంచి, దాని మీద అతడు నిలిచి, ఇశ్రా
యేలు సభవారందరికి యెదురుగా వుండి, మోకాళ్లు
వంచుకొని, తన చేతులు ఆకాశము వైపు చాపి చెప్పిన
దేమంటే; । ఇశ్రాయేలుయొక్క పరాత్పరుడవైన వో 14
యెహోవా, తమ నిండు హృదయముతో నీ ముందర
నడిచే నీ భక్తులకు వొడంబడికెను నిలుపుతున్ను కృపను
చూపుతున్ను వున్నటువంటి నీ వంటి పరాత్పరుడు
పరమండలమందయినా భూమి యందయినా లేడు. ।
నీ సేవకుడైన దావీదు అనే నా తండ్రితో చెప్పినదిన్ని 15
నీ వాక్కుతో ఆనతిచ్చినదిన్ని నీ చేతి చేతను యీ
దినమున వున్నట్టుగానే నీవు నెరవేర్చితివి. । నీవు నా 16
ముందర నడిచినట్టుగా నీ కుమార్లున్ను నాయొక్క
న్యాయ ప్రమాణము చొప్పున నడిచేటట్టు తను త్రో
వలు జాగ్రత చేసుకొన్నట్టయితే, ఇశ్రాయేలుయొక్క
సింహాసనము మీద కూర్చుండే పురుషుడు నా యెదుట
నీకు వుండకపోడని నీవు నీ సేవకుడైన దావీదనే నా
తండ్రితో చెప్పినది యిప్పుడు ఇశ్రాయేలుయొక్క
పరాత్పరుడవైన వో యెహోవా, దయచేసి నెరవే
ర్చుము. । యిప్పుడు ఇశ్రాయేలుయొక్క పరాత్పరు 17
డవయిన వో యెహోవా నీవు నీ సేవకుడైన దావీ
దుతో చెప్పిన నీయొక్క మాట నిజమవును గాక. ।
అయితే నిశ్చయముగా పరాత్పరుడు మనుష్యులతో 18
భూమి యందు నివాసము చేసునా? యిదుగో ఆకాశ
మున్ను ఆకాశముల ఆకాశమున్ను నిన్ను పట్ట చాలవే,
నేను కట్టిన యీ యిల్లు యేపాటి చాలును? । అయినప్ప 19
టికిన్ని పరాత్పరుడవైన వో యెహోవా, నీ సేవకుడు
నీ ముందర చేసే ప్రార్థన యందున్ను విన్నపము
యందున్ను నీవు లక్ష్యముంచి, నీ సేవకుడనయిన నేను
ప్రార్థించే ప్రార్థననున్ను పెట్టే మొర్రనున్ను
ఆలకించుము. । నీ సేవకుడు యీ స్థలమందు చేసే విన్న 20
పము వినేటందుకు నా నామము అక్కడ వుంచుతా
నని నీవు చెప్పిన స్థలమనే యీ యింటి మీద నీ కన్ను
లు రాత్రిం బగలున్ను తెరచి వుండునుగాక. । నీ సేవకు 21
డున్ను నీ జనులయిన ఇశ్రాయేలున్ను యీ స్థలమందు
చేయబోయే ప్రార్థనలు విందువుగాక; పరమండల
మనే నీ నివాస స్థలమందు వినుము; వినినప్పుడు
క్షమించుము । యెవడైనా వొకడు తనతోటివాని యె 22
డల తప్పు చేస్తే, అతనిచేత ప్రమాణము చేయించుటకు

అతని మీద వొట్టు పెట్టబడితే, ఆ వొట్టు యీ యింట్లో
23 వుండే నీ పీఠము యెదుటకు వచ్చినప్పుడు, । పరమం
డలములో వుండే నీవు విని, చెడ్డవాని మార్గము
చొప్పున వాని తల మీదికి వచ్చేటట్టుగా చేసి, నీతి
మంతుని నీతికి తగినట్టుగా వానికి యిచ్చేటందుకు నీతి
నిర్ధారణ చేసి, నీ సేవకులకు న్యాయము తీర్తువు
24 గాక. । నీ జనులైన ఇశ్రాయేలు నీకు విరోధముగా
పాపము చేసి అందువల్ల శత్రువుల ముందర పడిపో
యినట్టయితే, నీ యొద్దికి తిరిగి వారు వచ్చి, నీ నామ
మును యెరుక చేసి, యీ యింట్లో నీ సన్నిధి యందు
25 విన్నపమునున్ను ప్రార్థననున్ను చేస్తే, । పరమండల
ములో నీవు విని, నీ జనులయిన ఇశ్రాయేలుయొక్క
పాపమును మన్నించి, వాండ్లకున్ను వాండ్ల పితృలకు
న్ను నీవు యిచ్చిన దేశానకు వాండ్లను తిరుగా రాచే
26 తువు గాక. । వాండ్లు నీకు విరోధముగా పాపము
చేసినందువల్ల ఆకాశము మూయబడి వాన కురవకుం
డా వుండేటప్పుడు, వాండ్లు యీ స్థలమునకు తిన్నగా
ప్రార్థించి, నీ నామమును యెరుక చేసి, నీవు వాం
డ్లను శ్రమ పెట్టినప్పుడు వాండ్లు తమ పాపములను
27 విడిచిపెట్టి తిరిగితే, । పరమండలములో వుండే నీవు
విని, నీ సేవకులున్ను నీ జనులైన ఇశ్రాయేలున్ను చేసిన
పాపమును మన్నించి, వాండ్లు నడవవలసిన మంచి
మార్గము వాండ్లకు బోధించి, నీవు నీ జనులకు స్వా
స్థ్యముగా యిచ్చిన నీయొక్క దేశము మీద వాన
28 దయ చేతువు గాక. । దేశమందు కరువు కలిగినప్పుడై
నా, తెగులు వచ్చినప్పుడైనా, గాడ్పు దెబ్బ గానీ
చిత్త పట్టుట గానీ మిడతలు గానీ గొంగళి పురుగులు
గానీ కలిగినప్పుడైనా, వాండ్ల శత్రువులు వాండ్ల
దేశపు పట్టణముల యందు వాండ్లను ముట్టడి వేసిన
ప్పుడు అయినా, యే నొప్పిగానీ యే రోగము గానీ
29 వచ్చినప్పుడైనా, । యే మనుష్యుడైనా ఇశ్రాయేలైన
నీ జనులందు యెవడైనా తన తన నొప్పిన్ని కష్టమున్ను
యెరిగి, యీ యింటికి తిన్నగా తన చేతులను చాపి,
చేసే యావత్తు విన్నపమునున్ను యావత్తు ప్రార్థన
నున్ను నీ నివాస స్థలమైన పరమండలములో వుండే
30 నీవు విని మన్నించి, । నీవు మా పితృలకు యిచ్చిన దేశ
మందు వాండ్లు బ్రతికి వుండే దినములన్నీ నీకు భయ
31 పడి, । నీ మార్గములలో నడిచేటట్టుగా నీవు వాని
వాని హృదయమును యెరిగి యున్నావు గనుక వాని
వాని యావత్తు మార్గములకు తగినట్టుగా దయ చేతువు
గాక, యేమంటే నీవు వొక్కడవే మనుష్య పుత్రుల హృ
32 దయమును యెరిగి యున్నావు. । మరిన్ని నీ జనులైన
ఇశ్రాయేలు సంబంధులుకాని అన్యజాతివారు నీ గొప్ప
కీర్తి నిమిత్తమున్ను నీ బలమైన చేతి నిమిత్తమున్ను చాపి
వున్న నీయొక్క భుజము నిమిత్తమున్ను దూర దేశము
నుంచి వచ్చి, యీ యింటికి తిన్నగా నిలిచి విన్నపము
చేస్తే. । నీ నివాస స్థలమనే పరమండలములో వుండే నీవు 33
అది విని, భూమియొక్క జనులందరున్ను నీ జనమైన
ఇశ్రాయేలు వలె నీ నామమును యెరిగి, నీకు భయపడి,
నేను కట్టిన యీ యిల్లు నీ నామముచేత పిలువపడెనని
తెలిసేటట్టుగా ఆ అన్యజాతి అయినవారు నిన్ను దృష్టిం
చి, నిన్ను ప్రార్థించే యావత్తు కార్యమునకున్ను
తగినట్టుగా చేతువు గాక. । నీ జనులు నీవు పంపే మార్గ 34
మందు తమ శత్రువులతో యుద్ధము చేసుటకు బయిలు
వెళ్లి, నీవు యేర్పరచుకొన్న యీ పట్టణమునకున్ను నీ
నామమునకు నేను కట్టించిన యీ యింటికిన్ని తిన్నగా
విన్నపము చేస్తే, । పరమండలములో వుండే నీవు వాండ్ల 35
విన్నపమునున్ను ప్రార్థననున్ను ఆలకించి, వాండ్లకు
న్యాయమును విచారింతువు గాక. । పాపము చేయని 36
మనుష్యుడు లేడు గనుక వాండ్లు నీకు విరోధముగా
పాపము చేసినప్పుడు; నీవు వాండ్ల మీద కోపముచేసి,
వాండ్లను శత్రువుకు అప్పగించినందున వాండ్లను చెర
పట్టుకొనే వాండ్లు వాండ్లను దూరముగానైనా లేక
సమీపముగానైనా వుండే తమ దేశానకు కొంచపోయి
వుండగా, । వాండ్లు చెర కొంచపోబడిన దేశమందు 37
తాము బుద్ధి తెచ్చుకొని మనస్సు తిప్పుకొని, మేము
పాపము చేసినాము, అతిక్రమించి దుర్మార్గముగా
నడిస్తిమి అని వొప్పుకొని, । తాము చెరగా వున్న దేశ 38
మందు తమ నిండు హృదయముతోనున్ను తమ నిండు
ఆత్మతోనున్ను నీ యొద్దికి మళ్లుకొని, తమ పితృలకు
యిచ్చిన తమ దేశానకున్ను నీవు యేర్పరచుకొన్న
యీ పట్టణమునకున్ను నీ నామము కొరకు నేను కట్టిం
చిన యీ యింటికిన్ని తిన్నగా నిన్ను దృష్టించి విన్న
పము చేస్తే, । నీ నివాస స్థలమైన పరమండలములో 39
వుండే నీవు వాండ్ల విన్నపమునున్ను ప్రార్థనలనున్ను
ఆలకించి, వాండ్లకు న్యాయమును విచారించి, నీకు విరో
ధముగా పాపము చేసిన నీ జనులను మన్నించుము. ।
యిప్పుడు నా పరాత్పరుడా; యీ స్థలమందు చేయ 40
బోయే విన్నపమునకు నీ కన్నులు తెరచి వుండును
గాక; నీ చెవులు ఆలకించును గాక. । అయితే యిప్పుడు 41
నా పరాత్పరుడవైన వో యెహోవా, నీ బలముయొ
క్క పెట్టెతోకూడా లేచి, నీ విశ్రాంతి స్థలమందు
ప్రవేశించుము; పరాత్పరుడవైన వో యెహోవా, నీ
అర్చకులు రక్షణమును ధరించుకొని, నీ భక్తులు వుప
కారమందు సంతోషింతురు గాక. । పరాత్పరుడవైన వో 42
యెహోవా, నీవు నీ అభిషిక్తుడైన వాని ముఖమును
తిప్పకుము; నీవు నీ భక్తుడైన దావీదుకు వాగ్దత్తము
చేసిన కృపలు జ్ఞాపకము చేసుకొనుమని పలికెను.

## 7. అధ్యాయము.

1 అయితే సొలొమోను ప్రార్థన చేసుట సమాప్తి
పర్చేనప్పుడు అగ్ని ఆకాశమునుంచి దిగి, దహన బలి
నిన్ని కొదువ బలులనున్ను దహించి వేసినది, యెహో
2 వా మహిమతో యిల్లు నిండెను. । యెహోవా మహి
మతో యిల్లు నిండినందున అర్చకులు యెహోవా
3 యింట్లోకి ప్రవేశించ లేకుండా వుండిరి. । అయితే
అగ్నిన్ని యెహోవా మహిమయున్ను యింటి మీదికి
యేలాగు దిగెనో అది ఇశ్రాయేలు పుత్రులందరున్ను
చూచినప్పుడు వారు నేల మట్టుకు తమ ముఖములు
వంచుకొని, యెహోవా వుత్తముడు, ఆయన కృప
యెప్పటికిన్ని వున్నదని, ఆయనను మ్రొక్కి స్తుతించి
4 నారు. । అప్పుడు రాజున్ను యావత్తు జనమున్ను యె
5 హోవా యెదుట బలులు చెల్లించినారు. । అప్పుడు
రాజు అయిన సొలొమోను యిరువై రెండు వేల పశు
వులనున్ను లక్ష యిరువై వేల గొర్రెలనున్ను బలిగా
అర్పించెను; యీ ప్రకారము రాజున్ను యావత్తు జను
6 లున్ను పరాత్పరుని యిల్లు ప్రతిష్ఠ చేసినారు. । అర్చ
కులు తమ సేవకావృత్తులు చేసి నిలిచినారు; లేవీయు
లున్ను రాజయిన దావీదు యెహోవా కృప యెన్న
టికిన్ని వున్నదని ఆయనను స్తుతించేటందుకున్ను వారి
చేత స్తుతించేటందుకున్ను కల్పించిన యెహోవా
గీత వాద్యములను వాయించి నిలిచినారు; అర్చకులు
వాండ్లకు యెదురుగా నిలిచి బూరగలు వూదినారు;
7 ఇశ్రాయేలులందరున్ను నిలువబడినారు. । మరిన్ని యె
హోవా యింటి ముందర వుండే ప్రాకారము
యొక్క మధ్య లోగిలిని సొలొమోను పరిశుద్ధము చేసి,
అక్కడ దహన బలులనున్ను సమాధాన బలుల కొవ్వ
నున్ను చెల్లించెను; యేమంటే సొలొమోను చేయిం
చిన యిత్తడి బలిపీఠము దహన బలులనున్ను మాంసా
ర్పణలనున్ను కొవ్వనున్ను పట్ట చాలకుండా వుం
8 డెను. । ఆ కాలమందు సొలొమోనున్ను వానితో
కూడా హమాత్తు సరిహద్దు మొదలుకొని మిస్రయీ
ము నది పర్యంతము కూడి వచ్చిన మహా గొప్ప సమూ
హమయిన ఇశ్రాయేలు యావత్తున్ను యేడు దినముల
9 పర్యంతము పండుగను ఆచరించి, । యెనిమిదో నాడు
పండుగను సమాప్తి పర్చినారు, యేమంటే యేడు దిన
ముల మట్టుకు బలిపీఠమును ప్రతిష్ఠ చేసి, యేడు దిన
10 ముల పండుగను ఆచరించినారు. । అయితే యేడో
నెల యిరువై మూడో దినమందు యెహోవా దావీ
దుకున్ను సొలొమోనుకున్ను ఆయన జనులయిన ఇశ్రా
యేలుకున్ను చేసిన మేలు విషయమై సంతోషముతో
నున్ను మనో వుత్సాహముతోనున్ను వారి వారి డేరా
లకు వెళ్లేటట్టు అతడు జనులకు సెలవు యిచ్చెను. ।
ఆ ప్రకారమే సొలొమోను యెహోవా యిల్లును 11
న్ను రాజు నగరునున్ను కట్టి, యెహోవా యింట్లో
నున్ను తన నగరులోనున్ను చేసేటందుకు యేమి మనస్సై
వున్నదో అది అంతానున్ను అతడు సమ కూర్చెను. ।
అప్పుడు యెహోవా రాత్రియందు సొలొమోనుకు 12
ప్రత్యక్షమై వానితో చెప్పినదేమంటే, నేను నీ
విన్నపమును విని యీ స్థలమును నాకు బలి అర్పించే
యిల్లుగా యేర్పరచుకొంటిని. । యిదుగో నేను వాన 13
లేకుండా ఆకాశమును మూసినట్టాయెనా, లేక దేశ
మును నాశనము చేసుటకు మిడతలకు సెలవు యిచ్చి
నా, లేక నా జనులయందు తెగులైనా రా చేసినప్పు
డు, । నాయొక్క నామముచేత పిలువబడిన నాయొ 14
క్క జన సమూహములు తమ్ము తాము తగ్గించుకొని
ప్రార్థన చేసి నా ముఖమును వెతికి తమ చెడ్డ మార్గ
ములను విడిచితే, అప్పుడు పరమండలములో వుండే
నేను విని, వాండ్ల పాపమును క్షమించి, వాండ్ల దేశ
మును స్వస్థపరుతును. । యిప్పుడు యీ స్థలమందు 15
చేయబోయే ప్రార్థనకు నా కన్నులు తెరిచి వుం
డును, నా చెవులు ఆలకించును. । యిప్పుడు నాయొ 16
క్క నామము యీ యింటియందు యెన్నటికిన్ని వుం
డేటట్టుగా నేను దాన్ని యేర్పరచుకొని పరిశుద్ధము
చేస్తిని; నా కన్నులున్ను నా హృదయమున్ను యెన్న
టికిన్ని అక్కడనే వుండును. । అయితే నీ తండ్రి 17
అయిన దావీదు నడిచినట్టుగాను నీవున్ను నా ముందర
నడిచి, నేను నీకు ఆజ్ఞాపించిన ప్రకారము అంతా
నున్ను చేసి, నాయొక్క కట్టడలనున్ను నాయొక్క
న్యాయములనున్ను గైకొన్నట్టయితే, । అప్పుడు ఇశ్రా 18
యేలును యేలేటందుకు పురుషుడు నీకు వుండక పోడని
నేను నీ తండ్రి అయిన దావీదుతో వొడంబడికె చేసి
నట్టుగానే నీ రాజ్య సింహాసనమును దృఢపరుతును. ।
అయితే మీరు త్రోవ తప్పి, నేను మీ ముందర వుం 19
చిన నాయొక్క కట్టడలనున్ను నాయొక్క నిబంధనల
నున్ను విడిచి పెట్టి, వేరే దేవుండ్లను సేవించి వాటిని
కొలిచినట్టయితే, । నేను వాండ్లకు యిచ్చిన నా దేశ 20
ములోనుంచి వాండ్లను పెల్లగించి, నా నామము కొరకు
నేను పరిశుద్ధము చేసిన యీ యిల్లును నా సముఖము
నుంచి తోసివేసి, దాన్ని యావత్తు జన సమూహముల
యందు పాదుగానున్ను ఖిలముగానున్ను వుంతును. ।
అప్పుడు వున్నతముగా వున్న యీ యింటి దరిని వెళ్లే 21
మార్గస్థులందరున్ను భ్రమసి, యెహూవా యీ దేశ
మునకున్ను యీ యింటికిన్ని యీ ప్రకారముగా యెం
దుకు చేసినాడని అడిగినందుకు, । వాండ్లు తమ పితృ 22
లను మిస్రయీము దేశమునుంచి బైలు వెళ్ల చేసిన

వాండ్ల పరాత్పరుడైన యెహోవాను విడిచి పెట్టి,
వేరే దేవుండ్లను వెంబడించి, వాటికి నమస్కరించి,
వాటిని సేవించినందున యెహోవా యీ కీడంతా
నున్న వాండ్ల మీద రాచేసినాడని ప్రత్యుత్తరము
చెప్పుదురని చెప్పెను.

## 8. అధ్యాయము.

1 అప్పుడు సంభవించినదేమంటే, సొలొమోను
యెహోవా యిల్లునున్న తన యిల్లునున్న కట్టించిన
2 యిరువై సంవత్సరములు గతించిన తరువాత, । హీరా
ము తనకు తిరిగీ యిచ్చిన పట్టణములను సొలొమోను
కట్టించి వాటి యందు ఇశ్రాయేలు పుత్రులను కాపు
3 రముగా వుంచెను. । తరువాత సొలొమోను హమాతు
సొబా అనే స్థలముకు పోయి దాన్ని జయించెను. ।
4 అతడు వనాంతరమందుండే తద్మోరునున్న హమాతు
దేశనుందు ఖజానా వుంచే పట్టణములను అన్నిటినిన్ని
5 కట్టించెను । మరిన్ని అతడు పై బేథోరోనునున్న దిగువ
బేథోరోనునున్న తలుపులతోనున్న ద్వారబంధముల
తోనున్న గడలుతోనున్న బలపరచబడిన పట్టణము
6 లుగా కట్టి; । బయలతునున్న తనకు వుండే ఖజానా
లను వుంచే యావత్తు పట్టణములనున్న రథములు
వుంచే పట్టణములనున్న గుర్రపు రౌతులయొక్క పట్ట
ణములనున్న తాను యెరూశలేము యందున్న లెబా
నోను యందున్న తాను యేలే దేశములంతటి యం
దున్న కట్టేటందుకు తనకు యేది యిష్టమో అదం
7 తాను సొలొమోను కట్టించెను. । అయితే ఇశ్రాయే
లు సంబంధము కాని హిత్తీయులలోనుంచిన్ని ఎమో
రీయులలోనుంచిన్ని పెరిజ్జీయులలోనుంచిన్ని హీవీ
యులలోనుంచిన్ని యెబూసీయులలోనుంచిన్ని శే
8 షించి వున్న సకల జనులున్ను, । వాండ్ల తరువాత
ఇశ్రాయేలు పుత్రులు నాశము చేయక వదిలివేసిన
వారి పుత్రులున్ను సొలొమోను యిది పర్యంత
మున్ను పన్ను యిచ్చే వారుగా నిర్ణయించెను. ।
9 అయితే ఇశ్రాయేలు పుత్రుల యందు వొకరినైనా
సొలొమోను తన పని చేసుటకు నిర్ణయించ లేదు,
యేమంటే వీరు యుద్ధపు మనుష్యులున్న వాని అధి
పతులలో శ్రేష్ఠులున్న వాని రథాలకున్న గుర్రపు
10 రౌతులకున్న అధిపతులున్న అయి వుండిరి. । వీరు
రాజు అయిన సొలొమోను అధిపతులలో శ్రేష్ఠులైన
యిన్నూట యేభయి మంది; వీరు జనుల మీద అధికా
11 రము చేసేవారు. । అయితే ఫరో కుమార్తెను సొలొ
మోను దావీదు పట్టణమునుంచి తాను ఆమెకు కట్టిం
చిన యింటికి రా చేయించెను, యేమంటే ఇశ్రాయేలు
రాజయిన దావీదు యింటిలో నా భార్య నివాసము
చేయరాదు, యేమంటే యెహోవా పెట్టె వచ్చి
వున్న స్థలములు పరిశుద్ధమైనవై యున్నవని చెప్పెను.।
అది మొదలుకొని సొలొమోను తాను మంటపము 12
ముందర కట్టించి వున్న యెహోవా బలిపీఠము మీద
వొక్కొక దినము కట్టడకు తగినట్టుగా, । మోషేయొక్క 13
ఆజ్ఞా ప్రకారము సబ్బాతు దినముల యందున్న అమా
వాస్యల యందున్న పరిశుద్ధ వుత్సవముల యందున్న
సంవత్సరమునకు మూడు మారులు పులుసు లేని రొ
ట్టెలయొక్క పండుగ యందున్న వారముల పండుగ
యందున్న గుడారముల పండుగ యందున్న యె
హోవాకు దహన బలులను చెల్లించెను. । అతడు తన 14
తండ్రియైన దావీదుయొక్క ప్రమాణము ప్రకారము
వారి వారి వరసల చొప్పున అర్చకులను వారి సేవ
కున్న వొక్కొక దినము కట్టడ ప్రకారము అర్చ
కుల ముందర స్తుతిన్ని పరిచారమున్న చేసే వంతుల
చొప్పున లేవీయులకున్న ప్రతి ద్వారమందూ కావలి
యుండేటందుకు వారి వారి వంతుల చొప్పున ద్వార
పాలకులకున్న నిబంధన చేసెను; దైవ జనుడైన దావీదు
యీ ప్రకారము నిర్ణయించి వుండెను. । వారు యే 15
కార్యము గురించియైనా బొక్కసముల విషయమైన
కార్యమును గురించి అయినా రాజు అర్చకులకున్న
లేవీయులకున్న యిచ్చిన కట్టడను తొలగకుండా వుం
డిరి. । యీ ప్రకారమే యెహోవా యింటికి అస్తి 16
భారము వేయపడిన దినము మట్టుకున్న అది సంపూ
ర్ణమయ్యే మట్టుకున్న సొలొమోను పని అంతా
చేయించెను; యెహోవా యిల్లు యీలాగున సమాప్తి
పర్చబడెను. । తరువాత సొలొమోను ఏదోము దేశ 17
ముయొక్క సముద్రపు దరిని వున్న యెస్యోన్గెబెరు
కున్న ఏలతుకున్న పోయెను. । అప్పుడు హీరాము 18
తన సేవకుల ముఖాంతరముగా వోడలనున్న సముద్ర
ప్రయాణము యెరిగిన పని వాండ్లనున్న అంపెను.
వీండ్లు సొలొమోను పని వాండ్లతో కూడా ఓఫీరుకు
పోయి, అక్కడనుంచి నన్నూట యేభయి తలాంతుల
బంగారమును యెక్కించి రాజయిన సొలొమోను
యొద్దకు కొంచవచ్చినారు.

## 9. అధ్యాయము.

అయితే షెబ దేశముయొక్క రాణి సొలొమోను 1
కీర్తి విన్నప్పుడు సొలొమోనును కఠినమైన ప్రశ్నల
చేత శోధించేటందుకు మహా గొప్ప దండుతోనున్న
గంధవర్గములున్న బహు బంగారమున్న ప్రశస్త
మైన రత్నములున్న మోసిన వొంటెలతోనున్న యె
రూశలేముకు వచ్చెను; ఆమె సొలొమోను వొద్దికి
వచ్చినప్పుడు తన మనస్సు యందు వుండినదంతానున్న

2 వానితో తెలియచేసెను. । అప్పుడు సొలొమోను ఆమె
ప్రశ్నలు అన్నిన్ని ఆమెకు విడదీసి చెప్పెను; ఆమెకు
చెప్పకుండా సొలొమోను యేదిన్ని దాచి పెట్టలేదు. ।
3 షెబ దేశపు రాణి సొలొమోనుయొక్క జ్ఞానమున్ను,
4 అతను కట్టించిన యిల్లున్ను, । అతని మేజ భోజనము
న్ను, అతని సేవకులు కూర్చుండుటయున్ను, అతని
పని వాండ్ల వరుసనున్ను, వాండ్ల వస్త్రములున్ను, అత
నికి గిన్నె అందిచ్చే వాండ్లనున్ను, వాండ్ల వస్త్రములు
న్ను, యెహోవా యింటికి అతను యెక్కిపోయే
మార్గమున్ను చూచేటప్పుడు, ఆమె భ్రమసి, రాజు
5 తో చెప్పినదేమంటే, । మీ కార్యములను గురించిన్ని
మీ జ్ఞానమును గురించిన్ని నేను నా దేశమందు విన్న
వర్తమానము నిజమే గాని నేను వచ్చి దాన్ని కండ్లార
చూచే పర్యంతము వాండ్ల మాటలు నమ్మకుండా వుం
6 టిని; । అయితే యిదుగో మీ గొప్ప జ్ఞానము గురించి
సగమైనా వాండ్లు నాకు తెలుపలేదు; నేను మిమ్మును
గురించి వినిన దానికంటే మీ కీర్తి అధికముగా వు
7 న్నది. । మీ మనుష్యులు భాగ్యవంతులు; యెప్పుడున్ను
మీ ముందర నిలిచి మీ జ్ఞానమును వినే యీ మీ సేవ
8 కులు భాగ్యవంతులు. । మీ పరాత్పరుడైన యెహో
వాముందర మీరు రాజై వుండేటట్టుగా మిమ్మును తన
సింహాసనము మీద వుండేటట్టు మీ మీద ప్రీతి వుం
చిన మీ యొక్క పరాత్పరుడైన యెహోవా స్తోత్ర
ము చేయబడ తగినవాడు; మీ పరాత్పరుడు ఇశ్రాయే
లును యెన్నటికిన్ని స్థిర పర్చేటట్టుగా స్నేహించినం
దువల్ల ఆయన మిమ్మును నీతి న్యాయములను జరిగించే
టందుకు వాండ్ల మీద రాజుగా వుంచినాడని పలి
9 కెను. । ఆమె రాజుకు నూటయిరువై తలాంతుల బంగా
రమునున్ను విస్తారమయిన గంధ వర్గములనున్ను రత్న
ములనున్ను యిచ్చెను; షెబ దేశపు రాణి రాజైన సొ
లొమోనుకు యిచ్చినటువంటి గంధ వర్గములతో
10 సమానమైనది యేదిన్నిలేదు. । యిదిగాక ఓఫీరునుంచి
బంగారము కొంచ వచ్చిన హీరాము పనివాండ్లున్ను
సొలొమోను పనివాండ్లున్ను అల్మగీము వృక్షములున్ను
11 ప్రశస్తమైన రత్నములుకూడా కొంచవచ్చినారు. । ఆ
అల్మగీము చెట్లచేత రాజు యెహోవా యింటికిన్ని
రాజు నగరుకున్ను త్రోవలున్ను గాయకులకు తంబుర
లున్ను వీణెలున్ను చేయించెను; అటువంటివి అంతకు
ముందు యూదా దేశమందు యెవడైనా చూడలేదు. ।
12 అయితే షెబ దేశపు రాణి రాజుకు కొంచ వచ్చినవి
గాక ఆమె కోరి అడిగినదంతానున్ను రాజైన సొలొ
మోను ఆమెకు యిచ్చెను; తరువాత ఆమె తన సేవకు
లతో కూడా మళ్లుకొని తన దేశానకు వెళ్లిపోయెను. ।
13 యిప్పుడు గంధ వర్గములు అమ్మే వర్తకులున్ను వేరే
వర్తకులున్ను కొంచ వచ్చే బంగారముగాక సొలొ
మోనుకు సంవత్సరముకు వచ్చే బంగారము ఆరునూట
అరువై ఆరు తలాంతుల యెత్తై వుండెను. । అరబి దేశ 14
పు యావత్తు రాజులున్ను ఆ దేశపు ప్రభువులతో కూ
డా సొలొమోనుకు బంగారమున్ను వెండిన్ని కొంచ
వచ్చినారు. । రాజైన సొలొమోను సుత్తెతో కొట్టిన 15
బంగారముతోను అలుగులు గల యిన్నూరు డాళ్లను చే
యించెను; వొక్కొక డాలుకు ఆరునూరు షెకేలుల యెత్తు
బంగారము కలిగి యుండెను. । మరిన్ని సుత్తెతో కొట్ట 16
బడిన బంగారముతో మున్నూరు కేడెములను చేయిం
చెను; వొక్కొక కేడెముకు మున్నూరు షెకేలుల యెత్తు
బంగారము కలిగి వుండెను; వాటిని రాజు లెబానోను
అరణ్యపు మందిరమందు వుంచెను. । మరిన్ని రాజు దంత 17
ముతో వొక గొప్ప సింహాసనమును చేయించి, దాని
ప్రశస్తమైన బంగారముతో పొదిగించెను. । ఆ సింహాస 18
నమునకు ఆరు బంగారపు సోపానములు గలవు; సింహా
సనమునకు కట్టి వున్న బంగారపు పాద పీఠము కద్దు; ఆస
నముకు యీతట్టున్ను ఆ తట్టున్ను వూతలు కలవు; ఆ వూ
తలు దగ్గిర రెండు సింహములు వుండెను. । ఆ ఆరు సో 19
పానముల మీద యీ తట్టున్ను ఆ తట్టున్ను పండ్రెండు
సింహములు నిలిచి వుండెను; యే రాజ్యమందైనా ఆలా
టిది చేయబడుట లేదు. । మరిన్ని రాజైన సొలొమో 20
నుకు వున్న పాన పాత్రలన్నిన్ని బంగారపువై వుండెను;
లెబానోను అరణ్యపు మందిర వస్తువులన్నిన్ని బంగా
రపువై వుండెను; వెండిది వొకటీ లేదు; యేమంటే సొ
లొమోను దినములలో వెండి తక్కువగా యెంచబ
డెను. । యేమంటే హీరాముయొక్క పనివాండ్లతో కూ 21
డా రాజు వోడలు తర్షీషుకు వెళ్లి, మూడు సంవత్స
రములకు వొక మారు తిరిగీ బంగారమునున్ను వెండినిన్ని
ఏనుగ దంతమునున్ను కోతులనున్ను నెమలి పిట్టలనున్ను
కొంచవస్తూ వుండేవి. । యీ ప్రకారమే రాజైన సొలొ 22
మోను భూ రాజులందరికంటే ఐశ్వర్యమందున్ను జ్ఞాన
మందున్ను గొప్పవాడై వుండెను. । పరాత్పరుడు సొలొ 23
మోనుయొక్క హృదయమందు వుంచిన జ్ఞానమును వినే
టందుకు భూ రాజులందరున్ను వాని ముఖ దర్శన
మును వెతికినారు. । మరిన్ని ప్రతివాడు ప్రతి సంవత్స 24
రమున్ను తన కానుకగా వెండి వస్తువులనున్ను బంగా
రపు వస్తువులనున్ను వస్త్రాలనున్ను ఆయుధములనున్ను
గుర్రపు సామానునున్ను గంధ వర్గములనున్ను గుర్ర
ములనున్ను కంచర గాడిదెలనున్ను కొంచ వచ్చేవారు. ।
మరిన్ని సొలొమోనుకు నాలుగు వేల గుర్రపు శాల 25
లున్ను రథములున్ను వుండెను; పండ్రెండు వేల గుర్రపు
రౌతులున్ను వుండిరి; వాట్లనున్ను వీండ్లనున్ను రాజు

రథముల పట్టణములలోనున్ను యెరూశలేము యందు
26 తన యొద్దనున్ను వుంచెను. । మరిన్ని యేరు మొదలు
కొని ఫెలిష్తీయుల దేశము మట్టుకున్ను మిస్రయీము
పొలిమేర మట్టుకున్ను వుండే యావత్తు రాజుల పైగా
27 అతడు యేలుబడి చేసెను. । రాజు యెరూశలేముయందు
వెండి రాళ్లవలెనున్ను, ఆజ్ఞా చెట్లు పల్లపు భూమి యం
దున్న రావిచెట్ల వలెనున్ను, విస్తారముగా చేసెను. ।
28 మిస్రయీమునుంచిన్ని సకలదేశములనుంచిన్ని సొలొ
29 మోనుకు గుర్రములు కొంచ రాబడెను. । అయితే సొ
లొమోను చేసిన ముందు కార్యములున్ను వెనుక కార్య
ములున్ను దీర్ఘదర్శియైన నాతానుయొక్క పుస్తకమం
దున్ను, నెబాథు కుమారుడయిన యారొబామును గు
రించి షీలోనీయుడైన అహీయా వ్రాసిన దీర్ఘదర్శ
నమందున్ను, జ్ఞానదృష్టి పురుషుడయిన ఇద్దోయొక్క
30 దర్శనముల యందున్ను వ్రాసి వున్నవి గదా? । సొలొ
మోను యెరూశలేము యందు యావత్తు ఇశ్రాయే
లుల పైగా నలుబై సంవత్సరములు యేలుబడి చేసె
31 ను. । తరువాత సొలొమోను తన పితృలతో కూడా
నిద్రపొందెను; వానిని వాని తండ్రియైన దావీదు పట్ట
ణమందు పాతి పెట్టినారు; వానికి బదులుగా వాని
కుమారుడైన రెహొబాము రాజు ఆయెను.

## 10. అధ్యాయము.

1 అప్పుడు రెహబాము షెఖెముకు వెళ్లెను, యెందు
కంటే వాణ్ని రాజును చేసేటందుకు ఇశ్రాయేలు అం
2 తానున్ను షెఖెముకు వచ్చెను. । రాజైన సొలొమో
నును విడిచి పారిపోయి మిస్రయీములో వుండే
నెబాథు కుమారుడైన యారొబాము అది వినినప్పుడు
3 వాడు మిస్రయీమునుంచి తిరిగీ వచ్చెను. । అప్పుడు
వారు వాని పిలిపించినారు; కాగా యారొబామున్ను
ఇశ్రాయేలంతానున్ను యేకముగా వచ్చి, రెహబాము
4 తో మాట్లాడి, । మీ తండ్రీ మాకాడిని కఠినము చేసెను,
యిప్పుడు మీరు మీ తండ్రియొక్క కఠినమైన దాస
త్వమున్ను ఆయన మా మీద వుంచిన ఆయన భార
మైన కాడినిన్ని చులకన చేయండి, అప్పుడు మిమ్ము
5 సేవింతుమని చెప్పినారు. । అంతట వాడు వీరితో
మీరు మూడు దినముల తరువాత తిరిగీ నా యొద్దికి
రండని చెప్పెను; ఆలాగే జనులు వెళ్లిపోయిరి. ।
6 అప్పుడు రాజైన రెహబాము తన తండ్రియైన సొలొ
మోను ప్రాణముతో వుండగా వాని ముందర నిలువ
పడిన పెద్దలతో ఆలోచనచేసి, యీ జనులకు యేమి
ప్రత్యుత్తరము యివ్వ మీరు ఆలోచన చెప్పుతూ
7 వున్నారు అని అడిగెను. । అందుకు వారు వానితో
మీరు యీ జనులకు దయనున్ను పక్షమునున్ను కను
పరిచి, వాండ్లకు మంచి మాటలు చెప్పితే, వారు యె
ప్పటికిన్ని మీకు సేవకులై వుందురని చెప్పినారు. ।
అయితే వాడు పెద్దలు తనకు యిచ్చిన ఆలోచన విడిచి 8
పెట్టి, తనతో కూడా పెరిగిన వాండ్లున్ను తన ముం
దర నిలువపడే వాండ్లున్ను అయిన పడుచు వాండ్లతో
ఆలోచనచేసి, । వాండ్లతో మీ తండ్రి మా మీద 9
వుంచిన కాడిని చులకన చేయుమని నాతో చెప్పిన
యీ జనులకు మారుత్తరము యివ్వ మీరు యేమి ఆలో
చన చెప్పుతున్నారని చెప్పెను. । వానితో పెరిగిన 10
పడుచువాండ్లు వానితో చెప్పినదేమంటే, మీ తండ్రి
మా కాడిని బరువు చేసినాడు మీరు దాన్ని చులకన
చేయండని మీతో చెప్పిన యీ జనులకు మీరు చెప్ప
వలసినదేమంటే, నా చిటికిన వ్రేలు నా తండ్రియొక్క
నడుముకంటే గొప్పదిగా వుండును. । యిప్పుడు నా 11
తండ్రి భారమైన కాడి మీ మీద మోపినాడు, నేను
మీ కాడిని మరింత భారము చేతును; నా తండ్రి
మిమ్మును కొరడాలతో దండించినాడు, అయితే నేను
తేళ్లతో మిమ్మును దండింతునని చెప్పుదురు గాకని
చెప్పినారు. । మూడో దినమందు నా యొద్దికి తిరిగీ 12
రండని రాజు చెప్పిన ప్రకారమే యారొబామున్ను
యావత్తు జనులున్ను మూడో దినమందు రెహబాము
యొద్దికి వచ్చినంతట, । రాజు వాండ్లకు కఠినమైన 13
ప్రత్యుత్తరము యిచ్చెను, యేమంటే, రాజయిన రెహ
బాము పెద్దల ఆలోచన విడచిపెట్టి పడుచువాండ్ల
ఆలోచన ప్రకారమే వాండ్లతో మాట్లాడి, । మా 14
తండ్రి మీ కాడిని బరువు చేసినాడు, నేను దాన్ని
మరింత బరువు కాచేతును; మా తండ్రి మిమ్మును కొర
డాలతో దండించినాడు, నేను మిమ్మును తేళ్లతో
దండింతునని చెప్పి; । రాజు జనులను ఆలకించకుండా 15
పోయెను, యేమంటే యెహోవా షీలోనీయుడయిన
అహీయా వల్లను నెబాథు కుమారుడైన యారొబా
ముకు చెప్పిన తన మాటను దృఢ పరచేటట్టుగా పరా
త్పరుని వల్ల యీలాగున నిర్ణయించబడెను. । రాజు 16
తమకు చెవినివ్వక పోవడము జనులు చూచి రాజుకు
ప్రత్యుత్తరముగా దావీదుతో కూడా మాకు భాగము
యేది? యెష్షై కుమారుని వద్దను మాకు స్వాస్థ్యము
లేదు; ఇశ్రాయేలులారా, మీ గుడారములకు పొండి;
దావీదూ, నీ యిల్లు చూచుకొమ్మని చెప్పి, ఇశ్రాయేలు
యావత్తున్ను తమ తమ యిండ్లకు వెళ్లినారు. । అయితే 17
యూదా పట్టణముల యందు కాపురము వుండే
ఇశ్రాయేలు పుత్రుల మీద రెహబాము రాజై వుం
డెను. । అప్పుడు రాజయిన రెహబాము పన్ను విచా 18
రణకాడయిన హదోరామును పంపెను; అయితే ఇశ్రా
యేలు పుత్రులు వాని చనిపోయేటట్టుగా రాళ్లు వేసి

నారు; అయితే రాజయిన రెహబాము యెరూశలే
ముకు పారిపోయేటందుకు తీవరముగా రథము మీదికి
19 యెక్కి పోయెను. । ఆ ప్రకారమే ఇశ్రాయేలు యింత
పర్యంతమున్ను దావీదు యింటి మీద తిరుగుబాటు
చేసెను.

## 11. అధ్యాయము.

1 రెహబాము యెరూశలేముకు వచ్చినప్పుడు ఇశ్రా
యేలుతో యుద్ధము చేసుటకున్ను రాజ్యము రెహ
బాము అనే తనకు తిరిగీ తిప్పుకొనుటకున్ను అతడు
యూదా యింటి వారిలోనుంచిన్ని బెన్యా మీను
గోత్రపు వారిలోనుంచిన్ని యుద్ధము చేసుటకు తెలివి
గలిగినటువంటిన్ని యెంచబడినటువంటిన్ని లక్ష యె
2 నభై వేలమందిని కూచుర్చుకొనెను. । అయితే దైవ జను
డైన షెమయాకు యెహోవా మాట వచ్చెను, అది
3 యేదంటే, । నీవు యూదా రాజున్ను సొలొమోను
కుమారుడున్ను అయినటువంటి రెహబాముతోనున్ను
యూదా యందున్ను బెన్యామీను యందున్ను వుండే
యావత్తు ఇశ్రాయేలుతోనున్ను చెప్పవలసినదేమంటే, ।
4 మీరు యెక్కి పోకుండానున్ను మీ సహోదరులతో
యుద్ధము చేయకుండానున్ను ప్రతివాడు తన తన
యింటికి తిరగండి, యేమంటే మావల్లను యీ కార్య
ము ఆయెనని యెహోవా చెప్పుతూ వున్నాడని
చెప్పుమని చెప్పిరి; అప్పుడు వాండ్లు యెహోవా
మాటలను విని, యారొబాముకు విరోధముగా యు
5 ద్ధము చేయక తిరిగీ వెళ్లిపోయినారు. । అయితే రెహ
బాము యెరూశలేము యందు నివాసముగా వుండి,
యూదాయందు గొప్ప పట్టణములను కట్టించెను. ।
6 వాడు బేత్లెహేమున్ను, ఏథామున్ను, తెకోవయున్ను, ।
7 బేత్సూరున్ను, షోకోయున్ను, అదుల్లామున్ను, ।
8,9 గాతున్ను, మారీషాయున్ను, జీఫున్ను, । అదోరయీ
10 మున్ను, లాకీషున్ను, అజేకావున్ను, । సోరాయున్ను,
అయాలోనున్ను, హెబ్రోనున్ను, అనే యూదా
బెన్యామీను యందు వుండే అతిశయమైన పట్టణము
11 లను కట్టించి, । దుర్గములను బలపరచి, వాటిలో
అధిపతులనున్ను ఆహారమునున్ను నూనెనున్ను ద్రాక్ష
12 పండ్ల రసమునున్ను వుంచెను. । మరిన్ని ప్రతి యొక పట్ట
ణమందు డాలులనున్ను బల్లెములనున్ను వుంచి, వా
ట్లను బహు బలముగా చేసెను; ఆ ప్రకారమే
యూదాయున్ను బెన్యామీనున్ను వాని పక్షమున
13 వుండెను. । ఇశ్రాయేలు అంతటానున్ను వుండే అర్చకు
లున్ను లేవీయులున్ను తమ యావత్తు పొలిమేరలలో
14 నుంచి వానియొద్దికి వచ్చి చేరినారు. । యేమంటే లేవీ
యులు తమ పేటలనున్ను తమ స్వాస్థ్యములనున్ను
విడిచి, యూదా దేశమునకున్ను యెరూశలేముకున్ను
వచ్చినారు; యేమంటే యారొబామున్ను వాని కుమా
ళ్లున్ను వాండ్లను యెహోవాకు అర్చకపు సేవ
చేయకుండా తోసివేసినారు. । వాడు వున్నతమైన స్థల 15
ముల నిమిత్తమున్ను దయ్యముల నిమిత్తమున్ను తాను
చేయించిన దూడల నిమిత్తమున్ను తనకు అర్చకులను
నిర్ణయించెను. । వాండ్ల తరువాత ఇశ్రాయేలు గోత్ర 16
ముల యందు అంతటానున్ను ఇశ్రాయేలు పరాత్పరు
డైన యెహోవాను వెతికేటందుకు తమ హృదయ
మును దృఢపరచుకున్నవాండ్లు తమ పితృలయొక్క
పరాత్పరుడైన యెహోవాకు బలి యిచ్చేటట్టుగా
యెరూశలేముకు వచ్చినారు. । ఆ ప్రకారము మూడు 17
సంవత్సరముల పర్యంతము వారు యూదా రాజ్య
మును బలపరచి, సొలొమోను కుమారుడైన రెహబా
మును దృఢపరచినారు, యేమంటే దావీదున్ను సొలొ
మోనున్ను నడిచిన మార్గమందు మూడు సంవత్సర
ముల పర్యంతము వారు నడిచినారు. । రెహబాము 18
దావీదు కుమారుడైన యెరీమోతు కుమార్తె అయిన
మాహలతున్ను యెష్షైయొక్క కుమారుడైన ఏలీయాబు
కుమార్తె అయిన హయీలునున్ను వివాహము చేసు
కొనెను. । వారు వానికి యెవూషున్ను షమర్యాయున్ను 19
జాహామున్ను అనే పిల్లలను కనిరి. । దీని తరువాత వాడు 20
అబ్షాలోము కుమార్తెయైన మయఖాను వివాహము
చేసుకొనెను, యిది వానికి అబీయానున్ను అత్తయి
నిన్ని జీజానున్ను షెలోమీతునున్ను కనెను. । రెహ 21
బాము తన యావత్తు స్త్రీల కంటేనున్ను వుపపత్నుల
కంటేనున్ను అబ్షాలోము కుమార్తెయైన మయఖాను
స్నేహించెను, యేమంటే వాడు పద్దెనమండ్రుగురు
పెండ్లాములనున్ను అరువై మంది వుపపత్నులనున్ను
తీసుకొని, యిరువై యెనిమిది మంది కుమారులనున్ను,
అరువైమంది కుమార్తెలనున్ను కనెను. । రెహబాము 22
మయఖాయొక్క కుమారుడైన అబీయాను వాని సహో
దరులలో శ్రేష్ఠుడుగానున్ను పెద్దగానున్ను వుంచెను,
యేమంటే వీని వాడు రాజుగా చేయ తలంచెను. ।
వాడు బుద్ధిగా నడుచుకొని తన యావత్తు పుత్రులలో 23
నున్ను కొందరిని యూదా బెన్యామీనుయొక్క యా
వత్తు దేశములలో వుండే యావత్తు గొప్ప పట్టణముల
యందున్ను యేర్పరచి వుంచి, వాండ్లకు విస్తారమైన
ఆహారము యిచ్చెను; మరిన్ని వాడు అనేకమైన పెం
డ్లాములను యిచ్చయించెను.

## 12. అధ్యాయము.

అప్పుడు సంభవించినదేమంటే, రెహబాము రాజ్య 1
మును దృఢపరచి తన్ను బలపరచుకొన్న తరువాత వాడు

న్ను వానితో కూడాం ఇశ్రాయేలు యావత్తున్నుయేకమై,
యెహోవాయొక్క న్యాయ ప్రమాణమును విడిచి
2 పెట్టినారు. । అయితే వాండ్లు యెహోవాకు విరోధము
గా ద్రోహము చేసినందున రాజైన రెహబాముయొక్క
అయిదో సంవత్సరమందు మిస్రయీము రాజైన షీషకు
వెయిన్ని యిన్నూరు రథాలతోనున్ను అరువై వేల
గుర్రపు రౌతులతోనున్ను యెరూశలేముకు విరోధ
3 ముగా యెక్కి వచ్చెను; । వానితో కూడా మిస్రయీము
నుంచి వచ్చిన లూబీయులు సుక్కీయులు కుషీయు
లున్ను అనే జనులు యెంచ శక్యము కాకుండా వుం
4 డిరి. । వాడు యూదాకు సమీపమైన గొప్ప పట్ట
ణములను పట్టుకొని యెరూశలేము మట్టుకున్ను వచ్చె
5 ను. । అప్పుడు షెమయా అనే దీర్ఘదర్శి రెహబాము
వద్దికిన్ని షీషకు నిమిత్తము యెరూశలేము యందు
వచ్చి కూడియున్న యూదాయొక్క ప్రభువుల వద్ది
కిన్ని వచ్చి వాండ్లతో మీరు నన్ను విడిచిపెట్టితిరి
గనుక నేను మిమ్మును షీషకు చేతిలో పడేటట్టుగా
విడిచివేస్తినని యెహోవా చెప్పుతున్నాడని చెప్పెను. ।
6 అప్పుడు ఇశ్రాయేలు ప్రభువులున్ను రాజున్ను తమ్ము
తగ్గించుకొని, యెహోవా నీతి కలవాడని పలికినా
7 రు. । వాండ్లు తమ్ము తగ్గించుకొనిరని యెహోవా చూ
చినప్పుడు యెహోవా మాట షెమయాకు వచ్చెను,
యేమంటే వారు తమ్మును తాము తగ్గించుకొన్నారు
గనుక నేను వాండ్లను నాశనము చేయక నా వుగ్ర
ము షీషకు ద్వారా యెరూశలేము మీద కుమ్మరించ
కుండా వాండ్లకు కొంచెము రక్షణ దయ చేస్తాను. ।
8 అయితే వారు నా సేవనున్ను దేశములయొక్క రాజుల
సేవనున్ను తెలుసుకొనేటట్టు వారు వానికి సేవ చేసే
9 వాండ్లవుదురు అని చెప్పెను. । ఆ ప్రకారమే మిస్ర
యీము రాజయిన షీషకు యెరూశలేము మీదికి
యెక్కి వచ్చి, యెహోవా యింటి బొక్కసములను
న్ను రాజు యింటి బొక్కసములనున్ను సకలమునున్ను
యెత్తుకొని, సొలొమోను చేయించిన బంగారపు కేడె
10 ములనున్ను తీసుకొని పోయెను. । వాటికి బదులుగా
రాజయిన రెహబాము యిత్తడి కేడెములను చేయించి,
వాటిని రాజుయొక్క ద్వారము కాచే సేవకులయొక్క
11 అధిపతుల చేతికి అప్పగించెను. । రాజు యెహోవా
యింట్లోకి ప్రవేశించినప్పుడెల్లా నగరి సేవకులు వచ్చి
వాట్లను యెత్తుకొని తరువాత తిరిగీ తమ గదిలో వుం
12 తురు. । వాడు తన్ను తగ్గించుకొన్నందున యెహో
వా వాని భొత్తిగా నాశనము చేయక, ఆయన తన
కోపము వానినుంచి తిప్పుకొనెను; యేమంటే యూదా
13 యందు యింకా కొన్ని సత్కార్యములు వుండెను. । ఆ
ప్రకారమే రాజైన రెహబాము యెరూశలేము యందు
తన్ను దృఢపరచుకొని యేలుబడి చేసెను, యేమంటే
రెహబాము యేలనారంభించినప్పుడు నలుబై వొక సంవ
త్సరములు గలవాడై వుండి, యెహోవా తన నామ
మును వుంచి ఇశ్రాయేలు గోత్రములన్నిటినుంచి యే
ర్పరచుకొన్న పట్టణమనే యెరూశలేముయందు పది
హేడు సంవత్సరములు యేలెను; వాని తల్లి పేరు నయ
మా; ఆమె అమ్మోనీయురాలై వుండెను. । వాడు చెడ్డ 14
క్రియలు చేసెను, యేమంటే వాడు తన హృదయము
యెహోవాను వెతికేటందుకు నిశ్చయించుకొన లేదు. ।
రెహబాము ముందటి నడతలున్ను వెనకటి నడతలున్ను 15
రెహబాముకున్ను యారొబాముకున్ను యావత్తు దిన
ములను వున్న పోరాటములున్ను షెమయా పుస్తకమం
దున్ను జ్ఞాన దృష్టి కలవాడైన ఇద్దోయొక్క వంశావళి
యందున్ను వ్రాసి వున్నవి. । రెహబాము తన పితృల 16
తో నిద్ర పొందిన తరువాత దావీదు పట్టణమందు
పాతి పెట్ట పడెను; వాని కుమారుడైన అబీయా వానికి
బదులుగా రాజు ఆయెను.

## 13. అధ్యాయము.

రాజైన యారొబాముయొక్క పద్దెనిమిదో సంవ 1
త్సరమందు అబీయా యూదా మీద యేలేటందుకు
ఆరంభించెను. । అతడు మూడు సంవత్సరములు యె 2
రూశలేము యందు యేలెను; అతని తల్లి పేరు మిఖా
య్యా; ఆమె గిబా వూరివాడైన ఊరీయేలు కుమా
ర్తెయై వుండెను. । అబీయాకున్ను యారొబాముకు 3
న్ను యుద్ధము కలిగినందున అబీయా యేర్పరచబడ్డ
నాలుగు లక్షల మంది పరాక్రమ వంతుల సైన్యమును
యుద్ధమునకు ఆయత్తము చేసెను; యారొబాము కూడా
యేర్పరచబడిన యెనిమిది లక్షల మంది పరాక్రమ
శాలులను వానికి యెదురుగా యుద్ధానకు నిలిపెను. ।
అప్పుడు అబీయా ఎఫ్రయీము కొండ దేశమందు 4
వుండే సెమారయీము పర్వతము మీద యెక్కి నిలచి
చెప్పినదేమంటే, ఓ యారొబామా, యావత్తు ఇశ్రా
యేలులారా, నాకు చెవి నొగ్గండి: । యెన్నటికిన్ని 5
ఇశ్రాయేలును యేలేటట్టుగా ఇశ్రాయేలుయొక్క పరా
త్పరుడైన యెహోవా దావీదుకున్ను వాని కుమాళ్ల
కున్ను వుప్పు వొడంబడికెగా యిచ్చెనని మీరు యెరుగ
వలసినది కాదా? । అయినప్పటికిన్ని దావీదు కుమారు 6
డైన సొలొమోనుయొక్క సేవకుడైన యారొబాము
అనే నెబాతు కుమారుడు లేచి తన యజమానునికి
విరోధముగా తిరుగుబాటు చేసెను. । మరిన్ని బెలియా 7
లుయొక్క పిల్లలైన వ్యర్థ మనుష్యులు వానితో కూడా
కలిసి, సొలొమోను కుమారుడైన రెహబాము యింకా
బాలుడుగానున్ను ధైర్యము లేని వాడుగానున్ను వాం

డ్లను యెదురించే శక్తి లేనప్పుడు అతనితో యుద్ధము
8 చేయుటకు బలపచుర్చుకొన్నారు. । యిప్పుడు దావీదు
యొక్క కుమాళ్ల చేతియందుండే యెహోవా రాజ్య
మునకు విరోధముగా మీరు బలపచుర్చుకొన వలెనని
తలంచుతూ వున్నారు; మీరు గొప్ప సమూహముగా
వున్నారు; మరిన్ని యారొబాము మీకు దేవుండ్లుగా
చేయించిన బంగారపు దూడలున్ను మీ యొద్ద వున్నవి.।
9 మీరు అహరోనుయొక్క కుమారులైన యెహోవా అ
ర్చకులనున్ను లేవీయులనున్ను తోసివేసి, అన్య దేశముల
జన సమూహముల వలె మీకు అర్చకులను కలుగజేసు
కోలేదా? ఫ్రెక దూడ పెయ్యతోనున్ను యేడు గొర్రె
పొట్టేళ్లతోనున్ను తన చేతిని నింపుకొని వచ్చే వాం
డ్లుండరున్ను దైవములు కాని వాటికి అర్చకులు అవు
10 తూ వున్నారే. । అయితే మాకు పరాత్పరుడైన యె
హోవా వున్నాడు; మేము ఆయనను విడిచిబెట్టి
తొలగలేదు; యెహోవాకు సేవ చేసే అర్చకులు
అహరోను కుమాళ్లేవే; వాండ్ల పనియందు కనిపెట్టే
11 వారు లేవీయులే. । వాండ్లు వుదయాస్తమానములున్ను
యెహోవాకు దహన బలులున్ను సుగంధ ధూప
వర్గమున్ను వేసి, శుద్ధమైన మేజ మీద యెదుట రొ
ట్టెలు వుంచడమున్ను దాని ప్రమిదెలతో కూడా
బంగారపు సెమ్మెను ప్రతి సాయంత్రము ముట్టించడ
మున్ను విచారిస్తూ వున్నారు; యేమంటే మేము మా
పరాత్పరుడైన యెహోవాకు కావలి చూపెట్టుకుం
టాము, అయితే మీరు ఆయనను విడిచిపెట్టి తొల
12 గితిరి. । యిదుగో పరాత్పరుడే మాతో కూడా మా అధి
పతిగా వున్నాడు; మీకు విరోధముగా ఆర్భటించే
టట్టుగా బూరగలు పట్టుకొని వూదేటందుకు ఆయన
అర్చకులు వున్నారు. ఇశ్రాయేలు పుత్రులారా, మీ
పితృలయొక్క పరాత్పరుడైన యెహోవాకు విరోధ
ముగా యుద్ధము చేయకండి, యేమంటే మీరు వృద్ధి
13 పొందరని చెప్పెను. । అయితే యారొబాము వాండ్లకు
వెనుకగా మనుష్యులు పొంచి వుండేటట్టుగా నిర్ణ
యించెను; ఆ ప్రకారమే యూదాకు ముందుగానున్ను
ఆ పొంచి వుండే వాండ్లు వారికి వెనుకగానున్ను వుం
14 డిరి. । యూదా తిరిగీ చూచేటప్పటికి యిదుగో యు
ద్ధము వాండ్లకు వెనుకా ముందు కూడా వుండెను;
కాగా వాండ్లు యెహోవాకు ప్రార్థన చేసినారు,
15 అర్చకులున్ను బూరగలతో ధ్వని చేసినారు. । అప్పు
డు యూదా మనుష్యులు ఆర్భటించినారు; యూదా
మనుష్యులు ఆర్భటించేటప్పుడు సంభవించినదేమంటే,
పరాత్పరుడు యారొబామునున్ను ఇశ్రాయేలంతటినిన్ని
అబీయాకున్ను యూదాకున్ను ముందర కొట్టినాడు. ।
16 అంతట ఇశ్రాయేలు పుత్రులు యూదా ముందర పారి
పోయినారు; పరాత్పరుడు వాండ్లను వీరి చేతికి అప్ప
గించినాడు. । అబీయాయున్ను వాని జనులున్ను వాండ్లను 17
బహు హతముతో సంహరించినందున యేర్పరచబడిన
అయిదు లక్షలమంది ఇశ్రాయేలులో నరకబడినారు. ।
యీ ప్రకారమే ఇశ్రాయేలు పుత్రులు ఆ కాలమందు 18
తగ్గించబడినారు; అయితే యూదా పుత్రులు తమ
పితృలయొక్క పరాత్పరుడైన యెహోవా మీద ఆను
కొనినందున జయము పొందినారు. । అబీయా యారొ 19
బామును తరిమి, దాన్ని సంబంధించిన పట్టణము
లతో కూడా బేతేలునున్ను, దాన్ని సంబంధించిన పట్ట
ణములతో కూడా యేషానానున్ను, దాన్ని సంబంధిం
చిన పట్టణములతో కూడా ఎఫ్రయీమునున్ను ఆక్ర
మించుకొన్నాడు. । అబీయా దినములలో యారొబా 20
ము తిరిగీ బలము పొందలేదు; యెహోవా వాని
కొట్టినందున అతడు మరణము పొందెను. । అయితే 21
అబీయా బహు బలమును పొంది పద్నాలుగు మంది
పెండ్లాములను వివాహము చేసుకొని, యిరువై యిద్దరు
కుమాళ్లనున్ను పదహారుగురు కుమార్తెలనున్ను కనె
ను. । అబీయాయొక్క తతిమ్మా కార్యములున్ను వాని 22
మార్గములున్ను వాని మాటలున్ను దీర్ఘదర్శియైన
ఇద్దోయొక్క చరిత్రయందు వ్రాయబడి వున్నవి.

## 14. అధ్యాయము.

ఈలాగున అబీయా తన పితృలతో కూడా నిద్ర 1
పొందిన తరువాత వాని దావీదు పట్టణమందు పాతి
పెట్టినారు; వానికి బదులుగా వాని కుమారుడైన ఆసా
రాజు ఆయెను: వీని దినములయందు దేశము పది సంవ
త్సరముల పర్యంతము నెమ్మది పొందెను. । ఆసా తన 2
పరాత్పరుడైన యెహోవా చూపుకు వుత్తమముగాను
న్ను యుక్తముగానున్ను జరిగించెను. । యేమంటే అతడు 3
అన్య దేవుండ్ల పీఠములనున్ను వున్నతమయిన స్థలముల
నున్ను తీసివేసి, ప్రతిమలను పగలకొట్టి, తోపులను
కొట్టి వేయించి, । వారి పితృలయొక్క పరాత్పరుడయిన 4
యెహోవాను వెతికేటందుకున్ను న్యాయ ప్రకార
మున్ను కట్టడ ప్రకారమున్ను చేసేటందుకున్ను యూ
దాకు ఆజ్ఞాపించి, । వున్నతమయిన స్థలములనున్ను ప్రతి 5
మలనున్ను యూదాయొక్క యావత్తు పట్టణములలో
నుంచి తీసివేసెను; వాని యెదుట రాజ్యము నెమ్మదిని
పొందెను. । మరిన్ని ఆ సంవత్సరముల యందు అతడు 6
యుద్ధము చేయలేదు, యెందుకంటే దేశములో నెమ్మది
కలిగి యుండెను; అతడు యూదా యందు బలమైన పట్ట
ణములను కట్టించెను; యెహోవా అతనికి విశ్రాంతిని
దయచేసెను. । అతడు యూదాతో అనినదేమంటే, 7
దేశము మన ముందర యింకా వుండగా మనము యీ

పట్టణములను కట్టించి, గోడలున్ను గోపురములున్ను
గుమ్మములున్ను ద్వారబంధములున్ను వాటికి అమరింతు
ము, యేమంటే మనము మన పరాత్పరుడైన యెహోవా
వాను వెతికితిమి, వెతికినందున ఆయన మన చుట్టున్ను
నెమ్మది యిచ్చెనని పలికెను. ఆలాగునే వారు కట్టి వృద్ధి
8 పొందిరి. । అప్పుడు యూదా యందు అలుగులున్ను
యీటెలున్ను పట్టుకొనే మూడు లక్షల మందిన్ని
బెన్యామీను యందు కేడెములను ధరించుకొని విల్లు
వేసే రెండు లక్షల యెనభై వేల మందిన్ని అయిన
సైన్యము ఆసాకు వుండెను; వీరందరున్ను పరాక్రమ
9 శాలులు అయి వుండిరి. । వాండ్లకు విరోధముగా కుషీ
యుడైన జెరా వెయ్యి వేల మంది గల రాణువతో
నున్ను మున్నూరు రథాలతోనున్ను బైలు వెళ్లి, మారే
10 షా పర్యంతము వచ్చెను. । అప్పుడు ఆసా వానికి యె
దురుగా బైలు వెళ్లెను; వారు మారేషా వద్ద సెఫతా
అనే పల్లపు స్థలమందు యుద్ధమునకు ఆయత్త పడిరి. ।
11 ఆసా తన పరాత్పరుడైన యెహోవాకు మొర్రపెట్టి,
వో యెహోవా, బలము గల వారికైనా బలము లేని
వారికైనా సహాయము చేసేది నీకు కొంచపు కార్యమై
వున్నది; మా పరాత్పరుడవైన యెహోవా, మాకు సహా
యము చేయుము, యేమంటే నిన్నే నమ్మితిమి; నీ నా
మమందే యీ సమూహమునకు యెదురుగా వెళ్లుతు
న్నాము; యెహోవా, నీవే మా పరాత్పరుడవై వు
న్నావు; నరుడు నీ పైని జయము పొందకుండా వుం
12 డును గాక అని పలికెను. । అప్పుడు యెహోవా ఆ
కుషీయులను ఆసాకున్ను యూదాకున్ను ముందుగా
13 కొట్టినందున కుషీయులు పారిపోయినారు. । అంతట
ఆసాయున్ను వాని వెంబడి వున్న మనుష్యులున్ను
గెరారు పర్యంతము వాండ్లను తరిమినారు; కుషీయులు
తిరిగీ లేకుండా బొత్తిగా పడిపోయినారు; యేమంటే
యెహోవా యెదుటనున్ను ఆయన రాణువ యెదుట
14 నున్ను వారు నలిగిపోయినారు. । చాలా కొల్ల కూడా
వారు తీసుకొని పోయి, గెరారు చుట్టూ వున్న పట్ట
ణములన్నిటినిన్ని కొట్టివేసినారు, యేమంటే యెహో
వాయొక్క భయము వారి మీదికి వచ్చెను; ఆ పట్టణ
ములన్నిటిలో కొల్ల విస్తారముగా వున్నందున వాటి
15 నన్నిటినిన్ని దోచుకొన్నారు. । పశువులు వుండే శాలల
నున్ను వాండ్లు పడగొట్టి, విస్తారముగా గొర్రెలనున్ను
ఒంటెలనున్ను కూచుకొని, యెరూశలేముకు తిరిగీ
వచ్చినారు.

## 15. అధ్యాయము.

1 అప్పుడు పరాత్పరుని ఆత్మ ఓదేదు కుమారుడైన
అజర్యా మీదికి వచ్చినందున, వాడు ఆసాకు యెదు
రుగా బైలు వెళ్లి వానితో చెప్పినదేమంటే, । వో 2
ఆసా, వో యూదా వో బెన్యామీను యావత్తు మను
ష్యులారా, నా మాట ఆలకించండి; మీరు యెహో
వాతో కూడా వున్నట్టయితే ఆయన మీతో కూడా
వుంటాడు; మీరు ఆయనను వెతికితే మీకు కనుపడు
తాడు; ఆయనను మీరు విడిచితే మిమ్మును ఆయన
విడుచును. । అయితే ఇశ్రాయేలుకు చాలా దినముల 3
నుంచి నిజమైన దేవుడైనా వుపదేశించే ఆచార్యుడైనా
న్యాయమైనా లేకుండా వుండెను. । వారు తమ శ్రమ 4
యందు ఇశ్రాయేలుయొక్క పరాత్పరుడైన యెహో
వా యొద్దికి తిరిగి ఆయనను వెతికినప్పుడు ఆయన వీరికి
అగుపడెను. । ఆ కాలముల యందు బైలు వెళ్లే వాం 5
డ్లకున్ను లోగా ప్రవేశించే వాండ్లకున్ను సమాధానము
లేకుండా వుండెను, యేమంటే దేశముల కాపురస్తు
లందరి యందున్ను మహా కలహములు కలిగి వుండెను. ।
జనాంగము జనాంగమునున్ను పట్టణము పట్టణమును 6
న్ను పాడుచేసెను, యేమంటే పరాత్పరుడు వాండ్లను
సకల విధమైన బాధలతో శ్రమ పరచెను. । కాగా 7
మీ చేతులకు బలహీనము రాకుండా మీరు ధైర్యము
పొందండి, యేమంటే మీ కార్యమునకు ఫలము కలు
గునని చెప్పెను. । ఆసా యీ మాటలనున్ను దీర్ఘ 8
దర్శియైన ఓదేదుయొక్క దీర్ఘదర్శనమునున్ను
విన్నప్పుడు, వాడు ధైర్యము పొంది, యూదా బెన్యా
మీను దేశమంతటిలోనుంచిన్ని ఎఫ్రయీము కొండ
దేశమంతటి మట్టుకున్న పట్టణములలోనుంచిన్ని సకల
అసహ్యములను తీసివేసి, యెహోవా మంటపము
ముందర వుండే యెహోవాయొక్క బలిపీఠమును
మళ్లీ కట్టించి, । యూదా అంతటినిన్ని బెన్యామీను 9
అంతటినిన్ని వాండ్లతో కూడా ఎఫ్రయీములోనుం
చిన్ని మనస్సేలోనుంచిన్ని షిమోనులోనుంచిన్ని పర
దేశులనున్ను కూర్చెను, యేమంటే ఇశ్రాయేలులో
నుంచి విస్తారమైన జనులు వాని పరాత్పరుడైన యె
హోవా వానితో కూడా వుండేది చూచి వాని
తట్టున చేరినారు. । ఆసా రాజరికము చేసిన పదిహే 10
నో సంవత్సరము మూడో నెలయందు వాండ్లు యె
రూశలేములో కూడి, । తాము తీసుకొని వచ్చిన కొల్ల 11
సొమ్ములోనుంచి ఆ దినమందు యేడు నూర్ల యెద్దుల
నున్ను యేడువేల గొర్రెలనున్ను యెహోవాకు బలి
యిచ్చి, । తమ పితృలయొక్క పరాత్పరుడైన యెహో 12
వాను తమ నిండు హృదయముతోనున్ను తమ నిండు
ఆత్మతోనున్ను తాము వెతుకుదామనిన్ని, । చిన్నవాని 13
మొదలుకొని పెద్దవాని మట్టుకున్ను పురుషుని మొద
లుకొని స్త్రీ మట్టుకున్ను ఇశ్రాయేలుయొక్క పరాత్ప
రుడయిన యెహోవాను వెతకని వారందరున్ను చంప

14 బడవలెననిన్ని నిష్కర్ష చేసుకొని, । యెహోవాకు
మహా శబ్దముతోనున్ను బాజాలతోనున్ను బూరగల
15 తోనున్ను భేరీలతోనున్ను వొట్టు పెట్టుకొనిరి.। యీ
వొట్టు కొరకు యూదా అంతానున్ను సంతోష పడె
ను, యేమంటే తమ నిండు హృదయముతోనున్ను
తాము వొట్టు పెట్టి తమ నిండు మనస్సుతోను ఆయ
నను వెతికినారు; అందువల్ల యెహోవా వాండ్లకు
అగుపడి, చుట్టూ వున్న దేశస్థులతో పోరు లేకుండా
16 వాండ్లను సుఖము పొంద చేసినాడు. । వొక తోపులో
అసహ్యమయిన విగ్రహమును చేయించిన రాజైన ఆసా
తల్లియైన మయఖా రాణియై వుండకుండా ఆసా
ఆమెను వెళ్లవేసి, ఆమె విగ్రహమును కొట్టివేసి, నిర్మూ
లము చేసి, కిద్రోను యేటిదగ్గిర దాని కాల్చివేసెను. ।
17 అయితే వున్నత స్థలములు ఇశ్రాయేలులోనుంచి తీసి
వేయ పడలేదు, అయినప్పటికిన్ని ఆసా హృదయము
అతని యావద్దినముల పర్యంతమూ వుత్తమముగా వుం
18 డెను. । తన తండ్రిన్ని తానున్ను పరిశుద్ధము చేసిన
వెండినిన్ని బంగారమునున్ను వస్తువులనున్ను వాడు
19 పరాత్పరుని యింటిలోకి కొంచవచ్చి వుంచెను.। ఆసా
యేలుబడియొక్క ముప్పై అయిదో సంవత్సర పర్యం
తము యుద్ధము లేకుండా వుండెను.

## 16. అధ్యాయము.

1 ఆసా రాజరికముయొక్క ముప్పయి ఆరో సంవ
త్సరమందు ఇశ్రాయేలు రాజైన బయెషా యూదా
మీదికి విరోధముగా యెక్కివచ్చి, యెవరున్ను యూ
దా రాజైన ఆసా వద్దికి రాకనున్ను వెళ్లకనున్ను వుం
2 డేటట్టు రామాను కట్టించెను. । అప్పుడు ఆసా యె
హోవాయొక్క యింట్లోనున్ను రాజు యింట్లోనున్ను
వున్న బొక్కసములలోనుంచి వెండినిన్ని బంగారము
నున్ను తీసుకొని, దమస్కు యందు నివాసము చేసే
3 బెన్హద్దు అనే అరాము రాజు వద్దికి అంపించి, । నా
తండ్రికిన్ని నీ తండ్రికిన్ని వున్నట్టు నాకున్ను నీకున్ను
వొడంబడికె కలదు; యిదుగో వెండినిన్ని బంగారము
నున్ను నీకు పంపిస్తిని; ఇశ్రాయేలు రాజైన బయెషా
నన్ను విడిచి ఆవలికి పొయ్యేటట్టుగా నీవు వచ్చి వా
నితో చేసి వున్న నీ వొడంబడికె భంగముచేయ వలె
4 నని చెప్పి పంపెను. । బెన్హద్దు రాజయిన ఆసా మా
టను ఆలకించి, తనకు కలిగిన సైన్యములయొక్క అధి
పతులను ఇశ్రాయేలు పట్టణములకు విరోధముగా అం
పెను; వీండ్లు ఈయోనునున్ను దానునున్ను ఆబేల్మా
యీమునున్ను నఫ్తాలీయొక్క వుగ్రాణపు పట్టణముల
5 నున్ను పడగొట్టినారు. । బయెషా యిది వినినప్పుడు
సంభవించినదేమంటే, తాను రామాను కట్టించుట నిలిపి
వేసి, తన పని చాలించెను.। అప్పుడు రాజయిన ఆసా 6
యూదా యావత్తున్ను కూచుకొనెను; వీండ్లు
పోయి బయెషా కట్టిస్తూ వుండిన రామా పట్టణపు
రాళ్లనున్ను దాని మానులనున్ను కొంచ వచ్చినారు;
వాటితోను వాడు గెబనున్ను మిస్పెనున్ను కట్టించెను.।
ఆ కాలమందు జ్ఞాన దృష్టి పురుషుడయిన హనానీ 7
యూదా రాజైన ఆసా వద్దికి వచ్చి వానితో చెప్పిన
దేమంటే, నీవు నీ పరాత్పరుడయిన యెహోవాను
నమ్ముకుండా అరాము రాజును నమ్ముకొన్నందున అరా
ము రాజుయొక్క రాణువ నీ చేతినుంచి తప్పి పో
యెను. । బహు విస్తారమైన రథములున్ను గుర్రపు 8
రౌతులున్ను గల కుషీయులున్ను లూబీయులున్ను
గొప్ప దండు అయి వుండ లేదా? అయినప్పటికిన్ని
నీవు యెహోవాను నమ్ముకొన్నందున ఆయన వారిని
నీ చేతికి అప్పగించెను. । యేమంటే తన యెడల వుత్తమ 9
హృదయముగల వారికి తన బలము చూపించేటందుకు
యెహోవా కన్నులు భూమి యందంతటాను అటూ
యిటూ చలిస్తూ వున్నవి: యీ విషయమందు మతి
లేని వాడవు అయి ప్రవర్తించినందున యిది మొదలు
కొని నీకు యుద్ధములు కలుగునని చెప్పెను. । అయితే 10
ఆసా ఆ జ్ఞాన దృష్టి పురుషుని మీద కోపగించి, యిం
దు నిమిత్తము వానిమీద కిట్టక పోయినందున వాని
బందీ గృహములో వేసెను; యిదిగాక ఆ కాలమందు
ఆసా జనులలో కొందరిని బాధ పరిచెను.। అయితే యి 11
దుగో ఆసాయొక్క పూర్వోత్తర కార్యములు యూదా
ఇశ్రాయేలు అనే రాజుల గ్రంథమందు వ్రాసి యు
న్నవి.। ఆసా తన రాజరికముయొక్క ముప్పయితొమ్మి 12
దో సంవత్సరమందు తన పాదములో వ్యాధిగా వుండె
ను: అయితే వాని వ్యాధి మిక్కిలీ బలువై వుండినప్ప
టికిన్ని తన వ్యాధియందు వాడు యెహోవాను వెతు
కక వైద్యులనే వెతికెను.। అంతట ఆసా తన పితృలతో 13
కూడా నిద్రపొంది, తన రాజరికముయొక్క నలభైవొ
క్కటో సంవత్సరమందు చనిపోయెను. । గంధపు పని 14
వాండ్లచేత చేయబడిన సుగంధ వర్గములతోనున్ను పరి
మళములతోనున్ను నిండిన పరుపుమీద వారు అతని
వుంచి, అతని నిమిత్తము బహు విస్తారమైన గంధ వర్గ
ములను దహించిన తరువాత దావీదు పట్టణమందు తన
నిమిత్తము తాను తొవ్వించిన సమాధి యందు వారు
అతని పాతి పెట్టినారు.

## 17. అధ్యాయము.

తరువాత అతనికి బదులుగా అతని కుమారుడైన 1
యెహోషాఫాతు రాజై ఇశ్రాయేలుకు యెదురుగా
తన్నుతాను బలపరుచుకొనెను. । అతడు యూదాయె 2

క్క గొప్ప పట్టణములన్నిటియందు సైన్యమును వుంచి,
యూదా దేశమందున్న తన తండ్రియైన ఆసా పుచ్చు
కొనిన ఎఫ్రాయీము పట్టణముల యందున్న కావు
3 బలమును వుంచెను. । యెహోవా యెహోషాఫాథు
తో కూడా వుండెను, యేమంటే తన తండ్రియైన దా
వీదు మునుపటి దినములలో నడిచిన మార్గమందు
4 అతడు నడిచి, । బయలీమును వెతుకకుండా తన తండ్రి
యొక్క పరాత్పరుని వెతికి, ఇశ్రాయేలుయొక్క క్రి
యల ప్రకారము కాకుండా ఆయన ఆజ్ఞలయందు నడి
5 చెను. । కాబట్టి యెహోవా అతని చేతియందు రాజ్య
మును దృఢ పరచెను; యూదా వారందరున్ను యెహో
షాఫాథుకు కానుకలిచ్చినారు; అతనికి ఐశ్వర్యమున్ను
6 ఘనమున్ను బహుగా కలిగెను. । యెహోవా మార్గము
లలో అతని హృదయము బహు దృఢమయిన తరువాత
అతడు వున్నత స్థలములనున్ను తోపులనున్ను యూదా
7 లోనుంచి తీసివేసెను. । అతని రాజరికముయొక్క మూ
డో సంవత్సరమందు యూదా పట్టణములలో వుపదే
శము చేసేటందుకు అతడు తన కింద వున్న అధికారు
లైన బెన్హాయీలునున్ను, ఓబద్యానున్ను, జెఖర్యానున్ను,
8 నెతన్యేలునున్ను, మిఖాయ్యానున్ను, । వీరితో కూడా
షెమయా, నెతన్యా, జెబద్యా, అశాహేలు, షెమీ
రామోతు, యెహోనాతాను, అదోనీయా, థోబీయా,
థోబదోన్యాహు, అనే లేవీయులనున్ను, వీరితో కూడా
అర్చకులైన ఎలీషామానున్ను యెహోరామునున్ను
9 పంపెను. । వారు యూదాలో వుపదేశము చేసి, యె
హోవా న్యాయప్రమాణ గ్రంథము తీసుకొని, యూ
దా పట్టణముల యందంతటాను సంచరించి, జనులకు
10 వుపదేశము చేసినారు. । యూదా చుట్టూ వుండే దేశ
ములయొక్క రాజ్యములంతటి మీద యెహోవాయొ
క్క భయము కలిగినందున యెహోషాఫాథుతో వారు
11 యుద్ధము చేయకుండా వుండిరి. । పెలిష్తీయులలోనున్ను
కొందరు యెహోషాఫాథుకు పన్ను ద్రవ్యముతో
కూడా కానుకలు తెచ్చినారు; అరబీయులున్ను అత
నికి యేడు వేల యేడునూరు గొర్రె పొట్టేళ్లనున్ను యేడు
వేల యేడునూరు మేక పోతులనున్ను తెచ్చినారు. ।
12 యీ ప్రకారము యెహోషాఫాథు అంతకంతకు గొప్ప
వాడై, యూదా యందు కోటలనున్ను ధనములు వుంచే
13 పట్టణములనున్ను కట్టించెను. । యూదాయొక్క పట్ట
ణముల యందు అతనికి గొప్ప పని కలిగెను; యెరూ
శలేములో పరాక్రమ శాలులైన సేవకులు అతనికి వుం
14 డిరి. । తమ పితృల వంశముల చొప్పున వీరి లెక్క యే
దంటే, యూదాలో శతాధిపతులైన వారు యెవరంటే
అద్నా అనే ప్రధానుడు, వీని పెద్ద పరాక్రమ శాలు
15 లైన సేవకులు మూడు లక్షలమంది వుండిరి. । వాని తరు
వాత యెహోహానాను అనే అధిపతి వుండెను, వీని
పెద్దను రెండు లక్షల యెనభైవేల మంది వుండిరి. । వీని 16
తరువాత యెహోవాకు తన్ను తాను మనః పూర్వక
ముగా సమర్పించుకొనిన జిఖ్రీ కుమారుడైన అమస్యా
అనే వాడు వుండెను, వీని పెద్ద పరాక్రమశాలులు
రెండు లక్షల మంది వుండిరి. । బెన్యామీను సంబంధు 17
లలో ఎల్యాదా అనే పరాక్రమశాలి వుండెను, వీని
పెద్దను అంబున్ను కేడెమున్ను పట్టుకొనే వాండ్లు
రెండు లక్షల మంది వుండిరి. । వీని తరువాత యెహో 18
జాబాదు వుండెను; వీని పెద్ద యుద్ధమునకు సిద్ధమైన
వాండ్లు లక్ష యెనభైవేల మంది వుండిరి. । రాజు యూ 19
దా అంతటానున్ను వుండే గొప్ప పట్టణముల యందు
వుంచిన వాండ్లు గాక వీరు రాజును సేవించేవారు.

## 18. అధ్యాయము.

యెహోషాఫాథుకు ఐశ్వర్యమున్ను ఘనమున్ను 1
బహుగా కలిగి వుండెను; అయితే అతడు అహాబుతో
సంబంధము చేసుకొని, । కొన్ని సంవత్సరములు గతిం 2
చిన తరువాత షోమ్రోనులో వుండే అహాబు పెద్దికి
దిగి పోయెను; అప్పుడు అహాబు వాని నిమిత్తమున్ను
వాని వెంబడి వచ్చిన జనుల నిమిత్తమున్ను అనేకమైన
గొర్రెలనున్ను పశువులనున్ను కోయించి తనతో కూ
డా రామోత్గిలాదుకు యెక్కి వచ్చుటకు వాని ప్రేరే
పించెను; । యేలాగంటే ఇశ్రాయేలు రాజయిన అహాబు 3
యూదారాజైన యెహోషాఫాథును చూచి, నీవు
నాతో కూడా రామోత్గిలాదుకు వస్తావా? అని అడిగి
నందుకు, వాడు నీ వలె నేనున్ను వున్నాను, నీ జనుల
వలె నా జనులున్ను వున్నారు, నీతో కూడా యుద్ధ
మునకు వస్తామని చెప్పెను. । మరిన్ని యెహోషా 4
ఫాథు ఇశ్రాయేలు రాజుతో యెహోవాను సెలవు
యీ ప్రొద్దు అడిగి విచారించుమని చెప్పెను. । అందుకు 5
ఇశ్రాయేలు రాజు నన్నూరు మంది దీర్ఘదర్శులైన
వాండ్లను కూర్చి, నేను రామోత్గిలాదు మీదికి యు
ద్ధము చేయ పోదునా, మానుదునా? అని వారిని అడి
గెను; అందుకు వారు యెక్కి పొమ్ము; పరాత్పరుడు
దాని రాజు చేతికి అప్పగించునని చెప్పిరి. । అయితే 6
యెహోషాఫాథు యింకా యెహోవా దీర్ఘదర్శి
యెవడయినా యిక్కడ లేడా వాని అడిగి విచారించు
టకని అడిగెను. । అప్పుడు ఇశ్రాయేలు రాజు యెహో 7
షాఫాథుతో యెహోవాను అడిగేటందుకు ఇమ్లా
కుమారుడైన మిఖాయ్యా అనే పెకడు యిక్కడ వున్నా
డు; అయితే నేను వాని యందు పగగా వున్నాను,
యేమంటే వాడు నన్ను గూర్చి మేలు కాకుండా నిత్య
మూ కీడుగానే దీర్ఘదర్శనము చెప్పేవాడని పలి

కెను; అందుకు యెహోషాఫాఘు రాజుగారు ఆలాగు
8 చెప్పవద్దని పలికెను. । అప్పుడు ఇశ్రాయేలు రాజు వొక
ప్రధానిని పిలిచి, ఇమ్లా కుమారుడైన మిఖాయ్యాను
9 శీఘ్రముగా పిలుచుక రమ్మని చెప్పెను. । ఇశ్రాయేలు
రాజున్ను యెహోషాఫాఘు అనే యూదా రాజున్ను
షోమ్రోను వూరు గవిని ముందరి బయిలు యందు తమ
తమ వస్త్రములను ధరించుకొన్నవారై, తమ తమ సింహా
సనమందు కూర్చుని వుండిరి; యావత్తు దీర్ఘదర్శు
లున్ను వారి ముందర దీర్ఘదర్శనము చెప్పుకొంటూ
10 వుండిరి. । అప్పుడు కెనయనా కుమారుడైన సిద్కియా
తాను యినుప కొమ్ములు చేసుకొని, అరామీయులను
నిర్మూలము చేసే పర్యంతము వీటితో వారిని పొడిచి
వేతువని యెహోవా చెప్పుతూ వున్నాడని పలికెను. ।
11 ఆ ప్రకారముగా దీర్ఘదర్శులందరున్ను దీర్ఘద
ర్శనమును పలుకుతూ, రామోత్గిలాదుకు యెక్కిపో
యి జయించుము, యేమంటే యెహోవా రాజు చేతి
12 లోకి దాని అప్పగించునని చెప్పిరి. । అయితే మిఖా
య్యాను పిలువడానకు వెళ్లిన దూత వాని చూచి, యి
దిగో దీర్ఘదర్శులయొక్క మాటలు రాజు విషయ
మై యేక ముఖముగా మేలై యున్నవి, కాబట్టి దయ
చేసి నీ మాట వారి మాటలలో వొక దాని వలె వుండ
13 నిచ్చి, మేలు పలుకుమని చెప్పెను. । అందుకు మిఖా
య్యా యెహోవా జీవముతోడు, నా పరాత్పరుడు
14 పలికేదేదో అదే పలుకుతానని చెప్పెను. । అతడు రాజు
యొద్దికి వచ్చినప్పుడు రాజు అతని చూచి, వో మిఖా
య్యా, యుద్ధము కొరకు రామోత్గిలాదుకు మేము వెళ్ల
నా, మాననా? అని అడిగితే, అతడు యెక్కి వెళ్లి
జయించండి, వారు మీ చేతిలోకి అప్పగించబడుదురు
15 అని చెప్పెను. । అప్పుడు రాజు యెహోవా పేరట
సత్యమే గాని మరి యేమిన్ని నాకు పలకవద్దని నేను
యెన్నిమార్లు నీ చేత వొట్టుబెట్టుకొందునని అతని
16 తో చెప్పినప్పుడు; । అతడు చెప్పినదేమంటే, కాపరి
లేని గొర్రెల వలెనే ఇశ్రాయేలు వారందరున్ను పర్వ
తముల మీద చెదిరిపోవడమును చూచినాను; అప్పుడు
యెహోవా వీరికి యజమానుడు లేనందున ప్రతివా
నిని తన తన యింటికి సమాధానముగా పోనిమ్మని పలి
17 కెనని చెప్పెను. । అప్పుడు ఇశ్రాయేలు రాజు యెహో
షాఫాఘుతో యితడు కీడేగాని నా విషయమై మేలును
దీర్ఘదర్శనముగా పలకడని నీతో నేను చెప్పలేదా
18 అని అంటే; । అతడు తిరిగీ అనినదేమంటే, కాబట్టి
మీరు యెహోవాయొక్క మాటను వినండి; యెహో
వా తన సింహాసనము మీద కూర్చుండడమున్ను పర
మండల సైన్యమంతా ఆయన కుడి పక్కనున్ను యె
డమ పక్కనున్ను నిలువబడి యుండడమున్ను చూచి

నాను. । అప్పుడు యెహోవా ఇశ్రాయేలు రాజైన 19
అహాబు రామోత్గిలాదు మీదికి పోయి పడి పోయే
టట్టు యెవడు వాని ప్రేరేపించునని పలికినందున,
వొకడు యీ విధముగానున్ను యింకొకడు మరియొక
విధముగానున్ను పలికిరి. । అప్పుడు వొక ఆత్మ బైలు 20
వచ్చి, యెహోవా యెదుట నిలువబడి, నేను అతని
ప్రేరేపిస్తాను అని పలికినప్పుడు, యెహోవా దేని
చేత అని అతని అడిగితే, । అతడు నేను బయిలుదేరి, 21
వాని దీర్ఘదర్శులందరియొక్క నోటిలో అబద్ధ
మాడే ఆత్మనై వుంటానని చెప్పినందున, నీవు వాని ప్రే
రేపించి జయింతువు; బయిలు వెళ్లి ఆ ప్రకారముగా
చేయుమని యెహోవా పలికెను. । కాబట్టి యిదుగో 22
యెహోవా యీ నీ దీర్ఘదర్శులయొక్క నోటి
లో అబద్ధమాడే యాత్మను పెట్టి యున్నాడు; యెహో
వా నీకు విరోధముగా కీడును పలికించియున్నాడు
అని చెప్పెను. । అప్పుడు కెనయనా కుమారుడయిన 23
సిద్కియా దగ్గిరికి వచ్చి, మిఖాయ్యాను చెంపమీద
కొట్టి, నా యొద్దనుంచి నీతో మాట్లాడుటకు యెహో
వాయొక్క ఆత్మ యే మార్గముగా వెళ్లెనని చెప్పినం
దున, । యిదుగో దాగుటకు నీవు లోపలి గదిలోకి 24
వెళ్లే దినమున నీవు తెలుసుకొంటావని మిఖాయ్యా
చెప్పెను. । అప్పుడు ఇశ్రాయేలు రాజు పట్టణపు అధి 25
పతి అయిన ఆమోను యొద్దికిన్ని రాజు కుమారుడైన
యోవాషు యొద్దికిన్ని మీరు మిఖాయ్యాను తీసుకొని
వెళ్లి, రాజు యీలాగు చెప్పుతున్నాడు; । నేను తిరిగీ 26
సమాధానముగా వచ్చేపర్యంతము వీని ఖయిదులో
పెట్టి, బాధ గల రొట్టెతోనున్ను బాధ గల నీటితో
నున్ను వీని పోషించుమని చెప్పుమని పంపెను. ।
అప్పుడు మిఖాయ్యా నీవు సమాధానముతో నిజము 27
గా తిరిగి వచ్చిన పక్షమందు యెహోవా నా ద్వారా
పలకక వుండును అని చెప్పి, వో యీ సమస్త జను
లారా ఆలకించండి అని పలికెను. । అంతట ఇశ్రా 28
యేలు రాజున్ను యూదా రాజైన యెహోషాఫాఘు
న్ను రామోత్గిలాదు మీదికి వెళ్లిరి. । అప్పుడు ఇశ్రా 29
యేలు రాజు యెహోషాఫాఘుతో నేను మారు వేష
ము వేసుకొని యుద్ధమునకు వెళ్లుతాను; అయితే నీవు
నీ వస్త్రములను ధరించుకొమ్మని చెప్పెను; ఆ ప్రకార
ముగా ఇశ్రాయేలు రాజు మారు వేషము వేసుకొనెను;
తరువాత వారు యుద్ధమునకు వెళ్లిరి. । అయితే అరా 30
ము రాజు మీరు ఇశ్రాయేలు రాజుతోనే గాని పిన్న
లతోనైనా పెద్దలతోనైనా పోట్లాడ వద్దని తనతో
కూడా వున్న తన రథాధిపతులకు ఆజ్ఞాపించి వుండెను. ।
అంతట సంభవించినదేమంటే, రథాధిపతులు యెహో 31
షాఫాఘును చూచినప్పుడు ఇతడే ఇశ్రాయేలు రాజని

అనుకొని, యుద్ధము చేసుటకు అతని చుట్టుకొనిరి;
అయితే యెహోషాపాథాధు కేక వేసినందున యెహో
వా అతనికి సహాయము చేసెను; పరాత్పరుడు అతని
32 యొద్దనుంచి వారిని తొలగి పోయేటట్టు చేసెను. । యే
మంటే రథాధిపతులు అతడు ఇశ్రాయేలు రాజు కాడని
గ్రహించినప్పుడు వారు అతని తరమడము మానుకొని
33 మళ్లుకొనిరి. । అయితే వొకడు గురి చూడకనే తన
విల్లును ప్రయోగించి, ఇశ్రాయేలు రాజును అతని
కవచపు సందులో కొట్టినందున అతడు తన సారథి
తోను నేను గాయమును పొందియున్నాను, గనుక
నీ చెయి తిప్పి సమూహములోనుంచి నన్ను కొంచు
34 పొమ్మనెను. । యుద్ధము ఆ దినమున ప్రబలమాయెను;
అయినప్పటికీ ఇశ్రాయేలు రాజు అస్తమాన పర్యంతము
అరామీయులకు యెదురుగాను తన రథమందు వుం
డెను; ప్రొద్దు గ్రుంకిపోయే సమయమున అతడు
చనిపోయెను.

## 19. అధ్యాయము.

1 యూదా రాజైన యెహోషాపాథాధు యెరూశలే
మందుండే తన యింటికి సమాధానముగా తిరిగీ వచ్చె
2 ను. । జ్ఞాన దృష్టి గల వాడున్ను హనానీ కుమారు
డున్ను అయిన యెహూ అతని యెదుర్కొనుటకు
బయిలు వెళ్లి, రాజైన యెహోషాపాథాధుతో అనినదే
మంటే, నీవు భక్తిహీనులకు సహాయము చేసి యెహో
వా యందు పగ వుంచే వారిని స్నేహించడము తగు
నా? కాబట్టి యెహోవా యెదుటనుంచి నీ మీద
3 కోపము కలదు. । అయినప్పటికిన్ని దేశములోనుంచి నీవు
తోపులను తీసివేసినందువల్లనున్ను పరాత్పరుని వెతు
కుటకు నీ హృదయమును నీవు ఆయత్తపరచినందువల్ల
నున్ను నీ యందు మంచి సంగతులు కనుపడుతున్నవి
4 అని చెప్పెను. । యెహోషాపాథాధు యెరూశలేములో
నివాసము చేసి, బెయేర్షెబ మొదలుకొని ఎఫ్రయీ
ము పర్వత పర్యంతమందుండే జనుల మధ్యను తిరిగి
వెళ్లి, వారి పితృల పరాత్పరుడైన యెహోవా తట్టుకు
5 వారిని మళ్లించెను. । మరిన్ని అతడు దేశమందున్న
యూదా సంబంధమయిన బురుజులు గల పట్టణము
లన్నిటిలోను వొక్కొక్క పట్టణమందు న్యాయాధి
6 పతులను నిర్ణయించి, వారితో అనినదేమంటే, । మీరు
చేసే దాని గురించి హెచ్చరికగా వుండండి, యేమంటే
న్యాయపు తీర్పులో మీతో కూడా వుండే యెహో
వా కొరకే మీరు న్యాయము తీర్చేవారవుదురు గాని
7 మనుష్యుని కొరకు కాదు. । కాబట్టి యెహోవాయొ
క్క భయము మీ మీద వుండును గాక; హెచ్చరి
కగా వుండి దాని చేయండి; యేమంటే మన పరాత్ప
రుడయిన యెహోవా యొద్ద అక్రమమయినా మను
ష్యుల యెడల పక్షపాతమైనా కానుకలు పుచ్చుకో
వడమైనా లేదని చెప్పెను. । మరిన్ని యెహోషాపాథాధు 8
యెహోవా న్యాయపు తీర్పు కొరకున్ను తగవుల
కొరకున్ను తాము యెరూశలేముకు వచ్చినప్పుడు లేవీ
యులలోనున్ను అర్చకులలోనున్ను ఇశ్రాయేలు పితృల
పెద్దలలోనున్ను కొందరిని వుంచెను. । అతడు వారికి 9
ఆజ్ఞాపించినదేమంటే, యథార్థముగానున్ను నిండు
హృదయముతోనున్ను యెహోవా భయమందు యీ
ప్రకారము మీరు ప్రవర్తించ వలెను. । రక్తమునకు రక్త 10
మును గురించిన్ని న్యాయ ప్రమాణము ఆజ్ఞ కట్టడలు
న్యాయపు తీర్పులు అనేటటువంటి సంగతులను గురిం
చిన్ని తమ పట్టణములలో నివసించే మీ సహోద
రుల సంబంధమయిన యే నిమిత్తమైనా మీ యొద్దికి
వచ్చినప్పుడు, మీ మీదనున్ను మీ సహోదరుల మీ
దనున్ను కోపము రాకుండానున్ను వారు యెహో
వాకు విరోధముగా అపరాధము చేయకుండానున్ను
మీరు వారిని హెచ్చరిక చేయవలెను; మీరు దీని
చేస్తే అపరాధము చేయక వుందురు. । మరిన్ని యిదు 11
గో ప్రధానార్చకుడైన అమర్యా యెహోవా సంబం
ధమైన సకల సంగతుల విషయమై మీ మీద వున్నాడు;
యూదా యింటికి అధిపతి అయినటువంటిన్ని ఇష్మా
యేలు కుమారుడైనటువంటిన్ని జెబద్యా రాజు సంగ
తులకొరకు వున్నాడు; లేవీయులు మీ యెదుట పరిచా
రకులై వుంటారు; ధైర్యముగా ప్రవర్తించండి, అప్పుడు
యెహోవా మేలు కొరకు మీతో కూడా వుంటా
డని చెప్పెను.

## 20. అధ్యాయము.

ఇది అయిన తరువాత సంభవించినదేమంటే, మో 1
యాబు పుత్రులున్ను అమ్మోను పుత్రులున్ను వీరితో
కూడా అమ్మోనీయులు గాక యితరులున్ను యుద్ధము
కొరకు యెహోషాపాథాధు మీదికి వచ్చిరి. । అప్పుడు 2
కొందరు వచ్చి యెహోషాపాథాధుతో చెప్పినదేమంటే,
నీ మీదికి వొక గొప్ప సమూహము సముద్రము అవ
లనుండే అరాము యీ తట్టునుంచి వస్తూ వున్నది,
యిదుగో వారు హస్ససోం తామారు అనే ఏన్గెదీలో
వున్నారని చెప్పిరి. । అందుకు యెహోషాపాథాధు భయ 3
పడి, యెహోవాను వెతుకుటకు తన్ను స్థిరపరచు
కొని, యూదా యందంతటాను వుపవాసమును చా
టింపించెను. । అప్పుడు యూదావారు యెహోవాను 4
సహాయమును అడుగుటకు కూడుకొనిరి; యూదా పట్ట
ణములన్నిటిలోనుంచి వారు యెహోవాను వెతుకు
టకు వచ్చిరి. । అప్పుడు యెహోషాపాథాధు యెహోవా 5

మందిరములో క్రొత్త శాల యెదుటను యూదాయొ
క్కనున్ను యెరూశలేము యొక్కనున్ను సంఘము
6 మధ్యను నిలువబడి పలికినదేమంటే, । మా పితృల పరా
త్పరుడవైన ప్రభువా యెహోవా, నీవు పరమండలమందు
పరాత్పరుడవై వున్నావు కావా? నిన్ను విరోధించు
టకు యెవ్వరికీ శక్తిలేక వుండేటట్టు నీ చేతిలో బల
7 మున్ను సామర్థ్యమున్ను లేదా? । నీ జనులైన ఇశ్రా
యేలు ముందరినుంచి యీ దేశపు కాపురస్తులను తోలి
వేసి, నీ స్నేహితుడైన అబ్రాహాముయొక్క సంతతికి
దీని శాశ్వతముగా యిచ్చినటువంటి మా పరాత్పరు
8 డవు నీవే కదా? । వారు అందులో నివాసముచేసి, కత్తి
అయినా న్యాయపు తీర్పు అయినా తెగులైనా కరు
వైనా యిటివంటిది యే కీడైనా మా మీదికి వచ్చిన
ప్పుడు మేము యీ యింటి ముందర నిలువబడి మా
9 శ్రమలో నీకు మొర బెట్టితే, । అప్పుడు నీవు ఆలకించి
సహాయము చేతువని వారు నీ నామము కొరకు వొక
పరిశుద్ధ స్థలమును కట్టించి వున్నారు, యేమంటే నీ
10 నామము యీ యింటిలో వున్నది. । అయితే యిదుగో
ఇశ్రాయేలు వారు మిస్రయీములోనుంచి బైటికి వచ్చి
నప్పుడు నీవు వారిని అమ్మోనుయొక్క మోయాబు
యొక్క శెయీరు పర్వతముయొక్క పుత్రులతో యు
ద్ధము చేయనివ్వక వున్నందున వారు వారిని నిర్మూల
11 ము చేయక వారి యొద్దనుంచి తిరిగి పోయిరి. । స్వతం
త్రించుటకు నీవు మాకు యిచ్చిన నీ స్వాస్థ్యములో
నుంచి మమ్మును తోలివేసే కొరకు వారు వచ్చుటవల్ల
వారు మాకు యేలాగు ప్రతి ఫలము యిస్తున్నారో
12 చూడుము. । వో మా పరాత్పరుడా, నీవు వారికి న్యా
యము తీర్చవా? యేమంటే మా మీదికి వచ్చే యీ
గొప్ప సమూహమునకు విరోధముగా వెళ్లుటకు శక్తి
మాకు లేదు; దేని చేసుటకైనా మాకు తెలియదు;
అయితే మా నేత్రములు నీ తట్టు వున్నవని వేడుకొ
13 నెను. । యూదావారందరున్ను తమ తమ పిల్లలతోనున్ను
భార్యలతోనున్ను సంతతితోనున్ను యెహోవా ముం
14 దర నిలువబడిరి. । అప్పుడు మత్తన్యాకు పుట్టిన యెహీ
యేలు కుమారుడైన బేనాయ్యాకు పుట్టిన జెఖర్యా
కుమారుడైనటువంటిన్ని ఆసాపు పుత్రుల సంబంధు
డున్ను లేవీయుడున్ను అయినటువంటిన్ని యహజీయే
లు సభా మధ్యను వుండగా అతని మీదికి యెహో
వాయొక్క ఆత్మ వచ్చినందున అతడు పలికినదేమంటే, ।
15 యూదా వారలారా, యెరూశలేము కాపురస్తులారా,
యెహోషాఫాథు అనే రాజా, మీరందరూ ఆలకిం
చండి; యెహోవా యీలాగున మీకు చెప్పుతున్నా
డు; యీ గొప్ప సమూహము కొరకు మీరు భయప
డకనున్ను జడియకనున్ను వుండండి, యేమంటే యు
ద్ధము పరాత్పరునిదే గాని మీది కాదు. । రేపు వారి 16
మీదికి దిగి వెళ్లండి; యిదుగో వారు సిస్సు అనే
యెక్కుడు మార్గమున వత్తురు; మీరు యెరూయేలు
అరణ్యము ముందర వున్న కాలువ కొన దగ్గిర వారిని
కనుకొందురు. । మీరు యీ యుద్ధములో పోట్లాడుటకు 17
నిమిత్తము లేదు; వో యూదా వారలారా, యెరూశ
లేము వారలారా, మిమ్మును మీరు ఆయత్తపరచుకొని,
వూరకె నిలువబడి, మీతో కూడా వున్న యెహోవా
యొక్క రక్షణను చూడండి; భయపడకనున్ను జడి
యకనున్ను వుండండి; రేపు వారి మీదికి బైలు వెళ్లండి;
యేమంటే యెహోవా మీతో కూడా వుంటాడని
పలికెను. । అప్పుడు యెహోషాఫాథు నేలమట్టుకు తన 18
శిరస్సును వంచుకొనెను; యూదావారున్ను యెరూశ
లేము కాపురస్తులున్ను యెహోవా యెదుట సాగిల
పడి యెహోవాకు మ్రొక్కిరి. । కెహాతీయుల పుత్రుల 19
సంబంధులున్ను కోహీయుల పుత్రుల సంబంధులున్ను
అయిన లేవీయులు పైకెత్తిన గొప్ప శబ్దముతో ఇశ్రా
యేలు పరాత్పరుడైన యెహోవాను స్తుతించుటకు
నిలువబడిరి. । అంతట వారు వుదయమందు త్వరగా 20
లేచి, తెకోవ అరణ్యమునకు వెళ్లిరి; వారు వెళ్లుతూ
వుండగా యెహోషాఫాథు నిలువబడి చెప్పినదే
మంటే, వో యూదావారలారా, యెరూశలేము
కాపురస్తులారా, నా మాట ఆలకించండి; మీ పరా
త్పరుడైన యెహోవాను నమ్మండి; అప్పుడు మీరు
స్థిరపరచబడుదురు; ఆయన దీర్ఘదర్శులను నమ్మండి,
అప్పుడు మీరు కృతార్థులవుదురు అని పలికెను. ।
మరిన్ని అతడు జనులతో ఆలోచన చేసిన తరువాత 21
అతడు యెహోవా కొరకు గాయకులను యేర్పరచి,
సైన్యము ముందర వారు వెళ్లేటప్పుడు పరిశుద్ధాలంకా
రమును స్తుతించుటకున్ను, యెహోవాను స్తుతించండి
యెందుకంటే ఆయన కృప యెప్పటికిన్ని వుండునని
చెప్పుటకున్ను వారిని నిర్ణయించెను. । వారు పాడు 22
టకున్ను స్తుతించుటకున్ను ఆరంభించినప్పుడు యూదా
మీదికి వచ్చిన అమ్మోనుయొక్క మోయాబుయొక్క
శెయీరు పర్వతముయొక్క పుత్రుల మీద పొంచుండే
వారిని యెహోవా వుంచినందున వారు హతులయిరి. ।
యేమంటే అమ్మోనుయొక్క మోయాబుయొక్క పు 23
త్రులు శెయీరు పర్వతపు కాపురస్తులను బొత్తిగా
చంపుటకున్ను నశింప చేసుటకున్ను వారికి విరోధ
ముగా నిలువబడిరి; వారు శెయీరు కాపురస్తులను
సరిపుచ్చిన తరువాత తమలో ప్రతివాడు వొకని
నొకడు చంపుటకు ఆరంభించెను. । యూదా వారు 24
అరణ్యమందున్న కాపరుల గోపురము దగ్గిరికి వచ్చి
సమూహము తట్టు చూడగా, యిదుగో, వారు భూమి

మీద పడిన శవములై యుండిరి; ఒకడున్ను తప్పించు
25 కోలేదు. । యెహోషాఫాతున్ను అతని జనులున్ను
వారి వస్తువులను దోచుకొని పోవుటకు వచ్చినప్పుడు
వారు ఆ శవముల యొద్ద విస్తారమైన ధనమునున్ను
ప్రశస్తమైన నగలనున్ను కనుగొనిరి; వారు వీటిని తమ
కొరకు తీసిరి; అయితే తాము కొంచపోగలిగిన వాటి
కంటే అవి అధికమై యుండెను; కొల్ల వస్తువులు అతి
విస్తారమైనందున వాటిని కూర్చుటకు వారికి మూడు
26 దినములు పట్టెను. । నాలుగో దినమున వారు బెరాఖా
పల్లపు స్థలమందు కూడుకొనిరి, యేమంటే వారు
అక్కడ యెహోవాను స్తుతించిరి; అందుకొరకు ఆ
స్థలము నేటివరకు బెరాఖా పల్లపు స్థలమని పిలువబడి
27 నది. । తరువాత యెరూశలేముకు ఆనందముతో మళ్లు
టకు యూదా వారున్ను యెరూశలేము వారున్ను
వారికి యెదురుగా యెహోషాఫాతున్ను తిరిగి వెళ్లిరి,
యేమంటే యెహోవా వారి శత్రువుల మీద వారిని
28 సంతోషింప చేసెను. । వారు యెరూశలేములో వున్న
యెహోవా మందిరమునకు కిన్నెరలతోనున్ను వీణెల
29 తోనున్ను బూరగలతోనున్ను వచ్చిరి. । ఇశ్రాయేలు
శత్రువులకు విరోధముగా యెహోవా యుద్ధము
చేసెనని ఆ దేశముల రాజ్యముల వారు విన్నప్పుడు
30 పరాత్పరుని భయము వారందరి మీద వుండెను. । యీ
ప్రకారముగా యెహోషాఫాతుయొక్క రాజ్యము
నిమ్మళముగా వుండెను, యేమంటే అతని పరాత్పరుడు
చుట్టూ వున్న వారినుంచి అతనికి నెమ్మది దయ
31 చేసెను. । యెహోషాఫాతు యూదాను యేలెను;
అతడు యేలనారంభించినప్పుడు ముప్పయి అయిదు
సంవత్సరముల వాడై, యెరూశలేములో యిరువై
అయిదు సంవత్సరములు యేలెను; అతని తల్లి షిల్హీ
కుమార్తె అయి, అజూబా అనే పేరు గలదై వుం
32 డెను. । అతడు యెహోవా దృష్టికి యుక్తముగా ప్రవ
ర్తించి, తన తండ్రియైన ఆసాయొక్క మార్గమందు
నడుస్తూ దానిలోనుంచి తొలగిపోకుండా వుండెను. ।
33 అయినప్పటికిన్ని వున్నతమైన స్థలములు తీయబడ లేదు,
యేమంటే అప్పటి వరకు జనులు తమ పితృలయొక్క
పరాత్పరుని తట్టున తమ హృదయములను ఆయత్తపర
34 చక వుండిరి. । అయితే యెహోషాఫాతుయొక్క
కడమ పూర్వోత్తర కార్యములు యిదుగో అవి ఇశ్రా
యేలు రాజుల గ్రంథమందు చెప్పబడ్డ హనానీ కుమా
రుడైన యెహూయొక్క గ్రంథమందు వ్రాయబడి
35 వున్నవి. । యిది అయిన తరువాత యూదా రాజైన
యెహోషాఫాతు మిక్కిలీ దుర్మార్గముగా ప్రవ
ర్తించిన ఇశ్రాయేలు రాజయిన అహజ్యాతో కలుసు
36 కొనెను. । తర్షీషుకు వెళ్లే వోడలను చేయించుటకు
అతడు అతనితో కలుసుకొనెను; వారు ఎస్యోన్గెబె
రులో ఆ వోడలను చేయించిరి. । అప్పుడు మారేషా 37
సంబంధుడైన దోదావాహు కుమారుడైన ఎలీయెజెరు
నీవు అహజ్యాతో కలుసుకొన్నావు గనుక యె
హోవా నీ పనులను విరగగొట్టెనని యెహోషా
ఫాతుకు విరోధముగా దీర్ఘదర్శనము పలికెను. ఆ
వోడలు విరిగిపోయినందున తర్షీషుకు వెళ్లలేక
పోయినవి.

## 21. అధ్యాయము.

అంతట యెహోషాఫాతు తన పితృలతో కూడా 1
నిద్ర పొంది, తన పితృలతో కూడా దావీదు పట్టణ
మందు పాతి పెట్టబడెను; అతని కుమారుడైన యెహో
రాము అతనికి బదులుగా యేలెను. । యితనికి యెహో 2
షాఫాతు కుమారులైన అజర్యా, యెహీయేలు, జెఖర్యా,
అజర్యా, మిఖాయేలు, షెఫటీయా, అనే సహో
దరులు కలిగి వుండిరి; వీరందరున్ను ఇశ్రాయేలు
రాజయిన యెహోషాఫాతు కుమారులు. । వారి 3
తండ్రి యూదాలో ప్రాకారములు గల పట్టణము
లతోకూడా బహుమానముగా వెండినిన్ని బంగారము
నున్ను ప్రశస్తమైన వస్తువులనున్ను అధికముగా వారికి
యిచ్చెను; అయితే యెహోరాము మొదట పుట్టిన
వాడు గనుక అతడు రాజ్యము అతనికి యిచ్చెను. ।
యెహోరాము తన తండ్రి రాజ్యమునకు లేచినప్పుడు 4
అతడు తన్ను తాను బలపరచుకొని తన సహోదరు
లనందరినిన్ని ఇశ్రాయేలు ప్రభువులలో కొందరినిన్ని
కత్తిచేత సంహరించెను. । యెహోరాము యేలనారం 5
భించినప్పుడు ముప్పయి రెండు సంవత్సరముల వాడై,
యెరూశలేములో యెనిమిది సంవత్సరములు యేలెను. ।
అతడు అహాబు యింటివారు నడిచిన ప్రకారముగాను 6
ఇశ్రాయేలు రాజుల మార్గమందు నడిచెను, యే
మంటే అహాబుయొక్క కుమార్తె అతనికి భార్యగా
వుండెను, అతడు యెహోవా నేత్రములకు కీడుగా
ప్రవర్తించెను. । అయినప్పటికిన్ని యెహోవా దావీ 7
దుతో చేసిన వొడంబడికె నిమిత్తమున్ను అతనికిన్ని
అతని కుమారులకున్ను నిత్యమున్ను దీపమును యిస్తా
నని వాగ్దత్తము చేసిన ప్రకారముగానున్ను దావీదు
యింటిని నశింప చేయుటకు మనస్సు లేక యుండెను. ।
అతని దినములలో ఎదోమీయులు యూదా అధికా 8
రము కింద తిరుగబడి తమ కొరకు వొకని రాజుగా
చేసుకొనిరి. । అప్పుడు యెహోరాము తన చేతి కింద 9
వున్న ప్రభువులతోనున్ను తన యావత్తు రథములతో
నున్ను బయిలుదేరి, రాత్రి లేచి, తన్ను చుట్టుకొనిన
ఎదోమీయులనున్ను రథాధిపతులనున్ను సంహరిం

10 చెను. । యీలాగున ఎదోమీయులు నేటి వరకు వున్న
లాగున యూదా చేతికిందనుంచి తిరుగబడిరి; అతడు
తన పితృలయొక్క పరాత్పరుడైన యెహోవాను విడి
చిపెట్టినందున ఆ కాలమందు లిబ్నాయున్ను అతని
11 చేతికిందనుంచి తిరగబడెను. । మరిన్ని అతడు యూదా
పర్వతముల యందు వున్నతమైన స్థలములను చేసి, యె
రూశలేము కాపురస్తులను వ్యభిచారము జరిగించుటకు
చేసెను; అతడు అందుకు యూదానున్ను బలవంతము
12 చేసెను. । అంతట దీర్ఘదర్శియైన ఏలీయా యొద్ద
నుంచి అతని యొద్దికి వొక వ్రాత వచ్చినదేమంటే, నీ
తండ్రి అయిన దావీదుయొక్క పరాత్పరుడైన యె
హోవా యీ ప్రకారముగా చెప్పుతున్నాడు, యేలా
గునంటే, నీవు నీ తండ్రి అయిన యెహోషాఫాథు
మార్గములందైనా యూదా రాజయినా ఆసా మా
13 ర్గములందైనా నడవక, । ఇశ్రాయేలు రాజుల మార్గ
మందు నడిచి, అహాబు యింటివారియొక్క వ్యభిచార
ముల చొప్పున యూదానున్ను యెరూశలేము కాపు
రస్తులనున్ను వ్యభిచరింప జేసి, నీకంటే యోగ్యులైన
నీ తండ్రి యింటివారి సంబంధులైన నీ సహోదరు
14 లను చంపించినావు, గనుక, । యిదుగో గొప్ప తెగులు
తోను యెహోవా నీ జనులనున్ను నీ పిల్లలనున్ను నీ
15 భార్యలనున్ను నీ వస్తువులనన్నిటినిన్ని కొట్టును. । నీ
పేగులకు వ్యాధి కలిగినందున నీవు మిక్కిలీ రోగివై
యుందువు; దినదినానకు ఆ వ్యాధిచేత నీ పేగులు
16 పడిపోతవి అని వ్రాయబడి వుండెను. । మరిన్ని యె
హోవా యెహోరాముకు విరోధముగా పెలిష్తీయుల
యొక్కయున్ను కుషీయుల దగ్గిర వున్న అరబీయుల
17 యొక్కయున్ను ఆత్మను ప్రేరేపించినందున, । వారు
యూదా మీదికి వచ్చి, చొరబడి, రాజు యింట్లో
దొరికిన సమస్త పదార్థములనున్ను అతని కుమారుల
నున్ను అతని భార్యలనున్ను తీసుకొని పోయిరి; అందు
వల్ల అతని కుమారులలో కనిష్ఠుడైన యెహోయాహాజు
వినా అతనికి మరి యే కుమారుడైనా విడవబడలేదు. ।
18 యిది అంతా అయిన తరువాత యెహోవా అతని
పేగులకు స్వస్థము కానటువంటి వ్యాధిచేత అతని మొ
19 త్తెను. । కొంత కాలమైన తరువాత అనగా రెండు సం
వత్సరముల అంతమందు సంభవించినదేమంటే, అతని
వ్యాధిచేత అతని పేగులు పడిపోయెను; యీలాగున
కఠినమైన వ్యాధుల వల్ల అతడు చనిపోయెను; అతని
జనులు అతని తండ్రుల కొరకైన కాలుపుల చొప్పున
20 అతని కొరకు కాలుపును చేయలేదు. । అతడు యేలనా
రంభించినప్పుడు ముప్ఫయి రెండు సంవత్సరముల వా
డయి, యెరూశలేములో యెనిమిది సంవత్సరములు
యేలి, కోరబడకనే చనిపోయెను; అయినప్పటికిన్ని
వారు రాజుల సమాధులలో కాకుండా దావీదు పట్టణ
మందు అతని పాతిపెట్టిరి.

## 22. అధ్యాయము.

యెరూశలేముయొక్క కాపురస్తులు అతని కనిష్ఠ 1
కుమారుడైన అహజ్యాను అతనికి బదులుగా రాజును
చేసిరి, యేమంటే అరబీయులతో కూడా దండుకు
వచ్చిన మనుష్యుల గుంపు పెద్దవారినందరినిన్ని చంపె
ను; యీ ప్రకారముగా యూదా రాజనే యెహో
రాము కుమారుడైన అహజ్యా రాజరికము చేసెను. ।
అహజ్యా యేలనారంభించినప్పుడు నలుభై రెండు 2
సంవత్సరముల వాడై, యెరూశలేములో వొక సంవ
త్సరము యేలెను; అతని తల్లి ఒమ్రీ కుమార్తెయై అత
ల్యా అనే పేరు గలదై యుండెను.। అతడున్ను అహాబు 3
యింటివారి మార్గములందు నడిచెను, యేమంటే దుర్మా
ర్గముగా ప్రవర్తించుటకు అతని తల్లి అతనికి బుద్ధి
చెప్పినదై వుండెను. । కాబట్టి అతడు అహాబు యింటి 4
వారి లాగున యెహోవా దృష్టికి కీడుగా ప్రవర్తిం
చెను, యేమంటే అతని తండ్రి మరణము అయిన తరు
వాత అతని నాశనమునకు వారు అతని ఆలోచన
కర్తలై యుండిరి. । వారి ఆలోచన ప్రకారముగా 5
అతడు ప్రవర్తించి, రామోత్గిలాదులో అరాము
రాజైన హజాయేలుతో యుద్ధము చేసుటకు ఇశ్రా
యేలు రాజున్ను అహాబు కుమారుడున్ను అయిన యె
హోరాముతో కూడా వెళ్లెను; అయితే అరామీ
యులు యెహోరామును కొట్టిరి. । అరాము రాజైన 6
హజాయేలుతో యుద్ధము చేసినప్పుడు రామాలో
అతడు పొందిన గాయములు బాగుపడుట కొరకు
అతడు ఇజ్రెయేలుకు తిరిగీ వచ్చెను; అప్పుడు యూదా
రాజున్ను యెహోరాము కుమారుడున్ను అయిన అజ
ర్యా అహాబు కుమారుడైన యెహోరాము రోగియై
వున్నందున ఇజ్రెయేలులో వున్న అతని చూచుటకు
దిగి వెళ్లెను. । యెహోరాము యొద్దికి రావడము చేత 7
అహజ్యాయొక్క నాశనము యెహోవా వల్ల కలి
గెను, యేమంటే అతడు వచ్చినప్పుడు అహాబు యింటి
వారిని ఖండించుటకు యెహోవా అభిషేకించినటు
వంటిన్ని నిమ్షీ కుమారుడయినటువంటిన్ని యెహూ
మీదికి అతడు యెహోరాముతో కూడా వెళ్లెను.। 8
యెహూ అహాబు యింటి వారి మీద న్యాయమును
తీర్చుతూ యూదా ప్రభువులనున్ను అహజ్యాకు సేవ
చేసిన అహజ్యా సహోదరుల కుమారులనున్ను కను
గొనినప్పుడు అతడు వారిని సంహరించెను. । తరువాత 9
అతడు అహజ్యాను వెతికెను; అతడు షోమ్రోనులో
దాగి వున్నందున వారు అతని పట్టుకొని యెహూ

యొద్దికి తీసుక వచ్చిరి; వారు అతని చంపిన తరువాత
తన హృదయమంతటితోను యెహోవాను వెతికిన
యెహోషాఫాథు కుమారుడు యితడు గదా అను
కొని, అతని పాతిపెట్టిరి. యీలాగున రాజ్యమును
యింకా వుంచుటకు అహజ్యా యింటివారికి సమర్థత
10 లేకపోయెను. । అయితే అహజ్యా తల్లి అయిన అత
ల్యా తన కుమారుడు చనిపోయెనని చూచినప్పుడు
ఆమె లేచి, యూదా యింటి సంబంధమైన రాజ
11 వంశమును సంహరించెను. । అయితే రాజు కుమార్తె
అయిన యెహోషబతు అహజ్యా కుమారుడైన యో
వాషును హతులైన రాజ కుమారులలోనుంచి దొంగిలి
కొని, అతనినిన్ని అతని దాదినిన్ని వొక పడక గదిలో
వుంచెను. యీ ప్రకారముగా యెహోరాము అనే
రాజు కుమార్తెయున్ను యెహోయాదా అనే అర్చ
కుని భార్యయున్ను అయిన యెహోషబతు అత
ల్యాకు కనపడకుండా అతని దాచిపెట్టినందున ఆమె
అతని చంపక పోయెను, యేమంటే యీ యెహోష
12 బతు అహజ్యా సహోదరి అయి వుండెను. । అతడు
ఆరు సంవత్సరములు వారితో కూడా పరాత్పరుని
యింటిలో దాచబడి వుండెను, అప్పుడు అతల్యా దేశ
మును యేలుతూ వుండెను.

## 23. అధ్యాయము.

1 అంతట యేడో సంవత్సరమందు యెహోయాదా
తన్ను బలపరచుకొని, శతాధిపతులతోనున్ను యె
హోరాము కుమారుడైన అజర్యాతోనున్ను యెహో
హానాను కుమారుడైన ఇష్మాయేలుతోనున్ను ఓబేదు
కుమారుడైన అజర్యాతోనున్ను అదాయా కుమారుడైన
మయశేయాతోనున్ను జిఖ్రీ కుమారుడైన ఎలీషాఫా
థుతోనున్ను తాను వొడంబడికెను చేసుకొనెను. ।
2 వారు యూదా యందంతటాను సంచరించి, యూదా
పట్టణములన్నిటిలోనుంచి లేవీయులనున్ను ఇశ్రాయేలు
పితృల పెద్దలనున్ను కూర్చుకొని యెరూశలేముకు
3 వచ్చిరి. । సభవారందరూ పరాత్పరుని యింటిలో రా
జుతో కూడా వొడంబడికెను చేసుకొనిరి. అప్పుడు
అతడు వారితో చెప్పినదేమంటే, యిదుగో యెహో
వా దావీదు కుమారులను గురించి చెప్పిన ప్రకారము
4 గా రాజు కుమారుడు రాజరికము చేసును. । మీరు
చేయవలసిన కార్యము యిది, అర్చకులలోనున్ను లేవీ
యులలోనున్ను సబ్బాతు దినమున ప్రవేశించే మీరు
మూడు భాగములై, అందులో వొక భాగము ద్వార
5 పాలకులై యుండవలెను. । వొక భాగము రాజు యింటి
యొద్దనున్ను వొక భాగము పునాది యొక్క ద్వారము
యొద్దనున్ను వుండవలెను; జనులందరూ యెహోవా
యింటియొక్క సాలలలో వుండవలెను. । అయితే అర్చ 6
కులున్ను లేవీయులలో సేవ చేసేవారున్ను వినాగా
యెహోవా యింటి లోపలికి మరి యెవరున్ను రా
నివ్వబడ కూడదు; వారు పరిశుద్ధులై యున్నారు గనుక
వారు లోపలికి రావచ్చును; అయితే జనులందరూ
యెహోవాయొక్క కాపును వుంచవలెను. । లేవీయు 7
లలో ప్రతివాడు తన తన ఆయుధములను చేత పట్టు
కొని రాజుకు చుట్టూ వుండవలెను; యింటిలోపలికి
మరి యెవడైనా వస్తే వాడు చంపబడ వలెను; అయితే
రాజు లోపలికి వస్తూ బైటికి వెళ్లుతూ వున్నప్పుడు
మీరు అతనితో కూడా వుండవలెనని చెప్పెను. । యీ 8
ప్రకారముగా లేవీయులున్ను యూదా వారందరున్ను
అర్చకుడయిన యెహోయాదా ఆజ్ఞాపించిన అంతటి
ప్రకారముగా చేసి, ప్రతివాడు సబ్బాతు దినమున
బైటికి వెళ్లవలసిన తన తన వారినిన్ని సబ్బాతు దిన
ములో లోపలికి రావలసిన తన తన వారినిన్ని తీసు
కొనెను, యేమంటే అర్చకుడైన యెహోయాదా
వంతుల వారిని పంపివేయలేదు. । మరిన్ని అర్చకు 9
డైన యెహోయాదా పరాత్పరుని యింటిలో వున్న
టువంటిన్ని రాజైన దావీదువి అయినటువంటిన్ని బల్లె
ములనున్ను కేడెములనున్ను డాలులనున్ను శతాధి
పతులకు అప్పగించెను. । మరిన్ని అతడు జనుల నంద 10
రినిన్ని అనగా తన తన ఆయుధమును చేత పట్టు
కొనిన ప్రతివానినిన్ని మందిరముయొక్క కుడివైపు
మొదలుకొని మందిరముయొక్క యెడమవైపు పర్యం
తమున్ను బలిపీఠముయొక్క మందిరముయొక్క పక్క
నున్ను రాజు చుట్టున్ను వుంచెను. । అప్పుడు వారు 11
రాజు కుమారుని బైటికి తీసుక వచ్చి, అతని మీద కిరీ
టము వేసి, అతనికి సాక్ష్యము యిచ్చి, అతని రాజుగా
చేసిరి; అప్పుడు యెహోయాదాయున్ను అతని కుమా
రులున్ను అతని అభిషేకించి పరాత్పరుడు రాజును
రక్షించును గాక అని పలికిరి. । అయితే పరిగెత్తుతూ 12
రాజును కొనియాడుతూ వున్న జనులయొక్క ధ్వనిని
అతల్యా వినినప్పుడు ఆమె యెహోవా మందిరమం
దున్న జనుల యొద్దికి వచ్చి చూచెను. । అప్పుడు యి 13
దుగో ప్రవేశస్థలము దగ్గిర వున్న స్తంభము యొద్ద
రాజు నిలువబడి యుండెను; ప్రభువులున్ను బూరగల
నూదేవారున్ను రాజు యొద్ద వుండిరి; దేశపు జనులం
దరున్ను సంతోషిస్తూ బూరగలతో నాదము చేస్తూ
వుండిరి; వాద్యములతో గాయకులున్ను స్తుతిని పాడు
టకు నేర్పేవారున్ను వుండిరి; అప్పుడు అతల్యా తన
వస్త్రములను చించుకొని ద్రోహము ద్రోహము అని
పలికెను. । అప్పుడు అర్చకుడైన యెహోయాదా 14
సమూహము పైని వున్న శతాధిపతులను బయిటికి

తీసుక వచ్చి, ఆమెను వరసల అవతలకు వెళ్లవేయండి;
ఆమెను వెంబడించే వాడెవడో వాడు కత్తిచేత చంప
బడవలెనని వారితో చెప్పెను, యేమంటే యెహో
వా మందిరములో ఆమెను చంపవద్దని అర్చకుడు
15 చెప్పెను. । ఆలాగున వారు ఆమె మీద చేతులు వేసిరి;
రాజు యింటి యొద్ద వున్న గుర్రపు ద్వారముయొక్క
ప్రవేశస్థలమునకు ఆమె వచ్చినప్పుడు వారు ఆమెను
16 అక్కడ చంపి వేసిరి. । అప్పుడు యెహోయాదా
జనులందరూ యెహోవా వారలై యుండ వలెనని
తాను జనులందరితోనున్ను రాజుతోనున్ను ఔడంబ
17 డికె చేసెను.। అంతట జనులందరున్ను బయలుయొక్క
యింట్లోకి వెళ్లి, దాని పడగొట్టి, వాని బలిపీఠములను
న్ను వాని విగ్రహములనున్ను ముక్కలుగా విరగ
గొట్టి, బయలు అర్చకుడైన మత్తానును బలిపీఠముల
18 ముందర చంపిరి.। మరిన్ని యెహోయాదా యెహో
వా మందిరముయొక్క వ్యాపారములు లేవీయులైన
అర్చకుల ద్వారా జరిగేలాగు నిర్ణయించెను; మోషే
యొక్క న్యాయ ప్రమాణమందు వ్రాయబడిన ప్రకా
రముగా యెహోవా దహన బలులను దావీదు నియ
మించినలాగున వుత్సాహముతోనున్ను గానముతో
నున్ను అర్పించుటకు దావీదు వారిని యెహోవా
19 మందిరములో యేర్పరచెను. । యెహోవా మందిరము
లోకి దేని చేతనైనా అంటు కలిగిన వాడు ప్రవేశించ
కుండా అతడు ద్వారముల యొద్ద ద్వారపాలకులను
20 వుంచెను.। మరిన్ని అతడు శతాధిపతులనున్ను శ్రేష్ఠుల
నున్ను జనుల అధికారులనున్ను దేశపు జనులనందరినిన్ని
తీసుకొని, యెహోవా మందిరములోనుంచి రాజును
కొంచ వచ్చెను; వారు వున్నతమైన ద్వారములోబడి
రాజు యింటిలోకి వచ్చి, రాజ్య సింహాసనము మీద
21 రాజును కూర్చుండ బెట్టిరి. । అప్పుడు దేశపు జను
లందరూ సంతోషించిరి; వారు అతల్యాను కత్తిచేత
సంహరించిన తరువాత పట్టణము నిమ్మళముగా వుండెను.

## 24. అధ్యాయము.

1 యోవాషు యేలనారంభించినప్పుడు యేడు సంవ
త్సరములవాడై, యెరూశలేములో నలుభై సంవత్సర
ములు యేలెను; అతని తల్లి బెయేర్షెబ సంబంధురాలై
2 సిబ్యా అనే పేరు గలదై వుండెను. । యోవాషు అర్చ
కుడైన యెహోయాదాయొక్క యావద్దినముల పర్యం
తమూ యెహోవా దృష్టికి యుక్తముగా ప్రవర్తించె
3 ను. । యెహోయాదా యిద్దరు భార్యలను అతనికి
పెండ్లి చేసెను; అతడు కుమారులనున్ను కుమార్తెల
4 నున్ను కనెను.। యిది అయిన తరువాత సంభవించిన
దేమంటే, యెహోవా మందిరమును బాగు చేసుటకు
యోవాషుకు తాత్పర్యము పుట్టెను. । అతడు అర్చకుల 5
నున్ను లేవీయులనున్ను సమకూర్చి, మీరు యూదా
పట్టణములకు వెళ్లి, మీ పరాత్పరుని యిల్లు బాగు
చేసుటకు ఇశ్రాయేలు వారందరి యొద్దనుంచి ధనమును
యేడాదికి యేడాదికి కూర్చవలెను; యీ కార్యమును
మీరు త్వరపెట్టవలెను సుమీ, అని వారితో చెప్పెను;
అయినప్పటికిన్ని లేవీయులు త్వరపెట్టలేదు. । అప్పుడు 6
రాజు ప్రధాని అయిన యెహోయాదాను పిలిచి,
అతనితో అనినదేమంటే, యెహోవా సేవకుడైన
మోషే ఆజ్ఞ ప్రకారముగా సాక్ష్యముయొక్క గుడా
రము కొరకు యూదాలోనుంచిన్ని యెరూశలేములో
నుంచిన్ని ఇశ్రాయేలు సభలోనుంచిన్ని కానుకను నీవు
లేవీయులను యెందుకు తెమ్మన లేదని చెప్పెను. । యే 7
మంటే ఆ దుర్మార్గురాలయిన అతల్యాయొక్క కుమా
రులు పరాత్పరుని మందిరము పాడు చేసిరి; మరిన్ని
వారు యెహోవా మందిరముయొక్క పరిశుద్ధ వస్తు
వులనన్నిటినిన్ని బయలీముకు యిచ్చిరి. । అంతట రాజు 8
ఆజ్ఞ చొప్పున వారు వొక పెట్టెను చేయించి, యెహో
వా మందిర ద్వారము బయిట వుంచిరి. । మరిన్ని పరా 9
త్పరుని సేవకుడయిన మోషే అరణ్యమందు ఇశ్రాయే
లుకు నియమించిన కానుకను యెహోవా యొద్దికి
తెచ్చుటకు యూదాలోనున్ను యెరూశలేములోను
న్ను వారు చాటించిరి. । అప్పుడు ప్రభువులందరున్ను 10
జనులందరున్ను సంతోషించి తీసుక వచ్చి చాలించే
పర్యంతమూ పెట్టెలో వేసిరి. । అయితే లేవీయుల 11
ద్వారా ఆ పెట్టె రాజుయొక్క వ్యాపార స్థలమునకు
తేబడిన కాలమందు అందులో విస్తారముగా ధనము
వున్నదని వారు చూచినప్పుడు రాజుయొక్క సంప్ర
తిన్ని ప్రధానాచార్యకునియొక్క పరిచారకుడున్ను
వచ్చి, పెట్టెలో వున్న దాని తీసి, దాని స్థలమునకు దాని
తిరిగీ తీసుకొని వెళ్లేవారు; యీలాగున వారు దిన
దినానకు చేసి విస్తారమైన ధనమును కూర్చిరి.। అప్పు 12
డు రాజున్ను యెహోయాదాయున్ను యెహోవా
మందిరముయొక్క సేవకావృత్తి చేసే వారికి దాని
యిచ్చి, యెహోవా మందిరము బాగు చేసుటకు కా
సెవాండ్లనున్ను వడ్లవాండ్లనున్ను యెహోవా మంది
రము బాగు చేసే కొరకు యినుప పనిన్ని యిత్తడి
పనిన్ని చేసే వారినిన్ని కూలికి కుదిర్చిరి. । యీలా 13
గున పనివాండ్లు పని చేసినందువల్ల వారిచేత పని సమా
ప్తమాయెను; వారు పరాత్పరుని మందిరమును యథా
స్థితిగా చేసి దాని బలపరిచిరి. । వారు దాని తయారు 14
చేసిన తరువాత వారు మిగిలిన ధనమును రాజు యొద్ది
కిన్ని యెహోయాదా యొద్దికిన్ని తీసుక వచ్చిరి; దాని
చేత యెహోవా మందిరము కొరకు పాత్రలు అనగా

సేవించే అర్పించే పాత్రలున్ను గరిటెలున్ను వెండి
బంగారముల పాత్రలున్ను చేయబడినవి. యెహో
యాదా యావద్దినముల పర్యంతము వారు యెహో
వా మందిరములో దహన బలులను నిత్యమున్ను
15 అర్పించిరి. । అయితే యెహోయాదా చనిపోయిన
ప్పుడు అతడు వృద్ధుయి అనేక దినములు గడిచిన వా
డయి యుండెను; అతడు చనిపోయినప్పుడు నూట
16 ముప్పయి సంవత్సరముల వాడై వుండెను. । అతడు
ఇశ్రాయేలులో పరాత్పరుని యెడలనున్ను తన యిం
టివారి యెడలనున్ను మేలు చేసెను గనుక వారు అతని
దావీదు పట్టణమందు రాజులతో కూడా పాతి పెట్టిరి.।
17 అయితే యెహోయాదాయొక్క మరణము అయిన
తరువాత యూదా ప్రభువులు వచ్చి రాజుకు నమ
స్కరించిరి; అప్పుడు రాజు వారి మాటకు సమ్మతించె
18 ను. । అంతట వారు తమ పితృల పరాత్పరుడయిన యె
హోవా మందిరమును విడిచి, తోపులనున్ను విగ్ర
హములనున్ను సేవించిరి; వారిదైన యీ అక్రమము
నిమిత్తము యూదా మీదనున్ను యెరూశలేము మీద
19 నున్ను కోపము వచ్చెను. । అయినప్పటికిన్ని ఆయన
యెహోవా తట్టుకు వారిని మళ్లించుటకు వారి యొ
ద్దికి దీర్ఘదర్శులను పంపెను: వారు వారికి విరోధ
ముగా సాక్ష్యము పలికినప్పటికిన్ని వారు చెవిసొగ్గక
20 వుండిరి. । అప్పుడు పరాత్పరుని ఆత్మ అర్చకుడైన యె
హోయాదా కుమారుడైన జెఖర్యా మీదికి వచ్చినం
దున, అతడు జనుల పయిని నిలువబడి, పరాత్పరుడు
యీలాగు చెప్పుతున్నాడు, మీరు వృద్ధి పొందక వుం
డేటట్టు యెహోవా ఆజ్ఞలను యెందుకు అతిక్రమి
స్తున్నారు? మీరు యెహోవాను విడిచిపెట్టి యు
న్నారు గనుక ఆయన మిమ్మును విడిచిపెట్టి యున్నా
21 డని వారితో చెప్పెను. । అయితే వారు అతని మీద
జట్టు కూడుకొని, రాజు ఆజ్ఞ ప్రకారము యెహో
22 వా మందిరశాలలో రాళ్లతో అతని కొట్టిరి. । యీలా
గున రాజైన యోవాషు అతని తండ్రి అయిన యె
హోయాదా అతనికి చేసిన వుపకారమును తలంచక
అతని కుమారుని చంపించెను; అతడు చనిపోయేటప్పుడు
యెహోవా దీని చూచి విచారించును గాక అని
23 చెప్పెను. । ఆ సంవత్సరాంతమందు సంభవించినదేమం
టే, అరాము సమూహము అతని మీదికి వచ్చెను;
వారు యూదాకున్ను యెరూశలేముకున్ను వచ్చి, జను
లలోనుంచి జనుల ప్రభువులనందరినిన్ని సంహరించి,
వారి కొల్ల సొమ్మంతటినీ దమస్కు రాజు యొద్దికి పం
24 పిరి. । యేమంటే అరామీయుల సైన్యము మనుష్యుల
చిన్న గుంపుగా వచ్చెను; అయితే యెహోవా వారి
చేతికి అతి విస్తారమయిన సమూహమును అప్పగించెను,
యెందుకంటే వారు తమ పితృల పరాత్పరుడైన యె
హోవాను విడిచి పెట్టిరి; యీలాగున వారు యో
వాషు మీద న్యాయము తీర్చిరి. । వారు అతని యొ 25
ద్దనుంచి తొలిగి పోయినప్పుడు, యేమంటే గొప్ప రో
గములు గలవానిగా వారు అతని విడిచిపెట్టినందున,
అతని సేవకులు అర్చకుడయిన యెహోయాదా కుమా
రుల రక్తము కొరకు అతని మీద జట్టు కూడుకొని,
అతని పరుపు మీదనే అతని చంపినందున, అతడు చని
పోయెను; వారు అతని దావీదు పట్టణమందు పాతి
పెట్టిరి, గాని రాజుల సమాధులలో అతని పాతి పెట్ట
లేదు. । అతని మీద జట్టు కూడినవారెవరంటే, అమ్మో 26
నీయురాలైన షిమాతు కుమారుడైన జాబాదున్ను, మో
యాబీయురాలైన షిమ్రాతు కుమారుడైన యెహోజా
బాదున్ను. । అతని కుమాళ్లను గురించిన్ని అతని మీద 27
వేయబడ్డ గొప్ప బరువులను గురించిన్ని పరాత్పరుని
యింటిని బాగుచేసుటను గురించిన్ని అయిన సంగ
తులు, యిదుగో, రాజుల గ్రంథముయొక్క కథలో
వ్రాయబడి యున్నవి. అతనికి బదులుగా అతని కుమా
రుడైన అమస్యా యేలెను.

## 25. అధ్యాయము.

అమస్యా యేలనారంభించినప్పుడు యిరువై అయిదు 1
సంవత్సరములవాడై, యిరువై తొమ్మిది సంవత్సరములు
యెరూశలేములో యేలెను; అతని తల్లి యెరూశలేము
సంబంధురాలై, యెహోయద్దాను అనే పేరు గలదై
వుండెను. । అతడు యెహోవా దృష్టికి యుక్తముగా 2
ప్రవర్తించెను, గాని పూర్ణ హృదయముతో కాదు.।
రాజ్యము అతనికి దృఢమైనప్పుడు సంభవించినదేమం 3
టే, అతడు రాజైన తన తండ్రిని చంపిన తన సేవకు
లను చంపించెను. । అతడు వారి పిల్లలను చంపకుం 4
డా మోషే గ్రంథమందున్న న్యాయ ప్రమాణములో
వ్రాయబడిన ప్రకారము చేసెను; అందులో తండ్రు
లు పిల్లల కొరకున్ను పిల్లలు తండ్రుల కొరకున్ను చావ
కూడదు గాని ప్రతి మనిషి తన తన పాపము కొరకు
చావవలెనని యెహోవా ఆజ్ఞాపించెను. । మరిన్ని అమ 5
స్యా యూదా వారినందరినిన్ని కూర్చి, యూదా
అంతటిలోనున్ను బెన్యామీను అంతటిలోనున్ను వారి
వారి పితృల యిండ్ల ప్రకారము సహస్రాధిపతులనున్ను
శతాధిపతులనున్ను నిర్ణయించెను; అతడు యిరువై
సంవత్సరములు మొదలుకొని అంతకు పై యీడు గల
వారిని లెక్కించినప్పుడు యీటెనున్ను డాలునున్ను
పట్టగలవారున్ను యుద్ధమునకు తగిన వారున్ను అయి
యేర్పరచబడిన మూడు లక్షల మంది కనుపడిరి. ।
మరిన్ని అతడు ఇశ్రాయేలులోనుంచి నూరు తలాం 6

తుల వెండికి పరాక్రమశాలులైన లక్షమందిని కుదిర్చె
7 ను. । అయితే దైవ జనుడైన వొకడు అతని యొద్దికి
వచ్చి అనినదేమంటే, వో రాజా, ఇశ్రాయేలు సైన్య
మును నీతో కూడా వెళ్లనియ్యకుము, యేమంటే యె
హెూవా ఇశ్రాయేలుతో కూడా అనగా, ఎఫ్రయీ
8 ము పుత్రులందరితో కూడా వున్నాడు కాడు. । అయితే
వెళ్లవలెనని నీకు వుంటే ఆలాగు చేయుము; యుద్ధము
కొరకు బలముగా వుండుము; పరాత్పరుడు శత్రువు
యెదుట నిన్ను పడేటట్టు చేసును, యేమంటే సహా
యము చేసుటకున్ను పడవేసుటకున్ను పరాప్పరునికి
9 శక్తి వున్నదని చెప్పెను. । అప్పుడు అమస్యా దైవ జనుని
చూచి, అయితే ఇశ్రాయేలు సైన్యమునకు నేను యి
చ్చిన నూరు తలాంతులకు యేమి చేతామని అడిగితే,
దీనికంటే మరీ అధికమును యెహెూవా నీకు యివ్వ
10 గలడని ఆ దైవ జనుడు ప్రత్యుత్తర మిచ్చెను. । అప్పుడు
అమస్యా యిండ్లకు తిరిగీ వెళ్లే కొరకు వారిని అనగా
ఎఫ్రయీములోనుంచి తన యొద్దికి వచ్చిన సైన్యమును
కేటాయించెను; అందుకు వారి కోపము యూదా
మీద మిక్కిలిగా రగులుకొనెను; వారు తమ యిండ్లకు
11 బహు కోపముతో తిరిగి పోయిరి. । అంతట అమస్యా
తన్ను బలపరచుకొని తన జనులను బయిటికి తీసుకొపో
యి, వుప్పు పల్లపు స్థలమునకు వెళ్లి, శెయీరు పుత్రు
12 లలో పదివేల మందిని సంహరించెను. । యింకా ప్రా
ణముతో మిగిలిన పదివేల మందిని యూదా పుత్రులు
చెర పట్టి, మెట్ట మీదికి వారిని తీసుకపోయి, మెట్ట
మీదనుంచి వారిని పడవేసినందువల్ల వారు ముక్కలై
13 పోయిరి. । అయితే తనతో కూడా యుద్ధమునకు వెళ్ల
కుండా అమస్యా తిరిగీ పంపివేసిన సైన్యస్థులు షోమ్రో
ను మొదలుకొని బేథోరోను మట్టుకు వున్న యూదా
పట్టణముల మీద పడి, వారిలో మూడు వేల మందిని
14 కొట్టి, విస్తారమైన కొల్ల సొమ్మును తీసుకొనిరి. । అమ
స్యా ఎదోమీయులను హతము చేసి తిరిగీ వచ్చిన తరు
వాత సంభవించినదేమంటే, అతడు శెయీరు పుత్రుల
దేవుండ్లను తీసుక వచ్చి, తనకు దేవుండ్లయ్యేటట్టు
వాటిని నిలిపి, వాటి యెదుట వంగి వాటికి ధూపము
15 వేసెను. । అందు కొరకు యెహెూవా కోపము అమ
స్యామీద రగులుకొనినందున ఆయన అతని యొద్దికి
వొక దీర్ఘదర్శిని పంపెను; అతడు అతనితో అనిన
దేమంటే, నీ చేతిలోనుంచి తమ జనులను విడిపించ
శక్తి లేనటువంటి జనుల దేవుండ్లను నీవు యెందుకు వెతి
16 కితివని చెప్పెను. । అతడు అతనితో మాట్లాడుతూ
వుండగా సంభవించినదేమంటే, రాజు అతని చూచి,
నీవు రాజు యొక్క ఆలోచన కర్తలలో వొకడవైతివా?
వూరకో; నీవు యెందుకు చంపబడ వలెను, అని చెప్పి
నప్పుడు, ఆ దీర్ఘదర్శి వూరకొని, అనినదేమంటే,
నీవు దీని చేసి, నా ఆలోచనను ఆలకించక పోతివి,
గనుక పరాత్పరుడు నిన్ను నశింపచేసుటకు వుద్దేశించి
వున్నాడని నాకు తెలుసునని చెప్పెను. । అప్పుడు యూ 17
దా రాజైన అమస్యా ఆలోచన పుచ్చుకొని, రండి
మనము వొకరి ముఖము వొకరు చూచుకొందామని
యెహూకు పుట్టిన యెహెూయాహాజు కుమారుడున్ను
ఇశ్రాయేలు రాజున్ను అయిన యోవాషు యొద్దికి వా
ర్త పంపెను. । అప్పుడు ఇశ్రాయేలు రాజైన యోవాషు 18
యూదా రాజైన అమస్యాకు పంపిన కబురు యేమం
టే, లెబానోనులో వున్న ముళ్ల చెట్టు లెబానోనులో
వున్న సీదరు చెట్టుకు నీ కుమార్తెను నా కుమారునికి
భార్యగా యివ్వ వలెననే వర్తమానమును పంపెను;
అప్పుడు లెబానోనులో వున్న వొక అడవి మృగము
దాటి పోతూ ఆ ముళ్లచెట్టును తొక్కివేసెను. । 19
యిదుగో నేను ఎదోమీయులను కొట్టివేసినానని నీవు
అంటూ, బడాయి చేసుటకు నీ హృదయము నిన్ను
అతిశయింప చేస్తున్నది; యింటియొద్ద నిలిచి యుండు
ము; నీవున్ను నీతో కూడా యూదాయున్ను పడేటట్టు
నీ హాని కొరకు నాజోలికి యెందుకు వస్తావు అని చెప్పి
నప్పటికిన్ని; । అమస్యా ఆలకించక వుండెను, యేమంటే 20
వారు ఎదోమీయుల దేవుండ్లను వెతికిరి గనుక పరాత్ప
రుడు వారి శత్రువుల చేతికి వారిని అప్పగించేలాగున
యిది ఆయనవల్ల ఆయెను. । యీలాగున ఇశ్రాయేలు 21
రాజైన యోవాషు పయికి వెళ్లెను; యూదా సంబంధ
మైన బేత్షెమెషులో అతడున్ను యూదా రాజైన అమ
స్యాయున్ను వొకరి ముఖమును వొకరు చూచుకొనిరి. ।
అయితే యూదా ఇశ్రాయేలు ముందర కొట్టబడినం 22
దున ప్రతివాడు తన తన గుడారమునకు పారిపో
యెను. । అప్పుడు ఇశ్రాయేలు రాజయిన యోవాషు 23
యెహెూయాహాజుకు పుట్టిన యోవాషు కుమారు
డున్ను యూదా రాజున్ను అయిన అమస్యాను బేత్షె
మెషులో పట్టుకొని, యెరూశలేముకు తీసుక వచ్చి,
యెరూశలేము ప్రాకారమును ఎఫ్రయీము ద్వారము
మొదలుకొని మూల ద్వారము పర్యంతము నన్నూరు
మూరలు మట్టుకు పడగొట్టెను. । అతడు పరాత్పరుని 24
మందిరములో ఓబేదెదోము యొద్ద వున్న వెండి బంగా
రములంతటినిన్ని పాత్రలన్నిటినిన్ని రాజు యింటిలో
వున్న సొమ్మునున్ను కుదువ వాండ్లనున్ను తీసుకొని
షోమ్రోనుకు తిరిగీ వెళ్లెను. । యూదా రాజున్ను 25
యోవాషు కుమారుడున్ను అయిన అమస్యా ఇశ్రా
యేలు రాజున్ను యెహెూయాహాజు కుమారుడున్ను
అయిన యోవాషు మరణమైన తరువాత పదిహేను
సంవత్సరములు బ్రతికెను. । అమస్యాయొక్క కడమ 26

పూర్వోత్తర కార్యములు యిదుగో యూదాయొక్క
ఇశ్రాయేలుయొక్క రాజుల గ్రంథమందు వ్రాయ
27 బడి యున్నవిగదా! । అయితే అమస్యా యెహోవా
వెంబడినుంచి మళ్లిన తరువాత వారు యెరూశలేములో
అతని మీద జట్టు కూడినందున అతడు లాఖీషుకు
28 పారిపోయెను. । అయితే వారు అతని వెనుకను లాఖీ
షుకు పంపి, అతని అక్కడ చంపి, గుఱ్ఱముల మీద
అతని యెక్కించి తీసుక వచ్చి, యూదా పట్టణమందు
అతని తండ్రులతో కూడా అతని పాతి పెట్టిరి.

## 26. అధ్యాయము.

1 అప్పుడు యూదా జనులందరున్ను పదహారు సంవ
త్సరముల వాడైన ఉజ్జీయాను తీసుకొని, అతని తండ్రి
అయిన అమస్యాకు బదులుగా అతని రాజును చేసిరి. ।
2 అతడు ఏలోతును కట్టించి, రాజు అతని పితృలతో
కూడా నిద్రపోయిన తరువాత అది యూదా వారికి
3 తిరిగీ యిచ్చెను. । ఉజ్జీయా యేలనారంభించినప్పుడు
పదహారు సంవత్సరములవాడయి, యెరూశలేములో
యేభై రెండు సంవత్సరములు యేలెను; అతని తల్లి యె
రూశలేము సంబంధురాలై, యెఖొల్యాహు అనే పేరు
4 గలదై వుండెను. । అతడు తన తండ్రియైన అమస్యా
చేసిన అంతటి ప్రకారము యెహోవా దృష్టికి నీతి
5 గా ప్రవర్తించెను. । పరాత్పరుని దర్శనములయందు
తెలివి గల జెకర్యాయొక్క దినములలో అతడు పరా
త్పరుని వెతికెను; అతడు యెహోవాను వెతికినంత
పర్యంతము పరాత్పరుడు అతని వృద్ధిపొంద జేసెను. ।
6 అతడు బైలుదేరి ఫెలిష్తీయులతో యుద్ధము చేసి, గాతు
ప్రాకారమున్ను యబ్నె ప్రాకారమున్ను అష్డోదు
ప్రాకారమున్ను పడగొట్టి అష్డోదు దేశములోనున్న
7 ఫెలిష్తీయులలోనున్న పట్టణములు కట్టించెను. । పరా
త్పరుడు ఫెలిష్తీయుల మీదనున్ను గుర్బయలులో నివ
సించిన అరబీయుల మీదనున్ను మెహూనీయుల మీ
8 దనున్ను అతనికి సహాయము చేసెను. । అమ్మోనీయులు
ఉజ్జీయాకు కానుకలు యిచ్చిరి; అతని పేరు మిస్ర
యీముయొక్క ప్రవేశము మట్టుకు అంతటానున్ను
వ్యాపించెను, యేమంటే అతడు తన్ను అధికముగా
9 బలపరచుకొనెను. । మరిన్ని ఉజ్జీయా యెరూశలేము
లో మూల ద్వారము దగ్గిరనున్న పల్లపు స్థలములయొ
క్క ద్వారము దగ్గిరనున్న ప్రాకారముయొక్క మూల
దగ్గిరనున్న గోపురములను కట్టించి వాటిని దిట్ట పర
10 చెను. । అది గాక అతడు అరణ్యములో గోపురములను
కట్టించి, అనేకమైన నూతులను తొవ్వించెను, యేమం
టే పల్లపు దేశములోనున్న మైదానములోనున్న అత
నికి విస్తారమైన పశువులు వుండెను; పర్వతములలో
నున్న కర్మెలులోనున్న అతనికి వ్యవసాయకులున్న
ద్రాక్షతోటవాండ్లున్న కలిగి వుండిరి, యేమంటే వ్యవ
సాయమందు అతడు అపేక్ష గలవాడై వుండెను; । మరి 11
న్ని ఉజ్జీయాకు యుద్ధము చేసే వారి సమూహము కలిగి
వుండెను; వీరు రాజు పరిచారకులలో హనన్యా అనే
వాని చేతికింద అధిపతి అయిన మయశేయా ద్వారా
నున్న సంప్రతి అయిన యెహీయేలు ద్వారానున్న
అయిన తమ లెక్కయొక్క అంచనా ప్రకారము గుంపు
లుగా యుద్ధమునకు వెళ్లేవారు. । పరాక్రమశాలుల 12
యొక్క పితృలయొక్క ప్రధానులయిన వారి లెక్క
రెండువేల ఆరునూరు అయి వుండెను. । వీరి చేతి కింద 13
శత్రువుకు విరోధముగా రాజుకు సహాయము చేసే కొ
రకు మిక్కిలి పరాక్రమముతో యుద్ధము చేసే
మూడు లక్షల యేడు వేల యేనూరు మంది గల సైన్య
ము వుండెను. । ఉజ్జీయా వీరి కొరకు అనగా సమూ 14
హమంతటికిన్ని డాలులనున్ను యీటెలనున్ను శిర
స్త్రాణములనున్ను కవచములనున్ను విండ్లనున్ను వడి
సెలనున్ను చేయించెను. । మరిన్ని అతడు యెరూశ 15
లేములో అంబులనున్ను పెద్ద రాళ్లనున్ను ప్రయో
గించే కొరకు వుపాయశాలురవల్ల నిర్మించబడ్డ యంత్ర
ములను గోపురముల మీదనున్ను బురుజుల మీద
నున్ను వుండుటకు చేయించెను; అతని పేరు దూరము
గా వ్యాపించెను, యేమంటే అతడు దిట్టపడే పర్యం
తము అతిశయముగా సహాయమును పొందెను. । అయితే 16
అతడు దిట్ట పడినప్పుడు అతని హృదయము అతని
నాశనమునకు అతిశయ పడెను, యేమంటే అతడు
తన పరాత్పరుడయిన యెహోవా యెడల అతిక్ర
మించి, ధూప పీఠము మీద ధూపము వేసుటకు యె
హోవా మందిరములోకి వెళ్లెను. । అప్పుడు అర్చ 17
కుడయిన అజర్యాయున్ను తనతో కూడా ధైర్యవంతు
లున్ను యెహోవా అర్చకులున్ను అయిన యెనభై
మందిన్ని అతని వెంబడిని లోపలికి వెళ్లిరి. । వారు రాజ 18
యిన ఉజ్జీయాను యెదురించి, ఓ ఉజ్జీయా, ధూపము
వేసుటకు ప్రతిష్ఠ చేయబడిన అహరోను కుమారులైన
అర్చకులకు వినాగా యెహోవాకు ధూపము వేసు
టకు నీకు తగదు; పరిశుద్ధ స్థలములోనుంచి బయిటికి
వెళ్లుము, యేమంటే నీవు అతిక్రమించినావు; పరా
త్పరుడైన యెహోవా వల్లనుంచి యిది నీకు ఘనము
కలుగ జేయదు అని చెప్పినప్పుడు; । ఉజ్జీయా ధూపము 19
వేసుటకు ధూప కలశము చేత పట్టుకొనినవాడై, రౌ
ద్రుడాయెను; అతడు అర్చకులమీద రౌద్రుడై యుం
డగా యెహోవా మందిరములో ధూప పీఠము పక్క
ను వున్న అర్చకుల యెదుట అతని నుదుటను కుష్ఠ రో
గము లేచెను. । అప్పుడు ప్రధానాచార్యకుడైన అజర్యా 20

యున్ను అర్చకులందరున్ను అతని వైపు చూడగా
యిదుగో అతడు తన నుదుటను కుష్ఠ రోగము కల
వాడు అయినందున వారు అతని అక్కడినుంచి బైటికి
వెళ్ల జేసిరి; యెహోవా అతని మొత్తినందున బైటికి
21 వెళ్లుటకు తానే త్వరపడెను. । రాజైన ఉజ్జీయా తన మ
రణ దినము పర్యంతము కుష్ఠ రోగి అయి వుండెను; కుష్ఠ
రోగియై యెహోవా మందిరమునుంచి కేటించబడి
నందున అతడు ప్రత్యేకముగా వొక యింట్లో నివసిస్తూ
వుండెను; అతని కుమారుడైన యోతాము రాజు యింటి
మీద వుండి, దేశపు జనులకు న్యాయము తీరుస్తూ
22 వుండెను. । ఉజ్జీయాయొక్క కడమ పూర్వోత్తర కార్య
ములను ఆమోసు కుమారుడున్ను దీర్ఘదర్శిన్ని
23 అయిన యెషయా వ్రాసెను. । యీలాగున ఉజ్జీయా
తన పితృలతో కూడా నిద్ర పొందెను; యితడు కుష్ఠ
రోగి అని రాజుల సంబంధమైన స్మశాన భూమిలో
అతని పితృలతో కూడా వారు అతని పాతి పెట్టిరి;
అతని కుమారుడైన యోతాము అతనికి బదులుగా
యేలెను.

## 27. అధ్యాయము.

1 యోతాము యేలనారంభించినప్పుడు యిరువై
అయిదు సంవత్సరముల వాడై, యెరూశలేములో పద
హారు సంవత్సరములు యేలెను; అతని తల్లి సాదోకు
కుమార్తె అయి, యెరూషా అనే పేరు గలదై వుం
2 డెను. । అతడు తన తండ్రి అయిన ఉజ్జీయా చేసిన
అంతటి ప్రకారము యెహోవా దృష్టికి నీతిగా
ప్రవర్తించెను; అయితే అతడు యెహోవా మంది
రములోకి ప్రవేశించ లేదు; జనులు యింకా దుర్మా
3 ర్గముగా ప్రవర్తిస్తూ వుండిరి. । అతడు యెహో
వా మందిరముయొక్క వున్నత ద్వారమును కట్టించి,
ఓఫెలు గోడ మీదనున్ను విస్తారముగా కట్టించెను. ।
4 మరిన్ని అతడు యూదా పర్వతములలో పట్టణములు
కట్టించి, అరణ్యములలో కోటలనున్ను గోపురముల
5 నున్ను కట్టించెను. । అతడు అమ్మోనీయుల రాజుతో
పోట్లాడి, వారిని జయించినందువల్ల అమ్మోను పుత్రులు
ఆ సంవత్సరమందే అతనికి నూరు తలాంతుల వెండి
నిన్ని పదివేల కొలల గోధుములనున్ను పదివేల కొ
లల తోక గోధుములనున్ను యిచ్చిరి; యింత మట్టుకు
అమ్మోను పుత్రులు రెండో సంవత్సరమున్ను మూడో
6 సంవత్సరమున్ను అతనికి చెల్లించిరి. । యీలాగున యో
తాము తన పరాత్పరుడైన యెహోవా యెదుట తన
మార్గములను ఆయత్తపరచెను గనుక గొప్పవాడు ఆయె
7 ను. । అయితే యోతాముయొక్క కడమ కార్యములు
న్ను అతని యుద్ధములు యావత్తున్ను అతని మార్గ
ములున్ను ఇదుగో అవి ఇశ్రాయేలుయొక్క యూదా
యొక్క రాజుల గ్రంథమందు వ్రాయబడి యున్నవి. ।
అతడు యేలనారంభించినప్పుడు యిరువై అయిదు 8
సంవత్సరములవాడై, యెరూశలేములో పదహారు సం
వత్సరములు యేలెను. । యోతాము తన పితృలతో 9
కూడా నిద్ర పొందెను; వారు అతని దావీదు పట్టణ
మందు పాతి పెట్టిరి; అతని కుమారుడైన ఆహాజు అత
నికి బదులుగా యేలెను.

## 28. అధ్యాయము.

ఆహాజు యేలనారంభించినప్పుడు యిరువై సంవ 1
త్సరముల వాడై, యెరూశలేములో పదహారు సంవ
త్సరములు యేలెను; అయితే అతడు తన తండ్రి అయిన
దావీదు లాగున యెహోవా దృష్టికి నీతిగా ప్రవ
ర్తించ లేదు. । యేమంటే అతడు ఇశ్రాయేలు రా 2
జుల మార్గములందు నడిచి, బయలీము కొరకు పోత
బొమ్మలను చేయించెను. । మరిన్ని అతడు హిన్నోము 3
కుమారునియొక్క పల్లపు స్థలమందు ధూపము వేసి,
ఇశ్రాయేలు పుత్రుల ముందరనుంచి యెహోవా తో
లివేసిన జాతుల అసహ్యతల ప్రకారము తన పిల్లలను
అగ్నివల్లను దహింప చేసెను. । అతడు వున్నత స్థలముల 4
లోనున్ను కొండల మీదనున్ను ప్రతి పచ్చని చెట్టు
కిందనున్ను బలులను అర్పిస్తూ ధూపము వేస్తూ వుండే
వాడు. । అందుచేత అతని పరాత్పరుడైన యెహోవా 5
అతని అరాము రాజు చేతికి అప్పగించినందున, వారు
అతని కొట్టి, వారిలో గొప్ప సమూహమును చెర పట్టి,
దమస్కుకు తీసుకొని వచ్చిరి; అతడు ఇశ్రాయేలు
రాజు చేతికిన్ని అప్పగించబడినందున అతడు అతని
గొప్ప హతముతో కొట్టెను. । యేమంటే రెమల్యా 6
కుమారుడైన పెకహు యూదాలో వొక దినమందు
పరాక్రమశాలులైన లక్ష యిరువై వేల మందిని చం
పెను; యేమంటే వారు తమ పితృల పరాత్పరుడైన
యెహోవాను విడిచి పెట్టిరి. । ఎఫ్రాయీము సంబం 7
ధియున్ను పరాక్రమవంతుడున్నైన జిఖ్రీ రాజు కుమా
రుడైన మయశేయానున్ను యింటి అధిపతి అయిన
అజ్రీకామునున్ను రాజుకు రెండోవాడైన యెల్కా
నానున్ను చంపెను. । అది గాక ఇశ్రాయేలు పుత్రులు 8
తమ సహోదరులలో రెండు లక్షల మందిని స్త్రీలను
కుమారులను కుమార్తెలను చెర తీసుక పోయిరి; వారి
యొద్దనుంచి విస్తారమైన కొల్ల వస్తువులనున్ను తీసు
కొని, ఆ కొల్ల వస్తువులను షోమ్రోనుకు తెచ్చిరి. ।
అయితే ఓదేదు అనే పేరు గల యెహోవా దీర్ఘ 9
దర్శి అక్కడ వుండెను; అతడు షోమ్రోనుకు వచ్చిన
సమూహము యెదుటికి బయిలు వెళ్లి, వారితో అనిన

దేమంటే, యిదుగో మీ పితృల పరాత్పరుడైన యె
హోవా యూదా మీద కోపముగా వున్నందుచేత
ఆయన వారిని మీ చేతికి అప్పగిస్తే మీరు పరమండల
మునకు అంటే రౌద్రముతో వారిని సంహరించితిరి. ।
10 యిప్పుడు మీరు యూదాయొక్క యెరూశలేము
యొక్క పుత్రులను మీ కొరకు దాసులగానున్న
దాసురాండ్లగానున్న లోపరచుటకు వుద్దేశిస్తున్నారు;
అయితే మీ పరాత్పరుడైన యెహోవా యెడల మీ
యొద్ద నిశ్చయముగా మీ యొద్ద పాపములు లేవా? ।
11 కాబట్టి యిప్పుడు నా మాట ఆలకించి, మీ సహో
దరులలో మీరు చెర పట్టిన వారిని తిరిగీ విడిచి పె
ట్టండి, యేమంటే యెహోవాయొక్క తీక్ష్ణమైన కో
12 పము మీ మీద వున్నదని చెప్పెను. । అప్పుడు ఎఫ్ర
యీము పుత్రులయొక్క పెద్దలలో కొందరు అనగా
యోహానాను కుమారుడైన అజర్యాయున్ను మెషిల్లే
మోతు కుమారుడైన బెరెఖ్యాయున్ను షల్లూము కుమా
రుడైన యహిజ్కియ్యాయున్ను హద్లయి కుమారుడైన
అమాశాయున్ను యుద్ధమునుంచి వచ్చిన వారికి యెదు
13 రుగా నిలువబడి వారితో అనినదేమంటే, । చెర పట్టిన
వారిని మీరు యిక్కడికి తే కూడదు, యేమంటే మన
ము యెహోవా యెడల అపరాధము చేసే వున్నా
ము; అయితే మీరు మన పాపములనున్న మన అప
రాధములనున్న హెచ్చింప చేసుటకు తలంచేవారై
యున్నారు; యేమంటే మన అపరాధము అధికమై
యున్నందున ఇశ్రాయేలు మీద తీక్ష్ణమైన కోపము
14 కలిగి వున్నదని చెప్పిరి. । అందువల్ల ఆయుధస్థులు ప్ర
భువుల ముందరనున్న సభయంతటి ముందరనున్న చెర
పట్టిన వారినిన్ని కొల్ల సొమ్మునున్న విడిచిపెట్టిరి. ।
15 అప్పుడు పేరులచేత పిలువబడిన మనుష్యులు లేచి,
చెర పట్టిన వారిని తీసి, వారిలో వస్త్రహీనులైన వారిని
కొల్ల బట్టలను ధరింప చేసి, వారికి వస్త్రములనున్న పాద
రక్షలనున్న యిచ్చి, భోజనమునున్న పానమునున్న
పెట్టి, అభ్యంజనము చేసి, వారిలో బలహీనులైన వా
రిని గార్దభముల మీద యెక్కించి, యెరిఖో అనే
ఖర్జూరపు చెట్లు గల పట్టణమునకు వారి సహోద
రుల యొద్దికి వారిని తీసుక వచ్చిరి; తరువాత వారు
16 షోమ్రోనుకు తిరిగీ వచ్చిరి. । ఆ కాలమందు రాజైన
ఆహాజు తనకు సహాయము చేయుమని అష్షూరు రాజుల
17 యొద్దికి కబురు పంపెను. । యేమంటే ఎదోమీయులు
మళ్లి వచ్చి, యూదాను కొట్టి కొందరిని చెర తీసుక
18 పోయిరి. । ఫెలిష్తీయులున్ను పల్లపు దేశముయొక్క
పట్టణముల మీదనున్న యూదా దక్షిణ దిక్కు పట్ట
ణముల మీదనున్న పడి, బేత్షెమెషునున్న అయాలో
నునున్న గెదేరోతునున్న దాని గ్రామములతో శో
ఖోనున్న దాని గ్రామములతో తిమ్నానున్న దాని
గ్రామములతో గిమ్జోనున్న ఆక్రమించుకొని అక్కడ
కాపురము చేసిరి. । యేమంటే యెహోవా ఇశ్రా 19
యేలు రాజైన ఆహాజు కొరకు యూదాను హీనపర
చెను, యెందుకంటే అతడు యూదాను దిగంబరినిగా
చేసి, యెహోవా యెడల మిక్కిలీ అపరాధము చేసె
ను. । అప్పుడు అష్షూరు రాజైన తిల్గత్పిల్నెసెరు అతని 20
యొద్దికి వచ్చి, అతని బాధపరిచెను గాని అతని బల
పరచ లేదు. । యేమంటే ఆహాజు యెహోవా యిం 21
టిలోనుంచిన్ని రాజు యింటిలోనుంచిన్ని ప్రభువుల
యొద్దనుంచిన్ని భాగము తీసి, అష్షూరు రాజుకు యిచ్చె
ను; అయితే అతడు అతనికి సహాయము చేయ లేదు. ।
తన శ్రమ కాలమందుఅతడు యెహోవా యెడల మరీ 22
అపరాధములు చేసెను; ఆ ఆహాజు అనే రాజు యిత
డే. । యేమంటే అతడు తన్ను కొట్టిన దమస్కు దేవుం 23
డ్లకు బలులు చెల్లించెను; అరాము రాజుల దేవుండ్లు
వారికి సహాయము చేస్తున్నవి గనుక వారు నాకు సహా
యము చేసేలాగు నేను వారికి బలులు అర్పింతునని
అనుకొనెను; అయితే వారు అతనియొక్క ఇశ్రాయేలు
అంతటియొక్క నష్టమునకు హేతువులైరి. । ఆహాజు 24
పరాత్పరుని యింటి వస్తువులను కూర్చి, పరాత్పరుని
యింటి వస్తువులను ముక్కలుగా ఖండించి, యెహో
వా యింటియొక్క తలుపులను మూసిపెట్టి, యెరూశ
లేముయొక్క ప్రతి మూలలో బలిపీఠములను చేయించె
ను. । యూదాయొక్క ప్రతి పట్టణములోను అతడు 25
అన్యమైన దేవుండ్లకు ధూపము వేసుటకు వున్నత స్థల
ములను చేయించి, తన పితృల పరాత్పరుడైన యెహో
వాకు కోపము కలుగ చేసెను. । అయితే అతనియొ 26
క్క కడమ కార్యములున్న యావత్తు మార్గములున్న
వాటి పూర్వోత్తరములున్న యిదుగో అవి యూ
దాయొక్క ఇశ్రాయేలుయొక్క రాజుల గ్రంథమందు
వ్రాయబడి యున్నవి. । ఆహాజు తన పితృలతో కూడా 27
నిద్ర పొందెను; వారు పట్టణములో అనగా యెరూశ
లేములో అతని పాతిపెట్టిరి గాని ఇశ్రాయేలు రాజుల
సమాధులకు అతని తేలేదు; అతని కుమారుడైన హిజ్కి
యా అతనికి బదులుగా యేలెను.

## 29. అధ్యాయము.

హిజ్కియా యేలనారంభించినప్పుడు యిరువై 1
అయిదు సంవత్సరములవాడై, యిరువై తొమ్మిది సంవ
త్సరములు యెరూశలేములో యేలెను; అతని తల్లి
జెఖర్యా కుమార్తె అయి, అబీయా అనే పేరుగలదై
యుండెను. । అతడు తన తండ్రి అయిన దావీదు చేసిన 2
అంతటి ప్రకారము యెహోవా దృష్టికి నీతిగా ప్రవ

3 ర్తించెను. । అతడు తన యేలుబడియొక్క మొదటి సం
వత్సరము మొదటి నెలలో యెహోవాయొక్క యింటి
4 ద్వారములను తీసి వాటిని బాగు చేసెను. । అతడు
అర్చకులనున్ను లేవీయులనున్ను తెప్పించి, తూర్పు
5 వీధిలో వారిని కూర్చి, । వారితో అనినదేమంటే,
ఓ లేవీయులారా, యిప్పుడు మిమ్మును మీరు శుద్ధిపర
చుకొని, మీ పితృల పరాత్పరుడైన యెహోవాయొ
క్క యిల్లును శుద్ధిపరచి, పరిశుద్ధ స్థలములోనుంచి
6 మలినము బయిటికి కొంచపొండి. । యేమంటే మన
పితృలు అపరాధము చేసి, మన పరాత్పరుడయిన యె
హోవా దృష్టికి కీడుగా ప్రవర్తించి, ఆయనను విడి
చిపెట్టి, యెహోవా నివాసమునుంచి తమ ముఖము
లను తిప్పుకొని, తమ వీపులను తిప్పుకొని యున్నారు.।
7 మరిన్ని వారు మంటపముయొక్క ద్వారములను మూసి
పెట్టి, దీపములను ఆర్పివేసి, పరిశుద్ధ స్థలమందు ఇశ్రా
యేలుయొక్క పరాత్పరునికి ధూపము వేయకనున్ను
8 దహన బలులను అర్పించకనున్ను వుండిరి. । అందుచేత
యెహోవాకు యూదా మీదనున్ను యెరూశలేము
మీదనున్ను కోపము కలిగినందున మీ నేత్రములతో
మీరు చూస్తూ వున్నట్టు ఆయన వారిని కలహముల
కున్ను ఆశ్చర్యమునకున్ను నిందకున్ను అప్పగించి వున్నా
9 డు. । యేమంటే ఇదుగో మన పితృలు కత్తిచేత పడి
వున్నారు; మన కుమారులున్ను మన కుమార్తెలున్ను
మన భార్యలున్ను యిందు కొరకు చెరలో వున్నారు.।
10 యిప్పుడు మన యొద్దనుంచి ఇశ్రాయేలుకు పరాత్పరు
డయిన యెహోవాయొక్క తీక్ష్ణమైన కోపము తిరిగి
పోయేటట్టు ఆయనతో వొడంబడికెను చేసుటకు నా
11 హృదయములో తాత్పర్యము పుట్టి వున్నది. । నా కుమా
రులారా, మీరు యిప్పుడు అశ్రద్ధగా వుండకండి,
యేమంటే యెహోవా తన ముందర నిలుచుటకున్ను
తన్ను కొలుచుటకున్ను తనకు సేవ చేసి ధూపము వేసు
టకున్ను మిమ్మును యెంచి వున్నాడు అని చెప్పెను. ।
12 అప్పుడు లేవీయులు లేచిరి; వారు యెవరంటే, కెహా
తీయుల పుత్రులలో అమాశై కుమారుడయిన మహతు
న్ను, అజర్యా కుమారుడయిన యోవేలున్ను మెరారీ
పుత్రులలో అబ్దీ కుమారుడైన కీషున్ను, యహల్లెలేలు
కుమారుడయిన అజర్యాయున్ను; గేర్షోనీయులలో
జిమ్మా కుమారుడయిన యోవాహున్ను, యోవాహు
13 కుమారుడయిన ఏదెనున్ను; । ఎలిస్సాఫాను పుత్రులలో
షిమ్రీయున్ను, యెహీయేలున్ను; ఆసాపు కుమారుల
14 లో జెఖర్యాయున్ను, మత్తన్యాయున్ను; । హేమాను
పుత్రులలో యెహీయేలున్ను షిమీయున్ను; యెదూ
తూను పుత్రులలో షెమయాయున్ను; ఉజ్జీయేలు
15 న్ను, । వీరు తమ సహోదరులను కూర్చి, తమ్మును శుద్ధి
పరచుకొని, రాజుయొక్క ఆజ్ఞ ప్రకారము యెహో
వా వాక్యములచేత యెహోవా యిల్లును శుభ్రము
చేసుటకు వచ్చిరి. । అర్చకులు శుభ్రము చేసుటకు యె 16
హోవా యింటియొక్క లోపలి భాగమునకు వెళ్లి,
యెహోవా మందిరములో తమకు కనుపడిన మలిన
ము యావత్తు యెహోవా యింటియొక్క శాలలోకి
కొంచవచ్చిరి; లేవీయులు అది కిద్రోను కాలువకు
కొంచుబోవుటకు అది తీసుకొనిరి. । మొదటి నెలయొ 17
క్క మొదటి దినమున వారు శుద్ధి చేసుటకు ఆరం
భించి, ఆ నెలయొక్క యెనిమిదో దినమున వారు
యెహోవా మంటపమునకు వచ్చిరి; యీలాగున వారు
యెనిమిది దినములలో యెహోవా యిల్లు శుద్ధి చేసి,
మొదటి నెలయొక్క పదహారో దినమున వారు సమాప్తి
చేసిరి. । అప్పుడు వారు రాజైన హిజ్కియా యొద్దికి 18
వెళ్లి అనినదేమంటే, మేము యెహోవా యిల్లు యా
వత్తున్ను దాని వస్తువులతో కూడా దహన బలిపీఠము
నున్ను దాని వస్తువులన్నిటితో కూడా సముఖపు రొ
ట్టెలు గల బల్లనున్ను శుద్ధి చేస్తిమి. । మరిన్ని రాజైన 19
ఆహాజు యేలినప్పుడు అతడు అక్రమమున పారవేసిన
వస్తువులన్నిటినిన్ని మేము ఆయత్తపరచి శుద్ధి చేస్తిమి;
ఇదుగో అవి యెహోవా బలిపీఠము ముందర వున్నవి
అని చెప్పిరి. । అప్పుడు రాజైన హిజ్కియా పెందలాడ 20
లేచి, పట్టణపు అధికారులను కూర్చి, యెహోవా
యింటికి యెక్కి వెళ్లెను. । వారు యేడు కోడెలనున్ను 21
యేడు పొట్టేళ్లనున్ను యేడు గొర్రె పిల్లలనున్ను యేడు
మేకపోతులనున్ను రాజ్యము కొరకున్ను పరిశుద్ధ స్థల
ము కొరకున్ను యూదా కొరకున్ను పాప పరిహారపు
బలిగా తెచ్చిరి; అతడు అహరోను కుమారులయిన
అర్చకులకు యెహోవా బలిపీఠము మీద వాటిని
అర్పించుటకు ఆజ్ఞాపించెను. । ఆలాగున వారు ఆ కోడె 22
లను కోసిన తరువాత అర్చకులు వాటి రక్తము తీసు
కొని బలిపీఠము మీద చిలకరించిరి; ఆ ప్రకారముగా
వారు పొట్టేళ్లను కోసిన తరువాత వారు ఆ రక్తము
బలిపీఠము మీద చిలకరించిరి, వారు గొర్రె పిల్లలను
న్ను కోసి ఆ రక్తము బలిపీఠము మీద చిలకరించిరి. ।
వారు పాప పరిహారపు బలి కొరకు రాజు యెదుట 23
నున్ను సభ యెదుటనున్ను మేకపోతులను తీసుక
వచ్చి, తమ చేతులను వాటి మీద పెట్టిన తరువాత
అర్చకులు వాటిని కోసి, । ఇశ్రాయేలు అందరి కొరకు 24
శాంతి చేసుటకు బలిపీఠము మీద వాటి రక్తముతో
సమాధానము కలుగ చేసిరి. యేమంటే దహన బలిన్ని
పాప పరిహారపు బలిన్ని ఇశ్రాయేలందరి కొరకు అర్పిం
చబడ వలెనని రాజు ఆజ్ఞాపించెను. । మరిన్ని అతడు 25
దావీదుయొక్కయున్ను రాజు జ్ఞాన దృష్టి పురుషు

డైన గాదుయొక్కయున్ను దీర్ఘదర్శి అయిన నా
తానుయొక్కయున్ను ఆజ్ఞ చొప్పున లేవీయులను
తాళములతోనున్ను కిన్నెరలతోనున్ను వీణెలతోనున్ను
యెహోవా యింటిలో వుంచెను, యేమంటే ఆలా
గున యెహోవాయొక్క ఆజ్ఞ తన దీర్ఘదర్శుల
26 ద్వారా కలిగి వుండెను. । లేవీయులు దావీదుయొక్క
వాద్యములతోనున్ను అర్చకులు బూరగలతోనున్ను
27 నిలువబడిరి. । అప్పుడు హిజ్కియా బలిపీఠము మీద
దహన బలిని అర్పించుమని ఆజ్ఞాపించెను; దహన బలి
అర్పణ ఆరంభించినప్పుడు బూరగలతోనున్ను ఇశ్రా
యేలు రాజయిన దావీదు నియమించిన వాద్యములతో
నున్ను యెహోవాయొక్క కీర్తనయున్ను ఆరంభ
28 మాయెను. । అప్పుడు సభ అంతా ఆరాధించెను; గా
యకులు పాడిరి; బూరగ లూదేవారు నాదము చేసిరి;
దహన బలి అర్పణ సమాప్తమయ్యే పర్యంతము యిదం
29 తా అవుతూ వుండెను. । వారు అర్పించుట సమాప్తము
చేసిన తరువాత రాజున్ను తనతో కూడా వున్న వా
30 రందరున్ను వంగి ఆరాధించిరి. । మరిన్ని రాజయిన
హిజ్కియాయున్ను ప్రధానులున్ను దావీదుయొక్క
జ్ఞాన దృష్టి పురుషుడైన ఆసాపుయొక్క మాటలతోను
యెహోవాను గూర్చి స్తుతి పాడుమని లేవీయు
లకు ఆజ్ఞాపించిరి; వారు సంతోషముతో స్తుతులు పాడి
31 తమ శిరస్సులు వంచుకొని ఆరాధించిరి. । అప్పుడు
హిజ్కియా ప్రత్యుత్తరముగా అనినదేమంటే, మీరు
యిప్పుడు మిమ్మును యెహోవాకు పరిశుద్ధపరచుకొని
యున్నారు; దగ్గిరికి వచ్చి యెహోవా యింటిలోకి
బలులనున్ను స్తోత్రార్పణలనున్ను తీసుకొని రండని
చెప్పెను; అప్పుడు సభవారు బలులనున్ను స్తోత్రార్ప
ణలనున్ను తీసుక వచ్చిరి; స్వేచ్ఛ గల హృదయముతో
వున్న యెందరో అందరూ దహన బలులను తీసుక
32 వచ్చిరి. । సభవారు తీసుక వచ్చిన దహన బలుల లెక్క
యెంతంటే, డెబ్బయి కోడెలున్ను, నూరు పొట్టేళ్లున్ను,
యిన్నూరు గొర్రె పిల్లలున్ను; యివి అన్ని యెహో
33 వాకు దహన బలి కొరకై వుండెను. । పరిశుద్ధపరచబడి
నవి ఆరు నూరు యెద్దులున్ను, మూడు వేల గొర్రెలు
34 న్ను, । అయితే అర్చకులు కొద్దిగా వున్నందున వారు
ఆ దహన బలులనన్నిటినీ వొలుచ లేకపోయిరి; అందు
కొరకు పని సమాప్తమయ్యే పర్యంతమున్ను కడమ అర్చ
కులు తమ్మును శుద్ధిపరచుకొనే పర్యంతమున్ను వారి
సహోదరులైన లేవీయులు వారికి సహాయము చేసిరి,
యేమంటే అర్చకులకంటే లేవీయులు తమ్మును శుద్ధి
పరచుకొనుటకు యథార్థ హృదయులై యుండిరి. ।
35 సమాధానార్పణల కొవ్వుతో కూడా దహన బలులున్ను
ప్రతి దహన బలికి వున్న పానార్పణలనున్ను హేరా
ళముగా వుండెను; యీలాగున యెహోవా యింటి
సేవ క్రమ పరచబడెను. పరాత్పరుడు జనులను ఆయత్త
పరచెనని హిజ్కియాయున్ను జనులందరున్ను సంతో
షించిరి, యేమంటే యీ కార్యము ఆకస్మికముగా
చేయబడెను.

## 30. అధ్యాయము.

మరిన్ని హిజ్కియా ఇశ్రాయేలుయొక్క పరాత్ప 1
రుడైన యెహోవాకు పస్కాను ఆచరించుటకు యెరూ
శలేములోనున్న యెహోవా మందిరమునకు రమ్మను
మని ఇశ్రాయేలంతటికిన్ని యూదాకున్ను కబురు పంపి,
ఎఫ్రయీమునకున్ను మనస్సేకున్ను వుత్తరములను వ్రా
సెను. । యేమంటే రెండో నెలలో పస్కాను ఆచరించు 2
టకు రాజున్ను అతని ప్రధానులున్ను యెరూశలేము
లో వున్న సభవారందరున్ను ఆలోచన చేసుకొనిరి. ।
యేమంటే అర్చకులు చాలినంత మట్టుకు తమ్మును తా 3
ము శుద్ధి పరచుకోకుండానున్ను జనులు యెరూశలే
ములో కూడుకోకుండానున్ను వున్నందున, వారు ఆ
కాలమందు దాని ఆచరించలేక వుండిరి. । యీ సం 4
గతి రాజుకున్ను సభ అంతటికిన్ని అనుకూలముగా
వుండెను. । కాబట్టి యెరూశలేములో ఇశ్రాయేలుయొ 5
క్క పరాత్పరుడైన యెహోవాకు పస్కాను ఆచరించు
టకు రావలెనని బెయేర్షెబ మొదలుకొని దాను పర్యం
తము ఇశ్రాయేలందంతటా చాటించుటకు వారు నిర్ణ
యించిరి, యేమంటే వ్రాయబడిన ప్రకారము బహు
కాలమునుంచి వారు దాని చేయక వుండిరి. । యీలా 6
గున హర్కారాలు రాజు యొద్దనుంచిన్ని అతని ప్రధా
నుల యొద్దనుంచిన్ని వుత్తరములను పట్టుకొని, యూదా
ఇశ్రాయేలుల అంతటికీ వెళ్లి, రాజు ఆజ్ఞా ప్రకారము
అనినదేమంటే, ఇశ్రాయేలు పుత్రులారా, అబ్రా
హాము ఇస్సాకు ఇశ్రాయేలు అనే వారి పరాత్పరుడైన
యెహోవా తట్టుకు తిరగండి, అప్పుడు అష్షూరు
రాజుల చేతిలోనుంచి తప్పించుకొనినటువంటిన్ని మీ
లో మిగిలినటువంటిన్ని వారి తట్టుకు ఆయన తిరుగును. ।
తమ పితృలయొక్క పరాత్పరుడైన యెహోవా యెడల 7
అపరాధము చేసిన మీ పితృల వలెనున్ను మీ సహో
దరుల వలెనున్ను మీరు వుండకండి; అందుచేతనే
మీరు చూస్తూ వున్నలాగు ఆయన వారిని పాడుకు
అప్పగించెను. । అయితే మీ పితృలవలె మీరు వంగని 8
మెడ గలవారై యుండకుండా, యెహోవాకు లో
బడి ఆయన నిరంతరమున్ను పరిశుద్ధ పరిచిన ఆయన
పరిశుద్ధ స్థలములో ప్రవేశించి, మీ యొద్దనుంచి మీ
పరాత్పరుడైన యెహోవాయొక్క తీక్ష్ణమైన కోపము
తిరిగి పోయేటట్టు ఆయనకు సేవ చేయండి. । యేమంటే 9

మీరు యెహోవా తట్టుకు మళ్లుకొంటే చెర తీసుక
పోయిన వారిచేత మీ సహోదరులున్ను మీ పిల్ల
లున్ను కనికరించ బడుదురు; అప్పుడు వారు యీ
దేశమునకు తిరిగి వత్తురు, యేమంటే మీ పరాత్పరుడైన
యెహోవా కృపయున్ను కనికరమున్ను గలవాడై
వున్నాడు, గనుక మీరు ఆయన తట్టుకు తిరిగితే
ఆయన తన ముఖము మీ యొద్దనుంచి తిప్పివేయడని
10 చెప్పిరి. । యీలాగున హర్కారాలు ఎఫ్రయీము
మనస్సే అనే దేశములలోనుంచి జెబూలోను మట్టు
కున్ను వొక్కొక్క పట్టణము దాటి వెళ్లిరి; అయితే
వారు వారిని వుదాసీన పరచి అపహాస్యము చేసిరి. ।
11 అయినప్పటికిన్ని ఆషేరున్ను మనస్సేయున్ను జెబూ
లోనున్ను సంబంధులలో అనేకులు తమ్మును తగ్గించు
12 కొని యెరూశలేముకు వచ్చిరి. । యూదాలోనున్ను
యెహోవా వాక్యము ద్వారా రాజుయొక్క ప్రధా
నులయొక్క ఆజ్ఞను చేసే కొరకు యేక హృదయము
వారికి యిచ్చుటకు పరాత్పరుని హస్తము వుండెను. ।
13 కాబట్టి రెండో నెలలో పులుసులేని రొట్టె పండుగ
ఆచరించుటకు బహు జనులు అనగా అతి విస్తారమైన
14 సంఘము యెరూశలేములో కూడిరి. । వారు లేచి యె
రూశలేములో వున్న బలిపీఠములనున్ను ధూప పీఠము
లనున్ను తీసివేసి కిద్రోను కాలువలో వాటిని పారవే
15 సిరి. । అప్పుడు వారు రెండో నెలయొక్క పదునా
లుగో దినమందు పస్ఖాను చంపిరి; అర్చకులున్ను లేవీయు
లున్ను సిగ్గుపడి తమ్మును శుద్ధిపరచుకొని దహన బలు
16 లను యెహోవా యింటిలోకి తీసుక వచ్చిరి. । దైవ
జనుడైన మోషే న్యాయ ప్రమాణము చొప్పున వారు
తమ మర్యాద ప్రకారముగా తమ స్థలమందు నిలువ
బడిరి; అర్చకులు లేవీయుల చేతినుంచి తీసుకొనిన
17 రక్తమును చిలకరించిరి. । యేమంటే సభలో శుద్ధి పర
చబడని వారు అనేకులు వుండిరి; కాబట్టి యెహోవా
కొరకు పరిశుద్ధ పరచుటకు శుద్ధికాని ప్రతివాని నిమి
త్తము పస్ఖాలయొక్క చంపుట పని లేవీయులకు కలిగి
18 వుండెను. । యేమంటే జనులలో అనేకులు అనగా
ఎఫ్రయీము మనస్సే ఇశ్శాఖారు జెబూలోను అనే
వారిలో చాలామంది తమ్మును శుద్ధిపరచుకోక పోయి
నప్పటికిన్ని వ్రాయబడిన ప్రకారము కాకుండా
పస్ఖాను భుజించిరి; అయితే హిజ్కియా వారి కొరకు
19 ప్రార్థించినదేమంటే, । పరిశుద్ధ స్థలముయొక్క శుచి
ప్రకారము తాను శుద్ధిని పొందక వున్నప్పటికిన్ని
పరాత్పరుని అనగా తన పితృల పరాత్పరుడైన యె
హోవాను వెతుకుటకు తన హృదయమును ఆయత్త
పరచే ప్రతివానినిన్ని వుత్తముడైన యెహోవా క్షమిం
20 చును గాక అని ప్రార్థించి నందున, । యెహోవా
హిజ్కియా మనవి విని జనులను బాగు చేసెను. । యె 21
రూశలేములో వున్న ఇశ్రాయేలు పుత్రులు పులుసు
లేని రొట్టె పండుగను యేడు దినములు బహు సంతో
షముతో ఆచరించిరి; లేవీయులున్ను అర్చకులున్ను యె
హోవాను గూర్చి గొప్ప నాదము చేసే వాద్యము
లతో దినదినమున్ను యెహోవాను స్తుతిస్తూ వుండిరి. ।
హిజ్కియా యెహోవాను గూర్చి వుత్తమజ్ఞానమును 22
నేర్చి లేవీయులందరితో అనుకూలముగా మాట్లా
డెను; వారు సమాధానార్పణలను అర్పిస్తూ, తమ
పితృల పరాత్పరుడైన యెహోవాకు పాపమును యె
రుక చేస్తూ యేడు దినముల పండుగలో భుజిస్తూ
వుండిరి. । అప్పుడు సభవారందరున్ను మరి యేడు దిన 23
ములు ఆచరించుటకు ఆలోచించుకొని, మరి యేడు దిన
ములు సంతోషముతో ఆచరించిరి. । యేమంటే యూ 24
దా రాజయిన హిజ్కియా సభవారికి వెయ్యి కోడెల
నున్ను యేడువేల గొర్రెలనున్ను యిచ్చెను; ప్రధాను
లున్ను సభవారికి వెయ్యి కోడెలనున్ను పదివేల గొ
ర్రెలనున్ను యిచ్చిరి; అనేకులయిన అర్చకులున్ను
తమ్మును శుద్ధిపరచుకొనిరి. । అప్పుడు అర్చకులతో 25
కూడా లేవీయులతో కూడా యూదా సభవారంద
రున్ను ఇశ్రాయేలులోనుంచి వచ్చిన సభవారందరున్ను
ఇశ్రాయేలు దేశములోనుంచి వచ్చి, యూదాలో
కాపురము చేసిన అన్యులున్ను సంతోషించిరి. । యీ 26
లాగున యెరూశలేములో మిక్కిలీ ఆనందము కలిగి
వుండెను, యేమంటే ఇశ్రాయేలు రాజయిన దావీదు
కుమారుడైన సొలొమోనుయొక్క కాలము మొదలు
కొని అటువంటిది లేక వుండెను. । అప్పుడు లేవీయు 27
లైన అర్చకులు లేచి జనులను ఆశీర్వదించిరి; వారి
శబ్దము వినబడి, వారి ప్రార్థన పరమండలము అనే
ఆయన పరిశుద్ధ నివాస స్థలమునకు వచ్చెను.

## 31. అధ్యాయము.

ఇది అంతా సమాప్తమైన తరువాత అక్కడ వున్న 1
ఇశ్రాయేలందరున్ను యూదా పట్టణములకు వెళ్లి,
యూదా అంతటిలోనున్ను బెన్యామీనులోనున్ను
ఎఫ్రయీములోనున్ను మనస్సేలోనున్ను వున్న విగ్ర
హములను వాటిని బొత్తిగా నిర్మూలము చేసే పర్యం
తము ముక్కలుగా కొట్టివేసి, తోపులను నరికి, వున్నత
స్థలములనున్ను బలిపీఠములనున్ను పడగొట్టిరి. తరు
వాత ఇశ్రాయేలు పుత్రులందరున్ను తమ తమ పట్టణ
ములలో వున్న తమ తమ స్వాస్థ్యములకు తిరిగి వెళ్లిరి. ।
అంతట హిజ్కియా అర్చకులయొక్క వరసలనున్ను 2
వారి వారి వరసల చొప్పున లేవీయులనున్ను ప్రతి
మనిషిని తన తన సేవకావృత్తి ప్రకారము నిర్ణయిం

చెను; దహన బలుల కొరకున్ను సమాధాన బలుల కొర
కున్ను సేవించుటకున్ను స్తోత్రము చెల్లించుటకున్ను
యెహోవా యొక్క గుడారపు ద్వారముల యొద్ద
స్తుతి చేసుటకున్ను అర్చకులనున్ను లేవీయులనున్ను
3 నిర్ణయించెను. । మరిన్ని అతడు యెహోవా న్యాయ
ప్రమాణములో వ్రాయబడిన ప్రకారము దహన బలుల
కొరకు అనగా వుదహోస్తమానముల దహన బలుల కొర
కున్ను సబ్బాతులకున్ను అమావాస్యలకున్ను నియమిం
చబడిన పండుగలకున్ను వున్న దహన బలుల కొరకున్ను
రాజుకు కలిగిన దానిలోనుంచి భాగమును నిర్ణ
4 యించెను. । మరిన్ని అతడు యెహోవా న్యాయ ప్ర
మాణమందు అర్చకులున్ను లేవీయులున్ను ధైర్యపరచ
బడేటట్టు వారి వారి భాగములు యిమ్మని యెరూశలే
5 ములో కాపురము వున్న జనులకు ఆజ్ఞాపించెను. । ఆ
ఆజ్ఞ బైలు వెళ్లగానే ఇశ్రాయేలు పుత్రులు ధాన్య
ములు ద్రాక్షారసము నూనె తేనె అనే వీటియొక్క
యున్ను పొలముయొక్క ఫలముయొక్కయున్ను ప్రథ
మ ఫలములను విస్తారముగా తీసుక వచ్చిరి; సమస్త
మైన వాటిలోనుంచి పదో భాగమును విస్తారముగా
6 తీసుక వచ్చిరి. । యూదా పట్టణములలో కాపురముగా
వున్న ఇశ్రాయేలుయొక్కయున్ను యూదాయొక్క
యున్ను పుత్రులను గురించినది యేమంటే, వారున్ను
యెద్దులు గొర్రెలు అనే వాటియొక్క పదో పాలు
నున్ను తమ పరాత్పరుడైన యెహోవాకు పరిశుద్ధపర
చబడిన పరిశుద్ధమయిన వాటిలో పదో పాలునున్ను
7 తీసుక వచ్చి కుప్పలుగా వేసిరి. । వారు మూడో మాస
మందు కుప్పలు వేయడానకు ఆరంభించి యేడో మాస
8 మందు సమాప్తపరిచిరి. । హిజ్కియాయున్ను ప్రధాను
లున్ను వచ్చి ఆ కుప్పలను చూచినప్పుడు వారు యె
హోవానున్ను ఆయన జనులైన ఇశ్రాయేలునున్ను
9 ఆశీర్వదించిరి. । అప్పుడు హిజ్కియా ఆ కుప్పలను
గురించి అర్చకులనున్ను లేవీయులనున్ను అడిగితే
సాదోకు యింటి సంబంధుడున్ను ప్రధానార్చకుడున్ను
అయిన అజర్యా అతనితో ప్రత్యుత్తరముగా చెప్పిన
10 దేమంటే, । యెహోవా యింటిలోకి జనులు కానుక
లను తెచ్చుట ఆరంభించినప్పటినుంచి తినుటకు మాకు
చాలినంత మట్టుకు కలిగినందున మిగిలినది విస్తారముగా
విడిచిపెట్టి యున్నాము, యేమంటే యెహోవా తన
జనులను ఆశీర్వదించినందున యీ గొప్ప రాశి మిగిలి
11 నదని చెప్పెను. । అప్పుడు హిజ్కియా యెహోవా
యింటిలో కొట్లను ఆయత్తపరచుమనినందున వారు
12 వాటిని ఆయత్తపరచి, । కానుకలనున్ను పదోపాళ్ల
నున్ను పరిశుద్ధపరచబడిన వాటినిన్ని యథార్థముగా
లోపలికి తీసుక వచ్చిరి; వాటి మీద లేవీయుడయిన
కొనన్యాహు అధిపతి అయి వుండెను; వాని సహో
దరుడయిన షిమీ తరువాతివాడై వుండెను. । మరిన్ని 13
యెహీయేలున్ను అజజ్యాహున్ను నహతున్ను అశా
హేలున్ను యెరీమోతున్ను యోజాబాదున్ను యెలీ
యేలున్ను ఇస్మఖ్యాహున్ను మహతున్ను బేనాయ్యా
యున్ను రాజయిన హిజ్కియాయొక్క పరాత్పరుని
యింటి అధిపతి అయిన అజర్యాయొక్కయున్ను ఆజ్ఞ
చొప్పున కొనన్యాహు యొక్కయున్ను అతని సహో
దరుడైన షిమీయొక్కయున్ను చేతి కింద కాచేవారై
వుండిరి. । తూర్పు తట్టున ద్వారపాలకుడయినటువం 14
టిన్ని లేవీయుడున్ను ఇమ్నా కుమారుడున్ను అయిన
టువంటిన్ని కోరే యెహోవా యొక్క కానుకల
నున్ను అతి పరిశుద్ధమయిన వాటినిన్ని పంచిపెట్టుటకు
పరాత్పరుని స్వేచ్ఛార్పణల మీద వుండెను. । అతని 15
కింద ఏదెను, మిన్యామీను, యేషూవ, షెమయ్యా,
అమర్యా, షెఖన్యా, అనే వీరు అర్చకులయొక్క పట్ట
ణములందు పిన్న పెద్దలు అయిన తమ సహోదరులకు
వంతుల చొప్పున నమ్మకము ప్రకారము భాగము
యిచ్చేటందుకు నియమించబడి యుండిరి. । అది 16
గాక గోత్రములలో వ్రాయబడిన మూడు సంవత్సర
ములు మొదలుకొని అంతకంటే యెక్కువ వయస్సు
గల ప్రతి పురుషునికి, అనగా, వంతుల చొప్పున సేవ
చేసేటందుకు దినదినము యెహోవాయొక్క మందిర
ములోకి వచ్చే ప్రతి పురుషునికిన్ని, । మరిన్ని యిరువై 17
సంవత్సరములు మొదలుకొని అంతకంటే యెక్కువ
వయస్సు గల యే లేవీయులు తమ వంతులయొక్క
సేవ కొరకు తమ తమ పితృల వంశము చొప్పున లెక్కిం
పబడి యుండిరో, । అనగా, యెవరు నమ్మిక ప్రకార 18
ము తమ్మును పవిత్రము చేసుకొని యుండిరో వారి
కిన్ని వారియొక్క పిల్లలకున్ను భార్యలకున్ను కుమాళ్లు
కుమార్తెలు అందరికిన్ని; । మరిన్ని అహరోను వంశ 19
స్థులైన యే అర్చకులు ప్రతి పట్టణమందున్ను పేటల
యొక్క పొలములలో వుండిరో వాండ్లకున్ను వంతులు
యిచ్చేటందుకు వారు నియమించబడి యుండిరి; యీ
ప్రకారము పేరులచేత చెప్పబడ్డ ఆ జనులు అర్చ
కులలో పురుషులందరికిన్ని లేవీయులలో వంశముల
చొప్పున లెక్కించబడ్డ వారికిన్ని వంతులు యిచ్చు
టకు నియమించబడిరి. । యీలాగున హిజ్కియా 20
యూదా అంతటిలోను చేసి, తన పరాత్పరుడయిన
యెహోవా యెదుట యేది వుత్తమమున్ను యుక్తము
న్ను సత్యమున్ను అయినదో అది జరిగిస్తూ వుండెను. ।
తన పరాత్పరుని వెతుకుటకు పరాత్పరుని యింటి సేవను 21
గురించిన్ని న్యాయ ప్రమాణమును గురించిన్ని ఆజ్ఞలను

గురించిన్ని అతడు ఆరంభించిన ప్రతి పనిన్ని అతడు
తన హృదయమంతటితోను చేసి వృద్ధి పొందెను.

## 32. అధ్యాయము.

1 ఈ సంగతులున్ను వాటియొక్క నిర్ణయమున్ను
అయిన తరువాత అష్షూరు రాజయిన సన్హేరీబు వచ్చి,
యూదాలో ప్రవేశించి, ప్రాకారములు గల పట్టణ
ముల యెదుట దిగి, వాటిని తన కొరకు గెల్చుకొను
2 టకు తలంచెను. । అయితే సన్హేరీబు వచ్చి యెరూశలేము
మీదికి యుద్ధము చేసుటకు వుద్దేశించి యున్నాడని
3 హిజ్కియా చూచి, । అతడు పట్టణము బయిట వున్న
వూటల నీళ్లను అడ్డుటకు తన ప్రధానులతోనున్ను తన
పరాక్రమ వంతులతోనున్ను ఆలోచన చేసినందున
4 వారు అతనికి సహాయము చేసిరి. । యీలాగున అనేక
జనులు కూడిరి; అష్షూరు రాజులు వచ్చి విస్తారమైన
వుదకములు వారికి యెందుకు దొరక వలెనని అనుకొని,
వూటలన్నిటినిన్ని దేశము మధ్యను పారుతూ వున్న
5 కాలువనున్ను వారు అడ్డు కట్టించిరి. । మరిన్ని అతడు
తన్ను బలపరచుకొని, పాడైన గోడ యావత్తును
కట్టించి, గోపురముల మట్టుకు దాని యెత్తు చేసి, బైటను
మరియొక గోడ కట్టించి, దావీదు పట్టణములో మి
ల్లోను బాగు చేయించి, యీటెలనున్ను డాలులనున్ను
6 విస్తారముగా చేయించెను. । మరిన్ని అతడు జనుల
మీద సైన్యాధిపతులను నియమించి పట్టణ ద్వారము
యొక్క వీధిలో వారిని తన యొద్దికి రప్పించి, వారితో
7 హృదాపూర్ణగా అనినదేమంటే, । మీరు బలముగా
నున్ను ధైర్యముగానున్ను వుండండి; అష్షూరు రాజు
కైనా అతనితో కూడా వున్న సమూహమంతటికైనా
మీరు భయపడకనున్ను వెరువకనున్ను వుండండి; యే
మంటే అతనితో కూడా వున్న వారికంటే మనతో
8 కూడా వున్న వారు అధికులై వున్నారు. । అతనితో
మాంసపు బాహువు వున్నది, అయితే మనకు సహాయ
ము చేసుటకున్ను మన యుద్ధములను జరిగించుటకున్ను
మన పరాత్పరుడయిన యెహోవా మనతో కూడా
వున్నాడు అని చెప్పినందున, జనులు యూదా రాజ
9 యిన హిజ్కియా మాటల మీద ఆనుకొనిరి. । యిది
అయిన తరువాత అష్షూరు రాజయిన సన్హేరీబు తా
నున్ను తన బలమంతానున్ను లాఖీషును ముట్టడి వేసి
వున్నప్పుడు, యెరూశలేములో యూదా రాజయిన
హిజ్కియా యొద్దికిన్ని యెరూశలేములో వున్న యూ
దా వారందరి యొద్దికిన్ని తన సేవకులను పంపి చెప్పు
10 మన్నదేమంటే, । అష్షూరు రాజయిన సన్హేరీబు యీ
లాగు చెప్పుతున్నాడు, ముట్టడిలో వున్న యెరూశ
లేములో మీరు నిలిచి వుండేటట్టు మీరు దేని యందు
నమ్మకము వుంచుతూ వున్నారు! । మన పరాత్పరుడైన 11
యెహోవా అష్షూరు రాజుయొక్క చేతిలోనుంచి
మనలను విడిపిస్తాడని హిజ్కియా పలుకుతూ కరువు
వల్లనున్ను దాహమువల్లనున్ను చనిపోవుటకు మిమ్మును
మీరు అప్పగించుకొమ్మని అతడు మిమ్మును ప్రేరేపి
స్తున్నాడు కాడా! । ఆ హిజ్కియా గదా ఆయన 12
యొక్క వున్నత స్థలములనున్ను బలిపీఠములనున్ను
తీసివేసి, మీరు వొక్క బలిపీఠము యెదుట ఆరాధించి,
దాని మీద ధూపము వేయ వలెనని యూదాకున్ను
యెరూశలేముకున్ను ఆజ్ఞాపించి యున్నాడు! । నేనున్ను 13
నా పితృలున్ను యితర దేశముల జనులందరిని యేమి
చేస్తిమో మీరు యెరగరా? ఆ దేశముల జనులయొక్క
దేవుండ్లు వారి దేశములను యే మాత్రమయినా నా
చేతిలోనుంచి రక్షించుటకు సమర్థులయినారా! ।
మీ దేవుడు మిమ్మును నా చేతులోనుంచి విడిపించు 14
టకు సమర్థుడయ్యేటట్టు నా పితృలు బొత్తిగా నశింప
చేసిన ఆ యా దేశస్థులయొక్క సకల దేవుండ్లలో తన
జనులను నా చేతిలోనుంచి విడిపించ కలిగిన దేవుడు
యేడి? । కాబట్టి యిప్పుడు హిజ్కియా చేతను మీరు 15
వంచించబడకండి; మీరు యీ విధముగా ప్రేరేపిం
చబడకండి; అతని మరి నమ్మకండి; యేమంటే యే
జనులయొక్క గానీ రాజ్యముయొక్క గానీ దేవుడు
తన జనులను నా చేతిలోనుంచిన్ని నా పితృల చేతి
లోనుంచిన్ని విడిపించలేక పోయెను గనుక మీ దేవు
డు నా చేతిలోనుంచి మిమ్మును విడిపించ గలవాడా?
అని చెప్పుమనెను. । అతని సేవకులు పరాత్పరుడైన 16
యెహోవాకు విరోధముగానున్ను ఆయన సేవకుడైన
హిజ్కియాకు విరోధముగానున్ను యింకా మాట్లా
డిరి. । అది గాక యితర దేశముల జనులయొక్క 17
దేవుండ్లు తమ జనులను నా చేతిలోనుంచి యేలాగున
విడిపించ లేకపోయిరో ఆలాగున హిజ్కియాయొక్క
దేవుడు తన జనులను నా చేతిలోనుంచి విడిపించక
పోవునని ఇశ్రాయేలు పరాత్పరుడైన యెహోవాను
నిందించుటకున్ను ఆయనకు విరోధముగా పలుకుటకు
న్ను అతడు వుత్తరములను వ్రాయించెను. । అప్పుడు 18
వారు పట్టణము పుచ్చుకొనే కొరకు ప్రాకారము
మీద వున్న యెరూశలేము జనులను జడిపించుటకున్ను
తొందర పెట్టుటకున్ను యూదుల భాషచేత బొబ్బ
యెత్తి వారితో పలికిరి. । మరిన్ని వారు మనుష్యుల 19
చేతుల చేత చేయబడినటువంటి భూ జనుల దేవుండ్లకు
విరోధముగా పలికినలాగున యెరూశలేముయొక్క
పరాత్పరునికి విరోధముగానున్ను పలికిరి. । యిందు 20
కొరకు రాజైన హిజ్కియాయున్ను ఆమోసు కుమారు
డైన యెషయా అనే దీర్ఘదర్శిన్ని ప్రార్థించి,

21 పరమండలము తట్టు మొఱ్ఱపెట్టిరి. । అప్పుడు యె
హెూవా వొక దూతను పంపినందున అతడు అష్షూరు
రాజుయొక్క దండులో పరాక్రమశాలులందరినిన్ని
సేనాధిపతులనున్ను అధికారులనున్ను ఖండించెను. అం
దువల్ల అతడు లజ్జ గల ముఖముతో తన దేశమునకు
తిరిగీ వచ్చెను. అంతట అతడు తన దేవుని మందిరము
లోకి వచ్చినప్పుడు తన కడుపున పుట్టిన వారు అతని
22 అక్కడ కత్తిచేత చంపిరి. । యీలాగున యెహెూవా
హిజ్కీయానున్ను యెరూశలేము కాపురస్తులనున్ను
అష్షూరు రాజైన సన్హేరీబు చేతిలోనుంచిన్ని అందరి
చేతిలోనుంచిన్ని రక్షించి, అన్ని వైపులను వారిని కా
23 పాడెను.। అనేకులు యెరూశలేములో యెహెూవాకు
కానుకలనున్ను యూదా రాజైన హిజ్కీయాకు బహు
మానములనున్ను తెచ్చిరి, అందువల్ల అతడు అప్పటి
నుంచి సకల జనుల దృష్టికి ఘనము పొందిన వాడై
24 యుండెను. । ఆ దినములలో హిజ్కీయా మరణము
పొందేటట్టు రోగి అయి వుండెను; అయితే అతడు
యెహెూవాను ప్రార్థించినందున ఆయన అతనితో
25 మాట్లాడి అతనికి వొక ఆనవాలు యిచ్చెను. । అయితే
హిజ్కీయా తనకు చేయబడిన మేలుకు ప్రతికారము
చెల్లించలేదు; యేమంటే అతని హృదయము అతిశయ
పడెను; అందు కొరకు అతని మీదనున్ను యూదా
26 యెరూశలేముల మీదనున్ను కోపము కలిగెను.। అయిన
ప్పటికిన్ని హిజ్కీయా తన హృదయ గర్వము నిమిత్తము
తానున్ను యెరూశలేము కాపురస్తులున్ను తమ్మును
తగ్గించుకొనిరి, అందువల్ల యెహెూవా కోపము హి
27 జ్కీయా దినములలో వారి మీదికి రాలేదు. । హిజ్కీ
యాకు అతి విస్తారమైన ఐశ్వర్యమున్ను ఘనమున్ను
కలిగి వుండెను. అతడు వెండి కొరకున్ను బంగారము
కొరకున్ను రత్నముల కొరకున్ను సుగంధ ద్రవ్యముల
కొరకున్ను డాలుల కొరకున్ను నానా విధమైన యిం
28 పుగల నగల కొరకున్ను బొక్కసములనున్ను,। ధాన్య
ము ద్రాక్షారసము నూనె అనే వీటియొక్క సముదా
యము కొరకు కొట్లనున్ను, నానా విధమైన పశువుల
కొరకు శాలలనున్ను, మందల కొరకు దొడ్లనున్ను
29 చేయించెను. । మరిన్ని అతడు పట్టణములనున్ను విస్తా
రమైన గొఱ్ఱెల మందలనున్ను గోవుల మందలనున్ను
సంపాదించుకొనెను, యేమంటే పరాత్పరుడు అతనికి
30 అతి విస్తారమయిన కలిమిని దయచేసెను. । యీ హి
జ్కీయా గిహెూనుయొక్క మీది కాలువకు అడ్డు
కట్టించి, దావీదు పట్టణముయొక్క పడమట వైపుకు
దాని తెప్పించెను. హిజ్కీయా తన యావత్తు కార్య
31 ములందు వృద్ధి పొందెను.। అయినప్పటికిన్ని దేశమందు
జరిగిన వింతను గురించి విచారించుటకు బాబెలు ప్రభు
వులు అతని యొద్దికి పంపిన రాయభారుల యొక్క
సంగతి విషయమై పరాత్పరుడు అతని హృదయములో
వున్నదంతా తెలుసుకొనే కొరకు అతని శోధించుటకు
అతని విడిచిపెట్టెను. । అయితే హిజ్కీయా యొక్క 32
కడమ కార్యములున్ను అతని వుపకారములున్ను యి
దుగో అవి ఆమోసు కుమారుడైన యెషయా అనే
దీర్ఘదర్శియొక్క దర్శనములోనున్ను యూదా
ఇశ్రాయేలుల రాజులయొక్క గ్రంథములోనున్ను వ్రా
యబడి యున్నవి. । హిజ్కీయా తన పితృలతో కూ 33
డా నిద్ర పొందెను; వారు దావీదు కుమారుల సమా
ధులలో ముఖ్యమైన దానిలో అతని పాతిపెట్టిరి; యూ
దా అంతానున్ను యెరూశలేము కాపురస్తులున్ను
అతని మరణమందు అతనికి ఘనము చేసిరి. అతని
కుమారుడైన మనస్సే అతనికి బదులుగా యేలెను.

## 33. అధ్యాయము.

మనస్సే యేలనారంభించినప్పుడు పన్నెండు సంవ 1
త్సరముల వాడై, యెరూశలేములో యేభై అయిదు
సంవత్సరములు యేలెను.। అయితే ఇశ్రాయేలు పుత్రుల 2
ముందర యెహెూవా తోలివేసిన జాతులయొక్క అస
హ్యతల ప్రకారము అతడు యెహెూవా దృష్టికి కీడు
చేసెను. । యేమంటే అతడు తన తండ్రియైన హిజ్కీ 3
యా పడగొట్టిన వున్నత స్థలములను తిరిగీ కట్టించి,
బయలీము కొరకు బలిపీఠములను నిలిపి, తోపులను
చేయించి, ఆకాశ సమూహమంతటిని ఆరాధించి సేవిం
చెను. । మరిన్ని యెరూశలేములో నా నామము యె 4
న్నటికిన్ని వుండునని యే స్థలమును గురించి యెహెూ
వా చెప్పియుండెనో అక్కడ వున్న యెహెూవా
మందిరములో అతడు బలిపీఠములను కట్టించెను. । యె 5
హెూవా మందిరముయొక్క రెండు శాలలలో అతడు
ఆకాశ సమూహమంతటికి బలిపీఠములను కట్టించెను.।
హిన్నోము కుమారుని పల్లపు స్థలమందు అతడు తన 6
కుమారులను అగ్నిలోనుంచి నడపచేసి, ముహూర్త
ములను విచారిస్తూ, మంత్రములనున్ను చిల్లంగినిన్ని
వాడిక చేస్తూ, కర్ణ భూతముతోనున్ను చిల్లంగి వాం
డ్లతోనున్ను సాంగత్యము చేస్తూ వుండేవాడు: యీలా
గున యెహెూవాకు కోపము కలిగేటట్టు ఆయన
దృష్టికి మిక్కిలీ కీడు చేస్తూ వుండేవాడు. । మరిన్ని 7
అతడు తాను చేయించిన వొక విగ్రహమును అనగా
వొక చెక్కిన బొమ్మను పరాత్పరుని యింటిలో నిలి
పెను. ఆ యింటిని గురించి పరాత్పరుడు దావీదుతో
నున్ను అతని కుమారుడయిన సొలొమోనుతోనున్ను
అనినదేమంటే, యీ యింటిలోనున్ను ఇశ్రాయేలు
సకల గోత్రముల ముందర నేనుయెంచుకొనిన యెరూ

శలేములోనున్ను నా నామమును యెన్నటికిన్ని వుం
8 తును. । మరిన్ని మీ పితృలకు నేను నిర్ణయించిన
దేశములోనుంచి ఇశ్రాయేలుయొక్క పాదమును మరి
తొలగిపో చేయను; అందువల్ల వారు న్యాయ ప్రమాణ
మంతటి ప్రకారముగానున్ను నిబంధనల కట్టడల ప్రకా
రముగానున్ను నేను మోషే ద్వారా ఆజ్ఞాపించిన
అంతటినీ చేసుటకు వారు జాగ్రత పడుదురు అని
9 చెప్పెను. । యీలాగున మనస్సే యూదానున్ను యె
రూశలేము కాపురస్తులనున్ను తప్పు చేసుటకున్ను
ఇశ్రాయేలు పుత్రుల ముందర యెహోవా నశింపజే
సిన జాతులకంటే మరీ చెడ్డగా ప్రవర్తించుటకున్ను
10 చేసెను. । యెహోవా మనస్సేతోనున్ను అతని జను
లతోనున్ను పలికినప్పటికిన్ని వారు ఆలకించుటకు అను
11 కూలించక పోయిరి. । కాబట్టి యెహోవా వారి
మీద అష్షూరు రాజుయొక్క సమూహాధిపతులను
రప్పించినందున వారు ముళ్లనడుమను మనస్సేను పట్టు
కొని, గొలుసులతో బంధించి అతని బాబెలుకు తీసు
12 కొని వెళ్లిరి. । అతడు శ్రమలో వున్నప్పుడు తన పరా
త్పరుడైన యెహోవాను బతిమాలుకొని తన పితృల
పరాత్పరుని యెదుట తన్ను బహుగా తగ్గించుకొని, ।
13 ఆయనను ప్రార్థించినందున ఆయన అతని మనవి
నిన్ని విన్నపమునున్ను ఆలకించి, యెరూశలేముకు
అతని రాజ్యములోకి అతని తిరిగీ తీసుక వచ్చెను.
అప్పుడు మనస్సే యెహోవా పరాత్పరుడై యున్నా
14 డని తెలుసుకొనెను. । యిది అయిన తరువాత అతడు
దావీదు పట్టణము బయిట గిహోనుయొక్క పడమట
వైపున వున్న పల్లపు స్థలములో మత్స్య ద్వారము
పర్యంతమున్ను వొక గోడను కట్టించి, ఓఫెలు చుట్టు
న్ను కట్టించి, దాని మిక్కిలిగా యెత్తు చేసి, యూదా
యొక్క బలమైన పట్టణములన్నిటిలో సేనాధిపతులను
15 వుంచెను. । మరిన్ని అతడు యెహోవా మందిరము
లోనుంచి అన్య దేవుండ్లనున్ను విగ్రహమునున్ను తీసి
వేసి, యెరూశలేములోనున్ను యెహోవా మందిర
ముయొక్క పర్వతములోనున్ను తాను కట్టించిన యా
వత్తు బలిపీఠములనున్ను తీసి, పట్టణము బయిటికి వాటిని
16 పారవేయించెను. । అది గాక అతడు యెహోవా
బలిపీఠమును బాగుచేసి, దాని మీద సమాధానార్పణ
ములనున్ను స్తోత్రార్పణలనున్ను చెల్లించి, ఇశ్రాయేలు
పరాత్పరుడయిన యెహోవాను సేవించుమని యూ
17 దాకు ఆజ్ఞాపించెను. । అయినప్పటికిన్ని జనులు వున్నత
స్థలముల యందు యింకా బలులు అర్పిస్తూ వుండిరి;
అయితే అవి తమ పరాత్పరుడయిన యెహోవాకే
18 అర్పిస్తూ వుండిరి. । అయితే మనస్సేయొక్క కడమ
కార్యములున్ను అతని పరాత్పరునికి అతడు చేసిన
ప్రార్థనయున్ను ఇశ్రాయేలు పరాత్పరుడైన యె
హోవా పేరట అతనితో పలికిన జ్ఞాన దృష్టి పురు
షులయొక్క వాక్యములున్ను యిదుగో అవి ఇశ్రా
యేలు రాజుల గ్రంథమందు వ్రాయబడి వున్నవి. ।
మరిన్ని అతని ప్రార్థనయున్ను అతని మనవి విన 19
బడిన విధమున్ను అతని యావత్తు పాపములున్ను అప
రాధములున్ను అతడు తగ్గించబడక ముందు వున్నత
స్థలములను అతడు కట్టించినటువంటిన్ని తోపులనున్ను
చెక్కిన విగ్రహములనున్ను నిలిపినటువంటిన్ని స్థల
ములు యిదుగో అవి జ్ఞాన దృష్టి పురుషుల వచనము
లలో వ్రాయబడి యున్నవి. । అయితే మనస్సే తన 20
పితృలతో నిద్ర పొందిన తరువాత వారు అతని యింట్లో
అతని పాతిపెట్టిరి; అతని కుమారుడైన ఆమోను అత
నికి బదులుగా యేలెను. । ఆమోను యేలనారంభించి 21
నప్పుడు యిరువై రెండు సంవత్సరములవాడై, యెరూ
శలేములో రెండు సంవత్సరములు యేలెను. । అయితే 22
అతడు తన తండ్రియైన మనస్సే చేసినలాగున యె
హోవా దృష్టికి కీడు చేసెను, యేమంటే ఆమోను
తన తండ్రియైన మనస్సే చేయించిన చెక్కిన విగ్రహ
ములన్నిటికి బలులు చెల్లించి, వాటిని సేవించి, । తన 23
తండ్రియైన మనస్సే తన్ను తగ్గించుకొన్నలాగున యె
హోవా యెదుట తన్ను తగ్గించుకొనక వుండెను,
అయితే ఆమోను అంతకంతకు మరీ అపరాధములు
చేస్తూ వుండెను. । అతని సేవకులు అతని మీద జట్టు 24
కూడుకొని అతని యింట్లో అతని చంపిరి. । అయితే 25
దేశపు జనులు ఆమోను రాజు మీద జట్టు కూడిన
వారినందరినిన్ని చంపిరి; అంతట దేశపు జనులు అతని
కుమారుడైన యోషీయాను అతనికి బదులుగా రాజును
చేసిరి.

## 34. అధ్యాయము.

యోషీయా యేలనారంభించినప్పుడు యెనిమిది 1
సంవత్సరములవాడై, యెరూశలేములో ముప్పై వొక
సంవత్సరములు యేలెను. । అతడు యెహోవా దృష్టికి 2
నీతిగా ప్రవర్తించి, తన తండ్రియైన దావీదు మా
ర్గములందు నడిచి, కుడికైనా యెడమకైనా తొలగ
కుండా వుండెను. । యేమంటే తన యేలుబడియొక్క 3
యెనిమిదో సంవత్సరమందు అతడు యింకా బాలుడై
యుండగా, తన తండ్రియైన దావీదు పరాత్పరుని వెతు
కుటకు ఆరంభించెను; పన్నెండో సంవత్సరమందు
అతడు యూదానున్ను యెరూశలేమునున్ను వున్నత
స్థలములలోనుంచిన్ని తోపులలోనుంచిన్ని చెక్కిన
విగ్రహములలోనుంచిన్ని పోత విగ్రహములలోనుం
చిన్ని పవిత్రము చేసుటకు ఆరంభించెను. । వారు బయ 4

లీముయొక్క బలిపీఠములను అతని సముఖమందు పడ
గొట్టిరి; వాటి పైని వున్న విగ్రహములను అతడు నరి
కివేసి, తోపులనున్న చెక్కిన విగ్రహములనున్న పోత
విగ్రహములనున్న అతడు ముక్కలుగా విరగగొట్టి,
వాటిని ధూళి చేసి, వాటికి బలి అర్పణ చేసిన వారి
5 సమాధుల మీద ఆ ధూళిని జల్లెను. । అతడు అర్చ
కుల శల్యములను వారి బలిపీఠముల మీద కాల్చి, యూ
6 దానున్న యెరూశలేమునున్న శుద్ధిపరిచెను. । ఆలా
గున అతడు మనస్సే ఎఫ్రయీము షిమోను అనే వారి
పట్టణములలోనున్న నఫ్తాలీ పర్యంతము చుట్టున్న
7 వారి గుద్దళ్లతోను పాడు చేయించెను. । అతడు బలి
పీఠములనున్న తోపులనున్న పడగొట్టి, చెక్కిన విగ్ర
హములను చూర్ణముగా కొట్టి, ఇశ్రాయేలు దేశమం
దంతటా వున్న విగ్రహములన్నిటినిన్ని నరికివేసి, తరు
8 వాత అతడు యెరూశలేముకు తిరిగీ వచ్చెను. । అతని
యేలుబడియొక్క పద్దెనిమిదో సంవత్సరమందు అతడు
దేశమునున్న మందిరమునున్న శుభ్రము చేసి, తరువాత
అతడు అస్సల్యాహు కుమారుడైన షాఫానునున్న పట్ట
ణాధిపతి అయిన మయశేయానున్న సమాచార లేఖి
కుడున్న యోహాహాజు కుమారుడున్న అయిన యో
వాహునున్న తన పరాత్పరుడైన యెహోవాయొక్క
9 యిల్లును బాగుచేసుటకు పంపెను. । వారు ప్రధానా
చర్యకుడయిన హిల్కీయా యొద్దికి వచ్చినప్పుడు పరా
త్పరుని యింటిలోకి తేబడినటువంటిన్ని మనస్సే ఎఫ్ర
యీముల యొద్దనుంచిన్ని ఇశ్రాయేలులో శేషించిన
అందరి యొద్దనుంచిన్ని యూదా బెన్యామీనుల అం
దరి యొద్దనుంచిన్ని ద్వారపాలకులైన లేవీయులు కూర్చి
నటువంటిన్ని ద్రవ్యమును వారు అప్పగించి యెరూ
10 శలేముకు తిరిగీ వచ్చిరి. । వారు దాని యెహోవా
యిల్లును కాస్తూ వుండే పనివాండ్ల చేతికి యిచ్చినం
దున వారు యెహోవా యింటిలో పని చేసే వారికి
ఆ యిల్లును బాగు చేసి చక్కపరచుటకు దాని యిచ్చిరి.।
11 అనగా చెక్కిన రాళ్లనున్న జోడించే పని కొరకు
మానులనున్న కొనుటకున్న యూదా రాజులు పాడు
చేసిన యిండ్లకు చాపరాళ్లు వేసుటకున్న వారు దాని
12 పనివాండ్లకున్న శిల్పికారులకున్న యిచ్చిరి. । ఆ మను
ష్యులు ఆ పని నమ్మకముగా చేసిరి; వారిమీద కాచే
వారెవరంటే, మెరారీ కుమారులలో లేవీయులైన యహ
తున్న, ఓబద్యాయున్న, మరిన్ని పని నడిపించుటకు
కెహాతీయుల పుత్రుల సంబంధులైన జెఖర్యాయున్న,
మెషుల్లామున్న, లేవీయులలో వాద్యముల వాయిం
చుటకు నేర్పరులైన వారున్న వారితో కూడా వుండిరి.।
13 మరిన్ని వారు బరువులుమోసే వారి మీదనున్న ప్రతి
విధమైన పనిని జరిగించే వారి మీదనున్న కాచేవారై

వుండిరి; లేవీయులలో లేఖికులున్న పరిచారకులున్న
ద్వారపాలకులున్న వుండిరి. । అంతట వారు యెహో 14
వా యింటిలోకి తేబడిన ద్రవ్యమును బయిటికి తీసు
కొని వచ్చినప్పుడు అర్చకుడైన హిల్కీయా మోషే
ద్వారా యివ్వబడ్డ యెహోవా న్యాయ ప్రమాణము
గల గ్రంథమును కనుకొనెను. । అప్పుడు హిల్కీయా 15
నేను యెహోవా యింటిలో న్యాయ ప్రమాణము
గల గ్రంథము కనుగొంటినని లేఖికుడైన షాఫానుతో
చెప్పి, హిల్కీయా, ఆ గ్రంథమును షాఫానుకు అప్ప
గించెను. । షాఫాను ఆ గ్రంథమును రాజు యొద్దికి తీసుక 16
వెళ్లి, రాజు యొద్దికి మారు మాట తెచ్చి అనినదేమంటే,
నీ సేవకులకు అప్పగించబడినదంతాను వారు చేస్తూ
వున్నారు. । యెహోవా యింటిలో దొరికిన ద్రవ్య 17
మును వారు పోగుచేసి, కాచే వారి చేతికిన్ని పని
వాండ్ల చేతికిన్ని దాన్ని అప్పగించి వున్నారు అని పలి
కిన తరువాత, । అర్చకుడైన హిల్కీయా నాకు ఒక 18
గ్రంథమును యిచ్చెనని లేఖికుడైన షాఫాను రాజుతో
చెప్పి, షాఫాను రాజు ముందర దాని చదివెను. । రాజు 19
న్యాయప్రమాణముయొక్క వాక్యములను వినినప్పుడు
సంభవించినదేమంటే, అతడు తన వస్త్రములను చించు
కొనెను. । అప్పుడు రాజు హిల్కీయాకున్న షాఫాను 20
కుమారుడైన అహీకాముకున్న మీఖా కుమారుడైన
అబ్దోనుకున్న లేఖికుడయిన షాఫానుకున్న రాజు
సేవకుడయిన అశాయాకున్న ఆజ్ఞాపించినదేమంటే, ।
మీరు వెళ్లి, దొరకబడిన యీ గ్రంథముయొక్క వాక్య 21
ములను గురించి నా కొరకున్న ఇశ్రాయేలులోనున్న
యూదాలోనున్న శేషించి యున్న వారి కొరకున్న
యెహోవా యొద్ద విచారించండి, యేమంటే మన
పితృలు యీ గ్రంథములో వ్రాయబడిన అంతటి
ప్రకారము చేసుటకు యెహోవా వాక్యమును గైకొ
నక పోయినందుచేత మన మీద కుమ్మరించబడియున్న
యెహోవాయొక్క కోపము గొప్పదై యున్నదని
చెప్పెను. । అప్పుడు హిల్కీయాయున్న రాజు నియ 22
మించిన వారున్న హస్రాకు పుట్టిన తొఖతు కుమారు
డున్న వస్త్రగృహము కాచే వాడున్న అయిన షల్లూ
ముయొక్క భార్య అయిన హుల్దా అనే దీర్ఘదర్శ
రాలి యొద్దికి వెళ్లి, ఆమెతో అందును గురించి మాట్లా
డిరి; ఆమె అప్పుడు యెరూశలేమందున్న పాఠశా
లలో కాపురము చేస్తూ వుండెను. । అప్పుడు ఆమె 23
వారితో ప్రత్యుత్తరముగా అనినదేమంటే, ఇశ్రా
యేలు పరాత్పరుడైన యెహోవా యీలాగున చెప్పు
తున్నాడు, । యిదుగో నేను యీ స్థలము మీదనున్న 24
దాని కాపురస్తుల మీదనున్న కీడును, అనగా, యూదా
రాజు ముందర వారు చదివిన గ్రంథములో వ్రాయబ

25 డిన శాపములన్నిన్ని వచ్చేటట్టు చేస్తాను. । యెందు
కంటే వారు తమ చేతుల పనులవల్ల నాకు కోపమును
కలుగ చేసేటట్టు వారు నన్ను విడిచిపెట్టి, యితరమైన
దేవుండ్లకు ధూపము వేసి యున్నారు గనుక నా కోపము
యీ స్థలము మీద పోయబడి ఆర్పించబడక వుండును,
అని యెహోవా చెప్పుతున్నాడు, అని నా యొద్దికి
26 మిమ్మును పంపిన మనుష్యునితో మీరు చెప్పండి. । మరి
న్ని యెహోవాయొద్ద విచారించుమని మిమ్మును పం
పినటువంటి యూదా రాజును గురించినదేమంటే,
అతనితో మీరు యీలాగున చెప్పవలెను, నీవు వినిన
వాక్యములను గురించి ఇశ్రాయేలు దేవుడైన యెహో
27 వా చెప్పుతున్నదేమంటే, । నీ హృదయము మెత్తనిదై,
యీ స్థలమునకు విరోధముగానున్ను దాని కాపురస్తు
లకు విరోధముగానున్ను పరాత్పరుడు పలికించిన వా
క్యములను నీవు వినినప్పుడు ఆయన యెదుట నిన్ను
తగ్గించుకొని, అనగా, నా ముందర నిన్ను తగ్గించు
కొని, నీ వస్త్రములను చించుకొని, నా ముందర యేడ్చి
28 తివి, గనుక నీ మనవి నేను ఆలకించితిననిన్ని, । యిదు
గో నేను నీ పితృల యొద్దను నిన్ను చేర్చుదును; నీ
సమాధి యొద్దికి నీవు నెమ్మదితో చేర్చబడుదువు,
గనుక యీ స్థలము మీదనున్ను దాని కాపురస్తుల
మీదనున్ను నేను తేబోయే కీడును నీ నేత్రములు
చూడక వుండుననిన్ని యెహోవా చెప్పుతున్నాడని
చెప్పుమనెను; యీలాగున వారు రాజు యొద్దికి కబురు
29 తిరిగీ తీసుక వచ్చిరి. । అప్పుడు రాజు యూదా యెరూ
శలేములయొక్క పెద్దలనందరినిన్ని పిలువనంపించి, ।
30 వారిని సమకూర్చిన తరువాత రాజున్ను యూదా
వారందరున్ను యెరూశలేము కాపురస్తులున్ను అర్చ
కులున్ను లేవీయులున్ను జనులలో పిన్న పెద్దలందరు
న్ను యెహోవాయొక్క మందిరమునకు యెక్కి వెళ్లిరి.
అప్పుడు అతడు యెహోవా మందిరములో దొరికిన
వొడంబడికె గల గ్రంథముయొక్క వాక్యములన్నిన్ని
31 వారి వినికిలో చదివెను. । అంతట రాజు తన స్థలమందు
నిలువబడి, యెహోవా వెంబడి నడుచుటకున్ను
ఆయన ఆజ్ఞలనున్ను సాక్ష్యములనున్ను నిబంధనలను
న్ను తన హృదయమంతటితోనున్ను తన ఆత్మ అంతటి
తోనున్ను గైకొనుటకున్ను యీ గ్రంథములో వ్రాయ
బడిన వొడంబడికెయొక్క వాక్యములను చేసుటకున్ను
యెహోవా యెదుట వొడంబడికె చేసుకొనెను. ।
32 మరిన్ని అతడు యెరూశలేములో వున్న వారినందరి
నిన్ని బెన్యామీనునున్ను దానికి వొప్పుటకు చేసెను.
అప్పుడు యెరూశలేము కాపురస్తులు తరాత్పరునియొ
క్క అనగా తమ పితృల పరాత్పరునియొక్క వొడంబ
33 డికె ప్రకారము చేసిరి. । అంతట యోషీయా ఇశ్రా
యేలు పుత్రుల సంబంధమైన దేశములన్నిటిలోనుంచి
అసహ్యములన్నిన్ని తీసివేసి, ఇశ్రాయేలులో వున్న
వారినందరిని సేవించుటకు, అనగా, తమ పరాత్పరు
డైన యెహోవాను సేవించుటకు చేసెను. అతని
దినములన్నిటిలో వారు తమ పితృల పరాత్పరుడైన
యెహోవాను వెంబడించుట మానలేదు.

## 35. అధ్యాయము.

మరిన్ని యోషీయా యెరూశలేములో యెహో 1
వాను గూర్చిన పస్కా పండుగను ఆచరించెను; మొదటి
నెలయొక్క పధ్నాలుగో దినమున వారు పస్కాను చం
పిరి. । అతడు అర్చకులను వారియొక్క పనులలో 2
నిర్ణయించి, యెహోవా యింటియొక్క సేవ కొరకు
వారిని ధైర్యపరచి, । యెహోవాకు పరిశుద్ధులైనటు 3
వంటిన్ని ఇశ్రాయేలందరికి బోధ చేసేటటువంటిన్ని
లేవీయులతో అనినదేమంటే, ఇశ్రాయేలు రాజైన
దావీదుయొక్క కుమారుడైన సొలొమోను కట్టించిన
మందిరములో పరిశుద్ధమైన పెట్టెను మీరు వుంచండి;
అది మీ భుజముల మీద వొక బరువై వుండ కూడదు;
మీ పరాత్పరుడైన యెహోవానున్ను ఆయన జను
లైన ఇశ్రాయేలునున్ను సేవించి, । ఇశ్రాయేలు రాజైన 4
దావీదుయొక్క వ్రాత ప్రకారముగానున్ను అతని
కుమారుడైన సొలొమోను వ్రాత ప్రకారముగానున్ను
మీ మీ పితృల యిండ్ల ప్రకారముగానున్ను మీ వర
సల చొప్పుననున్ను మిమ్మును ఆయత్తపరచుకొని, । జను 5
లైన మీ సహోదరుల పితృల కుటుంబములయొక్క
విభాగముల చొప్పుననున్ను లేవీయుల కుటుంబము
యొక్క విభాగము చొప్పుననున్ను మీరు పరిశుద్ధ
స్థలమందు నిలవండి. । ఆలాగున పస్కాను చంపి, మిమ్మును 6
శుద్ధి పరచుకొని, మీ సహోదరులు మోషే ద్వారా
కలిగిన యెహోవాయొక్క వాక్య ప్రకారము చేసే
టట్టు వారిని ఆయత్త పరచండి అని చెప్పెను. । మరిన్ని 7
యోషీయా జనులకు, అనగా, అక్కడ వున్న వారంద
రికి పస్కా అర్పణల కొరకు మందలోనుంచి ముప్పయి
వేల గొర్రె పిల్లలనున్ను మేక పిల్లలనున్ను మూడు వేల
కోడెలనున్ను యిచ్చెను. యివి రాజుకు కలిగిన వా
టిలో వుండినవి. । అతని ప్రధానులున్ను జనులకున్ను 8
అర్చకులకున్ను లేవీయులకున్ను మనః పూర్వకముగా
యిచ్చిరి; యెహోవా యింటియొక్క అధికారులైన
హిల్కీయాయున్ను జెఖర్యాయున్ను యెహీయేలున్ను
పస్కా అర్పణల కొరకు అర్చకులకు రెండువేల ఆరు
నూరు గొర్రెలు మొదలయిన వాటినిన్ని మున్నూరు
కోడెలనున్ను యిచ్చిరి. । కొనన్యాహున్ను అతని 9
సహోదరులయిన షెమయాయున్ను నెతనేలున్ను

లేవీయులలో ప్రధానులయిన హషబ్యాయున్ను యె
హీయేలున్ను యోజాబాదున్ను పస్కా అర్పణల కొరకు
లేవీయులకు అయిదు వేల గొర్రెలు మొదలైన వాటి
10 నిన్ని యేనూరు యెడ్లనున్ను యిచ్చిరి. । యీలాగున
పని ఆయత్త పరచ బడెను; రాజు ఆజ్ఞా ప్రకారము
అర్చకులు తమ స్థలములోనున్న లేవీయులు తమ
11 వరసలలోనున్న నిలవబడిరి. । అంతట వారు పస్కాను
చంపిన తరువాత అర్చకులు తమ చేతులతో రక్తమును
12 చిలకరించిరి; లేవీయులు వాటిని వొలిచిరి. । అప్పుడు
మోషే గ్రంథములో వ్రాయబడిన ప్రకారము యె
హోవాకు అర్పించే కొరకు జనుల కుటుంబముల
యొక్క విభాగము చొప్పున యిచ్చుటకు వారు దహన
బలులను తీసివేసిరి; ఆలాగున వారు యెడ్లతోనున్ను
13 చేసిరి. । వారు నిబంధన ప్రకారము పస్కాను అగ్నిచేత
కాల్చిరి; అయితే యితరమయిన పరిశుద్ధార్పణలను
కుండలలోనున్ను బొరుసులలోనున్ను పెనములలోను
న్ను వుడికించి, వాటిని జనులందరికి త్వరగా పంచి
14 పెట్టిరి. । తరువాత వారు తమ కొరకున్ను అర్చకుల
కొరకున్ను సిద్ధము చేసిరి, యెందుకంటే అహరోను
కుమారులైన అర్చకులు దహన బలులనున్ను కొవ్వును
న్ను రాత్రి పర్యంతము అర్పిస్తూ వుండిరి; కాబట్టి
లేవీయులు తమ కొరకున్ను అహరోను కుమారులైన
15 అర్చకుల కొరకున్ను ఆయత్తపరచిరి. । మరిన్ని ఆసాఫు
కుమారులైన గాయకులు దావీదు ఆసాఫు హేమాను
రాజుయొక్క జ్ఞాన దృష్టి పురుషుడయిన యెదూ
తూను అనే వారు ఆజ్ఞా ప్రకారము తమ స్థలమందు
వుండిరి. ద్వారపాలకులు ప్రతి ద్వారముయొద్ద కని
పెట్టుతూ వుండిరి, యేమంటే వారు తమ పనిలోనుంచి
వెళ్లిపోకుండా వుండేటట్టు వారి సహోదరులైన లేవీ
16 యులు వారి కొరకు ఆయత్తపరచిరి. । యీలాగున రా
జైన యోషీయా ఆజ్ఞా ప్రకారము పస్కాను ఆచరించు
టకున్ను యెహోవా బలిపీఠము మీద దహన బలు
లను అర్పించుటకున్ను యెహోవాయొక్క సేవ
17 యావత్తు ఆ దినమందే ఆయత్త పరచబడెను. । అక్కడ
వున్న ఇశ్రాయేలు పుత్రులు ఆ కాలమందు పస్కాను
న్ను పులుసు లేని రొట్టెయొక్క పండుగనున్ను యేడు
18 దినములు ఆచరించిరి. । సమూయేలు అనే దీర్ఘదర్శి
యొక్క దినము మొదలుకొని ఇశ్రాయేలులో ఆలాటి
పస్కా పండుగ ఆచరించబడక వుండెను; యోషీయా
యున్ను అర్చకులున్ను లేవీయులున్ను అక్కడ వున్న
యూదా ఇశ్రాయేలులందరున్ను యెరూశలేము కాపు
రస్తులున్ను ఆచరించినలాటి పస్కా పండుగను ఇశ్రా
యేలు రాజులందరిలో వొక్కడయినా ఆచరించక వుం
19 డెను. । యోషీయా యేలుబడియొక్క పద్దెనిమిదో
సంవత్సరమందు యీ పస్కా ఆచరించబడెను. । యిది 20
అంతా అయిన తరువాత యోషీయా ఆలయమును
సిద్ధపరచినప్పుడు మిస్రయీము రాజైన నెఖో ఫెరాతు
నది యొద్ద వున్న కర్కెమీషు మీదికి యుద్ధము చేసు
టకు వచ్చెను; అప్పుడు యోషీయా అతని మీదికి
బైలుదేరెను. । అయితే అతడు అతని యొద్దికి రాయ 21
భారులను పంపి చెప్పుమనినదేమంటే, వో యూదా
రాజా, నీతో నాకేమి? యే యింటితో నాకు యుద్ధ
ము వున్నదో దాని మీదికే గాని నీ మీదికి యీ దిన
మున నేను వస్తున్నాను కాను; యేమంటే పరాత్ప
రుడు త్వరచేయుమని నాకు ఆజ్ఞాపించెను; నాతో
కూడా వున్న పరాత్పరుడు నిన్ను నశింపచేయక వుండే
టట్టు ఆయన జోలికి వెళ్లుట మానుకొనుమని చెప్పండి
అని అనెను. । అయినప్పటికిన్ని యోషీయా అతనితో 22
యుద్ధము చేసే కొరకు అతని యొద్దనుంచి తన ముఖ
మును తిప్పక, మారు వేషము ధరించుకొని, యెహో
వా నోటి ద్వారా కలిగిన నెఖోయొక్క వాక్యము
లను వినకుండా మెగిద్దో పల్లపు స్థలమందు యుద్ధము
చేసుటకు వచ్చెను. । అయితే విలుకాండ్లు రాజయిన 23
యోషీయాను బాణముతో కొట్టినందువల్ల, రాజు తన
సేవకులను చూచి, నేను బహుగా గాయములను పొంది
యున్నాను, గనుక యిక్కడనుంచి నన్ను కొంచ పొం
డని చెప్పెను. । కాబట్టి అతని సేవకులు ఆ రథము 24
మీదనుంచి అతని తీసి, అతనికి కలిగిన మరియొక రథ
ము మీద అతని పెట్టి, యెరూశలేముకు అతని తీసుక
వచ్చిరి; అయితే అతడు మృతిబొంది తన పితృల సమా
ధులలో వొక దాని యందు పాతి పెట్ట బడెను;
యూదా యెరూశలేము వారందరున్ను యోషీయా
కొరకు దుఃఖించిరి. । ఇర్మీయా యోషీయా కొరకు 25
ప్రలాపించెను; గాయకులందరున్ను గాయకురాండ్లు
న్ను తమ ప్రలాపములలో యోషీయాను గూర్చి
నేటి వరకు పలికి ఇశ్రాయేలులో వాటిని వొక నిబం
ధనగా చేసిరి; యిదుగో అవి ప్రలాపములలో వ్రాయ
బడి యున్నవి. । యోషీయాయొక్క కడమ కార్యము 26
లున్ను యెహోవా న్యాయ ప్రమాణములో వ్రాయ
బడిన ప్రకారమైన అతని వుపకారములున్ను, । అతని 27
పూర్వోత్తరమైన క్రియలున్ను, యిదుగో అవి ఇశ్రా
యేలు యొక్కయున్ను యూదా యొక్కయున్ను రా
జుల గ్రంథమందు వ్రాయబడి యున్నవి.

## 36. అధ్యాయము.

అప్పుడు దేశపు జనులు యోషీయా కుమారుడైన 1
యెహోయాహాజును తీసుకొని అతని తండ్రికి బదు
లుగా అతని యెరూశలేములో రాజును చేసిరి. ।

2 యెహోయాహాజు యేలనారంభించినప్పుడు యిరువై
మూడు సంవత్సరములవాడై యెరూశలేములో మూడు
3 నెలలు యేలెను. । మిస్రయీము రాజు యెరూశలే
ములో అతని తీసివేసి, ఆ దేశమునకు నూరు తలాం
తుల వెండినిన్ని వొక తలాంతు బంగారమునున్ను పన్ను
4 గా నిర్ణయించెను. । మరిన్ని మిస్రయీము రాజు
అతని సహోదరుడైన ఎల్యాకీమును యూదా మీద
నున్ను యెరూశలేము మీదనున్ను రాజుగా నియ
మించి, అతనికి యెహోయాకీము అనే మారు పేరు
పెట్టెను. నెఖో అతని సహోదరుడైన యెహో
యాహాజును తీసుకొని మిస్రయీముకు వచ్చెను. ।
5 యెహోయాకీము యేలనారంభించినప్పుడు యిరువై
అయిదు సంవత్సరములవాడై యెరూశలేములో పద
కొండు సంవత్సరములు యేలెను; అతడు తన పరాత్ప
రుడయిన యెహోవా దృష్టికి కీడుగా ప్రవర్తించె
6 ను. । అతని మీదికి బాబెలు రాజైన నెబూఖద్నెస్సరు
వచ్చి, అతని బాబెలుకు తీసుకొని పోవుటకు గొలుసు
7 లతో అతని బంధించెను. । నెబూఖద్నెస్సరు యెహో
వా మందిరముయొక్క వస్తువులలో కొన్నిటిని బాబె
లుకు తీసుకొని పోయి, బాబెలులో వున్న తన ఆలయ
8 ములో వాటిని వుంచెను. । అయితే యెహోయాకీము
యొక్క కడమ కార్యములున్ను అతడు చేసిన అస
హ్యతలనున్ను అతనియందు కనుపడినదిన్ని యిదుగో
అవి ఇశ్రాయేలుయొక్కయున్ను యూదాయొక్క
యున్ను రాజుల గ్రంథమందు వ్రాయబడి యున్నవి;
అతని కుమారుడయిన యెహోయాఖీను అతనికి బదు
9 లుగా యేలెను. । యెహోయాఖీను యేలనారంభించి
నప్పుడు యెనిమిది సంవత్సరములవాడై యెరూశలే
ములో మూడు నెలల పది దినములు యేలెను; అతడు
10 యెహోవా దృష్టికి కీడుగా ప్రవర్తించెను. । ఆ సంవ
త్సరము అంతమైనప్పుడు రాజయిన నెబూఖద్నెస్సరు
పంపి, యెహోవా మందిరముయొక్క యింపు గల
వస్తువులతో కూడా అతని బాబెలుకు తెప్పించి, అతని
సహోదరుడయిన సిద్కీయాను యూదా మీదనున్ను
11 యెరూశలేము మీదనున్ను రాజును చేసెను. । సిద్కీ
యా యేలనారంభించినప్పుడు యిరువై వొక సంవత్స
రములవాడై యెరూశలేములో పదకొండు సంవత్సర
12 ములు యేలెను. । అతడు తన పరాత్పరుడైన యెహో
వా దృష్టికి కీడుగా ప్రవర్తించి, యెహోవా నోటి
మాటగా పలికిన దర్ఘదర్శియైన ఇర్మీయా యెదుట తన్ను
13 తగ్గించుకొనక వుండెను. । మరిన్ని పరాత్పరుని పయిని
అతనిచేత ప్రమాణము చేయించిన నెబూఖద్నెస్సరు
అనే రాజు మీదికి అతడు తిరగబడెను; అయితే అతడు
తన మెడను గట్టి చేసుకొని, ఇశ్రాయేలు పరాత్పరుడ
యిన యెహోవా తట్టుకు తిరగకుండా తన హృద
యము కఠినపరచుకొనెను. । అది గాక అర్చకులలో 14
నున్ను జనులలోనున్ను శ్రేష్ఠులు అన్య జాతుల అస
హ్యతలన్నిటి ప్రకారము బహుగా అపరాధము చేసి,
యెహోవా యెరూశలేములో పరిశుద్ధపరచిన మంది
రమును అపవిత్రపరచిరి. । అయితే వారి పితృల పరా 15
త్పరుడయిన యెహోవా తన జనుల యందున్ను తన
నివాస స్థలమందున్ను కనికరించినందున వారి యొద్దికి
తన దూతల ద్వారా వార్తను పంపుతూ, పెందలాడ
లేస్తూ పంపుతూ వున్నప్పటికిన్ని, । వారు పరాత్ప 16
రుని దూతలను అపహసించి ఆయన వాక్యములను
తృణీకరించి, ఆయన దీర్ఘదర్శులను హింసపరిచిరి;
అందువల్ల యెహోవా కోపము తన జనుల మీదికి
లేచెను; అందుకు నివారణము లేకపోయెను. । కాబట్టి 17
ఆయన వారి మీదికి కల్దీయుల రాజును వచ్చేటట్టు
చేసినందున అతడు వారి పరిశుద్ధ స్థలముయొక్క యిం
టిలోను వారి పడుచువాండ్లను కత్తిచేత సంహరించి,
పడుచువాని యందైనా పడుచురాలి యందైనా ముస
లివాని యందైనా వార్ధక్యముచేత వంగినవాని యం
దైనా కనికరించ లేదు; ఆయన వారినందరినిన్ని అతని
చేతికి అప్పగించెను. । మరిన్ని అతడు పరాత్పరుని మంది 18
రముయొక్క పెద్దవిన్ని చిన్నవిన్ని అయిన పాత్రలు
అన్నిటినిన్ని యెహోవా మందిరముయొక్క పదా
ర్థములనున్ను రాజుయొక్కయున్ను అతని ప్రధా
నులయొక్కయున్ను పదార్థములనున్ను వీటినన్నిటి
నిన్ని బాబెలుకు తీసుక వచ్చెను. । అది గాక వారు 19
పరాత్పరుని మందిరమును తగలబెట్టి, యెరూశలేము
ప్రాకారమును పడగొట్టి, దానియొక్క నిగరులన్నిటిని
తగలబెట్టి, నాటి యింపు గల వస్తువులన్నిటిని పాడు
చేసిరి. । కత్తిచేత హతులు కాకుండా తప్పించుకొనిన 20
వారిని అతడు బాబెలుకు తీసుక వెళ్లెను: వారు అక్కడ
అతనికిన్ని అతని కుమారులకున్ను పారసీ రాజ్యము
యొక్క యేలుబడి పర్యంతము సేవకులై యుండిరి. ।
దేశము దాని సబ్బాతులను అనుభవించే పర్యంతము 21
ఇర్మీయా నోటి ద్వారా కలిగిన యెహోవా వాక్య
ము నెరవేరుటకు యిది సంభవించెను, యేమంటే అది
పాడుగా వున్నంత పర్యంతము అనగా డెబ్బయి సంవ
త్సరములు నెరవేరే పర్యంతము అది సబ్బాతును అనుభ
విస్తూ వుండెను. । అయితే పారసీ దేశపు రాజయిన 22
కోరేషుయొక్క మొదటి సంవత్సరమందు ఇర్మీయా
నోటి ద్వారా పలకబడిన యెహోవా వాక్యము
నెరవేరేటట్టు యెహోవా పారసీ రాజయిన కోరేషు
యొక్క ఆత్మను ప్రేరేపించినందున అతడు తన రాజ్య
మందంతటా ఆజ్ఞను చాటింపించి దాని వ్రాయించి

23 ప్రకటన చేసినదేమంటే, । పారసీ రాజయిన కోరేషు
యీలాగున చెప్పుతున్నాడు, భూమియొక్క రాజ్యము
లన్నిటినిన్ని పరమండలముయొక్క పరాత్పరుడయిన
యెహోవా నాకు యిచ్చి వున్నాడు; మరిన్ని ఆయన
యూదా యందున్న యెరూశలేములో ఆయన కొరకు
వొక మందిరమును కట్టించుమని నాకు ఆజ్ఞాపించి
వున్నాడు; మీలో ఆయన జనుల సంబంధమైన వాడు
యెవడో వాని పరాత్పరుడైన యెహోవా వానితో
కూడా వుండును గాక, అతడు పైకి వెళ్లును గాక
అని చాటింపించెను.

# ఎజ్రాయొక్క గ్రంథము.

## 1. అధ్యాయము.

1 పారసీ దేశపు రాజయిన కోరేషు యేలుబడి
యొక్క మొదటి సంవత్సరమందు యెహోవా ఇర్మీ
యా నోటి ద్వారా ఆనతిచ్చిన వాక్యము నెరవేరేట
ట్టుగా యెహోవా పారసీ దేశపు రాజైన కోరేషు
ఆత్మను ప్రేరేపణ చేసినందున అతడు ఆజ్ఞను వ్రాయించి
తన రాజ్యమందంతటా ప్రచురము చేయించినదేమం
2 టే, । పారసీ దేశపు రాజైన కోరేషు యీలాగున
చెప్పుతున్నాడు, ఆకాశమునకు దేవుడైన యెహోవా
లోకమందున్న సకల రాజ్యములను నా వశము చేసి,
యూదా దేశమందున్న యెరూశలేములో తన కొరకు
మందిరమును కట్టించుమన్న సెలవు నాకు యిచ్చెను. ।
3 కాబట్టి మీలో యెవరు ఆయన జనులయి యున్నారో
వారి దేవుడు వారికి తోడుగా వుండును గాక; వారు
యూదా దేశమందున్న యెరూశలేముకు వెళ్లి యెరూ
శలేములో వున్న ఇశ్రాయేలు దేవుడయిన యెహో
వాయొక్క మందిరమును కట్టుదురు గాక; ఆయనే
4 దేవుడయి వున్నాడు. । యెవడయినా తన నివాస స్థల
మందు వుండిపోయినట్టాయెనా అతని స్థలముయొక్క
మనుష్యులు యెరూశలేములో వుండే దేవునియొక్క
మందిరము కొరకు స్వేచ్ఛార్పణతో గాక అతనికి వెండి
బంగారములతోనున్ను వస్తువులతోనున్ను మృగముల
తోనున్ను సహాయము చేయ వలెనని ప్రచురము
5 చేయించెను. । అప్పుడు యూదా పెద్దలలోనున్ను
బెన్యామీను పెద్దలలోనున్ను వున్న శ్రేష్ఠులున్ను అర్చ
కులున్ను లేవీయులున్ను యెవరెవరి ఆత్మను దేవుడు
ప్రేరేపించెనో వారందరితో కూడా యెరూశలే
ములో వుండే యెహోవాయొక్క మందిరమును
6 కట్టించే కొరకు వెళ్లడానకు లేచినారు. । మరిన్ని వారి
చుట్టూ వున్న వారందరున్ను స్వేచ్ఛగా అర్పించబడి
నవి వినాగా వెండి బంగారముల వస్తువులతోనున్ను
మృగములతోనున్ను ప్రశస్తమైన వస్తువులతోనున్ను
7 వారియొక్క చేతులను బలపర్చిరి. । మరిన్ని రాజయిన
కోరేషు నెబూఖద్నెస్సరు తన దేవుండ్లయొక్క మంది
రమందు యెరూశలేములోనుంచి తెప్పించి వుంచిన
యెహోవా మందిరముయొక్క వస్తువులను బైటికి
8 తెప్పించెను. । వాటిని పారసీ దేశపు రాజైన కోరేషు
పదార్థపు కారకుడైన మిత్రెదాతు ద్వారా బయిటికి
తెప్పించి లెక్క చేయించి, యూదాలో శ్రేష్ఠుడైన
షేష్బస్సరు చేతికి వాటిని అప్పగించెను. । వాటియొక్క 9
లెక్క యెంతంటే, ముప్ఫయి బంగారపు పళ్లెము
లున్ను, వెయి వెండి పళ్లెములున్ను, యిరువై తొమ్మిది
కత్తులున్ను, । ముప్ఫయి బంగారపు గిన్నెలున్ను, 10
నన్నూట పది రెండో తరబడి వెండి గిన్నలున్ను,
యింకా వేరే వస్తువులు వెయ్యిన్ని అయి వుండెను. ।
బంగారపు వస్తువులున్ను వెండి వస్తువులున్ను అన్నీ 11
అయిదువేల నన్నూరు అయి వుండెను. యివన్నీ షేష్బ
స్సరు బాబెలు చెరలోనుంచి విముక్తి పొందినవారితో
కూడా యెరూశలేముకు తీసుకొని వచ్చినాడు.

## 2. అధ్యాయము.

అయితే బాబెలు రాజయిన నెబూఖద్నెస్సరు 1
చేత బాబెలు దేశమునకు చెరగా తీసుక పోబడిన
వారికి ఆ దేశమందే పుట్టి చెరలోనుంచి విముక్తులై, ।
యెరూశలేముకున్ను యూదా దేశమునకున్ను ప్రతి 2
మనిషీ తన తన పట్టణమునకున్ను జెరుబ్బాబెలు, యే
షూవ, నెహెమ్యా, శెరాయా, రెయేలాయా, మొ
ర్దెకై, బిల్షాను, మిస్పెరేతు, బిగ్వయి, రెహూము,
బయనా, అనే వీరితో కూడా వచ్చిన ఇశ్రాయేలీ
యులయొక్క లెక్క యేమంటే, । పరోషుయొక్క 3
పుత్రులు రెండువేల నూట డెబ్బయి యిద్దరున్ను, ।
షెఫటీయాయొక్క పుత్రులు మున్నూట డెబ్బయి 4
యిద్దరున్ను, । ఆరహుయొక్క పుత్రులు యేడ్నూట 5
డెబ్బయి అయిదుగురున్ను, । పహత్మోయాబుయొక్క 6
పుత్రులు యేషూవ యోవాబుయొక్క పుత్రులతో
కూడా రెండు వేల యెనమన్నూట పండ్రెండుగురు
న్ను, । ఏలాముయొక్క పుత్రులు వెయ్యిన్ని యిన్నూట 7
యేభయి నలుగురున్ను, । జత్తూయొక్క పుత్రులు తొం 8
బన్నూట నలభై అయిదుగురున్ను, । జక్కయి యొక్క 9
పుత్రులు యేడ్నూట అరువై మందిన్ని, । బానీయొక్క 10
పుత్రులు ఆరునూరు నలభై యిద్దరున్ను, । బేబైయొ 11
క్క పుత్రులు ఆరునూట యిరువై ముగ్గురున్ను, । అజ్గా 12
దుయొక్క పుత్రులు వెయ్యిన్ని యిన్నూట యిరువై
యిద్దరున్ను, । అదోనికాముయొక్క పుత్రులు ఆరు 13
నూట అరువై ఆరుగురున్ను, । బిగ్వయి యొక్క పుత్రు 14
లు రెండు వేల యేభై ఆరుగురున్ను, । అదీనుయొక్క 15

16 పుత్రులు నన్నూట యేభై నలుగురున్ను, । అథేరుయొక్క
పుత్రులు హిజ్కియాతో కూడా తొంభై యెనమండు
17 గురున్ను, । బేస్సయియొక్క పుత్రులు మున్నూట యి
18 రువై ముగ్గురున్ను, । యోరాయొక్క పుత్రులు నూట
19 పండ్రెండుగురున్ను, । హాషుముయొక్క పుత్రులు యి
20 న్నూట యిరువై ముగ్గురున్ను, । గిబ్బారుయొక్క పుత్రు
21 లు తొంభై అయిదుమందిన్ని, । బేత్లెహేముయొక్క
22 పుత్రులు నూట యిరువై ముగ్గురున్ను, । నెథోపాయొ
23 క్కవారు యేభైఆరు మందిన్ని, । అనాతోతు వాండ్లు
24 నూట యిరువై యెనమండుగురున్ను, । అజ్మావెతుయొ
25 క్కపుత్రులు నలభై యిద్దరున్ను, । కిర్యాతారీము, కెఫీ
రా, బెయేరోతు, అనే వీరి యొక్క పుత్రులు యేడ్నూట
26 నలభై ముగ్గురున్ను, । రామా, గాబ, అనే వీరియొక్క
27 పుత్రులు ఆరునూట యిరువై వొక మందిన్ని, । మిక్మషు
28 వాండ్లు నూట యిరువై యిద్దరున్ను, । బేతేలు హాయి
అనే వీటి మనుష్యులు యిన్నూట యిరువై ముగ్గు
29 రున్ను, । నెబోయొక్క పుత్రులు యేభై యిద్దరున్ను, ।
30 మగ్బీషుయొక్క పుత్రులు నూట యేభయి ఆరుగు
31 రున్ను, । యింకొక ఏలాముయొక్క పుత్రులు వెయ్యి
32 న్ని యిన్నూట యేభై నలుగురున్ను, । హారీముయొక్క
33 పుత్రులు మున్నూట యిరువై మందిన్ని, । లోదు, హ
దీదు, ఓనో, అనే వీరియొక్క పుత్రులు యేడ్నూట
34 యిరువై అయిదుగురున్ను, । యెరిఖోయొక్క పుత్రులు
35 మున్నూట నలుభై అయిదుగురున్ను, సెనాయాయొక్క
పుత్రులు మూడువేల ఆరునూట ముప్పైమందిన్ని. ।
36 మరిన్ని అర్చకులలో యేషూవ యింటి వాండ్లయిన యె
దాయాయొక్క పుత్రులు తొంబన్నూట డబ్బై ముగ్గు
37 రున్ను. । ఇమ్మేరుయొక్క పుత్రులు వెయ్యిన్ని యేభై
38 యిద్దరున్ను. । పష్హూరుయొక్క పుత్రులు వెయ్యిన్ని
39 యిన్నూట నలభై యేడు మందిన్ని. । హారీముయొక్క
40 పుత్రులు వెయ్యిన్ని పదిహేడుగురున్ను. । మరిన్ని
లేవీయులలో యేషూవ, కద్మీయేలు, వీరియొక్క పు
త్రులు హోదవ్యా పుత్రులతో కూడా డెబ్బై నలు
41 గురు మందిన్ని. । మరిన్ని గాయకులలో ఆసాఫుయొక్క
42 పుత్రులు నూట యిరువై యెనమండుగురున్ను. । ద్వార
పాలకులలో షల్లూము, అథేరు, థల్మోను, అక్కూబు,
హథీథా, షోబాయి, అనే వీరి అందరియొక్క పుత్రులు
43 నూట ముప్పయి తొమ్మండుగురున్ను. । మరిన్ని నెతేనీ
యులలో సీహాయొక్క పుత్రులున్ను, హశూఫాయొ
క్క పుత్రులున్ను, థబాయోతుయొక్క పుత్రులున్ను, ।
44 కెరోసుయొక్క పుత్రులున్ను, సీయహాయొక్క పుత్రు
45 లున్ను, పాదోనుయొక్క పుత్రులున్ను, । లెబానాయొ
క్క పుత్రులున్ను, హగాబాయొక్క పుత్రులున్ను,
46 అక్కూబుయొక్క పుత్రులున్ను, । హాగాబుయొక్క
పుత్రులున్ను, షల్మయియొక్క పుత్రులున్ను, హానాను
యొక్క పుత్రులున్ను, । గిద్దేలుయొక్క పుత్రులున్ను 47
గహరుయొక్క పుత్రులున్ను, రెవాయాయొక్క పుత్రు
లున్ను, । రెసీనుయొక్క పుత్రులున్ను, నెకోదాయొ 48
క్క పుత్రులున్ను, గజ్జాముయొక్క పుత్రులున్ను, ।
ఉజ్జాయొక్క పుత్రులున్ను, పాసేయహు యొక్క 49
పుత్రులున్ను, బేసైయొక్క పుత్రులున్ను, । అస్నా 50
యొక్క పుత్రులున్ను, మెహూనీముయొక్క పుత్రు
లున్ను, నెఫూసీముయొక్క పుత్రులున్ను, । బక్బూకు 51
యొక్క పుత్రులున్ను, హకూఫాయొక్క పుత్రులున్ను,
హహూర్హారుయొక్క పుత్రులున్ను, । బస్లూతుయొక్క 52
పుత్రులున్ను, మెహీదాయొక్క పుత్రులున్ను, హర్షా
యొక్క పుత్రులున్ను, । బర్కోసుయొక్క పుత్రులు 53
న్ను, సీసెరాయొక్క పుత్రులున్ను, తామహుయొక్క
పుత్రులున్ను, । నెస్సీయహుయొక్క పుత్రులున్ను, 54
హథీఫాయొక్క పుత్రులున్ను, । సొలొమోను సేవకుల 55
యొక్క పుత్రులున్ను, సోథైయొక్క పుత్రులున్ను,
సోఫెరెతుయొక్క పుత్రులున్ను, పెరూదాయొక్క
పుత్రులున్ను, । యహలాయొక్క పుత్రులున్ను, దర్కో 56
నుయొక్క పుత్రులున్ను, గిద్దేలుయొక్క పుత్రులున్ను, ।
షెఫథీయాయొక్క పుత్రులున్ను, హత్తీలుయొక్క 57
పుత్రులున్ను, సెబాయీ్యము సంబంధమైన పోఖెరెతు
యొక్క పుత్రులున్ను, ఆమీయొక్క పుత్రులున్ను, ।
వీరనే నెతేనీయులున్ను సొలొమోను సేవకులయొక్క 58
పుత్రులతోను మున్నూట తొంభై యిద్దరై వుండిరి. ।
మరిన్ని తెల్మెలహు, తెల్హర్షా, కెరూబు, అద్దాను, 59
ఇమ్మెరు, యీ స్థలములలోనుంచి కొందరు వచ్చినారు;
అయితే వీరు తమ పితృలయొక్క యిల్లయినా వంశావళి
యైనా చూపించ లేకపోయినందున వారు ఇశ్రాయేలీ
యులలో వారు అవుదురో కారో తెలియలేదు. । వారు 60
యెవరంటే, దెలాయ్యాయొక్క పుత్రులున్ను, థోబీ
యాయొక్క పుత్రులున్ను, నెకోదాయొక్క పుత్రు
లున్ను, ఆర్నూట యేభై యిద్దరు అయి వుండిరి. ।
మరిన్ని అర్చకులయొక్క పుత్రులలో హబాయ్యా 61
యొక్క పుత్రులున్ను, కోస్సుయొక్క పుత్రులున్ను,
గిలాదీయుడైన బర్జిల్లయియొక్క కుమార్తెలలో
వొకతెను పెండ్లి చేసుకొని వారి పేరులవల్ల బర్జిల్లయి
అని పిలువబడిన వానియొక్క పుత్రులున్ను, । అనే 62
వీరు వంశావళి లిఖితములో తమ తమ పేరులను వెతికి
నప్పుడు అవి కనుపడక పోయినందున అర్చకత్వము
లోనుంచి కేటాయించబడి అపవిత్రులని యెంచబడిరి. ।
మరిన్ని తిర్షాతా (అనగా అధికారి) వారితో అనిన 63
మాట, ఊరీమునున్ను తుమ్మీమునున్ను ధరించుకొనిన
వొక అర్చకుడు లేచేపర్యంతమూ మీరు పరిశుద్ధమైన

64 వస్తువులలోవి భుజించ కూడదని చెప్పెను. । అయితే
సంఘముయొక్క లెక్క అంతా నలభై రెండు వేల
65 మున్నూట అరువై మంది అని వుండెను. । వీరు గాక
వారియొక్క సేవకులున్ను సేవకురాండ్లున్ను యేడు
వేల మున్నూట ముప్పయి యేడు మంది అయి వుండిరి;
మరిన్ని వారిలో గాయకులున్ను గాయకురాండ్లున్ను
66 యిన్నూరు మంది వుండిరి.। వారి గుర్రములు యేళ్నూట
ముప్పయి ఆరున్ను; వారి వేసడములు యిన్నూట
67 నలుభై అయిదున్ను; । వారి వొంటెలు నన్నూట ము
ప్పయి అయిదున్ను; గార్దభములు ఆరువేల యేళ్నూట
68 యిరువైయిన్ని అయి వుండెను. । అయితే పిత్రులలో
కొందరు శ్రేష్ఠులు యెరూశలేములో వుండే యె
హొవా మందిరమునకు వచ్చి, దేవునియొక్క మందిర
మును దాని స్థలములో నిలిపేటందుకు వుచితముగా
69 కానుకలను యిచ్చినారు. । తమ తమ శక్తి ప్రకారము
గా పనిని గురించిన బొక్కసమునకు అరువై వొక్క
వెయ్యి దక్షిణామోనీముల బంగారమునున్ను అయిదు వేల
మానీముల వెండినిన్ని అర్చకుల కొరకు నూరు వస్త్ర
70 ములనున్ను యిచ్చినారు. । అయితే అర్చకులున్ను
లేవీయులున్ను జనులలో కొందరున్ను గాయకులున్ను
ద్వారపాలకులున్ను నెతేనీయులున్ను తమ తమ పట్ట
ణములకు వచ్చి కాపురము చేసిరి; ఇశ్రాయేలీయులంద
రున్ను తమ పట్టణములందు కాపురము చేసిరి.

## 3. అధ్యాయము.

1 అయితే ఇశ్రాయేలు పుత్రులు తమ పట్టణము
లకు వచ్చి వున్న తరువాత యేడో నెల వచ్చినప్పుడు
జనులు యేక మనస్సు కలిగి యెరూశలేముకు కూడి
2 వచ్చినారు. । అప్పుడు యెహొసాదాకు కుమారు
డయిన యేషూవయున్ను అర్చకులయిన అతని సహొ
దరులున్ను షెయల్తీయేలు కుమారుడయిన జెరుబ్బాబె
లున్ను అతని సహొదరులున్ను లేచి, దైవ జనుడైన
మోషేయొక్క న్యాయ ప్రమాణములో వ్రాయబడిన
ప్రకారము ఇశ్రాయేలు దేవునియొక్క బలిపీఠము
మీద హొమార్పణలను అర్పించుటకు దాని కట్టిరి. ।
3 వారు ఆ బలిపీఠమును దాని మట్ల మీద పెట్టిరి, యే
మంటే దేశమందున్న కాపురస్తులవల్ల వారు భయపడిరి;
కాబట్టి దాని మీద వుదయమందున్ను అస్తమానమం
దున్ను హొమార్పణలను యెహొవాకు చెల్లిస్తూ
4 వుండిరి. । మరిన్ని వారు పర్ణశాల పండుగను న్యాయ
లిఖిత ప్రకారముగా ఆచరించి, ప్రతి దినమున్ను
హొమార్పణలను కట్టడ ప్రకారమైన లిఖితము చొ
ప్పున ప్రతి దినముయొక్క సేవకు కావలసినట్టు అర్పిం
5 చిరి. । తరువాత వారు అమావాస్యలకున్ను పరిశుద్ధ
పరచి నిర్ణయించబడిన యెహొవాయొక్క పండు
గలకున్ను కావలసిన నిత్య హొమార్పణలనున్ను యె
వడు స్వేచ్ఛచేత యెహొవాకు స్వేచ్ఛార్పణ చెల్లిం
చుటకు వుండెనో అదిన్ని అర్పించిరి. । యేడో నెల 6
మొదటి దినమునుంచి వారు హొమార్పణలను యె
హొవాకు అర్పించుటకు ఆరంభించిరి. అయితే యె
హొవా మందిరముయొక్క పునాది అప్పటికి యిం
కా వేయబడలేదు. । మరిన్ని వారు కాసె పనివాండ్ల 7
కున్ను వడ్ల వాండ్లకున్ను ద్రవ్యమును యిచ్చిరి; అది
గాక పారసీ దేశపు రాజైన కొరేషు వారికి యిచ్చిన
సెలవు చొప్పున ఆజ్ఞామానులను లెబానోనునుంచి
సముద్రము మీద యొప్పే పట్టణమునకు తెప్పించడా
నకు సీదోనీయులకున్ను తురు వాండ్లకున్ను భోజన
ద్రవ్యమునున్ను పానమునున్ను నూనెనున్ను యిచ్చిరి.।
అయితే యెరూశలేములో వుండే దేవుని యొక్క 8
మందిరమునకు వారు వచ్చిన రెండో సంవత్సరము రెం
డో నెలలో షెయల్తీయేలు కుమారుడైన జెరుబ్బా
బెలున్ను యెహొసాదాకు కుమారుడైన యేషూవ
యున్ను వీరి సహొదరులైన తతిమ్మా అర్చకులున్ను
లేవీయులున్ను చెరలోనుంచి విడుదల పొంది యెరూ
శలేముకు వచ్చిన వారందరున్ను పని ఆరంభించి, యి
రువై సంవత్సరములు మొదలుకొని ఆ పైని యీడు
గల లేవీయులను యెహొవా మందిరముయొక్క పని
గడపడానకు నిర్ణయించిరి. । అప్పుడు యేషూవయు 9
న్ను అతని కుమారులున్ను సహొదరులున్ను కద్మీయే
లున్ను అతని పుత్రులున్ను యూదా పుత్రులున్ను
హేనాదాదు కుమారులున్ను వారి కుమారులున్ను లేవీ
యులైన వారి సహొదరులున్ను లేచి దేవుని మందిర
ములో పనివాండ్ల చేత పని చేయించుటకు నిలిచినా
రు. । అయితే శిల్పి కారులు యెహొవా మందిరము 10
యొక్క పునాది వేసినప్పుడు వస్త్రములను ధరించుకొ
నిన అర్చకులను బాకాలతోనున్ను ఆసాపు కుమారు
లైన లేవీయులను తాళములతోనున్ను ఇశ్రాయేలు
రాజైన దావీదుయొక్క కట్టడ ప్రకారము యెహొ
వాను స్తోత్రము చేయడానకు వారు నిలువ బెట్టిరి. ।
అప్పుడు వీరు వంతు చొప్పున కూడి యెహొవాను 11
గూర్చి స్తోత్ర సంగీతములను పాడినారు, యేమంటే
ఆయన వుత్తముడు, ఆయన కృప ఇశ్రాయేలు విష
యమై సదాకాలము కలిగి వున్నదని పలికిరి. మరిన్ని
యెహొవా మందిరముయొక్క పునాది వేయబడి
నందున జనులందరున్ను ఘనమైన శబ్దముతోటి ధ్వని
చేసి యెహొవాను స్తోత్రము చేసినారు. । అయితే 12
అర్చకులలోనున్ను లేవీయులలోనున్ను పెద్దల శ్రేష్ఠుల
లోనున్ను వృద్ధులైన అనేకులు మునుపటి మందిరమును

చూచిన వారైనందున యిప్పుడు వేయబడిన యీ మం
దిరముయొక్క పునాదిని చూచినప్పుడు గొప్ప శబ్దము
తో యేడ్చిరి; అయితే యింకా అనేకులు సంతోష
13 ముచేత బహుగా ధ్వని చేసిరి. । అయినందున యేది
సంతోష శబ్దమో యేది దుఃఖ శబ్దమో దాని జనులు
తెలుసుకోలేక పోయిరి, యేమంటే జనులు గొప్ప
ధ్వని చేసినందున ఆ శబ్దము బహు దూరము వినపడెను.

## 4. అధ్యాయము.

1 అయితే యూదా బెన్యామీనులయొక్క విరో
ధులు చెర నివారణ అయిన వారు ఇశ్రాయేలు దేవు
డైన యెహోవా కొరకు మందిరమును కట్టుతున్నా
2 రని వినినప్పుడు, । వారు జెరుబ్బాబెలు యొద్దికిన్ని పెద్ద
లలో శ్రేష్ఠుల యొద్దికిన్ని వచ్చి, మేమున్ను మీతో
కలుసుకొని కట్టుతాము, యేమంటే మీరు వెతికినట్టే
మేమున్ను మీ దేవుని వెతుకుతూ వున్నాము; మరిన్ని
యిక్కడికి మమ్మును తప్పించిన అష్షూరు రాజయిన
ఏసహర్ద్దోనుయొక్క దినములనుంచీ మేము ఆయనకు
3 బలులను చెల్లిస్తూ వున్నామని చెప్పిరి. । అయితే జెరు
బ్బాబెలున్ను యేషూవయున్ను ఇశ్రాయేలు పెద్దలలో
తతిమ్మా శ్రేష్ఠులున్ను వారితో అనిన మాట, మీరు
మాతో కలుసుకొని మా దేవుని కొరకు మందిరమును
కట్టుటకు నిమిత్తము లేదు; మేమే కూడుకొని పారసీ
దేశపు రాజయిన కోరేషు మాకు యిచ్చిన ఆజ్ఞప్రకా
రము ఇశ్రాయేలు దేవుడైన యెహోవా కొరకు మం
4 దిరమును కట్టుదుమని చెప్పిరి. । అయితే దేశపు జనులు
యూదా వారి చేతులను బలహీన పరచి, కట్టుతూ
5 వున్న వారిని బాధ పర్చిరి. । మరిన్ని పారసీ దేశపు
రాజయిన కోరేషుయొక్క దినములన్నిటిలోనున్ను
పారసీ దేశపు రాజైన దర్యావెషుయొక్క యేలుబడి
పర్యంతమున్ను వారి వుద్దేశమును భంగపరచుటకు
6 ఆలోచనకాండ్లకు వారు లంచము యిచ్చిరి. । మరిన్ని
అహశ్వేరోషు యేలనారంభించినప్పుడు వారు యూ
దా దేశస్థులను గురించిన్ని యెరూశలేము పట్టణపు
వారిని గురించిన్ని వుత్తరము వ్రాసి వారి మీద
7 తప్పు మోపిరి. । మరిన్ని అర్తహష్షస్తాయొక్క దినముల
లో బిష్లామున్ను మిత్రెదాతున్ను థాబేయేలున్ను
వారి సహవాసులలో కడమ వారున్ను పారసీ దేశపు
రాజయిన అర్తహష్షస్తాకు వుత్తరము వ్రాసి పంపిరి; ఆ
వుత్తరము అరాము భాషచేత వ్రాయబడి అరాము
8 భాషచేతనే తాత్పర్యము చేయ బడినది. । మరిన్ని సభ
యందు శ్రేష్ఠుడైన రెహూమున్ను కరణమైన షిమ్షయి
యున్ను యీ ప్రకారముగా యెరూశలేమును గు
రించి వుత్తరము వ్రాసి రాజయిన అర్తహష్షస్తా యొ
ద్దికి పంపిరి. । అంతట సభ యందు శ్రేష్ఠుడయిన రె 9
హూమున్ను కరణమైన షిమ్షయియున్ను వారి సహ
వాసులలో కడమ వారైన దీనాయీయులున్ను అఫ
ర్సత్కాయ్యులున్ను తర్పేలీయులున్ను అఫర్స
య్యులున్ను అర్కేవీయులున్ను బబెలీయులున్ను సూ
సంఖీయులున్ను దెహావీయులున్ను ఏలమీయులున్ను, ।
ఘనుడైనటువంటిన్ని అతిశయపరుడయినటువంటిన్ని 10
అస్నప్పరు యివతలకు తెప్పించి షోమ్రోను పట్టణ
ములందు వుంచిన తతిమ్మా జనాంగములున్ను నది
యివతల వున్న తతిమ్మా వాండ్లున్ను ఫలాన కాల
మందు వ్రాసినారు. । వీరు రాజయిన అర్తహష్షస్తాకు 11
వ్రాసి పంపించిన వుత్తరపు ప్రతి యిదే, నది యివతల
వున్న మీ సేవకులమైన మేము ఫలాని కాలమందు
రాజయిన మీకు తెలియ చేసేదేమంటే, । మీయొద్ద 12
నుంచి మాయొద్దికి వచ్చిన యూదైయులు యెరూశలే
ముకు వచ్చి ఆ తిరుగుబాటు చేసిన చెడ్డ పట్టణమును
కట్టుతూ వున్నారు; వారు దాని ప్రాకారములను
నిలిపి దాని పునాదులను కూర్చి వున్నారు. । కాబట్టి 13
రాజయిన మీకు తెలియబడ వలసినదేమంటే, యీ
పట్టణము కట్టబడి దాని ప్రాకారములు నిలువబడి
నట్టయితే అప్పుడు వారు సిస్తు అయినా సుంకమైనా
పన్ను అయినా యివ్వకుండా వుందురు; అప్పుడు
రాజులయొక్క పైకము మీవల్ల నష్టమవును. । అయితే 14
మేము రాజు నగరివల్ల జీవనోపాధి పొందుతూ వున్నం
దుననున్ను రాజుకు వచ్చే అఘనతను మేము చూడకూ
డనందుననున్ను మేము పంపి రాజైన మీకు తెలియ
చేస్తిమి. । మరిన్ని మీ పితృలయొక్క సమాచారముల 15
గ్రంథమందు చూస్తే యీ పట్టణము తిరుగుబాటు చేసే
పట్టణమనిన్ని రాజులకున్ను దేశములకున్ను హానిచేసే
దనిన్ని అందులో వున్న వారు కలహమును పుట్టించే
వారినిన్ని అందువల్ల ఆ పట్టణము నాశనము పొందె
ననిన్ని సమాచారముల గ్రంథమందు చూస్తే యిది
మీకు తెలిసే వుండును. । కాబట్టి రాజైన మీకు మేము 16
రూఢిపర్చేదేమంటే, యీ పట్టణము కట్టబడి దాని
ప్రాకారములు నిలువపెట్టబడినట్టయితే యిందువల్ల
నది యివతల మీకు భాగము యెంతమాత్రమూ లేక
పోవునని వ్రాసిరి. । అప్పుడు రాజు సభలో శ్రేష్ఠు 17
డైన రెహూముకున్ను కరణమైన షిమ్షయికిన్ని షోమ్రో
నులో నివసించే వారి సహవాసులైన తతిమ్మా వారికిన్ని
నది అవతల వుండే తతిమ్మా వారికిన్ని ప్రత్యుత్తరము
పంపినదేమంటే, మీకు క్షేమము కలిగి వుండును గాక; ।
ఫలాని కాలమందు మీరు మాకు పంపిన వుత్తరము 18
స్పష్టముగా చదివించుకొన్నాము. । అందుకు మేము 19
ఆజ్ఞాపించి వెతికించినందున ఆదినుంచి ఆ పట్టణము

రాజుల మీదికి విరోధముగా లేచి కలహమునున్ను
తిరుగుబాటునున్ను చేయించేదని మాకు అగుపడెను. ।
20 మరిన్ని యెరూశలేము పట్టణమందు బలమయిన రా
జులు కలిగి వుండిరి; వీరు నది అవతల దేశములన్నిటినీ
యేలినందున వీరికి సిస్తున్ను సుంకమున్ను పన్నున్ను
21 యివ్వడము కలిగి వుండెను. । కాబట్టి యిప్పుడు మను
ష్యులు ఆ పని మాని మేము సెలవు యిచ్చే పర్యంత
మూ ఆ పట్టణము కట్టకుండా వుండవలెనని ఆజ్ఞాపిం
22 చండి. । యిది తప్పకుండా చేసుటకు మీరు జాగ్రత
పడండి; రాజుల కీడు కొరకు హాని పెరుగుట యేల
23 అని వ్రాసి పంపించెను. । అయితే రాజైన అర్తహషస్తా
పంపించిన వుత్తరముయొక్క ప్రతి రెహూముకున్ను
షిమ్షయికిన్ని వీరి సహవాసులకున్ను వినిపించబడిన
ప్పుడు వారు త్వరచేసి యెరూశలేములో వున్న యూదై
యుల యొద్దికి వచ్చి బలవంతము చేతనున్ను అధికారము
24 చేతనున్ను వారి పని మాన్పించిరి. । అప్పుడు యెరూశ
లేములోనుండే దేవునియొక్క మందిరపు పని మానివే
యబడెను. యీలాగున పారసీ దేశపు రాజయిన
దర్యావెషు యేలుబడియొక్క రెండో సంవత్సరము
పర్యంతమూ అది మాని వేయబడి యుండెను.

## 5. అధ్యాయము.

1 అప్పుడు దీర్ఘదర్శులయిన హగ్గయియున్ను ఇద్దో
కుమారుడైన జెఖర్యాయున్ను యూదా దేశమందున్ను
యెరూశలేము యందున్ను వున్న యూదైయులతో
ఇశ్రాయేలు దేవుడైన యెహోవా నామమున వారి
2 తో దీర్ఘదర్శిత్వమును పలికినారు. । అప్పుడు షెయ
ల్తీయేలు కుమారుడైన జెరుబ్బాబెలున్ను యెహోసా
దాకు కుమారుడైన యేషూవయున్ను లేచి, యెరూశ
లేములో వుండే దేవునియొక్క మందిరమును కట్ట
నారంభించిరి; మరిన్ని దేవునియొక్క దీర్ఘదర్శులు
3 వారితో వుండి సహాయము చేస్తూ వుండిరి. । అంతట
నది యివతలకు అధికారియయిన తత్తెనైయున్ను షెత
బోజ్నయియున్ను వీరియొక్క సహవాసులున్ను వారి
యొద్దికి వచ్చి యీ మందిరము కట్టడానకున్ను
యీ ప్రాకారము నిలువడానకున్ను యెవరు మీకు
4 సెలవు యిచ్చినారని వారిని అడిగినప్పుడు, । మేము
యీ ప్రకారముగా ప్రత్యుత్తరము చెప్పినాము;
మరిన్ని యీ కట్టుట పని చేయించిన వారి పేరులు
5 యేమని అడిగిరి. । అయితే వారి దేవునియొక్క నేత్ర
దృష్టి యూదైయుల పెద్దల మీద వుండినందున యీ
సంగతి దర్యావెషు యెదుటికి వచ్చే పర్యంతమూ వీరు
వారిని పని మాన్పించలేక పోయిరి; అప్పుడు వారు
యీ సంగతిని గురించి వుత్తరము ద్వారా ప్రత్యుత్తరము
పంపించిరి. । అయితే నది యివతలి అధికారియైన తత్తె 6
నైయున్ను షెతబోజ్నయియున్ను నది యివతల
వుండే వారి సహవాసులైన అఫర్సెఖాయ్యులున్ను
రాజైన దర్యావెషుకు పంపిన వుత్తరముయొక్క ప్రతి
యేదంటే, । రాజయిన దర్యావెషుకు సకల క్షేమము 7
కలుగును గాక. । రాజయిన మీకు తెలియవలసిన 8
దేమంటే, మేము యూదా ఖండములోకి వెళ్లినాము;
అక్కడ గొప్ప దేవునియొక్క మందిరము వున్నది;
అది గొప్ప రాళ్లచేతను కట్టబడినది; దాని గోడలలో
మానులు వేయబడినవి; మరిన్ని యీ పని త్వరగా జరు
గుతూ వారి చేతులలో వృద్ధి పొందుతూ వున్నది. ।
అప్పుడు మేము అక్కడ వున్న పెద్దలను చూచి, యీ 9
మందిరము కట్టడానకున్ను యీ ప్రాకారములను నిలు
పడానకున్ను యెవరు మీకు సెలవు యిచ్చిరని అడిగి
నాము. । మరిన్ని వారిలో అధికారులైన వారి పేరులు 10
వ్రాసి మీకు తెలిపే కొరకు వారి పేరులను అడిగి
నాము. । అందుకు వారు ప్రత్యుత్తర మిచ్చినదేమంటే, 11
మేము ఆకాశమునకున్ను భూమికిన్ని దేవునియొక్క
సేవకులమై, అనేక సంవత్సరముల కిందట ఇశ్రాయే
లులో వొక గొప్ప రాజు కట్టించి నిలిపిన మందిరమును
కట్టుతూ వున్నాము. । అయితే మా పితృలు ఆకాశము 12
యొక్క దేవునికి కోపము పుట్టించినందున ఆయన వా
రిని కల్దీయుడైన నెబూఖద్నెస్సరనే బాబెలు రాజు
చేతికి అప్పగించెను; అప్పుడు అతడు యీ మందిర
మును నాశనము చేసి జనులను బాబెలు దేశములోకి
తీసుక పోయెను. । అయితే బాబెలు రాజయిన కోరేషు 13
యేలుబడియొక్క మొదటి సంవత్సరమందు ఆ రాజ
యిన కోరేషు దేవునియొక్క మందిరమును తిరిగీ కట్టిం
చడానకు నిర్ణయము చేసెను. । మరిన్ని నెబూఖద్నె 14
స్సరు యెరూశలేమందున్న మందిరములోనుంచి తీసి,
బాబెలు పట్టణమందున్న ఆలయములోకి కొంచు
వచ్చిన దేవుని మందిరపు వెండి బంగారపు వస్తువులను
రాజైన కోరేషు బాబెలు పట్టణపు మందిరములోనుంచి
బైటికి తెప్పించి, తాను అధికారిగా చేసిన షేష్బ
స్సరనే పేరు గల అతనికి వాటిని అప్పగించి, । నీవు 15
యీ వస్తువులను తీసుకొని, యెరూశలేము పట్టణమం
దుండే మందిరమునకు వెళ్లి, దేవునియొక్క మందిర
మును దాని స్థలమందు కట్టించుమన్న సెలవు అతనికి
యిచ్చెను. । కాబట్టి ఆ షేష్బస్సరు వచ్చి యెరూశలే 16
ములో వుండే దేవుని మందిరముయొక్క పునాది వేయిం
చెను; అప్పటినుంచి నేటివరకు అది కట్టబడుతూ వున్న
ప్పటికిన్ని యింకా సమాప్తి కాకుండా వున్నదని
చెప్పిరి. । కాబట్టి రాజయిన మీకు అనుకూలమైతే 17
బాబెలు పట్టణమందున్న రాజుయొక్క పదార్థపు

యిల్లును వెతికించి, యెరూశలేములో వుండే దేవుని
మందిరమును కట్టడానకు రాజైన కోరేషు వల్ల నిర్ణ
యము అయినదో లేదో అది తెలుసుకొని, రాజైన
మీరు ఆజ్ఞ పంపి యీ సంగతిని గురించి మీయొక్క
చిత్తము మాకు తెలియ చేయ వలసినదన్నట్టుగా వుత్త
రము వ్రాసి పంపిరి.

## 6. అధ్యాయము.

1 అప్పుడు రాజయిన దర్యావెషు ఆజ్ఞ యిచ్చినం
దున బాబెలులో పదార్థములు వుంచబడిన పుస్త
2 కపు గృహము వెతికినప్పుడు, । మాదీయుల ఖండమం
దున్న అహ్మెతాలో వొక పుస్తకము దొరికెను; దానిలో
3 వ్రాయబడినదేమంటే, । రాజైన కోరేషు యేలుబడియొ
క్క మొదటి సంవత్సరమందు ఆ రాజయిన కోరేషు
యెరూశలేములో వుండే దేవునియొక్క మందిరమును
గురించి చేసిన నిర్ణయము యిదే, వారు బలులు
అర్పించిన స్థలమైన మందిరము కట్టించ బడవలెను;
దాని పునాదులు గట్టిగా వేయబడవలెను; దాని నిడివి
అరువై మూరలున్ను దాని వెడల్పు అరువై మూరలు
4 న్ను వుండవలెను. । మూడు వరసలు గొప్ప రాళ్ల చేత
నున్ను వొక వరస కొత్త మానుల చేతనున్ను కట్టించ
బడవలెను; దాని వ్రయమునకు రాజుయొక్క మందిర
5 ములోనుంచి యివ్వబడవలెను. । మరిన్ని యెరూశలే
ములో వున్న ఆలయములోనుంచి నెబూఖద్నెస్సరు
బాబెలుకు తీసుకొని వచ్చిన దేవుని మందిరముయొక్క
వెండి బంగారపు వస్తువులు తిరిగీ యివ్వబడి, యెరూ
శలేములో వున్న మందిరముకు తేబడి దేవునియొక్క
మందిరములో వాటి వాటి స్థలమందు పెట్ట బడవలె
నని వ్రాయ బడినందున, రాజయిన దర్యావెషు ఆజ్ఞా
6 పించినదేమంటే, । నది అవతల వున్న అధికారి అయిన
వొూ తత్తెనై నీవున్ను, షెతర్బోజ్నయీ అనే నీవు
న్ను, నది అవతల వున్న మీయొక్క సహవాసులయిన
అఫర్సెఖాయ్యులున్ను ఆ స్థలమునకు దూరముగా
7 వుండి, । దేవునియొక్క యీ మందిరపు పని గడపని
య్యండి; యూదైయులయొక్క అధికారినిన్ని యూ
దైయులయొక్క పెద్దలనున్ను దేవునియొక్క యీ
8 మందిరమును దాని స్థలమందు కట్టించనివ్వండి.। మరిన్ని
దేవునియొక్క మందిరమును కట్టించే కొరకు యూ
దైయులయొక్క పెద్దలకు మీరు చేయవలసిన సహాయ
మును గురించి మేము నిర్ణయము చేస్తిమి; అది యేలా
గంటే రాజుయొక్క సొమ్ములోది అనగా నది అవతల
నుంచి వచ్చిన పన్నులోది ఆ మనుష్యుల పని నిమిత్తము
యే అడ్డమైనా రాకుండా వారి వ్రయమునకు యివ్వ
9 బడవలసినది. । మరిన్ని ఆకాశముయొక్క దేవుని హో
మార్పణల నిమిత్తము వారికి కావలసినది అనగా కోడె
లైనా గొర్రె పొట్టేళ్లు అయినా గొర్రె పిల్లలైనా గో
ధుమలైనా వుప్పయినా ద్రాక్షారసమైనా నూనెయైనా
వీటిని ప్రతి దినమున్ను తప్పకుండా, । యెరూశలేము 10
లో వున్న అర్చకులయొక్క నిర్ణయము చొప్పున
వారు ఆకాశముయొక్క దేవునికి సువాసనైన అర్పణ
లను అర్పించి, రాజుయొక్క జీవము కొరకున్ను అతని
కుమారులయొక్క జీవము కొరకున్ను ప్రార్థన చేసే
ట్టుగా వారికి యివ్వబడవలసినది. । యింకా మేము 11
చేసిన నిర్ణయము యేమంటే, యెవడైనా యీ ఆజ్ఞను
తప్పితే వాని యింటిలోనుంచి మాను తీయబడి, అది
యెత్తబడి, దాని మీద వాడు వురి తీయించబడును
గాక; ఆ తప్పు నిమిత్తము వాని యిల్లు పెంటరాశి
చేయబడును గాక. । మరిన్ని యే రాజులైనా యే జను 12
లైనా యెరూశలేములో వున్న దేవునియొక్క మందిర
మును నశింప చేయడానకైనా మార్చడానకయినా
తమ చెయ్యి చాపినట్టయితే అక్కడ తన నామమును
వుంచిన దేవుడు వారిని నశింపచేసును గాక. దర్యా
వెషు అనే మేమే యీ ఆజ్ఞ యిస్తిమి, అది అతి వేగ
ముగా చేయబడును గాక అని వ్రాయించి పంపెను.।
అప్పుడు నది యివతల అధికారి అయిన తత్తెనైయున్ను 13
షెతర్బోజ్నయియున్ను వారి సహవాసులున్ను వేగ
ముగా రాజు అయిన దర్యావెషు యిచ్చిన ఆజ్ఞ చొ
ప్పున చేసినారు. । అయినందున యూదైయుల పెద్దలు 14
కట్టించుతూ దీర్ఘదర్శియైన హగ్గయిన్ని ఇద్దో
కుమారుడైన జెఖర్యాయున్ను దీర్ఘదర్శనమును పలి
కినందుచేత పని బాగా గడిపినారు; యీలాగున వారు
కట్టించి, ఇశ్రాయేలు దేవుని ఆజ్ఞ చొప్పుననున్ను కో
రేషు దర్యావెషు అర్తహ్షస్తా అనే పారసీ దేశపు
రాజుల ఆజ్ఞ చొప్పుననున్ను ఆ పని సమాప్తి పర్చిరి.।
రాజైన దర్యావెషు యేలుబడియొక్క ఆరో సంవత్స 15
రము అదారనే నెలయొక్క మూడో దినము సరికి యీ
మందిరము సమాప్తిచేయబడినది. । అప్పుడు ఇశ్రా 16
యేలుయొక్క పుత్రులున్ను అర్చకులున్ను లేవీ
యులున్ను చెర నివారణయైన తతిమ్మా వారున్ను
దేవునియొక్క యీ మందిరమును ఆనందముతో సం
ప్రోక్షణ చేసిరి. । దేవునియొక్క మందిరము సంప్రో 17
క్షణ చేయడానకు నూరు యెడ్లనున్ను యిన్నూరు పొ
ట్టేళ్లనున్ను నన్నూరు గొర్రెపిల్లలనున్ను ఇశ్రాయేలీ
యులందరికిన్ని పాపపరిహారపు బలులుగా ఇశ్రా
యేలుయొక్క గోత్రముల లెక్క చొప్పున పండ్రెండు
మేకపోతులనున్ను చెల్లించిరి. । మరిన్ని యెరూశలేము 18
లో వున్న దేవునియొక్క సేవ కొరకు మోషేయొక్క
గ్రంథపు లిఖిత ప్రకారముగా వారు అర్చకులను

వారి వారి భాగముల చొప్పుననున్ను లేవీయులను
వారి వారి వరసల చొప్పుననున్ను నిర్ణయించిరి. ।
19 అయితే చెర నివారణమైన వారు పస్కా పండుగను
20 మొదటి నెల పధ్నాలుగో దినమున ఆచరించిరి. । యే
మంటే అర్చకులున్ను లేవీయులున్ను కూడా శుచి
భూతులై అందరున్ను పరిశుద్ధులై చెర నివారణమైన
వారందరి కొరకున్ను వారి సహోదరులైన అర్చకుల
కొరకున్ను తమ కొరకున్ను పస్కా బలిని వేట వేసిరి. ।
21 కాబట్టి చెర నివారణమై తిరిగీ వచ్చిన ఇశ్రాయేలు
పుత్రులున్ను ఇశ్రాయేలు దేవుడైన యెహోవాను
వెతక గలందులకు దేశమందుండే అన్య జనాంగముల
యొక్క అపవిత్రతలోనుంచి తమ్మును కేటాయించు
కొనిన వారందరున్ను వచ్చి తిని పులుసులేని రొట్టె
పండుగను యేడు దినములు సంభ్రమముగా ఆచరిం
22 చిరి. । యేమంటే యెహోవా అష్షూరు రాజుయొక్క
హృదయమును ఇశ్రాయేలుయొక్క దేవుని మందిరపు
పనిమీద వారి చేతులను బలముగా చేయడానకు వారి
తట్టు తిప్పి వారిని సంతోషింపచేసెను.

## 7. అధ్యాయము.

1 ఈ సంగతులైన తరువాత పారసీ దేశపు రాజైన
అర్తహ్షస్తాయొక్క యేలుబడిలో ఎజ్రా బాబెలు
దేశమునుంచి యెరూశలేము పట్టణమునకు వచ్చెను:
యితడు శెరాయా కుమారుడై వుండెను, శెరాయా
అజర్యా కుమారుడు, అజర్యా హిల్కీయా కుమారుడు, ।
2 హిల్కీయా షల్లూము కుమారుడు, షల్లూము సాదోకు
3 కుమారుడు, సాదోకు అహీథూబు కుమారుడు, । అహీ
థూబు అమర్యా కుమారుడు, అమర్యా అజర్యా కుమా
4 రుడు, అజర్యా మెరాయోతు కుమారుడు, । మెరా
యోతు జెరహ్యా కుమారుడు, జెరహ్యా ఉజ్జీ కుమారుడు,
5 ఉజ్జీ బుక్కీ కుమారుడు, । బుక్కీ అబీషూవ కుమారుడు,
అబీషూవ పీనెహాసు కుమారుడు, పీనెహాసు ఎలాజారు
కుమారుడు, ఎలాజారు ప్రధానాచర్యకుడైన అహరోను
6 కుమారుడై వుండెను. । యీ ఎజ్రా ఇశ్రాయేలు దేవు
డైన యెహోవా అప్పగించిన మోషేయొక్క న్యాయ
ప్రమాణమందు ప్రవీణత గల వుపదేశకుడై వుండెను;
మరిన్ని అతని దేవుడైన యెహోవాయొక్క హస్తము
అతనికి తోడుగా వున్నందువల్ల రాజు అతని మనవి
7 ప్రకారము అంతా జరిగించెను. । మరిన్ని రాజైన అర్త
హ్షస్తా యేలుబడియొక్క యేడో సంవత్సరమందు ఇశ్రా
యేలు పుత్రులు కొందరున్ను అర్చకులు కొందరున్ను
లేవీయులున్ను గాయకులున్ను ద్వారపాలకులున్ను
నెతేనీయులున్ను యెక్కి యెరూశలేము పట్టణమునకు
8 వచ్చినారు. । అయితే అతడు రాజు యేలుబడియొక్క
యేడో సంవత్సరము అయిదో మాసమందు యెరూశ
లేముకు వచ్చెను. । యేమంటే మొదటి నెల మొదటి 9
దినమందు అతడు బాబెలు దేశమునుంచి తర్లి, తన
దేవుని హస్తము తనకు తోడుగా వున్నందున అయిదో
నెల మొదటి దినమందు యెరూశలేముకు చేరెను. ।
యేమంటే ఎజ్రా యెహోవాయొక్క న్యాయ ప్రమా 10
ణమును వెతికి దాని చొప్పున చేసి, ఇశ్రాయేలీయు
లకు కట్టడలనున్ను ఆజ్ఞలనున్ను నేర్పుటకు తన హృద
యమును సర్వసిద్ధమును చేసెను. । అయితే ఇశ్రాయేలీ 11
యులకు యెహోవా యిచ్చిన ఆజ్ఞలున్ను కట్టడలున్ను
వీటియొక్క మాటలయందు లేఖికుడున్ను అర్చకుడు
న్ను అయిన ఎజ్రాకు రాజైన అర్తహ్షస్తా యిచ్చిన
వుత్తరముయొక్క ప్రతి యేమంటే, । రా రాజైన అర్త 12
హ్షస్తా ఆకాశముయొక్క దేవుని న్యాయ ప్రమాణ
మందు లేఖికుడున్ను అర్చకుడున్ను అయిన ఎజ్రాకు
సకల క్షేమములు కలుగును గాక, ఫలాని కాలమందు
మా చేత చేయబడిన నిర్ణయ మేమంటే, । నీ వశమం 13
దున్న నీ దేవునియొక్క న్యాయ ప్రమాణము చొప్పున
యూదాను గురించిన్ని యెరూశలేమును గురించిన్ని
విమర్శ చేయడానకు నీవు రాజువల్లనున్ను అతని ఆలో
చన కర్తల యేడుగురి వల్లనున్ను పంపబడితివి గనుక
మేము చేసిన నిర్ణయము యేమంటే, । మా రాజ్య 14
మందుండే ఇశ్రాయేలీయులలోనున్న వారి అర్చకు
లలోనున్ను లేవీయులలోనున్ను యెరూశలేము పట్ట
ణమునకు వెళ్లుటకు తాత్పర్యము గల వారెవరో వారు
నీతో కూడా వెళ్ల వలసినది. । మరిన్ని యెరూశలేము 15
లో నివాసము గల ఇశ్రాయేలుయొక్క దేవునికి రాజు
న్ను అతనియొక్క ఆలోచన కర్తలున్ను స్వేచ్ఛచేత
చెల్లించిన వెండినిన్ని బంగారమునున్ను నీవు పట్టుకొని
పోవలెను. । మరిన్ని బాబెలు ఖండమంతటియందూ నీకు 16
దొరికే వెండి అంతానున్ను బంగారమంతానున్ను జను
లున్ను అర్చకులున్ను యెరూశలేములో వున్న వారి
దేవునియొక్క మందిరము కొరకు స్వేచ్ఛగా చెల్లించిన
స్వేచ్ఛార్పణలతోను నీవు తీసుకొని పోవలెను. । ఆ 17
ద్రవ్యముచేత నీవు యెడ్లనున్ను పొట్టేళ్లనున్ను గొర్రె
పిల్లలనున్ను వాటితో కూడా వుండవలసిన భోజనా
ర్పణలనున్ను పానార్పణలనున్ను ఆలస్యము చేయ
కుండా కొని యెరూశలేము యందుండే మీ దేవుని
మందిరముయొక్క బలిపీఠము మీద వాటిని అర్పిం
తువు గాక. । మిగిలే వెండి బంగారములచేత నీకున్ను 18
నీ సహోదరులకున్ను యేది అనుకూలమో అది మీ
దేవునియొక్క చిత్త ప్రకారము మీరు చేయ వచ్చును. ।
మరిన్ని నీ దేవునియొక్క మందిరపు సేవ కొరకు నీకు 19
యివ్వ బడిన పాత్రలను నీవు యెరూశలేముయొక్క

20 దేవుని యెదుట అప్పగించవలసినది. ၊ మరిన్ని నీ దేవుని
యొక్క మందిరమునకు యివ్వడానకు మరి యేదైనా
నీకు కావలసి వుంటే అది రాజుయొక్క పదార్థపు
21 యింట్లోనుంచి నీవు పుచ్చుకొని యివ్వవలసినది. ၊ మరి
న్ని రాజునైన అర్తహషస్తా అనే మేమే నది అవతల
వున్న పదార్థపు కారకులైన మీకు యిచ్చే ఆజ్ఞ
యేమంటే, ఆకాశముయొక్క దేవుని న్యాయ ప్రమా
ణమందు లేఖికుడున్ను అర్చకుడున్ను అయిన ఎజ్రా
మిమ్మును యేదైనా అడిగినట్టయితే అది ఆలస్యము
22 కాకుండా చేయబడ వలసినది. ၊ నూరు వెండి తలాం
తుల మట్టుకున్ను నూరు కోరల గోధుమ గింజల మట్టు
కున్ను నూరు బాథుల ద్రాక్షారసము మట్టుకున్ను నూరు
బాథుల నూనె మట్టుకున్ను లెక్కలేకుండా వుప్పున్ను
23 యివ్వబడ వలసినది. ၊ ఆకాశముయొక్క దేవునిచేత
యేది నిర్ణయమాయెనో అది ఆకాశముయొక్క
దేవుని మందిరము కొరకు జాగ్రతగా చేయించబడ
వలసినది; రాజుయొక్క రాజ్యము మీదనున్ను అతని
యొక్క కుమారుల మీదనున్ను కోపము యెందుకు
24 రావలెను. ၊ మరిన్ని అర్చకులున్ను లేవీయులున్ను గా
యకులున్ను ద్వార పాలకులున్ను నెతేనీయులున్ను
దేవునియొక్క యీ మందిరపు వ్యాపారకులున్ను
అయిన వీరందరిని గురించి మీకు మా నిర్ణయ మేమం
టే, వారికి సిస్తు అయినా సుంకమైనా పన్ను అయి
నా కట్టడము న్యాయము కాదని తెలుసుకోండి. ၊
25 అయితే వో ఎజ్రా, నీ దేవుడు నీకు దయచేసిన జ్ఞా
నము చొప్పున నీవు నీ దేవునియొక్క న్యాయములను
యెరిగినటువంటి వారిలో కొందరిని అధికారులగా
నున్ను న్యాయాధిపతులగానున్ను నది అవతల వున్న
జనులకు న్యాయము తీర్చేటట్టు వుంచవలెను; యిందులో
యెవరు తెలియనివారో వారికి నీవు నేర్ప వలసినది. ၊
26 మరిన్ని నీ దేవునియొక్క న్యాయమునైనా రాజుయొ
క్క న్యాయమునయినా గైకొనక వుండే వాడెవడో
వానికి న్యాయపు తీర్పు త్వరగా నిర్ణయించబ
డవలెను, యేమంటే మరణమునకైనా స్వదేశ త్యాగ
మునకైనా ఆస్తి జప్తికైనా ఖైదుకైనా నిర్ణయించ
27 బడవలెను అని వ్రాయబడి వుండెను. ၊ యెరూశలే
ములో వుండే యెహోవా మందిరమును అలంకరిం
చడానకు రాజుయొక్క హృదయమందు తాత్పర్యము
పుట్టించినటువంటిన్ని రాజు యెదుటనున్ను అతని
ఆలోచన కర్తల యెదుటనున్ను రాజుయొక్క బలముగల
అధిపతుల యెదుటనున్ను నాకు దయ చూపించినటు
వంటిన్ని మన పితృల దేవుడైన యెహోవాకు స్తోత్ర
28 ము కలుగునుగాక. ၊ నా దేవుడైన యెహోవాయొక్క
హస్తము నాకు తోడుగా వున్నందువల్ల నేను బలపరచ
బడి, నాతో కూడా రావడానకు ఇశ్రాయేలులో
శ్రేష్ఠులను కూర్చుకొంటిని.

## 8. అధ్యాయము.

అయితే రాజైన అర్తహషస్తా యేలుబడియొక్క 1
కాలమందు బాబెలు దేశములోనుంచి నాతో కూడా
యెక్క వచ్చిన వారి పితృల ప్రధానులున్ను వారి
వంశావళిన్ని యేలాగునంటే, ၊ పీనెహాసు పుత్రుల 2
లో గేర్షోమున్ను, ఈతామారు పుత్రులలో దాని
యేలున్ను, దావీదు పుత్రులలో హట్టూషున్ను. ၊ షెఖ 3
న్యా పుత్రులలోనున్ను ఫరోషు పుత్రులలోనున్ను
జెఖర్యా అనే వీనితోను నూట యేభై మంది పురుషుల
వంశావళి చొప్పున యేభయి మంది లెక్కించబడిరి. ၊
మరిన్ని పహత్మోయాబు పుత్రులలో జెరహ్యా కుమారు 4
డయిన ఎల్యోయెనై అనే వీనితోను యిన్నూరు మంది
పురుషులు వుండిరి. ၊ షెఖన్యా పుత్రులలో యహజీ 5
యేలు కుమారుడైన వానితో మున్నూరు మంది పురు
షులు వుండిరి. ၊ ఆదీను పుత్రులలో యోనాతాను కుమా 6
రుడైన ఏబెదు అనే వానితోను యేభయి మంది పురు
షులు వుండిరి. ၊ ఏలాము పుత్రులలో అతల్యా కుమా 7
రుడయిన యెషయ్యా అనే వానితోను డెబ్బయిమంది
పురుషులు వుండిరి. ၊ షెఫట్యా పుత్రులలో మిఖా 8
యేలు కుమారుడయిన జెబద్యా అనే వానితోను యె
నభయి మంది పురుషులు వుండిరి. ၊ యోవాబుయొక్క 9
పుత్రులలో యెహీయేలు కుమారుడైన ఓబద్యా అనే
వానితోను యిన్నూట పద్దెనిమిది మంది పురుషులు
వుండిరి. ၊ షెలోమీతు పుత్రులలో యోసిఫ్యా కుమా 10
రుడయిన వానితోను నూట అరువై మంది పురుషులు
వుండిరి. ၊ బేబై పుత్రులలో బేబై కుమారుడైన జెఖర్యా 11
అనే వానితోను యిరువై యెనమండ్రుగురు పురుషు
లు వుండిరి. ၊ అజ్గాదు పుత్రులలో హక్కాతాను కుమా 12
రుడైన యోహానాను అనే వానితో నూట పది మంది
పురుషులు వుండిరి. ၊ మరిన్ని అదోనీకాముయొక్క కడ 13
వరి కుమారులలో ఎలీఫెలెతు యహీయేలు షెమయా
అనే పేరులు గల వీరితోను అరువై మంది పురుషులు
వుండిరి. ၊ బిగ్వై పుత్రులలో ఊతైయున్ను జబ్బూ 14
దున్ను అనే వారితోను డెబ్బయి మంది పురుషులు
వుండిరి. ၊ వీరిని నేను అహవాకు పారే నది యొద్దికి 15
కూర్చినాను; అక్కడ మేము మూడు దినములు డేరా
లలో వుంటూ వుండగా నేను జనులనున్ను అర్చకుల
నున్ను చూచినప్పుడు లేవీ పుత్రులలో వొకడయినా
నాకు కనపడ లేదు. ၊ అప్పుడు నేను ప్రధానులైన ఎలీ 16
యెజెరునున్ను అరీయేలునున్ను షెమయానున్ను ఎల్నా
తానునున్ను యారీబునున్ను ఎల్నాతానునున్ను నాతా

నునున్ను జెఖర్యానున్ను మెషుల్లామునున్ను మరిన్ని
తెలివి గల పురుషులైన యోయారీబునున్ను ఎల్నాతా
17 నునున్ను పిలువనంపించితిని. । అప్పుడు నేను కాసిఫ్యా
అనే స్థలమందుండే అధికారియైన ఇద్దో యొద్దికి ఆజ్ఞ
తోటి వారిని పంపినాను; మరిన్ని వీరు మా దేవుని
యొక్క మందిరము కొరకు వ్యాపారకులను మా యొ
ద్దికి తీసుక వచ్చేటట్టుగా కాసిఫ్యా అనే స్థలమందుండే
ఇద్దోతోనున్ను అతని సహోదరులయిన నెతేనీయుల
తోనున్ను చెప్ప వలసిన మాటలను వారితో తెలియ
18 చెప్పినాను. । అప్పుడు మన దేవునియొక్క వుత్తమ హస్త
ము మాకు తోడుగా వున్నందువల్ల వారు ప్రజ్ఞావంతు
డైన షేరేబ్యాను అతని కుమారులున్ను సహోదరు
లున్ను పద్ధెనమండ్రుతో కూడా తీసుకొని వచ్చిరి;
వాడు మహ్లీ కుమారులలో వొకడు; యీ మహ్లీ ఇశ్రా
యేలుకు పుట్టిన లేవీయొక్క కుమారుడై వుండెను. ।
19 మరిన్ని హషబ్యానున్ను అతనితో కూడా మెరారీ
పుత్రులలోనున్ను యెషయానున్ను అతని సహోద
రులున్ను వారి కుమారులున్ను అయిన యిరువై మంది
20 తో కూడా తీసుకొని వచ్చిరి. । మరిన్ని దావీదున్ను
అధిపతులున్ను లేవీయుల పని కొరకు నిర్ణయించిన
నెతేనీయులలో యిన్నూట యిరువై మంది వుండిరి;
21 వీరందరున్ను పేరుల వివరముగా చెప్పబడిరి. । అప్పుడు
దేవుని సముఖమందు మమ్మును మేము శ్రమపర్చు
కొని, మా కొరకున్ను మా చిన్నవాండ్ల కొరకున్ను మా
ఆస్తి కొరకున్ను ఆయన యొద్ద శుభ ప్రయాణమును
వెతికేటట్టుగా అహవా నది దగ్గిర వుపవాసమును
22 చేయుమని చాటింపించినాను. । యేమంటే మా దేవుని
హస్తము మేలు కొరకై ఆయనను వెతికిన వారందరికి
తోడుగా వుండును; అయితే ఆయన బలమున్ను ఆయన
వుగ్రమున్ను ఆయనను విడిచిపెట్టిన వారందరికిన్ని
విరోధముగా వుండునని మేము రాజుతో పలికి వుం
టిమి గనుక మార్గమందున్న శత్రువుల విషయమై
మాకు సహాయము చేసే కొరకు రాజు యొద్ద కాలి
బలమునున్ను రౌతులనున్ను అడుగడానకు నాకు సిగ్గు
23 కలిగెను. । కాబట్టి మేము వుపవాసము చేసి అందు
నిమిత్తము మా దేవుని వేడుకొన్నప్పుడు ఆయన మమ్మును
24 అంగీకరించెను. । అప్పుడు నేను అర్చకులలోనుంచి
ప్రధానులైన పండ్రెండు మందిని అనగా షేరేబ్యా
నున్ను హషబ్యానున్ను వీరి సహోదరులలో పది మం
25 దినిన్ని వేరుగా వుంచి, । మన దేవునియొక్క మందిరము
కొరకు చెల్లించడానకు రాజున్ను అతని ఆలోచన కర్త
లున్ను అధిపతులున్ను అక్కడ వున్న ఇశ్రాయేలీయు
లందరున్ను యిచ్చిన వెండిన్ని బంగారమున్ను పాత్ర
లున్ను వీటియొక్క యెత్తు జూచి వారికి అప్పగించి
నాను. । యేమంటే ఆరునూట యేభై తలాంతుల వెండి 26
నిన్ని, నూరు తలాంతుల వెండి పాత్రలనున్ను, నూరు
తలాంతుల బంగారమునున్ను, । వెయి ద్రాకెమోనీముల 27
యెత్తుగల యిరువై బంగారపు గిన్నెలనున్ను, బంగార
మంత వెలగల పరిశుద్ధమైన రెండు రాగి పాత్రలనున్ను
యెత్తు చూచి, । వారి చేతికి అప్పగించి, మీరు యెహో 28
వా విషయమై పరిశుద్ధులై వున్నారు; పాత్రలున్ను
పరిశుద్ధమైనవై వున్నవి; వెండి బంగారములున్ను మీ
పితృలయొక్క దేవుడైన యెహోవా కొరకు స్వేచ్ఛా
ర్పణగా వున్నవి. । కాబట్టి యెరూశలేములో మీరు 29
వాటిని యెహోవా మందిరముయొక్క గదులలో
అర్చకులలోనున్ను లేవీయులలోనున్ను ఇశ్రాయేలు
పెద్దలలోనున్ను ప్రధానులయిన వారి యెదుట చూచే
పర్యంతమూ వాటిని భద్రముగా వుంచుకొండని వారి
తో చెప్పినాను. । కాబట్టి అర్చకులున్ను లేవీయులు 30
న్ను యెరూశలేములో వున్న మన దేవునియొక్క మంది
రమునకు తీసుకొ పోవడానకు ఆ వెండి బంగారముల
యొక్కయున్ను పాత్రలయొక్కయున్ను యెత్తు పుచ్చు
కొనిరి. । అంతట మేము మొదటి నెల పండ్రెండో 31
దినమందున యెరూశలేముకు రావడానకు అహవా నది
నుంచి తర్లినాము; మరిన్ని మా దేవునియొక్క హస్త
ము మాకు తోడుగా వుండి శత్రువుని చేతిలోనుం
చిన్ని మార్గమందు పొంచి వున్నటువంటి వారి చేతు
లలోనుంచిన్ని ఆయన మమ్మున విడిపించినందున, ।
మేము యెరూశలేముకు వచ్చి మూడు దినములు అక్కడ 32
బస చేసుకొంటిమి. । నాలుగో దినమున వెండిన్ని బంగా 33
రమున్ను పాత్రలున్ను మన దేవునియొక్క మందిర
మందు అర్చకుడైన ఊరీయా కుమారుడనే మెరెమో
తుచేత తూపించబడెను; అతనితో పీనెహాసు కుమారు
డైన ఎలాజారు కూడా వుండెను; వీరితో లేవీయులై
నటువంటి యేషూవ కుమారుడైన యోజాబాదున్ను
బిన్నూవీ కుమారుడైన నోవద్యాయున్ను కూడా వుం
డిరి. । సమస్తమైన వాటియొక్క లెక్క చొప్పుననున్ను 34
యెత్తు చొప్పుననున్ను తూచినారు; మరిన్ని యెత్తు
అంతా ఆ సమయమందు వ్రాయబడెను. । మరిన్ని 35
చెరలోకి కొంచపోబడిన వారికి పుట్టి, చెర నివార
ణయై తిరిగీ వచ్చినవారు ఇశ్రాయేలుయొక్క దేవునికి
హోమార్పణలను అర్పించినారు; ఇశ్రాయేలీయులం
దరి కొరకు పండ్రెండు యెద్లనున్ను తొంభయి ఆరు
పొట్టేళ్లనున్ను డెబ్బయి యేడు గొర్రె పిల్లలనున్ను
పాప పరిహారపు బలి నిమిత్తము పండ్రెండు మేకపో
తులనున్ను యివి అన్ని హోమార్పణగా యెహో
వాకు చెల్లించినారు. । అయితే వారు రాజుయొక్క 36
నిర్ణయములను రాజుయొక్క యువరాజులకున్ను నది

యివతల వున్న అధికారులకున్ను అప్పగించిన తరు
వాత వీండ్లు జనులకున్ను దేవునియొక్క మందిరమున
కున్ను సహాయులైరి.

## 9. అధ్యాయము.

1 అయితే యీ సంగతులు సమాప్తమయిన తరువాత
శ్రేష్ఠులు నాయొద్దికి వచ్చి చెప్పినదేమంటే, ఇశ్రా
యేలీయులున్ను అర్చకులున్ను లేవీయులున్ను ఆ
దేశములయొక్క జనాంగముల యొద్దనుంచి తమ్మును
తాము కేటించుకోక, కెనయానీయులు హిత్తీయులు
పెరిజ్జీయులు యెబూసీయులు అమ్మోనీయులు మో
యాబీయులు మిస్రీయులు ఎమోరీయులు అనే
వీరియొక్క యేహ్యమైనటువంటి వాటి ప్రకారము
2 చేస్తూ,। వారి కుమార్తెలను తమ కొరకున్ను తమ
కుమారుల కొరకున్ను భార్యలగా పుచ్చుకొనిరి; కా
బట్టి పరిశుద్ధ సంతతియైన వీరు ఆ దేశములయొక్క
జనులతో కలుసుకొన్నారు; నిజముగా యీ అపరాధ
ములో శ్రేష్ఠులున్ను అధికారులున్ను ముఖ్యులై వుండి
3 రని చెప్పిరి. । అయితే నేను యీ సంగతి విని నా వస్త్ర
ములనున్ను పై దుప్పటినిన్ని చించుకొని నా తల
వెంట్రుకలనున్ను నా గడ్డపు వెంట్రుకలనున్ను పెరికి
4 వేసుకొని విభ్రాంతిపడి కూర్చున్నాను. । అప్పుడు
కొంచుపోబడిన వారియొక్క తప్పితము నిమిత్తము
ఇశ్రాయేలు దేవునియొక్క మాటలకు భయపడిన వా
రందరున్ను నా యొద్దికి కూడి వచ్చిరి; అయితే నేను
విభ్రాంతిపడి సాయంతనపు బలి వేళ మట్టుకు కూ
5 ర్చుని వుంటిని. । సాయంతనపు బలి వేళను నా శ్రమ
నుంచి నేను లేచి, నా వస్త్రములనున్ను నా పై దుప్ప
టినిన్ని చించుకొని మోకాళ్లమీద పడి, నా దేవుడైన
యెహోవా తట్టు నా చేతులను యెత్తి పలికినదేమం
6 టే, । ఓ నా దేవుడా, నా దేవుడా, నా ముఖము
నీ తట్టు యెత్తుటకు సిగ్గుపడి ఖిన్నుడనై యున్నాను,
యేమంటే మా అక్రమములు మా శిరస్సుల పైని హె
చ్చివున్నవి; మా తప్పితము ఆకాశముల మట్టుకు యె
7 దిగియున్నది. । మా పితృలయొక్క దినములనుంచి నేటి
వరకూ మిక్కిలీ అపరాధులమై వుండి వున్నాము, మా
అక్రమముల నిమిత్తము మేమున్ను మా రాజులున్ను
మా అర్చకులున్ను దేశములయొక్క రాజుల చేతులలో
కిన్ని కత్తికిన్ని చెరకున్ను దోపుకున్ను సిగ్గుగల ముఖ
మునకున్ను నేటి దినమున వున్నలాగున అప్పగించపడి
8 యున్నాము. । అయితే యిప్పుడు మా దేవుడు మా
నేత్రములకు వెలుగిచ్చి, మా దాస్యములో మాకు కొం
చెము తెప్పరిలుట కలగ జేసుటకున్ను తప్పించే కొరకు
మాలో వొక శేషము విడుచుటకున్ను ఆయన పరిశుద్ధ
స్థలమందు మాకు స్థిరత యిచ్చుటకున్ను మా దేవుడైన
యెహోవా యొద్దనుంచి కొంత కాలమునకు కృప
అగపరచబడి వున్నది. । యేమంటే మేము దాసులమై 9
యుంటిమి; అయితే మా దేవుడవైన నీవు మా దాస్య
ములో మమ్మును విడవక, పారసీ దేశపు రాజుల యె
దుట మాకు దయ అగుపర్చి, మేము తెప్పరిలేటట్టుగా
నున్ను మా దేవునియొక్క మందిరమును నిలిపి దాని
పాడైన స్థలములను తిరిగీ బాగు చేయడానకున్ను
యూదా దేశమందున్న యెరూశలేము పట్టణమందు
న్ను మాకు వొక గోడను యివ్వడానకున్ను కృప చూ
పిస్తివి. । అయితే ఓ మా దేవుడా, యింత కృప పొం 10
దిన తరువాత యేమి చెప్పగలము? యేమంటే దీర్ఘ
దర్శులైన నీ సేవకుల ద్వారా నీవు ఆజ్ఞాపించిన ఆజ్ఞ
లను మేము విడిచి పెట్టితిమి. । వారు చెప్పినదేమంటే, 11
మీరు స్వతంత్రించుకోవడానకు వెళ్లే దేశము ఆ దేశపు
జనాంగములయొక్క అపవిత్రత చేతనున్ను యేహ్య
మైనటువంటి వాటిచేతనున్ను అపవిత్రతను పొంది
యున్నది, యేమంటే వారియొక్క అసహ్యమైన వాటి
చేత ఆ దేశము యీ వైపునుంచి ఆ వైపు పర్యంతము
నిండుగా వున్నది. । కాబట్టి మీరు మీ కుమార్తెలను 12
వారి కుమారులకు యివ్వకుండానున్ను వారి కుమార్తె
లను మీ కుమారుల కొరకు పుచ్చుకోకుండానున్ను
వుండండి; మరిన్ని వారి క్షేమమునైనా భాగ్యమునైనా
మీరు యెన్నటికీ కోరకూడదు; అప్పుడు మీరు బల
ముగా వుండి ఆ దేశముయొక్క శుభమును అనుభ
వించి మీ పిల్లలకు నిత్య స్వాస్థ్యముగా దాని విడుతు
రని చెప్పిరి. । అయితే మా దుష్క్రియల వల్లనున్ను మా 13
గొప్ప తప్పితముల వల్లనున్ను యివి అన్నీ మా మీదికి
వచ్చిన తరువాతను మా దేవుడవైన నీవు మా అక్రమ
ములకు కాగల శిక్షకు కొద్దిగా మమ్మును శిక్షించి, యి
ప్పుడు మాకు యీ విధమైన విడుదల కలుగ చేసిన
తరువాతనున్ను మేము నీ ఆజ్ఞలను మీరి, । యీ యే 14
హ్యములను జరిగించిన జనులతో కూడా సంబంధము
చేసుకొన్నట్టయితే మేము నాశనమయ్యే మట్టుకు శేష
మైనా తప్పించుకొనుటకు సాధనమైనా లేక వుండే
టట్టు నీవు కోపపడవా? । ఇశ్రాయేలుయొక్క దేవుడ 15
వైన ఓ యెహోవా, నీవు నీతి పరుడవై వున్నావు,
యేమంటే నేటి దినమున మేము తప్పించుకొనే వున్నా
ము; యిదుగో మేము పాపములచేత కప్పపడిన వార
మయి నీ సముఖమందు వున్నాము; కాబట్టి నీ సముఖ
మందు నిలువడానకు మాకు శక్తి లేదని ప్రార్థనచేస్తిని.

## 10. అధ్యాయము.

1 అయితే ఎజ్రా యేడ్చుతూ దేవునియొక్క మంది
రము ముందర సాష్టాంగ పడుతూ పాపమును యెరుక
చేసి ప్రార్థన చేసిన తరువాత ఇశ్రాయేలీయులలో
నుంచి పురుషులు స్త్రీలు చిన్నవాండ్లు మిక్కిలీ గొప్ప
సమూహముగా అతని యొద్దికి కూడి వచ్చినారు, యే
2 మంటే జనులు బహుగా యేడ్చినారు. । అప్పుడు ఏలా
ముయొక్క పుత్రులలో యెహీయేలు కుమారుడైన
షెఖన్యా ఎజ్రాతో చెప్పినదేమంటే, మేము దేశ
మందుండే అన్య జనాంగములలోనుంచి భార్యలను
తీసుకొని మా దేవుని యెడల పాపము చేస్తిమి; అయితే
యీ సంగతిని గూర్చి ఇశ్రాయేలు యందు నిరీక్షణ
3 కద్దు. । కాబట్టి యేలినవారైన మీ ఆలోచన చొప్పున
నున్ను దైవాజ్ఞకు భయపడేవారి ఆలోచన చొప్పున
నున్ను యీ భార్యలనున్ను వారికి పుట్టిన వారినిన్ని
పరిహరింతామని మన దేవునితో ఫ్రెడంబడికెను చేసు
కొందాము; యిది న్యాయ ప్రమాణము చొప్పున చేయ
4 పడును గాక.। లెండి, యేమంటే యీ భారము మీదే;
అయితే మేమున్ను మీతో కూడా వుంటాము; మీరు
ధైర్యముగా వుండి యిది చేయించండని చెప్పెను. ।
5 అప్పుడు ఎజ్రా లేచి, ప్రధానార్చకులనున్ను లేవీయు
లనున్ను ఇశ్రాయేలీయులందరినిన్ని ఆ మాట ప్రకా
రము చేసేటట్టుగా ప్రమాణము చేయించినాడు; కా
6 బట్టి వారు ప్రమాణము చేసుకొన్నారు. । అప్పుడు
ఎజ్రా దేవుని మందిరము ముందరనుంచి లేచి, ఎల్యా
షీబు కుమారుడయిన యోహానానుయొక్క గదిలోకి
ప్రవేశించెను; అతడు అక్కడికి వచ్చి భోజనమునైనా
పానమునైనా చేయకుండా వుండెను; యేమంటే కొం
చపోపడిన వారి తప్పితమును గురించి అతడు దుఃఖ
7 పడినాడు. । అప్పుడు వారు యూదా దేశమంతటి
యందున్ను యెరూశలేము పట్టణమందున్ను చెర నివా
రణమైన వారందరున్ను యెరూశలేముకు కూడి వచ్చే
8 టట్టుగా చాటింపించినారు. । మరిన్ని యెవడైనా మూ
డు దినములలో శ్రేష్ఠులున్ను పెద్దలున్ను యిచ్చిన ఆలో
చన చొప్పున రాకుండా వుంటే వాని ఆస్తి దేవునికి
చెల్లించ పడుననిన్ని వాడు కొంచపోపడిన వారి సం
ఘములోనుంచి కేటించపడుననిన్ని నిర్ణయించిరి. ।
9 అయినందున యూదా వారందరున్ను బెన్యామీను
వారందరున్ను మూడు దినములలో యెరూశలేముకు
కూడి వచ్చిరి; అది తొమ్మిదో నెల యిరువయ్యో దిన
మై యుండెను; అప్పుడు జనులందరున్ను దేవుని మం
దిరముయొక్క వీధిలో కూర్చుని, యీ సంగతి విషయ
మైయున్ని గొప్ప వర్షము విషయమైయున్ని బహుగా
భయపడినారు. । అప్పుడు అర్చకుడైన ఎజ్రా లేచి 10
వారితో చెప్పినదేమంటే, మీరు ఆజ్ఞను మీరి అన్య
స్త్రీలను భార్యలుగా చేసుకొని ఇశ్రాయేలుయొక్క
పాపము యింకా అధికముగా చేస్తిరి. । కాబట్టి యి 11
ప్పుడు మీ పితృలయొక్క దేవుడైన యెహోవాకు
మీ పాపమును యెరుకచేసి, ఆయనయొక్క చిత్త
ప్రకారముగా చేయ సిద్ధపడి, దేశపు జనులలోనుం
చిన్ని అన్య స్త్రీలలోనుంచిన్ని మిమ్మును మీరు కేటించు
కొని వుండండని చెప్పినప్పుడు, । సంఘము గొప్ప 12
శబ్దముచేత అతనిలో నీవు చెప్పినట్టుగానే మేము
చేయ వలసినది. । అయితే జనులు విస్తారమై యున్నా 13
రు; మరిన్ని యిప్పుడు వర్షము బరువుగా వున్నందున
మేము బైట నిలువలేము; మరిన్ని యీ పని వొకటి
రెండు దినములలో జరిగే పని కాదు, యేమంటే యీ
సంగతి విషయమై అనేకులము తప్పుచేసిన వారమై
యున్నాము. । కాబట్టి సంఘమంతటియొక్క అధికా 14
రులను యీ పనిమీద వుంచవలసినది; అప్పుడు మన
పట్టణములందు యెవరు అన్య స్త్రీలను భార్యలుగా
చేసుకొన్నారో వారందరున్ను వీరితో కూడా ప్రతి
పట్టణముయొక్క పెద్దలున్ను న్యాయాధిపతులున్ను
యీ సంగతి విషయమయి మాకు వచ్చిన దైవోగ్రము
మా యొద్దనుంచి తిరిగీ పోయేటట్టుగా నిర్ణయమైన
కాలమందు రావలసినదని చెప్పిరి.। అయితే అశాహేలు 15
కుమారుడైన యోనాతానున్ను తిక్వా కుమారుడయిన
యహ్జెయాయున్ను వీరు మాత్రమే యీ పనికి నిర్ణ
యించబడిరి; అయితే మెషుల్లామున్ను లేవీయులైన
షబ్బెతైయున్ను వారికి సహాయులైయుండిరి. । అయితే 16
చెర నివారణమైన వారు ఆలాగున చేసిరి; కాబట్టి
అర్చకుడైన ఎజ్రాయున్ను పెద్దలలో కొందరు శ్రేష్ఠ
లున్ను వారి వారి పితృలయొక్క యింటి కొరకున్ను
అందరున్ను వారి వారి పేరుల ప్రకారమున్ను వేరుగా
వుంచబడి, పదో నెల మొదటి దినమున యీ సంగతిని
విమర్శించడానకు కూర్చుండిరి. । అయితే మొదటి నెల 17
మొదటి దినమున వారు అన్య స్త్రీలను భార్యలగా చేసు
కొనిన వారందరి నిమిత్తమును సమాప్తము చేసిరి. । అప్పు 18
డు అర్చకుల పుత్రులలో అన్య స్త్రీలను భార్యలగా చేసు
కొని వున్నారని కనిపించిన వారు యెవరంటే, యే
షూవ పుత్రులలో యెహోసాదాకు కుమారుడైన
మయశేయాయున్ను, వాని సహోదరులైన ఎలీయెజె
రున్ను, యారీబున్ను, గెదల్యాయున్ను. । వీరు తమ 19
భార్యలను పరిహరింతుమని తమ చేతులను యిచ్చిరి;
మరిన్ని వారు అపరాధులయి యున్నందున తప్పు నిమి
త్తము మందలోది వొక పొట్టేలును చెల్లించిరి.। మరిన్ని 20
ఇమ్మేరు పుత్రులలో హనానీ అనేవాడున్ను జెబద్యా

21 యున్ను. । మరిన్ని హారీము పుత్రులలో మయశేయా,
ఎలీయా, షెమయా, యెహీయేలు, ఉజ్జీయా, అనేవా
22 రున్ను. । పష్హూరు పుత్రులలో ఏల్యోయేనై, మయ
శేయా, ఇష్మాయేలు, నెతన్యేలు, యోజాబాదు, ఎలాశా,
23 అనేవారున్ను. । మరిన్ని లేవీయులలో యోజాబాదు,
షిమీ, కెలీథా అని పిలువబడిన కేలాయా, పెతహ్యా,
24 యూదా, ఎలీయెజెరు, అనేవారున్ను. । మరిన్ని గాయ
కులలో ఎల్యాషీబున్ను, ద్వారపాలకులలో షల్లూము,
25 తెలెము, ఊరీ, అనేవారున్ను. । ఇశ్రాయేలు జనుల
లో యెవరంటే, ఫరోషు పుత్రులలో రమయ్యా,
ఇజ్జీయా, మల్కీయా, మీయామీను, ఎలాజారు, మల్కీ
26 యా, బేనాయ్యా, అనేవారున్ను. । ఏలాము పుత్రులలో
మతన్యా, జెకర్యా, యెహీయేలు, అబ్దీ, యెరీమోతు,
27 ఏలీయా, అనేవారున్ను. । జత్తూ పుత్రులలో ఎల్యో
యేనై, ఎల్యాషీబు, మతన్యా, యెరీమోతు, జాబాదు,
28 అజీజా, అనేవారున్ను. । బేబయి పుత్రులలో యెహో
హానాను, హనన్యా, జబ్బయి, అత్లయి, అనేవారున్ను. ।
29 బానీ పుత్రులలో మెషుల్లాము, మల్లూఖు, అదాయా,
యాషూబు, షెయలు, రామోతు, అనేవారున్ను. ।

పహత్మోయాబు పుత్రులలో అద్నా, కెలాలు, బేనా 30
య్యా, మయశేయా, మత్తన్యా, బెసలేలు, బిన్నూవి,
మనస్సే, అనేవారున్ను. । హారీము పుత్రులలో ఎలీయె 31
జెరు, ఇష్షీయా, మల్కీయా, షెమయా, । షిమోను, 32
బెన్యామీను, మల్లూఖు, షెమర్యా, అనేవారున్ను. ।
హాషుము పుత్రులలో మత్తెనై, మత్తత్తా, జాబాదు, ఎలీ 33
ఫెలెథు, యెరేమై, మనస్సే, షిమీ, అనేవారున్ను. ।
బానీ పుత్రులలో మయదై, అమ్రాము, ఊయేలు, । 34
బేనాయ్యా, బేద్యా, కెలూహు, । వన్యా, మెరీ 35,36
మోతు, ఎల్యాషీబు, । మత్తన్యా, మత్తెనై, యహసావు, । 37
బానీ, బిన్నూవీ, షిమీ, । షెలెమ్యా, నాతాను, అదా 38,39
యా, । మక్నద్బయి, షషై, షారాయి, । అజరేలు, 40,41
షెలెమ్యా, షెమర్యా, । షల్లూము, అమర్యా, యోసేపు, 42
అనేవారున్ను. । నెబో పుత్రులలో యెహీయేలు, మత్తి 43
త్యా, జాబాదు, జబీనా, యద్దయి, యోవేలు, బేనా
య్యా, అనేవారున్ను. । వీరందరున్ను అన్య స్త్రీలను 44
భార్యలగా చేసుకొని వుండిరి; వీరిలో కొందరికి యీ
భార్యలవల్ల పిల్లలు పుట్టిరి.

# నెహెమ్యాయొక్క గ్రంథము.

## 1. అధ్యాయము.

1 హకల్యా కుమారుడైన నెహెమ్యాయొక్క మాటలు.
నేను యిరువయ్యో సంవత్సరములో కిస్లేవు అనే మాస
మందు షూషను అనే నగరులో వుంటూ వుండగా
2 సంభవించినదేమంటే, । నా సహోదరులలో హనానీ
యనే వొకడున్ను యూదా మనుష్యులలో కొందరున్ను
వచ్చినారు; అప్పుడు నేను చెర పట్టబడ్డ వారిలో వుండి
పోయి తప్పించుకొన్న యూదైయులను గూర్చిన్ని
యెరూశలేమును గూర్చిన్ని వారిని అడిగినప్పుడు, ।
3 వారు నాతో చెప్పినదేమంటే, చెరలోకి పోయినవారి
లోనుంచి శేషించి వున్నవారు ఆ రాజ్యములో బహు
శ్రమనున్ను నిందనున్ను పొందుతూ వున్నారు; మరిన్ని
యెరూశలేముయొక్క గోడ పడిపోయినది; దాని గుమ్మ
4 ములున్ను అగ్నిచేత దహించ పడినవని పలికిరి. । యీ
మాటలను వినగానే నేను కూచుండి యేడ్చి, కొన్ని
దినములు దుఃఖముతో వుపవాసము చేసి, ఆకాశము
5 యొక్క దేవుని యెదుట ప్రార్థించినాను. । యేలా
గంటే ఆకాశములో వుండే యెహోవా అనే దేవు
డా, భయంకరుడవైన గొప్ప దేవుడా, నిన్ను స్నేహించి
నీ ఆజ్ఞలను గైకొనేవారికి కృపనున్ను వొడంబడికె
6 నున్ను నీవు స్థిరపర్చుతున్నావు. । యిప్పుడు నీ చెవి
వొగ్గి నీ నేత్రములు తెరచి నీ యెదుట రాత్రి పగలు
నీ సేవకులయిన ఇశ్రాయేలు పుత్రుల విషయమై
అర్పించిన ప్రార్థనను వినుము; నీకు విరోధముగా
మేమున్ను మా తండ్రి యింటివారున్ను చేసిన పాపము
7 లను వొప్పుకొంటున్నాము. । నీకు విరోధముగా బహు
యేహ్యముగా జరిగించితిమి; నీ సేవకుడైన మోషేకు
నీవు నిర్ణయించిన ఆజ్ఞలనైనా నిబంధనలనైనా న్యా
8 యములనైనా మేము గైకొనకుండా వుంటిమి. । నీ సేవ
కుడైన మోషేకు నీవు చెప్పిన మాట జ్ఞాపకము తెచ్చు
కొనుము, యేమంటే మీరు అపరాధము చేసినట్టయితే
9 జనులలోకి మిమ్మును చెదర కొట్టుదును. । అయితే మీరు
నా తట్టు తిరిగి నా ఆజ్ఞలను గైకొని చేసితే ఆకాశ
ముయొక్క అంత్యభాగము పర్యంతము మీరు తోలి
వేయ బడినప్పటికీ అక్కడినుంచి సహా మిమ్మును చేర్చు
కొని, నా నామమును అక్కడ నిలిపేటందుకు నేను
యెంచుకున్న స్థలముకు వారిని తీసుకొని వత్తునని అం
10 టివి. । యిదుగో నీవు నీ ఘనమైన శక్తి చేతనున్ను నీ
బలమైన హస్తము చేతనున్ను విముక్తి పరచిన నీ సేవకు
లున్ను నీ జనులున్ను వీరే. । వో యెహోవా, నిన్ను 11
బతిమాలుతున్నాను, యేమంటే నీ నామమును భయ
భక్తులతో యెంచేటందుకు కోరుతున్న నీ సేవకుల మొం
ర్రకు చెవి వొగ్గుము; మరిన్ని నీ సేవకుని యీ దిన
మందు ఆశీర్వదించి యీ మనుష్యుని యెదుట అతనికి
దయ చూపించుము అని ప్రార్థించినాను. యెందు
కంటే నేను రాజుకు గిన్నె అందిచ్చే వాడనై యుంటిని.

## 2. అధ్యాయము.

అటుతరువాత సంభవించినదేమంటే, అర్తహషస్తా 1
అనే రాజు యేలుబడి కాలమందు యిరువైయో సంవ
త్సరములో నీసాను మాసమందు రాజు యెదుట ద్రాక్షా
రసము వుండగా దాని నేను తీసుకొని రాజుకు అందిచ్చి
నాను. యింతకు పూర్వము అతని ముందర నేను యె
న్నడయినా విచారముగా వుండలేదు. । కాగా రాజు 2
నాతో నీవు వ్యాధిగా వుండకపోయినప్పటికిన్ని నీ
ముఖము యెందుకు విచారముగా వున్నది! నీ హృద
య దుఃఖము చేతనే యీలాగు వున్నదని చెప్పెను. ।
అప్పుడు నేను బహుగా భయపడి, వో రాజా, నీవు 3
సదా జీవితుడవౌదువు గాక; నాకు విచారము కలగ
వద్దా! యెందుకంటే నా పితృల సమాధులు వుండే పట్ట
ణము పాడై పోయెను; దాని గుమ్మములున్ను అగ్నిచేత
దహించ బడినవని రాజుతో పలికినాను. । అప్పుడు 4
రాజు నాతో నీవు దేని కొరకు మనవి చేస్తున్నావు
అని చెప్పగా నేను ఆకాశముయొక్క దేవునికి ప్రా
ర్థన చేసినాను. । మరిన్ని రాజుతో నా పితృల సమా 5
ధులు వుండే యూదా అనే పట్టణమును తిరిగీ కట్టగ
లందులకు నీ సముఖమందు దయను పొందిన వాడన
యితినట్టాయెనా నన్ను దాని యొద్దకు పంపండని వేడు
కొంటున్నాను అని చెప్పితే; । అందుకు రాజు తన 6
భార్య తనయొద్ద కూచుండి వుండగా నీ ప్రయాణము
యెన్ని దినముల పర్యంతము వుండును? నీవు తిరిగీ యె
ప్పుడు వస్తావు అని అడిగెను. అంతట నేను కాలము
నిర్ణయించుకొన్నప్పుడు రాజు నన్ను పంపడానకు
చిత్తము కలవాడై వుండెను. । యిదిగాక రాజుతో నేను 7
అనిన మాట, రాజు గారికి అనుకూలమైతే యూదాకు
నేను వచ్చే పర్యంతము నది అవతలకు దాటించేటం
దుకు అక్కడ వున్న అధికారులకు వుత్తరములనున్ను, ।

8 నేను ప్రవేశించబోయే యింటి నిమిత్తమున్ను పట్టణపు
గోడ నిమిత్తమున్ను యింటిని సంబంధించిన నగరియొ
క్క గుమ్మములను చేయడానకు దూలముల కోసము
మానులున్ను యిచ్చేటందుకు రాజు తోపును కాచే
ఆసాపుకు వొక వుత్తరమునున్ను యిమ్మని అడిగినాను.
ఆలాగునే నాకు తోడుగా వున్న నా దేవుని వుత్తమ
హస్తము చొప్పున రాజు నాకు దయ చేసినాడు.।
9 తరువాత నేను నది ఆవల వున్న అధికారుల యొద్దికి
వచ్చి, వాండ్లకు రాజుయొక్క వుత్తరములను యిచ్చి
నాను. నాతో కూడా దండు అధిపతులనున్ను గుర్రపు
10 రౌతులనున్ను రాజు పంపించెను.। అయితే హోరో
నీయుడైన సన్బల్లథున్ను అమ్మోనీయుడైన థోబీయా
అనే సేవకుడున్ను యిది వినినప్పుడు ఇశ్రాయేలు
పుత్రుల శ్రేయస్సును వెతకడానకు వొకడు వచ్చినా
11 డని బహుగా దుఃఖపడినారు.। అంతట నేను యెరూ
శలేముకు వచ్చి మూడు దినములు అక్కడనే వుండి,।
12 రాత్రిలో నేనున్ను నాతో కూడా వున్న కొందరు
మనుష్యులున్ను లేచి, యెరూశలేములో యేమి చేయ
వలెనని నా హృదయమందు దేవుడు వుంచెనో అది
యెవరితోనైనా నేను చెప్పలేదు; మరిన్ని నేను యెక్కే
మృగము గాక మరి యే మృగమైనా నాతో కూడా
13 వుండలేదు.। అప్పుడు నేను రాత్రికాలమందు లోవ
ద్వారముగుండా డ్రాగోను నూతి యెదుటికిన్ని పెంట
తీసుకు పోయే ద్వారము దగ్గిరకున్ను వెళ్లి, పడిపోయిన
యెరూశలేముయొక్క గోడలను చూడగా దాని గుమ్మ
14 ములు అగ్నివల్ల దహించపడినవి.। తరువాత నేను ధార
యొక్క గుమ్మము యొద్దికి వచ్చి రాజు కుండీ యొద్ది
కిన్ని వెళ్లినాను గాని నేను యెక్కే మృగము వెళ్లడా
15 నకు చోటు లేకపోయెను.। తరువాత నేను మడుగు దగ్గి
రనుంచి రాత్రిలో పైకి వెళ్లి గోడను చూచిన మీదట
మళ్లుకొని లోవ గుమ్మములో పడి తిరిగీ వచ్చినాను.।
16 అయితే నేను యెక్కడికి వెళ్లినానో యేమి చేసినా
నో అధికారులకు తెలియలేదు; యూదైయులకైనా
అర్చకులకైనా మహానుభావులకైనా అధికారులకైనా
తతిమ్మా పనివాండ్లకైనా నేను యింకా దాని చెప్పడ
17 ము లేదు.। అంతట వారితో నేను అనిన మాట, మనకు
కలిగిన శ్రమ మీకు తెలుసును; యెరూశలేము యేలా
గున పాడై పోయినదో దాని గుమ్మములు అగ్నిచేత
యేలాగున దహించబడినవో మీరు చూచే వున్నారు;
మాకు యిక మీదట నింద రాకుండా యెరూశలేము
యొక్క గోడను మళ్లి కట్టుదాము రండని పలికితిని.।
18 యిదిన్ని గాక నా మీద వున్న దేవుని వుత్తమ హస్త
మును గురించి రాజు నాతో పలికిన మాటలన్నిన్ని వా
రితో చెప్పినాను; అందుకు వారు మనము లేచి కట్టు
దుము గాక అని పలికి, యీ మంచి కార్యము నిమి
త్తము వారు తమ చేతులను బలపర్చుకొన్నారు.।
అయితే హోరోనీయుడైన సన్బల్లథున్ను అమ్మోనీ 19
యుడైన సేవకుడనే థోబీయా అనే వాడున్ను అరబీ
యుడైన గెషెమున్ను యిది వినినప్పుడు మమ్మును హే
ళనపర్చి పగచేసి, మీరు చేసేది యిది యేమిటి?
రాజుకు విరోధముగా తిరుగుబాటు చేస్తారా అని
చెప్పుకొన్నారు.। అందుకు ప్రత్యుత్తరముగా నేను 20
ఆకాశముయొక్క దేవుడు ఆయనే మాకు ఆశీర్వాద
ము దయచేస్తాడు; కాగా ఆయన సేవకులమైన మేము
లేచి కట్టుతాము; అయితే యెరూశలేమందు మీకు
భాగమైనా స్వతంత్రమైనా జ్ఞాపక సూచనయైనా
లేదని చెప్పినాను.

## 3. అధ్యాయము.

అయితే ప్రధానార్చకుడైన ఎల్యాషీబున్ను అత 1
నితో కూడా అర్చకులైన అతని సహోదరులున్ను
లేచి, గొర్రెల ద్వారమును కట్టినారు; వారు దాని పరి
శుద్ధపర్చి దానికి తలుపులు నిలిపినారు, మేయా, హన
నేలు అనే గోపురముల పర్యంతమున్ను దాని పరిశుద్ధ
పర్చినారు.। అతని వెనుక యెరిఖో యనే పట్టణపు 2
మనుష్యులు కట్టినారు; వాండ్ల తరువాత ఇమ్రి కుమా
రుడైన జక్కూరు కట్టినాడు;। అయితే మత్స్య ద్వా 3
రము హస్సెనాయా కుమాళ్లు కట్టినారు; మరిన్ని వీరు
దానికి దూలములనున్ను తలుపులనున్ను తాళములను
న్ను గడలనున్ను కూడా నిలిపినారు.। వాండ్ల తరు 4
వాత కోస్సుకు పుట్టిన ఊరీయా కుమారుడైన మెరె
మోతు బాగు చేసినాడు; వాండ్ల తరువాత మెషేజబే
లుకు పుట్టిన బెరఖ్యా కుమారుడైన మెషుల్లాము బాగు
చేసినాడు; వాండ్ల తరువాత బయనా కుమారుడైన సా
దోకు బాగు చేసినాడు.। వాండ్ల తరువాత తెకోవీ 5
యులు బాగు చేసినారు; అయితే వాండ్ల అధికారులు
తమ ప్రభువు పనికి తమ మెడలను వంచ లేదు.। యిది 6
గాక పాత గుమ్మమును బాగు చేసేవారు యెవరంటే,
ఫాసేయహు కుమారుడయిన యెహోయాదాయున్ను
బెసోద్యా కుమారుడైన మెషుల్లామున్ను దానికి దూల
ములనున్ను తలుపులనున్ను తాళములనున్ను గడలను
న్ను నిలిపినారు.। వాండ్ల తరువాత గిబోనీయుడైన 7
మెలథ్యాయున్ను మేరోనోతీయుడైన యాదోనున్ను
బాగు చేసినారు; గిబోను మనుష్యులున్ను మిస్పె మను
ష్యులున్ను యేటి యివతల వున్న అధికారి సింహాస
నము పర్యంతమున్ను బాగు చేసినారు.। వాండ్ల తరు 8
వాత బంగారపు పనివాండ్ల సంబంధి అయిన హర్హ
యా కుమారుడైన ఊజ్జీయేలు బాగు చేసినాడు; అతని

తరువాత వైద్యులలో వొకని కుమారుడైన హనన్యా
బాగుచేసి, వెడల్పు గోడ పర్యంతమూ యెరూశలే
9 మును వదిలి పెట్టినారు. । వాండ్ల తరువాత యెరూశ
లేములో సగము భాగముకు అధిపతియైన హూరు
10 కుమారుడైన రెఫాయా బాగు చేసినాడు. । వాండ్ల తరు
వాత తన యింటికి యెదురుగుండా హరూమపు కుమా
రుడైన యెదాయా బాగు చేసినాడు; అతని తరువాత
హషబ్నెయా కుమారుడైన హథూషు బాగు చేసినా
11 డు. । అయితే రెండో భాగమున్ను అగ్ని గుండముల
గోపురమున్ను హారీము కుమారుడైన మల్కీయాయున్ను
పహత్మోయాబు కుమారుడైన హష్షూబున్ను బాగు చేసి
12 నారు. । వాండ్ల తరువాత యెరూశలేములో సగముకు
అధిపతి అయిన హల్లోహేషు కుమారుడైన షల్లూము
13 న్ను అతని కుమార్తెలున్ను కట్టినారు. । లోవ ద్వార
మును హానూనున్ను జానోహ కాపురస్తులున్ను బాగు
చేసి కట్టి, దానికి తలుపులనున్ను తాళములనున్ను గడ
లనున్ను వేసినారు; యిదిన్ని గాక పెంట ద్వారము
పర్యంతము వుండే గోడ వెయ్యి మూరలు దాకా కట్టి
14 నారు. । అయితే పెంట ద్వారమును బేథక్కెరెములో
కొంత భాగముకు అధిపతి అయిన రేఖాబు కుమారు
డైన మల్కీయా బాగు చేసినాడు; అతడు దాని కట్టి
దానికి తలుపులనున్ను తాళములనున్ను గడలనున్ను నిలి
15 పినాడు. । అయితే మిస్పెలో సగము భాగముకు అధి
పతి అయిన కొల్హోజ కుమారుడైన షల్లూను ధార
యొక్క ద్వారమును బాగు చేసినాడు; దాని కట్టి కప్పి
దానికి తలుపులనున్ను తాళములనున్ను గడలనున్ను
నిలిపినాడు. యిది గాక దావీదు పట్టణమునుంచి కిందకు
వెళ్లే మెట్ల పర్యంతమున్ను రాజు తోట వొద్ద వున్న
షిలోయహు మడుగుయొక్క గోడనున్ను కట్టినాడు. ।
16 అతని తరువాత బేత్సూరులో సగము భాగముకు అధి
పతి అయిన అజ్బూకు కుమారుడైన నెహెమ్యా బాగు
చేసెను; దావీదు సమాధులకు యెదురుగుండా వున్న
స్థలముల పర్యంతమున్ను చేయబడిన మడుగు పర్యంత
మున్ను బలవంతుల యిండ్ల పర్యంతమున్ను అతడు
17 కట్టెను. । అతని తరువాత లేవీయులలో బానీ కుమా
రుడైన రెహూము బాగు చేసెను; అతని తరువాత తన
భాగములో కెయీలాయొక్క సగము భాగముకు అధి
18 పతియైన హషబ్యా బాగు చేసెను. । అతని తరువాత
వారి సహోదరులయిన హేనాదాదు కుమారుడైన
బావై బాగు చేసెను; అతను కెయీలాలో సగము భాగ
19 ముకు అధిపతిగా వుండెను. । అతని తరువాత మిస్పెకు
అధిపతియైన యేషూవకు కుమారుడైన ఏజెరు ఆయు
ధముల కొట్టు మార్గమునకు యెదురుగా వున్న గోడ
మలుపు పక్కను మరి వొక భాగము బాగు చేసెను. ।

అతని తరువాత ఆ గోడ మలుపునుంచి ప్రధానాచార్య 20
కుడయిన ఎల్యాషీబు యింటి ద్వారము దాకా మరి
యొక భాగము జబ్బయి కుమారుడైన బారూఖు
బాగు చేసెను. । అతని తరువాత ఎల్యాషీబు యింటి 21
ద్వారమునుంచి ఆ యింటి కడ దాకా కోస్సుకు పుట్టిన
ఊరీయా కుమారుడైన మెరెమోతు బాగు చేసెను. ।
అతని తరువాత మైదానపు మనుష్యులైన ఆచార్యులు 22
బాగు చేసిరి. । అతని తరువాత వారి యింటికి యెదు 23
రుగుండా బెన్యామీనున్ను హష్షూబున్ను బాగు చేసిరి;
అతని తరువాత తన యింటి యొద్ద అనన్యాకు పుట్టిన
మయశేయా కుమారుడైన అజర్యా బాగు చేసెను. ।
అతని తరువాత అజర్యా యిల్లు మొదలుకొని గోడ 24
మలుపు మూల వరకూ హేనాదాదు కుమారుడైన
బిన్నూవీ మరి వొక భాగము బాగు చేసెను. । అతని తరు 25
వాత గోడ మళ్లిన దిక్కున చెర సాలయొక్క లోగిటి
యొద్ద వున్న రాజు నగరిని సంబంధించి వున్న గోపురము
దగ్గిర ఊజై కుమారుడైన పాలాలు కట్టెను; అతని తరు
వాత ఫరోషు కుమారుడైన పెదాయా బాగు చేసెను. ।
అయితే ఓఫెలులో వున్న నెతేనీయులు తూర్పు 26
వైపు నీటి గుమ్మము పక్కనున్ను దానికి సంబంధించిన
గోపురము దగ్గిరనున్ను బాగు చేసిరి. । వారి తరువాత 27
ఓఫెలు గోడ దాకా గొప్ప గోపురముకు యెదురుగా
వున్న మరి యొక భాగమును తెకోవీయులు బాగు
చేసిరి. । గుర్రపు ద్వారము పైగా ఆచార్యులు ప్రతివా 28
డున్ను తన తన యింటికి యెదురుగా బాగు చేసిరి. ।
వారి తరువాత తన యింటికి యెదురుగుండా ఇమ్మెరు 29
కుమారుడైన సాదోకు బాగు చేసెను; అతని తరువాత
తూర్పు ద్వారమును కాచే షెకన్యా కుమారుడైన
షెమయా బాగు చేసెను. । అతని తరువాత షెకమ్యా 30
కుమారుడయిన హనన్యాయున్ను సాలాపు ఆరో కుమా
రుడయిన హానూనున్ను మరి వొక భాగమును బాగు
చేసిరి; వాని తరువాత తన గదికి యెదురుగుండా బెరె
ఖ్యా కుమారుడైన మెషుల్లాము బాగు చేసెను. । వాని 31
తరువాత నెతేనీయుల స్థలముకున్ను మిఫ్కాదు ద్వార
ముకు యెదురుగా వున్న వర్తకుల స్థలముయొక్క
మూల వరకున్ను బంగారపు పనివాని కుమారుడైన
మల్కీయా బాగు చేసెను. । మరిన్ని మూలకున్ను గొ 32
ర్రెల ద్వారమునకున్ను మధ్యను బంగారపు పనివాం
డ్లున్ను వర్తకులున్ను బాగు చేసిరి.

## 4. అధ్యాయము.

అయితే అప్పుడు సంభవించినదేమంటే, మేము 1
గోడ కట్టినామని సన్బల్లథు వినినప్పుడు అతడు బహు
గా కోపపడి, యూదైయులను వెక్కిరించి, । అతడు 2

షోమ్రోను దండు యెదుటనున్ను తన సహోదరుల
యెదుటనున్ను అనిన మాట, యీ బలహీనమైన యూ
దైయులు యేమి చేస్తున్నారు? తమ్ముతాము బలపరచు
కొంటారా? బలి అర్పించు కొంటారా? వొక దిన
మందే అంతము చేసుకొంటారా? దహించపడ్డ చెత్త
కుప్పలలో వున్న రాళ్లను తిరిగి జీవింప చేస్తారా అని
3 పలికెను. । అయితే అమ్మోనీయుడైన థోబీయా అతని
యొద్ద వుండి పలికిన మాట, వారు కట్టిన దాని పైకి
వొక నక్కయైనా వెళ్లినట్టాయెనా అది వారి రాతి
4 గోడను పడగొట్టునని చెప్పెను. । వో మా దేవుడా,
వినుము, యెందుకంటే మేము అలక్ష్యమును పొందుతు
న్నాము; వారి తలల మీదికి వారి నిందను వచ్చేటట్టు
చేసి, చెరభూమిలోనే వారిని దోపు కొరకు యిమ్ము. ।
5 వారి అక్రమమును కప్పివేయకనున్ను నీ యెదుట వారి
పాపమును తుడిచివేయకనున్ను వుండుము, యెందు
కంటే శిల్పికారుల యెదుట వారు నీకు కోపమును
పుట్టించినారు అని యీ విధముగా ప్రార్థించితిని. ।
6 యీలాగున మేము గోడ కట్టినాము; సగము పర్యం
తము అది అతక పడెను, యెందుకంటే పని చేయ
7 డానకు జనులకు మనస్సు కలిగి వుండెను. । అయితే
సన్బల్లథున్ను థోబీయాయున్ను అరబీయులున్ను అమ్మో
నీయులున్ను అష్డోదీయులున్ను యెరూశలేముయొక్క
గోడలు కట్ట బడినవనిన్ని బీటలన్ని కప్పబడినవనిన్ని
8 వినినప్పుడు, । బహుగా కోపపడి యేకీభవించి, యెరూ
శలేముకు విరోధముగా పోట్లాడడానకున్ను దాని
9 ఆతంకపర్చడానకున్ను యత్నము చేసినారు. । అయితే
మేము మా దేవుని ప్రార్థించి, వారి విషయమై రా
10 త్రింబగలున్ను కావు వుంచినాము. । అప్పుడు యూ
దావారు అనిన మాట, బరువులుమోసే వారి బలము
తగ్గిపోయెను, చెత్త విస్తారముగా వున్నది, గోడ కట్ట
11 లేము అని పలికిరి. । మన విరోధులున్ను అనిన మాట,
వారి మధ్యకు వెళ్లి, వారిని చంపి, పని ఆతంకపర్చే
పర్యంతము వారు తెలియకుండానున్ను చూడకుండా
12 నున్ను వుందురని పలికిరి. । అప్పుడు సంభవించినదేమం
టే, వారి యొద్ద నివాసముచేసిన యూదైయులు వచ్చి
నప్పుడు పది మార్లున్ను మనతో మీరు తిరిగి వచ్చే
సకల స్థలములనుంచి మీ మీద వారు పడుదురని పది
13 మారులు మాతో పలికిరి. । అందు నిమిత్తము గోడ వెను
కగా వున్న దిగువ స్థలములలోనున్ను పైగా వున్న
స్థలములలోనున్ను జనులను వారి వారి కుటుంబముల
ప్రకారముగా వారి కత్తులతోటిన్ని వారి యీటెల
14 తోటిన్ని వారి విల్లతోటిన్ని నిలిపినాను. । అంతట నేను
లేచి చూచి, శ్రేష్ఠులతోనున్ను కర్తలతోనున్ను జను
లతోనున్ను అనిన మాట, వారికి మీరు భయపడకండి,
యెహోవాను జ్ఞాపకము చేసుకొండి, ఆయన భయం
కరుడున్ను ఘనమైన వాడున్ను అయి వున్నాడు; మీ
సహోదరుల నిమిత్తమున్ను మీ కుమారుల నిమిత్తము
న్ను మీ కుమార్తెల నిమిత్తమున్ను మీ భార్యల నిమి
త్తమున్ను మీ యిండ్ల నిమిత్తమున్ను యుద్ధము చేయండి
అని పలికినాను. । అయితే మనకు తెలియ బడెననిన్ని 15
దేవుడు వారి ఆలోచనను వ్యర్థము చేసెననిన్ని మన
శత్రువులు వినినప్పుడు మనలో ప్రతివాడున్ను తన
తన పనికి గోడదగ్గిరికి వచ్చినాడు. । అయితే అప్పటి 16
నుంచి నా నౌఖర్లలో సగము మంది పనిచేసిరి;
రెండో సగము మంది యీటెలనున్ను డాలులనున్ను
విల్లనున్ను కవచములనున్ను పట్టుకొన్నారు; అయితే
అధికారులు యూదా యింటి వాండ్ల వెనుక వుండిరి. ।
గోడ కట్టిన వారున్ను బరువులు మోసిన వారున్ను 17
బరువులు యెత్తిన వారున్ను వీరు వొక చేతితో పని
చేస్తూ వుండడమున్ను రెండో చేతితో ఆయుధము
పట్టుకోవడమున్ను యీ విధముగా జరుపుకొన్నారు. ।
యెందుకంటే శిల్పికారులందరున్ను తన తన కత్తి నడు 18
ముకు బిగించుకొని గోడ కట్టిరి; మరిన్ని బాకా వూదే
వాడు నా యొద్ద నిలిచి వుండెను. । అప్పుడు నేను 19
శ్రేష్ఠులతోనున్ను కర్తలతోనున్ను తతిమ్మా వారితోను
న్ను అనిన మాట, పని మిక్కిలీ గొప్పదిగా వున్నది;
మనము గోడ మీదను వొకరికొకరము చాలా దూర
ముగా వున్నాము. । కాగా యే స్థలములో మీకు బాకా 20
నాదము వినబడుతుందో అప్పుడు మా దగ్గిరకు రండి,
మన దేవుడు మన నిమిత్తము యుద్ధము చేసును అని
పలికినాను. । ఆలాగునే మనము పని యందు ప్రయాస 21
పడినాము; సగము మంది వుదయము మొదలుకొని
నక్షత్రములు అగుపడే పర్యంతము యీటెలు పట్టు
కొని వుండిరి. । మరిన్ని ఆ కాలమందు నేను జనులతో 22
అనిన మాట, ప్రతివాడు తన తన నౌకరుతో కూడా
యెరూశలేములో బస చేసును గాక; అప్పుడు రాత్రి
మాకు కావుగానున్న పగలు పని చేసేటట్టుగానున్న
వుండునని చెప్పితిని. । యీలాగున నేనైనా నా సహో 23
దరులైనా నా సేవకులైనా నా వెంబడి వున్న పారా
వాండ్లయినా వుతుకుకోవడానకు వినా మరి దేనికైనా
తమ వస్త్రములను తీసి వేయలేదు.

## 5. అధ్యాయము.

అప్పుడు తమ సహోదరులయిన యూదైయు 1
లకు విరోధముగా జనుల వల్లనున్ను వారి భార్యల వల్ల
నున్ను గొప్ప మొర్ర కలిగి వుండెను. । యెందుకంటే 2
కొందరు పలికినదేమంటే, మేమున్ను మా కుమాళ్లున్ను
మా కుమార్తెలున్ను చాలా మందిగా వున్నాము;

అందు చేత మేము తిని బ్రతుకడానకు వాండ్ల కోస
3 ము దినుస్సు కొంచబోతున్నామని పలికిరి.। యింకా
కొందరు అనినదేమంటే, క్షామము వున్నందున దినుస్సు
కొనుకోవడానకు మా భూములనున్ను మా ద్రాక్షతో
టలనున్ను మా యిండ్లనున్ను తనఖాలో వుంచినామని
4 చెప్పినారు.। యింకా కొందరు అనిన మాట, మా
భూముల మీదనున్ను మా ద్రాక్ష తోటల మీదనున్ను
రాజుగారికి పన్ను కట్టడానకు సొమ్ము బదులు చేసి
5 నాము.। యిదుగో యిప్పుడు మా సహోదరుల మాం
సములాటిది మా మాంసము కాదా! మా పిల్లలు వారి
పిల్లలు లాగున వున్నారు కారా? అయితే యిదుగో
సేవకులుగా వుండేటందుకు మా కుమారులనున్ను మా
కుమార్తెలనున్ను చెరలోకి తెస్తిమి, యిప్పటికి మా
కుమార్తెలలో కొందరు చెరలో వున్నారు; మా భూము
లున్ను మా ద్రాక్ష తోటలున్ను అన్యుల చేతులలో
వున్నందున వాటిని విమోచించడానకు మాకు శక్తి చాల
6 దని చెప్పినారు.। అయితే వారి మొర్రనున్ను యీ
మాటనున్ను నేను వినినప్పుడు బహుగా కోప బడి
7 నాను.। అంతట నాలో నేనే ఆలోచన చేసి శ్రేష్ఠుల
నున్ను కర్తలనున్ను గద్దించి, అనిన మాట, మీలో
వొకొక్కడు తన సహోదరుని యొద్ద అన్యాయపు
వడ్డి పుచ్చుకొంటున్నాడు అని పలికి, వారి మీదికి
8 గొప్ప సమూహమును పంపించి,। వాండ్లతో నేను
అనిన మాట, అన్యులకు అమ్మబడ్డ మా సహోదరులైన
యూదైయులను మా శక్తి చొప్పున మేము విమో
చిస్తిమి, మీరున్ను మీ సహోదరులను అమ్ముతారా?
వారు మాకు అమ్మబడుతారా అని చెప్పినప్పుడు, వారు
9 యేమైనా చెప్పకుండా వూరకొన్నారు.। మరిన్ని నేను
అనినదేమంటే, మీరు చేసేది మంచిది కాదు; మన
శత్రువులైన అన్యుల నింద నిమిత్తము మన దేవునియొక్క
10 భయమందు మీరు తిరుగ వద్దా?। నేనున్ను నా సహో
దరులున్ను నా సేవకులున్ను కూడా ఆలాగునే వారి యొ
ద్దను సొమ్మున్ను దినుస్సున్ను అన్యాయముగా కోరవ
చ్చును; కాగా నేను మిమ్మును బతిమాలి చెప్పుతున్న
దేమంటే, యీ అన్యాయపు వడ్డి పుచ్చుకోవడము మాని
11 వేతురు గాక.। యీ దినములోనే వారి యొద్ద మీరు
ఆక్రమించుకొన్న భూములనున్ను ద్రాక్ష తోటలను
న్ను ఇప్ప తోటలనున్ను వారి యిండ్లనున్ను సొమ్ములో
నూరో వంతునున్ను దినుస్సునున్ను ద్రాక్షారసమునున్ను
నూనెనున్ను యివి అన్ని వాండ్లకు తిరిగి యిచ్చి వేయు
12 మని నేను బతిమాలుతూ వున్నానని చెప్పినాను.। అప్పు
డు వారు మాకు చెప్పిన ప్రకారమే యివన్ని యిచ్చి
వేసి వాండ్ల యొద్ద యేమైనా కోరమని పలికినారు;
అంతట నేను అర్చకులను పిలచి, యీ వాగ్దత్త ప్రకా
రము చేసేటందుకు వారి యొద్ద వొక ప్రమాణము పుచ్చు
కొన్నాను.। మరిన్ని నేను నా వొడిని దులిపి అనిన 13
దేమంటే, యీలాగునే దేవుడు యీ వాగ్దత్త ప్రకా
రము చేయని ప్రతివానినిన్ని వాని యింటినుంచిన్ని
వాని పనినుంచిన్ని దులిపి వేసును; యీలాగున వాడు
దులిపి వేయబడి వట్టిదిగా చేయబడునుగాక అని పలికి
నాను; అప్పుడు సమూహమంతా ఆమేన్ అని పలికి యె
హోవాను స్తుతించెను; జనులందరున్ను యీ మాట
చొప్పునే జరగించినారు.। మరిన్ని యూదా దేశములో 14
వారికి అధికారినిగా నేను నిర్ణయించబడ్డ కాలము
నుంచి అనగా అర్తక్షస్తా అనే రాజు యేలుబడిలో
యిరువైయో సంవత్సరము మొదలుకొని ముప్పై రెండో
సంవత్సరము వరకు పండ్రెండు సంవత్సరములనుంచి
అధికారియొక్క సొమ్ము నేనైనా నా సహోదరులై
నా తినడములేదు.। అయితే నాకు ముందుగా వుండే 15
అధికారులు జనుల యొద్దనుంచి రొట్టెనున్ను ద్రాక్షా
రసమునున్ను నలభై వెండి షెకేలులనున్ను పుచ్చుకొ
న్నారు; వారి నౌకలున్ను సహా జనుల మీద సామంత
ము చేసిరి గాని నేను దేవునికి భయపడే వాడను గనుక
ఆలాగున చేయడములేదు.। యిదిగాక నేను యీ గోడ 16
పని చేస్తూ వుంటిని; మరి యే భూమి అయినా కొను
క్కోకుండా, నా నౌకలున్ను యీ పని చేస్తూ వుం
డిరి.। మరిన్ని నా భోజనపు బల్ల యొద్దను మా చుట్టూ 17
వున్న అన్య జనులలోనుంచి వచ్చిన వాండ్లుగాక యూ
దైయులున్ను అధికారులున్ను నూటా యేభై మంది
కూర్చుని వుండిరి.। నా నిమిత్తము ప్రతి దినమున్ను 18
వొక యెద్దున్ను యెంచబడిన మంచివైన ఆరు గొర్రె
లున్ను ఆయత్తము చేయపడినవి; యివిగాక కోళ్లున్ను
పది రోజులకు వొక మారు నానావిధములైన ద్రాక్షా
రసములున్ను ఆయత్తము చేయబడినవి; అయితే యీ
లాగున్నప్పటికిన్ని అధికారియొక్క సొమ్మున్ను నేను
అపేక్షించ లేదు, యెందుకంటే యీ జనుల దాసత్వము
బహు కఠినముగా వుండెను.। వో నా దేవుడా, యీ 19
జనులకు నేను చేసిన సకలోపకారముల నిమిత్తము నా
మేలు విషయమై నన్ను తలంచుకొమ్ము.

## 6. అధ్యాయము.

అప్పుడు సంభవించినదేమంటే, సన్బల్లథున్ను థో 1
బీయాయున్ను అరబీయుడైన గెషెమున్ను మా శత్రు
వులలో మిగిలిన వారున్ను యింకా నేను గుమ్మములకు
తలుపులు యెత్తించక పోయినప్పటిక్కిన్ని దానిలో పగులు
లేకుండా సంపూర్ణముగా గోడను కట్టినానని విని
నప్పుడు,। సన్బల్లథున్ను గెషెమున్ను ఓనో మైదాన 2
మందు వున్న గ్రామములలో వొక దాని దగ్గిర మనము

కూడుదాము రండి, అని నా యొద్దికి కబురు పంపించి
నారు. అయితే వారు నాకు యేదో హాని చేయడా
3 నకు ఆలోచించినారు. । అందుకు నేను మీ యొద్దికి
వచ్చినట్టయితే పని ఆతంకమవుతుంది; నేను గొప్ప పని
4 చేస్తున్నాను, దిగి రాలేనని కబురు పంపితిని. । అయి
నప్పటికిన్ని యీలాగునే నాలుగు మారులు నా యొద్దికి
కబురు పంపించినప్పటికిన్ని ఆ ప్రకారమే తిరిగీ నేను
5 ప్రత్యుత్తరము పంపినాను. । అంతట సన్బల్లటు తన
సేవకుని ద్వారా అయిదో మారు నా యొద్దికి విప్పి వున్న
6 వొక వుత్తరమును పంపినాడు. । అందులో వ్రాసియున్న
దేమంటే, అన్య జనులలో చెప్పబడుతున్నది, గెషె
మున్ను చెప్పుతున్నదేమంటే, యీ మాటల చొప్పున
వాండ్లపైని రాజుగా వుండేటందుకు గోడను కట్టుతూ
వున్నావు; యీ హేతువు చేతనే నీవున్ను యూదై
యులున్ను తిరుగుబాటు చేయుటకు తాత్పర్యముగా
7 వున్నారు. । మరిన్ని యూదాలో రాజు వున్నాడని
నిన్ను గూర్చి ప్రకటన చేసేటందుకు యెరూశలేములో
దీర్ఘదర్శులను నిర్ణయించినావు; కాగా రాజుకు
యీ మాటల చొప్పున తెలియచేయ బడును. అందు
నిమిత్తము యిప్పుడు మనము ఆలోచన చేతాము, రండి,
8 యని అందులో వ్రాసి యుండెను. । అందుకు యిటు
వంటి కార్యములు యెంత మాత్రమైనా మేము చేయ
డము లేదు, అవి నీ హృదయములోనుంచే నీవు కల్పిం
చుకొన్నావు అని అతని యొద్దికి నేను కబురు పంపించి
9 తిని. । యేమంటే యీ పని చేయబడకుండా మా చేతు
లకు బలహీనత కలుగును గాక అని వారు మమ్మును
భయపెట్టినారు. వో దేవుడా, యిప్పుడు నా చేతు
10 లను బలపరుచుము. । అటు తరవాత బంధించపడ్డ
మెహేథబేలుకు పుట్టిన దెలాయ్యా కుమారుడనే
షెమయాయొక్క యింటికి వచ్చినాను; అప్పుడు అత
డు చెప్పినదేమంటే, దేవుని మందిరమనే ఆలయము
లోపల మనము కూడుకొని తలుపులు వేసుకొందాము,
యెందుకంటే రాత్రి కాలమందు నిన్ను చంపడానకు
11 వారు వస్తారని పలికెను. । అప్పుడు నేను నా వంటి
వాడు పారిపో వచ్చునా? నా స్థితిలో వున్న వాడు
యెవడైనప్పటికీ తన ప్రాణమును రక్షించుకొనేటం
దుకు ఆలయములోకి వెళ్ల వచ్చునా? నేను లోపలికి
12 వెళ్లనని చెప్పినాను. । యిదుగో దేవుడు అతని పంప
లేదనిన్ని థోబీయాయున్ను సన్బల్లటున్ను అతని ప్రే
రేపించి నా విషయమై యీ దీర్ఘదర్శనము పలి
13 కించిరని నాకు తెలియ బడినది. । యిందు నిమిత్తమే
నాకు భయము పుట్టించి, నా చేత పాపము చేయించి,
నా మీద నింద వచ్చేటట్టు నన్ను గూర్చి కీడైన వర్త
మానముకు హేతువుగా అతను ప్రేరేపించ బడినాడు.।
కాగా వో నా దేవుడా, వారి వారి పనుల చొప్పున 14
థోబీయాను గూర్చిన్ని సన్బల్లటును గూర్చిన్ని నన్ను
భయపెట్ట వలెనని వున్న దీర్ఘదర్శులను గూర్చిన్ని
నోవద్యా అనే దీర్ఘదర్శురాలిని గూర్చిన్ని జ్ఞాప
కము చేసుకొనుము. । యీలాగునే ఏలూలు మాసము 15
యిరువై అయిదో దినమందు, అనగా, యేభయి రెండు
దినములకు గోడ కట్టడము సంపూర్ణమాయెను. ।
అయితే మన శత్రువులున్ను మన చుట్టు వుండే అన్య 16
జనులందరికిన్ని యీ సంగతి వినపడగానే వారి దృష్టి
లోనే వారు బహు విచారమును పొందినారు, యెం
దుకంటే యీ పని మన దేవుని వల్లనే సమకూర్చ
బడినదని తెలుసుకొన్నారు. । మరిన్ని ఆ దినములలో 17
యూదా శ్రేష్ఠులు థోబీయా యొద్దికి చాలా వుత్తర
ములు పంపినందున అవి అతనికి అందినవి. । యూదా 18
లో అనేకులు అతని యొద్ద ప్రమాణము చేసి వుండిరి,
యేమంటే అతడు ఆరహు కుమారుడైన షెఖన్యాకు
అల్లుడు; యిదిగాక యోహానాను అనే తన కుమారుడు
బెరఖ్యా కుమారుడైన మెషుల్లాము కుమార్తెను వివా
హము చేసుకొన్నాడు. । నా యెదుట వారు అతని 19
మంచి కార్యములు పలికి, నేను పలికిన మాటలను
అతనికి తెలియ చేసినారు; అందుకు థోబీయా నన్ను
భయపెట్టడానకు వుత్తరములను పంపెను.

## 7. అధ్యాయము.

అప్పుడు సంభవించినదేమంటే, నేను గోడను కట్టి, 1
తలుపులు నిలిపి, ద్వారపాలకులున్ను గాయకులున్ను
లేవీయులున్ను నిర్ణయించబడినప్పుడు, । నేను నా 2
సహోదరుడైన హనానీకిన్ని నగరికి అధిపతి అయిన
హనన్యాకున్ను యెరూశలేము పైని అధికారము యి
చ్చినాను, యెందుకంటే అతడు నమ్రతగల మనుష్యు
డై, అనేకుల కన్న యెక్కువగా దేవుని యెదుట భక్తి
పరుడున్ను అయి యుండెను. । అప్పుడు నేను వారి 3
తో బాగా ప్రొద్దెక్కే పర్యంతము యెరూశలేము
యొక్క గుమ్మములు విప్పకుండా వుండును గాక; మరి
న్ని వారు దగ్గిర నిలువబడి యుండగా తలుపులు వేయ
బడి, అడ్డు గడలు వాటికి వేయబడును గాక; యిది
గాక యెరూశలేము కాపురస్తులలో ప్రతివాడు తన
తన చౌకీ ప్రకారము తన తన యింటికి యెదురుగుం
డా కాచుకొనుటకు కావలి నిర్ణయించపడును గాక
అని చెప్పినాను. । అయితే అప్పట్లో ఆ పట్టణము 4
గొప్పదిగానున్ను పెద్దదిగానున్ను వుండెను గాని దాని
లో జనులు కొంచెము వుండిరి; యిండ్లు యింకా కట్ట
బడినవి కావు. । అప్పుడు నా దేవుడు వంశావళుల 5
చొప్పున వారు లెక్కించ బడడానకు శ్రేష్ఠులనున్ను

అధికారులనున్ను జనులనున్ను కూర్చుడానకు నా హృద
యములో తలంపు పుట్టించెను; యీలాగునే ముందు
వచ్చిన వారిని గూర్చిన వంశావళి గ్రంథము నాకు కన
6 పడెను, అందులో వ్రాయబడినదేమంటే, । జెరుబ్బా
బెలు, యేషూవ, నెహెమ్యా, అజర్యా, రయమ్యా, నహ
మానీ, మొర్దెఖై, బిల్షాను, మిస్పెరెతు, బిగ్వై, నెహూ
ము, బయనా, అనే వాండ్లతో కూడా బాబెలు రాజ
యిన నెబూఖద్నెస్సరు చేత చెరలోకి కొంచపోబడి,।
7 తిరిగీ యెరూశలేముకున్ను యూదాకున్ను ప్రతివాడు
తన తన పట్టణమునకు వచ్చిన వారు వీరే; ఇశ్రాయేలు
8 జనులయొక్క మనుష్యుల సంఖ్య యిదే; । అది యేలా
గంటే, ఫరోషు పుత్రులు రెండు వేల నూట డెబ్బయి
9 యిద్దరున్ను.। షెఫథీయా పుత్రులు మున్నూట డెబ్బయి
10 యిద్దరున్ను. । ఆరహు పుత్రులు ఆరునూట యేభయి
11 యిద్దరున్ను. । యేషూవ యోవాబు సంబంధులైన పహ
త్మోయాబు పుత్రులు రెండు వేల యెనమన్నూట పద్ధె
12 నిమిది మందిన్ని. । ఏలాము పుత్రులు వెయ్యిన్ని యి
13 నూట యేభయి నలుగురున్ను. । జత్తూ పుత్రులు యె
14 నమన్నూట నలభయి అయిదుగురున్ను. । జక్కయి
15 పుత్రులు యేడున్నూట అరువై మందిన్ని. । బానీ పు
16 త్రులు ఆరునూట నలభయి యెనిమిది మందిన్ని.। బేబై
పుత్రులు ఆరునూట యిరువై యెనిమిది మందిన్ని. ।
17 అజ్గాదు పుత్రులు రెండు వేల మున్నూట యిరువై
18 యిద్దరున్ను.।అదోనీకాము పుత్రులు ఆరునూట అరువై
19 యేడుగురున్ను. । బిగ్వై పుత్రులు రెండు వేల అరువై
20 యేడుగురున్ను.। ఆదీను పుత్రులు ఆరునూట యేభయి
21 అయిదుగురున్ను. । హిజ్కియా బంధువుడైన అథేరు
22 పుత్రులు తొంభయి యెనిమిది మందిన్ని. । హాషుము
పుత్రులు మున్నూట యిరువై యెనిమిది మందిన్ని. ।
23 బెస్సయి పుత్రులు మున్నూట యిరువై నలుగురున్ను.।
24,25 హారీఫు పుత్రులు నూట పన్నెండుగురున్ను. । గిబో
26 ను పుత్రులు తొంభై అయిదుగురున్ను.। బేత్లెహేము
నెథోఫా మనుష్యులు నూట యెనభై యెనిమిది మంది
27 న్ని.। అనాతోతు మనుష్యులు నూట యిరువైయెనిమిది
28 మందిన్ని.।బేతజ్మావెతు మనుష్యులు నలుభై యిద్దరున్ను.।
29 కిర్యత్యెహారీము, కెఫీరా, బెయేరోతు మనుష్యులు యే
30 డున్నూట నలభై ముగ్గురున్ను. । రామా, గాబ మనుష్యులు
31 ఆరునూట యిరువై వొకరున్ను. । మిక్మషు మనుష్యులు
32 నూట యిరువై యిద్దరున్ను.।బేతేలు, హాయి మనుష్యులు
33 నూట యిరువై ముగ్గురున్ను. । నెబో అని పిలువబడిన
34 వేరే స్థలపు మనుష్యులు యేభయి యిద్దరున్ను.।ఏలాము
అని చెప్పబడిన వేరే స్థలపు మనుష్యులు వెయ్యిన్ని
35 యిన్నూట యేభయి నలుగురున్ను. । హారీము పుత్రులు
36 మున్నూట యిరువై మందిన్ని. । యెరిఖో పుత్రులు
మున్నూట నలభయి అయిదుగురున్ను. । లోదు, హదీదు, 37
ఓనెలొయొక్క పుత్రులు యేడున్నూట యిరువై వొక
రున్ను. । సెనాయా పుత్రులు మూడు వేల తొమ్మన్నూట 38
ముప్ఫయి మందిన్ని. । యేషూవ యింటి వారైన యెదా 39
యా పుత్రులయిన అర్చకులు తొమ్మన్నూట డెబ్బయి
ముగ్గురున్ను. । ఇమ్మెరు పుత్రులు వెయ్యిన్ని యేభయి 40
యిద్దరున్ను. । పష్హూరు పుత్రులు వెయ్యిన్ని యిన్నూట 41
నలభయి యేడుగురున్ను. । హారీము పుత్రులు వెయ్యిన్ని 42
పదిహేడుగురున్ను. । లేవీయులైన యేషూవ, హోదవ 43
యా, కద్మీయేలు పుత్రులు డెబ్బయి నలుగురున్ను. ।
గాయకులయిన ఆసాపు పుత్రులు నూట నలభయి యెని 44
మిది మందిన్ని. । ద్వారపాలకులైన షల్లూము పుత్రులు, 45
అథేరు పుత్రులు, థల్మోను పుత్రులు, అక్కూబు పుత్రు
లు, హథీథా పుత్రులు, షోబాయి పుత్రులు, నూట
ముప్ఫయి యెనిమిది మందిన్ని. । నెతేనీయులైన సీహా 46
పుత్రులు, హశూఫా పుత్రులు, థబాయోతు పుత్రు
లు, । కెరోసు పుత్రులు, సీయా పుత్రులు, పాదోను 47
పుత్రులు, । లెబానా పుత్రులు, హగాబా పుత్రులు, 48
షల్మయి పుత్రులు, । హానాను పుత్రులు, గిద్దెలు పుత్రు 49
లు, గహరు పుత్రులు, । రెవాయా పుత్రులు, రెస్సీను 50
పుత్రులు, నెకోదా పుత్రులు, । గజ్జాము పుత్రులు, 51
ఉజ్జా పుత్రులు, పాసేయహు పుత్రులు, । బేసై పు 52
త్రులు, మెహూనీము పుత్రులు, నెఫూసీము పుత్రు
లు, । బక్బూకు పుత్రులు, హకూఫా పుత్రులు, హ 53
ర్హూరు పుత్రులు, । బస్లీతు పుత్రులు, మెహీదా పు 54
త్రులు, హర్షా పుత్రులు, । బర్కోను పుత్రులు, 55
సీసెరా పుత్రులు, తామా పుత్రులు, । నెస్సీయహు 56
పుత్రులు, హథీఫా పుత్రులు. । సొలొమోను నౌకర్ల 57
పుత్రులు: సోటై పుత్రులు, సోఫెరెతు పుత్రులు,
పెరీదా పుత్రులు, । యహలా పుత్రులు, దర్కోను 58
పుత్రులు, గిద్దేలు పుత్రులు, । షెఫథీయా పుత్రులు, 59
హత్తీలు పుత్రులు, సెబాయీము సంబంధమైన పోఖె
రెతు పుత్రులు, ఆమోను పుత్రులు. । యీ నెతేనీ 60
యులు మొదలయిన వారందరున్ను సొలొమోను నౌ
కర్ల పుత్రులున్ను మున్నూట తొంభయి యిద్దరు
అయి వుండిరి. । తెల్మెలహూ, తెల్హర్షా, కెరూబు, 61
అదోను, ఇమ్మెరు, మొదలైన యీ స్థలములనుంచి వీరు
పైకి వెళ్లినారు గాని తమ తండ్రుల యిండ్లను చూ
పించ లేకుండానున్ను ఇశ్రాయేలు సంబంధులు అవు
దురో కారో తమ వంశావళి పత్రికెను చూపించ
లేక పోయినారు. । దెలాయ్యా పుత్రులు, థోబీయా 62
పుత్రులు, నెకోదా పుత్రులు ఆరునూట నలభయి
యిద్దరు అయి వుండిరి. । అర్చకుల తాలూకు వారు 63
హబాయ్యా పుత్రులు, కోస్సు పుత్రులు, బర్జిల్లయి

పుత్రులు, గిలాదీయులైన బర్జిల్లయి కుమార్తెలలో
వొక తెను తీసుకొన్నటువంటిన్ని వారి పేరుచేత పిలువ
64 బడిన బర్జిల్లయి పుత్రులున్ను. । వీరు తమ తమ వంశా
వళుల చొప్పున యెంచబడ్డ వారిలో వారి పద్దు పుస్త
కము చూచుకొన్నప్పుడు అందులో అది కనపడక
పోయెను, కాగా వారు అర్చకులలోనుంచి కేటించ
65 బడి అపవిత్రులైనట్టు వుండిరి. । అప్పుడు తిర్షాతా
(అనగా అధికారి) వారితో ఊరీము తుమ్మీము అనే
వాటితో కూడా వొక అర్చకుడు నిలువబడే పర్యం
తమూ మహా పరిశుద్ధ వస్తువులను మీరు తినకూడదని
66 చెప్పెను. । యీ సమూహమంతా నలభయి రెండు వేల
67 మున్నూట అరువై మంది అయి వుండిరి. । వీరు గాక
వారి దాసులున్ను దాసీలున్ను కూడా యెంతమంది
అంటే, యేడు వేల మున్నూట ముప్ఫయి యేడుగురు
మనుష్యులున్ను, గాయకులలో స్త్రీ పురుషులున్ను యి
68 న్నూట నలభయి అయిదుగురు అయి వుండిరి. । వారి
గుర్రములు యేడ్నూట ముప్ఫయి ఆరున్ను; వారి వేస
69 డములు యిన్నూట నలభయి అయిదున్ను. । వారి వొం
టెలు నన్నూట ముప్ఫయి అయిదున్ను; వారి గాడ్ద
భములు ఆరు వేల యేడ్నూట యిరువైయిన్ని అయి
70 వుండెను. । పితృలలో ప్రధానులైన కొంత మంది పనికి
కొంత సహాయము చేసినారు; తిర్షాతా అనే అధి
కారి ఖజానా పెట్టెలో బంగారము వెయ్యి డర్క
మోనీములనున్ను యేభయి బోళములనున్ను యేనూట
ముప్ఫయి అర్చకుల వస్త్రములనున్ను వేసి యిచ్చి
71 నాడు. । మరిన్ని పితృలలో ప్రధానులైన వారు కొందరు
ఖజానా పెట్టెలో బంగారము యిరువై వేల డర్క
మోనీములున్ను వెండి రెండు వేల యిన్నూరు మానీ
72 ములున్ను వేసినారు. । మిగిలిన మనుష్యులున్ను బంగా
రము యిరువైవేల డర్కమోనీములనున్ను వెండి రెండు
వేల మానీములనున్ను అరువై యేడు అర్చకుల వస్త్ర
73 ములనున్ను యిచ్చినారు. । ఆలాగున అర్చకులు లేవీ
యులు ద్వారపాలకులు గాయకులు నెతేనీయులు ఇశ్రా
యేలీయులు మొదలైన వారందరున్ను తమ తమ పట్ట
ణముల యందు నివాసము చేసినారు; మరిన్ని యేడో
నెల సమీపించినప్పుడు ఇశ్రాయేలు పుత్రులు తమ
పట్టణముల యందు వుండిరి.

## 8. అధ్యాయము.

1 అప్పుడు జనులందరున్ను వొక జట్టు అయి, నీటి
ద్వారము యెదుట వున్న వీధిలో కూడి, ఇశ్రాయే
లుకు యెహోవా ఆజ్ఞాపించిన మోషే న్యాయపు గ్రం
థమును తెమ్మని ఎజ్రా అనే లేఖికునితో చెప్పినారు. ।
2 అప్పుడు అర్చకుడైన ఎజ్రా యేడో మాసము మొదటి
దినములో బాగా వినే పాటి బుద్ధి గల స్త్రీ పురుష
సమూహమంతటి ముందర ఆ న్యాయ ప్రమాణ గ్రంథ
మును తీసుకొని వచ్చి, । నీటి ద్వారము యెదుట వున్న 3
వీధిలో వుదయము మొదలుకొని మధ్యాహ్నము వరకు
నిలుచున్న ఆ స్త్రీ పురుషులకున్ను బాగా విన గల వారం
దరికిన్ని చదివి వినుపించగా, ఆ జనులందరున్ను ఆ
న్యాయ గ్రంథమును శ్రద్ధతో విన్నారు. । అంతట లేఖి 4
కుడనే ఎజ్రా ఆ పని కోసమే కర్రతో చేయబడిన
వొక పీఠము మీద నిలువబడెను; మరిన్ని అతని దగ్గిర
కుడిపార్శ్వమందు మత్తిత్యా, షెమ, అనాయా, ఊరీ
యా, హిల్కీయా, మయశేయా, అనేవారున్ను; అతని
యెడమ పక్కను పెదాయా, మిషాయేలు, మల్కీయా,
హషుము, హష్బదానా, జెకర్యా, మెషుల్లాము, అనే
వారున్ను నిలుచుని వుండిరి. । అప్పుడు ఎజ్రా అందరి 5
కన్నా పైగా వుండి జనులందరూ చూస్తూ వుండగా
గ్రంథమును విప్పెను; ఆలాగున విప్పగానే జనులందరు
నిలువబడినారు. । ఎజ్రా ఘన దేవుడైన యెహోవాను 6
స్తుతించగా జనులందరు తమ చేతులను యెత్తి ఆమేన్,
ఆమేన్, అని పలుకుతూ, భూమిమీద తమ ముఖములు
వంచుకొని సాష్టాంగముగా యెహోవాను ఆరాధిం
చిరి. । యిది గాక యేషూవ, బానీ, షేరేబ్యా, యా 7
మీను, అక్కూబు, శబ్బెతై, హోదీయా, మయశేయా,
కెలీథా, అజర్యా, యోజాబాదు, హానాను, పెలాయా,
లేవీయులు మొదలైన వారున్ను జనులకు న్యాయము
యొక్క తాత్పర్యమును తెలియ చేసినారు; జనులున్ను
తమ తమ స్థలములలో నిలుచుని వుండిరి. । యీలా 8
గునే వారు దేవుని గ్రంథమును స్పష్టముగా చదివి,
జనులు బాగా తెలుసుకొనేటట్టు దాని అర్థము చెప్పి
నారు. । అప్పుడు తిర్షాతా అనగా అధికారియైన 9
నెహెమ్యాయున్ను అర్చకుడనే లేఖికుడైన ఎజ్రాయు
న్ను జనులకు బోధించే లేవీయులున్ను మీరు దుఃఖప
డవద్దు,యేడవవద్దు, యీ దినము మీ దేవుడైన యెహో
వాకు పరిశుద్ధమాగాక అని జనులతో చెప్పినారు,
యేమంటే న్యాయ గ్రంథపు మాటలు విన్నప్పుడు జను
లందరూ యేడ్చినారు. । మరిన్ని అతడు వారితో మీ 10
మార్గములో వెళ్లండి, కొవ్వినది భక్షించి, మధురమై
నది తాగండి; యెవరి నిమిత్తము యేమీ యింకా సిద్ధము
చేయబడ లేదో వారికి వంతులు పంపించండి, యెందు
కంటే యీ దినము మన ప్రభువుకు పరిశుద్ధమవును;
మీరు దుఃఖపడకండి; యెహోవా ఆనందమే మీకు
బలమవును. । ఆలాగున లేవీయులు జనులందరిని వూ 11
రార్చి, వాండ్లతో మీరు మౌనముగా వుండండి; మీకు
దుఃఖము అక్కరలేదు; యిది పరిశుద్ధమైన దినము అని
పలికిరి, । ఆ తరువాత జనులు తినుటకున్ను తాగుట 12

కున్ను వంతులు పంపించుటకున్ను సంభ్రమముగా
వుండుటకున్ను తమ తమ మార్గమున వెళ్లినారు, యే
మంటే వారికి తెలియ చేయబడ్డ మాటలన్ని వారు
13 గ్రహించినారు. । రెండో దినమందు జనులను పితృ
లలో శ్రేష్ఠులైన వారున్ను అర్చకులు లేవీయులు మొద
లైన వారున్ను న్యాయ గ్రంథపు మాటలు గ్రహించ
గలందులకు లేఖికుడనే ఎజ్రా యొద్దికి కూడి వచ్చి
14 నారు. । అయితే మోషే ద్వారా యెహోవా ఆజ్ఞాపిం
చిన గ్రంథములో యేడో మాసపు వుత్సవ కాలమందు
పర్ణ శాలలో ఇశ్రాయేలు పుత్రులు నివాసము చేయ
15 వలెనని వ్రాసి యున్నది. । మరిన్ని వారు తమ పట్టణ
ములలోనున్ను యెరూశలేములోనున్ను ప్రచురము
చేసి చెప్పవలసినదేమంటే, మీరు పర్వతముకు పోయి,
ఇప్పకొమ్మలనున్ను ఎత్యా చెట్టు కొమ్మలనున్ను హడాసు
చెట్టు కొమ్మలనున్ను తిమ్మారిము చెట్టు కొమ్మలనున్ను
వేరే గుబురుగా వున్న చెట్ల కొమ్మలనున్ను తెచ్చి, పర్ణ
శాలలు కట్టుమని అందులో వ్రాసి యున్నది. ।
16 ఆలాగునే జనులు బయిలువెళ్లి వాటిని తెచ్చి, ప్రతి
వాడు తమ యింటి మీదనున్ను తమ లోగిళ్లలోనున్ను
దైవ మందిరపు లోగిటిలోనున్ను నీటి ద్వారపు వీధిలో
నున్ను ఎఫ్రయీము ద్వారపు వీధిలోనున్ను పర్ణశా
17 లలు కట్టుకొన్నారు. । మరిన్ని చెరలోనుంచి తిరిగి వచ్చిన
వారి సమూహమున్ను పర్ణశాలలు కట్టి వాటి కింద
కూర్చున్నారు, యెందుకంటే నూను కుమారుడైన యే
షూవ దినములు మొదలుకొని అది వరకు ఇశ్రాయేలు
పుత్రులు ఆలాగున చేయలేదు; అప్పుడు వారికి బహు
18 సంతోషము పుట్టెను. । యిదిన్ని గాక మొదటి దినము
నుంచి కడ దినము వరకు అతడు దైవన్యాయపు గ్రంథ
మందు చదువుతూ వుండెను; వారు యీ వుత్సవము
యేడు దినముల వరకు ఆచరించి, యెనిమిదో దినమందు
మర్యాద చొప్పున పరిశుద్ధపు సమూహముగా కూడి
వచ్చినారు.

## 9. అధ్యాయము.

1 ఇప్పుడు యీ నెల యిరువై నాలుగో దినమందు
ఇశ్రాయేలు వుపవాసము చేస్తూ, గోనె పట్టెలను ధరిం
2 చుకొని, పై బుగ్గి పోసుకొని, కూడి వుండిరి. । అయితే
ఇశ్రాయేలు పుత్రులు సకలమైన అన్య పుత్రులనుంచి
తాము కేటించుకొని, తమ పాపములనున్ను తమ పితృల
3 పాపములనున్ను నిలువబడి వొప్పుకున్నారు. । మరిన్ని
వారు తమ స్థలమందు నిలువబడి, ఆ దినములో నాలు
గో వంతు పర్యంతము తమ దేవుడైన యెహోవా
న్యాయ గ్రంథములో చదివినారు; మిగిలిన నాలుగో
వంతు పర్యంతమున్ను వారు తమ పాపములను వొప్పు
కొని దేవుడైన యెహోవాను ఆరాధించిరి. । లేవీయు 4
లలో యేషూవ, బానీ, కద్మీయేలు, షెబన్యా, బున్నీ,
షేరేబ్యా, బానీ, కెనానీ, మొదలైన వారు మెట్ల మీద
నిలువబడి, తమ దేవుడైన యెహోవాకు వడిగా
మొర్ర పెట్టినారు. । అప్పుడు లేవీయులైన యేషూవ, 5
కద్మీయేలు, బానీ, హషబ్నెయా, షేరేబ్యా, హోదీ
యా, షెబన్యా, పెతహ్యా, అనే వీరు చెప్పిన మాట,
నిలువబడి మీ దేవుడైన యెహోవాను స్తుతించండి
అని పలికి, ప్రార్థించినదేమంటే, సకలాశీర్వచన
స్తోత్రముల కన్నా వున్నతముగా వుండే నీ ఘనమైన
నామము యెన్నటికిన్ని స్తుతించబడును గాక. । నీవు 6
వొక్కడవే యెహోవావు అయి వున్నావు; నీవే ఆకా
శమును అనగా ఆకాశముల ఆకాశమునున్న వాటిలో
వుండే సైన్యమునున్ను భూమినిన్ని దానిలో వుండేది
అంతటినిన్ని సముద్రములనున్ను వాటిలో వుండేదంత
టినిన్ని సృష్టించి, వాటినన్నిటినీ కాపాడుతున్నావు;
ఆకాశసైన్యమంతా నిన్నే సేవిస్తున్నది. । దేవుడవైన వో 7
యెహోవా, నీవే అబ్రామును యెంచుకొని, కల్దీయు
లయొక్క ఊరు అనే స్థలమునుంచి అతని యివతలకు
తీసుకొని వచ్చి, అతనికి అబ్రాహామనే పేరు బెట్టినా
వు. । మరిన్ని అతనికి విశ్వాసపు హృదయము కలదని 8
చూచి, అతనితో వొడంబడికెను చేసి, అతని సంతతికి
కెనయానీయుల దేశమునున్ను హిత్తీయుల దేశమునున్ను
ఎమోరీయుల దేశమునున్ను పెరిజ్జీయుల దేశమునున్ను
యెబూసీయుల దేశమునున్ను గిర్గాషీయుల దేశము
నున్ను యిస్తానని చెప్పిన వాడవు నీవే. । ఆ ప్రకారమే 9
నీవు నీతిమంతుడవై వున్నావు గనుక నీ మాటల చొప్పు
నే నీవు జరిగించితివి; మరిన్ని మిస్రయీములో మా
పితృలు పొందిన శ్రమను నీవు చూచితివి; యెర్ర సము
ద్రము యొద్ద వారి మొర్రను నీవు వింటివి. । ఫరో 10
మీదనున్ను అతని సేవకులందరి మీదనున్ను అతని
దేశపు జనులందరి మీదనున్ను గురుతులనున్ను అద్భు
తములనున్ను చూపించినావు, యేమంటే వారు యెడల
వారు బహు అతిశయముగా ప్రవర్తించినారని నీకు
తెలుసును; కాగా యీ దినములో వున్నట్టుగానే నీవు
కీర్తిని పొంది వున్నావు. । మరిన్ని వారి యెదుట నీవు 11
సముద్రమును విభాగించినందున వారు సముద్రమధ్యను
పొడినేల మీద నడిచినారు; వారిని తరిమిన వారిని
నీవు గొప్ప వుదకములలో రాతిని పడవేసినట్టే అగాధ
జలములలో పడవేసినావు. । యిదిన్ని గాక పగటి కాల 12
మందు వారిని మేఘస్తంభము చేతనున్ను రాత్రి కాల
మందు వారు వెళ్లవలసిన మార్గమందు వెలుగు నిమి
త్తము అగ్ని స్తంభము చేతనున్ను వారిని తోడుకొని
పోయినావు. । సీనై పర్వతము మీదికి నీవు దిగి వచ్చి 13

ఆకాశమునుంచి వారితో మాట్లాడి వారికి యుక్తమైన
న్యాయపు తీర్పులనున్ను నిజమైన ఆజ్ఞలనున్ను మంచి
కట్టడలనున్ను నిబంధనలనున్ను నీవు దయచేసినావు.।
14 వారికి నీ పరిశుద్ధమైన సబ్బాతును తెలియ చేసి, నీ
సేవకుడైన మోషే ద్వారా న్యాయములనున్ను కట్టడ
లనున్ను నిబంధనలనున్ను వారికి ఆజ్ఞాపించినావు.।
15 వారి ఆకలి తీర్చడానకు ఆకాశమునుంచి రొట్టెను
న్ను వారి దాహము తీర్చేటందుకు కొండలోనుంచి
వుదకమునున్ను యివతలకు తెచ్చి యిచ్చినావు; వారికి
యిస్తానని ప్రమాణము చేసిన భూమిని అనుభవించు
16 టకు వారికి వాగ్దత్తము చేసినావు.। అయితే వారున్ను
మా పితృలున్ను గర్వముగా నడుచుకొని, తమ మెడ
లను కఠిన పరచుకొని, నీ ఆజ్ఞలకు చెవి నొగ్గకుండా
17 వుండిరి.। వారు విధేయముగా వుండేటందుకు మనస్సు
లేక, వారిలో నీవు చేసిన అద్భుతములను జ్ఞాపకము
చేసుకొనక, వారి మెడలను కఠిన పరచుకొని, వారి
దాసత్వముకు తిరిగి వెళ్లుటకు వొక అధికారిని యెంచు
కొని నీ మీద తిరుగుబాటు చేసినారు; అయితే నీవు
క్షమించుటకు సిద్ధమైన దేవుడవై వున్నావు; కృపయు
న్ను కనికరమున్ను గలవాడవై, కోపము త్వరితముగా
తెచ్చుకోక, బహు వాత్సల్యముగల వాడవై వున్నం
18 దున వారిని నీవు విడిచిపెట్టలేదు.। మరిన్ని వారు వొక
పోత దూడను చేసి, మిస్రయీమునుంచి మిమ్మును
యివతలకు తెచ్చిన నీ దేవుడు యిదే అని పలికి, నీకు
19 బహు విసుపు పుట్టించినప్పుడున్ను;। వారు వనాంతర
ములో వున్నప్పుడు నీకు అతి విస్తారమైన కృప గలిగి
వారిని విసర్జించినావు కావు; మార్గములో వారిని
కొంచపోవుటకు పగలు మేఘస్తంభమైనా వారిని మా
ర్గములో నడిపించుటకు వెలుగు నిమిత్తమై రాత్రిలో
అగ్ని స్తంభమైనా వారి యొద్దనుంచి వెళ్లిపోలేదు.।
20 వారిని బోధ పరచడానకు నీ వుత్తమమైన ఆత్మను
దయచేస్తివి; వారి నోటినుంచి నీ మాన్‌హును తీసి
వేయలేదు; వారి దాహము కొరకు వుదకమును యిస్తివి.।
21 నిజముగా వనాంతరములో వారికి యేమీ తక్కువ
లేకుండా నలుబై సంవత్సరముల మట్టుకు పోషించి
నావు; వారి వస్త్రములు పాతగిలినవి కావు; వారి
22 కాళ్లకు వాపు రాలేదు.। యిదిన్ని గాక వారికి రాజ్య
ములనున్ను జనాంగములనున్ను యిచ్చి, మూలలలోను
నీవు వారిని విభాగించినావు; ఆలాగున వారు సీహో
నుయొక్క భూమినిన్ని హెష్బోను రాజుయొక్క భూ
మినిన్ని బాషానుకు రాజైన ఓగుయొక్క భూమినిన్ని
23 వారు స్వతంత్రించుకొన్నారు.। వారి పుత్రులనున్ను
నీవు ఆకాశపు నక్షత్రముల వలెనే విస్తారముగా చేసి,
వారు లోపలికి వెళ్లి స్వతంత్రించుకొన గలందులకు
వారి పితృలకు నీవు వాగ్దత్తము చేసిన భూమిలోకి వా
రిని తెప్పించినావు.। ఆలాగునే ఆ పుత్రులు లోపలికి 24
వెళ్లి ఆ భూమిని స్వతంత్రించుకొన్నారు; మరిన్ని నీవు
కెనయానీయులనే ఆ భూమి కాపురస్తులను జయించి,
వారికి మనస్సు వచ్చినట్టు చేయడానకు వారి రాజుల
నున్ను ఆ భూమి జనులనున్ను వారి చేతులలోకి అప్ప
గించినావు.। అప్పుడు వారు బలమైన పట్టణములనున్ను 25
కొవ్విన భూమినిన్ని స్వాధీన పరచుకొని, సకలమైన
పదార్థములతో నిండి వున్న యిండ్లనున్ను తవ్విన నూతు
లనున్ను ద్రాక్ష తోటలనున్ను ఇప్ప తోటలనున్ను
బహు విస్తారముగా ఫలించే చెట్లనున్ను అనుభవించి
నారు; ఆలాగున వారు తిని, తృప్తి బొంది, మదించి,
నీ విస్తారమైన వుపకారమందు బహుగా సంతోషించి
నారు.। అయినప్పటికిన్ని వారు అవిధేయులై నీ మీద 26
తిరుగుబాటు చేసి, వారి వీపు వెనక నీ న్యాయములను
తోసివేసి, నీ తట్టు తిరగ వలెనని వారికి సాక్ష్యము పలి
కిన నీ దీర్ఘదర్శులను చంపి, నీకు బహుగా విసుపు
పుట్టించినారు.। అందు కొరకు వారి శత్రువుల చేతు 27
లలోకి నీవు వారిని అప్పగించినావు, వారు వారిని
హింస పెట్టినారు; వారి శ్రమ కాలమందు వారు నీకు
మొర్ర పెట్టినప్పుడు నీవు ఆకాశమునుంచి ఆలకించి,
నీ అతి విస్తారమయిన కృప చొప్పున వారిని శత్రు
వుల చేతులలోనుంచి విడిపించేటందుకు వారికి రక్షకు
లను దయచేసినావు.। అయితే వారు నెమ్మదిని పొందిన 28
తరువాత నీ యెదుట వారు మళ్లీ కీడు చేసినారు;
కాగా నీవు వారిని వారి శత్రువుల చేతులలోకి అప్ప
గించినావు; వారు వారి మీద అధికారము చేసినారు;
అయినప్పటికిన్ని వారు తిరిగీ వచ్చి నీకు మొర్ర పెట్టి
నప్పుడు ఆకాముశనుంచి నీవు ఆలకించి, నీ కృప చొ
ప్పున చాలా మార్లు వారిని నీవు విడిపించినావు.।
యిదిన్ని గాక నీవు నీ న్యాయమును విచారించ వలె 29
నని వారిని తిరిగీ తేవడానకు వారి విషయమై సాక్ష్య
ము పలికినావు; అయినప్పటికిన్ని వారు గర్వముగా
ప్రవర్తించి, నీ ఆజ్ఞలకు లోపడక, నీ నిబంధనలకు విరో
ధముగా పాపము చేసి, వారి భుజమును వెనుకకు తీసి,
వారి మెడను కఠిన పరచుకొని వినక వుండిరి; నీ నిబం
ధనలను గైకొనే వాడు వాటివల్ల బ్రతుకును.। అయితే 30
నీవు అనేక సంవత్సరముల మట్టుకు వారి యెడల
వోర్చి, నీ దీర్ఘదర్శులయందు వున్న నీ ఆత్మచేత
వారి విషయమై నీవు సాక్ష్యమును పలికినావు; అయితే
వారు వినకపోయినారు; కాగా వారిని దేశములలో
వున్న జనుల చేతులలోకి నీవు అప్పగించినావు.।నీ గొప్ప 31
వుపకారములచేత వారిని నీవు బొత్తిగా నాశనము చేయ
కనున్ను వారిని విడిచిపెట్టకనున్ను వుంటివి, యెందు

కంటే నీవు కృపయున్ను వాత్సల్యమున్ను గల దేవు
32 డవై వున్నావు. । అయితే యిప్పుడు గొప్పయున్ను
ఘనమున్ను భయంకరత్వమున్ను గల ఓ మా దేవుడా,
నీవు వొడంబడికె చొప్పున జరిగించి, కృపను చూపే
వాడవై వున్నావు; అష్షూరు రాజుల దినములనుంచి
యీ దినము వరకున్ను మా మీదనున్ను మా రాజులమీ
దనున్ను శ్రేష్ఠుల మీదనున్ను మా అర్చకుల మీదనున్ను
మా దీర్ఘదర్శుల మీదనున్ను మా పితృల మీద
నున్ను నీ జనులందరి మీదనున్ను వచ్చిన శ్రమ అంతా
నీ యెదుట కొంచెమని నీకు కనుపడక పోవును గాక.।
33 అయితే మా మీదికి వచ్చే సమస్తమైన శ్రమ విషయమై
నీవు నీతిమంతుడవై వున్నావు; నీవు యుక్తముగానే
ప్రవర్తించినావు గాని మేము దుర్మార్గముగా
34 ప్రవర్తించినాము. । మా రాజులైనా మా శ్రేష్ఠులైనా
మా అర్చకులైనా మా పితృలైనా నీ న్యాయమును
గైకొనలేదు; నీవు వారికి విరోధముగా పలికిన సాక్ష్య
35 ములనైనా నీ ఆజ్ఞలనైనా వారు వినడములేదు. । యే
మంటే వారి రాజ్యమందు వారు నీకు సేవ చేయ లేదు;
వారికి నీవు చూపించిన గొప్ప వుపకారమును తలం
చక, నీవు వారికి యిచ్చిన విస్తారమైన కొవ్విన భూమి
యందు వారు నిన్ను సేవించలేదు; వారి దుర్మార్గ
36 ములనుంచి వారు తిరుగలేదు. ।యిదుగో మేము యీ
దినమందు సేవకులమై వున్నాము; మా పితృలకు దాని
ఫలమునున్ను దాని సమృద్ధినిన్ని అనుభవించుమని యే
భూమిని వారికి దయచేసినావో అందులో మేము
37 సేవకులమై వున్నాము. । మరిన్ని మా పాపముల విష
యమై మా మీద నీవు వుంచిన రాజులకు అవి అతి
విస్తారమైన ఫలము యిచ్చును; మా శరీరముల పైనిన్ని
మా పశువుల పైనిన్ని వారి మనస్సు వచ్చినట్టు అధికా
రము చేస్తున్నారు గనుక మాకు చాలా శ్రమ కలిగి
38 యున్నది. । యిదంతా యీలాగున వుండుటచేత మేము
వొక స్థిరమయిన వొడంబడికెను చేసుకొని వ్రాసు
కొంటున్నాము; మా శ్రేష్ఠులున్ను లేవీయులున్ను అర్చ
కులున్ను దానికి ముద్రలను వేస్తున్నారు అని ప్రా
ర్థించిరి.

## 10. అధ్యాయము.

1 అయితే ముద్రలు వేసినవారెవరంటే, తిర్షాతా
అనగా హఖల్యా కుమారుడైన నెహెమ్యాయున్ను,
2,3 సిద్కీయా,। శెరాయా, అజర్యా, ఇర్మీయా,। పష్హూరు,
4 అమర్యా, మల్కీయా, । హత్తూషు, షెబన్యా, మల్లూ
5,6 ఖు, । హారీము, మెరెమోతు, ఓబద్యా, । దానియేలు,
7 గిన్నెతోను, బారూఖు, । మెషుల్లాము, అబీయా, మీ
8 యామీను, । మయజ్యా, బిల్గయి, షెమయా; వీరంద
రున్ను అర్చకులై వుండే వారు. । లేవీయులు యెవరం 9
టే, అజన్యా కుమారుడైన యేషూవయున్ను, హేనా
దాదు కుమాళ్లయిన బిన్నూవీయున్ను, కద్మీయేలున్ను;।
వారి సహోదరులైన షెబన్యా, హోదీయా, కెలీథా, 10
పెలాయా, హానాను,। మీఖా, రెహోబు, హషబ్యా,। 11
జక్కూరు, షేరేబ్యా, షెబన్యా, । హోదీయా, 12,13
బానీ, బెనీను.।జనులలో శ్రేష్ఠులు యెవరంటే, ఫరోషు, 14
పహత్మోయాబు, ఏలాము, జత్తూ, బానీ, । బున్నీ, 15
అజ్గాదు, బేబై, । అదోనీయా, బిగ్వయి, ఆదీను, । 16
జథేరు, హిజ్కీయా, అజ్జూరు, । హోదీయా, హ 17,18
షుము, బెస్సయి,।హారీఫు, అనాతోతు, నేబై,। మగ్పీ 19,20
యాషు, మెషుల్లాము, హేజీరు, । మెషేజబేలు, సా 21
దోకు, యెద్దూవ, । పెలథ్యా, హానాను, అనాయా, । 22
హోషేయా, హనన్యా, హష్షూబు, । హల్లోహే 23,24
షు, పిల్హా, షోబేకు, । రెహూము, హషమ్నా, మయ 25
శేయా,। అహీయా, హానాను, ఆనాను,। మల్లూఖు, 26,27
హారీము, బయనాయున్ను. । అయితే జనులలో తతి 28
మ్మా వారు అనగా అర్చకులున్ను లేవీయులున్ను ద్వార
పాలకులున్ను గాయకులున్ను నెతేనీయులున్ను దేవుని
న్యాయము విషయమై భూములలో వుండే జనులనుంచి
తమ్ము తాము కేటించుకొన్న వారందరున్ను వారి భా
ర్యలున్ను వారి కుమారులున్ను వారి కుమార్తెలున్ను
తెలివిన్ని బుద్ధిన్ని గల ప్రతివాడున్ను తమ సహో
దరులతోనున్ను తమ శ్రేష్ఠులతోనున్ను కలుసుకొని
వొట్టు పెట్టుకొని, । దేవుని సేవకుడైన మోషే ద్వారా 29
యివ్వబడిన దేవుని న్యాయ ప్రకారముగా నడుచుకుం
దామనిన్ని, మన ప్రభువైన యెహోవాయొక్క నిబం
ధనల చొప్పుననున్ను ఆయన కట్టడల చొప్పుననున్ను
జరిగించి వాటిని గైకొందుమనిన్ని ప్రమాణము చేసి
నారు. । మరిన్ని మేము దేశపు జనులకు మా కుమార్తె 30
లను యివ్వకనున్ను వారి కుమార్తెలను మా కుమా
రుల కొరకు పుచ్చుకొనకనున్ను వుందుమనిన్ని;। దేశపు 31
జనులు సబ్బాతు దినమందు అమ్మకపు వస్తువులనైనా
భోజనపు వస్తువులనైనా అమ్మడానకు తెస్తే సబ్బాతు
దినములో గానీ పరిశుద్ధ దినములో గానీ వాటిని మేము
కొనకుండానున్ను, యేడో సంవత్సరమును విడచిపెట్టి
ఆ సంవత్సరములో వున్న బాకీదార్ల బాకీలు వదలి
వేతుమనిన్ని నిర్ణయించుకున్నాము. । మరిన్ని మన 32
దేవుని మందిరపు సేవ నిమిత్తము ప్రతి సంవత్సరము
న్ను షెకేలులో మూడో వంతు యిత్తుమని నిబంధన
చేసుకొని వుంటిమి. । సముఖపు రొట్టె నిమిత్తమున్ను 33
నిత్యము అర్పించే మాంసార్పణ నిమిత్తమున్ను నిత్యము
అర్పించే దహన బలి నిమిత్తమున్ను సబ్బాతుల నిమిత్త
మున్ను అమావాస్యల నిమిత్తమున్ను నిర్ణయించబడ్డ

వుత్సవముల నిమిత్తమున్ను పరిశుద్ధ వస్తువుల నిమిత్తము
న్ను ఇశ్రాయేలుకు ప్రాయశ్చిత్తము చేయడానకు
పాప శమనార్థపు బలుల నిమిత్తమున్ను మన దేవుని
యింటి పని యావత్తు నిమిత్తమున్ను ఆలాగునే నిర్ణ
34 యించుకున్నాము. । మరిన్ని అర్చకులలోనున్ను లేవీ
యులలోనున్ను జనులలోనున్ను మనము చీట్లు వేసి,
మన పితృల యింటి మర్యాద ప్రకారము ప్రతి సంవ
త్సరమున్ను నిర్ణయించుకున్న కాలములలో న్యాయ
మందు వ్రాసినట్టు మన దేవుడయిన యెహోవాయొ
క్క బలిపీఠము మీదను దహింప చేసేటందుకు కర్రల
అర్పణను మన దేవునియొక్క మందిరములోకి తేవ
35 డానకు నిర్ణయించుకొన్నాము. । మరిన్ని మన భూ
మియొక్క ప్రథమ ఫలములనున్ను సకల వృక్షముల
ప్రథమ ఫలములనున్ను యేటా ప్రభువుయొక్క యిం
టికి తీసుకు రాగలందులకు నిర్ణయించుకొన్నాము. ।
36 మన కుమాళ్లలో ప్రథమ పుత్రులనున్ను మన పశువుల
లో తొలిచూలులనున్ను న్యాయమందు వ్రాయబడి
నట్టు మన మందలలో తొలిచూలులనున్ను మన దేవుని
యొక్క మందిరములో సేవ చేసే అర్చకుల యొద్దికి
తీసుకొని రాగలందులకు నిర్ణయించుకొన్నాము. ।
37 యిదిన్ని గాక మన పులియని పిండిలో ప్రథమ ఫల
మునున్ను కానుకలనున్ను సకల విధమైన వృక్షముల
ఫలములనున్ను ద్రాక్షారసము నూనె మొదలయినవి
మన దేవుని మందిరపు గదులలో అర్చకుల యొద్దికి
తెచ్చి, మన భూమి పంటలో పదో వంతును లేవీయుల
యొద్దికిన్ని తీసుకొని రాగలందులకు ప్రతి పట్టణము
లో వున్న మన పంటలో పదో వంతును ఆ లేవీయుల
38 కిచ్చేలాగు నిర్ణయించుకొన్నాము. । అహరోను కుమా
రుడైన అర్చకుడు లేవీయులు పదో వంతు పుచ్చుకొన్న
ప్పుడు వారితో కూడా వుండును; మన దేవుని మంది
రములో వున్న గదులలో అనగా ఖజానా యింటికి
పది వంతులలో వొక వంతు లేవీయులు తీసుకొని రా
39 వలెను. । యేమంటే ఇశ్రాయేలు పుత్రులున్ను లేవీ
పుత్రులున్ను గింజలు క్రొత్త ద్రాక్షారసము నూనె మొ
దలైన వాటి అర్పణను తీసుకొని, మందిరపు వస్తువులు
న్ను సేవ చేసే అర్చకులున్ను ద్వారపాలకులున్ను
గాయకులున్ను వుండే గదులలోకి తేవలెను; మన
దేవునియొక్క మందిరమును మేము విడిచి పెట్టము.

## 11. అధ్యాయము.

1 అప్పుడు జనుల అధికారులు యెరూశలేములో
నివాసము చేసినారు; తతిమ్మా జనులు పరిశుద్ధ పట్టణ
మనే యెరూశలేములో నివాసము చేయగలందులకు
పదింటిలో వొకడున్ను వేరే పట్టణములలో తొమ్మిది
వంతులు వుండిపోయే లాగున చీట్లు వేసినారు. । యె 2
రూశలేములో నివసించుదుమని సంతోషముగా వొప్పు
కున్న వాండ్లను జనులు ఆశీర్వదించినారు. । యిప్పుడు 3
యెరూశలేములో నివాసము చేసిన రాజ్యపు శ్రేష్ఠులు
వీరే. అయితే యూదా పట్టణములలో ప్రతివాడు
తన తన స్వాస్థ్యములోనే నివసిస్తూ వుండెను; వారు
యెవరంటే, ఇశ్రాయేలున్ను అర్చకులున్ను లేవీయులు
న్ను నెతేనీయులున్ను సొలొమోనుయొక్క సేవకుల
పిల్లలున్ను వీరే నివాసము చేసిరి. । అయితే యెరూశ 4
లేములో యూదా పుత్రులలో కొందరున్ను బెన్యా
మీను పుత్రులలో కొందరున్ను నివసించి వుండిరి.
యూదా పుత్రులలో యెవరంటే, అతాయా, వీడు
ఉజ్జీయా కుమారుడు, వీడు జెఖర్యా కుమారుడు, వీడు
అమర్యా కుమారుడు, వీడు షెఫటియా కుమారుడు,
వీడు మహలలేలు కుమారుడు, వీడు పెరెస్సు పుత్రుల
లో వొకడు. । మరిన్ని మయయా, వీడు బారూఖు 5
కుమారుడు, వీడు కొల్హోజ కుమారుడు, వీడు హజా
యా కుమారుడు, వీడు అదాయా కుమారుడు, వీడు
యోయారీబు కుమారుడు, వీడు జెఖర్యా కుమారుడు,
వీడు షిలోనీ కుమారుడు. । యెరూశలేములో నివాస 6
ము చేసిన పెరెస్సు పుత్రులందరూ బలవంతులయిన
నన్నూట అరువై యెనిమిది మంది అయి వుండిరి. ।
బెన్యామీను కుమారులలో యెవరంటే, సల్లు, వీడు 7
మెషుల్లాము కుమారుడు, వీడు యోవేదు కుమారుడు,
వీడు పెదాయా కుమారుడు, వీడు కోలాయా కుమా
రుడు, వీడు మయశేయా కుమారుడు, వీడు ఈతియేలు
కుమారుడు, వీడు యెషయ్యా కుమారుడు. । అతని తరు 8
వాత గబ్బయున్ని సల్లయున్ని; వీరందరున్ను తొమ్మన్నూట
యిరువై యెనమండుగురై వుండిరి. । మరిన్ని జిఖ్రీ 9
కుమారుడైన యోవేలు వాండ్లకు పెద్దగా వుండెను.
సెనూయా కుమారుడైన యూదా పట్టణము మీద రెం
డో అధికారియై వుండెను. । అర్చకులలో యెవరంటే, 10
యోయారీబు కుమారుడైన యెదాయాయున్ను, యాఖీ
నున్ను. । శెరాయా దేవుని మందిరమునకు అధిపతి అయి 11
వుండెను, వీడు హిల్కీయా కుమారుడు, వీడు మెషు
ల్లాము కుమారుడు, వీడు సాదోకు కుమారుడు, వీడు
మెరాయోతు కుమారుడు, వీడు అహీటూబు కుమా
రుడు. । యింటి పనిచేసిన వారి సహోదరులు యెన 12
మన్నూట యిరువై యిద్దరు అయి వుండిరి; మరిన్ని
అదాయాయున్ను; వీడు యెరోహాము కుమారుడు, వీడు
పెలల్యా కుమారుడు, వీడు అమ్సీ కుమారుడు, వీడు
జెఖర్యా కుమారుడు, వీడు పష్హూరు కుమారుడు, వీడు
మల్కీయా కుమారుడు: । మరిన్ని పితృలలో ప్రధాను 13
లైన ఆ అదాయా సహోదరులు యిన్నూట నలుభై

యిద్దరు అయి వుండిరి: మరిన్ని అమష్షైయున్ను;
వీడు అజరేలు కుమారుడు, వీడు అహస్సయి కుమా
రుడు, వీడు మెషల్లేమోతు కుమారుడు, వీడు ఇమ్మెరు
14 కుమారుడు. । మరిన్ని బలవంతులయిన వారి సహో
దరులు నూట యిరువై యెనిమిది మంది అయి వుండిరి;
వారికి పెద్ద యెవరంటే, జబ్దీయేలు, యితడు ఘనులలో
15 ఒకని కుమారుడై వుండెను. । లేవీయులలో యెవరంటే,
షెమయా, వీడు హషూబు కుమారుడు, వీడు అజ్రీ
కాము కుమారుడు, వీడు హషబ్యా కుమారుడు, వీడు
16 బున్నీ కుమారుడు. । లేవీయులలో ప్రధానులైన వాం
డ్లలో షబ్బెతైయున్ను యోజాబాదున్ను దేవుని మంది
రముయొక్క బహిరంగపు పని మీద అధికారము
17 పొందినారు. । ఆసాఫు కుమారుడైన జబ్దీకి పుట్టిన మీఖా
కుమారుడైన మత్తన్యా ప్రార్థన చేసే యెడల వంద
నపు సేవ ఆరంభించేటందుకు ప్రధానుడు అయి వుండె
ను; తన సహోదరులలో రెండోవాడు అయిన బక్బు
క్యాయున్ను యెదూతూను కుమారుడైన గాలాలుకు
18 పుట్టిన షమ్మూయ కుమారుడైన అబ్దాయున్ను. । పరిశుద్ధ
పట్టణములో వున్న లేవీయులందరు యిన్నూట యెన
19 భయి నలుగురు మంది అయి వుండిరి. । మరిన్ని ద్వార
పాలకులయిన అక్కూబున్ను థల్మోనున్ను గుమ్మములు
కాచేవారి సహోదరులున్ను నూట డెబ్బై యిద్దరు
20 మంది అయి వుండిరి. । మరిన్ని ఇశ్రాయేలులో శేషిం
చిన అర్చకులు లేవీయులు మొదలైన వారు యూదా
పట్టణములలో ప్రతివాడు తన తన స్వాస్థ్యములో
21 వుండెను. । అయితే నెతేనీయులు ఓఫెలులో నివసిం
చిరి. సీహాయున్ను గిష్పాయున్ను నెతేనీయుల పైని
22 వుండిరి. । యెరూశలేములో వున్న లేవీయుల పైని అధి
కారిగా ఉజ్జీ వుండెను; వీడు బానీ కుమారుడు, వీడు
హషబ్యా కుమారుడు, వీడు మత్తన్యా కుమారుడు, వీడు
మీఖా కుమారుడు. ఆసాఫు కుమాళ్లలో గాయకులు
దేవుని మందిరముయొక్క పని మీద అధికారులు అయి
23 వుండిరి. । మరిన్ని వాండ్లను గురించినది యేమంటే, ప్రతి
దినమునకు తగిన భాగము గాయకుల నిమిత్తము వుండవలె
24 నని రాజు సెలవు వుండెను. । మరిన్ని యూదా కుమా
రుడైన జెరాయొక్క పుత్రుల సంబంధమైన మెషేజ
బేలు కుమారుడైన పెతహ్యా జనులను గురించిన సంగ
25 తుల విషయమయి రాజు చేతి యొద్ద వుండెను. । వాటి
పొలములతో కూడా గ్రామములను గురించినదేమం
టే, యూదా పుత్రులలో కొందరు కిర్యతర్బాలో
నున్న దాని సంబంధించిన గ్రామములలోనున్న,
దీబోనులోనున్న దాని సంబంధించిన గ్రామములలో
నున్న, యెకబ్సెయేలులోనున్న దాని సంబంధించిన
26 గ్రామములలోనున్న; । యేషూవలోనున్న, మోలా
దాలోనున్న, బేత్పెలెతులోనున్న, । హసర్షూయా 27
లులోనున్న, బెయేర్షెబలోనున్న, దాని సంబంధించిన
గ్రామములలోనున్న; । సిక్లగులోనున్న, మెకోనాలో 28
నున్న, దాని సంబంధించిన గ్రామములలోనున్న, ।
ఎన్రిమ్మోనులోనున్న, జెరీయాలోనున్న, యర్మూ 29
తులోనున్న, । జానోహలోనున్న, అదుల్లాములోను 30
న్న, వాటిని సంబంధించిన గ్రామములలోనున్న,
లాకీషులోనున్న దాని సంబంధించిన పొలములలో
నున్న, అజేకాలోనున్న దాని గ్రామములలోనున్న
నివసించిరి. మరిన్ని బెయేర్షెబనుంచి హిన్నోము లోయ
మట్టుకూ వారు నివసించిరి. । గెబ సంబంధమైన బెన్యా 31
మీను పుత్రులు మిక్మషులోనున్న, అయ్యాలోనున్న,
బెతేలులోనున్న, వాటిని సంబంధించిన గ్రామముల
లోనున్న, । అనాతోతులోనున్న, నోబులోనున్న, 32
అనన్యాలోనున్న, । హసోరులోనున్న, రామాలోను 33
న్న, గిత్తయీములోనున్న, । హదీదులోనున్న, సెబో 34
యీములోనున్న, నెబల్లాతులోనున్న, । లోదులో 35
నున్న, పనివాండ్ల లోయ అనే ఓనోలోనున్న నివ
సించిరి. । మరిన్ని లేవీయుల సంబంధమైన వాండ్లలో 36
యూదాలోనున్న బెన్యామీనీయులలోనున్న భాగ
ములు వుండెను.

## 12. అధ్యాయము.

అయితే షెయల్తీయేలు కుమారుడైన జెరుబ్బా 1
బెలుతో కూడా పైకి వెళ్లిన అర్చకులున్ను లేవీయులు
న్ను వీరే; వారెవరంటే, యేషూవ, శెరాయా, ఇర్మీయా,
ఎజ్రా, । అమర్యా, మల్లూకు, హత్తూషు, । షెకన్యా, 2,3
రెహూము, మెరెమోతు, । ఇద్దో, గిన్నెతో, అబీయా, । 4
మీయామీను, మయద్యా, బిల్గా, । షెమయా, యో 5,6
యారీబు, యెదాయా, । సల్లూ, ఆమోకు, హిల్కీయా, 7
యెదాయా, వీరందరున్ను యేషూవ దినములలో అర్చ
కులలోనున్న వారి సహోదరులలోనున్న ప్రధాను
లయిన వారై వుండిరి. । మరిన్ని లేవీయులలో యేషూవ, 8
బిన్నూయీ, కద్మీయేలు, షెరేబ్యా, యూదా, వందనపు
సేవ మీద వున్న మత్తన్యాయున్ను అతని సహోదరు
లున్ను. । మరిన్ని బక్బుక్యాయున్ను, ఉన్నీయున్ని, వారి 9
సహోదరులున్ను వారి యెదురుగుండా కావులలో
వుండే వారు అయి వుండిరి. । యేషూవకు యోయా 10
కీము పుట్టెను, యోయాకీముకు ఎల్యాషీబు పుట్టెను,
ఎల్యాషీబుకు యోయాదా పుట్టెను, । యోయాదాకు 11
యోనాతాను పుట్టెను, యోనాతానుకు యద్దూవ
పుట్టెను. । యోయాకీము దినములలో పితృలలో ప్రధా 12
నులైన వారు అర్చకులు అయి వుండిరి; వారు యెవ
రంటే శెరాయా తాలూకా మెరాయా; ఇర్మీయా

13 తాలూకా హనన్యా; । ఎజ్రా తాలూకా మెషుల్లాము;
14 అమర్యా తాలూకా యెహోహానాను; । మెలీఖూ
తాలూకా యోనాతాను; షెబన్యా తాలూకా యో
15 సేపు; । హారీము తాలూకా అద్నా; మెరాయోతు తా
16 లూకా హెల్కయి; । ఇద్దో తాలూకా జెకర్యా; గిన్నె
17 తోను తాలూకా మెషుల్లాము; । అబీయా తాలూకా
జిఖ్రీ; మిన్యామీను తాలూకాయున్ను మోవద్యా
18 తాలూకాయున్ను పిల్టయి; । బిల్గా తాలూకా షమ్మూయ;
19 షెమయా తాలూకా యెహోనాతాను; । యోయా
రీబు తాలూకా మత్తెనై; యెదాయా తాలూకా ఉజ్జీ; ।
20 సల్లయి తాలూకా కలయి; ఆమోకు తాలూకా ఏబెరు; ।
21 హిల్కీయా తాలూకా హషబ్యా; యెదాయా తా
22 లూకా నెతనేలు. । ఎల్యాషీబు, యెయాదా, యో
హానాను, యద్దూవా, అనే వారి దినములలో లేవీయులు
పితృలకు ప్రధానులని నిర్ణయించబడినారు; మరిన్ని
పారసీయుడైన దర్యావెషు యేలుబడి కాలము మట్టుకు
23 అర్చకులున్ను నిర్ణయించబడినారు. । ఎల్యాషీబు
కుమారుడైన యోహానాను దినముల పర్యంతము పితృ
లయొక్క ప్రధానులైన లేవీ కుమాళ్లు రాజుల సమా
24 చారముల గ్రంథమందు వ్రాయబడినారు. । లేవీయుల
ప్రధానులున్ను అనగా హషబ్యాయున్ను షేరేబ్యా
యున్ను కద్మీయేలు కుమారుడయిన యేషూవయున్ను
వారికి యెదురుగుండా వున్న వాండ్ల సహోదరులతో
కూడా దైవ మనుష్యుడైన దావీదుయొక్క ఆజ్ఞ ప్రకా
రముగా స్తుతి వందనములు చెల్లించడానకు కావలుల
25 చొప్పున నిర్ణయించబడినారు. । మత్తన్యా, బక్బుక్యా,
ఓబద్యా, మెషుల్లాము, టల్మోను, అక్కూబు, అనే
వారు గుమ్మముల యొద్ద వున్న పదార్థపు కొట్టుల
26 యొద్ద కాపు వున్న ద్వారపాలకులై వుండిరి. । వీరు
యెహోసాదాకుకు పుట్టిన యేషూవ కుమారుడైన
యోయాకీము దినములలోనున్ను అధికారియైన నెహె
మ్యా దినములలోనున్ను అర్చకుడున్ను లేఖికుడున్ను
27 అయిన ఎజ్రా దినములలోనున్ను వుండిరి. । మరిన్ని యె
రూశలేము గోడయొక్క సంప్రోక్షణ కాలములో
వారు లేవీయులను వారి సకల స్థలములలోనుంచి యె
రూశలేముకు తేవడానకున్ను యీ సంప్రోక్షణను ఆచ
రించుటకున్ను సంతోషముతోనున్ను వందనపు ధ్వను
లతోనున్ను పాటలతోనున్ను వీణెలు కిన్నెరలు తాళ
28 ములు అనే వాటితోనున్ను వెతికినారు. । అప్పుడు
గాయకుల కుమాళ్లు యెరూశలేము చుట్టూ వున్న
మైదానపు భూమిలోనుంచిన్ని నెథోఫాతియొక్క
29 గ్రామములలోనుంచిన్ని కూడుకొనిరి. । మరిన్ని గిల్గా
లుయొక్క యింటిలోనుంచిన్ని గెబయొక్కయున్ను
అజ్మావెతుయొక్కయున్ను పొలములలోనుంచిన్ని వారు
కూడినారు, యేమంటే యెరూశలేము చుట్టూ గాయ
కులు తమ కోసము గ్రామములు కట్టుకున్నారు. ।
అర్చకులున్ను లేవీయులున్ను తమ్మున్ను జనులను 30
న్ను గుమ్మములనున్ను గోడనున్ను పరిశుద్ధ పరచుకొ
నిరి. । అటు తరువాత నేను యూదా శ్రేష్ఠులను గోడ 31
మీదికి తెచ్చి, వందనములు చెల్లించే వాండ్లలో రెండు
గొప్ప సమూహములను నిర్ణయించినాను; అందులో
ఒక సమూహము కుడి పక్కను పెంటద్వారము వైపు
గోడ మీదను నడిచెను; । వారి తరువాత హోషయా 32
యున్ను యూదా శ్రేష్ఠులలో సగము మందిన్ని వెళ్లి
నారు. । మరిన్ని అజర్యాయున్ను, ఎజ్రాయున్ను, మె 33
షుల్లామున్ను, । యూదాయున్ను, బెన్యామీనున్ను, 34
షెమయాయున్ను, ఇర్మీయాయున్ను వెళ్లినారు. । మరిన్ని 35
అర్చకుల కుమాళ్లలో కొందరు బాకాలతో వెళ్లినారు,
వారు యెవరంటే, ఆసాపు కుమారుడైన జక్కూరుకు
పుట్టిన మీకాయ్యా కుమారుడైన మత్తన్యాకు పుట్టిన
షెమయా కుమారుడైన యోనాతానుకు పుట్టిన జెఖ
ర్యాయున్ను, । అతని సహోదరులున్ను అనగా షెమ 36
యా, అజరేలు, మిలిలై, గిలిలై, మాయై, నెతనేలు,
యూదా, హనానీ, అనే వారు దైవ జనుడైన దావీదు
యొక్క వాద్యపు వస్తువులతో కూడా వెళ్లినారు;
వారి ముందర లేఖికుడైన ఎజ్రాయున్ను వెళ్లినాడు. ।
వారికి యెదురుగుండా వున్న ధారయొక్క గుమ్మము 37
యొద్ద దావీదు పురముయొక్క మెట్ల మీద దావీదు
యిల్లు దాటి గోడ మార్గమున తూర్పువయిపు నీటి
ద్వారము పర్యంతము వెళ్లినారు. । మరియొక సమూ 38
హము అనగా వందనములు చెల్లించే సమూహము వా
రికి యెదురుగుండా వెళ్లెను; వారి తరువాత నేనున్ను
వెళ్లినాను; గోడ మీద వున్న సగము మందిన్ని కొలు
ముల గోపురము పైనుంచి వెడల్పు గోడ పర్యంతము
న్ను వెళ్లినారు. । మరిన్ని వారు ఎఫ్రాయీము ద్వారము 39
పైనుంచిన్ని పాత ద్వారము పైనుంచిన్ని మత్స్య ద్వార
ము పైనుంచిన్ని హననేలు గోపురమునుంచిన్ని మేయా
గోపురమునుంచి గొర్రెల ద్వారము పర్యంతమున్ను
వెళ్లి, బందీ గృహపు ద్వారములో నిలుచున్నారు. ।
ఆలాగునే దైవ మందిరములో వందనములు చెల్లించే 40
రెండు సమూహములున్ను నేనున్ను నాతో కూడా
వున్న అధికారులలో సగము మందిన్ని నిలుచున్నాము. ।
అర్చకులున్ను అనగా ఎల్యాకీము, మయశేయా, 41
మిన్యామీను, మీకాయ్యా, ఎల్యోయేనై, జెకర్యా,
హనన్యా, బాకాలతో కూడానున్ను, । మయశేయా, 42
షెమయా, ఎలాజారు, ఉజ్జీ, యెహోహానాను,
మల్కీయా, ఏలాము, ఎజెరున్ను, గాయకులున్ను ఇజ్రె
హయా అనే వారి పెద్దతో కూడా వడిగా పాడినారు. ।

43 మరిన్ని ఆ దినములో వారు గొప్ప బలులను అర్పించి
సంతోషించిరి, యెందుకంటే అధికమైన ఆనందముతో
దేవుడు వారికి సంతోషము కలుగ చేసెను; వారి భార్య
లున్ను పిల్లలున్ను సంతోషించిరి, అందువల్ల యెరూశ
లేముయొక్క ఆనందము బహు దూరము పర్యంతమూ
44 వినబడెను. । ఆ కాలములో పదార్థములు నిమిత్తము
న్ను అర్పణల నిమిత్తమున్ను ప్రథమ ఫలముల నిమిత్త
మున్ను పదో వంతు వాటి నిమిత్తమున్ను వున్న గదుల
మీదను అర్చకుల కొరకున్ను లేవీయుల కొరకున్ను
న్యాయము చొప్పున నిర్ణయించపడి, పట్టణముల
పొలములనుంచి వచ్చేటటువంటి వంతులు వాటిలో
కూర్చేటందుకు కొందరు నియమించబడినారు, యేమం
టే కనిపెట్టే అర్చకుల విషయమైయిన్ని లేవీయుల
45 విషయమైయిన్ని యూదా సంతోషించెను. । మరిన్ని గా
యకులున్ను ద్వారపాలకులున్ను తమ దేవుని కావలి
నిన్ని పవిత్రపు కావలినిన్ని కాచి వుండిరి, యెందు
కంటే యీలాగున దావీదున్ను తన కుమారుడైన సొలొ
46 మోనున్ను ఆజ్ఞాపించినారు. । యేమంటే దావీదు దిన
ములలోనున్ను ఆసాఫు దినములలోనున్ను పూర్వమందు
గాయకులయొక్క శ్రేష్ఠులున్ను గలరు; దేవునికి స్తుతి
47 పాటలున్ను వందనపు పాటలున్ను వుండేవి. । ఇశ్రా
యేలీయులందరున్ను జెరుబ్బాబెలు దినములలోనున్ను
నెహెమ్యా దినములలోనున్ను ప్రతివాడు తన తన
వంతు చొప్పున వంతులను గాయకులకున్ను ద్వారపా
లకులకున్ను ప్రతి దినము యిచ్చేవారు; వారు లేవీయుల
నిమిత్తము పరిశుద్ధపు వస్తువులను ప్రత్యేకించి వుంచి
నారు; లేవీయులున్ను అహరోను పుత్రుల కొరకు
ఆలాగునే వాటిని ప్రత్యేకించి వుంచినారు.

## 13. అధ్యాయము.

1 ఆ దినమందు జనులు వింటూ వుండగా మోషే గ్రం
థము వారు చదువగా అందులో వ్రాయబడి వున్నదే
మంటే, అమ్మోనీయుడున్ను మోయాబీయుడున్ను దేవు
2 నియొక్క సంఘములోకి యెన్నటికీ రాకూడదు. । యెం
దుకంటే వారు రొట్టెనున్ను నీళ్లనున్ను పట్టుకొని,
ఇశ్రాయేలు పుత్రులకు యెదురుపడక, వారిని శపించు
మని బలామును ప్రోత్సాహ పరచిరి; అయితే మన
దేవుడు ఆ శాపము ఆశీర్వాదమునకు తిప్పివేసెను అని
3 వ్రాయబడి వుండెను. । అయితే యిప్పుడు సంభవించి
నదేమంటే, వారు న్యాయమును వినినప్పుడు మిళిత
మైన సమూహమును ఇశ్రాయేలునుంచి వారు విభజన
4 చేసినారు. । యింతకు ముందు అర్చకుడయిన ఎల్యాషీబు
మన దేవుని యింటియొక్క గది మీద నిర్ణయించపడి,
5 థోబీయాతో స్నేహము చేసి, । పూర్వమందు మాంసా
ర్పణలనున్ను సాంబ్రాణినిన్ని పాత్రలనున్ను గింజలలో
పదో వంతు వాటినిన్ని కొత్త ద్రాక్షా రసమునున్ను
లేవీయులకున్ను గాయకులకున్ను ద్వారపాలకులకున్ను
యిమ్మని ఆజ్ఞాపించబడ్డ నూనెనున్ను అర్చకుల అర్పణల
నున్ను వుంచే స్థలము యొద్ద అతని నిమిత్తము వొక
గొప్ప గదిని సిద్ధము చేసినాడు. । అయితే అప్పట్లో 6
నేను యెరూశలేములో వుండలేదు, యేమంటే బాబెలు
దేశపు రాజైన అర్తహ్షస్తా యేలుబడియొక్క ముప్పై
రెండో సంవత్సరమందు నేను రాజు యొద్దకు వచ్చి,
కొన్ని దినములయిన తరువాత రాజుయొద్ద సెలవు పుచ్చు
కొని, । యెరూశలేముకు వచ్చి, థోబీయా కొరకు ఎల్యా 7
షీబు దైవ మందిరములో వొక గది సిద్ధపరచడములో
చేసిన కీడంతా నేను తెలుసుకొని, । బహుగా దుఃఖ 8
పడి, ఆ గదిలోనుంచి థోబీయాయొక్క సామగ్రి యా
వత్తూ ఆవతల పారవేసి, గదులన్నిటిని శుభ్రము చేయు
మని ఆజ్ఞాపించి, । తిరిగీ మందిరపు పాత్రలనున్ను 9
వాటితో కూడా మాంసార్పణనున్ను సాంబ్రాణినిన్ని
యిక్కడికి తెచ్చినాను. । మరిన్ని లేవీయులయొక్క వం 10
తులు వారికి యివ్వబడ లేదని నేను చూచినాను,
యేమంటే పని చేసిన లేవీయులున్ను గాయకులున్ను
తన తన పొలముకు ప్రతివాడున్ను పారిపోయినారు. ।
అప్పుడు నేను అధిపతులతో పోరాడి, దేవుని యిల్లు 11
యెందుకు విసర్జించబడెనని అడిగి, వారిని సమకూర్చి
వారిని వారి స్థలములలో నిలిపినాను. । అటు తరువాత 12
యూదా వారందరూ దినుసులలో పదో వంతునున్ను
కొత్త ద్రాక్షా రసమునున్ను నూనెనున్ను బొక్కసము
లలోకి తెచ్చినారు. । నేను బొక్కసముల మీద కాప 13
రులగా షెలెమ్యా అనే అర్చకునిన్ని సాదోకు అనే
లేఖికునిన్ని లేవీయులలో పెదాయానున్ను నిర్ణయిం
చినాను; వారి తరువాత మత్తన్యా కుమారుడైన జక్కూ
రుకు పుట్టిన హానానున్ను నిర్ణయించ పడినాడు,
యేమంటే వారు నమ్మకము గల మనుష్యులని యెంచ
పడినారు; మరిన్ని వారి వుద్యోగము యేమంటే తమ
సహోదరులకు పంచి పెట్టేదై యున్నది. । ఓ నా 14
దేవుడా, దీని విషయమై నన్ను నీ జ్ఞాపకములో వుంచి,
నా దేవుని మందిరము కొరకున్ను దాని ఆచారముల
కొరకున్ను నేను చేసిన వుపకారములను తుడిచి వేయ
కుము. । ఆ దినములలో యూదాయందు సబ్బాతులో 15
కొందరు ద్రాక్ష గానుగలను త్రొక్కడమున్ను, చేను
మోపులను లోపలకు తెస్తూ, గార్దభముల మీద బరు
వులను యెత్తుతూ, ద్రాక్షా రసమునున్ను ద్రాక్ష పండ్ల
నున్ను అంజూరపు పండ్లనున్ను నానా విధమైన బరు
వులనున్ను సబ్బాతు దినములో యెరూశలేములోకి
తేవడమున్ను నేను చూచినప్పుడు, యీ ఆహార వస్తు

వులను వారు అమ్మిన దినమందు నేను వారికి విరోధ
16 ముగా సాక్షి పలికినాను. । అక్కడ తురు దేశస్థులున్ను
కాపురము చేసి, యూదా పుత్రులకున్ను యెరూశ
లేములోనున్ను సబ్బాతు దినములో చేపలు మొదలైన
నానా విధ వస్తువులను తెచ్చి అమ్ముతూ వుండేవారు.
17 అంతట నేను యూదా శ్రేష్ఠులతో పోరాడి, యీలా
గున మీరు కీడు చేసి, సబ్బాతును నిర్లక్ష్య పెట్టుతూ
18 వుండెద రేమి? । మీ పితృలున్ను యీలాగున చేసి, దేవు
నివల్ల మన మీదికిన్ని యీ పట్టణస్థుల మీదికిన్ని కీడు
రప్పించ లేదా? అయితే మీరు సబ్బాతును నిర్లక్ష్య
పెట్టి మరీ అధికముగా ఇశ్రాయేలు మీదికి కోపమును
19 రప్పించుతున్నారు అని చెప్పితిని. । అప్పుడు సంభవిం
చినదేమంటే, సబ్బాతు దినముకు ముందు చీకటి పడి
నప్పుడు యెరూశలేము గుమ్మములు మూసివేయు మని
న్ని, సబ్బాతు వెళ్లిపోయే పర్యంతము వాటిని విప్ప
కుండా వుండవలెననిన్ని నేను సెలవు యిచ్చినాను;
మరిన్ని సబ్బాతు దినములో యే బరువు అయినా లోప
లికి రాకుండా గుమ్మముల యొద్ద నా నౌకర్లలో
20 కొందరిని కాపు వుంచితిని. । ఆలాగు వర్తకులున్ను
నానా విధమైన వస్తువులను అమ్మే వారున్ను వొకమారు
రెండుమార్లు యెరూశలేము అవతల బస చేసుకు
21 న్నారు. । అప్పుడు నేను వారికి విరోధముగా సాక్షి
పలికి, వారితో మీరు గోడ యెదుట యెందుకు బస
చేసుకొని వున్నారు? మీరు మళ్లీ యీలాగున చేసితి
రట్టాయెనా మీ మీద చేతులు వేస్తానని చెప్పినాను,
అప్పటినుంచి సబ్బాతు దినములో వారు మరి రావడము
22 లేదు. । అప్పుడు నేను వారు తమ్ము తాము పరిశుద్ధ పర్చు
కోవలెననిన్ని, సబ్బాతు దినమును ఆచరించేటందుకు
వచ్చి గుమ్మములను కాచుకోవలెననిన్ని లేవీయులకు
ఆజ్ఞాపించినాను. కాగా ఓ నా దేవుడా, యిందును
గురించిన్ని నాయందు జ్ఞాపకము వుంచి, నీ కృపాతి
23 శయము చొప్పున నన్ను రక్షించుము. । ఆ దినములలో
నేను అష్డోదు, అమ్మోను, మోయాబు, సంబంధులైన
వారిలోనుంచి స్త్రీలను వివాహము చేసుకొన్న యూ
దైయులను చూచినాను. । వారి పుత్రులు అష్డోదు 24
భాషను సగము మట్టుకు మాట్లాడేవారు; తమ తమ
స్వభాషను మాట్లాడేవారు గాని యూదైయుల భాష
వారికి తెలియలేదు. । అంతట నేను వారితో కలహము 25
చేసి, శపించి, కొందరిని కొట్టి, వారి వెంట్రుకలను
పీకివేసి, మీరు వారి కుమారులకు మీ కుమార్తెలను
యివ్వకనున్ను, మీ కుమారుల కొరకైనా మీ కొరకైనా
వారి కుమార్తెలను తెచ్చుకోకనున్ను వుండవలెనని
వారి చేత దేవుని పేరట ప్రమాణము చేయించి; । యీ 26
లాటి కార్యముల చేతనే ఇశ్రాయేలు రాజైన సొలొ
మోను పాపము చేయలేదా? అయితే అనేక జనము
లలో అతనివంటి రాజు లేదు; అతడు తన దేవునిచేత
ప్రేమించబడిన వాడున్ను ఇశ్రాయేలంతటి మీద రా
జుగా చేయపడిన వాడున్ను అయినప్పటికిన్ని అన్య
స్త్రీలు అతని సహా పాపము చేయించినారు. । కాగా 27
యింత గొప్ప కీడు చేసేటందుకున్ను అన్య స్త్రీలను
వివాహము చేసుకొని, మన దేవునికి విరోధముగా
పాపము చేసుటకున్ను మీ మాటలను మేము ఆలకించ
వచ్చునా అని పలికినాను. । అప్పుడు ప్రధానార్చకు 28
డనే ఎల్యాషీబు కుమారుడైన యోయాదా కుమాళ్లలో
వొకడు హోరోనీయుడైన సన్బల్లఘుకు అల్లుడై వుం
డెను; అందు నిమిత్తము అతని నా యొద్దనుంచి తరిమి
వేసినాను. । ఓ నా దేవుడా, వారు అర్చకత్వము 29
నున్ను అర్చకత్వపు వొడంబడికెనున్ను లేవీయుల
వొడంబడికెనున్ను అపవిత్ర పర్చినారు గనుక వారిని
నీ జ్ఞాపకమందు వుంచుము. । యీలాగున సకల పరదే 30
శులలోనుంచి నేను వారిని పవిత్రపరచి, ప్రతివాడు
తన తన పని ప్రకారముగా అర్చకులయొక్కయున్ను
లేవీయులయొక్కయున్ను కావలులను నిర్ణయించి
నాను. । మరిన్ని కర్ర అర్పణ కొరకున్ను వాటి కాల 31
ముల చొప్పున ప్రథమ ఫలముల నిమిత్తమున్ను నిర్ణ
యించినాను. కాగా ఓ నా దేవుడా, మేలు కొరకు
నన్ను నీ జ్ఞాపకమందు వుంచు కొనుము.

# ఎస్తేరు అనే ఆమెను గూర్చిన గ్రంథము.

## 1. అధ్యాయము.

1 హిందూ దేశము మొదలుకొని కూషు దేశము
పర్యంతమున్ను నూట యిరువై యేడు సంస్థానములను
యేలిన అహశ్వేరోషు దినములలో సంభవించినదేమం
2 టే, । ఆ కాలమందు రాజయిన అహశ్వేరోషు షూ
షను అనే నగరిలో వుండే తన రాజ్యాసనము మీద
3 కూర్చుండి యుండగా, । అతడు తన యేలుబడియొక్క
మూడో సంవత్సరమందు తన యావత్తు ప్రభువులకున్ను
సేవకులకున్ను విందు చేయించెను; పారసీ దేశముయొక్క
యున్ను మాదై దేశముయొక్కయున్ను బలిష్ఠులున్ను
సంస్థానముల దొరలున్ను ప్రభువులున్ను అతని ముం
4 దర వుండగా, । అతడు తన మహిమగల రాజ్యముయొ
క్క ఐశ్వర్యములనున్ను అతిశయమయిన మాహాత్మ్య
ముయొక్క ఘనతనున్ను అనేక దినములు అనగా నూట
5 యెనభై దినముల పర్యంతము అగుపరిచెను. । ఆ దిన
ములు సమాప్తి అయిన తరువాత రాజు షూషను నగరి
లో వున్న పిన్న పెద్దలైన జనులందరికిన్ని రాజు నగరి
తోటయొక్క లోగిటిలో యేడు దినముల పర్యంతము
6 విందు చేయించెను. । అక్కడ చలవరాతి స్తంభముల
మీద వెండి గుండ్లకు సన్నపు నూలుతోనున్ను వూదా
నూలుతోనున్ను చేయబడిన తాళ్లతో తగిలించిన తెల్ల
పచ్చ నీలి అనే వర్ణములు గల తెరలు వ్రేలాడుతూ
వుండెను; మరిన్ని యెరుపున్ను నీలిన్ని తెలుపున్ను
నలుపున్ను గల చలవరాళ్లు పరచిన నేల మీద వెండి
బంగారపువైన జలతారు గల పరుపులు వుండెను. ।
7 వొకొక్కటి వొకొక్క విధముగా వున్న బంగారపు
పాత్రలతో వారికి వారు పానము యిచ్చిరి; రాజ్య
సంబంధమైన ద్రాక్షా రసమునున్ను రాజు స్థితికి తగిన
8 ట్టుగా వారు వారికి చాలా యిచ్చిరి. । ఆ పానము
చేసుట కట్టడ ప్రకారముగా వుండెను; యెవ్వడున్ను
బలవంతము చేయలేదు, యేమంటే ప్రతి వానియొక్క
ముష్టము చొప్పున వారు చేయ వలెనని తన నగరియొ
9 క్క పరిచారకులకు రాజు ఆజ్ఞ యిచ్చెను. । అది గాక
రాణి అయిన వష్తిన్ని రాజు అయిన అహశ్వేరోషు
సంబంధమైన రాజ నగరిలో స్త్రీలకు వొక విందు
10 చేయించెను. । యేడో దినమందు రాజు తాను ద్రాక్షా
రసముచేత మనస్సంతోషముగా వున్నప్పుడు రాణి
యైన వష్తియొక్క సౌందర్యమును జన సమూహముల
కున్ను ప్రభువులకున్ను కనపరచే కొరకు ఆమెను రాజ
కిరీటముతో తన యెదుటకు పిలుచుకొని రావలెనని, ।
రాజయిన అహశ్వేరోషు తన సముఖమందు సేవించే 11
మెహూమాను, బిజ్తా, హర్బోనా, బిగ్తా, అబగ్తా,
జేతరు, కర్కసు, అనే యేడుగురు షండులకు ఆజ్ఞాపిం
చెను, యేమంటే ఆమె చూచుటకు సౌందర్యవతి అయి
వుండెను. । అయితే రాణియైన వష్తి షండుల ద్వారా 12
కలిగిన రాజాజ్ఞ ప్రకారము వచ్చుటకు వొప్పక పోయి
నందున రాజు బహుగా కోప పడెను; అతని యందు
అతని కోపము మండుతూ వుండెను. । అప్పుడు రాజు 13
కాలములను యెరిగిన జ్ఞానులను చూచి, రాణి అయిన
వష్తి షండుల ద్వారా రాజయిన అహశ్వేరోషు అనే
నా ఆజ్ఞ ప్రకారము చేయక పోయినందుచేత ఆమెకు
న్యాయ ప్రమాణ ప్రకారము చేయ వలసినదేమి అని
వారిని అడిగెను; । యేమంటే న్యాయ ప్రమాణము 14
నున్ను న్యాయపు తీర్పునున్ను యెరిగిన అందరి యె
డల రాజు మర్యాద యీలాగు వుండెను. । అతనికి 15
తరువాతి వారై, రాజు ముఖమును చూచి రాజ్యమందు
ప్రథమ పీఠముల మీద కూర్చుండే పారసీ మాదైల
యొక్క యేడుగురు ప్రధానులు యెవరంటే, కర్షె
నా, షెతారు, అద్మతా, తర్షీషు, మెరెసు, మర్సెనా,
మెమూఖాను, అనేవారు. । అందుకు మెమూఖాను 16
రాజు యెదుటనున్ను ప్రధానుల యెదుటనున్ను ప్రత్యు
త్తరముగా చెప్పినదేమంటే, రాణియైన వష్తి రాజు
యెడల మాత్రము కాదు రాజు అయిన అహశ్వేరోషు
యొక్క సకల సంస్థానములలో వుండే యావత్తు ప్రభు
వుల యెడలనున్ను యావత్తు జనుల యెడలనున్ను నేర
ము చేసెను. । యేమంటే రాణివల్ల అయిన యీ కార్యము 17
స్త్రీలకందరికి తెలియబడును; అందువల్ల రాజు అయిన
అహశ్వేరోషు తన రాణి అయిన వష్తి తన యెదుటికి
తేబడవలెనని ఆజ్ఞాపించినప్పటికిన్ని ఆమె రాలేదన్న
సంగతి బయిలు పడగానే వారు తమ దృష్టిలో తమ
పెనిమిట్లను నిర్లక్ష్యము చేతురు. । మరిన్ని రాణి 18
చేసిన కార్యము వినిన పారసీ మాదైలయొక్క నాయక
పత్నులు యీ దినమందు రాజుయొక్క ప్రధానులకంద
రికీ యీలాగున చెప్పుదురు, అందువల్ల చాలా అలక్ష్య
మున్ను కోపమున్ను కలుగును. । రాజుకు సమ్మతి అయితే 19

వష్తి రాజు అయిన అహశ్వేరోషు యెదుటికి యికను
రా కూడదని అతని యొద్దనుంచి వొక రాజాజ్ఞ బయిలు
వెళ్లును గాక; అది తప్పకుండా పారసీ మాదీయుల
యొక్క న్యాయ ప్రమాణములో వ్రాయబడును గాక;
రాజు ఆమెయొక్క రాజ్య స్థితిని ఆమె కంటే యో
20 గ్యతగల యింకొక దానికి యిచ్చును గాక. । యీలా
గున రాజు చేసే నిర్ణయము విస్తారముగా వుండే
అతని రాజ్యమందంతటాను ప్రచురము చేయబడినప్పు
డు స్త్రీలందరు తమ తమ పెనిమిట్లకు పెద్దలు మొదలు
కొని పిన్నల పర్యంతమున్ను మన్నన చేతురు అని
21 చెప్పెను. । యీ మాట రాజుకున్ను ప్రభువులకున్ను
చక్కగా కనుపడినందున రాజు మెమూఖాను మాట
22 ప్రకారము చేసెను. । ప్రతి పురుషుడు తన తన యిం
ట్లో అధికారము చేయవలెననిన్ని ప్రతి జనముయొక్క
భాష ప్రకారము యిది ప్రచురము చేయబడ వలెన
నిన్ని ప్రతి సంస్థానమునకు దాని వ్రాత ప్రకారము
గానున్ను ప్రతి జనముకు వారి భాష ప్రకారముగా
నున్ను రాజు తన సకలమైన సంస్థానములకు వుత్తరము
లను పంపించెను.

## 2. అధ్యాయము.

1 ఈ సంగతులైన తరువాత రాజయిన అహశ్వేరో
షుయొక్క వుగ్రము చల్లారినప్పుడు అతడు వష్తినిన్ని
ఆమె చేసినదిన్ని ఆమెకు నిర్ణయించబడినదిన్ని తలం
2 చెను. । అప్పుడు రాజుకు సేవ చేసే సేవకులు అనినదే
మంటే, అందమైన కన్నెకలు రాజు కొరకు వెతుక
3 బడుదురు గాక. । అందు నిమిత్తము రాజు తన రాజ్య
ముయొక్క సంస్థానములన్నిటిలో పరిచారకులను నియ
మించును గాక; వీరు అందముగా వుండే సకలమైన
కన్నెకలను సమకూర్చి, షూషను అనే నగరియొక్క
అంతఃపురమునకు స్త్రీలయొక్క కాపరిన్ని రాజుయొక్క
షండుడున్ను అయిన హేగే వశమందు వారిని అప్ప
గింతురు గాక; వారి శుద్ధికొరకు సుగంధ ద్రవ్యములు
4 వారికి యివ్వబడును గాక. । మరిన్ని రాజు ఆ కన్నె
కలలో దేనియందు అనుకూలించునో ఆమె వష్తికి
బదులుగా రాణి అవుగాక అని పలికినారు. యీ
మాట రాజుకు అనుకూలమైనందున అతడు ఆలాగున
5 చేసెను. । అయితే షూషను నగరిలో కీషుకు పుట్టిన
షిమీ కుమారుడైన యాయీరు పుత్రుడున్ను బెన్యా
మీనీయుడున్ను అయిన మొర్దెకై అనే పేరుగల
6 వొక యూదైయుడు వుండెను. । అతడు బాబెలు రాజు
అయిన నెబూఖద్నెస్సరు యూదా రాజైన యెఖో
న్యాను పట్టుకొని పోయేటప్పుడు అతనితో కూడా
యెరూశలేమునుంచి చెర కొంచుపోపడిన వారిలో
వొకడు. । అతడు తన పినతండ్రి కుమార్తె అయిన 7
హదస్సా అనే ఎస్తేరును పెంచుకొనెను, యేమంటే
ఆమె తల్లి దండ్రులు లేనిదై, అందమైన రూపమున్ను
సుందర ముఖమున్ను గలదై వుండెను; ఆమె తలి
దండ్రులు మరణము పొందిన తరువాత మొర్దెకై
ఆమెను తన కుమార్తెగా స్వీకరించుకొనెను. । యీ 8
లాగున రాజు ఆజ్ఞయున్ను అతని నిర్ణయమున్ను
ప్రచురము చేయబడి, అనేకమైన పడుచులు షూషను
నగరిలో వున్న హేగే వశమందు అప్పగించపడినప్పుడు
సంభవించినదేమంటే, ఎస్తేరున్ను రాజుయొక్క యిం
టికి తేబడి స్త్రీలను కాచే హేగే వశమందు అప్పగిం
చపడెను. । ఆ పడుచు అతని దృష్టికి యింపైనదైనందున 9
ఆమె అతనివల్ల దయ పొందెను; కాబట్టి ఆమెయొక్క
శుద్ధి కొరకైన వస్తువులనున్ను ఆమెకు కలిగే భాగము
లనున్ను మరిన్ని రాజు యింట్లోనుంచి ఆమెకు యివ్వ
తగిన యేడుగురు పడుచులనున్ను అతడు ఆమెకు త్వర
గా యిచ్చెను; అతడు ఆమెనున్ను ఆమె చెలికత్తెల
నున్ను అంతఃపురములో వున్న అతి యోగ్యమైన స్థల
మందు వుంచెను. । అయితే ఎస్తేరు తన జనులనున్ను తన 10
వంశమునున్ను తెలుపకుండా వుండెను, యెందుకంటే
దాన్ని తెలుప వద్దని మొర్దెకై ఆమెకు నియోగించి
వుండెను. । అయితే ఎస్తేరుయొక్క క్షేమమునున్ను 11
ఆమెకు యేమి సంభవించునో అదిన్ని తెలుసుకు
నేటందుకు అంతఃపురముయొక్క లోగటి యెదుట
ప్రతి దినమున్ను మొర్దెకై తిరుగులాడుతూ వుండె
ను. । స్త్రీల మర్యాద చొప్పున పండ్రెండు మాసములు 12
అయిన తరువాత రాజైన అహశ్వేరోషు యొద్దికి వెళ్లు
టకు వొక్కొక పడుచుకు వంతువచ్చినప్పుడు, ఆ విధ
ముగా వొక్కొక పడుచు రాజుయొద్దికి వెళ్లుతూ వుం
డెను, యేమంటే ఆలాగున వారి శుద్ధియొక్క దినములు
సంపూర్ణమవుతూ వుండెను; యేలాగంటే ఆరు మా
సములు బోళపు తైలముతోనున్ను ఆరు మాసములు
సుగంధ వర్గములతోనున్ను స్త్రీల శుద్ధి కొరకైన యింకా
వేరే వాటితోనున్ను వారు శుద్ధి అవుతూ వుండిరి. ।
మరిన్ని అంతఃపురములోనుంచి రాజు యింట్లోకి వెళ్లే 13
టందుకు ఆమె యేదేది కోరునో అది అది ఆమెకు యి
వ్వపడుతూ వుండెను. । సాయంతనమందు ఆమె లోప 14
లికి వెళ్లి మరునాడు వుపపత్నులను కాచే రాజుయొక్క
షండుడైన షయష్గజు అనే అతని వశములో వున్న రెం
డో అంతఃపురమునకు తిరిగీ వస్తూ వుండేది; ఆమె యం
దు రాజు సంతోషించి పేరు చేతను ఆమెను పిలిచితేనే
గాని రాజు యొద్దికి ఆమె మరి వెళ్లేది లేదు. । అయితే 15
మొర్దెకై తన కుమార్తెగా స్వీకరించుకొన్న తన పిన
తండ్రి అయిన అబీహాయీలు కుమార్తె అనే ఎస్తేరు

రాజు యొద్దికి వెళ్లుటకు ఆమె వంతు వచ్చినప్పుడు
స్త్రీలను కాచే రాజుయొక్క షండుడైన హేగే నిర్ణ
యించినది గాక ఆమెకు మరి యేమైనా అక్కర లేక
వుండెను. ఎస్తేరును చూచిన వారి అందరికీ ఆమె యందు
16 దయ కలిగెను. । యీలాగున ఎస్తేరు రాజు అయిన
అహశ్వేరోషు యేలుబాటుయొక్క యేడో సంవత్సర
మందు థేబేతు అనే పదో నెలలో అతని రాజ్య గృహ
17 ములో వున్న అతని యొద్దికి పిలువ పడెను. । రాజు
స్త్రీలందరి కంటే ఎస్తేరు మీద యెక్కువ ప్రేమ వుం
చెను; కన్నెకలందరి కంటే ఆమె అతని దృష్టికి దయ
యున్ను వుపకారమునున్ను పొందెను; అయినందువల్ల
అతడు రాజ కిరీటమును ఆమె శిరస్సు మీద వుంచి,
18 ఆమెను వష్తికి బదులుగా రాణిగా చేసెను. । అప్పుడు
రాజు తన యావత్తు ప్రభువులకున్ను సేవకులకున్ను
ఎస్తేరు విషయమై వొక గొప్ప విందు చేయించి, సం
స్థానములకు విడుదల చేయించి, రాజు స్థితికి తగినట్టు
19 గా బహుమానములను యిచ్చెను. । రెండో మారు
కన్నెకలు చేర్చబడినప్పుడు మొర్దెకై రాజు నగరి
20 యొక్క గుమ్మములో కూర్చుండి వుండెను. । అయితే
మొర్దెకై తనకు ఆజ్ఞాపించి వున్న ప్రకారము ఎస్తేరు
తన జనులనైనా తన వంశమునైనా తెలుపకుండా వుం
డెను, యేమంటే ఎస్తేరు మొర్దెకై యొద్దను పోషింప
బడిన కాలమందు చేసినట్టుగానే యిప్పుడున్ను అతని
21 మాట ప్రకారము చేసెను. । ఆ దినములలో మొర్దెకై
రాజుయొక్క నగరి ద్వారమందు కూర్చుండి వుండగా
ద్వారమును కాచే రాజుయొక్క యిద్దరు షండులైన
బిగ్తానున్ను తేరెషున్ను కోపగ్రస్తులై, రాజైన అహ
శ్వేరోషు మీద చేతులు వేసుటకు ఆలోచించుచుం
22 డిరి. । యీ సంగతి మొర్దెకైకు తెలియ పడినందున
అతడు రాణి అయిన ఎస్తేరుతో చెప్పెను; ఎస్తేరు మొ
ర్దెకైయొక్క పేరట రాజుకు దాని తెలియ చేసెను. ।
23 అయితే యీ సంగతిని గూర్చి విచారణ కాగా అది
బైలు పడెను; అందు నిమిత్తము వారిద్దరున్ను వొక
చెట్టుకు వురి తీయించబడినారు; యిది రాజు యెదుటనే
దిన వృత్తాంతముల గ్రంథమందు వ్రాయపడినది.

## 3. అధ్యాయము.

1 ఈ సంగతులైన తరువాత రాజు అయిన అహ
శ్వేరోషు అగాగీయుడున్ను హమ్మెదాత కుమారుడున్ను
అయిన హామానును గొప్ప చేసి, వాని హెచ్చించి,
వాని పీఠమును తన యొద్ద వుండే యావత్తు ప్రభువుల
2 కంటే వున్నతముగా వుంచెను. । కాబట్టి రాజ మందిర
ద్వారమందు వుండే రాజ సేవకులందరున్ను హామానుకు
వంగి నమస్కరించినారు, యేమంటే రాజు యీలా
గున అతని గూర్చి ఆజ్ఞాపించెను; అయితే మొర్దెకై
వంగకుండానున్ను నమస్కారము చేయకుండానున్ను
వుండెను. । అప్పుడు రాజ మందిర ద్వారమందు వుండే 3
రాజ సేవకులు మొర్దెకైతో నీవు రాజాజ్ఞను యెం
దుకు మీరుతున్నావని పలికిరి. । యీ ప్రకారము 4
వారు ప్రతి దినమున్ను అతనితో చెప్పినప్పటికిన్ని
అతడు వారి మాట వినకుండా వున్నందువల్ల వారు
మొర్దెకైయొక్క మాటలు స్థిరపడునో లేదో అని
చూచేటందుకు అది హామానుకు తెలిపినారు, యేమంటే
అతడు నేను యూదైయుడనని వారితో చెప్పి వుం
డెను. । మొర్దెకై వంగకుండానున్ను నమస్కరించ 5
కుండానున్ను వుండడము హామాను చూచినప్పుడు హా
మాను బహుగా కోపపడి, । మొర్దెకై మీద మాత్రము 6
చెయి వేయడము కొంచెపు కార్యమని తలంచుకొని,
మొర్దెకైయొక్క జనులను తనకు వారు తెలియపర్చి
నందున అహశ్వేరోషుయొక్క రాజ్యమందంతటాను
న్ను వుండే మొర్దెకై జనులనే యూదైయులనందరి
నిన్ని సంహరించుటకు ఆలోచిస్తూ వుండెను. । రాజు 7
అయిన అహశ్వేరోషుయొక్క పండ్రెండో సంవత్సర
మందు నీసాను మాసము, అనగా, ప్రథమ మాసమందు
వారు హామాను యెదుట పురు, అనగా, చీటిని దిన
దినముకున్ను నెల నెలకున్ను అదారు అనే పండ్రెం
డో నెల మట్టుకు వేస్తూ వుండిరి. । అంతట హామాను 8
అహశ్వేరోషుతో చెప్పినదేమంటే, మీ రాజ్యము
యొక్క యావత్తు సంస్థానముల యందుండే జన సమూ
హములలో వొక విధమైన జనులు చెదరి వున్నారు;
వారి న్యాయములు సకల జనుల న్యాయములకంటే
వేరుగా వున్నవి; వారు రాజుయొక్క ఆజ్ఞలను గైకొం
టున్నారు కారు; కాబట్టి వారిని వుండనివ్వడము
రాజుకు యుక్తము కాదు. । రాజుకు సమ్మతి అయితే 9
వారు హతము చేయపడేటట్టు వ్రాయపడును గాక;
అప్పుడు నేను ఆ పనిచేసే వారి చేతులకు పదివేల
తలాంతుల వెండిని రాజుయొక్క బొక్కసములలో
వుంచుటకు తూచి అప్పగింతునని పలికెను. । అప్పుడు 10
రాజు తన చేతి వుంగరమును తీసి, దానిని హగాగీయు
డున్ను హమ్మెదాత కుమారుడున్ను అయినటువంటిన్ని
యూదైయులకు శత్రువైనటువంటిన్ని హామానుకు యి
చ్చి, । ఆ వెండి నీకు యివ్వపడి యున్నది; నీ దృష్టికి 11
యేది మేలుగా వుండునో అది ఆ జనులకు చేసేటం
దుకు వారున్ను నీకు అప్పగించపడి వున్నారని రాజు
పలికెను. । అప్పుడు మొదటి నెల పదమూడో దిన 12
మందు రాజు సంప్రతులు పిలువబడిరి; హామాను ఆజ్ఞా
పించిన ప్రకారము అంతానున్ను రాజుయొక్క దేశా
ధిపతులకున్ను వొక్కొక సంస్థానము మీద వుంచబడిన

దొరలకున్ను ఒక్కొక జన సమూహముయొక్క ప్రభు
వులకున్న వారి వారి సంస్థానము చొప్పుననున్ను వారి
వారి భాష చొప్పుననున్ను రాజైన అహశ్వేరోషు
పేరట వారిచేత వుత్తరములు వ్రాయబడి రాజు వుం
13 గరముచేత ముద్రించబడెను. । అదారు నెల, అనగా,
పండ్రెండో నెల పదమూడో దినమందు యావత్తు
యూదైయులను, అనగా, చిన్నవాండ్లు మొదలుకొని
పెద్దవాండ్ల మట్టుకున్ను యావత్తు శిశువులనున్ను స్త్రీల
నున్ను ఒక్క దినమందే బొత్తిగా నిర్మూలము చేసి,
వారి సొమ్ము కొల్ల పుచ్చుకొమ్మని వుత్తరములు హర్కా
రాలచేత రాజ సంస్థానమంతటికిన్ని పంపబడెను. ।
14 ఆ దినములో వారు ఆయత్త పడవలెనని ప్రతి సంస్థా
నమునకు యివ్వబడుటకు వున్న ఆ ఆజ్ఞ విషయమైన
వ్రాతయొక్క ప్రతి సమస్త జనులకు ప్రచురము చేయ
15 బడెను. । హర్కారాలు రాజాజ్ఞచేత త్వరచేయబడి
బైలు వెళ్లిరి; ఆ ఆజ్ఞ షూషననే నగరిలో యివ్వబడెను;
అంతట రాజున్ను హామానున్ను పానము చేసేటందుకు
కూర్చుండిరి; అయితే షూషను పట్టణము కలవిలపడెను.

## 4. అధ్యాయము.

1 సంభవించినదంతా మొర్దెకైకు తెలియగానే
మొర్దెకై తన వస్త్రములను చించుకొని, గోనె పట్టె
లను వేసుకొని, బూడిదె పోసుకొని, పట్టణము నడు
మకు బయిలు వెళ్లి, మిక్కిలీ అంగలార్పుగల శబ్దము
2 తో కేక వేసి, । రాజు నగరి ద్వారము యెదుటకు
వచ్చెను, యేమంటే గోనె కట్టుకొన్న వాడు రాజు
3 గుమ్మములో ప్రవేశించ కూడదని ఆజ్ఞ కద్దు. । రాజు
యొక్క కట్టడయున్ను అతని ఆజ్ఞయున్ను యే యే
సంస్థానముకు వచ్చెనో అక్కడక్కడ వున్న యూదై
యులలో మహా దుఃఖమున్ను వుపవాసమున్ను యే
డ్పున్ను రోదనమున్ను కలిగివుండి, అనేకులు గోనె
4 తోనున్న బూడిదెతోనున్ను పడి వుండిరి. । అప్పుడు
ఎస్తేరుయొక్క పనికత్తెలున్ను ఆమెయొక్క షండు
లున్ను వచ్చి, అది ఆమెకు తెలియ చేసిరి; అందువల్ల
రాణి బహు మనో విచారము కలదయి, మొర్దెకై
కట్టుకొని వున్న గోనె పట్టె తీసివేయించి, కట్టుకొను
టకు వస్త్రములను అతని యొద్దికి పంపెను; అయితే
5 అతడు వాటిని పుచ్చుకోలేదు. । అప్పుడు ఎస్తేరు తనను
కనిపెట్టి యుండుటకు రాజు నియమించిన అతని షం
డులలో హతాఖు అనే ఒకని పిలుపించి, అది యేమి
టో అనిన్ని, యెందుకో అనిన్ని, తెలుసుకొనేటందుకు
6 మొర్దెకై యొద్దికి వెళ్లుమని ఆజ్ఞ యిచ్చెను. । ఆలా
గున హతాఖు రాజు నగరి ద్వారమునకు యెదుట వున్న
పట్టణపు వీధిలో వుండే మొర్దెకై యొద్దికి బయిలు
వెళ్లెను. । అప్పుడు మొర్దెకై తనకు సంభవించినదం 7
తానున్ను యూదైయులను నాశనము చేసుటకు హా
మాను వారి నిమిత్తము రాజు బొక్కసములకు తూచి
యిత్తునని చెప్పి వున్న సొమ్మును గూర్చిన సమాచారము
నున్ను అతనికి తెలిపి, । ఎస్తేరుకు చూపేటట్టుగాను 8
న్ను ఆమెకు తెలుపేటట్టుగానున్ను ఆమె తన జనుల
నిమిత్తము రాజును వేడుకొని అతని సముఖమందు
విన్నపము చేసేటందుకు అతని యొద్దికి పోయేటట్టు
చెప్పి, వారిని సంహరించేటందుకు షూషను యందు
యివ్వబడిన ఆజ్ఞయొక్క వ్రాత ప్రతి యితనికి యి
చ్చెను. । హతాఖు వచ్చి మొర్దెకైయొక్క మాటలను 9
ఎస్తేరుతో చెప్పెను. । అప్పుడు ఎస్తేరు మొర్దెకైతో 10
చెప్పుమని తిరిగీ చెప్పి హతాఖుకు సెలవు యిచ్చిన
దేమంటే, । పిలువబడకుండా పురుషుడు గానీ స్త్రీగానీ 11
రాజుయొక్క అంతర్గృహములోకి ప్రవేశించే వారు
యెవరో బ్రతికేటందుకు రాజు తన బంగారపు దండ
మును యెవని తట్టు చాపునో వాడు వినా మరి యె
వ్వడయినా సంహరించ బడునని ఒక్కటే ఆజ్ఞ కద్దు
అని రాజ సేవకులకున్ను అతని సంస్థానములలో వున్న జను
లకున్ను తెలిసే వున్నది; అయితే నేను యీ ముప్పై
దినములనుంచి రాజు యొద్దికి ప్రవేశించుటకు పిలువ
బడ లేదని చెప్పుమని చెప్పెను. । ఎస్తేరుయొక్క మా 12
టలు మొర్దెకైతో వారు తెలిపినారు. । అయితే 13
మొర్దెకై ఎస్తేరుతో ప్రత్యుత్తరముగా చెప్పుమనిన
దేమంటే, రాజు నగరిలో వున్నంత మాత్రము చేతను
యూదైయులందరి కంటే నీవు తప్పించుకొందునని నీ
మనస్సులో తలంచుకోవద్దు. । యేమంటే నీవు యీ 14
కాలమందు బొత్తిగా మౌనముగా వున్నట్టయితే యూ
దైయులకు తెప్పిరిలుటయున్ను విమోచనమున్ను మరి
యొక స్థలమునుంచి కలుగును; అయితే నీవున్ను నీ తండ్రి
యింటివారున్ను నశించుదురు; నీవు యిటువంటి కాల
ము కొరకే రాజ్యమునకు వచ్చినావేమో యెవనికి తెలు
సును అని చెప్పుమనెను. । అప్పుడు ఎస్తేరు మొర్దె 15
కైతో తిరుగా చెప్పుమనినదేమంటే, । మీరు పోయి, 16
షూషను యందు కనుపడిన యూదైయుల నందరినీ
పిలుచుకొని, నా నిమిత్తము వుపవాసముగా వుండి,
మూడు దినములు దివా రాత్రములు భోజన పానములు
చేయకుండానున్న వుండండి; నేనున్ను నా పనికత్తె
లున్ను కూడా వుపవాసముగా వుందుము; అది న్యా
యముకు విరోధముగా వున్నప్పటికిన్ని నేను రాజు
యొద్దికి ప్రవేశింతును; నేను నశిస్తేనశిస్తాను అని చెప్పు
మనెను. । ఆలాగునే మొర్దెకై ఆవలికి వెళ్లి, ఎస్తేరు 17
తనకు నిర్ణయించిన ప్రకారము అంతా చేసెను.

## 5. అధ్యాయము.

1 అప్పుడు సంభవించినదేమంటే, మూడో దినమందు
ఎస్తేరు రాజ వస్త్రములను ధరించుకొని, రాజు నగరి
యొక్క అంతర్గృహమునకు యెదురుగా వెళ్లి నిలిచెను;
రాజు నగరి ద్వారమునకు యెదురుగా వున్న రాజ గృహ
మునందున్న తన రాజాసనమందు కూర్చుండి వుండెను.।
2 తరువాత సంభవించినదేమంటే, రాజు రాణియైన
ఎస్తేరు లోగిటిలో నిలుచుని వుండేది చూచినప్పుడు,
ఆమె అతని దృష్టియందు దయ పొందినందున రాజు
తన చేతిలో వుండే బంగారపు దండమును ఎస్తేరు తట్టు
చాపెను, అప్పుడు ఎస్తేరు దగ్గిరికి చేరి దండముయొక్క
3 కొన ముట్టెను.। అప్పుడు రాజు రాణియైన వో ఎస్తే
రూ, నీకు యేమి కావలెను? నీ మనవి యేమిటి? రాజ్య
ములో సగముమట్టుకు అయినా నీకు యివ్వబడునని
4 ఆమెతో చెప్పెను.। అప్పుడు ఎస్తేరు రాజవైన నీకు
సమ్మతిగా వుంటే నేను నీకు చేయించిన విందుకు రాజ
వైన నీవున్ను హామానున్ను యీ ప్రొద్దు రావలెనని
5 ప్రత్యుత్తరముగా చెప్పెను.। అందుకు ఎస్తేరు మాట
ప్రకారముగా హామాను చేసేటందుకు అతని త్వరపె
ట్టుండి అని రాజు అనెను. ఆలాగున రాజున్ను హామా
6 నున్ను ఎస్తేరు చేయించిన విందుకు వచ్చిరి.। అప్పుడు
రాజు ద్రాక్షారసపు విందు యొద్ద ఎస్తేరును చూచి,
నీయొక్క విజ్ఞాపన యేమిటి? అది నీకు యివ్వబడును;
నీ మనవి యేమిటి? అది రాజ్యములో సగము మట్టుక
7 యినా చేయబడునని చెప్పెను.। అప్పుడు ఎస్తేరు
ప్రత్యుత్తరముగా చెప్పినదేమంటే, రాజవైన నీ దృష్టి
యందు నాకు దయ కలిగి, నా మనవి చొప్పుననున్ను
నా కోరికె చొప్పుననున్ను జరిగించుటకు రాజవయిన
8 నీకు అనుకూలమైతే,। రాజవయిన నీవున్ను హామాను
న్ను మీ నిమిత్తము నేను చేయించబోయే విందుకు
రావలెను; రాజవయిన నీవు చెప్పినట్టు రేపటి రోజున
నేను చేతును; యిదే నా మనవిన్ని నా కోరికెయున్ను
9 అని పలికెను.। ఆ దినమందు హామాను మనోహరము
గానున్ను సంతోష హృదయముతోనున్ను బయిలు
వెళ్లెను; అయితే రాజు నగరి ద్వారమందుండే మొర్దెకై
ఖైని హామాను చూచినప్పుడు అతడు లేచి నిలువకుం
డానున్ను తన నిమిత్తము కదలకుండానున్ను వున్నం
దున అతడు మొర్దెకై మీద బహుగా కోపపడెను.।
10 అయినప్పటికిన్ని హామాను తనలో తాను అణచుకొని,
తన యింటికి వచ్చి, తన స్నేహితులనున్ను తన భార్య
11 అయిన జెరెషునున్ను పిలుపించి,। తన ఐశ్వర్యముయొ
క్క మహిమనున్ను తన పిల్లలయొక్క విస్తారమునున్ను
రాజు తనకు గొప్పగా చేసి, రాజు కింద వుండే ప్రధా
నుల మీదనున్ను సేవకుల మీదనున్ను తనకు యేలా
గున పెద్దగా చేసినాడో అదిన్ని హామాను వారితో
తెలియ చేసెను.। మరిన్ని హామాను చెప్పినదేమంటే, 12
రాణియైన ఎస్తేరు తాను చేయించిన విందుకు రాజుతో
కూడా నన్ను గాక మరి యెవనినైనా రానియ్య లేదు;
రేపటి రోజున కూడా రాజుతో విందుకు రమ్మని నాకు
సెలవు అయినదని చెప్పెను.। అయితే యూదైయుడ 13
యిన మొర్దెకై రాజు నగరి ద్వారమందు కూర్చుండి
వుండడము నేను చూచినంత మట్టుకు దీని అంతటివల్ల
నాకు ప్రయోజన మేమిన్ని లేదని పలికెను.। అప్పుడు 14
అతని భార్య అయిన జెరెషున్ను అతని యావత్తు స్నేహి
తులున్ను యేభై మూరలు యెత్తు గల వొక వురి కొయ్య
చేయబడును గాక; దాని మీద మొర్దెకై వురి తీయిం
చబడుటకు రేపు నీవు రాజుతో మాట్లాడుదువు గాక;
తరువాత సంతోషముగా రాజుతో కూడా నీవు
విందుకు వెళ్లుదువు గాక అని అతనితో చెప్పిరి. యీ
సంగతి హామానుకు అనుకూలముగా కనుపడినందున
అతడు వురి కొయ్యను తయారు చేయించెను.

## 6. అధ్యాయము.

ఆ రాత్రి రాజు తనకు నిద్ర లేనందున దిన వృత్తాం 1
తములు గల పుస్తకమును తెమ్మని చెప్పెను; అది రాజు
యెదుట చదువపడెను.। అప్పుడు ద్వారపాలకులైన 2
బిగ్తానాయున్ను తెరెషున్ను అనే రాజుయొక్క యి
ద్దరు షండులు రాజైన అహశ్వేరోషు మీద చెయ్యి
వేసుటకు వెతికినారనిన సంగతి మొర్దెకై తెలిపినా
డని అందులో వ్రాసి యుండెను.। అప్పుడు రాజు 3
యిందు నిమిత్తము మొర్దెకైకి బహుమానమైనా ఘన
త్వమైనా చేయబడినదా అని అడిగెను; అందుకు రాజ
సేవకులు అతని నిమిత్తము యేమిన్ని చేయబడ లేదని
ప్రత్యుత్తరము యిచ్చినారు.। అప్పుడు లోగిటిలో 4
యెవడు వున్నాడని రాజు అడిగెను. అప్పటికి హామాను
తాను చేయించిన వురి కొయ్యమీద మొర్దెకైని వురి
తీయించుమని రాజుతో చెప్పడానకు రాజు నగరియొ
క్క వెలపటి లోగిటిలోకి వచ్చి వుండెను.। అప్పుడు 5
రాజ సేవకులు అతనితో, యిదుగో హామాను లోగిటి
లో నిలువబడి వున్నాడని చెప్పినారు; అప్పుడు రాజు
అతని రానియ్యుడని సెలవు యిచ్చినందున హామాను
లోపటికి వచ్చెను.। ఘనము చేసుటకు రాజు అపే 6
క్షిస్తూ వున్న మనుష్యునికి యేమి చేయబడ వలెనని
రాజు అతనితో పలికెను. అప్పుడు హామాను నాకే
గాని మరి యెవరికి ఘనము చేసుటకు రాజు అపేక్షి
స్తాడు అని తన హృదయములో తాను తలంచుకొని
రాజుతో చెప్పినదేమంటే,। ఘనపర్చుటకు రాజు అపే 7

క్షిస్తూ వున్న మనుష్యునికి చేయ తగినది యేదంటే, ।
8 రాజు కట్టుకొనే రాజ వస్త్రమున్ను రాజు యెక్కే
గుర్రమున్ను అతని తల మీద వుంచబడిన రాజ కిరీట
9 మున్ను తేబడును గాక. । మరిన్ని ఆ వస్త్రమున్ను ఆ
గుర్రమున్ను రాజుయొక్క ఘనమైన ప్రధానులలో
నొకని చేతికి యివ్వబడి, ఘనపరచుటకు రాజు అపే
క్షిస్తూ వున్న మనుష్యునికి ఆ వస్త్రము ధరింపచేసిన
తరువాత అతని గుర్రము మీదను యెక్కించి, పట్టణపు
వీధిలోకి కొంచుపోయి, ఘనపరచుటకు రాజు అపేక్షి
స్తూ వున్న మనుష్యునికి యీ ప్రకారముగా చేయబ
డునని అతని ముందర చాటించబడును గాక అని పలి
10 కెను. । అప్పుడు రాజు నీవు శీఘ్రముగా ఆ వస్త్రము
నున్ను ఆ గుర్రమునున్ను నీవు చెప్పిన ప్రకారమే తీసు
కొని, రాజు నగరి ద్వారము యొద్దను కూర్చుని వున్న
యూదైయుడయిన మొర్దెకైకి ఆలాగున చేయుము;
నీవు చెప్పిన దానిలో నొకటిన్ని తక్కువ కాకుండా
11 అంతా చేయుమని హామానుతో పలికెను. । ఆ ప్రకా
రమే హామాను ఆ వస్త్రమునున్ను ఆ గుర్రమునున్ను
తీసుకొని, మొర్దెకైకి ఆ వస్త్రమును ధరింపచేసి, గుర్ర
ము మీదను అతని యెక్కించి, పట్టణపు వీధిలోకి కొం
చుపోయి, ఘనపరచుటకు రాజు అపేక్షిస్తూ వున్న ఆ
మనుష్యునికి యీ ప్రకారము చేయ బడునుగాక అని
12 అతని ముందర చాటినాడు. । తరువాత మొర్దెకై రాజు
నగరి ద్వారముకు వచ్చెను; అయితే హామాను తన తల
కప్పుకొని దుఃఖిస్తూ తన యింటికి త్వరగా వెళ్లిపో
13 యెను. । హామాను తనకు సంభవించినదంతాను తన భా
ర్యయైన జెరెషుతోనున్ను తన యావత్తు స్నేహితులతో
నున్ను తెలిపినప్పుడు అతని జ్ఞానులున్ను అతని భార్య
అయిన జెరెషున్ను యెవని యెదుట పడి పోవుటకు
నీవు ఆరంభిస్తివో ఆ మొర్దెకై యూదైయుల వం
శపు వాడయితే అతనికి విరోధముగా నీకు జయము
కలగక అతని ముందర అవశ్యముగా పడిపోదువని
14 అతనితో పలికినారు. । వారు యింకా అతనితో మా
టాడుతూ వుండగా రాజుయొక్క షండులు వచ్చి,
ఎస్తేరు చేయించిన విందుకు వచ్చేటట్టు హామానును
త్వర చేసినారు.

## 7. అధ్యాయము.

1 ఆలాగున రాజున్ను హామానున్ను రాణియైన ఎస్తే
2 రుతో విందుకు వచ్చిరి. । అప్పుడు రాజు రాణి వయిన
వో ఎస్తేరూ, నీ విజ్ఞాపనము యేమిటి? అది నీకు యివ్వ
పడును; నీ మనవి యేమిటి? రాజ్యములో సగము
మట్టుకు అయినా నీకు చేయబడును, అని మరునాడు
ద్రాక్షారసపు విందులో ఎస్తేరుతో తిరిగీ చెప్పెను. ।
అప్పుడు రాణి అయిన ఎస్తేరు ప్రత్యుత్తరముగా చెప్పిన 3
దేమంటే, ఓ రాజా, నీ దృష్టికి నేను కృప పొందిన
దాననైతే రాజవయిన నీకు సమ్మతి అయి వుంటే, నా
విజ్ఞాపన ప్రకారము నా జీవమున్ను నా మనవి ప్రకా
రము నా జనులున్ను నాకు యివ్వబడుదురు గాక. ।
యేమంటే మేము సంహరించ బడుటకున్ను హతము 4
చేయబడి నశించుటకున్ను నేనున్ను నా జనులున్ను
కూడా అమ్మ పడినాము; అయితే మేము దాసులగా
నున్ను దాసురాండ్లగానున్ను అమ్మపడి యుంటే అప్పుడు
శత్రువుడు రాజుయొక్క నష్టమునకు ప్రతికారము
చేయలేక పోయినప్పటికిన్ని నేను నోరు మూసుకొని
యుందును అని పలికెను. । అప్పుడు రాజైన అహశ్వే 5
రోషు రాణియైన ఎస్తేరుతో యీలాగు తన హృదయ
ములో సాహసించిన వాడు యెవడు? వాడు యేడి?
అని పలికెను. । అందుకు ఎస్తేరు ఆ శత్రువుడున్ను ఆ 6
పగవాడున్ను యీ దుష్టుడైన హామానే అని పలికెను.
అప్పుడు హామాను రాజు యెదుటనున్ను రాణి యెదు
టనున్ను భయపడెను. । రాజు తన వుగ్రముతో ద్రాక్షా 7
రసపు విందును విడిచి, నగరి తోటకు పోయెను;
అయితే హామాను రాణి అయిన ఎస్తేరుతో తన ప్రా
ణము కొరకు విన్నపము చేసుటకు నిలిచెను, యేమంటే
రాజు వల్లను తనకు యేదో హాని వుద్దేశించ బడెనని
తెలుసుకొన్నాడు. । రాజు నగరి తోటలోనుంచి ద్రా 8
క్షారసపు విందు స్థలమునకు తిరిగీ వచ్చేటప్పటికి ఎస్తేరు
కూర్చుని వుండే పరుపు మీద హామాను పడి వుండెను.
అప్పుడు రాజు వీడు యింట్లో నా యెదుట రాణిని
బలవంతము చేసునా అని పలికెను. యీ మాట రాజు
నోట బైలు వెళ్లగానే హామాను ముఖమును వారు
కప్పిరి. । అప్పుడు రాజు ముందర వుండే షండులలో 9
హర్బోనా అనే వొకడు, యిదుగో, రాజు మేలు కొరకు
మాట్లాడిన మొర్దెకైకి హామాను చేయించిన యేభయి
మూరలు యెత్తు గల వురి కొయ్య హామాను యింటి
యొద్ద నాటబడి వున్నది అని చెప్పెను; అప్పుడు రాజు
దాని మీద వాని వురి తీయండి అని చెప్పెను. । ఆ 10
ప్రకారమే హామాను మొర్దెకైకి ఆయత్తము చేసిన
వురి కొయ్యమీద అతనినే వురి తీసినారు; అప్పుడు
రాజు వుగ్రము చల్లారెను.

## 8. అధ్యాయము.

ఆ దినమున అహశ్వేరోషు అనే రాజు యూదై 1
యులయొక్క శత్రువుడయిన హామానుయొక్క యిల్లు
రాణియైన ఎస్తేరుకు యిచ్చెను. మొర్దెకై రాజు
యెదుటకు వచ్చెను, యేమంటే అతడు తనకు యేమవు
తాడో అది ఎస్తేరు తెలియ చేసెను. । రాజు హామాను 2

చేతి తన వుంగరమును తీసుకొని, దాని మొర్దెకైకి
యిచ్చెను; అయితే ఎస్తేరు మొర్దెకైని హామాను
3 యింటి మీద అధికారిగా వుంచెను. । మరిన్ని ఎస్తేరు
రాజు ముందర మాట్లాడి, అతని పాదముల మీద పడి,
అగాగీయుడయిన హామాను చేసిన కీడున్ను అతడు
యూదైయులకు విరోధముగా తలంచిన అతనియొక్క
యోచననున్ను పరిహరించుమని కన్నీళ్లతో అతని వేడు
4 కొనెను. । అప్పుడు రాజు బంగారపు దండమును ఎస్తేరు
తట్టు చాపెను; ఎస్తేరు లేచి, రాజు యెదుట నిలిచి
5 చెప్పినదేమంటే, । రాజవైన నీకు సమ్మతిగా వుండి, నీ
దృష్టికి నేను కృప పొందిన దాననై, రాజవైన నీ యె
దుట యీ సంగతి యుక్తమని తోచి, నీ దృష్టికి నేను
యింపుగా వుంటే, అప్పుడు రాజవైన నీ సకల సంస్థా
నములలోనున్ను యూదైయులను నాశనము చేయవలె
నని అగాగీయుడైన హమ్మెదాత కుమారుడైన హామాను
వ్రాయించిన వుత్తరముల చొప్పున జరగకుండా మారు
6 త్తరములు వ్రాయ పడును గాక. । యేమంటే నా
జనుల మీద రాబోయే కీడున్ను నా వంశముయొక్క
నాశనమునున్ను నేను యేలాగు చూచి భరించగలనని
7 పలికెను. । అప్పుడు అహశ్వేరోషు అనే రాజు రాణి
యైన ఎస్తేరుతోనున్ను యూదైయుడైన మొర్దెకై
తోనున్ను చెప్పినదేమంటే, యిదుగో హామాను యిల్లును
ఎస్తేరుకు యిస్తిని; అతడు యూదైయుల మీద తన
చెయ్యి వేయ బోయినందున అతని వురి కొయ్య మీ
8 దను వురి తీసినారు. । యిప్పుడు మీకు యిష్టమైనట్టు
మీరు రాజనైన నా పేరట యూదైయుల నిమిత్తము
వుత్తరము వ్రాయించి, రాజు వుంగరముతో దాని
ముద్రించండి, యేమంటే రాజు పేరట వ్రాయబడిన
టువంటిన్ని రాజు వుంగరముతో ముద్రించ బడినటు
వంటిన్ని వ్రాతను యే మనుష్యుడైనా తారుమారు
9 చేయ లేడని పలికెను. । సీవాను అనే నెల అనగా
మూడో నెలలో యిరువై మూడో దినమందు రాజు
సంప్రతులు పిలువ పడినారు; మొర్దెకై ఆజ్ఞాపించిన
ప్రకారము అంతానున్ను యూదైయులకున్ను హిూ
ద్దూ దేశము మొదలుకొని కుషు దేశము మట్టుకున్ను
అనగా నూట యిరువై యేడు సంస్థానములలో వున్న
దొరలకున్ను ప్రభువులకున్ను ప్రతి సంస్థానమునకు
దానియొక్క వ్రాత చొప్పుననున్ను వారి భాష చొప్పు
10 ననున్ను వ్రాయ పడెను. । అహశ్వేరోషు అనే రాజు
పేరట అతడు వ్రాయించి రాజు వుంగరముతో ము
ద్రించి, ఆ వుత్తరములను హర్కారాల చేత గుర్రముల
మీదనున్ను కంచరగాడిదెల మీదనున్ను ఒంటెల మీద
11 నున్ను ఒంటెల పిల్లల మీదనున్ను అంపినాడు. । అహ
శ్వేరోషు అనే రాజుయొక్క యావత్తు సంస్థానముల
యందు వొక్క దినమందే, అనగా, అదారు నెల అనే
పంద్రెండో నెల పదమూడో దినమందు ప్రతి పట్టణ
మందుండే యూదైయులు కూడుకొని, తమ ప్రాణ
ములు కాపాడుకొనేటందుకు తమ్మును విరోధించిన
జనులనున్ను దేశములో వున్న యావత్తు బలమునున్ను
శిశువులనున్ను స్త్రీలనున్ను కూడా సంహరించేటందుకు
హతముచేసి నిర్మూల పచేటందుకున్ను, । వారి వస్తువు 12
లను కొల్లగా తీసుకొనేటందుకున్ను రాజు యూదై
యులకు సెలవు యిచ్చినాడని వాటి యందు వ్రాయ
బడి యుండెను. । యూదైయులు తమ శత్రువుల మీద 13
తమ పగ తీర్చుకొనేటందుకు ఆ దినమందు ఆయత్త
ముగా వుండవలెననిన్ని ప్రతి దేశమందు వున్న యా
వత్తు జన సమూహమునకు చాటించేటందుకు ఆజ్ఞ యివ్వ
పడెనని వాటి యందు వ్రాయబడి వుండెను. । ఆ ప్రకా 14
రమే ఒంటెల మీదనున్ను కంచర గాడిదెల మీదనున్ను
యెక్కిన హర్కారాలు రాజు మాటవల్ల ప్రేరేపించ
బడి, అతి వేగముగా బైలు వెళ్లినారు; ఆ ఆజ్ఞ షూ
షను నగరియొద్ద యివ్వబడెను. । అప్పుడు మొర్దెకై 15
వూదా వర్ణమున్ను తెలుపు వర్ణమున్ను గల రాజ
వస్త్రమునున్ను బంగారపు పెద్ద కిరీటమునున్ను సన్నపు
వస్త్రమునున్ను ధరించుకొనిన వాడై, రాజు సముఖము
నుంచి బైలు వెళ్లెను; అందు నిమిత్తము షూషను పట్ట
ణము ఆనందించి సంతోషమును పొందెను. । మరిన్ని 16
యూదైయులకు వెలుగున్ను ఆనందమున్ను సంతుష్టిన్ని
ఘనమున్ను కలిగెను. । రాజు మాటయున్న అతని ఆజ్ఞ 17
యున్ను వచ్చి వున్న ప్రతి సంస్థానమందున్ను ప్రతి
పట్టణమందున్ను యూదైయులకు ఆనందమున్ను సం
తోషమున్ను వుత్సవమున్ను శుభ దినమున్ను కలిగి
వుండెను. మరిన్ని దేశముయొక్క జనులలో అనే
కులు యూదైయుల మార్గములో చేరినారు, యే
మంటే యూదైయుల విషయమై వారికి భయము
కలిగి యుండెను.

## 9. అధ్యాయము.

రాజు మాట ప్రకారమున్ను అతని ఆజ్ఞ ప్రకా 1
రమున్ను చేయపడేటందుకు అదారు మాసము అనగా
పంద్రెండో నెల పదమూడో దినమందు యూదైయు
లయొక్క పగవారు వారిని జయించ గల వారవుదురని
నమ్మియున్న ఆ దినములో యూదైయులకే తమ పగ
వాండ్ల మీద అధికారము వున్నట్టు అగుపడెను. । యూ 2
దైయులు అహశ్వేరోషు అనే రాజుయొక్క యావత్తు
సంస్థానములలో వుండే పట్టణముల యందు తమకు కీడు
రాగలందులకు చూచిన వారి మీద చెయ్యి వేసుటకు
కూడుకొన్నారు; అయితే యెవరున్ను వారి ముందర

నిలువలేక పోయినారు, యెందుకంటే వారిని గూర్చి
సకల జన సమూహముల మీద భయము కలిగి యుం
3 డెను. । సంస్థానములయొక్క యావత్తు ప్రభువులున్ను
అధికారులున్ను దొరలున్ను రాజు పని నడిపించే
వారున్ను యూదైయులకు సహాయము చేసినారు,
యేమంటే మొర్దెకైని గూర్చిన భయము వారి మీద
4 కలిగి వుండెను. । మొర్దెకై రాజుయొక్క నగరిలో
గొప్పవాడాయెను; అతని కీర్తి యావత్తు సంస్థానముల
యందు వ్యాపించెను; యేమంటే యీ మొర్దెకై
అనే మనుష్యుడు అంతకంతకు గొప్పవాడవుతూ వుం
5 డెను. । ఆ ప్రకారమే యూదైయులు తమ శత్రువుల
నందరినిన్ని కత్తితో నరికి, వారిని నాశనము చేసి,
తమ విరోధులను తమ మనస్సు వచ్చినట్టు చేసిరి. ।
6 షూషను నగరియందు యూదైయులు యేనూరు మం
7 దిని చంపి నాశనము చేసిరి. । యూదైయులకు శత్రు
వుడున్ను హమ్మెదాత కుమారుడున్ను అయిన హామా
నుయొక్క పదిమంది కుమారులయిన పర్షందాతా, ।
8,9 దల్ఫోను, అస్పాతా, పోరాతా, । అదల్యా, అరీ
10 దాతా, పర్మష్తా, । అరీసై, అరీదై, వైజాతా, అనే
వారిని చంపినారు; అయితే కొల్ల సొమ్ము మీద
11 వారు చేతులు వేయలేదు. । ఆ దినమున షూషను నగ
రియందు చంపబడిన వారి లెక్క రాజు ముందరికి
12 తేబడెను. । అప్పుడు యూదైయులు షూషను నగరి
యందు యేనూరు మందినిన్ని హామానుయొక్క పది
మంది కుమాళ్లనున్ను చంపి హతము చేసినారు; రాజు
యొక్క కొదువ సంస్థానములలో వారు యేమి చేసి
వుందురో? యిప్పుడు నీ మనవి యేమిటి? అది నీకు
యివ్వపడును; నీవు యింకా అడిగేది యేమిటి? అది
చేయపడునని రాజు రాణియైన ఎస్తేరుతో పలికెను. ।
13 అప్పుడు ఎస్తేరు రాజవైన నీకు సమ్మతి అయి వుంటే,
యీ ప్రొద్దుటి ఆజ్ఞ చొప్పున షూషను యందుండే
యూదైయులు రేపున్ను చేసుటకున్ను హామానుయొ
క్క పది మంది కుమాళ్లను వురి కొయ్య మీద వురి
తీయించబడుటకున్ను సెలవు యివ్వబడును గాక అని
14 పలికెను. । ఆలాగునే చేసేటందుకు రాజు ఆజ్ఞాపించెను
గనుక షూషను యందు ఆజ్ఞ యివ్వపడెను; హామాను
15 యొక్క పది మంది కుమాళ్లు వురి తీయించపడిరి. । షూ
షను యందు వుండే యూదైయులు అదారు అనే
మాసము పధ్నాలుగో దినమందు కూడుకొని, షూషను
యందు మున్నూరు మందిని చంపి వేసిరి; అయితే వారు
16 కొల్ల మీద తమ చెయ్యి వేయలేదు. । రాజ సంస్థాన
ముల యందు వుండే కొదువ యూదైయులు కూడు
కొని, తమ ప్రాణములను రక్షించుకొనుటకు నిలువ
బడి, తమ విరోధులలో డెబ్బై అయిదువేల మందిని
చంపివేసి, తమ పగ వారినుంచి నెమ్మదిని పొందిరి?
అయితే కొల్ల మీదను వారు తమ చేతులను వేయ
లేదు. । అదారు మాసము పదమూడో దినమందున్ను 17
పధ్నాలుగో దినమందున్ను వారు నెమ్మదిన్ని పొంది,
సంభ్రమముగానున్ను సంతోషముగానున్ను వుండిరి. ।
అయితే షూషనులో వుండే యూదైయులు ఆ మాస 18
మందు పదమూడో దినమందున్ను పధ్నాలుగో దిన
మందున్ను కూడుకొని, పదిహేనో దినమందు నెమ్మ
దిని పొంది, సంభ్రమముగానున్ను సంతోషముగా
నున్ను వుండిరి. । కాబట్టి ప్రాకారములు లేని వూళ్లలో 19
కాపురముగా వుండే గ్రామముల వారైన యూదై
యులు అదారు మాసము పధ్నాలుగో దినమందు సం
తోషముగానున్ను సంభ్రమముగానున్ను వుండి, శుభ
దినము చేసుకొని, వొకరికి వొకరు వంతులను పంపిం
చుకొనిరి. । మొర్దెకై యీ సంగతులను అహశ్వే 20
రోషు అనే రాజుయొక్క యావత్తు సంస్థానములకున్ను
సమీపముగానైనా దూరముగానైనా వున్న యావత్తు
యూదైయులకున్ను వుత్తరములను పంపి, । యూదై 21
యులు తమ పగవారినుంచి నెమ్మది పొందిన దినము
లుగానున్ను వారి దుఃఖము సంతోషముకు తిప్పబడిన
నెలగానున్ను వారి మూల్గుట మంచి దినమునకు తిప్ప
బడినదిగానున్ను వారు సంభ్రమముగానున్ను సంతో
షముగానున్ను వుండి, వొకరికి వొకరు వంతులనున్ను
దరిద్రులకు కానుకలనున్ను పంపే దినములుగానున్ను, ।
ప్రతి సంవత్సరమూ అదారు నెలయొక్క పధ్నాలుగో 22
దినమునున్ను పదిహేనో దినమునున్ను వారు ఆచరిం
చుకొనుటకు వారికి స్థిర పర్చెను. । అప్పుడు యూదై 23
యులు వారు ఆరంభించిన ప్రకారమునున్ను మొ
ర్దెకై వారికి వ్రాసిన ప్రకారముగానున్ను చేసేటం
దుకు అంగీకరించిరి. । యెందుకంటే యూదైయులకు 24
శత్రువున్ను అగాగీయుడున్ను హమ్మెదాత కుమారు
డున్ను అయిన హామాను యూదైయులను సంహరిం
చుటకు తలంచి, వారిని నాశనము చేసుటకున్ను నిర్మూ
లము చేసుటకున్ను పురు అనగా చీటి వేయించెను. ।
అయితే ఎస్తేరు రాజు యెదుటికి వచ్చిన తరువాత అత 25
డు యూదైయులకు విరోధముగా వాడు తలంచిన
చెడ్డ యోచన వాని తల మీదికి వచ్చేటట్టుగానున్ను
వాడున్ను వాని కుమాళ్లున్ను వురి కొయ్యమీద వురి
తియ్య బడేటట్టుగానున్ను వుత్తరముల వల్ల ఆజ్ఞా
పించినాడు. । అయినందున ఆ దినములను పురు అనే 26
పేరు చొప్పున పురీము అని వారు పిలిచినారు. కా
బట్టి యీ వుత్తరములో వ్రాసియున్న యావత్తు మాటల
నిమిత్తమున్ను యీ సంగతిని గూర్చి వారు చూచిన
దంతటి నిమిత్తమున్ను వారి మీదికి వచ్చిన దాని నిమి

27 త్తమున్ను, । యూదైయులు తాము యీ రెండు దిన
ములను గూర్చి వ్రాసియున్న ప్రకారముగానున్ను
ప్రతి సంవత్సరమున్ను వాటి నిర్ణయ కాల ప్రకా
రముగానున్ను వాటిని ఆచరింతామనిన్ని, యీ దిన
ములు తర తరముగా ప్రతి కుటుంబములోనున్ను ప్రతి
సంస్థానములోనున్ను ప్రతి పట్టణములోనున్ను జ్ఞాప
28 కము చేయబడి ఆచరంచ బడుననిన్ని, । యీ పూరీము
అనే దినములు యూదైయులలో తేలి పోకుండాను
న్ను వాటి జ్ఞాపకము తమ సంతతిలోనుంచి నశించి
పోకుండానున్ను వుండుననిన్ని, యీ ప్రకారముగా
నిర్ణయించుకొని, అది తేలి పోకుండా తమ మీద
నున్ను తమ సంతతి వారి మీదనున్ను తమతో కలు
సుకొన్న వారి మీదనున్ను వున్న బాధ్యతను ఫెప్పు
29 కొన్నారు. । అప్పుడు పురీమును గురించి వ్రాసియున్న
యీ రెడో వుత్తరమును దృఢ పరచేటందుకు అబీహా
యీలు కుమార్తెయున్ను రాణియున్ను అయిన ఎస్తే
రున్ను యూదైయుడైన మొర్దెఖైయున్ను యావ
30 దధికారముతో వ్రాయించినారు. । మరిన్ని యూదై
యుడైన మొర్దెఖైయున్ను రాణియైన ఎస్తేరున్ను
యూదైయులకు నిర్ణయించిన ప్రకారముగానున్ను
వారు వుపవాసముతోనున్ను మొర్రతోనున్ను ఆచ
రించి, తమ మీదనున్ను తమ వంశపువారి మీదనున్ను
వున్న బాధ్యత చొప్పున జరిగింతుమని ఫెప్పుకొన్న
ప్రకారముగానున్ను, । యీ పూరీముయొక్క దినములను 31
దృఢపరచుటకు అతడు అహశ్వేరోషుయొక్క రాజ్య
మందు వుండే నూట యిరువై యేడు సంస్థానము
లలో వున్న యావత్తు యూదైయులకు సమాధానము
న్ను సత్యమున్ను గల మాటలతో వుత్తరములను అంపె
ను. । యీలాగునే ఎస్తేరుయొక్క ఆజ్ఞవల్ల యీ పూరీ 32
ముయొక్క సంగతులు దృఢ పరచబడినవి; మరిన్ని
అది గ్రంథములో వ్రాయబడెను.

## 10. అధ్యాయము.

రాజు అయిన అహశ్వేరోషు దేశము మీదనున్ను 1
సముద్రముయొక్క ద్వీపముల మీదనున్ను పన్ను నిర్ణ
యించెను. । అతని బలమున్ను అతని సామర్థ్యమున్ను 2
గల యావత్తు కార్యములున్ను రాజు మొర్దెఖైని
పెద్దగా చేసిన సమాచారమున్ను యివి యన్నీ మాదై
పారసీ రాజుల వృత్తాంతముల గ్రంథమందు వ్రాయ
బడి యున్నవి కావా? । యేమంటే యూదైయుడైన 3
మొర్దెఖై రాజైన అహశ్వేరోషు తరువాత రెండో
వాడుగా వుండి, యూదైయులలో గొప్పవాడై, తన
సహోదరులైన చాలా మందికి ప్రియమైన వాడుగా
యెంచపడి, తన జనులయొక్క భాగ్యమును వెతుకు
తూ, తన సంతతి వారందరితో సమాధానముగా మా
ట్లాడుతూ, వుండే వాడు.

# యోబు యొక్క చరిత్ర.

## 1. అధ్యాయము.

1 ఊసు అనే దేశమందు యోబు అనే పేరు గల
వొక మనుష్యుడు వుండెను; ఆ మనుష్యుడు సజ్జనుడు
న్ను యథార్థపరుడున్ను పరాత్పరునికి భయపడి
చెడ్డతనమునుంచి తొలిగేవాడున్ను అయి వుండెను. ।
2 అతనికి యేడుగురు కుమారులున్ను ముగ్గురు కుమార్తె
3 లున్ను పుట్టిరి. । అతనికి కలిగిన పశువులు యెన్ని అంటే,
యేడువేల గొర్రెలున్ను, మూడువేల వొంటెలున్ను,
యేనూరు జతల యెడ్లున్ను, యేనూరు ఆడు గాడిదెలు
న్ను; మరిన్ని సేవకావృత్తి జనులున్ను బహు విస్తార
ముగా అతనికి వున్నందున ఆ మనుష్యుడు తూర్పు
4 జనులందరి కంటే గొప్పవాడై వుండెను. । అతని కుమా
రులు ప్రతివాడున్ను తన తన దినమున తమ తమ యిం
డ్లలో విందు చేయిస్తూ, తమ ముగ్గురు అక్కచెల్లెండ్లను
తమతో కూడా భుజించుటకున్ను పానము చేయుట
5 కున్ను పిలిపిస్తూ వుండేవారు. । విందు చేయించే వాని
వాని దినములు ముగించినప్పుడు యోబు వారిని పిలి
పించి, వారిని పరిశుద్ధపరచి, అరుణోదయమందు లేచి
వారందరి లెక్క ప్రకారముగాను దహన బలులను
చెల్లించేవాడు. యేమంటే వొక వేళ నా కుమారులు
పాపము చేసి, పరాత్పరుని తమ హృదయమందు దూ
షించి వుందురేమో అని యోబు అనుకొనేవాడు.
యీ ప్రకారముగా యోబు ఆ దినములన్నిటిలో చేసే
6 వాడు. । అయితే పరాత్పరుని కుమారులు యెహోవా
ముందర నిలుచుటకు వచ్చిన వొక దినమందు సాతా
7 నున్ను వారి నడిమికి వచ్చెను. । యెహోవా సాతా
నును నీవు యెక్కడినుంచి వస్తివి అని అడిగెను; అప్పు
డు సాతాను యెహోవాకు ప్రత్యుత్తరముగా భూ
మిలో అటూ యిటూ తిరుగుతూ, దానిలో కిందా
8 మీదా నడుస్తూ వస్తినని పలికెను. । అప్పుడు యెహో
వా సాతానుతో నా సేవకుడైన యోబు మీద దృష్టి
వుంచితివా? యేమంటే సజ్జనుడున్ను యథార్థపరు
డున్ను పరాత్పరునికి భయపడి చెడ్డతనము పరిహరించే
వాడున్ను అయిన ఆ మనుష్యుని వలె భూమిలో వొక
9 డున్ను లేడని చెప్పెను. । అప్పుడు సాతాను యెహో
వాకు ప్రత్యుత్తరముగా చెప్పినదేమంటే, యోబు వ్యర్థ
10 ముగా పరాత్పరునికి సేవ చేస్తూ వున్నాడా? । నీవు
వానికిన్ని వాని యింటికిన్ని వానికి కలిగినదంతటికిన్ని
చుట్టూ కంచె వేయ లేదా? నీవు వాని చేతుల పనిని
ఆశీర్వదించినందున వాని సంపద దేశమందు విస్తార
మాయెను. । అయితే యిప్పుడు నీ చెయ్యి చాపి, వానికి 11
కలిగినదంతటినిన్ని నీవు ముట్టుము; అప్పుడు వాడు నీ
ముఖము యెదుట నిన్ను దూషించడా అని పలికెను. ।
అప్పుడు యెహోవా సాతానుతో యిదుగో వానికి 12
కలిగినదంతాను నీ చేతిలో వున్నది; వాని మీద మా
త్రము నీ చెయ్యి చాప వద్దని చెప్పెను. అప్పుడు
సాతాను యెహోవా సముఖమును విడిచి బయిలు
వెళ్లెను. । తరువాత అతని కుమారులున్ను అతని కుమా 13
ర్తెలున్ను తమ పెద్ద సహోదరుని యింట్లో భోజ
నము చేస్తూ ద్రాక్షారసమును పానము చేస్తూ వున్న
వొక దినము సంభవించెను. । అప్పుడు వొక మనుష్యుడు 14
యోబు యొద్దికి వచ్చి, యెడ్లు దున్నుతూ గాడిదెలు
వాటి పక్కను మేస్తూ వుండగా, । సెబాయీయులు 15
వాటి మీద పడి, వాటిని పట్టుకొని, పనివాండ్లను
కత్తివాడితో నరికి వేసినారు; నేను వొకడను మాత్ర
ము అది మీకు తెలిపేటందుకు తప్పించుకొని వస్తినని
పలికెను. । వీడు యింకా మాట్లాడుతూ వుండగా, 16
యింకొకడు వచ్చి, పరాత్పరుని అగ్ని ఆకాశములో
నుంచి పడి గొర్రెలనున్న పనివాండ్లనున్ను కాల్చి నాశ
నము చేసెను; నేను వొక్కడను మాత్రము అది మీకు
తెలిపేటందుకు తప్పించుకొని వస్తినని పలికెను. । వీడు 17
యింకా మాట్లాడుతూ వుండగా, యింకొకడు వచ్చి,
కల్దీయులు మూడు తెగలయి వచ్చి, వొంటెల మీద
పడి, వాటిని తోలుకొని, పనివాండ్లను కత్తివాడితో
నరికి వేసినారు; నేను వొకడను మాత్రము అది మీకు
తెలిపేటందుకు తప్పించుకొని వస్తినని పలికెను. । వీడు 18
యింకా మాట్లాడుతూ వుండగా, యింకొకడు వచ్చి, నీ
కుమారులున్ను నీ కుమార్తెలున్ను తమ పెద్ద సహో
దరుని యింట్లో భోజనము చేస్తూ ద్రాక్షా రసమును
పానము చేస్తూ వుండగా, । యిదుగో గొప్పగాలి అరణ్య 19
మార్గముగా వచ్చి, ఆ యింటి నాలుగు మూలలను
న్ను కొట్టెను; అప్పుడు అది చిన్నవాండ్ల మీద పడి
నందున వారు చనిపోయిరి; నేను వొకడను మాత్రము
అది మీకు తెలిపేటందుకు తప్పించుకొని వస్తినని పలి
కెను. । అప్పుడు యోబు లేచి, తన వస్త్రమును చింపివే 20

సుకొని; తన తల వెంట్రుకలను గొరిగించి, నేలమీద
21 పడి మ్రొక్కి, । దిగంబరినై నా తల్లి గర్భములోనుంచి
నేను బయిటికి వస్తిని, దిగంబరినై అక్కడికి తిరిగీ
వెళ్లుదును; యెహోవా యిచ్చెను, యెహోవా తీసు
కొని వున్నాడు; యెహోవాయొక్క నామము స్తుతిం
22 చబడును గాక అని పలికెను. । వీటన్నిటిలోను యోబు
పాపము చేయకుండానున్ను పరాత్పరుని మీద సరి
కానిదేదైనా ఆరోపించకుండానున్ను వుండెను.

## 2. అధ్యాయము.

1 పరాత్పరుని కుమారులు యెహోవా ముందర
నిలుచుటకు మరి వొక దినము సంభవించెను; అప్పుడు
వారి నడిమికి సాతానున్ను యెహోవా ముందర నిలు
2 చుటకు వచ్చెను. । యెహోవా సాతానును నీవు యె
క్కడనుంచి వస్తివి అని అడిగెను; సాతాను యెహో
వాకు ప్రత్యుత్తరముగా భూమిలో అటూ యిటూ
తిరుగుతూ, దానిలో కిందా మీదా నడుస్తూ వస్తినని
3 పలికెను. । అప్పుడు యెహోవా సాతానుతో నీవు నా
దాసుడైన యోబు మీద దృష్టి వుంచితివా? యేమంటే
సజ్జనుడున్ను యథార్థపరుడున్ను పరాత్పరునికి భయ
పడి చెడ్డతనము పరిహరించే వాడున్ను అయిన ఆ
మనుష్యుని వలె భూమిలో వొకడున్ను లేడు; నిష్కా
రణముగా వాని నిర్మూలము చేసుటకు నీవు వానికి
విరోధముగా నన్ను ప్రేరేపించినప్పటికిన్ని వాడు యిం
కా తన సజ్జనత్వమందు గట్టిగా నిలిచి యున్నాడని ఆన
4 తిచ్చెను. । అప్పుడు సాతాను యెహోవాతో ప్రత్యు
త్తరముగా తోలుకు తోలునున్ను, మనుష్యుడు తనకు
కలిగినది యావత్తున్ను తన జీవము కొరకు యిచ్చును. ।
5 అయితే నీవు నీ చెయ్యి చాపి, వాని యెముకనున్ను
వాని మాంసమునున్ను ముట్టుకొనుము; అప్పుడు వాడు
నీ ముఖము యెదుట నిన్ను దూషించునని పలికెను. ।
6 అప్పుడు యెహోవా సాతానుతో యిదుగో వాడు
నీ చేతిలో వున్నాడు; వాని ప్రాణము మాత్రము కా
7 యుమని చెప్పెను. । అప్పుడు సాతాను యెహోవా
సముఖములోనుంచి బయిలు వెళ్లి, యోబుయొక్క అరి
కాలు మొదలుకొని అతని వునుక మట్టుకున్ను బాధ
8 గల కురుపులతో అతని మొత్తెను. । అప్పుడతడు తన్ను
గోకుకొనుటకు వొక పెంకు తీసుకొని, బూడిదెలో
9 కూర్చుండెను. । అంతట అతని భార్య అతని చూచి,
యింకా నీసజ్జనత్వమందు దృఢముగా నిలిచి వున్నావా?
పరాత్పరుని దూషించి, చచ్చిపొమ్మని పలికెను. ।
10 అందుకు అతడు దానితో నీవు వెర్రివాండ్లలో వొకతె
మాట్లాడినట్టు మాట్లాడుతున్నావు. యేమి, పరాత్ప
రుని చేతను మేలు పొందిన మనము కీడున్ను పొంద
వద్దా? అని పలికెను. వీటన్నిటిలోను యోబు తన
పెదవులచేత పాపము చేయకుండా వుండెను. । అయితే 11
యోబుయొక్క ముగ్గురు స్నేహితులు, అనగా, తేమానీ
యుడైన ఎలీఫాజున్ను, షూహీయుడైన బిల్దదున్ను
నయమాతీయుడైన సోఫరున్ను, యోబు మీదికి వచ్చిన
యీ కీడు అంతానున్ను వినినప్పుడు వారు తమ తమ
స్థలములనుంచి వచ్చిరి. యేమంటే వారు అతనితో
దుఃఖించుటకున్ను అతని పరామర్శించుటకున్ను రావ
డానకు వొకరితో వొకరు నిర్ణయము చేసుకొనిరి. ।
వారు దూరమునుంచి తమ కన్నులు యెత్తి చూచినప్పు 12
డు అతని పోల్చ లేక పోయినందున, వారు తమ శబ్ద
ము యెత్తి యేడ్చి, తమ తమ దుప్పటి చించుకొని,
ఆకాశము తట్టు తమ తలల మీద ధూళిని వేసుకొనిరి. ।
అప్పుడు వారు అతనితో వొక మాటనయినా పలుక 13
కుండా రాత్రి పగలూ యేడు దినములు అతనితో
కూడా నేల మీద కూర్చుని వుండిరి, యేమంటే అతని
దుఃఖము మహా అధికమని వారు చూచిరి.

## 3. అధ్యాయము.

ఆ తరువాత యోబు తన నోరు తెరచి, తాను 1
పుట్టిన దినమును శపించెను. । అప్పుడు యోబు ప్రత్యు 2
త్తరముగా చెప్పినదేమంటే, । నేను పుట్టిన దినమున్ను, 3
వొక మొగపిల్ల వుత్పత్తి ఆయెనని చెప్పబడ్డ రాత్రిన్ని
నాశన మవును గాక. । ఆ దినము అంధకారమవును 4
గాక; పరాత్పరుడు మీదనుంచి దానిని విచారించకను
న్ను వెలుగు దాని మీద ప్రకాశించకనున్ను వుండును
గాక. । చీకటిన్ని మరణముయొక్క నీడయున్ను దానిని 5
కళంక పరుచును గాక; మబ్బు దానిని మూసును గాక;
దినముయొక్క అంధకారము దానిని భయముతో ఆవ
రించును గాక. । ఆ రాత్రి, అంధకారము దానిని 6
పట్టును గాక; అది సంవత్సర దినములతో చేర్చబడ
కుండానున్ను మాసముల లెక్కలో రాకుండానున్ను
పోవును గాక. । యిదుగో ఆ రాత్రి ప్రత్యేకముగా 7
వుండును గాక; దానియందు సంతోష శబ్దములేకుం
డా వుండును గాక. । ఆ దినమును శపించే వారున్ను 8
విచారములను లేవచేయ తగిన వారున్ను దానిని శపిం
తురు గాక. । దాని సంధ్యా కాలపు నక్షత్రములు 9
చీకటి అవుగాక; అది వెలుగు కొరకు యెదురు చూ
స్తూ వున్నప్పటికీ అది లేక పోవును గాక; వుదయ
కాలముయొక్క తెలుపు అది కానక వుండును గాక. ।
యేమంటే నేను పడి వున్న గర్భముయొక్క ద్వార 10
ములు అది మూయకనున్ను నా నేత్రములకు శ్రమ
కనపడకుండా మరుగు చేయకనున్ను వుండెను. । నేను 11
గర్భములోనుంచే యేల చావకపోతిని? వుదరములో

నుంచి బైలు వెళ్లేటప్పుడే జీవము విడువకుండా యేల
12 వుంటిని? । మోకాళ్లు నన్ను బయిలు పడ చేసినవేమి?
13 కుడుచుటకు స్తనములు నాకు కలిగినవేమి? । యేమంటే
యిప్పుడు నేను పరుండి నిమ్మళముగా వుందునే; పాడు
భూములలో తమకు యిండ్లు కట్టించిన భూరాజులతో
14 నున్ను ఆలోచన కర్తలతోనున్ను, । లేక బంగారము
గలవారున్ను తమ యిండ్లు వెండితో నింపిన వారు
15 నైన్న ప్రభువులతోనున్ను కూడా, । నేను యిప్పుడు
16 సుఖపడుతూ నిద్రపోదునే. । లేకపోతే గర్భము పడి
పోయిన గుప్తమైన పిండము వలెనున్ను వెలుగు కనని
17 శిశువుల వలెనున్ను నేను కాక పోతినేల? । అక్కడ
దుష్టులు శ్రమ పరచుట చాలించి వున్నారు; అక్కడ
18 అలసిన వాండ్లు విశ్రాంతిని పొందుతున్నారు. । అక్కడ
చెరపడిన వాండ్లు యేకముగా విశ్రమిస్తున్నారు; హిం
19 సకుని శబ్దము వారు వినకుండా వున్నారు. । పిన్నలు
న్ను పెద్దలున్ను అక్కడ వున్నారు; దాసుడు తన యజ
20 మానుని యొద్దనుంచి వీడిపోయి వున్నాడు. । దుర్దశ
లో వున్న వానికి వెలుగున్ను చేదుగల ఆత్మకు జీవము
21 న్ను యెందుకు యివ్వబడి యున్నది? । వారు మరణ
మునకు ఆశించినప్పటికిన్ని అది రాక వున్నది; నిక్షేప
ము కొరకు తవ్వే దాని కంటే దీని కొరకు అధికము
22 గా తవ్వుతున్నారు. । వారు సమాధిని కనుకొనినప్పుడు
బహు సంతోష భరితులై, అందు నిమిత్తము ఆనందిం
23 తురు. । యెవ్వని మార్గము చాటుగా వున్నదో పరా
త్పరుడు యెవ్వని చుట్టూ కంచె వేసి వున్నాడో అటు
24 వంటి వానికి వెలుగు యివ్వ బడేది యెందుకు? । యే
మంటే నేను భోజనము చేయక మునుపే నాకు నిట్టూ
ర్పు వస్తున్నది; నా మూలుగులు నీళ్ల వలె పోయబడు
25 తున్నవి. । యేమంటే దేనికి నేను బహుగా భయపడి
తినో అది నా మీదికి వచ్చి వున్నది; దేని కొరకు
నేను వెరచితినో అది నాకు సంభవించి వున్నది. ।
26 సుఖించకుండానున్ను విశ్రమించకుండానున్ను అలుపు
తీర్చుకోకుండానున్ను వుండే నాకు తత్తరపాటు వచ్చెను
అని పలికెను.

## 4. అధ్యాయము.

1 అప్పుడు తేమానీయుడైన ఎలీఫాజు ప్రత్యుత్తర
2 ముగా చెప్పినదేమంటే, । మేము నీతో మాట్లాడుటకు
యత్నిస్తే ఆయాస పడుదువా? అయితే మాట్లాడకుం
3 డా యెవడు వూరకో గలడు? । యిదిగో నీవు అనేకు
లకు బుద్ధిచెప్పి, దుర్బలమైన చేతులను నీవు బలపరిచి
4 తివి. । నీ మాటలు పడిపోతూ వున్న వాని నిలువ
బెట్టెను; కుంగి పోతూ వుండిన మోకాళ్లను నీవు బల
5 పరచితివి. । అయితే యిప్పుడు యిది నీ మీదికి వచ్చి
నందున నీవు సొమ్మసిల్లుతున్నావు; యిది నిన్ను అంటి
నందున నీవు కలత పడుతున్నావు. । నీ దేవభక్తి యందే 6
గదా నీ ధైర్యమున్ను నీ కోరికెయున్ను నీ మార్గ
ముల యథార్థతయున్ను కలిగి వున్నవి? । నిరపరాధి 7
యై నశించిన వాడు యెవడు? లేక నీతిమంతుడు యె
క్కడ హతము చేయపడెను అని దయచేసి తలంచుము. ।
నేను చూచి వున్న ప్రకారము అన్యాయమును దున్ని, 8
కీడును విత్తేవారు అదే కూర్చుతారు. । పరాత్పరుని 9
శ్వాసము వల్ల వారు నశించి పోతున్నారు; ఆయన నా
సికారంధ్రముయొక్క వూపిరివల్ల వారు నిర్మూలమవు
తూ వున్నారు. । సింహముయొక్క గర్జనల్లుటయున్ను 10
దుష్ట సింహముయొక్క శబ్దమున్ను కొదమ సింహముల
యొక్క పళ్లున్ను పగిలి పోవును. । ముసలి సింహము 11
ఆహారములేక నశించి పోతున్నది; బలమైన సింహపు
పిల్లలు చెదరి పోతున్నవి. । వొక సంగతి రహస్యముగా 12
నా యొద్దికి వచ్చెను; దానియొక్క చిన్నవినికి నా
చెవిలో పడెను. । మనుష్యుల మీద గాఢ నిద్ర వచ్చి 13
నప్పుడు రాత్రి దర్శనములలో అనేక విధములైన తలం
పులు కలిగి వున్నప్పుడు, । దిగులున్ను వణుకున్ను నాకు 14
కలిగెను; అందువల్ల నా యెముకలన్నిన్ని కదిలెను. ।
అప్పుడు వొక ఆత్మ నా ముఖము యెదుట జరిగి పో 15
యెను; నా శరీరముయొక్క వెంట్రుకలు పులకించెను. ।
అది నిలువపడెను, అయితే దాని ఆకారమును నేను 16
భేదించ లేకపోతిని; వొక స్వరూపము నా నేత్రముల
యెదుట వుండెను; యే చప్పుడూ లేకపోయిన తరు
వాత నేను వొక శబ్దమును వింటిని; అది యేలాటిదం
టే, । దుర్బలుడైన మనుష్యుడు పరాత్పరుని కంటే 17
నీతిమంతుడై వుండునా? మనుష్యుడు తన సృష్టికర్త
కంటే పరిశుద్ధుడై వుండునా? । యిదుగో ఆయన తన 18
సేవకులయందు నమ్మకము వుంచక వున్నాడు; తన దూ
తల మీద బుద్ధి హీనతను మోపుతున్నాడు. । జిగట 19
మంటి యిండ్లలో నివసిస్తూ, మంటిలో అస్తిభారము
గల వారిని గూర్చి యిది మరి యెంతో రూఢము?
వారు చిమ్మెట యెదుట చితికి పోతున్నారు. । వారు 20
వుదయము మొదలుకొని సాయంతనము మట్టుకు నశి
స్తున్నారు; యెవ్వడున్ను లక్ష్యము చేయకనే వారు
నిత్య నాశనమును పొందుతున్నారు. । వారి యందున్న 21
వారి శ్రేష్ఠత పోతున్నది గదా? జ్ఞానము పొందక వారు
చస్తున్నారు అని నాకు పలుకబడెను.

## 5. అధ్యాయము.

ఇప్పుడు నీకు మారుత్తరము యిచ్చే వాడు యెవ 1
డైనా వుంటే పిలువుము; పరిశుద్ధులలో యెవని వై
పును చూతువు? । యేమంటే వుగ్రము బుద్ధి హీనుని 2

3 చంపును; రౌద్రము అవివేకుని హతము చేసును. । బుద్ధి
హీనుడు వేరు తన్నడము చూస్తిని; అయితే వెంబడి
4 గానే వాని నివాస స్థలమును నేను శపిస్తిని. । వాని
పిల్లలు నిరుపద్రవమునకు దూరమై వున్నారు; ద్వార
ములో వారు నలిగిపోతున్నారు; వారిని రక్షించే వాడు
5 వొకడూ లేడు. । వాని పంట ఆకలిగొన్న వాడు తిని,
ముండ్ల చెట్లలోనుంచిన్ని దానిని లాగును; దప్పికి లేని
6 వాడు వారి ఆస్తిని మింగివేసును. । యేమంటే ఆపద
ధూళిలోనుంచి లేవకనున్ను శ్రమ భూమిలోనుంచి
7 మొలువకనున్ను వున్నప్పటికీ, । అగ్ని కణములు పైకి
యెగిరినట్టు మనుష్యుడు శ్రమ కొరకు పుట్టి వున్నా
8 డు. । అయితే నేను పరాత్పరుని వెతుకుదును; పరా
9 త్పరునికి నా వ్యాజ్యమును అప్పగింతును. । ఆయన
పరిశోధించ శక్యము కాని గొప్ప కార్యములనున్ను
యెంచ శక్యము కాని అద్భుత కార్యములనున్ను చేస్తు
10 న్నాడు. । ఆయన భూమి మీద వర్షమును కురుపించి,
11 పొలముల మీదికి జలములను పంపుతున్నాడు. । ఆయన
దీనులను వున్నతమునకు హెచ్చింప చేస్తున్నాడు; దుఃఖ
12 గ్రస్తులు భాగ్య స్థితికి లేవనెత్తబడుతున్నారు. । ఆయన
కృత్రిమపు వారియొక్క వుద్దేశములను భంగపరచినం
దువల్ల వారి చేతులు వారి యత్నమును జరిగింప నేరక
13 వున్నవి. । ఆయన జ్ఞానులను వారి కృత్రిమములో పట్టు
తున్నాడు; అందువల్ల తంత్రపు వారియొక్క ఆలోచన
14 తలకిందై పోతున్నది. । పగటి కాలమందు అంధకార
ము వారికి తారసిల్లుతున్నది; మధ్యాహ్నమందు రాత్రి
15 అయినట్టు వారు తడవులాడుతూ వున్నారు. । అయితే
ఆయన కత్తినుంచిన్ని వారి నోటినుంచిన్ని బలవంతుని
16 చేతినుంచిన్ని బీదవాని రక్షిస్తూ వున్నాడు. । ఆలాగున
దరిద్రునికి నమ్మికె కద్దు; అక్రమము తన నోరు మూ
17 సును. । యిదుగో పరాత్పరుడు దండించే మనుష్యుడు
భాగ్యవంతుడు; కాబట్టి సర్వ శక్తునియొక్క దండనను
18 నీవు అలక్ష్యము చేయకుము. । యేమంటే ఆయన నలిపి
తిరుగా కట్టుతున్నాడు; ఆయన గాయమును పొందిం
19 చిన తరువాత ఆయన చేతులు బాగు చేస్తవి. । ఆయన
ఆరు కష్టములలోనుంచి నిన్ను రక్షించును; నిశ్చయ
20 ముగా యేడింట్లోనున్ను నీకు యే కీడు ముట్టదు. । క్షామ
కాలమందు ఆయన మరణమునుంచిన్ని యుద్ధములో
కత్తియొక్క నరుకులనుంచిన్ని నిన్ను రక్షించును. ।
21 మరిన్ని నీవు నాలుక కొరడాకు చాటు చేయబడు
దువు; నాశనము సంభవించేటప్పటికి నీవు భయపడ
22 కుండా వుందువు. । నాశనము తట్టున్ను క్షామము తట్టు
న్ను నీవు నవ్వుదువు; భూమియొక్క మృగములకు
23 నీవు భయపడకుండా వుందువు. । యేమంటే పొలము
యొక్క రాళ్లతోను నీవు వొడంబడికెగా వుందువు;
పొలముయొక్క మృగములున్ను నీతో సమాధానము
గా వుండును. । నీ గుడారము క్షేమములో వున్నదని 24
నీవు తెలుసుకొందువు; నీ నివాస స్థలమునకు నీవు
తిరిగి తప్పుచేయక వుందువు. । నీ సంతతి అధికమవు 25
ననిన్ని నీ బిడ్డలు భూమియొక్క గడ్డి వలె అవుదురనిన్ని
నీవు తెలుసుకొందువు. । దాని కాలమందు వచ్చే ధాన్య 26
ముయొక్క పన వలె నీవు ముదిరిన వయస్సులో సమా
ధికి చేరుదువు. । యిదుగో మేము పరిశోధించి తెలిసి 27
నది యిదే; యీలాగు వున్నది; యిది నీవు విని నీ మేలు
కొరకు తెలుసుకొనుమని పలికెను.

## 6. అధ్యాయము.

అందుకు యోబు ప్రత్యుత్తరముగా అనినదేమం 1
టే, । ఆహా నా దుఃఖము సరిగా తూచబడి, నా ఆపద 2
అంతా త్రాసులో వేయబడితే మేలు! । యేమంటే 3
అది యిప్పుడు సముద్రపు యిసుక కంటే బరువుగా
వుండును; కాబట్టి నా మాటలు మింగి వేయబడుతు
న్నవి. । యేమంటే సర్వశక్తునియొక్క అంబులు నా 4
యందు వున్నవి; వాటి విషము నా ఆత్మను తాగుతు
న్నది; పరాత్పరుని భయంకరత్వములు నా యెదుట
మొగ్గరముగా నిలువబడి యున్నవి. । గడ్డి వుండే స్థల 5
మందు అడవి గాడిదె కూసునా! తన మేత వున్న స్థల
మందు యెద్దు అరుచునా? । రుచి లేనిది వుప్పు లేకుం 6
డా భుజియించబడునా? గుడ్డుయొక్క తెలుపులోను
రుచి కద్దా? । నా ఆత్మ ముట్టుటకు సహించనివి నాకు 7
దుఃఖకరమయిన ఆహారమై వున్నవి. । ఆహా నా విన్న 8
పము ప్రకారము నాకు కలిగి, నేను కోరుతూ వున్న
దాని పరాత్పరుడు నాకు దయ చేసి, । పరాత్పరుడు 9
నన్ను నలుపుటకు అనుకూలించి, తన చెయ్యి వదలి
నన్ను ఖండిస్తే మేలు! । అప్పుడు నాకు యింకా ఆద 10
రణ కలిగి వుండును; నిశ్చయముగా నా శ్రమలో నేను
ఆనందింతును; ఆయన చేయ మానక వుండును గాక,
యేమంటే పరిశుద్ధునియొక్క మాటలను నేను మరుగు
వుంచలేదు. । నేను కోరేటట్టు నాకు వుండే బలము 11
యేది? నా జీవమును నేను పొడుగు చేసేటట్టు నాకు
అంతము యేది? । నా బలము రాళ్ల బలమా? నా మాం 12
సము యిత్తడిదా? । నా సహాయము నాయందు లేదా! 13
జ్ఞానము నన్ను విడిచి తొలగి పోయెనా! । శ్రమ పడు 14
తూ వున్న వానికి వాని స్నేహితునివల్లను దయ చూప
పడ వలెను; అయితే వీడు సర్వ శక్తునియొక్క భయ
మును విడిచిపెట్టి యున్నాడు. । నా సహోదరులు 15
యేరు వలె మోసము చేస్తూ వున్నారు; యేరులయొక్క
ప్రవాహముల వలె దాటి పోతూ వున్నారు. । అవి చలి 16
కాలపు మంచువల్లనున్ను కురిసిన వాన వాటిలో పారి

17 నందువల్లనున్ను కలగి వున్నవి. । వుష్ణమైన కాలమందు
అవి యింకి పోతవి; వెట్ట వచ్చినప్పుడు అవి తమ స్థల
18 మునుంచి యెండి పోతున్నవి. । వాటి మార్గముయొ
క్క కాలవలు అటూ యిటూ తిరిగి వున్నవి; అవి
వృథాగాను యేర్పడిన తరువాత వొకటీ లేకుండా పో
19 వును. । తేమాయొక్క సమూహములు చూచినవి; షెబ
యొక్క గుంపు వారు వాటి మీద నమ్మిక వుంచి, ।
20 తాము యీలాగు నమ్మినందువల్ల సిగ్గుపడుతూ వున్నారు;
21 అక్కడికి వారు వచ్చి కలవిలపడి వున్నారు. । అదే
మంటే యిప్పుడు మీరు వొక దానికిన్ని పనికిరాక
పోతిరి; నా ఆపదను చూచి సిగ్గు పడుతూ వున్నారు. ।
22 నాకు యేమైనా పట్టుకొని రండీ అనిన్ని, మీ ఆస్తి
23 లోది నాకొక బహుమతిని యిమ్మనిన్ని, । లేక శత్రువు
చేతిలోనుంచి నన్ను తప్పించండి అనిన్ని, లేక అవస్థ
పెట్టిన వాని చేతిలోనుంచి నన్ను రక్షించండి అనిన్ని
24 నేను చెప్పితినా? । నాకు వుపదేశించండి అప్పుడు నేను
మౌనముగా వుంటాను; నేను దేని యందు తప్పు చేసి
25 తినో అది నాకు తెలియ చేయండి. । చక్కని మాటలు
యెంతో బలమైనవి! అయితే మీ వాదము దేని గద్ది
26 స్తున్నది? । మాటలను గద్దించుటకు మీరు యోచిస్తు
న్నారా? దృఢము లేని వాని మాటలు గాలివలె అవు
27 తవి. । నిజముగా తండ్రి లేని వాని మీద మీరు పడి,
మీ పొరుగు వాని కొరకు మీరు గొయ్యి తవ్వుతు
28 న్నారు. । కాబట్టి యిప్పుడు మీకు చిత్తము వుంటే
నన్ను దృష్టించండి; అప్పుడు నేను అబద్ధము చెప్పు
29 తున్నానో లేదో మీకు దృశ్యమౌను. । దయచేసి తిరిగీ
రండి; అది అక్రమమని యెంచబడనివ్వకండి; తిరిగీ
30 రండి, నా నీతి అందులో వున్నది. । నా నాలుకలో
అక్రమము వున్నదా? నా రుచి న్యాయాన్యాయముల
ను గుర్తెరుగ లేదా?

## 7. అధ్యాయము.

1 మనుష్యునికి భూమి మీద పోరాటము కలిగి
వున్నది గదా? వాని దినములు వొక కూలివాని దినముల
2 వలె వున్నవి గదా? । పనివాడు నీడను అపేక్షించినట్టు
న్ను, కూలివాడు తన కూలి కొరకు యెదురు చూస్తూ
3 వున్నట్టున్ను, । మాయ గల నెలలు నా చేత స్వతం
త్రించబడి యున్నవి; ప్రయాసము గల రాత్రులు నా
4 కొరకు నియమించబడి యున్నవి. । నేను పడుకొనేట
ప్పుడు యెప్పుడు లేతునో అనిన్ని, రాత్రి యెప్పుడు
సరిపోవునో అనిన్ని అనుకొని, తెల్లవారే మట్టుకు
5 అటూ యిటూ పొర్లాటతో నిండి వున్నాను. । నా
మాంసము పురుగులతోనున్ను మంటి పెళ్లలతోనున్ను
కప్పబడి వున్నది; నా చర్మము పగిలిపోయి అసహ్య
ముగా వున్నది. । నా దినములు నేతవానియొక్క నాడె 6
కంటే తీవరముగా పరుగెత్తుతూ ఆశ లేకుండా క్షయ
మవుతున్నవి. । నా ప్రాణము గాలి వలె వున్నది అనిన్ని, 7
నా కన్నులు తిరుగా మేలు చూడ పోయేది లేదు
అనిన్ని తలంచుకొండి. । నన్ను చూచిన వాని కన్నులు 8
యిక నన్ను చూచేది లేదు; నీ కన్నులు నా మీద
వున్నవి, అయితే నేను లేకుండా పోతాను. । మేఘము 9
క్షీణించి అదృశ్యమైనట్టు సమాధిలోకి దిగే వాడు
యిక పైకి రాకుండా వుండును. । వాడు తన యింటికి 10
తిరిగీ రాడు, వాని స్థలము వానిని యిక యెరుగక వుం
డును. । కాబట్టి నేను నా నోరును వూరకోనివ్వకుండా 11
నా ఆత్మయొక్క వేదనలో నేను మాట్లాడి నా ఆత్మ
యొక్క చేదులో మొర బెట్టుదును. । నీవు నా మీద 12
కాపు వుంచేటందుకు నేను వొక సముద్రమునా? నేను
వొక తిమింగలమునా? । నా మంచము నాకు ఆదరణ 13
చేసుననిన్ని నా పరుపు నా మొర్రను తగ్గించుననిన్ని
నేను చెప్పితే, । నీవు స్వప్నములవల్ల నన్ను భయపరచి, 14
దర్శనములవల్ల నాకు దిగులు కలుగ చేస్తూ వున్నావు. ।
అందుచేత నా ఆత్మ కుతికె పిసుకుటనున్ను యీ యెము 15
కల కంటే మరణమునున్ను కోరుతున్నది. । యీలాగు 16
వుండుట నాకు సహించదు; నిత్యమున్ను జీవించుటకు
నాకు యిష్టము లేదు; నన్ను వూరకుండనిమ్ము, యేమం
టే నా దినములు మాయ గలవి. । మనుష్యుని గొప్ప 17
చేసుటకున్ను, వాని మీద నీ హృదయము వుంచుట
కున్ను, । ప్రత్యుదయమున వాని దర్శించుటకున్ను 18
ప్రతి క్షణమున వాని శోధించుటకున్ను వాడు యెంత
మాత్రపు వాడు? । నా యొద్దనుంచి తొలగి పోకుండా 19
నున్ను నా వుమ్మి నేను మింగివేసే కొరకు నన్ను వూరకే
వుండనివ్వకుండానున్ను యెంత పర్యంతము వుందువు? ।
మనుష్యులను కాపాడే వాడా, నేను పాపము చేసిన 20
వాడనైతే నీకు నేను చేయ తగినదేది? నాకు నేనే
భారము అయి వుండేటట్టుగా నీవు నన్ను నీ యెదుట
గురిగా వుంచితివేమి? । నా అక్రమమును నీవు మన్నిం 21
చకనున్ను నా అపరాధమును తీసివేయకనున్ను వుండె
దవేమి? యేమంటే నేను మంటిలో నిద్రింతును, వుద
యమందు నీవు నన్ను వెతుకుదువు గాని నేను లేకుండా
వుందును అని పలికెను.

## 8. అధ్యాయము.

అప్పుడు షూహీయుడైన బిల్దదు ప్రత్యుత్తరము 1
గా చెప్పినదేమంటే, । నీవు యెంత పర్యంతమూ యిటు 2
వంటి మాటలాడుదువు! యెంత పర్యంతము నీ నోటి
మాటలు బలమైన గాలివలె వుండును? । పరాత్పరుడు 3
న్యాయపు తీర్పును తిరగవేస్తున్నాడా? సర్వశక్తి గల

4 వాడు న్యాయమును తిరగవేస్తున్నాడా? । నీ పిల్లలు ఆ
యనకు విరోధముగా పాపము చేసినందువల్ల ఆయన
వారి అక్రమము కొరకు వారిని పరిహరించినట్టయితే,।
5 నీవు త్వరగా పరాత్పరుని వెతికి, సర్వ శక్తి గల వాని
6 గూర్చి నీవు నీ విన్నపము చేసుకొంటేనున్ను, । నీవు
శుద్ధుడవున్ను యథార్థపరుడవున్ను అయి వుంటేనున్ను,
నిశ్చయముగా యిప్పుడు ఆయన నీ కొరకు మేలుకొని
నీ నీతి గల నివాస స్థలమును భాగ్యము గలదిగా చేసు
7 ను. । నీ ఆరంభము కొద్దిదై వుండినప్పటికిన్ని నీ అంతము
8 బహుగా వృద్ధి పొందేదవును. । యేమంటే పూర్వ కా
లమును గురించి విచారించుము; వారి పితృలను పరీక్ష
చేసుటకు సిద్ధపడుము అని నిన్ను వేడుకొంటున్నాను.।
9 యేమంటే భూమి యందు మన దినములు నీడ వలె
వున్నందున మనము నిన్నటి వారమై యేమిన్ని తెలి
10 యక వున్నాము. । వారు నీకు వుపదేశించి, నీకు తెలిపి,
తమ హృదయములలోనుంచి మాటలు పలుకుదురు
11 గదా! । బురద లేకుండా జమ్ము పెరుగునా? నీళ్లు లేకుం
12 డా యేటిగడ్డి మొలుచునా! । అది యింకా తన పచ్చి
తనములోనే కోయబడకుండా వుండిన్ని కడమ గడ్డికం
13 టే త్వరగా వాడిపోవును గదా! । ఆలాగున పరాత్పరుని
మరచే అందరియొక్క మార్గములు వున్నవి; మాయ
14 కానియొక్క కోరికె ఆలాగు నశించును. । వాని కోరికె
తెగిపోవును; వాని నమ్మికె సాలె పురుగు పట్టు వలె
15 వుండును. । వాడు తన యింటి మీద ఆనుకొనును;
అయితే అది నిలవదు; వాడు దాని పట్టుకొనును అయి
16 తే అది వుండదు. । వాడు సూర్యుని యెదుట పచ్చిగా
వుంటాడు; వాని తీగెలు వాని తోట మీద పాకుతు
17 న్నవి. । వాని వేళ్లు రాళ్ల గట్టుమీద చుట్టుకొనును;
18 అవి రాతి స్థలము కొరకు చూస్తవి. । అది దాని స్థల
ములోనుంచి దాని నిర్మూలము చేసిన తరువాత నిన్ను
నేను చూడలేదు అని దాని గూర్చి చెప్పక వుండును.।
19 యిదుగో వాని మార్గముయొక్క భాగ్యము యీ
తీరున వున్నది; అయితే వేరే కొందరు మంటిలోనుంచి
20 పుట్టుదురు. । యిదుగో పరాత్పరుడు యథార్థవంతుని
పరిహరించడు; ఆయన చెడ్డ వాండ్లకు సహాయము
21 చేయడు. । ఆయన నీ నోరు నవ్వునున్ను నీ పెదవులు
ఆనందమునున్ను నింపే పర్యంతమున్ను యీలాగు
22 చేయడు. । నిన్ను పగ చేసే వారు సిగ్గుచేత కప్ప బడు
దురు; చెడ్డవారి గుడారము లేకుండా పోవును అని
పలికెను.

## 9. అధ్యాయము.

1 అప్పుడు యోబు ప్రత్యుత్తరమిచ్చి చెప్పినదేమం
2 టే, । అవును, ఆలాగు వున్నదని నిశ్చయముగా నేను
యెరుగుదును; అయితే పరాత్పరుని ముందర మను
ష్యుడు యేలాగు నీతిమంతుడు కాగలడు! । ఆయన 3
వానితో వ్యాజ్యమాడుటకు చిత్తము కలవాడై వుంటే
వాడు వేయింటిలో వొక దానికైనా ఆయనకు వుత్తరము
చెప్పలేడు. । ఆయన హృదయమందు జ్ఞానము గల 4
వాడున్ను బలమందు పరాక్రమవంతుడున్ను అయి
వున్నాడు; ఆయనకు విరోధముగా తన్ను కఠిన పరచు
కొని బాగుపడిన వాడు యెవడు! । ఆయన పర్వతము 5
లను తీసి వేసేటప్పుడు అవి తెలియక వుండును; ఆయన
తన కోపము చేతను వాటిని బోర్ల దోసును. । ఆయన 6
భూమిని దాని స్థలములోనుంచి కదిలించును; దాని
స్తంభములు వణుకును. । ఆయన సూర్యునికి ఆజ్ఞాపించి 7
నప్పుడు వాడు వుదయించకుండా వుండును; ఆయన
నక్షత్రములను మూసి వేసును. । ఆయనే ఆకాశములను 8
పరిచి సముద్రపు తరంగముల మీద నడుచును. ।
ఆయన స్వాతీ నక్షత్రమునున్ను మృగశీర్ష నక్షత్రము 9
నున్ను సప్త ఋషుల నక్షత్రములనున్ను దక్షిణపు గదు
లనున్ను కలుగ చేసును. । ఆయన తెలియ శక్యము కాని 10
గొప్ప కార్యములనున్ను యెంచ శక్యముకాని అతిశ
యములనున్ను చేసును. । యిదుగో ఆయన నా సమీ 11
పమున జరిగి పోవును, అయినప్పటికీ నేను ఆయనను
చూడక వున్నాను; ఆయన గడిచి పోవును అయితే
నేను ఆయనను కనుకోక వున్నాను. । యిదుగో ఆయన 12
తీసుకొని పోవును; ఆయనను అడ్డగించ గలవాడు యె
వడు? నీవు చేసేది యేమిటి అని ఆయనను అడిగే వాడు
యెవడు? । పరాత్పరుడు తన కోపమును తిప్పడు; గర్వ 13
మునకు సహాయము చేసేవారు ఆయన కింద వంగుదురు.।
యీలాగు వుండగా నేను ఆయనకు మారుత్తరము 14
యిచ్చి, ఆయనతో మాట్లాడే కొరకున్ను నా మాటలు
యేర్పరచుకొనేటందుకున్ను నేను యెంత మాత్రపు
వాడను? । నేను నీతిగల వాడనైనప్పటికిన్ని ఆయనకు 15
ప్రత్యుత్తరము చెప్పక వుందును; అయితే నాకు న్యా
యము తీర్చే ఆయనను బతిమాలుకొందును. । నేను 16
పిలిచినప్పుడు ఆయన నాకు మారుత్తరము యిచ్చినప్ప
టికిన్ని ఆయన నా శబ్దమునకు చెవి వొగ్గెనని నేను
నమ్మక పోదును. । యేమంటే ఆయన తుఫాను చేత 17
నన్ను నలిపి, నిమిత్తము లేకుండా అనేకములైన గాయ
ములను నాకు కలుగ చేస్తూ వున్నాడు. । ఆయన నన్ను 18
వూపిరి తీయ నివ్వక, చేదుతో నన్ను తృప్తి చేస్తూ
వున్నాడు. । సత్తువ చూస్తే యిదుగో ఆయన బలమైన 19
వాడు; న్యాయము చూస్తే నా కొరకు సాక్షిని యేర్ప
గచే వాడు యెవడు? । నన్ను నేనే నీతిమంతునిగా 20
చేసుకొంటే నా నోరు నా మీద నేరము మోపును;
నేను వుత్తముడనని చెప్పుకొంటే అది నన్ను చెడ్డవానిగా

21 అగుపరచును. । నేను వుత్తముడనైనప్పటికిన్ని నా ఆత్మను
నేను యెరుగక వుందును; నా జీవమును నేను అల
22 క్ష్యము చేతును. । యీ వొక్క సంగతి వున్నది, అందు
కొరకు ఆయన వుత్తమునిన్ని చెడ్డ వానినిన్ని నాశనము
23 చేస్తూ వున్నాడు అని చెప్పుతూ వున్నాను. । కొరడా
అకస్మాత్తుగా చంపితే ఆయన దోషము లేని వారి
24 యొక్క శ్రమలకు నవ్వును. । భూమి చెడ్డ వారి చేతికి
అప్పగించపడి వున్నది; దాని యందు వుండే న్యాయా
ధిపతులయొక్క ముఖమును ఆయన మూసివేస్తూ వున్నా
డు; యిది యీలాగు కాకుంటే ఆయన యేడి? ఆయన
25 యెవడు? । నా దినములు హర్కారా వానికంటే తీవ్ర
పడుతూ వున్నవి; అవి మేలు యెరుగకుండా యెగిరి
26 పోతూ వున్నవి. । అవి వేగముగా పరుగెత్తే వోడల
వలెనున్ను మాంసము మీద పడుతున్న రాంబోందు
27 వలెనున్ను దాటి పోతున్నవి. । నా మొర్రెను నేను
మరచి, నా ముఖ దుఃఖమును మార్చి ధైర్యము పొందు
28 దును అని అనుకొంటే, । నా ఖేదములన్నిటికిన్ని నేను
భయముగా వున్నాను; నన్ను తప్పు లేని వానిగా నీవు
29 యెంచక వుందువు. । నేను చెడ్డ వాడనై వుంటే నేను
30 యింత పర్యంతము వ్యర్థముగా పోరాడెదేమి? । నన్ను
నేను మంచు నీళ్లతో కడుగుకొని, నా చేతులు సబ్బు
31 తో శుద్ధి చేసుకొన్నప్పటికిన్ని, । నా వస్త్రములు నాకు
అసహ్యముగా వుండేటట్టు నీవు నన్ను బురదగుంతలో
32 ముంచుదువు. । యేమంటే నేను ఆయనకు ప్రత్యుత్త
రము చెప్పేటందుకున్ను మేము వుభయులము న్యా
యపు తీర్పుకు వచ్చేటందుకున్ను ఆయన నా వలె
33 మనుష్యుడు కాడు. । మా యిద్దరి మీద తన చెయ్యి
34 వుంచ తగిన మధ్యస్థుడు మా మధ్యను లేడు. । ఆయన
తన దండపు కోలను నా యొద్దనుంచి తీసి వేసును గాక;
ఆయన భయంకరత్వము నన్ను దిగులు పెట్టక వుండును
35 గాక. । అప్పుడు నేను మాట్లాడి ఆయనకు భయపడక
వుందును; అయితే నాకు యిప్పుడు ఆలాగు లేదే.

## 10. అధ్యాయము.

1 నేను ప్రాణముతో వుండుటకు నా ఆత్మ విసుకు
తున్నది; నా మొర్రకు నన్ను నేను యిచ్చుకొని, నా
2 ఆత్మయొక్క చేదులో మాట్లాడుదును. । నేను పరాత్ప
రునితో చెప్పుదును, యేమంటే నన్ను దుర్మార్గునిగా
తీర్చకుము; నాతో నీవు యే నిమిత్తముచేత వ్యాజ్య
3 మాడుతున్నావో అది నాకు తెలియ చేయుము. । బాధ
పరచుటకున్ను నీ చేతుల పనిని అలక్ష్యము చేసుట
కున్ను చెడ్డ వారి యోచన మీద ప్రకాశించుటకున్ను
4 నీకు అనుకూలమా? । మాంసపు కన్నులు నీకు వున్నవా?
మనుష్యుడు చూచినట్టు నీవు చూస్తూ వున్నావా? ।
నీవు నా అక్రమమును విచారిస్తూ నా పాపమును వెతు 5
కుతూ వుండేటట్టు, । నీ దినములు మనుష్యుని దినముల 6
వలెనున్ను నీ సంవత్సరములు మనుష్యుని దినముల వలె
నున్ను వున్నవా? । నేను దుర్మార్గుడను కానని నీకు తెలిసి 7
వున్నది; అయితే నీ చేతిలోనుంచి నన్ను తప్పించ గల
వాడు వొకడూ లేడు. । నీ చేతులు నన్ను కలుగ చేసి, 8
నా చుట్టూ వుండే అంతటినిన్ని రూపించినప్పటికిన్ని
నన్ను నిర్మూలము చేస్తూ వున్నావు. । నీవు నన్ను బంక 9
మన్ను వలెనే కలుగ చేస్తివని దయచేసి తలంచుము;
నన్ను తిరుగా ధూళిని చేయ పోతున్నావా? । నీవు నన్ను 10
పాల వలె పోసి పెరుగు వలె నన్ను తోడు పెట్టలేదా? ।
చర్మమునున్ను మాంసమునున్ను నాకు ధరింప చేసి, 11
యెముకలతోనున్ను నరములతోనున్ను నన్ను బలపరచి
తివి. । నాకు జీవమునున్ను దయనున్ను యిచ్చితివి; నీ 12
పరామర్శ నా ఆత్మను కాపాడెను. । అయితే వీటిని నీ 13
మనస్సులో నీవు దాచితివి; యిది నీ యొద్ద వున్నదని
నేను యెరుగుదును. । నేను పాపము చేస్తే అప్పుడు 14
నీవు నా యందు లక్ష్యము వుంచి నా అక్రమమునుంచి
నీవు నన్ను వదలి వేయవు. । నేను దుర్మార్గుడనై వుంటే 15
అయ్యో; నేను నీతి మంతుడనయి వున్నప్పటికిన్ని నేను
నా తల యెత్తను; నేను నిండైన తత్తరపాటుతో వున్నాను,
కాబట్టి నా శ్రమను చూడుము. । యేమంటే అది హె 16
చ్చుతున్నది; సింహము వలె నీవు నన్ను వేటాడు
తున్నావు; మరిన్ని నీవు ఆశ్చర్యముగా నన్ను నడిపిస్తూ
వున్నావు. । నాకు విరోధమైన సాక్ష్యములను నీవు 17
రెట్టిస్తూ, నా మీద నీ కోపమును హెచ్చింప చేస్తూ
వున్నావు; తేప తేపకు అధికమైన పోరాట నాకు కద్దు. ।
నీవు నన్ను గర్భములోనుంచి యెందుకు బైలు వెళ్ల 18
చేసితివి? ఆహా యే కన్ను అయినా నన్ను చూడకుండా
నేను చనిపోయి వుంటే మేలు! । అప్పుడు నేను లేకుం 19
డా వుండినట్టు వుండి, గర్భములోనుంచి సమాధికి
కొంచపోపడి వుందును. । నా దినములు కొంచెము 20
కావా? కాబట్టి నేను యెక్కడనుంచి తిరిగీ రాలేనో,
అక్కడికి అనగా మరణపు నీడ గల అంధకార దేశము
నకు, । అనగా మరణపు నీడయొక్క నలుపువంటి అంధ 21
కారము గల దేశమునకు నేను వెళ్లకముందు కొంచె
ము సేద తీర్చుకొనేటట్టు నన్ను వూరకుండనిమ్ము. ।
అక్కడ క్రమము లేదు; అక్కడ వున్న వెలుగు అంధ 22
కారములాగున వున్నదని పలికెను.

## 11. అధ్యాయము.

అప్పుడు నయమాతీయుడైన సోఫరు ప్రత్యుత్తర 1
ముగా చెప్పినదేమంటే, । మాటల విస్తారతకు మారుత్త 2
రము చెప్పుట అక్కర లేదా? ప్రేలే వాడు నీతిమం

3 తుడని తీర్చబడునా? । నీయొక్క వుప్పొంగే మాటలకు
మనుష్యులు మౌనముగా వుందురా? నీవు హాసించగా
4 యెవడున్ను నిన్ను సిగ్గుపరచ అక్కరలేదా? । యేమంటే
నా బోధ శుద్ధి కలదనిన్ని నీ దృష్టికి నేను శుద్ధుడనై
5 యున్నాననిన్ని నీవు చెప్పుతూ వున్నావు. । అయితే
పరాత్పరుడు మాట్లాడి, నీ యెదురుగా తన పెదవులు
6 తెరచి, । నీకు జ్ఞానముయొక్క రహస్యములు తెలియ
చేస్తే మేలు; యేమంటే వున్నదానికంటే అవి రెట్టి
అయి వున్నవి; కాబట్టి నీ అక్రమమునకు రాతగిన దాని
కంటే పరాత్పరుడు నీ యొద్దను తక్కువ చేయ కోరి
7 వున్నాడని తెలుసుకొనుము. । పరిశోధించుటవల్ల నీవు
పరాత్పరుని కనుకో గలవా? సర్వ శక్తిమంతుని నీవు
8 పరిపూర్ణముగా కనుకో గలవా? । అది పరమండల
మంత యెత్తయి యున్నది, నీవు యేమి చేయగలవు?
పాతాళము కంటే లోతై యున్నది, నీవు యేమి తెలు
9 సుకో గలవు? । దాని పరిమాణము భూమికంటే పొడు
గుగానున్ను సముద్రము కంటే వెడల్పుగానున్ను వు
10 న్నది. । ఆయన ఖండించినా, మూసిపెట్టినా, సమకూ
11 ర్చినా, ఆయనకు అడ్డము చేయగలవాడు యెవడు? । యే
మంటే ఆయన మాయగల మనుష్యులను యెరుగును;
ఆయన అక్రమమును చూచిన్ని దానిని విచారించక
12 వుండునా? । యేమంటే మనుష్యుడు అడవి గాడిద
పిల్లలాగున పుట్టుతున్నప్పటికిన్ని మాయ గల మను
13 ష్యుడు జ్ఞానము గలవాడవుటకు యిచ్ఛయించును. । నీవు
నీ హృదయమును ఆయత్తపరచి, నీ చేతులు ఆయన
14 తట్టుకు చాపితేనున్ను, । నీ చేతిలో వున్న అక్రమ
మును నీవు దూరముగా పరిహరించి, నీ నివాసములో
15 చెడ్డతనమును వుండనివ్వక వుంటేనున్ను, । అప్పుడు
నీవు నీ ముఖము మచ్చ లేకుండా యెత్త గలవు; నీవు
16 స్థిరపడి భయపడక వుందువు. । యేమంటే నీవు నీ దౌ
ర్భాగ్యమును మరిచిపోదువు; జరిగిపోతూ వున్న వుద
17 కముల వలె నీవు దాని తలంతువు. । నీ ఆయుస్సు
మధ్యాహ్నముకంటే కాంతిగా వుండును; నీవు ప్రకా
18 శింతువు; వుదయములాగున వుందువు. । నమ్మకము
వుండును గనుక నీవు నిర్భయముగా వుందువు; నీవు
19 చుట్టూ తవ్వి సుఖముగా పండుకొందువు. । నీవు పరుం
డినప్పుడు యెవ్వరూ నిన్ను భయపెట్టరు; అనేకులు
20 నీకు విన్నపము చేతురు. । అయితే చెడ్డవాండ్లయొక్క
నేత్రములు ఆరిపోతవి; వారు తప్పించక పోదురు;
వారి నమ్మికె నశించును అని పలికెను.

## 12. అధ్యాయము.

1 అప్పుడు యోబు ప్రత్యుత్తరముగా చెప్పినదేమం
2 టే, । నిస్సందేహముగా మీరే జనులు; మీతో జ్ఞానము
చచ్చును. । అయితే నాకున్ను మీ వలె బుద్ధి యున్నది, 3
నేను మీ కంటే తక్కువైన వాడను కాను; యిటు
వంటి తెలివి యెవరికి లేక వుండును? । నా పొరుగు 4
వాని వల్ల నేను హాసించబడి వున్నాను; పరాత్పరుని
గూర్చి మొరబెట్టుతున్నాను; ఆయన నాకు మారుత్త
రము చెప్పుతున్నాడు; వుత్తముడైన నీతి మంతుడు
హాస్య పరచబడి వున్నాడు. । కాలు జారుటకు సిద్ధ 5
మైన వాడు నెమ్మదిగా వుండే వాని తలంపుకు అక్కర
చేయబడని దీపము లాగున వున్నాడు. । దోచుకొనే 6
వారి గుడారములు నిర్భయముగా వున్నవి; పరాత్ప
రునికి కోపమును కలుగ జేసే వారు నిర్భయముగా
వున్నారు; వారి చేతిలోకి పరాత్పరుడు విస్తారమును
తెస్తున్నాడు. । అయితే యిప్పుడు నీవు మృగములను 7
అడుగుము, అవి నీకు బోధించును; ఆకాశ పక్షులను
అడుగుము, అవి నీకు తెలుపును. । లేక భూమిని విచా 8
రించి అడుగుము, అది నీకు వుపదేశించును; సముద్ర
ముయొక్క మత్స్యములు నీకు వివరించును. । యెహోవా 9
వాయొక్క చెయ్యి యిది చేసెనని వీటన్నిటిలో యెరుగ
నిది యేది? । ఆయన చేతిలో ప్రతి జీవ జంతువుయొక్క 10
ప్రాణమున్ను సమస్త మనుష్యులయొక్క శ్వాసమున్ను
కలిగి వున్నవి. । చెవి మాటలను పరిశోధిస్తున్నది కాదా? 11
నోరు ఆహారముయొక్క రుచిని చూస్తున్నది కాదా? ।
వృద్ధులయొద్ద జ్ఞానమున్ను దీర్ఘాయుస్సులో తెలి 12
విన్ని కలవు. । ఆయన యొద్ద జ్ఞానమున్ను బలమున్ను 13
కలవు; ఆలోచనయున్ను తెలివిన్ని ఆయన యొద్ద
వున్నవి. । యిదుగో ఆయన పడకొట్టి వేసును, అది 14
తిరిగీ కట్టబడ నేరదు; ఆయన మనుష్యుని మూసిపె
ట్టును, అప్పుడు తెరుచుటకు సాధనము లేదు. । యిదు 15
గో ఆయన నీళ్లను బంధిస్తే అవి ఆరిపోవును; ఆయన
వాటిని బయిటికి పంపిస్తే అవి భూమిని పాడు చేసును. ।
ఆయన యొద్ద బలమున్ను జ్ఞానమున్ను వున్నవి; మోస 16
పోయే వాడున్ను మోసపుచ్చే వాడున్ను ఆయన చేతి
కింద వున్నారు. । ఆయన ఆలోచన కాండ్లనున్ను చెర 17
తీసుకొని పోవుచున్నాడు; న్యాయాధిపతులను బుద్ధి
హీనులగా చేయుచున్నాడు. । ఆయన రాజులయొక్క 18
బంధకము తీసివేసి, వారి నడుములకు దట్టీ కట్టుతూ
వున్నాడు. । ఆయన మంత్రులను కొల్లపెట్టి కొంచపో 19
యి, బలవంతులను తల కిందుగా చేస్తూ వున్నాడు. ।
ఆయన నమ్మకము కల వాని పెదవిని తొలగ చేసి, 20
ముదిరిన వయస్సు కల వానియొక్క ఆలోచన తీసివే
స్తూ వున్నాడు. । ఆయన ప్రభువుల మీద వుల్లంఘన 21
పారపోసి, బలవంతుల నడుమును దుర్బలపరుస్తూ
వున్నాడు. । అంధకారమందు వుండే లోతు ఆయన 22
వాటిని ఆయన బైలు పరచి, మరణముయొక్క నీడను

23 వెలుగులోనికి తెస్తూ వున్నాడు. । ఆయన జనులను హె
చ్చింప చేస్తున్న నాశనము చేస్తున్న వున్నాడు; ఆయన
జనులను విస్తార పరుస్తూ, వారిని తిరిగీ యిరుకులో
24 పెట్టుతున్నాడు. । ఆయన భూజనులయొక్క అధిపతుల
హృదయము తీసివేసి, తోవలేని వనాంతరమందు వా
25 రిని ద్రిమ్మరిల చేస్తున్నాడు. । వారు వెలుగు లేని చీక
టిలో తడబడుతూ వున్నారు; ఆయన వారిని మత్తు
గొని వున్న వాని వలె తూల చేస్తున్నాడు.

## 13. అధ్యాయము.

1 ఇదుగో అవి అన్నిటినీ నా కన్నులు చూచి యు
2 న్నవి; నా చెవులు విని గ్రహించి యున్నవి. । మీరు
యెరిగి యుండేవి నేనున్ను యెరిగి యున్నాను; నేను
3 మీకు లొంగే వాడను కాను. । అయితే నేను సర్వశ
క్తునితో మాట్లాడ గోరుతున్నాను; పరాత్పరునితో
నా న్యాయము తీర్చుకొనేటందుకు అపేక్షిస్తున్నాను.।
4 యేమంటే మీరు అబద్ధము కల్పించే వారై యున్నారు;
5 మీరందరున్ను ప్రయోజనము లేని వైద్యులు. । మీరు
బొత్తిగా మౌనులై యుంటే మేలు; అది మీకు జ్ఞానమై
6 యుండును, । మీరు నా వివాదను విని, నా పెదవులు
7 చెప్పే యుక్తులను ధ్యానించండి. । మీరు పరాత్పరుని
నిమిత్తము న్యాయ విరుద్ధముగా మాట్లాడి, ఆయన నిమి
8 త్తము కపటముగా పలుక వలెనా? । ఆయన ముఖమును
చూస్తూ వున్నారా? పరాత్పరుని నిమిత్తము వ్యాజ్య
9 మాడుదురా? । ఆయన మిమ్మున పూర్ణముగా పరిశో
ధిస్తే అది మీకు మేలా? వొకడు వొకని మోసపుచ్చి
10 నట్టు ఆయనను మీరు మోసపుచ్చగలరా? । మీరు రహ
స్యముగా ముఖములందు లక్ష్యము వుంచే వారైతే
11 ఆయన నిశ్చయముగా మిమ్మును గద్దించును. । ఆయన
మహత్వము మిమ్మును తొందర పెట్టదా? ఆయన భయం
12 కరత్వము మీ మీద పడదా? । తలంచ తగిన మీ వాక్య
ములు బూడిదెతోనున్ను మీ పెద్దరికములు బురద
13 కుప్పలతోనున్ను సమానమవును. । నేను మాట్లాడే
టందుకు నా ముందర మౌనముగా వుండండి; నా మీదికి
14 వచ్చేది యేదో దాని రానివ్వండి. । నేను నా పండ్లతో
నా మాంసమును పట్టుకొని, నా ప్రాణము నా చేతి
15 లో వుంచవలసినదేమి? । యిదుగో ఆయన నన్ను చంపి
వేసినా గాని ఆయన మీద నమ్మికగా వుందును; నా
మార్గములను ఆయన ముందర నేను నిర్వహింతును. ।
16 ఆయన నా రక్షింపు అయి వుండును, యేమంటే మా
17 యకాడు ఆయన ముందరకు రాలేడు. । మీరు నా వచ
నములనున్ను నేను చెప్పేదిన్ని మీ చెవులతో వినండి.।
18 యిదుగో నా వ్యాజ్యమును క్రమముగా వుంచితిని;
నేను నీతిమంతుని కాబడుదును అని యెరుగుదును. ।
నాతో వ్యాజ్యమాడ వలెనని వుండే వాడు యెవడు? 19
యిప్పుడు నేను మౌనినై వుంటే జీవము విడిచి పో
దును. । రెండు కార్యములు మాత్రము నాకు చేయకుం 20
డా వుందువు గాక; అప్పుడు నీ ముఖము యెదుట
దాగకుండా వుందును. । నీ చేతిని నాకు దూరము కాచే 21
యుము; నీ భయంకరత్వము నన్ను దిగులు పెట్టకుండా
చేసును గాక. । అప్పుడు పిలువుము నేను మారుత్తరము 22
యిత్తును; లేక నేను మాట్లాడుదును, నీవు నాకు మా
రుత్తరము యిమ్ము. । నా మీద వుండే అక్రమములున్ను 23
పాపములున్ను యెన్నో? నా మీరుటలనున్ను నా
పాపములనున్ను నాకు తెలుపుము. । నీ ముఖమును 24
నాకు మరుగు చేసి, నన్ను నీవు నీ పగవానిగా యెంచు
కొనెదవేమి? । గాలి కొట్టుకొపోతున్న ఆకును నలుపు 25
దువా? యెండిపోయిన చెత్తను తరుముదువా? । యేమం 26
టే నీవు చేదు అయిన తీర్పులు నా మీద వ్రాసి, నా
చిన్నతనముయొక్క అక్రమములను నన్ను స్వతంత్రింప
చేస్తున్నావు. । నీవు నా కాళ్లను బొండలలో వేసి, నా 27
మార్గములన్నిటినీ కనిపెట్టుతూ వున్నావు; నా అరి
కాళ్లమీద నీవు గురుతు పెట్టుతున్నావు. । యీలాగున 28
వాడు కుళ్లిపోయే వస్తువు వలెనున్ను చిమ్మెట కొట్టే
వస్త్రము వలెనున్ను క్షీణించి పోతున్నాడు.

## 14. అధ్యాయము.

స్త్రీకి పుట్టిన మనుష్యుడు కొద్ది దినముల వాడున్ను 1
నిండు బాధ గలవాడున్ను అయి వున్నాడు. । వాడు 2
పువ్వువలె వికసించి ఖండించబడుతున్నాడు; నీడ వలె
పారిపోయి నిలవకుండా వున్నాడు. । నిశ్చయముగా 3
యిటువంటి వాని మీద నీవు నీ కన్నులు తెరస్తున్నా
వా? నీతో పరీక్ష కొరకు నన్ను కొంచు వస్తున్నావా? ।
అపవిత్రమయిన దానిలోనుంచి పవిత్రమైనది తీయ 4
గల వాడు యెవడు? వొకడూ లేడు. । వాని దినములు 5
యింత మాత్రము అని నిర్ణయించ పడి వుండగా,
దాని నెలల లెక్క నీ యొద్ద వున్నది; వాడు దాటి పో
కూడని సరిహద్దులు వానికి కట్టడ చేస్తివి. । వాడు వొక 6
కూలివాని వలె తన దినములయొక్క పని అయిన తరు
వాత వాడు సేద తీర్చుకొనేటట్టు వాని యొద్దనుంచి
తిరుగుము. । వొక మాను కొట్టివేయ పడినా అది తిరిగీ 7
చిగురు పెట్టుననిన్ని దానికి లేత కొమ్మ తప్పి పోదు
అనిన్ని దాని విషయమై నమ్మికె కద్దు. । దాని వేరు 8
భూమిలో పాతది అయి, దాని అడుగు మొద్దు మంటి
లో చచ్చినప్పటికిన్ని, । నీళ్ల వాసన చేత అది చిగురు 9
పెట్టి, మొక్క వలెనే కొమ్మలు పెట్టును. । అయితే 10
మనుష్యుడు మృతిబొంది గతించి పోతున్నాడు; నిశ్చ
యముగా మనుష్యుడు జీవమును విడిచిపెట్టుతున్నాడు;

11 వాడు మరి యేడి? । నీళ్లు చెరువులోనుంచి వడిసి
12 పోయినట్టున్ను, యేరు వట్టిపోయి ఆరినట్టున్ను, । మను
ష్యుడు పండుకొని లేవక వున్నాడు; ఆకాశములు
లేకపోయే పర్యంతమూ వారు తిరిగీ లేచేది లేదు,
13 తమ నిద్రలోనుంచి లేపబడేది లేదు. । నీవు నన్ను సమా
ధిలో దాచి, నీ కోపము తిరిగే మట్టుకు నన్ను దాచి,
నన్ను తిరిగీ తలంచేటట్టుగా నాకు వొక నిర్ణయ కా
14 లము నియమిస్తే మేలు. । మనుష్యుడు చచ్చిన తరువాత
బ్రతుకునా? నా మార్పు వచ్చేపర్యంతమూ నా
15 పోరాట దినములను నేను కనిపెట్టి వుంటాను. । నన్ను
పిలువుము అప్పుడు నేను నీకు మారుత్తరము చెప్పుదును;
నీ చేతులయొక్క క్రియల మీదను అపేక్ష వుంతువు
16 గాక. । యేమంటే యిప్పుడు నా అడుగులను యెంచు
తూ వున్నావు; నా పాపములను కాచి యున్నావు
17 గదా? । నా అక్రమము వొక సంచిలో కట్టబడి ముద్ర
వేసి వున్నది; నా అపరాధమును నీవు యేకముగా కుట్టి
18 వున్నావు. । నిశ్చయముగా పర్వతము పడుతూ నిర్మూల
మౌతున్నది; కొండ తన స్థలములోనుంచి తీయ బడు
19 తున్నది. । నీళ్లు రాళ్లను అరగచేసును; భూమియొక్క
మంటిలోనుంచి మొలిచే దాని నీవు ప్రవాహముల
చేత నశింప చేస్తున్నావు; ఆలాగున మనుష్యునియొక్క
20 కోరికెను నీవు నాశనము చేస్తూ వున్నావు. । నీవు యె
న్నటికిన్ని వాని జయించినందువల్ల వాడు పోతూ
వున్నాడు; వాని ముఖమును నీవు మారు రూపము
21 చేసి వాని పంపివేస్తూ వున్నావు. । వాని పిల్లలు ఘన
ము పొందినప్పటికిన్ని వాడు యెరుగడు; వారు శ్రమ
22 పడినప్పటికిన్ని వారిని చూడడు. । వాని మీద వాని
మాంసము నొప్పితో వుండును; వాని ఆత్మ వానిలో
దుఃఖించును అని పలికెను.

## 15. అధ్యాయము.

1 అప్పుడు తేమానీయుడైన ఎలీఫాజు ప్రత్యుత్తర
2 ముగా చెప్పినదేమంటే, । జ్ఞానము కల వాడు గాలి
వంటి మాటలతో వుత్తరము చెప్పి, తన కడుపు తూర్పు
3 గాలితో నింపుకొనుట తగునా? । ప్రయోజనము లేని
మాటలతోనున్ను పనికి రాని వచనములతోనున్ను వాడు
4 తర్కించ వచ్చునా? । నిశ్చయముగా నీవు భయపడుట
వ్యర్థమని చెప్పి, పరాత్పరుని యెదుట ప్రార్థనను
5 వ్యర్థ పరుస్తున్నావు. । యేమంటే నీ నోరు నీ అక్ర
మమును చూపుతుంది; నీవు కృత్రిమపు వారి నాలుక
6 యేర్పరచుకొంటివి. । నేను కాదు గాని నీ నోరే నిన్ను
చెడ్డ వాడని తీరుస్తున్నది; నీ పెదవులు నీకు విరోధ
7 ముగా సాక్ష్యమును పలుకుతున్నవి. । నీవు పుట్టిన మొ
దటి మనుష్యుడవా? కొండల కంటే ముందుగా నీవు
కలుగచేయబడితివా? । నీవు పరాత్పరుని రహస్యమైన 8
ఆలోచనను విని, సకల జ్ఞానమును నీ యొద్దికి చేర చేస్తి
వా? । మేము యెరుగని యే కార్యమునైనా నీవు 9
యెరిగి యున్నావా? మా యందు లేని యే గ్రహింపు
అయినా నీ యందు వున్నదా? । మాలో నీ తండ్రి 10
కంటే గొప్ప వయస్సు కల నెరసిన తల వెంట్రుకలు
కలవారున్ను వృద్ధులున్ను వున్నారు. । పరాత్పరునివల్ల 11
కలిగే ఆదరణలున్ను నీతో చెప్పబడే మృదువైన మా
టలున్ను నీకు అల్పమైనవై యున్నావా? । నీ హృద 12
యము నిన్ను యెక్కడికి కొంచుపోతున్నది? నీ కన్ను
లు పొగరు చూపు కలవై యున్నవేమి? । యేమంటే 13
పరాత్పరునికి విరోధముగా నీవు నీ ఆత్మను వుంచి, నీ
నోటనుంచి వచనములు బైలు వెళ్ల చేస్తూ వున్నావు. ।
మనుష్యుడు శుద్ధుడయ్యేటందుకున్ను స్త్రీకి పుట్టినవాడు 14
నీతి మంతుడు అయ్యేటందుకున్ను వాడు యెంత మా
త్రపు వాడు! । యిదుగో ఆయన తన పరిశుద్ధుల యందు 15
నమ్మికె వుంచక యున్నాడు; పరమండలములున్ను
ఆయన దృష్టికి శుద్ధమైనవి కావు. । ఆలాగైతే నీళ్ల వలె 16
అక్రమమును పానము చేసే మనుష్యుడు మరి యెంతో
అసహ్యమైన వాడున్ను అపవిత్రుడున్ను అయి వున్నా
డు! । నీకు నేను చూపుదును నా మాటను ఆలకించుము, 17
నేను చూచినది నీకు వివరింతును. । జ్ఞానులు తమ పితృల 18
యొద్ద వినిన మాటలు మరుగు చేయకుండా, వారు
తెలిపినదే చెప్పుతాను. । అటువంటి వారికి మాత్రము 19
దేశము యివ్వబడెను; అన్యులు వారి నడుమనుంచి
దాటి పోకుండా వుండిరి. । వారు తెలిపినదేమంటే, 20
చెడ్డవాడు తాను బ్రతికి వుండే దినములన్నిటి యందూ
బాధను పొందుతూ వున్నాడు; వాని సంవత్సరముల
లెక్క బాధపరచే వానికి తెలియక వున్నది. । భయం 21
కర శబ్దము వాని చెవుల యందు వున్నది; నెమ్మది దిన
మందు పాడు చేసే వాడు వాని మీదికి వచ్చును. ।
చీకటిలోనుంచి తిరుగా వస్తాను అనే నమ్మికె వానికి 22
లేదు; పొంచు వుండే వాండ్ల కత్తికి వాడు భయపడు
తాడు. । రొట్టె యెక్కడ దొరుకునని వాడు బతిమాలి 23
తిరుగుతూ వున్నాడు; అంధకార దినము తనకు సమీ
పముగా వున్నదని వాడు యెరుగును. । తొందరయు 24
న్ను వేదనయున్ను వాని భయ పెట్టును; యుద్ధము
నకు ఆయత్తమైన రాజు వలె అవి వాని జయించును. ।
యేమంటే వాడు పరాత్పరునికి విరోధముగా తన 25
చెయ్యి చాపి, సర్వశక్తునికి విరోధముగా తనను బల
పరచుకుంటాడు. । వాడు యెత్తిన మెడతోనున్ను తన 26
కేడములయొక్క గుబకలతోనున్ను ఆయన మీదికి
పరుగెత్తుతూ వున్నాడు. । యేమంటే వాడు తన ముఖ 27
మును కొవ్వుతో కప్పుకొని, తన నడుము పైని కొవ్వును

28 కూర్చినా యున్నాడు. । అయితే వాడు పాడు అయిన
పట్టణముల యందున్న్ను పాడు దిబ్బలు అవుటకు సిద్ధ
ముగా వున్నటువంటిన్ని కాపురస్తులు లేనటువంటిన్ని
29 యిండ్లలోనున్ను నివాసము చేసును. । వాడు అయిశ్వ
ర్యవంతుడు అయ్యేదిన్ని లేదు; వాని ఆస్తి నిలిచేదిన్ని
లేదు; అటువంటి వాండ్లయొక్క పోషణ దేశమందు
30 అగుపడేదిన్ని లేదు. । చీకటిలోనుంచి వాడు తప్పించు
కొనలేడు; అగ్ని జ్వాల వాని కొమ్మలను దహించును;
31 వాని నోటి శ్వాసముచేత వాడు ఆరిపోవును. । మోస
పోయిన వాడు మాయను నమ్మక వుండును గాక, యే
మంటే మాయ అనేది వానికి ప్రతి ఫలమై వుండును.।
32 వాని కాలము వాడు నెరవేర్చడు; వాని కొమ్మ పచ్చ
33 నయ్యేది లేదు. । వాడు ద్రాక్ష చెట్టువలె తన పిందె
లను రాల్చి, ఇప్ప చెట్టు వలె పువ్వులు రాల చేసును.।
34 యేమంటే మాయకాండ్లయొక్క గుంపు పాడు అవు
ను; లంచము తీసుకొన్న వాండ్ల గుడారములను అగ్ని
35 భక్షించును.। అటువంటి వారు శ్రమ గర్భమును ధరించి
మాయను పుట్టింతురు; వారి హృదయము కపటమును
కల్పించును అని చెప్పిరని పలికెను.

## 16. అధ్యాయము.

1 అప్పుడు యోబు మారుత్తరము యిచ్చి చెప్పినదే
2 మంటే, । యిటువంటివి అనేకములను నేను వింటిని;
మీరు అందరున్ను శ్రమ కలుగ జేసే వోదార్పుగా
3 వారు. । గాలి వంటి మాటలకు అంతము కలుగదా?
లేక నీవు యీ ప్రకారముగా వుత్తరము యిచ్చుటకు
4 నిన్ను పురికొల్పినది యేది? । మీరు పలికినట్టు నేను
కూడా పలుక గలను; మీ యాత్మ నా యాత్మ స్థితిలో
వున్నట్టయితే నేను మీ మీదికి మాటలను పోగు చేసి,
5 మీ వైపు నా తల ఆడించ గలను. । నేను నా నోటను
మీకు ధైర్యము చెప్పుదునే; నా పెదవులయొక్క కది
6 లికె మీ దుఃఖమును ఆర్పునే. । నేను మాట్లాడినా
నా దుఃఖము ఆరదు; నేను మాట్లాడకపోయినా
7 నా యొద్దనుంచి తొలిగి పోయేది యేది. । యేమంటే
ఆయన యిప్పుడు నాకు అలసట కలుగజేసి యున్నాడు;
8 నా గుంపును అంతా పాడు చేస్తివి. । నీవు నాకు నిండు
మడతలు కలుగ చేసితివి; యిది నాకు విరోధముగా
సాక్షి అయి యున్నది; నా చిక్కుట నాకు విరోధ
ముగా లేచి, నా ముఖము యెదుట నా విషయమై
9 సాక్ష్యము పలుకుతున్నది. । వాని కోపముచేత వాడు
నన్ను చీల్చుతున్నాడు; వాడు నాకు పగ చేస్తూ వున్నా
డు, వాడు తన పళ్లు నా మీద కొరుకుతూ వున్నాడు;
నా శత్రువు నాకు విరోధముగా తన కన్నులు భీకర
10 ముగా చేస్తున్నాడు. । వారు నాకు విరోధముగా తమ
నోరు తెరచి వున్నారు; నిందగా వారు నన్ను చెంప
మీద కొట్టి వున్నారు; వారు యేకముగా నా మీదికి
గుంపులు కూడి వున్నారు. । పరాత్పరుడు నన్ను అన్యా 11
యపు వారికి అప్పగించి, చెడ్డ వారి చేతిలోకి నన్ను
యిచ్చి వేసి వున్నాడు. । నేను నెమ్మదితో వుంటిని 12
అయితే ఆయన నన్ను నలిపి వున్నాడు; ఆయన నా
మెడ పట్టి నన్ను కదిలించి, నన్ను తనకు గురిగా నిలిపి
వున్నాడు. । ఆయనయొక్క అంబుల వాండ్లు నన్ను 13
చుట్టుకొని వున్నారు; ఆయన నా తుంట్లను ఖండించి,
నన్ను కనికరించక వున్నాడు; ఆయన నా పైత్యము
భూమి మీద పారపోస్తున్నాడు. । ఆయన నాకు నలత 14
మీద నలత కలుగ చేస్తున్నాడు; పరాక్రమశాలి వలె
నా మీద పడుతున్నాడు. । నా చర్మము మీద నేను 15
గోనె పట్టెను కుట్టుకొని వున్నాను; నా కొమ్మును ధూ
ళియందు నీచపరచితిని. । నా ముఖము యేడ్పుతో వాచి 16
వున్నది; నా కను రెప్పల మీద మరణపు నీడ కలిగి
వున్నది. । అయితే యిది నా చేతులలో అన్యాయము 17
వుండినందున కాదు; నా ప్రార్థన శుద్ధమై యున్నది.।
వో భూమీ, నా రక్తమును మూసి వేయకుము; నా 18
మొర్రకు చాటు స్థలము లేక పోవును గాక. । మరిన్ని 19
యిప్పుడు యిదుగో నా సాక్షి పరమండలమందున్ను
నన్ను యెరిగిన వాడు వున్నతము యందున్ను వున్నా
డు. । నా స్నేహితులు పరిహాసకులు; నా కన్నులు పరా 20
త్పరుని దృష్టించి నీళ్లు రాల్చుతున్నవి. । ఆహా మనుష్య 21
పుత్రుడు తన స్నేహితుని కొరకు వాదించే లాగున
పరాత్పరునితో వొకని నిమిత్తము వాదించే వాడు
వొకడు అయినా వుంటే మేలు! । యేమంటే నియమిం 22
చబడిన సంవత్సరములు జరిగి పోతున్నవి; నేను తిరిగీ
రాని మార్గముగా వెళ్లుతున్నాను.

## 17. అధ్యాయము.

నా వూపిరి ఆరిపోతున్నది; నా దినములు అంత 1
మవుతున్నవి; సమాధి నా ముందర వున్నది. । పరిహాస 2
కులు నా యొద్ద లేరా? వారు రేపిన వాటి మీద నా
నేత్రములు వున్నవి కావా? । వో దేవరవారా యిప్ప 3
డు పెట్టుము, నా నిమిత్తము పూట పడుము, నాకు
హస్తము యివ్వతగిన వాడు యెవడు? । యేమంటే వారి 4
హృదయమునకు జ్ఞానమును మరుగు చేస్తివి, అయినం
దున నీవు వారిని హెచ్చనివ్వకుండా వుందువు. । యె 5
వడు తన స్నేహితులతో చేటు కొరకు ద్రోహముగా
మాట్లాడునో వాని పిల్లల కన్నులు చెడిపోవును.। వాడు 6
నన్ను జనులలో సామితెగా వుంచి వున్నాడు; వారి
యెదుట నేను అసహ్యమైన వాడనై యున్నాను. ।
యిందు నిమిత్తము నా కన్నులు మంద దృష్టి గలవై 7

వున్నవి; నా అవయవములు అన్నిన్ని ఒక నీడవలె
8 వున్నవి. । యథార్థవంతులు యిందుకు ఆశ్చర్యపడు
దురు; తప్పు లేని వాడు కపటికి విరోధముగా లేచును.।
9 నీతిమంతుడు తన మార్గమును గట్టిగా పట్టును; చేతుల
శుద్ధి గల వాడు అంతకంతకు బలముగా వుండును.।
10 మిమ్మును గురించినదేమంటే, మీరు అందరున్ను తిరిగి
రండి; మీలో జ్ఞానవంతుని ఒకనినైనా నేను చూచేది
11 లేదు.।నా దినములు గతించిపోయెను; నా సంకల్పములు
అనగా నా హృదయములో వున్న ఆలోచనలు తెగి
12 పోయెను.। అవి రాత్రిని పగలుగా చేస్తున్నవి; చీక
13 టికి వెలుగు సమీపించి వస్తున్నది. । ఆలాగు నేను కని
పెట్టుకొని వుంటే సమాధి నా యిల్లు అయి వుండును;
14 చీకటిలో నేను నా పరుపును వేతును. । నేను నాశన
ముతో నీవు నా తండ్రివి అనిన్ని, పురుగుతో నీవు
నా తల్లివిన్ని నా సహోదరివిన్ని అనిన్ని పలుకుతూ
15 వున్నాను.। నా కోరికె యిప్పుడు యేది? నా కోరికెను
16 చూచే వాడు యెవడు!। అవి సమాధియొక్క తలుపుల
లోకి దిగును; మనము ధూళిలో యేకముగా పడి వుం
డేటప్పుడు నిమ్మళము కలుగునని పలికెను.

## 18. అధ్యాయము.

1 అప్పుడు షూహీయుడైన బిల్దదు ప్రత్యుత్తరముగా
2 చెప్పినదేమంటే, । మీరు యెంత పర్యంతము మాటలు
చాలించకుండా వుందురు? బుద్ధిమంతులై వుండండి,
3 మనము అప్పుడు మాట్లాడుదాము. । మేము యెందుకు
మృగముల వలె యెంచబడి, మీ దృష్టికి నీచుల వలె
4 కనబడుతున్నాము?। నీ కోపముచేత నిన్ను నీవే చీల్చు
కొంటూ వున్నావు; నీ నిమిత్తము భూమి పాడుగా
విడువబడ వలెనా? రాతికొండ తన స్థలములోనుంచి
5 తీసి వేయబడునా? । చెడ్డ వాని వెలుగు ఆరిపోవును;
వాని అగ్నియొక్క నిగురు ప్రకాశించక వుండును.।
6 వాని గుడారములో వెలుగు అంధకారమవును; వాని
7 దీపము వాని ముందర ఆరి పోవును. । వాని బలమైన
అడుగులు యిరికించబడును; వాని ఆలోచన వాని
8 పడిపో చేసును. । యేమంటే వాడు తన కాళ్ల చేతను
వలలోకి తేబడుతున్నాడు; వురి గల చోటు మీద
9 నడుస్తూ వున్నాడు. । వురి వాని మడిమెను తగులు
10 కొనును; దోషరి వాని జయించును. । వాని నిమిత్తము
వురి భూమియందు ఒగ్గి, వాని నిమిత్తము బోను మా
11 ర్గమందు వుంచబడి వున్నది. । భయంకరత్వములు
చుట్టూ వానికి దిగులు కలుగజేసి, వాని కాళ్లకు దిక్కు
12 తెలియకుండా బాధ కలుగ చేసును. ! వాని బలము
పస్తువల్ల నశించును; వాని పార్శ్వమందు చేటు ఆయ
13 త్తపడి నిలుచును. ।అది వాని చర్మబలమును భక్షించును;
మరణముయొక్క తొలిచూలు వాని బలమును భక్షిం
చును. । వాని నమ్మికె వాని గుడారములోనుంచి తీసి 14
వేయ బడును; అది భయంకరత్వము యొక్క రాజు
వద్దికి వాని తీసుకొని వెళ్లును. । వానికి ఒకటిన్ని లేక 15
పోవుటవల్లను భయంకరత్వము వాని గుడారములో
కాపురము వుండును; గంధకము వాని నివాస స్థలము
మీద చల్లబడును. । కింద వుండే వాని వేళ్లు యెండి 16
పోవును; పైగా వుండే వాని కొమ్మలు నరక బడును. ।
వాని తలంపు భూమిలోనుంచి నాశనమవును; వీధుల 17
లో వాని పేరు లేకుండా పోవును. । వాడు వెలుగు 18
లోనుంచి చీకటిలోకి వెళ్ల వేయబడి, భూలోకము
నుంచి తోలివేయబడును. । వాని జనులలో వానికి 19
పుత్రుడు అయినా జ్ఞాతియైనా వాని నివాస స్థల
మందు మిగిలిన యొకడైనా లేక వుండును. । వెనుకటి 20
వాండ్లు వాని దినమునకు భ్రమతురు; మునుపటి కా
లపు వారు దిగులును పొందుదురు. । యీలాగునే 21
దుష్టునియొక్క నివాసములు అవును; యిదే పరాత్ప
రుని యెరుగని వాని స్థలము అని పలికెను.

## 19. అధ్యాయము.

అప్పుడు యోబు ప్రత్యుత్తరముగా చెప్పినదేమం 1
టే, । మీరు యెంత పర్యంతము నా ఆత్మను శ్రమపెట్టి, 2
మాటలవల్ల నన్ను నలుపుదురు? । యీ పది మార్లు నన్ను 3
నిందిస్తిరి; మీరు నాకు కఠిన ముఖములను కనుపరచే
టందుకు మీకు సిగ్గు లేదు. । నేను తప్పి నడిచినది నిజ 4
మైనప్పటికిన్ని నా తప్పితము నాతోనే వున్నది. ।
మీరు నాకు విరోధముగా హెచ్చి, నా నింద నా 5
మీద పెట్టి వాదించి వున్న వారయితే, । పరాత్పరుడే 6
నన్ను తలకిందుగా చేసి, తన వలతో చుట్టినాడని తెలి
యుడి. । యిదుగో నేను బలాత్కారమును గూర్చి 7
మొరబెట్టుతున్నాను, అయితే నా మొర్ర వినపడేది
లేదు; నేను గట్టిగా కేకలు వేస్తూ వున్నాను, అయితే
న్యాయము లేదు. । నేను పోకుండా ఆయన నా మా 8
ర్గమునకు కంచె వేసి, నా మార్గములలో చీకటిని
వుంచి వున్నాడు. । నా యందు వున్న నా ఘనత్వమును 9
ఆయన విడతీసి, నా శిరస్సు మీది కిరీటమును తీసివేసి
యున్నాడు. । ఆయన నన్ను అన్ని వయిపులా కొట్టి 10
వేసినందున నేను పోతూ వున్నాను; నా నమ్మికెను ఒక
వృక్షమును వలె పెల్లగించి వున్నాడు. । ఆయన తన 11
కోపమును నా మీద రగులుకొల్పి యున్నాడు; నన్ను
తన శత్రువులలో ఒకనిగా యెంచుకొంటూ వున్నా
డు. । ఆయన దండు వారు యేకముగా వచ్చి, నాకు 12
విరోధముగా తమ త్రోవ హెచ్చు చేసి నా గుడా
రము చుట్టున్ను దిగుతున్నారు. । ఆయన నా సహో 13

దరులను నాకు దూరము చేసి వున్నాడు; నా నెళవైన
14 వారు నాకు అన్యులై పోయినారు. । నా బంధు జనులు
తొలిగి పోయి వున్నారు; నా అన్యోన్య స్నేహితులు
15 నన్ను మరచి పోయి వున్నారు. । నా యింటి కాపుర
స్తులున్ను నా దాసీలు సహా నన్ను అన్యునిగా యెం
చుతూ వున్నారు; వారి చూపుకు నేను పొరుగూరి
16 వాని వలె వున్నాను. । నేను నా పని వాని పిలిచి
నప్పుడు వాడు నాకు మారుత్తరము యివ్వడు; నా
17 నోటను నేను బతిమాలి అడుగ వలెను. । నా గర్భ
ముయొక్క పిల్లల కొరకు నేను నా భార్యను బతి
మాలుకొన్నప్పటికిన్ని నా శ్వాసము ఆమెకు అస
18 హ్యముగా వున్నది. । చిన్న పిల్లలున్ను నన్ను అలక్ష్య
ము చేస్తూ వున్నారు; నేను లేస్తే వారు నాకు విరో
19 ధముగా మాట్లాడుతూ వున్నారు. । నా ప్రాణ స్నేహి
తులు అందరున్ను నన్ను అసహ్యపరిచినారు; నేను
స్నేహించినవారు నాకు విరోధముగా తిరిగినారు. ।
20 నా యెముక నా చర్మముతోనున్ను నా మాంసముతో
నున్ను అంటుకొంటున్నది; నా పళ్లయొక్క చర్మము
21 తో కూడా నేను తప్పించుకొని వున్నాను. । వో నా
స్నేహితులారా, నా యందు కనికరించండి, నా యందు
కనికరించండి, యేమంటే పరాత్పరుని చెయి నన్ను
22 మొత్తి వున్నది. । పరాత్పరుని వలె మీరు నన్ను తరు
ముతూ, నా మాంసముచేత యెందుకు తృప్తిని పొం
23 దక వున్నారు. । ఆహా నా మాటలు యిప్పుడు వ్రా
యబడితే మేలు! ఆహా అవి వొక పుస్తకమందు ము
24 ద్రించ బడియైనా, । యెప్పటికిన్ని వుండేటట్టు రాతి
మీద సీసముతోనున్ను యినుప పోగరుతోనున్ను
25 చెక్కబడి అయినా వుంటే మేలు! । యేమంటే నా
రక్షకుడు జీవముతో వున్నాడనిన్ని ఆయన యిటు మీ
దట భూమి మీద నిలువబడుతాడనిన్ని నేను యెరు
26 గుదును. । యీ నాయొక్క చర్మము మొదలైనవి కుళ్లి
పోయినా, తరువాత నేను నా మాంసములోనుంచి
27 పరాత్పరుని చూతును. । నా యింద్రియములు నాలో
హరించి పోతూ వున్నప్పటికిన్ని ఆయనను నా అంతట
నేను చూతును; అన్యమైన కన్నులు కావు నా కన్నులే
28 ఆయనను చూచును. । కాబట్టి సంగతియొక్క మూల
ము వానియందు కనుపడి వున్నది గనుక మేము వాని
యెందుకు తరుముతున్నామని మీరు చెప్పవలసినదే
29 కదా? । కత్తికి భయపడండి, యేమంటే న్యాయపు తీర్పు
కలదని మీరు యెరిగేటట్టు క్రోధము కత్తివల్ల అయ్యే
శిక్షను కలుగ చేస్తున్నదని పలికెను.

## 20. అధ్యాయము.

1 అప్పుడు నయమాతీయుడైన సోఫరు ప్రత్యుత్తర
2 ముగా చెప్పినదేమంటే, । యిందు నిమిత్తము మారుత్త
రము యిచ్చుటకు నా తలంపులు నన్ను ప్రేరేపిస్తూ
వున్నందువల్ల నేను త్వర పడుతూ వున్నాను. । నా 3
నింద కొరకైన గద్దింపును నేను వినినందున నా గ్ర
హింపుయొక్క ఆత్మ ప్రత్యుత్తరము యిచ్చుటకు నన్ను
ప్రేరేపిస్తున్నది. । చెడ్డవారియొక్క జయోత్సవము కొ 4
ద్దికాలము మట్టుదనిన్ని, మాయకాని సంతోషము వొక
నిముష మాత్రపుది అనిన్ని, । పురాతన కాలములనుంచి 5
అనగా మనుష్యుడు భూమి మీద వుంచబడిన నాటి
నుంచి యీ ప్రకారము వున్నదని నీవు యెరుగవా? ।
వాని గొప్పతనము ఆకాశము పర్యంతమూ హెచ్చి 6
నప్పటికిన్ని, వాని తల మేఘముల పర్యంతమూ అంటి
నప్పటికిన్ని, । వాడు తన మలమువలె యెప్పటికిన్ని 7
నశించును; వాని చూచిన వాండ్లు వాడు యేడీ అని
పలుకుదురు. । వాడు వొక స్వప్నమువలె యెగసి కన 8
పడక పోవును; నిశ్చయముగా వాడు రాత్రి దర్శనము
వలె అంతర్ధానమవును. । వాని చూచిన కన్ను యిక 9
వాని చూచేది లేదు; వాని స్థలము వానిని మరి యెప్ప
టికీ కానక పోవును. । వాని పిల్లలు బీద వాండ్లను సం 10
తోష పెట్టుటకు వెతుకుదురు; వాని చేతులు వారి
వస్తువులను తిరుగా యిచ్చివేసును. । వాని యెముకలు 11
వాని అంతరంగ పాపములతోను నిండి వుండి, వాని
తో కూడా మంటిలో పడుకొనును. । చెడ్డతనము వాని 12
నోట తియ్యగా వున్నప్పటికిన్ని, వాడు దానిని తన
నాలుక కింద దాచినప్పటికిన్ని, । దానిని విడువకుండా 13
భద్రము చేసుకొని, తన నోట వుంచుకొనినప్పటి
కిన్ని, । వాని భోజనము వాని కడుపులో మార్పుపడి, 14
వానిలో అది పాములయొక్క విషమవును. । వాడు 15
ధనమును మింగి వున్నాడు, తిరిగీ వాడు దాని కక్కి
వేసును; పరాత్పరుడు దాని దాని కడుపులోనుంచి
వెలికి తోసును. । వాడు పాములయొక్క విషమును 16
పీర్చును; విషపు పురుగుయొక్క నాలుక వాని చంపి
వేసును. । తేనె యొక్కయున్ను వెన్న యొక్కయున్ను 17
కాలువలనున్ను నదులనున్ను వాడు చూచేది లేదు. ।
వాడు ప్రయాసపడి సంపాదించుకొనినది తాను మిం 18
గకుండా తిరుగా యిచ్చును; వాడు తిరుగా యిచ్చేది
వాని ఆస్తికి సరిగా వుండును; వాడు దానివల్ల తృప్తిని
పొందకుండా వుండును. । వాడు బీద వాండ్లను బాధ 19
పెట్టి విసర్జించి, తాను కట్టని యిల్లును బలాత్కా
రముగా ఆక్రమించుకొనినందువల్ల, । నిశ్చయముగా 20
వాడు తన వుదరములో నెమ్మదిని అనుభవించడు; వాడు
యిచ్ఛయించిన కార్యములలో వొకటిన్ని వుండేదిలేదు. ।
వాని భోజనములో యేదిన్ని మిగులదు; కాబట్టి వాని 21
ఆస్తి స్థిరపడేది లేదు. । వానికి కలిగిన పరిపూర్ణత్వములో 22
వాడు యిబ్బంది పడుతూ వుండును; నానా విధమైన

23 శ్రమ వానికి కలుగును. । వాడు తన కడుపు నింపుటకు
వున్నప్పుడు పరాత్పరుడు తన కోపాగ్నిని వాని మీదికి
వచ్చేటట్టు చేసి, వాడు భుజిస్తూ వుండగా వాని మీద
24 దాని కురిపించును. । వాడు యినుప ఆయుధములనుంచి
పారిపోవును; అయితే వృక్ష విల్లు వానికి దూసిపోవును.।
25 అది తీయబడి శరీరములోనుంచి బైటికి వచ్చును; తళ
తళలాడే కత్తి వాని పైత్యములోనుంచి పైకి వచ్చును;
26 భయంకరత్వములు వాని మీదికి వచ్చును. । వాడు దాచు
కొనే స్థలములలో నానా విధమైన చీకటిన్ని కూడ
పడి వుండును; వూదబడని అగ్ని వాని భక్షించును;
వాని గుడారములో మిగిలి వుండే వానికి కీడు సంభ
27 వించును. । ఆకాశము వాని అక్రమమును బైలు పర
28 చును; భూమి వానికి విరోధముగా లేచును. । వాని
యింటియొక్క ఆర్జన పోవును; వాని కోపముయొక్క
29 దినములో అది కరిగిపోవును. । యిది పరాత్పరుని వల్లను
చెడ్డ మనుష్యునికి వచ్చే భాగమున్ను వానికి పరాత్ప
రుని వల్లను వచ్చే స్వాతంత్ర్యమున్ను అయి వున్నదని
పలికెను.

## 21. అధ్యాయము.

1 అయితే యోబు ప్రత్యుత్తరముగా చెప్పినదేమం
2 టే, । నా వచనములను శ్రద్ధతో వినండి, యిది మీకు
3 ఆదరణ అవును గాక. । నేను మాట్లాడే కొరకు వోర్చి
వుండండి; నేను మాట్లాడిన తరువాత అపహాస్యము
4 చేయండి. । నన్ను గురించినదేమంటే, నా మొర్ర మను
ష్యుని యెదుట వున్నదా? అలాగుంటే నా ఆత్మ వ్యసన
5 పడవద్దా? । నా తట్టు చూచి ఆశ్చర్యపడండి; మీ
6 నోటి మీద మీ చెయి పెట్టండి. । యిది నేను తలంచే
టప్పుడు కలత పడుతూ వున్నాను; నా మాంసము
7 వణుకు పుట్టుతున్నది. । దుర్మార్గులు బ్రతుకుతూ వృద్ధు
లవుతూ నిశ్చయముగా భాగ్యమందు బలవంతులవుతూ
8 వుండెదరేమి? । వారితో కూడా వారి వంశపు వారు
వారి యెదుటనున్ను వారి సంతతివారు వారి కండ్ల
9 యెదుటనున్ను దృఢ పడుతూ వున్నారు. । వారి యిం
డ్లు భయము లేక సుఖముగా వుండును; పరాత్పరుని
10 యొక్క దండము వారి మీదికి దిగదు. । వారి యెద్దు
యెక్కితే నిష్ఫలము కాదు; వారి ఆవు కడుపు దిగబ
11 డకుండా యీనును. । వారు తమ శిశువులను వొక మంద
వలె వెలపటికి పో విడుతురు; వారి పిల్లలు ఆడుకుంటూ
12 వుందురు. । వారు తంబురనున్ను వీణెనున్ను వాయించి,
13 కిన్నెర నాదమునకు సంతోషపడుతూ వుందురు. । వారు
చెల్వముతో తమ దినములు గడుపుతూ, వొక క్షణ
14 ములో గోతిలోకి దిగుదురు. । యిటువంటి వారు
మమ్మును విడిచి తొలగి పొమ్ము, నీ మార్గములను గూ
ర్చిన తెలివికి మేము అపేక్షించము. । మేము సర్వ శక్తు 15
నికి సేవ చేసేటందుకు ఆయన యెవడు? ఆయనను
ప్రార్థిస్తే మాకు వచ్చేలాభమేమి? అని పరాత్పరునితో
పలుకుతూ వున్నారు. । యిదుగో వారి మేలు వారి 16
చేతిలో వుండదు; చెడ్డ వారి యోచన నాకు దూరముగా
వుండునుగాక. । యెంత తరుచుగా చెడ్డవారి దీపము 17
ఆరిపోతున్నది? యెంత తరుచుగా వారి నాశనము వారి
మీదికి వస్తున్నది? పరాత్పరుడు తన కోపము చేత
వారికి శ్రమలు పంచిపెట్టుతున్నాడు. । వారు గాలి 18
యెదుట వుండే చెత్తవలెనున్ను గొప్ప గాలి యెగర
గొట్టే పొట్టు వలెనున్ను వున్నారు. । పరాత్పరుడు వాని 19
అక్రమమును వాని పిల్లల కొరకు వుంచి వేస్తాడు; వాడు
గ్రహించేటట్టు ఆయన వానికి ఫలమును యిస్తున్నా
డు. । వాని కన్నులు వాని నాశనము చూచును; వాడు 20
సర్వ శక్తునియొక్క వుగ్రమును పానము చేసును. ।
యేమంటే వాని నెలలయొక్క లెక్క తక్కువ చేయబ 21
డినప్పుడు వాని తరువాత వాని యింటివల్లను వానికి
వుండే సంతోషము యేమిటి? । వున్నతమైన వారికి 22
న్యాయము తీర్చే పరాత్పరునికి బుద్ధి చెప్ప గల వాడె
వడు? । వొకడు తన సర్వ సౌఖ్యములో నిండైన నెమ్మది 23
గానున్ను నిమ్మళముగానున్ను వుండి చనిపోతూ వున్నా
డు. । వాని పాల బానలు పాలతో నిండి వున్నవి; వాని 24
యెముకలు మూలగతో తేమగా వున్నవి. । యింకొకడు 25
సంతోషముతో భుజించక వుండి, మనఃక్లేశముతో
చస్తూ వున్నాడు. । వీరు సమానముగా మంటిలో పండు 26
కొందురు; పురుగులు వారిని కప్పును. । యిదుగో నేను 27
మీ తలంపులనున్ను మీరు నా యెడల ద్వేషముగా
చేసే ఆలోచనలనున్ను యెరుగుదును. । యేమంటే మీరు 28
ప్రభువుయొక్క యిల్లు యేది అనిన్ని చెడ్డ వారి నివా
సము యేది అనిన్ని చెప్పుతూ వున్నారు. । త్రోవను 29
పోయే వాండ్లను మీరు అడిగి, వారు చెప్పే గురుతులు
మీరు తెలుసుకోలేదా? । యేమంటే చెడ్డవాడు నాశన 30
దినమునకు వుంచబడుతూ వున్నాడనిన్ని, వాండ్లు కోప
దినమునకు బైట తేబడుతూ వున్నారనిన్ని యెరగరా? ।
అటువంటి వాని మార్గమును వాని ముఖము ముందర 31
పట్టి చూపేవాడు యెవడు? వాడు చేసిన దానికి తగిన
ట్టుగా వానికి ప్రతి ఫలము యిచ్చే వాడు యెవడు? ।
అయినప్పటికిన్ని వాడు సమాధికి కొంచుపోబడుతూ 32
వున్నాడు; వాని సమాధి పరామరికతో కాయబడును. ।
పల్లపు స్థలముయొక్క పెళ్లలు వానికి యింపై యుం 33
డును; వాని వెనుక మనుష్యులందరు వెళ్లుదురు; వాని
ముందర పోయిన వారున్ను యెంచ శక్యముకాని
వారై వుందురు. । కాబట్టి యిప్పుడు మీరు మాయగల 34

ఆదరణ నాకు చేసెదరేమి? మీ మారుత్తరములో దబ్బర
వున్నది అని పలికెను.

## 22. అధ్యాయము.

1 అప్పుడు తేమానీయుడైన ఎలీఫాజు ప్రత్యుత్తర
2 ముగా చెప్పినదేమంటే, । జ్ఞాని తనకు తానే ప్రయోజ
కుడై వున్నట్టు వొకడు పరాత్పరునికి ప్రయోజనము
3 కలుగ చేసే వాడై వుండునా? । నీవు నీతి మంతుడవై
యున్నందున సర్వశక్తునికి యేమయినా సంతోషమయి
వుండునా? నీ త్రోవలను నీవు చక్కపరచుటవల్లను
4 ఆయనకు ఆదాయమవునా? । ఆయన నీకు భయపడి
నీతో వ్యాజ్యమాడునా? ఆయన నీతో కూడా న్యాయ
5 మునకు వచ్చునా? । నీ చెడ్డతనము గొప్పది కాదా? నీ
6 అక్రమములు మితములేనివై యున్నవి కావా? । యే
మంటే నీవు అన్యాయముగా నీ సహోదరుని యొద్ద
తాకట్టు పుచ్చుకొని, వస్త్రహీనులయొక్క వస్త్రములను
7 లాగుకొంటివి. । అలసిన వానికి దాహమునకు నీళ్లు
యివ్వవైతివి; పస్తుగా వున్న వానికి రొట్టె యివ్వక
8 పోతివి. । బలశాలికే దేశమందు స్థలము కలిగెను; ఘన
9 మైన వాడు అందులో నివసించెను. । విధవలను వట్టి
చేతులతో అంపివేస్తివి; తండ్రి లేని వాండ్లయొక్క
10 బాహువులను విరగ కొట్టితివి. । కాబట్టి నీ చుట్టూ
11 వురులు కలిగి వున్నవి. । హఠాద్భయమైనా, లేక నీవు
చూడక పోయేటట్టు అంధకారమైనా నిన్ను తొందర
పెట్టుతున్నది; జల ప్రళయములు నిన్ను కప్పుతున్నవి. ।
12 పరాత్పరుడు పరమండలముయొక్క వున్నతమందు వు
న్నాడు కాడా? నక్షత్రములను చూడుము అవి యెంతో
13 యెత్తుగా వున్నవి. । అయితే పరాత్పరుడు యేలాగున
తెలుసు కొనును? గాఢాంధకారములోనుంచి ఆయన
14 న్యాయమును తీర్చగలడా? । ఆయన చూడకుండా గాఢ
మయిన మేఘములు ఆయనకు చాటుగా వున్నవి; జ్యో
తిశ్చక్రమందు ఆయన సంచరిస్తూ వున్నాడు అని నీవు
15 పలుకుతూ వున్నావు. । చెడ్డ వాండ్లు త్రొక్కిన పురా
16 తన మార్గమును నీవు లక్షించి యున్నావా? । వారు
నిముషములో ఖండించబడిరి; వారి అస్తిభారము మీ
17 దను ప్రవాహము పొర్లెను. । మా యొద్దనుంచి తొలగి
పొమ్మనిన్ని సర్వశక్తుడు యేమి చేయ గలడనిన్ని వారు
18 పరాత్పరునితో పలికిరి. । అయినప్పటికిన్ని ఆయన వారి
యిండ్లను మంచి పదార్థములతో నింపెను; దుమార్గ
గులయొక్క ఆలోచన నాకు దూరమై వుండును
19 గాక. । మా ఆస్తి నిర్మూలము కాలేదు, వారిలో మిగి
లిన వారిని అగ్ని భక్షించెను అని నీతి మంతులు చూచి
20 సంతోషపడుతూ వున్నారు. । తప్పు లేనివారు వారిని
అపహాస్యము చేతురు. । యిప్పుడు నీవు ఆయనతో 21
పరిచయము చేసుకొని సమాధానమును పొందుము,
యిందువల్ల మేలు నీకు కలుగును. । ఆయన నోటనుంచి 22
న్యాయ ప్రమాణము గైకొని, ఆయన మాటలను నీ
హృదయములో వుంచుకొనుము. । నీవు సర్వశక్తుని వైపు 23
తిరిగితే నీవు కట్టబడుదువు; నీవు అక్రమమును నీ
గుడారమునకు దూరము చేస్తే, । అప్పుడు నీవు బంగార 24
మును ధూళి వలెనున్ను ఓఫీరు బంగారమును యేటి
రాళ్లవలెనున్ను కూర్చి వుంతువు. । అప్పుడు సర్వ శక్తుడు 25
తానే నీకు అపరంజిన్ని నీకు వెండి కుప్పలున్ను అయి
వుండును. । యేమంటే అప్పుడు నీవు సర్వశక్తుని యందు 26
సంతోషముగా వుండి, పరాత్పరుని తట్టుకు నీ ముఖ
మును యెత్తుదువు. । నీవు ఆయనను గూర్చి నీ ప్రార్థ 27
నను చేతువు; ఆయన నీ మనవిని ఆలకించును; నీ మొ
క్కుబళ్లను నీవు చెల్లింతువు. । నీవు వొక కార్యమును 28
నిర్ణయిస్తే అది నీకు నెరవేరును; నీ మార్గముల
మీద వెలుగు ప్రకాశించును. । మనుష్యులు పడిపోయి 29
నప్పుడు లెండీ అని చెప్పుదువు; ఖిన్నుడయిన వాని
రక్షింతువు. । తప్పు లేకుండా వుండని వానిని కూడా 30
నీవు తప్పింతువు; నీ చేతులయొక్క శుద్ధివల్ల వాడు విడి
పించబడునని పలికెను.

## 23. అధ్యాయము.

అప్పుడు యోబు ప్రత్యుత్తరముగా చెప్పినదేమం 1
టే, । నేటికిన్ని నా మొర్ర చేదుగా వున్నది; నా వ్యాధి 2
నా మూలుగుట కంటే కఠినమై యున్నది. । ఆహా 3
నేను ఆయనను యెక్కడ కనుకొందునో అది నాకు
తెలిస్తే అప్పుడు నేను ఆయన పీఠము యొద్దికి వత్తును! ।
నా కార్యమును నేను ఆయన యెదుట క్రమముగా 4
విశదపరచి, హేతువయిన మాటలను నా నోట నింపు
దును. । ఆయన నాకు యిచ్చే మారుత్తరపు మాటలను 5
నేను తెలుసుకొని, ఆయన నాకు యేమి చెప్పునో
అది గ్రహింతును. । ఆయన తన అధిక బలముతో 6
నాతో వ్యాజ్యమాడునా? ఆయన ఆలాగు చేయక
నాకు బలము యిచ్చును. । నీతి మంతుడు అక్కడ 7
ఆయనతో న్యాయమును చూచుకో వచ్చును, అందు
వల్ల నేను నా న్యాయాధిపతి యొద్దనుంచి యెన్నటె
న్నటికిన్ని విడుదల పొందుదును. । యిదుగో నేను 8
ముందుగా వెళ్లినప్పటికిన్ని ఆయన లేదు; వెనుకగా
పోయినా ఆయనను కానలేను. । ఆయన యెక్కడ 9
పనిని జరిగిస్తున్నాడో ఆ యెడమ వైపుకు నేను వెళ్లి
నా ఆయనను చూడ లేను; ఆయన కుడి వైపున దాగి
యున్నాడు, అయితే నేను ఆయనను కనుకో లేను. ।

10 అయితే నా యొద్ద వుండే మార్గమును ఆయన యెరు
గును; ఆయన నన్ను శోధించిన తరువాత బంగారము
11 వలె పైకి వత్తును. । నా పాదము ఆయన అడుగులను
అంటుకొనును; ఆయన త్రోవ నేను తొలగకుండా
12 గైకొంటిని. । ఆయన పెదవులయొక్క ఆజ్ఞను నేను
విడిచి వెనుక తియ్యలేదు; ఆయన నోటి మాటలను
నాకు అవసరమయిన ఆహారము కంటే యెక్కువగా
13 యెంచితిని. । అయితే ఆయన ఒక్కటే మనస్సు కల
వాడై యున్నాడు; ఆయనను తిప్పగల వాడు యెవడు?
14 ఆయన యేది యిచ్ఛయించునో అది చేసును. । నాకు
నియమించబడిన దాని ఆయన నెరవేర్చును; యిటువం
15 టివి ఆయన యొద్ద యింకా అనేకములున్నవి. । అయి
నందున నేను ఆయన యెదుట కలవిల పడుతూ వున్నా
ను; నేను ధ్యానించేటప్పుడు ఆయనకు భయపడుతూ
16 వున్నాను. । యేమంటే పరాత్పరుడు నా హృదయమును
మెత్తన చేసి, సర్వ శక్తుడు నన్ను తొందర పెట్టుతు
17 న్నాడు. । యెందుకంటే అంధకారము రాక ముందే
నేను సంహరించ పడక వుంటిని; నా ముఖమునుంచి
ఆయన చీకటిని మరుగు పర్చలేదు.

## 24. అధ్యాయము.

1 కాలములు సర్వ శక్తునికి మరుగు కానందున ఆయ
నను యెరిగిన వారు ఆయన దినములను తెలియక వుం
2 డెదరేమి. । కొందరు పొలిమేర గురుతులను తీసివేతురు;
వారు బలాత్కారముగా మందలను అక్రమించుకొని
3 వాటిని మేపుదురు. । వారు తండ్రి లేని వానియొక్క
గాడిదెను తోలివేతురు; తాకట్టు కొరకు విధవయొక్క
4 యెద్దును తీసుకొందురు. । వారు త్రోవలోనుంచి దీను
లను తోసివేతురు; భూమియొక్క బీదలు యేకముగా
5 దాగుదురు. । యిదుగో అడవి గాడిదెల వలె వారు తమ
పని కొరకు బైలుదేరి, దోచుటకు వుదయమందున త్వర
గా లేతురు; అడవి వారికిన్ని వారి పిల్లలకున్ను ఆహా
6 రమును యిచ్చును. । వారిలో ప్రతివాడు తన తన ధా
న్యమును పొలములో కూర్చును; బాధపరచే వాని
యొక్క ద్రాక్షతోట పండ్లను వారు కూర్తురు. ।
7 వస్త్రహీనులకు వస్త్రము లేకుండానున్ను చలికి కప్పుకో
నుటకు లేకుండానున్ను వారు వారిని బస చేయింతురు. ।
8 వారు కొండల వర్షములచేత తడిచి, చాటు లేనం
9 దున రాతిబండను కౌగలింతురు. । వారు తండ్రి లేని
పిల్లను రొమ్మునుంచి లాగుకొందురు; దరిద్రుని యొద్ద
10 తాకట్టు పుచ్చుకొందురు. । వారు వానికి వస్త్రము లేకుం
డా దిగంబరిగా వాని వెళ్లచేతురు; తమ ప్రాకారము
11 లలో నూనె గానుగలను ఆడుతూ, । దాహముతో
వుండి తమ ద్రాక్ష గానుగలను త్రొక్కుతూ వస్తు
వున్న వాని యొద్దనుంచి పనను తీసివేతురు. । పట్టణము 12
లోనుంచి మనుష్యులు మూల్గుదురు; గాయమును పొం
దిన ఆత్మ మొర పెట్టును; అయినప్పటికిన్ని పరాత్పరు
డు వారి మీద దుర్బుద్ధిని మోపక వున్నాడు. । వారు 13
వెలుగుకు విరోధముగా తిరుగుబాటు చేసే వారి సం
బంధులు; వాండ్లు దాని మార్గములను యెరుగకుండా
దాని త్రోవలలో నిలువకుండా వున్నారు. । ప్రాణ 14
ఘాతకుడు తెల్లవారేటప్పటికి లేచి, దరిద్రునిన్ని లేమి
గల వానినిన్ని చంపి, రాత్రిలో దొంగవలె వున్నాడు. ।
వ్యభిచారియొక్క కన్నులు కనుచీకటి కొరకు కాచు 15
కొని, యెవని కన్ను అయినా నన్ను చూచేది లేదు
అని ముఖమునకు ముసుకు వేసుకుంటూ వున్నాడు. ।
వారు పగటిలో గురుతు చూచుకొన్న యిండ్లను చీకటి 16
లో కన్నము వేసి, వెలుగును యెరుగకుండా వున్నారు. ।
యేమంటే వుదయ కాలము వారికి మరణపు నీడ వలె 17
వున్నది; అదేమంటే అటువంటి వారు మరణపు నీడయొ
క్క భయంకరత్వములను గ్రహిస్తూ వున్నారు. । నీరు 18
పారుట వలె వారు తీవరముగా వున్నారు; భూమిలో
వారి భాగము శపించబడును; వారు ద్రాక్ష తోటల
యొక్క మార్గముల వైపు చూడక వున్నారు. । వరు 19
వున్న వుష్ణమున్ను మంచు నీళ్లను హరించి వేసును;
ఆలాగున సమాధి పాపము చేసిన వారిని హో చేసును. ।
వాని కనిన గర్భము వాని మరుచును; పురుగు వా 20
నిని తీయగా తినును; వాడు మరి తలంచబడక పోవు
ను; అక్రమము తో్ర మానువలె విరిగి పడిపోవును. ।
పిల్లల కనని గొడ్రాలిని వాడు బాధపెట్టును; విధవకు 21
మేలు చేయకుండా వుండును. । వాడు తన బలము చేత 22
ను బలవంతులను నశింప చేసును; వాడు లేచినప్పుడు
యెవ్వడున్ను ప్రాణమును గూర్చి నిశ్చయపడ లేడు. ।
పరాత్పరుడు వానికి నిర్భయము యిచ్చినందున దాని 23
మీద వాడు నమ్మికె వుంచుతాడు; అయితే ఆయన
కన్నులు అటువంటి వారి మార్గముల మీద వున్నవి. ।
వారు కొంత సేపుకు హెచ్చించబడి, తరువాత కానబ 24
డక అణచబడి, కొదువ వారి వలె పాతిపెట్టబడుతూ
వున్నారు; పండిన వెన్నుల వలె వారు కోయబడుతూ
వున్నారు. । ఆలాగు కాకపోతే నన్ను అబద్ధికుని చేసి 25
నా మాటలు వట్టివని చూపేవారు యెవరు అని
పలికెను.

## 25. అధ్యాయము.

అప్పుడు షూహీయుడయిన బిల్దదు ప్రత్యుత్తర 1
ముగా చెప్పినదేమంటే, । అధికారమున్ను భయంకర 2
త్వమున్ను ఆయన యొద్ద వున్నవి; ఆయన తన వున్న
తమైన స్థలముల యందు సమాధానము కలుగ చేస్తూ

3 వున్నాడు. । ఆయన సైన్యములకు లెక్క కలదా? ఆయన
వెలుగు యెవరి మీద వుదయించకుండా వున్నది? ।
4 యీలాగు వుండగా మనుష్యుడు పరాత్పరుని యెదుట
నీతి మంతుడు కావడము యేలాగు? స్త్రీకి పుట్టిన వాడు
5 శుద్ధుడు కావడము యేలాగు? । యిదుగో చంద్రుడు
ప్రకాశించక వున్నాడు; నక్షత్రములున్ను ఆయన దృ
6 ష్టికి శుద్ధి గలవి కావు. । ఆలాగైతే పురుగు అయి వుండే
మనుష్యుడున్ను పురుగు అయి వుండే మనుష్య పుత్రు
డున్ను యెంత మాత్రపు వాడు అని పలికెను.

## 26. అధ్యాయము.

1 అప్పుడు యోబు మారుత్తరము యిచ్చి చెప్పినదేమం
2 టే, । శక్తి లేని వానికి నీవు యేలాగు సహాయము చేస్తివి?
3 బలము లేని చేతిని నీవు యేలాగు బలపరిస్తివి? । నీవు
జ్ఞానము లేని వానికి ఆలోచన యిచ్చి, జ్ఞానమును యే
4 లాగు పరిపూర్ణముగా తెలిపితివి? । యెవరికి బుద్ధి
చెప్పితివి! నీలోనుంచి బైలు వెళ్లిన ఆత్మ యెవరిది? ।
5 వుదకము కింద హతమైన గొప్పవారికిన్ని వారితో
6 కూడా నిలిచే వారికిన్ని తత్తళింపు కలదు. । ఆయన
యెదుట పాతాళము బట్ట బైలుగా తెరువపడి వున్నది;
7 నరకము మూయపడక వున్నది. । ఆయన వుత్తరమును
శూన్యము అయిన దాని మీద విశాలపరచి, భూమిని
8 నిరాధారముగా వ్రేలాడ చేసి వున్నాడు. । ఆయన
నీళ్లను తన గాఢ మేఘములలో బంధించి వున్నాడు;
9 వాటి కింద మేఘము చినగక వున్నది. । ఆయన తన
సింహాసన ముఖమును వెనుకకు తీసి, దాని మీద తన
10 మేఘమును పరుస్తూ వున్నాడు. । వెలుగున్ను చీకటిన్ని
సరిపోయే మట్టుకు ఆయన నీళ్ల చుట్టూ సరిహద్దులను
11 కలుగ చేసి వున్నాడు. । ఆయన గద్దింపువల్ల ఆకాశ
12 ముయొక్క స్తంభములు అదరి తత్తళిస్తున్నవి. । ఆయన
తన బలముచేత సముద్రమును శాంతి పరచి, తెలివితో
13 దాని పొంగు అణచివేస్తున్నాడు. । ఆయన తన ఆత్మ
చేత ఆకాశమును అలంకరించి వున్నాడు; ఆయన
హస్తము వంకర గల సర్పమును రూపించి వున్నది. ।
14 యిదుగో యివి ఆయన మార్గములలో కొన్ని మాత్రమై
వున్నవి; ఆయనను గురించి మనము వినినవి యెంతో
కొంచెమై వున్నవి! అయితే ఆయన బలముయొక్క
వురుమును యెవడు గ్రహించ గలడు అని పలికెను.

## 27. అధ్యాయము.

1 యోబు మరిన్ని తన ప్రసంగమును వుపక్రమించి
2 చెప్పినదేమంటే, । నా శ్వాసము నా యందున్న పరా
త్పరుని ఆత్మ నా నాసికా రంధ్రమందున్ను వున్నంత
పర్యంతమున్ను నా పెదవులు అక్రమము చెప్పేది
లేదు; । నా నాలుక కపటము పలికేదిన్ని లేదు, అని నా 3
న్యాయమును తీసి వేసిన పరాత్పరుడున్ను, । నా ఆత్మను 4
చేదుపరచిన సర్వశక్తుడున్ను యైన ఆయన యొక్క
జీవము మీద వొట్టుపెట్టి చెప్పుతూ వున్నాను. । మీరు 5
మాట్లాడేది నీతి అని నేను సమ్మతించుట నాకు దూ
రమై వుండును గాక; నేను చచ్చే పర్యంతమున్ను నా
సజ్జనత్వమును నా యొద్దనుంచి నేను తొలిగి పోచే
యను. । నా నీతి గట్టిగా పట్టుకుంటూ వున్నాను; నేను 6
దానిని విడిచి పెట్టను; నేను బ్రతికినంత కాలము నా
హృదయము నన్ను గద్దించదు. । నా పగవాడు చెడ్డ 7
వాని వలెనున్ను నాకు విరోధముగా లేచే వాడు అనీ
తిమంతుని వలెనున్ను వుండును గాక. । యేమంటే మా 8
యకాడు భాగ్యము వెతికి వుంచి వున్నప్పటికిన్ని పరా
త్పరుడు వాని ఆత్మను కొంచుపోయేటప్పుడు వాని
నమ్మికె యేమి అవును? । శ్రమ వాని మీదికి వచ్చేటప్ప 9
టికి పరాత్పరుడు వాని మొర్ర వినునా? । వాడు సర్వ 10
శక్తునియందు ఆనందించునా? వాడు యావత్కాలమం
దున్ను పరాత్పరుని గూర్చి మొరపెట్టునా? । పరాత్ప 11
రుని చేతిని గురించి మీకు వుపదేశింతును; సర్వశక్తుని
యందు వుండేది నేను దాచను. । యిదుగో మీ రందరు 12
న్ను అది చూచి వుండిన్ని మీరు యింత వ్యర్థపు తలం
పులు గలవారై వుండెదరేమి? । చెడ్డ మనుష్యునికి పరాత్ప 13
రుని యొద్దనుంచి వచ్చే భాగమున్ను బాధ కలుగ చేసే
వారు సర్వ శక్తుని యొద్దనుంచి అనుభవించే స్వాతంత్ర్య
మున్ను యేవంటే, । వాని పిల్లలు హెచ్చితే కత్తి చేత 14
తెగవేయ పడేటందుకే; వాని సంతతి ఆహారమున
తృప్తిపొందేది లేదు. । వానికి మిగిలిన వారు చనిపోయి 15
పాతిపెట్ట పడుదురు; వాని విధవలు యేడ్చేదిన్ని లేదు. ।
వాడు వెండిని ధూళి వలె పోగు చేసి, వస్త్రములను 16
జిగట మన్నువలె సంపాదించినప్పటికిన్ని, । వాడు 17
సంపాదించ వచ్చును గాని నీతిమంతుడు వాటిని కట్టు
కొనును; నిర్దోషులైన వారు ఆ వెండిని పంచుకొం
దురు. । వాడు చిమ్మెట వలె తన యిల్లు కట్టును; అది 18
కావలిగా వుండే వాడు వేసుకొన్న పాక వలె అవు
ను. । ఐశ్వర్యవంతుడు పండుకొనును అయితే వాడు 19
పాతి పెట్టబడక వుండును; వాడు తన కన్నులు తెర
చును అయితే వాడు లేకుండా వుండును. । భయోత్పా 20
తములు ప్రవాహము వలె వానికి కలుగును; రాత్రి
కాలమందు గొప్ప గాలి వాని కొట్టుకొని పోవును. ।
తూర్పు గాలి వానిని యెత్తుకొని పోయేటప్పుడు 21
వాడు తొలిగి పోవును; అది తుఫాను వలె వాని స్థల
మునుంచి వాని తోసుకొని పోవును. । యేమంటే పరా 22
త్పరుడు వీటిని వాని మీద పడవేసి, వాని విడువకుం
డా వుండును; వాడు ఆయన చేతిలోనుంచి తప్పించు

23 కొనేటందుకు అపేక్షించును. । మనుష్యులు వాని
మీద చప్పట్లు కొట్టి వాని స్థలములోనుంచి వాని తోసి
వేతురు.

## 28. అధ్యాయము.

1 నిశ్చయముగా వెండికి గని వున్నది; బంగారము
2 నకు పుటము వేసే స్థలము కలదు. । యినుము మంటి
లోనుంచి తియ్యపడును; రాగి రాళ్లలోనుంచి కరిగి
3 తీయపడును. । వాడు చీకటికి అంతము కలుగ చేసి,
సమస్తమున్ను అనగా చీకటిలో వుండే రాళ్లనున్ను
4 మరణపు నీడనున్ను పరిశోధించును. । కాపురస్తుని యొ
ద్దను దాట లేని లోతుగల యేరు లేచినప్పటికిన్ని అది
యెండ చేయబడి, మనుష్యులవల్లను యెత్తి విడువపడి
5 పోవును. । భూమిని గురించినదేమంటే, అందులోనుంచి
ఆహారము పండును; దాని కింది స్థలములలో వుండేవి
అగ్ని వల్లను అయినట్టుగాను మారుపడి పోతూ
6 వున్నవి. । దాని రాళ్లు నీలములకు స్థానమైనవి; దానిలో
7 బంగారపు యిసుక కలిగి వుండును. । ఆ దారి యే పక్షి
అయినా యెరగదు; రాంబోందు కన్నులు దాని చూడ
8 లేదు. । దుష్టమృగపు పిల్లలు దాని త్రొక్కలేదు; సింహ
9 ము దాని వైపు నడవ లేదు. । వాడు తన చెయి రాతి
మీద పెట్టి, పర్వతములను వాటి అడుగులతో బోల్ల
10 దోసును. । వాడు శిలా పర్వతములను చీల్చి, నీళ్ల కా
లువలను బయిలువెళ్ల చేస్తూ వున్నాడు; వాని కన్నులు
11 వెల అధికమైన సమస్తమునున్ను చూచెను. । నదులు
వుద్దుల పైని పార్లకుండా వాడు వాటిని బంధిస్తూ
వుండును; దాగి వున్నదాని వాడు వెలుగులోకి తెస్తూ
12 వున్నాడు. । అయితే జ్ఞానము యెక్కడ కనుబడును!
13 తెలివి వుండే స్థలము యేది! । దాని వెల మనుష్యుడు
యెరుగడు; అది జీవము కలవారి భూమిలో దొరికేది
14 కాదు. । అగాధము అది నా యందు లేదు అని పలు
కుతున్నది; సముద్రము అది నా యొద్ద లేదు అని
15 పలుకుతుంది. । అది బంగారము చేత కొనబడేది కాదు;
16 దాని వెలకు వెండి తూచబడేది లేదు. । ఓఫిరుయొక్క
బంగారముతోనున్ను వెల అధికమైన గోమేధికముతో
నున్ను నీలముతోనున్ను అది యీడు చేయ బడదు. ।
17 బంగారమున్ను స్ఫటికమున్ను దానితో సాటి చేయ
బడ జాలవు; ప్రశస్తమైన బంగారపు నగలకు అది మా
18 ర్చబడదు. । పగడములను గురించిన్ని ముత్యములను
గురించిన్ని చెప్ప నిమిత్తము లేదు, యేమంటే కెంపుల
19 కంటే జ్ఞానము యొక్క విలువ అధికమవును. । కుషు
దేశపు పుష్యరాగము దానితో సమానము కాదు;
20 అపరంజి చేత అది కొనబడదు. । యీలాగు వుండగా
జ్ఞానము యెక్కడనుంచి వచ్చును? తెలివి వుండే స్థల
ము యేది! । యేమంటే జీవము కల వారందరి కన్ను 21
లకు అది దాచబడి వున్నది; ఆకాశ పక్షులకు అది
మరుగు చేయబడి వున్నది. । మేము మా చెవులతో 22
మాత్రము దాని కీర్తిని వింటిమి అని క్షయమున్ను
మరణమున్ను పలుకును. । దాని మార్గము పరాత్పరు 23
డు యెరుగును; దాని స్థలము ఆయనకు తెలుసును. ।
యేమంటే ఆయన భూమియొక్క అంత్య భాగముల 24
మట్టుకు చూచును; ఆకాశమంతటి కింద వుండేదన్ని
దృష్టించును. । ఆయన గాలికి భారము కలుగ చేసి, 25
నీళ్లకు కొల ప్రమాణము చేసి, । వానకు నిర్ణయము 26
నున్ను వురుములతో కూడిన మెరుపుకు మార్గము
నున్ను కలుగ చేసినప్పుడు, । ఆయన దానిని చూచి 27
వివరించి, దాని ఆయత్తపరచి పరిశోధించెను. । ఆయన 28
మనుష్యునితో, యిదుగో ప్రభువుకు భయపడుటే
జ్ఞానము; కీడునుంచి తొలిగి పోవుటే తెలివి అని చెప్పి
నాడు అని చెప్పెను.

## 29. అధ్యాయము.

మరిన్ని యోబు తన ప్రసంగమును వుపక్రమించి 1
చెప్పినదేమంటే, । ఆహా, పరాత్పరునియొక్క దీపము 2
నా శిరస్సు మీద ప్రకాశించినందువల్ల నేను ఆయన
వెలుగు చేత చీకటిని దాటిన పూర్వపు మాసములలో
నున్ను, । ఆయన నన్ను కాపాడిన దినములలోనున్ను 3
నాకు కలిగిన భాగ్యము నాకు యిప్పుడు యిచ్చేవాడు
యెవడు? । నా పడుచు తనముయొక్క దినములలో, అన 4
గా, పరాత్పరునియొక్క రహస్యము నా గుడారము
మీద కలిగినప్పుడున్ను; । సర్వ శక్తుడు నాతో కూడా 5
వున్నప్పుడున్ను; నా పిల్లలు నన్ను చుట్టుకొని వున్న
ప్పుడున్ను; । నా అడుగులు నేను నేతితో కడిగినప్పు 6
డున్ను; రాతి కొండలోనుంచి నూనెయొక్క నదులు
పారినప్పుడున్ను; । నేను పట్టణపు వీధిలోబడి ద్వారము 7
బైటికి వెళ్లి, వీధిలో నా పీఠము వేయించినప్పుడున్ను
నాకు వున్న భాగ్యము నాకు యిప్పుడు యిచ్చే వాడు
యెవడు? । అప్పుడు పడుచువాండ్లు నన్ను చూచి దా 8
గిరి; ముసలి వాండ్లు లేచి నిలిచిరి. । పెద్ద మనుష్యులు 9
మాట్లాడకుండా తమ నోటిమీద తమ చెయ్యి వేసు
కొనిరి. । ఆలోచన కర్తలు వూరకొనిరి; వారి నాలుక 10
వారి నోటి పైని అంటుకొనెను. । నా మాట ఆలకిం 11
చిన చెవి నన్ను భాగ్యవంతుడు అని పలికెను; నన్ను
చూచిన కన్ను నా పట్ల సాక్ష్యము పలికెను. । యెందు 12
కంటే, మొర పెట్టిన దరిద్రులనున్ను దిక్కున్ను సహా
యమున్ను లేని వానినిన్ని నేను రక్షిస్తిని. । నశించుటకు 13
సిద్ధముగా వున్నవాని ఆశీర్వాదము నా మీదికి వచ్చెను;
విధవయొక్క హృదయమును నేను సంతోషింప చేస్తిని. ।

14 నేను నీతిని ధరించుకొంటిని; అది నాకు తొడుగు
కునే వస్త్రము ఆయెను; న్యాయము నాకు పై వస్త్రము
15 వలెనున్ను కిరీటము వలెనున్ను వుండెను. । నేను గుడ్డి
వానికి కన్నులున్ను కుంటివానికి కాళ్లున్ను అయి వుం
16 టిని. । నేను బీదవాండ్లకు తండ్రిని అయి వుండి, నేను
17 యెరుగని వ్యాజ్యమును పరిశోధిస్తిని. । నేను అన్యా
యపు వారియొక్క దవడ పళ్లను వూడ గొట్టి, దోపు
18 సొమ్మును వారి పళ్లలోనుంచి లాగివేస్తిని. । నా గూటి
లో నేను చనిపోదును, నా దినములను యిసుకలాగున
19 హెచ్చ చేతును అని అప్పుడు పలికితిని. । నా వేరు
నీటి దరిగా వ్యాపించెను; మంచు రాత్రి అంతా నా
20 కొమ్మల మీద నిలిచి వుండెను. । నా మహిమ నా యందు
కొత్తదై వుండెను; నా చేతి విల్లు నూతనముగా బలపర
21 చబడెను. । మనుష్యులు నాకు చెవి యిచ్చి కాచుకొని,
22 నా ఆలోచన విని మౌనముగా వుండిరి. । నా మాట
లైన తరువాత వారు ప్రత్యుత్తరము యివ్వక వుండిరి;
23 నా మాట వారి మీదను గుత్తి గుత్తిగా పడెను. । యే
మంటే వాన కొరకు కాచుకొని వున్నట్టుగా వారు
నా కొరకు కాచుకొని వుండి, తరువాతి వానకు ఆశ
గల వారివలె తమ నోరు వెడల్పుగా తెరుచుకొని
24 వుండిరి. । నేను వారిని చూచి నవ్వినప్పటికిన్ని వారు
నమ్మకుండానున్ను నా ముఖముయొక్క ప్రకాశము
25 తరగ చేయకుండానున్ను వుండిరి. । నేను వారి మార్గ
మును యేర్పరచితిని; శ్రేష్ఠుడనై కూర్చుండి, సైన్య
మందు రాజువలెనున్ను దుఃఖించిన వారిని వూరడించే
వానివలెనున్ను వుంటిని.

## 30. అధ్యాయము.

1 ఇప్పుడు నా కంటే తక్కువ వయస్సు గల వాండ్లు
నన్ను అపహాస్యము చేస్తూ వున్నారు; వారి పితృలను
నా మందలో వుండే కుక్కలతోనైనా వుంచడానకు
2 నేను వొప్పకుండా వుందును. । వృద్ధాప్యమువల్ల చెడి
పోయిన వాండ్ల చేతుల బలము నాకు యేమి ప్రయో
3 జనముగా వుండును? । లేమి చేతనున్ను ఆకలి చేతను
న్ను వారు వొంటరిగా విడువపడి, పాడుగానున్ను
వుత్తదిగానున్ను వున్న అంధకారపు అరణ్యమునకు పా
4 రిపోయి, । తుప్పలలో వుండే మాలూహ చెట్లను లాగు
5 దురు, రొతేము చెట్ల వేరులను తిందురు. । వారు మను
ష్యుల మధ్యనుంచి తరమ బడిరి; దొంగ వెంబడిని కూ
కలు వేసినట్టు వారి వెంబడిని వారు కూకలు వేసిరి. ।
6 భయంకరమైన పల్లపు స్థలముల యందున్ను భూమి
యొక్క గుహల యందున్ను రాతి కొండల యందున్ను
7 వారు కాపురము వుండిరి. । తుప్పలలో కేకలువేస్తూ,
8 ముళ్ల చెట్లకింద కూడిరి. । వారు మూఢులయొక్క పిల్ల
లున్ను కీర్తి లేని వారి పిల్లలున్ను దేశములోనుంచి
తరమ పడే వారున్ను అయి వుండిరి. । అయితే యిప్పుడు 9
నేను వారికి పాటగానున్ను సామితెగానున్ను వున్నా
ను. । వారు నన్ను అసహ్యించి, నా యొద్దనుంచి దూర 10
ముగా పారిపోయి, నా ముఖము మీద వుమ్మివేయు
టకు వెనుక తీయలేదు. । యేమంటే ఆయన నా తాడును 11
విప్పి, నన్ను శ్రమ పెట్టినందున వీరున్ను కళ్లెము నా
ముందర వదిలి వేసిరి. । నా కుడి పార్శ్వమందు పడు 12
చువాండ్లు లేచి, నా కాళ్లను తొట్రుపడేటట్టు చేసి,
తమ కీడు మార్గమును నా నిమిత్తము ఆయత్త పరు
స్తూ వున్నారు. । వారు నా మార్గమును పడగొట్టు 13
తున్నారు; నా ఆపదను నడిపిస్తూ వున్నారు; వారికి
సహాయము అక్కరలేదు. । విస్తారమైన వుదకములు 14
తోసుకొని వచ్చినట్టుగానే వారు నా పైకి నా శ్రమ
యందు పొర్లి వస్తూ వున్నారు. । భయంకరత్వములు 15
నా మీదికి తిరిగి వున్నవి; అవి గాలివలె నా ఆత్మను
వెంబడిస్తూ వున్నవి; నా క్షేమము మేఘము వలె గతిం
చిపోయెను. । అయినందున యిప్పుడు నా ఆత్మ నా 16
యందు కరిగిపోవును; వుపద్రవ దినములు నన్ను పట్టు
కొనెను. । రాత్రి కాలమందు నా యెముకలు నాకు 17
గుచ్చుకొనును; నా నరములకు సుఖము లేదు. । నా రోగ 18
బలముచేత నా వస్త్రము మార్చ బడెను; అది నా అంగీ
యొక్క మెడపట్టె వలె నన్ను చుట్టుకొనెను. । ఆయన 19
బురదలో నన్ను తోసివేసినందున నేను ధూళి వలెనున్ను
బూడిదె వలెనున్ను అవుతున్నాను. । నిన్ను గూర్చి నేను 20
మొర్ర పెట్టుతూ వున్నప్పటికీ నీవు నా మొర్ర ఆల
కించ లేదు; నేను నిలువబడినప్పటికిన్ని నీవు నన్ను లక్ష్య
పెట్టలేదు. । నీవు నా యెడల కఠినముగా వున్నావు; 21
నీ చేతి బలము చేత నన్ను యెదిరిస్తూ వున్నావు. । నీవు 22
నన్ను గాలివలె యెగరకొట్టి, నా జ్ఞానమును కరిగిపో
యేటట్టు చేస్తూ వున్నావు. । యేమంటే నీవు మరణము 23
నకున్ను సకల జీవులకు నిర్ణయించబడిన యింటికిన్ని
నన్ను తెత్తువని నాకు తెలుసును. । అయినప్పటికిన్ని 24
ఆయనయొక్క నాశనమందు వారు మొర్రపెట్టినట్ట
యితే సమాధి పర్యంతము ఆయన తన చెయి చాప
కుండా వుండును. । శ్రమలో వున్న వారి నిమిత్తము 25
నేను యేడ్వలేదా? దరిద్రుని నిమిత్తము నేను దుఃఖ
మును పొందలేదా? । నేను మేలు కొరకు కాచుకొని 26
యున్నప్పుడు నాకు కీడు వచ్చెను; వెలుగు నిమిత్తము
కనిపెట్టి వున్నప్పుడు చీకటి వచ్చెను. । నా పేగులు 27
పొంగి తీసిపోకుండా వున్నవి; వుపద్రవ దినములు నా
మీదికి వచ్చినవి. । యెండలో తిరగక పోయినప్పటి 28
కిన్ని మాడిపోతిని; నేను సంఘములో నిలువబడి మొ
ర్రపెట్టినాను. । నేను ఘటసర్పములకు సహోదరు 29

డనున్ను తీతికె పిట్టలకు జతకాడనున్ను అయితిని. ।
30 నన్ను చుట్టుకొని వుండే నా చర్మము నల్లనిది ఆయెను;
31 నా యెముకలు వుష్ణముచేత కాలి పోతున్నవి. । నా
వీణె యేడుపుకున్ను నా కిన్నెర యేడ్చే వారి శబ్దము
కున్ను మార్చపడినవి.

## 31. అధ్యాయము.

1 నేను నా కన్నులతో వొడంబడికె చేసుకొన్నాను,
కాగా నేను వొక కన్యక మీద తలంపు యేలాగు
2 వుంచుదును?। యేమంటే అప్పుడు వున్నతముగా వున్న
పరాత్పరునినుంచి నాకు యేమి భాగము కలుగును?
సర్వ శక్తునివల్ల నాకు యేమి స్వాస్థ్యము కలుగును? ।
3 దుర్మార్గులకు లయమున్ను అక్రమపు వారికి తెలి
4 యని శిక్షయున్ను రాదా? । ఆయన నా మార్గములను
చూచి, నా అడుగులు అన్నిన్ని యెంచుతూ వున్నాడు
5 కాడా? । నేను మాయయందు నడిచినా, నా కాలు
6 మోసము చేసుటకు త్వరపడినా, । పరాత్పరుడు నన్ను
తూచును గాక; అప్పుడు నా యథార్థతను ఆయన
7 కనుగొనును. । నా అడుగు జారి మార్గమును తప్పినా,
నా హృదయము నా కన్నులను వెంబడించినా, నా
8 చేతులలో మలినమైనది యేమైనా వున్నా, । అప్పుడు
నేను విత్తినది మరి యొకడు భుజియించును గాక; నేను
9 నాటినది పెరికి వేయబడును గాక. । నా హృదయము
వొక స్త్రీచేతను మోసపుచ్చబడి, నా పొరుగింటి వాని
10 ద్వారముయొద్ద నేను పొంచి వుండినా, । అప్పుడు నా
భార్య మరి యొకనికి పిండి విసురును గాక, ఆమె
11 మీదికి యితరులు వంగుదురు గాక. । యేమంటే అది
ఘోరమైన పాపము; అది న్యాయాధిపతులు శిక్షించ
12 తగిన అక్రమమై వున్నది. । అది నిర్మూలము చేసే పర్యం
తము దహించే అగ్నియై వుండి, నా అభివృద్ధి అంత
13 టినీ పెరికివేసును. । నా పనివాడు గానీ నా పనికత్తె
గానీ నాతో వ్యాజ్యపడేటప్పుడు వారి వ్యాజ్యమును
14 నేను అలక్ష్యము చేసి వుంటే, । పరాత్పరుడు లేచి
నప్పుడు నేను యేమి చేతును? ఆయన విచారించినప్పు
డు నేను ఆయనకు యేమి మారుత్తరము చెప్పుదును? ।
15 గర్భమందు నన్ను కలుగచేసిన వాడు వానిని కూడా
కలుగచేయ లేదా? గర్భమందు మమ్మును రూపించిన
16 వాడు వొక్కడే కాడా? । బీదలు యిచ్ఛయించిన దా
నికి నేను వెనుక తీసినా, విధవయొక్క కన్నులను
17 క్షీణింప చేసినా, । తల్లిదండ్రులు లేని వారు నా తున
కలోది భుజియించకుండా నేను అది వొంటిగా భుజి
18 యించినా, । (యేమంటే నా బాల్యము మొదలుకొని
తండ్రితోనైనట్టు వాడు నాతో కూడా పెరిగెను; నా
తల్లి గర్భమందు పుట్టిన నాటనుంచి ఆమెను నేను
తోడ్చుకొని తెస్తిని); । వస్త్రము లేకుండా యెవడైనా 19
చనిపోవుట నేను చూచినా, బీదలకు పై బట్ట లేకుండా
వుండుట నేను చూచినా, । వాని నడుము నన్ను ఆశీర్వ 20
దించకుండా వుండినా, నా గొర్రెల బొచ్చు చేత
అతడు వేడిమి పొందక పోయినా, । నాకు వూరి గవిని 21
యందు బలము కలిగి వున్నప్పటికీ దిక్కు లేని వాని
మీద నా చెయ్యి నేను చాపినా, । అప్పుడు నా భుజ 22
ము దాని దుమ్మునుంచి పడిపోయి విరిగి పోవును గాక. ।
యేమంటే పరాత్పరునివల్ల వచ్చే నాశనము నాకు 23
భయంకరముగా వుండును; ఆయన మహోన్నతిచేత
దాని వోర్చలేక పోదును. । నేను బంగారము మీద 24
నా నమ్మికె వుంచి, అపరంజితో నీవు నా ఆశ్రయమని
నేను చెప్పినా, । నా ఆస్తి గొప్పదనిన్ని నా చేతికి 25
చాలా దొరికినదనిన్ని నేను సంతోషించినా, । సూ 26
ర్యుడు ప్రకాశించేటప్పుడైనా లేక చంద్రుడు తన
కాంతితో బయిలు వెళ్లేటప్పుడైనా నేను వారిని
దృష్టించి, । నా నోరు నా చేతిని ముద్దు పెట్టుకొనే 27
టందుకు నా హృదయము రహస్యముగా మోసమును
పొందినా, । అదిన్ని న్యాయాధిపతి శిక్షించ తగిన అక్ర 28
మమై వుండును; యేమంటే అప్పుడు పైగా వుండే
పరాత్పరుని నేను యెరుగనని చెప్పే వాడనౌదును. ।
నా పగవాని నాశనమును గూర్చి నేను సంతోషించి 29
నా, అతనికి కీడు కలిగినదని నేను ఆనందించినా; ।
వాని జీవము మీద శాపము రాగలందులకు నా నో 30
టివల్ల నేను పాపము రానియ్య లేదు. । వాని ఆహార 31
ము భక్షించి తృప్తిపొందని వాడు యెవడని నా గుడా
రపు మనుష్యులు చెప్పకపోయినా, । (పరదేశి వీధిలో 32
బస చేయ లేదు, మార్గస్థుని కొరకు నేను నా తలు
పులు తెరిస్తిని.) । నేను ఆదాము వలె నా తప్పితమును 33
కప్పి వేసి, నా అక్రమమును నా గుండెలో దాచిపెట్టి
తినా, । అప్పుడు గొప్ప సమూహమువల్ల నాకు భయము 34
కలుగును గాక; కుటుంబములు నన్ను అవమానపరచి
భయపెట్టును గాక; నేను మాట్లాడకుండా యింటి
నుంచి బయిలు వెళ్లకుండా వుండును గాక. । నా వ్యా 35
జ్యమును వినే వాడు యెవడైనా వుంటే మేలు! యి
దుగో సర్వ శక్తుడు నాకు ప్రత్యుత్తరము యిచ్చుట
కున్ను నా వ్యాజ్యకాడు తన ఫిరియాదు వొక పుస్తక
ములో వ్రాసుటకున్ను నేను కోరుతూ వున్నాను. ।
అప్పుడు దాని నేను నా భుజము మీద వేసుకొందును; 36
నాకు కిరీటముగా దాని ధరించుకొందును. । ఆయనకు 37
నేను నా అడుగుల లెక్క కనుపరచి ఆయన త్రోవ
యొద్దకు రాజు వలెనే వెళ్లుదును. । నాకు విరోధముగా 38
నా భూమి మొర్ర పెట్టి, దాని చాలులు కూడా నా
మీద తప్పు మోపినా, । కూలి యివ్వకుండా నేను దాని 39

ఫలమును భక్షించి, పయిరు పండించినవారి ఆత్మను
40 నేను నశించి పోయేటట్టు చేసినా, । దానియందు గోధు
ములకు బదులుగా ముళ్లు మొలుచును గాక; తోక
గోధుములకు బదులుగా కలుపున్ను మొలుచును గాక
అని పలికెను. యోబుయొక్క మాటలు సమాప్తి అయినవి.

## 32. అధ్యాయము.

1 అప్పుడు ఆ ముగ్గురు మనుష్యులు యోబు తన
దృష్టి యందు నీతిమంతుడయి వున్నందున వానికి యిం
2 కా ప్రత్యుత్తరము యిచ్చుటకు చాలించిరి. । అయితే
యోబు పరాత్పరుని కంటే తన్ను తాను నీతిమంతుని
గా చేసుకొనినందున రాముయొక్క వంశములో బూ
జీయుడయిన బారఖేలు కుమారుడయిన ఎలీహుకు
3 వాని మీద కోపము కలిగెను.। మరిన్ని యోబుయొక్క
ముగ్గురు స్నేహితుల మీదనున్ను అతనికి కోపము కలి
గెను, యెందుకంటే వారు ప్రత్యుత్తరము యివ్వలేక
పోయినప్పటికిన్ని యోబు మీద నేరస్థాపన చేసినారు.।
4 వాండ్లు తనకంటే యెక్కువ యీడు గలవారైనందున
ఎలీహు యోబు మాట్లాడి వూరకుండే పర్యంతము కని
5 పెట్టినాడు. । అయితే ఆ ముగ్గురు మనుష్యుల నోట
మారుత్తరము లేకపోవడము ఎలీహు చూడగా అతనికి
6 కోపము కలిగెను. । అప్పుడు బూజీయుడయిన బార
ఖేలు కుమారుడైన ఎలీహు ప్రత్యుత్తరముగా చెప్పిన
దేమంటే, నేను కొద్ది వయస్సు కలవాడను, మీరు
ముసలివారు; కాగా నేను భయపడి నా తాత్పర్యమును
7 మీతో చెప్పుటకు సాహసించక పోతిని. । దినములు
పలక వలెను, విస్తారమైన సంవత్సరములు జ్ఞానమును
8 నేర్ప వలెను అని నేను అనుకొంటిని. । అయితే మను
ష్యుని యందు ఆత్మ కలదు; సర్వ శక్తుని ఆవేశమువల్ల
9 వారికి జ్ఞానము కలుగును. । అయితే గొప్పవారు అంద
రున్ను జ్ఞానవంతులు కారు; వృద్ధులున్ను తరుచుగా
10 న్యాయమును గ్రహించరు. । అందు కొరకే నా మాట
ఆలకించుము; నేనున్ను నా తాత్పర్యము చెప్పుతానని
11 పలికినాను. । యిదుగో మీ మాటల నిమిత్తము కని
పెట్టినాను; చెప్పేటందుకు మీకు యేమి వుండునో
అది మీరు తరిచి చూచే పర్యంతమూ మీ స్వాళ్లకు
12 నేను చెవి యొగ్గితిని. । మీ మాటను నేను గ్రహిస్తిని,
అయితే యిదుగో మీలో యోబుకు న్యాయము
తెలియ చూపి అతని మాటలకు తిరిగీ ప్రత్యుత్తరము
13 చెప్పతగినవాడు లేడు. । జ్ఞానమును మేము కనుకున్నా
ము అని చెప్పుదురేమో; మనుష్యుడు కాడు పరాత్ప
14 రుడు వాని పడదోసే వాడవును. । అతడు నన్ను చూచి
మాట్లాడలేదు; మీరు చెప్పిన మాటలవల్ల నేను అతనికి
15 ప్రత్యుత్తరము చెప్పను. । వారు ఆశ్చర్యమును పొంది,
మరి ప్రత్యుత్తరము యివ్వలేదు; వారు మాటలు ఆడ
కుండా వుండి, । వూరకె నిలుచుని; మరి ప్రత్యుత్తరము 16
చెప్పకుండా వున్నందున, । నేను కనిపెట్టి ప్రత్యుత్తర 17
ము నాకు తోచిన ప్రకారము చెప్పుదుననిన్ని నేను
న్ను నా తాత్పర్యమును తెలియచేతుననిన్ని అంటిని. ।
యేమంటే నేను మాటలతో నిండి యున్నాను; నా 18
యందు వుండే ఆత్మ నన్ను ప్రేరేపణ చేస్తూ వున్నది. ।
యిదుగో నా వుదరము తెరచక వున్న ద్రాక్షారసము 19
వలె వున్నది; అది క్రొత్త సిద్దెల వలెనే పగిలిపోవుటకు
సిద్ధపడి వున్నది. । నేను సేద తీర్చుకొనేటందుకు 20
మాట్లాడుదును; నేను నా పెదవులను తెరచి ప్రత్యు
త్తరము చెప్పుదును. । నేను వొకని ముఖము చూడకుం 21
డానున్ను వుందును గాక; వొక మనుష్యునికి యిచ్చ
కపు మాటలు పలుకకుండానున్ను వుందును గాక. ।
యేమంటే నేను యిచ్చకపు మాటలు పలుకడము యె 22
రుగను; నన్ను కలుగచేసినవాడు శీఘ్రముగా నన్ను
కొంచపోవును.

## 33. అధ్యాయము.

కాగా వో యోబూ, నా వార్తలను వినుము, నా 1
మాటలన్నిటికిన్ని చెవి యొగ్గుము. । యిదుగో నేను నా 2
నోరు తెరచితిని, నా నోట్లో వుండే నాయొక్క
నాలుక మాట్లాడెను. । నా మాటలు నా హృదయము 3
యొక్క సత్యమును గూర్చి వుండును; నా పెదవులు
జ్ఞానమును గూర్చి స్పష్టముగా మాట్లాడును. । పరా 4
త్పరుని ఆత్మ నన్ను కలుగ చేసెను; సర్వశక్తునియొక్క
శ్వాసము నాకు ప్రాణము యిచ్చెను. । అయితే నాకు 5
మారుత్తరము యివ్వగల వాడవైతే నా యెదుట నీవు
ఆయత్త పడి నిలిచి వుండుము. । యిదుగో నేను నీ 6
కోరికె ప్రకారము పరాత్పరునికి బదులుగా వున్నాను;
నేనున్ను జిగట మంటిలోనుంచి తియ్యపడిన వాడనై
వున్నాను. । యిదుగో నా భయంకరత్వము నీకు భయము 7
కలుగ చేయదు; నా చెయ్యి నీ మీదను బరువుగా
వుండదు. । నా చెవులలో నీవు పలికినావు; నీ మాటల 8
శబ్దమును నేను వినినాను. । యేమంటే నేను అపరాధిని 9
కాకుండా శుద్ధుడనై వున్నాననిన్ని, నాయందు అక్ర
మము లేదనిన్ని, నేను నిర్దోషిని అనిన్ని, । యిదుగో 10
నా యందు ఆయన తప్పు మోపుటకు హేతువులు
వెతుకుతూ వున్నాడనిన్ని, ఆయనకు శత్రువుగా నన్ను
యెంచుకొంటూ వున్నాడనిన్ని, । ఆయన నా కాళ్లను 11
బొండలలో వేసి నా త్రోవలనన్నిటినీ పరీక్షిస్తూ
వున్నాడనిన్ని పలికినావు. । యిదుగో యీ విషయ 12
మందు నీవు నీతిమంతుడవు కావు అని నీకు ప్రత్యు
త్తరముగా చెప్పుతున్నాను; యేమంటే మనిషికంటే

13 పరాత్పరుడు గొప్పవాడై వున్నాడు. । ఆయన తన నడ
వడిలో దేన్ని గూర్చి అయినా నీకు ప్రత్యుత్తరము
చెప్పడు గనుక ఆయనతో నీవు యెందుకు పోరాడు
14 తావు! । యేమంటే పరాత్పరుడు వొక మారు పలుకును,
నిజముగా రెండో మారున్ను పలుకును; అప్పుడైనా
15 మనుష్యుడు లక్ష్యపెట్టడు. । రాత్రి కాలములో స్వప్న
దర్శనమందున్ను, మనుష్యులకు గాఢమైన నిద్ర కలి
గినప్పుడున్ను, పడకలో కునుకుపాట్ల యందున్ను, ।
16 అప్పుడు ఆయన మనుష్యుని వాని వుద్దేశములోనుంచి
తప్పించేటట్టుగానున్ను, గర్వమును మనుష్యుల యందు
17 అణచివేసేటట్టుగానున్ను, । మనుష్యులయొక్క చెవు
18 లను తెరిచి వారికి బోధను ముద్రించును. । ఆయన వాని
ఆత్మను నాశనములో నుంచిన్ని వాని జీవమును కత్తి
19 నరుకులోనుంచిన్ని తప్పించివేస్తూ వున్నాడు. । వీడు తన
శయనమందు వ్యాధితోనున్ను తన యావత్తు యెముకల
యందు ఘోరమైన నొప్పితోనున్ను దండించపడుతూ
20 వున్నాడు. । అయినందున వాని జీవమునకు రొట్టెయం
దున్ను వాని ఆత్మకు రుచికరమైన భోజనమందున్ను అస
21 హ్యత కలుగును. । వాని మాంసము కనుపడకుండా
క్షీణించి పోయెను; కనుపడకుండా వున్నవాని యెము
22 కలు పైకి తోసుకొని వచ్చినవి. । వాని ఆత్మ సమాధికిన్ని
వాని ప్రాణము సంహరించే వారికిన్ని సమీపిస్తున్నది. ।
23 మనుష్యునికి వాని యథార్థతను తెలియ చేసుటకు
వెయ్యింటిలో వొక దూతయైనా అర్థము చెప్పేవాడైనా
24 వానితో కూడా వుంటే, । అప్పుడు ఆయన అతనికి దయ
చూపించి, వాడు లయములోకి దిగి పోకుండా వాని
రక్షించుము, నేను ప్రాయశ్చిత్తమును కనుకుంటిని అని
25 పలుకును. । అతని మాంసము బాల్యమందు వున్నలాగు
కంటే స్వస్థమై వుండును; తన వయస్సు గల దినములకు
26 అతడు తిరుగును. । అతడు పరాత్పరుని దృష్టించి ప్రా
ర్థించును; ఆయన అతని యెడల దయగా వుండును;
ఆనందముతో ఆయన అతని ముఖమును చూచును,
యేమంటే ఆయన నీతిని మనుష్యునికి కనుపరచును. ।
27 ఆయన మనుష్యులను దృష్టించినప్పుడు యెవడైనా నేను
పాపము చేసితిని, తిన్నగా వుండే దానిని తిప్పి వేసితిని,
28 దాని వల్ల నాకు ప్రయోజనము లేదని చెప్పితే; । ఆయన
వాని ఆత్మను నాశనములోకి దిగి పోకుండా రక్షించును;
29 అతని ప్రాణము వెలుగును చూచును. । యిదుగో జీవ
స్థులయొక్క వెలుగు చేతను వెలిగించబడుటకై పరా
త్పరుడు మనుష్యునియొక్క ఆత్మను నాశనమునుంచి
30 తప్పించే కొరకు, । యిది అంతానున్ను వాని యెడల
31 చాలా మార్లు జరిగించును. । వో యోబూ, బాగా
విచారించి, నా మాటలను ఆలకించుము; నీవు మౌన
32 ముగా వుంటే నేను పలుకుతాను. । చెప్పడానకు నీకు
యేమైనా వుంటే నాకు మారుత్తరము యిమ్ము, యేమంటే
నిన్ను నీతిమంతునిగా తీర్చేటందుకు నాకు కోరికె
కలదు. । లేకపోతే నా మాట వినుము; మౌనముగా వుం 33
డుము; నేను నీకు జ్ఞానమును నేర్పుదునని పలికెను.

## 34. అధ్యాయము.

మరిన్ని ఎలీహు మారుత్తరము యిచ్చి చెప్పినదేమం 1
టే, । ఓ జ్ఞానులారా, నా మాటలు వినండి; తెలివి కల 2
వారలారా, నాకు చెవి యివ్వండి. । యేమంటే నోరు 3
భోజనమును యేలాగున రుచి చూచునో ఆలాగునే
చెవి మాటలను పరిశోధించును. । మన నిమిత్తము న్యాయ 4
మును యెంచుకుందాము; మంచిది యెదో మనలో
మనము తెలుసుకొందాము. । యేమంటే నేను నీతిమం 5
తుడనని‌న్ని, పరాత్పరుడు నా వ్యాజ్యమును తోసివేసి
నాడనిన్ని, । నా న్యాయముకు వ్యతిరిక్తముగా నేను 6
అబద్ధమును పలుకుదునా అనిన్ని, నా యందు అపరా
ధము లేకపోయినా నా గాయము స్వస్థము కానిదిగా
వున్నది అనిన్ని యోబు పలికి వున్నాడు. । అపహాస్య 7
మును నీళ్లు వలెనే తాగే వాడున్ను, । అక్రమమును 8
చేసే వారితో సహవాసముగా పోయేవాడున్ను, దుష్టు
లతో నడిచే వాడున్నయిన యోబులాటి వాడు యె
వడు? । యేమంటే వొక మనుష్యుడు పరాత్పరుని మీద 9
ప్రేమ వుంచుటవల్ల వానికి ప్రయోజనము లేదని
యోబు పలికెను. । కాబట్టి వో బుద్ధిగల మనుష్య 10
లారా, నా మాట ఆలకించండి; పరాత్పరునికి దుష్టత
యున్ను సర్వశక్తునికి అక్రమమున్ను దూరముగా వుం
డును గాక, । యెందుకంటే మనుష్యునియొక్క క్రియ 11
లకు తగినట్టు అతనికి ఆయన ప్రతికారము చేసును, తన
తన మార్గముల చొప్పున ప్రతి వానికి ఆయన కలుగ
చేసును. । నిజముగా పరాత్పరుడు దుర్మార్గముగా జరి 12
గించడు; సర్వ శక్తుడు న్యాయమును తిప్పి వేయడు. ।
భూమి మీద ఆయనకు అధికారము యిచ్చిన వాడు 13
యెవడు! ప్రపంచమును స్థిరపరచిన వాడు యెవడు! ।
మనుష్యుని గూర్చి ఆయనకు ఆలోచన కలిగి, ఆయన 14
తన యొద్దికి వాని ఆత్మనున్ను శ్వాసమునున్ను చేర్చు
కుంటే, । సకల మాంసము యేకముగా నశించును; మను 15
ష్యుడు మళ్లీ ధూళి అయి పోవును. । యిప్పుడు నీకు 16
తెలివి వుంటే యిది వినుము; నా మాటలయొక్క శబ్ద
మునకు చెవి వొగ్గుము. । నీతి యందు పగ వుంచే వాడు 17
యేలునా? మహా నీతిమంతుడైన వానికి నేరస్థాపన
చేతువా? । రాజుతో నీవు చెడ్డవాడవనిన్ని అధిపతు 18
లతో మీరు భక్తిహీనులనిన్ని చెప్పడము తగునా? ।
ప్రభువుల ముఖము చూడకనున్ను బీదలకంటే అయి 19
శ్వర్యవంతులను యెక్కువగా యెంచకనున్ను వున్న

వానితో ఆలాగున చెప్పడము యెట్లాగు తగును? యే
మంటే వీరందరున్ను ఆయన చేతులయొక్క పనియై
20 వున్నారు. । అటువంటి వారు నిముషములో చనిపో
దురు; జనులు మధ్య రాత్రియందు కలవిలపడి వెళ్లిపో
దురు; బలవంతులు సహాయము లేకుండా తీసి వేయబ
21 డుదురు. । యేమంటే ఆయన కన్నులు మనుష్యుల మార్గ
ములను దృష్టించి వున్నవి; వారి నడకలన్నిటినీ ఆయన
22 చూస్తూ వున్నాడు. । అక్రమమును చేసే వారు తాము
దాగుటకు చీకటైనా మృత్యువ నీడయైనా లేదు. ।
23 యేమంటే పరాత్పరుని యెదుటకు మనుష్యుడు వచ్చి
తీర్పు పొందుటకు ఆయనకు యెంతో కాలము అక్కర
24 లేదు. । చాలా విమర్శ లేకుండానే ఆయన బలవంతు
లను ఛిన్నాభిన్నములుగా చేసి, వారికి బదులుగా యిత
25 రులను నిలుపును. । వారి కార్యములు ఆయనకు తెలు
సును గనుక వారు నలిగి పోయేటట్టుగా రాత్రి కాల
26 మందు ఆయన వారిని పడదోసును. । వారు ఆయనను
విడిచిపెట్టి, ఆయన మార్గములలో వేటినయినా విచా
27 రించకుండా వున్నందున, । యితరుల దృష్టియందే దుర్మా
28 ర్గులయినట్టు ఆయన వారిని కొట్టును. । ఆయన శ్రమ
పడుతూ వున్న వారి మొఱ్ఱ వింటూ వున్నాడు; బీదల
మొఱ్ఱ ఆయన యొద్దకు వారు రాచేయిస్తూ వున్నారు. ।
29 ఆయన నెమ్మది దయచేసినప్పుడు యెవడు తొందర
పెట్టగలడు? ఆయన తన ముఖమును వొక జనమునుంచే
గాని లేక వొక మనిషినుంచే గాని దాచితే ఆయనను
30 యెవరు చూడ గలరు? । జనులు వురిలో చిక్కుబడకుం
డానున్ను మాయావాది యేలకుండానున్ను ఆయన
31 ఆలాగు జరిగించును. । అయితే నేను శిక్షను పొంది
32 వున్నాను, నేను మరి పాపము చేయను అనిన్ని, । నాకు
కనపడనిది నాకు నేర్పుము అనిన్ని, నేను అక్రమ
మును చేసి వున్నట్టయితే యికను చేయనన్నిన్ని, పరా
33 త్పరునితో చెప్పుట నిజముగా తగును. । అయితే అది
నీ మనస్సు ప్రకారము వుండునా? నీవు నిరాకరించినా
అంగీకరించినా నేను కాదు, ఆయనే నీకు ప్రతి ఫలము
యిచ్చును; కాగా నీవు యేమి యెరుగుదువో అది పలు
34 కుము. । బుద్ధి గల వారు నాకు చెప్పుదురు గాక; వివే
35 కము గలవాడు నా మాట ఆలకించును గాక. । యోబు
తెలివితో మాట్లాడ లేదు; అతని మాటల యందు జ్ఞా
36 నము లేదు. । అయితే దుర్మార్గులను గూర్చి యోబు
యిచ్చిన ప్రత్యుత్తరముల విషయమై అతడు సంపూ
ర్ణముగా పరిశోధించ పడవలెనని నేను కోరుతున్నా
37 ను. । యెందుకంటే తన పాపముతో కూడా అతడు
తిరుగుబాటును అతుకుతూ వున్నాడు; మాలో చప్పట్లు
కొట్టి పరాత్పరునికి విరోధముగా విస్తారమైన మాట
లను పలుకుతున్నాడని చెప్పెను.

## 35. అధ్యాయము.

ఎలీహు మరిన్ని మాట్లాడి చెప్పినదేమంటే, । నా 1,2
నీతి పరాత్పరుని నీతికంటే యెక్కువగా వున్నదని
నీవు చెప్పుట మంచిదని తలంచుతూ వున్నావా? ।
యేమంటే నాకు ప్రయోజనమేమనిన్ని నా పాపము 3
నుంచి పరిహారమువల్ల నాకు లాభము యేమనిన్ని పలి
కినావే. । నీతోనున్ను నీతో కూడా వున్న నీ సహవా 4
సికులతోనున్ను నేను ప్రత్యుత్తరము చెప్పుదును. ।
నీవు ఆకాశము వైపు దృష్టించి చూడుము; నీ కంటే 5
వున్నతముగా వున్న మేఘముల వైపున్ను దృష్టించి చూ
డుము. । నీవు పాపము చేస్తే ఆయనకు యేమి నష్టము? 6
నీ అక్రమము విస్తారముగా వున్నప్పటికిన్ని ఆయనకు
నీవు యేమి చేయ గలవు? । నీవు నీతిమంతుడవయితే 7
ఆయనకు నీవు యిచ్చేదవేమి? లేక నీ చేతివల్ల ఆయన
యేమి పొందును? । నీ అక్రమమువల్ల నీ వంటి మను 8
ష్యునికి హాని రావచ్చును; నీ నీతివల్ల నరపుత్రునికి
లాభము రావచ్చును. । విస్తారమైన వుపద్రవములచేత 9
వారు శ్రమపొందిన వారిని యేడ్చేటట్టు చేతురు; బల
వంతుల భుజముచేత వారు కేక వేస్తూ వున్నారు. ।
అయితే రాత్రికాలమందు పాటలను దయ చేసే వా 10
డున్ను, భూమియొక్క మృగములకంటే మనకు యెక్కు
వగా నేర్పేవాడున్ను, । ఆకాశపు పక్షుల కంటే 11
మమ్మున జ్ఞానవంతులను చేసే వాడున్నయిన నా సృష్టి
కర్త యనే పరాత్పరుడు యేడీ అని చెప్పే వాడు
వొకడైనా లేడు. । అక్కడ వారు మొఱ్ఱ పెట్టుదురు 12
గాని దుష్టుల గర్వము నిమిత్తము యెవడయినా మారు
త్తరము యిచ్చేది లేదు. । నిశ్చయముగా పరాత్పరుడు 13
మాయకు చెవి యివ్వడు; సర్వశక్తి గల వాడు దాని
లక్ష్యపెట్టడు. । నేను ఆయనను చూడలేనని నీవు పలికి 14
నప్పటికిన్ని న్యాయము ఆయన యెదుటనే వున్నది;
కాగా నీవు ఆయనను కనిపెట్టి వుండుము. । అయితే 15
యిప్పుడు యింకా ఆయన తన కోపమందు దర్శనము
యివ్వక, పాపములయొక్క విస్తారత చొప్పున ఆయన
జరిగించ లేదు. । కాగా యోబు వ్యర్థముగా తన 16
నోరును తెరచి, తెలివిలేని మాటలను విస్తారముగా
పలికినాడని చెప్పెను.

## 36. అధ్యాయము.

మరిన్ని ఎలీహు మాట్లాడి చెప్పినదేమంటే, । 1
నా యెడల నీవు కాస్త వోర్చితే పరాత్పరుని విష 2
యమై యింకా నేను చెప్పవలసిన మాటలు నీకు కన
పరుస్తాను. । నేను నా తెలివిని దూరమునుంచి తెచ్చు 3
కొంటాను; నన్ను కలుగ చేసిన వాని మీద నీతిని ఆరో

4 పించుతాను. । నిజముగానే నా మాటలు అబద్ధమైనవి
కావు; నీతో కూడా వున్నవాడు తెలివి యందు
5 సంపూర్ణుడు. । యిదుగో పరాత్పరుడు మహత్వము
కలవాడై వుండిన్ని యెవనినైనా తృణీకరించడు; ఆయన
6 బలమందున్ను జ్ఞానమందున్ను గొప్ప వాడు. । ఆయన
దుర్మార్గుని ప్రాణమును కాపాడడు గాని శ్రమపడే
7 వారికి న్యాయము తీర్చును. । ఆయన నీతిమంతుల యె
డల తన కన్నులను తీసివేయక, వారిని రాజులతో
కూడా సింహాసనము మీద వుంచి వారిని యెప్పటి
కిన్ని స్థిరపర్చును; అప్పుడు వారు హెచ్చించ పడు
8 దురు. । వారు సంకెళ్లు వేయపడి బాధ అనే తాళ్లతో
9 కట్టబడి వుంటే, । వారి కార్యమున్ను మించిన వారి
అక్రమములనున్ను ఆయన వారికి కనుపరచును. ।
10 ఆయన గద్దింపు కొరకు వారి చెవిని తెరవ చేసి, అక్ర
11 మమునుంచి తొలగుమని వారికి ఆజ్ఞాపించును. । వారు
ఆయనకు లోబడి సేవిస్తే, తమ దినములు భాగ్యమం
దున్ను తమ సంవత్సరములు సుఖము యందున్ను గడు
12 పుకొందురు. । అయితే వారు లోబడక పోతే వారు
కత్తి చేత హతమును పొంది, తెలివి లేకనే గతించి
13 పోదురు. । హృదయములో మాయ గలవారు కోప
మును పోగు చేసుకొందురు; ఆయన వారిని బంధించి
14 నప్పుడు వారు మొర్ర పెట్టరు. । వారు కొద్ది వయ
స్సు యందే గతించి పోవుదురు; వారి ప్రాణము అప
15 విత్రులతో వుండును. । ఆయన శ్రమ పొందిన వారిని
వారి శ్రమలోనుంచి నివారణ చేసి, వారి కష్టమందు
16 వారి చెవులను తెరవ చేసును. । ఆలాగున నిన్ను కూడా
యిరుకునుంచి ఆయన తీసి, యే యిరుకున్ను లేని విశా
లమైన స్థలములో నిలువబెట్టును; మరిన్ని నీ భోజనపు
బల్లమీద వడ్డించబోయేది కొవ్వుతో నిండుగా వుం
17 డును. । అయితే నీవు చెడ్డ వారియొక్క న్యాయమును
పూర్తిపరచితివి; న్యాయమున్ను నీతిన్ని నిన్ను నిర్వ
18 హించును. । వుగ్రము వున్నందువల్ల ఆయన తన దెబ్బ
తో నిన్ను కొంచుపోవునేమో చూడుము; అప్పుడు
19 గొప్ప క్రయము నిన్ను తప్పించదు. । ఆయన నీ భాగ్య
మును లక్ష్యపెట్టునా? నీ బంగారమునైనా నీ బలాతి
20 శయమునైనా ఆయన లక్ష్యపెట్టునా! । వారి స్థలము
నుంచి జనులు కొట్టివేయబడ్డ రాత్రిని నీవు ఆశించ
21 వద్దు. । అక్రమమును యెంచకుండా హెచ్చరికెగా వుం
డుము, యేమంటే శ్రమకంటే దీనినే నీవు యెంచుకొం
22 టివి. । యిదుగో పరాత్పరుడు తన బలముచేత హెచ్చి
వున్నాడు; ఆయన లాగున యెవడు నేర్ప గలడు! ।
23 ఆయన మార్గము ఆయనకు యెవడు చూప గలడు!
లేక నీవు అక్రమమును చేస్తివని ఆయనతో చెప్పగల
24 వాడు యెవడు! । మనుష్యులు దృష్టిస్తూ వున్న ఆయన
కార్యమును నీవు మహిమపరచుటకు తలంచుకొమ్ము. ।
ప్రతి మనుష్యుడున్ను దాని చూడవచ్చును; దూరము 25
నుంచి అది మనుష్యునికి కనుపడును. । యిదుగో పరా 26
త్పరుడు గొప్పవాడు; ఆయనను మనము గ్రహించ
లేము; ఆయన సంవత్సరములను లెక్క చేసుటకు శక్య
ము కాదు. । యేమంటే ఆయన వుదక బిందువులను 27
పైకి పీల్చును; అవి తుంపరల వంటి వాన అయి, ।
మేఘములలోనుంచి విస్తారముగా మనుష్యుల మీద 28
కురుసును. । మరిన్ని మేఘములు యేలాగున వ్యాపిం 29
చునో అదిన్ని, ఆయన గుడారపు ధ్వనిన్ని యెవని
కైనా తెలుసునా? । యిదుగో ఆయన దాని మీద తన 30
వెలుగును వ్యాపింప చేసును; ఆయన సముద్రముయొ
క్క అడుగును కప్పివేసును. । యేమంటే ఆయన వాటి 31
వల్లను జనసమూహములకు న్యాయమును విచారించును;
ఆయన ఆహారమును సమృద్ధిగా దయ చేసును. । ఆ 32
యన తన చేతుల చేత మెరుపును దాచి, యెక్కడ
కొట్టవలెనో దానికి ఆజ్ఞాపించును. । ఆయన తన స్నేహి 33
తులకు దాని కనుపర్చును; అయితే దుష్టుల మీద
ఆయన తన కోపమును రప్పించును.

## 37. అధ్యాయము.

దీని వల్లనున్ను నా హృదయము వణుకుతూ, దాని 1
స్థలములోనుంచి కదలపడుతున్నది. । ఆయన వాక్కు 2
యొక్క శబ్దమునున్ను ఆయన నోట బైలు వెళ్లే గర్జ
నున్ను శ్రద్ధగా వినుము. । ఆయన ఆకాశము కింద అం 3
తటానున్ను దాని వ్యాపింప చేసును; తన మెరుపునున్ను
భూమి సరిహద్దుల పర్యంతము వెళ్లేటట్టు చేసును. । దీని 4
తరువాత వొక శబ్దము గర్జించును; ఆయన తన మహ
త్వముయొక్క శబ్దముతో వురుమును; ఆయన శబ్దము
వినపడినప్పుడు ఆయన వాటిని వెనక తీయడు. । పరా 5
త్పరుడు తన శబ్దముతో వింతగా గర్జించుతున్నాడు;
మనము గ్రహించ లేని గొప్ప కార్యములను చేస్తూ
వున్నాడు. । యేమంటే ఆయన హిమముతోనున్ను చిన్న 6
వానతోనున్ను బలమైన గొప్ప వానతోనున్ను భూమి
మీద వుండుడీ అని చెప్పుతూ వున్నాడు. । తాను కలుగ 7
చేసిన సకల మనుష్యులు తెలుసుకొనే కొరకు ఆయన
ప్రతి మనిషియొక్క చేతిని ముద్రించుతున్నాడు. ।
అప్పుడు అడవి మృగములు తమ గుహలలో ప్రవే 8
శించి, తమ స్థలములలో వుండును. । దక్షిణమునుంచి 9
సుడి గాలిన్ని వుత్తరమునుంచి చలిన్ని వచ్చును. । తన 10
శ్వాసమువల్ల పరాత్పరుడు మంచు రాచేస్తూ వున్నా
డు; అప్పుడు విశాలముగా వున్న నీళ్లు గట్టిపడును. ।
నైర్మల్యము చేత దిట్టమైన మేఘమును ఆయన చెదర 11
చేసును; తన తేజస్సు మేఘమును చెదరగొట్టును. ।

12 ఆయన వాటికి యేమి నిర్ణయించునో అవి భూ
చక్రమందు జరిగించేటట్టు తన బుద్ధిగల ఆలోచనల
13 ప్రకారము వాటిని చుట్టూ తిప్పుతున్నాడు. । దండన
కొరకైనా లేక తన భూమి కొరకైనా లేక వుపకారము
కొరకైనా ఆయన దాని రా చేయిస్తూ వున్నాడు. ।
14 వో యోబు, దీనికి చెవినిమ్ము; ఊరకే నిలిచి పరాత్ప
రునియొక్క వింతగల కార్యములను ధ్యానించుము. ।
15 పరాత్పరుడు వాటిని యెప్పుడు స్థిరపర్చెనో తన మేఘ
ముయొక్క మెరుపును యెప్పుడు ప్రకాశింప చేసె
16 నో నీకు తెలుసునా? । మేఘములు ఆకాశ మందు
యేలాగు వ్రేలాడుతూ వున్నవో అదిన్ని, మితిలేని
జ్ఞానము గల ఆయనయొక్క వింతైన కార్యములున్ను
17 నీకు తెలుసునా. । దక్షిణపు గాలిచేత ఆయన భూమి
మీద వున్న చలిని అణచివేసినప్పుడు నీ వస్త్రములవల్ల
18 వెట్ట యేలాగు కలుగునో నీవు యెరుగుదువా? । పోత
పోసిన అద్దమువంటి దిట్టమైన ఆకాశమును నీవు ఆయ
19 నతో కూడా వుండి పరిచినావా? । ఆయనతో మేము
యేమి చెప్ప వలెనో మాకు బోధించుము; యెందు
కంటే జ్ఞాన విహీనత చేత మేము మాటలను క్రమ
20 పరచ లేము. । నేను మాటలను పలుకుతున్నానని ఆయ
నతో చెప్పబడుటకు తగునా? యెవడైనా మాటలను
21 పలికితే నిజముగా అతడు మింగి వేయబడును. । అయితే
యిప్పుడు మేఘముల యందు వుండే కాంతి గల వెలు
గును మనుష్యులు కానరు; గాలి లేచి వాటిని నిర్మల
22 పరుచును. । మెరుగు చేయబడిన బంగారము వంటి
ప్రకాశత వుత్తరమునుంచి వచ్చును; పరాత్పరుని యందు
23 భయంకరమయిన మహత్వము కలదు. । సర్వ శక్తి గల
వాని గూచిర్ విచారించితే ఆయనను మనము కనుకో
లేము; ఆయన బలమందున్ను నీతి యందున్ను విస్తార
మైన న్యాయమందున్ను అతి శ్రేష్ఠత గల వాడు;
24 ఆయన బాధ పెట్టడు. । అందువల్ల మనుష్యులు ఆయ
నకు భయపడుదురు; తమ హృదయములో జ్ఞానము గల
వారిని ఆయన యెంచేవాడు కాడు అని పలికెను.

## 38. అధ్యాయము.

1 అప్పుడు యెహూవా గొప్ప గాలిలోనుంచి యో
2 బుకు వుత్తరము యిచ్చి చెప్పినదేమంటే, । తెలివి లేని
మాటలచేత ఆలోచనను చీకటిపరచే యితడు యెవడు?।
3 యిప్పుడు పురుషుని వలె నీ నడుమును దిట్ట పరచుకొ
మ్ము, నిన్ను అడుగుతాను, నాకు తెలియపరచుము. ।
4 నేను భూమియొక్క అస్తిభారములను వేసినప్పుడు నీవు
యెక్కడ వుంటివి? నీకు తెలివి యుంటే చెప్పుము. ।
5 దాని కొల చూచిన వాడు యెవడో, లేక దాని మీద
నూలు వేసిన వాడు యెవడో, నీకు తెలుసును గదా?
చెప్పుమీ. । దాని పునాదులు దేని మీద కట్టబడినవి; 6
లేక వుదయ కాలపు నక్షత్రములు యేకముగా పాడి, ।
దైవ పుత్రులందరున్ను వుత్సాహ ధ్వని చేసినప్పుడు 7
దాని మూల రాతిని వేసిన వాడు యెవడు? । గర్భము 8
లోనుంచి తోసుకొని వచ్చినట్టు సముద్రము భేదించు
కొని వచ్చినప్పుడు, తలుపులచేత దాని అడ్డకట్టిన వాడు
యెవడు? । నేను మేఘమును దానికి వస్త్రముగానున్ను 9
మిక్కటమైన చీకటిని దానికి పొత్తి గుడ్డగానున్ను
వేసినప్పుడున్ను, । నేను దానికి హద్దు నిర్ణయించి, 10
దానికి గడలనున్ను ద్వారములనున్ను యెత్తించి, । యింత 11
మట్టుకే గాని నీవు మించి రాకూడదనిన్ని, యిక్కడనే
నీ తరంగములయొక్క పొంగు అణచపడును గాక
అనిన్ని నేను చెప్పినప్పుడు నీవు యెక్కడ వుంటివి? ।
నీ కాలముయొక్క నాటినుంచి నీవు వుదయముకు 12
కట్టడ యిచ్చినావా? నీవు తెల్లవారుటకు దాని స్థల
మును చూపినావా? । చెడ్డవాండ్లు భూమిలోనుంచి 13
దులిపి వేయ బడేటట్టుగా అది భూమియొక్క సరిహ
ద్దుల దాకా వ్యాపించును. । జిగటమట్టి మీద ముద్ర 14
వేసుట వల్ల వేరే రూపము యేలాగు కలుగునో అది
మార్చపడి, వస్త్రమును ధరించినట్టు కనుపడును. ।
చెడ్డవాండ్లనుంచి వారి వెలుగు తీయబడును; వారి బల 15
మైన బాహువు విరగబడును. । నీవు సముద్రపు అడు 16
గున వున్న జెలలలోకి చొచ్చితివా? దాని లోతు అయిన
స్థలములలో నీవు నడిచితివా? । మరణముయొక్క ద్వా 17
రములు నీకు తెరవబడినవా? మరణపు నీడయొక్క తలు
పులు నీవు చూచి వుంటివా? । నీవు భూమియొక్క 18
విశాలమును గ్రహించినావా? అది అంతా నీకు తెలిసి
వున్నట్టయితే చెప్పుమీ. । వెలుగు నివసించి వుండే 19
చోటుకు త్రోవ యేది? చీకటి వున్న స్థలము యేది?।
దాని సరిహద్దుకు దాని తిరుగా కొంచపో గలవా? దాని 20
యింటికి వెళ్లే మార్గములు నీవు యెరుగుదువా? ।
నీవు అప్పుడు పుట్టి వుంటివి గనుకనున్ను నీవు చాలా 21
దినములు గల వాడవు గనుకనున్ను నీకు అది తెలుసు
నా? । లేక హిమము వుండే బొక్కసములలోకి నీవు 22
ప్రవేశించితివా? । ఆపద కాలము కోసమున్ను యుద్ధ 23
కాలము కోసమున్ను నేను పోగు చేసిన వడగండ్లయొ
క్క బొక్కసములను నీవు చూచి వుంటివా? । వెలుగు 24
విభాగించ బడే విధము యేది? తూర్పుగాలి భూమి
మీద చెదిరి వున్న మార్గము యేది? । వుదకములు ప్రళ 25
యముగా పారుటకు వాటికి కాలువలను యెవడు విభా
గించెను? మేఘ మధ్యనుంచి మెరుపుకు త్రోవ తీసిన
వాడు యెవడు? । మనుష్యుడు లేని భూమి మీదనున్ను 26
నరుడు లేని అరణ్యము మీదనున్ను యెండిపోయిన
పాడు భూమినిన్ని తృప్తిపరచి, । లేత మొక్కను మొలి 27

పించి, దాని చిగిరించుటకున్ను వాన కురిపించిన వాడు
28 యెవడు! । వానకు తండ్రి కలడా! లేక మంచు తుంప
29 రలను పుట్టించిన వాడు యెవడు! । గట్టి పడిన నీరు యె
వని గర్భములోనుంచి పుట్టెను! ఆకాశమునుంచి
30 వచ్చిన మంచును కన్నవాడు యెవడు! । వుదకములు
రాతితోనయినట్టు కప్పబడి వున్నవి; సముద్రముయొ
31 క్క వుపరిభాగము గట్టిపడి వున్నది. । సప్తఋషుల నక్ష
త్రముల అనుభోగములను నీవు పొందికె పరచగలవా!
మృగ శీర్ష నక్షత్రముయొక్క నడి కట్లను నీవు విప్ప
32 గలవా! । నీవు దాని కాలమందు రాశి చక్రమును బైలు
తీయగలవా! లేక దాని పుత్రులతో కూడా స్వాతీ
33 నక్షత్రమున్ను నీవు నడిపించ గలవా! । నీవు ఆకాశము
యొక్క నిబంధనలను యెరుగుదువా! భూమి మీద వా
34 టికి నీవు అధికారము యిస్తూ వున్నావా! । విస్తారమైన
నీళ్లు నిన్ను కప్పేటట్టుగా మేఘముల వైపు నీ శబ్దమును
35 నీవు యెత్త గలవా! । మెరుపులు బైలు వెళ్లి, యిదుగో
యిక్కడ వున్నామని అవి నీతో చెప్పేటట్టు వాటిని
36 పంపగలవా! । అంతరంగముల యందు జ్ఞానము వుంచిన
వాడు యెవడు! లేక మనస్సుకు బుద్ధి దయచేసిన వాడు
37 యెవడు! । జ్ఞానము చేత మేఘములను లెక్కించే వాడు
38 యెవడు! ధూళి బురద అయి, మంటి బెడ్డలు వొక
దానితో వొకటి అంటుకొనినప్పుడు ఆకాశముయొక్క
39 నీటి తిత్తులను కుమ్మరించ గలవాడు యెవడు! । నీవు
సింహము కోసము వేటాడుతావా! లేక సింహపు పిల్ల
లను అవి వాటి గుహలలో పొంచి వుండేటప్పుడైనా, ।
40 వాటి దాగుండే స్థలములో కాచుకొని వుండేటప్పు
41 డైనా నీవు వాటిని తృప్తి పరచ గలవా! । కాకి పిల్లలు
పరాత్పరుని దృష్టించి కూకలువేసి ఆహారము లేక
తిరుగులాడినప్పుడు వాటికి మేత జాగ్రత చేసిన వాడు
యెవడు!

## 39. అధ్యాయము.

1 నీవు కొండ మేకలు యీనే కాలము యెరుగుదు
వా! ఆడు జింకలు వాటి పిల్లలను వేసే కాలము నీవు
2 చెప్పగలవా! । అవి నెరవేర్చిన మాసములను నీవు లెక్క
3 పెట్టి, అవి యీనే కాలము యెరుగుదువా! । అవి
వొంగుకొని వాటి పిల్లలను వేసును; వాటి నొప్పులు
4 అవి పారబోసును. । వాటి పిల్లలు కొవ్వి బైట భూమి
యందు పెరుగును; అవి బైటకు పోయి తిరుగా
5 వాటియొద్దికి రాకుండా వుండును. । అడవి గాడిదెను
స్వేచ్ఛగా తిరుగుటకు దాని విడిచిన వాడు యెవడు!
అడవి గాడిదెయొక్క కట్లను విప్పిన వాడు యెవడు! ।
6 నేను అరణ్యము దాని యిల్లుగానున్ను వుప్పు భూమి
7 దాని నివాసముగానున్ను చేస్తిని. । అది పట్టణముయొ
క్క సమూహమును తిరస్కరించి, దాని తోలే వాని
యొక్క కూకను లక్ష్య పెట్టదు. । కొండల యందే 8
దానికి మేత దొరుకుతుంది; సకల విధమైన పచ్చని
వస్తువులను అది వెతుకుతుంది. । ఖడ్గ మృగము నిన్ను 9
కొలుచుటకు సమ్మతించునా! దాని నీ యింట్లో వుంచ
గలవా! । ఖడ్గ మృగమును నీవు కాడికి వేసి తాళ్లతో 10
దాని కట్టగలవా! లేక అది నీ వెనుకగా పల్లపు స్థలము
లను దున్నుతుందా! । దాని బలము గొప్పది గనుక 11
నీవు దాని నమ్ముకొని నీ పనిని దానికి అప్పగింతువా! ।
అది నీ ధాన్యమును యింటికి తెచ్చి, నీ కళ్లమందు 12
దాని వేస్తుందని నీవు నమ్ముతావా! । రెనానీమనే పక్షికి 13
నీవు రెక్కలను యిచ్చినావా! దానికి హసిదా అనే
పక్షికి వున్నట్టు రెక్కలున్ను చక్కటి వెంట్రుకలున్ను
వున్నవా! । అది దాని గుడ్లను భూమి మీద పెట్టి, వా 14
టిని ధూళియందు అణుగుటకు వదిలివేసి, । పాదము 15
వాటిని త్రొక్కివేసునేమో, లేక అడవి మృగము
వాటిని చితక గొట్టునేమో అని మరిచి పోవును. । అది 16
దాని పిల్లలు దానివి కానట్టే వాటి యెడల కఠినము
చేసుకొనును; భయము లేకుండా దాని ప్రయాస వ్య
ర్థమౌను. । యెందుకంటే పరాత్పరుడు దానికి జ్ఞాన 17
మును యివ్వలేదు; దానికి తెలివి దయ చేయలేదు. ।
అది పయికి యెగిరినప్పుడు గుర్రమున్ను దాని మీద 18
యెక్కే వానిన్ని కూడా తిరస్కరించును. । గుర్రముకు 19
నీవు బలమును యిచ్చినావా! దాని మెడకు నీవు వురు
మును ధరింప చేసినావా! । వొక మిడతను భయపెట్టి 20
నట్టు దాని నీవు భయపెట్టగలవా! దాని నాసికా రంధ్ర
ముల మహిమ భయంకరముగా వున్నది. । అది పల్లపు 21
స్థలమందు కాళ్లతో తవ్వి, దాని బలమందు సంతోషిం
చును; అది ఆయుధములకు యెదురుగా బైలు వెళ్లు
తుంది. । అది భయమును తిరస్కరించి, నిర్భయముగా 22
వుండును; కత్తినుంచి వెనక తీయదు. । అంబుల పొది 23
యున్ను తళతళలాడే యీటెయున్ను కేడెమున్ను
దానియొద్ద గలగల చప్పుడు చేసును. । అది వుద్దండమైన 24
కోపముతో భూమిని మింగి వేసి, బాకా నాదము
అది వినినప్పుడు వూరకె నిలవదు. । బాకా నాదము 25
దానికి వినబడినప్పుడు అది యిగిలించి, దూరమునుంచే
యుద్ధమును వాసన చూచి, సేనాధిపతుల ఆర్భటింపు
నున్ను ఘోషనున్ను వినును. । నీ తెలివి చేత డేగ యె 26
గరి తన రెక్కలను దక్షిణపు వైపు చాచుతుందా! ।
నీ ఆజ్ఞ వల్లను గద్ద పైకి యెగసి, వున్నతమందు దాని 27
గూడును కట్టునా! । అది రాతి కొండ మీదనున్ను 28
యెడు దుడుకు రాతి మీదనున్ను బలమైన స్థలమందు
న్ను నివాసము చేసును. । అక్కడనుంచి దాని ఆహా 29
రమును అది వెతుకుతుంది; దాని కన్నులు దూరము

30 నుంచి దాని దృష్టించును. । దాని పిల్లలు రక్తమును
పీల్చుతావి; చచ్చిన వారు యెక్కడ వుందురో అది
అక్కడనే వుండునని చెప్పెను.

## 40. అధ్యాయము.

1 మరిన్ని యెహోవా యోబుకు వుత్తరము యిచ్చి
2 చెప్పినదేమంటే, । సర్వశక్తి గలవానితో వాదించే వాడు
ఆయనకు బోధ చేస్తాడా? పరాత్పరుని యెదుటకు
తన వ్యాజ్యము కొంచుపోయే వాడు ఆయనకు వుత్త
3 రమును చెప్పును గాక అని పలికెను. । అప్పుడు యోబు
యెహోవాకు ప్రత్యుత్తరము యిచ్చి చెప్పినదేమంటే, ।
4 యిదుగో నేను అపరాధిని; నేను నీకు యేమి ప్రత్యు
త్తరమును యివ్వగలను? నేను నా నోటి మీద నా
5 చెయ్యి వేసుకొంటాను. । నేను వొక మారు మాట్లాడి
వున్నాను; యికను నేను ప్రత్యుత్తరము యివ్వను;
అవును రెండు మార్లున్ను నేను పలికితిని, అయితే నేను
6 మరి యేమిన్ని చెప్పనని అనెను. । అప్పుడు యెహో
వా సుడిగాలిలోనుంచి యోబుకు వుత్తరము యిచ్చి
7 చెప్పినదేమంటే, । యిప్పుడు, నీవు పురుషుని వలె నీ
నడుమును కట్టుకొమ్ము; నిన్ను నేను అడుగుతాను నాకు
8 తెలియ చేయుము. । నీవు నా న్యాయమును వ్యర్థము
చేస్తావా? నిన్ను నీవు నీతిమంతునిగా చేసుకొనే
9 టందుకు నన్ను అపరాధిగా చేస్తావా? । పరాత్పరుని
బాహువు వంటి బాహువు నీకు కద్దా? ఆయన లా
10 గున నీవు గర్జనచేతువా? । యిప్పుడు నిన్ను నీవు
మహాత్వముతోనున్ను వుత్తమత్వముతోనున్ను అలంక
రించుకొమ్ము; మహిమనున్ను సౌందర్యమునున్ను ధరిం
11 చుకొమ్ము. । నీవు నీ కోపముయొక్క తీక్ష్ణమును బైలు
పరచుము; అహంకారము గల ప్రతివాని చూచి అతని
12 తగ్గించుము. । అహంకారము గల ప్రతివాని దృష్టించి
కుంగ చేయుము; దుర్మార్గులను వారు వుండే స్థల
13 మందే అణగ ద్రొక్కుము. । నీవు వారిని యేకముగా
బూడిదెయందు దాచిపెట్టి, వారి ముఖములను రహస్య
14 స్థలమందు లోపర్చుకొమ్ము; । అప్పుడు నీ స్వంతమైన
కుడిచెయ్యి నిన్ను రక్షించ గలదని నేనున్ను నీకు వొప్పు
15 కొంటాను. । యిప్పుడు నీవు సముద్రపు గుర్రమును
దృష్టించుము; నిన్ను కలుగ చేసినట్టు దానిన్ని కలుగ
16 చేస్తిని; అది యెద్దు లాగున గడ్డి మేసును. । యిదుగో
దాని బలము దాని నడుము యందున్ను దాని సత్తువ
దాని కడుపుయొక్క నరముల యందున్ను వున్నది. ।
17 అది దాని తోక సీడరు చెట్టు వలె యెత్తిబెట్టును; దాని
నడుముయొక్క నరములు దిట్టముగా అల్లుకొని యు
18 న్నవి. । దాని యెముకలు లోహము వలె గట్టిగా
వున్నవి; దాని దుమ్ములు యినుప కమ్ముల వలె వున్నవి. ।
పరాత్పరునియొక్క కార్యములలో అది ప్రధానమై 19
నది; దాని కలుగ చేసిన వాడు దానికి కత్తి కూడా
యిచ్చినాడు. । నిజముగా పర్వతములవల్ల దానికి మేపు 20
దొరుకును; అక్కడ అడవి మృగములన్ని ఆట్లాడు
కుంటూ వుండును. । అది నీడగల చెట్ల కిందనున్ను 21
జమ్ము గడ్డి చాటుననున్ను బురద స్థలముల యందున్ను
పడుకుని వుండును. । నీడగల చెట్లు వాటి నీడవల్ల దాని 22
కప్పును; యేటి దరిని వున్న పొదలు దాని చుట్టుకొని
వుండును. । యిదుగో వొక యేరు దాని పైకి పొంగి 23
కొని వచ్చినా అది త్వరపడదు; యర్దేను నది అంత
నీరు దాని నోటి మట్టుకు ప్రవహించి వచ్చినా అది
కదలకుండా వుండును. । వేటకాడు దాని చూడగా 24
పట్టుకో గలడా? అది వురిలో పడినా దాని ముక్కుకు
తాడు కట్టగలడా?

## 41. అధ్యాయము.

నీవు మొసలిని గాలముతోను పైకి తీయగలవా? 1
దాని నాలుక మీదను తాడు వేసి దాని పట్టగలవా? ।
నీవు దాని ముక్కులో నారతాడు వేయగలవా? గా 2
లపు ముల్లుతోను దాని దవడను పొడవ గలవా? । అది 3
నిన్ను బహుగా బతిమాలునా? అది నీతోను యిచ్ఛ
కపు మాటను చెప్పునా? । అది నీతోను వొడంబడికెను 4
చేసునా? నీవు దాని యెప్పటికిన్ని నీకు నౌకరిగా
చేసుకొందువా? । నీవు వొక పక్షితోను ఆట్లాడినట్టు 5
దానితోను ఆట్లాడుదువా? నీవు నీ దాసీల నిమిత్తము
దాని బంధించుదువా? । నీ సహవాసులు దానితో విందు 6
చేతురా? అది తునకలు చేయబడి వ్యాపారులకు అమ్మ
పడునా? । నీవు దాని చర్మమును యినుప కోలలతోను 7
నింపగలవా? దాని తలకు చేప గాలములను తగిలించ
గలవా? । నీవు దాని మీద నీ చెయ్యి వేసితే యేమి 8
యుద్ధము జరుగునో చూడు; మళ్లీ ఆలాగున చేయవు. ।
యిదుగో నీవు దాని పట్టుకో వచ్చునని నమ్మకము 9
వట్టిది; దాని యెవడైనా చూడగానే సొమ్మసిల్లిపోడా? ।
దాని కోపమును రేపించుటకు ధైర్యము యెవనికిన్ని 10
లేకపోతే, నా యెదుట నిలువ గలవాడు యెవడు? ।
నేను అతనికి ప్రతికారము చేసుటకు నా యెదుటకు 11
దడాలున రాగల వాడు యెవడు? ఆకాశము కింద
వుండేదంతా నాది అయి వున్నది. । దాని భాగములను 12
న్ను దాని బలమునున్ను దాని ఆయుధముల చక్కదన
మునున్ను గూర్చి నేను మానముగా వుండను. । అది 13
కప్పుకొన్న వస్త్రమును యెవడు తీసివేయ గలడు? దాని
రెండు దవడల నడిమికి యెవడు వెళ్ల గలడు? । దాని 14
ముఖముయొక్క ద్వారములను తెరవ గల వాడు యె
వడు? చుట్టున్ను వుండే దాని పళ్లు భయంకరమైనవి. ।

15 దాని పొలుసు దానికి భూషణముగా వున్నది; ముద్ర
వల్ల అంటించబడినట్టు అది వొక దానితో వొకటి
16 హత్తుకొని వున్నది. । అది వొక దానికొకటి యెంత
దగ్గిరగా వున్నదంటే, వాటి మధ్యకు గాలి రావల్ల
17 కాదు. । అవి వొక దాని కొకటి హత్తుకొని వున్నవి;
అవి అతికి వున్నవి; వాటి విభజన చేయ వల్లగాదు. ।
18 అది తుమ్మితే వెలుగు ప్రకాశించును; దాని కన్నులు
19 వుదయ కాలపు కను రెప్పలు వలె వున్నవి. । దాని
నోట్లోనుంచి వెలుగుతూ వున్న దీపములు బయిలు
20 వెళ్లును; అగ్ని కణములు పైకి దాటును. । వుడుకుతూ
వున్న కుండలోనుంచి అయినా కొప్పెరలోనుంచి
అయినా పొగ బైలు వెళ్లినట్టు దాని నాశికా రంధ్ర
21 ములలోనుంచి పొగ బైలు వెళ్లును. । దాని శ్వాసము
చేత నిప్పులు రాజబడును; దాని నోట్లోనుంచి మంట
22 బయిలు వెళ్లును. । దాని గొంతుకయందు బలము నివా
సముగా వున్నది; దుఃఖము దాని యెదుట సుఖమునకు
23 మార్చపడును. । దాని మాంసముయొక్క నరములు వొక
దానితో నొకటి హత్తుకొని వున్నవి; అవి దిట్టముగా
24 వుండి కదలించబడ లేవు. । దాని గుండెకాయ రాయి
వలె గట్టిగా వుండును; అది తిరగటియొక్క కింది రాయి
25 వలె గట్టిగా వుండును. । అది లేచేటప్పటికి బలిష్ఠులు
భయపడుదురు; వారు మనో భీతిచేత తొందర పడు
26 దురు. । దాని మీదికి యెవడైనా పంట్రకోలను విసిరితే
అది తగులుకోదు; యీటెకైనా బాణముకైనా బరిచీకి
27 అయినా పట్టు దొరకదు. । అది యినుమును చెత్తగా
నున్ను కంచును పుచ్చిపోయిన కర్రలుగానున్ను యెం
28 చును. । అంబు దాని పారిపో చేయ లేదు; వడిశ
29 రాయి దానికి తొక్కుగా వుండును. । దుడ్డు కర్రలు
దానికి పొల్లు వలె వుండును; యీటె కదలడముకు
30 అది హాస్యము చేసును. । దాని కిందను చిల్లపెంకులు
వుండును; అది బురదలో కరుకు రాళ్లను పరుచు కొ
31 నును. । కుండ వుడికినట్టు అది అగాధమును పొంగ
పెట్టును; అది సముద్రమును తైలము లాగు కలియ
32 పెట్టును. । అది దాని వెనుకగా వొక త్రోవను వెలు
గింప చేసును; సముద్రము తెల్లగా వున్నట్టు కనపడును.।
33 భూమి మీద దీనికి సమమైన జంతువ యెక్కడా
34 లేదు; అది యెవనికైనా భయపడదు. । అది వున్నత
మైనవన్నిటినిన్ని దానికన్న అల్పమని యెంచును; అది
అహంకారపు మృగ జీవములన్నిటి పయిని రాజు
అయి వున్నదని పలికెను.

## 42. అధ్యాయము.

1 అప్పుడు యోబు యెహోవాకు ప్రత్యుత్తరము
2 యిచ్చి చెప్పినదేమంటే, । నీవు సకలమున్ను చేసేటం
దుకు బలము గలవాడవనిన్ని నీవు చేయ తలంచిన
దానికి అభ్యంతరము లేదనిన్ని నాకు తెలుసును. ।
తెలివి లేకుండా ఆలోచనను చీకటిపరిచే వాడు యె 3
వడు? అయితే నేను గ్రహించనివిన్ని నా బుద్ధికి మిం
చినవిన్ని నేను తెలుసుకో లేని సంగతులనున్ను పలికి
తిని. । నిన్ను బతిమాలుతున్నాను ఆలకించుము, అప్పుడు 4
నేను మాట్లాడుతాను; నిన్ను అడుగుతాను నీవు నాకు
తెలియ చెప్పుము. । చెవి వినికిచేత నిన్ను గూర్చి విని 5
యున్నాను, అయితే యిప్పుడు నా కన్ను నిన్ను
చూస్తూ వున్నది. । అయినందున నన్ను నేను అసహ్యిం 6
చుకొని, ధూళి యందున్ను బూడిదె యందున్ను మన
స్తాపపడుతూ వున్నాను అని పలికెను. । యెహోవా 7
యీ మాటలను యోబుతో పలికిన తరువాత సంభ
వించినదేమంటే, యెహోవా తేమానీయుడైన ఎలీఫా
జును చూచి, నీ మీదనున్న నీ యిద్దరి స్నేహితుల
మీదనున్ను నా కోపము మండుతూ వున్నది, యేమం
టే నా దాసుడయిన యోబు పలికినట్టు మీరు నన్ను
గురించి యుక్తమయిన దాని పలుక లేదు. । కాగా 8
యిప్పుడు మీరు యేడు యెడ్లనున్ను యేడు పొట్టేళ్ల
నున్ను తీసుకొని, నా దాసుడయిన యోబు యొద్దికి
వెళ్లి, మీ నిమిత్తము వొక దహనబలిని చెల్లించండి;
అప్పుడు నా దాసుడయిన యోబు మీ నిమిత్తము
ప్రార్థించును, యేమంటే నేను మీ బుద్ధి హీనతకు
తగినట్టుగా మీ యెడల జరిగించకుండా వాని ముఖ
మును నేను అంగీకరింతును, యెందుకంటే నా దాసు
డైన యోబు పలికినట్టు మీరు నన్ను గురించి యుక్త
మైన దాని పలుక లేదని చెప్పినాడు. । అంతట తేమా 9
నీయుడైన ఎలీఫాజున్ను షూహీయుడైన బిల్దదున్ను
నయమాతీయుడయిన సోఫరున్ను వెళ్లి, యెహోవా
తమకు చెప్పినట్టుగా చేసినారు; యెహోవాయున్ను
యోబుయొక్క ముఖమును అంగీకరించినాడు.। యోబు 10
తన స్నేహితుల నిమిత్తము వేడుకొనినప్పుడు యెహో
వా వాని చెరనుంచి వాని తిప్పినాడు; మరిన్ని యె
హోవా యోబుకు మునుపు వుండిన దాని కంటే
రెండంతలు అధికముగా దయచేసెను.। అప్పుడు వాని 11
యావత్తు సహోదరులున్ను వాని యావత్తు సహో
దరీలున్ను మునుపు వానికి సెళవు అయిన వారున్ను
వచ్చి, వానితో కూడా వాని యింట్లో రొట్టెను భు
జించి, యెహోవా వాని మీద రాచేసిన యావత్తు
కీడు నిమిత్తము వాని కొరకు అంగలార్చి, వానికి వొ
దార్పు కలగ జేసి, వొక్కొక్కడు కొంచెము సొమ్మున్ను
వొక్కొక్కడు వొక బంగారపు వుంగరమునున్ను వా
నికి యిచ్చినారు, । ఆలాగున యోబుయొక్క ఆరంభ 12
ము కంటే యెహోవా వాని అంతమును అధికముగా

ఆశీర్వదించినందున వానికి పద్నాలుగు వేల గొఱ్ఱె
లున్ను ఆరు వేల వొంటెలున్ను వెయి జోళ్ల యెడ్లున్ను
13 వెయి ఆడు గాడిదెలున్ను కలిగెను. । మరిన్ని వానికి
యేడుగురు కుమారులున్ను ముగ్గురు కుమార్తెలున్ను
14 పుట్టినారు. । పెద్దదాని పేరు యెమీమా అనిన్ని, రెం
డో దాని పేరు కెస్సీయా అనిన్ని, మూడో దాని
15 పేరు కెరైనప్పూఖు అనిన్ని వుండెను. । దేశమంతటా
నున్ను యోబు కుమార్తెల వంటి సౌందర్యము గల
స్త్రీలు కనుపడలేదు; వారి తండ్రి వారి సహోదరు
లలో వారికి స్వాస్థ్యమును యిచ్చెను. । అటు తరువాత 16
యోబు నూట నలుభయి సంవత్సరములు బ్రతికి తన
పిల్లలనున్ను తన పిల్లలయొక్క పిల్లలున్ను అయిన నా
లుగు తరముల వారినిన్ని చూచెను. । యీలాగున యోబు 17
ముసలి వాడున్ను పరిపూర్ణ వయస్సు గలవాడున్ను
అయి చనిపోయెను.

# కీర్తనల పుస్తకము.

## 1. కీర్తన.

1 దుష్టుల ఆలోచన యందు నడవక,
పాపుల మార్గమందు నిలువక,
అపహాసకులు కూర్చుండు చోటున కూర్చుండక,
2 యెహోవా బోధన ఇచ్ఛయించుచుండే మనుష్యుడు ధన్యుడు,
వాడు దివారాత్రులు ఆయన బోధన ధ్యానించుచుండును.
3 వాడు, నీళ్ల కాలువల ఓర నాటబడిన చెట్టువలె నుండును.
అది తన కాలమందు తన ఫలమిచ్చును,
దాని ఆకు వాడదు:
వాడు చేయునది అంతయు నెరవేరును.
4 దుష్టులు ఆలాగున ఉండరు,
వారు గాలి చెదరగొట్టే పొట్టువలెనుందురు.
5 కాబట్టి న్యాయవిమర్శలో దుష్టులును,
నీతిమంతుల సభలో పాపులును నిలువరు.
6 నీతిమంతుల మార్గము యెహోవాకు తెలుసును,
దుష్టుల మార్గము నశించును.

## 2. కీర్తన.

1 రాష్ట్రములు ఎందుకు గల్లత్తు చేయుచున్నవి?
ప్రజలు ఎందుకు వ్యర్థమైనది ధ్యానించుచున్నారు?
2 యెహోవాకు, ఆయన అభిషిక్తునికిని విరోధముగా
భూరాజులు లేచుచున్నారు,
ప్రధానులు ఏకముగా ఆలోచన చేసియున్నారు:—
3 — మనము వారి కట్లు తెంచి,
వారి పాశములు మనయొద్దనుంచి పారవేయుదమనిరి.
4 ఆకాశమందు ఆసీనుడైయుండేవాడు నవ్వును,
ప్రభువు వారిని ఎగతాళి చేసును.
5 అప్పుడు ఆయన తన కోపముచేత వారితో వచించును,
తన కోపాగ్నియందు వారిని తల్లడింపచేసును:—
6 —అయినను, నేను నా పరిశుద్ధ పర్వతమైన సీయోను మీద
నా రాజుని నియమించి యున్నాను.
7 — ఒక కట్టడను గురించి నేను వివరింతును,
యెహోవా నాతో ఇట్లనెను — నీవు నా కుమారుడవు,
నేను నేడు నిన్ను కనియున్నాను,
8 నన్ను అడుగుము,
నీకు స్వాతంత్ర్యముగా నేను రాష్ట్రములను,

నీకు స్వాస్థ్యముగా భూమి దిగంతములవరకు నిత్తును.
9 నీవు ఇనుప దండముతో వారిని చితకగొట్టుదువు,
కుమ్మరి కుండవలె వారిని ముక్కముక్కలుగా పగలగొట్టుదువు.
10 కాబట్టి రాజులారా! మీరు వివేకులై యుండుడి;
భూమియొక్క అధిపతులారా! బోధను పొందుడి.
11 భయముతో యెహోవాను సేవించుడి,
వణుకుతో సంతోషించుడి.
12 కుమారుని ముద్దుబెట్టుకొనుడి; ఆయన కోపపడునేమో,
అప్పుడు మీరు (మీ) మార్గమందు నశింతురు;
ఆయన కోపము త్వరగా రవులుకొనును:
ఆయనను ఆశ్రయించే వారందరు ధన్యులు.

## 3. కీర్తన.

అబ్షాలోమనే తన కుమారుని యెదుటనుంచి
పారిపోయినప్పుడు దావీదు రచించిన కీర్తన.

1 యెహోవా! నా శత్రువులు ఎంతో విస్తరించిరి!
నాకు విరోధముగా లేచేవారు అనేకులు.
2 — దేవునివల్ల వీనికి రక్షణ లేదని
నన్ను గురించి పలికేవారు అనేకులు. సెలా.
3 యెహోవా! నీవు నాకు కేడెముగాను,
నా మహిమగాను, నా తల ఎత్తేవాడవుగానున్నావు.
4 నేను నోరెత్తి యెహోవాను గూర్చి మొరబెట్టుచున్నాను,
ఆయన తన పరిశుద్ధ పర్వతమునుంచి నాకు ప్రత్యుత్తరమిచ్చుచున్నాడు. సెలా.
5 నేను పండుకొని నిద్రపోతిని,
నేను మేలుకొంటిని; యెహోవా నాకు ఆధారమై యున్నాడు.
6 నాకు విరోధముగా చుట్టుకొని, మోహరించిన
పదివేలమందికైనను భయపడను.
7 యెహోవా! లెమ్ము, నా దేవా! నన్ను రక్షించుము;
నా సమస్త శత్రువులను దవడ యెముక మీద మొత్తినావు,
దుష్టుల పళ్లు విరగగొట్టినావు.
8 రక్షణ యెహోవా వశము,
నీ ప్రజల మీద నీ ఆశీర్వాదము ఉండుగాక. సెలా.

## 4. కీర్తన.

ప్రధాన గాయకునికి. తంతివాద్యములతో
దావీదు కీర్తన.

1 నీతిగల నా దేవా! నేను మొరబెట్టితే నాకుత్తరమిమ్ము,
ఇరుకులో నాకు నీవే విశాలత కలుగచేసినావు,
నన్ను కరుణించి నా ప్రార్థన వినుము.
2 నరపుత్రులారా! ఎందాక నా గౌరవము అవమానమొందును!
(ఎందాక) వ్యర్థమైనదాని ప్రేమించి అబద్ధములు వెతుకుదురు! సెలా.
3 యెహోవా తన కొరకు భక్తుని ఏర్పరచుకొనెనని ఎరుగుడి,
నేను యెహోవాను గూర్చి మొరబెట్టితే, ఆలకించును.

4 వణుకుడి, పాపము చేయకుడి;
మీ పడక మీద, మీ హృదయములో అనుకొని ఊరుకొనుడి. సెలా.
5 నీతి యాగములు చేసి,
యెహోవా యందు నమ్మికనుంచుడి.
6 — మనకు మేలు ఎవరు చూపింతురని అనేకులు పలుకుచున్నారు,
యెహోవా! నీ ముఖకాంతి మా మీద ప్రకాశింపచేయుము.
7 వారి ధాన్య ద్రాక్షారసములు విస్తరించే కాలముకంటే
అధిక సంతోషము నీవు నా హృదయములో పుట్టించినావు.
8 నేను పండుకొన వేగమే క్షేమముగా నిద్రపోదును;
యెహోవా! నీవే నాయంతటట నన్ను నిర్భయముగా నివసింపచేతువు.

## 5. కీర్తన.

ప్రధాన గాయకునికి. పిల్లనగ్రోవితో.
దావీదు కీర్తన.

1 యెహోవా! నా మాటలు చెవిని బెట్టుము,
నా విచారము గ్రహించుము.
2 నా రాజా! నా దేవా! నా మొరను ఆలకించుము;
నిన్నే ప్రార్థించుచుందును.
3 యెహోవా! ఉదయమందు నా శబ్దము విందువు,
ఉదయమందు సిద్ధము చేసి ఎదురుచూతును.
4 నీవు దుష్టత్వము ఇచ్ఛయించే దేవుడవు కావు,
కీడు నీ యొద్ద నివసించదు.
5 దుర్బుద్ధి గలవారు నీ కన్నుల యెదుట నిలువరు,
అక్రమము చేసే వారినందరిని ద్వేషించుచున్నావు.
6 అబద్ధమాడే వారిని నశింప చేతువు;
యెహోవాకు రక్తాపరాధియైన కపటస్థుడు అసహ్యుడు.
7 నేను నీ కృపాతిశయమువల్ల నీ మందిరములో ప్రవేశింతును,
నీవలని భయముతో నీ పరిశుద్ధాలయము వైపు సాగిలపడుదును.
8 యెహోవా! పొంచియున్న నా శత్రువుల నిమిత్తము,
నీ నీతియందు నన్ను నడిపించుము,
నా ముందు నీ మార్గము తిన్నగా చేయుము;
9 వారి నోట ధ్రువమైనది యేది లేదు,
వారి అంతరంగము చెడుతనమే,*
వారి గొంతుక తెరిచిన సమాధి,
వారు తమ నాలుకలతో ఇచ్చకములాడుచున్నారు.
10 దేవా! వారికి దండన విధించుము,
వారు తమ ఆలోచనలవల్ల కూలుదురు,
వారి విస్తార ద్రోహములచేత వారిని వెలివేయుము;
వారు నీ మీద తిరుగబడి యున్నారు.
11 నిన్ను ఆశ్రయించే వారందరు సంతోషింతురు,
వారు నిరంతరము ఆనంద ధ్వని చేతురు; నీవు వారిని కాపాడుదువు:

*లేక, దురాశయే.

నీ నామము ప్రేమించే వారు ఉల్లసింతురు;
12 యెహోవా! నీవు నీతిమంతులను దీవించుచున్నావు,
కవచము వలె దయతో వారిని కప్పుచున్నావు.

## 6. కీర్తన.

ప్రధాన గాయకునికి. తంతివాద్యములతో.
షెమీనీతు మీద. దావీదు కీర్తన.

1 యెహోవా! నీ కోపముతో నన్ను గద్దించకుము,
నీ ఆగ్రహముతో నన్ను శిక్షించకుము.
2 యెహోవా! నన్ను కరుణించుము, నేను వాడిపోవుచున్నాను,
యెహోవా! నన్ను బాగుచేయుము; నా యెముకలు అదరుచున్నవి.
3 నా ప్రాణము చాలా అదరుచున్నది;
యెహోవా! నీవు ఎంత పర్యంతము!—
4 యెహోవా! తిరిగి రమ్ము; నన్ను తప్పించుము,
నీ కృప నిమిత్తముగా నన్ను రక్షించుమీ;
5 మరణమందు నీ జ్ఞాపకము ఉండదు సుమీ,
అదృశ్యలోకమందు నిన్ను ఎవరు స్తుతింతురు?
6 నా మూలుగువల్ల అలసి యున్నాను,
రాత్రియంతయు నా పరుపు తేల చేయుచున్నాను,
నా కన్నీళ్లతో నా మంచము తడుపుచున్నాను.
7 నా కన్ను విచారముచేత క్షీణించుచున్నది,
నా శత్రువులందరివల్ల అది చివికి యున్నది.
8 అక్రమము చేసే వారలారా! మీరందరు నా యొద్దనుంచి తొలగుడి;
యెహోవా నా రోదన ధ్వని వినియున్నాడు.
9 యెహోవా నా యాచన వినియున్నాడు,
యెహోవా నా ప్రార్థన అంగీకరించును.
10 నా శత్రువులందరు సిగ్గుపడి మిక్కిలి బెదిరియుందురు,
వారు వెనుకకు మళ్లుదురు; వెంటనే సిగ్గుపడుదురు.

## 7. కీర్తన.

బెన్యామీను వంశస్థుడైన కూషు పలికిన మాటలవిషయమై
దావీదు యెహోవాను గూర్చి పాడిన షిగ్గాయోన్.

1 యెహోవా! నా దేవా! నీ శరణుజొచ్చి యున్నాను,
నన్ను తరిమే వారందరినుంచి నన్ను రక్షించి తప్పించుము;
2 సింహమువలె వాడు నా ప్రాణము చీల్చి,
విడిపించే వాడెవడును లేనందున, ముక్కముక్కలుగా చేసునేమో.
3 యెహోవా! నా దేవా! నేను దీని చేసియుంటే,
నా చేతులలో అక్రమ సంపాద్యము ఉంటే,
4 నిర్నిమిత్తముగా నాకు విరోధియైనవాని విడిపించినాను గదా,
నాతో సమాధానముగానున్నవానికి కీడు చేతునా! చేస్తే,
5 శత్రువు నా ప్రాణము తరిమి పట్టుకొను గాక,
నా జీవము నేలను అణగ త్రొక్కి,

నా మహిమ మంటిపాలు చేయుగాక. సెలా.
6 యెహోవా! నీ కోపముతో లెమ్ము,
నా విరోధుల ఆగ్రహము మీద రేగి, నా నిమిత్తము మేలుకొనుము,
నీవు న్యాయవిధి ఆజ్ఞాపించియున్నావు.
7 జనసమాజము నిన్ను చుట్టుకొనును;
దాని పైని ఉన్నత స్థలమునకు తిరిగి వెళ్లుము.
8 యెహోవా ప్రజలకు న్యాయము తీర్చును,
నా నీతి ప్రకారముగా, నా యందలి యథార్థత ప్రకారముగాను
యెహోవా! నన్ను విమర్శించి న్యాయవిధి చేయుము.
9 దుష్టుల చెడుతనము మాననిమ్ము,
నీతిగల దేవా! హృదయములను అంతరింద్రియములను
నీవు, పరిశీలించుచు నీతి గలవాని స్థిరపరుచుదువు.
10 నా కేడెము దేవుని మీదనున్నది,*
ఆయన యథార్థ హృదయము గలవారిని రక్షించును.
11 దేవుడు నీతిగల న్యాయాధిపతి:
దేవుడు ప్రతిదినము కోపపడుచున్నాడు.
12 ఒకడు మళ్లకుంటే, ఆయన తన ఖడ్గము పదును బెట్టుచున్నాడు,
ఆయన తన విల్లు ఎక్కుబెట్టి సిద్ధపరిచి యున్నాడు.
13 ఆయన వాని కొరకు మరణ సాధనములు సిద్ధపరిచి యున్నాడు,
ఆయన తన అంబులకు మంట కలుగచేయుచున్నాడు.
14 ఇదుగో! వాడు అక్రమము కనుటకు ప్రసవవేదనపడును;
చేటు అనే గర్భము ధరించి మోసము కనును.
15 వాడు గుంట త్రవ్వి అది లోతు చేసెను,
తాను త్రవ్వుచున్న గుంటలో తానే పడిపోవుచున్నాడు.
16 వాడు తలంచిన చేటు తిరిగి వాని తల మీదికి వచ్చును,
వాని బలాత్కారము వాని నడినెత్తి మీద పడును.
17 నేను ఆయన నీతిప్రకారముగా యెహోవాను స్తుతింతును.
సర్వోన్నతుడైన యెహోవా నామము కీర్తింతును.

## 8. కీర్తన.

ప్రధాన గాయకునికి. గిత్తీతుమీద.
దావీదు కీర్తన.

1 యెహోవా! మా ప్రభువా!
నీ నామము భూమి యందంతట ఎంతో మహత్తైనది!
నీ మహిమను ఆకాశముమీద వ్యాపింప చేసియున్నావు.
2 శత్రువునిని, పగతీర్చుకొనే వానిని నిలుపుటకు,
నీ విరోధుల నిమిత్తము,
బాలుర యొక్కయు చంటిపిల్లల యొక్కయు నోటినుంచి బలము సిద్ధింపచేసియున్నావు.
3 నీ చేతుల పనియైన నీ ఆకాశమును,
నీవు ఏర్పరిచిన చంద్రనక్షత్రములను నేను చూచేటప్పుడు:—
4 నీవు మనుష్యుని జ్ఞాపకము చేసుకొనుటకు,
నరపుత్రునికి దర్శనమిచ్చుటకు అతడు ఏపాటివాడు!

*లేక, దేవుడు మోయుచున్నాడు.

5 నీవు దేవునికంటె వానిని కొంచెము తక్కువ చేసి,
వానికి మహిమ ప్రభావములనే కిరీటము ధరింపచేసినావు.
6 నీ చేతి పనులమీద అతనికి అధికారము ఇచ్చినావు;
7 సకలమైన గొఱ్ఱెలను, పశువులను,
అడవి మృగములను, ఆకాశ పక్షులను, సముద్ర మత్స్యములను,
8 సముద్రపు జాడలలో సంచరించేది యావత్తును
వాని పాదముల కింద ఉంచియున్నావు.
9 యెహోవా! మా ప్రభువా!
నీ నామము భూమి యందంతట ఎంతో మహత్తైనది!

## 9. కీర్తన.

ప్రధాన గాయకునికి. లబ్బేన్‌మూతనే రాగముమీద.
దావీదు కీర్తన.

1 నా పూర్ణ హృదయముతో యెహోవాను స్తుతింతును,
నీ అద్భుతములనన్నిటిని వివరింతును.
2 నేను నీ విషయమై ఉల్లాసముతో సంతోషింతును;
సర్వోన్నతుడా! నీ నామము కీర్తింతును.
3 నా శత్రువులు వెనుకకు మళ్లేటప్పుడు,
నీ యెదుట జోగి నశింతురు;
4 నీవు నా న్యాయము, నా న్యాయ్యము తీర్చియున్నావు,
నీతిగల న్యాయాధిపతివై సింహాసనము మీద కూర్చున్నావు.
5 నీవు రాష్ట్రములను గద్దించి, దుష్టుని నశింప చేసినావు,
వారి పేరు నీవు బొత్తిగా తుడుపుపెట్టి యున్నావు.
6 శత్రువులు నశించిరి, పాడులు నిరంతరముండును,
నీవు పట్టణములను నిర్మూలము చేసినావు,
వాటి జ్ఞాపకము కూడా నశించెను.
7 యెహోవా నిరంతరమును ఆసీనుడై యున్నాడు,
న్యాయవిధికొరకు తన సింహాసనము స్థాపించి యున్నాడు.
8 ఆయన నీతితో లోకమునకు న్యాయము తీర్చును,
ఆయన యథార్థముతో ప్రజలకు న్యాయము తీర్చును.
9 అందువల్ల యెహోవా నలిగిన వానికి దుర్గమవును,
ఆపత్కాలములలో దుర్గమవును.
10 నీ నామము ఎరిగిన వారు నీయందు నమ్మిక ఉంచుదురు,
యెహోవా! నిన్ను వెతికే వారిని నీవు విడిచియుండలేదు.
11 సీయోను వాసియైన యెహోవాను కీర్తించుడి,
ఆయన కార్యములను ప్రజలలో తెలియచేయుడి;
12 రక్తాపరాధమును గూర్చి విచారణ చేసేవాడు వారిని జ్ఞాపకము చేసుకొని యున్నాడు,
ఆయన బాధపడే వారి మొఱ్ఱ మరవలేదు.
13,14 సీయోను కుమార్తె ద్వారములలో
నేను నీ సమస్త స్తోత్రములను వివరించుటకు,
నీ రక్షణ విషయమై నేను ఆనందించుటకు,
యెహోవా! నన్ను కరుణించుము;
మరణ ద్వారములనుంచి నన్ను పైకెత్తేవాడా!

నన్ను ద్వేషించే వారివలని నా బాధ చూడుము.
15 రాష్ట్రములు తాము త్రవ్విన గుంటలో, తామే మునిగి పోయెను,
వారు ఒడ్డిన వలలో వారి కాలు చిక్కుబడియున్నది.
16 యెహోవా ప్రత్యక్షమాయెను, ఆయన న్యాయము చేసెను,
దుష్టుడు తన చేతిపనిలో చిక్కియున్నాడు.
హిగ్గాయోన్. సెలా.
17 దుష్టులు, దేవుని మరిచే జనులందరును
అదృశ్యలోకమునకు మళ్లుదురు;
18 దరిద్రులు నిత్యమును మరువబడరు,
బాధపడే వారి నిరీక్షణ ఎల్లకాలము నశించదు.
19 యెహోవా! లెమ్ము, మనుష్యుని ప్రబలనియ్యకుము,
నీ యెదుట రాష్ట్రములు న్యాయవిధి పొందుగాక.
20 యెహోవా! వారిని భయపెట్టుము,
రాష్ట్రములు తాము మనుష్యులమే అని తెలుసుకొనుగాక.

## 10. కీర్తన.

1 యెహోవా! ఎందుకు దూరముగా నిలుచుచున్నావు?
(ఎందుకు) ఆపత్కాలములో విముఖుడవై యున్నావు?
2 దుష్టుని గర్వముచేత, బాధపడే వాడు తపించుచున్నాడు,
వారు యోచించిన సంకల్పములలో పట్టుబడుదురుగాక.
3 దుష్టుడు తన మనోభిలాషవిషయమై కొనియాడుకొనుచున్నాడు,
వాడు లుబ్ధుడై యెహోవాను విడిచి* అలక్ష్యము చేయుచున్నాడు
4 దుష్టుడు తన దురభిమానమువల్ల విచారణ చేయడు,
వాని సంకల్పములలో దేవుడు ఉండడు.†
5 వాని మార్గములు ఎల్లప్పుడు వంకరగా ఉన్నవి,
నీ న్యాయ విధులు ఉన్నతమైనవై వానికి కనబడవు,
వాడు తన శత్రువులనందరిని ఊదివేయుచున్నాడు.
6 —నేను కదలించబడను, తరతరములమట్టుకు కీడులో పడనని
తన హృదయములో తాను అనుకొనుచున్నాడు.
7 వాని నోరు శపథముతో, కపటముతో, మోసముతోను నిండియున్నది,
వాని నాలుక కింద చేటును అక్రమమును ఉన్నవి.
8 వాడు గ్రామముల మాటున కూర్చుండును,
చాటైన స్థలములలో నిరపరాధిని చంపును,
వాని కన్నులు దిక్కులేని వారికొరకు పొంచి చూచును.
9 గుహలోని సింహమువలె, వాడు చాటున పొంచి యుండును,
బాధపడే వాని పట్టుకొనుటకు పొంచి యుండును,
తన వలలో బాధపడే వాని లాగి పట్టుకొనును.
10 వాడు నలిగి, వంగి యుండును,
వాని బలవంతులచేత దిక్కులేని వారు కూలుదురు.
11 వాడు—దేవుడు మరిచిపోయి యున్నాడు,
ఆయన విముఖుడై, ఎప్పుడును చూడడని

*లేక, స్తుతించి. †లేక, దేవుడు లేడన్నే వాని సంకల్పము.

తన హృదయములో అనుకొనును.
12 యెహోవా! లెమ్ము, దేవా! నీ చెయ్యి పైకెత్తుము,
బాధపడే వారిని మరవకుము.
13 దుష్టుడు ఎందుకు దేవుని అలక్ష్యము చేసి,
— నీవు విచారణ చేయవని హృదయములో అనుకొనెను!
14 నీవు చూచి యున్నావు; (వారు) నీ చేతిలో ఉంచుటకు
నీవు చేటును, విచారమును నిదానించుచున్నావు;
దిక్కు లేనివాడు వాటిని నీ మీద విడుచును,
తండ్రి లేనివానికి నీవు సహాయుడవు.
15 దుష్టుని భుజము విరగగొట్టుము,
అది లేకపోవుటకు చెడ్డవాని దుష్టత్వమును గూర్చి విచారణ చేయుము
16 యెహోవా నిరంతరము రాజై యున్నాడు,
రాష్ట్రములు ఆయన దేశమునుంచి నశించిపోయెను.
17 యెహోవా! నీవు బాధపడేవారి కోరికెను వినియున్నావు,
18 తండ్రి లేనివానికి, నలిగినవానికి న్యాయము తీర్చుటకు,
భూమి మనుష్యుడు ఇకను భయపెట్టకుండుటకు,
నీవు వారి హృదయము స్థిరపరిచి చెవియొగ్గి ఆలకించినావు.

## 11. కీర్తన.

ప్రధాన గాయకునికి. దావీదు కీర్తన.

1 యెహోవా శరణుజొచ్చి యున్నాను;
— ఓ పక్షీ! మీ కొండకు వలసపొమ్ము;
2 ఇదుగో! దుష్టులు విల్లు ఎక్కుబెట్టుచున్నారు,
చీకటిలో యథార్థ హృదయము గలవారి మీద వేయుటకు,
తమ బాణములు నారియందు సంధించి యున్నారు.
3 పునాదులు పాడై యుంటే, నీతిమంతులు ఏమి చేయగలరని,
నాతో మీరు ఏలాగు పలుకగలరు?
4 యెహోవా తన పరిశుద్ధాలయములో ఉన్నాడు,
యెహోవాయొక్క సింహాసనము ఆకాశమందున్నది,
నరపుత్రులను ఆయన కన్నులు చూచుచున్నవి,
ఆయన కనురెప్పలు పరిశీలించుచున్నవి.
5 యెహోవా నీతిమంతునిని పరిశీలించుచున్నాడు;
దుష్టుడు, బలాత్కారము ప్రేమించేవాడును ఆయన ఆత్మకు అసహ్యులు.
6 ఆయన దుష్టుల మీద ఉరులు, అగ్నిగంధకములు,
వెట్టగాలియు వర్షింపచేసును.
అది వారి పానియ్య భాగము;
7 యెహోవా నీతిమంతుడు, ఆయన నీతిమంతులను ప్రేమించుచున్నాడు,
యథార్థులు ఆయన ముఖము దర్శింతురు.

## 12. కీర్తన.

ప్రధాన గాయకునికి. షమీనీతుమీద. దావీదు కీర్తన.

1 యెహోవా! రక్షించుమీ; భక్తులు గతించిరి;
నమ్మకమైనవారు నరపుత్రులలో తుదముట్టియున్నారు.

2 వారు ఒకనితో ఒకడు అబద్ధమాడుచున్నారు,
వారు ద్వివిధ హృదయము కలిగి, ఇచ్చకములాడే పెదవులతో పలుకుచున్నారు.
3 యెహోవా ఇచ్చకములాడే పెదవులనన్నిటిని,
బింకములాడే నాలుకను కోసివేయునుగాక.
4 వారు—మా నాలుకలతో సాధింతుము,
మా పెదవులు మావే, మాకు ప్రభువు ఎవడని అనుకొనుచున్నారు.
5 —బాధపడేవాని బలాత్కారము నిమిత్తము,
దరిద్రుల నిట్టూర్పుల నిమిత్తము,
ఇప్పుడు నేను లేచి,
అతని ఊదివేయుచున్నవానినుంచి అతనికి రక్షణ కలుగ చేతునని
యెహోవా చెప్పుచున్నాడు;
6 యెహోవా వాక్యములు పవిత్రమైన వాక్యములు,
మట్టి మూసలో కరిగి ఏడుమారులు ఊదిన వెండి వలెనున్నవి.
7 యెహోవా! నీవు వారిని కాపాడుదువు,
ఈ తరము వారినుంచి మమ్ము నిరంతరము రక్షించుదువు.
8 నరపుత్రులలో నీచులు హెచ్చియుండగా,
దుష్టులు నఖముఖాలా తిరుగులాడుచుందురు.

## 13. కీర్తన.

ప్రధాన గాయకునికి. దావీదు కీర్తన.

1 ఎందాక? యెహోవా! నన్ను ఎప్పటికిని మరిచిపోదువా?
ఎందాక నాకు విముఖుడవై యుందువు*?
2 ఎందాక నేను నా ఆత్మలో చింతలు,
నా హృదయములో ప్రతిదినము దుఃఖము ఉంచుకొన వలెను?
ఎందాక నా శత్రువు నా పైని హెచ్చుగా నుండును?
3,4 యెహోవా! నా దేవా! నిదానించి ప్రత్యుత్తరమిమ్ము;
నేను మరణ నిద్ర పోదునేమో,
నా శత్రువు—వాని గెలిచినానని పలుకునేమో;
నేను జోగియుండగా నా విరోధులు ఆనందింతురేమో, నా కన్నులకు వెలుగిమ్ము.
5 నేనైతేనో, నీ కృపయందు నమ్మిక ఉంచి యున్నాను,
నీ రక్షణ విషయము నా హృదయము ఆనందించును,
యెహోవాను కీర్తింతును; ఆయన నాకు మేలు చేసి యున్నాడు.

## 14. కీర్తన.

ప్రధాన గాయకునికి. దావీదు కీర్తన.

1 —దేవుడు లేడని బుద్ధిహీనుడు హృదయములో అనుకొనుచున్నాడు.
వారు చెడిపోయిరి, వారు అసహ్యకార్యములు చేయుచున్నారు,
మేలు చేసే వాడు లేడు.
2 వివేకము కలిగి దేవుని వెతికేవాడు ఉండునేమో అని,
యెహోవా ఆకాశమునుంచి నరపుత్రులను నిదానించెను.
3 వారందరు తొలగి ఏకముగా చెడియున్నారు,
మేలు చేసేవాడు లేడు, ఒక్కడైనను లేడు.
4 అక్రమము చేసే వారందరికిని తెలివి లేదా?

* లేక, నన్నుంచి నీ ముఖము చాటుబెట్టుకొందువు.

రొట్టె తినునట్లు నా ప్రజలను తిందురు,
యెహోవాను ప్రార్థించరు.
5 అక్కడ వారు మిక్కిలి భయము పొందిరి;
దేవుడు నీతిమంతుల సంతతిలో ఉన్నాడు.
6 మీరు బాధపడేవాని ఆలోచన తృణీకరించితే నేమి;
అతని ఆశ్రయము యెహోవా.
7 ఇశ్రాయేలు రక్షణ సీయోనులోనుంచి కలుగుగాక;
యెహోవా చెరలోని తన ప్రజలను మళ్లించేటప్పుడు,
యాకోబు ఆనందించును, ఇశ్రాయేలు సంతోషించును.

## 15. కీర్తన.

దావీదు కీర్తన.

1 యెహోవా! నీ గుడారములో ఎవడు దిగును?
నీ పరిశుద్ధ పర్వతము మీద ఎవడు నివసించును?
2 నిర్దోషిగా ప్రవర్తించుచు, న్యాయము చేయుచు,
తన హృదయములో నిజము పలుకుచునుండువాడే.
3 వాడు తన నాలుకతో కొండెము చెప్పడు,
తన చెలికానికి కీడు చేయడు,
తన పొరుగువానిమీద నింద మోపడు.
4 వాని దృష్టికి సామాన్యుడు* అసహ్యుడు;
వాడు యెహోవా భక్తులను సన్మానించును,
ప్రమాణము చేసియుంటే, నష్టము కలిగినను, మాట తప్పడు.
5 వాడు వడ్డికి తన ద్రవ్యమియ్యడు,
నిరపరాధికి విరోధముగా లంచము పుచ్చుకొనడు,
వీటిని చేయువాడు నిరంతరము కదలించబడడు.

## 16. కీర్తన.

దావీదు మిక్తామ్.

1 దేవా! నన్ను కాపాడుము; నీ శరణుజొచ్చియున్నాను.
2 నా ఆత్మ యెహోవాతో ఇట్లనెను—నీవే ప్రభువైయున్నావు,
నీ కంటే నాకు వేరే మేలు లేదు.
3 భూమి మీదనున్న పరిశుద్ధులే శ్రేష్ఠులు,
వారే నాకు కేవలము ఇష్టులై యున్నారు.
4 వేరొకని అవలంబించేవారి శ్రమలు విస్తరించును,
వారి రక్త పానీయార్పణములు అర్పించను,
వారి నామములు నా పెదవులతో ఎత్తను.
5 యెహోవా నా పాలిభాగము, నా పానీయభాగమై యున్నాడు.
నీవే నా భాగము పట్టుకొనుచున్నావు. †
6 మనోహర స్థలములలో నాకు పాలు ప్రాప్తించెను,
ప్రశస్తమైన స్వాస్థ్యము నాకు కలిగెను.
7 నాకు ఆలోచన చెప్పిన యెహోవాను స్తుతింతును,
రాత్రులలో నా అంతరింద్రియము కూడ నన్ను బోధించును.
8 ఎల్లప్పుడు నా యెదుట యెహోవాను పెట్టుకొని యున్నాను;

---

* లేక, నీచుడు. † లేక, కాపాడుకొనుచున్నావు.

ఆయన నా కుడిపార్శ్వమందు ఉన్నాడు గనుక కదలించబడను.
9 కావున నా హృదయము సంతోషించెను, నా మహిమ ఆనందించెను;
నా శరీరము కూడా సురక్షితముగా నివసించును;
10 అదృశ్య లోకమునకు నీవు నా ప్రాణము విడిచిపెట్టవు,
సమాధి కుళ్లు నీ భక్తుని చూడనియ్యవు.
11 నాకు జీవమార్గము తెలియ చేతువు,
నీ సమ్ముఖమందు సంతోషపూర్ణతయు,
నీ కుడి పార్శ్వమందు మనోహరమైనవి నిరంతరము ఉండును.

## 17. కీర్తన.

### దావీదు ప్రార్థన.

1 యెహోవా! న్యాయము వినుము, నా మొఱ్ఱను ఆలకించుము,
నేను కపటముగా ఎత్తని పెదవులతో చేసిన నా ప్రార్థనకు చెవియొగ్గుము.
2 నీ సన్నిధినుంచి నాకు తీర్పు వచ్చుగాక;
నీ కన్నులు యథార్థముగా చూచును.
3 నీవు నా హృదయము పరిశీలించినావు,
రాత్రిలో నన్ను విచారణ చేసినావు,
నన్ను పరిశోధించినప్పుడు, నీకు దురాలోచన దొరకదు, నా నోరు జారలేదు.*
4 మనుష్యుల కార్యముల విషయము
సంహారకుని మార్గములు తప్పించుకొనుటకు,
నీ పెదవుల మాటవల్ల నన్ను కాపాడుకొన్నాను.
5 నా నడకలు నీ త్రోవలయందు స్థిరపరచుకొనుటవల్ల
నా అడుగులు కదలకుండెను.
6 దేవా! నీవు నాకు ప్రత్యుత్తరమిత్తువు గనుక నిన్ను గూర్చి మొఱపెట్టుకొన్నాను,
నాకు చెవినొగ్గి నా మాట ఆలకించుము.
7 నీ కుడిచేతికి విరోధముగా లేచేవారినుంచి
నీ శరణుజొచ్చిన వారిని రక్షించేవాడా!
నీ కృపాతిశయము చూపించుము.
8,9 కంటి పాపవలె నన్ను కాపాడుము,
నన్ను బాధించేవారినుంచి
ఆతురముగా నన్ను చుట్టుకొనే నా శత్రువులనుంచి
నీ రెక్కల చాటున నన్ను దాచిపెట్టుము.
10 వారు కొవ్వున తమ హృదయము మూసుకొని యున్నారు,
తమ నోటితో గర్వముగా పలుకుదురు.
11,12 చీల్చుటకు ఆతురపడే సింహమువలె,
చాటున పొంచే కొదమ సింహములాగున.
మా అడుగు జాడలు పట్టి, ఇప్పుడు మమ్మును చుట్టుకొని
నేలమట్టుకు వంచుటకు గురి చూచి యున్నారు.
13 యెహోవా! లెమ్ము; ముందు వాని ఎదురుకొని వంచుము,
యెహోవా! నీ కత్తిచేత దుష్టులనుంచి, నీ చేతితో మనుష్యులనుంచి,
14 ఇహలోక మనుష్యులనుంచి నా ప్రాణము తప్పించుము.
వారి పాలిభాగము ఇహమందు ఉన్నది,

---

లేక, నా నోరు జారకుండుటకు నిశ్చయించుకొంటిని.

నీ నిక్షేపముతో వారి కడుపును నిండించుచున్నావు,
వారు కుమారులతో తృప్తిపొంది, తమ ఆస్తిని తమ పిల్లలకు విడిచిపెట్టుదురు.
15 నేనైతేనో, నీతియందు నీ ముఖము చూతును,
నీ స్వరూపముతో మేలుకొని తృప్తి పొందుదును.

## 18. కీర్తన.

ప్రధాన గాయకునికి. యెహోవా దాసుడైన దావీదు కీర్తన. అతని శత్రువులందరి
చేతులనుంచియు సౌలు చేతులనుంచియు యెహోవా అతని
తప్పించిన దినమున అతడు ఈ కీర్తన వాక్యములు
యెహోవాతో పలికెను.

అతడు ఇట్లనెను:
1 యెహోవా! నా బలమా! నిన్ను ప్రేమించుచున్నాను.
2 యెహోవా నా శైలము, నా కోట, నన్ను తప్పించినవాడు,
నా దేవుడు, నా బండ, ఆయనను ఆశ్రయింతును,
ఆయన నా కేడెము, నా రక్షణశృంగము, నా దుర్గము.
3 కీర్తనీయుడని యెహోవాకు పేరు పెట్టుదును,
నా శత్రువులనుంచి రక్షించబడుదును.
4 మరణబంధములు* నన్ను చుట్టుకొనెను,
భక్తిహీనుల ప్రవాహములు నన్ను భయపరిచెను.
5 అదృశ్య లోకబంధములు* నన్ను చుట్టుకొనెను.
మరణపాశములు† నన్ను ఎదురుకొనెను.
6 నా శ్రమలో, నేను యెహోవా పేరు పెట్టి,
నా దేవుని గూర్చి మొర్రపెట్టినాను;
ఆయన తన మందిరమునుంచి నా శబ్దము వినెను,
నా మొర్ర ఆయన సన్నిధిని చేరి ఆయన చెవులలో చొచ్చెను.
7 భూమి కంపించి ఊటాడెను,
పర్వతముల పునాదులు వణికెను,
ఆయన ఆగ్రహమువల్ల అవి కంపించెను.
8 ఆయన నాసికారంధ్రములలో పొగ లేచెను,
ఆయన నోటినుంచి అగ్ని (వచ్చి) దహించెను,
దానివల్ల నిప్పులు పుట్టెను.
9 ఆయన ఆకాశము వంచుకొని దిగి వచ్చెను,
ఆయన పాదముల కింద గాఢాంధకారము ఉండెను.
10 ఆయన కెరూబునెక్కి ఎగిరెను,
గాలి రెక్కల మీదనెక్కి ఎగిరెను.
11 ఆయన తన చుట్టూ గుడారమువలె అంధకారము,
జలాంధకారము, ఆకాశమేఘములను తనకు చాటుగా చేసుకొనెను.
12 ఆయన సాన్నిధ్యప్రకాశమువలన ఆయన మేఘములు విడిపోయెను;
వడగండ్లు, మంట నిప్పులు (కలిగెను.)
13 అప్పుడు యెహోవా ఆకాశమందు ఉరుము కలిగించెను,
సర్వోన్నతుడు తన శబ్దము బైలుపరిచెను:
వడగండ్లు, మంట నిప్పులు (కలిగెను.)

* లేక వేదనలు. † ఉరులు.

14 ఆయన తన బాణములు వేసి వారిని చెదరగొట్టెను,
మెరుపులు మెరిపించి వారిని ఓడగొట్టెను.
15 యెహోవా! నీ గద్దింపు వల్లనే,
నీ నాసికారంధ్రముల ఊపిరి విసురుటవల్లనే
జలముల అడుగులు కనబడెను, భూమి పునాదులు బయలుపడెను.
16 ఆయన (చెయ్యి) చాపి నన్ను పట్టుకొనెను,
విస్తార జలములనుంచి నన్ను తీసెను.
17 బలముగల నా శత్రువునుంచి,
నన్ను ద్వేషించేవారినుంచి నన్ను తప్పించెను;
వారు నాకంటే బలిష్ఠులై యుండిరి.
18 వారు నా ఆపత్కాలమందు నన్ను ఎదిరించిరి,
యెహోవా నాకు ఆధారమై యుండెను.
19 ఆయన నన్ను వెలపటికి తెచ్చి విశాల స్థలమందు ఉంచెను,
ఆయనకు ఇష్టుడనైతిని గనుక నన్ను తప్పించెను.
20 నా నీతి ప్రకారముగా యెహోవా నాకు మేలు చేసెను,
నా చేతుల శుద్ధిప్రకారముగా నాకు ప్రతి ఫలమిచ్చెను;
21 యెహోవా మార్గములు గైకొని యున్నాను,
దేవుని విడిచిన ద్రోహిని కాను.
22 ఆయన న్యాయ విధులన్నియు నా యెదుట ఉన్నవి,
ఆయన ఆజ్ఞలు నా యొద్దనుంచి తొలగించ లేదు.
23 ఆయన యెదుట నిర్దోషినై,
నా అక్రమమునుంచి నన్ను కాపాడుకొని యున్నాను.
24 యెహోవా నా నీతి ప్రకారముగా,
తన కన్నుల యెదుట నా చేతుల శుద్ధిప్రకారముగా నాకు ప్రతి ఫలమిచ్చెను.
25 కృపగలవానికి కృపగలవాడవుగా,
నిర్దోష నరునికి నిర్దోషివిగా,
26 శుద్ధునికి శుద్ధిగలవాడవుగా,
వక్రోపాయునికి వక్రోపాయశాలివిగా అగుపడియుందువు;
27 బాధపడే ప్రజలను రక్షింతువు,
మీదు చూచే కన్నులకు కింది చూపు కలుగ చేతువు;
28 నీవు నా దీపము వెలిగించుచున్నావు,
నా దేవుడైన యెహోవా నా చీకటి వెలుగు చేసును;
29 నీవల్ల, సేన మీద పోయి పడుదును.
నా దేవుని వల్ల ప్రాకారము దాటుదును.
30 దేవుని మార్గము నిర్దోషమై యున్నది,
యెహోవా వాక్యము పరీక్షించబడినది,
ఆయన శరణుజొచ్చిన వారికందరికి కేడెమై యున్నాడు;
31 యెహోవా గాక వేరే దేవుడు ఎవడు?
మన దేవుడు గాక బండ ఎవడు?
32 ఆయన నాకు బలసన్నాహము చేసి,
నా మార్గము నిర్దోషముగా చేసిన దేవుడు.
33 ఆయన నా కాళ్లను జింకల కాళ్లవలె చేసి

నా ఎత్తుగల మెట్టలమీద నన్ను నిలువబెట్టెను.
34 ఆయన నా చేతులకు యుద్ధము నేర్పెను,
ఇత్తడి విల్లు నా బాహువులచేత వంచబడినది.
35 నీ రక్షణ కేడెముగా నాకు ఇచ్చి యున్నావు,
నీ కుడి చెయ్యి నాకు ఆధారమై యున్నది,*
నీ సాత్వికము నన్ను గొప్ప చేసినది.
36 నా క్రింది అంజలను వెడల్పు చేసియున్నావు,
నా చీలమండలు బెణకలేదు.
37 నా శత్రువులను తరిమి వారిని కలుసుకొంటిని,
వారు బొత్తిగా నశించేపర్యంతము నేను తిరుగలేదు.
38 వారిని గాయపరిచితిని, వారు లేవ లేకపోయిరి.
నాపాదములకింద పడియున్నారు;
39 యుద్ధమునకు నాకు బలసన్నాహము చేసి
నామీదికి లేచినవారిని నాక్రిందుగా అణచివేసినావు.
40 నా శత్రువుల మెడలను నాకు అప్పగించినావు,
నన్ను ద్వేషించినవారిని సంహరించినాను.
41 వారు మొఱ్ఱబెట్టిరిగాని రక్షకుడు లేకపోయెను,
యెహోవాను గూర్చి (మొఱబెట్టినను) ఆయన వారికి ఉత్తరమియ్యలేదు.
42 గాలికి ఎగిరే ధూళివలె వారిని పొడిగా కొట్టినాను,
త్రోవ పెంటవలె వారిని పారపోసినాను.
43 జనుల కలహములనుంచి నన్ను తప్పించినావు,
రాష్ట్రములకు నన్ను తలగా చేసినావు,
నేను ఎరుగని జనులు నన్ను సేవించుచున్నారు.
44 మాట చెవిని బెట్టగానే నాకు విధేయులైరి,
అన్యులు నాకు లోబడినట్టే ఉండిరి.
45 అన్యులు వాడబారిరి,
తమ తమ గడిస్థలములనుంచి భయపడి వచ్చిరి.
46 యెహోవా సజీవుడు, నాబండ స్తుతించబడుగాక,
నారక్షణకర్తయైన దేవుడు మహోన్నతుడవుగాక.
47 ఆ దేవుడే నానిమిత్తము ప్రతిదండన చేసి,
ప్రజలను నాకు లోపరిచినాడు.
48 నా శత్రువులనుంచి నన్ను తప్పించినవాడవు నీవే,
నామీదికి లేచినవారికంటే నన్ను హెచ్చించినావు.
బలాత్కారము చేసే మనుష్యులనుంచి నన్ను విడిపించినావు,
49 కావున, యెహోవా! నేను రాష్ట్రములలో నిన్ను స్తుతింతును,
నీ నామకీర్తన గానముచేతును.
50 తన రాజునకు గొప్ప రక్షణ కలుగచేసి,
తన అభిషిక్తునికి, దావీదుకు అతని సంతానమునకును
నిరంతరము కృపచేసేవాడవు నీవే.

* లేక నన్ను స్థిరపరిచెను.

## 19. కీర్తన.

ప్రధాన గాయకునికి. దావీదు కీర్తన.

1 ఆకాశము దేవుని మహిమ వివరించుచున్నది,
ఆకాశ విశాలము ఆయన చేతులపని తెలుపుచున్నది.
2 పగటికి పగలు ప్రచురము చేయుచున్నది,
రాత్రికి రాత్రి తెలివి కలిగించుచున్నది.
3 భాషలేదు, పలుకులు లేవు,
వాటి స్వరము వినబడుట లేదు.
4 భూమియందంతట వాటి శబ్దము
లోకములో దిగంతములమట్టుకు వాటి వచనములు బైలువెళ్లెను:
అందులో ఆయన సూర్యునికి గుడారము వేసెను.
5 అతడు, తన అంతఃపురములోనుంచి
బైలుదేరుచున్న పెండ్లికుమారునివలెనున్నాడు,
శూరునివలె తన త్రోవను పరుగెత్తుటకు ఉల్లసించును.
6 అతడు ఆకాశముయొక్క ఈ తుదనుంచి బైలుదేరి
ఆ తుదమట్టుకు దాని చుట్టుకొనును;
అతని వేడిమికి దాచబడేది ఏదియు లేదు.
7 యెహోవా బోధన నిర్దోషమైనది,
అది ఆత్మను మళ్లించును:
యెహోవా సాక్ష్యము నిశ్చయమైనది
అది అజ్ఞానులను బోధించును.
8 యెహోవా కట్టడలు యథార్థమైనవి,
అవి హృదయము సంతోషపెట్టును;
యెహోవా ఆజ్ఞ నిర్మలమైనది,
అది కంటికి వెలుగైయున్నది.
9 యెహోవా భయము పవిత్రమైనది,
అది నిరంతరము నిలుచును;
యెహోవా తీర్పులు సత్యమైనవి,
అవి కేవలము న్యాయమైనవి.
10 అవి బంగారుకంటే,
చాలా మేలిమి బంగారుకంటే రమ్యమైనవి;
అవి తేనెకంటే,
జుంటి తేనె ధారలకంటే మధురమైనవి.
11 మరియు, నీ సేవకుడు వాటివల్ల వెలుగుపొందును,
వాటిని గైకొనుటవలన గొప్ప లాభము కలుగును.
12 పొరబాటులు ఎవడు గ్రహించగలడు?
రహస్యమైన వాటినుంచి నన్ను నిర్మలునిగా చేయుము.
13 మరియు, దురభిమానదోషములనుంచి నీ సేవకుని కాపాడుము,
వాటిని నన్ను ఏలనియ్యకుము:
అప్పుడు నేను నిర్దోషినై
మహా ద్రోహమునుంచి నిర్మలుడనైయుందును.

14 యెహోవా! నా బండా! నా ఉద్ధారకుడా!
నా నోటి మాటలు, నా హృదయ ధ్యానమును,
నీ దృష్టికి అంగీకారముగా ఉండుగాక.

## 20. కీర్తన.

ప్రధాన గాయకునికి. దావీదు కీర్తన.

1 యెహోవా ఆపత్కాలములో నీకు ఉత్తరమిచ్చుగాక,
యాకోబు దేవుని నామము నిన్ను ఉద్ధరించుగాక.
2 ఆయన పరిశుద్ధ స్థలమునుంచి నీకు సహాయము కలుగచేసి
సీయోనులోనుండి నిన్ను స్థిరపరుచుగాక,
3 ఆయన నీ కానుకలన్నియు జ్ఞాపకము చేసుకొని
నీ హోమము అంగీకరించుగాక. సెలా
4 ఆయన నీ హృదయప్రకారముగా నీకిచ్చి,
నీ ఆలోచన యావత్తు నెరవేర్చుగాక.
5 నీ రక్షణ విషయము ఆనంద ధ్వనిచేతుము,
మా దేవుని పేరట ధ్వజమెత్తుదుము.
యెహోవా నీ ప్రార్థనలన్నియు నెరవేర్చుగాక,
6 యెహోవా తన అభిషిక్తుని రక్షించునని
ఇప్పుడు నాకు తెలిసినది.
ఆయన తన కుడిచేతి రక్షణ బలముతో
తన పరిశుద్ధాలయమునుంచి వానికి ఉత్తరమిచ్చును.
7 కొందరు రథములను కొందరు గుర్రములను (ఎంచుకొందురు);
మేమైతే మా దేవుడైన యెహోవా నామము జ్ఞాపకము చేసుకొందుము.
8 వారు వంగి పడియున్నారు,
మేము లేచి నిలిచియున్నాము.
9 యెహోవా! రాజుని రక్షించుము;
మేము మొర్రబెట్టే దినమున మాకు ఉత్తరమిచ్చుగాక.

## 21. కీర్తన.

ప్రధాన గాయకునికి. దావీదు కీర్తన.

1 యెహోవా! నీ బలమందు రాజు సంతోషించును,
నీ రక్షణయందు వాడు ఎంతో ఎక్కువగా ఆనందించును.
2 నీవు వాని హృదయమందలి కోరికె నెరవేర్చినావు,
వాని పెదవుల విన్నపము నీవు అంగీకరించక పోలేదు; సెలా.
3 నీవు శ్రేష్ఠమైన దీవెనలతో వాని ఎదురుకొని
వాని తల మీద అపరంజి కిరీటము ఉంచినావు.
4 వాడు నిన్ను జీవము అడిగెను,
నీవు వానికి నిరంతరమైన దీర్ఘాయువు దయచేసినావు.
5 నీ రక్షణవల్లనైన వాని మహిమ గొప్పది,
ఘనత ప్రభావమును వానిమీద ఉంచియున్నావు;
6 నిరంతరము దీవెనలకొరకు వాని నియమించి యున్నావు,
నీ సన్నిధిలో సంతోషముతో వాని ఉల్లసింపచేయుచున్నావు;

7 రాజు యెహోవాయందు నమ్మిక ఉంచి యున్నాడు,
సర్వోన్నతుని కృపచేత వాడు కదిలించబడకనుండును.
8 నీ శత్రువులందరు నీ చేతిలో చిక్కుదురు,
నిన్ను ద్వేషించేవారిని నీ కుడిచెయ్యి చిక్కించుకొనును.
9 నీవు కనబడే కాలమందు వారిని అగ్నిపొయ్యివలె చేతువు,
యెహోవా తన కోపమువల్ల వారిని మింగివేసును,
అగ్ని వారిని దహించును.
10 భూమి మీదనుంచి వారి ఫలమును
నరపుత్రులలోనుంచి వారి సంతానమును నశింపచేతువు.
11 వారు నీకు విరోధముగా కీడు ఉద్దేశించిరి,*
వారు దురపాయము యోచించుకొనిరి,
దాని కొనసాగించలేరు;
12 నీవు వారిని గురిపెట్టి,†
నీ బాణములు నారులయందు సంధించి
వారి ముఖము మీద వేతువు.
13 యెహోవా! నీ బలముచేత హెచ్చించబడుము,
మేము నీ పరాక్రమము గానము చేయుచు కీర్తింతుము.

## 22. కీర్తన.

ప్రధాన గాయకునికి. అయ్యలెత్ హష్షాహరు‡ మీద
దావీదు కీర్తన.

1 నా దేవా! నా దేవా! ఎందుకు నన్ను విడిచిపెట్టియున్నావు?
నన్ను రక్షించక నా ఆర్తధ్వని వినక దూరముగానుండనేల?
2 నా దేవా! పగటిలో మొర్రబెట్టుచున్నాను,
నీవు నాకు ఉత్తరమిచ్చుటలేదు,
రాత్రిలోనును నాకు మౌనవృత్తి లేదు.
3 అయితే నీవు పరిశుద్ధుడవు,
ఇశ్రాయేలు కీర్తనలపైని ఆసీనుడవై యున్నావు.
4 మా పితృలు నీయందు నమ్మిక ఉంచినారు,
వారు నమ్మిక ఉంచినప్పుడు వారిని తప్పించినావు.
5 వారు నిన్నుగూర్చి మొర్రబెట్టి తప్పించబడిరి,
వారు నీయందు నమ్మిక ఉంచి సిగ్గుపడరైరి.
6 నేనైతే నేను పురుగును, నరుడనుకాను,
నరులచేత నిందించబడి
ప్రజలచేత తృణీకరించబడి యున్నాను.
7 నన్ను చూచే వారందరు నన్ను అపహసించుచు,
పెదవులు విరిచి తలను ఆడించుచు,
8 —యెహోవాను ఆశ్రయించుము,
ఆయనను వాని తప్పించనిమ్ము;
ఆయనను వాని విడిపించనిమ్ము;
ఆయనకు ఇష్టుడని (పలుకుచున్నారు).
9 అవును, నేను గర్భము నుచి పుట్టినది మొదలుకొని

*లేక, వ్యాపింపచేసిరి. †లేక, వెనుకకు తిప్పుదువు. ‡అనగా, వేకువదుప్పి.

నా తల్లి చంటిమీద ఉన్నప్పుడు,
నీవే నాకు నమ్మికను కలుగచేసినావు.
10 నేను గర్భవాసినైనది మొదలుకొని నీ మీద వేయబడితిని:
నా తల్లి నన్ను కన్నది మొదలుకొని నీవు నా దేవుడవు.
11 నాకు దూరముగా ఉండకుము;
శ్రమ తటస్థమైనది; సహాయుడు లేడు.
12 అనేకమైన ఆబోతులు నన్ను చుట్టుకొని యున్నవి,
బాషాను బలమైనవి నన్ను ఆవరించుకొని యున్నవి.
13 చీల్చుచు గర్జించుచునుండే సింహమువలె
అవి నా మీద నోళ్లు తెరిచినవి.
14 నీళ్లవలె పారబోయబడి యున్నాను,
నా ఎముకలన్నియు వేరుపడి యున్నవి,
నా హృదయము మైనమువలె నా కడుపులో కరుగుచున్నది.
15 నా బలము చిల్లపెంకువలె ఎండియున్నది,
నా నాలుక నా దవడను అంటుకొని యున్నది,
నీవు మరణపు మంటిలో నన్ను పెట్టుదువు.
16 కుక్కలు నన్ను చుట్టుకొని యున్నవి,
దుర్మార్గుల గుంపు నన్ను ఆవరించినది;
వారు నా చేతులు నా పాదములును పొడిచిరి.
17 నా ఎముకలన్నియు లెక్కించ గలను;
వారు నన్ను తేరి చూచుచున్నారు.
18 వారు నా వస్త్రములు పంచుకొని
నా అంగీ నిమిత్తము చీట్లు వేయుచున్నారు.
19 యెహోవా! నీవు దూరముగా ఉండకుము;
నా బలమా! నాకు సహాయము చేయుటకు త్వరగా రమ్ము.
20 కత్తినుంచి నా ప్రాణమును
కుక్క బలమునుంచి నా ఏకజీవమును తప్పించుము.
21 సింహము నోటినుంచి
కారుపోతుల కొమ్ములనుంచి నన్ను రక్షించుము;
నాకు ఉత్తరమిచ్చియున్నావు.
22 నీ పేరు నా సహోదరులకు తెలియచెప్పుదును,
సంఘములో నిన్ను స్తుతింతును.
23 యెహోవాకు భయపడేవారలారా! ఆయనను స్తుతించుడి;
యాకోబు వంశస్థులారా! మీరందరు ఆయనను ఘనపరచుడి;
ఇశ్రాయేలు వంశస్థులారా! మీరందరు ఆయనకు భయపడుడి;
24 ఆయన బాధపడే వాని బాధను తృణీకరించలేదు అసహ్యపడలేదు,
వానికి తన ముఖము దాచుకొనలేదు;
వాడు ఆయనకు మొఱ్ఱబెట్టినప్పుడు ఆయన ఆలకించెను.
25 మహా సంఘములో నా కీర్తన నీవల్లనే కలుగును,
ఆయనకు భయపడే వారి యెదుట నా మ్రొక్కుబడులు చెల్లింతును.
26 బాధపడిన వారు భోజనము చేసి తృప్తి పొందుదురు,
యెహోవాను వెతికేవారు ఆయనను స్తుతింతురు:

మీ హృదయము నిరంతరము బ్రతికియుండుగాక.
27 సర్వభూమి దిగంతముల వరకు జ్ఞాపకము చేసుకొని
యెహోవాతట్టు తిరుగును;
రాష్ట్రముల వంశస్థులందరు నీ యెదుట సాగిలపడుదురు;
28 రాజ్యము యెహోవాదే,
ఆయన రాష్ట్రములను ఏలుచున్నాడు.
29 భూమియందలి ధనవంతులందరు భుజించుచు సాగిలపడుదురు:
మంటికి పోయేవారు, తన ప్రాణము కాపాడుకొన లేనివాడును
ఆయన యెదుట మోకాలించుకొందురు.
30 సంతానము ఆయనను సేవించును;
అది ప్రభువుని గూర్చి వచ్చే తరమునకు వివరించబడును.
31 వారు వచ్చి—ఆయన (దీని) చేసెనని
పుట్టబోయే ప్రజలకు ఆయన నీతిని తెలుపుదురు.

## 23. కీర్తన.

దావీదు కీర్తన.

1 యెహోవా నన్ను మేపెడివాడు; నాకు లేమి కలుగదు.
2 ఆయన పచ్చికగల చోట్లను నన్ను పరుండజేసి,
విశ్రాంతిగల జలములయొద్ద నన్ను నడిపించును.
3 ఆయన నా ప్రాణము మళ్లించును:
ఆయన తన నామము నిమిత్తము,
నీతి మార్గములయందు నన్ను నడవజేసును.
4 మరియు నేను మరణ ఛాయ లోవ ద్వారా వెళ్లునప్పుడు,
నీవు నాకు తోడై ఉందువు గనుక కీడుకు భయపడను:
నీ దండము నీ ఊతకర్రయు నన్ను ఆదరించును.
5 నీవు నా శత్రువుల ఎదుట
నా కొరకు భోజనపు బల్ల సిద్ధపరుచుచు,
నూనెతో నా తల అంటియున్నావు;
నా గిన్నె నిండి పొర్లుచున్నది.
6 నా బ్రతుకు దినములన్నిటను
మేలును కృపయు మాత్రము నన్ను వెంబడించును:
దీర్ఘకాల దినముల పర్యంతము,
నా నివాసము యెహోవా మందిరములో ఉండును.

## 24. కీర్తన.

దావీదు కీర్తన.

1 భూమి, దాని సంపూర్ణతయు
లోకము, దానిలో నివసించే సర్వమును యెహోవావే.
2 ఆయన సముద్రముల మీద దాని పునాది వేసెను,
ప్రవాహముల మీద దాని స్థిరపరిచెను.
3 ఎవడు యెహోవా కొండనెక్కును?
ఎవడు ఆయన పరిశుద్ధ స్థలములో నిలుచును?

4 వ్యర్థమైన దానియందు మనస్సుపెట్టక,
కపటముగా ప్రమాణము చేయక,
నిర్మలమైన చేతులు పవిత్రమైన హృదయము గలవాడే.
5 వాడు యెహోవావల్ల ఆశీర్వాదము,
తన రక్షకుడైన దేవునివల్ల నీతిని పొందును.
6 ఇది ఆయనను వెతికినవారి వంశము,
నీ ముఖము వెతికిన యాకోబు వంశస్థులు.*
7 గవునులారా! మీ తలలు ఎత్తుకొనండి,
పురాతనమైన తలుపులారా! పైకి ఎత్తబడి
మహిమగల రాజుని ప్రవేశించనియ్యండి.
8 మహిమగల ఈ రాజు ఎవడు?
బలశూరత్వములుగల యెహోవా,
యుద్ధమందు శూరుడైన యెహోవా.
9 గవునులారా! మీ తలలు ఎత్తుకొనండి,
పురాతనమైన తలుపులారా! పైకెత్తుకొని
మహిమగల రాజుని ప్రవేశించనియ్యండి.
10 మహిమగల ఈ రాజు ఎవడు?
సేనల యెహోవా; ఆయనే మహిమగల రాజు.

## 25. కీర్తన.

దావీదు కీర్తన.

1 యెహోవా! నీయందు మనస్సు పెట్టుకొన్నాను.
2 నా దేవా! నీయందు నమ్మిక ఉంచియున్నాను,
నన్ను సిగ్గుపడనియ్యకుము,
నా శత్రువులను నన్ను గూర్చి ఉత్సహించనియ్యకుము.
3 నీ నిమిత్తము నిరీక్షించేవారందరిలో ఎవడును సిగ్గుపడడు,
ఊరకనే ద్రోహము చేసేవారు సిగ్గుపడుదురు.
4 యెహోవా! నీ మార్గములు నాకు తెలుపుము,
నీ త్రోవలను నాకు బోధించుము.
5 నీ సత్యమందు నన్ను నడిపించి బోధించుము;
నీవు నా రక్షకుడవైన దేవుడవు,
దినమెల్ల నీ నిమిత్తము నిరీక్షించుచున్నాను.
6 యెహోవా! నీ కరుణాతిశయము నీ కృపాతిశయమును జ్ఞాపకము చేసుకొనుము;
అవి పురాతనకాలమునుంచి ఉండియున్నవి.
7 నా యౌవనకాల పాపములు నా అపరాధములును జ్ఞాపకము చేసుకొనకుము.
యెహోవా! నీ కృపచొప్పున,
నీవే నీ దయ నిమిత్తము నన్ను జ్ఞాపకము చేసుకొనుము.
8 యెహోవా మంచివాడు, యథార్థవంతుడునై యున్నాడు,
కావున ఆయన, మార్గమందు పాపులను బోధించును.
9 ఆయన న్యాయము చొప్పున బాధపడే వారిని నడిపించును;
తన మార్గము బాధపడే వారికి బోధపరుచును.

---

*ఆదికాండ. 32 అధ్యా. 24—29 వ. చూడుము.

10 ఆయన నిబంధనను ఆయన సాక్ష్యములను గైకొనువారికి
యెహోవా త్రోవలన్నియు కృపాసత్యములై యున్నవి.
11 యెహోవా! నీ నామము నిమిత్తము
నా అక్రమము క్షమించుము; అది గొప్పది.
12 యెహోవాకు భయపడే ఆ మనుష్యుడు ఎవడు?
వాడు ఏర్పరుచుకొన వలసిన మార్గమందు వాని బోధించును.
13 వాని ఆత్మ మేలుయందు నివసించును,
వాని సంతానము భూమిని స్వతంత్రించుకొనును.
14 యెహోవా మర్మము* ఆయనకు భయపడే వారికి కలుగును,
ఆయన తన నిబంధన వారికి తెలియచేసును.
15 నా కన్నులు ఎల్లకాలము యెహోవా వైపు ఉన్నవి,
ఆయన వలలోనుంచి నా పాదములు లాగును.
16 నా తట్టు తిరిగి, నన్ను కరుణించుము,
నేను ఏకాంగినై బాధపడుచున్నాను.
17 నా హృదయము చాలా శ్రమలు కలది,
నాకు విశాలత కలుగచేయుము,
నా ఇరుకులలోనుంచి నన్ను తప్పించుము.
18 నా బాధ నా కష్టమును చూడుము,
నా పాపములన్నియు క్షమించుము.
19 నా శత్రువులను చూడుము; వారు అనేకులు;
వారు క్రూరద్వేషముతో నన్ను ద్వేషించుచున్నారు.
20 నా ప్రాణము కాపాడి నన్ను తప్పించుము,
నన్ను సిగ్గుపడ నియ్యకుము;
నీ శరణుజొచ్చి యున్నాను.
21 నిర్దోషపత, యథార్థత నన్ను కాపాడనిమ్ము;
నీ నిమిత్తమే నిరీక్షించుచున్నాను.
22 దేవా! ఇశ్రాయేలును
వాని శ్రమలన్నిటిలోనుంచి విమోచించుము.

## 26. కీర్తన.

దావీదు కీర్తన.

1 యెహోవా! నాకు న్యాయము తీర్చుము;
నేను నా యథార్థతలో నడుచుకొనుచు
యెహోవాయందు ఎడతెగని నమ్మిక ఉంచియున్నాను.
2 యెహోవా! నన్ను పరిశీలించి నన్ను పరీక్షించుము,
నా ఇంద్రియములు నా హృదయమును నిర్మలపరుచుము.
3 నీ కృప నా కన్నుల యెదుట ఉన్నది,
నీ సత్యమందు నడుచుకొన్నాను.
4 అబద్ధికులైన మనుష్యులతో నేను కూర్చుండలేదు,
వేషధారులతో నేను వెళ్లుటలేదు.

---

*లేక, పరిచయము.

5 కీడు చేసే వారి సంఘము ద్వేషించినాను,
దుష్టులతో కూచుండను.
6,7 నోరెత్తి స్తోత్రము వినిపించుటకు,
నీ అద్భుతకార్యములు వివరించుటకు,
నా చేతులు నిర్మలత్వముతో కడుగుకొని
యెహోవా! నీ వేదికచుట్టు తిరుగుదును.
8 యెహోవా! నీ నివాసమందిరము,
నీ మహిమ నివసించే స్థలము ప్రేమించియున్నాను
9 పాపులతో నా ప్రాణమును
రక్తాపరాధులతో నా జీవమును చేర్చకుము.
10 వారి చేతులలో దుష్కృత్యము ఉన్నది,
వారి కుడిచెయ్యి లంచములతో నిండియున్నది.
11 నేనైతేనో నా యథార్థతలో నడుచుకొంటున్నాను;
నన్ను విమోచించి కరుణించుము.
12 నా పాదము చదునైన చోట నిలిచియున్నది,
సంఘములలో నేను యెహోవాను కొనియాడుదును.

## 27. కీర్తన.

దావీదు (కీర్తన).

1 యెహోవా నా వెలుగు నా రక్షణయునై యున్నాడు,
నేను ఎవనికి భయపడ వలెను?
యెహోవా నా ప్రాణమునకు కోటయై యున్నాడు,
నేను ఎవనికి వెరతును?
2 దుష్టులు నా సమీపమునకు,
నా శరీరమాంసము తినుటకు
నా విరోధులు నా శత్రువులు నా యొద్దికి వచ్చినప్పుడు
వారే మొగ్గిపడ్డారు.
3 దండు నాకు విరోధముగా దిగినప్పటికి
నా హృదయము భయపడదు.
నా మీదికి యుద్ధము లేచినప్పటికి,
దీనిలో నమ్మికగా ఉన్నాను.
4 ఒక్కటి యెహోవాను అడిగి యున్నాను,
అదే వెతుకుదును;
యెహోవాయొక్క ప్రసన్నత చూచుటకు
ఆయన గుడిలో ధ్యానించుటకు
నా జీవితకాలమంతయు యెహోవా మందిరములో
నన్ను నివసింపనిమ్ము.
5 ఆపత్కాలమందు, తన గుడారములో నన్ను దాచును,
తన గుడారము చాటున నన్ను చాటుగా ఉంచును,
శైలపర్వతము మీద నన్ను ఎక్కించును.
6 అట్లా నన్ను చుట్టుకొనిన నా శత్రువుల కన్న మీదుగా
నా తల ఎత్తబడును:

ఆయన గుడారములో నేను ఉత్సాహధ్వనితో
యాగములు చేతును,
యెహోవాను కీర్తించి గానము చేతును.
7 యెహోవా! వినుము! నోరెత్తి పిలుచుచున్నాను,
నన్ను కరుణించి నాకు ఉత్తరమిమ్ము.
8 —నా దర్శనము వెతుకుడు అనే మాట
నా హృదయము నీతో పలికి,
—యెహోవా! నీ దర్శనము వెతుకుదుననెను.
9 నీ ముఖము నాకు దాచకుము,
కోపముతో నీ సేవకుని తొలిగించకుము,
నాకు సహాయమై నీవే యున్నావు,
నా రక్షకుడవైన దేవా! నన్ను దిగనాడకుము,
నన్ను విడువకుము.
10 నా తండ్రియు నా తల్లియు నన్ను విడిచి యుంటే
యెహోవా నన్ను చేరదీసును.
11 యెహోవా! నీ మార్గము నాకు బోధించుము;
నా విరోధుల నిమిత్తము
న్యాయ మార్గములో నన్ను నడిన చేయుము.
12 నా శత్రువుల ఇచ్ఛకు నన్ను అప్పగించకుము;
అబద్ధపు సాక్షులు, బలాత్కారముగా ఎగరోజేవారు
నా మీద లేచి యున్నారు.
13 సజీవుల దేశమందు నేను యెహోవా దయను చూతునని
నమ్మి యుండకపోతే (ఏమౌదును).
14 యెహోవా నిమిత్తము నిరీక్షించుము,
ధైర్యము తెచ్చుకొని నీ హృదయము స్థిరపడనిమ్ము,
యెహోవా నిమిత్తము నిరీక్షించుము.

## 28. కీర్తన.

దావీదు (కీర్తన).

1 యెహోవా! నిన్ను గురించి మొరబెట్టుచున్నాను,
నా శైలపర్వతమా! నాకు విముఖుడవై మౌనముగా ఉండకుము;
నాకు విముఖుడవై మౌనముగా ఉంటే
నేను సమాధిలోకి దిగేవారి వలెనుందునేమో.
2 నిన్ను గురించి నేను మొరబెట్టేటప్పుడు
నీ పరిశుద్ధాలయము వైపు నా చేతులు పైకెత్తేటప్పుడు
నా ప్రార్థనల శబ్దము వినుము.
3 దుష్టులతోను అక్రమము చేసే వారితోను
నన్ను లాగి చేర్చకుము;
వారు తమ పొరుగువారితో సమాధానముగా పలికినను
కీడు వారి హృదయములలో ఉన్నది.
4 వారి క్రియల చొప్పున
వారు జరిగించే చెడుతనము చొప్పున వారికి ఫలమిమ్ము;

వారి చేతులు చేసే పని చొప్పున వారికి ఫలమిమ్ము,
కీడుకు కీడు వారికి కలుగచేయుము.
5 వారు యెహోవా కార్యములనైనను
ఆయన చేతి పనులనైనను వారు లక్ష్యపెట్టరు;
కావున ఆయన వారిని వృద్ధిపరచక వారిని పాడుచేసును.
6 యెహోవాకు స్తోత్రము;
ఆయన నా ప్రార్థనల శబ్దము వినియున్నాడు.
7 నా బలము నా కేడెము యెహోవా,
ఆయన యందు నా హృదయము నమ్మిక ఉంచెను, నాకు సహాయము కలిగెను.
కావున నా హృదయము ప్రహర్షించుచున్నది,
నా కీర్తనతో ఆయనను స్తుతింతును.
8 వారికి యెహోవా బలము,
ఆయన తన అభిషిక్తునికి రక్షణార్థక బలము.
9 నీ జనులను రక్షించుము, నీ స్వాస్థ్యము దీవించుము,
వారిని పాలించి నిరంతరము వారికి ఆధారమై యుండుము.

## 29. కీర్తన.

దావీదు కీర్తన.

1 దేవుని కుమారులారా! యెహోవాకు చెల్లించుడి,
మహిమ బలము యెహోవావి అని ప్రవచించుడి.
2 యెహోవా నామముయొక్క మహిమ పట్టి
ఆయనను స్తుతించుడి,
పరిశుద్ధతాలంకారముతో యెహోవాను ఆరాధించుడి.
3 యెహోవా శబ్దము జలముల మీదనున్నది,
మహిమగల దేవుడు ఉరుము కలుగచేసును,
యెహోవా మహా జలములమీదనున్నాడు,
4 యెహోవా శబ్దము బలము గలది,
యెహోవా శబ్దము ప్రభావము గలది.
5 యెహోవా శబ్దము దేవదారు చెట్లు విరుచును,
యెహోవా లెబానోను దేవదారు చెట్లు విరుచును.
6 ఆయన దూడ వలె వాటిని,
కారుపోతు పిల్లవలె లెబానోను షిర్యోనును గంతులు వేయించును;
7 యెహోవా శబ్దము అగ్ని జ్వాలలు వేరుపరుచును.
8 యెహోవా శబ్దము అరణ్యము కదిలించును,
యెహోవా కాదేషు అరణ్యము కదిలించును.
9 యెహోవా శబ్దము జింకలను ఈనచేసును;
అడవుల ఆకులు రాలచేసును,
ఆయన నగరులోనిది యావత్తు—మహిమ అనును.
10 యెహోవా జలప్రళయముమీద నాసీనుడై యుండెను,
యెహోవా నిరంతరము రాజై
సింహాసనాసీనుడై యున్నాడు.
11 యెహోవా తన ప్రజలకు బలమిచ్చును,
యెహోవా క్షేమమిచ్చి తన ప్రజలను ఆశీర్వదించును.

## 30. కీర్తన.

దావీదు కీర్తన. ఇంటి ప్రతిష్ఠగానము.

1 యెహోవా! నీవు నన్ను ఉద్ధరించినావు గనుక నిన్ను కీర్తింతును,
నా శత్రువులను నా విషయమై సంతోషించనియ్యలేదు.
2 యెహోవా! నా దేవా!
నేను నిన్ను గూర్చి మొరబెట్టినాను; నన్ను స్వస్థపరిచితివి.
3 యెహోవా! అదృశ్య లోకములోనుంచి నా ప్రాణము లేవదీసినావు,
నేను సమాధిలోకి దిగకుండా నన్ను బ్రతికించినావు.
4 యెహోవా భక్తులారా! ఆయనను కీర్తించుడి,
ఆయన జ్ఞాపకార్థమైన నామమును స్తుతించుడి.
5 ఆయన కోపము నిమిషమాత్రము,
ఆయన దయ యావజ్జీవము ఉండును;
సాయంకాలమందు ఏడ్పు వచ్చి రాత్రి వెళ్లబుచ్చును,
ఉదయమందు సంతోష ధ్వని కలుగును.
6 నేను—ఎన్నడును జోగిపోనని, నా సుఖస్థితిలో అనుకొంటిని.
7 యెహోవా! నీ దయవల్ల నీవే నా పర్వతము స్థిరపరిచినావు:
నీ ముఖము దాచుకొంటివి; నేను అదిరి యుంటిని.
8 యెహోవా! నిన్ను గూర్చి మొరబెట్టినాను,
ప్రభువుని ప్రార్థించినాను.
9 —నేను గోతిలో దిగితే, నా చావు* వల్ల ఏమి లాభము?
మన్ను నిన్ను స్తుతించునా? అది నీ సత్యము తెలుపునా?
10 యెహోవా! వినుము, నన్ను కరుణించుము,
యెహోవా! నాకు సహాయుడవై యుండుము.
11,12 నా ఆత్మ† మౌనముగా ఉండక నిన్ను కీర్తించే నిమిత్తము
నా కొరకు నీవు నా అంగలార్పు నాట్యములోకి మార్చినావు;
నీవు నా గోనెపట్ట విప్పి సంతోష వస్త్రము నాకు కట్టినావు:
యెహోవా! నా దేవా! నేను నిరంతరము నిన్ను స్తుతింతును.

## 31. కీర్తన.

ప్రధాన గాయకునికి. దావీదు కీర్తన.

1 యెహోవా! నీ శరణు జొచ్చి యున్నాను,
ఎన్నడును నన్ను సిగ్గుపడనియ్యకుము,
నీ నీతి ప్రకారముగా నన్ను తప్పించుము.
2 నాకు నీ చెవి నొగ్గి నన్ను త్వరగా వదిలించుము;
నన్ను రక్షించుటకు నాకు ఆశ్రయ శైలమును
కోటలు గల ఇల్లునై యుండుము.
3 నా కొండ, నా కోట నీవే;
నీ నామము నిమిత్తము నన్ను మేపుచు నడిపింతువు.
4 వారు నా కొరకు ఒడ్డిన వలలోనుంచి నన్ను వెలపటికి రప్పింతువు;
నా ఆశ్రయము నీవే.

---

*హెబ్రీలో, రక్తము. †హెబ్రీలో, మహిమ.

5 నీ చేతికి నా ఆత్మను అప్పగింతును;
యెహోవా! సత్యదేవా! నీవు నన్ను విమోచించినావు.
6 వ్యర్థమైన మాయారూపములు అనుసరించేవారు నాకు అసహ్యులు,
నేనైతేనో, యెహోవాయందు నమ్మిక ఉంచి యున్నాను.
7 నీవు నా బాధ నిదానించినావనియు,
శ్రమలలో నా ప్రాణము గుర్తెరిగినావనియు,
నేను నీ కృపావిషయమై ఆనందించుచు సంతోషింతును.
8 నీవు శత్రువు చేతి చెరలో నన్ను పెట్టలేదు,
నా పాదములు విశాల స్థలమందు నిలువ చేసినావు.
9 యెహోవా! నన్ను కరుణించుము; శ్రమపడుచున్నాను;
నా కన్ను, నా ప్రాణము, నా శరీరము* విచారమువల్ల క్షీణించుచున్నవి.
10 దుఃఖముచేత నా జీవము
నిట్టూర్పుచేత నా ఏండ్లు గతించినవి,
నా అక్రమమువల్ల నా బలము తగ్గిపోయెను,
నా ఎముకలు క్షీణించి యున్నవి.
11 నా సమస్త విరోధుల ద్వారా, నేను,
విశేషముగా నా పొరుగువారికి నిందాస్పదుడనైతిని,
నా నెళవరులు నాకు భయపడిరి,
వీధిలో నన్ను చూచినవారు నా యొద్దనుంచి పారిపోయిరి.
12 మరవబడిన మృతునివలె మరవబడి యున్నాను,
పగిలిన కుండవలెనై యున్నాను.
13 అనేకుల కొండెములు వింటిని,
భయము నఖముఖాలా ఉండెను:
వారు నాకు విరోధముగా ఏకమై ఆలోచన చేసుకొన్నప్పుడు,
నా ప్రాణము తీసుకొనుటకు ఉద్దేశించిరి.
14 నేనైతే, యెహోవా! నీయందు నమ్మిక ఉంచి యున్నాను,
—నీవే నా దేవుడవని పలికితిని.
15 నా కాలములు నీ చేతిలో ఉన్నవి,
నా శత్రువు చేతినుంచి
నన్ను తరిమే వారినుంచి నన్ను తప్పించుము.
16 నీ సేవకుని మీద నీ ముఖకాంతి ప్రకాశింపచేయుము,
నీ కృపవల్ల నన్ను రక్షింపుము.
17 యెహోవా! నన్ను సిగ్గుపడనియ్యకుము; నిన్ను గూర్చి మొరబెట్టినాను,
దుష్టులు సిగ్గుపడి అదృశ్యలోకములో మౌనులై యుందురు.
18 గర్వముతోను తిరస్కారముతోను, నీతిమంతునికి విరోధముగా
కఠోరమైనవి పలికే అబద్ధికుల పెదవులు కట్టబడును.
19 నీకు భయపడే వారి నిమిత్తము నీవు దాచి
నరపుత్రుల యెదుట నిన్ను ఆశ్రయించిన వారి నిమిత్తము
నీవు సిద్ధపరిచిన మేలు ఎంతో గొప్పది!
20 మనుష్యుల కృత్రిమములనుంచి
నీ సన్నిధి చాటున వారిని చాటుగా ఉంచుదువు,
నాలుకల కలహమునుంచి వారిని దాచుదువు.

---

*హెబ్రీలో, కడుపు.

21 యెహోవా కొనియాడబడును గాక,
ప్రాకారముగల పట్టణములో ఆయన నా యెడల
అద్భుతముగా తన కృపను విస్తరింప చేసి యున్నాడు.
22 నేనైతే, నా చాంచల్యములో
—నీ కన్నుల యెదుటనుంచి కేడించబడి యున్నాననుకొంటిని,
అయినను, నేను నిన్ను గూర్చి మొరబెట్టినప్పుడు
నీవు నా ప్రార్థన ధ్వని ఆలకించినావు.
23 యెహోవా భక్తులారా! ఆయనను మీరందరు ప్రేమించుడి;
యెహోవా నమ్మికగల వాని రక్షించును,
గర్వముగా ప్రవర్తించే వానికి మిక్కుటమైన ప్రతీకారము చేసును.
24 యెహోవా నిమిత్తము నిరీక్షించే మీరందరు
ధైర్యము తెచ్చుకొని మీ హృదయము స్థిరపడనియ్యుడి.

## 32. కీర్తన.

దావీదు కీర్తన. మశ్కీలు*

1 ఎవని ద్రోహము పరిహరించబడి యుండునో,
ఎవని పాపము కప్పబడి యుండునో వాడు ధన్యుడు.
2 ఎవనియందు యెహోవా అక్రమము ఎంచడో
ఎవని ఆత్మలో కపటము లేదో ఆ మనుష్యుడు ధన్యుడు.
3 నేను మౌనినై యుండగా, దినమంతయు నా ఆర్త ధ్వనివల్ల
నా ఎముకలు జీర్ణించి పోయెను.
4 దివారాత్రులు, నీ చెయ్యి నా మీద భారముగా ఉండెను,
నా రసము వేసవి యెండవలెనుండెను. సెలా.
5 నేను నీ యెదుట నా పాపము ఒప్పుకొన వలెనని
నా అక్రమము దాచుకొన లేదు:
—యెహోవా యెదుట నా ద్రోహములు ఒప్పుకొందుననుకొంటిని,
నీవు నా పాపముయొక్క అక్రమము పరిహరించినావు. సెలా.
6 కావున, భక్తిగల ప్రతివాడు ప్రాప్తికాలమందు నిన్ను ప్రార్థించుగాక,
విస్తార జల ప్రవాహములు వచ్చేటప్పుడు,
నిశ్చయముగా అవి అతని చేరవు.
7 నాకు చాటు నీవే, శ్రమనుంచి నన్ను రక్షింతువు;
రక్షణగానములు నన్ను చుట్టుకొన చేతువు. సెలా.
8 నీకు నేర్పి, నీవు నడవ వలసిన మార్గము నీకు బోధింతును;
నీ మీద కన్ను పెట్టి నీకు ఆలోచన చెప్పుదును.
9 మీరు తెలివి లేని గుర్రమువలెనైనా
కంచర గాడిదెవలెనైనా ఉండకుడి;
అవి నీ యొద్దికి రానందున
వాటి నోరు వారుత్తోను కళ్లెముతోను బిగించ వలెను.
10 దుర్మార్గునికి అనేక వేదనలు కలుగును:
యెహోవాను నమ్మేవానిని కృప ఆవరించును,
11 నీతిమంతులారా! యెహోవాయందు సంతసించి ఆనందించుడి.
యథార్థ హృదయముగల మీరందరు ఆనంద ధ్వని చేయుడి.

*అనగా, రమ్యము.

## 33. కీర్తన.

1 నీతిమంతులారా! యెహోవాను గూర్చి ఆనంద ధ్వని చేయుడి,
నీతిమంతుల కీర్తన మనోహరమై* యున్నది.
2 కిన్నెరతో యెహోవాను స్తుతించుడి,
పది తంతుల వీణతో ఆయనను కీర్తించుడి.
3 ఆయనను గూర్చి నూతన కీర్తన పాడుడి,
ఆనంద ధ్వనితో ఇంపుగా వాయించుడి.
4 యెహోవా వాక్యము యథార్థమైనది,
ఆయన క్రియలన్నియు నమ్మకమైనవి.
5 ఆయన నీతి న్యాయములను ప్రేమించుచున్నాడు;
భూమి యెహోవా కృపతో నిండియున్నది.
6 యెహోవా మాటవల్ల ఆకాశము
ఆయన నోటి ఊపిరివల్ల దాని సర్వసైన్యమును చేయబడెను.
7 ఆయన సముద్ర జలములు రాశిగా కూర్చెను,
కొట్లలో అగాధజలములు చేర్చెను.
8 సర్వలోకము యెహోవాకు భయపడుగాక,
భూలోక నివాసులందరు ఆయన యెదుట వెరుతురుగాక.
9 ఆయన పలికెను; అది కలిగెను.
ఆయన ఆజ్ఞాపించెను; అది స్థిరపడెను.
10 యెహోవా రాష్ట్రములయొక్క ఆలోచనలు వ్యర్థపరిచెను,
ఆయన ప్రజల సంకల్పములు నిషేధించెను.
11 యెహోవా ఆలోచన నిరంతరము,
ఆయన సంకల్పములు తరతరముల మట్టుకు నిలుచును.
12 ఏ రాష్ట్రమునకు యెహోవా దేవుడై యున్నాడో,
ఆయన తనకు స్వాస్థ్యముగా ఏర్పరుచుకొనిన ఆ ప్రజలు ధన్యులు.
13 యెహోవా ఆకాశమునుంచి కనిపెట్టి,
సమస్త నరపుత్రులను చూచుచున్నాడు.
14 ఆయన తన నివాస స్థలమునుంచి,
భూలోక నివాసులందరివైపు చూచుచున్నాడు.
15 ఆయన వారి హృదయములను ఒకటిగా నిర్మించి
వారి క్రియలన్నియు విచారించుచున్నాడు.
16 రాజు విస్తార బలముచేత విజయము పొందడు,
వీరుడు గొప్ప శక్తిచేత తప్పించబడడు.
17 రక్ష కొరకు గుర్రము వ్యర్థము,
అది తన విశేష బలముచేత ఒకని తప్పించదు.
18,19 ఇదిగో! మరణమునుంచి వారి ప్రాణము తప్పించుటకు,
కరువులో వారి జీవము రక్షించుటకు,
యెహోవా కన్ను తనకు భయపడే వారిమీద,
తన కృప కొరకు నిరీక్షించేవారి మీదనున్నది.
20 మన ఆత్మ యెహోవా కొరకు కనిపెట్టుకొని యున్నది,
ఆయన మనకు సహాయము, మనకు కేడెమునై యున్నాడు;

*లేక, సముచితమై.

21 ఆయనయందు మన హృదయము సంతోషించును,
ఆయన పరిశుద్ధ నామమందు నమ్మిక ఉంచి యున్నాను.
22 యెహోవా! మేము నీ కొరకు నిరీక్షించిన ప్రకారముగా
నీ కృప మా మీద ఉండనిమ్ము.

## 34. కీర్తన.

దావీదు అభీమెలఖు యెదుట వెర్రివానివలె ప్రవర్తించినప్పుడు
అతనిచేత తోలివేయబడి వెళ్లిన తరువాత రచించిన కీర్తన.

1 నేను ఎల్లప్పుడు యెహోవాను కొనియాడుదును,
ఆయన కీర్తి నా నోట నిత్యముగా ఉండును.
2 యెహోవాను గూర్చి నా ఆత్మ అతిశయపడును,
బాధపడే వారు విని సంతోషింతురు.
3 నాతో కూడా యెహోవాను మహిమపరుచుడి,
మనము ఏకమై ఆయన నామమును గొప్ప చేయుదము.
4 నేను యెహోవాను వెతికితిని; ఆయన నాకు ఉత్తరమిచ్చెను,
ఆయన నా సమస్త భయములనుంచి నన్ను తప్పించెను.
5 వారు ఆయన తట్టు కనిపెట్టి తేజరిల్లిరి,
వారి ముఖములు ఎర్రబడలేదు,*
6 బాధపడే ఇతడు పిలిచినప్పుడు యెహోవా ఆలకించి,
వాని శ్రమలన్నిటినుంచి వాని రక్షించెను.
7 యెహోవా దూత ఆయనకు భయపడే వారి చుట్టు దండువలె దిగును,
అతడు వారిని రక్షించును.
8 యెహోవా మంచివాడని అనుభవించి చూడుడి,
ఆయనను ఆశ్రయించే వాడు ధన్యుడు.
9 యెహోవా పరిశుద్ధులారా! ఆయనకు భయపడుడి,
ఆయనకు భయపడే వారికి కొదువ లేదు.
10 సింహపు పిల్లలు బీదవై ఆకలిగొనెను,
యెహోవాను వెతికే వారికి ఏ మేలు కొదువయు ఉండదు.
11 పిల్లలారా! మీరు వచ్చి నా మాట వినుడి,
మీకు యెహోవా భక్తి ఉపదేశింతును.
12 జీవము కోరేవాడు ఎవడు?
ఎవడు మేలు కాంచుటకు బహు దినములు ప్రేమించును?
13 కీడునుంచి నీ నాలుకను,
కపటమైన మాటలనుంచి నీ పెదవులను కాచుకొనుము.
14 కీడునుంచి తొలగి, మేలు చేయుము,
సమాధానము వెతికి దాని తరుముము.
15 యెహోవా కన్నులు నీతిమంతుల వైపునున్నవి,
ఆయన చెవులు వారి మొర్ర వైపునున్నవి.
16 కీడు చేసే వారి జ్ఞాపకము భూమిమీదనుంచి కొట్టివేయుటకు,
యెహోవా ముఖము వారికి యెదురై యున్నది.
17 వారు† మొర్రబెట్టినప్పుడు, యెహోవా ఆలకించి,
వారి శ్రమలన్నిటినుంచి వారిని తప్పించెను.

*అనగా, సిగ్గుపడలేదు. †అనగా, నీతిమంతులు.

18 యెహోవా విరిగిన హృదయముగల వారి దగ్గరనున్నాడు,
నలిగిన ఆత్మగల వారిని ఆయన రక్షించును.
19 నీతిమంతుని ఆపదలు అనేకములు,
వాటి యన్నిటిలోనుంచి యెహోవా వాని తప్పించును.
20 ఆయన వాని యెముకలన్నియు కాపాడును,
వాటిలో ఒక్కటియైనా విరిగి యుండదు.
21 కీడు దుష్టుని చంపును,
నీతిమంతుని ద్వేషించేవాడు శిక్షావిధి పొందును.
22 యెహోవా తన సేవకుల ప్రాణము విమోచించును,
ఆయన శరణుజొచ్చే వారెవరును శిక్షావిధి పొందరు.

## 35. కీర్తన.

దావీదు (కీర్తన.)

1 యెహోవా! నాతో వాదించే వారితో వాదించుము,
నాతో పోరాడే వారితో పోరాడుము.
2 కేడెము డాలును పట్టుకొని, నా సహాయము కొరకు లెమ్ము.
3 బల్లెము దూసి నన్ను తరిమేవారికి అడ్డపడుము,
— నీ రక్షణ నేనే అని నా ఆత్మతో చెప్పుము.
4 నా ప్రాణము వెతికేవారు
సిగ్గు బిడియములు పొందుదురు గాక,
నా కీడు కొరకు ఆలోచించేవారు
వెనుకకు తిప్పబడి ఎర్రబడుదురు గాక.
5 వారు గాలి ముందటి పొట్టువలె నుందురుగాక,
యెహోవా దూత వారిని పారదోలుగాక.
6 వారి తోవలో చీకటి, జారుడును ఉండుగాక,
యెహోవా దూత వారిని తరుముగాక.
7 నిర్నిమిత్తము వారు నా కొరకు తమ వల ఒడ్డినారు,
నిర్నిమిత్తము నా ప్రాణము కొరకు గుంట తవ్వినారు.
8 వాడు ఎరుగని చేటు వాని మీదికి వచ్చును,
వాడు ఒడ్డిన వలలో వాడు తగులుకొనును;
చేటుకై దానిలో పడును.
9 యెహోవాయందు నా ఆత్మ ఆనందించును,
అది ఆయన రక్షణయందు సంతోషించును.
10 —యెహోవా! నీవంటివాడు ఎవడు?
నీవు బాధపడేవాని,
వానికంటే ఎక్కువ బలము గలవానినుంచియు,
బాధపడే బీదను,
వాని దోచుకొనే వానినుంచియు తప్పింతువని
నా యెముకలన్నియు* పలుకుచున్నది.
11 క్రూర సాక్షులు లేచి,
నేను ఎరుగని వాటిని గురించి నన్ను అడుగుచున్నారు.

* హెబ్రీలో, ఎముకలన్నియు, అనగా నేను.

12 మేలుకు ప్రతిగా కీడు నాకు చేయుచున్నారు,
ఏకాంగినై యున్నాను.
13 నేనైతే, వారు వ్యాధిలో ఉన్నప్పుడు,
గోనె పట్ట వస్త్రము వేసుకొంటిని;
ఉపవాసముచేత నా ప్రాణము కుందించుకొంటిని:
నా ప్రార్థన నా ఎదలోకి తిరిగి వచ్చుగాక.
14 అతడు నాకు చెలికాడు, సహోదరుడు అయినట్టే నడుచుకొంటిని,
తన తల్లికొరకు దుఃఖించే వానివలె కుంగి యుంటిని.
15 నేను కుంటినప్పుడు వారు సంతసించి గుంపు కూడిరి,
నీచులు నాకు విరోధముగా గుంపు కూడిరి;
అది నాకు తెలియ లేదు; వారు మానక నన్ను చీల్చిరి.
16 రొట్టె కొరకు ఇచ్చకములాడే వదురుబోతులతో కూడా
నా మీద పండ్లు కొరుకుచున్నారు.
17 ప్రభువా! నీవు ఎన్నాళ్లు (దీని) చూచుచుందువు!
వారు చేసే నాశములనుంచి నా ప్రాణమును,
సింహములనుంచి నా ప్రియమైన దాని తప్పించుము.
18 మహా సంఘములో నిన్ను స్తుతింతును,
బహు జనులలో నిన్ను కొనియాడుదును.
19 అన్యాయముగా నాకు శత్రువులైన వారిని
నా మీద సంతసించ నియ్యకుము;
నిర్నిమిత్తము నన్ను ద్వేషించేవారిని
కన్ను గీటనియ్యకుము;
20 వారు సమాధాన వాక్యము పలుకరు,
దేశమందు శాంతులైన వారికి విరోధముగా
వారు కపటమైన సంగతులు యోచించుచున్నారు.
21 వారు నాకు విరోధముగా నోరు వెడల్పుగా తెరుచుకొని,
—ఆహా, ఆహా! మాకంట పడెనని పలికిరి.
22 యెహోవా! నీవు చూచినావు, మౌనముగా ఉండకుము,
ప్రభువా! నాకు దూరముగా ఉండకుము.
23 నా దేవా! నా ప్రభువా! నాకు న్యాయమిచ్చుటకు,
నా వ్యాజ్యము కొరకు మేలుకొని జాగ్రత్తపడుము.
24 యెహోవా! నా దేవా! నీ నీతిచొప్పున నాకు న్యాయమిమ్ము,
నా విషయమై వారిని సంతోషించ నియ్యకుము.
25 —ఆహా! ఇది మా కోరికె! అని హృదయములో అనుకొననియ్యకుము,
—వాని మింగివేసితిమని వారిని చెప్పుకొననియ్యకుము.
26 నా కీడును గూర్చి సంతోషించేవారు
ఏకమై లజ్జపడి యుందురుగాక,
నాకు విరోధముగా అతిశయపడేవారు,
సిగ్గుపడి అవమానము పొందుదురుగాక.
27 నా నీతిని అంగీకరించేవారు ఆనంద ధ్వనిచేసి సంతసింతురుగాక,
—తన సేవకుని క్షేమము అంగీకరించే యెహోవా,
మహిమపరచబడుగాకని వారిని నిత్యమును అనుకొననిమ్ము.
28 నా నాలుక నీ నీతిని,
దినమంతయు నీ కీర్తనను వచించును.

## 36. కీర్తన.

ప్రధాన గాయకునికి. యెహోవా సేవకుడైన
దావీదు (కీర్తన.)

1 దుష్టునికి తన ద్రోహమే దేవోక్తివలెనున్నదని నాకు తోచును,
వాని దృష్టికి దేవుని భయములేదు.
2 వాని అక్రమము కనబడి అసహ్యమౌటను గూర్చి,
తనలో తన్ను తానే పొగడుకొనును.
3 వాని నోటి మాటలు అక్రమము, కపటమును గలవి,
వాడు వివేచించుటయు మేలుచేయుటయు మానియున్నాడు,
4 వాడు తన మంచము మీద అక్రమము ఆలోచించును,
కాని మార్గమందు నిలుచును,
చెడుతనము వానికి అసహ్యముకాదు.
5 యెహోవా! నీ కృప ఆకాశమందు,
నీ సత్యము మేఘముల మట్టుకును ఉన్నవి.
6 నీ నీతి దేవపర్వతముల వలెనున్నది,
నీ న్యాయవిధులు మిక్కిలి లోతుగానున్నవి;
యెహోవా! నీవు మనుష్యులను జంతువులను రక్షించుచున్నావు.
7 దేవా! నీ కృప ఎంతో అమూల్యమై యున్నది,
నరపుత్రులు నీ రెక్కల నీడను ఆశ్రయించుచున్నారు.
8 వారు నీ ఇంటి పదార్థములవల్ల తృప్తి పొందుదురు,
నీవు నీ అత్యానంద నదిలో వారిని తాగనిత్తువు.
9 నీ యొద్ద జీవమిచ్చే జెల కలదు,
మేము నీ వెలుగున వెలుగు చూతుము.
10 నిన్ను ఎరిగిన వారియందు నీ కృపను,
యథార్థ హృదయముగల వారియందు నీ నీతిని
ఎడతెగక నుండనిమ్ము.
11 నా మీదికి గర్విష్ఠుని పాదము రానియ్యకుము,
నన్ను దుర్మార్గుని చేతిని వెళ్లగొట్టనియ్యకుము,
12 అక్రమము చేసినవారు అక్కడ పడియున్నారు,
వారు కూల్చబడి లేవ లేకనుందురు.

## 37. కీర్తన.

దావీదు కీర్తన.

1 చెడ్డవారిని గూర్చి మత్సరపడకుము,
అక్రమము చేసేవారిని చూచి ఆగ్రహించకుము;
2 వారు గడ్డివలె త్వరగా కోయబడుదురు,
పచ్చని కూరవలె వాడిపోదురు.
3 యెహోవాను నమ్మి మేలు చేయుము,
దేశమందు నివసించి సత్యమును అనుసరించుము.
4 యెహోవాయందు ఆనందపడుము,
ఆయన నీ హృదయమందలి కోరికెలు నీకిచ్చును.
5 యెహోవాకు నీ గతిని అప్పగించుము,
ఆయనను నమ్మితే ఆయన దాని నెరవేర్చును.

6 ఆయన వెలుగువలె నీ నీతిని,
పట్టపగటివలె నీ న్యాయమును వెల్లడిపరచును.
7 యెహోవా యెదుట శాంతపడి ఆయన కొరకు నిరీక్షించుము;
తన మార్గమందు వర్ధిల్లేవాని గూర్చిగాని,
దురాలోచనలు జరిగించేవాని గూర్చిగాని మత్సరపడకుము.
8 కోపము మానుము, ఉగ్రతను విడిచిపెట్టుము,
మత్సరపడకుము, అది చెడుతనమే కలిగించును.
9 కీడు చేసేవారు కొట్టివేయబడుదురు,
యెహోవాకొరకు నిరీక్షించేవారు దేశము స్వతంత్రించుకొందురు.
10 మరి కొంతకాలమునకు దుష్టుడు ఉండడు,
వాని స్థలము బాగా విచారించినను వాడు దొరకడు.
11 బాధపడిన దీనులు భూమి స్వతంత్రించుకొని,
బహు క్షేమమువల్ల ఆనందపడుదురు.
12 దుష్టుడు నీతిమంతునికి విరోధముగా ఆలోచనచేయుచు,
అతని మీద తన పండ్లు కొరుకుచుండును.
13 వాని దినము వచ్చుచున్నదని ప్రభువు చూచి,
వాని విషయమై నవ్వును.
14 బాధపడేవానిని, బీదవానిని పడదోయుటకు,
యథార్థముగా ప్రవర్తించేవారిని చంపుటకు,
దుష్టుడు కత్తి దూసి విల్లెక్కుబెట్టి యున్నాడు.
15 తమ కత్తి తమ హృదయములో దూరును,
వారి విండ్లు విరవబడును.
16 అనేక దుష్టుల ధనబాహుళ్యము కంటే,
ఒక్క నీతిమంతునికి కలిగినది కొంచెమైనా మంచిది.
17 దుష్టుల బాహువులు విరిగి పోవును,
యెహోవా నీతిమంతులకు ఆధారమై యున్నాడు.
18 నిర్దోషుల దినచర్యలు యెహోవాకు తెలుసును,
వారి స్వాస్థ్యము నిరంతరము ఉండును:
19 వారు ఆపత్కాలమందు సిగ్గుపడరు,
కరువు దినములందు తృప్తి పొందుదురు;
20 దుష్టులు నశింతురు,
యెహోవా శత్రువులు బీళ్ల అందము వలెనుందురు,
వారు కాలిపోదురు, పొగయై కాలిపోదురు.
21 దుష్టుడు అప్పు పుచ్చుకొని తీర్చకపోవును,
నీతిమంతుడు దయ కలిగి ఇచ్చును.
22 ఆయనచేత దీవించబడినవారు భూమి స్వతంత్రించుకొందురు;
ఆయనచేత శపించబడినవారు కొట్టివేయబడుదురు.
23 మనుష్యుని అడుగులు యెహోవా చేతనే క్రమపరచబడును,
అతని మార్గము ఆయనకు ఇష్టమై యున్నది.
24 అతడు నేలపడినను కూలడు,
యెహోవా అతని చేతిని పట్టుకొనుచుండును.
25 నేను చిన్నవాడనై యుంటిని, ముసలివాడనునై యున్నాను,
అయితే నీతిమంతుడు విడవబడుట అయినా,
అతని సంతతి ఆహారము అడుగుకొనుట అయినా నేను చూడనైతిని.

26 దినమెల్ల అతడు దయాళుడై అప్పు ఇచ్చుచుండును,
అతని సంతానము ఆశీర్వచనమై యుండును.
27 నీవు కీడు విడిచి మేలు చేయుము,
నిరంతరము ఉండుము.
28 యెహోవా న్యాయము ప్రేమించుచున్నాడు,
ఆయన తన భక్తులను విడువడు;
వారు నిరంతరము కాపాడబడుదురు;
దుష్టుల సంతానము కొట్టివేయబడును.
29 నీతిమంతులు భూమి స్వతంత్రించుకొని,
దానిలో ఎల్ల కాలము నివసింతురు.
30 నీతిమంతుని నోరు బుద్ధి వచించును,
అతని నాలుక న్యాయము పలుకును.
31 అతని దేవుని బోధ అతని హృదయములో ఉన్నది;
అతని అడుగులు జారవు.
32 దుష్టుడు నీతిమంతుని కొరకు పొంచి,
అతని చంపుటకు వెతుకును.
33 యెహోవా వీని చేతిలో అతని విడువడు,
అతడు విమర్శింపబడేటప్పుడు అతనికి శిక్ష విధించడు.
34 యెహోవా నిమిత్తము కనిపెట్టుకొని,
ఆయన మార్గమును అనుసరించుము,
భూమి స్వతంత్రించుకొనుటకు ఆయన నిన్ను హెచ్చచేసును;
దుష్టులు కొట్టివేయబడేటప్పుడు నీవు దాని చూతువు.
35 స్వస్థానమందు వేళ్లుబారిన పచ్చని చెట్టువలె,
వ్యాపించుచు బలాఢ్యుడైయున్న దుష్టుని చూచినాను.
36 అతడు గతించిపోయెను, ఇదిగో! అతడు లేడు,
నేను అతని వెతికినప్పుడు అతడు దొరకలేదు.
37 నిర్దోషిని గురుతుపట్టుము, యథార్థవంతుని చూడుము,
శాంతచిత్తునికి ముందు గతి కలదు.
38 అపరాధులు ఏకముగా నశింతురు,
దుష్టుల ముందు గతి కొట్టివేయబడును.
39 నీతిమంతుల రక్షణ యెహోవావల్లనే కలుగును,
ఆయన, శ్రమకాలమందు వారికి కోటగానుండును.
40 యెహోవా వారికి సహాయము చేసి వారిని తప్పించును,
వారు ఆయన శరణుజొచ్చి యున్నారు,
కావున ఆయన దుష్టులనుంచి వారిని తప్పించును.

## 38. కీర్తన.

జ్ఞాపకార్థకము. దావీదు కీర్తన.

1 యెహోవా! నీ క్రోధముతో నన్ను గద్దించకుము,
నీ ఆగ్రహముతో నన్ను శిక్షించకుము.
2 నీ బాణములు నాలోపలికి దిగినవి,
నీ చెయ్యి నా మీద భారముగా దిగియున్నది.
3 నీ కోపమువల్ల నా శరీరములో బాగులేదు,
నా పాపమువల్ల నా ఎముకలలో స్వస్థత లేదు.

4 నా అక్రమములు నా తలమీద పొర్లినవి,
నేను మోయలేని బరువుగల మోపువలెనున్నవి.
5 నా మూర్ఖతవల్ల
నా గాయములు దుర్వాసనగలవై స్రవించుచున్నవి.
6 నేను మిక్కిలి సంకటపడి వంగియున్నాను,
దినమెల్ల నేను కుంగి సంచరించుచున్నాను.
7 నా డొక్కలు తాపముతో నిండియున్నవి,
నా శరీరములో బాగులేదు.
8 నేను మ్రానుపడి మిక్కిలి నలిగియున్నాను,
నా హృదయ రోదనమువల్ల కేకలు వేయుచున్నాను.
9 ప్రభువా! నా కోరికయంతా నీ యెదుట ఉన్నది,
నా నిట్టూర్పును నీకు దాచబడలేదు.
10 నా గుండె అదురుచున్నది, నా బలము నన్ను విడిచిపోయెను,
నా కన్నుల వెలుగు కూడా నాకు లేకపోయెను.
11 నా స్నేహితులు, నా చెలికాండ్లు నా తెగులుకు ఎడగా నిలుచుచున్నారు,
నా బంధువులు దూరముగా నిలిచియున్నారు.
12 నా ప్రాణము వెతికేవారు ఉరులు ఒడ్డుచున్నారు,
నాకు కీడు వెతికేవారు చెడ్డమాట్లాడుచు
దినమెల్ల కపటోపాయములు ఆలోచించుచున్నారు.
13 చెవిటివానివలె నేను వినలేనైతిని,
నోరు తెరవని మూగవలె ఊరకుంటిని.
14 నేను వినలేని మనుష్యుని వలెనుంటిని,
వాని నోట ఎదురుమాట లేదు.
15 యెహోవా! నీ కొరకు కనిపెట్టుకొన్నాను,
ప్రభువా! నా దేవా! నీవు ప్రత్యుత్తరమిత్తువు;
16 —ఒకవేళ వారు నా విషయమై సంతోషింతురేమో,
నా కాలు జారితే నా మీద అతిశయింతురేమో అనుకొంటిని;
17 నేను కుంటివాడనౌటకు సిద్ధపడి యున్నాను,
నా వేదన నిత్యము నాకు తటస్థమై యున్నది;
18 నా అక్రమము ఒప్పుకొందును,
నా పాపమును గూర్చి విచారపడుదును.
19 నా శత్రువులు సజీవులును బలవంతులునై యున్నారు,
నిర్హేతువుగా నన్ను ద్వేషించేవారు విస్తరించియున్నారు;
20 వారు మేలుకు ప్రతిగా కీడు చేయుచున్నారు,
నేను మేలు అనుసరించినందున నాకు విరోధులై యున్నారు.
21 యెహోవా! నన్ను విడవకుము,
నా దేవా! నాకు దూరముగా ఉండకుము.
22 ప్రభువా! నా రక్షకా!
నాకు సహాయము చేయుటకు త్వరపడుము.

## 39. కీర్తన.

ప్రధాన గాయకుడైన యెదూతూను కొరకు. దావీదు కీర్తన.

1 —నేను నా నాలుకతో పాపము చేయకుండుటకు,
నా మార్గము బాగా చూచుకొందును:

దుష్టుడు నా యెదుట ఉన్నప్పుడు,
నా నోటికి చిక్కము వేసి ఉంచుకొందుననుకొంటిని.
2 మూగవలె నేను మౌనినైతిని,
మేలు లేక మౌనముగా ఉంటిని:
నా విచారము రేపబడెను.
3 నా హృదయము నాలో వేడిదైయుండెను,
నేను విచారపడగా మంట పుట్టెను;
నా నాలుకతో పలికితిని.
4 —యెహోవా! నా అంతమును,
నా దినముల ప్రమాణము ఎంతో అదియు నాకు తెలుపుము;
నా బలహీనత నాకు తెలుసుగాక.
5 ఇదుగో! నీవు నా దినములు బెత్తెడులగా చేసినావు,
నీ యెదుట నా ఆయువు అభావము వంటిది:
బలముగల ప్రతివాడును కేవలము వ్యర్థుడై యున్నాడు. సెలా.
6 మనుష్యుడు వట్టి నీడవలె తిరుగులాడుచున్నాడు,
ఊపిరికే వారు ఘోషించుచున్నారు:
ఒకడు ధనము కూర్చుకొనును,
అది ఎవడు చేర్చుకొనునో వానికి తెలియదు.
7 కాబట్టి, ప్రభువా! నేను దేని కొరకు కనిపెట్టుకొంటిని!
నా నిరీక్షణ నీయందే ఉన్నది.
8 నా ద్రోహములన్నిటినుంచి నన్ను తప్పించుము,
నన్ను బుద్ధిహీనుని హాస్యాస్పదముగా చేయకుము;
9 నీవు దాని చేసినావు గనుక,
నేను మౌనినై నోరు తెరవ లేదు.
10 నా మీదనుంచి, నీవు కలిగించిన తెగులు తొలిగించుము,
నీ చేతి దెబ్బవల్ల నేను క్షీణించియున్నాను.
11 నీవు అక్రమము కొరకు, గద్దింపులతో మనుష్యుని శిక్షించితే
చిమ్మటవలె వాని అందము చెరిపివేతువు;
ప్రతి మనుష్యుడు వట్టి ఊపిరి వలెనున్నాడు. సెలా.
12 యెహోవా! నా ప్రార్థన వినుము,
నా మొర్రకు చెవినొగ్గుము,
నా కన్నీళ్లు చూచి మౌనముగా ఉండకుము:
నేను నీ యొద్ద పరదేశిని,
నా పితృలందరివలె పరవాసినై యున్నాను.
13 నేను ఇక్కడనుంచి వెళ్లి, లేకపోక మునుపు,
నేను తేజరిల్లుటకు నాకు విముఖుడవై యుండుము.

## 40. కీర్తన.

ప్రధాన గాయకునికి. దావీదు కీర్తన.

1 నేను యెహోవా నిమిత్తము నిరీక్షించనే నిరీక్షించినాను,
ఆయన నాకు చెవినొగ్గి నా మొర్రను ఆలకించెను.
2 ఆయన, చేటు గల గుంటలోనుంచియు,
జిగట బురదలోనుంచియు నన్ను పైకెత్తి,

బండ మీద నా పాదములు నిలిపెను;
ఆయన నా అడుగులు స్థిరపరిచెను.
3 మన దేవుని కీర్తించుటకు
ఆయన క్రొత్త సంగీతము నా నోట ఉంచెను:
అనేకులు చూచి, భయపడి యెహోవాను నమ్ముదురు.
4 యెహోవాను తన ఆశ్రయముగా చేసుకొని,
అహంకారుల వైపు,
అబద్ధముతట్టు తొలగేవారి వైపు తిరగని నరుడు ధన్యుడు.
5 యెహోవా! నా దేవా!
నీవు మా యెడల నీ అద్భుతములను నీ తలంపులను,
విస్తరింప చేసియున్నావు:
నీ యెదుట వాటిని ఏర్పరుచుట అసాధ్యము,
వాటిని వివరించి చెప్పుదునుగాని అవి లెక్కలేనివి.
6 నీవు యాగమునైనా కానుకనైనా కోరలేదు,
నా చెవులు తెరవచేసి యున్నావు;
హోమమైనా పాపము కొరకైన అర్పణమైనా నీవు అడగలేదు.
7 అప్పుడు నేను—ఇదుగో! వచ్చియున్నాను,
పుస్తకము చుట్టలో నా విషయమై వ్రాయబడి యున్నది.
8 నా దేవా! నీ ఇష్టము నెరవేర్చుట నా కోరికె,
నీ బోధన నా అంతరంగములో ఉన్నదని పలికితిని.
9 మహా సంఘములో నీతిసువార్త ప్రకటించి యున్నాను,
ఇదుగో! నా పెదవులు మూసుకొననైతిని;
యెహోవా! అది నీవు ఎరిగి యున్నావు.
10 నా హృదయములో నీ నీతిని దాచుకొనలేదు,
నీ సత్యము, నీ రక్షణ వివరించి యున్నాను;
నీ కృపాసత్యములు మహా సంఘమునకు నేను చాటుచేయుటలేదు.
11 యెహోవా! నీవు నీ వాత్సల్యము నా విషయమై మూసిపెట్టకుము,
నీ కృపా సత్యములను ఎల్లప్పుడు నన్ను కాపాడనిమ్ము.
12 లెక్క లేనంతమట్టుకు కీడులు నన్ను చుట్టుకొని యున్నవి,
నా అక్రమములు నన్ను పట్టుకొనెను, నేను చూడలేను:
అవి నా తలవెంట్రుకల కంటే విస్తారమై యున్నవి;
నా హృదయము నన్ను విడిచిపోయెను.
13 యెహోవా! దయచేసి నన్ను తప్పించుము,
యెహోవా! నా సహాయము కొరకు త్వరపడి రమ్ము.
14 నా ప్రాణము సంహరించుటకు దాని వెతికేవారు,
ఏకముగా సిగ్గుపడి అవమానము పొందుదురుగాక;
నాకు కీడు కోరేవారు వెనుకకు తిప్పబడి సిగ్గుపడుదురుగాక.
15 నాతో— ఆహా, ఆహా, అని పలికేవారు,
తమ అవమానమునకు తగినట్టు పాడై పోవుదురు గాక.
16 నిన్ను వెతికేవారందరు సంతోషించి, నీయందు ఆనందింతురుగాక;
—యెహోవా మహిమపరచబడుగాకని,
నీ రక్షణ ప్రేమించేవారు ఎప్పుడును చెప్పుదురుగాక.

17 నేను బాధగల బీదవాడను,
ప్రభువు నన్ను తలంచుకొంటున్నాడు,
నాకు సహాయము నాకు రక్షణము నీవే;
నా దేవా! ఆలస్యము చేయకుము.

## 41. కీర్తన.

ప్రధాన గాయకునికి. దావీదు కీర్తన.

1 దరిద్రుని కటాక్షించేవాడు ధన్యుడు,
ఆపత్కాలమందు యెహోవా అతని విడిపించును.
2 యెహోవా అతని కాపాడుచు అతని బ్రతికించును,
భూమిమీద అతడు ధన్యుడనబడును;
అతని శత్రువుల ఇచ్ఛకు అతని అప్పగించవు.
3 యెహోవా, రోగశయ్య మీదనున్న వాని స్థిరపరుచును;
వాడు రోగియైయున్నప్పుడు వాని పరుపంతయు తిప్పుదువు.
4 నేను—యెహోవా! నన్ను కరుణించి నా ప్రాణము స్వస్థపరుచుము;
నీకు వ్యతిరిక్తముగా పాపము చేసితినని పలికితిని.
5 —వాడు ఎప్పుడు చనిపోవును? వాని పేరు ఎప్పుడు నశించునని,
నా శత్రువులు నా విషయమై చెడ్డమాటలు ఆడుచున్నారు.
6 (నన్ను) చూచుటకు వచ్చి అబద్ధమాడును,
వాని హృదయము చెడుతనము కూర్చుకొనును;
వాడు బైలువెళ్లి వీధిలో దాని పలుకును.
7 నన్ను ద్వేషించేవారందరు ఏకమై నా మీద గుసగుసలాడుచు
నాకు విరోధముగా నాకు కీడు ఆలోచించుచున్నారు.
8 —దురదృష్టము వాని అణిచివేసెను,
వాడు పండుకొనియున్నాడు గనుక తిరిగి లేవడనుచున్నారు.
9 నేను నమ్మిన నా స్నేహితుడు కూడా, నా ఆహారము తినుచు,
నాకు విరోధముగా తన మడిమె ఎత్తెను.
10 యెహోవా! నీవు నన్ను కరుణించి నన్ను లేవనెత్తుము:
నేను వారికి ప్రతిక్రియ చేతును.
11 నా శత్రువు నా మీద ఉల్లసించకనున్నాడు గనుక,
నీకు ఇష్టుడనని దీనివల్ల నాకు తెలుసును.
12 నా యథార్థతలో నన్ను స్థిరపరుచుము,
నీ యెదుట నిరంతరము నన్ను నిలువబెట్టుచున్నావు.
13 ఇశ్రాయేలు దేవుడైన యెహోవా,
త్రికాలముల యందు స్తుతించబడుగాక. ఆమేన్. ఆమేన్.

## 42. కీర్తన.

ప్రధాన గాయకునికి. కోరహు కుమారుల మస్కీల్.

1 నీటి కాలువల కొరకు ఆశపడిన లేడివలె,
దేవా! నీ నిమిత్తము నా ప్రాణము ఆశపడుచున్నది.
2 నా ప్రాణము దేవుని కొరకు, జీవముగల దేవుని కొరకు తృష్ణగొనుచున్నది:
నేను ఎప్పుడు వచ్చి దేవుని యెదుట కనబడుదును!
3 —నీ దేవుడు ఎక్కడనని వారు నిత్యమును నాతో పలికేటప్పుడు,
నా కన్నీళ్లు దివారాత్రులు నాకు కూడై యున్నవి.

4 నేను జనసమూహముతో, పండుగ చేయుచున్న సమూహముతో వెళ్లుచు,
ఉత్సాహ స్తోత్రముల ధ్వనితో దేవుని మందిరమునకు నడిచినాను;
నేను వీటిని జ్ఞాపకము చేసుకొని, నా ప్రాణము వెలువరించుకొంటున్నాను.
5 నా ఆత్మా! నీవు ఎందుకు కుంగి వ్యాకులపడుచున్నావు?
దేవుని నిమిత్తము నిరీక్షించుము; ఇంకా ఆయనను స్తుతింతును;
ఆయన నా రక్షణ కర్త, నా దేవుడునై యున్నాడు.
6 నా ఆత్మ నాలో కుంగియున్నది గనుక నేను యొర్దాను దేశమునుంచి,
హెర్మోనులనుంచి మిస్యారు కొండనుంచియు నిన్ను జ్ఞాపకము చేసుకొందును.
7 నీ జలప్రవాహముల శబ్దముతో కరడు కరడును పిలుచుచున్నది,
నీ అలలన్నియు, నీ తరంగములన్నియు నా మీద పొర్లియున్నవి.
8 పగటివేళ యెహోవా తన కృపను ఆజ్ఞాపించును,
రాత్రియందు ఆయన కీర్తన
నా జీవ దేవుని గూర్చిన నా ప్రార్థన నాకు తోడైయుండును.
9 —నీవు ఎందుకు నన్ను మరిచియున్నావు?
శత్రు బాధవల్ల ఎందుకు కుంగి సంచరించుచున్నాను అని?
నా శైలమైయున్న దేవునితో పలుకుదును.
10 —నీ దేవుడు ఎక్కడనున్నాడని నా శత్రువులు దినమెల్ల అడుగుచు,
నా ఎముకలు విరగగొట్టినట్టు నన్ను దూషించుచున్నారు.
11 నా ఆత్మా! నీవు ఎందుకు కుంగి ఘోషించుచున్నావు?
దేవుని నిమిత్తము నిరీక్షించుము; ఇంకా ఆయనను స్తుతింతును,
ఆయన నా రక్షణ కర్త, నా దేవుడునై యున్నాడు.

## 43. కీర్తన.

1 దేవా! నాకు న్యాయమిమ్ము,
కృపలేని రాష్ట్రమునకు విరోధముగా నా వాదము వాదించుము,
కపటము అక్రమము గల మనుష్యునినుంచి నన్ను తప్పించుము.
2 నీవు నాకు కోటయైన దేవుడవు; ఎందుకు నన్ను విడనాడినావు?
శత్రు బాధవల్ల నేను ఎందుకు కుంగి సంచరించుచున్నాను?
3 నీ వెలుగు నీ సత్యమును రాజేయుము: అవి నన్ను నడిపించుగాక,
అవి నీ పరిశుద్ధ పర్వతమునకు నీ గుడారములకును నన్ను చేర్చుగాక.
4 అప్పుడు నేను దేవుని యజ్ఞవేదిక యొద్దికి,
నా మహా సంతోషమైయున్న దేవునియొద్దికి వెళ్లుదును:
దేవా! నా దేవా! నిన్ను కిన్నెరతో స్తుతింతును.
5 నా ఆత్మా! నీవు ఎందుకు కుంగి ఘోషించుచున్నావు?
దేవుని నిమిత్తము నిరీక్షించుము; ఇంకా ఆయనను స్తుతింతును,
ఆయన నా రక్షణ కర్త, నా దేవుడునైయున్నాడు.

## 44. కీర్తన.

ప్రధాన గాయకునికి. కోరహు కుమారులది. మస్కీల్.

1 దేవా! మా పితృల దినములలో,
పూర్వదినములలో నీవు చేసిన కార్యములను మా చెవులతో వింటిమి,
వారు మాతో చెప్పియున్నారు.

2 నీవు నీ చేతితో* రాష్ట్రములను వెళ్లగొట్టి,
వారి స్వాస్థ్యములో మా పితృలను స్థాపించినావు;
నీవు జనములను బాధపరిచి వీరిని వ్యాపింప చేసినావు.
3 వారు తమ కత్తివల్ల దేశము స్వాధీనపరుచుకొనలేదు,
నీ కుడిచెయ్యి, నీ బాహువు, నీ ముఖకాంతియే గాని,
వారి బాహువు వారికి విజయము కలుగచేయలేదు;
నీవు వారిని కటాక్షించినావు.
4 దేవా! నీవే నా రాజువైయున్నావు,
యాకోబుకు పూర్ణ రక్షణ కలుగుటకు ఆజ్ఞాపించుము;
5 నీ వల్ల మా విరోధులను అణిచివేతుము,
మాకు విరోధముగా లేచేవారిని నీ నామమువల్ల త్రొక్కివేతుము.
6 నా వింటెని ఆశ్రయించను,
నా కత్తి నన్ను రక్షించదు.
7 నీవు మా విరోధులనుంచి మమ్ము రక్షించినావు,
మమ్ము ద్వేషించేవారిని సిగ్గుపరిచినావు.
8 దినమెల్ల దేవుని గూర్చి అతిశయపడుదుము,
నీ నామమును నిరంతరము స్తుతింతును.
9 అయితే నీవు మమ్ము విడనాడి సిగ్గుపరిచినావు,
మా సేనలతో కూడా బైలువెళ్లకనున్నావు.
10 విరోధి యెదుటనుంచి మమ్ము వెనుకకు తిప్పినావు,
మమ్ము ద్వేషించేవారు తమ కొరకు మమ్ము దోచుకొన్నారు.
11 ఆహారము కొరకైన గొర్రెలవలె మమ్ము అప్పగించి,
రాష్ట్రములలోకి మమ్ము చెదరగొట్టినావు.
12 ధనప్రాప్తి లేకనే నీ ప్రజలను అమ్మినావు,
వారి వెలవల్ల నీవు అభివృద్ధి పొందలేదు.
13 మా పొరుగువారు అపహాస్యము చేయుటకు,
మా చుట్టు ఉన్నవారు వెక్కిరించి ఎగతాళిచేయుటకు,
మమ్ము నియమించి యున్నావు.
14 రాష్ట్రములలో మమ్మును సామితెగాను,
ప్రజలలో తల ఆడించుటకు హేతువుగాను చేసియున్నావు.
15,16 నిందించి దూషించేవాని శబ్దమువల్ల,
శత్రువునివల్ల, పగతీర్చుకొనే వానివల్లను,
దినమంతయు నా అవమానము నా యెదుటనున్నది;
సిగ్గు నా ముఖము కమ్మియున్నది.
17 ఇదంతయు మా మీదికి వచ్చినను, మేము నిన్ను మరవలేదు,
నీ నిబంధన† విషయమై మేము ద్రోహులము కాము.
18 మా హృదయము వెనుకకు తిరగలేదు,
మా అడుగులు నీ మార్గమునుంచి తొలగలేదు;
19 అయితే నీవు నక్కల చోట మమ్ము నలిపి,
మరణ చ్ఛాయతో మమ్ము కప్పివేసి యున్నావు.

*లేక, నీ బలముచేత. †లేక, ఒడంబడిక.

20 మేము మా దేవుని నామము మరిచి,
అన్య దేవుని తట్టు మా చేతులు చాపియుంటే,
21 దేవుడు దాని పరిశోధించడా?
హృదయ రహస్యములు ఆయనకు తెలుసును.
22 అయినను దినమెల్ల నీ నిమిత్తము చంపబడుచున్నాము,
చంపబడబోయే గొఱ్ఱెలవలె ఎంచబడుచున్నాము.
23 ప్రభువా! మేలుకొనుము, ఎందుకు నిద్రించుచున్నావు?
లెమ్ము, నిరంతరము (మమ్ము) విడనాడకుము.
24 ఎందుకు నీ ముఖము చాటుచేసుకొని,
మా బాధను, మాకు కలిగిన హింసను మరిచియున్నావు?
25 మా ఆత్మ నేలమట్టుకు కుంగియున్నది;
మా శరీరము భూమిని అంటుకొని యున్నది.
26 మా సహాయము కొరకు లెమ్ము,
నీ కృప నిమిత్తము మమ్ము విమోచించుము.

## 45. కీర్తన.

ప్రధాన గాయకునికి. షోషన్నుల మీద. కోరహు కుమారులది.
మశ్కీల్, ప్రీతిని గూర్చిన సంగీతము.

1 నా హృదయము మంచి వాక్యముతో నిండి పొర్లుచున్నది:
నా రచన రాజును గూర్చినదని అనుకొంటిని:
నా నాలుక త్వరగా వ్రాసేవాని కలము.
2 నీవు నరపుత్రుల కంటే అతిసుందరుడవై యున్నావు,
నీ పెదవుల మీద దయారసము పోయబడియున్నది;
కావున దేవుడు నిరంతరము నిన్ను దీవించి యున్నాడు.
3 నీ మహిమతో నీ ప్రభావముతో,
శూరుడా! మొలను నీ కత్తి కట్టుకొనుము.
4 సత్యము కొరకు, నీతిమంతుని దీనత్వము కొరకు,
నీ ప్రభావముతో విజయ వాహనమెక్కి వర్ధిల్లుము;
నీ కుడిచెయ్యి భీకరమైనవాటిని నీకు బోధించును.
5 రాజుయొక్క శత్రువుల గుండెలో నీ అమ్ములు వాడిగానున్నవి,
ప్రజలు నీ క్రిందుగా పడుదురు.
6 దేవా! నీ గద్దె నిరంతరము ఉన్నది,
నీ రాజ్యముయొక్క రాజదండము న్యాయము గల దండము.
7 నీవు నీతి ప్రేమించి, దుష్టత్వము ద్వేషించి యున్నావు;
అందు చేతను దేవుడు, నీ దేవుడు నీ చెలికాండ్లకంటే
నిన్ను ఎక్కువగా ఆనంద తైలముతో అభిషేకించియున్నాడు.
8 నీ వస్త్రములన్నియు, బోళము, అగురు, లవంగపట్టయు గలవి,
దంతపు నగరులనుంచి తంతివాద్యములు నిన్ను సంతోషపెట్టినవి.
9 నీ ఘన స్త్రీలలో* రాజుల కుమార్తెలు ఉన్నారు,
రాణి, ఓఫీరు అపరంజి అలంకారములతో, నీ కుడిపార్శ్వమందు నిలిచియున్నది.

*లేక, ప్రియలలో.

10 కుమారీ! ఆలకించి, చూచి, చెవియొగ్గుము,
నీ స్వజనమును నీ తండ్రి యింటిని మరువుము.
11 రాజు నీ సౌందర్యము కాంక్షించుగాక,
ఆయన నీ ప్రభువు, ఆయనకు సాగిలపడుము.
12 సోరు కుమార్తె, కానుక తీసుకొనివచ్చును,
జనులలో ఐశ్వర్యవంతులు నీ దయ వెతుకుకొందురు.
13 అంతఃపురములో రాజు కుమార్తె కేవలము మహిమగలది,
ఆమె వస్త్రము బంగారు బుట్టాపనిది.
14 ఆమె విచిత్రమైన వస్త్రములతో రాజు యొద్దికి తీసుకొని రాబడును;
ఆమెను వెంబడించే ఆమె చెలికత్తెలైన కన్యకలు నీ యొద్దికి చేర్చబడుదురు.
15 వారు సంతోషముతో ఆనందముతో తీసుకొని రాబడి,
రాజు నగరులో ప్రవేశింతురు.
16 నీ పితృలకు ప్రతిగా నీ కుమారులు ఉందురు,
భూమియందంతట వారిని అధికారులగా నియమింతువు.
17 నీ నామమును తరములన్నిటను జ్ఞాపకము చేయింతును,
కావున జనులు నిరంతరము నిన్ను స్తుతింతురు.

## 46. కీర్తన.

ప్రధాన గాయకునికి, కోరహు కుమారులది. అల్మోతు* మీద, సంగీతము,

1 దేవుడు మనకు ఆశ్రయము, కోటయునైయున్నాడు;
శ్రమలలో ఆయన పూర్ణ సహాయముగా కనబడియున్నాడు.
2 కావున, భూమి మారుబడినప్పటికి,
పర్వతములు సముద్రములలో జోగి పడినప్పటికి,
3 వాటి జలములు ఘోషించుచు నురుగుకట్టినప్పటికి,
అది ఉప్పొంగుటవల్ల పర్వతములు కదిలినప్పటికి నేను భయపడను. సెలా.
4 ఒక నది యున్నది; దాని కాలువలు దేవుని పట్టణమును,
సర్వోన్నతుని ఆలయముల పరిశుద్ధ స్థలమును సంతోషపరుచును.
5 దేవుడు దాని మధ్యనున్నాడు, అది కదలించబడదు,
అరుణోదయమందు దేవుడు దానికి సహాయము చేసును.
6 రాష్ట్రములు ఘోషించెను, రాజ్యములు కదలెను,
ఆయన తన శబ్దము బైలుపరిచెను, భూమి కరిగిపోయెను.
7 సేనల (దేవుడైన) యెహోవా మనకు తోడైయున్నాడు,
యాకోబు దేవుడు మనకు దుర్గమైయున్నాడు. సెలా.
8 యెహోవా కార్యములు వచ్చి చూడుడి;
ఆయన భూమి మీద నాశములు చేసెను.
9 ఆయన భూదిగంతముల మట్టుకు యుద్ధములు మాన్పించును;
ఆయన విల్లు విరిచి, బల్లెము తెగ నరుకుచున్నాడు;
రథములు అగ్నిలో కాల్చి వేయుచున్నాడు.
10 —మానుకొనుడి; నేనే దేవుడనని తెలుసుకొనుడి,
నేను రాష్ట్రములలో మహోన్నతుడను,
భూమి మీద మహోన్నతుడనైయుందును.

*అనగా, కన్యకల స్వరయుక్త గీతము.

11 సేనల (దేవుడైన) యెహోవా మనకు తోడైయున్నాడు,
యాకోబు దేవుడు మనకు దుర్గమైయున్నాడు.

## 47. కీర్తన.

ప్రధాన గాయకునికి. కోరహు కుమారులది. సంగీతము.

1 సర్వ జనులారా! మీరు చప్పట్లు కొట్టుడి,
ఉత్సాహ ధ్వనితో దేవుని గూర్చి గానము చేయుడి.
2 మహోన్నతుడైన యెహోవా భయంకరుడు,
ఆయన సర్వ భూమిమీద మహారాజైయున్నాడు.
3 ఆయన మనకు జనములను,
మన పాదముల కింద ప్రజలను లోపరుచును.
4 మన స్వాస్థ్యమును, తాను ప్రేమించిన యాకోబు మహాతిశయమును,
ఆయన మనకొరకు ఏర్పాటు చేసును.
5 దేవుడు ఆర్భాటముతో,
యెహోవా బూర ధ్వనితో పైకెక్కి వెళ్లెను.
6 దేవుని కీర్తించుడి, కీర్తించుడి;
మన రాజును కీర్తించుడి, కీర్తించుడి.
7 దేవుడు సర్వభూమికి రాజైయున్నాడు,
రమ్యమైన* కీర్తన పాడుడి.
8 దేవుడు రాష్ట్రములకు రాజైయున్నాడు,
దేవుడు తన పరిశుద్ధ సింహాసనము మీద కూర్చునియున్నాడు,
9 జనముల ప్రధానులు,
అబ్రాహాము దేవుని జనముగా కూడబడియుందురు.
10 భూమి యొక్క కేడెములు దేవునివే,
ఆయన మహోన్నతుడైయున్నాడు.

## 48. కీర్తన.

సంగీతము. కీర్తన. కోరహు కుమారులది.

1 మన దేవుని పట్టణమందు, ఆయన పరిశుద్ధ పర్వతమందు,
యెహోవా గొప్పవాడు, బహు కీర్తనీయుడునై యున్నాడు.
2 మహా రాజుయొక్క పట్టణమైన సీయోను పర్వతము,
ఉత్తర దిక్కులో,
రమ్యమైన ఔన్నత్యము కలిగి సర్వభూమికి సంతోషకరమైయున్నది.
3 దేవుడు దాని నగరులలో ఆశ్రయమని తెలియబడియున్నాడు.
4 అదుగో! ఆ రాజులు కూడి, ఐక్యముగా దాటిపోయిరి.
5 వారు దాని చూచిన వెంటనే, వారు ఆశ్చర్యపడిరి;
వారు అదిరి, త్వరగా పారిపోయిరి.
6 అక్కడ వణుకు, ప్రసవించే స్త్రీ వేదన వారిని పట్టెను.
7 తూర్పు గాలిచేత తర్షీషు ఓడలు పగల గొట్టుదువు.
8 సేనల (దేవుడైన) యెహోవా పట్టణములో, మన దేవుని పట్టణములో,
మనము వినిన ప్రకారముగా చూచియున్నాము;
దేవుడు నిరంతరము దాని స్థిరపరుచును.

*లేక, బోధకరమైన.

9 దేవా! నీ ఆలయములో, నీ కృప ధ్యానించియున్నాము.
10 దేవా! నీ నామము వలె నీ కీర్తి భూదిగంతముల మట్టుకున్నది:
నీ కుడి చెయ్యి నీతితో నిండియున్నది.
11 సీయోను పర్వతము సంతోషించుగాక,
నీ న్యాయ విధులను గూర్చి,
యూదా కుమార్తెలు ఆనందింతురు గాక.
12 మీరు తరువాతి తరములకు తెలుపుటకు,
సీయోనును ఆవరించి దాని చుట్టు సంచరించుడి.
13 దాని బురుజులు లెక్కించుడి,
దాని ప్రాకారములయందు లక్ష్యముంచుడి;
దాని నగరులు నిదానించి చూడుడి.
14 దేవుడు, మన దేవుడు నిరంతరము ఇట్టివాడైయున్నాడు,
ఆయన మనలను నడిపించును. అల్మాతు*

## 49. కీర్తన.

ప్రధాన గాయకునికి. కోరహు కుమారులది, సంగీతము.

1 సర్వ జనములారా! దీని వినుడి;
2 సామాన్యులేమి, సామంతులేమి, ధనికులేమి, దరిద్రులేమి,
లోకస్థులారా! మీరందరు ఏకముగా చెవినొగ్గుడి.
3 నా నోరు బుద్ధి చెప్పును; నా హృదయధ్యానము జ్ఞానము.
4 నేను ఉపమానమునకు చెవినొగ్గుదును,
కిన్నెరతో నా మరుగుమాట విప్పుదును.
5 నా కొరకు పొంచే వారి అక్రమము నన్ను చుట్టుకొనినను,
ఆపత్కాలములో నేను ఎందుకు భయపడ వలెను?
6 వారు తమ ఆస్తియందు నమ్మిక ఉంచి,
తమ ధన విస్తారత విషయమై కొనియాడుకొందురు.
7—9 ఎవడును తన సహోదరుని విమోచింప నేరడు,
వాడు సమాధి చూడక, నిరంతరము బ్రతుకుచుండుటకు,
వాని కొరకు దేవునికి విమోచన క్రయము ఇయ్యలేడు:
వారి ప్రాణ విమోచనము వెలపొద్దుగైయున్నది,
అది నిరంతరము తీరకనుండును.
10 (సమాధి) చూడవలెను; జ్ఞానులు చనిపోదురు,
మూఢుడు, పశుప్రాయుడును ఏకముగా నశింతురు;
వారు తమ ఆస్తి అన్యులకు విడిచి పెట్టవలెను.
11 తమ ఇండ్లు నిరంతరము,
తమ నివాసస్థలములు తరతరముల మట్టుకుండుననుకొందురు,
వారు భూములకు తమ పేళ్లు పెట్టియున్నారు.
12 అయితే ఘనత వహించినను, మనుష్యుడు నిలువడు,
వాడు నశించే మృగములను పోలియున్నాడు.
13 ఇది అడియాసపడే వాని క్రమము,
వారి నోటి మాటలు వారి తరువాతి వారికి ఇష్టముగానుండును. సెలా.

*అనగా, మరణముమీద.

14 గొర్రెల వలె వారు గోతిలో వేయబడుదురు,
మరణము వారిని మేపును;
ఉదయమందు యథార్థులు వారిమీద విజయము పొందుదురు,*
వారి మూర్తి గోతిలో క్షయమైపోవును, దానికి నివాసము లేకపోవును.
15 అయితే గోతి బలమునుంచి, దేవుడు నా ప్రాణము విమోచించును;
ఆయన నన్ను చేర్చుకొనును. సెలా.
16 ఒకడు ధనవంతుడై,
వాని ఇంటి ఘనత విస్తరించేటప్పుడు భయపడకుము.
17 వాడు చనిపోయేటప్పుడు ఏమియు కొంచుపోడు,
వాని ఘనత వాని వెంట దిగిచనదు,
18 జీవితకాలమందు వాడు తన ప్రాణము కొనియాడుకొనినా,
—నీకు నీవే మేలు చేసుకొంటివని మనుష్యులు నిన్ను స్తుతించినా,
19 అది తన పితృల వంశమునకు చేర వలెను,
వారు మరి యెన్నడును వెలుగు చూడరు,
20 ఘనత వహించి బుద్ధిహీనుడైన మనుష్యుడు,
నశించే మృగములను పోలియున్నాడు.

## 50. కీర్తన.

ఆసాఫు కీర్తన.

1 దేవుడు, దేవుడైన యెహోవానా పలికియున్నాడు;
సూర్యోదయమునుంచి అతని అస్తమయము మట్టుకు
ఆయన భూనివాసులను† పిలిచియున్నాడు.
2 పరిపూర్ణ సౌందర్యము గల సీయోనునుంచి,
దేవుడు తేజరిల్లెను.
3 మన దేవుడు వచ్చి, మౌనముగానుండడు,
ఆయన ముందర అగ్ని మండుచుండును;
ఆయన చుట్టు ప్రచండ వాయువు కలుగును.
4 ఆయన తన జనులకు న్యాయము తీర్చుటకు,
మీది ఆకాశము భూమిని పిలుచును.
5 యాగము వల్ల నాతో నిబంధన చేసుకొనిన
నా దయా ప్రాప్తులను నాయొద్దికి కూర్చండి.
6 ఆకాశము ఆయన నీతిని తెలియచేసెను;
దేవుడు తానే న్యాయము తీర్చును. సెలా.
7 నా జనులారా! వినుడి, నేను పలుకుదును,
ఓ ఇశ్రాయేలా! నీ విషయము సాక్ష్యమిత్తును;
నేను దేవుడను, నీ దేవుడనై యున్నాను.
8 నీ యాగముల నిమిత్తము నిన్ను గద్దించను,
నీ హోమములు నిత్యముగా నా యెదుటనున్నవి.
9 నేను నీ ఇంట్లోనుంచి కోడెనైనా,
నీ మందలలోనుంచి చింబోతులనైనా పుచ్చుకొనను.

*లేక, వారిని త్రొక్కుదురు. †హెబ్రీలో, భూమి.

10 అడవి మృగములన్నియు,
వేయి కొండల మీదనున్న పశువులును నావే.
11 కొండల పక్షులనన్నిటిని నేను ఎరుగుదును,
బైటి పశ్వాదులు నా వశమైయున్నవి.
12 నాకు ఆకలి కలిగినా నీతో చెప్పను,
లోకము దాని పరిపూర్ణతయు నావే.
13 నేను వృషభముల మాంసము తిందునా?
చింబోతుల రక్తము తాగుదునా?
14 దేవుని గూర్చి స్తుతియాగము చేయుము,
మహోన్నతునికి నీ మ్రొక్కుబడులు చెల్లించుము.
15 ఆపత్కాలమందు నన్నుగూర్చి మొరబెట్టుము,
నేను నిన్ను విడిపింతును; నీవు నన్ను మహిమపరుతువు.
16 దుష్టునితో దేవుడు చెప్పినమాట,
—నా కట్టడలు వివరించుటకు నీకేమి పని?
నీవు నా నిబంధన నీ నోట వచించనేల?
17 నీవు బోధను ద్వేషించుచు,
నా మాటలను నీ వెనుకకు తోసివేయుచున్నావు,
18 నీవు దొంగను చూచినప్పుడు, వాడు నీకు ఇష్టుడు,
వ్యభిచారులతో నీవు పాలివాడవైతివి.
19 కీడుకు నీ నోరు అప్పగించినావు,
నీ నాలుక కపటము కల్పించును.
20 నీవు కూర్చుండి నీ సహోదరునికి విరోధముగా పలుకుదువు,
నీ తల్లి కుమారునిమీద అపనింద వేయుచునుందువు.
21 వీటిని నీవు చేసినప్పుడు, నేను మౌనినైయుంటిని,
నేను కేవలము నీవంటివాడనని నీకు తోచినది;
అయితే నేను నిన్ను గద్దించి,
నీ కన్నుల యెదుట వాటిని వరసగా ఏర్పరుతును.
22 కావున దేవుని మరిచేవారలారా! దీని యోచించుకొనుడి,
మిమ్ము చీల్చివేతునేమో; తప్పించేవాడెవడును ఉండడు.
23 స్తుతి యాగము చేసేవాడు నన్ను మహిమపరుచును,
తన మార్గమును సిద్ధపరుచుకొనేవారికి దేవుని రక్షణ కనపరుతును.

## 51. కీర్తన.

ప్రధాన గాయకునికి. దావీదు కీర్తన. బేత్షెబాయొద్దికి అతడు వెళ్లినతరువాత,
అతని యొద్దికి నాతాననే ప్రవక్త వెళ్లినప్పుడు ఇది రచించబడెను.

1 దేవా! నీ కృప చొప్పున నన్ను కరుణించుము;
నీ కనికరముల బాహుళ్యము చొప్పున,
నా ద్రోహములు తుడిచివేయుము.
2 నా అక్రమమునుంచి నన్ను బాగా కడిగి;
నా పాపమునుంచి నన్ను పవిత్రపరుచుము,
3 నేను నా నేరములను ఎరుగుదును;
నా పాపము ఎల్లప్పుడును నా ఎదుట ఉన్నది,
4 నీకు, కేవలము నీకు వ్యతిరిక్తముగా నేను పాపముచేసి,
నీ కన్నుల ఎదుట ఆ కీడు చేసినాను;

అయినందున, నీవు పలుకునప్పుడు నీతిమంతుడవును,
న్యాయము తీర్చునప్పుడు నిష్కళంకుడవునై యున్నావు.
5 ఇదుగో! నేను అక్రమమందు పుట్టితిని;
పాపమందు నా తల్లి నన్ను గర్భము ధరించెను.
6 ఇదుగో! అంతరంగములోని నిజమే ఇచ్ఛయించుచున్నావు;
ఆంతర్యములో నాకు జ్ఞానము తెలియజేతువు.
7 హిస్సోపుతో నన్ను పాపమునుంచి శుద్ధి చేతువు;
అప్పుడు నేను శుద్ధుడనైయుందును:
నీవు నన్ను కడిగితే,
హిమముకంటే తెల్లగానుంటును.
8 ఉత్సాహ సంతోషములు నాకు వినిపింతువు;
నీవు విరిచిన ఎముకలు హర్షించును
9 నా పాపములకు విముఖుడవై,
నా అక్రమములన్నియు తుడిచివేయుము.
10 దేవా! నాకు శుద్ధ హృదయము కలుగచేయుము;
స్థిరమైన ఆత్మను నాలో నూతనపరుచుము.
11 నీ సమ్ముఖమునుంచి నన్ను త్రోసివేయకుము;
పరిశుద్ధాత్మను నా యొద్దనుంచి తీసుకొనకుము.
12 నీ రక్షణానందము నాకు తిరిగీ పుట్టించుము,
యోగ్యమైన ఆత్మతో నన్ను దృఢపరుచుము.
13 అప్పుడు, ద్రోహులకు నీ త్రోవలను బోధింతును;
పాపులును నీ తట్టు తిరుగుదురు.
14 దేవా! రక్తాపరాధమునుంచి నన్ను విడిపించుము;
నా రక్షణ దేవా!
నా నాలుక నీ నీతిని గూర్చి పాడును.
15 ప్రభువా! నా పెదవులను తెరువుము;
అప్పుడు నా నోరు నీ స్తుతిని ప్రచురముచేసును.
16 నీవు యాగమిచ్ఛయించుటలేదు, యిచ్ఛయించితే అర్పింతును;
హోమము నీకిష్టముగాదు.
17 దేవుని యాగములు విరిగిన ఆత్మయే:
దేవా! విరిగి నలిగిన హృదయము నీవు అలక్ష్యము చేయవు.
18 నీ ఇష్టము చొప్పున సీయోనుకు మేలు చేయుము;
యెరూషలేముయొక్క గోడలను కట్టించుము.
19 అప్పుడు నీతియాగములు, హోమములు,
సర్వాంగ హోమ పశువులును నీకిష్టమవును.
అప్పుడు నీ వేదికమీద వారు కోడెలను అర్పింతురు.

## 52. కీర్తన.

ప్రధాన గాయకునికి. ఎదోమీయుడైన దోయేగు సౌలు యొద్దికి వచ్చి—
దావీదు అహీమెలెకు ఇంటికి వచ్చెనని అతనితో చెప్పినప్పుడు
దావీదు (రచించిన) మస్కీలు.

1 శూరుడా! కీడును గూర్చి నీవు ఎందుకు కొనియాడుకొంటున్నావు?
దేవుని కృప దినమెల్ల ఉన్నది.

2 నీ నాలుక చేటులను ఆలోచించును,
అది వాడిగల మంగలి కత్తివలె, మోసము చేయును.
3 మేలుకంటె కీడు,
నీతి పలుకుటకంటె అబద్ధము నీకు ఇష్టమైయున్నది. సెలా.
4 కపటమైన నాలుకా!
నాశకరమైన మాటలన్నిటిని ప్రేమించుచున్నావు.
5 కావున, దేవుడు నిన్ను బొత్తిగా అణగగొట్టును,
ఆయన నిన్ను పట్టుకొని (నీ) గుడారములోనుంచి వెడలించి,
జీవముగల వారి దేశములోనుంచి నిన్ను నిర్మూలము చేయును.
6 నీతిమంతులు చూచి, భయపడి వాని విషయము నవ్వుదురు. సెలా.
7 —ఇదుగో! తనకు బలముగా దేవుని ఉంచుకొనని ఆ శూరుడు!
తన ధనబాహుళ్యమందు నమ్మిక ఉంచి,
తన కామాతురతయందు బలవంతుడై యున్నాడనుకొందురు.
8 నేనైతే, దేవాలయములో పచ్చని ఒలీవ చెట్టువలెనున్నాను,
దేవుని కృపయందు నిరంతరమును నమ్మిక ఉంచియున్నాను.
9 నీవు దాని నెరవేర్చినావు గనుక నిన్ను ఎల్లప్పుడును స్తుతింతును:
నీ నామము కొరకు నిరీక్షింతును;
అది నీ పరిశుద్ధుల ఎదుట మంచిది.

## 53. కీర్తన.

ప్రధాన గాయకునికి. మహలతు మీద. దావీదు మస్కీలు.

1 బుద్ధిహీనుడు—దేవుడు లేడని హృదయములో అనుకొనెను,
వారు చెడిపోయిరి, అసహ్య కార్యములు చేసియున్నారు;
మేలు చేసేవాడు లేడు.
2 వివేకము కలిగి, దేవుని వెతికేవాడు ఉన్నాడేమో అని,
యెహోవా ఆకాశమునుంచి నరపుత్రులను నిదానించెను.
3 వారందరు తొలగి, ఏకముగా చెడియున్నారు:
మేలు చేసేవాడు లేడు, ఒక్కడైనా లేడు.
4 అక్రమము చేసేవారికి తెలివి లేదా!
వారు రొట్టె తినినట్లు నా ప్రజలను తిందురు:
దేవుని పేరట ప్రార్థించరు.
5 భయము లేనిచోట భయాక్రాంతులైరి:
నిన్ను ముట్టడి వేసేవారి ఎముకలు చెదరగొట్టెను:
వారిని అవమానపరిచినావు; దేవుడు వారిని ఉపేక్షించెను.
6 ఇశ్రాయేలుకు రక్షణ సీయోనులోనుంచి కలుగు గాక:
యెహోవా చెరలోని తన ప్రజలను మళ్లించేటప్పుడు,
యాకోబు ఆనందించును, ఇశ్రాయేలు సంతోషించును.

## 54. కీర్తన.

ప్రధాన గాయకునికి. తంతి వాద్యములమీద. జిఫీయులు వచ్చి,—దావీదు మాలో
దాగియున్నాడు కాదా అని సౌలుతో చెప్పినప్పుడు
దావీదు (రచించిన) మస్కీలు.

1 దేవా! నీ నామమువల్ల నన్ను రక్షించుము,
నీ శక్తివల్ల నాకు న్యాయము తీర్చుము.

2 దేవా! నా ప్రార్థన వినుము,
నా నోటి మాటలు ఆలకించుము.
3 పరులు నాకు విరోధముగా లేచియున్నారు,
బలాఢ్యులు నా ప్రాణము వెతికియున్నారు,
వారు తమ ఎదుట దేవుని ఉంచుకొనలేదు. సెలా.
4 ఇదుగో! దేవుడు నాకు సహాయుడు,
ప్రభువే నా ప్రాణమునకు ఆధారమైయున్నాడు.
5 ఆయన నా శత్రువుల మీదికి (వారి కీడు) తిరిగి రప్పించును;
నీవు సత్యము కలిగి వారిని నశింప చేయుము.
6 మనస్ఫూర్తితో నీకు యాగము చేతును,
యెహోవా! నీ నామము మంచిదని దాని స్తుతింతును;
7 ఆపదలన్నిటిలోనుంచి ఆయన నన్ను తప్పించెను,
నా కన్ను నా శత్రువులకు (కలిగినది) చూచెను.

## 55. కీర్తన.

ప్రధాన గాయకునికి. తంతివాద్యముల మీద.
దావీదు మస్కీలు.

1 దేవా! నా ప్రార్థన చెవినొగ్గి వినుము,
నా విన్నపమునకు విముఖుడవై యుండకుము.
2,3 నా మొర్ర ఆలకించి నాకు ఉత్తరమిమ్ము,
శత్రుని శబ్దమువల్ల, దుష్టుని బలాత్కారము వల్లను
నా వ్యాకులముచేత తిరుగులాడుచు ఘోషించుచున్నాను;
వారు నామీద అక్రమము దొర్లించుచున్నారు,
కోపముతో నాయందు పగపట్టుచున్నారు.
4 నా హృదయము నాలో వేదనపడుచున్నది,
మరణభయములు నామీద పడెను.
5 దిగులు వణుకును నాలో పుట్టెను,
మహాభయము నన్ను కమ్మెను.
6 —ఆహా! నాకు గువ్వవలె రెక్కలు కలిగితేనా!
నేను ఎగిరిపోయి నెమ్మదిగా ఉందును;
7 అదుగో! నేను దూరము వెళ్లుదును,
అరణ్యములో నివసింతుననుకొంటిని.
8 వడిగాలినుంచి సుడిగాలినుంచియు
తప్పించుకొనుటకు త్వరపడుదును.
9 ప్రభువా! నాశము చేసి, వారి నాలుకలు భేదపరుచుము,
పట్టణములో బలాత్కారము కలహమును చూచియున్నాను.
10 దివారాత్రులు అవి దాని గోడలమీద దానిచుట్టు తిరుగుచున్నవి,
అక్రమము చేటును దానిలో ఉన్నవి.
11 దాని మధ్యను చెడుతనము ఉన్నది,
దాని అంగడి వీధులనుంచి కపటోపాయములు తొలగవు.
12 నన్ను నిందించేవాడు శత్రువుకాడు, శత్రువైతే సహింతును;
నామీద అతిశయించినవాడు నన్ను ద్వేషించేవాడు కాడు,
అట్టివాడైతే, నేను వానికి దాగి యుండ వచ్చును.
13 అయితే నీవు నా తరగతి మనుష్యుడవు,
నా చెలికాడవు, నా పరిచయుడవై యున్నావు.

14 మనము కూడి మనోహరమైన సహవాసము చేసుకొంటిమి,
పండుగచేసే సమూహముతో దేవాలయమునకు నడిచితిమి.
15 వారికి ప్రళయములు కలుగును,
వారు అధోలోకమునకు సజీవులై దిగిపోదురు;
దుష్టత్వము వారి నివాసస్థలములలో, వారిలోపటనున్నది.
16 నేను దేవుని గూర్చి మొరబెట్టుచున్నాను,
యెహోవా నన్ను రక్షించుచున్నాడు.
17 సాయంకాలమందు, ప్రాతఃకాలమందు, మధ్యాహ్నకాలమందు
వ్యాకులపడుచు ఘోషించుచుందును:
ఆయన నా శబ్దము వినుచున్నాడు.
18 నాకు కలిగిన కలహమునుంచి
ఆయన, నెమ్మది కలుగుటకు నా ప్రాణము విమోచించెను;
అనేకులు నాకు విరోధులై యుండిరి.
19 దేవుడు ఆలకించి వారికి ప్రత్యుత్తరమిచ్చును,
ఆయన అనాదిగా ఆసీనుడైయున్నాడు: సెలా.
వారికి వ్యత్యయములు లేవు, వారు దేవునికి భయపడరు.
20 తనతో సమాధానపడిన వారి మీదికి చేతులు చాపెను,
తన నిబంధన అతిక్రమించెను.
21 వాని నోటిమాటలు వెన్నకంటే మెత్తనివి,
వాని హృదయములో కలహము ఉన్నది;
వాని మాటలు నూనెకంటే మెరుగైనవి,
అయితే అవి విచ్చుకత్తులై యున్నవి.
22 యెహోవా మీద నీ భారము వేయుము,
ఆయన నీకు ఆధారమై యుండును;
ఆయన ఎన్నడును నీతిమంతులను కదలనీయడు.
23 దేవా! నాశముగల గుంటలో వారిని దిగగొట్టుదువు,
రక్తాపరాధులు, వంచకులును
తమ ఆయుర్దినములలో సగమైనా బ్రతుకరు;
నేను నీయందు నమ్మికఉంచి యున్నాను.

## 56. కీర్తన.

ప్రధాన గాయకునికి. యోనతేలెమ్‌రెహోకీమ్* మీద.
గాతులో ఫిలిష్తీయులు దావీదును పట్టుకొన్నప్పుడు
ఆయన (రచించిన) మిక్తామ్.

1 దేవా! నన్ను కరుణించుము; మనుష్యుడు నన్ను మింగకోరుచున్నాడు,
దినమెల్ల వాడు పోరాడుచు, నన్ను బాధించుచున్నాడు.
2 దినమెల్ల నా విరోధులు నన్ను మింగకోరుతున్నారు,
అనేకులు గర్వించి నాకు విరోధముగా పోరాడుతున్నారు.
3 నేను భయపడే దినమున నిన్ను ఆశ్రయించుచుందును.
4 దేవుని వాక్యము పట్టి ఆయనను కీర్తింతును,
దేవుని నమ్మియున్నాను, భయపడను;
శరీరి నన్ను ఏమి చేయగలడు?

*అనగా, దూరమందుండే మూగగువ్వ.

5 దినమెల్ల వారు నా మాటలు అపార్థము చేయుచున్నారు,
నాకు విరోధముగా వారి తలంపులన్నియు కీడుకై యున్నవి.
6 వారు గుంపు కూడుకొని, పొంచియుందురు;
నా ప్రాణము కొరకు కనిపెట్టిన ప్రకారముగా,
వారు నా అడుగులను గురుతు పెట్టుదురు.
7 అక్రమమువల్ల వారు తప్పించుకొందురా?
దేవా! కోపమువల్ల ప్రజలను అణగగొట్టుము.
8 నీవు నా సంచారము లక్షించినావు,
నీ బుడ్డిలో నీవే నా కన్నీళ్లు ఉంచుకొనుము;
అవి నీ లెక్క పుస్తకములో లేవా?
9 అప్పుడు, నేను మొరబెట్టే దినమున నా శత్రువులు వెనుకకు తిరుగుదురు,
ఇది నాకు తెలుసును; దేవుడు నాకు తోడై యున్నాడు.
10 (ఆయన) వాక్యముపట్టి దేవుని కీర్తింతును,
(ఆయన) వాక్యముపట్టి యెహోవాను కీర్తింతును.
11 దేవుని నమ్మి యున్నాను, భయపడను;
నరుడు నన్ను ఏమి చేయగలడు?
12 దేవా! నీ మ్రొక్కుబడులు నామీద ఉన్నవి,
నేను నీకు స్తోత్రములు చెల్లింతును;
13 నీవు మరణమునుంచి నా ప్రాణము తప్పించినావు,
నేను జీవముగల వారి వెలుగులో, దేవుని ఎదుట సంచరించుటకు,
జారిపడకుండ నా పాదములు (తప్పించవా?)

## 57. కీర్తన.

ప్రధాన గాయకునికి. నశింపచేయకుము. గుహలో దావీదు
సావూలు యొద్దనుంచి పారిపోయినప్పుడు
అతడు (రచించిన) మిక్తామ్.

1 నన్ను కరుణించుము, దేవా! నన్ను కరుణించుము;
నా ప్రాణము నీ శరణుజొచ్చి యున్నది;
చేటులు గతించే మట్టుకు, నీ రెక్కలనీడ ఆశ్రయింతును.
2 మహోన్నతుడైన దేవుని గూర్చి,
నా కొరకు (మేలు) నెరవేర్చే దేవుని గూర్చి మొరబెట్టుదును.
3 నన్ను మ్రింగ కోరినవాడు నిందించినప్పటికి,
ఆయన ఆకాశమునుంచి దూతను పంపి నన్ను రక్షించును; సెలా.
దేవుడు తన కృపను తన సత్యమును రాజేసును.
4 నా ప్రాణము సింహములలో ఉన్నది;
మండుచున్న నరపుత్రులలో పండుకొంటున్నాను,
వారి పళ్లు శూలములు, అమ్ములునై యున్నవి.
వారి నాలుక వాడిగల కత్తి.
5 దేవా! ఆకాశముకంటే మహోన్నతుడవై యుండుము,
నీ మహిమ సర్వ భూమిమీద ఉండుగాక.
6 వారు నా అడుగులకు వల ఒడ్డిరి; నా ప్రాణము కుంగదీసిరి;
నా యెదుట గుంట తవ్వి, దానిలో తామే పడిరి. సెలా.
7 నా హృదయము దృఢమైనది; దేవా! నా హృదయము దృఢమైనది;
నేను పాడుచు కీర్తింతును.

8 ఓ నా మహిమా! మేలుకొనుము; వీణా! కిన్నెరా! మేలుకొనుడి,
నేను వేకువను లేపుదును.
9 ప్రభువా! జనులలో నిన్ను స్తుతింతును,
ప్రజలలో నిన్ను కీర్తింతును;
10 ఆకాశమువలె నీ కృపయు
మేఘముల వలె నీ సత్యము గొప్పవై యున్నవి.
11 దేవా! ఆకాశముకంటే మహోన్నతుడవై యుండుము,
నీ మహిమ సర్వ భూమిమీద ఉండుగాక.

## 58. కీర్తన.

ప్రధాన గాయకునికి. నశింపచేయకుము. దావీదు కీర్తన.

1 మీరు నిశ్చయముగా నీతి మౌనవృత్తితో పలుకుచున్నారా?
నరపుత్రులారా! యథార్థముగా న్యాయపుతీర్పు చేయుచున్నారా?
2 లేదే, హృదయముతో మీరు అక్రమములు జరిగించుచున్నారు,
మీరు దేశమందు మీ చేతుల బలాత్కారము తూచి చెల్లించుచున్నారు.
3 దుర్మార్గులు గర్భము మొదలుకొని అన్యులైయున్నారు,
అబద్ధమాడేవారు పుట్టినది మొదలుకొని తప్పిపోవుచున్నారు.
4 వారి విషము సర్పవిషము వలెనున్నది;
చెవి మూసుకొనే చెవిటి పాము వలెనున్నారు.
5 ఎంత నేర్పుగా మంత్రములతో మంత్రించినను,
అది మాంత్రికుల శబ్దము వినదు.
6 దేవా! వారి పళ్లను వారి నోట విరుగ గొట్టుము;
యెహోవా! కొదమ సింహముల కోరలను ఊడగొట్టుము.
7 వారు పారే నీళ్లవలె గతించి పోదురుగాక;
ఒకడు తన బాణములు సంధించితే, అవి ఛేదించబడునట్లు ఉండుగాక.
8 కరిగి జిగటగా పోయే నత్తవలె,
సూర్యుని చూడని స్త్రీగర్భస్రావమువలె నుందురుగాక.
9 మీ కుండలకు ముళ్లకంపల (సెగ) తగలక మునుపు,
పచ్చివైనను ఎండువైనను, వాటిని వడిగా ఎగరగొట్టును.
10 నీతిమంతుడు ఈ ప్రతిదండన చూచి సంతోషించును,
అతడు దుష్టుల రక్తములో తన పాదములు కడుగుకొనును.
11 కావున—నిశ్చయముగా నీతిమంతునికి ఫలము కలదనియు,
నిశ్చయముగా భూమిమీద న్యాయము తీర్చే దేవుడు ఉన్నాడనియు,
మనుష్యులు ఒప్పుకొందురు.

## 59. కీర్తన.

ప్రధాన గాయకునికి. నశింపచేయకుము. అతని చంపుటకు సౌలు
పంపినవారు ఇంటియొద్ద పొంచియున్నప్పుడు,
దావీదు (రచించిన) మిక్తామ్.

1 నా దేవా! నా శత్రువులనుంచి నన్ను తప్పించుము,
నాకు విరోధముగా లేచే వారినుంచి నన్ను ఉద్ధరించుము.
2 అక్రమము చేసే వారినుంచి నన్ను తప్పించుము.
రక్తాపరాధులనుంచి నన్ను రక్షించుము.
3 ఇదుగో! నా ప్రాణము కొరకు పొంచి యున్నారు;
యెహోవా! నా ద్రోహము కొరకు కాదు, నా పాపము కొరకు కాదుగాని,

బలవంతులై నాకు విరోధముగా పోగుబడి యున్నారు.
4 (నాయందు) అక్రమము లేకనే,
వారు పరుగెత్తి సిద్ధపరుచుకొందురు;
నన్ను ఎదురుకొనుటకు మేలుకొని చూడుము.
5 సేనల దేవుడవైన యెహోవా! ఇశ్రాయేలు దేవా!
సమస్త రాష్ట్రములకు తీర్పుచేయుటకు మేలుకొనుము:
అక్రమము చేసే వంచకులలో ఎవనిని కనికరించకుము. సెలా.
6 వారు సాయంకాలమందు మళ్లి వత్తురు;
కుక్కవలె మొరుగుచు పట్టణముచుట్టు తిరుగుదురు.
7 ఇదుగో! వారు తమ నోటినుంచి మాటలు కక్కుచుందురు;
వారి పెదవులలో కత్తులున్నవి,—ఎవరు వింటారనుకొందురు.
8 అయితే యెహోవా! నీవు వారిని గూర్చి నవ్వెదువు,
సమస్త రాష్ట్రములను అపహసింతువు.
9 నా బలమా! నీ నిమిత్తము కనిపెట్టుకొనుచున్నాను;
దేవుడే నాకు దుర్గమై యున్నాడు.
10 నా దేవుడు తన కృపతో నన్ను ఎదురుకొనును,
నా శత్రువులకు (జరగిన దాని) దేవుడు నన్ను చూడనిచ్చును.
11 వారిని చంపకుము; నా ప్రజలు దాని మరిచిపోదురేమో;
మా కేడెమైయున్న యెహోవా! వారిని తూలించి అణగగొట్టుము.
12 వారి పెదవుల మాట వారి నోటి పాపము,
వారు పలికే శాపమువల్ల అబద్ధమువల్లను,
వారు తమ గర్వములో చిక్కుబడుదురు.
13 నీ ఆగ్రహముతో క్షీణింప చేయుము,
వారు లేకపోయేటట్టు వారిని క్షీణింపచేయుము;
అప్పుడు దేవుడు యాకోబు (వంశము) ఏలుచున్నాడని,
భూమి దిగంతముల వరకు ఎరుగుదురు. సెలా.
14 వారు సాయంకాలమందు మళ్లీ వత్తురు,
కుక్కవలె మొరుగుచు పట్టణము చుట్టు తిరుగుదురు.
15 వారు ఆహారముకొరకు ఇటుఅటు తిరుగులాడుచు,
తృప్తి పొందకనే రాత్రి వెళ్లబుచ్చ వలెను.
16 నేనైతే, నీ బలమును కీర్తింతును,
ఉదయమందు నీ కృపను గూర్చి సంతోషగానము చేతును;
నీవు నాకు దుర్గమై యున్నావు,
నాకు ఆపద కలిగిన దినమందు నాకు ఆశ్రయము నీవే.
17 నా బలమా! నిన్నే కీర్తింతును;
దేవుడు నా దుర్గము, కృపగల నా దేవుడునై యున్నాడు.

## 60. కీర్తన.

ప్రధాన గాయకునికి. షూషన్యేదూతుమీద. దావీదు అరమ్నహరాయిముతోను,
అరమ్సోబాతోను యుద్ధము చేయగా, యోవాబు ఉప్పుపల్లములో
పన్నెండువేలమంది ఎదోమీయులను చంపి తిరిగి వచ్చినప్పుడు,
అతడు బోధనిమిత్తము (రచించిన) మిక్తామ్.

1 దేవా! మమ్ము విడనాడినావు, మమ్ము చెదరగొట్టినావు,
నీవు కోపపడినావు, (క్షేమము) మాకు తిరిగి కలిగించుము.

2 నీవు భూమి కంపింపచేసి, దాని పగిల్చి యున్నావు,
దాని సందులు బాగు చేయుము; అది కదులుచున్నది.
3 నీ ప్రజలకు కఠినమైన సంగతి చూపించినావు,
భ్రమింప చేసే మద్యము మమ్ము తాగించినావు.
4 సత్యము నిమిత్తము యెత్తుటకు,
నీకు భయపడే వారికి ధ్వజము ఇచ్చియున్నావు. సెలా
5 నీ ప్రియులు తప్పించబడుటకు,
నీ కుడిచేతితో రక్షించి, మాకు ఉత్తరమిమ్ము.
6 దేవుడు తన పరిశుద్ధతతోడని మాట ఇచ్చెను;
ప్రహర్షించెదను; షెకెము* పంచిపెట్టుదును,
సుక్కోతు* లోయను కొలిపింతును.
7 గిలాదు* నాది, మనష్షే* నాది,
ఎఫ్రాయిము* నాకు శిరస్త్రాణమై యున్నది,
యూదా* నా రాజదండము.
8 మోయాబు నేను కాళ్లు కడుగుకొనే పళ్లెము,
ఎదోము మీదికి నా చెప్పు విసిరివేతును;
ఫిలిష్తు! నన్ను గూర్చి ఉత్సాహధ్వని చేయుము.
9 కోటగల పట్టణములోకి నన్ను ఎవడు కొంచుపోవును?
ఎదోములోకి నన్ను ఎవడు నడిపించియున్నాడు?
10 దేవా! నీవు మమ్ము విడనాడినావు కావా?
దేవా! మా సేనలతోకూడా నీవు బైలుదేరకనున్నావు కావా?
11 శత్రువునకు విరోధముగా మాకు సహాయము దయచేయుము,
మనుష్యుల సహాయము వ్యర్థమవును.
12 దేవుని వల్ల అద్భుతకార్యములు చేతుము,
ఆయన మన శత్రువులను అణగత్రొక్కును.

## 61. కీర్తన.

ప్రధాన గాయకునికి. తంతివాద్యములమీద. దావీదు కీర్తన.

1 దేవా! నా మొర్రను ఆలకించుము,
నా ప్రార్థనకు చెవినొగ్గుము.
2 నా హృదయము కుందేటప్పుడు భూదిగంతములనుండి నిన్ను పిలుతును,
నేనెక్కలేని ఉన్నత పర్వతము మీదికి నన్ను నడిపింతువు;
3 నీవు నాకు ఆశ్రయముగాను,
శత్రువుని యెదుట బలమైన బురుజుగానున్నావు.
4 నీ గుడారములో ఎల్ల కాలము నివసింతును,
నీ రెక్కల చాటును ఆశ్రయింతును. సెలా.
5 దేవా! నా మ్రొక్కుబడులు ఆలకించి యున్నావు,
నీ నామమునకు భయపడే వారి స్వాస్థ్యము నాకిచ్చియున్నావు.
6 రాజునకు దీర్ఘాయువు కలుగచేతువు,
ఆయన సంవత్సరములు తరతరములమట్టుకుండును.
7 ఆయన దేవుని సన్నిధిలో నిరంతరమును ఆసీనుడై యుండును,
ఆయనను కాపాడుటకు కృపాసత్యములను నియమించుము.

---

*ఒక దేశము.

8 ఈలాగున నేను దినదినమున నా మ్రొక్కుబడులు చెల్లించుచు,
నీ నామము నిరంతరము కీర్తింతును.

## 62. కీర్తన.

ప్రధాన గాయకునికి. యెదూతూను మీద. దావీదు కీర్తన.

1 దేవుని యెదుటనే* నా ప్రాణము శాంతపడియున్నది,
ఆయన వల్లనే నాకు రక్షణ కలుగును.
2 ఆయనే నా శైలము, నా రక్షణ, నా దుర్గమునై యున్నాడు,
నేను మిక్కిలి కదిలింపబడను.
3 మీరు ఎన్నాళ్లమట్టుకు ఒకని పైబడుదురు?
ఒరిగిన గోడవలె, విడగొట్టబడిన ప్రాకారమువలె,
మీరందరు ఎన్నాళ్లమట్టుకు వాని విరుగగొట్టుదురు.
4 వాని ఔన్నత్యమునుంచి వాని పడద్రోయుటకే ఆలోచించుచున్నారు;
అబద్ధమాడుట వారికి ఇష్టము,
వారు తమ తమ నోటితో ఆశీర్వదించుచు,
తమ అంతరంగములో దూషించుచుందురు.
5 నా ఆత్మా! దేవుని యెదుటనే* శాంతపడి యుండుము,
ఆయన వల్లనే నా నిరీక్షణ సిద్ధించును.
6 ఆయన మాత్రమే నా శైలము, నా రక్షణ,
నా దుర్గమునై యున్నాడు; నేను కదిలింపబడను.
7 నా రక్షణకు నా మహిమకు దేవుడే ఆధారము;
నా బలశైలము, నా ఆశ్రయము దేవునియందున్నది.
8 ఓ జనులారా! ఎల్లప్పుడు ఆయనయందు నమ్మిక ఉంచుడి,
ఆయన యెదుట మీ హృదయములు కుమ్మరించుడి;
దేవుడు మనకు ఆశ్రయమై యున్నాడు.
9 నరపుత్రులు వట్టి ఊపిరివలెనున్నారు,
మానుషులు† మాయాస్వరూపులు;
వట్టి ఊపిరి కంటె తేలికగానుండి,
త్రాసులో వారందరు మీదికి లేతురు.
10 బలాత్కారమందు నమ్మిక ఉంచకుడి,
దోచుకొనుటవల్ల గర్వపడకుడి;
ధనాభివృద్ధి కలిగినను, దానిమీద హృదయముంచకుడి.
11 ఒకమారు దేవుడు పలికెను, రెండుమారులు దీని వింటిని,
—బలము దేవునిదే.
12 ప్రభువా! కృపయును నీదే;
ప్రతి మనుష్యునికి వాని వాని క్రియ చొప్పున,
నీవే ప్రతి ఫలమిచ్చుచున్నావు.

## 63. కీర్తన.

యూదారణ్యములో ఉన్నప్పుడు దావీదు (రచించిన) కీర్తన

1 దేవా! నా దేవుడవు నీవే నిన్ను జాగ్రత్తగా వెతుకుదును,
నా ఆత్మ నీకొరకు తృష్ణగొని యున్నది;

---

*లేక, యందే. †లేక, ఘనులు.

నీళ్లు లేక ఎండిన దేశమందు,
నా శరీరము నీ నిమిత్తము కృశించుచున్నది.
2 ఈలాగున నీ బలము నీ మహిమను చూచుటకు,
పరిశుద్ధాలయమందు నిన్ను తేరి చూచియున్నాను.
3 నీ కృప జీవము కంటే మంచిది,
కావున నా పెదవులు నీ స్తోత్రము పచించును.
4 ఈలాగున నా జీవితకాలమంతయు నిన్ను స్తుతింతును,
నీ పేరట నా చేతులు ఎత్తుదును.
5 క్రొవ్వు మెదడు నాకు కలిగినట్టు నా ప్రాణము తృప్తిపొందును,
ఉత్సహించే పెదవులతో నా నోరు గానము చేసును.
6 నా మంచము మీద నిన్ను జ్ఞాపకము చేసుకొంటూ,
రాత్రి జాములయందు నిన్ను ధ్యానించుచున్నాను;
7 నీవు నాకు సహాయుమై యుంటివి,
నీ రెక్కల నీడలో ఉత్సాహ ధ్వని చేతును.
8 నా ఆత్మ నిన్ను అంటుకొని వెంబడించుచున్నది,
నీ కుడి చేయి నాకు ఆధారమై యున్నది.
9 వారైతేనో నశించుటకే నా ప్రాణము వెతుకుచున్నారు,
వారు భూమి కింది చోట్లకు దిగిపోదురు.
10 ఖడ్గ బలమునకు వారు అప్పగించబడుదురు,
నక్కల పాలవుదురు.
11 అయితే రాజు దేవునియందు సంతోషించును;
ఆయన తోడని ప్రమాణము చేసే ప్రతివాదును పొగడుకొనును;
అబద్ధమాడే వారి నోరు మూయబడును.

## 64. కీర్తన.

ప్రధాన గాయకునికి. దావీదు కీర్తన.

1 దేవా! నా చింతలోని నా శబ్దము ఆలకించుము,
శత్రు భయమునుంచి నా ప్రాణము కాపాడుము.
2 దుర్మార్గుల కుట్రనుంచి,
అక్రమము చేసే వారి గల్లత్తునుంచి నన్ను దాచుము;
3,4 వారు కత్తివలె తమ నాలుకలు పదును పెట్టిరి,
చాటైన స్థలములలో యథార్థిని కొట్టుటకు,
వారు చేదుమాటలనే తమ బాణములు సంధించిరి;
అకస్మాత్తుగా అతని కొట్టియు భయపడరు.
5 వారు తమ దురాలోచన స్థిరపరచుకొందురు;
చాటుగా ఉరులను ఒడ్డుటకు యోచించుకొని,
—మనలను ఎవరు చూతురని చెప్పుకొందురు.
6 వారు అక్రమములను అన్వేషింతురు,
అన్వేషితమైన ఉపాయము నెరవేర్చినాము (అనుకొందురు;)
వారిలో ప్రతివాని అంతరంగము, హృదయమును అగాధమైయున్నది.
7 అప్పుడు దేవుడు బాణముతో వారిని కొట్టెను,
వారికి గాయములు ఆకస్మికముగా కలిగెను.
8 ఆయన వారిని జోగిపడ చేసెను,
వారి నాలుకలు వారి మీదనే పడెను,

వారిని చూచేవారందరు తల ఆడింతురు.*
9 సమస్త మనుష్యులు భయపడి,
దేవుని కార్యములు తెలియచేసి,
ఆయన చేసినదని బోధపరుచుకొందురు.†
10 నీతిమంతుడు యెహోవాయందు సంతోషించి ఆయనను ఆశ్రయించును;
యథార్థ హృదయము గలవారందరు కొనియాడుకొందురు.

## 65. కీర్తన.

ప్రధాన గాయకునికి. దావీదు కీర్తన. సంగీతము.

1 దేవా! సీయోనులో నీకు మౌనవృత్తి కీర్తన;
నీకు మ్రొక్కుబడి చెల్లించబడును.
2 ప్రార్థనను ఆలకించువాడా!
నీ యొద్దికి సమస్త శరీరులు వత్తురు.
3 అక్రమ కార్యములు నామీద ప్రబలమైనవి,
మా ద్రోహములు నీవే కప్పివేతువు.
4 నీ అంగణములలో నివసించే నిమిత్తము,
నీవు ఏర్పరిచి చేర్చుకొనేవాడు ధన్యుడు:
నీ పరిశుద్ధాలయమనే నీ ఇంటి మేలుచేత తృప్తి పొందుదుముగాక.
5 మా రక్షకుడవైన దేవా!
భీకర కార్యములవల్ల మాకు నీతితో ఉత్తరమిత్తువు;
దూరమైన భూ సముద్రముల దిగంతములన్నిటికి,
నీవు ఆశ్రయమై యున్నావు.
6 నీవు బలముతో నడుము కట్టుకొని,
నీ శక్తివల్ల పర్వతములు స్థిరపరుచుచు,
7 సముద్రఘోషను, దాని తరంగముల ఘోషను,
ప్రజలయొక్క అల్లరినిని చల్లార్చువాడవు నీవే.
8 కావున, దిగంతముల నివాసులు నీ ఆనవాళ్లకు భయపడుదురు;
నీవు ఉదయాస్తమానములయ్యే దిక్కులను ఉత్సహింప చేయుచున్నావు.
9 నీవు భూమికి‡ దర్శనమిచ్చి, అది (వానచే) నిండి పొర్లి పారచేసినావు;
దానికి మిక్కిలి ఐశ్వర్యము కలుగ చేయుచున్నావు,
దేవుని నది నీళ్లతో నిండియున్నది;
నీవు వారి ధాన్యము సిద్ధపరుచుచున్నావు;
భూమి ఆలాగున సిద్ధపరుచువాడవు నీవే.
10 నీవు దాని చాళ్లు బాగా తడుపుచు,
దాని గనిమలు సదును చేయుచు,
వాన జల్లులతో దాని పదును చేయుచు,
దాని మొలకలను దీవించుచునున్నావు.
11 నీ మంచితనమనే కిరీటము సంవత్సరమునకు వేసియున్నావు;
నీ జాడలు సారము చిలకరింపుచున్నవి.
12 అవి అడవి బీడులమీద చిలకరింపుచున్నవి;
కొండలు ఆనందాలంకారము ధరించుకొనుచున్నవి.

* లేక, పారిపోదురు. † లేక, గ్రహింతురు. ‡ లేక, దేశమునకు.

13 పచ్చికపట్లు మందలచేత కప్పబడి యున్నవి;
లోయలు సస్యముతో అలంకరించబడి యున్నవి;
అవి సంతోష ధ్వని చేసి గానము కూడ చేయును.

## 66. కీర్తన.

ప్రధాన గాయకునికి. సంగీతము. కీర్తన.

1 సర్వ భూజనులారా! దేవుని గూర్చి సంతోష ధ్వని చేయుడి.
2 ఆయన నామ మహిమను కీర్తించుడి,
ఆయన మహిమ పట్టి గానము చేయుడి.
3 —నీ కార్యములు ఎంతో భీకరమైనవి!
నీ బలాతిశయమువల్ల నీ శత్రువులు నీకు లోబడి యుందురు.
4 సర్వలోకము నీకు సాగిలపడి నిన్ను కీర్తించును;
నీ నామము కీర్తించునని దేవునితో చెప్పుడి. సెలా.
5 దేవుని కార్యములు చూడ రండి!
ఆయన నరపుత్రుల యెడల చేసిన క్రియలవల్ల భీకరుడు.
6 ఆయన సముద్రము ఎండిన భూమిగా చేసెను;
వారు కాలినడకగా దాటిరి;
అక్కడ ఆయనయందు సంతోషింతము.
7 ఆయన తన బలముచేత నిరంతరమును ఏలుచున్నాడు,
ఆయన కన్నులు రాష్ట్రములను వేగు చూచుచున్నవి,
ద్రోహులు తమ్ము తాము హెచ్చించుకొన కూడదు. సెలా.
8 ఓ జనులారా! మా దేవునికి వందనము చేయుడి;
ఆయన కీర్తి శబ్దము వినిపించుడి.
9 ఆయన సజీవులైనవారిలో మనలను కాపాడుచు,
మన పాదములు కదలనియ్యలేదు.
10 దేవా! నీవు మమ్ము పరిశీలించినావు;
వెండి నిర్మలపరచబడిన రీతిగా మమ్ము నిర్మలపరిచినావు.
11 నీవు వలలోకి మమ్ము చేర్చి,
మా నడుములకు ఇబ్బంది కలుగ చేసినావు.
12 మా తలలమీద మనుష్యులు ఎక్కి నడవ చేసినావు,
మేము అగ్ని జలములలోకి చేరితిమి;
నీవు సమృద్ధికి మమ్ము రప్పించినావు.
13 ఆరోహణయాగ ద్రవ్యములు నీ ఆలయమునకు తీసుకొనివచ్చి,
నా మ్రొక్కుబడులు నీకు చెల్లింతును;
14 నాకు శ్రమ కలిగినప్పుడు,
వాటిని నా పెదవులు పలికెను, నా నోరు వచించెను.
15 పొట్టేళ్ల ధూపముతో,
కొవ్విన గొర్రెలతో నీకు ఆరోహణయాగము చేతును,
ఎద్దులు మేకపోతులును అర్పింతును.
16 దేవునికి భయపడేవారలారా! మీరందరు వచ్చి ఆలకించుడి;
ఆయన నా ప్రాణముకొరకు చేసినదాని నన్ను వివరించనియ్యుడి.
17 ఆయనను గూర్చి నేను కంఠమెత్తి మొరబెట్టినాను,
స్తోత్రము నా నాలుక మీద నుండెను.

18 నా హృదయములో నేను అక్రమము లక్ష్యముచేసితే,
ప్రభువు వినకపోవును.
19 నిశ్చయముగా దేవుడు ఆలకించెను,
ఆయన నా ప్రార్థనశబ్దము చిత్తగించియున్నాడు.
20 నా ప్రార్థననైనా తన కృపనైనా,
నా యొద్దనుంచి తొలగదోయని దేవునికి వందనమవుగాక.

## 67. కీర్తన.

ప్రధాన గాయకునికి. తంతివాద్యములమీద.
కీర్తన. సంగీతము.

1,2 భూమిమీద నీ మార్గము,
సమస్త రాష్ట్రములలో నీ రక్షణయు తెలియబడుటకు,
దేవుడు మమ్ము కరుణించి మమ్ము దీవించి,
మా మీద తన ముఖకాంతి ప్రకాశింప చేసుగాక, సెలా.
3 దేవా! నిన్ను జనములు స్తుతించుగాక,
సమస్త జనములును నిన్ను స్తుతించుగాక.
4 ప్రజలు సంతోషించుచు ఉత్సాహధ్వని చేతురుగాక,
నీవు యథార్థముగా ప్రజలకు న్యాయము తీర్తువు,
భూమి మీదనున్న ప్రజలను నడిపింతువు, సెలా.
5 దేవా! నిన్ను జనములు స్తుతించుగాక,
సమస్త జనములును నిన్ను స్తుతించుగాక.
6 భూమి తన ఫలములిచ్చెను,
దేవుడు, మా దేవుడు మమ్మును ఆశీర్వదించును.
7 దేవుడు మమ్మును ఆశీర్వదించును;
భూదిగంతములన్నియు ఆయనకు భయపడును.

## 68. కీర్తన.

ప్రధాన గాయకునికి. దావీదు కీర్తన. సంగీతము.

1 దేవుడు లేచుగాక, ఆయన శత్రువులు చెదరిపోదురుగాక;
ఆయన ద్వేషులు ఆయన యెదుటనుంచి పారిపోదురుగాక.
2 పొగ చెదరగొట్టబడినట్టు వారిని చెదరగొట్టుము,
మైనము అగ్నియెదుట ఏలాగు కరిగిపోవునో,
ఆలాగున దుష్టులు దేవుని యెదుట నశింతురుగాక.
3 నీతిమంతులు సంతోషించుచు దేవుని యెదుట ఉత్సహింతురుగాక,
వారు సంతోషముతో ఉల్లసింతురుగాక.
4 దేవుని గూర్చి పాడుడి, ఆయన నామము కీర్తించుడి,
అరణ్యములలో వాహనమెక్కి విజయము చేసే వానికొరకు,
తోవ సరాళము చేయుడి: ఆయన నామము యాహే,*
ఆయన యెదుట ప్రహర్షించుడి.
5 తన పరిశుద్ధాలయమందు దేవుడు,
తండ్రిలేని వారికి తండ్రియు, విధవలకు న్యాయకర్తయునై యున్నాడు.

*యెహోవాయే.

6 దేవుడు ఏకాంగులను సంసారులగా చేసును,
ఆయన బంధింపబడినవారిని వదిలించి వారిని వర్ధిల్లచేసును;
ద్రోహులే నిర్జల భూమిలో నివసింతురు.
7 దేవా! నీవు జనుల ముందర బైలుదేరి,
ఎడారిలో విజయము చేసినప్పుడు, సెలా.
8 భూమి వణికెను, దేవుని యెదుట ఆకాశమునుంచి వర్షము కురిసెను,
అల్ల సీనాయియును ఇశ్రాయేలు దేవుడైన దేవుని యెదుట కంపించెను
9 దేవా! ఈవుల వర్షము నీ స్వాస్థ్యము మీద కురిపించినావు,
అది అలసటపడినప్పుడు దాని బలపరిచినావు.
10 దానిలో నీ మంద నివసించెను,
నీ అనుగ్రహమువల్ల బాధపడేవారికి సదుపాయము చేసినావు.
11 ప్రభువు మాట పలికితే,
దాని ప్రకటించే స్త్రీలు గొప్ప సైన్యమైయుందురు.
12 పారిపోవుచున్నారు, సైన్యముల రాజులు పారిపోవుచున్నారు;
ఇంట్లో నిలిచిన ఆమె దోపుడు సొమ్ము పంచిపెట్టును.
13 మీరు గొర్రెల దొడ్ల మధ్యను పండుకొన వచ్చునా?*
గువ్వ రెక్కలు వెండితోను
దాని వెంట్రుకలు మేలిమి బంగారముతో కప్పబడును.
14 సర్వశక్తుడు దానిలో రాజులను చెదరగొట్టినప్పుడు,
సల్మోను మీద హిమమువలె నుండెను.†
15 బాషాను పర్వతము దేవపర్వతము,‡
బాషాను పర్వతము అనేక శిఖరములు గలది,
16 శిఖరములుగల పర్వతములారా!
దేవుడు నివసించుటకు ఇచ్ఛయించిన పర్వతముమీద,
మీరు ఎందుకు మత్సరపడుచున్నారు!
(అక్కడ) యెహోవా నిరంతరమును ఉండును.
17 దేవుని రథములు సహస్రములు, సహస్ర సహస్రములునై యున్నవి,
ప్రభువు వాటిలో ఉన్నాడు; సీనాయి పరిశుద్ధస్థలములో ఉన్నది.§
18 మీదికి వెళ్లినావు; పట్టబడినవారిని చెరపట్టుకొని పోతివి,
మనుష్యులను కానుకలుగా,
యెహోవా దేవుడు వారిలో నివసించుటకు ద్రోహులను నీవు పుచ్చుకొంటివి.
19 ప్రభువునకు జయము! దినదినము ఆయన,
మా రక్షకుడైన ఆ దేవుడే మా భారము వహించుచున్నాడు. సెలా.
20 మా దేవుడు రక్షణ క్రియలు చేసే దేవుడు:
మరణము తప్పించుకొనుటకు,
ప్రభువైన యెహోవాయొద్ద సాధనములున్నవి.
21 నిశ్చయముగా దేవుడు తన శత్రువుల తలలను,
తన అపరాధములయందు తప్పకపోయే వానియొక్క
వెంట్రుకలుగల నడినెత్తిని పగలగొట్టును.

---

*Judges. v. 16. †c. ix. 48. ‡లేక, మహాపర్వతము.
§లేక, పరిశుద్ధస్థలము సీనాయివంటిది.

22,23 రక్తముతో నీ పాదము కడుగుకొనుటకు,
నీ కుక్కల నాలుకలు శత్రువులలో పాలు పుచ్చుకొనుటకును,
నేను బాషానునుంచి,
సముద్రముయొక్క అగాధ జలములలోనుంచి*
తిరిగి రాజేతునని ప్రభువు చెప్పుచున్నాడు.
24 దేవా! వారు నీ నడతలను,
నా దేవుని, నా రాజుని నడతలను పరిశుద్ధాలయమందు చూచిరి.
25 ముందర పాడేవారు, వెనుకను తంతివాద్యములవారు,
మధ్యను తంబురువాయించే కన్యకలు నడిచిరి.
26 సంఘములలో దేవుని స్తోత్రము చేయుచున్నారు,
ఇశ్రాయేలు వంశస్థులు ప్రభుని స్తోత్రము చేయుచున్నారు.
27 అక్కడ వారిని ఏలే చిన్న బెన్యామీను,
యూదా అధిపతుల సమూహము,
జబులోను అధిపతులు, నప్తాలీ అధిపతులునుండిరి.
28 నీ దేవుడు నీ బలము నియమించియున్నాడు;
దేవా! నీవు మాకొరకు చేసినదాని బలపరుచుము.
29 యెరూషలేముమీది నీ నగరము నిమిత్తము,
రాజులు కానుకలు తెచ్చి అర్పింతురు.
30 వెండి రేకులతో లొంగియుండగా,
జమ్ములోని జంతువును,
దూడలవంటి జనులలో ఆబోతుల గుంపును గద్దించుము,
యుద్ధములయందు సంతోషించే వారిని చెదరగొట్టుము.
31 ప్రధానులు ఐగుప్తులోనుంచి వచ్చుచుందురు,
కూషు తన చేతులను వేగముగా దేవునితట్టు చాచును.
32 భూరాజ్యములారా! దేవుని గూర్చి పాడుడి,
ప్రభుని కీర్తించుడి. సెలా.
33 అనాదిగానున్న ఆకాశములమీద సెక్కేవాని (కీర్తించుడి.)
ఇదుగో! ఆయన తన శబ్దము వినిపించెను; అది బలమైన శబ్దము.
34 దేవుడు బలవంతుడని ఎంచుడి,
ఇశ్రాయేలుమీద ఆయన ప్రభావము,
మేఘములపైని ఆయన బలమును ఉన్నవి.
35 దేవా! నీ పరిశుద్ధ స్థలములనుంచి భీకరుడవైయున్నావు,
ఇశ్రాయేలు దేవుడే తన ప్రజలకు బలపరాక్రమములను ఇచ్చుచున్నాడు;
దేవునికి జయము!

## 69. కీర్తన.

ప్రధాన గాయకునికి. షోషన్నీముమీద. దావీదుది.

1 దేవా! నన్ను రక్షించుము;
జలములు నా ప్రాణము మీదికి వచ్చియున్నవి.
2 అగాధ జలముల బురదలో దిగబడి యున్నాను,
నిలువ చోటు లేదు;
అగాధ జలములలో చేరియున్నాను,
ప్రవాహము నన్ను ముంచివేసెను.

*Amos. ix. 1—3.

3 నేను మొరబెట్టుటవల్ల అలసియున్నాను,
నా గొంతుక ఎండిపోయెను;
నా దేవునికొరకు కనిపెట్టుచుండగా,
నా కన్నులు క్షీణించిపోయెను;
4 ఊరకనే నన్ను ద్వేషించేవారు,
నా తలవెండ్రుకలకంటె విస్తరించియున్నారు,
నిర్నిమిత్తము నాకు శత్రువులై,
నన్ను సంహరించేవారు బలవంతులు;
కాగా నేను దేని దోచుకొనలేదో దాని నేను ఇచ్చుకొన వలెను.
5 దేవా! నా బుద్ధిహీనత నీకు తెలుసును,
నా అపరాధములు నీకు చాటుగా ఉండలేదు.
6 ప్రభువా! సేనల యెహోవా!
నీ నిమిత్తము కనిపెట్టుకొనే వారికి నావల్ల సిగ్గు కలుగనియ్యకుము,
ఇశ్రాయేలు దేవా!
నిన్ను వెతికేవారిని నావల్ల అవమానము పొందనియ్యకుము;
7 నీ నిమిత్తము నింద వహించినాను,
సిగ్గు నా ముఖము కప్పెను.
8 నా సహోదరులకు అన్యుడనైతిని,
నా తల్లి కుమారులకు పరుడనైయున్నాను.
9 నీ ఇంటి విషయమైన ఆసక్తి నన్ను భక్షించెను,
నిన్ను నిందించిన నిందలు నామీద పడెను.
10 నేను ఉపవాసము చేయుచు ఏడ్చినాను,
అది నాకు నిందాస్పదమై యుండెను.
11 నేను గోనెపట్ట వస్త్రముగా వేసుకొంటిని,
వారికి సామెతనైతిని.
12 నన్నుగూర్చి గవినియొద్ద కూర్చుండేవారు ముట్లాడుకొందురు,
మద్యము తాగేవారు పాటలు పాడుదురు.
13 అయినను, యెహోవా! నిన్నుగూర్చి ప్రార్థించుచున్నాను.
దేవా! విహితకాలమందు, నీ కృపాతిశయమువల్ల,
నీ రక్షణ సత్యమువల్ల నాకు ఉత్తరమిమ్ము.
14 నన్ను దిగబడనియ్యక, జిగట బురదనుంచి నన్ను తప్పించుము,
నా ద్వేషులనుంచి అగాధజలములనుంచి నన్ను తప్పించుము.
15 జలప్రవాహము నన్ను ముంచనియ్యకుము,
పాతాళము నన్ను మ్రింగనియ్యకుము,
గుంట నామీద నోరు మూసుకొననియ్యకుము.
16 యెహోవా! నాకు ఉత్తరమిమ్ము; నీ కృప మంచిది,
నీ కరుణాతిశయముచొప్పున నాతట్టు తిరుగుము.
17 నీ సేవకునికి విముఖుడవై ఉండకుము;
నాకు ఇబ్బంది కలిగెను, త్వరగా నాకు ఉత్తరమిమ్ము.
18 నా ఆత్మకు సమీపించి దాని విమోచించెను;
నా శత్రువులను చూచి నన్ను విడిపించుము.
19 నా నింద, నా సిగ్గు, నా అవమానము నీకు తెలుసును,
నా విరోధులందరు నీ యెదుట ఉన్నారు.

20 నింద నా హృదయము పగలచేసెను, అశక్తుడనైతిని,
ఆదరణకొరకు కనిపెట్టుకొంటిని, అది లేకపోయెను:
ఓదార్చేవారికొరకు (కనిపెట్టుకొంటిని), వారు దొరకలేదు.
21 వారు నా తిండిలో చేదుపెట్టిరి,
నాకు దప్పి కలిగినప్పుడు చిరకను త్రాగనిచ్చిరి.
22 వారి భోజనపు బల్ల వారి యెదుట వల అవునుగాక,
వారు నిర్భయులైతే అది వారికి ఉరి అవునుగాక.
23 వారు చూడకుండా వారి కన్నులు చీకటి కమ్మునుగాక,
వారి నడుములు ఎల్లప్పుడు వణకచేయుము.
24 వారి మీద నీ ఆగ్రహము కుమ్మరించుము,
నీ కోపాగ్ని వారి మీద పడనిమ్ము.
25 వారి పాళెము పాడవునుగాక,
వారి గుడారములలో నివసించే వాడెవడు లేకపోవుగాక;
26 నీవు కొట్టినవాని వారు తరిమినారు,
నీవు గాయపరిచిన వారి వేదన వివరింతురు.
27 వారి అక్రమముతో అక్రమము కలుపుము,
నీ నీతిలోకి వారిని చేరనియ్యకుము.
28 వారు జీవగ్రంథమునుంచి తుడిచివేయబడి,
నీతిమంతులతో వ్రాయబడనియ్యకుము.
29 నేనైతే బాధపడి వ్యాకులపడుచున్నాను,
దేవా! నీ రక్షణ నన్ను ఉద్ధరించును.
30 దేవుని నామము కీర్తనతో స్తుతింతును,
కృతజ్ఞతతో దాని మహిమపరుతును.
31 అది ఎద్దుకంటే,
కొమ్ములు, డెక్కలుగల కోడెకంటే యెహోవాకు ఇష్టమౌను.
32 బాధపడేవారు దాని చూచి, సంతోషింతురు,
దేవుని వెతికేవారలారా! బ్రతికియుందురుగాక!
33 యెహోవా దరిద్రుల మొర్రను ఆలకించును,
ఆయన తన ఖైదీలను తృణీకరించలేదు.
34 ఆకాశము భూమియు,
సముద్రము దాని జలచరములన్నియు ఆయనను స్తుతించుగాక.
35 దేవుడు సీయోనును రక్షించి, యూదాయొక్క పట్టణములు కట్టును,
అక్కడ మనుష్యులు నివసింతురు, అది వారి వశమౌను.
36 ఆయన సేవకుల సంతానము దాని స్వతంత్రించుకొనును,
ఆయన నామము ప్రేమించేవారు అందులో నివసింతురు.

## 70. కీర్తన.

ప్రధాన గాయకునికి. దావీదుది. జ్ఞాపకార్థము.

1 దేవా! నన్ను విడిపించుటకు,
యెహోవా! నా సహాయము కొరకు త్వరపడి రమ్ము.
2 నా ప్రాణము వెతికేవారు,
సిగ్గుపడి అవమానము పొందుదురుగాక;
నాకు కీడు కోరేవారు
వెనుకకు తిప్పబడి బిడియము పొందుదురుగాక.

3 —ఆహా, ఆహా! అని పలికేవారు,
తమ సిగ్గుకు తగినట్టు తిప్పబడుదురుగాక.*
4 నిన్ను వెతికే వారందరు,
నిన్ను గూర్చి ఉల్లసించి సంతోషింతురుగాక,
నీ రక్షణ ప్రేమించే వారందరు,
—దేవుడు మహిమపరచబడుగాకని ఎల్లప్పుడు చెప్పుదురు.
5 నేనైతే బాధగల దరిద్రుడను,
దేవా! నా నిమిత్తము త్వరపడి రమ్ము!
నీవు నా సహాయుడవు,
నన్ను తప్పించేవాడవునై యున్నావు;
యెహోవా! ఆలస్యము చేయకుమీ.

## 71. కీర్తన.

1 యెహోవా! నీ శరణు జొచ్చియున్నాను,
ఎన్నడును నన్ను సిగ్గుపడనియ్యకుము.
2 నీ నీతి ప్రకారముగా నన్ను విడిపించి తప్పించుము,
నాకు నీ చెవియొగ్గి నన్ను రక్షించుము.
3 నేను ఎల్లప్పుడు చేరుటకు నాకు ఆశ్రయశైలమైయుండుము,
నన్ను రక్షించుటకు ఆజ్ఞాపించినావు;
నా కొండ, నా దుర్గము నీవే.
4 నా దేవా! దుష్టుని చేతినుంచి,
కీడు చేసే బలవంతుని పట్టునుంచి నన్ను తప్పించుము.
5 ప్రభువా! యెహోవా! నా నిరీక్షణాస్పదము నీవే,
నా బాల్యమునుంచి నా ఆశ్రయము నీవే.
6 గర్భమందు పుట్టినది మొదలుకొని, నిన్ను ఆనుకొంటిని,
నా తల్లి కడుపునుంచి నన్ను తప్పించినవాడవు నీవే;
నిత్యమును నిన్ను కీర్తింతును.
7 నేను అనేకులకు వింతగా ఉన్నాను,
నీవు బలమైన నా ఆశ్రయము.
8 నా నోరు నీ కీర్తితోను,
దినమంతయు నీ ప్రభావవచనముతోను నిండియున్నది.
9 నా వృద్ధాప్యమందు నన్ను విడనాడకుము.
నా బలము క్షీణించినప్పటికి నన్ను విడవకుము.
10,11 —దేవుడు వాని విడిచెను, తరిమి పట్టుకొనుడి;
వాని తప్పించుటకు ఎవడును లేడని,
నా శత్రువులు నన్ను గూర్చి మాట్లాడుకొనిరి;
నా ప్రాణము కొరకు పొంచేవారు ఏకాలోచన చేసుకొనిరి.
12 దేవా! నాకు దూరముగా ఉండకుము,
నా దేవా! నా సహాయముకొరకు త్వరపడి రమ్ము.
13 నా ప్రాణ విరోధులు సిగ్గుపడి నశింతురుగాక,
నాకు కీడు వెతికేవారు,
అవమానముతో, బిడియముతోను కప్పబడుదురుగాక.

*లేక, తిరుగుదురుగాక.

14 నేనైతే ఎల్లప్పుడు నిరీక్షింతును,
మరి యెక్కువగా నిన్ను కీర్తింతును.
15 నా నోరు నీ నీతిని, దినమంతయు నీ రక్షణ వివరించును;
వాటి సంఖ్య నాకు తెలియదు.
16 ప్రభువైన యెహోవాయొక్క బలమైన క్రియలు పట్టి ప్రవేశింతును;
నీ నీతి, నీదిమాత్రమే జ్ఞాపకము చేసుకొందును.
17 దేవా! నీవు నా బాల్యమునుంచి నాకు బోధించినావు;
ఇదివరకు నీ అద్భుతకార్యములు తెలుపుచున్నాను.
18 (వచ్చు) తరమునకు నీ బాహువును,
రాబోవు వారికందరికి నీ బలమును తెలిపే పర్యంతము,
దేవా! తల నెరిసి, వృద్ధునైయుండే పర్యంతము నన్ను విడువకుము.
19 దేవా! నీ నీతి, మహోన్నతమైనది;
నీవు గొప్ప కార్యము చేసియున్నావు;
దేవా! నీవంటివాడు ఎవడు?
20 అనేకమైన చెడ్డ బాధలు మాకు అగుపరిచిన నీవు,
తిరిగి మమ్మును బ్రతికింతువు;
భూమియొక్క అగాధ జలములనుంచి,
తిరిగి మమ్మును లేవనెత్తుదువు.
21 నీవు నా గొప్పతనము వృద్ధిచేతువు,
నీవు తిప్పుకొని నాకు నెమ్మది కలుగ చేతువు,
22 నా దేవా! నేను కూడ నీ సత్యమును గూర్చి,
నిన్ను వీణ వాద్యముతో స్తుతింతును;
ఇశ్రాయేలు పరిశుద్ధుడా! కిన్నెరతో నిన్ను గానము చేతును.
23 నిన్ను గూర్చి నేను గానము చేయగా,
నా పెదవులు, నీవు విమోచించిన నా ప్రాణము,
నిన్ను గూర్చి ఉత్సాహ ధ్వని చేసును.
24 నా నాలుక కూడ దినమెల్ల నీ నీతిని తెలుపును,
నాకు కీడు వెతికేవారు సిగ్గుపడి అవమానము పొందియున్నారు.

## 72 కీర్తన.

సొలుమోను (కీర్తన.)

1 దేవా! రాజునకు నీ న్యాయవిధులు,
రాజు కుమారునికి నీ నీతియునిమ్ము.
2 ఆయన నీతి ప్రకారముగా నీ ప్రజలకు,
న్యాయవిధి ప్రకారముగా నీ దీనులకు న్యాయము తీర్చును.
3 నీతివల్ల పర్వతములు,
కొండలును ప్రజలకు నెమ్మది పుట్టించును.
4 ఆయన ప్రజలలో బాధపడే వారికి న్యాయపుతీర్పు చేసును;
బీదల కుమారులను రక్షించును;
బాధపెట్టే వాని నలగగొట్టును
5 వారు తరతరముల మట్టుకు,
ఆచంద్రతారకము నీకు భయపడుదురు.

6 ఆయన గడ్డి కోసిన బీటిమీద (పడు) వానవలె,
భూమిని తడుపు చినుకులవలెనుండును.
7 ఆయన దినములలో నీతిమంతులు అంకురింతురు;
చంద్రుడు ఉన్నంత మట్టుకు మిక్కిలి నెమ్మది ఉండును.
8 ఆయన ఈ సముద్రమునుంచి ఆ సముద్రము మట్టుకు,
నది మొదలుకొని భూదిగంతముల మట్టుకు రాజ్యము చేసును.
9 అరణ్యవాసులు ఆయన యెదుట వంగుదురు,
ఆయన శత్రువులు ధూళి నాకుదురుగాక.
10 తార్షీషు రాజులు, ద్వీపముల రాజులును కానుకలు చెల్లింతురు;
షెబారాజులు సబారాజులును అప్పనము అర్పింతురు.
11 రాజులందరు ఆయనకు సాగిలపడుదురు;
సకల రాష్ట్రములు ఆయనను సేవించును.
12 ఆయన మొఱ్ఱపెట్టు దరిద్రుని,
సహాయుడు లేక బాధపడువాని తప్పించును.
13 ఆయన దీనుడైన నిరుపేదయందు కనికరపడును,
దీనుల ప్రాణములు రక్షించును.
14 ఆయన కపట బలాత్కారములనుంచి వారి ప్రాణము విమోచించును;
వారి రక్తము ఆయన దృష్టికి ప్రియమైయున్నది.
15 కావున బ్రతుకును, ఆయన షెబా బంగారమిచ్చును.
ఆయన కొరకు నిత్యము ప్రార్థన చేయుచు,
దినమెల్ల ఆయనను ఆశీర్వదించును.
16 దేశమందు సస్యసమృద్ధి కలుగును,
పర్వతముల శిఖరములమీద దాని పంట,
లెబానోను (వృక్షముల) వలె గలగల లాడును;*
నేలమీద పచ్చికవలె మనుష్యులు పట్టణములో పుట్టుదురు.
17 ఆయన నామము నిరంతరమునుండును;
ఆయన నామము సూర్యుని యెదుట పల్లవించును;
మనుష్యులు ఆయనయందు తమ్మునామ దీవించుకొందురు,
సకల రాష్ట్రములు ఆయన ధన్యుడని పలుకును.
18 ఇశ్రాయేలు దేవుడైన యెహోవా దేవునికి జయము!
ఆయన మాత్రమే అద్భుతములు చేయుచున్నాడు.
19 ఆయన మహిమగల నామము నిరంతరము స్తుతించబడుగాక,
ఆయన మహిమతో సర్వభూమియు నిండియుండుగాక. ఆమేన్, ఆమేన్.

యెష్షయి కుమారుడైన దావీదు ప్రార్థనలు ముగిసెను.

## 73. కీర్తన.

ఆసాపు కీర్తన.

1 నిశ్చయముగా† దేవుడు ఇశ్రాయేలుకు,
శుద్ధ హృదయము గలవారికి మంచివాడే.
2 నాకైతే నా పాదములు తొలగుటకు కొంచెమే తప్పెను;
నా అడుగులు జారుటకు సమీపించెను.

---

* లేక, కదులును. † లేక, అయితేనేమి.

3 నేను బుద్ధిహీనుల* విషయమందు మత్సరపడితిని,
దుష్టుల నెమ్మది చూచినాను.
4 వారికి మరణ యాతనలు లేవు,
వారికి దేహపుష్టి కలదు.
5 వారు మనుష్యుల ప్రయాసములో పడరు,
ఆదాము వంశస్థులకువలె వారికి తెగులు పుట్టదు.
6 కావున గర్వము కంఠహారమువలె వారిని చుట్టుకొనుచున్నది,
బలాత్కారము వస్త్రమువలె వారిని కప్పుచున్నది.
7 కొవ్వునుంచి వారి కన్నులు మీదికి వచ్చినవి,
వారి హృదయాలోచనలు కొనసాగును.
8 వారు అపహాస్యము చేయుచు చెడ్డమాటలాడుదురు,
గర్వముగా బలాత్కారము పలుకుదురు.
9 వారు ఆకాశమునందు తమ నోరు ఉంచుకొని యున్నారు,
వారి నాలుక భూమి మీద సంచరించుచున్నది.
10 కావున ఆ తెగ జనులు ఈవైపు తిరుగుదురు,
వారిచేత సమృద్ధిగల నీళ్లు పీల్చివేయబడును.
11 అప్పుడు వారు—దేవునికి ఏలాగు తెలుసును?
మహోన్నతునియందు తెలివి ఉన్నదా? అనుకొందురు.
12 ఇదిగో! దుష్టులు అట్టివారు,
వీరు ఎల్లప్పుడు నిశ్చింతులై, ఆస్తి ఆర్జించియున్నారు.
13 వ్యర్థముగానే నా హృదయము శుద్ధిచేసుకొని,
నా చేతులు నిర్దోషతయందు కడుగుకొంటిని.
14 దినమంతయు నాకు తెగులు పుట్టుచున్నది.
ప్రతి ఉదయమందు నాకు శిక్ష కలుగుచున్నది.
15 నేను—ఈలాగున పలుకుదుననుకొంటే,
ఇదిగో! నీ కుమారుల వంశము మోసపుచ్చియుందును.
16,17 దీని తెలుసుకొనుటకు ఆలోచన చేసుకొంటిని;
నేను దేవుని పరిశుద్ధాలయములోకి వెళ్లి,
వారి అంతము గ్రహించే పర్యంతము,
అది నా దృష్టికి ప్రయాసమై యుండెను.
18 జారే చోట్లయందే నీవు వారిని ఉంచుదువు,
అపాయ స్థలములలో వారిని పడవేసి యుందువు.
19 వారు క్షణమాత్రములో ఏలాగు పాడైపోదురో!
కడమట్ట మహా భయములవల్ల నశింతురు.
20 మేలుకొనినవాడు తన స్వప్నము ఏలాగో,
ఆలాగే, ప్రభువా! నీవు జాగ్రత్తపడి వారి మాయరూపును ఉపేక్షింతువు!
21 నా హృదయము వ్యాకులపడెను,
నా అంతరింద్రియములలో వేధించబడితిని.
22 నేను అవివేకినై యెరుగనైతిని,
నీ యెదుట పశుప్రాయుడనై యుంటిని.

*లేక, బింకములాడేవారి.

23 అయినను, నేను ఎల్లప్పుడు నీయొద్దనున్నాను,
నీవు నా కుడిచేతిని పట్టుకొని యున్నావు.
24 నీవు నీ ఆలోచన ప్రకారముగా నన్ను నడిపింతువు;
తరువాత మహిమలోకి నన్ను చేర్చుకొందువు.
25 ఆకాశమందు (నీవుదప్ప) నాకు ఎవడు కలడు?
భూమి యందును నీవు దప్ప నాకిష్టుడు లేడు.
26 నా శరీరము, నా హృదయము క్షీణించియుంటున్నవి;
దేవుడు నా హృదయమునకు శైలము,
నాకు స్వాస్థ్య భాగమునై యున్నాడు.
27 ఇదుగో! నీకు దూరస్థులైనవారు నశింతురు,
నిన్ను విడిచి వ్యభిచరించే వారినందరిని సంహరింతువు.
28 నాకైతే దేవునియొద్ద చేరుటే మేలు,
నీ సమస్త కార్యములు వివరించుటకు,
నేను ప్రభువైన యెహోవాయందు నా నమ్మిక ఉంచియున్నాను.

## 74. కీర్తన.

ఆసాపు మస్కీల్.

1 దేవా! నీవు ఎందుకు నిరంతరము మమ్ము విడనాడి యున్నావు?
నీవు మేపే నీ గొఱ్ఱెల మీద నీ కోపము పొగరాజనేల!
2 నీవు పూర్వము సంపాదించిన నీ సమాజము,
నీవు విమోచించిన నీ స్వాస్థ్యమైన గోత్రము,
నీవు నివసించిన ఈ సీయోనుపర్వతము జ్ఞాపకము చేసుకొనుము.
3 నిరంతరము పాడైయున్న స్థలములకు త్వరగా రమ్ము,
శత్రువు పరిశుద్ధ స్థలములో సమస్తము పాడుచేసి యున్నాడు.
4 నీ విరోధులు నీ సంఘ స్థలములలో ఆర్భటించినారు,
వారు తమ ఆనవాళ్లే ఆనవాళ్లుగా ఎత్తిరి.
5 దట్టమైన చెట్లమీద
ఒకడు గొడ్డళ్లను ఎత్తినట్టుగా అగుపడుచున్నది.
6 ఇప్పుడు వారు దాని విచిత్రమైన పని,
గొడ్డళ్లతో, సమ్మెటలతోను బొత్తిగా విరగగొట్టుచున్నారు.
7 నీ పరిశుద్ధాలయమునకు అగ్ని ముట్టించిరి,
నీ నామ నివాసస్థలము నేలమట్టుకు పడగొట్టి అపవిత్రము చేసిరి.
8 తమ హృదయములలో,
వాటిని బొత్తిగా అణగద్రొక్కుదమనుకొని యున్నారు;
దేశములోని దేవుని సంఘస్థానములన్నియు కాల్చియున్నారు.
9 మా ఆనవాళ్లు మాకు కనబడవు; ఇకను ప్రవక్త లేడు,
ఎంతమట్టుకో! అది ఎరిగినవాడు మాలో లేడు.
10 దేవా! విరోధి ఎందాక నిందించుచుండును?
శత్రువు నిరంతరము నీ నామము దూషించుచుండునా?
11 నీ చేతిని, నీ కుడిచేతిని నీవు వెనుకకు తీసుకొనుట ఎందుకు?
నీ రొమ్మునుంచి దాని తీసుకొని వారిని వధించుము.
12 పూర్వమునుంచి దేవుడు నా రాజైయున్నాడు,
ఆయన దేశములో రక్షణలు చేసేవాడు.

13 నీవు నీ శక్తిచేత సముద్రము ఛేదించినావు,
జలములలో* దీర్ఘజంతువుల తలలు పగలగొట్టినావు.
14 నీవు లివ్యాతాను† తలలు చితకగొట్టినావు,
అరణ్యనివాసులైన జనులకు ఆహారముగా దాని ఇచ్చినావు.
15 నీవు (బండ) పగల్చి‡ బుగ్గను ప్రవాహమును పుట్టించినావు,
నీవు నిత్యము పారే నదులను ఇంకించినావు.
16 పగలు నీదే, రాత్రియు నీదే;
నీవు వెలుగును సూర్యునిని సిద్ధపరిచినావు.
17 నీవు భూమియొక్క పొలిమేరలన్నియు నియమించినావు,
వేసవికాలము, చలికాలమును నీవు కలిగించినావు.
18 దీని జ్ఞాపకము చేసుకొనుము, శత్రువు యెహోవాను నిందించియున్నాడు,
అవివేక జనులు నీ నామము ఉపేక్షించియున్నారు.
19 జంతువునకు నీ గువ్వ ప్రాణము§ అప్పగించకుము,
నీ దీనుల జీవము‖ నిరంతరము మరువకుము.
20 నిబంధన¶ తలంచుకొనుము,
దేశముయొక్క అంధకార స్థలములు,
బలాత్కార నివాసములతో నిండియున్నవి.
21 నలిగిన వానిని అవమానముతో తిరిగి వెళ్లనియ్యకుము,
బాధపడిన దరిద్రుని నీ నామము స్తుతించనిమ్ము.
22 దేవా! లెమ్ము, నీ వాదము వాదించుము,
దినమంతయు బుద్ధిహీనునివల్ల కలిగే నీ నింద జ్ఞాపకము చేసుకొనుము.
23 నీ విరోధుల శబ్దము,
నిత్యమును లేచే నీ విరోధుల అల్లరి మరవకుము.

## 75. కీర్తన.

ప్రధాన గాయకునికి. తష్హేతు* మీద. ఆసాపు కీర్తన. సంగీతము.

1 దేవా! స్తుతించుచున్నాము, నిన్ను! స్తుతించుచున్నాము,
నీ నామము సమీపమైయున్నది†
నీ అద్భుతకార్యములు వివరించినవి;
2 నేను నిర్ణయకాలము బట్టి,
యథార్థముగా న్యాయపు తీర్పు చేతును.
3 భూమియు దాని నివాసులందరు కరుగుచుండగా,
నాయంతటనేనే దాని స్తంభములు సరిగా నిలిపేవాడను. సెలా.
4 —బుద్ధిహీనులై యుండకండని, బుద్ధిహీనులతోను,
—కొమ్ము పైకి ఎత్తుకొనకుడి,
5 —మీ కొమ్ము పైకెత్తుకొనకుడి,
—నిక్కిన మెడతో పలుకకుడి అని దుష్టులతోను చెప్పితిని.
6 తూర్పునుంచి అయినను, పడమటనుంచి అయినను,
అరణ్యమునుంచి అయినను హెచ్చు కలుగదు;

*లేక, మీద. †ఇది మకరమని తోచును. ‡నిర్గమకాండము అ. 14. వ. 27. §లేక, క్రూర సమూహమునకు నీ గువ్వను. ‖లేక, నీ దీనుల సమూహము. ¶లేక, ఒడంబడిక.
*అనగా, నశింపచేయకుము. †లేక, యున్నదని.

7 దేవుడే న్యాయాధిపతి,
ఆయన ఒకని తగ్గించును, ఒకని హెచ్చించును.
8 యెహోవా చేతిలో ఒక పాత్ర ఉన్నది,
అందు మద్యము ఉప్పొంగుచున్నది, సంబారముతో నిండియున్నది;
ఆయన దానిలోనిది కుమ్మరించును,
భూ దుష్టులందరు దాని మడ్డితోకూడా పీల్చి తాగ వలెను.
9 నేనైతే నిరంతరమును దీని తెలియచేతును;
యాకోబు దేవుని కీర్తింతును.
10 దుష్టుల కొమ్ములనన్నిటిని విరగగొట్టుదును,
నీతిమంతుల కొమ్ములే హెచ్చించబడును.

## 76. కీర్తన.

ప్రధాన గాయకునికి. తంతివాద్యముల మీద. ఆసాపు కీర్తన. సంగీతము.

1 దేవుడు యూదాలో తెలియబడి యున్నాడు,
ఆయన నామము ఇశ్రాయేలులో గొప్పది.
2 షాలేములో ఆయన గుడారము,
సీయోనులో ఆయన ఆలయము ఉండెను.
3 అక్కడదుగో! ఆయన వింటి పిడుగులను,
కేడెము, కత్తి, యుద్ధాయుధమును విరగగొట్టెను. సెలా.
4 వేట కొండలనుంచి నీ మహిమ తేజరిల్లెను.
5 గుండె దిట్టముగలవారు దోచుకొనబడిరి,
వారు గాఢనిద్ర పొందియున్నారు;
పరాక్రమశాలులలో ఎవని చేతులు వానికి దొరకలేదు.
6 యాకోబు దేవా! నీ గద్దింపువల్ల,
రథమునకు గుర్రమునకు గాఢనిద్ర కలిగెను.
7 నీవే భయంకరుడవు,
నీవు కోపపడిన వేళ ఎవడు నీ యెదుట నిలువ గలడు!
8,9 ఆకాశమునుంచి నీవు న్యాయపు తీర్పు వినబడచేసితివి;
భూమియందు బాధపడే వారినందరిని రక్షించుటకు,
దేవుడు న్యాయపు తీర్పు నిమిత్తము లేచినప్పుడు
భూమి భయపడి, ఊరకుండెను. సెలా.
10 నరుల కోపము నిన్ను స్తుతించ వలెను,
మిగిలిన కోపము నీవు (ఆయుధమువలె) కట్టుకొందువు.
11 మీ దేవుడైన యెహోవాకు మ్రొక్కుకొని చెల్లించుడి;
భయపడ తగిన ఆయనకు,
ఆయన చుట్టు ఉన్నవారందరు కానుకలు తెచ్చి అర్పింతురుగాక.
12 ఆయన, అధికారుల ఆత్మను ఖండించును,
ఆయన భూరాజులకు భీకరుడై యున్నాడు.

## 77. కీర్తన.

ప్రధాన గాయకునికి. యెదూతూనుమీద.* ఆసాపు కీర్తన.

1 దేవుని గూర్చి నోరెత్తి మొరబెట్టుదును,
దేవుని గూర్చి నోరెత్తుదును; ఆయన నాకు చెవినొగ్గును.

*లేక, కొరకు.

2 నా ఆపత్కాలమందు, ప్రభుని వెతికినాను,
రాత్రివేళ నా చెయ్యి చాపబడి బడలియుండలేదు,
నా ఆత్మ ఓదార్పు పొందనొల్లకపోయెను.
3 దేవుని జ్ఞాపకము చేసుకొనే ఎడల, వ్యాకులపడుచున్నాను;
నేను ధ్యానించితే, నా ఆత్మ కుందిపోవుచున్నది. సెలా.
4 నీవు నా కనురెప్పలు పట్టుకొని యున్నావు,
నేను కలతపడి మాటలాడ లేకపోవుచున్నాను.
5 నేను తొల్లిటి దినములు,
పూర్వ సంవత్సరములు తలంచుకొంటిని.
6 రాత్రియందు నా పాట* జ్ఞాపకము చేసుకొందును,
నా హృదయముతో ధ్యానించుకొందును,
నా ఆత్మ అన్వేషించును.
7 — ప్రభువు నిరంతరమును విడనాడునా?
ఇకనెన్నడు కటాక్షించడా?
8 ఆయన కృప ఎల్లకాలము మానిపోయి యున్నదా?
తరతరముల మట్టుకు ఆయన మాట తప్పిపోయెనా?
9 దేవుడు దయచేయుట మరిచి యున్నాడా?
కోపముచేత తన వాత్సల్యము దాచిపెట్టెనా? సెలా.
10 అప్పుడు నేను—ఇది నా వ్యాధి,
మహోన్నతుని కుడిచేతి సంవత్సరములు,
11 యెహోవా కార్యములు జ్ఞాపకము చేసుకొందును,
పూర్వకాలమందలి నీ అద్భుతములు జ్ఞాపకము చేసుకొందును.
12 నీ కార్యములన్నియు తలంచుకొందును,
నీ చర్యలను ధ్యానించుకొందును.
13 దేవా! నీ మార్గము పరిశుద్ధమైనది,
మా దేవునివంటి గొప్ప దేవుడు ఎవడు?
14 అద్భుతములు చేసే దేవుడవు నీవే,
జనులలో నీ శక్తి తెలియ చేసియున్నావు.
15 యాకోబు, యోసేఫనే వారి కుమారులైన
నీ ప్రజలను, బాహువు వల్ల విమోచించినావు.
16 దేవా! జలములు నిన్ను చూచినవి,
జలములు నిన్ను చూచి దిగులుపడెను;
అగాధ జలములు కళవిళపడెను.
17 మేఘములు నీళ్లు దిమ్మరించెను, మేఘములు ఘోషించెను,
నీ బాణములు బైలువెళ్లినవి.
18 నీ ఉరుముయొక్క ధ్వని సుడిగాలిలో మ్రోగెను,
మెరుపులు లోకము ప్రకాశింప చేసెను;
భూమి వణికి కంపించెను.
19 నీ మార్గము సముద్రములో,
నీ తోవలు మహా జలములలోనుండెను;
నీ అడుగులు తెలియ బడలేదు.

*లేక, తంతివాద్యము.

20 మందవలె నీ ప్రజలను,
మోషే అహరోనను వారిచేత నడిపించినావు.

## 78. కీర్తన.

ఆసాపు మస్కీల్*

1 నా జనులారా! నా బోధనకు చెవినొగ్గుడి,
నా నోటి మాటలకు మీ చెవులు పెట్టుడి.
2 నేను నా నోరు తెరచి ఉపమానము పలుకుదును,
పూర్వకాలపు మరుగుమాటలు ప్రవచింతును.
3 మేము విని ఎరిగిన వాటిని,
మా పితృలు మాకు వివరించిన వాటిని,
4 వారి పిల్లలకు దాచము;
తరువాతి సంతానమునకు యెహోవా కీర్తనలు,
ఆయన బలము ఆయన చేసిన అద్భుతములు వివరింతుము.
5 ఆయన యాకోబులో సాక్ష్యము స్థాపించి,
ఇశ్రాయేలులో బోధన నియమించెను.
6 తరువాతి వంశము,
పుట్టబోయే వారు వాటిని తెలుసుకొని,
లేచి తమ పిల్లలకు వాటిని వివరించే నిమిత్తము,
7 వారు దేవుని యందు తమ విశ్వాసముంచి,
దేవుని క్రియలు మరవక, ఆయన ఆజ్ఞలు గైకొనే నిమిత్తము,
8 తిరుగబడిన మూర్ఖవంశమును,
హృదయము సిద్ధపరుచుకొనక,
దేవుని యెదుట ఆత్మ స్థిరతలేని వంశమునైన,
తమ పితృల వలెనుండక ఉండే నిమిత్తము,
తమ పిల్లలకు వాటిని తెలుపుటకు,
ఆయన మా పితృలకు వాటిని విధించెను.
9 విండ్లతో యుద్ధసన్నద్ధులైన ఎఫ్రాయీము కుమారులు,
యుద్ధకాలమందు వెనుకకు తిరిగినారు;
10 వారు దేవుని నిబంధన† గైకొనలేదు,
ఆయన బోధన చొప్పున నడవనొల్లక పోయిరి.
11 వారు, ఆయన క్రియలు,
ఆయన వారికి చూపిన ఆయన అద్భుతములు మరిచిరి.
12 ఐగుప్తు దేశములో సోయను ప్రాంతములో,
ఆయన వారి పితృల యెదుట అద్భుతములు చేసెను.
13 ఆయన సముద్రము పాయలుచేసి అద్దరికి వారిని నడిపించెను,
ఆయన నీళ్లు కుప్పగా నిలువబెట్టెను.
14 ఆయన పగలు మేఘము చేతను,
రాత్రియంతయు అగ్ని వెలుగుచేత వారిని నడిపించెను.
15 ఆయన అరణ్యములో బండలు చీల్చి,
వారికి మహా గాధ జలములవలె నీళ్లు తాగనిచ్చెను.

---

*బోధ. †లేక, ఒడంబడిక.

16 ఆయన శైలములోనుంచి నీటికాలువలు రప్పించి,
నదులవలె నీళ్లు ప్రవహింపచేసెను.
17 వారు ఆయనకు విరోధముగా మరీ పాపము చేసిరి,
అడవిలో మహోన్నతునికి కోపము తెప్పించిరి.
18 వారు తమ ఆశ కొలది ఆహారము అడుగుచు,
తమ హృదయములలో దేవుని శోధించిరి.
19 వారు దేవునికి వ్యతిరిక్తముగా మాటలాడుచు,
—ఈ అరణ్యములో దేవుడు భోజనపుబల్ల సిద్ధపరచ గలడా?
20 ఇదుగో! ఆయన బండ కొట్టినప్పుడు నీళ్లు ఉబికెను,
కాలువలు ప్రవహించెను;
ఆయన ఆహారము కూడా ఇయ్య గలడా?
ఆయన తన ప్రజలకు మాంసము సిద్ధపరచ గలడా అని చెప్పుకొనిరి.
21 కావున యెహోవా విని ఆగ్రహించెను,
యాకోబులో అగ్ని మండెను,
మరియు ఇశ్రాయేలుకు విరోధముగా కోపము లేచెను.
22 వారు దేవుని విశ్వసించలేదు,
ఆయన రక్షణయందు నమ్మిక ఉంచలేదు.
23 ఆయన పైనున్న మేఘములకు ఆజ్ఞాపించెను,
ఆకాశ ద్వారములు తెరిచెను.
24 వారు తినుటకు ఆయన వారిమీద మన్నా కురిపించి,
ఆకాశ ధాన్యము వారికిచ్చెను.
25 శక్తిమంతుల ఆహారము ప్రతివాడు భుజించెను,
సమృద్ధిగా వారికి భోజన పదార్థములు పంపెను.
26 ఆయన ఆకాశమందు తూర్పు గాలి విసరచేసి,
తన శక్తివల్ల దక్షిణపు గాలి తెప్పించి,
27 ధూళివలె మాంసమును,
సముద్రపు ఇసుకవలె రెక్కలుగల పక్షులను వారిమీద కురిపించెను.
28 వారి దండు మధ్యను,
వారి నివాసస్థలములచుట్టు వాటిని వ్రాలచేసెను.
29 వారు తిని చాలా తృప్తి పొందిరి;
ఆయన వారి ఆశ నెరవేర్చెను.
30 వారి ఆశ ఎడబాయక మునుపు,
వారి భోజ్యము ఇంకా వారి నోళ్లలో ఉండగానే,
31 దేవుని కోపము వారికి విరోధముగా లేచి,
వారిలో బలిసిన వారిని చంపి,
ఇశ్రాయేలులో బలిష్ఠులను కూల్చెను.
32 అయినను, వారు ఆయన అద్భుతములు విశ్వసించక,
మరియు పాపము చేసిరి.
33 అప్పుడు ఆయన వ్యర్థముగా వారి దినములు,
భయమందు వారి సంవత్సరములు క్షీణింపచేసెను.
34 ఆయన వారిని హతము చేసినప్పుడు, ఆయనను వెతికిరి;
వారు తిరిగి దేవుని అన్వేషించిరి.

35 అప్పుడు వారు దేవుడు తమ బండయనియు,
మహోన్నతుడైన దేవుడు తమ విమోచకుడనియు,
జ్ఞాపకము చేసుకొనిరి.
36 అయితే వారు తమ నోళ్లతో ఆయనను లాలనచేసిరి,
తమ నాలుకలతో ఆయన యొద్ద బొంకిరి.
37 వారి హృదయము ఆయన ఎడల సిద్ధపరచబడలేదు,
ఆయన నిబంధనయందు స్థిరులై యుండలేదు.
38 అయితే ఆయన దయాళుడు,
ఆయన అక్రమము కప్పివేయుచున్నాడు, నశింపచేయడు;
అనేకపర్యాయములు ఆయన తన కోపము మళ్లించుకొని,
తన ఆగ్రహమంతయు రేపుకొనలేదు.
39 అప్పుడు ఆయన—వారు శరీరమై,
వెళ్లిపోయి తిరిగి రానిగాలివలె నున్నారని జ్ఞాపకము చేసుకొనెను
40 వారు ఎన్నోమారులు అరణ్యములో ఆయన మీద తిరుగబడిరి!
ఎడారిలో ఆయనను దుఃఖపెట్టిరి!
41 మాటిమాటికి వారు దేవుని శోధించిరి,
ఇశ్రాయేలు పరిశుద్ధునికి సంతాపము కలిగించిరి.
42 వారు, ఆయన బాహుబలమును,
ఆయన తమ్ము విరోధినుంచి విమోచించిన దినమును,
43 ఐగుప్తులో తన ఆనవాళ్లను,
సోయను మైదానమందు తన అద్భుతములను చూపిన దినమును,
జ్ఞాపకము చేసుకొనలేదు.
44 ఆయన వారి నదులు రక్తముగా చేసెను,
వారు తమ ఏళ్ల నీళ్లు తాగలేక పోయిరి.
45 ఆయన వారిలోకి జోరీగలను విడిచెను, అవి వారిని తినివేసెను;
కప్పలను (విడిచెను), అవి వారిని నాశము చేసెను.
46 ఆయన వారి పంట చీడపురుగులకు,
వారి వ్యవసాయ ఫలము మిడతలకు ఇచ్చెను.
47 ఆయన వడగండ్లచేత వారి ద్రాక్ష తీగెలను,
హిమముచేత వారి మర్రిచెట్లను పాడు చేయించెను.
48 ఆయన వడగండ్లకు వారి పశువులను,
పిడుగులకు* వారి మందలను అప్పగించెను.
49 ఆయన తన కోపాగ్ని,
కీడు చేసే దూతల సేనవలె,
ఆగ్రహము, క్రోధము, శ్రమను వారిలోకి విడిచెను.
50 ఆయన తన కోపమునకు తోవ సదును చేసెను,
మరణమునుంచి వారి ప్రాణములు తప్పించక,
వారి జీవము తెగులుకు అప్పగించెను.
51 ఆయన ఐగుప్తులో సమస్త జ్యేష్ఠులను,
హాము గుడారములలో బలప్రారంభమైన ప్రథమ సంతానమును కొట్టివేసెను.

---

*లేక, మెరుపులు.

52 అయితే ఆయన గొఱ్ఱెలవలె తన ప్రజలను సాగచేసి,
అరణ్యములో మందవలె వారిని నడిపించెను.
53 ఆయన వారిని సురక్షితముగా తీసుకొని వెళ్లెను; వారు భయపడలేదు,
వారి శత్రువులను సముద్రము ముంచివేసెను.
54 ఆయన తన పరిశుద్ధమైన హద్దుకు,
తన కుడిచేత సంపాదించిన ఈ పర్వతమునకు,
వారిని తీసుకొని వచ్చెను.
55 ఆయన వారి యెదుటనుంచి రాష్ట్రములను వెళ్లగొట్టి,
కొలప్రకారము వారి స్వాస్థ్యము వారికి పంచిపెట్టి,
ఇశ్రాయేలు గోత్రములను వారి గుడారములలో నివసింపచేసెను.
56 వారు మహోన్నతుడైన దేవుని శోధించి తిరుగుబాటు చేసిరి,
వారు ఆయన సాక్ష్యములు గైకొనలేదు.
57 వారు తమ పితృలవలె వెనుకకు తిరిగి ద్రోహులైరి,
మోసపుచ్చే వింటివలె తొలగిపోయిరి.
58 వారు తమ ఉన్నత స్థలములచేత ఆయనను కోపింపచేసి,
తమ విగ్రహములవల్ల ఆయనకు క్రోధము పుట్టించిరి.
59 దేవుడు విని ఆగ్రహించి,
ఇశ్రాయేలు మీద మిక్కిలీ అసహ్యపడెను.
60 ఆయన షిలో యందలి నివాసస్థలమును,
మనుష్యులలో తాను నివసించిన గుడారమును విడిచెను.
61 ఆయన చెరకు తన బలమును,
విరోధి చేతికి తన సౌందర్యమును అప్పగించెను.
62 ఆయన తన ప్రజలను ఖడ్గమునకు అప్పగించి,
తన స్వాస్థ్యము మీద ఆగ్రహించెను.
63 అగ్ని వారి పడుచువారిని భక్షించెను,
వారి కన్యకలు వైవాహిక స్తోత్రము పొందలేదు.
64 వారి యాజకులు కత్తిపాలై కూలిరి,
వారి విధవలు రోదనము చేయలేదు.
65 అప్పుడు ప్రభువు నిద్రించిన వానివలె,
మద్యమువల్ల ఆర్భటించే పరాక్రమ శాలివలె మేలుకొనెను.
66 అప్పుడు ఆయన తన విరోధులను వెనుకకు కొట్టి,
వారికి నిత్యమైన అవమానము కలుగచేసెను.
67 ఆయన యోసేపు గుడారముమీద అసహ్యపడెను;
ఎఫ్రాయీము గోత్రము ఏర్పరచుకొన లేదు.
68 ఆయన యూదా గోత్రము,
తాను ప్రేమించిన సీయోను పర్వతము ఏర్పరచుకొనెను.
69 ఆయన ఉన్నత స్థలములవలె,
తాను నిరంతరము స్థాపించిన భూమివలె,
తన పరిశుద్ధ మందిరమును కట్టించెను.
70 ఆయన తన సేవకుడైన దావీదును ఏర్పరచుకొని,
గొఱ్ఱెల దొడ్లనుంచి అతని తీసుకొనెను.

71 అతడు పాడి గొఱ్ఱెలను వెంబడించుచుండగా,
ఆయన తన ప్రజలైన యాకోబును,
తన స్వాస్థ్యమైన ఇశ్రాయేలును మేపుటకు* అతని రప్పించెను.
72 అతడు తన నిర్దోష హృదయము చొప్పున వారిని మేపి,
తన చేతి నేర్పు వలన వారిని నడిపించెను.

## 79. కీర్తన.

ఆసాపు కీర్తన.

1 దేవా! రాష్ట్రములు నీ స్వాస్థ్యములోకి వచ్చినవి;
నీ పరిశుద్ధాలయము అపవిత్రపరిచి,
యెరూషలేము రాళ్ల కుప్పలుగా చేసియున్నవి,
2 వారు నీ సేవకుల శవములు ఆకాశ పక్షులకు,
నీ దయాప్రాప్తుల మాంసము భూ జంతువులకు ఆహారముగా ఇచ్చిరి.
3 యెరూషలేము చుట్టు వారి రక్తము నీళ్లవలె చిందించిరి;
పాతిపెట్టేవాడు ఎవడును లేడు.
4 మా పొరుగువారు అపహాస్యము చేయుటకు,
మా చుట్టు ఉన్నవారు వెక్కిరించి ఎగతాళి చేయుటకు,
మేము ఆస్పదమైతిమి.
5 యెహోవా! ఎంతకాలము? ఎల్లప్పుడు కోపపడుచుందువా?
నీ క్రోధము అగ్నిహోత్రమువలె మండిపడునా?
6 నిన్ను ఎరుగని రాష్ట్రములమీద,
నీ పేర ప్రార్థించని రాజ్యములమీద నీ కోపాగ్ని కుమ్మరించుము.
7 వారు యాకోబును తినివేసిరి,
అతని నివాసము పాడు చేసిరి.
8 పూర్వికుల అక్రమములు మాకు విరోధముగా జ్ఞాపకము చేసుకొనక,
నీ కనికరము త్వరగా మమ్ము ఎదురుకొనుగాక;
మేము కుంగి యున్నాము.
9 మా రక్షణదేవా! నీ నామ మహిమ నిమిత్తము,
మాకు సహాయము చేయుము;
నీ నామము నిమిత్తము,
మమ్ము తప్పించి మా పాపములు క్షమించుము†.
10 —వారి దేవుడు ఎక్కడ? అని రాష్ట్రములు చెప్పుకోనేల?
చిందించబడిన నీ సేవకుల రక్తమును గూర్చిన ప్రతిదండన
మా కన్నులయెదుట రాష్ట్రములలో తెలియబడుగాక.
11 చెరలోనున్న వాని నిట్టూరుపు నీ యెదుటికి వచ్చుగాక,
చావునకు విధించబడిన వారిని,
నీ బాహు బలాతిశయము చొప్పున కాపాడుము.
12 ప్రభువా! మా పొరుగువారు నిన్ను నిందించిన కొద్ది,
వారి ఎదలోకి ఏడంతలు నింద తిరిగి రానిమ్ము.

---

*లేక, పాలించుటకు. †లేక, కప్పివేయుము.

13 అప్పుడు నీ ప్రజలము, నీ మంద గొఱ్ఱెలమునైన మేము,
తరతరముల పర్యంతము నీ కీర్తి వివరింతుము.

## 80. కీర్తన.

ప్రధాన గాయకునికి. షోషన్నీయెదూతు* మీద సాక్ష్యము. ఆసాపు కీర్తన

1 ఇశ్రాయేలును మేపేవాడా! చెవినొగ్గుము,
మందనువలె యోసేపును నడిపించేవాడా!
ఖెరూబులమీద నాసీనుడవై యున్నవాడా! తేజరిల్లుము.
2 ఎఫ్రాయీము, బెన్యామీను, మనష్షె అనే గోత్రముల యెదుట,
నీ పరాక్రమము రేపుకొని మమ్ము రక్షించుటకు రమ్ము.
3 దేవా! మమ్ము మళ్లించుము,
నీ ముఖకాంతి ప్రకాశింప చేయుము; అప్పుడు రక్షించబడుదుము.
4 యెహోవా! సేనలదేవా! నీ ప్రజలు ప్రార్థించుచుండగా,
ఎంతకాలము నీ కోపము పొగ రాజుచుండును.
5 కన్నీళ్లనే ఆహారము వారిచేత తినిపించినావు;
కన్నీళ్లు గిన్నెతో తాగించినావు.
6 మా పొరుగువారికి కలహకారణముగా మమ్ము ఉంచినావు,
మా శత్రువులు మమ్ము తమకు హాస్యాస్పదముగా చేసుకొందురు.
7 సేనల దేవా! మమ్ము మళ్లించుము,
నీ ముఖకాంతి ప్రకాశింప చేయుము; అప్పుడు రక్షించబడుదుము.
8 నీవు ఐగుప్తులోనుంచి ఒక ద్రాక్షావల్లి తెచ్చితివి,
రాష్ట్రములను వెళ్లగొట్టి దాని నాటినావు.
9 దాని యెదుట స్థలము సిద్ధపరిచితివి,
అది లోతుగా వేరుపారి దేశమును అలముకొనెను.
10 కొండలు దాని నీడచేత కప్పబడెను,
దాని తీగెలు గొప్ప దేవదారు వృక్షములను పోలెను.
11 అది సముద్రము మట్టుకు తన తీగెలను,
నది మట్టుకు తన రెమ్మలను వ్యాపింప చేసెను.
12 నీవు ఎందుకు దాని కంచెలు పాడు చేసినావు?
త్రోవపోయే వారందరు దాని తెంచివేతురు.
13 అడవి పంది దాని పెకలించుచున్నది,
అడవి మృగము దాని తినివేయుచున్నది.
14 సేనల దేవా! దయచేసి తిరుగుము,
ఆకాశమునుంచి లక్షించి చూడుము;
15 ఈ ద్రాక్షావల్లికి, నీ కుడిచేత నాటిన మొక్కకు,
నీ కొరకు నీవు బలపరిచిన పిల్లకు దర్శనమిమ్ము.
16 అగ్నిచేత కాల్చబడి, నరకబడి యున్నది,
నీ ముఖముయొక్క గద్దింపువల్ల నశింతురు.
17 నీ హస్తము నీ కుడిచేతి మనుష్యుని మీద,
నీవు బలపరుచుకొనిన మనుష్య కుమారుని మీద ఉండనిమ్ము.

*అనగా, పద్మరాగము కాబోలును.

18 మేము నీ యొద్దనుంచి తొలగి వెళ్లము,
మమ్ము బ్రతికించుము; నీ నామము ప్రచురము చేతుము.
19 యెహోవా! సేనల దేవా! మమ్ము మళ్లించుము,
నీ ముఖకాంతి ప్రకాశింప చేయుము; రక్షించబడుదుము.

## 81. కీర్తన.

ప్రధాన గాయకునికి. గిత్తీతుల మీద ఆసాపు (కీర్తన.)

1 మనకు బలమైయున్న దేవుని గూర్చి గానము చేయుడి,
యాకోబు దేవుని గూర్చి ఉత్సాహధ్వని చేయుడి.
2 కీర్తన ఎత్తి గిలకతప్పెట తీసుకొని,
వీణతో రమ్యమైన కిన్నెర వాయించుడి.
3 నెలపొడుపు యందు,
మన పండుగ దినముకొరకు పున్నమనాడు కొమ్ము ఊదుడి.
4 అది ఇశ్రాయేలుకు కట్టడయు,
యాకోబు దేవుని న్యాయవిధియునై యున్నది.
5 ఆయన ఐగుప్తుదేశము మీదుగా బైలుదేరినప్పుడు,
యోసేపుయందు సాక్ష్యముగా దాని నియమించెను;
నేను ఎరగని భాషను అక్కడ వింటిని.
6 నేను వాని భుజమునుంచి బరువును తొలగించితిని,
వాని చేతులు మోతగంపలనుంచి విడుదల పొందెను.
7 ఆ శ్రమలో నీవు మొరబెట్టినప్పుడు నిన్ను తప్పించినాను;
ఉరుముయొక్క మరుగు చోట నీకు ఉత్తరమిచ్చితిని;
మెరీబా* నీళ్లయొద్ద నిన్ను శోధించితిని. సెలా.
8 నా ప్రజలారా! వినుడి; మీ విషయము సాక్ష్యమిత్తును;
ఓ ఇశ్రాయేలూ! నీవు నా మాట వింటేనా!
9 నీలో అన్య దేవుడు ఉండ కూడదు,
పరుని దేవునికి సాగిలపడ కూడదు.
10 నేనే నీ దేవుడనైన యెహోవాను,
ఐగుప్తనే దేశములోనుంచి నిన్ను వెలపటికి తెప్పించితిని;
నీ నోరు బాగా తెరువుము, దాని నింపుదును.
11 నా ప్రజలు నా మాట వినరైరి,
ఇశ్రాయేలు నన్ను ఒల్లకపోయెను.
12 కావున వారి హృదయ కాఠిన్యమునకు వారిని అప్పగించితిని;
వారు తమ స్వకీయాలోచనలయందు నడిచినారు.
13 అయ్యో! నా ప్రజలు నా మాట వింటేనా!
ఇశ్రాయేలు నా మార్గమందు నడిచితేనా!
14 శీఘ్రముగా వారి శత్రువులను అణిచివేతును,
వారి విరోధులమీద నా హస్తము వేతును.
15 యెహోవా ద్వేషులు వానికి లోబడినట్టు ఉందురు,
వారి కాలము నిరంతరము ఉండును.

---

*అనగా, కలహము. సాంఖ్యలు. 20. అ: 13. వ.

16 ఆయన అతి శ్రేష్ఠమైన గోధుమలచేత వారిని పోషించును;
కొండతేనెతో నిన్ను తృప్తిపరుతును.

## 82. కీర్తన.

ఆసాపు కీర్తన.

1 సమర్థుని సమాజములో దేవుడు నిలుచుచున్నాడు,
ఆయన అధికారుల* మధ్యను న్యాయము తీర్చును.
2 మీరు ఎంతకాలము అన్యాయముగా తీర్పుచేయుచు,
దుష్టులయందు పక్షపాతులై యుందురు? సెలా.
3 దరిద్రునికి, తలిదండ్రులు లేనివారికిని న్యాయము తీర్చుడి,
బాధపడే వారికి, దిక్కులేని వారికిని న్యాయము విధించుడి.
4 దరిద్రుని, బీదవానిని తప్పించుడి,
దుష్టులచేతినుంచి వారిని విడిపించుడి.
5 వారికి తెలివి లేదు, గ్రహించరు,
వారు చీకటిలో ఇటుఅటు తిరుగులాడుచున్నారు,
భూమియొక్క పునాదులన్నియు కదులుచున్నవి.
6 —మీరు దేవుండ్లనియు,
మీరందరు సర్వోన్నతుని కుమారులనియు నేను పలికినాను;
అయితే మీరు మనుష్యులవలె చనిపోదురు,
అధికారులలో ఒకనివలె కూలుదురు.
7 దేవా! లేచి భూమికి న్యాయము తీర్పుము;
రాష్ట్రములన్నియు నీకు స్వాస్థ్యముగా ఉండును.

## 83. కీర్తన.

ఆసాపు కీర్తన. సంగీతము.

1 దేవా! నీవు నిశ్శబ్దముగా ఉండకుము,
దేవా! మౌనముగా ఉండకుము, ఊరకుండకుము.
2 ఇదుగో! నీ శత్రువులు ఘోషించుచున్నారు,
నీ ద్వేషులు తల ఎత్తుచున్నారు.
3 నీ ప్రజలకు విరోధముగా కపటోపాయము చేతురు,
నీ మరుగు చేరిన వారికి విరోధముగా ఆలోచించుకొందురు.
4 —వారు రాష్ట్రముగా ఉండకనుండుటకు, వారిని సంహరింతము రండి,
ఇశ్రాయేలనే పేరు ఇకను జ్ఞాపకము చేయబడక పోవుగాకని
వారు చెప్పుకొనుచున్నారు.
5-7 గుడారు నివాసులైన ఎదోమీయులు, ఇష్మాయేలీయులు,
మోయాబు దేశస్థులు, హాగరీయులును,
గెబాలు, అమ్మోను, అమాలెఖు నివాసులును,
పెలెషెతు, సోరుల నివాసులును,
ఏకమనస్సుతో ఆలోచించి,
నీకు విరోధముగా నిబంధన† చేసుకొని యున్నారు.

*హెబ్రీలో, దేవుండ్లు. †లేక, ఒడంబడిక.

8 అష్షూరు దేశస్థులు వారితోకూడా కలిసియున్నారు,
వారు లోతువంశస్థులకు కుడిభుజమై* యున్నారు. సెలా.
9 కీషోను లోయలో మిద్యానుకువలె,
సీసెరాకువలె, యాబీనుకు వలెను వారికిని చేయుము;
10 వారు ఎన్దోరులో నశించిరి;
భూమికి పెంటయైరి.
11 ఓరేబు జెయేబు అనే వారినివలె, వారిని, వారి ప్రధానులను,
జెబహు సల్మున్నా అనే వారినివలె, వారి సమస్త రాజులను చేయుము.
12 వారు—దేవుని నివాసములను,
మనము ఆక్రమించుకొందమని చెప్పుకొంటున్నారు.
13 నా దేవా! గిరగిరలాడే దానివలె,
గాలి యెదుట చెత్తవలెను వారిని చేయుము.
14 అగ్ని అడవికాల్చే ప్రకారము,
మంట కొండలను తగలబెట్టే ప్రకారము,
15 నీ తుఫానువల్ల వారిని తరుముము,
నీ సుడిగాలివల్ల వారిని భయపరచుము.
16 యెహోవా! వారి ముఖములు సిగ్గుతో నింపుము,
అప్పుడు నీ నామము వెతుకుదురు.
17 వారు ఎల్లప్పుడు అవమానము పొంది వ్యాకుల పడుదురుగాక.
నిశ్చయముగా వారు భంగపరచబడి నశింతురు.
18 అప్పుడు నీవు, యెహోవా అనే నామముగల నీవు మాత్రమే,
సర్వభూమి మీద మహోన్నతుడవని నిన్ను తెలుసుకొందురు.

## 84. కీర్తన.

ప్రధాన గాయకునికి. గిత్తీతుమీద కోరహు కుమారుల కీర్తన.

1 సేనల యెహోవా! నీ నివాసములు ఎంత రమ్యమైనవి!
2 యెహోవాయొక్క అంగణములకొరకు,
నా ఆత్మ ఆతురపడుచు క్షీణించుచున్నది;
జీవముగల దేవుని గూర్చి,
నా హృదయము, నా శరీరము మొరబెట్టుచున్నవి.
3 సేనల యెహోవా! నా రాజా! నా దేవా!
ఊరపిచ్చుకకు ఇల్లును, వానకోవెలకు గూడును ఉన్నవి;
అక్కడ, నీ వేదికలలో అది తన పిల్లలను ఉంచుకొనెను.
4 నీ ఇంట నివసించే వారు ధన్యులు,
వారు ఎల్లప్పుడు నిన్ను స్తుతించుచుందురు. సెలా.
5 నీయందు బలముగల మనుష్యులు ధన్యులు,
వారి హృదయములో యాత్రసంగతులు ఉన్నవి.
6 వారు బాకా† లోయలో బడి వెళ్లుచు,
అది నీటి బుగ్గగా చేతురు;
వాన, దీవెనలతో దాని కప్పును.

*అనగా, సహాయకులు. †అనగా, ఏడ్పు.

7 వారు మరీమరీ బలాభివృద్ధి పొందుదురు,
ప్రతివాడు సీయోనులో దేవునియెదుట కనబడును.

8 యెహోవా! సేనల దేవా! నా ప్రార్థన వినుము,
యాకోబు దేవా! చెవి యొగ్గుము. సెలా.

9 దేవా! మా కేడెము చూడుము,
నీ అభిషిక్తుని* ముఖము లక్షించుము.

10 నీ అంగణములోని ఒక దినము వెయ్యి దినములకంటే మంచిది,
దుర్మార్గతతో గుడారములలో నివసించుట కంటే,
నా దేవుని ఇంటి గడపను నిలుచుట† నాకిష్టము.

11 యెహోవా సూర్యుడు, కేడెమునైయున్నాడు,
యెహోవా కృపా మహిమలు కనపరుచును,
నిర్దోషముగా నడిచేవారికి మేలు చేయక మానడు.

12 సేనల యెహోవా!
నీయందు నమ్మిక ఉంచే మనుష్యులు ధన్యులు,

## 85. కీర్తన.

ప్రధాన గాయకునికి. కోరహు కుమారుల కీర్తన.

1 యెహోవా! నీ దేశమును కటాక్షించినావు,
యాకోబు చెరను మళ్లించినావు.

2 నీ ప్రజల అక్రమము పరిహరించి,
వారి పాపమంతయు కప్పివేసినావు. సెలా.

3 నీ ఆగ్రహమంతయు అణచుకొంటివి,
నీ కోపాగ్నినుంచి మళ్లుకొంటివి.

4 మా రక్షణ దేవా! మమ్మును మళ్లించుము,
మా మీదనున్న నీ కోపము చాలించుము.

5 ఎల్లప్పుడు మా మీద కోపగింతువా?
తరతరముల మట్టుకు నీ కోపము ఎడతెగక ఉండేటట్టు చేతువా?

6 నీవు మళ్లుకొని మమ్మును జీవింప చేయవా?
అప్పుడు నీ ప్రజలు నీ యందు సంతోషింతురు.

7 యెహోవా! నీ కృప మాకు అగుపరుచుము,
నీ రక్షణ మాకు దయ చేయుము.

8 యెహోవా అనే దేవుడు ఏమి పలుకునో నేను విందుగాక,
ఆయన తన ప్రజలకు, తన దయాప్రాప్తులకు సువచనము పలుకును,
అయితే వారు బుద్ధిహీనతకు మళ్లుకొన కూడదు.

9 మన దేశములో మహిమ నివసించుటకు,
ఆయన రక్షణ ఆయనకు భయపడే వారికి సమీపమై యున్నది.

10 కృపయు సత్యము కలుసుకొని యున్నవి,
నీతియు సమాధానము ఒకదాని నొకటి ముద్దుబెట్టుకొనెను.

11 భూమినుంచి సత్యము మొలుచుచున్నది,
ఆకాశమునుంచి నీతియు కింద చూచుచున్నది.

---

*లేక, మషీహ, అనగా క్రీస్తు. †లేక, ద్వారపాలకుడైయుండుట.

12 యెహోవా మేలు దయచేయును,
మన భూమి తన ఫలమిచ్చును.
13 నీతి ఆయన ముందు నడుచుచు,
ఆయన అడుగులు త్రోవగా చేయును.

## 86. కీర్తన.

దావీదు కీర్తన.*

1 యెహోవా! నీ చెవియొగ్గి నాకు ఉత్తరమిమ్ము,
నేను బాధపడుచున్న బీదనై యున్నాను.
2 నా ప్రాణము కాపాడుము, నేను దయాప్రాప్తుడను,
నా దేవా! నీ సేవకుని నీవే రక్షించుము,
అతడు నీయందు నమ్మిక ఉంచి యున్నాడు.
3 ప్రభువా! నన్ను కరుణించుము;
దినమంతయు నిన్ను గూర్చి మొరబెట్టుచున్నాను.
4 నీ సేవకుని ఆత్మను సంతోషపరచుము;
ప్రభువా! నీ తట్టు నా ఆత్మను లేవనెత్తుచున్నాను;
5 ప్రభువా! నీవు మంచివాడవు, క్షమించేవాడవునై యున్నావు;
నిన్ను గూర్చి మొరబెట్టే వారందరియందు,
కృపాతిశయము గలవాడవునై యున్నావు.
6 యెహోవా! నా ప్రార్థన చెవిని బెట్టుము,
నా మనవుల శబ్దము ఆలకించుము.
7 నా ఆపత్కాలమందు నిన్నుగూర్చి మొరబెట్టుదును;
నీవు నాకు ఉత్తరమిత్తువు.
8 ప్రభువా! దేవులలో నీవంటివాడు లేడు,
నీ కార్యములవంటివి ఏవియు లేవు.
9 ప్రభువా! నీవు కలిగించిన రాష్ట్రములన్నియు,
వచ్చి, నీ యెదుట సాగిలపడి,
నీ నామము మహిమపరచును;
10 నీవు గొప్పవాడవై అద్భుతములు చేయుచున్నావు;
నీవే అద్వితీయ దేవుడవు.
11 యెహోవా! నీ మార్గము నాకు బోధించుము,
నీ సత్యమందు నడుతును,
నీ నామమునకు భయపడుటకు నా హృదయము నైక్యపరచుము.
12 నా దేవుడవైన ప్రభువా! నా పూర్ణ హృదయముతో నిన్ను స్తుతింతును,
నిరంతరము నీ నామము మహిమపరతును;
13 నాయందలి నీ కృప అధికమైనది,
కిందనున్న అదృశ్య లోకమునుంచి నా ప్రాణము తప్పించినావు.
14 దేవా! గర్విష్ఠులు నాకు విరోధముగా లేచి యున్నారు.
బలాత్కారుల గుంపు నా ప్రాణము వెతికెను,
వారు తమ యెదుట నిన్ను ఉంచుకొన లేదు.

---

*లేక, ప్రార్థన.

15 ప్రభువా! నీవు కనికరము దయాళుత్వముగల దేవుడవు,
దీర్ఘశాంతము, కృపాసత్య బాహుళ్యము గలవాడవు.
16 నా తట్టు తిరిగి నన్ను కరుణించుము,
నీ సేవకునికి నీ బలము దయచేయుము,
నీ సేవకురాలి కుమారుని రక్షించుము.
17 మేలును గూర్చిన ఆనవాలు నాకు అగుపరుచుము;
అప్పుడు యెహోవా అనే నీవు నాకు సహాయమై నన్నాదరించితివని,
నా పగవారు చూచి సిగ్గుపడుదురు.

## 87. కీర్తన.

కోరహు కుమారుల కీర్తన. సంగీతము.

1 పరిశుద్ధ పర్వతముల మీద తాను వేసిన పునాది,
2 యాకోబు నివాసములన్నిటికంటే సీయోను గుమ్మములు,
యెహోవా ప్రేమించుచున్నాడు.
3 దేవుని పట్టణమా!
నిన్ను గూర్చి, మహిమ గలవి చెప్పబడుచున్నవి. సెలా.
4 నన్ను ఎరిగిన వారిలో* రాహేబును బాబేలును జ్ఞాపకము చేతును,
ఇదుగో! పెలెషెతు, సోరు, కూషును,
—ఈ జనము అక్కడ జన్మించెను (అనబడును.)
5 —ఈ జనము, ఆ జనము దానిలో జన్మించెననియు,
సర్వోన్నతుడు తానే దాని స్థిరపరుచుననియు,
సీయోనును గూర్చి చెప్పబడును.
6 యెహోవా ప్రజాసంఖ్య వ్రాసేటప్పుడు,
—ఈ జనము అక్కడ జన్మించెనని యెంచును. సెలా.
7 పాడేవారును, వాద్యములు వాయించేవారును,
—మా ఊటలూరుటలన్నియు నీ యందే ఉన్నవందురు.

## 88. కీర్తన.

సంగీతము. కోరహు కుమారుల కీర్తన.
ప్రధాన గాయకునికి. మహలత్ లన్నోతు మీద. ఎజ్రాహీయుడైన హేమాను మశ్కీలు.

1 యెహోవా! నా రక్షణ దేవా!
దివారాత్రులు నీ యెదుట మొరబెట్టినాను.
2 నా ప్రార్థన నీ సన్నిధికి రానిమ్ము,
నా మొర్రకు నీ చెవినొగ్గుము.
3 నా ఆత్మ కీడులతో నిండియున్నది,
నా ప్రాణము అదృశ్య లోకమునకు సమీపించినది.
4 సమాధిలోకి దిగేవారిలో ఎంచబడి యున్నాను,
బలములేని మనుష్యునివలె నున్నాను.
5 చంపబడి సమాధిలో పడియున్న వారివలె,
చచ్చిన వారిలో విడువబడి యున్నాను;
వారిని ఇకమీదట జ్ఞాపకము చేసుకొనవు,
నీ చేతినుంచి వేరుపరచబడి యున్నారు.

*లేక, నాకు పరిచయముగలవారిలో.

6 మిక్కిలీ లోతైన గుంటలోను చీకటిలోను,
అగాధ స్థలములలో నన్ను పరుండబెట్టినావు.
7 నా మీద నీ ఆగ్రహము బరువుగా ఉన్నది,
నీ తరంగములన్నిటివల్ల నన్ను బాధపరిచినావు. సెలా.
8 నా నెళవరులను నాకు దూరముగా ఉంచినావు,
వారికి నన్ను ఏహ్యముగా ఉండేటట్టు చేసినావు;
నేను మూయబడి వెలపటికి వెళ్ల లేను.
9 బాధచేత నా కన్ను సన్నగిల్లుచున్నది;
యెహోవా! ప్రతిదినము నిన్నుగూర్చి మొరబెట్టినాను,
నీ తట్టు నా చేతులు చాపినాను.
10 చచ్చినవారికి అద్భుతము అగుపరుతువా?
అశరీరులు లేచి నిన్ను స్తుతింతురా? సెలా.
11 సమాధిలో నీ కృపయైనా,
నాశనములో నీ సత్యమైనా చెప్పబడునా?
12 చీకటిలో నీ అద్భుతములైనా,
మరుపు దేశములో నీ నీతియైనా తెలియబడునా?
13 యెహోవా! నేను నిన్ను గూర్చి మొరబెట్టినాను,
ఉదయమందు నా ప్రార్థన నిన్ను ఎదురుకొనును.
14 యెహోవా! ఎందుకు నా ఆత్మను విడనాడుచున్నావు?
ఎందుకు నీ ముఖము నాకు దాచుచున్నావు?
15 చిన్ననాటినుంచి నేను బాధపడుచు చావబోవుచున్నాను,
నీ భయములు పొంది సుడివడి యున్నాను.
16 నా మీద నీ కోపాగ్ని పొర్లినది,
నీ భయములు నన్ను సంహరించెను.
17 అవి నీళ్లవలె దినమంతయు నన్ను ఆవరించెను.
18 ప్రియులను స్నేహితులను నాకు దూరముగా ఉంచినావు,
నా పరిచయము చీకటియే.

## 89. కీర్తన.

ఏతాననే ఎజ్రాహీయుని మశ్కీలు.

1 యెహోవా కృపా బాహుళ్యమును ఎల్లప్పుడు కీర్తింతును,
తరతరముల మట్టుకు నీ విశ్వాస్యత* నా నోటితో తెలియచేతును.
2 —కృప నిరంతరము స్థాపించబడును,
ఆకాశమండలమందు నీ విశ్వాస్యత స్థిరపరుతువనుకొంటిని.
3 —నేను ఏర్పరుచుకొనిన వానితో నిబంధన† చేసుకొన్నాను,
4 నిరంతరము నీ సంతానము స్థిరపరిచి,
తరతరముల మట్టుకు నీ సింహాసనము స్థాపింతునని,
దావీదనే నా సేవకునితో ప్రమాణము చేసినాను. సెలా.
5 యెహోవా! ఆకాశము నీ అద్భుత స్వభావమును,
పరిశుద్ధుల సంఘములో నీ విశ్వాస్యతను స్తుతించును.
6 మింట యెహోవాను పోలిన వాడెవడు?
శక్తిమంతుల కుమారులలో యెహోవావంటి వాడెవడు?

---

* లేక, సత్యము. †లేక, ఒడంబడిక.

7 ఆయన పరిశుద్ధుల సభలో మిక్కిలి భీకరుడును,
తన చుట్టు ఉన్నవారందరికంటె భయాహ్వుడునై యున్నాడు.
8 యెహోవా! సేనల దేవా!
నీ వలె బలముగల వాడెవడు? యావే!
నీ విశ్వాస్యత నీ చుట్టు ఉన్నది.
9 నీవు సముద్రపు పొంగును ఏలుచున్నావు,
దాని తరంగములు లేచేటప్పుడు నీవు వాటిని అణచివేతువు.
10 చంపబడిన వారినివలె నీవు రాహాబును నలగచేసినావు,
నీ బలమైన బాహువుతో నీ శత్రువులను చెదరగొట్టినావు.
11 ఆకాశము నీదే, భూమియు నీదే,
లోకమును దాని పరిపూర్ణతను నీవే స్థాపించినావు.
12 ఉత్తర దక్షిణములను నీవే నిర్మించినావు,
తాబోరు హెర్మోను* నీ పేరున సంతోషధ్వని చేసును.
13 నీకు పరాక్రమము గల బాహువు కలదు,
నీ హస్తము బలమైనది, నీ కుడిచెయ్యి ఉత్తమమైనది.
14 నీతియు న్యాయము నీ సింహాసనమునకు ఆధారము,
కృపయు సత్యము నీ సన్నిధానవర్తులు.
15 ఆనంద ధ్వని ఎరిగే జనులు ధన్యులు,
యెహోవా! వారు నీ ముఖకాంతిలో నడుచుచుందురు.
16 నీ పేరున వారు దినమంతయు సంతోషింతురు,
నీ నీతివల్ల హెచ్చించబడుదురు.
17 వారి బలప్రభావము నీవే,
నీ దయచేతనే మా కొమ్ము హెచ్చించబడి యున్నది.
18 మా కేడెము యెహోవాదే,
మా రాజు ఇశ్రాయేలు పరిశుద్ధునివాడు.
19 అప్పుడు నీవు నీ దయాప్రాప్తునితో దర్శనమందు పలికినమాట,
—నేను బలవంతుని మీద సహాయము ఉంచినాను,
ప్రజలలోనుంచి ఏర్పరచబడినవాని హెచ్చించినాను:
20 నా సేవకుడైన దావీదును కనుగొంటిని,
నా పరిశుద్ధ తైలముతో ఆయనను అభిషేకించినాను;
21 నా చెయ్యి నిలకడగా ఆయనకు తోడై ఉండును,
నా బాహువు ఆయనను బలపరుచును.
22 ఏశత్రువును ఆయనను కక్కసించడు,
అక్రమ కుమారుడు ఆయనను బాధపరచడు.
23 ఆయన యెదుట ఆయన విరోధులను పడగొట్టుదును,
ఆయన పగవారిని మొత్తుదును.
24 నా సత్యము, నా కృపయు ఆయనకు తోడై ఉండును,
నా పేరున ఆయన కొమ్ము హెచ్చించబడును.
25 సముద్రము మీద ఆయన చేతిని,
నదులమీద ఆయన కుడిచేతిని ఉంచుదును.

---

*ఇవి పర్వతములు.

26 ఆయన—నీవు నా తండ్రివి, నా దేవుడవు,
నా రక్షణ శైలమునై ఉన్నావని నన్ను గూర్చి మొరబెట్టును.
27 కావున, నేను ఆయనను నా జ్యేష్ఠునిగా,
భూ రాజులకంటే మహోన్నతునిగాను చేసుకొందును.
28 నిరంతరము నా కృపను ఆయన కొరకు నిలువచేతును,
ఆయనతో నా నిబంధన స్థిరముగా ఉండును.
29 ఎల్లప్పుడు ఆయన సంతానమును,
ఆకాశముయొక్క దినములవలె, ఆయన సింహాసనమును నియమింతును.
30 ఆయన కుమారులు నా బోధను విడిచి,
నా న్యాయవిధుల చొప్పున నడవకపోతే,
31 వారు నా కట్టడలను అపవిత్రపరిచి,
నా ఆజ్ఞలను గైకొనకపోతే,
32 నేను దండముతో వారి ద్రోహమునకును,
దెబ్బలతో వారి అక్రమమునకును వారిని శిక్షింతును.
33 అయితే ఆయననుంచి నా కృపను తీసివేయను,
నా సత్యము* తప్పను.
34 నేను నా నిబంధనను† అపవిత్రపరచను,
నా పెదవులనుంచి బైలువెళ్లిన మాట మార్చను.
35 నా పరిశుద్ధత తోడని ఒక్కసారే ప్రమాణము చేసినాను,
దావీదుతో అబద్ధమాడను;
36 ఆయన సంతానము నిరంతరమును ఉండును,
ఆయన సింహాసనము సూర్యునివలె నాయెదుట ఉండును.
37 ఆయన‡ చంద్రునివలె,
మింట నిత్యసాక్షివలె నిరంతరము స్థిరపరచబడును. సెలా.
38 అయితే నీవు విసర్జించి విడనాడినావు,
నీ అభిషిక్తుని మీద ఆగ్రహించినావు.
39 నీవు నీ సేవకుని నిబంధన కొట్టివేసినావు,
ఆయన కిరీటము నేలమీద (పడదోసి) అపవిత్రపరిచినావు.
40 ఆయన సమస్త ప్రాకారములు విడగొట్టి,
ఆయన కోటలు పాడు చేసినావు.
41 ఆ త్రోవను పోయే వారందరు ఆయనను దోచుకొనుచున్నారు,
ఆయన తన సమీప దేశస్థులకు నిందాస్పదమై యున్నాడు.
42 నీవు ఆయన విరోధుల కుడిచేతిని హెచ్చించి,
ఆయన సమస్త శత్రువులను సంతోషింప చేసినావు.
43 మరియు, ఆయన కత్తి పదును నీవు తిరుగచేసి,
యుద్ధకాలమందు ఆయనను నిలిపినావు కావు.
44 ఆయన వైభవమును మానిపి,
ఆయన సింహాసనము నేల పడగొట్టినావు.
45 నీవు ఆయన యౌవన దినములు తక్కువచేసి,
సిగ్గుతో ఆయనను కప్పివేసినావు. సెలా.
46 యెహోవా! యెంతమట్టుకు! ఎల్లప్పుడు దాగియుందువా?
నీ ఆగ్రహము అగ్నివలె మండునా?

*లేక, విశ్వాస్యత. †లేక, ఒడంబడిక. ‡లేక, అది.

47 నా ఆయుస్సు ఎంత కొద్దిదో! జ్ఞాపకము చేసుకొనుము,
నీవు ఎందుకు సమస్త నరపుత్రులను వ్యర్థముగా నిర్మించినావు?
48 ఏ నరుడు మరణము చూడక బ్రతుకును?
ఎవడు అదృశ్యలోక బలమునుంచి తప్పించుకొన గలడు?
49 ప్రభువా! దావీదుకు నీ సత్యము* తోడని ప్రమాణము చేసిన
నీ తొల్లిటి కృపలు ఎక్కడ ఉన్నవి?
50 ప్రభువా! అనేకులైన జనులందరి నిందను నా ఎదలో మూయుచున్నానని,
నీ సేవకులయొక్క ఆ నింద జ్ఞాపకము చేసుకొనుము.
51 యెహోవా! నీ శత్రువులు నిందించిరి,
నీ అభిషిక్తుని నడతలు నిందించిరి.
52 యెహోవా నిరంతరము స్తుతించబడుగాక. ఆమేన్, ఆమేన్.

## 90. కీర్తన.

దేవ భక్తుడైన మోషే ప్రార్థన.

1 ప్రభువా! తరతరములనుంచి,
నీవే మాకు నివాసస్థలమై యున్నావు.
2 పర్వతములు పుట్టక మునుపు,
నీవు భూమియు లోకము సృజించక మునుపు,
అనాదినుంచి నిరంతరము నీవు దేవుడవు.
3 నీవు మనుష్యుని తిరిగి మన్నుగా చేసి,
—నరపుత్రులారా! మళ్లుకొనుడని పలుకుదువు.
4 నీ దృష్టికి వేయి సంవత్సరములు,
గతించిన నిన్నటివలె,
రాత్రిలో ఒక జాముVలె నున్నవి.
5 వరదవలె, వారిని తోసుకొని పోవుచున్నావు; వారు స్వప్నమే:
ప్రొద్దుట వారు పచ్చపారు గడ్డివలె నున్నారు.
6 ప్రొద్దుట అది పూచి పచ్చపారును;
సాయంకాలము అది కోయబడి వాడబారును;
7 మేము నీ కోపమువల్ల క్షీణించుచు,
నీ క్రోధమువల్ల దిగులుపడి యున్నాము.
8 నీవు నీ యెదుట మా అక్రమములను,
నీ ముఖ కాంతిలో మా రహస్య పాపములను ఉంచినావు.
9 మా దినములన్నియు నీ ఆగ్రహమువల్ల గతించిపోయినవి;
ఒక తలంపువలె మా ఏండ్లు వ్యయపరిచినాము.
10 మా ఆయుష్కాలము డెబ్బది సంవత్సరములవును,
అధిక బలమువల్ల ఎనబది సంవత్సరములు కావచ్చును;
అయినను వాటి వైభవము ప్రయాసము దుఃఖమునై ఉండును;
అది త్వరగా గతించెను, మేము ఎగిరిపోతిమి.
11 నీ కోప బలము,
నీ భయముకొలది, నీ ఆగ్రహము ఎవనికి తెలుసును?
12 మేము జ్ఞాన హృదయము పొందునట్లు,
మా దినములు లెక్కించుటకు మాకు బోధించుము.

* లేక, విశ్వాస్యత.

13 యెహోవా! తిరుగుము; ఎంతమట్టుకు?
నీ సేవకులను గూర్చి దుఃఖించి కరుణించుము.
14 మేము మా దినములన్నిట ఉత్సహించి ఆనందించే నిమిత్తము,
ఉదయమందు నీ కృపతో మమ్ము తృప్తిపరుచుము.
15 నీవు మమ్ము శ్రమపరిచిన దినములకొద్ది,
మేము చూచిన ఏండ్ల చొప్పున మమ్ము సంతోషపరుచుము.
16 నీ సేవకులకు నీ కార్యమును,
వారి కుమారులకు నీ ప్రభావమును చూపించుము.
17 మా దేవుడైన యెహోవా దయాళుత్వము మామీద నుండుగాక;
మా చేతుల పని మాకు స్థిరపరుచుము,
మా చేతుల పని స్థిరపరుచుము.

91. కీర్తన.

1 మహోన్నతుని చాటున కూర్చుండు వాడు,
సర్వశక్తుని నీడలో నివసించుచున్నాడు.
2 ఆయన నా ఆశ్రయము, నా కోట, నేను నమ్ముచున్న నా దేవుడని,
యెహోవానుగూర్చి పలుకుచున్నాను.
3 ఆయన వేటకాని ఉరినుంచియు,
నాశకరమైన తెగులునుంచియు నిన్ను విడిపించును.
4 ఆయన తన వెంట్రుకలతో నిన్ను కప్పును;
ఆయన రెక్కల కింద నీకు ఆశ్రయము కలుగును;
ఆయనయొక్క సత్యము కేడెము డాలునై యుండును.
5 నీవు రాత్రి భయమునకైనను,
పగటిలో ఎగురు బాణమునకైనను,
6 చీకటిలో సంచరించు తెగులుకైనను,
మధ్యాహ్నమందు పాడు చేయు రోగమునకైనను భయపడవు.
7 నీ పక్కను వేయిమందియు,
నీ కుడి పక్కను పదివేలమందియు కూలుదురు;
అది నీ యొద్దికి రాదు.
8 నీ కన్నులతోనే నీవు చూచుచుండగా,
దుష్టుల ప్రతి ఫలము నీకు కనబడును.
9 యెహోవా! నీవే నా ఆశ్రయము,
నీవు మహోన్నతుని నీ నివాసస్థలముగా చేసుకొంటివి;
10 కావున, నీకు కీడు కలుగదు,
ఏ తెగులైనను నీ గుడారమునకు సమీపించదు;
11 నీ మార్గములన్నిటిలో నిన్ను కాపాడుటకు,
ఆయన నిన్ను గూర్చి తన దూతలకు ఆజ్ఞాపించును;
12 నీ పాదమునకు రాయి తగలకుండ,
వారు తమ చేతులతో నిన్ను ఎత్తుకొందురు.
13 నీవు సింహము, కట్లపామును త్రొక్కుదువు;
కొదమ సింహము, దీర్ఘసర్పమును మట్టివేతువు.
14 అతడు నా యందు ప్రేమ ఉంచెను గనుక,
అతని తప్పింతును.
అతడు నా నామము ఎరిగియున్నాడు గనుక,
ఔన్నత్యమందు అతని ఉంచెదను.

15 ఆయన నన్ను గూర్చి మొరపెట్టితే ఆయనకు ఉత్తరమిచ్చెదను,
శ్రమలో నేను ఆయనకు తోడైయుందును,
నేను ఆయనను విడిపించి ఆయనను ఘనపరుతును.
16 దీర్ఘాయువుతో ఆయనను తృప్తిపరుతును,
నా రక్షణను ఆయనకు చూపింతును.

## 92. కీర్తన.

కీర్తన. సబ్బాతువారము కొరకైన సంగీతము.

1 యెహోవాను స్తుతించుట మంచిది,
మహోన్నతుడా!
2 పది తంతుల వాద్యము మీద, వీణమీద,
గంభీర ధ్వని గల కిన్నెర మీదను ఉదయమందు నీ కృపను,
3 ప్రతి సాయంకాలమందు నీ విశ్వాస్యతను తెలుపుచు,
నీ నామమును గూర్చి గానము చేయుట మంచిది.
4 యెహోవా! నీవు జరిగించిన దానివల్ల నన్ను సంతోషపరిచినావు,
నీ చేతి పనులను గూర్చి ఉత్సాహధ్వని చేతును.
5 యెహోవా! నీవు జరిగించినవి ఎంత గొప్పవో!
నీ ఆలోచనలు మిక్కిలి లోతైనవి.
6 పశుప్రాయునికి తెలివి లేదు,
అవివేకి దీని గ్రహించడు.
7 నిరంతరము నశించుటకే
దుష్టులు గడ్డివలె చిగిరించుచు,
అక్రమము చేసే వారందరు పుష్పించుచున్నారు.
8 యెహోవా! నీవు నిరంతరము మహోన్నతుడవైయున్నావు;
9 ఇదుగో! నీ శత్రువులు,
యెహోవా! ఇదుగో! నీ శత్రువులు నశింతురు,
అక్రమము చేసే వారందరు చెదిరిపోదురు.
10 కారుపోతు కొమ్మువలె నా కొమ్ము పైకెత్తినావు,
క్రొత్త తైలముతో నాకు అభిషేకము కలిగినది.
11 నా కన్ను నా నిమిత్తము పొంచిన వారి గతి చూచెను,
నా చెవులు నాకు విరోధముగా లేచిన వారి వృత్తాంతము వినెను.
12 నీతిమంతుడు ఖర్జూరపు చెట్టువలె మొవ్వవేసును,
లెబానోను మీది దేవదారు వృక్షమువలె ఎదుగును.
13 వారు యెహోవా మందిరములో నాటబడి,
మన దేవుని అంగణములలో వర్ధిల్లుదురు.
14 వారు ముసలితనమందు ఇంకా ఫలించుచు,
సారము కలిగి పచ్చిగా ఉందురు.
15 అందువల్ల, నా శైలమైన యెహోవా యథార్థవంతుడనియు,
ఆయన యందు అక్రమము లేదనియు తెలుపబడును.

## 93. కీర్తన.

1 యెహోవా రాజైయున్నాడు, ఆయన ప్రభావము ధరించెను;
యెహోవా బలము ధరించి నడుము కట్టుకొనియున్నాడు;
కావున భూలోకము కదలకుండా స్థిరపరచబడును.

2 నీ సింహాసనము పూర్వమునుంచి స్థిరమైయున్నది,
నీవు నిత్యుడవైయున్నావు.
3 ప్రవాహములు ఎలుగెత్తెను,
యెహోవా! ప్రవాహములు ఎలుగెత్తెను,
ప్రవాహములు తమ అలలను ఘోషింప చేసెను.
4 బలమైన విస్తార జలముల ఘోషకంటే,
సముద్ర తరంగములకంటే,
యెహోవా ఔన్నత్యమందు ఎక్కువైన బలము గలవాడు.
5 నీ సాక్ష్యములు మిక్కిలీ నమ్మకమైనవి,
యెహోవా! పరిశుద్ధత నీ ఇంటికి ఎల్లప్పుడు తగియున్నది

## 94. కీర్తన.

1 ప్రతీకారముల దేవా! యెహోవా!
ప్రతీకారముల దేవా! ప్రకాశించుము.
2 భూలోకమునకు న్యాయము తీర్చేవాడా! లెమ్ము,
గర్విష్ఠులకు ప్రతి ఫలమిమ్ము.
3 యెహోవా! ఎంతమట్టుకు దుష్టులు,
ఎంతమట్టుకు దుష్టులు ప్రహర్షింతురు?
4 వారు ప్రవాహ రీతిగా కఠోరమైన వాటిని పలుకుదురు,
అక్రమము చేసే వారందరు బింకములాడుదురు.
5 యెహోవా! వారు నీ ప్రజలను నలుగగొట్టుచున్నారు,
నీ స్వాస్థ్యమును బాధపెట్టుచున్నారు.
6 వారు విధవను పరదేశిని చంపుచున్నారు,
తండ్రిలేని వారిని హతము చేయుచున్నారు.
7 అప్పుడు వారు—యెహోవా చూడడు,
యాకోబు దేవుడు విచారించడు అనుకొందురు.
8 జనులలో పశుప్రాయులారా! విచారించుడి,
అవివేకులారా! మీరు ఎప్పుడు బుద్ధిమంతులవుదురు?
9 చెవిని కలిగించిన వాడు వినడా!
కన్ను నిర్మించిన వాడు చూడడా!
10 రాష్ట్రములను శిక్షించేవాడు,
మనుష్యులకు తెలివి నేర్పేవాడు గద్దించ కూడదా?
11 వ్యర్థమైనవని,*
నరుల ఆలోచనలు యెహోవాకు తెలుసును.
12,13 దుష్టుల కొరకు గుంట త్రవ్వబడే పర్యంతము,
ఆపత్కాలమందు నెమ్మది కలుగ చేయుటకు,
యెహోవా! నీవు ఎవని శిక్షించుచు,
నీ బోధనవల్ల నేర్పుచున్నావో, ఆ మనుష్యుడు ధన్యుడు;
14 యెహోవా తన ప్రజలను ఎడబాయడు,
ఆయన తన స్వాస్థ్యము విడువడు.
15 తీర్పు న్యాయమునట్టు తిరుగును,
యథార్థ హృదయముగల వారందరు దాని వెంబడింతురు.

* లేక, వ్యర్థులై యున్నారని.

16 దుష్టులకు విరోధముగా ఎవడు నా పక్షమై లేచును?
అక్రమము చేసే వారికి విరోధముగా ఎవడు నా పక్షమై నిలుచును?
17 యెహోవా నాకు సహాయమై యుండకపోతే,
శీఘ్రముగా నా ప్రాణము మౌనమందు నివసించును.
18 —నా కాలు జారుచున్నదని నేను పలికితే,
యెహోవా! నీ కృప నన్ను స్థిరపరుచును.
19 నా అంతరంగ విచారముల బాహుళ్యమందు,
నీ మహాదరణ నా ఆత్మకు నెమ్మది కలుగచేసును.
20 కట్టడవల్ల కీడు కల్పించే అక్రమ పీఠము,
నీతో కలిసియుండునా?
21 వారు నీతిమంతుని ప్రాణమునకు విరోధముగా గుంపుకూడి,
దోషి అని నిర్దోషికి మరణ శిక్ష విధింతురు.
22 యెహోవా నాకు దుర్గమై ఉన్నాడు,
నా దేవుడు నా శరణ శైలమై ఉన్నాడు.
23 ఆయన వారి అక్రమము వారి మీదికి మళ్లించును,
ఆయన వారి చెడుతనము వల్ల వారిని సంహరించును;
మన దేవుడైన యెహోవా వారిని సంహరించును.

## 95. కీర్తన.

1 రండి! యెహోవాను గూర్చి సంతోష గానము చేయుదము,
మన రక్షణ శైలమును గూర్చి ఉత్సాహధ్వని చేయుదము.
2 స్తోత్రముతో ఆయన సన్నిధికి వచ్చి,
కీర్తనలతో ఆయనను గూర్చి ఉత్సాహధ్వని చేయుదము.
3 యెహోవా గొప్ప దేవుడు,
దేవులందరికంటే ఆయన గొప్ప రాజై ఉన్నాడు.
4 భూమియొక్క అగాధ స్థలములు ఆయన చేతిలో ఉన్నవి,
పర్వతముల శిఖరములు ఆయనవి.
5 సముద్రము ఆయనది, ఆయన దాని కలుగచేసెను,
ఆయన చేతులు ఎండిన భూమి నిర్మించెను.
6 రండి! నమస్కారము చేసి సాగిలపడుదము,
మనలను సృజించిన యెహోవా ఎదుట మోకాళ్లూనుదము.
7 ఆయన మన దేవుడు,
మనము ఆయన మేపే ప్రజలము ఆయన చేతి గొర్రెలమై ఉన్నాము;
నేడు మీరు ఆయన శబ్దము వింటే,
8 అరణ్యమందలి మరీబాయొద్ద మస్సాదినమందు యేలాగో*
ఆలాగు మీ హృదయములను కఠినపరుచకుడి.
9 అక్కడ మీ పితృలు నన్ను పరీక్షించి శోధించినారు
మరియు వారు నా కార్యము చూచిరి.
10 నలుబది ఏండ్లు ఆ తరము వారివల్ల చీదరపడినాను,
—వీరు తమ హృదయములో తప్పిపోయే ప్రజలు,
వీరు నా మార్గము తెలుసుకొనలేదు అనుకొంటిని.

* నిర్గమకాండము, అధ్యా. 17. వ. 7.

11 కావున—నా విశ్రాంతిలో వారిని ప్రవేశించనియ్యనని,
నా కోపముచేత ప్రమాణము చేసినాను.

## 96. కీర్తన.

1 యెహోవానుగూర్చి క్రొత్త కీర్తన పాడుడి,
సర్వ భూ జనులారా! యెహోవానుగూర్చి గానము చేయుడి,
2 యెహోవానుగూర్చి కీర్తించుడి, ఆయన నామము కొనియాడుడి,
దినదినమున ఆయన రక్షణ సువార్త ప్రకటించుడి;
3 రాష్ట్రములలో ఆయన మహిమను,
సమస్త జనములలో ఆయన అద్భుతములను వివరించుడి;
4 యెహోవా గొప్పవాడు, ఆయన అధిక స్తోత్రము పొంద తగియున్నాడు;
ఆయన సమస్త దేవులకంటె భయార్హుడైయున్నాడు.
5 జనముల దేవులందరు మాయాకారములు;
యెహోవా ఆకాశము కలుగచేసెను.
6 ఘనత, ప్రభావమును ఆయన ఎదుట ఉన్నవి,
బలము, సౌందర్యమును ఆయన పరిశుద్ధ స్థలమందున్నవి.
7 యెహోవాకు చెల్లించుడి, జనముల కుటుంబములారా!
మహిమ బలము యెహోవావని ప్రకటించుడి.
8 యెహోవాయొక్క నామ మహిమ ఆయనదే అని ప్రకటించుడి,
కానుకను పట్టుకొని ఆయన అంగణములోకి రండి.
9 పరిశుద్ధతాలంకారముతో యెహోవాకు సాగిలపడుడి,
భూ జనులారా! ఆయన యెదుట వణుకుడి.
10 రాష్ట్రములలో ఇట్లు పలుకుడి—యెహోవా రాజైయున్నాడు;
కావున భూలోకము కదలకుండా స్థిరపరచబడును,
ఆయన న్యాయముగా ప్రజాపరిపాలనచేసును.
11 ఆకాశము సంతోషించుగాక,
భూమియు ఆనందించుగాక,
సముద్రము దాని సంపూర్ణతయు ఘోషించుగాక;
12 పొలము దానియందలి సర్వమును ప్రహర్షించుగాక;
అప్పుడు వనవృక్షములన్నియు
13 యెహోవా యెదుట సంతోషధ్వని చేయును; ఆయన వచ్చును,
ఆయన భూ జనులకు న్యాయము తీర్చుటకై వచ్చును,
ఆయన న్యాయము చొప్పున లోకమునకు,
తన సత్యప్రకారముగా జనములకు తీర్పు చేయును.

## 97. కీర్తన.

1 యెహోవా రాజైయున్నాడు; భూలోకము ఆనందించుగాక,
ద్వీపముల సముదాయము సంతోషించుగాక.
2 మేఘాంధకారములు ఆయన చుట్టు ఉన్నవి,
న్యాయము, న్యాయవిధియు,
ఆయన సింహాసనమునకు ఆధారమై ఉన్నవి.
3 అగ్ని ఆయన ముందర నడుచుచుండును,
అది చుట్టునున్న ఆయన శత్రువులను కాల్చివేయును.

4 ఆయన మెరుపులు లోకము ప్రకాశింప చేసెను,
భూలోకము చూచి వణికెను.
5 యెహోవా యెదుట, సర్వలోక నాథుని యెదుట,
పర్వతములు మైనము వలె కరిగినవి.
6 ఆకాశము ఆయన న్యాయము తెలియ చేసెను,
సమస్త జనములు ఆయన మహిమను చూచెను.
7 చెక్కిన ప్రతిమ సేవించే వారందరు,
మాయాకారములను గూర్చి అతిశయపడే వారు సిగ్గుపడుదురు.
దేవులారా! మీరందరు ఆయనకు సాగిలపడుడి.
8 యెహోవా! నీ న్యాయ విధులను,
సీయోను విని సంతోషించెను.
యూదా కుమార్తెలు ఆనందించిరి;
9 యెహోవా! నీవు సర్వ భూమి పైని మహోన్నతుడవు,
సమస్త దేవుల పైని మిక్కిలీ హెచ్చియున్నావు.
10 యెహోవాను ప్రేమించే వారలారా! చెడుతనము ద్వేషించుడి,
ఆయన తన దయాప్రాప్తుల ప్రాణములు కాపాడును;
దుష్టుల చేతిలోనుంచి ఆయన వారిని కాపాడును.
11 నీతిమంతుని కొరకు వెలుగు,
యథార్థ హృదయముగల వారి కొరకు ఆనందము విత్తబడియున్నది.
12 నీతిమంతులారా! యెహోవాను గూర్చి సంతోషించుడి,
ఆయన పరిశుద్ధ నామమును స్తుతించుడి.

## 98. కీర్తన.

సంగీతము.

1 యెహోవాను గూర్చి క్రొత్త కీర్తన పాడుడి,
అద్భుత కార్యములు ఆయన చేసియున్నాడు;
ఆయన కుడిచెయ్యి, ఆయన పరిశుద్ధ బాహువు
విజయము కలుగచేసెను.
2 యెహోవా తన రక్షణ తెలియచేసెను,
రాష్ట్రముల దృష్టికి తన నీతి బైలుపరిచెను.
3 ఆయన ఇశ్రాయేలు ఇంటికొరకైన తన కృపాసత్యములు,
జ్ఞాపకము చేసుకొనియున్నాడు;
భూ దిగంతములన్నియు మన దేవుని రక్షణ చూచినవి.
4 భూ జనులారా! మీరందరు యెహోవాను గూర్చి ఉత్సాహధ్వని చేయుడి;
నోరెత్తి సంతోషగానము చేయుచు వాయించుడి.
5 కిన్నెర మీద యెహోవాను గూర్చి,
కిన్నెర మీద సంగీత స్వరముతో వాయించుడి.
6 బూరలతో, కొమ్ము శబ్దముతో,
రాజైన యెహోవా యెదుట సంతోషగానము చేయండి.
7 సముద్రమును దాని సంపూర్ణతయు,
లోకము దాని నివాసులును ఘోషింతురుగాక.

8 యెహోవా యెదుట, నదులు కరతాళములు వాయించుగాక,
కొండలు కూడి సంతోషగానము చేయునుగాక;

9 ఆయన నీతి చొప్పున లోకమునకు,
న్యాయము చొప్పున జనులకు తీర్పు చేయును.

## 99. కీర్తన.

1 యెహోవా రాజైయున్నాడు; ప్రజలు వణుకుచున్నారు,
ఆయన ఖరూబులమీద నాసీనుడైయున్నాడు; భూమి కదులుచున్నది.

2 సీయోనులో యెహోవా గొప్పవాడు,
ఆయన ప్రజలందరి పైని హెచ్చియున్నాడు.

3 భయార్హమైన నీ గొప్ప నామము స్తుతింతురుగాక;
అది * పరిశుద్ధము.

4 రాజు బలమునకు న్యాయ విధి అనుకూలమై ఉన్నది,
నీవు యథార్థత స్థిరపరిచియున్నావు; యాకోబులో
న్యాయవిధిని న్యాయమును జరిగించినావు.

5 మన దేవుడైన యెహోవాను హెచ్చించుడి,
ఆయన పరిశుద్ధుడు, ఆయన పాదపీఠము యెదుట సాగిలపడుడి;

6 ఆయన యాజకులలో మోషేయు అహరోను,
ఆయన నామమును గూర్చి మొరబెట్టే వారిలో సమూయేలును,
యెహోవాను గూర్చి మొరబెట్టినప్పుడు,
ఆయన వారి కుత్తరమిచ్చెను.

7 మేఘాకార స్తంభములో ఆయన వారితో మాట్లాడెను,
వారు ఆయన సాక్ష్యములను,
ఆయన తమకిచ్చిన విధులను గైకొనిరి.

8 యెహోవా! మా దేవా! నీవు వారి కుత్తరమిచ్చినావు,
నీవు వారికి క్షమించే దేవుడవైతివి,
వారి క్రియలను గూర్చి ప్రతీకారము చేసినావు.

9 మన దేవుడైన యెహోవాను హెచ్చించుడి,
ఆయన పరిశుద్ధ పర్వతము యెదుట సాగిలపడుడి,
మన దేవుడైన యెహోవా పరిశుద్ధుడు.

## 100. కీర్తన.

స్తుతికీర్తన.

1 సమస్త భూ జనులారా!
యెహోవాను గూర్చి ఉత్సాహధ్వని చేయుడి.

2 సంతోషముతో యెహోవాను సేవించుడి,
ఆనందగానముతో ఆయన సన్నిధికి రండి.

3 యెహోవాయే దేవుడని తెలుసుకొనుడి,
ఆయన మనలను పుట్టించెను; మనము ఆయనవారము,
మనము ఆయన ప్రజలము, ఆయన మేపే గొఱ్ఱెలమై ఉన్నాము.

---

* లేక, ఆయన.

4 ఆయన గుమ్మముల ద్వారా స్తోత్రములతోను,
ఆయన అంగణములలో కీర్తనతోను ప్రవేశించుడి;
ఆయనను స్తుతించి ఆయన నామము కొనియాడుడి.
5 యెహోవా మంచివాడు, ఆయన కృప నిరంతరము ఉండును,
ఆయన సత్యము తరతరముల మట్టుకును ఉండును.

## 101. కీర్తన.

దావీదు కీర్తన.

1 నేను కృపను న్యాయవిధిని కీర్తింతును,
యెహోవా! నిన్ను గూర్చి సంగీతగానము చేతును.
2 నిర్దోష మార్గమందు వివేకముతో ప్రవర్తింతును;
నీవు ఎప్పుడు నా యొద్దికి వచ్చెదవు?
నీ ఇంటిలో యథార్థ హృదయముతో నడుచుకొందును.
3 నీచకార్యమందు నేను దృష్టి ఉంచుకొనను,
ద్రోహము చేయుట నాకు అసహ్యము,
అది నాకు అంటి యుండదు.
4 మూర్ఖచిత్తుడు నా యొద్దనుంచి తొలగి పోవలెను,
నాకు దుష్ట సాంగత్యముండదు.
5 తన పొరుగువాని మీద ఎవడు చాటుగా కొండెము చెప్పునో,
వాని సంహరింతును;
6 అహంకార దృష్టి, గర్వించే హృదయము ఎవనికి కలుగునో,
వాని సహించను.
7 నా కన్నులు దేశమందలి విశ్వాసుల మీదనున్నవి,
వారు నా సన్నిధిని ఉండ వలెను;
నిర్దోష మార్గములో ఎవడు నడుచునో,
వాడే నాకు పరిచారకుడవును.
8 ఎవడు మోసము చేసునో,
వాడు నా ఇంట నివసించ కూడదు;
అబద్ధములు పలికేవాడు,
నా కన్నుల యెదుట స్థిరపరచబడడు.
9 దేశమందలి సమస్త దుష్టులను,
ప్రతి ఉదయమందు సంహరింతును;
ఆలాగున యెహోవా పట్టణములోనుంచి,
అక్రమము చేసే వారిని కొట్టివేతును.

## 102. కీర్తన.

కుంది, యెహోవా యెదుట తన మొర్ర కుమ్మరించుచుండే బాధగల
వాని ప్రార్థన.

1 యెహోవా! నా ప్రార్థన వినుము,
నా మొర్రను నీ యొద్దికి రానిమ్ము.
2 నీ ముఖము నాకు దాచకుము,
నా ఆపత్కాలమందు నాకు చెవి యొగ్గుము,
నేను పిలిచే దినమున త్వరపడి నాకు ఉత్తరమిమ్ము.

3 నా దినములు ధూమమువలె క్షీణమై పోయెను,
నా ఎముకలు కొరవి వలె కాల్చబడి ఉన్నవి.
4 ఎండదెబ్బ తగిలి, గడ్డివలె నా హృదయము వాడినది,
నా ఆహారము తినుట మరచిపోతిని.
5 నా మూలుగుల శబ్దముచేత,
నా ఎముకలు నా మాంసమును హత్తుకొని ఉన్నవి.
6 నేను అడవి కొంగను పోలి ఉన్నాను,
పాడైన స్థలముల గుడ్లగూబ వలె ఉన్నాను.
7 నేను మెలుకువగా ఉండి,
ఇంటి మీద ఒంటిగా ఉండే పిచ్చుకవలె నున్నాను.
8 నా శత్రువులు దినమెల్ల నన్ను నిందించి ఉన్నారు,
నా మీద వెర్రికోపము గలవారు, నాతోడని ఒట్టుబెట్టుకొందురు.
9,10 నీ క్రోధమువల్ల నీ ఆగ్రహమువల్లను,
రొట్టెవలె బూడిదెను తిని,
కన్నీళ్లతో నా పానీయము కలిపి ఉన్నాను;
నీవు నన్ను పైకెత్తి కింద విసరివేసినావు.
11 నా దినములు, సాగిపోయే నీడను పోలి ఉన్నవి;
నేను గడ్డి వలె వాడి ఉన్నాను.
12 యెహోవా! నీవు నిరంతరము సింహాసనాసీనుడవై ఉన్నావు,
నీ నామము* తరతరముల మట్టుకు ఉండును.
13 నీవు లేచి సీయోనును కరుణింతువు,
దాని మీద దయ ఉంచుటకు కాలము వచ్చినది,
నిర్ణయకాలము వచ్చెను.
14 నీ సేవకులు దాని రాళ్లయందు ఇష్టపడి,
దాని మంటిమీద కనికరపడి ఉన్నారు.
15 రాష్ట్రములు యెహోవా నామమునకు,
భూ రాజులందరు నీ మహిమకును భయపడుదురు;
16 యెహోవా సీయోనును కట్టి ఉన్నాడు;
ఆయన తన మహిమతో అగుపడి ఉన్నాడు.
17 ఆయన దిక్కులేని దరిద్రుల ప్రార్థన వైపు మళ్లుకొని,
వారి ప్రార్థన అలక్ష్యము చేయలేదు.
18 ఇది వచ్చే తరము కొరకు వ్రాయబడును,
సృజించబడ బోయే ప్రజలు యెహోవాను స్తుతింతురు.
19-22 ఆయన తన పరిశుద్ధమైన ఉన్నత స్థలములోనుంచి వంగి చూచెను;
ప్రజలు రాజ్యములును,
యెహోవాను సేవించ కూడినప్పుడు,
జనులు సీయోనులో యెహోవా నామమును,
యెరూషలేములో ఆయన స్తోత్రమును ప్రకటించే నిమిత్తము,
చెరలోని వాని మూల్గును వినుటకును,
చావునకు నిర్ణయించబడిన వారిని విడిపించుటకును,
యెహోవా ఆకాశమునుంచి భూమితట్టు నిదానించి చూచెను.

* లేక, నిన్ను జ్ఞాపకము చేసేది.

23 ఆయన నా బలమును, ప్రయాణములో కుంగచేసి ఉన్నాడు,
నా దినములు కొద్దిపరిచి ఉన్నాడు.
24 నేనన్నాను—నా దేవా! నా దినముల మధ్యను నన్ను కొంచుపోకుము,
నీ సంవత్సరములు తరతరముల మట్టుకు ఉన్నవి.
25 పూర్వము నీవు భూమి పునాది వేసినావు,
ఆకాశము కూడా నీ చేతుల పని.
26 అవి నశించును; నీవు నిలిచి ఉందువు;
అవి అన్నియు వస్త్రము వలె పాతవౌను,
అంగవస్త్రము వలె, వాటిని నీవు మార్చుదువు; అవి మార్చబడును.
27 నీవైతే ఏకరీతిగానే ఉన్నావు;
నీ సంవత్సరములు తుద ముట్టవు.
28 నీ సేవకుల కుమారులు (స్వదేశమందు) నివసింతురు,
వారి సంతానము నీ యెదుట స్థిరపరచబడును.

## 103. కీర్తన.

దావీదు కీర్తన.

1 నా ఆత్మా! యెహోవాను,
నా సర్వాంతరంగములారా!
ఆయన పరిశుద్ధ నామమును స్తుతించుడి.
2 నా ఆత్మా! యెహోవాను స్తుతించుము,
ఆయన ఉపకారములన్నియు మరువకుము.
3 ఆయన నీ అక్రమములన్నియు క్షమించును,
నీ సంకటములన్నియు బాగు చేసును.
4 ఆయన పాతాళమునుంచి నీ ప్రాణము విమోచించును,
దయా దాక్షిణ్యములనే కిరీటముతో నిన్ను అలంకరించును.
5 ఆయన, మేలుతో నీ సౌందర్యము సంపూర్ణము చేసును,
గద్దవలె నీకు బలము కల్గుటకు, నీ యౌవనము మళ్లి పొదుకొనును.
6 యెహోవా నీతి క్రియలను,
బాధపరచబడే వారికందరికి న్యాయ విధులను నెరవేర్చును.
7 ఆయన మోషేకు తన మార్గములను,
ఇశ్రాయేలు వంశస్థులకు తన క్రియలను తెలియచేసెను.
8 యెహోవా దయాదాక్షిణ్య విశిష్టుడు,
ఆయన దీర్ఘశాంతము, కృపాతిశయమును గలవాడు.
9 ఆయన ఎల్లకాలము పోరాడుచు ఉండడు,
ఎల్లప్పుడును కోపించుచుండడు.
10 ఆయన మన పాపముల చొప్పున మనకు ప్రతీకారము చేయలేదు,
మన అక్రమముల చొప్పున మనకు ప్రతి ఫలమియ్యలేదు.
11 భూమికి పైగా ఆకాశము ఎంత ఉన్నతమైనదో,
ఆయనకు భయపడే వారికి, ఆయన కృప అంత అధికమైనది.
12 పడమటికి తూర్పు ఎంత దూరమో,
ఘనకు, మన అపరాధములను అంత దూరము చేసి ఉన్నాడు.

13 తండ్రి తన కుమారులయందు కనికరపడేరీతిగా,
యెహోవా తన భక్తులయందు కనికరపడుచున్నాడు.
14 మనము నిర్మించబడిన రీతి ఆయనకు తెలుసును,
మనము మంటివారమని జ్ఞాపకము చేసుకొనుచున్నాడు.
15 మర్త్యుని దినములు గడ్డివలె నున్నవి,
మనుష్యుడు అడవి పువ్వు వలె పూయును;
16 దాని మీద గాలి విసిరితే, అది గతించును,
ఆమీదట, దాని చోటు దాని ఎరగదు.
17 అయితే ఆయనకు భయపడే వారికి,
యెహోవా కృప అనాదిగా నిరంతరమునుండును.
18 ఆయన నిబంధన* గైకొనే వారికి,
ఆయన ఆజ్ఞలను జ్ఞాపకముచేసుకొని వాటిని మన్నించేవారికి,
ఆయన నీతి, కుమారుల కుమారులకును ఉండును.
19 యెహోవా ఆకాశమందు తన సింహాసనము స్థిరపరిచి ఉన్నాడు,
ఆయన రాజ్యపరిపాలన అంతటను ఉన్నది.
20 ఆయన దూతలారా!
ఆయన వాక్యశబ్దము ఆలకిస్తు, ఆయన వాక్యము నెరవేర్చే
బలవంతులైన శూరులారా! యెహోవాకు నమస్కారము చేయుడి.
21 ఆయన సర్వసేనలారా!
ఆయన ఇచ్ఛ నెరవేర్చే ఆయన సేవకులారా!
యెహోవాను స్తుతించుడి.
22 ఆయన ఏలే స్థలములన్నిటిలో,
ఆయన సర్వకార్యములారా! యెహోవాను స్తుతించుడి,
నా ఆత్మా! యెహోవాను స్తుతించుమీ.

## 104. కీర్తన.

1 నా ఆత్మా! యెహోవాను స్తుతించుము,
యెహోవా! నా దేవా! నీవు మిక్కిలీ గొప్పవాడవు,
నీవు మహిమ ప్రభావమును ధరించి ఉన్నావు.
2 వస్త్ర వలె వెలుగుతో నిన్ను నీవు కప్పుకొనుచున్నావు,
మేలుకట్టు వలె ఆకాశము పరుచుచున్నావు.
3 ఆయన, జలములలో తన గదులు నిర్మించుచు,
మేఘములు తన వాహనముగా చేసుకొనుచు,
గాలి రెక్కల మీద నడుచుచున్నాడు.
4 ఆయన తన దూతలు వాయువులుగాను,
తన పరిచారకులు అగ్నిమంటలుగాను చేసుకొనుచున్నాడు.
5 భూమిని దాని పునాదులమీద ఆయన స్థిరపరిచెను,
అది ఎన్నటెన్నటికిని కదలదు.
6 వస్త్రము వలె అగాధజలముతో దాని కప్పినావు,
కొండల పైని నీళ్లు నిలిచినవి.

* లేక, ఒడంబడిక

7, 8 నీవు గద్దించగానే అవి పారిపోయెను;
పర్వతములు ఎక్కుచు, పల్లములు దిగుచునుండగా
నీవు వాటికి నియమించిన చోటికి
నీ ఉరుము శబ్దము వల్ల అవి తొందరపడి పోయెను.
9 నీవు (వాటికి) సరిహద్దు ఉంచినావు, అవి దాని మించ కూడదు;
భూమిని కప్పుటకు తిరిగీ రావు.
10 నీవు కొండ వాగులలో నీటి బుగ్గలను పుట్టించుచున్నావు,
అవి కొండ సందులలో పారుచున్నవి.
11 అవి దాహమునకు అడవి జంతువులకన్నిటికి ఉపయోగమైనవి,
అడవి గాడిదెలు దప్పి తీర్చుకొనుచున్నవి.
12 వాటిపైని ఆకాశ పక్షులు వాసము చేయుచున్నవి,
అవి కొమ్మల మధ్యను సునాదము చేయుచున్నవి.
13 ఆయన తన మేఘములనుంచి* కొండలను తాగనిచ్చుచున్నాడు,
నీ క్రియల ఫలమువల్ల భూమి తృప్తి పొందుచున్నది.
14 ఆయన పశువుల కొరకు గడ్డిని,
మనుష్యుల ఉపయోగము కొరకు కూరలను మొలిపించుచు,
భూమిలోనుంచి ఆహారము పుట్టించుచున్నాడు.
15 ఆయన ద్రాక్షారసముతో నరుల హృదయము సంతోషపెట్టుచు,
తైలముచేత వారి మొగము మెరుగుపెట్టుచు,
రొట్టెవల్ల మనుష్యుల హృదయము బలపరుచుచునున్నాడు.
16 యెహోవా వృక్షములు,
ఆయన నాటిన లెబానోను దేవదారు చెట్లు తృప్తిపొందుచున్నవి.
17 అక్కడ పక్షులు తమ గూళ్లు కట్టుచున్నవి,
తమాల వృక్షము కొంగలకు నివాసము.
18 అడవి మేకలకు గొప్ప కొండలు,
కుందేళ్లకు బండలును ఆశ్రయమై ఉన్నవి.
19 ఆయన కాలనిర్ణయము కొరకు చంద్రుని చేసెను,
సూర్యుడు తన అస్తమానకాలము ఎరిగి ఉన్నాడు.
20 నీవు చీకటి చేయగా రాత్రి అవును,
అందులో అడవి జంతువులన్నియు తిరుగులాడుచుండును.
21 సింహపు పిల్లలు వేట కొరకు గర్జించును,
ఆహారము కొరకు దేవుని అడుగుకొనును.
22 సూర్యుడు ఉదయించగానే అవి తొలగి,
తమ గుహలలో పండుకొనును.
23 మనుష్యుడైతే తన పని చేయుటకు,
సాయంకాలముదాక వ్యవసాయము చేయుటకు బైలువెళ్లును.
24 యెహోవా! నీవు చేసినవి ఎంత విస్తారమైనవో!
జ్ఞానముతో వాటినన్నిటిని నిర్మించినావు;
భూమి నీ ఐశ్వర్యముతో నిండి ఉన్నది.
25 ఇదుగో! విశాలమైన గొప్ప సముద్రము!
దానిలో చిన్నవి పెద్దవి లెక్కలేని జీవరాసులున్నవి.

*Heb. గదులనుంచి.

26 అందులో ఓడలు నడుచుచుండును;
దానిలో చెల్లాటమాడుటకు నీవు నిర్మించిన లివ్యాతాను కలదు.
27 నీవు తగిన కాలమందు వాటివాటికి ఇచ్చుటకు,
అవి అన్నియు నిన్ను కనుపెట్టుచున్నవి.
28 నీవు వాటికి పెట్టెది అవి కూర్చుకొనుచుండును,
నీవు నీ చెయ్యి విప్పితే అవి మేలుతో తృప్తిపరుచబడును.
29 నీవు వాటికి విముఖుడవైతే అవి అదిరి ఉండును,
నీవు వాటి ఊపిరి తీసివేస్తే అవి ప్రాణములు విడిచి,
తమ మంటికి మళ్లును.
30 నీవు నీ ఆత్మను పంపితే, అవి సృజించబడును,
నీవు భూ తలము నూతనపరుచుచుందువు.
31 యెహోవా మహిమ నిరంతరము ఉండుగాక,
యెహోవా తన క్రియలవల్ల ఆనందించుగాక.
32 ఆయన భూమిని చూచితే, అది వణుకును,
ఆయన పర్వతములను ముట్టితే పొగరాజును.
33 నా జీవిత కాలమువరకు యెహోవాను కీర్తింతును,
నేనున్నంతమట్టుకు నా దేవుని గూర్చి గానము చేతును.
34 ఆయనను గూర్చిన నా ధ్యానము ఆయనకు ఇష్టమవుగాక,
నేను యెహోవాను గూర్చి సంతోషింతును.
35 పాపులు భూమి మీదనుంచి నాశమై పోదురు,
దుష్టులు ఇకనుండక పోదురు;
నా ఆత్మా! యెహోవాను స్తుతించుము; హల్లెలూయా.

## 105. కీర్తన.

1 యెహోవాను స్తుతించుడి; ఆయన నామము ప్రకటించుడి,
జనములలో ఆయన కార్యములు తెలియ చేయుడి.
2 ఆయనను కీర్తించుడి; ఆయనను గూర్చి గానము చేయుడి,
ఆయన అద్భుతములన్నియు ధ్యానించి పలుకుడి.
3 ఆయన పరిశుద్ధ నామమును గూర్చి కొనియాడుకొనుడి,
యెహోవాను వెతికే వారి హృదయము సంతోషించుగాక.
4 యెహోవాను గూర్చి ఆయన బలమును గూర్చియు విచారణ చేయుడి;
ఆయన అనుగ్రహము* ఎల్లప్పుడును వెతుకుడి.
5, 6 ఆయన సేవకుడైన అబ్రాహాము వంశస్థులారా!
ఆయన ఏర్పరుచుకొనిన యాకోబు పుత్రులారా!
ఆయన చేసిన ఆయన అద్భుత కార్యములు,
ఆయన గురుతులు ఆయన నోటి న్యాయ విధులును,
జ్ఞాపకము చేసుకొనుడి.
7 యెహోవా అనే ఆయన మన దేవుడు,
ఆయన న్యాయ విధులు భూమియందంతట నున్నవి.
8, 9 ఆయన, తాను వెయ్యి తరముల మట్టుకు సెలవిచ్చిన మాట,
తాను అబ్రాహాముతో చేసిన నిబంధన†,

* హెబ్రీలో, ముఖము. †లేక, ఒడంబడిక.

తాను ఇస్సాకుతో చేసిన ప్రమాణమును,
నిరంతరము జ్ఞాపకము చేసుకొనుచున్నాడు.
10, 11 —కనానను దేశమును నీ స్వాస్థ్యభాగముగా నీకిత్తునని,
ఆయన (ఆ నిబంధన) యాకోబుకు కట్టడగాను,
ఇశ్రాయేలుకు నిత్య నిబంధనగాను స్థిరపరచెను.
12 వారు కొద్ది లెక్కగలవారై ఉండిరి;
ఆ కొంచెముమంది దానితో పరదేశులై ఉండి,
13 ఒక రాష్ట్రమునుంచి మరియొక రాష్ట్రమునకును,
ఒక రాజ్యమునుంచి మరియొక జనమొద్దికిని తిరుగుచుండగా,
14, 15 ఆయన ఏ మనుష్యుని వారికి హింస చేయనియ్యక,
—నా అభిషిక్తులను ముట్ట వద్దనియు,
నా ప్రవక్తలకు కీడు చేయ వద్దనియు,
వారి కొరకు రాజులను గద్దించెను.
16 ఆయన, దేశముమీదికి కరువును రప్పించెను,
జీవనాధారమైన ధాన్యమును కొట్టివేసెను.
17 వారికంటే ముందుగా ఆయన ఒకని పంపించెను,
యోసేపు దాసుడుగా అమ్మబడెను.
18 వారు సంకెళ్లచేత అతని కాళ్లను నొప్పించిరి,
అతని ప్రాణము ఇనపకట్లలో చేర్చిరి.
19 ఆయన మాట నెరవేరిన కాల పర్యంతము,
యెహోవా వాక్యము అతని పరిశీలించెను.
20 రాజు పంపి అతని వదిలించెను,
ప్రజలయొక్క అధికారి అతనిని పైకి తెప్పించెను.
21, 22 అతని ఇష్టప్రకారము తన సర్దారులను ఏలుటకు,
తన పెద్దలకు బోధించుటకు,
తన ఇంటికి యజమానునిగాను,
తన యావదాస్తికి అధికారినిగాను అతని నియమించెను.
23 ఇశ్రాయేలు ఐగుప్తులోకి వచ్చెను;
యాకోబు, హామను దేశమందు పరదేశిగా ఉండెను.
24 ఆయన తన ప్రజలకు బహు సంతానవృద్ధి కలుగచేసి,
వారి విరోధులకంటే వారికి అధిక బలము కలిగించెను.
25 తన ప్రజలను ద్వేషించుటకు,
తన సేవకుల ఎడల కుయుక్తి చేయుటకు,
ఆయన వారి హృదయములను త్రిప్పెను.
26 ఆయన తన సేవకుడైన మోషేను,
తాను ఏర్పరుచుకొనిన అహరోనును పంపెను.
27 వారు వారి మధ్యను ఆయన సురుతులను,
హాము దేశములో భయోత్పాతములు కలుగచేసిరి.
28 ఆయన చీకటి రప్పించి చీకటి కలుగచేసెను,
వారు ఆయన మాటకు ఎదిరించలేదు.
29 ఆయన వారి జలములు రక్తముగా మార్చి,
వారి చేపలను చావచేసెను.

30 వారి దేశములో కప్పలరాశి విస్తారమైనది,
అవి వారి రాజుల గదులలో ఉండెను.
31 ఆయన చెప్పగానే జోరీగలు,
వారి ప్రాంతములన్నిటిలో దోమలును వచ్చెను.
32 ఆయన వారి వాన వడగండ్లగా చేసెను;
వారి దేశమందు అగ్నిజ్వాలలు పుట్టించెను.
33 ఆయన వారి ద్రాక్షావల్లులను, వారి అంజూరపు చెట్లను కొట్టెను;
వారి ప్రాంతములయందలి వృక్షములను విరుగగొట్టెను.
34 ఆయన చెప్పగానే మిడతలు,
లెక్కలేని చీడ పురుగులు వచ్చెను.
35 అవి వారి దేశపు కూరలన్నియు తిని,
వారి భూమి పంటలను తినివేసెను.
36 ఆయన వారి దేశమందలి సమస్త జ్యేష్ఠులను,
వారందరి మొదటి బలము హతమును చేసెను.
37 అక్కడనుంచి ఆయన వారిని వెండి బంగారులతో తెప్పించెను,
వారి గోత్రములలో తొట్రిల్లేవాడు ఒక్కడునుండ లేదు.
38 వారు బైలు వెళ్లినప్పుడు ఐగుప్తీయులు సంతోషించిరి,
వారి భయము వారికి కలిగినది.
39 ఆయన చాటుకొరకు మేఘమును,
రాత్రిలో వెలుగిచ్చుటకు అగ్నియు కలుగచేసెను.
40 వారు అడిగినప్పుడు, ఆయన లావుకలను రప్పించెను,
ఆకాశపు రొట్టెలతో వారిని తృప్తిపరిచెను.
41 ఆయన బండను చీల్చెను; నీళ్లు పైకి వచ్చి,
ఏరు వలె ఎడారులలో పారెను.
42 ఆయన తన పరిశుద్ధ వాక్యమును,
తన సేవకుడైన అబ్రాహామునును జ్ఞాపకము చేసుకొని,
43 తన ప్రజలను సంతోషముతోను,
తాను ఏర్పరుచుకొనిన వారిని ఉత్సాహ ధ్వనితోను,
బైటికి రప్పించెను.
44, 45 వారు తన కట్టడలను మన్నించుటకును,
తన బోధ వాక్యములు గైకొనుటకును,
ఆయన వారికి రాష్ట్రముల భూములు ఇచ్చెను;
వారు జనముల కష్టార్జితమును స్వతంత్రించుకొనిరి హల్లెలూయా.

## 106. కీర్తన.

1 హల్లెలూయా!
యెహోవాను స్తుతించుడి; ఆయన మంచివాడు;
ఆయన కృప నిరంతరమును ఉన్నది.
2 యెహోవాయొక్క పరాక్రమ కార్యములు ఎవడు చెప్పగలడు!
ఆయన కీర్తి యావత్తు ఎవడు వినిపించగలడు!
3 న్యాయవిధి గైకొనే వారికి,
ఎల్లకాలము న్యాయము చేసే వారికి ధన్యత కలుగును.
4 యెహోవా! నీ ప్రజలమీది నీ దయలో నన్ను జ్ఞాపకము చేసుకొని,
నాకు దర్శనమిచ్చి నన్ను రక్షించుము.

5 అందువల్ల నీవు ఏర్పరచుకొనిన వారి మేలు చూతును;
నీ రాష్ట్రము సంతోషముతో సంతోషించును,
నీ స్వాస్థ్యమైన వారితోకూడా కొనియాడుకొందును.

6 మా పితృల వలె మేము పాపము చేసితిమి,
అక్రమము చేసినాము, దుష్టులమైతిమి.
7 ఐగుప్తులో మా పితృలు నీ అద్భుతములను విచారణ చేయలేదు;
వారు నీ కృపాతిశయములను జ్ఞాపకము చేసుకొనక,
సముద్రము యొద్ద, ఎర్ర సముద్రము యొద్ద తిరుగుబాటుచేసిరి.
8 అయితే ఆయన తన నామము నిమిత్తము,
తన పరాక్రమము తెలియచేయుటకు వారిని రక్షించెను.
9 ఆయన ఎర్ర సముద్రము గద్దించెను; అది ఎండిపోయెను;
అరణ్యములో వలె అగాధ జలములలో వారిని నడిపించెను.
10 ఆయన, ద్వేషి చేతిలోనుంచి వారిని రక్షించెను,
శత్రుని చేతిలోనుంచి వారిని విమోచించెను.
11 నీళ్లు వారి శత్రువులను కప్పివేసెను,
వారిలో ఒక్కడైనను మిగిలి ఉండ లేదు.
12 అప్పుడు వారు ఆయన మాటలు నమ్మిరి,
ఆయన కీర్తి గానము చేసిరి.

13 శీఘ్రముగా వారు ఆయన కార్యములు మరిచిపోయిరి;
ఆయన ఆలోచన కొరకు కనుపెట్టుకొనలేదు.
14 అరణ్యములో వారు అత్యాశతో ఆశించి,
ఎడారిలో దేవుని శోధించినారు.
15 ఆయన, వారు అడిగిన దాని వారికిచ్చెను,
అయితే వారి ప్రాణములకు ఆయన క్షీణత కలుగచేసెను.
16 మరియు, వారు తమ దండులో మోషేయందు,
యెహోవా పరిశుద్ధుడైన అహరోనుయందును అసూయపడ్డారు.
17 భూమి తెరవబడి దాతానును మ్రింగి,
అబీరాముయొక్క జనసమూహమును కప్పెను.
18 వారి సంఘములో అగ్ని రవులుకొనెను,
దాని మంట దుష్టులను కాల్చివేసెను.
19 హోరేబులో వారు దూడను చేయించిరి,
ఆ పోతపోసిన విగ్రహమునకు సాగిలపడిరి.
20 గడ్డి మేసే ఎద్దు స్వరూపమునకు,
తమ మహిమను మార్చిరి.
21, 22 ఐగుప్తులో గొప్ప కార్యములను,
హాము దేశములో అద్భుతములను,
ఎర్ర సముద్రముయొద్ద భీకర కృత్యములను చేసిన,
తమ రక్షకుడైన దేవుని మరిచిపోయిరి.
23 ఆయన వారిని నశింపచేతుననగా,
నాశము చేయకుండా ఆయన కోపము తిప్పుటకు,
ఆయన ఏర్పరచుకొనిన మోషే,
ఆయన యెదుట సందులో అడ్డపడి నిలిచెను.

24 వారు రమ్యదేశమును అలక్ష్యము చేసిరి,
ఆయన మాట నమ్మలేదు.
25 వారు తమ గుడారములలో సణుగుకొనుచు
యెహోవా వాక్యమును ఆలకించలేదు.
26, 27 అప్పుడు వారిని అరణ్యములో కూలచేయుటకు,
వారి సంతానమును రాష్ట్రములలో కూల్చుటకు,
దేశములలో వారిని చెదరగొట్టుటకును,
ఆయన వారికి విరోధముగా తన చెయ్యి ఎత్తెను.

28 మరియు, వారు పెయోరు* స్వామిని హత్తుకొని,
నిర్జీవమైన వాటి బలులు భుజించిరి.
29 వారు తమ క్రియల వల్ల కోపము పుట్టించిరి,
కావున, తెగులు వారిలో బైలుదేరెను.
30 అప్పుడు ఫీనెహాసనేవాడు లేచి న్యాయము చేసెను,
కావున, ఆ తెగులు మాన్పబడెను.
31 అది అనంతమైన తరముల పర్యంతము,
అతనికి నీతిగా ఎంచబడెను.

32 మెరీబా జలములయొద్ద వారు కోపింపచేసిరి,
వారి మూలముగా మోషేకు హింస కలిగినది.
33 వారు అతని ఆత్మకు కోపము తెప్పించిరి†
అతడు తన పెదవులతో కానిమాట పలికెను.

34 యెహోవా వారికి ఆజ్ఞాపించిన ప్రకారముగా,
వారు ఆ జనములను నాశము చేయలేదు;
35 అప్పుడు వారు రాష్ట్రములతో వియ్యమంది,
వారి కార్యములు నేర్చుకొనిరి.
36 వారు వారి విగ్రహములను సేవించిరి;
అవి వారికి ఉరిగా ఉండెను.
37 వారు తమ కుమారులను కుమార్తెలను,
దయ్యములకు బలిగా అర్పించిరి.
38 వారు నిరపరాధ రక్తమును,
తమ కుమారులయు, కుమార్తెలయు రక్తమును చిందించిరి,
కనానుదేశపు ప్రతిమలకు వారిని బలిగాపెట్టిరి;
ఆరక్తమువల్ల దేశము అపవిత్రపరచబడెను.
39 వారు చేసిన వాటివల్ల వారికి మైల కలిగినది,
తమ క్రియలవల్ల వారు వ్యభిచరించిన వారైరి.

40 అప్పుడు యెహోవా కోపము ఆయన ప్రజలమీద రవులుకొనెను,
ఆయన తన స్వాస్థ్యమందు అసహ్యపడెను.
41 ఆయన వారిని రాష్ట్రముల చేతికి అప్పగించెను,
వారి ద్వేషులు వారిని ఏలుచుండిరి.

---

*అవాచ్యమైన పూజ. †లేక, తిరుగుబాటుచేసిరి,

42 వారి శత్రువులు వారిని బాధపెట్టినారు,
వారు వారి చేతికింద అణపబడిరి.
43 అనేక పర్యాయములు ఆయన వారిని విడిపించెను;
అయినను, వారు తమ ఆలోచనవల్ల ఆయనమీద తిరుగబడిరి;
తమ అక్రమమువల్ల కూల్చబడిరి.
44 అయితే, ఆయన వారి మొర్రను వినినప్పుడు,
ఆయన వారి శ్రమను లక్షించెను.
45 ఆయన వారి కొరకు తన నిబంధన జ్ఞాపకము చేసుకొని,
తన కృపాతిశయము చొప్పున దుఃఖించి వారిని కరుణించెను.
46 వారిని చెరపట్టిన వారందరి యెదుట,
ఆయన వారియెడల కనికరము కలుగచేసెను.
47 యెహోవా! మా దేవా! మమ్ము రక్షించి,
రాష్ట్రములనుంచి మమ్ము పోగుచేయుము;
అప్పుడు మేము నీ పరిశుద్ధ నామము స్తుతింతుము,
నీ కీర్తి విషయము కొనియాడుకొందుము.
48 ఇశ్రాయేలు దేవుడైన యెహోవా,
నిరంతరమును నిత్య స్తోత్రము పొందుగాక;
ప్రజలందరు—ఆమేన్ అందురుగాక. హల్లెలూయా*.

## 107. కీర్తన.

1 యెహోవాను స్తుతించుడి; ఆయన మంచివాడు;
ఆయన కృప నిరంతరము ఉండునని
2 యెహోవా వల్ల విమోచించబడిన వారు పలుకుదురుగాక,
వారిని విరోధి చేతిలోనుంచి ఆయన విమోచించి,
3 తూర్పునుంచి పడమటినుంచి,
ఉత్తరమునుంచి దక్షిణమునుంచియు
నానా దేశములనుంచి వారిని పోగుచేసెను.

4 వారు అరణ్యమందలి ఎడారి తోవను తిరుగులాడుచుండిరి,
నివసించుటకు పట్టణము వారికి దొరకదాయెను.
5 ఆకలి దప్పులు కలిగి,
వారిలో వారి ప్రాణము కుందినది.
6 అప్పుడు వారు తమ శ్రమలో యెహోవాను గూర్చి మొరబెట్టిరి;
ఆయన వారి బాధలోనుంచి వారిని విడిపించెను.
7 వారు నివాస పట్టణము వెళ్లుటకు,
ఆయన యథార్థ మార్గమున వారిని నడిపించెను.
8 వారు యెహోవా యెదుట ఆయన కృపను,
నరపుత్రుల యెదుట ఆయన అద్భుతములను స్తుతింతురుగాక;
9 ఆయన దప్పిగల ప్రాణము తృప్తిపరిచెను,
ఆకలి గల ప్రాణము మేలుతో నింపెను.

---

* అనగా, యెహోవాను స్తుతించుడి.

10, 11 దేవుని మాటలమీద తిరగబడి,
మహోన్నతుని ఆలోచన నిర్లక్ష్యము చేసినందున,
బాధచేతను ఇనప కట్లచేతను కట్టబడి,
చీకటిలోను మరణఛాయలోను కూర్చుండే వారి హృదయము,
12 ఆయాసమువల్ల ఆయన కుంగచేసెను;
వారు జోగిరి, సహాయుడు లేకపోయెను.
13 అప్పుడు తమ శ్రమలో యెహోవాను గూర్చి మొరబెట్టిరి,
ఆయన వారి బాధలలోనుంచి వారిని రక్షించెను.
14 ఆయన చీకటిలోనుంచి,
మరణ ఛాయలోనుంచి వారిని పైకి రప్పించి,
వారి కట్లను తెంపివేసెను.
15 వారు యెహోవా యెదుట ఆయన కృపను,
నరపుత్రుల యెదుట ఆయన అద్భుతములను స్తుతింతురుగాక;
16 ఆయన ఇత్తడి తలుపులను పగలగొట్టి,
ఇనప గడియలను విరిచెను.
17 బుద్ధిహీనులు, తమ ద్రోహమార్గము వలన
తమ అక్రమముల వలన బాధపరుచుకొందురు.
18 ఆహారమంతయు వారి ప్రాణమునకు అసహ్యము,
వారు మరణ ద్వారముల యొద్దికి సమీపించిరి.
19 అప్పుడు తమ శ్రమలో యెహోవాను గూర్చి మొరబెట్టిరి,
ఆయన వారి బాధలలోనుంచి వారిని రక్షించెను.
20 ఆయన తన వాక్యము పంపి వారిని బాగుచేసి,
తమ గుంటలలోనుంచి వారిని తప్పించెను.
21 వారు యెహోవా యెదుట ఆయన కృపను,
నరపుత్రుల యెదుట ఆయన అద్భుతములను స్తుతింతురుగాక.
22 వారు కృతజ్ఞతా యాగము చేసి,
ఉత్సాహ ధ్వనితో ఆయన కార్యములను వివరింతురుగాక.
23 ఓడలెక్కి సముద్రము మీద వెళ్లి,
మహా జలములయందు వ్యాపారము చేసేవారు,
24 యెహోవా కార్యములను,
అగాధ జలములలోని ఆయన అద్భుతములను చూచిరి.
25 ఆయన పలికి తుఫాను పుట్టించెను,
అది దాని తరంగములు లేవనెత్తినది.
26 వారు ఆకాశమునకు ఎక్కిరి, మళ్లి అగాధమునకు దిగిరి;
వారి ప్రాణము శ్రమవల్ల కరిగిపోయెను.
27 వారు మత్తెక్కిన వాని వలె జోగి జోగి తూలిరి,
వారి బుద్ధి కేవలము వ్యర్థమై పోయెను.
28 అప్పుడు తమ శ్రమలో యెహోవాను గూర్చి మొరబెట్టిరి,
ఆయన వారి బాధలలోనుంచి వారిని తప్పించెను.
29 ఆయన తుఫాను నిమ్మళింప చేసెను,
వాటి తరంగములు అణిగి పోయెను.
30 అవి అణిగినందున సంతోషించిరి,
వారు కోరిన రేవునకు ఆయన వారిని నడిపించెను.

31 వారు యెహోవా యెదుట ఆయన కృపను,
నరపుత్రుల యెదుట ఆయన అద్భుతములను స్తుతింతురుగాక.
32 వారు జనసంఘములో ఆయనను హెచ్చించి,
పెద్దల సభలో ఆయనను కీర్తింతురుగాక.
33 ఆయన నదులను అడవిగాను,
నీటి బుగ్గలను ఎండు నేలగాను,
34 అందులో నివసించే వారి దుష్టత్వమువల్ల,
సత్తువగల భూమి చవుటిదిగాను మార్చెను.
35 ఆయన అడవిని నీటి మడుగుగాను,
ఎండు నేలను నీటి బుగ్గలు గలదిగాను మార్చెను.
36 ఆయన ఆకలిగొనిన వారిని అక్కడ నివసింప చేసెను,
వారు నివసించుటకు పట్టణమును కట్టుకొనిరి.
37 అప్పుడు వారు పొలములలో విత్తిరి, ద్రాక్ష తోటలు వేసుకొనిరి;
వాటివల్ల వారికి సస్యవృద్ధి కలిగెను.
38 ఆయన వారిని దీవించెను; వారు చాలా వృద్ధి పొందిరి,
ఆయన వారి పశువులను తక్కువ చేయలేదు.
39 అప్పుడు బాధచేతను దౌర్భాగ్య దుఃఖములచేతను,
వారు తక్కువై క్షీణించిరి.
40 —ఆయన రాజులను తృణీకరించి,
తోవలేని ఎడారిలో వారిని తిరుగులాడ చేసెను.*
41 ఆయన బాధలోనుంచి దరిద్రుని లేవనెత్తి,
మందవలె వంశాభివృద్ధి చేసెను.
42 యథార్థులు చూచి సంతోషింతురు,
అక్రమమంతయు మౌనముగా ఉండును.
43 ఎవడు బుద్ధిమంతుడై వీటిని గైకొనునో,
వాడు యెహోవా కృపాతిశయము గ్రహించును.

## 108. కీర్తన.

దావీదు కీర్తన. సంగీతము.

1 దేవా! నా హృదయము దృఢమైనది,
నేను పాడుచు గానము చేతును, నా ఆత్మయు చేసును.
2 వీణా! కిన్నెరా! మేలుకొనుడి;
నేను వేకువను లేపుదును.
3 యెహోవా! జనములలో నిన్ను కీర్తింతును,
ప్రజలలో నిన్నుగూర్చి గానము చేతును;
4 ఆకాశముకంటే నీ కృపయు,
మేఘములకంటే నీ సత్యము గొప్పవి.
5 దేవా! ఆకాశముకంటే మహోన్నతుడవై యుందువుగాక,
నీ మహిమ సర్వ భూమికంటే హెచ్చుగానుండుగాక.
6 నీ ప్రియులు తప్పించబడుటకు,
నీ కుడిచేతితో రక్షించి మాకు ఉత్తరమిమ్ము.

* యోబు. 12: 21.

7 దేవుడు తన పరిశుద్ధత తోడని మాట ఇచ్చెను,
—ప్రహర్షించెదను; షెకెమును పంచిపెట్టుదును,
సుక్కోతు లోయను కొలిపింతును.
8 గిలాదు నాది; మనష్షె నాది,
ఎఫ్రాయిము నా శిరస్త్రాణము,
యూదా నా అధికారదండము.
9 మోయాబు నా కాళ్లు కడుగుకొనే పళ్లెము,
ఎదోము మీదికి నా చెప్పు విసిరివేతును,
పెలెషెద్దేశమును గూర్చి జయోత్సవము చేతును.
10 కోటగల పట్టణములోకి నన్ను ఎవడు కొంచుపోవును?
ఎదోములోకి నన్ను ఎవడు నడిపించినాడు?
11 దేవా! నీవు మమ్ము విడనాడినావు కావా?
దేవా! మా సేనలతోకూడా నీవు బైలుదేరకనుందువా?
12 శత్రునికి విరోధముగా మాకు సహాయము దయచేయుము,
(రక్షణ కొరకు) మనుష్యుల సహాయము వ్యర్థము.
13 దేవునివల్ల బలమైన వాటిని చేతుము,
ఆయన మన శత్రువులను అణగద్రొక్కును.

## 109. కీర్తన.

ప్రధాన గాయకునికి. దావీదు సంగీతము.

1 నేను కీర్తించే దేవా! మౌనముగా ఉండకుము;
2 వారు నాకు విరోధముగా,
చెడ్డ నోరు, కపటమైన నోరు తెరిచి యున్నారు;
అబద్ధమాడే నాలుకతో నా యెడల పలికియున్నారు.
3 వారు వైరముగల వాక్యములతో నన్ను చుట్టుకొని,
ఊరకనే నాతో పోరాడిరి.
4 నా ప్రేమకు ప్రతిగా నాకు విరోధులైరి,
నేనైతే, ప్రార్థన (చేతును.)
5 వారు మేలుకు ప్రతిగా కీడుచేసి,
నా ప్రేమకు ప్రతిగా నా మీద వైరము ఉంచిరి.
6 వాని మీద దుర్మార్గుని నియమించుము,
విరోధి వాని కుడి పక్కను నిలుచుగాక.
7 వాని గూర్చి న్యాయవిమర్శ చేయబడగా,
దుష్టుడని తీర్పు పొందుగాక,
వాని ప్రార్థన పాపమవుగాక.
8 వాని జీవిత దినములు కొద్దివవుగాక,
వాని ఉద్యోగము వేరొకనికి దొరుకుగాక.
9 వాని కుమారులు తండ్రిలేని వారవుదురుగాక,
వాని భార్య విధవరాలై యుండుగాక.
10 వాని కుమారులు దిమ్మరులై భిక్షమడుగుచు,
తమ ఎడారులలో (ఆహారము) వెతుకుచుందురుగాక.
11 వాని ఆస్తి యావత్తు అప్పులవాడు ఆక్రమించుకొనుగాక,
పరులు వాని కష్టార్జితము హరింతురుగాక.

12 ఎడతెగని కృప చూపుటకు, వానికి ఎవడును లేకపోవుగాక,
తండ్రిలేని వాని కుమారులకు దయాళుడు లేకపోవుగాక.

13 వాని వంశము కొట్టివేయబడుగాక,
రెండవ తరములో వారి నామము తుడుపు పెట్టబడుగాక.

14 వాని పితృల అక్రమము యెహోవా జ్ఞాపకము చేసుకొనుగాక,
వాని తల్లి పాపము తుడుపు పెట్టబడక నుండుగాక.

15 అవి నిత్యమును యెహోవా యెదుట నుండుగాక;
ఆయన వారి జ్ఞాపకము భూమిమీదనుంచి కొట్టివేసుగాక.

16 ఎందుకంటే, వాడు కరుణించుట జ్ఞాపకము చేసుకొనక,
బాధపడిన దరిద్రుని,
నలిగిన హృదయము గల వాని చంప తరిమినాడు.

17 శపించుట వానికి ఇష్టము; అది వానికి వచ్చెను:
దీవించుటయందు వానికిష్టము లేదు; అది వానికి దూరమైనది.

18 వాడు తన పైబట్టవలె శాపము వేసుకొనెను,
అది నీళ్ల వలె వాని కడుపులోకి,
తైలము వలె వాని యెముకలలోకి చేరెను.

19 అది వాడు ధరించే వస్త్రము వలెను,
వాడు నిత్యము కట్టుకొనే నడికట్టువలెను వానికి కలుగుగాక.

20 నా విరోధులకు, నా ప్రాణమునకు కీడు పలికే వారికి,
ఇదే యెహోవా వల్ల కలిగే ప్రతీకారము.

21 యెహోవా! పరమేశ్వరా!
నీవు నీ నామము నిమిత్తము నాకు సహాయము చేయుము;
నీ కృప మంచిది, నన్ను విడిపించుము.

22 నేను బాధపడిన దరిద్రుడను,
నాయందు నా హృదయము పొడవబడియున్నది.

23 సాగుచుండే నీడవలె పోనెత్తబడుచున్నాను,
మిడతవలె విదిలించబడి యున్నాను.

24 ఉపవాసముచేత నా మోకాళ్లు బలహీనమైనవి,
నా శరీరము పుష్టిమాని చిక్కిపోయినది.

25 నేనైతే, వారికి నిందాస్పదముగా ఉన్నాను,
వారు నన్ను చూచి తమ తలలు ఆడించుచున్నారు.

26 యెహోవా! నా దేవా! నాకు సహాయము చేయుము,
నీ కృప చొప్పున నన్ను రక్షించుము.

27 అప్పుడు, ఇది నీ చేతనైనదనియు,
యెహోవా! నీవే దీని చేసితివనియు వారికి తెలుసును.

28 వారు శపింతురు, నీవైతే దీవించెదవు;
వారు లేచి అవమానము పొందుదురు,
నీ సేవకుడు సంతోషించును.

29 నా విరోధులు అవమానము ధరించి,
పై వస్త్రము వలె తమ సిగ్గు కప్పుకొందురు.

30 నా నోటితో యెహోవాను మిక్కిలి స్తుతింతును,
అనేకుల మధ్యను, ఆయనను కీర్తింతును.

31 ఆయన దరిద్రుని కుడిపక్కను నిలిచి,
వాని ప్రాణమునకు శిక్ష విధించే వారినుంచి వాని రక్షించును.

## 110. కీర్తన.

దావీదు కీర్తన.

1 —నేను నీ శత్రువులను నీ పాదపీఠముగా చేసేపర్యంతము,
నా కుడిపార్శ్వమందు కూర్చుండుమని,
నా ప్రభువుతో యెహోవా పలికెను.
2 —నీ శత్రువుల మధ్యను ఏలుబడి చేయుమని,
నీ బలసహితమైన అధికార దండమును,
యెహోవా సీయోనులోనుంచి సాగచేసును.
3 నీ యుద్ధ సన్నాహదినమందు నీ ప్రజలు,
పరిశుద్ధతాలంకృతులై సిద్ధపడి* యుందురు;
అరుణోదయ గర్భమునుంచి పుట్టే మంచు బిందువులవలె,
నీ యౌవనస్థులు నీ యొద్దనుందురు.
4 —నీవు మల్కీసెదెకుయొక్క క్రమము చొప్పున,
నిరంతరము యాజకుడవై యున్నావని,
యెహోవా ప్రమాణము చేసెను; ఆయన మనస్సు తిప్పుకొనడు.
5 పరమేశ్వరుడు నీ కుడిపార్శ్వమందు ఉండి,
తన కోపదినమందు రాజులను ఖండించును.
6 ఆయన రాష్ట్రములలో న్యాయము తీర్చును,
వాటిని శవములతో నిండించును,
విశాల దేశము మీద ఆయన ప్రధానులను ఖండించును.
7 మార్గములో ఏటి నీళ్లు తాగును;
కావున, ఆయన తల ఎత్తుకొనును.

## 111. కీర్తన.

హల్లెలూయా.

1 యథార్థుల సభలోను, సంఘములోను,
యెహోవాను పూర్ణ హృదయముతో స్తుతింతును.
2 యెహోవా కార్యములు గొప్పవి,
వాటియందు ప్రీతిగల వారందరిచేత విచారించబడును.
3 ఆయన కార్యము ఘనత ప్రభావము గలది,
ఆయన నీతి నిరంతరమును స్థిరమైయున్నది.
4 ఆయన తన అద్భుతకార్యములు జ్ఞాపకము చేయించెను,
యెహోవా దయాదాక్షిణ్యములు గలవాడు.
5 ఆయన తనకు భయపడే వారికి ఆహారమిచ్చెను,
నిరంతరమును తన నిబంధన† జ్ఞాపకము చేసుకొనెను.
6 ఆయన తన కార్యముల బలము తన ప్రజలకు తెలిపెను,
రాష్ట్రముల స్వాస్థ్యము వారికిచ్చెను.
7 ఆయన చేతి పనులు సత్యముగాను న్యాయముగానున్నవి,
ఆయన శాసనములన్నియు నమ్మకమైనవి.

---

* లేక, స్వేచ్ఛాసన్నద్ధులై, † లేక, ఒడంబడిక.

8 అవి ఎల్లప్పుడును స్థిరముగానున్నవి,
సత్యముగాను యథార్థముగాను చేయబడియున్నవి.
9 ఆయన తన ప్రజలకు విమోచనము కలిగించెను,
నిరంతరమును తన నిబంధన నిర్ణయించెను;
ఆయన నామము పరిశుద్ధము, భయంకరమునైయున్నది.
10 యెహోవా భయము జ్ఞానమునకు మూలము;
వాటిని* గైకొనువారందరికి మంచి వివేకము ఉండును;
ఆయనకు నిరంతర స్తోత్రము కలుగును.

## 112. కీర్తన.

హల్లెలూయా.

1 యెహోవాకు భయపడి,
ఆయన ఆజ్ఞలయందు మిక్కిలి ప్రీతిగలవాడు ధన్యుడు.
2 అతని సంతానము దేశమందు ఘనత వహించును,
యథార్థుల వంశము దీవించబడును.
3 ఆస్తియు ఐశ్వర్యమును వాని ఇంటనుండును,
వాని నీతి నిరంతరము నిలుచును
4 యథార్థికి చీకటిలో వెలుగు పుట్టును;
అతడు నీతి దయాదాక్షిణ్యములు గలవాడు.
5 దయ చేసి అప్పిచ్చేవాడు భాగ్యవంతుడు,
న్యాయ విమర్శలో అతని వ్యాపారములు స్థాపించబడును;
6 అతడు ఎప్పుడును కదిలించబడడు,
నీతిమంతుడు నిరంతరము జ్ఞాపకము చేయబడును.
7 దుష్ట వర్తమానమునకు జడియడు,
వాని హృదయము యెహోవాయందు నమ్మిక ఉంచి,
దృఢమై యుండును.
8 వాని హృదయము స్థిరమై యున్నది,
తన శత్రువుల (గతి) చూచేమట్టుకు భయపడడు.
9 అతడు వెదచల్లి బీదలకు ఇచ్చెను,
వాని నీతి నిరంతరమును నిలుకడగానుండును;
వాని కొమ్ము ఘనతతో హెచ్చించబడును.
10 దుష్టుడు దాని చూచి దుఃఖించును,
వాడు తన పండ్లు కొరుకుకొని, కృశించిపోవును;
దుష్టుల కోరిక నశించును.

## 113. కీర్తన.

హల్లెలూయా.

1 యెహోవా సేవకులారా! స్తుతించుడి,
యెహోవా నామము స్తుతించుడి.
2 ఇది మొదలుకొని నిరంతరమును,
యెహోవా నామము స్తుతించబడుగాక.

* అనగా, శాసనములు. 7.

3 సూర్యుని ఉదయము మొదలుకొని అస్తమానము మట్టుకు,
యెహోవా నామము స్తుతించబడుగాక,
4 యెహోవా సమస్త రాష్ట్రముల పైని హెచ్చైయున్నాడు,
ఆయన మహిమ ఆకాశమునకు పైగా ఉన్నది.
5 యెహోవా యనే మన దేవునివంటివాడు ఎవడు?
ఆయన మహోన్నత స్థలమందు ఆసీనుడై యున్నాడు.
6 ఆకాశము భూమియు చూచుటకు,
ఆయన వంగుచున్నాడు.
7 ఆయన మంటిలోనుంచి దరిద్రుని లేవనెత్తును;
పెంట కుప్పలోనుంచి బీదవాని పైకెత్తును;
8 ప్రధానులతో, తన ప్రజల ప్రధానులతో
వాని కూర్చుండ బెట్టును.
9 ఆయన, సంతులేని ఇల్లాలు,
కుమారులకు ఉత్సహించే తల్లియై నివసించేటట్టు చేసును.

## 114. కీర్తన.

1 ఐగుప్తులోనుంచి ఇశ్రాయేలు,
అన్యభాషగల జనులలోనుంచి యాకోబువంశము వెడలినప్పుడు,
2 యూదా ఆయనకు పరిశుద్ధాలయము,
ఇశ్రాయేలు ఆయనకు రాజ్యమై ఉండెను;
3 సముద్రము చూచి పారిపోయెను;
యొర్దానే నది వెనుకకు మళ్లెను;
4 పొట్టేళ్ల వలె కొండలు,
గొర్రెపిల్లల వలె మెట్టలు గంతులువేసెను.
5 సముద్రమా! నీవు పారిపోనేల?
యొర్దానూ! నీవు వెనుకకు మళ్లనేల?
6 కొండలారా? మీరు పొట్టేళ్లవలె,
మెట్టలారా! మీరు గొర్రెపిల్లల వలె గంతులు వేయనేల?
7 భూమీ! ప్రభువు యెదుట,
యాకోబు దేవుని యెదుట వణుకుము;
8 ఆయన, బండ నీళ్లమడుగుగా,
కఠిన శైలము, నీటి ధారలుగా చేసెను,

## 115. కీర్తన.

1 మాకు కాదు; యెహోవా! మాకు కాదు;
నీ కృప నిమిత్తము, నీ సత్యము నిమిత్తము,
నీ నామమునకే మహిమ కలుగనిమ్ము.
2 —ఏడి, వారి దేవుడని,
రాష్ట్రములు ఎందుకు చెప్పుకొనును?

3 మా దేవుడైతే, ఆకాశమందు ఉన్నాడు,
ఆయన తనకు ఇష్టమైనవి యావత్తు చేసెను.

4 వారి విగ్రహములు వెండి బంగారములు;
అవి మనుష్యుల చేతి పనులు.
5 వాటికి నోరు ఉండియు పలుకవు,
వాటికి కన్నులు ఉండియు చూడవు;
6 వాటికి చెవులు ఉండియు వినవు,
వాటికి ముక్కులు ఉండియు వాసన చూడవు;
7 వాటికి చేతులు ఉండియు ముట్టుకొనవు,
వాటికి పాదములు ఉండియు నడవవు;
అవి గొంతుకలతో గుర్రని అయినా అనవు.
8 వాటిని చేసేవారును
వాటి యందు నమ్మిక ఉంచే వారందరును
వాటివలె నున్నారు.

9 ఓ ఇశ్రాయేలూ! యెహోవాయందు నమ్మిక ఉంచుము;
ఆయన వారి సహాయము వారి కేడెమునై యున్నాడు.
10 అహరోను ఇంటివారలారా! యెహోవాయందు నమ్మిక ఉంచుడి;
ఆయన వారి సహాయము వారి కేడెమునై యున్నాడు.
11 యెహోవాకు భయపడే వారలారా! యెహోవాయందు నమ్మిక ఉంచుడి,
ఆయన వారి సహాయము వారి కేడెమునైయున్నాడు.
12 మమ్ము జ్ఞాపకము చేసుకొనిన యెహోవా దీవించును,
ఆయన ఇశ్రాయేలు ఇంటివారిని దీవించును,
అహరోను ఇంటివారిని దీవించును.
13 యెహోవాకు భయపడే వారిని దీవించును,
పిన్నపెద్దలను (దీవించును.)
14 యెహోవా మిమ్మును,
మిమ్మును మీ పిల్లలను విస్తరింప చేసును.
15 ఆకాశము భూమియు సృజించిన యెహోవాచేత
మీరు దీవించబడిన వారు.
16 ఆకాశము యెహోవాయొక్క ఆకాశము,
నరపుత్రులకు భూమి ఇచ్చియున్నాడు.
17 మృతులు యెహోవాను స్తుతించరు,
మౌనస్థితిలోకి వెళ్లినవారందరు స్తుతించరు.
18 మేమైతే, ఇది మొదలుకొని నిరంతరమును
యెహోవాను స్తుతించెదము;
హల్లెలూయా! యెహోవాను స్తుతించుడి.

## 116. కీర్తన.

1 యెహోవాను ప్రేమించుచున్నాను,
ఆయన నా శబ్దము, నా మొర్రలను విని యున్నాడు.
2 ఆయన నాకు చెవినొగ్గి యున్నాడు,
కావున నా దినములన్నిటను ఆయనను ప్రార్థింతును.
3 మరణ పాశములు నన్ను చుట్టుకొనెను,
అదృశ్యలోక యాతనలు నన్ను పట్టుకొనెను,
శ్రమయు దుఃఖము పొందితిని.

4 అప్పుడు నేను—యెహోవా! నా ప్రాణము విడిపించుమీ అని
యెహోవా నామము పెట్టి ప్రార్థించినాను.
5 యెహోవా దయాళుడు, నీతిమంతుడునైయున్నాడు,
మా దేవుడు కనికరము గలవాడు.
6 యెహోవా సాధువులను కాపాడుచున్నాడు,
నేను కుంగియుండగా, ఆయన నాకు సహాయము చేసెను.
7 నా ఆత్మా! తిరిగి నీ విశ్రాంతి పొందుము;
యెహోవా నాకు మేలు విస్తరింప చేసియున్నాడు.
8 నీవు మరణమునుంచి నా ప్రాణమును,
కన్నీళ్లనుంచి నా కన్నులను,
జారిపడకుండా నా పాదములను తప్పించినావు.
9 జీవితుల దేశములలో,
యెహోవా యెదుట నడుచుచుందును.
10 నేను నమ్మితిని; అదే ప్రకారము పలుకుచున్నాను,
నేను మిక్కిలీ బాధపడి యుంటిని.
11 నేను నా తడబాటులో,
—మనుష్యులందరు అబద్ధికులను కొంటిని.
12 యెహోవా నాకు చేసిన సమస్తోపకారముల నిమిత్తము,
ఆయనకు ఏమి చెల్లించ గలను?
13 నేను రక్షణ పాత్రను పుచ్చుకొని,
యెహోవా నామము చెప్పుకొందును.
14 నా మ్రొక్కుబళ్లు యెహోవాకు చెల్లింతును,
ఆయన ప్రజలందరి యెదుట చెల్లింతుగాక.
15 ఆయన ప్రియభక్తుల మరణము,
యెహోవా దృష్టికి విలువ గలది.
16 ఓ యెహోవా! నేను నీ సేవకుడను,
నీ సేవకుడను, నీ సేవకురాలి కుమారుడనై యున్నాను;
నా కట్లు విప్పియున్నావు.
17 నేను నీకు స్తుతియాగములు చేసి,
యెహోవా నామము చెప్పుకొందును.
18 నా మ్రొక్కుబళ్లు యెహోవాకు చెల్లింతును;
ఆయన ప్రజలందరి యెదుట,
19 యెహోవా ఇంటి అంగణములలో,
యెరూషలేమా! నీ మధ్యను (చెల్లింతునుగాక);
హల్లెలూయా, యెహోవాను స్తుతించుడి.

## 117. కీర్తన.

1 సమస్త రాష్ట్రములారా! యెహోవాను స్తుతించుడి,
సమస్త జనులారా! ఆయనను కొనియాడుడి.
2 మన యెడలనున్న ఆయన కృప అధికమైనది,
యెహోవా సత్యము నిరంతరమునుండును.

## 118. కీర్తన.

1 యెహోవాను స్తుతించుడి; ఆయన మంచివాడు;
ఆయన కృప నిరంతరమునుండును.
2 —ఆయన కృప నిరంతరమునుండునని
ఇశ్రాయేలు చెప్పును గాక.
3 —ఆయన కృప నిరంతరమునుండునని
అహరోను వంశస్థులు చెప్పుదురు గాక.
4 —ఆయన కృప నిరంతరమునుండునని
యెహోవాకు భయపడే వారు చెప్పుదురు గాక.
5 నేను శ్రమలోనుండి యెహోవాను గూర్చి మొరబెట్టినాను,
యెహోవా విశాల స్థలమందు నన్ను ఉంచి నాకుత్తరమిచ్చెను.
6 యెహోవా నాకు తోడైయున్నాడు, భయపడను;
మనుష్యుడు నన్ను ఏమి చేయ గలడు?
7 నా సహాయులలో, యెహోవా నా పక్షముగా ఉన్నాడు,
నాయందు పగపట్టే వారి గతి చూతును.
8 మనుష్యుని యందు నమ్మిక ఉంచుట కంటే,
యెహోవాను ఆశ్రయించుట మంచిది.
9 రాజులయందు నమ్మిక ఉంచుట కంటే,
యెహోవాను ఆశ్రయించుట మంచిది.
10 సకల రాష్ట్రములు నన్ను చుట్టుకొనెను,
యెహోవా నామము తోడని, వాటిని ఖండింతును.
11 నన్ను చుట్టుకొనెను, బొత్తిగా నన్ను చుట్టుకొనెను,
యెహోవా నామము తోడని వాటిని ఖండింతును.
12 కందిరీగల వలె నన్ను చుట్టుకొనెను,
ముండ్ల మంట వలె ఆరిపోయెను;
యెహోవా నామము తోడని వాటిని ఖండింతును.
13 నన్ను పడ తోసినావు,
అయినను యెహోవా నాకు సహాయము చేసెను.
14 యెహోవాయే నా బలము, నా గానము;
ఆయన నాకు రక్షణ కర్తయై యున్నాడు.
15 నీతిమంతుల గుడారములలో
ఉత్సాహధ్వని, రక్షణ సునాదము వినబడుచున్నవి;
యెహోవా కుడి చెయ్యి సాహసము చేసెను.
16 యెహోవా కుడి చెయ్యి మహోన్నతమైనది,
యెహోవా కుడి చెయ్యి సాహసము చేసెను.
17 నేను చావను,
నేను జీవించుచు యెహోవా కార్యములు వివరించుచుందును.
18 యెహోవా నన్ను చాలా శిక్షించెను,
అయితే మరణమునకు ఆయన నన్ను అప్పగించలేదు.
19 నా నిమిత్తము నీతి గవునులు తీయుడి
నేను వాటిలో ప్రవేశించి యెహోవాను స్తుతింతును.

20 ఇది యెహోవా గవిని,
నీతిమంతులు దీనిలో ప్రవేశింతురు.
21 నిన్ను స్తుతింతును; నీవు నాకు ఉత్తరమిచ్చినావు,
నాకు రక్షణ కర్తవైతివి.
22 ఇల్లు కట్టేవారు ఉపేక్షించిన రాయి,
మూలకు తల అయినది.
23 ఇది యెహోవా వల్లనే కలిగెను,
ఇది మన కన్నులకు ఆశ్చర్యమైనది.
24 ఇది యెహోవా కలిగించిన దినము,
ఇందులో మనము సంతోషించుచు ఆనందించుచుందము.
25 ఓ యెహోవా! రక్షించుమీ,
ఓ యెహోవా! శ్రేయము కలిగించుమీ.
26 యెహోవా పేరట వచ్చేవాడు దీవించబడు గాక,
యెహోవా మందిరమునుంచి మిమ్మును దీవించినాము.
27 యెహోవా దేవుడు; ఆయన మనకు వెలుగిచ్చెను,
వేదిక కొమ్ముల మట్టుకు, యాగపశువును తాళ్లతో కట్టుడి.
28 నీవు నా దేవుడవు; నిన్ను స్తుతింతును;
నా దేవుడవు, నిన్ను హెచ్చింతును.
29 యెహోవాను స్తుతించుడి; ఆయన మంచివాడు;
ఆయన కృప నిరంతరము ఉండును.

## 119. కీర్తన.

### א ఆలెఫ్.

1 ఎవరు మార్గమందు నిర్దోషులై,
యెహోవా బోధనచొప్పున నడుచుకొందురో వారు ధన్యులు.
2 ఎవరు ఆయన సాక్ష్యములు గైకొనుచు,
పూర్ణ హృదయముతో ఆయనను వెతుకుదురో వారు ధన్యులు.
3 మరియు, వారు అక్రమము చేయరు,
ఆయన మార్గములలో నడుతురు.
4 నీ శాసనములు (మేము) జాగ్రత్తగా గైకొన వలెనని,
వాటిని విధించి యున్నావు.
5 ఆహా! నీ కట్టడలు గైకొనుటకు,
నా మార్గములు స్థిరపరచబడుగాక.
6 అప్పుడు నేను నీ ఆజ్ఞలన్నియు లక్ష్యముచేతును,
సిగ్గుపడక నుందును.
7 నేను నీ నీతిగల న్యాయ విధులు బోధపరచుకొందును,
యథార్థ హృదయముతో నిన్ను స్తుతింతును.
8 నీ కట్టడలు గైకొందును,
నన్ను బొత్తిగా విడనాడకుమీ.

### ב బేత్.

9 పడుచువాడు దేనివల్ల తన నడత శుద్ధిపరచుకొన గలడు?
నీ వాక్యము చొప్పున జాగ్రత్తపడుట వల్లనే.

10 నా పూర్ణ హృదయముతో నిన్ను వెదకినాను,
నన్ను నీ ఆజ్ఞలు విడిచి తప్పిపోనియ్యకుము.
11 నేను నీకు వ్యతిరిక్తముగా పాపము చేయక నుండుటకు,
నా హృదయములో నీ వాక్యము ఉంచుకొంటిని.
12 యెహోవా! నీవే శ్రీభగవంతుడవు;
నీ కట్టడలను నాకు బోధించుము.
13 నీ నోటి న్యాయ విధులన్నియు,
నా పెదవులతో వివరింతును.
14 యావదాస్తియందు వలె,
నీ సాక్ష్యముల మార్గమందు ఆనందించినాను.
15 నీ శాసనములను ధ్యానింతును,
నీ తోవలను లక్ష్యము చేతును.
16 నేను నీ కట్టడలయందు మిక్కిలీ ఆనందించుచున్నాను,
నీ వాక్యము మరవకనుందును.

ג గిమెల్.

17 నేను బ్రతికేలాగున, నీ సేవకునికి మేలు చేయుము,
నీ వాక్యము గైకొనుచుందును.
18 నా కన్నులు విప్పుము,
అప్పుడు నీ బోధనలో ఆశ్చర్యమైన వాటిని చూతును.
19 నేను భూమి మీద పరదేశిని,
నీ ఆజ్ఞలను నాకు దాచకుము.
20 ఎల్లప్పుడు నీ న్యాయ విధులు కాంక్షించుటవల్ల,
నా ఆత్మ నలిగియున్నది.
21 నీవు గర్విష్ఠులను గద్దించినావు,
నీ ఆజ్ఞలనుంచి తప్పిపోయిన వారు శపించబడియున్నారు.
22 నిందయు తిరస్కారమును నా మీదనుంచి తొలగించుము;
నీ సాక్ష్యములు గైకొనుచున్నాను.
23 రాజులు సహా కూర్చుండి,
నాకు వ్యతిరిక్తముగా మాటలాడుకొనిరి;
నీ సేవకుడు నీ కట్టడలు ధ్యానించుచున్నాడు.
24 మరియు, నీ సాక్ష్యములు నాకు మనోహరమైనవి,
అవి నాకు ఆలోచనకర్తల వలె నున్నవి.

ד దాలెత్.

25 నా ప్రాణము మంటిని హత్తుకొనియున్నది,
నీ మాట చొప్పున నన్ను బ్రతికించుము.
26 నా మార్గములు వివరించితిని; నీవు నాకుత్తరమిచ్చినావు;
నీ కట్టడలను నాకు బోధించుము.
27 నీ శాసనముల మార్గము నాకు బోధపరచుము;
నీ అద్భుత కార్యములు ధ్యానింతును.
28 దుఃఖముచేత నా ప్రాణము నీరై పోవుచున్నది;
నీ మాట చొప్పున నన్ను లేవనెత్తుము.

29 కపట మార్గము నాకు దూరము చేయుము,
నీ బోధన నాకు దయ చేయుము.
30 సత్యమార్గము ఏర్పరచుకొంటిని,
నీ న్యాయ విధులు (నా యెదుట) ఉంచుకొని యున్నాను.
31 నీ సాక్ష్యములను హత్తుకొని యున్నాను,
యెహోవా! నన్ను సిగ్గుపడనియ్యకుము.
32 నీ ఆజ్ఞల మార్గమందు పరుగెత్తుదును,
నీవు నా హృదయము విశాలము చేయుదువు.

ה హే.

33 యెహోవా! నీ కట్టడల మార్గము నాకు బోధించుము,
నిత్యమును దాని అనుసరింతును.
34 నాకు బోధపరచుము; నీ బోధన అనుసరింతును,
నా పూర్ణ హృదయముతో దాని గైకొందును.
35 నీ ఆజ్ఞల జాడలో నన్ను నడిపించుము;
దాని యందు ఆనందించుచున్నాను.
36 లుబ్ధత్వము తట్టు కాకుండా,
నీ సాక్ష్యముల తట్టు నా హృదయము ఒరగచేయుము.
37 మాయ చూడకుండా నా కన్నులు తిప్పుము,
నీ మార్గములో నన్ను బ్రతికించుము.
38 నీకు భయపడే నిమిత్తము,
నీవిచ్చిన మాట నీ సేవకునికి స్థిరపరచుము.*
39 నేను భయపడే నా అవమానము తప్పించుము,
నీ న్యాయ విధులు మంచివి.
40 ఇదుగో! నీ శాసనములను కాంక్షించియున్నాను,
నీ నీతిప్రకారము† నన్ను బ్రతికించుము.

ו వవ్.

41 యెహోవా! నా మీదికి నీ కృపయు,
నీ మాట చొప్పున నీ రక్షణయు రానిమ్ము.
42 అప్పుడు నన్ను నిందించిన వానికి ఉత్తరమిత్తును,
నీ మాటయందు నమ్మిక ఉంచియున్నాను.
43 నా నోటిలోనుంచి సత్యవాక్యము బొత్తిగా తీసివేయకుము,
నీ న్యాయవిధుల నిమిత్తము కనిపెట్టుకొన్నాను.
44 నిరంతరమును,
నీ బోధన నిత్యమును గైకొనుచుందును.
45 మరియు, విశాలస్థలమందు నడుతును,
నీ శాసనములను వెతికియున్నాను.
46 నేను సిగ్గుపడక,
రాజులయెదుట నీ సాక్ష్యములను గూర్చి పలుకుదును.
47 నీ ఆజ్ఞలయందు మిక్కిలీ ఆనందింతును,
వాటియందు నాకు ప్రీతి కలిగి యున్నది.

* లేక, నెరవేర్చుము. † లేక, లో.

48 నీ ఆజ్ఞలతట్టు నా చేతులు ఎత్తుదును,
అవి నాకు ప్రియమైనవి;
నీ కట్టడలను ధ్యానించుచుందును.

ז జాయిన్.

49 నీ సేవకునికి (నీ విచ్చిన) మాట జ్ఞాపకము చేసుకొనుము,
అందు వల్ల నాకు నిరీక్షణ కలుగచేసితివి.
50 నీ వాక్యము నన్ను బ్రతికించెనని,
నా బాధలో ఇది నాకు నెమ్మది కలిగించుచున్నది.
51 గర్విష్ఠులు నన్ను మిక్కిలీ అపహసించిరి,
నీ బోధననుంచి నేను తొలగనైతిని.
52 యెహోవా! పూర్వకాలమందు జరిగిన నీ న్యాయవిధులను,
నేను జ్ఞాపకము చేసుకొని ఓదార్చుకొంటిని.
53 నీ బోధన విడిచిన దుష్టుల నిమిత్తము,
నాకు ఘోరమైన మంట వచ్చెను.
54 నేను పరవాసినైయున్న ఇంటిలో,
నీ కట్టడలు నాకు పాటలైనవి.
55 యెహోవా! రాత్రిలో నీ నామము జ్ఞాపకము చేసుకొంటిని;
నీ బోధన గైకొనియున్నాను.
56 ఇది నాకు కలిగినది,
నీ శాసనములు అనుసరించి యున్నాను.

ח హేత్.

57 నీ వాక్యములు గైకొనుటకు,
—యెహోవా నా భాగమనుకొంటిని.
58 పూర్ణ హృదయముతో నిన్ను బతిమాలుకొంటిని,
నీ మాట చొప్పున నన్ను కరుణించుము.
59 నేను నా మార్గములు విచారించి,
నీ సాక్ష్యములతట్టు మరలుకొంటిని.
60 నీ ఆజ్ఞలను గైకొనుటకు,
ఆలస్యము చేయక త్వరపడినాను.
61 దుష్టుల పాశములు నన్ను ఆవరించెను,
నేను నీ బోధన మరవలేదు.
62 నీ నీతి గల న్యాయవిధుల నిమిత్తము,
నిన్ను స్తుతించుటకు అర్ధరాత్రివేళ లేతును.
63 నేను నీకు భయపడే వారికిని,
నీ శాసనములు గైకొనే వారికిని చెలికాడను.
64 యెహోవా! నీ కృపతో భూమి నిండియున్నది,
నీ కట్టడలు నాకు బోధించుము.

ט తేత్.

65 యెహోవా! నీ మాట చొప్పున,
నీ సేవకునికి మేలు చేసినావు.
66 మంచి వివేకజ్ఞానములు నాకు బోధపరుచుము,
నీ ఆజ్ఞలను గైకొనియున్నాను.

67 నేను బాధపొందకమునుపు, త్రోవ తప్పిపోతిని,
ఇప్పుడు నీ మాట గైకొనుచున్నాను.
68 నీవు మంచివాడవై మేలుచేయుచుందువు,
నీ కట్టడలను నాకు తెలియచేయుము.
69 గర్విష్ఠులు నాకు వ్యతిరిక్తముగా అబద్ధము కల్పించిరి,
పూర్ణ హృదయముతో నీ శాసనములు గైకొనుచుందును.
70 వారి హృదయము క్రొవ్వువలె స్పర్శ ఎరుగదు,
నేనైతే, నీ బోధనయందు ఆనందించుచున్నాను.
71 నేను నీ కట్టడలు బోధపరుచుకొనుటకు,
నాకు బాధ పొందియుండుట మేలు.
72 వేలకొలదియైన వెండి బంగారు నాణ్యములకంటె,
నీ నోటి బోధన నాకు మేలు.

י యోద్.

73 నీ చేతులు నన్ను నిర్మించి, నా రూపము ఏర్పరిచెను,
నీ ఆజ్ఞలను తెలుసుకొనుటకు, నాకు బుద్ధి దయచేయుము.
74 నీ వాక్యము నిరీక్షించినానని,
నీకు భయపడే వారు నన్ను చూచి సంతోషింతురు.
75 యెహోవా! నీ విధులు న్యాయమైనవని ఎరుగుదును,
నీ సత్యమువల్లనే నాకు శ్రమ కలుగచేసితివి.
76 నీవు నీ సేవకునికిచ్చిన మాట చొప్పున,
నీ కృప నా నెమ్మదికొరకు వచ్చుగాక.
77 నేను జీవించుటకు, నీ కనికరములను నాకు రానిమ్ము,
నీ బోధన నాకు ఆనందకరమైనది.
78 గర్విష్ఠులు సిగ్గుపడుదురుగాక;
ఊరకనే వారు నన్ను హింసించిరి;
నేను నీ శాసనములను ధ్యానించుచుందును.
79 నీకు భయపడే వారు నా యొద్దికి మళ్లుదురు,
వారు నీ సాక్ష్యములు తెలుసుకొందురు.
80 నేను సిగ్గుపడకనుండుటకు,
నా హృదయము నీ కట్టడలయందు నిర్దోషమూగాక.

כ కఫ్.

81 నీ రక్షణ కొరకు నా ప్రాణము క్షీణించెను,
నీవిచ్చిన మాట నిరీక్షించుచున్నాను.
82 —నన్ను ఎప్పుడు ఆదరింతువని,
నా కన్నులు నీవిచ్చిన మాట కొరకు క్షీణించినవి.
83 నేను పొగలోని సిద్దె వలె నైతిని,
అయితే నీ కట్టడలు మరుచుట లేదు.
84 నీ సేవకుని దినములు ఎన్ని?
నన్ను తరిమే వారి విషయము ఎప్పుడు న్యాయము తీర్తువు.
85 నీ బోధన అనుసరించని గర్విష్ఠులు,
నా నిమిత్తము గుంటలు తవ్విరి.

86 నీ ఆజ్ఞలన్నియు నమ్మతగినవి;
ఊరకనే నన్ను తరుముచున్నారు; నాకు సహాయము చేయుము.
87 భూమి మీద, కొంచెమే తప్ప, నన్ను క్షీణింపచేసిరి,
నీ శాసనములను విడువనైతిని.
88 నీ కృపచొప్పున నన్ను జీవింపచేయుము;
నీ నోటి సాక్ష్యములు గైకొందును.

ל లామెద్.

89 యెహోవా! నిరంతరము,
నీ వాక్యము ఆకాశమందు నిలకడగానున్నది.
90 నీ విశ్వాస్యత* తరతరముల మట్టుకునున్నది,
నీవు భూమి స్థాపించినావు; అది స్థిరపడెను.
91 నీ న్యాయవిధుల చొప్పున, అవి నేటికి స్థిరపడి యున్నవి;
విశ్వమంతయు ఆయన సేవక సమూహము.
92 నీ బోధన నాకు ఆనందకరమైతేనే గాని,
లేకుంటే నా బాధచేత నశించిపోదును.
93 నేను ఎప్పుడును నీ శాసనములు మరువను;
వాటి వల్ల నన్ను జీవింప చేసినావు.
94 నేను నీవాడనే; నన్ను రక్షించుము;
నీ శాసనములు వెతికి యున్నాను.
95 నన్ను సంహరించుటకు దుష్టులు నా నిమిత్తము పొంచిరి,
నీ సాక్ష్యములు బోధపరుచుకొంటున్నాను.
96 సకల సంపూర్ణతయొక్క అంతము చూచియున్నాను,
నీ ఆజ్ఞాప్రమాణము బహు విశాలమైనది.

מ మేమ్.

97 నీ బోధన నాకెంతో ప్రియమైనది!
దినమెల్ల నాకదే ధ్యానము.
98 నీ ఆజ్ఞలు నా శత్రువుల బుద్ధికంటే నాకు ఎక్కువ బుద్ధి కలిగించును;
అవి నిత్యమును నా యెదుట నున్నవి.
99 నా బోధకులందరికంటే నాకు అధికమైన తెలివి కలదు,
నీ సాక్ష్యములు ధ్యానించుచున్నాను.
100 వృద్ధులకంటే బాగా బోధపరుచుకొంటున్నాను,
నీ శాసనములు అనుసరించుచున్నాను.
101 నేను నీ వాక్యము గైకొనుటకు,
దుష్టమార్గమంతటినుంచి నా పాదములు
తొలగించుకొంటిని.
102 నీ న్యాయవిధులనుంచి తొలగనైతిని,
నీవు నన్ను బోధించినావు.
103 నీ వాక్యములు నా రుచికి ఎంతో మధురమైనవి!
అవి తేనెకంటే నా నోటికి (తీపిగానున్నవి.)
104 నీ శాసనములవల్ల బోధపరుచుకొందును;
కావున, అబద్ధపు మార్గమంతయు ద్వేషించుచున్నాను.

* లేక, సత్యము.

נ నున్.

105 నీ వాక్యము నా పాదములకు దీపమును,
నా త్రోవకు వెలుగునై యున్నది.
106 నీ న్యాయవిధులు గైకొందునని,
ప్రమాణము చేసి నెరవేర్చి యున్నాను.
107 మిక్కిలి బాధపడుచున్నాను,
యెహోవా! నీ వాక్యము చొప్పున నన్ను జీవింపచేయుము.
108 యెహోవా! నా నోటి స్వేచ్ఛార్పితములు అంగీకరించుము,
నీ న్యాయవిధులు నాకు బోధించుము.
109 నా ప్రాణము నిత్యమును నా అరచేతిలో ఉన్నది,
నీ బోధన మరువనైతిని.
110 దుష్టులు నా నిమిత్తము ఉరియొడ్డిరి,
అయినను, నీ శాసనములనుంచి తప్పిరియుండలేదు.
111 నీ సాక్ష్యములు నిత్యస్వాస్థ్యముగా స్వతంత్రించుకొంటిని;
అవి నాకు మనోహరమైనవి.
112 తుదముట్ట, నిరంతరమును,
నీ కట్టడలను మన్నించుటకు నా హృదయము తిప్పుకొంటిని.

ס సామెక్.

113 ద్విమనస్కులను ద్వేషించుచున్నాను,
నీ బోధనయందు నాకు ప్రీతి కలిగి యున్నది.
114 నీవు నా మరుగు చోటు, నా కేడెమునై యున్నావు,
నీ మాట నిమిత్తము నిరీక్షించుచున్నాను.
115 దుష్క్రియలు చేసేవారలారా! నా యొద్దనుంచి తొలగుడి;
నా దేవుని ఆజ్ఞలను అనుసరింతును.
116 నేను బ్రతికేలాగున, నీ మాట చొప్పున నన్ను ఆదుకొనుము,
నా నిరీక్షణవల్ల నన్ను సిగ్గుపడనియ్యకుము.
117 నన్ను స్థిరపరచుము; నాకు రక్షణ కలుగును,
నీ కట్టడలను నిత్యమును లక్ష్యము చేతును.
118 నీ కట్టడలనుంచి తప్పిపోయిన వారినందరిని నిరాకరించినావు,
వారి కపటము వ్యర్థమే.
119 భూమి మీదనున్న సకల దుష్టులను మష్టువలె పరిహరించినావు
కావున నీ సాక్ష్యములు నాకు ప్రియమైనవి.
120 నీ భయమువల్ల నా శరీరము వణుకుచున్నది,
నీ న్యాయ విధులకు భయపడుచున్నాను.

ע అయిన్.

121 నేను నీతియు న్యాయము పట్టి ప్రవర్తించినాను,
నన్ను బాధించే వారి వశములో నన్ను విడిచిపెట్టకుము.
122 మేలు నిమిత్తము నీ సేవకునికి పూటపడుము,
గర్విష్ఠులు నన్ను బాధించనియ్యకుము.
123 నీ రక్షణ కొరకు,
నీ నీతి మాట కొరకు నా కన్నులు క్షీణించుచున్నవి.

124 నీ కృప చొప్పున నీ సేవకుని యెడల చేయుము,
నీ కట్టడలు నాకు బోధించుము.
125 నేను నీ సేవకుడను, నాకు జ్ఞానము దయ చేయుము,
అప్పుడు నీ సాక్ష్యములను ఎరుగుదును.
126 యెహోవా* క్రియ చేయ వలసిన సమయము వచ్చెను,
నీ బోధన వీరి యున్నారు;
127 కావున, బంగారు కంటే, అపరంజి కంటే,
నీ ఆజ్ఞలు నాకు ప్రియమైనవి.
128 కావున, నీ శాసనములన్నియు న్యాయమైనవనుకొని,
అనృత మార్గమంతయు ద్వేషించుచున్నాను.

פ పే.

129 నీ సాక్ష్యములు ఆశ్చర్యమైనవి,
కావున, నా ఆత్మ వాటిని అనుసరించుచున్నది.
130 నీ వాక్యద్వారము వెలుగిచ్చును,
అది అజ్ఞానులకు బోధించును.
131 నా నోరు తెరచి ఒగర్చినాను;
నీ ఆజ్ఞలను కాంక్షించుచున్నాను.
132 నీ నామమందు ప్రీతి గలవారికి తగిన రీతిగా,
నన్ను చూచి నన్ను కరుణించుము.
133 నీవిచ్చిన మాటవల్ల నా అడుగులు స్థిరపరుచుము,
ఏ అక్రమము నన్ను ఏలనియ్యకుము.
134 మనుష్యుల బలవంతమునుంచి నన్ను విమోచించుము,
నీ శాసనములను గైకొందును.
135 నీ సేవకుని మీద నీ ముఖము ప్రకాశింప చేయుము,
నీ కట్టడలను నాకు బోధించుము.
136 జనులు నీ బోధన గైకొనక పోయినందున,
నీటి ధారలు నా కన్నులనుంచి ఓడుచున్నవి.

צ సాదె.

137 యెహోవా! నీవు నీతిమంతుడవు,
నీ విధులు యథార్థమైనవి.
138 నీవు నీతియు, అధిక విశ్వాస్యత కలిగి,
నీ సాక్ష్యములు నియమించియున్నావు.
139 నా విరోధులు నీ వాక్యములు మరిచినందున,
నా సంతాపము నన్ను దహించెను.
140 నీ మాట మిక్కిలి స్వచ్ఛమైనది,
దానియందు నీ సేవకునికి ప్రీతి కలిగియున్నది.
141 నేను అల్పుడను, నిరాకరించబడినవాడనై యున్నాను,
అయితే నీ శాసనములను మరువనైతిని.
142 నీ నీతి శాశ్వతమైన నీతి,
నీ బోధన సత్యమే.

---

* లేక, యెహోవా నిమిత్తము.

143 శ్రమ వేదనలు నన్ను పట్టుకొనెను,
నీ ఆజ్ఞలు నాకు మనోహరమైనవి.
144 నీ సాక్ష్యముల నీతి శాశ్వతమైనది,
నేను బ్రతికేలాగున నన్ను బోధపరచుము.

ౘ ఖోఫ్.

145 పూర్ణ హృదయముతో మొరబెట్టినాను, నాకుత్తరమిమ్ము;
యెహోవా! నీ కట్టడలను అనుసరింతును.
146 నిన్ను గూర్చి మొరబెట్టినాను, నన్ను రక్షించుము;
నీ సాక్ష్యములు గైకొందును.
147 తెల్లవారక మునుపు మొరబెట్టినాను,
నీ మాట నిరీక్షించినాను.
148 నీ మాట ధ్యానించుటకు,
నా కన్నులు, రాత్రి జాములు కాకమునుపు విప్పబడెను.
149 నీ కృప చొప్పున నా శబ్దము ఆలకించుము,
యెహోవా! నీ న్యాయవిధి చొప్పున నన్ను బ్రతికించుము.
150 దుష్కృత్యము వెంబడించే వారు సమీపించి యున్నారు,
వారు నీ బోధనకు దూరముగానున్నారు.
151 యెహోవా! నీవు సమీపించియున్నావు,
నీ ఆజ్ఞలన్నియు సత్యమే.
152 నీ సాక్ష్యములు నీవు నిరంతరము స్థిరపరిచినావని,
వాటి వల్లనే పూర్వకాలమునుంచి తెలుసుకొంటిని.

ר రేష్.

153 నా బాధ చూచి నన్ను విడిపించుము;
నీ బోధన మరువనైతిని.
154 నా వాదము వాదించి నన్ను విమోచించుము,
నీ మాట చొప్పున నన్ను బ్రతికించుము.
155 రక్షణ దుష్టులకు దూరమైనది,
వారు నీ కట్టడలను వెతుకరైరి.
156 యెహోవా! నీ కనికరములు విస్తారమైనవి,
నీ న్యాయవిధుల చొప్పున నన్ను బ్రతికించుము.
157 నన్ను తరిమేవారు, నా విరోధులు అనేకులు,
నీ సాక్ష్యములనుంచి నేను తొలగనైతిని.
158 ద్రోహులను చూచి విసుకుకొంటిని;
వారు నీ వాక్యము గైకొనలేదు.
159 చూడుము, నీ శాసనములయందు నాకు ప్రీతి కలిగియున్నది,
యెహోవా! నీ కృప చొప్పున నన్ను బ్రతికించుము.
160 నీ వాక్య సముదాయము సత్యమే,
నీ నీతి విధులన్నియు నిరంతరము ఉన్నవి.

ש షిన్.

161 రాజులు నన్ను ఊరకనే తరిమిరి;
నా హృదయము నీ వాక్యములకు భయపడుచున్నది.
162 చాలా దోపుడు సొమ్ము సంపాదించిన వాని వలె,
నా ఆత్మ నీ మాటను గూర్చి సంతోషించుచున్నది.

163 అబద్ధమును ద్వేషించుచున్నాను, అది నాకు అసహ్యమైనది,
నీ బోధన ప్రేమించుచున్నాను.
164 నీ నీతి విధుల నిమిత్తము,
దినమునకు ఏడు మారులు నిన్ను స్తుతించుచున్నాను.
165 నీ బోధనయందు ప్రీతి గల వారికి చాలా నెమ్మది కలుగును,
వారికి ఏదియు అభ్యంతరము చేయదు.
166 యెహోవా! నీ రక్షణ కొరకు కనిపెట్టుకొంటిని,
నీ ఆజ్ఞలను గైకొని యున్నాను.
167 నా ఆత్మ నీ సాక్ష్యములను గైకొనుచున్నది,
వాటియందు నాకు మిక్కిలీ ప్రీతి కలిగియున్నది.
168 నీ శాసనములను నీ సాక్ష్యములను గైకొనుచున్నాను;
నా మార్గములన్నియు నీ యెదుట ఉన్నవి.

ת

169 యెహోవా! నీ సన్నిధికి నా మొరను చేరనిమ్ము,
నీ మాట చొప్పున నన్ను బోధించుము.
170 నా విన్నపము నీ సన్నిధికి రానిమ్ము,
నీ మాట చొప్పున నన్ను తప్పించుము.
171 నా పెదవులు స్తోత్రము కుమ్మరించును,
నీవు నీ కట్టడలను నాకు బోధపరుతువు.
172 నా నాలుక నీవిచ్చిన మాట వచించును;
నీ ఆజ్ఞలన్నియు న్యాయమైనవే.
173 నీ చెయ్యి నాకు సహాయార్థమై ఉండుగాక,
నీ పద్ధతులు ఏర్పరుచుకొంటిని.
174 యెహోవా! నీ రక్షణ కొరకు కాంక్షించి ఉన్నాను,
నీ బోధన నాకు మనోహరమైనది.
175 నా ఆత్మ* బ్రతికి నిన్ను స్తుతించనిమ్ము,
నీ న్యాయ విధులు నాకు సహాయమవుగాక.
276 తప్పిపోయి నశించిన గొఱ్ఱెవలె తప్పిపోతిని,
నీ సేవకుని వెతుకుము; నీ ఆజ్ఞలను మరవనైతిని.

## 120. కీర్తన.

యాత్ర కీర్తన.

1 నా శ్రమలో యెహోవాను గూర్చి మొరబెట్టినాను,
ఆయన నాకు ఉత్తరమిచ్చెను.
2 యెహోవా! అబద్ధమాడు పెదవులనుంచి,
కపటమైన నాలుకనుంచి నా ప్రాణము విడిపించుము.
3 కపటమైన నాలుకా! ఆయన నీకేమి ఇచ్చును?
నీకు మరేమి చేసును?
4 తంగేటి నిప్పులను,
బలాఢ్యుని వాడిగల బాణములను (ఇచ్చును.)
5 అయ్యో! నేను మెషెకులో పరదేశినైతిని,
కేదారు గుడారములయొద్ద కాపురముంటిని.

* లేక, నేను.

6 సమాధానమందు ద్వేషపడే వానియొద్ద,
నా ప్రాణము బహు కాలము నివసించెను.
7 సమాధానమే నాకిష్టము,
అయితే నేను పలికేటప్పుడు వారు యుద్ధము కోరుదురు.

## 121. కీర్తన.

యాత్ర కీర్తన.

1 కొండల తట్టు నా కన్నులు ఎత్తుదును;
సహాయము నాకు ఎక్కడనుంచి కలుగును?
2 యెహూవా వల్లనే నాకు సహాయము కలుగును,
ఆయన ఆకాశము భూమియు సృజించెను.
3 ఆయన నీ పాదము కదలనియ్యకుండుగాక;
నిన్ను కాపాడేవాడు కునుకకనుండుగాక.
4 ఇశ్రాయేలును కాపాడే ఆయన కునుకడు,
ఆయన నిద్రపోడు.
5 నిన్ను కాపాడేవాడు యెహూవా,
నీ కుడి పక్కను యెహూవా నీకు నీడగా ఉన్నాడు.
6 పగలు, ఎండ దెబ్బ అయినను,
రాత్రి, వెన్నల దెబ్బ అయినను నీకు తగలదు.
7 కీడంతటినుంచి యెహూవా నిన్ను కాపాడును,
ఆయన నీ ప్రాణము కాపాడును.
8 ఇది మొదలుకొని నిరంతరము,
యెహూవా నీ రాకపోకలయందు నిన్ను కాపాడును.

## 122. కీర్తన.

దావీదు యాత్ర కీర్తన.

1 —యెహూవా ఇంటికి వెళ్లుదామని,
వారు నాతో పలికినప్పుడు సంతోషించినాను.
2 యెరూషలేమా! నీ ద్వారములలో
మా పాదములు నిలిచెను.
3 యెరూషలేమా! దట్టముగా కట్టబడిన పట్టణము వలె
నీవు కట్టబడి ఉన్నావు.
4 అక్కడికి గోత్రములు,
ఇశ్రాయేలుకు విధించబడిన ప్రకారము యెహూవా గోత్రములు,
యెహూవా నామము స్తుతించుటకు వెళ్లెను.
5 అక్కడ, న్యాయము తీర్చుటకు, సింహాసనములు,
దావీదు వంశమునకు సింహాసనములు స్థాపించబడెను.
6 యెరూషలేము సుఖము నిమిత్తము ప్రార్థించుడి;
నీ యందు ప్రీతి గలవారు వర్ధిల్లుదురు.
7 నీ బురుజులలో సుఖము,
నీ నగరులలో క్షేమము ఉండు గాక.
8 నా సహూదరుల నిమిత్తము నా చెలికాండ్ల నిమిత్తము,
—నీలో సుఖము కలుగు గాక అని పలుకుదును.

9 మన దేవుడైన యెహోవా ఇంటి నిమిత్తము,
నీ మేలు కోరుదును.

## 123. కీర్తన.

యాత్ర కీర్తన.

1 ఆకాశమందు ఆసీనుడై ఉండేవాడా!
నీ తట్టు నా కన్నులు పైకెత్తుచున్నాను.
2 ఇదుగో! సేవకుల కన్నులు తమ యజమానుల చేతితట్టు,
దాసి కన్నులు తన యజమానురాలి చేతితట్టు ఏలాగో,
ఆలాగే, ఆయన మనలను కరుణించే పర్యంతము,
మన కన్నులు మన దేవుడైన యెహోవాతట్టు చూచుచుండును.
3 మమ్ము కరుణించుము; యెహోవా! మమ్ము కరుణించుము;
మాకు నిండా తిరస్కారము వచ్చెను.
4 మేము* భోగవంతుల నిందచేతను,
గర్విష్ఠుల తిరస్కారముచేతను నిండా నింపబడి ఉన్నాము.

## 124. కీర్తన.

దావీదు యాత్ర కీర్తన.

1 ఇశ్రాయేలు ఈలాగున పలుకు గాక,
—యెహోవా మనకు తోడై ఉండకుంటే,
2 మనుష్యులు మనకు విరోధముగా లేచినప్పుడు,
యెహోవా మనకు తోడై ఉండకుంటే,
3 వారి కోపము మనమీద రవులుకొన్నప్పుడు,
వారు మనలను ప్రాణముతోనే మింగివేతురు.
4 అప్పుడు నీళ్లు మనలను ముంచివేసును,
ప్రవాహము మన ప్రాణముల మీద పొర్లిపారును;
5 అప్పుడు పొంగే నీళ్లు,
మన ప్రాణముల మీద పొర్లిపారును.
6 యెహోవాకు వందనము చేయబడుగాక,
ఆయన వారి పళ్లకు మనలను అప్పగించ లేదు.
7 వేటకాని ఉరినుంచి పక్షివలె మన ప్రాణము తప్పించుకొనెను;
ఉరి తెంపబడెను, మనము తప్పించుకొంటిమి.
8 ఆకాశము భూమిని సృజించిన యెహోవా పేరట,
మనకు సహాయము ఉన్నది.

## 125. కీర్తన.

యాత్ర కీర్తన.

1 యెహోవాయందు నమ్మిక ఉంచేవారు సీయోను కొండవలెనుందురు,
అది కదలక నిరంతరము నిలుచును.
2 పర్వతములు యెరూషలేము చుట్టుకొనుచున్నవి;
ఇది మొదలుకొని నిరంతరము
యెహోవా తన ప్రజలను చుట్టుకొనుచుండును.

*లేక, మా ఆత్మ.

3 నీతిమంతులు అక్రమము చేయుటకు
తమ చేతులు చాపకుండే నిమిత్తము,
దుష్టుల అధికారదండము నీతిమంతుల భాగము మీద నిలువదు.
4 యెహోవా! నీవు మంచివారికి,
యథార్థ హృదయము గలవారికి నీ మంచితనము చూపుము.
5 తమ వంకర త్రోవలకు తొలగిపోయే వారిని,
యెహోవా, అక్రమము చేసే వారితో కూడా పోగొట్టును;
ఇశ్రాయేలు మీద సుఖముండుగాక.

## 126. కీర్తన.

యాత్ర కీర్తన.

1 సీయోనుకు తిరిగి వచ్చినవారిని యెహోవా రావించుచుండగా,
కలగనిన వారి వలె నుంటిమి.
2 అప్పుడు నవ్వుతో మన నోరు,
ఆనందగానముతో మన నాలుక నింపబడెను.
3 అప్పుడు రాష్ట్రములలో వారు,
—యెహోవా వారికొరకు గొప్ప కార్యములు చేసెనని చెప్పుకొనిరి.
4 యెహోవా మన కొరకు గొప్ప కార్యములు చేసి ఉన్నాడు,
కావున సంతోషించినవారమైతిమి.
5 యెహోవా! దక్షిణ ప్రవాహముల వలె,
చెరపట్టబడిన మా వారిని తిరిగి రావించుము.
6 కన్నీళ్లతో విత్తేవారు సంతోషగానముతో పంట కోతురు;
7 వెదచల్లుటకు (ఒకడు) పిడికెడు విత్తనములు పట్టుకొని,
ఏడ్చుచు ఇటు అటు నడుచుచుండ వచ్చును;
8 అయితే తన పనలు మోసుకొని,
నిశ్చయముగా సంతోషగానముతో వచ్చును.

## 127. కీర్తన.

సలోమా యాత్ర కీర్తన.

1 యెహోవా, ఇల్లు కట్టించకపోతే,
దాని కట్టేవారి కష్టము వ్యర్థమే;
యెహోవా పట్టణమును కాపాడకపోతే,
కాపాడేవారు మేలుకొనుట వ్యర్థమే.
2 మీరు వేకువనే లేచి, చాలా రాత్రియైన తరువాత పండుకొని
కష్టార్జితమైన ఆహారము తినుట వ్యర్థమే;
ఆయన ఆలాగున తన ప్రియునికి నిద్రలో* దయచేసును.
3 ఇదుగో! కుమారులు యెహోవా ఇచ్చే స్వాస్థ్యము,
గర్భ ఫలము (ఆయన దయ చేసే) బహుమానమే.
4 బలవంతుని చేతిలోని బాణముల వలె,
యౌవనకాల కుమారులు ఉన్నారు.
5 వారితో తన అంబుల పొది నింపుకొనినవాడు ధన్యుడు;
అట్టివారు సిగ్గుపడక,
గుమ్మములో తమ విరోధులతో మాట్లాడుదురు.

---

*లేక, నిద్ర.

## 128. కీర్తన.

యాత్ర కీర్తన.

1 యెహోవా యందు భయభక్తులు కలిగి,
ఆయన త్రోవలో నడిచే ప్రతివాడు ధన్యుడు.
2 నీ చేతుల కష్టార్జితము భుజింతువు,
నీవు ధన్యుడవు; నీకు మేలు కలుగును.
3 నీ లోగిట నీ భార్య ఫలించే ద్రాక్షావల్లి వలె నుండును,
నీ భోజనపు బల్లచుట్టు,
నీ పిల్లలు ఒలీవ చెట్టు మొక్కల వలె నుందురు.
4 ఇదుగో! యెహోవాయందు భయభక్తులు గలవాడు,
ఆలాగున దీవించబడును.
5 యెహోవా సీయోనునుంచి నిన్ను దీవించుగాక;
నీ జీవితకాలమంతయు,
నీవు యెరూషలేముయొక్క మేలు చూతువుగాక.
6 నీ పిల్లల పిల్లలను చూతువుగాక;
ఇశ్రాయేలు మీద సుఖము ఉండుగాక.

## 129. కీర్తన.

యాత్ర కీర్తన.

1 – నా యౌవన కాలము మొదలుకొని,
నన్ను చాలా శ్రమ పెట్టిరని ఇశ్రాయేలు అనుకొన వచ్చును.
2 — నా యౌవనకాలము మొదలుకొని నన్ను చాలా శ్రమ పెట్టిరి;
అయితే వారు నన్ను జయించలేదు.
3 దున్నేవారు నా వీపుమీద దున్నిరి;
వారు తమ చాళ్లను పొడుగుచేసిరి.
4 యెహోవా న్యాయము గలవాడు,
ఆయన, దుష్టుల పాశములు ఖండించెను.
5 సీయోనును ద్వేషించేవారందరు
సిగ్గుపడి వెనుకకు తిరుగుదురు గాక.
6 వారు ఇంటి పైని గడ్డివలెనుందురు గాక,
అది ఊడతీయక మునుపే వాడిపోవును.
7 కోసేవాడు తన చేతినైనను,
పనలు కట్టేవాడు తన ఒడినైనను దానితో నింపుకొనడు.
8 మరియు దాటిపోయేవారు,
—యెహోవా దీవెన నీ మీద ఉండు గాక;
—యెహోవా పేరట మిమ్ము దీవించుచున్నామని పలుకరు.

## 130. కీర్తన.

యాత్ర కీర్తన.

1 యెహోవా! అగాధ జలములనుంచి నిన్ను గూర్చి మొరబెట్టి ఉన్నాను.
2 ప్రభువా! నా శబ్దము ఆలకించుము;

నీ చెవినొగ్గి, నా ప్రార్థనల శబ్దము వినుము;
3 యెహోవా! నీవు అక్రమములను ఎంచితే,
ప్రభువా! ఎవడు నిలుచును?
4 అయితే (మనుష్యులకు) నీయందు భయభక్తులు కలుగుటకు,
నీ యొద్ద క్షమ కలదు.
5 యెహోవా నిమిత్తము నిరీక్షించినాను; నా ఆత్మ నిరీక్షించెను;
ఆయన వాక్యము నిరీక్షించినాను.
6 ఉదయము కొరకు ఎదురు చూచేవారి కంటే,
నా ఆత్మ ప్రభువు తట్టు చూచుచున్నది;
ఉదయముకొరకు ఎదురు చూచేవారి కంటే చూచుచున్నది.
7 ఓ ఇశ్రాయేలు! యెహోవాను నిరీక్షించుము;
యెహోవా యొద్ద కృప ఉన్నది;
ఆయన యొద్ద సంపూర్ణ విమోచకత్వము ఉన్నది;
8 మరియు ఆయన ఇశ్రాయేలుని,
వాని అక్రమములన్నిటినుంచి విమోచనము చేసును.

## 131. కీర్తన.

దావీదు యాత్ర కీర్తన.

1 యెహోవా! నా హృదయము గర్వపడుటలేదు,
నా కన్నులు మీదు చూచుట లేదు,
నాకందని గొప్పవాటియందైనా ఆశ్చర్యమైన వాటియందైనా,
నేను ప్రవర్తించుట లేదు.
2 అయితే చనుపాలు విడిచి తన తల్లియొద్దనున్న పిల్లవలె,
నా ప్రాణము ఓదార్చుకొని సముదాయించుకొంటిని,
నా యొద్ద నా ఆత్మ, పాలు మాన్పబడిన పిల్లవలె నున్నది.
3 ఓ ఇశ్రాయేలూ!
ఇది మొదలుకొని నిరంతరము యెహోవాను నిరీక్షించుము.

## 132. కీర్తన.

యాత్ర కీర్తన.

1 యెహోవా! దావీదుయొక్క బాధలన్నియు,
అతని మేలుకై జ్ఞాపకము చేసుకొనుము.
2 అతడు యెహోవాతో ప్రమాణము చేసి,
5 — నేను యెహోవా నిమిత్తము ఒక స్థలము,
యాకోబు సమర్థుని కొరకు ఒక నివాస స్థలము సంపాదించుదాకా,
3 నా నివాసమైన గుడారములో ప్రవేశించను,
నా శయనమైన మంచము ఎక్కను;
4 నా కన్నులకు నిద్రయు,
నా కనురెప్పలకు కునికిపాటును రానియ్యనని,
యాకోబు సమర్థునికి మ్రొక్కుకొనెను.
6 ఇదుగో! ఎఫ్రాతాలో దాని గూర్చి వింటిమి;
యాయరు* పొలములలో అది దొరికెను.

* లేక, అడవి.

7 ఆయన నివాస స్థలములోకి చేరుదము,
ఆయన పాదపీఠము యెదుట సాగిల పడుదము.
8 యెహోవా! నీవు లెమ్ము,
నీ శక్తిగల పెట్టెతో నీ సుఖాలయములో ప్రవేశించుము.
9 నీ యాజకులు నీతి వహింతురు గాక,
నీ భక్తులు* ఉత్సాహ గానము చేతురు గాక.
10 నీ సేవకుడైన దావీదు నిమిత్తము,
నీ అభిషిక్తుని ముఖము నిరాకరించకుము.
11 యెహోవా దావీదుతో సత్యప్రమాణము చేసెను,
ఆయన మాట తప్పడు,
—నీ సింహాసనము మీద నీ గర్భఫలము కూర్చుండబెట్టుదును;
12 నీ కుమారులు నా నిబంధన,
నేను వారికి బోధించే నా సాక్ష్యము గైకొంటే,
నిరంతరము వారి కుమారులును,
నీ సింహాసనము మీద కూర్చుందురనెను.
13 యెహోవా సీయోనును ఏర్పరచుకొనెను;
అది తనకు నివాస స్థలముగా ఇచ్ఛయించుకొని ఉన్నాడు.
14 అది నిరంతరము నాకు సుఖాలయమై ఉండును,
అక్కడ నివసింతును; దీని ఇచ్ఛయించుకొంటిని.
15 దాని ఆహారమును అధికముగా దీవింతును,
దాని బీదలను అన్నముతో తృప్తిపరుతును.
16 దాని యాజకులను రక్షణ యనే వస్త్రము ధరింపచేతును;
దాని భక్తులు బహు ఆనందగానము చేతురు.
17 అక్కడ దావీదుకు కొమ్ము మొలవ చేతును,
నా అభిషిక్తుని కొరకు దీపము సిద్ధపరిచితిని.
18 ఆయన శత్రువులను సిగ్గు వహింపచేతును;
ఆయన మీద ఆయన కిరీటము తేజరిల్లును.

## 133. కీర్తన.

### దావీదు యాత్ర కీర్తన.

2 ఇదుగో! సహోదరులు ఐక్యముగా నివసించుట,
ఎంతో మంచిది! ఎంతో మనోహరమైనది!
2 అది తలపై పోయబడి, గడ్డము మీద,
అహరోను గడ్డము మీద కారుతు,
అతని అంగీల చెంగుమట్టుకు కారెడి,
మంచి తైలము వలె నున్నది.
3 సీయోను కొండలమీద దిగు
హెర్మోను మంచు వలె నున్నది;
అక్కడ యెహోవా, ఆశీర్వాదమును,
నిరంతరముండెడి జీవమును విధించెను.

* లేక, నీ దయాప్రాప్తులు.

## 134. కీర్తన.

యాత్ర కీర్తన.

1 ఇదుగో! యెహోవా సేవకులారా!
యెహోవా మందిరములో రాత్రి నిలిచువారలారా!
యెహోవాకు వందనము చేయుడి.
2 పరిశుద్ధ స్థలము వైపు మీ చేతులు పైకెత్తి,
యెహోవాకు వందనము చేయుడి.
3 ఆకాశము భూమియును సృజించిన యెహోవా,
సీయోనులోనుంచి నిన్ను దీవించుగాక.

## 135. కీర్తన.

1 హల్లెలూయా,
యెహోవా నామము స్తుతించుడి;
2 యెహోవా మందిరములో,
మన దేవుని ఇంటి అంగడములలో నిలిచెడి,
యెహోవా సేవకులారా! స్తుతించుడి.
3 హల్లెలూయా! యెహోవా మంచివాడు,
ఆయన నామము కీర్తించుడి; అది మనోహరమైనది.
4 యెహోవా తన కొరకు యాకోబుని,
తన విశేష సంపాద్యముగా ఇశ్రాయేలుని ఏర్పరుచుకొనెను.
5 యెహోవా గొప్పవాడనియు,
మన ప్రభువు సమస్త దేవతలకంటే,
అధికుడనియు నేను ఎరుగుదును.
6 ఆకాశమందు, భూమియందు,
సముద్రాది అగాధ జలములన్నిటియందు,
తనకు ఇష్టమైనది యావత్తు జరిగించెను.
7 ఆయన భూదిగంతములనుంచి ఆవిరి లేవ చేసును,
వానతో ఉండుటకు మెరుపు పుట్టించును,
తన కొట్లలోనుంచి గాలి బైలువెళ్ల చేసును.
8 ఆయన, మనుష్యులు మొదలుకొని పశువుల పర్యంతము,
ఐగుప్తులో తొలిచూలులను చంపెను.
9 ఐగుప్తూ! పరోకును, అతని ఉద్యోగస్థులకును విరోధముగా,
ఆయన ఆనవాళ్లను అద్భుతములను నీ మధ్య పుట్టించెను.
10 ఆయన అనేక రాష్ట్రములను కొట్టెను; బలిష్ఠ రాజులను,
11 అమోరుల రాజైన సీహోనుని,
బాషాను రాజైన ఓగుని సంహరించెను,
కనానుయొక్క సమస్త రాజ్యములను (కొట్టినాడు.)
12 ఆయన వారి దేశము స్వాస్థ్యముగా,
ఇశ్రాయేలనే తన ప్రజలకు స్వాస్థ్యముగా ఇచ్చెను.
13 యెహోవా! నీ నామము నిరంతరము ఉండును,
యెహోవా! నీ జ్ఞాపకము తరతరముల మట్టుకు నుండును.
14 యెహోవా తన ప్రజల నిమిత్తము న్యాయము తీర్చును;
ఆయన తన సేవకులను గూర్చి సంతాపపడును.

15 రాష్ట్రముల విగ్రహములు వెండి బంగారములు;
అవి మనుష్యుల చేతి పనులు.
16 వాటికి నోరు ఉండియు పలుకవు,
వాటికి కన్నులు ఉండియు చూడవు.
17 వాటికి చెవులు ఉండియు వినవు,
వాటి నోళ్లలో ఊపిరి లేశమైనను లేదు.
18 వాటిని చేసే వారు,
వాటియందు నమ్మిక ఉంచే వారందరు వాటి వలె నుందురు.
19 ఇశ్రాయేలు ఇంటివారలారా! యెహోవాను స్తుతించుడి,
అహరోను ఇంటివారలారా! యెహోవాను స్తుతించుడి.
20 లేవీ ఇంటివారలారా! యెహోవాను స్తుతించుడి,
యెహోవాకు భయపడే వారలారా! యెహోవాను స్తుతించుడి.
21 యెరూషలేములో నివసించు యెహోవాకు,
సీయోనులోనుంచి వందనము చేయబడు గాక,
హల్లెలూయా, యెహోవాను స్తుతించుడి.

## 136. కీర్తన.

1 యెహోవాను స్తుతించుడి; ఆయన మంచివాడు,
ఆయన కృప నిరంతరము నుండును.
2 దేవతల దేవుని స్తుతించుడి,
ఆయన కృప నిరంతరము నుండును.
3 ప్రభువుల ప్రభువుని స్తుతించుడి,
ఆయన కృప నిరంతరము నుండును.
4 తనంతట తానే గొప్ప అద్భుతములను చేసెను,
ఆయన కృప నిరంతరము నుండును.
5 జ్ఞానము వల్ల ఆకాశము కలుగ చేసెను,
ఆయన కృప నిరంతరము నుండును.
6 నీళ్లమీద భూమి పరిచెను,
ఆయన కృప నిరంతరము నుండును.
7 గొప్ప వెలుగులనుగా,
ఆయన కృప నిరంతరము నుండును,
8 పగటిని ఏలుటకు సూర్యుని చేసెను,
ఆయన కృప నిరంతరము నుండును.
9 రాత్రిని ఏలుటకు చంద్రుని, నక్షత్రములను చేసెను,
ఆయన కృప నిరంతరము నుండును.
10 ఐగుప్తు దేశములో తొలిచూలులను చంపెను,
ఆయన కృప నిరంతరము నుండును.
11 బలమైన చేతితోను చాపిన బాహువుతోను,
ఆయన కృప నిరంతరము నుండును,
12 వారి మధ్యనుంచి ఇశ్రాయేలుని పైకి తీసుకొని వచ్చెను,
ఆయన కృప నిరంతరము నుండును.
13 ఎర్ర సముద్రము భాగములుగా భేదించెను,
ఆయన కృప నిరంతరము నుండును.

14 ఇశ్రాయేలుని దాని ద్వారా వెళ్ల చేసెను,
ఆయన కృప నిరంతరము నుండును.
15 ఫరోను అతని సైన్యమును ఎర్ర సముద్రములో విదల్చెను,
ఆయన కృప నిరంతరము నుండును.
16 అరణ్యము ద్వారా తన ప్రజలను నడిపించెను,
ఆయన కృప నిరంతరము నుండును.
17 గొప్ప రాజులను కొట్టెను,
ఆయన కృప నిరంతరము నుండును.
18 ఘనత వహించిన రాజులను,
ఆయన కృప నిరంతరము నుండును.
19 అమోరుల రాజైన సీహోనుని,
ఆయన కృప నిరంతరము నుండును.
20 బాషాను రాజైన ఓగుని చంపినవాని స్తుతించుడి,
ఆయన కృప నిరంతరము నుండును.
21 ఆయన వారి దేశము స్వాస్థ్యముగా,
ఆయన కృప నిరంతరము నుండును.
22 తన సేవకుడైన ఇశ్రాయేలుకు స్వాస్థ్యముగా ఇచ్చెను,
ఆయన కృప నిరంతరము నుండును.
23 ఆయన మన దీనదశలో మనలను జ్ఞాపకము చేసుకొనెను,
ఆయన కృప నిరంతరము నుండును.
24 మన విరోధులలోనుంచి మనలను విడిపించెను,
ఆయన కృప నిరంతరము నుండును.
25 సమస్త జీవులకును ఆయన ఆహారము ఇచ్చుచున్నాడు,
ఆయన కృప నిరంతరము నుండును.
26 ఆకాశమందలి దేవుని స్తుతించుడి,
ఆయన కృప నిరంతరము నుండును.

## 137. కీర్తన.

1 బాబెలులో నదుల యొద్ద,
మనము సీయోనును జ్ఞాపకము చేసుకొని,
అక్కడ కూర్చుంటిమి; అప్పుడు ఏడ్చినాము.
2 దాని మధ్యను, వృక్షములకు*
మన కిన్నెరలు వ్రేలాడ వేసితిమి.
3 మనలను చెరపట్టుకొని వెళ్లినవారు, కీర్తన వాక్యములను,
మనల పాడు చేసినవారు ఉల్లాసమును కోరి,
—సీయోను కీర్తనలలో ఒకదాని మా నిమిత్తము పాడుడనిరి.
4 అన్యదేశములో యెహోవా కీర్తన ఏలాగు పాడగలము?
5 ఓ యెరూషలేమా! నిన్ను నేను మరిచితే,
నాకు కుడి చేతికి మరుపు కలుగుగాక.
6 నేను నిన్ను జ్ఞాపకము చేసుకొనక పోయినను,
నా ముఖ్య సంతోషముకంటె,
యెరూషలేమును మిక్కిలి ఎంచకపోయినను,
నా నాలుక నా అంగిటిని హత్తుకొనుగాక.

* English, willow trees.

7 యెహోవా! ఎదోము జనుల నిమిత్తము,
యెరూషలేము దినము* జ్ఞాపకము చేసుకొనుము;
వారు—దాని నాశము చేయుడి,
దాని సమూల నాశము చేయుడి అని పలికిరి.
8 పాడు చేయబడిన బాబెలు కుమారీ!
నీవు మాకు చేసిన కార్యమునకు ప్రతిగా
నీ ఎడల చేసే వాడు ధన్యుడు.
9 నీ పిల్లలను పట్టుకొని,
బండ మీద వారిని కొట్టేవాడు ధన్యుడు.

## 138. కీర్తన.

దావీదు (కీర్తన.)

1 పూర్ణ హృదయముతో నిన్ను స్తుతింతును,
దేవతల యెదుట నిన్ను కీర్తింతును;
2 నీ పరిశుద్ధాలయము తట్టు సాగిలపడుదును,
నీ కృపా సత్యములు పట్టి నీ నామము స్తుతింతును;
నీ సర్వ నామముకంటే నీ మాట గొప్పచేసి యున్నావు.
3 నేను మొరబెట్టిన దినమే నాకు ఉత్తరమిచ్చినావు;
నా ఆత్మకు ధైర్యము విస్తరింప చేసితివి.
4 యెహోవా! భూరాజులందరు నిన్ను స్తుతింతురు;
వారు నీ నోటి మాటలు విని యుందురు.
5 —యెహోవా మహిమ గొప్పదని,
వారు యెహోవా మార్గములను గూర్చి గానము చేతురు.
6 ఎందుకంటే యెహోవా మహోన్నతుడు,
అయినను దీనులను లక్షించును;
ఆయన దూరమునుంచి గర్విష్ఠుని తెలుసుకొనును.
7 నేను ఆపదలో నడిచినను, నీవు నన్ను బ్రతికింతువు;
నా శత్రువుల కోపమునకు విరోధముగా నీ చేయి చాపుదువు,
నీ కుడి చేయి నన్ను రక్షించును.
8 యెహోవా నా నిమిత్తము తీర్పు చేసును;†
యెహోవా! నీ కృప నిరంతరముండును:
నీ చేతి కార్యములు విడిచి పెట్టకుము.

## 139. కీర్తన.

దావీదు కీర్తన.

1 యెహోవా! నన్ను పరిశోధించి ఎరిగి యున్నావు.
2 నేను కూర్చుండుట, లేచుటయు నీకు తెలుసును;
దూరమునుంచి నా మనస్సు గ్రహించి యున్నావు.
3 నీవు నా నడక, నా పడకను ఆవరించుకొని యున్నావు,
నా త్రోవలన్నియు నీకు బాగా తెలుసును.
4 మాట నా నోటికి ‡ రాక మునుపే,
ఇదిగో! యెహోవా! అది నీకు పూర్తిగా తెలుసును.

*లేక, దుర్దినము. †లేక, మేలు నెరవేర్చును. 57. 2. ‡హెబ్రీలో, నాలుకకు.

5 వెనుకను, ముందటను నన్ను ఆవరించుకొని యున్నావు,
నీ చేయి నా మీద ఉంచి యున్నావు.
6 ఈ తెలివి నాకు ఆశ్చర్యమైనది;
అది ఉన్నతమైనది; అది నాకందదు.
7 నీ ఆత్మ యొద్దనుంచి నేను ఎక్కడికి వెళ్ల గలను!
నీ సన్నిధినుంచి ఎక్కడికి పారిపో గలను!
8 నేను ఆకాశ మెక్కినను, నీవు అక్కడ నున్నావు;
నేను అధోలోకమందు శయనించినను, ఇదుగో! అక్కడనున్నావు.
9 నేను వేకువ రెక్కలు కట్టుకొని,
పశ్చిమ దిగంతములతో నివసించినను,
10 అక్కడను నీ చేయి నన్ను నడిపించును,
నీ కుడి చేయి నన్ను పట్టుకొనును.
11 —చీకటి నన్ను కమ్మి,
నా చుట్టు పగలు రాత్రి వలె నుండుగాక అనుకొంటే,
12 చీకటి అయినను, నీకు చీకటి కలుగచేయదు,
రాత్రి పగటి వలె వెలుగును;
నీకు చీకటి, వెలుగును సమానమే.
13 నా అంతరింద్రియములు నీవే వశము చేసుకొని,
నా తల్లి గర్భమందు నన్ను ఒనర్చి యున్నావు.
14 నిన్ను స్తుతింతును,
భీకరమైన అద్భుత కార్యముల వల్ల ఏర్పరచబడితిని;
నీ కార్యములు అద్భుతమైనవి;
అది నా ఆత్మకు బాగా తెలుసును.
15 నేను రహస్యమందు పుట్టించబడి,
భూమి అగాధ స్థలములలో వలె,
విచిత్రముగా నిర్మించబడినప్పుడు,
నా ఎముకలు నీకు మరుగై యుండలేదు.
16 నీ కన్నులు నా పిండము చూచినవి;
వాటిలో ఒకటి అయినను లేనప్పుడు,
ఏర్పరచబడిన నా దినములన్నియు,
నీ పుస్తకమందు వ్రాయబడినవి.
17 దేవా! నాకు* నీ తలంపులు ఎంతో అమూల్యమైనవి!
వాటి మొత్తములు ఎంతో విస్తారములు!
18 వాటిని లెక్కింతునంటే, ఇసుకకన్న విస్తారమైనవి;
నేను మేలుకొని, నీ యొద్ద ఇంకనున్నాను.
19 దేవా! నీవు దుష్టులను చంపక మానవే!
రక్తాపరాధులారా! నా యొద్దనుంచి తొలగి పోవుడి.
20 వారు దురాలోచనతో నిన్ను గూర్చి పలుకుదురు,
నీ విరోధులై, వ్యర్థముగా నీ పేరు ఎత్తుదురు.
21 యెహోవా! నిన్ను ద్వేషించే వారిని నేను ద్వేషించ వద్దా!
నీకు విరోధముగా లేచువారి ఎడల చీదరపడ వద్దా?

* లేక, నావిషయమై.

22 నేను పూర్ణ ద్వేషముతో వారిని ద్వేషించి,
వారు నాకు శత్రువులనుకొంటున్నాను.
23 దేవా! నన్ను పరిశోధించి, నా హృదయము తెలుసుకొనుము;
నన్ను పరీక్షించి నా ఆలోచనలు తెలుసుకొనుము.
24 నాయందు ఆయాసకర మార్గమున్నదేమో చూచి,
నిత్యమార్గమందు నన్ను నడిపించుము.

## 140 కీర్తన.

ప్రధాన గాయకునికి, దావీదు కీర్తన.

1 యెహోవా! చెడ్డ మనుష్యులనుంచి నన్ను విడిపించుము,
బలాత్కారము చేసెడి నరులనుంచి నన్ను కాపాడుము.
2 వారు తమ హృదయములలో కీడులు ఆలోచింతురు,
దినమంతయు యుద్ధము కొరకు కూడుకొని యుందురు.*
3 పాముపలె వారు తమ నాలుకలు వాడిచేసి యున్నారు,
వారి పెదవుల కింద నాగ విషము కలదు.
4 యెహోవా! దుష్టుల చేతులనుంచి నన్ను రక్షించుము;
బలాత్కారము చేసే నరులనుంచి నన్ను కాపాడుము;
నా అడుగులు జారదోయుటకు తలంచియున్నారు.
5 గర్విష్ఠులు నా కొరకు ఉరిని, త్రాళ్లను ఒడ్డియున్నారు,
వారు త్రోవ పక్కను వల పరిచిరి,
నా కొరకు బోనులు ఒగ్గిరి. సెలా.
6 నేను యెహోవాతో పలికిన మాట,
—నీవే నా దేవుడవు,
యెహోవా! నా ప్రార్థనల శబ్దమునకు చెవి నొగ్గుము.
7 యెహోవా! నా రక్షణకు బలమైన ప్రభువా!
నీవు యుద్ధ దినములో నా తల కప్పినావు.
8 యెహోవా! దుష్టులు కోరేవాటిని ఇయ్యకుము,
వారి ఉద్దేశము కొనసాగింపకుము; వారు హెచ్చియుందురు.
9 నన్ను చుట్టుకొనే వారి తలను,
వారి పెదవుల కీడు కప్పుగాక.
10 వారి మీద నిప్పులు పడుగాక,
వారు తిరిగి లేవకుండా, అగ్నిహోత్రములోను
అగాధ జలములలోను త్రోయబడుదురు గాక.
11 చెడ్డమాటలాడే వాడు† భూమిలో స్థిరపరచబడడు,
బలాత్కారిని పడదోయుటకు కీడు వాని తరుమును.
12 యెహోవా బాధపడే వానికి న్యాయము,
దరిద్రునికి న్యాయపు తీర్పు చేసునని ఎరుగుదును.
13 నిశ్చయముగా నీతిమంతులు నీ నామము స్తుతింతురు;
యథార్థులు నీ సన్నుఖమందు నివసింతురు.

* లేక, యుద్ధము సిద్ధపరుచుకొందురు. † హెబ్రీలో, చెడ్డ నాలుకగలవాడు.

## 141. కీర్తన.

దావీదు కీర్తన.

1 యెహోవా! నిన్ను గూర్చి మొరబెట్టినాను,
నా యొద్దికి త్వరపడి రమ్ము;
నిన్ను గూర్చి నేను మొరబెట్టునప్పుడు,
నా మాటకు చెవి నొగ్గుము.
2 ధూపము వలె నా ప్రార్థన,
సాయంకాల నైవేద్యము వలె నా చేతులెత్తుట,
నీ యెదుట నిత్యమవుగాక.
3 యెహోవా! నా నోటికి కావలి ఉంచుము,
నా పెదవులనే ద్వారమునకు కాపు పెట్టుము.
4 అక్రమము చేసే మనుష్యులతో,
దుర్నీతి ప్రగల్భ కార్యము చేయుచు వచ్చుటకు,
ఏ దుష్కార్యమునకు నా హృదయము తిరగనియ్యకుము,
వారి రుచిగల పదార్థములు నన్ను తిననియ్యకుము.
5 నీతిమంతుడు నన్ను కొట్టితే, అది కృప;
అతడు నన్ను గద్దించితే అది తలకు తైలము;
నా తల దాని నిషేధించదు;
నా ప్రార్థన ఇంకా వారి అపాయముల విషయమే* యుండును.
6 వారి ఏలికలు శైలమునుండి కిందపడద్రోయబడినప్పుడు,
జనులు—మధురమైనవని నా మాటలు విందురు.
7 ఒకడు భూమి దున్నుచు చీల్చునట్లు,
మా ఎముకలు అధోలోక ద్వారమున చెదిరి యున్నవి.
8 యెహోవా! నా ప్రభువా! నా కన్నులు నీ తట్టు ఉన్నవి,
నిన్ను ఆశ్రయించినాను; నా ప్రాణము కుమ్మరించకుము.
9 వారు నా నిమిత్తము ఒడ్డిన ఉరినుంచియు,
అక్రమము చేసే వారి బోనులనుంచియు నన్ను కాపాడుము.
10 దుష్టులు తమ తమ వలలలో చిక్కుదురుగాక,
అంతలో నేను తప్పించుకొని పోదును.

## 142. కీర్తన.

గుహలో ఉన్నప్పుడు దావీదు బోధ ప్రార్థన.

1 నేను నోరెత్తి యెహోవాను గూర్చి మొరబెట్టుదును,
కంఠమెత్తి యెహోవాను ప్రార్థింతును.
2 ఆయన యెదుట నా చింత కుమ్మరింతును,
ఆయన యెదుట నా బాధ తెలియచేతును.

---

* లేక, సహితమై.

3 నా ఆత్మ నాలో కుందినప్పుడు,
నా మార్గము నీకు తెలుసును;
నేను నడచు త్రోవలో,
వారు నా నిమిత్తము చాటుగా ఉరియొగ్గి యున్నారు.
4 కుడి పక్క నిదానించి చూడుము,
నన్ను ఎరిగినవాడు ఎవడును లేడు;
నాకు ఆశ్రయము లేకపోయెను;
నా ప్రాణమును గూర్చి విచారపడు* వాడు లేడు.
5 యెహోవా! నిన్ను గూర్చి మొరబెట్టినాను;
—నా ఆశ్రయము నీవే,
సజీవుల భూమిలో నా స్వాస్థ్యభాగము నీవే అనుకొంటిని.
6 నా కేక వినుము, నేను చాలా కుంగియున్నాను;
నన్ను తరుమువారినుంచి నన్ను విడిపించుము,
వారు నాకంటే బలిష్ఠులు.
7 నీ నామము స్తుతించుటకు,
చెరసాలలోనుంచి నా ప్రాణము పైకి తెప్పించుము;
నీవు నాకు చాలా మేలు చేసితివని,
నీతిమంతులు నన్ను చుట్టుకొందురు.

## 143. కీర్తన.

దావీదు కీర్తన.

1 యెహోవా! నా ప్రార్థన వినుము,
నా విన్నపములకు చెవియొగ్గుము;
నీ విశ్వాస్యత ప్రకారముగా, నీ నీతిప్రకారముగా, నాకుత్తరమిమ్ము.
2 న్యాయ విమర్శలోకి నీ సేవకుని తేకుము;
నీ యెదుట ఏ జీవుడును నీతిమంతుడు కాడు.
3 శత్రువు నన్ను† తరిమెను; నా జీవము నేల పడగొట్టెను;
చిరకాలము కిందట చనిపోయిన వారిని వలె,
నన్ను చీకటిలో నివసింప చేసియున్నాడు.
4 నా ఆత్మ నాలో కుందియున్నది,
నా హృదయము నాలో మ్రాన్పడి యున్నది.
5 పూర్వ దినములు జ్ఞాపకము చేసుకొని యున్నాను;
నీ కార్యములన్నియు ధ్యానించుచు,
నీ చేతుల పని యోచించుచున్నాను.
6 నీ తట్టు నా చేతులు చాపి యున్నాను,
నా ప్రాణము నీ నిమిత్తము, ఎండిన భూమి వలె దప్పిగొని యున్నది.

* లేక, జాలిపడే. † లేక, నా ప్రాణము.

7 యెహోవా! త్వరగా నాకుత్తరమిమ్ము,
నా ప్రాణము క్షీణించి యున్నది;
నీ ముఖము నాకు దాచకుము,
దాచితే సమాధిలోకి దిగువారి వలె నుందును.
8 ఉదయము నీ కృప సమాచారము నాకు వినిపించుము;
నీ యందు నమ్మిక ఉంచి యున్నాను;
నేను నడవ వలసిన మార్గము నాకు తెలియ చేయుము;
నా మనస్సు నీ యందు పెట్టుకొని యున్నాను.
9 యెహోవా! నా శత్రువులలోనుంచి నన్ను విడిపించుము,
నీ శరణుజొచ్చి యున్నాను.
10 నీకిష్టమైనది చేయుటకు నన్ను బోధించుము,
నీవే నా దేవుడవు;
నీ మంచి ఆత్మ సరళ భూమి మీద నన్ను నడిపించుగాక.
11 యెహోవా! నీ నామము నిమిత్తము నన్ను బ్రతికించుము;
నీ నీతివల్ల నా ప్రాణము శ్రమలోనుంచి పైకి రప్పించుము.
12 నీ కృప చేత నా శత్రువులను సంహరింతువు,
నా ప్రాణమును బాధపరిచే వారినందరిని నాశము చేతువు;
నేను నీ సేవకుడను.

## 144. కీర్తన.

దావీదు కీర్తన.

1 యెహోవా, నా శైలము స్తుతించబడుగాక;
ఆయన నా చేతులకు యుద్ధము,
నా వ్రేళ్లకు పోరాటము నేర్పుచున్నాడు.
2 ఆయన నా కృప, నా కోట,
నా దుర్గము, నన్ను తప్పించువాడు;
నా కేడెము, నేను ఆశ్రయించువాడు,
నా జనులను నాకు లోపరిచేవాడునై యున్నాడు.
3 యెహోవా! నీవు మనుష్యుని తెలుసుకొనుటకు,
నరపుత్రుని తలంచుటకు అతడు ఏపాటివాడు?
4 నరుడు ఊపిరిని పోలి యున్నాడు,
వాని దినములు దాటిపోవు నీడ వలె నున్నవి.
5 యెహోవా! నీ ఆకాశము వంచుకొని దిగి రమ్ము,
పర్వతములు పొగరాజే నిమిత్తము వాటిని ముట్టుము.
6 మెరుపులు మెరిపించి, వారిని చెదర గొట్టుము,
నీ బాణములు వేసి వారిని ఓడకొట్టుము.
7 పైనుంచి నీ చేయి చాపి నన్ను తప్పించుము;
మహా జలములలోనుంచి,
అన్యుల చేతిలోనుంచి నన్ను విడిపించుము.
8 వారి నోరు వంచన గల మాటలాడెను;
వారి కుడి చేయి అబద్ధము గల కుడి చేయి.
9 దేవా! నిన్ను గూర్చి నూతన కీర్తన పాడుదును,
పది తంతుల వీణతో నిన్ను కీర్తింతును.

10 నీవు రాజులకు విజయము దయ చేతువు,
దుష్టుని ఖడ్గమునుంచి, నీ సేవకుడైన దావీదును తప్పింతువు.
11 నన్ను తప్పించుము, అన్యులచేతినుంచి నన్ను విడిపించుము;
వారి నోరు వంచన గల మాటలాడెను;
వారి కుడి చేయి అబద్ధము గల కుడి చేయి.
12 మా కుమారులు యౌవన కాలమందు,
గొప్పగా ఎదిగిన మొక్కల వలెను;
మా కుమార్తెలు నగరు ప్రతిమల రీతిగా,
చెక్కిన మూల కంబముల వలె నుండగా;
13 మా కొట్లు నింపబడి నానా విధమైన ద్రవ్యములిచ్చుచు,
మా గొఱ్ఱెలు వేల కొలది,
మా గడ్డి బీళ్లలో పదివేల కొలది,
సంతాన వృద్ధి పొందుచుండగా;
14 చూలుకొన్న మా పశువులు ఈచుకపోక ఈనుచుండగా,
మా వీధులలో కేకలు లేకపోవుచుండగా,
15 అట్టి మా స్థితిలో ఉన్న ప్రజలు ధన్యులు;
ఏ ప్రజలకు యెహోవా దేవుడై యున్నాడో వారు ధన్యులు.

## 145. కీర్తన.

దావీదు కీర్తన.

1 నా దేవా! నా రాజా! నిన్ను హెచ్చింతును,
నీ నామము నిరంతరము స్తుతింతును.
2 ప్రతి దినము నిన్ను స్తుతింతును,
నీ నామము నిరంతరము స్తుతింతును.
3 యెహోవా గొప్పవాడు, మిక్కిలి స్తుతి పొంద తగినవాడు;
ఆయన గొప్పతనము అగోచరమైనది.
4 ఒక తరమువారికి ఒక తరమువారు నీ క్రియలు కొనియాడుచు
నీ గొప్ప కార్యములు తెలియ చేతురు.
5 నీ ప్రభావము యొక్క మహోన్నతమైన మహిమను,
నీ అద్భుత కార్యములను ధ్యానింతును.
6 (మనుష్యులు) నీ భీకర కార్యముల పరాక్రమము వచింతురు,
నీ మాహాత్మ్యము వివరింతును.
7 నీ అధికమైన మంచితనము జ్ఞాపకము చేసుకొని వచింతురు,
నోరెత్తి నీ నీతి కీర్తింతురు.
8 యెహోవా దయా దాక్షిణ్యములు గలవాడు,
ఆయన దీర్ఘశాంతుడు, కృపాతిశయము గలవాడై యున్నాడు.
9 యెహోవా అందరికినుపకారి,
ఆయన కనికరములు ఆయన సమస్త కార్యముల మీద నున్నవి.
10 యెహోవా! నీ క్రియలన్నియు నిన్ను స్తుతించును,
నీ దయా ప్రాప్తులు నీకు సాగిలపడి కొనియాడుదురు.

11,12 వారు నీ రాజ్యముయొక్క మహిమను చెప్పుచు,
—ఆయన బలము, ఆయన రాజ్యముయొక్క మహోన్నతమైన ప్రభావము,
నరపుత్రులకు తెలియ చేతుమని,
నీ బలమును గూర్చి పలుకుదురు.

13 నీ రాజ్యము సకల యుగాల రాజ్యము,
నీ రాజ్యపరిపాలన తరతరముల మట్టుకు నిరంతరముండును.

14 యెహోవా పడిపోవుచుండే వారినందరిని నిలువ బెట్టును,
కుంగిపోయిన వారినందరిని లేవ నెత్తును,

15 సమస్త జీవుల కన్నులు నీ తట్టు ఎదురు చూచుచున్నవి,
తగిన కాలమందు నీవు వారికి ఆహారమిచ్చుచున్నావు.

16 నీవు నీ చేయి విప్పి,
ప్రతి జీవి కోరికను తృప్తిపరుచుచున్నావు.

17 యెహోవా తన మార్గములన్నిటిలో నీతి గలవాడు,
తన కార్యములన్నిటిలో కృపగల వాడునై యున్నాడు.

18 యెహోవా తన్ను గూర్చి మొరబెట్టే వారందరికి,
తన్ను గూర్చి నిజముగా మొరబెట్టే వారందరికి సమీపమై యున్నాడు.

19 ఆయన తనకు భయపడే వారి కోరిక నెరవేర్చును,
వారి మొరను విని వారిని రక్షించును.

20 యెహోవా తన్ను ప్రేమించే వారినందరిని కాపాడును,
సమస్త దుష్టులను ఆయన నాశము చేసును.

21 నా నోరు యెహోవా కీర్తన పలుకును;
శరీరులందరు సాగిలపడి,
ఆయన పరిశుద్ధ నామము నిరంతరము స్తుతింతురు గాక.

## 146. కీర్తన.

హల్లెలూయా.

1 నా ఆత్మా! యెహోవాను స్తుతించుము,
2 నా యావజ్జీవము, యెహోవాను స్తుతింతును,
నేనున్నంత మట్టుకు నా దేవుని కీర్తింతును.

3 రాజుల యందు,
రక్షించలేని నరపుత్రులయందు నమ్మిక ఉంచకుడి.

4 వాని ప్రాణము వెడలిపోవును, వాడు తన మంటివైపు తిరుగును;
ఆ దినమే వాని సంకల్పములు నశించును.

5 ఎవనికి యాకోబు దేవుడు సహాయుడవునో,
ఎవని నిరీక్షణ తన దేవుడైన యెహోవాయందు ఉండునో వాడు ధన్యుడు.

6 ఆయన ఆకాశము, భూమియు,
సముద్రము, దాని లోనిది యావత్తును సృజించెను;
ఆయన నిరంతరము సత్యము గైకొనును.

7 ఆయన బాధపరచబడే వారికి న్యాయము తీర్చును,
ఆకలిగొనిన వారికి ఆహారము దయ చేసును;
యెహోవా బంధించబడిన వారిని విడిపించును.

8 యెహోవా గుడ్డివారి కన్నులు తెరువ చేయును,
యెహోవా కుంగిన వారిని లేవనెత్తును,
యెహోవా నీతిమంతులయందు ప్రీతిగలవాఁడు.
9 యెహోవా పరదేశులను కాపాడును,
ఆయన, తండ్రిలేని వారిని, విధవలను నిలువ చేయును,
ఆయన దుష్టుల మార్గము చెరిపివేయును.
10 యెహోవా నిరంతరము,
సీయోనా! నీ దేవుఁడు తరతరముల మట్టుకు రాజై యుండును;
హల్లెలూయా (యెహోవాను స్తుతించుఁడి).

## 147. కీర్తన.

హల్లెలూయా.

1 యెహోవాను స్తుతించుఁడి; మన దేవుని స్తోత్రము పాడుట మంచిది;
అది మనోహరమైనది; ఆ కీర్తన రమ్యమైనది.
2 యెహోవా యెరూషలేము కట్టి,
చెదిరిన ఇశ్రాయేలును పోగు చేయును.
3 ఆయన విరిగిన హృదయము గలవారిని బాగు చేయును,
వారి గాయములు కట్టుచుండును.
4 ఆయన నక్షత్రములు లెక్కించును,
వాటికన్నిటికి పేరులు పెట్టును.
5 మన ప్రభువు గొప్పవాఁడు; ఆయన అధిక శక్తి గలవాఁడు;
ఆయన తెలివి మితి లేనిది.
6 యెహోవా బాధపడే వారిని నిలువ చేయును,
ఆయన దుష్టులను నేల పడద్రోయును.
7 యెహోవాను స్తుతించి స్వస్తిగానము చేయుఁడి,
కిన్నెర మీద మన దేవుని కీర్తించుఁడి.
8 ఆయన మేఘములతో ఆకాశము కప్పును,
భూమికొరకు వర్షము సిద్ధపరచును;
పర్వతముల మీద ఆయన గడ్డి మొలిపించును.
9 ఆయన పశువులకు,
అరిచే మాలకాకులకును ఆహారమిచ్చును.
10 ఆయన గుర్రముయొక్క బలమందు సంతోషించఁడు,
నరుల కాళ్లయందు ఆనందించఁడు.
11 యెహోవా తనకు భయపడే వారియందు,
తన కృప నిరీక్షించే వారియందు ఆనందించును.
12 యెరూషలేమా! యెహోవాను కొనియాడుము,
సీయోనా! నీ దేవుని స్తుతించుము.
13 ఆయన నీ గవునుల గడియలు బలపరిచెను,
నీ మధ్యను నీ పిల్లలను దీవించి యున్నాఁడు.
14 ఆయన నీ పొలిమేరలలో సమాధానము కలుగ చేయుచున్నాఁడు,
మేలిమి గోధుమలతో నిన్ను తృప్తిపరుచుచున్నాఁడు.

15 ఆయన తన మాట భూమికి పంపెను;
ఆయన వాక్యము అతి త్వరగా పరుగెత్తును.
16 ఆయన గొఱ్ఱె వెంట్రుకల వలె హిమము కలిగించును,
బూడిదె వలె మంచు కణములు చల్లును,
17 ఆయన తన వడగండ్లు ముక్కల వలె విసురును,
ఆయన చలి యెదుట, యెవరు నిలువ గలరు?
18 ఆయన తన వాక్యము పంపి వాటిని కరిగించును,
ఆయన తన గాలి విసిరచేసునప్పుడు నీళ్లు ప్రవహించును.
19 ఆయన యాకోబుకు తన వాక్యము,
ఇశ్రాయేలుకు తన కట్టడలు, తన న్యాయవిధులు తెలుపును.
20 ఆయన ఆలాగున ఏ రాష్ట్రము యెడలను చేయలేదు,
ఆయన న్యాయవిధులు వారు తెలుసుకొనలేదు,
హల్లెలూయా (యెహోవాను స్తుతించుడి.)

## 148. కీర్తన.

హల్లెలూయా.

1 ఆకాశముఃనుంచి యెహోవాను స్తుతించుడి;
ఉన్నత స్థలములలో ఆయనను స్తుతించుడి.
2 ఆయన దూతలారా! మీరందరు ఆయనను స్తుతించుడి;
ఆయన సైన్యములారా! మీరందరు ఆయనను స్తుతించుడి.
3 సూర్య చంద్రులారా! ఆయనను స్తుతించుడి,
వెలుగు నక్షత్రములారా! మీరందరు ఆయనను స్తుతించుడి.
4 ఆకాశముల ఆకాశములారా!
ఆకాశము పైనున్న జలములారా! ఆయనను స్తుతించుడి.
5 అవి యెహోవా నామము స్తుతించుగాక;
ఆయన ఆజ్ఞ అయినందున పుట్టెను.
6 ఆయన వాటిని నిరంతరమును నిలువ చేసెను,
ఆయన వాటికి కట్టడ నియమించెను; అవి దాని మీరవు.
7 భూమినుంచి యెహోవాను స్తుతించుడి;
దీర్ఘ జలజంతువులు, అగాధ జలచరములు,
8 అగ్ని, వడగండ్లు, హిమము, ఆవిరి,
ఆయన వాక్యము నెరవేర్చే తుఫాను,
9 పర్వతములు, సమస్తమైన కొండలు,
ఫల వృక్షములు, సమస్తమైన దేవదారు వృక్షములు;
10 మృగములు, సమస్తమైన పశువులు,
పురుగులు, రెక్కలు గల పక్షులు;
11 భూ రాజులు, సమస్త ప్రజలు,
ప్రభువులు, భూమిమీదనున్న సమస్త న్యాయ కర్తలు,
12 యౌవనస్థులు, కన్యకలును,
వృద్ధులు, బాలురును,

13 అందరు యెహోవా నామము స్తుతింతురుగాక;
ఆయన నామము మాత్రమే మహోన్నతమైనది,
ఆయన ప్రభావము భూమికి ఆకాశమునకును పైగానున్నది.
14 ఆయన తన ప్రజల నిమిత్తము కొమ్ము హెచ్చించెను,
అది*, ఆయన దయ పొందిన వారికందరికి,
ఆయన సమీపజనమై ఇశ్రాయేలు పుత్రులకు కీర్తి.
హల్లెలూయా, (యెహోవాను స్తుతించుడి.)

## 149. కీర్తన.

హల్లెలూయా.

1 యెహోవాను గూర్చి క్రొత్త కీర్తన,
ఆయన దయా ప్రాప్తుల సంఘములో ఆయన స్తోత్రము పాడుడి.
2 ఇశ్రాయేలు తన్ను పుట్టించిన ఆయన యందు సంతోషించుగాక,
సీయోను కుమారులు తమ రాజులయందు ఆనందింతురుగాక.
3 వారు నాట్యముతో ఆయన నామము స్తుతింతురుగాక,
తంబురతోను కిన్నెరతోను ఆయనను గూర్చి గానము చేతురుగాక.
4 యెహోవా తన ప్రజలయందు ప్రీతి గలవాడు,
ఆయన దీనులను రక్షణతో అలంకరించును.
5 దయా ప్రాప్తులు ఘనత వహించి ప్రహర్షింతురుగాక,
వారు తమ పడకల మీద ఉత్సాహ గానము చేతురుగాక.
6 వారి నోట దేవుని స్తోత్రములు,
వారి చేతిలో రెండంచుల కత్తి ఉండుగాక.
7 రాష్ట్రములకు ప్రతి దండన,
ప్రజలకు శిక్షను చేయుచు,
8 వారి రాజులను గొలుసులతో,
వారి ఘనులను ఇనప సంకెళ్లతో బంధించుచు,
9 వ్రాయబడిన న్యాయ విధి వారి యెడల చేతురుగాక;
అది ఆయన దయ పొందిన వారందరికి ఘనత,
హల్లెలూయా, (యెహోవాను స్తుతించుడి.)

## 150. కీర్తన.

హల్లెలూయా.

1 దేవుని పరిశుద్ధాలయములో,
ఆయనను స్తుతించుడి,
ఆయన బలముగల ఆకాశవిశాలమందు,
ఆయనను స్తుతించుడి.
2 ఆయన పరాక్రమ కార్యముల నిమిత్తము,
ఆయనను స్తుతించుడి,

* లేక, ఆయన.

ఆయన మహా మహిమ నిమిత్తము,
ఆయనను స్తుతించుడి.
3 బూర ధ్వనితో,
ఆయనను స్తుతించుడి.
వీణతో, కిన్నెరతోను,
ఆయనను స్తుతించుడి.
4 తంబురతో, నాట్యముతోను,
ఆయనను స్తుతించుడి.
తంతివాద్యములతో, పిల్లన గ్రోవితోను,
ఆయనను స్తుతించుడి.
5 తాళములతో,
ఆయనను స్తుతించుడి,
గంభీర ధ్వని గల తాళములతో,
ఆయనను స్తుతించుడి.
6 సకల ప్రాణులు యెహోవాను స్తుతింతురుగాక,
హల్లెలూయా, (యెహోవాను స్తుతించుడి.)

# సొలొమోను నీతిసామెతలు.

## 1. అధ్యాయము.

1 దావీదు కుమారుడును ఇశ్రాయేలు రాజునైన
సొలొమోను సామెతలు.

2 జ్ఞానము బోధను ఎరుగుటకును,
యుక్తి గల మాటలు గ్రహించుటకును,

3 వివేకము గల బోధన, నీతి, న్యాయము, సరళత పొందుటకును,

4 యుక్తిహీనులకు చాతుర్యమును,
పడుచువానికి తెలివిని, వివేకమును ఇచ్చుటకును,

5 జ్ఞాని విని, విద్యను వృద్ధి చేసుకొన వలెను;
బుద్ధి గలవాడు వివేకముగల ఆలోచన సంపాదించుకొన వలెను.

6 అందువల్ల వాడు సామెతను,* దాని తాత్పర్యమును,
జ్ఞానుల మాటలను వారి గూఢ వాక్యములను గ్రహించును.

7 యెహోవాను భయపడుట తెలివికి మూలము;
మూఢులు జ్ఞానము బోధను తిరస్కరింతురు.

8 నా కుమారుడా! నీ తండ్రి బోధ వినుము;
నీ తల్లి ఉపదేశము విడువకుము.

9 అవి నీ తలకు సొగసైన మాలికయు,
నీకు కంఠభూషణములై యుండును.

10 నా కుమారుడా! పాపులు నిన్ను పురికొలిపితే,
నీవు ఒప్పకుము.

11 —మాతో కూడా రమ్ము; రక్తము కొరకు పొంచి యుందము;
ఊరక నిర్దోషియైన వాని కొరకు దాగి యుందము;

12 అధోలోకము వలె సజీవులైన వారిని,
సమాధిలోకి దిగే వారిని వలె నిర్దోషులను మింగివేతము:

13 అమూల్యమైన సమస్త ద్రవ్యము మనకు దొరుకును;
మన ఇండ్లను దోపుడు సొమ్ముతో నిండించుకొందము;

14 నీవు మాతో పాలివాడవై యుండుము,
మనకందరికిని ఒక్క సంచి ఉండ వచ్చునని వారు చెప్పితే,

15 నా కుమారుడా! నీవు వారితో కూడా మార్గమందు నడువకుండుము;
వారి త్రోవలనుంచి నీ పాదము వెనుకకు తీసుకొనుము.

16 ఎందుకంటే వారి పాదములు కీడుకొరకు పరుగెత్తుచున్నవి;
రక్తము చిందించుటకు త్వరపడుచున్నవి.

17 ప్రతి పక్షి కన్నుల యెదుట
వల వేయుట వ్యర్థమే గదా;

---

*లేక, మాధుర్యము.

18 అయితే వారు స్వరక్తము కొరకు పొంచి యున్నారు;
స్వజీవముల కొరకు దాగి యున్నారు.
19 దుర్లాభము సంపాదించుకొనే వారందరి తోవలు అలాటివే;
అది తన యజమానుని జీవము తీసుకొని పోవును.

20 జ్ఞానము బైట కేకలు వేయుచున్నది,
వీధులలో తన కంఠమెత్తుచున్నది.
21 గుంపులు కూడే ముఖ్యస్థలములలో పుర ద్వారములలో ప్రకటించుచున్నది;
పట్టణములో అది తన మాటలు పలుకుచున్నది;
22 —యుక్తిహీనులారా! మీరు యుక్తిహీనత యందు ప్రీతిపడుటయు,
అపహాసకులు అపహాస్యమును అపేక్షించుటయు,
మతిహీనులు తెలివి ద్వేషించుటయు ఎందాక?
23 నా గద్దింపున తిరుగండి;
ఇదుగో! నా ఆత్మను మీ మీద కుమ్మరింతును;
నేను నా మాటలు మీకు తెలుపుదును.
24 నేను పిలిచినప్పుడు, మీరు విన లేదు గనుకను,
నా చేయి నేను చాపినప్పుడు ఎవడును లక్ష్యపెట్టలేదు గనుకను,
25 మీరు నా ఆలోచన యావత్తు తోసివేసి,
నా గద్దింపును అక్కర చేయుట లేదు గనుకను,
26 నేను మీ ఆపదకు నవ్వుదును;
మీకు భయము వచ్చినప్పుడు అపహాస్యము చేతును;
27 తుఫాను వలె భయము మీకును వచ్చి,
మీ ఆపద సుడిగాలి వలె చేరి,
మీ మీదికి శ్రమయు బాధయు వచ్చినప్పుడు (అపహాస్యము చేతును.)
28 అప్పుడు నన్ను గూర్చి మొరబెట్టుదురు గాని నేను ఉత్తరమియ్యను
నన్ను ఆతురముగా వెతుకుదురు గాని నన్ను కానక పోదురు,
29 వారు తెలివిని ద్వేషించి
యెహోవాయందు భయపడనొల్లక,
30 నా ఆలోచన వద్దని
నా గద్దింపు యావత్తు తృణీకరించి యున్నారు.
31 కాబట్టి వారు తమ మార్గ ఫలము తిన వలెను,
తమ ఆలోచిత క్రియలచేత తృప్తి పొందుదురు.
32 యుక్తిహీనుల తిరుగబాటు నిశ్చయముగా వారిని చంపును;
మూఢుల సౌఖ్యము వారిని నశింపచేసును.
33 అయితే నా మాటలు వినే వాడు సురక్షితముగా నివసించును,
వాడు కీడునకు భయపడక నెమ్మది పొందును.

## 2. అధ్యాయము.

1 నా కుమారుడా! నీవు నా వాక్యములను అంగీకరించి,
నా ఆజ్ఞలను నీ యొద్ద దాచిపెట్టుకొని,
2 జ్ఞానమునకు నీ చెవినొగ్గి
నీ హృదయము బుద్ధికి మళ్లించినా,

3 మరియు, నీవు వివేకము కొరకు ప్రార్థించి
బుద్ధికొరకు నీ కంఠమెత్తినా,
4 నీవు వెండి వలె దాని వెతికి,
దాచబడిన ధనము వలె దాని శోధించి చూచినా,
5 అప్పుడు నీవు యెహోవా భయము గ్రహించి,
దేవుని గూర్చిన తెలివి పొందుదువు;
6 యెహోవా జ్ఞానమిచ్చును,
తెలివి బుద్ధియు ఆయన నోటినుంచి (వచ్చును.)
7 ఆయన నీతిమంతుల కొరకు సదుపాయము,
యథార్థముగా నడిచే వారికి కేడెము సిద్ధపరిచి యున్నాడు.
8 ఆయన న్యాయ మార్గము కాచును,
తన భక్తుల* త్రోవను కాపాడును.
9 అప్పుడు నీవు నీతిని, న్యాయమును, సరళతను,
ఉత్తమమైన ప్రతి ఆచారమును గ్రహింతువు;
10 జ్ఞానము నీ హృదయములో ప్రవేశించును,
తెలివి నీ ఆత్మకు ఇంపుగా నుండును.
11 అప్పుడు ఆలోచన నిన్ను కాపాడును,
బుద్ధి నిన్ను బాగా కాచును.
12 ఏలాగంటే అది దుర్మార్గమునుంచి,
వంచనగా మాటలాడే మనుష్యులనుంచి,
13 చీకటి త్రోవలలో నడుచుటకు సరళ మార్గములు విడిచి,
14 కీడు చేయుటకు సంతోషించి,
దుర్వంచనల యందు ఉల్లాసపడే వారినుంచి నిన్ను తప్పించును
15 వారి త్రోవలు వంకరలు,
వారు తమ ప్రవర్తనల యందు దుర్మార్గులు.
16 మరియు అది జారస్త్రీనుంచి,
మృదువుగా మాటలాడే పర స్త్రీనుంచి నిన్ను తప్పించును;
17 అది తన యౌవనకాల ప్రియుని విడిచి,
తన దేవుని నిబంధన మరిచెను.
18 దాని ఇల్లు మృత్యువు యొద్దికిని
దాని త్రోవలు అశరీరుల† యొద్దికిని చేర్చును;
19 దాని యొద్ద ప్రవేశించే వారిలో ఒకడును తిరిగి రాడు;
జీవ మార్గముల యందు చేరడు;
20 కావున నీవు మంచివారి మార్గములో నడుచుచు,
నీతిమంతుల త్రోవలను గైకొన వలెను.
21 యథార్థులైనవారు దేశమందు నివసింతురు,
నీతిమంతులు దానిలో నిలిచి యుందురు.
22 అయితే దుష్టులు దేశము మీదనుంచి ఛేదించబడుదురు;
ద్రోహులు దానిలోనుంచి నిర్మూలము చేయబడుదురు.

*లేక, తన దయ పొందినవారి. †Heb. రెఫాయీము.

## 3. అధ్యాయము.

1 నా కుమారుడా! నా బోధ మరువకుము;
నా ఆజ్ఞలను నీ హృదయము గైకొనుగాక.
2 అప్పుడు అవి దీర్ఘాయువును, జీవిత సంవత్సరములను;
క్షేమమును నీకు కలుగ చేయును.
3 కృపను, సత్యమును నిన్ను విడిచి పోనియ్యకుము;
కంఠ భూషణముగా వాటిని వేసుకొనుము.
నీ హృదయమనే పలకమీద వాటిని వ్రాసుకొనుము.
4 అప్పుడు దేవుని దృష్టియందు, మనుష్యుల దృష్టియందు,
దయను సుకీర్తిని పొందుదువు.
5 నీ స్వబుద్ధి మీద ఆనుకొనక,
నీ పూర్ణ హృదయముతో యెహోవా యందు నమ్మిక ఉంచుము.
6 నీ సకల మార్గములలో ఆయనను తెలుసుకొనుము;
అప్పుడు ఆయన నీ త్రోవలను సరళము చేయును.
7 నీ దృష్టికి నీవు జ్ఞానివిగా ఉండకుము;
యెహోవాకు భయపడి చెడుతనమునుంచి తొలగుము.
8 ఇది నీ నాభికి ఆరోగ్యము,
నీ యెముకలకు మూలగయునై యుండును.
9 నీ సమస్తమైన వచ్చుబడిలో ప్రథమ లాభమిచ్చి,
నీ ఆస్తితో యెహోవాను సన్మానించుము.
10 అప్పుడు నీ కొట్లు నిండుగా నింపబడును;
నీ గానుగలలోనుంచి క్రొత్త ద్రాక్షారసము పైకి పొరలి పారును.
11 నా కుమారుడా! నీవు యెహోవా శిక్షను నిర్లక్ష్యపెట్టకుము;
ఆయన గద్దింపునకు అసహ్యపడకుము.
12 తండ్రి తనకు ఇష్టుడైన కుమారుని ఏలాగో ఆలాగే,
యెహోవా తాను ప్రేమించే వాని గద్దించును.
13 జ్ఞానము పొందిన మనుష్యుడు,
బుద్ధి తెచ్చుకొనిన మనుష్యుడు ధన్యుడు.
14 వెండి ఆదాయము కంటే దాని ఆదాయము,
అపరంజి కంటే దాని వచ్చుబడి మంచివి.
15 అది ముత్యముల కంటే ప్రియమైనది;
నీ ప్రియమైనవన్నియు దానితో సమానమైనవి కావు.
16 దాని కుడి చేతిలో దినముల దీర్ఘతయు,
దాని ఎడమ చేతిలో ఐశ్వర్యము ఘనతయు ఉన్నవి.
17 దాని మార్గములు ఇంపైన మార్గములు;
దాని త్రోవలన్నియు క్షేమమే.
18 దాని అవలంబించే వారికి అది జీవ వృక్షము;
దాని గ్రహించే వారిలో ప్రతివాడు ధన్యుడు.

19 యెహోవా, జ్ఞానము వల్ల భూమి స్థాపించెను;
ఆయన, బుద్ధి వల్ల ఆకాశ విశాలము సిద్ధపరిచెను

20 ఆయన తెలివిచేత అగాధ జలములు,
వాన కురిపించే మేఘములు వేరుపరచబడెను;
21 నా కుమారుడా! వాటిని నీ కన్నుల యెదుటనుంచి తొలగి పోనియ్యకుము;
సావధానము వివేకము గలవాడవై యుండుము.
22 అవి నీ ఆత్మకు జీవము,
నీ మెడకు అలంకారమునై యుండును.
23 అప్పుడు నీవు నీ మార్గమందు ధైర్యముగా* నడుతువు,
నీ పాదమునకు ఏదియు తగలదు.
24 నీవు పండుకొన్నప్పుడు బెదరక ఉందువు;
నీవు పండుకొని యుండగా, నీకు నిద్ర సుఖమవును.
25 ఆకస్మికమైన బెదురును,
దుర్మార్గుల నాశనమును వచ్చినప్పుడు నీవు వాటికి భయపడకుము.
26 యెహోవా నీకు ఆధారమై యుండును;
పట్టుబడకుండుటకు ఆయన నీ పాదము కాపాడును.

27 మేలు చేయుట నీ వల్లనైనప్పుడు,
దాని పొంద తగినవారికి చేయుటకు వెనుక తియ్యకుము.
28 ద్రవ్యము నీ యొద్ద ఉండియు,
—పోయి రా, రేపు ఇస్తానని నీ పొరుగువానితో పలుక వద్దు.
29 నిర్భయముగా నీ యొద్ద నివసించే
నీ పొరుగువానికి విరోధముగా హాని కల్పించ వద్దు.
30 నీకు హాని చేయని మనుష్యునితో,
నిర్నిమిత్తముగా వ్యాజ్యమాడ వద్దు.
31 బలాత్కారము చేసే వానిమీద మత్సరపడకుము,
వాని మార్గములలో దేనినైనా నీవు ఏర్పరచుకొన వద్దు.
32 వంచకుడు యెహోవాకు అసహ్యుడు,
యథార్థులకు ఆయన పరిచయము ఉన్నది.
33 దుష్టుని ఇంట్లో యెహోవా శాపము ఉండును;
నీతిమంతుల నివాసస్థలము ఆయన దీవించును.
34 ఆయన అపహాసకులను అపహసించును;
అప్పుడు ఆయన దీనులయందు దయ ఉంచును.
35 బుద్ధిమంతులు ఘనత స్వతంత్రించుకొందురు;
అయితే మతిహీనులు అవమానము వహింతురు. †

## 4. అధ్యాయము.

1 పిల్లలారా! తండ్రి బోధ వినండి;
బుద్ధి తెలుసుకొనుటకు ఆలకించండి.
2 నేను మీకు మంచి విద్య నేర్పించియున్నాను;
నా బోధ విడువకండి.
3 నేను నా తండ్రికి కుమారుడను,
నా తల్లి యెదుట సున్నితమైన ఏక కుమారుడనై యుంటిని.

* లేక, సురక్షితముగా. † లేక, మతిహీనులకు, అవమానమే ప్రసిద్ధి.

4 ఆయన నన్ను బోధించుచు నాతో ఇట్లనెను;
—నీ హృదయము నా మాటలు గట్టిగా గ్రహించుగాక;
నా ఆజ్ఞలు గైకొని బ్రతుకుము;
5 జ్ఞానము సంపాదించుకొనుము, బుద్ధి సంపాదించుకొనుము;
మరువకుము, నా నోటి మాటలనుంచి తొలగకుము;
6 నీవు దాని విడువకుము, అది నిన్ను కాపాడును;
దాని ప్రేమించుము, అది నిన్ను రక్షించును;
7 జ్ఞానము ముఖ్యమైనది, జ్ఞానము సంపాదించుకొనుము;
నీ సర్వ సంపాద్యముతో బుద్ధి సంపాదించుకొనుము;
8 దాని హెచ్చించుము, అది నిన్ను పైకి ఎత్తును;
దాని కౌగలించితే అది నిన్ను ఘనపరుచును.
9 అది నీ తలకు అందమైన మాలిక ఇచ్చును;
నీకు మహిమ కిరీటము దయ చేసును.
10 నా కుమారుడా! వినుము, నా మాటలు అంగీకరించుము;*
అప్పుడు నీ జీవిత సంవత్సరములు అధికమవును.
11 జ్ఞానమార్గమందు నిన్ను బోధించి యున్నాను;
సరళమయిన త్రోవలయందు నిన్ను నడిపించి యున్నాను.
12 నీవు నడిచేటప్పుడు నీ అడుగు ఇరుకున పడదు;
నీవు పరుగెత్తేటప్పుడు (నీ పాదము) తొట్రుపడదు.
13 నీవు బోధను పట్టుకొనుము, దాని విడువకుము;
అది నీకు జీవము గనుక, దాని కాపాడుకొనుము.
14 దుష్టుల త్రోవ చేరకుము;
చెడ్డవారి మార్గమందు నడువకుము.
15 దాని అలక్ష్యము చేయుము; దానిలోకి దాటి పోకుము;
దానినుంచి తొలగి అవతలకు వెళ్లుము.
16 కీడు చేస్తేనే గాని వారు నిద్రించరు;
కొందరిని పడదోయకుంటే వారి నిద్ర పోగొట్టబడును.
17 వారు చెడుతనమనే రొట్టె తిందురు;
బలాత్కారమనే ద్రాక్షారసము తాగుదురు.
18 అయితే నీతిమంతుల త్రోవ వేకువ వెలుగువలె నుండును;
పగలు పూర్ణమయ్యేదాక అది క్రమ క్రమముగా తేజోవృద్ధిపొందును.
19 దుష్టుల త్రోవ చీకటి వంటిది;
వారికి ఏది అడ్డునో వారికి తెలియదు.
20 నా కుమారుడా! నా మాటలు ఆలకించుము;
నా వాక్యములకు నీ చెవి నొగ్గుము.
21 నీ కన్నుల యెదుటనుంచి వాటిని తొలగిపోనియ్యకుము;
నీ హృదయమందు వాటిని కాపాడుకొనుము.
22 అవి ఎవరికి దొరుకునో వారికి జీవము,
వారి సర్వ శరీరమునకు ఆరోగ్యము కలిగించును.

* లేక, పట్టుకొనుము.

23 అన్నిటికంటే నీ హృదయము బాగా కాపాడుకొనుము;
అందులోనుంచి జీవధారలు వచ్చును.
24 మూర్ఖత గల మాటలు నీ నోటినుంచి తొలగించుము;
కృత్రిమ వాక్యము నీ పెదవులనుంచి దూరము చేయుము.
25 నీ కన్నులు సరిగా చూడనిమ్ము;
నీ కనురెప్పలను నీ ముందర తిన్నగా నుండనిమ్ము.
26 నీ కాళ్ల దారి బాగా విచారించుకొనుము;
అప్పుడు నీ మార్గములన్నియు స్థిరపరచబడును.
27 నీవు కుడి తట్టుకైనా ఎడమతట్టుకైనా తిరగక,
నీ పాదము కీడునుంచి తొలగించుము.

## 5. అధ్యాయము.

1 నా కుమారుడా! నా జ్ఞానబోధ వినుము;
నా బుద్ధికి నీ చెవి నొగ్గుము.
2 దానివల్ల వివేకము కాపాడుకొనుచుందువు;
నీ పెదవులు తెలివిని కాచుకొనును.
3 జార స్త్రీ పెదవులు తేనె కారుచుండే తేనెపట్టు వలె నుండును;
దాని అంగిలి* నూనెకంటే నునుపైనది.
4 అయితే దాని అంతము ముషిడి చెట్టు వలె చేదుది;
అది రెండంచులు గల కత్తి వలె పదునుగలది.
5 దాని నడతలు మరణమునకు దిగిపోవును;
దాని అడుగులు అధోలోకము పట్టును.
6 అది జీవ మార్గము విచారించకుండా,
దాని పాదములు ఎక్కడికో ఇటు అటు తిరుగును.
7 కాబట్టి, కుమారులారా! నా మాట వినండి;
నా నోటి మాటలనుంచి తొలగకండి.
8 నీ మార్గము దానికి దూరముగా చేసి,
దాని వాకిలి దగ్గరకు వెళ్లకుము.
9 నీవు పరులకు నీ యౌవనబలము,
క్రూరులకు నీ జీవితకాలము ఇచ్చుటయైనా,
10 నీ బలము† వల్ల పరులు తృప్తి పొందుటయైనా,
నీ కష్టార్జితము అన్యుని ఇంట్లో ఉండుటయైనా తగునా?
11 తుదకు నీ మాంసము నీ శరీరము క్షీణించినప్పుడు,
నీవు మూల్గుచుందువు,
12 —అయ్యో! నేను బోధను ద్వేషించినాను,
నా హృదయము గద్దింపును తృణీకరించెను,
13 నా బోధకుల మాట నేను విననైతిని,
నాకు ఉపదేశించిన వారికి నేను చెవినొగ్గ లేదు;
14 సంఘము మధ్యను సమాజము మధ్యను,
నేను కొంచెమే తక్కువగా సమస్తమైన కీడుకు లోబడితినను కొందువు.

* లేక, పలుకు. † లేక, ఆస్తి.

15 నీ కుండిలోని నీళ్లను,
నీ నూతిలోనుంచి పారే జలధారలను తాగుము.
16 బయిటికి నీ ఊటలు
వీధులలోకి నీటికాలువల లాగున వ్యాపించ తగునా?
17 అవి ఇతరులకును నీకును కాకుండా,
నీకు మాత్రమే ఉండనిమ్ము;
18 నీ ఊట దీవించబడనిమ్ము;
నీ యౌవనకాల భార్య వల్ల సంతోషించుము;
19 అతిప్రియమైన లేడి, అందమైన దుప్పి అని,
ఆమె రొమ్ము అన్నికాలములు నిన్ను తృప్తిపరచనిమ్ము,
ఆమె ప్రేమ వల్ల నీవు ఎల్లప్పుడును పరవశుడవై యుండుము.
20 నా కుమారుడా! నీవు జార స్త్రీ వల్ల పరవశుడవై,
పర స్త్రీ రొమ్ము కౌగలించుకొననేల?
21 మనుష్యుని మార్గములు యెహోవా కన్నుల యెదుట ఉన్నవి;
వాని నడతలన్నిటిని ఆయన విచారించును;
22 దుష్టుని అక్రమములు వాని చిక్కులబెట్టును;
వాడు తన పాప పాశముల వల్ల కట్టబడును;
23 అతడు బోధ లేకనే చనిపోవును,
అతడు తన బహు మూర్ఖత వల్ల పరవశుడవును.

## 6. అధ్యాయము.

1 నా కుమారుడా! నీవు నీ చెలికాని కొరకు పూటపడి,
పరునికి నీ చేయి ఇచ్చియున్నా,
2 నీ నోటి మాటల వల్ల చిక్కుబడియున్నా,
నీ నోటి మాటల వల్ల పట్టుబడియున్నా;
3 సరి, నా కుమారుడా! నీ చెలికాని చేతిలోకి వచ్చియున్నావు గనుక,
ఈలాగు చేసి తప్పించుకొనుము;
నీవు వెళ్లి సాగిలపడి నీ చెలికాని బలవంతము చేయుము;
4 నీ కన్నులకు నిద్రనైనా,
నీ కనురెప్పలకు కునుకుపాటునైనా రానియ్యకుము.
5 (వేటకాని) చేతినుంచి లేడి వలెను,
ఉరులు వేసే వాని చేతినుంచి పక్షి వలెను తప్పించుకొనుము.

6 సోమరివాడా! నీవు చీమ యొద్దికి వెళ్లి,
దాని నడతలు చూచి జ్ఞానము తెచ్చుకొనుము.
7 దానికి అధిపతి లేడు;
అధ్యక్షుడు లేడు; యజమానుడు లేడు;
8 అది వేసవికాలమందు తన ఆహారము సిద్ధపరుచుకొనును;
కోతకాలమందు తన భోజ్యము కూర్చుకొనును.*
9 సోమరివాడా! నీవు ఎందాక పండుకొనుచుందువు?
ఎప్పుడు నీవు నిద్రతెలిసి లేతువు?

* లేక, కూడబెట్టినది.

10 కొంచెము నిద్ర, కొంచెము కునుకుపాటు,
పరుండే కొరకు చేతులు కొంతసేపు ముడుచుకొనుట కలిగితే,
11 అప్పుడు నీకు దరిద్రత, త్వరపడి వచ్చే దొంగ వలెను,
నీ లేమి ఆయుధస్థుని వలెను వచ్చును.

12 దుష్టుడు పనికి మాలినవాడు,
వాడు మూర్ఖత గల మాటలు పలుకుచు,
13 తన కన్నులతో సైగచేయును, తన కాళ్లతో మాటలాడుచు,
తన వేళ్లతో సూచించుచుండును.
14 వాని హృదయములో కృత్రిమములు కలవు;
ఎల్లప్పుడు కీడు కల్పించుచు, జగడములు పుట్టించుచుండును.
15 కాబట్టి వానికి ఆపద హఠాత్తుగా వచ్చును;
ఆ క్షణమందే వాడు పగలగొట్టబడును, వానికి బాగు కలుగదు.

16 ఈ ఆరు యెహోవాకు అసహ్యమైనవి,
ఏడును ఆయన ఆత్మకు ఏహ్యమైనవి.
17 అవి యేవంటే, అహంకార దృష్టి, కల్లలాడే నాలుక;
నిరపరాధుల రక్తము చిందించే చేతులు;
18 దుర్యోచనలను యోచించే హృదయము;
చెడుతనము చేయ పరుగెత్తుటకు త్వరపడే పాదములు;
19 అబద్ధములు పలికే దొంగ సాక్షి;
అన్నదమ్ములలో జగడములను పుట్టించే వాడు.

20 నా కుమారుడా! నీవు నీ తండ్రి ఆజ్ఞను చేకొనుము;
నీ తల్లి బోధను నిరాకరించకుము.
21 వాటిని యెల్లప్పుడు నీ హృదయము మీద పెట్టుకొనుము;
నీ మెడకు వాటిని బంధించుకొనుము.
22 నీవు త్రోవను వెళ్లుచున్నప్పుడు అది నిన్ను నడిపించును;
నీవు పండుకొన్నప్పుడు అది నీ మీద కావలిగా ఉండును;
నీవు మేలుకొన్నప్పుడు, నీతో సంభాషించును.
23 ఆజ్ఞ దీపము, బోధ వెలుగు;
గుణము కలిగించే గద్దింపులు జీవమార్గము;
24 చెడ్డ స్త్రీనుంచి,
పర స్త్రీయొక్క ఇచ్చకపు నాలుకనుంచి, అవి నిన్ను కాపాడును.
25 దాని చక్కదనమును నీవు నీ హృదయములో వాంఛించకుము;
అది తన కనురెప్పలతో నిన్ను పట్టుకొననియ్యకుము.
26 వేశ్యవల్ల, రొట్టె తునక మాత్రమే మిగిలియుండును;
పెనిమిటి గల స్త్రీ మిక్కిలి విలువగల ప్రాణము వేటాడును.
27 ఒకడు తన ఒడిలో అగ్ని ఉంచుకొంటే,
వాని వస్త్రములు కాలకుండునా?
28 ఒకడు నిప్పుల మీద నడిచితే,
వాని పాదములు కమలకుండునా?

29 తన పొరుగువాని భార్య యొద్దికి వెళ్లేవాడు,
ఆ ప్రకారమే ఉండును;
ఆమెను ముట్టేవాడెవడో వాడు నిరపరాధి కాడు.

30 దొంగ తన ప్రాణము నిలుపుకొనుటకు ఆకలిచేత దొంగిలితే,
వాని తిరస్కరించరు;
31 అయితే వాడు దొరికియుంటే ఏడంతలు చెల్లించ వలెను;
తన ఇంటి ద్రవ్యమంతయు ఇయ్యవలసినదేమో.

32 పర స్త్రీతో వ్యభిచరించే వాడు బుద్ధిహీనుడు;
తన ప్రాణము చెరుపుకొనే వాడే దీని చేసును.
33 దెబ్బ, అవమానము వానికి కలుగును;
వాని నింద తుడిచి వేయబడదు.
34 (పాతివ్రత్య విషయమైన) అనుమానమే పురుషుని క్రోధము;
వాడు ప్రతిక్రియాకాలమందు కనికరపడడు.
35 వాడు ఏ విధ ద్రవ్యమిచ్చినను లక్ష్యపెట్టడు,
ఎంత లంచమిచ్చినను ఒప్పడు.

## 7. అధ్యాయము.

1 నా కుమారుడా! నీవు నా మాటలు చేకొనుము;
నా ఆజ్ఞలు నీ యొద్ద ఉంచుకొనుము.
2 నా ఆజ్ఞలను,
నీ కనుపాపను వలె నా బోధను చేకొని బ్రతుకుము.
3 వాటిని నీ వేళ్లమీద పెట్టుకొనుము;
నీ హృదయమనే పలక మీద వాటిని వ్రాసుకొనుము.
4 జ్ఞానమును చూచి—నీవు నా అక్కవని పలుకుము;
—నా చుట్టమా! అని బుద్ధితో చెప్పుము.
5 అవి జార స్త్రీనుంచి,
ఇచ్చకముగా మాటలాడే పర స్త్రీనుంచి నిన్ను కాపాడును.

6 నా ఇంటి కిటికీలోనుంచి,
నా అల్లిక త్రాళ్లనుంచి నేను కిందు చూచినాను;
7 చూడగా, యుక్తిహీనులైన కుమారులలో
బుద్ధిలేని ఒక పడుచువాడు కనబడెను.
8 సందెవేళ, ప్రొద్దు గ్రుంకిన తరువాత,
చిమ్మచీకటి గల రాత్రి,
9 వాడు దాని సందు దగ్గరనున్న వీధిలో వెళ్లుచు,
దాని ఇంటి మార్గముగా నడిచెను.
10 అప్పుడు తంత్ర హృదయము గల స్త్రీ, సానివేషముతో,
వాని ఎదురుకొనుటకు వచ్చెను.
11 ఆమె గల్లత్తు చేసే మూర్ఖురాలు;
దాని పాదములు దాని ఇంట్లో నిలువవు.

12 ఒకప్పుడు బైటను, మరి యొకప్పుడు వీధులలోను;
ప్రతి సందు దగ్గరను పొంచియుండును.
13 అది వాని పట్టుకొని ముద్దుబెట్టుకొని,
సిగ్గుమాలిన ముఖముతో
14 —నేను స్తుతియాగము చేయ వలసినది;
నేడు నా మ్రొక్కుబళ్లు చెల్లించి యున్నాను.
15 కాబట్టి నిన్ను* జాగ్రత్తగా వెతక వలెనని,
నిన్ను ఎదురుకొనుటకు బైలుదేరి వచ్చియున్నాను;
నిన్ను కనుగొని యున్నాను;
16 నా మంచము మీద రత్నకంబళ్లు,
విచిత్రమైన ఐగుప్తు† నార దుప్పట్లు పరిచి యున్నాను.
17 నా పరుపు మీద బోళము, అగురు, కారపు చెక్కను వేసి యున్నాను.
18 సరి, రా; ఉదయ పర్యంతము వలపుతో తృప్తిపొందుదాము;
మోహములచేత సంతుష్టి పొందుదాము.
19 పురుషుడు ఇంట్లో లేడు;
దూరప్రయాణము వెళ్లియున్నాడు.
20 ఆయన తన చేతిలో సంచి నిండా సొమ్ము కొంచుపోయినాడు,
పున్నమ దినమందు ఇంటికి తిరిగి వచ్చునని చెప్పి,
21 తన విస్తార లాలన వాక్యము వల్ల వాని లోపరుచుకొనెను;
తన పెదవుల లాలన వల్ల వాని ప్రేరేపించెను.
22 వెంటనే వాడు వధకు పశువు వలె,
సంకెళ్లకు శిక్షకు మూఢుని వలె,
ఆమెతో కూడా పోవుచున్నాడు.
23 తుదకు వాని గుండె కాయను అంబు చీల్చును;
ఉరి యొద్దికి త్వరపడే పక్షి వలె నుండును;
తనకు ప్రాణ సంకటమైనదని యెరుగడు.

24 కాబట్టి కుమారులారా! నాకు చెవియొగ్గి,
నా నోటి మాటలను ఆలకించుడి;
25 దాని మార్గములకు తట్టు నీ హృదయము తొలగనియ్యకుము;
నీవు దాని త్రోవలలో తిరుగులాడకుము.
26 అది గాయపరిచి పడదోసిన వారు అనేకులు,
అది చంపిన వారందరు బలిష్ఠులు;
27 దాని ఇల్లు అధోలోకమునకు మార్గము.
అది మృత్యువు గదులకు పోవును.

## 8. అధ్యాయము.

1 జ్ఞానము పిలుచుచున్నది గదా?
బుద్ధి తన శబ్దమెత్తుచున్నది గదా!
2 త్రోవ పక్కనుండే ఉన్నత స్థలముల మీదను,
మార్గముల మధ్యను నిలుచుచున్నది.

---

* లేక, నీ ముఖము. † లేక, సన్నపు.

3 గవునులయొద్ద, పుర ద్వారమందు,
వీధి ద్వారముల వాకిళ్లయందు కేకలు వేయుచున్నది.
4 —మనుష్యులారా! మిమ్మును పిలుస్తున్నాను;
నా శబ్దము మనుష్య కుమారుల వైపు పలుకుచున్నది.
5 యుక్తిహీనులారా! బుద్ధి గ్రహించుడి;
అవివేకులారా! మతిగలవారై యుండుడి.
6 వినుడి, నేను శ్రేష్ఠమైనవి* చెప్పుదును;
నా పెదవులు పలికేవి యథార్థమైనవి.
7 నేను సత్యము ధ్యానించి పలుకుదును;
దుష్టత్వము నా పెదవులకు అసహ్యము.
8 నా నోటి మాటలన్నియు నీతిగలవి;
వాటిలో మూర్ఖతయైనను వక్రోపాయమైనను లేదు.
9 అవి అన్ని, గ్రహించే వానికి తేటగాను,
తెలివి పొందిన వారికి యథార్థముగాను ఉన్నవి.
10 వెండికంటే నా బోధ,
మేలిమి బంగారముకంటే తెలివి మంచివని పుచ్చుకొనుడి.
11 జ్ఞానము ముత్యముల కన్న మంచిది;
ప్రియమైన వన్నియు దానితో సాటి కావు.

12 జ్ఞానమనే నేను వివేక సహవాసము చేయుచున్నాను;
సదుపాయములను తెలుసుకొంటున్నాను.
13 యెహోవా భయము చెడుతనమందు పగపట్టుటే;
గర్వము, అహంకారము, దుర్మార్గత,
కృత్రిమముగల నోరును నాకు అసహ్యములు;
14 నాకు ఆలోచన, సద్వివేచన కలవు;
నేనే బుద్ధిని; పరాక్రమము నాకున్నది;
15 నా వల్ల రాజులు రాజ్యపరిపాలన చేతురు,
అధికారులు న్యాయపు తీర్పు చేతురు.
16 నా వల్ల ప్రభువులు, ప్రధానులు,
భూమియొక్క న్యాయాధిపతులందరు ప్రభుత్వము చేతురు.
17 నన్ను ప్రేమించే వారిని నేను ప్రేమింతును;
జాగ్రత్తగా నన్ను వెతికేవారు నన్ను కనుగొందురు.
18 ఐశ్వర్యము, ఘనత,
స్థిరమైన ఆస్తి, నీతి ఫలము నా యొద్ద ఉన్నవి.
19 మేలిమి బంగారము కంటే, అపరంజి కంటే నా ఫలము మంచిది;
ప్రశస్తమైన వెండి కంటే నా ఆదాయము గొప్పది.
20,21 నన్ను ప్రేమించే వారిని ఆస్తికర్తలుగా చేయుటకును,
వారి కొట్లను నిండించుటకును,
నేను నీతి మార్గమందు,
న్యాయము గల తోవల మధ్యను నడుచుచుందును.

* లేక, విశదమైనవి.

22 పూర్వకాలమందు యెహోవా తన కార్యములు కాక మునుపు,
తన మార్గారంభముగా నన్ను సృజించెను.
23 ఆదినుంచి చిరకాలమునుంచి భూమ్యుత్పత్తి కాకమునుపు,
నేను నియమించబడితిని.
24 అగాధ జలములు లేనప్పుడు,
నీళ్లతో నిండిన వూటలు లేనప్పుడు, నేను పుట్టినాను.
25 పర్వతములు స్థాపించబడకమునుపు, కొండలు కాక మునుపు,
26 ఆయన భూమిని, దాని ఖండములను,
లోకపు మట్టిమొదలును నిర్మించకమునుపు నేను పుట్టినాను.
27 ఆయన ఆకాశ విశాలము ఏర్పరిచినప్పుడు,
ఆయన అగాధ జలము పైని మండలము నిర్ణయించినప్పుడు
నేను అక్కడ ఉంటిని.
28 ఆయన ఉన్నత స్థలమందు మేఘములను స్థిరపరిచినప్పుడు,
అగాధ జలధారలు ప్రబలియుండగా,
29 నీళ్లు ఆయన ఆజ్ఞను* మీరకుండుటకు,
ఆయన సముద్రమునకు దాని పొలిమేరను ఏర్పరిచినప్పుడు,
ఆయన భూమియొక్క అస్తిభారములను నియమించినప్పుడు,
30 నేను ఆయన యొద్ద శిల్పినై, దినదినము సంతోషించుచు,
నానాటికి ఆయన యెదుట ఆనందించుచుంటిని.
31 ఆయనదైన భూలోకమందు ఆనందించుచు,
మనుష్య కుమారులతో కూడా సంతోషించినాను.

32 కాబట్టి కుమారులారా! నా మాట వినుడి;
నా మార్గములు గైకొనే వారు ధన్యులు.
33 బోధ విని, జ్ఞానము గలవారై యుండుడి;
దాని నిరాకరించకుడి.
34 నానాటికి నా గడప యొద్ద కనిపెట్టుకొని,
నా ద్వారబంధముల యొద్ద కాచుకొని,
నా మాట వినే మనుష్యుడు ధన్యుడు.
35 నన్ను కనుగొనిన వాడు జీవము కనుగొని యుండును;
యెహోవా వల్ల వాడు కటాక్షము పొందును.
36 అయితే నన్ను కనుగొనసెల్లనివాడు,
తన ప్రాణమునకు హాని చేసుకొనును;
నన్ను ద్వేషించే వారందరు మరణము ప్రేమింతురు.

## 9. అధ్యాయము.

1 జ్ఞానము తన ఇల్లు కట్టి,
దాని† ఏడు స్తంభములు చెక్కినది.
2 అది తన పశువులను వధించి, తన ద్రాక్షారసము కలిపియున్నది.
అది తన బల్లను సిద్ధపరిచి యున్నది;
3 తన పనికత్తెలను పైకి పంపి
పట్టణమందలి మెట్టలమీద నిలిచి

* లేక తీరము. †లేక, తన.

4 —యుక్తిహీనుడు ఎవడో వాడు ఇక్కడికి వచ్చుగాకని ప్రకటించుచున్నది.
మతిహీనునితో అది ఇట్లు చెప్పుచున్నది,
5 —వచ్చి నా రొట్టె తినుడి,
నేను కలిపిన ద్రాక్షారసము త్రాగుడి;
6 యుక్తిహీనత మానివేసి, బ్రతుకుడి;
బుద్ధిగల మార్గములో నడువుడి.

7 అపహాసకునికి బుద్ధి చెప్పేవాడు, తనకు అవమానము,
దుష్టుని గద్దించే వాడు తనకు కలంకము తెచ్చుకొనును.
8 అపహాసకుని గద్దించకుము; గద్దిస్తే, నీ యందు పగపట్టును;
జ్ఞానము గల వాని గద్దించుము; అప్పుడు వాడు నిన్ను ప్రేమించును.
9 జ్ఞానము గల వానికిమ్ము, అప్పుడు అతడు అధిక జ్ఞానము గలవాడవును;
నీతిగల వానికి బోధించుము, వాడు జ్ఞానాభివృద్ధి పొందును;
10 యెహోవాను భయపడుట జ్ఞానమునకు మూలము;
పరిశుద్ధుని ఎరుగుట బుద్ధి.
11 నా వల్ల నీ దినములు విస్తరించును;
నీ జీవిత సంవత్సరములు అభివృద్ధి అవును.
12 నీవు జ్ఞానివైతే జ్ఞానఫలము నీది;
నీవు అపహసించితే దాని నీవే భరింతువు.
13 మతిలేని స్త్రీ బొబ్బలు పెట్టును,
అది యుక్తిహీనురాలు, దానికి ఏమియు తెలియదు.
14 అది తన ఇంటి వాకిటను,
ఊరిలో ఉన్నత స్థలములయందు పీఠము మీద కూర్చుండును.
15 మార్గమందు నడుచుచు,
తిన్నగా తమ త్రోవను వెళ్లే వారిని అది చూచి,
16 —యుక్తిహీనుడు ఎవడో,
వాడు ఇక్కడికి తొలగి వచ్చుగాకని నోరెత్తి పిలుచును.
17 అది మతిహీనుని చూచి,—దొంగిలిన నీళ్లు తియ్యనివి,
రహస్యముగా దొరికిన రొట్టె రుచికరమైనది అని పలుకును.
18 అయితే అక్కడ మృతులు* కలరనియు,
ఆమె పిలిచినవారు అధోలోకపు గోతులలో ఉన్నారనియు
వానికి తెలియదు.

## 10. అధ్యాయము.

### సొలొమోను నీతి సామెతెలు.

1 జ్ఞానముగల కుమారుడు తండ్రిని సంతోషపరుచును;
మతిలేని కుమారుడు తన తల్లికి దుఃఖకరుడు.
2 దుష్ట ధనము వల్ల లాభము లేదు;
నీతి, మరణమునుంచి తప్పించును.
3 నీతిమంతుని ప్రాణమునకు యెహోవా ఆకలి కలగనియ్యడు;
చెడ్డవారి ఆశను చెదరగొట్టును.

* లేక, అశరీరులు.

4 సోమరితనముతో పని చేసే వాడు దరిద్రుడు;
చురుకు గల వారి చేయి ఐశ్వర్యము పొందును.
5 వేసవిని కూర్చేవాడు బుద్ధిగల కుమారుడు;*
కోత కాలమందు నిద్రించే వాడు సిగ్గుపరిచే కుమారుడు.*
6 నీతిమంతుని తల మీద ఆశీర్వాదములు (కలవు);
దుష్టుల నోరు బలాత్కారము కప్పును.
7 నీతిమంతుని గూర్చిన జ్ఞాపకము ఆశీర్వాదమవును:
దుష్టుల పేరు అసహ్యమవును.†
8 జ్ఞాన హృదయము గలవాడు ఆజ్ఞలను గైకొనును;
వెర్రిమాటలాడే‡ వాడు పడదోయబడును.
9 యథార్థముగా నడిచే వాడు నిర్భయముగా నడుచును;
తన మార్గములు వంకర చేసుకొనే వాడు తెలియబడును.
10 కనుసైగ చేసే వాడు వ్యధ పుట్టించును;
వెర్రిమాటలాడే వాడు పడదోయబడును.
11 నీతిమంతుని నోరు జీవపు బుగ్గ;
దుష్టుల నోరు బలాత్కారము కప్పును.
12 పగ కలహములు రేపును;
ప్రేమ సకల పాపములు కప్పును.
13 వివేకి పెదవులనుంచి జ్ఞానము పుట్టును;
మతిహీనుని వీపునకు బెత్తము కావలెను.
14 జ్ఞానులు తెలివి కూర్చుకొందురు;
మూఢుని నోరు సమీపించిన నాశనము.
15 ధనవంతుని ఆస్తి వానికి బలమైన పట్టణము;
దరిద్రుల బీదతనము వారికి నాశము.
16 నీతిమంతుని కష్టార్జితము జీవార్థమవును;
దుష్టుని ఆదాయము పాపార్థమే.
17 బోధను గైకొనే వాడు జీవమార్గము;
గద్దింపు విడనాడే వాడు తోవ తప్పించును.
18 పగ దాచుకొనే వాడు అబద్ధికుడు;
కొండెము చెప్పేవాడు మూర్ఖుడు.
19 వాగ్బాహుళ్యమందు అపరాధముండక మానదు;
తన పెదవులను ఏలుకొనే వాడు బుద్ధిమంతుడు.
20 నీతిమంతుని నాలుక ప్రశస్తమైన వెండివంటిది;
దుష్టుల హృదయము అల్పమైనది.
21 నీతిమంతుని పెదవులు అనేకులను పోషించును;
మూఢులు మతిహీనత వల్ల చనిపోదురు.
22 యెహోవా§ ఆశీర్వాదమే ఐశ్వర్యము కలిగించును;
ఆయన దానితో వ్యధ చేర్చడు.‖
23 దుష్కార్యము చేయుట మతిలేని వాని ఆటయే;
బుద్ధిగల మనుష్యునికి జ్ఞానమే (విలాసము.)

---

*లేక, వాడు. †లేక, కుళ్లిపోవును. ‡లేక, వెర్రి పెదవులుగల.
§అనగా, ఈశ్వరుడు. ‖లేక, కష్టము దాని సమృద్ధి చేయదు.

24 దుష్టుడు దేనికి దిగులుపడునో అది వాని మీదికి వచ్చును;
అయితే నీతిమంతులు ఇచ్ఛయించేది వారికియ్యబడును.
25 సుడిగాలి గతించినట్టు* దుష్టుడు లేక పోవును;
నీతిమంతుడు నిత్యమైన పునాది.
26 పండ్లకు పులుసు, కన్నులకు పొగయు నేలాగునో;
ఆలాగే తన్ను పంపే వారికి బద్ధకుడు ఉండును.
27 యెహోవా భయము దినములు విస్తరింప చేసును;
దుష్టుల యేండ్లు తక్కువ చేయబడును.
28 నీతిమంతుని నిరీక్షణ సంతోషకరమవును;
దుష్టుల నిరీక్షణ చెడిపోవును.
29 యెహోవా మార్గము యథార్థికి కోట;
అక్రమము చేసే వారికి అది నాశకరము.
30 నీతిమంతుడు ఎప్పుడును కదిలించబడడు;
దుష్టులు భూమిలో నివసించరు.
31 నీతిమంతుని నోరు జ్ఞానము అంకురింప చేసును;
కృత్రిమ వచనములాడే నాలుక పెరికి వేయబడును.
32 రమ్యమైనది నీతిమంతుని పెదవులకు తెలుసును;
దుష్టుల నోటికి కృత్రిమములు తెలుసును.

## 11. అధ్యాయము.

1 దొంగ త్రాసు యెహోవాకు అసహ్యము;
సరియైన గుండు ఆయనకు ఇష్టము.
2 గర్వము వస్తే, అవమానమును వచ్చును;
వినయముగల వారికి జ్ఞానము కలదు.
3 నీతిమంతుల యథార్థత వారిని నడిపించును;
ద్రోహుల తిరుగుబాటు† వారిని పాడుచేసును.
4 ఆగ్రహ దినమందు ఆస్తి పనికిరాదు;
నీతి చావునుంచి తప్పించును.
5 యథార్థి‡ నీతి వాని మార్గమును సరళము చేసును;
అయితే దుష్టుడు తన దుష్టత్వము వల్ల పడిపోవును.
6 నీతిమంతుల న్యాయము వారిని తప్పించును;
ద్రోహులు తమ దురాశ వల్ల పట్టబడుదురు.
7 దుష్టుని మరణమందు, వాని నిరీక్షణ నశించును;
దుర్మార్గుల నమ్మిక నశించును.
8 నీతిమంతుడు బాధనుంచి తప్పించబడును;
అతనికి మారుగా దుష్టుడు చేరును.
9 ఇచ్చకములాడే వాడు నోటి వల్ల తన పొరుగువాని నశింప చేసును;
తెలివిచేత నీతిమంతులు తప్పించబడుదురు.
10 నీతిమంతుల మేలు వల్ల పట్టణము ఆనందించును;
దుష్టుల నాశము వల్ల ఉత్సాహము కలుగును.

* లేక, గతించినప్పుడు. † లేక, మూర్ఖత. ‡లేక, నిర్దోషి.

11 సరళమైన వారి దీవెనవల్ల పట్టణము హెచ్చించబడును;
దుష్టుల నోటి వల్ల అది పాడై పోవును.
12 తన పొరుగువాని తిరస్కరించే వాడు బుద్ధిహీనుడు;
వివేకి మౌనముగా నుండును.
13 తిరుగులాడే కొండెగాడు గుట్టు బైలుపరుచును;
నమ్మకమైన ఆత్మ గలవాడు సంగతి దాచును.
14 సదుపాయములు లేనప్పుడు, జనులు పడిపోదురు;
ఆలోచన కర్తల సమూహములో రక్షణ కలదు.
15 అన్యుని కొరకు పూటపడే వాడు చెడనే చెడును;
పూటబడే వారి సాంగత్యము చేయనివాడు సుఖించును.
16 సుగుణము గల స్త్రీ మానము కాచుకొనును;
బలిష్ఠులు ఐశ్వర్యము చేపట్టుకొందురు.
17 కృప గల వాడు తన ప్రాణమునకు మేలు చేసుకొనును;
క్రూరుడు తన శరీరము బాధపెట్టుకొనును.
18 దుష్టుని కష్టార్జితము వ్యర్థమే;
నీతిని విత్తే వాడు సత్య ఫలము అనుభవించును.
19 నీతి జీవార్థమవును;
చెడుతనము వెంబడించుట మరణార్థమవును.
20 మూర్ఖ హృదయము గలవారు యెహోవాకు అసహ్యులు;
యథార్థ మార్గమందు నడిచే వారు ఆయనకు ఇష్టులు.
21 నిశ్చయముగా దుష్టునికి శిక్ష తప్పదు;
నీతిమంతుల సంతానము విడిపించబడును.
22 సుబుద్ధి విడిచిన సుందర స్త్రీ
పంది ముక్కున బంగారు కమ్మి వలె నుండును.
23 నీతిమంతుల కోరిక కేవలము మేలే;
దుష్టుల నిరీక్షణ ఆగ్రహమే.
24 కొందరు వెదచల్లినప్పటికి, ఇంకా వృద్ధి పొందుదురు;
తగినదానికంటే తక్కువ ఇచ్చేవానికి లేమి కలుగును.
25 ఉపకారములు చేసే వాడు పుష్టి పొందును;
నీళ్లు పోసే వానికి నీళ్లు పోయబడును.
26 ధాన్యము దాచిపెట్టేవాని, జనులు శపింతురు;
వాటిని అమ్మేవాని తల మీద ఆశీర్వాదముండును.
27 శ్రద్ధగా మేలు కాంక్షించే వాడు దేవానుగ్రహము చూచుకొనును;
కీడు చేయ చూచే వాని మీదికి కీడే వచ్చును.
28 తన ఐశ్వర్యము నమ్ముకొనే వాడు పడిపోవును;
నీతిమంతులు చిగురు వలె చిగిరింతురు.
29 తన ఇంటివారిని బాధపెట్టేవాడు గాలి స్వతంత్రించుకొనును;
మూఢుడు జ్ఞాన హృదయము గల వానికి సేవకుడు.
30 నీతిమంతుని ఫలము జీవ వృక్షము;
జ్ఞాని, ఆత్మలను పట్టును.
31 ఇదుగో! భూమియందు నీతిమంతుడు ప్రతిఫలము పొందును గదా;
దుష్టుడు పాపియు మరీ నిశ్చయముగా పొందును.

## 12. అధ్యాయము.

1 బోధ ప్రేమించే వాడు తెలివిని ప్రేమించును;
గద్దింపును ద్వేషించే వాడు పశుప్రాయుడు.
2 మంచివాడు యెహోవా దయ పొందును;
దురాలోచనలు గలవాడు దుష్టుడని ఆయన శిక్ష విధించును.
3 దుష్టత్వము వల్ల మనుష్యుడు స్థిరపరచబడడు;
నీతిమంతుల వేరు కదిలించబడదు.
4 పతివ్రతయైన స్త్రీ తన పెనిమిటికి కిరీటము;
సిగ్గుపరిచేది వాని యెముకలలో కుళ్లువంటిది.
5 నీతిమంతుల తలంపులు న్యాయమైనవి;
దుష్టుల యోచనలు మోసము గలవి.
6 దుష్టులు—రక్తము చిందింతమని పొంచియుందురు;
నీతిమంతుల నోరు వారిని విడిపించును.
7 దుష్టులు పడదోయబడి లేకపోదురు;
నీతిమంతుల ఇల్లు నిలిచి యుండును.
8 తన బుద్ధి మేరకు, మనుష్యుడు పొగడబడును;
అయితే వక్ర హృదయము గలవాడు ఉపేక్షించబడును.
9 ఆహారములేకయు తన్ను తాను ఘనపరుచుకొనే వానికంటే;
తనకు తానే పని చేసుకొనే నీచుడు గొప్పవాడు.
10 నీతిమంతుడు తన పశువు ప్రాణము పరామర్శించును;
దుష్టుల వాత్సల్యము క్రూరత.
11 తన భూమి దున్నుకొనే వాడు ఆహార సమృద్ధి పొందును;
వ్యర్థులను వెంబడించే వాడు మతిహీనుడు.
12 దుష్టుడు, కీడులు కలిగించే* వలను అపేక్షించును,
నీతిమంతుల వేరు ఫలించును.
13 పెదవుల ద్రోహమందు దుష్టునికి ఉరి యుండును;
నీతిమంతుడు ఆపదనుంచి వెడలును.
14 ఒకడు తన నోటి ఫలము చేత మేలైన తృప్తి పొందును;
ఒకని చేతుల ప్రతీకారము వానికి తిరిగి వచ్చును.
15 మూఢుని మార్గము తన కన్నులకు సరియవును;
ఆలోచన వినే వాడు జ్ఞాని.
16 మూఢుని కోపము ఆ దినములోనే తెలియబడును;
వివేకి అవమానము దాచిపెట్టును.
17 సత్యము పలికే వాడు నీతియు,
అబద్ధపు సాక్షి మోసము ప్రచురము చేసును.
18 కొందరు కత్తిపోట్ల వలె వదరులు పలుకుదురు;
జ్ఞానుల నాలుక ఆరోగ్యకరమవును.
19 నిజమాడే పెదవులు ఎప్పటికిని స్థిరమై యుండును;
అబద్ధమాడే నాలుక క్షణ మాత్రమే ఉండును.

* లేక, కలిగించే చెడ్డవారి.

20 కీడు కల్పించే వారి హృదయములో కపటము కలదు;
సమాధానము కొరకు ఆలోచన చెప్పేవారికి ఆనందము కలదు.
21 నీతిమంతునికి ఏ ఆపదయైనను సంభవించదు;
అయితే దుష్టులు కీడుతో నిండి యుందురు.
22 అబద్ధమాడే పెదవులు యెహోవాకు అసహ్యమవును;
సత్యవర్తనులు ఆయనకు మనోహరులు.
23 వివేకి, తెలివి దాచిపెట్టును;
మతిహీనుల హృదయము మూఢత్వము ప్రచురము చేసును.
24 చురుకు గల వారి చేయి యేలుబడి పొందును;
సోమరి, పన్ను చెల్లించ వలసి యుండును.
25 ఒకని హృదయములోని దుఃఖము దాని కుంగచేసును;
మంచి మాట దాని సంతోషపెట్టును.
26 నీతిమంతుడు తన చెలికానికి తోవ చూపును;
దుష్టుల మార్గము వారిని మోసపుచ్చును.
27 బద్ధకుడు తన వేటమాంసము కాల్చుకొనడు;
చురుకైన వాని సంపాద్యము గొప్ప భాగ్యము,*
28 నీతి మార్గములో జీవము కలదు;
దాని తోవలో మరణము లేదు.

## 13. అధ్యాయము.

1 జ్ఞానము గల కుమారుడు తన తండ్రి బోధ (వినును;)
అపహాసకుడు గద్దింపు వినడు.
2 తన నోటి ఫలము చేత ఒకనికి సుఖానుభవము కలుగును,
ద్రోహుల ప్రాణము బలాత్కారము అనుభవించును.
3 తన నోరు భద్రము చేసుకొనే వాడు తన ప్రాణము కాపాడుకొనును;
తన పెదవులు వెడల్పుగా తెరుచుకొనే వాడు నశించును.
4 సోమరి ఆత్మ అపేక్షించి, ఏమియు పొందదు;
చురుకైన వారి ప్రాణము పుష్టి పొందును.
5 నీతిమంతుడు దొంగ మాట యందు పగపట్టును;
దుష్టుడు సిగ్గు అవమానమును కలుగచేసును.
6 నీతి, యథార్థ మార్గము కాపాడును;
దుష్టత్వము పాపిని పడదోసును.
7 కొందరు ఏమియు లేక పోయినను
తాము ఐశ్వర్యవంతులమని మాయచేతురు;
కొందరు బహు ధనము కలిగియుండియు
దరిద్రులైనట్టు అగుపడుదురు.
8 ఒకని ఐశ్వర్యము, వాని ప్రాణ సంరక్షణ ద్రవ్యము;
దరిద్రుడు గద్దింపు వినడు.
9 నీతిమంతుల వెలుగు తేజరిల్లును;
దుష్టుల దీపము ఆరిపోవును.

*లేక, జాగ్రత్తగలవాడు మనుష్యునికి అమూల్యుడు.

10 గర్వము వల్లనే జగడము పుట్టును;
ఆలోచన వినే వారికి జ్ఞానము కలుగును.
11 మాయవల్లనైన ధనము తక్కువైపోవును;
చేతి కష్టము వల్ల కూర్చేవాడు, దాని విస్తరింపచేసును.
12 చిరకాల నిరీక్షణ హృదయము నొప్పించును;
నెరవేరిన ఆశ జీవ వృక్షము.
13 వాక్యము తిరస్కరించే వాడు నశించును;
ఆజ్ఞకు భయపడే వాడు లాభము పొందును.
14 జ్ఞాని బోధన జీవపు బుగ్గ;
అది మరణము యొక్క ఉరులనుంచి తొలగించును.
15 సుబుద్ధి దయను పొందించును;
వంచకుల మార్గము కఠినమవును.
16 వివేకి సమస్తము తెలివితో చేసును;
మతిహీనుడు మూఢత్వము వ్యాపింప చేసును.
17 దుష్ట దూత కీడులో పడును;
నమ్మకమైన రాయభారి స్వస్థత కలిగించును.
18 శిక్ష నుపేక్షించే వానికి బీదతనము అవమానమును కలుగును;
గద్దింపు లక్ష్య పెట్టేవాడు ఘనత పొందును.
19 పుట్టిన ఆశ ప్రాణమునకు తియ్యనిది;
చెడుతనమునుంచి తొలగిపోవుట మూఢులకు అసహ్యత.
20 జ్ఞానులతో నడిచే వానికి జ్ఞానము కలుగును;
మూఢులతో సహవాసము చేసే వాడు చెడిపోవును.
21 కీడు పాపులను తరుమును;
ఆయన నీతిమంతులకు మేలైన ప్రతిఫలమిచ్చును.
22 మంచివాడు తన పిల్లల పిల్లలను ఆస్తికర్తలుగా చేసును;
పాపాత్ముని ఆస్తి నీతిమంతునికవును.
23 బీదల క్రొత్త భూమి ఆహార వృద్ధి కలిగించును;
కొందరు తమ అన్యాయమువల్ల నశించిపోదురు.
24 తన బెత్తము వాడిక చేయని వాడు తన కుమారుని ద్వేషి;
వాని ప్రేమించే వాడు బాల్యమందే వాని శిక్షించును.
25 నీతిమంతుడు ఆకలి తీరే మట్టుకే భుజించును;
దుష్టుల కడుపునకు లేమి కలుగును.

## 14. అధ్యాయము.

1 స్త్రీల జ్ఞానము తన ఇల్లు కట్టును;
మూఢురాలు తన చేతులతో దాని పడగొట్టును.
2 సరళత యందు నడిచే వాడు యెహోవాకు భయపడును;
అయితే వక్రమార్గముల వాడు ఆయనను తిరస్కరించును.
3 మూఢుని నోట వాని గర్వమునకు బెత్తము కలదు;
జ్ఞానుల పెదవులు వారిని కాపాడును.
4 యెద్దులు లేకపోతే తొట్టి ఉత్తది;
ఎద్దుల బలము చేత పచ్చుబడి విస్తరించును.

5 నమ్మకమైన సాక్షి అబద్ధమాడడు;
దొంగ సాక్షి అబద్ధములు పలుకును.
6 అపహాసకుడు జ్ఞానము వెతికినను అది దొరకదు;
గ్రహించే వానికి తెలివి సులభము.
7 బుద్ధిలేని మనుష్యుని యెదుటనుంచి తొలగుము;
వాని యందు తెలివి గల పెదవులు నీకు దొరకవు.
8 తన మార్గము గ్రహించుట వివేకి జ్ఞానము;
మోసపరుచుకొనుట మతిహీనుల మూఢత్వము.
9 అపరాధము కొరకైన యాగమువల్ల మూఢులకు అపహాస్యము కలుగును;
సరళతగల వారికి* అనుగ్రహముండును.
10 తన హృదయమునకు తన దుఃఖము తెలుసును;
అన్యుడు దాని సంతోషము జోలికి రాకూడదు.
11 దుష్టుల ఇల్లు నశించును;
సరళతగల వారి గుడారము తేజరిల్లును.
12 ఒకనికి సరళమైనదని కనుపడే ఒక మార్గమున్నది;
దాని అంతము మరణమార్గములు.
13 నవ్వులోనైనను, హృదయము దుఃఖపడ వచ్చును;
దాని సంతోషము తుద వ్యసనము.
14 తప్పిపోయిన హృదయము గలవానికి తన మార్గములు వెక్కసమవును;
సజ్జనుడు వానికి దూరస్థుడు.
15 యుక్తిహీనుడు ప్రతిమాట నమ్మును;
వివేకి తన నడతలు విచారించును.
16 జ్ఞాని భయపడి కీడునుంచి తొలగును,
మూఢుడు గర్విష్ఠుడై ధైర్యపడును.
17 త్వరగా కోపపడే వాడు మూఢత్వము చేసును;
దురాలోచనలు గలవాడు ద్వేషించబడును.
18 యుక్తిహీనులు మూఢత్వము స్వతంత్రించుకొందురు;
వివేకులకు తెలివి కిరీటము.
19 చెడ్డవారు మంచివారి యెదుటను,
దుష్టులు నీతిమంతుని తలుపు యొద్దను వంగుదురు.
20 దరిద్రుడు తన పొరుగువానిచే ద్వేషించబడును;
ఐశ్వర్యవంతుని ప్రేమించేవారు అనేకులు.
21 తన పొరుగువాని తిరస్కరించేవాడు పాపాత్ముడు;
దీనులయందు దయగల వాడు ధన్యుడు.
22 కీడు కల్పించే వారు తప్పిపోదురు గదా,
మేలు కల్పించే వారు కృపా సత్యములు గలవారు.
23 యావత్కష్టము వల్ల లాభముండును;
వట్టి మాటలు లేమికి కారణము.
24 జ్ఞానుల ఐశ్వర్యము వారికి కిరీటము;
అవివేకుల మూఢత్వము మూఢత్వమే.

---

* లేక, వారియందు.

25 సత్యమైన సాక్షి ప్రాణములను విడిపించును;
అబద్ధములు పలికే వాడు వంచకుడు.
26 యెహోవాయందలి భయము బలమైన ఆధారము;
ఆయన తన కుమారులకు ఆశ్రయము.
27 యెహోవా భయము జీవపు బుగ్గ;
అది మరణము యొక్క ఉరులనుంచి తొలగించును.
28 జన సమృద్ధి రాజునకు ఘనత;
ప్రజాక్షయము రాజునకు నాశము.
29 దీర్ఘశాంతుడు మహా బుద్ధిమంతుడు;
ముంగోపి, మూఢత్వము పైకెత్తును.
30 స్వస్థచిత్తము* శరీరమునకు జీవము;
మత్సరము ఎముకలలోని కుళ్లు.
31 దరిద్రుని బాధపెట్టేవాడు వాని సృష్టికర్తను నిందించును;
బీదను కనికరించేవాడు ఆయనను ఘనపరచును.
32 దుష్టుడు తన చెడుతనమువల్ల తోలివేయబడును;
నీతిమంతునికి, తన మరణకాలమందైనను నిరీక్షణ కలుగును
33 బుద్ధిమంతుని హృదయములో జ్ఞానము నివసించును;
అవివేకుల అంతరంగములోనిది బైలుపడును.
34 నీతి రాష్ట్రమును పైకెత్తును;
పాపము ప్రజలకు అవమానము.
35 బుద్ధి గల సేవకుడు, రాజునకు ఇష్టుడు;
సిగ్గుపరిచే వాని మీద అతనికి ఆగ్రహముండును.

## 15. అధ్యాయము.

1 మృదువైన ఉత్తరము క్రోధము తిప్పివేసును;
నొప్పించే మాట కోపమును రేపును.
2 జ్ఞానుల నాలుక తెలివిని మనోహరముగా చేసును;
మతిహీనుల నోరు మూఢత్వము వెళ్లగక్కును.
3 యెహోవా కన్నులు ప్రతి స్థలమందు,
చెడ్డ వారిని మంచి వారినిని చూచుచుండును.
4 సాత్వికమైన నాలుక జీవ వృక్షము;
దాని కదలికవల్ల ఆత్మ నలిగి పోవును.
5 మూఢుడు తన తండ్రి శిక్షను తిరస్కరించును;
గద్దింపు లక్ష్యపెట్టే వాడు వివేకి.
6 నీతిమంతుని ఇంట ఐశ్వర్య బాహుళ్యము కలదు;
దుష్టుని వచ్చుబడివల్ల అసమాధానముండును.
7 జ్ఞానుల పెదవులు తెలివి వెదచల్లును;
మూఢుల హృదయము ఆలాగు చేయదు.
8 దుష్టుల యాగము యెహోవాకు హేయము;
యథార్థుల ప్రార్థన ఆయనకు ఇష్టము.

* లేక, సాత్వికచిత్తము.

9 దుష్టుని మార్గము యెహోవాకు ఏహ్యము;
ఆయన, నీతిని అనుసరించే వాని ప్రేమించును.

10 తోవ విడిచిన వానికి కఠిన శిక్ష కలుగును;
గద్దింపు ద్వేషించే వాడు మరణమవును.

11 అధోలోకము నాశన స్థలమును యెహోవా యెదుట నుండగా,
నరపుత్రుల హృదయములు ఉండవా?

12 అపహాసకుడు తన్ను గద్దించే వాని ప్రేమించడు;
జ్ఞానుల యొద్దికి వెళ్లడు.

13 సంతోష హృదయము ముఖము ప్రకాశింప చేసును;
హృదయ దుఃఖము వల్ల ఆత్మ నలిగి పోవును.

14 బుద్ధిమంతుని హృదయము జ్ఞానము వెతుకును;
మతిహీనుల నోటికి మూఢత్వమే ఆహారము.

15 బాధపడే వారి దినములన్నియు కీడు గలవి;
హృదయ సంతోషము నిత్యమైన విందు.

16 అసమాధానముతో కూడిన విస్తార ధనముకంటే
యెహోవా భయముతో కూడినది కొంచెమైనను మేలు.

17 పగవాని ఇంట కొవ్విన ఎద్దుకంటే,
ప్రేమగల చోట కూరల భోజనమే మంచిది.

18 కోపిష్ఠుడు కలహము పుట్టించును;
దీర్ఘశాంతుడు వివాదము అణగచేసును.

19 సోమరి వాని మార్గము ముళ్ల కంచెవంటిది;
యథార్థుల తోవ రాజమార్గము.

20 జ్ఞానము గల కుమారుడు తండ్రిని సంతోషపెట్టును;
మతిలేని మనుష్యుడు తన తల్లిని తిరస్కరించును.

21 బుద్ధిలేని వానికి, మూఢత్వము సంతోషము;
వివేకము గలవాడు సరళముగా నడుచును.

22 ఆలోచన సభ లేకుంటే, ఉద్దేశములు వ్యర్థమవును;
అవి ఆలోచన కర్తల విస్తారతవల్ల దృఢపడును.

23 మనుష్యునికి తన నోటి ఉత్తరమువల్ల సంతోషము కలుగును;
సమయోచితమైన మాట, ఎంతో మంచిది!

24 అధోలోకమునుంచి తొలగి పోవుటకు,
బుద్ధిమంతునికి జీవమార్గము మీదికి పోవును.

25 గర్విష్ఠుల ఇల్లు యెహోవా పాడుచేసును;
విధవరాలి పొలిమేరను స్థాపించును.

26 దుష్టుని యోచనలు యెహోవాకు ఏహ్యమవును;
అనుగుణ్యమైన మాటలు పవిత్రమైనవి*.

27 దుర్లాభము సంపాదించేవాడు తన ఇంటిని బాధపెట్టును,
లంచములను ద్వేషించే వాడు బ్రతుకును.

28 నీతిమంతుని హృదయము ఉత్తరమిచ్చుటకు తలంచును;
దుష్టుల నోరు చెడ్డవి వెళ్లగక్కును.

---

* లేక, పవిత్రుల మాటలు ఆనందకరమైనవి.

29 యెహోవా దుష్టులకు దూరస్థుడు;
ఆయన నీతిమంతుల ప్రార్థన వినును.
30 కన్నుల వెలుగు హృదయము సంతోషపెట్టును;
మంచి సమాచారము ఎముకలను పుష్టి చేసును.
31 జీవ విషయమైన గద్దింపు వినే చెవి,
జ్ఞానము గల వారిలో నివసించును.
32 శిక్ష ఉపేక్షించే వాడు తన ప్రాణము అశ్రద్ధ చేసును;
గద్దింపు వినేవాడు బుద్ధి పొందును.
33 యెహోవా భయము జ్ఞానబోధ;
ఘనతకు ముందు వినయము (ఉండును.)

## 16. అధ్యాయము.

1 హృదయము యొక్క ఏర్పాటులు మనుష్యునివి;
నాలుక పలికే ఉత్తరము యెహోవావాదే.
2 నరుని మార్గములన్నియు తన కన్నుల యెదుట శుద్ధమైనవి;
యెహోవా ఆత్మలను తూచును.
3 నీ పనులు యెహోవా మీదికి పొర్లించుము;
అప్పుడు నీ యోచనలు స్థిరపరచబడును.
4 యెహోవా ప్రతి వస్తువును దానిదాని పని నిమిత్తము చేసెను;
దుష్టుని కూడా కీడు గల దినము కోసము (చేసెను.)
5 గర్విష్ఠ హృదయము గల ప్రతివాడును యెహోవాకు ఏహ్యుడు;
నిశ్చయముగా వాడు శిక్ష పొందక మానడు.
6 అక్రమము కొరకు, కృపా సత్యములచేత ప్రాయశ్చిత్తము చేయబడును;
యెహోవా భయమువల్ల చెడుతనమునుంచి తొలగి పోదురు.
7 నరుని మార్గములు యెహోవాకు ఇష్టమైతే,
వాని శత్రువులను కూడా వానికి మిత్రులుగా చేసును.
8 న్యాయము లేని విస్తారమైన ఆదాయము కంటే,
నీతితో కూడినది కొంచెమైనను మంచిది.
9 నరుని హృదయము తన మార్గము యోచించ వచ్చును;
వాని నడతను స్థిరపరిచే వాడు యెహోవా.
10 రాజు పలికే మాట దైవోక్తి;
న్యాయ విషయము ఆయన నోరు తప్పిపోదు.
11 న్యాయమైన త్రాసు తూనికయు యెహోవావి;
సంచిలోని గుండ్లన్నియు ఆయన కార్యము.
12 చెడుతనము చేసుట రాజులకు ఏహ్యము;
నీతివల్లనే సింహాసనము స్థిరపరచబడును.
13 నీతి గల పెదవులు రాజులకు ఇష్టమైనవి;
యథార్థ వాక్యము పలికే వాడు ప్రేమించబడును.
14 రాజు క్రోధము మరణ దూత;
జ్ఞానము గల వాడు దాని శాంతిపరచును.
15 రాజు ముఖకాంతిలో జీవముండును;
అతని కటాక్షము వర్షకాలాంత మేఘము వంటిది.

16 జ్ఞానము సంపాదించుట అపరంజికంటే మంచిది;
తెలివి పొందుట వెండికంటే మంచిదని ఎంచ దగినది.
17 చెడుతనమునుంచి తొలగిపోవుట యథార్థవంతుల ఎత్తుగల బాట;
తన మార్గము నిదానించేవాడు తన ప్రాణము కాపాడుకొనును.
18 నాశమునకు ముందుగా గర్వము,
పడుటకు ముందుగా అహంకారాతిశయము పుట్టును.
19 గర్విష్ఠులతో దోపుడు సొమ్ము పంచుకొనుట కంటే,
దీనులతో దీనభావము పొందుట మంచిది.
20 వాక్యము లక్షించే వాడు మేలు పొందును;
యెహోవాను ఆశ్రయించే వాడే ధన్యుడు.
21 జ్ఞాన హృదయము గలవాడు వివేకి అనబడును;
మధురమైన పెదవుల విద్య హెచ్చించును.
22 బుద్ధి గల వానికి అది జీవపు బుగ్గ;
మూఢుల బోధ మూఢత్వమే.
23 జ్ఞాని హృదయము వాని నోటికి బుద్ధి కలిగించును;
అది వాని పెదవులమీద విద్య హెచ్చించును.
24 ఇంపైన మాటలు తేనెపట్టు వంటివి;
అవి ప్రాణమునకు మధురమైనవి, ఎముకలకు క్షేమకరమైనవై యుండును.
25 ఒకనికి సరళమైనదని అగుపడే ఒక మార్గమున్నది;
అయితే దాని అంతము మరణ మార్గములు.
26 ప్రయాసపడే వాని జీవాత్మ తన కొరకు ప్రయాసపడును;
వాని నోరు వాని ప్రేరేపించును.
27 పనికిమాలిన మనుష్యుడు కీడు తవ్వి పైకెత్తును;
వాని పెదవుల మీద మండే అగ్నివంటిది ఉండును.
28 కృత్రిమ మనుష్యుడు కలహము పుట్టించును;
కొండెగాడు ప్రాణ స్నేహితులను ఎడబాపును.
29 బలాత్కారి తన పొరుగువాని లాలనచేసి,
కాని మార్గములో వాని నడిపించును.
30 వాడు కృత్రిమములు కల్పించుటకు తన కన్నులు మూసుకొనుచు,
తన పెదవులు కరుచుకొనుచు కీడు నెరవేర్చియున్నాడు.
31 నెరసిన తల అందమైన కిరీటము,
అది నీతిమార్గములో కనబడును;
32 పరాక్రమశాలికంటే శాంతుడును;
పట్టణము పట్టుకొనే వాని కంటే తన ఆత్మ నేలేవాడును శ్రేష్ఠులు.
33 చీటి* ఒడిలో వేయబడును;
దాని తీర్పు యెహోవా ఆధీనము.

## 17. అధ్యాయము.

1 కలహ సమేతమైన యాగపశువులతో నిండిన ఇంటికంటే,
నెమ్మదితో కూడిన యెండు రొట్టె ముక్క మేలు.
2 బుద్ధిగల దాసుడు సిగ్గు కలిగించే కుమారుని ఏలును;
అతడు అన్నదమ్ములలో భాగము స్వతంత్రించుకొనును.

* లేక, పందెపు రాళ్లు.

3 వెండికి మూస, బంగారమునకు కొలిమి ఉండును;
హృదయములు శోధించేవాడు యెహోవా.
4 చెడ్డవాడు కీడైన మాటలు వినును;
అబద్ధికుడు చేటులు చేసే నాలుకకు* చెవియొగ్గును.
5 బీదను హాస్యము చేసేవాడు, వాని సృష్టికర్తను నిందించేవాడు;
ఆపదకు సంతోషించేవాడు నిరపరాధిగా ఎంచబడడు.
6 కుమారుల కుమారులు వృద్ధుల కిరీటము;
కుమారుల అలంకారము వారి తండ్రులే
7 శ్రేష్ఠమైన పలుకులు వెర్రివానికి గిట్టవు;
అబద్ధమాడుట అధిపతికి బొత్తిగా గిట్టదు.
8 బహుమానము పొందిన వాని దృష్టికి, అది చక్కని రత్నము వంటిది;
ఏ వైపునకు తిరిగినను, అది తేజరిల్లును.
9 నేరము కప్పివేసేవాడు ప్రేమ వెతికేవాడు;
మాట పలుమారు చెప్పేవాడు ప్రాణస్నేహితులకు భేదము పుట్టించేవాడు.
10 మూఢునికి నూరు దెబ్బలు కంటె,
బుద్ధిమంతునికి ఒక గద్దింపు లోతుగా నాటును.
11 దుర్మార్గుడు తిరుగుబాటునే కోరును;
క్రూర దూత వానికి విరోధముగా పంపబడును.
12 ఒకని చేత పిల్లలను పోగొట్టుకొనిన ఎలుగుబంటి యెదురుకొన వచ్చును;
తన మూఢత్వము గల బుద్ధిహీనుని ఎదురుకొనవద్దు.
13 మేలుకు కీడు చేసే వాడెవడో
వాని ఇంటినుంచి కీడు తొలగి పోదు.
14 కలహారంభము నీటి గట్టున పుట్టే ఊటవంటిది;
ప్రవహించక మునుపు మాన్పివేయుము.
15 దుష్టుడు నిర్దోషియని తీర్పు చేసేవాడును,
నీతిమంతుడు దోషియని తీర్పు చేసేవాడును,
ఈ ఇద్దరు యెహోవాకు ఏహ్యులు.
16 జ్ఞానము కొనుకొనుటకు అవివేకి చేతిలో సొమ్ము ఎందుకు!
దానియందు వానికి ఆశ లేదు గదా.
17 స్నేహితుడు ఎల్లకాలము ప్రేమించును;
దుర్దశకు సహోదరుడు పుట్టును.
18 జామీను పడి
తన చెలికాని యెదుట పూటబడే వాడు మతిహీనుడు.
19 కలహప్రియుడు దుర్మార్గ ప్రియుడు;
తన గుమ్మము ఎత్తుగా చేసేవాడు నాశము వెతికేవాడు.
20 చెడ్డ హృదయము గలవాడు మేలు పొందడు;
చంచలమైన నాలుక గలవాడు కీడులో పడును.
21 మూఢుని కనినవానికి వ్యసనము కలుగును;
మతిహీనుని తండ్రి సంతోషపడడు.
22 సంతోషించే హృదయము దేహమునకు బాగు చేసును;
నలిగిన ఆత్మ ఎముకలను ఎండించును.

---

* లేక, మాటలకు.

23 న్యాయపు తీర్పు తిప్పుటకు,
దుష్టుడు ఒడిలోనుంచి లంచము పుచ్చుకొనును.
24 జ్ఞానము బుద్ధిమంతుని ముఖము యెదుట ఉండును;
మూఢుని కన్నులు భూదిగంతములందు ఉండును.
25 మూఢుడైన కుమారుడు తన తండ్రికి ఆయాసమును,
తన్ను కనిన ఆమెకు చేదును కలిగించును.
26 నీతిమంతుని దండించుటయు,
యథార్థులని, ప్రధానులను కొట్టుటయు మంచివి కావు.
27 తెలివి గ్రహించేవాడు, తన మాటలు మితము చేసును;
వివేకి చల్లని గుణము గలవాడు.
28 ఒకడు మూఢుడైనను మౌనముగా ఉంటే, జ్ఞాని అని యెంచబడును;
తన పెదవులు మూసుకొనే వాడు వివేకి.

## 18. అధ్యాయము.

1 తన్ను ప్రత్యేకించుకొనిన వాడు స్వేచ్ఛా సంతుష్టి వెతుకుచు,
సర్వ బుద్ధికి వ్యతిరిక్తముగా చొరబడి పోవును.
2 మూర్ఖుడు తన తాత్పర్యము బైలుపరుచుట యందేగాని
జ్ఞానమందు సంతోషపడడు.
3 దుష్టత్వము రాగానే తిరస్కారము,
అవమానముతో కూడా నిందయు వచ్చును.
4 మనుష్యుని నోటి మాటలు లోతైన నీళ్లు;
జ్ఞానపు బుగ్గ పారే ఏరు.
5 తీర్పులో నీతిమంతుని న్యాయము తప్పించుటకు,
దుష్టుల ముఖము చూచుట మంచిది కాదు.
6 మూర్ఖుని పెదవులు వివాదమందు చేరును;
వాని నోరు దెబ్బలు పిలుచుకొనును.
7 మూర్ఖుని నోరు వానికి చేటు;
వాని పెదవులు వాని ప్రాణమునకు ఉరి.
8 కొండెగాని మాటలు గుసగుసలవంటివి;
అవి గర్భాంతరంగములలోకి దిగిపోవును.
9 తన పనిలో బద్ధకము గలవాడు,
వృధా వ్రయము చేసే వానికి తమ్ముడు.
10 యెహోవా పేరు బలమైన కోట;
అందులోకి నీతిమంతుడు పరుగెత్తి ఆశ్రయము పొందును.
11 ఐశ్వర్యవంతుని ఆస్తి వాని బలమైన పట్టణము;
వాని తలంపునకు అది ఎత్తయిన గోడ వంటిది.
12 చేటు రాక మునుపు నరుని హృదయము గర్వపడును;
ఘనత రాక మునుపు దీన భావము ఉండును.
13 మాట వినక ముందు ఉత్తరమిచ్చుట
మూఢత్వము, అవమానమునై ఉన్నది.
14 మనుష్యుని ఆత్మ వాని వ్యాధి ఓర్చును;
అయితే నలిగిన ఆత్మను ఎవడు సహించ గలడు!

15 వివేకి హృదయము తెలివి సంపాదించును;
జ్ఞానుల చెవి తెలివి కోరును.
16 మనుష్యుని కానుక వానికి విశాల స్థలము కలిగించును;
అది గొప్పవారి యెదుటికి వాని తెప్పించును.
17 మొదటివాడు తన వ్యాజ్యమందు నీతిమంతుడు;
అయితే వాని పొరుగువాడు వచ్చి వాని పరిశోధించును.
18 చీట్లు వేసుట వివాదములు నిలుపును;
అది పరాక్రమశాలులను వేరుపరుచును.
19 ఎడబాసిన సహోదరుడు బలమైన పట్టణము కంటె ఎడబడి ఉండును;
వివాదములు కోట తలుపు గడియల వంటివి.
20 మనుష్యుని నోటి ఫలముచే వాని కడుపు తృప్తిపొందును;
తన పెదవుల ఆదాయముచేత తృప్తిపొందును.
21 మరణము జీవము, నాలుక వశమందు ఉన్నవి;
దానియందు ప్రీతిపడే ప్రతివాడు దాని ఫలము తినును.
22 ఎవనికి భార్య దొరుకునో వానికి మేలు దొరుకును;
అతడు యెహోవా వల్ల అనుగ్రహము పొంది యున్నాడు.
23 దరిద్రుడు బ్రతిమాలి మనవి చేసుకొనును;
ఐశ్వర్యవంతుడు కఠినముగా ఉత్తరమిచ్చును.
24 (అనేక) స్నేహితులు గల వాడు చెడిపోవును;
సహోదరుని కంటె బాగా హత్తుకొనే ప్రియుడు కలడు.

## 19. అధ్యాయము.

1 మూర్ఖుడై తన పెదవులతో వంచనగా మాటలాడే వానికంటె,
తన యథార్థత యందు నడిచే దరిద్రుడు వాసి
2 ప్రాణమునకు తెలివి లేకపోవుట యందు మేలు లేదు;
తొందరపడి నడిచే వాడు దారి తప్పిపోవును.
3 మనుష్యుని మూఢత్వము వాని మార్గము తారుమారు చేసును;
యెహోవాపు వ్యతిరిక్తముగా వాని హృదయము రేగును.
4 ధనము స్నేహితులను విస్తరింపజేసును;
దరిద్రుడు తన స్నేహితునినుంచి వేరుపడును.
5 దొంగ సాక్షి నిరపరాధిగా ఎంచబడడు;
అబద్ధములాడే వాడు తప్పించబడడు.
6 అనేకులు రాజు దయను వెతుకుకొందురు;
దాతకు అందరు స్నేహితులు.
7 బీదవాని అన్నదమ్ములందరు వాని ద్వేషింతురు;
వాని స్నేహితులు బొత్తిగా వానికి దూరస్థులవుదురు;
మాటలతో వారిని తరిమినను, లేకపోదురు.
8 బుద్ధి సంపాదించేవాడు తన ప్రాణము ప్రేమించేవాడు;
వివేకము గైకొనేవాడు మేలు పొందును.
9 దొంగ సాక్షి నిరపరాధిగా ఎంచబడడు;
అబద్ధములు పలికేవాడు నశించును.
10 మూర్ఖునికి వైభవము తగదు;
ప్రధానులను ఏలుట దాసునికి బొత్తిగా తగదు.

11 మనుష్యుని వివేకము వానికి దీర్ఘశాంతము కలిగించును;
నేరము క్షమించుట వాని ప్రభావము.

12 రాజు కోపము సింహనాదము వంటిది;
ఆయన కటాక్షము గడ్డి మీద కురిసే మంచువంటిది.

13 మూర్ఖతగల కుమారుడు తన తండ్రికి ఆపత్పరంపర;
భార్య జగడములు యెడతెగక కారే బిందువులు.

14 ఇల్లు ఐశ్వర్యము, పిత్రార్జిత స్వాస్థ్యము;
బుద్ధిగల భార్య యెహోవా దానమే.

15 బద్ధకము గాఢ నిద్రలో పడవేసును;
సోమరి ఆత్మ పస్తుగాను ఉండును.

16 ఆజ్ఞ గైకొనేవాడు తన ఆత్మ గైకొనేవాడు;
తన మార్గములు నిర్లక్ష్యపెట్టే వాడు చనిపోవును.

17 బీదను కనికరించేవాడు యెహోవాకు అప్పిచ్చేవాడు;
వాని ఉపకారము ఆయన వానికి తిరిగి చెల్లించును.

18 మేలు కలుగునని, నీ కుమారుని శిక్షించుము;
వాని చంపుటకు నీ మనసులో ఆశించ కూడదు,

19 చాలా కోపము గలవాడు దండించపడ వలెను;
నీవు వాని తప్పించినను, ఇకను దండించ వలెను.

20 నీ భవిష్యత్కాలమందు జ్ఞానివై యుండుటకు;
ఆలోచన విని శిక్షను అంగీకరించుము.

21 మనుష్యుని హృదయములో ఆలోచనలు అనేకమైనవి;
యెహోవా ఉద్దేశములే నిలుచును.

22 మనుష్యుడు కోరేది దయ;
అబద్ధికుని కంటే దరిద్రుడే మంచివాడు.

23 యెహోవా భయము జీవార్థమై ఉండును;
(అందువల్ల) తృప్తిబొంది నిలకడగా నుండును;
వానికి కీడు రాదు.

24 బద్ధకుడు పాత్రలో చెయ్యి ముంచి,
తన నోటి యొద్దకైనను దాని తిరిగి ఎత్తుకొనడు.

25 అపహాసకుని కొట్టితే, యుక్తిహీనుడు బుద్ధి తెచ్చుకొనును; *
వివేకిని గద్దించితే, అతడు జ్ఞానము గ్రహించును.

26 తన తండ్రిని బాధించే వాడు, తన తల్లిని వెళ్లగొట్టేవాడు,
సిగ్గు అపకీర్తియు కలుగచేసే కుమారుడు.

27 నా కుమారుడా; తెలివిగల మాటలు విడిచి తప్పిపోవుటకు,
(బోధించే) బోధ వినుట మానుకొనుము.

28 పనికిమాలిన సాక్షి న్యాయవిధి అపహసించును;
దుష్టుల నోరు అక్రమము మింగివేసును.

29 అపహాసకులకు న్యాయ విధులు,
మూర్ఖుల వీపుకు దెబ్బలు సిద్ధపరచపడి ఉన్నవి.

* లేక, జాగరూకుడవును.

## 20. అధ్యాయము.

1 ద్రాక్షారసము హాసము కలిగించును, మద్యము క్రోధము రేపును,
అందువల్ల మోసపోయే ప్రతివాడు అజ్ఞాని.
2 రాజు భయము సింహనాదము వంటిది;
అతనికి కోపము పుట్టించేవాడు తన ఆత్మకు అపాయము చేసుకొనేవాడు
3 కలహమునకు దూరముగా నివసించుట నరునికి ఘనత;
ప్రతి మూఢుడు దానిలో చొరబడును.
4 చలివేయుచున్నదని సోమరివాడు దున్నడు;
కోత కాలమందు యాచించునుగాని యేమియు దొరకదు.
5 మనుష్యుని హృదయములో ఆలోచన, లోతు నీళ్లవంటిది;
వివేకము గలవాడు దాని పైకి చేదును.
6 అనేక జనులు తమ తమ కృప ప్రకటింతురు;
నమ్మ తగిన మనుష్యుని కనుగొనే వాడెవడు!
7 తన యథార్థతయందు నడిచేవాడు నీతిమంతుడు;
వాని తరువాత వాని పిల్లలు ధన్యులవుదురు.
8 రాజు న్యాయసింహాసనాసీనుడై,
తన కన్నులతో చెడుతనమంతయు చెదరగొట్టును.
9 నా హృదయము శుద్ధపరుచుకొని యున్నాను,
నా పాపమునుంచి పవిత్రుడనైతిననుకొనే వాడెవడు!
10 నానావిధమైన తూనికె రాళ్లు, నానావిధమైన కుంచములు,
ఈ రెండు యెహోవాకు ఏహ్యము.
11 బాలుడైనను వాని కార్యము శుద్ధమైనదో లేదో సరళమైనదో లేదో,
వాని చేష్టలవల్ల తెలియబడును.
12 వినే చెవి చూచే కన్ను
ఈ రెండును యెహోవా చేసెను.
13 బీదవాడవై యుండకుండుటకు నిద్రను ప్రేమించకుము;
నీ కన్నులు తెరువుము, ఆహారముతో తృప్తిపొందుము.
14 కొనేవాడు—చెడ్డది, చెడ్డది అనును;
తరువాత తన తోవకు వెళ్లి కొనియాడుకొనును.
15 బంగారము, విస్తార ముత్యములును కలవు;
అయితే తెలివి గల పెదవులు అమూల్యమైన ఆభరణము.
16 అన్యుని కొరకు పూటబడిన వాని వస్త్రము పుచ్చుకొనుము
పరుల కొరకైతే వానినే కుదువ పెట్టించుము.
17 మోసమువలని రొట్టె మనుష్యునికి ఇంపుగానుండును;
పిమ్మట, వాని నోరు కంకర రాళ్లతో నింపబడును.
18 ఉద్దేశములు ఆలోచన చేత స్థిరపరచబడును;
మంచి ఉపాయములతో యుద్ధము చేయుము.
19 కొండెగాడు తిరుగులాడుచు మర్మములు బైలుపరుచును;
కావున బహుగా నోరుచేసే వాని జోలికి పోకుము.
20 తన తండ్రినైనను తల్లినైనను దూషించే వాడెవడో,
వాని దీపము చీకటిలో ఆరిపోవును.

21 మొదట బహు తీవ్రముగా గడించిన ధనము
తుదను ఆశీర్వాదము పొందదు.
22 —కీడునకు కీడు చేతుననుకొన వలదు;
యెహోవా కొరకు కనిపెట్టుము; ఆయనే నిన్ను రక్షించును.
23 నానావిధమైన తూనికె రాళ్లు యెహోవాకు ఏహ్యము;
దొంగ తక్కెడ మంచిది కాదు.
24 మనుష్యుని నడతలు యెహోవా వల్లనవును;
మనుష్యుడు తన మార్గము ఏలాగు తెలుసుకొన గలడు?
25 వివేచించక* మ్రొక్కుకొనిన తరువాత,
మ్రొక్కబడిన దాని గూర్చి విచారించుట మనుష్యునికి ఉరి.
26 జ్ఞానముగల రాజు దుష్టులను చెదరగొట్టును;
వారి మీద చక్రము దొలిఁగించును.
27 మనుష్యుని ఆత్మ యెహోవా (పెట్టిన) దీపము;
అది అంతరంగములన్నియు శోధించును.
28 కృపాసత్యములు రాజుని కాపాడును;
అతడు కృపవల్ల సింహాసనము స్థాపించుకొనును.
29 పడుచువారి అలంకారము వారి బలము;
వృద్ధుల సౌందర్యము తల నెరపు.
30 గాయము చేసే దెబ్బలు
అంతరంగములలో చొచ్చే కొట్లును కీడునకు పరిహారము.

## 21. అధ్యాయము.

1 రాజు హృదయము యెహోవా చేతిలో నీటికాలువల వంటిది;
తన చిత్తప్రకారము దాని తిప్పును.
2 మనుష్యుని సర్వమార్గము తన కన్నులకు సరళమైనది;
యెహోవా హృదయములను తూచును.
3 నీతి న్యాయములు చేయుట,
యెహోవాకు యాగము కంటే ఇష్టము.
4 అహంకార దృష్టి, గర్వించే హృదయము,
దుష్టుల తేజము పాపమే.
5 జాగ్రత్తగల వాని ఆలోచనలు లాభమే;
మిక్కిలి తొందరపడే ప్రతివానికి లేమి కలుగును.
6 అబద్ధములాడే నాలుక వల్ల ధనసంపాద్యము కావచ్చును;
మరణపాశములు ఎగిరిపోయే ఊపిరివంటివి.
7 దుష్టుల బలాత్కారము వారిని ఎత్తుకొనిపోవును;
వారు న్యాయము చేయనొల్లరు.
8 దోషభరితుడైన మనుష్యుని మార్గము కేవలము వంకర అయినది;
పవిత్రుని చూస్తే వాని కార్యము సరళమే.
9 జగడములాడే భార్యతో ఇంట ఉండుటకంటే,
మిద్దెమీది మూల, నివాసము చేయుట మేలు.
10 దుష్టుని ఆత్మ చెడ్డదాని ఇచ్ఛయించును;
వాని కటాక్షము వాని చెలికాడైనను పొందడు.

---

* అనగా, దేవునికి సమర్పిత మైనది.

11 అపహాసకుని దండించుటవల్ల, యుక్తిహీనుడు జ్ఞానము పొందును;
జ్ఞానము గల వాని బోధించుట వల్ల వానికి తెలివి కలుగును.
12 నీతిమంతుడు దుష్టుని ఇల్లు చూచి బోధపరుచుకొనును;
ఆయన దుష్టులను కీడులో తలకిందుగా పడదోయును.
13 దరిద్రుని మొర్ర వినక చెవి మూసుకొనేవాడు,
తాను మొరబెట్టేటప్పుడు, ఉత్తరము పొందడు.
14 రహస్యమైన బహుమానము కోపమును,
ఒడిలోని లంచము బలమైన క్రోధమును శాంతిపరుచును.
15 న్యాయము చేయుట నీతిమంతునికి సంతోషము;
అక్రమము చేసేవారికి చేటు కలుగును.
16 వివేక మార్గమునుంచి తప్పిపోయే మనుష్యుడు,
అశరీరుల గుంపులో కాపురముండును.
17 ఉల్లాసమును ప్రేమించే వానికి లేమి కలుగును;
ద్రాక్షారసము, నూనెయు ప్రేమించేవానికి ఐశ్వర్యము కలగదు.
18 నీతిమంతుని కొరకు దుష్టుడు,
యథార్థులకు ప్రతిగా వంచకుడు, ప్రాయశ్చిత్తమవును.
19 కోపిష్ఠురాలై, జగడములాడే భార్యతోకూడా ఉండుటకంటే
అరణ్యభూమిలో నివసించుట మేలు.
20 రమ్యమైన ధనము, నూనెయు జ్ఞాని నివసించే ఇంటనుండును;
మూర్ఖుడు దాని తినివేసును.
21 నీతిని కృపను వెంబడించే వానికి
జీవము, క్షేమము, ఘనత దొరుకును.
22 జ్ఞాని పరాక్రమశాలుల పట్టణ ప్రాకారములు ఎక్కి
దాని బలమైన ఆశ్రయ స్థలము పడగొట్టును.
23 తన నోటిని, తన నాలుకను కాపాడేవాడు,
శ్రమలనుంచి తన ప్రాణము కాపాడుకొనును.
24 అహంకారియైన గర్విష్ఠుడు
గర్విష్ఠి కోపముతో ప్రవర్తించును; వాని పేరు అపహాసకుడు;
25 సోమరివాని ఇచ్ఛ వాని చంపును;
వాని చేతులు పని చేయనొల్లవు.
26 వాడు దినమంతయు బహుగా ఇచ్ఛయించును;
నీతిమంతుడు వెనుక తియ్యక ఇచ్చును.
27 దుష్టుల యాగము హేయమే;
దురాలోచనతో దాని తెచ్చితే బొత్తిగా హేయము.
28 దొంగ సాక్షి నశించును;
ఆలకించేవాడు ఎల్లకాలము పలక వచ్చును.
29 దుష్ట మనుష్యుడు తన ముఖము కఠినపరుచుకొనును;
యథార్థి తన మార్గము స్థిరపరుచుకొనును.
30 యెహోవాకు విరోధమైన జ్ఞానము లేదు, తెలివి లేదు, ఆలోచన లేదు.
31 గుర్రము యుద్ధ దినమునకు ఆయత్తపరచబడ వచ్చును;
అయితే రక్షణ యెహోవాది.

## 22. అధ్యాయము.

1 సుకీర్తి* బహు ఐశ్వర్యము కంటే శ్రేష్ఠము;
దయ, వెండి, బంగారముల కంటే మేలు.
2 ఐశ్వర్యవంతుడు దరిద్రుడును కలుసుకొందురు;
యెహోవా వారినందరిని సృజించెను.
3 వివేకి కీడు చూచి దాగును;
యుక్తిహీనులు ముందుపోయి ఆపద పొందుదురు.
4 ఐశ్వర్యము, ఘనత, జీవమును,
వినయము వల్లను, యెహోవా భయము వల్లను కలిగే ఫలము.
5 ముండ్లు, ఉరులు, వంచకుని మార్గములో ఉండును;
తన ఆత్మ కాపాడుకొనేవాడు వాటికి దూరముగా ఉండుగాక.
6 బాలునికి వాని మార్గానుసారముగా నేర్పుము;
వాడు వృద్ధుడైనప్పుడు దానినుంచి తొలగిపోడు.
7 ఐశ్వర్యవంతుడు బీదలను ఏలును;
అప్పు పుచ్చుకొనేవాడు అప్పు ఇచ్చేవానికి దాసుడు.
8 అక్రమము విత్తేవాడు కీడు పంట కోసును;
వాని క్రోధ దండము కాలిపోవును.
9 సుదృష్టి గల వాడు దీవించబడును;
వాడు తన ఆహారములోనిది దరిద్రునికి ఇచ్చును.
10 పరిహాసకుని తోలివేయుము; అప్పుడు కలహము బైలువెడలి పోవును;
వివాదము, అవమానమును విడిపోవును.
11 ఎవనికి హృదయ శుద్ధి ప్రియమైనదో
ఎవనికి దయాళువులైన పెదవులు కలుగునో వానికి రాజు స్నేహితుడు.
12 యెహోవా కన్నులు తెలివి కాపాడును;
ఆయన వంచకుని మాటలు వ్యర్థము చేసును.
13 సోమరివాడు—
బైట సింహమున్నది, వీధులలో చంపబడుదునని పలుకును.
14 వేశ్యా స్త్రీల నోరు లోతు గుంట;
యెహోవా కోపమునకు లోబడిన వాడు అందులో పడును.
15 బాలుని హృదయములో మూఢత్వము కట్టబడి యున్నది;
శిక్షించే బెత్తము వాని యొద్దనుంచి దాని తొలగించును.
16 అతనికి సమృద్ధి కలిగించుటకు దరిద్రుని బాధపెట్టును,
వానికి లేమి కలుగుటకు ఐశ్వర్యవంతునికి ఇచ్చును.
17 నీ చెవినొగ్గి జ్ఞానుల మాటలు వినుము;
నా తెలివియందు నీ హృదయము ఉంచుము.
18 నీవు వాటిని నీ అంతరంగములో కాపాడుకొంటే ఇంపుగానుండును.
అవి నీ పెదవుల మీద ఏకముగా స్థిరపడియుండుగాక.
19 యెహోవా యందు నీవు నమ్మిక ఉంచుటకు
ఈ దినమున నీకు (వాటిని) తెలిపి యున్నాను.

* లేక, పేరు.

20 నిన్ను పంపిన వారికి నీవు నిజమైన మాటలతో ఉత్తరమిచ్చుటకు
నిజమైన మాటల రూఢి తెలుపుటకు,
21 నేను ఆలోచనలతోను, తెలివితోను
పూర్వము ముప్పారు వ్రాయ లేదా?
22 —దరిద్రుడని దరిద్రుని దోచుకొన కూడదు;
గవినియొద్ద* దీనుని బాధపరచ కూడదు.
23 యెహోవా వారి వ్యాజ్యము నిర్వహించి,
వారిని దోచుకొనే వారి ఆత్మ దోచుకొనును.
24 కోపిష్ఠునితో సహవాసము చేయకుము;
క్రోధము గల వానితో పరిచయము చేయకుము.
25 నీవు వాని మార్గములు నేర్చుకొని,
నీ ఆత్మకు ఉరి తెచ్చుకుందువేమో.
26 చెయ్యి ఇచ్చేవారిలోను,
అప్పులకు పూటబడే వారిలోనుండకుము.
27 చెల్లించుటకు నీకు ఏమియు లేకుంటే,
వాడు నీకిందనుండే నీ పరుపు తీసుకొననేల?
28 నీ తండ్రి తాతలు వేసిన
పురాతనమైన పొలిమేర గుర్తు తీసివేయకుము.
29 తన పనిలో జాగ్రత్తగల మనుష్యుని చూచితివా?
వాడు నీచుల యెదుట కాదు, రాజుల యెదుటనే నిలుచును.

## 23. అధ్యాయము.

1 నీవు ఒక అధికారితో భోజనము చేయుటకు కూర్చుంటే,
నీ ముందర ఉండేదాని బాగా విచారించుకొనుము.
2 నీవు భోజన ప్రియుడవైతే,
నీ గొంతుకకు కత్తి తగిలించుకొందువు.
3 వాని రుచిగల పదార్థములు ఆశించకుము;
అవి మోసపుచ్చే ఆహారము.
4 ఐశ్వర్యము పొందుటకు ప్రయాసపడకుము;
నీ స్వబుద్ధి మానుకొనుము.
5 దాని మీదికి నీ కన్నులు ఎగరనిత్తువా? అది లేనేలేదు;
నిశ్చయముగా అది గద్దవలె రెక్కలు కలిగించుకొని
ఆకాశమునకు ఎగిరి పోవును.
6 దుర్దృష్టి గలవాని రొట్టె తినకుము;
వాని రుచిగల పదార్థములు ఆశించకుము.
7 వాడు తనలో తానే అనుకొనిన ప్రకారమే ఉండును;
—తిని తాగుమని నీతో చెప్పనే గాని
వాని హృదయము నీకు తోడైయుండదు.
8 నీవు తినిన ముక్క కక్కివేతువు;
నీ ఇంపైన మాటలు పోగొట్టుకొందువు.
9 మూర్ఖుని చెవులలో మాటలాడకుము;
వాడు నీ మాటల బుద్ధి తిరస్కరించును.

*అనగా, న్యాయసభలో.

10 పురాతనమైన పొలిమేర గుర్తు తీసివేయకుము;
తలిదండ్రులు లేనివారి పొలములోకి వెళ్లకుము.
11 వారి రక్షకుడు బలిష్ఠుడు;
ఆయన నీతో వారి వాదము వాదించును.
12 బోధకు నీ హృదయమును,
తెలివి గల మాటలకు నీ చెవులను చేర్చుము.
13 నీ బాలుని దండించుటకు వెనుకతియ్యకుము;
నీవు బెత్తముతో వాని కొట్టినను చావడు.
14 నీవు బెత్తముతో వాని కొట్టుము,
వాని ఆత్మ అధోలోకమునుంచి తప్పింతువు.
15 నా కుమారుడా! నీ హృదయము జ్ఞానము గలదైతే,
నా హృదయము కూడా సంతోషించును.
16 నీ పెదవులు సరళమైనవి పలికితే,
నా అంతరింద్రియములు ఆనందించును.
17 నీ హృదయము పాపుల యందు మత్సరపడక,
దినమంతయు యెహోవా యందు భయము కలిగి యుండుగాక.
18 రూఢిగా పరలోకమున్నది గదా;
నీ నిరీక్షణ కొట్టివేయబడదు.
19 నా కుమారుడా! నీవు విని జ్ఞానము తెచ్చుకొని
ఆ మార్గమందు నీ హృదయము తిన్నగా నడిపించుము.
20 చాలా ద్రాక్షారసము తాగేటి వారిలోనైనను,
మాంసము భక్షించే తిండిబోతులలోనైనను ఉండ కూడదు.
21 తాగుబోతు తిండిబోతు దరిద్రులవుదురు;
కునికిపాటు చింకి గుడ్డలు తొడిగించును.
22 నిన్ను కనిన తండ్రి మాటలు వినుము;
నీ తల్లి ముసలిదైతే ఆమెను నిర్లక్ష్యపెట్టకుము.
23 సత్యము, జ్ఞానము, బోధన తెలివిని
కొని, అమ్మివేయకుము.
24 నీతిమంతుని తండ్రి చాలా సంతోషించును;
జ్ఞానిని కన్నవాడు వాని వల్ల ఆనందపడును.
25 నీ తలిదండ్రులు సంతోషింతురు;
నిన్ను కనిన ఆమె ఆనందపడును.
26 నా కుమారుడా! నీ హృదయము నాకిమ్ము;
నీ కన్నులు నా మార్గముల యందు ఇష్టపడుగాక;
27 వేశ్య లోతైన గొయ్యి;
పర స్త్రీ ఇరుకైన గుంట.
28 దోచుకొనే వాని వలె అది పొంచియుండును;
మనుష్యులలో వంచకులను వృద్ధి చేయును.
29 ఎవనికి బాధ! ఎవనికి దుఃఖము?
ఎవనికి జగడములు? ఎవనికి చింత?
ఎవనికి హేతువు లేని గాయములు? ఎవనికి యెర్ర గన్నులు?
30 ద్రాక్షారసముతో ప్రొద్దుబుచ్చే వారికిని
కలిపిన ద్రాక్షారసము రుచి చూచే వారికిని కలగవా?

31 ద్రాక్షారసము మిక్కిలి ఎర్రగా అగుపడేటప్పుడు,
గిన్నెలో తళుకులాడుచుండేటప్పుడు,
మెల్లగా దిగేటప్పుడు, దాని వైపు చూడ కూడదు.
32 పిమ్మట అది సర్పము వలె కరిచి
కట్లపాము వలె పొడుచును;
33 నీ కన్నులు పర స్త్రీలను చూచును;
నీ హృదయము కృత్రిమవాక్యములు పలుకును.
34 సముద్రములో పండుకొనే వాని వలె,
ఓడ కొయ్య చివర మీద పండుకొనే వాని వలె నుందువు.
35 —నన్ను కొట్టిరి, నాకు నొప్పలేదు;
నన్ను మొత్తిరి, నాకు తెలియ లేదు; ఎప్పుడు మేలుకొందునో,
దాని మళ్లీ వెతుకుదు ననుకొందువు.

## 24. అధ్యాయము.

1 చెడ్డవారి యందు మత్సరపడ వద్దు;
వారితోనుండుటకు ఇచ్ఛయించకుము.
2 వారి హృదయము బలాత్కారము యోచించును;
వారి పెదవులు కీడును గూర్చి మాటలాడును.
3 ఇల్లు జ్ఞానము వల్ల కట్టబడును;
అది వివేకము వల్ల స్థిరపరచబడును.
4 వెల కలిగి రమ్యమైన సర్వ ద్రవ్యముతో
తెలివిచేత గదులు నింపబడును;
5 జ్ఞానము గలవాడు బలము గలవాడు;
తెలివి గలవాడు తన శక్తి దృఢపరచుకొనును.
6 మంచి ఉపాయములతోనే నీవు యుద్ధము చేయ వలెను;
అనేకులైన ఆలోచన కర్తల వల్ల రక్షణ కలుగును.
7 మూఢునికి జ్ఞానము మిక్కిలి ఎత్తుగానుండును;
వాడు గవినియొద్ద* తన నోరు తెరవడు.
8 కీడు చేయుటకు తలంచేవాడు,
దురాలోచన కర్త యనబడును.
9 మూఢత్వము యోచించుట పాపము;
అపహాసకుడు జనులకు హేయ్యుడు.
10 ఇబ్బంది దినమున నీవు కుంగిపోతే
నీ బలము ఇబ్బందిగా ఉండును.
11 చావునకు లాగబడే వారిని తప్పించుము;
వధించబడుటకు జోగుచున్న వారిని, అయ్యో! రక్షించుము.
12 నీవు—ఇది మాకు తెలియ లేదు సుమీ అనుకొంటే
హృదయములు తూచేవాడు దాని గ్రహించడా!
నీ ఆత్మ కాపాడే వానికి తెలియదా?
ఆయన మనుష్యులకు వారివారి పనికి తగిన ప్రతీకారము చేసును.

* అనగా, సభలో.

13 నా కుమారుడా! తేనె త్రాగుము; అది మంచిది;
తేనెపట్టు నీ రుచికి తియ్యనిది.

14 ఆలాగే నీ ఆత్మకు జ్ఞానము మంచిది;
అది నీకు దొరికితే, పరలోకమున్నదిగదా నీ నిరీక్షణ కొట్టివేయబడదు.

15 దుష్టుడా! నీతిమంతుని నివాసమందు పొంచియుండకుము;
వాడు పండుకొనే చోటు పాడుచేయకుము.

16 నీతిమంతుడు ఏడుమార్లు పడియు లేచును;
దుష్టులయితే కీడులో తొట్రిల్లి పడిపోదురు.

17 నీ శత్రువు పడినందున నీవు సంతోషించకుము;
వాడు తొట్రిల్లితే నీ హృదయము ఉల్లాసపడ కూడదు.

18 యెహోవా చూచును; అది ఆయన దృష్టికి చెడ్డదైనందున,
ఆయన వాని మీదనుంచి తన కోపము త్రిప్పివేసునేమో.

19 దుర్మార్గుల యందు నీ ఆగ్రహము మండిపడ నియ్యకుము;
దుష్టుల యందు మత్సరపడకుము.

20 చెడ్డవానికి పరలోకము లేదు;
దుష్టుల దీపము ఆరిపోవును.

21 నా కుమారుడా! యెహోవాకు, రాజునకు భయపడుము;
తిరుగబడే వారి జోలికి పోకుము.

22 వారికి ఆపద హఠాత్తుగా పుట్టును;
వారిద్దరి* నాశము ఎవనికి తెలుసును?

23 ఇవి కూడా జ్ఞానుల మాటలు†
—న్యాయ విధిలో పక్షపాతము మంచిది కాదు.

24 —నీతిమంతుడవని దుష్టునితో చెప్పే వాడెవడో,
ప్రజలు వాని శపింతురు;
ప్రజలు వాని యందు అసహ్యపడుదురు.

25 దుష్టుని గద్దించే వారికి ఆనందము కలుగును;
వారి మీద మంచి దీవెన వచ్చును.

26 సరియైన ఉత్తరమిచ్చేవాడు,
పెదవులు ముద్దుబెట్టుకొనును.

27 బైట నీ పని చక్కపరచుము, పొలములో దాని కొనసాగించుము;
తరువాత నీ ఇల్లు కట్టుకొన వచ్చును.

28 హేతువు లేక నీ పొరుగువానికి విరోధముగా సాక్షివై యుండకుము;
నీ పెదవులతో మోసపుచ్చ వచ్చునా?

29 —వాడు నాకు చేసిన ప్రకారమే వానికి చేతును;
వానికి వాని క్రియ చొప్పున ఫలమిచ్చెద ననవద్దు.

30 సోమరి వాని చేనును,
మతిలేని వాని ద్రాక్షతోటను దాటి వచ్చినాను;

31 ఇదుగో! దానియందంతట దుత్తారములు బలిసినవి;
దూలగొండ్లు దాని మీద కప్పుకొని యుండెను;
దాని రాతిగోడ పడిపోయి యుండెను.

---

* అనగా యెహోవాయును రాజును. † లేక, జ్ఞానులవి.

32 అప్పుడు నేను చూచి మనస్సు ఉంచితిని;
బాగా చూచి బుద్ధి తెచ్చుకొంటిని.
33 ఇంకా కొంచెము నిద్ర ఇంకా కొంచెము కునుకుపాటు,
పరుండే కొరకు ఇంకా కొంచెము చేతులు ముడుచుకొనుట;
34 ఇందు వల్ల నీ దరిద్రత పరుగెత్తే వాని వలెను
నీకు లేమి ఆయుధస్థుని వలెను వచ్చును.

## 25. అధ్యాయము.

1 ఇవి కూడా సొలొమోను వాక్యములు; యూదా రాజైన
హిజ్కియా మనుష్యులు, వీటిని యెత్తి వ్రాసిరి.

2 —సంగతి మరుగు చేసుట దేవుని మహిమ;
సంగతి శోధించుట రాజుల మహిమ.

3 ఆకాశముయొక్క ఔన్నత్యము, భూమియొక్క లోతు,
రాజుల హృదయము అగోచరములు.

4 వెండిలోని మష్టు తీసివేయుము;
అప్పుడు పుటము వేసే వానికి పాత్ర బైలుపడును.
5 రాజు యెదుటనుంచి దుష్టుని తీసివేయుము;
అప్పుడు అతని సింహాసనము నీతి వల్ల స్థిరపరచబడును.

6 రాజు యెదుట డంబము చూపకుము;
గొప్పవారి స్థలమందు నిలువబడకుము.
7 నీ కన్నులు చూచిన ప్రధాని యెదుట,
వారు నిన్నుతగ్గించుట కంటే
—ఇక్కడికి ఎక్కిరమ్మని నీతో చెప్పుట మేలు.
8 వాదించుటకు త్వరపడి పోకుము;
వెళ్లితే, తుదకు నీ పొరుగువాడు
నిన్ను అవమానపరిచినప్పుడు ఏమి చేతువు?
9 నీ పొరుగువానితో నీ వాదము వాదించుము;
పరుని గుట్టు బైలు పెట్టవద్దు.
10 బైలుబెట్టితే, వినేవాడు నిన్ను నిందించునేమో*
అందువల్ల నీ అపకీర్తి మానకపోవును.
11 సమయోచితమైన మాట
చిత్రమైన వెండి పళ్లెములలోని బంగారు పండ్లవంటిది;
12 జ్ఞాని గద్దించుట ఆలకించే చెవికి
బంగారు కర్ణభూషణము, అపరంజి ఆభరణము.
13 నమ్మతగిన దూత తన్ను పంపేవారికి,
కోతకాలమందలి హిమ శీతమువలె నుండు;
వాడు తన యజమానుని ఆత్మను సంతోషపరుచును.
14 అసత్యదానమును గూర్చి డంబము చేసేవాడు,
వర్షము లేని మేఘములకు గాలికి సమానుడు.
15 దీర్ఘశాంతి వల్ల అధికారిని ఒప్పించ వచ్చును:
సాత్వికమైన నాలుక యెముక నలగ గొట్టును.

---

* లేక, అవమానపరుచునేమో.

16 తేనె కనుగొంటివా? తగినంతమట్టుకే తాగుము;
తృప్తిపరచబడి దాని కక్కివేతువేమో.
17 మాటిమాటికి నీ పొరుగువాని ఇంటికి వెళ్లుట మానుము,
మానకపోతే అతడు నీ వల్ల విసుకుపొంది నిన్ను ద్వేషించునేమో.
18 తన చెలికానికి విరోధముగా దొంగ సాక్ష్యము చెప్పేవాడు,
సుత్తికి, ఖడ్గమునకు, వాడిగల అమ్మునకు సమానుడు.
19 కష్టదినములో వంచకుని యందు నమ్మిక ఉంచుట;
విరిగిన పంటికి కీలు వసిలిన కాలికి సమానము.
20 దుఃఖపడిన హృదయమునకు* పాటలు పాడేవాడు
చలిదినమందు వస్త్రము తీసుకొని పోయేవానికి,
సురేకారము మీద చిరక పోసేవానికి సమానుడు.
21 నీ శత్రువు ఆకలిగొని యుంటే వానికి ఆహారము పెట్టుము;
దప్పిగొనియుంటే వానికి దాహమిమ్ము.
22 అలాగున వాని తల మీద నీవు నిప్పుల కుప్ప వేతువు;
యెహోవా నీకు ప్రతి ఫలమిచ్చును.
23 ఉత్తరపు గాలి వానను,
క్షుద్రమైన నాలుక కోప ముఖమును కలిగించును.
24 జగడమాడే భార్యతో ఉమ్మడింట ఉండుట కంటే,
మిద్దె మీది మూల నివసించుట మంచిది.
25 దూరదేశమునుంచి వచ్చే సువార్త,
దప్పిగొనిన ఆత్మకు చల్లని నీళ్లవంటిది.
26 దుష్టుని యెదుట తొట్రిల్లే నీతిమంతుడు,
కలకపొందిన ఊటకు మైల బుగ్గకు సమానుడు.
27 చాలా తేనె తాగుట మంచిది కాదు;
స్వకీయ ఘనత వెతుకుకొనుట భారము.
28 తన ఆత్మను అణుచుకొన లేని మనుష్యుడు,
గోడ లేక పాడైన పురము వలె నుండును.

## 26. అధ్యాయము.

1 ఎండకాలమందు హిమము, కోతకాలమందు వర్షము ఏలాగో,
అలాగే మూర్ఖునికి ఘనత తగియుండదు.
2 మిడిసి మిడిసి యెగిరే పిచ్చుక ఏలాగో, చెదిరిపోయే వానకోవెల ఏలాగో,
అలాగే హేతువులేని శాపము తగలదు.
3 గుర్రమునకు చబుకు, గాడిదెకు కళ్లెము;
మూర్ఖుల వీపునకు బెత్తము.
4 మూర్ఖునికి వాని మూఢత్వము చొప్పున ఉత్తరమియ్యకుము;
ఇచ్చితే, నీవు కూడా వాని పోలి యుందువేమో.
5 మూర్ఖునికి వాని మూఢత్వము చొప్పున ఉత్తరమిమ్ము;
లేకపోతే, వాడు తన దృష్టికి తాను జ్ఞాని ననుకొనును.
6 మూర్ఖునిచేత సమాచారము పంపేవాడు,
కాళ్లు తెగగొట్టుకొని, నష్టరసము తాగేవాడు.

*లేక, లో.

7 కుంటివాని కాళ్లు జబ్బయినవి;
మూర్ఖుల నోట సామెతె అలాటిదే.
8 బుద్ధిహీనుని ఘనపరిచే వాడు,
వడిశెలలో రాయి కట్టే వానివలె నున్నాడు.
9 మత్తుకొనే వాని చేతిలో ముళ్ల కర్ర,
మూర్ఖుల నోట సామెతెయును ఒక్కటే.
10 సమస్తము నిర్మించినవాడు గొప్పవాడు,
ఆయన మూర్ఖునికి, అతిక్రమించే వానికిని ఫలమిచ్చును.
11 కక్కిన దానికి తిరిగే కుక్కవలె,
మూర్ఖుడు తన మూఢత్వమునకు తిరుగును.
12 తన దృష్టికి తాను జ్ఞానిననుకొనే మనుష్యుని చూచితివా?
వాని కంటే మూర్ఖుని గూర్చి అధిక నిరీక్షణ కలుగును.
13 —మార్గమందు సింహమున్నది,
వీధులలో సింహమున్నదని సోమరివాడు చెప్పును.
14 తన ఉతక మీద తలుపు,
తన పడక మీద సోమరివాడు తిరుగులాడుచుండును.
15 బద్ధకుడు పాత్రలో తన చెయ్యి ముంచును,
తన నోటియొద్దికి దాని తిరిగి యెత్తుకొనుట వానికి ఆయాసము.
16 హేతువు చెప్పే ఏడుగురి కంటే,
సోమరివాడు తన దృష్టికి తానే జ్ఞాని ననుకొనును.
17 తనది కాని జగడములో చొచ్చేవాడు,
దాటిపోవుచున్న కుక్క చెవులు పట్టుకొనే వానివలె నున్నాడు.
18 కొరవులు అమ్ములు తెగులు విసరివేసే వెర్రివాడు
19 తన పొరుగువాని మోసపుచ్చి,
—నేను నవ్వులాటలనే చేస్తినని పలికేవాని పోలియున్నాడు.
20 కట్టెలు లేని యెడల, అగ్ని ఆరిపోవును;
కొండెగాడు లేని యెడల, జగడము మానిపోవును.
21 నిప్పులకు బొగ్గులు, అగ్నికి కట్టెలు యేలాగో
ఆలాగే వివాదము పుట్టించుటకు కలహప్రియుడు కావలెను.
22 కొండెగాని మాటలు గుసగుసలవంటివి;
అయితే అవి ఒకని అంతరంగములలోకి దిగిపోవును.
23 చెడ్డ హృదయముతో కలిసిన వెచ్చని పెదవులు,
పెంకుమీద వేసిన వెండి మష్టువలెనున్నవి.
24 పగవాడు తన పెదవులతో మాయలు చేసి,
తన అంతరంగములో కపటము ఉంచుకొనును.
25 వాడు దయగా మాటలాడితే, వాని మాట నమ్మకుము;
వాని హృదయములో, ఏడు ఏహ్యములు కలవు.
26 కపటము వల్ల పగ దాచబడును;
అయితే వాని చెడ్డతనము సంఘములో బైలుపరచబడును.
27 గుంట తవ్వేవాడు దానిలో పడును;
రాయి పొర్లించే వాని మీదికి అది తిరిగి వచ్చును.
28 అబద్ధమాడే నాలుక దాని వల్ల నలగగొట్టబడిన వారిని ద్వేషించును;
ఇచ్చకపు నోరు నష్టము కలుగచేసును.

## 27. అధ్యాయము.

1 రేపటి దినమును గూర్చి అతిశయపడకుము;
ఒక దినము ఏది పుట్టునో అది నీకు తెలియదు.
2 నీ నోరు కాదు, అన్యుడే,
నీ పెదవులు కాదు, పరుడే నిన్ను స్తుతించుగాక;
3 రాయి బరువైనది, ఇసుక భారమైనది;
మూఢుని కోపము ఆ రెంటి కన్న భారమైనది.
4 క్రోధము క్రూరమైనది, కోపము నిష్ఠురమైనది;
మత్సరమెదుట ఎవడు నిలువ గలడు?
5 మరుగైన ప్రేమ కంటే, బహిరంగమైన గద్దింపు మంచిది;
6 స్నేహితుని వలని గాయములు నమ్మకమైనవి;
శత్రుని ముద్దులు మోసము గలవి.
7 తృప్తి పొందిన ఆత్మ తేనెపట్టు అణగద్రొక్కును;
ఆకలిగొనిన వానికి ప్రతి చేదు వస్తువు తియ్యనిది.
8 తన స్థలము విడిచి పోయే మనుష్యుడు,
గూడు విడిచి యెగిరే పక్షి వలె నున్నాడు.
9 తైలము, ధూపము, హృదయమును సంతోషపరచును;
స్వకీయమైన ఆలోచనకంటే ఒకని చెలికాని మాధుర్యము (ఇంపు.)*
10 నీ స్నేహితుని నీ తండ్రి స్నేహితునిని విడిచిపెట్టకుము;
నీ ఆపద్దినమందు నీ సహోదరుని ఇంటికి వెళ్లకుము;
దూరముగా నున్న సహోదరుని కంటే,
దగ్గరనున్న పొరుగువాడు వాసి.
11 నా కుమారుడా! నీవు జ్ఞానివై నా హృదయము సంతోషపరచుము;
అందువల్ల నన్ను నిందించే వారికి నేను ఉత్తరమిత్తును.
12 వివేకి కీడును చూచి దాగియుండును;
యుక్తిహీనులు ముందు పోవుచు ఆపద పొందుదురు.
13 అన్యుని కొరకు పూటపడిన వాని వస్త్రము పుచ్చుకొనుము;
పరుల కొరకైతే వానినే కుదువ పెట్టించుము.
14 వేకువనే లేచి గొప్ప శబ్దముతో తన స్నేహితుని దీవించే వానికి,
అది శాపమని ఎంచబడును.
15 వాన కురిసే దినమున, ఎడతెగక నీళ్లు కారుటయు,
జగడములాడే భార్యయు సమానము.
16 ఆమెను దాచిపెట్టే వాడు గాలిని దాచిపెట్టును;
తన కుడిచెయ్యి నూనె పట్టుకొనును.
17 ఇనుము వల్ల ఇనుము పదును పెట్టబడును;
నరుడు తన చెలికాని ముఖము తేజరిల్ల జేయును.
18 అంజూరపు చెట్టును కాచేవాడు దాని ఫలము తినును;
తన యజమానుని కనిపెట్టేవాడు ఘనత పొందును.

---

*లేక, ఒకని చెలికాని మధుర వాక్యములు మంచి గంధపు చెక్కకంటే ఇంపైనవి.

19 నీటిలో ముఖము ముఖమునకు వలె,
హృదయములో మనుష్యుడు మనుష్యునికి సరిపడును.
20 అధోలోకము, నాశనము తృప్తి పొందవు,
అలాగు, మనుష్యుని కన్నులు తృప్తిపొందవు.
21 మూసవల్ల వెండి, కొలిమివల్ల బంగారము,
తన కీర్తివల్ల నరుడు శోధించబడును.
22 రోటిలో గోధుములతో మూఢుని రోకట దంచినను,
వాని మూఢత్వము వాని వదిలిపోదు.
23 నీ గొర్రెల స్థితి బాగా తెలుసుకొనుము;
నీ మందల యందు మనస్సు ఉంచుకొనుము.
24 ఆస్తి నిరంతరము నిలువదు;
కిరీటము తరతరముల మట్టుకు ఉండునా?
25 ఎండు గడ్డి అయిపోయెను, పచ్చిక కనబడుచున్నది;
కొండల కూరలు ఏరబడి యున్నవి;
26 నీ వస్త్రముల కొరకు గొర్రెపిల్లలు;
పొలము యొక్క క్రయధనము కొరకు పొట్టేళ్లు కలుగును.
27 నీ ఆహారమునకు,
నీ ఇంటి వారి ఆహారమునకు, నీ పనికత్తెల జీవనమునకును,
చాలినన్ని మేకపాలు కలుగును.

## 28. అధ్యాయము.

1 తరిమేవాడు లేకనే దుష్టులు పారిపోదురు;
నీతిమంతులు సింహము వలె ధైర్యముగా నుందురు.
2 దేశమందలి ద్రోహము వల్ల దాని అధికారులు అనేకులు;
వివేకము తెలివి గల మనుష్యులవల్ల అది చక్కపరచబడును.
3 బీదలను బాధించే దరిద్రుడు,
ఆహారము ఉంచక కొట్టుకొనిపోయే వానతో సమానుడు.
4 బోధన ప్రమాణము విడిచే వారు దుష్టులను స్తుతింతురు;
బోధన ప్రమాణము గైకొనేవారు వారితో పోరాడుదురు.
5 చెడ్డవారు న్యాయము గ్రహించరు;
యెహోవాను వెతికేవారు అన్నిటిని గ్రహింతురు.
6 వంకర మార్గములు గల ధనవంతుని కంటే,
తన యథార్థత యందు నడిచే దరిద్రుడు వాసి.
7 బోధన ప్రమాణము గైకొనేవాడు బుద్ధి గల కుమారుడు;
తిండిబోతుల చెలికాడు తన తండ్రిని అవమానపరుచును.
8 ఎక్కువ వడ్డి చేతను, దుర్లాభము చేతను, తన ఆస్తి హెచ్చించుకొనేవాడు;
దరిద్రులను కరుణించే వాని కొరకు దాని కూడబెట్టుచుండును.
9 బోధన ప్రమాణము వినకుండా,
తన చెవి తొలగించుకొనే వాని ప్రార్థన కూడా ఏహ్యమే;
10 యథార్థులను దుర్మార్గములోకి పోజేసే వాడెవడో,
వాడు తన గోతిలో తానే పడును;
యథార్థులు మేలు స్వతంత్రించుకొందురు.

11 ఐశ్వర్యవంతుడు స్వదృష్టికి జ్ఞాని;
అయితే బుద్ధి గల దరిద్రుడు వాని పరీక్షించును.
12 నీతిమంతులు ఉత్సాహపడుట మహా ప్రభావము;
దుష్టులు లేచేటప్పుడు జనులు వేషము వేసుకొందురు*.
13 తన నేరములను మరుగు చేసేవాడు వర్ధిల్లడు;
అయితే వాటిని ఒప్పుకొని విడిచేవాడు కనికరము పొందును.
14 ఎల్లప్పుడును భయపడే మనుష్యుడు ధన్యుడు;
తన హృదయము కఠినపరుచుకొనేవాడు కీడులో పడును.
15 గర్జించే సింహము, తిరుగులాడే ఎలుగుబంటి ఎట్టివో,
దరిద్రులైన జనులను ఏలే దుష్టుడు అట్టివాడు.
16 వివేకములేని అధికారి మిక్కిలి బాధపెట్టును;
దుర్లాభము ద్వేషించేవాడు దినములు వృద్ధిచేసుకొనును.
17 రక్తాపరాధభరితుడు, గోతికి పరుగెత్తుచున్నాడు;
వానికి ఆతంకము పెట్ట కూడదు.
18 యథార్థముగా నడిచేవాడు రక్షించబడును;
తన మార్గములు వంకర చేసుకొనేవాడు ఒక్కమారే పడిపోవును.
19 తన పొలము సేద్యము చేసేవాడు రొట్టెవల్ల తృప్తి పొందును;
వ్యర్థులను వెంబడించే వానికి చాలా బీదతనము కలుగును.
20 నమ్మ తగిన మనుష్యునికి ఆశీర్వాదములు విస్తరించును;
ధనవంతుడవుటకు త్వరపడేవాడు నిరపరాధి కాకపోవును.
21 పక్షపాతము మంచిది కాదు;
రొట్టె ముక్కకొరకు నరుడు ద్రోహము చేసును.
22 దుర్దృష్టి గలవాడు ఆస్తి కొరకు ఆతురపడును;
తనకు దరిద్రత వచ్చునని వానికి తెలియదు.
23 నాలుకతో ఇచ్చకములాడే వాని కంటే,
మనుష్యులను గద్దించేవాడు తుదకు ఎక్కువ దయ పొందును.
24 తన తలిదండ్రులను దోచుకొని—అది ద్రోహము కాదనుకొనేవాడు,
నశింప చేసే మనుష్యునికి జతకాడు.
25 గర్వించే హృదయము గలవాడు కలహము రేపును;
యెహోవా యందు నమ్మిక ఉంచేవాడు పుష్టి పొందును.
26 తన హృదయమందు నమ్మిక ఉంచేవాడు మూఖుడు;
జ్ఞానము పట్టి నడిచేవాడు తప్పించబడును.
27 బీదలకు ఇచ్చేవానికి లేమి కలగదు;
తన కన్నులు మూసుకొనే వానికి బహు శాపములు కలుగును.
28 దుష్టులు హెచ్చినప్పుడు జనులు దాగియుందురు;
వారు నశించితే, నీతిమంతులు వృద్ధిపొందుదురు.

## 29. అధ్యాయము.

1 బహుగా గద్దించబడియు మెడ కఠినపరుచుకొనేవాడు†
హఠాత్తుగా నాశము పొందును—కుదురుబాటు లేదు.

---

* లేక, దాగియుందురు. †అనగా, కాడిమోయనొల్లని పశువుల వలె.

2 నీతిమంతులు ప్రబలితే ప్రజలు సంతోషింతురు;
దుష్టుడు ఏలినప్పుడు ప్రజలు దుఃఖింతురు.
3 జ్ఞానము ప్రేమించేవాడు తన తండ్రిని సంతోషపరిచేవాడు;
అయితే వేశ్యలతో కూడినవాడు ఆస్తి నాశము చేసును.*
4 న్యాయము వల్ల, రాజు దేశము స్థిరపరుచును;
లంచములు పుచ్చుకొనేవాడు దాని పాడు చేసును.
5 తన పొరుగువానితో ఇచ్చకములాడేవాడు,
వాని అడుగులకు వల వేసును.
6 చెడ్డవాని ద్రోహమందు ఉరి యుండును.
నీతిమంతుడు గానముచేసి సంతోషించును.
7 నీతిమంతుడు బీదల న్యాయము తెలుసుకొనును;
దుష్టుడు ఆ తెలివి గ్రహించ నొల్లడు.
8 అపహాసకులు పట్టణము తగలబెట్టుదురు; †
జ్ఞానులు కోపము మాన్పింతురు.
9 జ్ఞానము గలవాడు మూర్ఖునితో వాదించితే,
రేగును, నవ్వును, గాని విశ్రాంతి కలగదు.
10 ఘాతకులు యథార్థిని ద్వేషింతురు;
నీతిమంతులు వాని ఆత్మను రక్షించుటకు చూతురు.
11 మూర్ఖుడు తన మనస్సు యావత్తు బైలుపరుచును;
జ్ఞాని దాని వెనుకకు బిగపట్టును.
12 ఏలిక అబద్ధములు వింటే,
అతని ఉద్యోగస్థులందరు దుష్టులవుదురు.
13 బీదవాడు, దండుగ వాడు కలుసుకొందురు;
యెహోవా వీరిద్దరి కన్నులు వెలిగింపచేసును.
14 ఏ రాజు దరిద్రులకు సత్యముగా న్యాయము తీర్చునో,
అతని సింహాసనము ఎల్లప్పుడు స్థిరపరచబడును.
15 బెత్తము, గద్దింపు జ్ఞానమిచ్చును;
అయితే ఆపబడని బాలుడు తన తల్లిని అవమానపరుచును.
16 దుష్టులు ప్రబలితే ద్రోహము ప్రబలమవును;
నీతిమంతులు వారి పాటు చూతురు.
17 నీ కుమారుని శిక్షించితే, అతడు నీకు నెమ్మది కలిగించును,
నీ ఆత్మకు ఆనందమిచ్చును.
18 దేవోక్తి లేకపోతే, జనులు అనాథలవుదురు;
బోధన ప్రమాణము గైకొనేవాడు ధన్యుడు.
19 దాసుడు మాటల శిక్షచేత గుణపడడు;
వాడు గ్రహించినను ఉత్తరమియ్యడు.
20 తన మాటలతో త్వరపడే మనుష్యుని చూచితివా!
వాని కంటే మూర్ఖుని యెడల అధిక నిరీక్షణ ఉండును.
21 ఒకడు తన దాసుని చిన్నప్పటినుంచి సున్నితముగా పెంచితే
వాడు తుదకు కుమారుడవును.

*లేక, చేసుకొనును. † లేక, అల్లరిచేతురు.

22 కోపిష్ఠుడు కలహము రేపును;
ఉగ్రుని వల్ల విస్తార ద్రోహము కలుగును.
23 మనుష్యుని గర్వము వాని తగ్గించును;
వినయ మనస్సు గలవాడు ఘనత పొందును.
24 దొంగతో పాలు పంచుకొనేవాడు తన ఆత్మను ద్వేషించును;
వాడు శాపము వినియు దాని తెలియజేయడు.
25 మనుష్యులకు భయపడుట ఉరి తెచ్చును;
అయితే యెహోవా యందు నమ్మిక ఉంచేవాడు హెచ్చించబడును.
26 అనేకులు, యేలే వాని దయ వెతుకుకొందురు;
మనుష్యుని గూర్చి న్యాయము యెహోవా వల్లనే తీర్చబడును.
27 దుర్ణీతి గలవాడు నీతిమంతులకు ఏహ్యుడు,
సరళ మార్గమందు నడిచేవాడు దుష్టునికి అసహ్యుడు.

## 30. అధ్యాయము.

1 యాకె కుమారుడైన ఆగూరు వాక్యములు; ఆ మనుష్యుడు ఇతీయేలుకు
అనగా ఇతీయేలుకు, ఉక్కాలుకును పలికిన దేవోక్తి.

2 నిశ్చయముగా నేను మనుష్యులలో పశుప్రాయుడను; నాకు నరుల బుద్ధి లేదు. నేను
3 జ్ఞానము నేర్చుకొన లేదు; పరిశుద్ధుల తెలివి నేనెరుగను.

4 ఆకాశమెక్కి, మళ్లీ దిగినవాడు ఎవడు? తన పిడికిళ్లలో గాలి కూర్చినవాడు ఎవడు?
వస్త్రములో నీళ్లు కట్టినవాడు ఎవడు? భూదిక్కులన్నియు స్థాపించినవాడు ఎవడు? ఆయన
పేరు ఏమిటి? ఆయన కుమారుని పేరు ఏమిటి? నీకు తెలుసునా?

5 దేవుని ప్రతివచనము శోధితమైనది; ఆయనను ఆశ్రయించేవారికి ఆయన కేడెము.
6 ఆయన మాటలతో ఏమియు చేర్చకుము; ఆయన నిన్ను గద్దించునేమో, అప్పుడు నీవు
అబద్ధికుడవై యుందువు.

7 రెండు మనవులు నిన్ను అడుగుకొని యున్నాను; నేను చనిపోయేమట్టుకు నా యొద్ద
8 నుంచి వాటిని వెనుక దియ్యకుము. మాయ, అబద్ధములు నాకు దూరము చేయుము; దరి
ద్రతనైనను ఐశ్వర్యమునైనను నాకియ్యకుము; నాకు కట్టడయైన ఆహారముతో నన్ను
9 పోషించుము. లేకపోతే నేను తృప్తి పొంది—నిన్ను ఎరుగను, యెహోవా ఎవడు అని
పలుకుదునేమో; లేక, నేను దరిద్రుడనై దొంగిలి, నా దేవుని పేరు అవమానపరుతునేమో.

10 ఒక దాసునిచేత వాని యజమానుని గూర్చి కొండెములు చెప్పించకుము; వాడు
నిన్ను శపించునేమో అప్పుడు నీవు అపరాధివౌదువేమో.

11 తన తండ్రిని శపించి తన తల్లిని ఆశీర్వదించని వంశము కలదు; అది స్వదృష్టికి శుద్ధమై,
12 మలినమునుంచి కడగబడని వంశము; ఎంతో మీదు చూచే కన్నులుగల వంశము! దాని
13 కనురెప్పలు ఎంతో పైకెత్తబడియున్నవి. అది కత్తులవంటి పళ్లుగల వంశము, దాని దవడ
14 పళ్లు ఖడ్గములు; అవి దేశమునుంచి దిక్కులేని వారిని, మనుష్యులలోనుంచి బీదలను తిని
వేసును.

15 జలూకమునకు, ఇమ్ము ఇమ్ము అనే పేరుగల ఇద్దరు కూతులు కలరు; తృప్తిపడనివి మూడు
16 కలవు; — చాలునని పలకనివి నాలుగు కలవు. అవి యేమనగా, అధోలోకము, కనని

17 గర్భము, నీరు నిండుకొనని నేల; అగ్నియు చాలుననదు. తండ్రిని అపహాస్యము చేసి,
తల్లికి విధేయపడనొల్లని కన్ను లోయ కాకులు పీకును, గద్దపిల్లలు తినును.

18 నాకు మిక్కిలి ఆశ్చర్యమైనవి మూడు కలవు, నాకు తెలియబడనివి నాలుగు కలవు.
19 అవి యేవనగా, ఆకాశమందలి గద్ద మార్గము, బండ మీది సర్ప మార్గము, సముద్ర
20 ములోని ఓడ మార్గము, కన్యకతో పురుషుని మార్గము; వ్యభిచారిణి మార్గము
ఆలాగే ఉండును; ఆమె తిని తన నోరు తుడుచుకొని—నేను అక్రమము చేయ లేదను
కొనును.

21 మూడు హేతువుల చేత దేశము కదులును, నాలుగు హేతువుల చేత ఓర్చ జాలదు
22 అవి యేవనగా, ఏలుబడి చేసే దాసుని వలన, ఆహారము నిండా పొందిన బుద్ధిహీనుని
23 వలన, పెనిమిటి గల హేయమైన స్త్రీ వలన తన యజమానురాలి బాధ్యురాలైన దాసి వలన.

24 భూమి మీద చిన్న వస్తువులు నాలుగు కలవు; అయితే అవి జ్ఞానులకంటె బహు
25 జ్ఞానము గలవి. చీమలు బలహీన జీవులు; అయితే అవి వేసవిలో తమ ఆహారము సిద్ధపరుచు
26 కొనును; కుందేళ్లు బలహీనమైన జీవులు, అయితే రాతిమెట్టలో తమ ఇల్లు కట్టుకొనును;
27 మిడతలకు రాజు లేడు; అయితే అవియన్నియు మోహరించుకొని బైలు వెళ్లును; బల్లి*
28 చేతులతో పట్టుకొనుచు, రాజుల గృహములలో ఉండును.

29 చక్కగా నడిచేవి మూడు కలవు; ఠీవిగా నడిచేవి నాలుగు కలవు — అవి యేవనగా,
30 మృగములలో వృద్ధ సింహము పరాక్రమము గలది; అది ఎవని యెదుటనుంచియు వెనుక
తిరుగదు.

31 నడుము కట్టబడిన గుర్రము, మేకపోతును; ఎవరును ఎదిరించజాలని రాజు.
32 నీవు అవివేకముగా అతిశయపడినను, కీడు యోచించినను, నీ నోటి మీద చెయ్యి
33 పెట్టుకొనుము. పాలు పిండుట వెన్న పుట్టించును; ముక్కు పిండుట రక్తము పుట్టించును;
ఆలాగే కోపము పిండుట† కలహము పుట్టించును.

## 31. అధ్యాయము.

1 మశ్శారాజైన లెమూయేలు మాటలు, అతని తల్లి
అతనికి వాటిని బోధించెను.

2 నా కుమారుడా! ఏమనగలను? నేను కన్న కుమారుడా! ఏమనగలను!
నా మ్రొక్కుబడుల కుమారుడా! ఏమనగలను!
3 స్త్రీలకు నీ బలమును,
రాజులను నశింపచేయుటకు నీ మార్గములను ఇయ్యకుము.
4 ద్రాక్షారసము త్రాగుట రాజులకు తగదు;
లెమూయేలూ! రాజులకు తగదు;
మద్యపాన కాంక్ష అధికారులకు తగదు.
5 త్రాగితే, వారు కట్టడల మరిచి
దీనులందరి న్యాయము తిప్పివేతురేమో.
6 నశించి పోవుచుండే వానికి మద్యము;
మనో వ్యాకులము గలవారికి ద్రాక్షారసము ఇయ్యుడి.

* లేక, సాలిపురుగు. †లేక, రేపుట.

7 వాడు తాగి తన బీదతనము మరిచి,
తన శ్రమను ఇక తలంచకుండు గాక.
8 మూగవాని కొరకు, తలిదండ్రులు లేనివారందరి న్యాయము కొరకు
నీ నోరు తెరుచుకొనుము.
9 నీ నోరు తెరుచుకొనుము; నీతిగా న్యాయము తీర్చుము.
దీనులకు బీదలకు న్యాయము తీర్చుము.
10 గుణవతియైన భార్యను కనుగొనేవాడు ఎవడు?
ఆమె వెల ముత్యముల కంటే అత్యధిక మైనది.
11 ఆమె పెనిమిటి హృదయము ఆమె యందు నమ్మిక ఉంచును;
కావున అతనికి ఆదాయము తక్కువ* లేదు.
12 ఆమె బ్రతికే దినములన్నిటను,
అతనికి మేలే గాని కీడు చేయదు;
13 ఆమె గొర్రెబొచ్చు, అవిసినార వెతికి,
తన చేతులతో మనస్ఫూర్తిగా పని చేయుచుండును.
14 ఆమె వర్తకుల ఓడల వంటిది;
దూరమునుంచి తన ఆహారము తెచ్చుకొనును.
15 ఆమె, చీకటితోనే లేచి,
తన ఇంటి వారికి ఆహారము, తన పనికత్తెలకు బత్తెము నిచ్చును.
16 ఆమె పొలమును యోచించి దాని పుచ్చుకొనును;
తన చేతుల ఫలముతో ద్రాక్షలతోట నాటించును.
17 ఆమె బలముతో తన నడుము కట్టుకొని,
తన బాహువులను దృఢపరుచుకొనును.
18 ఆమె తన వ్యాపార లాభము మంచిదని దాని అనుభవించి చూచును;
రాత్రియందు ఆమె దీపము ఆరిపోదు.
19 ఆమె చాచిన చేతిలో దూది పింజె ఉంచుకొని,
వేళ్లతో కదురు పట్టుకొనును.
20 ఆమె తన అరచెయ్యి దీనుని కొరకు చాపి,
బీదవారికి తన చేతులు చాపును.
21 ఆమె తన ఇంటివారి యెడల, హిమమునకు భయపడదు;
ఆమె ఇంటివారందరికిని రక్తాంబరములు కలవు.
22 ఆమె రత్నకంబళులను చేసుకొనును;
సన్నపు నారబట్టయు రక్తాంబరమును ఆమె వస్త్రము.
23 ఆమె పెనిమిటి, దేశపు పెద్దలతో కూడా కూర్చుండి,
గవినియొద్ద పేరుగొనినవాడై యుండును.
24 ఆమె విచిత్రమైన నారబట్టలు నేయించి అమ్మును;
నడికట్లను వర్తకునికి ఇచ్చును.
25 ఆమెకు బలము, శోభయు, వస్త్రములు;
రాబోయే కాలము ఆమె సంతోషించును.

---

*లేక, దోపుడు సొమ్ము.

26 ఆమె జ్ఞానముతో తన నోరు తెరుచును;
కృప గల బోధన ఆమె నాలుక మీద నుండును.
27 ఆమె తన ఇంటివారి నడతలను బాగా లక్షించును;
బద్ధకురాలై ఆహారము తినదు.
28 ఆమె కుమారులు లేచి ఆమెను దీవింతురు;
ఆమె పెనిమిటి ఆమెను మెచ్చుకొనును.
29 —చాలామంది కుమార్తెలు పతివ్రతా క్రియలు చేసియున్నారు;
వారందరి కంటే నీవు విశేషమైన దానవనును.
30 దయ మోసము, సౌందర్యము మాయ;
యెహోవాకు భయపడే స్త్రీ కొనియాడబడును.
31 ఆమె చేతుల ఫలములోనిది ఆమెకు ఇయ్యుడి;
గవునులయొద్ద ఆమె పనులు ఆమెను స్తుతించుగాక.

# ప్రసంగియొక్క పుస్తకము.

## 1. అధ్యాయము.

1 దావీదు కుమారుడున్ను యెరూశలేము రాజున్ను
2 అయిన ప్రసంగియొక్క మాటలు, । యేలాగంటే, వ్యా
హా, మాయలో మాయ, మాయలో మాయ, అని
3 ప్రసంగి చెప్పుతూ వున్నాడు; అంతా మాయ. । సూ
ర్యుని కింద మనుష్యుడు పొందే యావత్తు కష్టమువల్ల
4 అతనికి వచ్చిన లాభమేమి? । వొక వంశము పోతుంది,
యింకొక వంశము వస్తుంది; అయితే భూమి యెప్పటి
5 కిన్ని నిలుచును. । సూర్యుడు వుదయించుతాడు, సూర్యు
డు అస్తమించుతాడు; తాను వుదయించిన తన స్థలమునకే
6 తిరుగా వెళ్లుటకు త్వరపడుతాడు. । గాలి దక్షిణమునకు
పోయి వుత్తరమునకు చుట్టుకొని తిరుగుతుంది; అది
చుట్టూ చుట్టూ తిరిగి, దాని తిరుగుల చొప్పున మళ్లీ
7 వచ్చును. । యావత్తు నదులు సముద్రములోకి పారును;
అయినప్పటికీ సముద్రము నిండదు; యెక్కడనుంచి
నదులు పారి వచ్చునో అక్కడికే అవి తిరుగా వెళ్లు
8 ను. । యావత్తు కార్యములు కష్టమువల్ల నిండి యున్నవి;
మనుష్యుడు అది చెప్పజాలడు; చూచుటవల్ల కన్ను
9 తృప్తి పొందదు, వినుటవల్ల చెవి నిండదు. । మునుపు
వుండినదే యిక వుండబోతుంది; మునుపు చేయబడినదే
యిక చేయబడబోతుంది; సూర్యుని కింద నూతనమైనది
10 యేదిన్ని లేదు. । దీని చూడుము, యిది ఆశ్చర్యము
గాదా అని చెప్ప తగిన కార్యము వొకటి అయినా
కలదా? అది పూర్వ కాలమునుంచి మనకు ముందు వుం
11 డేది అవును. । మునుపటివాటి జ్ఞాపకము లేదు; ఆ
ప్రకారమే వెనకటి వాటి జ్ఞాపకమున్ను యిక మీదట
12 రాబోయేవారికి వుండదు. । ప్రసంగినయిన నేను యెరూ
శలేము యందు ఇశ్రాయేలు మీద రాజును అయి
13 వుండి, । ఆకాశము కింద చేయబడేది అంతాను జ్ఞాన
ముచేత విచారించేటందుకున్ను గ్రహించేటందుకున్ను
నా హృదయమును ప్రయోగించుకొంటిని; యీ చెడ్డ
ప్రయాసవల్ల మానవ పుత్రులు కష్టపడేటట్టుగా పరా
14 త్పరుడు కట్టడ చేసినాడు. । సూర్యుని కింద చేయబడే
యావత్తు క్రియలను చూస్తిని; యిదుగో అంతా మాయ
15 యున్ను ఆత్మను శ్రమ పెట్టేదిన్ని అయి వున్నది. । వంక
రగా వున్నది తిన్ననిది కాలేదు; తక్కువ అయినది
16 యెంచ శక్యము కాదు. । యిదుగో, యెరూశలేము
యందు నాకంటే ముందు వున్న వారందరికంటే నేను
హెచ్చి, యెక్కువ స్థితిని పొందితినన్ని, నా హృద
యమును బహు జ్ఞానమున్ను తెలివిన్ని గలదనిన్ని, నేను
నా మనస్సులో అనుకొని, । నా హృదయమును జ్ఞాన 17
మును యెరుగేటందుకున్ను అవివేకమునున్ను మతిహీ
నతనున్ను యెరుగేటందుకున్ను ప్రయోగించుకొంటిని;
అయితే యిదిన్ని ఆత్మను శ్రమ పరచేదని నేను తెలు
సుకొన్నాను. । యేమంటే విస్తారమైన జ్ఞానమందు విస్తా 18
రమైన దుఃఖము కద్దు; తెలివియందు హెచ్చినవాడు
నొప్పి యందు కూడా హెచ్చును.

## 2. అధ్యాయము.

నేను నా హృదయమందు రమ్ము, యిప్పుడు నిన్ను 1
సంతోషము చేత శోధించి చూతును; భాగ్యమును అను
భవించుమని అనుకొంటిని; అయితే యిదుగో యిదిన్ని
మాయ. । నేను నవ్వును గూర్చి అది వెర్రి అనిన్ని, 2
సంతోషమును చూచి అది యేమి చేసును అనిన్ని
చెప్పుకొంటిని. । ఆకాశము కింద ప్రాణముతో వున్న 3
అన్ని దినముల వరకు మనుష్య పుత్రులు చేసే క్రియల
వల్ల వారికి యేమి మేలు వుండునని నేను చూచే పర్యం
తమున్ను, నేను నా మాంసమును ద్రాక్షారసముతో
ఆచుకొని వుండేటందుకున్ను, నా హృదయమును
జ్ఞానమందు నడుపించుకొని వచ్చే వానిగా మతిహీన
తను పట్టేటందుకున్ను నా మనస్సు యందు యోచన
చేసుకొంటిని. । నేను గొప్ప క్రియలు చేసుకొంటిని; నా 4
నిమిత్తము యిండ్లను కట్టిస్తిని; నా కొరకు నేను ద్రాక్ష
తోటలను నాటితిని. । నా కొరకు నేను తోటలనున్ను 5
శృంగారమైన వనములనున్ను కలుగచేసి, వాటి యందు
సకల విధమైన ఫల వృక్షములనున్ను నాటితిని. । వృక్ష 6
ములు ఫలించే లాగు వాటికి నీళ్లు పారేటట్టు నేను నీళ్ల
మడుగులను కలుగ చేసుకొంటిని. । పనివాండ్లనున్ను 7
పనికత్తెలనున్ను సంపాదించుకొంటిని; నా యింటిలో
పిల్లలు పుట్టిరి; యెరూశలేము యందు నాకన్న ముందు
వుండిన అందరికంటే యెక్కువగా నాకు గొర్రెలున్ను
పశువులున్ను బహు విస్తారముగా వుండెను. । నా 8
కొరకు నేను బంగారమునున్ను వెండినిన్ని రాజుల సంప
దనున్ను సంస్థానములయొక్క సంపత్తునున్ను చేర్చు
కొంటిని; నాకు నేను గాయకులనున్ను గాయకురాండ్ల

నున్ను మనుష్య పుత్రులయొక్క సంపదలున్ను సకల
విధమైన వాద్య సూత్రములనున్ను సంపాదించుకొం
9 టిని. । నాకన్న ముందు యెరూశలేమునందు వున్న
అందరికంటే నేను వృద్ధి పొంది హెచ్చితిని; నా జ్ఞాన
10 మున్ను నాతో కూడా వుండెను. । నా కన్నులు దేని
ఆశించినవో దాని నేను వాటికి అభ్యంతరము చేయ
లేదు; నా హృదయమునుంచి యే సంతోషమునైనా
నేను వెనుక తీయలేదు; యేమంటే నా హృదయము
నాయొక్క యావత్తు ప్రయాసమువల్ల సంతోషముగా
వుండెను; యిదే నా యావత్తు ప్రయాసమువల్ల నాకు
11 వచ్చిన భాగమై వుండెను. । అప్పుడు నా చేతులు చేసిన
నాయొక్క యావత్తు క్రియలనున్ను నేను పడ్డ యా
వత్తు ప్రయాసమునున్ను నేను దృష్టించి చూడగా,
యిదుగో, అంతా మాయయున్ను ఆత్మను శ్రమ పెట్టే
దిన్ని అయి వుండెను: సూర్యుని కింద లాభము లేదు. ।
12 నేను జ్ఞానము యేది అనిన్ని వెర్రిన్ని మతిహీనతయు
న్ను యెటువంటివి అనిన్ని చూచేటందుకు తిరిగితిని,
యేమంటే, రాజు తరువాత రాబోయే మనుష్యుడు
యేమి చేయ గలడు? అప్పుడే జరిగి వుండేవే కావా? ।
13 అంతట నేను చీకటికంటే వెలుగు యెంత శ్రేష్ఠమో
బుద్ధిహీనతకంటే జ్ఞానము అంత శ్రేష్ఠమని తెలుసు
14 కొంటిని. । జ్ఞానియొక్క కన్నులు తన శిరస్సులో
వున్నవి; మూఢుడు చీకటి యందు నడుస్తూ వున్నాడు;
అయినప్పటికిన్ని వారందరికిన్ని వొక్కటే గతి సంభ
15 వించునని నేను యోచించుకొంటిని. । అయినందున
నేను నా హృదయమందు మూఢునికి సంభవించినట్టే నా
కున్ను సంభవించునే; ఆలాగైతే నాకు అధిక జ్ఞానము
యెందుకని చెప్పి, నా హృదయమందు యిదిన్ని మాయ
16 అని అనుకొంటిని. । యేమంటే మూఢునికంటే జ్ఞానిని
గూర్చి జ్ఞాపకము యెన్నటికిన్ని వుండదు; యిప్పుడు
వుండేది అంతా వచ్చే దినములయందు మరువపడును;
జ్ఞాని యేలాగు చచ్చును? మూఢుని వలెనే కాదా? ।
17 కాగా నేను బ్రతుకును పగచేస్తిని; యేమంటే సూర్యుని
కింద చేయబడే క్రియ నాకు వ్యసనకరమాయెను; అదే
మంటే యావత్తున్ను మాయయున్ను ఆత్మను శ్రమపర
18 చేదిన్ని అయి వున్నది. । సూర్యుని కింద నేను పడిన యా
వత్తు ప్రయాసమును నేను పగ చేస్తిని; యెందుకంటే
నా తరువాతి మనుష్యునికి దాని నేను విడిచిపెట్టవ
19 లెను. । మరిన్ని వాడు జ్ఞానము కలవాడై వుండునో,
లేక మతిలేనివాడై వుండునో, అది యెవడు యెరు
గును? అయినప్పటికిన్ని నేను సూర్యుని కింద ప్రయా
సపడినదిన్ని నేను జ్ఞానముగా నడుచుకొన్న అంతటి
మీద వాడు అధికారి అయి వుండును; యిదిన్ని మాయ. ।
20 అయినందున సూర్యుని కింద నేను పడిన యావత్తు
ప్రయాసము మీద వున్న ఆశ విడిచి పెట్టేటట్టు నా
హృదయమందు వుపాయము వెతికితిని. । యేమంటే 21
వొక మనుష్యుడు కలడు, వాని పని జ్ఞానమందున్ను
తెలివి యందున్ను ధర్మమందున్ను వున్నది; అయినప్పటి
కిన్ని దానియందు ప్రయాసపడని వేరే వొకనికి వాడు
దాని స్వతంత్రముగా యిచ్చివేయ వలసినది; యిదిన్ని
మాయయున్ను గొప్ప కీడున్నై వున్నది. । యేమంటే 22
మనుష్యుడు సూర్యునికింద అనుభవించే తనయొక్క
యావత్తు ప్రయాసము వల్లనున్ను తన హృదయము
యొక్క నూతన చేతనున్ను వానికి వచ్చినది యేమిటి? ।
వాని దినములు అన్ని వ్యాధులతోనున్ను వాని ప్ర 23
యాస నొప్పితోనున్ను వున్నవి; రాత్రియందు వాని
మనస్సుకు నెమ్మది దొరకదు; యిదిన్ని మాయ కాదా? ।
అయినందున మనుష్యుడు భుజించి, తాగి, తన ప్రయా 24
సమందు తన హృదయము ఫలమును అనుభవించేదే
గదా వానికి మేలు! యిదిన్ని పరాత్పరుని చేతివల్ల
వచ్చినదని నేను కంటిని. । యేమంటే నాకంటే బాగా 25
భుజించేవాడు యెవడు? నాకంటే త్వరగా సంపాదిం
చుకొనేవాడు యెవడు? । యేమంటే పరాత్పరుడు తన 26
యెదుట మంచివాడుగా వుండే మనుష్యునికి జ్ఞానము
నున్ను తెలివినిన్ని ఆనందమునున్ను దయచేసును;
అయితే పాపము చేసేవానికి పరాత్పరుని యెదుట
మంచివాడుగా వుండేవానికి యిచ్చేటందుకు కూర్చి
పోగు చేసుటకు ప్రయాసమును ఆయన నిర్ణయిం
చును. యిదిన్ని మాయయున్ను ఆత్మను శ్రమపరచే
దిన్ని అయి వున్నది.

## 3. అధ్యాయము.

సకలమునకున్ను వొక స్వతంత్ర దినమున్ను, ఆకా 1
శము కింద వుండే ప్రతి వుద్దేశమునకున్ను వొక కాల
ము వుండును. । పుట్టుటకు కాలము కలదు, చచ్చుటకు 2
కాలము కలదు; నాటుటకు కాలము కలదు, నాటబ
డిన దాని పెరికివేసుటకు కాలము కలదు; । చంపుటకు 3
కాలము కలదు, గుణపర్చుటకు కాలము కలదు; పడ
గొట్టుటకు కాలము కలదు, కట్టుటకు కాలము కలదు; ।
యేడ్చుటకు కాలము కలదు, నవ్వుటకు కాలము కలదు; 4
దుఃఖించుటకు కాలము కలదు, ఆడుటకు కాలము
కలదు; । రాళ్లను చెదరగొట్టుటకు కాలము కలదు, రా 5
ళ్లను చేర్చుటకు కాలము కలదు; కౌగలించుటకు కాల
ము కలదు, కౌగలించకుండా దూరముగా వుండుటకు
కాలము కలదు; । వెతుకుటకు కాలము కలదు, పోగొ 6
ట్టుటకు కాలము కలదు; వుంచుకొనుటకు కాలము
కలదు, పారవేసుటకు కాలము కలదు; । చింపుటకు 7
కాలము కలదు, కుట్టుటకు కాలము కలదు; మౌనముగా

వుండుటకు కాలము కలదు, మాట్లాడుటకు కాలము
8 కలదు; । ప్రేమించుటకు కాలము కలదు, పగచేసుటకు
కాలము కలదు; యుద్ధపు కాలము కలదు, సమాధా
9 నపు కాలము కలదు. । కష్టబడిన వానికి తన కష్టము
10 వల్ల వచ్చిన లాభము యేమి? । పరాత్పరుడు మనుష్య
పుత్రులకు కష్టపడ గలందులకు వారికి యిచ్చిన ప్రయా
11 సమును చూస్తిని. । ప్రతి దానిని దాని కాలమందు
ఆయన చక్కగానే చేసినాడు; సత్యముయొక్క తెలి
వినిన్ని వారి హృదయమందు వేసినాడు; లేకపోతే
పరాత్పరుడు ఆదినుంచి తుద పర్యంతము చేసే క్రియ
12 మనుష్యుడు కనుకో లేడు. । సంతోషముగా వుండే
దిన్ని తాను ప్రాణముతో వుండగా సత్క్రియను చేసే
దిన్ని గాక యింకొక మేలు వాటి వల్లను లేదు అని
13 నేను యెరుగుదును. । అయితే ప్రతి మనుష్యుడున్ను
భుజించి, తాగి, తన యావత్తు కష్టముయొక్క ఫలమును
14 అనుభవించేదిన్ని పరాత్పరునియొక్క యీవి. । పరా
త్పరుడు యేమి చేసునో అది యెప్పటికిన్ని నిలుచు
నని నేను యెరుగుదును; దానికి యేదైనా పెంచకూ
డదు; దానినుంచి యేదయినా తీయకూడదు; తన యె
దుట మనుష్యులు భయపడి వుండేటట్టుగా పరాత్ప
15 రుడు యీ ప్రకారముగా చేస్తూ వున్నాడు. । ముందు
వుండినదే యిప్పుడున్ను వున్నది; రాబోయేదిన్ని కూడా
పూర్వమందు వుండినదే; అయితే జరిగిపోయిన దాని
16 పరాత్పరుడు విచారించును. । మరిన్ని సూర్యుని కింద
నేను న్యాయ స్థలమందు అన్యాయము వున్నట్టున్ను
నీతి స్థలమందు అక్రమము వున్నట్టున్ను చూచినాను. ।
17 అయితే నీతిమంతునికిన్ని చెడ్డవానికిన్ని పరాత్పరుడు
న్యాయము తీర్చును అని నేను నా హృదయములో
అనుకొంటిని; యేమంటే ప్రతి వుద్దేశమునకున్ను ప్రతి
18 క్రియకున్ను న్యాయము తీర్చేకాలము వున్నది. । మరిన్ని
పరాత్పరుడు మనుష్య పుత్రుల అహంకృతిని పోచేసే
దిన్ని తమ వునికి యందు తాము మృగముల వలె వుం
డేది వారు చూచేదిన్ని వారికి తగునని నేను నా హృ
19 దయమందు అనుకొంటిని. । యేమంటే మనుష్య పుత్రు
లకు సంభవించేది యేదో మృగములకున్ను అదే సంభ
వించును; వారికి వొక్కటే సంభవించును; యితడు
చచ్చినట్టు అదిన్ని చచ్చును; సకల జీవులకు వొక్కటే
శ్వాసము; మృగముకంటే మనుష్యునికి ప్రధానము
20 లేదు; యేమంటే సకలమున్ను మాయ. । సకలమైన
వారు వొక్క స్థలమునకే పోదురు; సకలమున్ను మంటి
వల్ల కలుగబడ్డది; సకలమున్ను మంటికే తిరిగి పోతుం
21 ది. । పయికి యెక్కిపోయే నరపుత్రుల ఆత్మయున్ను
కిందికి భూమి యందు దిగిపోయే మృగములయొక్క
22 జీవమున్నున్ను యెవడు యెరుగును? । కాగా మనుష్య
డు తన క్రియలవల్ల ఆనందమును పొందుట కన్న అత
నికి మేలు మరేదైనా లేదని నేను గ్రహించితిని; యే
మంటే యిదే వాని భాగము అయి వున్నది; అతని
తరువాత వుండేది యేదో అది చూచుటకు అతని
కొంచ రాగల వాడు యెవడు?

## 4. అధ్యాయము.

ఆలాగున నేను తిరుగుకొని, సూర్యుని కింద చేయ 1
పడే కష్టములు అన్నిన్ని దృష్టించితిని; యిదుగో కష్ట
పడిన వారి కన్నీళ్లను చూస్తిని; వారికి వుపదేశించే
వారు లేరు; వారిని కష్టపెట్టే వారి చెయ్యి బలము
గానే వున్నది గాని వారిని ఆదరించే వాడు లేడు. ।
అయినందున యింకా జీవస్థులై ప్రాణముతో వున్న 2
వారికంటే యింతకు ముందు కాలము చేసుకొన్న మృ
తులే భాగ్యవంతులు అని నేను చెప్పుకొన్నాను. । నిజ 3
ముగా యీ వుభయులకంటే యింకా కలుగబడని
వాడున్ను సూర్యుని కింద జరిగిన కీడును చూడని వా
డున్ను మేలు. । మరిన్ని యావత్తు ప్రయాసమున్ను 4
ప్రతి సత్క్రియ నిమిత్తము మనుష్యుని మీద వాని తోటి
వానివల్ల వచ్చిన పోరాటమున్ను నేను విచారించితిని;
యిదిన్ని కూడా మాయయున్ను ఆత్మను శ్రమ పెట్టే
దిన్ని అయి వున్నది. । మూఢుడు తన చేతులను మడు 5
చుకొని, తన శరీరమును భక్షించును. । శ్రమతోనున్ను 6
ఆత్మయొక్క విసుపుతోనున్ను రెండు చేతులు నిండుగా
వుండే దానికంటే నెమ్మదితో వొక చెయ్యి మాత్ర
ము నిండి వుండుట మేలు. । అంతట నేను తిరుగుకొని, 7
సూర్యుని కింద వేరే వొక మాయను చూస్తిని. । వొంట 8
రిగా వున్న వొకడు కలడు, మరి జతగాడు లేడు; వా
నికి పిల్ల అయినా సహోదరుడైనా లేడు; అయినప్ప
టికిన్ని అతని ప్రయాసకు అంతము లేదు; అతని కన్ను
ఐశ్వర్యముచేత తృప్తిపొందదు; మరిన్ని నేను నా ఆత్మకు
మేలు తెచ్చుకోకుండా యెవరి నిమిత్తము ప్రయాస
పడుతున్నానని పలకడు: యిదిన్ని మాయ; నిజముగా
చెడ్డ ప్రయాసగా వున్నది. । వొకనికంటే యిద్దరు 9
మేలు; యెందుకంటే వారి కష్టము నిమిత్తము వారికి
మంచి ఫలము కలుగును. । వారు పడిపోయినా వొకడు 10
తనతోటి వాని పైకి యెత్తును; అయితే వొంటిగానే
పడిపోయే వానికి అయ్యో! యేమంటే వాని పైకి యె
త్తేటందుకు తోడు లేదు. । మరిన్ని యిద్దరు పడుకొని 11
వుంటే వారికి వేడిమి కలుగును; వొకనికి వేడిమి యే
లాగు కలుగును? । వొకని మీదికి యింకొకడు తోసు 12
కొని వస్తే, యిద్దరు వానికి యెదురుగా నిలువ వచ్చు
ను; మూడు పోగుల తాడు త్వరగా తెగిపోదు. । గద్దిం 13
పుకు మరి అక్కర చేయని మూఢుడైన ముసలి రాజు

కంటే బీదవాడైన తెలివి గల చిన్నవాడే మేలు।
14 యేమంటే అతడు చెరసాలలోనుంచి బైలు వెళ్లి, రాజ్య
భారము చేస్తాడు; అయితే వొకడు రాజాంగమందు
15 పుట్టిన్ని బీదవాడౌతాడు। సూర్యుని కింద వున్న జీవ
స్థులందరికిన్ని తనకు బదులుగా నిలుప బోయిన
16 రెండో పిల్లతో కూడా చూస్తిని। వారికన్న ముందు
వున్న సకల జనులయొక్క లెక్కకు అంతము లేదు;
తరువాత రాబోయే వారు కూడా వీని మీద ప్రియము
వుంచరు; నిజముగా యిదిన్ని మాయయున్ను ఆత్మను
శ్రమపెట్టేదిన్ని అయి వున్నది.

## 5. అధ్యాయము.

1 నీవు పరాత్పరుని యింటికి పోయేటప్పుడు నీ కా
లును కాచుకొమ్ము; మూఢులు యిచ్చే బలి కంటే
వినేటందుకు త్వరపడుము; యేమంటే వారు చెడ్డ తన
2 మును చేస్తూ వున్నారని యెరుగరు। నీవు పరాత్ప
రుని యెదుట తొందరగా పలుకుటకు నీ హృదయ
మును త్వరపడనీయక, నీ నోరును కాచుకొమ్ము; యే
మంటే పరాత్పరుడు పరమండలములో వున్నాడు,
అయితే నీవు భూమి మీద వున్నావు; కాబట్టి నీ మా
3 టలు కొద్దిగా వుండనిమ్ము। యేమంటే విస్తార ప్రయాస
వల్లను స్వప్నము పుట్టును; మాటల విస్తారత చేతను
4 మూఢుని శబ్దము తెలియపడును। నీవు పరాత్పరునికి
మొక్కుబడి చేస్తే అది చెల్లించుటకు ఆలస్యము చేయ
వద్దు; యేమంటే మూఢుల మీద ఆయనకు ప్రియము
5 లేదు; నీవు మ్రొక్కుకొన్నది చెల్లించుము। నీవు మ్రొ
క్కుకొనిన్ని చెల్లించకుండా వుండే దానికంటే మ్రొ
6 క్కుకోకుండా వుండేదే మేలు;। నీ మాంసము పాప
ము చేసేటందుకు నీ నోటికి సెలవు యివ్వకుము; అది
తప్పు అని దూత యెదుట చెప్పకుండా వుండుము;
నీ శబ్దము వల్లను పరాత్పరునికి కోపము కలిగి, నీ చేతు
7 లయొక్క క్రియను నాశన పరచవలసినదేమి?। యేమం
టే చాలా స్వప్నముల యందున్ను చాలా మాటల
యందున్ను మాయలు కలిగి యుండును; అయితే నీవు
8 పరాత్పరునికి భయపడి వుండుము। వొకని వశమందు
బీదలు కష్ట పడేదిన్ని న్యాయమున్ను నీతిన్ని బలా
త్కారముగా భ్రష్టపడుటనున్ను నీవు చూచినట్టయితే
అటువంటి క్రియచేత భ్రమ పడవద్దు, యేమంటే
వున్నతమైన వాని కంటే వున్నతమైన వాడు విచారిం
చును; మరిన్ని వారికన్న వున్నతమైన వారు కలరు।
9 సమస్తమైన వారికి భూమియొక్క లాభము కలిగి
వున్నది; రాజు సహా భూమివల్ల ఫలమును పొందును।
10 ద్రవ్యమును అపేక్షించేవాడు ద్రవ్యముచేత తృప్తి
పొందడు; విస్తారముగా అపేక్షించే వాడు యెవడో
వాడు ఆదాయము వల్ల తృప్తి పొందడు; యిదిన్ని
మాయ। ద్రవ్యము హెచ్చితే దాని భక్షించేవారున్ను 11
హెచ్చుదురు; దాని యజమానులు తమ కన్నులతో
చూచేది గాక వారికి దానివల్ల వున్న ప్రయోజన మేమి?।
పని చేసే వాడు కొద్దిగా భుజించినా, చాలా భుజిం 12
చినా, తన నిద్ర యింపుగా వున్నది; అయితే ఐశ్వర్య
వంతుని తృప్తిచేత అతనికి నిద్ర పట్టదు। నేను సూ 13
ర్యుని కింద వొక ఘోరమైన కీడును చూస్తిని; అదేదం
టే వారి నష్టము కొరకు దాని యజమానులకు భాగ్య
ము వుండుటేను। అయితే ఆ ఐశ్వర్యము విఘ్నమైన 14
ప్రయాసవల్ల నశించిపోతుంది; అతడు పుత్రుని కనును
గాని వాని చేతను యేమి లేక పోవును। వాడు యే 15
ప్రకారముగా తన తల్లి గర్భములోనుంచి బయిలు
వెళ్లినాడో ఆలాగునే వాడు వచ్చిన ప్రకారము తిరిగీ
దిగంబరిగానే పోవును; వాడు తన ప్రయాసలోది తన
చేతి యందు యేమిన్ని కొంచపోయేది లేదు। వాడు 16
వచ్చిన ప్రకారముగానే పోతూ వున్నాడు; యిది
ఘోరమైన కీడు; వాడు గాలికి ప్రయాసపడినందువల్ల
వానికి యేమి లాభము?। తన యావత్తు దినములలోను 17
వాడు చీకటి యందు భుజించును; మరిన్ని వాని వ్యా
ధితో కూడా వానికి వుగ్రమున్ను దుఃఖమున్ను కలు
గును। యిదుగో నేను చూచినది యిదేను; ప్రాణము 18
తో వుండుటకు పరాత్పరుడు తనకు కట్టడ చేసిన తన
దినములన్నిన్ని మనుష్యుడు భుజించేదిన్ని తాగేదిన్ని
తాను సూర్యుని కింద పొందిన తన ప్రయాసయొక్క
మేలును అనుభవించేదిన్ని అతనికి మంచిదిన్ని యోగ్య
మైనదిన్ని అవును; యేమంటే యిది వాని భాగము।
పరాత్పరుడు యెవనికి ఐశ్వర్యమున్ను దాని భుజించు 19
టకు శక్తిన్ని యిచ్చి, వాని భాగమును పుచ్చుకొనుట
కున్ను వాని ప్రయాసమందు సంతోషముగా వుండు
టకున్ను అధికారమును యిచ్చినాడో అది పరాత్పరుని
యీవి। యేమంటే, పరాత్పరుడు వాని హృదయము 20
యొక్క ఆనందముతో వానికి మారుత్తరము దయచేసి
నందువల్ల వాడు తన జీవపు దినములను బహుగా
తలంచడు.

## 6. అధ్యాయము.

సూర్యుని కింద నేను చూచిన వొక కీడు వున్నది; 1
అది మనుష్యుల యందు సాధారణముగా కనుబడును:।
అదేమంటే పరాత్పరుడు ఐశ్వర్యమున్ను ఆస్తినిన్ని 2
ఘనమునున్ను వొకనికి యిచ్చి, వాడు యేమి యిచ్ఛ
యించినా అది అంతా వాని ఆత్మకు తక్కువ లేకుండా
వున్నప్పటికిన్ని దాని భుజించుటకు పరాత్పరుడు వా
నికి అధికారము యివ్వక అన్యునికి దాని తీసుటకు

యిచ్చులేదు: యిది మాయయున్ను చెడ్డ వ్యాధిన్ని అవు
3 ను. । వొక మనుష్యుడు నూరుమంది పిల్లలను కన్నప్ప
టికిన్ని చాలా సంవత్సరములు ప్రాణముతో వున్నప్ప
టికిన్ని వాని ఆయుస్సుయొక్క దినములు విస్తారమైన
ప్పటికిన్ని వాని ఆత్మ భాగ్యముతోను తృప్తి కాకుండా
వుండి; వానికి సమాధి అయినా లేకుండా వుంటే వా
నికంటే గర్భస్రావమే మేలు అని పలుకుదును. ।
4 యేమంటే అది మాయతో వచ్చి చీకటిలోకి పోవును;
5 దాని పేరు చీకటితోను మయ్యపడును. । అది సూ
ర్యుని చూచినదిన్ని లేదు, యెరిగినదిన్ని లేదు; అతని
6 కంటే దీనికే నెమ్మది కలదు. । వాడు రెండువేల సంవ
త్సరములు బ్రతికి వున్నప్పటికిన్ని అతడు మేలును
కాన లేదు; అందరున్ను వొక స్థలమునకే వెళ్లరా? ।
7 మనుష్యుని ప్రయాసము అంతా వాని నోటికే కాదా?
అయినప్పటికిన్ని వాని మనస్సు సంతుష్టిని పొందదు.।
8 మూఢుని కంటే జ్ఞానికి విశేషమేమి? జీవము కలవారి
ముందర నడుచుటకు యెరిగిన బీదవానికి కలిగిన ఘన
9 ము యేమి? । ఆశ చెదిరి వుండుట కంటే కన్నులు
చూచి వుండుటే మేలు: యిదిన్ని మాయయున్ను ఆత్మను
10 శ్రమ పరచేదిన్నియి వున్నది. । ముందుండినదే అప్పుడే
వుచ్చరించబడెను; యిటువంటిది అని చెప్పబడెను;
వాడు మనుష్యుడని తెలిసి వుండును; తన కంటే బల
11 మైనవానితో అతడు వ్యాజ్యమాడ కూడదు. । మాయను
హెచ్చించేవి విస్తారము కలిగి వుండగా మనుష్యునికి
12 లాభయేమి? । యేమంటే నీడ వలె తన దినములన్ని
వ్యర్థముగా గడుపుకొన్న మనిషికి యీ జీవమందు
తనకు యేది మంచిదో యెవడు యెరుగును? యేమంటే
సూర్యుని కింద తన తరువాత యేది సంభవించునో
అది మనుష్యునికి తెలుపేవారు యెవరు.

## 7. అధ్యాయము.

1 ప్రశస్తమైన తైలము కంటే మంచి కీర్తి మేలు;
2 వొకని జన్మ దినము కంటే మరణ దినమే మేలు. । విందు
గల యింటికి పోయేదాని కంటే దుఃఖపు యింటికి
పోయేదే మేలు; యేమంటే అదే యావత్తు మనుష్యుల
యొక్క అంతము అవును; యిది ప్రాణముతో వున్న
3 వాడు తన మనస్సు యందు వుంచుకొనును. । నవ్వు
కంటే దుఃఖము మంచిది; యేమంటే ముఖముయొక్క
4 దుఃఖమువల్ల హృదయము గుణపడును. । జ్ఞానులయొక్క
హృదయము దుఃఖపు యింటి యందు వుండును; అయి
తే మూఢుల హృదయము సంతోషపు యింటి యందు
5 వుండును. । వొకడు మూఢుల పాట వినేదాని కంటే
6 జ్ఞానియొక్క అదమాయింపును వినేది మేలు. । యేమం
టే బాన కింద వుండే ముళ్లయొక్క శబ్దము యెటు
వంటిదో మూఢునియొక్క నవ్వు అటువంటిదేను; యి
దిన్ని మాయ. । బాధపరచుట జ్ఞానిని వెర్రిగా చేసు 7
ను; లంచము హృదయమును చెరుపును. । వొక కార్య 8
ముయొక్క ఆరంభము కంటే దాని అంతము మేలు;
మనోహంకారి కంటే మనోశాంతము గలవాడు
మేలు. । కోపముగా వుండుటకు నీ ఆత్మయందు త్వర 9
పడ వద్దు; యేమంటే కోపము మూఢులయొక్క హృ
దయమందు వుండును. । యీ దినముల కంటే మును 10
పటి దినములు యెందుకు మంచివి అని చెప్ప వద్దు;
యేమంటే నీవు యీ ప్రకారము అడిగేది జ్ఞానముతో
కూడినది కాదు. । స్వతంత్రము యెంత మంచిదో జ్ఞాన 11
మున్ను అంత మంచిదిగా వుండును; సూర్యుని చూచే
వారికి ప్రయోజనము కలదు. । యేమంటే జ్ఞానము వొక 12
ఆశ్రయమే; ద్రవ్యమున్ను వొక ఆశ్రయమే; అయితే
దాని పొందిన వారికి జ్ఞానము జీవమును యిచ్చులే
తెలివియొక్క శ్రేష్ఠత. । పరాత్పరునియొక్క క్రియ 13
లను దృష్టించుము, యేమంటే ఆయన వంకరగా చేసేది
యెవడు తిన్నగా చేయవచ్చును? । నీవు భాగ్యపు దిన 14
ము యందు సుఖమును అనుభవించుము; అయితే కీడు
దినము యందు నిదానించి చూడుము; తన తరువాత
యే వొకటైనా మనుష్యుడు కనుకోకుండా దానితో
కూడా దీనిన్ని పరాత్పరుడు కలుగచేసినాడు. । యిది 15
అంతానున్ను నా మాయయొక్క దినముల యందు
నేను చూస్తిని; తన నీతి యందు నశించిన నీతిమంతు
డున్ను కలడు; తన చెడ్డ తనమందు తన దినములను పొ
డుగు చేసుకొని వుండే చెడ్డ వాడున్ను కలడు. । నీవు 16
మించి నీతిమంతుడవై వుండవద్దు; మించి జ్ఞానవంతుడవై
యున్ని వుండ వద్దు; నిన్ను నీవు యెందుకు పాడు చేసు
కోవలెను? । మించ చెడ్డవాడవున్ను అవివేకుడవున్ను 17
అయి వుండ వద్దు; నీ కాలమునకు ముందుగానే నీవు
యెందుకు చావ వలెను? । నీవు దీని పట్టుకొని వుండే 18
దిన్ని నీవు దీని చెయి విడువకుండా వుండేదిన్ని నీకు
మంచిది; యేమంటే పరాత్పరునికి భయపడే వాడు
వాటి అంతటినుంచిన్ని గడిచి పోవును. । పట్టణమందు 19
వుండే పదిమంది బలిష్ఠుల కంటే జ్ఞానము జ్ఞానిని యె
క్కువగా బల పరచును. । యేమంటే పాపమును చేయ 20
కుండా మేలు చేసే నీతిమంతుడు భూమి యందు వొక
డైనా లేడు. । నీ పనివాడు నిన్ను శపించునేమో, 21
కాగా చెప్ప పడే యావత్తు మాటలకు నీవు నీ హృద
యమును యివ్వకుము. । యేమంటే అనేక మార్లు నీవు 22
న్ను యితరులను శపించితివని నీ మనస్సు యెరిగి
వుండును. । యిది అంతానున్ను న్యాయముగా చేసు 23
శోధించి చూస్తిని; నేను జ్ఞానమును పొందుతానని చెప్పు
కొంటిని గాని అది నాకు దూరము అయి వుండెను. ।

24 అది దూరముగానున్ను మహా లోతుగానున్ను వున్నది;
25 దాని కనుక్కొనే వాడు యెవడు? । జ్ఞానమున్ను సంగ
తులయొక్క హేతువులనున్ను యెరుగేటందుకున్ను
గ్రహించేటందుకున్ను వెతికేటందుకున్ను మతిహీనత
యొక్క అక్రమమున్ను అవివేకమున్ను పెర్రినిన్ని
తెలుసుకొనేటందుకున్ను నేను నా హృదయమును ప్ర
26 యోగించుకొంటిని. । అయితే దాని మనస్సు వలలుగా
నున్ను వురులుగానున్ను చేతులు కట్లుగానున్ను వున్న
స్త్రీ మరణము కంటే విషపుదని నేను యెరిగితిని; పరా
త్పరుని సముఖమందు సద్గుణము గల వాడు దాని తప్పిం
చుకొంటాడు; అయితే పాపాత్ముడు దాని వల్లను పట్టు
27 పడును. । యిదుగో నా ఆత్మ వెతుకుతూ వున్నప్పటికీ
యింకా నాకు దొరకని వాటిలో వొకటె గ్రహించి
28 నాను. । నేను క్రమముగా తరిచి చూడగా, వెయ్యి మం
దిలోనైనా వొక పురుషుని చూస్తిని గాని వీరందరి
లోను వొక స్త్రీని చూడలేదని ప్రసంగినైన నేను చెప్పు
29 తున్నాను. । యిదుగో పరాత్పరుడు మనుష్యుని తిన్నని
వానిగా కలుగ చేసినాడని మాత్రము నేను కనుగొ
న్నాను; అయితే వారు అనేక వుపాయ తంత్రములను
వెతికినారు.

## 8. అధ్యాయము.

1 జ్ఞాని వంటివాడు యెవడు? సంగతియొక్క భావ
మును యెరిగిన వానికి సమముగా వున్నవాడు యెవడు?
మనిషియొక్క జ్ఞానము తన ముఖమును వెలుగింప
చేసును; దానివల్ల తన ముఖముయొక్క రూపము మా
2 ర్చబడును. । రాజు కట్టడను కాపాడుమని నేను నిన్ను
హెచ్చరిస్తూ వున్నాను; నీవు పరాత్పరునికి పెట్టిన
3 వొట్టు ప్రకారము చేయుము. । నీవు ఆయన ముఖ దృ
ష్టినుంచి చెదరకుండా నడువుము; చెడ్డ కార్యమందు
నిలువవద్దు, యేమంటే ఆయనకు చిత్తమై వుండేది అంతా
4 ఆయన చేసును. । రాజుయొక్క మాటలు అన్నిన్ని అధి
కారము కలవి; నీవు యేమి చేస్తావని అతనితో యెవ
5 డు చెప్ప గలడు? । కట్టడను గైకొనే వాడు చెడ్డ పనిని
చూచి గ్రహించడు; జ్ఞానియొక్క హృదయము కాల
6 మున్ను న్యాయమున్ను యెరుగును. । యేమంటే
ప్రతి వుద్దేశమునకు కాలమున్ను న్యాయమున్ను కలవు,
కాగా మనుష్యుని మీద వుండే వానియొక్క కీడు
7 విస్తారము. । యేమి సంభవించునో అది వాడు యెరుగ
డు; సంభవించ బోయే కాలము యెప్పుడో వానికి తెలి
8 పేవాడు యెవడు? । ఆత్మను విడవకుండా వుండుటకు తన
ఆత్మ మీద మనుష్యుడు అధిపతి కాడు; మరణ దినము
మీద వానికి అధికారమున్ను లేదు; ఆ యుద్ధమందు
ఆయుధములను తీసివేసుట లేదు; దుష్టత తన వారిని విడి
పించదు. । సూర్యుని కింద చేయబడే ప్రతి క్రియ మీదను 9
నేను నా హృదయమును వుంచి, యిది అంతాను
యెరిగితిని; తన నష్టమునకు వొకని పైని వొకడు యేలే
కాలమున్ను కలదు. । ఆ ప్రకారముగానే పరిశుద్ధుల స్థల 10
మునుంచి వచ్చి వెళ్లిపోయిన దుష్టులను పాతిపెట్టబడు
టను చూస్తిని; అలాగున చేసిన వారు వూరి యందు మరచ
బడినారు: యిదిన్ని మాయ. । దుష్క్రియకు తగిన న్యాయపు 11
తీర్పు శీఘ్రముగా నడువనందున మనుష్య పుత్రుల
హృదయము వారిలో చెడ్డతనమును చేసుటకు నిండి
పడును. । పాపాత్ముడు నూరుమారులు చెడ్డతనమును 12
చేసి, చాలా దినములు వున్నప్పటికిన్ని, పరాత్పరునికి
భయపడి, ఆయన ముఖమునకు ముందర నిర్మలముగా
వున్న వారే బాగా వుందురని నేను యెరుగుదును. ।
అయితే చెడ్డ వానికి బాగా వుండేది లేదు; వానికి 13
చాలా దినములు వుండేది లేదు; అవి వొక నీడ వలె
వుండును; యేమంటే వాడు పరాత్పరుని యెదుట
నిర్మలము లేకుండా వున్నాడు. । భూమి యందు జరిగే 14
వేరే వొక మాయ కలదు; అదేమంటే కొందరు నీతి
మంతులు కలరు, వారికి చెడ్డ వారి క్రియకు తగినట్టు
గా వచ్చును, కొందరు చెడ్డవారున్ను కలరు, వారికి
నీతిమంతుల క్రియకు తగినట్టుగా వచ్చును: యిదిన్ని
మాయ అని నేను చెప్పుతూ వున్నాను. । అయినందున 15
నేను సంతోషమును పొగడినాను; యేమంటే భుజిం
చేదిన్ని తాగేదిన్ని సంతోషపడేదిన్ని గాక సూర్యుని
కింద వుండే వాటివల్ల మనుష్యునికి వేరే వొక భాగ్య
మున్ను లేదు: పరాత్పరుడు వానికి సూర్యుని కింద
కట్టడ చేసిన వాని జీవిత దినములలో వాని ప్రయాస
చేత వానితో నిలిచిపోయేది అదేను. । నేను జ్ఞానమును 16
యెరుగేటందుకున్ను మనుష్యుడు రాత్రి పగలున్ను
తన కన్నులు నిద్రను కానకుండా వుండేటంత భూమి
యందు వుండే ప్రయాసను చూచేటందుకున్ను నా
హృదయమును వుంచినప్పుడు, । సూర్యుని కింద చేయ 17
బడే క్రియను మనుష్యుడు కనుక్కోలేడని పరాత్ప
రునియొక్క క్రియలు అన్నిన్ని దృష్టించితిని; యెందు
కంటే దాని వెతుకుటకు మనుష్యుడు యెంత ప్రయా
సపడినప్పటికిన్ని వాడు కనుక్కోలేడు; యిదిన్ని గాక
తనకు తెలియబడునని జ్ఞాని అనుకొనినప్పటికిన్ని వానికి
దాని కనుక్కొనే శక్తి లేకపోవును.

## 9. అధ్యాయము.

ఇది అంతానున్ను నేను నా మనస్సు యందు వుం 1
చుకొని, నీతిమంతులున్ను జ్ఞానులున్ను వారి క్రియ
లున్ను పరాత్పరుని చేతి యందు వున్నవనిన్ని వారి
ముందర వుండే అంతటివల్ల స్నేహమో పగో యే మను

ష్యునికైనా తెలియదని యీ యావత్తు సంగతిన్ని
2 తెలియ చేయ కోరితిని. । సంభవించేవి అన్నిన్ని అం
దరికిన్ని వొక్క విధముగానే సంభవించును; నీతిమం
తునికిన్ని చెడ్డ వానికిన్ని మంచి వానికిన్ని శుద్ధముగా
వుండే వానికిన్ని అశుద్ధముగా వుండే వానికిన్ని బలి
యిచ్చే వానికిన్ని బలి యివ్వని వానికిన్ని వొక్కటే
సంభవించును; మంచివాడు యేలాగునో పాపాత్ము
డున్ను ఆలాగేను; వొట్టు పెట్టేవాడు యేలాగునో
3 వొట్టుకు భయపడేవాడున్ను ఆలాగునే. । అందరికిన్ని
వొక్క విధముగానే సంభవించునదేది సూర్యుని కింద
నడిచే వాటి అన్నిటిలో చేడుగా వున్నది, నిజముగా
మానవ పుత్రుల హృదయము చెడ్డతనముతో నిండి
వున్నది; వారు ప్రాణముతో వుండే దినములన్నీ వారి
హృదయమందు వెర్రి వుండును, తరువాత వారు మృ
4 తుల వృద్ధికి వెళ్లిపోదురు. । యేమంటే ప్రాణముతో
వుండే వారందరితో కలసి వున్న వానికి నిరీక్షణ కల
దు; చచ్చిన సింహము కంటే బ్రతికి వున్న కుక్క
5 మేలు. । బ్రతికి వుండేవారు తాము చచ్చుదురని యె
రుగుదురు; అయితే చచ్చిన వారు యేమిన్ని యెరుగరు;
తరువాత వారికి లాభమున్ను లేదు; యేమంటే వారి
6 పేరు మరువపడి వున్నది. । వారి ప్రేమయున్ను వారి
పగయున్ను వారి క్రోధమున్ను సమాప్తి అయి తీరి
పోయినవి; సూర్యుని కింద చేయబడే దేని యందున్ను
7 వారికి యింకా యెప్పటికిన్ని భాగము లేదు. । నీవు
పోయి నీ రొట్టెను సంతోషముతో భుజించుము; నీ
ద్రాక్షారసమును సుఖమైన హృదయముతో తాగుము;
యేమంటే పరాత్పరుడు నీ క్రియల యందు ప్రియ
8 ముగా వున్నాడు. । యావత్తు కాలమందున్ను నీ వస్త్ర
ములు తెల్లటివిగా వుండును గాక; నీ తల మీద నూనె
9 తక్కువ కాకుండా వుండును గాక. । పరాత్పరుడు
నీకు సూర్యుని కింద యిచ్చిన నీ మాయ గల సకల
దినముల మట్టుకు నీవు ప్రేమించే నీ భార్యతో నీ
సకల మాయ గల దినముల మట్టుకు సుఖముగా జీవిం
చుము; యేమంటే యీ జీవమందు నీవు సూర్యుని
10 కింద అనుభవించే నీ శ్రమలో అదే నీ భాగము. । చేసు
టకు నీ చేతనయినది అంతానున్ను నీ బలముతో చే
యుము, యేమంటే నీవు పోయే పాతాళమందు పని
అయినా విద్య అయినా గ్రహింపు అయినా జ్ఞాన
11 మైనా లేవు. । నేను తిరుగుకొని సూర్యుని కింద చూ
చినదేమంటే, చురుకు వారికి పరుగు కాదు; బలమైన
వారికి యుద్ధము కాదు; జ్ఞానము గలవారికి బ్రతుకు
కాదు; బుద్ధిమంతులకు ఐశ్వర్యము కాదు; చమత్కా
రులకు దయయున్ను కాదు; యేమంటే వారందరికిన్ని
12 ప్రాప్తిన్ని దైవయోగమున్ను సందర్భించును. । తన
కాలము యేదో మనుష్యుడు యెరుగడు; చేపలు చెడ్డ
వల యందు చిక్కబడేటట్టుగానున్ను పిట్టలు వల
యందు పట్టుబడేటట్టుగానున్ను చెడ్డ కాలము ఆక
స్మికముగా నర పుత్రుల మీద పడేటప్పుడు వారున్ను
చిక్కపడుతూ వున్నారు. । సూర్యుని కింద యీ 13
జ్ఞానమున్ను చూస్తిని; అది నా చూపుకు గొప్పదై వుం
డెను. । వొక చిన్న పట్టణము వుండెను; దానియందు 14
వుండే మనుష్యులు కొంచెము; దాని మీదికి గొప్ప
రాజు వచ్చి దాని చుట్టుకొని, దానికి యెదురుగా గొప్ప
బురుజులను కట్టించెను. । అయితే అందులో జ్ఞానము 15
కల వొక బీదవాడు కనపడెను; వాడు ఆ పట్టణమును
తన జ్ఞానము వల్లను విడిపించెను; అయినప్పటికిన్ని వొక
డైనా ఆ బీదవాని తలంచ లేదు. । కాగా నేను బీద 16
వాని జ్ఞానము అలక్ష్యము చేయబడి, వాని మాటలు
వినపడక పోయినప్పటికిన్ని, బలము కంటే జ్ఞానమే
మంచిదని అనుకొన్నాను. । మూఢులలో యేలేవాని 17
కూకలకంటే జ్ఞానులయొక్క మాటలే శాంతముగా విన
తగినవి. । యుద్ధపు ఆయుధముల కంటే జ్ఞానమే మం 18
చిది; అయితే వొక పాపాత్ముడు విస్తారమైన మేలును
చెరుచును.

## 10. అధ్యాయము.

చచ్చిన యీగలు వైద్యునియొక్క పరిమళ తైల 1
మును కంపు పట్టేటట్టు చేసును; కొంచెము వెర్రి
జ్ఞానమందున్ను ఘనమందున్ను ప్రవీణత కలవాని
ఆలాగే చేసును. । జ్ఞానియొక్క హృదయము తన కుడి 2
పక్కయందున్ను మూఢుని హృదయము తన యెడమ
పక్కయందున్ను వున్నది. । మూఢుడు మార్గమందు 3
నడిచినప్పటికిన్ని వాడు మతిహీనుడై వున్నాడు; వాడు
అందరితోనున్ను నేను వెర్రివాడనని చెప్పుతున్నాడు. ।
దొరయొక్క కోపము నీ మీద హెచ్చితే నీ స్థలమును 4
విడిచి తొలగ వద్దు; యేమంటే లోపడుట గొప్ప
తప్పితములను అణచి వేసును. । అధిపతినుంచి కలిగే 5
వొక కీడు వున్నది; దాని సూర్యుని కింద చూస్తిని. ।
వెర్రివాడు మహా వున్నతముల యందు వుంచబడుతూ 6
వున్నాడు; అయితే గొప్పవారు కింద కూర్చుని వున్నా
రు. । పనివాండ్లు గుఱ్ఱముల మీదను యెక్కడమున్ను 7
ప్రభువులు పనివాండ్ల వలె భూమి మీద నడువడ
మున్ను నేను చూస్తిని. । గోతిని తవ్వేవాడు యెవడో 8
వాడు దానియందే పడిపోవును; కంచెను కొట్టేవాని
పాము కరుచును. । రాళ్లను తీసివేసే వాడు నొప్పులు 9
అనుభవించును; చెట్లను నరికే వానికి గండము సంభ
వించును. । యినుప ఆయుధము మొద్దుగా వున్నప్పుడు 10
వొకడు దాని పదును చేయక పోతే, అధిక బలమును

దానికి వేయ వలెను; అయితే వొక కార్యమును చక్క
11 గా జరిగించుటకు జ్ఞానమే ప్రధానము. । మంత్రము
లేకపోయినా పాము కరుచును; వదరుబోతు దాని
12 కన్న యోగ్యుడు కాడు. । జ్ఞానియొక్క నోటి మా
టలు యింపుగా వున్నవి; అయితే మూఢుని పెదవులు
13 వానినే మింగివేసును. । తన నోటి మాటలయొక్క
ప్రారంభము మతిహీనమున్ను తన వాక్కుయొక్క
14 ముగింపు చెడ్డ వెర్రిన్ని అవును. । మూఢుడు విస్తార
ముగా మాట్లాడుతాడు, అయినప్పటికిన్ని నడవబో
యేది యేదో మనుష్యుడు యెరుగడు; వాని తరువాత
రాబోయేది వానికి తెలియ చేసేవాడు యెవడు! ।
15 వూరికి పోయే త్రోవ యెరుగనందున మూఢుల ప్ర
16 యాస వారికి ఆయాస పెట్టును.। ఓ దేశమా, నీ రాజు
చిన్నవాడై వున్నప్పుడున్ను ప్రభువులు వుదయమందు
17 భుజించినప్పుడున్ను నీకు అయ్యో! । ఓ దేశమా, నీ
రాజు అధిపతుల పుత్రుడు అయి వున్నప్పుడున్ను నీ
ప్రభువులు వెర్రి పట్టేటందుకు కాకుండా బలము
పొందేటందుకు తగిన కాలమందు భుజించినప్పుడున్ను
18 నీవు భాగ్యము కల దానవు! । అధికమైన సోమారితన
ముచేత యిల్లు శిథిలమై పోవును; చేతుల బద్ధకము వల్ల
19 యిల్లు కారును. । ఆట నిమిత్తము విందు చేయబడును;
ద్రాక్షారసము జీవమును సంతోష పరచును; అయితే
20 సొమ్ము అన్నిటికిన్ని పనికి వచ్చును. । నీ మనస్సు యం
దైనా రాజును శపించవద్దు; నీ పడక గదిలోనైనా
ఐశ్వర్యవంతుని శపించవద్దు; యేమంటే ఆకాశ పక్షి
ఆ కబురును కొంచబోవును, రెక్కలు కలది ఆ సంగ
తిని తెలుపును.

## 11. అధ్యాయము.

1 నీ ఆహారమును నీళ్ల మీద వేయుము; యేమంటే
చాలా దినముల తరువాత నీవు దాని ఫలమును కను
2 కొందువు.। యేడుగురికిన్ని యెనమండ్రుగురికిన్ని కూ
డా పాలు యిమ్ము; యేమంటే భూమి మీద యేమి
3 కీడు వచ్చునో నీవు యెరుగవు. । మేఘములు నీరుతో
నిండి వుంటే భూమి మీద వాన కురుసును; మాను
దక్షిణపు తట్టు పడినా వుత్తరపు తట్టు పడినా మాను
4 యెక్కడ పడునో అక్కడే వుండును. । గాలిని గురు
తుపట్టిన వాడు విత్తడు; మేఘములను దృష్టించిన వాడు
5 కోయడు. । గాలియొక్క త్రోవ యేదో అదిన్ని,
గర్భిణి స్త్రీయొక్క కడుపు యందు యెముకలు పుట్టే
విధము యేదో అదిన్ని నీవు యేలాగున యెరుగవో,
ఆలాగునే సమస్తమునున్ను చేసే పరాత్పరుని క్రియల
6 నున్ను నీవు యెరుగవు. । వుదయమందు నీ విత్తనమును
విత్తుము; సాయంతనమందున్ను నీ చేతిని వెనుక తియ్య
కుము; యేమంటే అది ఫలించునో యిది ఫలించు
నో, లేక రెండున్ను సరి సమానముగా వచ్చునో
నీవు యెరుగవు. । నిజముగా వెలుగు యింపుగా వున్నది; 7
సూర్యుని చూచేది కన్నులకు ప్రియముగానున్ను వున్న
ది. । అయితే మనుష్యుడు చాలా సంవత్సరముల మట్టుకు 8
బ్రతికి వుండి వాటన్నిటి యందున్ను సంతోషముగా
వున్నప్పటికిన్ని, అతడు చీకటియొక్క దినములనున్ను
తలంచవలెను; యేమంటే అవి అనేకముగా వుండును;
సంభవించినదంతా మాయ. । ఓ పడుచువాడా, నీ 9
యౌవనమందు సంతోషపడుము; నీ యౌవనపు దిన
ముల యందు నీ హృదయము నిన్ను సంతుష్టి చేయ
నిమ్ము; నీ మనస్సుయొక్క త్రోవల యందున్ను నీ కన్ను
లయొక్క దృష్టి యందున్ను నీవు నడువుము; అయితే
వీటి అన్నిటి నిమిత్తమున్ను పరాత్పరుడు నిన్ను న్యాయ
తీర్పులోకి తెచ్చునని తెలుసుకొమ్ము; । కాగా నీవు 10
చెడ్డ గుణమును నీ హృదయమునుంచి విడిచిపోనిమ్ము;
ద్రోహము నీ మాంసమునుంచిన్ని తొలగ నిమ్ము; యే
మంటే లేత వయస్సున్ను బాల్యమున్ను మాయ.

## 12. అధ్యాయము.

కీడు దినములు రాకముందున్ను, వీటి యందు నాకు 1
సంతోషము లేదని నీవు చెప్పే సంవత్సరములు చేరక
ముందున్ను, । సూర్యుడైనా వెలుగైనా చంద్రుడైనా 2
నక్షత్రములైనా అంధకారము కాక మునుపున్ను, వాన
పోయిన తరువాత మేఘములు తిరుగా రాక ముందు
న్ను, నీవు నీ సృష్టికర్తను నీ బాల్య దినముల యందు
తలంచుకొమ్ము. । యేమంటే యింటి కావలి వారు వణికి, 3
బలిష్ఠులు వొంగుకొని, దంతములు కొంచెము గనుక
చాలించి, కిటికీలలోనుంచి చూచేవి చీకటి అయిపో
యి, । తిరగటి శబ్దము నిలిచి పోయినందుచేత వీధులలో 4
తలుపులు మూయ పడి, పిట్టయొక్క కూతకు లేచి,
సంగీతపు కుమార్తెలు అంతానున్ను అణగి పోయి, ।
వున్నతమునకు భయము కలిగి, మార్గముల యందు 5
భయములు కనుపడి, బాదంవృక్షము పూలు పూసి,
మిడత బరువుగా వుండి, ఆశ లేకపోయి, అంతట మను
ష్యుడు తనయొక్క నిత్య స్థలమునకు పోవును; వాని
నిమిత్తము దుఃఖించే వారు వీధి యందు తిరుగులాడు
దురు. । వెండి తాడు విడిపోయి, బంగారపు గిన్నె విరిగి 6
పోయి, ధార వొద్ద కుండ పగిలిపోయి, బావి వొద్దను
చక్రము కదియ పడి, । అప్పుడు మన్ను అయినది భూ 7
మికి తిరిగిపోయి, దాని యిచ్చిన పరాత్పరుని యొద్దికి
ఆత్మ తిరుగా పోక ముందే ఆయనను నీ బాల్యమందే
తలంచుకొమ్ము. । వొహొహో, మాయలో మాయ అని 8
ప్రసంగి చెప్పుతూ వున్నాడు; అంతా మాయ. । మరిన్ని 9

ప్రసంగి జ్ఞాని అయి వుండెను గనుక జనులకు అతడు
తెలివిని బోధించెను; అతడు నిదానించి వెతికి, అనేక
10 సామితెలను కూర్చెను. । ప్రసంగి హితమైన మాటలను
కనుక్కొనేటందుకు వుపాయమును వెతికెను; అతడు
వ్రాసినవి తిన్ననివిన్ని సత్య వచనములున్ను అయి
11 వున్నవి. । జ్ఞానులయొక్క వచనములు సమూహముల
యజమానుల వల్లను కూడా కూర్చబడి కొట్టబడిన మెట్టు
లుగానున్ను మేకులుగానున్ను వున్నవి; వొక్క కాపరి
12 వల్లనే అవి యివ్వపడెను. । నా కుమారుడా, యిటు
వంటి వాటికి హెచ్చరికెగా వుండుము; చాలా పుస్తక
ములను రచించేటందుకు అంతము లేదు; విస్తారమైన
విద్య మాంసమునకు ప్రయాసము. । సంగతియొక్క 13
ముగింపును విందుము గాక; పరాత్పరునికి భయపడి
ఆయన కట్టడలను గైకొనుము; యేమంటే యిదే మను
ష్యుడు చేయ వలసిన యావత్తు విధి. । యెందుకంటే 14
ప్రతి క్రియనున్ను అంతరంగమైన ప్రతి సంగతినిన్ని
అది మేలైనా కీడైనా పరాత్పరుడు న్యాయపు తీర్పు
లోకి తెచ్చును.

# సొలొమోనుయొక్క పాట.

## 1. అధ్యాయము.

1,2 సొలొమోనుదైన వున్నతమైన పాట.। ఆయన తన
నోటి ముద్దులతో నన్ను ముద్దు పెట్టుకొనును గాక;
యేమంటే ద్రాక్షారసము కంటే నీ ప్రేమలు యింపు
3 గా వుండును.। నీ పరిమళ తైలము సువాసనగా వున్నది
గనుక నీయొక్క నామము పోయపడిన పరిమళ తైల
మై వున్నది; అందు కొరకు కన్నెకలు నిన్ను ప్రేమిస్తూ
4 వున్నారు.। నన్ను లాగుము, నీ వెనుకను మేము పరు
గెత్తుదుము; రాజు నన్ను తన గదులలోకి పిలుచుక
పోయినాడు: నీ యందు మేము ఆనందించి సంతోష
పడుదుము; ద్రాక్షా రసము కంటే నీ ప్రేమను మేము
యెక్కువగా తలంతుము: తిన్నటివారు నిన్ను ప్రేమి
5 స్తూ వున్నారు.। ఓ యెరూశలేముయొక్క కుమార్తె
లారా, నేను నలుపుగా వున్నప్పటికిన్ని కేదారుయొక్క
గుడారముల వలెనున్ను సొలొమోనుయొక్క పూలు
6 నేత బట్ట వలెనున్ను అందముగా వున్నాను.। నేను
నలుపుగా వున్నానని యెంచ వద్దు, యేమంటే యెండ
నాకు తగిలెను; నా తల్లి పిల్లలు నా మీద కోపముగా
వుండి, నన్ను ద్రాక్ష తోటలయొక్క కావలికత్తెగా
వుంచినారు; నాకు వుండే నా ద్రాక్ష తోటను నేను
7 కాచుకో లేదు.। నా ఆత్మ ప్రేమించేవాడా, నీవు యె
క్కడ మందను మేపుతున్నావో, యెక్కడ దాని
మధ్యాహ్నమందు నీడకు తోలుతున్నావో నాకు తెలి
య చెప్పుమీ: నేను నీ జతకాండ్ల మందల వొద్దను
ముసుకు వేసుకొన్న దాని వలె వుండవలసినదేమి!।
8 స్త్రీలలో రూపవతివైనదానా, అది నీకు తెలియకపోతే,
నీవు బయిలు వెళ్లి, మందయొక్క అడుగులను వెంబడిం
చుకొని పోయి, మంద కాపరుల గుడారముల యొద్దను
9 నీ మేకపిల్లలను మేపుము.। నా ప్రియురాలా, ఫరో
యొక్క రథములకు కట్టి వున్న వొక గుర్రపు సమూ
10 హమునకు నిన్ను నేను సాటి చేసుకొన్నాను.। నీ చెం
పలు ఆభరణములవల్ల చక్కగా వున్నవి; నీ మెడ గొలు
11 సులవల్ల అందముగా వున్నది.। వెండి బొత్తములతో
12 బంగారపు ఆభరణములను నీకు చేయింతుము.। రాజు
తన పంక్తి యందు వుండేటప్పుడు నా మంచి తైలము
13 దాని వాసనను బయిలు వెళ్లచేసును.। నా ప్రియుడు
నాకు మర్ర అనే చెట్టుయొక్క గుత్తి వలె వున్నాడు;
అతడు రాత్రి అంతా నా రొమ్ములో పడుకొనును.।
నా ప్రియుడు నాకు ఏన్గెదీ వూరు ద్రాక్ష తోటల 14
లో మొలిచే అతికర్పూరపు చెట్టుయొక్క గుత్తి
వలె వున్నాడు.। నా ప్రియురాలా, యిదుగో నీవు 15
చక్కటిదానవు; యిదుగో నీవు చక్కటిదానవు; నీ
కన్నులు పావురముల కన్నులవంటివి.। యిదుగో నా 16
ప్రియుడా, నీవు రూపవంతుడవు; నీవు వుత్తమమైన
వాడవు; మన పరుపున్ను పచ్చనిదై వున్నది.। మన యింటి 17
దూలములు సీడరు చెట్టువి; మన వాసాలు దేవదారు
వృక్షపువి.

## 2. అధ్యాయము.

నేను షారోనుయొక్క గులాబి పుష్పమున్ను, పల్లపు 1
తగ్గులయొక్క లీలియా పుష్పమున్ను అయి వున్నాను.।
ముళ్లలో లీలియా పుష్పము యే ప్రకారముగా వున్నదో 2
ఆ ప్రకారముగానే కుమార్తెలలో నా ప్రియురాలు
వున్నది.। అడవి మానులలో దబ్బచెట్టు యే ప్రకార 3
ముగా వున్నదో ఆ ప్రకారముగానే కుమాళ్లలో నా
ప్రియుడు వున్నాడు; వాని నీడ యందు మహానంద
ముతో కూచుంటిని; వాని ఫలము నా రుచికి మధు
రముగా వున్నది.। అతడు నన్ను ద్రాక్షారసపు యిం 4
టికి పిలుచుకొని పోయినాడు; నా మీదవుండే అతని
జండా ప్రేమ.। ద్రాక్షారస పానములతోను నన్ను 5
బలపరచుము; దబ్బ ఫలములతోను నన్ను ఆదరించుము;
యేమంటే ప్రేమ నన్ను క్షయించుచున్నది.। అతని 6
యెడమ చెయ్యి నా తల కింద వుండును గాక; అతని
కుడి చెయ్యి నన్ను కౌగలించును గాక.। ఓ యెరూశ 7
లేము కుమార్తెలారా, నా ప్రియుడు కోరిన దాక
అతని మీరు లేపకుండానున్ను మేలుకొనేటట్టు యేమి
చేయకుండానున్ను వుండవలెనని అడవి మెగజింకల
మీదనున్ను ఆడుజింకల మీదనున్ను నేను ప్రమాణము
చేసి మిమ్మును బతిమాలుతున్నాను.। అదుగో నా 8
ప్రియుని శబ్దము! అతడు కొండల మీదను యెగిరా
డుతూ, మెట్టల మీదను లగువులు వేస్తూ వస్తూ వు
న్నాడు, చూడుమీ.। నా ప్రియుడు వొక మెగజింక 9
వలెనున్ను లేక వొక ఆడుజింక పిల్ల వలెనున్ను వున్నాడు;
యిదుగో అతడు మా గోడకు వెలిగా నిలుచుని కిటికీ
సందులోనుంచి తన ముఖమును కనుపరుచుతూ వున్నా
డు.। నా ప్రియుడు మారుత్తరము తెలియచేసి నాతో 10
చెప్పినదేమంటే, నా ప్రియురాలా, నా సౌందర్యవతి

11 వైనదానా, లేచి రమ్ము. । యేమంటే యిదుగో చలికా
12 లము గతించినది, వాన విడిచి తీరిపోయినది. । పుష్ప
ములు భూమియందు కనుపడుతూ వున్నవి; పిట్టలు
కూసే కాలము వచ్చినది; అడవి పావురముయొక్క
13 శబ్దము మన దేశమందు వినబడుతున్నది. । అంజూరపు
చెట్టు దాని కాయలు కాస్తూ వున్నది; ద్రాక్ష చెట్లు
పువ్వులు పూసి పరిమళిస్తూ వున్నవి. నా ప్రియు
14 రాలా, నా సౌందర్యవతివైనదానా, లేచి రమ్ము. । వుదు
దుడుకు రాళ్లయందున్ను పర్వత ప్రపాతములయొక్క
చాటులయందున్ను వుండే వో నా పావురమా, నీ ముఖ
మును నాకు కనుపరచుమీ, నీ శబ్దము నాకు వినుపిం
చుమీ; యేమంటే నీ శబ్దము రమ్యమైనది; నీ ముఖము
15 అందమైనది. । ద్రాక్ష తోటలను చెరిపే పెద్ద నక్కల
నున్ను చిన్న నక్కలనున్ను మా కొరకు పట్టుకొండి;
యేమంటే మా ద్రాక్షచెట్లు పిందెలను కాసి వున్నదని
16 చెప్పుతూ వున్నాడు. । నా ప్రియుడు నా వాడు; నేను
అతనిదానను; అతడు లీలియా పుష్పములలో మేస్తూ
17 వున్నాడు. । నా ప్రియుడా, తెల్లవారే మట్టుకున్ను
నీడలు జరిగిపోయే మట్టుకున్ను నీవు తిరిగి వుదుదుడు
కుల రాతికొండల మీద దుముకుతూ వచ్చే మొగజింక
వలెనున్ను లేక ఆడుజింకయొక్క పిల్ల వలెనున్ను
వుండుము.

## 3. అధ్యాయము.

1 నా ఆత్మ ప్రేమించే వాని రాత్రి కాలము యందు
నా పడక మీద నేను వెతికితిని; వాని నేను వెతికితిని
2 గాని వాని కానలేకపోతిని. । అయినందున నేను యి
ప్పుడు లేచి, పట్టణమందు త్రోవల యందున్ను వీధుల
యందున్ను తిరుగులాడి, నా ఆత్మ ప్రేమించేవాని వెతు
కుదును; నేను వాని వెతికితిని గాని నేను వాని కాన
3 లేకపోతిని. । పట్టణములో వుండే కావలి వారు నన్ను
చూడగా నేను వారితో నా ఆత్మ ప్రేమించే వాని
4 చూస్తిరా అని అంటిని. । అయితే నేను కొంచెము
దూరము వారిని విడిచి దాటినప్పుడు నా ఆత్మ ప్రే
మించే వాని చూచి, వాని నేను నా తల్లి యింట్లోకిన్ని
నన్ను కన్న దాని గదిలోకిన్ని కొంచవచ్చే మట్టుకు
5 పట్టుకొని వెళ్లనిచ్చినాను కాను. । ఓ యెరూశలేము
కుమార్తెలారా, నా ప్రియుడు కోరిన దాక అతని
మీరు లేపకుండానున్ను మేలుకొనేటట్టు యేమీ చేయ
కుండానున్ను వుండ వలెనని అడవి మొగజింకల మీద
నున్ను ఆడుజింకల మీదనున్ను నేను ప్రమాణము చేసి
6 మిమ్మును బతిమాలుతున్నాను. । మర్ర అనే దానితో
నున్ను సాంబ్రాణితోనున్ను అంగడివాని సకల విధ
మైన సుగంధవర్గములతో పరిమళించబడి పొగస్తంభము
లవలె అరణ్యములోనుంచి పైకి వచ్చే యితడు యెవడు
చెప్పుమా. । యిదుగో, సొలొమోనుదైన తన పల్లకి చూ 7
డుమీ; ఇశ్రాయేలుయొక్క శౌర్యవంతులలో అరువై
మంది శౌర్యవంతులు దాని చుట్టూ నిలుచుని వున్నారు. ।
వీరందరున్ను కత్తి పట్టుకొని యుద్ధ ప్రవీణత గలవా 8
రయి వున్నారు; రాత్రికాలములయొక్క భయము నిమి
త్తము వొక్కొక్కని తొడ మీద తన కత్తి వున్నది. । సొ 9
లొమోను అనే రాజు తన కోసము లెబానోను
యొక్క కర్రతో వొక మంచమును చేయించినాడు. ।
దాని స్తంభములు వెండివి; దాని అడుగు బంగారపుది; 10
దాని పరుపు వూదా వర్ణపుది; దాని మధ్యను యెరూ
శలేముయొక్క కుమార్తెల నిమిత్తము ప్రేమ అనే
కింది వరుస చేయబడి యున్నది. । ఓ సీయోను కుమా 11
ర్తెలారా, మీరు బైలు వెళ్లి, తన పెండ్లి దినములలో
నున్ను తన మనస్సంతోషపు దినములయందున్ను తన
తల్లి తనకు వేసిన కిరీటముతో ధరించబడిన రాజైన సొలొ
మోనును దృష్టించి చూడండి.

## 4. అధ్యాయము.

ఇదుగో, నా ప్రియురాలా, నీవు రూపవతివి; 1
యిదుగో, నీవు రూపవతివి; నీ వెంట్రుకల నడుమ నీ
కన్నులు పావురముల కన్నులై వున్నవి; నీ తల వెంట్రు
కలు గిలాదు పర్వతమందు పచ్చికను మేసే నల్లటి
మేకల మందల వలె వున్నవి. । నీ పళ్లు వెంట్రుకలు 2
కత్తిరించిన పిమ్మట కడగబడినవిన్ని వాటిలో వొకటైనా
గొడ్డుది కాకుండా ప్రతి గొర్రె రెండేసి పిల్లలను వేసే
గొర్రెల మందవలె వున్నవి. । నీ పెదవులు యెరుపు నూ 3
లుకు సమానము; నీ మాటలు యింపైనవి; నీ వెంట్రు
కల నడుమ నీ బుగ్గలు దానిమ్మ పండు అందము వంటివి. ।
నీ మెడ ఆయుధ సాలగా కట్టబడిన దావీదుయొక్క 4
దుర్గమువలె వున్నది; వెయి బరచీలు దానియందు వ్రేలా
డుతూ వున్నవి; అవి అన్నిన్ని పరాక్రమశాలులయొక్క
కేడెములు. । నీ రెండు స్తనములు లీలియా పుష్పముల 5
యందు మేసే అడవి జింకయొక్క రెండు ఆడుపిల్లలకు
సమానముగా వున్నవి. । పగలు చల్లపడి నీడ జరిగిపోయే 6
వరకు మర్ర పర్వతమున్ను సాంబ్రాణి కొండకున్ను
నేను పోయి వుందును. । నా ప్రియురాలా, నీవు సం 7
పూర్ణ సౌందర్యము గలదానవు; నీ యందు యే మరక
అయినా లేదు. । నాతో కూడా లెబానోనునుంచి 8
రమ్ము; పెండ్లికూతురా, నాతో కూడా లెబానోను
నుంచి రమ్ము; సింహములయొక్క గుహలున్ను సివంగుల
యొక్క పర్వతములున్ను వుండే అమానయొక్క శిఖరము
నుంచిన్ని షెనీరు హెర్మోను అనే కొండలయొక్క
శిఖరమునుంచిన్ని దృష్టించి చూడుము. । నా సహోదా 9

డరీ, పెండ్లికూతురా, నీవు నా హృదయమును అపహ
రించుకొంటివి; నీ కన్నులలో వొకదానివల్లనున్ను నీ
మెడ మీద వుండే వొక గొలుసువల్లనున్ను నీవు నా
10 హృదయమును అపహరించుకొంటివి. । నీ ప్రేమ
యెంత మంచిది, నా సహోదరీ, పెండ్లికూతురా! ద్రా
క్షారసము కంటే నీ ప్రేమ యెంత మంచిది? సకల
గంధవర్గముల కంటే నీ పరిమళ తైలముయొక్క
11 వాసన యెంత యింపు అయి వున్నది! । ఓ పెండ్లికూ
తురా, నీ పెదవులు తేనెపట్టు కారినట్టు గానే వున్నవి;
తేనెయున్ను పాలున్ను నీ నాలుక కింద వున్నవి; నీ
12 వస్త్రముల వాసన లెబానోను వాసనకు సమానము. । నా
సహోదరి, పెండ్లికూతురు, ఆవరణ గల తోటయున్ను
గట్టు వేయబడిన నీళ్ల వూటయున్ను కట్టుచేయబడిన
13 బావిన్ని అయి వున్నది. । నీ తోటలో దానిమ్మ చెట్లున్ను
వింతయిన ఫల వృక్షములున్ను వున్నవి; కర్పూరమున్ను;
14 పరిమళ తైలపు చెట్లున్ను, । కుంకుమయున్ను, తియ్యని
కర్ర చెట్లున్ను, కారపు చెక్క చెట్లున్ను, సకల విధ
వృక్షములున్ను, మర్ర చెట్లున్ను, అలోసి చెట్లున్ను,
ముఖ్యమయిన గంధవర్గముల చెట్లున్ను అందులో
15 వున్నవి. । నా సహోదరి తోటలకు నీళ్ల వూటలున్ను
జీవపు నీళ్లయొక్క బావిన్ని లెబానోనునుంచి పారే
16 కాలువలున్ను వున్నవి. । ఓ వుత్తరపు గాలీ, నీవు లెమ్ము,
దక్షిణపు గాలీ, నీవు వచ్చి సుగంధ వాసనలు కొట్టే
టట్టు నా తోట మీద విసురుము; నా ప్రియుడు
తన తోటలోకి వచ్చి తన వింతయిన ఫలములను
భక్షించును గాక.

## 5. అధ్యాయము.

1 నా సహోదరీ, పెండ్లికూతురా, నేను నా తోట
లోకి వస్తిని; నా సాంబ్రాణిని నా గంధవర్గములతో
కూడా కోస్తిని; నా తేనె పట్టును నా తేనెతో కూడా
భుజించితిని; నా ద్రాక్షారసమున్ను నా పాలతో
కూడా తాగితిని; ఓ స్నేహితులారా, భుజించండి; ఓ
2 ప్రియులారా, సమృద్ధిగా పానించండి. । నేను నిద్రిం
చితిని గాని నా హృదయము మేలుకొని యున్నది;
తలుపు తట్టే నా ప్రియుని శబ్దము వింటిని; అతడు
నాతో చెప్పుతున్నదేమంటే, నా ప్రియురాలా, నా
పావురమా, నా నిష్కళంకమైనదానా, నాకు తెరువు
ము; యేమంటే నా శిరస్సు మంచుతోనున్ను నా వెం
ట్రుకలు రాత్రి కురిసే తుంపరలతోనున్ను నిండి వున్నది
3 అని పలికినాడు. । నేను నా అంగీని తీసివేసితిని; యే
లాగు దాని తిరుగా వేసుకొందును? నా కాళ్లను కడు
గుకొంటిని; యేలాగు వాటిని తిరుగా మైల చేతును
4 అని పలికితిని. । నా ప్రియుడు తన చేతిని తలుపు
ద్వారమందు చాపినాడు, అప్పుడు నా పేగులు అతని
నిమిత్తము కదిలినవి. । నా ప్రియునికి తెరచేటందుకు 5
నేను లేచితిని; నా చేతులనుంచి సాంబ్రాణిన్ని నా
వేళ్లనుంచి సుగంధమైన సాంబ్రాణిన్ని తలుపు పిళ్లమీద
కారెను. । నేను నా ప్రియునికి తెరిచితిని, అయితే నా 6
ప్రియుడు తొలగి పోయినాడు; అతడు మాట్లాడి
నప్పుడు నా ఆత్మ నన్ను విడిచిపోయెను; నేను అతని
వెతికితిని గాని అతని నేను కానలేక పోతిని; అతని
పిలిచితిని గాని అతడు నాకు మారుత్తరమును యివ్వ
లేదు. । పట్టణమందు తిరిగే కావలివారు నన్ను చూచి 7
కొట్టినారు; వారు నన్ను గాయపరచినారు; గోడలను
కాచేవారు నా మీద వున్న నా ముసుకును తీసుక
పోయినారు. । ఓ యెరూశలేము కుమార్తెలారా, నా 8
ప్రియుని మీరు చూచినట్టయితే నేను ప్రేమవల్ల క్షీణిం
చుతున్నాను అని అతనితో తెలుపవలెనని మీకు
వొట్టు పెట్టుతూ వున్నాను. । ఓ స్త్రీలలో సుందరవతి 9
వైనదానా, వేరే వొక ప్రియుని కంటే నీ ప్రియునికి
యేమి విశేషము చెప్పుమీ; నీవు యీ ప్రకారముగా
మమ్మును వొట్టు పెట్టేటందుకు వేరే వొక ప్రియుని
కంటే నీ ప్రియునికి యేమి విశేషము చెప్పుమీ. ।
నా ప్రియుడు తెలుపుగానున్ను యెరుపుగానున్ను 10
వున్నాడు; పదివేలలో అతడు ముఖ్యుడు. । అతని 11
శిరస్సు అపరంజి వంటిది; అతని వెంట్రుకలు వుంగర
పువిన్ని కాకివలెనే నల్లటివిన్ని అయి వున్నవి. । అతని 12
కన్నులు నీళ్ల నదుల దగ్గిర వుండే పావురముల కండ్ల
వంటివి; అవి పాలలోను కడుగ బడినవిన్ని చక్కగా
రూపించ బడినవిన్ని అయి వున్నవి. । అతని బుగ్గలు 13
పరిమళ పుష్పముల గోపురము వంటివి; సుగంధవర్గ
పు చెట్ల శిఖరముల వంటివి; అతని పెదవులు లీలియా
పుష్పముల వంటివి; వాటినుంచి పరిమళమైన సాంబ్రాణి
కారుతున్నది. । అతని చేతులు గరుడపచ్చ రాతితో 14
అంటించిన బంగారపు కడియాలై వున్నవి; అతని దేహ
ము నీలములలో పరచబడిన ప్రశస్తమైన దంతము
వంటిది. । అతని తొడలు అపరంజి పీటల మీద నిలిచే 15
చలవ రాతి స్తంభముల వంటివి; అతని ముఖము లెబా
నోను వలెనున్ను సీడరు మానుల వలె ప్రశస్తమైన
దిన్ని వున్నది. । అతని నోరు అతి మధురముగా 16
వున్నది; నిజముగా అతడు రమణీయుడు; ఓ యెరూశ
లేము కుమార్తెలారా, యితడే నా ప్రియుడు, యి
తడే నా స్నేహితుడు సుమండీ.

## 6. అధ్యాయము.

నీ ప్రియుడు యెక్కడికి పోయినాడు, స్త్రీలలో 1
రూపవతివైన దానా! నీ ప్రియుడు యే స్థలమునకు

తిరిగినాడు, చెప్పుమీ? నీతో కూడా మేమున్ను అతని
2 వెతుకుదాము. ।తోటలలో మేసుటకున్ను లీలియా
పుష్పములను కోసుటకున్ను నా ప్రియుడు తన తోట
కున్ను సుగంధవర్గపు మళ్లకున్ను దిగి పోయినాడు.।
3 నేను నా ప్రియునిదానను, నా ప్రియుడు నా వాడు;
అతడు లీలియా పుష్పములలో మేస్తూ వున్నాడు. ।
4 ఓ నా ప్రియురాలా, నీవు తిర్స పట్టణము వలె సుం
దరముగానున్ను యెరూశలేము వలె చక్కగానున్ను
వున్నావు; జండాలుతో వచ్చే సైన్యము వలె భయంక
5 రమైన దానవు. । నీ కన్నులను నానుంచి తిప్పివేయుము,
యేమంటే అవి నన్ను జయించినవి; నీ వెంట్రుకలు
గిలాదు పర్వతమందు పచ్చికను మేసే నల్లటి మేక మం
6 దల వలె వున్నవి.। నీ పళ్లు కడుగబడిన చోటునుంచి
పయికి యెక్కి వస్తూ వొకటైనా గొడ్డుది కాకుండా
అన్నిన్ని రెండేసి పిల్లలను వేసే గొర్రెల మందవలె
7 వున్నవి. । నీ వెంట్రుకల నడుమ నీ బుగ్గలు దానిమ్మ
8 పుష్పముయొక్క శృంగారము వంటివి. । రాణులు అరు
వై మందిన్ని ఉపపత్నులు యెనభైమందిన్ని కలరు;
9 పడుచులు లెక్క లేకుండా వున్నారు. । అయితే నా
పావురమున్ను నా నిష్కళంకమైనదిన్ని వొకతేను;
అది దాని తల్లికి యేకమైనది; అది దాని కనిన దానివల్ల
యేర్పరచుకోబడినది; కుమార్తెలు దాని చూచి దాని
భాగ్యశాలి అని పలికినారు; రాణులున్ను ఉపపత్ను
10 లున్ను దాని చూచి పొగడినారు. । వుదయ కాలము
వలె తేరి చూచి, చంద్రుని వలె అందముగానున్ను సూ
ర్యుని వలె కాంతిగానున్ను జండాలుతో వచ్చే సైన్య
ము వలె భయంకరముగానున్ను వున్న యీబిడె యెవతె
11 చెప్పుమా. । పల్లపు తగ్గుయందు మొలచిన చెట్లను చూ
చుటకున్ను ద్రాక్ష చెట్లు చిగిరించినవో దానిమ్మ చెట్లు
పూసినవో చూచుటకున్ను ప్రశస్తమైన చెట్ల తోటకు
12 నేను దిగి వెళ్లితిని. । నేను తలంచక ముందే నా ఆత్మ
నన్ను అమ్మీనాదీబుయొక్క రథముల వలె చేసినది. ।
13 తిరుగుము, తిరుగుము, ఓ షూలమ్మీతురాలా, నిన్ను
మేము చూచేటట్టుగా తిరుగుము, తిరుగుము. షూల
మ్మీతురాలి యందు మీకు యేమి కనుపడును? అది
రెండు సైన్యముల సమూహమునకు సమానము అయి
వున్నది.

## 7. అధ్యాయము.

1 ఓ రాచకుమార్తె, పాద రక్షలలో వున్న నీ పాద
ములు యెంత అందమై వున్నవి! నీ అవయవములయొ
క్క సొగసు విచిత్రపు పనివాండ్ల చేతి పని అయిన
2 భూషణముల వలె వున్నది. । నీ నడుము వెలితి లేని గుం
డ్రటి పాత్రవలె వున్నది; నీ రొమ్ము లీలియా పుష్ప
ములలోను కుప్ప కూర్చిన గోధుమ రాశి వలె వున్నది.।
నీ రెండు స్తనములు అడవి జింకయొక్క అమడ పిల్ల 3
లకు సమానముగా వున్నవి. । నీ మెడ దంతపు దుర్గ 4
ము వలె వున్నది; నీ కన్నులు బత్రబ్బీము ద్వారము
వొద్ద వున్న హెష్బోను వూరు యందు వుండే కోనే
ర్ల వలె వున్నవి; నీ ముక్కు దమస్కు వైపు చూస్తూ
వుండే లెబానోనుయొక్క గోపురము వలె వున్నది. ।
నీ మీద వుండే నీ శిరస్సు కర్మెలు వంటిదిన్ని నీ శిరస్సు 5
యొక్క సన్నపు వెంట్రుకలు వూదా వర్ణము వలె
నున్ను వున్నవి; రాజు నీ వుంగరపు వెంట్రుకల వల్ల
బంధించబడిన వాని వలె నిలుచుని వున్నాడు. । ఓ మన 6
స్సంతోషమును కలుగ చేసే ప్రియురాలా, నీవు
యెంతో రూపవతివి! యెంతో చక్కని దానవు! ।
నీవు తాటి చెట్టంత ప్రమాణము కలదానవు; నీ స్తన 7
ములు ద్రాక్ష గెలల వంటివి. । నేను తాటి చెట్టు యెక్కి 8
దాని కొమ్మను పట్టుకొందును అని పలికినాను; యిప్పు
డున్ను నీ స్తనములు ద్రాక్ష చెట్లయొక్క గెలల వలె
నున్ను నీ ముక్కుయొక్క వాసన దబ్బ పండ్ల వలెను
న్ను వుండును. । నీ అంగిలి నా ప్రియుడు మృదువుగా 9
పానించేదిన్ని నిద్రిస్తూ వున్న వారి పెదవులను మా
ట్లాడ చేసేదిన్ని అయిన మంచి ద్రాక్షారసము వలె
నున్ను వుండును. । నేను నా ప్రియుని దానను; అతని 10
ఆశ నా యందు వున్నది. । నా ప్రియుడా, రమ్ము, మన 11
ము బయిటికి బోయి గ్రామములలో బస చేతుము
గాక. । మనము వుదయమందు ద్రాక్ష తోటలకు పోయి 12
ద్రాక్ష చెట్లు చిగురించినదో దాని పువ్వు పూసినదో
దానిమ్మ చెట్లు పూసినవో చూతాము, రమ్ము, అక్కడ
నా ప్రియమైన యీవులను నీకు నేను యిత్తును. ।
దుదాయములు వాసన వేస్తూ వున్నవి; మన ద్వారముల 13
వొద్దను సకల విధమైన చక్కని కొత్త ఫలములున్ను
పాత ఫలములున్ను కలవు; ఓ నా ప్రియుడా, నేను
నీ నిమిత్తము వాటిని వుంచితిని.

## 8. అధ్యాయము.

నీవు నా తల్లియొక్క స్తనములను కుడిచిన నా 1
సహోదరుని వలె వుంటే యెంత మేలు! అప్పుడు
నేను బయిట యెదురాడి నిన్ను ముద్దు పెట్టుకొందును;
నిజముగా వారు నన్ను నిందించకుండా వుందురు. ।
నీవు నన్ను బోధించేటట్టుగా నిన్ను నేను యీడ్చు 2
కొని, నా తల్లి యింటికి పిలుచుకొ పోదును; నేను
నా దానిమ్మ పండ్ల రసమును నీకు తాగుటకు యిత్తును. ।
అతని యెడమ చెయ్యి నా తల కింద వుండును గాక; 3
అతని కుడి చెయ్యి నన్ను కౌగలించును గాక. । ఓ 4
యెరూశలెము కుమార్తెలారా, నా ప్రియుడు కోరిన

దాక అతని లేపకుండానున్ను అతడు మేలుకొనేటం
దుకు యేమిన్ని చేయకుండానున్ను వుండుటకు మీకు
5 వొట్టు పెడుతూ వున్నాను. । వనాంత్రమునుంచి పైకి
లేచి తన ప్రియుని మీద ఆనుకొని వస్తూ వున్న యీ
బిడె యెవతె చెప్పుమా! దబ్బ చెట్టుకింద నిన్ను నేను
పెడితిని; అక్కడ నీయొక్క తల్లి నిన్ను కనెను; అక్కడ
6 నిన్ను కనిన స్త్రీ ప్రసవమైనది. । నన్ను ముద్రవలె నీ
హృదయము మీదనున్ను ముద్రవలె నీ భుజము మీద
నున్ను వుంచుకొమ్ము; యేమంటే ప్రేమ మరణమంత
బలముగాను వున్నది; అనుమానము పాతాళమంత కఠిన
ముగా వున్నది; దాని నిప్పులు తీక్ష్ణమైన మంట గల
7 అగ్గి నిప్పులు అయి వున్నవి. । చాలా వుదకములు
ప్రేమను ఆర్పలేవు; నదులు దానిని చల్లార్చలేవు;
వొకడు తన యింటి ఆస్తి అంతా ప్రేమ నిమిత్తము
యిచ్చినా అది బొత్తిగా అలక్ష్యము చేయబడును. ।
8 మనకు వొక చిన్న సహోదరి గలదు; ఆమెకు స్తన
ములు లేవు; మన సహోదరిని అడగ వచ్చే దినములో
9 ఆమెకు యేమి చేతుము! । ఆమె గోడ అయితే ఆమె
మీద వొక వెండి కోటను కట్టుదుము; ఆమె తలుపు
అయితే సీడరు పలకలను ఆమెకు అంటింతుము. । నేను 10
గోడనై యున్నాను; నా స్తనములు గోపురముల లా
టివి; అయితే అతని దృష్టియందు నేను సమాధానమును
పొందిన దాని వలె వుంటిని. । బయల్హామోను యందు 11
సొలొమోనుకు వొక ద్రాక్ష తోట వుండెను; అతడు
ఆ తోటను కావలి వారి వశమందు వుంచెను; ప్రతి
వాడు అధిక ఫలమును కొంచ వచ్చేటట్టుగా వెయి
వెండి కాసులకు అతడు యిచ్చినాడు. । నా ద్రాక్ష 12
తోట నా సముఖమందు వున్నది; ఓ సొలొమోనా,
నీకు వెయ్యిన్ని, దాని ఫలమును కాపాడే వారికి రెండు
నూర్లున్ను, వుండవలెను. । తోటల యందు వాసము 13
గా వుండేదానా, తోట వాండ్లు నీ శబ్దమును వింటూ
వున్నారు; దానిని నన్ను కూడా విన నిమ్ము. । నా ప్రి 14
యుడా, నీవు త్వర చేసుకొని, గంధవర్గముల పర్వ
తముల మీద మొగ జింకకున్ను లేక ఆడుజింక పిల్ల
కున్ను సమానముగా వుండుము.

# దీర్ఘదర్శియైన యెషయాయొక్క గ్రంథము.

## 1. అధ్యాయము.

1 ఉజ్జీయా, యోతాము, ఆహాజు, హిజ్కియా, అనే
యూదా రాజులయొక్క దినములందు యూదాను
గురించిన్ని యెరూశలేమును గురించిన్ని ఆమోసు కుమా
రుడైన యెషయాకు కనపడిన దర్శనము: యేమంటే;।
2 ఓ ఆకాశములారా, వినుడీ; ఓ భూమీ, నీ చెవిని
వొగ్గుము; యేమంటే యెహోవా పలికియున్నదే
మంటే, నేను పిల్లలను పోషించి పెంచితిని, అయితే
3 నా మీదికి వారు తిరగబడిరి.। యెద్దు తన యజమాని
నిన్ని గార్దభము తన యేలినవానియొక్క తొట్టినిన్ని
యెరుగును, అయితే ఇశ్రాయేలు నన్ను యెరుగక
వున్నాడు; గ్రహించుటకు బుద్ధి నా జనులకు లేకపో
4 యెనని పలికెను.। యీ పాపపు జనాంగముకున్ను
అక్రమమనే భారము కిందనున్న యీ జనులకున్ను
యీ దుష్టసంతతికిన్ని చెడిపోయిన యీ పిల్లలకున్ను
అయ్యో! వారు యెహోవాను విడిచిపెట్టిరి; వారు
ఇశ్రాయేలుయొక్క పరిశుద్ధుడైన వానికి కోపము యె
5 క్కించి వెనుకకు తిరిగి దూరముగా వుండిరి.। మీరు
యింకా యెందుకు కొట్లపడుతారు? యింకా మీరు
యెందుకు తిరుగుబాటు చేస్తారు? శిరస్సంతా వ్యాధిగా
6 వున్నది; గుండె అంతా కరిగిపోయినది.। అరికాలు మొ
దలుకొని శిరస్సు పర్యంతము ఆరోగ్యత గల చోటు
వొకటైనా లేదు; గాయములున్ను చితుకుటలున్ను
చీము కారే వ్రణములున్ను కలిగి వున్నవి; అవి వూడి
నవి కావు; కట్టినవి కావు; తైలముతోటి మెత్తన చేయ
7 పడలేదు.। మీ దేశము పాడై పోయెను; మీ పట్టణ
ములు అగ్నిచేత దహన మాయెను; మీ భూమిని మీ
కనుదృష్టిలోనే పరదేశులు మింగివేస్తూ వున్నారు; అది
పరదేశులచేత బోర్లించపడినట్టు పాడై పోయెను.।
8 మరిన్ని సీయోను కుమార్తె ద్రాక్ష తోటలోనున్న
గుడిసె వలెనున్ను దోసపాదులలో వున్న పాక వలె
నున్ను చుట్టవేసుకోపడిన పట్టణము వలెనున్ను విడువ
9 పడెను.। సైన్యములయొక్క యెహోవా కొంచమైనా
మనకు శేషము వుండనియ్యకపోతే మనము సొదొమ
పట్టణము వలెనున్ను గొమొర్రా పట్టణము వలెనున్ను
10 అవుదుము.। ఓ సొదొమ అధికారులారా, యెహో
వా వాక్యమును వినుడీ; ఓ గొమొర్రా జనులారా,
11 మన దేవుని న్యాయమునకు చెవి వొగ్గండి.। యెహో
వా ఆనతిచ్చినది యేమంటే, మీ విస్తారమైన బలులు
నాకు యెందుకు? గొర్రె పొట్టేళ్లయొక్క హోమా
ర్పణల వల్లనున్ను కొవ్విన మృగముల కొవ్వు వల్లను
న్ను నేను తృప్తిని పొందితిని; యెడ్లయొక్కయున్ను
గొర్రెలయొక్కయున్ను మేకపోతులయొక్కయున్ను
రక్తమును నేను కోరలేదు.। నా సముఖమందు మీరు 12
నిలుచుటకు వచ్చినప్పుడు నా సాలలను త్రొక్కుటకు
మిమ్మున యెవరు కోరినారు?।యికను వ్యర్థమైన అర్ప 13
ణలను తేకండి; ధూపము నాకు అసహ్యము; అమా
వాస్యలనున్ను సబ్బాతు దినములనున్ను సంఘముల
నున్ను వీటిని నేను వోర్చలేను; మీ వుపవాసపు దిన
ము సహా నాకు దుఃఖకరముగా వున్నది.। మీ అమా 14
వాస్యలనున్ను మీ సంభ్రమపు దినములనున్ను నా
మనస్సు రోయును; అవి నాకు మహా భారముగా వున్నం
దున నాకు మోయ శక్తి లేదు.। మరిన్ని మీ అరిచేతు 15
లను మీరు యెత్తినప్పుడు నేను నా కన్నులను మూసు
కొని, మిమ్మును చూడక వుందును; మీరు విస్తరించి
ప్రార్థన చేసినప్పుడు నేను వినక వుందును; మీ
చేతులు రక్తము చేత నిండి వున్నవి.। మిమ్మును మీరు 16
కడుగుకొని శుభ్రపరచుకొనుడి; నా దృష్టి యెదుట
నుంచి మీ దుష్క్రియలను పరిహరించండి.। కీడు చేసుట 17
మానండి, మేలు చేసుటకు నేర్చుకొనండి; యేది న్యా
యమో అది వెతుకండి; బాధ పొందిన వారికి ప్రాప
కులై, తండ్రి లేనివాని పక్షముగా న్యాయమును తీర్చి,
విధవరాలి వ్యాజ్యమును నడిపించండి. మరిన్ని యె
హోవా ఆనతిచ్చినదేమంటే:।యిదుగో రండి, మన 18
ము వాదింతుము గాక; మీ పాపములు రక్తవర్ణముగా
వున్నప్పటికిన్ని అవి మంచు వలెనే ధావళ్యముగా వుం
డును; సింధూరము వలె వున్నప్పటికిన్ని అవి గొర్రె
బొచ్చు వలె అవును.। మీరు మనస్సు కలవారై విధే 19
యతగా వుంటే దేశముయొక్క మేలును అనుభవిం
తురు.। అయితే మీరు మనస్సు లేనివారున్ను వ్యతి 20
రిక్తులున్ను అయి వుంటే కత్తిచేత హతులగుదురు అని
యెహోవా వాక్కు ఆనతిచ్చెను.। విశ్వాసము కల 21
యీ పట్టణము వేశ్యవలె యేలాగునాయెను! అది
న్యాయములతోటి పూర్తిగా వుండేది; పూర్వము నీతి
దాని యందు నివాసము చేసేది, అయితే యిప్పుడు
నరఘాంతకులు దానిలో నివాసులై వున్నారు.। నీ వెండి 22

మష్టు అయి పోయెను; నీ ద్రాక్షారసము నీళ్లతోను
23 కలిసి వున్నది. । నీ శ్రేష్ఠులు వ్యతిరిక్తులై దొంగలకు
సహవాసులయిరి; వారిలో ప్రతివాడూ కానుక మీద
ఆశపడి లంచములను వెంటాడును; వారు తండ్రిలేని
వానికి న్యాయము తీర్చరు; విధవయొక్క వ్యాజ్యము
24 వారి ముందరికి రాదు. । కాబట్టి ఇశ్రాయేలుయొక్క బల
ము గలవాడైన సైన్యములయొక్క యెహోవా యనే
దేవుడు ఆనతిచ్చినదేమంటే, ఆహా, నేను నా శత్రు
వులను ప్రతిగా శిక్షింతును; నా విరోధుల మీద నేను
25 నా కోపమును చల్లార్చుకుందును. । మరిన్ని నేను నా
హస్తమును నీ మీదికి తిరగ చేసి, కొలిమిలో నీ మష్టు
26 అంతా కాల్చివేసి, నీ తగరమంతా తీసివేసి, । మును
పటి లాగున నీ న్యాయాధిపతులనున్ను ఆది యందు
వున్నట్టు నీ ఆలోచన పరులనున్ను నేను మళ్లీ రాచే
తును; అప్పుడు నీవు నీతి పట్టణమనిన్ని విశ్వాసపు
27 పురమనిన్ని పిలువపడుదువు. । సీయోను న్యాయము
చేతనున్ను దానిలోకి వచ్చే దాని సంబంధులు నీతిచేత
28 నున్ను విముక్తిని పొందుదురు. । అయితే వ్యతిరిక్తులు
న్ను పాపాత్ములున్ను కూడా ఛిన్నాభిన్నములు అయి
పోవుదురు; యెహోవాను విడిచిపెట్టిన మీరు లయ
29 మాదురు. । మీరు కోరిన ఆల చెట్లను గురించి మీరు
సిగ్గును పొందుదురు; మీరు యెంచుకొనిన వనములను
30 గురించి మీరు కలతను అనుభవింతురు. । యేమంటే,
మీరు ఆకులు రాలిపోయిన ఆల చెట్లవలెనున్ను, వుద
31 కములేని వనము వలెనున్ను అవుదురు. । శక్తిమంతుడు
దూది అయినట్టున్ను వాని పని అగ్ని అయినట్టున్ను
అవును; యీ రెండున్ను కూడా తగలపడిన తరువాత
ఆర్పివేసే వాడు వొకడూ లేక పోవునని పలుకు
తున్నాడు.

## 2. అధ్యాయము.

1 యూదాను గురించిన్ని యెరూశలేమును గురించిన్ని
ఆమోసు కుమారుడైన యెషయాకు కనుపడినదేమంటే;।
2 అంత్య దినములందు యెహోవా మందిరముయొక్క
పర్వతము పర్వతముల మీద దృఢపడి, కొండల పైని
హెచ్చించ పడును; అప్పుడు సమస్తమైన జనాంగము
3 లున్ను దానిలోకి ప్రవాహములుగా వత్తురు. । మరిన్ని
అనేక జనులు వచ్చి, మీరు రండి, యెహోవాయొ
క్క పర్వతమునకున్ను యాకోబుయొక్క దేవుని మంది
రమునకున్ను యెక్కి పోదాము; యేమంటే ఆయన
తన మార్గములను మనకు చూపించును; ఆయన అడుగు
జాడలలో మనము నడుతుమని చెప్పుకొందురు; యే
మంటే సీయోనులోనుంచి న్యాయప్రమాణమున్ను
యెరూశలేములోనుంచి యెహోవాయొక్క వాక్య
మున్ను బయిలు వెళ్లును. । ఆయన జనాంగములలో 4
న్యాయమును నడిపించును; అనేక జనులను గద్దించును;
అప్పుడు వారు తమ కత్తులను నక్కులుగానున్ను తమ
యీటెలను కొడవళ్లుగానున్ను చేతురు; జనాంగము
జనాంగము మీదికి కత్తిని యెత్తకుండానున్ను యికను
యుద్ధము చేసుటకు నేర్చుకొనకుండానున్ను వుందురు. ।
ఓ, యాకోబుయొక్క యింటివారా, రండి; యెహో 5
వాయొక్క వెలుగు యందు మేము నడుతుము. । అయితే 6
యాకోబు యింటి వారైన మీ జనులను మీరు విడచి
పెట్టితిరి, యేమంటే తూర్పు దేశమువల్ల వారు నిం
డుగా వుండి, ఫిలిష్తీయుల వలె జ్యోతిష్కులై, పర
దేశ పుత్రుల యందు సంతోషమును తెచ్చుకుంటూ
వున్నారు. । వారి దేశము వెండితోనున్ను బంగారముతో 7
నున్ను నిండి వున్నది; వారి పదార్థములకు మితి లేదు;
వారి దేశము గుర్రములతోను నిండి వున్నది; వారి
రథములకున్ను లెక్క లేదు. । మరిన్ని వారి దేశము 8
బొమ్మలతోటి నిండి వున్నది; తమ చేతి పనికిన్ని తమ
చేతులు కల్పించిన వాటికిన్ని వారు వంగి నమస్కారము
చేతురు. । అక్కడ పిన్నవాడు వంగి మ్రొక్కును; 9
పెద్దవాడున్ను కుంగి పడును; కాబట్టి మీరు వారిని
వోర్చక వుందురు. । నీవు రాతి కొండలోకి ప్రవేశించి, 10
యెహోవాకున్ను ఆయన ఘనమైన మాహాత్మ్యమున
కున్ను భయపడి, భూమిలో నిన్ను నీవు దాచుకొను
ము. । గర్వపు కన్నులు గలవాడు కుంగపడును; మను 11
ష్యుల అతిశయము వంచపడును; ఆ దినమందు యె
హోవా మాత్రమే హెచ్చించ పడును. । యేమంటే 12
సైన్యములయొక్క యెహోవా దినము సకల గర్విష్ఠు
లకున్ను అతిశయ పరులకున్ను తమ్మును తాము హె
చ్చించుకొనిన వారందరికిన్ని విరోధముగా వున్నందున
వారు కుంగించ పడుదురు. । మరిన్ని అతిశయము గల 13
వున్నతమైన లెబానోనుయొక్క అర్జ వృక్షములక
న్నిటికిన్ని, బాషానుయొక్క ఆల వృక్షములకన్నిటి
కిన్ని, । వున్నతమైన పర్వతములకన్నిటికిన్ని, అతిశయ 14
మైన కొండలకన్నిటికిన్ని, । పొడుగైన సకల గోపు 15
రములకున్ను, సకలమైన బురుజులు గల ప్రాకారముల
కన్నిటికిన్ని, । సకలమైన తర్షీషు వోడలకున్ను, సకల 16
ప్రియమైన చెక్కడపు పనులకున్ను విరోధముగా వుం
డును. । యేమంటే మనుష్యునియొక్క గర్వము కుంగ 17
పడును; మనుష్యులయొక్క అతిశయము వంచపడును;
ఆ దినమందు యెహోవా మాత్రమే హెచ్చించ
పడును. । సకలమైన బొమ్మలు బొత్తిగా నాశనమౌను. । 18
యెహోవా భూమిని భయంకరముగా కదిలించుటకు 19
లేచినప్పుడు వారు ఆయనకున్ను ఘనము గల ఆయన
యొక్క మహత్వమునకున్ను భయపడి, రాతి కొండల

యొక్క గుహలలోకిన్ని భూమియొక్క గహ్వరముల
20 లోకిన్ని ప్రవేశింతురు. ౹ ఆ దినమందు మనుష్యులు
మ్రొక్కుటకు తాము చేసుకొనిన వెండి బొమ్మలనున్ను
బంగారపు బొమ్మలనున్ను బుక్కుపెలకలకున్ను బగ్గిల
21 ములకున్ను యిచ్చివేసి, ౹ యెహోవా భూమిని భయం
కరముగా కదిలించుటకు లేచినప్పుడు వారు ఆయన
కున్ను ఘనము గల ఆయనయొక్క మహత్వమునకున్ను
భయపడి, రాతి కొండలయొక్క పగుళ్లలోకిన్ని రాతి
మెట్టలయొక్క బీటలలోకిన్ని ప్రవేశింతురు.

## 3. అధ్యాయము.

1 తన నాసికా రంధ్రములలో వూపిరి గల మను
ష్యుని యికను నమ్మకండీ, యేమంటే వాడు యెంతటి
2 వాడు గనుక. ౹ యిదుగో, కర్తయైన సైన్యములయొక్క
యెహోవా ఆనతిచ్చిన లాగు, నేను యెరూశలేము
లోనుంచిన్ని యూదాలోనుంచిన్ని సకలమైన ఆధార
3 మున్ను వూతనున్ను తీసి వేతును; ౹ రొట్టె అనే ఆధా
రమున్ను నీరు అనే ఆధారమున్ను, పరాక్రమశాలి
నిన్ని, ఆయుధస్థునిన్ని, న్యాయాధిపతినిన్ని, దీర్ఘ
దర్శినిన్ని, బుద్ధిమంతునిన్ని, వృద్ధునున్ను, యేభైమంది
మీది అధిపతినిన్ని, ఘనునిన్ని, ఆలోచనపరునిన్ని,
ప్రజ్ఞగల పని వానిన్ని, వాచాలకునున్ను తీసివేసి, ౹
4 బాలురను వారికి నేను అధిపతులుగా చేసినందున
5 పిల్లలు వారిని యేలుదురు. ౹ కాబట్టి జనులు వొకరివల్ల
వొకరు బాధపడుదురు; ప్రతి మనుష్యుడు వాని వాని
తోటివానికి విరోధుడవును; చిన్నవాడు పెద్దవాని
మీదనున్ను నీచుడు ఘనుని మీదనున్ను అతిశయము
6 గా వుండును. ౹ కాబట్టి ఆ దినమందు యెవడైనా తన
తండ్రి యింటికాడైన తన సహోదరుని చేతిని పట్టు
కొని, నీకు వస్త్రము కలదు, నీవు వచ్చి మాకు అధికా
రివి కమ్ము, యీ విపత్తి నీ చేతి కింద వుండనిమ్మని చెప్పి
7 నప్పుడు, ౹ వాడు చెయ్యి యెత్తి, నేను చెడిపోయిన
దాని బాగుచేసే వాడను కాను; నా యింట్లో ఆహార
మైనా వస్త్రమైనా లేదు; జనుల మీద నన్ను అధికా
8 రినిగా చేయవద్దన్నట్టుగా చెప్పును. ౹ యేమంటే యె
రూశలేము పాడైపోయినది; యూదా పడి పోయినది;
వారి నాలుకయున్ను వారి చేతులున్ను యెహోవా
యొక్క మహిమ గల నేత్రములకు కోపమును యె
9 క్కించేటట్టుగా ఆయనకు విరోధముగా వున్నవి.౹ వారి
ముఖ లక్షణములు వారి యెడల సాక్షులై వున్నవి;
వారు తమ పాపమును సొదొమ వారి లాగున దాచక
బైలుపరచుదురు; వారికి అయ్యో! యేమంటే తమ
10 మీదికి తామే కీడుకు ప్రతి కీడు తెచ్చుకొనిరి.౹ మీరు
నీతిపరులను చూచి మీకు మేలు వచ్చునని చెప్పండి;
యేమంటే వారు తమ కార్యముల ఫలమును అనుభ
వింతురు. ౹ దుష్టులకు అయ్యో! కీడు అవును; యేమంటే 11
వారి చేతుల ఫలము వారికి ప్రతిగా యివ్వపడును. ౹
అయితే నా జనులను బాలులు బాధపెట్టుదురు; వారిని 12
స్త్రీలు యేలుదురు; ఓ నా జనులారా, మిమ్మును నడి
పించిన వారు మార్గమును తప్పిన వారై వుండి, మీరు
నడిచే మార్గమును తారుమారు చేతురు. ౹ యెహో 13
వా వాదించుటకు సిద్ధమై వున్నాడు; జనులకు న్యా
యము విధించుటకు నిలిచి వున్నాడు. ౹ యెహోవా 14
తన జనులయొక్క పెద్దలకున్ను శ్రేష్ఠులకున్ను కూడా
న్యాయము తీర్చును; యేమంటే మీరు ద్రాక్షతో
టను కాల్చివేస్తిరి; దరిద్రులయొక్క కొల్ల సొమ్ము మీ
యిండ్లలోనే వున్నది.౹ మీరు నా జనులను కొట్టి ఛిన్నా 15
భిన్నములు చేసెదరేమి? దరిద్రులను బాధించెదరేమని
సైన్యములయొక్క యెహోవా అనే దేవుడు చెప్పు
తున్నాడు. ౹ మరిన్ని యెహోవా ఆనతిచ్చినదేమంటే, 16
సీయోనుయొక్క కుమార్తెలు అతిశయవంతురాళ్లై,
యెత్తిన కంఠములు కలిగి, వార చూపులు చూచి, గజ్జల
చప్పుడుతోటి నాట్యము ఆడుతూ నడుస్తూ వున్నారు;౹
గనుక, యెహోవా సీయోను కుమార్తెలయొక్క 17
శిరస్సుల మీద కురుపులు పుట్టించును; వారియొక్క
మర్మస్థానములను బయిలు పరచును. ౹ మరిన్ని ఆ దిన 18
మందు యెహోవా వారియొక్క అలంకారపు గజ్జల
తో అల్లిన జాలరులనున్ను, నెలవంకలనున్ను, ౹ జుమ 19
కాలనున్ను, కడియాలనున్ను, జరీ చీరలనున్ను, ౹ శిరో 20
భూషణములనున్ను, కాళ్ల సజ్జునున్ను, వడ్డాణములను
న్ను, పరిమళ ద్రవ్యపు బరిణెలనున్ను, జటకుచ్చులను
న్ను, ౹ వుంగరములనున్ను, ముక్కు ముంగరలనున్ను, ౹ 21
చిత్ర వస్త్రములనున్ను, వల్లెవాటులనున్ను, శాలూలను 22
న్ను, చిన్న సంచులనున్ను, ౹ సన్నపు బట్టలనున్ను, 23
సన్నపు దుప్పట్లనున్ను, టోపీలనున్ను, ముసుకులనున్ను
తీసివేయించును. ౹ మరిన్ని సుగంధమునకు బదులుగా 24
దుర్గంధము కలుగును; మొలదట్టీలకు బదులుగా తా
డున్ను, అల్లిన జడకు బదులుగా బోడి తలయున్ను
కలుగును; కటిసూత్రముకు బదులుగా నార తాడు
కలుగును; సౌందర్యమునకు బదులుగా మాడుపు కలు
గును. ౹ నీ జనసమూహము కత్తి చేతనున్ను నీ బలా 25
ఢ్యులు యుద్ధమందున్ను కూలుదురు. ౹ దాని ద్వార 26
ములు మూలుగుతూ అంగలార్చుతూ వుండును; అది
వొంటరిగా నేల మీద కూర్చుని వుండును.

## 4. అధ్యాయము.

మరిన్ని ఆ దినమందు యేడుగురు స్త్రీలు వొక పురు 1
షుని పట్టుకొని, మేము మా భోజనము తినుదుము,

మా వస్త్రమును కట్టుకుందుము, మా వుదాసీనము పో
వుటకు నీ పేరుచేత మాత్రమే మమ్మును పిలువనిమ్ము
2 అని చెప్పుదురు. । అయితే ఆ దినమందు యెహోవా
యొక్క కొమ్మ సౌందర్యముగానున్ను ఘనముగానున్ను
వుండును; మరిన్ని భూమి పంట ఇశ్రాయేలులో తప్పిం
చుకొనిన వారి కొరకు విశేషముగానున్ను కంటికి
3 యింపుగానున్ను వుండును. । మరిన్ని సీయోనులో
శేషించిన వాడు యెవడో యెరూశలేములో వుండి
పోయినవాడు యెవడో యెరూశలేము యందు సజీవు
లైన వారితో గణనకు వచ్చిన ప్రతివాడున్ను పరిశుద్ధు
4 డని పిలువబడును. । నిజముగా యెహోవా సీయోను
కుమార్తెలయొక్క కల్మషమును కడిగివేసి, అధికాజ్ఞల
చేతనున్ను అధికాగ్ని చేతనున్ను యెరూశలేముయొక్క
రక్తాపరాధమును దాని మధ్యనుంచి పరిహరించినప్పు
5 డు, । యెహోవా సీయోను పర్వతమందున్న ప్రతి
గృహము మీదనున్ను దాని సమస్తమైన సంఘముల
మీదనున్ను పగటియందు మేఘమునున్ను ధూమము
నున్ను రాత్రి యందు మండుతున్న అగ్నికాంతినిన్ని
కలుగ చేసును: మరిన్ని సమస్త మహిమ మీద కప్పు
6 వుండును. । డేగా పగటి యెండ తగలకుండా నీడగా
నున్ను ప్రాపుగానున్ను వాననుంచిన్ని గాలినుంచిన్ని
చాటుగానున్ను వుండును.

## 5. అధ్యాయము.

1 ఇప్పుడు నేను నా ప్రియునియొక్క ద్రాక్ష తో
టను గురించి ప్రీతిగా పాట పాడుదును: ఫలభరితమైన
కొండ మీద వొక ద్రాక్షతోట నా ప్రియునికి కల
2 దు. । వాడు దాని చుట్టూ ప్రాకారమును కట్టి, రా
ళ్లను దానిలోనుంచి యేరి, ఉత్తమమైన ద్రాక్ష మొ
క్కను దానిలో నాటి, దాని మధ్యమందు గోపురము
కట్టి, దానిలో గానుగను పాతించి, అది మంచి ఫల
ములను ఫలించునని యెదురు చూచినాడు, అయితే
3 అది అడవి ఫలములను ఫలించెను. । కాబట్టి ఓ యె
రూశలేము కాపురస్తులారా, యూదా మనుష్యులారా,
గండి; నా మధ్యనున్ను నా ద్రాక్షతోట మధ్యనున్ను
4 న్యాయము తీర్చండి. । నా ద్రాక్షతోటకు నేను చేసి
వున్న దానికంటే అధికముగా మరి యేమి చేయ గలు
గును! అది మంచి ఫలమును ఫలించునని నేను యెదురు
చూచినప్పుడు అది యెందుకు అడవి పండ్లను ఫలిం
5 చెను! । కాబట్టి యిదుగో నా ద్రాక్షతోటకు నేను
చేయబోయేది మీకు తెలియచేతును: దాని తినేటట్టు
గా నేను కంచెను తీసివేతును; దాని త్రొక్కేటట్టుగా
6 ప్రాకారమును కొట్టివేతును:। నేను దాని పాడుచేతును;
దాని బద్దించకుండానున్ను గొప్పు తవ్వకుండానున్ను
వున్నందున ముళ్ల చెట్లు పుట్టును: మరిన్ని మేఘములు
వర్షించకుండా నేను ఆజ్ఞాపింతును. । సైన్యముల యె 7
హోవాయొక్క ద్రాక్షతోట ఇశ్రాయేలుయొక్క
యిల్లు అయి వున్నది; యూదా మనుష్యులు ఆయనకు
ప్రియమైన మొక్కలై యున్నారు: ఆయన న్యాయము
కొరకు వెతికినప్పుడు యిదుగో బలవంతము అగుప
డెను; నీతి కొరకు వెతికినప్పుడు యిదుగో రోదన శబ్ద
ము వినపడెను. । చాలా యిండ్లను కట్టుకొన వలెనని, 8
వున్న దేశమందు తాము మాత్రమే వుండేటట్టు అన్యు
లకు భూమి లేకుండా వుండే మట్టుకు చాలా భూము
లను కోరినటువంటి వారికి అయ్యో! । సైన్యములయొక్క 9
యెహోవా నా చెవిలో వినిపించినదేమంటే, నిజ
ముగా మిక్కిలీ ఘనమైన మంచి యిండ్లు మనుష్యులు
లేకుండా వట్టివై వుండును. । నిజముగా పది యేళ్లను 10
దున్నే ద్రాక్షతోట కుంచెడు రసము మాత్రమే యి
చ్చును; పది కుంచముల విత్తనములు కుంచెడు పంట
మాత్రమే యిచ్చును. । ప్రాతఃకాలమందు లేచి, బల 11
మైన మద్యమును వెతికి, ద్రాక్షారసమువల్ల తమకు
మత్తు కలిగేటట్టుగా రాత్రి పర్యంతమూ తాగే వారికి
అయ్యో! । కిన్నెరయున్ను వీణెయున్ను తంబురయున్ను 12
పిల్లనగ్రోవిన్ని ద్రాక్షారసమున్ను వారి విందులలో వుం
డును, అయితే యెహోవాయొక్క పనినైనా ఆయన
చేతి క్రియలనైనా మనస్కరించరు. । నా జనులకు బుద్ధి 13
లేదు గనుక వారు చెరలోకి వెళ్లుదురు, అప్పుడు
వారి ఘనులు ఆకలి చేత లయమౌదురు; వారి జన
సమూహము దప్పి చేత యెండిపోవును. । కాబట్టి 14
సమాధి తన్ను విస్తారపర్చుకొని, తన నోరు అపరిమిత
ముగా తెరచినందున దాని ఘనులున్ను దాని జన సమూ
హమున్ను దాని అతిశయమున్ను సంతోషముగా వున్న
వారున్ను దానిలోకి దిగిపోదురు. । పిన్నలున్ను వంగు 15
దురు; పెద్దలున్ను కుంగుదురు; గర్విష్టుల చూపులున్ను
కుంగును. । అప్పుడు సైన్యములయొక్క యెహోవా 16
న్యాయమందు హెచ్చించబడును; పరిశుద్ధుడైన దేవుడు
నీతి యందు పరిశుద్ధముగా అగుపడును. । అప్పుడు 17
గొర్రె పిల్లలు వాటి చిత్తము చొప్పున మేసును; మదము
గల వారి పాడు భూములను అన్యులు ఆక్రమింతురు. ।
మాయా పాశములతోటి అక్రమమున్ను బండి మోకుల 18
తోనైనట్టు పాపమునున్ను లాగుకొనిన వారికి అయ్యో! ।
వారు పలికేది యేమంటే, వారి చర్య మాకు కనుపడ 19
డానకు వారు త్వరపడి అతివేగముగా చేయవలసినది;
ఇశ్రాయేలుకు పరిశుద్ధుడైన వానియొక్క యోచన
బయిలు వచ్చి మాకు తెలియపడడానకు సమీపమునకు
రావలసిదన్నట్టుగా పలికిరి. । కీడు మేలనిన్ని మేలు కీడ 20
నిన్ని చీకటి వెలుగనిన్ని వెలుగు చీకటి అనిన్ని చెప్పు

కొనిన వారికిన్ని, చేదు తీపె అనిన్ని తీపె చేదు అనిన్ని
21 యెంచుకొనిన వారికిన్ని అయ్యో!। తమ దృష్టికి జ్ఞాను
లుగానున్న తమ కన్నులకు బుద్ధిగానున్న వున్న వారికి
22 అయ్యో!। ద్రాక్షారసమును తాగే బలాఢ్యులకున్ను
బలమైన మద్యపానము చేసే శక్తిమంతులకున్ను అయ్యో!।
23 లంచము పుచ్చుకొనిన చెడ్డవాని నీతిపరుడని తీర్చి, నీతి
పరునియొక్క నీతి అతని యొద్దనుంచి పరిహరించే వా
24 రికి అయ్యో!। అగ్ని చెత్తను మింగినట్టున్న మంట ఊ
కను దహించినట్టున్న వారి వేరు క్షీణించును; వారి
పుష్పము ధూళివలెనే పైకి వెళ్లును; యేమంటే వారు
సైన్యముల యెహోవాయొక్క న్యాయ ప్రమాణమును
రోసి, ఇశ్రాయేలుకు పరిశుద్ధుడైన వానియొక్క వాక్య
25 మును నిర్లక్ష్యపెట్టిరి.। కాబట్టి యెహోవా కోపాగ్ని
ఆయన జనుల మీద రాజినది; వారి మీద ఆయన తన
చెయ్యి చాపి వారిని కొట్టినందున పర్వతములు తత్తళిం
చినవి; వారి కళేబరములు పెంటరాశుల వలె వీధులలో
పడి వుండెను; అయినప్పటికిన్ని ఆయన కోపము తిరిగి
పోలేదు, యేమంటే ఆయనయొక్క హస్తము యిప్ప
26 టికీ చాచబడి వున్నది.। ఆయన దూరమై యున్న
జనాంగములకు బిరుదును యెత్తును; యీలకొట్టి వారిని
పిలిచినందున యిదుగో వారు శీఘ్రముగా వత్తురు.।
27 వారిలో సొమ్మసిల్లిన వాడైనా తొట్రిల్లిన వాడైనా
నిద్రించిన వాడైనా కునికిన వాడైనా వొకడూ లేక
పోవును; వారి మొలతాడు వొదులయ్యేదిన్ని వారి పాద
రక్షల వారు విడిపోయేదిన్ని లేక వుండును; వారి బాణ
28 ములన్ని వాడిగా వున్నవి.। వారి విండ్లన్ని యెక్కు పెట్ట
బడి సిద్ధముగా వున్నవి; వారి గుర్రపు డెక్కలు అగ్ని
రాళ్లని యెంచబడును; వారి రథచక్రములు సుడిగా
29 లితో సమమవును.। వారి రంకె సింహనాదము వలె
వుండును; వారు కొదమ సింహము వలెనే రంకె వేతురు;
నిజముగా వారు రంకెవేసి వేటను పట్టుకొనిపోదురు;
30 విడిపించే వాడు వొకడూ లేక వుండును.। నిజముగా
ఆ దినమందు వారు సముద్రపు ఘోష వలె వారి మీద
రంకె వేతురు; మరిన్ని భూమి తట్టు చూచే వారికి
అదుగో అంధకారమున్ను దుఃఖమున్ను కలుగును;
మరిన్ని ఆకాశములలో వున్న వెలుగు సహా అంధకా
రమై పోవును.

## 6. అధ్యాయము.

1 రాజైన ఉజ్జీయా మరణము పొందిన సంవత్సరమందు
నేను యెహోవా మహోన్నతమైన గద్దెమీద ఆసీ
నుడు అయి వుండేది కన్నాను; ఆయన పొడవైన వస్త్ర
2 ములచేత గుడి నిండి వుండెను.। దాని పయిని సెరె
ఫీము నిలిచి యుండెను; వొక్కొక్కరికి ఆరేసి రెక్కలు
గలవు; రెండు రెక్కలతోటి అతడు తన ముఖము
కప్పుకొనును; రెండు రెక్కలతోటి అతడు తన కాళ్లు
కప్పుకొనును; యింకా రెండు రెక్కలతోటి అతడు
యెగురును.। వారు వొకరితో నొకరు సైన్యములయొక్క 3
యెహోవా పరిశుద్ధుడు, పరిశుద్ధుడు, పరిశుద్ధుడు
అయి వున్నాడు; భూమి అంతా ఆయన ప్రకాశతచేత
పూర్తిగా వున్నదని వొకరి తర్వాత వొకరు కేకవేసి
పలికిరి.। అయితే కేకవేసిన వీరియొక్క శబ్దముచేత 4
ద్వారములయొక్క స్తంభములు కదిలెను; మందిరము
ధూమముచేత నిండెను.। అప్పుడు నేను అనిన మాట, 5
నాకు అయ్యో! నేను నశింతును; అపవిత్రమైన పెద
వులు గల మనుష్యుడను; మరిన్ని అపవిత్రమైన పెద
వులు గల జనుల మధ్యను కాపురస్తుడను; రాజయిన
సైన్యములయొక్క యెహోవాను నా కన్నులు చూచి
నవి, అని నేను అనగానే,। ఆ సెరెఫీములలో వొకడు 6
కారుతో పీఠము మీదనుంచి తీసిన నిప్పు చేత పట్టు
కొని యెగిరి,। నా యొద్దికి వచ్చి, ఆ నిప్పు నా నో 7
టికి అందిచ్చి, అనిన మాట, యిదుగో, యిది నీ పెద
వులను ముట్టినది; నీ అక్రమము పరిహరమైనది; నీ
పాపము కప్పపడినదని చెప్పెను.। అప్పుడు యెహో 8
వా వాక్యముయొక్క శబ్దము నాకు వినపడెను; అది
యేమంటే, నేను యెవని పంపుదును? నా నిమిత్తము
యెవడు వెళ్లునన్నట్టుగా నేను వింటిని; అప్పుడు నేను
యిక్కడనే వున్నాను; నన్ను పంపండని చెప్పినప్పుడు
ఆయన నాకు సెలవు యిచ్చినదేమంటే,। నీవు యీ 9
జనుల యొద్దికి వెళ్లి, మీరు చెవులారా వినిన్ని తెలియక
వుంటిరి, కండ్లారా చూచిన్ని కానక వుంటిరని వారి
తో చెప్పి,। యీ జనులు తమ కండ్లచేత కని, తమ 10
చెవులచేత విని, తమ హృదయముచేత గ్రహించి, పశ్చా
త్తాపపడి, స్వస్థము కాకుండా, యీ జనులయొక్క
హృదయమును మందముగానున్ను వారి చెవులు విను
టకు భారముగానున్ను చేసి, వారి కండ్లను కప్పివేయు
మని సెలవు యిచ్చినప్పుడు,। నేను వో యెహోవా, 11
యెన్నాళ్లమట్టుకని అడగగా, ఆయన సెలవు యిచ్చిన
దేమంటే, పట్టణములలో కాపురస్తులు లేక పాడయ్యే
మట్టుకున్ను దేశమున్ను పాడై వట్టిదయ్యే మట్టుకున్ను
వుండును.। యేమంటే యెహోవా అయిన నేను యీ 12
మనుష్యులను దూరమునకు వెళ్లవేతును; దేశములో
బహు నాశనము వుండును.। దానిలో పదోభాగము 13
యింకా వున్నప్పటికీ అది బొత్తిగా లయమవును; అయి
తే పుచ్చి పడిపోయిన ఆల చెట్టుకైనా ఆలోన చెట్టు
కైనా వేరు పచ్చగా వున్నట్టు పరిశుద్ధ సంతతి జనాంగ
ముకు మూలముగా వుండును.

## 7. అధ్యాయము.

1 అయితే యూదా రాజనే ఉజ్జియాకు పుట్టిన
యోతాము కుమారుడైన ఆహాజుయొక్క దినములందు
అరాము రాజైన రెస్సీనున్ను ఇశ్రాయేలుకు రాజైన
రెమల్యా కుమారుడైన పెకహును యెరూశలేము మీ
దికి యుద్ధము చేసుటకు వచ్చినారు గాని జయమును
2 పొందలేక పోయిరి. । అయితే ఎఫ్రయీమువారు అరా
మీయులకు తోడై వున్నారని దావీదు యింటివారికి
వినపడినప్పుడు వాని హృదయమున్ను వాని జనుల హృ
దయమున్ను అడవి వృక్షములు గాలిచేత కదలినట్టు
3 గానే కలవిలపడినవి. । అప్పుడు యెహోవా యెష
యాతో సెలవు యిచ్చినదేమంటే, నీవున్ను నీ కుమా
రుడైన షెయార్యాషూబున్ను చాకలి భూమిలో
పైగా వున్న కొలనుయొక్క నీటి కాలువ కడకు ఆహా
జును యెదుర్కొనుటకు వెళ్లి, వాని చూచి చెప్పవలసి
4 నదేమంటే, । నీవు జాగ్రతగా వుండి నిమ్మళముగా వుం
డుము; పొగ రాజుతున్న యీ రెండు కొరకంచుల
యొక్క చివరలవల్లనున్ను, అనగా, అరాము రాజైన
రెస్సీనుకున్ను రెమల్యాయొక్క కుమారునికిన్ని కలిగిన
రౌద్రాగ్నివల్లనున్ను భయపడక నీ హృదయము కరగ
5 నీయకుము. । యేమంటే అరామీయులున్ను ఎఫ్రయీ
మీయులున్ను రెమల్యా కుమారుడున్ను నీ మీద
6 కీడును ఆలోచించి, । వారు యూదాదేశము మీదికి
వెళ్లి దాని శ్రమపెట్టి, దానిలోనుంచి భాగమును వారి
కొరకు ఖండించుకొని, దాని మీద టాబెయేలుయొక్క
కుమారుని రాజును చేతుమన్నట్టుగా ప్రతిజ్ఞ చేసిరి. ।
7 అయితే యిందుకు దేవుడైన యెహోవా చెప్పిన మాట,
8 యీ యోచన నిలువక సంభవించక వుండును. । యే
మంటే అరాము దేశపు శిరస్సు దమస్కు, దమస్కు
శిరస్సు రెస్సీను; మరిన్ని ఎఫ్రయీముయొక్క శిరస్సు
షోమ్రోను, షోమ్రోనుయొక్క శిరస్సు రెమల్యా
9 కుమారుడు; । యిక అరువై అయిదు సంవత్సరములు
కాక మునుపు ఎఫ్రయీము జనాంగము కాకుండా
ఛిన్నాభిన్నములై పోవును; దీని మీరు నమ్మకపోతే నిజ
ముగా మీరు దృఢపడరని చెప్పుమనేదిగా సెలవు యి
10 చ్చెను. । మరిన్ని యెహోవా ఆహాజుకు సెలవు యిచ్చి
11 నదేమంటే, । నీ దేవుడైన యెహోవా యొద్ద వొక గురు
తును కిందనుంచి అయినా మీదనుంచి అయినా అడు
12 గుమని సెలవు యివ్వగా, । యెహోవాను శోధించేట
ట్టుగా నేను గురుతును అడగనని ఆహాజు చెప్పెను. ।
13 అప్పుడు అతడు అనిన మాట, ఓ దావీదు యింటి
వారా, వినండి; మనుష్యులకు విసుపు పుట్టించేది కొం
చెము అయితే నా దేవునికి విసుపు పుట్టింతురా? ।
అందుకు యెహోవాయే మీకు వొక గురుతును యి 14
చ్చును; యిదుగో వొక కన్య గర్భవతియై కుమారుని
కనును; అతడు ఇమ్మానూయేలని పిలువబడును. । అతడు 15
కీడును వుప్పక మేలును యెంచుకొనుటకు తెలిసే
పర్యంతము వెన్ననున్ను తేనెనున్ను తినును. । యేమం 16
టే యీ పిల్ల కీడును వుప్పక మేలును యెంచుకొనక
మునుపు యే దేశపు యిద్దరు రాజులవల్ల నీకు శ్రమ
వచ్చెనో ఆ దేశము ఆ యిద్దరు రాజులవల్ల విడువ
పడును. । అయితే యెహోవా నీ మీదనున్ను నీ 17
జనుల మీదనున్ను నీ తండ్రి యింటి మీదనున్ను ఎఫ్ర
యీము యూదాను విడిచిన నాటినుంచి నేటి వరకు
రాని దినములను రప్పించి అష్షూరు రాజును పిలుచు
ను. । యేమంటే ఆ దినమందు యెహోవా యీల 18
కొట్టి, మిస్రయీముయొక్క నదుల అవతలవున్న యీ
గనున్ను అష్షూరు దేశమందున్న కందిరీగనున్ను పిలు
చును. । అప్పుడు అవి వచ్చి, పాడైన లోవలు అన్నిటి 19
యందున్ను రాతి మెట్టల మీదనున్ను సకలమైన ముండ్ల
పొదల మీదనున్ను సకలమైన అందము గల పుష్ప
వృక్షముల మీదనున్ను వాలి వుండును. । మరిన్ని ఆ దిన 20
మందు యెహోవా అవతలి జనుల చేతనున్ను అష్షూ
రు రాజు చేతనున్ను కూలికి వచ్చిన వాని తలయొక్క
యున్ను కాలుయొక్కయున్ను వెంట్రుకలను క్షౌరపు
కత్తిచేత గొరిగించును; మరిన్ని గెడ్డమునున్ను గొరిగిం
చును. । మరిన్ని ఆ దినమందు వొకడు వొక ఆవు పడ్డ 21
నున్ను రెండు మేకలనున్ను పెంచుకొనును. । అవి 22
చాలా పాలను యిచ్చినందున వాడు వెన్నను భుజిం
చును; యేమంటే దేశమందు విడువపడిన వారందరు
న్ను వెన్ననున్ను తేనెనున్ను భక్షింతురు. । మరిన్ని వెయ్యి 23
వెండి బిళ్లల వెలగల వెయ్యి ద్రాక్ష చెట్లు వుండే
చోట ఆ దినమందు ముళ్లచెట్లు పుట్టును. । వారు విండ్ల 24
తోటిన్ని బాణములతోటిన్ని అక్కడికి వత్తురు, యెం
దుకంటే దేశమంతా ముళ్ల చెట్లు అవును. । అయితే 25
పార చేత తొవ్వబడిన సకలమైన కొండల మీద
వున్న ముళ్ల భయము చేత యెవ్వడైనా అక్కడికి రాక
పోవును; అది యెడ్లను పంపుటకున్ను గొర్రెలు త్రొ
క్కుటకున్ను వుండును.

## 8. అధ్యాయము.

మరిన్ని యెహోవా నాతోను సెలవు యిచ్చిన 1
దేమంటే, నీవు గొప్ప పలకను తీసుకొని, కరణము
యొక్క గంటము చేత మహేర్షాలాల్హాష్బజుని గురించి
దానిలో వ్రాయుమని సెలవు యిచ్చెను. । కాబట్టి 2
నేను సాక్షి నిమిత్తము అచంచలుడైన ఊరీయాయున్ను
యెబెరెఖ్యా కుమారుడయిన జెఖర్యాయున్ను అనే

3 యథార్థమైన సాక్షులను పిలుచుకొని, । అంతట నేను
దీర్ఘదర్శిరాలి వద్దికి ప్రవేశించినందున ఆమె
గర్భవతియై కుమారుని కనెను: అప్పుడు యెహోవా
నాతో అనిన మాట, వానికి మహేర్షాలాల్హష్బజు
4 అనే పేరు పెట్టుము. । యేమంటే యీ పిల్లకు అబ్బా
అమ్మా అని చెప్పుటకు శక్యము కాక మునుపు దమ
స్కుయొక్క ఐశ్వర్యమున్ను షోమ్రోనుయొక్క కొల్ల
సొమ్మున్ను అష్షూరు రాజు చేత యెత్తుక పోపడునని
5 ఆనతిచ్చెను. । మరిన్ని యెహోవా యింకా నాతో
6 సెలవు యిచ్చినదేమంటే, । యీ జనులు మెల్లిగా పా
రుతున్న షిలోయహు వుదకములను విసర్జించుకొని,
రెస్సీను యందున్ను రెమల్యా కుమారుని యందున్ను
7 సంతోషింతురు గనుక, । యిదుగో, యెహోవా వారి
మీదికి నదియొక్క బలము గల విస్తారమైన వుదకము
లను, అనగా, అష్షూరు రాజునున్ను అతని మహత్వ
మంతటినిన్ని రప్పించును; వాడు యెక్కి వారి కాలు
వలన్నిటి మీదనున్ను వారి వొడ్డులన్నిటి మీదనున్ను
8 పొర్లి వెళ్లును. । మరిన్ని వాడు యూదా దేశము
గుండా పారి, కంఠము మట్టుకు ప్రవహించును; మరి
న్ని ఓ ఇమ్మానూయేలూ, నీ దేశము యెంత మట్టుకు
వ్యాపించునో అంత మట్టుకున్ను అతని రెక్కలు చా
9 పబడి వుండును.। ఓ జనులారా, జత కూడండి, అప్పుడు
మీరు భ్రష్టులై పోవుదురు; ఓ దూరదేశస్థులారా,
చెవి యొగ్గండి, నడుమును బిగించుకొండి, అప్పుడు
మీరు భ్రష్టులై పోవుదురు; నడుమును బిగించుకొండి,
10 అప్పుడు మీరు భ్రష్టులై పోవుదురు. । ఆలోచన చేసు
కొండి, అప్పుడు మీ ఆలోచన వ్యర్థమౌను; ఆజ్ఞను
యివ్వండి, అప్పుడు అది నిలువక పోవును; యేమంటే
11 దేవుడు మాకు తోడుగా వున్నాడు. । మరిన్ని నాకు
యీ జనుల మార్గమందు నడువ వద్దని యెహోవా
బహు దృఢముగా వుపదేశించి నాతోను సెలవు యి
12 చ్చినదేమంటే, । యీ జనులు అది కుట్ర అని యెవరి
తో చెప్పుదురో అ దికుట్ర అని మీరు చెప్పకండి;
దేనివల్ల వారు భయమును పొందుదురో దానివల్ల మీరు
13 భయమును పొందకండి. । సైన్యములయొక్క యెహో
వా పరిశుద్ధుడని యెంచి, ఆయన యందే మీరు భయ
14 ముగా వుండి వెరవండి. । అప్పుడు ఆయన మీకు నిరా
తంకమైన ప్రాపుగా వుండును; అయితే ఇశ్రాయేలు
యొక్క రెండు యింట్లకు ఆయన తాకించిన రాయి
గానున్ను అభ్యంతర శిలగానున్ను యెరూశలేము కా
15 పురస్థులకు వురులుగానున్ను వుండును. । కాబట్టి వారి
లో అనేకులు వాటిని తాకి, కిందపడి, ఛిన్నాభిన్న
16 ములై, వురులలో చిక్కుపడుదురు. । సాక్షి ప్రమాణ
మును కట్టి, నా శిష్యులకు ఆజ్ఞను ముద్రించుమని
సెలవు యిచ్చెను. । కాబట్టి నేను యెహోవాను కని 17
పెట్టి యుందును; తన ముఖమును యాకోబుయొక్క
యింటికి మరుగు చేసినప్పటికిన్ని ఆయనను నేను యె
దురు చూస్తూ వుందును. । యిదుగో నేనున్ను యె 18
హోవా నాకు దయ చేసిన పిల్లలున్ను సీయోను పర్వ
తమందు నివాసము చేసిన సైన్యములయొక్క యెహో
వా వల్లనుంచి ఇశ్రాయేలు వారిలో గురుతులుగాను
న్ను లక్షణములుగానున్ను వున్నాము. । మరిన్ని యె 19
హోవా సెలవు యేమంటే, వారు మిమ్మును చూచి,
కర్ణ పిశాచము గలవారి యొద్దనున్ను శకునము చెప్పే
వారి యొద్దనున్ను వెతుకండని చెప్పితే, వారిని చూచి,
జనులు తమ దేవుని యొద్ద వెతుక వద్దా? జీవస్థులు
వాటిని గూర్చి మరణమైన వారి యొద్ద వెతుక వచ్చు
నా? అని చెప్పండి. । న్యాయమునకున్ను సాక్షి ప్రమా 20
ణమునకున్ను వారు రావలసినది; వారు ఆ వాక్య ప్ర
కారము పలుకక పోతే వారి యందు వెలుగు లేదు. ।
కాబట్టి వారు ఆకలితోటి దేశమును గడచి బహు 21
కష్టమును పొందుదురు; మరిన్ని వారు ఆకలిని పొంది
విసుకుకొని, పైగా చూచి, వారి రాజునున్ను వారి
దేవునిన్ని శపింతురు. । మరిన్ని వారు భూమి తట్టు 22
చూస్తే అదుగో శ్రమయున్ను అంధకారమున్ను వుప
ద్రవమున్ను గాఢమైన చీకటిన్ని అగుపడును.

## 9. అధ్యాయము.

అయితే పూర్వము ఆయన జెబూలోను దేశము 1
నున్ను నఫ్తాలీ దేశమునున్ను కొద్ది పరచినప్పుడు వా
టికి వున్న వుపద్రవము చొప్పున యికను వాటికి అంధ
కారము వుండబోదు; తరువాతి కాలమందు ఆయన
యర్దేను అవతల సముద్ర ప్రాంతమందున్న గాలీలు
అనే అన్యజనులయొక్క దేశమును మరీ ఘనముగా
చేసును. । అంధకారమందు నడిచిన వారు బహు వెలు 2
గును కనిరి; మృత్యువుయొక్క నీడగల దేశపు కాపు
రస్థుల పైని వెలుగు ప్రకాశించెను. । నీవు జనాంగ 3
మును విస్తారముగానున్ను సంతోషమును అధికముగా
నున్ను చేస్తివి; కాబట్టి వారు కోత కాలమందు కలి
గిన సంతోషము వలె నీ యెదుట సంతోషముగా
వున్నారు. । యేమంటే వాని మోపుయొక్క కాడినిన్ని 4
వాని భుజముయొక్క కర్రనున్ను వానిని బాధించిన
వానియొక్క దండమునున్ను మిద్యాను దినములోనై
నట్టు నీవు విరిచివేస్తివి. । యేమంటే అప్పుడు ఆయు 5
ధస్థుల ఆయుధములన్నిన్ని కలవిల శబ్దముతో కదు
లును; వారి వస్త్రములు రక్తమందు ముంచబడును;
అయితే అవి కాల్చపడి అగ్నికి ఆహారముగా వుండును.।
యేమంటే మన కొరకు శిశువు పుట్టెను, మనకు కుమా 6

రుడు యివ్వపడెను; ఆయన భుజము మీద రాజ్యభా
రము వుంచపడును; ఆయన వింతయిన వాడు, ఆలో
చనకర్త, సర్వశ్రాణగల దేవుడు, నిత్యమైన తండ్రి,
7 క్షేమాధిపతి అనే పేరులచేత పిలువపడును. । అతని
రాజ్యమునకున్ను క్షేమమునకున్ను మితము లేదు; ఆయన
దావీదుయొక్క గద్దె పైనిన్ని రాజ్యము పైనిన్ని ఆసీ
నుడై, నీతి న్యాయములచేత యెప్పటికిన్నీ దాని స్థిర
పరిచి దిట్టము చేసును; సైన్యముల యెహోవాయొ
8 క్క అత్యాసక్తిచేత యిది నెరవేరును. । యెహోవా
వొక వాక్యమును యాకోబుకు పంపెను, అయితే అది
9 ఇశ్రాయేలుకు ప్రాప్తమాయెను. । దాని తాత్పర్యము
యెఫ్రయీము వారందరికిన్ని షోమ్రోను కాపురస్థు
లందరికిన్ని తెలుసును; వీరు తమ గర్వము గల అతిశ
10 యమైన హృదయములో అనుకొనినదేమంటే, । యిటి
కెలు రాలిపోయినవి, అయితే మేము చెక్కిన రాళ్ల
చేత కట్టుకొందుము; రావి మానులు నరకపడినవి;
అయితే మేము వాటికి మారుగా ఆలమానులను వేసు
11 కొందుమని అనుకున్నందున, । యెహోవా రెస్సీను
యొక్క విరోధులను వారి మీదికి రప్పించి, వారియొ
12 క్క శత్రువులను జట్టుగూర్చును. । తూర్పునుంచి అరా
మీయులున్ను పడమరనుంచి ఫిలిష్తీయులున్ను నిలు
తురు; వీరు నిండు నోటితోను ఇశ్రాయేలీయులను
మింగివేతురు; అయినప్పటికిన్ని ఆయన కోపము తిరగ
లేదు, ఆయన హస్తము యింకా చాపబడి వున్నది. ।
13 యేమంటే యీ జనులు వారిని కొట్టిన వానితట్టు
తిరగకనున్ను సైన్యములయొక్క యెహోవాను వెతు
14 కకనున్ను వున్నారు. । కాబట్టి యెహోవా వొక్క
దినమందే ఇశ్రాయేలునుంచి శిరస్సునున్ను తోకనున్ను
15 కొమ్మనున్ను రెల్లునున్ను ఖండించును. । పెద్దవాడున్ను
ఘనుడున్ను శిరస్సై వున్నాడు; అబద్ధమును పలికే
16 దీర్ఘదర్శి తోక అయి వున్నాడు. । యేమంటే యీ జను
లను నడిపించే వారు మార్గమును తప్పింతురు; వారిచేత
నడిపించబడిన వారు నాశనమును పొంది వున్నారు. ।
17 కాబట్టి యిక యెహోవా వారి పడుచువారియందు
ఆనందము పొందక వుండును; వారి తండ్రిలేని వారి
నిన్ని వారి విధవలనున్ను కనికరించడు; యేమంటే
ప్రతి మనుష్యుడున్ను మాయకాడున్ను దుర్మార్గు
డున్ను అయి వున్నాడు; ప్రతినోరు వెర్రి మాటలను
ఆడును; అయినప్పటికిన్ని ఆయన కోపము తిరగలేదు;
18 ఆయన హస్తము యింకా చాపబడి వున్నది. । యేమం
టే అక్రమము అగ్నివలె కాల్చివేసును; ముళ్ల చెట్లను
అది మింగివేసును; అడవియొక్క దిట్టమైన పొదల
యందు అది రాజినందున అవి మీదికి యెక్కిన ధూ
19 మము వలె పైకి యెగిరిపోవును. । సైన్యముల యెహో

వాయొక్క కోపాగ్నిచేత దేశము అంధకారపరాను;
జనులు అగ్నికి ఆహారమవుదురు; వొకడు తన సహో
దరుని కనికరించక వుండును. । అతడు కుడిపార్శ్వ 20
మున గవసినప్పటికిన్ని ఆకలితో వుండును; యెడమ
పార్శ్వమున తినినప్పటికిన్ని తృప్తిని పొందడు; వారి
లో ప్రతి మనిషి తన చేతి మాంసమును తానే భక్షిం
చును. । మనస్సే ఎఫ్రయీమునున్ను ఎఫ్రయీము మన 21
స్సేనున్ను భక్షించును; వీరిద్దరున్ను కూడి యూదాకు
విరోధముగా వుందురు; అయినప్పటికిన్ని ఆయన కోప
ము తిరగ లేదు; ఆయన హస్తము యింకా చాపబడి
వున్నది.

## 10. అధ్యాయము.

అనీతి గల నిర్ణయములను నిర్ణయించే వారికి 1
అయ్యో! లేమి వానియొక్క వ్యాజ్యమును తప్పించే
టందుకున్ను, । నా జనులలో బీదల యొద్దనుంచి న్యా 2
యమును అపహరించేటందుకున్ను, విధవలు వారికి కొల్ల
సొమ్ము అయ్యేటందుకున్ను, తండ్రి లేని వారి యొద్ద
దొంగిలించేటందుకున్ను బాధకరమైన వాటిని వ్రాసే
టటువంటి లేఖికులకున్ను అయ్యో! । వృత్తరమడిగే దిన 3
మందు మీరు యేమి చేతురు! దూరమునుంచి దేశము
నకు కీడు వచ్చే దినమందు ప్రాపు కొరకు మీరు యె
వరి యొద్దికి పారిపోదురు! మీ ఘనతను యెక్కడ
వుంచుకొందురు? । నేను లేకపోతే వారు ఖయిదీల వలె 4
కింద కుంగుదురు; వారు హతమై పోయి కూలుదురు;
అయినప్పటికిన్ని ఆయన కోపము తిరగలేదు; ఆయన
హస్తము యింకా చాపబడి వున్నది. । అష్షూరు వానికి 5
అయ్యో! నా కోపముయొక్క దండమై వున్నాడు;
వాని చేతిలో వున్న కర్ర నా రౌద్రమై వున్నది. ।
మాయగల జనాంగముల మీదికి నేను వానిని పంపు 6
దును; నా వుగ్రమును భరించే జనులను గురించి నేను
అతనికి ఆజ్ఞను యిచ్చెదను; అప్పుడు వాడు కొల్లపుచ్చు
కొని సొమ్ము లాగుకొని, పాదము కింద వున్న వీధి
బురద లాగున వారిని త్రొక్కును. । అయితే యీ 7
లాటి తాత్పర్యము వానికి లేదు, వాని హృదయమందు
యీలాటి తలంపు లేదు; యేమంటే చాలా జనాంగ
ములను నరికివేసి నశింపచేసేటట్టుగా అతనికి మనస్సు
కలదు. । వాడు అనుకొనినదేమంటే, నా కింద వున్న 8
అధికారులు రాజులు కారా? । కాల్నో కర్కెమీషు 9
లాటిదే కాదా! హమాతు అర్పాదు లాటిదే కాదా!
షోమ్రోను దమస్కులాటిదే కాదా? । యెరూశలేము 10
యొక్కయున్ను షోమ్రోనుయొక్కయున్ను ప్రతిమల
కంటే మంచి ప్రతిమలు కలిగి, ఆ బొమ్మల వశమైన
రాజ్యములు నా చేతికి దొరికినట్టే, । నేను షోమ్రోను 11

పట్టణమునకున్ను దానియొక్క బొమ్మలకున్ను యే విధ
ముగా చేస్తినో ఆ ప్రకారముగానే యెరూశలేము
కున్ను దానియొక్క బొమ్మలకున్ను చేయలేక పోదు
12 నా అని అనుకొని యున్నాడు. । కాబట్టి యెహోవా
వా సీయోను పర్వతమందున్ను యెరూశలేము యం
దున్ను తన కార్యము యావత్తు సమాప్తి పరచిన తరు
వాత నేను వచ్చి అష్షూరు రాజుయొక్క గర్వపు
హృదయమునకున్ను వాని అతిశయము గల కన్నుల
యొక్క ఘనతకున్ను తగిన ఫలమును యిత్తునని ఆన
13 తిచ్చెను. । వాడు పలికినదేమంటే, నేను బుద్ధిమంతు
డను; నా బలహస్తముచేతనున్ను నా బుద్ధిచేతనున్ను
యిది చేస్తిని; నేను జనాంగములయొక్క సరిహద్దులను
మార్చిన్నీ, వారి పదార్థములను దొంగిలించి, బలిష్ఠు
14 లైనట్టు కాపురస్తులను స్వాధీనపరచితిని. । జనాంగముల
యొక్క ఐశ్వర్యము గూడులాగున నా చేతికి దొరి
కెను; వొకడు విడిచిన గుడ్లను యేలాగున యేరునో
ఆలాగున నేను లోకమంతాను లోపర్చుకొంటిని; రెక్క
యెత్తుటకున్ను నోరు తెరుచుటకున్ను ఆర్చుటకున్ను
15 వొకడూ లేకపోయెనని అతిశయించును. । అయితే
నరికే వాని మీద గొడ్డలి పొంగవచ్చునా? కదిలించే
వాని మీద రంపము అతిశయపడ వచ్చునా? యెత్తిన
వాని మీదికి కర్ర లేచినట్టున్ను అది కర్ర కానట్టే
16 దండము లేచినట్టున్ను అవును. । కాబట్టి కర్తయయిన
సైన్యముల యెహోవా ఆయన కొవ్విన వారిలోకి
క్షీణతను పంపును; ఆయన ఘనత కింద దహించిన
17 అగ్నిని ఆయన రాజవేసును. । యేమంటే ఇశ్రాయేలు
యొక్క తేజస్సు అగ్నిగానున్ను ఆయనయొక్క పరి
శుద్ధమైనవాడు మంటగానున్ను వుండును; యీ అగ్ని
వొక్క దినమందే వాని ముళ్ల చెట్లను కాల్చి మింగి
18 వేసి, । వాని అడవియొక్క ఘనమునున్ను తన ఫలభరి
తమయిన భూమియొక్క ఘనమునున్ను ఆత్మను శరీర
మును కూడా దహించును; అప్పుడు వారు వ్యాధి గల
19 వాడు క్షీణించినట్టు వుందురు. । మరిన్ని వాని అడవి
లో మిగిలిన వృక్షములు మిక్కిలీ కొద్దిగా వుండును;
20 వాటిని పిల్లవాడు సహా లెక్క పెట్టవచ్చును. । మరిన్ని
ఆ దినమందు ఇశ్రాయేలులో శేషించిన వారున్ను
యాకోబు యింటివారిలో తప్పించుకొనిన వారున్ను
తమ్మును కొట్టిన వాని మీద యికను వూనుకొని వుం
డక, ఇశ్రాయేలుయొక్క పరిశుద్ధుడైన యెహోవా
21 మీద నిజముగా వూనుకొని వుందురు. । శేషించిన
వారు అనగా యాకోబుయొక్క శేషించిన వారు సర్వ
22 త్రాణ గల దేవుని తట్టు తిరిగి వత్తురు. । యేమంటే
ఇశ్రాయేలీయులైన నీ జనులు సముద్రపు యిసుకంత
విస్తారమైనప్పటికిన్ని వారిలో వొక భాగము మాత్రమే
తిరిగి వచ్చును; నిర్ణయించపడిన నాశనము నీతితో
పూర్తి చేయబడును. । యేమంటే సైన్యములకు దేవుడైన 23
యెహోవా నిర్ణయించుకొని దేశమంతటిలో నాశ
నమును కాచేసును. । కాబట్టి సైన్యములకు దేవుడైన 24
యెహోవా ఆనతిచ్చినదేమంటే, సీయోనులో కాపు
రము వున్న ఓ నా జనమా, అష్షూరు వానికి భయపడ
వద్దు, వాడు చేతి కర్రతోటి నిన్ను కొట్టి, తన దండము
నీ మీదికి లేపును; అయితే అది మిస్రయీము మార్గ
ప్రకారముగా వుండును. । యింకా కొద్ది కాలము 25
లో నా రౌద్రాగ్ని మానిపోవును; వారి లయమందు
నా కోపము చల్లారును అని ఆనతిచ్చెను. । మరిన్ని 26
సైన్యముల యెహోవా ఓరెబు రాతి కొండ దగ్గిర
మిద్యానీయులు పొందిన దెబ్బ ప్రకారము వాని మీ
దికి కొరడాలను రేపించును; సముద్రము మీద ఆయన
దండము యేలాగున వుండెనో మిస్రయీము మీద
యేలాగున వుండెనో ఆలాగునే తన కర్రను ఆయన
యెత్తును. । కాబట్టి ఆ దినమందు అతడు మోపిన భార 27
ము నీ భుజము మీదనుంచిన్ని అతడు పెట్టిన కాడి
కర్ర నీ మెడ మీదనుంచిన్ని తీసివేయపడును; అతని
కాడియొక్క తాళ్లు అభిషేకించబడిన ఆయన నిమిత్త
ము విప్పబడును. । వాడు ఆయాతుకు వచ్చెను; అక్కడ 28
నుంచి తర్లీ మిగ్రోనుకు వచ్చెను; మిక్మషులో తన
సామగ్రిని వుంచెను. । వారు ఘాటి దాటి గెబలో 29
ఆ రాత్రి దిగిరి; రామా పట్టణము బహు భయపడుతూ
వున్నది; సౌలుయొక్క గిబా వూరివారు పారిపోయిరి. ।
ఓ గల్లీముదేశపు కుమారీ, నీ బొబ్బ యెత్తుము; ఓ 30
బాధపడిన అనాతోతా, నీవు లాయీషు పట్టణము
మట్టుకు నీ శబ్దము వినిపించబడనిమ్ము. । మద్మేనా పట్ట 31
ణపు వారు పారిపోయిరి; గెబీము కాపురస్తులు కూడు
కొని పారిపోతూ వున్నారు. । ఆ రోజున వాడు 32
నోబు పట్టణమందు వుండును; వాడు సీయోను కుమా
ర్తె అనే యెరూశలేము కొండ తట్టు తన చేతిని కది
లించును. । యిదుగో కర్త అయిన సైన్యములయొక్క 33
యెహోవా కంటికి అందమయిన కొమ్మను భయంకర
ముగా తెగవేసును; వున్నతమైన వారు కిందను నరక
బడుదురు; అతిశయమైన వారు కుంగుదురు. । మరిన్ని 34
అడవియొక్క దిట్టమైన పొదలను యినుముచేత ఆయన
నరికివేసును; లెబానోను సహా బలమైన హస్తముచేత
పడిపోవును.

## 11. అధ్యాయము.

అయితే యెష్షై అడుగు మొద్దునుంచి కొమ్మ పుట్టు 1
ను; వాని వేరునుంచి చిగురు బైలు వెళ్లును. । ఆయన 2
మీదికి యెహోవాయొక్క ఆత్మ వచ్చి నిలుచును; జ్ఞాన

ముయొక్క ఆత్మయున్ను తెలివియొక్క ఆత్మయున్ను
ఆలోచనయొక్క ఆత్మయున్ను మహాత్వముయొక్క ఆత్మ
యున్ను యెహోవా యెడల భయభక్తిగల ఆత్మ
3 యున్ను ఆయన మీద వుండును. । దానిచేత ఆయనకు
యెహోవా భయభక్తి యందు చాలా సంతోషము
కలిగినందున ఆయన కను దృష్టి చొప్పున న్యాయమును
తీర్చక, చెవి వినికి చొప్పున తీర్పుచేయక వుండి, ।
4 నీతిచేత బీదలకు న్యాయము తీర్చి, ధర్మముచేత లోక
మందున్న దీనుల యెడల విమర్శ చేసును; ఆయన
తన నోటియొక్క దండము తోటి లోకమును కొట్టి
తన పెదవుల వూపిరిచేత దుష్టులను హతము చేసును. ।
5 మరిన్ని నీతి తన నడుముకున్ను సత్యము తన మొలకు
6 న్ను తాడుగా వుండును. । అప్పుడు తోడేలు గొర్రె
పిల్లతో కూడా నివసించును; సివంగి మేక పిల్లతో
కూడా పడుకొనును; దూడయున్ను కొదమ సింహ
మున్ను కొవ్విన పెయ్యయున్ను కూడుకొని వుండును;
7 వీటిని వొక చిన్న పిల్లవాడు తోలును. । ఆవున్ను వెలు
గుబంటిన్ని కూడి మేసును; వాటి పిల్లలు కూడి పడు
8 కొనును; సింహము యెద్దు వలె గడ్డిని మేసును. । పసి
పిల్ల పాము పుట్ట రంధ్రము మీద ఆడుకొనును; పాలు
విడిచిన పిల్ల సర్పపు నివాసము మీద తన చేతిని వుం
9 చును. । యివన్నీ నా పరిశుద్ధ పర్వతము అంతటానున్ను
యే మోసమయినా హానియైనా చేయక వుండును;
యేమంటే వుదకములచేత సముద్రపు అగాధము యేలా
గున కప్పబడి వున్నదో ఆలాగున భూలోకము యె
10 హోవా తెలివిచేత నిండి వుండును. । మరిన్ని ఆ దిన
మందు యెష్షయియొక్క వేరు జనులకు నిశానీగా నిలు
చును; దానిని జనాంగములు వెతుకుదురు; ఆయన
11 యిచ్చే నెమ్మది బహు ఘనముగా వుండును. । మరిన్ని
ఆ దినమందు యెహోవా తన హస్తమును రెండోమారు
చాపి అష్షూరునుంచిన్ని మిస్రయీమునుంచిన్ని పత్రో
సునుంచిన్ని కూషునుంచిన్ని ఏలామునుంచిన్ని షినా
రునుంచిన్ని హమాతునుంచిన్ని సముద్రపు ద్వీపముల
నుంచిన్ని శేషించి వున్న తన జనులను తిరిగీ చేకొనేటం
12 దుకు వచ్చును. । యేమంటే ఆయన జనాంగముల కొ
రకు వొక నిశానీ యెత్తి, అవతల వెళ్ల వేయపడిన ఇశ్రా
యేలీయులను కూడా రప్పించి, నఖముఖాలా చెదిరిన
యూదా వారిని నాలుగు దిక్కులనుంచి కూర్చును. ।
13 అప్పుడు యెఫ్రయీముయొక్క పరభాగ్యచింత మాని
పోవును; యూదాయొక్క శత్రు పరిహరమౌను; యె
ఫ్రయీము యూదాయొక్క భాగ్యమును గూర్చి చింత
పడదు; యూదా యెఫ్రయీముకు విసుపు పుట్టించ
14 దు. । అయితే వారు కలుసుకొని, పడమటి తట్టు వున్న
ఫిలిష్తీయులయొక్క సరిహద్దుల మీద దడాలున పడు
దురు; తూర్పు దిక్కున వున్న వారియొక్క సొమ్మును
వారు దోచుకొందురు; యేదోము మోయాబు అనే
దేశముల మీద వారు తమ చేతిని చాపుదురు; అమ్మోను
పుత్రులు వారికి విధేయులవుదురు. । మరిన్ని యెహో 15
వా మిస్రయీముయొక్క సముద్రపు గొంది యెండి
పోయేటట్టు చేసును; తన బలమైన గాలిచేత తన హస్త
మును నది మీదికి కదిలించి, దాని యేడు పాయలుగా
తెగబొడిచి, మనుష్యులను కాలి చెప్పులతోటి దాటిం
చును. । కాబట్టి ఇశ్రాయేలీయులు మిస్రయీము దేశ 16
ములోనుంచి యివతలికి వచ్చినప్పుడు వారికి యెటు
వంటి మార్గము కలిగెనో అటువంటి రాజమార్గము
అష్షూరు దేశములోనుంచి శేషించిన ఆయన జనులకు
కలిగి యుండును.

## 12. అధ్యాయము.

మరిన్ని ఆ దినమందు నీవు అనుకొనేదేమంటే, 1
వో యెహోవా, నేను నిన్ను స్తుతింతును; నీవు
నా మీద కోప పడినప్పటికిన్ని నీ కోపము తిరిగి
పోయినందున నీవు నన్ను ఆదరించితివి. । యిదిగో దేవు 2
డు నా రక్షణ అయి వున్నాడు; నేను నమ్ముకొని భయ
పడుదును; యెహోవా నా బలమున్ను నా పాటయు
న్ను అయి వున్నాడు; ఆయన నా రక్షణయున్ను అయి
వున్నాడు. । కాగా మీరు రక్షణ ధారలలోనుంచి సం 3
తోషముచేత నీళ్లను తోడుదురు. । ఆ దినమందు మీరు 4
చెప్పేదేమంటే, మీరు యెహోవాను స్తుతించండి;
ఆయన నామమును స్మరించి, ఆయన కార్యములను
జనులలో చాటించి, ఆయన నామము హెచ్చించపడె
నని జ్ఞాపకము చేయండి. । యెహోవాయొక్క నామ 5
మును పాడండి, యేమంటే ఆయన మహిమ గల క్రియ
లను చేసెను; యిది లోకులందరిలో ప్రచురమై యు
న్నది. । ఓ సీయోను కాపురస్తులారా, సంతోషమైన 6
శబ్దముచేత బొబ్బ పెట్టండి; యేమంటే మీ మధ్యమం
దున్న ఇశ్రాయేలుయొక్క పరిశుద్ధమైన వాడు మహ
త్వము గలవాడు.

## 13. అధ్యాయము.

బాబెలును గురించి ఆమోసు కుమారుడైన యెష 1
యాకు దర్శనమందు కనపడిన భగవద్వాక్యము, యే
మంటే, । వున్నతమైన పర్వతము మీద నిశానీ యెత్తండి; 2
వారు అధికారులయొక్క ద్వారములందు ప్రవేశించే
టట్టుగా వారికి చే సౌజ్ఞ చేసి గొప్ప శబ్దముచేత పిలు
వండి. । నా చేత నిర్ణయించబడిన వారికి నేను ఆజ్ఞను 3
యిస్తిని; నన్ను ఘనపచేటందుకు సంతోషిస్తూ వున్న
నా పరాక్రమశాలురను నా కోపాగ్నిని రాజబెట్టే
టందుకు నేను పిలువ నంపిస్తిని. । మిక్కిలీ గొప్ప 4

అయిన జన సమూహముయొక్క శబ్దము పర్వతము
లందు వినబడి వున్నది; అది కూడుకొనిన రాజ్యముల
జనాంగములయొక్క వురుము వంటి శబ్దమై యున్నది;
సమూహములకు అధిపతియైన యెహోవా యుద్ధము
5 నకు సమూహమును కూర్చినాడు. । వారు లోకాంత
మందున్న దూర దేశమునుంచి వస్తూ వున్నారు; యె
హోవా తన వుగ్రపు ఆయుధముల తోటి ఆ దేశ
6 మంతా నశింపచేయడానకు వస్తూ వున్నాడు. । యెహో
వాయొక్క దినము సమీపమైనందున మీరు అంగలా
ర్చండి; అది సర్వత్రాణ గల వాని యొద్దనుంచి నాశ
7 నము కొరకు వచ్చును. । కాబట్టి సకల హస్తములు వా
8 లును; ప్రతివాని హృదయము కరిగిపోవును. । వారు
భయమును పొందుదురు; శ్రమలున్ను దుఃఖములున్ను
వారిని పట్టుకొనును; ప్రసవ వేదన పొందిన స్త్రీవలెనే
వారికి నొప్పి కలుగును; వొకరి ముఖమును వొకరు
చూచుకొని విభ్రాంతిని పొందుదురు; వారి ముఖములు
9 అగ్ని మంటకు సమమౌను. । యిదుగో యెహోవాయొ
క్క దినము భయంకరమైన రౌద్రముతోటిన్ని కోపా
గ్నితోటిన్ని దేశము పాడుచేసుటకు వస్తూ వున్నది;
ఆయన భూమిలో వున్న పాపాత్ములను దానిలోనుంచి
10 నాశనము చేసును. । యేమంటే ఆకాశ నక్షత్రములు
న్ను దాని గ్రహములున్ను వాటి వాటి ప్రకాశతను
యివ్వక వుండును; సూర్యుడు బైలు వెళ్లేటప్పుడు
అంధకారమవును; చంద్రుడున్ను తన తేజస్సు యి
11 వ్వక వుండును. । లోకులను వారి చెడ్డతనము నిమిత్తము
న్ను దుర్జనులను వారి అక్రమము నిమిత్తమున్ను నేను
శిక్షింతును; గర్విష్ఠులయొక్క గర్వమును నేను మా
న్పించి, బెదిరించే వారి అతిశయమును కుంగచేతును. ।
12 మనుష్యులను నేను బంగారము కంటేనున్ను నిజముగా
ఓఫీరుదేశపు సువర్ణము కంటేనున్ను ప్రియముగా
13 చేతును. । కాబట్టి నేను ఆకాశములను కదిలింతును;
సైన్యముల యెహోవా అనే నా కోపాగ్ని మండిన
దినమందు నా వుగ్రముచేత భూమి తన స్థలమునుంచి
14 కదల్చబడును. । అది తరమపడిన లేడి వలెనున్ను కాపరి
లేక బెదరిన గొర్రె వలెనున్ను వుండును; ప్రతి మను
ష్యుడున్ను తన స్వజనుల తట్టు ముఖము తిప్పుకొని,
15 తన స్వదేశమునకు పారిపోవును. । చిక్కిన వారందరు
న్ను కుమ్మపడుదురు; కూడుకొనిన మేళము కత్తిచేత
16 కూలును. । వారి పసిపిల్లలు వారి కనుదృష్టి యెదుట
ప్రహరించబడుదురు; వారి యింటి సొమ్ము దోచుకో
పడును; వారి భార్యలు బలిమిచేత చెరుపును పొందు
17 దురు. । యిదుగో నేను వారి మీదికి వచ్చేటట్టు మాదీ
యులను ప్రేరేపణ చేతును; వీరు వెండిని లక్ష్యము
18 చేయరు, బంగారమును ఆశించరు. । వాని విండ్లచేత
పడుచు వారు ఛిన్నాభిన్నములౌదురు; గర్భ ఫలము
మీద వారికి జాలి లేకపోవును; పసిపిల్లల మీద వారికి
కనికరము వుండదు. । మరిన్ని రాజ్యములలో శృంగా 19
రమైన పట్టణమనిన్ని కల్దీయులయొక్క అతిశయమైన
ప్రకాశత గల పట్టణమనిన్ని యెంచపడిన యీ బా
బెలు దేవునిచేత బోల్ర్తించబడిన సొదొమకున్ను గొమొ
ర్రాకున్ను సమమౌను. । అది యెప్పటికిన్ని కాపురము 20
చేయబడకపోవును; తర తరముకు అది నివసించబడక
పోవును; అరబీయుడు అక్కడ డేరా వేసుకోడు; బో
యలు అక్కడ మంద దొడ్లను వేసుకోరు. । అయితే 21
అక్కడ అడవి మృగములు పడుకొనును; దుష్ట జంతు
వులచేత వారి యిండ్లు నిండి వుండును; అక్కడ గుడ్ల
గూబలు నివాసము చేసును; అక్కడ కొండ గొర్రెలు
ఆట్లాడును. । వారి మందిరపు సాలలలో తోడేళ్లు 22
అర్చును; వారి ఆనందమైన విశాల స్థలమందు క్రూర
సర్పములు బుస్సు పెట్టును; దాని కాలము సమీ
పించెను; దాని దినములు ఆలస్యము కాకపోవును.

## 14. అధ్యాయము.

యేమంటే యెహోవా యాకోబు మీద జాలిగా 1
వుండి, ఇశ్రాయేలీయులను యింకా యేర్పరచి, వారి
స్వదేశమందు వారికి నెమ్మదిని దయచేసును; మరిన్ని
పరదేశులు వారితో కలుసుకొని, యాకోబు యింటి
తోటి అతక పడుదురు. । మరిన్ని ఆ జనులు తమ స్వస్థ 2
లమునకు వారిని తీసుకొ వత్తురు; అప్పుడు ఇశ్రాయేలు
యింటివారు యెహోవా దేశమందు వారిని దాసుల
గానున్ను దాసీలగానున్ను స్వతంత్రించుకొని, యెవరి
కింద వారు చెరగా వుండిరో వారిని చెరగా పట్టు
కొని, తమ్మును బాధ పెట్టిన వారిని యేలుదురు. । కా 3
బట్టి నీ దుఃఖములోనుంచిన్ని నీ భయములోనుంచిన్ని
నీ మీద పెట్టిన కఠినమైన దాసత్వములోనుంచిన్ని
యెహోవా నీకు నెమ్మదిని దయ చేసిన దినమందు
నీవు బాబెలు రాజును గురించి అపహాస్యముగా చెప్పే
దేమంటే, । బాధపెట్టేవాడు యేలాగున వూరకున్నా 4
డు! బంగారపు పట్టణము యేలాగున వూరకున్నది! ।
యెహోవా దుర్జనులయొక్క దండమునున్ను యేలే 5
వారియొక్క గదనున్ను విరిచివేసెను. । రౌద్రము తెచ్చు 6
కొని నిత్యమున్ను దెబ్బలచేత జనులను కొట్టి జనాం
గములను కోపముగా యేలిన వీడు మరేమైనా ఆతం
కము లేకుండా తరమ పడినవాడై వుండెను. । యిప్పుడు 7
భూమి అంతా చల్లదనమును పొంది నిమ్మళమై సంతో
షపు శబ్దము చేత అర్పుతూ వున్నది. । నిజముగా దేవ 8
దారు వృక్షములున్ను ఆర్జవృక్షములున్ను నిన్ను
చూచి సంతోషిస్తూ, నీవు కూలినప్పటినుంచి మమ్మును

నరికేటందుకు వచ్చిన వాడు వొకడూ లేడని అనుకొం
9 టూ వున్నవి. । నీవు వస్తూ వున్నావని పాతాళము విని
లేచి నిన్ను యెదుర్కొనుటకు కలవిలపడుతూ వస్తూ
వున్నది; చనిపోయిన వికృతాకారులను భూలోకము
నకు అధికారులై పోయిన వారందరినిన్ని నీ నిమిత్తము
అది లేపిస్తూ వున్నది; అది జనాంగములయొక్క రాజు
10 లను తమ తమ గద్దెల మీదనుంచి లేపించెను. । వీరంద
రున్ను నిన్ను చూచి పలికేదేమంటే, నీవున్ను మా వలె
11 నే బలహీనుడవైతివా? మా వంటివాడవైతివా? । నీ
గర్వమున్ను నీ వీణెలయొక్క నాదమున్ను పాతాళ
మునకు దిగి వచ్చినవి; పురుగులు నీకింద పరుపు వలె
పరచబడినవి; యెమిడికె పాములు నిన్ను కప్పినవి. ।
12 అరుణోదయపు కుమారుడనే ఓ వేకువ చుక్కా,
ఆకాశమునుంచి నీవు యేలాగు పడితివి! జనాంగము
లను పడదోసిన ఓ నీవా, యేలాగు నరక పడితివి! ।
13 నీ హృదయములో నీవు అనుకొనినదేమంటే, నేను
పైకి యెక్కిపోదును; నేను నా గద్దెను దైవ నక్షత్ర
ముల పైగా హెచ్చించుదును; నేను సంఘము కూ
డిన పర్వతము మీద వుత్తర పార్శ్వములో ఆసీనుడ
14 నవుదును. । నేను వున్నతమైన మేఘములకంటే పైకి
యెక్కి, మహోన్నతమైన వానితో సమానమౌదునని
15 అనుకొంటివి; । అయినప్పటికిన్ని నీవు పాతాళములో
నున్ను కూపముయొక్క పక్కలలోనున్ను అణచ పడు
16 దువు. । నిన్ను చూచినవారు నిన్ను పరకాయించి, విచా
రణ చేసి, భూమిని బెదిరించి, రాజ్యములను కదిలించి, ।
17 లోకమంతా అరణ్యమయ్యేటట్టు చేసి, దాని పట్టణము
లను నశింపచేసి, తాను చెరగా పట్టుకొని పోయిన
వారిని విడుదల చేయని వాడు వీడే కదా అని అను
18 కొందురు. । జనాంగములయొక్క రాజులందరున్ను ఘన
ముగా ప్రతివాడు తన తన సమాధిలో శయనించి
19 వుంటూ వుండగా, । నీవు యేహ్యమైన చిగురుగానున్ను
కత్తిచేత కుమ్మపడి హతమై పోయి రాళ్లు గల కూపము
లోకి దిగిపోయిన వారియొక్క వస్త్రమైనట్టున్ను నీ
సమాధిలోనుంచి బయట వేయ పడినందున నీవు కాలు
20 కింద త్రొక్కపడిన లాగున వుందువు. । వీవు నీ దేశ
మును నశింపచేసి, నీ జనులను హతము చేస్తివి గనుక
వారితో కూడా సమాధిలో శయనించక పోదువు;
దుష్టుల సంతతి యెన్నటికిన్ని పేరు పొందేది లేదు. ।
21 వాని పిల్లలు లేచి భూమిని స్వతంత్రించుకొని, లోక
మును పట్టణములతోటి నిండించకుండా వారి పితృల
యొక్క అక్రమము నిమిత్తము వారికి హతము సిద్ధము
22 చేయుండి । యిందుకు సైన్యములయొక్క యెహోవా
ఆనతిచ్చినదేమంటే, నేను వారి మీదికి లేచి, బాబెలు
నుంచి నామమునున్ను శేషమునున్ను కుమారునిన్ని జ్ఞాతి
నిన్ని నరికివేతుననిన్ని, । దానిని యేదుబందులకు స్వాధీ 23
నముగానున్ను వుదకములు గల కొలనులుగానున్ను చేతు
ననిన్ని, నాశనమనే చీపురుకట్టతోటి దాని వూడ్చుదు
ననిన్ని సైన్యములయొక్క యెహోవా ఆనతిచ్చెను. ।
మరిన్ని సైన్యములయొక్క యెహోవా ప్రమాణము 24
చేసినదేమంటే, నేను యోచించిన యోచన నిజముగా
సంభవించును; నేను చేసిన ప్రతిజ్ఞ స్థిరపడును. । అది 25
యేమంటే, నా దేశమందు నేను అష్షూరు దేశస్థుని
చితక కొట్టుదును; నా పర్వతముల మీద వాని నేను
త్రొక్కుదును; అప్పుడు తన కాడి వారి మీదనుంచి
తీయపడును; తన మోపు వారి భుజముల మీదనుంచి
కింద పడును. । యిది భూమి అంతటిని గురించి నిర్ణ 26
యించిన నిర్ణయమై వున్నది; మరిన్ని సకల జనాంగ
ముల మీద చాపబడి వున్న హస్తము యిది అయి
వున్నది. । యేమంటే సైన్యములయొక్క యెహోవా 27
నిర్ణయించినట్టయితే యెవరు భేదించగలరు? ఆయన
హస్తము చాపితే యెవరు వెనుకకు లాగ గలరు! । మరిన్ని 28
రాజైన ఆహాజు మరణము పొందిన సంవత్సరమందు
వచ్చిన భగవద్వాక్యము యేమంటే, । ఓ సమస్తమైన 29
పెలెష్తు దేశమా, నిన్ను కొట్టిన వానియొక్క దండము
విరిగినందుచేత నీవు సంతోష పడకుము; యేమంటే
సర్పముయొక్క వేరు వల్లనుంచి మిడినాగు పుట్టును;
వానికి ఫలించే ఫలము యెగిరే అగ్ని సర్పమై వుండును. ।
అప్పుడు దరిద్రులలో అతిశయులు తిందురు; బీదలు 30
నిర్భయముగా పడుకొందురు; నీ వేరును కరువు చేత
నశింప చేతును; నీకు శేషించిన వారు వుంటే వారిని
వాడు హతము చేసును. । ఓ ద్వారమా, నీవు అంగలా 31
ర్చుము; ఓ పట్టణమా, నీవు యేడ్వుము; ఓ పెలెష్తు
దేశమా, నీవు బొత్తిగా కరిగిపోయి వున్నావు; యేమంటే
వుత్తర దిక్కునుంచి ధూమము యెక్కి వస్తూ వున్నది;
వాని దండు మేళములందు కేటించిన వాడు వొకడూ
లేక వుండును. । మరిన్ని జనాంగములయొక్క దూత 32
లకు యివ్వవలసిన ప్రత్యుత్తరమేమంటే, యెహోవా
సీయోనుయొక్క పునాదిని స్థిరపరచెను; దానిని దరి
ద్రులైన తన జనులు ఆశ్రయింతురని చెప్పను.

## 15. అధ్యాయము.

మోయాబు దేశమును గురించిన భగవద్వాక్యము, 1
యేమంటే, రాత్రిలో మోయాబు సంబంధమయిన ఆరు
అనే పట్టణము పాడయి పోయి తెగవేయ పడెను;
యేమంటే రాత్రిలో మోయాబు సంబంధమైన కీరు
అనే పట్టణము పాడయి పోయి తెగవేయ పడెను. ।
అతడు యేడ్చుటకు బాయీతు, దీబోను, అనే వున్న 2
తమయిన స్థలములకు యెక్కి వెళ్లెను; నెబో మీద

నున్ను మేదెబా మీదనున్ను మోయాబు అంగలా
ర్చును; సకల శిరస్సులు బోడిగా వున్నవి; సకలమైన
3 గడ్డములు గొరిగించపడి యున్నవి. । వారి వీధులలో
వారు గోనెపట్టచేత నడుము కట్టుకొందురు; మేడల
మీదనున్ను వీధులయందున్ను అందరున్ను అంగలా
4 ర్చుతూ బహుగా యేడ్చుతూ దిగులు బడుదురు. । హె
ష్బోను; ఎలాలే, అనే పట్టణములు యేడ్చుతూ వున్నవి;
వారి శబ్దము యహస్సు మట్టుకు వినపడును; కాబట్టి
మోయాబుయొక్క సైన్యములు కేకవేసును; అతని
5 ప్రాణముకు విసువు పుట్టును. । నా గుండె మోయాబు
నిమిత్తము అంగలార్చును; అతని జనులు మూడేండ్ల
యీడు గల ఆవుపడ్డ వలెనే పారిపోతూ, సోయరు
అనే పట్టణముకు వచ్చి, లూహీతుయొక్క యెక్కుడు
స్థలముకు యేడ్పుతోటి యెక్కి, హొరొనయీము
మార్గమున వచ్చి నాశనమును గూర్చి బొబ్బ పెట్టు
6 దురు. । యేమంటే నిమ్రీముయొక్క జలములు యెండి
పోవును; గడ్డి యెండిపోవును; చిగురు వాడిపోవును;
7 యే పచ్చిక అయినా లేకపోవును. । కాబట్టి వారు
సంగ్రహించుకొనినది యావత్తున్ను అరబీయులయొక్క
8 లోవలోకి యెత్తుకుపోబడును. । యేమంటే రోదన
శబ్దము మోయాబు సరిహద్దుల చుట్టుకు వ్యాపించెను;
దాని మొర్ర ఎగ్లయీము మట్టుకున్ను దాని అంగ
9 లార్పు బెయేరేలీము మట్టుకున్ను సాగెను. । యేమంటే
దీమోనుయొక్క జలములు రక్తముతోటి నిండివున్నవి;
యింకా అధికమైన నష్టములను దీమోను మీదనున్ను
సింహములను మోయాబు వారి మీదనున్ను దేశమం
దున్న శేషించిన వారి మీదనున్ను నేను రా చేతును.

## 16. అధ్యాయము.

1 అరణ్యము గుండా సెలనుంచి సీయోను కుమార్తె
యొక్క పర్వతములో వున్న దేశమును యేలిన వాని
2 యొద్దికి గొర్రె పిల్లను పంపండి. । యేమంటే పక్షి
తన గూటిలోనుంచి తోలివేయపడినప్పుడు యేలాగు
యిటూ అటూ యెగురునో ఆలాగునే అర్నోను
నది రేవుల యొద్దను మోయాబు కుమార్తెలు తోలి
3 వేయ పడుదురు. । ఆలోచన చేయుము, న్యాయముగా
తీర్చుము, రాత్రి కాలపు చాటువలెనే మధ్యాహ్న
మందు నీ నీడను నీకు చేసుకొమ్ము; అవతల వేయపడిన
వారికి మరుగు యిమ్ము; తప్పించుకొని పోయిన వారిని
4 బైలు పర్చ వద్దు. । ఓ మోయాబూ, అవతల వేయప
డిన నా వారిని నీ యొద్ద వుండనిమ్ము; దోపుకాని
నుంచి నీవు వారికి ప్రాపుగా వుండుము, యేమంటే
బాధకర్త మరి లేడు; కొల్లపెట్టేవాడు మరి బాధిం
చడు; కాళ్లకింద త్రొక్కేవాడు దేశములోనుంచి నాశ
నమై పోవును. । అప్పుడు వుపకారమందు గద్దె స్థిరప 5
డును; సత్యమందు దావీదుయొక్క కాపురములలో
ఆయన ఆసీనుడై న్యాయముగా యేలుతూ వుండి,
నీతిగా విమర్శిస్తూ ధర్మము చేసుటకు సిద్ధమై వుం
డును. । అయితే మోయాబుయొక్క గర్వమును గూర్చి 6
మేము విని యున్నాము; వాడు బహుగా గర్వించి
యున్నాడు; వానియొక్క అతిశయమున్ను గర్వమున్ను
కోపమున్ను యెంత అధికము, అయితే వాని ప్రగల్భ
మైన మాటలు అన్ని వ్యర్థము. । కాబట్టి మోయాబు 7
మోయాబును గూర్చి రోదనము చేసును; అందరున్ను
రోదనము చేతురు; కీహరెశతుయొక్క పునాదుల నిమి
త్తము మీరు దుఃఖింతురు; నిజముగా అవి బద్దలై
పోయినవి. । యేమంటే హెష్బోనుయొక్క భూములు 8
యెండిపోయినవి; శిబ్మాయొక్క ద్రాక్ష చెట్టున్ను యెం
డిపోయినది; అన్యజనుల అధిపతులు దానిలో వున్న
మంచి మొక్కలను పాడుచేసిరి; అవి యజేరు సమీప
మునకు వచ్చి నఖముఖాలా అల్లుకొని, అరణ్యము
మట్టుకు సహా సాగినవి; దాని తీగెలు సాగి సముద్రము
అవతలకు పాకినవి. । కాబట్టి నేను శిబ్మాయొక్క ద్రాక్ష 9
చెట్టును గురించి యజేరుయొక్క యేడ్పుతోటి రోద
నము చేతును; ఓ హెష్బోనా, ఓ ఎలాలే, నా కన్నీళ్ల
చేత నేను మీ భూములను పదునుగా చేతును; యే
మంటే మీ పండ్ల కోత ఆపున్ను మీ పంట కోత
ఆపున్ను తప్పినది. । ఫలితమైన భూమిలోనుంచి సం 10
తోషమున్ను విలాసమున్ను తీయపడెను; ద్రాక్ష తోట
లలో పాట అయినా సంతోషపు ధ్వని అయినా లేక
పోవును; గానుగలలో ద్రాక్ష గెలలను త్రొక్కేవారు
మరి త్రొక్కరు; వారి సంతోషపు ధ్వనిని నేను మా
న్పించినాను. । కాబట్టి నా గుండె మోయాబు నిమి 11
త్తమున్ను నా వుదరము కిర్హెరెషు నిమిత్తమున్ను
కిన్నెర వలెనే వాగును. । అయితే మోయాబు వున్నత 12
మైన స్థలమందు తాను ఆయాస పడుటను చూచి,
ప్రార్థన చేసుటకు తన దేవాలయములోకి వచ్చును
గాని వానికి జయము దొరకదు. । యిది యెహోవా 13
మోయాబును గురించి ఆదినుంచి చెప్పిన వాక్యమై
వున్నది. । అయితే యిప్పుడు యెహోవా ఆనతిచ్చిన 14
వాక్యమేమంటే, మూడు సంవత్సరములు, అనగా,
కూలివాని లెక్క ప్రకారమైన మూడు సంవత్సరముల
యీలోపల మోయాబుయొక్క ఘనము తన గొప్ప
సమూహముతో కూడా వంచపడును; శేషించిన వారు
మిక్కిలి కొంచెముగానున్ను బలహీనముగానున్ను
వుందురు.

## 17. అధ్యాయము.

1 దమస్కు పట్టణమును గురించిన భగవద్వాక్యము,
యేమంటే, యిదుగో దమస్కు పట్టణము కాకుండా
2 పాడు దిబ్బ అయి పోవును.। అరోయేరుయొక్క వూళ్లు
విడవపడి గొర్రెలకు యివ్వపడును; అవి పడుకొని
యెవరివల్లనైనా భయమును పొందకుండా వుండును.।
3 మరిన్ని ఎఫ్రయీముకు బురుజులున్ను దమస్కుకు రా
జ్యమున్ను లేక పోవును; అరాము వారిలో శేషించిన
వారికి ఇశ్రాయేలు పుత్రులకు వున్న ఘనము కలుగు
నని సైన్యములయొక్క యెహోవా ఆనతిచ్చెను;।
4 యేమంటే, ఆ దినమందు యాకోబుయొక్క ఘనము
తక్కువై పోవును; మరిన్ని వాడు పంటను కోసేవాని
5 చేత కూర్చబడిన చేనుల లాగుననున్ను,। వానిచేత
కోయబడిన వెన్నుల లాగుననున్ను నిజముగా రెఫా
యీము లోవలో వుకనిచేత కోయబడిన వెన్నుల లా
గుననున్ను వుండును; అయితే యాకోబు దేశమందు
6 లేకి యేరుటకు కొందరు శేషించి వుందురు.। అది యిప్ప
చెట్టును దులిపిన తరువాత పయి కొమ్మ మీద రెండు
మూడు పండ్లు వున్నట్టుగానున్ను ఫలించిన చివర
కొమ్మలలో నాలుగు అయిదు పండ్లు వున్నట్టుగానున్ను
వుండునని ఇశ్రాయేలుకు దేవుడైన యెహోవా ఆన
7 తిచ్చెను.। అయితే ఆ దినమందు మనుష్యులు తమ్మును
కలుగచేసిన ఆయన తట్టు ముఖము తిప్పుకొని, ఇశ్రా
యేలుయొక్క పరిశుద్ధమైన వాని కనిపెట్టుతూ వుం
8 దురు.। యేమంటే అతడు తనవల్ల కలిగిన పీఠముల
తట్టు చూడక, తనవల్ల కలిగిన తోపులనైనా సూర్య
9 ప్రతిమలనయినా లక్ష్యము చేయక వుండును.। మరిన్ని
ఆ దినమందు తన బలమైన పట్టణములు ఇశ్రాయేలు
పుత్రుల ముఖము ముందర విడవబడిన అడవి చెట్ల
పై కొమ్మల వలె వున్నందున దేశము యావత్తు పాడు
10 గా వుండును.। యేమంటే నీ రక్షణయొక్క దేవుని
నీవు మరచిపోయి, బలమైన శిలా పర్వతమందు మన
స్సు వుంచుకోకపోతివి గనుక నీవు అందమైన మొక్క
లను నాటుదువు; అన్యదేశపు చిగురులను వేసుకొం
11 దువు.। మరిన్ని పగటి యందు నీ మొక్కను నీవు
పెరిగేటట్టు చేతువు; వుదయమందు నీ విత్తనమును నీవు
ఫలింప చేతువు; అయినప్పటికిన్ని కోత దినమందు
కోత తీసివేయపడినందున మిక్కటమైన దుఃఖము కలిగి
12 వుండును.। సముద్రముయొక్క ఘోష వలెనే ధ్వని
చేసిన చాలా జన సమూహమునకు అయ్యో! గొప్ప
వుదకముల శబ్దములాగున వున్న జనులయొక్క జయ
13 ధ్వనికి అయ్యో!। మహా ప్రవాహముల వలెనే జనాంగ
ములు తోసుకొని వచ్చి ఘోషింతురు; అయితే వారు
దేవునిచేత గద్దించపడి, దూరముకు పోయి, కొండల
ధూళి గాలిచేత యేలాగున యెగరవేయబడునో జంతి
సుడిగాలిచేత యేలాగున చెదరపడునో ఆలాగున
వారున్ను చెదరబడుదురు.। అస్తమానమందు యిదుగో 14
శ్రమ వుండును; సూర్యోదయము కాక మునుపు
వారు లేక వుందురు; యిది మమ్ము అపహరించే వారి
యొక్క భాగమున్ను మన సొమ్మును దోచుకొనిన వారి
యొక్క ప్రాప్తమున్ను అయి వున్నది.

## 18. అధ్యాయము.

కూషు నదుల తీరమున వాటి సరిహద్దులలో 1
బహుగా నీడ కలిగి సముద్రపు వుదకముల మీద
తుంగపడవలచేత రాయబారులను పంపే దేశముకు
అయ్యో!। ఓ, చురుకయిన దూతలారా, బహు బల 2
మును పొంది చాలా దూరము మట్టుకు వ్యాపించి
వున్నటువంటిన్ని ఆరంభమునుంచి ఇది వరకు భయం
కరముగా వున్నటువంటిన్ని చాలా జయకరముగా
వున్నటువంటిన్ని నదులవల్ల పాడైపోయిన దేశము గల
జనాంగము యొద్దికి వెళ్లండి.। లోకమందుండే నివాసు 3
లారా, భూమి యందు వుండే కాపురస్తులారా, పర్వ
తముల మీద వారు నిశానీ యెత్తినప్పుడు చూడండి;
వారు బాకా నాదము చేసినప్పుడు వినండి। యిందుకు 4
యెహోవా నాకు ఆనతిచ్చినదేమంటే, నేను నిమ్మ
ళించి కాయ కూరల మీద తేటైన యెండ లాగున
నున్ను కోత కాలములో వెట్ట సమయమందు వచ్చిన
మంచు మేఘము లాగుననున్ను వుండి, నా నివాస
స్థలమందు కనిపెట్టుతూ వుందునని ఆనతిచ్చెను.। యే 5
మంటే ద్రాక్షపండ్ల కోత కాలము యింకా రాక
ముందు మొక్క చిగురు పెట్టి పుష్పించి కాయ కాసి
పక్వముకు వస్తూ వుండగా వారు పోట కత్తుల చేత
వాటి చిగురులనున్ను కొమ్మలనున్ను నరికి వేతురు.। 6
అప్పుడు వారు పర్వతములయొక్క పక్షుల కొరకున్ను
భూమియొక్క మృగముల కొరకున్ను వదలివేయ పడు
దురు; పక్షులు వారిని భక్షించును; సకలమైన భూ
మృగములు వారిని చెండాడును.। అప్పుడు బహు బల 7
మును పొంది చాలా దూరము మట్టుకు వ్యాపించి
వున్నటువంటిన్ని ఆరంభమునుంచి యిది వరకు భయం
కరముగా వున్నటువంటిన్ని చాలా జయకరముగా
వున్నటువంటిన్ని నదుల చేత పాడై పోయిన దేశము
గల జనాంగముల చేత సైన్యముల యెహోవాయొక్క
నామముగల స్థలమనే సీయోను పర్వతమునకు కానుక
తేబడును.

## 19. అధ్యాయము.

1 మిస్రయీమును గురించిన భగవద్వాక్యము, యే
మంటే, యిదుగో యెహోవా మేఘము మీద యెక్కి,
శీఘ్రముగా మిస్రయీము దేశమునకు వచ్చును; ఆయన
సముఖమందు మిస్రయీముయొక్క బొమ్మలు కలవిల
పడును; మిస్రయీముయొక్క హృదయము కరిగిపో
2 వును. నేను మిస్రీయులను మిస్రీయుల మీదికి రేపిం
చినందున వారిలో ప్రతివాడున్ను తన సహోదరుని
తోటిన్ని తన పొరుగువాని తోటిన్ని పోట్లాడును;
పట్టణము పట్టణము తోటిన్ని రాజ్యము రాజ్యముతో
3 టిన్ని యుద్ధము చేసును. మరిన్ని మిస్రయీముయొ
క్క ఆత్మ దాని విడిచి పోవును; వారు తమ బొమ్మల
తోటిన్ని యక్షిణీ విద్య వారితోటిన్ని కర్ణ పిశా
చము గల వారితోటిన్ని చిల్లంగివారితోటిన్ని ఆలో
4 చన చేతురు; అయితే వారి ఆలోచనలను నేను తారు
మారుచేసి, మిస్రీయులను క్రూరులైన కర్తలయొక్క
చేతులకు అప్పగింతును; వారి మీద దుష్టుడైన రాజు
యేలునని కర్తయైన సైన్యముల యెహోవా ఆన
5 తిచ్చెను. అప్పుడు సముద్రమునుంచి వుదకములు తీసి
పోవును; నది యెండి పోయి పొడిగా వుండును.
6 యేమంటే నదియొక్క ప్రవాహములు కంపు కొట్టును;
మిస్రయీముయొక్క కాలువలు వట్టివిగా చేయపడి
యెండి పోవును; రెల్లున్ను తుంగయున్ను వాడిపో
7 వును. కాలువలున్ను కాలువల వొడ్డున వున్న పచ్చని
పొలములున్ను కాలువ దగ్గిర విత్తపడిన సమస్తమున్ను
8 వాడిపోయి, చెదిరి, లేక పోవును. జాలరులు దుఃఖ
పడుదురు; కాలువలలో గాలములను వేసేవారు అంగ
లార్తురు; వుదకములందు వలలను వేసేవారు క్షీణిం
9 తురు. మరిన్ని సన్నపు నార పని చేసేవారున్ను తెల్లటి
10 బట్టలను నేసేవారున్ను కలవిల పడుదురు. మరిన్ని
జలచరములు గల కొలనులు త్రొక్కి వేయపడును;
ఆదాయము నిమిత్తము చేయపడిన మడుగులు పాడై
11 పోవును. నిజముగా సోయనుయొక్క ప్రధానులు
అవివేకులై పోయిరి; ఫరోయొక్క ఆలోచన కర్తలు
పశువుల లాగున ఆలోచన చేసిరి; మీరు ఫరోను చూచి
నేను జ్ఞాని కుమారుడననిన్ని పూర్వపు రాజుల పుత్రు
12 డననిన్ని యెందుకు చెప్పుతారు! వారు యెక్కడ
వున్నారు? నీ జ్ఞానులు యెక్కడ వున్నారు? వారు
యిప్పుడు వచ్చి సైన్యముల యెహోవా మిస్రయీ
మును గూర్చి నిర్ణయించినది యేదో అది తెలుసు
13 కొని నీకు చెప్పుదురు గాక. సోయనుయొక్క ప్రధా
నులు అవివేకులైరి; నోపుయొక్క ప్రధానులు మోస
మును పొందిరి; మిస్రయీమునున్ను దాని గోత్రము
లకు ఆధారమైన వారినిన్ని మార్గమును తప్పించి
నారు. యేమంటే, యెహోవా వారిలో మూర్ఖత 14
గల ఆత్మను వుంచినందున మత్తుదారుడు వమనము చేసు
కొని తూలినట్టు వారు మిస్రయీమును దాని కార్య
ములన్నిటి యందూ మార్గమును తప్పించినారు.
మరిన్ని మిస్రయీములో శిరస్సుకైనా తోకకైనా 15
కొమ్మకైనా తుండుకైనా చేసుటకు పని లేకపోవును.
ఆ దినమందు మిస్రీయులు స్త్రీల వలెనే వుండి, సైన్య 16
ముల యెహోవా వారి మీద కదిలించిన హస్తమును
భయపడి కలవిల పడుదురు. మరిన్ని యూదా దేశము 17
మిస్రీయులకు భయంకరముగా వుండును; యెవడైనా
దాని పేరు తలంచుకుంటే సైన్యముల యెహోవా
మిస్రయీమును గూర్చి నిర్ణయించిన ఆలోచన నిమి
త్తము భయమును పొందును. అయితే ఆ దినమందు 18
మిస్రయీము దేశమందు అయిదు పట్టణములు కెన
యను భాష పలికి, సైన్యముల యెహోవాతో ప్రమా
ణము చేసును; వాటిలో వొకటి సూర్యుని పట్టణమని
పిలువ పడును. మరిన్ని ఆ దినమందు మిస్రయీము 19
దేశపు మధ్యమందు యెహోవా పేరట వొక పీఠ
మున్ను దాని సరిహద్దు దగ్గిర యెహోవా పేరట
వొక స్తంభమున్ను కలిగి వుండును. అది మిస్రయీము 20
దేశమందు సైన్యముల యెహోవాను గురించి గురు
తుగానున్ను సాక్షిగానున్ను నిలిచి వుండును; యేమం
టే తమ్మును బాధపెట్టిన వారి నిమిత్తము వారు యె
హోవాను స్మరించినందున ఆయన వారి యొద్దికి ఘన
మైన రక్షకుని పంపును; అతడు వారిని విడిపించును.
మరిన్ని యెహోవా మిస్రయీముకు యెరుగ పడును; 21
మిస్రీయులున్ను ఆ దినమందు యెహోవాను యెరిగి
బలుల చేతనున్ను అర్పణల చేతనున్ను ఆయనను సేవిం
తురు; వారు యెహోవాకు మ్రొక్కుకొని దాని
తీర్చుకొందురు. యేమంటే యెహోవా మిస్రయీ 22
మును కొట్టును; అయితే ఆయన దాని కొట్టిన తరు
వాత స్వస్థము చేసును; యేమంటే వారు యెహోవా
తట్టు తిరుగుదురు, అప్పుడు ఆయన వారి పక్షమందు
దయగా వుండి వారిని స్వస్థము చేసును. మరిన్ని 23
ఆ దినమందు మిస్రయీమునుంచి అష్షూరు దేశమునకు
రాజ మార్గము కలుగును; కాబట్టి అష్షూరు వారు
మిస్రయీముకున్ను మిస్రీయులు అష్షూరుకున్ను వచ్చి,
మిస్రీయులు అష్షూరు వారితో కలుసుకొని సేవిం
తురు. ఆ దినమందు ఇశ్రాయేలు మిస్రయీముతో 24
నున్ను అష్షూరుతోనున్ను కూడి మూడో భాగముగా
దేశములో వుండి ఆశీర్వాదమును పొందించును. వీరిని 25
సైన్యముల యెహోవా ఆశీర్వదించి పలికేదేమంటే,
మిస్రీయులైన నా జనులున్ను నావల్ల కలిగిన అష్షూరు

వారున్ను నా స్వాస్థ్యమైన ఇశ్రాయేలీయులున్ను
ఆశీర్వాదమును పొందుదురు గాకని దీవించును.

## 20. అధ్యాయము.

1 అష్షూరు రాజైన సర్గోననుచేత పంపబడిన తర్తాను
అష్డోదు పట్టణము మీదికి వచ్చి, యుద్ధము చేసి పట్టు
2 కొనిన కాలమందు, । యెహోవావారొయొక్క వాక్యము
ఆమోసు కుమారుడైన యెషయాకు వచ్చినదేమంటే,
నీవు వెళ్లి, నీ నడుము గోనెపట్ట విప్పి, నీ పాదముల
చెప్పులు తీసివేయుము, అని ఆయెను; కాబట్టి అతడు
ఆలాగున చేసి, దిగంబరియై, పాదచారిగా తిరుగులా
3 డెను. । అప్పుడు యెహోవా ఆనతిచ్చినదేమంటే,
నా సేవకుడైన యెషయా మిస్రయీము దేశమునకున్ను
కూషు దేశమునకున్ను గురుతుగానున్ను లక్షణముగా
నున్ను మూడు సంవత్సరములు దిగంబరియై వుండి,
4 పాదచారియై తిరుగులాడినట్టు, । మిస్రీయులున్ను కూ
షువారున్ను పిన్నలున్ను పెద్దలున్ను మిస్రయీము దేశ
మునకు సిగ్గువచ్చేటట్టుగా అష్షూరు రాజుచేత చెరను
పొంది దిగంబరులై, పిరుదులు కప్పబడకుండానున్ను
పాదచారులుగానున్ను పరదేశమునకు కొంచపోపడు
5 దురు. । అప్పుడు వారి కోరికె అయిన కూషుకున్ను
వారికి అతిశయమైన మిస్రయీముకున్ను వారు భయ
6 పడి సిగ్గును పొందుదురు. । యేమంటే సముద్ర ప్రాం
తపు కాపురస్తులు ఆ దినమందు అనుకొనేదేమంటే,
యిదుగో అష్షూరు రాజు చేతిలోనుంచి విడిపించ
బడుటకు మేము పారిపోయిన కోరికె యిట్లాగున
అయి పోయినందున యిప్పుడు యెందుకు తప్పించు
కొందుమని అనుకొందురు.

## 21. అధ్యాయము.

1 సముద్ర ప్రాంతమందుండే అరణ్యమును గురించిన
భగవద్వాక్యము, యేమంటే, దక్షిణ దిక్కులోనుంచి
తోసుకొని వచ్చిన ప్రళయ వాయువు వలెనే ఘోర
మైన అరణ్యపు దేశములోనుంచి అది వస్తూ వున్నది. ।
2 నాకు అగుపడిన దర్శనము బహు దుఃఖకరముగా
వున్నది; మోసపుచ్చిన వాడు మోసపుచ్చబడెను; లయ
పరచే వాడు లయమును పొందెను; ఓ ఏలామువారా,
ఓ మాదై దేశమా, మీరు ఆ పట్టణము మీదికి వెళ్లి
దాని చుట్టబెట్టండి; దాని వుపద్రవములను నేను మా
3 న్పింతునని యెహోవా ఆనతిచ్చెను. । అయినందున
నా నడుము నొప్పిచేత నిండి వున్నది; ప్రసూతి కాల
మందు స్త్రీకి యెంత వేదన వుండునో అంత వేదన
నన్ను పట్టెను; అది నాకు వినపడినప్పుడు నేను గింజు
కొంటిని; అది నాకు కనుపడినప్పుడు నేను బహుగా
కలవిలపడితిని. । నా గుండె పగిలి వున్నది; ఘోరమైన 4
దర్శనములచేత నేను భయమును పొందితిని; నేను
కోరిన సుఖ రాత్రి ఆయన నాకు భయంకరముగా
చేసెను. । భోజనపు బల్లను ఆయత్తము చేయండి; కాపు 5
వారిని కాయనియ్యండి; భుజించి పానము చేయండి;
ఓ అధిపతులారా, మీరు లేచి మీ డాలుల మీద తైల
మును పుయ్యండి. । యెహోవా నాకు ఆనతిచ్చిన 6
దేమంటే, నీవు వెళ్లి, కావువానిని వుంచి, వానికి కను
పించినది యేదో అది వానిని చెప్పనిమ్మని సెలవు యి
చ్చెను. । వానికి యిద్దరు రౌతులున్ను గార్దభములు 7
న్ను వొంటెలున్ను కనుపడెను; అప్పుడు వాడు బహు
జాగ్రతగా విని, సింహములాగున కేక వేసినదేమంటే,।
యేలినవారా, పగలంతా నేను నిలిచి కాస్తూ వుంటిని; 8
నా కావు స్థలములో రాత్రిదాకా నిలిచి వుంటిని. ।
యిదుగో గుర్రపు రౌతులు యిద్దరేసి వస్తూ వున్నారు; 9
అప్పుడు వాడు బాబెలు కూలెను, కూలెను; దాని
దేవుండ్లయొక్క ప్రతిమలన్నీ నేలకు కొట్టివేయ పడిన
వని చెప్పెను. । నూర్చబడిన ఓ నా కళ్లమా, ఓ నా 10
పంటయొక్క విత్తనమా, ఇశ్రాయేలుకు దేవుడనే సైన్య
ముల యెహోవా వల్ల నాకు వినపడిన దాని నేను
మీకు తెలియ చెప్పితిని. । మరిన్ని దూమాను గురించిన 11
భగవద్వాక్యము, శెయీరునుంచి నాకు వినపడిన శబ్ద
ము యేమంటే, ఓ కాపరీ, రాత్రి సమాచారము యే
మిటి? ఓ కాపరీ, రాత్రి సమాచారము యేమిటి? అని
అడగగా, । కాపరి వుదయము వచ్చును, తరువాత రా 12
త్రిన్ని వచ్చును; మీరు అడుగవలెనని వుంటే అడుగు
టకు తిరిగి రండని ప్రత్యుత్తరము యిచ్చెను. । మరిన్ని 13
అరబీదేశము గురించిన భగవద్వాక్యము యేమంటే,
ఓ దెదానీముయొక్క మార్గస్తులైన సమూహములారా,
అరబీదేశపు అడవిలో మీరు దిగి వుందురు. । తేమా 14
దేశస్థులు దాహముగల వారిని యెదుర్కొనుటకు నీళ్ల
తోటి వచ్చిరి; పారిపోయిన వారికి ముందుగా ఆహార
ముతో వెళ్లినారు. । యేమంటే వారు దూసిన కత్తుల 15
ముఖమునుంచిన్ని యెక్కు పెట్టబడ్డ విండ్ల ముఖము
నుంచిన్ని కఠినమైన యుద్ధము ముఖమునుంచిన్ని పారి
పోదురు. । యిందుకు యెహోవా నాతో ఆనతిచ్చిన 16
దేమంటే, కూలివాని లెక్క ప్రకారము యింకొక
సంవత్సరమునకు లోపుగానే కేదారుయొక్క ఘనమం
తా నశించును. । మరిన్ని కేదారు పుత్రులలో వున్న 17
బలాఢ్యులైన విలుకాండ్లయొక్క లెక్కకు శేషించిన
వారు యింకా తక్కువై పోదురు, యేమంటే ఇశ్రా
యేలుకు దేవుడయిన యెహోవా యీ వాక్యమును
ఆనతిచ్చెను.

## 22. అధ్యాయము.

1 దర్శనముయొక్క లోవను గురించిన భగవద్వా
క్యము, యేమంటే, నీ మేడల మీదికి నీ కాపురస్థులం
2 దరున్ను యెక్కి పోవుటకు నీకు యేమి పట్టినది? । గల్లత్తు
తోనున్ను సంతోషపు ధ్వనితోనున్ను నిండి వున్న ఓ
పట్టణమా, నీలో హతమయిన వారు కత్తిచేత హతము
3 కాలేదు, యుద్ధముచేత మరణము పొంద లేదు. । అయి
తే నిన్ను యేలిన వారందరున్ను కూడి పారిపోయిరి;
వారు విలుకాండ్ల భయముచేత పారిపోయిరి; నీలో
వున్న వారందరున్ను దూరముగా పారిపోవుటకు కట్టు
4 కట్టిరి. । కాబట్టి నేను అనుకొనేది యేమంటే, నన్నుంచి
ముఖము తిప్పండి; నేను ఘోరమైన యేడ్పు యేడ్తును;
నా జనులయొక్క కుమార్తె పాడై పోయెను గనుక
5 నన్ను వోదార్చుటకు మానండి. । యేమంటే యిది
బహు శ్రమ దినమై యున్నది; కర్తయైన సైన్యముల
యెహోవా వల్ల దర్శనముయొక్క లోవలో ఆపద
యున్ను త్రొక్కడమున్ను తాపత్రయమున్ను గల
దినమున్ను ప్రాకారములను కింద పడగొట్టడమున్ను
పర్వతముల వయిపు బొబ్బ పెట్టడమున్ను కలిగి వున్నవి.।
6 మరిన్ని యేలాము వారు అంబుల పొది కట్టుకొని
గుర్రపు రౌతులైన సమూహములతోను వచ్చిరి; కీరు
7 వారు డాలులను బైలు పరచిరి. । కాబట్టి నీ కంటికి
అందమయిన లోవలు రథములచేత నిండి వుండును;
గుర్రపు రౌతులు యుద్ధపు మర్యాద చొప్పున సిద్ధమై
8 గవిని వొద్ద నిలుతురు. । కాబట్టి యూదాయొక్క తెర
బైలుపడును; ఆ దినమందు నీవు అరణ్య గృహపు ఆయు
9 ధము తట్టు చూతువు. । దావీదుయొక్క పురములో
బీటలు విస్తారముగా వున్నవని చూతురు; మరిన్ని దిగువ
10 కొలను నీళ్లను మీరు పోగుచేతురు. । మరిన్ని మీరు
యెరూశలేముయొక్క యిండ్లను లెక్కించి, ప్రాకార
మును గట్టి చేయడానకు యిండ్లను కొట్టి వేతురు. ।
11 మరిన్ని మొదటి చెరువుయొక్క నీళ్లు రావడమునకు
రెండు ప్రాకారముల మధ్యను మీరు కందకమును
తవ్వింతురు; అయితే యిది నిర్ణయించిన వాని మీరు
కనిపెట్ట లేదు; యిది ఆరంభములో కల్పించిన వాని
12 మీరు లక్ష్యపెట్ట లేదు. । ఆ దినమందు కర్తయైన సైన్య
ముల యెహోవా యేడ్చుటకున్ను అంగలార్చుటకున్ను
బోడిగా వుండుటకున్ను గోనెపట్ట కట్టుకొనుటకున్ను
13 పిలుచును. । అయితే యిదుగో సంతోషమున్ను సంభ్ర
మమున్ను యెడ్లనున్ను గొర్రెలనున్ను చంపుటయున్ను
మాంసమును తినుటయున్ను ద్రాక్షారసము తాగుట
యున్ను రేపు మనము చనిపోదుము గనుక భుజించి
14 తాగుదామని చెప్పుకొనుటయున్ను కలవు. । కాబట్టి
నా చెవికి వినపడిన కర్తయైన సైన్యముల యెహోవా
యొక్క వాక్యమేమంటే, నిజముగా యీ మీ అక్ర
మము మీరు మరణమయ్యే పర్యంతమూ పరిహరించ
బడక వుండును అని కర్తయైన సైన్యముల యెహో
వా పలుకుతున్నాడు. । మరిన్ని కర్తయైన సైన్యముల 15
యెహోవా యిచ్చిన సెలవు యేమంటే, నీవు వెళ్లి,
యింటి పదార్థము పైని కారకుడైన షెబ్నా యొద్దికి
వచ్చి, వాని చూచి, । యిక్కడ నీకు యేమి వున్నది? 16
యిక్కడ నీకు యెవ్వరు వున్నారు? వున్నతమైన స్థల
మందు సమాధిని దొలిపించుకొని; తన కొరకు నివాస
ము కొండ యందు తవ్విన వాని వలె నీ కొరకు నీవు
సమాధిని యెందుకు దొలిచినావు? । యిదుగో యెహో 17
వా బహు బలమైన గెంటుటచేత నిన్ను అవతలకు
వెళ్లవేసి నిన్ను నిశ్చయముగా కప్పును. । నిజముగా 18
ఆయన నిన్ను చుట్టూ తిప్పి, బంతి లాగున నిన్ను విశా
లమైన దేశములోకి వడిశతో విసురును; అక్కడ
నీవు మరణమౌదువు; అక్కడ నీ ఘనమైన రథములు
నీ యజమాని యింటికి సిగ్గుగా అగుపడును. । నేను 19
నీ స్థితిలోనుంచి నిన్ను తోలివేతును; వాడే నీ స్థలము
లోనుంచి నిన్ను కిందికి పడదోసును. । మరిన్ని ఆ దిన 20
మందు నేను నా సేవకుడున్ను హిల్కీయా కుమారుడు
న్ను అయిన ఎల్యాకీమును పిలిచి, । నీ వస్త్రమును వా 21
నికి ధరింపజేసి, నీ కటి సూత్రము చేత వాని బలముగా
చేసి, నీ వుద్యోగమును వాని చేతికి అప్పగింతును;
వాడు యెరూశలేము కాపురస్థులకున్ను యూదా
యింటివారికిన్ని తండ్రిగా వుండును. । మరిన్ని నేను 22
దావీదు యింటి తాళమును వాని భుజము మీద వేతును;
అప్పుడు అతడు విప్పితే మూసే వాడు వొకడూ లేక
పోవును; అతడు మూసితే విప్పే వాడు వొకడూ లేక
పోవును. । మరిన్ని నేను వాని నాటే స్థలమందున్న 23
మేకు లాగున స్థిరపరచినందున అతడు తన తండ్రి
యింటికి ఘనమైన ఆసనమైనట్టుగా వుండును. । కాబ 24
ట్టి వారు పెద్దలున్ను పిన్నలున్ను సమస్తమైన ఘటము
లలో చిన్న గిన్నెలు యేమి పెద్ద పాత్రలు యేమి తన
తండ్రి యింటి భాగమంతా అతనిమీద వేతురని చెప్పి,
యింకా సైన్యముల యెహోవా ఆనతిచ్చినదేమంటే, ।
ఆ దినమందు నాటే స్థలమందు వేయపడిన ఆ మేకు 25
కదిలి తెగవేయబడి పడును; దాని మీద పెట్టిన భార
ము తెగవేయపడును; యేమంటే యీలాగు యెహో
వా ఆనతిచ్చి వున్నాడు.

## 23. అధ్యాయము.

తూరు పట్టణమును గురించిన భగవద్వాక్యము, యే 1
మంటే, ఓ తర్షీషు వోడలారా, అంగలార్చండి,

యేమంటే అది బొత్తిగా నాశనమాయెను; యిల్లైనా
ప్రవేశపు స్థలమైనా లేదు; కిత్తీము దేశమునుంచి యీ
2 వర్తమానము వారికి వినబడెను. । ద్వీప నివాసులారా,
మీరు మౌనముగా వుండండి; సముద్రము మీద గడిచే
సీదోను పట్టణపు వర్తకులవల్ల నీవు పూర్తిని పొంది
3 తివి. । విస్తారమైన వుదకములవల్లను సీహోరుయొక్క
విత్తనము ఆ నదియొక్క పంట దానికి తేపడినందున
4 అది జనాంగములకు అంగడియై యుండెను. । ఓ సీదో
నూ, నీవు సిగ్గును తెచ్చుకొనుము; యేమంటే సము
ద్రము, అనగా, సముద్రముయొక్క బలము అనుకొని
నదేమంటే; నేను ప్రసూతి వేదనను పొందక పిల్లలను
కనక పడుచువాండ్లనున్ను పడుచురాండ్లనున్ను పెంచక
5 వున్నానని అనుకొనెను. । మిస్రయీమును గురించిన
వర్తమానమునకు అయిన లాగున తురు పట్టణమును
గురించిన వర్తమానమునకు వారు బహుగా వేదనను
6 పొందుదురు. । తర్షీషుకు దాటి వెళ్లండి; సముద్ర
ప్రాంతమందుండే ఓ కాపురస్తులారా, అంగలార్చండి. ।
7 పురాతన కాలమునుంచి అతిశయముగా వున్న మీ
సంతోషపు పట్టణము యిదేనా? దాని కాళ్లే దాని
8 దూరమునకు వాసము కొరకు తీసుకొ పోవును. । కిరీట
ములను యిచ్చినటువంటిన్ని దాని వర్తకులు రాజుల
వలెనున్ను దాని వ్యవహారికులు లోకపు ఘనుల వలె
నున్ను వున్న తురు పట్టణము మీద యీ ఆలోచన
9 యెవరు చేసిరి? । సైన్యముల యెహోవాయే సకల
మహిమయొక్క గర్వమును కలంకపర్చుటకున్ను భూమి
యందుండే సమస్తమైన ఘనులను నీచపర్చుటకున్ను దీని
10 ఆలోచించెను. । ఓ తర్షీషు కుమారీ, ప్రవాహము
వలెనే నీ దేశమునుంచి గడిచి వెళ్లుము; యిక శక్తి
11 యెంత మాత్రమూ లేదు. । ఆయన తన హస్తమును సము
ద్రము మీద చాపెను; జనాంగములను కదిలించెను;
కెనయును గురించి దాని గట్టి స్థలములను నశింప చేసు
టకు యెహోవా ఆజ్ఞ యిచ్చెను; ఆయన ఆనతిచ్చిన
12 దేమంటే, । చెరపపడిన సీదోను కుమార్తెవైన కన్యా
కన్యకా, యిక నీకు సంతోషము కలుగదు; నీవు లేచి,
కిత్తీము దేశమునకు వెళ్లిపొమ్ము; అక్కడ సహా నీకు
13 నెమ్మది లేకపోవును. । అదుగో కల్దీయులయొక్క దేశము
పూర్వము యీ జనాంగము లేకుండా వుండెను; అయితే
అష్షూరు వాడు అరణ్యమందు కాపురము చేసిన వారికి
దాని స్థాపించెను; వారు దాని బురుజులనున్ను నగరుల
నున్ను కట్టినారు; అయినప్పటికిన్ని వారు దాని పాడు
14 చేసిరి. । ఓ తర్షీషు వోడలారా, అంగలార్చండి;
15 యేమంటే మీ గట్టిస్థలము నశించెను. । అయితే ఆ దిన
మందు తురు పట్టణము రాజు దినముల ప్రకారము
డెబ్భయి సంవత్సరములు మరుపును పొందును; అయితే
డెబ్భయి సంవత్సరములు అయినప్పుడు తురు పట్టణము
వేశ్యలాగున పాట పాడును. । చాలా కాలమునుంచి 16
మరుపును పొందిన ఓ వేశ్యా, నీవు కిన్నెరను పట్టు
కొని, పట్టణమందు తిరుగులాడి, నీవు మళ్లీ జ్ఞాపక
ముకు వచ్చేలాగు చెవికి ఆనందముగా వాయించి, చాలా
సంగీతములను పాడుము. । యేమంటే డెబ్భయి సంవ 17
త్సరములు అయిన తరువాత యెహోవా తురు పట్ట
ణమును దర్శించును; అయితే అది మళ్లీ కానుకలను
వెంటాడి, లోకమందుండే సకల రాజ్యములతో వ్యభి
చరించును. । అయితే దాని వర్తకమున్ను దాని లాభ 18
మున్ను యెహోవాకు పరిశుద్ధమవును; అది పోగుచే
యబడక వుండును; యేమంటే దాని వర్తకము యె
హోవా సముఖమందు నిలిచే వారికి సంతుష్టి పరచే
భోజనము కొరకున్ను చక్కటి వస్త్రము కొరకున్ను
వుండును.

## 24. అధ్యాయము.

ఇదుగో యెహోవా దేశమును వట్టిదిగానున్ను 1
పాడుగానున్ను తలక్రిందుగానున్ను చేసి, దాని కాపు
రస్తులను నఖముఖాలా చెదరకొట్టును. । మరిన్ని జను 2
లకు అయ్యేలాగున అర్చకునికిన్ని, దాసునికి అయ్యే
లాగున యజమానికిన్ని, దాసీకి అయ్యేలాగున దాని
యజమానురాలికిన్ని, కొనేవానికి అయ్యేలాగున అమ్మే
వానికిన్ని, అప్పు పుచ్చుకొనేవానికి అయ్యేలాగున
అప్పు యిచ్చే వానికిన్ని, వడ్డి యిచ్చే వానికి అయ్యేలా
గున వడ్డి పుచ్చుకొనే వానికిన్ని వుండును. । దేశమంతా 3
వట్టిదై బొత్తిగా నశించును, యేమంటే యెహోవా
యీ వాక్యమును ఆనతిచ్చెను. । భూమి దుఃఖించి వాడి 4
పోతూ వున్నది; లోకము క్షీణించి వాడిపోతూ వు
న్నది; దేశమందుండే గొప్పవారు క్షీణిస్తున్నారు. । దే 5
శము తన కాపురస్తుల వల్ల అపవిత్రమై పోయెను,
యేమంటే వారు న్యాయప్రమాణమును అతిక్రమించి,
కట్టడను మార్చి, నిత్యమైన వొడంబడికను భేదించి
నారు. । కాబట్టి దేశము శాపముచేత మింగపడెను; 6
దానియందు కాపురము వున్నవారు పాడైపోయిరి;
కాబట్టి దేశపు కాపురస్తులు దహనమైనందున శేషిం
చిన వారు కొద్దిగా వున్నారు. । కొత్త ద్రాక్షారసము 7
మూలుగుతూ వున్నది; ద్రాక్షచెట్టు క్షీణిస్తూ వున్నది;
సంతోషపు హృదయము గలవారు చింతాక్రాంతులైరి. ।
తంబురలయొక్క సంతోషము సరిపడెను; ఆనందించే 8
వారియొక్క నాదము నిలిచిపోయెను; కిన్నెరయొక్క
సంతోషము సరిపడెను. । యిక వారు సంగీతమును 9
పాడి ద్రాక్షారసమును తాగరు; బలమైన మద్యపానము
చేసే వానికి అది చేదుగావుండును. । గల్లత్తుగల పట్ట 10

ణము కూలెను; ప్రతి యిల్లూ మూయపడినందున యెవ
11 నికైనా ప్రవేశము లేక పోవును. । ద్రాక్షారసము
కొరకు వీధులలో కేక వేస్తున్నారు; సంతోషమంతా
గతించిపోయెను; దేశముయొక్క సుఖము జరిగిపో
12 యెను. । పట్టణము వట్టిదిగా విడువపడెను; గవిని విరగ
13 పడెను, । యీలాగున దేశమందుండే జనులలో వుండును;
అయినప్పటికిన్ని ఇప్ప చెట్టు దులిపితే యేలాగు వుం
డునో ద్రాక్ష పండ్ల కోత అయితే యేలాగు వుండు
14 నో ఆలాగునే దేశమందు కూడా వుండును. । వీరు
తమ కంఠమెత్తి కేక వేతురు; యెహోవా మహత్వము
నిమిత్తము పాడుదురు; సముద్రమునుంచి బొబ్బ పెట్టు
15 దురు. । కాబట్టి తూర్పులో యెహోవానున్ను సముద్ర
ప్రాంతములందు ఇశ్రాయేలుకు దేవుడైన యెహోవా
16 యొక్క నామమునున్ను ఘనపర్చండి. । దేశపు అంత్య
భాగమునుంచి మనము నీతిపరుడైన వాని కొరకు మహి
మగల సంగీతమును వింటిమి. అయితే నేను అనుకొ
నిన మాట యేమంటే, అయ్యో, నాకు క్షీణత వచ్చెను!
నాకు క్షీణత వచ్చెను! నాకు అయ్యో, మాయకాండ్లు
బహు మాయగా ప్రవర్తించిరి! నిజముగా మాయకాండ్లు
17 బహు మాయగా ప్రవర్తించిరి! । ఓ దేశపు కాపుర
స్తుడా, భయమున్ను గుంతయున్ను వురులున్ను నీ మీద
18 వున్నవి. । కాబట్టి భయముయొక్క ధ్వనినుంచి తప్పిం
చుకొనిన వాడు గోతబడును; గోతినుంచి తప్పించు
కొనిన వాడు వురులలో చిక్కును; యేమంటే పైని
వున్న కిటికీలు విప్పబడి యున్నవి; భూమియొక్క పునా
19 దులు వణుకుతున్నవి. । దేశము బహుగా కదిలించ బడి
యున్నది; దేశమంతా బద్దలై పోయెను; దేశము మిక్కి
20 లిగా కంపించెను. । దేశము కైపుదారుని లాగున తూ
లును; అది వుయ్యల మంచము వలె ఊగులాడును;
యేమంటే దాని అక్రమము దాని మీద భారముగా
వున్నందున అది కిందపడి యిక లేవలేక పోవును. ।
21 మరిన్ని ఆ దినమందు యెహోవా వున్నతమందు వున్న
ఘనుల సమూహమును వున్నతమందున్ను భూపతులను
22 భూమియందున్ను శిక్షించును. । యేమంటే వారు గోత
వేసుటకు కూర్చబడిన ఖైదీల వలె కూర్చబడి, చాలా
23 దినములకు కృపను పొందుదురు. । మరిన్ని చంద్రుడు
భయమును పొందును; సూర్యుడు సిగ్గుపడును; యే
మంటే సైన్యముల యెహోవా సీయోను పర్వతము
మీదనున్ను యెరూశలేము యందున్ను తన జనులైన
పెద్దల ముందరనున్ను ఘనముగా యేలును.

## 25. అధ్యాయము.

1 ఓ యెహోవా, నీవు నా దేవుడవై యున్నందున
నిన్ను నేను ఘనపర్చి, నీ నామమును స్తోత్రము
చేతును; యేమంటే నీవు వింతైన కార్యములను చేస్తివి;
ఆదినుంచి వున్న నీ ఆలోచనలు సత్యముగానున్ను రూ
ఢముగానున్ను వున్నవి. । యేమంటే పట్టణమును నీవు 2
కుప్పగా చేస్తివి; బురుజులు గల పురమును పాడైన దిబ్బ
గానున్ను పరదేశుల నగరిని పట్టణము కాకుండానున్ను
చేస్తివి; అది యికను కట్టపడేది లేదు. । కాబట్టి బల 3
మైన జనులు నిన్ను ఘనపర్తురు; భయంకరమైన జనాం
గముల పట్టణము నీకు భయపడును. । యేమంటే నీ వల్ల 4
దరిద్రులు శక్తిని పొందిరి; శ్రమలో వుండే లేమి గల
వారికి నీ వల్ల బలము కలిగెను; భయంకరమైన వారి
వూపిరి గోడమీద కొట్టిన ప్రళయ వాయువు వలె
వున్నప్పుడు నీవు ప్రాపుగానున్ను వెట్ట కాలమందు
నీడగానున్ను వున్నావు. । మేఘపు నీడచేత యెండి 5
పోయిన స్థలమందు వెట్ట యేలాగు వుండునో పరదే
శుల గొల్లు నీ చేత ఆలాగునే అణచబడును; భయంక
రుల జయాతిశయము కుంగి పోవును. । అయితే యీ పర్వ 6
తమందు సైన్యముల యెహోవా సమస్తమైన జనుల
కొరకు విందును సిద్ధపర్చును; ఆ విందులో ఘనమైన
పదార్థములున్ను బలమైన ద్రాక్షారసమున్ను బహు
రుచిగల విశేష పదార్థములున్ను నికరమైన బలము
గల ద్రాక్షా రసమున్ను కలిగి వుండును. । మరిన్ని యీ 7
పర్వతమందు ఆయన సమస్తమైన జనుల ముఖముల
మీద వున్న తెరనున్ను సకల జనాంగముల మీద వేయ
పడిన ముసుకునున్ను తీసివేసును. । మరిన్ని కర్తయైన 8
యెహోవా మృత్యువును సంపూర్ణముగా నాశనము
చేసి, సకల ముఖములనుంచి కన్నీళ్లను తుడచివేసి, తన
జనులయొక్క అవమానమును లోకమంతటి మీదనుంచి
తీసివేసును, యేమంటే యీలాగున యెహోవా
ఆనతిచ్చెను. । ఆ దినమందు అనుకొనేది యేమంటే, 9
యిదుగో, యీయన మన దేవుడయి యున్నాడు;
ఆయన రాకకు మనము యెదురు చూస్తూ వుంటిమి;
ఆయన మనలను రక్షించును; యీయన యెహోవా
అయి వున్నాడు; ఆయన రాకకు యెదురు చూస్తూ
వుంటిమి; ఆయన రక్షణ కొరకై మనము సంతోషించి
గంతులు వేతుమని అనుకొందురు. । యేమంటే యీ 10
పర్వతమందు యెహోవాయొక్క హస్తము నిలిచి
వుండును; మరిన్ని ఆయనచేత మోయాబు పెంట కుప్ప
మీద త్రొక్కపడిన వరిగడ్డిలాగున త్రొక్కపడును. ।
మరిన్ని వారి మధ్యమందు యీదేవాడు యీదుటకు 11
తన చేతులను యేలాగు చాపునో ఆలాగున తన చేతు
లను ఆయన చాపి, తన చేతులచేత వారిని వడిసిపట్టి,
వారి అతిశయమును కుంగచేసును. । నీ వున్నతమైన 12
ప్రాకారములయొక్క బురుజులకు ఆయన కింద పడ
దోసి, వాటిని నేలకున్ను ధూళికిన్ని సమముగా చేసును.

## 26. అధ్యాయము.

1 ఆ దినమందు యూదా దేశమందు వారు పాడే
పాట యేమంటే, మనకు బలమైన పట్టణము కలిగి
యున్నది; దేవుడు ప్రాకారములకున్ను బురుజులకున్ను
2 మారుగా రక్షణను నిర్ణయించును. । నిబ్బరమైన మన
స్సు గలిగి సత్యమును గైకొనిన నీతిగల జనాంగము
ప్రవేశించేటట్టుగా మీరు ద్వారములను విప్పండి. ।
3 నిన్ను నమ్మిన వాని నీవు చాలా నెమ్మది యందు కాపా
డుదువు, యేమంటే వాడు నీ మీద ఆనుకొనును. ।
4 యెన్నటెన్నటికీ యెహోవాను నమ్మండి, యేమంటే
5 యెహోవా యందు నిత్య శక్తి కలుగును. । మహో
న్నతముగా వున్న వారిని ఆయన కుంగచేసును; అతిశ
యమైన పట్టణమును ఆయన కింద పడదోసును; దాని
కింద పడదోసి నేలకున్ను ధూళికిన్ని సమముగా
6 చేసును. । కాబట్టి అది కాళ్లచేత త్రొక్కపడును; దరి
ద్రుల కాళ్లచేతనున్ను లేమి గల వారి కాళ్లచేతనున్ను
7 త్రొక్కపడును. । నీతిపరుల మార్గమంతా తిన్నగా
వుండును: ఓ బహు నీతి గలవాడా, నీతిపరుని మార్గ
మును నీవు నీతి గల త్రాసుచేత తూచి చూతువు. ।
8 ఓ యెహోవా, నీ ఆజ్ఞలయొక్క మార్గములందు
మేము నీ నామమును నమ్మితిమి; నిన్ను తలంచుకొను
టకు మాకు మనోహరముగా వున్నది; నిండు మనస్సు
9 చేత నేను నిన్ను రాత్రి వేళ కోరితిని. । నా అంతరం
గపు ఆత్మతోటి నిన్ను తెల్లవారేటప్పుడు వెతికితిని,
యేమంటే నీ ఆజ్ఞలు లోకమందు వ్యాపించి వున్న
ప్పుడు లోకపు కాపురస్తులు నీతిని నేర్చుకొందురు. ।
10 యేమంటే అక్రమపు వానికి కృపను అగుపర్చినప్ప
టికిన్ని వాడు నీతిని నేర్చుకొనక వుండును; నీతి గల
దేశమందు వున్నప్పటికిన్ని వాడు అక్రమముగా నడిచి,
యెహోవాయొక్క మహత్వమును కానక వుండును. ।
11 ఓ యెహోవా, నీ హస్తము యెత్తపడినప్పటికిన్ని
వారు చూడరు; అయితే వారు చూచి, జనుల యెడల
తమ అసూయ కొరకు సిగ్గును పొందుదురు; నిశ్చయ
ముగా నీ శత్రువుల విషయమైన అగ్ని వారిని దహిం
12 చును. । ఓ యెహోవా, నీవు మా కొరకు క్షేమమును
నిర్ణయింతువు; యేమంటే మా కొరకు నీవు మా
13 కార్యములనన్నిటినీ చేసితివి. । మా దేవుడవైన ఓ యె
హోవా, నీవు వినా వేరే కర్తలు మా మీదను
ప్రభుత్వమును చేసిరి; అయితే యికను మేము నిన్ను
న్ను నీ నామమునున్ను మాత్రమే చెప్పుకొనుదుము. ।
14 వారు మరణమైరి; మరి బ్రతకరు; వారు బుగ్గి అయి
మరి లేవరు; అందు కొరకు నీవు వారిని శిక్షించి, నాశ
15 నముచేసి వారి జ్ఞాపకమంతా తుడిచివేస్తివి. । ఓ యె
హోవా, నీవు యీ జనాంగమును విస్తరింప చేస్తివి;
దాని విస్తరింప చేస్తివి; నీవు ఘనమును పొందితివి; దేశ
ముయొక్క సరిహద్దులన్నిటినీ నీవు బహు దూరపరిచి
తివి. । ఓ యెహోవా, వుపద్రవమందు వారు నిన్ను 16
వెతికిరి; నీ దండన వారి పైని వున్నప్పుడు వారు ప్రా
ర్థనలను బహుగా చేసిరి. । గర్భవతి అయి, ప్రసూతి 17
సమయమందు వేదనచేత వడిగా రోదనముచేసే స్త్రీ
యేలాగునో ఆలాగే ఓ యెహోవా, మేము నీ సము
ఖమందు వుంటిమి. । మేము గర్భవతి వలెనే వుండి 18
నొప్పి పొందితిమి, అయితే గాలిని మాత్రమే కంటిమి;
మేము దేశములో రక్షణను రా చేయించ లేదు; లో
కపు కాపురస్తులు కూల లేదు. । నీ మరణమైన వారు 19
బ్రతుకుదురు; వారి శవములు లేచును; బుగ్గి యందు
కాపురముచేసే వారలారా, మేలుకొని పాడండి, యే
మంటే నీ మంచు మొక్కల మీద పడిన మంచు వలె
వున్నది; భూమి మరణమైన వారిని బైట పడ వేసును. ।
ఓ నా జనులారా, మీ అంతర్గృహములలోకి ప్రవే 20
శించి, మీ వెనుకను మీ తలుపులను వేసుకొండి; యీ
రౌద్రాగ్ని చల్లారే పర్యంతము క్షణ మాత్రము దాగి
వుండండి. । యేమంటే యిదుగో యెహోవా లోకపు 21
కాపురస్తుల అక్రమము నిమిత్తము వారిని శిక్షించు
టకు తన స్థలములోనుంచి బైలు వెళ్లుతూ వున్నాడు;
అప్పుడు భూమి తన రక్తమును బైలుపరచి, యిక దాని
లో హతమైన వారిని కప్పక వుండును.

## 27. అధ్యాయము.

ఆ దినమందు యెహోవా గట్టిన్ని గొప్పయున్ను 1
బలమున్ను గల తన ఆయుధముచేత లెవియాతాననే
తీవ్ర సర్పమును లెవియాతాననే ఆ మెలికెల సర్ప
మును శిక్షించును; నిజముగా సముద్రమందున్న ఆ
క్రూర జంతువును ఆయన హతము చేసును. । ఆ దిన 2
మందు ద్రాక్ష తోటను గురించి అందమైన పాటను
పాడండి. । యెహోవాను అయిన నేను దాని కని 3
పెట్టి, ప్రతి నిముషమూ దానికి నీళ్లు పోతును; యెవ
డైనా దానికి మోసము చేయకుండా దాని దివా రా
త్రులు కాస్తూ వుందును. । నా యందు కోపము లేదు; 4
నా యెదుట ముళ్ల చెట్లను యెవరు పెట్టుదురు! వాటి
మీదికి నేను వచ్చి యుద్ధము చేస్తే నేను వాటిని యీ
వత్తూ దహనము చేతును. । ఆలాగు కాకుండా యెవ 5
డైనా నా శక్తిని పట్టుకొని, నాతో వాడు సమాధాన
మును చేసుకొనును గాక; నిజముగా వాడు నాతోను
సమాధానమును చేసుకొనును గాక. । యాకోబులో 6
నుంచి వచ్చే వారిని ఆయన వేరు తన్నేటట్టు చేసును;
ఇశ్రాయేలు పూచి కాచి భూమి ముఖమును పండ్ల

7 చేత నిండించును. । ఆయన వీని కొట్టిన వారిని కొట్టి
నట్టు వీని కొట్టినాడా? హతమైన తన వారి వలె యిత
8 డు హతుడైనాడా? । నీవు దాని పంపివేసేటప్పుడు
దానితో కఠినమైన వ్యాజ్యము చేయ లేదు; తూర్పు
గాలి విసరే దినమందు ఆయన తన బలమైన గాలిచేత
9 దాని కొంచుపోయెను. । కాబట్టి యీలాగున యాకో
బుయొక్క అక్రమము కప్ప బడును; పీఠపు రాళ్లనన్ని
టినీ ఛిన్నాభిన్నములైన గచ్చురాళ్ల వలె ఆయన చేసి
నప్పుడున్ను తోపులనున్ను ప్రతిమలనున్ను నిలువకుం
డా చేసినప్పుడున్ను తన పాప పరిహారముయొక్క
10 ఫలమును వాడు అనుభవించును. । యేమంటే బురు
జులు గల పట్టణము వట్టిదై పోవును; ఆ పురము విడువ
పడి అరణ్యము వలె వుండును; అక్కడ దూడ మేసి,
అక్కడ పడుకొని, దాని లేత మొక్కలను తినును. ।
11 దాని కొమ్మలు యెండిపోయి విరిగి రాలును; అప్పుడు
స్త్రీలు వచ్చి వాటిని కాల్తురు; యేమంటే యీ జను
లకు బుద్ధి లేదు; కాబట్టి వారిని కలుగ చేసిన వాడు
వారిని కనికరించక వుండును; వారిని రూపించిన వాడు
12 వారికి దయ అగుపర్చక వుండును. । అయినప్పటికిన్ని
ఆ దినమందు సంభవించేదేమంటే, యెహోవా నదీ
ప్రవాహము మొదలుకొని మిస్రయీము నది పర్యం
తము దుల్ల కొట్టును; అప్పుడు ఓ ఇశ్రాయేలు పుత్రు
లారా, మీరు వొక్కొక్కని చొప్పున యేర పడుదురు.।
13 మరిన్ని ఆ దినమందు పెద్ద బాకా నాదమౌను; అప్పు
డు అష్షూరు దేశమందు నాశనమౌటకు సిద్ధమైన వా
రున్ను మిస్రయీము దేశమందు చెదరియున్న వారు
న్ను యెరూశలేములో పరిశుద్ధ పర్వతమునకు వచ్చి
యెహోవాను ఆరాధింతురు.

## 28. అధ్యాయము.

1 ఎఫ్రయీము సంబంధులైన కైపుదారులయొక్క
గర్వపు కిరీటమునకున్ను కొవ్విన పల్లపు భూమిలో
వుండి వాడిపోతూ వున్న పుష్పమనే వారియొక్క
బహు సౌందర్యమునకున్ను ద్రాక్షారసపు మత్తు చేత
2 పీడితులైన వారికిన్ని అయ్యో! । యిదుగో బలమున్ను
పరాక్రమమున్ను గలది యొకటి యెహోవాకు కలిగి
వున్నది; ఆయన వడగండ్ల తుఫాను వలెనున్ను ప్రళయ
వాయువు వలెనున్ను వేగముగా తోసుకొని వచ్చే
గొప్ప జలప్రళయము వలెనున్ను తన హస్తముచేత వా
3 రిని నేల మీద పడదోసును. । ఎఫ్రయీము సంబంధ
మైన కైపుదారులయొక్క గర్వపు కిరీటము కాళ్ల కింద
4 త్రొక్కబడును. । కొవ్విన పల్లపు భూమిలో వుండి
వాడిపోతూ వున్న పుష్పమనే వారి బహు సౌందర్య
ము వసంత కాలము రాక ముందు పండిన పండు వలె
వుండును; యెవనికైనా అది కనుపడితే వాడు దాని
త్రుంచుకొనును; చేతికి దొరికిన తక్షణమందే వాడు దాని
తినివేసును. । ఆ దినమందు సైన్యముల యెహోవా 5
తన జనులలో శేషించిన వారికి ఘనము గల కిరీటము
గానున్ను సౌందర్యముగల దండగానున్ను వుండును. ।
మరిన్ని న్యాయాసనమందు ఆసీనుడై వున్న వానికి 6
న్యాయమును తీర్చే ఆత్మగానున్ను యుద్ధమును గవిని
మట్టుకు తిరగ కొట్టే వారికి శక్తిగానున్ను వుండును. ।
అయితే వీరున్ను ద్రాక్షారసపు మత్తుచేత తప్పి పో 7
యిరి; బలమైన పానముచేత మార్గములోనుంచి తొలిగి
పోయిరి; అర్చకుడున్ను దీర్ఘదర్శిన్ని మద్యముచేత
తప్పి పోయిరి; ద్రాక్షారసమందు మునిగిరి; బలమైన
పానముచేత వారు మార్గమును విడిచి వున్నారు;
దర్శన విషయమై వారు తప్పుతున్నారు; న్యాయము
తీర్చుటలో తూలి పోతున్నారు. । యేమంటే వారి 8
భోజనపు బల్లలన్నీ వమనముతోటిన్ని యేహ్యతతో
టిన్ని నిండి వున్నవి; యీలాగు కాని స్థలము వొకటీ
లేదు. । వారు అనుకొనినదేమంటే, ఆయన యెవనికి 9
బుద్ధి చెప్పును? యెవనికి బోధ చేసును? పాలు విడిచిన
వారికా? స్తనములను తప్పించిన వారికా? । యేమంటే 10
ఆజ్ఞమీద ఆజ్ఞయున్ను ఆజ్ఞమీద ఆజ్ఞయున్ను, న్యా
యము మీద న్యాయమున్ను న్యాయము మీద న్యా
యమున్ను, యిక్కడ కొంచెము అక్కడ కొంచెము
కలిగి వున్నదని అనుకొనిరి.। కాబట్టి నిజముగా ఆయన 11
నత్తి నాలుకచేతనున్ను అన్యభాష చేతనున్ను యీ
జనులతోటి పలుకును. । యేమంటే ఆయన వచ్చి, యీ 12
నెమ్మదిచేతనే అలసిన వారికి మీరు నెమ్మది యియ్య
వచ్చుననిన్ని యిదే వుపశాంతి యనిన్ని చెప్పినప్పటికిన్ని
వారు వినరైరి. । కాబట్టి వారు నడిచి వెనుకనుంచి 13
కూలి చితికి వురులలో చిక్కపడేటట్టుగా యెహో
వాయొక్క వాక్కువల్ల వారికి ఆజ్ఞ మీద ఆజ్ఞయున్ను
ఆజ్ఞ మీద ఆజ్ఞయున్ను, న్యాయము మీద న్యాయ
మున్ను న్యాయము మీద న్యాయమున్ను, అక్కడ
కొంచెమున్ను యిక్కడ కొంచెమున్ను కలిగి వుండు
ను. । కాబట్టి యెరూశలేము యందుండే జనులను 14
యేలే ఓ పరిహాసకులారా, యెహోవాయొక్క వా
క్యమును వినండి. । మృత్యువుతోటి మేము వొడంబడి 15
కెను చేసుకొంటిమి; సమాధికిన్ని మాకున్ను సమాధా
నపు నిర్ణయము కలదనిన్ని, వుప్పెన తెగులు గడిచి
పోతూ వున్నప్పుడు అది మా యొద్దికి రాదు అనిన్ని,
యేమంటే అబద్ధమును మేము ప్రాపుగా చేసుకొం
టిమి, మాయ కింద మేము దాగి వుంటిమనిన్ని చెప్పి
తిరి, । గనుక కర్తయైన యెహోవా ఆనతిస్తున్న 16
దేమంటే, యిదుగో సీయోనులో పునాది కొరకు నేను

వొక రాతిని వుంతును; అది శోధించబడిన రాయిన్ని
ప్రశస్తమైన మూల రాయిన్ని స్థిరమైన పునాదిన్ని
అయి వుండును; దాని యెవడు నమ్మునో వాడు సిగ్గును
17 పొందడు. । మరిన్ని నేను కొలనూలుకు న్యాయము
నున్ను గుండుకు నీతినిన్ని పెట్టుదును; వడగండ్లు అబ
ద్ధపు ప్రాపును కొట్టివేసును; వుదకములు మరుగైన
18 స్థలమును ముంచును. । మృత్యువుకున్ను మీకున్ను
కలిగిన వొడంబడికె భేదించపడును; సమాధికిన్ని మీ
కున్ను కలిగిన సమాధానము నిలువక పోవును; వుప్పెన
తెగులు గడచి పోతూ వున్నప్పుడు మీరు దాని చేత
19 త్రొక్కబడుదురు. । అది గడచి పోతూ వున్నప్పుడు
మిమ్మును పట్టుకొపోవును; యేమంటే వుదయోదయము
నకున్ను దివారాత్రములకున్ను అది గడచిపోతూ వుం
డును; దాని గూర్చిన కబురు వినగానే భయంకరముగా
20 వుండును. । యేమంటే వొకడు మంచము మీద పడు
కొనుటకు అది పొడవు చాలకుండా వున్నది; వొకడు
21 దుప్పటి కప్పుకొనుటకు అది కురచగా వున్నది. । యే
మంటే పెరెసీము పర్వతమందు అయినట్టు యెహోవా
వా లేచును; తన పని అనగా తన వింతైన పని చేసుట
కున్ను తన కార్యము అనగా తన వింతైన కార్యమును
కాచేసుటకున్ను గిబోను లోవలో అయినట్టు ఆయన
22 వుగ్రమును తెచ్చుకొనును. । కాబట్టి మీ బంధకములు
యింకా గట్టి పరచబడకుండా హాస్యములను మానండి;
యేమంటే దేశమంతటి మీద సైన్యముల యెహోవా
వల్ల నిర్ణయించ పడిన నాశనము వచ్చునని నాకు
23 వినపడెను. । మీరు చెవి వొగ్గి నా నోటి శబ్దమును
24 వినండి; నా మాటలను విని ఆలకించండి. । వ్యవసాయ
దారుడు విత్తే కొరకు నిత్యమున్ను దున్నుతూ వుండు
నా! అతడు దుక్కి బెడ్డలను నిత్యమున్ను బద్దల కొట్టు
25 తూ వుండునా? । భూమిని సమము చేసి, పప్పు గింజ
లనున్ను జిలకర్రనున్ను గోధుములనున్ను ధాన్యపు
విత్తనములనున్ను వాటి వాటికి తగిన స్థలమందు విత్త
26 డా! । యేమంటే వాని దేవుడు వాని చక్కగా బో
27 ధించి, వానికి బుద్ధి దయ చేసును. । యేమంటే పప్పు
గింజలు నూర్చే యంత్రము చేత నూర్చబడవు; జిల
కర్ర మీద బండి చక్రమును నడిపించేది లేదు; పప్పు
గింజలు కర్ర చేత దుళ్ల గొట్టబడును; జిలకర్ర కర్ర
28 చేత దుళ్ల గొట్టబడును. । గోధుములు నూర్చపడును;
అయితే వాడు నిత్యమున్ను ఆలాగున దుళ్లకొట్టడు;
తన బండి చక్రముతోటి వాడు నిత్యమున్ను నూర్చడు;
నిత్యమున్ను తన పశువుల డెక్కలచేత వాటిని త్రొ
29 క్కించడు. । యిదిన్ని సైన్యముల యెహోవా వల్లనై
వున్నది; ఆలోచన యందు ఆశ్చర్యముగానున్ను కార్య
ముల యందు మహత్వముగానున్ను ఆయన అగుపడును.

## 29. అధ్యాయము.

అరీయేలు, అనగా, దావీదు కాపురము వున్న అరీ 1
యేలు పట్టణము, దానికి అయ్యో! సంవత్సరమునకు
సంవత్సరము చేర్చండి; వేటలను చేయ నివ్వండి. । అయి 2
నప్పటికిన్ని నేను అరీయేలు బాధింతును; అందువల్ల
దుఃఖమున్ను చింతయున్ను కలుగును; అది నాకు గొప్ప
బలిపీఠ హోమస్థానము వలె వుండును. । కాబట్టి నేను 3
సైన్యముతోటి నిన్ను ముట్టడి వేతును; నీ చుట్టూ దిబ్బ
తోసి ఆవరింతును; నీ యెదుట నేను బురుజులను
కట ్టింతును. । కాబట్టి నీవు కుంగుదువు; భూమితో 4
కలిసి మాట్లాడుదువు; బుగ్గిలోనుంచి నీ స్వరము విన
పడును; నీ నోటి శబ్దము కర్ణ పిశాచము గల వాని
నోటి శబ్దము లాగున భూమిలోనుంచి వినపడును; నీ
మాటలు బుగ్గిలోనుంచి వినపడును. । మరిన్ని పర దేశ 5
స్థులైన నీ సమూహము ధూళి రేణువుల వలె అవును;
భయంకరుల సమూహము యెగిరి పోయిన పొట్టు
లాగున తత్క్షణమందు హఠాత్తుగా యెగిరిపోవును. ।
యేమంటే సైన్యముల యెహోవా నిన్ను వురుముతో 6
టిన్ని భూకంపముతోటిన్ని మహత్వమైన శబ్దముతో
టిన్ని తుఫానుతోటిన్ని ప్రళయ వాయువుతోటిన్ని
దహించే అగ్ని మంటతోటిన్ని శిక్షించును. । అయితే 7
రాత్రిలో స్వప్న దర్శనము యేలాగునో అరీయేలు
మీద యుద్ధము చేసే జనాంగముల సైన్యమంతాయు
న్ను దాని మీదనున్ను దాని బురుజుల మీదనున్ను
యుద్ధము చేసే వారందరున్ను దాని యిబ్బంది పెట్టే
వారున్ను ఆలాగున వుందురు. । ఆకలిగొనిన వాడు 8
యిదుగో భుజించినట్టు స్వప్నమును కని మేలుకొన్న
ప్పుడు సంతుష్టిని పొందనట్టున్ను, దప్పిగొనిన వాడు
యిదుగో పానము చేసినట్టు స్వప్నమును కని మేలు
కొనినప్పుడు సొమ్మసిల్లి, యింకా దప్పితోనే వున్న
ట్టున్ను, సీయోను పర్వతమునకు విరోధముగా యుద్ధ
ముచేసే జనాంగముల సమూహమంతా వుండును. ।
మీరు నిలిచి ఆశ్చర్యపడండి; తేరి చూచి విభ్రాంతి 9
పడండీ; వారు మత్తుగా వున్నారు గాని ద్రాక్షారస
ముచేత కాదు; జోగుతున్నారు గాని మద్యముచేత
కాదు. । యేమంటే యెహోవా గాఢ నిద్రయొక్క 10
ఆత్మను మీ మీద కుమ్మరించి; మీ నేత్రములను మూసి
పెట్టి యున్నాడు; దీర్ఘదర్శులయొక్కయున్ను అధి
కారులయొక్కయున్ను ప్రదర్శకులయొక్కయున్ను
కన్నులకు ఆయన గంతలు కట్టెను. । కాబట్టి యావత్తు 11
దర్శనము ముద్రించిన గ్రంథపు మాటల వలె మీకు
వున్నది; దాని విద్యావంతుడైన వొకని చేతికి యిచ్చి
చదువుమంటే వాడు అది ముద్రించ పడినది గనుక

12 నేను చదువ లేనని అనును. । మరిన్ని ఆ గ్రంథమును
విద్యాహీనుడైన వొకని చేతికి యిచ్చి చదువుమంటే
13 వాడున్ను నాకు విద్య రాదని అనును. । కాబట్టి యె
హోవా ఆనతిచ్చినదేమంటే, యీ జనులు నా యొ
ద్దికి తమ నోటితోటి చేరి, తమ పెదవులతోటి నన్ను
ఘనపర్చుతూ వున్నారు గాని వారి హృదయము నాకు
దూరముగా వున్నది; మరిన్ని నా పట్ల వారికి కలిగిన
14 భక్తి మనుష్యుల బోధ చేతనైనదై యున్నది. । కాబట్టి
యిదుగో నేను యీ జనులలో వొక ఆశ్చర్యమైన
కార్యమును చేతును; అది బహు వింతైన కార్యమున్ను
ఆశ్చర్యమున్నై వుండును; అందు నిమిత్తము వారి
జ్ఞానుల జ్ఞానము లయమవును; మతి మంతుల మతి
15 ప్రత్యక్షము కాకపోవును. । తమ ఆలోచనలను యె
హోవాకు మరుగుగా వుంచ కోరినటువంటి వారికి
అయ్యో! తమ క్రియలను అంధకారమందు వుంచి,
మమ్మును యెవరు చూడ గలరు, మమ్మును యెవరు యె
16 రుగుదురని అనుకొందురు. । తలక్రిందుగా వున్న మీ
బుద్ధి కుమ్మరి వాని మంటితో సమానము చేయపడినట్టు
వుండును; కార్యము దాని చేసిన వాని గూర్చి ఆయన
నన్ను చేయ లేదని అనునా? రూపించ పడినది రూ
పించిన వాని గూర్చి ఆయనకు బుద్ధి లేదని అనునా?।
17 యిక కొంత కాలముకే కదా లెబానోను పర్వతము
ఫలించిన పొలము వలె అవును; ఫలించిన పొలము అర
18 ణ్యము వలె యెంచబడును. । ఆ దినమందు చెవిటి
వాడు గ్రంథముయొక్క మాటలను వినును; గుడ్డి వాని
నేత్రములు మబ్బులోనుంచిన్ని చీకటిలోనుంచిన్ని
19 చూచును. । దీనులు యెహోవా యందు విస్తారమైన
సంతోషమును పొందుదురు; జనులలోనున్న దరిద్రులు
ఇశ్రాయేలుయొక్క పరిశుద్ధుని యందు ఆనందింతురు.।
20 యేమంటే భయంకరుడు కడతేరును; పరిహాసకుడు
లేకపోవును; అక్రమము కొరకు కనిపెట్టుతున్న వారం
21 దరున్ను నరకపడుదురు. । బీదవాడు మాట ఆడినంత
మాత్రమునకు వానికి దోషము మోపుదురు; పుర ద్వా
రమందు వ్యాజ్యము కలవాని కొరకు వారు వురులను
వొగ్గుదురు; అబద్ధపు మాటలను పలికి నీతిపరుని వ్యా
22 జ్యమును తిప్పి వేతురు. । కాబట్టి అబ్రాహామును
విమోచించిన యెహోవా యాకోబు యింటివారిని
గురించి ఆనతిస్తున్నదేమంటే, యిక యాకోబు సిగ్గు
పడక వుండును; వాని ముఖము చిన్నబోక వుండును.।
23 యేమంటే వాని బిడ్డలు వారిలోగా నా చేతుల కా
ర్యమును చూచినప్పుడు నా నామమును పరిశుద్ధ పర
చుదురు; యాకోబు పరిశుద్ధుని పరిశుద్ధ పర్చి, ఇశ్రా
24 యేలు దేవుని యందు భయ భక్తిగా వుందురు.। ఆత్మలో

తప్పినవారున్ను తెలివిని పొందుదురు; సణిగినవారు
బోధను ఆలకింతురని ఆనతిచ్చెను.

## 30. అధ్యాయము.

మరిన్ని యెహోవా ఆనతిస్తున్నదేమంటే, తిరుగు 1
బాటు చేసే పిల్లలకు అయ్యో! యేమంటే నావల్ల రాని
ఆలోచనను వారు ఆలోచింతురు; పాపము మీద
పాపము చేసుటకు నా ఆత్మ వల్ల రానటువంటి ప్రమా
ణములను రూఢ పరచుకొందురు. । నా నోటి ఆలోచ 2
నను అడగక, ఫరోయొక్క శక్తి చేత తాము శక్తి పర్చు
కొనుటకు మిస్రయీము దేశమునకు దిగి వెళ్లి, మిస్ర
యీముయొక్క నీడ యందున నమ్ముదురు. । కాబట్టి 3
ఫరోయొక్క శక్తి మీకు సిగ్గుకవును; మిస్రయీము
యొక్క నీడయందుండే మీ నమ్మిక మీకు బిడియమున
కవును. । వారి అధికారులు సోయనుకు వచ్చిరి; వారి 4
రాయభార కర్తలు హానేసుకు చేరిరి. । తమకు ప్రయో 5
జనము లేని జనుల విషయమై తమరందరున్ను సిగ్గుప
డిరి; వారు సిగ్గుకున్ను అవమానమునకున్ను హేతువైరి,
గాని సహాయమునకున్ను ప్రయోజనమునకున్ను రాక
పోయిరి. । దక్షిణపు దిక్కుకు ప్రయాణము చేసే పశువు 6
లను గురించిన భగవద్వాక్యము యేమంటే, అవి వుప
ద్రవమున్ను మనో వేదనయున్ను గల దేశములోకి
వెళ్లుతూ వున్నవి; అక్కడనుంచి ఆడు సింహమున్ను
దుష్ట సింహమున్ను క్రూరమైన పామున్ను యెగిరే
అగ్ని సర్పమున్ను వచ్చును; వారు గాడిదె పిల్లల మీద
వారి ఐశ్వర్యమునున్ను వొంటెల వీపుల మీద వారి
పదార్థములనున్ను తమ ప్రయోజనమునకు రానటు
వంటి జనులయొద్దికి తీసుకొపోదురు. । యేమంటే మిస్ర 7
యీముయొక్క సహాయము వట్టిదై పనికిరాక పోవును;
అందు నిమిత్తము కూర్చుని వుండే ప్రేలేది అని నేను
దానిని పిలిస్తిని. । కాబట్టి నీవు వెళ్లి, యీ వాక్యము నిత్య 8
సాక్షిగా ముందు వచ్చే కాలమంతటి పర్యంతము వుండే
టట్టు వారి ముందర పలక మీద చెక్కి గ్రంథమందు
వ్రాతువు గాక. । యేమంటే యీ జనులు తిరుగుబాటు 9
చేసేవారు; అబద్ధపు పిల్లలు; యెహోవా న్యాయప్ర
మాణమును వినని పిల్లలై వున్నారు. । చూడ వద్దని ప్రద 10
ర్శకులతోనున్ను నీతి వాక్యమును మీరు మాతో చెప్ప
వద్దు; మృదువైన మాటలను పలకండి; మాయగా దీర్ఘ
దర్శిత్వమును పలకండి; । మార్గమును విడిచి తిన్నటి 11
దానిలోనుంచి తొలగండి; ఇశ్రాయేలుయొక్క పరిశు
ద్ధుని మాకు మరుగుగా చేయండని దీర్ఘదర్శులతో
నున్ను వారు పలుకుదురు.। కాబట్టి ఇశ్రాయేలుయొక్క 12
పరిశుద్ధుడు పలుకుతున్న దేమంటే, మీరు యీ మాట
లను రోసి, బలిమి యందున్ను మూర్ఖత యందున్ను

13 నమ్మి పూనుకొన్నందున, । యీ దోషము పొడుగైన
గోడలోనుంచి బైటకు జారి పడుటకు సిద్ధముగా వున్న
బీట వలెనే మీకు అవును; అది వొక క్షణములో పగిలి
14 హఠాత్తుగా కూలును. । ముక్కలుగా పగల గొట్టబడిన
కుమ్మరి పాత్రయొక్క చితుకుట వలెనే ఆయన దాని
పగల గొట్టి కనికరించడు; కాబట్టి పొయిలోనుంచి
నిప్పు తీసుటకయినా గోతి నీళ్లు చేదుటకైనా దాని
చితుకుటలోను వొక పెంకైనా కనుపడక పోవును. ।
15 యేమంటే ఇశ్రాయేలుయొక్క పరిశుద్ధుడు, అనగా,
కర్తయైన దేవుడు యీలాగున ఆనతిస్తున్నాడు; యేలా
గంటే మళ్లుటచేతనున్ను పూరకుండుట చేతనున్ను
మీరు రక్షించబడుదురు అనిన్ని, శాంతము వల్లనున్ను
నమ్మిక వల్లనున్ను మీకు శక్తి కలుగుననిన్ని చెప్పినప్పు
16 టికీ మీరు అనుకూలించరైతిరి. । అలాగున కాదు గాని
మేము గుర్రముల మీద యెగిరి పోదుమని అనుకొం
టిరి, గనుక మీరు పారదోల బడుదురు; వేగము గల
వాటిని యెక్కుదుమని అనుకొంటిరి గనుక మిమ్మును
17 తరిమే వారు వేగముగా వత్తురు. । వొకని గద్దింపు చేత
వెయిమంది పారిపోదురు; అయిదుగురి గద్దింపు వల్లను
మీరు అందరున్ను పారిపోదురు; అయినందున మీలో
శేషించిన వారు పర్వతము మీద వున్న కొడి స్తంభము
వలెనున్ను కొండ మీద వున్న నిశానీ వలెనున్ను వుం
18 దురు. । అయినప్పటికీ యెహోవా మీ యందు అను
గ్రహించుటకు కనిపెట్టి వుండును; మిమ్మును కనికరిం
చుటకు హెచ్చించబడును; యేమంటే యెహోవా
నీతి గల దేవుడై వున్నాడు, ఆయన కొరకు కనిపెట్టి
19 యున్న వారందరున్ను భాగ్యవంతులౌదురు. । యేమంటే
జనులు సీయోనులోనున్ను యెరూశలేములోనున్ను
నివసింతురు; యిక నీవు కన్నీరు రాల్చక వుందువు; నీ
మొరయొక్క శబ్దమును ఆయన వినగానే నీ యందు
మిక్కిలీ అనుగ్రహించును; ఆయన దాని ఆలకించి
20 వెంటనే నీకు ప్రత్యుత్తరమును యిచ్చును. । మరిన్ని
యెహోవా నీకు ఆపత్తుయొక్క రొట్టెనున్ను శ్రమ
యొక్క వుదకమునున్ను యిచ్చినప్పటికిన్ని యిక నీ
వుపదేశకులు తీసివేయ బడక పోదురు; నీ నేత్రములు
21 నీ వుపదేశకులను చూచును. । మరిన్ని మీరు తోవ
తప్పి కుడికైనా యెడమకైనా తిరిగేటప్పటికి యిదే
మార్గము, దీని యందు నడువండన్న శబ్దము నీ వెనుక
22 నుంచి నీ చెవులకు వినపడును. । మరిన్ని చెక్కపడిన నీ
వెండి బొమ్మలయొక్క కప్పులనున్ను పోత పోసిన నీ
బంగారపు ప్రతిమలయొక్క ఆభరణములనున్ను మీరు
అపవిత్రపరుతురు; మలిన వస్త్రము వలెనే వాటిని నీవు
పారవేతువు; వాటిని చూచి నాకు తొలిగి పొమ్మని
23 అందువు. । అప్పుడు నీ గింజల కొరకు ఆయన వర్షమును
కురిపించును; భూమి మీదను వాటిని నీవు విత్తుదువు; నీ
పంట బలముగానున్ను విస్తారముగానున్ను వుండును;
నీ పశువులు విస్తారమైన బీళ్లలో మేసును. । మరిన్ని యె 24
ద్దులున్ను భూమిని దున్నే లేత గాడిదెలున్ను చేటతో
టిన్ని జల్లెడతోటిన్ని చెరిగి జల్లించిన మేతను తినును. ।
మరిన్ని గోపురములు పడిపోయి బహు హతము అయ్యే 25
దినమందు సకలోన్నతమైన పర్వతముల మీదనున్ను
సకలమైన పొడుగు కొండల మీదనున్న ధారలున్ను
ప్రవహించే వుదకములున్ను కలుగును. । మరిన్ని యె 26
హోవా తన జనులయొక్క నలిగినదాని కట్టి వారి
గాయపు నరుకును స్వస్థపరిచే దినమందు చంద్రుని
కాంతి సూర్యుని కాంతికి సమమవును; సూర్యుని
కాంతి యేడు దినముల వెలుగు లాగున యేడు రెట్లు
అధికమౌను. । అదుగో యెహోవా నామము దూర 27
మునుంచి వస్తూ వున్నది; ఆయన కోపము మండుతూ
వున్నది; దాని జ్వాల భారముగా వున్నది; ఆయన పెద
వులు ఆగ్రహముతోటి నిండి వున్నవి; ఆయన నాలుక
దహించే అగ్ని వలె వున్నది. । ఆయన శ్వాసము వొడ్డు 28
మించి పారిన ప్రవాహమువలెనే వచ్చి మెడ పర్యం
తము పారును; ఆయన వచ్చి జనాంగములను చేట
తోటి చెరిగి నాశనము చేసును; ఆ జనుల నోటి
యందు వారి మార్గమునుంచి వారిని తప్పించుటకు
కళ్లెము వుండును. । కాబట్టి పరిశుద్ధమైన పండుగయొ 29
క్క రాత్రిలో పాడినటువంటి పాటను మీరు పాడు
దురు; యెహోవాయొక్క కొండకు, అనగా, ఇశ్రా
యేలుయొక్క శిలా పర్వతము యొద్దికి పిల్లనగ్రోవి
నాదముతో వచ్చే వానికి వున్నట్టు మీకు హృదయా
నందము కలుగును. । మరిన్ని యెహోవా తన మహత్తు 30
గల శబ్దమును వినపడేటట్టు చేసి తన కోపముయొక్క
ఆగ్రహముతోనున్ను దహించే అగ్ని జ్వాలతోనున్ను
చెదరచేసే ప్రళయ వాయువుతోనున్ను వడగండ్లతో
నున్ను తన హస్తముయొక్క దిగుట అగుపడేటట్టు
చేసును. । యేమంటే దండముతోటి కొట్టిన అష్షూరు 31
వాడు యెహోవాయొక్క శబ్దముచేత కొట్టబడి కూ
లును. । మరిన్ని నిర్ణయించిన దండము యొక్కదెక్క 32
డికి గడిచివెళ్లునో అక్కడక్కడ తంబురలతోనున్ను
కిన్నెరలతోనున్ను ఆనందము కలిగి వుండును; ఆ దండ
మును యెహోవా వాని మీద కఠినముగా పెట్టును;
ఆయన కఠినమైన యుద్ధములతో దాని మీద యుద్ధము
చేసును. । యేమంటే తోఫెతు ఆదినుంచీ నిర్ణయిం 33
చబడి యున్నది; అది ఆ రాజు నిమిత్తము సిద్ధపడి యు
న్నది; అతడు దానిని లోతుగానున్ను విశాలముగానున్ను
చేసి వున్నాడు; అది కాలేటందుకు కర్రలు కుప్పగా

సిద్ధము చేయబడి వున్నవి; యెహెూవాయొక్క శ్వా
సము గంధక ప్రవాహము వలెనే దాని రాజ వేసును.

## 31. అధ్యాయము.

1 సహాయము కొరకు మిస్రయీము దేశమునకు దిగి
వెళ్లుతూ, గుర్రముల యందు తమ నమ్మకము వుంచు
తూ, రథములు విస్తారముగా వున్నందున వాటియం
దున్ను రౌతులు మహా బలముగలవారై యున్నందున
వారి యందున్ను నమ్ముతూ వున్న వారికి అయ్యో!
వారు ఇశ్రాయేలుయొక్క పరిశుద్ధుని తట్టు చూడక
2 యెహెూవాను వెతుకక వున్నారు. । అయినప్పటికిన్ని
ఆయనయున్ను జ్ఞాని అయి వున్నాడు; ఆయన కీడు
వచ్చేటట్టు చేసి, తన వాక్యములను మళ్లించడు; ఆయన
దుర్మార్గులయొక్క యింటి మీదనున్ను అక్రమము
జరిగించే వారికి సహాయులైన వారి మీదనున్ను లేచు
3 ను. । మిస్రీయులు మనుష్యులే గాని దేవుడు కారు;
వారి గుర్రములు మాంసము గాని ఆత్మ కావు; యె
హెూవా తన హస్తమును చాపగానే సహాయము చేసే
వాడున్ను సహాయము పొందే వాడున్ను కింద పడు
4 దురు; అందరున్ను కూడి లయమౌదురు. । యెందుకంటే
యెహెూవా నాతో ఆనతిచ్చినదేమంటే, సింహమున్ను
సింహపు పిల్లయున్ను వాటికి దొరికిన దాని మీద
గర్జిస్తూవుండగా దాని మీదికి గొర్రెల బోయల
సమూహమంతా కూడి వచ్చినప్పటికిన్ని వారి శబ్దము
నకు అది భయపడక, వారి గుంపుకు దిగులు పడక
వున్న లాగున సైన్యముల యెహెూవా సీయోను పర్వ
తము కొరకున్ను దాని కొండ కొరకున్ను యుద్ధము
5 చేసుటకు దిగి వచ్చును. । పక్షులు యెగురుతూ వున్న
లాగున సైన్యముల యెహెూవా యెరూశలేమును
కాపాడును; కాపాడుతూ ఆయన దాని విడిపించును;
6 గడిచి పోతూ ఆయన దాని సంరక్షణ చేసును. । ఓ
ఇశ్రాయేలు పుత్రులారా, యెవరి యొద్దనుంచి మీరు
యింత ఘోరముగా తొలిగిపోతిరో ఆయన తట్టు తిర
7 గండి. । యేమంటే ఆ దినమందు మీరందరున్ను పాపము
కొరకు మీ చేతులు చేసుకొనిన మీ వెండి బొమ్మల
నున్ను బంగారపు బొమ్మలనున్ను మీరు పారవేతురు. ।
8 అప్పుడు అష్షూరువాడు కత్తివల్ల కూలును, అయితే అది
బలవంతునిది కాదు; నీచునిది కానటువంటి కత్తి వాని
భక్షించును; కత్తినుంచి వాడు పారిపోవును; వాని
9 పడుచు వారు కరిగిపోదురు. । కాబట్టి వాడు భయపడి
తన గట్టి స్థలమునకు వెళ్లిపోవును; మరిన్ని వాని కింద
వున్న అధికారులు నిశానీ చూచి భయపడుదురని యీ
లాగున సీయోనులో తన అగ్నిన్ని యెరూశలేములో
తన కొలిమిన్ని వుంచిన యెహెూవా ఆన తిచ్చెను.

## 32. అధ్యాయము.

ఇదుగో వొక రాజు నీతిగా పరిపాలించును; అధి 1
కారులు న్యాయప్రకారముగా యేలుదురు. । మరిన్ని 2
ఆ మనుష్యుడు వాయువుకు మరుగు స్థలమువలెనున్ను,
తుఫానుకు చాటు వలెనున్ను, మరు భూమిలో వుదక
నదుల వలెనున్ను, అలయిక గల ప్రదేశములో పెద్ద
మెట్ట నీడ వలెనున్ను వుండును. । చూచేవారి కన్నులు 3
మందత గలవై యుండవు; వినేవారి చెవులు ఆలకిం
చును. । త్వరితుల హృదయము తెలివిని పొందును; 4
నత్తి నాలుక స్పష్టముగా పలుకుటకు త్వరపడును. ।
నీచుడు వుదారుడని యిక పిలువబడడు; లుబ్ధుడు ధార్మి 5
కుడని యిక పిలువబడడు. । యేమంటే ఆకలిగొనిన 6
వారి ఆత్మను క్షీణింప చేసుటకున్ను దాహము గలవా
రికి పానము తప్పిపో చేసుటకున్ను వంచనను జరిగిం
చుట వల్లనున్ను యెహెూవాకు విరోధముగా అబద్ధ
మును పలుకుట వల్లనున్ను నీచుడు నీచపు మాటలను
పలుకును; వాని హృదయము అక్రమమును జరిగిం
చును. । లుబ్ధునియొక్క సాధనములున్ను చెడ్డవిగా వుం 7
డును; వాడు అబద్ధపు మాటలతోటి దీనుని నశింప
చేసుటకు బీదవాడు యథార్థముగా పలుకుతున్నప్ప
టికిన్ని దుర్మార్గపు తంత్రములను కల్పించును. ।
అయితే వుదారుడు ఔదార్యము గల వాటిని సంక 8
ల్పించును; ఔదార్యము గల వాటివల్ల వాడు స్థిరప
డును. । నెమ్మదిగా వున్న ఓ స్త్రీలారా, మీరు లేచి, 9
నా నోటి శబ్దమును వినండి; నిర్విచారము గల ఓ కుమా
ర్తెలారా, నా మాటలకు చెవి వొగ్గండి. । నిర్విచారి 10
ణులైన ఓ స్త్రీలారా, సంవత్సరము కంటే అనేక దిన
ముల పర్యంతము మీరు శ్రమ పెట్ట బడుదురు; యే
మంటే ద్రాక్షాఫల సంగ్రహ కాలము తప్పిపోవును;
కోతకాలము రాకుండా వుండును. । నెమ్మదిగా వున్న 11
ఓ స్త్రీలారా, వణుకుడీ; ఓ నిర్విచారిణులారా, తొం
దరపడుడీ; మీ బట్టలను తీసివేసి దిగంబరులై, గోనె
పట్టను నడుమును చుట్టబెట్టుకొనుడీ. । స్తనముల నిమి 12
త్తమున్ను రమ్యమైన పొలముల నిమిత్తమున్ను ఫలభరి
తమైన ద్రాక్షచెట్ల నిమిత్తమున్ను వారు మూల్గుదురు. ।
నా జనుల భూమి మీదనున్ను నిశ్చయముగా ఆనంద 13
పట్టణమందుండే ఆనంద గృహములన్నిటి యందున్ను
ముళ్లున్ను ముళ్ల పొదలున్ను పెరుగును. । యేమంటే 14
నగరు విడువబడును; జన సమూహపు సందడి గల పట్ట
ణము విడువబడును; పైనుంచి ఆత్మ మన మీద కుమ్మరిం
చబడే పర్యంతమున్ను అరణ్యము ఫలభరితమైన పొల
మయ్యే పర్యంతమున్ను ఫలభరితమైన పొలము వనము
గా యెంచబడే పర్యంతమున్ను, । కోటలున్ను కావు 15

కొరకైన గోపురములున్ను నిత్యమున్ను గుహలుగాను
న్ను అడవి గాడిదెలకు ఆనందమైన స్థలములుగానున్ను
16 మందలకు మేత భూములుగానున్ను అవును. । అప్పుడు
న్యాయము అరణ్యమందు కాపురము చేసును; నీతి ఫలి
17 తమైన పొలమందు వుండును. । నీతి కార్యము నెమ్మది
అయి వుండును; నీతియొక్క ఫలము నిత్యమున్ను
18 విశ్రాంతిన్ని నిర్భయమున్ను అవును. । నా జనులు
సుఖమైన నివాసమందున్ను నిర్భయమైన కాపురము
లందున్ను కలవిలపడని నిమ్మళమైన స్థలములయందున్ను
19 కాపురము చేతురు. । అయితే వడగండ్లు రాలును;
అడవి విరగపడును; పట్టణము కూలి సదునైన భూమికి
20 సమమౌను. । సకలమైన వుదకముల మీద విత్తనములను
విత్తి, అక్కడికి యెద్దుయొక్కయున్ను గాడిదెయొక్క
యున్ను పాదములను నడిపించే మీరు భాగ్యవంతులై
వున్నారు.

## 33. అధ్యాయము.

1 పాడుపొందక వున్నప్పటికిన్ని ఓ పాడు చేసిన
వాడా, మోసము పొందక వున్నప్పటికిన్ని ఓ మోస
పుచ్చినవాడా, నీకు అయ్యో! నీవు పాడుచేసుట మా
నిన తరువాత నీవున్ను పాడై పోవుదువు; నీ మోసపు
చ్చుట సమాప్తమైనప్పుడు వారు నిన్ను మోసపుత్తురు.।
2 ఓ యెహోవా, మా యందు కృప వుంచుము; నిన్ను
మేము నమ్మి యున్నాము; ప్రత్యుదయమున్ను వారికి
శక్తిన్ని శ్రమ కాలమందు మాకు రక్షణయున్ను అయి
3 వుండుము. । గల్లత్తుయొక్క ధ్వనిచేత జనులు పారిపో
తున్నారు; నీయొక్క లేచుట చేత జనాంగములు చెద
4 రిపోతున్నవి. । అయినందున మీ దోపుడు సొమ్ము గొం
గళీ పురుగులు యేరినట్టు యేరపడును; యిటూ అటూ
యెగిరే మిడతల లాగున వారు పరుగెత్తి దాని మీదికి
5 వత్తురు. । యెహోవా హెచ్చించబడి వున్నాడు; యే
మంటే ఆయన వున్నతమందు నివాసము చేస్తూ వున్నా
డు; నీతి న్యాయములచేత ఆయన సీయోనును నింపి
6 వున్నాడు. । జ్ఞానమున్ను తెలివిన్ని నీ కాలముల స్థిరత
యున్ను రక్షణయొక్క బలమున్ను అయి వుండును;
యెహోవాయొక్క భయమే అతనికి ఐశ్వర్యమై వుం
7 డును. । అదుగో పరాక్రమశాలులు అవతల బొబ్బ
పెట్టుదురు; సమాధానముయొక్క రాయభారులు ఘో
8 రముగా యేడ్తురు. । రాజ మార్గములు విడువబడినవి;
మార్గస్థుడు వొకడూ లేడు; వాడు వొడంబడికెను
త్రుంచి వున్నాడు; పట్టణములను నిర్లక్ష్యపెట్టి వున్నా
9 డు; యెవనినైనా లక్ష్యపెట్టక వున్నాడు. । భూమి
మూల్గి క్షీణిస్తూ వున్నది; లెబానోను సిగ్గుపడి వాడి
పోయెను; షారోను అరణ్యము వలె వున్నది; బాషాను
న్ను కర్మెలున్ను తమ ఫలములను కదలిస్తున్నవి. ।
యెహోవా ఆనతిస్తున్నదేమంటే, యిప్పుడు నేను 10
లేతును, యిప్పుడు నేను హెచ్చించబడుదును; యిప్పు
డు నా అంతట నేనే లేతును. । మీరు పొల్లుతో గర్భ 11
మును ధరింతురు; మీరు చెత్తను కందురు; మీ ఆత్మ
అగ్ని వలెనే మిమ్మును దహించును. । జనులు కాల్చబ 12
డిన సున్నము వలెనే వుందురు; నరకబడిన ముళ్ల వలెనే
అగ్నిచేత వారు దహించబడుదురు. । దూరముగా వున్న 13
వారలారా, నేను చేసిన వాటిని వినండి; దగ్గిర వున్న
వారలారా, నా మహాత్మ్యమును గుర్తెరుగండి. । సీయో 14
నులో వున్న పాపాత్ములు భయముగా వున్నారు; భీతి
ఆ వేషధారులను ఆవరించెను; మనలో యెవడు దహించే
అగ్నిలో నివసించ గలడు? మనలో యెవడు నిత్యమైన
దహనములందు నివసించ గలడు? । నీతిగా నడుస్తూ, 15
యథార్థమును పలుకుతూ, బలవంతపు లాభమును
అలక్ష్యపెట్టుతూ, తన చేతిలోనుంచి లంచమును మలిపి
వేస్తూ, రక్తమును గురించినవి వినక వుండేటట్టు తన
చెవులను మూసుకొంటూ, దుష్ట క్రియను చూడక వుం
డేటట్టు తన కండ్లను మూస్తూ వున్నవాడు యెవడో
వాడే వున్నతమందు నివాసము చేసును. । శిలా పర్వ 16
తములయొక్క గట్టి స్థలములు అతనికి వున్నతమైన
ప్రాపు అయి వుండును; అతని ఆహారము అతనికి యి
య్యబడును; అతని వుదకము అతనికి నిశ్చయమైన
దౌను. । అతని సౌందర్యముతో వున్న రాజును నీ కండ్లు 17
చూచును; దూరముగా వున్న దేశమును వారు దృష్టిం
తురు. । భయమును గూర్చి నీ హృదయము తలంచుకొ 18
నును. అయితే కరణము యెక్కడ? తూచేవాడు యె
క్కడ? గోపురములను లెక్కించిన వాడు యెక్కడ? ।
యిక ఆ వుగ్రమైన జనులను నీవు చూడవు; నీవు తెలు 19
సుకోలేని భాష గల వారినిన్ని నీకు యెరుగ నశక్యమైన
నత్తి నాలుక గల వారినిన్ని యిక నీవు చూడక వుందు
వు. । మన వుత్సవముల పట్టణమైన సీయోనును చూడు 20
ము; నీ కన్నులు యెరూశలేమును నిమ్మళమైన కాపుర
ముగానున్ను తీయబడని డేరాగానున్ను చూచును; దాని
మేకులలో వొకటయినా యెప్పటికీ తీయబడక యుం
డును; దాని తాళ్లలో వొకటైనా తెగిపోక వుండును. ।
అయితే అక్కడ మహాత్మ్యము గల యెహోవా 21
మనకు విస్తారమైన నదులున్ను ప్రవాహములున్ను గల
స్థలము వలె వుండును; కోలలు గల పడవ అక్కడ నడ
వదు; ఘనమైన వోడ వాటిలోబడి వెళ్లదు. । యేమం 22
టే యెహోవా మనకు న్యాయాధిపతి; యెహోవా
మనకు శాసన కర్త; యెహోవా మనకు రాజు;
ఆయన మనలను రక్షించును. । నీ వోడ తాళ్లు వొదులై 23
పోయెను; వారు కొయ్యను దిట్టపరచలేక పోయిరి;

వారు చాప చీరెను అంకారించ లేక పోయిరి; అప్పు
డు విస్తారమైన దోపుడు సొమ్ము పంపకమౌను; కుంటి
24 వారు దోపుడు సొమ్మును పుచ్చుకొందురు. । మరిన్ని
కాపురముగా వున్నవాడు నేను రోగినని చెప్పడు; దా
నిలో నివసించే జనులు తమ పాపక్షమను పొందుదురు.

## 34. అధ్యాయము.

1 ఓ జనాంగములారా, వినుటకు రండి; ఓ జనులా
రా, ఆలకించండి; లోకమున్ను దానిలో వున్న సమస్త
మున్ను భూమిన్ని దానిలోనుంచి పుట్టే సమస్తమున్ను
2 వినును గాక. । యేమంటే యెహోవా కోపము సకల
జనాంగముల మీదికి వచ్చి వున్నది; ఆయన రౌద్రము
వారి సైన్యములన్నిటి మీద పడి వున్నది; ఆయన వా
రిని నాశనమునకు నిర్ణయించెను; ఆయన వారిని హతికి
3 అప్పగించెను. । హతమైన వారు బైట వేయపడుదురు;
వారి కళేబరములలోనుంచి దుర్గంధము బైలు వెళ్లును;
4 వారి రక్తము చేత పర్వతములు కరిగి పోవును. । మరిన్ని
ఆకాశపు సమూహమంతా కరిగిపోవును; ఆకాశము
చుట్టవలె చుట్టబడును; ద్రాక్ష చెట్టునుంచి ఆకు యే
లాగు రాలునో అంజూరపు చెట్టునుంచి పండు యే
లాగున రాలునో ఆలాగునే దాని సమూహమంతా
5 రాలిపోవును. । యేమంటే ఆకాశమందు నా కత్తి మత్తి
ల్లినదై, యిదుగో, యెదోము దేశము మీదికిన్ని నా శాప
మునకు లోనై వున్న వారి మీదికిన్ని వచ్చి శిక్షను విధిం
6 చును. । యెహోవా కత్తి రక్తముతోటి తృప్తి పొంది
వున్నది; కొవ్వుచేత నిండి వున్నది; గొఱ్ఱెపిల్లలయొక్క
మేకలయొక్క రక్తముచేతనున్ను పొట్టేళ్లపక్క గుండె
కాయల కొవ్వుచేతనున్ను అది కొవ్వి వున్నది; యేమం
టే బోస్రాలో యెహోవాకు బలి కలదు; యెదోము
7 దేశమందు చాలా హతము కలదు. । మరిన్ని ఖడ్గ మృగ
ములున్ను ఆబోతులతో కూడా కోడెలున్ను వేటకు దిగి
వచ్చును; వారి దేశము రక్తముతో నానును; వారి మన్ను
8 కొవ్వుచేత నిండి వుండును. । యేమంటే అది యెహో
వా ప్రతి కీడు చేసే దినమౌను; అది సీయోనుకు కలి
9 గిన వ్యాజ్యమును తీర్చే సంవత్సరమైనందున, । ఆ దేశ
ముయొక్క ప్రవాహములు కీలై పారును; దాని బుగ్గి
గంధకమై యుండును; ఆ భూమి అంతా కాలే కీలై
10 వుండును. । రాత్రి అయినా పగలు అయినా అది ఆరి
పోక వుండును; దాని ధూమము యెన్నటికీ యెక్కు
తూ వుండును; తర తరముల మట్టుకు అది పాడయి
వుండును; యెన్నటికీ దానిలో గడచిన వాడు వొకడూ
11 లేక వుండును. । అయితే పైరీలున్ను, యేదుబందులున్ను
దాని స్వతంత్రించుకొనును; గుడ్లగూబయున్ను మాల
కాకిన్ని అక్కడ నివాసము చేసును; దాని మీద నాశ
నమనే నూలున్ను శూన్యత అనే గుండున్ను ఆయన
సాగించును. । వారు రాచరికము చేసుటకు వారి శ్రేష్ఠు 12
లను పిలితురు; అయితే శ్రేష్ఠులు అక్కడ వుండరు;
దాని అధికారులందరున్ను లేక పోదురు. । దాని నగ 13
రులలో ముళ్ల చెట్లున్ను దాని దుర్గములలో దురద
గొండ్లున్ను గచ్చతీగెలున్ను పుట్టును; క్రూర సర్ప
ములకు అది నివాసస్థలమౌను; గుడ్లగూబలకు సాలగా
వుండును. । అరణ్యపు దుష్ట మృగములున్ను పర్వతపు 14
దుష్ట మృగములున్ను అక్కడికి కూడి వచ్చును; కొండ
గొఱ్ఱె దానితోటి దానిని పిలుచుకొనును; పులుగు
పిట్ట అక్కడ వాలి నిమ్మళమైన చోటు కనుగొనును. ।
అక్కడ పెద్ద గుడ్లగూబ గూడు కట్టుకొని, గుడ్లను 15
పెట్టి అణిపి, దాని రెక్కల కిందికి పిల్లలను కూర్చును;
అక్కడికి రాంబొందులు కూడి వచ్చి, వాటి జత పక్షు
లతో కలుసుకొనును. । యెహోవాయొక్క గ్రంథ 16
మందు చదివి తెలుసుకొండి; వాటిలో వొకటైనా
తప్పిపోక వుండును; యే పక్షికైనా దాని జత పక్షిని
వెతికే నిమిత్తము లేదు, యేమంటే యెహోవాయే
ఆజ్ఞ యిచ్చెను; ఆయన ఆత్మ చేతనే అవి అక్కడికి
కూడి వచ్చును. । యేమంటే ఆయనే వాటి కొరకు 17
చీట్లు వేసెను; ఆయన నూలు చేతపట్టుకొని, ఆ దేశ
మును వాటికి సరిహద్దులుగా పంచిపెట్టెను; నిత్యమైన
స్వాస్థ్యముగా అవి ఆ దేశమును స్వతంత్రించుకొను
ను; తర తరము మట్టుకు అవి అక్కడ కాపురము
చేసును.

## 35. అధ్యాయము.

అరణ్యమున్ను యెండిపోయిన భూమిన్ని వీటికో 1
రకు సంతోషించును; అడవిన్ని సంతోషించి, గులాబి
చెట్టువలె పూచును. । అది బహుగా పూచి ఆనందము 2
గా పాడి సంతోషించును; లెబానోనుకు కలిగినంత
ఘనమున్ను కర్మెలు షారోను అనే వీటికి కలగినంత
శృంగారమున్ను దానికి యియ్యపడును; వారు యె
హోవాయొక్క ప్రకాశతనున్ను మన దేవుని మహి
మనున్ను చూతురు. । బలములేని చేతులను దృఢపర 3
చండి; తత్తళించిన మోకాళ్లను స్థిరపర్చండి. । అధైర్య 4
పంతులను చూచి, ధైర్యము తెచ్చుకొని భయపడకండి;
యిదుగో మీ దేవుడు మీ విషయమై వచ్చి శిక్షించు
ను; మీ దేవుడు వచ్చి తగినట్టుగా ప్రతికారము చేసును;
ఆయనే వచ్చి మిమ్మును రక్షించునని వారితో చెప్పండి. ।
అప్పుడు అంధుల కన్నులు తెరవపడును; చెవిటివారి 5
చెవులు విప్పపడును. । అప్పుడు కుంటివాడు లేడి 6
లాగున లగువులు వేసును; మూగవాని నాలుక పాటను
పాడును; యేమంటే అరణ్యమందు వుదకములున్ను

7 అడవి యందు ప్రవాహములున్ను వుబుకును. । యెండి
పోయిన భూమికి కొలనులున్ను ఆర్చుకొ పోయిన
భూమికి జెలలు పుట్టించే వూటలున్ను కలిగి వుండును;
క్రూర సర్పముల నివాసస్థలమందు గడ్డిన్ని రెల్లున్ను
8 తుంగయున్ను పెరుగును. । మరిన్ని వొక రాజ మార్గ
మున్ను వొక దారిన్ని అక్కడ కలిగి వుండును; అది
పరిశుద్ధ మార్గమని పిలువబడును; అపవిత్రుడు దాని
లోబడి వెళ్లడు; ఆయనే వారితో కూడా ఆ మార్గ
మందు వుండును; మార్గస్థులు సాధులై వున్నప్పటి
9 కిన్ని దాని తప్పిపోరు. । అక్కడ సింహము వుండదు;
యే దుష్ట మృగమైనా దాని మీదికి రాక వుండును;
అది అక్కడ కనపడకుండా వుండును; అయితే విముక్తి
10 పరులు అక్కడ నడుస్తూ వుందురు. । యేమంటే యె
హోవా వల్ల విముక్తిని పొందిన వారు పాటలు పాడు
తూ, సీయోనుకు తిరిగి వత్తురు; వారి శిరస్సుల మీద
నిత్యానందము వుండును; వారు సంతోషమున్ను వుత్సా
హమున్ను అనుభవింతురు; దుఃఖమున్ను నిట్టూర్పు
లున్ను యెగిసి పోవును.

## 36. అధ్యాయము.

1 రాజైన హిజ్కియా యేలుబడియొక్క పద్నాలు
గో సంవత్సరమందు సంభవించినదేమంటే, అష్షూరు
రాజైన సన్హేరీబు యూదా దేశమందున్న ప్రాకార
ములు గల పట్టణములన్నిటి మీదికి వచ్చి వాటిని
2 ఆక్రమించెను. । అప్పుడు అష్షూరు రాజు రబ్షాకే అనే
వాని బహు సైన్యముతోటి లాఖీషు పట్టణమునుంచి
రాజైన హిజ్కియా మీదికిన్ని యెరూశలేము మీది
కిన్ని పంపెను; వాడు చాకలి రేవు మార్గమందున్న
పై చెరువుయొక్క కాలువ వొద్దికి వచ్చి నిలిచెను. ।
3 అప్పుడు యింటి కారకుడున్ను హిల్కియా కుమారు
డున్ను అయిన ఎల్యాకీమున్ను కరణమైన షెబ్నాయు
న్ను సమాచార లేఖికుడున్ను ఆసాపు కుమారుడున్ను
అయిన యోవాహున్ను దాని యొద్దికి బైలు వెళ్లి వచ్చిరి. ।
4 అప్పుడు రబ్షాకే వారితో అనిన మాట, మహారాజైన
అష్షూరు రాజు సెలవు యిచ్చిన లాగు, మీరు హిజ్కి
యాతో చెప్పవలసినదేమంటే, నీవు దేని యందు నమ్మి
తున్నావో ఆ నమ్మకముయొక్క ఆస్పదము యేది! ।
5 యుద్ధమునకు కావలసిన బుద్ధిన్ని బలమున్ను నాకు కల
వని నీవు అనుకొంటున్నావు; అయితే అవి వ్యర్థ
మైన మాటలు; యెవరిని నమ్మి నా మీద తిరగపడితివి?।
6 యిదుగో మిస్రయీము అనే యీ చితికిన రెల్లు
కర్రను నీవు నమ్ముకుంటున్నావు; దాని మీద వొకడు
ఆనుకొంటే అది వాని చేతికి యేలాగున గుచ్చుకొని
దూసిపోవునో ఆలాగునే మిస్రయీము రాజైన
ఫరో వాని నమ్మిన వారికి అవును. । అయితే మేము 7
మా దేవుడైన యెహోవాను నమ్మి వున్నామని నీవు
నాతో చెప్పెదవేమో; చెప్పితే, హిజ్కియా యూదా
వారినిన్ని యెరూశలేము వారినిన్ని చూచి, యీ బలి
పీఠముయొద్ద మాత్రమే మ్రొక్క వలెనని చెప్పి, యె
వని వున్నత స్థలములనున్ను బలిపీఠములనున్ను అతడు
తీసివేసెనో ఆయనే యెహోవా గదా? । యిప్పుడు 8
నీకు అనుకూలమైతే అష్షూరు రాజైన నా యేలిన వారికి
కుదువ యిమ్ము; అప్పుడు రెండు వేల గుర్రముల మీద
నీవు రౌతులను యెక్కించ శక్తిగల వాడవైతే వాటిని
నీకు నేను అప్పగింతును. । యీలాగు వుండగా నా 9
యజమానుని నీచ సేవకులలో వొక అధిపతి ముఖము
నైనా నీవు యేలాగు మళ్లింతువు! అయితే రథముల
కొరకున్ను రౌతుల కొరకున్ను మిస్రయీము రాజును
నమ్ముదువా? । యీ స్థలమును నాశనము చేసుటకు యె 10
హోవా సెలవు లేక వస్తినా? ఆ దేశము మీదికి వెళ్లి,
దాని నాశనము చేయుమని యెహోవా నాకు సెలవు
యిచ్చెనని చెప్పినప్పుడు, । ఎల్యాకీమున్ను షెబ్నా 11
యున్ను యోవాహున్ను రబ్షాకేతో అనిన మాట,
ప్రాకారము మీద వున్నవారు వింటూ వుండగా
యూదా భాషచేత వద్దు అరాము భాషచేత మీ సేవకు
లమైన మాతో మాట్లాడండి, యేమంటే అది మాకు తె
లుసునని చెప్పగా, । రబ్షాకే అనిన మాట, యీ మాటలు 12
పలుకుటకు నా యజమానుడు నన్ను మీ యజమానుని
యొద్దికిన్ని మీ యొద్దికిన్ని పంపినాడా! ప్రాకారము
మీద కూర్చున్న వారు మీతో కూడా తమ మల
మును తినేటట్టున్ను తమ మూత్రమును తాగేటట్టున్ను
వారి యొద్దికి నన్ను పంపలేదా? । అని రబ్షాకే పలికి, 13
లేచి, గొప్ప శబ్దముతోటి యూదా భాషచేత చెప్పి
నదేమంటే, మహారాజైన అష్షూరు రాజు మాటలను
మీరు వినండి. । రాజు చెప్పినదేమంటే, హిజ్కియా 14
మీకు మోసము చేయనివ్వకండి; యేమంటే మిమ్మును
విడిపించే శక్తి వానికి చాలదు. । హిజ్కియా మిమ్మును 15
చూచి, యెహోవా మనలను నిశ్చయముగా విడిపిం
చును; యీ పట్టణము అష్షూరు రాజు చేతికి దొరక
దని చెప్పినంత మాత్రమున మీరు యెహోవాను
నమ్మవద్దు. । హిజ్కియా చెప్పిన మాటలు వినవద్దు; యే 16
మంటే కానుకచేత మమ్మును సమాధానము చేసుకొని,
మా యొద్దికి బైలు వెళ్లి రండి, అప్పుడు మీ లోగా
ప్రతి మనుష్యుడున్ను తన ద్రాక్ష చెట్టు వల్లనుంచిన్ని
తన అంజూరపు చెట్టువల్లనుంచిన్ని తింటూ, తన నూతి
నీళ్లు తాగుతూ, । మేము వచ్చి, మీ దేశము వంటి దేశ 17
మునకు, అనగా, గోధుమున్ను ద్రాక్షారసమున్ను గల
దేశమునకున్ను ఆహారమున్ను ద్రాక్ష తోటలున్ను గల

దేశమునకున్ను మిమ్మును దీసుకుపోయే పర్యంతమున్ను
సుఖముగా వుండవచ్చును అని అష్షూరు రాజు పలు
18 కుతున్నాడు. । అయితే యెహోవా మిమ్మును విడు
పించునని హిజ్కియా మీతో చెప్పి, మిమ్మును భ్రమ
పెట్టనియ్యకండి; జనాంగముల దేవుళ్లలో యెవడైనా
తన దేశమును అష్షూరు రాజు చేతిలోనుంచి విడిపించె
19 నా? । హమాతుయొక్క దేవుళ్లు యెక్కడ? అర్పాదు
యొక్క దేవుళ్లు యెక్కడ? సెఫర్వయీముయొక్క
దేవుళ్లు యెక్కడ? వీరు వచ్చి షోమ్రోను దేశమును నా
20 చేతిలోనుంచి విడిపించినారా? । దేశములయొక్క దేవు
ళ్లలో యెవరైనా తమ దేశములను నా చేతిలోనుంచి
విడిపించిరి గనుక నా యెహోవా యెరూశలేమును
21 మా చేతిలోనుంచి విడిపించడానకని పలికెను. । అయి
తే జనులు వూరకొని ప్రత్యుత్తరము యెంత మాత్ర
మూ యివ్వకుండా వుండిరి; యేమంటే వానికి ప్రత్యు
22 త్తరము యివ్వ వద్దని రాజు సెలవు వుండెను. । అప్పుడు
యింటి కారకుడున్ను హిల్కీయా కుమారుడున్ను
అయిన ఎల్యాకీమున్ను కరణమయిన షెబ్నాయున్ను
సమాచార లేఖికుడున్ను ఆసాపు కుమారుడున్నుఅయిన
యోవాహున్ను బట్టలను చించుకొని, హిజ్కియా యొ
ద్దికి వచ్చి రబ్షాకే పలికిన మాటలెల్లా తెలియ చెప్పిరి.

## 37. అధ్యాయము.

1 అయితే హిజ్కియా దీని వినినప్పుడు తన బట్ట
లను చించుకొని, గోనె పట్ట కప్పుకొని, యెహోవా
2 మందిరములోకి వెళ్లి, । యింటి కారకుడైన ఎల్యాకీము
నున్ను కరణమయిన షెబ్నానున్ను అర్చకులలో పెద్ద
వారినిన్ని ఆమోసు కుమారుడైన యెషయా యొద్దికి
పంపినాడు; వీరు గోనె పట్టను కప్పుకొని, వాని యొ
3 ద్దికి వచ్చి, వానితో చెప్పినదేమంటే, । హిజ్కియా
యీలాగు చెప్పుతున్నాడు, యిది శ్రమయున్ను గద్దిం
పున్ను దూషణయున్ను గల దినము; పిల్లలు పుట్టేటం
దుకు సిద్ధముగా వున్నారు గాని తల్లులకు కనుటకు
4 శక్తి లేదు. । జీవము గల దేవుని నిర్లక్ష్య పెట్టుటకు
అష్షూరు రాజు అయిన తన యజమానుని చేత పంప
బడిన రబ్షాకే చెప్పిన మాటలెల్లా నీ దేవుడైన యె
హోవా విని, అహంకార పడునేమో; కాబట్టి శేషిం
చిన వారి కొరకు నీ ప్రార్థన యెక్కించుమని చెప్పె
5 ననిరి. । ఆలాగున రాజైన హిజ్కియాయొక్క సేవకులు
6 యెషయా యొద్దికి వచ్చిరి. । అప్పుడు యెషయా వారి
తో యెహోవా యిచ్చిన వాక్యము యేమంటే,
అష్షూరు రాజు సేవకులు నన్ను దూషించినటువంటివిన్ని
7 నీవు వినినటువంటి మాటలకు భయపడవద్దు. । యిదుగో
నేను వాని మీదికి వొక ఆత్మను రాచేసినందున వాడు
వొక కబురును విని, తన దేశమునకు మళ్లును; అయితే
నేను వాని దేశమందు కత్తిచేత వాని కూలచేతునని,
యీ ప్రకారము మీ యజమానునితో చెప్ప వలెనని
చెప్పెను. । అయినందున రబ్షాకే తిరిగి వెళ్లి, అష్షూరు 8
రాజు లిబ్నా మీద యుద్ధము చేస్తూ వుండేది కనెను,
యేమంటే వాడు లాఖిషు పట్టణమును విడిచిన సంగతి
వీనికి వినపడినది. । మరిన్ని కుషురాజైన తిర్హాకా నీ 9
మీద యుద్ధము చేయుటకు వచ్చెనని అష్షూరు రాజుకు
వినపడెను గనుక వాడు తిరుగా హిజ్కియా వొద్దికి
దూతలచేత పంపిన వర్తమానము యేమంటే, । నీవు 10
నమ్మిన దేవుడు యెరూశలేము అష్షూరు రాజు చేతికి
దొరకదని చెప్పితే ఆయన వల్ల మోసము పొందవద్దు. ।
యిదుగో అష్షూరు రాజులు సకల దేశములను బొత్తి 11
గా నశింప చేసిన సంగతి నీకు వినపడినది; అయితే
నీవు యేలాగు విమోచించబడుదువు! । మా పితృలు 12
నశింపజేసిన గోజాను, హారాను, రెస్సెపు, తెలశ్శారు
లో వున్న ఏదెను పుత్రులను జనాంగముల దేవుండ్లు
విడిపించినారా? । హమాతు రాజు యెక్కడ? అర్పాదు 13
రాజు యెక్కడ? సెఫర్వయీము, హేన, ఇవా, అనే
పట్టణముల రాజులు యెక్కడ వున్నారని యూదా
రాజైన హిజ్కియాతో చెప్పండని పంపెను. । యీ 14
వుత్తరమును హిజ్కియా దూతల చేతులలోనుంచి పుచ్చు
కొని చదువుకొనెను; అప్పుడు హిజ్కియా యెహో
వా మందిరములోకి వచ్చి, యెహోవా సముఖమందు
దాని విప్పి పరచెను. । మరిన్ని హిజ్కియా యెహో 15
వా సముఖమందు ప్రార్థన చేసినదేమంటే, । కెరూ 16
బుల మధ్యను నివసిస్తున్న ఇశ్రాయేలుకు దేవుడవైన
ఓ సైన్యముల యెహోవా, నీవు మాత్రమే లోక
మందున్న సకల రాజ్యములకు దేవుడవై యున్నావు;
ఆకాశమునున్ను భూమినిన్ని నీవే కలుగ చేసితివి. ।
ఓ యెహోవా, నీ చెవి వొగ్గి వినుము; ఓ యెహో 17
వా, నీ నేత్రములను తెరచి చూడుము; జీవము గల
దేవుడవైన నిన్ను నిర్లక్ష్యము చేయుటకు సన్హేరీబు
పంపిన మాటలను వినుము. । ఓ యెహోవా, నిజము 18
గా అష్షూరు రాజులు జనాంగములనున్ను వీరి దేశ
ములనున్ను నాశనము చేసి, । వారి దేవుళ్లను అగ్నిలో 19
వేసిరి; యేమంటే వారు దేవుండ్లు కారు, మనుష్యుల
చేతి పని గల దారు శిలామయములు; కాగా వారు
వాటిని నాశనము చేసిరి. । కాబట్టి మా దేవుడవైన 20
ఓ యెహోవా, లోకమందున్న సమస్త రాజ్యములు
యెహోవావైన నీవు మాత్రమే దేవుడవని యెరిగే
టట్టుగా వాని చేతిలోనుంచి మమ్మును రక్షించుము
అని ప్రార్థించెను. । అప్పుడు ఆమోసు కుమారుడైన 21
యెషయా హిజ్కియా యొద్దకు వర్తమానమును

పంపినదేమంటే, ఇశ్రాయేలుకు దేవుడైన యెహోవా
ఆనతిచ్చిన లాగు, అష్షూరు రాజైన సన్హేరీబు నిమిత్తము
22 నీవు నాకు చేసిన ప్రార్థనను నేను వింటిని. । వాని
గురించి యెహోవా యిచ్చిన సెలవు యేమంటే,
సీయోను కుమార్తెయైన కన్యక నిన్ను నిర్లక్ష్యపెట్టి
అపహాస్యము చేసెను; యెరూశలేము కుమార్తె నీ
23 తట్టు తన తల యూచెను. । నీవు యెవరిని నిర్లక్ష్య
పెట్టి దూషించితివి? యెవరికి వ్యతిరిక్తుడవై నీ బొబ్బ
యెత్తితివి! యెవరి పైని నీ కనుదృష్టిని హెచ్చించితివి!
24 ఇశ్రాయేలుయొక్క పరిశుద్ధమైన వానికే కదా! । నీ
సేవకులచేత నీవు యెహోవాను నిర్లక్ష్యపెట్టి, నీవు
పలికినదేమంటే, నాకు కలిగిన విస్తారమైన రథముల
తోను నేను పర్వతముల శిఖరము మీదికిన్ని లెబా
నోనుయొక్క పార్శ్వముల మీదికిన్ని వచ్చి, దాని
పొడుగైన ఆర్జ వృక్షములనున్ను అతిశయమైన బరశ
వృక్షములనున్ను నేను నరుకుతాను; దాని పొడుగైన
సరిహద్దులలోకిన్ని కర్మెలనే వాని అడవిలోకిన్ని
25 ప్రవేశిస్తాను. । నేను తవ్వి క్రొత్త నీళ్లు తాగితిని; ముట్టడి
వేయబడ్డ స్థలములయొక్క నదులనన్నిటినిన్ని నా అరి
కాలిచేత యెండిపోయేటట్టు చేస్తినని పొంగితివి. ।
26 అయితే పూర్వమునుంచీ అది నేను సంభవించుటకు
నిర్ణయిస్తినన్ని గత కాలమునుంచి నేను ఆ ప్రకా
రము యోచిస్తినన్ని తెలియక పోతివా? మరిన్ని
ఆలాగున నిర్ణయించి, అంతా నెరవేరేటట్టుగా ప్రా
కారములు గల పట్టణములు నీ చేత పాడు దిబ్బలు
27 అయ్యేటందుకు నిన్ను లేవచేస్తిని. । అయినందున వాటి
కాపురస్తులు బలహీనులైరి; వారు భయపడి దిగులుప
డిరి; వారు బైట వుండే గడ్డి లాగుననున్ను పచ్చని
కూర లాగుననున్ను యింటి మీద మొలిచిన గడ్డి లాగున
నున్ను యెదగక మునుపు వడగొట్టబడిన చేనుల లా
28 గుననున్ను వుండిరి. । అయితే నీ కూర్చుండుటయున్ను
బైలు వెళ్లుటయున్ను లోపలికి వచ్చుటయున్ను నా
29 మీద నీకు కలిగిన రౌద్రమున్ను, । నీవు చేసిన గల్లత్తు
న్ను యెక్కి, నా చెవులలోకి చొచ్చెను; కాబట్టి నా
గాలము నీ ముక్కుకున్ను నా కళ్లెము నీ నోటికిన్ని
వేసి, నిన్ను మళ్లించి, నీవు యే మార్గముచేత వస్తివో
ఆ మార్గముచేతనే తిరిగీ వెళ్లచేతునని వాని గురించిన
30 ఆజ్ఞ అయి వున్నది. । మరిన్ని నీకు కలిగే గురుతు యే
మంటే, యీ సంవత్సరమందు మీరు దానంతట అదే
పెరిగినటువంటి వాటిని తిందురు; రెండో సంవత్సర
మందు వాటివల్ల మొలిచినటువంటి వాటిని తిందురు;
మూడో సంవత్సరమందు మీరు విత్తనములను విత్తి చేను
లను కోతురు; ద్రాక్షతోటలను నాటి పండ్లను తిం
31 దురు. । మరిన్ని యూదా యింటి వాండ్లలో తప్పిం
చుకొనిన శేషము యింకా వేరు తన్ని, పైగా పండ్లను
ఫలించును. । యేమంటే శేషించిన వారు యెరూశలేము 32
నుంచిన్ని తప్పించుకొనిన వారు సీయోను పర్వతము
లోనుంచిన్ని అవతలకు వెళ్లుదురు; యిది యెహోవా
మహత్వము చేత సంభవించును. । అయినందున అష్షూరు 33
రాజును గురించి యెహోవా యిచ్చిన సెలవు యేమం
టే, వాడు యీ పట్టణములోకి ప్రవేశించ లేక పో
వును; దాని మీద ఒక బాణము అయినా వేయక
వుండును; ఒక డాలు అయినా దానికి అగుపర్చక
వుండును; దాని యెదుట బురుజు అయినా కట్టక వుం
డును. । యే మార్గముచేత వాడు వచ్చెనో ఆ మా 34
ర్గముచేతనే వాడు తిరిగీ వెళ్లును గాని యీ పట్టణ
ము లోపలికి రాలేక పోవునని యెహోవా పలుకు
తున్నాడు. । యేమంటే నా నామము కొరకున్ను నా 35
సేవకుడైన దావీదు కొరకున్ను నేను యీ పట్టణమును
కాచి రక్షింతునని సెలవు యిచ్చెనని చెప్పెను. । అప్పుడు 36
యెహోవా దూత బైలు వెళ్లి, అష్షూరు వారి దండు
పేటలో ప్రవేశించి, లక్ష యెనభై అయిదు వేలమం
దిని కొట్టినందున వారు ప్రాతఃకాలమందు లేచి చూ
డగానే యిదుగో వారందరున్ను శవములై వుండిరి. ।
అప్పుడు అష్షూరు రాజైన సన్హేరీబు తిరిగి పోయి, 37
నీనెవే పట్టణమునకు వచ్చి వుండెను. । అయితే వాడు 38
తన దేవుడైన నిస్రోఖుయొక్క మందిరమందు మ్రొ
క్కుతూ వున్నప్పుడు తన కుమారులైన అద్రమ్మెలెకు
న్ను షరెస్సెరున్ను వచ్చి, కత్తిచేత వాని నరికి, అర
రాథు దేశములోకి తప్పించుకొని పోయిరి; అప్పుడు
వాని కుమారుడైన యేసర్హద్దోను వానికి మారుగా
రాజై వుండెను.

## 38. అధ్యాయము.

ఆ దినములందు హిజ్కియా రోగియై మరణమునకు 1
సిద్ధముగా వుండెను. అప్పుడు ఆమోసు కుమారుడున్ను
దీర్ఘదర్శిన్నియైన యెషయా వాని దగ్గిరకు వచ్చి,
నీ యింటిని గురించి నీవు నిర్ణయించుకొమ్ము, యే
మంటే, నీవు బ్రతుకక మరణమౌదువని యెహోవా
ఆనతిచ్చెనని వానితో చెప్పినప్పుడు, । అతడు తన ము 2
ఖమును గోడ తట్టు తిప్పుకొని, యెహోవాను ప్రా
ర్థించినదేమంటే, । ఓ యెహోవా, నేను నీ ముం 3
దర యథార్థముగానున్ను మనఃపూర్తిగానున్ను
నడిచి, నీ దృష్టికి యేది మేలో అది నేను చేసితినని
నా యందు జ్ఞాపకము వుంచుము అని హిజ్కియా
కన్నీళ్లతోను వేడుకొనెను. । అయినందున యెహో 4
వా వాక్యము యెషయాకు వచ్చినదేమంటే, । నీ తండ్రి 5
అయిన దావీదుకు దేవుడైన యెహోవా యీలాగు

ఆనతిస్తూ వున్నాడు, నీ ప్రార్థనను నేను వింటిని;
నీ కన్నీళ్లను నేను చూస్తిని; యిదుగో నీ దినములు
యింకా పది హేను సంవత్సరములు హెచ్చు చేతును.।
6 మరిన్ని నేను నిన్నున్ను యీ పట్టణమునున్ను అష్షూరు
రాజు చేతిలోనుంచి విడిపించి, యీ పట్టణమును కా
7 స్తూ వుందును. । మరిన్ని యెహోవాను అయిన నేను
చెప్పిన ప్రకారము చేతునని యెహోవావల్ల యిదే
8 గురుతు. । యేమంటే, యిదుగో ఆహాజుయొక్క గడి
యారము మీద ముందర నడిచిన గడియల నీడను పది
గడియలు వెనుకకు రాచేతునని నీవు వెళ్లి హిజ్కియా
తో చెప్పుమనెను; కాబట్టి సూర్యుడు యే గడియల
పైని దాటి వెళ్లెనో ఆ పది గడియల పైని తిరిగీ వచ్చెను.।
9 యూదా రాజైన హిజ్కియా రోగియై, తాను ఆరో
10 గ్యముగా వున్న తరువాత వ్రాసిన లిఖితము, । నేను
అనుకొనినదేమంటే, నా దినములు కడతేర వచ్చిన
ప్పుడు సమాధి ద్వారము యొద్దికి దిగి పోదును; నా
సంవత్సరములయొక్క శేషము నాకు లేక పోయి
11 వున్నది. । జీవస్థుల దేశములో నేను యెహోవాను
చూచేది లేదు; యీ లోక నివాసులలో యే మనుష్యు
12 నైనా యిక నేను చూచేది లేదు. । నా ఆయుస్సు గడి
చిపోయి, గొల్ల బోయని గుడిసె లాగున తీసివేయబడి,
నన్నుంచి తప్పి పోయెను; నేసే వానిచేత నూలు తెగి
పోయినట్టు నా ప్రాణము తెగిపోయెను; క్షయరోగ
ముచేత ఆయన నన్ను నరికివేసును; వుదయము మొద
లుకొని రాత్రి యీ మధ్య నీవు నన్ను కడతేర్తువు.।
13 సింహము లాగున ఆయన నా శల్యములన్నిటినీ విరిచి
వేసునని తెల్లవారే పర్యంతము నేను యోచించుకొం
టిని; వుదయము మొదలుకొని రాత్రి యీ మధ్య నీవు
14 నన్ను కడతేర్తువు. । సుస పక్షి వలెనున్ను అగుర
పక్షివలెనున్ను నేను పలికితిని; గువ్వ లాగున మూల్గితిని;
నా నేత్రములు పైకి చూచుటవల్ల క్షీణిస్తున్నవి; ఓ
యెహోవా, నేను బాధలో వున్నాను; నాకు ప్రాప
15 కుడవై వుండుమని నేను వేడుకొంటిని. । నేను యేమి
చెప్పుదును? ఆయన నాకు వాగ్దత్తమిచ్చెను; ఆ ప్రకా
రము ఆయన నాకు దయచేసెను; నా ఆత్మయొక్క
వ్యాకులము కొరకు నా యావత్సంవత్సరములు దైన్య
16 ముగా గడుపుదును. । ఓ యెహోవా, వీటివల్ల మను
ష్యులు బ్రతుకుతున్నారు; వీటి అన్నిటియందు నా ఆత్మ
యొక్క జీవము కలిగియున్నది; నీవు నన్ను స్వస్థపర్చి
17 బ్రతుక చేస్తివి! । నెమ్మదికి మారుగా నాకు మిక్కిలీ
ఆయాసము కలిగెను; అయినప్పటికిన్ని నీవు ప్రేమ
చేత నా ఆత్మను నాశనపు గోతినుంచి రక్షించితివి; యే
మంటే నీవు నా పాపములన్నిటినీ నీ వీపు వెనుకకు
18 తోసివేసి యున్నావు. । యెందుకంటే సమాధి నిన్ను
స్తుతించ నేరదు; మృత్యువు నిన్ను కొనియాడ నేరదు;
గోత దిగిన వారు నీ సత్యమును కానక వుందురు.।
జీవము గలవాడే, జీవము గలవాడే, యీ రోజున నేను 19
చేసినట్టు నిన్ను స్తుతించును; తండ్రి తన పిల్లలకు నీ
సత్యమును తెలియచేసును. । యెహోవా నన్ను రక్షిం 20
చుటకు సిద్ధమై వుండెను; కాబట్టి మనము బ్రతికే దిన
ములన్నిటి యందూ యెహోవా మందిరమందు వీణెను
వాయించి పాటలు పాడుదుమని వ్రాసినాడు. । అయితే 21
యెషయా అంజూరపు పండ్ల ముద్దను తీసుకొని వచ్చి
వ్రణము మీద పెట్టితే అతడు బాగుపడునని చెప్పెను.।
మరిన్ని హిజ్కియా నేను యెహోవాయొక్క మంది 22
రమునకు యెక్కి పోతాననుటకు గురుతు యేమని
అడిగెను.

## 39. అధ్యాయము.

ఆ కాలమందు బాబెలు రాజున్ను బలదాను కుమా 1
రుడున్ను అయిన మెరోదక్బలదాను వుత్తరములనున్ను
కానుకనున్ను హిజ్కియా యొద్దికి పంపెను, యేమంటే
వాడు రోగియై స్వస్థము పొందినాడని అతనికి వినప
డెను. । అయితే హిజ్కియా వారు వచ్చినందుకు సంతో 2
షపడి, తన పదార్థపు యింటినిన్ని వెండినిన్ని బంగా
రమునున్ను సుగంధ వర్గమునున్ను పరిమళ తైలము
నున్ను ఆయుధ గృహములనున్ను తన పదార్థము
లలో వున్న సమస్తమునున్ను చూపించినాడు; తన నగరి
యందున్ను రాజ్యమందున్ను వున్న సమస్తములో హి
జ్కియా వారికి చూపించనిది వొకటైనా లేదు. ।
అప్పుడు దీర్ఘదర్శియైన యెషయా రాజైన హిజ్కి 3
యా యొద్దికి వచ్చి, ఆ మనుష్యులు యేమి చెప్పినారు?
నీ యొద్దికి యెక్కడనుంచి వచ్చిరని అడిగెను; అందుకు
హిజ్కియా దూరదేశమునుంచి, అనగా, బాబెలునుంచి
నా యొద్దికి వచ్చిరని చెప్పగా, । అతడు నీ యింట్లో 4
వారు యేమి చూచినారని అడిగినప్పుడు, హిజ్కియా
నాయింట్లో వున్న సమస్తమున్ను వారు చూచిరి; నా
పదార్థములలో వారికి నేను చూపించనిది వొకటీ
లేదని చెప్పినందున, । యెషయా హిజ్కియాతో అన్న 5
మాట, సైన్యముల యెహోవా యిచ్చిన సెలవు వినుము.।
యిదుగో నీ యింట్లో వున్న సమస్తమున్ను నీ పితృలు 6
నేటివరకు కూర్చి దాచి పెట్టినదంతానున్ను బాబెలు
పట్టణమునకు యెత్తుకుపోబడే దినములు వస్తూ వున్నవి;
వొకటైనా విడువబడక పోవునని యెహోవా ఆనతి
చ్చెను. । మరిన్ని నీ వల్ల పుట్టిన నీ పుత్రసంతతిని వారు 7
తీసుకుపోయినందున వారు బాబెలు రాజు నగరిలో
షండులై వుందురని చెప్పినప్పుడు, । హిజ్కియా యెష 8
యాను చూచి, నీవు చెప్పిన యెహోవాయొక్క

వాక్యము మంచిది అని, మరిన్ని అతడు అనినదేమంటే,
నా దినములందు క్షేమమున్ను సత్యమున్ను కలిగి వుం
డును గనుక ఆ వాక్యము మంచిదని చెప్పెను.

## 40. అధ్యాయము.

1 నా జనులను మీరు వోదార్చండి, వోదార్చండి,
2 అని మీ దేవుడు పలుకుతున్నాడు. । మీరు యెరూశ
లేము హృదయమును వోదార్చి, నీ యుద్ధపు కాలము
సమాప్తమాయెనన్నిన్ని నీ పాపము క్షమించపడెననిన్ని
నీ పాపములన్నిటి కొరకు రెట్టింది యెహోవా వల్ల
3 పొందినావనిన్ని దానితో చెప్పుదురు గాక. । అరణ్య
ములో బొబ్బ పెట్టే వొకని శబ్దము, అది యేలాగంటే,
యెహోవాయొక్క మార్గమును సిద్ధము చేయండి;
అడవి యందు మన దేవుని కొరకు రాజ మార్గమును
4 చక్కగా చేయండి. । ప్రతి పల్లము యెత్తు చేయబ
డును; ప్రతి కొండయున్ను మెట్టయున్ను అణచబ
డును; వంకర అయినవి తిన్ననివిగానున్ను కరుకు అయి
5 నవి నునుపు అయినవిగానున్ను అవును. । మరిన్ని యె
హోవా మహత్వము ప్రత్యక్షమౌను; సకల మాంసము
దాని చూచును, యేమంటే యెహోవాయొక్క నోరు
యీ ప్రకారముగా పలికెనని ఆ శబ్దము ఆయెను. ।
6 మరిన్ని ఆ శబ్దము చాటించుమనినందున యేమి చాటిం
తును అని అతడు పలికెను; సకల మాంసము గడ్డియై
వున్నది; దాని అందము యావత్తూ అడవి పువ్వు వలె
7 వుండును. । యెహోవా వాయువు దాని మీద విసరి
నప్పుడు గడ్డి వాడి పోవును; పుష్పము క్షీణించును; నిజ
8 ముగా జనులు గడ్డియై వున్నారు. । గడ్డి వాడిపోవును;
పుష్పము క్షీణించును; అయితే మన దేవుని వాక్యము
9 యెన్నటికీ నిలిచి వుండును. । సీయోనుకు శుభసమాచా
రములను తెచ్చే వాడా, వున్నతమైన కొండను యె
క్కుము; యెరూశలేముకు శుభసమాచారములను తెచ్చే
వాడా, బలముగా నీ శబ్దమును యెత్తుము; భయపడక
శబ్దమును యెత్తి, అదుగో, మీ దేవుడని యూదా
10 పట్టణములకు చెప్పుము. । అదుగో కర్తయైన యె
హోవా బలముగల వాని మీదికి వచ్చును; ఆయన
భుజము ఆయన కొరకు పరిపాలించును; యిదుగో
ఆయన బహుమానము ఆయన యొద్దనే వున్నది; ఆయన
11 ప్రతిక్రియ ఆయన ముందర వున్నది. । బోయడు వలెనే
ఆయన తన మందను మేపును; ఆయన తన చేతులతోటి
గొర్రెపిల్లలను కూర్చి రొమ్మున మోసుకొని పోయి,
12 చూలుతో వున్న వాటిని మెల్లిగా నడిపించును. । తన
అరిచేతిలో వుదకములను కొలిచి, తన జానతోటి ఆకా
శమునకు ప్రమాణములను నిర్ణయించి, భూమి మట్టిని
కొలలో వుంచి, పర్వతములను త్రాసు చేతనున్న
కొండలను తూనికె చేతనున్ను తూచిన వాడు యెవడు! ।
యెహోవా ఆత్మను యెవడు ప్రేరేపించెను? ఆయన 13
యొక్క ఆలోచన కర్తయై యెవడు ఆయనకు బుద్ధి
చెప్పెను? । యెవని యొద్ద ఆయన ఆలోచన చేసెను! 14
యెవడు ఆయనకు బోధపర్చి, న్యాయమార్గమును
చూపించి, తెలివిని నేర్పి, జ్ఞాన మార్గమును తెలియ
చేసెను? । యిదుగో జనాంగములు తొట్టిలో వున్న 15
నీళ్లలో వొక బిందువు వంటి వారు; తూనికె మీదను
వున్న ధూళి రేణువు వంటి వారని యెంచ పడుదురు;
యిదుగో గాలిచేత యెగరవేయపడిన ధూళి లాగున
ఆయన ద్వీపములను యెత్తును. । మరిన్ని లెబానోను 16
కాలుటకు చాలక వున్నది; దాని పశువులు హోమా
ర్పణకు చాలవు. । ఆయన యెదుట సకల జనులున్ను 17
లేని దాని వలె వున్నారు; వారు ఆయన చేత యేమీ
లేని దాని కంటే తక్కువగానున్ను మాయగానున్ను
అగుపడుదురు. । యీలాగు వుండగా మీరు యెవనికి 18
దేవుని సమానము చేతురు? ఆయనను యెవనికి యీడు
చేతురు? । పనివాడు వొక విగ్రహమును పోతపోసును; 19
కంసాలి దాని మీద బంగారపు రేకులు వేసి, దానికి
వెండి గొలుసులను చేసును. । మిక్కిలి వెల గల అర్ప 20
ణను చెల్లించుటకు శక్తిలేని నీరసుడు పుచ్చని మానును
యేర్చును; కదలని విగ్రహమును చేసుటకు వాడు తన
కొరకు నేర్పరియైన పనివాని వెతుకును. । మీరు తెలుసు 21
కొని యుండలేదా? మీరు విని యుండలేదా? ఆదినుంచీ
అది మీకు చెప్పపడి వుండలేదా? భూమియొక్క అస్తిభా
రములనుంచి మీరు గ్రహించలేదా? । భూ చక్రము మీద 22
ఆసీనుడైన వాడు ఆయనే; దానియొక్క నివాసులు
మిడతల వలె వున్నారు; ఆయన ఆకాశములను తెరవలె
వేసి, నివసించుటకు డేరా వలెనే వాటిని పరస్తున్నాడు. ।
ఆయన ప్రభువులను శూన్యతకు తెచ్చును; లోకపు 23
న్యాయాధిపతులను ఆయన వ్యర్థులను చేసెను. । నిశ్చ 24
యముగా వారు నాటపడక పోదురు; నిశ్చయముగా
వారు విత్తపడక వుందురు; వారి మొదలు భూమిలో వేరు
తన్నక వుండును; ఆయన వారి మీద వూదుటవల్ల వారు
వాడిపోదురు; సుడిగాలి వారిని పొల్లు లాగున యెగర
కొట్టును. । కాబట్టి మీరు నన్ను యెవరితో సాటిచేతు 25
రు? యెవరితో నేను సమము చేయబడుదును? అని పరి
శుద్ధుడు ఆనతిస్తున్నాడు. । మీ కన్నులను పైకి యెత్తి 26
చూడండి; వీటిని కలుగ చేసిన వాడు యెవడు? ఆయన
వాటి సమూహములను లెక్కచొప్పున బైటికి తెస్తు
న్నాడు; ఆయన తన బలాతిశయము చేతనున్ను తన
శక్తియొక్క మహత్వము చేతనున్ను పేళ్ల చొప్పున
వాటిని పిలుస్తున్నాడు; వాటిలో వొకటైనా తప్పక
వున్నది. । నా మార్గము యెహోవాకు మరుగు 27

చేయబడి యున్నది; నా దేవుని చేత నా వ్యాజ్యము
విడిచిపెట్ట పడినది, అని, ఓ యాకోబా, యెందుకు
అంటున్నావు? ఓ ఇశ్రాయేలా, యెందుకు పలు
28 కుతున్నావు? । యెహోవా అనంతమైన దేవుడున్ను
భూమియొక్క అంత్య భాగముల సృజన కర్తయు
న్ను అయి వున్నాడని నీకు తెలియదా? నీవు విన
లేదా? ఆయన బడలకనున్ను అలియకనున్ను వున్నా
29 డు; ఆయన తెలివి శోధింప శక్యము గాదు. । దుర్బలు
లకు ఆయన శక్తిని యిచ్చును; ఆయన బలహీనులకు
30 బలము విస్తరింప చేయును. । పడుచు వారు అలసి నిస్త్రాణ
పడుదురు; వయస్సు గల వారు సహా బొత్తిగా కూలు
31 దురు. । అయితే యెహోవాను నమ్మిన వారు నూతన
శక్తిని పొందుదురు; గద్దల వలె రెక్కలతోటి వారు
యెగురుదురు; అలసట పడక పరుగెత్తుదురు సొమ్మసిల్లక
సాగి నడుతురు.

## 41. అధ్యాయము.

1 ఓ ద్వీపములారా, నా ముందర మౌనముగా వుం
డండి; జనులు తిరిగీ శక్తి తెచ్చుకొందురు గాక; వారు
దగ్గిరికి చేరి పలుకుదురు గాక; మనము కూడి వ్యాజ్య
2 ము నిర్వహింతుము గాక. । తూర్పు దిక్కులోనుంచి
నీతిపరుని లేవ జేసి, తన పాదములయొద్దికి రమ్మని పిలిచి,
అతని యెదుటికి జనాంగములను అప్పగించి, రాజుల
పైని అతనికి అధికారము యిచ్చిన వాడు యెవ్వడు?
ఆయన వారిని ధూళి వలెనే అతని కత్తికిన్ని కొట్టుకొ
పోబడిన పొల్లు వలెనే అతని వింటికిన్ని యిచ్చి వేసె
3 ను. । అతడు వారిని తరిమెను; పూర్వము అతడు తన
కాళ్లతో నడవని మార్గమున క్షేమముగా దాటి వెళ్లె
4 ను. । ఆదినుంచి తరములను పిలిచి, యీ కార్యములను
చేసి జరిగించిన వాడు యెవడు? యెహోవాను అయిన
నేనే; అదిన్ని అంతముతో కూడా వున్న వాడను
5 నేనే. । ద్వీపములు చూచి భయపడెను; భూమియొక్క
అంత్య భాగముల వారు దిగులు పడిరి: వారు దగ్గిరికి
6 వచ్చి కూడుకొనిరి. । వారు వొకరికి వొకరు సహాయము
చేసుకొని, వొకరితో వొకరు ధైర్యము తెచ్చుకొమ్మని
7 చెప్పుకొనిరి. । ఆలాగే వడ్లవాడు పోత పని వానినిన్ని
సుత్తెతో నునుపుచేసేవాడు సమ్మెట వేసే వానినిన్ని
ధైర్యపరచి, అది అతుకు కొరకు సిద్ధముగా వున్నదని
పలికిరి; అది కదలకుండా వాడు మేకులతో దాని
8 బిగించెను. । అయితే నా సేవకుడవైన ఓ ఇశ్రాయేలా,
నేను యేర్పరచుకొనిన యాకోబా, నా స్నేహితుడ
9 యిన అబ్రాహాము సంతతీ, । భూమియొక్క అంత్య
భాగములలోనుంచి నిన్ను నేను తీసుకొని, దాని ముఖ్య
మైన వారిలోనుంచి నిన్ను నేను పిలుచుకొని, నీవు
నా సేవకుడవనిన్ని నిన్ను నేను యేర్పరచుకొంటిని;
నిన్ను పరిహరించననిన్ని నేను చెప్పితిని. । నీకు నేను 10
తోడుగా వున్నాను గనుక భయపడకుము; నేను నీ
దేవుడనై యున్నాను గనుక వెరవకుము; నేను నిన్ను
బలపరతును; నిశ్చయముగా నీకు సహాయము చేతును;
నిశ్చయముగా నా నీతి గల కుడి హస్తముతో నిన్ను
వుద్ధరింతును. । యిదుగో నీ మీద రౌద్రము తెచ్చు 11
కొనిన వారందరున్ను సిగ్గు పడి తత్తరపాటు పొందు
దురు; నీతో వ్యాజ్యమాడిన వారు లేనివారి వలెనై
నశింతురు. । నీతో పోరాడిన వారిని నీవు వెతికితే కను 12
పడక పోదురు; నీ మీద యుద్ధము చేసిన వారు లేని
వారి వలెనై బొత్తిగా నశింతురు. । యేమంటే నీ దేవు 13
డైన యెహోవా అనే నేను నీ కుడి చెయ్యి పట్టు
కొని, భయపడకుము, నీకు నేను సహాయము చేతునని
చెప్పుదును. । ఓ పురుగు వంటి యాకోబా, నీవు 14
భయపడకుము; ఓ ఇశ్రాయేలీయులారా, మీరు భయ
పడవద్దు; నీకు సహాయము చేతునని యెహోవాయు
న్ను ఇశ్రాయేలుయొక్క పరిశుద్ధుడైన నీ రక్షకుడున్ను
ఆనతిస్తున్నాడు. । యిదుగో కక్కులు కలిగినటువం 15
టిన్ని వాడిన్ని క్రొత్తయున్ను అయినటువంటిన్ని నూర్చే
యంత్రముగా నేను నిన్ను చేతును; నీవు పర్వతము
లను దుళ్ల కొట్టి, వాటిని పిండి చేతువు; కొండలను
పొల్లు చేతువు. । నీవు వాటిని చెరిగినందున గాలి వాటిని 16
యెగర కొట్టును; సుడిగాలి వాటిని చెదర కొట్టును;
అయితే నీవు యెహోవా యందు సంతోషింతువు;
ఇశ్రాయేలుయొక్క పరిశుద్ధుని యందు అతిశయింతు
వు. । దరిద్రుడున్ను లేమి గల వాడున్ను నీళ్లను వెతు 17
కగా అవి లేకపోయినందున వారి నాలుక దప్పి చేత
యెండిపోయేటప్పుడు యెహోవానైన నేను వారి
స్వరమును విందును; ఇశ్రాయేలు దేవుడనైన నేను
వారిని విడిచిపెట్టను. । వున్నతమైన స్థలములందు నదు 18
లనున్ను లోవల మధ్య యందు వూటలనున్ను నేను
వుద్భవింప చేతును; అరణ్యమును నీటి కొలనుగానున్ను
యెండిన భూమిని జల ప్రవాహములుగానున్ను చేతు
ను. । అరణ్యమందు నేను ఖదిర చెట్లనున్ను శిత్త చెట్ల 19
నున్ను మిరుదు చెట్లనున్ను ఇప్ప చెట్లనున్ను నాటు
దును; అడవి యందు నేను దేవదారు చెట్లనున్ను పసన
చెట్లనున్ను మిడపలు చెట్లనున్ను కూడా నాటుదును. ।
అప్పుడు వారు చూచి, తెలుసుకొని, విచారించి, యిది 20
యెహోవా చేతివల్ల అయినదనిన్ని, ఇశ్రాయేలుయొ
క్క పరిశుద్ధుడు దీని కలుగ చేసెననిన్ని గ్రహింతురు. ।
మీ వ్యాజ్యమును ముందరికి తెండి అని యెహోవా 21
ఆనతిస్తున్నాడు; మీ బలమైన యుక్తులను అగుపర్చం
డని యాకోబుయొక్క రాజు చెప్పుతున్నాడు. । వారు 22

దగ్గిరికి వచ్చి, యేమి సంభవించునో అది మాకు తెలి
య చెప్పుదురు గాక; పూర్వమందు గతమైనవి యెటు
23 వంటివో వాటిని వారు చెప్పుదురు గాక.। మీరు దేవుం
డ్లయి వున్నారని మేము తెలుసుకొనే కొరకు రాబో
యే వాటిని చూపించండి; మేము ఆశ్చర్యపడి, కూడా
వుండి, దాని చూచే కొరకు మేలైనా కీడైనా చేయండి.।
24 యిదుగో మీరు మాయ కంటే తక్కువై వున్నారు;
మీ చేతి పని వ్యర్థముగా వున్నది; మిమ్మును యెంచు
25 కొనిన వాడు అసహ్యుడు.। వుత్తర దిక్కునుంచి నేను
వొకని లేవచేస్తిని; వాడు వచ్చును; సూర్యోదయపు దిక్కు
నుంచి వాడు నా నామమును స్మరించును; సున్నము
లాగుననున్ను కుమ్మరివాడు మంటిని త్రొక్కినట్టున్ను
26 వాడు అధికారుల మీదికి వచ్చును.। మేము తెలుసు
కొనేటట్టు ఆదినుంచిన్ని యిది నిజమని మేము చెప్పే
టట్టు పూర్వకాలమందున్ను తెలియ చేసినవాడు యె
వడు? నిశ్చయముగా ముందు తెలియ చేసిన వాడు
వొకడూ లేడు; నిశ్చయముగా చెప్పిన వాడు వొకడూ
లేడు; నిశ్చయముగా మీ మాటలను వినిన వాడు వొక
27 డూ లేడు.। నేను ముందుగా సీయోనుతో, అవిగో,
అవిగో, అని చెప్పితిని; మరిన్ని యెరూశలేముకు శుభ
28 సమాచారములను తెచ్చే వొకని నేను యిస్తిని.। యేమం
టే, నేను చూచినప్పుడు యెవడున్ను అగుపడ లేదు;
వారిలో ఆలోచన కర్త వొకడైనా లేడు; వారిని నేను
అడిగినప్పుడు ప్రత్యుత్తరమిచ్చిన వాడు వొకడైనా
29 లేక పోయెను.। యిదుగో వారు వ్యర్థులు; వారి కా
ర్యములు వట్టివి; వారి పోత విగ్రహములు గాలిన్ని
మాయయున్ను అయి వున్నవి.

## 42. అధ్యాయము.

1 ఇదుగో, నేను వుద్ధరించుచున్న నా సేవకుడు; నేను
యెంచుకొనిన వాడు; అతని యందు నా ఆత్మ ఆనం
దిస్తున్నది; అతని మీద నేను నా ఆత్మను వుంచి యు
న్నాను; అతడు అన్య జనులకు న్యాయమును బైలుపర
2 చును.। అతడు బొబ్బ పెట్టకనున్ను గొల్లు చేయకను
న్ను తన నోటి శబ్దమును వీధిలో వినుపించకనున్ను
3 వుండును.। చితికిన రెల్లును అతడు విరవడు; పొగరాజే
పీచును అతడు ఆర్పివేయడు; అతడు న్యాయమును
4 సత్యమందు స్థిరపరుచును.। అతడు న్యాయమును లోక
మందు స్థిరపచ్చే పర్యంతమూ అలయకనున్ను అధైర్య
పడకనున్ను వుండును; మరిన్ని దూర దేశస్థులు అతని
5 న్యాయప్రమాణము కొరకు కనిపెట్టుదురు.। ఆకాశ
ములను సృష్టించి, వాటిని విశాల పరచినటువంటిన్ని,
భూమినిన్ని దానివల్ల పుట్టిన యావత్తునున్ను విస్తార
పరచినటువంటిన్ని, దాని యందుండే జనులకు శ్వాస
మున్ను దానిలో సంచరించే వారికి జీవాత్మనున్ను
యిస్తూ వున్నటువంటిన్ని దేవుడైన యెహోవా యీ
లాగు ఆనతిస్తున్నాడు,। యేమంటే, యెహోవాను 6
అయిన నేను నీతితో నిన్ను పిలిచితిని; నీ చెయి పట్టు
కొని, నిన్ను కాపాడి, జనులకు వొడంబడికెగానున్ను,
అన్య జనులకు వెలుగుగానున్ను,। అంధకుల నేత్రము 7
లను విప్పుటకున్ను నిర్బంధికులను బంధ విముక్తి చేసు
టకున్ను అంధకారమందుండే వారికి బందీ గృహము
లోనుంచి యివతలకు తెచ్చుటకున్ను నిన్ను యిత్తును.।
నేను యెహోవాను; అదే నా నామము; నా మహి 8
మను అన్యునికిన్ని నా స్తోత్రమును చెక్కిన విగ్రహ
ములకున్ను యిచ్చేవాడను కాను.। పూర్వపు సంగతులు 9
యిదుగో అవి సంభవించినవి; కొత్త సంగతులను నేను
తెలియ చెప్పుతూ వున్నాను; అవి పుట్టక మునుపే వా
టిని మీతో తెలియ చెప్పుతూ వున్నాను.। సముద్ర 10
మునకు వెళ్లుతూ, దాని యందు వున్న సమస్తమైన
వారలారా, ద్వీపములారా, వాటి యందు వున్న నివా
సులారా, యెహోవాను గూర్చి నూతన కీర్తనను
లోకాంతమునుంచి ఆయన స్తోత్రమును పాడుడీ.।
అరణ్యమున్ను దాని పట్టణములున్ను కేదారు నివసించే 11
గ్రామములున్ను తమ స్వరమును పైకి యెత్తును గాక;
మెట్టయొక్క నివాసులు పాడుదురు గాక; వారు పర్వ
తములయొక్క శిఖరమునుంచి ధ్వని చేతురు గాక.।
యెహోవాను ఘనపర్చి ఆయన స్తోత్రములను ద్వీప 12
ములందు తెలియ చేతురు గాక.। యెహోవా పరా 13
క్రమ శాలి వలె బైలు వెళ్లును; ఆయుధస్థుని వలె ఆయన
రౌద్రమును తెచ్చుకొనును; ఆయన శబ్దము యెత్తి
బహుగా ఆర్చి, తన శత్రువులను జయించును.। చాలా 14
కాలమునుంచి నేను వూరకొంటిని; నేను మౌనినై
వుండి నన్ను నేను అణచుకొంటిని; అయితే యిప్పుడు
నేను ప్రసూతి వేదనతో వున్న స్త్రీవలె కేక వేతును;
వారందరినీ పట్టి బెగల్చి నాశనము చేతును.। నేను పర్వ 15
తములనున్ను కొండలనున్ను పాడు చేసి, వాటి మీద
వున్న గడ్డి యావత్తున్ను వాడి పోయేటట్టు చేతును;
నేను నదులను ద్వీపములుగా చేతును; కొలనులను
యెండి పోయేటట్టు చేతును.। నేను గుడ్డి వాళ్లను వారు 16
యెరుగని మార్గము చేత కొంచవత్తును; వారికి తెలియని
మార్గముల యందు వారిని నేను నడిపింతును; వారి
ముందర అంధకారమును వెలుగుగానున్ను వంకర అయి
నవి తిన్ననివిగానున్ను చేతును; నేను యీ కార్యము
లను వారికి చేసి, వారిని విడువను.। అయితే చెక్కిన విగ్ర 17
హములను నమ్మి, పోత విగ్రహములను చూచి, మీరు మా
దేవుండ్లని వాటితో చెప్పినవారు వెనుకకు తిప్పబడి,
మిక్కిలి సిగ్గును పొందుదురు.। ఓ చెవిటి వారలారా, 18

వినండి; ఓ గుడ్డి వారలారా, కనుగొనేటట్టు చూ
19 డండి. । నా సేవకుడు గాక మరి యెవడు అంధకుడై
వున్నాడు? నేను పంపిన దూత వలె యెవడు చెవిటి
వాడై వున్నాడు? నేను పరిపూర్ణుడని చెప్పిన వాని
కంటే యెవడు గుడ్డి వాడై వున్నాడు? యెహోవా
20 సేవకుడైనట్టు యెవడు అంధకుడై వున్నాడు? । అనేక
సంగతులను నీవు చూస్తివి గాని జాగ్రత చేయని వాడ
వైతివి; నీ చెవులు విప్ప పడినవి గాని నీవు వినని వాడ
21 వైతివి. । అయితే ఆయన నీతి నిమిత్తము యెహోవా
బహు సమ్మతిగా వున్నాడు; ఆయన న్యాయప్రమాణ
మును గొప్పగానున్ను ఘనముగానున్ను చేసును. ।
22 అయితే యీ జనులు దోపును పొంది పాడై పోయిరి;
అందరున్ను గోతపడి చిక్కిరి; వారు బందీ గృహము
లందు దాచి వుంచపడిరి; శత్రువులకు దోపుడుగా దొ
రికిరి; వారిని విడిపించే వాడు వొకడూ లేడు; శత్రు
వులకు వారి సొమ్ము దొరికెను; అయితే తిరుగా యివ్వం
23 డన్న వాడు వొకడూ లేడు. । మీలోగా యిది యెవరు
విందురు? యెవరు ఆలకించి యిక మీదట విందురు? ।
24 యాకోబును దోపు కొరకు యిచ్చిన వాడు యెవడు?
ఇశ్రాయేలును దోచుకుపోయిన వారికి అప్పగించిన
వాడు యెవడు? మేము యెవరికి విరోధముగా పాపము
చేసినామో ఆ యెహోవాయే కాదా? యేమంటే
వారు ఆయన మార్గములందు నడవక, ఆయన న్యా
25 యప్రమాణమును వినకపోయిరి. । కాబట్టి ఆయన తన
రౌద్రాగ్నినిన్ని యుద్ధముయొక్క బలమున్ను వారి
మీద కుమ్మరించినందున అది వాని చుట్టూ అగ్నిని
రాజ వేసినప్పటికిన్ని వాడు లక్ష్య పెట్టక వుండెను;
దాని చేత వాడు కాలినప్పటికిన్ని నిర్విచారముగా
వుండెను.

## 43. అధ్యాయము.

1 అయితే ఓ యాకోబా, నిన్ను సృష్టించిన వాడు
న్ను, ఓ ఇశ్రాయేలా, నిన్ను రూపించినవాడున్ను
అయిన యెహోవా ఆనతిచ్చేదేమంటే, నీవు భయ
పడ వద్దు; యేమంటే నేను నిన్ను విమోచించి వున్నా
ను; నీ పేరుచేత నిన్ను పిలిచితిని; నీవు నావాడవు. ।
2 వుదకములలోబడి నీవు వెళ్లేటప్పుడు నేను నీకు తోడు
గా వుందును; నదులలోబడి నీవు వెళ్లేటప్పుడు అవి
నీ మీద పొర్లిపారవు; అగ్నిలో బడి నీవు నడిచేట
3 ప్పుడు నీవు కాలిపోవు; మంట నీకు తగలదు. । యే
మంటే యెహోవాను అయిన నేను నీకు దేవుడనై
వున్నాను; ఇశ్రాయేలుకు పరిశుద్ధుడనైన నేను నీకు
రక్షకుడనై యున్నాను; నీ విమోచనము కొరకు మిస్ర
యీమునున్ను నీ కొరకు కూషునున్ను సెబానున్ను
యిస్తిని. । నా కంటికి నీవు ప్రీతిగా వున్నప్పటినుంచి 4
నీవు ఘనుడవై వుంటివి; నేను నిన్ను స్నేహిస్తిని గనుక
నీ కొరకు మనుష్యులనున్ను నీ ప్రాణము కొరకు జను
లనున్ను యిస్తిని. । నీవు భయపడవద్దు, యేమంటే నేను 5
నీకు తోడుగా వుందును; నీ బిడ్డలను తూర్పు దిక్కు
నుంచిన్ని నీ సంతతిని పడమటి దిక్కునుంచిన్ని కూర్చి
గప్పింతును. । నేను వుత్తర దిక్కుతో అప్పగించుమని 6
చెప్పుదును; దక్షిణ దిక్కుతో రానిమ్ము అని చెప్పుదు
ను; దూరమునుంచి నా కుమాళ్లనున్ను లోక సరిహ
ద్దులలోనుంచి నా కుమార్తెలనున్ను తీసుకొరమ్మని
చెప్పుదును. । నిజముగా నా నామముచేత యెందరు 7
పిలువబడుదురో యెందరిని నేను నా ఘనము కొరకు
సృష్టించితినో నేను యెందరిని రూపించి కలుగచేస్తి
నో వారందరున్ను వత్తురు. । కన్నులు వున్నప్పటికిన్ని 8
గుడ్డివారినిన్ని చెవులు వున్నప్పటికిన్ని చెవిటివారినిన్ని
బైటికి తీసుకొని రండి. । జనాంగములందరున్ను కూడి 9
వత్తురు గాక; జనులందరున్ను కూడి వత్తురు గాక;
వారిలో యెవరు వచ్చి ముందు సంభవించ పోయేది
మనకు తెలప గలరు? వారు నీతిపరులని అగుపడేటట్టు
వారి సాక్షులను వారు బైటికి తెత్తురు గాక; లేక వారు
విని ఆ మాట నిజమని పలుకుదురు గాక. । యిందుకు 10
యెహోవా ఆనతిచ్చేదేమంటే, మీరే నా సాక్షులై
వున్నారు; నేను యెంచుకొనిన నా సేవకుడు సాక్షియై
వున్నాడు; కాబట్టి మీరు తెలుసుకొని, నన్ను నమ్మి,
నేనే ఆయన అని గ్రహించ వలెను; నా కంటే ముం
దర యే దేవుడైనా రూపించబడ లేదు; తరువాత యే
దేవుడైనా వుండబోయేది లేదు. । నేనే యెహోవానై 11
వున్నాను; నేను గాక రక్షకుడు యెవడూ లేడు. ।
మీలో యితర దేవుండ్లు లేనప్పుడు నేను బైలుపరచి 12
రక్షించి తెలియచేస్తిని; కాబట్టి నేనే దేవుడనై వుండు
టకు మీరు నా పట్ల సాక్షులని యెహోవా ఆనతి
చ్చెను. । మరిన్ని కాలము లేకమునుపు నేనే వుంటిని; 13
నా చేతిలోనుంచి విడిపించుకో గలవాడు వొకడూ
లేడు; నేను యేది చేస్తే యెవడు దానిని ఆతంకపరచ
గలడు? । మీ విమోచన కర్తయున్ను ఇశ్రాయేలుయొ 14
క్క పరిశుద్ధుడున్ను అయిన యెహోవా ఆనతిచ్చిన
దేమంటే, యిదుగో, మీ నిమిత్తము నేను బాబెలు పట్ట
ణముకు దూతను పంపితిని; దాని గవనులయొక్క అడ్డు
గడలనున్ను వోడల యందు ఆచిర్ణన కల్దీయులనున్ను
కుంగచేస్తిని. । యెహోవాను అయిన నేను మీయొక్క 15
పరిశుద్ధమైన వాడనున్ను ఇశ్రాయేలును సృష్టించిన
వాడనున్ను మీ రాజునున్ను అయి వున్నాను. । సము 16
ద్రమందు మార్గమునున్ను గొప్ప వుదకములందు దారి
నిన్ని కలుగచేస్తూ, । రథమునున్ను గుర్రమునున్ను సైన్య 17

మునున్ను బలమునున్ను బైటికి రప్పించిన యెహోవా
వా ఆనతిచ్చేదేమంటే, వారందరున్ను కూలి తిరిగీ లేవక
18 వుందురు; వారు ఆరిపోయిరి వత్తివలె ఆరిపోయిరి.। జరి
గిన సంగతులను మరిచిపోయినారా! పూర్వపు కార్య
19 ములను తలంచకుండా వున్నారా!। యిదుగో నేను
వొక నూతన కార్యమును చేస్తూ వున్నాను; యిప్పుడే
అది జరుగును; దానిని మీరు గ్రహించరా! యేమంటే,
నేను అరణ్యమందు మార్గమునున్ను అడవి యందు
20 నదులనున్ను కలుగజేతును.। నేను యెంచుకొనిన నా
జనులకు దాహము యిచ్చుటకు అరణ్యమందు వుదక
ములనున్ను అడవి యందు నదులనున్ను కలుగ చేసినం
దున బైటి మృగమున్ను క్రూర సర్పములున్ను అరణ్య
21 పక్షులున్ను నన్ను ఘనపచురను.। యీ జనులను నేను
నా కొరకై రూపించితిని; వారు నా స్తోత్రములను
22 బైలుపరతురు.। అయితే ఓ యాకోబా, నీవు నా నామ
మును స్మరించ లేదు; ఓ ఇశ్రాయేలా, నా యెడల
23 నీకు విసుపు కలిగినది.। నీవు నీ హోమార్పణయొక్క
గొర్రెపిల్లను తీసుక రాలేదు; నీ బలులతో నీవు నన్ను
ఘనపచరలేదు; కానుకతో నేను నిన్ను సేవింప చేయ
24 లేదు; ధూపముతో నీకు విసుపు పుట్టించ లేదు.। సొమ్ము
చేత నీవు నా కొరకు సువాసన గల రెల్లును కొనలేదు;
బలుల కొవ్వుచేత నీవు నన్ను తృప్తిపరచలేదు; అయితే
నీ పాపములతోటి నీవు నన్ను భారపెట్టితివి; నీ అక్ర
25 మములచేత నీవు నన్ను ఆయాసపరచితివి.। నేనే, నిశ్చ
యముగా నేనే, నీ అక్రమములను నా కొరకే తుడి
చివేసే వాడనై, నీ పాపములను జ్ఞాపకము తెచ్చు
26 కోక వుందును.। నన్ను జ్ఞాపకము చేయుము; మనము
వుభయులమున్ను వాదింతుము; నీవు నీతిమంతుడవుగా
27 అగుపడేటట్టు హేతువును చూపించుము.। నీ మొదటి
తండ్రి పాపము చేసినాడు; నీకు బోధించేవారు సహా
28 నా మీదికి తిరగపడిరి.। కాబట్టి నేను పరిశుద్ధ స్థలము
యొక్క శ్రేష్ఠులను అపవిత్రులగా యెంచుదును; మరి
న్ని శాపమునకు యాకోబునున్ను అవమానమునకు ఇశ్రా
యేలునున్ను అప్పగింతును.

## 44. అధ్యాయము.

1 అయినప్పటికిన్ని నా సేవకుడవైన ఓ యాకోబా;
2 నేను యెంచుకొన్న ఓ ఇశ్రాయేలా, వినుము.। నిన్ను
కలుగ చేసి, నీ గర్భమునుంచి నిన్ను రూపించి, నీకు
సహాయుడైన యెహోవా ఆనతిచ్చేదేమంటే, నా
సేవకుడవైన ఓ యాకోబా, నేను యెంచుకొన్న ఓ
3 యెషురూనూ, భయపడ వద్దు,। యేమంటే నేను దప్పి
గల వారి మీద నీళ్లనున్ను యెండిన భూమి మీద
ప్రవాహములనున్ను కుమ్మరింతును; నేను నీ సంతతి
మీద నా ఆత్మనున్ను నీ పుత్రుల మీద నా ఆశీర్వా
దమునున్ను కుమ్మరింతును.। అయినందున వారు నీటిలో 4
గడ్డి లాగుననున్ను కాలువ దగ్గిర ఆలచెట్టు లాగునను
న్ను పెరుగుదురు.। వొకడు నేను యెహోవా వాడను 5
అని అనును; మరి వొకడు యాకోబు నామము చేత
తనను తాను పిలుచుకొనును, యింకొకడు యెహో
వా విషయమై తన చేవ్రాలును యిచ్చి, ఇశ్రాయేలనే
పేరుచేత ప్రతి నామమును ధరించుకొనును.। ఇశ్రా 6
యేలుకు రాజున్ను విమోచన కర్తయున్నైన సైన్య
ముల యెహోవా ఆనతిచ్చేదేమంటే, నేను మొదటి
వాడను, చివరవాడను; నేను గాక దేవుడు మరిలేడు.।
నేను ఆది నరులను స్థాపించినప్పటినుంచి నా వలెనే 7
యెవరు భవిష్యత్సంగతిని రాజేసి, దాని తెలియ చెప్పి,
నా కొరకు సిద్ధపర్చుకోగలరు? అటువంటివారు వుంటే
వారు వచ్చి, ముందు సంగతులనున్ను తరువాతి సంగతు
లనున్ను వారికి తెలియ చెప్పుదురు గాక.। మీరు జడి 8
యకనున్ను వెరువకనున్ను వుండండి; అప్పటినుంచి
నేను మీకు తెలియ చెప్పి, వినుపించ లేదా? మీరే
నా సాక్షులై వున్నారు; నేను గాక యింకొక దేవుడు
వున్నాడా? నిశ్చయముగా యే దేవుడూ లేడు; నేను
యెవనినైనా యెరుగను.। విగ్రహమును చెక్కించిన 9
వారందరున్ను వ్యర్థులై వున్నారు; వారియొక్క ఆశిం
చతగినవి నిష్ఫలమౌను; వారికి వారే సాక్షులయి వుం
దురు; యేమంటే వాటికి చూపులేదు, తెలివి లేదు;
కాబట్టి వారికి సిగ్గు కలుగును.। నిష్ప్రయోజనమయిన 10
విగ్రహమును పోత పోసి, దేవుని రూపించిన వారు
యెవరు?। యిదుగో, దాని సహవాసులందరున్ను సిగ్గును 11
పొందుదురు; చేసేవారు మనుష్యులే; వారందరున్ను
కూడుదురు గాక; వారు నిలువబడుదురు గాక; వారు
వణికి సిగ్గును పొందుదురు.। కమ్మరివాడు యినుపముక్క 12
తెగగొట్టి; అగ్నితో పనిచేసి, సుత్తెలతోటి తన బాహు
బలముచేత రూపించును; ఆకలి కలిగినందున వాని శక్తి
క్షీణించును; వాడు నీళ్లు తాగక సొమ్మసిల్లును.। వడ్లవా 13
డున్ను తన నూలు మాను మీద సాగించి, చీర్ణముతో
గురుతును గీసి, దానిని చిత్రికలతోటి చక్కచేసి, కుం
పానుతోటి గురుతును గీసి, మనుష్య రూప ప్రకార
ము సరిగా చేసును; మనుష్య స్వరూప ప్రకారముగా
చేసి, మందిరములో నిలువబెట్టును.। వాడు ఆర్జ 14
మానులను నరుకును; అతడు అడవి వృక్షములలో తర్జ
చెట్టునున్ను ఆలోన చెట్టునున్ను కనుగొని, తన కొరకు
వాటిని పెంచును; అతడు అర్జ చెట్టును నాటును;
అది వర్షముచేత యెదుగును.। అప్పుడు అది మను 15
ష్యుని కొరకు కాల్చుటకై వుండును; వాడు దాని తీసు

కొని, కాల్చి చలి కాచుకొనును; వాడు దానితోటి
అగ్ని రాజవేసి, రొట్టెను కాల్చుకొనును; మరిన్ని దా
నిచేత వొక దేవుని కలుగ చేసుకొని, దానికి నమస్క
రించును; వాడు దాని చెక్కిన విగ్రహమునుగా చేసి,
16 దానికి సాష్టాంగ పడును. । వొక తునక అగ్నిలో కా
ల్చును; మరియొక తునకచేత వండుకొని భుజించును;
వాడు మాంసమును కాల్చి తిని, తృప్తిని పొందును;
వాడు చలి కాచుకొని, హాహా నేను కాగితిని, అగ్నిని
17 చూచితినని అనుకొనును. । అయినప్పటికిన్ని యింకొక
తునకచేత వొక విగ్రహమును చెక్కి, యిది దేవుడని
అనుకొని, దానికి నమస్కారములను చేసును; వాడు
దానిని ప్రార్థించి, నీవు నా దేవుడవు, నన్ను రక్షిం
18 చుమని వేడుకొనును. । వారికి తెలివిన్ని బుద్ధిన్ని లేదు;
వారి కన్నులు మూయబడినందున చూడ లేవు; వారి
19 మనస్సు చీకటి గలదై గ్రహించ లేక పోయెను. । తన
హృదయమందు విచారించుకొనిన వాడు వొకడూ
లేడు; వొక తునక నేను అగ్నిలో కాల్చితిని; దాని
నిప్పులవల్ల నేను రొట్టెను కాల్చుకొంటిని; మాంసము
నున్ను కాల్చుకొని తింటిని; మిగిలిన తునకను నేను
యేహ్యమైన దానిగా చేతునా? చెట్టు తునకకు యె
దుట నేను సాష్టాంగ పడుదునా? అని అనుకొనేటం
దుకు వారికి తెలివి అయినా బుద్ధి అయినా లేదు. ।
20 వాడు బూడిదెను తినును; భ్రమసిన హృదయము చేత
వాడు మార్గమును తప్పి, తన ఆత్మను తాను విడిపిం
చుకో లేక, నా కుడి చేతిలో అబద్ధము వున్నది గదా
21 అని చెప్పుకొన నేరడు. । ఓ యాకోబా, ఓ ఇశ్రా
యేలా, నీవు నా సేవకుడవు గనుక యీ సంగతులను
జ్ఞాపకము చేసుకొనుము; నేను నిన్ను రూపించితిని;
నీవు నా సేవకుడవు; వో ఇశ్రాయేలా, నేను నిన్ను
22 మరిచిపోను. । నీ తప్పితములను మేఘము లాగుననున్ను
నీ పాపములను యెండమావుల లాగుననున్ను అదృశ్య
పరచితిని; నా యొద్దికి మళ్లుము, యేమంటే నేను
23 నిన్ను విమోచించితిని. । యెహోవా యీలాగున
చేసెను గనుక ఓ ఆకాశములారా, పాడండి; భూమి
యొక్క లోతైన భాగములారా, కేక వేయండి; ఓ
పర్వతములారా, ఓ అరణ్యమందున్న సకల వృక్షము
లారా, మీ వాక్కుచేత సంగీతపు నాదము చేయండి;
యేమంటే యెహోవా యాకోబును విముక్తిపరచి,
24 ఇశ్రాయేలులో చాలా ఘనత్వమును పొందెను.। గర్భ
మువల్ల నిన్ను రూపించి, నీ విమోచన కర్తయైన యె
హోవా ఆనతిచ్చేదేమంటే, నేను సమస్తమును కలుగ
చేసే యెహోవాను అయి వున్నాను; నా యంతట
నేనే ఆకాశములను విశాలపరచితిని; నా అంతట నేనే
25 భూమిని విస్తారపరచితిని. । నేను మాయకాండ్ల యం
త్రములను భ్రష్టు చేసేవాడనున్ను, శకునము చూచే
వారిని అవివేకులగా చేసే వాడనున్ను, జ్ఞానుల యో
చనలను తారుమారు చేసి వారి తెలివిని వ్యర్థపరచే
వాడనున్ను, । నా సేవకుని వాక్యము రూఢిపర్చి, నా 26
దూతల ఆలోచనను నెరవేర్చేవాడనున్ను, యెరూశ
లేముతో నీ యందు జనులు కాపురము చేతురనిన్ని,
యూదా పట్టణములతో మీరు కట్టబడుదురనిన్ని,
పాడై పోయిన దాని స్థలములను నేను బాగుచేతునని
న్ని, చెప్పిన వాడనున్ను, । అగాధమును చూచి, నీవు 27
యెండిపోదువుగాకనిన్ని, నీ నదులను పొడి నేలగా
చేతుననిన్ని, । కొరేషును గురించి వాడు నా మంద 28
కాపరి అనిన్ని నా చిత్తమంతాను వాడు నెరవేర్చున
నిన్ని, యెరూశలేముతో నీవు కట్టబడుదువనిన్ని, దాని
యందుండే గుడితో నీ పునాదులు కట్టబడుననిన్ని,
చెప్పిన వాడనున్ను అయి వున్నాను.

## 45. అధ్యాయము.

యెహోవాను అయిన నేను అభిషేకించిన కొ 1
రేషు యెదుట జనాంగములను తగ్గించుటకున్ను రాజుల
నడికట్లను విప్పుటకున్ను అతని యెదుట ద్వారములకు
తాళములు వేయకుండా రెండు మడతల తలుపులను
తెరచుటకున్ను నేను అతని కుడిచేతిని పట్టుకొని
అతనికి చెప్పేదేమంటే, । నేను నీ ముందర నడిచి, వం 2
కర అయినది తిన్నగా చేతును; నేను యిత్తడి తలుపు
లను కొట్టివేసి, యినుప గడియలను తెగవేతును; । మరి 3
న్ని నీ పేరుచేత నిన్ను పిలిచిన యెహోవాను అనే
నేను ఇశ్రాయేలుకు దేవుడనై వున్నానని నీవు తెలు
సుకొనేటట్టుగా అంధకారమందు వున్న ఆస్తినిన్ని
రహస్య స్థలమందు వుండే మరుగైన ధనమునున్ను నీకు
యిత్తును. । యేమంటే నా సేవకుడైన యాకోబు నిమి 4
త్తమున్ను నేను యెంచుకొన్న ఇశ్రాయేలు నిమిత్తము
న్ను నేను నీ పేరుచేత నిన్ను పిలిచినాను; నీవు నన్ను
యెరుగకుండా వున్నప్పటికిన్ని నీకు పేరు పెట్టితిని. ।
నేనే యెహోవానై వున్నాను; వేరే వొకడు లేడు; 5
నేను గాక దేవుడు లేడు; నేను గాక వేరొకడు లేడని
వారు సూర్యుడు వుదయించే దిక్కునుంచిన్ని అతడు
అస్తమించే దిక్కునుంచిన్ని తెలిసేటట్టుగా,। నీవు నన్ను 6
యెరుగక వున్నప్పటికిన్ని నీ నడుమును కట్టితిని; నేనే
యెహోవానై వున్నాను; వేరే వొకడూ లేడు. । వెలు 7
గును రూపించి, చీకటిని సృష్టించే వాడను నేనే;
సమాధానమును కలుగ చేసి, కీడును పుట్టించే వాడను
నేనే; యెహోవానైన నేను వీటినన్నిటినిన్ని చేసే
వాడను. । ఓ ఆకాశములారా, పైనుంచి రాలండి; 8
ఆకాశమండలములు నీతిని కురిపించును గాక; భూమి

తెరువబడినందున అవి రక్షణను పుట్టించును గాక; నీతి
అప్పుడు పెరుగును గాక; యెహోవానైన నేను వీటిని
9 సృష్టించితిని. । తన సృష్టికర్తతో పోరాడే వానికి
అయ్యో! వాడు భూమిలో వున్న పెంకులలో వొక
పెంకు. జిగటమన్ను దాని రూపించే వానితో యేమి
చేస్తూ వున్నావు అనిన్ని, లేక నీ పని నీకు చేతులు
10 లేవనిన్ని పలుకునా? । తండ్రితో నీవు దేని పుట్టిస్తివి
అనిన్ని, తల్లితో దేని కంటివి అనిన్ని చెప్పే వానికి
11 అయ్యో! । ఇశ్రాయేలుయొక్క పరిశుద్ధుడున్ను వాని
సృష్టించిన వాడున్ను అయిన యెహోవా చెప్పేదే
మంటే, రాబోయే కార్యములను గురించి నన్ను అడు
గుము; నా కుమారులను గురించిన్ని నా చేతుల పనిని
12 గురించిన్ని నాకు ఆజ్ఞాపించుము. । నేను భూమిని
కలుగ చేసి, నేనే దాని మీద వుండే మనుష్యులను
సృష్టించితిని; నా చేతులు ఆకాశములను విశాలపర
13 చెను; వాటి సైన్యములన్నిటికీ ఆజ్ఞాపిస్తిని. । నేను నీతి
తో వాని లేవ చేసి, వాని త్రోవలనన్నిటిని చక్కపర
తును; వాడు నా పట్టణమును కట్టి, బంధించపడిన నా
వారిని విలువ లేకుండానున్ను విమోచన క్రయములే
కుండానున్ను విడుదల చేసును, అని సైన్యముల యె
14 హోవా చెప్పుతూ వున్నాడు. । మిస్రయీముయొక్క
ప్రయాసమున్ను కుషు యొక్కయున్ను దీర్ఘదేహు
లైన సెబాయీయుల యొక్కయున్ను వర్తకమున్ను
నీ యొద్దికి వచ్చి నీది అవును; వారు నీ వెంట వెళ్లు
దురు; వారు సంకెళ్లతో నడిచి వచ్చి, నీ యందే దేవుడు
వున్నాడు, ఆయన గాక వేరే దేవుడు లేడు, అని నీ
ముందర సాగిలపడి, నీకు విన్నపము చేతురు, అని యె
15 హోవా చెప్పుతున్నాడు. । రక్షకుడవైన ఓ ఇశ్రా
యేలు దేవుడా, నిజముగా నిన్ను నీవు మరుగు పర్చు
16 కొనే దేవుడవై వున్నావు. । ప్రతిమలను కలుగ చేసే
వారందరూ హీనతను పొంది, సిగ్గును అనుభవించి,
17 యేకముగా బిడియమును పొందుదురు. । అయితే
ఇశ్రాయేలు యెహోవా వల్ల నిత్యమైన రక్షింపుతో
రక్షింపబడును; మీరు నిత్య యుగముల మట్టుకు సిగ్గును
18 అనుభవించకుండా కలవిలపడకుండా వుందురు. । యే
మంటే ఆకాశములను సృష్టించిన యెహోవా చెప్పే
దేమంటే, ఆయన భూమిని రూపించి కలుగ చేసిన
దేవుడై వున్నాడు; ఆయన దాని స్థిరపరచెను; ఆయన
దాని వృథాగా సృష్టించలేదు; అది నివసింపబడుటకు
దాని రూపించెను; నేనే యెహోవాను; వేరే వొక
19 డూ లేడు. । నేను రహస్యముగా, అనగా, భూమి
యొక్క అంధకారమైన స్థలములో మాట్లాడలేదు;
వృథాగా నన్ను వెతుకుము అని యాకోబు సంతానము
తో నేను చెప్పలేదు; యెహోవానైన నేను నీతిని
పలికే వాడను; నేను యథార్థమైన వాటిని తెలియ
చేసే వాడను. । జనాంగములనుంచి తప్పించుకొన్న వా 20
రలారా, కూడి రండి; యేకముగా చేరండి; తమ చెక్కిన
విగ్రహముల మ్రాను నిలిపి రక్షించలేని దేవుని స్మరించిన
వారు తెలివిలేక వున్నారు. । మీరు తెలిపేటందుకు చేరి, 21
యేకముగా యోచన చేయండి; యిది పూర్వ కాలము
నుంచి బైలుపరచి, అప్పటినుంచి అది తెలిపిన వాడు
యెవడు? యెహోవాను అయిన నేను కానా? నీతిప
రుడనున్ను రక్షకుడనున్ను అయిన నేను గాక వేరే వొక
దేవుడు లేడు; నేను గాక మరి యెవ్వడూ లేడు. । భూమి 22
యొక్క యావత్తు సరిహద్దులారా, నా తట్టు చూడండి,
అప్పుడు మీరు రక్షించబడుదురు; యేమంటే నేనే
దేవుడను; యింకొకడు లేడు. । నాకు ప్రతి మోకాలు 23
వంగును, ప్రతి నాలుక ప్రమాణము చేసును, అని
నన్ను గురించి నేను వొట్టు పెట్టుకొంటిని; నీతిగా మాట
నా నోటనుంచి బైలు వెళ్లెను; అది మళ్లీ రాదు. । నిజ 24
ముగా యెహోవా యందు నాకు నీతిన్ని బలమున్ను
కలవని వొకడు అనుకొనును; ఆయన యొద్దికి మను
ష్యులు వచ్చి చేరుదురు; అయితే ఆయనకు విరోధ
ముగా మండే వారందరున్ను సిగ్గుపడుదురు. । ఇశ్రా 25
యేలు సంతతి వారందరూ యెహోవాయందు నీతి
మంతులై అతిశయింతురు.

## 46. అధ్యాయము.

బేలు వంగుతూ వున్నది; నెబో పడిపోతున్నది; వారి 1
విగ్రహములు పశువుల మీదనున్ను మృగముల మీద
నున్ను వేయబడి వున్నవి; మీ రథములు మిక్కిలి
బరువుగా వున్నవి; అవి పాటు పశువులకు బరువుగా
వుండును. । అవి వంగి యేకముగా పడిపోతున్నవి; అవి 2
భారమును తప్పించలేక, అవే చెరలోకి పోవును. । తల్లి 3
గర్భము మొదలుకొని నా చేత యెత్తుకో బడినటు
వంటిన్ని పుట్టినప్పటినుంచి మోయబడిన వారైనటు
వంటి యాకోబు యింటి వారలారా, ఇశ్రాయేలు
యింటివారిలో శేషించిన సకల జనులారా, నా మాట
ఆలకించండి. । మీకు ముదిరిన వయస్సు కలిగే మట్టుకు 4
నేనే ఆయన; నెరవెంట్రుకల మట్టుకున్ను నేను
మిమ్మును మోతును; నేను చేస్తిని, నేను యెత్తుదును;
నేను కొంచబోయి విడిపింతును. । నన్ను యెవరికి సమా 5
నముచేసి సాటిచేయ గలరు! యెవరితో నేను సమ
ముగా వుండేటట్టు నన్ను పోలిక పర్చగలరు! । వారు 6
సంచిలో వుండే బంగారము ఖర్చుచేసి, త్రాసులో
వెండిని తూచుదురు; బంగారపు పనివానిని కూలికి
కుదిర్చినందున వాడు దానిని దేవునిగా చేసును; దానికి
వారు సాగిల బడుదురు; నిశ్చయముగా వారు దాని

7 ఆరాధింతురు. । వారు దాని భుజము మీదను యెక్కిం
చుకొని, కొంచుబోదురు; వారు దాని స్థానమందున
దాని వుంచినందున అది నిలుచును; తన స్థలమును విడిచి
కదలదు; వొకడు దాని వేడుకొన్నప్పటికిన్ని అది మారు
త్తరము యిచ్చేది లేదు; వాని కష్టములోనుంచి వానిని
8 రక్షించేది లేదు. । యిది మీరు తలంచుకొని, మిమ్మును
మీరు మనుష్యుల లాగున అగుపరచుకొనండి; ఓ అక్ర
మపు వారలారా, యిది మనస్సుకు తెచ్చుకొండి. ।
9 పూర్వ కాలమునుంచి నడిచిన వాటిని గురించి జ్ఞాపకము
తెచ్చుకొండి; యేమంటే నేనే దేవుడనై యున్నాను;
యింకొక దేవుడు లేడు; నాతో సమమైన వాడు వొక
10 డున్ను లేడు. । నేను ఆదినుంచి అంతమునున్ను పూర్వ
కాలమునుంచి పుట్టబోయే వాటినిన్ని తెలియ చేస్తూ,
నా ఆలోచన నిలుచును, నా చిత్తము యావత్తు నేను
11 నెరవేర్తును అని పలుకుతూ, । తూర్పుననుంచి గద్దనున్ను
దూరదేశమునుంచి నా ఆలోచన జరిగించే మనుష్యు
నిన్ని పిలుస్తూ వున్నాను; నేను చెప్పినట్టు చేతును;
12 నేను నిర్ణయించుకొన్నట్టు చేతును. । మూర్ఖ హృద
యులారా, నీతికి దూరులారా, నా మాటను ఆలకిం
13 చండి. । నా నీతిని నేను సమీపింప చేస్తూ వున్నాను;
అది దూరముగా వుండదు; నా రక్షణ ఆలస్యము
కాకుండా వుండును; నేను సీయోనుయందు రక్షింపును
వుంచి, ఇశ్రాయేలుకు నా మహిమను యిత్తును.

## 47. అధ్యాయము.

1 బాబెలు కుమార్తెవైన వో కన్యకా, నీవు దిగి,
మంటిలో కూర్చుండుము; ఓ కల్దీయుల కుమారీ, నేల
మీద కూర్చుండుము; సింహాసనము లేదు; యేమంటే
నీవు కోమలత్వమున్ను సుకుమారత్వమున్ను గలదానవని
2 యిక పిలువ బడేది లేదు. । తిరుగటి రాళ్లను తీసుకొని,
పిండి విసురుము; నీ వెంట్రుకల పైని వున్న ముసుకును
తీయుము; నీ కాలు కనుబడనిమ్ము; వూరువును బైలుప
3 రచి, నదులను దాటుము. । నీ దిగంబరత్వము బైలుప
డును; నీ సిగ్గు కనుపడును; నేను నీ పక్షమునకు వొకని
4 రానివ్వకుండా ప్రతి దండన చేతును. । మా రక్షకుడు
యెవరంటే, ఇశ్రాయేలుకు పరిశుద్ధుడు; సైన్యములకు
5 యెహోవా అనే నామము ఆయనకు కలదు. । ఓ
కల్దీయుల కుమారికా, నీవు మౌనముగా కూర్చుండి, చీక
టిలోకి వెళ్లుము; యేమంటే యికను రాజ్యములలో
6 దొరసానివి అని నీవు పిలువబడవు. । నేను నా జనుల
మీద కోపముగా వుంటిని; నా స్వాస్థ్యమును అపవిత్ర
పరచి, నీ చేతికి వారిని అప్పగించితిని; అయితే నీవు
వారికి కనికరము చూపించకుండా ముసలివారి మీద
7 నీ కాడి మాను మిక్కిలి బరువుగా పెట్టితివి. । మరిన్ని
యెప్పటికిన్ని నేను దొరసానిగా వుందునని చెప్పితివి;
నీవు యీ కార్యములను గురించి నీ మనస్సులో విచా
రించకనున్ను దాని అంతమును గురించి నీవు యోచిం
చకనున్ను వుంటివి. । కాబట్టి యిప్పుడు భోగము గల 8
దానవై, నిర్విచారముగా నివసిస్తూ, నేను వున్నాను,
నేను గాక మరి యెవరూ లేరు; నేను విధవగా కూర్చుం
డను; బిడ్డల నాశనమును యెరుగను అని నీ హృదయ
ములో అనుకొంటూ వున్నదానా, దీని వినుము. ।
పుత్రనాశమున్ను వైధవ్యమున్ను యీ రెండు నీ మీ 9
దికి ఆకస్మికముగా వొక్క దినమందే వచ్చును; విస్తార
మైన నీ చిల్లంగుల నిమిత్తమున్ను కర్ణ పిశాచపు తం
త్రముల నిమిత్తమున్ను అవి సంపూర్ణముగా నీ మీదికి
వచ్చును. । యేమంటే నీవు నీ దుర్మార్గమందు నమ్మ 10
కముగా వుండి, నన్ను చూచేవాడు యెవడూ లేడు
అని పలికితివి; నీ జ్ఞానమున్ను నీ తెలివిన్ని నిన్ను తిప్పి
వేసెను; మరిన్ని నేను వున్నాను, నేను గాక మరి యె
వడూ లేడని నీ హృదయములో నీవు అనుకొంటివి. ।
కాబట్టి నీ మీదికి కీడు వచ్చును; దాని వుదయమును 11
నీవు తెలియక వుందువు; నీవు పరిహరించలేని చేటు నీ
మీద పడును; నీవు యెరుగని నాశనము నీ మీదికి
ఆకస్మికముగా వచ్చును. । నీవు నీ చిన్న వయస్సు నాటి 12
నుంచి ప్రయాసపడి, అభ్యసించిన విస్తారమయిన నీ
కర్ణ పిశాచ తంత్రములతోనున్ను నీ చిల్లంగులతో
నున్ను యిప్పుడు నిలిచి వుండుము; వాటివల్లను నీకు
లాభము కలుగునేమో; వాటివల్ల నీకు జయము కలుగు
నేమో. । నీవు నీ విస్తారమైన యోచనలచేత అలసి వుం 13
టివి; జ్యోతిష్కులున్ను నక్షత్రసూచన యెరిగిన వారు
న్ను మాసములయొక్క లక్షణములను యెరిగిన వారున్ను
లేచి, నీ మీదికి వచ్చే వాటినుంచి నిన్ను తప్పించి,
రక్షింతురుగాక. । యిదుగో వారు పొల్లువలె వుందురు; 14
అగ్ని వారిని కాల్చివేసును; తమ ప్రాణమును వారు
జ్వాల బలమునుంచి తప్పించుకో లేరు; చలికాచుకొనే
టందుకు వొక నిప్పు అయినా వుండదు; దానికి యెదు
రుగా కూచుండేటందుకు కాసంత అగ్నియైనా వుం
డదు. । నీ చిన్న వయస్సు మొదలుకొని నీవు యెవరితో 15
ప్రయాసపడి, వ్యాపారము చేసినావో, వారు నీకు
ఆలాగునే వుందురు; వారు తమకు మనస్సు వచ్చిన
స్థలమునకు పోదురు; నిన్ను రక్షించే వారు వుండరు.

## 48. అధ్యాయము.

ఇశ్రాయేలు అనే పేరు చేత పిలువబడి, యూదా 1
యొక్క నీళ్లలోనుంచి వచ్చి, యెహోవా పేరట
వొట్టుపెట్టుకొని ఇశ్రాయేలు దేవుని గురించి యథా
ర్థముగానైనా నీతిగానైనా కాకుండా మాట్లాడిన

2 ఓ యాకోబు యింటివారలారా, వినండి. । యేమంటే
వారు పరిశుద్ధ పట్టణపు వారనే పేరు ధరించుకొని,
ఇశ్రాయేలుయొక్క దేవుని నమ్ముతున్నారు; ఆయన
3 పేరు సైన్యముల యెహోవా. । పూర్వపు సంగతులను
ఆదినుంచి నేను తెలియ చేస్తిని; నా నోటినుంచి అవి
బైలు వెళ్లినవి; వాటిని నేను తెలియ చేస్తిని; వాటిని
నేను ఆకస్మికముగా కలుగ చేసినందున అవి సంభవిం
4 చెను.।అయితే నీవు కఠినుడవనిన్ని నీ మెడ యినుప నర
మనిన్ని, నీ నుదురు యిత్తడిది అనిన్ని నేను యెరిగి
5 యుంటిని, । గనుక నా విగ్రహము వాటిని చేసెను
అనిన్ని, నా చెక్కిన విగ్రహమున్ను నా పోత విగ్ర
హమున్ను వాటిని ఆజ్ఞాపించెను అనిన్ని నీవు చెప్ప
కుండా నేను ఆరంభమునుంచీ వాటిని నీకు ముందు
గానే చూపించి, అవి రాక మునుపే నీకు తెలియ
6 చేస్తిని.। నీవు అది వింటివే; వాటిని అన్నిటినీ చూడుము;
యిప్పుడు మీరు వాటిని తెలుపరా? యిది మొదలు
కొని కొత్త వాటినిన్ని మరుగైన వాటినిన్ని నీకు చూ
7 పించినాను; అయితే నీవు వాటిని తెలుసుకో లేదు.। అవి
ఆదినుంచీ కాకుండా యిప్పుడు సృష్టించపడి యున్నవి;
యిదుగో వాటిని యెరిగి యుంటినని నీవు చెప్పకుండా
యీ దినములకుముందు నీవు వాటిని విని యుండలేదు.।
8 నిజముగా నీవు వినలేదు, నీకు తెలియ లేదు, ఆదినుంచీ
నీ చెవి తెరువపడలేదు; యేమంటే నీవు ద్రోహము
చేతువనిన్ని నీ తల్లి గర్భమునుంచి అక్రమపు వాడవని
9 చెప్పబడుదువనిన్ని యెరిగి యుంటిని. । నా నామము
కొరకు నేను నా కోపమును అణచితిని; నిన్ను సంహ
రించకుండా నేను నా కీర్తి కొరకు నీ యెడల వోర్చి
10 వుంటిని.। యిదుగో నేను నిన్ను పుటము వేస్తిని, అయితే
వెండితో కాదు; కష్టమనే కొలిమి యందు నిన్ను
11 యెంచుకొంటిని. । నా విషయమే, నా విషయమే, ఆ
లాగు చేతును; యేమంటే నా నామము యేలాగు అప
విత్రము చేయపడును! నేను నా మహిమను యింకొక
12 నికి యివ్వను.।ఓ యాకోబా, నేను పిలిచిన ఇశ్రాయేలా,
నా మాట వినుము; నేను ఆయననే; నేను మొదటి వాడ
13 నున్ను వెనుకటి వాడనున్ను అయి వున్నాను. । నా
చెయ్యే భూమి అస్తిభారము వేసెను; నా కుడి చెయ్యి
ఆకాశములను కొలిచినది; నేను వాటిని పిలిస్తే అవి నిలు
14 వపడును. । మీరందరూ కూడి వచ్చి ఆలకించండి; వా
రిలో యీ సంగతులను యెవరు తెలియ చేసినారు? యె
హోవా అతని ప్రేమించెను; అతడు ఆయన చిత్తము
చొప్పున బాబెలుకు చేసును; అతని భుజము కల్దీయు
15 లకు విరోధముగా వుండును. । నేను నేనే పలికితిని;
నిశ్చయముగా నేను అతని పిలిచితిని; నేను అతని రాచే
16 సినందున అతని మార్గము సఫలమౌను. । నా యొద్దికి
రండి, దీని వినండి; నేను ఆదినుంచీ రహస్యముగా మా
ట్లాడ లేదు; అది సంభవించిన కాలమునుంచి అక్కడ
నేను వుంటిని; అయితే యిప్పుడు కర్తయైన యెహో
వాయున్ను ఆయన ఆత్మయున్ను నన్ను పంపినారు. ।
ఇశ్రాయేలుకు పరిశుద్ధుడున్ను నీ రక్షకుడున్ను అయిన 17
యెహోవా ఆనతిచ్చేదేమంటే, నేను నీ ప్రయోజన
ము కొరకు బోధించి, నీవు నడువ వలసిన మార్గమందు
నిన్ను నడిపించే దేవుడైన యెహోవానై వున్నాను. ।
నా కట్టడలను నీవు అంగీకరించి వున్నట్టయితే, నీకు 18
యెంత మేలు! అప్పుడు నీ క్షేమము నది వలెనున్ను
నీ నీతి సముద్రపు తరంగముల వలెనున్ను వుండును. ।
అప్పుడు నీ సంతానము సముద్రపు యిసుక వలెనున్ను, 19
నీ గర్భ ఫలము దాని ఫలము వలెనున్ను వుండును;
అతని నామము నా యెదుటనుంచి కొట్టివేయబడక
పోవును.। బాబెలునుంచి బయలు వెళ్లండి; కల్దీయులను 20
విడిచి, ఆనందముతో ప్రకటనచేసి, భూమి అంతము
మట్టుకున్ను దీనిని తెలియ చేయండి; యెహోవా
తన సేవకుడైన యాకోబును రక్షించెనని చెప్పండి. ।
ఆయన వీరిని అరణ్యమందు నడిపించినప్పుడు వీరికి 21
దాహము కాలేదు; వీరికి నీళ్లు రాతి కొండనుంచి వుబి
కేటట్టు చేసెను; ఆయన రాతి కొండను పగలకొట్ట
గానే వుదకములు పైకి పారెను. । దుర్మార్గులకు 22
క్షేమము లేదని యెహోవా ఆనతిస్తూ వున్నాడు.

## 49. అధ్యాయము.

ఓ ద్వీపములారా, నా మాట ఆలకించండి; దూర 1
ముగా వుండే జనులారా, శ్రద్ధగా వుండండి; యెహో
వా నన్ను తల్లి గర్భమునుంచి పిలిచెను; నా తల్లి యుద
రమునుంచి నా నామమును వుచ్చరించెను. । ఆయన 2
నా నోరు తెగువ గల కత్తి లాగున చేసెను; ఆయన
తన చేతి నీడయందు నన్ను దాచి, నన్ను మెరుగైన
అంబుగా చేసి, నన్ను తన అంబుల పొదిలో మూసి
పెట్టినాడు. । మరిన్ని ఆయన నాతో నీవే నా సేవకు 3
డవు; ఓ ఇశ్రాయేలా, నేను నీ యందు మహిమను
పొందుదునని ఆనతిచ్చెను. । అంతట నేను చెప్పినది 4
యేమంటే, నేను వృథాగా ప్రయాసపడితిని; వ్యర్థ
ముగానున్ను నిష్ప్రయోజనముగానున్ను నేను నా బల
మును వ్రయపర్చుకొంటిని; అయినప్పటికిన్ని నా న్యా
య్యము యెహోవా యొద్దనున్ను నా కార్య ఫలము
నా దేవుని యొద్దనున్ను వున్నదని చెప్పినాను. । యిప్ప 5
డు తనకు సేవకుడనయ్యేటందుకున్ను యాకోబును తన
యొద్దికి తీసుకొని వచ్చేటందుకున్ను నన్ను గర్భము
లోనుంచి రూపించిన యెహోవా ఆనతిచ్చేదేమంటే,
ఇశ్రాయేలు కూర్చబడక పోయినప్పటికీ యెహోవా

దృష్టి యందు నేను ఘనమును పొందుదును; నా దేవు
6 డు నా బలమై వుండును. । ఆయన యాకోబు గోత్ర
ములను నిర్వహించుటకున్ను ఇశ్రాయేలులో శేషించి
వున్న వారిని మళ్లించడానకున్ను నీవు నాకు సేవకుడవై
వుండేది కొంచెపు కార్యము; నీవు భూమి అంతము
పర్యంతము నా రక్షింపు అయి వుండుటకు నిన్ను
అన్య జనులకు వెలుగుగా వుంచుదును అని నాతోను
7 చెప్పెను. । ఇశ్రాయేలుకు రక్షకుడున్ను అతని పరిశుద్ధు
డున్నైన యెహోవా మనుష్యుల వల్లను వుపేక్షించ
బడినటువంటిన్ని జనాంగములకు అసహ్యుడైనటువం
టిన్ని అధికారులకు సేవకుడైనటువంటిన్ని వానితో
యీలాగున పలుకుతూ వున్నాడు, యేమంటే, రాజులు
చూచి లేతురు; నమ్మకము గల యెహోవా నిమిత్తము
న్ను నిన్ను యెంచుకొన్న ఇశ్రాయేలుయొక్క పరిశు
ద్ధుని నిమిత్తమున్ను ప్రభువులున్ను సాష్టాంగపడుదు
8 రు. । మరిన్ని యెహోవా యీలాగున పలుకుతూ
వున్నాడు; యోగ్యమైన కాలమందు నీ వేడుటలను
వింటిని; రక్షణ దినమందు నీకు సహాయము చేస్తిని;
నిన్ను నేను కాపాడి భూమిని నిర్వహించుటకున్ను,
పాడై యున్న స్వాస్థ్యములను స్వతంత్రించుకొనుట
కున్ను నిన్ను జనుల కొరకు వొడంబడికెగా యిస్తాను.।
9 అప్పుడు నీవు ఖైదీలతో బయిలు వెళ్లండి, చీకటిలో
వున్న వారితో మిమ్మును మీరు అగుపరుచుకొనండి
అని చెప్పుదువు; వారు మార్గములయందు మేతురు;
సకలమైన మెట్టల మీద వారికి మేపు కలిగి యుండు
10 ను. । వారికి ఆకలి అయినా దాహము అయినా వుం
డదు; వెట్ట అయినా యెండ అయినా వారికి తగలదు;
యేమంటే వారి యందు దయ గలవాడు వారిని తోడు
కొని, వారిని నీళ్ల కాలువల యొద్దికి కొంచ పోవును.।
11 మరిన్ని నా పర్వతములన్నిన్ని త్రోవగా చేతును; నా
12 బాటలు హెచ్చించబడును. । యిదుగో వీరు దూరము
నుంచి వత్తురు; అదుగో వీరు వుత్తరమునుంచిన్ని పడ
మటినుంచిన్ని వత్తురు; మరిన్ని వీరు సినీము దేశము
13 నుంచి వత్తురు. । ఓ ఆకాశములారా, పాడండి; ఓ
భూమీ, ఆనందమును పొందుము; ఓ పర్వతములారా,
సంగీత ధ్వని చేయండి; యేమంటే యెహోవా తన
జనులను ఆదరించెను; శ్రమపడిన తన వారి యందు
14 కృపగా వుండును. । అయితే యెహోవా నన్ను విడిచి
యున్నాడు, నా ప్రభువు నన్ను మరచి యున్నాడు,
15 అని సీయోను పలికెను. । స్త్రీ తన కడుపున పుట్టిన
కుమారుని యందు కనికరము లేక వుండే లాగు తన
చంటి పిల్లను మరుచునా? అవును వారు మరుతురు,
16 అయినప్పటికిన్ని నేను నిన్ను మరువను. । యిదుగో,
నా అరిచేతుల మీద నిన్ను పచ్చ పొడిస్తిని; నీ ప్రాకా
రములు యెప్పటికిన్ని నా యెదుట వున్నవి. । నీ పుత్రు 17
లు త్వరగా వత్తురు; నిన్ను నిర్మూలము చేసిన వారున్ను
నిన్ను పాడు చేసిన వారున్ను నిన్ను విడిచి బయిలు
వెళ్లుదురు. । నీ కన్నులను యెత్తి నఖముఖాలా చూ 18
డుము; వీరందరూ కూడుకొని, నీ యొద్దికి వత్తురు;
నీవు వీరినందరినీ ఆభరణముగా ధరించుకొని, పెండ్లి
కుమార్తెవలె వారిని అలంకారముగా కట్టుకొందువని
నా జీవము మీద వొట్టుపెట్టి చెప్పుతూ వున్నాను,
అని యెహోవా ఆనతిస్తూ వున్నాడు. । యేమంటే 19
నీ అరణ్యమున్ను నీ పాడైన స్థలములున్ను నీ నిర్మూల
మైన దేశమున్ను కాపురస్తులు విస్తరించినందుచేత నీకు
చాలా యిక్కట్టుగా వుండును; నిన్ను మింగినవారు
న్ను దూరముగా వుందురు. । నీ వైధవ్యములో నీకు 20
కలుగబోయే పుత్రులు మాకు స్థలము యిక్కట్టుగా
వున్నది, మేము కాపురము వుండేటందుకు స్థలము యి
మ్మని, నీ చెవులలో మళ్లీ పలుకుదురు. । అప్పుడు నీవు నీ 21
హృదయమందు అనుకొనేదేమంటే, వీరిని నా కొరకు
కన్నవారు యెవరు? నేను పిల్లలను పోగొట్టుకొని, వొం
టిదాననై, చెరబడి, స్థానము లేక వుంటిని గదా? వీరిని
నా కొరకు పెంచిన వారు యెవరు? యిదుగో నేను
వొంటిగా విడువపడి యుంటిని గదా? వీరు యెక్కడ
నుంచి వచ్చిరి? అని అనుకొందువు. । యిదుగో, కర్త 22
యైన యెహోవా పలికేదేమంటే, జనాంగముల తట్టు
నేను నా చేతినిన్ని జనుల తట్టు నా కొడినిన్ని యె
త్తుదును; అప్పుడు వారు నీ కుమారులను చేతులతో
యెత్తుకొని వత్తురు; నీ కుమార్తెలు భుజములచేత
యెత్తుక రాపడుదురు. । రాజులు నిన్ను పోషించే తం 23
డ్రులున్ను రాణులు నిన్ను పోషించే తల్లులున్ను అయి
వుందురు; వారు భూమి మీద సాగిలపడి, నీకు మ్రొక్కి
నీ కాళ్ల ధూళిని నాకుదురు; అప్పుడు నీవు నేను యె
హోవానై వున్నాననిన్ని నన్ను కాచుకొని వున్న
వారు సిగ్గును పొందరనిన్ని తెలుసుకొందువు. । పరా 24
క్రమశాలి చేతినుంచి కొల్ల సొమ్ము దోచుకోపడునా?
లేక కఠినులవల్ల చెర తీసుకో పోపడినవారు విడిపించ
బడ గలరా? । యిప్పుడు ఇదుగో పరాక్రమశాలులవల్ల 25
చెరపట్టబడిన వారు లాగుకొనబడుదురు; బలవంతుడు
కొల్ల పెట్టినది విడిపించబడును; నీతో వ్యాజ్యమాడే
వారితో నేను వ్యాజ్యమాడి, నీ పిల్లలను నేను రక్షిం
చుదునని యెహోవా చెప్పుతున్నాడు. । నిన్ను శ్రమ 26
పెట్టిన వారిని వారి మాంసమునే తినిపింతును; మధు
పానముచేత అయినట్టు తమ రక్తముచేతనే వారు మత్తు
ను పొందుదురు; యెహోవా అనే నేను నీ రక్షకు
డననిన్ని యాకోబుకు సర్వత్రాణ కలవాడనైన నేను

నీ విముక్తిపరుడననిన్ని సకల జనులున్ను తెలుసుకొం
దురని యెహోవా ఆనతిచ్చెను.

## 50. అధ్యాయము.

1 యెహోవా ఆనతిచ్చేదేమంటే, నేను పరిహరిం
చిన మీ తల్లియొక్క పరిత్యాగ పత్రిక యేది! లేక
నేను బాకీ వున్న వారిలో యెవనికి మిమ్మును అమ్మివే
స్తిని? యిదుగో మీ అక్రమముల నిమిత్తము మీరు
అమ్మపడితిరి; మీ అక్రమముల నిమిత్తము మీ తల్లి పరి
2 హరించబడెను. । నేను వచ్చినప్పుడు యెవ్వడూ లేక
పోవుట యేమి? నేను పిలిచినప్పుడు మారుత్తరము యి
చ్చేవాడు లేకపోవుట యేమి! నా చెయ్యి విమోచించ
లేకపోయేటట్టు అంత కురచ అయినదా? విడిపించు
టకు నాకు శక్తి లేకుండా వున్నదా? యిదుగో నా
గద్దింపుచేత నేను సముద్రమును యెండిపొయేటట్టు
చేస్తూ వున్నాను; నదులను అడవిగా చేస్తూ వున్నాను;
నీళ్లు లేనందున వాటిలో వున్న చేపలు కంపుకొట్టును;
3 దాహము చేత అవి చనిపొవును. । నేను ఆకాశములను
నలుపుతో ధరింప చేసి, గోనెపట్ట వాటికి వస్త్రముగా
4 యిస్తూ వున్నాను. । అలిసిన వానితో సమయోచిత
మైన వాక్యము యేలాగు పలుకవలెనో అది నేను
తెలిసే కొరకు కర్తయైన యెహోవా నాకు విద్యా
శాలియొక్క నాలుకను యిచ్చినాడు; ప్రత్యుదయ
మందు నన్ను ఆయన లేపుతూ వున్నాడు; నేర్చుకొనే
5 వారి వలె వినుటకు నా చెవిని తెరుస్తున్నాడు. । కర్త
యైన యెహోవా నాయొక్క చెవిని తెరిచెను; నేను
తిరుగుబాటు చేయ లేదు; నేను వెనుకకు తొలగ లేదు. ।
6 నా వీపును కొట్టే వారికిన్ని నా చెంపలను వెంట్రు
కలు పెరికివేసే వారికిన్ని అప్పగించినాను; నా ముఖ
ము అవమానమునుంచిన్ని వుమియుటనుంచిన్ని నేను
7 దాచ లేదు. । యేమంటే దేవుడైన యెహోవా నాకు
సహాయము చేస్తాడు; కాగా నేను సిగ్గుపడను; కాబట్టి
నా ముఖమును రాయి వలెనే వుంచితిని; నేను భయ
8 పడనని యెరుగుదును. । నాకు నీతి నిర్ధారణ చేసే
వాడు సమీపముగా వున్నాడు; నాతో యెవడు వ్యా
జ్యమాడును? మనము కూడుకొని నిలుతుము గాక;
నా వ్యాజ్యమునకు కార్యకర్త యెవడు? నా యొద్దికి
9 రానిమ్ము. । యిదుగో కర్తయైన యెహోవా నాకు
సహాయము చేసును; నా మీద తప్పు మోపేవాడు
యెవడు! యిదుగో వారు అందరు వస్త్రము వలె పాత
గిలి పోదురు; చిమ్మట పురుగు వారిని నాశనము చేసు
10 ను. । మీలో యెహోవా యందు భయ భక్తి గలిగి,
ఆయన సేవకుని మాట విని, వెలుగు లేక చీకటిలో
నడుస్తూ వున్నవాడు యెవడో, వాడు యెహోవా
నామమును నమ్మి, తన దేవుని మీద ఆనుకొనును గాక. ।
యిదుగో అగ్ని రాజవేసి, అగ్ని మిణుగుర్లతో చుట్టు 11
పెట్టబడే మీరందరూ మీ అగ్నియొక్క వెలుగులో
నున్ను మీరు రాజపెట్టిన అగ్ని మిణుగుర్ల కాంతిలో
నున్ను నడువండి; నా చేతివల్ల యిది మీకు కలుగును;
మీరు వేదనలో పడుకొందురు.

## 51. అధ్యాయము.

నీతిని వెంబడించి, యెహోవాను వెతికే మీరు 1
నా మాటను వినండి; మీరు యే రాతి కొండనుంచి
చెక్కి తీయ పడినారో, మీరు యే గుంతనుంచి తవ్వ
పడినారో, దాని తట్టు దృష్టించి చూడండి. । మీ తండ్రి 2
అయిన అబ్రాహాము తట్టున్ను మిమ్మును కన్న శారా
తట్టున్ను ధ్యానించి చూడండి; యేమంటే నేను వా
నిని వొంటిగా పిలిచి, ఆశీర్వదించి, వృద్ధిని పొంద
చేస్తిని. । నిశ్చయముగా యెహోవా సీయోనును ఆద 3
రించును; ఆయన దాని పాడైన స్థలములన్నిటినిన్ని సం
తోష పెట్టి, దాని అరణ్యమును ఏదెను వలెనున్ను
దాని నిర్జల భూమిని యెహోవా తోట వలెనున్ను
కాచేసును; సంతోషమున్ను ఆనందమున్ను స్తుతించు
టయున్ను సంగీతపు ధ్వనిన్ని దాని యందు కలిగి
యుండును. । నా జనులారా, నా యందు శ్రద్ధగా 4
వుండండి; ఓ నా జనాంగమా, నా మాటను ఆలకిం
చుము; యేమంటే వొక న్యాయము నా యొద్దనుంచి
బైలు వెళ్లును; నా నిబంధనను జన సమూహములకు
వెలుగుగా నిలుపుదును. । నా నీతి సమీపముగా వున్న 5
ది; నా రక్షణ బైలు వెళ్లెను; నా భుజములు జన సమూ
హములకు న్యాయమును తీర్చును; ద్వీపాంతరములు
నా నిమిత్తము కనిపెట్టి వుండును; నా హస్తము మీద
అవి ఆనుకొనును. । మీ కన్నులను ఆకాశము వైపు 6
యెత్తండి; కింద వుండే భూమిని చూడండి; యేమంటే
ఆకాశము పొగవలె అంతర్ధానమవును; భూమి వస్త్ర
మువలె పాతగిలి పోవును; దాని కాపురస్తులున్ను ఆలా
గే చనిపోదురు; అయితే నా రక్షణ యెప్పటికిన్ని
వుండును; నా నీతి తగ్గిపోయేది లేదు. । నీతిని యెరిగిన 7
వారలారా, నా న్యాయము మీ హృదయమందు ధరిం
చుకొని వున్న జనులారా, నా మాటను వినండి; మను
ష్యులచేత వచ్చిన నిందకు భయపడకుండా, వారి దూ
షణలకు వెరవక వుండండి. । యేమంటే చిమ్మట వారిని 8
వస్త్రమువలె కొట్టి వేసును; పురుగు వారిని గొర్రె బొ
చ్చువలె భక్షించును; అయితే నా నీతి యెన్నటికిన్ని
నా రక్షణ తరతరముల మట్టుకున్ను వుండును. । ఓ 9
యెహోవాయొక్క భుజమా, లెమ్ము, లెమ్ము; బలమును
తొడుగుము, పూర్వపు దినములలోనున్న పురాతనపు

తరములలోనున్న అయినట్టు లెమ్ము; రహాబును ఖండిం
చి, క్రూర సర్పమును నరికిన దానవు నీవే కదా? ।
10 అగాధ జలముగల సముద్రమును యెండి పోయేటట్టు
చేసి, రక్షింపబడిన వారు దాటిపోయేటందుకు సము
ద్రపు పల్లములను త్రోవగా చేసిన దానవు నీవే కదా? ।
11 కాబట్టి యెహోవా వల్ల రక్షించపడినవారు తిరిగీ
సంగీతనాదముతో సీయోనుకు వత్తురు; నిత్య సంతో
షము వారి తల మీద వుండును; సంతోషమున్ను ఆనం
దమున్ను వారికి కలుగును; చింతయున్ను దుఃఖమున్ను
12 తొలిగి పోవును. । నేను నేనే మిమ్ము ఆదరించే వాడను;
మృతిబొందే మనుష్యునికిన్ని గడ్డి అయ్యే మనుష్య
13 పుత్రునికిన్ని భయపడుటకు నీవు యెవడవు? । ఆకాశ
ములను పరచి, భూమికి అస్తిభారమును వేసి, నిన్ను
కలుగ చేసిన యెహోవాను మరిచేటందుకు నీవు యె
వడవు? బాధపెట్టే వాడు నశింప చేసుటకు ఆయత్త
పడి వున్నట్టే వాని వుగ్రమునకు నిత్యమున్ను భయప
డుతూ వున్న నీవు యెవడవు? బాధపెట్టే వాని వుగ్ర
14 ము యేది? । చెరపట్టబడిన వాడు విడిపించబడుటకు
త్వరపడుతూ వున్నాడు; గోతిలో వాడు చావడు;
15 వానికి ఆహారము తప్పదు. । యేమంటే కెరటములు
ఘోషించేటప్పుడు సముద్రమును బంధించే నీ దేవుడ
నైన యెహోవాను నేనే; ఆయన నామము సైన్య
16 ముల యెహోవా. । నీ నోట నా మాటలను వుంచి
నాను; నేను ఆకాశమును నాటి, భూమికి అస్తిభారము
వేసి, సీయోనుతో నీవు నా జనమై వున్నావని చెప్పే
టందుకు నా చేతి నీడ కింద నిన్ను దాచి వున్నాను. ।
17 లెమ్ము, లెమ్ము, యెహోవా వుగ్రపాత్రను ఆయన
చేతినుంచి పుచ్చుకొని తాగిన ఓ యెరూశలేమా, నిలు
వబడుము; నీవు మత్తు పుట్టించే పాత్ర అడుగున వున్న
18 మడ్డిని భొత్తిగా తాగితివి. । ఆబిడె కనిన కుమారులలో
దాని సౌమ్యతగా నడిపించే వారు యెవరూ లేరు;
ఆబిడె పెంచిన యావత్తు కుమాళ్లలోనున్న దానికి
19 చెయ్యి యిచ్చి పిలిచేవారు యెవరూ లేరు. । యీ
రెండూ నీకు సంభవించినవి; నీ విషయమై విచారపడే
వాడు యెవడు? పాడున్ను యిక్కట్టున్ను కరువున్ను
కత్తిన్ని వచ్చెను; యెవరి ద్వారా నేను నిన్ను ఓదా
20 ర్తును? । నీ కుమారులు మూర్ఛిల్లినారు; వారు వలలో
చిక్కుపడిన అడవి జింకవలె యావత్తు వీధుల మూలల
లో పడియున్నారు; యెహోవా యుగ్రముతోను
న్ను నీ దేవుని గద్దింపుతోనున్న నిండి యున్నారు. ।
21 అయినందున మధుపానముచేత కాకుండా స్మృతి తప్పి
22 శ్రమపడిన దానా, నీవు వినుము. । కర్తయైన యె
హోవాయున్ను తన జనుల కొరకు వ్యాజ్యమాడబో
యే నీ దేవుడున్ను చెప్పేదేమంటే, యిదుగో మత్తు
పుట్టించే పాత్రను నీ చేతినుంచి నేను తీసివేస్తూ
వున్నాను; నా వుగ్ర పాత్రలోనున్న మడ్డిని నీవు
మరి తాగేది లేదు. । అయితే నిన్ను బాధించినటువం 23
టిన్ని మేము దాటిపోయే కొరకు కిందికి వంగుమని నీ
యాత్మతో చెప్పినటువంటిన్ని వారి చేతులలో నేను
దాని పెట్టుదును; నీవు నీ శరీరమును నేల వలెనున్న
వీధి వలెనున్న దాటిపోయిన వారి కొరకు పెట్టితివి.

## 52. అధ్యాయము.

లెమ్ము, లెమ్ము, ఓ సీయోనా, నీ బలమును ధరించు 1
కొమ్ము; పరిశుద్ధ పట్టణమైన ఓ యెరూశలేమా, నీ
సుందరమైన వస్త్రములను ధరించుకొమ్ము; యేమంటే
సున్నతీ కానివారున్ను అపవిత్రులున్ను నీలో మరి
ప్రవేశించరు. । ఓ యెరూశలేమా, ధూళిని దులిపి వేసు 2
కొని, లేచి, కూర్చుండుము; ఓ చెరపెట్టబడిన సీయో
ను కుమారికా, నీ మెడకట్లను విప్పి వేసుకొమ్ము. । యే 3
మంటే మీరు విలువ లేకుండా అమ్మబడితిరి; ద్రవ్యము
యివ్వకుండా రక్షించ బడుదురని యెహోవా ఆన
తిస్తూ వున్నాడు. । పూర్వమందు నా జనులు కొంత కా 4
లము నివసించుటకు మిస్రయీముకు దిగి వెళ్లిరి; అష్షూ
రు దేశస్థులు నిమిత్తము లేకుండా వారిని కష్టపెట్టిరి,
అని కర్తయైన యెహోవా చెప్పుతూ వున్నాడు. ।
కాగా యిక్కడ నాకు యేమి వున్నది? యేమంటే నా 5
జనులు నిర్హేతువుగా కొంచపోపడినారు; వారిని
యేలే కర్తలు వారిని తల్లడింప చేస్తూ వున్నారు; నిత్య
మున్ను ప్రతి దినమున్ను నా నామము దూషించబడు
తున్నది, అని యెహోవా ఆనతిస్తూ వున్నాడు. ।కా 6
బట్టి నా జనులు నా నామమును యెరుగుదురు; కాబ
ట్టి అది చెప్పేవాడను నేనే; యిదుగో నేనే అని ఆ
దినమందు వారు తెలుసుకొందురు. । సమాధానమును 7
ప్రకటించి, శుభసమాచారమును తెలిపి, రక్షణను
గురించి చాటించి, సీయోనుతో నీ దేవుడు రాచరికము
చేస్తూ వున్నాడని చెప్పి, ప్రచురము చేసే వారి కాళ్లు
కొండల మీద యెంత అందమైనవి! । నీ కాపరుల శబ్ద 8
ము వినపడును; వారు తమ శబ్దమును యెత్తి, యేకముగా
పాడుతున్నారు; యేమంటే యెహోవా సీయోనును
తిరుగా తెచ్చేటప్పుడు వారు ముఖాముఖిగా చూచు
కొందురు. । యెరూశలేముయొక్క పాడైన స్థలములా 9
రా, సంతోషముగా వుండి, యేకముగా ఆర్భటిం
చండి; యేమంటే యెహోవా తన జనులను ఆదరించి,
యెరూశలేమును రక్షించినాడు. । సకల జనాంగముల 10
కన్నుల ముందర యెహోవా తన పరిశుద్ధమైన భుజ
మును బైలుపరచెను; భూమియొక్క యావత్తు సరిహ
ద్దులు మన దేవుని రక్షణను చూచును. । ఆ స్థలమును 11

విడిచి బైలు వెళ్లండి; బైలు వెళ్లండి; అపవిత్రమైన
వాటిని ముట్టకండి; యెహోవాయొక్క పాత్రలను
మోసే వారలారా, దానిలోనుంచి మీరు బైలు వెళ్లి,
12 పరిశుద్ధముగా వుండండి. । యేమంటే మీరు త్వరగా
నైనా బైలు వెళ్లరు; పారిపోయే వారుగానైనా బైలు
వెళ్లరు; యేమంటే యెహోవా మీకంటే ముందుగా
నడుచును; ఇశ్రాయేలు దేవుడు మిమ్మును చేర్చును. ।
13 యిదుగో నా సేవకుడు వృద్ధి పొంది, హెచ్చింపపడి,
మహిమగానున్ను మహోన్నతముగానున్ను వుండు
14 ను. । రే మనుష్యుని ముఖలక్షణము కంటే ఆయన
ముఖలక్షణమున్ను మనుష్య పుత్రుల రూపము కంటే
ఆయన రూపమున్ను వికారముగా వుండినందున అనే
15 కులు నిన్ను గురించి విభ్రాంతి పొందిరి. । ఆ ప్రకా
రము ఆయన అనేక జనాంగముల మీద చిలకరించును;
ఆయన విషయమై రాజులు తమ నోరు మూసుకొం
దురు; యేమంటే వారికి తెలియచేయపడనివి వారు
చూతురు; వారికి వినపడనివి వారు తెలుసుకొందురు.

## 53. అధ్యాయము.

1 మా వర్తమానమును విశ్వసించినవాడు యెవడు?
యెహోవా భుజము యెవరికి బైలుపరచపడెను? ।
2 యేమంటే లేత మొక్క వలెనున్ను యెండిన భూమి
లోనుంచి లేచే చిగురు వలెనున్ను ఆయన ముందర
ఆయన పెరుగును; ఆయనకు మంచి రూపమైనా అం
దమైనా లేదు; మనము ఆయనను చూచినప్పుడు కోర
3 తగిన సౌందర్యము ఆయన యందు కనుబడదు. । ఆయన
మనుష్యులవల్ల విసర్జించపడి అలక్ష్యమును పొందిన
వాడు; ఆయన చింతాక్రాంతుడు; దుఃఖమును తెలి
సిన వాడు; ఆయననుంచి మనము ముఖములు దాచు
కొంటిమి; ఆయన అలక్ష్యమును పొందెను; మనము
4 ఆయనను యెన్నిక చేయలేదు. । నిజముగా ఆయన
మన బలహీనతలను తాను పైని వేసుకొని, మన వేదన
లను మోసుకొనెను; అయినప్పటికిన్ని దేవుని వల్ల
ఆయన కొట్లపడి, పాట్లను అనుభవించి, బాధింపబడిన
5 వానిగా మేము యెంచుకొంటిమి. । అయితే ఆయన
మన తప్పితముల నిమిత్తము గాయమును పొంది, మన
అక్రమముల నిమిత్తము నలగబడెను; మన సమాధానా
ర్థమైన శిక్ష ఆయన మీద వుండెను; ఆయన దెబ్బ
6 లవల్ల మనము గుణపడుతున్నాము. । మనమందరమూ
గొర్రెలవలె తోవ తప్పి, తన తన మార్గములోకి ప్రతి
వాడూ తిరిగిపోతిమి; అయితే యెహోవా మన అం
దరియొక్క అక్రమ శిక్షను ఆయన మీద మోపెను. ।
7 ఆయన మిక్కిలీ బాధపడి శ్రమ ననుభవించినప్పటికీ
తన నోరును తెరచలేదు; ఆయన వధకు తేబడిన గొ
ర్రెపిల్ల వలెనున్ను దాని బొచ్చు కత్తిరించే వాని ముం
దర మౌనముగానున్న గొర్రెవలెనున్ను తన నోరు తెర
చలేదు. । ఆయన నిర్బంధమునుంచిన్ని న్యాయపు తీర్పు 8
నుంచిన్ని కొంచపోపడెను; ఆయన తరమును యెవరు
చెప్పగలరు? యేమంటే జీవస్థులయొక్క భూమిలో
నుంచి ఆయన ఖండించబడెను; నా జనులయొక్క
అక్రమము కొరకు ఆయన కొట్టబడెను. । దుర్మార్గులతో 9
కూడా ఆయనకు సమాధి నియమించబడెను; అయితే
ఆయన తన మరణమందు ఐశ్వర్యవంతునితో కూడా
వుండెను; యేమంటే ఆయన చెడ్డతనమును చేయలేదు;
ఆయన నోట కపటము యెంత మాత్రము లేదు. ।
అయినప్పటికిన్ని ఆయనను నలగకొట్టుటకు యెహోవా 10
వాకు చిత్తము కలిగి వుండెను; ఆయనను దుఃఖపెట్టి
నాడు; తన ఆత్మను ఆయన పాపమునకు బలిగా చెల్లిం
చినప్పుడు ఆయన తన సంతానమును చూచును; ఆయన
తన దినములను పొడుగు చేసుకొనును; యెహోవాకు
అనుకూలమైనది ఆయన చేతిలో వృద్ధి పొందును. ।
ఆయన తన ఆత్మకు కలిగిన ప్రయాస ఫలమును చూచి 11
తృప్తిని పొందును; తన్ను గూర్చిన తెలివి చేత నా
నీతి గల సేవకుడు అనేకులను నీతిమంతులగా చేసును;
యేమంటే ఆయన వారి అక్రమములను మోసుకొను
ను. । కాగా నేను బలిష్ఠులతో ఆయనకు పాలు పంచి 12
పెట్టుదును; ఘనులతో ఆయన కొల్ల సొమ్మును విభా
గించును; యేమంటే ఆయన తన ఆత్మను మరణము
మట్టుకు ధారపోసుకొని, పాపాత్ములతో యెంచబడిన
వాడై, అనేకుల పాపములను భరించి, దుష్టుల కొరకు
వేడుకొనెను.

## 54. అధ్యాయము.

పిల్లను కనని వొ గొడ్రాలా, పాడుము; ప్రసవ 1
వేదన పొందనిదానా, నీవు ఆర్భటించి, సంతోషపు
శబ్దము చేయుము; యేమంటే సంసారికి వున్న పిల్లల
కంటే విడువబడిన దాని పిల్లలు విస్తారమని యెహో
వా చెప్పుతూ వున్నాడు. । నీ గుడారపు స్థలమును 2
విశాలపరచుము; నీ నివాస స్థానములయొక్క తెరలు
సాగబడి యుండనిమ్ము; అభ్యంతరము చేయకుము; నీ
తాళ్లను పొడుగు చేసి, నీ మేకులను బలపర్చుము. ।
యేమంటే కుడి యెడమ వైపుల కూడా నీవు స్థలమును 3
పెంచుదువు; నీ సంతానము జనాంగములను స్వతంత్రిం
చుకొని, పాడైన పట్టణములను కాపురముగా చేసును. ।
భయపడకుము, యేమంటే నీకు సిగ్గు కలుగబోదు; 4
కలత పడవద్దు, యేమంటే నీవు లజ్జను అనుభవించవు;
నీ బాల్యపు నాటి సిగ్గును నీవు మరచి, నీ వైధవ్యపు
నిందను యిక తలంచకుండా వుందువు. । యేమంటే 5

నిన్ను కలుగ చేసిన వాడు నీకు పెనిమిటి అయి వున్నా
డు; ఆయన పేరు సైన్యముల యెహోవా; ఇశ్రాయే
లుకు పరిశుద్ధమైన వాడే నీ రక్షకుడు; భూమి అంత
6 టికీ దేవుడని ఆయన పిలువబడును. । యేమంటే తోలి
వేయబడి దుఃఖిస్తూ వున్న స్త్రీవలె నిన్ను యెహో
వా పిలిచి వున్నాడు; నీవు విడిచి పెట్టబడినప్పటికిన్ని
లేత వయస్సు గల భార్యవలె నిన్ను మళ్లీ అంగీకరిస్తా
7 నని నీ దేవుడు చెప్పుతున్నాడు.।నిముషమాత్రము నేను
నిన్ను విసర్జించితిని, అయితే చాలా దయతో నిన్ను
8 చేర్చుకొందును. । కించిత్కోపమందు నా ముఖమును
నీకు దాచితిని, అయితే నిత్యోపకారమువల్ల నీకు దయ
చూపింతునని, యెహోవా అయిన నీ రక్షకుడు చెప్పు
9 తూ వున్నాడు. । యిది నాకు నోవహు దినమందు
వుండిన జలముల వలె వుండును; యెందుచేతనంటే
నోవహుయొక్క జలములు భూమి మీద యికను
పొర్లక వుండునని నేను వొట్టు పెట్టినట్టుగా నీ మీద
నేను కోపముగా వుండననిన్ని నిన్ను గద్దించననిన్ని
10 వొట్టు పెట్టుకొంటిని. । పర్వతములు తొలిగి, మెట్టలు
పోయినప్పటికిన్ని నా అనుగ్రహము నిన్ను విడిచి
పోదు; నా సమాధానమును గురించిన వొప్పందము తిరిగి
పోదని నీ మీద దయ గలిగిన యెహోవా చెప్పు
11 తూ వున్నాడు. । ఆదరణ లేకుండా ప్రళయ వాయు
వుచేత కొట్టబడి, శ్రమ పొందిన దానా, యిదుగో,
నేను నీ రాళ్లను ఇంగిలీకపు వర్ణము వంటి జిగటవల్ల
మెరుగుగా వుంచి, నీలములవల్ల నీకు అస్తిభారము వేస్తా
12 ను. । నీ కిటికీలను అకీక రాళ్లవల్లనున్ను నీ ద్వారము
లను సూర్య కాంతముల వల్లనున్ను నీ యావత్తు సరి
హద్దులను ప్రశస్తమైన రాళ్లవల్లనున్ను కాచేతును. ।
13 నీ పిల్లలందరు యెహోవా చేత బోధించబడుదురు;
నీ పిల్లలు అనుభవించే క్షేమము బహుగా వుండును. ।
14 నీవు నీతి యందు దృఢపరచబడుదువు; శ్రమకు దూర
ముగా వుందువు; యేమంటే నీకు భయము కలుగబోదు;
హింసకు దూరముగా వుందువు; అది నిన్ను అంటదు.।
15 యిదుగో వారు గుంపు కూడుదురు, అయితే నావల్ల
నయ్యేది లేదు; నీకు యెవరు విరోధముగా గుంపు కూ
16 డుదురో వారు నీ విషయమై పడిపోదురు. । యిదుగో
నిప్పులు వూది, తన పనికి తగిన వస్తువును చేసే కంసా
లిని నేను సృష్టిస్తిని; చెరుపుటకు పాడుచేసే వానిని
17 కూడా నేను సృష్టిస్తిని.।నీకు విరోధముగా యే ఆయు
ధము చేయబడునో అది వృద్ధి పొందదు; నీకు విరో
ధముగా లేచి, పోరాడే నాలుకను నీవు విరోధింతువు.
యిది యెహోవా సేవకులయొక్క స్వతంత్రమున్ను
నా వల్లను వారికి కలిగే నీతిన్ని అని యెహోవా
చెప్పుతూ వున్నాడు.

## 55. అధ్యాయము.

ఓ హో, దాహము గల మీరందరూ, నీళ్లయొద్దికి 1
రండి; ద్రవ్యములేని వారలారా, మీరు వచ్చి, కొని,
తినుడి; రండి, ద్రవ్యము లేకుండానున్ను క్రయము
లేకుండానున్ను ద్రాక్షారసమునున్ను పాలనున్ను కొ
నండి. । మీరు ఆహారము కాని దాని కొరకు ద్రవ్యము 2
నున్ను సంతుష్టిని కలుగ చేయని దాని కొరకు మీ
ప్రయాసమునున్ను వ్రయపరుస్తూ వుండెదరేమి? మీరు
నా శబ్దమును జాగ్రతగా ఆలకించి, మేలైనది భుజిం
చండి; అప్పుడు మీ ఆత్మ సమృద్ధిని పొంది ఆనందము
గా వుండును. । మీ చెవి వొగ్గి, నా యొద్దికి రండి; 3
వినండి, అప్పుడు మీ ఆత్మ బ్రతుకును; దావీదుకు నిశ్చ
యింపబడిన వుపకారములు, అనగా, నిత్యమైన వొప్పం
దమును మీతో చేతును. । యిదుగో నేను ఆయనను 4
ప్రజలకు సాక్షిగానున్ను జన సమూహములకు అధిపతి
గానున్ను అధికారిగానున్ను యిస్తిని. । యిదుగో నీవు 5
తెలియని జనాంగమును పిలుతువు; నిన్ను యెరుగక
వున్న జనులు నీ దేవుడయిన యెహోవా నిమిత్త
మున్ను ఇశ్రాయేలుయొక్క పరిశుద్ధుని నిమిత్తమున్ను
నీ యొద్దికి పరుగెత్తి వత్తురు; యేమంటే ఆయన నిన్ను
మహిమపరచినాడు. । యెహోవా కనుపడ గలిగిన 6
ప్పుడు ఆయనను వెతుకండి; ఆయన సమీపముగా వున్న
ప్పుడు ఆయనను వేడుకొండి. । దుష్టుడు తన దుమార్గ 7
గతనున్ను అనీతిపరుడు తన తలంపులనున్ను విడిచి
పెట్టును గాక; వాడు యెహోవా యొద్దికి మళ్లును
గాక, అప్పుడు ఆయన వానిమీద కనికరముగా వుం
డును; మన దేవుని యొద్దికి వాడు మళ్లును గాక, యేమం
టే ఆయన విస్తారముగా క్షమించేవాడై యున్నాడు.।
యేమంటే నా తలంపులు మీ తలంపులు కావు; మీ 8
త్రోవలు నా త్రోవలు కావు, అని యెహోవా
చెప్పుతూ వున్నాడు. । యేమంటే భూమికంటే ఆకా 9
శములు యేలాగున యెత్తుగా వున్నవో, ఆలాగునే
మీ మార్గముల కంటే నా మార్గములున్ను మీ తలం
పుల కంటే నా తలంపులున్ను యెత్తుగా వున్నవి. ।
యేమంటే వర్షమున్ను మంచు పెల్లలున్ను ఆకాశ 10
మునుంచి దిగి, అక్కడికి మళ్లకుండా భూమిని తడిపి,
ఫలమునున్ను వృద్ధినిన్ని పొందేటట్టు చేసినందున అది
విత్తే వానికి విత్తనమునున్ను భుజించేవానికి ఆహారము
నున్ను యే ప్రకారముగా యిస్తున్నదో, । ఆ ప్రకార 11
ముగానే నా నోటినుంచి బైలు వెళ్లే వచనమున్ను
వుండును; అది వూరకె నా యొద్దికి మళ్లకుండా, నాకు
అనుకూలమైన దాని నెరవేర్చును; నేను దాని అంపిన
కార్యము విషయమయి అది సఫలము పొందును. ।

12 యేమంటే మీరు ఆనందముగా బైలు వెళ్లి, సమాధానము
గా కొంచపోబడుదురు, పర్వతములున్ను మెట్టలున్ను
మీ ముందర సంగీతనాదము చేసును; సకలమైన అడవి
13 చెట్లున్ను చప్పట్లు కొట్టును. । ముండ్ల చెట్లకు బదులు
గా దేవదారు వృక్షము మొలుచును; ముండ్ల తుప్పలకు
బదులుగా మిరుదు చెట్టు యెదుగును; అది యెహోవా
వాకు కీర్తిగానున్ను నిర్మూలము కాని నిత్యమైన గురు
తుగానున్ను వుండును.

## 56. అధ్యాయము.

1 యెహోవా చెప్పేదేమంటే, మీరు న్యాయము
ను గైకొని, నీతిని జరిగించండి; యేమంటే నా రక్షణ
వచ్చుటకు సమీపముగా వున్నది; నా నీతి బైలుపడే
2 కాలము వచ్చును. । సబ్బాతును అపవిత్ర పరచకుండా
దాని గైకొని, కీడును చేయకుండా తన చేతిని కాచు
కొని యుండే మనుష్య పుత్రుడున్ను యీ ప్రకారము
చేసి, దీని వెంబడించిన మనుష్యుడున్ను భాగ్యవంతు
3 డు. । యెహోవాను చేరుకొనిన అన్యునియొక్క పు
త్రుడు యెహోవా తన జనులనుంచి నన్ను బొత్తిగా
విభజన చేసెనని చెప్పక వుండును గాక; మరిన్ని యి
దుగో నేను యెండిపోయిన చెట్టును అని షండుడు
4 చెప్పక వుండును గాక. । యేమంటే నా సబ్బాతులను
గైకొని, నాకు అనుకూలముగా వుండే వాటిని యెంచు
కొని, నా వొప్పందమును అంగీకరించిన షండులను
5 గురించి యెహోవా ఆనతిచ్చేదేమంటే, । నా యిం
ట్లోనున్ను నా ప్రాకారములలోనున్ను కుమాళ్ల కంటే
నున్ను కుమార్తెల కంటేనున్ను వుత్తమమైన స్థలము
నున్ను నామమునున్ను నేను వారికి దయచేతును; నశిం
6 చని నిత్య నామమును వారికి నేను యిత్తును. । మరిన్ని
యెహోవాను సేవించుటకున్ను యెహోవా నామ
మును ప్రేమించేటందుకున్ను ఆయన సేవకులైయ్యేటం
దుకున్ను ఆయనను చేరుకొని, సబ్బాతును అపవిత్రము
చేయకుండా దాని గైకొని, నా వొప్పందమును అంగీ
కరించే అన్యునియొక్క పుత్రులనందరిని నేను నా పరి
7 శుద్ధ పర్వతమునకు కొంచవచ్చి, । వారిని నా ప్రార్థ
నపు యింట్లో ఆనందము కలుగజేతును; వారి హో
మార్పణలున్ను వారి బలులున్ను నా బలిపీఠము మీద
అంగీకరించబడి వుండును; యేమంటే నా యిల్లు సకల
8 జనులకు ప్రార్థనపు యిల్లు అనబడును. । చెదిరిపో
యిన ఇశ్రాయేలీయులను చేర్చుకొనే కర్త అయిన
యెహోవా చేర్చపడిన వారిని వినాగా యింకా
నేను యితరులను ఆయన యొద్దికి చేర్చుదునని ఆనతి
9 స్తూ వున్నాడు. । పొలములలో వున్న సకల మృగము
లారా, అరణ్యములో వున్న సకల మృగములారా,
భక్షించుటకు రండి. । వాని కాపరులు అందరూ అజ్ఞా 10
నులున్ను గుడ్డివారున్నై వున్నారు; వారందరూ అరవ
లేని మూగ కుక్కలు; వారు కలవరిస్తూ, పండుకొంటూ,
నిద్రను అపేక్షిస్తూ వున్నారు. । నిజముగా వారు తిం 11
డికి ఆతురపడే కుక్కలు; తృప్తిని పొందుటకు యెర
గరు, వారు తెలివిలేని మంద కాపరులు; ప్రతివాడూ
తన తన మూలనుంచి తన లాభమునే వెతికి, తన మా
ర్గమునే చూస్తూ వున్నాడు. । రండి, మనము మధు 12
పానము తెచ్చుకొని, బలమైన రసమును తాగుదాము;
రేపటి దినము యీ ప్రొద్దుటి దినము వలెనున్ను
యింత కన్న అధికముగానున్ను వుండునని వారు పలు
కుదురు.

## 57. అధ్యాయము.

నీతిమంతుడు హరించి పోతూ వున్నాడు, అయితే 1
యెవడైనా దాని మనస్సు యందు వుంచడు; సన్మార్గు
లు తీసుకో పోబడుతూ వున్నారు, అయితే వచ్చే కీడు
నుంచి నీతిమంతుడు తీసుకో పోబడుతూ వున్నాడని
యోచించేవాడు యెవడూ లేడు. । వాడు నెమ్మదిలో 2
ప్రవేశించును; యథార్థముగా నడిచే వారందరూ
తమ పడకల యందు విశ్రమింతురు. । అయితే చిల్లంగి 3
దాని పిల్లలారా, వ్యభిచారునికిన్ని వేశ్యకున్ను సంతతి
అయిన వారలారా, మీరు యిక్కడికి రండి. । యెవరికి 4
విరోధముగా అపహాస్యమును చేస్తూ వున్నారు! యె
వరి మీద నోరు విస్తారముగా తెరచి, నాలుకను చాపు
తూ వున్నారు! మీరు అక్రమపు పిల్లలు కారా! దొంగ
వంశము కాదా! । మీరు సకలమైన పచ్చని చెట్లకింద 5
విగ్రహముల యెడల మోహాతురులై, రాతి పణుకుల
కింద వున్న పల్లముల యందు పిల్లలను చంపుతూ
వున్నారు. । గోర్జల యందుండే పల్లపు స్థలముల 6
యందు నీ భాగము వున్నది; అవే అవును, అవే నీ
పాలు, వీటికి సహా నీవు పానార్పణనున్ను మాంసా
ర్పణనున్ను చెల్లించినావు; వీటి యందు నేను సంతో
షింతునా! । నీవు మహోన్నతమైన పర్వతము మీద 7
నీ పరుపును వేసుకొన్నావు; అక్కడికి సహా బలి
అర్పించడానకు నీవు యెక్కి పోయినావు. । తలుపుల 8
కున్ను ద్వారబంధములకున్ను వెనుకగా నీవు నీ జ్ఞాపక
సూచనను వుంచినావు; యేమంటే నీవు నన్ను విడిచి
పెట్టి, యింకొకని యొద్దికి వెళ్లి, నీవు నీ పరుపును
వెడల్పు చేసుకొని, వారితో వొప్పందము చేసి, వారి
పరుపు నీవు యెక్కడ చూచినావో దానిని అపేక్షి
స్తివి. । నీవు రాజుకు కానుకగా తైలమును కొంచుబో 9
యి, నీ పరిమళ వస్తువులను విస్తరింపచేసి, నీ దూతలను
దూరమునకు పంపి, నిన్ను నీవు పాతాళము మట్టుకు

10 నీచపచుకొంటివి. । నీ విస్తారమైన ప్రయాణముల
చేత నీవు ప్రయాసమును పొందితివి; అయితే అది
వ్యర్థమని నీవు చెప్పలేదు, నీ చేతి చేతనైన బ్రతు
కును కనుగొంటివి, అయినందున నీవు అధైర్యమును
11 పొందలేదు. । నీవు యెవరిని గూర్చి సిగ్గుగానున్ను
భయముగానున్ను వున్నావు? నీవు నన్ను తలంచకుం
డానున్ను నీ మనస్సుయందు వుంచకుండానున్ను నన్ను
గురించి అబద్ధికుడవై వుంటివే; బహు కాలమునుంచి
నేను మౌనముగా వుంటిని గదా? అయితే నాకు భయ
12 పడకుండా వున్నావు. । నీ నీతినిన్ని నీ క్రియలనున్ను
నేను తెలియ చేతును; అవి నీకు ప్రయోజనము అయి
13 వుండవు. । నీవు మొర్రపెట్టినప్పుడు నీ గుంపులు నిన్ను
తప్పించును గాక; అయితే గాలి వారినందరినీ యెగర
కొట్టును; మాయ వారిని కొంచుబోవును; అయితే
నన్ను నమ్మేవాడు దేశమును స్వతంత్రించుకొని, నా
14 పరిశుద్ధ పర్వతమును అనుభవించును. । నా జనులకు మా
ర్గమునుంచి అభ్యంతరమైనది తీసి వేయండి, త్రోవ
ను సిద్ధపచుకొనండి, దాని సిద్ధముగా చేయండని
15 ఆయన పలుకును. । నిత్యత్వమందు నివాసియైనటువం
టిన్ని పరిశుద్ధుడు అనే నామము గల అతిశయుడున్ను
వున్నతుడున్ను అయినవాడు చెప్పేదేమంటే, నేను
వున్నతమున్ను పరిశుద్ధమున్ను అయిన స్థలమందు నివా
సము చేస్తున్నాను; మరిన్ని నలిగిన హృదయము కల
వారిని బ్రతికించేటందుకున్ను కష్టపడిన వారి హృద
యమును వూరడాచుటకున్ను యిక్కట్టు పడినటువం
టిన్ని వినయము కలిగినటువంటిన్ని ఆత్మగల వారి యం
16 దున్ను వాసము చేస్తూ వున్నాను. । యేమంటే నేను
నిత్యమున్ను పోరాడను; నేను యెప్పటికిన్ని కోపము
గా వుండను; ఆలాగు వుంటే నేను కలుగచేసిన ఆత్మలు
17 నా ముందర క్షీణించి పోవును. । వాని అక్రమమైన
ధనాపేక్ష నిమిత్తము నేను బహు కోపముగా వుండి,
వాని కొట్టితిని; నేను చాటుగా వుండి, బహు కోప
ముగా వుంటిని గాని వాడు తన మనస్సు చొప్పున
18 మూర్ఖతగా నడిచెను. । వాని మార్గములను నేను
చూచినాను; వాని గుణపరుచుదును; నేను వాని నడి
పించి, వానినిన్ని వానియొక్క దుఃఖపడే వారినిన్ని
19 తిరుగా ఆదరింతును. । నేను పెదవుల ఫలమును సృష్టి
స్తూ వున్నాను; దూరముగా వుండే వానికిన్ని సమీప
ముగా వుండే వానికిన్ని క్షేమము, క్షేమము, కలు
గును గాక; నేను వారిని గుణపరచుదునని యెహోవా
20 ఆనతిస్తూ వున్నాడు. । అయితే దుర్మార్గులు కలత
గల సముద్రము వలె వున్నారు; యేమంటే అది నిమ్మ
ళించ లేనందున దాని జలములు బురదనున్ను మైలను
న్ను పైకి లేవనెత్తును. । దుర్మార్గులకు క్షేమము లేదని 21
నా దేవుడు చెప్పుతూ వున్నాడు.

## 58. అధ్యాయము.

ఆచుకోక కేకలు వేయుము; నీ శబ్దము బూరా 1
వలె యెత్తి, నా జనులకు వారి అక్రమములనున్ను యా
కోబు యింటి వారికి వారి పాపములనున్ను తెలియ
చేయుము. । యథార్థముగా జరిగించి, తమ దేవుని 2
నిర్ణయమును విడువని జనాంగము వలె వారు నన్ను
ప్రతి దినమున్ను వెతికి, నా మార్గములను యెరుగనపే
క్షింతురు; వారు నీతియొక్క నిర్ణయములను గురించి
నన్ను అడుగుదురు; దేవుని యొద్దికి చేరుటకు అపేక్షిం
తురు. । మేము వుపవాసము చేసి వుంటిమి, మీరు యెం 3
దుకు చూడలేదు? మేము మా ఆత్మలను కష్టపెడుతూ
వుండగా మీరు యెందుకు లక్ష్యపెట్టలేదని, వారు
పలుకుతున్నారు. యిదుగో, మీరు వుపవాసము చేసే
దినమందు మీ భోగమును మీరు అనుభవించి, మీ
కష్ట ప్రయోజనములను మీరు చేయింతురు. । యిదుగో 4
మీరు కలహము కొరకున్ను వాదము కొరకున్ను అన్యా
యముగా గుద్దులాడేటందుకున్ను వుపవాసము చేస్తూ
వున్నారు; మీరు మీ శబ్దము పైకి వినపడే కొరకు
యీ దినమందైనట్టు వుపవాసముగా వుండకండి. । మను 5
ష్యుడు వొక దిన మాత్రమున తన ఆత్మను బాధపెట్టు
టూ, తన తలను తుంగవలె వంచుకొని, తన కింద గోనె
పట్టనున్ను బూడిదెనున్ను పరుచుకొనుటూ, నేను యే
ర్పరచుకొనిన వుపవాసము యిటువంటిదా? యిది వుప
వాసమనిన్ని యెహోవాకు అనుకూలమైన దినమనిన్ని
నీవు పలుకుదువా? । అన్యాయపు కట్లను విప్పుటయు 6
న్ను బరువైన మోపులను చులకన చేసుటయున్ను బాధ
గల వారిని విడుదల చేసుటయున్ను యావత్తు కాడ్లను
విరగ కొట్టుటయున్ను నేను యేర్పరచుకొనిన వుప
వాసము యిదే కదా? । మరిన్ని ఆకలిగల వానికి నీ 7
ఆహారము యిచ్చుటయున్ను వెలివేయబడ్డ బీదలను నీ
యింట్లోకి తెచ్చుటయున్ను వస్త్రహీనుని చూచినప్పు
డు వానికి కప్పుటయున్ను నీ బంధువుడైన వానినుంచి
నిన్ను నీవు దాచుకొనక వుండుటయున్ను యిదే కదా? ।
అప్పుడు నీ వెలుగు వుదయము వలె వికసించి, నీ స్వస్థత 8
శీఘ్రముగా బైలు వెళ్లును, నీ నీతి నీ ముందర నడుచును;
యెహోవాయొక్క మహిమ నీ వెనుక తట్టున నిన్ను
కాచును. । అప్పుడు నీవు పిలుతువు, యెహోవా మా 9
రుత్తరము యిచ్చును; నీవు కేక వేతువు, యిదుగో నేను
వున్నానని ఆయన చెప్పును. నీవు నీ మధ్యనుంచి కా
డిని దించివేసి, వేలు చాపుటనున్ను అన్యాయపు మాట
లనున్ను తీసివేసి, । ఆకలిగా వున్న వానికి నీ కనికరము 10

చూపించి, శ్రమపడిన ఆత్మకు తృప్తిపర్చితే, అప్పుడు
నీ వెలుగు చీకటియందు వుదయించి, నీ అంధకారము
11 మధ్యాహ్నము వలె వుండును. । యెహోవా నిన్ను
విడువకుండా నడిపించి, మహా క్షామ కాలమందు నీ
ఆత్మను తృప్తిపర్చి, నీ యెముకలను బలపర్చును; అప్పుడు
నీవు నీళ్లు పోయబడిన తోట వలెనున్ను వంచించని
12 వుదకములు గల నీటి వూట వలెనున్ను వుందువు. । నీ
యొద్దనుంచి వచ్చినవారు చాలా కాలమునుంచి పా
డైన స్థలములను కట్టుదురు; తరతరములనుంచి వున్న
అస్తిభారములను నీవు లేవనెత్తుదువు; విరగబడిన దాని
బాగు చేసే వాడవనిన్ని కాపురము చేసేటందుకు మా
ర్గములను స్థిరపర్చేవాడవనిన్ని నీవు పిలువబడుదువు.।
13 నీవు నా పరిశుద్ధ దినమందు నీ యిచ్ఛ చొప్పున చేయ
కుండానున్ను నీ కాళ్లను సబ్బాతు దినమునుంచి తొల
గించి; సబ్బాతు దినము మనోహరముగా వున్నదనిన్ని
అది యెహోవాయొక్క పరిశుద్ధ దినమనిన్ని ఘనము
గల దినమనిన్ని చెప్పి, నీ మార్గముల చొప్పున చేయ
కుండానున్ను నీ యిచ్ఛ చొప్పున చేయకుండానున్ను
నీ మాటలను వచించకుండానున్ను వున్నట్టయితే, ।
14 అప్పుడు నీవు యెహోవా యందు ఆనందముగా
వుందువు; నేను భూమియొక్క వున్నత స్థలముల మీద
నిన్ను యెక్కిపోయేటట్టు చేసి నీ తండ్రియైన యా
కోబుయొక్క స్వాస్థ్యముచేత నిన్ను పోషింతును; యే
మంటే యెహోవాయొక్క నోరు దీని పలికెను.

## 59. అధ్యాయము.

1 ఇదుగో రక్షించలేకుండేటట్టు యెహోవాయొక్క
చెయ్యి కురచ కాలేదు; వినలేకుండేటట్టు ఆయన చెవి
2 భారముగా వుండ లేదు. । అయితే మీ అక్రమములే
మీకున్ను మీ దేవునికిన్ని యెడము చేసినవి; ఆయన
ఆలకించకుండేటట్టు మీ పాపములే ఆయన ముఖమును
3 మీకు చాటుచేసినవి. । యేమంటే మీ చేతులు రక్తము
చేతనున్ను మీ వేళ్లు అక్రమము చేతనున్ను అపవిత్ర
మై వున్నవి; మీ పెదవులు అబద్ధములను పలికియున్నవి;
4 మీ నాలుక కీడును పణికెను. । న్యాయము చేతను
వ్యాజ్యము ఆడేవాడు లేడు; సత్యముతో వాదించే
వాడు లేడు; వారు మాయను నమ్మి, అబద్ధమును పలు
కుదురు; మోసమును గర్భమందు ధరించి, అక్రమమును
5 కందురు. । వారు విషసర్పములయొక్క గుడ్లను పొదు
గుకొందురు; సాలె పురుగు పట్టును నేస్తూ వుందురు;
వారి గుడ్లను భుజించే వాడు చచ్చును; అందులో
నొకటి చితికితే దానిలోనుంచి విషసర్పము బైలువెళ్లు
6 ను. । వారి పట్లు వస్త్రములు అయేవి కావు; వారు వారి
క్రియలచేతను తమ్మును కప్పుకో లేరు; వారి కార్య
ములు అక్రమ కార్యములు; బలాత్కార క్రియ వారి
చేతులలో వున్నది. । వారి కాళ్లు కీడుకు పరుగెత్తి, నిర 7
పరాధుల రక్తమును చిందించుటకు త్వరపడుతవి; వారి
తలంపులు అక్రమపు తలంపులు; బలిమిన్ని నాశనము
న్ను వారి మార్గములలో వున్నవి. । వారు సమాధానపు 8
మార్గమును యెరుగరు; వారి నడతలయందు న్యాయము
లేదు; వారు తమ కొరకు వంకర త్రోవలను చేసు
కొని యున్నారు; వాటిలో నడిచే వాడు యెవడో
వాడు సమాధానమును యెరుగడు. । కాబట్టి న్యాయపు 9
తీర్పు మాకు దూరమై వున్నది; నీతి మా సహాయమునకు
రాదు; వెలుగుకు కాచుకొని వుంటిమి గాని యిదుగో
చీకటే; ప్రకాశత నిమిత్తము కనిపెట్టినప్పటికిన్ని అం
ధకారములో నడుస్తూ వున్నాము. । మేము గుడ్డి వారి 10
వలె గోడ పట్టుకొని, కన్నులు లేని వారి వలె తడువు
లాడుతున్నాము; రాత్రియందు అయినట్టే మధ్యాహ్న
మందు తొట్రిల్లుతున్నాము; ఫలభరిత భూములలో
చచ్చిన వారి వలె వున్నాము. । మేమందరము యెలుగు 11
బంట్ల వలె అర్చి, గువ్వల లాగునే దుఃఖపు కూత కూ
స్తున్నాము; న్యాయపు తీర్పు కొరకు కాచుకొని యు
న్నాము, అయితే అది లేదు; రక్షణ కొరకున్ను కాచు
కొని యున్నాము, అయితే అది మాకు దూరముగా
వున్నది. । యేమంటే మా అక్రమములు నీ ముందర 12
విస్తారముగా వున్నవి; మా పాపములు మాకు విరోధ
ముగా సాక్ష్యము పలుకుతున్నవి; మా దోషములు మా
వెంటనే యున్నవి; మా అక్రమములను యెరిగి యు
న్నాము. । యెహోవాకు విరోధముగా ద్రోహము 13
చేసుటవల్లనున్ను దబ్బరలాడుటవల్లనున్ను మా దేవుని
విడిచిపెట్టుటవల్లనున్ను బాధ విషయమైయున్ని తిరుగు
బాటు విషయమైయున్ని మాట్లాడుటవల్లనున్ను హృ
దయమందు దొంగమాటలను యోచించుకొని పలుకు
టవల్లనున్ను పాపము చేస్తిమి. । కాబట్టి న్యాయము 14
వెనుకకు తోయబడినది; నీతిన్ని దూరముగా నిలిచి
యున్నది; యేమంటే సత్యము వీధిలో పడిపోయినది;
ధర్మమున్ను ప్రవేశించనేరదు. । నిజముగా సత్యము 15
కనుపడదు; పాపమును విసర్జించే వాడు కొల్లగా
పట్టుబడుతున్నాడు; యిది యెహోవా చూచెను;
ధర్మము లేనందున ఆయనకు ప్రతికూలమాయెను.।ఆయన 16
యెవడూ లేడని చూచెను; మధ్యవర్తి యెవడూ
లేడని ఆయన ఆశ్చర్యపడెను; అయినందున ఆయన
భుజమే ఆయనకు రక్షణను కలుగ జేసెను; ఆయన నీతి
యే ఆయనను వుద్ధరించెను. । ఆయన నీతిని వక్షస్త్రాణ 17
ముగానున్ను తన శిరస్సుమీద రక్షణయొక్క శిరస్త్రాణ
మునున్ను వేసుకొనెను; ఆయన ప్రతికారపు వస్త్రము
లను ధరించుకొని, భక్త్యాగ్ని పై వస్త్రముగా కప్పుకొ

18 నెను. । వారి క్రియలకు తగినట్టు ఆయన ప్రతిక్రియ
చేసును; తన శత్రువులకు కోపమున్ను తన పగవారికి
ప్రతికారమున్ను యిచ్చును; ద్వీపాంతరములకున్ను
19 ఆయన ప్రతికారము చేసును. । అప్పుడు పడమటి
దిక్కున వున్నవారు యెహోవా నామమున్ను తూ
ర్పు దిక్కున వున్నవారు ఆయన మహిమనున్ను మన్నిం
తురు. శత్రువుడు ప్రళయ ప్రవాహము వలె వచ్చి
నప్పుడు యెహోవా ఆత్మ వానికి విరోధముగా కొడి
20 యెత్తును. । అప్పుడు సీయోనుకున్ను యాకోబులో
తమ పాపమును విడిచి తిరిగిన వారికిన్ని రక్షించే వాడు
21 వచ్చునని యెహోవా చెప్పుతూ వున్నాడు. । అయితే
వారితో నేను చేసే ఒడంబడికె యిదే అని యెహో
వా పలుకుతున్నాడు; యేమంటే మీ మీద వుండే
నా ఆత్మయున్ను నేను మీ నోట వుంచిన నా మాట
లున్ను మీ నోటినుంచిన్ని మీ పుత్రుల నోటినుం
చిన్ని మీ పుత్రుల పుత్రుల నోటినుంచిన్ని యిప్పుడు
మొదలుకొని యెప్పటికిన్ని విడిచిపోవు అని యెహో
వా చెప్పుతూ వున్నాడు.

## 60. అధ్యాయము.

1 నీవు లేచి ప్రకాశించుము, యేమంటే నీ వెలుగు
వచ్చినది; యెహోవా మహిమ నీ మీద వుదయించి
2 వున్నది. । యేమంటే యిదుగో చీకటి భూమినిన్ని గా
ఢాంధకారము జన సమూహములనున్ను కప్పి వున్నది;
అయితే నీ మీద యెహోవా వుదయించును; ఆయన
3 మహిమ నీ మీద కనుపడును. । నీ వెలుగుకు జనాంగ
ములున్ను నీ వుదయ ప్రకాశతకు రాజులున్ను నడిచి
4 వత్తురు. । నీ కన్నులను యెత్తి చుట్టూ చూడుము; నీ కుమా
రులు దూరమునుంచి వత్తురు; నీ కుమారికలు నీ పక్కను
మోయబడుదురు; వీరందరున్ను కూర్చపడి వస్తూ
5 వున్నారు. । అప్పుడు నీవు చూచి సంతోషింతువు; నీ
గుండె ఆశ్చర్యమును పొంది వుప్పొంగును; యేమంటే
సముద్రపు పదార్థములు నీ తట్టుకు తిప్పబడును;
6 అన్య జనులయొక్క ఆస్తి నీ యొద్దికి వచ్చును. । ఒం
టెల సమూహము నిన్ను కప్పును; మిద్యానుయొక్క
యున్ను ఏఫాయొక్కయున్ను చురుకు గల ఒంటెలు
నిన్ను చుట్టు వేసుకొనును; షెబానుంచి అందరు వచ్చి,
బంగారమునున్ను ధూపవర్గమునున్ను కొంచు వచ్చి,
యెహోవాయొక్క స్తుతులు విశేషముగా ప్రకటిం
7 తురు. । కేదారుయొక్క గొర్రెల మందలన్ని నిన్ను
చేరుకొనును; నెబాయోతుయొక్క పొట్టేళ్లు నిన్ను
సేవించును; అవి నా బలిపీఠము మీదికి అనుకూలము
గా యెక్కును; నా మహిమగల యింటిని నేను ఘన
8 పరుచుదును. । మేఘము వలెనున్ను వాటి కిటికీ ద్వార
ములకు గువ్వల వలెనున్ను యెగసి వచ్చే వీరు యెవరు?।
నిశ్చయముగా ద్వీపాంతరములు నా విషయమై కని 9
పెట్టి వుండును; ఆయన నిన్ను మహిమపరచినందున
నీ పిల్లలనున్ను వారితో కూడా వారి వెండి బంగార
ములనున్ను నీ దేవుడైన యెహోవా నామము కొర
కున్ను ఇశ్రాయేలుయొక్క పరిశుద్ధుని కొరకున్ను దూ
రమునుంచి తీసుకొని వచ్చేటందుకు ముందుగానే
తర్షీషు వోడలున్ను నా నిమిత్తము కనిపెట్టి వుం
డును. । అన్యుల పుత్రులు నీ ప్రాకారములను కట్టు 10
దురు; వారి రాజులు నిన్ను సేవింతురు; యేమంటే
నేను నా కోపముచేత నిన్ను కొట్టితిని, అయితే నా
కృపచేత నిన్ను కనికరించితిని. । నీ యొద్దికి జనాంగ 11
ములయొక్క ఆస్తి తేబడుటకున్ను వారి రాజులు తేబ
డుటకున్ను నీ ద్వారములు రాత్రిన్ని పగలున్ను వేయ
బడకుండా అనుదినమున్ను తెరవబడి యుండును. ।
యేమంటే నిన్ను సేవించని జనాంగమున్ను రాజ్య 12
మున్ను నశించును; నిజముగా ఆ జనాంగములు బొత్తి
గా పాడై పోవును. । నా పరిశుద్ధ స్థలమును అలంకరిం 13
చుటకు లెబానోనుయొక్క ఘనత నీ యొద్దికి వచ్చును;
దేవదారు చెట్టున్ను మద్ది చెట్టున్ను ఇప్ప చెట్టున్ను
కూడా నీ యొద్దికి వచ్చును; మరిన్ని నేను నా పాద
స్థలమును మహిమ పరతును. । నిన్ను కష్టపెట్టిన వారి 14
పుత్రులున్ను వంగుతూ, నీ ముందరికి వత్తురు; నిన్ను
నిర్లక్ష్యపెట్టిన వారందరున్ను నీ కాళ్లమీద సాగిల
పడుదురు. వారు నిన్ను యెహోవాయొక్క పట్టణ
మనిన్ని ఇశ్రాయేలు పరిశుద్ధునియొక్క సీయోననిన్ని
పిలుతురు. । నీవు విసర్జించబడి పగచేయబడితివి, గనుక 15
నీ యందు నడిచిన వాడు యెవడూ లేకపోయినప్ప
టికిన్ని నిన్ను నిత్య శ్రేష్ఠతగానున్ను చాలా తరములకు
వుండే భాగ్యముగానున్ను చేస్తాను. । నీవు జనాంగ 16
ముల పాలను తాగి, రాజుల చంటి పాలను కుడుతువు;
యెహోవాను అయిన నేను యాకోబులో నీ రక్ష
కుడనున్ను నీ విముక్తి పరుడనున్ను యాకోబుయొక్క
బలవంతుడనున్ను అయి వున్నానని తెలుసుకొందువు.।
నేను యిత్తడికి బదులుగా బంగారమునున్ను, యిను 17
ముకు బదులుగా వెండినిన్ని, కర్రలకు బదులుగా యిత్త
డినిన్ని, రాళ్లకు బదులుగా యినుమునున్ను తెచ్చి, నీ
యధిపతులను సమాధానము కల వారినిగా చేసి, నీ పన్ను
నిర్ణయించి పుచ్చుకొన్న వారిని నీతిపరులుగా చేతు
ను. । యికను బలాత్కారము నీ దేశమందున్ను, నాశ 18
నమున్ను బాధయున్ను నీ పొలిమేరలయందున్ను వినప
డక పోవును; అయితే నీవు నీ గోడలను రక్షణ అనిన్ని
నీ ద్వారములను స్తుతి అనిన్ని పిలుతువు. । సూర్యుడు 19
పగటికి నీకు మరి వెలుగుగా వుండడు; చంద్రుడు తన

కాంతివల్ల నీ మీద ప్రకాశించదు; అయితే యెహోవా
వారయే నీకు నిత్యమైన వెలుగుగా వుండును; నీ దేవుడే
20 నీకు మహిమగా వుండును. । నీ సూర్యుడు మరి అస్త
మించదు; నీ చంద్రుడు క్షీణించదు; యేమంటే యె
హోవావారయే నీకు నిత్యమైన వెలుగై వుండును; నీ దుః
21 ఖపు దినములు సమాప్తి పొందును. । నీ జనులందరూ
నీతిమంతులవుదురు; వారు యెప్పటికిన్ని భూమిని స్వ
తంత్రించుకొందురు; వారు నేను నాటిన కొమ్మగా
వుండి, నేను మహిమ పొందేటందుకు నా చేతుల క్రియ
22 అయి వుందురు. । అల్పమైనవాడు వెయిగానున్ను కొద్ది
గా వున్నవాడు బలమైన జనాంగముగానున్ను అవును;
యెహోవానైన నేను దాని కాలమందు దానిని త్వరగా
నెరవేర్తును.

## 61. అధ్యాయము.

1 కర్త అయిన దేవుని ఆత్మ నా మీద వున్నది, యే
మంటే దీనులకు శుభవర్తమానమును తెలిపేటందుకు
యెహోవా నన్ను అభిషేకించి వున్నాడు; నలిగిన
హృదయులను బాగు చేసుటకున్ను చెరలో వున్న వా
రికి విడుదలనున్ను బంధించబడిన వారికి చెరయొక్క
2 విముక్తినిన్ని ప్రకటించుటకున్ను, । యెహోవాయొక్క
హితకరమైన సంవత్సరమునున్ను మన దేవునియొక్క
ప్రతి దండన దినమునున్ను ప్రచురము చేసుటకున్ను,
3 దుఃఖాక్రాంతులనందరిని ఆదరించుటకున్ను, । సీయో
నులో వున్న విచారగ్రస్తులకు ఆనందము యిచ్చుటకు
న్ను బూడిదెకు బదులుగా వారికి శృంగార కిరీటము
నున్ను విచారమునకు బదులుగా ఆనంద తైలమునున్ను
భారాక్రాంతమైన ఆత్మకు బదులుగా స్తుతి వస్త్రము
నున్ను యిచ్చుటకున్ను ఆయన నన్ను పంపి వున్నాడు;
యెహోవా మహిమను పొందే కొరకు వారు యె
హోవా నాటిన నీతి వృక్షములు అనబడుదురు. ।
4 వారు పురాతనపు పాడైన వాటిని కట్టుదురు; పూర్వపు
విచ్ఛిత్తు అయిన వాటిని నిలువబెట్టుదురు; పాడైన పట్ట
ణములనున్ను అనేకమైన తరములనుంచి విచ్ఛిత్తు అయిన
5 వాటినిన్ని బాగుచేతురు. । అన్యులు నిలిచి, మీ మంద
లను మేపుదురు; అన్యుల పుత్రులు మీ వ్యవసాయకు
లున్ను మీ ద్రాక్ష తోట కాండ్లున్ను అవుదురు. ।
6 అయితే మీరు యెహోవాయొక్క అర్చకులని అన
బడుదురు; మన దేవుని సేవకులని మీరు అనబడుదురు;
మీరు జనాంగముల ఐశ్వర్యములను అనుభవించి, వారి
7 ఘనత యందు అతిశయింతురు. । మీ సిగ్గుకు బదులుగా
రెట్టి ఫలము మీకు కలుగును; నిందకు బదులుగా వారు
తమ స్వాస్థ్యమందు సంతోషింతురు; కాగా వారు
తమ దేశమందు రెట్టి ఫలమును స్వతంత్రించుకొందురు;
వారికి నిత్యానందము కలుగును. । యేమంటే యెహోవా 8
వానైన నేను న్యాయమును ప్రేమిస్తున్నాను; నేను
అనీతిగా దొరికిన కొల్లను పగచేసేవాడను; నేను వారి
క్రియను సత్యమందు నడిపించి, వారితో నిత్యమైన
నిబంధన చేతును. । వారి సంతానము జనాంగము 9
లలోనున్ను వారి పుత్రులు జన సమూహములలో
నున్ను తెలియబడి వుందురు; వారు యెహోవాచేత
ఆశీర్వదించబడిన సంతానమని వారిని చూచిన వారం
దరున్ను ఒప్పుకొందురు. । నేను యెహోవా యందు 10
బహుగా ఆనందింతును; నా దేవుని యందు నా ఆత్మ
సంతోషించును; యేమంటే పెండ్లి కుమారుడు అర్చ
కుని వలె తనను శృంగారించుకొన్నట్టున్ను పెండ్లి
కుమార్తె తన ఆభరణములతో తనను అలంకరించు
కొన్నట్టున్ను ఆయన రక్షణ వస్త్రములను నాకు కట్టించి,
నీతి అనే పై బట్టను నాకు ధరింప చేసి వున్నాడు. ।
యేమంటే భూమి తన మొలకను బైలు వెళ్ల చేసినట్టు 11
న్ను తోట తన యందు విత్తపడిన వాటిని మొలిపించి
నట్టున్ను కర్త అయిన దేవుడు సకల జనాంగములకు
ముందర నీతినిన్ని స్తుతినిన్ని విజృంభింప చేసును.

## 62. అధ్యాయము.

సీయోను విషయమై నేను మౌనముగా వుండను; 1
యెరూశలేము విషయమై నేను నెమ్మదిని పొందను;
దాని నీతి ప్రకాశము వలెనున్ను దాని రక్షణ వెలుగు
తున్న దీపము వలెనున్ను తెలియపడే మట్టుకు వూరకె
వుండను. । జనాంగములు నీ నీతినిన్ని సకల రాజులు నీ 2
మహిమనున్ను చూతురు; యెహోవా నోరు తెలియ
చేసే కొత్త పేరువల్ల నీవు పిలువ బడుదువు. । నీవు యె 3
హోవాయొక్క చేతిలో మహిమగల కిరీటమున్ను,
నీ దేవుని చేతిలో రాజ కిరీటమున్ను అయి వుందువు. ।
విసర్జించ పడిన దానవని యిక నీవు అనబడవు; నీ 4
దేశము పాడైనదని యిక చెప్ప పడదు; యెహోవా
నీ యందు ప్రియముగా వున్నాడు; నీ దేశమునకు
వివాహము చేయబడును గనుక నీ పేరు హెఫ్సిబా
అనిన్ని నీ దేశము బియూలా అనిన్ని చెప్పబడును. । పడు 5
చువాడు కన్యకను పెండ్లి చేసుకొన్నట్టు నీ కుమాళ్లు
నిన్ను వివాహమును చేసుకొందురు; పెండ్లి కుమారుడు
పెండ్లి కుమార్తె యందు సంతోషించినట్టు నీ దేవుడు
నీ యందు సంతోషించును. । ఓ యెరూశలేమా, నీ గో 6
డల మీద పగలయినా రాత్రి అయినా మౌనములేని
పదిలమైన వారిని నిర్ణయించి వున్నాను. । యెహోవా 7
వాను ప్రస్తాపించే వారలారా, వూరకె వుండకండీ;
ఆయన యెరూశలేమును దృఢపరచి, భూమి యందు
దాని కీర్తిగా వుంచే మట్టుకు ఆయనకు విశ్రాంతిని

8 యివ్వకండి.। యిక నేను నీ శత్రువులకు నీ ధాన్య
మును ఆహారము కొరకు యివ్వను అనిన్ని, నీవు
ప్రయాసపడి పండించుకొన్న నీ ద్రాక్షారసమును
అన్య పుత్రులు తాగేదిలేదు అనిన్ని, యెహోవా
తన కుడి చేతి మీదనున్ను తన బలమైన భుజము మీ
9 దనున్ను ప్రమాణము పెట్టి వున్నాడు.। అయితే దాని కూ
ర్చిన వారే దానిని భుజించి, యెహోవాను స్తుతిం
తురు; దాని కూర్చిన వారే దానిని నా పరిశుద్ధమైన
10 సాలలో తాగుదురు.। గుమ్మములను దాటి పోండీ, దాటి
పోండీ; జనులకు మార్గమును ఆయత్తము చేయండీ;
రాదారిని చక్కచేయండీ, చక్కచేయండీ; దాని రా
ళ్లను యేర్చండీ; జన సమూహముల కొరకు కొడి యెత్తం
11 డీ.। యిదుగో నీ రక్షకుడు వస్తూ వున్నాడు; యిదుగో
ఆయన బహుమానము ఆయనతోనున్ను ఆయన పని
ఆయన సముఖమందున్ను వున్నది, అని సీయోను
కుమార్తెతో చెప్పండి అని, యిదుగో యెహోవా
భూమియొక్క అంతము మట్టుకూ చాటిస్తూ వున్నా
12 డు.। వారిని పరిశుద్ధ జనులనిన్ని యెహోవా వల్ల
రక్షించబడిన వారనిన్ని వారు పిలుతురు; నీవు వెతుక
బడిన దానవనిన్ని విసర్జించబడని పట్టణమనిన్ని పిలువ
బడుదువు.

## 63. అధ్యాయము.

1 ఎదోమునుంచిన్ని బొస్రానుంచిన్ని యెర్రటి
వస్త్రములను ధరించుకొని వస్తూ వున్న యితడు యెవడు?
మహిమగల వస్త్రములను కట్టుకొని తన బలాతిశయము
చేత వస్తూ వున్న యితడు యెవడు! నీతిగా మాట్లాడి
2 రక్షించుటకు బలము కలవాడనైన నేనే.। నీ వస్త్రము
యెర్రగా ద్రాక్ష గానుగను త్రొక్కేవాని వస్త్రము
3 వలె నీ వస్త్రములు వున్నవేమి?। నేను వంటరిగా ద్రా
క్ష గానుగను త్రొక్కితిని; జనులలో యెవడున్ను
నాతో కూడా వుండలేదు; నా కోపముచేత వారిని
త్రొక్కివేసి, నా వుగ్రతచేత వారిని నలిపితిని; వారి
రక్తము నా వస్త్రముల మీద చిందినది, నా బట్టలన్ని
4 మరకను పొందినవి.। యేమంటే ప్రతికారము చేసే
దినము నా మనస్సు యందు వుండెను; నేను విముక్తిప
5 రిచిన వారి సంవత్సరము వచ్చి యుండెను.। అయితే
నేను చూడగా సహాయము చేసేవాడు లేడు; వుద్ధరిం
చేవాడు లేడని ఆశ్చర్యపడితిని; కాగా నా భుజమే
నాకు రక్షణను తెచ్చెను; నా వుగ్రత నన్ను వుద్ధరిం
6 చెను.। నేను నా కోపముచేత జనులను త్రొక్కివేసి,
నా వుగ్రత చేత వారిని మత్తుగా తాగచేతును; వారి
7 బలమును భూమి మట్టుకు తగ్గింతును.। యెహోవా
యొక్క వాత్సల్యత చొప్పుననున్ను ఆయన విస్తారమైన
దయచొప్పుననున్ను ఇశ్రాయేలు యింటి వారికి ఆయన
చేసిన విశేషమైన మేళ్లనున్ను యెహోవా మనకు
దయచేసిన అంతటి చొప్పుననున్ను యెహోవాయొ
క్క స్తుతులనున్ను యెహోవాయొక్క కృపలనున్ను
నేను ప్రస్తాపము చేతును.। యేమంటే నిశ్చయముగా 8
వారు నా జనులు అనిన్ని కపటము లేని పిల్లలు అని
న్ని ఆయన చెప్పి, వారికి రక్షకుడైనాడు.। వారి యా 9
వత్తు శ్రమలో ఆయన శ్రమపడెను; అయినందున
ఆయన సముఖపు దూత వారిని రక్షించెను; ఆయన
తన దయ చేతనున్ను కనికరము చేతనున్ను వారిని
రక్షించి, పూర్వపు దినములన్నిటి యందు వారిని యె
త్తుకొని మోసుక వచ్చినాడు.। అయితే వారు తిరుగు 10
బాటుచేసి, ఆయన పరిశుద్ధాత్మను దుఃఖపెట్టిరి; కాబట్టి
ఆయన వారికి శత్రువుడై, వారికి విరోధముగా యు
ద్ధము చేసెను.। అంతట ఆయన పూర్వ దినములనున్ను 11
మోషేనున్ను తన జనులనున్ను జ్ఞాపకము తెచ్చుకొని, తన
మంద కాపరులచేత సముద్రమునుంచి వారిని తెప్పించి
నవాడు యేడీ అనిన్ని,। వాని యందు తన పరిశుద్ధా 12
త్మను వుంచి, మోషేయొక్క కుడిచేతితో తన మహిమ
గల భుజముచేత వారిని నడిపించి, తనకు నిత్య కీర్తిని
కలుగచేసుటకు వారి ముందర నీళ్లను విభజించి,।
గుర్రము అరణ్యమందు నడిచినట్టుగా వారు పడిపో 13
కుండా లోతులో నడిపించిన వాడు యేడీ అనిన్ని
పలికెను.। పల్లపు స్థలమునకు మృగము దిగిపోయినట్టు 14
యెహోవాయొక్క ఆత్మ అతనికి నెమ్మదిని కలుగ
చేసెను; యీలాగున నీవు నీ నామమును ఘనపరచే
టందుకు నీవు నీ జనులను నడిపిస్తివి.। ఆకాశమునుంచి 15
దృష్టించుము; నీ పరిశుద్ధతయొక్కయున్ను నీ మహిమ
యొక్కయున్ను నివాస స్థలమునుంచి చూడుము; నీ
అత్యాసక్తియున్ను నీ బలమున్ను యేవి? నా యెడల
నీ వుదరముయొక్క మంటయున్ను నీ కనికరములున్ను
యేవి? అవి అణప బడినవా?। నిశ్చయముగా నీవే మా 16
తండ్రివి; అబ్రాహాము మమ్మును యెరుగక పోయినప్ప
టికిన్ని ఇశ్రాయేలు మమ్మును అంగీకరించక పోయిన
ప్పటికిన్ని ఓ యెహోవా, నీవు మా తండ్రివిన్ని మా
రక్షకుడవున్ను అయి వున్నావు; నీ నామము నిత్యకా
లమునుంచి వున్నది.। ఓ యెహోవా, నీ మార్గముల 17
నుంచి మమ్మును యేల తొలగనిచ్చినావు? నీకు భయ
పడకుండా మా హృదయములను నీవు కఠినము చేసితి
వేమి? నీ సేవకుల నిమిత్తము, అనగా నీ స్వాస్థ్యపు
గోత్రముల నిమిత్తము తిరుగుము.। నీ పరిశుద్ధ జనులు 18
కొద్ది కాలము మట్టుకే స్వతంత్రించుకొనిరి; మా శత్రు
వులు నీ పరిశుద్ధ స్థలమును త్రొక్కివేసి వున్నారు.।

19 మేము నీ వారము; వారి పైని నీవు యెప్పుడూ
ప్రభుత్వము చేయలేదు; నీ నామముచేత వారు పిలు
వబడ లేదు.

## 64. అధ్యాయము.

1 నీ నామము నీ శత్రువులకు తెలియచేయబడే కొరకున్ను,
కున్ను, జనులు నీ సముఖమందు దిగులుపడే కొరకున్ను,
మండే అగ్ని కాలినట్టుగానున్ను, అగ్ని నీళ్లను పొంగ
2 చేసినట్టుగానున్ను, । అహహా, నీవు ఆకాశములను
చీల్చి, దిగి వత్తువుగాక; పర్వతములు నీ ముందర కరిగి
3 పోవును గాక. । మేము నిరీక్షించని భయంకరమైన కా
ర్యములను నీవు చేసినప్పుడు నీవు దిగి వచ్చినావు;
4 నీ ముందర పర్వతములు కరిగినవి. । యేమంటే నీ విష
యమై కనిపెట్టి వుండే వారి కొరకు యిటువంటి కా
ర్యములను చేసిన నీవు గాక మరి వొక దేవుని లోకా
రంభమునుంచి నరులు గ్రహించలేదు; చెవిని వినలేదు;
5 కన్నున చూడలేదు. । నీతిగా నడుచుకొనే వారికిన్ని
నీ మార్గములలో నిన్ను తలంచే వారికిన్ని నీవు ఆనం
దముతో యెదురుపడే వాడవు; అయితే యిదుగో నీవు
కోపముగా వున్నావు; యేమంటే మేము పాపము
చేస్తిమి; వాటిలో చాలా మట్టుకు వుంటిమి; రక్షించ
6 బడ గలమా? । అయితే మేమందరమున్ను అపవిత్రమైన
దాని వలె వున్నాము; మా నీతులన్నిన్ని మైల గుడ్డల
వలె వున్నవి; మేమందరమున్ను ఆకు వలె క్షీణించిపో
తున్నాము; మా అక్రమములు గాలి వలె మమ్మును
7 కొట్టుకొని పోయినవి. । నీ నామమును స్మరించేవాడు
న్ను నిన్ను పట్టేటందుకు తన్ను తాను రేపుకొనే వాడు
న్ను లేడు; యేమంటే నీవు నీ ముఖమును మాకు చాటు
చేసి, మా అక్రమముల నిమిత్తము మమ్మును క్షీణింప
8 చేస్తున్నావు. । అయితే ఓ యెహోవా, నీవు మా
తండ్రివి; మేము జిగట మన్ను నీవు కుమ్మరివాడవు;
9 మేమందరమూ నీ చేతి క్రియ అయి వున్నాము. । ఓ
యెహోవా, నీవు అత్యంతమైన కోపము వుంచకను
న్ను యెప్పటికిన్ని మా అక్రమమును తలంచకనున్ను
వుండుము; యిదుగో నిన్ను వేడుతున్నాము; చూడు
10 ము, మేమందరము నీ జనులమై వున్నాము. । నీ పరి
శుద్ధ పట్టణములు అడవి ఆయెను; సీయోను అరణ్యమా
11 యెను; యెరూశలేము పాడాయెను. । మా పితృలు
నిన్ను యెక్కడ స్తుతించినారో పరిశుద్ధతయున్ను ఘన
తయున్ను గల ఆ మా యిల్లు అగ్నిచేత దహించబడి
12 నది; మా కోర తగినవన్నిన్ని పాడై పోయెను. । ఓ యె
హోవా, వీటి కొరకు నిన్ను నీవు అణుచుకొని వుం
దువా? నీవు మానివై మమ్మును ఘోరముగా శ్రమ
పెట్టుదువా?

## 65. అధ్యాయము.

నన్ను గూర్చి అడగక వున్న వారివల్ల నేను వెత 1
కపడి వున్నాను; నన్ను వెతకక వున్న వారివల్ల నేను
కనుగొనబడి వున్నాను; నా నామము చేత పిలువబడని
జనాంగముతో యిదుగో వున్నాను, యిదుగో వున్నా
ను, అని చెప్పితిని. । చెడ్డ మార్గమందు తమ తమ 2
తలంపుల చొప్పున నడిచే మూర్ఖపు జనులతట్టు దిన
మంతా నేను నా చేతులను చాపితిని. । వారు నా 3
ముందర నిత్యము నాకు కోపమును కలుగ చేస్తూ,
తోటలలో బలులను చెల్లిస్తూ, యిటికెల మీద ధూప
మును సమర్పిస్తూ, । సమాధులలోనున్ను రహస్య స్థల 4
ములలోనున్ను కాపురము చేస్తూ, పంది మాంసమును
తింటూ, తమ పాత్రల యందు సకల విధమైన అస
హ్యపు పాకములను వుంచుకొంటూ, । యెడముగా 5
వుండు, నా యొద్దికి చేరకు, నీకంటే నేను పరిశుద్ధు
డను, అని పలికే జనులై వున్నారు. వీరు నా కోప
సమయమందు పొగ వలెనున్ను దినమంతా మండే
అగ్ని వలెనున్ను వున్నారు. । యిదుగో అది నా ముం 6
దరనే వ్రాసి వున్నది; నేను మానినై వుండను; ప్రతి
కారము చేతును. । మీ అక్రమములకున్ను కొండల 7
మీద ధూపమును సమర్పించి, మెట్టల మీద నన్ను
నిందించుటవల్ల మీ పితృలు చేసిన అక్రమములకున్ను
తగినట్టు నేను ప్రతికారము చేతును; నేను వారి పూర్వ
కార్యపు ఫలమును కొలిచి, వారి రొమ్ములో పోయు
దునని యెహోవా చెప్పుతూ వున్నాడు. । యెహో 8
వా ఆనతిచ్చేదేమంటే, ద్రాక్ష గెల యందు క్రొత్త
రసము కనుపడినప్పుడు దానిని కొట్టివేయకుము; యే
మంటే దాని యందు ఆశీర్వాదము కలదని వొకడు
చెప్పినట్టే, నేను నా సేవకుల విషయమై ఆలాగే చేస్తా
ను; వారినందరిని నాశనము చేయను. । యాకోబులో 9
నుంచి సంతానమునున్ను యూదాలోనుంచి మా పర్వ
తములను స్వతంత్రించుకొనే వానినిన్ని లేవ చేతును;
నేను యేర్పరచుకొన్నవారు దాని స్వతంత్రించుకొం
దురు; నా సేవకులు అక్కడ నివసింతురు. । నన్ను వెతికే 10
నా జనులకు షారోను గొర్రెల దొడ్డిగానున్ను ఆఖోరు
అనే పల్లము పశువులు విశ్రమించే స్థలముగానున్ను
వుండును. । అయితే మీరు యెహోవాను విడిచిపెట్టి, 11
నా పరిశుద్ధ పర్వతమును మరచిపోయి, గాదు కొరకు
వొక బల్లను ఆయత్తము చేసి, మెనీ కొరకు పానార్ప
ణను చెల్లించేవారై వున్నారు. । కాగా మిమ్మును నేను 12
కత్తికి యెంచి యిత్తును; మీరందరూ వధకు వంగు
దురు; నేను పిలిచినప్పుడు మీరు మారుత్తరము యివ్వ
కనున్ను నేను మాట్లాడినప్పుడు మీరు వినకనున్ను

వుండి, నా యెదుట పాపముచేసి, నాకు అనుకూలము
13 కాని వాటిని యేర్పరచుకొంటిరి. । కాబట్టి యెహో
వా అనే దేవుడు చెప్పేదేమంటే, యిదుగో నా సేవ
కులు భుజింతురు, అయితే మీరు ఆకటితో వుందురు;
యిదుగో నా సేవకులు తాగుదురు, అయితే మీరు దా
హముతో వుందురు; యిదుగో నా సేవకులు సంతో
14 షింతురు, అయితే మీరు సిగ్గు పడుదురు. । యిదుగో నా
సేవకులు మనస్సంతోషముచేత పాడుదురు, అయితే
మీరు మనో దుఃఖముచేత యేడ్చుదురు; ఆత్మ విరిగి
15 నందుచేత మీరు అంగలార్తురు. । నేను యేర్పరచుకొన్న
వారికి మీరు మీ నామమును శాపముగా విడుతురు;
యేమంటే యెహోవా అనే దేవుడు నిన్ను చంపి, తన
16 సేవకులను వేరే నామముచేత పిలుచును. । భూమి యందు
తన్ను తాను ఆశీర్వదించుకొనే వాడు సత్యమైన దేవుని
వల్లను తన్ను తాను ఆశీర్వదించుకొనును; భూమి యందు
ఒట్టు బెట్టుకొనే వాడు సత్యమైన దేవుని మీద ఒట్టు
పెట్టును; యేమంటే మునుపటి కష్టములు మరువ బడి
17 నవి; అవి నా కన్నులకు మరుగుగా వుండును. । యిదు
గో నేను క్రొత్త ఆకాశములనున్ను క్రొత్త భూమినిన్ని
సృష్టింతును; మునుపటివి తలంపులోకైనా మనస్సులోకి
18 అయినా రావు. । అయితే నేను సృష్టించే దానివల్ల
మీరు యెప్పటికిన్ని సంతోషమునున్ను ఆనందమును
న్ను పొందండి; యేమంటే యిదుగో నేను యెరూశ
లేమును సంతోషమునకు హేతువుగానున్ను దాని జను
లను ఆనందమునకు హేతువుగానున్ను సృష్టింతును. ।
19 నేను యెరూశలేము యందు ఆనందముగానున్ను నా
జనుల యందు సంతోషముగానున్ను వుందును; యేడు
పుయొక్క ధ్వని అయినా రోదనపు ధ్వని అయినా
20 దాని యందు యిక వినపడేది లేదు. । అక్కడ యికను
కొద్ది దినముల బాలుడైనా తన దినములను నెరవేర్చు
కొనని ముసలివాడైనా వుండడు; యేమంటే నూరు
సంవత్సరముల వయస్సు గలవాడు యింకా బాలుడు
అయినట్టు చనిపోవును; అయితే నూరు సంవత్సరములు
21 యీడుగల పాపాత్ముడు శపించబడును. । వారు యిం
డ్లను కట్టి, వాటిలో కాపురము వుందురు; వారు
ద్రాక్ష తోటలను నాటి, వాటియొక్క ఫలమును భక్షిం
22 తురు. । వారు కట్టుదురు, అన్యులు వాటిలో కాపు
రము చేయరు; వారు నాటుదురు, అన్యులు భక్షించరు;
యేమంటే వృక్షముయొక్క దినములు యేలాగునో
ఆలాగే నా జనులయొక్క దినములున్ను వుండును;
నేను యేర్పరచుకొన్నవారు తమ చేతుల క్రియలను
23 చాలా కాలము మట్టుకు అనుభవింతురు. । వారు వృథా
గా ప్రయాసమును పొందరు; ఆకస్మికపు మరణమును
అనుభవించడానకు వారు పిల్లలను కనరు; యేమంటే
వారున్ను వారితో కూడా వారి పిల్లలున్ను యెహో
వావల్ల యేర్పరచబడిన సంతానమై వుందురు. । అప్పు 24
డు సంభవించేదేమంటే, వారు వేడుకోకమునుపే నేను
ప్రత్యుత్తరమును యిత్తును; వారు మాట్లాడుతూ వుం
డగానే నేను విందును. । తోడేలున్ను గొర్రెపిల్లయు 25
న్ను కలిసి మేసును; సింహము యెద్దు వలెనే గడ్డిని
తినును; సర్పమునకు ధూళి ఆహారమై యుండును;
అవి నా పరిశుద్ధ పర్వతమందంతటా యికను హానినై
నా నాశనమునైనా చేయవని యెహోవా చెప్పుతూ
వున్నాడు.

## 66. అధ్యాయము.

యెహోవా చెప్పేదేమంటే, ఆకాశము నా సింహా 1
సనమున్ను భూమి నా పాదపీఠమున్నయి యున్నవి;
మీరు నా నిమిత్తమై కట్టే యిల్లు యేది? నా విశ్రమ
స్థలము యేది? । వాటిని యావత్తూ నా చెయ్యి గదా 2
కలుగ చేసెను! అవి అన్ని నా వల్లను గదా కలిగినవి?
అని యెహోవా చెప్పుతూ వున్నాడు; అయితే విన
యమున్ను నలిగిన హృదయమున్ను గల వాని తట్టున్ను
నా వాక్యమును సన్మానించే వాని తట్టున్ను నేను దృ
ష్టింతును. । పశువును చంపే వాడు మనుష్యుని నరికే 3
వాడుగానున్ను గొర్రెను బలిగా యిచ్చేవాడు కుక్క
గొంతుకను కోసేవాడుగానున్ను కానుకను యిచ్చే
వాడు పంది రక్తమును అర్పించేవాడుగానున్ను ధూప
మును సమర్పించే వాడు బొమ్మకు మ్రొక్కేవాడుగా
నున్ను వుండును; వారు తమ మార్గములను యేర్ప
రచుకొని వున్నారు; వారి ఆత్మ వారి అసహ్యతల
యందు అపేక్షగా వున్నది. । నేనున్ను వారి శ్రమలను 4
యేర్పరచుకొని, వారి భయములను వారి మీదికి రప్పిం
తును; యేమంటే నేను పిలిచినప్పటికిన్ని యెవడైనా
మారుత్తరమును యివ్వకనున్ను నేను మాట్లాడినప్పటికి
న్ని వారు వినకనున్ను వుండి, వారు నా సముఖమందు
పాపము చేసి, నాకు అనుకూలము కాని వాటిని యే
ర్పరచుకొన్నారు. యెహోవా వాక్యమునకు భయ 5
పడే వారలారా, ఆయన మాటను వినండి; మిమ్మును
పగచేసి, నా నామముకొరకు మిమ్మును దూరపర్చిన
మీ సహోదరులు యెహోవా మహిమను పొందు
ను గాక అని పలికిరి; అయితే ఆయన మీ సంతోష
ము కొరకు కానపడును; అప్పుడు వారు సిగ్గు పడు
దురు. । పట్టణములోనుంచి గల్లత్తుయొక్క ధ్వని, దేవా 6
లయములోనుంచి ధ్వని, తన శత్రువులకు ప్రతికారము
చేసే యెహోవాయొక్క శబ్దము. । ప్రసవవేదన రాక 7
మునుపే ఆమె కన్నది; ఆమెకు నొప్పి రాక మునుపే
ఆమె మొగపిల్లను కన్నది. । యీలాటి సంగతిని విన్న 8

వారు యెవరు? యిటువంటివి చూచిన వారెవరు?
వొక్క దినమందే భూమి దాని ఫలమును ఫలించునా?
వొక్క మారే వొక జనము పుట్టునా? యేమంటే సీయో
ను వేదనను పొందగానే అది తన పిల్లలను కన్నది. ।
9 ప్రసవ కాలమును సమీపింప చేసే నేను ప్రసవము
కానివ్వనా? అని యెహోవా చెప్పుతూ వున్నాడు;
పుట్టించే నేను గర్భమును బిగియచేతునా? అని నీ దేవు
10 డు చెప్పుతూ వున్నాడు. । యెరూశలేమును ప్రేమించే
మీరందరూ దానితో కూడా సంతోషపడి, దానితో
కూడా ఆనందమును పొందండి; దాని నిమిత్తము దుః
ఖించే మీరందరున్ను దానితో కూడా బహుగా వుత్సా
11 హమును పొందండి. । మీరు దాని ఆదరణయొక్క
స్తనముల పాలు తాగి, తృప్తి పొందుదురు గాక; మీరు
దాని ఘనమైన కాంతిచేత చాలా ఆనందమును పొం
12 దేటందుకు పీల్చి తాగుదురు గాక. । యేమంటే యె
హోవా యీ విధముగా చెప్పేదేమంటే, యిదుగో
నేను యేరు వలెనే సమాధానమున్ను పొర్లి పారే
ప్రవాహము వలెనే దానికి అన్య జనులయొక్క ఘన
తనున్ను దయచేతును; అప్పుడు మీరు చంటిని పీల్చు
దురు; మీరు దాని పక్కను మోయ పడుదురు; దాని
మోకాళ్ల మీద సంతోషముగా ఆడించబడుదురు. ।
13 వొకని వాని తల్లి ఆదరించినట్టే నేను మిమ్మును ఆదరిం
తును; మీరు యెరూశలేము యందు ఆదరించబడుదు
14 రు. । మీరు యిది చూచినప్పుడు మీ హృదయము సం
తోషించి, మీ యెముకలు మొలకవలె పెరుగును; యె
హోవా సేవకులలో ఆయన చెయ్యిన్ని ఆయన శత్రు
15 వులలో ఆయన శౌర్యమున్ను తెలియబడును. । యేమం
టే యిదుగో తన కోపమును శౌర్యముతోనున్ను తన
గద్దింపును అగ్ని జ్వాలలతోనున్ను యిచ్చుటకు యె
హోవా తన అగ్నితోనున్ను సుడిగాలివలె తన రథ
16 ములతోనున్ను వచ్చును. । యేమంటే యెహోవా
అగ్నిచేతనున్ను తన ఆయుధము చేతనున్ను సకల మాం
సమునకు న్యాయము తీర్చును; యెహోవా వల్లను
17 అనేకులు చంపబడుదురు. । తమ్ము తాము పవిత్రము
చేసుకొని, తోటల నడుమ తమ్ము తాము వొకని వెనుక
వొకడు శుద్ధి చేసుకొంటూ, పంది మాంసమునున్ను
అసహ్యమైన దానినిన్ని యెలుకనున్ను భుజించే వారు
యేకముగా సంహరించ పడుదురని యెహోవా ఆన
తిస్తూ వున్నాడు. । యేమంటే నేను వారి క్రియలను 18
న్ను వారి తలంపులనున్ను యెరుగుదును; నేను సకల
మైన జనులనున్ను భాషావంతులనున్ను కూర్చే కాలము
వచ్చును; వారు వచ్చి నా మహిమను చూతురు. । మరి 19
న్ని నేను వారిలో వొక గురుతును స్థాపించి, వారిలో
తప్పించుకొన్న వారిని జనాంగములకు, అనగా, విలు
కాండ్లయిన తర్షీషుకున్ను పూలుకున్ను లూదుకున్ను
తూబలుకున్ను యావానుకున్ను నా కీర్తిని గూర్చి విన
కనున్ను నా మహిమను చూడకనున్ను వున్న దూరద్వీ
పములకున్ను నేను పంపింతును; వారు అన్యజనులలో
నా మహిమను తెలియ చేతురు. । అప్పుడు ఇశ్రాయే 20
లు పుత్రులు శుద్ధి అయిన పాత్రలో కానుకను యె
హోవా యింటిలోకి యే ప్రకారముగా తెత్తురో
ఆ ప్రకారమే యెహోవాకు కానుకగా సమస్త జను
లలోనుంచి వారు తమ సహోదరులను గుర్రముల
మీదనున్ను రథముల మీదనున్ను డోలీల మీదనున్ను
వేసడముల మీదనున్ను చురుకైన మృగముల మీదను
న్ను నా పరిశుద్ధ పర్వతమునకు తీసుకొని వత్తురని
యెహోవా ఆనతిస్తూ వున్నాడు. । మరిన్ని యెహో 21
వా ఆనతిచ్చేదేమంటే, అర్చకుల నిమిత్తమున్ను లేవీ
యుల నిమిత్తమున్ను వారిలోనుంచి నేను తీసుకొం
దును. । యేమంటే నేను సృష్టించ బోయే కొత్త ఆకా 22
శములున్ను కొత్త భూమిన్ని నా ముందర యేలాగు
నిలుచునో ఆలాగే మీ సంతతిన్ని మీ నామము
న్ను నిలుచునని యెహోవా పలుకుతున్నాడు. । మరి 23
న్ని సంభవించబోయేదేమంటే, అమావాస్య మొదలు
కొని అమావాస్య మట్టుకున్ను సబ్బాతు మొదలుకొని
సబ్బాతు మట్టుకున్ను నా ముందర సకలమైన మాంస
ము మ్రొక్కుటకు వచ్చునని యెహోవా పలుకుతు
న్నాడు. । అప్పుడు వారు బైలువెళ్లి, నాకు అపరా 24
ధము చేసిన వారి శవములను దృష్టింతురు; యేమంటే
వారి పురుగు లయము కాదు, వారి అగ్ని ఆరిపోదు;
సకలమైన మాంసమునకు వారు అసహ్యముగా వుందు
రని యెహోవా ఆనతిస్తూ వున్నాడు.

దీర్ఘదర్శి అయిన

# ఇర్మీయాయొక్క గ్రంథము.

## 1. అధ్యాయము.

1 బెన్యామీను దేశమందుండే అనాతోతులో వున్న
అర్చకులలో హిల్కీయా కుమారుడయిన ఇర్మీయాయొ
2 క్క వాక్యములు. । యూదా రాజైన ఆమోను కుమారు
డైన యోషీయాయొక్క దినములలో అతని యేలుబ
డియొక్క పదమూడో సంవత్సరమందు యెహోవా
3 యొక్క వాక్యము అతనికి వచ్చెను. । యూదా రాజైన
యోషీయా కుమారుడైన యెహోయాకీముయొక్క
దినములందున్ను యూదా రాజైన యోషీయా కుమా
రుడైన సిద్కీయాయొక్క పదకొండో సంవత్సరాంత
పర్యంతము, అనగా, అయిదో మాసములో యెరూశ
లేము చెరకొంచపోబడిన పర్యంతమున్ను అది వచ్చెను.।
4 అప్పుడు యెహోవా వాక్యము నాకు వచ్చినదేలా
5 గంటే, । వుదరములో నేను నిన్ను రూపించక ముందే
నిన్ను యెరిగి వుంటిని; గర్భములోనుంచి నీవు వెలికి
రాక ముందే నిన్ను పరిశుద్ధ పరచి, జనాంగముల యె
ద్దికి వెళ్లే కొరకు నిన్ను దీర్ఘదర్శినిగా నిర్ణయిస్తిని,
6 అని పలుకగా, । కర్తవైన ఓ దేవుడా, యిదుగో నేను
మాట్లాడలేను, యేమంటే నేను బాలుడనై యున్నా
7 నని అంటిని. । అయితే యెహోవా నాతో అనిన
దేమంటే, నేను బాలుడనని చెప్పకుము; యేమంటే
యెవ్వరెవ్వరి యెద్దికి నేను నిన్ను పంపుదునో వారం
దరి యెద్దికి నీవు వెళ్ల వలెను; మరిన్ని నేను నీకు యే
8 దేది ఆజ్ఞాపింతునో అది నీవు పలుక వలెను. । వారి
ముఖములకు భయపడకుము; యెందుకంటే నిన్ను రక్షిం
చుటకు నేను నీతోకూడా వున్నానని యెహోవా
9 ఆనతిస్తున్నాడని అనెను. । అప్పుడు యెహోవా తన
చెయ్యి చాచి నా నోటిని ముట్టెను; అంతట యిదు
గో నేను నా వాక్యములను నీ నోట వుంచితిని; ।
10 యిదుగో పెల్లగించుటకున్ను దిగలాగుటకున్ను నశింప
చేసుటకున్ను పడగొట్టుటకున్ను కట్టుటకున్ను నాటు
టకున్ను నేను నిన్ను యీ దినమున జనాంగముల మీద
నున్ను రాజ్యముల మీదనున్ను వుంచితిని అని యె
11 హోవా నాతో ఆనతిచ్చెను. । మరిన్ని యెహోవా
యొక్క వాక్యము నాకు వచ్చినదేమంటే, ఇర్మీయా,
దేని చూస్తున్నావు? అని అంటే, బాదామి చెట్టు
12 రువ్వను చూస్తున్నానని, నేను అనినప్పుడు, । నీవు
బాగా చూస్తివి, యేమంటే దాని చేసుటకు నేను నా
వాక్యమును త్వరపెట్టుదునని యెహోవా నాతో
ఆనతిచ్చెను. । అంతట దేని చూస్తున్నావు? అని యె 13
హోవాయొక్క వాక్యము రెండోమారు నాకు వచ్చె
ను; అందుకు నేను వుడుకుతున్న కుండను చూస్తున్నా
ను; దాని ముఖము వుత్తరపువైపు వున్నదని పలికితిని. ।
అప్పుడు యెహోవా నాతో ఆనతిచ్చినదేమంటే, 14
వుత్తరమునుంచి కీడు దేశపు కాపురస్థులందరి మీదికి
తోసుకొని వచ్చును. । యేమంటే యిదుగో వుత్తరపు 15
రాజ్యములయొక్క యావత్తు కుటుంబములను నేను
పిలుతునని యెహోవా ఆనతిస్తున్నాడు; వారు వచ్చి
వుక్కొకడు తన తన సింహాసనమును యెరూశలేము
ద్వారముల యెదుటనున్ను చుట్టూ వున్న దాని ప్రా
కారములంతటి యెదుటనున్ను యూదా పట్టణములం
తటి యెదుటనున్ను నిలుపును. । మరిన్ని నన్ను విస 16
ర్జించి, అన్య దేవుండ్లకు ధూపమును సమర్పించి,
తమ హస్త కృత్యములయిన వాటికి మ్రొక్కిన వారికి
విరోధముగా వారి దుర్మార్గములంతటిని గురించి
నేను నా న్యాయపు తీర్పులను చెప్పుదును. । కాబట్టి 17
నీవు నీ నడుమును బిగించుకొని, లేచి, నీకు నేను ఆజ్ఞా
పించేదంతటిని వారికి చెప్పుము; వారి యెదుట నావల్ల
నీకు తత్తరపాటు పొందబడక వుండేలాగు నీవు వారి
ముఖములకు వెరవకుము. । యేమంటే యిదుగో దేశ 18
మంతటికి విరోధముగా, అనగా, యూదా రాజులకు
విరోధముగానున్ను దాని అధిపతులకు విరోధముగా
నున్ను దాని అర్చకులకు విరోధముగానున్ను దేశపు
జనులకు విరోధముగానున్ను యీ దినమున నేను నిన్ను
బలపరచబడిన పట్టణముగానున్ను యినుప స్తంభము
గానున్ను యిత్తడి గోడలుగానున్ను చేస్తిని. । వారు 19
నీతో యుద్ధము చేతురు గాని నిన్ను జయించకపోదురు;
యెందుకంటే నిన్ను రక్షించుటకు నేను నీతోకూడా
వున్నానని యెహోవా ఆనతిస్తున్నాడని పలికెను.

## 2. అధ్యాయము.

మరిన్ని యెహోవాయొక్క వాక్యము నాకు 1
వచ్చినదేమంటే,। నీవు వెళ్లి, యెరూశలేముయొక్క చెవు 2
లలో బొబ్బ పెట్టుము, యేమంటే, యెహోవా యీ
లాగున సెలవిస్తున్నాడు; అరణ్యములో అనగా విత్త
బడని దేశములో నీవు నా వెంట వచ్చినప్పుడు నిన్ను
గూర్చిన్ని నీ యౌవన కాలపు అనుగ్రహమును

గూర్చిన్ని నీ వైవాహిక ప్రేమను గూర్చిన్ని నాకు జ్ఞాప
3 కము వున్నది. । ఇశ్రాయేలు యెహోవా ఆదాయ
ముయొక్క ప్రథమ ఫలములై, ఆయన విషయమై పరి
శుద్ధత అయి వుండెను; అతని భక్షించిన వారందరున్ను
అపరాధులైరి; కీడు వారి మీదికి వచ్చెనని యెహో
4 వా ఆనతిస్తున్నాడు. । యాకోబుయొక్క యింటివార
లారా, ఇశ్రాయేలు వంశ్యులారా, యెహోవా వాక్య
5 మును వినండి. । యెహోవా యీలాగున సెలవిస్తు
న్నాడు, నా యొద్దనుంచి దూరముగా తొలగిపోయి,
మాయ వెంబడి నడిచి, మాయ గలవారగుటకు మీ
పితృలు నా యందు యేమి అక్రమము కనుగొనిరి? ।
6 మిస్రయీము దేశములోనుంచి మమ్మును బయిటికి
తీసుక వచ్చినటువంటిన్ని అరణ్యములోనుంచిన్ని గో
తులు గల నిర్మనుష్య దేశములోనుంచిన్ని మరణపు నీడ
గల నిర్జల దేశములోనుంచిన్ని యే మనుష్యుడైనా
గడవకనున్ను యే మనుష్యుడైనా నివాసము చేయకను
న్ను వున్న దేశములోనుంచిన్ని మమ్మును నడిపించినటు
వంటిన్ని యెహోవా యేడి అని వారు అడగడమైనా
7 లేదు. । నేను సమృద్ధి గల దేశములోకి దాని ఫలము
నున్ను దాని వుత్తమమైన దానినిన్ని తినుటకు మిమ్మును
తీసుక వస్తిని; అయితే మీరు ప్రవేశించినప్పుడు నా
దేశమును అపవిత్రపరచి, నా స్వాస్థ్యమును అస
8 హ్యత గల దానిగా చేస్తిరి. । యెహోవా యేడి అని
అర్చకులు అడుగలేదు; న్యాయప్రమాణమును చేకొనే
వారు నన్ను యెరుగక వుండిరి; కాపరులున్ను నాకు
విరోధముగా అతిక్రమించిరి; దీర్ఘదర్శులు బయలు
ద్వారా దీర్ఘదర్శనము పలికి, నిష్ఫలమైన వాటి
9 వెంబడి నడిచిరి. । కాబట్టి నేను మీతో యింకా
వాదింతును; మీ పిల్లల పిల్లలతోటిన్ని వాదింతునని
10 యెహోవా ఆనతిస్తున్నాడు. । యేమంటే కిత్తీము ద్వీప
ములను దాటి చూడండి; కేదారుకు పంపి జాగ్రతగా
విచారించి, యీలాటి సంగతి వున్నదేమో చూడండి. ।
11 యే జనాంగమై నా దేవుండ్లు కాకపోయినప్పటికిన్ని
తన దేవుండ్లను మార్చెనా? అయితే నా జనులు తమ
మహిమను నిష్ప్రయోజనమైన దానికి మార్చివున్నారు. ।
12 ఓ ఆకాశములారా, యిందుకు ఆశ్చర్యపడి, బహు
భీతితో వుండండి; మిక్కిలిగా క్షీణించి పొండి, అని
13 యెహోవా ఆనతిస్తున్నాడు. । యేమంటే నా జనులు
చెడ్డవి రెండు చేసి వున్నారు; జీవోదకపు వూటనైన
నన్ను విసర్జించి, తమ కొరకు కుండీలను, అనగా,
నీళ్లను పట్టని చిల్లిన కుండీలను తొలిపించుకొని వున్నా
14 రు. । ఇశ్రాయేలు సేవకుడై వున్నాడా? వాడు యింట
పుట్టినదాసుడై వున్నాడా? వాడు యెందుకు దోపుడు

బడి వున్నాడు? । కొదమ సింహములు వాని మీద ఱంకె 15
వేసి గర్జిల్లెను; అవి వాని దేశమును పాడు చేసెను;
వాని పట్టణములు దహింపబడినవి; అవి కాపురస్తులు
లేక వున్నవి. । నోపుయొక్కయున్ను తహపనేసుయొ 16
క్కయున్ను పుత్రులు నీ నెత్తిని బద్దలు కొట్టిరి. । నీ దే 17
వుడైన యెహోవా నిన్ను మార్గములో నడిపించి
నప్పుడు నీవు ఆయనను విడిచి పెట్టినందుచేత నీకు
నీవే దీని తెచ్చుకొనలేదా? । అయితే యిప్పుడు సీహో 18
రు నీళ్లను తాగుటకు మిస్రయీము మార్గములో నీకు
వున్న పని యేమిటి? లేక నది నీళ్లను తాగుటకు అష్షూ
రు మార్గములో నీకు వున్నపని యేమిటి? । నీ దుర్మా 19
ర్గమే నిన్ను శిక్షించును; నీ వెనుక తిరుగుటయున్ను
నిన్ను గద్దించును; కాబట్టి నీ దేవుడైన యెహోవాను
నీవు విసర్జించుటయున్ను నా భయము నీ యందు
లేక పోవుటయున్ను చెడ్డయున్ను చేదున్ను అయిన
సంగతి అని చూచి తెలుసుకొనుమని సైన్యముల దేవు
డైన కర్త ఆనతిస్తున్నాడు. । యేమంటే పూర్వమందే 20
నేను నీయొక్క కాడిని విరగకొట్టి, నీ పలుపులను
తెంపితిని; నేను అతిక్రమించను అని నీవు అప్పుడు చె
ప్పితివి; అయినప్పటికిన్ని వున్నతమైన ప్రతి కొండ మీ
దనున్ను ప్రతి పచ్చని చెట్టు కిందనున్ను నీవు వేశ్యాత్వ
మును జరిగిస్తూ, తిరుగులాడుతూ వున్నావు. । అయితే 21
కేవలము నిక్కమైన విత్తనముచేత నేను నిన్ను శ్రేష్ఠ
మైన ద్రాక్ష చెట్టుగా నాటి వుంటిని; నీవు అన్యమైన
ద్రాక్షా సంబంధపు చెడు మొక్కగా నా విషయమై
యేలాగు మార్చబడి వున్నావు? । యేమంటే నిన్ను నీవు 22
సూరేకారముతో కడుగుకొని, చాలా సబ్బున్ను వా
డుకొన్నప్పటికీ నీ అపరాధము నా యెదుట గురుతు
పెట్టబడి వున్నదని కర్త అయిన దేవుడు ఆనతిస్తున్నాడు. ।
నేను అపవిత్రుడను కాను; నేను బయలీము వెంబడి 23
వెళ్లలేదని నీవు యేలాగు చెప్పగలవు? లోవలో కలిగిన
నీ మార్గమును చూడుము; నీవు చేసిన దాని తెలు
సుకొనుము; నీవు దాని మార్గములను దాటిపోతూ
వున్న వడిగల వొంటె వలెనున్ను దాని మనోభిలాష
చొప్పున గాలిని పీల్చుతూ, అడవికి వాడికెబడిన కా
రుగాడిదె వలెనున్ను వున్నావు. । దాని సమయములో 24
యెవరు దానికి అడ్డు చేయ గలరు? దాని వెతికే వా
రందరు తమకు అలసట కలుగనియ్యరు; దాని మాస
ములో వారు దాని కనుగొందురు. । నీ పాదములకు 25
చెప్పులు లేకుండేటట్టున్ను నీ గొంతుకకు దాహమెత్తే
టట్టున్ను చేయకుము; అయితే నిరీక్షణ లేనే లేదు,
యేమంటే నేను అన్యులను ప్రేమించి వున్నాను
గనుక వారి వెంబడి వెళ్లుతానని నీవు చెప్పితివి. ।
దొంగ దొరికినప్పుడు యేలాగు సిగ్గు పొందునో 26

ఆలాగే ఇశ్రాయేలు యింటివారున్ను వారి రాజులున్ను
వారి అధిపతులున్ను వారి అర్చకులున్ను వారి దీర్ఘ
27 దర్శులున్ను సిగ్గు పొందుదురు. । వారు కర్ర ముక్క
ను చూచి, నీవు నా తండ్రివి అనిన్ని, రాతిని చూచి
నీవు నన్ను పుట్టించినావనిన్ని పలుకుతున్నారు; యే
మంటే వారు నాతట్టు తమ ముఖమును కాదు తమ
వీపును తిప్పి వున్నారు; అయితే లేచి మమ్ము రక్షించు
మని వారు తమ శ్రమ కాలమందు పలుకుదురు. ।
28 అయితే నీ కొరకు నీవు కలుగ చేసుకొనిన నీ దేవుండ్లు
యెక్కడ వున్నారు? నీ శ్రమ కాలమందు వారు నిన్ను
రక్షించ గలవారైతే వారే లేతురు గాక; యేమంటే
ఓ యూదా, నీ దేవుండ్లు నీ పట్టణముల లెక్క చొ
29 ప్పున వున్నారు. । మీరు నాతో యెందుకు వాదింతు
రు? మీరందరున్ను నాకు విరోధముగా అతిక్రమించి
30 వున్నారని యెహోవా ఆనతిస్తున్నాడు. । నేను వృ
థాగా మీ పిల్లలను కొట్టితివి; వారు దిద్దుబాటు పొంద
లేదు; మీ కత్తి ధ్వంసము చేసే సింహము లాగున మీ
31 దీర్ఘదర్శులను భక్షించెను. । ఓ యీ తరము వార
లారా, యెహోవా వాక్యమును చూడండి: నేను
ఇశ్రాయేలుకు అరణ్యమై వుంటినా? అంధకార దేశమై
వుంటినా? మేము ప్రభువులము, నీ యొద్దికి మేము
యిక రాము అని నా జనులు యెందుకు అంటున్నా
32 రు? । కన్యక తన ఆభరణములనున్ను పెండ్లి కుమార్తె
తన వస్త్రములనున్ను మరుచునా? అయితే నా జనులు
33 లెక్కలేని దినములు నన్ను మరచి వున్నారు. । ప్రేమను
వెతుకుటకు నీవు నీ మార్గమును యెందుకు చక్క
పెట్టుతున్నావు? అందు కొరకే నీవు దుష్టులకు నీ మా
34 ర్గములను నేర్పి వున్నావు. । మరిన్ని నీ వస్త్రపు చెం
గులలో దీనులైన నిర్దోషుల ఆత్మలయొక్క రక్తము
కనుపడుతున్నది; తవ్వి చూచినందువల్ల కాదు గాని
వీటన్నిటి యందు నేను దాని కనుగొని వున్నాను. ।
35 అయినప్పటికిన్ని నేను నిర్దోషినై వున్నాను గనుక
నిశ్చయముగా ఆయన కోపము నా యొద్దనుంచి తిరు
గునని నీవు అంటున్నావు; యిదుగో నేను పాపము
చేయలేదని నీవు అంటున్నావు గనుక నేను నీతో వా
36 దింతును. । నీ మార్గమును మార్చుటకు నీవు యెం
దుకు యింత తిరుగులాడుతున్నావు? అష్షూరును గురించి
నీవు యేలాగు సిగ్గుపడితివో ఆలాగే మిస్రయీమును
37 గురించిన్ని నీవు సిగ్గు పడుదువు. । నిజముగా నీ తలమీద
నీ చేతులు పెట్టుకొని, నీవు అతని యొద్దనుంచి బైలు
వెళ్లుదువు; యేమంటే యెహోవా నీ నమ్మకపు ఆస్ప
దములను తోసివేసి వున్నాడు గనుక నీవు వాటివల్ల
బాగుపడవు.

## 3. అధ్యాయము.

ఒకడు తన భార్యను పరిత్యజించిన తరువాత అది 1
అతని యొద్దనుంచి తొలగిపోయి మరి యొకనిదైతే అత
డు దాని యొద్దికి తిరిగీ వెళ్లునా? ఆ దేశము మిక్కిలీ
అపవిత్రతను పొందదా? అని చెప్పడము కలదు; అయి
తే నీవు అనేకులైన ప్రియులతో వేశ్యాత్వమును జరి
గించితివి; అయినప్పటికిన్ని నా యొద్దికి తిరిగీ రమ్మని
యెహోవా ఆనతిస్తున్నాడు. । వున్నత స్థలముల తట్టు 2
నీ నేత్రములను యెత్తి, యెక్కడెక్కడ నీవు శయ
నింప బడకపోతివో చూడుము; అరణ్యమందు అరబి
యుని వలె నీవు వారి కొరకు మార్గములలో కూ
ర్చుని, నీ వేశ్యాత్వముల చేతనున్ను నీ దుర్మార్గము
చేతనున్ను నీవు దేశమును అపవిత్ర పరచితివి. । అందు 3
కొరకే వర్షములు కురిపించబడక వున్నవి; కడవరి
వర్షమున్ను లేక వున్నది; నీవు వేశ్యయొక్క నుదురు
గలదానవై సిగ్గుబడుటకు వొప్పక వున్నావు. । వో 4
నా తండ్రీ, నీవు నా యౌవన కాలపు మార్గ ప్రద
ర్శకుడవని నీవు యిప్పటినుంచి నన్ను గూర్చి మొర్ర
బెట్టవా? । ఆయన తన కోపమును నిత్యమున్ను వుంచు 5
నా? కడకున్ను దాని వుంచునా? యిదుగో నీకు శక్య
మైనంత మట్టుకు నీవు చెడ్డవాటిని పలికి చేసివున్నా
వని ఆనతిచ్చెను. । మరిన్ని రాజైన యోషీయాయొక్క 6
దినములలో యెహోవా నాతో ఆనతిచ్చినదేమంటే,
వెనుకకు తిరిగిన ఇశ్రాయేలు చేసివున్న దాని నీవు
చూచి వున్నావా? అది వున్నతమైన ప్రతి కొండ మీ
దికిన్ని ప్రతి పచ్చని చెట్టు కిందికిన్ని వెళ్లి, అక్కడ
క్కడ వేశ్యాత్వమును జరిగించి వున్నది. । అది వీటినన్ని 7
టిని చేసిన తరువాత నా తట్టు తిరుగుమని నేను చెప్పి
నప్పటికిన్ని అది తిరగలేదు; మరిన్ని విశ్వాస ఘాతు
కురాలైన దాని సహోదరి అనే యూదా చూచెను. ।
అది గాక యే యే హేతువులచేత వెనుకకు తిరిగిన 8
ఇశ్రాయేలు జారత్వమును జరిగించెనో వాటి యన్నిటి
కొరకు నేను దాని పరిత్యజించి, దానికి పరిత్యాగ
పత్రిక యిచ్చినప్పటికిన్ని విశ్వాస ఘాతుకురాలైన
దాని సహోదరి అనే యూదా భయపడక, అదిన్ని
వెళ్లి, వేశ్యాత్వమును జరిగించడమును నేను చూస్తిని. ।
మరిన్ని దాని వేశ్యాత్వముయొక్క చులకనచేత సంభ 9
వించినదేమంటే, అది దేశమును అపవిత్రపరచి, రాళ్ల
తోనున్ను కర్రముక్కలతోనున్ను వ్యభిచారమును
జరిగించెను. । అయితే దీని అంతటి కొరకైనా విశ్వాస 10
ఘాతుకురాలైన దాని సహోదరి అనే యూదా మా
యతోనేగాని తన యావద్హృదయముతో నా తట్టుకు
తిరుగలేదని యెహోవా ఆనతిస్తున్నాడు. । మరిన్ని 11

యెహోవా నాతో అనినదేమంటే, వెనుకకు తిరిగిన
ఇశ్రాయేలు విశ్వాస ఘాతుకురాలైన యూదా కంటే
12 తన్ను తాను నీతి గల దానిగా తీర్చుకొనెను. । నీవు వెళ్లి
వుత్తరము తట్టు యీ మాటలను ప్రకటించుము; యేలా
గంటే వెనుకకు తిరిగిన ఓ ఇశ్రాయేలా, మళ్లుమని
యెహోవా ఆనతిస్తున్నాడు; నా కోపము మీ మీద
పడనియ్యను; యేమంటే నేను కనికరము గలవాడనై,
కోపమును నిత్యమున్ను వుంచనని యెహోవా ఆనతి
13 స్తున్నాడు. । నీ దేవుడైన యెహోవాకు విరోధముగా
పాపము చేసినారనిన్ని నా శబ్దము విననైతిరనిన్ని యీ
చొప్పున నీ అపరాధమును మాత్రము వొప్పుకొమ్మని
14 యెహోవా ఆనతిస్తున్నాడు. । వెనుకకు తిరిగిన ఓ పిల్ల
లారా, మళ్లండని యెహోవా ఆనతిస్తున్నాడు; యే
మంటే నేను మిమ్మున పెండ్లాడి వున్నాను; నేను మి
మ్మును వొక్కొక పట్టణములోనుంచి వొక్కొకనిన్ని
వొక్కొక కుటుంబములోనుంచి యిద్దరిద్దరినిన్ని తీసు
15 కొని సీయోనుకు మిమ్మును రాచేతును. । మరిన్ని నా
హృదయ ప్రకారమైన కాపరులను నేను మీకు యి
త్తును; వారు మిమ్మును తెలివితోటిన్ని వివేకముతో
16 టిన్ని పోషింతురు. । మీరు దేశమందు విస్తరించి వృద్ధి
బొందినప్పటి దినములలో సంభవించేదేమంటే, యె
హోవాయొక్క వొడంబడికె పెట్టె అని వారు యి
కను చెప్పరని యెహోవా ఆనతిస్తున్నాడు; అది మన
స్సులోకైనా రాదు; వారు దాని జ్ఞాపకమైనా చేసు
కోరు; వారు దాని దర్శించనైనా దర్శించరు; దానికి
17 మహిమ అయినా కలుగ చేయబడదు. । ఆ కాలమందు
వారు యెరూశలేమును యెహోవా సింహాసనమని
పిలుతురు; అప్పుడు సకలమైన జనాంగములు యెరూ
శలేమందున్న యెహోవా పేరట దాని యొద్దికి కూ
ర్చబడుదురు; వారు తమ దుష్ట హృదయముయొక్క
18 మూర్ఖత ప్రకారముగా మరి నడవక వుందురు. । ఆ
దినములలో యూదా యింటివారు ఇశ్రాయేలు యిం
టివారితో కూడా నడిచి, వారు భయములున్ను ఉత్త
రపు దేశములోనుంచి బైలుదేరి, నేను మీ పితృలకు
19 స్వాస్థ్యముగా యిచ్చిన దేశమునకు వత్తురు. । అయితే
పిల్లలలో నేను నిన్ను యేలాగు వుంతును! రమ్యమైన
దేశమున్ను జనసమూహములయొక్క ప్రశస్థమయిన
స్వాస్థ్యమున్ను నేను నీకు యేలాగు యిత్తును? అని
అనుకొంటిని; అయినా నా తండ్రీ, అని నీవు నన్ను
పిలిచి, నా యొద్దనుంచి తొలగక పోదువని అనుకొం
20 టిని. । నిశ్చయముగా భార్య ద్రోహముచేత తన పెని
మిటి యొద్దనుంచి యేలాగు తొలిగి పోవునో ఆలా
గునే ఓ ఇశ్రాయేలుయొక్క యింటివారలారా, మీరు
నా యెడల ద్రోహముగా ప్రవర్తించి యున్నారని
యెహోవా ఆనతిస్తున్నాడు. । వృస్నత స్థలముల మీద 21
వొక శబ్దము అనగా ఇశ్రాయేలు పుత్రులయొక్క
అంగలార్పు గల విన్నపములు వినబడెను; యేమంటే
వారు తమ మార్గములను భ్రష్టపరచి తమ దేవుడైన
యెహోవాను మరచియున్నారు. । వెనుకకు తిరిగిన ఓ 22
పిల్లలారా, మళ్లుకొండి, నేను మీ వెనుక తిరుగుటను
బాగుచేతును; యిదుగో మేము నీ యొద్దికి వస్తున్నా
ము, యేమంటే నీవు మా దేవుడవైన యెహోవావు. ।
నిజముగా కొండలనుంచిన్ని పర్వత సమూహమునుం 23
చిన్ని రక్షణ కలుగునన్న ఆశ వ్యర్థము; నిజముగా
మన దేవుడైన యెహోవా యందు ఇశ్రాయేలు యొ
క్క రక్షణ కలిగి యున్నది. । యేమంటే సిగ్గు మన బా 24
ల్యమునుంచి మన పితృలయొక్క ప్రయాసముల ఫల
ము, అనగా, వారి మేకలయొక్క గోవులయొక్క మం
దలనున్ను వారి కుమాళ్లనున్ను కుమార్తెలనున్ను భక్షిం
చెను. । మనము మన సిగ్గులో పండుకొని యున్నాము; 25
మన అవమానము మనల కప్పుతున్నది; యేమంటే మన
బాల్య కాలమునుంచి నేటివరకు మనమున్ను మన పితృ
లున్ను మన దేవుడైన యెహోవాకు విరోధముగా
పాపము చేసి, మన దేవుడైన యెహోవాయొక్క శబ్ద
మును వినక పోతిమి.

## 4. అధ్యాయము.

ఓ ఇశ్రాయేలా, నీవు మళ్లేటట్టయితే నా యొద్దికి 1
మళ్లుము, అని యెహోవా ఆనతిస్తున్నాడు; నా దృష్టి
లోనుంచి నీ అసహ్యమైన వాటిని నీవు తీసివేసుటకై
వుంటే అప్పుడు నీవు కదలక వుందువు. । మరిన్ని 2
సత్యముతోనున్ను న్యాయముతోనున్ను నీతితోనున్ను
యెహోవా జీవముతోడే అని నీవు ప్రమాణము
చేసుకొందువు; జనులు ఆయన యందు తమ్ము తాము
దీవించుకొని, ఆయన యందు అతిశయింతురు. । యేమం 3
టే యూదాయొక్కయున్ను యెరూశలేముయొక్క
యున్ను మనుష్యులతో యెహోవా యీలాగు ఆన
తిస్తూ వున్నాడు; మీ కొర్నభూమిని దున్ని, ముళ్ల
నడుమ విత్తనములను జల్లకండి. । ఓ యూదా జనులా 4
రా, యెరూశలేము కాపురస్తులారా, మీ దుష్కార్య
ముల కొరకై నా వుగ్రము అగ్నివలె బైలు వచ్చి,
ఆర్ప శక్యము కాకుండా మండకపోయే కొరకు యె
హోవా విషయమై మిమ్మును మీరు సున్నతి చేసు
కొని, మీ హృదయముయొక్క ముందోలును తీసివే
యండి. । దేశములో బాకానాదము చేయండని యూ 5
దాలో తెలియ చేయండి; యెరూశలేములో ప్రకటన
చేయండి; మిమ్మును మీరు పోగుచేసుకొండి, మనము
బురుజులు గల పట్టణములకు వెళ్లుదుము గాక అని

6 బొబ్బ పెట్టి కూడుకొండి. । సీయోను తట్టు ధ్వజమును
యెత్తండి; త్వరపడి ఆలస్యము చేయకండి, యేమంటే
వుత్తరమునుంచి కీడున్ను గొప్ప నాశమున్ను వచ్చే
7 టట్టు చేస్తాను. । సింహము తన పొదలోనుంచి బైలు
దేరి వస్తున్నది; అన్య జనులయొక్క వినాశకుడు మా
ర్గములో వున్నాడు; మీ దేశమును పాడు చేసు
టకు వాడు తన స్థలములోనుంచి బైలుదేరి వున్నాడు;
మీ పట్టణములు నష్టమున్ను నిర్మనుష్యమున్ను అవును.।
8 యిందు కొరకు మీరు గోనెపట్ట కట్టుకొని, అంగ
లార్చి, రోదనము చేయండి, యేమంటే యెహోవా
యొక్క తీక్ష్ణమైన కోపము మన యొద్దనుంచి తిరగక
9 వున్నది. । ఆ దినమందు సంభవించేదేమంటే, రాజు
యొక్క హృదయమున్ను అధిపతులయొక్క హృదయ
మున్ను క్షీణించి పోవును; అర్చకులు ఆశ్చర్యపడు
దురు; దీర్ఘదర్శులు విస్మయమును పొందుదురు, అని యె
10 హోవా ఆనతిస్తున్నాడు. । అప్పుడు అయ్యో! కర్త
యైన దేవుడా, నిజముగా నీవు యీ జనులనున్ను యె
రూశలేమునున్ను బహుగా మోసపుచ్చితివి; యేమం
టే మీకు నెమ్మది కలుగునని నీవు అన్నప్పటికీ కత్తి
11 ఆత్మ పర్యంతము అంటుతున్నదని పలికితిని. । ఆ కాల
మందు యీ జనులకున్ను యెరూశలేముకున్ను చెప్ప
బడేదేమంటే, అరణ్యమందున్న వున్నత స్థలములయొ
క్క వడగాడ్పు నా జనుల కుమార్తె తట్టుకు విసరు
12 టకైనా శుద్ధి చేసుటకైనా కాకుండా వచ్చును. । ఆ
స్థలములనుంచి నిండు గాలి నా యొద్దికి వచ్చును;
యిప్పుడున్ను నేను వారి విషయమై న్యాయపు తీర్పు
13 లను పలుకుదును. । యిదుగో అతడు మేఘముల వలె
మీదికి వచ్చును; అతని రథములు సుడిగాలి వలె వుం
డును; అతని గుర్రములు గద్దల కంటే వేగము గలవి;
మనకు అయ్యో! యేమంటే మనము దోపుడుబడుతూ
14 వున్నాము. । వో యెరూశలేమా, నీవు రక్షించబడే
కొరకు నీ హృదయమును చెడ్డతనమునుంచి కడిగివేయు
ము; యెంత పర్యంతము నీ వ్యర్థమైన తలంపులు
15 నీ యందు నివసించి వుండును? । యేమంటే వొక శబ్ద
ము దానునుంచి తెలియ చేస్తూ, యెఫ్రాయీము కొండ
16 నుంచి శ్రమను చాటిస్తూ వున్నది. । జనాంగములకు
మీరు తెలియ చేయండి; యిదుగో కాపరులు దూర
దేశమునుంచి వస్తూ, యూదా పట్టణములకు విరోధ
ముగా తమ శబ్దమును బైలు వెళ్లిస్తూ వున్నారు, అని
17 యెరూశలేము విషయమై ప్రకటన చేయండి. । చేని
కాపరుల వలె వారు దాని చుట్టూ వున్నారు; యెందు
చేతనంటే అది నాకు విరోధముగా తిరుగుబాటు చేసె
18 నని యెహోవా పలుకుతున్నాడు. । నీ మార్గమున్ను
నీ క్రియలున్ను యిటువంటి వాటిని తెచ్చినవి; యిదే
నీ చెడ్డతనము; యేమంటే అది చేదై వున్నది; అది నీ
హృదయము మట్టుకు అంటుతున్నది. । నా కడుపూ, 19
నా కడుపూ! నా హృదయమందు నాకు బాధ కలిగి
వున్నది; నా హృదయము నాలో మొరబెట్టుతుంది;
నేను వూరకుండలేను, యెందుకంటే ఓ నా ఆత్మా,
నీవు బాకా ధ్వనినిన్ని యుద్ధపు అల్లరనున్ను వినియు
న్నావు. । నాశనము మీద నాశనము ప్రచురమాతు 20
న్నది; యేమంటే దేశమంతా దోపుడుబడి వున్నది;
హఠాత్తుగా నా గుడారములున్ను వొక క్షణములో
నా తెరలున్ను దోపుడుబడి వున్నవి. । యెంత పర్యం 21
తము నేను ధ్వజమును చూతును! బాకా ధ్వనిని విం
దును? । యేమంటే నా జనులు అవివేకులై యున్నారు; 22
వారు నన్ను యెరుగక వున్నారు; వారు మూర్ఖపు
పిల్లలై, తెలివి లేనివారై వున్నారు; కీడు చేసుటకు
జ్ఞానులైయున్నారు గాని మేలు చేసుటకు వారికి తెలివి
లేదు. । నేను భూమిని దృష్టిస్తిని, అప్పుడు యిదుగో 23
అది ఆకారము లేనిదిన్ని వట్టిదిన్ని అయి వుండెను;
ఆకాశములనున్ను దృష్టిస్తిని, అవి వెలుగు లేనివై వుం
డెను. । నేను పర్వతములను దృష్టిస్తిని, అప్పుడు యిదు 24
గో అవి కంపించెను; కొండలన్ని కదలినవి. । నేను 25
దృష్టిస్తిని, అప్పుడు యిదుగో మనుష్యుడు లేడు, ఆకా
శపక్షులన్ని యెగిరిపోయి వుండెను. । నేను దృష్టిస్తిని, 26
అప్పుడు యిదుగో ఫలభరితమైన స్థలము అడవి ఆయె
ను; దాని పట్టణములన్నీ యెహోవా సముఖమున
ఆయన తీక్ష్ణమైన కోపము చేతను పడగొట్టబడి వుండె
ను. । యేమంటే యెహోవా యీలాగు చెప్పి వున్నా 27
డు, యేమంటే దేశము యావత్తు నిర్మనుష్యమవును;
అయినప్పటికిన్ని నేను పూర్ణమైన అంతమును కలు
గచేయను. । యిందు కొరకు భూమి దుఃఖించును; 28
పైనున్న ఆకాశములు నలుపవును; యెందుకంటే నేను
పలికి వున్నాను; నేను వుద్దేశించి వున్నాను; నేను
పశ్చాత్తాపపడకనున్ను దానినుంచి తిరుగకనున్ను వుం
దును. । పట్టణము యావత్తు గుర్రపు రౌతులయొక్క 29
యున్ను విలుకాండ్లయొక్కయున్ను సందడి వల్లను
పారిపోవును; వారు తుప్పలలోకి వెళ్లుదురు; మెట్టలను
యెక్కుదురు; ప్రతి పట్టణము విడువబడును. అందు
లో వొక మనుష్యుడైనా నివసించడు. । నీవు దోపుడు 30
పడినప్పుడు యేమి చేతువు? నీవు యెరుపు వస్త్రములను
ధరించుకొన్నా సువర్ణ భూషణములతో నిన్ను నీవు
అలంకరించుకొన్నా నీవు నీ ముఖమునకు రంగు పూ
సుకొన్నా నిన్ను నీవు సుందరవతిగా చేసుకొనుట
వ్యర్థమవును; నీ ప్రియులు నిన్ను నీచ పర్తురు; వారు
నీ ప్రాణమును వెతుకుదురు. । యేమంటే నాకిప్పుడు 31
అయ్యో! యెందుకంటే నా ఆత్మ నరహంతకులను గూర్చి

విసికి వున్నదని తన చేతులను చాస్తూ అంగలార్చుతూ
వున్న సీయోను కుమార్తెయొక్క శబ్దమును ప్రసవ
వేదనలో వున్న స్త్రీయొక్క శబ్దమైనట్టున్ను తన తొలి
చూలు బిడ్డను కంటూ వున్నదాని శ్రమ అయినట్టున్ను
నేను విని వున్నాను.

## 5. అధ్యాయము.

1 మీారు యెరూశలేముయొక్క వీధులలో అటూ
యిటూ పరుగెత్తి చూచి తెలుసుకోండి; న్యాయమును
జరిగిస్తూ సత్యమును వెతుకుతూ వున్న యెవ్వడైనా
అక్కడ వున్నాడేమో, ఆ మనుష్యుని మీారు కనుగొన
గలరేమో, దాని విశాలమైన స్థలములందు వెతుకండి,
2 అప్పుడు నేను దాని క్షమింతును. । యెహోవా జీవ
ముతోడే అని వారు అన్నప్పటికిన్ని నిశ్చయముగా
3 వారు అబద్ధ ప్రమాణమును చేసుకొంటున్నారు. । ఓ
యెహోవా, నీ నేత్రములు సత్యము మీాద వున్నవి
కావా? నీవు వారిని కొట్టినప్పటికిన్ని వారు దుఃఖించ
లేదు; నీవు వారిని క్షీణింప చేసినప్పటికిన్ని వారు
శిక్షను పొందుటకు అనుకూలించరైరి; వారు తమ
ముఖములను రాయి కంటే కఠినము చేసుకొని వు
4 న్నారు; మళ్లుటకు వారు ఫుప్పరైరి. । కాబట్టి నేను
అనుకొనినదేమంటే, నిశ్చయముగా వీరు దీనులై యు
న్నారు; అవివేకులై యున్నారు; యేమంటే వారు
యెహోవాయొక్క మార్గమునున్ను తమ దేవునియొ
క్క న్యాయపు తీర్పునున్ను యెరుగక వున్నారు. ।
5 నేను గొప్ప వారి యొద్దికి వెళ్లి వారితో మాట్లాడుదు
ను; యేమంటే వారు యెహోవాయొక్క మార్గము
నున్ను తమ దేవునియొక్క న్యాయపు తీర్పునున్ను
యెరిగి వున్నారు; అయితే వీరు కాడిని బొత్తిగా విరగ
6 గొట్టి, పలుపులను తెంపుకొని వున్నారు. । అందుచేత
అడవిలోనుంచి సింహము వారిని చంపును; అరణ్యపు
తోడేలు వారిని కొల్ల బెట్టును; చిరత పులి వారి పట్ట
ణముల యొద్ద కాచుకొని వుండును; అందులోనుంచి
బయిటికి వెళ్లే ప్రతివాడున్ను చీల్చబడును; యెందు
కంటే వారి అపరాధములు అనేకములై యున్నవి;
7 వారి వెనుక తిరుగుటలు విస్తరించినవి. । యిందుకు నేను
నిన్ను యేలాగున క్షమింతును? నీ పిల్లలు నన్ను విస
ర్జించి, దేవుండ్లు కాని వారి మీాద ఒట్టు పెట్టుకొని
వున్నారు; నేను వారిని తృప్తిగా పోషించిన తరువాత
వారు జారత్వమును జరిగించి గుంపులుగా వేశ్యల
8 యిండ్లలో కూడుకొనిరి. । వుదయమందు వారు మేత
పెట్టిన గుర్రముల లాగున వుండిరి, ప్రతివాడు తన
9 తన పొరుగు వాని భార్య తట్టు సకిలించెను. । వీటి కొ
రకు నేను విచారణ చేయనా? అని యెహోవా పలు
కుతున్నాడు; యిటువంటి జనాంగము మీాద నా ఆత్మ
పగతీర్చక వుండునా? । మీారు దాని ప్రాకారములను 10
యెక్కి నాశనము చేయండి; అయితే పూర్ణమైన అం
తము చేయకండి; దాని ఆధారములను తీసివేయండి,
యేమంటే అవి యెహోవావి కావు. । యెందుకంటే 11
ఇశ్రాయేలు యింటివారున్ను యూదా యింటివారు
న్ను నా యెడల మిక్కిలీ విశ్వాస భంగముగా ప్రవ
ర్తించిరని యెహోవా పలుకుతున్నాడు. । వారు 12
యెహోవాను అబద్ధికుని చేసి, ఆయన కాడనిన్ని,
మా మీాదికి కీడు రాదనిన్ని, మేము కత్తినైనా కరువు
నైనా చూడమనిన్ని, । దీర్ఘదర్శులు గాలి అవుదురు, 13
వాక్యము వారి యందు లేదనిన్ని, ఆలాగున వారికే
అవుగాకనిన్ని పలికి వున్నారు. । కాబట్టి సైన్యముల 14
దేవుడైన యెహోవా యీలాగున ఆనతిస్తున్నాడు,
యేమంటే మీారు యీ మాటను పలుకుతున్నారు గనుక
యిదుగో నీ నోటియందు నా మాటలను అగ్నిగా
నున్ను యీ జనులను కర్రలనుగానున్ను చేతును; అది
వారిని భక్షించును. । యిదుగో ఇశ్రాయేలుయొక్క 15
యింటివారలారా, దూరమునుంచి ఒక జనాంగము
మీా మీాదికి వచ్చేటట్టు చేస్తానని యెహోవా పలుకు
తున్నాడు; అది బలమైన జనాంగము; పురాతనమైన
జనాంగము; నీవు యెరుగని భాషగల జనాంగము;
వారు పలికేదేదో నీవు గ్రహించవు. । వారి అమ్ముల 16
పొది తెరిచిన సమాధివలె వున్నది; వారందరున్ను బలా
ఢ్యులై వున్నారు. । మీా కుమారులున్ను కుమార్తెలు 17
న్ను భక్షించవలసిన మీా పంటనున్ను మీా ఆహారము
నున్ను వారు భక్షింతురు; మీా గొర్రెల మందలనున్ను
మీా పశువుల మందలనున్ను వారు భక్షింతురు; మీా
ద్రాక్ష చెట్లనున్ను మీా అంజూరపు చెట్లనున్ను వారు
భక్షింతురు; నీవు నమ్మినటువంటి నీ బురుజులు గల పట్ట
ణములను కత్తిచేత వారు క్షీణింప చేతురు. । అయిన 18
ప్పటికిన్ని ఆ దినముల యందు నేను మీాకు పూర్ణ
మైన అంతమును కలుగ చేయనని యెహోవా పలుకు
తున్నాడు. । అయితే మన దేవుడయిన యెహోవా 19
మనకు యీ సమస్తమైన వాటిని యెందుకు చేస్తున్నా
డని వీరు పలికేటప్పుడు సంభవించేదేమంటే, మీారు
నన్ను విసర్జించి, మీా దేశమందు మీారు అన్యమైన
దేవుండ్లను యేలాగు కొల్చియున్నారో ఆలాగున నే
మీాది కానటువంటి దేశమందు మీారు అన్యులకు కొ
లువు చేస్తారని నీవు వారికి ప్రత్యుత్తరము చెప్పవలెను. ।
యాకోబు యింటిలో యిది తెలియ చేయుము; యూ 20
దాలో ప్రకటించుము; । యేదంటే కన్నులు కలిగిన 21
ప్పటికీ చూడకనున్ను చెవులు గలిగినప్పటికీ వినకనున్ను
వున్నటువంటి అవివేకులున్ను బుద్ధిహీనులున్ను అయిన

22 ఓ జనులారా, మీరిప్పుడు దీని వినండి. । మీరు నాకు
భయపడరా? అని యెహోవా పలుకుతున్నాడు; నా
సముఖమున మీరు వణకరా? నేను నిత్య నిర్ణయము
చేత సముద్రముయొక్క హద్దు కొరకు అది దాని దాట
లేకుండేటట్టు యిసుకను వుంచియున్నాను; దాని తరం
గములు పొర్లినప్పటికీ అవి ప్రబలించ లేవు; అవి
23 ఘోషించినప్పటికీ అవి అతిక్రమించలేవు. । అయితే
యీ జనులు తిరుగుబాటున్ను ద్రోహమున్ను గల
హృదయపు వారై వున్నారు; వారు తిరగబడి తొలిగి
24 వున్నారు. । వర్షమును అనగా దాని కాలమందు తొ
లకరి వర్షమునున్ను కడవరి వర్షమునున్ను దయ
చేస్తూ వున్నటువంటి మన దేవుడైన యెహోవాకు
భయపడుదుము గాక; ఆయన పంట కాలపు నిర్ణయ
మైన వారములను మనకు వుంచుతూ వున్నాడు, అని
25 వారు తమ హృదయమందు చెప్పకనున్నారు. । మీ
అపరాధములే వీటిని మళ్లింప జేసినవి; మీ పాపములే
శుభమైన వాటిని మీకు రాకుండా ఆతంక పరచినవి.।
26 యేమంటే నా జనులలో దుర్మార్గులు కనుపడి
యున్నారు; వురులు వొగ్గే వాని వలె వారు పొంచి
యుందురు; వారు బోను వొగ్గి మనుష్యులను పట్టు
27 కొందురు. । పంజరము పిట్టలతో నిండి వున్నట్టు వారి
యిండ్లు కపటముతో నిండి యున్నవి; అందువల్లనే
28 వారు గొప్పవారై ఐశ్వర్యవంతులై వున్నారు. । వారు
మదించి నిగనిగలాడుతూ వున్నారు; నిశ్చయముగా
వారు దుష్టుల క్రియల కంటే అధికమైన వాటిని చేస్తు
న్నారు; తండ్రిలేని వారియొక్క వ్యాజ్య విషయమై
న్యాయము విచారించక వున్నారు; అయినప్పటికీ వారు
వృద్ధిపొందుతూ వున్నారు; దరిద్రులకు న్యాయము
29 యివ్వక వున్నారు. । వీటి కొరకు నేను విచారణ చేయక
వుందునా? అని యెహోవా పలుకుతున్నాడు; నా
ఆత్మ యిటువంటి జనాంగము మీద పగ తీర్చుకొనక
30 వుందునా? । వింతయున్ను ఘోరమున్ను అయిన వొక
కార్యము దేశమందు జరుగుతున్నది, అదేదంటే దీర్ఘ
దర్శులు అబద్ధపు దీర్ఘదర్శనమును పలుకుతున్నారు;
అర్చకులు వారి ద్వారా ప్రభుత్వము చేస్తున్నారు;
మరిన్ని నా జనులు ఆ ప్రకారముగా వుండుటను
అపేక్షిస్తున్నారు; అయితే దాని అంతమందు మీరు
యేమి చేయుదురో?

## 6. అధ్యాయము.

1 ఓ బెన్యామీను పుత్రులారా; యెరూశలేము మధ్య
నుంచి పారిపోవుటకు మీరు కూడుకొని, తెకోవలో
బాకా నాదము చేసి, బేధక్కెరెములో అగ్నియొక్క
ఆనవాలును వుంపించండి; యేమంటే వుత్తరమునుంచి
కీడున్ను గొప్ప నాశనమున్ను ప్రత్యక్షమౌతున్నవి. ।
నేను సీయోనుయొక్క కుమార్తెను కోమలత్వమున్ను 2
సుకుమారత్వమున్ను గల స్త్రీకి పోలిక చేస్తిని. । గొర్రెల 3
కాపరులు తమ మందలతో కూడా దాని యొద్దికి
వత్తురు; వారు తమ గుడారములను దానికి విరోధముగా
చుట్టున్ను వేతురు; వారిలో ప్రతివాడు తన తన స్థల
మందు మేపు పొందును. । దానిమీద యుద్ధము ఆయ 4
త్తపరచండి; లెండి, మనము మధ్యాహ్నమందు పైకి
వెళ్లుదాము; మనకు అయ్యో! యేమంటే ప్రొద్దుపో
తున్నది, సాయంతనపు నీడలు పొడవు అవుతున్నవి. ।
లెండి, మనము రాత్రికాలమందు వెళ్లి, దాని నగరు 5
లను పాడుచేతుము. । యేమంటే సైన్యముల యెహోవా 6
వా యీలాగు చెప్పియున్నాడు, యేమంటే మీరు
చెట్లను నరికి, యెరూశలేముకు విరోధముగా బురుజులు
యెత్తండి; శిక్షింపబడుటకు యిదే పట్టణము; దీని మధ్య
మందు అన్యాయము నిండి యున్నది. । వూట తన 7
జలములను పైకి వుబికేటట్టు యేలాగు చేసునో ఆలా
గునే అది తన చెడ్డతనమును పైకి వుబకచేస్తున్నది;
బలాత్కారమున్ను కొల్లయున్ను దానిలో వినబడుతు
న్నది; దుఃఖమున్ను గాయములున్ను నిత్యమున్ను నా
యెదుట వున్నవి. । ఓ యెరూశలేమా, నాయాత్మ నీ 8
యొద్దనుంచి తొలగిపోకుండా వుండేటట్టున్ను నేను
నిన్ను పాడుగానున్ను నిర్మనుష్యమయిన దేశముగా
నున్ను చేయక వుండేటట్టున్ను బోధ పొందుము; సైన్య
ముల యెహోవా యీలాగున పలుకుతున్నాడు. ।
యేమంటే వారు ఇశ్రాయేలుయొక్క శేషించిన వారిని 9
ద్రాక్ష చెట్టు వలె బొత్తిగా యేరుకొందురు; ద్రాక్ష
పండ్లను యేరుకొనే వాని వలె నీ చెయ్యి గంపలలోకి
మళ్లించుము. । వారు వినేలాగు నేను యెవరితో మా 10
ట్లాడి హెచ్చరిక చేతును? యిదుగో వారి చెవి సున్నతి
పొందనిదైనందున వారు వినలేదు; యిదుగో యెహో
వాయొక్క వాక్యము వారికి నింద అయి వున్నది;
దాని యందు వారికి యిష్టము లేదు. । కాబట్టి నేను 11
యెహోవాయొక్క వుగ్రముతో నిండియున్నాను;
దాని అణుచుకొని వుండుటచేత విసుకుతున్నాను;
బైట వున్న పిల్లల మీదనున్ను పడుచు వారియొక్క
గుంపు మీదనున్ను నేను దాని పోతును; యేమంటే
భార్యతో కూడా పెనిమిటిన్ని పూర్ణ దినములు గల
వానితో కూడా వృద్ధున్ను తీసుకొని పోబడుదురు. ।
వారి యిండ్లున్ను పొలములున్ను స్త్రీలున్ను యితరు 12
లకు వశమౌను; యేమంటే దేశపు కాపురస్థుల మీద
నేను నా చెయ్యి చాపుదునని యెహోవా పలుకు
తున్నాడు. । యేమంటే వారిలో కొద్దివాడు మొదలు 13
కొని గొప్పవాని పర్యంతము అందరున్ను లోభ్యమునకు

వశులై వున్నారు; దీర్ఘదర్శి మొదలుకొని అర్చకుని
పర్యంతము ప్రతివాడున్ను అబద్ధముగా ప్రవర్తిస్తు
14 న్నాడు. । మరిన్ని క్షేమము లేకపోయినప్పటికీ క్షేమ
ము, క్షేమము, అని పలుకుతూ, నా జనుల కొమార్తె
యొక్క గాయమును పై పైగా స్వస్థపరచి యున్నారు.।
15 వారు అసహ్యతను జరిగించిన తరువాత సిగ్గుపడి
నారా? లేదు; వారు యెంతమాత్రమూ సిగ్గుపడ లేదు;
బిడియము పొందలేక పోయిరి; కాబట్టి పడిపోయే
వారిలో వారున్ను పడుదురు; నేను వారిని శిక్షించే
కాలమందు వారు కూలుదురని యెహోవా పలుకు
16 తున్నాడు.। యెహోవా యీలాగు పలుకుతున్నాడు,
యేమంటే, మీరు మార్గములలో నిలువబడి చూచి,
పురాతన మార్గములను గురించిన్ని మంచి మార్గము
యేది అని అడిగి, అందులో నడువండి; అప్పుడు మీరు
మీ యాత్మలకొరకు నెమ్మదిని కనుగొందురు; అయితే
17 మేము దానిలో నడువమని వారు చెప్పిరి. । మరిన్ని
బాకా నాదమును వినండి, అని చెప్పే కాపరులను
నేను మీ మీద వుంచితిని; అయితే మేము వినమని
18 వారు పలికిరి. । కాబట్టి ఓ జనాంగములారా, వినండి;
ఓ సంఘమా, వారిలో వున్నదాని తెలుసుకొనుము. ।
19 ఓ భూమీ, వినుము; యిదుగో యీ జనులు నా వా
క్యములనైనా నా న్యాయప్రమాణమునైనా వినక,
దాని విసర్జించి వున్నారు, గనుక నేను వారి మీదికి
కీడు, అనగా, వారి తలంపులయొక్క ఫలము వచ్చేటట్టు
20 చేస్తాను. । షెబానుంచి ధూప వర్గమున్ను దూరదేశ
మునుంచి మధురపు చెక్కయున్ను నా యొద్దికి రావ
డము యెందుకు? మీ దహనబలులు హితమైనవి కావు;
21 మీ బలులు నాకు యింపైనవి కావు. । కాబట్టి యె
హోవా యీలాగు పలుకుతున్నాడు; యేమంటే
యిదుగో నేను యీ జనుల యెదుట అభ్యంతరములను
పెట్టుదును; అప్పుడు తండ్రులున్ను కుమారులున్ను
యేకముగా వాటిమీదను పడుదురు; పొరుగువాడున్ను
22 వాని స్నేహితుడున్ను నశింతురు. । యెహోవా యీ
లాగు పలుకుతున్నాడు, యేమంటే యిదుగో వుత్తరపు
దేశమునుంచి వొక జనసమూహము వస్తున్నది; భూమి
యొక్క పక్కలలోనుంచి వొక గొప్ప జనాంగము
23 కూర్చబడును. । వారు వింటెనిన్ని యీటెనున్ను పట్టు
కొనుదురు; వారు క్రూరులై కనికరము లేనివారై యు
న్నారు; వారి శబ్దము సముద్రము లాగున ఘోషిం
చును; ఓ సీయోను కుమారికా, నీ మీదికి యుద్ధపు
మనుష్యుల వలె మోహరముగా వుంచబడిన గుర్రము
24 లను వారు యెక్కుతూ వున్నారు. । మనము దానియొ
క్క కబురు విని యున్నాము; మన చేతులకు బలహీ
నత కలిగెను; వేదనయున్ను ప్రసవ వేదన గల స్త్రీకి

అయినట్టు శ్రమయున్ను మమ్మును ఆక్రమించుకొనెను.।
పొలములోకి వెళ్లకండి; మార్గమున నడువకండి; యే 25
మంటే శత్రువుని ఆయుధమున్ను భయమున్ను అన్ని
వయిపులా కలిగియున్నవి. । నా జనులయొక్క కుమా 26
రికా, గోనెపట్టను కట్టుకొని, బూడిదెలో పొర్లుము;
యేక పుత్రునికైనట్టు దుఃఖించుము; ఘోరమైన రోద
నము చేయుము; యెందుకంటే దోపరి మన మీదికి
హఠాత్తుగా వచ్చును. । నీవు నా జనులయొక్క మార్గ 27
మును తెలుసుకొని, పరిశోధించే లాగున నేను నిన్ను
గోపురముగానున్ను కోటగానున్ను వుంచితిని. । వారం 28
దరున్ను కఠోరమైన తిరుగుబాటు చేసేవారై, అపనిం
దలతో నడుస్తూ వున్నారు; వారు యిత్తడిన్ని యిను
మున్ను అయి వున్నారు; వారందరూ చెరిపే వారై
వున్నారు. । తిత్తులు కాలి పోయినవి; సీసము అగ్ని 29
వల్ల దహించబడిపోయినది; పోత పనివాడు వృథాగా
కరిగిస్తూ వున్నాడు; యేమంటే దుర్మార్గులు వెలి
వేయబడ లేదు. । పనికిమాలిన వెండి అని మనుష్యులు 30
వారిని పిలుతురు; యెందుకంటే యెహోవా వారిని
పరిహరించి యున్నాడు.

## 7. అధ్యాయము.

యెహోవా యొద్దనుంచి ఇర్మీయాకు వచ్చిన వా 1
క్యము యేమంటే, । నీవు యెహోవాయొక్క మందిర 2
ద్వారమందు నిలువబడి, అక్కడ యీ వాక్యమును
ప్రకటించి చెప్పుము; యేదంటే యెహోవాను ఆరా
ధించుటకు యీ ద్వారములలో బడి ప్రవేశించే యూ
దావారలారా, యెహోవా వాక్యమును వినండి. ।
ఇశ్రాయేలుయొక్క దేవుడైన సైన్యముల యెహోవా
యీలాగు పలుకుతున్నాడు; మీ మార్గములనున్ను
మీ కార్యములనున్ను దిద్దుకొనండి, అప్పుడు మీరు
యీ స్థలమందు నివసించేటట్టు చేస్తాను. । యెహోవా
మందిరము, యెహోవా మందిరము, యెహోవా
మందిరము యివి, అని, అబద్ధపు మాటలయందు నమ్మిక
వుంచకండి. । యేమంటే మీరు మీ మార్గములనున్ను
మీ కార్యములనున్ను పూర్ణముగా దిద్దుకొని, వొక
మనుష్యునికిన్ని అతని పొరుగు వానికిన్ని మధ్యను
పూర్ణముగా న్యాయమును తీర్చి, । పరదేశినిన్ని
తండ్రి లేని వానినిన్ని విధవనున్ను బాధించకనున్ను,
యీ స్థలములో నిరపరాధి రక్తమును చిందించకనున్ను
మీ చేటుకై యితరమైన దేవుండ్ల వెంబడి మీరు నడు
వకనున్ను వున్నట్టయితే, । అప్పుడు నేను మిమ్మును యీ
స్థలమందు, అనగా, మీ పితృలకు నేను యిచ్చిన దేశ
మందు యెప్పటికిన్ని నివసించేటట్టు చేస్తాను. । యిదు
గో ప్రయోజనము లేని అబద్ధపు మాటల యందు

9 మీరు నమ్మికను వుంచుతున్నారు. । మీరు దొంగిలి, నర
హత్య చేసి, జారత్వమును జరిగించి, అబద్ధ ప్రమాణ
ము చేసి, బయలుకు ధూపమును సమర్పించి, మీరు
10 యెరుగని యితర దేవుండ్ల వెంబడి నడిచి, । నా పేరట
పిలువబడిన యీ మందిరమందున్న నా యెదుటికి వచ్చి
నిలువబడి, యీ సకలమైన అసహ్యతలను చేసుటకు
11 మాకు యివ్వబడి వున్నదని పలుకుదురా? । నా పేరట
పిలువబడిన యీ మందిరము మీ దృష్టికి దొంగల
గుహ అయినదా? యిదుగో నేను దీని చూచి వున్నా
12 నని యెహోవా పలుకుతున్నాడు. । అయితే ప్రథమ
మందు నేను నా పేరును పెట్టిన షీలో యందు వున్న
నా స్థలమునకు మీరు యిప్పుడు వెళ్లి, నా జనులైన
ఇశ్రాయేలు దుర్మార్గత కొరకు దానిని యేమి చేస్తి
13 నో చూడండి. । మరిన్ని యెహోవా చెప్పేదేమంటే,
మీరు యీ కార్యములన్నీ చేస్తిరి, అయితే నేను మీతో
మాట్లాడితిని; పెందలాడ లేచి పలికినప్పటికిన్ని మీరు
వినలేదు; నేను మిమ్మును పిలిచినప్పటికిన్ని మీరు
14 ప్రత్యుత్తరము యివ్వలేదు. । కాబట్టి నేను షీలోకు
చేసినట్టు నా పేరట పిలువబడి వున్నటువంటిన్ని మీరు
నమ్ముతున్నటువంటిన్ని యీ యింటికిన్ని మీకున్ను మీ
పితృలకున్ను నేను యిచ్చినటువంటి స్థలముకున్ను నేను
15 చేతును. । మరిన్ని మీ సహోదరులందరిని, అనగా,
ఎఫ్రాయీము సంతతి అంతటినీ నేను పరిహరించినట్టు
16 మిమ్మును నా దృష్టిలోనుంచి పరిహరింతును. । కాబట్టి
యీ జనుల కొరకు నీవు ప్రార్థించకుము; వారి
కొరకు మొర్రనైనా ప్రార్థననైనా చేయకనున్ను,
నా యొద్ద విజ్ఞాపనము చేయకనున్ను వుండుము; యెందు
17 కంటే నేను నీ మనవిని వినను. । యూదా పట్టణముల
లోనున్న యెరూశలేము వీధులలోనున్న వారు యేమి
18 చేస్తున్నారో నీవు చూస్తున్నావు కావా? । వారు
నాకు కోపమును కలుగ చేసుటకై ఆకాశ పత్నికి
అప్పాలను చేసే కొరకున్ను యితరమయిన దేవుండ్లకు
పానార్పణలను పోసే కొరకున్ను పిల్లలు కర్రలను
పోగుచేతురు; తండ్రులు అగ్నిని రాజబెట్టుదురు; స్త్రీలు
19 పిండిని పిసుకుదురు. । వారు నాకు కోపమును కలుగ
చేస్తున్నారా? వారి ముఖముయొక్క తత్తరపాటుకై
వారికి వారే కలుగ చేసుకొంటున్నారు కారా? అని
20 యెహోవా పలుకుతున్నాడు. । కాబట్టి కర్త అయిన
దేవుడు యీలాగు పలుకుతున్నాడు, యేమంటే యి
దుగో నా కోపమున్ను నా రౌద్రమున్ను యీ స్థలము
మీదనున్ను మనుష్యుని మీదనున్ను మృగము మీద
నున్ను పొలముయొక్క చెట్ల మీదనున్ను భూమియొ
క్క పంట మీదనున్ను పోయబడును; అది కాలి ఆర్ప
21 బడక వుండును. । ఇశ్రాయేలు దేవుడైన సైన్యముల
యెహోవా యీలాగు పలుకుతున్నాడు; యేమంటే
మీ హోమార్పణలను మీ బలులతో కూర్చి మాంస
మును తినండి. । నేను మీ పితృలను మిస్రయీము 22
దేశములోనుంచి వెలపటికి తీసుకొని వచ్చిన దినమందు
హోమార్పణలను గురించియైనా బలులను గురించియై
నా వారితో నేను పలుకలేదు; వారికి ఆజ్ఞాపించలేదు.।
అయితే నా శబ్దమును వినండి, అప్పుడు నేను మీ 23
దేవుడనవుదును; మీరు నా జనులవుదురు; మీకు బాగా
జరిగేలాగు నేను మీకు ఆజ్ఞాపించిన మార్గములన్నిటి
యందు నడువండి, అని యీ సంగతిని నేను వారికి
ఆజ్ఞాపిస్తిని. । అయితే వారు వినకనున్ను వారు చెవి 24
యొగ్గకనున్ను వుండి, తమ దుష్ట హృదయముయొక్క
ఆలోచన చొప్పుననున్ను మూర్ఖత చొప్పుననున్ను
నడిచి, ముందరికి కాకుండా వెనకకు వెళ్లిరి. । మీ పితృ 25
లు మిస్రయీము దేశములోనుంచి వెలపటికి వచ్చిన
నాటినుంచి నేటివరకున్ను నేను నా సేవకులైన దీర్ఘ
దర్శులనందరిని మీ యొద్దికి పంపితిని; అనుదినమున్ను
పెందలాడలేచి పంపుతూ వుంటిని. । అయినప్పటికిన్ని 26
వారు నా మాటను వినకనున్ను తమ చెవి యొగ్గక
నున్ను వుండి, తమ మెడను కఠినపరచుకొనిరి; వారు
తమ పితృలకంటే మరీ చెడ్డగా ప్రవర్తించిరి. । కాబట్టి
నీవు యీ వాక్యములన్నిటినిన్ని వారితో పలుక వల 27
సినది, అయినప్పటికిన్ని వారు నీ శబ్దమును వినరు;
నీవు వారిని పిలువవలసినది, అయినప్పటికిన్ని వారు
నీకు ప్రత్యుత్తరము యియ్యరు. । అయితే యిది తమ 28
దేవుడైన యెహోవాయొక్క శబ్దమునకు లోబడక
నున్ను బోధను అంగీకరించకనున్ను వున్న జనసమూ
హమై యున్నది; సత్యము నశించిపోయి, వారి నోట
నుంచి తెగిపోయినదని నీవు వారితో చెప్పవలెను. ।
ఓ యెరూశలేమా, నీ వెంట్రుకలను కత్తిరించి పార 29
వేసి, వున్నత స్థలముల మీద ప్రలాప వాక్యమును
యెత్తి పలుకుము; యెందుకంటే యెహోవా తన కో
పముయొక్క తరము వారిని నిరాకరించి విసర్జించి
వున్నాడు. । యేమంటే యూదా పుత్రులు నా దృష్టికి 30
కీడు చేసి వున్నారని యెహోవా పలుకుతున్నాడు;
వారు నా పేరట పిలువబడిన మందిరములో దాని
అపవిత్రపరచుటకు తమ అసహ్యమైన వాటిని పెట్టి
వున్నారు. । మరిన్ని వారు తమ కుమారులనున్ను కుమా 31
ర్తెలనున్ను అగ్నిలో దహించుటకు హిన్నోము కుమా
రుని లోవలో వున్న తోఫెతుయొక్క వున్నత స్థలము
లను కట్టి వున్నారు; నేను అది వారికి ఆజ్ఞాపించలేదు;
అది నా హృదయములోకైనా రాలేదు. । కాబట్టి యి 32
దుగో దినములు వస్తున్నవి, అప్పుడు అది తోఫెతు అని
అయినా హిన్నోము కుమారుని లోవ అని అయినా

పిలువబడక, వధయొక్క లోయ అని పిలువబడును,
అని యెహోవా పలుకుతున్నాడు; యెందుకంటే
స్థలము లేకపోయినంత మట్టుకు వారు తోఫెతులో
33 శవములను పాతిపెట్టుదురు. । మరిన్ని యీ జనులయొ
క్క శవములు ఆకాశ పక్షులకున్ను భూ మృగముల
కున్ను ఆహారమవును; యెవరూ వాటిని వెళ్లగొట్టక
34 వుందురు. । అప్పుడు నేను యూదా పట్టణములలో
నున్ను యెరూశలేముయొక్క వీధులలోనున్ను వుల్లాస
శబ్దమునున్ను ఆనంద శబ్దమునున్ను పెండ్లికుమారుని
శబ్దమునున్ను పెండ్లికుమార్తె శబ్దమునున్ను చాలించే
టట్టు చేస్తాను, యేమంటే దేశము నిర్మనుష్యమై
యుండును.

## 8. అధ్యాయము.

1 యెహోవా చెప్పేదేమంటే, ఆ కాలమందు వారు
యూదా రాజులయొక్క శల్యములనున్ను అతని అధి
కారుల శల్యములనున్ను అర్చకుల శల్యములనున్ను
దీర్ఘదర్శుల శల్యములనున్ను యెరూశలేముయొక్క
కాపురస్తుల శల్యములనున్ను వారి వారి సమాధులలో
2 నుంచి తీసి, । వారు ప్రేమించినటువంటిన్ని సేవించిన
టువంటిన్ని వెంబడించినటువంటిన్ని వెతికినటువంటిన్ని
ఆరాధించినటువంటిన్ని సూర్యుని ముందరనున్ను చం
ద్రుని ముందరనున్ను ఆకాశ సమూహమంతటి ముంద
రనున్ను పరుతురు; అవి పోగు చేయబడకనున్ను పాతి
పెట్టబడకనున్ను భూ ముఖము మీద పెంటగా వుం
3 డును. । నేను వారిని తోలివేసిన స్థలములన్నిటి యందు
వుండిపోయిన యీ చెడ్డ కుటుంబములో శేషించిన
వారందరిచేత జీవము కంటే మరణమే మేలుగా యెం
చబడునని సైన్యముల యెహోవా పలుకుతున్నాడు.।
4 మరిన్ని నీవు వారితో చెప్పవలసినదేమంటే యెహో
వా యీలాగున పలుకుతున్నాడు; వారు పడి తిరిగీ
లేవక వుందురా! వాడు తొలిగిపోయి మళ్లక వుండు
5 నా? । యెరూశలేముయొక్క యీ జనులు యెందుకు
నిత్యమైన వెనుకకు తిరుగుటచేత తిరిగిపోయి యున్నా
రు? వారు కపటమును గట్టిగా అవలంబించి యున్నారు;
6 మళ్లుటకు ఒప్పక వున్నారు. । నేను ఆలకించి వింటిని,
అయితే వారు సరిగా మాట్లాడలేదు; నేను యేమి
చేస్తిని అని ఒక్కడైనా తన దుర్మార్గతను గురించి
పశ్చాత్తాప పడలేదు; గుర్రము యుద్ధమునకు చొరబ
డినట్టు ప్రతివాడు తన తన మార్గము తట్టు తిరిగెను.।
7 ఆకాశమందుండే సాళ్వ పక్షి దాని నిర్ణయ కాలము
లను యెరుగును, గువ్వయున్ను కొంగయున్ను మంగలి
కత్తి అనే పిట్టయున్ను వాటి కాలముయొక్క రాక
టను గుర్తెరుగును; అయితే నా జనులు యెహోవా
యొక్క న్యాయపు విధింపును గుర్తెరుగక వున్నారు. ।
మేము జ్ఞానులము, యెహోవా న్యాయ ప్రమాణము 8
మా యొద్ద వున్నదని మీరు యేలాగు చెప్పుతున్నారు!
యిదుగో నిశ్చయముగా లేఖికులయొక్క కృత్రిమపు
కలము కృత్రిమముగానే జరిగిపోతున్నది. । జ్ఞానులు 9
సిగ్గుపొంది వున్నారు; వారు విభ్రాంతి పడిన్ని చిక్కు
పడిన్ని వున్నారు, యిదుగో వారు యెహోవా వాక్య
మును నిరాకరించి వున్నారే; వారిలో యేమి జ్ఞానము
వున్నది! । కాబట్టి నేను వారి భార్యలను యితరులకు 10
న్ను వారి పొలములను వాటిని స్వతంత్రించుకొనే వారి
కిన్ని యిత్తును; యేమంటే వారిలో కొద్దివాడు మొద
లుకొని గొప్పవాని పర్యంతము అందరున్ను లోభ్యము
నకు వశులై యున్నారు; దీర్ఘదర్శి మొదలుకొని
అర్చకుని పర్యంతము ప్రతివాడున్ను అబద్ధముగా
ప్రవర్తిస్తున్నాడు. । యేమంటే క్షేమము లేకపోయిన 11
ప్పటికిన్ని క్షేమము, క్షేమము, అని పలుకుతూ, నా
జనుల కుమార్తెయొక్క గాయమును పై పైగా స్వస్థప
రచి యున్నారు. । వారు అసహ్యతను జరిగించిన తరు 12
వాత సిగ్గుపడినారా? లేదు; వారు యెంత మాత్రమూ
సిగ్గుపడలేదు; బిడియమునున్ను పొందలేకపోయిరి;
కాబట్టి పడిపోయే వారిలో వారున్ను పడుదురు; వారి
శిక్షా కాలమందు వారు కూలుదురని యెహోవా
పలుకుతున్నాడు. । నిశ్చయముగా నేను వారిని క్షీణిం 13
పచేతును అని యెహోవా పలుకుతున్నాడు; ద్రాక్ష
చెట్టులో ద్రాక్షపండ్లు వుండవు; అంజూరపు చెట్టులో
అంజూరపు పండ్లు వుండవు; ఆకున్ను వాడిపోవును;
మరిన్ని నేను వారికి యిచ్చినవి వారి యొద్దనుంచి
తొలిగి పోవును. । మనము యెందుకు వూరకె కూ 14
ర్చుని వున్నాము! కూడుకొని మనము ప్రాకార
ములుగల పట్టణములలోకి వెళ్లుదుముగాక; అక్కడ
వూరకుందుముగాక; యేమంటే మనము యెహోవాకు
విరోధముగా పాపము చేసినాము, గనుక మన దేవు
డైన యెహోవా మనలను మౌనుల మయ్యేటట్టు చేసి,
తాగుటకు మనకు విషపు నీళ్లను యిచ్చి వున్నాడు. ।
క్షేమము కొరకు మనము కనిపెట్టి వుంటిమి, అయితే 15
శుభము రాలేదు; స్వస్థకాలము కొరకున్ను అయితే
యిదుగో శ్రమ. । అతని గుర్రములయొక్క బుసలుగొ 16
ట్టుట దానునుంచి వినబడెను; దేశము యావత్తు అతని
బలమైన వాటి సకిలింపుయొక్క శబ్దమువల్ల కంపించె
ను; యేమంటే వారు వచ్చి వున్నారు; దేశమునున్ను
దానియందున్న సమస్తమునున్ను పట్టణమునున్ను దాని
యందు నివసించే వారందరినిన్ని వారు పాడుచేసి వు
న్నారు. । యేమంటే యిదుగో నేను మీలోకి పాము 17
ళనున్ను కర్కోట సర్పములనున్ను పంపుదును; అవి

లాలించబడక మిమ్మును కరుచునని యెహోవా పలు
18 కుతున్నాడు. । దుఃఖమునకు విరోధముగా నా అంతట
నేను వుపశమించుకొనుటకు వున్నప్పుడు నా హృద
19 యము నాలో సొమ్మసిల్లుతున్నది. । దూరదేశమందు
నివసించే వారి కోసము నా జనుల కుమార్తెయొక్క
రోదన శబ్దము యిదుగో; యెహోవా సీయోనులో
లేడా? దాని రాజు దానియందు లేడా? వారు తమ
చెక్కిన బొమ్మలచేతనున్ను యితరమైన వ్యర్థాపు వాటి
చేతనున్ను నాకు యెందుకు కోపమును కలుగచేసిరి? ।
20 కోత కాలము గతించిపోయెను, వేసవి కాలము అంత
మాయెను, అయితే మనము రక్షించబడక వున్నాము. ।
21 నా జనుల కుమార్తెయొక్క గాయము కొరకు నేను
గాయమును పొంది వున్నాను; నేను నల్లుపై యున్నా
22 ను; విస్మయము నన్ను పట్టెను. । గిలాదులో జీగురు
లేదా? అక్కడ వైద్యుడు లేడా? యెందుకు మరి నా
జనులయొక్క కుమార్తె ఆరోగ్యమును పొందక వున్నది?

## 9. అధ్యాయము.

1 అహహా, నేను నా జనుల కుమార్తెయొక్క హ
తులైయ్యే వారి నిమిత్తము దివారాత్రములు అంగలా
ర్చుటకై, నా శిరస్సు వుదకములయ్యేటట్టున్ను నా
నేత్రములు కన్నీళ్ల వూట అయ్యేటట్టున్ను నేను
2 యెంతో ఆశిస్తున్నాను! । అహహా, నేను నా జనులను
విడిచి, వారి యొద్దనుంచి తొలిగిపోయే కొరకు అర
ణ్యమందు బాటసార్లు బస నాకు వుంటే మేలు! యే
మంటే వారందరూ వ్యభిచారులున్ను విశ్వాస ద్రో
3 హుల సమూహమున్ను అయి యున్నారు. । అబద్ధముల
కొరకు వారు తమ నాలుకలను తమ విండ్ల వలె వంచు
తూ వున్నారు; అయితే భూమి యందు సత్యము కొ
రకు వారు ధైర్యవంతులు కారు; వారు కీడునుంచి
కీడుకు జరుగుతూ, నన్ను యెరుగరని యెహోవా
4 పలుకుతున్నాడు. । మీలో ప్రతివాడు తన తన పొరు
గువాని గురించి జాగ్రతపడి, యే సహోదరుని యం
దైనా నమ్మిక వుంచకండి; యేమంటే ప్రతి సహోద
రుడు బొత్తిగా వంచనచేసి వెళ్లగొట్టును; ప్రతి పొరు
5 గువాడు అపనిందలతో నడుచును. । మరిన్ని వారిలో
ప్రతివాడు తన పొరుగువాని వంచించి, సత్యమును
పలుకక వుండును; అబద్ధములను పలికే కొరకు వారు
తమ నాలుకను నేర్పి యున్నారు; అక్రమము జరిగిం
6 చుటకు ప్రయాసపడుతున్నారు. । నీ నివాసము వంచన
మధ్యను వున్నది; వంచనచేత వారు నన్ను తెలుసుకొ
నుటకు వొప్పక వున్నారని యెహోవా పలుకుతు
7 న్నాడు. । కాబట్టి సైన్యముల యెహోవా యీలాగు
పలుకుతున్నాడు, యిదుగో నేను వారిని కరిగించి,
పుటము వేతును; యేమంటే నా జనుల కుమార్తెను
నేను యేలాగు చేతును? । వారి నాలుక యెగసిన బాణ 8
ము వలె వున్నది; అది వంచనను పలుకుతున్నది; వొకడు
తన పొరుగు వానితో నోటను సమాధానముగా మా
ట్లాడును, అయితే హృదయమందు వాని కొరకు పొంచి
వుండును. । వీటి కొరకు నేను వారిని విచారణ చేయ 9
నా? నా ఆత్మ యిటువంటి జనాంగము మీద పగ
తీర్చక వుండునా? అని యెహోవా పలుకుతున్నా
డు. । పర్వతముల కొరకు అంగలార్పున్ను రోదన 10
మునున్ను అరణ్య నివాస స్థలముల కొరకు ప్రలాప
మునున్ను చేతును; అవి పాడైపోయెను; వాటి లో
బడి యెవరూ వెళ్ల లేరు; పశువుల శబ్దము యెవరూ
వినలేరు; ఆకాశ పక్షులున్ను మృగములున్ను పారిపో
యినవి; అవి తొలగి పోయినవి. । నేను యెరూశలేము 11
ను దిబ్బలుగానున్ను ఘట సర్పముల గుహగానున్ను
చేతును; యూదా పట్టణములను పాడుగానున్ను
నిర్మానుష్యముగానున్ను చేతును. । యిది గ్రహించే 12
జ్ఞాని యెవడు? దేశము లోబడి యెవరూ వెళ్లకుండా
అది యెందు కొరకు నశించి, అరణ్యమువలె కాలిపో
తూ వున్నదో దాని చెప్ప గలిగేలాగు యెహోవా
యొక్క నోటి మాట పొందిన వాడు యెవడు? । యె 13
హోవా చెప్పేదేమంటే, నేను వారి ముందర పెట్టిన
నా న్యాయ ప్రమాణమును వారు విసర్జించి, నా శబ్ద
మును వినక, దాని చొప్పున నడువక, । వారి హృద 14
యాలోచన ప్రకారముగానున్ను వారి పితృలు వారికి
నేర్పిన బయలీము వెంబడిగానున్ను వారు నడిచి
వున్నారు గనుక, । యిదుగో నేను వీరిని, అనగా, యీ 15
జనులకు చేదును తినిపించి, విషపు నీళ్లను తాగింతున
నిన్ను, । మరిన్ని వారైనా వారి పితృలైనా యెరుగనటు 16
వంటి అన్య జనులలోకి వారిని చెదర గొట్టుదుననిన్ని
నేను వారిని క్షీణింప చేసే పర్యంతము వారి వెంబడిని
కత్తిని పంపుదును అనిన్ని ఇశ్రాయేలు దేవుడైన సైన్య
ముల యెహోవా యీలాగు పలుకుతున్నాడు. । సైన్య 17
ముల యెహోవా యీలాగున పలుకుతున్నాడు,
మీరు విచారించుకొని, అంగలార్చే స్త్రీలు వచ్చేటట్టు
వారిని పిలువండి, చమత్కారపు స్త్రీలున్ను వచ్చేటట్టు
వారిని పిలువనంపించండి. । మన నేత్రములు కన్నీళ్లను 18
ప్రవహింప చేసేటట్టున్ను మన కను రెప్పలు జలములను
వొలుకింప చేసేటట్టున్ను వారు త్వరపడి మన కొరకు
ప్రలాప శబ్దమును యెత్తుదురు గాక. । యేమంటే 19
ప్రలాప శబ్దము సీయోనులోనుంచి వినపడుతున్నది,
యేలాగంటే, అయ్యో, మనము యెంతో చెడగొట్టబడి
వున్నాము! మనము దేశమును విసర్జించుకొని యు
న్నాము గనుకనున్ను మన నివాసములు మనలను వెళ్ల

గొట్టెను గనుకనున్ను మనము మిక్కిలిగా తత్తరపాటు
20 ను పొందుతున్నాము! । అయినప్పటికిన్ని ఓ స్త్రీలారా,
యెహోవా వాక్యమును వినండి; మీ చెవి ఆయన
నోటి మాటను అంగీకరించును గాక; మీలో ప్రతి
స్త్రీయున్ను తన తన కుమార్తెలకు అంగలార్పున్ను
తన తన చెలికత్తెకు ప్రలాపమునున్ను నేర్పును గాక. ।
21 యేమంటే బయిటనుంచి పిల్లలనున్ను వీధులలోనుంచి
పడుచువాండ్లనున్ను ఖండింపచేసుటకు మృత్యువు మన
కిటికీల లోపలికి వచ్చి యున్నది; మన నగరులలో ప్రవే
22 శించి వున్నది. । యెహోవా యీలాగు అంటున్నాడని
పలుకుము; యేమంటే, మనుష్యుల శవములు పొలము
బైట పెంట వలెనున్ను పంట కూర్చే వాని వెనుకపడే
పిడికిటి వలెనున్ను పడును; వాటిని యెవరున్ను పోగు
23 చేయరు. । యెహోవా యీలాగు పలుకుతున్నాడు,
యేమంటే, జ్ఞాని తన జ్ఞానమందున్ను బలవంతుడు తన
బలమందున్ను ఐశ్వర్యవంతుడు తన ఐశ్వర్యమందున్ను
24 అతిశయించక వుండును గాక. । అయితే అతిశయించే
వాడు తాను నన్ను గ్రహించి తెలుసుకొని వున్నాడ
నిన్ని భూమిలో కృపనున్ను న్యాయమునున్ను నీతినిన్ని
జరిగించే యెహోవాను నేనే అనిన్ని దీని యందే
అతిశయించును గాక, యేమంటే వీటి యందు నేను
ఆనందిస్తున్నానని యెహోవా పలుకుతున్నాడు. ।
25 యెహోవా పలికేదేమంటే, యిదుగో దినములు వస్తు
న్నవి, అప్పుడు నేను సున్నతి లేని వారితో కూడా
26 సున్నతి పొందిన వారినందరినిన్ని, । అనగా, మిస్రయీ
మునున్ను యూదానున్ను ఎదోమునున్ను అమ్మోను
పుత్రులనున్ను మోయాబునున్ను కడమూలలలోనున్ను
అరణ్యములోనున్ను నివసించే వారినందరినిన్ని శిక్షిం
తును; యేమంటే యీ సకలమయిన జనాంగములు
సున్నతిలేని వారై యున్నారు; ఇశ్రాయేలు యింటి
వారందరున్ను హృదయమందు సున్నతిలేని వారై యు
న్నారు అని పలికెను.

## 10. అధ్యాయము.

1 ఇశ్రాయేలుయొక్క యింటివారలారా, యెహో
2 వా మీతో పలికే మాటను వినండి. । యెహోవా
యీలాగు పలుకుతున్నాడు, యేమంటే, అన్యజనుల
మార్గమును నేర్చుకొనకనున్ను ఆకాశపు గురుతులకు
దిగులుబడకనున్ను వుండండి, యేమంటే అన్య జనులు
3 వాటికి దిగులుబడుదురు. । యేమంటే జనుల ఆచార
ములు వ్యర్థమయినవై యున్నవి; యేలాగంటే వొకడు
గొడ్డటిచేత పనివానిచేతి పనిగా అడవిలో వొక చెట్టు
4 ను నరుకును. । వెండి బంగారములతో వారు దానిని
అలంకరింతురు; అది కదలకుండా వారు దానికి సుత్తె
లతో మేకులు కొట్టుదురు. । అవి తాటి చెట్టువలె తిన్న 5
గా వుండును; అయితే మాట్లాడలేవు; అవి నడవలేవు,
గనుక మోయబడ వలెను; వాటికి భయపడకండి, యే
మంటే అవి కీడును చేయలేవు, మేలునున్ను చేయుటకు
వాటికి తరము కాదు. । ఓ యెహోవా, నీతో సమాన 6
మైన వాడు యెవడూలేడు; నీవు గొప్పవాడవై యు
న్నావు; నీ నామము పరాక్రమ విషయమై గొప్పదై
యున్నది. । ఓ జనాంగముల రాజా, నీకు యెవరు భయ 7
పడక వుందురు? యేమంటే అది నీది; యెందుచేతనంటే
జనాంగములయొక్క సకల జ్ఞానులలోనున్ను వారి రా
జ్యములన్నిటిలోనున్ను నీతో సమానమైనవాడు లేడు. ।
అయితే వారందరూ పశుప్రాయులై అవివేకులై యు 8
న్నారు; కఱ్ఱముక్క మాయోపదేశమై యున్నది. । రేకు 9
లుగా సాగగొట్టిన వెండి తర్షీషునుంచిన్ని బంగారము
ఊఫాజునుంచిన్ని పనివానియొక్కయున్ను పోతవాని
చేతియొక్కయున్ను పనియై తేబడును; నీలిబట్టలున్ను
వూదాబట్టలున్ను వాటి వస్త్రములై యున్నవి; అవి అన్ని
చమత్కారము గలవారి పనియై యున్నవి. । అయితే 10
యెహోవా నిజమైన దేవుడు; ఆయన జీవముగల దేవు
డున్ను అనంతుడైన రాజున్ను అయి వున్నాడు; ఆయన
కోపముచేత భూమి కంపించును; జనాంగములు ఆ
యన రౌద్రమును సహించలేక పోవును. । మీరు యీ 11
ప్రకారముగా వారితో చెప్పవలెను, యేమంటే, ఆకా
శములనున్ను భూమినిన్ని సృష్టించని దేవుండ్లు భూమి
లోనుంచిన్ని యీ ఆకాశముల కిందనుంచిన్ని నశించి
పోదురు. । ఆయన తన బలముచేత భూమిని కలుగజేసి 12
వున్నాడు; తన జ్ఞానముచేత లోకమును స్థిరపరచి వు
న్నాడు; తన వివేకముచేత ఆకాశములను విశాలపరచి
వున్నాడు. । ఆయన తన శబ్దమును బైలు పరచేటప్పుడు ఆ 13
కాశములందు వుదక సమూహము కలుగును; భూమియొ
క్క అంత్య భాగములనుంచి ఆయన ఆవి యెక్కేట
ట్టు చేసును; ఆయన వర్షము కొరకు మెరుపులను కలు
గచేసి, తన బొక్కసములలోనుంచి గాలిని బయిటికి
తీసును. । ప్రతివాడు తన తెలివి విషయమై పశుప్రా 14
యుడయి యున్నాడు; పోతపోసే ప్రతి పనివాడు
చెక్కిన విగ్రహముచేత సిగ్గు పొందును; యెందుకంటే
వాని పోత విగ్రహము అబద్ధమై యున్నది; వాటిలో
శ్వాసము లేదు. । అవి మాయయున్ను భ్రమలయొక్క 15
పనియున్ను అయి యున్నవి; వాటి విచారణ కాలమం
దు అవి నశించును. । యాకోబుయొక్క భాగము వాటి 16
వంటిది కాదు; యేమంటే ఆయన సమస్తమును రూపిం
చినవాడై యున్నాడు; ఇశ్రాయేలు ఆయన స్వాస్థ్య
ముయొక్క దండమై యున్నది; సైన్యముల యెహో
వా ఆయన పేరు. । కోటలో వుండే ఓ నివాసీ, నీ సామ 17

18 గ్రులను దేశములోనుంచి కూర్చుము. । యేమంటే
యెహోవా యీలాగు పలుకుతున్నాడు, యిదుగో,
నేను వొకమారే దేశపు కాపురస్తులను వడిశలోనుంచి
విసరినట్టు విసరివేసి, వారికి ఆలాగే కనుపడేటట్టు వా
19 రిని బాధింతును. । నా చేటు కొరకై నాకు అయ్యో! నా
గాయము దుఃఖకరమైనదై యున్నది; అయితే నిజము
గా యిది బాధే; నేను దాని భరించ వలెనని అనుకొం
20 టిని. । నా గుడారము పాడాయెను; నా తాళ్లన్ని తెగి
పోయెను; నా పిల్లలు నా యొద్దనుంచి వెళ్లిపోయిరి;
వారు లేరు; యికను నా గుడారమును సాగించుటకున్ను
21 నా తెరలను యెత్తించుటకున్ను యెవరూ లేరు. । యేమం
టే కాపరులు పశుప్రాయులై, యెహోవాను వెతు
కక వున్నారు; కాబట్టి వారు వృద్ధిని పొందరు; వారి
22 మందలన్ని చెదరబడును. । యిదుగో యూదా పట్టణ
ములను పాడుగానున్ను ఘట సర్పముల గుహగాను
న్ను చేసుటకు కబురు సందడియున్ను వుత్తరపు దేశ
ములోనుంచి గొప్ప అల్లరయున్ను వచ్చి యున్నవి. ।
23 ఓ యెహోవా, మనుష్యుని మార్గము వాని యందు
లేదని నాకు తెలుసును; అతని అడుగులను క్రమపర్చు
24 టకు నడుస్తున్న మనుష్యుని యందు లేదు. । ఓ యె
హోవా, నీవు నన్ను క్షీణింప చేయకుండేటట్టు నీ
కోపముచేత కాకుండా న్యాయముచేత నన్ను శిక్షిం
25 చుము. । నిన్ను యెరుగనటువంటి అన్య జనుల మీదను
న్ను నీ నామమును స్మరించనటువంటి కుటుంబముల
మీదనున్ను నీ వుగ్రతను పోయుము; యెందుకంటే
వారు యాకోబును తినివేసి, కబళించి, హరించి, అతని
నివాసము నిర్మనుష్యముగా చేసి వున్నారు.

## 11. అధ్యాయము.

1 యెహోవా యొద్దనుంచి ఇర్మీయాకు వచ్చిన వా
2 క్యము యేమంటే, । యీ వొడంబడికెయొక్క వాక్య
ములను మీరు విని, యూదా మనుష్యులతోనున్ను
3 యెరూశలేము కాపురస్తులతోనున్ను చెప్పండి. । యీ
దినమందు వున్నట్టు పాలతోనున్ను తేనెతోనున్ను ప్ర
వహిస్తూ వున్న దేశమును మీ పితృలకు యిస్తానని నే
ను చేసుకొనిన ప్రమాణమును నేను నెరవేర్చ గలందు
4 లకు, । మీరు నా శబ్దమునకు లోబడి, నేను మీకు ఆజ్ఞా
పించే అంతటి ప్రకారము చేయండి, అప్పుడు మీరు
నా జనులవుదురు, నేను మీ దేవుడనవుదును, అని యి
నుప కొలిమిలోనుంచి, అనగా, మిస్రయీము దేశము
లోనుంచి, మీ పితృలను వెలపటికి తీసుకొని వచ్చిన
దినమందు నేను వారికి ఆజ్ఞాపించిన యీ వొడంబడికె
యొక్క వాక్యములకు లోబడని వాడు శపించబడును
5 గాక అని, । ఇశ్రాయేలు దేవుడైన యెహోవా యీ
లాగు ఆనతిస్తూ వున్నాడని వారితో నీవు చెప్ప వలె
నని పలికినందున, నేను వో యెహోవా, ఆలాగే
అవును గాక అని ప్రత్యుత్తరమిచ్చితిని. । అప్పుడు యె 6
హోవా నాతో చెప్పినదేమంటే, నీవు యూదా పట్ట
ణముల యందున్ను యెరూశలేము వీధులయందున్ను
యీ మాటలన్నిటిని ప్రకటనచేసి అనవలసినదేమంటే,
యీ వొడంబడికెయొక్క మాటలను మీరు విని వాటి
ప్రకారము చేయండి. । యేమంటే నేను మీ పితృలను 7
మిస్రయీము దేశములోనుంచి తీసుకొని వచ్చిన కా
లమందున్ను యీ దినము మట్టుకున్ను నా శబ్దములకు
లోబడండి అని వారికి దృఢముగా విధిస్తిని; పెంద
లాడే లేస్తూ విధిస్తూ వుంటిని; । అయినప్పటికిన్ని వారు 8
లోబడకనున్ను తమ చెవి చాపకనున్ను ప్రతివాడు తన
తన చెడ్డ హృదయముయొక్క మూర్ఖత ప్రకారము
నడిచెను: కాబట్టి చేయండని నేను ఆజ్ఞాపించిన యీ
వొడంబడికెయొక్క వాక్యములన్నిటిని వారి మీదికి
రా చేతును; యెందుకంటే వారు వాటిని చేయలేదు
అని చెప్పెను. । మరిన్ని యెహోవా నాతో చెప్పినదే 9
మంటే, యూదా మనుష్యులలోనున్ను యెరూశలేము
కాపురస్తులలోనున్ను నాకు విరోధముగా వొక దురా
లోచన కనబడుతున్నది. । నా మాటలు వినుటకు వొ 10
ప్పక వున్నటువంటి వారి పితృలయొక్క అక్రమముల
తట్టుకు వారు మళ్లి, యితర దేవుండ్లను సేవించుటకు వెం
బడించియున్నారు; నేను వారి పితృలతో చేసిన వొడం
బడికెను ఇశ్రాయేలు యింటివారున్ను యూదా యిం
టివారున్ను భ్రష్టు చేసి వున్నారు. । అయినందున యె 11
హోవా చెప్పేదేమంటే, యిదుగో వారు తప్పించు
కొనలేని కీడు వారి మీదికి రాచేతును, అప్పుడు వారు
నన్ను వేడుకొన్నప్పటికీ నేను ఆలకించను. । అప్పుడు 12
యూదా పట్టణముల మనుష్యులున్ను యెరూశలేము
కాపురస్తులున్ను వెళ్లి, తాము ధూపము అర్పించిన
దేవుండ్లను వేడుకొందురు; అయితే వారు వారి ఆప
త్కాలమందు వారిని రక్షించేదిలేదు. । యేమంటే ఓ 13
యూదా, నీ పట్టణముల లెక్క చొప్పున నీ దేవుండ్ల
లెక్క వుండును; యెరూశలేము వీధుల లెక్క చొ
ప్పున మీరు ఆ సిగ్గుగల దానికి పీఠములను, అనగా,
బయలుకు ధూపము సమర్పించుటకు పీఠములను స్థా
పించి వున్నారు. । కాబట్టి నీవు యీ జనుల కొరకు 14
విన్నపము చేయకనున్ను ప్రార్థించకనున్ను వేడు
కొనకనున్ను వుండుము, యేమంటే తమ కీడు విషయ
మై నన్ను వేడుకొనినప్పటికిన్ని నేను వారి మొర్రను
ఆలకించను. । అనేకులతో దేహ్యమైన కార్యము చేసి 15
నందున నా ప్రియమైన దానికి నా యింట్లో వుండు
టకు యేమి నిమిత్తము? పవిత్రమైన మాంసము నీ యొద్ద

నుంచి తొలగి పోయెను; నీ పాపము నడుస్తూ వుం
16 డగా నీవు సంతోషిస్తూ వున్నావే. । అందమైన ఫల
ములు కలిగి, చక్కనిదిన్ని పచ్చనిదిన్ని అయిన ఇప్ప
చెట్టు అనే పేరు యెహోవా నీకు వుంచినాడు; అ
యితే గొప్ప అల్లరయొక్క శబ్దముతో దాని చుట్టూ
అగ్ని అంటించి వున్నాడు, దాని కొమ్మలు విరువ పడె
17 ను; । యెందుకంటే బయలుకు ధూపమును అర్పించి
నందువల్ల నాకు కోపము కలుగచేసే లాగు ఇశ్రాయే
లు యింటివారున్ను యూదా యింటివారున్ను తమకు
విరోధముగా తాము చేసిన దుర్మార్గత నిమిత్తము
నిన్ను నాటిన సైన్యముల యెహోవా నీ విషయమై
18 కీడును నిర్ణయించెను. । యెహోవా దాని నాకు తెలి
పినందున నేను దాని యెరుగుదును; వారి క్రియలను
19 అప్పుడు నాకు చూపినావు. । అయితే నేను వధకు కొం
చపోపడే యెద్దు వలెనున్ను గొర్రెపిల్లవలెనున్ను వుం
టిని; వాని పేరు యిక తలంచబడకుండా జీవస్థుల దేశ
ములోనుంచి వాని ఖండింప చేతుము గాక అనిన్ని
వృక్షమును దాని ఫలములలో కూడా నరికివేతుము
గాక అనిన్ని నాకు విరోధముగా ఆలోచన చేయుట
20 యెరుగక వుంటిని. । అయితే జ్ఞానేంద్రియములనున్ను
హృదయమునున్ను శోధించేటటువంటిన్ని నీతిగా న్యా
యమును తీర్చేటటువంటిన్ని ఓ సైన్యముల యె
హోవా, వారికి నీ ప్రతి ఫలము కలిగేటట్టు నన్ను
చూడనిమ్ము; యేమంటే నా వ్యాజ్యమును నీకు తెలియ
21 చేస్తిని అని పలికితిని. । కాబట్టి నీవు మా చేత చావ
కుండా యెహోవా నామము ద్వారా దీర్ఘదర్శన
ము చెప్పకుండా వుండుమని చెప్పి, నీ ప్రాణమును
వెతికే అనాతోతు మనుష్యులను గురించి యెహోవా
22 చెప్పేదేమంటే, । యిదుగో యిందునిమిత్తము వారిని
శిక్షింతును; లేత వయస్సు గల పురుషులు కత్తిచేత చం
పబడుదురు; వారి కుమారులున్ను వారి కుమార్తెలున్ను
23 క్షామముచేత చత్తురు. । వారిలో శేషించేవారు లేకపో
దురు, యేమంటే నేను అనాతోతు మనుష్యులను విచా
రించే సంవత్సరమందు వారి మీదికి కీడు రాచేతునని
సైన్యముల యెహోవా చెప్పుతూ వున్నాడు.

## 12. అధ్యాయము.

1 ఓ యెహోవా, నేను నీతో వ్యాజ్యమాడినప్పటి
కిన్ని నీవు నీతి కలవాడవై వున్నావు; అయితే నీ న్యా
యములను గురించి నీతో నన్ను మాట్లాడనిమ్ము; దుర్మా
ర్గుల త్రోవ శుభముగా వున్నదేమి? చాలా ద్రోహ
2 ము చేసే వారందరు సుఖించెదరేమి? । నీవు వారిని నా
టితివి; వారు వేరు దన్ని వున్నారు; వారు యెదిగి ఫల
మును యిస్తూ వున్నారు; నీవు వారు నోటికి సమీప
ముగా వున్నావు; అయితే వారి జ్ఞానేంద్రియములకు
దూరముగా వున్నావు. । అయితే ఓ యెహోవా, నీవు 3
నన్ను యెరిగి వున్నావు; నన్ను చూస్తూ వున్నావు; నన్ను
గురించి నా హృదయమును పరీక్షచేసి వున్నావు; వా
రిని వధకయ్యే గొర్రెల వలె లాగుకొని, వధ దినము
నకు వారిని ఆయత్తము చేయుము. । దేశములో నివాస 4
ము చేసే వారి పాపము నిమిత్తము యెంత పర్యంతము
అది మూలుగును? యావత్తు పొలముల కూర యెండి
పోవును; మృగములున్ను పక్షులున్ను నశించిపోయెను;
మా అంతమును వాడు చూచేది లేదు అని వారు పలు
కుతూ వున్నారు. । నీవు పాదచారులతోను పరుగెత్తి 5
అలసటను పొందినట్టయితే గుర్రములతోను యే ప్ర
కారముగా కలుసుకొని పరుగెత్తగలవు? నీవు నమ్మియు
న్న నెమ్మది గల దేశమందు నీకు అలసట కలిగితే య
ర్దేను నది పొంగినప్పుడు యేమి చేతువు? । యేమంటే 6
నీ సహోదరులున్ను నీ తండ్రి యింటి వారున్ను నీకు
ద్రోహము చేసిరి; నిజముగా వారున్ను నీ విషయమై
గొప్ప కేక వేసిరి; వారు నీతోను మంచి మాటలను పలి
కినప్పటికీ వారిని నమ్మకుము. । నేను నా యింటిని విడ 7
చిపెట్టితిని; నా స్వాస్థ్యమును విసర్జించితిని; నా ఆత్మ
ప్రేమిస్తూ వున్న దానిని దాని శత్రువుల చేతికి యిస్తూ
వున్నాను. । నా స్వాస్థ్యము నాకు అడవి సింహమునకు 8
సమానముగా వున్నది; అది నాకు విరోధముగా తన నా
దమును యెత్తుతున్నది; కాబట్టి దానిని నేను పగచేసి
యున్నాను. । నా స్వాస్థ్యము నాకు గోర్లుగల పక్షివలె 9
వున్నది; దాని చుట్టూ వున్న పక్షులు దానికి విరోధ
ముగా వున్నవి; ఓ అడవి మృగములారా, భక్షించుటకు
కూడి రండి. । అనేకులైన మంద కాపరులు నా ద్రాక్ష 10
తోటను నాశనము చేసి, నా ఆస్తిని కాళ్లతో త్రొక్కి,
నేను కోరుకొన్న స్వతంత్రమును పాడైన అరణ్యము
గా చేసినారు. । దాని వారు పాడు చేసినారు; అది 11
పాడై యున్నందున నన్ను దృష్టించి మూల్గుతూ వున్నది;
దేశమంతా పాడై పోయెను; అయితే యెవడైనా తన
మనస్సుయందు విచారించ లేదు. । అరణ్యమందు వుండే 12
యావత్తు వున్నతమైన స్థలముల మీదికి పాడుచేసేవారు
వస్తూ వున్నారు; యేమంటే యెహోవా కత్తి యీ
మూల మొదలుకొని ఆ మూల మట్టుకు దేశము యా
వత్తు భక్షించును; క్షేమము యెవనికైనా కలగ బోదు. ।
వారు గోధుమలను విత్తి ముండ్లను కోతురు; వారు చా 13
లా కష్టమును పొంది ఫలము లేకుండా వుందురు; యె
హోవా తీక్ష్ణమైన కోపము విషయమై మీకు వచ్చే
ఫలము నిమిత్తము మీరు సిగ్గుపడుదురు. । యిదుగో నేను 14
నా జనులైన ఇశ్రాయేలుకు యిచ్చిన నా స్వాస్థ్యమును
తీసుకొని, నా చెడ్డ పొరుగు వారినందరినీ వారి దేశ

మందు వుండకుండా పెరికి, వారిలోనుంచి యూదా
యింటివారిని లాగుకొనుదునని యెహోవా వారిని
15 గురించి చెప్పుతూ వున్నాడు.। వారిని నేను పెరికిన తర
వాత సంభవించబోయేదేమంటే నేను మళ్లుకొని వారి
మీద కనికరముగా వుండి, వారిలో ప్రతి మనుష్యుని
తన తన ఆస్తికిన్ని తన తన దేశముకున్ను తిరిగీ రప్పిం
16 తును.। మరిన్ని సంభవించబోయేదేమంటే, వారు నా
జనులకు బయలు నామముచేత వొట్టుబెట్ట నేర్పినట్టు
యెహోవాతోడు అని నా నామము మీద వొట్టు
బెట్టుకొనేటట్టుగా నా జనుల మార్గములను చక్క
గా నేర్చుకొంటే వారు నా జనుల నడుమను దృఢము
17 గా నివసింతురు.। అయితే వారు ఆలాగు వినకపోయి
నట్టయితే నేను ఆ జనాంగమును బొత్తిగా పెరికి నా
శనము చేతునని యెహోవా చెప్పుతూ వున్నాడు.

## 13. అధ్యాయము.

1 యెహోవా నాతో చెప్పినదేమంటే, నీవు వెళ్లి,
నీకు వొక నూలు మొలతాడు సంపాదించుకొని, దానిని
నీ నడుముకు కట్టుకొనుము; అయితే దానిని నీళ్లలో
2 వేయవద్దనెను.। అందుకు నేను యెహోవా సెలవు ప్ర
కారము వొక నూలు మొలతాడును సంపాదించుకొని,
3 దానిని నా నడుముకు కట్టుకొంటిని.। రెండో మారు
4 యెహోవా మాట నాకు వచ్చెను, యేలాగంటే,। నీవు
సంపాదించుకొని నీ నడుముకు కట్టుకొనిన నూలు మొ
లతాడును నీవు తీసుకొని, లేచి, ఫెరాతు అనే నది యొ
ద్దికి వెళ్లి, దానిని అక్కడ వొక రాతి కొండలో వున్న
5 కన్నములో దాచుమనెను.। అప్పుడు నేను వెళ్లి, యె
హోవా నాకు చెప్పిన ప్రకారము దానిని ఫెరాతు
6 అనే నది యొద్దను దాచితిని.। అనేక దినములు గతిం
చిన తరువాత యెహోవా నాతో చెప్పినదేమంటే,
నీవు లేచి, ఫెరాతు దరికి వెళ్లి, నేను అక్కడ దాచు
మన్న నూలు మొలతాడును ఆ స్థలమునుంచి తీసుకొను
7 మనెను.। అప్పుడు నేను ఫెరాతు దరికి వెళ్లి, నూలు
మొలతాడును దాచి వుంచిన స్థలమందు తవ్వి, దానిని
తీసుకొంటిని, అయితే యిదుగో ఆ నూలు మొలతాడు
8 చెడిపోయి దేనికిన్ని పనికి రాకుండా పోయెను.। అం
తట యెహోవా మాట నాకు వచ్చెను, యేలాగంటే,।
9 ఆ ప్రకారమే యూదాయొక్క అతిశయమునున్ను యె
రూశలేముయొక్క మహా గర్వమునున్ను నేను చెరుపు
10 దును అని యెహోవా చెప్పుతూ వున్నాడు.। నా మా
టలను వినకుండా వుండి, తమ హృదయ కఠినత్వముచొ
ప్పున నడిచి, అన్య దేవుండ్లను సేవించి, వాటిని కొలిచి,
వాటిని వెంబడించే యీ చెడ్డజనులు పనికిరాని యీ
11 నూలు మొలతాడు వలెనే అవుదురు.। యేమంటే మను
ష్యుని నడుముకు మొలతాడు అంటి వున్నట్టుగానే
నేను ఇశ్రాయేలు యింటివారినందరినిన్ని యూదా యిం
టివారినందరినిన్ని కీర్తి కొరకున్ను స్తుతి కొరకున్ను
శృంగారము కొరకున్ను నా జనులుగా చేర్చుకొంటిని
అయితే వారు వినకపోయిరి అని యెహోవా చెప్పు
తూ వున్నాడు.। సకలమైన సిద్దెలు మద్యముచేత నింప 12
బడునని ఇశ్రాయేలుకు యెహోవా అయిన దేవుడు
ఆనతిస్తూ వున్నాడనే మాట వారితో చెప్పుము; అం
దుకు వారు సకలమైన సిద్దెలు మద్యముచేత నింపబడు
నని మేము నిశ్చయముగా యెరుగమా అని నీతో చెప్పి
తే, నీవు వారితో చెప్పవలసినదేమంటే,। యిదుగో యీ 13
దేశపు కాపురస్తులందరిని, అనగా, దావీదు సింహాసన
ము మీద కూర్చుండి వుండే రాజులనున్ను ఆచార్యుల
నున్ను దీర్ఘదర్శులనున్ను యెరూశలేము కాపురస్తు
లనందరినిన్ని నేను మత్తుచేత నింపి,। మనుష్యుడు తన 14
పొరుగు వానిని, అనగా, పితృలనున్ను కుమారులనున్ను
నేను యేకముగా నలగ గొట్టి, వారిని కనికరించకుండా
నున్ను కాయకుండానున్ను దయ చూపించకుండాను
న్ను నశింప చేస్తానని చెప్పుమని యెహోవా చెప్పు
తున్నాడు.। మీరు విని శ్రద్ధగా వుండండి, గర్వముగా 15
వుండకండి; యేమంటే యెహోవా యీలాగున చెప్పి
నాడు.। ఆయన అంధకారము చేయక ముందున్ను చీకటి 16
కొండల మీద మీ కాళ్లు జారక ముందున్ను మీరు
వెలుగు కొరకు కనిపెట్టి వుండగా ఆయన దానిని మృ
త్యువు నీడగానున్ను గాఢమైన అంధకారముగానున్ను
చేయక ముందే మీ దేవుడైన యెహోవాకు మహి
మను చెల్లించండి.। అయితే మీరు దీనిని వినకపోతే నా 17
యాత్మ రహస్య స్థలముల యందు మీ అతిశయము
కొరకు యేడ్చును; మరిన్ని యెహోవాయొక్క మంద
చెరపట్టుకొ పోబడునని నా కన్ను బహుగా దుఃఖించి
విస్తారమైన నీటిని వొలికించును.। రాజుతోనున్ను రాణి 18
తోనున్ను కింద కూర్చుండి వినయముగా వుండండి,
యేమంటే మీ శిరో భూషణములు అనగా మీ మహి
మయొక్క కిరీటము పడిపోవునని చెప్పుము.। దక్షిణపు 19
పట్టణములు బంధించబడును; వాటిని యెవడైనా తెరచ
లేడు; యూదా సంపూర్ణముగా చెరపట్టబడి పో
వును, అది బొత్తిగా తీసివేయబడును.। మీ కన్నులను 20
యెత్తి వుత్తరమునుంచి వచ్చేవారిని చూడండి; నీకు
యివ్వబడిన మంద అనగా నీ అందమైన మంద యేది?।
ఆయన నిన్ను విచారణచేసేటప్పుడు యేమి చెప్పుదువు? 21
యేమంటే వారు నీ మీద అధికులున్ను శ్రేష్ఠులున్ను
అయి వుండేలాగు నీవు వారికి నేర్పితివి; ప్రసూతి వేదన
పొందే స్త్రీవలె నీకు విచారములు కలగబోవా?। యిది 22
నాకు సంభవించిన హేతువు యేమని నీ హృదయమందు

నీవు తలంచుకొనినట్టయితే నీ విస్తారమైన అక్రమము
కొరకే నీ వస్త్రముల చెంగులు బైలు పడినవి, నీ మడ
23 మలు బలవంతముచేత కొంచపోబడుతున్నవి. । కుషీ
యునికి తన చర్మమున్ను చిరత పులికి తన మచ్చల
నున్ను మార్చ శక్యమా? అలాగైతే పాపము చేయు
టకు నేర్పును బొందిన మీరున్ను సత్క్రియను చేయ
24 వచ్చును. । అయినందున అరణ్యమందు విసిరే గాలిచేత
యెగరబడిన ధూళి వలె వారిని నేను చెదరగొట్టు
25 దును. । నీవు నన్ను మరచి అబద్ధమును నమ్మినందున
యిది నీయొక్క భాగము, నావల్ల నీకు దొరకబడే
పాలున్ను అయి వుండునని యెహోవా చెప్పు
26 తూ వున్నాడు. । కాబట్టి నేను నీ సిగ్గు అగుపడేటట్టు
గా నీ వస్త్రపు చెంగులను నీ ముఖము మీద పడవే
27 తును. । నీ వ్యభిచారములున్ను నీ సకిలింతలున్ను పొల
ములలో వున్న మెట్టల మీద నీవు చేసిన వేశ్యా కా
ముకత్వమున్ను కానపడెను; నీ అసహ్యతలనున్ను నేను
చూస్తిని. ఓ యెరూశలేమా, నీకు అయ్యో! నీవు
నిన్ను శుద్ధి చేసుకోవా? యిది యింకా యెంత కాల
మునకు పిమ్మట కలుగును అని యెహోవా చెప్పుతూ
వున్నాడు.

## 14. అధ్యాయము.

1 వరుపును గురించి ఇర్మీయాకు వచ్చిన యెహోవా
2 వచనము యేలాగంటే, । యూదా దుఃఖిస్తూ వున్నది;
దాని గుమ్మములు క్షీణించుచున్నవి; నేలమట్టుకు వొంగి
నట్టు పడియున్నవి; యెరూశలేముయొక్క కేక పైకి
3 వెళ్లియున్నది. । వారి ప్రధానులు తమ చిన్నవారిని
నీటి కొరకు అంపిరి; వీరు గుంతల యొద్దికి వచ్చి నీళ్లు
కానకుండా తమ వట్టి పాత్రలతో తిరిగి వచ్చిరి;
వారు సిగ్గును పొంది బిడియపడి తమ తలలు మూసు
4 కొనిరి. । దేశము మీద వర్షము లేనందుచేత భూమి
యెండి వున్నది; దుక్కి దున్నేవారు సిగ్గును పొంది
5 తమ తలలను కప్పుకొనిరి. । ఆడు జింక పిల్లను పెట్టి,
6 గడ్డి లేనందున దానిని విడిచి పోయెను. । అడవి గాడి
దెలు యెత్తు అయిన భూముల మీద నిలిచి ఘట
సర్పములవలె గాలిని పీల్చుతూ వున్నవి; గడ్డి లేనం
దువల్ల వాటి కన్నులు లోపలికి పొయినవి అని ఆనతి
7 చ్చెను. । ఓ యెహోవా, మా అక్రమములు మాకు
విరోధముగా సాక్ష్యమును యిచ్చినప్పటికిన్ని నీ నామ
విషయమై దయ చేయుము; యేమంటే మా వెనుక
జారుటలు విస్తారమై వున్నవి; నీకు విరోధముగా పా
8 పము చేస్తిమి. । ఇశ్రాయేలుకు నిరీక్షణ కర్తా, కష్ట
కాలమందు దానిని రక్షించేవాడా, భూమి మీద పర
దేశి వలెనున్ను రాత్రి బస చేసుకొనుటకు దిగే మార్గ
స్తుని వలెనున్ను వుండెదవేమి? । నీవు అలసిన పురుషుని 9
వలెనున్ను రక్షించలేని పరాక్రమశాలి వలెనున్ను వుం
డెదవేమి! ఓ యెహోవా, నీవు మా మధ్యను వుండే
వాడవు; నీ నామముచేత మేము పిలువబడి వున్నాము;
మమ్మును విడిచిపెట్టకుము. । యెహోవా యీ జనుల 10
తో చెప్పేదేమంటే, వారు తమ కాళ్లతో సంచరించ
కోరుతూ వున్నారు, అయినందున యెహోవా వా
రిని అంగీకరించడు; ఆయన యిప్పుడు వారి అక్రమ
మును గురించి జ్ఞాపకము తెచ్చుకొని వారి పాపము
లను గూర్చిన విచారణ చేసును. । యెహోవా నా 11
తో చెప్పినదేమంటే, నీవు యీ జనుల మేలు కొరకై
వేడుకొన వద్దు. । వారు వుపవాసము చేసినప్పటికిన్ని 12
నేను వారి ప్రార్థనను వినను; వారు దహనబలినిన్ని
కానుకనున్ను చెల్లించినప్పటికిన్ని నేను వారి మీద
దయగా వుండను; కత్తి చేతనున్ను క్షామము చేతనున్ను
తెగులు చేతనున్ను నేను వారిని నిర్మూలము చేతును
అని ఆనతిచ్చెను. । అప్పుడు నేను అనినదేమంటే, ఓ 13
కర్తవైన యెహోవా, యిదుగో మీరు కత్తిని చూ
చేది లేదు, మీకు క్షామము వచ్చేది లేదు, అయితే
దృఢమైన నెమ్మదిని యీ స్థలమందు మీకు యిత్తునని
దీర్ఘదర్శులు వారితో చెప్పుతూ వున్నారని చెప్పి
తిని. । అందుకు యెహోవా నాతో చెప్పినదేమంటే, 14
దీర్ఘదర్శులు నా నామముచేత అబద్ధముగా దీర్ఘ
దర్శనము చెప్పుతూ వున్నారు; నేను వారిని పంప
లేదు; వారికి నేను ఆజ్ఞాపించలేదు; వారితో మాట్లాడ
లేదు; వారు దొంగ దర్శనమున్ను శకునమున్ను వ్యర్థ
మైన దానినిన్ని తమ హృదయపు కపటమునున్ను
మీకు భవిష్యత్తుగా చెప్పుతూ వున్నారు. । అయినందున 15
నేను వారిని పంపకపోయినప్పటికిన్ని నా నామము
చేత దీర్ఘదర్శనము చెప్పుతూ, యీ దేశమందు
ఆయుధమైనా క్షామమైనా వచ్చేది లేదని పలికే
దీర్ఘదర్శులను గురించి యెహోవా చెప్పేదేమం
టే, ఆయుధము చేతనున్ను క్షామము చేతనున్ను ఆ
దీర్ఘదర్శులు నశింతురు. । మరిన్ని యే జనులకు వారు 16
దీర్ఘదర్శనము చెప్పుదురో వారు యెరూశలేము
వీధులలోకి ఆయుధ విషయమైయిన్ని క్షామము విష
యమైయిన్ని వెలివేయబడి, వారినైనా వారి భార్యల
నైనా వారి కుమారులనైనా వారి కుమార్తెలనైనా
పాతిపెట్టే వారు లేకపోదురు, యేమంటే వారి దుర్మా
ర్గమును వారి మీద కుమ్మరింతును. । కాగా నీవు 17
యీ మాట వారితో చెప్పుదువు గాక; నా కన్నుల
నుంచి దివా రాత్రములు తప్పకుండా నీరు వొలకనిమ్ము,
యెందుచేతనంటే నా జనుల కుమార్తె అయిన కన్యక
గొప్ప యిక్కట్టుచేత కొట్టబడి ఘోరమైన దెబ్బచేత

18 నశించినది. । నేను బైటికి వెళ్లితే యిదుగో కత్తిచేత చం
పబడిన వారు వుందురు! పట్టణములోకి వెళ్లితే యిదు
గో క్షామము చేత నిరశించిన వారు వుందురు! నిజము
గా దీర్ఘదర్శిన్ని ఆచార్యుడున్ను వారు యెరుగని
19 దేశమునకు సంచరించ వెళ్లుదురు. । నీవు యూదాను
బొత్తిగా పరిత్యజించినావా? నీ యాత్మకు సీయోను
అసహ్యముగా వున్నదా? మేము స్వస్థతను పొందకుం
డా మమ్మును కొడుతూ వుండెదవేమి? నెమ్మది నిమి
20 త్తము కనిపెట్టితిమి, అయితే యిదుగో శ్రమ! । ఓ
యెహోవా, మా దుర్మార్గతనున్ను మా పితృల అక్ర
మమునున్ను వొప్పుకొంటున్నాము; అవును నీకు విరో
21 ధముగా పాపము చేస్తిమి. । నీ నామముకొరకు మా
యందు అసహ్యతగా వుండకుము; నీ మహిమ గల
సింహాసనమును అవమాన పరచకుము; నీవు మాతో
చేసిన వొడంబడికెను తప్పకుండా చిత్తమందు వుంచు
22 ము. । అన్యజనులయొక్క వ్యర్థమైన వాటిలో వర్షింప
చేసేవి యేవైనా కలవా? లేక ఆకాశములు కురిపించ
గలవా? మా దేవుడవైన ఓ యెహోవా, నీవే ఆయన
కదా? నిన్ను కనిపెట్టి వుందుము, యేమంటే, వీటినన్ని
టినీ నీవే చేసితివి.

## 15. అధ్యాయము.

1 అప్పుడు యెహోవా నాతో చెప్పినదేమంటే,
మోషేయున్ను సమూయేలున్ను నా సముఖమందు నిలు
చున్నప్పటికీ నా దయ యీ జనులమీద వుండదు;
2 వీరిని నా దృష్టినుంచి తీసివేసి బైలు వెళ్లనిమ్ము. । యెక్క
డికి బైలు వెళ్లుదుమని వారు నిన్ను అడిగితే, నీవు వా
రితో చావుకు తగిన వారిని చావుకున్ను కత్తికి తగిన
వారిని కత్తికిన్ని క్షామమునకు తగిన వారిని క్షామమున
కున్ను చెరకు తగిన వారిని చెరకున్ను పోనిమ్ము అని
యెహోవా ఆనతిస్తూ వున్నాడని చెప్పుదువు గాక. ।
3 వారి పైని నేను నాలుగు విధములైన బాధలను నిర్ణ
యింతును; చంపుటకు కత్తినిన్ని, చీల్చివేసుటకు కుక్క
లనున్ను, భక్షించుటకు ఆకాశ పక్షులనున్ను, నశింప
చేసుటకు భూ మృగములనున్ను తెప్పింతునని యె
4 హోవా చెప్పుతూ వున్నాడు. । యూదా రాజైన
హిజ్కియాకు కుమారుడైన మనస్సే యెరూశలేము
యందు చేసినదాని నిమ్తితము వారిని భూమిలో వున్న
5 సకల రాజ్యములకు నేను చెదరకొడుదును. । ఓ యెరూ
శలేమా, నిన్ను కనికరించే వారు యెవరు? నిన్ను గూ
ర్చి దుఃఖపడే వారు యెవరు? నీ యోగక్షేమమును
గురించి విచారించుటకు నీ యొద్దికి తిరిగీ వచ్చే వారు
6 యెవరు? । నీవు నన్ను విడిచిపెట్టి వెనుకకు జారిపోతివి,
అయినందున నేను నా చెయ్యి నీకు విరోధముగా చాపి
నిన్ను హతము చేతును; దయ చూపడమందు విసికితిని
అని యెహోవా చెప్పుతూ వున్నాడు. । దేశమందు 7
వుండే ద్వారములలో వారిని నేను చేటతో చెరుగుదు
ను; నా జనులు తమ మార్గములనుంచి తిరుగనందున
నేను వారి సంతానమును తీసివేసి నాశనము చేతును. ।
సముద్రపు యిసుక కంటే అధికముగా వారి విధవలు 8
నాకు కలిగి వుండిరి. పట్టపగటి యందు వారి మీదను
పడుచువారి తల్లికి విరోధముగా దోపు వాని తెప్పి
స్తిని; వారి మీదనున్న పట్టణము మీదనున్న హఠా
త్తుగా భయంకరత్వములను పడచేతును. । యేడుగురు పిల్ల 9
లను కన్న స్త్రీ క్షీణించి పోవును; ఆమె జీవము చాలిం
చెను; యింకా పగలు వుండగానే ఆమె సూర్యుడు
అస్తమించెను; ఆమె సిగ్గునున్ను బిడియమునున్ను పొంది
వున్నది; వారిలో మిగిలిన వారిని తమ శత్రువుల యెదుట
కత్తికి అప్పగింతునని యెహోవా చెప్పుతూ వున్నా
డు. । ఓ నా తల్లీ, దేశమంతటికీ వ్యాజ్యమాడే వాడ 10
నున్ను కలహము కల మనుష్యుడనైన నన్ను నీవు కంటివి
గనుక నాకు అయ్యో! నేను అధికమైన వడ్డికి యివ్వ
లేదు, మనుష్యులు నాకున్ను అధికమైన వడ్డికి యివ్వ
లేదు; అయినప్పటికిన్ని వారందరూ నన్ను శపిస్తూ వు
న్నారు. । యెహోవా చెప్పినదేమంటే, నీ శేషించిన 11
వారు భాగ్యవంతులవుదురు; కీడు కాలమందున్ను కష్ట
కాలమందున్ను నీ నిమిత్తము నేను శత్రువువల్ల నీకు సహా
యము చేయింతునని నిజముగా చెప్పుతూ వున్నాను. ।
యినుము వుత్తరమునుంచి వచ్చే యినుమునున్ను యిత్త 12
డినిన్ని నరుకునా? । నీ పాపముల నిమిత్తము నేను నీ 13
సకలమైన సరిహద్దులలో నీ ఆస్తినిన్ని నీ సంపదలనున్ను
క్రయపరచకుండా కొల్లపెట్టుటకు యిచ్చి, । నీవు యె 14
రుగని దేశములోకి నీ శత్రువులతో కూడా నిన్ను
దాటింతును; యేమంటే నా కోపాగ్ని రగులుకొని
మిమ్మును దహించును అని యెహోవా చెప్పుతూ
వున్నాడు. । ఓ యెహోవా, నీకు తెలుసును; నన్ను 15
తలంచుకొని, నాకు యెదురుపడి, నన్ను శ్రమ పెట్టే
వారిమీద పగ తీర్చుము; నీ అత్యంత కోపముచేత
నన్ను కొంచుపోవద్దు; నీ నిమిత్తము నేను నిందను పొం
దితినని తెలియుము. । నీ మాటలు నాకు వినపడగానే 16
వాటిని గ్రహించితిని; నీ మాటలు నా హృదయము
నకు సంతోషమున్ను ఆనందమున్ను ఆయెను; యేమం
టే ఓ సైన్యములకు కర్తవైన యెహోవా, నీ నామ
ముచేత నేను పిలువబడితిని. । నేను హాస్యమాడే వారి 17
ఆలోచన సభయందు కూర్చుని సంతోషించలేదు; నీ
హస్తముచేత వచ్చిన దాని నిమిత్తము వొంటరిగానే
కూర్చుంటిని; యేమంటే నీవు నన్ను దిగులుతో నింపి
తివి. । నా వేదన విడువకుండానున్ను నా గాయము 18

స్వస్థతను పొందకుండానున్ను వున్నవేమి? నాకు నీవు
తొలగిపోయే వాని వలెనున్ను ఆరిపోయే నీళ్ల వలెను
19 న్ను వుండెదవేమి? । అందుకు యెహోవా చెప్పినదే
మంటే, నీవు మళ్లుకుంటే నేను నిన్ను తిరిగీ రప్పింతును,
నా సముఖమందు నీవు నిలుచుని వుందువు; నీవు దు
ష్టులలోనుంచి ప్రశస్తమైన వారిని యేర్పరచినట్టయితే
నీవు నా నోటి వలె వుందువు; నీవు వారి యొద్దికి
20 తిరుగక వారిని నీయొద్దికి తిరుగనిమ్ము. । యీ జనుల
యెదుటను నేను నిన్ను బలముగల యిత్తడి ప్రాకార
ముగా చేతును; వారు నీకు విరోధముగా యుద్ధము
చేతురుగాని నిన్ను జయించలేకపోదురు; యేమంటే
నిన్ను రక్షించేటందుకున్ను తప్పించేటందుకున్ను నేను
నీకు తోడుగా వున్నానని యెహోవా చెప్పుతూ
21 వున్నాడు. । నేను నిన్ను దుర్మార్గుల చేతిలోనుంచి
విడిపించి భయంకరుల చేతిలోనుంచి విమోచింతును.

## 16. అధ్యాయము.

1 నా యొద్దికి వచ్చిన యెహోవా మాట యేమం
2 టే, । నీవు వొక స్త్రీని వివాహము చేసుకోవద్దు; యీ
స్థలమందు కుమారులనైనా కుమార్తెలనైనా నీవు
3 కలుగ చేసుకోవద్దు. । యేమంటే యీ స్థలమందు పుట్టే
కుమారులను గూర్చిన్ని యీ దేశమందు వారిని కన్న
తల్లి దండ్రులను గూర్చిన్ని యెహోవా చెప్పేదేమం
4 టే, । వారు మహా ఘోరమైన మరణములచేత చత్తురు;
వారు దుఃఖించబడకుండానున్ను పాతి పెట్టబడకుం
డానున్ను భూమి మీద పెంటవలె వుందురు; మరిన్ని
వారు ఆయుధము చేతనున్ను క్షామము చేతనున్ను
హతమై పోయి, వారి శవములు ఆకాశ పక్షులకున్ను
5 భూ మృగములకున్ను ఆహారమవును. । అయినందున
యెహోవా చెప్పేదేమంటే, నీవు దుఃఖపు యింటిలో
ప్రవేశించకనున్ను వారి నిమిత్తము ప్రలాపించకనున్ను
మూలగకనున్ను వుండుము; యేమంటే యీ జనుల
యొద్దనుంచి నా సమాధానము, అనగా, నా వాత్సల్య
మునున్ను నా కృపలనున్ను నేను తీసితినని యెహో
6 వా చెప్పుతూ వున్నాడు. । పిన్నలున్ను పెద్దలున్ను
యీ దేశమందు చనిపోదురు; వారు పాతి పెట్టబడ
కుండా వుందురు; వారి నిమిత్తము యెవడైనా దుఃఖిం
చకనున్ను క్షౌరము చేయించుకోకనున్ను బోడి చేయిం
7 చుకోకనున్ను వుండును. । చచ్చిన వారి నిమిత్తము యె
వడైనా దుఃఖపడి వొడాపున్ను పొందకుండా వుం
డును గాక; వొకని తండ్రి కొరకైనా తల్లి కొరకైనా
యెవడైనా వారికి ఆదరణ పాత్రను తాగుటకు యివ్వ
8 కుండా వుండును గాక. । నీవు వారితో భుజించుట
కైనా తాగుటకైనా విందు యింట్లోకి నీవు ప్రవేశించ
వద్దు. । యిదుగో నేను యీ స్థలమందు మీ కన్నుల 9
యెదుటనున్ను మీ కాలమందున్ను సంతోషపు శబ్ద
మునున్ను ఆనందపు శబ్దమునున్ను పెండ్లి కుమారుని
శబ్దమునున్ను పెండ్లి కుమార్తె శబ్దమునున్ను మానిపిం
తునని ఇశ్రాయేలుకు దేవుడైన సైన్యముల యెహో
వా చెప్పుతూ వున్నాడు. । నీవు యీ జనులకు యీ 10
మాటలన్ని తెలియ చేసినప్పుడు వారు యెహోవా
మాకు యింత గొప్ప కీడును నిర్ణయించెనేమి! మా
అక్రమము యేమి! మా దేవుడైన యెహోవాకు విరో
ధముగా చేసిన మా దోషము యేమి! అనిన్ని అడిగితే,
నీవు వారితో చెప్పవలసినదేమంటే, । మీ పితృలు నన్ను 11
విడిచి, అన్య దేవుండ్లను వెంబడించి, వారిని సేవించి,
వారికి మ్రొక్కి, నన్ను విడిచిపెట్టి, నా న్యాయ ప్ర
మాణమును గైకొనకనుండి, । యిదిగో మీలో ప్రతి 12
వాడు నా మాటను వినకుండా తన చెడ్డ హృదయపు
కాఠిన్యము చొప్పున ప్రవర్తించి, మీ పితృల కంటే
అధిక దోషమును చేసెను గనుక, । యీ దేశమునుంచి 13
మీరైనా మీ పితృలైనా యెరుగని దేశమునకు మిమ్ము
ను నేను వెళ్ల గొడుదును; మీకు మరి దయ చూపిం
చను; అక్కడ మీరు దివా రాత్రములు అన్య దేవుం
డ్లను సేవింతురని యెహోవా చెప్పుతున్నాడని చెప్ప
వలెను. । యిదుగో దినములు వచ్చునని యెహోవా 14
చెప్పుతూ వున్నాడు; అప్పుడు మిస్రయీము దేశము
నుంచి ఇశ్రాయేలు పుత్రులను పైకి కొంచువచ్చిన యె
హోవా తోడని చెప్పబడక, । ఇశ్రాయేలు పుత్రు 15
లను వుత్తర దేశమునుంచిన్ని ఆయన వారిని తరిమి
వున్న యావత్తు దేశములనుంచిన్ని పయికి కొంచువచ్చిన
యెహోవా తోడని చెప్పబడును; యేమంటే నేను
వారి పితృలకు యిచ్చిన వారి దేశమునకు వారిని తిరిగీ
రప్పింతును. । యిదుగో వారిని పట్టుకొనేటందుకు చాలా 16
మంది జాలరులను పిలిపింతును; తరువాత యావత్తు
కొండలనుంచిన్ని యావత్తు మెట్టలనుంచిన్ని రాతి కొం
డల గుహలనుంచిన్ని వారిని వేటాడేటందుకు చాలా
మంది వేటకాండ్లను పిలిపింతును. । యేమంటే వారి 17
యావత్తు మార్గముల మీద నా కన్నులు వున్నవి; అవి
నా ముఖమునకు చాటుగా వుండలేదు; వారి అక్రమ
ము నా కన్నులకు మరుగుగా వుండలేదు. । ముందు 18
నేను వారి అక్రమము నిమిత్తమున్ను వారి పాపము నిమి
త్తమున్ను వారికి ప్రతికారము చేతును; యెందుకంటే
వారు నా దేశమును అపవిత్రపరచి, వారి యేహ్య
మైన శవములతోనున్ను అసహ్యత కల వాటితోనున్ను
నా స్వాస్థ్యమును నింపినారని యెహోవా చెప్పుతూ
వున్నాడు. । నా శ్రమ దినమందు ఆశ్రయమున్ను 19
నా దుర్గమున్ను నా బలమున్నైన ఓ యెహోవా,

నీ యొద్దికి అన్యజనులు భూమి సరిహద్దులనుంచి వచ్చి
చెప్పేదేమంటే, నిజముగానే మా పితృలు ప్రయోజ
నము లేని వ్యర్థమైన అబద్ధములను స్వతంత్రించు
20 కొన్నారని పలుకుదురు. । మనుష్యుడు తన కొరకు దైవ
21 త్వములేని దేవుండ్లను కలుగచేసుకొనునా? । కాగా
యిదుగో యీ వొక మారు నేను వారికి తెలియ చేయిం
తును; నా హస్తమునున్ను నా శక్తినిన్ని వారికి తెలియ
చేయింతును; అప్పుడు నా నామము యెహూవా
అని వారు తెలుసుకొందురు.

## 17. అధ్యాయము.

1 యూదాయొక్క పాపము యినుప గంటము చేత
నున్ను వజ్రపు మొనచేతనున్ను వ్రాయబడెను; వారి
హృదయముయొక్క పలక మీదనున్ను మీ బలిపీఠ
ముల కొమ్ముల మీదనున్ను అది చెక్కబడి యున్నది; ।
2 యేమంటే యెత్తు అయిన మెట్టల మీద వున్న పచ్చని
చెట్లలో వారి బలిపీఠములనున్ను వారి తోటలనున్ను
3 వారి పిల్లలు జ్ఞాపకము తెచ్చు కొంటున్నారు. । పొల
మందు వున్న ఓ నా పర్వతమా, నీ యావత్తు సరిహ
ద్దులలో నీవు చేసిన పాపము నిమిత్తము నీ యెత్తయిన
స్థలములనున్ను నీ ఆస్తినిన్ని నీ యావత్తు సంపదలతో
4 కూడా నేను కొల్లకు అప్పగింతును. । నీకు నేను యి
చ్చిన స్వాస్థ్యమును నీ యంతట నీవే వదిలిపెట్టుదు
వు; నీవు యెరుగని దేశమందు నీ శత్రువులకు నిన్ను
దాసునిగా చేతును; యేమంటే మీరు యెప్పటికీ మం
5 డేలాగు నా కోపాగ్నిని రగులుకొల్పితిరి. । యీ విధ
ముగా యెహూవా చెప్పేదేమంటే, మనుష్యుని నమ్మి,
మాంసమును ఆశ్రయముగా చేసుకొని, యెహూ
6 వాను విడిచిపెట్టిన వాడు శపించబడును గాక. । యే
మంటే వాడు అడవిలో తుప్ప వలె వుండి, మేలు
వచ్చేది యెరుగక వుండును; అతడు నిర్మనుష్యమైన
చవటి భూమిలోనున్ను యెండిపోయిన అరణ్య స్థల
7 ములలోనున్ను నివసించును. । యెహూవాను నమ్మినవా
డున్ను ఆయనను నిరీక్షించిన వాడున్ను భాగ్యవంతు
8 డు. । వాడు నీళ్ల యొద్ద నాటబడి, కాలువ వారను
వేళ్లుపారి, వెట్టకు భయపడకనున్ను దాని ఆకు
పచ్చగానున్ను వుండి, వాన లేని సంవత్సరమును గురిం
చిన అక్కరపట్టక, తప్పకుండా ఫలించే చెట్టు వలె
9 వుండును. । అన్నిటికంటే హృదయము మాయకలదిన్ని
ఘోరమైన దుష్టతకలదిన్నియై యున్నది; దానిని యె
10 వరు గ్రహించగలరు? । యెహూవానైన నేను హృద
యమును శోధించేవాడను; వొక్కొకనికి వాని మా
ర్గముల చొప్పుననున్ను వాని క్రియల ఫలము చొప్పు
ననున్ను తగినట్టుగా యిచ్చుటకు నేను జ్ఞానేంద్రియ
ములను పరీక్షించే వాడను. । కౌజుపిట్ట గుడ్లను అణిపి, 11
పిల్లలను పుట్టించకుండా వున్నట్టు, అన్యాయముగా
భాగ్యమును సంపాదించిన వాడున్ను వుండును; వాడు
దానిని మంచి వయస్సులోనే విడిచిపెట్టి, అంత్యమం
దు వెర్రివాడవును. । నా పరిశుద్ధ స్థలము వున్నతమైన 12
మహిమగల సింహాసనమై వున్నది. ఇశ్రాయేలుకు నమ్మ 13
కమైన వో యెహూవా, నిన్ను విడిచిపెట్టే వారంద
రూ బిడియ పడుదురు; నిన్ను విడిచిపెట్టే వారు భూమి
మీద వ్రాయ పడుదురు, యేమంటే వారు జీవోదక
ధార అయిన యెహూవాను విడిచి పెట్టిరి. । వో 14
యెహూవా, నీవు నన్ను గుణపర్చుము, అప్పుడు నేను
గుణపడుదును; నన్ను రక్షించుము, అప్పుడు నేను
రక్షించ పడుదును యేమంటే నిన్ను స్తుతింతును. ।
యిదుగో, వారు నాతో యెహూవా మాట యేది? 15
అది రానిమ్ము, అని అంటూ వున్నారు. । యేమంటే నిన్ను 16
వెంబడించే మందకాపరిగా వుండేటందుకు నేను త్వర
పడ లేదు; దుఃఖకరమైన దినమును నేను యెంతమా
త్రమూ కోరలేదని నీకు తెలుసును; నా పెదవులు నీ
ముందర యుక్తముగా వున్నవి. । నీవు నాకు భయంక 17
రుడవై వుండకుము; కీడు దినమందు నీవు నా ఆశ్ర
యము. । నేను సిగ్గుపడకుండా నన్ను కష్టపెట్టే వారిని 18
సిగ్గు పొందనిమ్ము; నేను బిడియ పడకుండా వారిని బిడి
యపడనిమ్ము; కీడు దినమును వారి మీదికి రాచేసి,
రెట్టింపుగల నాశనముచేత వారిని నశింప చేయుము. ।
యెహూవా నాతో చెప్పినదేమంటే, నీవు వెళ్లి, 19
యూదా రాజులు వెళ్లుతూ వస్తూ వున్న యీ జనుల
పుత్రుల ద్వారములోనున్ను యెరూశలేము యావత్తు
ద్వారములలోనున్ను నిలిచి, వారితో చెప్పవలసినదే
మంటే, । యీ ద్వారములలో ప్రవేశించే యూదా 20
రాజులున్ను యూదా యావత్తున్ను యెరూశలేము
కాపురస్థులందరున్ను అయిన మీరు యెహూవా మా
టను వినండి. । యెహూవా చెప్పేదేమంటే, మీరు 21
జాగ్రతపడి, సబ్బాతు దినమున యే బరువైనా మోయ
కుండానున్ను, యెరూశలేము ద్వారములలోబడి దానిని
లోపలికి తేకుండానున్ను, । సబ్బాతు దినమందు మీ 22
యింట్లోనుంచి బరువును బైటికి తీసుకొని పోకుండా
నున్ను యే పనియైనా చేయకుండానున్ను, నేను మీ
పితృలకు ఆజ్ఞాపించిన ప్రకారము సబ్బాతు దినమును
పరిశుద్ధముగా యెంచి చేయుమంటిని. । అయితే వారు 23
లైకొనక, తమ చెవి చాపక, వినక, బుద్ధిని పొందక,
తమ మెడ కఠిన పరచిరి. । అయినప్పటికిన్ని మీరు 24
సబ్బాతు దినమందు యీ పట్టణపు ద్వారములలో
బడి బరువును లోపలికి కొంచురాకుండా, సబ్బాతు
దినమందు యేదైనా పని చేయకుండా దానిని పరిశుద్ధ

25 పరచేటట్టుగా నా మాట శ్రద్ధగా వింటే, । అప్పుడు
దావీదుయొక్క సింహాసనము మీద కూర్చుంటున్న
రథముల మీదనున్న గుర్రముల మీదనున్న యెక్కు
తున్న వారున్ను వారి వారి ప్రభువులున్ను యూదా
మనుష్యులున్ను యెరూశలేము కాపురస్థులున్ను యీ
పట్టణపు ద్వారములలో ప్రవేశింతురు; యీ పట్టణము
26 యెప్పటికిన్ని నిలిచి వుండును. । యూదా పట్టణముల
నుంచిన్ని యెరూశలేము చుట్టూ వున్న వూళ్లనుంచిన్ని
బెన్యామీను దేశమునుంచిన్ని మైదానమునుంచిన్ని
కొండలనుంచిన్ని దక్షిణమునుంచిన్ని జనులు సర్వాంగ
దహన బలులనున్ను కానుకలనున్ను మాంసార్పణలను
న్ను ధూపమునున్ను కొంచువచ్చి, స్తోత్ర బలులను
27 యెహోవా యింటికి కొంచువత్తురు. । అయితే మీరు
సబ్బాతు దినమును పరిశుద్ధ పరచేటట్టుగా సబ్బాతు
దినమందు బరువును యెరూశలేము ద్వారములలోకి
కొంచురాకుండా వుండేటట్టు నా మాట వినక పోయి
నట్టయితే నేను దాని ద్వారములయందు అగ్నిని రవులు
కొల్పి, అది యెరూశలేముయొక్క నగరులను భక్షించి
ఆరిపోకుండా వుండేటట్టు చేతునని ఆనతిచ్చెనని చెప్పు
మని చెప్పెను.

## 18. అధ్యాయము.

1 యెహోవావల్ల ఇర్మీయా యొద్దికి వచ్చిన వచనము
2 యేమంటే, । నీవు లేచి, కుమ్మరివాని యింటికి వెళ్లుము;
అక్కడ నా మాటలను నీకు వినిపింతునని చెప్పెను. ।
3 ఆ ప్రకారమే నేను కుమ్మరివాని యింటికి వెళ్లగా,
యిదుగో, వాడు సారె మీద పని చేస్తూ వుండెను. ।
4 అయితే కుమ్మరివాడు జిగట మట్టితో చేస్తూ వున్న
కుండ వాని చేతిలో చెడిపోయెను; అయితే తనకు
అనుకూలముగా వున్నట్టు కుమ్మరివాడు దానిని తిరుగా
5 వేరే కుండగా చేసెను. । అప్పుడు యెహోవా వాక్య
6 ము నా యొద్దికి వచ్చినదేమంటే, । ఓ ఇశ్రాయేలు
యింటివారా, యీ కుమ్మరివాని వలె నేను మిమ్మును
గురించి చేయలేనా? అని యెహోవా చెప్పుతూ
వున్నాడు. యిదుగో, కుమ్మరివాని చేతి జిగట మన్ను
యేలాగు వున్నదో, ఓ ఇశ్రాయేలు యింటివారా,
7 మీరు నా చేతిలో ఆలాగునే వున్నారు. । దానిని పెల్ల
గింతుననిన్ని నిర్మూలము చేతుననిన్ని నశింప చేతుననిన్ని
నేను యే జనాంగమునకు విరోధముగానున్ను యే రా
8 జ్యమునకు విరోధముగానున్ను నియమించితినో, । ఆ
జనాంగము దాని పాపమును విడిచిపెట్టి తిరిగినట్టయితే,
నేను దానికి చేయ తలంచిన కీడును చేయక వుందును. ।
9 దానిని స్థిరపరతును, నాటుదును, అని నేను యే జనాం
గమునున్ను యే రాజ్యమునున్ను గూర్చి చెప్పుదునో, ।
అది నా శబ్దమును ఆలకించకుండా నా దృష్టి యెదుట 10
పాపమును చేసినట్టయితే, నేను దాని ప్రయోజనము
కొరకు నిర్ణయించిన మేలును చేయక వుందును. ।
యిప్పుడు నీవు యూదా మనుష్యులలోనున్న యె 11
రూశలేము కాపురస్థులలోనున్న చెప్పవలసినదేమం
టే, యిదుగో, నేను మీకు విరోధముగా కీడు పుట్టించి,
మీకు విరోధముగా వొక వుపాయమును నిర్ణయిస్తూ
వున్నాను; యిప్పుడు మీలో ప్రతివాడు తన చెడ్డ
మార్గమును విడిచిపెట్టి, మీ మార్గములనున్ను మీ
క్రియలనున్ను బాగు చేసుకొండీ అని యెహోవా
చెప్పుతూ వున్నాడని చెప్పుము. । అయితే వారు చెప్పి 12
నదేమంటే, నిరీక్షణ లేదు; మా మా భావముల ప్రకా
రము మేము నడుస్తాము; మాలో ప్రతివాడు తన తన
చెడ్డ హృదయాలోచన ప్రకారము చేస్తాడని పలికిరి. ।
అయినందున యెహోవా ఆనతిచ్చేదేమంటే, యీ 13
లాటి వాటిని విన్నవాడు యెవడని అన్య జనులలో
అడిగి విచారించండి: ఇశ్రాయేలు కన్యక బహు ఘో
రమైన సంగతి జరిగించెను. । యెవడైనా రాతి కొండ 14
కొరకైనా లెబానోను మంచు కొరకైనా నా పొలము
లను విడుచునా? అన్య స్థలమునుంచి వచ్చిన చల్లని నీళ్ల
కొరకు ప్రవహిస్తూ వున్న నీళ్లు విసర్జించ బడవచ్చు
నా? । యేమంటే నా జనులు నన్ను మరచి, వ్యర్థ 15
మైన దానికి ధూపమునర్పిస్తూ వున్నారు; చక్క చేయ
పడని మార్గములలో వారిని నడిపించేటట్టుగానున్ను,
వారి దేశమును పాడుచేసేటట్టుగానున్ను, నిత్యమైన
నిందపరచేటట్టుగానున్ను, । వారు తమ పురాతన మా 16
ర్గములనుంచి వారిని మళ్లించి, తమ మార్గములలో
తొట్రిల్ల పరచినారు; ఆ వైపు దాటిపోయే ప్రతివాడు
దిగులుపడి, తన తలను వూచును. । నేను వారిని వారి 17
శత్రువులకు ముందుగా తూర్పు గాలితోనయినట్టు
యెగరకొడుదును; వారి ఆపత్కాలమందు నేను వారికి
వీపునే గాని ముఖమును చూపించనని చెప్పుతూ వు
న్నాడని చెప్పుమనెను. । అంతట వారు అనినదేమంటే, 18
ఇర్మీయాకు విరోధముగా ఆలోచింతాము, రండి; యే
మంటే అర్చకుని యొద్ద వేదమైనా, జ్ఞానియొద్ద బుద్ధి
యైనా, దీర్ఘదర్శి యొద్ద వచనమైనా గతించిపోదు.
రండి వీని మాటలకు శ్రద్ధ చేయక, వీనిని తిరస్కరిం
తాము అని చెప్పినారు. । ఓ యెహోవా, నీవు నన్ను 19
శ్రద్ధచేయుము; నాతో వ్యాజ్యమాడే వారి శబ్దమును
ఆలకించుము. । మేలు కొరకు కీడు ప్రతికారముగా 20
యివ్వ వచ్చునా? యేమంటే వారు నా ఆత్మ నిమిత్తము
గోతిని తవ్వి వున్నారు; నీ వుగ్రమును వారి పైనుంచి
తప్పించేటందుకున్ను వారి కొరకు మేలు వచించేటందు
కున్ను నీ సముఖమందు నేను నిలిచి వుండుటను తలం

21 చుకొమ్ము. । అయినందున వారి పిల్లలను క్షామమునకు
అప్పగించి, వారిని కత్తిపాలుచేయుము; వారి భార్యలను
పిల్లలు లేని వారిగానున్ను విధవలగానున్ను వుండనిమ్ము;
వారి పురుషులు సంహరించ బడుదురు గాక; వారి పడు
చువాండ్లు యుద్ధముచేత నరకపడి హతము చేయబడు
22 దురు గాక. । నీవు వారి మీదికి ఆకస్మికముగా దండు
ను రా చేసేటప్పుడు వారి యిండ్లలోనుంచి కేక విన
పడనిమ్ము; యేమంటే వారు నన్ను పట్టేటందుకు గోతిని
23 తవ్వి నా కాళ్లకు వురులు వొగ్గినారు. । అయితే యె
హోవా, వారి నా చావుకు చేసే యత్నమంతా నీవు
యెరుగుదువు; వారి అక్రమమును నీవు మన్నించక,
నీ దృష్టినుంచి వారి పాపమును తుడిచివేయకుము;
వారిని నీ ముందర బోర్లపడనిమ్ము; నీ కోప కాలమందు
యీ ప్రకారము వారికి చేయుము.

## 19. అధ్యాయము.

1 యెహోవా సెలవు యిచ్చినదేమంటే, నీవు వెళ్లి,
కుమ్మరివాని మంటికుండను తీసుకొని, జనుల పెద్దలలో
కొందరినిన్ని అర్చకుల పెద్దలలో కొందరినిన్ని పిలుచు
2 కొని, । తూర్పు ద్వారము సమీపమందున్న హిన్నోము
కుమారుని లోవకు పోయి, అక్కడ నేను నీతో చెప్పే
3 మాటలను ప్రకటించి, చెప్పవలసినదేమంటే, । ఓ యూ
దా దేశపు రాజులారా, యెరూశలేము కాపురస్తులా
రా, యెహోవా వాక్యమును వినండి; ఇశ్రాయేలు
దేవుడైన సైన్యముల యెహోవా ఆనతిచ్చేదేమంటే,
యీ స్థలము మీదికి నేను కీడును రప్పింతును; దానిని
4 వినినవారందరి చెవులకు దిమ్ముపట్టును. । యేమంటే
వారు నన్ను విడిచి, యీ స్థలమును వేరుగా చేసి, వారి
కైనా వారి పితృలకైనా యూదా దేశపు రాజులకైనా
తెలియనటువంటి దేవుండ్లకు అందులో ధూపమిచ్చి,
5 యీ స్థలమును నిరపరాధుల రక్తముచేత నింపిరి. । మరి
న్ని వారు బయలు కొరకు ఉన్నతమైన స్థలములను కట్టి,
అగ్నితోను తమ కుమాళ్లను దహనము చేసి, బయలుకు
హోమార్పణలను యిచ్చిరి; అయితే ఆలాగున నేను
వారికి యే ఆజ్ఞనైనా యే సెలవైనా యివ్వలేదు; అది
6 నా మనస్సులోకి అయినా యెన్నడూ రాలేదు. । కా
బట్టి యెహోవా ఆనతిచ్చేదేమంటే, యిదుగో, దిన
ములు వస్తున్నవి; అప్పుడు యీ స్థలము తోఫెతనిన్ని
హిన్నోము కుమారుని లోవ అనిన్ని కాక, హతము
7 యొక్క లోవ అని పిలువబడును.—యేమంటే యీ
స్థలమందు నేను యూదా దేశస్థులయొక్కయున్ను
యెరూశలేము కాపురస్తులయొక్కయున్ను ఆలోచన
ను వ్యర్థపరచి, వారి శత్రువుల ముందర వారిని వారి
ప్రాణములను వెతికిన వారి చేతులవల్లనున్ను కత్తివల్ల
నున్ను కూలచేసి, వారి కళేబరములను ఆకాశ పక్షుల
కున్ను భూ మృగములకున్ను ఆహారముగా యిచ్చి, ।
యీ పట్టణము పాడు కొరకున్ను నింద కొరకున్ను 8
చేతును; ఆ మార్గముగా వెళ్లిన ప్రతివాడూ దాని
తెగుళ్లను చూచి ఆశ్చర్యపడి బుస్సు పెట్టును. । మరిన్ని 9
వారి కుమారుల మాంసమునున్ను వారి కుమార్తెల
మాంసమునున్ను వారికి తినిపింతును; మరిన్ని వారి
శత్రువులున్ను వారి ప్రాణములను వెతికేవారున్ను వా
రిని గవసి, యిబ్బంది పరచినందున వారిలో ప్రతి మను
ష్యుడూ తన తన తోటివాని మాంసమును భక్షించును. ।
అప్పుడు నీతో వచ్చిన వారి కండ్ల ముందర నీవు ఆ 10
కుండను పగల కొట్టి, వారితో చెప్పవలసినదేమంటే, ।
సైన్యముల యెహోవా యీ విధముగా చెప్పుతున్నా 11
డు, యీలాగునే వొకడు బద్దలు కొట్టిన కుండ తిరిగీ
బాగుచేయ నశక్యమైనట్టు నేను యీ జనులనున్ను యీ
పట్టణమునున్ను బద్దల కొట్టుదును; వారు తోఫెతులో
పాతిపెట్టుటకు మరి చోటులేక వుండే మట్టుకు వా
రిని పాతిపెట్టుదురు. । యీలాగున నేను యీ స్థలము 12
కున్ను దాని కాపురస్తులకున్ను చేసి, యీ పట్టణమును
తోఫెతుకు సమముగా చేతును. । మరిన్ని యెరూశ 13
లేము యిండ్లున్ను యూదా రాజుల యిండ్లున్ను తో
ఫెతనే స్థలము వలె అపవిత్రమౌను; యేమంటే ఆ
యిండ్లపైని వారు ఆకాశ సమూహము యావత్తుకున్ను
ధూపమిచ్చి, అన్య దేవుండ్లకు పానార్పణలను కుమ్మ
రించిరని యెహోవా ఆనతిచ్చెనని చెప్పుమని సెలవు
యిచ్చెను. । అయితే అతని దీర్ఘదర్శిగా పలుకుటకు 14
యెహోవా ఇర్మీయాను యే స్థలముకు పంపెనో ఆ
తోఫెతునుంచి అతడు వచ్చి, యెహోవా మందిరము
యొక్క శాలలో నిలిచి, జనులందరితో ఇశ్రాయేలుకు
దేవుడైన సైన్యముల యెహోవా ఆనతిచ్చేదేమంటే, ।
యిదుగో నేను యీ పట్టణము మీదికిన్ని దాని సకల 15
గ్రామముల మీదికిన్ని దానికి నేను విధించిన కీడం
తౌను రప్పింతును; యేమంటే వారు తమ కంఠములను
కఠిన పరచుకొని, నా వాక్యములను వినలేదని ఆన
తిచ్చెనని చెప్పెను.

## 20. అధ్యాయము.

అయితే యెహోవా మందిరముయొక్క శ్రేష్ఠు 1
డున్ను అర్చకుడున్ను అయిన ఇమ్మేరు కుమారుడనే
పష్హూరు ఇర్మీయా ఆలాగున దీర్ఘదర్శనముగా పలి
కిన సంగతులు విని, । పష్హూరు ఇర్మీయా అనే దీర్ఘ 2
దర్శిని కొట్టి, యెహోవా మందిరముయొద్ద బెన్యా
మీను పెద్ద ద్వారమందుండే బొండలో పెట్టినాడు. ।
అయితే ఆ మరునాటి యందు పష్హూరు బొండలో 3

నుంచి ఇర్మీయాను విడిపించెను; అప్పుడు ఇర్మీయా వా
నిని చూచి, యెహోవా నీ పేరు పష్హూరు అని కాదు
4 మాగోర్మిస్సాబీబు అని పిలిచెను. । యిందుకు యె
హోవా ఆనతిచ్చేదేమంటే, యిదుగో, నేను నీకున్ను
నీ చెలికాండ్లకందరికిన్ని భయంకరముగా చేతును;
వారందరున్ను వారి శత్రువుల కత్తిచేత కూలుదురు;
అది నీ కన్నులు చూచును; మరిన్ని నేను యూదా
వారినందరినీ బాబెలు రాజు చేతిలోకి అప్పగింతును;
వాడు వారిని చెరపట్టుకుపోయి, బాబెలు దేశము
నకు తీసుకు వెళ్లి, వారిని కత్తిచేత హతము చేసును. ।
5 మరిన్ని యీ పట్టణముయొక్క బలమంతటినిన్ని దాని
కష్టార్జితమంతటినిన్ని దాని ప్రశస్తమైన వస్తువుల
నన్నిటినిన్ని యూదా రాజుల పదార్థములనన్నిటినిన్ని
నేను వారి శత్రువుల చేతికి అప్పగించినందున వారు
నాటిని దోపుకు యిచ్చి, బాబెలుకు తీసుకొని పోదురు. ।
6 మరిన్ని పష్హూరువైన నీవున్ను నీ యింటి వారందరున్ను
చెరలోకి వెళ్లుదురు; నీవు బాబెలుకు వచ్చి, అక్కడ
మరణమౌదువు; మరిన్ని అక్కడ నీవున్ను యెవరితో
దీర్ఘదర్శనముగా అబద్ధపు మాటలను పలికితివో
నీ స్నేహితులు అయిన వారున్ను పాతి పెట్టబడుదురని
7 ఆనతిచ్చెనని చెప్పెను. । ఓ యెహోవా, నీవు నన్ను
బోధపర్చితివి, నీ బోధ నేను వింటిని; నాకంటే
నీవు బలమైనవాడవై వుండి, జయము పొందితివి; ప్రతి
దినమున్ను వారు నన్ను చూచి నవ్వుదురు; అందరున్ను
8 నన్ను అపహసింతురు. । యేమంటే నేను పలికినప్పటి
నుంచి బలవంతమనిన్ని క్షయమనిన్ని బొబ్బ యెత్తి
అంటూ వుంటిని; అయినందున యెహోవా వాక్యము
ప్రతి దినమూ నాకు అవమానమున్ను అపహాస్యమున్ను
9 ఆయెను. । కాబట్టి యిక నేను ఆయనను గురించి జ్ఞాపక
ము చేసుకోక, ఆయన పేరట యిక పలుకనని అనుకొం
టిని; అయితే ఆయన వాక్యము నా హృదయమందు
మండే అగ్ని అయినట్టున్ను నా శల్యములలో కట్టబడిన
అగ్నియైనట్టున్ను ఆయెను; నేను ఓపుచేత అలసట
10 పడి మరి ఓర్చలేక పోతిని. । యేమంటే అనేకులయొ
క్క దూషణ నాకు వినబడెను; నఖముఖాలా భయము
కలిగి యుండెను; యేదైనా మాతో తెలియ చెప్పితే
మేము దాని తిరిగీ తెలియ చేతుము; నా తోటివారం
దరున్ను నా జారిపోవుటకు కనిపెట్టి, అతడు మోస
ము పొందునేమో, అప్పుడు మేము వారిని జయించి,
వాని యందు పగ తీర్చుకొందుమని అనుకొనిరి. ।
11 అయితే యెహోవా భయంకరమైన బలిష్ఠుని వలె
నాకు తోడుగా వున్నందున నన్ను తరిమే వారు తొ
ట్రిల్లి, జయించలేకపోదురు; వారు బహుగా సిగ్గుపడు
దురు, యేమంటే వారు వృద్ధిని పొందలేరు; వారి సిగ్గు
యెప్పటికీ వుండి, యెన్నటికైనా మరుపును పొందక
వుండును. । అయితే నీతిపరులను శోధించి, జ్ఞానేంద్రి 12
యములనున్ను హృదయమునున్ను గుర్తెరిగిన ఓ సైన్య
ముల యెహోవా, వారి మీద నీవు చేసిన ప్రతికా
రమును నన్ను చూడనిమ్ము; యేమంటే నా వ్యాజ్యమును
నేను నీకు అగుపర్చితిని. । యెహోవా దీనుని ప్రా 13
ణమును దుష్టక్రియలు చేసే వారి చేతిలోనుంచి విడి
పించెను గనుక యెహోవా కొరకు పాట పాడండీ;
యెహోవాను స్తోత్రము చేయండీ. । యే దినమందు 14
నేను పుట్టితినో ఆ దినము శపించబడును గాక; యే
దినమందు నా తల్లి నన్ను కనినదో అది ఆశీర్వదించ
బడక పోవును గాక. । నీకు మొగ పిల్ల పుట్టెనన్న వర్త 15
మానము నా తండ్రికి తెచ్చి, వానిని చాలా సంతోష
పర్చిన వాడున్ను శపించబడును గాక. । అతడు యె 16
హోవా చింతబడకుండా బోర్లించిన పట్టణములకు
సమానమౌ గాక; వాడు వుదయమందు రోదనమును
న్ను మధ్యాహ్నమందు ఆర్పునున్ను వినును గాక. ।
యెందుకంటే నా తల్లి గర్భమునుంచి పుట్టినప్పుడే 17
అతడు నన్ను చంపలేదు; నా తల్లి నాకు సమాధిగా
చేయలేదు; దాని గర్భము నన్ను యెప్పటికీ భరించే
టట్టు చేయలేదు. । నా దినములు అవమానముచేత గడి 18
చేటట్టు నేను కష్టమున్ను చింతనున్ను చూచేటందుకు
నేను గర్భమునుంచి యెందుకు పుట్టితిని?

## 21. అధ్యాయము.

మెల్కీయా కుమారుడైన పష్హూరునున్ను అర్చకు 1
డైన మయశేయా కుమారుడగు సెఫన్యానున్ను రాజ
యిన సిద్కీయా ఇర్మీయా యొద్దికి పంపినప్పుడు యె
హోవానుంచి తనకు వచ్చిన వాక్యము యేమంటే, ।
రాజైన నెబూఖద్రెస్సరు మా మీద యుద్ధము చేస్తూ 2
వున్నాడు; కాబట్టి యెహోవా ఆశ్చర్యమైన తన క్రి
యలన్నిటి చొప్పున మా కొరకు చేసి, వాడు మమ్మును
విడిచేటట్టు చేసునో లేదో అని నీవు దయచేసి, మా
కొరకు ఆయనను అడగ వలసినదని చెప్పినప్పుడు. । ఇర్మీ 3
యా వారితో చెప్పినదేమంటే, ఇశ్రాయేలుకు దేవు
డైన యెహోవా ఆనతిచ్చినట్టు మీరు సిద్కీయాతో
చెప్పవలసినదేమంటే, । యిదుగో నేను బాబెలు రాజు 4
తోనున్ను ప్రాకారముల బైట మిమ్మును గవిసిన కల్దీ
యులతోనున్ను పోట్లాడిన మీ చేతులలో వున్న ఆయు
ధములను అటు తిప్పివేసి, వారినందరినీ యీ పట్టణము
లోకి ప్రవేశింపచేతును. । నేను చాపిన హస్తము చేతను 5
న్ను బాహు బలము చేతనున్ను కోపము చేతనున్ను రౌ
ద్రము చేతనున్ను మహోగ్రత చేతనున్ను మీ మీద
యుద్ధముచేసి, । యీ పట్టణపు కాపురస్థులను, అనగా, 6

మనుష్యులనున్ను మృగములనున్ను కొట్టినందున వారు
గొప్ప తెగులుచేత మరణమౌదురని వానితో చెప్పండని
7 చెప్పి పంపెను.। అటు తరువాత యెహోవా ఆనతి
చ్చేదేమంటే, నేను యూదా దేశపు రాజయిన సిద్కీ-
యానున్ను అతని సేవకులనున్ను జనులనున్ను యీ
పట్టణములో తెగులునుంచిన్ని కత్తినుంచిన్ని క్షామము
నుంచిన్ని శేషించి వున్న మనుష్యులనున్ను బాబెలు
రాజయిన నెబూఖద్రెస్సరు చేతికిన్ని వారి శత్రువుల
చేతికిన్ని వారి ప్రాణములను వెతికిన వారి చేతికిన్ని
అప్పగింతును; అప్పుడు వాడు కనికరించక, కాయక,
దయ చూపించక, కత్తి వాడిచేత వారిని నరుకును.।
8 అయితే యీ జనులతో నీవు చెప్పవలసినదేమంటే,
యీలాగున యెహోవా చెప్పుతున్నదేమంటే, యి
దుగో, నేను జీవపు మార్గమునున్ను మరణపు మార్గ
9 మునున్ను మీ ముందర పెట్టుతున్నాను.। యీ పట్టణ
మందు నిలచివున్న వారు కత్తిచేతనున్ను క్షామము చేత
నున్ను తెగులు చేతనున్ను మరణమౌదురు; అయితే
బైలువెళ్లి మిమ్మును గవిసిన కల్దీయులలోకి వెళ్లిన వాడు
యెవడో వాడు బ్రతుకును; వాడు తన ప్రాణమును
10 తప్పించుకొనును.। యేమంటే నేను నా ముఖమును
మేలు కొరకు కాదు కీడు కొరకు యీ పట్టణము తట్టు
స్థిరపర్చితిని; అది బాబెలు రాజు చేతికి అప్పగించబడు
ను; వాడు దానిని అగ్నిచేత కాల్చివేసునని యెహో
11 వా ఆనతిచ్చెనని చెప్పుము.। మరిన్ని యూదా దేశపు
రాజు యింటిని గురించి నీవు చెప్పవలసినదేమంటే,।
12 దావీదు యింటి వారలారా, యెహోవా వాక్యమును
వినండి; యెహోవా యిచ్చిన సెలవు యేమంటే, మీ
దుష్ట క్రియల నిమిత్తము నా రౌద్రము అగ్నిలాగున
బైలు వెళ్లును; దానిని ఆర్ప శక్యము కానంత బలము
చేత కాలకుండా మీరు వుదయమందే న్యాయమును
నడిపించి, బాధకర్త చేతిలోనుంచి పాడై పోయిన
13 వానిని విడిపింతురు గాక.। మన మీదికి యెవరు దిగి
వత్తురనిన్ని, మన కాపురములోకి యెవరు ప్రవేశించ
గలరనిన్ని అనుకొనిన లోవలో కాపురముచేసిన వాడా,
మైదానపు భూమిలోనున్న కొండ కాపురము చేసిన
వాడా, యిదుగో నేను నీకు విరోధముగా వున్నాను.।
14 అయితే నేను మీ క్రియల ఫల ప్రకారము మిమ్మును
శిక్షింతును; యేమంటే దాని అరణ్యములో నేను అగ్ని
రాజబెట్టుదును; అది దాని చుట్టూ వున్న సమస్తమును
మింగివేసునని యెహోవా ఆనతిచ్చెనని చెప్పుమని
సెలవు యిచ్చెను.

## 22. అధ్యాయము.

1 మరిన్ని యెహోవా సెలవు యిచ్చినలాగు, నీవు
యూదా దేశపు రాజు యింటికి వెళ్లి, చెప్పవలసిన వా
క్యము యేమంటే,। దావీదు గద్దె మీద ఆసీనుడవైన ఓ 2
యూదా దేశపు రాజా, నీవున్ను నీ సేవకులున్ను యీ
గుమ్మముల ద్వారా ప్రవేశించే మీ జనులున్ను యెహో
వాయొక్క వాక్యమును వినండి.। యెహోవా యి 3
చ్చిన సెలవు యేమంటే, మీరు నీతి న్యాయములను నడి
పించి, బాధకర్త చేతిలోనుంచి పాడై పోయిన వాని
విడిపించి, పరదేశికైనా తండ్రిలేని వానికైనా విధవకై
నా అన్యాయమైనా బలవంతమైనా చేయకనున్ను, యీ
స్థలమందు నిరపరాధియొక్క రక్తమును చిందించకను
న్ను వుందురుగాక.। యేమంటే యీలాగున మీరు నిజ 4
ముగా చేసినట్టయితే, అప్పుడు దావీదు గద్దెమీద ఆసీ
నులైన రాజులు రథములనున్ను గుర్రములనున్ను యె
క్కి, అతడున్ను అతని సేవకులున్ను అతని జనులున్ను
యీ యింటి గుమ్మముల ద్వారా ప్రవేశింతురు.। అయితే 5
మీరు యీ వాక్యములను వినక పోయినట్టయితే, యీ
యిల్లు పాడై పోవునని నా మీద నేనే ప్రమాణము
చేసుకొంటినని అని యెహోవా ఆనతిచ్చెను.। యిందు 6
కు యెహోవా యూదా దేశపు రాజు యింటి వారి
తో ఆనతిచ్చేదేమంటే, నీవు నాకు గిలాదు పర్వతము
వలెనున్ను లెబానోను పర్వత శిఖరము వలెనున్ను వుం
టివి; అయినప్పటికిన్ని నేను నిన్ను అరణ్యమునకున్ను
మనుష్యులు లేని పట్టణమునకున్ను సమానము చేతును.।
మరిన్ని నేను నీ మీదికి లయకర్తలను లేవచేతును; 7
అందరున్ను తమ తమ ఆయుధములను చేత పట్టుకొని,
గొప్ప ఆర్జ వృక్షములను నరికి, అగ్నిలో కాల్చివేతురు.।
అప్పుడు అనేకమైన జనాంగములు యీ పట్టణపు మా 8
ర్గము చేత వచ్చి, ప్రతి మనుష్యుడూ తన తోటివాని
చూచి, యెహోవా యీ గొప్ప పట్టణమునకు యీ
లాగున చేసెనేమని అడిగినందున,। ఆ పట్టణపు వారు 9
తమ దేవుడైన యెహోవా ప్రమాణమును విడిచిపెట్టి,
వేరే దేవుండ్లకు మ్రొక్కి సేవించిరన్న ప్రత్యుత్తర
ము యిత్తురు.। మరణమైన వాని కొరకు యేడ్వక, 10
వాని గురించి మూల్గకండి; అయితే అవతలకు పోయిన
వాని గురించి బహుగా యేడ్వండి; యేమంటే వాడు
యికను తిరిగీ రాక, తన జన్మ దేశమును చూడకుండా
వుండును.। యేమంటే తన తండ్రియైన యోషీయాకు 11
మారుగా యేలి, యీ స్థలములలోనుంచి బైలు వెళ్లిన
యూదా రాజైన యోషీయా కుమారుడైన షల్లూమును
గురించి యెహోవా ఆనతిచ్చేదేమంటే, వాడు యిక్క
డికి తిరిగీ రాక వుండును.। యే స్థలమునకు వారు 12
వానిని చెరగా తీసుకొని పోయిరో అక్కడనే వాడు
మరణమును బొందును; యీ దేశమును యికను చూడక
వుండును.। తన పొరుగింటి వాని వల్ల కొలువు పుచ్చు 13
కొని, తన పని కొరకు వానికి జీవము యివ్వక, తన

యింటిని అన్యాయము చేతనున్ను తన గదులు బలవం
14 తము చేతనున్ను కట్టించిన వానికిన్ని,। నేను విశాల
మైన యిల్లును కట్టించి, అందులో పొడవైన గదుల
నున్ను కిటికీలనున్ను వేయించి, దాని మీద భాగమును
ఆర్జ బల్లలతో పొదిగించి, యింగిలీకముతో రంగు
15 రాయింతునని పలికిన వానికిన్ని అయ్యో!। అయితే
ఆర్జ బల్లల చేత నీ పైని నిన్ను కప్పుకొన్నందున
నీవు యేలుదువా? నీ తండ్రి తిని, తాగి, నీతి న్యాయ
ములను జరిగించ లేదా? అప్పుడు వాడు బాగా వుండ
16 లేదా?। వాడు దరిద్రునియొక్కయున్ను లేమిగల వాని
యొక్కయున్ను వ్యాజ్యమును తీర్చి, అప్పుడు వాడు
బాగా వుండ లేదా? అది నన్ను యెరుగుటకే కాదా
17 అని యెహోవా అడిగెను.। అయితే నీ కన్నులున్ను నీ
హృదయమున్ను లోభ్యమందున్ను నిరపరాధి రక్తమును
చిందడమందున్ను బాధ పర్చడమందున్ను బలవంతము
18 చేయడమందున్ను ఆశగా వున్నవి.। కాబట్టి యూదా
దేశపు రాజైన యోషీయా కుమారుడైన యెహోయా
కీమును గురించి యెహోవా ఆనతిచ్చినదేమంటే, వారు
వాని కొరకు దుఃఖించక వుందురు; అయ్యో, నా
సహోదరుడా! అయ్యో, నా సహోదరీ! అయ్యో,
నా యేలిన వాడా! అయ్యో, మహా ప్రభూ! అని వాని
19 కొరకు దుఃఖించరు.। వాడు యెరూశలేము గవనుల
బైటికి యీడ్చివేయబడి, గాడిదెను పాతిపెట్టినట్టు
20 వాడు పాతిపెట్టబడును.। నీవు లెబానోను మీదికి వెళ్లి
కేక వేయుము; బాషానుకు వెళ్లి బొబ్బయెత్తి, రేవుల
మీదనుంచి నీ కేక వినపడనిమ్ము; యేమంటే నీ స్నేహి
21 తలందరున్ను పాడై పోయిరి.। నీకు క్షేమము కలిగిన
ప్పుడు నేను నీ తోటి చెప్పితిని, అయితే నీవు విననని
అంటివి; యీలాగునే నీ బాల్యమునుంచి నా వాక్య
22 మును నీవు వినక నాకు లోపడక వుంటివి.। కాబట్టి
వాయువు నీ కాపరులనందరిని మింగి వేసును; నీ స్నేహి
తులు చెరలోకి వెళ్లుదురు; నిజముగా అప్పుడు నీవు నీ
23 దోషమంతటి కొరకు సిగ్గుపడి కలవిలపడుదువు.। ఆర్జ
వృక్షములలో గూడు కట్టుకొనిన ఓ లెబానోనులో
కాపురము చేసినదానా, ప్రసూతి స్త్రీకి వచ్చిన వేదనలు
నిన్ను పట్టినప్పుడు నీ విషయమై యెంత కనికరము
24 వుండును!। యిందుకు యెహోవా ఆనతిచ్చేదేమంటే,
నా జీవముతోడు, యూదా రాజైన యెహోయా
కీము కుమారుడైన కొన్యాహు నా కుడి చేతికి వుంగ
రముగా వున్నప్పటికిన్ని నేను నిన్ను అక్కడనుంచి
25 తీసివేతును.। నేను నీ ప్రాణమును వెతికిన వారి చేతి
లోకిన్ని నీవు భయపడే వాని చేతిలోకిన్ని, అనగా,
బాబెలు రాజైన నెబూఖద్రెస్సరు చేతికిన్ని కల్దీయుల
26 చేతికిన్ని నిన్ను అప్పగింతును.। మరిన్ని నిన్నున్ను నిన్ను
కన్న తల్లినిన్ని మీ జన్మ దేశము కాని వేరే దేశము
లోకి నేను వెళ్లవేతును; అక్కడ మీరు మరణమౌదురు.।
అయితే యే దేశములోకి వారు తిరిగీ వచ్చుటకు కోరు 27
దురో అక్కడికి తిరిగీ వారు రాకపోదురు.। కొన్యా 28
హు అనే యీ పురుషుడు విరిగిపోయినటువంటిన్ని
రోయబడినటువంటిన్ని బొమ్మలాటి వాడా? ఆశించ
తగని పాత్రవంటి వాడా? అతడున్ను అతని సంత
తిన్ని యెందుకు వారు యెరుగని భూమిలోకి తోసి
వేయబడినారు?। ఓ భూమీ, భూమీ, భూమీ, నీవు 29
యెహోవా వాక్యమును వినుము.। యెహోవా ఆన 30
తిచ్చేదేమంటే, యీ మనుష్యుడు సంతానము లేని
వాడనిన్ని తన దినముల యందు క్షేమము పొందని
వాడనిన్ని వ్రాయండి; యేమంటే తన సంతతిలో యెవ
నికయినా క్షేమము రాక వుండును; దావీదు గద్దెమీద
ఆసీనుడుగా వుండుటకున్ను యూదా దేశమును యేలు
టకున్ను వొకడైనా వుండడని ఆనతిచ్చెను.

## 23. అధ్యాయము.

నేను పోషించిన గొర్రెలను చెదర కొట్టి, లయ 1
పర్చిన మంద కాపర్లకు అయ్యో! అని యెహోవా
ఆనతిచ్చెను.। యిందుకు ఇశ్రాయేలుకు దేవుడైన యె 2
హోవా తన జనులను మేపే కాపర్లను గురించి
చెప్పినదేమంటే, మీరు నా గొర్రెలను కాపాడక, ఆవ
తలికి తోలివేసి, చెదర గొట్టితిరి; కాబట్టి నేను మీ
దుష్ట క్రియల కీడును మీ మీదికి రా చేయింతునని
యెహోవా ఆనతిచ్చెను.। అయితే యే దేశములకు 3
నేను నా గొర్రెలను తోలివేస్తినో ఆ దేశములనుంచి
వాటిలో శేషించిన వాటిని కూర్చుకొని, వాటి దొ
డ్లకు వాటిని తిరిగీ రప్పింతును; అప్పుడు అవి అభి
వృద్ధి పొంది విస్తరించును.। యేమంటే వాటి మీద 4
నేను వాటిని మేపించ గల బోయలను వుంచుదును;
కాబట్టి అటు తరువాత అవి భయపడకనున్ను విస్మయ
పడకనున్ను తక్కువగాకనున్ను వుండునని యెహోవా
ఆనతిచ్చెను.। మరిన్ని యెహోవా ఆనతిచ్చేదేమంటే, 5
యిదుగో దినములు వస్తూ వున్నవి; వాటియందు నేను
దావీదువల్ల నీతి గల చిగురును లేవచేతును; అప్పుడు
వొక రాజు విజయముతో యేలి, భూమి యందు నీతి
న్యాయములను నడిపించును.। ఆయన దినముల యందు 6
యూదా రక్షణను పొందును; ఇశ్రాయేలున్ను నిర్భ
యముగా కాపురము చేసును; ఆయన పిలువబడిన నా
మము యేమంటే మన నీతి అయిన యెహోవా.। యిం 7
దుకు యెహోవా మరిన్ని ఆనతిచ్చేదేమంటే, దినములు
వస్తూ వున్నవి; వాటి యందు మిస్రయీము దేశములో
నుంచి ఇశ్రాయేలు పుత్రులను యివతలకు రప్పించిన

8 యెహోవా సజీవుడై యున్నాడని కాక, ఉత్తర దేశ
ములోనుంచిన్ని వారిని నేను తోలివేసిన దేశములన్ని
టిలోనుంచిన్ని ఇశ్రాయేలు యింటి వారి సంతతిని
యివతలకు కొంచువచ్చిన యెహోవా సజీవుడై యు
న్నాడని చెప్పబడును; యేమంటే వారు తమ స్వదేశ
మందు కాపురము చేతురని యెహోవా ఆనతిచ్చెను.।
9 దీర్ఘదర్శుల నిమిత్తము నా హృదయము విరిగిపో
యినది; నా శల్యములన్నిన్ని వణుకుతూ వున్నవి; యె
హోవా నిమిత్తము చేతనున్ను ఆయన పరిశుద్ధ వాక్య
ముల నిమిత్తము చేతనున్ను నేను ద్రాక్షారసముచేత
10 మత్తు పొందిన మత్తుదారుని వలె వుంటిని. । యే
మంటే దేశము వ్యభిచారులవల్ల నిండి వున్నది; శపించ
బడినందున దేశము మూల్గుతూ వున్నది; అరణ్యముయొ
క్క ఆనందమైన స్థలములు యెండిపోయినవి; మరిన్ని
వారి నడత చెడ్డది; వారి బలము తిన్ననిది కాదు. ।
11 యేమంటే దీర్ఘదర్శిన్ని అర్చకుడున్ను దుర్జనులు;
నిజముగా నా మందిరమందు వారి దోషము నాకు కను
12 బడెనని యెహోవా ఆనతిచ్చెను. । కాబట్టి వారి మా
ర్గము వారికి చీకటిలో జారు భూమిగా వుండును;
వారు ముందటికి తోలివేయబడి అందులో కూలుదురు;
యేమంటే వారి మీదికి కీడు, అనగా, వారి విచారణ
సంవత్సరమును నేను రప్పింతునని యెహోవా ఆనతి
13 చ్చెను. । మరిన్ని షోమ్రోను దేశపు దీర్ఘదర్శుల
యందు అవివేకము నాకు కనుపడెను; వారు బయలు
యొక్క నామమందు భవిష్యత్తుగా పలికి, ఇశ్రాయే
14 లనే నా జనులను తప్పిపోయేటట్టు చేసిరి. । అయితే
నేను యెరూశలేముయొక్క దీర్ఘదర్శులలో బహు
ఘోరమైన పాపమును చూస్తిని; వారు వ్యభిచారమును
చేసి, అబద్ధముల యందు ప్రవర్తింతురు; వారు దుర్మా
ర్గులయొక్క చేతులను బలపరచినందున తన దోష
మును విడిచి వొకడైనా తిరిగీ రాలేదు; వారందరున్ను
నాకు సొదొమ పట్టణము వలెనున్ను దాని కాపుర
స్తులు గొమొఱ్ఱా పట్టణము వలెనున్ను వున్నారు. ।
15 కాబట్టి ఆ దీర్ఘదర్శులను గురించి సైన్యముల యె
హోవా ఆనతిచ్చేదేమంటే, యిదుగో, నేను వారిని
చేదైన ఆహారమును తినిపింతును; చేదైన పానమును
తాగింతును; యేమంటే యెరూశలేముయొక్క దీర్ఘ
దర్శుల యొద్దనుంచి కపటము దేశమంతటిలోకి బైలు
16 వెళ్లెను. । కాబట్టి సైన్యముల యెహోవా ఆనతిచ్చే
దేమంటే, భవిష్యత్తుగా మీ తోటి పలికిన దీర్ఘద
ర్శుల మాటలను ఆలకించకండి; వారు మిమ్మును భ్రమ
పెట్టుదురు; యెహోవా వాక్కువల్ల కాక తమ హృ
దయములో పుట్టినటువంటి దర్శనమును పలుకుదురు.।
17 మీరు నన్ను నిర్లక్ష్యపెట్టిన వారిని చూచి, మీకు క్షే
మము కలుగునని యెహోవా ఆనతిచ్చెనని చెప్పు
దురు; మరిన్ని తమ హృదయపు యోచన ప్రకారము
నడిచే వారినందరినీ చూచి, యే కీడైనా మీకు రాక
వుండును. । యేమంటే యెహోవా ఆలోచన యెవరికి 18
గూఢముగా తెలుసును? ఆయన వాక్యమును యెవరు
విని తెలుసుకొనిరి? ఆయన వాక్యమును విని గుర్తెరి
గిన వారు యెవరని చెప్పుదురు. । యిదుగో యెహో 19
వా యొద్దనుంచి సుడిగాలి బహు రౌద్రముచేత బైలు
వెళ్లెను; అది మిక్కిలీ చెడ్డ సుడిగాలి; దుష్టుల శిరస్సుల
మీద అది బరువుగా పడును. । యెహోవా కోపాగ్ని 20
తన హృదయపు యోచనలను ఆయన నెరవేర్చి, సమ
కూర్చేపర్యంతమూ తిరిగీ రాక వుండును; అంత్య దిన
ములందు మీరు దీని విచారించి బాగా తెలుసు
కొందురు. । ఆ దీర్ఘదర్శులను నేను పంపలేదు, అయి 21
నప్పటికిన్ని వారు పరుగెత్తి వచ్చిరి; వారికి నేను సెలవు
యివ్వలేదు; అయినప్పటికిన్ని వారు భవిష్యత్తుగా పలి
కిరి. । అయితే వారు నా ఆలోచన యందు దృఢముగా 22
నిలిచి, నా వాక్యములను నా జనులకు వినిపించినట్ట
యితే అప్పుడు వారు తమ దుష్ట మార్గములోనుం
చిన్ని తమ క్రియలయొక్క కీడునుంచిన్ని తిరుగుదు
రు. । నేను దగ్గిరగా వున్న దేవుడను మాత్రమేనా, 23
దూరముగా వున్న దేవుడనున్ను కానా? అనిన్ని, ।
నాకు మరుగుగా వుండేలాగు రహస్య స్థలములయందు 24
దాగి వుండగలవాడు యెవడనిన్ని, నేను భూమ్యాకా
శములను నింపిన వాడను కానా అనిన్ని, యెహో
వా అడిగెను. । దీర్ఘదర్శులు పలికినదంతా నేను 25
వింటిని; నా నామమందు వారు అబద్ధపు మాటలను
భవిష్యత్తుగా పలికి, నేను స్వప్నమును కంటినని స్వప్న
మును కంటినని అందురు. । అబద్ధములను భవిష్యత్తుగా 26
పలికిన వారి హృదయము యెన్నాళ్లు మట్టుకు యీ
లాగున వుండును? నిజముగా వారు తమ హృదయపు
మాయవల్ల దీర్ఘదర్శులై, । ప్రతివాడు తన స్వప్న 27
మును తన పొరుగు వానితో చెప్పి, వారి పితృలు బయ
లు కొరకు నా నామమును మరచి పోయినట్టు నా జను
లను కూడా నా నామమును మరచిపో చేసుటకు కోరి
వున్నారు. । యే దీర్ఘదర్శికి స్వప్నము వున్నదో 28
వాడు స్వప్నమును చెప్పనిమ్ము; నా వాక్యము యెవని
యొద్ద వున్నదో వాడు నా వాక్యమును నమ్మకముగా
పలుకనిమ్ము; గోధుమ గింజలను చూస్తే పొల్లు యెంత
గనుక అని యెహోవా ఆనతిచ్చెను. । నా వాక్యము 29
అగ్నివంటిది కాదా? శిలను బద్దలు గొట్టే సుత్తెవంటిది
కాదా? అని యెహోవా అడిగెను. । కాబట్టి యిదుగో 30
ప్రతివాడు తన పొరుగువాని యొద్దనుంచి నా వాక్య
ములను దొంగిలిన ఆ దీర్ఘదర్శులకు నేను విరో

31 ధిసై యున్నానని యెహోవా ఆనతిచ్చెను. । యిదు
గో ఆయన యీలాగున సెలవు యిచ్చెనని తమ నాలు
కలను నునుపు చేసుకొనిన దీర్ఘదర్శులకు నేను
విరోధినై యున్నానని యెహోవా ఆనతిచ్చెను. ।
32 యిదుగో అబద్ధపు స్వప్నములను ప్రకటించి, తమ
అబద్ధములచేతనున్ను మాయలచేతనున్ను నా జనులను
తప్పిపోయేటట్టు చేసిన వారికి నేను విరోధినై వున్నా
ను; యేమంటే వారు నావల్ల వచ్చిన వారు కారు; వారికి
నేను యే సెలవును అయినా యివ్వలేదు; కాబట్టి
వారివల్ల యీ జనులకు ప్రయోజనము యెంత మాత్ర
33 మూ వుండదని యెహోవా ఆనతిచ్చెను. । అయితే
యీ జనులైనా దీర్ఘదర్శియైనా అర్చకుడైనా నిన్ను
చూచి, యెహోవాయొక్క భారము యేమిటని అడి
గినప్పుడు, నీవు వారిని చూచి, యే భారమని అడుగు
ము; మిమ్మును నేను విడిచిపెట్టుదునని యెహోవా
34 ఆనతిచ్చెనని వారితో చెప్పవలసినది. । మరిన్ని యె
హోవాయొక్క భారమని పలికిన దీర్ఘదర్శియ
యినా అర్చకుడైనా జనమైనా వుంటే నేను ఆ మను
35 ష్యునిన్ని వాని యింటినిన్ని శిక్షింతును. । ప్రతి మను
ష్యుడు తన పొరుగువానినిన్ని తన సహోదరునిన్ని
చూచి, యెహోవా యే వుత్తరము యిచ్చెననిన్ని యె
36 హోవా యేమి పలికెననిన్ని అడగవలసినది, । గాని
యెహోవా భారముయొక్క సంగతి యికను యెత్త
కూడదు; యేమంటే ప్రతి మనుష్యుని మాటా వానికే
భారముగా వుండును; యేమంటే మీరు జీవము గల
దేవుని వాక్యములనున్ను మన దేవుడైన సైన్యముల యె
37 హోవా వాక్యములనున్ను అటు తిప్పితిరి. । మీరు
దీర్ఘదర్శిని చూచి, యెహోవా యే వుత్తరము యిచ్చె
ననిన్ని యెహోవా యేలాగు పలికెననిన్ని అడగ వల
38 సినది. । అయితే మీరు యెహోవాయొక్క భారము
అని అందురు గనుక యెహోవా ఆనతిచ్చేదేమంటే,
యెహోవాయొక్క భారము అని మీరు అనకూడదని
మీ యొద్దికి నేను వర్తమానమును పంపినప్పటికిన్ని
మీరు యెహోవాయొక్క భారము అని అంటూ
39 వున్నారు, । గనుక, యిదుగో నేను మిమ్మును బొత్తిగా
మరచిపోయి, మీ పితృలకున్ను మీకున్ను నేను యి
చ్చిన పట్టణమునున్ను మిమ్మునున్ను విడిచిపెట్టి, నా సము
40 ఖములోనుంచి మిమ్మును అవతలకు వెళ్లవేతును. । మరిన్ని
నేను మీ మీదికి అవమానమునున్ను సిగ్గునున్ను రప్పిం
తును; అది యెన్నటికీ మరుపును పొందదని యెహో
వా ఆనతిచ్చెను.

## 24. అధ్యాయము.

1 అయితే బాబెలు రాజయిన నెబూఖద్రెస్సరు
యూదా రాజున్ను యెహోయాకీము కుమారుడున్ను
అయిన యెఖొన్యానున్ను యూదా అధిపతులనున్ను
వడ్లవాండ్లనున్ను కంసాలులనున్ను చెరపట్టుకొని, యె
రూశలేమునుంచి బాబెలు దేశమునకు తీసుకొని పోయిన
తరువాత యెహోవా నాకు అగుపర్చినట్టు యిదుగో
రెండు అంజూరపు పండ్ల గంపలు యెహోవా గుడి
ముందర పెట్టపడెను. । వొక గంపలో ముందుగా ముది 2
రిన మంచి అంజూరపు పండ్లు వుండెను; రెండో గంప
లో తినుటకు శక్యము కానటువంటివిన్ని బొత్తిగా చెడి
పోయినటువంటివిన్ని అంజూరపు పండ్లు వుండెను. ।
అప్పుడు యెహోవా ఓ ఇర్మీయా, నీకు యేమి కను 3
బడెనని నన్ను అడగగా, అంజూరపు పండ్లు కనుబడి
నవి; యోగ్యమైన అంజూరపు పండ్లు మిక్కిలీ మం
చివి; అయితే చెడిపోయిన అంజూరపు పండ్లు తినుటకు
శక్యము కానివిన్ని చెడ్డవిన్ని అని నేను అనగా, ।
యెహోవా వాక్యము నా యొద్దికి తిరిగీ వచ్చెను, 4
యేలాగంటే, । ఇశ్రాయేలుకు దేవుడైన యెహోవా 5
ఆనతిస్తూ వున్నదేమంటే, యీ మంచి అంజూరపు
పండ్లు వలెనే యీ స్థలములోనుంచి నేను తమ మేలు
కొరకు కల్దీయుల దేశములోకి చెరగా కొంచబోయిన
యూదా వారిని అంగీకరింతును. । యేమంటే వారిని 6
నేను బహుగా కనికరించి, యీ దేశములోకి తిరిగీ
రప్పించి, కింద పడదోయక వారిని కట్టి, పెల్లగించక
వారిని నాటుదును. । మరిన్ని నేను యెహోవానై 7
వున్నానని నన్ను తెలుసుకొనే హృదయమును వారికి
యిత్తును; వారు నా జనమవుదురు; నేను వారికి దేవుడ
నవుదును; యేమంటే వారు తమ పూర్ణ హృదయ
ముతో నా తట్టు తిరుగుదురు. । అయితే తినుటకు 8
శక్యము కాని ఆ చెడ్డ అంజూరపు పండ్లు వలెనే నేను
యీ దేశమందు నిలిచి వున్నటువంటివిన్ని మిస్రయీము
దేశమందు నివసించినటువంటివిన్ని యూదా రాజైన
సిద్కియానున్ను వాని అధిపతులనున్ను యెరూశలే
ములో శేషించిన వారినిన్ని లోకమందుండే సకల
రాజ్యములలోకి కొంచుపోపడుటకు అప్పగించి, । యే 9
స్థలములకు నేను వారిని తోలివేతునో అక్కడ వారిని
అవమానము కొరకున్ను సామితె కొరకున్ను అపహాస్య
ము కొరకున్ను శాపము కొరకున్ను చేతును. । మరిన్ని 10
వారి పితృలకున్ను వారికిన్ని నేను యిచ్చిన దేశము
లోనుంచి వారు నశించిపోయే మట్టుకు కత్తినిన్ని క్షామ
మమునున్ను తెగులునున్ను వారిలోకి పంపుదునని యె
హోవా ఆనతిచ్చెను.

## 25. అధ్యాయము.

యూదా రాజున్ను యోషీయా కుమారుడున్ను 1
అయిన యెహోయాకీము యేలుబడి నాలుగో సంవ
త్సరము, అనగా, బాబెలు రాజైన నెబూఖద్రెస్సరు.

యేలుబడి మొదటి సంవత్సరమందు యూదా వారంద
రిని గురించి దీర్ఘదర్శియైన ఇర్మీయాకు వాక్యము
2 వచ్చెను. । ఆ వాక్యము ఇర్మీయా యూదా దేశస్థులం
దరికిన్ని యెరూశలేము కాపురస్తులందరికిన్ని తెలిపి
3 చెప్పినదేమంటే, । యూదా రాజైన ఆమోను కుమారు
డగు యోషీయాయొక్క యేలుబడి పదమూడో సం
వత్సరము మొదలుకొని నేటివరకు, అనగా, యిరువై
మూడో సంవత్సరమందు యెహోవా వాక్యము నా
యొద్దికి వచ్చినందున నేను మీతో వేగముగా లేచి
చెప్పుతూ వుంటిని: అయితే మీరు ఆలకించ లేదు. ।
4 మరిన్ని యెహోవా దీర్ఘదర్శులైన తన సేవకులను
వేగముగా లేచి పంపుతూ వున్నప్పటికిన్నీ మీరు ఆల
5 కించకనున్ను చెవి యొగ్గకనున్ను వుంటిరి.। వారు వచ్చి
మిమ్మును చూచి మీరందరున్ను మీ దుర్మార్గతను
విడిచి, మీ దుష్టక్రియలను మాని, యెహోవా మీ
పితృలకున్ను మీకున్ను యెప్పటికిన్ని యిచ్చిన దేశ
6 మందు కాపురము చేసి, । అన్య దేవుండ్లను వెంటాడక,
వారిని సేవించక, వారికి మ్రొక్కక, మరిన్ని మీరు
మీ చేతి కార్యముల చేత నాకు కోపమును పుట్టించ
కండి; అప్పుడు నేను మీకు యే కీడున్నైనా చేయక
7 వుందునని యెహోవా ఆనతిచ్చెనని చెప్పిరి. । అయితే
యిందుకు యెహోవా ఆనతిచ్చేదేమంటే, మీరు నా
వాక్యమును ఆలకించక, మీకు నష్టము వచ్చేలాగు
మీ చేతి కార్యములచేత నాకు కోపమును పుట్టించి
8 తిరి. । కాబట్టి సైన్యముల యెహోవా మరిన్ని ఆన
తిచ్చేదేమంటే, మీరు నా వాక్యములను వినక పోతిరి
9 గనుక, । యిదుగో నేను నా సేవకుడున్ను బాబెలు రా
జున్ను అయిన నెబూఖద్రెస్సరునున్ను వుత్తర దేశమం
దున్న సకల కుటుంబములనున్ను పిలువనంపించి, యీ
దేశము మీదికిన్ని చుట్టూ వున్న జనాంగములన్నిటి
మీదికిన్ని రప్పించి, వారిని బొత్తిగా నాశనముచేసి,
వారిని విభ్రాంతికిన్ని నిందకున్ను హేతువుగానున్ను
10 బొత్తిగా పాడయ్యేటట్టుగానున్ను చేతును. । మరిన్ని
వారి యొద్దనుంచి నేను సంభ్రమపు శబ్దమునున్ను సం
తోషపు శబ్దమునున్ను పెండ్లి కుమారుని శబ్దమునున్ను
పెండ్లి కుమార్తె శబ్దమునున్ను తిరగళ్ల ధ్వనినిన్ని దీప
11 ముయొక్క వెలుగునున్ను పోయేటట్టు చేతును.। యీ
దేశమంతా ఆశ్చర్యముగా పాడై పోవును; మరిన్ని
యీ జనాంగములు డెబ్బై సంవత్సరములు బాబెలు
12 రాజుకు సేవ చేతురు. । అయితే ఆ డెబ్బై సంవత్సర
ములు అయిన తరువాత నేను బాబెలు రాజునున్ను
ఆ జనాంగమునున్ను కల్దీయుల దేశమున్ను వారి దో
షము నిమిత్తము శిక్షించి, యెప్పటికిన్ని పాడు చేతు
13 నని యెహోవా ఆనతిచ్చెను. । మరిన్ని ఆ దేశము
మీద నేను విధించిన సమస్తమైన ఆజ్ఞలను ఆ జనాం
గములన్నిటికీ ఇర్మీయా చేత భవిష్యత్తుగా చెప్పించి,
యీ గ్రంథమందు వ్రాసిన మాటలన్నిన్ని వాటి మీ
దికి రప్పింతును.। యేమంటే చాలా జనాంగములున్ను 14
గొప్ప రాజులున్ను వారిచేత కొలువు చేయించుకొం
దురు; యీలాగున నేను వారి క్రియల ప్రకారము
గానున్ను వారి నడతల ప్రకారముగానున్ను వారికి
ప్రతిగా యిత్తునని ఆనతిచ్చెను. । మరిన్ని యిందుకు 15
ఇశ్రాయేలుకు దేవుడైన యెహోవా నాతో సెలవు
యిచ్చినదేమంటే, నా చేతులలోనుంచి నీవు యీ
వుగ్రపాత్రను తీసుకొని, యే జనాంగముల యొద్దికి
నేను నిన్ను పంపుదునో వారిని దానిలోది తాగిం
చుము. । యేమంటే వారు తాగి వణుకుతున్నప్పుడు 16
వారిలోకి నేను పంపిన కత్తి నిమిత్తము వారికి వెర్రి యె
క్కునని సెలవు యివ్వగా, । నేను యెహోవా చేతి 17
లోనుంచి ఆ పాత్రను పుచ్చుకొని, యే జనాంగముల
యొద్దికి యెహోవా నన్ను పంపెనో వారిని, । అన 18
గా, యెరూశలేమునున్ను యూదా దేశపు పట్టణముల
నున్ను వాటి రాజులనున్ను వాటి అధిపతులనున్ను యీ
రోజునైనట్టు పాడు కొరకున్ను ఆశ్చర్యము కొరకున్ను
నింద కొరకున్ను శాపము కొరకున్ను వుండేటట్టు నేను
తాగిస్తిని. । మరిన్ని మిస్రయీము రాజైన ఫరోనున్ను, 19
వాని సేవకులనున్ను, వాని అధిపతులనున్ను, వాని
జనులనందరినిన్ని, । మరిన్ని మిళితమైన జనాంగముల 20
నున్ను, ఊస్సు దేశపు రాజులనున్ను ఫెలిష్తీయుల దేశపు
రాజులనందరినిన్ని, అష్కెలోను వారినిన్ని, అజ్జా
వారినిన్ని, ఎక్రోను వారినిన్ని, అష్దోదులో శేషించిన
వారినిన్ని, । ఎదోమీయులనున్ను; మోయాబీయులను 21
న్ను, అమ్మోను పుత్రులనున్ను; । మరిన్ని సోరు రాజుల 22
నందరినిన్ని, సీదోను రాజులనందరినిన్ని, సముద్ర తీర
మందుండే రాజులనున్ను, । దెదాను వారినిన్ని, తేమా 23
వారినిన్ని, బూజవారినిన్ని, నడినెత్తులను గొరిగించు
కొనిన వార నందరినిన్ని, । అరబి దేశపు వారినందరిని 24
న్ని, అరణ్యమందు నివసించిన వారితో మిళితమైన
జనాంగముల రాజులనందరినిన్ని, । జిమ్రీ రాజులనం 25
దరినిన్ని, ఏలాము రాజులనందరినిన్ని, మాదీయుల
రాజులనందరినిన్ని, । సమీపముగానున్ను దూరముగా 26
నున్ను వున్న వుత్తర దేశపు రాజులనందరినిన్ని, భూ
ముఖము మీద వున్న రాజ్యములనన్నిటినిన్ని, నేను
దానిలోది తాగిస్తిని; అయితే వారి తరువాత షెషఖు
రాజు తాగును. । యిందుకు నీవు వారితో చెప్పవలసిన 27
దేమంటే, ఇశ్రాయేలుకు దేవుడైన సైన్యముల యెహో
వా ఆనతిచ్చిన లాగు, మీరు తాగి, మత్తిల్లి, కక్కు
కొని, నేను మీలోకి పంపించబోయే కత్తిచేత తిరిగీ

28 లేవకుండా కూలుడని చెప్పుము. । అయితే తాగుటకు
నీ చేతిలోనుంచి పాత్రను పుచ్చుకోము అని వారు
చెప్పితే, అప్పుడు నీవు అవశ్యముగా మీరు తాగు
దురు; యెందుకంటే సైన్యముల యెహోవా నిర్ణ
29 యించెనని వారితో చెప్పవలెను. । యేమంటే, యిదు
గో, నేను నా నామముచేత పిలువబడిన పట్టణము
మీదికి కీడును తెప్పించగా మీరు శిక్షను తప్పించి
కొందురా? నిజముగా మీరు శిక్షను తప్పించుకోలేరు;
యేమంటే భూమియొక్క కాపురస్తులందరి మీదికి
నేను కత్తిని పిలువనంపింతునని సైన్యముల యెహో
30 వా ఆనతిచ్చెను. । కాబట్టి నీవు యీ వాక్యములనన్ని
టినీ వారికి విరోధముగా భవిష్యత్తుగా పలికి, యె
హోవా పైనుంచి ఆర్చును, తన పరిశుద్ధమైన కాపు
రమునుంచి తన శబ్దమును వినుపించును, తన కాపురము
మీద ఆయన మహిమగల శబ్దముతోటి ఆర్చును,
భూమి కాపురస్తులందరి మీదికి ద్రాక్ష గానుగను
త్రొక్కిన వారి ఆర్పువలె ఆయన ఆర్చును, అని
31 వారితో చెప్పుము. । లోకపు సరిహద్దుల మట్టుకు ఆ
ధ్వని వినబడును; యేమంటే జనాంగములతోటి యె
హోవాకు వ్యాజ్యము కలిగెను; సమస్తమైన నరుల
తోటి ఆయన వ్యాజ్యమాడి, దుర్జనులను కత్తికి అప్ప
32 గింతునని యెహోవా ఆనతిచ్చెను. । మరిన్ని సైన్య
ముల యెహోవా ఆనతిచ్చేదేమంటే, యిదుగో కీడు
యీ జనాంగము పైనుంచి ఆ జనాంగము మీదికి
బైలు వెళ్లును; భూమి సరిహద్దులలోనుంచి గొప్ప సుడి
33 గాలి పుట్టును. । అయినందున భూమియొక్క యీ
సరిహద్దు మొదలుకొని ఆ సరిహద్దు పర్యంతమూ యె
హోవా చేత హతమాదురు; వారి నిమిత్తము మూల్గుట
లేక వుండును; వారు కూర్చబడకనున్ను పాతిపెట్ట
బడకనున్ను భూమి మీద పెంట వలె వుందురు. ।
34 మంద కాపరులారా, రోదన శబ్దము చేయండి; మంద
లో శ్రేష్ఠులైన వారలారా, బూడిదెలో పొర్లండి;
యేమంటే మిమ్మును చెదరచేసి హతము చేసే దినములు
సమీపమైనందున కోరదగిన ఘటమైనట్టు మీరు కూ
35 లుదురు. । మంద కాపరులు పారిపోవుటకున్ను మంద
లో శ్రేష్ఠులైన వారు తప్పించుకొనుటకున్ను మార్గము
36 కనుపడక వుండును. । బోయల రోదన శబ్దమున్ను మం
దలో శ్రేష్ఠమైన వారి ఆర్పున్ను వినబడును; యేమంటే
యెహోవా వారు మేసే స్థలములను పాడు చేసును. ।
37 మరిన్ని యెహోవా కోపాగ్నిచేత వారి ఆనందమైన
38 కాపురములు తెగవేయబడును. । వాడు సింహము వలె
తన మాటును విడిచెను; కాబట్టి బాధ పెట్టేవాని
రౌద్రము చేతనున్ను వాని కోపాగ్ని చేతనున్ను వారి
దేశము పాడై పోయెను.

## 26. అధ్యాయము.

మరిన్ని యూదా దేశపు రాజయిన యోషీయా 1
కుమారుడగు యెహోయాకీము యేలుబడి ఆరంభిం
చినప్పుడు యెహోవా యొద్దనుంచి యీ వాక్యము
వచ్చెను. । యేమంటే, యెహోవా చెప్పినదేమంటే, 2
నీవు యెహోవా మందిర శాల యందు నిలిచి, యె
హోవా మందిరమందు మ్రొక్కుటకు వచ్చే యూదా
దేశపు పట్టణముల వారందరితో నీకు నేను ఆజ్ఞాపించే
మాటలన్నిన్ని ఒకటైనా తప్పక చెప్పవలసినది. । వారు 3
ఆలకించి, ప్రతివాడు తన తన దుర్మార్గతను విడి
చెనట్టాయెనా, ఆ పక్షమందు నేను వారి దుష్టక్రియల
నిమిత్తము వారికి చేయ తలంచిన కీడును గురించి చింత
పడుదును. । కాబట్టి నీవు యెహోవా ఆనతిచ్చినట్టు 4
వారితో చెప్పవలసినదేమంటే, మీరు ఆలకించక, మీకు
నేను అగుపర్చిన యీ న్యాయప్రమాణము చొప్పున
నడువక, । నేను వేగముగా మీ యొద్దికి పంపిన నా 5
సేవకులైన దీర్ఘదర్శులు వాక్యములను మీరు ఆల
కించక వున్నట్టయితే, । నేను యీ మందిరమును షీలో 6
వలెనున్ను యీ పట్టణమును భూమియందుండే సకల
జనాంగముల ముందర శాపము పొందేటట్టున్ను చేతు
నని ఆనతిచ్చెను. । ఆలాగు యెహోవా మందిరమందు 7
ఇర్మీయా యీ మాటలను చెప్పుట అర్చకులున్ను
దీర్ఘదర్శులున్ను జనులందరున్ను వినిరి. । అయితే 8
జనులందరితో చెప్పుమని యెహోవా ఇర్మీయాకు
ఆజ్ఞాపించినవి యావత్తున్ను అతడు చెప్పి ముగించిన
తరువాత అర్చకులున్ను దీర్ఘదర్శులున్ను జను
లందరున్ను అతని పట్టుకొని, అతనితో నీవు అవశ్య
ముగా చత్తువు. । యీ మందిరము షీలో వలె వుండు 9
ననిన్ని యీ పట్టణము నిర్మనుష్యముగా పాడయిపో
వుననిన్ని యెహోవా నామమందు నీవు భవిష్య
త్తుగా పలికెదవేమని అడిగిరి. యీలాగున జనులం
దరున్ను యెహోవా మందిరమందు ఇర్మీయా మీ
దికి కూడి వచ్చిరి. । మరిన్ని యీ సంగతులను యూ 10
దా దేశపు అధిపతులు వినినప్పుడు వారు రాజు మం
దిరమునుంచి యెహోవా మందిరమునకు వచ్చి, యె
హోవా మందిరపు కొత్త ద్వారమందు కూర్చొని
వుండగా, । అర్చకులున్ను దీర్ఘదర్శులున్ను అధి 11
పతులతోనున్ను జనులందరితోనున్ను అన్నమాట, వీడు
మరణమునకు పాత్రుడు, యెందుకంటే మీ చెవు
లకు వినబడినట్టు యీ పట్టణము మీద విరోధముగా
భవిష్యత్తు పలికెను అని చెప్పిరి. । అప్పుడు ఇర్మీయా 12
అధిపతులందరితోనున్ను జనులందరితోనున్ను చెప్పిన
దేమంటే, మీకు వినబడిన మాటలన్ని యీ మందిర

మును గురించిన్ని యీ పట్టణమును గురించిన్ని భవి
ష్యత్తుగా పలుకుటకు యెహోవా నన్ను పంపెను.।
13 కాబట్టి యిప్పుడు మీరు మీ మార్గములనున్ను మీ
కార్యములనున్ను చక్కపరచుకొని, మీ దేవుడైన యె
హోవా వాక్యమును విని దానికి లోపడండి, అప్పుడు
యెహోవా మీ మీద విధించిన కీడును గురించి చింత
14 పడును.। నేను మీకు వశుడనై వున్నాను; మీకు అను
15 కూలమైనట్టు నాకు చేయండి;। అయితే మీరు అవశ్య
ముగా తెలుసుకోవలసినది వొకటి వున్నది, అదేదంటే,
మీరు నన్ను చంపితే అవశ్యముగా మీరు మీ శిరస్సుల
మీదికిన్ని యీ పట్టణము మీదికిన్ని దాని కాపురస్థు
లందరి మీదికిన్ని నిరపరాధినైన నా రక్తదోషమును
తెచ్చుకొందురు; యేమంటే యెహోవా మీ చెవుల
లో యీ మాటలన్ని వినిపించుటకు నిజముగా నన్ను
16 పంపెనని చెప్పగా,। అధిపతులున్ను జనులందరున్ను
అర్చకులతోనున్ను దీర్ఘదర్శులతోనున్ను అనిన
మాట, యితడు మన దేవుడైన యెహోవా నామమం
దు మనతో పలికెను గనుక మరణమునకు పాత్రుడు
17 కాడు అనిరి.। అప్పుడు దేశపు పెద్దలలో కొందరు
18 లేచి, సమస్తమైన సంఘముతో చెప్పినదేమంటే,।యూ
దా దేశపు రాజైన హిజ్కియా దినములందు మోరష్తీ
యుడైన మీఖా వచ్చి, సీయోను పొలము వలె దున్న
పడును, యెరూశలేము పట్టణము పాడు దిబ్బలు కలది
యౌను, మందిరముయొక్క కొండ అరణ్యపు పాడు
గైన స్థలముల వలె అవునని సైన్యముల యెహోవా
19 ఆనతిచ్చెనని చెప్పినప్పటికిన్నీ,। యూదా దేశపు రా
జైన హిజ్కియా అయినా యూదా వారైనా వానిని
యెప్పుడైనా చంపినారా? వాడు యెహోవాయందు
భయభక్తులు గలిగి యెహోవాను వేడుకొన్నందున
యెహోవా వారి మీద విధించిన కీడును గురించి చింత
పడెను. కాబట్టి మనము యితనికి యేమైనా చేసితే
మన మీదికి బహు దోషము తెచ్చుకొందుమని చెప్పిరి.।
20 అయితే కిర్యత్యేహారీము వూరివాడైన షెమయా కు
మారుడైన ఊరీయా అనే వొక దీర్ఘదర్శి కలడు;
వాడు ఇర్మీయాయొక్క మాటలన్నిటి ప్రకారము యీ
పట్టణమును గురించిన్ని యీ దేశమును గురించిన్ని
21 భవిష్యత్తుగా పలికెను.। అయితే రాజయిన యెహో
యాకీమున్ను వాని పరాక్రమశాలులున్ను వాని కింద
వున్న అధిపతులున్ను వాని మాటలను వినినప్పుడు ఆ
రాజు వానిని చంప వెతికెను, అయితే ఊరీయా అది
విని జడిసి పారిపోయి, మిస్రయీము దేశమునకు వెళ్లి
22 పోయెను.। రాజైన యెహోయాకీము అక్బోరు కుమా
రుడైన ఏల్నాతానునున్ను అతనితోను మరికొందరినిన్ని
23 మిశ్రయీము దేశములోకి పంపెను.। వారు మిస్ర
యీము దేశములోనుంచి ఊరీయాను రాజైన యెహో
యాకీము యొద్దికి కొంచు వచ్చిరి; వీడు వానిని కత్తి
చేత చంపించి, వాని కళేబరమును సాధారణ జనుల
సమాధులలో వేయించెను.। అయినప్పటికిన్ని షాఫాను 24
కుమారుడైన అహీకాముయొక్క చెయ్యి ఇర్మీయాకు
తోడుగా వున్నందున వారు వానిని చంపుటకు జనుల
చేతులకు అప్పగించలేదు.

## 27. అధ్యాయము.

యూదా దేశపు రాజైన యోషీయా కుమారుడగు 1
యెహోయాకీము యేల నారంభించినప్పుడు యెహో
వా యొద్దనుంచి ఇర్మీయా యొద్దికి వాక్యము వచ్చి,
యెహోవా ఆనతిచ్చినట్టు నాతో చెప్పినదేమంటే,।
నీవు తాళ్లతోటి కాడి కర్రలను చేయించి, నీ మెడ 2
మీద పెట్టుకొని,। వాటిని యూదా దేశపు రాజైన 3
సిద్కియా యొద్దికి యెరూశలేముకు వచ్చిన దూతలచేత
ఎదోము రాజు యొద్దికిన్ని మోయాబు రాజు యొద్ది
కిన్ని అమ్మోనీయుల రాజు యొద్దికిన్ని సోరు రాజుయొ
ద్దికిన్ని సీదోనీయుల రాజు యొద్దికిన్ని పంపి,। వారి 4
యజమానులతో చెప్పుమని ఆజ్ఞాపించ వలసినదేమం
టే, ఇశ్రాయేలుకు దేవుడైన సైన్యముల యెహోవా
ఆనతిచ్చినట్టు మీరు మీ యజమానులతో చెప్పవలసి
నది యేమంటే,। నేను నా మాహాత్మ్యము చేతనున్ను 5
నా చాచిన హస్తము చేతనున్ను భూమినిన్ని భూమి
యందుండే మనుష్యునిన్ని మృగమునున్ను కలుగచేసి,
నాకు అనుకూలమైన వారికి వాటిని యిస్తిని.। అయితే 6
యిప్పుడు నేను యీ దేశములన్నిన్ని నా సేవకుడున్ను
బాబెలు రాజునైన నెబూఖద్నెస్సరుయొక్క చేతికి
అప్పగిస్తిని; మరిన్ని భూ పశువులను వానికి కొలువు చే
యిస్తిని.। కాబట్టి సకల జనాంగములు వాని దేశము 7
నకు నిర్ణయమైన కాలము సరిపడే మట్టుకు వాని
కిన్ని వాని కుమారునికిన్ని వాని కుమారుని కుమారుని
కిన్ని కొలువు చేతురు; అటుతరువాత అనేకమయిన
జనాంగములున్ను గొప్ప రాజులున్ను వానిచేత కొలువు
చేయించుకోబడుదురు.। అయితే బాబెలు రాజయిన 8
నెబూఖద్నెస్సరు కొలువు చేయుటకున్ను బాబెలు
రాజుయొక్క కాడి తమ మెడమీద వుంచుకొనుట
కున్ను మనస్సులేని జనమైనా రాజ్యమైనా వుంటే
ఆ జనాంగము అతనిచేత నాశనమయ్యే మట్టుకు
నేనే వారిని కత్తివల్లనున్ను క్షామమువల్లనున్ను తెగులు
వల్లనున్ను శిక్షింతును.।కాబట్టి బాబెలు రాజుకు మీరు 9
కొలువు చేసేది లేదన్నట్టుగా చెప్పిన మీ దీర్ఘదర్శు
లకున్ను మీ ప్రశ్న చూచే వారికిన్ని మీ స్వప్నమును
కనేవారికిన్ని మీ మాయావాదులకున్ను మీ చిల్లంగుల

10 కున్ను చెవి యివ్వకండి. । యేమంటే వీరు మీ దేశము
లోనుంచి మీరు పరిహరించ బడేటట్టుగానున్ను నేను
మిమ్మును అవతలకు వెళ్లవేసేటట్టుగానున్ను మీరు నశిం
11 చేటట్టుగానున్ను అబద్ధపు భవిష్యత్తు పలికిరి. । అయితే
బాబెలు రాజు కాడి కింద తమ మెడను వుంచుకొని,
వానికి కొలువుచేసిన జనాంగములను నేను వారి స్వదేశ
ములలో వుండనిత్తును; వారు దాని యందు కాపురము
చేసి, దానిని సేద్యపరుతురని యెహోవా ఆనతిచ్చెనని
12 వర్తమానమును పంపుమని సెలవు యిచ్చెను. । అయితే
నేను ఆ మాటలన్నిటి ప్రకారము యూదా రాజైన
సిద్కియాతో చెప్పినదేమంటే, మీ మెడలను బాబెలు
రాజు కాడి కింద మీరు వుంచి, వానికిన్ని వాని జనుల
13 కున్ను కొలువుచేసి బ్రతుకండి. । బాబెలు రాజుకింద కొ
లువు చేయుటకు మనస్సులేని జనాంగములను గురించి
యెహోవా ఆనతిచ్చినట్టు నీవున్ను నీ జనులున్ను
కత్తిచేతనున్ను క్షామముచేతనున్ను తెగులుచేతనున్ను మ
14 రణము కానేల! । కాబట్టి బాబెలు రాజుకు మీరు కొ
లువు చేసేది లేదన్నట్టు మీతోటి చెప్పిన దీర్ఘదర్శుల
మాటలను ఆలకించకండి; యేమంటే వారు మీతో అబ
15 ద్ధపు భవిష్యత్తు పలుకుతూ వున్నారు. । యిందుకు యె
హోవా ఆనతిచ్చేదేమంటే, వారిని నేను పంపలేదు,
అయినప్పటికిన్ని వారు వచ్చి నేను మిమ్మును అవతలకు
వెళ్లవేసి, మీరున్ను మీకు భవిష్యత్తుగా చెప్పిన దీర్ఘ
దర్శులున్ను పాడై పోయేటట్టు నా నామమందు అబ
ద్ధపు భవిష్యత్తును పలుకుతూ వుండిరని ఆనతిచ్చెనని
16 చెప్పితిని. । మరిన్ని యెహోవా ఆనతిచ్చినట్టు నేను
అర్చకులతోటిన్ని యీ జనులందరితోటిన్ని చెప్పిన
దేమంటే, యిదుగో యెహోవా మందిరపు వస్తువులు
వేగముగా బాబెలునుంచి తిరిగీ తేబడునని మీకు భవి
ష్యత్తుగా చెప్పిన దీర్ఘదర్శుల మాటలను ఆలకించకండి;
యేమంటే వారు మీతో అబద్ధపు భవిష్యత్తు పలుకుతూ
17 వున్నారు. । వారి మాటలను ఆలకించకండి; బాబెలు
రాజుకు కొలువు చేసి బ్రతుకండి; యీ పట్టణము పా
18 డైపోనేల! । వారు నిజముగా దీర్ఘదర్శులైతే, వారితో
యెహోవా వాక్యము వుంటే, యెహోవా మందిర
ములోనున్ను యూదా రాజు మందిరములోనున్ను యె
రూశలేములోనున్ను శేషించిన వస్తువులు బాబెలుకు
వెళ్లకుండా సైన్యముల యెహోవాను మీ కొరకు వారు
19 బతిమాలవలసినది. । యేమంటే యూదా రాజయిన యె
హోయాకీము కుమారుడగు యెఖొన్యానున్ను యూ
దా దేశపు శ్రేష్ఠులనున్ను యెరూశలేము పట్టణపు
శ్రేష్ఠులనున్ను బాబెలు రాజైన నెబూఖద్నెస్సరు యె
రూశలేములోనుంచి బాబెలుకు చెరగా కొంచుబో
20 యినప్పుడు, । కొంచుపో బడనటువంటి స్తంభములను
గురించిన్ని, సముద్రమును గురించిన్ని, మట్లను గురిం
చిన్ని, యీ పట్టణమందు శేషించిన వస్తువులను గురిం
చిన్ని, । యెహోవా మందిరమందున్న యూదా 21
యొక్కయున్ను యెరూశలేముయొక్కయున్ను రాజుల
మందిరమందున్ను వున్న వస్తువులను గురించిన్ని ఇశ్రా
యేలుకు దేవుడైన సైన్యముల యెహోవా ఆనతిచ్చే
దేమంటే, । అవి బాబెలుకు కొంచుపోపడును; మరిన్ని 22
నేను బాబెలు వారి విచారణచేసే దినము పర్యంతమూ
అవి అక్కడ వుండును; అప్పుడు నేను వాటిని తెప్పించి
యీ స్థలమందు తిరిగీ వుంతునని ఆనతిచ్చెనని చెప్పితిని.

## 28. అధ్యాయము.

అయితే ఆ సంవత్సరమందే, అనగా, యూదా 1
రాజైన సిద్కియా యేలుబడి నాలుగో సంవత్సరము
అయిదో నెలలో గిబోను వూరి దీర్ఘదర్శియైన
అజ్జూరు కుమారుడగు హనన్యా యెహోవా మంది
రమందు జనులందరి యొక్కయున్ను అర్చకులయొ
క్కయున్ను సముఖమందు నాతో చెప్పినదేమంటే, ।
ఇశ్రాయేలుకు దేవుడైన సైన్యముల యెహోవా ఆన 2
తిచ్చేలాగు, బాబెలు రాజు పెట్టిన కాడిని నేను విరి
చితిని. । యింకా రెండు సంవత్సరములు నిండక మును 3
పు నేను బాబెలు రాజైన నెబూఖద్నెస్సరు యీ స్థల
మునుంచి బాబెలుకు తీసుకు పోయిన యెహోవా
మందిరపు వస్తువులన్నిటినీ యీ స్థలమునకు తిరిగీ
రప్పింతును. । మరిన్ని యూదా రాజైన యెహోయా 4
కీము కుమారుడైన యెఖొన్యానున్ను బాబెలుకు చెర
గా వెళ్లి పోయిన యూదా వారినందరినిన్ని యీ స్థల
మునకు తిరిగీ రప్పింతును; యేమంటే నేను బాబెలు
రాజు పెట్టిన కాడిని విరుచుతున్నానని యెహోవా
ఆనతిచ్చెనని చెప్పగా, । దీర్ఘదర్శియైన ఇర్మీయా 5
అర్చకుల ముందరనున్ను యెహోవా మందిరమందు
నిలిచి వున్న జనులందరి ముందరనున్ను దీర్ఘదర్శి
యైన హనన్యాతో అనిన మాట, । యెహోవా ఆలా 6
గున చేసును గాక; నీవు భవిష్యత్తుగా పలికిన మాట
లను యెహోవా నెరవేర్చి, యెహోవా మందిరపు
వస్తువులనున్ను చెరలోకి యెత్తుకు పోబడిన సమస్తము
నున్ను బాబెలునుంచి యీ స్థలమునకు తిరిగీ రప్పించు
ను గాక. । అయినప్పటికిన్ని నీ చెవులలోనున్ను జను 7
లందరియొక్క చెవులలోనున్ను నేను చెప్పబోయే మా
టను నీవు వినుము. । ఆదిని నీ ముందరనున్ను నా ముం 8
దరనున్ను వున్న దీర్ఘదర్శులు చాలా దేశముల మీద
యుద్ధమును గురించిన్ని కీడును గురించిన్ని తెగులును
గురించిన్ని భవిష్యత్తుగా పలికిరి. । క్షేమమును గురించి 9
భవిష్యత్తుగా పలికిన దీర్ఘదర్శి మాట సంభవించితే

అప్పుడు ఆ దీర్ఘదర్శి యెహోవావల్ల నిజముగా
వచ్చెనని తెలియపడునని దీర్ఘదర్శియైన ఇర్మీయా
10 చెప్పినప్పుడు, । దీర్ఘదర్శియైన హనన్యా దీర్ఘద
ర్శియైన ఇర్మీయా మెడ మీదను వున్న కాడిని తీసి
11 విరిచి, జనులందరి ముందర చెప్పినదేమంటే, । యీలా
గున నేను యింకా రెండు సంవత్సరములు నిండక ము
నుపు సకల జనాంగముల మెడ మీద బాబెలు రాజైన
నెబూకద్నెస్సరు పెట్టిన కాడిని తీసి విరిచి వేతునని
యెహోవా ఆనతిచ్చెనని చెప్పెను. అప్పుడు దీర్ఘ
దర్శియైన ఇర్మీయా తన మార్గమున వెళ్లి పోయెను.।
12 అయితే దీర్ఘదర్శియైన హనన్యా దీర్ఘదర్శియైన
ఇర్మీయా మెడ మీద కాడిని తీసి విరిచిన వెనుక యె
హోవా వాక్యము ఇర్మీయా యొద్దికి వచ్చి చెప్పినదే
13 మంటే, । నీవు హనన్యా యొద్దికి వెళ్లి, వానిని చూచి,
యెహోవా ఆనతిచ్చినట్టు చెప్పవలసినదేమంటే, నీవు
కర్ర కాడ్లను విరిచితివి, అయితే నేను వాటిని మారు
14 గా యినుప కాడ్లను చేయించ వలసినది. । యేమంటే
యిందుకు ఇశ్రాయేలుకు దేవుడయిన సైన్యముల యె
హోవా ఆనతిచ్చేదేమంటే, యీ జనాంగములన్నిన్ని
బాబెలు రాజైన నెబూకద్నెస్సరు కొలువు చేసే
టట్టు వారి మెడ మీదను యినుప కాడిని పెట్టితిని;
కాబట్టి వారు వాని కొలువు చేతురు; మరిన్ని భూ
పశువులను నేను వానికి యిస్తినని చెప్పుమన్న సెలవు
15 యిచ్చెను. । కాబట్టి దీర్ఘదర్శియైన ఇర్మీయా దీర్ఘ
దర్శియైన హనన్యా యొద్దికి వచ్చి, ఓ హనన్యా,
యెహోవా నిన్ను పంపలేదు; యీ జనులను అబద్ధ
16 మును నమ్మేటట్టు చేస్తివి. । కాబట్టి యెహోవా వాక్య
మును వినుము, అది యేమంటే, నీవు యెహోవాకు
విరోధముగా తిరుగుబాటు చేయ నేర్పితివి గనుక
నేను నిన్ను భూ ముఖము మీదనుంచి తీసివేతును;
యీ సంవత్సరమందే నీవు మరణమాదువని ఆనతిచ్చె
17 నని అతనితో చెప్పెను. । కాబట్టి దీర్ఘదర్శియైన
హనన్యా ఆ సంవత్సరపు యేడో మాసమందు మరణ
మాయెను.

## 29. అధ్యాయము.

1 అయితే రాజైన యెఖొన్యాయున్ను రాణిన్ని
షండులున్ను యూదాయొక్క యెరూశలేముయొక్క
అధిపతులున్ను వడ్లవాండ్లున్ను కంసాలులున్ను యెరూ
2 శలేమునుంచి వెళ్లిన తరువాత, । దీర్ఘదర్శియైన ఇర్మీ
యా చెరలోకి కొంచుపోపడి, శేషించిన పెద్దలకున్ను
అర్చకులకున్ను దీర్ఘదర్శులకున్ను నెబూకద్నె
స్సరు యెరూశలేమునుంచి బాబెలుకు చెరగా తీసుకు
3 పోయిన జనులందరికిన్ని, । యూదా రాజైన సిద్కియా
బాబెలు రాజయిన నెబూకద్నెస్సరు యొద్దికి పంపిన
శాఫాను కుమారుడైన ఎలాశా చేతనున్ను హిల్కియా
కుమారుడైన గెమర్యా చేతనున్ను పంపిన వుత్తరము
యేమంటే, । ఇశ్రాయేలుకు దేవుడైన సైన్యముల యె 4
హోవా యెరూశలేమునుంచి బాబెలుకు తాను వెళ్ల
వేసి, చెరలో వుంచబడిన వారందరికీ ఆనతిచ్చేలాగు, ।
మీరు యిండ్లను కట్టుకొని, వాటి యందు కాపురము 5
చేయండి; తోటలను నాటి, వాటి ఫలములను అనుభ
వించండి; । భార్యలను వివాహము చేసుకొని కుమారు 6
లనున్ను కుమార్తెలనున్ను కనండి; అక్కడ మీరు
తక్కువగాక అభివృద్ధి పొందేటట్టు మీ కుమారుల
కొరకు భార్యలను చూడండి, మీ కుమార్తెలు కుమా
రులనున్ను కుమార్తెలనున్ను కనుటకు వారికి పెండ్లి
చేయండి. । మరిన్ని యే పట్టణమునకు నేను మిమ్మును 7
చెరగా కొంచుపో చేస్తినో ఆ పట్టణముయొక్క క్షే
మమును కోరి, దాని కొరకు యెహోవాను ప్రార్థన
చేయండి, యేమంటే దాని క్షేమమువల్ల మీరు క్షేమ
మును పొందుదురు. । యిందును గురించి ఇశ్రాయేలుకు 8
దేవుడైన సైన్యముల యెహోవా ఆనతిచ్చేదేమంటే,
మీలో వున్న దీర్ఘదర్శులనున్ను ప్రశ్న చూచే వారి
నిన్ని మిమ్మును భ్రమ పెట్టనివ్వకండి; స్వప్నమును గన
చేసే వారి స్వప్నపు మాటలను ఆలకించకండి. । యేమం 9
టే వారిని నేను పంప లేదు, అయినప్పటికిన్ని వారు
నా నామమందు అబద్ధముగా భవిష్యత్తును మీకు చెప్పు
దురు. । యెహోవా ఆనతిచ్చినలాగు, యేమంటే, మీరు 10
బాబెలులో డెబ్బై సంవత్సరములు వున్న తరువాత
నేను మిమ్మును కరుణించి, యీ స్థలమునకు తిరిగీ రప్పిం
చి, మీకు దయచేసిన వాగ్దత్తమును తీర్తును. । యేమంటే 11
మీ పట్ల నేను యోచించిన యోచనలు నాకు తెలిసి యు
న్నవి; అవి కీడైనవి కావు; మీ కోరికె నెరవేరేటట్టుగా
మంగళ ప్రదములై యున్నవి. । అప్పుడు మీరు నా 12
నామమును స్మరింతురు; మీరు వచ్చి నన్ను ప్రార్థిం
చినందున నేను మీ ప్రార్థనను ఆలకింతును. । మీరు 13
నన్ను వెతుకుదురు; మరిన్ని నన్ను మనస్ఫూర్తిగా
వెతికినప్పుడు నేను మీకు కనుపడుదును. । నిజముగా 14
నేను మీకు కనుబడి, నేను చెరలోనుంచి మిమ్మును
విడిపించి, యే జనాంగముల యొద్దికిన్ని యే స్థలముల
కున్ను నేను మిమ్మును వెళ్లవేస్తినో వాటిలోనుంచి
మిమ్మును కూర్చుకొని, యెక్కడనుంచి నేను మిమ్మును
చెరలోకి కొంచుపో చేస్తినో ఆ స్థలమునకు మిమ్మును
తిరిగీ రప్పింతునని యెహోవా ఆనతిచ్చెను. । అయితే 15
యెహోవా మా కొరకు బాబెలులో దీర్ఘదర్శు
లను లేవచేసెనని మీరు చెప్పుకొంటిరి. । కాబట్టి దా 16
వీదు గద్దె మీదను ఆసీనుడైన రాజును గురించిన్ని

యీ పట్టణమందు కాపురము వున్న జనులందరిని గురిం
చిన్ని మీతో కూడా చెరలోకి వెళ్లనటువంటి మీ
సహోదరులను గురించిన్ని సైన్యముల యెహోవా
17 ఆనతిచ్చేదేమంటే, । నేను వారి మీదికి కత్తినిన్ని క్షామ
మునున్ను తెగులునున్ను పంపి, తినుటకు అశక్యముగా
వున్న చెడ్డ అంజూరపు పండ్లకు సమముగా వారిని
18 అసహ్యపరుతును. । మరిన్ని నేను వారిని కత్తిచేతనున్ను
క్షామముచేతనున్ను తెగులుచేతనున్ను తరిమి, సమస్త
మైన భూ రాజ్యములలోకి వారిని కొంచుబోయేటట్టు
చేసి, యే జనాంగములలోకి నేను వారిని తోలివేతు
నో వాటి యందు వారిని శాపము కొరకున్ను ఆశ్చ
ర్యము కొరకున్ను నింద కొరకున్ను అవమానము కొర
19 కున్ను వుండచేతును. । యేమంటే వారి యొద్దికి దీర్ఘ
దర్శులైన నా సేవకులచేత నేను పంపిన వాక్యములను
వారు ఆలకించక వుండిరి; నేను వేగముగా లేచి పంపు
తూ వున్నప్పటికిన్నీ మీరు వాటిని వినలేదని యె
20 హోవా ఆనతిచ్చెను. । కాబట్టి యెరూశలేమునుంచి
నా చేత బాబెలుకు చెరగా పంపబడిన వారలారా,
21 సైన్యముల యెహోవా వాక్యమును వినండి. । నా
నామమందు మీతో అబద్ధపు భవిష్యత్తు పలికిన వారిని,
అనగా, కోలాయా కుమారుడైన ఆహాబును గురించిన్ని
మయశేయా కుమారుడైన సిద్కీయాను గురించిన్ని
ఇశ్రాయేలుకు దేవుడైన సైన్యముల యెహోవా ఆన
తిచ్చేదేమంటే, యిదుగో, నేను వారిని బాబెలు రాజైన
నెబూఖద్రెస్సరు చేతికి అప్పగించినందున అతడు వా
22 రిని మీ కన్నుల ముందర హతము చేసును. । మరిన్ని
బాబెలు యందు చెరలో వున్న వారందరున్ను వారిని
గురించి శాపమును యెత్తి, యెహోవా నిన్ను బాబెలు
రాజు అగ్నిలో కాల్చిన ఆహాబు వలెనున్ను సిద్కీయా
23 వలెనున్ను చేసును గాకని అందురు. । యేమంటే వారు
తమ పొరుగింటి వారి భార్యలతో వ్యభిచరించి, ఇశ్రా
యేలులో అవివేకపు పనిని జరిగించి, నేను ఆజ్ఞాపిం
చని అబద్ధపు మాటలను నా నామమందు పలికిరి; యిది
నాకు తెలిసి యున్నది; యిందుకు నేనే సాక్షినని యె
24 హోవా ఆనతిచ్చెను. । మరిన్ని ఇశ్రాయేలుకు దేవు
డైన సైన్యముల యెహోవా ఆనతిచ్చేదేమంటే, నీవు
నెహెలామీయుడైన షెమయాతో చెప్పవలసినదేమం
25 టే; । నీవు యెరూశలేములో వున్న జనులందరికిన్ని
అర్చకుడైన మయశేయా కుమారుడైన సెఫన్యాకున్ను
నా నామమందు వుత్తరములను పంపితివి గనుక అర్చ
కుడైన యెహోయాదాకు మారుగా యెహోవా
26 నిన్ను అర్చకునిగా నిర్ణయించెను; । కాబట్టి యె
హోవా మందిరములో అధికారులై మీలో యెవ
డైనా వెర్రివాడై తనకు తాను దీర్ఘదర్శిగా చేసు
కొంటే నీవు వానిని చెరసాలలోనున్ను బొండలోను
న్ను వుంచవలసినది. । కాబట్టి తనకు తాను మీ కొరకు 27
దీర్ఘదర్శిగా చేసుకొనిన ఆనాతోతు వూరి వాడైన
ఇర్మీయాను నీవు గద్దించక వుండెదవేమి! । యేమంటే 28
మీరు చాలా కాలము చెరలో వుందురు; కాబట్టి
మీరు యిండ్లను కట్టుకొని, వాటి యందు కాపురము
చేసి, తోటలను నాటి, వాటి ఫలములను అనుభవించం
డని చెప్పుమని బాబెలులో వున్న మాకు అతడు కబురు
పంపెను. । అప్పుడు అర్చకుడైన సెఫన్యా ఆ వుత్తర 29
మును దీర్ఘదర్శియైన ఇర్మీయా చెవులలో వినుపించెను. ।
కాబట్టి ఇర్మీయా యొద్దికి వచ్చిన యెహోవా వాక్య 30
ప్రకారము చెరలో వున్న వారందరికిన్ని పంపవలసిన
కబురు యేమంటే, । నెహెలామీయుడైన షెమయాను 31
గూర్చి యెహోవా ఆనతిచ్చిన వాక్యము నేను షెమ
యాను పంపకపోయినప్పటికిన్ని అతడు మీతో భవి
ష్యత్తుగా పలికి, మిమ్మును అబద్ధమును నమ్మచేసెను
గనుక యెహోవా ఆనతిచ్చేదేమంటే, । యిదుగో నేను 32
నెహెలామీయుడైన షెమయానున్ను అతని సంతతి
నిన్ని శిక్షింతును; యీ జనులలో కాపురము చేసుటకు
అతనికి వొకడున్ను లేకపోవుననిన్ని అతడు యెహో
వా మీద తిరుగుబాటు చేయ నేర్పెను గనుక నేను
నా జనులకు చేసే మేలును అతడు చూడకపోవున
నిన్ని యెహోవా ఆనతిచ్చెనని పంపుమన్న సెలవు
యిచ్చెను.

## 30. అధ్యాయము.

మరిన్ని ఇర్మీయాకు వచ్చిన యెహోవా వాక్య 1
ప్రకారము, ఇశ్రాయేలుకు దేవుడైన యెహోవా నీకు
యిచ్చిన సెలవు యేమంటే, । నేను నీతో చెప్పిన వాక్య 2
ములన్నిటినీ వొక గ్రంథమందు వ్రాయుము. । యెందు 3
కంటే, యిదుగో, దినములు వస్తూవున్నవి, అప్పుడు
చెరలో వున్న నా జనులయిన ఇశ్రాయేలీయులనున్ను
యూదా వారినిన్ని నేను తిరిగీ రప్పించి, వారి పితృ
లకు నేను యిచ్చిన దేశములోకి వారిని మళ్లించి, వారు
దానిని స్వతంత్రించుకొన చేతునని యెహోవా ఆన
తిచ్చెను. । మరిన్ని ఇశ్రాయేలీయులను గురించిన్ని 4
యూదా వారిని గురించిన్ని యెహోవా ఆనతిచ్చిన
వాక్యములు యేవంటే, । క్షేమముయొక్క శబ్దము కాదు 5
వణుకుయొక్కయున్ను భయముయొక్కయున్ను శబ్ద
ము మనకు వినబడెను. । పురుషుడు యెక్కడైనా ప్ర 6
సూతి వేదనను పొంది పిల్లను కనునేమో అది తెలుసు
కొండి; ప్రసూతి స్త్రీవలెనే ప్రతి పురుషుడున్ను తన
చేతులను నడుము మీద వుంచుకొనుటయున్ను సకల
ముఖములు తెల్లనౌటయున్ను నాకు కనుపడనేల; ।

7 అయ్యో! ఆ దినము బహు ఘోరమైనది; దానికి సమ
మైన దినము వొకటి లేదు; అది యాకోబుకు శ్రమ
కాలమైనప్పటికిన్ని అతడు దానినుంచి విడిపించబ
8 డును. । యిందుకు సైన్యముల యెహోవా ఆనతిచ్చేదే
మంటే, నేను ఆ దినమందు నీ మెడ మీద వాడు
పెట్టిన కాడిని విరిచి, నీ కట్లను తెంపివేతును; నీ చేత
9 అన్యులు యిక కొలువు చేయించుకోరు. । అయితే వారు
వారి దేవుడైన యెహోవానున్ను నేను వారి కొరకు
10 లేవచేసే రాజైన దావీదునున్ను సేవింతురు. । కాబట్టి
యెహోవా ఆనతిచ్చేదేమంటే, నా సేవకుడవైన వో
యాకోబూ, నీవు భయపడకుము; ఓ ఇశ్రాయేలా,
నీవు జడియకుము; యేమంటే యిదుగో దూరదేశము
నుంచి నిన్నున్ను వారు చెరగా వున్న దేశమునుంచి నీ
సంతతినిన్ని నేను విడిపింతును; యాకోబు తిరిగీ వచ్చి
నెమ్మదిగల స్థితిలో చల్లదనమును పొందును; వానిని బెది
11 రించుటకు వొకడున్ను లేకపోవును. । యేమంటే నిన్ను
రక్షించుటకు నేను నీకు తోడుగా వున్నానని యె
హోవా ఆనతిచ్చెను; నిన్ను నేను యే జనాంగముల
లోకి చెదరగొట్టితినో ఆ జనాంగములను నేను సర్వ
నాశనము చేసినప్పటికిన్ని నేను నిన్ను సర్వ నాశనము
చేయను; నిన్ను నిర్దోషిగా యెంచక కొద్దిగా నిన్ను
12 శిక్షింతును. । యిందుకు యెహోవా ఆనతిచ్చేదేమంటే,
13 నీ దెబ్బ స్వస్థతలేనిది; నీ గాయము చెడ్డది. । అది కట్ట
పడి నీవు బాగా వుండేటట్టు చేసే ప్రాపకుడు వొక
డూ లేడు; నీ యొద్ద స్వస్థపరచే ఔషధములు లేవు. ।
14 నీ స్నేహితులందరున్ను నిన్ను మరిచిరి; వారు నిన్ను
వెతుకలేదు; యేమంటే నీ పాపములు బహు విస్తా
రము గనుక అనేకమైన నీ అక్రమముల నిమిత్తము నేను
నిన్ను శత్రువుని గాయము లాగున నీకు గాయము
కలుగచేస్తిని; క్రూరుని దండన లాగున నిన్ను దండించి
15 తిని. । నీకు వచ్చిన బాధ నిమిత్తము నీవు యేడ్వనేల?
నీ అక్రమములు బహు నిస్తారము గనుక నీ దుఃఖము
నకు తెరవు లేదు; నీ పాపములు అనేకమై వున్నందు
16 చేత నేను నీకు యీలాగున చేస్తిని. । కాబట్టి నిన్ను
మింగిన వారందరున్ను మింగివేయపడుదురు; నీ విరో
ధులందరున్ను చెరలోకి వెళ్లుదురు; నిన్ను పాడుచేసిన
వారు పాడై పోదురు; నిన్ను దోచుకొన్న వారందరి
17 నిన్ని నేను దోపుడుకు అప్పగింతును. । వారు పరిహరిం
చబడినదానవనిన్ని యెవరూ విచారించని సీయోను
యిదే అనిన్ని నిన్ను గూర్చి వారు చెప్పిరి గనుక నేను
నిన్ను స్వస్థపరచి, నీ గాయములను మాన్పింతునని యె
18 హోవా ఆనతిచ్చెను. । మరిన్ని యెహోవా ఆనతిచ్చే
దేమంటే, యిదుగో, నేను చెరలో వున్న యాకోబు
డేరాలను తిరిగీ తెప్పించి, అతని కాపురపు స్థలముల
యందు కనికరమును వుంతును; మరిన్ని పట్టణము దాని
దిబ్బమీద తిరిగీ కట్టబడును, దాని నగరు మునుపటి
లాగున వుండును. । మరిన్ని వారిలోనుంచి స్తోత్రపు 19
శబ్దమున్ను సంభ్రమముగా వున్న వారి శబ్దమున్ను
బైలు వెళ్లును; వారిని కొద్దిపరచక విస్తరింపచేతును;
వారిని నీచపరచక ఘనపర్తును. । వారి పిల్లలు మునుపటి 20
లాగున వుందురు; వారి సంఘము నా సముఖమందు
శాశ్వతముగా వుండును; వారిని బాధపెట్టే వారినందరి
నిన్ని నేను శిక్షింతును. । మరిన్ని వారి పెద్దలు వారి 21
జనులలో వారై యుందురు; వారి అధిపతి వారిలో
నుంచి పుట్టును; మరిన్ని వానిని నేను చేర్చుకొన్నం
దున వాడు నా సమీపమునకు వచ్చును; యేమంటే నా
సమీపమునకు చేరవలెనని తన హృదయమును దిట్టపర
చుకొనే పాటి వాడు యెవడని యెహోవా అడి
గెను. । మరిన్ని మీరు నా జనులై వుందురు, నేను మీకు 22
దేవుడనై వుందును. । యిదుగో యెహోవా యొద్ద 23
నుంచి సుడిగాలి రౌద్రముగా బైలు వెళ్లుతూ వున్నది;
అది నిత్యమున్ను వుండి, దుర్జనుల శిరస్సుల మీద
పడును. । యెహోవా కోపాగ్ని తిరిగీ రాక, తన హృ 24
దయపు యోచనలను తాను నెరవేర్చే పర్యంతమూ
వుండును; అంత్య దినములందు మీరు దీనిని విచారించి
తెలుసుకొందురు.

## 31. అధ్యాయము.

మరిన్ని యెహోవా ఆనతిచ్చేదేమంటే, ఆ కాల 1
మందు నేను ఇశ్రాయేలు కుటుంబములన్నిటికి దేవు
డనై వుందును; మరిన్ని వారు నా జనులై వుందురు. ।
ఇశ్రాయేలు జనులను నెమ్మదిగల స్థితిలో వుంచుటకు 2
నేను వెళ్లినప్పుడు కత్తిచేత హతమైన వారిలో శేషిం
చిన వారు అరణ్యమందు నా కనికరమును పొందిరని
యెహోవా ఆనతిచ్చెను. । యెహోవా ఆదిని నాకు 3
ప్రత్యక్షమై ఆనతిచ్చినదేమంటే, నిత్య స్నేహముచేత
నేను నిన్ను స్నేహించి, ప్రేమాతిశయముచేత నిన్ను
చేర్చుకొంటిని. । నేను నిన్ను తిరిగి స్థిరపరచినందున 4
ఓ ఇశ్రాయేలు కన్యకా, నీవు కట్టపడుదువు; నీవు
తిరిగీ నీ అలంకారములను ధరించుకొని, నీ కంజరీ
లను పట్టుకొని, సంభ్రమమును చేసే వారితో బయిలు
వెళ్లి, నాట్య మాడుదువు. । యింకా నీవు షోమ్రోను 5
పర్వతముల మీద ద్రాక్ష చెట్లను నాటుదువు; నాటే
వారు నాటి, వాటి పండ్లను సాధారణమైన వస్తువులు
వలె తిందురు. । యేమంటే ఎఫ్రయీము పర్వతములో 6
వున్న కాపరుల మీదికి దినము వస్తూ వున్నది; అప్పుడు
మీరు లెండి, సీయోను మీద వున్న మన దేవుడైన
యెహోవా యొద్దికి మనము వెళ్లుదామని వారు అర్చు

7 దురు.। యిందుకు యెహోవా ఆనతిచ్చేదేమంటే, యా
కోబు నిమిత్తము సంతోషముగా పాడండి; ఘనమైన
జనాంగముల ముందర ఆర్భటించండి; మీరు ప్రక
టించి స్తోత్రములను చెల్లించి, ఓ యెహోవా, ఇశ్రా
యేలులో శేషించిన నీ జనులను రక్షించుమని ప్రా
8 ర్థించండి.। యిదుగో నేను వారిని వుత్తర దేశము
నుంచి రప్పింతును; భూమి సరిహద్దులనుంచి వారిని
కూర్చుదును; వారితో కూడా గుడ్డివారున్ను కుంటివారు
న్ను గర్భిణిలున్ను ప్రసూతి స్త్రీలున్ను వత్తురు; గొప్ప
9 సమూహము యిక్కడికి తిరిగీ వచ్చును.। వారు యేడు
స్తూ వత్తురు; వేడుకొనే వారిని నేను కొంచు వత్తును;
ఉదకములు గల నదుల దగ్గిర తిన్నటి మార్గమున వారిని
నేను నడిపింతును; దాని యందు వారు తొట్రిల్లరు;
యేమంటే నేను ఇశ్రాయేలుకు తండ్రినై వున్నాను;
10 ఎఫ్రయీము నా ప్రథమ పుత్రుడు.। ఓ జనాంగము
లారా, యెహోవా వాక్యమును విని, దూరమైన
ద్వీపములందు దానిని ప్రకటించి, చెప్పవలసినదేమంటే,
ఇశ్రాయేలును చెదరచేసినవాడు బోయడు తన గొర్రె
11 లను కాచినట్టు వాని సమకూర్చి కాచును.। యే
మంటే యెహోవా యాకోబును కొని, వానికంటే
బలము గల వాని చేతిలోనుంచి వానిని విడిపించెను.।
12 కాబట్టి వారు సీయోను కొండ మీదికి వచ్చి, పాట
బాడి, గోధుమున్ను ద్రాక్షారసమున్ను తైలమున్ను
గొర్రెపిల్లలున్ను లేత దూడలున్ను అనే యెహోవా
దయచేసిన మేలు కొరకు గుంపు గుంపులుగా వత్తురు;
అప్పుడు వారి యాత్మ నీళ్లు గల వనమైనట్టు వున్నందున
యిక వారికి దుఃఖము యెంతమాత్రము రాకపోవును.।
13 అప్పుడు కన్యక నాట్యమాడి సంతోషించును; ముసలి
వారున్ను పడుచు వారున్ను కూడి సంతోషింతురు; యే
మంటే, నేను మూల్గుటను సంతోషమునకు మార్చి, వా
రిని వోదార్చి, దుఃఖితులయిన వారిని సంతోషింప
14 చేతును.। మరిన్ని అర్చకుల యాత్మలను మంచి పదార్థ
ములతోటి తృప్తిని పొందింతును; నా వుపకారముచేత
నా జనులు తృప్తిని పొందుదురని యెహోవా ఆనతి
15 చ్చెను.। అయితే యెహోవా మరిన్ని ఆనతిచ్చేదేమంటే,
మూల్గుటయొక్క యేడ్పుయొక్క శబ్దము రామా వూరి
లో వినపడెను; రాహేలు తన పిల్లలు పోయినందున వారి
కొరకు యేడ్చి వోదార్పును పొందుటకు మనస్సు లేక
16 వుండెను.। అందుకు యెహోవా ఆనతిచ్చేదేమంటే,
నీ రోదన శబ్దమునున్ను నీ కన్నీళ్లనున్ను మాన్పకొను
ము; యేమంటే నీ కార్యము సఫలమౌను; వారు శత్రు
17 వుల దేశములోనుంచి తిరిగి వత్తురు.। నీ కోర్కె కొన
సాగును; నీ పిల్లలు తమ స్వదేశములోకి తిరిగీ వత్తురని
18 యెహోవా ఆనతిచ్చెను.। ఎఫ్రయీము అంగలా
ర్చుట నాకు నిజముగా వినపడెను; యేలాగంటే,
నీవు నాకు బుద్ధి చెప్పితివి; కాడి కర్ర అభ్యాసము
లేని యెద్దుకైనట్టు నేను బుద్ధి చెప్పటను పొందితిని;
నన్ను తిప్పుము, అప్పుడు నేను తిరుగుదును; యేమంటే
నీవు నా దేవుడవైన యెహోవావు.। నిజముగా నేను 19
తిరిగిన తరువాత పశ్చాత్తాపమును పొందితిని; బుద్ధి
తెలిసిన తరువాత నేను నా తొడను చరుచుకొంటిని;
నా బాల్య కాలపు నిందను అనుభవించితిని, గనుక
నేను సిగ్గు పొంది కలవిల పడితిని.। అయితే ఎఫ్ర 20
యీము నా ప్రియమైన కుమారుడు కాడా! నేను
కోర తగిన పిల్లవాడు కాడా! యేమంటే అతని మీద
నేను తప్పు మోపినప్పటికిన్ని యింకా అతని బహుగా
తలంచుకుంటూ వున్నాను; కాబట్టి నా వుదరము అతని
కొరకు కరుగుతూ వున్నది; అవశ్యము అతని మీద
దయ వుంతునని యెహోవా పలికెను.। నీవు మార్గ 21
మునకు ఆనవాళ్లను పెట్టుకొమ్ము; పొడుగైన కుప్పలను
చేసుకొమ్ము; నీవు వెళ్లిన మార్గము యేదో ఆ రాజ
మార్గము తట్టు నీ హృదయమును వుంచి ఓ ఇశ్రా
యేలు కన్యకా, యీ నీ పట్టణములకు మళ్లుకొని
రమ్ము.। వెనుకకు తిరిగే ఓ కుమారికా, యెన్నాళ్ల 22
మట్టుకు నీవు తిరుగులాడుదువు? యెహోవా వింతైన
కార్యమును లోకమందు పుట్టించును; యేమంటే స్త్రీ
పురుషుని చుట్టుకొనును.। అయితే ఇశ్రాయేలుకు దేవు 23
డైన సైన్యముల యెహోవా ఆనతిచ్చేదేమంటే, ఓ
నీతియొక్క కాపురమా, ఓ పరిశుద్ధతయొక్క పర్వత
మా, యెహోవా నిన్ను ఆశీర్వదించును గాక, అనే
వాక్యమును చెరలో వున్న వారిని నేను తిరిగీ రప్పిం
చిన తరువాత వారు యూదా దేశమందున్ను దాని
పట్టణములందున్ను యింకా వాడికె చేతురు.। మరిన్ని 24
యూదా దేశమందున్ను దాని పట్టణములందున్ను వ్యవ
సాయకులున్ను మందలతో బయిలు వెళ్లేవారున్ను
కూడా కాపురము చేతురు.। దప్పిగొనిన వాని దాహ 25
మును నేను తీర్తును; దుఃఖితులైన వారినందరినిన్ని
నేను తృప్తిని పొందింప చేతును.। అప్పుడు నేను 26
మేలుకొని, యిదుగో, నేను పొందిన నిద్ర మధురమై
నదని అనుకొంటిని.। మరిన్ని యెహోవా ఆనతిచ్చే 27
దేమంటే, యిదుగో దినములు వస్తూ వున్నవి, అప్పుడు
నేను ఇశ్రాయేలు యింటి యందున్ను యూదా యింటి
యందున్ను మనుష్యుని విత్తనమునున్ను మృగముయొక్క
విత్తనమునున్ను చల్లుదును.। మరిన్ని పెరికి వేసుటకున్ను 28
పగలగొట్టుటకున్ను పడదోయుటకున్ను లయము చేసు
టకున్ను హింస పెట్టుటకున్ను నేను వారిని కనిపెట్టి
నట్టు కట్టుటకున్ను నాటుటకున్ను వారిని కనిపెట్టుదు
నని యెహోవా ఆనతిచ్చెను.। ఆ దినములలో తం 29

డ్రులు పుల్లద్రాక్షకాయలను తినినందున పిల్లల పండ్లు
30 పులుపారెనన్న సామితె లేకపోవును.। యేమంటే
ప్రతి మనుష్యుడూ తాను చేసుకొన్న అక్రమము
కొరకు మరణమౌను; యెవడైనా పుల్లద్రాక్ష కాయ
31 లను తింటే తన పళ్లు పులుపౌను.। మరిన్ని యెహోవా
వా ఆనతిచ్చేదేమంటే, యిదుగో, దినములు వస్తూ
వున్నవి, అప్పుడు ఇశ్రాయేలు యింటి వారితోనున్ను
యూదా యింటి వారితోనున్ను నూతనమైన వొడం
32 బడికెను చేసుకొందును.। అయితే అది మిస్రయీము
దేశములోనుంచి యివతలకు కొంచు వచ్చుటకు నేను
వారి పితృల హస్తమును పట్టుకొని, నేను వారితో
చేసిన ప్రమాణము, అనగా, వారికి నేను పెనిమిటిగా
వున్నప్పటికిన్ని వారు మీరిన నా ప్రమాణము చొ
33 ప్పున కాదు.। అయితే నేను ఇశ్రాయేలు యింటి
వారితో చేసుకొన్న ప్రమాణము యిదే, యేమంటే
నేను ఆ దినములైన తరువాత నా న్యాయ ప్రమాణ
మును వారి అంతరంగములలో వుంచి, వారి హృదయ
ముల మీద దాని వ్రాతును; వారు నా జనులవుదురు;
నేను వారి దేవుడనౌదునని యెహోవా ఆనతిచ్చెను.।
34 మరిన్ని యిక మీదట వారు తమ తమ పొరుగు వాని
తోనున్ను సహోదరునితోనున్ను మీరు యెహో
వాను తెలుసుకొండన్న మాటను చెప్పరు; యేమంటే
పిన్నలు మొదలుకొని పెద్దల పర్యంతము వారందరున్ను
నన్ను యెరుగుదురు; నేను వారి దోషమును క్షమించి,
వారి పాపమును యికను జ్ఞాపకము చేసుకోనని యె
35 హోవా ఆనతిచ్చెను.। మరిన్ని సైన్యముల యెహో
వా అనే నామము కలిగిన వాడున్ను పగటి యందు
వెలుగు కొరకు సూర్యునిన్ని రాత్రియందు వెలుగు
కొరకు చంద్ర నక్షత్రములనున్ను నిర్ణయించి, తరంగ
ములు ఘోషించినప్పుడు సముద్రమును భాగించిన
36 వాడున్నైన యెహోవా ఆనతిచ్చేదేమంటే,। ఆ నిబం
ధనలు నా ముందర తప్పిపోయిన పక్షమందు ఇశ్రా
యేలు సంతతి కూడా నా ముందర జనాంగమై వుండే
టట్టుగా యెన్నటికిన్ని లేకపోవునని యెహోవా
37 ఆనతిచ్చెను. । యెహోవా యీలాగున ఆనతిచ్చే
దేమంటే, పైని వున్న ఆకాశమును కొలువనున్ను కింద
వున్న భూమి పునాదులను శోధించనున్ను శక్యమైతే
అప్పుడు వారు చేసినదంతటికి నిమిత్తము ఇశ్రాయేలు
సంతతి అంతటినీ నేను పరిహరింతునని యెహోవా
38 ఆనతిచ్చి, మరిన్ని యెహోవా చెప్పిన మాట,। యిదు
గో దినములు వస్తూ వున్నవి, అప్పుడు యీ పట్టణము
హననేలు గోపురము మొదలుకొని మూలయొక్క ద్వా
రము పర్యంతము యెహోవా కొరకు కట్టపడును.।
39 మరిన్ని దాని యెద్దనుంచి కొలిచే నూలు గారేబు
కొండ మట్టుకు సాగి, తిరిగీ గోయాతును చుట్టుకొని
పైగా వెళ్లును.। మరిన్ని శ్మశాన భూమియొక్కయున్ను 40
బూడిదెయొక్కయున్ను లోవయున్ను కిద్రోను గెడ్డ
మట్టుకున్ను తూర్పు తట్టు వున్న గుర్రపు గౌని మూల
మట్టుకున్ను వున్న పొలములున్ను యెహోవాకు పరి
శుద్ధమని యెంచబడును; అవి యికను యెన్నటికైనా
పెరికి వేయబడకుండానున్ను పడదోయబడకుండాను
న్ను వుండునని యెహోవా ఆనతిచ్చెను.

## 32. అధ్యాయము.

యూదా దేశపు రాజైన సిద్కియా యేలుబడి 1
పదో సంవత్సరము, అనగా, నెబూఖద్రెస్సరు యేలు
బడి బద్దెనిమిదో సంవత్సరమందు యెహోవా యె
ద్దనుంచి ఇర్మీయా యెద్దికి వాక్యము వచ్చెను.। యేమం 2
టే అప్పుడు బాబెలు రాజు సైన్యము వచ్చి, యెరూశ
లేమును చుట్టుకొనెను; మరిన్ని దీర్ఘదర్శియైన ఇర్మీ
యా యూదా రాజు నగరి యందుండే చెరసాలలో
వుంచబడెను.। యేమంటే యూదా రాజైన సిద్కియా 3
వానిని చూచి, యెహోవా చెప్పినట్టు నీవు యిదుగో
యీ పట్టణమును నేను బాబెలు రాజు చేతికి అప్ప
గించినందున వాడు దానిని ఆక్రమించుకొనుననిన్ని,।
యూదా రాజైన సిద్కియా కల్దీయుల చేతిలోనుంచి 4
తప్పించుకో లేకపోవుననిన్ని, బాబెలు రాజుచేతికి
వాడు దొరికినప్పుడు వారు అభిముఖులై వొకరితో
వొకరు మాట్లాడుకొని, వొకరిని వొకరు చూచుకొని,
అతడు సిద్కియాను బాబెలుకు తీసుకొపోవుననిన్ని,।
అక్కడ నేను కనికరించే పర్యంతము వుండునని యె 5
హోవా ఆనతిచ్చెననిన్ని, మీరు కల్దీయులతో పోట్లా
డితే మీకు జయము లేకపోవుననిన్ని, భవిష్యత్తుగా
పలికెదవేమని అడిగి, వానిని చెరసాలలో వుంచెను.।
అప్పుడు ఇర్మీయా చెప్పినదేమంటే, యెహోవా వా 6
క్యము నా యెద్దికి వచ్చి నాతో చెప్పిన లాగు,। యి 7
దుగో, నీ పినతండ్రియైన షల్లూము కుమారుడనే హన
మేలు అనాతోతు వూరి దగ్గిర వున్న నా పొలమును
నీవు కొనుము, యేమంటే న్యాయ పద్ధతి చొప్పున
నీవు దానిని కొనుటకు బాధ్యుడవని చెప్పుటకు నీ
యెద్దికి వస్తూ వున్నాడని చెప్పెను.। అయినందున నా 8
పినతండ్రి కుమారుడైన హనమేలు యెహోవా వాక్య
ప్రకారము చెరసాలలో వున్న నా యెద్దికి వచ్చి,
నాతో బెన్యామీను దేశమందలి అనాతోతు దగ్గిర
వున్న నా పొలమును నీవు కొనుము; యేమంటే న్యా
య పద్ధతి చొప్పున నీవు బాధ్యుడవు; దానిని కొను
మనెను. అప్పుడు అది యెహోవా వాక్యమని నాకు
తెలిసెను.। కాబట్టి నేను అనాతోతు వూరి దగ్గిర 9

వున్న నా పినతండ్రి కుమారుడైన హనమేలు పొలమును
పదిహేడు తులముల వెండికి కొని, అది తూచి వానికి
10 యిస్తిని. । మరిన్ని నేను సాక్షులను పిలుచుకొని, క్రయ
చీటిలో సంతకములు చేయించి, ముద్రవేసిన సొమ్ము
11 త్రాసుతో తూచి వానికి యిస్తిని. । మరిన్ని నేను క్రయ
చీటి, అనగా, న్యాయ పద్ధతి యొక్కయున్ను మర్యాద
యొక్కయున్ను ముద్రగల చీటినిన్ని ముద్రలేని చీటి
12 నిన్ని పుచ్చుకొని, । నేను క్రయ చీటిని నా పినతండ్రి
కుమారుడైన హనమేలు ముందరనున్ను క్రయ చీటిలో
సంతకములు చేసిన సాక్షుల ముందరనున్ను చెరసాల
లో కూర్చున్న యూదైయుల ముందరనున్ను మయ
శేయాకు పుట్టిన నేరీయా కుమారుడయిన బారూఖు
13 చేతికి యిచ్చి, । వారందరి ముందర ఇశ్రాయేలుకు దేవు
డైన సైన్యముల యెహోవా ఆనతిచ్చినట్టు బారూ
14 ఖుకు నిర్ణయించినదేమంటే, । క్రయ చీటి, అనగా,
ముద్రగల చీటినిన్ని ముద్రలేని చీటినిన్ని తీసి, మంటి
కుండలో చాలా దినములు వుండేటట్టుగా వాటిని వుం
15 చుము. । యేమంటే ఇశ్రాయేలుకు దేవుడైన యెహో
వా ఆనతిచ్చేదేమంటే, యీ దేశమందు యిండ్లున్ను
పొలములున్ను ద్రాక్ష తోటలున్ను తిరిగీ స్వతంత్రించ
16 పడునని ఆనతిచ్చెనని చెప్పితిని. । అయితే నేను క్రయ
చీటిని నేరీయా కుమారుడైన బారూఖు చేతికి అప్ప
గించిన తరువాత నేను యెహోవాను ప్రార్థించిన
17 దేమంటే, । ఓ దేవుడవైన యెహోవా, యిదుగో,
నీ మహత్వము చేతనున్ను చాపిన నీ హస్తము చేత
నున్ను నీవు ఆకాశమునున్ను భూమినిన్ని కలుగ చేస్తి
18 వి; నీకు అసాధ్యమైనది వొకటీ లేదు. । నీవు చాలా
వేలమందికి కృపనగుపర్చినవాడవు; తండ్రుల దోష
ముకు ప్రతిగా వారి తరువాతి వారైన వారి పుత్రుల
వడిలోకి యిస్తూ వున్నావు; సామర్థ్యముగల ఘన
మైన సైన్యముల యెహోవాయని నీకు పేరు కలదు. ।
19 నీవు ఆలోచన యందు ఘనుడవున్ను క్రియల యం
దు సమర్థుడవున్ను అయి వున్నావు; యేమంటే
ప్రతి మనుష్యునికి వాని మార్గముల ప్రకారముగా
నున్ను వాని చేతుల ప్రకారముగానున్ను యిచ్చుటకు
నీ నేత్రములు నర పుత్రుల సకల మార్గముల మీద
20 విప్పివున్నవి. । నీవు మిస్రయీము దేశములోనున్ను
ఇశ్రాయేలీయులలోనున్ను యితర జనులలోనున్ను నేటి
వరకున్ను గురుతులనున్ను వింతలనున్ను స్థిరపర్చి, యీ
21 రోజునైనట్టు నీకు పేరును కలుగ చేసుకొని, । మిస్ర
యీము దేశములోనుంచి నీవు ఇశ్రాయేలనే నీ జను
లను గురుతులచేతనున్ను వింతల చేతనున్ను బలమైన చేతి
చేతనున్ను చాచిన హస్తము చేతనున్ను మహా భయము
22 చేతనున్ను యివతలకు కొంచు వచ్చి, । వారి పితృలకు
ప్రమాణము చేసిన దేశము, అనగా, పాలు తేనె ప్రవ
హించే యీ దేశమును వారికి దయచేసినందుచేత వారు
ప్రవేశించి, దానిని స్వతంత్రించుకొనిరి. । అయితే 23
వారు నీ వాక్యమును వినకపోయి, నీ న్యాయప్రమాణ
మందు నడవక వుండిరి; నీవు వారికి ఆజ్ఞాపించిన వాటి
లో యే వొకటైనా చేయలేదు; కాబట్టి నీవు యీ కీడం
తా వారి మీదికి రప్పిస్తివి. । బురుజులను చూడుము; 24
యీ పట్టణమును ఆక్రమించుకొనుటకు వారు దాని
మీదికి వచ్చిరి; పట్టణము దాని మీద యుద్ధము చేసిన
కల్దీయుల చేతులకు అప్పగించపడెను; యేమంటే కత్తి
న్ని క్షామమున్ను తెగులున్ను నీవు చెప్పినదంతానున్ను
సంభవించినవి; యిదుగో నీవు చూస్తూ వున్నావు. । మరి 25
న్ని ఓ దేవుడవైన యెహోవా, సొమ్ము యిచ్చి, యీ
పొలమును కొని, సాక్షులను తీసుకొమ్ము, యేమంటే కల్దీ
యుల చేతికి యీ పట్టణము యివ్వబడెనని నీవు నా
తో చెప్పితివి, అని ప్రార్థిస్తిని. । అప్పుడు ఇర్మీయా 26
యొద్దికి వచ్చిన యెహోవా వాక్యము యేమంటే, । 27
యిదుగో, నేను సమస్తమైన వారికి దేవుడనైన యెహో
వాను; నాకు అసాధ్యమైనది వొకటైనా వున్నదా! । కా 28
బట్టి యెహోవా ఆనతిచ్చేదేమంటే, యిదుగో, యీ
పట్టణమును నేను కల్దీయుల చేతికిన్ని బాబెలు రాజైన
నెబూఖద్రెస్సరు చేతికిన్ని అప్పగింతును; వాడు దీనిని
ఆక్రమించుకొనును. । యేమంటే యీ పట్టణము మీద 29
యుద్ధము చేసిన కల్దీయులు వచ్చి, దాని మీద అగ్ని
రాజపెట్టి, దానిని యే యిండ్ల పైని వారు నాకు కో
పము పుట్టించేటట్టు బయలుకు ధూపమును యిచ్చి యి
తర దేవుండ్లకు పానార్పణలను కుమ్మరించిరో ఆ యిం
డ్లనున్ను కాల్చివేతురు. । యేమంటే ఇశ్రాయేలు పు 30
త్రులున్ను యూదా పుత్రులున్ను బాల్యమునుంచి నా
కండ్ల ముందర కీడు మాత్రమే చేసినారు; ఇశ్రాయేలు
పుత్రులు తమ చేతుల పనిచేత నాకు కోపమును పుట్టిం
చినారని యెహోవా ఆనతిచ్చెను. । యేమంటే యీ 31
పట్టణము కట్టిన నాటినుంచి నేటి వరకున్ను అది నాకు
కోపమునున్ను రౌద్రమునున్ను ప్రేరేపించినదై యు
న్నది; । కాబట్టి ఇశ్రాయేలు పుత్రులున్ను యూదా 32
పుత్రులున్ను వారి రాజులున్ను అధిపతులున్ను అర్చ
కులున్ను దీర్ఘదర్శులున్ను యూదా దేశస్థులున్ను
యెరూశలేము కాపురస్తులున్ను నాకు కోపము పుట్టిం
చేటట్టుగా చేసిన యీ కీడంతటి నిమిత్తము నేను యీ
పట్టణమును నా సముఖమునుంచి అవతలకు వెళ్లవేతు
ను. । వారు ముఖమును మాని వీపును నా తట్టు తిప్పు 33
కొనిరి; నేను వారికి వుపదేశించి, తెల్లవారగానే లేచి,
దాని నేర్పుతూ వున్నప్పటికిన్ని వారు వినరైరి; బుద్ధి
నేర్చుకోరైరి. । మరిన్ని వారు తమ యేహ్యతలను నా 34

నామము చేత పిలువబడిన మందిరమందు నిలువబెట్టి
35 దానిని అపవిత్రపరచిరి. । మరిన్ని వారు హిన్నోము
కుమారుని లోవలో బయలు కొరకు వున్నతమైన స్థల
ములనున్ను కట్టి, తమ కుమారులనున్ను కుమార్తెలను
న్ను అగ్నిచేత మోలెఖుకు అప్పగించిరి; యీలాటి యే
హ్యమైన పనిచేత యూదా వారిని పాపము చేయిం
చుటకు నేను వారికి ఆజ్ఞ యివ్వలేదు; అది యెన్నడు
36 న్ను నా మనస్సు యందు పుట్టలేదు. । అయితే యిది
కత్తిచేతనున్ను క్షామము చేతనున్ను తెగులు చేతనున్ను
బాబెలు రాజుచేతికి అప్పగించబడెనని మీరు చెప్పిన
యీ పట్టణమును గురించి ఇశ్రాయేలుకు దేవుడైన
37 యెహోవా యిప్పుడు ఆనతిచ్చేదేమంటే, । యిదుగో
యెక్కడెక్కడికి నేను నా వుగ్రత చేతనున్ను రౌద్ర
ము చేతనున్ను బహు కోపాగ్ని చేతనున్ను వారిని తోలి
వేస్తినో ఆ దేశము లన్నిటిలోనుంచి, వారిని కూర్చు
దును; మరిన్ని యీ స్థలమునకు వారిని తిరిగీ రప్పించి,
38 నిర్భయముగా కాపురము చేయింతును. । వారు నా
39 జనులవుదురు; నేను వారి దేవుడనవుదును. । మరిన్ని వా
రికిన్ని వారి తరువాత వారి పిల్లలకున్ను మేలు కలుగు
టకు వారు నిత్యమూ నాకు భయపడేటట్టుగా వారికం
దరికీ ఏక హృదయమునున్ను ఏక మార్గమునున్ను యి
40 త్తును. । మరిన్ని వారిని నేను విడువకుండానున్ను వా
రికి మేలు చేయుట మానకుండానున్ను వుందునని వారి
తో నిత్యమైన ప్రమాణమును చేసుకొందును; మరిన్ని
వారు నన్ను విడువకుండా నా విషయమై భయభక్తు
41 లను వారి హృదయమందు వుంచుదును. । నిజముగా
వారికి మేలు చేసుట యందు సంతోషముగా వుందు
ను; నిజముగా నిండు హృదయము చేతనున్ను మనస్ఫూ
ర్తి చేతనున్ను యీ దేశమందు వారిని నాటుదును. ।
42 యిందుకు యెహోవా ఆనతిచ్చేదేమంటే, యీ జనుల
మీదికి నేను యింత గొప్ప శ్రమను రప్పించినట్టు నేను
వారికి వాగ్దత్తము చేసిన మేలంతాను వారి మీదికి ఆ
43 లాగునే తెప్పింతును. । కాబట్టి కల్దీయుల చేతికి దొ
రికి, పాడై, నిర్మనుష్యముగానున్ను మృగ హీనత్వము
గానున్ను వున్నదని మీరు చెప్పుకొనిన యీ దేశమందు
44 పొలములు విక్రయించబడును. । మనుష్యులు బెన్యా
మీను దేశమందున్ను యెరూశలేముకు చుట్టూ వున్న
స్థలములందున్ను యూదా దేశపు పట్టణములందున్ను
పర్వతముల పట్టణములందున్ను లోవ పట్టణములందు
న్ను దక్షిణపు పట్టణములయందున్ను సాక్షులను పిలు
చుకొని, ద్రవ్యము నిచ్చి, పొలములను కొని, క్రయ
చీట్లలో సంతకములు చేయింతురు; యేమంటే నేను
చెరలో వున్న వారిని తిరిగీ రాచేతునని యెహోవా
ఆనతిచ్చెను.

## 33. అధ్యాయము.

మరిన్ని ఇర్మీయా యింకా చెరసాలలో వుంచపడి 1
యుండగా యెహోవా అతని యొద్దికి రెండో మారు
పంపిన వాక్యము యేమంటే, । సైన్యముల యెహో 2
వా అనే నామము గలిగి, సమస్తమును కలుగచేసి, సమ
స్తమును రూపించిన యెహోవా ఆనతిచ్చేలాగు, । నీవు 3
నన్ను ప్రార్థించుము, అప్పుడు నేను నీకు ప్రత్యు
త్తరమిచ్చి, నీవు యెరుగని ఘన కార్యములను నీకు చూ
పింతును. । బురుజుల చేతనున్ను కత్తిచేతనున్ను కిందప 4
డిన యీ పట్టణముల యిండ్లను గురించిన్ని యూదా
రాజుల యిండ్లను గురించిన్ని ఇశ్రాయేలుకు దేవుడైన
యెహోవా ఆనతిచ్చేదేమంటే, । వారు కల్దీయులతో 5
పోట్లాడుటకు వచ్చిరి, అందువల్ల వారి యిండ్లు నా కో
పము చేతనున్ను రౌద్రము చేతనున్ను నేను హతము
చేయించిన మనుష్యుల కళేబరములతోటి నిండి వుం
డును; యేమంటే వారి దోషమంతటి కొరకు నేను నా
ముఖమును యీ పట్టణమునకు చాటుగా చేసుకొంటిని. ।
అయినప్పటికిన్ని యిదుగో నేను దానికి ఆరోగ్యమును 6
దయచేసి, వారిని స్వస్థపర్చి, బహు క్షేమమునున్ను
సత్యమునున్ను వారికి అగుపర్తును. । మరిన్ని నేను 7
చెరలో వున్న యూదా వారినిన్ని చెరలో వున్న ఇశ్రా
యేలు వారినిన్ని తిరిగీ రప్పించి ఆది యందైనట్టు వా
రిని స్థిరపర్తును. । మరిన్ని నా విషయమై వారు చేసిన 8
సకలమైన అక్రమములనుంచి వారిని శుభ్రపర్చి, వారు
క్రమము తప్పి నాకు విరోధముగా చేసిన వారి దోషము
లను క్షమింతును. । మరిన్ని నేను వారికి చేసిన మేలం 9
తాను వినిన సకలలోక జనాంగముల ముందర యీ పట్ట
ణము నాకు సంతోషమైన నామము కొరకున్ను స్తోత్ర
ము కొరకున్ను శిరో భూషణము కొరకున్ను వుండును;
యేమంటే దానికి నేను దయచేసిన మేలునున్ను క్షేమ
మునున్ను వారు విని భయపడి వణుకుదురు. । యీలా 10
గున యెహోవా ఆనతిచ్చేదేమంటే, నిర్మనుష్యముగా
నున్ను మృగహీనత్వముగానున్ను పాడుగానున్ను వున్న
దని మీరు చెప్పుకొనే యీ స్థలము, అనగా, మనుష్యు
డైనా కాపురస్తుడైనా మృగమైనా లేక పాడుగావున్న
యూదా పట్టణములందున్ను యెరూశలేము వీధులం
దున్ను సంతోషపు శబ్దమున్ను పెండ్లి కుమారుని శబ్ద
మున్ను పెండ్లికుమార్తె శబ్దమున్ను, । మరిన్ని యెహోవా 11
వుత్తముడు, ఆయనకృప శాశ్వతముగా వున్నది గనుక
సైన్యముల యెహోవాను స్తుతించండి అని చెప్పే వారి
శబ్దమున్ను తిరిగీ వినపడును; యేమంటే చెరలో వున్న
యీ దేశస్థులను తిరిగీ రప్పించి, మునుపటి లాగున నేను
వుండచేతునని యెహోవా ఆనతిచ్చి, । మరిన్ని సైన్యముల 12

యెహోవా చెప్పేదేమంటే, నిర్మనుష్యముగానున్న
మృగహీనత్వముగానున్న పాడైపోయిన యీ స్థలమం
దున్ను దాని పట్టణములన్నిటి యందున్ను తమ గొఱ్ఱెల
ను పరుండబెట్టిన బోయల కాపురములు తిరిగీ వుండు
13 ను. ।పర్వతముల పట్టణములందున్ను లోవ పట్టణములం
దున్ను దక్షిణపు పట్టణములందున్ను బెన్యామీను దేశ
మందున్ను యెరూశలేముకు చుట్టూ వున్న స్థలముల యం
దున్ను యూదా దేశపు పట్టణములందున్ను గొఱ్ఱెలు
తిరిగీ లెక్క పెట్టిన వాని చేతి కిందనుంచి గడుచునని యె
14 హోవా చెప్పె;। మరిన్ని యెహోవా ఆనతిచ్చేదేమం
టే, యిదుగో దినములు వస్తూ వున్నవి, అప్పుడు నేను
ఇశ్రాయేలు యింటి వారికిన్ని యూదా యింటి వారి
కిన్ని నేను వాగ్దత్తము చేసిన వాక్యమును నెరవేర్తును.।
15 ఆ దినములందున్ను ఆ కాలమందున్ను నేను దావీదువల్ల
నీతిగల చిగురును పుట్టింతును; ఆయన దేశమందు నీతి
16 న్యాయములను నడిపించును.। ఆ దినములందు యూ
దా రక్షణ్యమును పొందును; యెరూశలేమున్ను నిర్భ
యమైన కాపురములు కలదై వుండును; ఆయనకు మన
నీతిగల యెహోవా అనే నామము పెట్టబడును.।
17 యిందుకు యెహోవా ఆనతిచ్చేదేమంటే, ఇశ్రా
యేలు యింటి వారి గద్దె మీద కూచుండుటకు మను
ష్యుని అవసరము దావీదుకు యెన్నడూ లేక పోవును.।
18 మరిన్ని నా ముందర నిలచి హోమార్పణలను అర్పిం
చుటకున్ను మాంసార్పణలను కాల్చుటకున్ను యెల్ల
ప్పుడున్ను నాకు బలులను చెల్లించుటకున్ను మనుష్యుని
అవసరము అర్చకులైన లేవీయులకు లేకపోవునని ఆన
19 తిచ్చెను.। మరిన్ని ఇర్మీయా యొద్దికి వచ్చిన యెహో
20 వా వాక్యము ఆనతిచ్చేదేమంటే,।దివా రాత్రములకొ
రకు నేను చేసిన ప్రమాణము వాటి సమయము చొప్పున
21 కాకుండా దాని మీరు విచ్ఛిత్తుచేసిన పక్షమందు,। నా
సేవకుడైన దావీదుతోనున్ను నా పరిచారకులైన అర్చ
కులనే లేవీయులతోనున్ను నేను చేసుకొనిన ప్రమాణ
ము విచ్ఛిత్తయినందున వాని గద్దె మీద కూచుండు
22 టకు కుమారుడు వొకడూ వానికి లేక పోవును.। ఆకా
శపు సమూహము లెక్కలేకుండా వున్నట్టున్ను సము
ద్రపు యిసుక కొలుచుటకు అశక్యమైనట్టున్ను నేను
నా సేవకుడైన దావీదు సంతతినిన్ని నాకు పరిచారకులైన
23 లేవీయులనున్ను విస్తరింపచేతునని ఆనతిచ్చెను.। మరిన్ని
24 ఇర్మీయా యొద్దికి వచ్చిన యెహోవా వాక్యము,। యీ
జనులు చెప్పుకొనిన దానిని నీవు వింటివే, అనగా, యె
హోవా యెంచి చేర్చుకొనిన రెండు కుటుంబములను
తానే పరిహరించెనని వారు చెప్పుకొన్నందుచేత నా
జనులు యిక జనాంగము కాకుండా వుండేటట్టు వా
25 రిని నిర్లక్ష్యము చేసిరి.। అయినందున యెహోవా
ఆనతిచ్చేదేమంటే, దివారాత్రములకు నేను ప్రమాణ
మును నిర్ణయించక పోయినానున్ను, భూమ్యాకాశ
ముల గురుతులను నిర్ణయించక పోయినానున్ను,।అప్పు 26
డు నేను యాకోబు సంతతినిన్ని నా సేవకుడైన దా
వీదు సంతతినిన్ని పరిహరించి, వాని సంతతిలోనుంచి
వొకనినైనా అబ్రాహాము ఇస్సాకు యాకోబుల సం
తతి పైని యేలుటకు; యెంచను; ఆవశ్యముగా చెరలో
వున్న వారిని తిరిగీ రప్పించి, వారిని గూర్చి కనికరింతు
నని యెహోవా ఆనతిచ్చెను.

## 34. అధ్యాయము.

బాబెలు రాజైన నెబూఖద్రెస్సరున్ను అతని సైన్య 1
ములున్ను అతని ఆధిపత్యము కిందవున్న సకల భూ
రాజ్యములున్ను సకల ప్రజలున్ను యెరూశలేముకు
దాని సంబంధమయిన పట్టణములకున్ను విరోధముగా
యుద్ధము చేసినప్పుడు యెహోవా యొద్దనుంచి ఇర్మీ
యా యొద్దికి వచ్చిన వాక్యము, అనగా,। ఇశ్రాయే 2
లుకు దేవుడైన యెహోవా చెప్పేదేమంటే, నీవు
యూదా రాజైన సిద్కీయాతో మాట్లాడి చెప్పవలసిన
దేమంటే, యిదుగో, నేను యీ పట్టణమును బాబెలు
రాజు చేతిలోకి యిత్తును; దాని అతడు కాల్చివేసును.।
మరిన్ని నీవు అతని చేతిలోనుంచి తప్పించుకో లేక, 3
అతని చేతికి అప్పగించబడుదువు; నీ కన్నులు బాబెలు
రాజును చూచును; అతడు నీకు అభిముఖుడై నీతో
మాట్లాడును; నీవు బాబెలుకు వెళ్లుదువు, అని యె
హోవా యీలాగున చెప్పుతున్నాడని చెప్పుము.।
అయినప్పటికిన్ని ఓ యూదా రాజవైన సిద్కీయా 4
యెహోవా వాక్యమును వినుము; యెహోవా నిన్ను
గూర్చి చెప్పేదేమంటే, నీవు కత్తిచేత నశించక, సమా
ధాన మరణమాదువు।నీకన్న మునుపటి రాజులైన నీ 5
పితృలతో కూడా నీకు దహనములు కలుగును; ఆలా
గున నీ నిమిత్తమున్ను వారు పరిమళ వస్తువులను కాల్తు
రు; నీ కొరకు దుఃఖించి, అయ్యో, ప్రభువా, అని అం
గలార్చుదురు; యీలాగున నేను నిజముగా చెప్పితిని,
అని యెహోవా ఆనతిస్తున్నాడు.। బాబెలు రాజు 6
సైన్యము యెరూశలేముకున్ను శేషించిన సకలమైన
యూదా పట్టణములకున్ను విరోధముగా, అనగా,।
లాకీషుకున్ను అజేకాకున్ను విరోధముగా యుద్ధము 7
చేసినప్పుడు దీర్ఘదర్శియైన ఇర్మీయా యీ మాటలు
యావత్తూ యెరూశలేములో యూదా రాజైన సిద్కీ
యాతో పలికెను, యేమంటే యూదా పట్టణములలో
యీ ప్రాకారములు గల పట్టణములు శేషించి వుం
డెను.। యెరూశలేములో వున్న వారందరితో సిద్కీ 8
యా వొడంబడిక చేసి, అనగా, వారికి విమోచనమును

9 ప్రకటించి,। ప్రతివాడున్ను ఇబ్రీయుడైన తన పని
వానినిన్ని ఇబ్రీయురాలైన తన పనికత్తెనున్ను విడు
దల పొందించ వలెననిన్ని, తన సహోదరుడైన యూ
దైయునివల్ల యెవడైనా సేవ పుచ్చుకొన రాదనిన్ని,
నిర్ణయించిన తరువాత యెహోవా యొద్దనుంచి ఇర్మీ
10 యా యొద్దికి వచ్చిన వాక్యము యిదే.। అయితే యీ
వొడంబడికను చేసుకొన్న అధికారులందరున్ను జను
లందరున్ను యీలాగున ప్రతివాడు తన పనివానినిన్ని
తన పనికత్తెనున్ను విమోచించి, వారివల్ల యికను సేవ
పొందకుండా వుండవలెనని వినినప్పుడు వారు ఆమో
11 దించి వారిని విడుదల చేసిరి.। అయితే అటుతరువాత
వారు విమోచించిన వీరిని తిరిగీ పనివాళ్లగానున్ను పని
12 కత్తెలగానున్ను చేసుకొనిరి.। అందు కొరకు యెహో
వా యొద్దనుంచి ఇర్మీయా యొద్దికి వచ్చిన వాక్యప్రకా
13 రము,। ఇశ్రాయేలుకు దేవుడైన యెహోవా చెప్పే
దేమంటే, దాసుల యిల్లు అయిన మిస్రయీము దేశ
మునుంచి మీ పితృలను యివతలకు నేను తెచ్చిన దిన
మందు వారితో నేను వొడంబడికెను చేసి చెప్పినప్రకా
14 రము,। యేడో సంవత్సరాంతమందు మీలో ప్రతి
వాడు తనకు అమ్మబడిన ఇబ్రీయుడైన తన సహోద
రుని వదిలి పెట్టవలెను; అతడు నీకు ఆరు సంవత్సర
ములు సేవ చేసిన తరువాత నీ యొద్దనుంచి వెళ్లిపో
నిమ్ము, అని చెప్పితిని; అయితే మీ పితృలు నన్ను
15 మన్నించనూ లేదు, వారు చెవి వొగ్గనూ లేదు.। అయితే
యీ దినమందు తిరిగీ మీలో ప్రతివాడున్ను తన పొ
రుగువాని విడుదలను గూర్చి ప్రకటించుట నా దృ
ష్టికి యుక్తముగానే వున్నది; మరిన్ని మీరు నా పేరట
పిలువబడిన యింటిలో నా ముందర మీరు వొడంబడి
16 కెను చేసుకొంటిరి.। అయినప్పటికిన్ని మీరు తిరిగీ నా
నామమును అపవిత్రపరచి, ప్రతివాడు తన పనివాని
నిన్ని తన పనికత్తెనున్ను స్వేచ్ఛా విహారము కలుగున
ట్టుగా వదిలిపెట్టినప్పటికీ మీకు పనివాళ్ల కొరకున్ను
17 పనికత్తెల కొరకున్ను వారిని లోపచుర్చుకొంటిరి.। కా
గా యెహోవా యీలాగున చెప్పేదేమంటే, మీరు
నా మాటను వినక, మీలో ప్రతివాడు తన సహో
దరునికిన్ని తన పొరుగు వానికిన్ని విమోచనమును ప్రక
టించనందువల్ల యిదుగో నేను మీకు వొక విమోచన
మును ప్రకటింతును, అనగా, కత్తికిన్ని తెగులుకున్ను
క్షామమునకున్ను నేను మిమ్మును అప్పగించి, సకల భూ
రాజ్యముల మట్టుకు మిమ్మును చెదరకొట్టుదునని యె
18 హోవా ఆనతిస్తున్నాడు.। మరిన్ని నా వొడంబడి
కెను మీరిన మనుష్యులకున్ను నా యెదుట దూడను
రెండు తునకలుగా చేసి, ఆ భాగముల మధ్యను జరిగి
వెళ్లినప్పుడు వారు చేసుకొన్న వొడంబడికె చొప్పున
చేయక పోయిన వారికిన్ని, అనగా,। యూదా అధిప 19
తులనున్ను యెరూశలేము అధిపతులనున్ను షండుల
నున్ను అర్చకులనున్ను దూడయొక్క తునకల మధ్య
నుంచి జరిగిపోయిన వారినిన్ని,। నిజముగా వారి శత్రు 20
వులచేతిలోకిన్ని వారి ప్రాణమును వెతికిన వారి చేతి
లోకిన్ని నేను అప్పగింతును; వారి కళేబరములు ఆ
కాశ పక్షులకున్ను భూ మృగములకున్ను ఆహారమ
వును.। అయితే యూదా రాజైన సిద్కీయానున్ను 21
అతని అధిపతులనున్ను వారి శత్రువుల చేతిలోకిన్ని
వారి ప్రాణమును వెతికిన వారి చేతిలోకిన్ని మీ యొ
ద్దనుంచి పైకి వెళ్లిపోయిన బాబెలు సైన్యముయొక్క
రాజు చేతిలోకిన్ని నేను అప్పగింతును.। యెహోవా 22
ఆనతిచ్చేదేమంటే, యిదుగో, నేను ఆజ్ఞాపించి, యీ
పట్టణమునకు వారిని తిరిగీ రప్పింతును, అప్పుడు వారు
దానికి విరోధముగా పోట్లాడి, దాని జయించి, అగ్ని
చేత దాని కాల్చివేతురు; మరిన్ని నేను యూదా పట్ట
ణములను నిర్మనుష్యముగా చేతును.

## 35. అధ్యాయము.

మరిన్ని యూదా రాజైన యెహోయాకీము కుమా 1
రుడగు యోషీయా దినములయందు యెహోవా యొ
ద్దనుంచి ఇర్మీయా యొద్దికి వచ్చిన వాక్యమేమంటే,।
నీవు రెఖాబీయుల యింటికి వెళ్లి, వారితో మాట్లాడి, 2
వారిని యెహోవా మందిరపు గదిలోకి తీసుకొ వచ్చి,
వారికి తాగుటకు ద్రాక్షారసమును యిమ్మని సెలవు
యిచ్చెను.। కాబట్టి నేను హబస్సిన్యాకు పుట్టిన ఇర్మీ 3
యా కుమారుడైన యాజన్యాహునున్ను వాని సహో
దరులనున్ను వాని కుమారులనందరినిన్ని రెఖాబీయుల
యింటి వారినందరినిన్ని పిలుచుకొని,। యెహోవా 4
మందిరమందున్న దైవ జనుడగు ఇగ్దల్యాహు కుమారు
డైన హానాను కుమారుల గదిలోకి తీసుకొ వస్తిని; ఆ
గది ద్వారపాలకుడగు షల్లూము కుమారుడైన మయశే
యా గది పైని వుండెను.। అక్కడ నేను రెఖాబీయుల 5
యింటి కుమారుల ముందర ద్రాక్షా రసముతోటి నిం
డిన కుండలనున్ను పాత్రలనున్ను వుంచి, వారిని చూచి,
ద్రాక్షా రసమును దాగండని చెప్పగా,। వారనిన మాట, 6
మేము ద్రాక్షా రసమును తాగ కూడదు; యేమంటే
మా పితృడైన రెఖాబు కుమారుడగు యెహోనా
దాబు మమ్మును చూచి, మీరైనా మీ పితృలైనా యె
న్నటికీ ద్రాక్షా రసమును తాగక వుండవలెను.। మరిన్ని 7
మీరు యిండ్లను కట్టుకొనక, విత్తనమును విత్తక, ద్రాక్ష
తోటను నాటక వుండవలెను; మీరు పరదేశులుగా
వున్న దేశమందు చాలా దినములు బ్రతికేటట్టు మీ
యావద్దినములను డేరాల యందే గడప వలసినదని మాకు

8 ఆజ్ఞాపించెను. । కాబట్టి మేము మా పితృడైన రేఖాబు
కుమారుడగు యెహోనాదాబు మాకు ఆజ్ఞాపించిన
వాక్యమంతా విని, మేమున్ను మా భార్యలున్ను మా
కుమారులున్ను మా కుమార్తెలున్ను యెప్పుడూ ద్రాక్షా
9 రసమును తాగలేదు. । మరిన్ని మేము కాపురము కొరకు
యిండ్లను కట్టుకొన లేదు; మాకు ద్రాక్షతోట అయి
10 నా పొలము అయినా విత్తనము అయినా లేదు. । యే
మంటే బైట డేరాలలో మేము కాపురము చేస్తూ వుం
టిమి; యీలాగున మేము మా పితృడైన యెహోనా
దాబు మాకు ఆజ్ఞాపించినదంతటి ప్రకారము మేము
11 చేస్తిమి. । అయితే బాబెలు రాజైన నెబూఖద్రెస్సరు
దేశము మీదికి వచ్చినప్పుడు మేము అనుకొనినదేమం
టే, కల్దీయుల సైన్యపు భయమునుంచి మనము యెరూ
శలేము పట్టణములోకి వెళ్లుదాము, లెండి అని అను
కొని, మేము వచ్చి, యెరూశలేముయందు కాపురము
12 వుంటిమని చెప్పిరి.। అప్పుడు యెహోవా యొద్దనుంచి
13 ఇర్మీయా యొద్దికి వచ్చిన వాక్యప్రకారము, । ఇశ్రా
యేలు దేవుడైన సైన్యముల యెహోవా ఆనతిచ్చే
దేమంటే, నీవు వెళ్లి యూదా వారితోనున్ను యెరూ
శలేము కాపురస్తులతోనున్ను యెహోవా ఆనతిచ్చి
నట్టు చెప్పవలసినదేమంటే, నా వాక్యములను వినుటకు
14 మీరు బుద్ధి తెచ్చుకొనరా! । రేఖాబు కుమారుడయిన
యెహోనాదాబు తన పుత్రులతో ద్రాక్షా రసమును
తాగకండి అని ఆజ్ఞాపించిన వాక్యము నెరవేరెను;
యేమంటే నేటి వరకూ వారు ద్రాక్షా రసమును తా
గక, వారి పితృల ఆజ్ఞకు లోపడి వున్నారు; అయితే
నేను వుదయమందే లేచి, మీతోటి చెప్పుతూ వున్న
15 ప్పటికిన్ని మీరు నా వాక్యమును వినరైతిరి. । మరిన్ని
నేను వుదయమందునే లేచి, దీర్ఘదర్శులైన నా సేవ
కులనందరినీ మీ యొద్దికి నేను పంపి, మీరందరున్ను
మీ మీ దుర్మార్గతలను విడిచి, మీ కార్యములను
చక్కపరచుకొని, యితర దేవుండ్లను సేవించుటకు వెం
టాడకండి అనిన్ని, అప్పుడు మీరు మీ పితృలకున్ను
మీకున్ను నేను యిచ్చిన దేశమందు కాపురము చేతు
రనిన్ని, వారిచేత చెప్పించినప్పటికిన్ని మీరు చెవి
నొగ్గనూ లేదు, నా వాక్యమును ఆలకించనూ లేదు. ।
16 రేఖాబు కుమారుడైన యెహోనాదాబు పుత్రులు
తమ పితృడు తమకు ఆజ్ఞాపించిన ఆజ్ఞను గైకొనిరి,
17 అయితే యీ జనులు నా వాక్యమును వినరైరి. । కాబట్టి
ఇశ్రాయేలుకు దేవుడైన సైన్యముల యెహోవా ఆన
తిచ్చేదేమంటే, నేను వారితో చెప్పినప్పటికిన్నీ వారు
వినకనున్ను నేను వారిని పిలిచినప్పటికిన్నీ వారు పలు
కకనున్ను వున్నందుచేత నేను యూదా దేశస్థుల మీ
దికిన్ని యెరూశలేము కాపురస్తులందరి మీదికిన్నీ వారి
మీద విధించిన కీడంతా రప్పింతునని ఆనతిచ్చెనని
చెప్పెను.। అయితే ఇర్మీయా రేఖాబీయుల యింటి వారి 18
తో అనిన మాట, ఇశ్రాయేలుకు దేవుడైన సైన్యముల
యెహోవా ఆనతిచ్చేదేమంటే, మీరు మీ పితృడైన
యెహోనాదాబు ఆజ్ఞను విని, దానికి లోపడి, అతని
బోధలను గైకొని, అతడు మీకు ఆజ్ఞాపించిన అంతటి
ప్రకారము చేస్తిరి గనుక యెన్నటికీ నా ముందర నిలు
చుటకు మనుష్యుడు లేని అవసరము రేఖాబు కుమా
రుడైన యెహోనాదాబుకు లేక వుండునని ఇశ్రాయే
లుకు దేవుడైన యెహోవా ఆనతిచ్చెనని చెప్పెను.

## 36. అధ్యాయము.

యూదా రాజైన యోషీయా కుమారుడగు యె 1
హోయాకీము యొక్క యేలుబడి నాలుగో సంవ
త్సరమందు యెహోవా యొద్దనుంచి ఇర్మీయా యొ
ద్దికి వచ్చిన వాక్యమేమంటే, । నీవు వొక గ్రంథపు 2
చుట్టను తీసుకొవచ్చి, దాని యందు నేను నీతో చెప్పిన
దినమునుంచి, అనగా, యోషీయా దినములనుంచి నేటి
వరకున్ను నీతోటి నేను ఇశ్రాయేలీయులకున్ను యూ
దా వారికిన్ని సకల జనాంగములకున్ను విరోధముగా
చెప్పిన వాక్యములనన్నిటినీ వ్రాయుము. । యూదా 3
యింటి వారికి నేను చేయదలంచిన కీడంతా విని, వా
రందరున్ను తమ తమ దుర్మార్గతను విడుతురేమో;
అది విడిచిరట్టాయెనా నేను వారి అక్రమమునున్ను
పాపమునున్ను క్షమింతునని ఆనతిచ్చెను. । కాబట్టి 4
ఇర్మీయా నేరీయా కుమారుడైన బారూఖును పిలువ
నంపించెను; అప్పుడు యెహోవా ఇర్మీయాతో ఆనతి
చ్చిన వాక్యములన్ని ఇర్మీయా బారూఖుతో చెప్పుతూ
వుండగా, విన్న ప్రకారము బారూఖు ఆ గ్రంథపు
చుట్టయందు వాటిని వ్రాసెను. । అప్పుడు ఇర్మీయా 5
బారూఖుతో సెలవు యిచ్చినదేమంటే, నేను బంధిం
చబడి వున్నాను; యెహోవా మందిరములోకి వెళ్ల
లేను. । కాబట్టి నీవు వెళ్లి, నేను చెప్పుతూ వుండగా 6
నీవు గ్రంథములో వ్రాసిన యెహోవా వాక్యము
లను వుపవాస దినమున యెహోవా మందిరమందు
చదివి, జనులకు వినుపించుము; తమ తమ పట్టణముల
నుంచి వచ్చిన యూదా వారందరికిన్ని వినబడేటట్టు
గా చదువ వలసినది. । వారు యెహోవా సముఖ 7
మందు సాష్టాంగపడి, ప్రార్థనచేసి, అందరున్ను తమ
తమ దుర్మార్గతను విడిచి, తిరిగీ వత్తురేమో; యే
మంటే యీ జనులమీద యెహోవా విధించిన కోప
మున్ను రౌద్రమున్ను బహు ఘోరముగా వున్నదని
చెప్పి పంపెను. । అప్పుడు నేరీయా కుమారుడైన బా 8
రూఖు తనకు దీర్ఘదర్శియైన ఇర్మీయా ఆజ్ఞాపించిన

అంతటి ప్రకారముగా యెహోవా మందిరమందు
యెహోవా వాక్యములుగల పుస్తకమును చదివెను. ।
9 యేమంటే యూదా దేశపు రాజయిన యోషీయా
కుమారుడగు యెహోయాకీము యేలుబడి అయిదో
సంవత్సరపు తొమ్మిదో నెలయందు వారు యెరూశ
లేములో వున్న జనులందరికిన్ని యూదా దేశపు పట్ట
ణములలోనుంచి యెరూశలేముకు వచ్చిన జనులందరి
కిన్నీ యెహోవా ముందర వుపవాసముచేయ వలెనని
10 చాటించిరి. । అప్పుడు బారూఖు యెహోవా మంది
రమందు ఇర్మీయా వాక్యములు గల పుస్తకమును చది
వెను; యెహోవా మందిరపు క్రొత్త ద్వారము పైని
వున్న శాలలో సమాచారలేఖికుడనే షాఫాను కుమా
రుడైన గెమర్యా గదిలో జనులందరున్ను వింటూ వుం
11 డగా చదివెను. । అయితే షాఫానుకు పుట్టిన గెమర్యా
కుమారుడైన మిఖాయ్యా ఆ పుస్తకములో వున్న యె
12 హోవా వాక్యములన్నీ విని, । వాడు రాజు మందిర
మందున్న సమాచార లేఖికుని గదిలోకి వెళ్లెను; అక్కడ
యిదుగో సమాచార లేఖికుడైన ఎలీషామాయున్ను
షెమయా కుమారుడైన దెలాయ్యాయున్ను అక్బోరు
కుమారుడైన ఎల్నాతానున్ను షాఫాను కుమారుడైన
గెమర్యాయున్ను హనన్యా కుమారుడైన సిద్కియా
యున్ను అధిపతులందరున్ను కూర్చుండి వుండిరి. ।
13 అప్పుడు మిఖాయ్యా జనులందరికీ తెలిసేటట్టు బారూ
ఖు పుస్తకమును చదివినప్పుడు తనకు వినబడిన వాక్య
14 ములన్నీ వారితో తెలియ చెప్పెను. । అయినందున
అధిపతులందరున్ను కూషీ కుమారుడైన షెలెమ్యాకు
పుట్టిన నెతన్యా కుమారుడైన యెహూదీని నీవు జనులు
వింటూ వుండగా చదివిన గ్రంథమును చేత పట్టుకొని
రమ్మనుమని బారూఖుతో చెప్పుటకు అతని యొద్దికి
పంపిరి. కాబట్టి నేరీయా కుమారుడయిన బారూఖు
ఆ గ్రంథమును చేత పట్టుకొని, వారందరి యొద్దికి
15 వచ్చెను. । అప్పుడు వారు నీవు కూర్చుండి, దానిని
చదివి, మాకు వినుపించుమని అతనితో చెప్పినందున,
16 వారు వింటూ వుండగా అతడు అది చదివెను.। అయితే
ఆ వాక్యములన్నిటినీ వారు విని, విభ్రాంతిపడి, ఒకరి
నొకరు చూచుకొని, బారూఖుతో అవశ్యముగా మేము
17 యీ మాటలన్నీ రాజుతో చెప్పుదుమని చెప్పి,। మరిన్ని
బారూఖును అడిగినదేమంటే, అతడు చెప్పుతూ వుం
డగా యీ వాక్యములన్నీ యేలాగు వ్రాస్తివి? మాకు
18 తెలియ చెప్పుమని అడిగినందున, । బారూఖు వారితో
అనిన మాట, అతడు తన వాక్కున యీ వాక్యములన్నీ
పలుకుతూ వుండగా నేను సిరాతోటి వాటిని పుస్తక
19 మందు వ్రాస్తినని చెప్పినప్పుడు, । అధిపతులు బారూ
ఖుతో అనిన మాట, నీవున్ను ఇర్మీయాయున్ను వెళ్లి,
దాగి యుండండి; మీరు వుండే స్థలమును యెవనికైన
నా తెలియ చేయకండని చెప్పిరి. । అప్పుడు వారు 20
ఆ గ్రంథమును సమాచార లేఖికుడయిన ఎలీషామా
యొక్క గదిలో దాచి పెట్టి, శాలలో వున్న రాజు
యొద్దికి వచ్చి, ఆ మాటలన్నీ రాజుకు వినుపించిరి. ।
అప్పుడు రాజు గ్రంథమును తెచ్చుటకు యెహూదీని 21
పంపినందున అతడు వెళ్లి, సమాచార లేఖికుడైన ఎలీ
షామాయొక్క గదిలోనుంచి దాని తీసుకొని వచ్చెను;
అప్పుడు రాజున్ను రాజు దగ్గిర వుండే అధిపతులున్ను
వింటూ వుండగా యెహూదీ దానిని చదివెను.। అయితే 22
అప్పుడు రాజు తొమ్మిదో నెలను శీతకాలపు గృహ
మందు కూర్చుండి వుండెను; మరిన్ని అతని ముందర
కుంపటిలో అగ్ని కాలుతూ వుండెను. । అయినందున 23
యెహూదీ మూడు నాలుగు పుటలను చదివినప్పుడు
రాజు చాకును పట్టుకొని, గ్రంథమును కోసి, కుంప
టిలో వేయగానే గ్రంథమంతా కుంపటిలో వున్న
అగ్నివల్ల దహనమాయెను. । అయితే ఆ వాక్యములన్నీ 24
రాజున్ను అతని సేవకులున్ను వినినప్పటికిన్ని దేవునికి
భయపడకనున్ను బట్టలను చించుకొనకనున్ను వుండిరి.।
అయితే ఏల్నాతానున్ను దెలాయ్యాయున్ను గెమ 25
ర్యాయున్ను ఆ గ్రంథమును కాల్చివేయవద్దని రాజును
బతిమాలినప్పటికిన్ని రాజు వినకపోయెను. । మరిన్ని 26
రాజు హమ్మెలెఖు కుమారుడైన యెరహ్మెయేలుకున్ను
అజ్రీయేలు కుమారుడైన శెరాయాకున్ను అబ్దెయేలు
కుమారుడైన షెలెమ్యాకున్ను సమాచార లేఖికుడైన
బారూఖునున్ను దీర్ఘదర్శియైన ఇర్మీయానున్ను పట్టు
కొమ్మని ఆజ్ఞ యిచ్చెను; అయితే యెహోవా వారిని
దాచెను.। అప్పుడు రాజు ఆ గ్రంథమునున్ను బారూ 27
ఖు వ్రాసిన ఇర్మీయా వాక్యములనున్ను కాల్చివేసిన
తరువాత యెహోవా వాక్యము ఇర్మీయా యొద్దికి వచ్చి
చెప్పినదేమంటే, । నీవు మరి యొక గ్రంథపు చుట్టను 28
తీసుకొవచ్చి, దాని యందు యూదా రాజైన యెహో
యాకీము కాల్చివేసిన మొదటి గ్రంథములో వున్న
మాటలన్నీ వ్రాయుము. । మరిన్ని యెహోవా ఆన 29
తిచ్చినట్టు నీవు యూదా రాజైన యెహోయాకీము
తో చెప్పవలసినదేమంటే, బాబెలు రాజు అవశ్యము
గా వచ్చి, యీ దేశమును నాశనముచేసి, దీని యందు
మనుష్యుడైనా మృగమైనా లేకుండా చేసునని దీని
యందు వ్రాసేదేమని చెప్పి, ఆ గ్రంథమును కాల్చి
వేస్తివి. । కాబట్టి యెహోవా యూదా రాజైన యె 30
హోయాకీమును గురించి ఆనతిచ్చేదేమంటే, దావీదు
గద్దెమీద కూర్చుండుటకు అతనికి ఒకడైనా లేక వుం
డును; మరిన్ని అతని కళేబరము పగటియందు యెండకు
న్ను రాత్రియందు మంచుకున్ను పాలౌను. । యేమంటే 31

నేను అతనినిన్ని అతని సంతతినిన్ని అతని సేవకులనున్న
వారి అక్రమము నిమిత్తము శిక్షింతును; వారి కొరకు
కున్ను యెరూశలేము కాపురస్తుల కొరకున్ను యూదా
దేశస్తుల కొరకున్ను నేను విధించిన కీడంతటినీ వారి
మీదికి రప్పింతునని ఆనతిచ్చెను; అయినప్పటికిన్ని వారు
32 ఆలకించలేదు,। కాబట్టి ఇర్మీయా మరి యొక చుట్టను
తీసుకొని వచ్చి, నేరీయా కుమారుడున్ను సమాచార లేఖి
కుడున్ను అయిన బారూఖు చేతికి యిచ్చెను; అతడు
ఇర్మీయా చెప్పుతూ వుండగా యూదా రాజైన యె
హోయాకీము అగ్నిలో కాల్చిన గ్రంథపు వాక్యము
లన్నీ వ్రాసెను; మరిన్ని అలాటి వాక్యములు వాటితో
అనేకముగా అతకబడెను.

## 37. అధ్యాయము.

1 అయితే యోషీయా కుమారుడైన సిద్కియా యె
హోయాకీము కుమారుడైన కొన్యాహుకు మారుగా
రాజ్యమును యేలుతూ వుండెను; యెమంటే బాబెలు
రాజైన నెబూఖద్రెస్సరు అతని యూదా దేశము మీద
2 రాజును చేసెను.। అయితే వీడైనా వీని సేవకులైనా
దేశపు జనులైనా దీర్ఘదర్శియైన ఇర్మీయావల్లను యె
హోవా ఆనతిచ్చిన వాక్యములను ఆలకించ లేదు.।
3 అయితే రాజైన సిద్కియా షెలెమ్యా కుమారుడైన
యెహూఖలునున్ను అర్చకుడైన మయశేయా కుమారు
డగు సెఫన్యానున్ను దీర్ఘదర్శియైన ఇర్మీయా యొ
ద్దికి మా కొరకు మన దేవుడైన యెహోవాను యిప్పుడు
4 ప్రార్థించుమని చెప్పుటకు పంపెను.। యేమంటే అప్ప
టికి వారు ఇర్మీయాను బందీగృహములో వుంచలేదు
గనుక అతడు జనులలో తిరుగులాడుతూ వుండెను.।
5 మరిన్ని అప్పుడు ఫరోయొక్క సైన్యము మిస్రయీము
లోనుంచి యివతలకు వచ్చి వుండెను; మరిన్ని వారి
వర్తమానము యెరూశలేమును గవిసి, కల్దీయులకు విన
బడినప్పుడు వారు యెరూశలేమును విడిచిపోయిరి.।
6 అప్పుడు యెహోవా వాక్యము దీర్ఘదర్శియైన
7 ఇర్మీయా యొద్దికి వచ్చి అనిన లాగు,। ఇశ్రాయేలుకు
దేవుడైన యెహోవా ఆనతిచ్చేదేమంటే, నన్ను అడు
గుటకు నిన్ను పంపిన యూదా రాజుతో చెప్పవలసిన
ప్రకారము, యిదుగో, మీకు సహాయము చేసుటకు
యివతలకు వచ్చిన ఫరోయొక్క సైన్యము వారి స్వదే
8 శమైన మిస్రయీముకు తిరిగీ వెళ్లును.। మరిన్ని కల్దీ
యులు తిరిగీ వచ్చి, యీ పట్టణము మీద యుద్ధము
చేసి, దానిని ఆక్రమించి, అగ్నిచేత కాల్చివేతురు.।
9 యిందుకు యెహోవా ఆనతిచ్చేదేమంటే, కల్దీయులు
మన యొద్దనుంచి నిజముగా తర్లిపోయిరని చెప్పు
కొని, మీరు భ్రమపడకండి, యేమంటే వారు తర్లి
వెళ్లరు.। యేమంటే మీ మీద యుద్ధము చేస్తూ వున్న 10
కల్దీయుల సైన్యమంతటినీ వారిలో గాయము పొందిన
వారు మాత్రమే వుండే మట్టుకు మీరు కొట్టినప్పటి
కిన్ని వారున్ను తమ తమ డేరాలలోనుంచి లేచి వచ్చి,
యీ పట్టణమును అగ్నిచేత కాల్చివేతురని ఆనతిచ్చె
నని చెప్పుమన్న సెలవు యిచ్చెను.। అయినందున కల్దీ 11
యుల సైన్యము ఫరోయొక్క సైన్య భయముచేత యె
రూశలేమునుంచి తర్లి వెళ్లిన తరువాత,। ఇర్మీయా 12
యెరూశలేమును విడిచి, జనుల మధ్యనుంచి రహస్య
ముగా బెన్యామీను దేశమునకు వెళ్లవలసి,। బెన్యా 13
మీను దేశమునకు రాగానే అక్కడ కావలి వారి అధి
పతియైన ఇర్మీయా అనే పేరుగల వాడు వుండెను; వీడు
హనన్యాకు పుట్టిన షెలెమ్యా కుమారుడై వుండెను;
వీడు దీర్ఘదర్శియైన ఇర్మీయాను పట్టుకొని, నీవు
కల్దీయుల తట్టు వెళ్లుతూ వున్నావని చెప్పగా,। ఇర్మీ 14
యా అబద్ధము, నేను కల్దీయుల తట్టు వెళ్ల లేదని చెప్పి
నప్పటికిన్ని వీడు వాని మాటను చెవిబెట్టక వుండెను;
కాబట్టి ఇరీయా ఇర్మీయాను పట్టుకొని, అధిపతుల
యొద్దికి కొంచువచ్చెను.। అయినందున అధిపతులు ఇర్మీ 15
యా మీద కోపపడి, అతని కొట్టి, సమాచార లేఖికు
డైన యోనాతానుయొక్క యింటిలో, అనగా, బందీ
గృహములో వుంచిరి; యేమంటే వారు ఆ యింటిని
బందీగృహముగా చేసిరి.। అయితే ఇర్మీయా అక్కడికి 16
వచ్చి, కారాగృహమందున్న యిరుకు గదులలోనున్ను
చాలా దినములు వుండెను.। తరువాత రాజైన సిద్కియా 17
దానిలోనుంచి అతని పిలువనంపించెను; అప్పుడు రాజు
తన యింట్లోకి అతని రహస్యముగా పిలుచుకొని, యె
హోవా వాక్యము యేదైనా నీ యొద్దికి వచ్చి యు
న్నదా, అని అడగగానే, ఇర్మీయా అవును, అది యే
మంటే, మీరు బాబెలు రాజు చేతికి అప్పగించపడు
దురని అతనితో చెప్పెను.। మరిన్ని ఇర్మీయా రాజైన 18
సిద్కియాతోటి చెప్పినదేమంటే, మీకైనా మీ సేవ
కులకైనా యీ జనులకైనా నేను యేమి పాపము చేస్తిని
గనుక మీరు నన్ను బందీగృహములో వుంచితిరి?। బా 19
బెలు రాజు మీ మీదికైనా యీ దేశము మీదికైనా
రాక వుండునని భవిష్యత్తుగా పలికిన మీ దీర్ఘద
ర్శులు యిప్పుడు యెక్కడ వున్నారు!। కాబట్టి ఓ నా 20
కర్తవైన రాజా, మీరు దయచేసి, యిప్పుడు నా మాట
వినండి; నేను చేసుకొనిన మనవి మీరు అంగీకరించి,
దయచేసి, నేను అక్కడ మరణము కాకుండా సమా
చార లేఖికుడైన యోనాతాను యింటికి నన్ను తిరిగీ
పంపించకండని వేడుకొనినందున,। రాజైన సిద్కియా 21
బందీగృహ శాలలో ఇర్మీయాను వుంచి పట్టణమందున్న
ఆహారమంతా సరిపడే పర్యంతము ప్రతి రోజునా

రొట్టె కాల్చే వారి వీధిలోనుంచి రొట్టె ముక్క తెచ్చి
అతనికి యియ్యండని ఆజ్ఞ యిచ్చెను. యీలాగున
ఇర్మీయా బందీగృహపు శాలలో వుండిపోయెను.

## 38. అధ్యాయము.

1 అయితే మత్తాను కుమారుడైన షెఫటీయాయున్ను
పష్హూరు కుమారుడైన గెదల్యాయున్ను షెలెమ్యా కుమా
రుడైన యూఖలున్ను మల్కీయా కుమారుడైన పష్హూ
రున్ను ఇర్మీయా జనులందరితో చెప్పిన మాటలను వినిరి.।
2 యేమంటే యెహోవా ఆనతిచ్చినట్టు చెప్పిన మాట
యీ పట్టణమందు వుండి పోయిన వాడు కత్తిచేతనున్ను
క్షామముచేతనున్ను తెగులుచేతనున్ను మరణమౌను;
అయితే కల్దీయులలోకి పోయిన వాడు బ్రతుకును;
3 ప్రాణమును తప్పించుకొని అతడు బ్రతుకును.। యే
మంటే యీ పట్టణము అవశ్యముగా బాబెలు రాజు
సైన్యము చేతికి దొరుకును; వాడు దానిని పట్టుకొనునని
యెహోవా ఆనతిచ్చెనని చెప్పిన వాని మాటలను ఆ
యధిపతులు విని, రాజుతో మనవి చేసినదేమంటే,।
4 యీ మనుష్యుడు జనులతో యీలాటి మాటలను చెప్పి,
యీ పట్టణమందు శేషించిన ఆయుధస్థులనున్ను జను
లనందరినిన్ని అధైర్యపరుస్తూ వున్నాడు; యేమంటే
యితడు యీ జనుల క్షేమము కోరక, వారి నష్టమును
కోరి వున్నాడు; కాబట్టి వీనిని చంప వలసినదని వేడు
5 కొనినందున,। రాజైన సిద్కీయా వారితో అనిన మాట,
యిదుగో వాడు మీ చేతిలోనే వున్నాడు; రాజు
మీకు విరోధముగా యేమైనా చేయడని చెప్పెను.।
6 కాబట్టి వారు ఇర్మీయాను పట్టుకొని, బందీగృహపు
శాలలో వున్న హమ్మెలెఖు కుమారుడైన మల్కీయా
కారాగృహములో అతనిని వేసిరి; అయితే వారు ఇర్మీ
యాను తాళ్లతోటి దించిరి; ఆ కారాగృహములో నీళ్లు
లేవు, అయితే బురద మాత్రమే వుండెను, గనుక ఇర్మీ
7 యా బురదలో దిగబడెను.। అయితే రాజు యింట్లో
వున్న షండులలో వొకడు, అనగా, కుషు దేశపు వాడైన
ఎబెద్మెలెఖుకు వారు ఇర్మీయాను కారాగృహములో
దించిన సంగతి వినబడెను; అప్పుడు రాజు బెన్యా
8 మీను ద్వారమందు కూర్చుని వుండెను.। కాబట్టి ఎబె
ద్మెలెఖు రాజు యింట్లోనుంచి బయిలు వెళ్లి, రాజు
9 యొద్దకి వచ్చి, చెప్పినదేమంటే,। కర్తయైన ఓ రాజా,
ఆ మనుష్యులు దీర్ఘదర్శియైన ఇర్మీయాను కారాగృ
హములో వేసి, వానికి చాలా కీడు చేసిరి; యేమంటే
పట్టణమందు రొట్టెలు లేవు; కాబట్టి అతడు వున్న
స్థలమందు మరణముకు సమీపించి వున్నాడని చెప్పి
0 నందున,। రాజు కుషు వాడైన ఎబెద్మెలెఖుకు సెలవు
యిచ్చినదేమంటే, యిక్కడనుంచి నీవు ముప్పైమందిని
తీసుకొని వెళ్లి, దీర్ఘదర్శియైన ఇర్మీయాను అతడు
మరణము కాక మునుపు కారాగృహములోనుంచి
పయికి తీయించుమని సెలవు యివ్వగా,। ఎబెద్మెలెఖు 11
ఆ ముప్పైమందినీ తీసుకొని, రాజు యింటి కింద
ఖజానా వుంచిన స్థలములోకి వెళ్లి, అందులోనుంచి
తీసివేసిన పాత బట్టలనున్ను చింకి గుడ్డలనున్ను పట్టుకొ
వెళ్లి, కారాగృహములో వున్న ఇర్మీయా యొద్దకి తాళ్ల
చేత వాటిని దించెను.। అప్పుడు కుషీయుడైన ఎబెద్మె 12
లెఖు ఇర్మీయాతో అనిన మాట, తీసివేసిన యీ పాత
గిలిన బట్టలున్ను చింకి గుడ్డలున్ను తాళ్ల మీద పెట్టి,
నీ చంకల కింద వుంచుకొమ్మని చెప్పినందున, ఇర్మీయా
ఆలాగు చేసెను.। అప్పుడు వారు తాళ్లతోటి ఇర్మీ 13
యాను కారాగృహములోనుంచి మీదికి యెత్తిరి; తరు
వాత ఇర్మీయా బందీగృహపు శాలలో వుండెను.।
అప్పుడు రాజైన సిద్కీయా దీర్ఘదర్శియైన ఇర్మీ 14
యాను యెహోవా మందిరపు మూడో ద్వారములోకి
పిలువనంపించిన తరువాత రాజు ఇర్మీయాతో అనిన
మాట, నిన్ను వొకటి అడుగుదును, యేదైనా నాకు
మరుగు చేయ వద్దు అని అనగా,। ఇర్మీయా సిద్కీయాను 15
చూచి, నేను యేదైనా చెప్పితే నన్ను చంపుదువేమో;
నీకు నేను ఆలోచన చెప్పితే నీవు ఆలకింతువా? అని
చెప్పినప్పుడు,। రాజైన సిద్కీయా నేను నిన్ను చంపను, 16
మరిన్ని నీ ప్రాణమును వెతికిన వారి చేతికి నిన్ను
అప్పగించను; యిందుకు మనకు జీవాత్మను కలుగచేసిన
యెహోవా తోడు అని ఇర్మీయాతో యేకాంత
ముగా ప్రమాణము చేసెను.। అప్పుడు ఇర్మీయా సిద్కీ 17
యాతో అనిన మాట, ఇశ్రాయేలుకు దేవుడున్ను సైన్య
ములకు దేవుడున్ను అయిన యెహోవా ఆనతిచ్చేదే
మంటే, బాబెలు రాజు కింద వున్న అధిపతుల శరణు
చొచ్చుటకు నీకు మనస్సు వుంటే అవశ్యము నీ ప్రా
ణము నిలుచును; మరిన్ని యీ పట్టణము కాలకుండా
వుండును; నీవున్ను నీ యింటివారున్ను బ్రతుకుదు
రు.। అయితే బాబెలు రాజు కింద వున్న అధిపతుల 18
శరణు చొచ్చుటకు నీకు మనస్సు లేని పక్షమందు
యీ పట్టణము కల్దీయుల చేతికి దొరుకును; వారు
దానిని అగ్నిచేత కాల్చివేతురు; నీవు వారి చేతిలో
నుంచి తప్పించుకోలేకపోదువని ఆనతిచ్చెనని చెప్పిన
ప్పుడు,। రాజైన సిద్కీయా ఇర్మీయాతో అనిన మాట, 19
యూదులలో కొందరు కల్దీయుల తట్టు తిరిగిరి; వీరు
నన్ను వారి చేతిలోకి అప్పగించిన తరువాత వారు
నన్ను అపహసింతురేమోయని నేను భయముగా వున్నా
నని అనెను.। అందుకు ఇర్మీయా వారు మిమ్మును అప్ప 20
గించరు; నేను మీతో చెప్పిన యెహోవా వాక్య
మును విని లోపడండి; నేను కోరినట్టు మీరు చేస్తే

మీరు బాగా వుందురు; మీ ప్రాణము నిలుచును. ।
21 శరణు చొరని పక్షమందు యెహోవా నాకు అగు
22 పర్చిన వాక్యము యిదే; । మరిన్ని యూదా రాజు
యింట్లో శేషించిన స్త్రీలందరున్ను బాబెలు రాజు కింద
వున్న అధిపతుల యొద్దికి కొంచుపోపడి, వారు మిమ్ము
ను చూచి, మీ స్నేహితులు మీ మీద బడి మిమ్మును
జయించిరి; మీ కాళ్లు బురదలో దిగబడి వెనుకకు
23 జారినవని అందురు. । ఆలాగున వారు మీ భార్యలనం
దరినిన్ని మీ బిడ్డలనున్ను కల్దీయుల యొద్దికి తీసుకొ
వత్తురు; మీరున్ను వారి చేతిలోనుంచి తప్పించుకో
లేకపోదురు; బాబెలు రాజు చేతికి మీరు దొరుకు
దురు; మరిన్ని యీ పట్టణము అగ్నిచేత కాల్చుటకు
మీరే హేతువై వుందురని అతనితో చెప్పినప్పుడు, ।
24 సిద్కీయా యెవనికైనా యీ మాటలను చెప్పకపోతే
25 నీవు మరణమును పొందక వుందువు. । అయితే నేను
నీతోటి మాట్లాడిన సంగతి అధిపతులకు వినబడితే
వారు నీ యొద్దికి వచ్చి, నీ ప్రాణమును మేము రక్షిం
తుము, రాజుతోటి నీవు చెప్పిన మాటలను యేమైనా
మరుగుచేయక మాతో తెలియ చెప్పుము; మరిన్ని రాజు
నీతోటి చెప్పిన మాటలనున్ను తెలియ చెప్పుమని వారు
26 అడుగ వచ్చిరట్టాయెనా, । నీవు యోనాతాను యింట్లో
నేను మరణము పొందుటకు రాజు నన్ను తిరిగీ అక్క
డికి పంపించకుండా మనవి చేసుకొనుటకు రాజు యొ
ద్దికి వెళ్లితినని వారితో చెప్పవలసినదని బోధపచిః
27 అతనితో పలికెను. । కాబట్టి అధిపతులందరున్ను ఇర్మీ
యా యొద్దికి వచ్చి అడిగినప్పుడు, అతడు రాజు ఆజ్ఞా
పించిన మాటలన్నిటి ప్రకారము వారితో అనెను;
అప్పుడు వారు అతనితో మాట్లాడుట చాలించిరి, యే
28 మంటే ఆ సంగతి బైలుపడ లేదు. । అయితే ఇర్మీయా
యెరూశలేము పట్టుపడే పర్యంతమూ బందీగృహపు
శాలలో వుండెను; యెరూశలేము పట్టుబడినప్పుడు
అతడు అక్కడ వుండెను.

## 39. అధ్యాయము.

1 యూదా రాజైన సిద్కీయా యేలుబడి తొమ్మిదో
సంవత్సరము పదో నెలలో బాబెలు రాజైన నెబూఖ
ద్రెన్సరున్ను అతని సైన్యమంతాయున్ను యెరూశ
2 లేము మీదికి వచ్చి దానిని గవిసిరి. । మరిన్ని సిద్కీ
యా యేలుబడి పదకొండో సంవత్సరము నాలుగో
నెల తొమ్మిదో దినమున పట్టణపు ప్రాకారములు పగ
3 లకొట్టబడినందున, । బాబెలు రాజు కింద వున్న అధి
పతులందరు, అనగా, నేర్గల్షరేస్సెరున్ను సమ్గర్నెబో
యున్ను శర్సెఖీమున్ను రబ్సారీసున్ను నెర్గల్షరేస్సె
రున్ను రబ్మాగున్ను శేషించిన బాబెలు రాజు కింద వున్న
అధిపతులున్ను లోపలికి ప్రవేశించి, మధ్య ద్వార
మందు కూర్చుండి వుండిరి. । అప్పుడు యూదా రాజైన 4
సిద్కీయాయున్ను ఆయుధస్థులందరున్ను వారిని చూచి
పారిపోయిరి; యేలాగంటే పట్టణములోనుంచి రాత్రి
బైలు వెళ్లి, రెండు గోడల సందున వున్న ద్వారములో
బడి, అనగా, రాజు తోట మార్గమున పారిపోయిరి;
అతడు మైదానపు భూమి మార్గము చేత పారిపోయె
ను. । అయితే కల్దీయుల సైన్యము వారిని తరిమి, యెరి 5
ఖో మైదానపు భూమియందు సిద్కీయాను కదిసెను;
వీరు అతనిని పట్టుకొని, హమాతు దేశమందున్న రిబ్లా
పట్టణమునకు కొంచు వచ్చి, బాబెలు రాజైన నెబూ
ఖద్రెన్సరుకు అప్పగించిరి; అక్కడ అతడు ఆయనకు
ఆజ్ఞ విధించెను. । అంతట బాబెలు రాజు రిబ్లా పట్టణ 6
మందు సిద్కీయా కుమారులను అతని కన్నుల ముందర
హతము చేయించెను; మరిన్ని బాబెలు రాజు యూదా
శ్రేష్ఠులనందరినిన్ని హతము చేయించెను. । మరిన్ని అత 7
డు సిద్కీయా కన్నులను వూడతీయించి, బాబెలు పట్ట
ణమునకు అతని తీసుకొ పోవుటకు రెండు సంకెళ్లతో
బంధించెను. । అయితే కల్దీయులు రాజు యింటినిన్ని 8
జనుల యిండ్లనున్ను అగ్నిచేత కాల్చివేసి, యెరూశ
లేము ప్రాకారములను కింద పడదోసిరి. । అప్పుడు 9
తలవర్లకు అధిపతియైన నెబూజరదాను పట్టణమందు
శేషించిన జనులనున్ను శేషించిన వారిలో అతని, అన
గా బాబెలు రాజును, శరణు జొచ్చిన వారినిన్ని బాబె
లుకు చెరగా కొంచుపోయెను. । అయితే తలవర్లకు 10
అధిపతియైన నెబూజరదాను జనులలో లేమిడివారు,
అనగా, దరిద్రులలో కొందరిని యూదా దేశమందు
వుండనిచ్చి, ఆ దినమందు వారికి ద్రాక్ష తోటలనున్ను
పొలములనున్ను యిచ్చెను. । అయితే బాబెలు రాజైన 11
నెబూఖద్రెన్సరు తలవర్లకు అధిపతియైన నెబూజ
రదానుకు ఇర్మీయాను గురించి ఆజ్ఞాపించినదేమంటే, ।
నీవు అతని నీ వశముగా వుంచుకొని, అతనికి యే మో 12
సమైనా చేయక, అతని పరామర్శించి, అతడు నీ తోటి
చెప్పినట్టు చేయుమని సెలవు యిచ్చెను. । ఆలాగున తల 13
వర్లకు అధిపతియైన నెబూజరదానున్ను నెబూష
జ్బానున్ను రబ్సారీసున్ను నెర్గల్షరేస్సెరున్ను రబ్మా
గున్ను బాబెలు రాజు కింద వున్న అధిపతులందరున్ను
బందీగృహపు శాలలోనుంచి ఇర్మీయాను పిలువనంపిం
చి, । షాఫానుకు పుట్టిన అహీకాము కుమారుడైన గెద 14
ల్యా వశముచేసి, అతని యింటికి తీసుకొ పొమ్మని అత
నికి ఆజ్ఞ యిచ్చిరి; అయినందున అతడు జనులలో
కాపురము చేసెను. । అయితే ఇర్మీయా బందీగృహపు 15
శాలలో వున్నప్పుడు యెహోవా వాక్యము అతని
యొద్దికి వచ్చి అనిన మాట, । నీవు వెళ్లి ఇశ్రాయేలుకు 16

దేవుడైన సైన్యముల యెహోవా ఆనతిచ్చినట్టు కూషీ
యుడైన ఎబెద్మెలెకుతో చెప్పవలసినదేమంటే, యిదు
గో యీ పట్టణము మీదికి నేను మేలు కొరకు గాక
కీడు కొరకు నా వాక్యములను రప్పింతును; అవి నీ
17 కండ్ల ముందరనే ఆ దినమందు నెరవేరును. । అయితే
యే మనుష్యులకు నీవు భయముగా వుంటివో వారికి
నీవు దొరకకుండా ఆ దినమందు నేను నిన్ను విడిపిం
18 తును. । నీవు నా యందు నమ్మిక వుంచితివి గనుక నేను
నిన్ను విడిపింతును; నీవు కత్తిచేత పడక, ప్రాణమును
తప్పించుకొందువని యెహోవా ఆనతిచ్చెనని చెప్పు
మన్న సెలవు యిచ్చెను.

## 40. అధ్యాయము.

1 అయితే యెరూశలేమునుంచిన్ని యూదానుంచిన్ని
బాబెలుకు చెరకొంచుపోయిన వారందరిలో సంకెళ్ల
చేత బంధించబడిన ఇర్మీయాను తలవర్లకు అధిపతి
యైన నెబూజరదాను పిలువనంపించి, రామా పట్టణ
మందు అతని విముక్తి పర్చిన తరువాత యెహోవా
2 యొద్దనుంచి ఇర్మీయా యొద్దికి వాక్యము వచ్చెను. । తల
వర్ల అధిపతి ఇర్మీయాను పిలిచి, అతనితో అనిన
మాట, నీ దేవుడైన యెహోవా యీ స్థలము మీద
3 యింత కీడును విధించెను. । యేమంటే మీరు యెహో
వా వాక్యమును ఆలకించక, ఆయనకు విరోధముగా
పాపము చేస్తిరి, గనుక తాను చెప్పిన ప్రకారముగా
ఆ కీడును మీ మీదికి రప్పించి, మిమ్మును ఆయన యింత
4 శ్రమపరిచెను. । యిదుగో నేటిరోజున నేను నీ చేతు
లను వున్న సంకెళ్లను విప్పితిని; నీకు అనుకూలమైతే
నాతో కూడా బాబెలుకు రావచ్చును; నీ మీద నా
నేత్రములను వుంతును; అయితే నా తోటి బాబెలుకు
వచ్చుటకు నీకు అనుకూలము కాకపోతే రా వద్దు;
యిదుగో దేశమంతా నీ ముందర వున్నది; నీకు యే
స్థలమునకు వెళ్లుటకు అనుకూలమో ఆ స్థలమునకే వెళ్లు
5 మని చెప్పెను. । అయితే అతడు యింకా తర్లక ముందే
అతనితో మరిన్ని చెప్పినదేమంటే, షాఫానుకు పుట్టిన
అహీకాము కుమారుడైన గెదల్యా యొద్దికి, అనగా,
బాబెలు రాజు యూదా పట్టణముల మీద అధికారి
గా నిర్ణయించిన వాని యొద్దికి నీవు తిరిగీ వెళ్లి, జను
లలో అతని యొద్ద కాపురమైనా చేయుము; లేక నీకు
యే స్థలము అనుకూలముగా కనుపడునో అక్కడికైనా
వెళ్లి వుండుమని చెప్పెను; ఆలాగునే తలవర్ల అధి
పతి అతనికి ప్రయాణపు బత్తెమునున్ను బహుమానము
6 నున్ను యిచ్చి సెలవు యిచ్చెను. । అప్పుడు ఇర్మీయా
మిస్పెలో వున్న అహీకాము కుమారుడైన గెదల్యా
యొద్దికి వెళ్లి, దేశమందు విడువబడిన వారితో కలిసి,
అతని యొద్ద కాపురము చేసెను. । అయితే బాబెలు 7
రాజు అహీకాము కుమారుడైన గెదల్యాను దేశము
మీద అధికారినిగా చేసి, బాబెలు దేశముకు చెర
కొంచుపో పడనటువంటి దేశమందుండే దరిద్రులను
న్ను పురుషులనున్ను స్త్రీలనున్ను పిల్లలనున్ను అతని
వశము చేసిన సంగతి బైట భూములలో వున్న సైన్యా
ధిపతులకున్ను వారి తరుపున వున్న వారికిన్ని వినపడి
నప్పుడు, । వాడు, అనగా, నెతన్యా కుమారుడయిన 8
ఇష్మాయేలున్ను కారేయహు కుమారుడైన యోహానా
నున్ను యోనాతానున్ను తన్హుమేతు కుమారుడైన శెరా
యాయున్ను నెథోఫాతీయుడైన ఏఫైయొక్క కుమా
ళ్లున్ను మయఖాతీయుని కుమారుడైన యెజన్యాయు
న్ను వీరున్ను వీరి సంబంధీకులున్ను మిస్పెలో వున్న
గెదల్యా యొద్దికి వచ్చిరి. । అప్పుడు షాఫానుకు పుట్టిన 9
అహీకాము కుమారుడైన గెదల్యా ప్రమాణము చేసి,
వారితో చెప్పినదేమంటే కల్దీయుల సేవ చేసుటకు
భయపడకండి; దేశమందు కాపురము చేసిన బాబెలు
రాజుకు సేవ చేయండి; అప్పుడు మీరు బాగా వుం
దురు. । అయితే యిదుగో నేను మిస్పెలో కాపురము 10
చేసి, మన యొద్దికి వచ్చే కల్దీయులకు సేవ చేతును;
మీరు వెళ్లి ద్రాక్షా రసమునున్ను పండిన పండ్లనున్ను
తయిలమునున్ను కూర్చి, వాటిని మీ పాత్రలలో
వుంచుకొని, మీరు జయించిన వూళ్లలో కాపురము
చేయండని బోధపరచెను. । మరిన్ని మోయాబు యం 11
దున్ను అమ్మోనీయుల దేశమందున్ను ఎదోము దేశ
మందున్ను అన్య దేశములన్నిటి యందున్ను వున్న యూ
దైయులందరున్ను బాబెలుకు రాజు యూదైయుల
లో కొందరిని వుంచి, వారి మీద షాఫానుకు పుట్టిన
అహీకాము కుమారుడైన గెదల్యాను అధిపతిగా నిర్ణ
యించెనని వినినప్పుడు, । ఆ యూదైయులందరున్ను 12
యే స్థలములలోకి తోలివేయబడిరో ఆ స్థలములలో
నుంచి తిరిగీ యూదా దేశపు మిస్పెలో వున్న గెదల్యా
యొద్దికి వచ్చి, విస్తారముగా ద్రాక్షా రసమునున్ను పం
డిన పండ్లనున్ను కూర్చుకొనిరి. । అయితే కారేయహు 13
కుమారుడైన యోహానానున్ను బైట భూములలో వున్న
సైన్యాధిపతులందరున్ను మిస్పెలో వున్న గెదల్యా
యొద్దికి వచ్చి, । అతని చూచి, అమ్మోనీయుల రాజైన 14
బయలీసు నెతన్యా కుమారుడైన ఇష్మాయేలును నిన్ను
చంపుటకు పంపెనని నీకు తెలుసునా? అని అడిగిరి;
అయితే అహీకాము కుమారుడైన గెదల్యా వారి మాట
నమ్మలేదు. । తరువాత కారేయహు కుమారుడైన యో 15
హానాను మిస్పెలో వున్న గెదల్యాతో ఏకాంతముగా
అనిన మాట, నీకు అనుకూలమైతే నన్ను వెళ్లనిమ్ము; నెత
న్యా కుమారుడైన ఇష్మాయేలును యెవరికీ తెలియ

కుండా చంపుదును; నీ యొద్దికి చేరిన యూదైయులంద
రున్ను చెదిరేటట్టుగానున్ను యూదా యందు శేషిం
చిన జనులందరున్ను నాశనమయ్యేటట్టుగానున్ను అత
16 డు నిన్ను చంపనేల అని చెప్పినప్పుడు, । అహీకాము
కుమారుడైన గెదల్యా కారేయహు కుమారుడైన యో
హానానుతో అనిన మాట, నీవు ఇష్మాయేలును గురించి
అబద్ధమును పలికితివి గనుక ఆ క్రియ చేయకూడదని
చెప్పెను.

## 41. అధ్యాయము.

1 అయితే యేడో నెలలో రాజ సంతతియైన ఎలీ
షామాకు పుట్టిన నెతన్యా కుమారుడైన ఇష్మాయేలున్ను
రాజు కింద వున్న పదిమంది అధిపతులున్ను మిస్పెలో
వున్న అహీకాము కుమారుడైన గెదల్యా యొద్దికి వచ్చి,
అక్కడనే అనగా మిస్పెలో అతనితో భుజించిరి. ।
2 అంతట నెతన్యా కుమారుడైన ఇష్మాయేలున్ను అతని
తో కూడిన పదిమందిన్ని లేచి, షాఫానుకు పుట్టిన
అహీకాము కుమారుడైనటువంటిన్ని బాబెలు రాజు
దేశము మీద అధికారిగా నిర్ణయించినటువంటిన్ని
3 గెదల్యాను కత్తిచేత నరికి చంపిరి. । మరిన్ని ఇష్మాయేలు
మిస్పెలో గెదల్యాయొద్ద వున్న యూదైయులనందరి
నిన్ని అక్కడ దొరికిన కల్దీయులనున్ను ఆయుధస్థుల
4 నున్ను హతము చేసెను. । అయితే అతడు గెదల్యాను
చంపిన మరునాడు యింకా ఆ సంగతి యొవరికీ తెలి
5 యనందున కొందరు, । అనగా, యెనభైమంది గడ్డములు
క్షౌరము చేయించుకొని, బట్టలను చించుకొని, తమ్మును
తాము పొడుచుకొని, షెఖెమునుంచిన్ని షీలోనుం
చిన్ని షోమ్రోనులోనుంచిన్ని అర్పణలనున్ను ధూ
పమునున్ను చేత పట్టుకొని, యెహోవాకు అర్పిం
6 చుటకు మందిరమునకు వస్తూ వుండగా, । నెతన్యా
కుమారుడైన ఇష్మాయేలు మిస్పెలోనుంచి వారిని యెదు
ర్కొనుటకు బైలువెళ్లి, దారి పొడుగున యేడుస్తూ
వస్తూ వుండెను; అతడు వారిని యెదుర్కొని, వారిని
చూచి అహీకాము కుమారుడైన గెదల్యా యొద్దికి మీ
7 రు రండని పిలచినందున, । వారు పట్టణములోకి రా
గానే నెతన్యా కుమారుడైన ఇష్మాయేలు వారినిన్ని
8 వారితో వచ్చిన వారినిన్ని చంపి గోత వేసెను. । అయి
తే వారిలో పదిమంది ఇష్మాయేలుతో చెప్పినదేమంటే,
మమ్మును చంపవద్దు; పొలములో మాకు గోధుములు
న్ను యవలున్ను తైలమున్ను తేనెయున్ను కలిగియు
న్నవి, అని చెప్పినందున, అతడు వారి సహోదరుల
9 మధ్యను వారిని చంపక వుండెను. । అయితే ఇష్మాయేలు
గెదల్యా నిమిత్తము తాను చంపిన వారి కళేబరములను
పడవేసిన గొయ్యి ఇశ్రాయేలుకు రాజైన బయషాను
గూర్చిన భయముచేత రాజైన ఆసా చేయించిన గొ
య్యి అయి వుండెను; నెతన్యా కుమారుడైన ఇష్మాయేలు
హతమైన వారితో దాని నింపెను. । అప్పుడు ఇష్మా 10
యేలు మిస్పె పట్టణమందున్న తతిమ్మా వారిని, అనగా,
రాజు కుమార్తెలనున్ను తలవర్లకు అధిపతియైన
నెబూజరదానును అహీకాము కుమారుడైన గెదల్యా
వశముచేసి, మిస్పెయందున్న జనులందరినిన్ని చెర తీసు
కొ పోయెను; వీరిని నెతన్యా కుమారుడైన ఇష్మాయేలు
చెర తీసుకొని, అమ్మోనీయులలోకి వెళ్లుటకు తర్లిపో
యెను. । అయితే కారేయహు కుమారుడైన యోహా 11
నానుకున్ను అతనితో గూడిన సైన్యాధిపతులందరికిన్ని
నెతన్యా కుమారుడైన ఇష్మాయేలు చేసిన కీడంతా విన
బడినప్పుడు, । వారు తమ వారినందరిసిన్ని తీసుకొని, 12
నెతన్యా కుమారుడైన ఇష్మాయేలుతో పోట్లాడుటకు
వెళ్లి, గిబోనులో వున్న గొప్ప వుదకముల దగ్గిర అతని
కనిరి. । అయితే ఇష్మాయేలు యొద్దవున్న జనులందరున్ను 13
కారేయహు కుమారుడైన యోహానానున్ను అతనితో
కూడిన సైన్యాధిపతులనున్ను చూచి బహుగా సంతో
షించిరి. । ఆలాగున ఇష్మాయేలు చేత మిస్పెలోనుంచి 14
చెర కొంచుపోబడిన జనులందరున్ను ముఖములు తిప్పు
కొని, కారేయహు కుమారుడైన యోహానాను తట్టు
తిరిగి వచ్చిరి. । అయితే నెతన్యా కుమారుడైన ఇష్మా 15
యేలు యెనమండ్రుతోటి యోహానాను యొద్దనుంచి
తప్పించుకొని, అమ్మోనీయులలోకి వెళ్లెను. । అయితే 16
నెతన్యా కుమారుడైన ఇష్మాయేలు అహీకాము కుమా
రుడైన గెదల్యాను చంపిన తరువాత, కారేయహు
కుమారుడైన యోహానానున్ను అతనితో కూడిన సైన్యా
ధిపతులున్ను కల్దీయులకు భయపడి, ఇష్మాయేలు యొద్ద
నుంచి విడిపించి, గిబోనునుంచి మిస్పెకు తిరిగీ తెప్పించి
నటువంటి జనులందరినిన్ని, అనగా, స్త్రీలనున్ను పిల్లల
నున్ను షండులనున్ను తీసుకొని, । మిస్రయీముకు వెళ్లే 17
మార్గమందున్న బేత్లెహేము యొద్ద వున్న కింహాముకు
వచ్చి కాపురము చేసిరి. । యేమంటే నెతన్యా కుమారు 18
డైన ఇష్మాయేలు బాబెలు రాజు దేశము మీద అధికా
రిగా నిర్ణయించిన అహీకాము కుమారుడైన గెద
ల్యాను చంపినందున వారు కల్దీయులకు భయముగా
వుండిరి.

## 42. అధ్యాయము.

అప్పుడు సైన్యాధిపతులందరున్ను కారేయహు 1
కుమారుడైన యోహానానున్ను హోషయా కుమారు
డైన యెజన్యాయున్ను పిన్నలు మొదలుకొని పెద్దల
పర్యంతమూ జనులందరున్ను దీర్ఘదర్శియైన ఇర్మీయా
యొద్దికి వచ్చి చెప్పినదేమంటే, । మా మనవి నీవు అంగీ 2

కరించి, మేము నడవవలసిన మార్గమునున్ను చేయ
వలసిన క్రియయున్ను మాకు అగుపచేటట్టు నీవు మా
కొరకున్ను శేషించిన వీరందరి కొరకున్ను నీ దేవుడైన
3 యెహోవాను ప్రార్థించుము. । యేమంటే నీ కన్నుల
తో చూస్తూ వున్నావు; చాలా మందిగా వున్న మేము
4 కొద్దిగా వున్నాము అని అనగానే, । దీర్ఘదర్శియైన
ఇర్మీయా వారితో అనిన మాట, మీరు చెప్పిన దానిని
నేను వింటిని; యిదుగో మీరు కోరినట్టు నేను మీ
దేవుడైన యెహోవాను ప్రార్థింతును; మరిన్ని
మీకు యెహోవా యే ప్రత్యుత్తరము దయచేసునో
అది నేను యెంత మాత్రమూ మరుగు చేయక మీతో
5 తెలియ చెప్పుదునని చెప్పగా, । వారు ఇర్మీయాతో
అనిన మాట, నీ దేవుడైన యెహోవా నీ చేత మా
యొద్దికి పంపే వాక్యములన్నిటి ప్రకారము మేము
చేయకపోయిన పక్షమందు యెహోవా మన మధ్యను
6 సత్యము గల యథార్థ సాక్షి అవును గాక. । యెవని
యొద్దికి మేము నిన్ను పంపితిమో మన దేవుడైన ఆ
యెహోవా వాక్యమువల్ల మాకు మేలు గలిగినా కీడు
గలిగినా మేము దానిని విని అందుకు లోబడి వుం
7 దుమని అనిరి. । అయితే యిది సంభవించిన పది దిన
ముల తరువాత యెహోవా వాక్యము ఇర్మీయా యొ
8 ద్దికి వచ్చెను. । అప్పుడు అతడు కారేయహు కుమా
రుడైన యోహానానున్ను అతనితో గూడిన సైన్యాధి
పతులనున్ను పిన్నలు మొదలుకొని పెద్దల పర్యంతము
న్ను జనులనందరినిన్ని పిలువనంపించి వారితో అనిన
9 మాట, । యెవరి సన్నిధికి మీ మనవి చెప్పుటకు మీరు
నన్ను పంపితిరో ఆ ఇశ్రాయేలుకు దేవుడైన యెహో
10 వా ఆనతిచ్చేదేమంటే, । మీరు యింకా యీ దేశమం
దు నివాసము చేస్తిరా నేను మిమ్మును కిందికి దోయక
స్థిరపరతును; మిమ్మును పెరికివేయక నాటుదును; యే
మంటే మీకు నేను చేసిన కీడును గురించి చింతించితి
11 నని, మరిన్ని అనినదేమంటే, । బాబెలు రాజుకు భయ
పడకండి; నేను మీకు తోడుగా వుండి, రక్షించి,
12 అతని చేతిలోనుంచి మిమ్మును విడిపింతును. । అతడు
మీ యందు జాలిపొంది, మీ స్వదేశములోకి మిమ్మును
తిరిగీ రానిచ్చేటట్టుగా నేను మీ యందు కనికరింతు
13 ను. । అయితే మీరు మనము యీ దేశమందు కాపుర
ము చేయమనిన్ని మన దేవుడైన యెహోవా వాక్య
14 ప్రకారము చేయమనిన్ని, । మిస్రయీము దేశములోకి
వెళ్లుదుము, అక్కడ యుద్ధమును చూడక బాకానాద
మును వినక వుందుము; ఆకలి లేక సుఖముగా వుందు
ము; కాబట్టి అక్కడికే వెళ్లి కాపురము చేతామని
15 మీరు అనుకొనినట్టయితే, । యూదాలో శేషించిన
వారలారా, యెహోవా వాక్యమును వినండి; యిందుకు
ఇశ్రాయేలుకు దేవుడైన సైన్యముల యెహోవా ఆన
తిచ్చిన లాగు, మిస్రయీముకు మీరు అభిముఖులై
అక్కడ వుండుటకు మీరు వెళ్లిన పక్షమందు, । యే 16
కత్తిని గూర్చి మీరు భయపడితిరో ఆ కత్తి మిస్ర
యీము దేశమందుండే మిమ్మును తరుమును; మరిన్ని
మీరు యే క్షామమునకు భయపడితిరో అది మిస్రయీ
ములో మిమ్మును తరుమును; అక్కడనే మీరు మరణ
మాదురు. । మిస్రయీముకు అభిముఖులై అక్కడ వుం 17
డుటకు వెళ్లిన వారందరున్ను ఆలాగునే అవుదురు;
వారు కత్తిచేతనున్ను క్షామముచేతనున్ను తెగులుచేత
నున్ను మరణమాదురు; వారి మీదికి నేను రప్పించే
కీడునుంచి తప్పించుకొనిన వాడు వొకడైనా లేక
వుందును. । యిందుకు ఇశ్రాయేలుకు దేవుడైన సైన్య 18
ముల యెహోవా మరిన్ని ఆనతిచ్చేదేమంటే, నా
కోపాగ్నిన్ని నా రౌద్రమునున్ను యెరూశలేము కా
పురస్థుల మీద నేను కుమ్మరించినట్టు మీరు వొకవేళ
మిస్రయీములోకి వెళ్లితే నేను నా రౌద్రమును
మీ మీద కుమ్మరింతును గనుక మీరు శాపము కొర
కున్ను అవమానము కొరకున్ను వింత కొరకున్ను వుండి,
యీ స్థలమును యెన్నటికీ చూడకపోదురు. । కాబట్టి 19
ఓ యూదాలో శేషించియున్న వారలారా, మిమ్మును
గురించి యెహోవా ఆనతిచ్చిన లాగు, మిస్రయీ
ముకు వెళ్లకండని నేను నేటి రోజున మీకు రూఢ
ముగా బోధపర్చితిని; దీని తలంచుకోండి. । యేమంటే 20
మీరు నా యొద్దికి వచ్చి, మా దేవుడైన యెహోవాను
మా కొరకు ప్రార్థించుము; మా దేవుడైన యెహో
వా ఆనతిచ్చే అన్నిటినీ నీవు మాకు తెలియ చెప్పితే
మేము ఆ ప్రకారము చేతుమని మీ దేవుడైన యె
హోవా యొద్దికి మీరు నన్ను పంపినప్పుడు మాయా
వాదులై వుంటిరి. । మరిన్ని యీ రోజున నేను యె 21
హోవా చెప్పినట్టు మీకు తెలియ చేస్తిని, అయితే
మీరు మీ దేవుడైన యెహోవా వాక్యమునైనా విన
లేదు; ఆయనచేత నేను మీ యొద్దికి యెందు కొరకు
పంపబడితినో అందుకైనా లోపడ లేదు. । కాబట్టి 22
మీకు రూఢముగా తెలియవలసినదేమంటే, యే స్థల
మందు వుండుటకు మీరు వెళ్ల గోరితిరో ఆ స్థలమందు
మీరు కత్తిచేతనున్ను తెగులుచేతనున్ను హతమాదు
రని చెప్పెను.

## 43. అధ్యాయము.

అయితే వారి దేవుడైన యెహోవా ఇర్మీయా 1
చేత వారికి పంపించిన వాక్యములన్నిటినీ ఇర్మీయా జను
లందరితో చెప్పి సమాప్తిపర్చిన తరువాత,। హోషయా 2
కుమారుడైన అజర్యాయున్ను కారేయహు కుమారు

డయిన యోహానానున్ను గర్విష్ఠులైన వారందరున్ను
ఇర్మీయాతో అనిన మాట, నీవు అబద్ధమాడితివి, యేమం
టే మిస్రయీము యందు వుండుటకు వెళ్లకండన్న
మాట చెప్పుమని మా దేవుడైన యెహోవా నిన్ను
3 పంపలేదు. । అయితే నేరీయా కుమారుడైన బారూఖు
మాకు విరోధుడైనందున కల్దీయులు మాలో కొందరిని
హతముచేసి కొందరిని బాబెలుకు చెరతీసుకొని పోగలం
దులకున్ను వారి చేతికి మేము దొరికేటందుకున్ను నిన్ను
4 మా విషయమై యీలాగున బోధించ పంపెనని,। కారే
యహు కుమారుడైన యోహానానున్ను సైన్యాధిపతు
లందరున్ను జనులందరున్ను యూదా దేశమందు కా
పురము చేయండని చెప్పిన యెహోవా వాక్యమును
5 విననైరి. । యేమంటే కారేయహు కుమారుడైన యో
హానానున్ను సైన్యాధిపతులందరున్ను యూదా దేశ
మందు కాపురము చేయదలచి, వారు యే యే జనాం
గములలోకి చెదరిరో ఆ జనాంగములలోనుంచి తిరిగీ
6 వచ్చిన యూదాలో శేషించిన వారందరినీ, । అనగా,
పురుషులనున్ను స్త్రీలనున్ను పిల్లలనున్ను షాఫానుకు
పుట్టిన అహీకాము కుమారుడైన గెదల్యాయొద్ద తల
వర్లకు అధిపతియైన నెబూజరదాను వుండనిచ్చిన
వారినందరినిన్ని దీర్ఘదర్శియైన ఇర్మీయానున్ను నేరీ
యా కుమారుడైన బారూఖునున్ను తీసుకొని మిస్ర
7 యీములోకి వెళ్లిరి. । యేమంటే వారు యెహోవా
వాక్యమును విని దానికి లోపడక, యీలాగున తహ్ప
8 న్హేసుకు వచ్చిరి. । అప్పుడు యెహోవా వాక్యము
తహ్పన్హేసు యందుండే ఇర్మీయా యొద్దికి వచ్చి సెలవు
9 యిచ్చినదేమంటే, । నీవు గొప్ప రాళ్లు చేతపట్టుకొని,
యూదా మనుష్యులు చూస్తూ వుండగా వాటిని తహ్ప
న్హేసులో వున్న ఫరో యింటి గుమ్మము ముందరి యిటి
10 కెల ఆవపు మట్టిలో వాటిని దాచి, । ఇశ్రాయేలుకు
దేవుడైన సైన్యముల యెహోవా ఆనతిచ్చినట్టు వారి
తో చెప్పవలసినదేమంటే, యిదుగో నేను నా సేవకు
డున్ను బాబెలు రాజున్నైన నెబూఖద్రెస్సరును యి
క్కడికి పిలువనంపించి, నేను దాచిన రాళ్ల పైని అతని
గద్దెను స్థిరపతుర్చను, వాటి పైని అతడు తన రాజ
11 పట గృహమును వేసును, । అతడు వచ్చి మిస్రయీ
ము దేశమును కొట్టి, యెవరు మృత్యువు కొరకు వుం
దురో వారిని మృత్యువుకున్ను యెవరు చెర కొరకు
వుందురో వారిని చెరలోకిన్ని యెవరు కత్తి కొరకు
12 వుందురో వారిని కత్తికిన్ని అప్పగించును. । మరిన్ని
మిస్రయీము దేవుండ్ల మందిరములలో నేను అగ్ని
రాజ బెట్టుదును; అతడు వాటిని కాల్చి వారిని చెర
తీసుకొని పోవును; యీలాగున గొర్రెల బోయెడు తన
బట్ట పైని వేసుకొనినట్టు అతడు మిస్రయీము దేశ
మును ధరించుకొని అక్కడనుంచి క్షేమముగా బయిలు
వెళ్లును. । అయితే అతడు మిస్రయీము దేశమందుండే 13
బేత్షెమెషు యొక్క ప్రతిమలను పగలకొట్టి, మిస్రీ
యుల దైవముల మందిరములను అగ్నిచేత కాల్చివేసు
నని ఆనతిచ్చెనని చెప్పుమని సెలవు యిచ్చెను.

## 44. అధ్యాయము.

మిస్రయీము దేశములో మిగ్దోలు యందున్న 1
తహ్పన్హేసు యందున్న నోఫు యందున్న పత్రోసు
దేశమందున్న కాపురము సేయుచున్న యూదైయు
లందరిని గురించి ఇర్మీయా యొద్దికి వచ్చిన వాక్యము
యేమంటే, । ఇశ్రాయేలుకు దేవుడైన సైన్యముల యె 2
హోవా ఆనతిచ్చేలాగు, యెరూశలేము మీదికిన్ని
యూదా పట్టణములన్నిటి మీదికిన్ని నేను రప్పించిన
కీడంతటినీ మీరు చూస్తిరి; యిదుగో నేటి వరకు వా
టిలో కాపురస్థుడు వొకడున్నూ లేక అవి పాడై
వున్నవి. । యేమంటే వారు వెళ్లి, వారికైనా మీకైనా 3
మీ పితృలకైనా యెరుక లేని దేవుండ్లను సేవించి, ధూ
పము సమర్పించినందున చాలా దోషము చేసి నాకు
కోపమును పుట్టించిరి. । అయినప్పటికిన్ని నేను దీర్ఘ 4
దర్శులైన నా సేవకులనందరినీ మీ యొద్దికి తెల్లవారక
ముందే లేచి పంపుతూ, నాకు విరోధమైన ఆ యేహ్య
కార్యమును చేయవద్దని చెప్పి వుంటిని.। అయితే వారు 5
ఆలకించకనున్ను చెవి వొగ్గకనున్ను తమ దుర్మార్గ
తను విడువకనున్ను అన్య దేవుళ్లకు ధూపమును సమ
ర్పిస్తూ వుండిరి. । కాబట్టి నా రౌద్రమునున్ను నా 6
కోపాగ్నినిన్ని నేను వారి మీద కుమ్మరించినందున అది
యూదా పట్టణములందున్న యెరూశలేము వీధులం
దున్న రగులుతూ వుండెను; అవి నేటి రోజు మట్టుకు
న్ను పాడై వట్టివిగా వున్నవి. । మరిన్ని ఇశ్రాయేలుకు 7
దేవుడైన సైన్యముల యెహోవా యిప్పుడు ఆనతిచ్చే
దేమంటే, మీలోనుంచి పురుషునున్ను స్త్రీనిన్ని పిల్ల
నున్ను శిశువునున్ను తెగవేసి, శేషము యెంతమాత్రము
వుంచక, మీ ప్రాణముల మీదికి మీరు యింత కీడును
తెచ్చుకొంటిరేమి!। కాపురము చేసుటకు మీరు వెళ్లిన 8
మిస్రయీము దేశమందు మీరు అన్య దేవుళ్లకు ధూ
పము సమర్పించి, మిమ్మును మీరు తెగవేసుకొనే కొర
కున్ను మీరు లోకముయొక్క సకల జనాంగములలో
శాపమునున్ను అవమానమునున్ను పొందే కొరకున్ను
మీ కార్యములచేత నాకు కోపమును పుట్టిస్తూ వుం
టిరి. । యూదా దేశమందున్న యెరూశలేము వీధు 9
లందున్న మీ పితృలు చేసిన దోషములనున్ను వారి
భార్యలు చేసిన దోషములనున్ను మీరు చేసిన దోష
ములనున్ను మీ భార్యలు చేసిన దోషములనున్ను మరి

10 చిపోతిరా?। యేమంటే నేటి వరకున్ను వారి హృదయ
ములు మెత్తబడక కఠినముగానే వున్నవి; వారు భయ
పడక, మీ పితృలకున్ను మీకున్ను నేను నిర్ణయిం
చిన న్యాయ ప్రమాణమందున్ను కట్టడలయందున్ను
11 నడవక వుండిరి. । కాబట్టి ఇశ్రాయేలుకు దేవుడయిన
సైన్యముల యెహోవా ఆనతిచ్చేదేమంటే, యిదుగో,
కీడు కొరకున్ను యూదా వారందరినిన్ని తెగవేసే
కొరకున్ను నేను నా ముఖమును మీకు విరోధముగా
12 చేతును. । మరిన్ని మిస్రయీము దేశము తట్టు అభి
ముఖులై, అక్కడ వుండుటకు వెళ్లిన యూదాలో
శేషించిన వారందరినిన్ని నేను లోపచుర్చుకొనినందున
వారు మిస్రయీము దేశమందు కూలి నశింతురు; కత్తి
చేతనున్ను క్షామముచేతనున్ను నాశనమాదురు; పిన్నలు
మొదలుకొని పెద్దల పర్యంతమూ అందరున్ను శాప
మునున్ను అవమానమునున్ను పొంది, కత్తిచేతనున్ను క్షా
13 మముచేతనున్ను మరణమాదురు. । యేమంటే యెరూశ
లేము కాపురస్థులను నేను కత్తిచేతనున్ను క్షామము
చేతనున్ను తెగులు చేతనున్ను శిక్షించినట్టు మిస్రయీ
ము దేశమందు కాపురము చేసిన వారినిన్ని శిక్షిం
14 తును. । అందువల్ల యెక్కడికి వారు తిరిగీ వచ్చి కాపు
రము చేయ కోరుదురో అక్కడనే, అనగా, యూదా
దేశములోకి తిరిగీ వచ్చుటకు మిస్రయీములో నివ
సించ వెళ్లిన యూదాలో శేషించిన వారిలో తప్పిం
చుకొని పోయేవాడు వొకడున్నూ లేక వుండును; యే
మంటే నేను తప్పించినవారు గాక మరి యెవరైనా
తిరిగీ రాలేక పోదురని ఆనతిచ్చెనని ఇర్మీయా చెప్పెను.।
15 అప్పుడు తమ భార్యలు అన్య దేవుళ్లకు ధూపమును
సమర్పించిరని యెరిగిన పురుషులున్ను దగ్గిర నిలిచి
వున్న స్త్రీ సమూహమున్ను, అనగా, మిస్రయీము దేశ
మందున్న పత్రోసులో కాపురము చేసిన జనులంద
16 రున్ను ఇర్మీయాతో చెప్పిన వుత్తరము, । యెహోవా
నామమందు నీవు మాతోటి వాక్యమును చెప్పితివి,
అయితే నీవు చెప్పిన వాక్యమును మేము ఆలకించ
17 ము. । మా వాక్కులోనుంచి బైలు వెళ్లిన యావత్ప్ర
కారము మేము చేస్తూ, పూర్వము మేమున్ను మా పితృ
లున్ను మా రాజులున్ను మా అధిపతులున్ను యూదా
పట్టణములందున్ను యెరూశలేము వీధులందున్ను చేసి
నట్టు యిటు మీదటనున్ను మేము ఆకాశ పత్నికి
ధూపమును యిచ్చి, దానికి పానార్పణలను పోయుట
మానక వుందుము; యేమంటే అప్పుడు మాకు విస్తార
మైన ఆహారము కలిగి యే కీడునైనా పొందక సుఖ
18 ముగా బ్రతికితిమి. । అయితే ఆకాశ పత్నికి ధూప
మును యిచ్చుటనున్ను పానార్పణలను కుమ్మరించుట
నున్ను మానివేసినప్పటినుంచి మాకు లేమి సంభవించెను;
కత్తిచేతనున్ను క్షామము చేతనున్ను నశించితిమి.। మరిన్ని 19
ఆకాశపత్నికి మేము ధూపమిచ్చి, దానికి పానార్పణ
లను కుమ్మరించినప్పుడు మా పురుషులకు తెలియకుండా
ఆవిడె కొరకు అప్పములను చేసి సమర్పించి పానార్ప
ణలను కుమ్మరించితిమా అని చెప్పినందున, । ఇర్మీయా 20
జనులందరితోటిన్ని, అనగా, పురుషులతోటిన్ని స్త్రీల
తోటిన్ని తనకు ప్రత్యుత్తరమును యిచ్చిన జనులందరి
తోటిన్ని చెప్పినదేమంటే, । మీరున్ను మీ పితృలున్ను 21
మీ రాజులున్ను మీ అధిపతులున్ను దేశపు జనులున్ను
యూదా పట్టణములందున్ను యెరూశలేము వీధుల
యందున్ను ధూపమును యిస్తిరి; అది ఆయనకు జ్ఞాప
కము లేదా? ఆయన దాని తలచ లేదా?। కాబట్టి మీ 22
చెడ్డ క్రియలను గూర్చిన్ని మీరు చేసిన యేహ్య కా
ర్యములను గూర్చిన్ని యెహోవా యిక సహించనం
దున మీ దేశము పాడై, వింతకొరకున్ను శాపము కొర
కున్ను నేటి వరకున్ను నిర్మనుష్యముగా వున్నది.।ఆలా 23
గున మీరు ధూపమిచ్చి, యెహోవాకు విరోధముగా
పాపముచేసి, యెహోవా వాక్యమును విని లోపడక,
ఆయన న్యాయ ప్రమాణమందైనా కట్టడల యందైనా
నిబంధనలయందైనా నడవకపోతిరి గనుక యింత కీడు
నేటి వరకున్ను మీకు సంభవించెనని చెప్పి, । ఇర్మీయా 24
జనులందరితోటిన్ని స్త్రీలందరితోటిన్ని మరిన్ని చెప్పిన
దేమంటే, మిస్రయీము దేశమందుండే సకలమైన
యూదైయులారా, యెహోవా వాక్యమును వినండి.।
ఇశ్రాయేలుకు దేవుడైన సైన్యముల యెహోవా ఆన 25
తిచ్చేదేమంటే, ఆకాశ పత్నికి ధూపమిచ్చుటకున్ను
పానార్పణలను కుమ్మరించుటకున్ను మ్రొక్కుటకున్ను
మేము మా మ్రొక్కును తీర్చుకొందుమని మీరున్ను
మీ భార్యలున్ను మీ వాక్కులచేత చెప్పి, మీ చేతు
లచేతనే నెరవేర్చితిరి; నిజముగా మీ మ్రొక్కుబడిని
మీరు రూఢపర్చి, మీ ప్రమాణములను నెరవేర్చితిరి.।
కాబట్టి మిస్రయీము దేశమందు కాపురము చేసిన 26
సకలమైన యూదైయులారా, యెహోవా వాక్య
మును వినండి; కర్తయైన యెహోవా తోడు అని
మీరు అనినప్పటికిన్ని నా నామము మిస్రయీము దేశ
మందున్న యూదా వారిలో యే వొకని వాక్కు చేత
నైనా యిక పలకబడక వుండునని నేను నా ఘనమైన
నామము మీద ప్రమాణము చేసుకొంటినని యెహో
వా ఆనతిచ్చెను.। యిదుగో మేలు కొరకు కాదు కీడు 27
కొరకు నేను వారి నిమిత్తము కనిపెట్టుదును; కాబట్టి
మిస్రయీము దేశమందున్న యూదా వారందరున్ను
కత్తిచేతనున్ను క్షామము చేతనున్ను వారు అంతమయ్యే
పర్యంతమూ నశింతురు.। అయినప్పటికిన్ని కత్తిని తప్పిం 28

చికొనిన వారిలో కొంత మంది మిస్రయీము దేశము
లోనుంచి తిరిగి, యూదా దేశములోకి వత్తురు; మిస్ర
యీము దేశములో కాపురము చేసుటకు వెళ్లిన యూ
దాలో శేషించిన వారందరు తమ వాక్యములు నిలు
చునో నా వాక్యములు నిలుచునో తెలుసుకొందురు
29 గాక. । మరిన్ని యెహూవా ఆనతిచ్చేదేమంటే, యీ
స్థలమందు నేను మిమ్మును శిక్షించేకొరకు నా వాక్య
ములు మీ మీద కీడు కొరకు నిలుచునని మీరు తెలు
30 సుకొనేటందుకు గురుతు యేమంటే, । యిదుగో, యూ
దారాజైన సిద్కియాను అతనికి శత్రువుదున్ను అతని
ప్రాణము వెతికిన వాడున్ను బాబెలు రాజున్నైన
నెబూఖద్రెస్సరు చేతిలోకి నేను అప్పగించినట్టు నేను
మిస్రయీము దేశపు రాజైన ఫరోహొప్రను అతని
శత్రువుల చేతికిన్ని అతని ప్రాణమును వెతికిన వారి
చేతికిన్ని అప్పగింతునని యెహూవా ఆనతిచ్చెనని
చెప్పెను.

## 45. అధ్యాయము.

1 యూదా రాజున్ను యోషీయా కుమారుడున్నైన
యెహూయాకీము యేలుబడి నాలుగో సంవత్సరమందు
నేరీయా కుమారుడైన బారూఖు ఇర్మీయా వాక్య పద్ధ
తిని గ్రంథమందు వ్రాసిన తరువాత దీర్ఘదర్శియైన
2 ఇర్మీయా అతనితో చెప్పిన వాక్యము యేమంటే, । ఓ
బారూఖూ ఇశ్రాయేలుకు దేవుడైన యెహూవా
3 నిన్ను గురించి ఆనతిచ్చినలాగు, । యిప్పుడు నాకు
అయ్యో! యేమంటే యెహూవా నా చింతతో దుఃఖ
మును సమకూర్చెను; నా నిట్టూర్పు వల్లనున్ను మూర్ఛ
4 పోయి నెమ్మదిని పొందలేదు అని నీవు అంటివి. । కా
బట్టి నీవు అతనితో యెహూవా ఆనతిచ్చినట్టు చెప్ప
వలసినదేమంటే, యిదుగో నేను కట్టిన దానిని కింద
పడదోతును; నేను నాటిన దాని, అనగా, యీ దేశమం
5 తటినీ పెరికివేతును. । అయితే నీ కొరకు నీవు గొప్ప
వాటిని వెతుకుతున్నావా? వెతక వద్దు; యేమంటే సమ
స్తమైన వారి మీదికి నేను కీడును రప్పింతును; అయితే
నీవు వెళ్లే స్థలములన్నిటి యందు నీ ప్రాణముతోటి
నిన్ను తప్పింతునని యెహూవా ఆనతిచ్చెనన్నట్టు
చెప్పెను.

## 46. అధ్యాయము.

1 మరిన్ని అన్య జనాంగముల గూర్చిన్ని, అనగా,
మిస్రయీమును గూర్చిన్ని ఫెరాతు నది యొద్ద కర్కె
మీషులో వుండిన మిస్రయీము రాజైన ఫరోనెఖో
2 సైన్యమును గూర్చిన్ని, । అనగా, యూదా దేశపు
రాజైన యోషీయా కుమారుడగు యెహూయాకీము
యేలుబడి నాలుగో సంవత్సరమున బాబెలు రాజైన
నెబూఖద్రెస్సరు చేత కొట్టబడిన సైన్యమును గూర్చి
న్ని యెహూవా యొద్దనుంచి దీర్ఘదర్శియైన ఇర్మీయా
యొద్దికి వచ్చిన వాక్యము యేమంటే, । డాళ్లనున్ను 3
ఆయుధములనున్ను మీరు సిద్ధపర్చుకొని యుద్ధము
నకు రండి. । ఓ రౌతులారా, గుర్రములను సిద్ధపర్చు 4
కొని, మీరు యెక్కి శిరస్త్రాణములను ధరించుకొని నిలు
వండి; మీరు యీటెలను చికలీ చేసుకొని, కవచము
లను ధరించుకొండి. । వారు భయపడి వెనుక తిరుగుట 5
నాకు యేల కనుబడెను! వారి బలాఢ్యులు కొట్లబడి
వెనుక చూడక పారిపోయిరి; నఖముఖాలా భయము
కలిగెనని యెహూవా ఆనతిచ్చెను. । అతివేగులు పారి 6
పోక వుందురు; బలాఢ్యులు తప్పించుకోలేక వుందురు;
ఫెరాతు నదీ తీరమందు వుత్తరము వైపున వారు కూలు
దురు. । వరద పైకి వచ్చినట్టు మీదికి వస్తూ వున్న యి 7
తడు యెవడు! అతని వుదకములు నదుల వలె ప్రవ
హిస్తూ వున్నవి. । మిస్రయీము వరద వలెనే యెక్కి 8
వస్తూ వున్నది; దాని వుదకములు నదుల వలెనే ప్రవ
హిస్తూ వున్నవి; నేను పైకి యెక్కి భూమిని కప్పి పట్ట
ణమునున్ను దాని కాపురస్తులనున్ను లయపర్తునని
అది అనుకొనెను. । ఓ గుర్రములారా, మీదికి రండి; 9
ఓ రథములారా, అహంకారములతోటి రండి; కుషీ
యులున్ను డాళ్లను పట్టుకొనిన లుబ్బీయులున్ను విలు
కాండ్లయిన లూదీయులున్ను అనగా యీ బలాఢ్యులు
బైలు వెళ్లి వత్తురు గాక. । యేమంటే యీరోజు సైన్య 10
ముల యెహూవా అనే దేవునిది; ప్రతికారము చేసే
దినమైనందున ఆయన తన విరోధులకు ప్రతికారమును
చేసును; కాబట్టి కత్తి వారిని మింగి సంతుష్టిని బొంది,
వారి రక్తముచేత మత్తిల్లి వుండును; యేమంటే వుత్తర
దేశమందు ఫెరాతు నది దగ్గిర కర్తయైన సైన్యముల
యెహూవా కొరకు వొక బలి కలుగును. । మిస్ర 11
యీము కుమారికయైన వో కన్యకా, గిలాదుకు వెళ్లి,
జీగురును తీసుకొనుము; అయితే నీవు చాలా ఔషధ
ములు పుచ్చుకొన్నప్పటికీ వ్యర్థమాను, యేమంటే
నీవు స్వస్థతను పొందలేవు. । నీకు వచ్చిన సిగ్గు జనాంగ 12
ములకు వినబడెను; నీ యేడ్పు చేత దేశము నిండి వున్నది;
బలాఢ్యులు వొకరి మీద వొకరు పడి కూలిరి. । మిస్ర 13
యీము దేశమును కొట్టుటకు బాబెలు రాజైన నెబూ
ఖద్రెస్సరు వచ్చుటను గురించి యెహూవా దీర్ఘద
ర్శియైన ఇర్మీయాతో ఆనతిచ్చిన వాక్యము యేమంటే, । 14
మిస్రయీములో తెలియ చెప్పండి, మిగ్దోలు యందు
న్ను నోఫు యందున్ను తహ్పనేసు యందున్ను ప్రక
టించండి, నీవు స్థిరపడి సిద్ధముగా వుండుము; యేమంటే
కత్తి నీ చుట్టూ వున్న సమస్తమును మింగి వేసునని
చెప్పండి. । నీ పరాక్రమశాలులు యెందుకు కొట్టబ

డిరి? యెహోవా వారిని తోలివేసును గనుక వారు
16 నిలువరైరి. । ఆయన చాలా మందిని కూలచేసెను; వొ
కని మీద వొకడు కూలిపడినందున వారు అనుకొనిన
మాట క్రూరమైన కత్తినుంచి మనము తప్పించుకొని
మన జనుల యొద్దికిన్ని మన స్వదేశములోకిన్ని తిరిగీ
17 వెళ్లుదాము, లెండి అని పలికిరి. । మరిన్ని అక్కడ వారు
మిస్రయీము రాజైన ఫరో వట్టి ధ్వని మాత్రమే
చేసెను; అతడు నిర్ణయించిన సమయము తప్పిపోని
18 చ్చెనని చెప్పుకొనిరి. । పర్వతములలో తాబోరు వున్న
ట్టున్ను సముద్రము దగ్గిర కర్మేలు వున్నట్టున్ను
సైన్యముల యెహోవా అనే నామముగల రాజు నా
జీవముతోడు అతడు యీలాగుననే వచ్చునని ఆనతి
19 చ్చెను. । మిస్రయీములో కాపురము చేసే ఓ కన్యకా,
చెరలోకి వెళ్లుటకు నీవు సామగ్రిని జాగ్రత చేసు
కొమ్ము, యేమంటే నోఫు పాడై నిర్మనుష్యముగా
20 వుండును. । మిస్రయీము కోమలమైన పడ్డ వలె వు
న్నది; ఉత్తర దేశమునుంచి నాశనము వస్తూ వున్నది. ।
21 మరిన్ని దానికి మద్దత్తుగా వచ్చి దానితో కూడిన
వారు కొవ్విన యెడ్ల వలె వున్నారు; వారున్ను వెనుక
తిరిగి పారిపోయిరి; వారి వుపద్రవ దినమున్ను వారి
విచారణ కాలమున్ను వారి మీదికి వచ్చెను గనుక వారు
22 నిలువలేక పోయిరి. । దాని నోటి శబ్దము సర్పము
యొక్క శబ్దము వలె వుండెను; యేమంటే సైన్యము
తోటి వారు బయిలు వెళ్లి మానులు నరికే వారి వలెనే
23 గొడ్డళ్లను పట్టుకొని దాని మీదికి వత్తురు. । దాని అర
ణ్యము శోధించ నశక్యమైనప్పటికిన్ని వారు దానిని
నరికివేతురని యెహోవా ఆనతిచ్చెను; యేమంటే వారు
మిడతల కంటే విస్తారమై లెక్కకెక్కువగా వుందురు. ।
24 మిస్రయీము కన్యక సిగ్గును పొందును; ఆమె ఉత్తర
25 దేశపు వారి చేతికి దొరుకును. । ఇశ్రాయేలుకు దేవుడైన
సైన్యముల యెహోవా ఆనతిచ్చేదేమంటే, యిదుగో
నేను నో అనే పట్టణముయొక్క సమూహమునున్ను
ఫరోనున్ను మిస్రయీమునున్ను వారి దేవుండ్లనున్ను
వారి రాజులనున్ను మరిన్ని ఫరోనున్ను అతని నమ్మిన
26 వారినిన్ని శిక్షించి, । వారి ప్రాణములను వెతికే వారి
చేతికిన్ని బాబెలు రాజైన నెబూఖద్రెస్సరు చేతికిన్ని
అతని సేవకుల చేతికిన్ని వారిని అప్పగింతును; తరు
వాత అది మునుపటి లాగున నివసించబడునని యె
27 హోవా ఆనతిచ్చెను. । అయితే నా సేవకుడయిన
వొ యాకోబూ, భయపడ వద్దు; వొ ఇశ్రాయేలా,
నీవు జడియ వద్దు; యేమంటే దూరదేశమునుంచి నిన్ను
న్ను చెరగా వున్న దేశమునుంచి నీ సంతతినిన్ని విడి
పింతును; యాకోబు తిరిగీ వచ్చి నెమ్మదిగానున్ను సుఖ
ముగానున్ను వుండును; భయపెట్టుటకు వొకడున్ను
లేక వుండును. । కాబట్టి వొ నా సేవకుడైన యాకోబా, 28
నీవు భయపడ వద్దు; యేమంటే నేను నీకు తోడుగా
వున్నాను; యే జనాంగములలోకి నేను నిన్ను తోలి
వేస్తినో వారిని నేను సర్వనాశనము చేతును; అయితే
నిన్ను సర్వనాశనము చేయక మితిగా దండింతును;
యేమంటే నిన్ను బొత్తిగా నిరపరాధియని యెంచను.

## 47 అధ్యాయము.

ఫరో అజ్జా పట్టణమును కొట్టక మునుపు యెహో 1
వా వాక్యము దీర్ఘదర్శియైన ఇర్మీయా యొద్దికి వచ్చి,
పెలిష్తీయులను గురించి అనినది యేమంటే, । యెహో 2
వా ఆనతిచ్చినలాగు, యిదుగో వుదకములు ఉత్తరము
నుంచి పొంగి, మించి పారిన వరదై, దేశమున్ను దా
నిలో వున్న సమస్తమునున్ను పట్టణమునున్ను దాని
కాపురస్తులనున్ను ముంచును; అప్పుడు మనుష్యులు
యేడ్తురు; దేశపు కాపురస్తులందరున్ను అంగలార్తు
రు. । అతని బలమైన గుర్రముల డెక్కల చప్పుడుకున్ను 3
అతని రథములు చొచ్చి వచ్చుటకున్ను అతని చక్ర
ముల ధ్వనికిన్ని తండ్రులు భయపడి అధైర్యులై, పిల్ల
లను కనిపెట్టే శక్తిలేక వుందురు. । యేమంటే పెలిష్తీ 4
యులను లయము చేసుటకున్ను సోరు సీదోను అనే
పట్టణములలో శేషించిన సహాయులనందరినీ తెగవేసు
టకున్ను దినము వస్తూ వున్నది, యేమంటే యెహో
వా కఫ్తోరు ద్వీపములో శేషించిన పెలిష్తీయులను
లయపర్చును. । అజ్జా పట్టణము శూన్యముగా వున్నది; 5
అష్కెలోను వారియొక్క శేషించిన లోవ భూమిన్ని
తెగవేయబడెను; ఓ యెహోవా ఖడ్గమా, యెంత
పర్యంతమూ నీవు కోసుకొందువు? । యెన్నాళ్లమట్టుకు 6
నెమ్మది లేకుండా యీలాగున వుందువు? నీ వరలోకి
తిరిగీ ప్రవేశించి, శాంతపడి, యిక నిమ్మళించుము. ।
అయితే యెహోవా అష్కెలోను మీదనున్న సము 7
ద్రపు తీరము మీదనున్న దానికి ఆజ్ఞ యిచ్చెను గనుక
అది యేలాగు నిమ్మళించును; అక్కడికే ఆయన దానిని
వెళ్ల నిర్ణయించెను.

## 48. అధ్యాయము.

మరిన్ని ఇశ్రాయేలుకు దేవుడైన సైన్యముల యె 1
హోవా మోయాబును గురించి ఆనతిచ్చినలాగు, నెబో
పట్టణమునకు అయ్యో! యేమంటే అది లయమాయెను;
కిర్యాతయీము పట్టుబడి దిగులుపడెను; మిశ్గాబున్ను
సిగ్గును పొంది భయపడెను. । యిక మోయాబును గూ 2
ర్చిన స్తుతి వుండదు; హెష్బోనువారు యిక జనాం
గము లేకుండా దానిని తెగవేయుదము రండి అని
దానికి విరోధముగా కీడును తలంచుకొనిరి. వొ మద్మే
నూ, నీవు నరకబడుదువు; కత్తి నిన్ను తరుమును. । హెూ 3

రోనయీములలోనుంచి లయమున్ను బహు హతమున్ను
4 చాలా రోదనమున్ను వినబడును. । మోయాబు విచ్ఛి
త్తయి పోయెను; దాని చిన్నవాండ్లు రోదన శబ్దమును
5 వినబడ జేసిరి. । యేమంటే లూహీతుయొక్క యెక్కు
డులో కన్నీళ్లు నిత్యమున్ను యెక్కుతూ వుండును;
మరిన్ని హొరోనయీముయొక్క దిగుడులో విరో
6 ధులకు రోదన శబ్దము వినబడెను. । పారిపోయి, మీ
ప్రాణములను రక్షించుకొని, కొనుర్ల భూమిలో వున్న
7 పొద వలె వుందురు గాక. । యేమంటే నీ బురుజుల
నున్ను నీ పదార్థములనున్ను నీవు నమ్మితివి గనుక
నీవు దొరుకుదువు; కెమోషున్ను అతని అర్చకులున్ను
8 అతని అధిపతులున్ను చెరలోకి వెళ్లుదురు. । యేమంటే
పట్టణములన్నిటి మీదికిన్ని లయ కర్త వచ్చును గనుక
తప్పించుకొనిన పట్టణము వొకటిన్ని లేకపోవును; యె
హోవా ఆనతిచ్చినట్టు లోవయున్ను నాశనమౌను,
9 మైదానమున్ను క్షయమౌను. । కాబట్టి మోయాబు యెగి
రిపోవుటకు దానికి రెక్కలు యివ్వండి; యేమంటే
దాని పట్టణములు పాడైపోయి నిర్మనుష్యముగా వుం
10 డును. । యెహోవా పని యందు యెవడైనా అశ్రద్ధ
గా వుంటే వాడు శపించబడును; రక్తమునుంచి తన
ఖడ్గము కొరకు వెనుక తీసినవాడు శపించబడును. ।
11 మోయాబు చిన్నప్పటినుంచి నెమ్మదిగా వుండెను; యీ
కుండలోనుంచి ఆ కుండలోకి కుమ్మరించపడని తేరిన
రసము వలె వాడు నిమ్మళపడి వుండెను; అతడు చెర
లోకి యెన్నడూ వెళ్లలేను గనుక అతని అభిరుచి నిలిచి
వున్నది; అతని వాసన యెప్పటిలాగున నిలిచి వున్నది.।
12 అయినందున యెహోవా ఆనతిచ్చేదేమంటే, దినము
లు వస్తూ వున్నవి, అప్పుడు నేను అతని యొద్దికి దేశ
సంచారులను పంపుదును; వారు వెళ్లి వచ్చి అతని దేశ
సంచారిగా చేసి, అతని పాత్రలోది వెలిపి, వారి సిద్దె
13 లను పగల కొట్టుదురు. । అప్పుడు తాము నమ్మిన బేతేలు
నిమిత్తమై ఇశ్రాయేలు యింటివారు సిగ్గుపడినట్టు మో
14 యాబు కెమోషు విషయమై సిగ్గుపడును. । మేము బలా
ఢ్యులమై యుద్ధమునకు గట్టివారమైతిమి అని యేల
15 అంటిరి! । మోయాబు పాడై తన పట్టణములలోనుంచి
పయికి వెళ్లెను; దాని యందు యెంచిన పడుచువారు
వధ కొరకు దిగి వెళ్లిరని సైన్యముల యెహోవా అనే
16 నామము గల రాజు ఆనతిచ్చెను. । వుపద్రవము మో
యాబుకు సమీపించెను; శ్రమకాలము అతనికి వేగి
17 రమే వచ్చెను. । అతని చుట్టూ వున్న సమస్తమైన వార
లారా, అతని గురించి దుఃఖించండి; అతని నామమును
గుర్తెరిగిన సమస్తమైన వారలారా, బలమైన దండమున్ను
సుందరమైన కర్రయున్ను యెందుకు విరిగిపోయెనని
18 పలుకండి. । దీబోను పట్టణపు కాపురస్తురాలవైన వొ
కన్యకా, నీ ఘన స్థితిలోనుంచి దిగి వచ్చి, లేమి గల
స్థలమందు కాపురము చేయుము; యేమంటే మోయా
బును లయము చేసినవాడు నీ మీదికి వచ్చి, నీ బల
మైన స్థలములను లయము చేసును. । అరోయేరు కా 19
పురస్తురాలా, మార్గమందు నిలిచి కనిపెట్టి, పలా
యనుడైన వానిన్ని తప్పించుకొని వచ్చిన దానిన్ని
చూచి, అక్కడ యేమి జరిగెనని అడుగుము. । మో 20
యాబు నిశ్చేష్టుడాయెను; మోయాబు తల్లడించెను,
మోయాబు క్షయమాయెనని అంగలార్చి బొబ్బ యెత్తి,
అర్నోను పట్టణమందు తెలియచేయండి. । మరిన్ని 21
మైదానపు భూమి మీదికిన్ని హోలోను మీదికిన్ని
యహస్సు మీదికిన్ని మేఫయతు మీదికిన్ని, । దీబోను 22
మీదికిన్ని నెబో మీదికిన్ని బేత్దిబ్లయీము మీదికి
న్ని, । కిర్యాతయీము మీదికిన్ని బేత్గామూలు మీది 23
కిన్ని బేత్మెయోను మీదికిన్ని, । కెరీయోతు మీదికిన్ని 24
బొస్రా మీదికిన్ని దూరముగానున్ను సమీపముగాను
న్ను వున్న మోయాబు దేశపు సమస్త పట్టణముల మీది
కిన్ని ఆజ్ఞ వచ్చెను. । మోయాబుయొక్క శృంగము 25
నరికివేయబడెను; అతని హస్తము విరిగెనని యెహో
వా ఆనతిచ్చెను. । అతడు యెహోవాను నిర్లక్ష్యము 26
చేసెను గనుక అతని కైపు గల వానిగా చేయండి; మో
యాబున్ను తన వమనములో పొర్లి అపహాస్యమును
పొందును. । యేమంటే ఇశ్రాయేలు నీ యొక్క అప 27
హాస్యము కొరకు వుండలేదా? అతడు దొంగలలో
దొరికెనా? అతని గూర్చి నీవు పలికినప్పటినుంచి
సంతోషముచేత గంతులు వేస్తివి. । మోయాబులో కా 28
పురము చేసిన వారలారా, పట్టణములను విడిచిపెట్టి,
శిలాపర్వతములో కాపురము చేసి, గుహా బిలములయొ
క్క పార్శ్వములలో గూళ్లు కట్టుకొని, గువ్వ పక్షుల
వలెనే వుండండి. । మోయాబుయొక్క గర్వమును 29
గురించి మనకు వినబడెను; అతడు బహు గర్వముగా
వున్నాడు; అతని అతిశయమున్ను అతని ప్రగల్భము
న్ను అతని గర్వమున్ను అతని హృదయపు పొంగున్ను
అపరిమితమై వున్నవి. । అతని ఉగ్రము యెంతో అది 30
నాకు తెలిసి యున్నది; అయితే అతని శక్తి అంత లేదు
గనుక అతని అబద్ధములవల్ల యేమీ రాదని యెహో
వా ఆనతిచ్చెను. । కాబట్టి నేను మోయాబును గురించి 31
అంగలార్తును; మోయాబు వారందరిని గురించి రోద
నము చేతును; నా హృదయము కిర్హెరెషు వారిని
గురించి మూల్గును. । ఓ శిబ్మాయొక్క ద్రాక్షా వృక్ష 32
మా, యజేరు కొరకైన యేడ్పు వలెనే నీ కొరకున్ను
యేడ్తును; నీ చిగురులు సముద్రముయొక్క తలకు దాటి
పోయినవి; యజేరు సముద్రము మట్టుకున్ను అవి సాగి
నవి, అయితే లయకర్త వచ్చి నీ పక్వమైన పండ్ల

మీదనున్న నీ యేరిన ఫలముల మీదనున్న పడెను. ।
33 అయినందున బాగా ఫలించిన భూమి అనగా మోయా
బులోనుంచి సంతోషమున్ను పుత్సాహమున్ను తీసివే
యబడెను; యేమంటే ద్రాక్ష గానుగలను రసము లేని
విగా చేస్తిని; ఆర్పులతోటి తొక్కిన వాడు పుకడున్ను
లేకపోవును; వారి ఆర్పు లేనిదిగా యెంచబడును. ।
34 హెష్బోనులోనుంచి బొబ్బ యెలాలే మట్టుకున్ను య
హస్సు మట్టుకున్ను వినబడెను; సోయరు వారున్ను
మూడు యేండ్లు గల పడ్డ వలె వున్న హొరోనయీ
ము మట్టుకు శబ్దము వినచేతురు; యేమంటే నిమ్రీము
35 యొక్క ఉదకములు యెండిపోవునని చెప్పి, । యింకా
యెహోవా ఆనతిచ్చేదేమంటే, వున్నతమైన స్థలము
లందు అర్పణ చెల్లించే వానిన్ని అతని దేవుండ్లకు
ధూపమిచ్చే వానిన్ని లేకుండా చేతునని ఆనతిచ్చెను.।
36 అయినందున నా హృదయము మోయాబును గురించి
పిల్లన గ్రోవి లాగున నాదము చేసును; నా హృదయము
కీర్హెరెషు వారిని గురించి నాదము చేసును; యే
37 మంటే అతడు కూర్చిన భాగ్యము పోయెను. । ప్రతి
శిరస్సు బోడిగా వుండును; ప్రతి గడ్డము కత్తిరించ
పడును; సమస్త హస్తముల మీద నరుకులున్ను సకల
మైన నడుముల మీద గోనె పట్టయున్ను వుండు
38 ను. । మోయాబు యందు వున్న సమస్త గృహముల
మీదనున్ను దాని వీధులందున్ను అంగలార్పు వుం
డును; యెందుకంటే అయోగ్య భాండము వలెను
నేను మోయాబును పగల కొట్టుదునని యెహోవా
39 ఆనతిచ్చెను. । వారు అంగలార్చి యేల కొట్టబడిరి!
మోయాబు వెనుక తిరిగి యెంత సిగ్గు పొందెనని పలు
కుదురు; యీలాగు మోయాబు తన చుట్టూ వున్న వా
రందరున్ను అపహసించుట కొరకున్ను ఆశ్చర్యపడుట
40 కొరకున్ను వుండును. । యిందుకు యెహోవా ఆనతి
చ్చేదేమంటే, యిదుగో అతడు గద్దలాగున యెగిరి
41 రెక్కలను మోయాబు దేశము మీద చాపును. । పట్టణ
ములు పట్టబడును; గట్టి స్థలములున్ను కలవిలపడును;
ఆ దినమున మోయాబులో బలాఢ్యుల హృదయములు
ప్రసూతి వేదన కలిగిన స్త్రీ యొక్క హృదయము వలె
42 వుండును. । మరిన్ని మోయాబు యెహోవాను నిర్ల
క్ష్యము చేసును గనుక మోయాబు జనాంగము నిర్మూ
43 లమౌను. । ఓ మోయాబు కాపురస్తుడా, భయమున్ను
44 గొయ్యిన్ని వురిన్ని నీకు వచ్చును. । భయమునుంచి పా
రిపోయిన వాడు గోత బడును; గోతిలోనుంచి పైకి
యెక్కినవాడు వురిలో చిక్కును; యేమంటే మోయా
బు వారి మీదికి నేను విచారణ సంవత్సరమును రప్పిం
45 తును అని యెహోవా ఆనతిచ్చెను. । శత్రువుని బల
మునుంచి పారిపోయిన వారు హెష్బోనుయొక్క నీడ
యందు నిలిచి వుందురు; అయితే హెష్బోనులోనుంచి
అగ్నిన్ని సీహోనులోనుంచి మంటయున్ను బైలు
వెళ్లి, మోయాబు సరిహద్దులనున్ను గొల్లు పెట్టిన వారి
నడినెత్తులనున్ను దహించును. । ఓ మోయాబూ, నీకు 46
అయ్యో! కెమోషుయొక్క జనులు లయమైరి; నీ కుమా
రులున్ను నీ కుమార్తెలున్ను చెర పట్టబడిరి. । అయిన 47
ప్పటికిన్ని తరువాతి దినములందు చెరలో వున్న మో
యాబు వారిని నేను తిరిగీ రప్పింతునని యెహోవా
ఆనతిచ్చెను. మోయాబు పొందబోయే ఆజ్ఞ యింత
మట్టుకు వున్నది.

## 49. అధ్యాయము.

అమ్మోనీయులను గురించి యెహోవా ఆనతిచ్చే 1
వాక్యము యేమంటే, ఇశ్రాయేలుకు పుత్రులు లేరా?
అతనికి బాధ్యుడు లేడా? వారి రాజు గాదు దేశమును
స్వతంత్రించుకొనెనేమి? అతని జనులు ఆ పట్టణము
లందు వుండెదరేమి! । కాబట్టి యెహోవా ఆనతిచ్చే 2
దేమంటే, యిదుగో దినములు వస్తూ వున్నవి; అప్పుడు
నేను రబ్బా అనే అమ్మోనీయుల పట్టణమందు యుద్ధ
పు గొల్లు వినపడేటట్టు చేతును; కాబట్టి అది పాడు
దిబ్బ అవును; దాని కుమార్తెలు అగ్నిచేత దహించబ
డుదురు; అప్పుడు తనకు బాధ్యులైన వారికి యీ ఇశ్రా
యేలు బాధ్యుడవునని యెహోవా ఆనతిచ్చెను. ।
హాయి పట్టణము క్షయమైనందున ఓ హెష్బోను 3
పట్టణమా, అంగలార్చుము; రబ్బా పట్టణపు కుమా
ర్తెలారా, మీరున్ను యేడ్వండి; గోనె పట్టను కట్టు
కొని అంగలార్చి, కంచెల దగ్గిర యిటూ అటూ పరు
గెత్తండి; యేమంటే వారి రాజున్ను అతని అర్చకులు
న్ను అతని అధిపతులున్ను చెరలోకి కలిసి వెళ్లుదురు. ।
వెనుకకు జారిన కుమారికా, నీ లోవల యందు అనగా 4
ప్రవహించే నీ లోవ యందు నీవు అతిశయపడనేల!
నీ పదార్థములను నమ్మి నా యొద్దికి యెవరు వత్తురని
అనుకొంటివి: । కాబట్టి సైన్యముల యెహోవా ఆన 5
తిచ్చేదేమంటే, నీ చుట్టూ వున్న వారందరి యొద్దనుంచి
నీ మీదికి నేను భయమును రప్పింతును; మీరందరున్ను
అవతలకు తోలివేయబడుదురు; మరిన్ని సంచరిస్తూ
వున్న వానిని పరామర్శించే వాడు పుకడున్ను లేక
వుండును. । అటు తరువాత నేను చెరలో వున్న అమ్మో 6
ను పుత్రులను తిరిగీ రప్పింతునని యెహోవా ఆనతి
చ్చెను. । అయితే యెదోమును గురించి సైన్యముల యె 7
హోవా ఆనతిచ్చేదేమంటే, తేమానునుంచి జ్ఞానము
విడిచి పోయెనా? మతిమంతులకు బుద్ధి లేకపోయెనా?
వారి జ్ఞానము వ్యర్థమై పోయెనా? । ఓ దెదాను 8
కాపురస్తులారా, పరుగెత్తి మళ్లుకొని లోతు స్థలము

నకు వచ్చి వుండండి; యేమంటే నేను దాని విచారణ
కాలమందు దాని మీదికి ఏశావు పొందిన వుపద్రవ
9 మును రప్పింతును. । ద్రాక్షా ఫలములను యేరే వారు
నీ యొద్దికి వస్తే లేకి యేరే వారికి కొంత విడిచిపెట్టరా?
దొంగలు రాత్రి వస్తే తమ యిచ్ఛ చొప్పున దొంగిలి
10 మిగిలినవి విడిచిపెట్టరా? । అయితే నేను ఏశావును
దిగంబరిగా చేసి, అతని మరుగు స్థలములను బైలు
పర్చినందున అతడు దాగలేకపోవును; అతని సంతతి
క్షయమై పోయెను; అతని సహోదరులున్ను అతడు
11 న్ను యిరుగు పొరుగు వారున్ను లేక పోయిరి. । తండ్రి
లేని పిల్లలను నీవు విడువుము; నేను వారి ప్రాణము
12 లను సంరక్షింతును; నీ విధవలు నన్ను నమ్మనిమ్ము. । యిం
దుకు యెహోవా ఆనతిచ్చేదేమంటే, పాత్రలోది
తాగుటకు విధింపుము పొందని వారు దానిలోది తా
గిరి; యీలాగు వుండగా నీవు శిక్షను బొత్తిగా తప్పిం
చుకొందువా? నీకు శిక్ష రాక మానదు; అవశ్యముగా
13 నీవు తాగుదువు. । యేమంటే బొస్రాపాడై, అవమా
నము కొరకున్ను శూన్యమాట కొరకున్ను శాపము
కొరకున్ను వుండుననిన్ని, దాని పట్టణములన్నిన్ని యె
ప్పటికీ పాడై వుండుననిన్ని, నా మీద నేనే ప్రమా
14 ణము చేసుకొంటినని యెహోవా ఆనతిచ్చెను. । యె
హోవా యొద్దనుంచి నాకు కబురు వినబడెను; మీరు
కూడుకొని దాని మీదికి యుద్ధమునకు సిద్ధపడండి
అని చెప్పుటకు జనాంగముల యొద్దికి రాయభారి పంప
15 బడెను. । యేమంటే నేను నిన్ను జనాంగములలో నీచు
నిగానున్ను మనుష్యులలో నిలక్ష్యమయిన వానిగా
16 నున్ను చేతును. । నీ భయంకరత్వమువల్లనున్ను నీ హృద
య గర్వమువల్లనున్ను నీవు భ్రమపడితివి; కొండల
సందులలో కాపురముచేసి, పర్వత శిఖరము మీద
వున్న దానా గద్ద లాగున నీ గూడును నీవు వున్నత
ముగా కట్టుకొన్నప్పటికీ అక్కడనుంచి నిన్ను నేను
17 కింద పడదోతునని యెహోవా ఆనతిచ్చెను. । యేమం
టే ఏదోము పాడవును; దాని వైపు వెళ్లినవాడు ఆశ్చ
ర్యమును పొంది, దాని తెగుళ్లను చూచి లేవిడీ కొట్టు
18 ను. । సొదొమయున్ను గొమొర్రాయున్ను వాటికి సమీ
పమైన పట్టణములున్ను బోర్లించబడినప్పుడు యేలా
గు వుండెనో ఆలాగునే దానియందు కాపురము చేసే
మనుష్యుడైనా మనుష్య పుత్రుడయినా లేక వుండు
19 ము. । యిదుగో యర్దేను పొంగునుంచి వాడు సింహ
ము వలె బలిష్ఠుని కాపురము మీదికి వచ్చును; అయితే
దానినుంచి అతని తొందరగా పారిపోచేతును; దాని
మీద నిర్ణయించుటకు యెంచపడిన వాడు యెవడు?
నాకు సముడు యెక్కడ వున్నాడు? నాకు కాలము
నిర్ణయించే వాడు యేడి? నా ముందర నిలిచే పాటి

మందకాపరి యెవ్వడు? । కాబట్టి ఎదోమును గురించి 20
యెహోవాకు తోచిన ఆలోచనన్ను తేమాను
వారిని గురించి యోజించిన యోచనలనున్ను వినండి;
అవశ్యముగా మందలో నీచుడయిన వాడు వారిని
యివతలకు లాగి, వారితో కూడా వారి కాపురము
లను పాడుచేసును. । వారు కూలిన ధ్వనిచేత భూమి 21
కంపించును; వారి బొబ్బ యెర్ర సముద్రములో విన
బడెను. । యిదుగో అతడు గద్ద లాగున యెగిరి, తన 22
రెక్కలను బొస్రా పయిని విప్పును; ఆ దినమందు ఎదో
ములో వున్న బలాఢ్యుల హృదయములు ప్రసూతి
వేదన గల స్త్రీ హృదయము లాగున వుండునని ఆనతిచ్చె
ను. । దమస్కును గురించిన వాక్యము యేమంటే, హమా 23
తున్ను అర్పాదున్ను నిశ్చేష్టను పొందినవి; యేమంటే
కీడైన వర్తమానము వాటికి వినబడెను; అవి కరిగిపోయెను;
సముద్రము కలవిలపడినట్టు వాటికి నెమ్మది లేదు. ।
దమస్కు నిబ్బలమై పారిపోవుటకు ముఖము తిప్పు 24
కొనెను; భయము దానిని పట్టెను; ప్రసూతి స్త్రీకి
వచ్చిన వేదనలున్ను చింతలున్ను దానికి పట్టెను. । నా 25
సంతోషమైన పురము అనగా ఘనమైన పట్టణము
యేలాగు విడువబడెను! । యిందుకు సైన్యముల యె 26
హోవా ఆనతిచ్చేదేమంటే, దాని పడుచు వాండ్లు
దాని వీధులలో కూలుదురు; ఆ దినమందు ఆయుధ
స్థులందరున్ను నరకబడుదురు. । దమస్కు గోడ లోపల 27
నేను అగ్నిని రాజబెట్టుదును; అది బెన్హదదుయొక్క
నగరులను దహించునని యెహోవా ఆనతిచ్చెను. ।
మరిన్ని బాబెలు రాజైన నెబూఖద్రెస్సరు కొట్టవల 28
సిన కేదారును గురించిన్ని హాసోరు రాజ్యములను గురిం
చిన్ని యెహోవా ఆనతిచ్చేదేమంటే, మీరు లేచి,
కేదారు మీదికి వెళ్లి, తూర్పు దేశపు వారిని నశింప
చేయండి. । వారు వీరి డేరాలనున్ను గొర్రెల మందల 29
నున్ను యెత్తుకొని పోదురు; వారి తెరలనున్ను పాత్రల
నున్ను వొంటెలనున్ను తీసుకొని, నఖముఖాలా భయము
కలదని వారికి వినచేతురు. । యిందుకు యెహోవా 30
ఆనతిచ్చేదేమంటే, హాసోరు కాపురస్తులారా, మీరు
దూరముగా పారిపోయి, లోతు యందు దిగండి; యే
మంటే బాబెలు రాజైన నెబూఖద్రెస్సరు మీకు విరో
ధముగా ఆలోచించి; మిమ్మును గూర్చి యోచించెను. ।
యెహోవా సెలవు యిచ్చేదేమంటే, మీరు లేచి, 31
ద్వారములున్ను అడ్డు గడలున్ను అక్కరలేక వొంటరి
గానున్ను నిర్భయముగానున్ను కాపురము చేసిన
చాలా భాగ్యము గల జనాంగము మీదికి వెళ్లండి. ।
వారి వొంటెలున్ను విస్తారమైన వారి పశువులున్ను 32
మీకు దోపుడు కొరకు దొరుకును; యేమంటే అవతలి
దిక్కున వున్న వారినందరినిన్ని నఖముఖాలా చెదర

కొట్టి, సకల దిక్కులనుంచి వారి మీదికి వుపద్రవమును
33 రప్పింతునని యెహోవా ఆనతిచ్చెను. । అయినందున
హాసోరు క్రూర సర్పములకు కాపురపు స్థలముగా
నున్ను యెప్పటికిన్ని పాడుగానున్ను వుండును; దాని
యందు కాపురము చేసే మనుష్యుడయినా సంచారము
34 చేసే మనుష్య పుత్రుడైనా లేక వుండును. । మరిన్ని
యూదా రాజైన సిద్కీయా యేలనారంభించినప్పుడు
యెహోవా వాక్యము దీర్ఘదర్శియైన ఇర్మీయా
35 యొద్దికి వచ్చి, ఏలామును గురించి అనినది. । సైన్యముల
యెహోవా ఆనతిచ్చేదేమంటే, యిదుగో ఏలాము వా
రియొక్క మహా బలముగల ఘనమైన విల్లును నేను
36 విరుతును. । ఆకాశముయొక్క నాలుగు దిక్కులలో
నుంచి నాలుగు వాయువులను ఏలాము మీదికి విసరే
టట్టు చేసి, వారిని ఆ వాయువులన్నిటి తట్టు చెదర
కొడుదును; కాబట్టి ఏలామునుంచి అవతలకు వెళ్లవే
యబడిన వారు సమస్తమైన జనాంగములలోనున్ను
37 కలిసి వుందురు. । యేమంటే ఏలాము వారిని వారి
శత్రువుల ముందరనున్ను వారి ప్రాణములను వెతికే
వారి ముందరనున్ను భయపడ చేసి, కీడును అనగా నా
కోపాగ్నిని వారి మీదికి రప్పింతునని యెహోవా
ఆనతిచ్చెను; మరిన్ని వారిని నేను నాశనము చేసే పర్యం
38 తమూ వారి వెంటను కత్తిని పంపుదును. । మరిన్ని నా
గద్దెను నేను ఏలాములో స్థిరపర్చి, అక్కడనుంచి
రాజునున్ను అధిపతులనున్ను లయముచేతునని యె
39 హోవా ఆనతిచ్చెను. । అయితే తరువాతి దినములందు
నేను చెరలో వున్న ఏలాము వారిని తిరిగీ రప్పింతున
నిన్ని యెహోవా ఆనతిచ్చెను.

## 50. అధ్యాయము.

1 మరిన్ని బాబెలును గురించిన్ని కల్దీయుల దేశమును
గురించిన్ని దీర్ఘదర్శియైన ఇర్మీయా ద్వారా వచ్చిన
2 యెహోవా వాక్యము యేమంటే, । జనాంగములలో
మీరు ప్రకటనగా తెలియ చెప్పి, జండా యెత్తి, మరుగు
చేయక చాటించి, బాబెలు పట్టబడెనన్నిన్ని బేలు కల
విల పడెననిన్ని మెరోదాఖు తున్కలాయెననిన్ని దాని
బొమ్మలు దిగులు పొంది దాని ప్రతిమలు ఛిన్నాభిన్న
3 ములాయెననిన్ని చెప్పవలెను. । యేమంటే వుత్తరదిక్కు
నుంచి దాని మీదికి జనాంగము వస్తూ వున్నది; అది
దాని దేశమును పాడు చేసినందున అది నిర్మనుష్య
ముగా వుండును; మనుష్యుడున్ను మృగమున్ను దానిని
4 విడిచి తర్లిపోవును. । అయితే యెహోవా ఆనతిచ్చెను
గనుక ఆ దినములందున్ను ఆ కాలమందున్ను ఇశ్రా
యేలు పుత్రులున్ను యూదా వారున్ను కూడి యేడు
స్తూ వెళ్లి తమ దేవుడైన యెహోవాను వెతుకుదురు. ।
వారు సీయోను తట్టు తమ ముఖములను తిప్పుకొని, 5
మార్గమును తెలుసుకొని, మనము యెన్నటికిన్ని
మరువని నిత్యమైన ఒడంబడికతో యెహోవాను
కలుసుకొందుము, రండని ఒకరితో ఒకరు పలుకు
దురు. । నా జనులు తప్పి పోయిన గొర్రెలైరి; వారి 6
బోయలు వారిని తప్పిపోచేసి, పర్వతముల మీద తిరు
గుటకు విడిచి పెట్టిరి; కాబట్టి వారు పర్వతమునుంచి
కొండకు తిరిగి, వారి నెమ్మది స్థలమును వారు మరిచిరి. ।
వారిని చూచిన వారు వారిని మింగిరి; వారి విరోధులు 7
చెప్పినదేమంటే, వీరు తమ నీతియొక్క కాపురమున్ను
తమ పితృల ఆశ్రయమున్ను అయిన యెహోవా విష
యమై పాపము చేసిరి గనుక మావల్ల యేమి దోషమని
అనుకొనిరి. । మీరు బాబెలును విడిచి కల్దీయుల దేశ 8
ములోనుంచి యివతలకు వచ్చి, మందల ముందర నడిచే
మేకపోతుల వలెనే వుండండి. । యేమంటే యిదుగో 9
నేను వుత్తర దేశములోనుంచి గొప్ప జనాంగములను
సమకూర్చి, బాబెలు మీదికి రప్పింతును; వారు దాని
మీదికి యుద్ధ ప్రకారముగా లేచినందున అది పట్ట
బడును; వారి బాణములు ప్రజ్ఞగల బలాఢ్యుని బాణ
ముల వలె అమోఘములై యుండును. । కల్దీయ దోపుడు 10
పడును; దాని దోచుకొనిన వారికి సంతుష్టి కలుగునని
యెహోవా ఆనతిచ్చెను. । యేమంటే నా ఆస్తిని దోచు 11
కొనిన వారలారా, గడ్డి బాగా మేసిన పడ్డ వలెనే
మీరు సంతోషపడి గంతులు వేస్తూ, కొవ్విన ఆబో
తుల లాగున రంకెలు వేస్తూ వున్నందున, । మీ తల్లికి 12
సిగ్గు వచ్చును; మిమ్మును కనినది బిడియపడును; యిదు
గో జనాంగములలో నీచమైన అది అరణ్యముగానున్ను
కొర్ర భూమిగానున్ను అడవిగానున్ను వుండును. ।
యెహోవా వుగ్రమువల్ల అది నిర్మనుష్యముగా 13
వుండును; బాబెలు మార్గమున వచ్చిన ప్రతివాడు
ఆశ్చర్యము పొంది, దాని తెగుళ్లను చూచి లేవిడీ కొ
ట్టును. । సకలమైన విలుకాండ్లారా, బాబెలు యెహో 14
వా విషయమై పాపము చేసెను గనుక దాని చుట్టూ
యుద్ధప్రకారముగా నిలిచి, విల్లు యెక్కుబెట్టుకొని,
దాని మీద బాణములను యెడతెగకుండా వేయండి. ।
నఖముఖాలా దాని మీద బొబ్బ యెత్తండి; దాని 15
చేతిని అది యిచ్చెను; దాని పునాదులు పడిపోయెను;
దాని ప్రాకారములు కింద పడెను; యిది యెహో
వా చేసిన ప్రతికారము; అది మీకు యేలాగు చేసె
నో ఆలాగున దానికి మీరున్ను ప్రతికారము చే
యండి. । బాబెలులో విత్తేవానిన్ని కోతకాలమందు 16
కొడవలి పట్టుకొనిన వానిన్ని తెగవేయండి; వారు
బాధపెట్టే కత్తిని చూచి భయపడి, అందరున్ను తమ
తమ జనుల తట్టు తిరిగి, తమ తమ దేశములలోకి పారి

17 పోవుదురు. । ఇశ్రాయేలు చెదిరిన గొఱ్ఱెయై వున్నది;
సింహములు అతని తోలివేసెను; ముందు అష్షూరు
రాజు అతని మింగెను; తరువాత బాబెలు రాజైన నెబూ
18 ఖద్రెస్సరు వచ్చి అతని దుమ్ములను విరిచెను. । కాబట్టి
ఇశ్రాయేలుకు దేవుడైన సైన్యముల యెహోవా ఆన
తిచ్చేదేమంటే, అష్షూరు రాజును శిక్షించినట్టు బాబెలు
రాజునున్ను అతని దేశమునున్ను నేను శిక్షింతును. ।
19 అప్పుడు నేను ఇశ్రాయేలును తన కాపురముకు తిరిగీ
రప్పించినందున అతడు కర్మెలు మీదనున్ను బాషాను
మీదనున్ను మేసి, ఎఫ్రయీము పర్వతము మీదనున్ను
గిలాదు మీదనున్ను తన మనస్సంతుష్టిని బొందునని
20 చెప్పి, । మరిన్ని యెహోవా ఆనతిచ్చేదేమంటే,
ఆ దినములందున్ను ఆ కాలమందున్ను యెంత వెతికి
నా ఇశ్రాయేలుయొక్క దోషము కనపడక పోవును;
యూదాయొక్క పాపములు యెంత వెతికినా కాన
రాక వుండును; యేమంటే నేను వుంచిన వారి పాప
21 మును పరిహరింతును. । మెరాతయీము దేశము మీది
కిన్ని పెకోదు కాపురస్థుల మీదికిన్ని నీవు వెళ్లి, వారిని
పాడుగానున్ను సర్వనాశనముగానున్ను చేసి, నీకు నేను
ఆజ్ఞాపించిన అన్నిటి ప్రకారము చేతువు గాకని యె
22 హోవా సెలవు యిచ్చెను. । దేశమందు యుద్ధము
యొక్కయున్ను హతము యొక్కయున్ను శబ్దము కల
23 దు. । లోకమంతటినీ కొట్టిన సుత్తె యేలాగు తెగిపోయి
విరిగెను! బాబెలు జనాంగములలో యేలాగు వట్టిదై
24 పోయెను! । ఓ బాబెలూ, నీ కొరకు నేను వురి ఒగ్గి
నందున నీవు తెలియక తగులుకొంటివి; నీవు పోట్లా
డుటకు యెహోవా మీదికి వచ్చినందున నీవు తగు
25 లుకొని దొరికితివి. । యెహోవా తన ఆయుధముల
కొట్టును విప్పి, తన కోపాగ్ని అనే ఆయుధములను
బైలు తీసెను; యేమంటే కల్దీయుల దేశమందు జరిగిన
పని కర్తయైన సైన్యముల యెహోవా పనియై
26 వున్నది. । దూర దిక్కులలోనుంచి మీరు దాని మీదికి
వచ్చి, దాని పదార్థములను విప్పుకొని, దాని పాడు
దిబ్బగా చేసి, దానిలో యేమిన్ని వుండకుండా సర్వ
27 నాశనము చేయండి. । దాని యెడ్లనన్నిటినీ వేట కొర
కైన చోటుకు రప్పించి, కత్తిచేత హతము చేయండి;
వారికి అయ్యో! యేమంటే వారి దినమున్ను వారి శిక్షా
28 కాలమున్ను వచ్చెను. । మన దేవుడయిన యెహోవా
చేసిన ప్రతికారమును, అనగా, ఆయన గుడి నిమిత్తము
చేసిన ప్రతికారమును సీయోనులో తెలియ చెప్పుటకు
బాబెలు దేశములోనుంచి పారిపోయి తప్పించుకొనిన
29 వారి శబ్దము వినబడెను. । బాబెలు మీదికి కూడి వచ్చు
టకు విలుకాండ్లను పిలువండి; విల్లు యెక్కుబెట్టుకొ
నిన మీరందరున్ను దాని చుట్టూ దిగండి; దానిలో
నుంచి యెవనినైనా తప్పి పోనివ్వక, దాని చేతల
ప్రకారము దానికి తిరిగీ చేయండి; యేమంటే అది
ఇశ్రాయేలు యొక్క పరిశుద్ధుడైన యెహోవా మీద
బహుగా అతిశయించెను. । కాబట్టి దాని పడుచు 30
వాండ్లు వీధులలో కూలుదురు; దాని ఆయోధస్థులంద
రున్ను ఆ దినమందు కొట్టివేయ బడుదురని యెహో
వా ఆనతిచ్చెను. । మరిన్ని సైన్యముల యెహోవా 31
ఆనతిచ్చేదేమంటే, ఓ అతి గర్విష్ఠుడా, యిదుగో
నేను నీకు విరోధుడనైతిని; యేమంటే నీ దినము అన
గా నీ శిక్షాకాలము వచ్చెను. । బహుగా అతిశయిం 32
చిన వాడు కూలును; అతని లేవనెత్తుటకు ఒకడున్ను
లేకపోవును; అతని పట్టణములందు నేను అగ్ని రాజ
బెట్టినందున అది దాని చుట్టూ వున్న సమస్తమును
దహించునని చెప్పి, । యింకా సైన్యముల యెహోవా 33
ఆనతిచ్చేదేమంటే, ఇశ్రాయేలు పుత్రులున్ను యూ
దా పుత్రులున్ను కలిసి బాధపడిరి; చెరగా వీరిని తీసు
కపోయిన వారందరున్ను వీరిని గట్టిగా బంధించి విడి
చిపెట్ట మనస్సు లేక వుండిరి. । అయితే వారి ప్రాప 34
కుడు మాహాత్మ్యము గలవాడు; ఆయన నామము సైన్య
ముల యెహోవా; ఆయన వారి వ్యాజ్యమును కడ
ముట్టా జరిగించి, దేశముకు నిమ్మళము కలుగచేసి, బా
బెలు కాపురస్థులను కలవిల పరచును. । యిందుకు 35
యెహోవా ఆనతిచ్చేదేమంటే, కత్తి కల్దీయుల మీది
కిన్ని బాబెలు కాపురస్థుల మీదికిన్ని దాని అధిపతుల
మీదికిన్ని దాని జ్ఞానవంతుల మీదికిన్ని వచ్చి వుండు
ను. । కత్తి మాయకాండ్ల మీదికి వచ్చినందున వారు 36
విభ్రాంతిని పొందుదురు; కత్తి దాని బలాఢ్యుల మీదికి
వచ్చినందున వారు కలవిల పడుదురు. । వారి గుఱ్ఱముల 37
మీదికిన్ని రథముల మీదికిన్ని దానిలో కలసి వున్న
వారందరి మీదికిన్ని కత్తి వచ్చినందున వారు స్త్రీల
వలెనే వుందురు; దాని పదార్థముల మీదికి కత్తి
వచ్చినందున అవి దోచబడును. । దాని వుదకముల మీ 38
దికి వేడిమి వచ్చినందున అవి యెండిపోవును; యేమం
టే ఆ దేశము విగ్రహములు కలదై యున్నది; వారు
తమ బొమ్మల మీద ఆవేశము కలవారై యుండిరి. ।
కాబట్టి అరణ్య దుష్ట మృగములున్ను ద్వీపాంతర దుష్ట 39
మృగములున్ను గుడ్లగూబలున్ను అక్కడ నివసించు
ను; యెన్నటికీ అది మనుష్యునికి కాపురపు స్థలము
కాక వుండును; తరతరముల మట్టుకున్ను అక్కడ కా
పురము చేసుటకు ఒకడున్ను లేక పోవును. । దేవుడు 40
సొదొమ గొమొఱ్ఱా అనే పట్టణములను బోర్లించి
నప్పుడు అవి యేలాగు వుండెనో అలాగున దాని
యందు మనుష్యుడు వుండుటయున్ను నరపుత్రుడు
సంచరించేదిన్ని లేకపోవునని యెహోవా ఆనతి

1 చ్చెను. ।యిదుగో వుత్తర దిక్కులోనుంచి జనమున్ను గొప్ప
జనాంగమున్ను లేచి వచ్చును; లోకపు సరిహద్దులలో
2 నుంచి చాలా మంది రాజులు లేవనెత్తబడుదురు. ।వారు
వింటినిన్ని యీటెనున్ను ధరించుకొని వత్తురు; వారు
క్రూరులై కనికరము వుంచక వుందురు; వారి నోటి
శబ్దము సముద్రపు ఘోషము వలె వుండును; ఓ
బాబెలు కుమారికా, ఆయుధస్థుల వలెనే వారు గుర్ర
ములను యెక్కి అందరున్ను యుద్ధమునకు సిద్ధమై నీ
3 మీదికి వత్తురు. ।బాబెలు రాజు వారి కబురు విని అధై
ర్యపడి పోయెను; అతని చేతులు బలహీనతను పొంది
నవి; ప్రసూతి స్త్రీకి వచ్చిన వేదనలున్ను చింతలున్ను
4 అతని పట్టెను. ।యిదుగో యర్దేను పొంగునుంచి
అతడు సింహము లాగున గట్టి కాపురము మీదికి
వచ్చును; వారిని అక్కడనుంచి పారిపో చేతును; నేను
యెంచిన వాని దాని మీదికి వెళ్ల నాజ్ఞాపింతును; యే
మంటే నాకు సముడు యెవడు! నాకు కాలము నిర్ణ
యించిన వాడు యెవడు? నా ముందర నిలువగల బో
5 యడు యెవడు! ।కాబట్టి బాబెలును గురించి యెహోవా
వాకు తోచిన ఆలోచనను్ను కల్దీయుల దేశమును
గురించి యోచించిన యోచనలనున్ను వినండి; అవశ్య
ముగా మందలో నీచుడైన వాడు వారిని యివతలకు
లాగి, వారితో కూడా వారి కాపురమును పాడు చేసు
6 ను. ।బాబెలును పట్టిన ధ్వనినుంచి భూమి కంపించును;
జనాంగములలో ఆ బొబ్బ వినబడును.

## 51. అధ్యాయము.

1 మరిన్ని యెహోవా ఆనతిచ్చేదేమంటే, యిదిగో
నేను ప్రళయ వాయువును లేవచేసి, బాబెలు వారి మీది
కిన్ని వారిలో కాపురము చేసి నా మీదికి లేచిన వారి
2 మీదికిన్ని రప్పింతును. ।మరిన్ని బాబెలును చెరిగే వా
రిని పంపినందున వారు దానిని చెరిగి, దాని దేశమును
వట్టిదిగా చేతురు; యేమంటే శ్రమ దినమందు వారు
3 నఖముఖాలా దాని మీదికి వత్తురు. ।విలుకాడు విల్లు
యెక్కుబెట్టిన వాని మీదనున్ను కవచము తొడుగు
కొని వచ్చిన వాని మీదనున్ను విల్లు యెక్కుబెట్టి వేసు
నుగాక; దాని పడుచు వారిని కనికరించక దాని సమూ
4 హమును సర్వ నాశనము చేయండి. ।కల్దీయుల దేశ
మందు హతమైన వారు కూలి, దాని వీధులలో దూసి
5 పోయిన వారు పడుదురు. ।యేమంటే ఇశ్రాయేలు
అయినా యూదా అయినా వీరి దేశము ఇశ్రాయే
లుకు పరిశుద్ధుని విషయమై దోషముతోటి నిండి యు
న్నప్పటికిన్ని తమ దేవుడైన సైన్యముల యెహోవా
6 చేత పరిహరించబడక పోవును. ।మీరందరున్ను బాబె
లులోనుంచి పారిపోయి, ప్రతివాడు తన ప్రాణమును
తప్పించుకొననిమ్ము; దాని దోషముతో కూడా కొట్టివే
యబడకుండా వుండండి; యేమంటే యిది యెహో
వాకు ప్రతికారము చేసే కాలము; ఆయన దానికి
ప్రతిగా యిచ్చును. ।బాబెలు యెహోవా చేతిలో 7
బంగారపు పాత్ర అయి లోకమంతటినీ మత్తు చేసినదై
వుండెను; జనాంగములు దాని ద్రాక్షా రసమును తాగి
నందున మత్తును పొందినవి. ।హఠాత్తుగా బాబెలు కూలి 8
విచ్ఛిత్తయిపోయెను; దాని కొరకు అంగలార్చండి;
అది స్వస్థతను పొందునేమో దాని నొప్పి కొరకు జీగు
రును తెప్పించండి. ।మేము బాబెలుకు ఔషధము యి 9
చ్చినప్పటికిన్ని దానికి స్వస్థత రాకపోయెను; దానిని
విడిచిపెట్టి, మనమందరమున్ను మన స్వదేశముకు తిరిగీ
వెళ్లుదాము; యేమంటే అది పొందిన ఆజ్ఞ మేఘముల
మీదికి యెక్కి, పైని ఆకాశము మట్టుకు సాగెను. ।
యెహోవా మన నీతిని బైలు పరచెను; రండి మన 10
దేవుడైన యెహోవా కార్యమును సీయోను యందు
తెలియచేతాము. ।బాణములను చికిలీ చేయండి; అమ్ముల 11
పొదులను నింపండి; యెహోవా మాదీయుల రాజుల
ధైర్యమును ప్రేరేపించెను; యేమంటే ఆయన ఆలో
చన బాబెలుకు విరోధమైనందున దానిని నాశనము
చేసును; యేమంటే యిది యెహోవా చేసిన ప్రతికా
రము, అనగా, తన గుడిని గురించిన ప్రతికారము అయి
వున్నది. ।బాబెలు ప్రాకారముల మీద జండా యె 12
త్తండి; కావలిని బలముగా చేయండి; కావలి వారిని
వుంచి, మాటులను సిద్ధము చేయండి; యేమంటే బా
బెలు కాపురస్తుల మీద యెహోవా యేమి యోజించి
చెప్పెనో అదే ఆయన కాచేసెను. ।విస్తారపు వుదక 13
ముల దగ్గిర కాపురము చేసి, విస్తారమైన పదార్థ
ములు గలదానా, నీ అంత్య కాలము వచ్చెను; నీ ద్ర
వ్యాశయొక్క పరిమాణము సరిపడెను. ।గొంగళి పురు 14
గులతోనైనట్టు నేను నిన్ను మనుష్యులతో నింపుదును;
వారు నీ మీద ఆర్చుదురని సైన్యముల యెహోవా
తన మీద తానే ప్రమాణముచేసి సెలవు యిచ్చెను. ।
తన మాహాత్మ్యముచేత ఆయన భూమిని కలుగ జేసెను; 15
తన జ్ఞానముచేత లోకమును ఆయన స్థిరపచెర్చను; తన
బుద్ధిచేత ఆకాశమండలమును విశాలముగా చేసెను. ।
తన శబ్దమును ఆయన వుచ్చరించినప్పుడే జలరాశి ఆకా 16
శమందు వుండును; లోకపు సరిహద్దులలోనుంచి ఆయన
యెండమావులను పైకి యెక్కించును; మెరుపులనున్ను
వాననున్ను కలుగచేసును; వాయువునున్ను తన పదా
ర్థములలోనుంచి బైలు తియ్యించును. ।ప్రతి మను 17
ష్యునికీ పశువుకు వలెనే తెలివిలేక పోయెను; ప్రతి
పోత పనివాడు తాను చేసిన ప్రతిమవల్ల కలవిల పడెను;
యేమంటే అతని విగ్రహము అబద్ధము; వాటికి వూపిరి

18 యెంతమాత్రము లేదు. । అవి వ్యర్థమైయున్ని భ్రమ
పెట్టే పని అయిన్ని వున్నవి; వాటికి శిక్షా కాలము
19 వచ్చినప్పుడు అవి లయమవును. । యాకోబుయొక్క భా
గము వాటి లాగు కాదు; యేమంటే ఆయన సమస్త
మైన వాటిని రూపించెను; ఇశ్రాయేలు ఆయనకు స్వా
ధీనమైన గద అయి వుండెను; ఆయన నామము సైన్య
20 ముల యెహోవా. । నీవు నాయొక్క గదయున్ను
ఆయుధములున్ను అయి వున్నావు; యేమంటే నీ చేత
నేను జనాంగములను తున్కలుగా కొట్టించి, నీ చేత
21 రాజ్యములను లయము చేయింతును. । మరిన్ని నీ చేత
నేను గుర్రమునున్ను దాని నెక్కిన రౌతునున్ను తున్క
లుగా కొట్టింతును; నీ చేత రథమునున్ను దాని నెక్కిన
22 రౌతునున్ను తున్కలుగా కొట్టింతును. । మరిన్ని నీ చేత
పురుషునిన్ని స్త్రీనిన్ని తున్కలుగా కొట్టింతును; నీ చేత
పెద్ద వాండ్లనున్ను చిన్నవాండ్లనున్ను తున్కలుగా కొ
ట్టింతును; నీ చేత పడుచువానిన్ని కన్యకనున్ను తున్క
23 లుగా కొట్టింతును. । మరిన్ని నీ చేత నేను బోయనిన్ని
అతని మందనున్ను తున్కలుగా కొట్టింతును; నీ చేత
వ్యవసాయదారునున్ను వాని దుక్కి యెడ్లనున్ను తున్క
లుగా కొట్టింతును; మరిన్ని యేలిన వారినిన్ని అధికా
రులనున్ను నేను నీ చేత తున్కలుగా కొట్టింతును. ।
24 యీలాగున మీ కన్నులముందర నేను బాబెలు వా
రున్ను కల్దీయుల దేశస్థులున్ను సీయోనులో చేసిన దో
షమంతటికీ ప్రతి యిచ్చి, సమము చేతునని యెహో
25 వా ఆనతిచ్చి; మరిన్ని చెప్పేదేమంటే, । ఓ లయము చేసే
పర్వతమా, యిదుగో నేను నీకు విరోధినైతిని; నీవు
లోకమంతటిని క్షయము చేస్తివి; కాబట్టి నేను నీ పైని
నా హస్తమును చాపి, శిలాపర్వతము మీదనుంచి నిన్ను
కిందికి దొలిర్చించి, కాలే పర్వతముగా చేసినందున, ।
26 వారు మూల కొరకైనా పునాది కొరకైనా నీలో
నుంచి రాయి తీసుకొనక వుందురు; యెప్పటికీ నీవు
27 పాడుగా వుందువని యెహోవా ఆనతిచ్చెను. । ఆ
దేశమందు జండాను యెత్తండి; జనాంగములలో బాకా
నాదము చేయించి, దాని మీదికి వచ్చుటకు జనాంగ
ములను సిద్ధపర్చండి; అరారాఘు, మిన్ని, అష్కెనజు,
అనే రాజ్యములను దాని మీదికి వచ్చేటట్టుగా పిలు
వండి; దానికి విరోధముగా సైన్యాధిపతిని నిర్ణయిం
చండి; రోమములు గల గొంగళి పురుగుల వలెనే దాని
28 మీదికి గుర్రములను రప్పించండి. । దానితో కలహించే
టట్టుగా జనాంగములనున్ను మాదీయుల రాజులనున్ను
వారికింద వున్న అధిపతులనున్ను అధికారులనున్ను
29 చతురంగ బలమునున్ను సిద్ధపర్చండి. । అప్పుడు ఆ దేశ
ము కంపించి, బహు చింతగా వుండును; యేమంటే
బాబెలు మీద యెహోవా చేసిన యోజనలన్నీ రూ
ఢమైనందున బాబెలు దేశము నిర్మనుష్యమై పోవును. ।
బాబెలులో వున్న బలాఢ్యులు యుద్ధము చేయలేక, 30
మాటుగా దాగి వుండిరి; వారి మాహాత్మ్యము తప్పి పో
యినందున స్త్రీల వలె వుండిరి; వారు దాని కాపురపు
స్థలములను కాల్చివేసిరి; దాని అడ్డు గడలు విరిగెను. ।
బాబెలు రాజుతో నీ పట్టణము వొక మూల శత్రు 31
వునిచేత పడెననిన్ని, రేవులు పట్టబడెననిన్ని, రెల్లు
కర్రలు కాలిపోయెననిన్ని, । ఆయుధస్థులు జడిసిరి 32
నిన్ని, చెప్పుటకు వొక హర్కారా మరియొక హర్కా
రానున్ను వొక రాయభారి మరియొక రాయభారినిన్ని
యెదుర్కొనుటకు పరుగెత్తి వత్తురు. । యిందుకు ఇశ్రా 33
యేలుకు దేవుడైన సైన్యముల యెహోవా ఆనతిచ్చే
దేమంటే, బాబెలు కుమార్తె కళ్లము వలె వున్నది;
దానిని తొక్కవలసిన సమయము వచ్చెను; యింకా
కొంత సేపటికి దాని కోతకాలము వచ్చును. । బాబెలు 34
రాజైన నెబూఖద్రెస్సరు నన్ను మింగెను; అతడు నన్ను
నలిపెను; నన్ను శూన్య భాండము లాగున చేసెను;
క్రూర సర్పము లాగున నన్ను మింగెను; నా రుచి
కరపు భోజన వస్తువుల చేత అతడు తన కడుపును
నింపుకొని నన్ను అవతలకు తోలివేసెను. । నాకున్ను నా 35
రక్త సంబంధికులకున్ను చేసిన నిర్బంధము బాబెలు
మీద పడునుగాకని సీయోను కాపురస్తుడు అనును; నా
రక్త దోషము కల్దీయుల కాపురస్తుల మీదికి వచ్చి వుం
డును గాకని యెరూశలేము అనును. । యిందుకు యె 36
హోవా ఆనతిచ్చేదేమంటే, యిదుగో నేను నీ వ్యాజ్య
మును జరిగించి, దాని సముద్రమునున్ను దాని వూటల
నున్ను యెండిపోజేసి, నీకు ప్రతికారము చేతును. । మరి 37
న్ని బాబెలు పాడు దిబ్బయున్ను క్రూర సర్పములకు
నివాస స్థలమున్ను అయి, ఆశ్చర్యము కొరకున్ను లేవి
డికి హేతువయ్యే కొరకున్ను నిర్మనుష్యము అయ్యే
కొరకున్ను వుండును. । వారు సింహముల లాగున కూడి 38
నాదము చేతురు; సింహపు పిల్ల లాగున రంకె వేతురు. ।
వారికి వెట్ట పుట్టినప్పుడు నేను వారి విందులను కలుగ 39
చేతును; మరిన్ని వారు హర్షించి శాశ్వత నిద్రను
పొంది, తిరిగీ మేలుకొనక వుండేలాగు నేను వారిని
మత్తిల్లిన వారినిగా చేతును అని యెహోవా ఆనతి
చ్చెను. । మేకపోతుల కలసిన గొర్రె పొట్టేళ్ల వలెనున్ను 40
గొర్రె పిల్లల వలెనున్ను వారిని వధకు తెత్తును. । షేషఖు 41
యేలాగు పట్టుబడెను! లోకమంతటా ఘనమును పొం
దినది యేలాగు కలవిల పడెను! బాబెలు జనాంగము
లలో యేలాగు ఆశ్చర్య కారణమాయెను! । సముద్ర 42
ము బాబెలు మీదికి మించి వచ్చెను; విస్తారమైన తరం
గములవల్ల అది మునిగిపోయెను. । దాని పట్టణములు 43
పాడైపోయెను; అది కొర్ర భూమిగానున్ను అరణ్య

ముగానున్ను అయి, నిర్మనుష్యముగానున్ను నరపుత్ర
44 సంచారము లేకనున్ను వుండును. । మరిన్ని నేను బాబె
లులో వున్న బేలును శిక్షించి, దేనిని అతడు మింగె
నో దాని వాని నోట్లోనుంచి బైటికి తీయింతును;
కాబట్టి యికను జనాంగములు అతని యొద్దికి కలసి
ప్రవహించక యుండును; నిజముగా బాబెలు ప్రా
45 కారములు కూలును. । నా జనులారా, మీరు దానిలో
నుంచి బైలు వెళ్లి, అందరున్ను మీ మీ ప్రాణములను
46 యెహోవా కోపాగ్నినుంచి తప్పించుకొండి. । ఆ దేశ
ములోనుంచి వినబడిన కబురువల్ల మీరు సొమ్మసిల్లి,
హృదయములకు అధైర్యము రాకుండా దానిలోనుంచి
బైలు వెళ్లండి; యేమంటే వొక సంవత్సరమందు కబురు
పుట్టును, రెండో సంవత్సరమందున్ను కబురు పుట్టును;
దేశమందు నిర్బంధమున్ను అధికారులు వొకని మీద
47 వొకడు పడుటయున్ను కలిగి యుండును. । యిందుకు
యిదుగో దినములు వస్తూ వున్నవి; అప్పుడు నేను బా
బెలులో చెక్కిన ప్రతిమల మీదికి ఆజ్ఞ విధింతును;
దాని దేశమంతా విభ్రాంతి పడును; దాని జనులు
48 హతులై దానిలో కూలుదురు. । అప్పుడు ఆకాశము
న్ను భూమిన్ని దానిలో వున్న సమస్తమున్ను బాబె
లును గూర్చి సంతోషించి ఆర్చును; యేమంటే
లయకర్తలు ఉత్తర దిక్కులోనుంచి దాని మీదికి
49 వత్తురని యెహోవా ఆనతిచ్చెను. । బాబెలు ఇశ్రా
యేలుయొక్క హతులైన వారిని కూలేటట్టు చేసిన లాగు
యావద్భూమియొక్క హతులైన వారు బాబెలులో
50 కూలుదురు. । కత్తిని తప్పించుకొనిన వారలారా, అవత
లకు వెళ్లి, వూరకే నిలువకండి; దూరమునుంచి యె
హోవాను తలంచుకొని, యెరూశలేము పట్టణము
51 ను జ్ఞాపకము చేసుకొండి. । మేము దిగులు పడితిమి;
అవమానమును పొందితిమి; అన్య దేశస్థులు యెహో
వా మందిరముయొక్క పరిశుద్ధ స్థలములందు చొచ్చిరి
గనుక మా ముఖములు సిగ్గుచేత కప్పబడెనని మీరు
52 అనుకొన్నందుకు, । యెహోవా ఆనతిచ్చేదేమంటే,
యిదుగో దినములు వస్తూ వున్నవి; అప్పుడు నేను దాని
చెక్కిన ప్రతిమల మీద ఆజ్ఞ విధింతును; దాని దేశ
మంతటా వారు గాయమును పొంది మూల్గుతూ వుం
53 దురు. । బాబెలు ఆకాశము మీదికి యెక్కి, వున్నత
ముగా వుండి, తన బలము యెంత అధికము చేసుకొ
నినా నా వల్ల లయకర్తలు దాని మీదికి వత్తురని యె
54 హోవా ఆనతిచ్చెను. । బాబెలులోనుంచి రోదన శబ్ద
మున్ను కల్దీయుల దేశములోనుంచి నాశన శబ్దమున్ను
55 వినబడును. । యేమంటే యెహోవా బాబెలును లయ
ము చేస్తూ, దానిలోనుంచి వుప్పొంగిన శబ్దమును పోచే
స్తూ వుండెను; దాని తరంగములు సముద్రము లాగున
విస్తరించి ఘోషించును; అవి ఘోషించిన శబ్దము
మీదికి యెక్కును. । యేమంటే బాబెలు మీదికే లయ 56
కర్త వచ్చును; కాబట్టి దాని బలాఢ్యులు చిక్కుదురు;
వారందరి విండ్లు విరువబడును; యేమంటే ప్రతికార
ము చేసే దేవుడయిన యెహోవా అవశ్యము దానికి
ప్రతి యిచ్చును. । నేను దాని అధిపతులనున్ను దాని 57
జ్ఞానులనున్ను దాని సైన్యాధిపతులనున్ను అధికారుల
నున్ను దాని బలాఢ్యులనున్ను మత్తిలజేసినందున వారు
దీర్ఘ నిద్ర పొంది, యెన్నటికీ తెలియని వారౌదు
రని సైన్యముల యెహోవా అనే నామము గల రాజు
ఆనతిచ్చెను. । మరిన్ని బాబెలుయొక్క విశాలమైన ప్రా 58
కారములు యావత్తూ పడగొట్టబడును; దాని వున్నత
మైన గవనులు అగ్నిచేత కాల్చివేయబడును; కాబట్టి
ఆ జనుల పని వ్యర్థమవును; జనాంగముల కష్టార్జి
తము అగ్ని పాలౌనని సైన్యముల యెహోవా ఆన
తిచ్చెను. । యూదా రాజైన సిద్కియా తోటి అతని 59
యొక్క యేలుబడి నాలుగో సంవత్సరమందు బాబె
లుకు వెళ్లేటప్పుడు మయశేయాకు పుట్టిన నేరీయా
కుమారుడైన శెరాయాతో యీ వాక్యమును దీర్ఘ
దర్శియైన ఇర్మీయా చెప్పెను; యీ శెరాయా సాత్వి
కుడైన అధిపతి అయి వుండెను. । యీలాగున బాబెలు 60
మీదికి రాగల కీడు యావత్తు, అనగా, బాబెలును
గురించి లిఖించబడిన యీ మాటలన్నిటినీ గ్రంథమందు
వ్రాసిన తరువాత ఇర్మీయా శెరాయాతో చెప్పినదేమం
టే, । నీవు బాబెలుకు వచ్చినప్పుడు దానిని చూచి, 61
యీ మాటలన్నిటినీ చదివిన తరువాత నీవు అనవలసిన
లాగు, । వో యెహోవా, నీవు యీ స్థలమును గురించి 62
యీలాగున ఆనతిచ్చి, దానిలో మనుష్యుడైనా మృగ
మైనా వుండకుండానున్ను అది యెన్నటికీ వట్టిదయే
టట్టుగానున్ను దానిని నరికి వేసుటకు నిర్ణయిస్తివని
చెప్పవలెను. । మరిన్ని నీవు యీ గ్రంథమును చదివి 63
చాలించిన తరువాత దానికి రాయి కట్టి ఫెరాతు నది
మధ్యను వేసి, । యీలాగున బాబెలు మునిగి, నేను దా 64
నికి రప్పించే కీడునుంచి యెన్నటికీ అది లేవక వుండు
ను; యేమంటే వారు మూర్ఛ పోవుదురని చెప్ప వలె
నని నిర్ణయించెను. యింత మట్టుకు యివి ఇర్మీయా
వాక్యములు.

## 52. అధ్యాయము.

సిద్కియా యేల నారంభించినప్పుడు యిరువై వొక 1
సంవత్సరముల వాడై, యెరూశలేమును పదకొండు
సంవత్సరములు యేలెను; అతని తల్లి లిబ్నా వూరి వా
డైన ఇర్మీయా కుమార్తెయైన హమూథలు అని పిలువ
బడెను. । అయితే యితడు యెహోయాకీము చేసిన 2

అంతటి లాగున యెహోవా దృష్టికి కీడు చేసెను. ।
3 అయినందున యూదా వారి మీదనున్ను యెరూశలే
ము మీదనున్ను యెహోవా తెచ్చుకొనిన కోపము
చేత ఆయన తన సముఖములోనుంచి వారిని తోలివేసే
మట్టుకు సిద్కీయా బాబెలు రాజు మీద తిరగబడుట
4 సంభవించెను. । అయితే అతనియొక్క యేలుబడి తొ
మ్మిదో సంవత్సరము పదో నెల పదో దినమందు బాబెలు
రాజైన నెబూఖద్రెస్సరున్ను అతని సైన్యము యావ
త్తున్ను యెరూశలేము మీదికి వచ్చి, దాని యెదుట
డేరాలు వేసి, దాని చుట్టూ బురుజులను కట్టెను. ।
5 యీలాగున పట్టణము రాజైన సిద్కీయా యేలుబడి
పదకొండో సంవత్సరము పర్యంతమూ గడువ పడెను.।
6 అయితే నాలుగో నెల తొమ్మిదో నాటి యందు క్షా
మము పట్టణమందు బలముగా వుండెను; దేశపు జను
7 లకు ఆహారము యెంతమాత్రమూ లేదు. । అప్పుడు ఆ
పట్టణము కొట్టి వేయబడినందున ఆయుధస్థులందరు
న్ను రాత్రి యందు రాజు తోట దగ్గిర రెండు గోడల
మధ్య వున్న ద్వారపు మార్గముచేత పారిపోయిరి;
కల్దీయులు పట్టణము యెదుట చుట్టూ వుండినందున
రాజు మైదానమునకు వెళ్లే మార్గము చేత వెళ్లెను. ।
8 అయితే కల్దీయుల సైన్యము రాజును తరిమి, యెరిఖో
మైదానమందు సమీపించినందున అతని సైన్యము అత
9 నికి దూరముగా చెదర చేయబడెను. । అప్పుడు వారు
రాజును పట్టుకొని, హమాతు దేశపు రిబ్లా పట్టణ
మందు వున్న బాబెలు రాజు యొద్దికి అతని తీసుకొని
వచ్చిరి; అక్కడ అతడు వాని మీద ఆజ్ఞ విధించెను.।
10 యేలాగంటే బాబెలు రాజు సిద్కీయా కుమాళ్లను
అతని కండ్ల ముందర చంపి, రిబ్లా పట్టణమందు యూదా
11 దేశపు అధిపతులను చంపి, । సిద్కీయా కండ్లను వూడ
తీయించెను; మరిన్ని బాబెలు రాజు అతని సంకెళ్లచేత
బంధించి, బాబెలుకు తీసుకొపోయి, అతడు మరణమ
12 య్యే పర్యంతమూ చెరసాలలో వుంచెను. । మరిన్ని
బాబెలు రాజైన నెబూఖద్రెస్సరుయొక్క యేలుబడి
పందొమ్మిదో సంవత్సరము అయిదో నెల పదో దిన
మందు తలవర్లకు అధిపతిన్ని బాబెలు రాజుకు సేవ
కుడున్ను అయిన నెబూజరదాను యెరూశలేముకు
13 వచ్చి, । యెహోవా మందిరమునున్ను రాజ మందిరము
నున్ను యెరూశలేము యందున్న యిండ్లనున్ను సమస్త
మైన గొప్ప వారి యిండ్లనున్ను అగ్ని చేత దహింప
14 చేసెను. । మరిన్ని తలవర్ల అధిపతి యొద్దను వున్న కల్దీ
యుల సైన్యస్థులందరున్ను యెరూశలేము చుట్టూ వున్న
15 ప్రాకారములన్నిటినీ కింద పడగొట్టిరి. । అప్పుడు తల
వర్ల అధిపతియైన నెబూజరదాను జనులలో దరిద్రు
లను కొందరినిన్ని పట్టణమందు శేషించిన జనులనున్ను
బాబెలు రాజు తట్టు తిరిగి శరణు జొచ్చిన వారినిన్ని
జన సమూహములో తతిమ్మా వారినిన్ని చెర తీసుకొ
పోయెను. । అయితే తలవర్ల అధిపతియైన నెబూజర 16
దాను వ్యవసాయదారులున్ను ద్రాక్ష తోట మాలీలు
న్ను అయ్యేటట్టుగా దేశపు దరిద్రులలో కొందరిని
వుండ నిచ్చెను. । మరిన్ని యెహోవా మందిరమందున్న 17
యిత్తడి స్తంభములనున్ను మట్లనున్ను యెహోవా
మందిరమందున్న యిత్తడి సముద్రమునున్ను కల్దీయులు
తునకలుగా కొట్టి, ఆ యిత్తడి యావత్తు బాబెలు పట్ట
ణమునకు యెత్తుకొ పోయిరి. । మరిన్ని వారు సేవార్థ 18
మైన కుండలనున్ను చేటలనున్ను మాంసపు ముళ్లనున్ను
పళ్లెములనున్ను ధూపార్తెలనున్ను యిత్తడి పాత్రలన్ని
టినిన్ని వీరు తీసుకొ పోయిరి. । మరిన్ని గిన్నెలున్ను 19
కుంపట్లున్ను పళ్లెములున్ను కుండలున్ను శెమ్మలున్ను
ధూపార్తెలున్ను పాత్రలున్ను మొదలైన బంగారపు
వస్తువులనున్ను వెండి వస్తువులనున్ను తలవర్ల అధిపతి
తీసుకొపోయెను. । మరిన్ని సొలొమోను యెహోవా 20
మందిరము కొరకు చేయించిన రెండు స్తంభములనున్ను
వొక సముద్రమునున్ను మట్ల కింద వున్న పన్నెండు
యిత్తడి యెద్లనున్ను తీసుకొ పోయెను; యీ యిత్తడి
వస్తువుల లెక్క అపరిమితమై వుండెను. । అయితే ఆ 21
వొక్కొక స్తంభము పద్దెనిమిది మూరల నిడుపు కలిగి
వుండెను; దాని కైవారము పండెండు మూరలు; అది
గుల్ల కలదిన్ని నాలుగు వేళ్ల దళసరి కలదిన్ని అయి
వుండెను. । మరిన్ని దాని పైని తలాటము వొకటి వుం 22
డెను; ఆ తలాటము నిడివి అయిదు మూరలు; తలాట
ముల చుట్టూ అల్లిన వలలున్ను దానిమ్మ పండ్లున్ను కలిగి
వుండెను; యివి అన్నీ యిత్తడివై వుండెను; రెండో
స్తంభమందున్ను దానిమ్మ పండ్లు ఆ ప్రకారముగానే
వుండెను. । నాలుగు పక్కలను తొంభై ఆరు దానిమ్మ 23
పండ్లు కలిగి వుండెను; అల్లిన వలల చుట్టూ వున్న దా
నిమ్మ పండ్లు అన్నిన్ని నూరు వుండెను. । అయితే తల 24
వర్ల అధిపతి ప్రధానార్చకుడైన శెరాయానున్ను
రెండో అర్చకుడైన సెఫన్యానున్ను ద్వారపాలకులను
ముగ్గురినిన్ని పట్టుకొనెను. । మరిన్ని ఆయుధస్థుల మీద 25
కాపుగా నిర్ణయించబడిన పట్టణపు పండుని వొక
నిన్ని రాజ సముఖమందు కనిపెట్టే పట్టణమందు దొరి
కిన యేడుగురినిన్ని దేశపు జనులను సైన్యస్థులుగా చేసే
సైన్యముయొక్క ప్రధాన లేఖికునిన్ని పట్టణమందు
దొరికిన దేశపు జనులను అరువై మందినిన్ని పట్టుకొ
నెను. । వీరిని తలవర్ల అధిపతియైన నెబూజరదాను 26
తీసుకొని, రిబ్లా పట్టణమందలి బాబెలు రాజుయొద్దికి
కొంచువచ్చెను. । అప్పుడు బాబెలు రాజు హమాతు 27
దేశపు రిబ్లా పట్టణమందు వారిని నరికి చంపెను; యీ

లాగున యూదా స్వదేశములోనుంచి చెరలోకి తీసుకొ
28 పోబడెను. । నెబూఖద్రెస్సరు చెర తీసుకొ పోయిన
జనులు యెందరంటే, యేడో సంవత్సరమందు మూడు
వేల యిరువై ముగ్గురు యూదైయులను తీసుకొ పో
29 యెను. । మరిన్ని నెబూఖద్రెస్సరు యేలుబడి పద్దెని
మిదో సంవత్సరమందు అతడు యెరూశలేములోనుంచి
యెనబన్నూట ముప్పై యిద్దరిని చెర తీసుకొ పోయె
30 ను. । మరిన్ని నెబూఖద్రెస్సరుయొక్క యేలుబడి యిరు
వైమూడో సంవత్సరమందు తలవర్లకు అధిపతియైన
నెబూజరదాను యూదైయులలో యేడు నూట నలుబై
అయిదు గురిని చెర తీసుకొ పోయెను; వీరిలెక్క వెరసి
31 నాలుగు వేల ఆరునూరు అయి వుండెను. । అయితే
యూదా రాజైన యెహోయాఖీను చెరపడిన ముప్పై
యేడో సంవత్సరము పండ్రెండో నెల యిరువై అయి
దో దినమందు బాబెలు రాజైన ఎవిల్మెరోదఖు తాను
యేల నారంభించిన సంవత్సరమందు బందీగృహములో
నుంచి యూదా రాజైన యెహోయాఖీనును విము
క్తుని చేసి, । అతనితో స్నేహ పూర్వకముగా మాట్లా 32
డి, అతని గద్దె బాబెలులో తన యొద్ద వున్న రాజుల
గద్దెల కంటే వున్నతముగా చేసెను. । అయినందున 33
అతడు తన బందీగృహపు బట్టలను తీసివేసి, అన్య
వస్త్రములను ధరించుకొని, తాను బ్రతికిన దినములన్నిటి
పర్యంతమూ అతని సన్నిధిని భుజిస్తూ వుండెను. । మరి 34
న్ని అతని జీవనోపాధి యెంతంటే, దినము వొక్కొం
టికి బాబెలు రాజువల్ల నిర్ణయించబడినది; అది అత
డు బ్రతికిన దినములన్నిటి పర్యంతమూ ఆ చొప్పున
ధృవమైన జరుగుతూ వుండెను.

# ఇర్మీయా యొక్క ప్రలాప వాక్యములు.

## 1. అధ్యాయము.

1 జనులతోటి పూర్ణిగా వుండిన పట్టణము యేలా
గు వొంటరిగా కూర్చుని వున్నది! విధవ వలె యేలాగు
వున్నది! జనాంగములలో ఘనముగానున్న సంస్థాన
ములలో రాణిగానున్ను వుండినది యేలాగు పన్నుకు
2 లోబడి యున్నది! । అది రాత్రి యేడుస్తూ వున్నది;
కన్నీరు దాని బుగ్గల మీద కారుతూ వున్నది; దాని
స్నేహితులలో దానిని వోదార్చేవాడు వొకడూ లేడు;
దాని చెలికాండ్లందరున్ను దాని యెడల మోసమును
3 జరిగించి దానికి శత్రువులైరి. । బాధ విషయమైయున్ని
బహు దాసత్వపు విషయమైయున్ని యూదా చెరపట్ట
బడెను; అది అన్య జనాంగములలో కాపురము చేసినం
దున నిమ్మళము లేక వుండెను; దానిని తరిమే వారంద
4 రున్ను యిరుకు చోట్లలో దానిని కలుసుకొనిరి. । పండు
గలకు యెవరూ రానందున సీయోను మార్గములు
మూల్గుతూ వున్నవి; దాని ద్వారములు విడువబడి వు
న్నవి; దాని అర్చకులు నిట్టూర్పు బుచ్చుచూ వున్నా
రు; దాని చెలికత్తెలు చింతాక్రాంతలై వున్నారు; అది
5 దుఃఖిస్తూ వున్నది. । దాని విరోధులు శ్రేష్ఠులైనారు;
దాని శత్రువులు క్షేమమును పొంది యున్నారు; యే
మంటే విస్తారమైన దాని తప్పితముల నిమిత్తము యె
హొవా దానిని దండించినందున దాని పిల్లలు శత్రు
6 వుని ముందర చెరలోకి వెళ్లియున్నారు. । యీలాగున
సీయోను కుమార్తె యొద్దనుంచి దాని సౌందర్యము
తర్లిపోయెను; దాని అధిపతులు మేత లేని దుప్పుల
లాగున వున్నారు; తరిమే వాని ముందరనుంచి తప్పిం
7 చుకొన శక్తి లేక వున్నారు. । యీ శ్రమ దినములందు
వుపద్రవమును పొందిన యెరూశలేము ఆదిని తనకు
కలిగిన భాగ్యమును తలంచుకొంటూ వున్నది; యేమం
టే ప్రాపకుడు వొకడూ లేడు గనుక దాని జనులు
శత్రువుని చేతికి దొరికిరి; విరోధులు దానిని చూచి
8 దాని సబ్బాతు దినములను అపహసించిరి. । యెరూశ
లేము బహు దోషము చేసెను గనుక అది పరిహరించ
బడెను; మునుపు దానిని మన్నించిన వారు దాని మాన
మును చూచి రోసిరి; అది నిట్టూర్పు పుచ్చి వెనుక
9 తిరిగెను.।దాని అపవిత్రత దాని చెంగుల మీద వున్నది;
అంతమందు యేలాగౌనో అని అది తలంచుకోక,
నీచ స్థితిలోకి దిగబడెను; దానిని పరామర్శించిన
వాడు వొకడున్ను లేడు; వో యెహొవా నా
బాధను చూడుము, యేమంటే శత్రువుడు నా మీద
అతిశయము పొందెను. । విరోధి దాని ప్రియమైన వస్తు 10
వుల మీద తన హస్తమును చాపెను; యెవరు నీ సంఘ
ములో ప్రవేశించ కూడదని నీవు ఆజ్ఞాపించితివో
ఆ అన్య జనాంగములు దాని పరిశుద్ధ స్థలములోకి
చొచ్చుట అది చూచెను. । దాని జనులు ఆహారమును 11
వెతుకుతూ నిట్టూర్పు పుచ్చిరి; ప్రాణమును నిలుపు
కొనేటందుకు తమ ప్రియమైన వస్తువులను యిచ్చిరి;
వో యెహొవా, చూడుము; యెందుకంటే నేను
నీచుడను అయినాను. । యీ మార్గమున వస్తూ పో 12
తూ వుండే వారలారా, మీకు విచారము లేదా! యె
హొవా నా మీద కోపాగ్ని తెచ్చుకొని, నన్ను
చింతపరచినందున నేను పొందిన దుఃఖమును మీరు
చూచి, దీనికి సమమైన దుఃఖము యెక్కడ వున్నదో
అది విచారించుకొండి. । యేమంటే పైనుంచి ఆయన 13
నా శల్యములలోకి అగ్నిని పంపెను; వాటియందు
అది మహా బలముగా వున్నది; నా కాళ్లకొరకు ఆయన
వలను వొగ్గి నన్ను చిక్కించుకొని, పట్టుకొనెను; దిన
మంతా ఆయన నన్ను పాడుగానున్ను రోగిగానున్ను
చేసెను. । నా తప్పితముల కాడి ఆయన తాళ్లతో కట్ట 14
బడెను; అవి అల్లపడి, నా మెడ మీద వేయబడెను;
నా శక్తిని ఆయన తక్కువ చేసెను; యెహొవా
నన్ను వారి చేతులకు అప్పగించినందున లేవ శక్తి నాకు
లేకపోయెను. । నాలో వున్న బలాఢ్యులనందరినీ యె 15
హొవా పాదముల కింద త్రొక్కెను; నా పడుచు
వారిని నలిపి వేయుటకు నా మీదికి జన సమూహమును
పిలిచెను; యూదా కన్యాకుమారికను యెహొవా
ద్రాక్షగానుగలలో అయినట్టు తొక్కెను. । యిందు కొ 16
రకు నేను యేడ్చుతూ వున్నాను; నా ప్రాణము తెప్పి
రిల్లుటకు వోదార్చే వాడు దూరముగా వున్నందున
నా కంట నీరు గారుతున్నది; శత్రువుడు జయించినం
దున నా పిల్లలు పాడైపోయిరి. । సీయోను తన చేతు 17
లను యెత్తినప్పటికిన్ని దాని ఓదార్చుటకు వొకడున్ను
లేడు; యెహొవా సెలవు యిచ్చెను గనుక యాకోబు
చుట్టూ వున్నవారు అతనికి విరోధులై వున్నారు; యె
రూశలేము వారిలో అంటుగా వుండే స్త్రీవలె వున్నది. ।
యెహొవా నీతిపరుడు; యేమంటే నేను ఆయన 18

ఆజ్ఞకు వ్యతిరిక్తుడనయి వుంటిని; సమస్త జనులారా,
నేను పొందిన దుఃఖమును మీరు ఆలకించి చూడండీ;
నా కన్యలున్ను నా పడుచువారున్ను చెరలోకి వెళ్లిరి. ।
19 నేను నా స్నేహితులను పిలిస్తిని, అయితే వారు నన్ను
మోసపుచ్చిరి; నా అర్చకులున్ను నా పెద్దలున్ను తమ
ప్రాణములు నిలుపు కొనుటకు ఆహారమును వెతుకు
20 తూ పట్టణములోనే జీవములను విడిచిరి. । ఓ యె
హోవా, శ్రమలో వున్న నన్ను కనికరించుము; నా
వుదరము కదిలెను; నేను బహుగా తిరుగుబాటు చేస్తిని
గనుక నా హృదయము నాలో తిరగలబడుతూ వుం
డెను; బయిట కత్తి నా పిల్లలను హతము చేస్తూ వున్నది;
21 యింట్లో మృత్యువు వున్నది. । నేను శ్వాసమును విడు
స్తూ వున్న సంగతి వారు వినిరి, అయితే నన్ను ఓదా
ర్చుటకు వచ్చిన వాడు వొకడున్ను లేడు; నా శత్రు
వులందరున్ను నా వుపద్రవమును గురించి విని, నీవు
నన్ను యీలాగున చేసినందుకు సంతోషపడిరి, అయితే
నీవు చెప్పిన దినమును నీవు రప్పింతువు, అప్పుడు వారు
22 నా లాగున వుందురు. । వారి దోషమంతటినీ నీవు నీ
ముందర అగుపడచేసి, నా తప్పుల నిమిత్తము నీవు నన్ను
యేలాగు చేస్తివో ఆలాగునే వారిని చేయుము; యే
మంటే నా మూల్గుటలు విస్తారమైనందున నా హృద
యము మూర్ఛిల్లెను.

## 2. అధ్యాయము.

1 సీయోను కుమార్తెను కర్త తన కోపపు మేఘము
చేత యేలాగు కప్పెను! తన కోపపు దినమందు తన
పాదపీఠమును తలంచుకోక, ఆకాశమునుంచి భూమి
పర్యంతమూ ఇశ్రాయేలు యొక్క సౌందర్యమును యే
2 లాగు పడవేసెను! । కర్త చింతపడక, యాకోబు
కాపురములన్నిటినీ మింగెను! ఆయన ఉగ్రము తెచ్చు
కొని, యూదా కుమార్తెయొక్క దుర్గములను కింద
పడగొట్టి, నేలతో సమము చేసెను; రాజ్యమునున్ను
3 దాని అధిపతులనున్ను ఆయన యేహ్యపరచెను. । ఆ
యన కోపాగ్ని తెచ్చుకొని, ఇశ్రాయేలుయొక్క శృం
గమును తెగవేసెను; శత్రువుడు వచ్చినప్పుడు ఆయన
తన కుడి హస్తమును వెనుకకు తీసుకొని, నఖముఖా
లా దహించే అగ్ని మంట లాగున యాకోబు మీద
4 మండి పడెను. । శత్రువుని వలె ఆయన తన విల్లును యె
క్కుబెట్టెను; విరోధి వలె ఆయన నిలిచి, తన కుడి హస్త
మును చాపి, కంటికి అందమైన వారినందరినిన్ని హత
ము చేసెను; సీయోను కుమార్తె డేరా మీద ఆయన
5 తన రౌద్రమును అగ్ని వలె కుమ్మరించెను. । కర్త ఇశ్రా
యేలుకు శత్రువై అతని మింగెను; ఆయన దాని నగ
రులనన్నిటినీ మింగెను, దాని దుర్గములను కొట్టి,
యూదా కుమార్తెలో మూల్గుటనున్ను ప్రలాపమును
న్ను విస్తరింప చేసెను. । ఆయన తన డేరాను తోట 6
కంచె లాగున బలవంతముగా తీసివేసెను; ఆయన సం
ఘపు స్థలములను పాడు చేసెను; యెహోవా సీయో
నులో నిర్ణయించిన పండుగలనున్ను సబ్బాతు దిన
ములనున్ను మరవచేసెను; ఆయన కోపాగ్ని తెచ్చు
కొని, రాజునున్ను అర్చకునిన్ని నిర్లక్ష్యపెట్టెను. ।
కర్త తన బలిపీఠమును పరిహరించి, తన పరిశుద్ధ స్థల 7
మును యేహ్యపరచెను; ఆయన దాని నగరుల ప్రాకా
రములన్నిటినీ శత్రువుల చేతికి అప్పగించెను; నిర్ణయిం
చిన పండుగ దినమందైనట్టు వారు యెహోవా మం
దిరమందు బొబ్బ పెట్టిరి. । యెహోవా సీయోను 8
కుమార్తెయొక్క ప్రాకారమును పాడు చేయించు
టకు యోచన చేసెను; దాని మీద ఆయన నూలు సా
గించెను; క్షయము చేస్తూ ఆయన తన హస్తమును వెను
కకు తీయలేదు; బైటి ప్రాకారమునున్ను లోపటి ప్రా
కారమునున్ను మూలుగ చేసినందున అవి కూడా క్షీణిం
చెను. । దాని ద్వారములు భూమిలోకి దిగిపోయెను; 9
దాని అడ్డు గడలను ఆయన విరిచి లయము చేసెను;
దాని రాజున్ను దాని అధిపతులున్ను అన్య జనాంగ
ములలో వుండిరి; న్యాయప్రమాణము లేకపోయెను;
దాని దీర్ఘదర్శులకు యెహోవా యొద్దనుంచి యే
దర్శనమూ లేకపోయెను. । సీయోను కుమార్తెయొక్క 10
పెద్దలు భూమి మీద మౌనముగా కూర్చుండిరి; శిర
స్సుల మీద వారు బుగ్గి వేసుకొని, గోనెపట్టను నడు
ముకు కట్టుకొనిరి; యెరూశలేము కన్యకలు నేలపడి
తల్లడించిరి. । కన్నీరు రాలినందున నా కనుదృష్టి తప్పి 11
పోయెను; నా వుదరము కదిలెను; నా జనుల కుమార్తె
విచ్ఛిత్తియి పోయెను గనుక నా గుండె నీరై నేల
మీద వొలికెను; యేమంటే బాలులున్ను చంటి పిల్లలు
న్ను పట్టణపు వీధులందు మూర్ఛిల్లిరి. । వారు పట్టణపు 12
వీధులందు గాయము పొందిన వారి లాగున మూర్ఛి
ల్లినప్పుడున్ను తమ తల్లుల రొమ్మున తమ ప్రాణములను
విడిచేటప్పుడున్ను తమ తల్లులను చూచి పంటయు
న్ను ద్రాక్షా రసమున్ను యేవి అని అడుగుదురు. । ఓ 13
యెరూశలేము కుమారికా, నీ పట్ల యే సాక్షిని పిలు
తును? నీకు దేనిని యీడు చేతును? సీయోనుయొక్క
కన్యకవైన పుత్రికా, నిన్ను వోదార్చుటకు నిన్ను
దేనికి యీడు చేతును? నీ గాయము సముద్రమంత
గొప్పది; నిన్ను యెవరు స్వస్థపరచగలరు? । నీ దీర్ఘ 14
దర్శులు నీ కొరకు వ్యర్థమైన అవివేకపు దర్శన
ములను కనిరి; నిన్ను చెర తప్పించుటకు నీ అక్రమ
ములను కానక, నీవు చెరలోకి పోయేటట్టుగా నీ కొ
రకు అబద్ధపు దీర్ఘదర్శిత్వములను వారు చెప్పిరి. ।

15 నీ వైపు వెళ్లే మార్గస్థులందరున్ను నిన్ను చూచి, చప్ప
ట్లు చరుతురు; వారు యెరూశలేము కుమార్తెవైన నిన్ను
చూచి, తల వూచి, లేవిడీకొట్టి, పరిపూర్ణ రూపవతి
అనిన్ని లోకులందరికి సంతోషమును పుట్టించేదనిన్ని
16 చెప్పబడిన పట్టణము యిదేనా అని అందురు. । నీ
శత్రువులందరున్ను వారి నోళ్లు నీ మీద విప్పి, లేవిడీ
కొట్టి, పండ్లు పటపట కొరికి, మనము దానిని మింగి
తిమి; యిది మనము కనిపెట్టిన దినమై యున్నది; అది
మనకు కనుబడినందున మేము చూస్తిమని అందురు. ।
17 యెహోవా యేలాగున యోచించెనో ఆలాగునే
కలుగచేసెను; ఆదిని ఆయన సెలవు యిచ్చిన వాక్య
మును నెరవేర్చెను; ఆయన చింతపడక కింద పడద్రో
సెను; ఆయన నీ శత్రువుని నీ మీద జయము పొంద
చేసి; నీ విరోధుల శృంగమును హెచ్చింప చేసెను. ।
18 వారి హృదయము కర్తను స్మరించెను; ఓ సీయోను
కుమార్తెయొక్క ప్రాకారమా, మానకుండా దివా
రాత్రములూ కన్నీరు నీ కనుగుడ్డునుంచి తెరిపి లేకుం
19 డా కాలువ లాగున వొలికించుము. । నీవు రాత్రి లేచి
యేడ్వుము; రాత్రి జాము జాముకు యెహోవా సము
ఖమందు నీ హృదయమును నీళ్లు వలె కుమ్మరించుము;
ప్రతి వీధియొక్క మొగలో ఆకలిగొని మూర్ఛిల్లిన
నీ పసిపిల్లల ప్రాణముల కొరకు నీ చేతులను వారి
20 తట్టు యెత్తుము. । వో యెహోవా, నీవు చూచి, యె
వరికి నీవు యీలాగున చేస్తివో అది విచారించుకొను
ము; స్త్రీలు తమ గర్భ ఫలమైన జానెడు పిల్లలను తామే
తిందురా? అర్చకుడున్ను దీర్ఘదర్శిన్ని కర్తయొ
21 క్క పరిశుద్ధమైన స్థలమందు హతమాదురా? । చిన్నవా
రున్ను పెద్దవారున్ను వీధులలో భూమి మీద పడి
వుండిరి; నా కన్యకలున్ను నా పడుచువారున్ను కత్తి
చేత కూలిరి; నీ కోపపు దినమందు నీవు వారిని హతము
22 చేసి చింతపడక చంపితివి. । నిర్ణయమైన పండుగ
రోజు యందైనట్టు నాకు భయంకరమైన వాటిని నఖ
మొఖాలనుంచి నా మీదికి పిలిపిస్తివి; అయినందున
యెహోవా కోపాగ్ని దినమందు తప్పించుకొని వుండే
వాడు వొకడున్నూ లేడు; నేను కౌంగిటిలో వుంచి
పెంచిన వారిని నా శత్రువుడు హతము చేసెను.

## 3. అధ్యాయము.

1 ఆయన ఉగ్రపు దండమువల్ల ఉపద్రవము వొందిన
2 వాడనై వుంటిని. । ఆయన నన్ను వెలుగులోకి కాక
3 అంధకారములోకి కొంచుబోయి వుంచెను. । నా మీ
దికి ఆయన తిరిగి వచ్చెను; దినమంతా ఆయన హస్త
4 ము నాకు విరోధముగా వుండెను. । నా మాంసమున్ను
నా చర్మమున్ను ఆయన క్షీణింపచేసి, నా దుమ్ములను
విరిచెను. । ఆయన గోడలను కట్టి నన్ను యిబ్బందిపర 5
చెను; చేదునున్ను దురవస్థనున్ను నా చుట్టూ ఆయన
వుంచెను. । పూర్వమందు మరణమైన వారి వలె ఆయన 6
నన్ను అంధకార స్థలములలో వుంచెను. । నేను యివత 7
లకు రాకుండా ఆయన నా చుట్టూ కంచె నాటెను;
నాకు సంకెళ్ల భారము ఆయన కలగచేసెను. । నేను 8
బొబ్బ యెత్తి స్మరిస్తే ఆయన నా ప్రార్థనకు అభ్యం
తరము చేసును. । నా మార్గమును ఆయన చెక్కిన 9
రాళ్లచేత చుట్టూ కట్టెను; నా నడకలను ఆయన వంక
రలగా చేసెను. । ఆయన నాకు పొంచి వున్న యెలుగు 10
బంటి లాగునున్ను మాటు యందున్న సింహము లాగు
నున్ను వుండెను. । ఆయన నా మార్గములను తిప్పి 11
నన్ను తునకలుగా కొట్టి పాడు చేసెను. । ఆయన తన 12
విల్లును యెక్కుబెట్టి, బాణము కొరకు నన్ను గురిబెట్టె
ను. । తన అమ్ముల పొదియొక్క బాణములచేత ఆయన 13
నా అంతరంగమును దూసిపో చేసెను. । నేను దినమంతా 14
నా జనులకు అపహాస్య హేతువై వుంటిని. । ఆయన 15
నన్ను చేదుచేత తృప్తిగానున్ను వేపచేదుచేత కైపుగాను
న్ను చేసెను. । కంకరలచేత ఆయన నా పండ్లను విరిచి, 16
బుగ్గిచేత నన్ను కప్పెను. । నా ఆత్మను నీవు క్షేమము కొ 17
రకు దూరముగా వెళ్లజేసినందున నేను భాగ్యమును మరి
చిపోయి, । యికను యెహోవావల్ల నాకు శక్తి అయి 18
నా ఆశ అయినా లేకపోవునని అనుకొంటిని. । నాకు 19
కలిగిన వుపద్రవమునున్ను దురవస్థనున్ను వేపచేదున్ను
చేతికట్టున్ను తలంచుకొమ్ము. । యిప్పటికి నా యాత్మ 20
వాటిని తలంచుకొని, నాలో తల్లడించెను. । దీని నేను 21
తలంచుకొని కోరుతూ వుందును. । యెహోవా దయా 22
పరుడైనందుచేతనున్ను ఆయన కనికరములు తప్పనివి
గనుకనున్ను మనము నాశనము కాక వున్నాము. । అవి 23
ప్రత్యుదయమందు నూతనముగా వున్నవి; నీ ప్రామా
ణికత్వము బహు ఘనమై వున్నది. । యెహోవా నా 24
వశమై యున్నాడని నా యాత్మ అనుకొనెను; కాబట్టి
ఆయనను నేను కనిపెట్టి వుందును. । ఆయనను కని 25
పెట్టిన వారికిన్ని ఆయనను వెతికిన వారికిన్ని యెహో
వా వుత్తముడై యున్నాడు. । యెహోవా రక్షణను 26
కోరి నెమ్మదిగా కనిపెట్టేది మనుష్యునికి వుత్తమమై
యున్నది. । తన యౌవనమందు కాడి కర్ర భరించేది 27
మనుష్యునికి యుక్తమైయున్నది. । దాని యతడు భరిం 28
చినందున వంటరిగా కూర్చుండి మౌనముగా వుండు
ను. । యింకా కోరికె వుండునేమో అని తన నోరు 29
బుగ్గిలోకి వంచుకొనును. । తనకు కొట్టిన వారి తట్టు 30
తన దవడను తిప్పును; దూషణ చేస్తే వొప్పును. । యే 31
మంటే యెహోవా యెప్పటికీ విడిచిపెట్టడు. । ఆయన 32
వొకవేళ దుఃఖపెట్టితే తన విస్తారమైన కృప చొప్పున

33 వొకవేళ కనికరమును అగుపర్చును. । యేమంటే నర
పుత్త్రులను దుఃఖపర్చుటయున్ను బాధ పెట్టుటయున్న
34 ఆయనకు కోరికె లేదు. । యెవడైనా లోకమందున్న
35 నిర్బంధితులను పాదముల కింద తొక్కేదిన్ని, । మ
హోన్నతమైన వాని సముఖమందు వొకని నీతి వ్యా
36 జ్యమును తిప్పేదిన్ని, । వొకని తగువును అన్యాయము
గా తీర్చేదిన్ని యెహోవాకు అనుకూలము లేదు. ।
37 యెహోవా వద్దని చెప్పితే యెవరి మాట నెరవేరు
38 ను? । మహోన్నతమైన వాని నోటనుంచి కీడున్ను
39 మేలున్ను కూడా బైలు వెళ్లదా? । జీవస్థుడయిన మను
ష్యుడు తన పాపానుభవమును గూర్చి యెందుకు చింత
40 పడ వలెను? । మన మార్గములను మనము శోధించి
41 చూచుకొని, యెహోవా తట్టు తిరిగి వత్తుము. । ఆకా
శమందుండే దేవుని తట్టు మన చేతులతోటి మన హృ
42 దయమును యెత్తుదాము. । మేము నీకు వ్యతిరిక్తులమై
43 అతిక్రమించితిమి; నీవు కాయక వుంటివి. । కోపము
చేత నీ ముఖమును కప్పుకొని, మమ్మును తరిమి, చింత
44 పడక హతము చేస్తివి. । మా ప్రార్థన నీ సన్నధికి
యెక్కకుండా నీ చుట్టూ మేఘమును అడ్డుబెట్టుకొం
45 టివి. । జనాంగములలో నీవు మమ్మును మట్టుగానున్ను
46 చెత్తగానున్ను చేస్తివి. । మా శత్రువులు మా మీద తమ
47 నోళ్లను విప్పిరి. । భయమున్ను వురిన్ని పాడున్ను క్షయ
48 మున్ను మాకు ప్రాప్తించెను. । నా జనముయొక్క
కుమార్తె విచ్ఛిత్తియై పోయినందున నా కన్నీరు కా
49 లువై పారెను. । యెహోవా ఆకాశమునుంచి కిందు
చూచి కనికరించే పర్యంతమూ నిమ్మళము లేదు గనుక, ।
50,51 కన్నీరు మానకుండా వొలుకుతూ వున్నది. । నా పట్ట
ణపు కుమార్తెల స్థితిని చూచిన నా కన్ను నా హృ
52 దయములో చింత పుట్టించెను. । నిష్కారణముగా నా
శత్రువులు నన్ను పక్షిని వలె బహుగా తరుముతూ
53 వుండిరి. । వారు కారా గృహమందు నా ప్రాణమును
54 తెగవేసి నా మీద రాయి వేసిరి. । వుదకములు నా
శిరస్సు పైకి మించి వచ్చినందున నా ప్రాణము తెగి
55 పోయెనని అనుకొంటిని. । ఓ యెహోవా, లోతైన
కారా గృహమందు నేను నీ నామమును స్మరిస్తిని. ।
56 నీవు నా నోటి శబ్దమును వింటివి; నా నిట్టూర్పు
57 కున్ను నా కేకకున్ను నీ చెవిని మూయకుము. । నేను
నిన్ను స్మరించిన దినమందు నీవు చేరి భయపడ వద్దని
58 అంటివి. । ఓ యెహోవా, నా యాత్మయొక్క వ్యా
జ్యములను నీవు జరిగించి, నా ప్రాణమును రక్షిస్తివి. ।
59 వో యెహోవా, నేను పొందిన అన్యాయమును నీవు
60 చూస్తివి; నా తగువును తీర్చుము. । నా మీద వారు
చేసిన పగ అంతటినిన్నీ వారి యోచనలన్నిటినిన్నీ
61 నీవు చూస్తివి. । ఓ యెహోవా, వారు చేసిన దూష
ణలనున్ను, నాకు విరోధమైన వారి యోచనలనున్ను, ।
నా మీదికి లేచిన వారి గుసగుసలాడుటలనున్ను, దిన 62
మంతా నాకు విరోధమైన వారి ఆలోచననున్ను నీవు
వింటివి. । యిదుగో వారు కూర్చుని వున్నప్పుడున్ను 63
లేచినప్పుడున్ను నా మీద పాటలు పాడుదురు. । వో 64
యెహోవా, వారి చేతల ప్రకారము వారికి ప్రతి
యిమ్ము. । వారికి మనశ్చింత కలుగ చేయుము; నీ శాప 65
ము వారి మీద వుండును గాక. । నీవు కోపము తెచ్చు 66
కొని, వారిని తరిమి, యెహోవావైన నీ ఆకాశముల
కిందనుంచి వారిని నీవు లయము చేతువు గాక.

## 4. అధ్యాయము.

బంగారము యేలాగు కగ్గెను! కుందనము యేలాగు 1
మార్పును పొందెను! పరిశుద్ధ స్థలపు రాళ్లు వీధుల మొ
గములలో వేయబడి యున్నవి. । అపరంజికి సమాను 2
లైన సీయోను పుత్త్రులు కుమ్మరివాడు చేసిన మంటి
కుండల వలె యేలాగు అయిరి! । సముద్రపు మృగములు 3
వాటి రొమ్ము వంచి, వాటి పిల్లలకు పాలు యిచ్చును;
అయితే నా జనుల కుమార్తె అరణ్యమందున్న హసివా
అనే పక్షిలాగున క్రూరురాలై పోయెను. । చంటి పిల్ల 4
నాలుక దప్పిచేత యెండిపోయినందున అంగుటిని అం
టుకొనెను; చిన్న పిల్లలు రొట్టెను అడిగినప్పుడు
యివ్వగల వాడు వొకడూ లేడు. । సుకుమారముగా 5
భుజించే వారు యిప్పుడు వీధులలో సొమ్మసిల్లిరి; వూదా
వస్త్రములతో పెరిగిన వారు యిప్పుడు పెంట రాశిని
కౌగిలించుకొని వుండిరి. । యేమంటే నా జనుల కుమార్తె 6
యొక్క పాపమునకు వచ్చిన శిక్ష మనుష్యుల చేతి
బలము లేకుండా క్షణములో బోర్లించబడిన సొదొమ
పట్టణపు పాపపు శిక్షకంటే ఘోరమై వుండెను. ।
దాని నజీరీయులు మంచు కంటే తేటగానున్ను పాల 7
కంటే తెలుపుగానున్ను వుండిరి; వారి శరీరము కెం
పుల కంటే యెరుపుగానున్ను నీలముల కంటే నునుపు
గానున్ను వుండెను. । యిప్పుడు వారి ముఖము అంధ 8
కారము కంటే నలుపైనందున వీధులలో వారిని పోల్చ
లేరు; వారి చర్మము వారి దుమ్ములకు అతకబడి యెండి
పోయి కర్రవలె యున్నది. । కత్తిచేత హతమైన వారు 9
క్షామము చేత హతమైన వారి కంటే భాగ్యవంతులు;
యేమంటే భూమిలో పంట లేనందుచేత వీరు దూసి
పోయినట్టు క్షీణింతురు. । జాలి గుండెగల స్త్రీలు తమ 10
చేతులచేత తమ పిల్లలను వండుకొనిరి; వారు నా జనుల
కుమార్తె విచ్ఛిత్తియైపోయినప్పుడు వారికి ఆహార
మైరి. । యెహోవా తన రౌద్రమును నెరవేర్చెను; 11
ఆయన తన కోపాగ్నిని కుమ్మరించి, సీయోనులో అగ్నిని
రాజబెట్టినందున అది దాని పునాదులను దహించెను. ।

12 యే విరోధియైనా యే శత్రువైనా యెరూశలేము
ద్వారములలో చొరబడుదురని భూపతులతోటిన్ని
భూమి కాపురస్థులందరితోటిన్ని చెప్పితే వారు నమ్మక
13 పోదురు. । అయితే దాని దీర్ఘదర్శుల పాపముల
వల్లనున్ను దానిలో నీతిపరుల రక్తమును చిమ్మిన దాని
అర్చకుల అన్యాయమువల్లనున్ను అది సంభవించెను. ।
14 వారు గుడ్డి వారి లాగున వీధులలో తిరుగులాడి, రక్త
ముతోటి తమ్మును తాము అపవిత్రపరుచుకొన్నందున
15 యెవరైనా వారి బట్టలను ముట్టకూడదు. । వీరు వారిని
చూచి, దూరముగా వుండండి, దూరముగా వుండండి,
అపవిత్రులైన మీరు మమ్మును ముట్టకుండా దూరముకు
పొండని చెప్పిరి; నిజముగా వారు పారిపోయి తిరుగు
లాడుతూ వుండిరి; వీరు యిక్కడ వుండ కూడదని
16 అన్య జనాంగములలో చెప్పుకొనిరి. । యెహోవా
కోపము తెచ్చుకొని వారిని చెదర కొట్టెను; వారు
అర్చకుల ముఖములను లక్ష్యపెట్టకనున్ను పెద్దల
యందు దయ అగుపర్చకనున్ను వుండిరి గనుక యిక
17 ఆయన వారిని లక్ష్యపెట్టక వుండును. । వ్యర్థ సహా
యము కొరకు యెదురు చూచిన మన కన్నుల దృష్టి
తప్పెను; మనము రక్షించలేని జనాంగము కొరకు కని
18 పెట్టి వుంటిమి. । వారు మన అడుగు జాడలను వెం
టాడినందున మనము మన వీధులలో సంచరించ లేము;
మన అంతము సమీపించెను, మన దినముల లెక్క నిం
19 డినది; మన అంతము వచ్చెను. । మమ్మును తరిమే వారు
ఆకాశపు గద్దలకంటే వేగులై పర్వతముల మీద మన
లను తరిమి అరణ్యమందు మన కొరకు పొంచి వుండిరి.।
20 మన నాసికా రంధ్రములకు శ్వాసమైన వాడు, అన
గా, యెహోవాయొక్క అభిషిక్తుడున్ను ఆయన
నీడయందు మనము అన్య జనాంగములలో బ్రతుకు
దుము అని మనము అనుకొనిన వాడు సహా వారి
21 గోతులలో చిక్కెను. । ఊస్సు దేశమందు కాపురము
చేసే ఎదోము కుమారికా, సంతోషించి, గంతులు
వేయుము; అయితే పాత్ర నీ యొద్దికి వచ్చినందున
22 నీవున్ను మత్తిల్లి, దిగంబరివై వుందువు. । ఓ సీయోను
కుమారికా, నీ పాప శిక్ష నెరవేరెను; యిక ఆయన
నిన్ను చెరలోకి వెళ్లనియ్యడు; ఓ ఎదోము కుమారికా,
ఆయన నీ దోషము కొరకు నిన్ను శిక్షించి, నీ పాప
మును బైలుపరచును.

## 5. అధ్యాయము.

ఓ యెహోవా మాకు సంభవించిన దాని తలం 1
చుకొమ్ము, మేము పొందిన అవమానమును చూచి విచా
రించుము. । మా ఆస్తి అన్యులకున్ను మా యిండ్లు పర 2
దేశులకున్ను తిరిగి పోయెను. । మేము దిక్కులేని వార 3
మున్ను తండ్రిలేని వారమున్ను అయి వున్నాము; మా
తల్లులు విధవలు. । మా నీళ్లను సొమ్మిచ్చి తాగితిమి; 4
మా కర్రలు మాకు అమ్మబడినవి.। మా గొంతుకలు పట్టు 5
కొనుటకు వారు తరిమిరి; మేము అలసటపడి నెమ్మదిని
పొందలేదు. । తగిన ఆహారము కొరకు మేము మిస్రీయు 6
లకున్ను అష్షూరు వారికిన్ని మా చేతులను యిస్తిమి. ।
మా పితృలు పాపమును చేసి పోయిరి; వారి దోషము 7
యొక్క భారము మా మీదికి వచ్చెను. । సేవకులు మ 8
మ్మును యేలిరి; వారి చేతులలోనుంచి మమ్మును విడిపిం
చుటకు వొకడున్ను లేడు. । అరణ్యమందు కత్తి వున్నం 9
దున ప్రాణభయముచేత ఆహారము మాకు దొరికెను.।
ఘోరమైన క్షామముచేత మా చర్మము పొయ్యివలె నలు 10
పుగా వుండెను. । వారు సీయోనుయందు స్త్రీలనున్ను 11
యూదా పట్టణములందు కన్యకలనున్ను చెరిచిరి. । వా 12
రిచేత అధిపతులు వురి తీయబడిరి; పెద్దల ముఖములను
మన్నించుట లేదు. । వారు పడుచువారిచేత పిండి విసి 13
రించిరి; పిల్లలు కర్రమోపు కింద కుంగి పడిరి. । ద్వార 14
మందు పెద్దలు కూర్చుండ లేదు; పడుచువారు తమ
వాద్యమును మానిరి.।మా హృదయపు సంతోషము గతిం 15
చెను; మా నాట్యము మూల్గుటకు తిరిగెను. । కిరీటము 16
మా శిరస్సునుంచి కింద బడెను; మేము పాపము చేస్తి
మి గనుక మాకు అయ్యో! । యిందువల్ల మా హృదయ 17
ము మూర్ఛిల్లెను; యిందువల్ల మా కన్నుల దృష్టి తప్పె
ను. । యేమంటే సీయోను పర్వతము పాడైనందున నక్క 18
లు దాని మీద తిరుగులాడుతూ వున్నవి. । ఓ యెహో 19
వా, నీవు నిత్యమున్ను వుందువు; నీ గద్దె తరతరాల
మట్టుకు స్థిరముగా వుండును. । యెప్పటికీ మమ్మును నీవు 20
యెందుకు మరిచితివి? యింత మట్టుకు మమ్మును యెం
దుకు విడిచితివి? । ఓ యెహోవా, నీ తట్టు మమ్మును 21
తిప్పుకొనుము, అప్పుడు మేము తిరిగీ వత్తుము; తిరిగీ
మా దినములను మునుపటి లాగున చేయుము. । అయితే 22
నీవు మమ్మును బొత్తిగా విసర్జింతువా? నీవు మా మీద
బహు కోపముగా వున్నావు.

దీర్ఘదర్శియైన

# యెహెజ్కేలు యొక్క గ్రంథము.

## 1. అధ్యాయము.

1 యెహోయాకీను చెరలో వున్న అయిదో సంవ
త్సరము అయిదో నెల, అనగా, ముప్పయ్యో సంవత్స
రము నాలుగో నెల అయిదో దినమున నేను కెబారు
2 నది దగ్గిర చెరలో వున్న వారిలో వుండగా, । ఆకాశ
ములు తెరచి వున్నందున దైవ దర్శనములు నాకు ప్ర
3 త్యక్షమాయెను. । మరిన్ని కల్దీయుల దేశమందున్న కె
బారు నది దగ్గిర యెహోవా వాక్యము బూజీ కుమా
రుడున్ను అర్చకుడున్ను అయిన యెహెజ్కేలు యొద్దికి
వచ్చెను; మరిన్ని యెహోవా హస్తము అక్కడ అతని
4 పైని వుండెను. । అప్పుడు నేను చూడగానే, యిదుగో,
ఉత్తర దిక్కునుంచి సుడిగాలి వచ్చెను; మరిన్ని గొప్ప
మేఘమున్ను దానంతట అదే తళతళలాడుతూ వున్న
మంటయున్ను అగుపడెను; దాని చుట్టూ తేజస్సు కలిగి
వుండెను; ఆ మంటలోనుంచి తృణగ్రాహి రంగు లా
5 టిది బైలు వచ్చెను. । మరిన్ని దానిలోనుంచి నాలుగు
జీవ జంతువుల లాటి రూపములు బైలు వచ్చెను; యే
6 లాగంటే వాటికి మనుష్య రూపము కలదు. । ప్రతి
దానికీ నాలుగు ముఖములున్ను నాలుగు రెక్కలున్ను
7 కలవు. । వాటి కాళ్లు తిన్నగా వుండెను; వాటి పాద
ముల అడుగు ఆవు పెయ్య అడుగు వలె వుండెను; అవి
మెరుగు చేయబడిన యిత్తడి లాగున తళతళలాడుతూ
8 వుండెను. । వాటి నాలుగు పక్కలలో వున్న రెక్కల
కింద మనుష్యుల చేతులు కలిగి వుండెను; ఆ నాలుగిం
9 టికిన్ని ముఖములున్ను రెక్కలున్ను కలవు. । వాటి రె
క్కలు వొక దానిని వొకటి కలుసుకొనెను; అవి యన్నీ
యే వైపునైనా తిరగకుండా తిన్నగా ముందర వెళ్లెను.।
10 వాటి ముఖరూపములు యేలాటివంటే, నాలుగింటికిన్ని
మనుష్య ముఖము కలదు; మరిన్ని కుడి పార్శ్వమందు
సింహ ముఖము కలిగి వుండెను; నాలుగింటికిన్ని యె
డమ పార్శ్వమందు యెద్దు ముఖము కలిగి యుండె
11 ను; నాలుగింటికిన్ని గద్ద ముఖము కలదు. । యీలాగున
వాటి ముఖములు వుండెను; మరిన్ని వాటి రెక్కలు
పయికి విప్పి వుండెను; ప్రతి దాని రెండు రెక్కలూ
వొక దానితో వొకటి కలుసుకొనెను; మిగిలిన రెండు
రెక్కలతోటి అవి వాటి శరీరమును కప్పుకొనెను. ।
12 అవి అన్నిన్ని తిన్నగా ముందర వెళ్లెను; యెక్కడికి ఆత్మ
వెళ్లునో అక్కడికే అవిన్ని వెళ్లి మరి తిరగ లేదు. ।
అయితే ఆ జీవ జంతువుల పోలిక యేలాటిదంటే, 13
వాటి రూపము కాలే అగ్నికిన్ని దీపములకున్ను సమ
మాయెను; ఆ తేజస్సు జీవ జంతువుల మధ్యను తిరిగీ
వుండెను; అగ్ని అతి కాంతిగా వుండెను; అగ్నిలో
నుంచి మెరుపు బయిలు వెళ్లెను. । మరిన్ని ఆ జీవ జంతు 14
వులు ప్రజ్వలించే మెరుపు లాగున ప్రసరించి తిరు
గును. । అయితే యీ జీవ జంతువులను నేను చూస్తూ 15
వుండగా, యిదుగో, భూమి మీద ఆ జీవ జంతువుల
దగ్గిర నాలుగు దిక్కులను చక్రాకారము అగుపడెను. ।
ఆ చక్రములున్ను వాటి పనిన్ని యేలాగు వున్నవంటే 16
గరుడ పచ్చరాతి రంగు వలెనే వుండెను; ఆ నాలుగు
న్ను వొక్కలాగునే వుండెను; వాటి ఆకారమున్ను వాటి
పనిన్ని చక్రములో చక్రము వున్నట్టు వుండెను. । అవి 17
వెళ్లేటప్పుడు నాలుగు వైపుల తిరిగి వెళ్లును; వెళ్లేటప్పు
డు అవి తిరగలేదు. । వాటి కైవారములు మిక్కిలీ పొ 18
డుగై భయంకరముగా వుండును; వాటి కైవారముల
చుట్టూ నేత్రములు నిండి వుండెను. । మరిన్ని ఆ నా 19
లుగు జీవ జంతువులు వెళ్లేటప్పుడు ఆ చక్రములు వా
టితో కూడా వెళ్లును; ఆ జీవ జంతువులు భూమినుంచి
పయికి యెక్కినప్పుడు చక్రములున్ను కూడా యెక్కు
ను. । యెక్కడికి ఆత్మ వెళ్లవలసినదో అక్కడికే అవిన్ని 20
వెళ్లును; వాటితో కూడా చక్రములున్ను యెక్కును;
యేమంటే జీవ జంతువుకు కలిగిన ఆత్మ చక్రములకున్ను
కలిగి వుండెను. । అవి వెళ్లేటప్పుడు యివిన్ని వెళ్లును; 21
అవి నిలిచినప్పుడు యివిన్ని నిలుచును; అవి భూమి
నుంచి పయికి యెక్కినప్పుడు యివిన్ని వాటితో
కూడా యెక్కును; యేమంటే జీవ జంతువుకు కలిగిన
ఆత్మ చక్రములకున్ను కలిగి వుండెను. । మరిన్ని జీవ 22
జంతువుల శిరస్సుల పయిని ఆకాశమండలాకారము
వుండెను; అది చూచుటకు తళతళలాడే స్ఫటికపు రం
గులాటిదై, వాటి శిరస్సుల పయిని వ్యాపించి వుండెను.।
అయితే ఆకాశమండలము కింద వాటి రెక్కలు వొక 23
దాని తట్టు వొకటి యెత్తబడి వుండెను; ప్రతి దాని
శరీరము కప్పుకొనుటకు వుభయ పార్శ్వములను రెండు
రెక్కలు కలవు. । అవి యెగసి వెళ్లేటప్పుడు నేను 24
వాటి రెక్కల చప్పుడు వింటిని; అది విస్తారమైన
వుదక ఘోషము వలెనున్ను సర్వత్రాణ గలవాని

ఉచ్చారణ శబ్దము వలెనున్ను సమూహపు శబ్దము వలె
నున్ను వుండి, అవి నిలిచినప్పుడు వాటి రెక్కలను
25 వాల్చుకొనును. । మరిన్ని అవి యెప్పుడు నిలిచి రెక్క
లను వాల్చుకొనునో అప్పుడు వాటి శిరస్సుల పయి
26 నున్న ఆకాశ మండలములోనుంచి శబ్దమవును. । మరి
న్ని వాటి శిరస్సుల పైనున్న ఆకాశ మండలము పైని
నీలము మణుల రీతిని సింహాసనము యొక్క ఆకారము వుండెను; అది నీలము
వలె వుండెను; మరిన్ని ఆ గద్దెయొక్క ఆకారము పైని
నర స్వరూపముతో ఆసీనుడైన వొకడు వుండెను. ।
27 అయితే చుట్టూ దాని లోపట తృణగ్రాహి రంగు
లాటి అగ్ని నాకు కనుపడెను; ఆయన తన నడుము
మొదలుకొని మీదికిన్ని ఆయన తన నడుము మొదలు
కొని దిగువకున్ను అగ్ని స్వరూపము వలె నాకు కను
బడెను; దాని చుట్టూ బహు తేజస్సు వుండెను. ।
28 వర్షపు దినమున మేఘములో ధనుస్సు యేలాగు వుం
డెనో ఆలాగునే దాని చుట్టూ వున్న తేజస్సు కను
బడెను; యిది యెహోవా మహిమయొక్క పోలిక
లాగు వుండెను; నేను యిది చూచి సాగిల బడితిని;
మరిన్ని వొకడు పలికిన శబ్దము నాకు వినబడెను.

## 2. అధ్యాయము.

1 ఆయన నాతోటి చెప్పినదేమంటే, వో నరపుత్రు
డా, నీవు నీ కాళ్లతో నిలువబడుము; నీతోటి నేను
2 మాట్లాడుదునని అనగానే, । ఆత్మ నాలో ప్రవేశించి,
నా కాళ్లకు బలము యిచ్చినందున నేను నిలిచి, నాతో
3 మాట్లాడిన ఆయన వాక్యములను వింటిని. । ఆయన
నాతోటి చెప్పినదేమంటే, వో నర పుత్రుడా, నా
మీద తిరుగుబాటు చేసిన జనాంగము, అనగా, ఇశ్రా
యేలు పుత్రుల యొద్దికి నిన్ను పంపుదును; వారున్ను
వారి పితృలున్ను నేటి వరకున్ను నా విషయమై అతి
4 క్రమించినవారై వుండిరి. । వారు కఠిన ముఖమున్ను
రాతి గుండెయున్ను కలవారు; వారి యొద్దికి నేను
నిన్ను పంపుదును; నీవు వారితో కర్తయైన దేవుడు ఆన
5 తిచ్చినట్టు చెప్ప వలసినది. । వారి యింటి వారందరున్ను
అతిక్రమించిన వారే గనుక వారు వినినా వినకపో
యినా తమలో దీర్ఘదర్శి వుండెనని యెరుగుదురు. ।
6 అయితే వో నర పుత్రుడా, వారికి భయపడకుము;
నీవు ద్రోహులతోనున్ను ముండ్ల చెట్లతోనున్ను వున్న
ప్పటికిన్ని తేళ్లలో కాపురము చేసినప్పటికిన్ని వారి
మాటలకు భయ పడవద్దు; వారి యింటివారందరున్ను
అతిక్రమించినవారు, అయినప్పటికిన్ని వారి మాటల
నున్ను వారి ముఖములనున్ను చూచి భయపడ వద్దు. ।
7 వారు నా వాక్యములను వినినా వినకపోయినా నీవు
వారితో చెప్పవలెను; వారు బహుగా అతిక్రమించి
యున్నారు. । అయితే ఓ నర పుత్రుడా, నీతోటి నేను 8
చెప్పే మాటను వినుము; యేమంటే, ఆ యింటి వారం
దరున్ను అతిక్రమించిన వారయినట్టు నీవు అతిక్ర
మించిన వాడవు కాకూడదు; నేను యేమి యిత్తునో
అది నీవు నోరు తెరచి భుజించుమని చెప్పెను. ।
అయితే నేను చూస్తూ వుండగా, యిదుగో, నా యొద్దికి 9
చాపిన హస్తము వచ్చెను; దానిలో యిదుగో చుట్టబడి
వున్న గ్రంథము వుండెను. । దానిని ఆయన నా ముం 10
దర విప్పినప్పుడు అందులో లోపలా వెలపలా వ్రాత
కలిగి వుండెను; మరిన్ని దాని యందు ప్రలాపములు
న్ను మూల్గుటలున్ను రోదనమున్ను వ్రాసి వుండెను.

## 3. అధ్యాయము.

మరిన్ని ఆయన నాతో అన్న మాట, వో నర పు 1
త్రుడా, నీకు కనుబడిన దానిని నీవు భక్షించుము; యీ
గ్రంథమును నీవు తిని, ఇశ్రాయేలు యింటివారి యొ
ద్దికి వెళ్లి, వారితో మాట్లాడవలసినదని చెప్పగా, । నేను 2
నా నోరు తెరచినప్పుడు ఆయన ఆ గ్రంథమును
తినిపించి, నాతో చెప్పినదేమంటే, । వో నర పుత్రు 3
డా, నీ వుదరమునకు అది ఆహారమని తలంచి, నేను
నీకు యిచ్చిన గ్రంథముతోటి నీవు నీ కడుపును తృప్తి
పరుచుమన్న సెలవు యిచ్చినందున నేను దానిని భక్షిం
చితిని; అయితే నా నోటికి అది తేనె లాగున మధు
రముగా వుండెను. । అప్పుడు ఆయన నాతో ఆనతిచ్చిన 4
దేమంటే, వో నర పుత్రుడా, నీవు బైలుదేరి, ఇశ్రా
యేలు యింటివారి యొద్దికి వెళ్లి, నా వాక్యములను
వారితో తెలియ చెప్పుము. । యేమంటే లోతైన మాట 5
లున్ను కఠినమయిన భాషయున్ను కలిగిన జనుల యొ
ద్దికి కాదు, ఇశ్రాయేలు యింటివారి యొద్దికి నిన్ను
పంపుదును. । లోతయిన మాటలున్ను నీకు యెరుకలేని 6
కఠిన భాషయున్ను కలిగిన అన్య జనుల యొద్దికి నీవు
పంపబడి యున్నావు కావు; వారి యొద్దికి నిన్ను నేను
పంపితే వారు నీ మాటలను విని వుందురు. । అయితే 7
ఇశ్రాయేలు యింటివారు నీ మాటలు వినరు; నేను
చెప్పినప్పటికిన్ని వారు ఆలకించక వుందురు; యేమం
టే ఇశ్రాయేలు యింటివారందరున్ను కఠినమైన ముఖ
ములున్ను రాతి గుండెలున్ను కలవారు. । యిదుగో నేను 8
వారి ముఖముల యెదుట నీ ముఖమును కఠినమయిన
దిగా చేస్తిని; వారి లలాటము యెదుట నీ లలాటమును
కఠినమైనదిగా చేస్తిని. । నీ లలాటమును అగ్గి రాతి 9
కంటే గట్టిగా వున్న వజ్రములాగున చేస్తిని; కాబట్టి
వారికి భయపడ వద్దు; వారి యింటివారందరున్ను అతి
క్రమించిన వారయినప్పటికిన్ని వారి ముఖములను
చూచి జడియ వద్దని చెప్పి, । మరిన్ని ఆయన ఆనతి 10

చ్చినదేమంటే, ఓ నర పుత్రుడా, నీతోటి నేను
చెప్పిన మాటలన్ని నీ చెవులతోటి ఆలకించి, నీ మన
11 స్సు యందు వుంచుకొని, । బయిలుదేరి, చెరలో వున్న
నీ జనుల పుత్రుల యొద్దికి వెళ్లి, వారిని చూచి, వారు
వినినా వినకపోయినా కర్తయైన దేవుడు యీలాగున
సెలవు యిచ్చెనని చెప్పవలసినదని ఆనతిచ్చిన తరువాత,।
12 ఆత్మ నన్ను పయికి యెత్తినందున నా వెనుకనుంచి యె
హోవా మహిమకు స్తోత్రము కలుగును గాకని దాని
స్థలమునుంచి తోసుకొవచ్చిన ఆయన శబ్దము నాకు
13 వినబడెను. । మరిన్ని వొక దాని నొకటి కలుసుకొనిన
ఆ జీవ జంతువుల రెక్కల చప్పుడున్ను వాటి యెదు
టనున్న చక్రముల ధ్వనిన్ని తోసుకొవచ్చిన ధ్వనిన్ని
14 నాకు వినబడెను. । అయితే ఆత్మ నన్ను యెత్తుకొపోయి
నందున నేను నా ఆత్మకు కలిగిన రౌద్రాగ్నిచేత బహు
గా చింతిస్తూ వెళ్లితిని; అయితే యెహోవా హస్త
15 ము నా పయిని మహా బలముగా వుండెను. । అప్పుడు
నేను కెబారు నది దగ్గిర తెలాబీబు అనే స్థలమందు
కాపురము చేసి, చెరబడిన వారి యొద్దికి వచ్చి, వారు
కూర్చున్న స్థలమందు కూచుండి, విభ్రాంతిపడిన వా
16 డనై, యేడు దినములు వారిలో వుంటిని. । అయితే
ఆ యేడు దినములయిన తరువాత యెహోవా వాక్య
17 ము నా యొద్దికి వచ్చి చెప్పినదేమంటే, । ఓ నర
పుత్రుడా, నేను నిన్ను ఇశ్రాయేలు యింటివారికి కా
పరిగా నిర్ణయిస్తిని; కాబట్టి నీవు నా వాక్యమును
విని, నా వాక్కుచొప్పున వారికి బోధించ వలెను. ।
18 నీవు అవశ్యముగా చత్తువని నేను దుర్మార్గుని
గురించి చెప్పినప్పుడు నీవు అతనికి బోధించకనున్న
అతని ప్రాణమును రక్షించుటకు ఆ దుర్మార్గునికి
అతని దుర్మార్గతను గురించి బోధపడేటట్టుగా
చెప్పకనున్న వున్నట్టయితే అప్పుడు ఆ దుర్మార్గు
డు అతని దోషమువల్ల మరణమవును; అయితే అతని
19 రక్త దోషమును గురించి నిన్ను అడుగుదును. । అయితే
నీవు దుర్మార్గునికి బోధించిన తరువాత అతడు తన
దుష్క్రియలనున్ను దుర్మార్గతనున్ను విడువక వుం
టే, అతడు తన దోషమువల్ల మరణమవును; అయితే
అప్పుడు నీవు నీ ప్రాణమును రక్షించుకొందువు. ।
20 మరిన్ని నీతిపరుడు తన నీతిని విడిచి, అన్యాయమును
చేసినందున, అతడు మరణమయ్యేటట్టుగా నేను అతని
ముందర అభ్యంతరము కలుగ చేస్తే, నీవు అతనికి బో
ధించక పోయినందున అతడు తన దోషమువల్ల మరణ
మవును; పూర్వము అతడు చేసిన నీతి జ్ఞాపకమునకు
రాకపోవును; అయితే అప్పుడు నేను వాని రక్త దోష
21 మును గురించి నిన్ను అడుగుదును. । అయితే నీవు నీతి
పరుని చూచి, నీవు పాపము చేయవద్దని చెప్పినట్ట
యితే, అతడు ఆ బోధ విని, పాపము చేయక, అవ
శ్యముగా బ్రతుకును; అప్పుడు నీవున్ను నీ ప్రాణ
మును రక్షించుకొందువని చెప్పెను. । అయితే అక్కడ 22
యెహోవా హస్తము నా పైని వుండెను; మరిన్ని
ఆయన నీవు మైదానపు భూమికి వెళ్లుము, అక్కడ
నేను నీతోటి మాట్లాడుదునని సెలవు యిచ్చినందున,।
నేను లేచి మైదానపు భూమికి వెళ్లితిని; అయితే యి 23
దుగో యెహోవా మహిమ కెబారు నది దగ్గిర నాకు
ప్రత్యక్షమై నిలిచి వున్నందున నేను సాగిల పడితిని.।
అప్పుడు ఆత్మ నాలో ప్రవేశించి, నా కాళ్లకు బలము 24
కలుగచేసి, తరువాత ఆయన నాతో చెప్పినదేమంటే,
యిప్పుడు నీవు నీ యింటికి వెళ్లి దాగి వుండుము. । యే 25
మంటే ఓ నర పుత్రుడా, యిదుగో, వారు నీ మీద
పాశములను వేసి, వాటితోటి నిన్ను బంధింతురు; కా
బట్టి వారి యొద్దికి నీవు బైలు వెళ్లకూడదు. । నేను నీ 26
నాలుకలను నీ అంగుటికి అంటుకొన చేసినందున నీవు
మూనివై వారిని గద్దించకుండా వుందువు; యేమంటే
వారి యింటివారందరు బహుగా అతిక్రమించి వున్నా
రు. । అయితే యిప్పుడు నేను నీతోటి చెప్పుదును; అప్పు 27
డు నేను నీ నోటిని తెరువ చేసినందున నీవు వారిని
చూచి, వినిన వాడు యెవడో అతడు వినును గాక;
వినని వాడు యెవడో అతడు వినకపోవును గాకని కర్త
యైన దేవుడు ఆనతిచ్చెనని నీవు వారితో చెప్పుదువు;
యేమంటే వారి యింటివారందరూ అతిక్రమించిన
వారై వున్నారు.

## 4. అధ్యాయము.

కాబట్టి ఓ నర పుత్రుడా, వొక పెంకు తీసుకొ 1
వచ్చి, నీ ముందర పెట్టుకొని, దాని మీద యెరూశ
లేము పట్టణము పోలికె వ్రాయుము. । మరిన్ని అది 2
ముట్టడి వేయబడినట్టున్ను దాని యెదుట బురుజులను
కట్టినట్టున్ను దాని యెదుట దిబ్బ వేసినట్టున్ను దాని
చుట్టూ వున్న ప్రాకారములను కూలగొట్టే సూత్రముల
పోలికగానున్ను వ్రాయవలసినది. । మరిన్ని వొక యి 3
నుప పలకను తెచ్చి, నీ మధ్యనున్ను పట్టణము మధ్య
నున్ను యినుప గోడకు మారుగా దానిని పెట్టి, నీ
ముఖదృష్టిని దానికి యెదురుగా పెట్టి, దానిని నీవు
ముట్టడి వేయవలసినది; అప్పుడు అది ఇశ్రాయేలు యిం
టివారికి గురుతుగా వుండును. । మరిన్ని నీ యెడమ 4
పక్క తట్టు వొత్తిగిలి, దాని యందు ఇశ్రాయేలు
యింటివారి పాప భారమును మోపవలయును; యెన్ని
దినములు నీవు ఆ తట్టు పడుకొందువొ అన్ని దిన
ములు నీవు వారి పాప భారమును భరింతువు. । యే 5
మంటే వారు పాపము చేసిన సంవత్సరముల లెక్క

చొప్పున నీకు మున్నూట తొంభై దినములను నిర్ణ
యిస్తిని; యీలాగున నీవు ఇశ్రాయేలు యింటివారి
6 పాప భారము భరించవలయును. । అయితే ఆ దినములు
నీవు గడిపిన తరువాత కుడిపక్క తట్టు నొత్తిగిలి, నలుబై
దినములు యూదా యింటివారి పాప భారమును భరిం
చవలయును; సంవత్సరము వొక్కంటికి వొక దినము చొ
7 ప్పున నేను నిర్ణయిస్తిని. । కాబట్టి నీవు యెరూశలే
ముకు నీ ముఖమును యెదురుబెట్టి, దానిని ముట్టడి వేయు
ము; మరిన్ని నీ చేతి మీద వున్న వస్త్రము తీయబడును;
8 దానికి విరోధముగా భవిష్యత్తును పలుక వలయును. । మ
రిన్ని నీవు దానిని ముట్టడి వేసే దినములు ముగించే పర్యం
తమూ నీవు యీ పక్కనుంచి ఆ పక్కకు తిరుగకుండా
9 నిన్ను కట్లతో బంధింతును. । మరిన్ని నీవు గోధుములున్ను
యవలున్ను చిక్కుడు గింజలున్ను చోళ్లున్ను కొర్రలు
న్ను తెచ్చుకొని, వొక పాత్రలో పోసి, నీ పక్కను నీవు
పడుకునే దినముల లెక్క చొప్పున రొట్టెలను కాల్చు
కోవలయును; మున్నూట తొంభై దినములు నీవు వా
10 టిని తినవలెను. । మరిన్ని నీవు తూనిక ప్రకారము
అనగా దినము వొక్కంటికి యిరువై తులముల యెత్తు
11 చొప్పున తినవలయును. । మరిన్ని నీళ్లను కొలప్రకా
రము హీను అనే దాని ఆరో భాగము చొప్పున ప్రతి
12 దినమున తాగవలయును. । మరిన్ని యవలతో చేసే
అప్పముల వలె నీవు వాటిని కాల్చుకొని తినవలయును;
వారు చూస్తూ వుండగా దానిని మనుష్య పురీషము
13 తోటి కాల్చవలయును. । యేమంటే యీలాగున ఇశ్రా
యేలు పుత్రులు వారిని నేను తోలివేసే అన్య జనాం
గములలో అపవిత్రమైన ఆహారమును తిందురని యె
14 హెూవా ఆనతియ్యగా, । నేను అన్నమాట, అయ్యో!
కర్తవైన యెహెూవా, యెన్నడూ నేను అపవిత్రుని
కాను; నా బాల్యము నాటినుంచి నేటివరకున్ను నేను
చచ్చిన దానిని అయినా చీల్చినదానిని అయినా తిన
లేదు; యేహ్యమైన మాంసము నా నోట యెన్నడూ
15 పడలేదని అనగా, । ఆయన నాతో ఆనతిచ్చినదేమంటే,
యిదుగో మనుష్య పురీషముకు మారుగా నీకు నేను
గోమయము నిర్ణయిస్తిని; దీనితోటి నీవు నీ భోజన
16 మును సిద్ధపచుర్చకొమ్ము అని సెలవు యిచ్చి, । మరిన్ని
ఆయన నాతో చెప్పినదేమంటే, వో నర పుత్రుడా,
యిదుగో యెరూశలేములో నేను రొట్టెయొక్క ఆధా
రమును విరిచినందున తూనిక ప్రకారముగా వారు
బహు చింతతోటి రొట్టెను తిందురు; వారు నీళ్లు కొల
17 చొప్పున తాగి నిశ్చేష్టతను పొందుదురు. । యీలాగున
వారు రొట్టెకున్ను పానమునకున్ను శ్రమ పొంది
వొకని నొకను విభ్రాంతి పడి చూస్తూ, తమ దోషము
వల్ల క్షయమవుదురు.

5. అధ్యాయము.

మరిన్ని వో నర పుత్రుడా, నీవు తెగువైన కత్తిని, 1
అనగా, మంగలి కత్తిని తీసుకొని, దానివి నీ తల మీద
నున్ను గడ్డము మీదనున్ను నడిపించి, త్రాసు తీసు
కొని, ఆ వెంట్రుకలను తూచి, మూడు భాగములను
చేయవలసినది. । మరిన్ని పట్టణమును ముట్టడి వేసిన దిన 2
ములు సంపూర్ణమైనప్పుడు నీవు పట్టణములో మూ
డో భాగమును కాల్చవలెను; రెండో భాగమును తీసి
కత్తిచేత నరికివేయవలెను; మిగిలిన భాగము గాలి చేత
యెగరగొట్టబడనియ్య వలెను; వాటిని వెంబడించి నేను
కత్తి దూసి తరుముదును. । అయితే వాటిలో కొన్ని 3
నీవు తీసుకొని నీ చెంగున కట్టుకో వలెను. । అప్పుడు 4
వాటిని మళ్లీ తీసి, అగ్నిలో వేసి, కాల్చవలసినది; దాని
నుంచి అగ్ని బైలువెళ్లి, ఇశ్రాయేలు యింటివారందరి
మీదికి వచ్చునని చెప్పి, । మరిన్ని కర్తయైన యె 5
హెూవా ఆనతిచ్చేదేమంటే, యిది యెరూశలేము;
దాని చుట్టూ వున్న జనాంగముల మధ్యనున్ను దేశ
ముల మధ్యనున్ను నేను దాని వుంచితిని. । అయితే అది 6
నా ఆజ్ఞలనున్ను కట్టడలనున్ను మార్చి, దాని చుట్టూ
వున్న జనాంగముల కంటేనున్ను దేశముల కంటేనున్ను
దోషము చేసెను; వారు నా ఆజ్ఞలనున్ను నా కట్టడల
నున్ను విసర్జించి, వాటియందు నడువలేదు. । కాబట్టి 7
కర్తయైన యెహెూవా ఆనతిచ్చేదేమంటే, మీరు మీ
చుట్టూ వున్న జనాంగముల కంటే అధిక దోషులై,
నా కట్టడల ప్రకారము నడువకనున్ను నా ఆజ్ఞలను
గైకొనకనున్ను మీ చుట్టూ వున్న జనాంగములకు కలిగి
వున్న ఆజ్ఞల చొప్పుననైనా నడువక వుంటిరి గనుక, ।
యిదిగో కర్తయైన యెహెూవానైన నేను నీకు విరో 8
ధినై, జనాంగములు దృష్టిస్తూ వుండగా నీ మీద ఆజ్ఞ
లను విధింతును. । నీ యేహ్యమైన చేష్టల నిమిత్తము నేను 9
పూర్వమందైనా యిక మీదనైనా చేయని కార్యమును
నీలో చేతును. । కాగా నీలో తండ్రులు తమ కుమారుల 10
నున్ను కుమారులు తమ తండ్రులనున్ను భక్షింతురు; యీ
లాగున నేను నీ మీద ఆజ్ఞలను విధించి, నీయొక్క శేషిం
చినవారిని నఖముఖాలా చెదరకొట్టుదును. । యిందుకు 11
కర్తయైన యెహెూవా ఆనతిచ్చేలాగు, నా జీవము
తోడు, నిజముగా నీవు నా పరిశుద్ధ స్థలమును నీ యే
హ్యమైన వాటి చేతనున్ను నీ అసహ్యమైన వాటి చేత
నున్ను అపవిత్రపరచితివి గనుక నిన్ను నేను నీచు
రాలినిగా చేతును; నాకు కరుణా దృష్టి అయినా చింత
అయినా రాక వుండును. । నీలో మూడో భాగము 12
తెగులుచేత మరణమవును, క్షామముచేత క్షయమవును;
మూడో భాగము కత్తిచేత నీ చుట్టూ కూలును; మిగి

లిన భాగమును నేను నఖముఖాలా చెదరగొట్టి, కత్తి
13 దూసి దాని తరుముదును. । యీలాగున నేను నా కోప
మును నెరవేర్చుదును; వారి మీద నా రౌద్రమును పెట్టి
తిని గనుక చల్లార్చుకొందును; యీలాగున నేను నా
రౌద్రమును వారి మీద తీర్చుకొన్న తరువాత వారు
యెహోవానైన నేను అహంకారముతో ఆనతిచ్చి
14 నదంతా చేస్తినని తెలుసుకొందురు. । మరిన్ని నేను నిన్ను
పాడుచేసి, నీ చుట్టూ వున్న జనాంగములలో నిన్ను
గడచి వెళ్లిన వారందరి కండ్లకు నిందితురాలినిగా
15 చేతును. । అయినందున కోపము చేతనున్ను రౌద్రము
చేతనున్ను కఠినమైన అహంకారముల చేతనున్ను నీకు
ఆజ్ఞలను విధించేటప్పుడున్ను, నీ వారు క్షయమయ్యేట
ట్టుగా నేను వారిని క్షయపర్చే క్షామమనే చెడ్డ బాణ
16 ములను వేసినప్పుడున్ను, । నీవు నీచురాలవుగానున్ను
హాస్యాస్పదురాలవుగానున్ను వున్నందున నీ చుట్టూ
వున్న జనాంగములు ఆశ్చర్యము పొంది, బుద్ధి తెచ్చు
కొందురని యెహోవానైన నేను ఆనతిస్తిని; యేమంటే
నీ మీద క్షామమును బలముగాచేసి, నీ రొట్టెయొక్క
17 ఆధారమును విరుతును. । యీలాగున నేను నీ మీదికి
క్షామమున్ను దుష్ట మృగములనున్ను పంపుదును;
అవి నిన్ను పుత్రరహితగా చేసును; నీలోనుంచి తెగు
లున్ను రక్తమున్ను పారును; నీ మీదికి కత్తిని రప్పింతు
నని యెహోవానైన నేను ఆనతిస్తిని.

## 6. అధ్యాయము.

1 మరిన్ని యెహోవా వాక్యము నా యొద్దికి వచ్చి
2 చెప్పినదేమంటే, । ఓ నర పుత్రుడా, నీ ముఖమును
ఇశ్రాయేలు పర్వతముల తట్టు వుంచి, వాటిని గురించి
3 భవిష్యత్తుగా పలికి చెప్పవలసినలాగు, । ఓ ఇశ్రాయేలు
పర్వతములారా, కర్తయైన యెహోవా వాక్యములను
వినండి; పర్వతములతోటిన్ని కొండలతోటిన్ని నదుల
తోటిన్ని లోవలతోటిన్ని కర్తయైన యెహోవా
ఆనతిచ్చేదేమంటే, యిదుగో నేను నిజముగా నీ మీదికి
కత్తిని రప్పించి, నీ వున్నతమైన స్థలములను నాశనము
4 చేతును. । మీ బలిపీఠములు పాడై పోవును; మీ విగ్ర
హములు ఛిన్నాభిన్నములవును; హతులైన మీ వారిని
5 నేను మీ బొమ్మల ముందర పడవేతును. । ఇశ్రాయేలు
పుత్రుల కళేబరములను వారి బొమ్మల ముందర పడ
వేసి, మీ శల్యములను మీ బలిపీఠముల చుట్టూ జల్లు
6 దును. । మీరు కట్టిన పీఠములు విడువబడి పాడయ్యే
టట్టుగానున్ను, మీ విగ్రహములు ఛిన్నాభిన్నముల
య్యేటట్టుగానున్ను, మీ ప్రతిమలు నరకబడేటట్టుగా
నున్ను, మీ చేతి క్రియలు నాశనమయ్యేటట్టుగా
నున్ను మీరు నివసించిన పట్టణములు పాడైపోవును;
మీ వున్నతమైన స్థలములు విడువబడును. । మీ చేత 7
హతమైన వారు కూలుదురు; అప్పుడు నేనే యెహోవా
వానై వున్నానని మీరు తెలుసుకొందురు. । అయినప్ప 8
టికిన్ని మీలో కొంత శేషమును వుండనిత్తును; యేలా
గంటే, మీరు దేశముల కడకు చెదిరి పోయేటప్పుడు
జనాంగములలో కొందరు మీ నిమిత్తము కత్తినుంచి
తప్పించుకొందురు. । మరిన్ని మీలో తప్పించుకొనిన 9
వారు యే జనాంగములలోకి చెరగా వెళ్లుదురో అక్కడ
నన్ను తలంచుకొందురు, యేమంటే నన్ను విడిచిన వారి
వ్యభిచారపు హృదయము చేతనున్ను తమ విగ్రహము
లతో వ్యభిచరించిన వారి నేత్రముల చేతనున్ను నేను
దుఃఖపరచబడితిని; అయితే అప్పుడు వారు తమ యే
హ్యములయిన వాటి అన్నిటిచేత చేసిన కీడు నిమిత్తము
తమలో తామే రోయుదురు. । మరిన్ని నేను యెహోవా 10
వానయి వున్నాననిన్ని యీ కీడును వారికి చేతునని
నేను చెప్పిన మాట వ్యర్థము కాదనిన్ని వారు యె
రుగుదురని ఆనతిచ్చి, । మరిన్ని కర్తయైన యెహోవా 11
ఆనతిచ్చేదేమంటే, నీవు నీ హస్తముచేత చరుచుకొని,
కాలుచేత మట్టి, ఇశ్రాయేలు యింటివారి చెడ్డ యే
హ్యములయిన వాటికన్నిటికీ అయ్యో అని మొర్రపెట్ట
వలసినది; యేమంటే వారు కత్తిచేతనున్ను క్షామము
చేతనున్ను తెగులుచేతనున్ను కూలుదురు. । దూరమున 12
వున్నవారు తెగులుచేత మరణమవుదురు; దగ్గిర వున్న
వారు కత్తిచేత కూలుదురు; వుండిపోయి ముట్టడి వేయ
బడిన వారు క్షామముచేత మరణమవుదురు; యీలాగున
వారి మీద నేను నా రౌద్రమును నెరవేర్చుదును. ।
వారి జనులు హతులై, వారి విగ్రహముల మధ్యనున్ను 13
వారు కట్టిన పీఠముల చుట్టున్ను పొడుగయిన కొండ
లన్నిటి మీదనున్ను సకల పర్వతముల మీదనున్ను
పచ్చని చెట్లన్నిటి కిందనున్ను దర్పమయిన ఆల వృక్ష
ములన్నిటి కిందనున్ను వారి విగ్రహములన్నిటికి పరి
మళపు ధూపమిచ్చిన చోట్లన్నిటిలోనున్ను పడి వున్న
ప్పుడు నేనే యెహోవానయి వున్నానని మీరు యె
రుగుదురు. । ఆలాగున నేను నా హస్తమును వారి మీద 14
చాపి, దేశమును పాడుచేతును; వారి కాపురములన్ని
టినీ దిబ్లాతు తట్టు వున్న అరణ్యము కంటే పాడు
చేతును; అప్పుడు నేనే యెహోవానై వున్నానని
వారు యెరుగుదురు.

## 7. అధ్యాయము.

మరిన్ని యెహోవా వాక్యము నా యొద్దికి 1
వచ్చి చెప్పినదేమంటే, । ఓ నర పుత్రుడా, కర్తయైన 2
యెహోవా ఇశ్రాయేలు దేశమును గురించి ఆన
తిచ్చిన లాగు దేశము నాలుగు దిక్కుల మీదికిన్ని

3 అంతము వస్తూ వున్నది. । యిదుగో యిప్పుడే నీకు
అంతము వచ్చెను; కాబట్టి నా కోపమును నీ మీదికి
పంపి, నీ మార్గములు ప్రకారము నీకు న్యాయము
తీర్చి, నీ యేహ్యములయిన వాటి అన్నిటి చొప్పున
4 నీకు ప్రతి క్రియ చేతును. । నా కన్ను నిన్ను కనిక
రించక వుండును; నాకు చింతలేక పోవును, యేమంటే
నీ మార్గములనున్ను నీ యేహ్యములైన వాటినిన్ని
నీ మీద ఆరోపించి, నిన్ను శిక్షింతును; అప్పుడు నేను
5 యెహోవానై వున్నానని మీరు యెరుగుదురు.। మరి
న్ని కర్తయైన యెహోవా ఆనతిచ్చేదేమంటే, కీడు,
6 యిదుగో, కీడు మాత్రమే వచ్చెను.। అంతము వచ్చెను,
అంతము వచ్చెను; అది నీ కొరకు కనిపెట్టి వున్నది;
7 యిదుగో అది వచ్చెను.। వో దేశపు కాపురస్తుడా,
నీ కొరకు వుదయము వచ్చెను; సమయము వచ్చెను;
పర్వతముల ప్రతి ధ్వని కాదు శ్రమ దినము సమీ
8 పించెను. । యిక కొంత సేపటికి నేను నా రౌద్రమును
నీ మీద కుమ్మరింతును; నీ మీద నా కోపము నెరవే
ర్తును; నీ మార్గముల ప్రకారము నీకు న్యాయము
తీర్తును; నీ యేహ్యములయిన వాటియన్నిటి చొప్పున
9 నీకు ప్రతి క్రియ చేతును.। నా కన్ను కనికరించక
వుండును; నాకు చింతలేక పోవును; యేమంటే నీ మా
ర్గములనున్ను నీ యేహ్యములయిన వాటినిన్ని నీ మీద
ఆరోపించి నిన్ను శిక్షింతును, అప్పుడు యెహోవా
నయిన నేను కొట్టేవాడనై వున్నానని మీరు యెరు
10 గుదురు. । యిదుగో ఆ దినము వచ్చెను, యిదుగో
వచ్చెను; వుదయము బయిలు వెళ్లెను; దండము పూచి
11 వున్నది; గర్వము చిగిరించెను.। బలవంతము పుట్టి అన్యా
యపు దండమై పెరిగెను; వారికైనా వారి సమూహము
కైనా వారివల్ల పుట్టిన వారికయినా యెవడున్ను వుం
డక పోవును; వారి కొరకు రోదనము లేకపోవును. ।
12 కాలము వచ్చెను, దినము సమీపించెను; సమూహమం
తటి మీద వుగ్రము కలిగి వుండెను గనుక కొనినవాడు
సంతోషించ వద్దు, అమ్మిన వాడు దుఃఖించ వద్దు. ।
13 యేమంటే వారు జీవించి వున్నప్పటికిన్ని అమ్మిన వాడు
అమ్మిన దానికి తిరిగీ రాకపోవును, యేమంటే యీ
దర్శనము దాని సమూహమంతటిని గురించి తప్పక
వుండును; తన అన్యాయపు నడతలచేత తన్ను బల
14 పర్చుకొనిన వాడు వొకడున్ను లేకపోవును. । వారు
సర్వసిద్ధము చేసేటట్టుగా బాకానాదము చేసిరి, అయితే
సమూహమంతటి మీద నా వుగ్రము కలిగి వుండెను
గనుక యుద్ధమునకు బయిలు వెళ్లిన వాడు వొకడున్ను
15 లేడు. । బయిట కత్తి వున్నది, లోపల తెగులున్ను క్షా
మమున్ను వున్నవి; బయిట వున్నవారు కత్తిచేత మరణ
మవుదురు; పట్టణమందున్న వారిని క్షామమున్ను తెగు
లున్ను మింగును. । వారిలో తప్పించుకొనే వారు 16
తప్పించుకొని, పర్వతముల మీద వుండి, అందరున్ను
తమ తమ దోషములవల్ల లోయలో వున్న గువ్వల లా
గున మూల్గుతూ వుందురు. । సమస్తమైన హస్తములు 17
నిర్జలములై పోవును; సకలమైన మోకాళ్లు నీళ్ల వలె
నే తత్తళించును. । వారు గోనెపట్టను కట్టుకొందురు; 18
ఘోరమైన భయము వారిని కప్పును; సకల ముఖములు
సిగ్గుతోనున్ను సకల శిరస్సులు బోడిగానున్ను అగు
పడును. । తమ వెండిని వీధులలో పారవేతురు; తమ 19
బంగారమును అపవిత్రమైనదిగా యెంతురు; యెహో
వా ఉగ్రదినమందు వారి వెండి అయినా బంగారము
అయినా వారిని తప్పించలేక పోవును; అది వారి దోష
మువల్ల వారికి అభ్యంతరమైనది అవును గనుక దాని
వల్ల వారు తమ క్షుధను తీర్చుకొనుటయున్ను తమ
వుదరమును తృప్తిపరుచుకొనుటయున్ను లేకపోవును.।
నాకు శృంగారమైన ఆభరణమయ్యేటట్టు దానిని బహు 20
ఘనముగా స్థాపించితిని; అయినప్పటికిన్ని వారు దాని
లో అసహ్యమైనటువంటిన్ని యేహ్యమైనటువంటిన్ని
తమ ప్రతిమలను నిలువబెట్టిరి; కాబట్టి దానిని వారికి
అపవిత్ర పరుతును.। యేమంటే దానిని అన్యుల చేతు 21
లలోకి చిక్కేటట్టు చేతును; లోకపు దుర్మార్గులకు
దోపుడుగా యిచ్చినందున వారు దానిని చెరుతురు. ।
నా ముఖమును వారినుంచి నేను తిప్పుకొనినందున 22
వారు నా అంతఃపురమును అపవిత్ర పరుతురు; యేమం
టే దొంగలు కన్నమువేసి అందులో ప్రవేశించి చెరు
పుదురు. । సంకెళ్లను చేయండి, యేమంటే రక్త దోష 23
ములచేత దేశము నిండి వున్నది; పట్టణము బలవంతము
చేత నిండి వున్నది. । కాబట్టి నేను అన్య జనాంగము 24
లలో చెడ్డవారిని రక్షించినందున వీరు వారి యిండ్లను
స్వతంత్రించుకొందురు; మరిన్ని బలాఢ్యుల అతిశయ
ము లేకుండా చేతును; వారి పరిశుద్ధ స్థలములు అప
విత్రమవును. । నాశనము వస్తూ వున్నది; వారు నెమ్మ 25
దిని వెతికినప్పటికిన్ని యెంతమాత్రమూ దొరకక వుం
డును.। వుపద్రవము మీద వుపద్రవము వచ్చును, కబురు 26
మీద కబురు పుట్టును; అప్పుడు వారు దీర్ఘదర్శిని
దర్శనమును అడుగుదురు, అయితే అర్చకునికి న్యా
యప్రమాణమున్ను పెద్దలకు ఆలోచనయున్ను లేక
పోవును. । రాజు మూల్గుతూ వుండును; అధిపతులు 27
క్షీణ లక్షణమును ధరింతురు; దేశపు జనుల చేతులు
వణుకును; వారి మార్గప్రకారము నేను వారికి చేతును;
నేను వారి నడకల ప్రకారము వారికి న్యాయము
తీర్తును; అప్పుడు నేను యెహోవానై వున్నానని
వారు తెలుసు కొందురు.

## 8. అధ్యాయము.

1 అయితే ఆరో సంవత్సరము ఆరో నెల అయిదో
దినమున నేను నా యింట్లో కూర్చుని వుండగానున్ను
యూదా పెద్దలు నా ముందర కూర్చుని వుండగాను
న్ను కర్తయైన యెహోవా హస్తము అక్కడ నా
2 మీదికి వచ్చి వుండెను. । అప్పుడు నేను చూడగానే
యిదుగో అగ్ని లాటి రూపము నాకు కనుబడెను;
ఆయన మొల మొదలుకొని దిగువకు అగ్ని వలెనున్ను
ఆయన మొల మొదలుకొని మీదికి తృణగ్రాహి రంగు
3 గల తేజస్సు వలెనున్ను నాకు కనుబడెను. । అప్పుడు
ఆయన హస్తాకారమైన దాని చాపి, నా తల వెంట్రు
కలు పట్టుకొనినందున దైవదర్శనములందు ఆత్మ నన్ను
భూమి మీదనుంచి ఆకాశములోకి యెత్తుకొని, యె
రూశలేముకు వెళ్లి, లోపటి శాలయొక్క ఉత్తరపు తట్టు
చూచే ద్వారమందు నన్ను దించెను; అక్కడ అహం
కారమును ప్రేరేపణ చేసేటటువంటి విగ్రహముయొ
4 క్క ఆసనము వుకటి వుండెను. । మరిన్ని యిదుగో
మైదానమందు నాకు కనుబడిన దర్శన ప్రకారము
ఇశ్రాయేలు దేవుని ప్రకాశత అక్కడ వుండెను. ।
5 అప్పుడు ఆయన నాతో ఆనతిచ్చినదేమంటే, వో నర
పుత్రుడా, వుత్తరపు మార్గము తట్టు నీ కండ్లను తెరచి
చూడుమని సెలవు యిచ్చినందున, నేను వుత్తరపు తట్టు
తేరి చూడగానే యిదుగో వుత్తరపు తట్టు పీఠముయొ
క్క ద్వారము లోపల అహంకారమును కలుగ చేసే
6 యీ విగ్రహము నిలిచి వుండెను. । అప్పుడు ఆయన
మరిన్ని నాతో ఆనతిచ్చినదేమంటే, వో నర పుత్రు
డా, వారు చేసిన పని చూస్తివా? నా పరిశుద్ధ స్థల
మును నేను విడిచి వెళ్లేటట్టుగా ఇశ్రాయేలు యింటి
వారు యిక్కడ చేసిన బహు యేహ్యములైన వాటిని
చూస్తివా? అయితే నీవు యీ తట్టు తిరిగి, వీటి కంటే
7 చెడ్డ యేహ్యతలను చూతువని చెప్పి, । శాలయొక్క
ద్వారము దగ్గిరకు నన్ను తీసుకొని పోయెను; అప్పుడు
నేను చూడగానే యిదుగో గోడలో వున్న సందు
8 నాకు కనుబడెను. । అప్పుడు ఆయన నాతో ఆనతిచ్చి
నదేమంటే, వో నర పుత్రుడా, ఆ గోడకు కన్నము
తవ్వుమని సెలవు యిచ్చెను; కాబట్టి నేను గోడకు
9 కన్నము తవ్వినందున ద్వారము కనుబడెను. । అప్పుడు
ఆయన నాతో ఆనతిచ్చినదేమంటే, నీవు లోపలికి
చొచ్చి, యిక్కడ వారు యెటువంటి యేహ్యములైన
వాటిని చేస్తూ వున్నారో అది చూడుమని సెలవు
10 యిచ్చినందున, । నేను చొచ్చి చూస్తిని; అప్పుడు
అవిగో నఖముఖాలా పాకే సకల జంతువుల ఆకారము
లున్ను యేహ్యమయిన మృగముల ఆకారములున్ను
ఇశ్రాయేలు యింటివారి విగ్రహముల ఆకారములు
న్ను గోడ మీద వ్రాసి వుండెను. । మరిన్ని వాటి ముం 11
దర ఇశ్రాయేలు యింటివారి పెద్దలు డెబ్బయి మంది
నిలిచి వుండిరి; వారి మధ్యను షాఫాను కుమారుడైన
యాజన్యాహు నిలిచి వుండెను; మరిన్ని ప్రతి మను
ష్యుని చేతిలో ధూపార్తె కలిగినందున ధూపము
చిక్కని మేఘము వలె యెక్కుతూ వుండెను. । అప్పుడు 12
ఆయన నన్ను చూచి, వో నరపుత్రుడా, ఇశ్రాయేలు
యింటివారి పెద్దలు అంధకారమందున్న ప్రతి మను
ష్యుడు ప్రతిమలు గల తన తన అంతఃపురమందున్న
యేమి చేస్తూ వుండిరో అది చూస్తివా? వారు అనుకొ
నేదేమంటే, యెహోవా మమ్మును కానక వుండును;
యెహోవా దేశమును విడిచెనని అనుకొనిరని చెప్పి, ।
మరిన్ని నాతో ఆనతిచ్చినదేమంటే, నీవు యీ తట్టు 13
తిరిగీ వచ్చి, వీటి కంటే వారు చేసిన యింకా చెడ్డ
యేహ్యములైన వాటిని చూడుమని చెప్పి, । యెహో 14
వా మందిరముయొక్క వుత్తరపు తట్టు ద్వారము దగ్గిరికి
నన్ను తీసుకొ పోయెను; అక్కడ యిదుగో స్త్రీలు కూ
ర్చుండి, తమ్మూజు నిమిత్తము యేడుస్తూ వుండిరి. ।
అప్పుడు ఆయన వో నర పుత్రుడా, యిది చూస్తివా? 15
అయితే నీవు మళ్లీ తిరిగి చూస్తే, వీటి కంటే యింకా
చెడ్డ యేహ్యములైన వాటిని చూతువని నాతో చెప్పి, ।
యెహోవా మందిరముయొక్క లోపల శాలలోకి 16
నన్ను తీసుకొ పోయెను; అక్కడ యెహోవా గుడి
ద్వారము దగ్గిర వున్న మొగసాలయొక్క పంచపాళీ
కిన్ని పీఠముయొక్క మధ్యను రమారమీ యిరువై అయి
దుగురు వుండిరి; వారి వీపులు యెహోవా గుడితట్టు
న్ను వారి ముఖములు తూర్పు తట్టున్ను వుండగా వారు
తూర్పున వున్న సూర్యునికి మ్రొక్కుతూ వుండిరి. ।
అప్పుడు ఆయన నన్ను చూచి, వో నర పుత్రుడా, 17
యిది నీవు చూస్తివే; యూదా యింటివారు యిక్కడ
యీలాటి యేహ్యములైన వాటిని జరిగించుట వట్టిదని
యెంచవచ్చునా? యేమంటే దేశమును బలవంతముచేత
నింపుట మాత్రమే కాదు; వారు తిరిగీ వచ్చి, నాకు
కోపమును పుట్టిస్తూ వుందురు; యిదుగో వారు కొమ్మను
నాసికకు యెత్తుతూ వుండిరి. । కాబట్టి నేను నా రౌ 18
ద్రమును అగుపర్తును; నా కన్ను కనికరించక వుం
డును; నేను చింతపడక వుందును; వారు నా చెవులలో
పెద్ద బొబ్బతోటి మొఱ్ఱబెట్టినప్పటికిన్ని నేను ఆల
కించక వుందునని చెప్పెను.

## 9. అధ్యాయము.

మరిన్ని ఆయన నేను వింటూ వుండగా గొప్ప 1
శబ్దము చేత చెప్పినదేమంటే, పట్టణమును కనిపెట్టే

వారందరున్ను హతము చేసే తమ తమ ఆయుధములను
చేత పట్టుకొని, సమీపమునకు వత్తురు గాకని ఆనతి
2 చ్చినందున, । యిదుగో ఆరుగురు మనుష్యులు వుత్తర
ముఖముగా వున్న పొడుగైన గవిని మార్గముచేత
వచ్చిరి; ప్రతి మనుష్యుడు హతము చేసే ఆయుధము
తన చేత పట్టుకొని వుండెను; అయితే వారిలో వొకడు
నారచీర కట్టుకొని, తన పక్కను లేఖికుని సిరాబుడ్డిని
కట్టుకొని వుండెను; వీరు లోపలికి ప్రవేశించి, యిత్తడి
3 పీఠము వొద్ద నిలిచి వుండిరి. । అయితే ఇశ్రాయేలు
దేవుని ప్రకాశత తన కింద వున్న కెరూబు పైనుంచి
యెక్కి వెళ్లి, మందిరపు గడప పైకి వచ్చి నిలిచి వుం
డెను; అప్పుడు ఆయన నారచీర కప్పుకొని, లేఖికుని
సిరాబుడ్డిని పక్కను ధరించుకొన్న వానిని పిలిచెను. ।
4 అప్పుడు యెహోవా అతనికి సెలవు యిచ్చినదేమం
టే, నీవు యెరూశలేములోకి వెళ్లి, చుట్టూ తిరిగి,
దానిలో జరిగిన యేహ్యతలన్నిటిని గురించి మూల్గి
దుఃఖిస్తూ వున్న వారి లలాటముల మీద ఆనవాళ్లను
5 పెట్టుమని చెప్పి, । నేను వింటూ వుండగా ఆయన
తతిమ్మా వారిని చూచి చెప్పినదేమంటే, మీరున్ను పట్ట
ణమందు వాని వెంటపోయి, కనికరమైనా చింతయైనా
6 లేకుండా, । పెద్దవారినిన్ని చిన్నవారినిన్ని కన్యలనున్ను
పిల్లలనున్ను స్త్రీలనున్ను నరికి, భొత్తిగా నాశనము
చేయండి; అయితే ఆనవాలు యెవనికి కలిగి వుండునో
అతని దగ్గిరకు వెళ్లవద్దు; యిది నా పరిశుద్ధ స్థలమందు
ఆరంభింతురు గాకని సెలవు యిచ్చినందున వారు మంది
రము ముందర వున్న పెద్దలను నరక నారంభించిరి. ।
7 మరిన్ని ఆయన వారితో సెలవు యిచ్చినదేమంటే,
మందిరమును అపవిత్రపరచి, శాలలను హతమైన వారి
తో నింపి, బైలు వెళ్లండని సెలవు యిచ్చినందున, వారు
8 బైలు వెళ్లి, పట్టణమును హతము చేసిరి. । అయితే వీరు
వారిని నరుకుతూ వుండగా నేను వొంటరిగా వుండి,
సాష్టాంగపడి, మొర్ర పెట్టినదేమంటే, అయ్యో కర్త
వయిన యెహోవా! యెరూశలేము మీద నీ రౌద్ర
మును కుమ్మరించి, ఇశ్రాయేలులో శేషించిన వారినం
9 దరినిన్ని క్షయము చేతువా? అని అడిగినప్పుడు. । ఆ
యన నాతో ఆనతిచ్చినదేమంటే, ఇశ్రాయేలు యింటి
వారి దోషమున్ను యూదా యింటివారి దోషమున్ను
బహు ఘోరముగా వున్నది; వారు యెహోవా దేశ
మును విడిచెననిన్ని యెహోవా మమ్మును కానలేద
నిన్ని అనుకొన్నందున దేశము రక్తములోటిన్ని పట్ట
10 ణము తిరుగుబాటుతోటిన్ని నిండి వున్నది. । కాబట్టి
నా కన్ను కనికరించక వుండును; నేను చింతపడను;
వారి మార్గము చొప్పున నిర్ణయించి, వారిని శిక్షిం
11 తునని ఆనతిచ్చెను. । అప్పుడు నారచీర కప్పుకొని
లేఖికుని సిరాబుడ్డి పక్కను ధరించుకొనిన వాడు వచ్చి,
నీవు నాకు ఆజ్ఞాపించినట్టు నేను చేస్తినని చెప్పెను.

## 10 అధ్యాయము.

అప్పుడు నేను చూడగానే, యిదుగో, కెరూబుల 1
పై వున్న ఆకాశమండలములో నీలము వలెనున్న గద్దె
ఆకారము నాటి మీద అగుపడెను. । అప్పుడు ఆయన 2
నారచీర కప్పుకొనిన వానికి సెలవు యిచ్చినదేమంటే,
నీవు కెరూబు కింద వున్న చక్రముల మధ్యను ప్రవే
శించి, కెరూబుల మధ్యనున్న అగ్ని నీ చేతితో యెత్తి,
పట్టణము మీద జల్లుమని సెలవు యిచ్చినందున, అతడు
నేను చూస్తూ వుండగా ప్రవేశించెను. । అయితే అతడు 3
ప్రవేశించినప్పుడు కెరూబులు మందిరపు కుడిపార్శ్వ
మందు నిలిచి వుండెను; మరిన్ని మేఘము లోపలి శా
లను నింపెను. । అప్పుడు యెహోవా ప్రకాశత కెరూ 4
బుల పైనుంచి యెక్కి వెళ్లి, మందిరపు గడప పయికి
వచ్చి నిలిచి వుండెను; మరిన్ని ఆ మేఘముతోటి మం
దిరము నిండి వుండెను; శాలయున్ను యెహోవా
మహిమయొక్క తేజస్సు చేత నిండి వుండెను. । మరిన్ని 5
కెరూబుల రెక్కల చప్పుడు సర్వ సమర్థుడయిన
దేవుడు పలికిన శబ్దము వలె బయిటి శాలమట్టుకు విన
బడెను. । అయితే ఆయన నారచీర కప్పుకొనిన వానికి 6
కెరూబుల మధ్యనున్న చక్రముల మధ్యనుంచి అగ్నిని
తీసుకొనుమని సెలవు యిచ్చినప్పుడు అతడు లోపలికి
వెళ్లి చక్రముల దగ్గిర నిలిచి వుండెను. । అప్పుడు కెరూ 7
బులలో వొక కెరూబు కెరూబుల మధ్య వున్న అగ్ని
తట్టు చెయ్యి చాపి, నిప్పులను తీసి, నారచీర కప్పు
కొనిన అతని చేతిలో వేసెను; అతడు వాటిని పుచ్చు
కొని బయిలు వెళ్లెను. । యేమంటే కెరూబుల రెక్కల 8
కింద మనుష్యుని చేతి ఆకారము అగుపడెను. । మరిన్ని 9
నేను చూడగానే, యిదుగో, కెరూబుల దగ్గిర నాలుగు
చక్రములు కలిగి వుండెను; వొక కెరూబు దగ్గిర వొక
చక్రమున్ను వొక కెరూబు దగ్గిర వొక చక్రమున్ను
వుండెను; మరిన్ని చక్రముల ఆకారము గరుడ పచ్చ
రాతి రంగు వలె వుండెను. । మరిన్ని ఆ నాలుగు చక్ర 10
ముల ఆకారము వొక లాగున వుండి, చక్రములో
చక్రము వున్నట్టు అగుపడెను. । అవి తిరుగులాడుతూ 11
వెళ్లేటప్పుడు నాలుగు వయిపులనూ తిరిగి వెళ్లును; వెళ్లే
టప్పుడు తిరిగి రాక వుండును; యే తట్టు శిరస్సు తిప్పు
కొనునో ఆ తట్టు అవి దానిని వెంటాడును; వెళ్లేట
ప్పుడు తిరిగి రాక వుండును. । వాటి శరీరమంతటా 12
వెన్నులున్ను చేతులున్ను రెక్కలున్ను మరిన్ని యీ
నాలుగు కెరూబుల యొద్ద వున్న చక్రములు చుట్టున్ను
నేత్రములతోను నిండి వుండును. । మరిన్ని చక్రము 13

లను గురించినది యేమంటే, నేను వింటూ వుండగా,
14 వైా చక్రమా, అని పిలిచిన శబ్దమాయెను. । మరిన్ని వా
టిలో ప్రతి దానికి నాలుగు ముఖములు కలిగి వుం
డెను; మొదటి ముఖము కెరూబు ముఖమై వుండెను;
రెండో ముఖము మనుష్యుని ముఖమై వుండెను; మూడో
ముఖము సింహపు ముఖమై వుండెను; నాలుగో ముఖ
15 ము గద్ద ముఖమై వుండెను. । యీ కెరూబులు పైకి
యెత్తబడెను; యిది కెబారు నది దగ్గిర నాకు అగుప
16 డిన జీవజంతువై వుండెను. । అయితే కెరూబులు వెళ్లిన
ప్పుడు చక్రములున్ను వాటితో కూడా వెళ్లును; మరి
న్ని కెరూబులు భూమి పైకి యెక్కుటకు రెక్కలు
యెత్తుకొన్నప్పుడు ఆ చక్రములు వాటి యొద్దనుంచి
17 తిరిగీ వెళ్లక వుండును. । అవి నిలిస్తే యివిన్ని నిలుచును;
అవి యెత్తబడితే యివిన్ని యెత్తబడును; యేమంటే జీవ
జంతువులకు కలిగిన ఆత్మ వీటికిన్ని కలిగి వుండెను. ।
18 అయితే అటుతరువాత యెహోవాయొక్క ప్రకా
శత మందిరపు గడప పైనుంచి తలిఁ, కెరూబుల పైకి
19 వచ్చి నిలిచెను. । అప్పుడు కెరూబులు రెక్కలు యెత్తు
కొని నేను చూస్తూ వుండగా, భూమి పయికి యెక్కి
బయిలు వెళ్లెను; మరిన్ని బయిలు వెళ్లినప్పుడు చక్ర
ములు వాటితో కూడా వెళ్లెను; అయితే అవి యె
హోవా మందిరపు తూర్పుఁ ద్వారమునకు వచ్చి
అక్కడ నిలిచి వుండెను; మరిన్ని ఇశ్రాయేలు దేవుని
20 ప్రకాశత వాటి పయిని నిలిచి వుండెను. । యిది కెబారు
నది దగ్గిర ఇశ్రాయేలు దేవుని కింద వుండి, నాకు అగు
పడిన జీవ జంతువై వుండెను; కాబట్టి అవి కెరూబు
21 లని నేను యెరిగి వుంటిని. । వొక్కొక్క దానికి నా
లుగు ముఖములు కలిగి యుండెను; వొక్కొక్క దానికి
నాలుగు రెక్కలు కలిగి వుండెను; మరిన్ని వాటి రెక్కల
కింద మనుష్యుని చేతి ఆకారము కలిగి వుండెను. ।
22 మరిన్ని వాటి ముఖముల పోలికె కెబారు నది దగ్గిర
నాకు కనుబడిన ముఖముల వలె వుండెను; అవిన్ని వాటి
ఆకారములున్ను ఆలాగున వుండెను; యివి అన్నీ తిన్న
గా ముందర వెళ్లెను.

## 11. అధ్యాయము.

1 అప్పుడు ఆత్మ నన్ను యెత్తుకొని, యెహోవా మం
దిరపు తూర్పుఁ ద్వారము దగ్గిరకు తీసుకొ వచ్చెను;
అప్పుడు యిదుగో ద్వారపు తలుపు దగ్గిర యిరువై అయి
దుగురు నిలిచి వుండిరి; వారిలో అజ్జూరు కుమారుడైన
యాజన్యాహున్ను బేనాయ్యా కుమారుడైన పెలధ్యా
యున్ను అనగా జనులకు అధిపతులైన వీరు నాకు కను
2 బడిరి. । అప్పుడు ఆయన నాతో ఆనతిచ్చినదేమంటే,
వైా నర పుత్రుడా, వీరు యీ పట్టణమందు అన్యా
యపు యోచన యోజించి, చెడ్డ ఆలోచన చేసే వారు:।
అది చాలా దూరమనిన్ని, మనము యిండ్లను కట్టుకుం 3
దామనిన్ని, యీ పట్టణము పచనపాత్రయున్ను మన
ము మాంసమున్ను అయి వున్నామనిన్ని చెప్పుకొనే
వారు. । కాబట్టి వారి మీద భవిష్యత్తుగా పలుకుము; ఓ 4
నరపుత్రుడా, భవిష్యత్తుగా పలుకుమని సెలవు యిచ్చె
ను. । అప్పుడు యెహోవా ఆత్మ నా మీదికి వచ్చి చెప్పి 5
నదేమంటే, యెహోవా ఆనతిచ్చినట్టు నీవు పలుక
వలసిన లాగు, ఓ ఇశ్రాయేలు యింటివారలారా, మీరు
ఆలాగున చెప్పుకొంటిరి; మీ మనస్సులో పుట్టినటు
వంటివన్నిన్ని నాకు తెలిసి వున్నవి. । యీ పట్టణమందు 6
మీరు విస్తారముగా హతము చేస్తిరి; మీ చేత హతులైన
వారితో వీధులు నిండి వున్నవి. । కాబట్టి కర్తఁయైన 7
దేవుడు ఆనతిచ్చినదేమంటే, దానిలో మీరు హతము
చేసి పడవేసిన వారే మాంసమున్ను యీ పట్టణమే
పచనపాత్రయున్ను అయి వుండును; దానిలోనుంచి
మిమ్మును బైలు వెళ్ల వేతును. । మీరు కత్తికి భయపడి 8
తిరి, అయితే కత్తిని మీ మీదికి పంపుదునని కర్తఁయైన
దేవుడు ఆనతిచ్చెను. । మరిన్ని దానిలోనుంచి మిమ్మును 9
బైలు తీసి, అన్యుల చేతులలోకి అప్పగించి, మీ మీ
దికి ఆజ్ఞను విధింతును. । కత్తిచేత మీరు కూలుదురు; ఇశ్రా 10
యేలు సరిహద్దులోనే మిమ్మును శిక్షింతును; అప్పుడు
నేను యెహోవానై వున్నానని మీరు తెలుసుకొం
దురు. । యీ పట్టణము మీకు పచన పాత్ర కాదు; మీరు 11
దానిలో వుండే మాంసము కారు; యేమంటే ఇశ్రా
యేలు సరిహద్దులోనే మిమ్మును శిక్షింతును. । అప్పుడు 12
నేను యెహోవానై వున్నానని మీరు తెలుసుకొం
దురు; యేమంటే నా కట్టడల ప్రకారము మీరు నడువ
లేదు; నా ఆజ్ఞల ప్రకారము మీరు చేయక మీ చుట్టూ
వున్న అన్య జనాంగముల మర్యాదల ప్రకారము చేస్తిరి
అని ఆనతిచ్చెనని చెప్పుమని సెలవు యిచ్చెను. । అయితే 13
నేను ఆ చొప్పున భవిష్యత్తు పలికిన కాలమందు బేనా
య్యా కుమారుడైన పెలధ్యా మరణమాయెను; కాబట్టి
నేను సాష్టాంగపడి, పెద్ద బొబ్బతోటి మొఱ్ఱ బెట్టిన
దేమంటే, అయ్యో కర్తవైన దేవుడా! నీవు ఇశ్రాయే
లుకు శేషించిన వారిని బొత్తిగా నాశనము చేతువా
అని అంటిని. । అప్పుడు యెహోవా వాక్యము నా 14
యొద్దికి వచ్చి చెప్పినదేమంటే, । ఓ నర పుత్రుడా, యె 15
రూశలేము పట్టణపువారు యీ దేశము మాకు స్వాస్థ్య
ముగా యివ్వబడెను, కాబట్టి మీరు వెళ్లి యెహో
వాకు దూరముగా వుండండన్న మాట యెవరితో చెప్పి
రో, వారే, అనగా, ఇశ్రాయేలు యింటివారందరున్ను
నీ అన్నదమ్ములున్ను నీ రక్తసంబంధికులున్ను నీ సహో
దరులున్ను అయి వున్నారు. । కాబట్టి కర్తయైన దేవుడు 16

ఆనతిచ్చినట్టు నీవు చెప్పవలసినదేమంటే, నేను వా
రిని దూరమున వున్న అన్య జనాంగములలోకి వెళ్లవేసి
నప్పటికిన్ని దేశముల కడకు చెదర గొట్టినప్పటికిన్ని యే
దేశములకు వారు వత్తురో ఆ దేశములలో నేను వారికి
17 చిన్నదైన పవిత్ర స్థలము వలెనే వుందును.। అయినం
దున కర్తయైన దేవుడు ఆనతిచ్చినట్టు నీవు చెప్పవలసిన
దేమంటే, నేను జనాంగములలోనుంచి మిమ్మును కూ
ర్చుకొని, యే యే దేశములకు మీరు చెదరకొట్టబడితి
రో ఆయా దేశములలోనుంచి మిమ్మును కూర్చి రప్పించి,
18 ఇశ్రాయేలు దేశమును మీకు యిత్తును.। కాబట్టి వారు
అక్కడికి వచ్చి అక్కడ వున్న అసహ్యములైన వాటి
నిన్ని యేహ్యములయిన వాటినిన్ని అక్కడనుంచి తీసి
19 వేతురు.। మరిన్ని వారు నా కట్టడల యందు నడిచే
టట్టుగానున్ను నా నిర్ణయములను గైకొనేటట్టుగా
నున్ను నేను వారికి యేక హృదయమును యిచ్చి, వారి
యందు నూతనమైన ఆత్మను వుంతును; నేను వారి శరీ
రములలోనుంచి రాతి గుండెను తీసివేసి, వారికి మాం
20 సపు గుండెను యిత్తును.। మరిన్ని వారు నాకు జనులు
గానున్ను వారికి నేను దేవుడనుగానున్ను వుందును.।
21 అయితే యెవరెవరి హృదయము వారి అసహ్యమైన
వాటినిన్ని యేహ్యమైన వాటినిన్ని వెంటాడునో నేను
వారి మార్గప్రకారము నిర్ణయించి, వారిని శిక్షింతు
నని కర్తయైన దేవుడు ఆనతిచ్చెనని చెప్పుమని సెలవు
22 యిచ్చెను.। అప్పుడు కెరూబులు తమ రెక్కలు యెత్తు
కొనెను; చక్రములున్ను వాటికి తోడై వుండెను; మరి
న్ని ఇశ్రాయేలు దేవునియొక్క ప్రకాశత వాటికి పై
23 గా వుండెను.। అయితే యెహోవా ప్రకాశత పట్ట
ణములోనుంచి మీదికి యెక్కి, పట్టణపు తూర్పున
24 వున్న కొండ పైకి వచ్చి నిలిచెను.। తరువాత ఆత్మ నన్ను
యెత్తుకొని, దైవాత్మ దర్శనమందు కల్దీయుల దేశ
మందు చెరలో వున్న వారి యొద్దికి తీసుకొ వచ్చెను.।
25 అప్పుడు నాకు కనుబడిన దర్శనము నా యొద్దనుంచి
అదృశ్యమాయెను, అప్పుడు నేను యెహోవా నాకు
అగుపర్చినవన్నిటినీ చెరలో వున్న వారికి తెలియ
చెప్పితిని.

## 12. అధ్యాయము.

1 మరిన్ని యెహోవా వాక్యము నా యొద్దికి వచ్చి
2 చెప్పినదేమంటే,। ఓ నర పుత్రుడా, తిరుగుబాటు
చేసిన యింటి వారిలో నీవు నివసించి వున్నావు; చూ
చుటకు వారికి కన్నులు వున్నప్పటికిన్ని చూడక వున్నా
రు; వినుటకు వారికి చెవులు వున్నప్పటికిన్ని వినక వు
న్నారు; యేమంటే వారి యింటివారు యావత్తున్ను తిరు
3 గుబాటు చేసే వున్నారు.। కాబట్టి ఓ నర పుత్రుడా,
నీవు నీ సామగ్రిని మూట కట్టుకొని, పగటి యందు
వారు చూస్తూ వుండగా తర్లిపోవుటకు సిద్ధముగా వుం
డుము; వారు చూస్తూ వుండగా నీవు నీ స్థలమును
విడిచి, మరి యొక స్థలమునకు వెళ్లవలసినది; వారున్ను
వారి యింటివారు యావత్తున్ను తిరుగుబాటు చేసినప్ప
టికిన్ని వారు దీనిని చూచి విచారించుకొందురేమో.।
కాబట్టి నీవు పగటి యందు నీ సామగ్రిని ప్రయా 4
ణపు సామగ్రివలె బైటికి తీసుకొని వచ్చి, అస్తమాన
మందు వారు చూస్తూ వుండగా వేరే స్థలమునకు వెళ్లే
వారి వలె నీవు బయిలు వెళ్ల వలసినది.। వారు చూస్తూ 5
వుండగా గోడకు కన్నము తవ్వి, నీ సామగ్రిని అందు
లోనుంచి యివతలకు తీసుకొరమ్ము.। వారు చూస్తూ వుం 6
డగా రాత్రిలో మూట భుజము పైని వేసుకొని, బైలు
వెళ్లవలెను; భూమి నీకు అగుపడకుండా నీ ముఖమును
కప్పుకోవలసినది; యేమంటే ఇశ్రాయేలు యింటివా
రికి నేను నిన్ను గురుతుగా నిర్ణయిస్తినని ఆనతిచ్చెనని
చెప్పెను.। అప్పుడు నేను నాకు ఆజ్ఞాపించినట్టు చేస్తిని, 7
యేమంటే పగటియందు నేను నా సామగ్రిని వేరే స్థల
మునకు వెళ్లేవాని సామగ్రిలాగున బైటికి తెస్తిని; మరి
న్ని అస్తమానమందు నా చేతులతో గోడకు కన్నము
తవ్వి, సామగ్రిని బైటికి తెస్తిని; రాత్రిలో సామగ్రిని
బైటికి తెచ్చి, వారు చూస్తూ వుండగా మూట భుజము
పైని వేసుకొని బైలు వెళ్లితిని.। అయితే వుదయమందు 8
యెహోవా వాక్యము నా యొద్దికి వచ్చి చెప్పినదేమం
టే,। ఓ నర పుత్రుడా, తిరుగుబాటు చేసిన యింటి 9
వారు, అనగా, ఇశ్రాయేలు యింటివారు నిన్ను చూచి,
నీవు చేసేది యేమిటి అని అడుగుదురు.। అప్పుడు నీవు 10
వారిని చూచి, కర్తయైన దేవుడు ఆనతిచ్చినట్టు చెప్ప
వలసినదేమంటే, యిది యెరూశలేములో వుండిన అధి
పతిని గురించిన్ని దాని యందు వున్న ఇశ్రాయేలు
యింటి వారిని గురించిన్ని అయిన భవిష్యద్భారమై వున్న
దని చెప్పి,। మరిన్ని వారిని చూచి, నేను మీకు గురుతై 11
వున్నాను; నేను చేసినట్టు వారున్ను చేతురు; వారు తమ
స్థలమును విడిచి చెరలోకి వెళ్లుదురు.। మరిన్ని వారిలో 12
వున్న అధిపతి రాత్రిలో తన సామగ్రిని భుజము పైని
వేసుకొని బైలు వెళ్లును; మరిన్ని సామగ్రిని బైటికి
తీసుకొ పోవుటకు గోడకు కన్నము తవ్వుదురు; మరిన్ని
భూమి అతని కన్నులకు అగుపడకుండా అతడు తన ము
ఖమును కప్పుకొనును.। అయితే అతని కొరకు నేను 13
నా వలను వొగ్గి, వానిని చిక్కించుకొని, కల్దీయుల దేశ
మందున్న బాబెలుకు తెప్పింతును; అక్కడ అతడు మ
రణమవును; అయితే ఆ స్థలమును కానక వుండును.।
మరిన్ని దానికి సహాయులై వచ్చిన వారి నందరినిన్ని 14
అతని సమూహములన్నిటినిన్ని నఖముఖాలా చెదర

15 కొట్టి, కత్తి దూసి, వారిని తరుముదును. । కాబట్టి నేను
వారిని సకల జనాంగములలోకి వెళ్లేటట్టు దేశముల
కడకు చెదర గొట్టిన తరువాత నేను యెహోవానైై
16 వున్నానని వారు తెలుసుకొందురు. । అయితే యే అన్య
జనాంగములలోకి వారు వత్తురో వారిలో తమ యే
హ్యాతలను యెరుక చేసేటట్టు నేను వారిలో కొందరిని
కత్తినుంచిన్ని క్షామమునుంచిన్ని తెగులునుంచిన్ని తప్పిం
తును; అప్పుడు నేను యెహోవానై వున్నానని వారు
తెలుసుకొందురని ఆనతిచ్చెనని చెప్పుమన్న సెలవు యి
17 చ్చెను. । మరిన్ని యెహోవా వాక్యము నా యొద్దికి
18 వచ్చి చెప్పినదేమంటే, । ఓ నర పుత్రుడా, వణుకు
తోటి ఆహారమును తిని, తల్లడింపుతోటిన్ని చింతతో
19 టిన్ని నీళ్లు తాగి, । దేశపు జనులను చూచి చెప్పవలసిన
లాగు యెరూశలేము వారిని గురించిన్ని ఇశ్రాయేలు
దేశపు వారిని గురించిన్ని కర్తయైన దేవుడు ఆనతి
చ్చినదేమంటే, వారు ఆహారమును చింతతోటి తిందురు,
నీళ్లు భయభ్రాంతితోటి తాగుదురు; యేమంటే దేశ
ము దానిలో వున్న కాపురస్తులు చేసిన బలవంతము
20 నిమిత్తము పాడయి పోవును. । మరిన్ని కాపురపు పట్ట
ణములు పాడై పోవును; దేశము పాడై పోవును; అప్పు
డు నేను యెహోవానై వున్నానని మీరు తెలుసుకొం
దురని ఆనతిచ్చెనని చెప్పుమన్న సెలవు యిచ్చెను. ।
21 మరిన్ని యెహోవా వాక్యము నా యొద్దికి వచ్చి చెప్పి
22 నదేమంటే, । ఓ నర పుత్రుడా, దినములు దూరమవు
ను, సకల దర్శనములు తప్పును; అనే ఇశ్రాయేలు దేశ
23 మందు మీరు చెప్పుకొనిన సామితె యేమిటి? । కాబట్టి
కర్తయైన యెహోవా ఆనతిచ్చినట్టు నీవు వారితో
చెప్పవలసినదేమంటే, యీ సామితెను నేను లేకుండా
చేసినందున ఆ వుపమానము ఇశ్రాయేలీయులు మానివే
తురు; అందుకు నీవు వారిని చూచి, ఆ దినములున్ను
సకల దర్శనముయొక్క నెరవేర్పున్ను సమీపమాయె
24 నని చెప్పుము. । యేమంటే యిక ఇశ్రాయేలు యింటి
వారిలో వ్యర్థమైన దర్శనమైనా ప్రశ్న చూచి మృ
దువైన మాటలను పలుకుట అయినా లేక వుండును. ।
25 యేమంటే నేను యెహోవానై వున్నాను; నేను చెప్పు
దును; మరిన్ని నేను చెప్పిన వాక్యము ఆలస్యము లేకుం
డా సంభవించును; యేమంటే ఓ తిరుగుబాటు చేసిన
యింటివారలారా, మీ దినములందు నేను వాక్యమును
చెప్పి దాని నెరవేర్తునని ఆనతిచ్చెనని చెప్పుమన్న
26 సెలవు యిచ్చెను. । మరిన్ని యెహోవా వాక్యము
27 నా యొద్దికి వచ్చి చెప్పినదేమంటే, । ఓ నర పుత్రు
డా, యిదుగో ఇశ్రాయేలు యింటివారు వానికి కనబ
డిన దర్శనపు దినములు బహుదూరమనిన్ని అతడు
దూరమైన కాలమును గురించి భవిష్యత్తుగా పలికినా
డనిన్ని చెప్పుకొని వున్నారు. । కాబట్టి నీవు వారితో 28
కర్తయైన దేవుడు ఆనతిచ్చినట్టు చెప్పవలసినదేమంటే,
నా వాక్యములలో యే వొకటైనా ఆలస్యము లేక
వుండును; నేను చెప్పిన వాక్యము తప్పకుండా సంభ
వించునని కర్తయైన దేవుడు ఆనతిచ్చెనని చెప్పుమని
సెలవు యిచ్చెను.

## 13. అధ్యాయము.

మరిన్ని యెహోవా వాక్యము నా యొద్దికి వచ్చి 1
చెప్పినదేమంటే, । ఓ నర పుత్రుడా, భవిష్యత్తుగా 2
పలికిన ఇశ్రాయేలు దీర్ఘదర్శులమీద భవిష్యత్తు
గా పలికి, వారి హృదయములలోనుంచి భవిష్యత్తుగా
పలికిన వారిని చూచి చెప్పవలసిన లాగు, యెహో
వా వాక్యమును వినండి: । కర్తయైన దేవుడు ఆనతి 3
చ్చినదేమంటే, యే దర్శనమునైనా కానక తమ స్వబు
ద్ధిని నమ్మిన అవివేక దీర్ఘదర్శులకు అయ్యో! । ఓ 4
ఇశ్రాయేలు వారలారా, మీ దీర్ఘదర్శులు అడవి
లో వుండే నక్కలతో సమమై వున్నారు. । గోడలో 5
వున్న బీటల మీదికి మీరు రాలేదు; యెహోవా దిన
మున ఇశ్రాయేలు యింటివారు యుద్ధమందు నిలువగ
లందులకు మీరు కంచెను దిట్టపర్చలేదు. । వారు వ్యర్థ 6
మైన దర్శనములను కని, అబద్ధపు ప్రశ్నలను చూచి,
యెహోవా తమ్మును పంపకపోయినప్పటికిన్ని యె
హోవా యీలాగున ఆనతిచ్చెనని చెప్పి, తాము
చెప్పిన వాక్యము రూఢమవునని అన్యులను నమ్మించిరి. ।
నావల్ల వాక్యము రానప్పుడు యెహోవా ఆనతిచ్చె 7
నని మీరు చెప్పితే అది వ్యర్థమైన దర్శనమున్ను
అబద్ధపు ప్రశ్న చూచుటయున్ను కాదా! । కాబట్టి 8
కర్తయైన దేవుడు ఆనతిచ్చేదేమంటే, మీరు వ్యర్థ
మైన మాటలను పలికి, అబద్ధపు దర్శనములను కంటిరి
గనుక నేను మీకు విరోధినై వున్నాను. । వ్యర్థమైన 9
దర్శనములను కని, అబద్ధముగా ప్రశ్న చూచిన
దీర్ఘదర్శులకు నా హస్తము విరోధమైనదై వుండును;
వారు నా జనుల సంఘములోకి రాక వుందురు; ఇశ్రా
యేలు యింటివారి లిఖితమందు వారి పేళ్లు లిఖించబ
డక వుండును; మరిన్ని వారు ఇశ్రాయేలు దేశములోకి
ప్రవేశించలేక వుందురు; అయినందున నేను కర్త
యైన దేవుడనై వున్నానని మీరు తెలుసుకొందురు. ।
యేమంటే నెమ్మది యెంత మాత్రమూ లేనప్పటికిన్ని 10
వారు నెమ్మదిని పొందుదురని చెప్పి, నా జనులను మోస
పుచ్చిరి; మరిన్ని వొకడు మంటి గోడను కట్టిన వెనుక
యింకా కొందరు వచ్చి దాని మీద అంటని సున్నపు
అడుసును పూతురు. । కాబట్టి అంటని సున్నపు అడు 11
సును పూసిన వారిని చూచి, అది పడిపోవునని చెప్ప

వలసినది; యేమంటే ప్రళయపు వర్షము కురుసును;
ఓ గొప్ప వడగండ్లారా, మీరున్ను పడుదురు; తుఫా
12 ను దానిని బద్దలు చేసును. । కాబట్టి ఆ గోడ పడిపో
యిన తరువాత వారు మిమ్మును చూచి, మీరు పూసిన
13 పూత యెక్కడని అడగరా? । యిందుకు కర్తయైన
దేవుడు ఆనతిచ్చేదేమంటే, నేను రౌద్రమును తెచ్చు
కొని, తుఫానుచేత దానిని బద్దలు చేతును; నాకు కో
పము వచ్చినప్పుడు ప్రళయపు వర్షము కురుసును;
నాకు రౌద్రము వచ్చినప్పుడు గొప్ప వడగండ్లు రాలి
14 దానిని లయము చేసును. । యీలాగున నేను అంటని
సున్నపు అడుసుచేత మీరు పూసిన గోడను దాని
పునాది అగుపడేటట్టుగా నేలతో సమము చేతును;
అది యీలాగున పడిపోయినప్పుడు దానిలోనున్న మీ
రున్ను క్షయమవుదురు; అప్పుడు నేను యెహోవానై
15 వున్నానని మీరు తెలుసుకొందురు. । యీలాగున నేను
ఆ గోడమీదనున్ను దాని మీద అంటని సున్నపు
అడుసును పూసిన వారి మీదనున్ను నా కోపమును
తీర్చుకొనిన తరువాత మిమ్మును చూచి, గోడయున్ను
దానికి పూత బెట్టిన వారున్ను కూడా పోయిరని అం
16 దును. । వీరు యెరూశలేము కొరకు నెమ్మది లేక పోయి
నప్పటికిన్ని నెమ్మది గల దర్శనములను కని, దానిని
గురించి భవిష్యత్తుగా పలికిన ఇశ్రాయేలు దీర్ఘద
ర్శులై వున్నారని కర్తయైన దేవుడు ఆనతిచ్చెను. ।
17 మరిన్ని ఓ నర పుత్రుడా, వారి హృదయములలో
నుంచి భవిష్యత్తుగా పలికిన నీ జనుల కుమార్తెల
మీద నీ ముఖమును కఠినపరచుకొని, వారి మీద భవి
ష్యత్తుగా పలికి, కర్తయైన దేవుడు ఆనతిచ్చినట్టు
18 చెప్పవలసినది యేమంటే, । చంకల కింద మెత్తాలను
కుట్టి, మనుష్యుల ప్రాణములను వేటాడుటకు లేచిన
సకల స్త్రీల ముఖములకు ముసుకులను వేసే ఓ స్త్రీలా
రా, మీకు అయ్యో! నా జనుల ప్రాణములను వేటాడి,
19 మీ జీవములను రక్షించుకొందురా? । దోసెడు యవల
కొరకున్ను రొట్టె ముక్కల కొరకున్ను నా జనులలో
నన్ను దూషించి, మరణమునకు అపాత్రులైన వారిని
పంపించేటట్టుగానున్ను బ్రతుకుటకు అపాత్రులైన వా
రిని బ్రతికించేటట్టుగానున్ను నా జనులలో అబద్ధ
మును నమ్మేవారితో అబద్ధపు మాటలు చెప్ప వచ్చు
20 నా? । అయినందున కర్తయైన దేవుడు ఆనతిచ్చేదేమం
టే, యే మెత్తాలచేత మీరు మనుష్యులను పువ్వుల
తోటలలోకి వలలతోటి అయినట్టు యీడ్చితిరో ఆ
మెత్తాలకు నేను విరోధినై, మీ చంకల కిందనుంచి
వాటిని చింపివేసి, పువ్వుల తోటలలోకి మీరు యీ
21 డ్చిన మనుష్యులను తప్పింతును. । మరిన్ని మీ ముసుకు
లను చింపి, మీ చేతులలోనుంచి నా జనులను విడి
పింతును; కాబట్టి వేటకు వారు యిక మీ వశముకాక
వుందురు; అయినందున నేను యెహోవానై వున్నా
నని మీరు తెలుసుకొందురు. । యేమంటే మీ అబద్ధ 22
ములచేత మీరు నావల్ల చింతపడని నీతిపరుల హృద
యమును చింతపడచేసి, దుర్మార్గుడు బ్రతికేటట్టు
గా అతని దుర్మార్గతను విడువకుండా అతనిని దృఢ
పర్చితిరి. । కాబట్టి యిక మీరు వ్యర్థమైన దర్శన 23
ములను కనేదిన్ని ప్రశ్న చూచేదిన్ని లేక వుందును;
నేను యెహోవానై వున్నానని మీరు తెలుసుకో
నేటట్టుగా నా జనులను మీ చేతిలోనుంచి విడిపింతు
నని ఆనతిచ్చెనని చెప్పుమన్న సెలవు యిచ్చెను.

## 14. అధ్యాయము.

అప్పుడు ఇశ్రాయేలు పెద్దలలో కొందరు నా 1
యొద్దికి వచ్చి, నా ముందర కూర్చొని వుండిరి. । కా 2
బట్టి యెహోవా వాక్యము నా యొద్దికి వచ్చి చెప్పిన
దేమంటే, । ఓ నర పుత్రుడా, యీ మనుష్యులు 3
వారి హృదయములలో ప్రతిమలను నిలుపుకొని, వారి
ముఖముల ముందర వారి దోషమనే అభ్యంతరమును
పెట్టుకొని యున్నారు; వీరు నాయొద్ద ఆలోచన అడగ
వచ్చునా? । కాబట్టి నీవు వారిని చూచి, కర్తయైన 4
దేవుడు ఆనతిచ్చినట్టు చెప్పవలసినది యేమంటే, ఇశ్రా
యేలు యింటివారిలో యెవడైనా తన హృదయమందు
ప్రతిమలను నిలుపుకొని, తన ముఖము ముందర తన
దోషమనే అభ్యంతరమును పెట్టుకొని, దీర్ఘదర్శి
యొద్దికి వస్తే, ఇశ్రాయేలు యింటివారిని వారి హృదయ
ముచేత చిక్కించుకొనేటట్టుగా యెహోవానైన నేను
వచ్చిన వానికి కలిగిన విస్తారమైన ప్రతిమల చొప్పున
ప్రత్యుత్తరమిత్తును. । యేమంటే వారందరున్ను వారి 5
ప్రతిమలవల్ల నాకు అన్యులై వున్నారు. । కాబట్టి 6
ఇశ్రాయేలు యింటివారితో కర్తయైన దేవుడు ఆన
తిచ్చినట్టు చెప్పవలసినదేమంటే, మీరు పశ్చాత్తాపము
ను పొంది, మీ ప్రతిమలనుంచి తిరిగి, మీ యేహ్యత
లన్నిటినుంచీ ముఖమును తిప్పుకొండి. । యేమంటే 7
ఇశ్రాయేలు యింటివారిలోనున్న ఇశ్రాయేలు దేశ
మందు నివసించిన పరదేశులలోనున్ను యెవడైనా నన్ను
విడిచిపెట్టి, తన హృదయమందు ప్రతిమలను నిలువు
కొని, తన దోషమనే అభ్యంతరమును తన ముఖము
ముందర పెట్టుకొని, నన్ను గూర్చిన ఆలోచన అడు
గుటకు దీర్ఘదర్శి యొద్దికి వస్తే, యెహోవానైన
నేనే అతనికి ప్రత్యుత్తరమిత్తును. । యేమంటే ఆ మను 8
ష్యుని మీద నేను నా ముఖమును కఠినపరచి, వానిని
గురుతుగానున్ను సామితెగానున్ను చేసి, నేను యె
హోవానై వున్నానని మీరు తెలుసుకొనేటట్టుగా

9 నా జనులలోనుంచి అతని తెగవేతును. । మరిన్ని యే
దీర్ఘదర్శియైనా మోసపోయి, యీ మాట చెప్పితే
యెహోవానైన నేను ఆ దీర్ఘదర్శిని మరిన్ని మో
సపుత్తును; నా హస్తము అతని మీద చాపి, నా జను
10 లలోనుంచి అతనిని నాశనము చేతును. । యీలాగున
వారు తమ దోషమును అనుభవింతురు; యేమంటే
ఇశ్రాయేలు యింటివారు యిక నా యొద్దనుంచి తప్పి
పోకుండానున్ను వారు తప్పితములచేత యిక అపవి
త్రులు కాకుండానున్ను వారు నాకు జనులున్ను నేను
11 వారికి దేవుడనున్ను అయ్యేటట్టుగానున్ను, । దీర్ఘ
దర్శి అన్న వానికి శిక్ష యెంతో అంత శిక్ష వానిని
అడిగిన వానికి అవునని ఆనతిచ్చెనని చెప్పుమని సెలవు
12 యిచ్చెను. । అయితే యెహోవా వాక్యము నా యొ
13 ద్దికి తిరిగీ వచ్చి చెప్పినదేమంటే, । ఓ నర పుత్రుడా,
దేశము నా విషయమై బహుగా అతిక్రమించి, పాప
ము చేసినందున, నేను దాని మీద నా హస్తమును
చాపి, రొట్టెయొక్క ఆధారమును విడిచి పెట్టి, దాని
మీదికి క్షామమును పంపి, దానిలో వున్న మనుష్య
14 నున్ను మృగమునున్ను తెగవేసినప్పుడు,। నోవహున్ను
దానియేలున్ను యోబున్ననే యీ ముగ్గురున్ను దాని
యందు వున్నప్పటికిన్ని వారు తమ నీతి చేత తమ
ప్రాణమును మాత్రమే తప్పించుకొందురని కర్తయైన
15 దేవుడు ఆనతిచ్చెను. । నేను దేశములోకి దుష్ట మృగ
ములను చొరబడ జేసినప్పుడు అవి దానిని పాడుచేసి,
ఆ మృగములు అక్కడ వున్నందున యెవడైనా దాని
16 లో లేకుండా దేశము వట్టిదై వుండును. । ఆ ముగ్గు
రున్ను దాని యందు వున్నప్పటికిన్ని నా జీవముతోడు
వారు పురుషులనైనా స్త్రీలనైనా విడిపించేది లేదు;
వారు మాత్రమే రక్షించబడుదురు గాని దేశము పాడై
17 పోవునని కర్తయైన దేవుడు ఆనతిచ్చెను. । మరిన్ని
నేను ఆ దేశము మీదికి కత్తిని రప్పించి, దానియం
దుండే మనుష్యునున్ను మృగమునున్ను తెగవేసుటకు,
ఓ ఖడ్గమా, నీవు ఆ దేశము అంతటా సంచరించు
18 మని దానితో చెప్పినప్పుడు, । ఆ ముగ్గురున్ను దానిలో
వున్నప్పటికిన్ని నా జీవముతోడు వారు కుమారులనై
నా కుమార్తెలనైనా విడిపించేది లేదు; వారు మా
త్రమే విడువబడుదురని కర్తయైన దేవుడు ఆనతిచ్చెను.।
19 మరిన్ని దేశములోకి నేను తెగులును పంపి, దానిలో
వున్న మనుష్యునున్ను మృగమునున్ను తెగవేసేటట్టు
నా రౌద్రమును రక్తము వచ్చేమట్టుకు కుమ్మరించినప్పు
20 డు, । నోవహున్ను దానియేలున్ను యోబున్ననే యీ
ముగ్గురున్ను దాని యందు వున్నప్పటికిన్ని నేను నా
జీవముతోడు వారు కుమారులనైనా కుమార్తెలనైనా
విడిపించలేకపోదురు; వారు తమ నీతిచేత తమ ప్రా
ణములను మాత్రమే తప్పించుకొందురని కర్తయైన
దేవుడు ఆనతిచ్చెను. । అయితే యిందుకు కర్తయైన 21
దేవుడు మరిన్ని ఆనతిచ్చేదేమంటే, నేను ఖడ్గమున్ను
క్షామమున్ను దుష్ట మృగమున్ను తెగులున్ను అనే నా
నాలుగు ఘోరమైన ఆజ్ఞలను యెరూశలేము మీదికి
దానిలో వున్న మనుష్యునున్ను మృగమునున్ను తెగ
వేసేటందుకు పంపినప్పుడు యెంత అధికమైన చేటుగా
వుండునని సెలవు యిచ్చెను. । అయితే యిదుగో దాని 22
యందు కొంత శేషము వుండును, అనగా, కొందరు
కుమారులున్ను కుమార్తెలున్ను బైటికి వత్తురు; యిదు
గో వారు బైలువెళ్లి మీ యొద్దికి వత్తురు; అప్పుడు
మీరు వారి మార్గములనున్ను చేష్టలనున్ను చూచి,
యెరూశలేము మీదికి నేను రప్పించిన కీడంతటిని గురిం
చిన్ని దానికి నేను సంభవింప చేసినదంతటిని గురించి
న్ని ఓదార్పును పొందుదురు. । నిజముగా వారి మా 23
ర్గములనున్ను చేష్టలనున్ను మీరు చూచినప్పుడు నేను
చేసినదంతటిని నిర్హేతువుగా చేయలేదని మీరు తెలుసు
కొని, ఓదార్పును పొందుదురని కర్తయైన దేవుడు
ఆనతిచ్చెనని చెప్పెను.

## 15. అధ్యాయము.

మరిన్ని యెహోవా వాక్యము నా యొద్దికి వచ్చి 1
చెప్పినదేమంటే, । ఓ నర పుత్రుడా, ద్రాక్షచెట్టు 2
తతిమ్మా చెట్ల కంటే యేమి విశేషము అయినది? అడ
విలో వున్న చెట్ల కంటే కొమ్మ యేమి విశేషము అయి
నది? । దానిలోనుంచి యే పని కొరకైనా కర్రను తీసు 3
కొందురా? యే వస్తువునైనా తగిలించుటకు దానివల్లను
మేకును చేతురా? । యిదుగో అది అగ్నికి ఆహారము 4
వును; అగ్ని దాని రెండు కొనలున్ను మధ్య భాగము
యీవత్తున్ను దహించును; అది మరి యే పనికైనా తగు
నా? । యిదుగో అది బాగా వున్నప్పుడే పనికి రాక 5
పోతే అగ్ని దాని రాజుకొని దహించిన తరువాత మరి
యేలాగు పనికి వచ్చును? । అయితే యిందుకు కర్త 6
యైన యెహోవా ఆనతిచ్చేదేమంటే, అడవి చెట్లలో
ద్రాక్ష చెట్టును నేను అగ్నికి ఆహారముగా యిచ్చి
నట్టు యెరూశలేము కాపురస్థులను యిత్తును.। యేమం 7
టే నేను నా ముఖమును వారి మీద కఠిన పరుతును;
ఒక అగ్నిలోనుంచి వారు తప్పించుకొంటే వేరొక
అగ్ని వారిని దహించును; యీలాగున నేను నా ము
ఖమును వారి మీద కఠినపరచినప్పుడు నేను యెహో
వానై వున్నానని మీరు తెలుసుకొందురు. । వారు నా 8
విషయమై బహుగా అతిక్రమించిరి గనుక దేశమును
నేను పాడు చేతునని కర్తయైన దేవుడు ఆనతిచ్చె
నని చెప్పెను.

## 16. అధ్యాయము.

1 మరిన్ని యెహోవా వాక్యము నా యొద్దికి వచ్చి
2 చెప్పినదేమంటే, । ఓ నర పుత్రుడా, యెరూశలేము
తో దాని యేహ్యతలను తెలియ చేసుటకు నీవు చెప్ప
3 వలసిన లాగు, । కర్తయైన దేవుడు యెరూశలేమును
గురించి ఆనతిచ్చేదేమంటే, నీ యుత్పత్తిన్ని నీ జనన
మున్ను కెనయను దేశపు సంబంధమైనది; నీ తండ్రి
4 ఎమోరీయుడు; నీ తల్లి హిత్తీయురాలు. । నీ జననమును
గురించి అయితేనో నీవు పుట్టిన నాడు నీ నాభి సూ
త్రము కోయబడలేదు; నేను చూచే దినమున నీవు
నీళ్లచేత కడగబడ లేదు; నీకు వుప్పు రాయ లేదు; బట్ట
5 కట్టలేదు. । వీటిలో యే వొకటైనా నీకు చేసి, నిన్ను
కనికరించుటకు నేత్రము వొకటైనా లేదు; నీ యందు
జాలిపడుటకు యెవరూ లేరు; అయితే నీవు పుట్టిన
నాడే బైట భూమిలో వేయబడి, చూడనసహ్యముగా
6 వుంటివి. । అయితే నీ వైపు నేను వచ్చి, రక్తములో
పొర్లుతూ వున్న నిన్ను చూచి, రక్తములో మునిగి
వున్న నీతో బ్రతుకుమని చెప్పితిని; నిజముగా రక్తము
లో మునిగి వున్న నిన్ను చూచి బ్రతుకుమని చెప్పి
7 తిని. । మరిన్ని బయిట భూమిలో వున్న చిగురులాగున
నిన్ను వృద్ధిపరచితిని; నీవు యెదిగి, పెద్దదానవై, ఆభ
రణ భూషితురాలవైతివి; నీ స్తనములకు రూపు కలిగి
నది; ఆదిని నీవు దిగంబరవుగానున్ను నిర్వసనవుగా
నున్ను వున్నప్పటికిన్ని యిప్పుడు నీ వెంట్రుకలు పెరి
8 గినవి. । అయితే నేను నీ వైపు వచ్చి, నిన్ను చూచితిని,
యిదుగో, అది నీకు ప్రేమ కాలమై వుండెను; నా
చెంగును నీ మీద పరచి, నీ దిగంబరత్వమును వుడిపి
తిని; మరిన్ని నేను నీకు ప్రమాణమునిచ్చి, నీతో వొ
డంబడికెను చేసినందున నీవు నా దానవైతివని కర్త
9 యైన దేవుడు ఆనతిచ్చెను. । తరువాత నేను నీళ్లచేత
నిన్ను కడిగి, నీ మీద వున్న రక్తమంతా తుడిచి, నీకు
10 తైలలేపనము చేసితిని. । మరిన్ని చిత్రపు చీర నీవు
ధరించేటట్టు చేసి, తేహాషనే మృగముయొక్క చర్మపు
పాదరక్షలను తొడిగించి, సన్నపు నారయొక్క కటి
సూత్రమును కట్టించి, పట్టు బట్ట నీకు కప్పితిని. ।
11 మరిన్ని ఆభరణములచేత నిన్ను అలంకరింప చేసి, నీ
చేతులకు కడియములను వేసి, నీ మెడకు గొలుసును
12 కట్టి, । నీ శిరస్సు మీద కిరీటమునున్ను నీ చెవులకు
పోగులనున్ను నీ లలాటమునకు చేర్చుక్క బొట్టు
13 నున్ను వుంచితిని. । యీలాగు నీవు బంగారము చేత
నున్ను వెండి చేతనున్ను అలంకరించబడితివి; నీ వస్త్ర
ములు సన్నపు నారయొక్కయున్ను పట్టుయొక్కయు
న్ను విచిత్రపు పనివై వుండెను; మరిన్ని సన్నపు పిం
డిన్ని తేనెయున్ను తైలమున్ను నీకు ఆహారమై వుం
డెను; మరిన్ని నీవు మిక్కిలీ సౌందర్యవతివై రాణి
వయ్యే మట్టుకు విజయమును పొందితివి. । నీ సౌంద 14
ర్యము నిమిత్తము నీ కీర్తి అన్య జనాంగములలో
ప్రబలెను, యేమంటే నీ మీద పెట్టిన నా సౌందర్య
ముచేత అది పరిపూర్తిగా వుండెను అని కర్తయైన
దేవుడు ఆనతిచ్చెను. । అయితే నీ సౌందర్యము యందు 15
నీవు నమ్మకము వుంచి, నీకు కీర్తి వచ్చినందున నీవు
వేశ్యవై, నీ వైపు వచ్చిన ప్రతివారితోనున్ను నీవు
వ్యభిచరిస్తివి; అది అతనిదై వుండెను. । మరిన్ని నీ వస్త్ర 16
ములలో నీవు కొన్నిటిని తీసి, నానా విధమైన రంగు
లతో నీ వున్నతమైన స్థలములను అలంకరించుకొని,
వాటి యందు వేశ్యాత్వము జరిగిస్తివి; అలాటిది యిక
యెన్నటికయినా వుండబోదు. । మరిన్ని నేను నీకు 17
శృంగారార్థమై యిచ్చిన బంగారపువిన్ని వెండివి
నైనన నగలను తీసి, నీవు మనుష్యాకారముగల ప్రతి
మలను చేసుకొని వాటితో వ్యభిచరిస్తివి. । మరిన్ని నీ 18
చిత్ర వస్త్రములను తీసి, వాటిని కప్పి, నా తైలమును
న్ను నా ధూపమునున్ను వాటి ముందర బెట్టితివి. ।
తినుటకు నేను యిచ్చిన సన్నపు పిండిన్ని తైలము 19
నున్ను తేనెనున్ను తీసి, వాటి ముందర పరిమళముతోటి
పెట్టి, యీలాగున నీవు చేస్తివని కర్తయైన దేవుడు
ఆనతిచ్చెను. । మరిన్ని నాకు నీవు కనిన కుమారులనున్న 20
కుమార్తెలనున్ను వాటికి దహనబలిగా అర్పిస్తివి. ।
నీ జారత్వము కొద్ది అయినందుచేతనా యింకా నా 21
పిల్లలను వాటి పేరట అగ్నిలోనుంచి గడుపుటకు అప్ప
గించి పంపితివి? । మరిన్ని యేహ్యతలనున్ను జారత్వ 22
ములనున్ను యింతగా చేస్తూ, నీ బాల్య కాలమందు
నీవు దిగంబరవైయున్ని నిర్వసనవైయున్ని నీవు నీ రక్తము
లో పొర్లుతూ వున్న కాలమును తలంచుకోక వుం
టివి. । నీకు అయ్యయ్యో! అని కర్తయైన దేవుడు ఆన 23
తిచ్చెను; యేమంటే యింత చెడ్డతనమును చేసిన తరు
వాత, । నీవు వేశ్యా మందిరమును కట్టుకొంటివి; ప్రతి 24
వీధి యందూ వున్నతమైన స్థలమును కట్టుకొంటివి. ।
ప్రతి దారి మొగలోనున్ను నీవు వున్నతమయిన స్థల 25
మును కట్టుకొని, నీ సౌందర్యమును యేహ్యమయిన
దిగా చేసుకొని, నీ తట్టు వచ్చిన వారందరికిన్ని నీ
కాళ్లను తెరచి, వారితో బహుగా వ్యభిచరిస్తివి. ।
మరిన్ని బహుగా మదించిన నీ పొరుగువారయిన 26
మిస్రీయులతోటిన్ని నీవు వ్యభిచరించి, నాకు కో
పము పుట్టించేటట్టు నీ జారత్వక్రియలను విస్తరింప
చేస్తివి. । కాబట్టి యిదుగో నీ పయిని నేను నా హస్త 27
మును చాపి, నీ జీవనోపాధిని తక్కువ చేసి, ఫెలిష్తీ
యుల కుమార్తెలు అనగా నీ కామ వికార చేష్టలకు

సిగ్గుపడి నిన్ను పగచేసిన వారి మనస్సుకు నిన్ను అప్ప
28 గించితిని. । నీ కాముకత్వమునకు మితిలేదు గనుక
అష్షూరు వారితోటిన్ని వ్యభిచరిస్తివి; వారితో కూడా
జారత్వ క్రియలను చేసినప్పటికిన్ని నీ యిచ్ఛ తీర
29 లేదు. । మరిన్ని కెనయను దేశము మొదలుకొని కల్దీయ
దేశము మట్టుకు నీవు బహుగా వ్యభిచరించినప్పటికిన్ని
30 నీ యిచ్ఛ తీరలేదు. । పోకిరియైన వేశ్య లాగున నీవున్ను
చేసినందువల్ల నీ హృదయము యెంతగా క్షీణించెను. ।
31 అయితే ప్రతి దారి మొగలోను నీవు వేశ్యా మందిర
మునున్ను ప్రతి వీధియందూ వున్నతమైన స్థలమునున్ను
కట్టుకొన్నప్పటికిన్ని నీవు సొమ్ముకు ఆశించే వేశ్యవు
32 కావు. । యేమంటే పెనిమిటికి మారుగా అన్యులను
33 చేర్చుకొన్న వ్యభిచారిణివైన భార్యవైతివి. । వారు
వేశ్యలందరికిన్ని సొమ్మును యిత్తురు, అయితే నీవు నీ
స్నేహితులందరికిన్ని సొమ్ము యెదురు యిత్తువు; నీతో
వ్యభిచరించుటకు నీవు వారికి సొమ్ము యెదురు యిచ్చి,
34 నఖముఖాలనుంచి పిలుతువు. । మరిన్ని నీ జారత్వముల
కున్ను అన్య స్త్రీల జారత్వములకున్ను భేదమేమంటే,
వ్యభిచరించుటకు యెవడైనా నీ వెంట తిరుగుట లేదు,
మరిన్ని నీకు సొమ్ము యిచ్చేది లేదు; నీవే సొమ్ము యి
త్తువు; కాబట్టి నీకున్ను వారికిన్ని భేదము వున్నది. ।
35 అయినందున ఓ వేశ్యా, యెహోవా వాక్యమును
36 వినుము. । కర్తయైన దేవుడు ఆనతిచ్చేదేమంటే, నీ
మలినము నీవు కుమ్మరించినందునన్ను నీ విటకాండ్ల
తోటిన్ని యేహ్యమైన నీ ప్రతిమలతోటిన్ని నీవు వ్యభి
చరించుటవల్లనున్ను వారికి నీవు చెల్లించిన నీ పిల్లల
37 రక్తముచేతనున్ను నీ సిగ్గు బైలుపడినందునన్ను, । యి
దుగో యెవరితోటి నీవు సంభోగించితివో, అనగా, నీ
విటకాండ్లనున్ను నీవు మోహించిన వారందరినిన్ని నీవు
పగచేసిన వారందరినిన్ని నేను నీ చుట్టూ కూర్చి, వారు
నీ మానమంతా చూచేటట్టు నీ సిగ్గు వారికి బయిలు
38 పరుతును. । మరిన్ని పెండ్లి బంధకములను తెంపుకొని,
రక్తము చిందించిన స్త్రీలకు విధించే న్యాయము చొ
ప్పున నీకున్ను నేను విధించి, రౌద్రమునున్ను అహం
కారమునున్ను తెచ్చుకొని, నిన్ను రక్తమును తాగిం
39 తును. । యేమంటే వారి చేతికి నేను నిన్ను అప్పగించి
నందున వారు నీ వేశ్యా మందిరమును పడదోసి, నీ
వున్నతమైన స్థలములను వూడదీసి, నీ బట్టలను తీసి, నీ
శృంగారార్థమైన ఆభరణములను పుచ్చుకొని, నిన్ను
40 దిగంబరగానున్ను నిర్వసనగానున్ను చేతురు. । మరిన్ని
వారు నీ మీదికి సమూహముతోటి వచ్చి, నిన్ను రాళ్ల
తో కొట్టి, తమ కత్తులచేత నిన్ను దూసి పోచేతురు. ।
41 మరిన్ని వారు నీ యిండ్లను అగ్నిచేత కాల్చి, అనేక
స్త్రీల యెదుట నీ మీద ఆజ్ఞలను విధింతురు; యీలా
గున నేను నీ వేశ్యాత్వమును మాన్పించినందున యిక
నీవు సొమ్మును యెదురు యివ్వక వుందువు. । యీలా 42
గున నేను నీ మీద వున్న నా రౌద్రమును చల్లార్చు
కొందును; నా అహంకారము నిన్ను విడిచిపోవును;
నేను శాంతము తెచ్చుకొని యిక కోపపడక వుందును. ।
నీ బాల్యదినములను తలంచుకోక, యిన్ని విధములచేత 43
నన్ను విసికించినందున, యిదుగో నీ దుర్మార్గతలను
నీ మీద మోపి, నిన్ను శిక్షింతును; యేమంటే నీ యే
హ్యతలతోటి నీవు యింత దుష్టత్వమును చేయకూడదు. ।
యిదుగో సామితెలను చెప్పే వారందరున్ను నిన్ను 44
గురించి తల్లి యెటువంటిదో కుమార్తె అటువంటిదే
అన్న సామితె చెప్పుదురు. । పెనిమిటి యందున్ను 45
పిల్లల యందున్ను సహించక వున్న నీ తల్లి కుమార్తెవు;
నీవు పెనిమిట్ల యందున్ను పిల్లల యందున్ను సహిం
చక వున్న నీ సహజలకు నీవు సహజవు; నీ తల్లి హిత్తీ
యురాలు; నీ తండ్రి ఏమోరీయుడు. । నీ యెడమ పా 46
ర్శ్వమున నివసించిన షోమ్రోను నీ అప్ప అయి, తన
కుమార్తెలతోటి వుండెను; నీ కుడి పార్శ్వమున నివ
సించిన సొదొమ నీ చెల్లెలై తన కుమార్తెలతోటి
వుండెను. । అయితే వారి మార్గముల ప్రకారము నడు 47
చుటయున్ను వారి యేహ్యతల ప్రకారము చేసుట
యున్ను స్వల్ప కార్యమని తోచినట్టు నీవు యింకా
నీ మర్యాదలచేత మరిన్ని అధికమైన దుర్మార్గతను
చేస్తివి. । నా జీవముతోడు నీవున్ను నీ కుమార్తెలు 48
న్ను చేసిన ప్రకారము నీ చెల్లెలైన సొదొమయున్ను
దాని కుమార్తెలున్ను చేయ లేదని కర్తయైన దేవుడు
ఆనతిచ్చెను. । యిదుగో నీ చెల్లెలైన సొదొమయొక్క 49
దోషమునకు హేతువు యేమంటే, గర్వమున్ను చాలా
ఆహారమున్ను మిక్కిలీ సోమరితనమున్ను; యివి దానికి
కలిగినందున ఆలాగున చేసి బీదకున్ను దరిద్రునకున్ను
సహాయము చేయక వుండెను. । యీలాగున వారు అతి 50
శయించి, నా ముందర అసహ్యమయిన వాటిని చేసి
నందున అది నేను చూచి వారిని పరిహరిస్తిని. । మరిన్ని 51
షోమ్రోనైనా నీ పాపములలో సగమున్ను చేయ లేదు;
వాటికంటే విస్తారమైన అసహ్యతలను నీవు చేస్తివి;
కాబట్టి అసహ్యతలను యింతగా చేసినందున నీ సహ
జలను నీతి పరురాండ్లగా అగుపర్చితివి. । అయినం 52
దున నీ సహజల పక్షమందు న్యాయము తీర్చిన నీవు
నీ పాపముల గూర్చిన సిగ్గు పొందుదువు; వారి
కంటే నీవు అసహ్యతలను విస్తారముగా చేస్తివి; నీ
కంటే వారు నీతిపరురాండ్లయి వుందురు; నీ సహజలను
నీవు నీతిపరురాండ్లగా అగుపర్చినందున నీవున్ను బిడి
యపడి సిగ్గు పొందుదువు గాక. । నేను చెరలో వున్న 53
సొదొమనున్ను దాని కుమార్తెలనున్ను చెరలో వున్న

షోమ్రోనున్ను దాని కుమార్తెలనున్ను తిరిగీ యె
ప్పుడు రప్పింతునో అప్పుడు వారితో కూడా చెర
54 లో వున్న నీ వారినిన్ని తిరిగీ రప్పింతును. । యీలా
గున వారిని వోదార్చేదానవైన నీవు చేసినదంతటి
55 నిమిత్తము బిడియపడి, నీకు తగిన సిగ్గును భరింతువు. । నీ
సహజలనే సొదొమయున్ను షోమ్రోనున్ను దాని
కుమార్తెలతో కూడా వారి పూర్వ స్థితికి తిరిగీ వచ్చి
నప్పుడు నీవున్ను నీ కుమార్తెలున్ను మీ పూర్వ
56 స్థితికి తిరిగీ వత్తురు. । యేమంటే నీ చుట్టూ వున్న పెలి
ష్తీయుల కుమార్తెలు నిన్ను నిర్లక్ష్యపెట్టినప్పుడు
న్ను, నీ చుట్టూ వున్న అరాము వారి కుమార్తెలు నిన్ను
అవమానించినప్పుడున్ను నీ దోషము బైలుపడెను; ।
57 బైలుపడక మునుపు నీవు అతిశయముగా వున్న కాల
మందు నీ చెల్లెలయిన సొదొమ పేరునయినా నీవు తల
58 చవైతివి. । కాబట్టి నీ కామ వికారమైన నీ దోషము
నున్ను నీ యేహ్యతల దోషమునున్ను నీవు భరించవలసి
59 నదని యెహోవా ఆనతిచ్చెను. । యిందుకు కర్తయైన
దేవుడు మరిన్ని ఆనతిచ్చేదేమంటే, ప్రమాణమును విచ్ఛి
త్తుచేసి, సత్యమును నిర్లక్ష్యపెట్టిన నీవు చేసినట్టు
60 నేను నీకు ప్రతిగా చేతును. । అయినప్పటికిన్ని నీ బాల్య
దినములందు నేను నీతో చేసుకొనిన ప్రమాణమును
తలంచుకొని, నీతోటి నిత్యమైన ప్రమాణమును చేసు
61 కొని స్థిరపర్తును. । అయితే నీ అప్పలున్ను నీ చెల్లెం
డ్లున్ను నీ యొద్దికి వచ్చినప్పుడు నీవు నీ మార్గము
లను తలంచుకొని బిడియపడుదువు; యేమంటే నేను
వారిని నీకు కుమార్తెలగా యిత్తును; అయితే ఆ యి
చ్చుట నీవు చేసుకొనిన ప్రమాణము చొప్పున కాదు. ।
62 యేమంటే అది అంతా నీవు చేసినప్పటికిన్ని నేను నీ
యెడల శాంతపడుదును; అప్పుడు నీవు తలంచుకొని,
బిడియపడి, లజ్జచేత యిక నీ నోరు తెరవకుండా
వుండుటకు నేను నీ తోటి ప్రమాణమును చేసుకొని
63 స్థిరపర్తును: । అప్పుడు నేను యెహోవానై వున్నాన
న్నట్టు నీవు తెలుసుకొందువని కర్తయైన దేవుడు ఆన
తిచ్చెనని చెప్పుమన్న సెలవు యిచ్చెను.

## 17 అధ్యాయము.

1 మరిన్ని యెహోవా వాక్యము నా యొద్దికి వచ్చి
2 చెప్పినదేమంటే, । వో నర పుత్రుడా, నీవు ఇశ్రా
యేలు యింటివారిని చూచి, వారితో వుపమానముగా
3 పొడుపుడు కథ చెప్పవలసినది. । దాని కర్తయైన
దేవుడు ఆనతిచ్చినట్టు చెప్పవలెను, యేమంటే, గొప్ప
గద్ద వొకటి కలదు; దానికి మిక్కిలీ పొడుగైన పెద్ద
రెక్కలున్ను నానా విధమైన రంగులుగల విస్తారమైన
4 వెంట్రుకలున్ను కలవు; । యీ గద్ద లెబానోను పర్వ
తముకు వచ్చి, ఆజ్జచెట్టు కొమ్మను తెంపి, దాని చిగు
ళ్లను తెంపి, దానిని వర్తకము కలిగిన దేశములోకి
తీసుకొని వెళ్లి, వర్తకుల పురమందు వుంచెను. । మరిన్ని 5
అది దేశమందున్న విత్తనములలో వొక విత్తును తీసుకొ
వచ్చి, విస్తారపు వుదకములు గల భూమి యందు మహా
జాగ్రతగా నాటెను. । కాబట్టి అది పెరిగి, మిక్కిలీ 6
పొడవుగా పెరగక విశాలముగా కొమ్మలతో అల్లుకొని,
గొప్ప ద్రాక్ష చెట్టు ఆయెను; ఆ చెట్టు వేళ్లు దాని కింద
వున్నవి గనుక ఆ చెట్టు తన కొమ్మలను తన తట్టు తిప్పు
కొనెను; యీలాగున ఆ ద్రాక్ష చెట్టు శాఖోపశాఖ
లతో వృద్ధి పొంది చిగిర్చెను. । అయితే మరి వొక పెద్ద 7
గద్ద కలదు; దానికిన్ని పెద్ద రెక్కలున్ను విస్తారమైన
వెంట్రుకలున్ను కలవు; అప్పుడు యిదుగో ఆ ద్రాక్ష
చెట్టు తాను నాటుకొనిన భూమి కాలువలోనుంచి
తనకు నీళ్లు పోయుటకు యీ గద్ద తట్టు తన వేళ్లను
తిప్పి తన శాఖలను విడిచెను. । అది శాఖలను విస్తిరింప 8
చేసి, బహుగా ఫలించే మంచి ద్రాక్ష చెట్టు కాగలం
దులకు విస్తారమైన వుదకములు గల మంచి భూమియందు
నాటబడెను, అని చెప్పి, । యింకా కర్తయైన దేవుడు ఆన 9
తిచ్చినట్టు చెప్పవలసినది యేమంటే, అది వృద్ధిపొందు
నా! అది యెండిపోయేటట్టు అతడు వచ్చి, దాని వేళ్లను
దుంపనాశనము చేసి, దాని గెలలను తెగవేయడా! నిజ
ముగా అదిన్ని దాని ఆకులున్ను యెండిపోవును; గొప్ప
బలమున్ను సమూహమున్ను లేకుండానే అతడు దానిని
దుంపనాశనము చేసును. । యిదుగో అది నాటినప్పటి 10
కిన్ని వృద్ధి పొందునా! తూర్పు గాలి దాని మీద విస
రినప్పుడు అది బొత్తిగా యెండిపోదా! నిజముగా అది
పెరిగిన భూమి యందు యెండిపోవునని ఆనతిచ్చెనని
చెప్పుమన్న సెలవు యిచ్చెను. । మరిన్ని యెహోవా 11
వాక్యము నా యొద్దికి వచ్చి చెప్పినదేమంటే, । నీవు 12
తిరుగుబాటు చేసిన ఆ యింటివారిని చూచి, చెప్పవల
సినలాగు, యీ వుపమానమునకు అర్థము మీకు తెలి
యదా! యిదుగో బాబెలు రాజు యెరూశలేముకు
వచ్చి, దాని రాజునున్ను దాని అధిపతులనున్ను పట్టు
కొని, బాబెలు పురముకు తీసుకొని పోయెను. । మరిన్ని 13
అతడు రాజ సంతతిలో వొకనితో ప్రమాణమును చేసి,
వాని చేత బాస చేయించెను; మరిన్ని అతడు చేసిన
ప్రమాణము చొప్పున అతడు చేస్తేనే గాని రాజ్యము
నిలువక వుండును. । యేమంటే రాజ్యము క్షీణించి లేవ 14
శక్తిలేక పోయేటట్టు అతడు దేశముయొక్క బలిష్టు
లను తీసుకొని పోయెను. । అయితే అతడు మిస్రయీము 15
దేశములోకి వారు తనకు గుర్రములనున్ను గొప్ప
సమూహమునున్ను యివ్వవలెనని అడుగుటకు రాయభా
రులను పంపి, అతనిమీద తిరుగుబాటు చేసెను; అతనికి

జయమవునా? యీలాటి క్రియలు చేసినవాడు తప్పిం
చుకొనునా? ప్రమాణము తప్పిన వానికి విడుదల కలు
16 గునా? । నా జీవముతోడు, యెవని విషయమై అతడు
సత్యమును నిర్లక్ష్యపెట్టెనో యెవని విషయమై
అతడు ప్రమాణమును విచ్ఛిత్తిచేసెనో అతడు అనగా
వీనిని రాజుగా నిర్ణయించిన రాజు నివాసము చేసిన
స్థలమందు వీడు మరణమవును; నిజముగా బాబెలు పుర
మందు అతని యొద్ద వీడు మరణమవునని కర్తయైన
17 యెహోవా ఆనతిచ్చెను. । ఫరో యెంత బలముతోటి
న్ని యెంత సమూహముతోటిన్ని వచ్చినా అనేక జను
లను తెగవేసేటట్టు యెన్ని దిబ్బలను వేసినా యెన్ని బురు
జులను కట్టినా యుద్ధమందు అతనికి సహాయము యెంత
18 మాత్రము లేక పోవును. । యేమంటే అతడు తన చెయ్యి
యిచ్చి ప్రమాణము చేసిన తరువాత దానిని విచ్ఛిత్తి
చేసి, ప్రమాణమును నిర్లక్ష్యపెట్టెను; యీలాటి కా
19 ర్యములను చేసిన వాడు తప్పించుకొలేక పోవును. । యిం
దుకు కర్తయైన దేవుడు ఆనతిచ్చేదేమంటే, అతడు
నా విషయమై చేసిన ప్రమాణమునున్ను వొడంబడికె
నున్ను నిర్లక్ష్యపెట్టి విచ్ఛిత్తి చేసెను గనుక నా జీవ
ముతోడు ఆ దోషమును అతని నెత్తి మీద మోపి అతని
20 శిక్షింతును. । యేమంటే అతని కొరకు నా వలలను వొగ్గి,
అతని చిక్కించుకొని, బాబెలు పురముకు తెప్పించి,
అక్కడ నా విషయమై అతడు చేసిన అక్రమమును
21 గురించి అతనితో వ్యాజ్యమాడుదును. । మరిన్ని పారి
పోయే వాని వారందరున్ను వాని జన సమూహములం
దరున్ను కత్తిచేత కూలుదురు; శేషించిన వారందరున్ను
నాలుగు తట్లా చెదిరిపోదురు; యీ మాట చెప్పిన
నేనే యెహోవానై వున్నానని మీకు తెలియబడు
22 నని కర్తయైన యెహోవా ఆనతిచ్చెను. । అయితే
కర్తయైన యెహోవా మరిన్ని చెప్పేదేమంటే, పొ
డుగైన ఆర్జచెట్టు మీది కొమ్మను నేను తీసి, దానిని
నాటుదును; మీద వున్న దాని శాఖలలో లేత దానిని
త్రుంచి, మహోన్నతమైన పర్వతము మీద దానిని
23 నాటుదును. । ఇశ్రాయేలుయొక్క వున్నతమైన పర్వత
మందు నేను దానిని నాటినందున అది శాఖలను విడిచి,
బహుగా ఫలించే మంచి ఆర్జచెట్టయి వుండును; సకల
24 పక్షి జాతులున్ను దాని యందు నివసించును. । దాని
కొమ్మల నీడను అవి నివసించును; మరిన్ని యెహోవా
నైన నేను ఘనమైన చెట్టును నీచమైనదిగా చేసి, నీచ
మైన చెట్టును ఘనమైనదిగా చేస్తిననిన్ని, పచ్చని చెట్టు
ను యెండిపోచేసి, యెండిపోయిన చెట్టును పుష్పించే
టట్టు చేస్తిననిన్ని, భూమి యందుండే సకలమైన చెట్ల
కూ తెలియబడును; యెహోవానైన నేను యీ మాట
చెప్పిన వాడనై దానిని నెరవేర్తునని ఆనతిచ్చెనన్నట్టు
చెప్పుమన్న సెలవు యిచ్చెను.

## 18. అధ్యాయము.

మరిన్ని యెహోవా వాక్యము నా యొద్దికి వచ్చి 1
చెప్పినదేమంటే, । తండ్రులు ద్రాక్ష కాయలను తిని 2
నందుచేత పిల్లల పండ్లు పులిసెనన్న సామితె ఇశ్రాయే
లీయులైన మీరు పలికెదరేమి! । యిందుకు కర్తయైన 3
యెహోవా ఆనతిచ్చేదేమంటే, నా జీవముతోడు,
యీ సామితెను యిక పలుకుటకు హేతువు ఇశ్రా
యేలీయులకు లేకపోవును. । యివిగో సమస్తమైన ఆత్మ 4
లు నావి; తండ్రి ఆత్మ నాదైనట్టు కుమారుని ఆత్మయున్ను
నాది; పాపము చేసే ఆత్మ యేదో అది మరణము పొం
దును. । యిందుకు యెవడైనా నీతిపరుడై, నీతి న్యాయ 5
ములను చేస్తూ, । పర్వతముల మీద భుజించకనున్ను, 6
ఇశ్రాయేలీయులకు కలిగిన దైవములను తాను దృష్టించ
కనున్ను, తన పొరుగువాని భార్యను చెరుపకనున్ను,
రజస్వలైన దానితో వెళ్లకనున్ను, । యెవనినైనా బాధ 7
పెట్టకనున్ను వుండి, కుదువపెట్టినవాని కుదువను అత
నికి యిచ్చి, బలవంతముచేత యెవనినైనా మోసపు
చ్చక, ఆకలిగల వానికి ఆహారమిచ్చి, దిగంబరికి కప్పు
కొనుటకు బట్ట యిచ్చి, । అన్యాయపు వడ్డి కొరకు అప్పు 8
యివ్వక, లాభమును విస్తరించి పుచ్చుకోక, అన్యా
యముపట్ల తన చెయ్యి ముడుచుకొని, ఉభయులకు
న్ను సరిగా న్యాయము తీర్చి, । యథార్థపరుడై 9
నా కట్టడల యందు నడుస్తూ, నా ఆజ్ఞలను భద్రముగా
గైకొంటూ వున్నట్టయితే, నిజముగా ఆ నీతిపరుడు
బ్రతుకునని కర్తయైన దేవుడు ఆనతిచ్చెను. । అయితే 10
ఆ నీతిపరునికి వొక కుమారుడు పుట్టును; యితడు
కన్నము తవ్వుటయున్ను, రక్తము చిందచేయుటయు
న్ను, మొదలైన చేయరాని క్రియలలో యే వొకటైనా
చేసి, । చేయవలసినటువంటి మంచి క్రియలలో యే 11
వొకటైనా చేయక, పర్వతముల మీద భుజించి, తన
పొరుగువాని భార్యను చెరిపి, । బీదనున్ను దరిద్రునున్ను 12
బాధపెట్టి, బలవంతముచేత మోసపుచ్చి, కుదువను తిరిగీ
యివ్వక, విగ్రహముల పయిని కనుదృష్టి వుంచి, అస
హ్యతలను చేసి, । వడ్డి కొరకు అప్పు యిచ్చి, అధిక 13
మైన లాభము పుచ్చుకొన్న వాడైతే బ్రతుకునా? అత
డు బ్రతకడు; అతడు యిన్ని అసహ్యతలను చేసెను
గనుక అవశ్యముగా అతడు మరణమవును; అతని రక్త
ము అతని మీదనే వుండును. । మరిన్ని అతనికి కుమా 14
రుడు పుట్టును; ఆ కుమారుడు తన తండ్రి చేసిన పాప
ములన్నిటిని చూచి, తలంచుకొని, ఆలాటి క్రియలను
చేయకనున్ను, । పర్వతముల మీద భుజించకనున్ను, 15

ఇశ్రాయేలు యింటి వారికి కలిగిన విగ్రహములను
దృష్టించకనున్ను, తన పొరుగువాని భార్యను చెరుప
16 కనున్ను,। యెవనినైనా బాధ పెట్టకనున్ను; కుదువను
వుంచుకోకనున్ను, బలవంతముచేత మోసపుచ్చకనున్ను,
ఆకలి గల వానికి ఆహారమును యిచ్చి, దిగంబరికి కప్పు
17 కొనుటకు బట్ట యిచ్చి,। బీదవాని మీద తన చెయ్యి
అన్యాయముగా వేయక, అన్యాయపు వడ్డినైనా అధి
కమైన లాభమునైనా పుచ్చుకోక, యీలాగు నా
ఆజ్ఞలను భద్రముగా గైకొంటూ, నా కట్టడలయందు
నడిచినట్టయితే, అతడు తన తండ్రి దోషము నిమిత్తము
18 మరణము పొందక అవశ్యముగా బ్రతుకును.। అయితే
అతని తండ్రి క్రూరుడై, బాధపెట్టి, బలవంతముచేత తన
సహోదరుని మోసపుచ్చి, తన జనులలో దుష్ట క్రియ
లను చేసును గనుక యిదుగో అతడే తన దోషము నిమిత్త
19 ము మరణము పొందును.। యీలాగైనప్పటికిన్ని మీరు
కుమారుడు తన తండ్రి దోషమును భరిస్తూ వున్నాడే,
అని చెప్పుకుంటూ వున్నారు; కుమారుడు నీతి న్యా
యములను జరిగించి, నా కట్టలనన్నిటినీ భద్రముగా
20 గైకొంటే, అవశ్యముగా అతడు బ్రతుకును.। పాపము
చేసే ఆత్మ యేదో అది మరణమవును. తండ్రి దోషము
ను కుమారుడైనా కుమారుని దోషమును తండ్రి అయి
నా భరించడు; నీతిపరుని నీతి ఆ నీతిపరుని మీదనే
వుండును; దుష్టుని దుష్టత్వము ఆ దుష్టుని మీదనే వుం
21 డును.। అయితే దుష్టుడు తాను చేసిన పాపములనన్ని
టినిన్నీ విడిచి, నా కట్టడలనన్నిటినిన్ని గైకొని, నీతి
న్యాయములను జరిగిస్తే, అతడు మరణము పొందడు;
22 అవశ్యముగా అతడు బ్రతుకును.। అతడు చేసిన తప్పి
తములన్నీ అతని విషయమై జ్ఞాపకమునకు రాక పో
23 వును; అతడు చేసిన నీతివల్ల అతడు బ్రతుకును.। దుష్టుని
మరణమువల్ల నాకు యెంత మాత్రమైనా సంతోషము
కలుగునా! అతడు తన మార్గములను విడిచి బ్రతి
కితే, నాకు చాలా సంతోషము గాదా! అని కర్త
24 యైన యెహోవా ఆనతిచ్చెను.। మరిన్ని నీతిపరుడు
తన నీతిని విడిచి, అన్యాయము చేసి, దుష్టుడు చేసే అస
హ్యతలన్నిటి ప్రకారము చేస్తే అతడు బ్రతుకునా?
పూర్వము అతడు చేసిన నీతి అంతా జ్ఞాపకమునకు రా
కపోవును; అతడు జరిగించిన అక్రమమువల్లనున్ను అత
డు చేసిన పాపమువల్లనున్ను అతడు మరణము పొం
25 దును.। అయినప్పటికిన్ని మీరు యెహోవా మార్గ
ము తిన్ననిది కాదని చెప్పితిరి; అయితే ఓ ఇశ్రా
యేలు యింటివారలారా, వినండి, నా మార్గమే తిన్న
26 నిది గాని మీ మార్గములు తిన్ననివి అవునా!। నీతి
పరుడు తన నీతిని విడిచి, అన్యాయమును చేస్తే, అతడు
చేసిన అన్యాయమువల్ల అతడు మరణము పొందును.।
మరిన్ని దుష్టుడు తాను చేసే దుష్టత్వమును విడిచి, నీతి 27
న్యాయములను జరిగిస్తే, అతని నీతి చేత అతని ఆత్మ
బ్రతుకును.। యేమంటే అతడు విచారించి తాను చేసిన 28
తప్పితములన్నిటినిన్ని విడుచును గనుక అతడు మరణ
ము పొందక అవశ్యముగా బ్రతుకును.। అయినప్పటి 29
కిన్ని ఇశ్రాయేలు యింటివారు యెహోవా మార్గ
ము తిన్ననిది కాదని చెప్పుకొని వున్నారు; ఓ ఇశ్రా
యేలు యింటివారలారా, నా మార్గములే తిన్ననివి
గాని మీ మార్గములు తిన్ననివౌనా!। కాబట్టి ఓ 30
ఇశ్రాయేలు యింటివారలారా, మీలో ప్రతి వాని
కిన్ని తన తన మార్గముల చొప్పున న్యాయము తీర్తు
నని కర్తయైన యెహోవా ఆనతిచ్చెను; మీరు పశ్చా
త్తాపమును పొంది, మీ అక్రమపు మార్గములను
విడువండి, అప్పుడు మీరు చేసిన అన్యాయమువల్ల
మీకు నష్టము రాక వుండును.। మీరు జరిగించిన అక్ర 31
మములనన్నిటినిన్ని విడిచి, నూతనమైన హృదయము
నున్ను నూతనమైన ఆత్మనున్ను మీరు పొందుదురు గాక;
ఓ ఇశ్రాయేలు ఇంటివారలారా, మీరు మరణము
పొందనేల!। యెవడైనా మరణము పొందితే అతని మర 32
ణమువల్ల నాకు సంతోషము రాదు; కాబట్టి మీకు
మీరే తిరిగి, బ్రతుకండని, కర్తయైన యెహోవా
ఆన తిచ్చెను.

## 19. అధ్యాయము.

మరిన్ని నీవు ఇశ్రాయేలు అధిపతులను గురించి 1
దుఃఖపు పాటను యెత్తి చెప్పవలసిన లాగు,। నీ తల్లి 2
అడవి సింహమై, సింహములలో పడుకొనెను; అది
పిల్లలను కని, వాటిని కొదమ సింహములతో పెంచెను.।
వాటిలో వొకటి పెరిగి, కొదమ సింహమై, వేట నేర్చు 3
కొని, మనుష్యులను సహా మింగెను.। అయితే జనాం 4
గములు దాని సంగతి విని, మాటు వొగ్గి, దానిని చిక్కిం
చుకొని, సంకెళ్లను వేసి, మిస్రయీము దేశమునకు
తీసుకొ వచ్చిరి.। అప్పుడు తల్లి కనిపెట్టి, వేసారి, తన 5
నిరీక్షణ తప్పినదని చూచి, తన పిల్లలలో మరి వొక
దానిని యెంచి, కొదమ సింహమయ్యేటట్టు పెంచెను.।
యిదిన్ని కొదమ సింహమై, కొదమ సింహములతో 6
తిరుగులాడి, వేట నేర్చుకొని, మనుష్యులను సహా
మింగెను.। అది వారి పాడైన నగరులను కనిపెట్టి, వారి 7
పట్టణములను పాడు చేసెను; అది చేసిన నాదమువల్ల
దేశమున్ను దానిలో వున్న సమస్తమున్ను పాడాయె
ను.। అయితే నఖముఖాలా దేశపు జనులందరున్ను 8
దాని కొరకు పొంచి, మాట్లు వొగ్గినందున, అది వారి
గోతిలో చిక్కెను.। అప్పుడు వారు సంకెళ్లచేత దాని 9
జాగ్రతగా బంధించి, బాబెలు రాజు యొద్దికి తీసుకొ

పోయి, అప్పగించిరి; అప్పుడు దాని నాదము ఇశ్రా
యేలు పర్వతము మీద యెన్నటికీ వినబడకుండా వారు
10 దానిని గట్టి స్థలమందు వుంచిరి. । మరిన్ని కొమ్మలతో
టిన్ని గెలలతోటిన్ని పరిపూర్ణమైనటువంటిన్ని విస్తా
రపు వుదకముల దగ్గిర నాటబడినటువంటిన్ని ద్రాక్ష
11 చెట్టు వలె నీ తల్లి రక్తపుష్టితో వుండెను. । మరిన్ని
భూపతుల దండముల కొరకు దాని యందు జంటలు
కలిగి వుండెను; ప్రతి జంటా చిక్కని కొమ్మలలో
చాలా పొడుగై వుండెను; అది తన విస్తారమైన కొమ్మ
12 లతోటి బహు ఘనముగా అగుపడెను. । అయినప్పటి
కిన్ని దానిని బహు రౌద్రముచేత పీకివేసి, నేల మీద
పడవేసిరి; తూర్పు గాలి విసరి, దాని పండ్లను యెం
డిపో చేసెను; మరిన్ని దాని గట్టి జంటలు తెగి, వాడి
13 పోయి అగ్నిచేత దహించబడెను. । యిప్పుడు అది అర
14 ణ్యమందున్న నిర్జల స్థలములలో నాటబడెను. । మరి
న్ని దాని కొమ్మల జంటలలో వొక జంటలోనుంచి
అగ్ని బైలువెళ్లి, దాని పండ్లను దహించెను; కాబట్టి
రాజదండము కొరకు గట్టి జంట వొకటైనా లేదు;
యిది దుఃఖకరమైన పాట అయి, దుఃఖకరమైన పాట
కొరకు వుండునని చెప్పుమని సెలవు యిచ్చెను.

## 20. అధ్యాయము.

1 అయితే యేడో సంవత్సరము అయిదో నెల పదో
దినమున ఇశ్రాయేలు పెద్దలలో కొందరు యెహో
వా సన్నిధిని ఆలోచన అడుగుటకు నా యొద్దికి వచ్చి,
2 నా ముందర కూర్చుండి వుండిరి. । అప్పుడు యెహో
వా వాక్యము నా యొద్దికి వచ్చి చెప్పినదేమంటే, ।
3 వో నర పుత్రుడా, నీవు ఇశ్రాయేలు పెద్దలను చూచి,
కర్తయైన యెహోవా ఆనతిచ్చినట్టు వారితో చెప్ప
వలసినదేమంటే, మీరు నా సన్నిధిని ఆలోచన అడు
గుటకు వస్తిరా? నా జీవముతోడు, మీవంటి వారికి
నేను ఆలోచన చెప్పేవాడను కానని ఆనతిచ్చెనని
4 చెప్పుము. । వో నర పుత్రుడా, అటువంటి వారి నిమి
త్తము నీవు వేడుదువా? వేడుదువా? వారి పితృల యే
5 హ్యాతలను వారికి తెలియ చెప్పి, వారిని చూచి, । కర్త
యైన యెహోవా ఆనతిచ్చినట్టు చెప్పవలసినది యే
మంటే, ఇశ్రాయేలీయులను నేను యేర్పరచి, యా
కోబు యింటి సంతతికి నా హస్తమును యెత్తి, మిస్ర
యీము దేశమందు నన్ను వారికి తెలియ చేసిన నాడు
న్ను నా హస్తమును వారికి యెత్తి నేను మీ దేవుడనైన
యెహోవానైవున్నానని చెప్పిన సమయమందున్ను, ।
6 వారిని మిస్రయీము దేశములోనుంచి విడిపించి, వారి
కొరకు నేను చూచిన దేశములు, అనగా, సకల దేశ
ములకు ఘనము కొరకై పాలనున్ను తేనెనున్ను ప్రవ
హింప చేసే దేశములోకి రప్పించేటట్టు నా హస్తమును
వారికి యెత్తిన నాడున్ను, । నేను వారిని చూచి, నేను 7
మీ దేవుడనైన యెహోవానై వున్నాను, గనుక,
మీలో ప్రతి మనుష్యుడూ తన కంటికి అందమైన
యేహ్యాతలను విడిచి, మిస్రయీము విగ్రహములచేత
మిమ్మును మీరు అపవిత్రపరచుకోబడ కూడదని చెప్పి
తిని. । అయినప్పటికిన్ని వారు నా విషయమై తిరుగు 8
బాటు చేసి, నా మాటలను ఆలకించక, అందరున్ను
తమ కంటికి అందమైన యేహ్యాతలను విడువక, మిస్ర
యీము విగ్రహములను విడువక వుండిరి; అప్పుడు నేను
అనుకొనినదేమంటే, నా రౌద్రమును నేను వారి మీద
కుమ్మరించి, మిస్రయీము దేశములో నా కోపమును
వారి మీద తీర్చుకొందునని అనుకొన్నప్పటికిన్ని, ।
యెవరిలో వారు వుండిరో ఆ యన్య జనాంగముల 9
కండ్లకు నా నామము అపవిత్రమని తోచక వుండేట
ట్టుగా నేను చేయక వుంటిని; యేమంటే వారు చూస్తూ
వుండగా నేను మిస్రయీము దేశములోనుంచి మిమ్ము
ను విడిపింతునని వారితో చెప్పి, మీకు తెలియచేసి
వుంటిని. । కాబట్టి నేను వారిని మిస్రయీము దేశము 10
లోనుంచి విడిపించి, అరణ్యములోకి తీసుకొ వస్తిని. ।
అక్కడ నేను వారికి నా కట్టడలను అప్పగించి, నా 11
ఆజ్ఞలనున్ను వారికి చూపించితిని; వీటి ప్రకారము యె
వడైనా చేస్తే అతడు వాటిచేత బ్రతుకును. । మరిన్ని 12
నాకున్ను వారికిన్ని గురుతులయ్యేటట్టుగానున్ను వారిని
పరిశుద్ధ పరచుటకు యేర్పరచినవాడనైన యెహో
వానై వున్నానని వారికి తెలిసేటట్టుగానున్ను నా
సబ్బాతులను వారికి నిర్ణయిస్తిని. । అయితే ఇశ్రా 13
యేలు యింటివారు అరణ్యమందు నా మీద తిరుగు
బాటు చేసి, నా కట్టడలయందు నడువక, నా ఆజ్ఞల
యందు నిర్లక్ష్య పెట్టిరి; అయితే వాటి ప్రకారము
యెవడైనా చేస్తే వాడు వాటిచేత బ్రతుకును; మరిన్ని
నా సబ్బాతు నిబంధనలను వారు బహుగా అపవిత్ర
పరిచిరి; అప్పుడు నేను అరణ్యమందు నా రౌద్రాగ్నిని
వారి మీద కుమ్మరించి, దహించెదనని అనుకొంటిని. ।
అయితే యెవరు చూస్తూ వుండగా నేను వారిని యివ 14
తలకు తెప్పిస్తినో ఆ యన్య జనాంగముల కండ్లకు
నా నామము నిర్లక్ష్యమని తోచక వుండేటట్టు నేను
చేయక వుంటిని. । మరిన్ని వారు నా ఆజ్ఞల యందు 15
నిర్లక్ష్యపెట్టి, నా కట్టడల యందు నడువక, నా
సబ్బాతు నిబంధనలను అపవిత్రపరచుట మాత్రమే
కాకుండా వారి హృదయము వారి విగ్రహములను
వెంటాడెను, గనుక, । అరణ్యమందు వారికి నా హస్త 16
మును యెత్తి, వారిని చూచి, సకల దేశములలోనున్ను
ఘనము కొరకై పాలనున్ను తేనెనున్ను ప్రవహింప చేసి,

నేను మీకు యిచ్చిన దేశములోకి మిమ్మును రానియ్య
17 నని చెప్పితిని. । అయినప్పటికిన్ని వారి యందు కనిక
రించి, వారిని నాశనము చేయక వుంటిని; యీలాగున
అరణ్యమందు నేను వారిని సర్వనాశనము చేయకుండా
18 వుంటిని. । అయితే అరణ్యమందు నేను వారి పిల్లలను
చూచి, మీరు మీ తండ్రుల కట్టడల యందు నడువక,
వారి ఆజ్ఞలను గైకొనక, వారి దేవుండ్లచేత మిమ్మును
19 మీరు అపవిత్రపరుచుకోబడక వుండండి. । నేను మీ
దేవుడనైన యెహోవానై వున్నాను, గనుక, నా కట్ట
డల యందు నడిచి, నా ఆజ్ఞలను గైకొని, వాటిని
20 చేసి, । నా సబ్బాతులను పరిశుద్ధముగా ఆచరింతురు
గాక; యేమంటే యెహోవానైన నేను మీ దేవుడనై
వున్నానని మీకు తెలిసేటట్టు నా సబ్బాతులు నాకు
న్ను మీకున్ను మధ్యను గురుతులై వుండునని చెప్పిన
21 ప్పటికిన్ని, । వారి పిల్లలు కూడా నా మీద తిరుగుబా
టు చేసి, నా కట్టడల యందు నడువకనున్ను, నా ఆజ్ఞ
లను గైకొని చేయకనున్ను వుండిరి; అయితే వాటి
ప్రకారము యెవడైనా చేస్తే వాటిచేత అతడు బ్రతు
కును; మరిన్ని నా సబ్బాతు నిబంధనలను అపవిత్రప
రిచిరి; అప్పుడు నేను నా రౌద్రాగ్నిని వారి మీద
కుమ్మరించి, అరణ్యమందు నా కోపమును వారి మీద
22 తీర్చుకొందునని అనుకొంటిని. । అయినప్పటికిన్ని నేను
నా హస్తమును వెనుకకు తీసుకొని, యెవరు చూస్తూ
వుండగా నేను వారిని యివతలకు రప్పించితినో ఆ
యన్య జనాంగముల కండ్లకు నా నామము నిర్లక్ష్య
23 మని తోచక వుండేటట్టు నేను చేయక వుంటిని. । మరి
న్ని వారు నా ఆజ్ఞల ప్రకారము చేయక, నా కట్టడ
లను నిర్లక్ష్యపెట్టి, నా సబ్బాతు నిబంధనలను అప
విత్రపరిచినందుచేతనున్ను, వారి దృష్టి వారి తండ్రుల
24 విగ్రహముల తట్టు పారినందుచేతనున్ను, । అరణ్యమం
దు వారికి నా హస్తమును యెత్తి, మిమ్మును అన్య జనాం
గములలోకి చెదరగొట్టి, సకల దేశముల కడకు వెళ్లచే
25 తునని వారితో చెప్పితిని. । మరిన్ని వారికి అనుకూల
ము గాని నిబంధనలనున్ను వారిని బ్రతుకనియ్యని
26 ఆజ్ఞలనున్ను నిర్ణయిస్తిని. । మరిన్ని వారు గర్భమునుంచి
పుట్టిన వారందరినిన్ని అగ్నిలోనుంచి గడవచేసినందున
నేను యెహోవానై వున్నానని వారికి తెలిసే మట్టు
కూ వారిని నేను పాడుచేసి, వారి కానుకల యందు
27 వారిని అపవిత్రపరిచితిని. । కాబట్టి, ఓ నర పుత్రు
డా, నీవు ఇశ్రాయేలు యింటివారిని చూచి, కర్త
యైన యెహోవా ఆనతిచ్చినట్టు చెప్పవలసినది యే
మంటే, మీ పితృలు యీలాగున నా విషయమై అక్ర
28 మముచేసి, నన్ను నిర్లక్ష్యపెట్టి, । నేను వారికి ప్రమా
ణము చేసి యిచ్చిన దేశములోకి వారిని తెప్పించిన
తరువాత, వారు వున్నతమైన ప్రతి కొండనున్ను దర్ప
మైన ప్రతి వృక్షమునున్ను చూచి, వారు బలులను
చెల్లించి, నాకు కోపము పుట్టించేటటువంటి అర్పణ
లను అర్పించిరి; మరిన్ని అక్కడ పరిమళ ధూపమును
యిచ్చి, పానార్పణలను కుమ్మరించిరి. । అప్పుడు నేను 29
వారిని చూచి, మీరు వెళ్లిన వున్నత స్థలము యేమిటని
అడిగితిని? అయినందున ఆ స్థలముకు బామా అన్న
పేరు నేటి వరకూ కలిగి వున్నది. । అయినందున ఇశ్రా 30
యేలు యింటివారిని చూచి, కర్తయైన యెహోవా
ఆనతిచ్చినట్టు చెప్పవలసినది యేమంటే, మీ పితృల
మర్యాదలచేత మీరున్ను అపవిత్రులైతిరా! వారి యే
హ్యతల ప్రకారము మీరు వ్యభిచారులైతిరా! । యేమం 31
టే నేటివరకు సహా మీరు కానుకలను చెల్లించి, మీ
కుమారులను అగ్నిలోనుంచి గడవచేసి, మీ విగ్రహ
ములతోటి మిమ్మును మీరు అపవిత్రులగా చేసుకొం
టిరి; యీలాగున వుండగా ఓ ఇశ్రాయేలు యింటి
వారలారా, మీచేత నేను ఆలోచించబడుదునా? నా
జీవముతోడు నేను మీచేత ఆలోచించబడక వుందు
నని కర్తయైన యెహోవా ఆనతిచ్చెను. । మేము అన్య 32
జనాంగముల లాగునున్ను దేశములలో నుండే కుటుం
బముల లాగునున్ను శిలా దారు విగ్రహములకు సేవ
చేతుమని మీరు చెప్పుకొనే వుంటిరి; అయినప్పటి
కిన్ని మీరు తలంచుకొనిన ప్రకారము యెన్నటికీ
కాదు. । యిందుకు కర్తయైన యెహోవా ఆనతిచ్చేదే 33
మంటే, నా జీవముతోడు, బలమైన బాహువుతోను
న్ను చాపిన హస్తముతోనున్ను కుమ్మరించే రౌద్రము
తోనున్ను మీ పైని అధికారము చేతును. । అప్పుడు 34
జనులలోనుంచి మిమ్మును బైలుపరిచి, మీరు చెదిరిపో
యిన దేశములలోనుంచి బలమైన బాహువుతోనున్ను
చాపిన హస్తముతోనున్ను కుమ్మరించే రౌద్రముతోను
న్ను మిమ్మును కూర్తును. । మరిన్ని జనులయొక్క అర 35
ణ్యములోకి మిమ్మును రప్పించి, అక్కడ ముఖాముఖి
గా తారసిల్లి, మీ తోటి వ్యాజ్యము జరిగింతును. ।
మిస్రయీము దేశపు అరణ్యమందు నేను మీ పితృ 36
లతో యేలాగు వ్యాజ్యము జరిగించితినో ఆలాగునే
మీతోటిన్ని వ్యాజ్యము జరిగింతును. । హస్త దండము 37
కిందినుంచి మిమ్మును గడవచేసి, ప్రమాణపు బంధకము
లోకి మిమ్మును రప్పింతును. । మరిన్ని మీలో వున్న 38
వ్యతిరిక్తులనున్ను నా విషయమై అక్రమము చేసిన వా
రినిన్ని బైలు వెళ్లగొట్టుదును; వారు సంచరించే దేశము
లోనుంచి వారిని అవతలకు వెళ్లజేసిన వెనుక వారు
ఇశ్రాయేలు దేశములోకి ప్రవేశించలేక వుందురు; అయి
నందున నేను యెహోవానై వున్నానని మీరు తెలు
సుకొందురు. । అయితే ఓ ఇశ్రాయేలు యింటివార 39

లారా, మిమ్మును గురించి కర్తయైన యెహోవా ఆన
తిచ్చేదేమంటే, మీ మార్గమున మీరు వెళ్లి, మీ విగ్ర
హములకు సేవ చేయండి; యిటు మీదట నా మాట
లను ఆలకించని వారైతే మీ కానుకలచేతనున్ను మీ
విగ్రహములచేతనున్ను నా పరిశుద్ధమైన నామమును
40 యిక అపవిత్రపరచకండని ఆనతిచ్చెను. । యిందుకు
కర్తయైన యెహోవా మరిన్ని ఆనతిచ్చేదేమంటే,
ఇశ్రాయేలుయొక్క వున్నతమైన కొండ, అనగా, నా
పరిశుద్ధమైన కొండలో దేశమందున్న ఇశ్రాయేలు యిం
టివారందరున్ను నాకు సేవచేతురు; అక్కడ నేను
వారిని అంగీకరింతును; అక్కడ నేను అర్పణలనున్ను
అంగీకరించవలసిన తొలి ఫలములనున్ను మీరు కట్టిన
41 వన్నిటినిన్ని మిమ్మును అడుగుదును. । జనులలోనుంచి
మిమ్మును బైలుపరచి, మీరు చెదిరిపోయిన దేశముల
లోనుంచి మిమ్మును కూర్చిన తరువాత, మీరు యిచ్చిన
పరిమళ ధూపముతోటి మిమ్మును అంగీకరింతును; మరి
న్ని అన్య జనాంగముల ముందర నేను మీ విషయమై
42 పరిశుద్ధమైన వాడనుగా అగుపడుదును. । మరిన్ని నేను
మీ పితృలకు ప్రమాణ పూర్వకముగా యిచ్చిన దేశము,
అనగా, ఇశ్రాయేలు దేశములోకి తిరిగీ మిమ్మును రప్పిం
చినప్పుడు, నేను యెహోవానై వున్నానని మీరు
43 తెలుసుకొందురు. । అప్పుడు మీరు యే మార్గముల
యందు నడిచి, యే చేష్టలను చేసి, అపవిత్రులైతిరో,
వాటినన్నిటినీ తలంచుకొని, మీరు చేసిన కీడంతటివల్ల
44 మీ కన్నులకు మీరే అసహ్యులవుదురు. । మరిన్ని వో
ఇశ్రాయేలు యింటివారలారా, మీ దుర్మార్గముల
ప్రకారమున్ను కాని చేష్టల ప్రకారమున్ను కాదు
గాని నా నామము నిమిత్తము నేను యిది మీకు చేసిన
తరువాత నేను యెహోవానై వున్నానని మీరు తెలు
సుకొందురని కర్తయైన యెహోవా ఆనతిచ్చెనని
45 చెప్పుమని సెలవు యిచ్చెను. । మరిన్ని యెహోవా
46 వాక్యము నా యొద్దికి వచ్చి చెప్పినదేమంటే, । వో నర
పుత్రుడా, నీ ముఖమును దక్షిణపుతట్టు తిప్పుకొని,
ఆ దక్షిణపుతట్టు నీ మాటను జారవిడిచి, ఆ దక్షిణ
47 భూమి అడవి మీద భవిష్యత్తుగా పలికి, । ఆ యడవి
తో చెప్పవలసినదేమంటే, యెహోవా వాక్యమును
వినుము; కర్తయైన యెహోవా ఆనతిచ్చేదేమంటే,
యిదుగో నేను నీలో అగ్ని రాజ బెట్టుదును; అది నీలో
వున్న పచ్చని చెట్లనన్నిటినిన్ని యెండిన చెట్లనన్నిటి
నిన్ని దహించును; అది రాజి రాజి అగ్ని అయి, ఆరి
పోక వుండును; దానిచేత దక్షిణ దిక్కు మొదలుకొని
ఉత్తర దిక్కు మట్టుకు ముఖములు అన్నిన్ని కాలిపో
48 వును. । మరిన్ని యెహోవానైన నేను దాని రాజబెట్టి
తిని, అని సమస్తమైన జనులకు తెలియబడునని ఆన
తిచ్చెనని చెప్పుమన్న సెలవు యిచ్చెను. । అప్పుడు నేను 49
అన్న మాట అయ్యో! కర్తయైన యెహోవా, వీడు
సామితెలను పలికే వాడని వారు నన్ను గూర్చి పలు
కుదురని చెప్పితిని.

## 21. అధ్యాయము.

మరిన్ని యెహోవా వాక్యము నా యొద్దికి వచ్చి 1
చెప్పినదేమంటే, । వో నర పుత్రుడా, యెరూశలేము 2
తట్టు నీ ముఖమును తిప్పుకొని, ఆ పరిశుద్ధమైన స్థల
ముల తట్టు నీ మాటలను జార విడిచి, । ఇశ్రాయేలు 3
దేశము మీద భవిష్యత్తుగా పలికి, యెహోవా ఆన
తిచ్చినట్టు ఇశ్రాయేలు దేశముతో చెప్పవలసినదేమం
టే, యిదుగో నేను నీకు విరోధినై యున్నాను; కాబట్టి
నా కత్తి వర దూసి, నీలో వున్న నీతిపరులనున్ను అనీ
తిపరులనున్ను నరుకుదును. । నీలో వున్న నీతిపరులను 4
న్ను అనీతిపరులనున్ను నరుకుదునని నేను వుద్దేశించు
కొనినందున నా కత్తి దక్షిణ దిక్కు మొదలుకొని వుత్తర
దిక్కు పర్యంతమూ సమస్తమైన వారి మీద దాని వర
లోనుంచి బైలు వెళ్లును. । మరిన్ని యెహోవానైన 5
నేను నా కత్తి వరదూసితినని సమస్తమైన జనులకు తెలి
య గలందులకు అది యెన్నటికి తిరిగీ రాక వుండును.।
కాబట్టి వో నర పుత్రుడా, నీవు చింతాక్రాంతుడవై, 6
నిట్టూర్పు బుచ్చుము; వారు చూస్తూ వుండగా మిక్కిలీ
నిష్టురముగా నీ గుండె బద్దలయ్యే మట్టుకున్ను నిట్టూ
ర్పు బుచ్చుము. । మరిన్ని వారు నిన్ను చూచి, నిట్టూర్పు 7
బుచ్చెదవేమని అడిగితే, నీవు వారిని చూచి, చెడ్డ
కబురు వింటిని, శ్రమ దినము సమీపమాయెను, కా
బట్టి సమస్తమైన హృదయములు కరిగి పోవును, సకల
హస్తములున్ను బలక్షీణములవును, సకల ఆత్మలున్ను
మూర్ఛిల్లును, సమస్తమైన మోకాళ్లున్ను నీరు అవు
ను; యిదుగో వుపద్రవము సమీపమై సంభవించునని
కర్తయైన యెహోవా ఆనతిచ్చెనని చెప్పుమని సెలవు
యిచ్చెను. । మరిన్ని యెహోవా వాక్యము నా యొ 8
ద్దికి వచ్చి చెప్పినదేమంటే, । వో నర పుత్రుడా, నీవు 9
భవిష్యత్తుగా పలికి, యెహోవా ఆనతిచ్చినట్టు నీవు
చెప్పవలసినదేమంటే, అదిగో ఖడ్గము, అది తెగువ గలి
గినదిన్ని పదును గలిగినదిన్ని అయి వున్నది. । అది బహు 10
గా హతము చేసుటకు వాడి గలదై వున్నది; తళతళ
లాడుటకు అది చికిలీ చేయబడి వున్నది; యీలాగు
వుండగా మనము సంభ్రమము చేయ వచ్చునా? నా
కుమారునియొక్క గద సమస్తమైన కర్రలను వంచించె
ను. । మరిన్ని అది చేతికి సిద్ధమాటకు దానిని చికిలీ 11
కొరకై యిచ్చిరి; యీ ఖడ్గము తెగువ గలదిన్ని పదును
గలదిన్ని అయి హతము చేసే వానిచేత అమరి యుం

12 న్నది. । ఓ నర పుత్రుడా, నీవు బహుగా యేడ్వు
ము, యెందుకంటే, అది నా జనుల మీదికిన్ని ఇశ్రా
యేలు అధిపతుల మీదికిన్ని వచ్చును; ఖడ్గ భయములు
నా జనుల మీద వుండును గనుక నీ తొడను చరుచు
13 కొమ్ము. । శోధన కాలమందు ప్రయోజనమేమి? అయితే
ఆ గదను నిర్లక్ష్యపెట్టిన పక్షమందు అది వుండగూ
14 డదని కర్తయైన యెహోవా ఆనతిచ్చెను. । కాబట్టి
ఓ నర పుత్రుడా, నీవు భవిష్యత్తుగా పలికి, చేతు
లను చరుచుకొమ్ము; యేమంటే ఖడ్గము మూడు మడత
లుగా వుండును; అది హతము చేసుటకైన ఖడ్గము అయి
వున్నది; గొప్ప వారిని హతము చేసుటకైన ఖడ్గము
అయి, వారి అంతఃపురములలోకి కూడా చొచ్చును. ।
15 వారి హృదయము కరిగిపోవుటకున్ను లయము వారికి
విస్తరించుటకున్ను నేను ఖడ్గపు మొనను వారి గౌను
లన్నిటి యెదుట నిలువబెట్టితిని; అది మెరుగై, మడచ
16 బడి, హతము చేసుటకు సిద్ధమై వున్నది. । నీవు దృఢ
ముగా వుండి, కుడి యెడమ పార్శ్వములలో నీ ముఖ
17 ము యే తట్టు వున్నదో ఆ తట్టు వెళ్లుము. । నేను నా
చేతులు చరుచుకొని, నా రౌద్రమును తీర్చుకొందును;
యెహోవానైన నేను చెప్పిన వాడనైతినని ఆనతిచ్చె
18 నని చెప్పుమన్న సెలవు యిచ్చెను. । అప్పుడు యెహో
వా వాక్యము నా యొద్దికి తిరిగీ వచ్చి చెప్పినదేమంటే, ।
19 ఓ నర పుత్రుడా, బాబెలు రాజు ఖడ్గము వచ్చుటకు
రెండు మార్గములను నిర్ణయించుము; రెండు ఖడ్గ
ములు వొక దేశములోనుంచి వచ్చును; మరిన్ని వొక
స్థలము నీవు యెంచుకొమ్ము; పట్టణమునకు వెళ్లే మా
20 ర్గపు మొగను యెంచుకొమ్ము. । మరిన్ని ఖడ్గము రబ్బ
తు అనే అమ్మోనీయుల పట్టణమునకున్ను యూదా
దేశమందున్న ప్రాకారములు గల యెరూశలేము పట్ట
ణమునకున్ను వచ్చుటకు మార్గములను నిర్ణయించు
21 ము. । యేమంటే బాబెలు రాజు రెండు మార్గములకూ
కలిగిన మొగలో ప్రశ్న చూపించుటకు నిలిచెను; అత
డు తన బాణములను సానబట్టి, విగ్రహముల ఆలో
22 చన పుచ్చుకొని, కార్జమును చూచును. । తన కుడి
పార్శ్వమునందు యెరూశలేముకు ప్రశ్న చెప్పుట
యేలాగంటే, సైన్యాధిపతులను నిర్ణయించుటకున్ను,
హతము చేస్తూ నోరు తెరుచుటకున్ను, బొబ్బయెత్తి
అర్చుటకున్ను, గౌనులను కూలగొట్టే సూత్రములను
వుంచుటకున్ను, దిబ్బ వేసుటకున్ను, బురుజును కట్టు
23 టకున్ను, ప్రత్యుత్తరమిచ్చెను. । అయితే ప్రమాణము
లను చేసిన వారికి యిది వ్యర్థమయిన ప్రశ్న చూచుట
అని తలంచబడును; అయితే అతడు ఆ దోషమును జ్ఞాప
కము చేసుకొన్నందున వారు అతని చేతిలో చిక్కుదు
24 రు. । కాబట్టి కర్తయైన యెహోవా ఆనతిచ్చేదేమంటే,
మీ నడతలవల్ల కలిగిన పాపములు అగుపడేటట్టుగా
మీ అక్రమములు బయిలు పడినవి; యీలాగున మీ
దోషమును జ్ఞాపకము చేసినందువల్ల మీరున్ను జ్ఞాపక
ము వచ్చి, అతని చేతికి చిక్కుదురు. । మరిన్ని ఇశ్రాయే 25
లుయొక్క మిక్కిలీ దుష్టుడవైన అధిపతీ, నీ అక్రమము
చాలించే దినము వచ్చెను. । యిందుకు కర్తయైన యె 26
హోవా ఆనతిచ్చేదేమంటే, ఆ తలాటము తీసివేసి,
కిరీటమును కింద పడవేయుము; యిక యిది యీలాగున
వుండ గూడదు; నీచుని ఘనునిగానున్ను ఘనుని నీచుని
గానున్ను చేయుము. । నేను దాని బొత్తిగా పడవోసి, 27
తల కిందు చేతును; స్వాస్థ్యము యెవనిదో ఆయన వచ్చే
పర్యంతమూ అది లేక వుండును; అప్పుడు నేను దానిని
ఆయనకు యిత్తునని ఆనతిచ్చెను. । మరిన్ని ఓ నర 28
పుత్రుడా, నీవు భవిష్యత్తుగా పలికి, అమ్మోనీయులను
గురించిన్ని వారి అవమానమును గురించిన్ని కర్తయైన
యెహోవా ఆనతిచ్చినట్టు చెప్పవలసినది యేమంటే,
అదుగో ఖడ్గము, అది వరదీయబడెను; హతము చేసు
టకు చికిలీ చేయబడి, తళతళలాడుతూ, బొత్తిగా
మింగివేసును. । యీలాగుండగా వారు నీ కొరకు వ్య 29
ర్థమైన దర్శనములను కనే వారై వుండిరి; యే దుర్మా
ర్గుల దినము వచ్చెనో యెవరి అక్రమమునకు అం
తము వచ్చెనో ఆ హతమైన వారి మెడల మీద నిన్ను
పడదోసుటకు నీ కొరకు అబద్ధపు ప్రశ్న చూచేవా
రైరి. । నేను ఖడ్గమును తిరిగీ వరలో వుంతునా! నీవు 30
సృష్టించబడిన స్థలమందున్ను నీవు పుట్టిన దేశమందు
న్ను నీ మీద ఆజ్ఞ విధింతును. । నా కోపాగ్నిని నీ 31
మీద కుమ్మరింతును; నా వుగ్రపు అగ్నిచేత నీ మీద
శ్వాసము విడిచి, హతము చేసుటకు ప్రజ్ఞ కలిగిన
క్రూరుల చేతిలోకి నిన్ను అప్పగింతును. । అగ్నికి నీవు 32
ఆహారమవుదువు; నీ రక్తము దేశపు మధ్యను వొలు
కును; నీ పేరు యెన్నటికి జ్ఞాపకమునకు రాక వుండును;
యెహోవానైన నేను యిది చెప్పితిని.

## 22. అధ్యాయము.

మరిన్ని యెహోవా వాక్యము నా యొద్దికి వచ్చి 1
చెప్పినదేమంటే, । ఓ నర పుత్రుడా, యిప్పుడు నీవు 2
మనవి చేతువా? ఆ రక్తాపరాధముగల పట్టణము నిమి
త్తము మనవి చేతువా? నిజముగా నీవు దాని అసహ్య
తలన్నిటినిన్ని దానికి చూపించుము. । కర్తయైన యె 3
హోవా ఆనతిచ్చినట్టు నీవు చెప్పవలసినది యేమంటే,
దాని కాలాంతము వచ్చుటకు యీ పట్టణము దాని
లో రక్తమును చిందచేసి, తన్ను తాను అపవిత్రపర్చు
కొనుటకు విగ్రహములను చేసుకొంటూ వున్నది. ।
నీవు చిందిన రక్తము వల్ల దోషివైతివి; విగ్రహములను 4

కలుగ చేసుకొని అపవిత్రురాలవైతివి; నీ దినములను
నీవు సమీపింప చేసుకొని, పెద్ద కాలముకు వస్తివి;
కాబట్టి అన్య జనాంగములవల్ల అవమానము పొందుట
కున్ను సకల దేశములవల్ల అపహాస్యమును పొందుట
5 కున్ను నిన్ను నిర్ణయిస్తిని. । దుర్న్యయమువల్ల స్థిరత
లేని దానవైన నీ దగ్గిర వున్న వారున్ను దూరమున
6 వున్న వారున్ను నిన్ను అపహసింతురు. । యిదుగో నీ
యందు ఇశ్రాయేలు అధిపతులందరున్ను తమ తమ శక్తి
7 కొద్ది రక్తమును చిందించిరి. । నీ యందు వారు తల్లి
దండ్రులను నిర్లక్ష్యపెట్టిరి; నీ యందు వారు పరదే
శులను బాధ పెట్టిరి; నీ యందు వారు తండ్రిలేనివారి
8 నిన్ని విధవలనున్ను హింసపెట్టిరి. । నీవు నా పరిశుద్ధ
మైన నిబంధనలను నిర్లక్ష్యపెట్టి, నా సబ్బాతులను
9 అపవిత్రపరచితివి. । నీ యందు కొందరు రక్తము చిం
దించుటకు తచ్చన కొండెగాండ్లయి వున్నారు; నీ యం
దు కొందరు పర్వతముల మీద భుజిస్తూ వున్నారు;
10 నీ యందు కామ వికారము జరుగుతూ వున్నది. । నీ
యందు తండ్రి మానము బయిలు పరచబడెను; నీ యం
దు రజస్వల అయిన దాని సాంగత్యమున్ను కలదు. ।
11 వొకడు తన పొరుగువాని భార్యతోటి కాని క్రియ
జరిగించెను; మరి వొకడు కామాతురుడై తన కోడలితో
ప్రవర్తించెను; యింకొకడు తన తండ్రి కుమార్తె
తో, అనగా, తన సహోదరితో సాంగత్యము చేసెను. ।
12 నీ యందు రక్తము చిందుటకు లంచము పుచ్చుకొనుట
గలదు; నీవు అన్యాయపు వడ్డినిన్ని చాలా లాభము
నున్ను పుచ్చుకొనిన దానవు; ద్రవ్యాశ కలిగి, నీవు
పొరుగువారిని బలవంతముచేత బాధపెట్టి, నన్ను మరి
చిపోతివని కర్తయైన యెహోవా ఆనతిచ్చెను. ।
13 కాబట్టి యిదుగో అన్యాయముగా నీకు దొరికిన లాభ
మునకున్ను నీలో చిందబడిన రక్తమునకున్ను నేను
14 చేతులను చరుచుకొంటిని. । నేను నీ విషయమయి జరి
గించే సమయమందు నీ హృదయము నిలువగలదా? నీ
చేతులు బలముగా వుండునా? యెహోవానైన నేను
15 మాట పలికితిని, దానిని రూఢపర్తును. । యేమంటే
జనాంగములలోకి నిన్ను చెదరగొట్టి, దేశముల కడకు
వెళ్లవేసి, నీలో వున్న కళంకమును బయిటికి తీయిం
16 తును. । మరిన్ని అన్య జనాంగముల కండ్ల ముందర
నీకు తగిన ఫలము సంభవించును; అప్పుడు నేను యె
హోవానై వున్నానని నీవు తెలుసుకొందువని ఆనతి
17 చ్చెనని చెప్పుమన్న సెలవు యిచ్చెను. । మరిన్ని యె
హోవా వాక్యము నా యొద్దికి వచ్చి చెప్పినదేమం
18 టే, । వో నర పుత్రుడా, ఇశ్రాయేలు యింటివారు
నాకు వట్టి మష్టువలె వున్నారు; అందరున్ను కొలిమి
లో యిత్తడిన్ని తగరమున్ను యినుమున్ను సీసమున్ను
అయి వున్నారు; వెండియొక్క మష్టువలె వున్నారు. ।
కాబట్టి కర్తయైన యెహోవా ఆనతిచ్చేదేమంటే, 19
మీరందరున్ను మష్టువలె వున్నారు, గనుక యిదుగో
మిమ్మును యెరూశలేము నడుమను కూర్తును. । వెండిన్ని 20
యిత్తడిన్ని యినుమున్ను సీసమున్ను తగరమున్ను కూర్చి
కొలిమిలో వేసి, దాని మీద అగ్ని వూది, కరిగించి
నట్టు నా కోపము చేతనున్ను రౌద్రము చేతనున్ను
మిమ్మును సమకూర్చి అక్కడ కరిగింతును. । నిజము 21
గా మిమ్మును సమకూర్చి, నా వుగ్రపు మంటచేత
మీ మీద శ్వాసము విడిచినందున దానిలో మీరు
కరిగి పోదురు. । వెండి కొలిమిలో యేలాగు కరుగు 22
నో ఆలాగున మీరు దానిలో కరిగి పోదురు; అప్పుడు
యెహోవానైన నేను నా రౌద్రాగ్నిని మీ మీద
కుమ్మరించితినని మీరు తెలుసుకొందురని ఆనతిచ్చెను. ।
మరిన్ని యెహోవా వాక్యము నా యొద్దికి వచ్చి 23
చెప్పినదేమంటే, । వో నర పుత్రుడా, దానితో చెప్ప 24
వలసిన లాగు, నీవు పవిత్రము కాని దేశమై వున్నావు;
వుగ్రపు దినమందు నీ మీద వర్షము కురవక వుం
డును. । దాని దీర్ఘదర్శులు దానిలో జట్టు కూడు 25
దురు; దొరికిన వేటను పెగల్చి, నాదము చేసే సింహము
లాగున వారు ప్రాణములను పెగల్చిరి; పదార్థముల
నున్ను ప్రియమైన వస్తువులనున్ను పట్టుకొనిరి; దాని
లో చాలామందిని విధవలగా చేసిరి. । దాని అర్చకులు 26
నా న్యాయప్రమాణమును విసర్జించి, నా పరిశుద్ధపు
నిర్ణయములను అపవిత్రపరిచిరి; పరిశుద్ధమైన దాని
నిన్ని అపవిత్రమైన దానినిన్ని భేదించక వుండిరి; శుభ్ర
మైన దానినిన్ని శుభ్రము కాని దానినిన్ని భేదించక
వుండిరి; మరిన్ని నా సబ్బాతులను నా కండ్లకు మరుగు
పరిచిరి; యీలాగున వారు నన్ను అలక్ష్యము చేసిరి. ।
దాని అధిపతులు దానిలో దొరికిన వేటను పెగల్చిన 27
తోడేలు వలెనే అన్యాయపు లాభము దొరుకుటకు
రక్తమును చిందిస్తూ ప్రాణములను లయము చేస్తూ
వున్నారు. । మరిన్ని దాని దీర్ఘదర్శులు వ్యర్థమైన 28
దర్శనములను కని, యెహోవా ఆనతియ్యక పోయి
నప్పటికిన్ని కర్తయైన యెహోవా యీలాగున
ఆనతిచ్చెనని చెప్పి, వారితో అబద్ధపు భవిష్యత్తు పలికి,
వారి మీద అంటని సున్నపు అడుసును పూసిరి. ।
మరిన్ని దేశపు జనులు బలవంతమునున్ను దొంగతన 29
మునున్ను చేసి, బీద వారినిన్ని దరిద్రులనున్ను హింస
పెట్టి, పరదేశిని అన్యాయముచేత బాధ పెట్టిరి. । యీ 30
లాగు వుండగా నేను దేశమును లయము చేయకుండా
కంచె దిట్టపచుర్చుటకున్ను బద్దలైన సందులో నా ముం
దర నిలుచుటకున్ను వచ్చే వానిని వెతికితిని; అయితే
కనుబడిన వాడు వొకడూ లేడు. । కాబట్టి నేను నా 31

క్రోధాగ్నిని వారి మీద కుమ్మరింతును; నా వుగ్రాగ్ని
చేత వారిని దహింపచేతును; వారి దుర్మార్గతలను
వారి శిరస్సుల మీద మోపి, వారిని శిక్షింతునని ఆన
తిచ్చెనని చెప్పుమన్న సెలవు యిచ్చెను.

## 23. అధ్యాయము.

1 అయితే యెహోవా వాక్యము నా యొద్దికి
2 తిరిగీ వచ్చి చెప్పినదేమంటే, । వో నర పుత్రుడా, యి
ద్దరు స్త్రీలు కలరు; వారు వొక తల్లి కుమార్తెలయి
3 వుండిరి. । వీరు మిస్రయీము దేశములో బహు జారలై
తిరిగిరి; ఈషద్యౌవనమందే వారు జారలైరి; అక్కడ
వారి స్తనములు అణపబడినవి; అక్కడ వారి చనుమొ
4 నలు నలుపబడినవి. । వారిలో పెద్దదాని పేరు ఒహొ
లా, చిన్న దాని పేరు ఒహొలిబా; వీరు నా వారై
వుండి, కుమారులనున్ను కుమార్తెలనున్ను కనిరి; మరిన్ని
వారి నిజ నామములు యేవంటే, ఒహొలా అంటే
షోమ్రోనున్ను, ఒహొలిబా అంటే యెరూశలేము
5 న్ను. । అయితే ఒహొలా నా సంబంధము కలదైనప్ప
6 టికిన్ని వేశ్యాత్వము జరిగించెను;। యేమంటే నీలి రంగు
వస్త్రములను ధరించుకొన్న సేనాధిపతులున్ను అధికా
రులున్ను అందముగల పడుచువారున్ను గుర్రములను
యెక్కే రౌతులున్ను అయి వుండిరి గనుక పొరుగు
7 వారైన అష్షూరు వారిని మోహించెను. । అది వారితో
నున్ను అష్షూరు వారయిన శ్రేష్ఠులతోనున్ను వ్యభి
చరించి, వారి సకల విగ్రహములతో తనను అపవిత్ర
8 పరచుకొనెను. । మరిన్ని మిస్రయీము దేశములో
చేసిన జారత్వమును అది మానక వుండెను; యేమంటే
దాని ఈషద్యౌవనమందే వారు దానితో శయనించి,
దాని చనుమొనలను నలిపి, వారి మోహములను దాని
9 మీద కుమ్మరించిరి. । కాబట్టి యెవరి యందు దానికి
మోహము పుట్టెనో వారికే అనగా అష్షూరు వారైన
దాని విటకాండ్ల చేతిలోకి దానిని నేను అప్పగిస్తిని. ।
10 వీరు దాని మానమును బైలుపరిచిరి; దాని కుమారుల
నున్ను కుమార్తెలనున్ను తీసుకొని, దానిని కత్తిచేత
చంపిరి; యీలాగున వారు దాని మీద ఆజ్ఞ విధించి
11 నందున స్త్రీలలో అది ప్రఖ్యాతిని పొందెను. । దాని
చెల్లెలైన ఒహొలిబా యిది చూచినప్పుడు దాని కంటే
అధిక కామాతురయైనందున దాని జారత్వములు దాని
12 అప్ప జారత్వములకంటే విస్తరించెను. । అది అష్షూరు
వారైన తన పొరుగువారి యందు మోహించెను; వీరు
ఆభరణములను ధరించుకొని, గుర్రములను యెక్కి,
అందరున్ను అందముగల పడుచువారున్ను సేనాధిపతు
13 లున్ను అధికారులున్ను అయి వుండిరి. । అప్పుడు అది
అపవిత్రురాలాయెననిన్ని వారిద్దరున్ను వొక్కటే మా
ర్గములో నడిచిరనిన్ని నేను చూస్తిని. । మరిన్ని యిది తన 14
జారత్వములను మరీ అధికముగా చేసెను; యేమంటే
గోడ మీద యింగిలీకపు రంగుతోటి వ్రాసిన కల్దీయు
లయొక్క పటముల మీద దాని కనుదృష్టి పడగానే
దానికి మోహము పుట్టెను. । వారు తాము పుట్టిన కల్దీయ 15
దేశపు బాబెలువారి దేశాచారము చొప్పున కటి సూ
త్రములను నడుముకు కట్టుకొని, శిరస్సుల మీద చాలా
రంగులు గల పాగాలను వేసుకొని, అందరున్ను చూచు
టకు అందముగల సేనాధిపతులై వుండిరి. । వీరిని అది 16
చూచి మోహించి కల్దీయ దేశములో వున్న వారి యొ
ద్దికి దూతలను పంపించి, పిలిపించుకొనెను. । కాబట్టి 17
బాబెలువారు వచ్చి, దాని మోహకరమైన మంచము
మీదికి యెక్కి, జారత్వముచేత దానిని అపవిత్రపరి
చిరి; మరిన్ని వారిచేత అది అపవిత్రపరచబడిన తరు
వాత దాని మనస్సు వారికి యెడమైపోయెను. । యీలా 18
గున అది తన జారత్వములనున్ను తన మానమునున్ను
బైలుపడ జేసెను; కాబట్టి దాని అప్ప యందు నా మన
స్సు యేలాగు యెడమై పోయెనో నీ యందున్ను నా
మనస్సు ఆలాగునై యెడమై పోయెను. । అయినప్పటి 19
కిన్ని అది ఈషద్యౌవనమందు మిస్రయీములో వేశ్యా
త్వమును జరిగించిన కాలమును తలంచుకొని, దాని జార
త్వములను యింకా విస్తరింప చేసెను. । యేమంటే 20
అక్కడ వున్న విటకాండ్ల మాంసము గార్దభముల మాం
సము వలెనున్ను వారి బీజము గుర్రముల బీజము వలె
నున్ను వుండును గనుక వారిని అది మోహించెను. ।
యీలాగున వో ఒహొలిబా, ఈషద్యౌవనమందు 21
నీవు మిస్రీయులచేత నీ చనుమొనలను నలిపించుకొనిన
సంగతినిన్ని నీ బాల్యపు కామ వికారమునున్ను నీవు
జ్ఞాపకమందు వుంచుకొంటివి గనుక కర్తయైన యె
హోవా ఆనతిచ్చేదేమంటే, । యిదుగో నేను యెవండ్ల 22
యందు నీ మనస్సు యెడమై పోయెనో వారిని అనగా
నీ మునుపటి విటకాండ్లను నీ మీదికి లేవచేసి, నఖము
ఖాలనుంచీ వారిని నీ మీదికి రప్పింతును. । బాబెలు 23
వారున్ను కల్దీయులున్ను పెకోదు వారున్ను షోవా
వారున్ను కోవా వారున్ను మరిన్ని అష్షూరు వారున్ను
అందముగల పడుచువారున్ను అధిపతులున్ను అధికా
రులున్ను ప్రఖ్యాతి బొందిన మహా ప్రభువులు అయి, ।
గుర్రములను యెక్కి, రథములతోటిన్ని బండ్లతోటిన్ని 24
చక్రములతోటిన్ని బహు జన సమూహముతోటిన్ని
డాళ్లతోటిన్ని యుద్ధపు పాగాలతోటిన్ని నీ మీదికి
వచ్చి నిన్ను ముట్టడి వేతురు; వారి న్యాయాలోచనల
చొప్పున నేను వారికి చూపించినట్టు వారు న్యాయ
మును నీకు విధింతురు. । నా అహంకారమును నీ మీద 25
దృఢపరుతును; వారు నీ యందు బహు రౌద్రులై,

నీ చెవులనున్న నీ ముక్కునున్న తెగకోయుదురు; శేషిం
చిన వారు కత్తిచేత కూలుదురు; వారు నీ కుమారుల
నున్న నీ కుమార్తెలనున్న పట్టుకొందురు; యింకా నీకు
శేషించినదేదైనా వుంటే అది అగ్నిచేత దహనమవును.।
26 మరిన్ని వారు నీ బట్టలనున్న నీ సొగసైన నగలనున్న
27 తీసివేతురు.। యీలాగున మిస్రయీము దేశమునుంచి
నీవు తెచ్చిన జారత్వమునున్న నీ కామ వికారము
నున్న నీలోనుంచి తీయింతును; అప్పుడు నీ కనుదృష్టి
వారి మీద పారకనున్న మిస్రయీము యిక నీ జ్ఞాప
28 కమునకు రాకనున్న వుండును.। యిందుకు కర్తయైన
యెహోవా ఆనతిచ్చేదేమంటే, నీవు పగ చేసిన వారు,
అనగా, నీ మనస్సుకు దూరమైన వారి చేతిలోకి నిన్ను
29 అప్పగింతును.। వారున్న నీ యందు పగచేసి, నీ కష్టా
ర్జితమంతా తీసుకొని, నిన్ను దిగంబరగానున్న నిర్వ
సనగానున్న చేసి విడుతురు; యీలాగున నీ వేశ్యా
త్వమున్న నీ కామ వికారమున్న నీ జారత్వమున్న
30 బైలుపడును.। నీవు వేశ్యలాగున అన్య జనాంగములను
వెంటాడి, వారి విగ్రహముల చేత అపవిత్రపరచబడి
31 తివి గనుక నేను యీలాగున నీకు చేతును.। నీ అప్ప
మార్గమందే నీవు నడిచితివి గనుక దాని పాత్రను నీ
32 చేతికి యిత్తును.। లోతుగానున్న వెడల్పుగానున్న
వుండిన నీ అప్ప పాత్రలో నీవున్న తాగుదువు; ఆ
పాత్రలో చాలా వున్నది గనుక నిన్ను చూచిన వారు
33 యెగతాళి చేసి అపహాస్యము చేతురు.। మత్తుతోనున్న
దుఃఖముతోనున్న తృప్తిగా వుందువు యేమంటే షో
మ్రోను అనే నీ అప్ప తాగిన పాత్ర భయభ్రాంతితో
34 టిన్ని పాడుతోటిన్ని నిండినదై వుండెను.। దానిలో
నీవున్న తాగి, దాని అడుగు మట్టుకున్న అంతటినీ
పీల్చి, దానిని తునకలుగా కొట్టివేసి, నీ స్తనములను
పెరుకుకొందువు; కర్తయైన యెహోవానైన నేను యీ
35 మాట ఆనతిస్తిని గనుక రూఢమవునని చెప్పి,। మరిన్ని
కర్తయైన యెహోవా చెప్పేదేమంటే, నీవు నన్ను మరి
చిపోయి, వెనుకకు తోసివేస్తివి; కాబట్టి నీ కామ వికా
రము యొక్కయున్న నీ జారత్వము యొక్కయున్న
దోషమును నీవు భరింతువు గాకని ఆనతిచ్చెనని చెప్పె
36 ను.। మరిన్ని యెహోవా నాతో ఆనతిచ్చేదేమంటే,
ఓ నర పుత్రుడా, ఒహొలా ఒహొలిబా అనే వీరి
ద్దరి నిమిత్తము నీవు వేడుదువా? నిజముగా వారి అస
37 హ్యపు చేష్టలను వారికి కనుపరచుము.। అనగా వారి
వ్యభిచారమునున్న వారి చేతులలో వున్న రక్తము
నున్న వారి విగ్రహములతో వారు చేసిన వ్యభిచార
మునున్న వారు నాకు కనిన కుమారులను అగ్నిలో
38 గడవ చేయుటనున్న వారికి కనుపరచుము.। మరిన్ని
వారు నాకు చేసినదేమంటే, ఆ దినమందే వారు నా
పరిశుద్ధ స్థలమును అపవిత్రపరిచి, నా సబ్బాతు నిబం
ధనలను గైకొనక నుండిరి.। యేమంటే వారి విగ్రహ 39
ముల పేరట వారి పిల్లలను చంపిన నాటియందే వారు
నా పరిశుద్ధ స్థలమును అపవిత్రపరిచిరి; యీలాగున
వారు నా మందిరములోనే చేసిరి.। మరిన్ని దూరము 40
నుంచి వారు మనుష్యులను పిలువనంపించిరి; వారు వచ్చి
నప్పుడు యిదుగో వారి కొరకు నీవు స్నానము చేసి,
కన్నులకు కాటుక బెట్టుకొని, ఆభరణములను ధరించు
కొని,। ఘనమైన మంచము మీద కూర్చుని, ఆ మం 41
చము ముందర బల్లను సిద్ధపర్చి, దాని మీద నా పరి
మళ ద్రవ్యమునున్న తైలమునున్న పెట్టితివి.। అయితే 42
దాని మీద సమూహముయొక్క గొల్లు అణిగిన తరు
వాత వారు నీచులతో కూడా అరణ్యములోనుంచి
సెబాయీయులను పిలువనంపించిరి; వారు చేతులకు
కడియములను తొడుగుకొని, శిరస్సు మీద సొగసైన
కిరీటములను బెట్టుకొని వచ్చిరి.। అప్పుడు చాలా కాల 43
మునుంచి వ్యభిచరించిన యీమెను గురించి నేను అను
కొనినదేమంటే, యిప్పుడు యిదిన్ని వారున్న సాంగ
త్యము చేతురా అని అనుకొంటిని.। అయితే వారు 44
వేశ్యాత్వము చేసే స్త్రీలతో సాంగత్యము చేసినట్టు
దానితోటిన్ని సాంగత్యము చేసిరి; యీలాగున వారు
న్న ఒహొలాయున్న ఒహొలిబాయున్న అనే కా
మాంధురాండ్లయిన స్త్రీలతో సాంగత్యము చేసిరి.। కా 45
బట్టి నీతిపరులు వ్యభిచారిణులకున్న రక్తము చిందిం
చిన స్త్రీలకున్న తగిన న్యాయ ప్రకారముగా వీరికిన్ని
న్యాయమును విధింతురు; యేమంటే వారు వ్యభిచారి
ణులై వున్నారు; వారి చేతులలో రక్తమున్న వున్నది.।
యిందుకు కర్తయైన యెహోవా ఆనతిచ్చేదేమంటే, 46
వారి మీదికి నేను సమూహమును రప్పింతును; వారిని
దోపుడు కొరకు యిచ్చి బైటికి వెళ్లవేతును.। మరిన్ని 47
ఆ సమూహము వారి మీద రాళ్లు కొట్టి తమ కత్తుల
చేత హతము చేసును; మరిన్ని వారి కుమారులనున్న
కుమార్తెలనున్న చంపి, వారి యిండ్లను అగ్నిచేత కాల్చి
వేసును.। యీలాగున నేను వారి కామ వికార ప్రకా 48
రము స్త్రీలందరున్న నేర్చుకొని చేయ గూడదని దేశ
మునుంచి కామ వికారమును తీయింతును.। వారు మీ 49
కామ వికారమును మీ మీద కుమ్మరించినందున, మీరు
మీ విగ్రహములతోటి చేసిన దోషమును భరింతురు;
అప్పుడు నేను యెహోవానై వున్నానని మీరు తెలు
సుకొందురని ఆనతిచ్చెను.

## 24. అధ్యాయము.

తొమ్మిదో సంవత్సరము పదో నెల పదో దినము యె 1
హోవా వాక్యము నా యొద్దికి మరిన్ని వచ్చి చెప్పినదే

2 మంటే, । ఓ నర పుత్రుడా, యీ దినము పేరు యీ దిన
ముసే వ్రాయుము, యేమంటే, యీ దినమున బాబెలు
రాజు యెరూశలేము మీద తన్ను బలపరచుకొనెను. ।
3 మరిన్ని నీవు ఆ తిరుగుబాటు చేసిన యింటిని గురించి
సామితెను యెత్తి, కర్తయైన యెహోవా ఆనతిచ్చినట్టు
చెప్పవలసినదేమంటే, కుండను తెచ్చి, దానిలో నీళ్లు
4 పోసి, అది పొయ్యి మీద వేసి, । అప్పుడు దానిలో
వేయవలసిన తొడనున్ను భుజమునున్ను మంచి ముక్క
నున్ను తీసి, విశేషమైన దుమ్ములతో కూడా దాని
5 నిండా వేయుము. । వీటి కొరకు మందలో విశేషమైన
వాటిని తీసి వుంచుకొమ్ము; మరిన్ని దాని కింద దుమ్ము
లను కాల్చి, దానిని బాగా వుడకబెట్టి, దుమ్ములను
6 దానిలో వుడకబెట్టుము. । యిందుకు కర్తయైన యె
హోవా ఆనతిచ్చేదేమంటే, రక్త దోషి అయిన ఆ పట్ట
ణమునకు మడ్డిగల ఆ కుండకు అయ్యో! దాని మడ్డి దా
నిలోనుంచి బయలు వెళ్లలేదు; ముక్కముక్కలుగా
దాని తీసుకొరమ్ము; దాని మీద చీటి పడనియ్యకుము. ।
7 యేమంటే దానిచేత చిందబడిన రక్తము దానిలోనే
వున్నది; అది దానిని కొండ మీద పెట్టినది కాని
బుగ్గి దానిని కప్పుటకు నేల మీద కుమ్మరించక పో
8 యెను. । కాబట్టి తగిన ప్రాయశ్చిత్తమును చేసుటకు
నాకు రౌద్రము యెక్కేటట్టు నేను దాని రక్తము
కప్పి వుండకుండా కొండ మీద పెట్టితినని చెప్పి, ।
9 యిందుకు కర్తయైన యెహోవా మరిన్ని ఆనతిచ్చే
దేమంటే, రక్తదోషి అయిన ఆ పట్టణమునకు అయ్యో!
అగ్ని కొరకు నేను విస్తరించి కర్రలను పేర్చెదను. ।
10 కర్రలను విస్తరించి పేర్చుము; అగ్ని రాజబెట్టుము;
మాంసమును బాగా కాల్చి, దాని మీద విస్తారమైన
11 కారపు గుండను వేసి దుమ్ములనున్ను కాల్చుము. । అప్పు
డు దాని యిత్తడి వేడిమి గలదై, కాలుటకున్ను దాని
మష్టు దానిలో కరిగి ఆ మడ్డి దహనము అవుటకున్ను
12 దానిని నిప్పుల మీద పెట్టుము. । అది అబద్ధములచేత
బహు ప్రయాసము పొంది అలసటబడినప్పటికిన్ని
దానికి కలిగిన విస్తారపు మడ్డి దానిలోనుంచి బైలు
వెళ్లలేదు; కాబట్టి అగ్నిచేత దాని మడ్డి దహింప చేయ
13 వలెను. । నీలో వున్న మడ్డి చాలా చిక్కగా వున్నది,
యేమంటే, నేను నిన్ను యెంత శుభ్రము చేసినా నీవు
శుభ్రపడకపోతివి; కాగా నా రౌద్రమును నీ మీద
తీర్చుకుంటే గాని నీవు మష్టునుంచి శుభ్రపడక వుం
14 దువు. । యెహోవానైన నేను యీలాగున ఆనతిస్తిని
గనుక దానిని సంభవింపచేతును; నేను వెనుకతియ్యక
నున్ను కనికరించకనున్ను చింతపడకనున్ను వుందును;
నీ మార్గముల ప్రకారమున్ను నీ చేష్టల ప్రకారమున్ను
వారు నీకు న్యాయము విధింతురని కర్తయైన యె

హోవా ఆనతిచ్చెనని చెప్పుమన్న సెలవు యిచ్చెను. ।
యెహోవా వాక్యము మరిన్ని నా యొద్దికి వచ్చి 15
చెప్పినదేమంటే, । ఓ నర పుత్రుడా, యిదుగో నీ 16
కండ్లకు అందము గల దానిని నీ యొద్దనుంచి ఒక్క
దెబ్బను తీసి వేస్తూ వున్నాను; అయినప్పటికీ నీవు
యెంతమాత్రమూ మూల్గ కూడదు, దుఃఖించ గూడదు;
నీ కన్నీరు రాల గూడదు. । దుఃఖించ వద్దు; మరణ 17
మైన దాని కొరకు మూల్గ వద్దు; నీ శిరోభూషణము
లను ధరించుకొని, పాదరక్షలను తొడగవలసినది గాని
నీ పెదవులను మూసుకో కూడదు; చింతతోటి భుజించ
గూడదని చెప్పెను. । అయినందున నేను వుదయమం 18
దు జనులతోటి మాట్లాడితిని, అస్తమానమందు నా
భార్య చనిపోయెను; ఆ మర్నాటి వుదయమందు నాకు
ఆజ్ఞాపించినట్టు చేస్తిని. । అయినందున జనులు నన్ను 19
చూచి, నీవు చేసిన వాటివల్ల మేము తెలియవలసిన
తాత్పర్యమును మాతోటి చెప్పవా? అని అంటే, । నేను 20
వారితో అన్న మాట, యెహోవా వాక్యము నా
యొద్దికి వచ్చి, కర్తయైన యెహోవా ఆనతిచ్చినట్టు
మీకు తెలియ చెప్పుటకు సెలవు యిచ్చెను. । అది యే 21
దంటే, యిదుగో, మీ మనస్సుకు ప్రియమైనదిన్ని మీ
కండ్లకు అందమైనదిన్ని మీ బలముకు అతిశయమైనదిన్ని
అయి వుండిన నా పరిశుద్ధ స్థలమును నేను అపవిత్ర
పరుతును; మరిన్ని అక్కడ మీరు విడిచిన మీ కుమా
రులున్ను కుమార్తెలున్ను కత్తిచేత కూలుదురు. । అప్పు 22
డు నేను చేసిన లాగున మీరున్ను చేతురు; మీ పెద
వులను మూసుకోక, చింతతోటి భుజించక వుందురు. ।
మీ శిరోభూషణములను మీ శిరస్సుల మీదనున్ను 23
మీ పాదరక్షలు మీ పాదముల మీదనున్ను వుందును;
యిందుకు మీరు మూల్గుటయున్ను ఖేదించుటయున్ను
లేదు; మీ అక్రమములవల్ల మీరు క్షీణించి, ఒకరితో
ఒకరు అంగలార్తురు. । యీలాగున మీకు యెహె 24
జ్కేలు గురుతై వున్నాడు; అతడు చేసిన అంతటి
ప్రకారమూ మీరున్ను చేతురు; యిది సంభవించిన
ప్పుడు నేను కర్తయైన యెహోవానై వున్నానని
మీరు తెలుసుకొందురని చెప్పుమని సెలవు యిచ్చి, ।
మరిన్ని నాతో చెప్పినదేమంటే, నేను వారి బలము 25
నున్ను వారికి సంతోషము పుట్టించిన ఘనమునున్ను
వారి కండ్లకు అందమైనదిన్ని వారు మనస్సు పెట్టిన
దానిన్ని వారి కుమారులనున్ను కుమార్తెలనున్ను తీసి
వేసిన నాటియందు ఒకడు తప్పించుకొని, । నీ యొద్దికి 26
వచ్చి, నీ చెవులకు వినిపించడా! । అయితే నాడు నీ 27
వాక్కు తప్పించుకొనిన వాని యొద్ద తెరువబడును;
అప్పటినుంచి నీవు మూగివి కాక పలుకుదువు; యీలా
గున నీవు వారికి గురుతై వుందువు; అయినందున నేను

యెహోవానైయున్నానని వారు తెలుసుకొందురని
ఆనతిచ్చెనని చెప్పెను.

## 25. అధ్యాయము.

1 యెహోవా వాక్యము నా యొద్దికి తిరిగీ వచ్చి
2 చెప్పినదేమంటే, । ఓ నర పుత్రుడా, అమ్మోనీయుల
మీద నీ ముఖ దృష్టిని దిట్టపరుచుకొని, భవిష్యత్తుగా
3 అమ్మోనీయులతో చెప్పవలసిన లాగు, । మీరు కర్తయైన
యెహోవా వాక్యమును వినండి; కర్తయైన యెహో
వా ఆనతిచ్చేదేమంటే, నా పరిశుద్ధ స్థలమును అప
విత్రపరచినప్పుడున్ను ఇశ్రాయేలు దేశము పాడయి
పోయినప్పుడున్ను యూదా యింటివారు చెరలోకి
4 వెళ్లినప్పుడున్ను మీరు ఆహా అని నవ్వినందున, । యి
దుగో నేను నిన్ను తూర్పుదిక్కు మనుష్యులను వారికి
స్వాధీనమయ్యేటట్టు చేతును; వారు తమ నగరులను
నీయందు కట్టి స్థిరపర్తురు; నీలో వారు కాపురము
చేతురు; వారు నీ పంటను భుజింతురు; నీ పాలను
5 వారు తాగుదురు. । నేను రబ్బా పట్టణమును వొంటెల
సాలగా చేతును; అమ్మోనీయుల దేశమును గొర్రెల
దొడ్డిగా చేతును; అప్పుడు నేను యెహోవానై
6 వున్నానని మీరు తెలుసుకొందురు. । మరిన్ని యిందుకు
కర్తయైన యెహోవా ఆనతిచ్చేదేమంటే, నీవు చేతు
లను చరుచుకొని, కాళ్లతో గంతులు వేసి, ఇశ్రాయేలు
దేశ విషయమై దృఢ మనస్ఫూర్తిగా సంతోషిస్తివి
7 గనుక, । నేను నా హస్తమును నీ మీదను చాపి, అన్య
జనాంగములకు నిన్ను దోపుడుగా అప్పగించి, జనుల
లోనుంచి నిన్ను తెగటార్చి, దేశములోనుంచి నిన్ను
లయము చేతును; కాగా నేను నిన్ను నాశనము చేసిన
ప్పుడు నేను యెహోవానై వున్నానని నీవు తెలుసు
8 కొందువని ఆనతిచ్చి, । కర్తయైన యెహోవా మరిన్ని
చెప్పేదేమంటే, యూదా యింటివారు అన్య జనాం
గముల లాగున వున్నారని మోయాబువారున్ను శేయీ
9 రు పట్టణపు వారున్ను అనుకొనిరి గనుక, । యిదుగో
నేను మోయాబు దేశపు పక్కను చెరిపి, బేత్యేషీమో
తున్ను బయల్మెయోనున్ను కిర్యాతయీమున్ను అనే దేశ
ముల మహా పురములలోకి తూర్పు వారికి మార్గ
10 మును యిచ్చి, । అన్య జనులలో అమ్మోనీయులు జ్ఞాప
కమునకు రాకుండా మోయాబు వారితో కూడా యీ
అమ్మోనీయులను వీరికి స్వాధీనులయ్యేటట్టు చేతును. ।
11 యీలాగున నేను నా ఆజ్ఞలను మోయాబీయుల మీద
వుంచినందున నేను యెహోవానై వున్నానని వారు
12 తెలుసుకొందురని ఆనతిచ్చి, । మరిన్ని కర్తయైన యె
హోవా చెప్పేదేమంటే, ఎదోము వారు యూదా
యింటివారి మీద తమ పగను తీర్చుకొనిరి; అయితే
యీలాగున వారి మీద పగను తీర్చుకొని, బహు
దోషము చేసిరి గనుక, కర్తయైన యెహోవా ఆన
తిచ్చేదేమంటే, । నేను ఎదోము దేశము మీద నా 13
హస్తమును చాపి, దానినుంచి మనుష్యునున్ను మృగ
మునున్ను తెగవేతును; తేమాను పట్టణము మట్టుకు దా
నిని అరణ్యముగా చేతును; దెదాను వారున్ను కత్తిచేత
కూలుదురు. । మరిన్ని నా ప్రతికారమును ఇశ్రాయే 14
లనే నా జనుల ద్వారా ఎదోము వారి మీద చూపిం
తును; వీరు ఎదోము దేశమందు నా కోప ప్రకారము
గానున్ను నా రౌద్ర ప్రకారముగానున్ను చేతురు. ।
యీలాగున వారు నా ప్రతికారమును తెలుసుకొందు 15
రని కర్తయైన యెహోవా ఆనతిచ్చి, మరిన్ని కర్త
యైన యెహోవా సెలవు యిచ్చేదేమంటే, పెలిష్తీ
యులు తమ పగను తీర్చుకొనిరి; అయితే వారు క్రోధ
మనస్సు కలిగి, దాని పగవల్ల లయము చేయ దలచి,
పగ తీర్చుకొనిరి గనుక, । కర్తయైన యెహోవా 16
ఆనతిచ్చేదేమంటే, యిదుగో నేను పెలిష్తీయుల మీద
నా హస్తమును చాచి, కెరేతీయులను నరికి, సముద్ర
ప్రాంతమందున్న కొదువ వారినిన్ని లయము చేతును.।
యీలాగున నేను రౌద్రముచేత వారిని గద్దించి, భయం 17
కరమైన ప్రతికారము వారికి చేతును; కాగా వారి
మీద నా ఆజ్ఞలను విధించినప్పుడు నేను యెహోవా
నై వున్నానని వారు తెలుసుకొందురని ఆనతిచ్చెనని
చెప్పెను.

## 26. అధ్యాయము.

అయితే పదకొండో సంవత్సరము నెల యొక్క 1
మొదటి దినమున యెహోవా వాక్యము మరిన్ని నా
యొద్దికి వచ్చి చెప్పినదేమంటే, । ఓ నర పుత్రుడా, 2
సోరు పట్టణము యెరూశలేమును గురించి, ఆహా,
జనాంగములకు ద్వారములుగా వున్నది, అది విచ్ఛిత్తి
యి పోయెను, దాని లాభము నాతట్టు తిరిగెను, అది
పాడై పోయినందున నాకు సంపూర్ణమవునని అను
కొనెను గనుక, । కర్తయైన యెహోవా ఆనతిచ్చేదే 3
మంటే, ఓ సోరు పట్టణమా, యిదుగో నేను నీకు
విరోధినై, సముద్రము దాని తరంగములను లేవ చేసి
నట్టు నేను చాలా జనాంగములను నీ మీదికి లేవ
చేతును. । వారు వచ్చి సోరుయొక్క ప్రాకారములను 4
లయము చేసి, దాని గోపురములను కింద పడగొట్టు
దురు; దాని మీదనున్న బుగ్గిని తుడిచి, నునుపు రాయి
లాగున దానిని చేతును. । అది సముద్రమందుండిన జా 5
లర్లు వలలు పరుచుకొనే చోటై వుండును; నేను యీ
లాగున చెప్పితిని గనుక అది జనాంగములకు దోపుడై
వుండును. । పొలములో వున్న దాని కుమార్తెలు కత్తి 6

చేత హతమవుదురు; అప్పుడు నేను యెహోవానై
వున్నానని వారు తెలుసుకొందురు అని కర్తయైన యె
7 హోవా ఆనతిచ్చెను. । యిందుకు కర్తయైన యెహో
వా మరిన్ని చెప్పేదేమంటే, యిదుగో నేను బాబెలు
రాజైన నెబూకద్రెస్సరును సోరు పట్టణము మీదికి
రాచేతును; అతడు రారాజై, గుర్రములతోటిన్ని రథ
ములతోటిన్ని రౌతులతోటిన్ని సైన్యముతోటిన్ని జన
8 సమూహముతోటిన్ని వుత్తర దిక్కునుంచి వచ్చి, । బైటి
పొలములో వున్న నీ కుమార్తెలను హతము చేసి, నీ
యెదుట బురుజులను కట్టించి, దిబ్బను వేసి, నీ పైకి
9 డాళ్లను యెత్తును, । మరిన్ని అతడు నీ ప్రాకారముల
యెదుట యుద్ధపు సూత్రములను వుంచి, అతని గొడ్డం
10 డ్లచేత నీ గోపురములను కింద పడగొట్టును. । అతని
గుర్రములు బహు విస్తారమైనందున ధూళి యెగిరి నిన్ను
కప్పును; బీట సందులు గల పట్టణములోకి సైన్యస్థులు
చొరబడినట్టు అతడు నీ గవునులలో ప్రవేశించినప్పు
డు రౌతుల చక్రములు రథములు మొదలైన వాటి
11 ధ్వనివల్ల నీ ప్రాకారములు కంపించును. । అతని గుర్ర
ముల డెక్కలచేత అతడు నీ వీధులను తొక్కించును;
నీ జనులను కత్తిచేత హతము చేసును; నీ బలమైన కోట
12 లన్నిన్ని నేల మీద కూలును. । వారు నీ ఐశ్వర్యమును
దొంగిలింతురు; నీ వర్తకమును దోచుకొందురు; నీ
ప్రాకారములను కింద పడగొట్టి, నీవు కోరిన యిండ్లను
లయము చేతురు; నీ రాళ్లనున్ను నీ మానులనున్ను నీ
13 బుగ్గినిన్ని నీట్లో పారవేతురు. । యీలాగున నేను
నీ సంగీత నాదమును మానిపింతును; నీ కిన్నెర నాదము
14 యిక వినబడేది లేదు. । నిన్ను నునుపైన రాతివలె చేతు
ను; జాలర్లు వలలు పరుచుకొనే చోటువు అవుదువు;
నీవు తిరిగీ కట్టబడక వుందువు; యెహోవానైన నేను
యీలాగున చెప్పితిని గనుక రూఢమవునని కర్తయైన
15 యెహోవా ఆనతిచ్చెను. । మరిన్ని కర్తయైన యెహో
వా సోరు పట్టణముతో చెప్పేదేమంటే, నీ కూలుట
యొక్క శబ్దమునకున్ను గాయము పొందిన వారి కేక
కున్ను నీలో కలిగిన గొప్ప హతికిన్ని ద్వీపములు
16 కంపించవా? । సముద్రమందున్న అధిపతులందరున్ను
తమ తమ గద్దెల మీదనుంచి దిగి, తమ వస్త్రములనున్ను
అలంకారపు చీరలనున్ను తీసివేతురు; వారు వణుకును
కప్పుకొని, నేల మీద కూర్చుండి, ప్రతి క్షణమూ
17 వణికి, నిన్నుంచి భయభ్రాంతిగా వుందురు. । మరిన్ని
వారు నిన్ను గురించి అంగలార్చ నారంభించి, పలికేదే
మంటే, సముద్రమందున్న అధిపతులకు కాపురమైన
దానవైయిన్ని సముద్రమందు బలము కలిగి పేరుపడిన
దానవైయిన్ని వున్న నీవు యేలాగు లయమై పోతివి!
దానికిన్ని దానిలోకి వచ్చిన వారందరికిన్ని భయ
భ్రాంతి పొందచేసిన దాని కాపురస్థులకున్ను యేలాగు
లయము వచ్చెను! । యిప్పుడు నీవు కూలిన దినమున 18
ద్వీపములు కంపించును; నిజముగా నీవు జరిగిపోవుట
చేత సముద్రమందున్న ద్వీపములు కదులును. । యిం 19
దుకు కర్తయైన యెహోవా మరిన్ని ఆనతిచ్చేదేమం
టే, కాపురస్థులు లేని పట్టణము లాగున నేను నిన్ను
పాడుచేసిన తరువాతనున్ను నీ మీదికి నేను అగాధ
జలములను రప్పించినందున ఘనమైన వుదకములు నిన్ను
ముంచిన తరువాతనున్ను ఆదిని సమాధిలోకి దిగిపో
యిన వారిలోకి నిన్ను దింపి, । నీలో కాపురస్థులు 20
లేకుండా భూమియొక్క అగాధ స్థలములు, అనగా,
ఆదినుంచీ పాడై వున్న స్థలములలో నిన్ను సమాధి
లోకి దిగిపోయిన వారిలో వుంచిన తరువాతనున్ను
నేను జీవస్థుల దేశమును శృంగారింతును. । యీలాగున 21
నేను నిన్ను కలవిలపరుతును; నీవు గతింతువు; యెంత
వెతికినా నీవు కనుబడక వుందువు, అని కర్తయైన
యెహోవా ఆనతిచ్చెనని చెప్పెను.

## 27. అధ్యాయము.

అయితే యెహోవా వాక్యము నా యొద్దికి తిరిగీ 1
వచ్చి చెప్పినదేమంటే, । ఓ నర పుత్రుడా, యిప్పు 2
డు నీవు సోరు పట్టణమును గురించి అంగలార్చనా
రంభించి, సోరు పట్టణముతో చెప్పవలసినదేమంటే, ।
సముద్రపు రేవులలో వుండినదానవున్ను అనేక ద్వీ 3
పాంతరముల జనులకు వర్తకపు దానవున్ను అయిన
దానా, కర్తయైన యెహోవా ఆనతిచ్చేదేమంటే,
ఓ సోరు పట్టణమా, నేను సంపూర్ణ సౌందర్యము
కలదాననైతినని నీవు అనుకొంటివి. । నీ సరిహద్దులు 4
సముద్రముల మధ్యను కలిగి వున్నవి; నీ శిల్పకారులు
నిన్ను సంపూర్ణ సౌందర్యము కల దానిగా చేసిరి. ।
నీ వోడలను శెనీరు దేశపు బరశమానులచేత కట్టిరి; 5
లెబానోనునుంచి అర్జ మానులను తెప్పించి, నీ వోడ
కొయ్యలను చేసిరి. । బాషానుయొక్క అల మానులచేత 6
నీ కోలలను చేసిరి; అష్షూరీయుల జన సమూహము
కిత్తీము ద్వీపములనుంచి వచ్చిన దంతముచేత నీ పీట
లను చేసెను. । మిస్రయీమునుంచి వచ్చిన విచిత్రపు 7
పనిగల సన్నపు నార చాపులను చాప చీరలుగా యె
త్తితివి; ఎలీషా ద్వీపములనుంచి వచ్చిన నీలి పట్టున్ను
వూదా రంగు పట్టున్ను నీవు కప్పుకొంటివి. । ఓ సోరు 8
పట్టణమా, సీదోను కాపురస్థులున్ను అర్వాదు కాపు
రస్థులున్ను నీ వోడ కలాసులున్ను నీలో వున్న ప్రజ్ఞా
వంతులు నీ వోడ నాయకులున్నై వుండిరి. । గెబాలు 9
పెద్దలున్ను బుద్ధిమంతులున్ను నీ తట్టు బాగుచేసేవారై
వుండిరి; సముద్రమందున్న వోడలన్నిన్ని వోడవాండ్లం

దరున్ను నీ యొద్దికి వచ్చి నీ తోటి వర్తకమును చేస్తూ
10 వుండిరి. । పారసీ దేశపు వారున్ను లూదు వారున్ను
పూథువారున్ను నీ బలములో సేనాధిపతులై వుండి,
నీలో డాళ్లనున్ను యుద్ధపు పాగాలనున్ను తగిలించి,
నిన్ను శృంగారము కల దానిగా అగుపడ చేసిరి. ।
11 అర్వాదువారు నీ సైన్యముతో కూడి, నీ చుట్టూ
ప్రాకారముల మీద వుండిరి; గమ్మాదీయులు నీ గోపు
రములలో వుండి, చుట్టూ నీ ప్రాకారముల మీద
తమ డాళ్లను తగిలించి, నీ సౌందర్యమును సంపూర్ణము
12 అయ్యేటట్టుగా చేసిరి. । నానా విధమైన దినుసులు
నీలో విస్తరించినందున తర్షీషువారు నీతో వర్తకము
చేసిరి; వెండినిన్ని యినుమునున్ను తగరమునున్ను సీస
13 మునున్ను తీసుకొని వచ్చి నీ అంగళ్లలో అమ్మిరి. । మరిన్ని
యావానువారున్ను తూబలువారున్ను మెషెఖువారు
న్ను నీతో వర్తకము చేసిరి; వారు నరులనున్ను యిత్తడి
వస్తువులనున్ను తీసుకొని వచ్చి, నీ అంగళ్లలో అమ్మిరి. ।
14 మరిన్ని తోగర్మావారు గుర్రములనున్ను రౌతులను
న్ను వేసడములనున్ను తీసుకొని వచ్చి నీ అంగళ్లలో
15 అమ్మిరి. । మరిన్ని దెదానువారున్ను నీతో వర్తకము
చేస్తూ వుండిరి; చాలా ద్వీపముల వర్తకము నీ చేతికి
వచ్చెను; వారు దంతమునున్ను చేవ కర్రనున్ను తెచ్చి
16 నీకు అమ్మిరి. । నీవు చేసిన వస్తువులు విస్తరించెను గనుక
అరామువారున్ను నీతో వర్తకము చేసిరి; వారు పచ్చ
రాళ్లనున్ను వూదా పట్టునున్ను విచిత్రపు చీరలనున్ను
సన్నపు నార బట్టలనున్ను పగడములనున్ను అకీకపు
రత్నములనున్ను తీసుకొని వచ్చి నీ అంగళ్లలో అమ్మిరి. ।
17 మరిన్ని యూదావారున్ను ఇశ్రాయేలు దేశస్థులున్ను
నీతో వర్తకము చేస్తూ వుండిరి; వారు మిన్నీతుయొ
క్కయున్ను పన్నగుయొక్కయున్ను గోధుమనున్ను
తేనెనున్ను తైలమునున్ను జీగురునున్ను తీసుకొనివచ్చి
18 నీ అంగళ్లలో అమ్మిరి. । దమస్కువారు హెల్బోను
ద్రాక్షా రసమునున్ను తెల్ల బొచ్చునున్ను తీసుకొనివచ్చి,
నీవు విస్తారముగా చేసిన వస్తువులకున్ను నీ విస్తారమైన
19 దినుసులకున్ను ప్రతియిచ్చిరి. । దానువారున్ను యా
వానువారున్ను తిరుగులాడి, యినుప వస్తువులనున్ను
కత్సియా కెనయా అనే సుగంధ ద్రవ్యములనున్ను
20 తీసుకొనివచ్చి నీ అంగళ్లలో అమ్మిరి. । మరిన్ని దెదాను
వారు రథముల కొరకు ప్రశస్తమైన బట్టల వర్తకము
21 నీతో చేస్తూ వుండిరి. । అరబీయులున్ను కేదారు అధి
పతులందరున్ను గొర్రె పిల్లలనున్ను పొట్టేళ్లనున్ను మే
కలనున్ను తీసుకొనివచ్చి నీలో అమ్మిరి; వీటిచేత వారు
22 నీతో వర్తకము చేసిరి. । షెబా వర్తకులున్ను రయ
మా వర్తకులున్ను నీతో వర్తకము చేస్తూ వుండిరి;
వీరు ప్రశస్తమైన గ్రంధ్యాణములనున్ను ప్రియమైన
నానా జాతి రత్నములనున్ను బంగారమునున్ను తెచ్చి
నీ అంగళ్లలో అమ్మిరి. । హారానువారున్ను కన్నేవారు 23
న్ను ఎదేనువారున్ను షెబా వర్తకులున్ను అష్షూరు
వర్తకులున్ను కిల్మదు వర్తకులున్ను నీతో వర్తకము
చేస్తూ వుండిరి. । వీరు నీ వర్తకులై నీలి బట్టలనున్ను 24
విచిత్రపు కుట్టు పని వస్త్రములనున్ను ప్రశస్తమైన
వస్త్రములనున్ను సమస్తమైన పదార్థములనున్ను ఆర్జా
పెట్టెలలో వుంచి తాళ్లతో కట్టి నీ అంగళ్లకు తీసుకొని
వచ్చి వర్తకము చేస్తూ వుండిరి. । తర్షీషు వోడలు నీ 25
అంగడిలో నిన్ను గురించి స్తుతించెను; యీలాగున నీవు
పరిపూర్ణమైన దానవున్ను సముద్రమందు బహు ఘన
మైన దానవున్ను అయితివి. । అయితే నీ కోలలు వేసే 26
వారు నిన్ను ఘనమైన వుదకములోకి తెచ్చిరి; తూర్పు
గాలి సముద్రమధ్యమందు నిన్ను పగలగొట్టెను. । నీ 27
పదార్థములున్ను నీ అంగళ్లున్ను నీ దినుసులున్ను నీ
వోడవారున్ను నీ ఆరకాట్లున్ను నీ తట్టు బాగుచేసేవా
రున్ను నీతో వర్తకము చేసేవారున్ను నీలో వున్న సైన్యా
ధిపతులందరున్ను నీలో వున్న జన సమూహములున్ను
నీవు కూలిన దినమందే సముద్ర మధ్యమందు కూలుదు
రు. । నీ ఆరకాట్ల కేకలవల్ల పట్టణము కింద వున్న వూళ్లు 28
కంపించును. । మరిన్ని కోలలు పట్టుకొనిన వారందరు 29
న్ను వోడవారున్ను వోడ నాయకులున్ను తమ వో
డల మీదనుంచి దిగి, భూమి మీద నిలిచి, । నీకు బహు 30
రోదనముగల శబ్దమును వినబడజేసి, తమ శిరస్సుల
మీద బుగ్గి పోసుకొని, బూడిదెలో పొర్లి, । నిన్ను 31
గురించి తలలు అన్ని బోడి చేసుకొని, గోనెలను కట్టు
కొని, మనశ్చింతచేతనున్ను విషపు యేడ్పుచేతనున్ను
నీ కొరకు బహుగా యేడ్తురు. । మరిన్ని వారు రోదన 32
ముచేసి నిన్ను గురించి అంగలార్చ నారంభించేదేమంటే,
సోరు పట్టణమునకు సమమైనది యేది? సముద్రమం
దుండి లయమైపోయిన ఆ పట్టణమునకు సమమైనది
యేదని నిన్ను గూర్చి అంగలార్తురు. । సముద్రములో 33
నుంచి నీవు దినుసులను బైటికి పంపించి, చాలా జను
లను నిండుగా చేస్తివి; విస్తారమైన నీ పదార్థముల
చేతనున్ను నీ వర్తకముచేతనున్ను భూపతులను ఐశ్వ
ర్యవంతులగా చేస్తివి. । అయితే అగాధమైన వుదకముల 34
యందు నీవు సముద్రపు బలముచేత బద్దలైనప్పుడు
నీ వర్తకమున్ను నీ యావత్సమూహమున్ను నీతో
కూడా కూలును. । ద్వీపములయొక్క కాపురస్తులు నీ 35
విషయమై భయభ్రాంతి పొందుదురు; వారి రాజులు
భయభ్రాంతులవుదురు; వారి ముఖములు చిన్నబోవు
ను. । జనులలో వున్న వర్తకులు నిన్ను అపహసింతురు; 36
నీవు కలవిలపడుటకు హేతువైన దానవై, యిక నీవు లేక
పోదువని ఆనతిచ్చెనని చెప్పుమన్న సెలవు యిచ్చెను.

## 28. అధ్యాయము.

1 అయితే యెహోవా వాక్యము మరిన్ని నా యొ
2 ద్దికి వచ్చి చెప్పినదేమంటే, । ఓ నర పుత్రుడా, నీవు
కర్తయైన యెహోవా ఆనతిచ్చినట్టు సోరు పట్ట
ణపు రాజుతో చెప్పవలసినదేమంటే, నీవు మనస్సులో
గర్వించి, దేవుడనై, సముద్రమందు దైవాసనము మీద
ఆసీనుడనైతినని అనుకొంటివి; యీలాగున నీవు దేవుని
హృదయము వలె నీ హృదయమును చేసుకొన్నప్పటి
3 కిన్ని నీవు మనుష్యుడవు గాని దేవుడవు గావు. । యి
దుగో నీవు దానియేలు కంటే, బుద్ధిమంతుడవైతివి; నీకు
4 మరుగైన రహస్యము వొకటీ లేదు. । నీ తెలివివల్లనున్ను
నీ బుద్ధివల్లనున్ను నీకు ఐశ్వర్యము కలిగెను; నీ ధనా
గారములలో నీవు బంగారమునున్ను వెండినిన్ని దాచు
5 కొంటివి. । నీకు కలిగిన మిక్కిలీ తెలివిచేతనున్ను వర్త
కము చేతనున్ను నీవు విస్తారమైన ఐశ్వర్యమును సం
పాదించుకొంటివి గనుక నీకు కలిగిన ఐశ్వర్యమువల్ల
6 నీ హృదయము గర్వించెను. । కాగా కర్తయైన యె
హోవా ఆనతిచ్చేదేమంటే, నీ హృదయము దేవుని
7 హృదయమని తలంచుకొంటివి గనుక, । యిదుగో నేను
పరదేశులను నీ మీదికి రప్పింతును; వారు జనాంగము
లలో క్రూరులై, సొగసైన నీ తెలివికి విరోధముగా
తమ కత్తులను వరలుదీసి, నీ కాంతిని హీనపరచి, నిన్ను
8 గోత దింపుదురు; । సముద్ర మధ్యమందు హతమైన
9 వారివలె నీవున్ను మరణమును పొందుదువు. । నిన్ను
చంపే వాని యెదుట నేను దేవుడనని యిక చెప్పుదు
వా? నిజముగా నిన్ను చంపే వాని చేతికి నీవు మను
10 ష్యుడవే కాని దేవుడవు గావు. । నిజముగా పరదేశుల
చేత నీవు సున్నతీ లేని వారికి వచ్చిన మరణమును
పొందుదువు; యేమంటే నేను యీలాగున ఆనతిస్తిని
గనుక రూఢమవునని కర్తయైన యెహోవా ఆనతి
11 చ్చెనని చెప్పుమన్న సెలవు యిచ్చెను. । అయితే యె
హోవా వాక్యము మరిన్ని నా యొద్దికి వచ్చిన లాగు, ।
12 ఓ నర పుత్రుడా, నీవు సోరు పట్టణపు రాజును
గురించి అంగలార్పునారంభించి, కర్తయైన యెహో
వా ఆనతిచ్చినట్టు అతనితో చెప్పవలసినదేమంటే, నిం
డయిన తెలివిన్ని సంపూర్ణ సౌందర్యమున్ను కలిగి,
13 వెరసి లెక్కలను ముద్రించే వాడా, । నీవు ఏదేను అనే
దైవ వనములో వుంటివి; కెంపున్ను పుష్యరాగమున్ను
వజ్రమున్ను గరుడ పచ్చయున్ను వైడూర్యమున్ను
సూర్య కాంతమున్ను నీలమున్ను పచ్చయున్ను మాణి
క్యమున్ను అనే అమూల్య రత్నములతోటిన్ని బంగా
రముతోటిన్ని నీవు కప్పబడితివి; కంజరీలున్ను పిల్లన
గ్రోవులున్ను నిన్ను సృష్టించిన దినమున నీ యొద్ద
కలిగి వుండెను. । అభిషేకమును పొంది రెక్కలతో 14
కప్పబడిన కెరూబువై వుంటివి; ఆలాగున నేను నిన్ను
వుండ చేస్తిని; నీవు దేవుని పరిశుద్ధ పర్వతము మీద వుం
టివి; అగ్ని రాళ్లలో నీవు తిరుగులాడితివి. । నిన్ను సృ 15
ష్టించిన దినము మొదలుకొని దోషము నీ యందు
కనుబడే పర్యంతమూ నీ మార్గములయందు నీవు
పరిపూర్ణుడవై వుంటివి. । అయితే నీకు కలిగిన విస్తా 16
రమైన వర్తకముచేత వారు నిన్ను నిండైన బలవంతుని
జేసిరి; నీవు పాపము చేస్తివి గనుక నీవు అపవిత్రుడ
వని దేవుని పర్వతములోనుంచి నేను నిన్ను వెళ్లవేతు
ను; రెక్కలతో కప్పబడిన ఓ కెరూబా, అగ్నిరాళ్ల
మధ్యనుంచి నిన్ను లయము చేతును. । నీ సౌందర్యము 17
వల్ల నీ హృదయము పొంగెను; నీ తేజస్సువల్ల నీ తెలివి
చెడిపోయెను; కాబట్టి నేను నిన్ను నేల మీద కూల
వేతును; రాజులు నిన్ను చూచుటకు వారి ముందర
నిన్ను వేతును. । విస్తారమైన నీ అక్రమములచేతనున్ను 18
నీ వర్తకపు అన్యాయముచేతనున్ను నీవు నీ పరిశుద్ధ
స్థలమును అపవిత్రపరిచితివి; కాబట్టి నీలోనుంచి నేను
అగ్నిని బైటికి రాచేతును; అది నిన్ను దహించును;
నిన్ను చూచిన వారందరి కన్నుల ముందర నిన్ను భూమి
మీద భస్మము చేతును. । జనులలో నిన్ను యెరిగిన వా 19
రందరున్ను నిన్ను చూచి ఆశ్చర్యపడుదురు; నీవు కల
విలపడుటకు హేతువైన దానవై యిక లేకపోదువని
ఆనతిచ్చెనని చెప్పుమన్న సెలవు యిచ్చెను. । అయితే 20
యెహోవా వాక్యము మరిన్ని నా యొద్దికి వచ్చి
చెప్పినదేమంటే, । ఓ నర పుత్రుడా, నీ ముఖ దృ 21
ష్టిని సీదోను పట్టణము మీద దిట్టము చేసి, దానిని
గురించి కర్తయైన యెహోవా ఆనతిచ్చినట్టు భవి
ష్యత్తుగా పలికి చెప్పవలసినదేమంటే, । ఓ సీదోను 22
పట్టణమా, యిదుగో నీకు నేను విరోధినై, నీ మధ్యను
ఘనతను పొందుదును; కాబట్టి దాని మీద నేను ఆజ్ఞ
లను విధించి, దాని మీద నేను పరిశుద్ధుడనుగా అగు
పడినప్పుడు నేను యెహోవానై వున్నానని వారు
తెలుసుకొందురు. । యేమంటే నేను దానిలోకి తెగు 23
లున్ను దాని వీధులలోకి రక్తమునున్ను పంపుదును;
నఖముఖాలనుంచీ దాని మీదికి వచ్చిన కత్తిచేత వారు
హతమౌదురు; అప్పుడు నేను యెహోవానై వున్నా
నని వారు తెలుసుకొందురు. । మరిన్ని ఇశ్రాయేలు 24
యింటివారి చుట్టూ వుండి వారికి పగచేసే వారివల్లను
యిక ఇశ్రాయేలీయులకు గుచ్చుకొనే ముండ్లయినా
నొచ్చే కంప అయినా వుండదు; అప్పుడు నేను యె
హోవానై వున్నానని వారు తెలుసుకొందురని ఆన
తిచ్చి, । మరిన్ని కర్తయైన యెహోవా ఆనతిచ్చేది 25
యేమంటే, చెదిరిపోయిన జనులలో వున్న ఇశ్రాయేలు

యింటి వారిని నేను కూర్చి అన్య జనాంగముల కం
డ్లను వారిచేత పరిశుద్ధుడనని అగుపర్చబడిన తరువాత,
వారు నా సేవకుడైన యాకోబుకు నేను యిచ్చిన వారి
26 దేశమందు కాపురము చేతురు. । మరిన్ని వారు దాని
యందు నిర్భయముగా కాపురము చేసి, యిండ్లను
కట్టుకొని, ద్రాక్ష తోటలను నాటుకొని వుందురు;
నిజముగా నఖముఖాలా వారిని హింసపెట్టిన వారం
దరి మీద నేను ఆజ్ఞలను విధించిన తరువాత వారు
నిర్భయముగా కాపురము చేతురు; అప్పుడు యెహోవా
వానైన నేను వారి దేవుడనై వున్నానని వారు తెలుసు
కొందురని ఆనతిచ్చెనని చెప్పుమన్న సెలవు యిచ్చెను.

## 29. అధ్యాయము.

1 పదో సంవత్సరము పదో నెల పన్నెండో దినము
యెహోవా వాక్యము నా యొద్దికి వచ్చి చెప్పినదే
2 మంటే, । ఓ నర పుత్రుడా, నీ ముఖ దృష్టిని మిస్ర
యీము రాజైన ఫరో మీద దిట్టపరచి, అతని గురిం
చిన్ని మిస్రయీము దేశమంతటిని గురించిన్ని కర్త
యైన యెహోవా ఆనతిచ్చినట్టు భవిష్యత్తుగా పలికి
3 చెప్పవలసినదేమంటే, । దాని ప్రవాహములలో పడు
కొనిన క్రూరమైన పెద్ద మొసలి అనే మిస్రయీము
రాజవైన ఓ ఫరో, యిదుగో నేను నీకు విరోధినైతిని;
నీవు యీ నది నాది, నా కొరకు నేను దీనిని కలుగ
4 చేసుకొంటినని నీవు అనుకొన్నప్పటికిన్ని, । యిదుగో
నేను నీ దవడలలో గాలములను వేసి, నీ నదులలో
వున్న మత్స్యములను నీ పొలుసుకు అంటజేసి, ప్రవా
హములలోనుంచి నిన్ను లాగుదును; నీ ప్రవాహము
లలో వున్న మత్స్యములు అన్నిన్ని నీ పొలుసుకు
5 అంటుకొనును. । మరిన్ని నిన్నున్ను నీ ప్రవాహముల
లో వున్న మత్స్యములన్నిటినిన్ని అరణ్యములో పార
పోతును; నిన్ను యెత్తేవాడున్ను కూర్చేవాడున్ను
లేక బైలు మీద పడుదువు; యేమంటే నేను నిన్ను
భూ మృగములకున్ను ఆకాశ పక్షులకున్ను ఆహార
6 ముగా యిస్తిని. । మరిన్ని మిస్రయీము కాపురస్తులం
దరున్ను ఇశ్రాయేలు యింటివారికి రెల్లు పుల్లగా వుం
డిరి గనుక నేను యెహోవానై వున్నానని వారు
7 తెలుసుకొందురు. । వీరు నిన్ను చేత పట్టుకొనినప్పుడు
విరిగిపోయి, వారి పక్కలలో గుచ్చుకొంటివి; నీ మీద
వారు ఫూనుకొనినప్పుడు నీవు విరిగిపోయి, అన్ని మొ
8 లలున్ను వాటికి అవే నిలిచేలాగు చేస్తివి. । కాబట్టి
కర్తయైన యెహోవా ఆనతిచ్చేదేమంటే, యిదుగో
నేను నీ మీదికి కత్తిని రప్పించి, నీలోనుంచి మనుష్యు
9 నున్ను మృగమునున్ను తెగవేతును. । కాబట్టి మిస్ర
యీము దేశము నిర్మనుష్యముగానున్ను పాడుగానున్ను
వుండును; అప్పుడు నేను యెహోవానై వున్నానని
వారు తెలుసుకొందురు; యీ నది నాది, నేను దీనిని
కలుగ చేస్తినని అతడు అనుకొనెను గనుక, । యిదుగో 10
నేను నీకున్ను నీ జనులకున్ను విరోధినైతిని; మిస్ర
యీము దేశమును సెవేనే మొదలుకొని కూషు సరి
హద్దు మట్టుకు అంతా పాడుగానున్ను నిర్మనుష్యము
గానున్ను చేతును. । దానిలో మనుష్య సంచారమున్ను 11
మృగసంచారమున్ను లేకపోవును; అది నలుభై సంవ
త్సరములు నిర్వాసముగా వుండును. । నిర్మనుష్యము 12
గా వున్న దేశములలో మిస్రయీము దేశమును పా
డుజేతును; పాడైపోయిన పట్టణములలో దాని పట్టణ
ములు నలుభై సంవత్సరముల పర్యంతమూ పాడై వుం
డును; మిస్రీయులను జనాంగములలోకి చెదరవేసి,
దేశముల కడకు వారిని వెళ్లవేతునని ఆనతిచ్చి, । యిం 13
దుకు కర్తయైన యెహోవా మరిన్ని చెప్పే దేమం
టే, నలుభై సంవత్సరములయిన తరువాత చెదిరిపోయి
జనులలో వున్న మిస్రీయులను నేను కూర్చి, । చెర 14
నుంచి తప్పించి, పత్రోసు అనే వారి స్వదేశములోకి
తిరిగీ వారిని తెప్పింతును; అయితే అక్కడ వారి రా
జ్యము నీచమైనదై వుండును. । అది రాజ్యములన్నిటి 15
లో నీచమైన రాజ్యమై వుండును; అది యికను జనాం
గముల మీద అతిశయించక వుండును; యేమంటే నేను
వారిని హీనపర్చినందున యిక జనాంగముల మీద
వారికి కర్తృత్వము లేక వుండును. । కాబట్టి యికమీ 16
దట దానివల్ల ఇశ్రాయేలు యింటివారికి ధైర్యము లేక
వుండును; వారు మిస్రీయుల సహాయము కోరినందున
వచ్చిన దోషముకు మరి హేతువు లేక పోవును; అయి
నందున నేను కర్తనైన యెహోవానై వున్నానని వారు
తెలుసుకొందురని ఆనతిచ్చెనని చెప్పుమన్న సెలవు
యిచ్చెను. । అయితే యిరువై యేడో సంవత్సరము మొ 17
దటి నెల మొదటి దినమున యెహోవా వాక్యము నా
యొద్దికి వచ్చి చెప్పినదేమంటే, । ఓ నర పుత్రుడా, 18
బాబెలు రాజైన నెబూఖద్రెస్సరు తన సైన్యముచేత
సోరు పట్టణము మీద మిక్కిలీ గొప్ప సేవను చేయిం
చెను; సమస్తమైన తలలు బోడివి ఆయెను; సకల భుజ
ములు కొట్టుకొని పోయెను; అయినప్పటికిన్ని అతడు
సోరు పట్టణము మీద చేయించిన సేవ నిమిత్తము అత
నికైనా అతని సైన్యమునకైనా కూలి యెంతమాత్రమూ
లేక పోయెను. । కాబట్టి కర్తయైన యెహోవా ఆనతి 19
చ్చేదేమంటే, యిదుగో నేను మిస్రయీము దేశమును
బాబెలు రాజైన నెబూఖద్రెస్సరుకు యిత్తును; అతడు
దాని జన సమూహమును పట్టుకొని, దాని సొమ్మును
దోచుకొనును; అది అతని సైన్యమునకు కూలి అయి
వుండును. । అతడు సోరు పట్టణము మీద చేసిన సేవ 20

నిమిత్తము అతనికి మిస్త్రీయుల దేశమును యిస్తిని; యే
మంటే వారు నా పనివారై వుండిరని కర్తయైన యె
21 హెూవా ఆనతిచ్చి, మరిన్ని చెప్పేదేమంటే,। ఆ దిన
మందు నేను ఇశ్రాయేలు యింటివారి శృంగమును
చిగిరింప చేసి, వారిలో నీకు వాగ్ధోరణి యిత్తును;
అయినందున నేను యెహెూవానై వున్నానని వారు
తెలుసుకొందురని ఆనతిచ్చెనని చెప్పుమన్న సెలవు
యిచ్చెను.

## 30. అధ్యాయము.

1 అయితే యెహెూవా వాక్యము మరిన్ని నా యొ
2 ద్దికి వచ్చి చెప్పినదేమంటే,। ఓ నర పుత్రుడా, నీవు
కర్తయైన యెహెూవా ఆనతిచ్చినట్టు భవిష్యత్తుగా
పలికి చెప్పవలసిన లాగు, యేమంటే, ఆ దినముకు
3 అయ్యయ్యో! అని అంగలార్చండి, యేమంటే,। ఆ
దినము అనగా యెహెూవా దినము సమీపమాయెను;
ఆ దినమంతా మబ్బుతోనే వుండును; అది అన్య జనాం
4 గములకు సమయమవును.। యేమంటే కత్తి మిస్రయీము
దేశము మీదికి వచ్చును; మిస్రయీము దేశమందు
వారు కూలినప్పుడు కుషు దేశమునకు దిగులు వచ్చును;
యేమంటే వారు దాని జన సమూహమును తీసివేతురు;
5 దాని పునాదులు పడగొట్టబడును.। కుషీయులున్ను
పూథువారున్ను లూదువారున్ను కూబువారున్ను మిళి
తమైన జనులందరున్ను జట్టు కూడుకొనిన దేశపు వా
6 రున్ను వారితో కూడా కత్తిచేత కూలుదురు.। యిం
దుకు యెహెూవా ఆనతిచ్చేదేమంటే, మిస్రయీముకు
వూత యిచ్చినవారు కూలుదురు; దాని గర్వపు బలము
వంచబడును; వారు మిగ్దోలు మొదలుకొని సెవేనే
7 పర్యంతమూ దాని యందు కత్తిచేత కూలుదురు.। మరిన్ని
నిర్మనుష్యమైన దేశములో వారు రిక్తులై వుందురు; వారి
పట్టణములు పాడైపోయిన పట్టణములతో కూడా
8 పాడై పోవును.। యీలాగున నేను మిస్రయీము దేశ
ములో అగ్నిని వుంచిన తరువాతనున్ను దాని సహాయ
కులు లయమైన తరువాతనున్ను నేను యెహెూవానై
వున్నానని వారు తెలుసుకొందురని కర్తయైన యె
9 హెూవా ఆనతిచ్చి, మరిన్ని చెప్పినదేమంటే,। ఆ దిన
మందు నా ముందటనుంచి దూతలు వోడలు యెక్కి
అవతలకు వెళ్లి, నిర్విచారులైన కుషీయులను భయపెట్టు
దురు; మిస్రయీముకు వచ్చిన దినమువలె వారికి భయ
10 భ్రాంతి పుట్టును; అదుగో అది వస్తూ వున్నది.। యిం
దుకు కర్తయైన యెహెూవా ఆనతిచ్చేదేమంటే, బా
బెలు రాజైన నెబూఖద్రెస్సరు హస్తముచేత నేను మిస్ర
11 యీము జన సమూహమును లేకుండా చేతును.। జనాం
గములలో భయంకరమైన వాడున్ను అతని జనులున్ను
ఆ దేశమును లయము చేసుటకు వత్తురు; మిస్రయీము
మీద తమ కత్తులను పరదీసి, దేశమును హతమైన
వారితోటి నిండచేతురు.। నేను దాని నదులను యెండి 12
పోచేసి, ఆ దేశమును దుర్జనుల చేతికి అప్పగింతును;
పరదేశుల హస్తముచేత నేను ఆ దేశమునున్ను దానిలో
వున్న సమస్తమునున్ను పాడుచేతును; యెహెూవా
నైన నేను యీలాగున చెప్పితిని గనుక రూఢమవునని
ఆనతిచ్చి, మరిన్ని కర్తయైన యెహెూవా చెప్పినదే
మంటే,। నేను ఆ విగ్రహములను లయముచేసి, నో 13
ఫులో బొమ్మలను లేకుండా చేతును; మరిన్ని యిక
మిస్రయీము దేశములోనుంచి అధిపతి లేచేది లేదు;
మిస్రయీము దేశముకు భయము కలుగచేతును.। మరి 14
న్ని పత్రోసును పాడు చేతును; సోయనులో అగ్నిని
వుంతును; నోమీద ఆజ్ఞలను విధింతును.। మిస్రయీ 15
ముకు బలమైన సీను మీద నా రౌద్రమును కుమ్మరిం
తును; నోయొక్క జన సమూహమును తెగవేతును.।
మిస్రయీము దేశమందు అగ్నిని వుంచుదును; సీనుకు 16
మిక్కిలీ చెడ్డ నొప్పి పుట్టును; నో బద్దలై పోవును;
ప్రతి దినమున నోఫుకు వుపద్రవములు వచ్చును.।
ఆవెను, పిబెసతు, అనే పట్టణముల పడుచువారు కత్తి 17
చేత కూలుదురు; యీ పట్టణములు చెరలోకి పోవును.।
మరిన్ని మిస్రయీము పెట్టిన కాడి కర్రను నేను 18
తెహప్నెహేసులో విడిచినప్పుడు దాని దినము చీక
టిగా వుండును; దానికి గర్వపు బలము లేకపోవును;
మబ్బు దానిని కప్పును; దాని కుమార్తెలు చెరలోకి
పోదురు.। యీలాగున నేను మిస్రయీము మీద ఆజ్ఞ 19
లను విధించి, తరువాత నేను యెహెూవానై వున్నా
నని వారు తెలుసుకొందురని ఆనతిచ్చెనని చెప్పుమన్న
సెలవు యిచ్చెను.। అయితే పదకొండో సంవత్సరము 20
మొదటి నెల యేడో దినమున యెహెూవా వాక్యము
నా యొద్దికి వచ్చి చెప్పినదేమంటే,। ఓ నర పుత్రుడా, 21
నేను మిస్రయీము రాజైన ఫరో హస్తమును విరిచి
తిని; అది బాగౌటకు కట్టు కట్టుట లేక పోవును; అది
గట్టిదియై కత్తి పట్టుకోగలందులకు గుడ్డ చుట్టుట లేక
పోవునని చెప్పి, యింకా కర్తయైన యెహెూవా ఆన
తిచ్చేదేమంటే,। యిదుగో నేను మిస్రయీము రాజైన 22
ఫరోకు విరోధినై వున్నాను; అతని హస్తములలో బాగా
వున్న దానినిన్ని మునుపు విరిగిపోయిన దానినిన్ని బొ
త్తిగా విరిచి, కత్తిని అతని చేతిలోనుంచి కింద పడ
వేసి,। మిస్రీయులను జనాంగములలోకి చెదరచేసి, దేశ 23
ముల కడకు వెళ్లవేతును.। మరిన్ని బాబెలు రాజు 24
యొక్క హస్తములను బలపరిచి, నా కత్తిని అతని చేతికి
యిత్తును; అయితే ఫరోయొక్క హస్తములను విరిచినం
దున అతడు వీనిముందర గాయముతోటి చనిపోయే

25 వాని లాగున మూల్గును. । యీలాగున నేను బాబెలు
రాజుయొక్క హస్తములను బలపరచుదును, అయితే
ఫరోయొక్క హస్తములు కిందికి వాలును; నేను నా
కత్తిని బాబెలు రాజు చేతికి యిచ్చినప్పుడున్ను అతడు
దానిని మిస్రయీము దేశము మీద చాపినప్పుడున్ను
నేను యెహోవానై వున్నానని వారు తెలుసుకొం
26 దురు. । నేను మిస్రీయులను జనాంగములలోకి చెదర
గొట్టి, దేశములకడకు వెళ్లవేసినప్పుడు, నేను యెహో
వానై వున్నానని వారు తెలుసుకొందురని ఆనతిచ్చెనని
చెప్పెను.

## 31. అధ్యాయము.

1 అయితే పదకొండో సంవత్సరము మూడో నెల
మొదటి దినమున యెహోవావా వాక్యము నా యొద్దికి
2 వచ్చి చెప్పినదేమంటే, । ఓ నర పుత్రుడా, నీవు మిస్ర
యీము రాజైన ఫరోతోటిన్ని అతని సమూహముతో
టిన్ని చెప్పవలసినదేమంటే, ఘనుడవైన నీవు యెవనితో
3 సముడవవుదువు! । అదుగో అష్షూరువాడు లెబానోను
ఆర్జ వృక్షమై వుండెను; అతని కొమ్మలు శృంగార
ముగా వుండెను; ఆకులవల్ల నీడ విశాలమై వుండెను;
బహుగా వున్నతమైనందున అతని శిఖరము చిక్కని
4 కొమ్మలలో అగుపడెను. । వుదకములవల్ల అతడు మి
క్కిలీ గొప్పగా వుండెను; లోతైన నదివల్ల అతడు
మిక్కిలీ పొడుగై వుండెను; ఆ నది అతని మొక్కల
చుట్టూ పారే తన కాలువలను భూమి మీద వున్న
5 చెట్లకన్నిటికీ ప్రవహింపచేసెను. । కాబట్టి అతని పొ
డుగు భూ వృక్షములన్నిటి కంటే పైగా వుండెను;
అతని శాఖలు బహు విస్తారమై వుండెను; వుదకములు
బహు విస్తారమైనందున అతడు ఫుట్టించిన చిగురులు
6 పొడుగైన కొమ్మలాయెను. । ఆకాశపు పక్షులన్నిన్ని
అతని శాఖలలో గూళ్లను కట్టుకొనెను; భూ మృగ
ములన్నిన్ని అతని కొమ్మల కింద పిల్లలను పెట్టెను; అతని
నీడలో సకలమైన గొప్ప జనాంగములున్ను నివసించె
7 ను. । యీలాగున అతడు పొడుగైన కొమ్మలు కలిగి,
మిక్కిలీ గొప్పగా వుండి, కంటికి అందము గలవాడై
వుండెను; యేమంటే అతని వేరు విస్తారమైన వుదకముల
8 దగ్గిర వుండెను. । దైవ వనములో వున్న ఆర్జ వృక్ష
ములు అతని మరుగు చేయలేక పోయెను; బరళ వృక్ష
ములు అతని శాఖలకు సమమైనవి కావు; అరమ వృక్ష
ములు అతని కొమ్మలకు సమమైనవి కావు; దైవ వనమం
దున్న వృక్షములలో అతనికి వున్న శృంగారము వొక
9 దానికీ లేదు. । అతనికి విస్తారమైన కొమ్మలను యిచ్చి,
నేను అతని శృంగారించినందున ఏదెను అనే దైవ
వనమందున్న వృక్షములన్నిన్ని అతని భాగ్యమునకు
చింతపడెను. । అయితే యిందుకు కర్తయైన యెహోవా 10
వా ఆనతిచ్చేదేమంటే, మిక్కిలీ పొడుగైన నీవు అతి
శయ పడినట్టు అతడు తన శిరస్సును చిక్కని కొమ్మల
మీదికి మిక్కిలీ పొడుగయ్యేటట్టు యెత్తుకొన్నందున
అతని హృదయము అతిశయించెను. । కాబట్టి నేను 11
జనాంగములలో బలము గల వాని చేతికి తగినట్టు చేసు
టకు అతని అప్పగిస్తిని; అతని దోషము నిమిత్తము నేను
అతనిని అవతలకు వెళ్లవేస్తిని. । అయినందున జనాంగ 12
ములలో క్రూరులైన పరదేశులు అతని నరికి పడవే
సిరి; అతని కొమ్మలు కొండలయందున్ను సకలమైన లో
వల యందున్ను పడెను; దేశమందున్న సకల నదుల
యొద్ద అతని శాఖలు విరిగిపడెను; అతని నీడ పోయి
నప్పుడు లోకులందరున్ను అతని విడిచిరి. । పడిపో 13
యిన అతని మొరడు మీద ఆకాశపు పక్షులన్నిన్ని
నివసించెను; అతని కొమ్మల మీదికి భూ మృగములన్ని
న్ని వచ్చెను. । యిది వుదకముల దగ్గిర వున్న వృక్షము 14
లన్నిటిలో యేదైనా వాటి వున్నతమందు అతిశయించక
నున్ను చిక్కని కొమ్మల మీదికి వాటి శిరస్సులను యె
త్తక నీటిని పీల్చే వృక్షములు తమ వున్నతమందు నమ్మ
కుండా వుండేటట్టు సంభవించును; యేమంటే, వారం
దరున్ను మరణమునకు అప్పగించబడి గోతికి వెళ్లిన
నర పుత్రులతో కూడా భూమియొక్క అగాధ స్థల
ములలోకి వెళ్లిరి. । యిందుకు కర్తయైన యెహోవా 15
ఆనతిచ్చేదేమంటే, అతడు పాతాళములోకి వెళ్లిన దిన
మున నేను అంగలార్పు పుట్టిస్తిని; అతని కొరకు నేను
అగాధమును కప్పితిని; దాని ప్రవాహములను బంధిం
చినందున ఘనమైన వుదకములు నిలిచిపోయెను; అతని
కొరకు నేను లెబానోను పర్వతమును నలుపు చేస్తిని;
భూ వృక్షములన్నిన్ని అతని గురించి మూర్ఛిల్లెను. ।
గోతబడిన వారితో కూడా నేను అతని పాతాళము 16
లో వేసినప్పుడు నేను అతని పాటుకు జనాంగములను
కంపింప చేస్తిని; మరిన్ని ఏదెను వనముయొక్క వృక్ష
ములన్నిన్ని లెబానోనుయొక్క మిక్కిలి విశేష వృక్ష
ములున్ను నీటిని పీల్చిన చెట్లు యావత్తున్ను భూమి
యొక్క అగాధ స్థలములందు వోదార్పును పొం
దెను. । జనాంగములలో అతని నీడను నివసించి, అత 17
నికి హస్తము వలె వున్నవారున్ను అతనితో కూడా
కత్తిచేత హతమైన వారి యొద్దికి పాతాళములోకి
వెళ్లిరి. । కాబట్టి ఘనముగానున్ను గొప్పగానున్ను వున్న 18
నీవు ఏదెనుయొక్క వృక్షములలో దేనికి సముడవవు
దువు? అయినప్పటికిన్ని ఏదెనుయొక్క వృక్షములతో
కూడా నీవు భూమియొక్క అగాధ స్థలములలోకి
దింపబడుదువు; కత్తిచేత హతమైన వారితో కూడా
నీవు సున్నతీలేని వారిలో పడివుందువు. యిదే ఫరోను

గురించిన్ని అతని సమూహమును గురించిన్ని అయి
వున్నదని కర్తయైన యెహోవా ఆనతిచ్చెనని చెప్పు
మన్న సెలవు యిచ్చెను.

## 32. అధ్యాయము.

1 అయితే పన్నెండో సంవత్సరము పన్నెండో నెల
మొదటి దినమున యెహోవా వాక్యము నా యొద్దికి
2 వచ్చి చెప్పినదేమంటే, । ఓ నర పుత్రుడా, మిస్రయీ
ము రాజైన ఫరోను గురించి నీవు అంగలార్చ నారం
భించి, అతనితో చెప్పవలసినదేమంటే, జనాంగముల
లో నీవు కొదమ సింహము వంటివాడవైతివి; జలచర
ములలో మొసలివంటి వాడవైతివి; నీవు నదులలోనుంచి
తోసుకొ వచ్చి, నీ కాళ్లచేత వుదకములను కదల్చి,
3 వాటి నదులను కలపరిచితివి. । కాబట్టి కర్తయైన యె
హోవా ఆనతిచ్చేదేమంటే, చాలా జనులను సమ
కూర్చి, నా వల నీ మీద వేసినందున వారు నా వల
4 లో చిక్కిన నిన్ను బైటికి లాగుదురు. । అప్పుడు నేను
భూమి మీదనుంచి నిన్ను బైట పారవేతును; ఆకా
శపు పక్షులన్నీ నీ మీద వాలేటట్టు చేసి, నీ వల్ల భూ
5 మృగములన్నీ తృప్తిపడ చేతును. । నీ మాంసమును పర్వ
తముల మీద వేసి, నీ యౌన్నత్యముతోటి లోవలను
6 నిండచేతును. । మరిన్ని యే దేశమందు నీవు యీదు
తూ వుంటివో ఆ దేశపు పర్వతములయందు నీ రక్త
మును తాగింతును; నదులున్ను నీ వల్ల నిండి యుండు
7 ను. । మరిన్ని నిన్ను నిర్మూలము చేసినప్పుడు నేను ఆకా
శమండలమును విప్పి, నక్షత్రములను చీకటిగా చేతును;
సూర్యుని మబ్బుచేత కప్పుదును; చంద్రుడు వెన్నెల
8 కాయకపోవును. । నీ నిమిత్తము ఆకాశమందు ప్రకా
శించే వెలుగులన్నిటికీ అంధకారము కలగజేసి, నీ దేశ
9 ము మీద గాఢమైన చీకటిని వుంతును. । మరిన్ని నీవు
యెరుగని దేశములలో వున్న జనాంగములలోకి నీ
నాశపు కబురు తెప్పించి, చాలా జనుల హృదయము
10 లకు చింత కలుగచేతును. । యేమంటే నా కత్తిని నేను
వారి ముందర ఆడించి, నిన్నుంచి, చాలా జనులను
కలవిలపడజేతును; వారి రాజులున్ను నిన్నుంచి విభ్రాం
తిపడుదురు; నీవు కూలే దినమున వారందరున్ను తమ
ప్రాణముల కొరకు ప్రతి నిముషమూ వణుకుతూ వుం
11 దురు. । యిందుకు కర్తయైన యెహోవా ఆనతిచ్చే
దేమంటే, బాబెలు రాజుయొక్క కత్తి నీ మీదికి వచ్చు
12 ను. । బలమైన వారి కత్తుల చేత నేను నీ సమూహ
మును కూలచేతును; జనాంగములలో భయంకరులైన
వారందరున్ను పడిపోదురు; వారు మిస్రయీముయొ
క్క అతిశయమును తీసి వేతురు; దాని జన సమూహ
13 మంతా లయమవును. । మరిన్ని గొప్ప ప్రవాహముల
యొద్ది మృగములన్నిటిని నేను లయము చేతును; యిక
మనుష్యుని కాలు అయినా మృగము కాలు అయినా
వాటిని బాధ పెట్టదు. । అప్పుడు నేను వారి వుదకము 14
లను లోతుగా చేసి, వారి నదులను తైలమువలె ప్రవ
హింప చేతునని కర్తయైన యెహోవా ఆనతిచ్చి, మరి
న్ని చెప్పేదేమంటే, । నేను మిస్రయీము దేశమును 15
పాడు చేసినప్పుడున్ను పరిపూర్ణమై వున్న ఆ దేశము
సర్వ శూన్యమైనప్పుడున్ను దాని యందు కాపురము
చేసిన వారందరినిన్ని నేను నరికినప్పుడున్ను నేను యె
హోవానై వున్నానని వారు తెలుసుకొందురు. ।
యీలాటి అంగలార్పు చేత వారు దానిని గురించి 16
అంగలార్తురు; జనాంగముల కుమార్తెలు దానిని గురించి
అంగలార్తురు; మిస్రయీమును గురించిన్ని దాని
సమూహమును గురించిన్ని వారు అంగలార్తురని కర్త
యైన యెహోవా ఆనతిచ్చెనని చెప్పుమన్న సెలవు
యిచ్చెను. । అయితే పన్నెండో సంవత్సరము నెలయొ 17
క్క పదిహేనో దినమున యెహోవా వాక్యము
నా యొద్దికి వచ్చి చెప్పినదేమంటే, । ఓ నర పుత్రు 18
డా, మిస్రయీము సమూహమును గురించి అంగలా
ర్చుము; దానినిన్ని పేరు పొందిన జనాంగముల కుమా
ర్తెలనున్ను గోతికి పోయిన వారితో కూడా భూమి
యొక్క అగాధ స్థలములలో పడవేయుము. । సౌంద 19
ర్యమునకు నీవు యెవరిని మించిన వాడవు! నీవు దిగి
సున్నతీ లేని వారిలో శయనించుము. । కత్తిచేత హత 20
మైన వారితో వారు కూలుదురు; అది కత్తికి అప్పగిం
చబడెను; దానినిన్ని దాని సమూహమునున్ను యీడ్చు
ము. । పాతాళము నడమ వున్న పరాక్రమశాలులలో 21
బలము గలవారు అతనితోటిన్ని అతనికి సహాయులైన
వారితోటిన్ని మాట్లాడుదురు; వారు దిగిపోయిరి; సున్న
తీ లేనివారు కత్తిచేత హతమై అక్కడ పడి వుండిరి. ।
అష్షూరున్ను దాని యావత్సమూహమున్ను అక్కడ 22
వుండెను; అతని సమాధులు అతని చుట్టూ వున్నవి;
అందరున్ను కత్తిచేత హతమై కూలిరి. । వారి సమాధులు 23
గోతి పక్కలలో వున్నవి; దాని సమూహము దాని
సమాధి చుట్టూ నిలిచి వున్నది; అందరున్ను జీవస్థుల
దేశమందు మిక్కిలీ భయమును పుట్టించినప్పటికిన్ని
కత్తిచేత హతమై కూలిరి. । అక్కడ ఏలామున్ను దాని 24
యావత్సమూహమున్ను దాని సమాధి చుట్టూ నిలిచి
వుండెను; అందరున్ను సున్నతీ లేనివారై, కత్తిచేత హత
మై కూలి, భూమియొక్క అగాధ స్థలములలోకి పోయిరి;
వీరు జీవస్థుల దేశమందు భయము పుట్టించినప్పటికిన్ని
గోతికి పోయే వారితో కూడా తమ సిగ్గును తామే
పొందుతూ వుండిరి. । వారు దాని సమూహముతో 25
కూడా దానికి హతమైన వారిలో శయనమును యిచ్చిరి;

దాని సమాధులు దాని చుట్టూ వుండెను; అందరున్ను
సున్నతి లేనివారై, కత్తిచేత హతమైరి; వారు జీవస్థుల
దేశమందు భయము పుట్టించినప్పటికిన్ని గోతికి పో
యిన వారితో కూడా తమ సిగ్గును తామే పొందుతూ
వుండిరి; అతడు హతమైన వారిలో వుంచబడెను. ।
26 అక్కడ మెషెఖున్ను తూబలున్ను దాని సమూహ
మున్ను వుండెను; దాని సమాధులు అతని చుట్టూ వుం
డెను; అందరున్ను సున్నతి లేనివారై, జీవస్థుల దేశ
మందు భయము పుట్టించినప్పటికిన్ని కత్తిచేత హత
27 మైరి. । వీరు సున్నతి లేనివారిలో కూలి, ఆయుధముల
తోటి పాతాళములోకి వెళ్లిన పరాక్రమశాలులలో
పడుకోక వుందురు; వారి శిరస్సుల కింద వారి కత్తులను
వుంచుకొనిరి; అయితే వారు జీవస్థుల దేశమందు బలా
ఢ్యులకు కూడా భయంకరమైన వారై వున్నప్పటికిన్ని
28 తమ దోషములు తమ శల్యముల మీద వుండును. । నిజ
ముగా నీవున్ను సున్నతి లేని వారిలో విచ్ఛిత్తయి,
29 కత్తిచేత హతమైన వారితోటి పడుకొందువు. । అక్కడ
ఎదోమున్ను దాని రాజులున్ను దాని అధిపతులందరు
న్ను తమ పరాక్రమముతో కూడా కత్తిచేత హతమైన
వారి యొద్ద వుంచబడిరి; సున్నతిలేని వారితోనున్ను
గోతికి పోయిన వారితోనున్ను పడుకొని వుండిరి. ।
30 అక్కడ వుత్తర దేశపు అధిపతులందరున్ను సీదోనీయు
లున్ను వుండిరి; వీరు హతమైన వారితో కూడా కిందికి
పోయిరి; వారి భయముతో బల విషయమై సిగ్గుపడి,
సున్నతి లేనివారై కత్తిచేత హతమైన వారితో పడు
కొని, గోతికి పోయిన వారితో సిగ్గు పొందుతూ వుం
31 డిరి. । అయితే ఫరో వారిని చూచి, తన సమూహమంత
టిని గురించి ఓదార్పు తెచ్చుకొనెను; ఫరోయున్ను
అతని యావత్సైన్యమున్ను కత్తిచేత హతమై వారిని
32 చూతురు. । యేమంటే నేను జీవస్థుల దేశమందు భయ
మును పుట్టింతును; కాబట్టి ఫరోయున్ను అతని సమూ
హమంతయున్ను కత్తిచేత హతమైన సున్నతి లేని వారి
యొద్ద వుంచబడుదురని కర్తయైన యెహోవా ఆనతి
చ్చెనని చెప్పుమన్న సెలవు యిచ్చెను.

## 33. అధ్యాయము.

1 యెహోవా వాక్యము మరిన్ని నా యొద్దికి వచ్చి
2 చెప్పినదేమంటే, । ఓ నర పుత్రుడా! నీవు నీ జనుల
పిల్లలను చూచి, వారితో చెప్పవలసినదేమంటే, నేను
దేశము మీదికి కత్తిని రప్పించబోయే సమయమందు
దేశపు జనులు తమ సరిహద్దులలో ఒకని యెంచి కాపరి
3 గా నిర్ణయించినప్పుడు, । అతడు దేశము మీదికి వచ్చే
కత్తిని చూచి, బాకా వూది, జనులను జాగ్రత పడుమం
4 టే, । బాకా నాదము వినిన వాడు జాగ్రతపడనందున
కత్తి వచ్చి అతని ప్రాణమును పుచ్చుకొంటే, అతని రక్త
ము అతని శిరస్సు మీదనే వుండును. । యేమంటే అతడు 5
బాకా నాదము విని, జాగ్రతపడక వుండెను; అతని
రక్తము అతని మీదనే వుండును; అయితే జాగ్రత
పడిన వాడు తన ప్రాణమును రక్షించుకొనును. ।
అయితే కాపరి వచ్చే కత్తిని చూచి బాకా వూద 6
నందున, జనులు అజాగ్రతగా వున్నప్పుడు కత్తి వచ్చి
వారిలో ఒకని ప్రాణమును పుచ్చుకొంటే, అతడు
తన దోషమువల్ల పోవును; అయితే అతని రక్త దోష
మును గురించి ఆ కాపరిని అడుగుదును. । ఆ ప్రకా 7
రముగా ఓ నర పుత్రుడా, నేను నిన్ను ఇశ్రాయేలు
యింటి వారికి కాపరినిగా నిర్ణయిస్తిని; కాబట్టి నీవు
నా నోటి వాక్యమును విని, నా యొద్దనుంచి వా
రిని జాగ్రత చేయుము. । నేను దుర్మార్గునితో ఓ 8
దుర్మార్గుడా, నిజముగా నీవు మరణము పొందుదువని
ఆనతిచ్చినప్పుడు, నీవు అతని దుర్మార్గతను గురించి జా
గ్రతపడేటట్టు ఆ దుర్మార్గునితో చెప్పకపోతే, ఆ దుర్మా
ర్గుడు తన దోషమువల్ల మరణమవును; అయితే అతని
రక్త దోషమును గురించి నిన్ను అడుగుదును. । అయితే 9
ఆ దుర్మార్గుడు అతని దుర్మార్గతను విడువవలెనని నీవు
అతని జాగ్రత చేసినప్పటికిన్ని అతడు తన దుర్మార్గతను
విడువకపోతే, అతడు అతని దోషమువల్ల మరణమవును;
అయితే నీ ప్రాణమును నీవు రక్షించుకొందువు. । అయితే 10
ఇశ్రాయేలు యింటివారు మా అక్రమములున్ను మా
పాపములున్ను మా మీదనే వున్నవి, మేము వాటివల్ల
క్షీణింతుము, మరి యేలాగు బ్రతుకుదుమని అనుకొం
దురు. । కాబట్టి ఓ నర పుత్రుడా, నీవు వారిని చూచి, 11
వారితో కర్తయైన యెహోవా ఆనతిచ్చినట్టు చెప్ప
వలసినదేమంటే, నా జీవముతోడు, దుర్మార్గుని మరణ
మువల్ల కాదు దుర్మార్గుడు తన దుర్మార్గతను విడిచి బ్ర
తుకుటవల్ల నాకు సంతోషము కలుగును; కాబట్టి ఓ
ఇశ్రాయేలు యింటివారలారా, మీ దుర్మార్గతను విడిచి
తిరుగండి, తిరుగండి; మీరు యెందుకు మరణము పొం
దుదురని చెప్పుము. । మరిన్ని ఓ నర పుత్రుడా, నీవు 12
నీ జనుల పిల్లలతో చెప్పవలసినదేమంటే, నీతిపరుని నీతి
అతడు యే దినమున తప్పితము చేసునో వాని తప్పించ
లేక పోవును; అక్రమపు వాడు తన అక్రమమును విడిచి
తిరిగే దినమున తన అక్రమముచేత తాను పడిపోడు;
ఆలాగునే నీతిపరుడు పాపము చేసిన దినమున తన నీతి
చేత తాను బ్రతుకడు. । నేను నీతిపరుడు నిజముగా బ్ర 13
తుకునని చెప్పినప్పుడు అతడు తన నీతిని నమ్మి అన్యాయ
ము జరిగిస్తే, అతని నీతి జ్ఞాపకమునకు రాకపోవును; అత
డు చేసిన అన్యాయమువల్ల అతడే మరణమవును. । మరి 14
న్ని దుర్మార్గుడు నిజముగా మరణ మవును అని నేను

చెప్పినప్పటికిన్ని అతడు తన పాపమును విడిచి, నీతి
15 న్యాయములను జరిగించి, । కుదువను తిరిగీ యిచ్చి, అత
డు దొంగిలిన దాని నిమిత్తము సమాధానపరిచి, అన్యా
యము జరిగించక, బ్రతుకుటకై కట్టడల యందు నడి
చినట్టయితే, అవశ్యముగా అతడు మరణముకాక బ్రతు
16 కును. । అతడు చేసినపాపములలో యే వొకదానిని
గురించి అయినా జ్ఞాపకము రాకపోవును; అతడు నీతి
న్యాయములను జరిగించెను గనుక అవశ్యముగా బ్రతు
17 కును. । యీలాగైనప్పటికిన్ని నీ జనులైన వారు యె
హోవా మార్గము తిన్ననిది కాదని అనుకొనిరి, అయితే
18 తమ మార్గమే తిన్ననిది కాదు. । నీతిపరుడు తన నీతిని
విడిచి, అన్యాయము జరిగిస్తే, ఆ అన్యాయమువల్ల అత
19 డు మరణమవును. । మరిన్ని దుర్మార్గుడు తన దుర్మార్గతను
విడిచి, నీతి న్యాయములను జరిగిస్తే, అందువల్ల అతడు
20 బ్రతుకును. । అయినప్పటికిన్ని మీరు యెహోవా మా
ర్గము తిన్ననిది కాదని అనుకొంటిరి, అయితే ఓ ఇశ్రా
యేలు యింటివారలారా, మీ మీ మార్గముల ప్రకా
రము నేను మీకు న్యాయమును తీర్చుదునని ఆనతిచ్చె
21 నని చెప్పుమన్న సెలవు యిచ్చెను. । అయితే మనము
చెరలోకి వచ్చిన పన్నెండో సంవత్సరము పదో నెల
అయిదో దినమున వొకడు యెరూశలేములోనుంచి
తప్పించుకొని, నా యొద్దికి వచ్చి, పట్టణము కొట్టబడె
22 నని తెలియ చెప్పెను. । అయితే ఆ తప్పించుకొనిన
వాడు వచ్చిన వెనుకటి నాటి అస్తమానమందు యెహో
వా హస్తము నా మీద వుండెను; వుదయమందు అతడు
నా యొద్దికి రాక మునుపే ఆయన నా వాక్కును తె
రువ చేసెను; యీలాగున నా వాక్కు తెరువ చేయ
బడినందున నేను అప్పటినుంచీ మరి మౌనిని కానైతిని. ।
23 అప్పుడు యెహోవా వాక్యము నా యొద్దికి వచ్చి
24 చెప్పినదేమంటే, । వో నర పుత్రుడా, పాడైపోయిన
ఇశ్రాయేలు దేశములో కాపురము చేసినవారు అను
కొనినదేమంటే, అబ్రాహాము తన వొకని కొరకే యీ
దేశమును స్వతంత్రించుకొనెను, మనము అనేకులమై
వున్నాము; యీ దేశము మనకున్ను స్వాధీనముగా యి
25 వ్వబడెనని అనుకొనిరి. । కాబట్టి కర్తయైన యెహో
వా ఆనతిచ్చినట్టు వారితో చెప్పవలసినదేమంటే, మీరు
రక్తముతోటే తిందురు; మీ విగ్రహముల వైపు దృ
ష్టించి రక్తమును చిందింతురు; మీరు దేశమును స్వతం
26 త్రించుకో వచ్చునా? । మీ కత్తిని మీరు నమ్ముతూ
వుంటిరి; యేహ్యమైనది చేస్తూవుంటిరి; మీరందరున్ను
మీ పొరుగు వారి భార్యలను చెరుపుతూ వుంటిరి; మీ
వంటి వారు దేశమును స్వతంత్రించుకో వచ్చునా!
27 అని చెప్పుమని, । మరిన్ని కర్తయైన యెహోవా ఆన
తిచ్చినట్టు చెప్పవలసినదేమంటే, నా జీవముతోడు,
పాడై పోయిన ఆ స్థలములందున్న వారు కత్తిచేత కూ
లుదురు; బైట భూమిలో వున్న వారిని మృగములకు
భక్షణగా యిత్తును! మరిన్ని కోటలందున్ను గుహల
యందున్ను వున్నవారు తెగులుచేత మరణమవుదురు. ।
యేమంటే నేను ఆ దేశమును బహుగా పాడు చేతును; 28
దాని బలాతిశయమును పోచేతును; యెవరూ రాకుం
డా ఇశ్రాయేలు పర్వతములు పాడౌను. । యీలాగున 29
వారు చేసిన యేహ్యములైన వాటి యన్నిటి నిమిత్తము
నేను దేశమును మిక్కిలీ పాడు చేసినప్పుడు నేను యె
హోవానై వున్నానని వారు తెలుసుకొందురని ఆన
తిచ్చెనని చెప్పుము. । మరిన్ని వో నర పుత్రుడా నీ 30
జనుల పిల్లలు నిన్ను గురించి గోడ దగ్గిరనున్ను యింటి
ద్వారములందున్ను వొకరిని వొకరు చూచుకొని, రండి,
మనము వెళ్లి యెహోవా యొద్దనుంచి వచ్చిన వాక్య
ము యేమిటో అది అంతా విని వత్తమని జనులు వచ్చి
నట్టు నీ యొద్దికి వచ్చి, । నా జనులైనట్టు నీ ముందర 31
కూర్చుండి, నీ మాటలను విన్నప్పటికిన్ని వాటి ప్రకా
రము చేయరు; నోటిచేత మహా స్నేహమును అగుప
ర్తురు, అయితే వారి హృదయములు ద్రవ్యమును వెం
టాడును. । మరిన్ని యిదుగో వారికి నీవు వాద్యమును 32
బాగా వాయించి, మంచి స్వరము కలిగిన వాని ఆనం
దపు పాట లాగున వున్నావు; యేమంటే వారు నీ మాట
లను విందురుగాని వాటి ప్రకారము చేయరు. । అయితే 33
అది సంభవించినప్పుడు యిదుగో అది సంభవిస్తుంది;
అప్పుడు దీర్ఘదర్శియైన వొకడు వారిలో వుండెనని
వారు తెలుసుకొందురని చెప్పెను.

## 34. అధ్యాయము.

మరిన్ని యెహోవా వాక్యము నా యొద్దికివచ్చి 1
చెప్పినదేమంటే, । వో నర పుత్రుడా, నీవు ఇశ్రాయే 2
లుయొక్క బోయలను గురించి భవిష్యత్తుగా పలుకు
ము; కర్తయైన యెహోవా ఆనతిచ్చినట్టు భవిష్య
త్తుగా పలికి, ఆ బోయలతో చెప్పవలసినదేమంటే, తమ
కడుపు తామే నింపుకొనిన ఇశ్రాయేలు బోయలకు
అయ్యో! బోయలు గొర్రెలను మేప వలెను. । మీరు 3
మదమును తిందురు; బొచ్చును కప్పుకొందురు; కొవ్విన
వాటిని చంపుదురు; అయితే మీరు గొర్రెలను మేపరు. ।
బలహీనమైన వాటిని మీరు బలపరచలేదు; తెగులు 4
గల వాటిని స్వస్థపరచలేదు; విడిన వాటిని కట్టలేదు;
తోలివేసిన వాటిని మళ్లించ లేదు; తప్పిపోయిన వా
టిని వెతుకలేదు; అది మాత్రమే కాకుండా మీరు
కఠినత్వము చేతనున్ను క్రూరత్వము చేతనున్ను వాటిని
యేలితిరి. । కాబట్టి బోయడు లేదు గనుక అవి చెదిరి 5
పోయెను; చెదిరిపోయి సకల భూ మృగములకున్ను

6 ఆహారమాయెను. । నా గొఱ్ఱెలు పర్వతములన్నిటి మీ
దనున్ను పొడుగైన ప్రతి కొండమీదనున్ను తిరుగు
తూ వుండెను; మరిన్ని నా గొఱ్ఱెలు భూమిమీద
అంతటా చెదిరిపోయినప్పటికిన్ని వాటి నిమిత్తము
7 విచారపడి వెతికిన వాడు వొకడున్ను లేడు. । కాబట్టి
వో బోయలారా, యెహోవా వాక్యమును వినండి. ।
8 కర్తయైన యెహోవా ఆనతిచ్చేదేమంటే, నా గొ
ఱ్ఱెలు ఆలాగున దోపుడు పడెను, నా గొఱ్ఱెలకు బో
యడు లేడు గనుక అవి సకల భూ మృగములకున్ను
ఆహారమాయెను; బోయలు నా గొఱ్ఱెలను వెతకలేదు;
బోయలు తమ కడుపును తామే నింపుకొని గొఱ్ఱెలను
9 మేపలేదు. । కాబట్టి వో బోయలారా, యెహోవా
10 వాక్యమును వినండి. । కర్తయైన యెహోవా ఆనతి
చ్చేదేమంటే, యిదుగో నేను ఆ బోయలకు విరోధినై
తిని; నా జీవముతోడు, నా గొఱ్ఱెలను గురించి వారిని
అడుగుదును; గొఱ్ఱెలను మేపుట వారిచేత మాన్పిం
తును; యికను బోయలు తమ కడుపు తామే నింపుకొ
నుట లేకపోవును, యేమంటే నా గొఱ్ఱెలు వారికి
ఆహారము కొరకు కాకుండా వారి నోట్లోనుంచి వా
11 టిని విడిపింతును. । మరిన్ని యిందుకు కర్తయైన యె
హోవా ఆనతిచ్చేదేమంటే, యిదుగో నేను, అవును
12 నేనే, నా గొఱ్ఱెలను వెతికి కనిపెట్టుదును. । బోయడు
తన గొఱ్ఱెలు చెదిరిపోయినప్పుడు వాటిని వెతికినట్టు
నేనున్ను నా గొఱ్ఱెలను వెతికి, చీకటి గల మబ్బు దిన
మందు యెక్కడెక్కడికి అవి చెదిరిపోవునో అక్క
13 డనుంచి నేను వాటిని విడిపించి, । జనులలోనుంచి వా
టిని తీసుకొని వచ్చి, అన్య దేశములోనుంచి కూర్చి,
వాటి స్వదేశములోకి వాటిని తెచ్చి, నదుల యొద్దనున్న
పర్వతముల మీదనున్న దేశమందున్న సకలమైన కా
14 పురపు స్థలములందున్ను వాటిని మేపింతును. । నేను
మంచి మేత గల చోట వాటిని మేపింతును; వాటి
దొడ్డి ఇశ్రాయేలుయొక్క వున్నతమైన స్థలముల మీద
వుండును; అక్కడ అవి మంచి దొడ్డిలో పడుకొనును;
ఇశ్రాయేలు పర్వతముల మీద బలమైన మేత గల స్థల
15 మందు అవి మేసును. । నేను నా గొఱ్ఱెలను మేపించి
పరుండబెట్టుదునని ఆనతిచ్చి, కర్తయైన యెహోవా
16 మరిన్ని చెప్పేదేమంటే, । నేను తప్పిపోయిన దానిని
వెతుకుదును; తోలివేసిన దానిని మళ్లింతును; విరిగిపో
యిన దానిని కట్టుదును; తెగులు గల దానిని స్వస్థపర
చుదును; అయితే కొవ్విన వాటినిన్ని మదించిన వాటి
నిన్ని ఆజ్ఞచేత మేపి, వాటిని లయము చేతునని ఆన
తిచ్చి, మరిన్ని కర్తయైన యెహోవా చెప్పేదేమం
17 టే, । వో నా గొఱ్ఱెలారా, యిదుగో నేను ప్రతి
పశువు మధ్యనున్ను గొఱ్ఱె పొట్టేళ్ల మధ్యనున్ను మేక
పోతుల మధ్యనున్ను తగినట్టుగా తీర్తును. । విశేష 18
మైన మేత మేసి, మిగిలిన మేతను కాళ్లచేత తొ
క్క వచ్చునా? తేట నీళ్లు తాగి, కొదువ నీళ్లను కా
ళ్లతో బురదగా కలప వచ్చునా? । అందువల్ల మీరు 19
కాళ్లతో తొక్కిన దానిని నా గొఱ్ఱెలు తినును కాళ్ల
తో మీరు బురదగా కలిపిన వాటిని తాగును. । కాబట్టి 20
కర్తయైన యెహోవా ఆనతిచ్చేదేమంటే, యిదుగో
నేను, అవును నేనే, కొవ్విన పశువులకున్ను చిక్కిన
పశువులకున్ను మధ్యను తగినట్టుగా తీర్తును. । యే 21
మంటే మీరు భుజముతోటిన్ని పక్కతోటిన్ని కొమ్ము
లతోటిన్ని సంకటముగా వున్న అన్నిటినీ తోసి పొ
డిచి నఖముఖాలా చెదర చేస్తిరి. । కాబట్టి నేను నా 22
గొఱ్ఱెలు యిక దోపుడు కాకుండా వాటిని విడిపిం
తును; మరిన్ని ప్రతి పశువు మధ్యనున్ను తగినట్టుగా
తీర్తును. । మరిన్ని నేను వాటి మీద నా సేవకుడైన దా 23
వీదనే వొక కాపరిని వుంతును; అతడు వాటిని మేపు
ను; అతడే వాటిని మేపి, వాటికి కాపరిగా వుండును. ।
యెహోవానైన నేను వాటికి దేవుడనుగా వుందును; 24
నా సేవకుడైన దావీదు వాటి పైని అధిపతిగా వుండును;
యీలాగున యెహోవానైన నేను చెప్పితిని. । మరిన్ని 25
వాటితోటి నేను సమాధానపు ప్రమాణమును చేసు
కొందును; దుష్ట మృగములను దేశములోనుంచి తీసివే
తును; అయినందున అవి అరణ్యములో నిర్భయము
గా నివసించి, అడవి యందు నిర్భయముగా పడుకొ
నును. । మరిన్ని వాటినిన్ని నా పర్వతము చుట్టూ వున్న 26
స్థలమునున్ను ఆశీర్వదింతును; వర్షమును దాని కాల
మందు కురిపింతును; ఆశీర్వాదములనే వర్షములు కురు
సును. । భూ వృక్షములు వాటి ఫలములను యిచ్చును; 27
భూమియొక్క పంట పండును; వారు తమ దేశమందు
నిర్భయముగా వుందురు; యెవరు వారిని దాసులుగా
చేసుకొనిరో వారి చేతులలోనుంచి నేను వారిని విడి
పించి, కాడి కట్లను తెంపినప్పుడు నేను యెహో
వానై వున్నానని తెలుసుకొందురు. । యిక వారు అన్య 28
జనాంగములకు దొరకక వుందురు; వారిని మింగే మృ
గములు యిక లేక పోవును; వారిని భయపెట్టేవారు
లేనందున వారు సురక్షితముగా నివసింతురు. । మరిన్ని 29
వారి కొరకు ప్రఖ్యాతి గల మొక్కను లేవచేతును;
యిక దేశమందు వారికి ఆకలియైనా క్షీణతయైనా
లేకపోవును; అన్య జనాంగములవల్ల యిక సిగ్గు పొం
దక వుందురు. । యీలాగున యెహోవానైన నేను 30
వారి దేవుడనై వారికి తోడుగా వున్నాననిన్ని ఇశ్రా
యేలు యింటివారు నా జనులై వున్నారనిన్ని వారు
తెలుసుకొందురని కర్తయైన యెహోవా ఆనతిచ్చెను. ।
అయితే నా మేత మేసిన వో గొఱ్ఱెలారా, మీరు 31

మనుష్యులై వున్నారనిన్ని నేను మీ దేవుడనై వున్నా
ననిన్ని కర్తయైన యెహోవా ఆనతిచ్చెనని చెప్పు
మన్న సెలవు యిచ్చెను.

## 35. అధ్యాయము.

1 మరిన్ని యెహోవా వాక్యము నా యొద్దికి వచ్చి
2 చెప్పినదేమంటే, । ఓ నర పుత్రుడా, శేయీరు పర్వ
3 తము వైపు నీ ముఖ దృష్టిని దిట్టపరచి, । కర్తయైన
యెహోవా ఆనతిచ్చినట్టు భవిష్యత్తుగా పలికి, దాని
తో చెప్పవలసినదేమంటే, ఓ శేయీరు పర్వతమా,
యిదుగో నేను నీకు విరోధినై వున్నాను; నా హస్తమును
4 నీ మీద చాపి నిన్ను బొత్తిగా పాడుచేతును. । నీ పట్ట
ణములను పాడుగానున్ను నిన్ను నిర్మనుష్యముగా
నున్ను చేతును; అప్పుడు నేను యెహోవానై వున్నా
5 నని నీవు తెలుసుకొందువు. । ఇశ్రాయేలు పుత్రుల
మీద నీకు కలిగిన పూర్వోత్తరపు పగవల్ల కత్తి బలము
చేత వారికి వుపద్రవము కలిగినప్పటికిన్ని వారి దోష
ము కడతేరినప్పటికిన్ని నీవు వారి రక్తమును చిందచే
6 స్తివి. । కాబట్టి కర్తయైన యెహోవా ఆనతిచ్చేదేమం
టే, నా జీవముతోడు, నేను నిన్ను రక్తము కొరకు సిద్ధ
పరుతును; రక్తము నిన్ను తరుమును; రక్తము నీకు అను
7 కూలమైనందున రక్తమే నిన్ను తరుమును. । యీలాగున
నేను శేయీరు పర్వతమును బొత్తిగా పాడుచేసి,
బైటికి వెళ్లేవానిన్ని లోపలికి వచ్చేవానిన్ని దానిలో
8 నుంచి తెగవేతును. । అతని పర్వతములను హతమైన
వారితోటి నిండజేతును; నీ కొండల యందున్ను నీ లో
వలయందున్ను నీ నదులన్నిటి యందున్ను వారు కత్తి
9 చేత హతమై కూలుదురు. । నిన్ను నిత్యమూ పాడుచే
స్తూ వుందును; మీ పట్టణములు తిరిగీ కట్టపడక పో
వును; అయినందున నేను యెహోవానై వున్నానని
10 మీరు తెలుసుకొందురు. । యెహోవా అక్కడ వున్న
ప్పటికిన్ని ఆ రెండు జనాంగములున్ను ఆ రెండు దేశ
ములున్ను నావి; మనము వాటిని స్వతంత్రించుకొందు
11 మని నీవు అనుకొంటివి గనుక, । కర్తయైన యెహో
వా ఆనతిచ్చేదేమంటే, నా జీవముతోడు, నీ కోప ప్ర
కారముగానున్ను వారి మీద నీకు కలిగిన పగవల్ల నీవు
చేసిన క్రోధ ప్రకారముగానున్ను నీకు చేతును; నీకు
ఆజ్ఞ విధించిన తరువాత నేను వారికి తెలియబడుదును. ।
12 మరిన్ని అవి పాడైనవి, యిప్పుడు అవి మన ఆహార
మునకు దొరుకునని ఇశ్రాయేలు పర్వతములను గురించి
నీవు పలికిన దూషణములన్నిటినిన్ని యెహోవానైన
13 నేను వింటినని నీవు తెలుసుకొందువు. । యీలాగున
మీ నోటిచేత మీరు నా మీద అతిశయపడి, మీ
మాటలు నా మీద విస్తరింపచేస్తిరి, వాటిని నేను వింటిని. ।
కాబట్టి కర్తయైన యెహోవా ఆనతిచ్చేదేమంటే, 14
లోకమంతా సంతోషముగా వున్నప్పుడు నేను నిన్ను
పాడు చేతును. । ఇశ్రాయేలు యింటివారి స్వాస్థ్యము 15
పాడై పోయినప్పుడు నీవు సంతోషిస్తివి గనుక నీకు
తగినట్టుగా చేతును; ఓ శేయీరు పర్వతమా, నీవు
పాడౌదువు; ఎదోము దేశము యావత్తున్ను పాడైపో
వును; అప్పుడు నేను యెహోవానై వున్నానని వారు
తెలుసుకొందురన్నట్టు ఆనతిచ్చెను.

## 36. అధ్యాయము.

మరిన్ని ఓ నర పుత్రుడా, నీవు ఇశ్రాయేలు 1
పర్వతములతో భవిష్యత్తుగా పలికి చెప్పవలసినదేమం
టే, ఓ ఇశ్రాయేలు పర్వతములారా, యెహోవా
వాక్యమును వినండి. । కర్తయైన యెహోవా ఆనతిచ్చే 2
దేమంటే, ఆహా, మీ ప్రాచీనములైన వున్నత స్థలములు
మా స్వాస్థ్యములైనవని మిమ్మును గురించి శత్రువులు
అనుకొనిరి గనుక, । కర్తయైన యెహోవా ఆనతిచ్చి 3
నట్టు నీవు భవిష్యత్తుగా చెప్పవలసినదేమంటే, వారు
మిమ్మును పాడుచేసి శేషించిన జనాంగములకు మీరు
స్వాధీనులయ్యేటట్టు నఖముఖాలా మిమ్మును మింగినం
దున మీరు గొణుగుడుగాండ్ల పెదవులను ఆడించి,
జనులకు అపహాసకులై వుంటిరి గనుక, । ఓ ఇశ్రా 4
యేలు పర్వతములారా, కర్తయైన యెహోవా వా
క్యమును వినండి; పర్వతములతోనున్ను కొండలతో
నున్ను నదులతోనున్ను లోవలతోనున్ను పాడైపో
యిన స్థలములతోనున్ను అనగా మీ చుట్టూ వున్న
శేషించిన జనాంగములకు అపహాసకులుగానున్ను దో
పుడుగానున్ను విడువబడిన పట్టణములతోనున్ను కర్త
యైన యెహోవా ఆనతిచ్చేదేమంటే, । హృదయపు 5
సంతోషముచేతనున్ను దురాశచేతనున్ను నా దేశము
వారికి స్వాస్థ్యము అయ్యేకొరకున్ను దోపుడు కొర
కున్ను ఆయెనని తలంచుకొనిన ఎదోము దేశమంతటిని
గురించిన్ని శేషించిన జనాంగములను గురించిన్ని నిజ
ముగా నేను అహంకారముచేత కోపాగ్నిని తెచ్చుకొని
ఆజ్ఞ విధిస్తిని. । కాబట్టి ఇశ్రాయేలు దేశమును గురించి 6
భవిష్యత్తుగా పలికి, పర్వతములతోటిన్ని కొండలతో
టిన్ని నదులతోటిన్ని లోవలతోటిన్ని కర్తయైన యె
హోవా ఆనతిచ్చినట్టు చెప్పవలసినదేమంటే, యిదు
గో మీరు అన్య జనాంగములవల్ల సిగ్గు పొందితిరి గనుక
నేను అహంకారమున్ను రౌద్రమున్ను తెచ్చుకొని
విధిస్తిని. । యిందుకు కర్తయైన యెహోవా ఆనతిచ్చే 7
దేమంటే, నేను నా హస్తమును యెత్తి, మీ చుట్టూ
వున్న జనాంగములు తగిన సిగ్గును పొందుదురని నిజ
ముగా విధిస్తిని. । అయితే ఓ ఇశ్రాయేలు పర్వతము 8

లారా, మీరు తిరిగి చిగురు పెట్టి, మీ ఫలములను ఇశ్రా
9 యేలీయులైన నా జనులకు యిత్తురు. । యేమంటే, వారి
రాకట సమీపమాయెను; యిదుగో నేను మీ పక్షమై
మీ తట్టు తిరిగినందున మీరు దున్నబడిన్ని విత్తబడిన్ని
10 వుందురు. । యేమంటే నేను ఇశ్రాయేలు యింటివారి
నందరినీ తిరిగీ రప్పించి, మీ యందు మనుష్యులను
విస్తరింపచేతును; అయినందున పట్టణములు కాపురము
11 చేయబడును, పాడైపోయినవి తిరిగీ కట్టబడును. । మీ
యందు నేను మనుష్యులనున్ను మృగములనున్ను విస్త
రింపచేతును; అవి విస్తరించి అభివృద్ధిని పొందును; ఆది
యందు మీరు వున్నట్టు మీకు కాపురములను కలుగ
చేసి, మునుపటి కంటే యికను మిమ్మును బాగుచేతును;
అప్పుడు నేను యెహోవానై వున్నానని మీరు తెలు
12 సుకొందురు. । నిజముగా నేను మనుష్యులను అనగా
ఇశ్రాయేలీయులైన నా జనులను మీలో సంచారము
చేయింతును; వారు నిన్ను స్వతంత్రించుకొందురు; నీవు
వారి స్వాస్థ్యమై యిక వారిని హీనపర్చక వుందువు. ।
13 వారు మిమ్మును చూచి, ఓ దేశమా, నీవు మనుష్యు
లను మింగి, నీ జనులను హీనపర్చితివని వారు చెప్పిరి
గనుక కర్తయైన యెహోవా ఆనతిచ్చేదేమంటే, ।
14 యిక నీవు మనుష్యులను మింగక వుందువు; యిక నీ
జనులు నీవల్ల హీనతను పొందక వుందురని కర్తయైన
15 యెహోవా ఆనతిచ్చి, మరిన్ని చెప్పినదేమంటే, । నిన్ను
అపహాస్యము చేసిన అన్య జనాంగముల మాటలు యిక
నీకు వినబడకుండా చేతును; యిక జనులలో నీవు నిష్టు
రము పొందని దానవౌదువు; యిక నీవు నీ జనులను కూ
లచేయక వుందువని కర్తయైన యెహోవా ఆనతిచ్చె
16 నని చెప్పుమన్న సెలవు యిచ్చెను. । యెహోవా వాక్య
17 ము మరిన్ని నా యొద్దికి వచ్చి చెప్పినదేమంటే, । ఓ
నర పుత్రుడా, ఇశ్రాయేలు యింటివారు తమ దేశమందు
కాపురము చేసినప్పుడు వారు తమ మార్గము చేత
నున్ను తమ చేష్టలచేతనున్ను దానిని అపవిత్రపరిచిరి;
వారి మార్గము నా ముందర రజస్వలయొక్క అప
18 విత్రత వలె వుండెను. । కాబట్టి దేశమందు వారు చిం
దించిన రక్తము నిమిత్తమున్ను దేశమును అపవిత్ర
పరిచిన వారి విగ్రహముల నిమిత్తమున్ను నేను నా
19 రౌద్రమును వారి మీద కుమ్మరించి, । వారిని అన్య
జనాంగములలోకి చెదరగొట్టినందున వారు దేశముల
కడకు వెళ్లవేయబడిరి; వారి మార్గముల ప్రకారమున్ను
వారి చేష్టల ప్రకారమున్ను నేను వారికి ఆజ్ఞ విధి
20 స్తిని. । మరిన్ని అన్య జనాంగములలోకి వారు వెళ్లిన
ప్పుడు వారు వీరిని చూచి, వీరు యెహోవా జనులై
వుండి ఆయన దేశములనుంచి యివతలకు వచ్చిరని
21 అనుకొన్నందున, । వారివల్ల నా పరిశుద్ధమైన నామము
నకు అవమానము వచ్చెను; అయినందున ఇశ్రాయేలు
యింటివారు యే జనాంగములలోకి వెళ్లిరో వారి వల్ల
అవమానము పొందిన నా పరిశుద్ధమైన నామము నిమి
త్తము నేను చింతపడితిని. । కాబట్టి నీవు కర్తయైన 22
యెహోవా ఆనతిచ్చినట్టు ఇశ్రాయేలు యింటివారి
తో చెప్పవలసినదేమంటే, ఓ ఇశ్రాయేలు యింటివా
రలారా, మీ విషయమై కాదు గాని జనాంగములలో
మీరు నిర్లక్ష్యము చేసిన నా పరిశుద్ధ నామ విషయ
మై నేను దీని చేతును. । యేమంటే అన్య జనాంగము 23
లలో నీవల్ల అవమానము పొందిన నా ఘనమైన నామ
మును పరిశుద్ధమైనదని తెలియ చేతును; కాబట్టి అన్య
జనాంగముల కండ్లకు నేను మీవల్ల పరిశుద్ధుడనని అగు
పడినప్పుడు నేను యెహోవానై వున్నానని వారు
తెలుసుకొందురని ఆనతిచ్చి, మరిన్ని కర్తయైన యెహో
వా యిందుకు చెప్పేదేమంటే, । నేను అన్య జనాంగ 24
ములలోనుంచి మిమ్మును తీసి, సకల దేశములలోనుంచి
కూర్చి, మీ స్వదేశములోకి తిరిగీ రప్పింతును. । అప్పు 25
డు నేను మీ మీద మంచి వుదకమును జల్లినందున
మీరు శుద్ధులవుదురు; మీ అపవిత్రత అంతటనుం
చిన్ని మీ విగ్రహములన్నిటినుంచిన్ని మిమ్మును శుభ్ర
పరతును. । నేను మీకు నూతన హృదయమును యిత్తు 26
ను; నూతనమైన ఆత్మను మీలో వుంతును; రాతి గుండెను
మీలోనుంచి తీసి, మాంసపు గుండెను మీకు యిత్తును. ।
నేను నా ఆత్మను మీ యందు వుంచి, నా కట్టడలందు 27
మిమ్మును నడిపించినందున మీరు నా ఆజ్ఞలను గైకొని
జాగ్రతచేతురు. । మరిన్ని మీరు మీ పితృలకు నేను 28
యిచ్చిన దేశమందు కాపురము వుందురు; మీరు నా
జనులై వుందురు, నేను మీ దేవుడనై వుందును. । మీ 29
సకలమైన అపవిత్రతనుంచి మిమ్మును విడిపింతును; నేను
పంటను రప్పించి, దాని అభివృద్ధిపర్చి, మీ మీదికి
క్షామమును రానియ్యను. । చెట్ల ఫలమునున్ను భూమి 30
పంటనున్ను విస్తరింపచేసినందున అప్పటినుంచి అన్య
జనాంగములవల్ల మీరు క్షామము కొరకు అవమానము
పొందక వుందురు. । అప్పుడు మీరు మీ దుర్మార్గ 31
తలనున్ను కాని క్రియలనున్ను తలంచుకొని, మీ అక్ర
మములచేతనున్ను అసహ్యతలచేతనున్ను మీ దృష్టికి
మీరే యేహ్యులుగా అగుపడుదురు. । ఓ ఇశ్రాయేలు 32
యింటివారలారా, మీ మార్గములను తలంచుకొని
సిగ్గు పొందండి; మీ విషయమై నేను దీని చేయలేదని
తెలుసుకొండని కర్తయైన యెహోవా ఆనతిచ్చి, మరి
న్ని చెప్పేదేమంటే, । మీ అక్రమములన్నిటినుంచీ నేను 33
మిమ్మును శుభ్రపర్చిన నాడు మీ పట్టణములలో
మిమ్మును కాపురము చేయింతును; పాడైన స్థలములు
తిరిగీ కట్టబడును. । మార్గస్థుల దృష్టికి వట్టిదిగానున్ను 34

పాడుగానున్న అగుపడిన భూమి తిరిగీ ఫలించును. ।
35 అప్పుడు వారు ఆశ్చర్యము పొంది, పాడైన భూమి
ఏదేను వనము లాగున వున్నదనిన్ని పాడుగానున్న
వట్టిదిగానున్న లయమైన యీ పట్టణములకు ప్రాకా
రములున్ను కాపురములున్ను కలిగెనని చెప్పుకొందు
36 రు. । అప్పుడు మీ చుట్టూ వున్న స్థలములయందు
వున్న జనాంగములు యెహోవానైన నేను నాశన
మైన స్థలములను కట్టేవాడనున్ను పాడైన స్థలములో
చెట్లను నాటేవాడనున్ను అయి వున్నానని యెరుగు
దురు; యెహోవానైన నేను యీ మాటను పలికితిని
37 గనుక ఆ ప్రకారము చేతునని ఆనతిచ్చి, । కర్తయైన
యెహోవా యిందుకు మరిన్ని చెప్పేదేమంటే యిందు
నిమిత్తము ఇశ్రాయేలు యింటివారి కొరకు ఆలాగు
చేసేటట్టుగా నేను విచారించ బడుదును; మనుష్యుల
చేత నేను వారిని గొర్రెలవలెనున్ను మీదు కట్టబడి
నిర్ణయమైన పండుగ దినమున యెరూశలేముకు
38 వచ్చిన గొర్రెలవలెనున్ను విస్తరింప చేతును; । యీలా
గున పాడైన పట్టణములు మనుష్యుల మందలతోటి
నిండి వున్నందున నేను యెహోవానై వున్నానని
వారు తెలుసుకొందురని ఆనతిచ్చెనని చెప్పుమన్న సెలవు
యిచ్చెను.

## 37 అధ్యాయము.

1 యెహోవా హస్తము నా మీద వుండి, యెహో
వా ఆత్మచేత నన్ను బైటికి తీసుకొ వెళ్లి, శల్యములతో
నిండి వున్న లోవలో నన్ను దించి, వాటి చుట్టూ తిరు
2 గులాడ జేసెను. । అయితే యిదుగో లోవ ముఖము
మీద శల్యములు మిక్కిలీ విస్తారముగానున్న మిక్కిలీ
3 యెండిపోయినట్టున్ను వుండెను. । అప్పుడు ఆయన వో
నర పుత్రుడా, యీ యెండిపోయిన శల్యములు బ్రతు
కగలవా? అని నన్ను అడగగా, నేను వో కర్తవైన
4 యెహోవా, అది నీకే తెలుసునని అంటిని. । అయితే
ఆయన నాతో మరిన్ని ఆనతిచ్చినదేమంటే, యీ
యెండిపోయిన శల్యములతో నీవు భవిష్యత్తుగా పలికి,
చెప్పవలసినది యేలాగంటే, వో యెండిపోయిన శల్య
5 ములారా, యెహోవా వాక్యమును వినండి. । శల్యము
లైన మీకు కర్తయైన యెహోవా సెలవు యిచ్చే
దేమంటే, యిదుగో నేను మీలో జీవాత్మను ప్రవేశ
6 పెట్టినందున మీరు బ్రతుకుదురు. । మీకు నరములను
యిచ్చి, మీ మీద మాంసమును పొదిగించి, చర్మము
చేత మిమ్మును కప్పి, మీలో జీవాత్మను ప్రవేశ పెట్టి
నందున మీరు బ్రతుకుదురు; అప్పుడు నేను యెహో
వానై వున్నానని మీరు తెలుసుకొందురని ఆనతిచ్చె
7 నని చెప్పుమన్న సెలవు యిచ్చెను. । అయినందున నాకు
వచ్చిన ఆజ్ఞ ప్రకారము నేను భవిష్యత్తుగా పలికితిని;
మరిన్ని నేను పలుకుతూ వుండగా ధ్వని పుట్టెను;
అప్పుడు యిదుగో శల్యములు వణకి, వొక దానితో
వొకటి కూడి వచ్చి, కలుసుకొనెను. । నేను చూడగానే 8
యిదుగో నరములున్ను మాంసమున్ను వాటి మీదికి
వచ్చెను; మరిన్ని పైగా చర్మము వాటిని కప్పెను;
అయితే వాటిలో జీవాత్మ యెంతమాత్రమూ లేదు. ।
అప్పుడు ఆయన నాతో భవిష్యత్తుగా పలుకుము, 9
ఆత్మతో భవిష్యత్తుగా పలుకుము, ఆత్మతో కర్తయైన
యెహోవా ఆనతిచ్చినట్టు చెప్పవలసినదేమంటే, వో
ఆత్మా, నాలుగు దిక్కులనుంచి వచ్చి, హతమైన వీరు బ్రతి
కేటట్టు వారి మీద వూపిరించుమని చెప్పుమని సెలవు
యిచ్చెను. । అయినందున ఆయన నాకు ఆజ్ఞాపించినట్టు 10
నేను భవిష్యత్తుగా పలికినప్పుడు జీవాత్మ వారిలోకివచ్చి
నందున వారు జీవస్థులై లేచి, మిక్కిలి విస్తారమై సైన్య
ము వలె నిలిచిరి. । అప్పుడు ఆయన నాతో ఆనతిచ్చిన 11
దేమంటే, వో నర పుత్రుడా, యీ శల్యములు ఇశ్రా
యేలు యింటివారందరికిన్ని గురుతుగా వున్నవి; వారు
యిదుగో మన శల్యములు యెండిపోయెను మన కోరికె
విఫలమైనది; మన చేతులు తెగెనని అనుకొనిరి. । కాబట్టి 12
నీవు వారికి కర్తయైన యెహోవా ఆనతిచ్చినట్టు భవి
ష్యత్తుగా పలికి చెప్పవలసినదేమంటే, వో నా జనులా
రా, నేను మీ సమాధులను బైలుపర్చెదును; మీ సమా
ధులలోనుంచి మిమ్మును బైటికి రప్పించి, ఇశ్రాయేలు
దేశములోకి తీసుకొవత్తును. । యీలాగున వో నా జను 13
లారా, నేను సమాధులను విప్పి, సమాధులలో వున్న
మిమ్మును బైటికి తీసి, మీరు బ్రతికేటట్టు నా ఆత్మను
మీలో వుంచి, । మీ దేశమందు మిమ్మును వుంచిన తరు 14
వాత నేను యెహోవానై వున్నానని మీరు తెలుసు
కొందురు; యెహోవానైన నేను యేలాగు చెప్పితి
నో ఆలాగే చేస్తినని అప్పుడు మీరు తెలుసుకొందు
రని ఆనతిచ్చెనని చెప్పుమన్న సెలవు యిచ్చెను. । అయితే 15
యెహోవా వాక్యము మరిన్ని నా యొద్దికి వచ్చి
చెప్పినదేమంటే, । వో నర పుత్రుడా, నీవు వొక 16
కర్రను తెచ్చి, దాని మీద యూదాను గురించిన్ని
అతనితో కూడుకొనిన ఇశ్రాయేలు పుత్రులను గురిం
చిన్ని అని వ్రాయవలసినది; మరియొక కర్ర తీసుకొని,
దాని మీద ఎఫ్రయీము కర్ర, అనగా, యోశేపును
గురించిన్ని అతనితో కూడిన ఇశ్రాయేలు యింటివా
రిని గురించిన్ని అని వ్రాయవలసినది. । అప్పుడు అది 17
వొక కర్ర అయ్యేటట్టు వొక దానితో వొకటి కూడ
పెట్టుము; అప్పుడు అది నీ చేతిలో వొక కర్ర అవును. ।
అయితే నీ జనుల పిల్లలు నిన్ను చూచి, యిందుకు తాత్ప 18
ర్యము మాకు తెలిసేటట్టు చెప్పవా! అని అడిగినప్పుడు, ।

19 నీవు వారితో కర్తయైన యెహోవా ఆనతిచ్చి
నట్టు చెప్పవలసినది యేమంటే, యిదుగో ఎఫ్రయీము
చేతిలో వున్న కర్ర, అనగా, యోశేపును గురించిన్ని
అతనితో కూడుకొనిన ఇశ్రాయేలు గోత్రికులను గురిం
చిన్ని వున్న కర్రను నేను తీసి, యూదా కర్రతో
కూడా కలిపి, నా చేతిలో వాటిని వొక కర్రగా
20 చేతునని ఆనతిచ్చెనని చెప్పుము. । మరిన్ని నీవు వ్రాసిన
కర్రలు వారు చూస్తూ వుండగా నీ చేతిలో వుంచు
21 కో వలెను. । మరిన్ని కర్తయైన యెహోవా ఆనతి
చ్చినట్టు నీవు వారితో చెప్పవలసినది యేమంటే, యి
దుగో యే జనాంగములలోకి ఇశ్రాయేలు పుత్రులు
వెళ్లిరో అక్కడనుంచి నేను వారిని తీసి, నఖముఖాల
నుంచీ వారిని కూర్చి, వారి స్వదేశములోకి తీసు
22 కొ వత్తును. । మరిన్ని ఇశ్రాయేలు పర్వతముల మీది
దేశమందు వారిని ఏక జనాంగముగా చేతును; వారం
దరినీ వొక రాజు పాలించును; యిక వారు రెండు
జనాంగములు కాక వుందురు; యెన్నటికీ వారు రెండు
23 రాజ్యముల వారు కాక వుందురు. । మరిన్ని యిక వారు
తమ విగ్రహములవల్లనైనా యేహ్యమైన వాటివల్లనైనా
యే అక్రమమువల్లనైనా తమ్మును అపవిత్రపరచుకొక
వుందురు; యేమంటే యే కాపురములలో వుండి పాప
ము చేసిరో ఆ కాపురములలోనుంచి వారిని విడతీసి
శుభ్రపరతును; అప్పుడు వారు నా జనులై వుందురు;
24 నేను వారికి దేవుడనై వుందును. । మరిన్ని నా సేవకు
డైన దావీదు వారికి రాజవును; వారందరి పైని వొక
కాపరి వుండును; కాబట్టి వారు నా ఆజ్ఞల ప్రకా
25 రము నడిచి, నా కట్టడలను భద్రముగా చేతురు. । నా
సేవకుడైన యాకోబుకు నేను యిచ్చినటువంటిన్ని మీ
పితృలు నివసించినటువంటిన్ని దేశమందు వారున్ను
వారి బిడ్డలున్ను వారి బిడ్డల బిడ్డలున్ను అక్కడ నిత్య
మూ నివసింతురు; మరిన్ని నా సేవకుడైన దావీదు వారి
26 మీద యెన్నటికీ అధిపతియై వుండును. । మరిన్ని నేను
వారితో సమాధానమై ప్రమాణమును చేసుకొందును;
అది నాకున్ను వారికిన్ని నిత్యమైన ప్రమాణమవును;
వారిని నాటి విస్తరింపచేసి, వారిలో నా పరిశుద్ధ స్థల
27 మును నిత్యమూ వుంచుదును. । నా డేరా వారితోనే
వుండును; నిజముగా వారు నా జనులై వుందురు; నేను
28 వారి దేవుడనై వుందును. । మరిన్ని వారి మధ్యను నా
పరిశుద్ధ స్థలము నిత్యమై వున్నప్పుడు యెహోవా
నైన నేను ఇశ్రాయేలును పరిశుద్ధపర్చిన వాడనని
అన్య జనాంగములు యెరుగుదురని ఆనతిచ్చెనని చెప్ప
మన్న సెలవు యిచ్చెను.

## 38. అధ్యాయము.

యెహోవా వాక్యము మరిన్ని నా యొద్దికి వచ్చి 1
చెప్పినదేమంటే, । వో నర పుత్రుడా, నీవు మాగోగు 2
దేశమందున్న గోగు, అనగా, మెషెఖుకున్ను తూబలు
కున్ను ప్రధానాధిపతియైన అతని మీద నీ ముఖ దృ
ష్టిని దిట్టపర్చి, । కర్తయైన యెహోవా ఆనతిచ్చినట్టు 3
దాని మీద భవిష్యత్తుగా పలికి చెప్పవలసినదేమంటే,
మెషెఖుకున్ను తూబలుకున్ను ప్రధానాధిపతివైన వో
గోగా, యిదుగో నేను నీకు విరోధినై వున్నాను. । నీ 4
దవడలలో గాలములను వేసి, నిన్ను వెనుకకు లాగు
దును; నిన్నున్ను నీ సైన్యమంతటినిన్ని బైటికి రప్పిం
తును; గుర్రములు కలిగి వుండి, నానా విధములైన
ఆయుధములను ధరించుకొనిన నీ రౌతులనందరినిన్ని
కవచములున్ను డాళ్లున్ను కలిగి కత్తులను చేత పట్టు
కొనిన సమూహమంతటినిన్ని యివతలకు రప్పింతును. ।
మరిన్ని వీరితోటి పారసీ దేశపువారున్ను కుషీయు 5
లున్ను పూథువారున్నైన అందరున్ను డాళ్లతోటిన్ని
యుద్ధపు పాగాలతోటిన్ని వుందురు. । గోమెరున్ను 6
అతని సైన్యపు గుంపులున్ను వుత్తరపు దిక్కులలోనున్ను
తోగర్మా యింటి కూటమున్ను అతని సైన్యపు గుం
పులున్ను వుందును; నీతోటి చాలా మందిన్ని వుందు
రు. । నీవు సిద్ధముగా వుండుము; నీవున్ను నీతో కూడా 7
కలసిన సమూహమున్ను సిద్ధముగా వుండవలెను; వారికి
నీవు కాపరివై వుండుము. । అయితే చాలా దినములైన 8
తరువాత నీకు శిక్ష వచ్చును; అంత్య సంవత్సరములందు
నీవు చాలా జనులలోనుంచి కూర్చబడి, కత్తినుంచి
తప్పించబడిన దేశములోకిన్ని నిత్యమూ పాడుగా వుం
డిన ఇశ్రాయేలు పర్వతములకున్ను విరోధివై వత్తువు;
అయితే వారు జనాంగములలోనుంచి వచ్చి, అంద
రున్ను నిర్భయముగా కాపురము చేతురు. । అయితే 9
నీవు ప్రళయ వాయువు వచ్చినట్టు దేశము మీదికి
వత్తువు; వచ్చి నీవున్ను నీ సైన్యపు గుంపులన్నిన్ని నీతో
కూడిన బహు జనమున్ను మేఘము వలె దేశమును
కప్పుదురు. । యిందుకు కర్తయైన యెహోవా ఆనతి 10
చ్చేదేమంటే, ఆ కాలమందు ఆలోచనలు నీ మనస్సున
పుట్టును; నీవు దుర్యోజన యోజింతువు. । యేలాగంటే 11
నేను ప్రాకారములు లేని గ్రామములు గల దేశము
మీదికి వెళ్లుదును; గౌనులున్ను అడ్డు గడలున్ను ప్రా
కారములున్ను యివి మొదలైనవి లేని కాపురములందు
నిమ్మళముగానున్ను నిర్భయముగానున్ను నివసించి వున్న
వారి మీదికి వెళ్లి, దోచుకొని, కొల్లపుచ్చుకొందునని
యోజింతువు. । పూర్వము పాడైపోయి తిరిగీ కాపు 12
రము చేయబడిన స్థలముల మీదికిన్ని జనాంగములలో

నుంచి కూర్చబడి, పశువులనున్ను సొమ్మునున్ను సంపా
దించి, దేశములో నివసించిన వారి మీదికిన్ని నీ చేతిని
13 ఆడించ దలంతువు.। షెబా వారున్ను దెదాను వారున్ను
తర్షీషు వర్తకులున్ను కొదమ సింహములు లాటి
వారున్ను నిన్ను చూచి, సొమ్మును దోచుకొనుటకు వస్తి
వా! దోపును దోచుకొనుటకు సమూహమును కూర్చి
తివా! బహుగా దోపుడు దోచుకొని, వెండినిన్ని
బంగారమునున్ను పశువులనున్ను సొమ్మునున్ను తీసుకొ
14 పోవుటకు వస్తివా! అని అడుగుదురని చెప్పుము.। మరిన్ని
ఓ నర పుత్రుడా, యిందుకు నీవు కర్తయైన యె
హోవా ఆనతిచ్చినట్టు గోగుతో భవిష్యత్తుగా పలుక
వలసినదేమంటే, ఇశ్రాయేలైన నా జనులు నిర్భయ
ముగా నివసించిన నాడు నీకు తెలియక పోవునా!।
15 వుత్తర దిక్కులందుండిన నీ స్థలములలోనుంచి నీవు యివ
తలకు వత్తువు; చాలామంది నీతో కూడా వత్తురు; అంద
రున్ను గుర్రములను యెక్కి, గొప్ప గుంపువలెనున్ను
16 మహా బలము గల సైన్యము వలెనున్ను వత్తురు.। యీ
లాగు వున్న నీవు ఇశ్రాయేలైన నా జనుల మీదికి
వచ్చి, మేఘము వలె దేశమును కప్పుదువు; అది కడ
దినములందు సంభవించును; ఓ గోగా, అప్పుడు నేను
నా దేశము మీదికి నిన్ను రప్పింతును; అయినందున
అన్య జనాంగములు నేను నీకు చేసిన దానిని చూచి,
నేను పరిశుద్ధుడనై వున్నానని తెలుసుకొందురని చెప్పి,।
17 యింకా కర్తయైన యెహోవా ఆనతిచ్చేదేమంటే,
పూర్వమందు నేను ఇశ్రాయేలు దీర్ఘదర్శులైన నా
సేవకులచేత చెప్పించిన వాడవు నీవే కావా? చాలా
సంవత్సరముల కిందటి దినములలో నేను నిన్ను వారి
18 మీదికి రప్పింతునని చెప్పుకొని వుండిరి.। అయితే గోగు
ఇశ్రాయేలు దేశము మీదికి వచ్చే సమయమున నా
ముఖ రౌద్రము పైకి యెక్కునని కర్తయైన యెహోవా
19 ఆనతిచ్చి,। మరిన్ని చెప్పినదేమంటే, నిజముగా ఆ దిన
మున ఇశ్రాయేలు దేశమందు బహు కంపము పుట్టు
నని నేను రోషముతోనున్ను రౌద్రాగ్నితోనున్ను చెప్పి
20 తిని.। అయినందున సముద్రమందుండే మత్స్యములు
న్ను ఆకాశమందుండే పక్షులున్ను భూమియందుండే
మృగములున్ను భూమి మీద పాకే జంతువులున్ను
భూమి యందుండే నరులందరున్ను నా ముఖమును
చూచి కంపింతురు; పర్వతములు కింద బడిపోవును;
కోరైన స్థలములు రాలును; గోడలన్నిన్ని కింద పడు
21 ను.। మరిన్ని నా కత్తిని రప్పించి, నా పర్వతములన్నిటి
మట్టుకు అతని మీదికి పంపుదునని కర్తయైన యె
హోవా ఆనతిచ్చి; మరిన్ని చెప్పేదేమంటే, ప్రతి
మనుష్యుని కత్తి తన సహోదరుని మీదికి విరోధ
22 ముగా వుండును.। నేను తెగులునున్ను రక్తమునున్ను
అతనికి కలిగేటట్టుగా విధింతును; అతని మీదనున్ను
అతని సైన్యపు గుంపుల మీదనున్ను అతనితో కూడిన
బహు జన సమూహము మీదనున్ను ప్రళయపు వాన
నున్ను పెద్ద వడగండ్లనున్ను అగ్నినిన్ని గంధకమునున్ను
కలుగజేతును.। యీలాగున నన్ను నేను ఘనపర్చు 23
కొని, పరిశుద్ధుడనని చాలా జనాంగముల కండ్లకు అగు
పడుదును; యెహోవానై వున్నానని వారు తెలుసు
కొందురని ఆనతిచ్చెనని చెప్పుము.

## 39. అధ్యాయము.

మరిన్ని ఓ నర పుత్రుడా, నీవు కర్తయైన యె 1
హోవా ఆనతిచ్చెనని గోగుతో భవిష్యత్తుగా పలికి,
చెప్పవలసినదేమంటే, మెషెకుకున్ను తూబలుకున్ను
ప్రధానాధిపతివైన ఓ గోగా, యిదుగో నేను నీకు
విరోధినై వున్నాను.। ఆరు ముల్లుగల గాలముతో నిన్ను 2
గుచ్చి వెనుకకు లాగుదును; వుత్తర దిక్కునుంచి ఇశ్రా
యేలు పర్వతముల మీదికి నిన్ను రప్పింతును.। అయితే 3
నీ యెడమ చేతిలోనున్న నీ విల్లును కింద పడగొట్టు
దును; నీ కుడి చేతిలోనున్న నీ బాణములను కింద పడ
వేతును.। నీవున్ను నీ సైన్యపు గుంపులున్ను నీ తోటి 4
జనులున్ను ఇశ్రాయేలు పర్వతముల మీద కూలుదురు;
నానా విధమైన వేట పక్షులకున్ను భూ మృగముల
కున్ను నిన్ను ఆహారముగా యిత్తును.। నీవు భూ ము 5
ఖము మీద కూలుదువు; యేమంటే నేను ఆలాగున
నిర్ణయిస్తినని కర్తయైన యెహోవా ఆనతిచ్చి,
మరిన్ని చెప్పినదేమంటే,। నేను మాగోగు మీదికిన్ని 6
ద్వీపములందు నిర్విచారముగా నివసించిన వారి మీది
కిన్ని అగ్నిని పంపుదును; అప్పుడు నేను యెహో
వానై వున్నానని వారు తెలుసుకొందురు.। యీలా 7
గున నేను నా ఇశ్రాయేలు జనులలో నా పరిశుద్ధ
నామమును తెలియ చేతును; యిక వారు నా పరిశుద్ధ
నామమును అవమానపర్చకుండా చేతును; అప్పుడు
యెహోవానైన నేను ఇశ్రాయేలులో పరిశుద్ధుడనని
అన్య జనాంగములకు తెలియబడునని ఆనతిచ్చి యింకా
కర్తయైన యెహోవా ఆనతిచ్చేదేమంటే,। యిదుగో 8
అది సమీపమాయెను, యిప్పుడు అది నెరవేరును;
యిది నేను చెప్పిన దినమై యున్నది.। ఇశ్రాయేలు 9
పట్టణములందు నివసించిన వారు బైలువెళ్లి, డాళ్లు కవ
చములు విండ్లు బాణములు గదలు యీటెలు మొద
లైన ఆయుధములను అగ్నిచేత కాల్చివేతురు; యేడు
సంవత్సరములు మట్టుకు వాటిని కాలుస్తూ వుందురు.।
కాబట్టి వారు బైటి భూమినుంచి కర్రలు తెచ్చేదిన్ని 10
అడవిలో మానులు నరికేదిన్ని లేక వుండును; ఆ
ఆయుధములు కాల్చుటకు సరిపడును; తమ్మును దోచ

వచ్చిన వారిని తామే దోతురు; తమ్మును దోచుకో
వచ్చిన వారిని తామే తోచుకొందురని కర్తయైన యె
11 హెూవా ఆనతిచ్చి, మరిన్ని చెప్పేదేమంటే, । ఆ దిన
మందు నేను ఇశ్రాయేలు దేశములో సమాధుల కొరకు
స్థలమును గోగుకు యిత్తును; అది సముద్రమునకు తూ
ర్పుగా వెళ్లే మార్గములో వున్న లోవ అయి వుండును;
ఆ దుర్గంధము మార్గస్థుల నాసికా రంధ్రములలో
ప్రవేశించును; యేమంటే అక్కడ వారు గోగునున్ను
అతని యావత్సమూహమునున్ను పాతిపెట్టి, దానికి
12 హమోన్గోగు లోవ అనే పేరు పెట్టుదురు. । అయితే
దేశమును పరిశుద్ధపర్చుటకు ఇశ్రాయేలు యింటివారు
యేడు నెలల మట్టుకు వారిని పాతిపెట్టుతూ వుందు
13 రు. । నిజముగా దేశపు జనులందరున్ను వారిని పాతి
పెట్టుదురు; మరిన్ని నేను ఘనతను పొందిన దినమున
14 వారు పేరుపడుదురు. । మరిన్ని భూమిని పరిశుద్ధ
పర్చుటకు దాని ముఖము మీద వున్న కళేబరము
లను పాతిపెట్టుటకు దేశములో నిత్యమున్ను పనిచేసే
వారిని యిందు నిమిత్తము వుంచి, మార్గస్థులకు సహా
యము చేతురు; యేడు నెలలైన తరువాత వారు శో
15 ధించ నారంభింతురు. । మరిన్ని దేశమందు మార్గస్థులు
తిరుగుతూ వుండగా వారికి మనుష్య శల్యము కను
బడితే పాతిపెట్టేవారు హమోన్గోగు లోవలో దాని
స్థాపించే పర్యంతమూ అక్కడ వారు ఆనవాలు బెట్టు
16 దురు. । మరిన్ని ఆ పట్టణము హమోనా అని పిలు
వబడును; యీలాగున వారు దేశమును పరిశుద్ధపర్చు
17 దురని ఆనతిచ్చెనని చెప్పుము. । మరిన్ని ఓ నర పుత్రు
డా, కర్తయైన యెహెూవా ఆనతిచ్చినట్టు నీవు సకల
జాతి పక్షులకున్ను భూ మృగములన్నిటికిన్ని చెప్ప
వలసినదేమంటే, మీరు కూడి రండి; మాంసమును
తినుటకున్ను రక్తపానము చేసుటకున్ను ఇశ్రాయేలు
పర్వతముల మీద నేను మీ కొరకు నిర్ణయించిన
గొప్ప బలి యొద్దికి నఖముఖాలనుంచీ కూడి రండి. ।
18 మీరు బలాఢ్యుల మాంసమును తిందురు; భూ పతుల
రక్తమునున్ను బాషానులో కొవ్విన పొట్టేళ్లయొక్క
యున్ను గొర్రెపిల్లల యొక్కయున్ను మేకలయొక్క
యున్ను యెద్దులయొక్కయున్ను రక్తపానము చేతురు. ।
19 మీ కొరకు నేను నిర్ణయించిన బలివల్ల కొవ్వును
తిని, మీరు తృప్తిపొందే మట్టుకున్ను రక్తమును తాగు
20 దురు. । యీలాగున నా బల్లయొద్ద గుర్రములవల్లనున్ను
రథములవల్లనున్ను బలాఢ్యులవల్లనున్ను ఆయుధస్థుల
వల్లనున్ను మీకు తృప్తి అవునని కర్తయైన యెహెూ
21 వా ఆనతిచ్చి, మరిన్ని చెప్పేదేమంటే, । నా ఘనత్వ
మును నేను అన్య జనాంగములకు అగుపర్తును; అన్య
జనాంగములందరున్ను నేను విధించిన ఆజ్ఞనున్ను వారి
మీద నేను పెట్టిన నా హస్తమునున్ను చూతురు. ।
మరిన్ని ఆ దినమునుంచీ ఇశ్రాయేలు యింటివారు 22
యెహెూవానైన నేను వారి దేవుడనై వున్నానని తెలు
సుకొందురు. । మరిన్ని ఇశ్రాయేలు యింటివారు వారి 23
దోషము నిమిత్తము చెరలోకి వెళ్లిరని అన్య జనాంగ
ములకు తెలియబడును; యేమంటే వారు నా విషయమై
అక్రమపువారై వుండిరి గనుక నా ముఖమును వారికి
మరుగు చేసుకొని, వారి శత్రువుల చేతిలోకి వారిని
అప్పగిస్తిని; యీలాగున వారందరున్ను కత్తిచేత కూ
లిరి. । వారి దోషప్రకారమునకున్ను అక్రమముల ప్ర 24
కారమునకున్ను నేను వారికి ప్రతిగా చేసి, నా ముఖ
మును వారికి మరుగుపరిచితినని చెప్పి, వారిని గురించి
కర్తయైన యెహెూవా మరిన్ని ఆనతిచ్చేదేమంటే, ।
యిప్పుడు చెరలోనున్న యాకోబు సంతతిని తిరిగీ 25
రప్పించి, ఇశ్రాయేలు యింటివారందరి మీద జాలిపడి,
నా పరిశుద్ధ నామమును గూర్చి రోషము గల వాడనై
వుందును. । వారు తమ సిగ్గునున్ను నా విషయమై వారు 26
చేసిన అక్రమముల నన్నిటినిన్ని పొందిన తరువాతను
న్ను, వారు తమ దేశమందు సురక్షితముగానున్ను నిర్భ
యముగానున్ను నివసించినప్పుడున్ను, । జనాంగముల 27
లోనుంచి నేను వారిని విడతీసి, వారి శత్రువుల దేశ
ములలోనుంచి కూర్చి, చాలా జనాంగముల కండ్లకు
వారియందు నేను పరిశుద్ధుడనని అగుపడిన తరువాత
నున్ను, । వారిని అన్య జనాంగములలోకి చెరగా పో 28
జేసినప్పటికిన్ని యే వొకనినైనా అక్కడ వుంచక వారి
దేశమునకు వారిని కూర్చిన యెహెూవానైన నేను
వారికి దేవుడనై వున్నానని వారు తెలుసుకొందురు. ।
మరిన్ని యిక నేను నా ముఖమును వారికి మరుగుపర 29
చక వుందును; యేమంటే ఇశ్రాయేలు యింటివారి
మీద నేను నా ఆత్మను కుమ్మరింతునని ఆనతిచ్చెనని
చెప్పుమన్న సెలవు యిచ్చెను.

## 40. అధ్యాయము.

చెరలోకి మనము వచ్చిన యిరువై అయిదో సం 1
వత్సరము మొదటి నెల పదో దినము, అనగా, పట్టణ
ము కొట్టబడిన పధ్నాలుగో సంవత్సరమందే యె
హెూవా హస్తము నా మీద వుండి నన్ను అక్కడికి
తీసుకొ పోయెను. । దైవ దర్శనములందు ఆయన నన్ను 2
ఇశ్రాయేలు దేశములోకి తెచ్చి, మహోన్నతమైన
పర్వతము మీద వుంచెను; దాని దగ్గిర దక్షిణపు తట్టున
పట్టణపు ఆకారము వంటిది వుండెను. । అక్కడికి 3
ఆయన నన్ను తెచ్చెను; అయితే యిదుగో అక్కడ
వొక మనుష్యుడు వుండెను; అతని రూపము చూచు
టకు యిత్తడి లాగున వుండెను; అతని చేతిలో నార

నూలున్ను కొల కఱ్ఱయున్ను వుండెను; ద్వారమందు
4 అతడు నిలిచి వుండెను. । అయితే ఆ మనుష్యుడు నన్ను
చూచి చెప్పినదేమంటే, ఫ్రౌ నర పుత్రుడా, నేను నీకు
చూపించబోయే అన్నిటినీ నీ కండ్లతో కని, చెవుల
తో విని, నీ మనస్సు వాటి మీద వుంచుము; యేమం
టే నేను వాటిని నీకు చూపేటందుకు యిక్కడికి
నీవు తేబడితివి; నీకు కనిపించిన అన్నిటినీ ఇశ్రాయేలు
5 యింటివారితో తెలియ చెప్పవలెనని చెప్పెను.। అయితే
యిదుగో మందిరము చుట్టూ ప్రాకారము గలదు;
మరిన్ని ఆ మనుష్యుని చేతిలో ఆరు మూరల కొల
కఱ్ఱ వుండెను; ప్రతి మూరకున్ను మూరెడు బెత్తెడు
నిడివి వుండెను; అయితే అతడు దానితో ఆ కట్టేదాని
కొలిచెను; అప్పుడు దాని వెడల్పున్ను పొడుగున్ను
6 ఫ్రెక కొల అయి వుండెను. । అప్పుడు అతడు తూర్పు
తట్టు వున్న ద్వారమునకు వచ్చి, దాని సోపానముల
మీదికి యెక్కి, ద్వారపు గడపను కొలిచెను; దాని
వెడల్పున్ను మరి ఫ్రెక గడప వెడల్పున్ను ఫ్రెక కొల
7 అయి వుండెను. । మరిన్ని చిన్న గదులన్నిటియొక్క
నిడివిన్ని వెడల్పున్ను ఫ్రెక కొల అయి వుండెను; అయితే
యీ చిన్న గదుల మధ్యను అయిదు మూరలు వుండెను;
మరిన్ని ద్వారములో గడప దగ్గిర వున్న ద్వారము
8 ఫ్రెక కొల అయి వుండెను. । మరిన్ని లోపటి ద్వారపు
గడపను కొలిచెను; అదిన్ని ఫ్రెక కొల అయి వుండెను.।
9 అప్పుడు ద్వారముయొక్క గడపను కొలిచెను, అది
యెనిమిది మూరలు అయి వుండెను; దాని స్తంభములు
రెండు మూరలయి వుండెను; ద్వారముయొక్క గడప
10 లోపలికి వుండెను. । అయితే తూర్పు వైపున వున్న
ద్వారముయొక్క చిన్న గదులు యిటు మూడున్ను
అటు మూడున్ను వుండెను; యివి ఫ్రెక్క ప్రమాణమై
వుండెను; యిరు పార్శ్వముల స్తంభములు ఫ్రెక్క
11 ప్రమాణమై వుండెను. । అప్పుడు ద్వార ప్రవేశము
యొక్క వెడల్పును కొలిచెను, అది పది మూరలయి
వుండెను; ద్వారపు నిడివి పదమూడు మూరలయి వుం
12 డెను. । మరిన్ని చిన్న గదుల ముందర హద్దు యీ
పార్శ్వమునన్ను ఆ పార్శ్వమునన్ను మూరెడు
అయి వుండెను; మరిన్ని యీ చిన్న గదులు యీ పా
ర్శ్వమునన్ను ఆ పార్శ్వమునన్ను ఆరు మూరలై
13 వుండెను.। అప్పుడు అతడు యీ చిన్న గది కప్పు మొ
దలుకొని ఆ చిన్న గది కప్పు మట్టుకు ద్వారమును
కొలిచెను; దాని వెడల్పు యిరువై అయిదు మూరలై
వుండెను; యీ తలుపు ఆ తలుపుకు యెదురుగా వుం
14 డెను. । మరిన్ని ఆయన ద్వారముచుట్టూ వున్న వాకిటి
స్తంభము మట్టుకు అరువై మూరలు గల స్తంభములను
15 చేసెను. । మరిన్ని బైటి ద్వారము యొద్దనుంచి లోపటి
ద్వారముయొక్క గడప మట్టుకు యేభై మూరలయి
వుండెను. । మరిన్ని చిన్న గదులకున్ను ద్వారము లో 16
పల చుట్టూ వున్న వాటి స్తంభములకున్ను నాదులకు
న్ను సన్నపు కిటికీలు కలిగి వుండెను; అయితే లోపల
చుట్టూ కిటికీలు వుండెను; ప్రతి స్తంభము మీద పో
నీకి చెట్ల రూపము వుండెను. । మరిన్ని నన్ను అతడు 17
బైట వాకిటిలోకి తీసుకొ వచ్చెను; అక్కడ యిదుగో
గదులున్ను వాకిటి చుట్టూ రాకట్టున్ను వుండెను;
రాకట్టు మీద ముప్పయి గదులు వుండెను. । యీ 18
రాకట్టు ద్వారముల తట్టు వుండి, ద్వారములు సాగి
నంత మట్టుకు సాగెను; యిదే కింది రాకట్టు.। అప్పుడు 19
అతడు కింది ద్వారము మొదలుకొని లోపటి వాకిటి
మట్టుకు బైటి వెడల్పును కొలిచెను; యిది తూర్పు
కున్ను వుత్తరమునకున్ను నూరు మూరలయి వుండెను. ।
మరిన్ని వుత్తరపు తట్టు బైటి వాకిటి ద్వారముయొక్క 20
నిడివినిన్ని వెడల్పునున్ను కొలిచెను. । దానికి కలిగిన 21
చిన్న గదులు యీ పార్శ్వమున మూడున్ను ఆ పా
ర్శ్వమున మూడున్ను అయి వుండెను; దాని స్తంభ
ములున్ను దాని నాదులున్ను మొదటి ద్వారముయొక్క
కొల ప్రకారమై వుండెను; దాని నిడివి యేభై మూర
లున్ను దాని వెడల్పు యిరువై అయిదు మూరలున్ను
అయి వుండెను. । మరిన్ని వాటి కిటికీలున్ను వాటి 22
నాదులున్ను వాటి పోనీకి చెట్లున్ను తూర్పు ద్వార
ముయొక్క కొల ప్రకారమై వుండెను; మరిన్ని జనులు
దాని పైకి వెళ్లుటకు యేడు సోపానములను యెక్కు
దురు; దాని నాదులు వారికి యెదురుగా వుండెను. ।
అయితే లోపటి వాకిటి ద్వారము వుత్తర ద్వారము 23
కున్ను తూర్పు ద్వారముకున్ను యెదురుగా వుండెను;
అతడు యీ ద్వారమునుంచి ఆ ద్వారముకు నూరు
మూరలను కొలిచెను. । అప్పుడు అతడు నన్ను దక్షి 24
ణపు తట్టుకు తీసుకొవచ్చెను; దక్షిణపు తట్టున్ను యి
దుగో ద్వారము వుండెను; అప్పుడు అతడు దాని స్తంభ
ములనున్ను దాని నాదులనున్ను యీ కొల ప్రకారము
కొలిచెను. । మరిన్ని యీ కిటికీల లాటివి దీని చుట్టు 25
న్ను దీని నాదుల చుట్టున్ను కలవు; దాని నిడివి యేభై
మూరలున్ను దాని వెడల్పు యిరువై అయిదు మూర
లున్ను అయి వుండెను. । యెక్కుటకు యేడు సోపాన 26
ములు కలవు; నాదులు వాటికి యెదురుగానే వుం
డెను; మరిన్ని దాని స్తంభముల మీద పోనీకి చెట్లు
యీ తట్టు ఫ్రెకటిన్ని ఆ తట్టు ఫ్రెకటిన్ని వుండెను. ।
మరిన్ని లోపటి వాకిటిలో దక్షిణపు తట్టున ఫ్రెక 27
ద్వారము వుండెను; అయితే అతడు దక్షిణపు తట్టున
యీ ద్వారమునుంచి ఆ ద్వారముకు నూరు మూరలను
కొలిచెను. । అప్పుడు అతడు దక్షిణపు ద్వారము దగ్గిర 28

వున్న లోపటి వాకిటిలోకి నన్ను తీసుకొని వచ్చెను;
దక్షిణ ద్వారమును అతడు యీ కొలల ప్రకారము
29 కొలిచెను. । మరిన్ని దాని చిన్న గదులున్ను దాని స్తం
భములున్ను దాని నాదులున్ను యీ కొలల ప్రకారము
గా వుండెను; మరిన్ని దానికిన్ని దాని చుట్టూ వున్న నా
దులకున్ను కిటికీలు కలవు; దాని నిడివి యేభై మూరలు,
దాని వెడల్పు యిరువై అయిదు మూరలున్ను అయి
30 వుండెను. । చుట్టూ వున్న నాదుల నిడివి యిరువై అయి
దు మూరలున్ను వెడల్పు అయిదు మూరలున్ను అయి
31 వుండెను. । మరిన్ని దాని నాదులు బయిటి వాకిటి
తట్టున వుండెను; దాని స్తంభముల మీద పోనీకి చెట్లు
కలిగి వుండెను; యెక్కుటకు యెనిమిది సోపానములు
32 కలవు. । అప్పుడు అతడు తూర్పు తట్టు లోపటి వాకిటి
లోకి నన్ను తీసుకొని వచ్చెను; యీ ద్వారమునున్ను యీ
33 కొలల ప్రకారము కొలిచెను. । మరిన్ని దాని చిన్న
గదులున్ను దాని స్తంభములున్ను దాని నాదులున్ను
యీ కొలల ప్రకారముగా వుండెను; మరిన్ని దాని
కిన్ని దాని చుట్టూ వున్న నాదులకున్ను కిటికీలు కలవు;
దాని నిడివి యేభై మూరలున్ను దాని వెడల్పు యి
34 రువై అయిదు మూరలున్ను అయి వుండెను. । మరిన్ని
దాని నాదులు బయిటి వాకిటి తట్టున వుండెను; దాని
స్తంభముల మీద పోనీకి చెట్లు కలిగి వుండెను; యెక్కు
35 టకు యెనిమిది సోపానములు కలవు. । అప్పుడు అతడు
నన్ను తూర్పు ద్వారమునకు తెచ్చి, యీ కొలల ప్రకా
36 రము దాని కొలిచెను. । మరిన్ని దాని చిన్న గదులు
న్ను దాని స్తంభములున్ను దాని నాదులున్ను యీ
కొలల ప్రకారముగా వుండెను; మరిన్ని దానికిన్ని దాని
చుట్టూ వున్న నాదులకున్ను కిటికీలు కలవు; దాని
నిడివి యేభై మూరలున్ను దాని వెడల్పు యిరువై అయి
37 దు మూరలున్ను అయి వుండెను. । బైటి వాకిటి తట్టున
దాని స్తంభములు వుండెను; మరిన్ని ఆ స్తంభముల
మీద యిటున్ను అటున్ను పోనీకి చెట్లు వుండెను;
మరిన్ని యెక్కుటకు యెనిమిది సోపానములు కలవు.।
38 దాని గదులున్ను తలుపులున్ను ద్వారముయొక్క స్తంభ
ముల దగ్గిర వుండెను; అక్కడ వారు హోమ బలు
39 లను కడిగేవారు. । మరిన్ని ద్వారముయొక్క వాకిటిలో
యీ పార్శ్వమున రెండు పలకలున్ను ఆ పార్శ్వ
మున రెండు పలకలున్ను కలిగి వుండెను; వీటి మీద
వారు హోమ బలినిన్ని పాప పరిహారపు బలినిన్ని
40 తప్పితపు బలినిన్ని అర్పించుతురు. । మరిన్ని ఉత్తర ద్వా
రముయొక్క తలుపు బైట యెక్కుటకు యీ పార్శ్వ
మున రెండు పలకలు కలిగి వుండెను; మరిన్ని ద్వార
ముయొక్క గడప దగ్గిర ఆ పార్శ్వమున రెండు పల
41 కలు కలిగి వుండెను. । ద్వారము యిరు పార్శ్వము
లను నాలుగేసి పలకలు వుండెను; వాటి మీద వారు
వేట వేతురు. । మరిన్ని హోమ బలి కొరకు చెక్కిన 42
రాతి పలకలు నాలుగున్ను పలక వొక్కంటికి మూరె
డునర నిడివిన్ని మూరెడునర వెడల్పున్ను మూరెడు
పొడుగున్ను అయి వుండెను; వాటి మీద వారు హో
మార్పణల కొరకున్ను బలుల కొరకున్ను అయిన వా
టిని చంపుటకు యినుప సరుకులను వుంచుకొందురు. ।
మరిన్ని లోపల బెత్తెడేసి వంకీలు నాటబడి వుండెను; 43
ఆ బలియొక్క మాంసము పలకల మీద వుండెను. ।
లోపటి ద్వారము బైట వున్న లోపటి వాకిటిలో 44
గాయకులయొక్క గదులు వుండెను; అవి వుత్తర ద్వా
రము తట్టున వుండెను; వాటి ముఖములు దక్షిణపు
తట్టు వుండెను; వొకటి తూర్పు ద్వారము తట్టు కల
దు; దాని ముఖము వుత్తరముకు వుండెను. । అప్పుడు 45
అతడు నాతో చెప్పినదేమంటే, దక్షిణపు తట్టు ముఖ
ము కలిగిన గది మందిరమును కనిపెట్టే అర్చకుల
కొరకై వుండెను. । వుత్తరపు తట్టు ముఖము కలిగిన గది 46
పీఠమును కనిపెట్టే అర్చకుల కొరకై వుండెను; వీరు
లేవీ పుత్రులలో సాదోకు కుమారులయి యెహోవా
సన్నిధికి వచ్చి సేవించేవారై వున్నారని చెప్పెను. ।
అప్పుడు అతడు ఆ వాకిటిని కొలిచెను; దాని నిడివి 47
నూరు మూరలున్ను వెడల్పు నూరు మూరలున్నై చచ్చౌ
కముగా వుండెను; మందిరము ముందర వున్న పీఠము
నున్ను కొలిచెను. । అప్పుడు అతడు మందిరముయొక్క 48
గడపలోకి నన్ను తీసుకొని వచ్చి, గడపయొక్క స్తంభ
మును కొలిచెను; వొక్కొక్క దానికి యీ పార్శ్వము
అయిదు మూరలున్ను ఆ పార్శ్వము అయిదు మూర
లున్ను అయి వుండెను; ద్వారముయొక్క వెడల్పు యీ
తట్టు మూడు మూరలున్ను ఆ తట్టు మూడు మూరలు
న్ను అయి వుండెను. । ద్వారముయొక్క నిడివి యిరువై 49
మూరలున్ను వెడల్పు పదకొండు మూరలున్ను అయి
వుండెను; యెక్కుటకు సోపానములు వుండెను; ద్వార
బంధముల దగ్గిర యిరు పార్శ్వములను వొక్కొక్క
స్తంభము వుండెను.

## 41. అధ్యాయము.

తరువాత అతడు నన్ను గుడి యొద్దికి తీసుకొని వచ్చి, 1
స్తంభములను కొలిచినప్పుడు, యీ పార్శ్వము వెడ
ల్పు ఆరు మూరలున్ను ఆ పార్శ్వము వెడల్పు ఆరు
మూరలున్ను అయి వుండెను; అది డేరాయొక్క వెడ
ల్పు అయి వుండెను. । ద్వారముయొక్క వెడల్పు పది 2
మూరలై వుండెను; తలుపు యిరు పార్శ్వములను
అయిదేసి మూరలు వుండెను; దాని నిడివి నలుభై మూ
రలుగానున్ను దాని వెడల్పు యిరువై మూరలుగాను

3 న్ను కొలిచెను. । అప్పుడు అతడు లోపటికి వెళ్లి, తలు
పుయొక్క స్తంభమును రెండు మూరలుగా కొలిచెను;
తలుపు ఆరు మూరలున్ను తలుపు వెడల్పు యేడు మూ
4 రలున్ను అయి వుండెను. । అప్పుడు దాని నిడివి యిరువై
మూరలుగా కొలిచెను; గుడి ముందటి వెడల్పు యిరువై
మూరలు అయి వుండెను; అప్పుడు అతడు నన్ను చూచి
5 యిది మహా పరిశుద్ధమైన స్థలమని చెప్పెను. । తరువాత
అతడు మందిరముయొక్క గోడను ఆరు మూరలుగా
కొలిచెను; మందిరము చుట్టూ యిరు పార్శ్వములను
వున్న గదులు నాలుగేసి మూరల వెడల్పువి అయి వుం
6 డెను. । అయితే యీ పక్క గదులు మూడేసి అంత
స్థులై ముప్పయి గదులు వుండెను; యివి చుట్టూ వున్న
పక్క గదుల కొరకు మందిరమునకు కట్టిన గోడలో
అతక గలందులకు యిమిడి వుండెను; యీలాగున అవి
7 మందిరముయొక్క గోడను అంటి వుండలేదు. । మరిన్ని
పక్క గదుల పైకి యెక్కే మార్గము యింకా వెడల్పు
గానున్ను తిరుగుడుగానున్ను వుండెను; యేమంటే యీ
మార్గము చుట్టూ తిరిగి మందిరము మీదికి యెక్కుతూ
వుండెను; అయినందున మందిరముయొక్క వెడల్పు కింది
అంతస్తుకంటే రెండో అంతస్తున అధికమై వుండెను;
రెండో అంతస్తు కంటే మూడో అంతస్తున మరీ అధి
8 కమై వుండెను. । మరిన్ని మందిరము చుట్టూ పొడుగం
తా నేను చూస్తిని; పక్క గదులయొక్క పునాదులు
9 ఆరు పెద్ద మూరల నిండు కొలలై వుండెను. । బైటి
పక్క గదుల కొరకు కట్టిన గోడ దళసరి అయిదు
మూరలై వుండెను; విడిగా వున్న స్థలము లోపటి పక్క
10 గదుల కొరకై వుండెను. । గదుల మధ్య వెడల్పు మం
దిరము చుట్టూ నలుతట్లా యిరువై మూరలై వుండెను.।
11 అయితే పక్క గదుల తలుపులు విడిగా వున్న స్థలము
తట్టు వుండెను; వొక తలుపు వుత్తరము తట్టున్ను మరి
యొక తలుపు దక్షిణపు తట్టున్ను వుండెను; విడిగా
వున్న స్థలము వెడల్పు చుట్టూ అయిదు మూరలై వుం
12 డెను. । అయితే పడమటి తట్టు మూల కలిగిన సందు
ముందర కట్టిన దాని వెడల్పు డెబ్భయి మూరలై వుం
డెను; యీ కట్టిన దాని గోడ చుట్టూ అయిదు మూ
రలై వుండెను; దాని నిడివి తొంభై మూరలై వుండె
13 ను. । మరిన్ని మందిరముయొక్క నిడివి నూరు మూర
లుగా అతడు కొలిచెను; విడి స్థలమున్ను ఆ కట్టిన
దానిన్ని దాని చుట్టూ గోడలున్ను నూరు మూరల
14 నిడివిగా కొలిచెను. । మరిన్ని మందిరము ముందర వాకి
టినిన్ని తూర్పున తట్టు వున్న విడి స్థలమున్ను నూరు
15 మూరల వెడల్పుగా కొలిచెను. । మరిన్ని వెనుక విడి
స్థలమునకు యెదుట కట్టిన దానిన్ని యిరు పార్శ్వ
ములనూ వున్న దాని పంచపాళీలనున్ను నూరు మూరల

నిడివిగా కొలిచెను. । లోపటి గుడినిన్ని లోగిటి ద్వార 16
ములనున్ను గడపలనున్ను యిరుకు కిటికీలనున్ను ద్వా
రము యెదుట మూడు అంతస్తుల చుట్టూ వున్న పంచ
పాళీలనున్ను కొలిచెను; యివిన్ని కిటికీలున్ను బల్లల
చేత చుట్టూ కప్పబడెను. । నేల మొదలుకొని కిటికీలు 17
మట్టుకున్ను తలుపు పైని వున్న దానిన్ని లోపటి యిం
టినిన్ని బైటి యింటినిన్ని గోడ అంతటినిన్ని లోపటా
బైటా నఖముఖాలా కొలిచెను. । దానికి కెరూబులు 18
న్ను పోనీకి చెట్లున్ను వుండెను; కెరూబుల సందున
వొక్కొక పోనీకి చెట్టు వుండెను; వొక్కొక కెరూ
బుకు రెండేసి ముఖములు వుండెను. । యేలాగంటే 19
యీ పార్శ్వపు పోనీకి చెట్టు తట్టు మనుష్య ముఖ
మున్ను ఆ పార్శ్వపు పోనీకి చెట్టు తట్టు సింహ
ముఖమున్ను తిప్పుకొని వుండెను; యీ ప్రకారము
మందిరము చుట్టూ అంతటా వుండెను. । నేల మొదలు 20
కొని తలుపు పై మట్టుకున్ను గుడి గోడకున్ను కెరూ
బులున్ను పోనీకి చెట్లున్ను వుండెను. । గుడి స్తంభములు 21
చచ్చౌకమై వుండెను; పరిశుద్ధ స్థలమంతా వొక లాగు
నే వుండెను. । దారు పీఠము పొడుగు మూడు మూర 22
లున్ను దాని నిడివి రెండు మూరలున్ను అయి వుండె
ను; దాని మూలలున్ను దాని నిడివిన్ని దాని గోడలు
న్ను దారు మయములై వుండెను; అప్పుడు అతడు
నాతో యిది యెహోవా సముఖమందుండే బల్ల అని
చెప్పెను. । అయితే గుడికిన్ని పరిశుద్ధ స్థలమున్ను రెం 23
డు తలుపులు కలవు. । వొక్కొక తలుపుకు రెండేసి 24
మడత రెక్కలు కలవు; । వీటి మీదనున్ను గుడి తలు 25
పుల మీదనున్ను గోడల మీద వున్నట్టు కెరూబులున్ను
పోనీకి చెట్లున్ను వుండెను; బైట గడప దళసరి బల్లల
చేత కప్పబడెను. । మరిన్ని గడప యిరు పార్శ్వముల 26
నున్ను మందిరముయొక్క పక్క గదుల మీదనున్ను
యిరుకైన కిటికీలున్ను పోనీకి చెట్లున్ను వుండెను; యి
విన్ని దళసరి బల్లలచేత కప్పబడెను.

## 42. అధ్యాయము.

అప్పుడు అతడు వుత్తర మార్గముచేత అవతల 1
వాకిటిలోకి నన్ను వెంటబట్టుకొని, వుత్తరపు తట్టున
కట్టిన దాని ముందటి విడి స్థలముయొక్క యెదటి గది
లోకి వచ్చెను.। వుత్తరపు తలుపు ముందటి నిడివి నూరు 2
మూరలై వుండెను; వెడల్పు యేభై మూరలై వుండెను.।
యిరువై మూరలు గల లోపటి వాకిటి యెదుటనున్ను 3
బైట వున్న రాకట్టు వాకిటి యెదుటనున్ను మూడు
అంతస్తుల పంచపాళీలు వొక దానికొకటి యెదురుగా
వుండెను. । గదుల ముందర పది మూరల వెడల్పు గల 4
విహార స్థలము వుండెను; లోపటికి వెళ్లే దారి వెడల్పు

5 మూరెడు వుండెను. । వాటి తలుపులు వుత్తరపు తట్టున
వుండెను; అయితే మీది గదులు వీటి కన్న చిన్నవి,
యేమంటే పంచపాళీలు పొడుగైనందున కింది గదుల
కంటేనున్ను మధ్య గదుల కంటేనున్ను యిరుకుగా
6 వుండెను. । యేమంటే అవి మూడు అంతస్తులై వుండెను;
మరిన్ని వాకిటి స్తంభముల వంటి స్తంభములు వాటికి
లేవు గనుక కింది గదుల కంటేనున్ను మధ్య గదుల
7 కంటేనున్ను అది యిరుకుగా వుండెను. । అయితే బైటి
వాకిటి తట్టున్ను గదులకు యెదురుగానున్ను వున్న
బయిటి గోడ నిడివి యేభయి మూరలయి వుండెను. ।
8 ఆ ప్రకారముగా బైటి వాకిటిలో వున్న గదుల నిడివి
యేభై, మూరలయి వుండెను; మరిన్ని యిదుగో గుడి
9 ముందర నూరు మూరల స్థలము వుండెను. । అయితే
లోపటికి వచ్చే ద్వారముయొక్క బైటి వాకిటినుంచి
వచ్చే మనుష్యునికి తూర్పు తట్టు గదులు కిందై వుం
10 డెను. । తూర్పు తట్టు వాకిటియొక్క గోడ మందము
లో నిడివి స్థలముకు యెదురుగానున్ను ఆ కట్టిన దా
11 నికి యెదురుగానున్ను గదులు వుండెను. । మరిన్ని వాటి
ముందర వున్న మార్గము వుత్తరపు తట్టు వున్న గదుల
లాగున వుండెను; వాటి నిడివి ప్రకారముగానున్ను
వాటి వెడల్పు ప్రకారముగానున్ను వుండెను; వాటి
బైటి ద్వారములు వాటి ప్రకారముగానున్ను వాటి
12 తలుపుల ప్రకారముగానున్ను వుండెను. । మరిన్ని మా
ర్గపు మొగను దక్షిణపు తట్టు గదులయొక్క తలు
పుల లాటిది వొక తలుపు వుండెను; ఆ మార్గము
వాటిలోకి వెళ్లేవానికి తూర్పుగా వున్న గోడ యెదు
13 టనే వుండెను. । అప్పుడు అతడు నాతో చెప్పినదే
మంటే, నిడివి స్థలము యెదుట వున్న వుత్తరపు గదు
లున్ను దక్షిణపు గదులున్ను పరిశుద్ధపు గదులై వున్నవి;
అక్కడ యెహోవా సన్నిధికి వచ్చే అర్చకులు పరి
శుద్ధ వస్తువులను భుజింతురు; అక్కడ వారు మాంసా
ర్పణయున్ను పాపపరిహారార్పణయున్ను తప్పితపు
అర్పణయున్ను మొదలయిన పరిశుద్ధమైన వాటిని
వుంతురు, యేమంటే ఆ స్థలము పరిశుద్ధమై వున్నది. ।
14 అర్చకులు లోపటికి ప్రవేశించినప్పుడు బైటి వాకిటికి
వెళ్లుటకు పరిశుద్ధ స్థలమును విడువ గూడదు; అక్కడ
వారు తమ వ్యాపారపు వస్త్రములను వుంచ వలెను,
యేమంటే అవి పరిశుద్ధమై వున్నవి; కాబట్టి జనుల
యొక్క స్థలమునకు వెళ్లేటప్పుడు వేరే బట్టలను ధరిం
15 చుకొన వలెనని చెప్పెను. । అయితే ఆయన లోపటి
మందిరమును కొలుచుట సమాప్తమైన తరువాత ఆయన
నన్ను బైటికి తీసుకొని, తూర్పు తట్టున వున్న ద్వార
16 మునకు వచ్చి దాని చుట్టూ కొలిచెను. । ఆయన తూర్పు
పార్శ్వము చుట్టూ కొల కర్రతోటి యేనూరు కొల
లుగా కొలిచెను. । మరిన్ని వుత్తర పార్శ్వము చుట్టూ 17
కొల కర్రతోటి యేనూరు కొలలుగా కొలిచెను. ।
మరిన్ని దక్షిణ పార్శ్వము కొల కర్రతోటి యేనూరు 18
కొలలుగా కొలిచెను. । అప్పుడు పశ్చిమ పార్శ్వము 19
నకు వెళ్లి కొల కర్రతోటి యేనూరు కొలలుగా కొలి
చెను. । అతడు నలుతట్లా కొలిచెను; పరిశుద్ధ స్థలమున 20
కున్ను బహిరంగ స్థలమునకున్ను సందు వుండేటట్టు
దానిచుట్టూ ప్రాకారము కలిగి వుండెను; దాని నిడి
విన్ని దాని వెడల్పున్ను యేనూరు కొల కర్రలై వుండెను.

## 43. అధ్యాయము.

తరువాత అతడు నన్ను తూర్పు తట్టున వున్న ద్వార 1
మునకు తీసుకొ వచ్చెను. । అయితే యిదుగో ఇశ్రా 2
యేలు దేవుని మహిమ తూర్పు మార్గమున వచ్చెను;
ఆయన శబ్దము విస్తారపు వుదకముల ధ్వనివలె వుం
డెను; భూమి ఆయన ప్రకాశతవల్ల ప్రజ్వరిల్లెను. ।
యీ దర్శనము పట్టణపు నాశనమును గూర్చి భవి 3
ష్యత్తుగా చెప్ప వచ్చిన నాకు కనుబడిన దర్శనము
లాగున వుండెను; మరిన్ని యీ దర్శనములు కెబారు
నది దగ్గిర నాకు కనుబడిన దర్శనము లాగున వుం
డెను; కాబట్టి నేను సాష్టాంగపడితిని. । అయితే యె 4
హోవా మహిమ తూర్పు తట్టున వున్న ద్వారపు
మార్గమున వచ్చి మందిరములోకి ప్రవేశించెను. ।
అప్పుడు ఆత్మ నన్ను యెత్తుకొని లోపటి వాకిటిలోకి 5
తీసుకొ వచ్చెను; అప్పుడు యిదుగో యెహోవా మహి
మతో మందిరము నిండి వుండెను. । అప్పుడు మందిర 6
ములోనుంచి వొకడు నన్ను పిలుచుట వింటిని; మరిన్ని
ఆ మనుష్యుడు నా యొద్ద నిలిచి, నాతో ఆనతిచ్చిన
దేమంటే, । వో నర పుత్రుడా, యిది నా గద్దె స్థల 7
మున్ను నా అరికాలి స్థలమున్ను అయి వున్నది; యి
క్కడ నేను ఇశ్రాయేలు పుత్రులలో నిత్యమున్ను నివ
సింతును; యిక మీదట ఇశ్రాయేలు యింటివారు నా
పరిశుద్ధ నామమును అలక్ష్యము చేయక వుందురు;
వారైనా వారి రాజులైనా జారత్వము చేతనున్ను వున్న
తమైన స్థలములందు వారి రాజుల కళేబరముల చేత
నున్ను దానిని అలక్ష్యము చేయక వుందురు. । నా 8
గడప దగ్గిర వారి గడపనున్ను నా స్తంభము దగ్గిర
వారి స్తంభమునున్ను నాయొక్క వారియొక్క మధ్యను
గోడనున్ను పెట్టి బహు యేహ్యతలను చేసి, నా పరి
శుద్ధమైన నామమును అలక్ష్య పెట్టిరి; కాబట్టి నేను
కోపాగ్ని తెచ్చుకొని వారిని దహిస్తిని. । అయినప్పటి 9
కిన్ని యిప్పుడు వారు జారత్వమును మాని, వారి రాజుల
కళేబరములను నాకు దూరముగా చేస్తే నేను వారిలో
యెన్నటికీ నివాసుడనై వుందును. । కాబట్టి వో నర 10

పుత్రుడా, ఇశ్రాయేలు యింటివారు తమ అక్రమ
ముల యందు సిగ్గుపడేటట్టు నీవు యీ మందిరమును
వారికి చూపించుము; వారు దాని ప్రమాణమును కొ
11 లువవలెను. । వారి చేష్టల విషయమై వారు సిగ్గుపడితే
మందిరముయొక్క ఆకారమునున్ను దాని పోలికెనున్ను
దాని వచ్చే పోయే స్థలములనున్ను దాని మర్యాదలన్ని
టినిన్ని దాని నిబంధనలన్నిటినిన్ని దాని న్యాయ ప్ర
మాణములన్నిటినిన్ని వారికి చూపించి, వారు దాని
మర్యాదలన్నిటినిన్ని నిబంధనలన్నిటినిన్ని జాగ్రత చేసే
12 టట్టు వారి కండ్ల ముందర వ్రాయవలెను. । మందిరము
యొక్క న్యాయ పద్ధతి యేమంటే, కొండ మీద
చుట్టూ మహా పరిశుద్ధముగా వుండును; యిదుగో యిదే
మందిరముయొక్క న్యాయ పద్ధతి అయి వున్నది. ।
13 మరిన్ని మూరెడు బెత్తెడు గల పీఠముయొక్క మూర
కొల ప్రమాణములు యేవంటే, మూరెడంటే మూరెడు
జానెడు; దాని చుట్టు మూరెడై వుండును; దాని వెడ
ల్పున్ను మూరెడై వుండును; దాని చివర చుట్టూ వున్న
అంచు జానెడయి వుండును; యిది పీఠముకు పునాది
14 అయి వుండును. । మరిన్ని కింది మట్టు మొదలుకొని
కింది చూరు మట్టుకు రెండు మూరలు వుండును; దాని
వెడల్పు మూరెడై వుండును; మరిన్ని చిన్న చూరు మొ
దలు కొని పెద్ద చూరు మట్టుకు నాలుగు మూరలయి
15 వుండును; దాని వెడల్పు మూరెడై వుండును. । మరిన్ని
పీఠముయొక్క పొడుగు నాలుగు మూరలై వుండును;
16 పీఠమునుంచి నాలుగు కొమ్ములు పైకి వుండును. । పీఠ
ముయొక్క నిడివి పన్నెండు మూరలున్ను వెడల్పు
పన్నెండు మూరలున్ను అయి చచ్చౌకముగా వుండు
17 ను. । మరిన్ని చూరు నిడివిన్ని వెడల్పున్ను నలుతట్లా
పద్నాలుగు మూరలై వుండును; దాని చుట్టూ వున్న
అంచు జానెడై వుండును; దాని మట్టు చుట్టంతా మూ
రెడై వుండును; పీఠముయొక్క సోపానములు తూర్పు
18 తట్టు వుండవలెను. । మరిన్ని ఆయన నాతో చెప్పిన
దేమంటే, వో నర పుత్రుడా, కర్తయైన యెహోవా
వా నీకు సెలవు యిచ్చిన లాగున వారు దాని మీద
హోమములను అర్పించుటకున్ను దాని మీద రక్త
మును చల్లుటకున్ను పీఠమును చేసిన నాటియందు పీఠ
19 మును గురించిన నిర్ణయములు యేవంటే, । వ్యాపా
రము చేసుటకు నా సన్నిధికి వచ్చిన లేవీయులలో సా
దోకు సంతతియైన అర్చకులకు నీవు పాపపరిహారపు
20 బలి కొరకు కోడె యెద్దును యివ్వవలెను. । దాని రక్త
మును నీవు తీసి పీఠముయొక్క నాలుగు కొమ్ముల మీద
నున్ను చూరుయొక్క నాలుగు మూలల మీదనున్ను
చుట్టూ వున్న అంచు మీదనున్ను వేసి, యీలాగున
నీవు దానిని శుభ్రముగానున్ను పరిశుద్ధముగానున్ను
చేయవలెను. । అప్పుడు నీవు పాపపరిహారపు బలి కొర 21
కైన యెద్దును తీసి, పరిశుద్ధ స్థలము అవతలి మందిరము
లో నిర్ణయపు స్థలమందు దహనము చేయవలెను. ।
రెండో దినమున నీవు మొర్రిలేని మేక పిల్లను పాప 22
పరిహారపు బలిగా చెల్లించ వలెను; మరిన్ని కోడె
యెద్దు చేత వారు పీఠమును యేలాగు పరిశుద్ధ పర్చిరో
ఆలాగునే మేకపిల్లచేతనున్ను పరిశుద్ధపర్చ వలెను. ।
నీవు దానిని పరిశుద్ధము చేయుట సమాప్తమైన తరు 23
వాత మొర్రిలేని కోడె యెద్దునున్ను మొర్రిలేని పొ
ట్టేలునున్ను చెల్లించ వలెను. । యెహోవా సముఖ 24
మందు నీవు వాటిని చెల్లించ వలెను; అర్చకులు వాటి
మీద వుప్పు జల్లి, హోమార్పణగా యెహోవాకు
చెల్లించ వలెను. । యేడు దినముల మట్టుకు ప్రతి దిన 25
మందూ నీవు పాపపరిహారపు బలి కొరకు వొక మేకను
సిద్ధపర్చ వలెను; మరిన్ని కోడె యెద్దునున్ను మొర్రి
లేని పొట్టేలునున్ను వారు సిద్ధపర్చ వలెను. । యేడు 26
దినముల మట్టుకు వారు పీఠములు శుభ్రముగానున్ను
పరిశుద్ధముగానున్ను చేసి దాని సంప్రోక్షణ చేయ
వలెను. । ఆ దినములు గతించిన తరువాత యెనిమిదో 27
దినముననున్ను ఆ మీదటనున్ను అర్చకులు పీఠము
మీద మీ హోమములనున్ను మీ సంతోషపు అర్ప
ణలనున్ను చెల్లించ వలెను; మరిన్ని నేను నిన్ను అంగీక
రింతునని కర్తయైన యెహోవా చెప్పెనని ఆనతిచ్చెను.

## 44 అధ్యాయము.

అప్పుడు ఆయన తూర్పు తట్టు వున్న బైటి పరి 1
శుద్ధ స్థలముయొక్క ద్వారపు మార్గము చేత నన్ను
మళ్లించెను; అయితే ఆ ద్వారము ముయ్యపడి వుండె
ను. । అయినందున యెహోవా నాతో ఆనతిచ్చినదే 2
మంటే, యీ ద్వారము ముయ్యబడి వుండును; యే
మనుష్యుడైనా దానిలో ప్రవేశించుటకు దానిని విప్ప
కూడదు; యేమంటే ఇశ్రాయేలు దేవుడైన యెహోవా
దానిలో ప్రవేశించెను గనుక అది ముయ్యబడి వుండు
ను. । యిది శ్రేష్ఠుని కొరకు వుండును; ఆ శ్రేష్ఠుడు లోప 3
టికి వచ్చి కూచుండి, యెహోవా సన్నిధిని భుజిం
చును; యీ ద్వారపు గడప మార్గముచేత అతడు
లోపలికి వస్తూ, ఆ మార్గముచేతనే బైటికి వెళ్లుతూ
వుండునని ఆనతిచ్చెను. । అప్పుడు అతడు వుత్తరపు ద్వా 4
రపు మార్గముచేత నన్ను మందిరము ముందటికి తీసు
కొ వచ్చెను; అప్పుడు నేను చూడగానే యిదుగో
యెహోవా మహిమచేత యెహోవా మందిరము
నిండి యుండెను; కాబట్టి నేను సాష్టాంగ పడితిని. ।
అప్పుడు యెహోనా నాతో ఆనతిచ్చినదేమంటే, 5
వో నర పుత్రుడా, యెహోవా మందిరముయొక్క

కట్టడలన్నిటిని గురించిన్ని దాని న్యాయ నిబంధనల
నన్నిటిని గురించిన్ని నేను నీతోటి చెప్పబోయే యా
వత్తు మాటలు నీవు నీ కండ్లతోటి చూచి, నీ చెవుల
తోటి విని, నీ మనస్సు యందు దిట్టపర్చుకొనుము;
మరిన్ని మందిరము లోపటికి వచ్చే ద్వారములందున్ను
పరిశుద్ధ స్థలమునుంచి బైలు వెళ్లే ద్వారములందున్ను నీ
6 మనస్సు వుంచి, । వ్యతిరిక్తులైన ఇశ్రాయేలు యింటివా
రిని చూచి, కర్తయైన యెహోవా ఆనతిచ్చినట్టు
చెప్పవలసినదేమంటే, ఓ ఇశ్రాయేలు యింటివార
లారా, యింత మట్టుకు మీరు అసహ్యపు చేష్టలను
7 చేస్తిరి, చాలునని అనుకొన వలెను. । యేమంటే నాకు
రొట్టెలనున్ను రక్తమునున్ను చెల్లించినప్పుడు మీరు హృ
దయమందున్ను శరీరమందున్ను సున్నతీ లేని అన్యులను
నా మందిరమును అపవిత్రపరిచేటట్టుగా లోపటికి తీసు
కవచ్చి వుంచితిరి; మీ సకల యేహ్యతల విషయమై
8 వారు నా ప్రమాణమును విచ్ఛిత్తు చేసిరి. । మరిన్ని
మీరు నా పరిశుద్ధమైన వాటిని కనిపెట్టక మీకు మా
9 రుగా నన్ను కనిపెట్టుటకు అన్యులను వుంచితిరి. । కాబట్టి
యిందుకు కర్తయైన యెహోవా సెలవు యిచ్చేదేమం
టే, హృదయమందున్ను శరీరమందున్ను సున్నతీ లేని
అన్యుడు ఇశ్రాయేలు పుత్రులలో వుంటే అతడు నా
10 పరిశుద్ధ స్థలములోకి ప్రవేశించ కూడదు. । మరిన్ని
ఇశ్రాయేలీయులు నన్ను విడిచి, వారి విగ్రహములను
వెంటాడినప్పుడు నన్ను విడిచిన లేవీయులు వారి దోష
11 మును భరింతురు. । అయినప్పటికిన్ని వారు నా పరిశుద్ధ
స్థలమునకు సేవకులై వుందురు; నా మందిరముయొక్క
ద్వారపాలకులై మందిరమునకు సేవ చేస్తూ వుందురు;
మరిన్ని సేవ కొరకు హోమ బలులనున్ను అన్య బలుల
నున్ను నరుకుతూ జనుల ముందర నిలిచి సేవ చేస్తూ
12 వుందురు. । యేమంటే వీరు వారి విషయమై వారి విగ్ర
హముల ముందర సేవచేసి, ఇశ్రాయేలు యింటివారిని
పాపములో పడవేసిరి; కాబట్టి నేను వారికి విరోధ
ముగా నా హస్తమును యెత్తితిని; వారు తమ దోష
మును భరింతురని కర్తయైన యెహోవా ఆనతిచ్చెను. ।
13 వారు అర్చకత్వపు వుద్యోగమును చేయుటకు నా
సన్నిధికి రాలేకపోదురు; పరిశుద్ధ స్థలమందు వున్న నా
పరిశుద్ధ వస్తువులలో యే వొక దాని యొద్దికైనా రాలే
కపోదురు; యీలాగున వారు తమ సిగ్గునున్ను తమ
14 యేహ్య చేష్టలనున్ను భరింతురు. । అయితే నా మంది
రపు యావత్సేవ నిమిత్తమున్ను దానికి కావలసిన యా
వత్ప్రయోజనము నిమిత్తమున్ను వారు దానిని కనిపె
15 ట్టేటట్టు చేతును. । అయితే ఇశ్రాయేలు పుత్రులు
నన్ను విడిచినప్పుడు నా పరిశుద్ధ స్థలమును కనిపెట్టివున్న
లేవీయులైన అర్చకులు అనగా సాదోకు కుమారులు
నాకు సేవ చేయుటకు నా సన్నిధికి వచ్చి, వారే నా
ముందర నిలిచి, నాకు క్రొవ్వునున్ను రక్తమునున్ను చెల్లిం
తురు. । నా పరిశుద్ధ స్థలములోకి ప్రవేశించి, వారు 16
నాకు సేవ చేసుటకు నా బల్ల యొద్దికి వచ్చి, నన్ను
కనిపెట్టి వుందురు, అని కర్తయైన యెహోవా ఆన
తిచ్చి, । యింకా చెప్పినదేమంటే, వారు లోపటి వా 17
కిటి ద్వారములోకి ప్రవేశించినప్పుడు నార బట్టలను
కట్టుకో వలెను, యేమంటే లోపటి వాకిటి ద్వారము
లోనున్ను గుడిలోనున్ను వారు సేవ చేసిన సమయ
మున బొచ్చుచేత చేసిన బట్టను కప్పుకో కూడదు. ।
వారు నార పాగాలను ధరించుకొని, వారి నడుములకు 18
నార లాగులను తొడగ వలెను; చెమట పట్టేది యే
దైనా కప్పుకో కూడదు. । అయితే బైటి వాకిటిలో 19
వున్న జనుల యొద్దికి వారు వెళ్లేటప్పుడు వారి వ్యా
పార వస్త్రములను తీసి పరిశుద్ధమైన గదులలో వుంచి,
వేరే బట్టలను ధరించ వలెను; వారి పరిశుద్ధ వస్త్రము
లతో జనులలోకి వెళ్ల కూడదు. । మరిన్ని వారు తమ 20
తలలను క్షౌరము చేయించుకో కూడదు; వారు వెంట్రు
కలను పెరగనియ్య కూడదు; కత్తెరతో మాత్రము కత్తి
రించ వచ్చును. । మరిన్ని యే అర్చకుడైనా లోపటి 21
వాకిటికి ప్రవేశించేటప్పుడు ద్రాక్షారసమును తాగ
కూడదు. । మరిన్ని విధవనైనా పరిహరించబడిన దాని 22
నైనా వివాహము చేసుకోక, ఇశ్రాయేలు యింటివారి
సంతతియైన కన్యకలనైనా అర్చకులలోనున్న విధవల
నైనా భార్యలను చేసుకోవచ్చును. । మరిన్ని వారు నా 23
జనులకు యేది పరిశుద్ధమైనదో యేది పరిశుద్ధమైనది
కాదో యేది పవిత్రమైనదో యేది పవిత్రమైనది కా
దో అది నేర్పి చూపించ వలెను. । మరిన్ని వ్యాజ్యము 24
వుంటే వారు న్యాయము తీర్చుదురు; నా న్యాయ నిబం
ధనల ప్రకారము వారు దానిని తీర్చ వలెను; నేను
నిర్ణయించిన పండుగలను వారు నా న్యాయప్రమా
ణముల ప్రకారముగానున్ను నా కట్టడల ప్రకారము
గానున్ను చేసి, నా సబ్బాతులను పరిశుద్ధముగా ఆచ
రించ వలెను. । మరిన్ని వారు అంటుపడకుండా వుండు 25
టకు శవము దగ్గిరికి రాకూడదు; అయితే తండ్రి నిమి
త్తమైనా తల్లి నిమిత్తమైనా కుమారుని నిమిత్తమైనా
కుమార్తె నిమిత్తమైనా సహోదరుని నిమిత్తమైనా
పెనిమిటి లేని సహోదరి నిమిత్తమైనా వారు అంటు
పడ వచ్చును. । మరిన్ని అంటు పడినవాడు శుచిభూ 26
తుడైన తరువాత అతనికి యేడు దినములు నిర్ణయించ
వలెను. । మరిన్ని పరిశుద్ధ స్థలములో సేవ చేసుటకు అతడు 27
లోపటి వాకిటి పరిశుద్ధ స్థలమునకు వచ్చిన నాటియం
దు అతడు తన కొరకు పాపపరిహారపు బలిని చెల్లించ

వలెనని కర్తయైన యెహోవా ఆనతిచ్చి, మరిన్ని
28 చెప్పినదేమంటే, । యిది వారికి స్వాస్థ్యము కొరకు
వుండును; నేనే వారికి స్వాస్థ్యమును; కాబట్టి ఇశ్రా
యేలులో మీరు వారికి యెంతమాత్రమైనా స్వాస్థ్య
మును యివ్వవద్దు, యేమంటే నేనే వారికి స్వాస్థ్య
29 మును. । భోజనార్పణలున్ను పాపపరిహారపు బలు
లున్ను తప్పితపు బలులున్ను వారికి ఆహారమవును;
ఇశ్రాయేలులో మీరు కట్టినవన్నిన్ని వారివవును. ।
30 మరిన్ని ప్రథమ ఫలములన్నిటిలో ప్రధాన ఫలమున్ను
మీరు చెల్లించిన కానుకలన్నిన్ని అర్చకునివై వుండు
ను; మీ మీ యిండ్ల మీద ఆశీర్వాదము నిలిచి వుండే
టట్టు మీరు ముందుగా పిసికిన పిండి ముద్దను అర్చ
31 కునికి యివ్వవలెను. । అర్చకుడు తనకు తాను చచ్చిన
దానినైనా పక్షిచేత గాని మృగముచేత గాని పెగల్చ
బడిన దానినైనా తినకూడదు.

## 45. అధ్యాయము.

1 మరిన్ని మీరు చీట్లువేసి దేశమును విభాగించు
కొనినప్పుడు మీరు భూమిలోనుంచి పరిశుద్ధమైన పా
లును యెహోవాకు కానుకగా చెల్లించవలెను; దానికి
యిరువై అయిదు వేల కోల కర్రల నిడివిన్ని పది వేల
కోల కర్రల వెడల్పున్ను వుండ వలెను; యీ భూమి
2 దాని సరిహద్దులన్నిటిలో పరిశుద్ధమైన దవును. । దాని
లో పరిశుద్ధ స్థలము కొరకు యేనూరు కోల కర్రల నిడి
విన్ని యేనూరు కోల కర్రల వెడల్పున్ను వుండ వలెను;
చుట్టూ చచ్చౌకముగా వుండ వలెను; దాని కింద నలు
3 తట్లా యేభై మూరల భూమి వుండ వలెను. । యీ కోల
కర్రచేత నీవు యిరువై అయిదు వేల కోల కర్రల నిడి
వినిన్ని పది వేల కోల కర్రల వెడల్పునున్ను కొలువ
వలెను; అందులో మహా పరిశుద్ధ స్థలము వుండును. ।
4 యీ పరిశుద్ధ భూమి యెహోవాను సేవించుటకు
వారి సన్నిధికి వచ్చే పరిశుద్ధ స్థలముయొక్క వ్యాపార
కులైన అర్చకుల కొరకై వుండును; అది వారి యిండ్ల
కొరకు స్థలముగానున్ను పరిశుద్ధ స్థలము కొరకు స్థల
5 ముగానున్ను వుండ వలెను. । మరిన్ని యిరువై అయిదు
వేల కోల కర్రల నిడివిన్ని పదివేల కోల కర్రల వెడ
ల్పున్ను గల యీ భూమి మందిరముయొక్క వ్యాపా
రకులైన లేవీయులకు యిరువై గదుల కొరకు స్వాస్థ్య
6 ముగా వుండ వలెను. । మరిన్ని పట్టణము కొరకు మీరు
అయిదు వేల కోల కర్రల వెడల్పున్ను యిరువై అయి
దు వేల కోల కర్రల నిడివిన్ని గల భూమి నిర్ణ
యించ వలెను; కానుక చెల్లించిన పరిశుద్ధ భాగముకు
యెదురుగా వున్న ఇశ్రాయేలు యింటివారందరి కొ
7 రకు వుండును. । మరిన్ని కానుక చెల్లించిన పరిశుద్ధ
భాగముయొక్క యిరు పార్శ్వములనున్ను కానుక
చెల్లించిన పరిశుద్ధమైన భాగము యెదుట పట్టణపు భూ
మియొక్క యిరు పార్శ్వములనున్ను పట్టణపు భూమి
యెదుట పశ్చిమపు తట్టున్ను తూర్పు తట్టున్ను శ్రేష్ఠు
నికి భాగము వుండ వలెను; దాని నిడివి భాగములలో
వొక భాగము యెదుట వుండి పశ్చిమపు సరిహద్దు
మొదలుకొని తూర్పు సరిహద్దు మట్టుకు సాగి వుండ
వలెను. । యిది ఇశ్రాయేలు దేశమందు అతనికి భూ 8
భాగమై వుండును; మరిన్ని నా అధిపతులు యిక జను
లను బాధపెట్టక వుందురు; అయితే శేషించిన భూమి
అంతా ఇశ్రాయేలు యింటివారికి వారి గోత్రముల
ప్రకారముగా యివ్వవలెనని ఆనతిచ్చి, మరిన్ని కర్తయైన
యెహోవా ఆనతిచ్చేదేమంటే, । వో ఇశ్రాయేలు అధి 9
పతులారా, యింత మట్టుకు చాలునని అనుకోండి; బల
వంతమున్ను అపహరించుటయున్ను మాని, నీతి న్యాయ
ములను జరిగిస్తూ, నా జనుల సొమ్మును అపహరించ
వద్దని కర్తయైన యెహోవా ఆనతిచ్చి, మరిన్ని
చెప్పేదేమంటే, । మీ యొద్ద యథార్థమైన త్రాసు 10
న్ను యథార్థమైన ఏఫాయున్ను యథార్థమైన
బాతున్ను వుండ వలెను; ఏఫాయున్ను బాతున్ను వొక
కొల ప్రకారము వుండ వలెను. । బాతు హోమరులో 11
పదో పాలున్ను ఏఫా హోమరులో పదో పాలున్ను
పట్టేవై వుండ వలెను; వీటి కొల హోమరుచేత సరి
పుచ్చ వలెను. । షెకేలు వొక్కంటికి యిరువై గేరాల 12
యెత్తు వుండవలెను; మానె వొక్కంటికి యిరువై షేకే
లులు వుండవలెను. । మీరు చెల్లించ వలసిన అర్పణలు 13
యేవంటే, హోమరు గోధుములలో ఆరో వంతు
ఏఫానున్ను హోమరు యవలలో ఆరో వంతు ఏఫా
నున్ను చెల్లించ వలెను. । మరిన్ని బాతు తైలమును గురించి 14
నిర్ణయము యేమంటే, పది బాతులు గల ఖోరలో
పదో బాతును చెల్లించ వలెను; ఖోర వొక్కంటికి పది
బాతులు వుండ వలెను. । మరిన్ని భోజనార్పణల కొర 15
కున్ను సంతోషార్పణల కొరకున్ను ఇశ్రాయేలు దేశ
మందున్న మంచి మేత కలిగిన భూములలోనుంచి
వచ్చిన గొర్రెలు యిన్నూటికి వొకటి చొప్పున తీసి,
వాటిని జనుల కొరకు శమనార్థముగా చెల్లించ వలె
నని కర్తయైన యెహోవా ఆనతిచ్చి, మరిన్ని చెప్పిన
దేమంటే, । దేశపు జనులందరున్ను శ్రేష్ఠుని నిమిత్తము 16
యీ కానుకను యివ్వ వలెను. । అది శ్రేష్ఠుని పాలై 17
పండుగలందున్ను అమావాస్య దినములందున్ను సబ్బా
తు దినములందున్ను ఇశ్రాయేలు యింటివారి నిర్ణ
యపు కాలములందున్ను హోమార్పణ కొరకున్ను
భోజనార్పణల కొరకున్ను వుండ వలెను; అతడు ఇశ్రా
యేలు యింటివార శమనార్థముగా పాపపరిహారపు

బలులనున్ను భోజనార్పణలనున్ను సంతోషార్పణల
18 నున్ను సిద్ధపర్చ వలెనని ఆనతిచ్చి,। మరిన్ని కర్త
యైన యెహోవా ఆనతిచ్చేదేమంటే, మొదటి నెల
మొదటి దినమున నీవు తొర్రిలేని కోడె యెద్దును తీసు
19 కొని, పరిశుద్ధ స్థలము శుభ్రము చేయ వలెను.। యేలా
గంటే అర్చకుడు పాపపరిహారపు బలి రక్తమును తీసి,
మందిరముయొక్క స్తంభముల మీదనున్ను పీఠము
యొక్క చూరు నాలుగు మూలల మీదనున్ను లోపటి
వాకిటి ద్వారపు స్తంభముల మీదనున్ను పెట్టవలెను.।
20 ఆ ప్రకారముగా నీవు ఆ నెల యేడో దినమందు తప్పి
పోయిన వారిని గురించిన్ని తెలియని వారిని గురించిన్ని
చేయవలెను; యీలాగున మందిరముయొక్క శమనా
21 ర్థముగా చేతురుగాక.।మొదటి నెల పధ్నాలుగో దిన
మున పస్కా పండుగను ఆరంభించి, యేడు దినములు ఆ
చరించ వలెను; అప్పుడు పులిసిన రొట్టెను తిన గూడదు.।
22 ఆ దినమున శ్రేష్ఠుడు తన కొరకున్ను దేశపు జనులం
దరి కొరకున్ను వొక యెద్దును పాపపరిహారపు బలిగా
23 సిద్ధపర్చ వలెను.। మరిన్ని ప్రతి దినమున్ను యేడు
దినములు అతడు తొర్రిలేని యేడు యెద్లనున్ను యేడు
పొట్టేళ్లనున్ను యెహోవా కొరకు హోమార్పణగా
సిద్ధపర్చ వలెను; మరిన్ని ప్రతి దినమున మేక పిల్లను
24 పాపపరిహారపు బలిగా చెల్లించ వలెను.। మరిన్ని యెద్దు
వొక్కంటికిన్ని పొట్టేలు వొక్కంటికిన్ని ఏఫా అంత
పిండి గల భోజనార్పణను సిద్ధపర్చ వలెను; ఏఫా
25 వొక్కంటికి హీను అంత నూనె కావలెను.। మరిన్ని
యేడో నెల పదిహేనో దినమున పండుగను ఆరం
భించి, ఆ ప్రకారముగా పాపపరిహారపు బలిని గురిం
చిన్ని హోమార్పణను గురించిన్ని భోజనార్పణను
గురించిన్ని నూనెను గురించిన్ని యేడు దినములు చేయ
వలెనని ఆనతిచ్చెను.

## 46. అధ్యాయము.

1 మరిన్ని కర్తయైన యెహోవా ఆనతిచ్చేదేమం
టే, తూర్పుతట్టు లోపటి వాకిటి ద్వారపు ఆరు పని
దినముల మట్టుకు మూయబడి వుండ వలెను; అయితే
సబ్బాతు దినమందున్ను అమావాస్య దినమందున్ను
2 దానిని విప్ప వలెను.। మరిన్ని శ్రేష్ఠుడు ఆ ద్వారము
బయిటి గడప మార్గముచేత ప్రవేశించి, ద్వారపు
స్తంభము దగ్గిర నిలువ వలెను; అప్పుడు అర్చకులు దా
నియొక్క హోమార్పణనున్ను సంతోషార్పణనున్ను
చెల్లించవలెను; అతడు ద్వారము యొద్ద నిచిన తరువాత
బైటికి వెళ్లవలెను; అయితే సాయంకాలము కాక ము
3 నుపే ద్వారమును మూయ కూడదు.। మరిన్ని దేశపు
జనులు సబ్బాతు దినములందున్ను అమావాస్యలందు
న్ను ఆ తలుపు దగ్గిర నిలిచి, యెహోవా ముందర
మ్రొక్క వలెను.। అయితే సబ్బాతు దినమందు శ్రేష్ఠు 4
డు యెహోవాకు చెల్లించ వలసిన హోమార్పణల
కొరకు తొర్రి లేని ఆరు గొర్రె పిల్లలున్ను తొర్రిలేని
వొక పొట్టేలున్ను కావలెను.। పొట్టేలు వొక్కంటికి 5
ఏఫా అంత పిండిగల భోజనార్పణ కావలెను; గొర్రె
పిల్లలతోటి తన శక్తి ప్రకారము యివ్వవలెను; ఏఫా
వొక్కంటికి హీను అంత నూనెకావలెను.। మరిన్ని 6
అమావాస్యనాడు కోడె యెద్దునున్ను ఆరు గొర్రె పిల్లలను
న్ను వొక పొట్టేలునున్ను చెల్లించ వలెను; యివి తొర్రి
లేనివై వుండవలెను.। మరిన్ని అతడు భోజనార్పణను 7
సిద్ధపర్చ వలెను; యేలాగంటే యెద్దు వొక్కంటికిన్ని
పొట్టేలు వొక్కంటికిన్ని ఏఫా అంత పిండి వుండ
వలెను; గొర్రె పిల్లలతోను తన చేతిలో వున్నంతమ
ట్టుకు చెల్లించ వలెను; అయితే ఏఫా వొక్కంటికి హీను
అంత నూనె కావలెను.। శ్రేష్ఠుడు ప్రవేశించేటప్పుడు 8
ఆ ద్వారపు గడప మార్గముచేత ప్రవేశించ వలెను;
మరిన్ని ఆ మార్గము చేతనే బయిటికి వెళ్లవలెను.।
అయితే దేశపు జనులు నిర్ణయమైన పండుగలందు 9
యెహోవా సముఖమునకు వచ్చేటప్పుడు మ్రొక్కు
టకు వుత్తరపు ద్వారపు మార్గముచేత లోపటికి వచ్చి
నవాడు దక్షిణపు ద్వారపు మార్గముచేత బైలు వెళ్ల
వలెను; దక్షిణపు ద్వారపు మార్గముచేత లోపటికి
వచ్చినవాడు వుత్తరపు ద్వారపు మార్గముచేత బైలువెళ్ల
వలెను; లోపటికి వచ్చిన ద్వారపు మార్గముచేత బైలు
వెళ్లక దాని యెదుటనున్న మార్గముచేత బైలు వెళ్ల
వలెను.। మరిన్ని వారు లోపటికి వెళ్లేటప్పుడు శ్రేష్ఠుడు 10
వారితో కలుసుకొని వారితో ప్రవేశించ వలెను;
వారు బైలు వెళ్లేటప్పుడు అతడు వారితో బైలు వెళ్ల
వలెను.। మరిన్ని పండుగలయందున్ను నిర్ణయమైన కా 11
లములందున్ను వొక యెద్దుతోటిన్ని వొక పొట్టేలు
తోటిన్ని ఏఫా అంత పిండి గల భోజనార్పణను
చెల్లించ వలెను; గొర్రె పిల్లలతోటి తన శక్తి ప్రకార
ము యివ్వవలెను; అయితే ఏఫా వొక్కంటికి హీను
అంత నూనె కావలెను.। అయితే యెహోవాకు 12
హోమార్పణనైనా సంతోషార్పణనైనా చెల్లించు
టకు యెప్పుడు శ్రేష్ఠునికి మనస్సు కలుగునో అప్పు
డు తూర్పుతట్టు వున్న ద్వారమును అతనికి విప్పవలెను;
అతడు తన హోమార్పణనున్ను తన సంతోషార్ప
ణలనున్ను సబ్బాతు దినమందైనట్టు చెల్లించ వలెను;
అతడు వెళ్లి పోయిన తరువాత ఆ ద్వారమును మూయ్య
వలెను.। మరిన్ని ప్రతి దినమందున నీవు తొర్రిలేని 13
యేడాది గొర్రెపిల్లను హోమార్పణగా చెల్లించ వలె
ను; ప్రత్యూదయమందున్ను నీవు దానిని సిద్ధపర్చవలెను;

మరిన్ని ప్రత్యుదయమందూ నీవు దానితో భోజనా
14 ర్పణను చెల్లించ వలెను. । అది యేమిటంటే, ఏఫా అంత
సన్నపు పిండిలో ఆరో పాలున్ను పిండితో కలుపు
టకు హీను అంత నూనెలో మూడో పాలున్ను వుండ
వలెను; యిది నిత్య నిర్ణయము చేత యెహోవాకు
15 చెల్లించ వలసిన భోజనార్పణయై వుండును. । యీలా
గున వారు ప్రత్యుదయమందూ గొర్రె పిల్లనున్ను భో
జనార్పణనున్ను నూనెనున్ను హోమార్పణగా
చెల్లించ వలెనని ఆనతిచ్చి, మరిన్ని కర్తయైన యెహో
16 వా ఆనతిచ్చేదేమంటే, । శ్రేష్ఠుడు తన కుమారులలో
యెవనికైనా భూమిని యిస్తే అది అతని కుమారునికి స్వా
ధీనమవును; దానికి అతడు స్వతంత్రుడై వుండును. ।
17 అయితే అతడు తన సేవకులలో యెవనికైనా తన భూ
మిలో కొంత యిస్తే అది విడుపు సంవత్సరము మట్టుకు
మాత్రమే నిలిచి వుండును, అప్పుడు అది శ్రేష్ఠునికి
తిరిగీ రావలెను; అది అతని భాగమైనందున అతని
18 కుమారులు దానిని అనుభవించ వలెను. । మరిన్ని శ్రేష్ఠు
డు జనుల భూమిలోది యే మాత్రమైనా ఆక్రమించి,
వారి స్వాస్థ్యములోనుంచి వారిని వెళ్లవేయ కూడదు;
నా జనులు తమ తమ భూములలోనుంచి చెదిరిపోకుం
డా అతడు తన భూమిలోనుంచి తన కుమారులకు భాగ
19 ములను యివ్వవలెనని ఆనతిచ్చెను. । అప్పుడు అతడు
నన్ను ద్వారము యివతల వున్న మార్గముచేత తూర్పు
తట్టున వున్న అర్చకులయొక్క పరిశుద్ధమైన గదులలోకి
తీసుకొని వచ్చెను; అక్కడ యిరు పార్శ్వములను పశ్చి
20 మ దిక్కున స్థలము కలదు. । అప్పుడు అతడు నాతో
చెప్పినదేమంటే, అర్చకులు పరిశుద్ధమైన వాటితోటి
బైటి వాకిటిలో జనుల యొద్దికి వెళ్లకుండా యీ స్థల
మందు తప్పితపు అర్పణలనున్ను పాపపరిహారపు అర్ప
ణలనున్ను వండవలెను; భోజనార్పణలనున్ను అక్క
21 డనే కాల్చవలెనని చెప్పి, । బైటి వాకిటికి అప్పుడతడు
నన్ను తీసుకొని వచ్చి, వాకిటి నాలుగు మూలలనూ
తిప్పెను; అయితే యిదుగో వాకిటి మూల నెక్కంటికి
22 మరి నొక వాకిలి కలిగి వుండెను. । వాకిటి మూల
నెక్కంటికి ధూమ నాళములు గల వాకిలి నొకటి
కలదు; నొక్కొక దానికి నలభై మూరల నిడివిన్ని
ముప్పయి మూరల వెడల్పున్ను నాలుగింటికిన్ని నొక్క
23 టే ప్రమాణము కలదు. । మరిన్ని ఆ నాలుగింటి లో
పల చుట్టూ పజ్తిగా వున్న కట్టినవి కలవు; చుట్టూ
24 వున్న పజ్తుల కింద వంట స్థలములు కలవు. । అప్పుడు
అతడు నన్ను చూచి, యివి వంటచేసే వారి స్థలములై
వున్నవి; యిక్కడ మందిరముయొక్క వ్యాపారకులు
జనులయొక్క బలులను వండవలెనని చెప్పెను.

## 47. అధ్యాయము.

అప్పుడు అతడు మందిరముయొక్క ద్వారమునకు 1
నన్ను తీసుక వచ్చెను; అయితే యిదుగో మందిరము
యొక్క గడప కిందినుంచి వుదకములు వుబికి తూర్పు
గా పారెను; యేమంటే మందిరముయొక్క ముఖము
తూర్పు తట్టున వుండెను; ఆ వుదకములు మందిరము
యొక్క కుడి పార్శ్వము కిందినుంచిన్ని పీఠముయొ
క్క దక్షిణపు తట్టునుంచిన్ని వుబికి వుండెను. । అప్పుడు 2
అతడు వుత్తరపు ద్వారపు మార్గముచేత నన్ను వెంట
బెట్టుకొని, చుట్టూ మార్గముచేత తిరిగి తూర్పుకు
వెళ్లే మార్గముచేత అవతలి ద్వారముకు వచ్చెను; అక్కడ
యిదుగో కుడిపార్శ్వమందు వుదకములు వుబికి పా
రుతూ వుండెను. । అప్పుడు ఆ మనుష్యుడు కొల నూ 3
లుచేత పట్టుకొని, తూర్పుగా వెళ్లి, వెయి మూరలను
కొలిచి, వుదకములలోనుంచి నన్ను కొంచు వచ్చెను;
వుదకములు చీలమండల మట్టుకు వచ్చెను. । మరిన్ని 4
అతడు వెయి మూరలను కొలిచి, వుదకములలోనుంచి
నన్ను కొంచు వచ్చెను; వుదకములు నా ముడుకుల
మట్టుకు వచ్చెను; యింకా అతడు వెయి మూరలు కొ
లిచి, వుదకములలోనుంచి నన్ను కొంచు వచ్చెను;
అప్పుడు వుదకములు నా మొల మట్టుకు వచ్చెను. ।
మరిన్ని అతడు వెయి మూరలను కొలిచెను; అప్పుడు 5
నాకు దాటలేని నది కనుబడెను; యేమంటే వుదకములు
మిక్కిలీ లోతై వుండెను; యీదుటకు తగిన వుదకము
లున్ను దాటలేని నదిన్ని అయి వుండెను. । అప్పుడు 6
అతడు నన్ను చూచి, వో నర పుత్రుడా, నీవు చూ
స్తివా అని చెప్పి, నన్ను తిరిగీ యిద్దరికి తీసుకొని వచ్చెను. ।
అయితే నేను తిరిగీ వచ్చినప్పుడు యిదుగో నది గట్టు 7
మీద యిరు పార్శ్వములను విస్తారమైన చెట్లు వుం
డెను. । అప్పుడు అతడు నాతో చెప్పినదేమంటే, యీ 8
వుదకములు వుబికి, తూర్పు దేశమునకు పారి, అర
ణ్యములోకి దిగి సముద్రములోకి పోవును; యివి సము
ద్రములోకి ప్రవహించినందున ఆ వుదకములు బాగా
వుండును. । యెక్కడికి యీ నది పారునో అక్కడ 9
జలచరములన్నిన్ని బ్రతుకును; బహు విస్తారమైన
మత్స్యములు పుట్టును; యేమంటే యీ వుదకములు
అక్కడికి పారినందున అవి బాగౌను; యెక్కడికి యీ
నది పారునో అక్కడ సమస్తమున్ను బ్రతికి వుండును. ।
మరిన్ని దాని యొద్ద ఏన్గెదీ పట్టణము మొదలుకొని 10
ఏనెగ్లయీము పట్టణము మట్టుకు జాలరులు నిలిచి
వుందురు; అక్కడ వలలు వేతురు; సకల జాతి మత్స్య
ములున్ను కలిగి, గొప్ప సముద్రములో వున్నట్టు బహు
విస్తారమై వుండును. । అయితే బురద స్థలములున్ను 11

వూబి స్థలములున్ను అయి బాగులేనందున వుప్పు కొ
12 రకు యివ్వబడును. । అయితే నది గట్టు మీద యివ
తలా అవతలా ఫలాహారమిచ్చే సకల జాతి వృక్షములు
పెరిగి వుండును; వాటి ఆకులు వాడిపోక వుండును;
వాటి ఫలములు యెప్పటికీ పోక వుండును; వాటి వుద
కములు పరిశుద్ధ స్థలములోనుంచి వుబుకును గనుక అవి
నెలనెలకూ నూతనముగా ఫలిస్తూ వుండును; వాటి
ఫలములు ఆహారమునకున్ను వాటి ఆకులు ఔషధము
13 నకున్ను వుపయోగమవునని చెప్పి, । మరిన్ని కర్తయైన
యెహోవా ఆనతిచ్చేదేమంటే, దేశపు సరిహద్దుల
లో వున్న భూమిని ఇశ్రాయేలు పండెండు గోత్ర
ముల ప్రకారము మీరు స్వతంత్రించుకో వలెను;
14 యోసేపుకు రెండు భాగములు యివ్వవలెను. । నేను
హస్తమును యెత్తి మీ పితృలకు యిచ్చిన దేశమును
మీలో ప్రతివాడున్ను యేక రీతిగా స్వతంత్రించు
కొందురు; యీ దేశము మీకు స్వాస్థ్యముగా ప్రాప్త
15 మవును. । వుత్తరపు దిక్కు తట్టు దేశపు సరిహద్దు అన
గా గొప్ప సముద్రము మొదలుకొని సెదాదుకు జనులు
16 వెళ్లే హెత్లోను మార్గమున్ను, । హమాతున్ను బేరో
తాయున్ను హమాతు సరిహద్దుకున్ను దమస్కు సరి
హద్దుకున్ను మధ్యను వున్న సిబ్రయీమున్ను హవ్రాను
దిక్కు తట్టు వున్న హసర్హత్తికోనుకున్ను అయి వుం
17 డును. । యీలాగున సముద్రము తట్టు వున్న సరిహద్దు
హస్సరేనాను అనే దమస్కు సరిహద్దుకున్ను వుత్తరపు
తట్టు వున్న భూమికిన్ని హమాతు సరిహద్దుకున్ను సాగి
18 వుండును; యిది మీకు వుత్తర దిక్కు అవును. । మరిన్ని
తూర్పు సరిహద్దు కొరకు మీరు హవ్రానునుంచిన్ని
దమస్కునుంచిన్ని గిలాదునుంచిన్ని ఇశ్రాయేలు దేశపు
యర్దేను నది చివరనుంచిన్ని తూర్పుసముద్రము మ
ట్టుకు కొలువ వలెను; యిది తూర్పు సరిహద్దు అవును. ।
19 మరిన్ని దక్షిణపు దిక్కు తామారునుంచి కాదేషులో
మెరీబా అనే వుదకముల మట్టుకున్ను నదినుంచి గొప్ప
సముద్రము మట్టుకున్ను సాగును; యిది దక్షిణపు
20 దిక్కు సరిహద్దు అవును. । మరిన్ని పశ్చిమదిక్కు సరి
హద్దు గొప్ప సముద్రము చివర మొదలుకొని, యెకడు
హమాతుకు వచ్చే పర్యంతమూ సాగి వుండును; యిది
21 పశ్చిమ దిక్కు సరిహద్దు అవును. । యీ దేశమును మీరు
ఇశ్రాయేలు గోత్రముల ప్రకారము పంచుకో వలెను. ।
22 యేలాగంటే మీరు చీట్లువేసి, మీకున్ను మీలో కా
పురముచేసి, మీలో పిల్లలను కనిన పరదేశులకున్ను స్వా
స్థ్యములను విభజించుకో వలెను; యేమంటే వారు
ఇశ్రాయేలు పుత్రులలో దేశమందు పుట్టినవారైనట్టు
వుండి, ఇశ్రాయేలు గోత్రికులతో స్వాస్థ్యమును పం
23 చుకో వలెను. । మరిన్ని యేగోత్రములో పరదేశి కాపు
రము చేసెనో అక్కడ మీరు అతనికి పాలు పంచి
పెట్టి స్వాధీనపర్చ వలెనని కర్తయైన యెహోవా
ఆనతిచ్చెను.

## 48. అధ్యాయము.

అయితే గోత్రముల పేళ్లు యేవంటే, వుత్తరదిక్కు 1
కడనుంచి హమాతుకు వెళ్లే హెత్లోను మార్గపు సరి
హద్దు మట్టుకున్ను హస్సరేనాను అనే దమస్కు సరి
హద్దు మట్టుకున్ను హమాతు సరిహద్దు మట్టుకున్ను సాగి
వున్న భూమి తూర్పు మూలతోటిన్ని పడమటి మూ
లతోటిన్ని దాను గోత్రపుదై వుండును. । మరిన్ని దాను 2
యొక్క సరిహద్దు దగ్గిర తూర్పు పార్శ్వము మొద
లుకొని పడమటి పార్శ్వము మట్టుకు ఆషేరు గోత్ర
పుదై వుండును. । మరిన్ని ఆషేరుయొక్క సరిహద్దు 3
దగ్గిర తూర్పు పార్శ్వము మొదలుకొని పడమటి పా
ర్శ్వము మట్టుకు నఫ్తాలీ గోత్రపుదై వుండును. । మరి 4
న్ని నఫ్తాలీ సరిహద్దు దగ్గిర తూర్పు పార్శ్వము మొ
దలుకొని పడమటి పార్శ్వము మట్టుకు మనస్సే గో
త్రపుదై వుండును. । మరిన్ని మనస్సే సరిహద్దు దగ్గిర 5
తూర్పు పార్శ్వము మొదలుకొని పడమటి పార్శ్వము
మట్టుకు ఎఫ్రయీము గోత్రపుదై వుండును. । మరిన్ని 6
ఎఫ్రయీము సరిహద్దు దగ్గిర తూర్పు పార్శ్వము
మొదలుకొని పడమటి పార్శ్వము మట్టుకు రూ
బేను గోత్రపుదై వుండును. । మరిన్ని రూబేను సరి 7
హద్దు దగ్గిర తూర్పు పార్శ్వము మొదలుకొని పడ
మటి పార్శ్వము మట్టుకు యూదా గోత్రపుదై వుం
డును. । మరిన్ని యూదా సరిహద్దు దగ్గిర తూర్పు 8
పార్శ్వము మొదలుకొని పడమటి పార్శ్వము మ
ట్టుకు మీరు కానుకగా చెల్లించవలసిన భూమి వుండు
ను; దాని వెడల్పు యిరువై అయిదు వేల కొలలున్ను
దాని నిడివి తూర్పు పార్శ్వము మొదలుకొని పడ
మటి పార్శ్వము మట్టుకు కొదువ భాగముల నిడివి
లాగునే వుండును; పరిశుద్ధ స్థలము దాని మధ్యమందు
వుండ వలెను. । యెహోవాకు మీరు చెల్లించవలసిన కా 9
నుక యిరువై అయిదు వేల కొలల నిడివిన్ని పది వేల
కొలల వెడల్పున్ను వుండ వలెను. । యీ పరిశుద్ధమైన 10
కానుక అర్చకుల కొరకై వుండును; తూర్పు తట్టు
యిరువై అయిదు వేల కొలల నిడివిన్ని పడమటి తట్టున
పది వేల కొలల వెడల్పున్ను తూర్పు తట్టున పది వేల
కొలల వెడల్పున్ను దక్షిణపు తట్టున యిరువై అయిదు
వేల కొలల నిడివిన్ని కావలెను; యెహోవా పరిశుద్ధ
స్థలము మధ్యను వుండ వలెను. । అది సాదోకు పుత్రు 11
లలో పరిశుద్ధముగా వుంచబడి, నేను అప్పగించిన దా
నిని కనిపెట్టే అర్చకులదై వుండును; యేమంటే ఇశ్రా

యేలు పుత్రులు తప్పిపోయిన సమయమున వీరు తతి
12 మ్మా లేవీయులు తప్పిపోయినట్టు తప్పిపో లేదు. । మరిన్ని
కానుకగా చెల్లించబడిన యీ భూమి వారి విషయమై
మహా పరిశుద్ధమైనదై, లేవీయుల సరిహద్దు దగ్గిర వుం
13 డును. । మరిన్ని అర్చకుల సరిహద్దుకు యెదురుగా లేవీ
యులకు యిరువై అయిదు వేల కొలల నిడివిన్ని పది వేల
కొలల వెడల్పున్ను అయిన భూమి కలుగ వలెను; నిడివి
అంతా యిరువై అయిదు వేల కొలలున్ను వెడల్పు పది
14 వేల కొలలున్ను కావలెను. । దీనిలోది వారు యెంత
మాత్రమైనా అమ్మకూడదు; మార్చ కూడదు; భూమి
యొక్క తొలి ఫలమును వేరే వినియోగము చేయ కూ
డదు; యేమంటే అది యెహోవాకు పరిశుద్ధమై
15 వున్నది. । మరిన్ని యిరువై అయిదు వేల కొలల భూ
మికి యెదట వున్న వెడల్పులో విడిచిన అయిదు వేల
కొలలు గల భూమి బహిరంగమై పట్టణము కొరకున్ను
కాపురముల కొరకున్ను పట్టణము కింద వుండే భూముల
కొరకున్ను వుండును; పట్టణము నాటి మధ్యను వుండ
16 వలెను. । దాని ప్రమాణములు యేపాటి అంటే, వుత్తరపు
తట్టున నాలుగు వేల యేనూరు కొలలున్ను దక్షిణపు
తట్టున నాలుగు వేల యేనూరు కొలలున్ను తూర్పు తట్టున
నాలుగు వేల యేనూరు కొలలున్ను పడమటి తట్టున నా
17 లుగు వేల యేనూరు కొలలున్ను వుండ వలెను. । మరిన్ని
పట్టణము కిందవున్న భూమి వుత్తరపు తట్టున యిన్నూట
యేభై కొలలున్ను దక్షిణపు తట్టున యిన్నూట యేభై కొ
లలున్ను తూర్పు తట్టున యిన్నూట యేభై కొలలున్ను
పడమటి తట్టున యిన్నూట యేభై కొలలున్ను కావ
18 లెను. । అయితే కానుకగా చెల్లించిన పరిశుద్ధ భూమి
యెదుట తూర్పు తట్టున పది వేల కొలలున్ను పడమటి
తట్టున పది వేల కొలలున్ను గల భూమి మిగిలి వుండ
వలెను; అది కానుకగా చెల్లించిన పరిశుద్ధ భూమి యె
దుటనే వుండ వలెను; దాని పంటను పట్టణపు పని
19 వారికి జీవనోపాధి కొరకు యివ్వ వలెను. । మరిన్ని
పట్టణపు పనిచేసుటకు ఇశ్రాయేలు గోత్రములన్నిటి
20 లోనుంచి రావలెను. । కానుక భూమి వెడల్పున్ను
నిడుపున్ను యిరువయి అయిదు వేల కొలలు వుండ
వలెను; పట్టణపు భూమితోటి మీరు పరిశుద్ధమైన కా
21 నుక భూమిని చచ్చౌకముగా చెల్లించవలెను. । మరిన్ని
శేషించిన భూమి శ్రేష్ఠునిదై వుండును; అది పరిశుద్ధ
మైన కానుక; భూమికిన్ని యిరు పార్శ్వములనున్ను
తూర్పు సరిహద్దు తట్టు కానుక భూమియొక్క యిరు
వై అయిదు వేల కొలల యెదుటనున్ను శ్రేష్ఠుని భాగ
ములకు యెదురుగా వున్న పడమటి సరిహద్దు తట్టున
యిరువై అయిదు వేల కొలల యెదుటనున్ను వుండును;
దానిని పరిశుద్ధమైన కానుకగా చెల్లించవలెను; మంది
రముయొక్క పరిశుద్ధ స్థలము దాని మధ్యను వుండ
వలెను. । మరిన్ని లేవీయుల భూమి యొద్దనుంచిన్ని 22
శ్రేష్ఠుని భాగము మధ్యమందున్న పట్టణపు భూమి
యొద్దనుంచిన్ని యూదా సరిహద్దుకున్ను బెన్యామీను
సరిహద్దుకున్ను మధ్యను వున్న భూమి శ్రేష్ఠునికి వుండ
వలెను. । కొదువ గోత్రములను గురించి యేమంటే 23
తూర్పు పార్శ్వము మొదలుకొని పడమటి పార్శ్వ
ము మట్టుకు బెన్యామీనుదై వుండును. । బెన్యామీను 24
సరిహద్దు దగ్గిర తూర్పు పార్శ్వము మొదలుకొని
పడమటి పార్శ్వము మట్టుకు షిమోనుదై వుండును. ।
షిమోను సరిహద్దు దగ్గిర తూర్పు పార్శ్వము మొద 25
లుకొని పడమటి పార్శ్వము మట్టుకు ఇశ్శాఖారుదై
వుండును. । ఇశ్శాఖారు సరిహద్దు దగ్గిర తూర్పు పా 26
ర్శ్వము మొదలుకొని పడమటి పార్శ్వము మట్టుకు
జెబూలోనుదై వుండును. । జెబూలోను సరిహద్దు దగ్గిర 27
తూర్పు పార్శ్వము మొదలుకొని పడమటి పార్శ్వ
ము మట్టుకు గాదుదై వుండును. । గాదు సరిహద్దు దగ్గిర 28
దక్షిణ దిక్కు తట్టు వున్న సరిహద్దు తామారునుంచి
కాదేషులో వున్న మెరీబా అనే వుదకముల మట్టుకు
న్ను గొప్ప సముద్రము తట్టున నది మట్టుకున్ను సాగి
వుండును. । మీరు చీట్లు వేసి ఇశ్రాయేలు గోత్రము 29
లకు విభాగించ వలసిన దేశము యిదే; మరిన్ని యివి
వారి భాగములై వున్నవని కర్తయైన యెహోవా ఆన
తిచ్చెను. । మరిన్ని వుత్తరపు తట్టు పట్టణపు బైటి భూమి 30
నాలుగు వేల యేనూరు కొలలు వుండ వలెను. । మరిన్ని 31
పట్టణపు గవునుల పేళ్లు ఇశ్రాయేలు గోత్రముల పేళ్ల
చొప్పున వుండ వలెను; వుత్తరపు తట్టు మూడు గవునులు
వుండ వలెను; యిందులో వొకటి రూబేనుదిన్ని వొకటి
యూదాదిన్ని వొకటి లేవీదిన్ని అయి వుండ వలెను. ।
తూర్పు తట్టున నాలుగు వేల యేనూరు కొలలు వుండ 32
వలెను; ఆ తట్టే మూడు గవునులు వుండ వలెను; వీటి
లో వొకటి యోసేపుదిన్ని వొకటి బెన్యామీనుదిన్ని
వొకటి దానుదిన్ని అయి వుండ వలెను. । దక్షిణపు తట్టున 33
నాలుగు వేల యేనూరు కొలలు వుండ వలెను; ఆ తట్టే
మూడు గవునులు వుండ వలెను; వొకటి షిమోనుదిన్ని
వొకటి ఇశ్శాఖారుదిన్ని వొకటి జెబూలోనుదిన్ని
అయి వుండ వలెను. । పడమటి తట్టున నాలుగు వేల 34
యేనూరు కొలలు వుండ వలెను; ఆ తట్టే మూడు గవు
నులు వుండ వలెను; వొకటి గాదుదిన్ని వొకటి ఆషే
రుదిన్ని వొకటి నఫ్తాలీదిన్ని అయి వుండ వలెను. । దాని 35
కైవారము పద్దెనిమిది వేల కొలలు అయి వుండ వలెను;
మరిన్ని నాటినుంచి ఆ పట్టణమునకు యెహోవా
నివాసమన్న పేరు కలుగునని చెప్పెను.

# దానియేలు యొక్క గ్రంథము.

## 1. అధ్యాయము.

1 యూదా రాజైన యెహోయాకీము యేలుబడి
మూడో సంవత్సరమందు బాబెలు రాజైన నెబూఖద్నె
స్సరు యెరూశలేము మీదికి వచ్చి దానిని గవిసెను.।
2 అప్పుడు యెహోవా యూదా రాజైన యెహో
యాకీమునున్ను దైవ మందిరపు వస్తువులలో కొన్నిటి
నిన్ని అతని చేతికి యిచ్చెను; కాబట్టి అతడు వీటిని
షినారు దేశమందున్న తన దేవుని మందిరములోకి
తెప్పించెను; ఆ వస్తువులనున్ను దొరికిన పదార్థములన
నున్ను తన దేవుని మందిరములోకి తెప్పించి వుంచెను.।
3 అప్పుడు రాజు షండులకు అధికారి అయిన అష్పెన
జును పిలిపించి, అతనితో సౌందర్యములో వెల్తి లేని
సకల జ్ఞాన ప్రజ్ఞయందున్ను విద్యయందున్ను ప్రవీణత
గల రాజు నగరిలో తిరుగుటకు యుక్తమైన బాలురను
4 ఇశ్రాయేలు పుత్రుల రాజు సంతతిలోనున్ను,। అధిప
తుల సంతతిలోనున్ను చూచి తెప్పించి, వారికి కల్దీ
5 యుల భాషను నేర్పవలెనని సెలవు యిచ్చెను.। మరిన్ని
రాజు వారి కొరకు అనుదినమున్ను తన భోజనములోది
కొంత భోజనమున్ను తన ద్రాక్షారసములోది కొంత
ద్రాక్షారసమునున్ను నిర్ణయించి, యీ చొప్పున వా
రిని మూడు సంవత్సరములు పెంచి, రాజ సముఖమందు
6 నిలువబెట్ట వలెనని ఆజ్ఞాపించెను.। అయితే వారిలో
దానియేలున్ను హనన్యాయున్ను మిషాయేలున్ను అజ
ర్యాయున్ను అనే యూదా సంతతివారు వుండిరి.।
7 వీరికి షండుల మీది అధికారి పేళ్లుబెట్టెను, యేలా
గంటే దానియేలును బేల్తెషస్సరనిన్ని హనన్యాను
షద్రఖు అనిన్ని మిషాయేలును మేషఖు అనిన్ని అజ
8 ర్యాను అబెద్నెగో అనిన్ని పిలిచెను.। అయితే దాని
యేలు రాజు భోజనముచేతనున్ను ద్రాక్షారసముచేత
నున్ను అంటు పడకూడదని తలంచుకొని, షండుల
మీది అధికారిని తనకు అంటు రాకుండా బతిమాలు
9 కొనెను.। అయితే దేవుడు దానియేలు మీద షండుల
అధికారికి బహు స్నేహమున్ను దయయున్ను వుండే
10 టట్టు చేసెను.। కాబట్టి షండుల అధికారి దానియే
లును చూచి చెప్పినదేమంటే, మీకు భోజన పానము
లను నిర్ణయించిన నా యేలిన వారైన రాజు యందు
భయముగా వున్నాను; మీలాటి చిన్నవారి ముఖముల
కంటే మీ ముఖములు అతని చూపుకు బాగా అగుప
డక పోనేల! వొకవేళ అగుపడని పక్షమందు మిమ్ముల
నుంచి నా శిరస్సు రాజాజ్ఞకు లోనై వుండునని చెప్పి
నందున,। షండుల అధికారి దానియేలు, హనన్యా, 11
మిషాయేలు, అజర్యా అనే వారి మీద వుంచిన మె
ల్సారుతో దానియేలు చెప్పినదేమంటే,। మీ సేవకుల 12
మైన మమ్మును మీరు పది దినముల మట్టుకు శోధించి
చూడ వలెను; యేలాగంటే తినుటకు గింజలున్ను తాగు
టకు నీళ్లున్ను యిప్పించండి.। అప్పుడు మీరు మా ముఖ 13
ములనున్ను రాజు నిర్ణయించిన భోజనము తినిన
చిన్నవారి ముఖములనున్ను చూచి తెలుసుకొని, మీ
అనుకూలము చొప్పున అది మీ సేవకులమైన మాకు
చేయవచ్చునని చెప్పుకొన్నందున,। అతడు వొప్పి, పది 14
దినములు వారిని శోధించెను.। అయితే ఆ పది దినము 15
లైన తరువాత వారి ముఖములు రాజు నిర్ణయించిన
భోజనము తినిన చిన్నవారందరి ముఖముల కంటే
సౌందర్యముగానున్ను బలముగానున్ను అగుపడినవి.।
అయినందున మెల్సారు వారికి నిర్ణయించిన భోజన 16
మునున్ను ద్రాక్షా రసమునున్ను తీసి, వారికి గింజలను
యిచ్చెను.। మరిన్ని యీ నలుగురు చిన్నవారిని గురించి 17
దేవుడు వారికి సకల విద్యల యందున్ను సకల జ్ఞానము
యందున్ను మిక్కిలి తెలివిన్ని ప్రజ్ఞయున్ను కలుగచే
సెను; మరిన్ని దానియేలు సకల దర్శనములకున్ను
స్వప్నములకున్ను తాత్పర్యము చెప్పేపాటి వాడై వుం
డెను.। అయితే వారిని లోపటికి తీసుకొ వచ్చుటకు 18
యే దినములు రాజు మితిచేసి నిర్ణయించెనో ఆ దిన
ములన్నీ అయిన తరువాతను షండుల యధికారి వారిని
లోపటికి తీసుకొ వచ్చి, నెబూఖద్నెస్సరు ముందట
నిలువబెట్టెను.। అప్పుడు రాజు వారితో మాట్లాడి 19
చూచెను; అయితే వారందరిలో దానియేలు, హనన్యా,
మిషాయేలు, అజర్యా, అనే వారివంటి వాడు వొక
డున్ను లేక పోయెను; కాబట్టి వీరు రాజ సముఖమందు
నిలిచి వుండిరి.। మరిన్ని జ్ఞానమును గురించిన్ని తెలి 20
విని గురించిన్ని రాజు వీరిని యేమైనా అడిగితే వీరు
అతని రాజ్యమంతటి యందుండే మాంత్రికులందరికం
టేనున్ను జ్యోతిష్కులందరి కంటేనున్ను పది రెట్లు
జ్ఞానవంతులై వుండిరని చూచెను.। యీ దానియేలు 21
రాజైన కోరేషు యేలుబడి మొదటి సంవత్సరము పర్యం
తమూ వుండెను.

## 2. అధ్యాయము.

1 అయితే నెబూఖద్నెస్సరు యేలుబడి రెండో
సంవత్సరమందు నెబూఖద్నెస్సరు తాను మనశ్చింత
పొంది స్వప్నములను కనినందున నిద్ర అతని విడి
2 చెను. । అయినందున రాజు తన స్వప్నమును చెప్పుటకు
మాంత్రికులనున్ను జ్యోతిష్కులనున్ను యెక్షిణీకాం
డ్లనున్ను కల్దీయులనున్ను పిలువుమనెను; కాబట్టి వారు
3 వచ్చి రాజు ముందర నిలిచిరి. । అప్పుడు రాజు వారిని
చూచి, నేను వొక స్వప్నమును కంటిని; ఆ స్వప్న
మును తెలుసుకొనేటందుకు నా ఆత్మ చింతిస్తూ వున్న
4 దని అనగా, । కల్దీయులు అరాము భాషను రాజుతో
చెప్పినదేమంటే, రాజవైన నీవు చిరకాల జీవివవుదువు
గాక; మీ సేవకులమైన మాతో మీ స్వప్నమును చె
ప్పితే మేము దాని తాత్పర్యమును చెప్పగలమని చెప్పి
5 నప్పుడు, । రాజు కల్దీయులతో చెప్పినదేమంటే, అది
నాకు జ్ఞాపకములేదు; అయినప్పటికిన్ని నా స్వప్న
తాత్పర్యమును మీరు నాతో చెప్పకపోతే మీరు తు
నక తునకలుగా కోయించబడి, మీ యిండ్లు పెంట
6 కుప్పలౌను. । నా స్వప్న తాత్పర్యమును మీరు అగుప
ర్చిన పక్షమందు నా చేత మీరు కానుకలనున్ను కట్న
ములనున్ను బహుమానములనున్ను పొందుదురు; కాబట్టి
ఆ స్వప్న తాత్పర్యమును నాకు తెలియ చెప్పండని
7 చెప్పినప్పుడు, । వారు అందుకు చెప్పినదేమంటే, రాజ
వైన నీవు దయచేసి, మీ సేవకులమైన మాకు ఆ స్వప్న
మును తెలియ చెప్పితే, మేము దాని తాత్పర్యమును
8 అగుపర్తుమని చెప్పిరి. । అందుకు రాజు చెప్పినదే
మంటే, ఆ స్వప్నము నాకు జ్ఞాపకము లేదని మీరు
చూచి, కాలహరణము చేయ దలచితిరని నాకు రూ
9 ఢమై వున్నది. । కాబట్టి ఆ స్వప్నమును మీరు నాకు
తెలియ చెప్పకపోతే ఆజ్ఞ తప్పదు; యేమంటే సమ
యము తప్పిపోయే పర్యంతమూ అబద్ధపు మాయ మా
టలు నా ముందట చెప్పుటకు కల్పించుకొని వున్నా
రు; కాబట్టి ఆ స్వప్నమును నాతో చెప్పండి, అప్పుడు
మీరు దాని తాత్పర్యమునున్ను చెప్పగలరని నాకు తెలి
10 యబడునని చెప్పినప్పుడు, । కల్దీయులు రాజు సముఖ
మందు చెప్పినదేమంటే, రాజుగారి స్వప్నమును చెప్పే
పాటి వాడు లోకమందు యెక్కడైనా లేడు; కాబట్టి
రాజు అయినా ప్రభువు అయినా అధికారి అయినా
యీలాటి ప్రశ్నలు మాంత్రికునైనా జ్యోతిష్కునై
11 నా కల్దీయునైనా అడుగుట యెన్నడూ లేదు. । రాజు
అడిగిన సంగతి బహుగా వింత అయి వున్నది; మాన
వులలో నివాసముచేయని దైవములు గాక దానిని రా
జుకు అగుపర్చ గలవాడు వొకడూ లేడని చెప్పినం
దున, । రాజు బహు రౌద్రావేశుడై, బాబెలు దేశ 12
ములో వున్న జ్ఞానులనందరినిన్ని లయము చేసుటకు
ఆజ్ఞ యిచ్చెను. । కాబట్టి జ్ఞానులను హతము చేయ 13
వలెనన్న ఆజ్ఞ బైలు వెళ్లినప్పుడు వారు దానియేలును
న్ను అతని తోటి వారినిన్ని హతము చేసుటకు వెతి
కిరి. । అప్పుడు దానియేలు బహు బుద్ధిన్ని జ్ఞానము 14
న్ను కలవాడై, బాబెలు జ్ఞానులను చంపుటకు బయిలు
వెళ్లిన రాజు తలవర్లకు అధిపతియైన అర్యోఖుతో
చెప్పినదేమంటే, । రాజాజ్ఞకు యింత తొందర యెందు 15
కని అడిగినందున, అర్యోఖు ఆ సంగతి దానియేలు
తో తెలియ చెప్పెను. । అంతట దానియేలు లోపటికి 16
వెళ్లి, తాను రాజుతో దాని తాత్పర్యమును చెప్పుటకు
తనకు సమయమును యివ్వ వలెనని రాజును అడిగెను. ।
అప్పుడు దానియేలు తన యింటికి వెళ్లి, ఆ సంగతి 17
తనతోటివారైన హనన్యాకున్ను మిషాయేలుకున్ను అజ
ర్యాకున్ను తెలియచేసి, । దానియేలున్ను అతనితోటి 18
వారున్ను బాబెలుయొక్క మిగిలిన జ్ఞానులవలెనే నా
శనము కాకుండా ఆకాశముయొక్క దేవుని యీ
మర్మము నిమిత్తము దయచేసేటట్టు వేడుకొనవలెనని
చెప్పెను. । కాబట్టి రాత్రి దర్శనముచేత ఆ మర్మము 19
దానియేలుకు తెలియబడెను; అప్పుడు దానియేలు
ఆకాశముయొక్క దేవుని స్తోత్రముచేసి, పలికినదేమం
టే, । దేవుని నామము యెన్నటికీ స్తుతించబడును గాక; 20
యేమంటే జ్ఞానమున్ను పరాక్రమమున్ను ఆయనవి. ।
ఆయన కాలములనున్ను సమయములనున్ను మార్చును; 21
ఆయన రాజులను తీసి, రాజులను నిలుపును; జ్ఞానవం
తులకు జ్ఞానమునున్ను బుద్ధిమంతులకు తెలివినిన్ని
ఆయన యిచ్చును. । మిక్కిలీ అగాధమైన మర్మము 22
లను ఆయన బైలుపర్చును; అంధకారమందు యేమి
వుండునో అది ఆయనకు తెలుసును; వెలుగు ఆయన
యొద్ద యెప్పుడూ నివసించును. । వో నా పితృల దేవు 23
డా, నిన్ను స్తుతించి పొగడుతున్నాను, యేమంటే
నీవు నాకు జ్ఞానమునున్ను పరాక్రమమునున్ను యిచ్చి,
మేము నిన్ను అడిగిన దాని మాకు తెలియచేస్తివి; రాజు
సంగతి మాకు తెలియచేస్తినని దానియేలు స్తోత్రము
చేసెను. । అప్పుడు దానియేలు బాబెలు జ్ఞానులను 24
లయము చేసుటకు రాజు నిర్ణయించిన అర్యోఖు
యొద్దికి వెళ్లెను; అతని యొద్దికి వచ్చి అతనితో చెప్పిన
దేమంటే, బాబెలు జ్ఞానులను చంపకుము; రాజు సము
ఖమునకు నన్ను తీసుకొని పోతే నేను రాజుకు దాని తా
త్పర్యమును తెలియ చెప్పుదునని చెప్పెను. । కాబట్టి 25
అర్యోఖు అతి శీఘ్రముగా దానియేలును రాజు సము
ఖమునకు తీసుకు వచ్చి, అతనితో చెప్పినదేమంటే,
రాజుగారికి దాని తాత్పర్యమును చెప్పేపాటి వాడు

ఒకడు చెరలో వున్న యూదా వారిలో నాకు కనుబ
26 డెనని చెప్పినప్పుడు, । రాజు బేల్తెషస్సరన్న పేరు గల
దానియేలుతో చెప్పినదేమంటే, నాకు కనుబడిన స్వ
ప్నముయొక్క తాత్పర్యమును నాతో చెప్ప గలవా
27 అని అడగగా, । దానియేలు రాజు సన్నిధిని నిలిచి చె
ప్పినదేమంటే, రాజు అడిగిన మర్మమును రాజుకు
తెలియ చెప్పేపాటి శక్తి జ్ఞానులకైనా జ్యోతిష్కుల
కైనా మాంత్రికులకైనా ప్రశ్న చూచే వారికైనా లేక
28 పోయెను. । అయితే మర్మములను తెలియజేయగల
దేవుడు ఆకాశమందు వున్నాడు; అంత్య దినముల
యందు యేమి సంభవించునో అది రాజైన నెబూఖ
ద్నెస్సరుకు తెలియ చేస్తూ వున్నాడు; మీ స్వప్న
మున్ను పడకలో మీ తలంపులోకి వచ్చి, అగుపడిన
29 దర్శనములున్ను యేమిటంటే, । ఓ రాజా, శయనము
మీద నీవు పడుకొని, యిక మీదట యేమి సంభవిం
చునో అని విచారిస్తూ వుంటివి; కాబట్టి మర్మము
లను తెలియచేసే వాడు యేమి సంభవించునో అది
30 మీకు తెలియచేసెను. । వేరే జీవులకంటే నాకు యె
క్కువ జ్ఞానము కలిగినందువల్ల యీ మర్మము బైలు
పడ లేదు, అయితే రాజుకు దాని తాత్పర్యమును తెలి
యబడే నిమిత్తమున్ను మీ మనశ్చింతలు మీకు తెలియ
31 బడే నిమిత్తమున్ను నాకు అది బయిలుపడెను. । ఓ
రాజా, నీ స్వప్నములో యిదుగో ఒక గొప్ప విగ్ర
హము మీకు కనుబడెను; యీ విగ్రహము మిక్కిలీ
పొడుగుదై, మహా తేజస్సు కలిగి, మీ ముందట నిలిచి
వుండెను; చూచుటకు దాని రూపము భయంకరముగా
32 వుండెను. । యీ విగ్రహముయొక్క శిరస్సు బంగార
పుదైయిన్ని, దాని రొమ్మున్ను హస్తములున్ను వెండి
వైయిన్ని, దాని వుదరమున్ను తొడలున్ను యిత్తడి
33 వైయిన్ని, । దాని కాళ్లు యినుపవైయిన్ని, దాని పాద
ములు సగము యినుపవైయిన్ని సగము మంటివైయి
34 న్ని వుండెను. । మరిన్ని మీరు చూస్తూ వుండగా, చేతి
పని గాకుండా బైట దొల్చబడిన రాయి ఒకటి వచ్చి,
యినుమున్ను మన్నున్ను కలిగిన ఆ విగ్రహముయొక్క
35 పాదములను ఛిన్నాభిన్నములుగా కొట్టివేసెను.। అప్పు
డు యినుమున్ను మన్నున్ను యిత్తడిన్ని వెండిన్ని బం
గారమున్ను కూడా విచ్ఛిత్తయి, వేసవి కాలపు కళ్ల
ముయొక్క పొల్లు వలెనే పోయినందున గాలి వచ్చి
అవి యెక్కడా అగుపడకుండా తూలగొట్టెను; అప్పు
డు విగ్రహమును కొట్టిన రాయి గొప్ప పర్వతమై
36 లోకమంతా నింపెను. । యిదే మీరు కనిన స్వప్నము;
యికను రాజు సన్నిధిలో దీని తాత్పర్యమును తెలియ
37 చెప్పుతున్నాను.। ఓ రాజా, నీవు రాజులలో రాజువై
వున్నావు; యేమంటే ఆకాశముయొక్క దేవుడు మీకు

రాజ్యమునున్ను బలమునున్ను సామర్థ్యమునున్ను ఘ
నమునున్ను యిచ్చి యున్నాడు. । నర పుత్రులు యె 38
క్కడ కాపురము వుందురో అక్కడ వున్న భూ మృ
గములనున్ను ఆకాశ పక్షులనున్ను మీ చేతికి అప్ప
గించి, సమస్తము పయిని ఆయన మిమ్మును అధికారిని
గా చేసి యున్నాడు; మీరే ఆ బంగారపు శిరస్సు. ।
మీ తరువాత వేరే రాజాంగము లేచును; అది మీ 39
రాజ్యము కంటే నీచమైనదై వుండును; తరువాత యి
త్తడి రాజాంగము లేచి, లోకమంతటి మీద కర్తృ
త్వము చేసును. । అయితే నాలుగో రాజాంగము యిను 40
మంత బలముగా వుండును; యేమంటే యినుము సకల
వస్తువులను తునకలుగా కొట్టి సమస్తమును లోపర్చు
కొనును, కాబట్టి యినుము వాటినన్నిటినీ తునకలుగా
కొట్టినట్టు అదిన్ని సమస్తమును కొట్టి తునకలుగా
చేసును. । అయితే దాని పాదములున్ను వేళ్లున్ను సగ 41
ము కుమ్మరివాని మన్నువలెనున్ను సగము యినుమువలె
నున్ను మీకు అగుపడినట్టు ఆ రాజాంగము విభేదము
గా వుండును; అయినందున యినుమున్ను బురదయు
న్ను మంటితోటి కలిపినట్టు మీకు అగుపడెను. ।
అయితే దాని పాదములున్ను వేళ్లున్ను సగము యిను 42
మున్ను సగము మన్నున్ను అయినట్టు ఆ రాజ్యము
సగము దిట్టముగానున్ను సగము విచ్ఛిత్తయ్యేదిగాను
న్ను వుండును. । మరిన్ని యినుమున్ను బురదయున్ను 43
మంటితో కలిసినట్టు మీకు అగుపడినందున వారు
జనుల సంతతితోటి కలుసుకొందురు, అయితే యినుము
మంటితో అతకబడనిదైనట్టు వారు వీరితో అతకబడ
లేరు. । అయితే రాజుల దినములందు ఆకాశముయొక్క 44
దేవుడు మరి ఒక రాజాంగమును లేవచేసును; అది
చిరకాలము మట్టుకు లయము కాకవుండును; యీ
రాజాంగము వేరే జనుల వశము కాక వుండి, ఆ రాజ్య
ములన్నిటినీ తునకలుగా కొట్టి లయముచేసి, తాను యె
ప్పటికీ స్థిరమవును. । యిందును గురించి పర్వతములో 45
నుంచి చేతుల పనికాకుండా, దొల్చబడిన రాయి యి
నుమునున్ను యిత్తడినిన్ని మంటినిన్ని వెండినిన్ని బంగా
రమునున్ను తునకలుగా కొట్టిన లాగున మీకు అగుప
డెను; యీలాగున ఘనమైన దేవుడు భవిష్యత్సంగతు
లను రాజవైన నీకు తెలియచేసెను; యీ స్వప్నము నిజ
మైనది; దాని తాత్పర్యమున్ను రూఢమవునని చెప్పెను.।
అప్పుడు రాజైన నెబూఖద్నెస్సరు దానియేలుకు సా 46
ష్టాంగ నమస్కారములను చేసి, అతనికి బహుమానము
నున్ను పరిమళ తైలమునున్ను యిచ్చుటకు సెలవు యిచ్చె
ను. । మరిన్ని రాజు దానియేలుతో చెప్పినదేమంటే, 47
నీవు యింత మరుగైన దానిని బహిరంగముగా చెప్పితివి
గనుక నిజముగా నీ దేవుడు దైవములకు దేవుడున్ను

రాజులకు కర్తయున్ను మర్మములను తెలియచేసే వా
48 డున్ను అయి వున్నాడని చెప్పెను. । అప్పుడు రాజు
దానియేలును గొప్పచేసి, చాలా కానుకలను అతనికి
యిచ్చి, బాబెలు దేశమంతటి మీద అధికారినిగానున్ను
బాబెలు జ్ఞానులందరియొక్క అధిపతుల మీద శ్రేష్ఠుని
49 గానున్ను చేసెను. । మరిన్ని దానియేలు రాజును అడి
గినందున ఆయన షద్రఖునున్ను మెషెఖునున్ను అబె
ద్నెగోనున్ను బాబెలు దేశపు వ్యాపారముల మీద
నిర్ణయించెను; అయితే దానియేలు రాజ ద్వారమందు
వుండెను.

## 3. అధ్యాయము.

1 రాజైన నెబూఖద్నెస్సరు వొక బంగారపు విగ్ర
హమును చేయించెను; దీని పొడుగు అరువై మూరలు
న్ను వెడల్పు ఆరుమూరలున్ను అయి వుండెను; ఆయన
బాబెలు దేశమందున్న దూరా అనే మైదానములో దీని
2 నిలిపెను. । అప్పుడు రాజైన నెబూఖద్నెస్సరు అధిపతుల
నున్ను దొరలనున్ను సైన్యాధిపతులనున్ను న్యాయాధి
పతులనున్ను ద్రవ్యాధికారులనున్ను మంత్రాంగులను
న్ను ప్రధానులనున్ను ఖండాధికారులనున్ను రాజైన
నెబూఖద్నెస్సరు నిలిపిన విగ్రహమును ప్రతిష్ఠ చేసు
3 టకు పిలువనంపించెను. । కాబట్టి అధిపతులున్ను దొర
లున్ను సైన్యాధిపతులున్ను న్యాయాధిపతులున్ను ద్ర
వ్యాధికారులున్ను మంత్రాంగులున్ను ప్రధానులున్ను
ఖండాధికారులున్ను రాజైన నెబూఖద్నెస్సరు నిలిపిన
4 విగ్రహమును ప్రతిష్ఠ చేసుటకు కూడి వచ్చిరి. । అప్పుడు
చాటేవాడు చాటినదేమంటే,। వో జనులారా, జనాం
5 గములారా, భాషాంతరులారా, వినండి. । బాకా, పిల్లన
గ్రోవి, వీణ, కిన్నర, తంబురా, మొదలైన వాద్యముల
నాదము మీకు వినబడినప్పుడు మీరు సాష్టాంగపడి,
రాజైన నెబూఖద్నెస్సరు నిలిపిన బంగారపు విగ్రహ
మునకు నమస్కారములు చేయవలసినదన్న ఆజ్ఞ ఆయె
6 ను. । యెవడైనా సాష్టాంగ నమస్కారములను చేయక
పోతే, ఆ గడియలోనే వాడు కాలే అగ్ని కొలిమి
7 లో వేయబడునని చాటెను. । కాబట్టి బాకా, పిల్లన
గ్రోవి, వీణ, కిన్నర, తంబురా, మొదలైన వాద్యముల
నాదము జనులందరికి వినబడినప్పుడు, జనులందరున్ను
జనాంగములందరున్ను భాషాంతరులున్ను సాష్టాంగపడి,
రాజైన నెబూఖద్నెస్సరు నిలిపిన బంగారపు విగ్రహ
8 మునకు నమస్కారములు చేసిరి. । అయితే కల్దీయులు
కొందరు అప్పుడు యూదుల మీద తప్పు మోపుటకు
9 రాజు యొద్దికి వచ్చిరి. । వీరు వచ్చి, రాజైన నెబూఖద్నె
స్సరుతో చెప్పినదేమంటే, వో రాజా, నీవు చిరకాల
10 జీవివౌదువు గాక. । రాజైన మీరు సమస్తమైన వారు
బాకా, పిల్లనగ్రోవి, వీణ, కిన్నర, తంబురా, మొదలైన
వాద్యముల నాదమును విని, బంగారపు విగ్రహమునకు
సాష్టాంగ నమస్కారములను చేతురు గాక అనిన్ని, ।యె 11
వడైనా సాష్టాంగ నమస్కారములు చేయకపోతే, వాడు
కాలే అగ్ని కొలిమిలో వేయబడుననిన్ని ఆజ్ఞను నిర్ణ
యిస్తిరి. ।అయితే బాబెలు దేశపు వ్యాపారముల మీద 12
మీరు నిర్ణయించిన యూదులైన షద్రఖున్ను మెషెఖు
న్ను అబెద్నెగోయున్ను అనే వారు వో రాజా, మిమ్మును
లక్ష్యపెట్టక, మీ దేవుండ్లకు సేవచేయక, మీరు నిలి
పిన బంగారపు విగ్రహమునకు నమస్కారములు చేయక
వున్నారని చెప్పినప్పుడు, । నెబూఖద్నెస్సరు బహు 13
కోపమునున్ను రౌద్రమునున్ను తెచ్చుకొని, షద్రఖు
నున్ను మెషెఖునున్ను అబెద్నెగోనున్ను తీసుకొని రమ్మని
ఆజ్ఞాపించెను; కాబట్టి వారు వీరిని రాజు ముందటికి
తీసుకొని వచ్చిరి. । అప్పుడు నెబూఖద్నెస్సరు వారితో 14
చెప్పినదేమంటే, షద్రఖా, మెషెఖా, అబెద్నెగో,
యీ మాటలు నిజమా! మా దేవుండ్లను మీరు సేవించ
రా! మేము నిలిపిన విగ్రహమునకు నమస్కారము
చేయరా! । యిందుకు మీరు సిద్ధమై, బాకా, పిల్లన 15
గ్రోవి, వీణ, కిన్నర, తంబురా, మొదలైన వాద్యముల
నాదము మీకు వినబడినప్పుడు, మీరు సాష్టాంగపడి,
మేము చేయించిన విగ్రహమునకు నమస్కారములను
చేస్తిరట్టాయెనా మంచిది; నమస్కారములు చేయని
పక్షమందు ఆ గడియనే మీరు కాలే అగ్ని కొలిమిలో
వేయబడుదురు, అప్పుడు మా చేతులనుంచి మిమ్మును
విడిపించగల దేవుడు యెవడో అని పలికినప్పుడు, ।
షద్రఖున్ను మెషెఖున్ను అబెద్నెగోయున్ను రాజు 16
తో చెప్పినదేమంటే, వో నెబూఖద్నెస్సరూ, యిం
దును గురించి మీకు ప్రత్యుత్తరము యిచ్చే నిమిత్తము
లేదు. । మీరు చెప్పినట్టు ఆయెనా మేము సేవించే దేవు 17
డు కాలే అగ్ని కొలిమిలోనుంచి మమ్మును విడిపించ
గలడు; మరిన్ని వో రాజా, మీ చేతిలోనుంచి ఆయన
మమ్మును విడిపించును. । విడిపించక పోయినా రాజవైన 18
నీవు వొకటి తెలియ వలెను, అది యేదంటే, మీ దేవుం
డ్లను సేవించుటయున్ను మీరు నిలిపిన బంగారపు విగ్ర
హమునకు మ్రొక్కుటయున్ను మావల్ల కాదని చెప్పిన
ప్పుడు; । నెబూఖద్నెస్సరు రౌద్రాగ్ని నిండి, తన ము 19
ఖము షద్రఖుకున్ను మెషెఖుకున్ను అబెద్నెగోకున్ను
మారు ముఖముగా చేసెను; అయినందున కొలిమిని
మునుపటి కంటే యేడు రెట్లు యెక్కువ వేడిమి చేసు
టకు ఆజ్ఞ యిచ్చెను. । మరిన్ని తన సైన్యములో బలా 20
ఢ్యులకు షద్రఖునున్ను మెషెఖునున్ను అబెద్నెగో
నున్ను బంధించి, కాలే అగ్ని కొలిమిలో వేయుమని
ఆజ్ఞ యిచ్చెను. । కాబట్టి యీ ముగ్గురినిన్ని వారి అంగీ 21

లతోనున్న లాగులతోనున్న పాగాలతోనున్న మిగి
లిన బట్టలతోనున్న బంధించి, కాలే అగ్ని కొలిమిలో
22 వేసిరి.। అయితే రాజాజ్ఞ బహు కఠినమైనందున కొలి
మి మిక్కిలీ కాకగా వుండెను; కాబట్టి అగ్ని మంట
షద్రఖునున్న మెషెఖునున్న అబెద్నెగోనున్న యెత్తి
23 వేసిన వారిని దహించెను.। అయితే షద్రఖున్న మెషె
ఖున్న అబెద్నెగోయున్న అనే యీ ముగ్గురున్న
బంధించబడి, కాలే అగ్ని కొలిమిలో వేయబడిరి.।
24 అటు తర్వాత రాజైన నెబూఖద్నెస్సరు ఆశ్చర్యపడి,
దబ్బున లేచి, తన మంత్రులతో చెప్పినదేమంటే, మన
ము ముగ్గురు మనుష్యులను బంధించి అగ్నిలో వేయించ
లేదా! అని చెప్పగా, వారు రాజును చూచి, అవును
25 రాజా, అని పలికిరి.। అందుకు అతడు యిదుగో నలు
గురు మనుష్యులు విడిగా వుండి, హాని పొందకుండా
అగ్నిలో తిరుగుట నేను చూస్తున్నాను; నాలుగో వాని
రూపము దేవుని కుమారుని రూపము వలెనే వున్నదని
26 చెప్పి,। నెబూఖద్నెస్సరు కాలే అగ్ని గుండము దగ్గిరికి
వచ్చి, చెప్పినదేమంటే, మహోన్నతమైన దేవుని సేవకు
లైన వో షద్రఖా, మెషెఖా, అబెద్నెగో, బైలు వెళ్లి
యిక్కడికి రండని చెప్పగా, షద్రఖున్న మెషెఖున్న
అబెద్నెగోయున్న అగ్నిలోనుంచి బైటికి వచ్చిరి.।
27 అప్పుడు అధిపతులున్న దొరలున్న సైన్యాధిపతులు
న్న రాజ మంత్రులున్న కూడివచ్చి, యీ మష్యులను
చూచి, వారి శరీరముల మీద అగ్ని బలము చేయ
లేదనిన్ని, వారి బట్టలు యెప్పటి వలెనే వున్నవనిన్ని,
వారికి అగ్ని వాసన తగల లేదనిన్ని, వారి వెంట్రుక
లలో వొకటైనా కాలకుండా వుండుట చూచిరి.।
28 అప్పుడు నెబూఖద్నెస్సరు చెప్పినదేమంటే, షద్రఖు
న్న మెషెఖున్న అబెద్నెగోయున్న అనే వీరి దేవు
నికి స్తోత్రము కలుగును గాక; యేమంటే ఆయన
తన దూతను పంపి, తన్ను నమ్మినటువంటిన్ని తమ దేవు
నికే గాక వేరే దేవునికి సేవనైనా పూజనైనా చేయ
కుండా రాజాజ్ఞను మాచ్చి తమ శరీరములను అప్ప
29 గించినటువంటిన్ని తన సేవకులను విడిపించెను.। కాబట్టి
మేము నిర్ణయించేదేమంటే; యే జనులైనా యే జనాం
గమైనా యే భాషాంతరులైనా షద్రఖున్న మెషె
ఖున్న అబెద్నెగోయున్న అనే వీరి దేవుని విషయమై
యే దూషణైనా చేస్తే వారు తునక తునకలుగా కోయిం
చబడుదురు; మరిన్ని వారి యిండ్లు మరుగు దొడ్లవును;
యేమంటే, ఆ దేవుడు గాక యీ లాగున విడిపించ
30 గల దేవుడు వొకడూ లేడని చెప్పెను.। మరిన్ని రాజు
బాబెలు దేశమందు షద్రఖునున్న మెషెఖునున్న
అబెద్నెగోనున్న మిక్కిలీ ఘనులగా చేసెను.

## 4. అధ్యాయము.

రాజైన నెబూఖద్నెస్సరు లోకమంతటి యందుండే 1
సకల జనులకున్న జనాంగములకున్న భాషాంతరుల
కున్న సకల క్షేమములు కలుగును గాక.। నా నిమి 2
త్తము మహోన్నతుడైన దేవుడు చేసిన గురుతులనున్న
అద్భుతములనున్న ప్రబలపర్చుట నాకు అనుకూలమని
తోచెను. । ఆయన గురుతులు యెంత ఘనమైనవి! 3
ఆయన అద్భుతములు యెంత మాహాత్మ్యమైనవి! ఆయన
రాజ్యము నిత్యమైనది; ఆయన కర్తృత్వము తరతరాల
మట్టుకు వుండును.। నెబూఖద్నెస్సరునైన నేను నా 4
మందిరములో నిమ్మళముగా వుంటిని; నా నగరిలో
మేలుకొని వుంటిని.। అప్పుడు నాకు బెంగ పుట్టించి 5
నంత స్వప్నము కనుబడెను; శయ్య మీద పరుండి,
నా తలంపులవల్లనున్న నా తలంపులో వచ్చి అగుప
డిన దర్శనములవల్లనున్న నాకు బహు చింత కలిగెను.।
కాబట్టి ఆ స్వప్న తాత్పర్యమును నాకు తెలియ చెప్పు 6
టకు బాబెలు జ్ఞానులనందరినిన్ని లోపటికి పిలువుమన్న
ఆజ్ఞ యిస్తిని.। అప్పుడు మంత్రాంగులున్న జ్యోతి 7
ష్కులున్న కల్దీయులున్న ప్రశ్న చూచే వారున్న
లోపటికి వచ్చిరి; వీరికి నేను నా స్వప్నమును చెప్పి
తిని, అయితే దాని తాత్పర్యమును నాకు తెలియచెప్ప
లేక పోయిరి.। అటుతరువాత నా దేవుని పేరుచేత 8
బేల్తెషస్సరని పిలువబడి పరిశుద్ధ దేవుండ్ల ఆత్మను పొం
దిన దానియేలు వచ్చెను గనుక అతనికి నా స్వప్నమును
తెలియచేసి చెప్పినదేమంటే,। జ్ఞానుల పైని వున్న వో 9
బేల్తెషస్సరూ, పరిశుద్ధమైన దేవుండ్ల ఆత్మను నీవు పొం
దినందున నీకు యే మర్మమైనా అసాధ్యము కాదని
నాకు తెలిసెను, గనుక నా స్వప్న దర్శనములనున్న
వాటి తాత్పర్యమునున్న నీవు నాకు తెలియ చెప్ప
వలెను.। శయ్యమీద పరుండినప్పుడు నా తలంపులో 10
వచ్చి అగుపడిన దర్శనములు యేవంటే, యిదుగో
లోకముయొక్క నడమను వొక వృక్షము నాకు కను
బడెను; అది మహోన్నతముగా వుండెను.। మరిన్ని 11
ఆ వృక్షము పెరిగి, బలముగా వుండి, దాని చివర ఆకా
శమును అంటి, లోకపు సరిహద్దులన్నిటి పర్యంతమూ
వ్యాపించెను.। దాని ఆకులు చూడ విచిత్రముగా వుం 12
డెను; దాని ఫలములు బహుగా విస్తరించి వుండెను;
దానియందు సకల జీవకోట్లకు ఆహారము కలిగి వుండె
ను; దాని కింద భూ మృగములకు నీడ కలదు; ఆకాశ
పక్షులు దాని కొమ్మల యందు నివసించెను; దాని వల్ల
సకల జీవకోట్లకు ఆహారము కలదు.। అయితే శయ్య 13
మీద పరుండినప్పుడు నా శిరస్సులోకి వచ్చి అగు
పడిన దర్శనములలో యిదుగో పరిశుద్ధుడైన వొక

14 కాపరి ఆకాశములోనుంచి దిగి వచ్చి, । గొప్ప శబ్దము
తోటి చెప్పినదేమంటే, యీ వృక్షమును నరికి, దాని
కొమ్మలను తెగవేసి, దాని ఆకులను రాల్చి, దాని ఫల
ములను చెదరగొట్టి, దాని కింద వున్న మృగములనున్ను
15 దాని కొమ్మల యందున్న పక్షులనున్ను పోనిమ్ము. । అయి
తే దాని వేళ్లతోటి దాని మొరడును భూమి యందు
వుండనిచ్చి, భూమి యందు మొలిచిన లేత గడ్డిలో
దానిని యినుప కట్లచేతనున్ను యిత్తడి కట్లచేతనున్ను
బంధించి, ఆకాశపు మంచుచేత తడిచేటట్టు విడిచి
పెట్టి, మృగములతోటి భూమి గడ్డిలో దానికి పాలు
16 నిర్ణయించుము. । మరిన్ని దానిలో వున్న మనుష్య హృ
దయమును తీసి, దానికి ప్రతిగా మృగ హృదయమును
యిచ్చి, యేడు కాలములు దాని మీద గడిచేటట్టు
17 చేయుమని చెప్పెను. । మరిన్ని మహోన్నతుడు మను
ష్య రాజ్యమును యేలి, దానిని యెవనికి యివ్వ మన
స్సు కలిగి వుండునో అతనికి యిచ్చి, మరిన్ని దాని
మీద మనుష్యులలో నీచుని వుంచునని సకల జీవులకు
తెలిసేటట్టు ఆ నిర్ణయము పరిశుద్ధమైన వాని ఆజ్ఞా
18 ప్రకారమై యున్నదని చెప్పెను. । యీలాటి స్వప్నము
రాజైన నెబూఖద్నెస్సరనే నాకు కనుబడెను; కాబట్టి
ఓ బేల్తెషస్సరూ, దీని తాత్పర్యమును నాకు తెలియ
చెప్ప వలెను; నా రాజ్యమందుండే జనులందరున్ను దాని
తాత్పర్యమును నాకు తెలియ చెప్పలేకైరి; అయినప్ప
టికిన్ని నీ యందు పరిశుద్ధ దేవుండ్ల ఆత్మ వున్నది గనుక
19 దీని యందు నీకు శక్తి కలదని చెప్పితిని. । అందుకు
బేల్తెషస్సరని పిలువబడిన దానియేలు వొక గడియ
మట్టుకు ఆశ్చర్యపడి, చింతాక్రాంతుడై వుండెను;
కాబట్టి రాజు అన్నమాట, ఓ బేల్తెషస్సరూ, యీ
స్వప్నము వల్లనున్ను దాని తాత్పర్యము వల్లనున్ను చింత
పడవద్దని చెప్పినందున, బేల్తెషస్సరు చెప్పినదేమంటే,
ఓ మహాప్రభో, యీ స్వప్నము మిమ్మును పగచేసే
వారికిన్ని దాని తాత్పర్యము మీ విరోధులకున్ను అవు
20 గాక. । పెరిగి, బలముగా వుండి, మిక్కిలి పొడుగై,
21 ఆకాశమును అంటి, లోకమంతటికి కనుబడి, । చూడ
విచిత్రమైన ఆకులు గలిగి, విస్తారముగా ఫలించి, సకల
జీవకోట్లకు ఆహారమిచ్చి, దాని కింద భూ మృగముల
కున్ను దాని కొమ్మలయందు ఆకాశ పక్షులకున్ను నివా
శము చేయ కాపురమిచ్చిన మీకు కనుబడిన వృక్షము
22 యేదంటే, । ఓ రాజా, ఆ వృక్షము నీవే; యేమంటే,
మీరు పెరిగి బలముగా వున్నారు; మీరు బహుగా
పెరిగి, ఆకాశము మట్టుకు హెచ్చించబడి యున్నారు;
మీ కర్తృత్వము లోకపు సరిహద్దుల మట్టుకు సాగి
23 నది. । మరిన్ని పరిశుద్ధుడైన కాపరి ఆకాశమునుంచి
దిగి వచ్చినట్టు రాజుకు కనుబడెను; అతడు చెప్పినదే
మంటే, యీ వృక్షమును లయముచేసి నరికివేయుము;
అయితే దాని వేళ్లతోటి దాని మొరడును భూమియం
దు వుండనిచ్చి, భూమియందు మొలిచిన లేత గడ్డి
మీద దానిని యినుప కట్లచేతనున్ను యిత్తడి కట్లచేత
నున్ను బంధించి, ఆకాశపు మంచుచేత తడిసేటట్టు
విడిచిపెట్టి, యేడు కాలములు దాని మీద గడచిపోయే
పర్యంతమూ భూ మృగములతోటి అతనికి భూమి గడ్డి
లో పాలు నిర్ణయించండని అతడు చెప్పుట మీరు
వింటిరి. । ఓ రాజా, దీనికి తాత్పర్యము యేమంటే, 24
నా యేలిన వారైన మీకు సంభవించిన మహోన్న
తుని నిర్ణయము యేలాగంటే, । వారు మిమ్మును మను 25
ష్యులలోనుంచి తోలివేతురు; అప్పుడు మీరు భూ
మృగములలో కాపురముచేతురు; మీరు యెడ్లలాగున
గడ్డి మేతురు; ఆకాశపు మంచుచేత మీరు తడుతురు;
మరిన్ని మనుష్య రాజ్యమందు మహోన్నతమైన వాడు
యేలినవాడై, దానిని యెవనికి యివ్వ మనస్సు వుండు
నో వానికే యిచ్చునని మీకు తెలిసే పర్యంతమూ
ఆలాగున వుండే మీరు యేడు కాలములను గడుపు
దురు. । అయితే వేళ్లతోటి మొరడును వుండనిమ్మని 26
నిర్ణయించబడినందున ఆకాశములే యేలేవని మీరు
తెలుసుకొన్న తరువాత మీ రాజ్యము మీకు తిరిగీ
వచ్చుట రూఢమవును. । కాగా ఓ రాజా, నేను 27
చెప్పే ఆలోచనను ఆలకించి, మీ సుఖము బహు కా
లము వరకు వుండేటట్టు మీ పాపములనున్ను అక్రమ
ములనున్ను విడిచి, నీతిని జరిగించి, దరిద్రులకు దాన
ము చేయండని చెప్పెను. । అయితే యిది అంతా రాజ 28
యిన నెబూఖద్నెస్సరుకు సంభవించెను. । యేమంటే 29
పండెండు నెలలైన తరువాత అతడు బాబెలు రాజ
మందిరముయొక్క మేడ మీద తిరుగులాడుతూ వుండి,
రాజు అనుకొనినదేమంటే, । మా పరాక్రమముయొక్క 30
బలిమిచేతను మేము కట్టించిన మహా బాబెలు పురము
యిదే కాదా! దీని యందు మా రాజ ఘనత్వము నిమి
త్తమున్ను మా నగరియై వుండుటకున్ను దీనిని కట్టిం
చినవారము మేమే కామా? అని అనుకొనెను. । అయి 31
తే యీ మాటలు రాజు నోట వుండగానే ఆకాశము
నుంచి వొక శబ్దము దిగి చెప్పినదేమంటే, రాజవైన
ఓ నెబూఖద్నెస్సరూ, యీ వాక్యము నిన్ను గురిం
చినది; యీ రాజ్యము నీనుంచి పోవును. । వారు నిన్ను 32
మనుష్యులలోనుంచి తోలివేతురు; అయినందున నీవు
భూ మృగములలో నివాసముచేసి, యెడ్ల వలెనే గడ్డి
మేతువు; మహోన్నతమైన వాడు మనుష్య రాజ్య
మును యేలినవాడై, దాని యెవనికి యివ్వ మనస్సు
కలవాడై వుండునో వానికే యిచ్చునని నీవు తెలు
సుకొనే పర్యంతమూ నీ మీద యేడు కాలములు

33 గడచి పోవునని పలికెను. । అయితే ఆ గడియలోనే ఆ
వాక్యము నెబూఖద్నెస్సరు మీద నెరవేరెను; యేమం
టే అతడు మనుష్యులలోనుంచి తోలివేయబడి, యెద్ల
వలెనే గడ్డి మేసెను; అతని వెంట్రుకలు గద్ద వెంట్రు
కల వలెనున్ను అతని గోళ్లు పక్షి గోళ్ల వలెనున్ను పె
రిగే పర్యంతమూ అతని శరీరము ఆకాశపు మంచు
34 తోటి తడిసెను. । అయితే ఆ దినములైన తరువాత
నెబూఖద్నెస్సరునైన నేను మతిమంతుడనైనందున నా
కనుదృష్టిని ఆకాశము పైని వుంచి, మహోన్నతుని
స్తోత్రము చేస్తిని; చిరకాల జీవియైన వాని ఘనపర్చి
పొగడితిని; యేమంటే ఆయన రాజ్యము నిత్యమైన
రాజ్యము; ఆయన కర్తృత్వము తరతరాల మట్టుకు
35 వుండును. । ఆయనను చూస్తే లోకులందరున్ను వట్టివా
రని తోచును; ఆయన ఆకాశ సమూహములకున్ను
లోకపు కాపురస్తులకున్ను తన చిత్తప్రకారము చేసు
ను; ఆయన హస్తమును అడ్డుకొనుటకున్ను ఆయన
చేసేది యేమిటని అనేపాటి వారు యెవరూ లేరు. ।
36 అప్పుడే నా మతి నాకు తిరిగీ వచ్చెను; నా రాజ్య
ఘనత్వమున్ను మాహాత్మ్యమున్ను తేజస్సున్ను నాకు
తిరిగీ వచ్చెను; నా మంత్రాంగులున్ను నా సామంతు
లున్ను నన్ను దర్శించ వచ్చిరి; నా రాజ్యమందు నేను
37 స్థిరపడితిని; నాకు మరింత ఘనము వచ్చెను. । కాబట్టి
నెబూఖద్నెస్సరునైన నేను ఆకాశముయొక్క రాజును
స్తోత్రము చేస్తూ ఘనపర్చుచూ పొగడుతూ వున్నా
ను; యేమంటే ఆయన క్రియలన్నిన్ని సత్యమై యు
న్నవి; ఆయన మార్గములు నీతి న్యాయములై యు
న్నవి; గర్వముగా నడిచేవారి గర్వమును అణిచి వేసే
శక్తి ఆయనకు కలిగి వున్నది.

## 5. అధ్యాయము.

1 రాజైన బేల్షస్సరు తనయొద్ద వున్న వెయిమంది సా
మంతులకున్ను గొప్ప విందు చేయించి, ఆ వెయిమంది
2 ముందర ద్రాక్షారసమును తాగెను. । అయితే బేల్షస్సరు
ద్రాక్షారసమును తాగి చెప్పినదేమంటే, తన తాతైన
నెబూఖద్నెస్సరు యెరూశలేము గుడిలోనుంచి దోపు
డుగా తెచ్చిన బంగారపు పాత్రలలోనున్ను వెండి పా
త్రలలోనున్ను మేమున్ను మా సామంతులున్ను మా భా
ర్యలున్ను మా వుపపత్నులున్ను తాగుటకు వాటిని తె
3 మ్మని సెలవు యిచ్చెను. । కాబట్టి వారు యెరూశలేములో
వున్న దైవమందిరముయొక్క గుడిలోనుంచి దోపుడు
గా తెచ్చిన బంగారపు పాత్రలను తీసుకొ వచ్చినందున
రాజున్ను అతని సామంతులున్ను భార్యలున్ను వుపప
4 త్నులున్ను వాటిలో తాగిరి. । యీలాగున ద్రాక్షారస
మును తాగి, బంగారము వెండి యిత్తడి యినుము కర్ర
రాయి మొదలైన దేవుండ్లను స్తుతించిరి.।ఆ గడియలోనే 5
మనుష్యునిచేతి వేళ్లు అగుపడి, దీపస్తంభము యెదుట
రాజ మందిరముయొక్క గోడ సున్నపు గచ్చుమీద వ్రా
సెను; మరిన్ని ఆ చెయ్యి వ్రాసినది రాజు చూచెను. ।
అప్పుడు రాజు ముఖము చిన్నబోయెను; అతని తలంపుల 6
వల్ల అతనికి శ్రమ వచ్చి, అతని నడుము కీళ్లు వసిలి, అతని
మోకాళ్లు వొకదానితో వొకటి కొట్టుకొనెను. । కా 7
బట్టి రాజు జ్యోతిష్కులనున్ను కల్దీయులనున్ను ప్రశ్న
చూచే వారినిన్ని లోపటికి పిలువుమని కేక వేసెను;
కాబట్టి రాజు వారితో చెప్పినదేమంటే, యీ వ్రాత
యెవరైనా చదివి, దాని తాత్పర్యము మాకు తెలియ
చెప్పితే, అతడు వూదా వస్త్రములు ధరించును; అతడు
బంగారపు కంఠమాల వేసుకొనును; మరిన్ని అతడు
రాజ్యము పైని మూడో అధికారి అవునని చెప్పెను. ।
అప్పుడు రాజు జ్ఞానులందరున్ను లోపటికి వచ్చిరి; 8
అయితే ఆ వ్రాత చదువలేక దాని తాత్పర్యమును రా
జుకు చెప్పలేకపోయిరి. । అందుకు బేల్షస్సరు బహు చిం 9
తాక్రాంతుడై, ముఖము చిన్నబుచ్చుకొనెను; అతని
సామంతులున్ను కలవిలపడిరి. । అంతట రాణి రాజుయొ 10
క్కయున్ను సామంతులయొక్కయున్ను మాటలను విని,
విందు చేసిన యింట్లోకి వచ్చి, రాజుతో చెప్పినదేమం
టే, వో రాజా, నీవు చిరకాల జీవివవుదువు గాక;
యిందును గురించి చింతపడుటకున్ను ముఖము చిన్న
బుచ్చుకొనుటకున్ను నిమిత్తము లేదు. । మీ రాజ్యమందు 11
పరిశుద్ధ దేవుండ్లయొక్క ఆత్మ కలిగిన వొక మనుష్యుడు
న్నాడు; మీ తాత దినములలో అతని యందు దేవుండ్ల
వంటి జ్ఞానమున్ను తెలివిన్ని తేజస్సున్ను అగుపడెను;
మీ తాతయున్ను రాజున్ను అయిన నెబూఖద్నెస్సరు
మంత్రాంగులకున్ను జ్యోతిష్కులకున్ను కల్దీయులకు
న్ను ప్రశ్న చూచేవారికిన్ని యితని అధికారిని చేసెను.।
మరిన్ని దానియేలనే యితడు ఘనమైన ఆత్మయున్ను 12
తెలివిన్ని బుద్ధిన్ని కలవాడున్ను, స్వప్నముల తాత్పర్య
ములను చెప్పుటకున్ను కఠినమైన ప్రశ్నలకు ప్రత్యు
త్తరము చెప్పుటకున్ను చిక్కులను విప్పుటకున్ను బహు
ప్రజ్ఞ గలవాడున్ను గనుక రాజు అతనికి బేల్తెషస్సరు
అన్న పేరు బెట్టెను; కాబట్టి యీ దానియేలును పిలువ
నంపిస్తే అతడు వచ్చి దీని తాత్పర్యమును మీకు తెలి
య జేసునని చెప్పెను. । కాబట్టి వారు దానియేలును 13
రాజు సన్నిధికి తీసుకొ వచ్చిరి; అప్పుడు రాజు దాని
యేలును చూచి చెప్పినదేమంటే, రాజుగారైన మా
తాతగారు యూదా దేశములోనుంచి చెరగా పట్టి
తెచ్చిన యూదా వారిలో వున్న దానియేలువు నీవే
నా? । నీ యందు దేవుండ్ల ఆత్మ కలిగి వున్నదనిన్ని తేజ 14
స్సున్ను తెలివిన్ని బహు జ్ఞానమున్ను నీ యందు అగు

15 పడెననిన్ని నిన్ను గూర్చిన వింటిమి. । యిప్పుడు యీ
వ్రాతను చదువుటకున్ను దీని తాత్పర్యమును మాకు
తెలియ చెప్పుటకున్ను జ్యోతిష్కులైన జ్ఞానులు మా
సన్నిధికి తీసుకొని రాబడిరి గాని దీని తాత్పర్యమును
16 వారు చెప్పలేకపోయిరి. । నీవు తాత్పర్యములను చెప్పు
టకున్ను చిక్కులను విప్పుటకున్ను శక్తిమంతుడవని
మాకు వినబడెను; కాబట్టి యీ వ్రాతను నీవు చదివి,
దాని తాత్పర్యమును మాకు తెలియ చెప్పితే, నీవు వూ
దా వస్త్రములను ధరింతువు; బంగారపు కంఠమాల నీ
మీద వేయబడును; మరిన్ని నీవు రాజ్యము పయిని
17 మూడో అధికారివవుదువని చెప్పెను. । అందుకు దాని
యేలు చెప్పినదేమంటే, మీ కానుకలు మీ యొద్దనే
వుండనిమ్ము; మీ బహుమానములను మరి యొకనికి యి
మ్ము; అయినప్పటికిన్ని యీ వ్రాతను నేను చదివి,
దాని తాత్పర్యమును రాజుగారికి తెలియ చెప్పుదును. ।
18 వో రాజా, మహోన్నతుడైన దేవుడు మీ తాతైన
నెబూఖద్నెస్సరుకు రాజ్యమునున్ను మాహాత్మ్యము
నున్ను ఘనత్వమునున్ను బహుమానమునున్ను యిచ్చెను. ।
19 కాబట్టి యింత మాహాత్మ్యమును ఆయనకు యిచ్చినం
దున సకల జనులున్ను జనాంగములున్ను భాషాంతరు
లున్ను ఆయన ముందట వణికి జడిసిరి; యెవని చంపించ
వలెనని వుండెనో అతని చంపించివేసెను; యెవని బ్రతి
కించ వలెనని వుండెనో అతని బ్రతికించెను; యెవని
స్థిరపర్చ వలెనని వుండెనో అతని స్థిరపర్చెను; యెవని
తక్కువ చేయ వలెనని వుండెనో అతని తక్కువ చేసె
20 ను. । అయితే ఆయన హృదయము అతిశయించినప్పు
డున్ను అతని మనస్సు గర్వముచేత కఠినమైనప్పుడున్ను
అతని రాచ గద్దె మీదినుంచి ఆయన కింద పడదోయ
బడి అతని ఘనత్వము అతని యొద్దనుంచి తీసివేయబ
21 డెను. । మరిన్ని అతడు మనుష్యులలోనుంచి తోలివేయ
బడెను; అతని హృదయము మృగ హృదయములతో
సమమాయెను; అడవి గాడ్దెలతో ఆయన వాస
ము చేసెను; యెడ్ల లాగున ఆయన గడ్డి మేసెను; యీ
లాగున మహోన్నతుడైన దేవుడు మనుష్య రాజ్య
మును యేలి, దాని పైని యెవరిని వుంచుటకు చిత్తము
కలిగి వుండునో అతని వుంచునని అతడు తెలుసు
కొనే పర్యంతమూ అతని శరీరము ఆకాశపు మంచు
22 చేత తడుస్తూ వుండెను. । మరిన్ని అతని మనుమడవైన
వో బేల్షస్సరూ, యిది అంతా మీకు తెలిసినప్పటికిన్ని
మీరు మీ హృదయమును తగ్గించుకొనక, ఆకాశము
23 యొక్క దేవుని మీదికి లేచితిరి. । మరిన్ని ఆయన మం
దిరముయొక్క పాత్రలను వారు మీ ముందటికి తీసు
కొని వచ్చిరి; విటిలో మీరున్ను మీ సామంతులున్ను
మీ భార్యలున్ను మీ వుపపత్నులున్ను ద్రాక్షారసము
ను తాగి, వెండి, బంగారము, యిత్తడి, యినుము, కర్ర,
రాయి, మొదలైన చూడలేని వినలేని తెలివిలేని దేవుం
డ్లను స్తుతించితిరి; అయితే యెవని చేతిలో మీ ప్రా
ణము వున్నదో యెవని వశమందు మీ మార్గములు
వున్నవో ఆ దేవుని మీరు ఘనపర్చలేదని చెప్పెను. ।
అప్పుడు ఆ చెయ్యి ఆయననుంచి పంపించబడగానే, । 24
మినే, మినే, టికేల్, ఊఫార్సీన్, అనే వ్రాత కను 25
బడ్డది. । దాని తాత్పర్యము యేమంటే, మినే అనగా 26
దేవుడు మీ రాజ్యమును లెక్కించి కడతేర్చెను. ।
టికేల్ అనగా మీరు త్రాసుతో తూచబడితిరి, అయి 27
తే తక్కువైతిరి. । ఊఫార్సీన్ అనగా మీ రాజ్యము 28
విభాగించబడి, సగము మాదీయులకున్ను సగము పా
రసీ వారికిన్ని యివ్వబడెనని చెప్పెను. । అప్పుడు బేల్ష 29
స్సరు సెలవు యిచ్చినందున వారు దానియేలును వూ
దా వస్త్రములను ధరింపజేసి, ఆయనకు బంగారపు కంఠ
మాలవేసి, రాజ్యమునకు యితడు మూడో అధికారి అని
చాటించిరి. । అయితే ఆ రాత్రిలోనే కల్దీయుల రాజైన 30
బేల్షస్సరు హతమాయెను. । కాబట్టి మాదీయుడయిన 31
దర్యావెషు అరువై రెండు సంవత్సరముల వాడై రాజ్య
మును అనుభవించెను.

## 6. అధ్యాయము.

అప్పుడు రాజ్యము పైని నూట యిరువైమంది అధి 1
కారులను రాజ్యమంతటి మీద వుండేటట్టు చేయుటకు
దర్యావెషుకు మనస్సు పుట్టెను. । మరిన్ని వీరిమీద ము 2
గ్గురు ప్రధానులు వుండిరి; వీరిలో దానియేలు మొద
టివాడై వుండెను; రాజుకు నష్టము రాకుండా యీ
అధికారులు వీరికి సకల వర్తమానములను తెలియచే
సుటకు నిర్ణయించబడిరి. । దానియేలు బహు బుద్ధి 3
మంతుడు గనుక అధికారుల మీదనున్న ప్రధానుల
మీదనున్న యీలాగున వుంచబడెను; మరిన్ని రాజ్య
మంతటి పైని అతని వుంచుటకు రాజు తలంచెను. ।
అప్పుడు ప్రధానులున్ను అధికారులున్ను రాజ్యమును 4
గురించి దానియేలు మీద తప్పమోపే హేతువును
వెతికిరి, అయితే యే హేతువైనా యే తప్పయినా వా
రికి కనుబడలేదు; యేమంటే అతడు యథార్థపరుడు
గనుక అతని యందు యే తప్పయినా యే నేరమైనా
కనుబడలేదు. । అప్పుడు యీ మనుష్యులు అనుకొనిన 5
దేమంటే, అతని దేవుని న్యాయ ప్రమాణము విషయ
మై యీ దానియేలు మీద మనకు హేతువు దొరక
వలెను గాని మరి దేనివల్లనైనా దొరకదని అనుకొనిరి. ।
కాబట్టి యీ ప్రధానులున్ను అధికారులున్ను రాజు 6
యొద్దికి కూడి వచ్చి, చెప్పినదేమంటే, వో రాజవైన
దర్యావెషూ, చిరకాల జీవివవుదువు గాక. । రాజ్యము 7

యొక్క ప్రధానులందరున్ను దొరలున్ను అధికారు
లున్ను మంత్రాంగులున్ను సైన్యాధిపతులున్ను కూడు
కొని, యెవడైనా ముప్పయి దినముల మట్టుకు రాజు
వైన నీ యొద్ద గాక యే దేవుని యొద్దనైనా యే మను
ష్యుని యొద్దనైనా మనవి చేసుకొని ఆశ్రయించితే,
అతడు సింహపు బోనులో వేయబడునని రాజాజ్ఞను
న్ను రూఢమైన నిర్ణయమునున్ను చేయించ నాలోచిం
8 చిరి. । కాబట్టి ఓ రాజా, యీ నిర్ణయమును నీవు
రూఢపర్చి, అది తిరిగి పోకుండా మాదీయులున్ను
పారసీయులున్ను వీరితప్ప లేని న్యాయప్రమాణ ప్రకా
రము లిఖించబడ్డ దాని యందు సంతకము చేయండని
9 చెప్పినందున, । రాజైన దర్యావేషు ఆ నిర్ణయమైన
10 లిఖితము మీద సంతకము చేసెను. । అయితే లిఖి
తమందు సంతకము అయినదనిన సంగతి దానియే
లుకు తెలిసినప్పటికిన్ని అతడు తన యింటికి వెళ్లి,
యెరూశలేము తట్టు వున్న అతని గది కిటికీలను విప్పు
కొని, యెప్పటి లాగునే ప్రతి దినము ముమ్మారు మో
కాళ్లూని ప్రార్థించి, తన దేవునితో మనవి చేస్తూ వుం
11 డెను. । అంతట యీ మనుష్యులు కూడి, దానియేలు
అతని దేవుని ప్రార్థిస్తూ వేడుకొంటూ వుండుట చూచి, ।
12 అప్పుడు వారు రాజుయొద్దికి వచ్చి, రాజు చేసిన నిర్ణ
యమును గురించి చెప్పినదేమంటే, యెవడైనా ముప్పై
దినముల యీలోగా మీ యొద్ద గాక యే దేవుని యొ
ద్దనైనా యే మనుష్యుని యొద్దనైనా మనవి చేసుకొని
ఆశ్రయించినట్టయితే, అతడు సింహపు బోనులో వేయ
బడుననే నిర్ణయము మీద మీరు సంతకము చేస్తిరి
గదా అని చెప్పినప్పుడు, రాజు అందుకు ప్రత్యుత్తర
ముగా అది నిజమే, మాదీయులయొక్కయున్ను పార
సీయులయొక్కయున్ను న్యాయప్రమాణ ప్రకారము
13 తప్పగూడదని పలికినప్పుడు, । వారు రాజుతో చెప్పిన
దేమంటే, చెరలోకి వచ్చిన యూదా వారిలో వున్న ఆ
దానియేలు మిమ్మునైనా మీరు సంతకము చేసిన నిర్ణయ
మునైనా లక్ష్యపెట్టక, ప్రతి దినమూ ముమ్మారు మనవి
14 చేసుకొంటూ వున్నాడని చెప్పిరి. । అయితే రాజు యిది
విని, బహు చింతాక్రాంతుడై, దానియేలును విడిపిం
చుటకు ప్రయత్నము చేసెను; అతని విడిపించుటకు
15 సూర్యాస్తమాన పర్యంతమూ ప్రయాస పడెను. । అయి
నందున ఆ మనుష్యులు తిరిగీ రాజు యొద్దికి వచ్చి, రా
జుతో చెప్పినదేమంటే, ఓ రాజా, నీవు తెలియ వల
సినదేమంటే, రాజు యే కట్టడయినా యే నిర్ణయ
మయినా చేస్తే, అది మాదీయులయొక్కయున్ను పార
సీయులయొక్కయున్ను న్యాయ ప్రమాణ ప్రకారము
16 రూఢమై తప్పిపోకూడదని చెప్పినందున, । రాజు సెలవు
యిచ్చెను గనుక వారు దానియేలును తెప్పించి, సింహ
ములు వుండే బోనులో వేయించిరి; అయితే రాజు
దానియేలుతో నీవు నిత్యమున్ను సేవించే దేవుడు నిన్ను
విడిపించునని చెప్పెను. । అయితే వారు రాతిని తెప్పిం 17
చి, బోను మీద వేసిరి; మరిన్ని దానియేలును గురించి
ఆజ్ఞాపించినది తిరిగి పోకుండా రాజు దానిని తన ము
ద్రచేతనున్ను తన సామంతుల ముద్రచేతనున్ను ము
ద్రించెను. । అప్పుడు రాజు తన నగరికి వెళ్లి, భుజిం 18
చక, ఆ రాత్రి గడిపెను; అతని యొద్దికి వాద్యగాం
డ్లున్ను రాలేదు; అతనికి నిద్ర పట్టలేదు. । కాబట్టి 19
రాజు వుదయమందు త్వరగా లేచి, వేగముగా సింహ
ముల బోను యొద్దికి వెళ్లెను. । బోను యొద్దికి వచ్చి, 20
తాను గొప్ప శబ్దముచేత దానియేలును పిలిచి, మరిన్ని
రాజు దానియేలును గురించి చెప్పినదేమంటే, సజీవు
డయిన దేవునికి సేవకుడవైన ఓ దానియేలూ, నీవు
నిత్యమూ సేవించే దేవుడు సింహములనుంచి నిన్ను విడి
పించెనా అని అడిగినప్పుడు, । దానియేలు రాజుతో 21
చెప్పినదేమంటే, ఓ రాజా, చిరకాల జీవివి అవు
దువు గాక. । నా దేవుడు తన దూతను పంపి, సింహ 22
ముల మూతులు నాకు మోసము చేయకుండా కట్టిం
చెను; యేమంటే ఆయన సముఖమందు నేను నిరపరా
ధినై వుంటిని; మరిన్ని ఓ రాజా, నిన్ను గురించి యే
తప్పయినా చేయలేదని చెప్పెను. । అప్పుడు రాజు 23
బహు సంతోషపడి, దానియేలును బోనులోనుంచి
మీదికి తీసుటకు ఆజ్ఞాపించెను; కాబట్టి దానియేలును
బోనునుంచి మీదికి తీసిరి; అయితే అతడు తన దేవుని
నమ్మినందున హాని యెంత మాత్రమూ పొందక వుం
డెను. । అప్పుడు రాజు ఆజ్ఞ యిచ్చినందున వారు దాని 24
యేలు మీద తప్పు మోపిన వారినిన్ని వారి బిడ్డలను
న్ను భార్యలనున్ను పట్టి, సింహములు వుండే బోనులో
వేసిరి; వీరి మీద సింహములకు బలము కలిగి, బోనులో
వారు పడక మునుపే వారి దుమ్ములన్నిటినీ తునక తున
కలుగా చేసెను. । అప్పుడు రాజైన దర్యావేషు లోక 25
మంతటా కాపురము చేసే సకల జనులకున్ను జనాంగ
ములకున్ను భాషాంతరులకున్ను వ్రాయించినదేమంటే,
మీకు సకల క్షేమములు కలుగును గాక. । మేము 26
నిర్ణయించేదేమంటే, మా యేలుబడిలో వున్న వారం
దరున్ను దానియేలుయొక్క దేవుని యెదుట వణికి భయ
పడవలసినది; యేమంటే ఆయన సజీవుడై నిత్యమున్ను
వుండును; ఆయన రాజ్యము లయము గాక వుండును;
ఆయన కర్తృత్వమునకు అంతము లేదు. । ఆయన విడి 27
పించే వాడున్ను ఆకాశమందున్ను భూమి యందున్ను
గురుతులనున్ను అద్భుతములనున్ను చేసేవాడున్ను సిం
హముల బలమునుంచి దానియేలును విడిపించిన వాడు
న్నని వ్రాయించెను. । కాబట్టి దర్యావేషు యేలుబడి 28

యందున్ను పారసీయుడైన కోరేషు యేలుబడి యందు
న్ను దానియేలు క్షేమముగా వుండెను.

## 7. అధ్యాయము.

1 అయితే బాబెలు రాజైన బేల్షస్సరు యేలుబడి మొ
దటి సంవత్సరమందు దానియేలుకు స్వప్నము ఆయెను;
శయ్య మీద పరుండగా అతని తలంపులలో దర్శన
ములు కనుబడెను; అప్పుడు అతడు తన స్వప్నమును
2 వ్రాసి దాని తాత్పర్యమును తెలియ చెప్పెను.। అప్పు
డు దానియేలు రాత్రి తనకు కనుబడిన దర్శనములు
తెలియజెప్పిన లాగు యేమిటంటే, యిదుగో ఆకాశ
ముయొక్క చతుర్వాయువులు లేచి గొప్ప సముద్రము
3 మీద విసరెను.। అప్పుడు సముద్రములోనుంచి నా
లుగు గొప్ప మృగములు భేద రూపములు పొంది పైకి
4 యెక్కెను.। మొదటి మృగము సింహము లాటిదై,
గద్ద రెక్కలు గలదై వుండెను; అయితే నేను చూస్తూ
వుండగా యిదుగో భూమి పైకి యెగిరిన దాని రెక్కలు
వూడతియ్యబడెను; అప్పుడు అది దాని కాళ్లతోటి
మనుష్యుని వలె నేల మీద నిలిచెను; మరిన్ని మను
5 ష్యుని హృదయము దానికి యివ్వబడెను.। అప్పుడు
వెలుగుబంటి అయిన రెండో మృగము అగుపడి, వొక
పక్కను లేచెను; మరిన్ని దాని నోటి కోరలలో
మూడు పక్కటెముకలు వుండెను; అప్పుడు దానితో
నీవు లేచి చాలా మాంసమును భక్షించుమని చెప్పిరి.।
6 అప్పుడు నేను చూస్తూ వుండగా, యిదుగో సివంగి
లాటి మరివొక మృగము అగుపడెను; దాని వీపున నా
లుగు పక్షి రెక్కలు గలవు; యీ మృగమునకు నా
లుగు శిరస్సులు గలవు; మరిన్ని దానికి కర్తృత్వము
7 యివ్వబడెను.। తరువాత రాత్రి దర్శనములలో యి
దుగో నాలుగో మృగము అగుపడెను; అది ఘోరమైన
దిన్ని భయంకరమైనదిన్ని మహా బలమయినదిన్ని అయి
వుండెను; మరిన్ని అది పెద్ద యినుప కోరలు గలదై
భక్షిస్తున్ను విరిచివేస్తున్ను మిగిలిన వాటిని కాళ్లచేత
తొక్కెను; మరిన్ని అది పది శృంగములు గలదై మును
8 పటి మృగములకంటే వేరై వుండెను.। నేను ఆ శృం
గములను గురించి విచారిస్తూ వుండగా, యిదుగో నా
టిలో మరి వొక చిన్న శృంగము లేచెను; దాని ముం
దట మొదటి శృంగములలో మూడు శృంగములు వేళ్ల
తోటి పీకివేయబడెను; మరిన్ని యిదుగో ఆ శృంగ
ములకు మనుష్య నేత్రములున్ను గర్వపు మాటలు
9 పలికే నోరున్ను కలిగి వుండెను.। మరిన్ని నేను చూ
స్తూ వుండగా, గద్దెలు కింద వేయబడెను; పురాతన కా
లీనుడు ఆసీనుడై వుండెను; ఆయన వస్త్రము మంచు
లాటిదై వుండెను; ఆయన వెంట్రుకలు తేటైన బొచ్చు
వలెనే వుండెను; ఆయన గద్దె అగ్ని మంట వంటిదై
వుండెను; ఆయన చక్రములు కాలే అగ్ని వలె వుం
డెను.। ఆయన ముందటినుంచి అగ్ని వుబికి ప్రవహిం 10
చెను; వెయివేలమంది ఆయనను కనిపెట్టి వుండిరి; కోట్ల
కొలది జనులు ఆయన ముందట నిలిచి వుండిరి; న్యా
యపు తీర్పు కాలము వచ్చెను; గ్రంథములు విప్పబ
డెను.। అయితే ఆ శృంగము పలికిన గర్వపు మాటల 11
శబ్దము నిమిత్తము నేను కనిపెట్టి వుంటిని; కనిపెట్ట
గానే యిదుగో ఆ మృగము హతమై పోయెను; దాని
శరీరము లయమై, కాలే అగ్నికి యివ్వబడెను.। అయితే 12
మిగిలిన మృగములకు కర్తృత్వము లేదు; అయితే యిం
కా వొక కాలము మట్టుకున్ను సమయము మట్టుకున్ను
బ్రతుకుటకు వాటికి సెలవాయెను.। మరిన్ని రాత్రి 13
దర్శనములలో నేను చూస్తూ వుండగా, యిదుగో
మనుష్య కుమారునివంటి వొకడు ఆకాశ మేఘముల
తోటి వచ్చి అగుపడి, పురాతన కాలీనుడైన వాని
సమీపమునకు వచ్చెను; అప్పుడు యీయనను ఆయన
యొద్దికి కొంచు వచ్చిరి.। అప్పుడు సకల జనులున్ను 14
జనాంగములున్ను భాషాంతరులున్ను ఆయనకు సేవ
చేసేటట్టు కర్తృత్వమున్ను ఘనమున్ను రాజ్యమున్ను
ఆయనకు యివ్వబడెను; ఆయన కర్తృత్వము నిత్యమైన
కర్తృత్వము; ఆయన రాజ్యము లయము కానిది.।
అయితే దానియేలునైన నా శరీరములో వున్న నా 15
ఆత్మ నొప్పి పొందినది; నా తలంపులలోకివచ్చి అగుపడిన
దర్శనములవల్ల నేను బహు చింతాక్రాంతుడనైతిని.।
కాబట్టి దగ్గిర నిలిచి వున్న వారిలో వొకని యొద్దికి 16
వెళ్లి, దీని తాత్పర్యమేమని అడిగినందున, అతడు వాటి
తాత్పర్యమును నాతో తెలియ చెప్పినదేమంటే,। ఆ 17
నాలుగు గొప్ప మృగములు లోకమందు లేవబోయే
నలుగురు రాజులు.। అయినప్పటికిన్ని మహోన్నత 18
మైన వాని పరిశుద్ధులు రాజ్యమును చేపట్టి, రాజ్య
మును యెన్నటికిన్ని స్వతంత్రించుకొందురని చెప్పి
నప్పుడు,। నేను మునుపటి మృగములకు వేరుగా వున్న 19
నాలుగో మృగమును గురించిన తాత్పర్యమును తెలియ
గోరితిని; యేమంటే అది యినుప కోరలున్ను యిత్తడి
గోళ్లున్ను కలదై, బహు ఘోరమైనదై వుండెను; అది
విరిచి భక్షించగా మిగిలిన వాటిని కాళ్లచేత తొక్కె
ను.। మరిన్ని దాని శిరస్సు మీద వున్న పది శృంగ 20
ములను గురించిన్ని మీదికి యెక్కిన యింకొక శృంగ
మును గురించిన్ని తెలియ గోరి వుంటిని; యేమంటే
దాని ముందట మూడు శృంగములు పడిపోయెను;
ఆ శృంగమునకు కండ్లున్ను గర్వపు మాటలు పలికే
నోరున్ను కలిగి వుండెను; దాని ముఖము దాని తోటి
వాటి ముఖముల కంటే దృఢముగా వుండెను.। మరిన్ని 21

ఆ శృంగము పరిశుద్ధులతో యుద్ధము చేసి, పురాతన
కాలీనుడు వచ్చే పర్యంతమూ జయము పొందినట్టు
22 నాకు కనుబడి వుండెను. । అప్పుడు న్యాయపు తీర్పు
మహోన్నతమైన వాని పరిశుద్ధులకు యివ్వబడెను;
పరిశుద్ధులు రాజ్యమును స్వతంత్రించుకొనే కాలము
23 వచ్చెను. । కాబట్టి అతడు నాతో చెప్పినదేమంటే,
నాలుగో మృగము లోకమందు లేవబోయే నాలుగో
రాజ్యమయి యున్నది; అది సకల రాజ్యముల కంటే
వేరై, లోకమంతటినీ భక్షించి, తునక తునకలుగా
24 కొట్టివేసును. । మరిన్ని యీ రాజ్యములోనుంచి లేచిన
పది శృంగములు పదిమంది రాజులు: వారి తరువాత
యింకొక రాజు లేచును; ఆయన మునుపటి వారి
కంటే వేరై వుండి, ముగ్గురు రాజులను స్వాధీనపర్చు
25 కొనును. । మరిన్ని అతడు మహోన్నతమైన వాని దూ
షించి, మహోన్నతమైన వాని పరిశుద్ధులను హీనప
ర్చి, కాలములనున్ను న్యాయ ప్రమాణములనున్ను
మార్చ దలచును; మరిన్ని కాలము కాలములు అర్థ
కాలములు గతించే పర్యంతమూ వారు అతని చేతికి
26 దొరికి వుందురు. । అప్పుడు న్యాయపు తీర్పు కాలము
వచ్చును; వారు దాని కర్తృత్వమును తీసివేసి, నశింప
27 చేసి, సమూలముగా లయపర్చుదురు. । మరిన్ని రాజ్య
మున్ను కర్తృత్వమున్ను ఆకాశముకింద వున్న రాజ్య
ములన్నిటి ఘనత్వమున్ను మహోన్నతమైన వాని పరి
శుద్ధ జనులకు యివ్వబడును; ఆయన రాజ్యము నిత్య
మైన రాజ్యమై వుండును; సమస్తమైన కర్తలు ఆయ
28 నను సేవించి లోపడి వుందురని చెప్పెను. । యీ సంగతి
యింత మట్టుకు ముగించెను; అయితే దానియేలునైన
నేను నా తలంపులవల్ల అతి చింతాక్రాంతుడనై వున్నం
దున నా ముఖము చిన్నబోయెను; అయితే ఆ మాట
లన్నీ నా జ్ఞాపకమందు వుంచుకొంటిని.

## 8. అధ్యాయము.

1 మరిన్ని రాజైన బేల్షస్సరు యేలుబడి మూడో సంవ
త్సరమందు ఆ దర్శనము గాక యింకొక దర్శనము
2 దానియేలునైన నాకు కనుబడెను. । యీ దర్శనము
నాకు కనుబడినప్పుడు నేను ఏలాము దేశమందు వున్న
షూషను నగరిలో వుంటిని; అయితే నాకు కనుబడిన
దర్శనములో యిదుగో నేను ఊలాయి నది దగ్గిర
3 నిలిచి వుంటిని. । అప్పుడు నేను నా కండ్లతో తేరి
చూడగా, యిదుగో రెండు శృంగములు గల గొర్రె
పొట్టేలు నది యొద్ద నిలిచి వుండెను; ఆ శృంగములు
పొడుగై వుండెను; అయితే వొక దాని కంటే వొకటి
పొడుగై వుండెను; పొడుగైనది కడవరిని లేచెను. ।
4 యీ గొర్రెపొట్టేలు పడమటి దిక్కుకున్ను వుత్తర
దిక్కుకున్ను దక్షిణపు దిక్కుకున్ను తోసుకొని పోయి
నట్టు నాకు కనుబడెను; దాని ముందట నిలువ గల
మృగము వొకటీ లేదు; దాని చేతినుంచి తప్పించుకొన
నిది వొకటీ లేదు; యీలాగున అది తన యిష్టప్రకా
రము చేసి, మిక్కిలీ గొప్పదై వుండెను. । అయితే దీనిని 5
గురించి నేను విచారిస్తూ వుండగా, యిదుగో పడమటి
దిక్కునుంచి వొక మేకపోతు నేలను అంటనట్టుగా
భూ ముఖము అంతటి పైకి వచ్చెను; యీ మేకపోతు
నేత్రముల మధ్యను లక్షణమైన వొక శృంగము కల
దు. । యీ మేకపోతు నాకు కనుబడిన రెండు శృంగ 6
ములు గల దాని దగ్గిర నిలిచి యున్న గొర్రెపొట్టేలు
యొద్దికి వచ్చి, రౌద్రము తెచ్చుకొని, బహు బలము
చేత దాని మీద దబ్బున పడెను. । అది గొర్రెపొట్టేలు 7
యొద్దికి వచ్చుట నేను చూస్తూ వుంటిని; అది దీని
యందు బహు కోపము తెచ్చుకొని, యీ గొర్రెపొ
ట్టేలును కొట్టి, దాని రెండు శృంగములను విరిచెను;
దాని ముందట నిలువ శక్తి గొర్రెపొట్టేలుకు లేక పో
యెను; యేమంటే అది దీనిని కింద పడదోసి తొక్కెను;
మరిన్ని దాని చేతిలోనుంచి గొర్రెపొట్టేలును విడి
పించ గలవాడు వొకడూ లేడు. । కాబట్టి యీ మేక 8
పోతు మిక్కిలీ గొప్పదిగా వుండెను; అయితే బలమై
నదై వుండగానే ఆ ఘనమైన శృంగము విరిగి పో
యెను; చూడగా దానికి మారుగా ఆశ్చర్యమైన నా
లుగు శృంగములు ఆకాశముయొక్క నలుతట్లా లేచెను. ।
మరిన్ని వాటి యందు వున్న వొక దానిలోనుంచి వొక 9
చిన్న శృంగము లేచెను; యిది మిక్కిలీ గొప్పదై పెరిగి,
దక్షిణపు తట్టున్ను తూర్పు తట్టున్ను ఆనంద దేశము
తట్టున్ను బహు బలముగా వుండెను. । మరిన్ని ఆకాశ 10
సమూహము మట్టుకు బలముగా పెరిగి, వాటిలో కొన్ని
నక్షత్రములను కింద బడదోసి తొక్కెను. । మరిన్ని 11
అది సమూహాధిపతి మీదనున్ను అతిశయపడెను; ఆయ
నచేత నిత్యమూ చేయబడె అర్పణ లేకపోయెను;
ఆయన పరిశుద్ధ స్థలము కిందబడెను. । మరిన్ని నిత్య 12
మూ చేసే అర్పణ తప్పిపోయినందున సమూహము
అతనికి దొరికెను; యీలాగున అది సత్యమును కింద
పడదోసి, యింకా మరిన్ని జయము పొందెను. ।
అప్పుడు పరిశుద్ధుడైన వొకడు పలుకుట నేను వింటిని; 13
ఆ పలికిన పరిశుద్ధుని మరి యొక పరిశుద్ధుడు అడిగిన
దేమంటే, నిత్యమూ చేసే అర్పణను గురించిన్ని తప్పి
తమువల్ల ప్రాప్తించిన పాడును గురించిన్ని పరిశుద్ధ స్థల
మున్ను సమూహమున్ను కాళ్లచేత తొక్కబడుటను
గూర్చిన దర్శనము యెన్నాళ్లు మట్టుకు వుండునని
అడిగినప్పుడు, । అతడు నాతో చెప్పినదేమంటే, రెండు 14
వేల మున్నూరు దినముల మట్టుకు యీలాగున వుండును;

అప్పుడు పరిశుద్ధ స్థలము శుచిభూర్ణతమౌనని చెప్పె
15 ను. । అయితే దానియేలునైన నేను యీ దర్శనమును
చూచి దాని తాత్పర్యమును విచారిస్తూ వుండగా, యి
దుగో మనుష్యాకారము గల వొకడు నా ముందర నిలి
16 చేను. । అప్పుడు ఊలాయి నది గట్లలోనుంచి మను
ష్యుని శబ్దము నాకు వినబడి, వో గబ్రీయేలూ, అత
నికి దర్శనముయొక్క తాత్పర్యమును తెలియచేయు
17 మని చెప్పెను. । కాబట్టి అతడు నేను నిలిచిన స్థలము
నకు వచ్చెను; అయితే అతడు రాగానే నేను భయ
పడి సాగిలబడితిని; అయితే అతడు నాతో చెప్పినదే
మంటే, వో నర పుత్రుడా, దీనిని నీవు తెలియ వలెను;
యేమంటే కాలాంతమందు యీ దర్శనము నెరవేరు
18 నని చెప్పెను. । అయితే అతడు నాతో చెప్పుతూ వుం
డగా, నేను సాగిలబడి పరవశుడనైతిని; కాబట్టి అత
డు నన్ను ముట్టి లేపి నిలువబెట్టి నాతో చెప్పినదే
19 మంటే, । వుగ్రముకు అంతము వచ్చినప్పుడు యేమి
సంభవించునో అది నీతో చెప్పుదును; యేమంటే
20 మితి చేసిన కాలమునకు అంతము వచ్చును. । నీకు కను
బడిన రెండు శృంగములు గల గొర్రెపొట్టేలు మాదై
21 రాజున్ను పారసీ రాజున్ను అవును. । సాధు గాని మేక
పోతు యావాను దేశపు రాజై వున్నది; దాని కండ్ల
మధ్య వున్న గొప్ప శృంగము మొకటి రాజై వున్నది. ।
22 అది విరిగిపోయిన తరువాత దానికి మారుగా నాలుగు
శృంగములు లేచెను గనుక ఆ జనాంగములోనుంచి
నాలుగు రాజ్యములు తన శక్తి కంటే తక్కువై లేచు
23 ను. ।అయితే వారి రాజ్యము కడతేరి పోయేటప్పుడున్ను
దోషులు అక్రముముచేత నిండుగా వున్నప్పుడున్ను
క్రూర ముఖము గలిగి లోతు మాటలను తెలిసిన వొక
24 రాజు నిలుచును. । ఆయన శక్తి బలముగా వుండును;
అయితే యీ బలము యితని శక్తివల్ల కాదు; అతడు
అత్యద్భుతముగా లయముచేసి, జయము పొంది, వెళ్లు
తూ, బలము గలవారినిన్ని పరిశుద్ధ జనులనున్ని లయ
25 ము చేసును. । మరిన్ని అతడు కుటిల ప్రజ్ఞ గలవాడు
గనుక కపటము అతని చేతి కింద జయముగా జరుగు
ను; మరిన్ని అతడు తన హృదయమందు గర్వించి, సమా
ధానముగా వుండే చాలామందిని లయము చేసును;
మరిన్ని అతడు అధికారులయొక్క అధికారి పైకి లేచు
ను గాని వొకరిచేత కాకుండా విచ్ఛిత్తయి పోవును. ।
26 చెప్పబడిన వుదయాస్తమానములయొక్క దర్శనము నిజ
మై వున్నది గనుక నీవు దానిని నీ మనస్సు యందు
వుంచుకొమ్ము; యేమంటే దీనికి చాలా దినములు గడవ
27 వలెనని చెప్పెను. । అప్పుడు దానియేలునైన నేను బల
హీనుడనై, కొన్ని దినములు రోగినై వుంటిని; తరువాత
నేను లేచి, రాజు పని చేస్తిని; మరిన్ని యీ దర్శన
మువల్ల నేను విభ్రాంతి పడితిని; అయితే అది యెవని
కిన్ని తెలియక వుండెను.

## 9. అధ్యాయము.

మాదై సంతతి అయిన అహశ్వేరోషు కుమారు 1
డైన దర్యావేషు కల్దీయుల దేశమునకు రాజై వుండె
ను. । ఆయన యేలుబడి మొదటి సంవత్సరమందు దాని 2
యేలునైన నేను గ్రంథములను చదివి, దీర్ఘదర్శి
యైన ఇర్మీయాకు వచ్చిన యెహోవా వాక్యప్రకార
ము ఆయన యెరూశలేమును డెబ్బయి సంవత్సరములు
పాడుచేసునని ఆ సంవత్సరపు లెక్కను తెలుసుకొం
టిని. । కాబట్టి నేను కర్తయైన దేవుని తట్టు ముఖము 3
తిప్పుకొని, బుగ్గి పోసుకొని, గోనె కట్టుకొని, వుప
వాసము చేసి, । ఆయనను ప్రార్థన చేతనున్ను వేడుట 4
చేతనున్ను వెతికితిని; దేవుడైన యెహోవాను నేను
ప్రార్థించి, పాపములను యెరుక చేసి, చెప్పినదేమం
టే, వో యెహోవా, నీవు భయంకరమైన గొప్ప
దేవుడవై వున్నప్పటికిన్ని నిన్ను స్నేహించి, నీ ఆజ్ఞ
లను గైకొని, వారికి యిచ్చిన ప్రమాణ ప్రకారము
చేసి, కృపను అగుపచిర్చన వాడవయి వున్నావు. ।
నీ ఆజ్ఞలనున్ను న్యాయప్రమాణములనున్ను మేము 5
విడిచి, బహు పాపాత్ములమైతిమి; అక్రమమున్ను కాని
క్రియలనున్ను చేసి నీకు వ్యతిరిక్తులమైతిమి. । నీ సేవకు 6
లయిన దీర్ఘదర్శులు నీ నామము చేత మా రాజుల
తోటిన్ని అధిపతులతోటిన్ని పెద్దలతోటిన్ని దేశపు
జనులందరితోటిన్ని చెప్పినప్పటికిన్ని వారి మాటలను
మేము ఆలకించక వుంటిమి. । వో కర్తా, నీవు నీతి 7
పరుడవు; అయితే మా ముఖములు చిన్నబోయెను;
యీ దినమందైనట్టు యూదా వారికిన్ని యెరూశలేము
కాపురస్తులకున్ను వారు నీ విషయమై చేసిన అక్రమ
ముల నిమిత్తము నీవు వారిని యే యే దేశముల కడకు
చేదర చేస్తివో అక్కడ సమీపముగానైనా దూరము
గానైనా వున్న ఇశ్రాయేలీయులందరికిన్ని వాడిన ము
ఖములు కలిగియున్నవి; వో కర్తా, మేము నీ విష
యమై పాపము చేస్తిమి గనుక, । మాకున్ను మా రాజు 8
లకున్ను మా అధిపతులకున్ను పెద్దలకున్ను వాడిన ము
ఖములు కలిగి వున్నవి. । మేము నీకు వ్యతిరిక్తముగా 9
ప్రవర్తించినప్పటికిన్ని కర్తయైన మా దేవుడు కృప
చేస్తున్న క్షమిస్తున్న వున్నాడు. । మరిన్ని మా దేవు 10
డైన యెహోవా శబ్దమును మేము ఆలకించి, ఆయన
సేవకులైన దీర్ఘదర్శులచేత ఆయన మా ముందర
పెట్టించిన న్యాయ ప్రమాణముల యందు నడవ లేదు. ।
నిజముగా ఇశ్రాయేలీయులందరున్ను నీ న్యాయ ప్ర 11
మాణమును అతిక్రమించి, నీ శబ్దమును వినక దూర

ముకు పోయిరి; యీలాగున మేము నీ విషయమై పా
పము చేస్తిమి గనుక దేవుని సేవకుడైన మోషే న్యాయ
ప్రమాణమందు వ్రాసిన ప్రమాణమున్ను శాపమున్ను
12 మా మీద కుమ్మరించబడెను। ఆయన మన మీదికి
యింత కీడును రప్పించి, మనల గురించిన్ని మన న్యా
యాధిపతులను గురించిన్ని ఆయన చెప్పిన మాటను
రూఢపర్చెను; యేమంటే యెరూశలేముకు చేసిన లా
గున ఆకాశమంతటి కింద వున్న యే స్థలమునకైనా
13 చేయలేదు। మోషే న్యాయ ప్రమాణమందు వ్రాసిన
ప్రకారము యీ కీడంతా మన మీదికి వచ్చెను; అయి
నప్పటికిన్ని మనము మన అక్రములను విడువక,
ఆయన సత్యమును గ్రహించేటట్టు మన దేవుడయిన
14 యెహోవాను ప్రార్థించ లేదు। కాబట్టి యెహో
వా యీ కీడును చేయ దలచి మన మీదికి రప్పించెను;
మన దేవుడైన యెహోవా తాను చేసిన కార్యముల
న్నిటి యందూ నీతి పరుడై వున్నాడు; యేమంటే
15 మనము ఆయన శబ్దమును ఆలకించ లేము। అయితే
మా దేవుడవైన వో యెహోవా, మిస్రయీము దేశ
ములోనుంచి నీవు నీ జనులను ఘనమైన హస్తము చేత
యివతలకు తెప్పించి, నేటి వరకైనట్టు గొప్ప ప్రఖ్యా
తిని బొందితివి; మేము పాపము చేసి దుర్మార్గులమైతిమి।
16 వో యెహోవా, నీ నీతి న్యాయములన్నిటి ప్రకా
రము దయచేసి, నీ కోపమున్ను నీ రౌద్రమున్ను
యెరూశలేమనే నీ పట్టణమునుంచిన్ని నీ పరిశుద్ధమైన
పర్వతమునుంచిన్ని తిరిగి పో చేయుము; యేమంటే
మా పాపమువల్లనున్ను మా పితృల పాలమువల్లనున్ను
యెరూశలేముతో కూడా నీ జనులమైన మేము మా
చుట్టూ వున్న వారందరి చేత అవమానము పొందుతూ
17 వున్నాము। కాబట్టి వో మా దేవుడా, నీ సేవకుడ
నైన నా ప్రార్థనలనున్ను వేడుటలనున్ను ఆలకించి,
కర్తయొక్క నామ విషయమై పాడయి పోయిన నీ
పరిశుద్ధ స్థలము మీద నీ ముఖమును ప్రకాశింప
18 చేయుము। వో నా దేవుడా, నీ చెవియొగ్గి ఆలకిం
చుము; నీ నేత్రములను తెరచి, మాకు ప్రాప్తించిన
వుపద్రవములనున్ను నీ నామము చేత పిలువబడిన పట్ట
ణమునున్ను చూడుము; యేమంటే మా నీతి న్యాయ
ముల విషయమై కాదు నీ విస్తారమైన కృప విషయమై
19 మా వేడుటలను నీకు చెల్లిస్తున్నాము। వో కర్తా, విను
ము; వో కర్తా, క్షమించుము; వో కర్తా, నీవు
ఆలకించి, నీ నామ విషయమై ఆలస్యము లేకుండా
దయచేయుము; వో నా దేవుడా, నీ పట్టణము కొర
కున్ను నీ నామము చేత పిలువబడిన నీ జనుల కొర
20 కున్ను దయచేయుమని వేడుకొంటిని। అయితే నేను
చెప్పుకొంటూ, ప్రార్థిస్తూ, నా పాపమున్ను

ఇశ్రాయేలనే నా జనుల పాపమున్ను యెరుకచేస్తూ
వుండగానున్ను, నా దేవుని పరిశుద్ధ పర్వతము కొరకు
నా వేడుటలను నా దేవుడైన యెహోవా సముఖ
మందు చెల్లిస్తూ వుండగానున్ను, । నిజముగా ప్రార్థన 21
చేసి చెప్పుతూ వుండగా, పూర్వము దర్శనమందు
నాకు అగుపడిన ఆ పురుషుడైన గబ్రీయేలు దబ్బున
యెగిరి వచ్చి, అస్తమానార్పణ చెల్లించే వేళ యందు
నన్ను ముట్టి, । నాతో మాట్లాడి తెలియచెప్పినదేమం 22
టే, వో దానియేలూ, దాని తాత్పర్యమును నీకు తెలి
య చెప్పుటకు యిప్పుడు నేను బైలువెళ్లి వస్తిని। నీవు 23
వేడుకొనుటకు ఆరంభించినప్పుడు ఆజ్ఞ బయిలు వచ్చి
నందున నేను దానిని నీకు చూపించుటకు వస్తిని; యే
మంటే నీవు బహు ప్రియమైన వాడవు; కాబట్టి ఆ
సంగతి విచారించుకొని ఆ దర్శనమును తెలుసుకో
ము। నీ జనుల మీదనున్ను నీ పరిశుద్ధ పట్టణము మీ 24
దనున్ను అక్రమమును కడతేర్చుటకున్ను పాపము
లను అణపుటకున్ను దోషమును శాంతపర్చుటకున్ను
నిత్యమైన నీతిని ప్రవేశింప చేసుటకున్ను దర్శనము
నున్ను భవిష్యత్తునున్ను ముద్రించుటకున్ను పరిశుద్ధ
వంతుని అభిషేకించుటకున్ను డెబ్బయి వారములు
నిర్ణయించబడినవి। యిందుకు నీవు గ్రహించి తెలి 25
యవలసినదేమంటే, జనులను మళ్లించుటకున్ను యెరూ
శలేమును తిరిగీ కట్టించుటకున్ను ఆజ్ఞ బైలు వచ్చిన
ప్పటినుంచి శ్రేష్ఠుడైన మెస్సీయా వచ్చే పర్యంతమూ
యేడు వారములున్ను అరువై రెండు వారములున్ను
గడుచును; శ్రమ కాలములలోనే వీధిన్ని గోడయున్ను
తిరిగీ కట్టించబడును। అరువై రెండు వారములైన తరు 26
వాత మెస్సీయా కొట్టివేయబడును; అయితే తన కోస
ము కాదు; అప్పుడు భూపతియొక్క జనులు వచ్చి,
పట్టణమునున్ను పరిశుద్ధ స్థలమునున్ను లయము చేతురు;
దానికి జలప్రళయముతోటి అంతము సంభవించును;
మరిన్ని ఆ యుద్ధము కడతేరే పర్యంతమూ వుపద్రవ
ములు నిర్ణయించబడెను। మరిన్ని అతడు వొక వారము 27
దాకా అనేకులకు ప్రమాణమును రూఢపర్చును;
అయితే ఆ వారము మధ్యను అతడు బలిన్ని అర్ప
ణనున్ను లేకుండా చేసును; మరిన్ని యిదంతా సమాప్త
మయ్యే పర్యంతమూ ఆ అసహ్యమైనది అంతటా వ్యా
పించేటట్టు వుపద్రవములు కలుగచేసును; మరిన్ని నిర్ణ
యమైన వుపద్రవము దాని మీద కుమ్మరించబడునని
చెప్పెను.

## 10. అధ్యాయము.

సారసీ రాజైన కోరేషు యేలుబడి మూడో సంవ 1
త్సరమందు బేల్తెషస్సరని పిలువబడిన దానియేలుకు

ఒక దర్శనమాయెను; అది నిజమైనప్పటికిన్ని దాని
నిర్ణయ కాలము దూరముగా వుండెను; అతడు ఆ
దర్శనమును గ్రహించి దాని తాత్పర్యమును తెలుసు
2 కొనెను. । ఆ దినములలో దానియేలునైన నేను మూడు
3 నిండైన వారములు దుఃఖిస్తూ, । రుచిగల భోజనమును
తినక వుంటిని; మాంసమైనా ద్రాక్షారసమైనా నా
నోట బడలేదు; మూడు నిండైన వారముల మట్టుకు
4 తైలము పూసుకొన లేదు. । అయితే మొదటి నెల యి
రువై నాలుగో దినమున నేను హిద్దెకెలు అనే గొప్ప
5 నదీ ప్రాంతమందు నిలిచి వుంటిని. । అప్పుడు నేను
నా కండ్లు తెరిచి చూడగానే, యిదుగో నారబట్ట
కట్టుకొనిన ఒక మనుష్యుడు నాకు కనుబడెను; ఆయన
మొలకు ఊఫాజుయొక్క బంగారపు మొలతాడు కలిగి
6 వుండెను. । ఆయన శరీరము గరుడపచ్చ రాతి రంగు
వంటిదై వుండెను; ఆయన ముఖము మెరుపు లాగున
నున్ను ఆయన నేత్రములు వెలిగే దీపముల లాగునను
న్ను వుండెను; ఆయన చేతులున్ను కాళ్లున్ను కగ్గించిన
యిత్తడి వలెనే వున్నవి; ఆయన నోటి శబ్దము సమూ
7 హముయొక్క శబ్దము వలె వుండెను. । యీ దర్శనము
దానియేలునైన నాకు మాత్రమే కనుబడెను; నాతోటి
వున్న వారికి యీ దర్శనము అగుపడలేదు; అయితే
భయము వారికి బహుగా కలిగినందున వారు దాగి
8 వుండుటకు పరుగెత్తి పోయిరి. । కాబట్టి నేను వంటరి
గానే వుండి, యీ గొప్ప దర్శనమును చూస్తిని; చూ
డగా నాలో శక్తి తప్పిపోయెను; నా ముఖకాంతి
పోయి మరణ లక్షణము వచ్చినందున నాకు శక్తి యెంత
9 మాత్రమూ లేక పోయెను. । అయినప్పటికిన్ని ఆయన
మాటల శబ్దమును వింటిని; అయితే వినినప్పుడు నేను
10 సాగిలబడి పరవశుడనైతిని. । అప్పుడు ఒకని చెయ్యి
నన్ను ముట్టి, నా మోకాళ్లతోనున్ను అరిచేతులతోను
11 న్ను నన్ను లేవ చేసెను. । అప్పుడు ఆయన నాతో
చెప్పినదేమంటే, మిక్కిలీ ప్రియ మనుష్యుడవైన ఓ
దానియేలూ, నీవు తిన్నగా నిలిచి, నేను నీతో చెప్పే
మాటలను విని తెలుసుకొనుము; యేమంటే, నేను యి
ప్పుడే నీయొద్దికి పంపబడితినని చెప్పినందున నేను
12 వణుకుతూ నిలువబడితిని. । అప్పుడు ఆయన నాతో
చెప్పినదేమంటే, ఓ దానియేలూ, భయపడ వద్దు;
యేమంటే దీనిని తెలుసుకొనుటకు నీవు నీ హృదయ
మును దిట్టము చేసుకొని, నీ దేవుని సముఖమందు దీన
వృత్తిగా వున్న నాటి యందే నీ మనవులు అంగీకరించ
బడినవి; కాబట్టి నీ మనవుల కొరకై నేను వస్తిని. ।
13 అయితే పారసీ దేశాధిపతి నేను రాకుండా యిరువై
ఒక దినములు నన్ను ఆతంక పరిచెను; యిదుగో నాకు
సహాయము చేసుటకు ప్రధానాధిపతులలో మిఖాయే
లు అనే ఒకడు వచ్చెను; అప్పుడు నేను పారసీ రా
జుల యొద్ద వుంటిని. । అయితే అప్పుడు కడదినముల 14
లో నీ జనులకు యేమి సంభవించునో అది నీతో
తెలియ చెప్పుటకు వస్తిని; యేమంటే దర్శనమునకు
యింకా చాలా దినములు పట్టునని చెప్పెను. । అయితే 15
యీలాటి మాటలు ఆయన నాతో చెప్పినప్పుడు నేను
ముఖము వంచుకొని మూగివలె నిలువబడితిని. । అప్పు 16
డు యిదుగో మనుష్య పుత్రులలో ఒకని వంటి
వాడు నా పెదవులను ముట్టినందున నేను నోరు తెరిచి,
నా ముందట నిలిచిన అతనితో చెప్పినదేమంటే, ఓ
నా కర్తా, యీ దర్శనమువల్ల నా పైని దుఃఖములు
ప్రసరించినందున నాకు శక్తి యెంత మాత్రమూ లేదు. ।
నీ సేవకుడనైన నేను నా కర్తవైన నీతో యేలాగు 17
మాట్లాడుదును? యేమంటే వెంటనే నాలో శక్తి తప్పి
పోయెను; శ్వాసము నాలో యెంత మాత్రమూ
లేదని నేను చెప్పగానే, । మనుష్యాకారము గల వాడు 18
తిరిగీ వచ్చి నన్ను ముట్టి, బలపరచి, చెప్పినదేమంటే, ।
ఓ ప్రియమైన మనుష్యుడా, నీకు క్షేమము కలుగును 19
గాక; ధైర్యము తెచ్చుకొని, దృఢముగా వుండుమని
ఆయన నాతో చెప్పినందున, నేను శక్తి తెచ్చుకొని,
నా కర్తవైన నీవు చెప్పుము అని అంటిని; యేమంటే
నీవు నాకు శక్తి కలుగచేస్తివని నేను అనినప్పుడు, ।
ఆయన నాతో చెప్పినదేమంటే, నీ యొద్దికి నేను వచ్చిన 20
హేతువు నీకు తెలుసునా? అయితే యిప్పుడు తిరిగీ
వెళ్లి, పారసీ దేశాధిపతి మీద యుద్ధము చేతును;
మరిన్ని నేను బైలు వెళ్లిన తరువాత యిదుగో యావాను
దేశాధిపతి వచ్చును. । సత్యవేదమందు లక్షణ యుక్త 21
ముగా వ్రాయబడిన వాటిని నీకు తెలియ చెప్పుదును;
అయితే వీటిని గురించి నాతో దిట్టముగా నిలిచేవాడు
మిఖాయేలు అనే నీ అధికారి గాక మరి యెవ్వడూ
లేడు.

## 11. అధ్యాయము.

మాదీయుడైన దర్యావేషు యేలుబడి మొదటి 1
సంవత్సరమందు నేను అతని దృఢపర్చుటకున్ను బలప
ర్చుటకున్ను నిలిచితిని. । అయితే నేను యిప్పుడు నీకు 2
సత్యమును తెలియ చెప్పుదును; యింకా పారసీ రాజ్య
మందు ముగ్గురు రాజులు లేతురు; నాలుగో వాడు కొ
దువ వారందరికంటే మిక్కిలీ భాగ్యవంతుడై వుండును;
మరిన్ని అతని ఐశ్వర్యములచేత అతడు మహా బల
ముగా వుండి, తన దేశమంతటినీ యావాను దేశము మీద
లేపించును. । తరువాత బహు బలముగల రాజు లేచును; 3
అతడు గొప్ప అధికారముచేత యేలి, తన యిష్టప్రకా
రము చేసును. । అయితే అతడు నిలిచి వున్నప్పుడే 4

అతని రాజ్యము విచ్ఛిత్తయిపోయి, ఆకాశము కింద
వుండే నాలుగు దిక్కులున్ను అతని సంతతికి కాకుండా
నున్ను అతడు అధికారము చేసిన అధికారప్రకారము
కాకుండానున్ను పాళ్లు పెట్టబడును; యేమంటే అతని
రాజ్యము పెల్లగించపడి వీరికి గాక అన్యులకు వచ్చును.।
5 అతని కింద వున్న అధిపతులలో దక్షిణ దేశపు రాజైన
వొకడు బలముగా వుండును; అయితే అతని కంటే మరి
వొకడు బలముగా వుండి, అధికారము చేసును; అతని
6 అధికారము ఘనాధికారమై వుండును.। అయితే కొన్ని
సంవత్సరములైన తరువాత వారు కలుసుకొందురు; యే
మంటే దక్షిణ దేశపు రాజు కుమార్తె వుభయులను
సమాధానపర్చుటకు వుత్తర దేశపు రాజు యొద్దికి
వచ్చును; అయితే యిందులో బలమైన హస్తము ఆమెకు
లేక పోవును; అతడైనా అతని హస్తమైనా నిలువలేక
పోవును; యేమంటే ఆమెయున్ను ఆమెను తీసుకొ
వచ్చిన వారున్ను ఆమెను కన్నవారున్ను ఆ కాలమందు
ఆమెను దృఢపర్చిన వారున్ను అప్పగించ బడుదురు.।
7 అయితే ఆమె మూలమువల్ల మొలిచిన జంట అయిన
వొకడు అతనికి మారుగా లేచి, సైన్యముతోటి వచ్చి,
వుత్తర దేశపు రాజు కోటలోకి చొరబడి, వారి మీద
8 యుద్ధము చేసి, జయము పొంది,। వారి దేవుండ్లనున్ను
అధిపతులనున్ను వారి ప్రియమైన బంగారపు పాత్రల
నున్ను వెండి పాత్రలనున్ను పట్టుకొని, మిస్రయీము
దేశములోకి చెర తీసుకొ పోవును; యితడు వుత్తర
దేశపు రాజు కంటే చాలా సంవత్సరములు వుండును.।
9 ఆలాగున దక్షిణ దేశపు రాజు అతని రాజ్యములోకి
10 వెళ్లి, తన స్వదేశమునకు తిరిగీ వచ్చును.। అయితే అతని
కుమారులు శౌర్యము తెచ్చుకొని, బహు సమూహము
లైన బలమును కూర్చుకొందురు; వొకడు వేగముగా
వచ్చి జలప్రళయము వలె దేశములోనుంచి గడిచిపో
వును; అయితే యితడు తిరిగీ వచ్చి, యితని బలమైన
11 కోట మీదనున్ను యుద్ధము చేసును.। అప్పుడు దక్షిణ
దేశపు రాజు బహు కోపము తెచ్చుకొని, వుత్తర దేశపు
రాజుతో పోట్లాడుటకు బైలువెళ్లును; అప్పుడు అతని
సమూహము బహు బలమైనదైనప్పటికిన్ని అది యిత
12 నికి దొరకబడును.। తన చేత ఆ సమూహము హతమై
నందున అతని హృదయము గర్వించును; అతడు చాలా
వేలమందిని కూలచేసినప్పటికిన్ని అతనికి శక్తి లేక పో
13 వును.। యేమంటే వుత్తర దేశపు రాజు మునుపటి సమూ
హము కంటే గొప్ప సమూహమును కూర్చుకొని, తిరిగీ
వచ్చును; నిజముగా కొన్ని సంవత్సరములైన తరువాత
అతడు బహు సైన్యముతోటిన్ని బహు భాగ్యముతో
14 టిన్ని వచ్చును.। మరిన్ని ఆ కాలమందు అనేకులు
దక్షిణ దేశపు రాజు మీదికి లేతురు; మరిన్ని నీ జను
లను దోచుకొన్నవారు దర్శనమును రూఢపర్చుటకు
అతిశయింతురు గాని వారు కింద పడిపోదురు.। అయితే 15
వుత్తర దేశపు రాజు ఆలాగున వచ్చి దిబ్బలను వేసి, ప్రా
కారములు గల పట్టణములను పట్టును; దక్షిణ దేశపు
ఆయుధస్థులున్ను అతడు యేంచిన వారున్ను యెదు
రుగా నిలువలేక పోదురు; నిలుచుటకు శక్తి యెంత మా
త్రమూ లేకపోవును.। యేమంటే యితని మీదికి వచ్చిన 16
వాడు తన మనస్సు వచ్చినట్టు చేసును; అతని ముం
దట నిలువ గలవాడు వొకడున్ను లేకపోవును; మరిన్ని
అతడు ఘనమైన దేశమందు నిలుచును; అతనిచేత అది
నాశనమవును.। మరిన్ని అతడు తన రాజ్య బలమంత 17
టిచేత ప్రవేశించేటట్టు తన ముఖమును దిట్టపర్చుకొని,
న్యాయమైన మాటలతోటి వచ్చును; వాటి ప్రకారము
యితడు చేసినప్పటికిన్ని యితడు స్త్రీల కుమార్తెలకు
చెడు బోధచేసే దానిని అతనికి యిచ్చును; అయితే
ఆమె అతని పక్షము కాక అతని కొరకై సహాయము
చేయక పోవును.। అప్పుడు అతడు తన ముఖమును 18
ద్వీపముల తట్టు తిప్పుకొని, వాటిలో కొన్నిటిని పట్టు
కొనును; అయితే అధిపతి అయిన వొకడు వచ్చి, తన
మీద అతడు పెట్టిన అవమానమును తీసివేసుట మా
త్రను కాక అతని మీదికి తిరిగీ రాచేసును.। అప్పుడు 19
అతడు తన దేశపు కోట తట్టు ముఖమును తిప్పుకొ
నును గాని అతడు అభ్యంతరము పొంది కిందపడి అగు
పడక పోవును.। అతనికి మారుగా మరివొకడు లేచి, 20
ఘనమైన రాజ్యము నిమిత్తము పన్ను పుచ్చుకొనే వా
డవును; అయితే కొన్ని దినములైన తరువాత అతడు
కోపము చేతనైనా యుద్ధము చేతనైనా కాక, లయమ
వును.। యితనికి మారుగా నీచుడైన వొకడు లేచును; 21
యితనికి వారు ఘనమైన రాజ్యమును యివ్వకపోదురు;
అయితే అతడు చల్లగానే ప్రవేశించి యిచ్చకపు యం
త్రములచేత రాజ్యమును పొందును.। యితని ముందట 22
జలప్రళయము వలె వచ్చిన బలములు మునిగిపోవును;
యీ బలములతో కూడా ప్రమాణమును చేసిన అధి
కారిన్ని విచ్ఛిత్తయిపోవును.। యేమంటే యితనితో 23
అతడు ప్రమాణము చేసిన తరువాత కపటముచేసి, కొద్ది
జనులతోటి యెక్కి వచ్చి, బలముగా వుండును.। యీ 24
లాగున అతడు ఆ దేశముయొక్క మదించిన స్థలము
లోకి చల్లగా ప్రవేశించి, తన పితృలున్ను తన పితా
మహులున్ను చేయలేని వాటిని చేసును; జనులలో
అతడు తనకు దొరికిన సొమ్మున్ను దోపుడు పదార్థ
ములున్ను ద్రవ్యమునున్ను పారజల్లును; మరిన్ని యి
తడు గట్టి స్థలమును పట్టుటకు ఆలోచన చేసుకొనును;
యీలాగున కొంత కాలము మట్టుకు వుండును.। మరి 25
న్ని అతడు తనలో శక్తినిన్ని ధైర్యమునున్ను పుట్టించు

కొని, గొప్ప సైన్యముతోటి దక్షిణ దేశపు రాజా మీ
దికి వచ్చును; కాబట్టి దక్షిణ దేశపు రాజు బలముగా
వుండి, గొప్ప సైన్యమును కూర్చుకొని యుద్ధమునకు
తలపడును; అయితే అతని మీద కపటపు యోజన
లను యోజించినందున అతడు నిలువలేక పోవును.।
26 నిజముగా యితని అన్నము తింటూ వున్నవారే యితని
మోసపుత్తురు; కాబట్టి అతని సైన్యము జలప్రళయ
మువలె వచ్చినందున చాలా మంది హతమై కూలుదురు.।
27 అప్పుడు యీ యిద్దరు రాజుల హృదయములు మోస
పుచ్చుట యందు తిరుగులాడును; వొక బల్లయొద్ద కూ
ర్చుని కపట వాక్యములు పలుకుదురు; అయితే యిం
దువల్ల క్రియ యెంత మాత్రమూ లేక పోవును; యే
మంటే యింకా కొంత కాలమునకు అంతము వచ్చును.।
28 అప్పుడు మిక్కిలీ ఐశ్వర్యముతోటి తన దేశములోకి
తిరిగీ వచ్చును; అప్పుడు అతని మనస్సు పరిశుద్ధమైన
ప్రమాణ నిర్ణయమునకు విరోధమైనందున అతడు వచ్చి,
తన యిష్టప్రకారముచేసి, తిరిగీ తన దేశములోకి వచ్చు
29 ను.। మరిన్ని నిర్ణయమైన కాలమందు అతడు తిరిగీ
దక్షిణదిక్కుకు వచ్చును; అయితే అది ముందటి లాగున
30 నున్ను వెనుకటి లాగుననున్ను లేకపోవును.। యేమంటే
కిత్తీమునుంచి వోడలు అతనికి విరోధముగా వచ్చును;
కాబట్టి అతడు నొచ్చుకొని, తిరిగీ వచ్చి, పరిశుద్ధ ప్ర
మాణ నిర్ణయమును గురించి కోపపడి, ఆ ప్రకార
ము చేసును; యేమంటే అతడు పరిశుద్ధ ప్రమాణ నిర్ణ
యమును విడిచిన వారిని తెలియనడిగి తిరిగీ వచ్చును.।
31 మరిన్ని బలహస్తములు అతని పక్షమై నిలిచినందున
వారు గట్టిదైన పరిశుద్ధ స్థలమును అపవిత్రపరచి, నిత్య
మైన అర్పణను తీసివేసి, దానికి బదులుగా పాడుచేసే
32 యేహ్యమైన దానిని వుంతురు.। మరిన్ని ప్రమాణ నిర్ణ
యమును గురించి తప్పితము చేసిన వారిని అతడు కపట
స్తోత్రములచేత మోసపుచ్చును; అయితే తమ దేవుని
యెరిగిన జనులు బలిమి గలవారై వింతలు జరిగింతురు.।
33 జనులలో తెలిసిన వారు చాలా మందికి నేర్పుదురు;
అయితే కొన్ని దినములలో వారు కత్తిచేతనున్ను అగ్ని
చేతనున్ను బంధకముచేతనున్ను దోపుడుచేతనున్ను కూ
34 లుదురు.। వారు కూలిన తరువాత మిగిలిన వారికి కొద్ది
గా సహాయము కలుగును; అప్పుడు చాలామంది కపట
35 స్తోత్రములచేతను వారిని కలుసుకొందురు.। అయితే
వారికి కళయున్ను పవిత్రతయున్ను ధావళ్యమున్ను
కలిగేటట్టు తెలిసిన వారిలో కొందరు కూలుదురు;
యీలాగున కాలాంతము మట్టుకు వుండును; యేమం
36 టే దీనికి యింకా కాలము నిర్ణయమై వున్నది.। ఆ
రాజు తన యిష్టము వచ్చినట్టు చేసును; తన్ను తాను
సమస్తమైన దేవుండ్లకంటే అతిశయముగానున్ను ఘన
ముగానున్ను చేసుకొని, దేవాది దేవుని ఆశ్చర్యముగా
దూషించి, వుగ్రము తీరే పర్యంతము జయముగా వుం
డును; యిది రూఢముగా నిర్ణయమై సంభవించును.।
మరిన్ని అతడు తన పితృల దేవునైనా ఆశచేతను స్త్రీల 37
నైనా లక్ష్యపెట్టక వుండును; యే దేవునైనా లక్ష్య
పెట్టక వుండును; యేమంటే అతడు సమస్తముకంటే
తన్ను తాను గొప్ప చేసుకొనును.। ఆ దేవునికి మారు 38
గా అతడు మాజీముయొక్క దేవుని ఘనపర్చును;
అతని పితృలు యెరుగని దేవుని బంగారము చేతనున్ను
వెండిచేతనున్ను ప్రశస్తమైన రాళ్లచేతనున్ను మనో
హరమైన వస్తువులచేతనున్ను ఘనపర్చును.। యీలా 39
గున అతడు చేసి, మాజీముయందు పక్షమైన వారిని
తాను తెలియ చేసిన యీ వింతయైన దేవునితోను
బహుగా ఘనపర్చి చాలామంది మీద వారిని అధి
కారులుగా చేసి, దేశము లాభము కొరకు పాళ్లు
వేసును.। అయితే కాలాంతమందు దక్షిణ దేశపు రాజు 40
వచ్చి అతని పొడుచును; మరిన్ని వుత్తర దేశపు రాజు
అతని మీదికి రథములతోటిన్ని రౌతులతోటిన్ని చా
లా వోడలతోటిన్ని ప్రళయ వాయువు వలెనే దేశ
ములలోకి వచ్చి, జలప్రళయము వలె గడిచిపోవును.। 41
మరిన్ని అతడు ఘనమైన దేశములోకి వచ్చును; చాలా
దేశములు కూలిపోవును; అయితే ఎదోము దేశమున్ను
మోయాబు దేశమున్ను అమ్మోను పుత్రుల ప్రధాన
స్థలములున్ను అతని చేతిలోనుంచి తప్పించుకొనును.।
యీలాగున అతడు దేశముల మీద తన హస్తము చా 42
పును; మిస్రయీము దేశము తప్పించుకో లేకపోవును.।
బంగారమున్ను వెండిన్ని మిస్రయీములో వున్న 43
ప్రియమైన వస్తువులున్ను అతని వశమవును; లుబ్బీయు
లున్ను కుషీయులున్ను అతని పాదాక్రాంతులవుదురు.।
అయితే తూర్పు దిక్కునుంచిన్ని వుత్తర దిక్కునుంచి 44
న్ని అతడు చింతపొందేటట్టు వర్తమానములు వచ్చినం
దున అతడు లయపర్చుటకున్ను చాలా మందిని సం
పూర్ణముగా నాశనము చేసుటకున్ను బహు రౌద్రము
చేత బైలు వెళ్లి, తన రాచ డేరాలను సముద్రముల
మధ్యను ఘనము గల పరిశుద్ధ పర్వతము మీద పాతిం
చును; అయినప్పటికిన్ని అతనికి అంతము వచ్చును;
అతనికి సహాయము చేసుటకు వొకడున్ను లేకపోవును.

## 12. అధ్యాయము.

ఆ కాలమందు నీ జనుల పుత్రుల కొరకు నిలిచి 1
వుండే ఆ ఘనమైన మిఖాయేలనే అధికారి లేచును;
ఆ కాలము శ్రమ కాలమై వుండును; జనాంగము
పుట్టినప్పటినుంచి ఆ కాలము సమాప్తమయ్యే పర్యం
తమూ అలాటి కాలము యెన్నడూ లేదు; అప్పుడు

నీ జనులలో యెవరెవరి పేళ్లు గ్రంథమందు వ్రాయ
బడి వున్నవో వారందరున్ను విముక్తి పొందుదురు. ।
2 మరిన్ని భూమిలో నిద్రిస్తూ వున్న చాలామంది మేలు
కొందురు; వీరిలో కొందరు నిత్య జీవము పొందుట
కున్ను కొందరు సిగ్గునున్ను అవమానమునున్ను పొందు
3 టకున్ను లేతురు. । జ్ఞానవంతులు ఆకాశమండల ప్రకా
శతతోటి వెలుగుతూ వుందురు; చాలా మందిని నీతికి
తిప్పినవారు నక్షత్రముల లాగున యెన్నటికీ వెలుగు
4 తూ వుందురు. । అయితే వో దానియేలూ, యీ మా
టలను నీవు మరుగు చేసి, కాలాంతము మట్టుకున్ను
యీ గ్రంథమును ముద్రించుము; చాలామంది నలుత
ట్లా సంచరించినందున తెలివి విస్తరించునని చెప్పెను. ।
5 అప్పుడు దానియేలునైన నేను చూస్తూ వుండగా, యి
దుగో యింకా యిద్దరు నాకు అగుపడిరి; వొకడు నది
యివతల గట్టు మీదనున్ను వొకడు నది అవతల గట్టు
6 మీదనున్ను నిలిచి వుండిరి. । అప్పుడు వారిలో వొకడు
నారబట్ట కట్టుకొని, నదీ జలముల పైని వున్న మను
ష్యుని యీ ఆశ్చర్యమైన కార్యములు నెరవేరుటకు
7 యెన్నాళ్లు అవునని అడిగెను. । అప్పుడు నేను వింటూ
వుండగా, నారబట్ట కట్టుకొని నదీ జలముల పైని వున్న
పురుషుడు తన కుడి చేతినిన్ని యెడమ చేతినిన్ని
ఆకాశము పైకి యెత్తి, చిరకాలము మట్టుకు సజీవు
డైనవాని గురించి ప్రమాణము చేసి, చెప్పినదేమంటే,
కాలము కాలములు అర్థకాలము నడిచినప్పుడున్ను
ఆయన పరిశుద్ధ జనుల బలమును చెదర చేసుట చాలిం
చినప్పుడున్ను యివన్నీ సమాప్తమవునని చెప్పెను. ।యీ 8
మాట నాకు వినబడినప్పటికిన్ని తెలియకపోయెను,
గనుక నేను ఆయనను చూచి, వో కర్తా, వీటి అం
తము యేలాగౌనని అడిగినప్పుడు, । ఆయన నాతో 9
చెప్పినదేమంటే, వో దానియేలూ, నీవు నీ మార్గ
మున వెళ్లిపొమ్ము; యేమంటే యీ మాటలు కాలాంత
మయ్యే పర్యంతమూ మరుగు చేయబడి ముద్రించి
వుండును. । చాలామంది శుభ్రముగానున్ను ధావళ్య 10
ముగానున్ను కళగానున్ను వుందురు; అయితే చెడ్డ
వారు చెడ్డతనము చేతురు; దుర్మార్గులకు అది తెలియక
పోయినప్పటికిన్ని జ్ఞానవంతులు దానిని తెలుసుకొం
దురు. । అయితే నిత్యమైన అర్పణను తీసివేసుట మొ 11
దలుకొని పాడు చేసే యేహ్యమైన దానిని వుంచే
పర్యంతమూ వెయ్యిన్ని యిన్నూట తొంభై దినములు
గడుచును. । వెయ్యిన్ని మున్నూట ముప్ఫయి అయిదు 12
దినముల మట్టుకు కనిపెట్టి చేరిన వారు భాగ్యవంతుల
వుదురు. ।అయితే అది అంతమయ్యే పర్యంతమూ నీవు 13
నీ మార్గమున వెళ్లుము; యేమంటే నీవు నిమ్మళించి,
ఆ దినములైన తరువాత నీకు ప్రాప్తించిన స్థితిలో నీవు
నిలుతువని చెప్పెను.

# హోషేయ యొక్క గ్రంథము.

## 1. అధ్యాయము.

1 ఉజ్జీయా, యోతాము, అహాజు, హిజ్కియా, అనే
యూదా రాజుల దినములందున్ను యోవాషు కుమా
రుడైన యారొబాము అనే ఇశ్రాయేలు రాజు దినము
లందున్ను, బెయేరి కుమారుడైన హోషేయకు వచ్చిన
2 యెహోవా వాక్యము. । యెహోవా హోషేయ
తో చెప్పిన మొదటి వాక్యము యేమంటే, నీవు వెళ్లి,
వేశ్యా సంతతియైన దానిని పిల్లలతోటి భార్యగా తీసు
కొనుము; యేమంటే దేశము యెహోవాను విడిచి
3 పెట్టి, బహు జారత్వమును చేసెనని ఆనతిచ్చెను. । కా
బట్టి అతడు వెళ్లి, దిబ్లయీము కుమార్తెయైన గోమే
రును తీసుకొనెను; అది గర్భవతియై, అతనికి కుమా
4 రుని కనెను. । అప్పుడు యెహోవా అతనితో చెప్పి
నదేమంటే, యితనికి ఇజ్రెయేలనే పేరు పెట్టుము;
యేమంటే యిక కొంత కాలమునకు నేను ఇజ్రె
యేలు రక్త దోషము నిమిత్తము యెహూ యింటివారిని
శిక్షింతును; మరిన్ని ఇశ్రాయేలు యింటివారికి రాజ్య
5 ములేక పోజేతును. । మరిన్ని ఆ దినమందు నేను ఇజ్రె
యేలు లోవలో ఇశ్రాయేలు విల్లును విరుతునని అనతి
6 చ్చెను. । అయితే అది తిరిగీ గర్భవతియై కుమార్తెను
కనెను; అప్పుడు ఆయన అతనికి సెలవు యిచ్చినదే
మంటే, దీనికి లోరుహామా అనే పేరు పెట్టుము;
యేమంటే యిక మీదట నేను ఇశ్రాయేలు యింటి
వారి మీద కనికరించక, వారిని బొత్తిగా తీసివేతును.।
7 అయితే యూదా యింటివారి మీద కనికరించి, విల్లు
కత్తి యుద్ధము గుర్రములు రౌతులు మొదలైన వాటి
చేత కాకుండా వారి దేవుడైన యెహోవా చేతనే
8 వారు శిక్షించ బడుదురని ఆనతిచ్చెను. । అయితే లోరు
హామా పాలు విడిచిన తరువాత అది గర్భవతియై
9 కుమారుని కనెను. । అప్పుడు ఆయన అతనికి సెలవు
యిచ్చినదేమంటే, యితనికి లోయమ్మీ అనే పేరు
బెట్టుము; యేమంటే మీరు నా జనులు కారు, నేను
10 మీకు దేవుడను కాను. । అయినప్పటికిన్ని ఇశ్రాయేలు
పుత్రుల లెక్క మితము లేకుండా లెక్క లేని సము
ద్రపు యిసుకంత విస్తారమై వుండును; యేమంటే యే
స్థలమందు మీరు నా జనులు కారన్న మాట వారిని
గురించి చెప్పబడెనో అక్కడ మీరు సజీవులైన
దేవుని కుమాళ్లయి వున్నారన్న మాట వారిని గురించి
చెప్పబడును. । అప్పుడు యూదా పుత్రులున్ను ఇశ్రా 11
యేలు పుత్రులున్ను కూడుకొని, తమ పైని వొక
ప్రధానిని నిర్ణయించుకొని, ఆ దేశములోనుంచి
యివతలకు వత్తురు; యేమంటే ఇజ్రెయేలు దినము
మహా ఘనముగా వుండును.

## 2. అధ్యాయము.

మీ సహోదరులను చూచి అమ్మీ అనిన్ని, మీ 1
సహజలను చూచి రుహామా అనిన్ని చెప్పండి. । మీ 2
తల్లితోటి వాదించండి, వాదించండి; యేమంటే అది
నాకు భార్య కాదు; నేను దానికి పెనిమిటిని కాను;
కాగా నేను దాని బట్టలను విప్పి, పుట్టిన దినమందైన
నట్టు దానిని దిగంబరగా వుంచి, । అరణ్యము వలె 3
చేసి, ఆర్చుకు పోయిన భూమి వలె వుంచి, దప్పికిచేత
దానిని లయపర్చకుండా దాని ముఖమునుంచి జారత్వ
ములున్ను దాని స్తనముల మధ్యనుంచి వేశ్యాత్వము
లున్ను తీసుకో వలెను. । దాని పిల్లల యందు నేను కని 4
కరించను, యేమంటే వారు జార సంతతియై వున్నారు.।
వారి తల్లి వేశ్యాత్వము చేసినది; వారిని కన్నది సిగ్గు 5
లేని పని చేసి, అనుకొనినదేమంటే, నాకు ఆహారము
న్ను నీళ్లున్ను గొర్రె బొచ్చున్ను నారయున్ను తైల
మున్ను పానమున్ను యిచ్చిన నా విటకాండ్లను వెం
టాడుదునని అనుకొనెను. । యిదుగో దాని మార్గ 6
ములను నేను ముండ్ల కంచెతోటి కట్టుదును; దాని
మార్గములు దానికి కనుపడకుండా గోడ కట్టుదును.।
అది తన విటకాండ్లను వెంటాడి దగ్గిరించలేక పోవును; 7
వారిని యెంత వెతికినా వారు దానికి దొరకక వుం
దురు; అప్పుడు అది అనుకొనేది యేమంటే, యిప్పటి
కంటే పూర్వము నా స్థితి బాగా వుండెను; కాబట్టి
నేను తిరిగీ నా మొదటి పెనిమిటి యొద్దికి వెళ్లుదునని
అనుకొనును. । యేమంటే దానికి పంటనున్ను ద్రాక్షా 8
రసమునున్ను తైలమునున్ను విస్తారమైన వెండినిన్ని
బంగారమునున్ను యిచ్చినవాడను నేనే అని విచారిం
చక, వాటిని బయలుకు చెల్లించెను. । కాబట్టి నేను 9
తిరిగీ వచ్చి, నా పంటనున్ను నా ద్రాక్షా రసమును
న్ను వాటి వాటి కాలములలో దీని యొద్దనుంచి తీసి
వేసి, దాని మాన సంరక్షణ కొరకు నేను యిచ్చిన
గొర్రె బొచ్చునున్ను నారనున్ను తిరిగీ పుచ్చుకొందు
ను. । యిప్పుడే నేను దాని విటకాండ్ల దృష్టి యందే 1

దాని కాని క్రియలను బైలుపతుర్చును; నా చేతిలో
నుంచి దానిని విడిపించేవాడు వొకడున్ను లేకపోవును.।
11 మరిన్ని దాని వుత్సవములనున్ను దాని పండుగలనున్ను
దాని అమావాస్యలనున్ను దాని సబ్బాతులనున్ను దాని
12 నిర్ణయమైన పండుగలనున్ను లేకపోచేతును. । నా విట
కాండ్లు నాకు యిచ్చిన కానుకలు అని వేటిని గూర్చి
చెప్పెనో ఆ ద్రాక్ష చెట్లనున్ను అంజూరపు చెట్లను
న్ను నేను లయము చేతును; వాటిని నేను అడవి లాగున
చేసినందున భూ మృగములు వాటిని భక్షించును. ।
13 అది పోగులు మొదలైన ఆభరణములతోటి శృంగారిం
చుకొని బయలీముకు ధూపమిచ్చెను; అయినందున ఆ
దినములను నేను జ్ఞాపకము చేసుకొని దానిని శిక్షిం
తును; ఆలాగున అది దాని విటకాండ్లను వెంటాడి
14 నన్ను మరచెనని యెహోవా ఆనతిచ్చెను. । కాబట్టి
నేను బోధపర్చి, దానిని అరణ్యములోకి కొంచువచ్చి,
అక్కడ దాని హృదయము కరిగేటట్టు మాట్లాడుదును.।
15 అక్కడనుంచి నేను దానికి ద్రాక్ష చెట్లను యిత్తును;
ఆఖోరు లోవ నిరీక్షణ ద్వారమవును; అక్కడ అది
బాల్యము నాటి వలెనున్ను మిస్రయీము దేశములో
నుంచి పైకి వచ్చిన నాటి వలెనున్ను పాడుననిన్ని, ।
16 ఆ దినములో నీవు బయలీ అని కాక ఇషీ అని నన్ను
17 పిలుతువని యెహోవా పలికెను. । బయలీముయొక్క
పేళ్లను నేను దాని నోటినుంచి తీసివేసినందున యిక
18 మీదట ఆ పేళ్లు జ్ఞాపకమునకు రాక పోవును. । మరిన్ని
ఆ దినమందు నేను వారి కొరకై భూ మృగములతో
టిన్ని ఆకాశ పక్షులతోటిన్ని నేల పాకే జంతువుల
తోటిన్ని ప్రమాణముచేసి, విల్లున్ను కత్తిన్ని యుద్ధ
మున్ను భూమిలోనుంచి తీసివేసి, వారిని నిర్భయము
19 గా పరుండచేతును. । అప్పుడు నిన్ను నిత్యమైన ప్రధా
నము చేసుకొందును; నీతి న్యాయములతోటిన్ని దయ
తోటిన్ని కనికరముతోటిన్ని నేను నిన్ను ప్రధానము
20 చేసుకొందును. । నమ్మకముగా నేను నిన్ను ప్రధానము
చేసుకొందును; అప్పుడు నీవు యెహోవాను గుర్తె
21 రుగుదువని చెప్పి, । మరిన్ని యెహోవా ఆనతిచ్చేదే
మంటే, ఆ దినమందు నేను ఆకాశమందు నా శక్తిని
వుంతును; ఆకాశము తనయొక్క శక్తిని భూమికి యి
22 చ్చును. । భూమి ఇజ్రెయేలుకు పంటనున్ను ద్రాక్షా
23 రసమున్ను తైలమునున్ను యిచ్చును. । మరిన్ని నేను
దానిని భూమి యందు నా కొరకు నాటుదును; దయ
పొందనిదానికి దయ కనుపర్చి, నా జనము కాని వారి
తో మీరే నా జనమని చెప్పుదును; వారు నీవే మా
దేవుడవు అని పలుకుదురు.

## 3. అధ్యాయము.

మరిన్ని యెహోవా నాకు సెలవు యిచ్చినదే 1
మంటే, తిరిగీ నీవు వెళ్లి, దాని ప్రియునికి ప్రియురాలై
వున్నప్పటికిన్ని వ్యభిచారిణియైన దానిని స్నేహించు
ము; యితర దేవుండ్లను కనిపెట్టి ద్రాక్షారసపు సిద్దెలను
కోరిన ఇశ్రాయేలు పుత్రుల యందు యెహోవా
తనకు కలిగిన స్నేహముతోటి దానిని స్నేహించుమని
సెలవు యిచ్చెను. । కాబట్టి నేను పదిహేను వెండి తుల 2
ములున్ను హోమెరు అన్ని యవలున్ను అర హోమ
మెరు అన్ని యవలున్ను పట్టుకొవెళ్లి, దానిని కొని,
దానితో చెప్పినదేమంటే, । నీవు చాలా దినములు కని 3
పెట్టి వుండ వలెను; వేశ్యాత్వము చేయ గూడదు; మరి
వొకనికి నీవు వొప్పక వుంటే నేను నీ వాడనై వుందు
నని చెప్పితిని. । యిందుకు ఇశ్రాయేలు పుత్రులు చాలా 4
దినములు రాజు లేకుండానున్ను అధిపతి లేకుండాను
న్ను తెరాఫీము లేకుండానున్ను వుందురు. । తరువాత 5
ఇశ్రాయేలు పుత్రులు తిరిగీ వచ్చి, తమ దేవుడయిన
యెహోవానున్ను తమ రాజైన దావీదునున్ను వెతికి,
అంత్య దినములందు యెహోవా యందున్ను ఆయన
వుత్తమత్వమందున్ను భయభక్తిగా వుందురు.

## 4. అధ్యాయము.

వో ఇశ్రాయేలు పుత్రులారా, యెహోవా 1
వాక్యమును వినండి; యేమంటే దేశమందు విశ్వాస
మున్ను దయయున్ను దేవుని గురించిన తెలివిన్ని లేదు
గనుక యెహోవాకున్ను దేశపు కాపురస్తులకున్ను
వ్యాజ్యము పుట్టెను. । శపించుట అబద్ధమాడుట హత్య 2
చేసుట దొంగిలించుట వ్యభిచరించుట మొదలైన వాటి
చేత వారు తొక్కుకొ వచ్చినందున రక్తమున్ను రక్త
మున్ను కలుసుకొనును. । కాబట్టి యీ దేశము దుఃఖిం 3
చును; దానిలో కాపురస్తులందరున్ను భూమృగముల
తోనున్ను ఆకాశమందుండే పక్షులతోనున్ను సొమ్మ
సిల్లిపోదురు; మరిన్ని సముద్రపు మత్స్యములు తీసి
వేయబడును. । అయినప్పటికిన్ని యెవడైనా మరి వొక 4
నితో జగడమాడి గద్దించ గూడదు, యేమంటే నీ జను
లు అర్చకునితో జగడమాడిరి. । కాబట్టి నీవు పగటి 5
యందు కూలుదువు; నీతో కూడా దీర్ఘదర్శి రాత్రి
కూలును; నీ తల్లిని నేను సర్వనాశనము చేతును. । నా 6
జనులు తెలియని వారు గనుక వృధాగా పోయిరి;
నీవు తెలివిని విడిచితివి గనుక నీవు నాకు అర్చకు
డవు కాకుండా నేను నిన్ను పరిహరింతును; నీ దేవుని
న్యాయ ప్రమాణమును నీవు మరిచితివి గనుక నేను
నీ పిల్లలను మరుతును. । యెంత కలిమి వారికి కలిగెనో 7

అంత అధికముగా నా విషయమై పాపము చేసిరి;
కాబట్టి వారి ఘనత్వమును నేను నీచత్వమునకు మళ్లిం
8 తును. । నా జనుల పాప పరిహారపు బలిని వీరు తిం
దురు గనుక వారు అక్రమము చేస్తే వీరి మనోరథము
9 యీడేరును. । కాబట్టి జనులు యేలాగునో ఆలాగునే
అర్చకులున్ను వుందురు; వారి మార్గముల నిమిత్తము
వారిని శిక్షింతును; వారి చేష్టలప్రకారము వారికి ప్రతి
10 గా యిత్తును. । కాబట్టి వారు భుజింతురు గాని తృప్తి
పొందక పోదురు; వ్యభిచారము చేతురు గాని అభి
వృద్ధిని పొందక పోదురు; యేమంటే వారు యెహో
11 వాను లక్ష్యపెట్టక పోయిరి. । జారత్వము చేతనున్ను
ద్రాక్షా రసముచేతనున్ను కొత్త ద్రాక్షా రసముచేత
12 నున్ను మతి పోవును. । నా జనులు వారి కర్ర ముక్క
లను ఆలోచన అడుగుదురు; వారి కర్రే వారితో తెలి
య చెప్పును; యీలాగున జారత్వపు ఆత్మచేత వారు
13 భ్రమపడి, వారి దేవుని విడిచి వ్యభిచారులైరి. । పర్వ
తముల మీద బలులను చెల్లింతురు; కొండల మీదను
న్ను నీడ మంచిది గనుక ఆల చెట్ల కిందనున్ను లావన
చెట్ల కిందనున్ను యీల చెట్ల కిందనున్ను ధూపము
అర్పింతురు; కాబట్టి మీ కుమార్తెలు వేశ్యాత్వము
14 చేతురు; మీ భార్యలు వ్యభిచారిణులవుదురు. । మీ
కుమార్తెలున్ను మీ భార్యలున్ను వేశ్యాత్వము చేసి
నప్పటికిన్ని నా వల్ల వారికి శిక్ష రాకపోవును; యేమం
టే వారే వ్యభిచారులతోటి పోయిరి; వేశ్యలతో కలు
సుకొని బలి చెల్లింతురు; కాబట్టి తెలియని యీ జనులు
15 కూలుదురు. । అయితే ఇశ్రాయేలూ, నీవు వేశ్యాత్వ
ము చేసినప్పటికిన్ని యూదాను పాపము చేయనియ్య
కుము; గిల్గాలుకు రావద్దు; బేతావెనుకు యెక్కిపోకండి;
యెహోవా సజీవుడై వున్నాడన్నట్టు ప్రమాణము
16 చేయకండి. । యేమంటే ఇశ్రాయేలు వెనుక జారే పడ్డ
వలెనే వెనుక జారెను; యిప్పుడు యెహోవా వారిని
విశాల స్థలమందున్న గొర్రె పిల్లలాగున మేపించును. ।
17 ఎఫ్రయీము విగ్రహములతో కలుసుకొనెను; అతని
18 జోలికి వెళ్లవద్దు. । వారి పానపు వాసన చెడిపోయెను;
మానక జారత్వము చేసిరి; దాని అధికారులు సిగ్గులేక
19 కానుకలు యివ్వకోరిరి. । వాయువు తన రెక్కలను
దానిని కట్టుచేసెను; అయినందున వారు చెల్లించిన
బలులవల్ల వారికి సిగ్గు కలుగును.

## 5. అధ్యాయము.

1 ఓ అర్చకులారా, ఓ ఇశ్రాయేలు యింటి
వారలారా, రాజు యింటి వారలారా, చెవి యొగ్గి ఆల
కించండి; యేమంటే మీరు మిస్పాకొండ మీద వుర
లుగానున్ను తాబోరు కొండ మీద వలలుగానున్ను
వుంటిరి గనుక మీకు ఆజ్ఞ వస్తూ వున్నది. । తిరుగు 2
బాటు చేసిన వారు హతము చేసుటకున్ను స్థిరులై
వుండిరి; కాబట్టి వారందరినిన్ని నేను గద్దింతును. ।
ఎఫ్రయీమును నేను యెరుగుదును; ఇశ్రాయేలు నాకు 3
మరుగైన వాడు కాడు యేమంటే ఓ ఎఫ్రయీమా,
నీవు జారుడవై వుంటివి; ఇశ్రాయేలు అపవిత్రుడా
యెను. । వారు దేవుని తట్టు తిరిగి వచ్చేటట్టు తమ నడ 4
తలను చక్కగా జరపలేదు; యేమంటే వారిలో జార
గుణము గల ఆత్మ కలిగినందున యెహోవాను యెరు
గరైరి. । ఇశ్రాయేలు గర్వము అతని ముఖమందే సా 5
క్ష్యము పలుకుతూ వున్నది; కాబట్టి ఇశ్రాయేలీయు
లున్ను ఎఫ్రయీము వారున్ను తమ దోషమువల్ల కూ
లుదురు; వారితో కూడా యూదా వారున్న కూలు
దురు. । వారు గొర్రెలనున్ను యెడ్లనున్ను తీసుకొని 6
యెహోవాను వెతుకుటకు వెళ్లుదురు; అయితే ఆయన
వారిని విడిచినందున ఆయన వారికి కనుబడక వుండును. ।
యెహోవాకు వారు అవిశ్వాసులైరి; వారు అన్యులైన 7
పిల్లలను కనిరి; యింకొక నెల అయిన తరువాత వారు
వారి భాగములతో కూడా లయమవుదురు. । గిబాలో 8
బాకా నాదము చేయండి; రామాలోనున్ను బూర
వూదండి; బెన్యామీనుకు వినబడేటట్టు బేతావెనులో
బొబ్బ పెట్టండి. । శిక్షా దినమందు ఎఫ్రయీము పాడై 9
పోవును; యేది సంభవించునో దానిని నేను ఇశ్రా
యేలు గోత్రికులకు తెలియచేస్తిని. । యూదా అధిప 10
తులు సరిహద్దులను తీసివేసిరి; కాబట్టి నేను వారి
మీద నా ఉగ్రమును నీళ్లు కుమ్మరించినట్టు కుమ్మరిం
తును. । ఎఫ్రయీముకు అధికావస్థ కలుగును; ఆ ఆజ్ఞ 11
చొప్పున నడుచుటకు అతనికి మనస్సు కలిగి వుండెను
గనుక, । న్యాయపు తీర్పు యందు అతడు విచ్ఛిత్తయి 12
పోవును; నేను ఎఫ్రయీముకు చిమ్మట పురుగు లాగు
నున్ను యూదా యింటి వారికి మృత్యువు లాగునున్ను
వుందును. । ఎఫ్రయీము రోగి యయినప్పుడున్ను యూ 13
దాకు గాయము కలిగినప్పుడున్ను ఎఫ్రయీము అ
ష్షూరు వాని యొద్దికి వెళ్లి, రాజైన యారేబును పిలు
చుకొనెను; అయితే నిన్ను స్వస్థపర్చుటకున్ను నీ గా
యమును బాగుచేసుటకున్ను అతనివల్ల కాకపోయెను. ।
అయినందున నేను ఎఫ్రయీముకు సింహము లాగున్ను 14
యూదా యింటి వారికి కొదమ సింహము లాగున్ను
వుందును; నేనే పట్టి పెగల్తును; విడిపించే వాడు లేకుం
డా నేను వారిని తీసివేతును. । నేను తల్లి నా స్థల 15
ముకు తిరిగి వెళ్లి, వారు తమ తట్టు యెరుక చేసే పర్యం
తమూ వుందును; వుపద్రవము వారికి వచ్చినప్పుడు
వారు నన్ను తెల్లవారక మునుపే వెతుకుదురని ఆన
తిచ్చెను.

## 6. అధ్యాయము.

1 రండి, మనము తిరిగీ యెహోవా యొద్దికి వెళ్లు
దము; యేమంటే ఆయన మనలను పెగల్చినప్పటికిన్ని
మనలను స్వస్థపర్చును; కొట్టినప్పటికిన్ని మనలను
2 బాగుచేసును. । రెండు దినములైన తరువాత ఆయన
మనలను బ్రతికించును; మూడో దినమున మనలను లేపి
నందున మనము ఆయన సముఖమందు బ్రతుకుదుము.।
3 మనము యెహోవాను తెలుసుకొనేటందుకై వెంబడి
స్తూ వస్తే అప్పుడు మనము తెలుసుకొందుము: ఆయన
యొక్క బయిలు వెళ్లుట సూర్యోదయమైనట్టు సిద్ధమా
యెను; ఆయన మనయొద్దికి వర్షము వలెనున్ను తొ
లకరి వర్షమున్ను కడవరి వర్షమున్ను భూమి మీ
4 దికి వచ్చినట్టున్ను వచ్చును.। ఓ ఎఫ్రయీమూ, నిన్ను
యేమి చేతును? ఓ యూదా, నిన్ను యేమి చేతును?
యేమంటే మీ వుత్తమత్వము వుదయపు మేఘము వలె
నున్ను ప్రాతః కాలపు మంచు వలెనున్ను గతించి
5 పోవును. । కాబట్టి నేను దీర్ఘదర్శులచేత వారిని
కొట్టించితిని; నా నోటి వాక్యములచేత వారిని హత
ము చేస్తిని; నీ ఆజ్ఞలు వెలుగు లాగున బయిలు వెళ్లును.।
6 బలి యిచ్చుట కంటే దయచేసుట యందున్ను హో
మార్పణల కంటే దేవుని గురించిన తెలివి యందున్ను
7 కోరి వుంటిని. । అయితే ఆదాము వలెనే వారు ప్రమా
ణమును అతిక్రమించిరి; అక్కడ వారు నా విషయమై
8 అవిశ్వాసులైరి. । గిలాదు అక్రమపు వారి పట్టణమై
9 నందున రక్తముచేత అది అపవిత్రమాయెను. । మరిన్ని
దొంగల సమూహములు వొకని రాకటకు యేలాగు
కనిపెట్టి వుందురో ఆలాగున అర్చకులున్ను జట్టుగూడి
షెఖెము మార్గములో నరహత్య చేసిరి; యీలాగున
10 వారు కాని క్రియలు చేస్తూ వుండిరి. । ఇశ్రాయేలు
యింటివారిలో అసహ్యమైన వొక సంగతి నాకు కను
బడెను; అదుగో ఎఫ్రయీమువల్ల జారత్వము జరుగు
11 తూ వున్నది; ఇశ్రాయేలు అపవిత్రుడాయెను.। అయితే
చెరలోకి వెళ్లిన నా జనులను నేను యెప్పుడు తిరిగీ
రప్పింతునో అప్పుడు ఓ యూదా, అతడు నీకు
కోతకాలము నిర్ణయించును.

## 7. అధ్యాయము.

1 నేను ఇశ్రాయేలుకు స్వస్థత కలుగజేయ దలచి
నప్పుడు ఎఫ్రయీముయొక్క అన్యాయమున్ను షో
మ్రోనుయొక్క దోషమున్ను బైలుబడెను; యేమంటే
వారు మిక్కిలీ కపటపు పని చేసిరి; కొల్లకాడు లో
పట చోరబడుటయున్ను బైట దొంగల గుంపు సంచ
2 రించుటయున్ను అయి వుండెను. । వారి అక్రమమంతా
నా జ్ఞాపకమందు వున్నదని వారు విచారించరైరి; అ
యితే వారి చేతనే వారిని గవిసినవి; నా సముఖమందు
అవి వుండెను. । వారి దుష్టక్రియలచేత వారు రాజు 3
నున్ను అబద్ధములచేత అధిపతులనున్ను సంతోషింప
చేతురు. । అందరున్ను వ్యభిచారులై, రొట్టెలు కాల్చే 4
వాని పొయ్యివలెనే వేడిమిగా వుండిరి; అతడు ముద్ద
పిసికి పొయ్యిలో అగ్నివేసి పడుకొని, ముద్దంతా
పొంగే పర్యంతమూ లేవక వుండును. । మన రాజు 5
దినమందు అధిపతులు అతని ద్రాక్షారసపు సిద్దెలచేత
మత్తిల్ల జేసిరి; అతడు చెయ్యి చాపి అపహాసకులతో
కలుసుకొనెను. । పొంచి చూస్తూ వుండగా, వారు తమ 6
హృదయములను పొయ్యి వలె వేడిమి కలుగ చేసు
కొందురు; వారి రొట్టెలు కాల్చేవాడు రాత్రి పర్యం
తమూ నిద్రపోవును గనుక వుదయమందు అది అగ్ని
మంట లాగున కాలుతూ వుండును. । పొయ్యి వలె 7
వారందరున్ను వేడిమి గలవారు అయి, వారి న్యాయాధి
పతులను దహించిరి; వారి రాజులందరున్ను కూలిరి;
వారిలో నన్ను స్మరించే వాడు వొకడూ లేడు. । ఎఫ్ర 8
యీము అన్య జనాంగములలో కట్టుబడి వుండెను;
ఎఫ్రయీము తిరగ వేయని అప్పమై వున్నాడు.। అతని 9
శక్తిని అన్యులు తినిరి; అది అతనికి తెలియ లేదు;
అక్కడక్కడ అతని తలమీద నెరసిన వెంట్రుకలు
వుండుట అతనికి తెలియలేదు. । ఇశ్రాయేలుయొక్క 10
గర్వము అతని ముఖమందే సాక్ష్యము పలుకుతూ
వున్నది; యేమంటే యివి అన్నీ యీలాగునైనప్పటి
కిన్ని వారు తమ దేవుడైన యెహోవా తట్టు తిరగ
లేదు. । ఎఫ్రయీము బుద్ధిలేని అధైర్యము గల గువ్వ 11
వలెనే వున్నాడు; వారు మిస్రీయులను పిలుస్తున్న
అష్షూరు వారి యొద్దికి వెళ్లుతున్న వున్నారు. । వారు 12
వెళ్లేటప్పుడు నేను వారి పయిని నా వలలను వేసి,
ఆకాశ పక్షుల వలెనే కిందికి లాగుదును; వారి సంఘ
ముకు వినబడిన మాటప్రకారము వారిని దండింతును.।
వారు నన్ను విడిచి తప్పిపోయిరి గనుక వారికి అయ్యో! 13
నాకు వ్యతిరిక్తముగా నడిచిరి గనుక వారికి క్షయము
సంభవించును గాక; నేను వారిని విడిపించినప్పటికిన్ని
నన్ను దూషించిరి. । మరిన్ని వారు శయ్యల మీద 14
పరుండి, పంట కొరకున్ను ద్రాక్షా రసము కొరకున్ను
మొర పెట్టినప్పటికిన్ని మనస్ఫూర్తిగా నన్ను స్మరించ
లేదు; తమ్మును తాము ప్రేరేపించుకొని, నా మీద
తిరుగుబాటు చేసిరి. । నేను వారికి బుద్ధి జెప్పి, వారి 15
హస్తమును బలపర్చినప్పటికిన్ని, నా మీద మోసపు
యోజన యోజించిరి. । మహోన్నతుని తట్టు వారు 16
తిరిగీ రారైరి; వారు వంకర విల్లు వలె వున్నారు; వారి
అధిపతులు రౌద్రపు నాలుకలు గలవారైనందున కత్తి

చేత కూలుదురు; అందువల్ల వారికి మిస్రయీము దేశ
మందు అపహాస్యము కలుగును.

## 8. అధ్యాయము.

1 బూకా నీ నోట వుంచ వలెను; యెహోవా
యింటివారు నా ప్రమాణమును మీరి నా న్యాయ
నిర్ణయమును అతిక్రమించిరి గనుక శత్రువు వారి
2 మీదికి గద్దవలె వచ్చును. । అప్పుడు ఓ నా దేవుడా,
మేము నిన్ను యెరిగి యున్నామని ఇశ్రాయేలువారు
3 నన్ను స్మరింతురు. । ఇశ్రాయేలు సన్మార్గమును విడిచి
4 పెట్టెను గనుక శత్రువు అతని తరుమును. । నేను
చేయకుండా వారు కొందరిని రాజులగా చేసుకొనిరి;
నాకు యెరుక చేయకుండా కొందరిని అధిపతులగా
చేసుకొనిరి; లయము వారికి వచ్చేటట్టు వారు బంగా
రపు విగ్రహములనున్ను వెండి విగ్రహములనున్ను
5 చేసుకొనిరి. । ఓ షోమ్రోనూ, నీ పడ్డ నిన్ను విడిచి
పెట్టెను; నా కోపాగ్ని వారి పైని మండినది; యెన్నా
6 ళ్లకు వారు నిరపరాధులవుదురు? । యేమంటే అది
ఇశ్రాయేలీయులవల్ల కలిగి వున్నది; కంసాలి చేసెను
గనుక అది దైవము కాదు; అయితే షోమ్రోనుకు కలి
7 గిన యీ పడ్డ చిన్నాభిన్నములై పోవును. । వారు గా
లిని విత్తిరి గనుక వారికి ప్రళయ వాయువు కోత కలు
గును; అతనికి చేను లేదు; అది మొలిచినప్పటికిన్ని
ఫలించకపోవును; వొకవేళ ఫలిస్తే అన్యులు దానిని మిం
8 గుదురు. । ఇశ్రాయేలు మింగబడును; యిప్పుడే వారు
అన్య జనాంగములలో విసర్జించబడిన పాత్ర వలెనే
9 వుందురు. । యేమంటే తన కొరకు మాత్రమే విచా
రించుకొనిన అడవి గార్దభమువలెనే వారు వొంటిగా
అష్షూరు యొద్దికి వెళ్లిరి; ఎఫ్రయీము కానుకలను
10 యిచ్చి విటకాండ్లను పిలుచుకొనెను. । వారు కాను
కలను యిచ్చి జనాంగములలో విటకాండ్లను పిలుచు
కొనిరి గనుక యిప్పుడు నేను వారిని కూడి రాచేతును;
కాబట్టి అధిపతుల పైని వున్న రాజు పెట్టే భారము
11 వల్ల వారికి కొంచెము చింత కలుగును. । పాపము వచ్చే
టట్టు ఎఫ్రయీము పీఠములను విస్తరించి చేసెను గనుక
12 పీఠములవల్ల అతనికి మరింత పాపము కలుగును. । అతని
కొరకు నేను నా న్యాయ ప్రమాణముయొక్క విశేష
ములను వ్రాస్తిని, అయితే యివి అతనికి వింతగా అగు
13 పడెను. । వారు నా అర్పణల కొరకై బలివేసి, మాంస
మును చెల్లించి, దానిని తిందురు; అయితే యెహోవా
వారిని అంగీకరించ లేదు; యిప్పుడు ఆయన వారి దో
షమును జ్ఞాపకము చేసుకొని, వారి పాపముల నిమి
త్తము శిక్షించును; వారు మిస్రయీము దేశములోకి
14 తిరిగీ వెళ్లుదురు. । యేమంటే ఇశ్రాయేలు తన సృష్టి
కర్తను మరిచి, ఆలయములను కట్టించెను; యూదా
యున్ను ప్రాకారములు గల చాలా పట్టణములను
కట్టుకొనెను; అయితే నేను అతని పట్టణముల మీద
అగ్ని వేతును, అది వాటి నగరులను దహించును.

## 9. అధ్యాయము.

ఓ ఇశ్రాయేలూ, అన్య జనాంగముల వలెనే 1
నీవు సంతోషముచేత సంభ్రమము చేయవద్దు, యే
మంటే నీవు నీ దేవుని విడిచి వ్యభిచరించ వెళ్లితివి;
వేశ్య లాగున నీవు సకలమైన పంట కళ్లముల మీద
కానుకను కోరితివి. । అయితే కళ్లమున్ను ద్రాక్ష గా 2
నుగున్ను వారికి ఆహారము యివ్వలేక పోవును; కొత్త
ద్రాక్షారసము దానిలో లేకపోవును. । వారు యెహో 3
వా దేశమందు వుండ గూడదు; ఎఫ్రయీము మిస్ర
యీము దేశములోకి తిరిగీ వెళ్లును; అష్షూరు దేశ
మందు వారు అపవిత్రమయిన దానిని తిందురు. । యె 4
హోవా కొరకు వారు ద్రాక్షారసమును కుమ్మరించేది
లేకపోవును; అది ఆయనకు అనుకూలము గాక వుం
డును; వారి బలులు వారికి మూర్ఛే వారి భోజనమైనట్టు
అవును; దానిని యెందరు భుజింతురో అందరున్ను అం
టుబడుదురు; కాబట్టి వారు నిలువగలందులకు వారు
తినవలసిన భోజనము యెహోవా మందిరములోకి
రా కూడదు. । కాబట్టి మీరు నిర్ణయమైన దినమం 5
దున్ను యెహోవా పండుగ దినమందున్ను యేమి
చేతురు! । యేమంటే లయము వచ్చినందున వారు చెదిరి 6
పోదురు; మిస్రీయులు వారిని కూర్తురు; నోపు పట్ట
ణపువారు వారి వెండికి ఆశించి, వారిని సమాధిలో
పెట్టుదురు; వారి భూములను ముండ్లకంప ఆవరించు
కొనును; వారి డేరాలలో ముండ్లు పెరుగును. । శిక్షా 7
దినములు వచ్చెను; ప్రతికారపు దినములు వచ్చెను;
యిది ఇశ్రాయేలీయులకు తెలుసును; వారి దోషము
విస్తారమైనందువల్లనున్ను వారి క్రోధము చెడ్డదైనందు
వల్లనున్ను దీర్ఘదర్శి అవివేకుడాయెను; దైవాత్మను
పొందవలసిన యితడు వెర్రివాడై పోయెను. । ఎఫ్రయీ 8
ము కాపరి నా దేవుని యొద్ద వుండెను, అయితే ఆ
దీర్ఘదర్శి అతని మార్గములన్నిటి యందూ కిరా
తకుని వురుల వలెనే అతని దేవుని యింటివారందరికిన్ని
పగవాడై వుండెను. । గిబా దినములందైనట్టు వారు 9
బహుగా చెడిపోయిరి; కాబట్టి ఆయన వారి దోషము
ను తలంచి, వారి పాపముల నిమిత్తము శిక్షించును. ।
ఇశ్రాయేలు అరణ్యములో దొరికిన ద్రాక్ష పండ్ల వలె 10
నాకు కనుబడెను; పండ్ల కాలమందు అంజూరపు చెట్టు
తొలి ఫలము వలె మీ పితృలు నాకు కనుబడిరి; అయి
తే వారు బయల్పెయోరు యొద్దికి వెళ్లి, ఆ సిగ్గు గల

దాని కొరకు తమ్మును తాము కేటించుకొనిరి; అక్కడ
వారి అసహ్యతలు వారి యిచ్ఛా ప్రకారము కలిగి
1 వుండెను. । ఎఫ్రాయీము ఘనము పక్షి వలె యెగిరిపో
వును; యేమంటే వారి పిల్లలు పుట్టినప్పుడున్ను తల్లి
గర్భమునుంచి యివతలకు వచ్చినప్పుడున్ను గర్భమున
2 నిలిచినప్పుడున్ను లేని వారౌదురు. । వారు తమ పిల్ల
లను పెంచినా నేను వారికి వొక పిల్లనైనా లేకుండా
చేతును; నేను వారిని విడిచినప్పుడు వారికి అయ్యో! ।
3 ఎఫ్రాయీము నాకు సోరు కనుబడినట్టు కనుబడి, అం
దమైన స్థలమందు నాటబడెను; అయితే ఎఫ్రాయీము
4 నరాంతకుని కొరకు పిల్లలను కనును. । వో యెహో
వా, వారికి యిమ్ము; యేమి యివ్వవలెనంటే గర్భ
స్రావమునున్ను శుష్క స్తనములనున్ను వారికి యిమ్ము. ।
5 వారి దోషమంతా గిల్గాలులో జరుగుతూ వున్నది;
అక్కడ వారు దుష్ట క్రియలను చేసినందున నేను వా
రిని పగచేస్తిని; నా యింట్లోనుంచి అవతలకు వారిని
వెళ్లవేతును; యిక మీదట వారితో స్నేహించను; వారి
6 అధిపతులందరున్ను వ్యతిరిక్తులైరి. । ఎఫ్రాయీము మొత్త
బడెను; వారి వేరు యెండిపోయెను; వారివల్ల ఫలము
రాకపోవును; వారు పిల్లలను కనినప్పటికిన్ని నేను
వారి ప్రియమైన గర్భ ఫలములను హతము చేతును. ।
7 వారు నా దేవుని వాక్యములను ఆలకించలేదు గనుక
ఆయన వారిని చెదర వేసును; నిజముగా అన్య జనాం
గములలో వారు సంచరింతురు.

## 10. అధ్యాయము.

1 ఇశ్రాయేలు సరము లేని ద్రాక్ష చెట్టయి పోయె
ను; తన కొరకు తాను ఫలిస్తూ వున్నాడు; అతనికి ఫల
ము యెంతగా విస్తరించెనో అంత విస్తారముగా అతడు
పీఠములను కట్టెను; వారి భూమి యెంత శృంగారమై
వుండెనో అంత శృంగారమైన విగ్రహములను వారు
2 చేసిరి. । వారి హృదయములు విభాగించబడెను; యిప్పు
డు వారు అపరాధులుగా కనుబడుదురు; వారి పీఠము
లను వారు కింద బడవేసి, వారి విగ్రహములను నశింప
3 చేతురు. । అయినందున వారు యిప్పుడు చెప్పుకొనేది
యేమంటే, మనకు రాజు లేడు, వొక వేళ వుంటే మన
ము యెహోవా యందు భయ భక్తిగా వుండకపోతిమి
గనుక ఆయన మన కొరకు యేమి చేయ గలడని అను
4 కొందురు. । వారు వూరికె మాట్లాడి, ప్రమాణముచేసి,
అప్రమాణికులైరి; అయినందున భూమి సాళ్లలో విషపు
5 కూర మొలిచినట్టు ఆజ్ఞ పుట్టును. । బేతావెనులో వున్న
పడ్డల నిమిత్తము షోమ్రోను కాపురస్తులు భెంగటిల్లు
దురు; దాని జనులు దానిని గురించి దుఃఖింతురు; దా
నికి కలిగిన ఘనము నిమిత్తము దాని యందు సంతో
షించిన అర్చకులున్ను దుఃఖింతురు; యెందుకంటే
దాని ఘనము పోయెను. । అది అష్షూరు దేశములోకి 6
కొంచుపోబడి, రాజైన యారేబుకు కానుక అవును;
ఎఫ్రాయీముకు సిగ్గు వచ్చును; ఇశ్రాయేలు తాను చేసిన
ఆలోచనవల్ల సిగ్గు తెచ్చుకొనును. । షోమ్రోను రాజు 7
నీళ్ల మీద వున్న తెట్టె లాగున తీసివేయబడెను. । ఇశ్రా 8
యేలుకు పాపమయిన ఆవెనుయొక్క వున్నత స్థల
ములు క్షయమవును; వారి పీఠముల మీద ముళ్లచెట్లు
పుట్టును; పర్వతములను చూచి మమ్మును కప్పుండనిన్ని
కొండలను చూచి మా మీద రాలండనిన్ని చెప్పుదురు. ।
వో ఇశ్రాయేలూ, గిబాయొక్క దినములనుంచీ నీవు 9
పాపము చేస్తూ వుంటివి; ఆ గర్విష్టులను గురించి గిబా
లో లేచిన యుద్ధము వారి మీద కదియలేదు గనుక
వారు అక్కడ నిలిచి వుండిరి. । యిప్పుడు వారిని బం 10
ధించుటకు నాకు అనుకూలమై వున్నది; కాబట్టి వారు
చేసిన రెండు తప్పితముల నిమిత్తము నేను వారిని బంధిం
చినప్పుడు అన్య జనాంగములు కూడి వారి మీదికి
వత్తురు. । ఎఫ్రాయీము నూర్పు యందు అభ్యాసము 11
కలదై పంటను తొక్కకోరిన పడ్డయి వుండెను; అయి
తే దాని నునుపయిన మెడను నేను నిర్లక్ష్యపెట్టు
దును; ఎఫ్రాయీము మీద వొకని యెక్కింతును;
యూదా భూమిని దున్నును; యాకోబు అతని కొరకు
భూమిని చదును చేసును. । అయితే మీ కొరకు మీరు 12
నీతిని విత్తండి; దయ అనే కోతను కొయ్యండి; మీ
కొనుగ భూమిని దున్నండి; యేమంటే యెహోవావా
వచ్చి, మీ మీద నీతిని కురిపించేటట్టు ఆయనను వెతికే
సమయము యిదే. । అయితే మీరు చెడ్డతనమును విత్తి 13
తిరి; అన్యాయపు కోతను కోస్తిరి; అబద్ధపు ఫలమును
తింటిరి; యేమంటే నీవు నీ మార్గమునున్ను నీకు కలి
గిన బలాఢ్యుల సమూహమునున్ను నమ్మితివి. । కాబట్టి 14
నీ జనులలో గొల్లు పుట్టును; షల్మాను యుద్ధ దినమందు
యేలాగున బేతర్బేలును క్షయము చేసెనో ఆలాగున
నీ గట్టి స్థలములు క్షయమవును; అక్కడ తల్లి పిల్లలతో
కూడా ప్రహతించబడును. । యీలాగున మీ మిక్కిలి 15
చెడ్డ పని నిమిత్తము బేతేలు మీకు చేసును; శీఘ్రము
గానే ఇశ్రాయేలు రాజు సర్వనాశనమవును.

## 11. అధ్యాయము.

ఇశ్రాయేలు బాలుడై వున్నప్పుడు నేను అతని 1
యందు దయగా వుండి, నా కుమారుని మిస్రయీము
లోనుంచి పిలిచితిని. । వీరిని వారు యెంతగా పిలుతురో 2
అంతగా వీరు వారి యొద్దనుంచి దూరముకు పోయి,
బయలీముకు బలులను చెల్లించి, చెక్కిన విగ్రహములను
ధూపమిచ్చిరి. । నేను ఎఫ్రాయీము చేతులను పట్టుకొని, 3

వారిని నడిపిస్తిని; అయితే వారిని సంరక్షించిన వాడను
4 నేనని వారికి తెలియలేదు. । మనుష్యునికి పాశములు
అనగా స్నేహపాశములతోటి నేను వారిని లాగితిని;
వారికి నేను తమ పశువుల మీది కాడి కర్రను తీసిన
వాడనయినట్టు వుండి, వారికి తినుటకు ఆహారమును
5 యిస్తిని. । అతడు మిస్రయీము దేశములోకి తిరిగీ
వెళ్లక వుండును; వారు నా తట్టు తిరగ లేదు గనుక
6 అష్షూరువాడు అతనికి రాజౌను. । కత్తి అతని పట్టణ
ముల మీదికి వచ్చి వుండి, వారి ఆలోచనల నిమిత్తము
7 అతని జంటలను భక్షిస్తూ వుండును. । నా జనులు నా
యొద్దనుంచి తిరిగిపోవుటకు దీక్ష చేసుకొనిరి; మహో
న్నతమయిన వాని యొద్దికి వారిని పిలిచితే వొకనికిన్ని
8 లక్ష్యము లేక వుండెను. । వో ఎఫ్రయీమూ, నిన్ను
యేలాగు పరిహరింతును! వో ఇశ్రాయేలూ, నిన్ను
యేలాగు విడిపింతును! అద్మావలెనే నిన్ను యేలాగు
చేతును! సెబోయీమువలెనే నిన్ను యేలాగు వుంతును?
నా హృదయములో తిప్పినట్టే వున్నది; చింతలతో
9 నా అంతరంగము మండుతూ వున్నది. । నా యావ
త్కోపాగ్ని ప్రకారము చేయను; నేను తిరిగీ ఎఫ్ర
యీమును లయము చేయను; యేమంటే నేను దేవు
డను గాని మనుష్యుడను గాను; మీలో పరిశుద్ధుడను;
10 అయితే నేను పట్టణములోకి రాను. । వారు యెహో
వాను వెంటాడుదురు; వారు సింహములాగున నాదము
చేతురు; నాదము చేసినప్పుడు పడమటి దేశపువారు
11 యివతలకు పరుగెత్తి వత్తురు. । మిస్రయీము దేశము
లోనుంచి పక్షివలెనున్ను అష్షూరు దేశములోనుంచి
గువ్వవలెనున్ను యెగిరి వత్తురు; వీరిని వారి కాపురము
12 లలో వుంతునని యెహోవా ఆనతిచ్చెను. । ఎఫ్ర
యీము వారు అబద్ధములతోటిన్ని ఇశ్రాయేలు యిం
టివారు మాయతోటిన్ని నన్ను గవిసి వున్నారు; అయితే
యూదా దేవునితో కూడి వుండి నేటివరకు యేలు
తూ, పరిశుద్ధవంతులకు నమ్మికగా వున్నది.

## 12. అధ్యాయము.

1 ఎఫ్రయీము గాలిని ఆహారముగా చేసుకొని, తూ
ర్పుగాలిని వెంటాడును; ప్రతి దినమూ అతడు అబద్ధ
ములనున్ను లయమునున్ను విస్తరింపచేసును; అష్షూరు
వారితోటి వీరు ప్రమాణమును చేసుకొనిరి; తైలము మి
2 స్రయీము దేశములోకి పంపించబడెను. । యూదాను
గురించి యెహోవాకు వ్యాజ్యము కలిగియున్నది;
ఆయన యాకోబును తన మార్గముల ప్రకారము శిక్షిం
చును; అతని క్రియల ప్రకారము అతనికి ప్రతిగా
3 చేసును. । అతడు తల్లి గర్భమందు వుండి, తన సహో
దరుని మడిమెను పట్టుకొనెను; అతడు శక్తి కలవాడై
దేవుని యొద్ద బలముగా వుండెను. । నిజముగా అతడు 4
బలము పొంది, దూతను జయించెను; అతడు కన్నీరు
రాల్చి, ఆయనను వేడుకొనెను; బేతేలులో అతడు ఆయ
నకు కనుబడెను; అక్కడ ఆయన మనతో మాట్లా
డెను. । ఆయన యెవడంటే, సైన్యముల యెహోవా; 5
యెహోవా ఆయన నామము. । కాబట్టి నీవు నీ దేవుని 6
తట్టు తిరుగుము; దయనున్ను నీతి న్యాయములనున్ను
జరిగించి, సదాకాలము దేవుని కనిపెట్టి వుండుము. ।
అతడు వర్తకుడై వున్నాడు; అన్యాయపు త్రాసు 7
అతని చేత వున్నది; బాధపెట్టుటకు ఆయనకు కోరికె
కలదు. । అయినప్పటికిన్ని ఎఫ్రయీము అనుకొనిన 8
దేమంటే, నేను ఐశ్వర్యవంతుడనై వున్నాను; నాకు
బహు భాగ్యము దొరికెను; అయినప్పటికిన్ని నా
కష్టార్జితమంతటి యందూ నావల్ల అన్యాయమైన
పాపము వారికి అగుపడ లేదని అనుకొనెను. । అయితే 9
యెహోవానైన నేను మిస్రయీము దేశమును నీవు
విడిచినప్పటినుంచీ నీకు దేవుడనై వుండి, నిర్ణయ
మైన పండుగ దినములందైనట్టు యింకా నిన్ను డేరా
లలో కాపురము చేయింతును. । మరిన్ని దీర్ఘద 1
ర్శుల ద్వారా నేను మాట్లాడి, దర్శనములను విస్త
రింపజేసి, దీర్ఘ దర్శులచేత వుపమానములను పలి
కింతును. । అవశ్యముగా గిలాదులో అన్యాయము 1
వున్నదా! నిజముగా వారు వ్యర్థులై వున్నారు; గిల్గా
లులో నారు యెడ్లను అర్పిస్తూ వున్నారు; వారి పీఠ
ములు దున్నిన పొలము సాళ్లలో వున్న రాళ్ల కుప్పల
వలెనే వున్నవి. । యాకోబు తప్పించుకొని అరాము 1
దేశములోకి పోయెను; భార్య కొరకు ఇశ్రాయేలు
కొలువు చేసెను; భార్య కొరకు అతడు గొర్రెలను
కాచెను. । దీర్ఘదర్శిచేత యెహోవా ఇశ్రాయే 1
లును మిస్రయీములోనుంచి విడిపించెను; దీర్ఘద
ర్శిచేత అతడు కాపాడబడెను. । అయితే ఎఫ్రయీ 1
ము ఆయనకు బహు ఘోరముగా కోపమును పుట్టిం
చెను; కాబట్టి ఆయన అతని రక్త దోషమును తన మీ
దనే మోపును; అతని అవమానమును అతని కర్త తన
మీదనే తిరిగీ పెట్టును.

## 13. అధ్యాయము.

ఎఫ్రయీము వణుకుతో పలికినప్పుడు ఇశ్రాయే 1
లులో అతనికి అధికారము కలిగెను; అయితే బయలు
విషయమై దోషము చేసినప్పుడు మరణము పొందెను. ।
అయితే వారు యింకా మరింత అధికముగా పాపము 2
చేస్తున్నారు; యేమంటే వెండి విగ్రహముల పోత
పోసిరి; వారి ఆలోచన కొద్ది విగ్రహములను కల్పిం
చిరి; యివన్నీ కంసాలి పనివి అయినప్పటికిన్ని వారు

అర్పణలను చెల్లించి, పెయ్యలను ముద్దుబెట్టుకో వలె
3 నని చెప్పుకొందురు. । కాబట్టి వారు వుదయపు మేఘ
ము వలెనున్ను అతి వేగముగా పోయే ప్రాతః కాలపు
మంచు వలెనున్ను కళ్లములోనుంచి గాలి యెగరగొట్టే
పొల్లు వలెనున్ను నాళములోనుంచి పోయే పొగ వలె
4 నున్ను లేకపోదురు. । అయితే యెహోవానైన నేను
మిస్రయీము దేశమును నీవు విడిచినప్పటినుంచీ నీ
దేవుడనై వుంటిని; నన్ను గాక నీవు యే దేవునినైనా
యెరుగవు; నేను గాక రక్షకుడు వొకడూ లేడు. ।
5 నిర్జల స్థలమైన అరణ్య భూమిలో నిన్ను యెరిగి
6 వుంటిని. । తరువాత వారు మేతగల భూమిలోకి వచ్చి
తృప్తిని పొందిరి; తృప్తిని పొంది వారి హృదయము
7 అతిశయించినందున నన్ను మరిచిరి. । కాబట్టి నేను వా
రికి సింహము లాగున వుందును; మార్గము దగ్గిర
పొంచి వున్న సివంగివలెనే వారి కొరకు కాసి వుం
8 దును. । పిల్లలు పోయిన యెలుగుబంటి లాగున వారిని
యెదిరించి, వారి హృదయపు సంచిని పెగల్తును;
అక్కడ నేను సింహము లాగున వారిని మింగుదును;
9 దుష్ట మృగము వారిని చెండాడును. । వో ఇశ్రాయే
లూ నిన్ను నీవు చెరుపుకొంటివి; అయితే నావల్ల నీకు
10 సహాయము కలుగును. । నేనే నీకు రాజునౌదును; నీ
పట్టణములలో నిన్ను రక్షించే పాటివాడు యెవడైనా
వున్నాడా? నాకు రాజునున్ను అధిపతులనున్ను యి
వ్వండని నీవు అడిగిన నీ న్యాయకర్తలు యెక్కడ
11 వున్నారు? । కోపము తెచ్చుకొని, నీకు రాజును యిచ్చి,
12 కోపాగ్నిని తెచ్చుకొని అతని తీసివేస్తిని. । ఎఫ్రయీము
దోషము కట్టుబడెను; అతని పాపము దాచబడెను. ।
13 అతని మీదికి ప్రసూతి వేదనలు వచ్చును; అతడు
బుద్ధిలేని పిల్లయి వున్నాడు; యేమంటే పిల్లలు పుట్టే
14 సమయమున అతడు నిలిచేవాడు కాడు. । అయినప్పటి
కిన్ని సమాధినుంచి నేను వారిని విడిపింతును; మృత్యు
వునుంచి వారిని విమోచింతును; వో మృత్యువూ,
నేను నీకు మృత్యువు నౌదును; వో సమాధీ, నావల్ల
నీకు క్షయము కలుగును; పశ్చాత్తాపము నా దృష్టికి
15 మరుగుగా వుండును. । అతడు తన సహోదరులలో
బహుగా వృద్ధి బొందినప్పటికిన్ని తూర్పుగాలి వచ్చు
ను; యెహోవా వాయువు అరణ్యములోనుంచి వచ్చి
నందున అతని జెల యెండిపోవును; అతని వూట యెం
డిపోవును; దానిచేత దాచిపెట్టిన ప్రియమైన వస్తువుల
న్నిన్ని చెడిపోవును. । షోమ్రోను తన దేవునికి వ్యతి 16
రిక్తురాలైనందున పాడైపోవును; వారు కత్తిచేత కూలు
దురు; వారి పిల్లలు తునకలయ్యేటట్టు ప్రహతించబడు
దురు; గర్భిణీ స్త్రీల కడుపులు చించబడును.

## 14. అధ్యాయము.

వో ఇశ్రాయేలూ, నీ దేవుడైన యెహోవా యొ 1
ద్దికి తిరిగీ రమ్ము, యేమంటే నీ దోషమువల్ల నీవు అభ్యం
తరపడితివి. । మీరు తగిన మాటలను విచారించుకొని, 2
యెహోవా తట్టు తిరగండి; ఆయనతో చెప్పవలసిన
దేమంటే, పాపములన్నిటినీ పరిహరించి మా వాక్స్తో
త్రములను మేము నీకు చెల్లించేటట్టు మమ్ముని గుణ
పరచుమనిన్ని, । అష్షూరు వారివల్ల రక్షణ కోరక వుం 3
దుమనిన్ని, గుర్రములను మేము యెక్కమనిన్ని, మరి
న్ని యిక మీదట మా చేతుల చేత చేసిన వాటిని
దేవుండ్లని అనకోమనిన్ని, తండ్రిలేని వారియందు నీకు
జాలి గుండె కలిగి వున్నదనిన్ని చెప్పండి. । వారు యిక 4
వెనుకతీయకుండా వారిని గుణపరుచుదును; మనస్ఫూ
ర్తిగా వారిని స్నేహింతును; యేమంటే ఇశ్రాయేలు
మీదనుంచి నా కోపము తిరిగి పోయెను. । అతనికి నేను 5
మంచువలెనే వున్నందున అతడు శుశాన పుష్పము లా
గున పెరిగి లెబానోను చెట్ల లాగున అతడు వేళ్లు
దన్నును. । అతని జంటలు విశాలముగా అల్లుకొనును; 6
అతనికి యిప్ప చెట్టుకు కలిగినంత సౌందర్యము కలు
గును; అతనికి లెబానోనుకు కలిగినంత సువాసన కలు
గును. । వారు తిరిగీ వారి నీడ యందు నివసింతురు; 7
విత్తనము లాగున బలుతురు; ద్రాక్ష చెట్టు లాగున
చిగిరింతురు; దాని వాసన లెబానోను ద్రాక్షారసము
యొక్క వాసన వలెనే వుండును. । యిక బొమ్మలతో 8
నాకు నిమిత్తమేమని ఎఫ్రయీము పలుకును; అతనికి
నా చెవి వొగ్గితిని; చిగిర్చిన బరిశ చెట్టు లాగున అతని
చూస్తిని; నావల్ల నీకు ఫలము కలిగెను. । యెవడైనా 9
జ్ఞానియైతే అతడు వాటిని గ్రహించును; యెవడైనా
మతిమంతుడైతే అతడు వాటి గుర్తెరుగును; యేమంటే
యెహోవా మార్గములు తిన్ననివై వున్నవి; నీతిపరులు
వాటి యందు నడుతురు; అయితే వ్యతిరిక్తులు వాటి
యందు అభ్యంతరపడుదురు.

# యోవేలు యొక్క గ్రంథము.

## 1. అధ్యాయము.

1 పెతూయేలు కుమారుడయిన యోవేలుకు వచ్చిన
2 యెహోవా వాక్యము, యేమంటే, । వో పెద్దలారా,
వినండి; దేశపు కాపురస్తులారా, చెవి యొగ్గండి; యీ
లాటి సంగతి మీ దినములందున్ను మీ పితృల దినము
3 లందున్ను యెన్నడయినా సంభవించెనా! । దీనిని మీ
బిడ్డలకు తెలియ చేయండి; మీ బిడ్డలు తమ బిడ్డలకు
న్ను వారి బిడ్డలు యింకొక తరపు వారికిన్ని తెలియ
4 చేతురు గాక. । యేమంటే గొంగలి పురుగులు విడిచి
నది మిడతలు తినెను; మిడతలు విడిచినది పసరు పురు
గులు తినెను; పసరు పురుగులు విడిచినది చీడ పురు
5 గులు తినెను. । వో మత్తులారా, మేలుకొని, కన్నీరు
రాల్పండి; ద్రాక్షా రసము తాగే వారలారా, క్రొత్త
ద్రాక్షా రసమును గురించి రోదనము చేయండి; యే
మంటే అది మీ నోటినుంచి కొట్టి వేయబడి యు
6 న్నది. । యేమంటే లెక్కలేని బలమయిన జనాంగము
నా దేశము మీదికి వచ్చి యున్నది; దాని పండ్లు సిం
హముయొక్క కోరలకు సమము; దాని లోపలి పండ్లు
పెద్ద సింహముయొక్క లోపలి దంతముల వలెనే వు
7 న్నవి. । నా ద్రాక్ష చెట్టును అది పాడుచేసెను; నా
అంజూరపు చెట్టు తొక్క అంతా వొలిచెను; దాని
8 కొమ్మలన్నిన్ని తెలుపాయెను. । బాల్యమందు పోయిన
పెనిమిటి నిమిత్తము గోనె కట్టుకొనిన కన్యక వలె అం
9 గలార్చుము.। భోజనార్పణయున్ను పానార్పణయున్ను
యెహోవా మందిరములోనుంచి కొట్టివేయబడి యు
న్నవి; యెహోవా వ్యాపారులయిన అర్చకులు మూ
10 ల్గుతూ వున్నారు. । పొలము పాడైయున్నది; భూమి
మూల్గుతున్నది; యేమంటే పంట లయమాయెను; క్రొత్త
ద్రాక్షా రసము యెండిపోయెను; తైలపు చెట్లు సురిగి
11 పోయెను. । వో వ్యవసాయదారులారా, మీ శిరస్సు
లను వంచుకొండి; వో ద్రాక్ష తోట కాపరులారా,
రోదనము చేయండి; యేమంటే గోధుమయున్ను య
12 వలున్ను భూమి పంటయున్ను చెడిపోయెను.। ద్రాక్ష
చెట్టు యెండిపోయెను; అంజూరపు చెట్టు సురిగిపో
యెను; దానిమ్మ చెట్టున్ను పోనీకి చెట్టున్ను దబ్బ చె
ట్టున్ను భూమి మీది చెట్లన్నిన్ని వాడిపోయెను; కా
బట్టి నర పుత్రుల సంతోషమున్ను వాడిపోయెను. ।
వో అర్చకులారా, గోనె కట్టుకొని అంగలార్చండి; 13
వో పీఠముయొక్క వ్యాపారకులారా, రోదనము చే
యండి; వో నా దేవుని వ్యాపారకులారా, రాత్రి
దాకా గోనెల మీద పరుండి వుండండి; యేమంటే
భోజనార్పణయున్ను పానార్పణయున్ను మీ దేవుని
మందిరమునకు రాకపోయెను. । వుపవాస దినమును 14
గురించి చాటించండి; జన సమాగమమును గురించి
ప్రకటన చేయండి; పెద్దలనున్ను దేశపు కాపురస్తులం
దరినిన్ని మీ దేవుని మందిరమునకు పిలిపించి, యెహో
వాను ప్రార్థించండి. । ఆ దినముకు అయ్యో! యే 15
మంటే యెహోవా దినము సమీపమాయెను; అది
లయకర్తవల్ల వచ్చిన లయమైనట్టు వచ్చును. । మన 16
కండ్ల ముందటినుంచి ఆహారమున్ను మన దేవుని మం
దిరమునుంచి సంతోషమున్ను వుత్సాహమున్ను కొట్టి
వేయబడును గదా! । విత్తనము వాటి వాటి కుదుళ్ల కింద 17
కుళ్లిపోయెను; పంట రాశులు సరిపోయెను; కొట్లు విర
గబడెను; యేమంటే పైరు మాడిపోయెను. । యిదుగో 18
పశువులు యేలాగు మూల్గుతూ వున్నవో! మేత లేదు
గనుక యెద్లు మూర్ఛిల్లెను; గొఱ్ఱెమందలు పాడై పో
యెను. । వో యెహోవా, నిన్ను స్మరిస్తూ వుంటాను; 19
యేమంటే అగ్ని అరణ్యమందున్న పీటి స్థలములను మిం
గివేసెను; పంట భూమి మీది చెట్లనన్నిటినీ దహిం
చెను.। భూ మృగములు కూడా నిన్ను స్మరిస్తూ వున్నవి; 20
యేమంటే ప్రవాహములు యెండిపోయెను; అగ్ని అర
ణ్యమందుండే పీటి స్థలములను మింగివేసెను.

## 2. అధ్యాయము.

సీయోను మీద బాకా వూదండి; పరిశుద్ధ పర్వ 1
తము మీద హెచ్చరిక నాదము చేయండి; దేశపు కా
పురస్తులందరున్ను వణుకుదురు, యేమంటే యెహో
వా దినము వస్తూ వున్నది; అది సమీపమాయెను. ।
ఆ దినము చీకటిగానున్ను మబ్బుగానున్ను వుండును; 2
మేఘములతో గాఢాంధకారమైన దినమై యుండును;
పర్వతముల మీదనుంచి సూర్యోదయము తోసుకొని
వచ్చి వ్యాపించినట్టు ఆ జనము బలము గలదిన్ని విస్తా
రమైనదిన్ని అవును; అలాటి జనము యెన్నడూ లేదు;
తర తరాల మట్టుకు అలాటిది యికను లేక వుండును. ।
వారి ముందట దహించే అగ్ని వుండును; వారి వెనుక 3

కాలే మంట వుండును; వారి ముందట భూమి ఏదెను
వనము లాగున వుండును; వారి వెనుక భూమి వట్టి
అరణ్యమై వుండును; వారినుంచి యేదిన్ని తప్పించుకో
4 పోలేదు.। వారి రూపము గుఱ్ఱముల రూపముల వలెనే
యుండును; రౌతుల వలెనే వారు పరుగెత్తి వత్తురు.।
5 పర్వతముల మీదనున్ను రథముల ధ్వని వలెనున్న
కొయ్య కాలును భక్షించే అగ్ని వలెనున్ను వారు చెం
గున దాటుతూ, యుద్ధ బలము గల జనుల వలెనున్న
6 వత్తురు.। వారి ముఖములవల్ల జనులకు బహు బాధ కలు
7 గును; సకల ముఖములూ నలుపౌను.। వారు బలాఢ్యుల
లాగున పరుగెత్తుదురు; సైన్యస్థుల లాగున పరుగెత్తి
గోడ యెక్కుదురు; అందరున్ను వారి వారి మార్గ
ములందు నడిచి, యిటూ అటూ తిరుగక తిన్నగా
8 వత్తురు.। ఒకని మీద ఒకడు తొక్కులాడక అంద
రున్ను వారి వారి మార్గములందు నడుతురు; కత్తి మీద
9 బడినప్పటికీ గాయమును పొందరు.। వారు పట్టణము
లో నఖముఖాలా పరుగెత్తుదురు; గోడ మీద పరుగెత్తి
యిండ్ల మీదికి యెక్కుదురు; దొంగ లాగున కిటికీలలో
10 నుంచి చొరబడుదురు.। వారి ముందర భూమి కంపిం
చును; ఆకాశము తత్తరించును; సూర్య చంద్రులు తేజో
11 హీనులగుదురు; నక్షత్రముల కాంతి తప్పును.। మరిన్ని
యెహోవా తన సైన్యము ముందర శబ్దమును యెత్తు
ను; ఆయన దండు మిక్కిలీ గొప్పదై వుండును; తన
వాక్యమును నెరవేర్చుటకు తాను బలాఢ్యుడై వున్నా
డు; యెహోవా దినము బహు ఘనముగానున్న
భయంకరముగానున్న వున్నందున దానిని యెవరు ఓ
12 ర్చగలరు!। కాబట్టి యెహోవా యిందుకై ఆనతిచ్చే
దేమంటే, మీరు నిండు హృదయముతోటిన్ని వుపవా
సముతోటిన్ని యేడ్పుతోటిన్ని దుఃఖముతోటిన్ని నా
13 యొద్దికి తిరిగీ రండి.। వస్త్రములను కాదు మీ హృద
యములను చించుకొని, మీ దేవుడైన యెహోవా
తట్టు తిరుగండి; యేమంటే ఆయన దయాపరుడున్న
జాలి గుండె గలవాడున్ను బహు శాంతమూర్తిన్ని బహు
కటాక్షము గలవాడున్న గనుక శిక్షను గూర్చి చింత
14 పడును.। ఆయన తన మనస్సు మళ్లించుకొని, చింతను
పొంది, ఆశీర్వాదము దయచేసునేమో; మీ దేవుడైన
యెహోవా కొరకు భోజనార్పణనున్న పానార్పణ
15 నున్న చెల్లించండి.। సీయోను మీద బాకా వూదండి;
వుపవాసమును గురించి చాటించండి; దిన సమాగమ
16 మును గురించిన ప్రకటన చేయండి.। పెద్దలను పిలువ
నంపించండి; చిన్న వారినిన్ని స్తన్యపానమును చేసే
బాలురనున్న కూర్చండి; పెండ్లి కుమారుడు తన అంతః
పురమునున్న పెండ్లి కుమార్తె తన గదినిన్ని విడిచి రా
17 వలయును.। అప్పుడు యెహోవా వ్యాపారకులయిన
అర్చకులు వాకిటియొక్కయున్న పీఠముయొక్కయు
న్ను సందున నిలిచి యేడ్చి, చెప్పవలసినదేమంటే, ఓ
యెహోవా, నీ జనులను కాపాడుము; అన్య జనాం
గములు వీరిని యేలుటవల్లనైన అవమానము రాకుండా
నీ స్వజనులను వారికి అప్పగించకుము; జనులలో వీరి
దేవుడు యెక్కడ వున్నాడన్న మాటను వారు యెం
దుకు పలక వలెను?। అప్పుడు యెహోవా తన దేశము 18
నిమిత్తము పరాక్రమశాలియై తన జనులను కనికరిం
చును.। మరిన్ని యెహోవా తన జనులకు వుత్తరమిచ్చి, 19
చెప్పేదేమంటే, యిదుగో, మీరు తృప్తిని పొందేటట్టు
మీకు పంటనున్న ద్రాక్షా రసమునున్న తైలమునున్న
యిప్పింతును; యికను అన్య జనాంగములలో మిమ్మును
అవమానమును పొందనియ్యను.। మరిన్ని నేను వుత్తరపు 20
సమూహములను మీకు దూరముగా వెళ్లవేసి, యెండి
పోయిన నిష్ఫల భూమిలోకి వారిని తోలివేతును; వారి
ముందట తూర్పు సముద్రమున్న వారి వెనుక అవతలి
సముద్రమున్న వుండును; అక్కడ వారి దుర్గంధమున్న
దుర్వాసనయున్న మీదికి యెక్కును; యేమంటే, యె
హోవా గొప్ప కార్యములను చేసెను.। ఓ దేశమా, 21
యెహోవా గొప్ప కార్యములను చేసును గనుక సం
తోషపడి గంతులు వేయుము.। భూ మృగములారా, 22
భయపడకండి; యేమంటే అరణ్యమందున్న బీటి స్థల
ములు గడ్డిని పుట్టించును; చెట్లు ఫలించును; అంజూ
రపు చెట్లున్న ద్రాక్ష చెట్లున్న వాటి వాటి రసమును
యిచ్చును.। కాబట్టి సీయోను పిల్లలారా, మీరు వుత్సా 23
హులై, మీ దేవుడైన యెహోవా యందు సంతోషిం
చండి; యేమంటే ఆయన దాని సమయములందు మీకు
వర్షమును కురిపించి, యింకా ఆయన మునుపటి వలెనే
తొలకరి వానన్ను కడవరి వాననున్న మీ కొరకు
కురిపించును.। కళ్లములు గోధుమతోటి నిండి వుండు 24
ను; ద్రాక్షా రసమున్న తైలమున్న గానుగల మీద
ప్రవహించును.। మరిన్ని మిడతలున్న గొంగళి పురు 25
గులున్న పసరు పురుగులున్న చీడ పురుగులున్న
అనే నేను పంపిన నా గొప్ప సమూహము అవి తిని
వేసిన సంవత్సర ఫలమును మీకు తిరిగీ యిత్తును.। కా 26
బట్టి మీరు విస్తారముగా తిని, తృప్తిబొంది, మీ కొరకు
యింత వింతగా జరిగించిన మీ దేవుడైన యెహోవా
నామమును స్తుతింతురు గాక; మరిన్ని నా జనులు యె
న్నటికిన్ని సిగ్గు పొందరు.। మరిన్ని మీ దేవుడనున్న 27
యెహోవానున్న అయిన నేను ఇశ్రాయేలీయులలో
వున్నానని మీరు తెలుసుకొందురు; నేను గాక మరి
యెవ్వడూ లేడు; యెన్నటికీ నా జనులకు సిగ్గు రాక
వుండును.। మరిన్ని యిక మీదట నేను సమస్తమైన 28
వారి మీద నా ఆత్మను కుమ్మరింతును; మీ కుమాళ్లున్న

మీ కుమార్తెలున్ను భవిష్యత్తును చెప్పుదురు; మీ
ముసలివారు స్వప్నమును కందురు; మీ పడుచువారు
29 దర్శనములను చూతురు.।మరిన్ని ఆ దినములందు నేను
నా ఆత్మను సేవకుల మీదనున్ను సేవకురాండ్ల మీదను
30 న్ను కుమ్మరింతున్ను.। మరిన్ని ఆకాశమందున్ను భూమి
యందున్ను అద్భుతములను అగుపర్తును; రక్తమున్ను
31 అగ్నియున్ను పొగయున్ను కలిగి వుండును.। యెహోవా
వాయొక్క భయంకరమున్ను ఘనమున్ను అయిన దినము
రాక మునుపే సూర్యుడు తేజోహీనుడగును; చంద్రు
32 డు రక్త వర్ణమవును.। అయితే యెహోవా నామ
మును స్మరించే వారందరున్ను రక్షణ పొందుదురు;
యేమంటే యెహోవా ఆనతిచ్చినట్టు సీయోను కొం
డకున్ను యెరూశలేముకున్ను మరిన్ని యెవరెవరిని యె
హోవా పిలుచునో వారికిన్ని రక్షణ కలుగును.

## 3. అధ్యాయము.

1 యిదుగో ఆ దినములందున్ను చెరలోకి పోయిన
యూదా వారినిన్ని యెరూశలేము కాపురస్తులనున్ను
2 నేను తిరిగీ రప్పించే కాలమందున్ను,। నేను సకల
జనాంగములను కూర్చి, యెహోషాఫాథు లోవ
లోకి రాజేసి, అక్కడ వారితో నా జనుల నిమిత్తము
న్ను ఇశ్రాయేలు దేశమనే నా స్వాస్థ్యము నిమిత్త
మున్ను వ్యాజ్యము జరిగింతును; యేమంటే వారు నా
జనులను జనాంగములలోకి చెదరవేసి, నా భూమిని
3 పాళ్లు పంచుకొనిరి.। నా జనుల మీద వారు చీట్లు
వేసిరి; వేశ్య కొరకు వొక చిన్నవాని యిచ్చిరి; ద్రా
క్షారసము పానము సేయుటకు వొక చిన్నదానిని అమ్మి
4 వేసిరి.। అయితే వో సోరు పట్టణమా, వో సీదోను
పట్టణమా, పెలెషెతు సరిహద్దులారా, మీకున్ను నా
కున్ను యేమి నిమిత్తము? మీరు నా వుపకారములకు
అపకారములు చేయవచ్చునా? వొక వేళ చేస్తే మీ
అపకారములను మీ శిరస్సుల మీదికే అతి శీఘ్రముగా
5 తిరిగీ రాజేతును.। యేమంటే నా వెండినిన్ని నా బంగా
రమునున్ను మీరు పట్టుకొని పోతిరి; నా ప్రియమైన
మంచి వస్తువులను తీసుకొని వెళ్లి,మీ గుళ్లలో వుంచుకొం
6 టిరి.। మరిన్ని యూదా వారినిన్ని యెరూశలేము పట్ట
ణపు వారినిన్ని వారి సరిహద్దులకు దూరము అయ్యే
7 టట్టు హెల్లేనిస్తులకు అమ్మి వేస్తిరి.। యిదుగో యే
స్థలమునకు వారిని మీరు వెళ్లనమ్మితిరో ఆ స్థలములో
నుంచి నేను వారిని రప్పించి, మీ అపకారములను మీ
8 శిరస్సుల మీదనే తిరిగీ వుంతును.। యేమంటే నేను
నీ కుమారులనున్ను కుమార్తెలనున్ను యూదా వారి
చేతులకు దొరికేటట్టు అమ్మి వేయింతును; వీరు వా
రిని దూర జనులైన ఆ సెబాయీయులకు అమ్మి వేతు
రని యెహోవా ఆనతిచ్చెను గనుక రూఢమవును.।
అన్య జనాంగములతో యుద్ధమునకు సిద్ధపడండని చా 9
టించండి; బలాఢ్యులను లేపండి; సైన్యస్థులందరినిన్ని
దగ్గిరికి రప్పించండి.। మీ నక్కులు కత్తులయ్యేటట్టు 10
న్ను మీ పోట కత్తులు యీటెలయ్యేటట్టున్ను సాగ
గొట్టించండి; బలహీనుడు నేను బలాఢ్యుడను అని
చెప్పనిమ్ము.। వో జనాంగములారా, మీరు కూడి 11
రండి; నలు దిక్కులనుంచీ మీరు కూడి రావలెను; వో
యెహోవా, నీ పరాక్రమశాలురను అక్కడె దిగేట
ట్టు చేయుము.। జనాంగములు లేచి యెహోషాఫాథు 12
లోవలోకి వత్తురు; యెందుకంటే, అక్కడ నేను ఆసీ
నుడనై, నఖముఖాలనున్ను యావజ్జనమునకున్ను న్యా
యము తీర్తును.। కొడవలి లోపటికి చాపి కోయండి; 13
యేమంటే పంట ముదిరినది; మీరు వచ్చి దిగండి; గా
నుక నిండి వున్నది; తొట్లు పొర్లి పారుతూ వున్నవి;
వారి దోషము మిక్కిలి అధికముగా వున్నది.। న్యాయ 14
ము తీర్చే లోవలో సమూహముల మీద సమూహ
ములు వున్నవి; యేమంటే న్యాయము తీర్చే లోవ
లో యెహోవా దినము సమీపమాయెను.। సూర్యు 15
డున్ను చంద్రుడున్ను కాంతి హీనులైరి; నక్షత్రముల
కాంతి తప్పను.। యెహోవా సీయోనులోనుంచి 16
ఆర్చును; యెరూశలేములోనుంచి తన శబ్దమును విని
పింప చేసును; ఆకాశమున్ను భూమిన్ని వణుకును;
అయితే యెహోవా తన జనులకు ప్రాపకుడైయున్ని
ఇశ్రాయేలు పుత్రులకు దాపుదైయున్ని వుండును.।
యీలాగున మీ దేవుడైన యెహోవా అనే నేను 17
సీయోననే పరిశుద్ధ పర్వతములో నివాసినై వున్నానని
మీరు తెలుసుకొందురు; అప్పుడు యెరూశలేము పరి
శుద్ధముగా వుండును; యిక మీదట అందులో విదేశ
వాసులు సంచరించరు.। మరిన్ని ఆ దినమందు పర్వత 18
మునుంచి కొత్త ద్రాక్షా రసమున్ను కొండనుంచి పా
లున్ను ప్రవహించును; యూదా నదులన్నిటినుంచీ
వుదకములు ప్రవహిస్తూ వుండును; మరిన్ని ధార యె
హోవా మందిరములోనుంచి వుబికి, పారి, షిద్దీము
లోవకు నీళ్లను యిచ్చును.। అయితే మిస్త్రీయులున్ను 19
ఎదోమువారున్ను యూదా పుత్రులను బలవంతము
చేసిరి గనుక మిస్రయీము దేశము పాడైపోవును;
ఎదోము దేశమున్ను వట్టి అరణ్యమౌను.। యేమంటే 20
వారి దేశమందు వీరు నిరపరాధి రక్తమును చిందించిరి;
అయితే యూదా యెన్నటికిన్ని యెరూశలేము తర
తరాల మట్టుకున్ను వుండును.। శుభ్రపరచని వారి రక్త
మును శుభ్రపరతును; యేమంటే యెహోవా సీయో
నులో నివాసము చేసును.

# ఆమోసుయొక్క గ్రంథము.

## 1. అధ్యాయము.

1 యూదా రాజయిన ఉజ్జీయా దినములందున్ను
ఇశ్రాయేలు రాజైన యోవాషు కుమారుడయిన యా
రొబాము దినములందున్ను భూకంపము పుట్టకము
నుపు రెండు సంవత్సరములకు ముందు తెకోవ పశువుల
కాపరులలో వున్న ఆమోసుకు ఇశ్రాయేలును గూర్చి
2 కనుబడిన సంగతులు, యేలాగంటే, । యెహోవా
సీయోనులోనుంచి ఆర్చును; యెరూశలేములోనుంచి
తన శబ్దమును వినిపింపజేసును; కాబట్టి పశువుల కా
పరుల కాపురములు మూల్గును, కర్మెలు శిఖరము యెండి
3 పోవును. । యిందుకు యెహోవా ఆనతిచ్చేదేమంటే,
దమస్కు చేసిన మూడు నాలుగు తప్పితముల నిమిత్త
ము తప్పకుండా శిక్షింతును; యేమంటే వారు పంట
దుళ్లగొట్టె యినుప సరుకులతోటి గిలాదును కొట్టిరి.।
4 కాబట్టి నేను హజాయేలు యింట్లోకి అగ్నిని పంపు
దును; అది బెన్హదదుయొక్క నగరులను మింగును.।
5 మరిన్ని దమస్కుయొక్క అడ్డు గడెలను విరిచి, బికాతు
ఆవెనులోనున్న కాపురస్తునిన్ని బేతెదెనులో గదమ
ట్టుకొన్న వానిన్ని సర్వ నాశనము చేతును; మరిన్ని
అరాము దేశస్థులు చెరగా కీరులోకి కొంచుపోబడు
6 దురని యెహోవా ఆనతిచ్చి, । మరిన్ని చెప్పేదేమంటే,
గాజా చేసిన మూడు నాలుగు తప్పితముల నిమిత్తము
తప్పకుండా శిక్షింతును; యేమంటే వారు చెర పట్టిన
వారినందరినిన్ని ఎదోము వారికి యిచ్చుటకు తీసుకొ
7 పోయిరి. । కాబట్టి నేను గాజాయొక్క గోడ మీదికి
అగ్నిని పంపుదును; అది దాని నగరులను మింగును.।
8 మరిన్ని అష్డోదులోనున్న కాపురస్తునిన్ని అష్కెలో
నులో గద పట్టుకొన్న వానిన్ని సర్వ నాశనముచేసి,
నా హస్తమును ఎక్రోను మీదికి తిప్పుదును; మరిన్ని
యింకా శేషించిన ఫెలిష్తీయులున్ను క్షయమవుదురు
9 అని కర్తయైన యెహోవా ఆనతిచ్చి, । మరిన్ని యె
హోవా చెప్పేదేమంటే, సోరు చేసిన మూడు నా
లుగు తప్పితముల నిమిత్తమూ నేను తప్పకుండా శిక్షిం
తును; యేమంటే వారు సహోదరుల ప్రమాణము
నిమిత్తము తలంచుకోక, చెరలో వున్న వారి నందరి
10 నిన్ని ఎదోమీయులకు యిచ్చిరి. । కాబట్టి నేను సోరు
యొక్క గోడ మీదికి అగ్నిని పంపింతును; అది దాని
11 నగరులను మింగునని ఆనతిచ్చి, । మరిన్ని యెహోవా
చెప్పేదేమంటే, ఎదోము చేసిన మూడు నాలుగు తప్పి
తముల నిమిత్తము నేను తప్పకుండా శిక్షింతును; యే
మంటే అతడు కనికరమును విడిచి, తన సహోదరుని
కత్తిచేత తరిమెను; అతని కోపము యెప్పటికీ మండు
తూ వుండెను; అతని కోపాగ్ని యెప్పటికీ రగులుతూ
వుండెను. । కాబట్టి నేను తేమాను మీదికి అగ్నిని పం 12
పుదును; అది వచ్చి, బొస్రాయొక్క నగరులను మిం
గునని ఆనతిచ్చి, । మరిన్ని యెహోవా చెప్పేదేమంటే, 13
అమ్మోను పుత్రులు చేసిన మూడు నాలుగు తప్పితముల
నిమిత్తమూ నేను తప్పకుండా శిక్షింతును; యేమంటే
వారి సరి హద్దును యింకా విస్తరింప చేయ దలచి, గిలా
దులో గర్భిణీ స్త్రీలయొక్క కడుపులను చించివేసిరి.।
కాబట్టి నేను రబ్బాయొక్క గోడ మీద అగ్నిని రా 14
జబెట్టుదును; అది యుద్ధపు దినముయొక్క ఆర్భా
టోటెన్ని సుడిగాలి దినముయొక్క ప్రళయ వాయువు
తోటెన్ని దాని నగరులను మింగును. । వారి రాజు చెర 15
లోకి కొంచుపోబడును; అతడున్ను అతని అధిపతు
లున్ను కూడా పోదురని యెహోవా ఆనతిచ్చెను.

## 2. అధ్యాయము.

మరిన్ని యెహోవా ఆనతిచ్చేదేమంటే, మో 1
యాబు చేసిన మూడు నాలుగు తప్పితముల నిమి
త్తము నేను తప్పగుండా శిక్షింతును; యేమంటే అతడు
ఎదోము రాజు దుమ్ములను కాల్చి భస్మము చేసెను. । కా 2
బట్టి నేను మోయాబు మీదికి అగ్నిని పంపుదును;
అది కెరియోతుయొక్క నగరులను మింగును; మో
యాబు మిక్కిలి గొల్లుతోనున్ను ఆర్పుతోనున్ను బాకా
నాదముతోనున్ను మరణమును పొందును. । మరిన్ని 3
మోయాబు దేశములోనుంచి నేను న్యాయ కర్తను
తెగవేతును; అతనితో కూడా అధిపతులందరినిన్ని
హతము చేతునని యెహోవా ఆనతిచ్చి, । మరిన్ని 4
యెహోవా చెప్పేదేమంటే, యూదా చేసిన మూడు
నాలుగు తప్పితముల నిమిత్తమూ నేను తప్పకుండా
శిక్షింతును; యేమంటే వారు యెహోవా న్యాయ
ప్రమాణమును నిర్లక్ష్యపెట్టి, ఆయన నిబంధనలను
గైకొనక పోయిరి; వారి పితృల వలెనే వారు అబద్ధ
మువల్ల క్రమము తప్పిరి. । కాబట్టి నేను యూదా మీ 5
దికి అగ్నిని పంపుదును; అది యెరూశలేము నగరును
మింగునని ఆనతిచ్చి, । మరిన్ని యెహోవా చెప్పేదే 6

మంటే, ఇశ్రాయేలు చేసిన మూడు నాలుగు తప్పిత
ముల నిమిత్తమూ నేను తప్పకుండా శిక్షింతును; యే
మంటే వారు ద్రవ్యము కొరకు నీతి పరునిన్ని పాద
7 రక్షల కొరకు బీదవానిన్ని అమ్మి వేసిరి. । దరిద్రుని శిర
స్సుమీద బుగ్గి పోసుటకు వారికి బహు ఆశ కలదు;
దీనుని మార్గమును వంకర చేతురు; మరిన్ని నా పరి
శుద్ధ నామము అవమానము పొందేటట్టు తండ్రిన్ని
కుమారుడున్ను వొక దాని యొద్దికే ప్రవేశింతురు. ।
8 మరిన్ని తాకట్టుపడిన బట్టలతో వారు సకల పీఠముల
యొద్దనూ పడుకొందురు; మరిన్ని తప్పు ద్రవ్యము
తోటి ద్రాక్షా రసము కొని వారి దేవాలయములందు
9 తాగుదురు. । అయితే నేను వారి ముందట అమోరీయు
లను నాశనము చేస్తిని; వారి పొడుగు ఆర్జ చెట్టంత
యై వుండును; ఆల వృక్షములకు కలిగినంత గట్టి వా
రికి కలిగి వుండెను; అయినప్పటికిన్ని నేను పైని వున్న
వారి ఫలములనున్ను కింద వున్నవారి వేరులనున్ను
10 నశింపచేస్తిని. । మరిన్ని నేను మిమ్మును మిస్రయీము
దేశములోనుంచి యివతలకు రప్పించి, నలభై సంవత్సర
ములు అరణ్యమందు తిప్పి, అమోరీయుల దేశమునకు
11 స్వతంత్రులగా చేస్తిని. । మరిన్ని మీ కుమారులలో
కొందరిని దీర్ఘదర్శులగానున్ను మీ పడుచువారి
లో కొందరిని నజోరీయులగానున్ను లేవచేస్తిని; వో
ఇశ్రాయేలు పుత్రులారా, యీ మాటలు నిజమైనవి
12 కావా! అని యెహోవా ఆనతిచ్చెను. । అయితే మీరు
నజోరీయులకు ద్రాక్షా రసమును తాగ యిస్తిరి; దీర్ఘ
దర్శులను చూచి, దీర్ఘదర్శనమును పలకవద్దని
13 చెప్పితిరి. । యిదుగో పంటచేను మోపులు నిండైన బం
డిని యేలాగున అణగతొక్కునో ఆలాగున నేను
14 మీ స్థలములను అణగ దొక్కుదును. । కాబట్టి అతివేగి
తప్పించుకోలేక వుండును; పరాక్రమశాలి తన బలము
వల్ల ధైర్యము తెచ్చుకో లేకపోవును; బలాఢ్యుడు
15 విడిపించుకో లేకపోవును. । విలుకాడు నిలువ లేకపో
వును; అతివేగిన్ని గుర్రమును యెక్కిన వాడున్ను
16 తప్పించుకోలేక వుండును. । మరిన్ని ఆ దినమందు బలా
ఢ్యులలో ప్రతాపము గలవాడు దిగంబరుడై పారి
పోవునని యెహోవా ఆనతిచ్చెను.

## 3. అధ్యాయము.

1 నేను మిస్రయీము దేశములోనుంచి యివతలకు
తెప్పించిన వో ఇశ్రాయేలు పుత్రులారా, మీ యం
దరిని గురించి యెహోవా ఆనతిచ్చిన వాక్యమును
2 వినండి; ఆయన ఆనతిచ్చేదేమంటే, । లోకమందున్న
సకల వంశికులలో మిమ్మును మాత్రమే నేను యెరిగి
యుంటిని; కాబట్టి మీరు చేసిన అన్యాయములన్నిటి
నిమిత్తమూ మిమ్మును శిక్షింతును. । సమాధానము లేకుం 3
డా యిద్దరు కూడుకొని నడువగలరా! । తినుటకు యే 4
దైనా దొరకనప్పుడు సింహము అడవిలో గర్జిల్లు
నా? కొదమ సింహము దేనినైనా పట్టక తన గుహలో
బొబ్బ పెట్టునా! । భూమి మీద వురులు వొగ్గుట లేక 5
పోతే పక్షి వురులలో చిక్కునా! నేల మీదనుంచి
వురులను యెత్తుకొనిన వాడు యేమైనా యెత్తని వాడై
వుండునా! । పట్టణమందు బాకా నాదమైతే జనులకు 6
భయము రాదా! యెహోవా ఆజ్ఞ చేయకపోతే పట్ట
ణమందు యే వుపద్రవమైనా వుండునా! । అవశ్యము 7
గా యెహోవా తన రహస్యమును తన సేవకులైన
దీర్ఘదర్శులకు బైలుపడ చేస్తేనే గాని యేమిన్ని
చేయ లేరు. । సింహము గర్జిల్లెను, అప్పుడు యెవరికి 8
భయము లేక వుండును; కర్తయైన యెహోవా
సెలవు యిచ్చెను, అప్పుడు యెవ్వరూ భవిష్యత్తును
పలుకక వుందురు! । అష్దోదు నగరులలోనున్ను మిస్ర 9
యీము దేశపు నగరులలోనున్ను ప్రకటన చేయవల
సినదేమంటే, మీరు షోమ్రోను పర్వతముల మీదికి
కూడా వచ్చి, దానిలో వున్న బహు గల్లత్తున్ను దాని
లో బాధపడిన వారినిన్ని చూడండని చెప్ప వలెను. ।
యిందుకు యెహోవా చెప్పేదేమంటే, బలవంతము 10
చేతనున్ను అపహరించుటచేతనున్ను తమ నగరులలో
పదార్థములను దాచే వారు నీతిని జరిగించుటకు యె
రుగరు. । కాబట్టి కర్తయైన యెహోవా ఆనతిచ్చే 11
దేమంటే, దేశము అంతటికీ విరోధియైన వొకడు వుం
డును; అతడు నీ శక్తిని తక్కువ చేసును; నీ నగరులను
పాడు చేసునని ఆనతిచ్చి, । మరిన్ని యెహోవా చెప్పే 12
దేమంటే, బోయెడు సింహము నోటిలోనుంచి రెండు
కాళ్లనైనా చెవి ముక్కనైనా యేలాగు విడిపించుకొ
నునో ఆలాగున షోమ్రోనులో మంచపు పక్కమీద
కూర్చుని వున్న ఇశ్రాయేలు పుత్రులున్ను దమస్కు
లో శయ్య మీద కూర్చుని వున్న వారున్ను విడిపిం
చబడుదురు. । యిందుకు సర్వ సామర్థ్యము గల కర్త 13
యైన యెహోవా ఆనతిచ్చేదేమంటే, మీరు ఆలకిం
చండి; యాకోబు యింటి కూటములలో రూఢముగా
చెప్పండి. । యేమంటే ఇశ్రాయేలు చేసిన తప్పితముల 14
నిమిత్తము నేను అతని శిక్షించే దినమున బేతేలుయొక్క
పీఠమును గురించిన్ని శిక్షింతునని చెప్పండి; యేమంటే
ఆ పీఠముయొక్క కొమ్ములు తెగవేయబడి అది కింద
బడి పోవును. । చలి కాలపు యింటినిన్ని వేసవి కా 15
లపు యింటినిన్ని కొట్టివేతును; దంతపు యిండ్లు లయ
మవును; ఘనమైన యిండ్లు సర్వనాశనమవునని యె
హోవా ఆనతిచ్చెను.

## 4. అధ్యాయము.

1 దరిద్రులను బాధపెట్టుతున్న లేమిగల వారిని
నలుపుతున్న వారి యజమానులతో తాగుటకు యిమ్మని
చెప్పుతున్న వున్నటువంటి షోమ్రోను పర్వతమందున్న
బాషాను పశువులారా, కర్తయైన యెహోవా తన
పరిశుద్ధతయందు ప్రమాణము చేసి ఆనతిచ్చిన వాక్య
2 మును వినండి.। అది యేదంటే, యిదుగో, మీ మీదికి
దినములు వస్తూ వున్నవి; అప్పుడు మీరు కొంకులచేత
నున్ను మీ వెనుకటి వారు మత్స్యములను పట్టే గాల
3 ముల చేతనున్ను లాగబడుదురు.। మీరు గంతలలో
నుంచి బైలు వత్తురు; ప్రతి పశువున్ను దాని దాని యె
దుటనున్న గంతలలోనుంచి బైలువెళ్లి, మాంసపు వీధి
లోకి తోలివేయపడునని యెహోవా ఆనతిచ్చెను.।
4 బేతేలుకు వచ్చి, తిరుగుబాటు చేయండి; గిల్గాలుకు వెళ్లి,
మరింత వ్యతిరిక్తము చేసి, ప్రతి దినమున వుదయమందు
బలులనున్ను మూడో సంవత్సరమైనప్పుడు పదో భాగ
5 మును తీసుకో వచ్చి,। పులిసిన పిండితోటి స్తోత్రార్ప
ణను చెల్లించి, స్వేచ్ఛవల్లనైన అర్పణను గురించి చా
టించి ప్రకటన చేయండి; యేమంటే వో ఇశ్రాయేలు
పుత్రులారా, యీలాగున మీ మనోభావమై వున్న
6 దని కర్తయైన యెహోవా ఆనతిచ్చెను.। కాబట్టి
మీ పట్టణములన్నిటి యందూ నేను మీకు శుభ్ర
మయిన దంతములను కలుగజేస్తిని; మీ స్థలములన్నిటి
యందూ ఆహారమును లేకపోచేస్తిని; అయినప్పటికిన్ని
మీరు నా తట్టు తిరుగరైతిరని యెహోవా ఆనతి
7 చ్చెను.। మరిన్ని యిక మూడు నెలలకు కోత వస్తుంద
నగానే నేను వర్షమును కట్టివేస్తిని; యీ పట్టణము
మీద కురవచేసి, ఆ పట్టణము మీద కురవ చేయక
వుంటిని; వొక చోట వర్షము కురిసెను; వర్షము
8 లేనిచోటు యెండిపోయెను.। కాబట్టి రెండు మూడు
పట్టణములు మరి వొక పట్టణమునకు నీళ్ల కొరకు
వెళ్లెను; అయితే వారికి దాహము తీరక పోయెను;
అయినప్పటికిన్ని మీరు నా తట్టు తిరుగరైతిరని యె
9 హోవా ఆనతిచ్చెను.। మరిన్ని మీ సస్యములను గా
డ్పుచేతనున్ను చిత్త పట్టుటచేతనున్ను కొట్టితిని; మీ
వనములున్ను ద్రాక్ష తోటలున్ను అంజూరపు చెట్లు
న్ను ఇప్ప చెట్లున్ను పెరిగి వున్నప్పుడు గొంగలి పురు
గు వచ్చి వాటిని తినివేసెను; అయినప్పటికిన్ని మీరు
నా తట్టు తిరుగరైతిరని యెహోవా ఆనతిచ్చెను.।
10 మరిన్ని మిస్రయీముకు పంపించినట్టు నేను మీలోకి
తెగుళ్లను పంపితిని; మీ పడుచు వాండ్లను కత్తిచేత
హతము చేయిస్తిని; మీ గుర్రములను లేకపోచేస్తిని;
మీ దండు పేటయొక్క దుర్గంధము మీ నాసికా
రంధ్రములలోకి యెక్కచేస్తిని; అయినప్పటికిన్ని మీరు
నా తట్టు తిరుగరైతిరని యెహోవా ఆనతిచ్చెను.।
దేవుడు సొదొమనున్ను గొమొర్రానున్ను బోర్లించి 11
నట్టు నేను మీలో కొందరిని బోర్లించితిని; మీరు
న్ను అగ్నిలోనుంచి తీసివేయబడిన కొరవులైనట్టు తప్పిం
చుకొంటిరి; అయినప్పటికిన్ని మీరు నా తట్టు తిరుగ
రైతిరని యెహోవా ఆనతిచ్చెను.। కాబట్టి వో ఇశ్రా 12
యేలా, నేను ఆలాగున మిమ్మును చేతును గనుక, వో
ఇశ్రాయేలా, మీ దేవుని యెదుటికి వచ్చుటకు సిద్ధ
ముగా వుండుము.। యేమంటే, యిదుగో, పర్వతములను 13
రూపించి, వాయువును సృష్టించి, మనుష్యునికి తన
యోజన యేమిటో అది తెలియచేసి, వుదయమును చీక
టిగాచేసి, భూమియొక్క వున్నత స్థలముల మీద నడి
చిన వాడు యెహోవా అయి వున్నాడు; ఆయనకు
సర్వసామర్థ్యము గల దేవుడన్న నామము కలదు.

## 5. అధ్యాయము.

వో ఇశ్రాయేలు యింటివారలారా, మిమ్మును 1
గురించి నేను వుపక్రమించే అంగలార్పు వాక్యమును
వినండి.। యేమంటే, ఇశ్రాయేలు కన్యక కూలిపోయి, 2
యెప్పటికీ లేవకుండా వుండును; ఆమె తన భూమి
మీద విడవబడెను; దానిని లేవనెత్తుటకు వొకడున్ను
లేడు.। యిందుకు కర్తయైన యెహోవా ఆనతిచ్చే 3
దేమంటే, వెయిమందితో బయిలు వెళ్లిన పట్టణమందు
నూరుమందిన్ని నూరుమందితో బయిలు వెళ్లిన పట్టణ
మందు పదిమందిన్ని ఇశ్రాయేలు యింటికి శేషించి
వుందురని ఆనతిచ్చి,। యిందుకు యెహోవా ఇశ్రా 4
యేలు యింటివారితో మరిన్ని చెప్పేదేమంటే, నన్ను
వెతుకండి అప్పుడు మీరు బ్రతుకుదురు.। యింతే 5
కాని బేతేలును వెతుకకండి; గిల్గాలులోకి ప్రవేశించ
కండి; బెయేర్షెబకు వెళ్లకండి; యేమంటే గిల్గాలు
అవశ్యముగా చెరలోకి పోవును; బేతేలు పాడైపోవు
ను.। యెహోవాను వెతుకండి అప్పుడు మీరు బ్రతు 6
కుదురు; వెతుకని పక్షమందు ఆయన యోసేపు యిం
ట్లో అగ్ని అయినట్టు భగ్గున లేచి దానిని దహించును;
దీనిని ఆర్పుటకు బేతేలులో వొకడున్ను లేకపోవును.।
న్యాయమును విషపు కూరకు తిప్పి, నీతిని భూమి 7
యందు మాన్పించిన వారలారా,। స్వాతీ నక్షత్రమును 8
న్ను మృగశీర్ష నక్షత్రమునున్ను సృష్టించి, మృత్యు
వు నీడను వుదయమునకు తిప్పి, పగటిని రాత్రివలె అం
ధకారముచేసి సముద్రోదకములను పిలిచి భూ ముఖ
ము మీద వాటిని కుమ్మరించిన వాని వెదకండి; ఆయన
నామము యెహోవా.। ఆయన దోపుడు పోయిన 9
వానికి బురుజుల మీదికి కూడా యెక్కే బలము కలుగ

10 జేసును. । ద్వారమందుండి గద్దించే వాని యందు
వారు పగచేతురు; యథార్థముగా పలికే వాని యందు
11 రోయుదురు. । అయితే మీరు దరిద్రుని కింద తొక్కి,
పంట మోపును అతని యొద్దనుంచి లాగుకొంటిరి
గనుక, చెక్కిన రాళ్లచేత మీరు యిండ్లను కట్టుకొనిన
ప్పటికిన్ని వాటి యందు కాపురము చేయకపోదురు;
శృంగారమైన ద్రాక్ష తోటలను నాటినప్పటికిన్ని వా
12 టి పండ్ల రసమును మీరు తాగకపోదురు. । యేమంటే
అనేకమైన మీ అక్రముములనున్ను మీ ఘోరమైన
పాపములనున్ను నేను యెరిగి వున్నాను; యేమంటే
మీరు నీతిపరుని బాధ పెట్టుదురు; లంచము పుచ్చు
కొందురు; ద్వారమందు బీదవానికి అన్యాయము తీర్తు
13 రు. । కాబట్టి ఆ కాలమందు బుద్ధిమంతులు వూరకొని
వుందురు; యేమంటే అది బహు శ్రమ కాలమవును.।
14 మీరు బ్రతికే కొరకు కీడును విడిచి, మేలును వెత
కండి; అప్పుడు మీరు చెప్పుకొన్నట్టు యెహోవా
అనే సర్వ సామర్థ్యము గల దేవుడు మీకు తోడు
15 గా వుండును. । కీడు యందు పగగానున్ను మేలు యం
దు స్నేహముగానున్ను వుండండి; ద్వారమందు న్యా
యమును స్థిరపర్చండి; యెహోవా అనే సర్వసామ
ర్థ్యము గల దేవుడు యోసేపుయొక్క శేషించిన
16 వారి యందు కనికరించునేమో;। యేమంటే ఆలాగైతే
యెహోవా అనే సర్వ సామర్థ్యము గల దేవుడు
ఆనతిచ్చేదేమంటే, సకల వీధులందు అంగలార్పులు
కలిగి వుండును; సకల రాజ మార్గములందున్ను అంద
రూ అయ్యయ్యో అని వ్యవసాయ దారులనున్ను రోద
నము చేయ నేర్పు గల వారినిన్ని అంగలార్చుటకు
17 పిలుతురు. । మరిన్ని సమస్తమైన ద్రాక్ష తోటలలో
నున్ను రోదనము కలుగును; యేమంటే నేను నచ్చి,
మీ మధ్యనుంచి గడచిపోదునని యెహోవా ఆనతి
18 చ్చెను. । యెహోవా దినమును కోరిన వారలారా,
మీకు అయ్యో! యెహోవా దినమందు మీకు ప్రయో
జనమేమి? అది వెలుగు కాదు; అంధకారమై వుం
19 డును. । వొకడు సింహము యొద్దనుంచి తప్పించుకొనిన
వెనుక వెలుగుబంటికి యెదురైనట్టున్ను, యింట్లోకి
వెళ్లి గోడ మీద తన చేతిని చాపిన వెనుక పాము
20 అతని కరిచినట్టున్ను వుండును. । కాబట్టి యెహోవా
దినము వెలుగు కాదు, అంధకారమూను; కాంతి యెం
తమాత్రమూ లేదు మిక్కిలి చీకటిగా వుండును. ।
21 మీ పండుగ దినముల యందు నేను పగగా వున్నాను;
అవి నాకు అసహ్యముగా వున్నవి; నిర్ణయపు దిన
ములందు మీరు యెక్కించిన ధూపపు వాసన నేను
22 చూడక వుందును. । మీరు నాకు హోమములనున్ను
భోజనార్పణలనున్ను చెల్లించినప్పటికిన్ని నేను వా
టిని అంగీకరించను; కొవ్విన మీ పశువులచేత మీరు
సంతోషార్పణలను చెల్లిస్తే నేను వాటిని లక్ష్యపెట్ట
ను. । మీ పాట శబ్దము నాకు దూరము చేతురుగాక; 23
మీ వీణల నాదమును నేను వినను. । కాబట్టి న్యాయ 24
ము వుదకముల వలెనున్ను నీతి గొప్ప ప్రవాహము
వలెనున్ను ప్రవహించును గాక. । వో ఇశ్రాయేలు 25
యింటివారలారా, అరణ్యమందు నలభై సంవత్సరములు
బలులనున్ను అర్పణనున్ను నాకు మాత్రమే చెల్లిస్తి
రా! । నిజముగా మోలెఖున్ను కియూను అనే మీ విగ్ర 26
హములయొక్క డేరాల కొరకున్ను మీరు చేసుకొ
నిన మీ దేవునియొక్క చుక్క కొరకున్ను మీరు యె
త్తుకొంటిరి. । కాబట్టి నేను దమస్కు పట్టణము అవతల 27
చెరలోకి మిమ్మును పోచేతునని సర్వ సామర్థ్యము
గల దేవుడనే నామము గల యెహోవా ఆనతిచ్చెను.

## 6. అధ్యాయము.

సీయోను యందు సుఖముగా వున్న వారికి అయ్యో! 1
యెవర్లి యొద్దికి ఇశ్రాయేలు యింటివారు వస్తూ వున్నా
రో, అనగా, జనులలో పేరుబడి షోమ్రోను పర్వత
మందు నమ్మినవారికిన్ని అయ్యో! । కల్నేకు వెళ్లి చూ 2
డండి; అక్కడనుంచి హమాతు మహా పురమునకు
వెళ్లండి; అప్పుడు పెలిష్తీయులయొక్క గాతు పట్టణ
మునకు దిగండి; అవి యీ రాజ్యముల కంటే విశేష
మైనవో కావో, వాటి సరిహద్దులు మీ సరిహద్దుల
కంటే విస్తారమైనవో కావో చూడండి. । శ్రమ దిన 3
ము బహు దూరమని అనుకొని అన్యాయపు పీఠమును
దగ్గిరికి తెప్పించుకొని, । దంతపు మంచముల మీద శయ 4
నిస్తూ, పాన్పుల మీద తమ ఒడళ్లు చాచుకొంటూ,
మందలో విశేషమైన గొర్రెపిల్లలనున్ను సాలలో కొ
వ్విన పెయ్యలనున్ను తింటూ, । వీణతోటి కలిసి పాడు 5
చూ, దావీదు వలెనే వాయించే వాటిని కల్పించు
కొంటూ, । పాత్రలతో ద్రాక్షా రసమును తాగుతూ, 6
పరిమళ తైలమును పూసుకొంటూ వున్న మీరు యో
సేపు వుపద్రవమును గురించి చింతపడే వారు కారు.।
కాబట్టి ముందుగా చెరలోకి వెళ్లే వారితో కూడా 7
వీరు చెరలోకి వెళ్లుదురు; సుకుమారుల విందులు లేక
పోవును. । కర్తయైన యెహోవా తన్ను గురించి 8
ప్రమాణముచేసి, యెహోవా అనే సర్వసామర్థ్య
ముగల దేవుడు ఆనతిచ్చేదేమంటే, యాకోబు అతి
శయము నాకు అసహ్యమై యున్నది; అతని నగరులు
నాకు అసమ్మతమై యున్నవి; కాబట్టి నేను పట్టణము
నున్ను దానిలో వున్న సమస్తమునున్ను శత్రువుని చేతికి
దొరక చేతునని ఆనతిచ్చెను. । అప్పుడు వొక యింట్లో 9
పదిమంది వుంటే వారు మరణమవుదురు. । యింట్లో 10

నుంచి దుమ్ములను బైటికి తెచ్చుటకు సన్నిహిత బంధు
వుడయినా మరణమైన వాని కాల్చే వాడైనా వచ్చి,
యింట్లో వున్నవాని చూచి, యింకా నీ యింట్లో మరి
యేదైనా వున్నదా అని అడిగితే, అతడు మరి యేమీ
లేదని చెప్పినప్పుడు, అతని చూచి నీ నోరు మూసు
కొమ్ము, యేమంటే యిప్పుడు మనము యెహోవా
11 నామమును పిలిచే సమయము కాదని చెప్పును. । యే
మంటే, యిదుగో, యెహోవా ఆజ్ఞ ఆయెను; ఆయన
గొప్ప యిండ్లనున్ను చిన్న యిండ్లనున్ను కొట్టి, కంత
12 లుగానున్ను బీటలుగానున్ను చేసును. । గుర్రములు
మెట్టల మీద పరుగెత్తునా? అక్కడ యెవడైనా యేరు
వూచి దున్ను నా? యేమంటే మీరు న్యాయమును
చేదుకున్న నీతియొక్క ఫలమును విషపు కూరకున్న
13 తిప్పితిరి. । అంతట మేమే మా బలము చేతను మా శృంగ
ములను సంగ్రహించుకుంటిమని అనుకొన్న మీరు విఫ
14 లమైన దాని యందు అతిశయిస్తూ వున్నారు. । యిం
దుకు యెహోవా అనే సర్వసామర్థ్యము గల దేవుడు
ఆనతిచ్చేదేమంటే, ఓ ఇశ్రాయేలు యింటివారలా
రా, యిదుగో, నేను మీ మీదికి వొక జనాంగమును
లేవ చేతును; అది వచ్చి, హమాతు ద్వారము మొదలు
కొని అరణ్యముయొక్క నది మట్టుకు నన్ను యిబ్బంది
పచర్చనని ఆనతిచ్చెను.

## 7. అధ్యాయము.

1 కర్తయైన యెహోవా నాకు చూపించినలాగు,
యేమంటే, కడవరి గడ్డి మొలిచే కాలమందు యిదుగో
ఆయన మిడతలను పుట్టించెను; యిదుగో అది రాజు
యొక్క గడ్డి కోత అయిన తరువాత మొలిచిన గడ్డి
2 యై వుండెను. । అయితే ఆ మిడతలు భూమి యందుండే
గడ్డి యావత్తున్ను తింటూ వున్నప్పుడు చెప్పినదేమం
టే, ఓ కర్తవైన యెహోవా, నీవు దయచేసి క్షమిం
చుము; నీచుడైన యాకోబు యేలాగు నిలుచునని చెప్పి
3 నప్పుడు, । యెహోవా దీని గురించి పశ్చాత్తప్తుడై,
4 యిది కానివ్వనని యెహోవా ఆనతిచ్చెను. । మరిన్ని
కర్తయైన యెహోవా నాకు చూపించినలాగు, యే
మంటే, యిదుగో కర్తయైన యెహోవా న్యాయ
మును విధించుటకు అగ్నిని పిలుస్తూ వుండెను; కాబట్టి
అది వచ్చి, బహు అగాధమైన దాని మింగి, భూమిలో
5 వొక భాగము భక్షించెను. । అప్పుడు నేను చెప్పినదే
మంటే, ఓ కర్తవైన యెహోవా, యిది మానివే
యుము; నీచుడైన యాకోబు యేలాగు నిలుచునని
6 చెప్పినప్పుడు, । పశ్చాత్తప్తుడై, యిది కానివ్వనని కర్త
7 యైన యెహోవా ఆనతిచ్చెను. । మరిన్ని ఆయన
నాకు చూపించినది యేమంటే, యిదుగో, యెహో
వా గుండు నూలు చేత బట్టుకొని, గుండు నూలుతోటి
కట్టిన గోడ మీద నిలిచి వుండెను. । అప్పుడు యెహో 8
వా నాతో ఓ ఆమోసూ, నీకు కనుబడినది యేమి
టని అడగగా, నాకు గుండు నూలు కనుబడినదని అని
నప్పుడు, యెహోవా ఆనతిచ్చేదేమంటే, యిదుగో,
ఇశ్రాయేలనే నా జనుల మధ్యను నేను గుండు నూ
లును ఆడింతును; యిక నేను వారిని కాయక వుందు
ను. । యేమంటే ఇశ్రాయేలుయొక్క వున్నత స్థలములు 9
పాడైపోవును; ఇశ్రాయేలుయొక్క పరిశుద్ధ స్థలములు
నశించును; కత్తితోటి నేను యారొబాము యింటి మీ
దికి వత్తునని ఆనతిచ్చెను. । అప్పుడు బేతేలుయొక్క 10
అర్చకుడైన అమస్స్యా ఇశ్రాయేలు రాజైన యారొ
బాముకు వర్తమానమును పంచినదేమంటే, ఇశ్రాయే
లు యింటివారిలో ఆమోసు నీ మీద తిరుగుబాటు
చేసెను; అతని మాటలన్నిన్ని భరించే శక్తి దేశమునకు
లేకపోయెను. । యేమంటే ఆమోసు యారొబాము 11
కత్తిచేత మరణమువుననిన్ని అవశ్యముగా ఇశ్రాయేలీ
యులు చెరగా తమ దేశములోనుంచి కొంచుపోబడు
దురనిన్ని చెప్పెనని చెప్పి పంపెను. । మరిన్ని అమస్స్యా 12
ఆమోసును చూచి, చెప్పినదేమంటే, ఓ దీర్ఘదర్శీ,
నీవు యూదా దేశమునకు తప్పించుకొ వెళ్లి, అక్కడ
నీ ఆహారమును తిని, అక్కడ భవిష్యత్తుగా పలుకు
ము. । అయితే బేతేలులో రాజుయొక్క పరిశుద్ధ స్థల 13
మున్ను రాజు మందిరమున్ను వున్నది గనుక యిక నీవు
అక్కడ భవిష్యత్తు పలక కూడదని చెప్పినప్పుడు, ।
ఆమోసు అమస్స్యాతో చెప్పినదేమంటే, నేను దీర్ఘ 14
దర్శినైనా దీర్ఘదర్శి కుమారుడనైనా కాను; పశు
వుల కాపరినిన్ని రావి పండ్లను యేరేవాడనున్న అయి
వుంటిని. । అయితే మంద వెంట నేను వెళ్లుతూ వుండ 15
గా, యెహోవా నన్ను పిలిచి, నీవు వెళ్లి, ఇశ్రాయేలు
అనే నా జనులతో భవిష్యత్తుగా పలుకుమని నాతో
సెలవు యిచ్చెను. । కాబట్టి నీవు యెహోవా వాక్య 16
మును వినుము; నీవు ఇశ్రాయేలును గురించి భవిష్యత్తు
పలుక కూడదనిన్ని ఇస్సాకు యింటిని గురించి మాట
జార విడువ గూడదనిన్ని చెప్పితివి. । కాబట్టి యె 17
హోవా ఆనతిచ్చేదేమంటే, నీ భార్య పట్టణమందు
వేశ్య అవును; నీ కుమారులున్ను కుమార్తెలున్ను కత్తి
చేత కూలుదురు; నీ భూమి నూలుచేత విభాగించబడు
ను; నీవు అపవిత్రమైన దేశమందు మరణమవుదువు;
అవశ్యముగా ఇశ్రాయేలీయులు చెరగా తమ దేశము
లోనుంచి కొంచుపోబడుదురని ఆనతిచ్చెనని చెప్పెను.

## 8. అధ్యాయము.

మరిన్ని కర్తయైన యెహోవా నాకు చూపిం 1
చినదేమంటే, యిదుగో, వేసవి కాలపు పండ్ల గంప

2 నాకు కనుబడెను. । అప్పుడు ఆయన నాతో, ఓ
ఆమోసూ, నీకు కనుబడినది యేమిటని అడగగా, నాకు
వేసవి కాలపు పండ్ల గంప కనుబడినదని అన్నప్పుడు,
యెహోవా నాతో ఆనతిచ్చినదేమంటే, ఇశ్రాయే
లనే నా జనులకు అంతము వచ్చెను; యిక నేను వారిని
3 కాయక వుందును. । యిందుకు కర్తయైన యెహో
వా ఆనతిచ్చేదేమంటే, గుడిలో పాడే పాటలు ఆ దిన
మందు రోదనములు అవును; సకల స్థలములందు శవ
ములు అనేకమవును; మౌనులై వారు వాటిని బైట
4 వేతురని ఆనతిచ్చెను. । దేశమందుండే బీదలు క్షీణించే
టట్టు దరిద్రులను మింగిన వారలారా, యిది వినండి.।
5 మీరు అనుకో వలసినదేమంటే, మనము పంట అమ్మ
టకు అమావాస్యయున్ను సబ్బాతున్ను యెప్పుడు పో
వుననిన్ని, ఏఫా తక్కువగానున్ను షెకేలు యెక్కువ
గానున్ను కపటము చేత అన్యాయపు త్రాసును చేసి,।
6 మనము గోధుమను బైలు పెట్టగలందులకున్ను ద్రవ్య
ము చేత దరిద్రులనున్ను పాదరక్షలచేత లేమిగల వారి
నిన్ని కొనగలందులకున్ను గోధుమ పొట్టు అమ్మగలం
దులకున్ను సబ్బాతు దినము యెప్పుడు పోవుననిన్ని
7 మీరు అనుకొంటిరి. । కాబట్టి యెహోవా యాకోబు
యొక్క మాహాత్మ్యముచేత ప్రమాణముచేసి, నిజముగా
వారి చేష్టలలో యే ఒక దానిని అయినా నేను యె
8 ప్పటికీ మరువనని ఆనతిచ్చెను. । యిందువల్ల దేశము
వణకక వుండునా! అందులో కాపురస్తులందరున్ను
మూల్గక వుందురా? నిజముగా అది ప్రవాహము వలె
పైకి యెక్కి కొట్టుకొ పోవును; మిస్రయీము దేశము
9 నది వలె మునిగిపోవును. । మరిన్ని యిందును గురించి
కర్తయైన యెహోవా ఆనతిచ్చేదేమంటే, ఆ దినమున
నేను మధ్యాహ్న కాలమందే సూర్యుని అస్తమింప
జేసి, పగటి వెలుగు బహు కాంతిగా వున్నప్పటికిన్ని
10 భూమిని చీకటిగా చేతును. । మీ సంభ్రమములను
మూల్గుటల కొరకున్ను మీ పాటలన్నిటినిన్ని రోదన
ముల కొరకున్ను తిప్పుదును; యావత్తు నడుములు గో
నెలు గలవిగానున్ను యావత్తు శిరస్సులున్ను బోడివి
గానున్ను చేతును; యేక పుత్రుని కొరకు ఒకడు
మూల్గినట్టు దేశమును మూల్గేటట్టు చేతును; దానికి
చేదైనా అంత్య దినమును రాచేతునని ఆనతిచ్చి,।
11 మరిన్ని కర్తయైన యెహోవా చెప్పేదేమంటే, యి
దుగో దినములు వస్తూ వున్నవి; అప్పుడు దేశము మీదికి
క్షామమును పంపుదును; అది ఆహారము లేకనున్న నీళ్లు
లేకనున్న కాదు, యెహోవా వాక్యపు క్షామమై
12 వుండును. । కాబట్టి వారు యీ సముద్రమునుంచి ఆ
సముద్రమునకున్ను వుత్తర దిక్కునుంచి తూర్పు దిక్కు
కున్ను సంచరింతురు; యెహోవా వాక్యమును వెతు
కుటకు అక్కడక్కడ తిరుగులాడినప్పటికిన్ని అది వా
రికి దొరకక వుండును. । ఆ దినమందు చక్కని కన్య 13
లున్ను పడుచువారున్ను దప్పికిచేత సొమ్మసిల్లి పోదు
రు. । ఓ దానూ, నీ దేవుడు సజీవుడనిన్ని, బెయే 14
షెబా మార్గము జీవపుదనిన్ని, షోమ్రోను పాప
మును గురించి ప్రమాణము చేసిన వారికి అయ్యో!
వారు కూలిపోయి, యెప్పటికీ లేవలేక పోదురు.

## 9. అధ్యాయము.

యెహోవా పీఠము మీద నిలిచి వుండుట నాకు 1
కనుబడెను; అప్పుడు ఆయన నాకు సెలవు యిచ్చిన
దేమంటే, ద్వారబంధములు కదిలేటట్టు పై కమ్మి కదల
గొట్టుము; యేమంటే వారందరికిన్ని శిరస్సుల మీద
గాయములు చేసి, వారి కట్టకడ వాని పర్యంతము
కత్తిచేత హతము చేయింతును; పారిపోవలెనని వున్న
వారు పారిపోలేక వుందురు; తప్పించుకో వలెనని వున్న
వారు విడిపించుకోలేక వుందురు. । వారు తవ్వుకొని 2
పాతాళములోకి చొచ్చినప్పటికిన్ని అక్కడనుంచి నా
హస్తము వారిని బైటికి లాగును; ఆకాశమునకు యె
క్కిపోయినప్పటికిన్ని అక్కడనుంచి వారిని దింపు
దును. । కర్మెలు పర్వతములో దాగి వున్నప్పటికిన్ని 3
నేను వారిని వెతికి అక్కడనుంచి బైటికి తీతును; నా
కండ్లకు మరుగుగా వారు సముద్రములో మునిగి వున్న
ప్పటికిన్ని అక్కడ సర్పముకు నేను ఆజ్ఞ యిచ్చినం
దున అది వారిని కరుచును. । వారి శత్రువులవల్ల వారు 4
చెరలోకి పోయినప్పటికిన్ని అక్కడ నేను కత్తికి ఆజ్ఞ
యిచ్చినందున అది వారిని హతము చేసును; మేలు
యిచ్చుటకు కాదు కీడు యిచ్చుటకు నా దృష్టి వారి
పైని వుంతును. । యేమంటే సర్వ సామర్థ్యము గల 5
కర్తయైన యెహోవా హస్తము దేశమును ముట్టిన
ప్పుడు అది కరిగిపోవును; అందులో కాపురస్తులంద
రున్ను మూల్గుదురు; అది ప్రవాహమువలె యెక్కి,
మిస్రయీము దేశపు వరదలోనైనట్టు మునిగి పోవును.।
ఆయన తన పై అంతస్తులను ఆకాశమందు కట్టుకొని, 6
తన కొట్లకు భూమి యందు పునాదులను వేసుకొనెను;
సముద్రోదకములను పిలిచి, భూ ముఖము మీద కుమ్మ
రించెను; ఆయన నామము యెహోవా. । ఓ ఇశ్రా 7
యేలు పుత్రులారా, యెహోవా ఆనతిచ్చేదేమంటే,
మీరు నాకు కూషు పుత్రుల వలెనే వున్నారు కారా!
మిస్రయీము దేశములోనుంచి ఇశ్రాయేలీయులనున్ను
కఫ్తోరునుంచి ఫెలిష్తీయులనున్ను కీరులోనుంచి అరా
ము వారినిన్ని బైటికి రప్పించిన వాడను నేనే కానా!!
అదుగో కర్తయైన యెహోవా దృష్టి యీ పాపపు 8
రాజ్యము మీద వున్నది; దాని గురించి యెహోవా

ఆనతిచ్చేదేమంటే, నేను యాకోబు యింటిని సర్వ
నాశనము చేయక, ఆ రాజ్యము మట్టుకు భూ ముఖము
9 మీదినుంచి నాశనము చేతును. । యేమంటే యిదుగో
నేనే ఆజ్ఞను యిత్తును; జల్లెడతో జల్లించినట్టు ఇశ్రా
యేలు యింటివారిని సకల జనాంగములలో జల్లింతును;
అయినప్పటికిన్ని వొక విత్తనము అయినా నేల మీద
10 పడకపోవును. । కాబట్టి ఆ కీడు మనలను డాయుట
కున్ను యెదురించుటకున్ను లేకపోవునని అనుకొన్న
నా జనులలో వున్న పాపాత్ములందరున్ను కత్తిచేత
11 హతమౌదురు. । ఆ దినమందు నేను దావీదుయొక్క
కూలిన డేరాను లేవనెత్తి, దాని పోయిన చోట్లను
12 కప్పుదును. । మరిన్ని శేషించిన నా జనులు, అనగా, నా
నామముచేత పిలువపడిన సకల జనాంగములు యె
హోవాను వెతికేటట్టు దానియొక్క శిథిలమైన దాని
భాగుపర్చి, మునుపటి లాగున లేవనెత్తుదునని యిది
చేసే యెహోవా ఆనతిచ్చెను. । మరిన్ని యెహో 13
వా చెప్పేదేమంటే, యిదుగో, దినములు వస్తూ వున్నవి;
అప్పుడు దున్నేవాడు కోసేవానిన్ని ద్రాక్ష పండ్లను
తొక్కేవాడు రసము తీసేవానిన్ని వెంబడించి పట్టును;
పర్వతములనుంచి మధురమైన ద్రాక్షా రసము రాలును;
కొండలన్నిన్ని కరుగును. । మరిన్ని చెరలోకి పోయిన 14
నా జనులైన ఇశ్రాయేలీయులను తిరిగీ రప్పింతును;
వారు వచ్చి, పాడైన పట్టణములను తిరిగీ కట్టుకొని,
కాపురము చేతురు; ద్రాక్ష తోటలను నాటి, వాటి
రసమును తాగుదురు; వనములను వేసుకొని, వాటి పం
డ్లను తిందురు. । వారి దేశమందు నేను వారిని నాటు 15
దును; వారికి నేను యిచ్చిన దేశములోనుంచి వారు
యిక పెరికివేయబడరని నీ దేవుడైన యెహోవా
ఆనతిచ్చెను.

# ఓబద్యాయొక్క గ్రంథము.

## 1. అధ్యాయము.

1 ఇది కర్తయైన యెహోవా ఎదోమును గురించి
ఆనతిచ్చినట్టు ఓబద్యాకు కనుబడిన దర్శనమై వున్నది.
మేము యెహోవా యొద్దనుంచి వచ్చిన కబురు
వింటిమి; జనాంగముల యొద్దికి రాయభారి పంపబ
డెను; లెండి, దాని మీదికి మనము వెళ్లి, యుద్ధము
2 చేతాము. । యిదుగో, నేను నిన్ను జనాంగములలో
3 నీచుని చేతును; నీవు బహుగా రోయబడుదువు. । రాతి
కొండలయొక్క వండలలో నివాసము చేసి, వున్నత
మందు కాపురము చేసిననన్ను కిందికి యెవరు పడదో
యగలరని నీ హృదయమందు అనుకొనిన దానా, నీ
4 హృదయపు గర్వమువల్ల నీవు భ్రమపడితివి. । యేమం
టే గద్ద లాగున నీవు పైకి యెక్కినప్పటికిన్ని నక్షత్ర
ములలో నీవు గూడు కట్టుకొన్నప్పటికిన్ని అక్కడ
నుంచి నేను నిన్ను కిందికి దింపుదునని యెహోవా
5 ఆనతిచ్చెను. । చోరులైనా రాత్రి కన్నము వేసే దొంగ
లైనా నీ దగ్గిరికి వచ్చి, వారికి కావలసినంత మట్టుకు
దొంగిలి, మానివేయరా! ద్రాక్ష పండ్లను యేరే వారు
నీ యొద్దికి వచ్చి, లేకి యేరుకొనే వారికి కొంత వుండ
6 నివ్వరా! నీవు యేలాగు తెగిపోతివి! । ఏశావుయొక్క
వస్తువులు యేలాగు శోధించబడెను! దాచబడిన అతని
7 పదార్థములు యేలాగు బైలుపడి దొరికెను! । ప్రమా
ణము చేసి నీతో కలుసుకొనిన వారు నిన్ను సరిహద్దు
మట్టుకు కొంచు వచ్చిరి; నీతో సమాధానముగా వున్న
వారు నిన్ను మోసపుచ్చి, నీ మీద జయము పొందిరి;
నీ ఆహారమును తినినవారు నీకు వురులు పొగ్గిరి; అత
8 నికి బుద్ధి యెంత మాత్రమూ లేదు. । కాబట్టి యెహో
వా ఆనతిచ్చేదేమంటే, ఆ దినమందు నేను ఎదోము
లోనుంచి జ్ఞానులనున్ను ఏశావు పర్వతములనుంచి బుద్ధి
9 మంతులనున్ను లయము చేయింతును. । పౌ తేమానూ,
ఏశావుయొక్క పర్వతమందున్న వారందరున్ను హత
10 మైనందున నీ బలాఢ్యులు బెంగటిల్లుదురు. । నీ సహో
దరుడైన యాకోబుకు నీవు చేసిన బలవంతము నిమిత్త
ము సిగ్గు నిన్ను కప్పును; నీవు యెప్పటికీ కొట్టివేయబడు
11 దువు. । నీవు యెదురుగా నిలిచి వున్న దినమందున్ను
పరదేశులు అతని బలమును చెరలోకి కొంచుపోయిన
దినమందున్ను అన్యులు అతని గవునులలోకి చొరబడి,
యెరూశలేము మీద చీట్లు వేసిన దినమందున్ను నీవు
12 వారితో కలుసుకొంటివి. । అయితే నీ సహోదరుడు
పరదేశి అయినప్పుడు నీవు అతని దినమును చూడ
గూడదు; యూదా పుత్రులు విచ్ఛిత్తయి పోయిన దిన
మున వారి విషయమై నీవు సంతోషించ గూడదు;
అతని శ్రమ దినమందు నీవు ఆచర గూడదు. । నా 13
జనుల వుపద్రవ దినమున నీవు వారి గవునులలోకి
చొరబడ గూడదు; వారి వుపద్రవ దినమున నీవు వారి
బాధను చూడ గూడదు; వారికి వుపద్రవము కలిగిన
ప్పుడు నీవు వారి ఆస్తి మీద చేతులు వేయ గూడదు. ।
మరిన్ని వారిలో తప్పించుకొనిన వారిని కొట్టివేయు 14
టకు నీవు వీధుల మొగను నిలువ గూడదు; మరిన్ని
శ్రమ దినమందు అతనికి శేషించిన వారిని శత్రువుని
చేతికి అప్పగించ గూడదు. । యేమంటే సకల జనాంగ 15
ములకు యెహోవా దినము సమీపమై వున్నది;
అప్పుడు నీవు చేసినట్టు నీకున్ను చేయబడును; నీ
నడత చొప్పున నీ శిరస్సు మీదికే తిరిగీ వచ్చును. । యే 16
మంటే మీరు నా పరిశుద్ధమైన కొండ మీద తాగిన
లాగున సకల జనాంగములున్ను నిత్యమూ తాగుదురు;
నిజముగా వారు తాగి మింగి, యెన్నడూ జన్మము యె
త్తని వారుగా వుందురు. । అయితే సీయోను కొండ 17
మీద విడుదల కలుగును; అక్కడ పరిశుద్ధత వుండును;
యాకోబు యింటివారు తమ స్వంతమైన భూములను
స్వతంత్రించుకొందురు. । మరిన్ని యాకోబు యిల్లు 18
అగ్ని అయి వుండును; యోసేపు యిల్లు మంట అయి
వుండును; అయితే ఏశావు యిల్లు కొయ్య కాలుగా
వున్నందున వీరిలో వారు మండి కాలుదురు; ఏశావు
యింటి వారిలో శేషించిన వాడు వొకడున్ను లేక
పోవును; యేమంటే యెహోవా యీ చొప్పున ఆన
తిచ్చెను. । మరిన్ని దక్షిణపు దిక్కువారు ఏశావుయొ 19
క్క పర్వతమునున్ను మైదానమందున్న వారు పెలె
షెతు దేశమునున్ను స్వతంత్రించుకొందురు; మరిన్ని
ఎఫ్రయీముయొక్క భూములనున్ను షోమ్రోనుయొ
క్క భూములనున్ను స్వతంత్రించుకొందురు; బెన్యా
మీను గిలాదు దేశమును స్వతంత్రించుకొనును. । మరి 20
న్ని ఇశ్రాయేలు సమూహములో చెరలోకి కొంచుపో
బడిన వారు కెనయను వారి దేశమును సారెఫతు మట్టు
కున్ను స్వతంత్రించుకొందురు; యెరూశలేమునుంచి
సెఫారదుకు చెరగా వెళ్లినవారు దక్షిణ దేశపు పట్టణ
ములను స్వతంత్రించుకొందురు. । మరిన్ని రక్షకులు 21
సీయోను కొండ మీదికి వచ్చి, ఏశావుయొక్క కొం
డను గురించి న్యాయము తీర్తురు; మరిన్ని రాజ్యము
యెహోవాదై వుండును.

# యోనా యొక్క గ్రంథము.

## 1. అధ్యాయము.

1 యెహోవా వాక్యము అమిత్తయి కుమారుడైన
2 యోనా యొద్దికి వచ్చి, చెప్పినదేమంటే, । నీవు లేచి,
నీనెవే మహా పురమునకు వెళ్లి, దానిని గురించి ప్రక
టన చేయుము; యేమంటే వారి దోషము నా సముఖ
3 మునకు యెక్కెను, అని అనెను. । అయితే యోనా
లేచి, యెహోవా సముఖమునుంచి తర్షీషుకు పారి
పోవుటకు యొప్పేకు వచ్చెను; అక్కడ తర్షీషుకు
వెళ్లే వోడ అతనికి దొరికెను; కాబట్టి అతడు వోడ
అద్దెయిచ్చి, యెహోవా సముఖమునుంచి తర్షీషుకు
4 వెళ్లే వారితో దాని మీద యెక్కెను. । అయితే యె
హోవా సముద్రము మీదికి గొప్ప గాలి పంపెను;
సముద్రమందు గొప్ప తుఫాను పుట్టినందున వోడ
5 పగిలిపోయేటట్టు అగుపడెను. । కాబట్టి నావికులు భయ
పడి, ప్రతివాడూ తన తన దేవుని స్మరించి, వోడ
చులకన చేసుటకు దానిలో దినుస్సులను బైట పార
బోసిరి; అప్పటికి యోనా వోడ పక్కను నిద్రిస్తూ
6 వుండెను. । అప్పుడు వోడ నాయకుడు అతని యొద్దికి
వచ్చి, వో నిద్ర మత్తుడా, నీకు యేమి పట్టినది? లేచి,
నీ దేవుని స్మరించుము; మనము లయము కాకుండా
ఆ దేవుడు మన యందు కనికరించునేమో అని చెప్పె
7 ను. । మరిన్ని వారు వొకనితో వొకడు చెప్పుకొన్న
దేమంటే, యెవని నిమిత్తము యింత కీడు మనకు సంభ
వించెనో అది తెలియ గలందులకు మనము చీట్లు వేత
మని చెప్పుకొని, చీట్లు వేయగా, చీటి యోనా మీ
8 దికి వచ్చెను. । అప్పుడు వారు అతని చూచి, నీవల్లను
యింత కీడు మాకు సంభవించెను గనుక నీ వ్యాపార
మేమిటో? యెక్కడనుంచి నీవు వస్తివో? నీ దేశము
యేదో? నీ జనము యేదో! యిది యావత్తూ మాకు
9 తెలియ చెప్ప వలెనని చెప్పిరి. । అప్పుడు అతడు వారి
తో చెప్పినదేమంటే, నేను వొక ఇబ్రీయుడను; సము
ద్రమునున్ను భూమినిన్ని కలుగజేసిన ఆకాశమునకు
దేవుడైన యెహోవా యందు భయభక్తులు గలవా
10 డనై వున్నానని చెప్పినప్పుడు, । ఆ మనుష్యులు మరింత
భయపడి, అతని చూచి, నీవు యీలాగున చేసెదవే
మని అడిగిరి; యేమంటే అతడు వారికి అంతా తెలియ
చెప్పెను గనుక అతడు యెహోవా సముఖమునుంచి
11 పరుగెత్తి వచ్చిన సంగతి వారికి తెలిసెను. । కాబట్టి
వారు అతనితో మరిన్ని చెప్పినదేమంటే, సముద్రము
మా కొరకు నిమ్మళించేటందుకు నిన్ను యేమి చేయ
వలెను? యేమంటే సముద్రము పొంగుతూ వున్నది;
గాలి అధికమౌతూ వున్నదని చెప్పినప్పుడు, । అతడు 12
వారితో అన్న మాట, నన్ను యెత్తి, సముద్రములో
పడవేయండి, అప్పుడు మీ కొరకు సముద్రము నిమ్మ
ళించును; యేమంటే నా నిమిత్తము యీ గొప్ప తు
ఫాను మీ మీదికి వచ్చెనని నాకు తెలిసినదని చెప్పి
నప్పటికిన్ని, । వారు వోడను దరికి తెచ్చుటకు కోలలను 13
బహు బలముగా వేసిరి; అయితే సముద్రము మిక్కిలీ
పొంగి వుండెను; గాలిన్ని యెదురై వుండెను; కాబట్టి
అది వారి వల్ల కాకపోయెను. । అయినందున వారు 14
యెహోవాను స్మరించి, చెప్పినదేమంటే, వో యె
హోవా, యీ మనుష్యుని నిమిత్తము మమ్మును లయ
ము చేయకుము; నిరపరాధి రక్తమును మా మీద మో
పకుము; యేమంటే వో యెహోవా, నీ చిత్త ప్రకా
రము నీవు చేస్తివని చెప్పి, । యోనాను యెత్తి, సము 15
ద్రములో పడవేయగానే, సముద్రపు పొంగు నిమ్మ
ళించెను. । అప్పుడు ఆ మనుష్యులు యెహోవా యందు 16
భయభక్తులను పొంది, యెహోవాకు బలులనున్ను
మొక్కుబళ్లనున్ను చెల్లించిరి. । అయితే యెహోవా 17
గొప్ప మత్స్యమును యోనాను మింగేటట్టు సిద్ధప
ర్చెను; కాబట్టి యోనా మూడు దివా రాత్రములు
మత్స్య గర్భమందు వుండెను.

## 2. అధ్యాయము.

అప్పుడు యోనా మత్స్య గర్భమందు వుండి, 1
యెహోవాను ప్రార్థించి, పలికినదేమంటే, । నేను 2
బహు వుపద్రవములో వుండి, యెహోవాను స్మరిం
చినప్పుడు ఆయన నా మనవి వినెను; అగాధమయిన
సముద్ర గర్భములో వుండి, నేను నిన్ను స్మరించి
నప్పుడు నీవు నా శబ్దమును వింటివి. । నీవు నన్ను అగా 3
ధమైన సముద్ర గర్భములో పడచేస్తివి; వుదకములు
నన్ను చుట్టుకొనెను; నీ తరంగములున్ను కెరటములు
న్ను నా పైనుంచి వెళ్లినవి. । నీ కరుణా దృష్టినుంచి 4
దూరముకు వెళ్ల వేయబడితినని నేను అనుకొంటిని;
అయినప్పటికిన్ని నేను నీ పరిశుద్ధమైన ఆలయమును
తిరిగీ చూతును. । నిజముగా వుదకములు నా ప్రాణ 5
ములు పోయేటట్టు వచ్చి, నన్ను ముట్టడి వేసెను; అగా
ధము నన్ను కప్పెను; సముద్రపు నాచు నా శిరస్సును
చుట్టుకొనెను. । పర్వతముల పునాదులంత లోతున 6
నేను పడితిని; నలుతట్లా భూమి దాని గడలతో నిత్య
మూ నన్ను చుట్టుకొని వుండెను; అయినప్పటికిన్ని

యెహోవావైన నా దేవుడా, నీవు ఆ కూపములోనుంచి
7 ప్రాణముతోటి నన్ను బైటికి తీస్తివి. । నా ప్రాణము
నాలో మూర్ఛిల్లినప్పుడు నేను యెహోవాను తలంచు
కొంటిని; నా ప్రార్థన నీ సన్నిధికిన్ని నీ పరిశుద్ధా
8 లయములోకిన్ని చేరినది. । అప్రయోజనమైన అబద్ధ
ముల యందు లక్ష్యము వుంచిన వారు తమకు రాగల
9 కృపను తప్పించుకొందురు. । అయితే నేను స్తోత్రపు
శబ్దముతోటి నీకు బలులను చెల్లించి, నేను మ్రొక్కిన
మొక్కుబళ్లను తీర్చక మానను; యెహోవావల్ల మా
10 త్రమే రక్షణ కలుగునని పలికెను.। అయితే యెహో
వా మత్స్యమునకు ఆజ్ఞ యిచ్చినందున అది యోనాను
భూమి మీద కక్కెను.

## 3. అధ్యాయము.

1 అప్పుడు యెహోవా వాక్యము యోనాయొద్దికి
2 రెండోమారు వచ్చి, చెప్పినదేమంటే, । నీవు లేచి,
నీనెవే మహా పురమునకు వెళ్లి, నేను నిన్ను ప్రకటన
చేయువలసినదనిన ప్రకారముగా ప్రకటన చేయుమన్న
3 ఆజ్ఞ యిచ్చెను. । కాబట్టి యోనా లేచి, యెహోవా
ఆజ్ఞ ప్రకారము నీనెవే పట్టణమునకు వెళ్లెను; అయితే
యీ నీనెవే పట్టణము మూడు దినముల ప్రయాణ
మంత వున్నందున మిక్కిలీ గొప్ప పట్టణమై వుండెను.।
4 అయితే యోనా ఆ పట్టణములోకి వొక్క దిన ప్ర
యాణమంత దూరము పోయి, తన బొబ్బ యెత్తి, యిక
నలబై దినములకు నీనెవే పట్టణము బోర్లించపడునని
5 చెప్పెను. । అయినందున నీనెవే పట్టణపువారు దైవ
వాక్యము నమ్మి, వుపవాసమును చాటించి, పెద్దలు మొ
దలుకొని పిన్నల పర్యంతమూ గోనెలను కట్టుకొనిరి.।
6 యేమంటే యీ వాక్యము నీనెవే రాజుకు వినబడిన
ప్పుడు అతడు తన గద్దెను విడిచి, తన రాజ వస్త్రము
లను తీసి, గోనె కట్టుకొని బుగ్గిలో కూర్చుండెను. ।
7 మరిన్ని రాజైన తానున్ను తన సామంతులున్ను నిర్ణ
యించుకొన్నట్టు నీనెవే పట్టణమంతటా చాటించి,
ప్రకటన చేయించినదేమంటే, మనుష్యుడైనా మృగ
మైనా యెద్దు అయినా గొర్రె అయినా యేమైనప్ప
టికిన్ని పుచ్చుకోకనున్ను తినకనున్ను నీళ్లు తాగకను
8 న్ను వుండి, । మనుష్యుడున్ను మృగములున్ను గోనెలు
కట్టుకొని, బహు తీక్ష్ణముగా దేవుని స్మరించి, మరిన్ని
మీరందరున్ను మీ మీ దుర్మార్గతను విడిచి, బల
9 మయిన చేష్టలను మానివేతురు గాకనిన్ని, । దేవుడు
మనస్సు తిప్పుకొని పశ్చాత్తప్తుడై, మనము లయము
కాకుండా తన కోపాగ్నిని చల్లార్చుకొనేటట్టు యెవ
రెవరికి పాపము తెలిసి వుందునో వారు దాని గురించి
పశ్చాత్తప్తులు కావలెననిన్ని, ప్రకటన చేయించెను. ।
కాబట్టి దేవుడు వారి చేతలను చూచెను; యేమంటే 10
వారు తమ దుర్మార్గతలను విడిచిరి; అయినందున
దేవుడు వారిని చేయదలచిన కీడును గురించి చింతపడి
చేయక వుండెను.

## 4. అధ్యాయము.

అయితే అందుకు యోనా బహు చింతాక్రాం 1
తుడై, అతి విచారపడి, యెహోవాను ప్రార్థించిన
దేమంటే, । వో యెహోవా, నా దేశమందు నేను 2
వున్నప్పుడు ఆలాగున అనుకొంటిని; కాబట్టి నేను
దబ్బున తర్షీషుకు వెళ్లితిని; యేమంటే దేవుడవైన
నీవు కటాక్షమున్ను జాలిన్ని బహు శాంతమున్ను కృ
పయున్ను గలవాడవై, కీడును చేయదలచి పశ్చాత్తప్తు
డవై వున్నావని నాకు తెలిసెను. । కాబట్టి యిప్పుడు 3
వో యెహోవా, నా ప్రాణమును పుచ్చుకొమ్ము;
యేమంటే నాకు జీవము కంటే మరణమే మేలని వేడు
కొనెను. । అందుకు యెహోవా నీవు చింతబడుటకు 4
నిమిత్తమేమని అడిగెను. । అప్పుడు యోనా ఆ పట్టణ 5
ము అవతలకు వెళ్లి, పట్టణపు తూర్పు తట్టు కూర్చుని
వుండెను; మరిన్ని పర్ణశాలను కట్టుకొని, పట్టణము
నకు యేమి సంభవించునో చూడ గలందులకు దాని
నీడను కూర్చుని వుండెను. । అయితే దేవుడయిన యె 6
హోవా వొక కిక్యోన చెట్టును కల్పించి, అతని దుః
ఖము విడిచిపోయేటట్టున్ను అతని శిరస్సు మీదికి నీడ
కోసము అతని పైకి పెరిగేటట్టున్ను చేసెను; కాబట్టి
ఆ కిక్యోన చెట్టు నిమిత్తము యోనా బహు సంతోష
ముగా వుండెను. । అయితే మర్నాటి వుదయమందు 7
దేవుడు వొక పురుగును కల్పించెను; అది ఆ కిక్యోన
చెట్టును కొట్టివేసినందున అది వాడిపోయెను.। మరిన్ని 8
సూర్యుడు వుదయించిన తరువాత దేవుడు నిర్మలమైన
తూర్పు గాలిని కల్పించెను; యెండ యోనా తలకు తగి
లెను; అయినందున యోనా మూర్ఛిల్లి, ప్రాణము విసికి,
నాకు బ్రతుకు కంటే మరణమే మేలని అనుకొనెను.।
అప్పుడు దేవుడు యోనాతో ఆనతిచ్చిన మాట, ఆ 9
కిక్యోన చెట్టును గురించి చింతపడితివా అని అడగ
గా, యోనా నా ప్రాణము విసికి, చింతపడితినని
చెప్పెను. । కాగా యెహోవా అతనితో చెప్పినదే 10
మంటే, దేని కొరకు నీవు కష్టపడక వుంటివో, నీ చేత
కాకుండా యేది పెరిగెనో, వొక రాత్రిలోనే లేచి,
వొక రాత్రిలోనే వాడిపోయిన యీ కిక్యోన చెట్టును
గురించి నీవు విచారపడితివి.। అయితే కుడి యెడమ చే 11
తుల అంతరము యెరుగని నూటయిరువై వేలు కన్న యె
క్కువ మందిన్ని బహు పశువులున్ను గల నీనెవే మహా
పురము కొరకు నేను విచారపడవద్దా అని పలికెను.

# మీకా యొక్క గ్రంథము.

## 1. అధ్యాయము.

1 యోతాము, అహాజు, హిజ్కియా, అనే యూ
దా రాజుల దినములలో షోమ్రోనును గూర్చిన్ని యె
రూశలేమును గూర్చిన్ని దర్శనమువల్ల మోరష్తీయు
డైన మీఖాకు వచ్చిన యెహోవా వాక్యము యే
2 మంటే, । ఓ సకల జనులారా, వినండి; ఓ భూమీ,
నీవున్ను నీలో వున్న సమస్తమున్ను ఆలకించ వలెను; కర్త
యైన యెహోవా మీ మీద సాక్షి అవును గాక;
కర్త తన పరిశుద్ధాలయములోనుంచి మీ మీద సాక్షి
3 అవును గాక. । యేమంటే యిదుగో యెహోవా
తన స్థలములోనుంచి బైలు వస్తూ వున్నాడు; ఆయన
దిగి, భూమియొక్క వున్నత స్థలములను తొక్కును. ।
4 ఆయన కింద పర్వతములు అగ్ని ముందర మైనము వలె
కరిగి పోవును; లోవలు కోరు దిబ్బ మీదనుంచి పా
5 రిన నీళ్ల వలె చెదిరి పోవును. । యిదంతా యాకోబు
యొక్క అక్రమము నిమిత్తమున్ను ఇశ్రాయేలు యిం
టివారి పాపముల నిమిత్తమున్ను సంభవించును; యా
కోబు యింట్లో పాపము చేసుటకు యెక్కడ ఆరంభిం
చెను? షోమ్రోనులోనే కాదా? యూదాయొక్క వు
న్నత స్థలములు యెక్కడ వున్నవి? యెరూశలేములో
6 నే కాదా? । కాబట్టి నేను షోమ్రోనును పొలమందుండే
రాళ్ల కుప్ప వలెనున్ను ద్రాక్ష చెట్టుకు నాట తగిన
స్థలము వలెనున్ను చేతును; దాని రాళ్లను లోవలో పా
7 రవేతును; పునాదులను బైలు పరుతును. । దాని చెక్కిన
ప్రతిమలు పగలకొట్టబడును; వేశ్య అయిన దాని కా
నుకలు అగ్నిచేత కాల్చబడును; దాని బొమ్మలన్నిటి
నిన్ని నేను పాడుచేతును; యేమంటే అది వేశ్య అయి
కానుకను గణించుకొనెను గనుక అవి తిరిగీ వేశ్యకు
8 కానుకలుగా వచ్చును. । కాబట్టి యిందును గురించి
నేను యేడ్చి రోదనము చేతును; నేను బట్టను విప్పు
కొని దిగంబరినై, ఘటసర్పముల వలెనే యేడుస్తూ,
9 గుడ్లగూబ వలెనే మూల్గుతూ వుందును. । యేమంటే
అది వచ్చిన తెగుళ్లవల్ల మరణమవును; అవి యూదా
కున్ను వచ్చినవి; శత్రువు నా జనులయొక్క గవునుల
10 కున్ను యెరూశలేముకున్ను వచ్చెను. । గాతు పట్టణ
మందుండే వారలారా, దీనిని తెలియ చెప్పవద్దు; యెంత
మాత్రమైనా యేడ్వవద్దు; బుగ్గిగల యింట్లోకి వెళ్లి,
11 బుగ్గిలో పొర్లండి. । షాఫీరు కాపురస్తుడా, నీ సిగ్గును
బైలుపరుస్తూ అవతలకు వెళ్లుము; సయనానులో కా
పురము చేసినవాడు బేతెస్సెలులో మూల్గుటవల్ల బైలు
రాక వుండును; మిమ్ములనుంచి అతనికి స్థితి కలుగును. ।
యేమంటే మారోతులో కాపురము చేసిన వానికి కో 12
రిన మేలు రాలేదు గనుక వాడు క్షీణించెను; యేమం
టే కీడు యెహోవా యొద్దనుంచి దిగి, యెరూశలే
ము పట్టణపు ద్వారము మట్టుకు వచ్చెను. । లాఖీషు 13
కాపురస్తుడా, వేగిరము పరుగెత్తే మృగమునకు రథ
మును కట్టుము; సీయోను కుమార్తెకు అది పాపకార
ణమై వుండెను; యేమంటే ఇశ్రాయేలు అక్రమములు
నీని యందు కనుబడినవి. । కాబట్టి నీవు మోరెషెత్గ 14
తుకు కానుకలను యిత్తువు; అక్జీబు యిండ్లు ఇశ్రా
యేలు రాజులను మోసపుచ్చును. । అయితే మారేషా 15
కాపురస్తుడా, నీ యొద్దికి నేను స్వతంత్రుడైన వొకని
తెప్పింతును; అతడు ఇశ్రాయేలుకు ఘనమైన అదుల్లా
ము మట్టుకు వచ్చును. । నీ ప్రియమైన పిల్లల కొరకు 16
నిన్ను నీవు బోడిగా చేసుకొమ్ము; గద్ద వలె మిక్కిలి
బోడిగా చేసుకొమ్ము; యేమంటే నీ యొద్దనుంచి పిల్లలు
చెరలోకి పోయిరి.

## 2. అధ్యాయము.

తమ మంచము మీద పరుండి, అన్యాయమును 1
యోజించి, కాని క్రియలను చేసిన వారికి అయ్యో!
శక్తి వారి చేతులలో వున్నందున ఆలాగున చేసుటకు
తెల్లవారగానే వారు లేతురు. । వారు భూములనున్ను 2
యిండ్లనున్ను ఆశించి, బలవంతముగా ఆక్రమించుకొం
దురు; యీలాగున వారు యజమానునిన్ని తన యింటి
నిన్ని తన ఆస్తినిన్ని అన్యాయము చేతురు. । కాబట్టి 3
యెహోవా ఆనతిచ్చేదేమంటే, యిదుగో, యీ వంశ
మునకు కీడు చేయ దలచితిని; దాని కిందనుంచి మీరు
మీ మెడలను తీసుకో లేక పోదురు; కంఠములు నిగు
డించి, నడవలేక పోదురు; యేమంటే యీ కాలము
మిక్కిలీ చెడ్డదై వున్నది. । ఆ దినమందు వారు మిమ్మును 4
గురించి సామితెను యెత్తి, బహు రోదనముచేత అంగ
లార్చి, చెప్పేదేమంటే, మనము బొత్తిగా పాడైతిమి
అనిన్ని, ఆయన నా జనుల భాగమును అన్యులకు తిరుగ
చేసెననిన్ని ఆయన నా యొద్దనుంచి దీనిని యేల తీసి
వేసెననిన్ని, మన భూములను వారు పాళ్లు వేసి అన్యుల
కొరకు తిరుగ చేసిరనిన్ని పలుకుదురు. । కాబట్టి యె 5
హోవాయొక్క సంఘముతోటి కలుసుకొని, పాళ్లు
పంచుటకు నూళ్లు వేసేవాడు వొకడు నీకు లేకపో

6 వును. । మీరు దీర్ఘదర్శనమును పలుకవద్దు; వారు పలు
కుదురు; సిగ్గు వారికి రాకుండా వీరు వారికి దీర్ఘ
7 దర్శనమును పలక కూడదు. । యాకోబు యింటివా
రని చెప్పబడిన వారలారా, యెహోవా ఆత్మ బంధిం
చబడి వున్నదా? యీలాటి క్రియలు ఆయనకు అను
కూలమవునా! నా వాక్యములవల్ల యథార్థముగా
8 నడిచే వానికి మేలు రాకపోవునా! । నిన్నటి రోజున
నా జనులు శత్రువు మీదికి లేచిరి; మీరు యుద్ధము
నుంచి తిరిగీ నిర్భయముగా వచ్చే వారి వుపరి వస్త్రము
9 తో కూడా పంచలున్ను లాగుకొంటిరి. । నా జనుల
యొక్క స్త్రీలను మీరు వారి సంతోషమయిన యిం
డ్లలోనుంచి వెళ్లచేస్తిరి; వారి బిడ్డల యొద్దనుంచి వారికి
నేను యిచ్చిన ఘనతను యెప్పటికిన్ని తీసుకొంటిరి. ।
10 కాబట్టి మీరు లేచి అవతలకు పొండి; యీ దేశము
అపవిత్రమైనందున యిందులో నిమ్మళము లేదు; అది
మిక్కిలీ చెడ్డ నాశనముచేత మిమ్మును నశింప చేసును. ।
11 మాయగల ఆత్మతోటి నడిచి, అబద్ధికుడై, ద్రాక్షా రస
మునున్ను బలమైన పానమునున్ను యిస్తే నేను మీకు
దీర్ఘదర్శనమును చెప్పుదు నన్నవాడు యెవడో వాడే
12 యీ జనులకు దీర్ఘదర్శి అవును. । అయితే ఓ
యాకోబూ, నిజముగా నేను మిమ్మునందరినిన్ని కూడి
రాచేతును; నిజముగా ఇశ్రాయేలుకు శేషించిన వారిని
కూర్తును; కూర్చి వారిని బొస్రా గొర్రెల లాగున
కూడా వుంతును; వారు చాలా మందియై, దొడ్డిలో
వున్న మంద వలెనే మిక్కిలీ గొప్ప ధ్వని చేతురు. ।
13 విరగగొట్టిన వాడు వారికి ముందుగా వెళ్లును; వారు
తోసుకొ పోయి, ద్వారమును గడిచి వెళ్లి, దానిలో
నుంచి బైటికి వత్తురు; వారి రాజు వారికి ముందుగా
నడుచును; యెహోవా వారికి ప్రధాన శిరస్సై
వుండును.

## 3. అధ్యాయము.

1 మరిన్ని నేను చెప్పినదేమంటే, యాకోబు ప్రధా
నులారా, ఇశ్రాయేలు యింటి అధిపతులారా, ఆల
కించండి; యేది న్యాయమో అది మీకు తెలిసి వున్నది
2 గదా? । అయితే వారు మేలు యందు సహించక, కీడు
యందు అనుకూలించి వున్నారు; నా జనులు చర్మముల
నున్ను వారి దుమ్ముల మీద వున్న మాంసమునున్ను
3 చించుతూ వున్నారు. । నా జనుల మాంసమును తింటూ
వున్నారు; వారి చర్మములను ఒలిచి, వారి దుమ్ములను
విరిచి, కుండకొరకు అయినట్టున్ను గూనలో వున్న మాం
సపు ముక్కలైనట్టున్ను తునక తునకలుగా కొట్టుతూ
4 వున్నారు. । కాబట్టి అప్పుడు వారు యెహోవాను
స్మరింతురు; అయితే ఆయన వారి ప్రార్థనను వినడు;
వారు దుర్మార్గతగా నడిచిరి గనుక ఆ కాలమందు
ఆయన తన ముఖమును వారికి మరుగు చేసును. । యె 5
హోవా నా జనులను మోసపుచ్చిన దీర్ఘదర్శు
లను గురించి ఆనతిచ్చేదేమంటే, మీకు క్షేమము కలు
గునని వీరు పలుకుతూ, తమ పండ్లతో కరుస్తూ వున్నా
రు; యెవడైనా వారి నోట యేమైనా పడవేయని
వాడైతే వీరు అతని మీద యుద్ధము లేవచేతురు. ।
కాబట్టి వారికి యేదిన్ని దృశ్యము కాకుండా రాత్రి 6
వచ్చును; వారికి ప్రశ్న కనుబడకుండా చీకటి వారిని
కప్పును; దీర్ఘదర్శులకు సూర్యుడు అస్తమించును; వా
రికి పగలే చీకటిగా వుండును. । అప్పుడు దీర్ఘదర్శులు 7
సిగ్గు పొందుదురు; ప్రశ్న చూచేవారి ముఖములు కంది
చిన్నబోవును; దేవుడు వారికి వుత్తరమును యివ్వనందున
వారు నోళ్లు మూసుకొందురని ఆనతిచ్చెను. । అయితే 8
యాకోబుకు తన అక్రమమునున్ను ఇశ్రాయేలుకు తన
పాపమునున్ను చూపించుటకు నేను యెహోవా ఆత్మ
వల్ల బలముతోటిన్ని న్యాయముతోటిన్ని ధైర్యముతో
టిన్ని నిండి వున్నాను. । కాబట్టి యాకోబు యింటివారికి 9
శిరస్సులైన వారలారా, ఇశ్రాయేలు యింటి అధిపతు
లారా, వినండి; న్యాయమందు సహించలేక మీరు
సకల నీతిని తిప్పితిరి. । సీయోనును రక్తమువల్లనున్ను 10
యెరూశలేమును అన్యాయమువల్లనున్ను కట్టింతురు. ।
దాని ప్రధాన శిరస్సులు లంచము పుచ్చుకొని, అన్యా 11
యము తీర్తురు; దాని అర్చకులు కూలి పుచ్చుకొని,
నేర్పుదురు; దీర్ఘదర్శులు ద్రవ్యము కొరకు ప్రశ్న
చూతురు; యీలాగైనప్పటికిన్ని వారు యెహోవా
మీద ఆనుకొని, యెహోవా మనలో లేడా అనిన్ని
యే కీడయినా మనకు రానేరదనిన్ని అనుకొందురు. ।
కాబట్టి మీ నిమిత్తము సీయోను పొలము లాగున 12
దున్నబడును; యెరూశలేము రాళ్ల కుప్పలౌను; మం
దిరము గల పర్వతము అరణ్యములో వుండే వున్నత
స్థలముల వలెనే వుండును.

## 4. అధ్యాయము.

అంత్య దినములందు యెహోవా మందిరముయొ 1
క్క పర్వతము పర్వతముల మీద దృఢముగా నిలిచి,
కొండల పైని హెచ్చించబడును; అప్పుడు జనులు దాని
లోకి ప్రవాహముల వలె వత్తురు. । మరిన్ని చాలా 2
జనాంగములు వచ్చి చెప్పుకొనేదేమంటే, రండి, యె
హోవా పర్వతమునకున్ను యాకోబు దేవుని మందిర
మునకున్ను యెక్కి పోదము; యేమంటే ఆయన తన
మార్గములను మనకు చూపించును; ఆయన అడుగు
జాడలలో మనము నడుచుకొందమని చెప్పుకొందురు;
యేమంటే సీయోనులోనుంచి న్యాయ ప్రమాణమున్ను

యెరూశలేములోనుంచి యెహోవా వాక్యమున్న
3 బయలు వెళ్లును. । మరిన్ని ఆయన చాలా జనులలో న్యా
యము నడిపించును; దూరముగా వుండిన బలముగల
జనాంగములకు నీతిగా బుద్ధి చెప్పును; అప్పుడు వారు
తమ కత్తులను నక్కులుగానున్న తమ యీటెలను
పోట కత్తులుగానున్న చేతురు; జనాంగము జనాంగ
ము మీదికి కత్తిని యెత్తకనున్న యిక యుద్ధము నేర్చు
4 కోకనున్న వుండును. । ప్రతివాడు తన ద్రాక్ష చెట్టు
కిందనున్న తన అంజూరపు చెట్టు కిందనున్న యెవరి
భయము లేకుండా కూచుండని వుండును; యేమంటే
సర్వ శక్తిగల యెహోవా వాక్కులోనుంచి యిది
5 వచ్చెను. । సకల జనాంగములు వారి వారి దేవుని పేరట
నడుతురు; అయితే మనము మన దేవుడైన యెహో
6 వా పేరట యెన్నటికీ నడుస్తూ వుందుము. । యిందుకు
యెహోవా ఆనతిచ్చేదేమంటే, ఆ దినమందు నేను
కుంటిదానిని చేచుండకొందును; అవతలకు తోలివేయ
బడిన దానిన్ని కష్టపెట్టబడిన దానిన్ని నేను చేచుండ
7 కొందును. । మరిన్ని కుంటి దానికి శేషము వుండేటట్టు
న్న దూరమునకు తోలి వేయబడిన దానిని బలమైన
జనాంగములు గల దానిగానున్న చేతును; మరిన్ని యె
హోవా సీయోను కొండ యందు వారిని యెన్నటికీ
8 యేలుతూ వుండును. । అయితే ఎదారుయొక్క గోపు
రమా, సీయోను కుమారికవైన మెట్టా, మునుపటి లా
గున నీకు కర్తృత్వము కలుగును; రాజ్యము సీయోను
9 కుమార్తెకు వచ్చును. । యిప్పుడు నీవు యెందుకు
యీలాగున యేడ్చెదవు? నీకు రాజు వొకడు లేడా?
నీ ఆలోచనపరుడు నశించెనా? ప్రసూతి స్త్రీకి వచ్చిన
10 వేదనలు నీకు వచ్చినవి. । ఓ సీయోను కుమారికా, నీవు
నొప్పి బొంది, ప్రసూతి స్త్రీవలె కనుటకు ప్రయాస
పడ వలెను; యేమంటే నీవు పట్టణమును విడిచి, బైట
భూమి యందు వాసము చేతువు; బాబెలు పురము
మట్టుకు నీవు వెళ్లుదువు; అయినప్పటికిన్ని అక్కడ
నుంచి నీవు విడుదల పొందుదువు; అక్కడ యెహో
వా నీ శత్రువుల చేతులలోనుంచి నిన్ను విడిపించును.।
11 యిప్పుడు చాలా జనాంగములు నీకు విరోధముగా
కూడుకొని, దానిని చెరప వలెనని్ని మన దృష్టి
12 సీయోను మీద పెట్టుదామనిన్ని చెప్పుకొనిరి. । అయితే
వారికి యెహోవా తలంపులు తెలియలేదు; ఆయన
వారిని చేను మోపులుగా తన కళ్లములోకి కూచుండ
నని ఆయన తలంచిన ఆలోచన వారికి తెలియక పో
13 యెను. । ఓ సీయోను కుమారికా, నీవు కళ్లములోకి
వెళ్లి త్రొక్కుము; అందుకు నేను నీ శృంగము యిను
పదిగానున్న నీ డెక్కలు యిత్తడివిగానున్న చేతును;
చాలా జనాంగములను నీవు తునకలుగా కొట్టుదువు;
వారికి దొరికిన లాభము యెహోవాకున్న వారి సొమ్ము
లోకమంతటియొక్క కర్తకున్న నేను మీదు కట్టి
తిని. । అయితే ఓ సమూహములు గల కుమారికా, యి 14
ప్పుడు నీవు సమూహములను కూర్చుదువు గాక; అతడు
మన మీదికి వచ్చి గవిసెను; వారు ఇశ్రాయేలు న్యా
యాధిపతిని చెంప మీద కర్రతోటి కొట్టుదురు.

## 5. అధ్యాయము.

ఓ బేత్లెహేము ఎఫ్రాతూ, యూదా పట్టణము 1
లలో నీవు సామాన్యరాలవైనప్పటికీ నీలోనుంచి ఇశ్రా
యేలును యేలేవాడు వొకడు నా కొరకు లేచును;
అతని బైలు వెళ్లుటలు ఆదినుంచిన్ని గతించిన యుగ
ములనుంచిన్ని కలిగి వుండెను. । కాబట్టి ఆయన వారిని 2
పిల్లను కనబోయే స్త్రీ ప్రసవమయ్యే పర్యంతమూ వా
రిని విడిచి పెట్టును; అప్పుడు ఇశ్రాయేలు పుత్రులతో
కూడా అతని కొదువ సహోదరులు తిరిగీ వత్తురు. ।
మరిన్ని అతడు నిలిచి, యెహోవా శక్తిచేతనున్న తన 3
దేవుడైన యెహోవా ఘనమైన నామము చేతనున్న
తన మందను మేపించును. । వారు స్థిరముగా వుందురు; 4
యేమంటే యిప్పుడు అతడు భూమి సరిహద్దుల మట్టుకు
ప్రబలమవును. । యితడు సమాధానము కలుగ చేసును; 5
అష్షూరు వాడు మన దేశములో చొరబడినప్పుడున్న
మన నగరులలో ప్రవేశించినప్పుడున్న అతని మీదికి
మనము యేడుగురు బోయలనున్న యెనమండ్రు ప్రధా
నులనున్న లేవచేతుము. । వీరు అష్షూరు దేశమునున్న 6
దాని ద్వారములతో కూడా నిమ్రోదు దేశమునున్న
కత్తిచేత పగలకొట్టుదురు; యీలాగున ఆయన అష్షూ
రువాడు మన దేశములో చొరబడినప్పుడున్న మన
సరిహద్దులలో ప్రవేశించినప్పుడున్న మనలను విడిపిం
చును. । మరిన్ని యాకోబుయొక్క శేషించిన వారు 7
చాలా జనాంగములలో యెహోవా యొద్దనుంచి
వచ్చిన మంచు వలె వుందురు; మన మనో భావమును
అక్కర చేయకుండానున్న నరపుత్రుల తలంపును కని
పెట్టకుండానున్న గడ్డి మీద కురిసిన వర్షము వలెనే
వుందురు. । మరిన్ని యాకోబుయొక్క శేషించిన వారు 8
అనేక జనులలోనున్న జనాంగములలోనున్న అడవి
మృగములలో సింహము లాగుననున్న గొర్రె మందల
లో కొదమ సింహము వలెనున్న వుందురు; అతడు
లోపటికి చొచ్చితే తొక్కి, యెవడూ విడిపించకుం
డా పెగల్చును. । నీ చెయ్యి నీ విరోధుల మీద అధిక 9
మవును; నీ శత్రువులందరున్న తెగిపోదురు. । మరిన్ని 10
యెహోవా ఆనతిచ్చేదేమంటే, ఆ దినమందు నేను
నీలో వున్న గుర్రములను తెగవేతును; నీ రథములను
లయము చేతును. । నీ దేశమందున్న పట్టణములను నాశ 11

12 నము చేతును; నీ కోటలను పడవేతును. । నీ చేతనున్న
చిల్లంగితనమును తెగవేతును; యిక జ్యోతిష్కులు నీకు
13 లేకపోదురు. । మరిన్ని చెక్కిన నీ ప్రతిమలనున్ను నీ
మూల విగ్రహములనున్ను నేను నీలోనుంచి నరికి వేతు
ను; నీ చేతి పనికి యిక నీవు మ్రొక్కక వుందువు. ।
14 మరిన్ని నీ మధ్యనుంచి తోపులను పెల్లగించి వేతును;
15 నీ పట్టణములనున్ను నాశనము చేతును. । మరిన్ని
నేను కోపమునున్ను రౌద్రమునున్ను తెచ్చుకొని, అన్య
జనాంగములు యెన్నడూ వినని ఆజ్ఞను చేతునని ఆన
తిచ్చెను.

## 6. అధ్యాయము.

1 యెహోవా ఆనతిచ్చిన వాక్యమును మీరు విన
వలెను; అది యేమంటే, నీవు లేచి, పర్వతముల ముం
దట వ్యాజ్యమాడుము; నీ శబ్దమును కొండలకు విని
2 పింప జేయుము. । ఓ పర్వతములారా, భూమి గట్టి
పునాదులారా, యెహోవా వాక్యమును వినండి; యే
మంటే యెహోవాకు తన జనుల మీద వ్యాజ్యము
కలదు; ఆయన ఇశ్రాయేలు మీద వ్యాజ్యమాడును. ।
3 ఓ నా జనమా, నీ పట్ల యేమి చేస్తిని? నిన్ను యేమి
కష్ట పెట్టితిని? యేదైనా వుంటే నా మీద సాక్ష్యము
4 తెలియచేయుము. । అయితే నేను నిన్ను మిస్రయీము
దేశములోనుంచి యివతలకు తెప్పించి, సేవకా గృహ
ములోనుంచి నిన్ను విమోచించి, మోషేనున్ను అహ
రోనునున్ను మిర్యామునున్ను నీకు ముందుగా పంపి
5 తిని. । ఓ నా జనులారా, యెహోవా నీతిపరుడని
మీకు తెలియగలందులకు మోయాబు రాజైన బాలాకు
యేలాగు యోజించెనో అదిన్ని, బేయోరు కుమారు
డైన బలాము సిద్ధీమునుంచి గిల్గాలు మట్టుకు యే
6 ప్రత్యుత్తరమిచ్చెనో అదిన్ని తలంచుకొండి. । నేను
యెహోవా సన్నిధికి వచ్చి, మహోన్నతమైన దేవుని
ముందర సాష్టాంగపడుటకు యేమి తెత్తును? హోమా
ర్పణలనున్ను యేడాది పెయ్యలనున్ను తీసుకొని ఆయన
7 ముందటికి వత్తునా? । లేక వేల కొలది గొర్రె పొట్టే
ళ్లున్ను వేల కొలది నదులంత విస్తారమైన తైలమున్ను
ఆయనకు అనుకూలమా? లేక నా తప్పితము నిమిత్తము
నా ప్రథమ పుత్రుని న్ని నా పాపము నిమిత్తము నా
8 గర్భ ఫలమునున్ను యిత్తునా? । ఓ మనుష్యుడా,
యేది ప్రయోజనమవునో అది ఆయన నీకు అగుప
రచెను; యేమంటే న్యాయముగా చేయుటయున్ను
జాలి యందు ప్రియముగా వుండుటయున్ను నీ దేవుని
ముందట దీన మనస్సుగా నడుచుటయున్ను యింతే
గాని నీ వల్ల యెహోవాకు కావలసినది యేమిటి? ।
9 యెహోవా పిలుపు శబ్దము పట్టణమునకు వినబడెను;
జ్ఞాని నా నామమును కనుగొనును; ఆ దండించుటను
నీవు విని, దానిని నిర్ణయించిన వాడు యెవడో అది
గ్రహించుకొనుము. । యిప్పటికిన్ని అన్యాయవంతు 10
లందరి యిండ్లలో అన్యాయమైన పదార్థములున్ను
యేహ్యమైన వెల్తి కొలలున్ను వున్నవి కావా? । అన్యా 11
యమైన త్రాసులున్ను కపటపు గుండ్ల సంచియున్ను
కలిగిన వారిని యథార్థపరులని యెంచుదునా? । యే 12
మంటే దాని ఐశ్వర్యవంతులు బలవంతముతోటి నిండి
వుండిరి; దాని కాపురస్థులు అబద్ధమాడిరి; వారి
నోట్లో నాలుక కపటము కలదై వున్నది. । కాబట్టి 13
నీ పాపముల నిమిత్తము నేను నిన్ను కొట్టి, క్షీణతను
న్ను శూన్యతనున్ను నీకు కలుగచేతును. । నీవు తినిన 14
ప్పటికిన్ని నీకు తృప్తి లేక వుండును; నీలో నీవే కుం
గుదువు; నీవు యేమైనా పట్టుకో వెళ్లిపోతే దానితోటి
తప్పించుకో లేక పోదువు; ఒక వేళ తప్పించుకుంటే
నేను దాని కత్తికి యిత్తును. । నీవు విత్తనము విత్తి, 15
కొయ్య లేక పోదువు; నీవు యిప్ప పండ్లనున్ను ద్రాక్ష
పండ్లనున్ను తొక్కుదువు, అయితే తైలమును పూసు
కోకనున్ను ద్రాక్షా రసమును తాగకనున్ను వుందువు. ।
యేమంటే మీరు ఒమ్రీ యొక్క కట్టడలను గైకొం 16
టూ వుంటిరి; అహాబు యొక్క క్రియలన్నిటి ప్రకా
రము చేస్తూ వుంటిరి; యీ పట్టణమును నేను పాడు
గానున్ను దాని కాపురస్థులను లేవిడీ పొందేటట్టుగా
నున్ను చేసుటకు మీరు వారి ఆలోచన ప్రకారము
నడుస్తూ వుంటిరి; కాబట్టి నా జనులవల్ల అవమానమును
మీరు పొందుదురు.

## 7. అధ్యాయము.

వేసవి కాలపు పండ్లను యేరిన తరువాతనున్ను 1
ద్రాక్ష పండ్లను లేకి యేరిన తరువాతనున్ను యేలా
గుండునో ఆలాగు వుండిన నాకు అయ్యో! తినుటకు
గెల లేకపోయెను; నా జిహ్వ ముందుగా ముదిరిన ఫల
మును కోరెను. । వుత్తముడు దేశములో లేకపోయెను; 2
జనులలో యథార్థపరుడు ఒకడున్ను లేడు; అంద
రున్ను రక్తము చిందుటకు పొంచి వుండిరి; ప్రతి మను
ష్యుడున్ను కిరాతుడై తన సహోదరుని కొరకు వల
లను ఒగ్గును. । రెండు చేతులతోటి కీడు చేసుటకు 3
ప్రతిజ్ఞ చేసుకొనిరి; అధిపతి కానుకలను తెమ్మంటూ
వుండెను; న్యాయకర్త లంచమడుగును; పెద్దవాడు తన
మోసపు కోరికను తెలియచేసును; ఆలాగున వారు
కమ్మిక చేయుదురు. । వారిలో వున్న దొడ్డవాడు ముల్లు 4
లాగున వుండెను; వారిలో యథార్థపరుడు బ్రహ్మ
చెముడు వంటివాడు; నీ కాపలి దినమున్ను నిన్ను
శిక్షించే దినమున్ను నస్తూ వున్నది; యిప్పుడు వారు

5 కలవిలగానే వుందురు. । స్నేహితుని యందు నమ్మిక
వుంచవద్దు; గురువును విశ్వసించకండి; నీ కౌగిటలో
పడుకొనిన దాని యొద్ద నీవు వాగ్బంధన చేయుము. ।
6 యేమంటే కుమారుడు తండ్రిని నిర్లక్ష్యపెట్టును;
కుమార్తె తల్లి మీదికిన్ని కోడలు అత్త మీదికిన్ని
లేచును; తన యింటివారు తనకు విరోధులై వుందురు. ।
7 కాబట్టి నేను యెహోవా కొరకు యెదురు చూస్తూ
వుందును; నన్ను రక్షించే దేవుని కొరకు కనిపెట్టి వుం
8 దును; నా దేవుడు నా ప్రార్థనను వినును. । ఓ
నా శత్రువుడా, నా మీద అతిశయించవద్దు; నేను
కింద బడినప్పటికీ తిరిగీ లేతును; నేను అంధకారమందు
కూర్చున్నప్పుడు యెహోవా నాకు వెలుగై వుండును. ।
9 నేను యెహోవాకు పాపము చేస్తిని గనుక ఆయన
నా పట్ల వ్యాజ్యమాడి, నా పట్ల న్యాయము తీర్చే
పర్యంతమూ నేను ఆయన కోపాగ్నిని సహింతును;
ఆయన నన్ను వెలుగులోకి బయిలు తీసును; ఆయన
10 నీతిని నేను చూతును. । నా శత్రువు నన్ను చూచును;
నీ దేవుడైన యెహోవా యెక్కడని నాతో అనిన
దానిని శిగ్గు కప్పును; అది నా కండ్లకు అగుపడును;
యిప్పుడు అది వీధిలో వున్న బురద లాగున తొక్కబ
11 డును. । నీ గోడలు తిరిగీ కట్టించే దినమందు ఆ నిర్ణ
12 యము దూరముగా వుండును. । అయితే ఆ దినమందు
అష్షూరు దేశమునుంచిన్ని ప్రాకారములు గల పట్టణ
ములనుంచిన్ని కోట మొదలుకొని నది మట్టుకున్ను
యీ సముద్రము మొదలుకొని ఆ సముద్రము మట్టు
కున్ను యీ పర్వతము మొదలుకొని ఆ పర్వతము
మట్టుకున్ను నీ యొద్దికి జనము వచ్చును. । అయితే దేశ 13
ము దానిలో కాపురము చేసిన వారి నిమిత్తమున్ను
వారి చేతుల ఫలము నిమిత్తమున్ను శూన్యమౌను. । మీ 14
చేతి కర్రను మీరు పట్టుకొని, కర్మేలు పర్వతమం
దలి అడివిలో వేరుగా వున్న మీకు సంపాద్యమైన
మందను మేపింతురు గాక; మునుపటి లాగున వారిని
బాషానులోనున్ను గిలాదులోనున్ను మెయ్య నియ్యం
డి. । మిస్రయీము దేశములోనుంచి నీవు వచ్చిన దిన 15
ములందైనట్టు నేను అతనికి అద్భుతములను చూపిం
తును. । అన్య జనాంగములు దానిని చూచి, తమకు 16
కలిగిన బలమంతటివల్ల తామే సిగ్గు పడుదురు; చేతితో
నోరు మూసుకొందురు; వారి చెవులు చెవుడెక్కి
పోవును. । సర్పముల లాగున మన్ను నాకుదురు; వారి 17
వారి దాపులలోనుంచి భూమిలో వుండే పురుగుల
వలెనే పాకి వత్తురు; మన దేవుడైన యెహోవాకు
జడిసి ఆయననుంచి భయపడుదురు. । యింకా శేషించి 18
వున్న మీ స్వజనుల అక్రమమును కాచి, అన్యాయ
మునుంచి వారిని క్షమించిన దేవుడవయిన నీకు సముడు
యెవడు? ఆయన జాలి యందు ప్రియముగా వుండెను
గనుక యెల్లప్పటికీ కోపమును వుంచుకోడు. । ఆయన 19
తిరిగీ వచ్చి మనలను కనికరించును; మన అక్రమము
లను అణచివేసును; వారి పాపములన్నిటినీ నీవు సము
ద్రపు అగాధములలో పడవేతువు. । ఆదిని నీవు అబ్ర 20
హాము యాకోబు అనే మా పితృలకు ప్రమాణము చేసి
యిచ్చిన ప్రమాణమునున్ను కృపనున్ను నీవు దయ
చేతువు.

# నహూాము యొక్క గ్రంథము.

## 1. అధ్యాయము.

1 ఇది ఎల్కోషీయుడైన నహూాముకు కనుబడిన
నీనెవే పట్టణమును గురించి భగవద్వాక్యము గల
2 గ్రంథమై యున్నది. । యెహోవా పరాక్రమముగల
దేవుడై శిక్షించును; యెహోవా రౌద్రము తెచ్చు
కొని శిక్షించును; యెహోవా తన విరోధులకు తగిన
ప్రాయశ్చిత్తమును చేసును; తన శత్రువుల కొరకు
3 తన యొద్ద వుగ్రతను వుంచుకొనును. । యెహోవాకు
బహు బలము కలిగినప్పటికిన్ని బహు శాంతమూర్తి
అయి వున్నాడు; అయితే దోషిని నిర్దోషిగా యె
ప్పటికీ యెంచక వుండును; యెహోవా మార్గము
సుడిగాలిలోనున్ను తుఫానులోనున్ను వున్నది; మేఘ
4 ములు ఆయన పాద ధూళి అయి వున్నవి. । ఆయన
సముద్రమును గద్దించి, పొడి భూమిగా చేయగలడు;
నదులన్నిటినీ యెండిపో చేయగలడు; బాషానున్న
కర్మేలున్ను లెబానోను పుష్పమున్న సురిగి పో
5 వును. । ఆయన ముందట పర్వతములు కంపించును;
కొండలు కరుగును; ఆయన ముందట భూమిన్ని లోక
మున్ను దానిలో వున్న సకల వస్తువులున్ను దహన
6 మవును. । ఆయన వుగ్రము ముందట యెవరు నిలువ
గలరు! ఆయన కోపాగ్ని ముందట యే జీవి నిలుచును!
ఆయన కోపమును అగ్నివలె కుమ్మరించును; ఆయన
7 చేత కొండలు కింద వేయబడును. । యెహోవా వుత్త
ముడై శ్రమ దినమందు గట్టి ప్రాపకుడై వుండును;
ఆయన యందు నమ్మిక వుంచిన వారినందరినిన్ని ఆయన
8 యెరుగును. । అయితే జలప్రళయముచేత ఆయన సర్వ
నాశము చేసును; అంధకారము ఆయన శత్రువులను
9 తరుమును. । యెహోవా మీద దుర్యోజన యోజిం
చేదేమి! ఆయన సర్వనాశనము చేసును; రెండవ మారు
10 వుపద్రవము లేచేది లేదు. । యేమంటే వారు ముండ్ల
లాగున తగులుకొని వుండగానున్ను మత్తు దారుల లా
గున మత్తిల్లి వుండగానున్ను యెండిపోయిన కొయ్య
11 కాలువలె దహనమవుదురు. । నీలోనుంచి వొకడు బైలు
వచ్చెను; అతడు దురాలోచనపరుడై, యెహోవా
12 మీద దుర్యోజన యోజించెను. । కాబట్టి యెహో
వా ఆనతిచ్చేదేమంటే, వారు విజయము పొంది, అనే
కులై వున్నప్పటికిన్ని ఆలాగునే వారు తెగిపోదురు;
అతడు గతించును; నిన్ను నేను బాధ పెట్టినప్పటికిన్ని
యిక నిన్ను బాధ పెట్టక వుందును. । యిప్పుడు అతడు 13
పెట్టిన కాడి కర్రను నీ మీదనుంచి తీసి విరిచి, నీ
కట్లను తెంపివేతును. । అయితే నిన్ను గురించి యె 14
హోవా నిర్ణయించెను, నీ నామముకు సంతు లేక
పోవును; నీ దేవాలయములోనుంచి చెక్కిన విగ్రహ
ములనున్ను పోత విగ్రహములనున్ను తెగవేతును; నీవు
యేహ్యమైన వాడవు గనుక నీ కొరకు సమాధిని సిద్ధ
పర్తును. । అదుగో శుభసమాచారములను తెస్తూ క్షేమము 15
ప్రకటిస్తూ వున్న వాని పాదములు పర్వతముల మీద
అగుపడుతూ వున్నవి; ఓ యూదా, నీ పండుగ దిన
ములను ఆచరించుకొనుము; నీ మొక్కుబళ్లను తీర్చుకొ
నుము; యేమంటే యిక దుర్మార్గుడు గడిచి, నీలోకి
వచ్చుట లేకపోవును; అతడు సర్వనాశనమాను.

## 2. అధ్యాయము.

లయకర్త నీ మీదికి వచ్చెను; కోట కాచుకొమ్ము; 1
మార్గమును కనిపెట్టి వుండుము; నడుము బిగించుకొ
నుము; నీ సామర్థ్యమును బలపచుర్చుకొమ్ము. । యేమం 2
టే ఇశ్రాయేలు గర్వమును తిప్పినట్టు, యెహోవా
యాకోబుయొక్క గర్వమునున్ను తిప్పును; యేమంటే
సర్వ నాశనము చేసేవారు వచ్చి, వారిని సర్వ నాశ
ము చేసి, వారి ద్రాక్ష జంటలను పాడుచేసిరి. । అతని 3
బలాఢ్యుల డాళ్లు యెరుపుగా వున్నవి; పరాక్రమశా
లులు రక్త వర్ణముగా వుండిరి; అతడు నిర్ణయించిన
దినమునకు రథములయొక్క వంక కత్తులు అగ్నిలో
వున్నవి; దేవదారు వృక్షములు బహుగా కదల్చబడును. ।
వీధులలో రథములు మిక్కిలీ తొందరగా వెళ్లును; 4
అవి విశాలమైన మార్గములలో తోసుకొ పోయి తిరు
గులాడును; అవి దివిటీల వలెనే అగుపడును; మెరుపుల
లాగున పరుగెత్తును. । అతడు తన ఘనులను యెంచును 5
అయితే వీరు రాగానే పడిపోదురు; అవు సిద్ధమైనప్పుడు
వారు గోడ మీదికి వేగిరమే వత్తురు. । నదుల ద్వార 6
ములు విప్పబడును; నగరు కొట్టుకొపోవును. । పట్టణపు 7
దేవి చెరలో బడును; దానినిన్ని దాని చెలికత్తెలనున్ను
యెక్కించుకొని పోదురు; వారు రొమ్ములు కొట్టుకొం
టూ గువ్వ పిట్టల లాగున మూల్గుతూ కొంచు పోబ
డుదురు. । నీనెవే పట్టణము చాలా దినములకు కొల 8
నౌను; జనులు పారిపోదురు; నిలువండి నిలువండని
చెప్పినప్పటికిన్ని తిరిగి చూచేవాడు వొకడున్ను లేకపో

9 వును. । వాని వెండినిన్ని దాని బంగారమునున్న దోచు
కొండి; దాచిపెట్టిన ప్రియమయిన ఘనముగల సకల
10 పదార్థములున్ను లెక్క లేక వున్నవి. । అది సర్వ
శూన్యమైయున్ని పాడైయున్ని పోయెను; హృదయ
ములు కరిగిపోయెను; మోకాళ్లు కొట్టుకొ పోయెను;
నడుములన్నిటికీ నొప్పి కలిగెను; నానా ముఖములు
11 కళాహీనములాయెను. । యిప్పుడు సింహముల నివా
సము యెక్కడ? సింహపు పిల్లల మేత స్థలము యె
క్కడ? సింహమున్ను ముసలి సింహమున్ను వాటి వాటి
పిల్లలున్ను యెవరి భయము లేకుండా నడుస్తూ వుం
12 డెను. । సింహము తన పిల్లలకున్ను ఆడు సింహములకు
న్ను కావలసినంత మట్టుకు గొంతుక నొక్కిపట్టి పెగ
ల్చిన వాటిని యిచ్చెను; తన గుహలను మృగ కళేబర
ములతోటిన్ని తన నివాసములను వేటాడి పట్టిన వాటి
13 తోటిన్ని నిండ జేసెను. । కాబట్టి సర్వశక్తి గల యె
హోవా ఆనతిచ్చేదేమంటే, నేను నీ మీదికి వత్తును;
నీ రథములను కాల్చినందున వాటి ధూమము యె
క్కును; కత్తి నీ కొదమ సింహములను మింగును; నీకు
దొరికిన దోపుడును భూమిలోనుంచి తెగవేతును; యిక
నీ రాయభారుల శబ్దము వినబడదు.

## 3. అధ్యాయము.

1 రక్త దోషి అయిన పట్టణమునకు అయ్యో! అబద్ధ
ములతోటిన్ని దోపుడుతోటిన్ని నిండి వున్నది; దొం
2 గిలుట తప్పినది కాదు. । సారథియొక్క చబుకు ధ్వనిన్ని
చక్రముల చప్పుడున్ను గుఱ్ఱములు తొక్కిన ధ్వనిన్ని
3 తూలె రథముల ధ్వనిన్ని వినబడెను. । రౌతులు ప్రకా
శమైన కత్తినిన్ని తళతళలాడే యీటెనున్ను పైకి యె
త్తుదురు; చాలామంది హతమాదురు; కళేబరములు
విస్తారముగానున్ను లెక్కలేనివిగానున్ను వుండును; కళే
4 బరములను తాకి పడుదురు. । చక్కని వేశ్యవైయున్ని
చిల్లంగితనమందు యజమానురాలవైయున్ని జారత్వముల
వల్ల జనాంగములనున్ను చిల్లంగితనమువల్ల సంసారముల
5 నున్ను అమ్మివేసిన దానా, । సర్వశక్తి గల యెహోవా
ఆనతిచ్చేదేమంటే, నీ జారత్వములు బహు విస్తారము
గనుక యిదుగో నేను నీకు విరోధినై వున్నాను; నీ
చెంగులు నీ ముఖము మీద వేసి, నీ మానమును జనాం
గములకున్ను నీ సిగ్గును రాజాంగములకున్ను బైలుపరు
6 తును. । నీ మీద పెంటవేసి, నిన్ను నీచురాలినిగా చేసి,
7 చూడ నాశ్చర్యముగా చేతును. । కాబట్టి నిన్ను చూ
చిన వారందరున్ను నీ యొద్దనుంచి పారిపోయి, నీనెవే
పాడైపోయెననిన్ని యెవరు దాని కొరకు మూల్గుదుర
నిన్ని నీ కొరకు వోదార్చే వారిని యెక్కడ చూతు
మనిన్ని అందురు. । బహు జనము కలిగి, నదుల దగ్గిర 8
వుండిన నో పట్టణము కంటే నీవు విశేషమైనదానవా?
సముద్రము దానికి ఆపుగానున్న ప్రాకారముగాను
న్ను వుండెను. । కుషు దేశము వల్లనున్న మిస్రయీము 9
దేశమువల్లనున్న దానికి బలము కలిగెను; అది అపరి
మితమై వుండెను; పూథువారున్న లుబ్బీయులున్న
దానికి సహాయులై వుండిరి. । అయినప్పటికిన్నీ అది 10
చెరలోకి వెళ్లిపోయెను; దాని చిన్న పిల్లలు వీథుల మొ
గలందు ప్రహరించబడిరి; దాని ఘనుల మీద చీట్లు
వేయబడెను; దాని పెద్దలందరున్ను సంకెళ్లతోటి బం
ధించబడిరి. । నీవున్ను మత్తురాలవై దాగి వుందువు; 11
శత్రువు వచ్చినందున నీవు గట్టి స్థలములను వెతుకు
దువు. । అయితే నీ కోటలు ముదిరిన అంజూరపు పండ్ల 12
చెట్లవలె వుండును; యేమంటే వాటిని కదిలిస్తే పండ్లు
తినే వాని నోట బడును. । యిదుగో నీలో వున్న 13
జనులు స్త్రీలు; నీ దేశపు ద్వారములు నీ శత్రువుల
చేత బాగా విప్పబడును; అగ్ని నీ అడ్డుగడలను దహిం
చును. । ముట్టడి వేసే కాలము కొరకు నీళ్లు తోడు 14
టకు నీ కోటలను గట్టి చేసుకొమ్ము; జిగట భూమికి
వెళ్లుము; సున్నపు అడుసు తొక్కుము; యిటికెల ఆవ
మును దిట్టపర్చుము. । యిది అంతా చేసినప్పటికిన్ని 15
అగ్ని అక్కడ నిన్ను దహించును; కత్తి నిన్ను తెగవే
సును; గొంగళి పురుగు వలె అది నిన్ను తినివేసును;
వో రాజా, గొంగళి పురుగులంత విస్తారము నిన్ను
నీవు చేసుకొమ్ము; వో పట్టణమా, మిడతలంత విస్తార
ము నిన్ను నీవు చేసుకొమ్ము. । నీ వర్తకులు ఆకాశ 16
నక్షత్రముల కంటే అనేకముగా వున్నారు; మిడతలు
వచ్చి చెరిపి యెగిరిపోవును. । నీ కిరీటధారులు మిడతల 17
వలెనున్న నీ సైన్యాధిపతులు పెద్ద గొంగళి పురుగుల
వలెనున్న వున్నారు; చలికాలమందు యివి కంచెలలో
నివాసము చేసును; యెండ కాసినప్పుడు యెగిరిపో
వును; అవి యెక్కడ వాలి వుండునో అది తెలియదు. ।
వో అష్షూరు రాజా, నీ బోయలు నిద్రమత్తులయి 18
వుందురు; నీ ఘనులు వూరికే వుందురు; నీ జనులు
పర్వతముల మీదికి చెదిరిపోదురు; వారిని కూర్చుటకు
వొకడున్ను లేకపోవును. । నీ గాయము యెంత మా 19
త్రమూ స్వస్థతను పొందదు; నీకు కలిగిన తెగులు
మిక్కిలి చెడ్డదిగా వున్నది; నిన్ను గురించిన సంగతి
వినిన వారందరున్ను నీ విషయమై చప్పట్లు చరుతురు;
యేమంటే యెప్పుడున్ను నీవల్ల మోసపోని వాడు వొక
డైనా వున్నాడా?

# హబక్కూకు యొక్క గ్రంథము.

## 1. అధ్యాయము.

1 ఇది దీర్ఘదర్శియైన హబక్కూకుకు దర్శనము
2 వల్ల వచ్చిన భగవద్వాక్యము. । ఓ యెహోవా, నీవు
ఆలకించక యెన్నాళ్లు వుందువు? బలవంతమును గురించి
3 నీకు మొర్రబెట్టినప్పటికిన్ని నీవు రక్షించవైతివి! । అ
న్యాయము నాకు అగుపడచేయు నేల? వుపద్రవము
నన్ను చూడనివ్వనేల? యేమంటే యెక్కడ చూచినా
పాడు చేసుటయున్ను బలవంతమున్ను అగుపడును;
4 జగడమున్ను వ్యాజ్యమున్ను పుట్టిస్తూ వున్నారు. । అం
దువల్ల న్యాయ ప్రమాణము మానిపోయెను; న్యాయపు
తీర్పు జయముగా నడువకపోయెను; యేమంటే దుర్జ
నులు వచ్చి నీతిపరుని ముట్టడివేసిరి గనుక అన్యా
5 యపు తీర్పు జరుగుతూ వున్నది. । జనాంగములలో
వున్న వారలారా, మీరు చూచి కనిపెట్టి, ఆశ్చర్యప
డుదురు గాక; యేమంటే మీ దినములందు నేను మీకు
6 చెప్పినప్పటికిన్ని మీరు నమ్మని క్రియను చేతును. । యే
మంటే యిదుగో నేను త్వరపడే జనులైన కల్దీయులనే
క్రూరులను రేపింతును; వారు యావద్దేశము మీదికి
గడిచి వచ్చి, అన్యుల కాపురములను ఆక్రమింతురు. ।
7 చూచుటకు వారు భయంకరముగానున్ను భీకరముగా
నున్ను వుందురు; వారి అధికారమున్ను ఘనమున్ను
8 వారి స్వేచ్ఛలవల్లనే కలిగి వుండును. । వారి గుర్రములు
సివంగుల కంటే వేగము కలిగినవిన్ని రాత్రిలో తిరిగే
తోడేళ్ల కంటే క్రూరమైనవిన్ని అయి వున్నవి; వారి
రౌతులు నఖముఖాలా తిరుగులాడుదురు; వారి రౌ
తులు దూరమునుంచి వత్తురు; ఆహారమునకు పరుగున
9 వచ్చే గద్ద వలె వారు యెగిరి వత్తురు. । బలవంతము చేసు
టకు వత్తురు; వారు తమ ముఖ దృష్టిని తూర్పు తట్టు
తిప్పి, యిసుకంత విస్తారమైన జనులను చెరలోకి కూ
10 ర్తురు. । రాజులను అపహాస్యము చేతురు; అధిపతులను
చూచి నవ్వుదురు; గట్టి స్థలములన్నిటినిన్ని నిర్లక్ష్య
11 పెట్టి, మంటి దిబ్బచేసి ఆక్రమింతురు. । అప్పుడు వారి
మనస్సు వేరైనందున వారు గడిచిపోయి, వారికి కలి
గిన బలము వారి దేవుని వల్ల వచ్చెనని యెంచుకొని,
12 శిక్షకు లోనౌదురు. । ఓ నా దేవుడవైన యెహోవా,
నా పరిశుద్ధమైన వాడా, ఆదినుంచి నీవు వున్న వాడవు
కావా? మేము మరణము కాక వుందుము; ఓ యె
హోవా, శిక్షా విధి చేసుటకు నీవు వారిని నిర్ణ
యిస్తివి; సామర్థ్యము గల ఓ దేవుడా, దండించు
టకు నీవు వారిని నిలువపెట్టితివి. । నీ కనుదృష్టి బహు 13
నిష్కళంకమైనదై చెడ్డ తనమును చూడక వుండును;
అన్యాయమును చూస్తే నీవు అసహ్యముగా వుందువు;
కాగా కపటులను నీవు కనిపెట్టనేల? దుర్మార్గుడు
తనకు మిక్కుటమైన నీతి పరుని మింగగా నీవు వూరు
కొని వుండెదవేమి! । యేలికలేని చేపలతోటిన్ని పాకే 14
జంతువులతోటిన్ని నరులను సమము చేసెదవేమి! ।
వారు గాలపు ముండ్లను వేసి, వీరినందరినిన్ని గుచ్చి 15
లాగుదురు; వురులను వొగ్గి చిక్కించుకొందురు; వల
తోటి వారిని కూర్చుకొని సంతోషపడి గంతులు
వేతురు. । వారివల్ల వారి వంతు కొవ్వున్ను వారి భోజ 16
నము మదమున్ను అయి వున్నది గనుక వారు తమ
వలకు బలులను చెల్లింతురు; తమ వలకు ధూపమిత్తురు. ।
అయితే వారు యెల్లప్పుడున్ను తమ వలలోనుంచి దిమ్మ 17
రిస్తున్నే వుందురా? యెప్పటికిన్ని మానకుండా జనాం
గములను హతము చేస్తూ వుందురా?

## 2. అధ్యాయము.

నా కావలి స్థలము మీద నేను నిలిచి, గోపురము 1
మీద నేను కనిపెట్టుకొని వుండి, ఆయన నాకు యే
సెలవు యిచ్చునో దాని కొరకున్ను నేను అడిగిన
ప్రశ్నకు యే ప్రత్యుత్తరమిచ్చునో దాని కొరకున్ను
యెదురు చూస్తూ వుంటాను. । అప్పుడు యెహోవా 2
నాకు యిచ్చిన ప్రత్యుత్తరమేమంటే, పరుగెత్తే వాడు
కూడా చదువుకొనుటకు నీవు ఆ దర్శనమును విరళము
గా పలక మీద వ్రాతువు గాక. । యేమంటే దర్శనము 3
నిర్ణయించబడ్డ మరి కొంత కాలము పర్యంతమూ రహ
స్యమై వుండును; తరువాత అది తప్పకుండా బైలుపడు
ను; ఆ దర్శనము ఆలస్యమైనప్పటికిన్ని దాని కొరకు కని
పెట్టి వుండుము; యేమంటే అది ఆలస్యము లేకుండా
అవశ్యముగా వచ్చును. । యిదుగో అతని మనస్సు అతని 4
లో అతిశయపడి, యథార్థమయినది కాకపోయెను;
అయితే నీతిపరుడు తన విశ్వాసమువల్ల బ్రతుకును. ।
మరిన్ని అతడు ద్రాక్షా రసము రుచి మరిగి, గర్విష్ఠుడై 5
వుండి, తాను తన కాపురమందు నిలువక, తన కోరికెను
సమాధికొరకైనట్టు విస్తరింపచేసి, మృత్యువు లాగున
ఆశతీరక, సకల జనాంగములను కూర్చుకొని, సకల
జనులను లాగుతూ వున్నాడు. । వీరందరున్ను యితని 6
గూర్చి వుపమానమునున్ను అపహాస్యపు సామితెనున్ను
యెత్తరా? యెత్తి వారు పలికేదేమంటే, తనది కాని

దానివల్ల అభివృద్ధి పొందిన వానికిన్ని అన్యాయమును
భరించిన వానికిన్ని అయ్యో! యీలాగున యెన్నాళ్లు
7 నిలుచునని పలుకుదురు.। వారు హఠాత్తుగా లేచి నిన్ను
కరవరా? వారు మేలుకొని నిన్ను హింస పెట్టరా?
8 నిజముగా నీవు వారివల్ల దోపుడు పోదువు.। నీవు చా
లా జనాంగములను లయము చేస్తివి గనుక శేషించి
వుండే జనులు నిన్ను నాశనము చేతురు; జనులయొక్క
రక్త దోషము నిమిత్తమున్ను దేశమునున్ను పట్టణము
నున్ను దాని కాపురస్తులందరినిన్ని నీవు చేసిన బలవం
9 తము నిమిత్తమున్ను యిది సంభవించును.। కీడుయొక్క
బలమునుంచి విడిపించుకో గలందులకున్ను తన గూడు
పైని కట్టుకో గలందులకున్ను అపేక్షించి, తన యింటి
0 కొరకు దురాశపడిన వానికి అయ్యో!। నీవు చాలా
జనులకు నరికినందువల్ల నీ యింటికి అవమానము వచ్చు
టకు ఆలోచిస్తివి; నీ ప్రాణమునకు నీవే పాపముచేస్తివి.।
1 యేమంటే గోడలోనుంచి రాయి మొఱ్ఱ పెట్టును,
2 దానికి దూలము ప్రత్యుత్తరమిచ్చును.। రక్తము చిందు
టచేత వూరు కట్టించి, అన్యాయముచేత పట్టణమును
3 స్థాపించిన వానికి అయ్యో!। యిదుగో జనులయొక్క
కష్టము అగ్నికి ఆహారముగానున్ను జనులయొక్క
ప్రయాసము వ్యర్థముగానున్ను సర్వశక్తిగల యె
4 హోవా చేయక పోవునా?। యేమంటే సముద్రము
వుదకములచేత కప్పబడినట్టు భూమి యెహోవా
యొక్క ఘనతను గురించిన తెలివిచేత నిండి వుండును.।
5 తన పొరుగువానికి తాగుటకు యిచ్చి, తన బుడ్డిని తన
ముందట వుంచి, అతని మానమును చూచేటట్టు మత్తు
6 గా తాగించిన వానికి అయ్యో!। బహుమానమునకు మా
రుగా అవమానము నీకు నిండుగా వచ్చును; నీవున్ను
తాగి నీ మానము పయి వున్న చర్మమును బైలు పర్చు
కొందువు; యెహోవా కుడిచేతిలో వున్న పాత్ర నీ
తట్టున్ను తిప్పబడును; నీ ఘనత్వము పై అసహ్యమైన
17 వమనము కప్పి వుండును.। యేమంటే లెబానోనుకు
చేసిన బలవంతము నిన్ను కప్పును; పశువులకు చేసిన
లయమువల్ల నీకు బెంగ కలుగును; మరిన్ని జనులయొ
క్క రక్త దోషము నిమిత్తమున్ను దేశమునున్ను పట్టణ
మునున్ను దానిలో కాపురస్తులందరున్ను చేసిన బలవం
18 తము నిమిత్తమున్ను యిది సంభవించును.। చెక్కడపు
పనివాడు విగ్రహమును చెక్కిన తరువాత ఆ విగ్ర
హము యే ప్రయోజనమునకు వచ్చును? అబద్ధములు
పుట్టించే పోత విగ్రహము యే ప్రయోజనమునకు
వచ్చును? పనివాడు మూగి బొమ్మలను చేసి తాను రూ
19 పించిన వాటియందు నమ్మును.। కర్రను చూచి మేలు
కొమ్ము అనిన్ని మూగి రాతిని చూచి లెమ్మనిన్ని చెప్పే
వానికి అయ్యో! అది యేమైనా నేర్పగలదా? యిదు
గో అది బంగారముతోనున్ను వెండితోనున్ను పూత
పెట్టబడినప్పటికిన్ని దానిలో శ్వాసము యెంత మాత్ర
మూ లేదు.। అయితే యెహోవా తన పరిశుద్ధ మంది 20
రములో వున్నాడు; ఆయన ముందట లోకులందరున్ను
మౌనులై వుందురు గాక.

## 3. అధ్యాయము.

ఇది దీర్ఘదర్శియైన హబక్కూకు చేసిన ప్రా 1
ర్థన.। ఓ యెహోవా, నీ వాక్యము నాకు వినబ 2
డినప్పుడు నేను భయపడితిని ఓ యెహోవా, యీ
సంవత్సరములోనే నీ కార్యమును బలపర్చుము; యీ
సంవత్సరములోనే దాని తెలియ చేయుము; వుగ్రు
డవై వున్నప్పటికిన్ని కనికరించుము.। దేవుడు తేమా 3
నునుంచిన్ని పరిశుద్ధుడు పారానునుంచిన్ని వచ్చెను;
ఆయన మహిమ ఆకాశమండలమును కప్పెను; ఆయన
ప్రకాశతతోటి భూమి నిండి వుండెను.। ఆయన తేజ 4
స్సు వెలుగు వలె వుండెను; ఆయన హస్తములోనుంచి
కిరణములు బైలువెళ్లెను; వాటిలో ఆయన బలము దాగి
వుండెను.। ఆయన ముందట తెగులు నడుస్తూ వుండెను; 5
అగ్ని మెరుపులు ఆయన పాదముల వెంట వచ్చెను.।
ఆయన నిలిచి, భూమిని కొలిచెను; జనాంగములను 6
చూచి, వారిని చెదరచేసెను; స్థిరమైన పర్వతములు
ఛిన్నాభిన్నములాయెను; నిత్యమైన కొండలు వంగెను;
ఆయన నడతలు నిత్యమై వుండెను.। వుపద్రవమందున్న 7
కూషాను డేరాలు నాకు కనుబడెను; మిద్యాను దేశపు
డేరాల తెరలు గడగడలాడెను.। నదుల మీద యె 8
హోవాకు హంకారము పుట్టెనా? నదుల మీద నీకు
కోపము కలిగెనా? సముద్రము మీద నీకు వుగ్రము
వున్నందుచేతనా నీ గుర్రముల మీదనున్ను రక్షణ
యనే రథముల మీదనున్ను యెక్కివస్తివి?। నీ వింటిని 9
నారి యెక్కించి, చాలా బాణములను ప్రయోగిస్తివి;
భూమిని బద్దలుచేసి నదులను కలుగ చేస్తివి.। పర్వత 10
ములు నిన్ను చూచి కంపించెను; వుదక ప్రవాహ
ములు పారిపోయెను; అగాధము తన శబ్దమును యెత్తి
తన చేతులను పైకి యెత్తెను.। సూర్య చంద్రులున్ను 11
తమ నివాసములందు నిలిచి వుండిరి; నీ బాణములు
మెరుపుల వలె సంచరించెను; తేజస్సువలెనే నీ యీటె
తళతళలాడెను.। బహు రౌద్రముగా నీవు దేశమును 12
గడిచిపోతివి; కోపము తెచ్చుకొని, నీవు జనాంగము
లను దుళ్లగొట్టితివి.। నీ జనులను రక్షించుటకు నీవు 13
బైలువస్తివి; నీవల్ల అభిషిక్తునిచేత రక్షణ కలుగచేసుటకు
నీవు దుర్జనుల యింటి పైనున్న ప్రధాన శిరస్సును
గాయపర్చి, పునాదిని కుతికెలబంటి మట్టుకు బైలు
తీస్తివి.। అతని యీటెలచేత నీవు వారి గ్రామముల 14

యొక్క ప్రధాన శిరస్సును దూసిపో చేస్తివి; ప్రళయ
వాయువు వలెనే వారు నన్ను చెదరచేయ వచ్చిరి;
బీదవాని రహస్యముగా మింగివేసుటకు వారు సంతో
15 షముతోటి వచ్చిరి. । నీవు గుఱ్ఱములను యెక్కి సము
ద్రములోనుంచి మార్గము చేస్తివి; విస్తారపు వుదక
16 ములు రాశులుగా నిలిచి వుండెను. । అది నాకు వినబ
డినప్పుడు నా అంతరంగము కలవిలగా వుండెను; నీ
శబ్దమునకు నా పెదవులు అల్లలాడెను; నా ఎముకలు
కుళ్లిపోయినవి; నా భారము నేను పట్టలేక పోతిని;
యేమంటే శ్రమ దినము దాకా నేను నిలువబడి
సమూహములతో మన మీద పడిన జనులకు దొరుకు
దును. । అయితే అంజూరపు చెట్టు పుయ్యక పోయిన 17
ప్పటికిన్ని ద్రాక్ష చెట్టు ఫలించక పోయినప్పటికిన్ని
ఇప్ప చెట్టు పనికి రాక పోయినప్పటికిన్ని పొలములు
ఆహారములు యివ్వక పోయినప్పటికిన్ని గొఱ్ఱెలు దొ
డ్డిలోనుంచి తెగవేయబడినప్పటికిన్ని సాలలో యెద్దు
లేకపోయినప్పటికిన్ని నేను యెహోవా విషయమై
గంతులువేసి, నన్ను రక్షించే దేవుని యందు బహుగా
సంతోషింతును. । కర్తయైన యెహోవా నాకు బల 19
మై వున్నాడు; నా కాళ్లను లేడి కాళ్ల వలె చేసి,
జయించే వాని పాట పాడుతున్న నన్ను ఆయన నా
వున్నత స్థలముల మీద నడవ చేసును.

# సెఫన్యా యొక్క గ్రంథము.

## 1. అధ్యాయము.

1 హిజ్కియా అమర్యా కుమారుడు, అమర్యా గెద
ల్యా కుమారుడు, గెదల్యా కూషీ కుమారుడు, యీ
కూషీ కుమారుడైన సెఫన్యాకు యెహోవా వాక్యము
యూదా రాజైన ఆమోను కుమారుడైన యోషీయా
2 దినములందు వచ్చి, చెప్పినదేమంటే, । దేశములో వున్న
3 సమస్తమున్ను నేను వూడ్చి వేతును. । మనుష్యులున్ను
మృగమున్ను వూడ్చి వేతును; ఆకాశ పక్షులనున్ను
సముద్రపు మత్స్యములనున్ను దుర్జనులనున్ను వారు
స్థాపించిన విగ్రహములనున్ను వూడ్చి వేతును; దేశ
ములోనుంచి మనుష్యజాతిని లయము చేతునని యె
4 హోవా ఆనతిచ్చి, మరిన్ని చెప్పేదేమంటే, । నా హస్త
మును నేను యూదా దేశము పైనిన్ని యెరూశలేము
కాపురస్థులందరి పైనిన్ని చాపి, బయలుకు కలిగిన శేష
5 మున్ను అర్చకులతోటి ఖిమారీములనున్ను, । మేడల
మీదనుంచి ఆకాశ సమూహమునకు మ్రొక్కిన వారి
నిన్ని, యెహోవా నామము చేతనున్ను మల్కోము
నామము చేతనున్ను మ్రొక్కి ప్రమాణము చేసిన వారి
6 నిన్ని, । యెహోవా వెనుకనుంచి తిరిగి పోయిన వారి
నిన్ని, యెహోవాను వెతుకక లక్ష్యపెట్టని వారినిన్ని,
7 యీ స్థలములోనుంచి తెగవేతునని ఆనతిచ్చెను. । కర్త
యైన యెహోవా ముందట నీవు మౌనివై వుండుము;
యేమంటే యెహోవా దినము సమీపమై వున్నది;
ఆయన బలి సిద్ధపచేశాను, ఆయన రావలసిన వారిని
8 పిలిపించెను. । యిందుకు యెహోవా ఆనతిచ్చేదేమం
టే, బలిచేసే దినమందు నేను అధిపతులనున్ను రాజ
పుత్రులనున్ను అన్య వస్త్రములను కప్పుకొనిన వారి
9 నిన్ని శిక్షింతును. । మరిన్ని ఆ దినమందు కపటము చేత
నున్ను బలవంతము చేతనున్ను సంపాదించబడిన పదా
ర్థములచేత వారి యజమానుల యిండ్లను నింపుటకు
గడప దాటి వచ్చిన వారందరినిన్ని నేను శిక్షింతునని
10 ఆనతిచ్చి, యెహోవా మరిన్ని చెప్పేదేమంటే, । ఆ
దినమందు మత్స్య ద్వారములోనుంచి రోదన శబ్ద
మున్ను రెండో ద్వారములోనుంచి అంగలార్పున్ను
వినబడును; కొండలలోనుంచి బహుగా గొల్లున్ను
11 లేచును. । మక్తేషు కాపురస్థులారా, అంగలార్చండి;
యేమంటే వర్తకులందరున్ను మౌనులౌదురు; వెండి
12 నమ్మే వారందరున్ను తెగవేయబడుదురు. । మరిన్ని ఆ
దినమందు నేను యెరూశలేమును దీపములతోటి పరి
శోధించి, మీదికి తేరిన తెట్టె లాగున వుండి, యెహో
వా మేలైనా కీడైనా చేసేవాడు కాడని అనుకొనిన
నారిని శిక్షింతును. । కాబట్టి వారి ఆస్తి దోపుడౌను; 13
వారి యిండ్లు పాడవును; వారు యిండ్లను కట్టుకొన్న
ప్పటికిన్ని కాపురము చేయక పోదురు; ద్రాక్ష తో
టలను వేసినప్పటికిన్ని వాటి రసమును తాగక పోదు
రు. । యెహోవా ఘనమైన దినము సమీపమాయెను; 14
యెహోవా దినము సమీపమై, అతి శీఘ్రముగా
వచ్చును; అప్పుడు పరాక్రమశాలి కూడా విషపు యే
డ్పుతోటి రోదనము చేసును. । ఆ దినము వుగ్రపు 15
దినమై వుండును; శ్రమయున్ను వుపద్రవమున్ను కలి
గిన దినమౌను; ఆ దినమందు నాశనమున్ను లయమున్ను
కలిగి వుండును; అంధకారమున్ను మబ్బున్ను గల దిన
మై వుండును; మేఘములున్ను దిట్టమైన అంధకార
మున్ను గల దినమై వుండును. । ఆ దినమందు ప్రాకా 16
రములు గల పట్టణముల మీదనున్ను వున్నతమైన గో
పురముల మీదనున్ను భయంకరమైన బాకా నాద
మవును. । జనులు యెహోవా విషయమై పాపము 17
చేసిరి గనుక నేను వారి మీదికి వుపద్రవమును రప్పిం
చినందున వారు గుడ్డివారి వలెనే నడుస్తూ వుందురు;
వారి రక్తము ధూళి వలె కుమ్మరించబడును; వారి శరీర
ములు పెంట అవును. । యెహోవా వుగ్రపు దిన 18
మందు వారి వెండి అయినా వారి బంగారమైనా వా
రిని విడిపించ లేకపోవును; ఆయన కోపాగ్నిచేత దేశ
మంతా దహనమౌను; యేమంటే శీఘ్రముగా ఆయన
దేశమందు కాపురము చేసిన వారందరినిన్ని సర్వనా
శనము చేసును.

## 2. అధ్యాయము.

ఓ నిరాశగల జనాంగమా, సమయము పొల్లు వలె 1
నే గడిచిపోతూ వున్నది గనుక, । నిర్ణయము బైలు 2
రాక మునుపున్ను యెహోవా కోపాగ్ని నీ మీదికి
రాక మునుపున్ను యెహోవా వుగ్రపు దినము నీ
మీదికి రాక మునుపున్ను కూడుకొని రమ్ము. । దేశము 3
లో సాత్వికులై ఆయన నీతి న్యాయములను చేసిన
వారలారా, యెహోవాను వెతుకండి; యెహోవా
వుగ్రపు దినమందు మీరు దాచబడుదురేమో; కాబట్టి
నీతినిన్ని సాత్వికమునున్ను వెతుకండి. । యేమంటే 4

గాజా పట్టణము పెంటిగా విడువబడును; అష్కెలోను
పాడై పోవును; అష్డోదు వారు మధ్యాహ్న కాలమందు
బయిటికి వెళ్లగొట్టబడుదురు; ఎక్రోను పట్టణము దుంప
5 నాశనమౌను. । సముద్ర ప్రాంతమందు కాపురము
చేసే వారిని, అనగా, కెరేతీయుల జనాంగమునకు
అయ్యో! యేమంటే యెహోవా వాక్యము మీకు
విరోధముగా వున్నది; ఫెలిష్తీయులయొక్క కెనయను
దేశమా, నేను నిన్ను లయముచేతును; నీ యందు కా
6 పురస్థుడు వొకడున్ను లేకపోవును. । సముద్ర ప్రాంత
ము గొర్రె బోయల కాపురముల కొరకున్ను గుహల
7 కొరకున్ను మంద దొడ్ల కొరకున్ను వుండును. । మరిన్ని
ఆ దిక్కు యూదా యింట శేషించిన వారి కొరకై
వుండును; అక్కడ వారు మేత పట్టుదురు; అస్తమాన
మందు వారు అష్కెలోను యిండ్లలో పడుకొందురు;
యేమంటే వారి దేవుడైన యెహోవా వారిని కనిక
8 రించి, చెరలోనుంచి తిరిగీ రప్పించును. । మోయాబు
వారు పలికిన అవమానమునున్ను అమ్మోను వారు చేసిన
దూషణనున్ను నేను వింటిని; అందుచేత వారు నా
జనులను అవమానపెట్టి, వారి సరిహద్దులలో వారిని
9 వారు అధికులగా చేసుకొనిరి. । కాబట్టి ఇశ్రాయేలు
దేవుడైన సైన్యముల యెహోవా ఆనతిచ్చేదేమంటే,
నా జీవముతోడు, మోయాబు దేశము సొదొమ లాగు
నను్ను అమ్మోను దేశము గొమొర్రా లాగుననున్ను
వుండును; అక్కడ ముండ్ల చెట్లున్ను వుప్పు గోతులు
న్ను కలిగి వుండును; నా జనులలో శేషించిన వారు
వారిని సర్వ నాశనము చేతురు; నా జనులలో శేషించి
10 యుండేవారు వారి మీద స్వతంత్రులవుదురు. । యీ
లాగున వారి గర్వము నిమిత్తము యిది వారికి సంభవిం
చును; యేమంటే వారు అతిశయపడి, సైన్యముల యె
11 హోవాయొక్క జనులను అవమానపర్చిరి. । వారికి
యెహోవా భయంకరముగా వుండును; యేమంటే
ఆయన భూమిలో వుండే దేవుండ్లనందరినిన్ని క్షయము
చేసును; జనాంగములయొక్క దిక్కులలో వున్న వా
రందరున్ను తమ తమ స్థలములందు ఆయనకు వంగి
12 నమస్కారములు చేతురు. । అయితే కుషీయులారా,
13 మీరున్ను నా కత్తిచేతనే హతమవుదురు. । ఆయన వుత్తర
దేశము మీద తన హస్తమును చాపి, అష్షూరు దేశమును
నాశనము చేసును; నీనెవే పట్టణమును పాడుగానున్ను
14 అర్చుకుపోయిన అరణ్యముగానున్ను చేసును. । దాని
లో గొర్రెలున్ను జనుల పశువులన్నిన్ని పడుకొనును;
ఖైరీలున్ను యేదుబందులున్ను వారి ద్వారబంధముల
మీద నివసించును; వాటి శబ్దము దిడ్డీలలోకి వినబడు
ను; గడప దాటితే పాడు కనుపించును; యేమంటే యె
హోవా ఆర్జ కర్ర పని యావత్తూ తీసివేసును. ।
యిది సకల వుల్లాసముతోటి నిర్విచారముగా వుండి, 15
నా వంటిది మరి లేదని అనుకొనిన నీనెవే పట్టణమై
యున్నది; యిది యేలాగు పాడాయెను! పశువులు
పడుకొనే స్థలము యేలాగు ఆయెనని దానినుంచి గడిచి
వచ్చిన వారందరున్ను అనుకొని, లేపిడీ కొట్టి; చేతులు
తిప్పుదురు.

## 3. అధ్యాయము.

భయంకరమైనదిన్ని బాధ పెట్టినదిన్ని అపవిత్రమై 1
పోయిన పట్టణమునకు అయ్యో! । యేమంటే అది దైవ 2
శబ్దమును ఆలకించలేదు; దానికి బుద్ధిచెప్పి శిక్షించితే
వినలేదు; యెహోవాను నమ్మకనున్ను దేవుని యొద్దికి
చేరకనున్ను వున్నది. । దానిలో వున్న అధిపతులు రంకె 3
వేసే సింహములై వున్నారు; దాని న్యాయ కర్తలు
రాత్రిలో తిరిగి తెల్లవారే పర్యంతమూ మాంసమును
పీకుకొని తినే తోడేళ్ల వలె వున్నారు. । దాని దీర్ఘ 4
దర్శులు వికారులైన అవిశ్వాసులు; దాని అర్చకులు
పరిశుద్ధ స్థలమును అపవిత్రముచేసి, న్యాయ ప్రమాణ
మును విసర్జించిరి. । నీతిపరుడైన యెహోవా దాని 5
లో వున్నాడు; ఆయన అన్యాయము చేయడు; ప్రతి
వుదయమందు ఆయన తన నీతి న్యాయములను వెలుగు
లోకి తెచ్చును; ఆయనకు రహస్యమైనది వొకటీ
లేదు; అయితే నీతి లేనివాడు సిగ్గు యెరగడు. । నేను 6
జనాంగములను నరికివేస్తిని; వారి గోపురములు పాడై
పోయెను; వారి వీధులలో సంచరించేవాడు వొకడు
న్ను లేక పోయెను; వారి పట్టణములలో కాపురస్థుడు
వొకడున్ను లేకుండా లయమై పోయెను. । కాబట్టి 7
నేను అనుకొనినదేమంటే, దీని కాపురము తెగిపోకుం
డా యిది నా యందు భయముగా వుండును; బుద్ధి
చెప్పితే యిది వినునని అనుకొని, యీ ప్రకారము
యిది చేసునని కనిపెట్టి వుంటిని; అయినప్పటికిన్ని
వారు అతి శీఘ్రముగా తమ కార్యములను చెరిపి వేసు
కొనిరి.। కాబట్టి యెహోవా ఆనతిచ్చేదేమంటే, నేను 8
లేచి, సాక్ష్యము అగుపర్చే దినము మట్టుకున్ను మీరు
నన్ను కనిపెట్టి వుండండి; యేమంటే నా వుగ్రము
నున్ను నా యావత్తు కోపాగ్నినిన్ని వారి మీద కుమ్మ
రించుటకు నేను జనాంగములను కూర్చి, రాజాంగము
లను కూడి రాచేతునని నిర్ణయించుకొంటిని; యేమం
టే దేశమంతా నా రౌద్రాగ్నిచేత దహనమవును. ।
అప్పుడు లోకులు యెహోవా నామమును స్మరించి, 9
యేక మనస్సుతోటి ఆయనను సేవించేటట్టు నేను వా
రికి పరిశుద్ధమైన పెదవులను కలుగ చేతును. । యేమం 1
టే చెదిరిపోయిన నా జనులు నాతట్టు హృదయమును
వికసింప చేసుకొని, కుషుయొక్క నదుల అవతలనుంచి

11 నా కొరకు అర్పణలను తీసుకొని వత్తురు. । ఆ దినము
లందు నాకు అక్రమమైన నీ నడతలను గురించి నీవు
సిగ్గు తెచ్చుకొందువు; యేమంటే అప్పుడు నేను నీ
గర్వమందు సంతోషించిన వారిని నీలోనుంచి తీసివే
తును; అప్పుడు నా పరిశుద్ధమయిన కొండ నిమిత్తము
12 నీవు గర్వించక వుందువు. । మరిన్ని నేను నీలో దీన
మనస్సు కలిగిన దరిద్ర జనులను వుంతును; వీరు యె
13 హోవా నామమందు నమ్ముదురు. । ఇశ్రాయేలులో
శేషించి వున్న వారు ఆ అన్యాయమును చేయకనున్ను
అబద్ధమాడకనున్ను వుందురు; కపటపు నాలుక వారి
నోట్లో వుండదు; వారు భుజించి, యెవరి భయము
14 లేకుండా పడుకొని వుందురు. । ఓ సీయోను కుమా
రికా, పాటపాడుము; ఓ ఇశ్రాయేలూ, బొబ్బ పె
ట్టుము; ఓ యెరూశలేము కుమారికా, మనస్ఫూర్తి
15 గా గంతులువేసి, సంతోషముగా వుండుము. । నీ మీ
దికి వచ్చిన ఆజ్ఞలను యెహోవా పోజేసెను; నీ శత్రు
వులను అవతలకు వెళ్లజేసెను; ఇశ్రాయేలుకు రాజయిన
యెహోవా నీలో వున్నాడు; యిక మీదట నీవు
16 కీడును చూడక వుందువు. । ఆ దినమందు భయపడ
వద్దన్న మాట యెరూశలేముకున్ను ధైర్యము తెచ్చు
కొమ్మన్న మాట సీయోనుకున్ను చెప్పబడును. । నీలో 17
వుండే నీ దేవుడైన యెహోవా రక్షించుటకు బలము
గా వున్నాడు; ఆయన నీ మీద మిక్కిలీ ఆనందము
గా సంతోషించును; ఆయన ప్రేమయందు సమ్మతిగా
వుండి, నీ మీద సంతోషముచేత ఆర్చును. । నీవల్ల కలి 18
గిన సంఘము కూడి వచ్చుటకు నిర్ణయమైన కాల
మును గురించి చింతపడిన వారిని నేను కూర్తును;
దాని మీదికి వచ్చిన అవమానము వారికి భారమయి
వుండెను. । యిదుగో ఆ దినమందు నేను నిన్ను హింస 19
పెట్టిన వారందరినిన్ని లయము చేతును; కుంటుతూ
నడిచే దానిని రక్షింతును; పరిహరించబడిన దానిని
చేర్చుకొందును; యే యే దేశములలో నా జనులు సిగ్గు
పొందిరో అక్కడ నేను వారిని ప్రతిష్ఠను పొందించి,
పేరుపడిన వారిగా చేతును. । నేను మిమ్మును కూర్చిన 20
కాలమందు యిక్కడికి రప్పింతును; మీ కండ్ల ముం
దట చెరలో బడిన మీ వారిని తిరిగీ రప్పించినప్పుడు
లోకులందరిలో మీకు ప్రతిష్ఠనున్ను నా నామాంకిత
మునున్ను కలుగచేతునని యెహోవా ఆనతిచ్చెను.

# హాగ్గయియొక్క గ్రంథము.

## 1. అధ్యాయము.

1 రాజైన దర్యావేషు యేలుబడి రెండో సంవత్స
రము ఆరో నెల మొదటి దినమున దీర్ఘదర్శియైన
హగ్గయి చేత యెహోవా వాక్యము యూదా అధి
కారియగు షెయల్తీయేలు కుమారుడైన జెరుబ్బాబెలు
కున్ను ప్రధానార్చకుడగు యెహోసాదాకు కుమా
రుడైన యెహోషువకున్ను వచ్చిన లాగు, సైన్యముల
2 యెహోవా ఆనతిచ్చేదేమంటే, । యీ జనులు యిది
సమయము కాదు, యెహోవా మందిరమును కట్టిం
చుటకు సమయము రాలేదని చెప్పుకొని వున్నారు. ।
3 అప్పుడు యెహోవా వాక్యము దీర్ఘదర్శియైన
4 హగ్గయి చేత చెప్పబడినదేమంటే, । యీ మందిరము
పాడయి వుండగా మీరు మిద్దెటిళ్లలో నివసించు
5 టకు యిది సమయమా? । కాబట్టి సైన్యముల యెహో
వా ఆనతిచ్చేదేమంటే; మీ మార్గములను మీరు విచా
6 రించుకోండి. । విస్తారముగా విత్తిన మీకు కొంచెము
మాత్రము తిరిగీ వచ్చెను; మీరు తినినప్పటికిన్ని తృప్తి
పొందక పోతిరి; మీరు తాగినప్పటికిన్ని మీకు దాహ
ము తీరక పోయెను; బట్టలను కప్పుకొన్నప్పటికిన్ని
యెవరికిన్ని వెట్టలేకపోయెను; కూలీలు తమకు దొరి
7 కిన కూలిని చింకి సంచిలో వేసిరి. । మీ మార్గము
లను విచారించుమని సైన్యముల యెహోవా పలు
8 కుతున్నాడు. । మీరు పర్వతము మీదికి యెక్కి, మాను
లను తీసుకొవచ్చి, మందిరమును కట్టించండి; దాని
యందు నేను అనుకూలించి, దానిని ఘనపర్తునని
9 యెహోవా ఆనతిచ్చెను. । మీరు విస్తారము కొరకు
యెదురు చూస్తూ వుంటిరి, అయితే యిదుగో కొం
చెమే వచ్చెను; మీరు దానిని యింటికి తెచ్చినప్పుడు
నేను దాని వూదితిని, యెందుకంటే నా మందిరము
పాడై వుండగా మీలో ప్రతివాని మనస్సు తన యింటి
మీద వున్నదని సైన్యముల యెహోవా ఆనతిచ్చెను. ।
10 కాబట్టి మీ పైని ఆకాశపు మంచు కురవకపోయెను;
11 భూమిన్ని పండకపోయెను. । యేమంటే నేను భూమి
మీదికిన్ని పర్వతముల మీదికిన్ని ద్రాక్షా రసము మీ
దికిన్ని తైలము మీదికిన్ని భూమి ఫలించే సమస్తము
మీదికిన్ని మనుష్యుల మీదికిన్ని పశువుల మీదికిన్ని
యావత్తు చేతిపనుల మీదికిన్ని వరుపును పిలిపింతునని
12 ఆనతిచ్చెనని చెప్పెను. । అప్పుడు షెయల్తీయేలు కుమా
రుడైన జెరుబ్బాబెలున్ను యెహోసాదాకు కుమారు
డైన యెహోషువయున్ను మిగిలిన జనులందరున్ను
వారి దేవుడైన యెహోవా శబ్దమునున్ను వారి దేవు
డైన యెహోవా తనను పంపెననిన దీర్ఘదర్శియైన
హగ్గయి మాటలనున్ను వినిరి; జనులు యెహోవా
ముందట భయపడిరి. । అప్పుడు యెహోవా దూత 13
యైన హగ్గయి జనులతో యెహోవా పంపిన వాక్య
మును తెలిపి, నేను మీకు తోడుగా వున్నానని యె
హోవా ఆనతిచ్చెనని చెప్పెను. । మరిన్ని యెహో 14
వా యూదా అధికారియగు షెయల్తీయేలు కుమారు
డయిన జెరుబ్బాబెలు ఆత్మనున్ను ప్రధానార్చకుడగు
యెహోసాదాకు కుమారుడైన యెహోషువ మన
స్సునున్ను మిగిలిన జనులందరి మనస్సునున్ను రేపినం
దున, । వారు రాజైన దర్యావేషుయొక్క యేలుబడి 15
రెండో సంవత్సరము ఆరో నెల యిరువై నాలుగో దిన
మున వచ్చి, వారి దేవుడైన సైన్యముల యెహోవా
మందిరముయొక్క పనిచేస్తూ వుండిరి.

## 2. అధ్యాయము.

యేడో నెల యిరువై వొకటో దినమున యెహో 1
వా వాక్యము దీర్ఘదర్శియైన హగ్గయి ద్వారా వచ్చి
చెప్పినదేమంటే, । నీవు యూదాకు అధికారియగు షెయ 2
ల్తీయేలు కుమారుడైన జెరుబ్బాబెలునున్ను ప్రధానా
ర్చకుడగు యెహోసాదాకు కుమారుడైన యెహో
షువనున్ను తతిమ్మా జనులందరినిన్ని చూచి, చెప్పవలసిన
దేమంటే, । యీ మందిరముయొక్క ఘనమును ముందు 3
చూచి వున్నవారికి అది యిప్పుడు యేలాగు కనబడుతు
న్నది? దాని చూచిన మీ కండ్లకు యిది వట్టిదని కనబ
డుతూ వుండ లేదా? । అయితే యిందుకు యెహోవా 4
ఆనతిచ్చేదేమంటే, వో జెరుబ్బాబెలూ, ధైర్యము తె
చ్చుకొమ్ము; ప్రధానార్చకుడగు యెహోసాదాకు
కుమారుడైన యెహోషువా, ధైర్యము తెచ్చుకొమ్ము;
దేశములో వున్న సమస్త జనులారా, మీరున్ను ధైర్య
ము తెచ్చుకొని, పని చేయండి; యేమంటే నేను మీకు
తోడుగా వున్నానని సైన్యముల యెహోవా ఆనతి
చ్చెను. । మీరు మిస్రయీము దేశములోనుంచి యివత 5
లకు వచ్చినప్పుడు నేను మీకు ప్రమాణ పూర్వకము
గా చెప్పిన మాట ప్రకారము నా ఆత్మ మీలో వుం
డును గనుక భయపడకండని చెప్పి, । యిందుకు సైన్య 6

ముల యెహోవా మరిన్ని ఆనతిచ్చేదేమంటే, యిక
కొంత కాలమునకు నేను యింకొక మారు ఆకాశము
నున్ను భూమినిన్ని సముద్రమునున్ను పొడి నేలను
7 న్ను కంపింపచేతును. । నేను సకల జనాంగములను
కంపింపజేసిన తరువాత సకల జనాంగముల కోరికె
వచ్చును; యీ మందిరమును నేను ఘనతతోటి నిండిం
8 తునని సైన్యముల యెహోవా ఆనతిచ్చెను. । వెండి
నాది, బంగారమున్ను నాది, అని సైన్యముల యెహో
9 వా ఆనతిచ్చెను. । యీ వెనుకటి మందిరముయొక్క
ఘనత మునుపటి మందిరముయొక్క ఘనత కంటే
యెక్కువై వుండునని సైన్యముల యెహోవా ఆనతి
చ్చెను; మరిన్ని యీ స్థలమందు సమాధానమును కలు
గచేసునని సైన్యముల యెహోవా ఆనతిచ్చెనని చెప్ప
10 మని సెలవు యిచ్చెను. । మరిన్ని దర్యావేషు యేలుబడి
రెండో సంవత్సరము తొమ్మిదో నెల యిరువై నాలుగో
దినమున యెహోవా వాక్యము దీర్ఘదర్శియైన
11 హగ్గయి ద్వారా వచ్చి, । సైన్యముల యెహోవా ఆన
తిచ్చినట్టు సెలవు యిచ్చెను గనుక అతడు అర్చకు
లను న్యాయ ప్రమాణమును గురించి అడగవలసినదే
12 మంటే, । యెవడైనా పరిశుద్ధమైన మాంసమును తన
వస్త్రపు చెంగులో కట్టుకొని, తన చెంగుతోటి రొట్టె
నైనా అంబలినైనా ద్రాక్షా రసమునైనా తైలమునైనా
ముట్టుకొనినట్టయితే అది పరిశుద్ధమవునా? అని అడ
13 గగా, అర్చకులు కాదనిరి. । అప్పుడు హగ్గయి తిరిగీ
అడిగినదేమంటే, శవమువల్ల యెవడయినా అంటుపడి,
వాటిలో యే వొక దానినైనా ముట్టినట్టయితే అది
అంటు అవునా? అని అడగగా, అర్చకులు అది
14 అంటు అవుననిరి. । అప్పుడు హగ్గయి యెహోవా ఆన
తిచ్చినట్టు చెప్పినదేమంటే, ఆలాగున యీ జనులున్ను
జనాంగములున్ను వారు చేసిన పనిన్ని వారు చెల్లించిన
అర్పణలున్ను నా ముందట అపవిత్రములై వున్నవి. ।
15 ఆదినుంచీ నేటి వరకున్ను యెహోవా మందిరములో
రాతి మీద రాయివేసి కట్టక, మునుపటినుంచిన్ని
మీరు యేలాగుంటిరో అది మీ హృదయములలో
తలంచుకొండి. । వొకడు యిరువై కొలలు గల కుప్పను 16
వచ్చి చూడగానే యిదుగో పది కొలలు మాత్రమే
కనుపించెను; యేభై కొలలు తీసుకొనుటకు గానుగకు
వస్తే యిరువై కొలలు మాత్రమే కనుపించెను. । యే 17
మంటే గాడ్పుతోటిన్ని తెగులుతోటిన్ని వడగండ్లతో
టిన్ని మీ కష్టార్జితమంతటినిన్ని కొట్టితిని; అయినప్ప
టికిన్ని మీరు నా తట్టు తిరిగి రాకైతిరని యెహోవా
ఆనతిచ్చెను. । యిది మీ హృదయములలో మీరు తలం 18
చుకోవలెను; తొమ్మిదో నెల యిరువై నాలుగో దిన
ము, అనగా, యెహోవా మందిరముయొక్క పునాది
వేసిన నాటినుంచీ మీరు యేలాగుంటిరో అది మీ
హృదయములలో తలంచుకోవలెను. । యింకా కొట్ల 19
లో విత్తనము వున్నదా? నిజముగా ద్రాక్ష చెట్టున్ను
అంజూరపు చెట్టున్ను దానిమ్మ చెట్టున్ను ఇప్ప చెట్టు
న్ను ఫలించక పోయెను; అయితే యిక మీదట నేను
వాటిని ఆశీర్వదింతునని ఆనతిచ్చెనని చెప్పెను.। అయితే 20
ఆ నెల యిరువై నాలుగో దినమందు యెహోవా
వాక్యము హగ్గయికి తిరిగీ వచ్చి చెప్పినదేమంటే, । నీవు 21
యూదాకు అధికారియైన జెరుబ్బాబెలును చూచి,
చెప్పవలసినదేమంటే, నేను ఆకాశమునున్ను భూమి
నిన్ని కదల్తును. । రాజాంగములయొక్క గదను కింద 22
పడవేతును; జనాంగముల రాజ్యములకు కలిగిన బల
మును నాశనము చేతును; రథములనున్ను వాటిని యె
క్కిన వారినిన్ని కింద పడవేతును; గుఱ్ఱములున్ను రా
తులున్ను ప్రతి వాడు తన సహోదరుని కత్తిచేత
కూలునని సైన్యముల యెహోవా ఆనతిచ్చి, మరిన్ని
చెప్పేదేమంటే, । నా సేవకుడైన షెయల్తీయేలు కుమారు 23
డైన వో జెరుబ్బాబెలూ, ఆ దినమందు నేను నిన్ను
చేర్చుకొని, రాజ ముద్రవలె నిన్ను వుంచుకొందును;
యేమంటే నేను నిన్ను యెంచుకొంటిని అని సైన్యముల
యెహోవా ఆనతిచ్చెనని చెప్పుమన్న సెలవు యిచ్చెను.

# జెఖర్యా యొక్క గ్రంథము.

## 1. అధ్యాయము.

1 దర్యావేషు యేలుబడి రెండో సంవత్సరము యెని
మిదో నెలలో యెహోవా వాక్యము దీర్ఘదర్శి
అయిన ఇద్దోకు పుట్టిన బెరఖ్యా కుమారుడయిన జెఖ
2 ర్యాకు వచ్చి చెప్పినదేమంటే, । యెహోవా మీ
3 పితృల మీద బహు కోపముగా వుండెను. । కాబట్టి
నీవు నీ జనులను చూచి, సైన్యముల యెహోవా ఆన
తిచ్చినట్టు చెప్పవలసినదేమంటే, మీరు నా తట్టు తిరి
గితే నేను మీ తట్టు తిరుగుదునని సైన్యముల యె
4 హోవా ఆనతిచ్చెను. । మీ పితృల లాగున మీరు వుం
డవద్దు, యేమంటే పూర్వికులయిన దీర్ఘదర్శులు వా
రిని చూచి, సైన్యముల యెహోవా చెప్పినట్టు వారి
తో మీ దుర్మార్గములనున్ను మీ దుష్ట క్రియల
నున్ను మాని తిరుగండని పిలిచి చెప్పినప్పటికిన్ని
వారు వినక నా మాటలను ఆలకించ లేదని యెహో
5 వా ఆనతిచ్చెను. । మీ పితృలు యెక్కడ వున్నారు!
దీర్ఘదర్శులున్ను యెప్పటికీ బ్రతికి వుందురా! ।
6 అయితే నా సేవకులయిన దీర్ఘదర్శులకు నేను ఆజ్ఞా
పించిన వాక్యములున్ను నిబంధనలున్ను మీ పితృలను
అనుసరించినవి కావా! కాబట్టి వారు తిరిగీ వచ్చి, మన
మార్గముల నిమిత్తమున్ను మన చేష్టల నిమిత్తమున్ను
యెహోవా మనలను చేయ దలచిన ప్రకారమంతా
ఆయన మనకు చేసెనని చెప్పుకొనిరని వారితో చెప్పు
7 మని సెలవు యిచ్చెను. । మరిన్ని దర్యావేషు యేలు
బడి రెండో సంవత్సరము శెబాటు అనే పదకొండో
నెల యిరువై నాలుగో దినమున యెహోవా వాక్య
ము దీర్ఘదర్శియైన యిద్దోకు పుట్టిన బెరఖ్యా కుమా
8 రుడైన జెఖర్యాకు వచ్చెను. । యేలాగంటే రాత్రి దర్శ
నమందు యిదుగో యెర్ర గుర్రము యెక్కిన మను
ష్యుడు నాకు కనుబడెను; అతడు కింద వున్న గోరింట
చెట్లలో నిలిచి వుండెను; అతని వెనుక యెర్ర గుర్ర
ములున్ను చుక్కలు గల గుర్రములున్ను తెల్లటి గుర్ర
9 ములున్ను వుండెను. । అప్పుడు నేను నా యేలిన
వాడా, యివి యేమిటని అడగగా, నాతో మాట్లాడిన
దూత యివి యేమిటో నీకు తెలియచేతునని చెప్పెను. ।
10 అప్పుడు గోరింట చెట్లలో నిలిచి వున్నవాడు చెప్పిన
దేమంటే, యివి లోకమంతటి యందూ తిరుగులాడు
టకు యెహోవా పంపించినవై వున్నవని చెప్పెను. ।
అప్పుడు అవి గోరింట చెట్లలో నిలిచి వున్న యెహో 11
వా దూతను చూచి, చెప్పినదేమంటే, మేము లోక
మంతటా తిరుగులాడి వస్తిమి; యిదుగో లోకము యా
వత్తూ వూరికే కూర్చుని, మిక్కిలి నిమ్మళముగా వున్న
దని చెప్పెను. । అప్పుడు యెహోవా దూత ప్రత్యు 12
త్తరమిచ్చినదేమంటే, ఓ సైన్యముల యెహోవా,
నీవు యెరూశలేము మీదనున్న యూదా పట్టణముల
మీదనున్ను యెన్నాళ్లదాకా కనికరించక వుందువు!
వాటి మీద నీవు యీ డెబ్బై సంవత్సరములున్ను కో
పముగానే వుంటివని చెప్పినప్పుడు, । యెహోవా 13
నాతో మాట్లాడిన దూతకు మధురమైన మాటలచేత
ప్రత్యుత్తరమిచ్చెను. । కాబట్టి నాతో మాట్లాడిన దూత 14
చెప్పినదేమంటే, సైన్యముల యెహోవా ఆనతిచ్చి
నట్టు నీవు ప్రకటన చేయవలసినది; అది యేలాగంటే,
నేను యెరూశలేము కొరకున్ను సీయోను కొరకున్ను
బహు కోపాగ్ని చేత మండిపడుతూ వున్నాను. । నిమ్మ 15
ళముగా వున్న జనాంగముల మీద నాకు వుగ్రము
కలిగి వున్నది, యేమంటే నాకు కొద్దిగా కోపము వచ్చి
నప్పుడు వారు అధికమైన శిక్ష కలుగజేసుకొనిరి. । కాబట్టి 16
యెహోవా ఆనతిచ్చేదేమంటే, నేను అత్యంత కృప
తోటి యెరూశలేముకు తిరిగి వస్తిని; అందులో నాకు
మందిరము కట్టబడును; యెరూశలేము మీద శిల్పికా
రులు నూలు సాగింతురని సైన్యముల యెహోవా అన
తిచ్చెనని ప్రకటనచేసి, మరిన్ని సైన్యముల యెహోవా
ఆనతి చొప్పున ప్రకటన చేయవలసినదేమంటే, । యిక 17
నా పట్టణములు భాగ్యముతోటి పరిపూర్ణముగా వుం
డును; యిక మీదట యెహోవా సీయోనును వోదా
ర్చి, యెరూశలేమును యెంచునని ప్రకటన చేయు
మని చెప్పెను. । అప్పుడు నేను తేరి చూడగానే, యి 18
దుగో, నాలుగు శృంగములు కనుబడెను. । కాబట్టి 19
నేను నాతో మాట్లాడిన దూతను చూచి, యివి యేమి
టని అడగగా, అతడు యివి యూదానున్ను ఇశ్రాయే
లునున్ను యెరూశలేమునున్ను చెదరచేసిన శృంగము
లని చెప్పెను. । అప్పుడు యెహోవా నాకు నలుగురు 20
కంసాలులను కనపరచెను. । కాబట్టి నేను వీరు వచ్చి, 21
యేమి చేతురని అడగగా, ఆయన నాతో చెప్పినదే
మంటే, అవి తల యెత్త గలవాడు వొకడున్ను లేకుండా

యూదాను చెదరచేసిన శృంగములై వున్నవి; అయితే
వీరు వాటిని భయపెట్టుటకున్ను యూదా దేశమం
తటా చెదర చేసేటట్టు దాని మీద శృంగమును యెత్తిన
జనాంగముల శృంగములను కొట్టి అవతల వేసుటకున్ను
వచ్చిరని ఆనతిచ్చెను.

## 2. అధ్యాయము.

1 తిరిగీ నేను పార చూడగానే, యిదుగో, కొల
నూలు చేత పట్టుకొనిన వొక మనుష్యుడు కనుబడెను.।
2 అప్పుడు నేను అతని చూచి, నీవు యెక్కడికి వెళ్లు
తావని అడగగా, అతడు యెరూశలేముయొక్క వెడ
ల్పున్ను నిడివిన్ని కొలిచి, చూచుటకు వెళ్లుతూ వున్నా
3 నని చెప్పెను.। అప్పుడు యిదుగో నాతో మాట్లాడిన
దూత అవతలకు వెళ్లెను; వెంటనే మరి వొక దూత
4 అతని యెదుర్కొనుటకు బైలు వెళ్లి వచ్చి,। అతని
చూచి, నీవు పరుగెత్తి పోయి, ఆ పడుచు వానితో
చెప్పవలసినదేమంటే, మనుష్యులున్ను పశువులున్ను
బహు విస్తారమైనందున యెరూశలేము చుట్టూ ప్రా
కారములు లేని పట్టణముల వలెనే నివసించబడును.।
5 యిందుకు యెహూవా ఆనతిచ్చేదేమంటే, నేను దాని
చుట్టూ అగ్ని గోడగానున్ను దానిలో మహిమగాను
న్ను వుందునని చెప్పి, మరిన్ని ఆనతిచ్చేదేమంటే,।
6 వుత్తర దేశములో వున్న వారలారా, తప్పించుకొని
రండి; యేమంటే ఆకాశపు చతుర్వాయువుల తట్టు
మిమ్మును చెదరవేస్తినని యెహూవా ఆనతిచ్చెను.।
7 బాబెలు పురమందున్న వో సీయోనా, ఆ చోటు
విడిచి తప్పించుకొమ్మని సైన్యముల యెహూవా సెలవు
8 యిచ్చెను.। మిమ్మును ఘనపర్చ దలచి, ఆయన మిమ్మును
సర్వ శూన్యము చేసిన జనాంగముల యొద్దికి నన్ను
పంపెను; యేమంటే యేవడైనా మిమ్మును ముట్టితే
9 ఆయన కను గుడ్డును ముట్టినట్టవును.। కాబట్టి యిదుగో
నేను నా చేతిని వారి మీద కదిలించినందున వారు
వారి సేవకులకే దోపుడు పోదురు; అప్పుడు సైన్యముల
యెహూవా నన్ను పంపెనని మీరు యెరుగుదురు.।
10 వో సీయోను కుమారికా, పాటబాడి, సంతోషముగా
వుండుము; యేమంటే నేను వచ్చి, నీలో నివాసము
11 చేతునని యెహూవా ఆనతిచ్చెను.।ఆ దినమందు చాలా
జనాంగములు యెహూవానయిన నాతో కలుసుకొని,
నా జనులై వుందురు; నేను నీలో నివాసము చేతును;
అప్పుడు యెహూవా నీ యొద్దికి నన్ను పంపెనని నీవు
12 యెరుగుదువు.। మరిన్ని యెహూవా పరిశుద్ధమైన దేశ
మందు యూదాకు పాలు పంచి, యెరూశలేమును తిరిగీ
13 యెంచును.। వో సకల జనులారా, యెహూవా ముం
దట మౌనులై వుందురు గాక; యేమంటే ఆయన లేచి,
తన పరిశుద్ధమైన నివాసములోనుంచి వచ్చునని చెప్పెను.

## 3. అధ్యాయము.

అప్పుడు అతడు యెహూవా దూత ముందట 1
నిలిచి వున్న ప్రధానార్చకుడైన యెహూషువనున్ను
అతని యెదురించుటకు అతని కుడిపార్శ్వమున నిలిచి
యున్న సైతానునున్ను నాకు చూపించెను.। అప్పుడు 2
యెహూవా సైతానుతో చెప్పినదేమంటే, వో సైతా
నా, యెహూవా నిన్ను గద్దించును గాక, యెరూశ
లేమును యెంచిన యెహూవాయే నిన్ను గద్దించును
గాక; వీడు అగ్నిలోనుంచి తీసిన కొరవి కాడా అని
చెప్పెను.। అయితే దూత ముందట నిలుచున్న యెహూ 3
షువ మైల బట్టలతో కప్పబడి వుండెను.। కాబట్టి 4
ఆయన దగ్గిర నిలిచే వారిని చూచి, వీని మైల బట్టలను
తీసివేయండని ఆజ్ఞాపించి, అతనితో చెప్పినదేమంటే,
యిదుగో, నేను నిన్ను నిర్దోషిని చేస్తిని; ధవళ వస్త్ర
ములతోటి నిన్ను అలంకరింపచేతునని చెప్పి,। వారితో 5
వీని శిరస్సు మీద తెల్లటి పాగా పెట్టండని ఆజ్ఞాపిం
చినందున, వారు అతని శిరస్సు మీద తెల్లటి పాగాను
పెట్టి, వస్త్రములతోటి అతని అలంకరించిరి; యింతలో
యెహూవా దూత దగ్గిర నిలిచి వుండెను.। అప్పుడు 6
యెహూవా దూత యెహూషువను చూచి, సైన్య
ముల యెహూవా ఆనతిచ్చినట్టు చెప్పినదేమంటే,।
నీవు నా మార్గములందు నడిచి, నా ఆజ్ఞలను గైకొ 7
న్నట్టయితే, నీవు నా మందిరము మీద అధికారివై,
నా సాలలో కనిపెట్టే వాడవౌదువు; మరిన్ని యిక్కడ
నిలిచి వుండే వారిలో నడుచుటకు నీకు స్థలము యి
త్తును.। అయితే ప్రధానార్చకుడవైన వో యెహూ 8
షువా, నీవున్ను నీ ముందట కూర్చుని వున్న నీతోటి
వారున్ను వింతను పొందిన వారున్ను ఆలకించ వలెను;
యేమంటే యిదుగో నేను నా సేవకుడనే శాఖను బైలు
తీతును.। యెహూషువ ముందట నేను వుంచిన రా 9
తిని చూడండి; ఆ రాతి మీద యేడు నేత్రములు
వుండును; యిదుగో దాని చెక్కడపు పని నేను చేతు
నని సైన్యముల యెహూవా ఆనతిచ్చెను; మరిన్ని వొక
దినమందే నేను ఆ దేశముయొక్క దోషమును పరిహ
రింతును.। ఆ దినమందు మీరందరున్ను వొకని నొక 10
డు ద్రాక్షచెట్టు కిందికిన్ని అంజూరపు చెట్టు కిందికిన్ని
పిలుతురని సైన్యముల యెహూవా ఆనతిచ్చెను.

## 4. అధ్యాయము.

అయితే నాతో మాట్లాడిన దూత తిరిగీ వచ్చి, 1
నిద్రలోనుంచి లేపబడిన వాని వలె నన్ను లేపి,। నీకు 2

యేమి కనుబడుతున్నదని అడగగా, నేను చూస్తిని,
యిదుగో బంగారపు శెమ్మె నాకు కనుబడెను; దాని
మీద వొక గిన్నె వుండెను; దానికి యేడు కుడకలు
కలవు; శెమ్మె పైనున్న కుడక వొక్కొంటికి వొక నాళ
3 ము కలిగి వుండెను. । మరిన్ని రెండు ఇప్పచెట్లు శెమ్మె
4 యిరు పార్శ్వములా కలిగి వుండెనని చెప్పి, । నాతో
మాట్లాడిన దూతను చూచి, యేలినవాడా, యిది యే
5 మిటని అడగగా, । నాతో మాట్లాడిన దూత నన్ను
చూచి, యిది యేమిటో నీకు తెలియదా? అని చెప్పి
నప్పుడు, నేను యేలినవాడా, నాకు తెలియదని చెప్పి
6 నప్పుడు, । అతడు నన్ను చూచి చెప్పినదేమంటే, యిది
జెరుబ్బాబెలుకు వచ్చిన యెహోవా వాక్యమై యు
న్నది; యేమంటే యిది శక్తిచేతనైనా బలముచేతనైనా
కాదు, నా యాత్మ చేత అవునని సైన్యముల యెహో
7 వా ఆనతిచ్చెను. । వో గొప్ప పర్వతమా, నీవు యెంత
గనుక? జెరుబ్బాబెలు ముందట నీవు సదును భూమి
వౌదువు; దీనికి దయ కలుగును గాక, దయ కలుగును
గాక, అన్న ఆర్భాటలతోటి అతడే పైరాయి పెట్టు
8 నని చెప్పెను. । అయితే యెహోవా వాక్యము నాకు
9 తిరిగీ వచ్చి చెప్పినదేమంటే, । జెరుబ్బాబెలు చేతులు యీ
మందిరముయొక్క పునాదిని వేసెను; ఆ చేతులే దానిని
ముగించును; అప్పుడు సైన్యముల యెహోవా నన్ను
10 నీ యొద్దికి పంపెనని నీవు యెరుగుదువు. । అల్ప కార్య
ములు కలిగిన దినమును యెవరు అలక్ష్య పెట్టుదురు!
యేమంటే ఆ యేడున్ను జెరుబ్బాబెలు చేతిలో గుండు
నూలు వుండుట చూచి సంతోషించును; అవి లోక
మంతటిలో సంచారముచేసే యెహోవా నేత్రములై
11 వున్నవని చెప్పగా, । నేను అతని చూచి, శెమ్మెకు యిరు
పార్శ్వములా వుండిన రెండు ఇప్ప చెట్లున్ను యే
12 మిటి అని అడిగితిని. । యిదిగాక యింకా నేను అడి
గినదేమంటే, రెండు బంగారపు నాళములలోనుంచి
సువర్ణ తైలమును కుమ్మరించిన ఇప్ప చెట్లు రెండు
13 కొమ్మలున్ను యేమిటని అడిగినప్పుడు, । అతడు నన్ను
చూచి, యివి యేమిటో నీకు తెలియదా? అని అడగ
గా, యేలినవాడా, నాకు తెలియదని అనినప్పుడు, ।
14 అతడు యివి యావల్లోకమునకు కర్తయైన యెహో
వా ముందర నిలిచి అభిషేకము పొందిన యిద్దరు అని
చెప్పెను.

## 5. అధ్యాయము.

1 అప్పుడు నేను తిరిగీ పార చూడగానే, యిదుగో,
2 యెగిరే చుట్టబడిన గ్రంథము నాకు కనుబడెను. । అప్పు
డు అతడు నన్ను చూచి, నీకు యేమి కనుబడెనని అడ
గగా, నేను చుట్టబడినటువంటి యెగిరే గ్రంథము
నాకు కనుబడెను; దాని నిడివి యిరువై మూరలున్ను
దాని వెడల్పు పది మూరలున్ను అయి వుండెనని చెప్ప
గా, । అతడు నాతో చెప్పినదేమంటే, యిది యావల్లో 3
కము మీదికి బైలు వచ్చే శాపమై యున్నది; యేమం
టే దొంగిలే వారందరున్ను యీ పక్కను వున్న శాప
ప్రకారము తెగి పోదురు; అప్రమాణికులందరున్ను ఆ
పక్కను వున్న శాపప్రకారము తెగిపోదురు. । దీనిని 4
గురించి సైన్యముల యెహోవా ఆనతిచ్చేదేమంటే,
నేను యీ శాపమును బైటికి రప్పింతును; అది దొంగ
యింట్లోకిన్ని నా నామ విషయమై అబద్ధముగా ప్రమా
ణము చేసిన వాని యింట్లోకిన్ని ప్రవేశించి, అతని
యింట్లో వుండే దానిన్ని దాని దూలమునున్ను రాళ్ల
నున్ను దహించునని ఆనతిచ్చెనని చెప్పెను. । అప్పుడు 5
నాతో మాట్లాడిన దూత బైలువెళ్లి, నన్ను చూచి,
నీవు నీ కన్నులను తెరిచి యివతలకు వచ్చినదేమిటో
చూడుమని చెప్పగా, । నేను యిది యేమిటి అని అడి 6
గినప్పుడు, అతడు చెప్పినదేమంటే, యిది బైలు వెళ్లి
వస్తూ వున్న ఏఫా అయి వున్నదని చెప్పి, మరిన్ని
అతడు చెప్పినదేమంటే, యిది లోకమంతటి మీద కని
పెట్టే కన్ను అయి వున్నదని చెప్పెను. । అప్పుడు యిదు 7
గో సీసపు బిళ్ల పైకి యెత్తబడెను; మరిన్ని ఏఫాలో కూ
చున్న వొక స్త్రీ కనిపించెను. । అప్పుడు అతడు నన్ను 8
చూచి, యిది దోషురాలై వున్నదని చెప్పి, ఏఫాలో
దానిని వేసి సీసపు ముద్ద దాని నోట వుంచెను. । అప్పుడు 9
నేను పార చూడగానే, యిదుగో, యిద్దరు స్త్రీలు బైలు
వచ్చిరి; వారి రెక్కలకు వాయువు కలిగి వుండెను; వారి
రెక్కలు ఘసద పక్షి రెక్కలంత పెద్దవై వుండెను;
వీరు వచ్చి ఆ ఏఫాను భూమ్యాకాశముల మధ్యకు
యెత్తిరి. । అప్పుడు నేను నాతో మాట్లాడిన దూతను 10
చూచి, వీరు యీ ఏఫాను యెక్కడికి తీసుకొని పోదు
రని అడిగినప్పుడు, । అతడు నాతో చెప్పినదేమంటే, 11
షినారు దేశమందు దాని కొరకు యింటిని కట్టుటకు
వెళ్లుదురు; అక్కడ అది దాని పునాది మీద స్థిరము
గా నిలుచునని చెప్పెను.

## 6. అధ్యాయము.

అప్పుడు నేను వెనుక తిరిగి పార జూడగానే, యిదు 1
గో, రెండు పర్వతముల మధ్యనుంచి నాలుగు రథములు
బైలుదేరెను; ఆ పర్వతములు యిత్తడి పర్వతములయి
వుండెను. । మొదటి రథమునకు యెర్రని గుర్రములు 2
కలిగి వుండెను; రెండో రథమునకు నల్లని గుర్రములు
కలిగి వుండెను. । మూడో రథమునకు తెల్లని గుర్రములు 3
కలిగి వుండెను; నాలుగో రథమునకు వడగండ్లలాటి
చుక్కలు గల గుర్రములు కలిగి వుండెను. । అప్పుడు 4

నేను నాతో మాట్లాడిన దూతను చూచి, యేలినవా
5 డా, యిది యేమిటని అడగగా, । అతడు నాతో చెప్పి
నదేమంటే, యివి యావల్లోకమునకు కర్తయైన యె
హోవా ముందట నిలిచి బయిలు వచ్చిన ఆకాశపు
6 చతుర్వాయువులై వున్నవి. । యిందులో వున్న నల్లని
గుఱ్ఱములు వుత్తర దేశములోకి వెళ్లును; తెల్లని గుఱ్ఱ
ములు వాటిని వెంబడించును; వడిగండ్లలాటి చుక్కలు
7 గలవి దక్షిణ దేశము తట్టు వెళ్లునని చెప్పెను.। అప్పుడు
ఆ యెఱ్ఱని గుఱ్ఱములు యావల్లోక పర్యంతమూ తిరు
గులాడ దలచి బైలు వెళ్లెను; యేమంటే అతడు వాటిని
చూచి, మీరు యిది విడిచి వెళ్లి, యావల్లోక పర్యంత
మూ తిరుగులాడండని చెప్పి వుండెను; కాబట్టి అవి
వెళ్లి, యావల్లోక పర్యంతమూ తిరుగులాడుతూ వుం
8 డెను. । అప్పుడు అతడు నన్ను పిలిచి, చెప్పినదేమంటే,
యిదుగో వుత్తర దేశములోకి వెళ్లినవి వుత్తర దేశమందు
9 నా యాత్మను చల్లార్చెనని చెప్పెను. । అప్పుడు యె
హోవా వాక్యము నాకు వచ్చి చెప్పినదేమంటే, ।
10 హెల్దయి, థోబీయా, యెదాయా, అనగా చెరబడి
బాబెలు దేశమునుంచి తిరిగీ వచ్చిన వీరి యొద్ద నీవు
బంగారమునున్ను వెండినిన్ని పుచ్చుకొని, ఆ దినమున
వచ్చి, సెఫన్య కుమారుడయిన యోషీయా యింట్లోకి
11 వెళ్లి,। అప్పుడు వెండినిన్ని బంగారమునున్ను తీసుకొని,
కిరీటములను చేసి, వాటిని ప్రధానార్చకుడయిన యె
హోసాద్దాకు కుమారుడైన యెహోషువ శిరస్సు
12 మీద పెట్టి,। అతనితో సైన్యముల యెహోవా సెలవు
యిచ్చినట్టు చెప్పవలసినదేమంటే, యిదుగో, శాఖ అనే
నామముగల మనుష్యుడు; యితడు తన స్థలములో
13 పెరిగి యెహోవా గుడిని కట్టును. । అతడే యెహో
వా గుడిని కట్టి ఘనతను ధరించును; అతడు తన గద్దె
మీద ఆసీనుడై యేలుతూ వుండును; అతడు తన గద్దె
మీద ఆసీనుడయి అర్చకుడై వుండును; సమాధానపు
ఆలోచన ఆ యిద్దరి మధ్యనూ వుండునని చెప్పుము. ।
14 మరిన్ని ఆ కిరీటములు హేలెమునకున్ను థోబీయాకు
న్ను యెదాయాకున్ను సెఫన్యా కుమారుడైన హేనుకు
న్ను యెహోవా గుడిలో జ్ఞాపకము నిమిత్తము కలిగి
15 వుండును. । మరిన్ని దూరముగా వున్నవారున్ను వచ్చి,
యెహోవా గుడిలో కట్టుదురు; అప్పుడు యెహో
వా నన్ను మీ యొద్దికి పంపెనని మీరు యెరుగుదురు;
మీ దేవుడైన యెహోవా శబ్దమును మీరు విని, జా
గ్రతగా చేస్తిరట్టాయెనా యిది సంభవించునని చెప్పెను.

## 7. అధ్యాయము.

1 రాజైన దర్యావేషు యేలుబడి నాలుగో సంవత్స
రము కిస్లేవు అనే తొమ్మిదో నెల నాలుగో దినమున
యెహోవా వాక్యము జెఖర్యాకు వచ్చెను. । యేమం
టే అప్పుడు వారు యెహోవా సముఖమందు ప్రా 2
ర్థించుటకున్ను యెహోవా మందిరమందున్న అర్చ
కులనున్ను దీర్ఘదర్శులనున్ను, । యిన్ని సంవత్సరము 3
లున్ను మేము దుఃఖించినట్టు అయిదో నెలలో వేరై
మేమున్ను దుఃఖించవలెనా అని అడుగుటకున్ను షేరే
జరునున్ను రేగెమ్మెలెఖునున్ను పంపిరి. । కాబట్టి యె 4
హోవా వాక్యము నాకు వచ్చి చెప్పినదేమంటే, ।
నీవు దేశపు జనులందరినిన్ని అర్చకులనున్ను చూచి 5
చెప్పవలసినలాగు, యీ డెబ్బై సంవత్సరముల పర్యం
తమున్ను అయిదో నెలయున్ను యేడో నెలయున్ను
మీరు వుపవాసమును చేసి దుఃఖించినప్పుడు నా నిమి
త్తము మీరు వుపవాసము చేస్తిరా? । మరిన్ని మీరు 6
భుజించిన ఆహారమున్ను తాగిన పానమున్ను మీ కొ
రకే కాదా? । యెరూశలేములోనున్ను దాని చుట్టూ 7
వున్న గ్రామములలోనున్ను విస్తారమైన జనులున్ను
భాగ్యమున్ను కలిగి వున్నప్పుడున్ను విస్తార జనులు
దక్షిణ దేశములోనున్ను మయిదాన భూమిలోనున్ను
కాపురము చేసినప్పుడున్ను పూర్వీకులైన దీర్ఘదర్శుల
చేత యెహోవా ప్రకటన చేయించిన మాటలను
మీరు విని చేయవద్దా అని చెప్పుమని సెలవు యిచ్చెను.।
అయితే యెహోవా వాక్యము జెఖర్యాకు తిరిగీ వచ్చి 8
చెప్పినదేమంటే, । సైన్యముల యెహోవా ఆనతిచ్చిన 9
ప్రకారము మీరందరున్ను నీతిగా న్యాయము తీర్చి,
వొకని యందు వొకనికి దయనున్ను కనికరమునున్ను
అగుపర్చి, । విధవనున్ను తండ్రిలేని వానినిన్ని పరదేశి 10
నిన్ని దరిద్రునిన్ని బాధ పెట్టకుండానున్ను వొకొ్క
కని విషయమై హృదయమందు దుర్యోజన యోజించ
కుండానున్ను వుండండని పలికించి వుంటిని. । అయితే 11
వారు ఆలకించక, భుజమును వెనుకకు తిప్పుకొని,
వినక, చెవులను మూసుకొనిరి. । నిజముగా న్యాయ 12
ప్రమాణమునున్ను పూర్వీకులైన దీర్ఘదర్శుల ద్వారా
సైన్యముల యెహోవా తన ఆత్మచేత పంపిన వాక్య
ములనున్ను వినక, వారు తమ హృదయములను వజ్ర
ములాగున కఠినపరుచుకొనిరి. । అయినందున సైన్య 13
ముల యెహోవావల్లను చాలా వుగ్రము బైలువెళ్లెను;
కాబట్టి ఆయన పిలిచినప్పుడు వారు వినకపోయిరి
గనుక వారు పిలిచినప్పుడు నేను వినక, । వారికి యెరుక 14
లేని జనాంగములలోకి వారిని సుడిగాలిచేత చెదర
జేతునని సైన్యముల యెహోవా ఆనతిచ్చెను; యీ
లాగున వారు వెళ్లిన వెనుక యీ దేశము మనుష్య సం
చారములేక వట్టిదాయెను; యేమంటే వారు యీ
శృంగారమైన దేశమును పాడుచేసిరని చెప్పెను.

## 8. అధ్యాయము.

1 మరిన్ని సైన్యముల యెహోవా వాక్యము నాకు
తిరిగీ వచ్చి, సైన్యముల యెహోవా ఆనతిచ్చినట్టు
2 చెప్పేదేమంటే, । మిక్కిలి ఆసక్తిచేత నేను సీయోను
కొరకు రోషము పొందితిని, బహు రౌద్రముచేత దాని
3 కొరకు ఆసక్తి పొందితినని చెప్పి, । యెహోవా మరిన్ని
ఆనతిచ్చేదేమంటే, నేను సీయోను యొద్దికి తిరిగీ వస్తిని;
నేను యెరూశలేములో నివాసము చేతును; యెరూశ
లేము యథార్థపురమనిన్ని సైన్యముల యెహోవా
కొండ పరిశుద్ధమైన కొండ అనిన్ని పిలువబడునని ఆన
4 తిచ్చి, । సైన్యముల యెహోవా చెప్పేదేమంటే, యిం
కా యెరూశలేము వీధులలో వృద్ధులున్ను వృద్ధ స్త్రీలు
న్ను కాపురము చేసి, అందరున్ను వృద్ధత్వముచేత కర్ర
5 పట్టుకొని వుందురు. । మరిన్ని ఆ పట్టణపు వీధులు ఆడు
6 కొనే పిల్లలతో నిండి వుండును. । యిందుకు సైన్యముల
యెహోవా ఆనతిచ్చేదేమంటే, యీ దినములందున్న
జనుల కంటికి యిది ఆశ్చర్యమైనప్పటికిన్ని నా కంటికి
ఆశ్చర్యమవునా అని ఆనతిచ్చి, మరిన్ని సైన్యముల
7 యెహోవా చెప్పేదేమంటే, । యిదుగో నా జనులు
నేను తూర్పు దేశములోనుంచిన్ని పడమటి దేశము
8 లోనుంచిన్ని విడిపించి, తిరిగీ రా చేసినందున, । వారు
యెరూశలేములో కాపురము చేతురు; వారు నా
జనులై వుందురు; యథార్థముగానున్ను నీతిగానున్ను
9 నేను వారికి దేవుడనై వుందునని చెప్పి, । మరిన్ని సైన్య
ముల యెహోవా ఆనతిచ్చేదేమంటే, సైన్యముల యె
హోవా మందిరపు పునాది వేసిన దినమందు వుండి
గుడిని కట్టవలెనని చెప్పిన దీర్ఘదర్శుల మాటలను
యిప్పుడు వినిన వారలారా, ధైర్యము తెచ్చుకొండి. ।
10 యేమంటే ఆ దినములలో మనుష్యునికి కూలి లేకపో
యెను; పశువులకున్ను పాటు లేకపోయెను; మరిన్ని
శ్రమకాలము వచ్చినందున వెలపటికి వెళ్లే వానికిన్ని
లోపటికి వచ్చేవానికిన్ని నిమ్మళము లేకపోయెను; యే
మంటే అందరినిన్ని నేను వొకని మీద వొకని పడ
11 వేస్తిని. । అయితే పూర్వపు దినములలో నేను వారిని
చేసిన ప్రకారము యిప్పుడు శేషించి వుండే వారికిన్ని
12 చేయక వుందును. । యేమంటే విత్తనము బలమై వుం
డును; ద్రాక్ష చెట్టు ఫలమిచ్చును; భూమి విస్తారము
గా పండును; ఆకాశమునుంచి మంచు రాలును; శేషించి
వుండే యీ జనులకు సకల భాగ్యమున్ను కలుగచేతు
13 నని సైన్యముల యెహోవా ఆనతిచ్చెను. । కాబట్టి
యూదా యింటివారలారా, ఇశ్రాయేలు యింటివార
లారా, సంభవించేది యేమంటే, మీరు జనాంగముల
లో యెంతగా శపించబడితిరో అంతగా ఆశీర్వాద
ముగా కలుగజేసి మిమ్మును రక్షింతును; మీరు భయ
పడక ధైర్యము తెచ్చుకొండి. । యిందుకు సైన్యముల 14
యెహోవా ఆనతిచ్చేదేమంటే, మీ పితృలు నాకు
కోపము యెక్కించినప్పుడు నేను మిమ్మును శిక్షించ
దలచి, పశ్చాత్తపుడను కాకపోయినట్టు, । యీ దిన 15
ములందు నేను యెరూశలేముకున్ను యూదా యిం
టివారికిన్ని మేలు చేయ దలచుకొన్న వాడనైతిని
గనుక భయపడకండని సైన్యముల యెహోవా ఆన
తిచ్చెను. । అయితే మీరు చేయవలసిన లాగు యేమం 16
టే, మీరందరున్ను వొకనితో వొకడు నిజమయిన
మాటలు చెప్పవలెను; మీ పురద్వారములలో నిజముగా
నున్ను సమాధానముగానున్ను న్యాయము తీర్చవలెను. ।
మీలో యెవడయినా తన తోటివాని మీద దుర్యో 17
జన యోజించవద్దు, అప్రమాణమందు ప్రియముగా
వుండకండి; యేమంటే యిటువంటివి నాకు అసహ్య
మై వున్నవని యెహోవా ఆనతిచ్చెనని చెప్పెను. ।
మరిన్ని సైన్యముల యెహోవా వాక్యము నాకు వచ్చి, 18
సైన్యముల యెహోవా ఆనతిచ్చినట్టు చెప్పినదేమం
టే, । నాలుగో నెలను చేసే వుపవాసమున్ను అయిదో 19
నెలను చేసే వుపవాసమున్ను యేడో నెలను చేసే
వుపవాసమున్ను పదో నెలను చేసే వుపవాసమున్ను
యూదా యింటివారికి సంతోషమున్ను వుత్సాహము
న్ను విలాసమున్ను గల పండుగలై వుండును; కాబట్టి
సత్యమందున్ను సమాధానమందున్ను ప్రియులై వుం
డండి. । సైన్యముల యెహోవా మరిన్ని ఆనతిచ్చేదే 20
మంటే, అనేక జనులున్ను అనేక పట్టణములందుండే
కాపురస్థులున్ను వత్తురు. । యేలాగంటే వొక పట్టణపు 21
వారు మరియొక పట్టణము యొద్దికి వెళ్లి, వారిని చూచి,
మనము ఆలస్యము చేయక, యెహోవాను ప్రార్థిం
చుటకున్ను సైన్యముల యెహోవాను వెతుకుటకున్ను
వెళ్లుదామనిన్ని, నేను వత్తునంటే నేనున్ను వత్తుననిన్ని
చెప్పుకొందురు. । నిజముగా అనేక జనులున్ను బలము 22
గల జనాంగములున్ను యెరూశలేములో సైన్యముల
యెహోవాను వెతుకుటకున్ను యెహోవాను ప్రా
ర్థించుటకున్ను వత్తురు. । యిందుకు సైన్యముల యె 23
హోవా ఆనతిచ్చేదేమంటే, ఆ దినములందు జనాం
గములయొక్క సకల భాషాంతరులలో పదిమంది వొక
యూదీయుని చెంగును పట్టుకొని, దేవుడు మీకు తో
డుగా వున్నాడు గనుక మేము మీతో కలుసుకొని
వత్తుమని చెప్పుదురని ఆనతిచ్చెనని చెప్పెను.

## 9. అధ్యాయము.

హద్రాఖు దేశమును గురించిన్ని దానికి ఆధార 1
మైన దమస్కు పట్టణమును గురించిన్ని వచ్చిన భగవ

ద్వాక్యము యేమంటే, మనుష్యుని కన్నున్ను ఇశ్రా
యేలు గోత్రముల కన్నున్ను యెహోవా తట్టు తిరిగి
2 నప్పుడు, । హమాతున్ను సోరున్ను సీదోనున్ను అనే
యీ పట్టణములను బహు బుద్ధి కలిగినప్పటికిన్ని దా
3 నికి సరిహద్దులై వుండును. । సోరు పట్టణము మిక్కిలి
గట్టి స్థలమును కట్టుకొని; యిసుక లాగున వెండినిన్ని
వీధిలో వుండే బురదలాగున సువర్ణమునున్ను కూ
4 ర్చుకొనెను. । యిదుగో దానిని యెహోవా బైలు
వెళ్లవేసును; సముద్రమందుండే దాని బలమును కొట్టు
5 ను; అది అగ్నిచేత దహనమై పోవును. । అష్కెలోను
దీనిని చూచి జడుసును; గాజా పట్టణమున్ను ఎక్రోను
పట్టణమున్ను దానిని చూచి దుఃఖపడును; యేమంటే
యిది దానిని కనిపెట్టుకొని వుండి సిగ్గు పొందును;
గాజాయొక్క రాజు లేకపోవును; అష్కెలోనులో
6 కాపురస్తులు లేకపోదురు. । అష్దోదులో అన్యుడు కా
పురము వుండును; ఫెలిష్తీయుల అతిశయమును నేను
7 తెగవేతును. । మరిన్ని తన నోట్లోనుంచి తన రక్తము
నున్ను తన పండ్లలోనుంచి తన అసహ్యతలనున్ను వెళ్ల
వేతును; అప్పుడు శేషించిన వాడు మన దేవుని కొరకై
వుండును; అతడు యూదా దేశమందు అధికారియై
వుండును; ఎక్రోనువారు యెబూసీయుని వలెనే వుం
8 దురు. । మరిన్ని సైన్యము నిమిత్తమున్ను గడచి పోయే
వారి నిమిత్తమున్ను తిరిగీ వచ్చే వారి నిమిత్తమున్ను
నేను నా మందిరము చూట్టూ దండుపేట వేతును;
యిక హింస పెట్టే వాడు వారి యొద్దికి రాకపోవును;
యేమంటే యిప్పుడు నేను నా కన్నులతోటి చూస్తిని.।
9 ఓ సీయోను కుమారికా, బహు సంతోషముగా వుం
డుము; యెరూశలేము కుమారికా, నీవు కేక వేయు
ము, యిదుగో నీ రాజు నీ యొద్దికి వస్తూ వున్నాడు;
అతడు నీతిపరుడున్ను రక్షకుడున్ను అయి వున్నాడు;
అతడు దీనుడై, గార్దభము మీదనున్ను దాని పిల్ల
10 మీదనున్ను యెక్కి వస్తూ వున్నాడు. । నేను ఎఫ్ర
యీములో రథమునున్ను యెరూశలేములో గుర్రము
నున్ను లేకుండా తెగవేతును; యుద్ధపు విల్లున్ను తెగి
పోవును; అతడు అన్య జనాంగములలో సమాధాన
మును గురించి చెప్పును; ఆయన కర్తృత్వము యీ
సముద్రమునుంచి ఆ సముద్రము మట్టుకున్ను నదినుంచి
11 లోక సరిహద్దుల మట్టుకున్ను సాగును.।అయితే నిన్ను
గురించి నీ ప్రమాణమైన రక్తము నిమిత్తము నేను నిర్బం
ధికులైన నీ వారిని నీళ్లు లేని గోతిలోనుంచి విడిపించి
12 తిని.।నిర్బంధికులై విముక్తిని కోరుతూ వున్నవారలారా,
మీరు తిరిగీ గట్టి స్థలమునకు రండి; నేడు నేను యి
13 చ్చిన మాట యేమంటే, । యూదాను నేను యెక్కు
బెట్టి ఎఫ్రయీముయొక్క విల్లును నిండుచేసి, ఓ
హెల్ల దేశమా, నీ కుమాళ్ల మీదికి, ఓ సీయోను పట్ట
ణమా, నీ కుమాళ్లను లేవచేసి, నిన్ను పరాక్రమశాలి
కత్తివలెనే చేసిన తరువాత నిన్ను రెట్టిగా తిరిగీ జయ
చేతును. । యెహోవా వారి పయిని అగుపడును; 14
ఆయన బాణములు మెరుపు లాగున బయిలు వెళ్లును;
కర్తయైన యెహోవా బాకా నాదము చేసి, దక్షి
ణపు దిక్కునుంచి గొప్ప సుడిగాలితోటి బయిలువెళ్లి
వచ్చును. । సైన్యముల యెహోవా వారికి ఆపు అయి 15
వుండును; వడిశ రాళ్లను జయించిన తరువాత వారు
తిందురు; మరిన్ని వారు తాగి ద్రాక్షా రసమువల్లనైన
ట్టు గొల్లుచేతురు; పళ్లెము వలెనున్ను పీఠముయొక్క
మూలల వలెనున్ను నిండి వుందురు. । ఆ దినమందు 16
వారి దేవుడయిన యెహోవా వీరు నా జనులయొక్క
మంద అని అనుకొని వారిని రక్షించును; కాబట్టి వారు
భూమి యందు కిరీట రత్నములైనట్టు పయిగా హెచ్చిం
చబడుదురు. । యేమంటే వారి వుత్తమత్వము యెంత 17
ఘనముగా వుండును! వారు పెట్టే శృంగారము యెంత
విస్తారమౌను! పంటవల్ల పడుచువారున్ను ద్రాక్షా రస
మువల్ల పడుచురాండ్లున్ను వుత్సాహముతో వుందురు.

## 10. అధ్యాయము.

కడవరి వాన సమయమందు యెహోవాను వర్ష 1
మును గూర్చి అడుగండి; యెహోవా మెరుపులను
మెరియజేసి, భూమి మీది పచ్చని కూరల కన్నిటికీ
కావలసిన వర్షమును కురిపించును. । యేమంటే గృహ 2
దేవతలు వ్యర్థముగా పలికిరి; ప్రశ్న చూచేవారు
అబద్ధపు దర్శనమును కని, వ్యర్థమైన స్వప్నము
లను తెలిపి, వ్యర్థముగా ఓదార్చిరి; కాబట్టి
జనులు గొర్రెల మంద లాగున దూరముకు పోయిరి;
బోయడు లేనప్పుడు గొర్రెల లాగునే వుపద్రవమును
పొందిరి. । నా కోపాగ్ని బోయల మీద మండినది; 3
మేకలను నేను శిక్షిస్తిని; అయితే సైన్యముల యెహో
వా యూదా యింటి వారైన తన మంద యందు కని
కరించి, యుద్ధమందు మాహాత్మ్యముగల తన గుర్రము
వలెనే వారిని కలుగ చేసును. । ఆయననుంచి మూల 4
రాయిన్ని మేకున్ను యుద్ధపు విల్లున్ను బాధా కర్తృ
త్వమున్ను కలిగి వుండును. । వీరు యుద్ధము చేసి, వీధి 5
బురదలో శత్రువును తొక్కిన పరాక్రమశాలుర వలె
నే వుందురు; యెహోవా వారికి తోడైనందున వారు
యుద్ధము చేసి, గుర్రములను యెక్కి వచ్చిన వారిని
సిగ్గు పొంద చేతురు. । నేను యూదా యింటిని రూఢ 6
పర్తును; యోసేపు యింటి వారిని రక్షించి, తిరిగీ తెచ్చి,
స్థాపింతును; యేమంటే వారి యందు నేను కనికరిస్తిని;
వారిని నేను విడువని వాడనై వుందును; యేమంటే

యెహోవానైన నేను వారి దేవుడనై వారి మనవి
7 ఆలకింతును. । ఎఫ్రయీము వారు బలాఢ్యులై వుం
దురు; వారి హృదయములు ద్రాక్షా రసముతోనైనట్టు
సంతోషముగా వుండును; మరిన్ని వారి బిడ్డలు దానిని
చూచి సంతోషింతురు; వారి హృదయములు యెహో
8 వా యందు సంతోషముగా వుండును. । నేను వారిని
యీలకొట్టి పిలిచి కూర్తును; యేమంటే వారిని నేను
విడిపింతును; మునుపటి లాగున వారు విస్తారముగా
9 వుందురు. । అన్య జనాంగములలో నేను వారిని విత్తు
దును; దూర దేశములలో వారు నన్ను జ్ఞాపకము చేసు
కొందురు; వారు తమ బిడ్డలతోటి బ్రతికి తిరిగీ వత్తు
10 రు. । నేను మిస్రయీము దేశములోనుంచి వారిని తిరిగీ
రప్పించి, అష్షూరు దేశమునుంచి కూర్చి, గిలాదు
దేశములోకిన్ని లెబానోను దేశములోకిన్ని తెత్తును;
11 మరిన్ని వారికి స్థలము చాలకపోవును. । వారు యిరుకు
సముద్రమును గడిచి వత్తురు; సముద్రపు తరంగము
లను కొట్టుదురు; లోతైన నదులు యెండిపోవును;
అష్షూరుయొక్క గర్వము కిందబడును; మిస్రయీ
12 ముకు రాజ దండము లేకపోవును. । నేను వారిని యె
హోవా యందు దృఢపర్తును; ఆయన నామమందు
వారు నడుస్తూ వుందురని యెహోవా ఆనతిచ్చెను.

## 11. అధ్యాయము.

1 ఓ లెబానోనూ, అగ్ని వచ్చి నీ ఆర్జమాను
2 లను దహించేటట్టు నీ ద్వారములను తెరువుము. । ఓ
బరసె వృక్షమా, అంగలార్చుము; యేమంటే ఆర్జ
వృక్షము కూలెను; విశేష వృక్షములు పాడై పోయెను;
ఓ బాషానుయొక్క ఆర్జ వృక్షములారా, అంగలా
3 ర్చండి; యేమంటే చిక్కని అడవి నరకబడెను. । గొర్రె
బోయల రోదన శబ్దము వినబడెను; యేమంటే వారి
ఘనము లయమాయెను; కొదమ సింహముల ఆర్పు
వినబడెను; యేమంటే యర్దానుయొక్క అతిశయము
4 లయమాయెను. । యిందుకు నా దేవుడైన యెహోవా
ఆనతిచ్చేదేమంటే, హతమాతూ వున్న యీ గొర్రెలను
5 మేపించుము. । వాటి యజమానులు వాటిని చంపి,
తాము నిరపరాధులమని యెంచుకొనిరి; వాటిని అమ్మిన
తరువాత వారు మాకు బహు ద్రవ్యము కలదు గనుక
యెహోవాకు స్తోత్రము కలుగును గాకని అందురు;
వాటి మీద వాటి బోయలకు కనికరము యెంత మా
6 త్రమూ లేదు. । కాబట్టి యెహోవా ఆనతిచ్చేదేమం
టే, యిక నేను యీ దేశపు కాపురస్తుల యందు కని
కరించక, యిదుగో వారినందరినిన్ని వారి యిరుగు పొ
రుగుల వారి చేతులలోకిన్ని రాజు చేతులలోకిన్ని అప్ప
గింతును; వీరు వచ్చి దేశమును కొట్టుదురు; వీరి చేతు
లలోనుంచి వారిని విడిపించక వుందునని ఆనతిచ్చెను. ।
కాబట్టి నేను హతమవుతూ వున్న ఆ గొర్రెలు బహుగా 7
కష్టపడినవి గనుక వాటిని మేపింతునని అనుకొని, రెండు
కర్రలు తీసుకొని వచ్చి, వొక దానిని నామ అనిన్ని రెం
డవ దానిని ఘోవలీమనిన్ని పిలిచి, గొర్రెలను మేపి
స్తిని. । వొక్క నెలలో ముగ్గురు బోయలను నరికివేస్తిని; 8
యేమంటే నా మనస్సుకు వారు అసహ్యులై వుండిరి;
వారి మనస్సుకు నేనున్ను యేహ్యముగా వుంటిని. ।
అప్పుడు నేను అనుకొనినదేమంటే, యిక మిమ్మును 9
కాయను; చచ్చేదానిని చావనియ్యండి; తెగిపోయే దా
నిని తెగిపోనియ్యండి; మిగిలిన వాటిని వొక దాని
మాంసము వొక దానిని తిననియ్యండని అని, । నామ 10
అనే కర్రను తీసుకొని వచ్చి, జనులందరితోటి నేను
చేసిన ప్రమాణమును విచ్ఛిత్తు చేసినట్టు విరచితిని. । కా 11
బట్టి ఆ దినమందు అది విచ్ఛిత్తయిపోయెను; అందు
వల్ల మందలో బాధపడి నన్ను కనిపెట్టుకొనిన వారు
వచ్చి, అది యెహోవా వాక్యమని యెరుకచేసిరి. ।
అప్పుడు నేను వారిని చూచి, మీకు అనుకూలమైతే 12
నా కూలి నాకు యివ్వండి; ప్రతికూలమైతే మానివే
యండని చెప్పినప్పుడు, వారు నా కూలి కొరకు ముప్ఫ
యి తులముల వెండిని తూచి యిచ్చిరి. । అప్పుడు యె 13
హోవా నాతో చెప్పినదేమంటే, దానిని కుమ్మరివా
నికి యిమ్మని సెలవు యిచ్చెను; యేమంటే వారు నన్ను
ఘనముగా యెంచి, విస్తారమైన కూలి నాకు యిచ్చి
వుండిరి; కాబట్టి నేను ఆ ముప్ఫయి వెండి తులములను
తీసుకొని, యెహోవా మందిరములోకి వచ్చి కుమ్మరి
వానికి యిస్తిని. । అప్పుడు నేను ఘోవలీమనే రెండవ 14
కర్రను తీసుకొని వచ్చి, యూదాకున్ను ఇశ్రాయేలుకు
న్ను కలిగిన సహోదర బంధకమును తెంపి వేసినట్టు
దానిని విరిచితిని. । అప్పుడు యెహోవా నాకు సెలవు 15
యిచ్చినదేమంటే, యిప్పుడు నీవు బుద్ధిలేని బోయని
వస్తువులను తీసుకొమ్ము. । యేమంటే, యిదుగో ఆలాటి 16
బోయలను నేను దేశమందు లేవచేతును; వారు తెగులు
పట్టిన వాటిని కనిపెట్టకనున్ను పిల్లలను వెతకకనున్ను
విరిగిపోయిన దానిని బాగుచేయకనున్ను నిలిచి వున్న
దానిని మేపించకనున్ను వుండి, కొవ్విన వాటి మాంస
మును తింటూ వాటి డెక్కలను తునకలు చేస్తూ వుం
దురు. । అయితే మందను విడిచి పెట్టిన సోమరి బో 17
యనికి అయ్యో! క్షయ రోగము అతని హస్తమునందు
న్ను అతని కుడి కన్ను యందున్ను కలిగినందున అతని
హస్తము యెండిపోవును; అతని కుడి కంటికి దృష్టి
తప్పును.

## 12. అధ్యాయము.

1 ఇశ్రాయేలును గురించి వచ్చిన భగవద్వాక్యము
యేమంటే, ఆకాశమండలమును విశాలముగా చేసి,
భూమికి పునాది వేసి, మనుష్యుని అంతరంగములో
ఆత్మను కలుగ చేసిన యెహోవా ఆనతిచ్చేదేమంటే,।
2 యిదుగో నేను యెరూశలేము చుట్టూ వున్న జనులం
దరికీ వణుకెత్తే పాత్రను చేతును; మరిన్ని యెరూశ
లేమున్ను యూదాయున్ను గవిసిన దినమందు అది
3 యూదా మీద వుండును.। మరిన్ని ఆ దినమందు నేను
యెరూశలేమును సమస్తమైన జనులకు బరువైన రాయి
గా చేతును; దానిని యెత్తి మోసిన వారందరున్ను విచ్ఛి
త్తయిపోదురని ఆనతిచ్చి, మరిన్ని యెహోవా చెప్పే
4 దేమంటే,। ఆ దినమందు నేను గుర్రములన్నిటికిన్ని
బెంగయున్ను వాటిని యెక్కిన వారికి వెర్రిన్ని కలు
గజేతును; యూదా యింటి మీద నా నేత్రములను
విప్పి, జనుల గుర్రములన్నిటికిన్ని అంధత్వము కలుగ
5 జేతును.। అప్పుడు యెరూశలేము కాపురస్తులు వారి
దేవుడనే సైన్యముల యెహోవా చేత మనకు బలమై
వుందురని అధికారులు తమ హృదయములందు అను
6 కొందురు.। ఆ దినమందు నేను యూదా అధికారుల
ను కఱ్ఱలు కాలే కొలిమిగానున్ను చేను కుప్పలో దివి
టీగానున్ను చేతును; వారు నఖముఖాలా చుట్టూ వున్న
జనులందరినిన్ని దహనము చేతురు; యెరూశలేము వారు
తమ స్వస్థలము అయిన యెరూశలేములో తిరిగీ నివ
7 సింతురు.। మరిన్ని దావీదు యింటివారి సామంతమున్ను
యెరూశలేము కాపురస్తుల సామంతమున్ను యూదా
వారి మీద అతిశయించకుండా యెహోవా యూదా
8 డేరాలను మునుపటి లాగున రక్షించును.। ఆ దినమం
దు యెహోవా యెరూశలేము కాపురస్తులకు ఆపు
అయి వుండును; కాబట్టి ఆ దినమందు వారిలో శక్తి
హీనుడు దావీదు వంటి వాడవును; దావీదు యింటి
వారు దేవుని వలెనున్ను వారి యెదుట యెహోవా
9 దూత వలెనున్ను వుందురు.। మరిన్ని ఆ దినమందు నేను
యెరూశలేము మీదికి వచ్చిన జనాంగములన్నిటినీ
10 నశింపచేయ వత్తును.। దావీదు యింటివారి మీదనున్ను
యెరూశలేము కాపురస్తుల మీదనున్ను కృపా విజ్ఞా
పనములయొక్క ఆత్మను కుమ్మరించినందున వారు తాము
గుచ్చిన వారి మీద కన్ను పెట్టి, యేక పుత్రుడైన
అతని విషయమై మూల్గి దుఃఖించే వొకని లాగునను
న్ను ప్రథమ పుత్రుని విషయమై విషపు యేడ్పు యే
డ్చిన మరి వొకని లాగునను్ను అతని గురించి విషపు
11 యేడ్పు యేడ్తురు.। ఆ దినమందు యెరూశలేములో
చాలా దుఃఖము కలిగి వుండును; అది మెగిద్దోను లో
వలో హదద్రిమ్మోనుయొక్క దుఃఖము వలెనే వుండు
ను.। దేశముయొక్క కుటుంబములు ప్రత్యేకముగా 12
మూల్గును; దావీదు యింటివారు ప్రత్యేకముగానున్ను
వారి భార్యలు ప్రత్యేకముగానున్ను నాతాను యింటి
వారు ప్రత్యేకముగానున్ను వారి భార్యలు ప్రత్యే
కముగానున్ను,। లేవీ యింటివారు ప్రత్యేకముగానున్ను 13
వారి భార్యలు ప్రత్యేకముగానున్ను షిమీ యింటి
వారు ప్రత్యేకముగానున్ను వారి భార్యలు ప్రత్యే
కముగానున్ను,। తతిమ్మా యింటివారున్ను ప్రత్యేక 14
ముగానున్ను వారి భార్యలు ప్రత్యేకముగానున్ను
దుఃఖింతురు.

## 13. అధ్యాయము.

మరిన్ని ఆ దినమందు దావీదు యింటివారి విష 1
యమైయిన్ని యెరూశలేము కాపురస్తుల విషయమై
యిన్ని పాపమునున్ను అపవిత్రతనున్ను కడుగుటకు
వొక ధార బైలు తియ్యబడునని చెప్పి,। మరిన్ని సైన్య 2
ముల యెహోవా ఆనతిచ్చేదేమంటే, ఆ దినమందు
నేను విగ్రహములయొక్క నామములను దేశములో
నుంచి తెగవేతును; అవి యికను జ్ఞాపకమునకు రాక
పోవును; మరిన్ని దీర్ఘదర్శులనున్ను అపవిత్రమైన
ఆత్మనున్ను దేశములోనుంచి వెళ్ల వేతును.। కాబట్టి యె 3
వడైనా అప్పుడు దీర్ఘదర్శనమును పలికితే అతని
కనిన తల్లి తండ్రులు అతని చూచి, నిన్ను బ్రతకనివ్వ
కూడదు, యేమంటే యెహోవా నామమందు నీవు
అబద్ధము పలికితివని చెప్పి, అతని తల్లి తండ్రులు అత
డు పలుకుతూ వుండగానే దూసివేతురు.। మరిన్ని ఆ 4
దినమందు వారు పలికిన దీర్ఘదర్శనముల నిమిత్తము
సిగ్గు పొందుదురు; మరిన్ని యిక భ్రమ పెట్టుటకు గొం
గలిని కప్పుకొన్న వాడు వొకడున్ను లేకపోవును.।
అతడు చెప్పేదేమంటే, నేను దీర్ఘదర్శిని కాను, 5
వ్యవసాయకుడనై వుంటిని; యేమంటే బాల్యమునుం
చిన్ని నాకు వొకడు పశువుల కాపరితనము నేర్పెనని
చెప్పగా,। వొకడు అతని చూచి, నీ చేతులలో గాయ 6
ములేమని అడిగినప్పుడు, అతడు యివి నా స్నేహితుల
యింట్లో పొందిన గాయములని చెప్పును.। వో ఆయు 7
ధమా, నీవు మేలుకొని, నా గొఱ్ఱెల బోయనికిన్ని నా
తోటి వానికిన్ని విరోధివై వుండి, గొఱ్ఱెలు చెదిరిపో
యేటట్టు బోయని కొట్టుము; నా చేతిని నేను పిన్న
వారి మీద తిప్పుదునని సైన్యముల యెహోవా ఆన
తిచ్చి, మరిన్ని చెప్పేదేమంటే,। అప్పుడు దేశమంత 8
టిలో రెండు భాగముల జనము నరకబడి, జీవము విడు
చును; మూడవ భాగపు జనము నిలిచి వుండును.। ఆ 9
మూడవ భాగమును నేను అగ్నిలోనుంచి వెండిని తీసి

శుద్ధపఱచినట్టు వారిని శుద్ధపఱతును; బంగారము శో
ధించినట్టు వారిని శోధింతును; అప్పుడు వారు నా
నామమును స్మరింతురు; నేను వారి స్మరణను విందును;
వీరు నా జనులై వున్నారని చెప్పుదును; వారు యె
హొూవా మన దేవుడై వున్నాడని చెప్పుకొందురని
యెహొూవా అనలిచ్చెను.

## 14. అధ్యాయము.

1 ఇదుగో యెహొూవా దినము వస్తూ వున్నది; నీ
2 దోపుడు సొమ్ము నీలో పంచబడును. । యేమంటే నేను
సకల జనాంగములను యెరూశలేము మీద యుద్ధము
చేసుటకు కూర్తును; పట్టణము పట్టబడును; యిండ్లు
దోపుడు పోవును; స్త్రీలు చెరప బడుదురు; పట్టణము
లో సగము మంది చెరగా కొంచుపోబడుదురు; కొదవ
సగము మందిన్ని పట్టణముతో తెగిపోక వుందురు. ।
3 అప్పుడు యెహొూవా బైలువెళ్లి, మునుపటి యుద్ధ
దినములందు ఆయన యుద్ధము చేసినట్టు ఆ జనాంగ
4 ముల మీద యుద్ధము చేసును. । ఆ దినమందు ఆయన
పాదములు యెరూశలేము యెదుట తూర్పు తట్టు
వున్న యిప్ప కొండ మీద నిలిచి వుండును; మరిన్ని
యిప్ప కొండ తూర్పు తట్టున్ను పడమటి తట్టున్ను
నడిమికి బద్దలై పోయినందున విస్తరించిన లోవ అవును;
సగము కొండ వుత్తరపు తట్టున్ను సగము కొండ దక్షి
5 ణపు తట్టున్ను వెళ్లిపోవును. । అప్పుడు మీరు కొండ
లోవకు పరుగెత్తి వత్తురు; యేమంటే కొండ లోవ
ఆస్సలం మట్టుకు సాగును; నిజముగా యూదా రా
జైన ఉజ్జీయా దినములందు వుండిన భూకంపము ముం
దటినుంచి మీరు పరుగెత్తినట్టు పరుగెత్తి వత్తురు;
అప్పుడు నా దేవుడైన యెహొూవా వచ్చును; వో
యెహొూవా, నీతో కూడా నీ పరిశుద్ధులందరున్ను
6 వత్తురు. । ఆ దినమందు అంతా వెలుగు కాదు; వెలుగు
7 న్ను అంధకారమున్ను కలిగి వుండును. । ఆ దినము
యెహొూవాకు తెలుసును; పగలూ కాదు, రాత్రీ
కాదు; అయితే అస్తమానమందే వెలుగు వుండును. ।
8 మరిన్ని ఆ దినమందు జీవపు వుదకములు యెరూశలే
ములోనుంచి సగము తూర్పు సముద్రము తట్టున్ను
సగము పడమటి సముద్రము తట్టున్ను పారును; వేసవి
కాలమందున్ను చలి కాలమందున్ను ఆలాగునే వుం
9 డును. । యెహొూవా యావల్లోకము పైని రాజై వుండు
ను; ఆ దినమందు యెహొూవా వొక్కడే అనిన్ని
ఆయన నామము వొక్కటే అనిన్ని తెలియబడును. ।
10 దేశమంతా గెబ మొదలుకొని యెరూశలేముకు దక్షి
ణపు తట్టు వున్న రిమ్మోను పర్యంతమూ మైదాన భూమి
అయి వుండును; అది అతిశయించి, బెన్యామీను ద్వా
రము మొదలుకొని ప్రథమ ద్వారము మట్టుకున్ను
మూల ద్వారము మట్టుకున్ను హననేలు గోపురము మొ
దలుకొని రాజు ద్రాక్ష గానుగల మట్టుకున్ను యెప్ప
టికీ తన స్థలమందు కాపురము గలదై వుండును. । అక్కడ 11
జనులు నివసింతురు; యిక దానిమీదికి యెన్నటికీ నాశ
నము రాకపోవును; యెరూశలేము నిర్భయమైన నివా
సములు కలదౌను. । మరిన్ని యెరూశలేము మీద యు 12
ద్ధము చేసిన జనులందరికిన్ని యెహొూవా యే తెగులు
అనుసరింప చేసునంటే, వారు నిలువబడ్డ పాటునే వారి
మాంసము క్షీణించి పోవును; వారి కన్నులు వాటి
కుదుళ్లలోనుంచిన్ని వారి నాలుకలు వారి నోళ్లనుం
చిన్ని క్రమముగా క్షీణించి పోవును. । మరిన్ని ఆ దిన 13
మందు యెహొూవా వారిలో గొప్ప గల్లత్తును పుట్టిం
చును; కాగా ప్రతివాడున్ను వొకని మీదను వొకడు
చెయి గలుపును. । యూదావారు యెరూశలేముతో 14
యుద్ధము చేతురు; చుట్టూ వున్న యావజ్జనాంగముల
పదార్థములున్ను బంగారమున్ను వెండిన్ని వస్త్రము
లున్ను విస్తారముగా కూర్చబడును. । మరిన్ని ఆలాటి 15
తెగులే గుర్రముల మీదనున్ను వేసడముల మీదనున్ను
వొంటెల మీదనున్ను గార్దభముల మీదనున్ను దం
డు పేటలలో వున్న పశువులన్నిటి మీదనున్ను పడును. ।
అయితే యెరూశలేము మీదికి యావజ్జనాంగములలో 16
శేషించి వుండే వారందరున్ను ప్రతి సంవత్సరమున్ను
సైన్యముల యెహొూవా అనే రాజుకు మ్రొక్కుట
కున్ను పర్ణశాల పండుగను ఆచరించుటకున్ను యె
క్కి వత్తురు. । యేమంటే లోకమందుండే కుటుంబము 17
లలో సైన్యముల యెహొూవా అనే రాజుకు మ్రొ
క్కుటకు యెరూశలేముకు యెక్కి రాని వారందరి
మీద వర్షము కురవక పోవును. । మరిన్ని మిద్రయీ 18
ముయొక్క యింటివారు యెక్కి రాకపోతే వారికి వర్ష
ము లేకపోవును; పర్ణశాల పండుగను ఆచరించుటకు
రాని జనాంగములను అనుసరించే తెగులును వారి మీ
దికి యెహొూవా రాజేసును. । యిది మిద్రీయులకున్ను 19
పర్ణశాల పండుగను ఆచరించుటకు రాని జనాంగ
ములన్నిటికిన్ని రాగల శిక్ష అయి వున్నది. । మరిన్ని 20
ఆ దినమందు గుర్రములయొక్క కళ్లెముల మీద యె
హొూవాకు పరిశుద్ధత ఆనే లిఖితము కలిగి వుండును;
యెహొూవా మందిరములో వున్న పాత్రలు పీఠము
ముందట వున్న పళ్లెము వలెనే వుండును. । నిజముగా 21
యెరూశలేములోనున్ను యూదా దేశమందున్ను వు
న్న పాత్రలన్నిన్ని యెహొూవా విషయమై పరిశుద్ధ
మయినవి అవును; బలి చెల్లించే వారందరున్ను వాటిని
తీసుకొ వచ్చి వాటితో వండుకొందురు; మరిన్ని ఆ
దినమందు సైన్యముల యెహొూవా మందిరములోకి
కెనయనువాడు ప్రవేశించకపోవును.

# మలాఖీయొక్క గ్రంథము.

## 1. అధ్యాయము.

1 ఇది ఇశ్రాయేలీయులకు మలాఖీ ద్వారా వచ్చిన
2 భగవద్వాక్యమై యున్నది. । యెహోవా ఆనతిచ్చే
దేమంటే, నేను మిమ్మును స్నేహిస్తిని, అయితే నీవు
మమ్మును యేలాగు స్నేహిస్తివని అంటిరి; అందుకు యె
హోవా యిచ్చిన వుత్తరము యేమంటే, ఏశావు యా
కోబుయొక్క అన్న కాడా? అయినప్పటికిన్ని నేను
3 యాకోబును స్నేహించి, । ఏశావు యందు పగచేసి,
అతని పర్వతములనున్ను అతని స్వాస్థ్యమునున్ను పా
డుచేసి, అరణ్యమందున్న క్రూర సర్పములకు అతని
4 ఆధారము చేస్తిని. । యీలాగయినప్పటికిన్ని ఎదోము
వారు అనుకొనినదేమంటే, మనము దీనులమయితిమి;
అయితే మనము తిరిగీ వచ్చి, పాడైన స్థలములను తిరిగీ
కట్టుకొందమని అనుకొనిరి; దీనికి సైన్యముల యెహో
వా వుత్తరమిచ్చేదేమంటే, వారు కట్టుకొన్నప్పటికిన్ని
నేను కింద పడదోతును; లోకులు వారి దేశమును దో
షముకు దిక్కనిన్ని వారిని యెహోవా నిత్యమయిన
5 కోపాగ్నికి లోనయిన వారనిన్ని చెప్పుదురు. । మరిన్ని
మీ కన్నులతోటి మీరు ఇశ్రాయేలు సరిహద్దులనుంచి
దానిని చూచి, యెహోవాకు ఘనము కలుగును గాక
6 అని పలుకుదురు. । కుమారుడు తన తండ్రినిన్ని సేవ
కుడు తన యజమానినిన్ని ఘనపచుర్చును; నేను తండ్రి
నైతే నన్ను ఘనపచేర్చువారు యేరీ! నేను యజమాను
డనైతే నా యందు భయపడినవారు యేరీ? అని నా
నామమును నిర్లక్ష్యపెట్టిన వో అర్చకులారా, సై
న్యముల యెహోవా ఆనతిచ్చెను; అయితే మీరు దేని
చేత నీ నామమును నిర్లక్ష్య పెట్టితిమని అడిగితిరి. ।
7 నా పీఠము మీద అపవిత్రమైన భోజనమును చెల్లించి,
దేనిచేత నిన్ను అలక్ష్య పెట్టితిమని మీరు అంటిరి;
యెహోవా భోజనపు బల్లను నీచ పర్చినందుచేతనే
8 మీరు నన్ను అలక్ష్యము చేస్తిరి. । గుడ్డి దానిని తీసుకొ
వచ్చి బలి చెల్లిస్తే అది చెడ్డతనము కాదా? కుంటిదా
నిని అయినా తెగులు గల దానిని అయినా చెల్లిస్తే
అది చెడ్డతనము కాదా? నీ అధికారికి అటువంటి దా
నిని చెల్లిస్తే నీ యందు సమ్మతిగా వుండునా? నీ ముఖ
మును చూచునా? అని సైన్యముల యెహోవా ఆన
9 తిచ్చెను. । యిప్పుడు మీరు మనకు కటాక్షము అగు
పచేర్చుటట్టు దేవుని వేడుకొండి; యిది మీ మూలము
చేతనే వున్నది; వారు మీ ముఖమును చూతురా? దీనికి
సైన్యముల యెహోవా ఆనతిచ్చేదేమంటే, । మీలో 10
వూరకే యెవరు తలుపు మూతురు! మీరు వూరకే నా
పీఠము మీద అగ్ని రాజబెట్టిన వారు కారు; మీ యం
దు నాకు సమ్మతి యెంతమాత్రమూ లేదు; మీ చేతి
మీదుగా నేను యే అర్పణనైనా అంగీకరించక వుందు
నని సైన్యముల యెహోవా ఆనతిచ్చెను. । అయినప్ప 11
టికిన్ని సూర్యోదయము మొదలుకొని సూర్యాస్తమాన
పర్యంతమూ నా నామము అన్య జనాంగములలో ఘన
ముగా వుండును; సకల స్థలముల యందు ధూపమున్ను
శుభ్రమైన అర్పణలున్ను చెల్లించబడును; యేమంటే
అన్య జనాంగములలో నా నామము ఘనముగా వుం
డునని సైన్యముల యెహోవా ఆనతిచ్చెను. । అయితే 12
మీరు యెహోవా భోజనపు బల్ల అపవిత్రమయిన
దనిన్ని దాని మీదనుంచి వచ్చిన నీచమైన భోజనమని
న్ని అనుకొని, దానిని నిర్లక్ష్యము పెట్టితిరి. । మరిన్ని 13
చంపబడిన దానిన్ని కుంటి దానిన్ని తెగులు పట్టిన
దానిన్ని మీరు వగచుర్చుచూ తెచ్చి, యిదుగో మిక్కిలి
కష్టపడితిమని అంటిరి; యీలాగున మీరు అర్పణ
చేస్తే మీ చేతి మీదుగా దానిని అంగీకరింతునా? అని
యెహోవా ఆనతిచ్చెను. । తన మందలో కలిగిన మొ 14
గదానిని యెహోవాకు మొక్కుబడి మ్రొక్కి, చెడి
పోయిన దానిని చెల్లించిన వానికి అయ్యో! యేమంటే
నేను ఘనమయిన రాజునై వున్నాను; నా నామమందు
జనాంగములకు భయభక్తి కలుగునని సైన్యముల యె
హోవా ఆనతిచ్చెను.

## 2. అధ్యాయము.

వో అర్చకులారా, యిప్పుడు యీ ఆజ్ఞ మీ 1
కొరకు పంపబడి వున్నది. । యిందుకు సైన్యముల యె 2
హోవా ఆనతిచ్చేదేమంటే, మీరు ఆ ఆజ్ఞను వినక, నా
నామమును ఘనపచేర్చుటట్టు దానిని హృదయములోకి
తెచ్చుకోక వుంటిరట్టాయనా, నేను మీ మీదికి శాప
మును పంపుదును; మీకు కలిగిన ఆశీర్వాదమును శపిం
తునని నిజముగా మీరు దానిని హృదయములోకి తె
చ్చుకోనైతిరి గనుక యింతకు మునుపే నేను వాటిని
శపించి వుంటిని. । యిదుగో మీరు విత్తిన విత్తనమును 3

చెరుపుదును; మీ పండుగలందు చెల్లించిన వాటి పేడ
ను మీ ముఖముల మీద వేతును; అందువల్ల దానితోటి
4 వారు మిమ్మును తీసి బయిట వేతురు. । అప్పుడు నా
ప్రమాణము లేవీకి నిలిచి వుండే కొరకు నేను యీ
ఆజ్ఞను మీకు పంపితినని మీరు యెరుగుదురని సైన్య
5 ముల యెహోవా ఆనతిచ్చెను. । జీవ సమాధానముల
ప్రమాణమును నేను అతనితో చేస్తిని; నా యందున్ను
నా నామమందున్ను అతడు భయభక్తులతో వున్నం
6 దున నేను వాటిని అతనికి యిస్తిని. । సత్యమైన న్యా
య ప్రమాణము అతని వాక్కులో వుండెను; అతని
పెదవులలో అన్యాయము కనబడక పోయెను; నాతో
అతడు సమాధానముగానున్ను నీతిగానున్ను నడిచిన
వాడై, చాలా మందిని అన్యాయమునుంచి తిప్పెను. ।
7 యేమంటే అర్చకుని పెదవులు తెలివిని జాగ్రత చేసు
కో వలెను; అతని వాక్కునుంచి వారు న్యాయ ప్రమా
ణమును వెతుక వలెను; యేమంటే అతడు సైన్యముల
8 యెహోవా దూత అయి వుండును. । అయితే మీరు
మార్గమును తప్పితిరి; న్యాయ ప్రమాణమందు మీరు
అనేకులను అభ్యంతరపడ చేస్తిరి; లేవీయొక్క ప్రమాణ
9 మును మీరు విచ్ఛిత్తు చేస్తిరి. । కాబట్టి నా వాక్య
పద్ధతి చొప్పున మీరు నా మార్గములను గైకొనక,
న్యాయ ప్రమాణమందు పక్షపాతముచేసి వుంటిరి గనుక
నేను మిమ్మును జనులందరి యెదుటనూ యేహ్యులగా
నున్ను నీచులగానున్ను చేస్తినని సైన్యముల యెహో
10 వా ఆనతిచ్చెను. । మనకందరికిన్ని తండ్రి వొక్కడే
కాడా? వొక్క దేవుడే మనలను సృష్టించ లేదా? యీ
లాగుండగా మన పితృల ప్రమాణమును మీరి, వొకని
11 యందు వొకడు అవిశ్వాసులమై నడువనేల? । యూదా
అవిశ్వాసియై నడిచెను; ఇశ్రాయేలు దేశమందున్ను
యెరూశలేము పట్టణమందున్ను అసహ్యత జరుగుతూ
వుండెను; యేమంటే యూదా యెహోవాయొక్క
ప్రియమైన పరిశుద్ధ స్థలమును నిర్లక్ష్యపెట్టి, అన్య
12 దేవుని పిల్లను పెండ్లి చేసుకొనెను. । యీలాగున చేసిన
వాని యెహోవా యాకోబుయొక్క డేరాలలోనుంచి
దుంపనాశనము చేసును; మేలుకొనిన వానిన్ని ప్రత్యు
త్తరమిచ్చే వానిన్ని సైన్యముల యెహోవాకు అర్ప
13 ణను చెల్లించే వానిన్ని దుంపనాశనము చేసును. । యిం
కా మీరు చేసినదేమంటే, యెహోవా పీఠమును
కన్నీళ్లతోటిన్ని యేడ్పుతోటిన్ని రోదనముతోటిన్ని
నింప చేస్తిరి; కాబట్టి వారు యే అర్పణానున్ను కండ్ల
చూడకపోయిరి; సమ్మతిచేత వారు మీ చేతి మీదుగా
14 యేమైనా అంగీకరించరు. । అది యెందుకని మీరు అడి
గితే, యెహోవా నీ సందుననున్ను బాలుడవైనప్పటి
నీ పెండ్లి భార్య సందుననున్ను సాక్షి అయి వుండెను;
అది నీ ప్రమాణపు భార్యయున్ను చెలికత్తెయున్ను
అయి వున్నది; అయినప్పటికిన్ని నీవు దాని విషయమై
అవిశ్వాసముగా నడిచితివి. । ఆయన వొకతెను మాత్ర 15
మే చేయలేదా? అయినప్పటికిన్ని ఆత్మయొక్క వుత్తమ
త్వము ఆయన యొద్ద వున్నది; యెందుకు వొకతెగా
చేసెనని అడిగితే, దైవ సంతానము లేవగలందులకు
ఆలాగున చేసెను; కాబట్టి మీ ఆత్మలను మీరు జా
గ్రత చేసుకొని, మీలో యెవడైనా బాల్యములో
పెండ్లి చేసుకొనిన తన భార్య విషయమై అవిశ్వాసులై
వుండకండి. । యేమంటే పరిహరించిన వాడు నాకు అను 16
కూలుడు కాడని ఇశ్రాయేలుకు దేవుడైన యెహో
వా ఆనతిచ్చెను; తన బట్టలతోటి బలవంతమును కప్పి
పెట్టిన వాడు నాకు అనుకూలుడు కాడని సైన్య
ముల యెహోవా ఆనతిచ్చెను; కాబట్టి మీ ఆత్మలను
మీరు జాగ్రత చేసుకొని, అవిశ్వాసముగా నడవకండి. ।
మీ మాటలచేత మీరు యెహోవాను ఆయాస పెట్టి 17
తిరి; అయితే మీరు దేనిచేత ఆయనను ఆయాస పెట్టి
తిమని వొక వేళ అడిగితే, యెవరు చెడ్డవారో వారు
యెహోవా దృష్టికి దొడ్డవారౌదురు; వారి యందు
ఆయన సంతోషపడును; న్యాయము నడిపించే దేవుడు
యెక్కడని మీరు అనుకొని దేవుని ఆయాసపెట్టితిరి.

## 3. అధ్యాయము.

ఇదుగో నేను నా దూతను పంపుదును; అతడు 1
నా ముందర తోవ సిద్ధపర్చును; అప్పుడు మీరు కో
రిన యెహోవా తన గుడికి హఠాత్తుగా వచ్చును;
ఆయన మీకు ప్రియుడున్ను ప్రమాణముయొక్క దూ
తయున్ను అయి వున్నాడు; యిదుగో ఆయన వచ్చు
నని సైన్యముల యెహోవా ఆనతిచ్చెను. । అయితే 2
ఆయన వచ్చిన దినమును యెవడు భరించ గలడు!
ఆయన అగుపడినప్పుడు యెవడు నిలువ గలడు! యే
మంటే ఆయన కంసాలి అగ్ని వలెనున్ను చాకలి వాని
సబ్బు వలెనున్ను వుండును. । ఆయన వెండిని శోధించి 3
నిర్మలము చేసినట్టు కూర్చుని, లేవీ పుత్రులను శుద్ధి
పరచి, వెండి బంగారములవలె వారిని నిర్మలము చేసును;
అప్పుడు వారు న్యాయ ప్రకారము యెహోవాకు
అర్పణను చెల్లింతురు. । అప్పుడు యూదాయొక్క 4
యున్ను యెరూశలేముయొక్కయున్ను అర్పణలు
మునుపటి దినములందైనట్టున్ను పూర్వపు సంవత్సరము
లందైనట్టున్ను ఆనందముగా వుండును. । అయితే న్యా 5
యము తీర్చుటకు నేను మీ యొద్దికి వత్తును; చిల్లంగి
వాండ్ల మీదికిన్ని వ్యభిచారుల మీదికిన్ని అప్రమాణి
కుల మీదికిన్ని కూలివానిన్ని తండ్రిలేని వానిన్ని బాధ
పెట్టి, పరదేశికి అన్యాయము చేసి నా యందు భయప

6 డని వారి మీదికిన్ని వేగిరమే సాక్షినై వత్తును. । యే
మంటే యెహోవానైన నేను మార్పు నొంద లేదు
గనుక యాకోబు పుత్రులైన మీరు లయము కాలేదు.।
7 మీ పితృల దినముల నాటినుంచీ మీరు నా కట్టడలను
విడచి, వాటిని గైకొనక పోయినప్పటికిన్ని మీరు నా
తట్టు తిరిగితే, నేను మీ యొద్దికి తిరిగి వత్తునని సైన్య
ముల యెహోవా ఆనతియ్యగా, మేము తిరిగీ వచ్చుట
8 యేలాగు అని మీరు అంటిరి. । యెవడైనా దేవుని
యొద్ద దొంగిలునా? అయితే మీరు నా యొద్ద దొం
గిలితిరి; నీ యొద్ద యేలాగు దొంగిలితిమని మీరు అడి
గితే, దశమ భాగమునున్ను అర్పణలనున్ను యివ్వక
9 నా యొద్ద దొంగిలితిరి. । మీరున్ను యీ యావజ్జనాం
గము నా యొద్ద దొంగిలినందున మీరు ఘోరమైన
10 శాపమును పొందితిరి. । నా మందిరములో ఆహారము
వుండేటట్టు దశమ భాగములనన్నిటినీ కొట్టులోకి తె
ప్పించండి; ఆలాగున నన్ను శోధించి, నేను మీ కొరకు
ఆకాశపు దిడ్డీలను విప్పి, వుంచుటకు స్థలము చాలక
పోయే మట్టుకున్ను మీకు ఆశీర్వాదమును కుమ్మరింతు
11 నో లేదో చూతురు గాని, । మీ పంటను తినివేసే
వాటిని నేను మీ నిమిత్తమై గద్దించినందున అవి మీ
భూమి పంటను నశింప చేయలేక పోవును; మీ ద్రాక్ష
చెట్లు అకాలపు ఫలములను రాల్పక వుండునని సైన్య
12 ముల యెహోవా ఆనతిచ్చెను. । నా దేశము ఆనంద
ము గల దేశము గనుక సకల జనాంగములు మిమ్మును
భాగ్యవంతులని చెప్పుదురని సైన్యముల యెహోవా
13 ఆనతిచ్చి, మరిన్ని చెప్పేదేమంటే, । నన్ను గురించి
మీరు చెప్పిన మాటలు బహు గర్వపు మాటలైనప్పటి
కిన్ని నిన్ను గురించి యేమి చెప్పితిమని మీరు అడిగి
14 తిరి. । దేవునిని సేవ చేసుట నిష్ఫలమనిన్ని, ఆయన
ఆజ్ఞలను మనము గైకొని సైన్యముల యెహోవా
సముఖమందు మనము దుఃఖము తెచ్చుకొనుటకు ప్ర
15 యోజనమేమనిన్ని, । గర్విష్ఠులను భాగ్యవంతులనిన్ని,
దుర్మార్గులకు క్షేమము కలుగుననిన్ని, యెహో
వాను శోధించే వారికి రక్షణ కలుగుననిన్ని, మీరు
చెప్పుకొని, యెహోవాను దూషిస్తిరని ఆనతిచ్చెను. ।
16 అప్పుడు యెహోవా యందు భయభక్తులు గలవారు
వొకరితో వొకరు మాట్లాడు కొంటూ వుండిరి; యె
హోవా ఆలకించి, దానిని వినెను; మరిన్ని యెహో
వా యందు భయభక్తులు గలిగి ఆయన నామమును
తలంచుకొనిన వారిని గురించిన జ్ఞాపకపు గ్రంథము
ఆయన సముఖమందు వ్రాయబడి వుండెను. । మరిన్ని 17
యిందుకు సైన్యముల యెహోవా ఆనతిచ్చేదేమంటే,
నేను నిర్ణయించే దినమందు వారు నాకు స్వజనులై
వుందురు; తండ్రి తన్ను సేవించిన తన కుమారుని యం
దు కనికరించినట్టు నేను వారిని కనికరింతునని సైన్య
ముల యెహోవా ఆనతిచ్చెను. । అప్పుడు మీరు తిరిగీ 18
నీతిగల వానికిన్ని నీతిలేని వానికిన్ని భేదమునున్ను
దేవుని సేవించిన వానికిన్ని సేవించని వానికిన్ని వున్న
భేదమునున్ను చూతురు.

## 4. అధ్యాయము.

ఇదుగో దినము వస్తూ వున్నది; అది కొలిమిలా 1
గున కాలుతూ వుండును; గర్విష్ఠులందరున్ను దుష్ట
క్రియలు చేసే వారందరున్ను కొయ్యకాలై వుందురు;
వచ్చే ఆ దినము వారికి వేరైనా చిగురైనా వుండకుం
డా దహించునని సైన్యముల యెహోవా ఆనతిచ్చె
ను. । అయితే నా నామమందు భయభక్తులు గల వారి 2
పైని నీతి సూర్యుడు వుదయించును; అతని రెక్కలలో
నుంచి ఆరోగ్యము దిగివచ్చును; మీరు బైలు వెళ్లి, కొ
వ్విన దూడల లాగున పెరిగి, దుర్మార్గులను త్రొక్కు
దురు. । యేమంటే నేను నిర్ణయించే దినమందు వారు 3
మీ పాదముల కింద ధూళివలె వుందురని సైన్యముల
యెహోవా ఆనతిచ్చెను. । హోరేబు కొండ మీద 4
ఇశ్రాయేలీయులందరికొరకు నేను నా సేవకుడైన మో
షేకు ఆజ్ఞాపించిన న్యాయ ప్రమాణమునున్ను కట్టడల
నున్ను ఆజ్ఞలనున్ను జ్ఞాపకము చేసుకొండి. । యిదుగో 5
ఘనమున్ను భయంకరమున్ను అయిన యెహోవా
దినము రాక మునుపే నేను దీర్ఘదర్శియైన ఏలీయా
ను మీ యొద్దికి పంపుదును. । నేను వచ్చి, దేశమును 6
శపించకుండా, అతడు తండ్రుల హృదయములను పిల్లల
తట్టున్ను పిల్లల హృదయములను తండ్రుల తట్టున్ను
తిప్పేటట్టు నేను అతని పంపుదును.

సమాప్తము.

**TENTATIVE EDITION.**

THE

# NEW TESTAMENT

OF OUR

## LORD AND SAVIOUR JESUS CHRIST,

TRANSLATED INTO TELUGU FROM THE ORIGINAL GREEK.

---

మన ప్రభువును రక్షకుడునైన యేసుక్రీస్తుయొక్క

# కొత్త నిబంధన,

ఆదిమ గ్రేకు భాషలోనుంచి తెనుగులో రచించబడినది.

---

MADRAS:
PRINTED FOR THE MADRAS AUXILIARY BIBLE SOCIETY,
AT THE CHRISTIAN KNOWLEDGE SOCIETY'S PRESS.

1881.

*Super royal 8vo. Long primer.*

# THE BOOKS OF THE NEW TESTAMENT.

కొత్త నిబంధనయొక్క పరిశుద్ధ గ్రంథమునందు యిమిడియున్న పుస్తకముల నామ క్రమము, అధ్యాయముల వెరసి.

# మత్తై వ్రాసిన సువార్త.

## 1. అధ్యాయము.

1 అబ్రాహాము కుమారుడును దావీదు కుమారుడు
2 నైన యేసు క్రీస్తుయొక్క వంశావళి. । అబ్రాహాము
ఈసాకును కనెను. ఈసాకు యాకోబును కనెను.
యాకోబు యూదాను అతని అన్నదమ్ములను
3 కనెను. । యూదా తామారుయందు పెరెసును జర
హును కనెను. పెరెసు ఎస్రోమును కనెను. ।
4 ఎస్రోము ఆరామును కనెను. ఆరాము అమ్మీనాదా
బును కనెను. అమ్మీనాదాబు నయస్సోనును కనెను. ।
5 నయస్సోను సల్మోనును కనెను. సల్మోను రాహాబుయందు
బోయజును కనెను. బోయజు రూతుయందు ఓబే
6 దును కనెను. ఓబేదు యెష్షయిని కనెను. । యెష్షయి
రాజైన దావీదును కనెను. రాజైన దావీదు ఊరియా
7 యొక్క భార్యయందు సొలొమోనును కనెను. । సొలొ
మోను రెహబామును కనెను. రెహబాము అబీయాను
8 కనెను. అబీయా ఆసాను కనెను. । ఆసా యెహో
షాపాతును కనెను. యెహోషాపాతు యెహో
రామును కనెను. యెహోరాము ఉజ్జీయాను కనె
9 ను. । ఉజ్జీయా యోతామును కనెను. యోతాము
ఆహాజును కనెను. ఆహాజు హిజ్కియాను కనెను. ।
10 హిజ్కియా మనష్షేను కనెను. మనష్షే ఆమోనును
11 కనెను. ఆమోను యోషీయాను కనెను. । బబులో
నులో పరవాసులై యుండబోయేటప్పుడు యోషీ
యా యెకొన్యాను అతని సహోదరులను కనెను. ।
12 బబులోనులో పరవాసులై యున్నప్పుడు యెకొన్యా
షయల్తీయేలును కనెను. షయల్తీయేలు జెరుబ్బాబెలును
13 కనెను. । జెరుబ్బాబెలు అబీహూదును కనెను. అబీ
హూదు ఎల్యాకీమును కనెను. ఎల్యాకీము అజో
14 రును కనెను. । అజోరు సాదోకును కనెను. సాదోకు
ఆకీమును కనెను. ఆకీము ఎలీహూదును కనెను. ।
15 ఎలీహూదు ఎలియాజరును కనెను. ఎలియాజరు
మత్తానును కనెను. మత్తాను యాకోబును కనెను. ।
16 యాకోబు మరియ పెనిమిటియైన యోసేపును కనెను.
ఆమెయందు క్రీస్తు అనబడిన యేసు పుట్టెను. । ఈ 17
లాగు అబ్రాహాము మొదలుకొని దావీదు పర్యంతము
తరములన్నియు పదునాలుగు తరములు; దావీదు మొద
లుకొని బబులోనులో ఉన్న పరవాసకాల పర్యం
తము పదునాలుగు తరములు; బబులోనులో ఉన్న పర
వాసకాలము మొదలుకొని క్రీస్తు పర్యంతము పదు
నాలుగు తరములునై యున్నవి.

అయితే యేసుక్రీస్తు జన్మము ఏలాగున జరిగిన 18
దంటే, ఆయన తల్లియైన మరియ యోసేపుకు ప్రధా
నము చేయబడిన తర్వాత, వారికి సంసర్గము కాక
మునుపు, ఆమె పరిశుద్ధాత్మవల్ల గర్భవతియై అగుప
డెను. । అప్పుడు ఆమెకు పెనిమిటియైన యోసేపు 19
నీతిపరుడైయుండి ఆమెను బహిరంగముగా అవమాన
పరచనొల్లక, రహస్యముగా ఆమెను విడనాడుటకు
ఉద్దేశించెను. । ఆయన వీటిని గురించి ఆలోచిస్తూ 20
వున్నప్పుడు ఇదుగో! ప్రభువుయొక్క దూత స్వప్న
మందు అతనికి ప్రత్యక్షమై, —దావీదు కుమారుడవైన
యోసేపా! నీ భార్యయైన మరియను చేర్చుకొనుటకు
భయపడకుము; ఆమె గర్భములో పుట్టినది పరిశు
ద్ధాత్మవల్ల కలిగియున్నది, । ఆమె కుమారుని కనును; 21
ఆయనకు యేసు అనే పేరు పెట్టుదువు; ఎందుకంటే
ఆయనే తన ప్రజలను వారి పాపములనుంచి రక్షిం
చునని పలికెను. । —ఇదుగో! ఒక కన్యక గర్భవతియై 22
కుమారుని కనును; అప్పుడు ఆయనకు । భాషాంతరమై 23
దేవుడు మనకు తోడైయున్నాడనే అర్థమిచ్చే, ఇమ్మా
నూయేలనే పేరు పెట్టుదురని ప్రభువు ప్రవక్త ద్వారా
చెప్పినది నెరవేరేటట్టు ఇదంతయు జరిగెను. । అప్పుడు 24
యోసేపు మేలుకొని, ప్రభువుయొక్క దూత అతనికి
ఆజ్ఞాపించిన ప్రకారము చేసి, తన భార్యను చేర్చు
కొని । ఆమె తన తొలుచూలు కుమారుని కనేవరకు 25
ఆమెను ఎరుగక ఉండెను. అప్పుడు ఆయనకు యేసు
అని పేరు పెట్టెను.

## 2. అధ్యాయము.

1 రాజైన హేరోదు దినములయందు యూదైయ
దేశపు బేత్లెహేములో యేసు పుట్టినప్పుడు, ఇదుగో!
తూర్పునుంచి జ్ఞానులు యెరూశలేముకు వచ్చి।—
2 యూదుల రాజుగా పుట్టినవాడు ఎక్కడ ఉన్నాడు?
మేము ఆయన నక్షత్రమును తూర్పున చూచి, ఆయ
3 నకు నమస్కరించుటకు వచ్చితిమని చెప్పిరి.। రాజైన
హేరోదు దీని వినినప్పుడు, అతడు అతనితో కూడా
4 యెరూశలేము వారందరును తొందరపడిరి.। అతడు
సకల ప్రధాన యాజకులను జనుల శాస్త్రులను పోగు
చేసి — క్రీస్తు ఎక్కడ పుట్టునని వారిని అడిగెను.।
5 అందుకు వారు — యూదైయ దేశపు బేత్లెహేము
లోనే; ఎందుకంటే — యూదైయ దేశపు బేత్లెహే
మా! ఇశ్రాయేలనే నా ప్రజలను పరిపాలించే ఒక
అధిపతి నీలోనుంచి వచ్చును గనుక నీవు యూదైయ
యొక్క అధిపతులలో ఎంత మాత్రము అల్పమైనదా
6 నవు కావని। ప్రవక్తచేత వ్రాయబడి యున్నదని చె
7 ప్పిరి.। అప్పుడు హేరోదు ఆ జ్ఞానులను రహస్యముగా
పిలిపించి, ఆ నక్షత్రము అగుపడిన కాలము వారివల్ల
8 పరిష్కారముగా తెలుసుకొని।—మీరు వెళ్లి ఆ శిశువు
ను జాగ్రత్తగా వెతికి, అతని కనుగొనినప్పుడు, నేనును
వచ్చి అతనికి నమస్కరించేటందుకు, నాకు తెలియ
చేయండని చెప్పి వారిని బేత్లెహేముకు పంపెను.।
9 వారు రాజు మాట విని బైలువెళ్లిరి. అప్పుడు ఇదు
గో! వారు తూర్పున చూచిన నక్షత్రము ఆ శిశువు
ఉండిన చోటి మీదికి వచ్చి నిలిచేమట్టుకు వారికి
10 ముందుగా నడిచెను.। వారు ఆ నక్షత్రము చూచి
11 అత్యధిక సంతోషముతో ఆనందించిరి.। అప్పుడు
వారు ఇంట్లోకి వచ్చి, అతని తల్లియైన మరియతో
కూడా ఆ శిశువును చూచి, సాగిలపడి అతనికి నమ
స్కారము చేసి, తమ బరిణెలను తెరిచి, బంగారము
సాంబ్రాణి బోళము అనే కానుకలను అతనికి సమ
12 ర్పించిరి.। అయితే—హేరోదు యొద్దికి వెళ్లవద్దని
స్వప్నమందు దేవునివల్ల ఆజ్ఞాపించబడి, మరియొక
మార్గముగా తమ దేశమునకు తిరిగీ వెళ్లిరి.

13 వారు వెళ్లిన తర్వాత, ఇదుగో! ప్రభువుయొక్క
దూత స్వప్నమందు యోశేపుకు కనబడి,—హేరోదు
ఆ శిశువును సంహరించుటకు అతని వెతకబోతున్నా
డు గనుక నీవు లేచి ఆ శిశువును అతని తల్లిని తీసు
కొని ఐగుప్తుకు పారిపోయి, నేను నీతో చెప్పే పర్యం
తము అక్కడ ఉండుమని అతనితో పలికెను.। అప్పు 14
డు ఆయన లేచి రాత్రివేళ శిశువును అతని తల్లిని
తీసుకొని ఐగుప్తుకు వెళ్లి।— నేను ఐగుప్తులోనుంచి 15
నా కుమారుని పిలిచితినని ప్రభువు ప్రవక్త ద్వారా
పలికిన మాట నెరవేరేటట్టు, హేరోదు మరణ పర్యం
తము అక్కడ ఉండెను.

అప్పుడు హేరోదు తాను ఆ జ్ఞానులచేత వంచించ 16
బడి యుండుట చూచి, బహు కోపము తెచ్చుకొని,
తాను జ్ఞానులవల్ల పరిష్కారముగా తెలుసుకొనిన వేళ
చొప్పున, బేత్లెహేములోను దాని సకల ప్రాంతముల
లోను రెండు సంవత్సరములు వయస్సుగాని అంత
కంటే తక్కువ వయస్సుగాని గల మగపిల్లలనందరిని
చంపుటకు పంపించెను.। అప్పుడు, — రామాలో అం 17
గలార్పు యేడ్పు మహా దుఃఖమును కలిగిన శబ్దము
వినబడెను;। రాహేలు తన పిల్లల నిమిత్తము యేడుస్తూ; 18
వారు లేనందున ఓదార్పు పొందనొల్లక పోయెనని
ప్రవక్తయైన యెరిమియా చేత చెప్పబడినది నెరవేరె
ను.। అయితే హేరోదు చనిపోయిన తరువాత, ఇదు 19
గో! ప్రభువుయొక్క దూత ఐగుప్తులో యోశేపుకు
స్వప్నమందు ప్రత్యక్షమై।— నీవు లేచి శిశువును 20
అతని తల్లిని తీసుకొని ఇశ్రాయేలు దేశమునకు వెళ్లు
ము; ఆ శిశువు ప్రాణము వెతికిన వారు చనిపోయి
రని చెప్పెను.। అప్పుడు ఆయన లేచి, ఆ శిశువును 21
అతని తల్లిని తీసుకొని ఇశ్రాయేలు దేశమునకు వచ్చె
ను.। అయితే అర్ఖెలాయు తన తండ్రియైన హే 22
రోదుకు ప్రతిగా యూదైయను యేలుతున్నాడని
విని, అక్కడికి వెళ్లుటకు భయపడెను.। అప్పుడు స్వ 23
ప్నమందు దేవునిచేత ఆజ్ఞాపించబడి,—ఆయన నజో
రీయుడనబడునని ప్రవక్తలద్వారా పలకబడినది నెర
వేరేటట్టు, గలిలైయ ప్రాంతములకు వెళ్లి, నజరెథనే
ఊరికి వచ్చి కాపురముండెను.

## 3. అధ్యాయము.

ఆ దినములయందు స్నానమిచ్చే* యోహాను 1
వచ్చి।—ఆకాశ రాజ్యము సమీపమై ఉన్నది గనుక 2
మీరు మనస్సు తిప్పుకొనండని యూదైయయొక్క
అరణ్యములో ప్రకటించుచుండెను.।— ప్రభువుయొ 3
క్క మార్గము సిద్ధపరచండి; ఆయన త్రోవలు సరా
ళము చేయండని అరణ్యములో నోరెత్తి పలికే ఒకని
శబ్దమని ప్రవక్తయైన ఎషయవల్ల చెప్పబడినవాడు
ఈయనే.। ఆ యోహానుకు ఒంటె వెంట్రుకల వస్త్ర 4

*అనగా, బాప్తిస్మము.

మును, అతని మొలకు తోలు దట్టియు కలిగి ఉండె
ను; మిడతలు అడవి తేనెయు అతనికి ఆహారమై
5 ఉండెను.। అప్పుడు యెరూషలేమువారు, యూదైయ
వారందరు, యొర్దానుకు సమీపప్రదేశముల వారం
6 దరును ఆయన యొద్దికి బయలు వెళ్లి,। తమ పాపము
లను ఒప్పుకొని యొర్దానులో* ఆయనవల్ల స్నా
7 నము పొందిరి.। అయితే ఆయన, ఫరిసైయులలోను
సద్దూకైయులలోను అనేకులు తన స్నానముకొరకు
వచ్చుట చూచి,—ఓ సర్పవంశస్థులారా! రాబోయే
కోపము తప్పించుకొనుటకు మీకు బుద్ధి చెప్పినవా
8 డెవడు?। కాబట్టి, మారు మనస్సుకు తగిన ఫలము
9 ఫలింపచేయండి।— అబ్రాహాము మాకు తండ్రియని
మీలో మీరు అనుకొనుటకు తలంచవద్దు; దేవుడు ఈ
రాళ్లవల్ల అబ్రాహాముకు పిల్లలను పుట్టించగలడని మీ
10 తో చెప్పుతున్నాను.। మరియు ఇప్పుడు గొడ్డలి చెట్ల
వేరున ఉంచబడియున్నది గనుక మంచి ఫలము ఫలిం
పచేయని ప్రతి చెట్టును నరకబడి అగ్నిలో వేయబ
11 డును.। నేను మారు మనస్సు కొరకు మీకు నీళ్లతో
స్నానమిస్తున్నాను. అయితే నా వెనుక వస్తున్నవాడు
నాకంటే శక్తిమంతుడు. ఆయన చెప్పులు మోయుటకై
నా నేను యోగ్యుడను కాను. ఆయన పరిశుద్ధాత్మతోను
12 అగ్నితోను మీకు స్నానమిచ్చును.। ఆయన చేట
ఆయన చేతిలో ఉన్నది; ఆయన తన కళ్లమును లెస్స
గా పరిశుద్ధపరిచి తన గోధుములను కొట్టులో కూర్చి,
ఆరని అగ్నితో పొట్టు కాల్చివేసునని వారితో
పలికెను.

13 అప్పుడు యేసు గలిలైయనుంచి యొర్దాను
దగ్గిర ఉన్న యోహానువల్ల స్నానము పొందుటకు అతని
14 యొద్దికి వచ్చెను.। అయితే యోహాను—నీ వల్ల స్నా
నము పొందుటకు నాకు అవసరము ఉన్నది; నీవు నా
యొద్దికి వస్తున్నావా? అని ఆయనను నివారిస్తూ ఉం
15 డెను.। అందుకు యేసు, — ఇప్పుడు కానిమ్ము; నీతి
యావత్తు నెరవేర్చుట మనకు తగి యున్నదని అతనికి
ప్రత్యుత్తరమిచ్చెను. అప్పుడు ఆయనకు ఆలాగు కా
16 నిచ్చెను.। యేసు స్నానము పొంది నీళ్ల యొద్దనుంచి
రాగానే, ఇదుగో! ఆకాశము ఆయనకు తెరవబడెను;
అప్పుడు దేవుని ఆత్మ పావురమువలె దిగి ఆయన మీద
17 వ్రాలుట చూచెను.। అప్పుడు ఇదుగో!— ఈయనే
నా ప్రియ కుమారుడు; ఈయన విషయమై నేను సం
తోషపడుతున్నాననే ఒక శబ్దము ఆకాశమునుంచి
కలిగెను.

## 4. అధ్యాయము.

అప్పుడు యేసు సైతానువల్ల శోధించబడుటకు 1
ఆత్మచేత అరణ్యమునకు కొంచుపోబడెను.। ఆయన 2
దివారాత్రులు నలభై దినములు ఉపవాసము చేసిన
తరువాత ఆయనకు ఆకలి పుట్టెను.। అప్పుడు ఆ శో 3
ధకుడు ఆయన యొద్దికి వచ్చి,—నీవు దేవుని కుమారుడ
వైతే ఈ రాళ్లు రొట్టెలయేటట్టు ఆజ్ఞాపించుమని పలి
కెను.। అందుకు ఆయన,—మనుష్యుడు రొట్టెవల్ల మా 4
త్రమే కాకుండా దేవుని నోటినుంచి బైలు వెళ్లే
ప్రతి మాటవల్లను బ్రతుకునని వ్రాయబడి యున్నదని
ప్రత్యుత్తరమిచ్చెను.। అప్పుడు సైతాను పరిశుద్ధ పట్ట 5
ణమునకు ఆయనను తీసుకొని వెళ్లి, గుడి శిఖరమున
ఆయనను నిలువబెట్టి।— నీవు దేవుని కుమారుడవైతే 6
నీకు నీవే కింద పడుము;—ఆయన నిన్ను గురించి తన
దూతలకు ఆజ్ఞాపించుననియు, నీ పాదము ఎప్పుడై
నా రాతికి తగలకుండా వారు నిన్ను చేతులతో
ఎత్తుకొందురనియు వ్రాయబడి యున్నదని ఆయ
నతో చెప్పెను.। అందుకు యేసు, — తిరిగీ—నీవు నీ 7
దేవుడైన ప్రభువును శోధించవద్దని వ్రాయబడి యు
న్నదని వానితో పలికెను.। తిరిగీ సైతాను ఆయనను 8
మిక్కిలీ ఎత్తైన పర్వతము మీదికి తీసుకొని వెళ్లి, ఈ
లోక రాజ్యములనన్నిటిని, వాటి మహిమను ఆయనకు
చూపించి।— నీవు సాగిలపడి నాకు నమస్కరించితే 9
ఇవన్నియు నీకు ఇత్తునని ఆయనతో పలికెను। అప్పు 10
డు యేసు వానితో— సైతానా! నా వెనుకకు పొ
మ్ము;—నీ దేవుడైన ప్రభువుకు నమస్కరించి ఆయనను
మాత్రమే ఆరాధించ వలెనని వ్రాయబడి యున్నదని
చెప్పెను.। అంతట సైతాను ఆయనను విడిచిపోయెను. 11
అప్పుడు ఇదుగో! దూతలు వచ్చి ఆయనను సేవించిరి.

యోహాను అప్పగించబడెనని యేసు విని గలిలై 12
యకు వెళ్లెను.। అప్పుడు,—జబులోను దేశమును, నఫ్తా 13
లీము దేశమును, యొర్దానుకు ఆవలనున్న సముద్ర
తీరమును, రాష్ట్రములయొక్క గలిలైయయు; అక్కడ
అంధకారములో కూర్చుని యున్న జనులు గొప్ప వెలు
గు చూచిరనియు, మరణముయొక్క నీడగల దేశములో
కూర్చుని యున్న వారికి వెలుగు ఉదయించెననియు
ప్రవక్తయైన ఎషయా మూలముగా పలుకబడినది నెర
వేరేటట్టు, ఆయన నజరెథు విడిచి జబులోను, నఫ్తా
లీమనే దేశముల ప్రాంతములలో సముద్రము దగ్గిర

* లేక, యొద్ద.

ఉన్న కపెర్నహూముకు వచ్చి కాపురముండెను.।
17 అప్పటినుంచి యేసు — ఆకాశ రాజ్యము సమీపమై
యున్నది గనుక మనస్సు తిప్పుకొనండని ప్రకటించి
చెప్పుటకు మొదలుబెట్టెను.

18 యేసు గలిలైయ సముద్రముయొద్ద నడుస్తూ పేతు
రనబడిన సీమోను, అతని సహోదరుడైన అంద్రెయ
అనే ఇద్దరు సహోదరులు సముద్రములో వల
19 వేయుట చూచెను; వారు జాలరులై యుండిరి.। అప్పుడు
ఆయన,—నా వెంబడి రండి; నేను మిమ్మును మనుష్య
లను పట్టే జాలరులను చేతునని వారితో చెప్పెను.।
20 వెంటనే వారు తమ వలలను విడిచి ఆయనను వెంబ
21 డించిరి.। ఆయన అక్కడనుంచి వెళ్లి, జెబెదై కుమా
రుడైన యాకోబు అతని సహోదరుడైన యోహాను
అనే వేరే ఇద్దరు సహోదరులు, వారి తండ్రియైన
జెబెదై యొద్ద దోనెలో తమ వలలను బాగుచేసుకొ
22 నుట చూచి వారిని పిలిచెను.। వెంటనే వారు తమ
దోనెను తమ తండ్రిని విడిచి ఆయనను వెంబడించిరి.

23 తరువాత యేసు వారి సునగోగులలో ఉపదేశిస్తూ
రాజ్య విషయమైన సువార్తను ప్రకటిస్తూ జనులలో
ప్రతి రోగమును ప్రతి వ్యాధిని స్వస్థపరుస్తూ గలి
24 లైయ యందంతటా సంచరిస్తూ ఉండెను.। ఆయన
కీర్తి సురియ దేశమంతటా వ్యాపించెను గనుక
నానావిధమైన వ్యాధుల చేతను వేదనల చేతను పీడిం
చబడిన సమస్త రోగులను, దయ్యము పట్టిన వారిని,
చాంద్రరోగులను, పక్షవాయువు గల వారిని ఆయన
యొద్దికి తీసుకొని వచ్చిరి. ఆయన వారిని స్వస్థపరి
25 చెను.। అయితే గలిలైయనుంచియు దెకపొలీనుంచి
యు యెరూశలేమునుంచియు యూదైయనుంచియు
యొర్దానుకు అవతలనుంచియు అనేక ప్రజలు వచ్చి
ఆయనను వెంబడించిరి.

## 5. అధ్యాయము.

1 ఆయన ఆ సమూహములను చూచి ఒక కొండ
మీదికి ఎక్కి కూర్చుండిన తరువాత ఆయన శిష్యులు
2 ఆయన యొద్దికి వచ్చిరి.। అప్పుడు ఆయన తన నోరు
తెరిచి వారికి ఈలాగున ఉపదేశించెను।—

3 దీన మనస్సుగలవారు ధన్యులు; ఆకాశ రాజ్యము
వారిది.

4 దుఃఖపడే వారు ధన్యులు; వారు ఓదార్చబడు
దురు.

5 సాత్వికులు ధన్యులు; వారు భూమి స్వతంత్రించు
కొందురు.

నీతి కొరకు ఆకలి దప్పులుగలవారు ధన్యులు; 6
వారు తృప్తిపరచబడుదురు.

కనికరము గలవారు ధన్యులు; వారు కనికరించబ 7
డుదురు.

శుద్ధ హృదయము గలవారు ధన్యులు; వారు దేవుని 8
చూతురు.

సమాధానపరిచేవారు ధన్యులు; వారు దేవుని కుమా 9
రులని పిలువబడుదురు.

నీతి నిమిత్తము తరుమబడేవారు ధన్యులు; ఆకాశ 10
రాజ్యము వారిది.

నా నిమిత్తము జనులు మిమ్మును నిందించి తరిమి మీ 11
మీద నానా విధమైన కాని మాటలు అబద్ధముగా పలి
కేటప్పుడు మీరు ధన్యులు.। సంతోషపడి మిక్కిలీ 12
ఆనందించండి; మీ ఫలము ఆకాశములో అధికమై
యున్నది. ఈలాగున వారు మీకు ముందుగా ఉండిన
ప్రవక్తలను తరిమిరి.

మీరు భూమికి ఉప్పై యున్నారు. ఉప్పు నిస్సా 13
రమైతే, దేనివల్ల సారము పొందును. ఆ తరువాత
అది బైట పారవేయబడి మనుష్యులచేత తొక్క
బడుటకేగాని మరి దేనికిని పనికిరాదు.। మీరు లోక 14
ముయొక్క వెలుగై యున్నారు. కొండమీద ఉండే
పట్టణము మరుగై యుండనేరదు.। మరియు దీపము 15
ముట్టించి దీపస్తంభము మీదనేగాని కుంచము కింద
దాని పెట్టరు. అప్పుడు ఇంట్లో ఉండే వారందరికిని
వెలుగు ఇచ్చును.। అటువలె మనుష్యులు మీ సత్క్రి 16
యలను చూచి ఆకాశములో ఉండే మీ తండ్రిని
మహిమపరిచేకొరకు, వారి యెదుట మీ వెలుగు ప్రకా
శించనియ్యండి.

బోధనాప్రమాణమునైనా ప్రవక్తలనైనా కొట్టి 17
వేయుటకు వచ్చితినని తలంచవద్దు; నెరవేర్చుటకు వచ్చి
తినే గాని కొట్టివేయుటకు కాదు.। యెందుకంటే 18
ఆకాశము, భూమియు గతించిపోయే వరకు సమస్త
మును నెరవేర్చబడితేనే గాని బోధనాప్రమాణము
నుంచి ఒక గుడియైనా ఒక సున్నయైనా గతించదని
నిజముగా మీతో చెప్పుతున్నాను.। కాబట్టి ఈ ఆజ్ఞ 19
లలో మిక్కిలీ అల్పమైన ఒక దానినైనా మీరి, మను
ష్యులకు ఆలాగున బోధించే వాడెవడో వాడు ఆకాశ
రాజ్యములో మిక్కిలీ అల్పుడనబడును. అయితే వా
టిని గైకొని బోధించే వాడెవడో వాడు ఆకాశ రా
జ్యములో గొప్ప వాడనబడును.। శాస్త్రుల యొక్క 20
యు ఫరిసైయుల యొక్కయు నీతి కంటే. మీ నీతి
యొక్కువ కాకపోతే మీరు ఆకాశ రాజ్యములో
ప్రవేశించ నేరరని మీతో చెప్పుతున్నాను.

21 —నరహత్య చేయవద్దనియు; నరహత్య చేసేవాడు
న్యాయపు తీర్పుకు లోపడుననియు పూర్వికులవల్ల*
22 చెప్పబడెనని మీరు వినియున్నారు. । అయితే నేను
మీతో చెప్పేదేమంటే, నిర్నిమిత్తము తన సహో
దరుని మీద కోపపడే ప్రతివాడు న్యాయపు తీర్పుకు
లోబడును. తన సహోదరుని — నీచుడా! అని
పలికేవాడు సభకు లోబడును.— ద్రోహీ! అని చెప్పే
వాడు అగ్ని గల గెహెన్నలో (తోయబడుటకు) లో
23 బడును. । కాబట్టి నీవు యజ్ఞవేది యొద్దికి నీ కానుక
తెచ్చి నీ సహోదరునికి నీ మీద యేదైనా విరో
24 ధము కలదని అక్కడ జ్ఞాపకము చేసుకొంటే । అక్కడ
యజ్ఞవేది యెదుట నీ కానుక విడిచి, ముందుగా వెళ్లి
నీ సహోదరునితో సమాధానపడినప్పుడు, వచ్చి నీ
25 కానుకను అర్పించుము. । నీ ప్రతివాదితో నీవు తో
వలో ఉన్నప్పుడు త్వరగా అతనికి విహితముగా ఉం
డుము; లేకపోతే ఒకవేళ నీ ప్రతివాది నిన్ను న్యా
యాధిపతికి అప్పగించును. అప్పుడు న్యాయాధిపతి
నిన్ను బంటుకు అప్పగించును; అప్పుడు నీవు చెరసా
26 లలో వేయబడుదువు. । నీవు కడపటి కాసు తీర్చే
పర్యంతము అక్కడనుంచి వెలపటికి రావని నీతో
నిజముగా చెప్పుతున్నాను.

27 —వ్యభిచారము చేయ వద్దని పూర్వికులవల్ల* చెప్ప
28 బడెనని మీరు వినియున్నారు. । అయితే ఒక స్త్రీని
మోహించుటకు, ఆమెను చూచే ప్రతివాడు అప్పుడే
తన హృదయమందు ఆమెతో వ్యభిచారము చేసి
29 యున్నాడని నేను మీతో చెప్పుతున్నాను. । మరియు
నీ కుడి కన్ను నిన్ను ఆతంకపరిచితే,† దాని పెరికి నీ
యొద్దనుంచి పారవేయుము; నీ శరీరమంతయు గెహె
న్నలో వేయబడుటకంటే నీ అవయవములలో ఒకటి
30 నశించుట నీకు ఉపయుక్తము. । మరియు నీ కుడిచె
య్యి నిన్ను ఆతంకపరిచితే† దాని నరికి నీ యొద్ద
నుంచి పారవేయుము; నీ శరీరమంతయు గెహెన్నలో
వేయబడుటకంటే నీ అవయవములలో ఒకటి నశిం
చుట నీకు ఉపయుక్తము.

31 —తన భార్యను విడనాడే వాడు ఆమెకు పరిత్యాగ
32 పత్రిక ఇయ్యవలెనని చెప్పబడి యున్నది । అయితే వ్య
భిచార నిమిత్తమే గాక తన భార్యను విడనాడే వాడు
ఆమెను వ్యభిచరింప చేస్తున్నాడనియు, విడనాడబ
డిన దాని పెండ్లి చేసుకొనే వాడు వ్యభిచరిస్తున్నా
డనియు నేను మీతో చెప్పుతున్నాను.

మరియు—నీవు అప్రమాణము చేయక నీ ప్రమాణ 33
ములను ప్రభువుకు చెల్లించ వలెనని పూర్వికులవల్ల*
చెప్పబడెనని మీరు విని యున్నారు. । అయితే నేను 34
మీతో చెప్పేది యేమంటే, ఎంతమాత్రము ప్రమా
ణము చేయకండి. ఆకాశము తోడనవద్దు; అది దే
వుని సింహాసనమై యున్నది. । భూమి తోడనవద్దు; 35
అది ఆయన పాదపీఠమై యున్నది. యెరూశలేము తో
డనవద్దు; అది మహారాజు పట్టణమై యున్నది. । నీ 36
తలతోడని ప్రమాణము చేయవద్దు; నీవు ఒక వెంట్రు
కనైనా తెలుపు నలుపు చేయలేవు. । అయితే మీ 37
మాట, అవును అవును, కాదు కాదు అనేదై యుండ
వలెను; వీటికంటే యెక్కువైనది యేదో అది చెడుతన
మువల్ల కలుగును.

—కంటికి కన్ను, పంటికి పల్లు అని చెప్పబడెనని 38
మీరు విని యున్నారు. । అయితే నేను మీతో చెప్పే 39
దేమంటే, కీడుకు ఎదురాడక నీ కుడి చెంప మీద
నిన్ను కొట్టే వాని తట్టు రెండోది కూడా తిప్పుము. ।
నీతో వ్యాజ్యమాడుతూ నీ అంగీ పుచ్చుకొనుటకు 40
ఇచ్ఛయించే వాని, నీ పై వస్త్రము పుచ్చుకొననిమ్ము. ।
ఎవడైనా ఒక కోసెడు దూరము రమ్మని నిన్ను నిర్బం 41
ధించితే వానితో రెండు కోసులు వెళ్లుము. । నిన్ను 42
అడిగే వానికి ఇమ్ము; నీ యొద్ద ఎరవు పుచ్చుకొనుటకు
కోరే వాని గూర్చి వెనుక తీయవద్దు.

—నీ పొరుగువాని ప్రేమించి నీ శత్రువును ద్వే 43
షించ వలెనని చెప్పబడినమాట మీరు వినియున్నారు. ।
అయితే నేను మీతో చెప్పేదేమంటే । మీరు ఆకా 44,45
శమందున్న మీ తండ్రికి కుమారులై యుండుటకు, మీ
శత్రువులను ప్రేమించండి; మిమ్మును శపించే వారిని
దీవించండి; మిమ్మును ద్వేషించేవారికి మేలు చేయండి;
మిమ్మును నిందించి తరిమే వారి కొరకు ప్రార్థించండి.
ఆయన చెడ్డవారి మీదను మంచివారి మీదను తన
సూర్యుని ఉదయింప చేసి, నీతిమంతుల మీదను అనీ
తిమంతుల మీదను వర్షము కురిపిస్తున్నాడు. । అయితే 46
మీరు మిమ్ము ప్రేమించేవారినే ప్రేమించితే మీకు
ఫలమేమి? సుంకరులు ఆలాగు చేస్తున్నారు గదా. ।
మీ సహోదరులకు మాత్రమే మర్యాద చేసితే 47
మీరు విశేషముగా చేస్తున్నది ఏమిటి? సుంకరులు
ఆలాగు చేస్తున్నారు గదా. । కాబట్టి ఆకాశమందున్న 48
మీ తండ్రి పరిపూర్ణుడై యున్న ప్రకారము, మీరు
పరిపూర్ణులై యుండండి.

*లేక, పూర్వికులతో. †లేక, కంటుపరిచితే. *లేక, పూర్వికులతో.

## 6. అధ్యాయము.

1 మనుష్యులచేత చూడబడే కొరకు, వారి యెదుట
మీ నీతికృత్యము చేయకుండా జాగ్రత్తపడండి; లే
కుంటే ఆకాశమందున్న మీ తండ్రివల్ల మీరు ఫలము
పొందరు.

2 కాబట్టి నీవు ధర్మము చేసేటప్పుడు మనుష్యులవల్ల
కీర్తి పొందుటకు, సునగోగులలోను వీధులలోను వేష
ధారులు చేసేలాగున నీ ముందట బూర ఊదించ
వద్దు. వారు తమ పూర్ణ ఫలము పొంది యున్నారని
3 నిజముగా మీతో చెప్పుతున్నాను.। అయితే నీవు ధర్మ
ము చేసేటప్పుడు, నీ ధర్మము రహస్యమందు ఉండే
కొరకు, నీ కుడిచెయ్యి చేసేది నీ ఎడమ చేతికి తెలియ
4 నియ్య కూడదు.। అప్పుడు అంతరంగమందు చూచే నీ
తండ్రి తానే బహిరంగమందు నీకు ఫలమిచ్చును.

5 మరియు నీవు ప్రార్థించేటప్పుడు వేషధారులవలె ఉం
డవద్దు; మనుష్యులకు అగుపడే కొరకు సునగోగులలోను
వీధుల మూలలలోను నిలిచి ప్రార్థించుట వారికి ఇష్టమై
యున్నది. వారు తమ పూర్ణ ఫలము పొంది యు
6 న్నారని నిజముగా మీతో చెప్పుతున్నాను.। అయితే
నీవు ప్రార్థించేటప్పుడు నీ గదిలోకి వెళ్లి నీ తలుపు
వేసి అంతరంగమందున్న నీ తండ్రిని గూర్చి ప్రార్థిం
చుము; అప్పుడు అంతరంగమందు చూచే నీ తండ్రి
7 బహిరంగముగా నీకు ఫలమిచ్చును.। అయితే మీరు
ప్రార్థన చేసేటప్పుడు రాష్ట్రములవలె వ్యర్థమైన
మాటలు వచించవద్దు; వారు, విస్తరించి పలుకుటవల్ల
8 తమ మనవి వినబడునని తలుస్తున్నారు। గనుక మీరు
వారివలె వుండకండి. మీరు ఆయనను అడుగక
మునుపే, మీకు కావలసినవి యేవో అవి మీ తండ్రికి
9 తెలుసును.। కాబట్టి మీరు ఈలాగున ప్రార్థన చేయ
వలసినది — ఆకాశమందున్న మా తండ్రీ! నీ నామ
10 ము పరిశుద్ధపరచబడు గాక;। నీ రాజ్యము వచ్చుగాక;
ఆకాశమందు ఏలాగో ఆలాగే భూమి యందును నీ
11 చిత్తము నెరవేరు గాక;। మా జీవనోపాధియైన ఆహా
12 రము నేడు మాకు దయ చేయుము;। మా ఋణస్థులను
మేము క్షమించిన ప్రకారము, మా ఋణములు క్షమిం
13 చుము;। మమ్ము శోధనలోకి తేక కీడునుంచి మమ్ము
తప్పించుము, రాజ్యము బలము మహిమయు నిరంత
రము నీవై యున్నవి. ఆమేన్.

14 మనుష్యుల తప్పితములు మీరు క్షమించితే ఆకాశ
మందు ఉన్న మీ తండ్రి మీ తప్పితములు క్షమిం
15 చును.। అయితే మీరు మనుష్యుల తప్పితములు క్షమిం
చకపోతే, మీ తండ్రి మీ తప్పితములు క్షమించదు.

మరియు మీరు ఉపవాసము చేసేటప్పుడు, వేష 16
ధారులవలె దుఃఖముఖులై యుండకండి; వారు ఉపవా
సము చేస్తున్నారని మనుష్యులకు అగుపడే కొరకు, తమ
ముఖములను వికారము చేసుకొందురు. వారు తమ
పూర్ణ ఫలము పొందియున్నారని నిజముగా మీతో
చెప్పుతున్నాను.। అయితే నీవు ఉపవాసము చేసుట 17
అంతరంగమందు ఉన్న నీ తండ్రికే గాని మనుష్యులకు
అగుపడక ఉండే కొరకు, నీవు ఉపవాసము చేసేట
ప్పుడు, నీ తల అంటుకొని నీ ముఖము కడుగుకొ
నుము.। అప్పుడు అంతరంగమందు చూచే నీ తండ్రి 18
బహిరంగముగా నీకు ఫలమిచ్చును.

భూమి మీద మీ కొరకు ధనము కూర్చుకొన 19
వద్దు. ఇక్కడ చిమ్మెటయు తుప్పును దాని చెరుపును;
ఇక్కడ దొంగలు కన్నము వేసి దొంగతనము చేతు
రు.। అయితే ఆకాశమందు మీ కొరకు ధనము కూర్చు 20
కొనండి; అక్కడ చిమ్మెటయైనా తుప్పైనా దాని
చెరపదు; అక్కడ దొంగలు కన్నము వేసి దొంగత
నము చేయరు.। మీ ధనము ఎక్కడ ఉన్నదో అక్కడ 21
మీ హృదయమును ఉండును.। కన్ను శరీరమునకు 22
దీపమై యున్నది గనుక నీ కన్ను స్వస్థమైనదైతే నీ శరీ
రమంతయు వెలుగై యుండును.। నీ కన్ను చెడ్డదైతే నీ 23
శరీరమంతయు చీకటియై యుండును గనుక నీలో ఉ
న్న వెలుగు చీకటిగా ఉంటే చీకటి ఎంతో గొప్పది.

ఎవడును ఇద్దరు యజమానులను సేవించలేడు; అత 24
డు ఒకని ద్వేషించి మరియొకని ప్రేమించును; లేక
ఒకని అనుసరించి మరియొకని తిరస్కరించును. మీరు
దేవునిని సిరినిని సేవించలేరు.। కాబట్టి మీరు—ఏమి తిం 25
దుమో ఏమి తాగుదుమో అని మీ ప్రాణమును గురిం
చియైనా,—ఏమి ధరించుకొందుమో అని శరీరమును
గురించియైనా చింతించకండి. ఆహారముకంటే ప్రాణ
ము, వస్త్రముకంటే శరీరము గొప్పవికావా?। ఆకాశ 26
పక్షులను చూడండి. అవి విత్తవు, అవి కోయవు, అవి
కొట్లలో ఏమిన్ని కూర్చుకొనవు. అయినప్పటికిని ఆకా
శమందున్న మీ తండ్రి వాటిని పోషిస్తున్నాడు; మీరు
వాటికంటే బహు శ్రేష్ఠులు కారా?। మీలో ఎవడు 27
చింతించి తన ఆయుస్సు ఒక మూరెడు ఎక్కువ చేసు
కొన గలడు?। మరియు వస్త్రమును గురించి మీరు చిం 28
తించుట ఎందుకు? అడవి పువ్వులు ఏలాగు ఎదుగుతు
న్నవో వాటిని ఆలోచించుకొనండి. అవి కష్టపడవు,
అవి ఒడకవు.। అయినప్పటికిని సొలొమోను కూడా 29
తనకు కలిగిన సమస్త వైభవముతో వీటిలో ఒక దాని
వలెనైనా అలంకరించబడ లేదని మీతో చెప్పుతు

30 న్నాను. । నేడు ఉండి రేపు పొయిలో వేయబడే
అడవి గడ్డికి దేవుడు ఈలాగు వస్త్రము వేసితే, ఓ
అల్ప విశ్వాసులారా! మరీ ఎక్కువగా మీకు వేసును
31 గదా. । కాబట్టి—ఏమి తిందుమో, ఏమి తాగుదుమో
ఏమి ధరించుకొందుమో అని చింతించకండి; రాష్ట్ర
32 ములు ఇవియన్నియు వెతుకుచుందును. । అయితే ఇవి
యన్నియు మీకు కావలెనని ఆకాశమందున్న మీ
33 తండ్రికి తెలుసును. । అయితే మీరు మొదట* దేవుని
రాజ్యమును ఆయన నీతిని వెతకండి; అప్పుడు ఇవి
34 గాక అవి యన్నియు మీకు ఇయ్యబడును. । కాబట్టి
రేపటికి చింతించకండి; రేపు తన వాటిని గురించి చిం
తించును. ఏనాటి కీడు ఆనాటికి చాలును.

## 7. అధ్యాయము.

1 మిమ్మును గూర్చి తీర్పు చేయబడక ఉండే కొరకు;
2 మీరు తీర్పు చేయకండి. । మీరు చేసే తీర్పు చొప్పున
మీకు తీర్పు చేయబడును. మరియు మీరు కొలిచే
3 కొలత చొప్పున మీకు కొలవబడును. । అయితే నీ కం
టిలో ఉన్న దూలము నిర్లక్ష్యపెట్టి, నీ సహోదరుని
4 కంటిలో ఉన్న నలుసు వైపు చూచుట ఎందుకు? । లేక
ఇదుగో నీ కంటిలో దూలము ఉండగా—నీ కంటిలో
ఉన్న నలుసు తీసివేయుటకు సెలవిమ్మని నీవు నీ సహో
5 దరునితో చెప్పనేల? । ఓ వేషధారీ! మొదట నీ కంటిలో
నుంచి దూలము తీసివేసుకొనుము; అప్పుడు నీ సహో
దరుని కంటిలో నలుసు తీసివేయుటకు బాగా చూడ
6 వచ్చును. । కుక్కలకు పవిత్రమైనది ఇయ్యకండి. మీ
ముత్యములను పందుల ఎదుట వేయకండి. ఆలాగైతే
అవి ఒకవేళ వాటిని తమ కాళ్లతో త్రొక్కి, తిరిగి
మిమ్మును చీల్చివేసును.

7 అడుగండి, మీకు ఇయ్యబడును; వెతుకండి మీకు
8 దొరుకును; । కొట్టండి మీకు తీయబడును, ఎందుకంటే
అడిగే ప్రతి వాడును పొందును; వెతికే వానికి దొరు
9 కును; కొట్టే వానికి తీయబడును. । మీలో యే మను
ష్యుడైనా తన కుమారుడు తన్ను రొట్టె అడిగితే అత
10 నికి రాయి ఇచ్చునా. । లేక చేప అడిగితే అతనికి
11 పాము ఇచ్చునా. । కాబట్టి చెడ్డవారైన మీరు మీ పిల్ల
లకు మంచి ఈవులు ఇచ్చుటకు సమ్మతించితే, ఆకాశ
మందు ఉన్న మీ తండ్రి తన్ను అడిగే వారికి అంత
కంటే ఎంతో ఎక్కువగా మంచి వాటిని ఇచ్చును.

12 కాబట్టి మనుష్యులు మీకు వేటిని చేయ వలెనని
కోరుదురో, వాటినన్నిటిని మీరు వారికి ఆలాగున
చేయండి; ఇది బోధనా ప్రమాణము ప్రవక్తల వచన
మునై యున్నది.

ఇరుకు ద్వారమున ప్రవేశించండి; నాశమునకు 13
పోయే ద్వారము వెడల్పును ఆ దారి విశాలమునై
యున్నది. అందులో ప్రవేశించే వారు అనేకులు
ఉన్నారు. । అయితే జీవమునకు పోయే ద్వారము ఇరు 14
కును, ఆ దారి సంకటమునైయున్నది; దాని కనుగొనే
వారు కొందరు ఉన్నారు.

అబద్ధ ప్రవక్తలను గురించి జాగ్రత్తపడండి. వారు 15
గొర్రెల వస్త్రములు వేసుకొని మీ యొద్దికి వస్తున్నారు
గాని, లోపల వారు క్రూరమైన తోడేళ్లయి యున్నా
రు. । వారి ఫలములవల్ల వారిని తెలుసుకొందురు. ముం 16
డ్ల పొదలో ద్రాక్ష పండ్లనైనా, పల్లేరు చెట్టున అం
జూరపు పండ్లనైనా కోయుదురా? । ఈలాగున ప్రతి 17
మంచి చెట్టున మంచి పండ్లు పండును, కాని చెట్టున
కాని పండ్లు పండును. । మంచి చెట్టున కాని పండ్లు 18
పండ నేరవు; కాని చెట్టున మంచి పండ్లు పండ నేర
వు. । మంచి పండు పండని ప్రతి చెట్టు నరకబడి అగ్ని 19
లో వేయబడును. । కాబట్టి మీరు వారి పండ్లవల్ల 20
వారిని తెలుసుకొన గలరు.

—ప్రభువా, ప్రభువా! అని నాతో చెప్పే ప్రతి 21
వాడును కాదు, అయితే ఆకాశమందున్న నా తండ్రి
ఇష్టప్రకారము చేసేవాడు ఆకాశ రాజ్యములో ప్రవే
శించును. । ఆ దినమందు అనేకులు,—ప్రభువా, ప్రభు 22
వా! మేము నీ నామమున ప్రవచించ లేదా? నీ నామ
మున దయ్యములను వెళ్లగొట్టలేదా? నీ నామమున అ
నేకమైన అద్భుతకార్యములు చేయలేదా? అని నాతో
చెప్పుదురు. । అప్పుడు నేను, మిమ్ము ఎన్నడును ఎరుగ 23
నైతిని; అక్రమము చేసేవారలారా! నా యెదుటనుంచి
పొండని వారితో చెప్పుదును.

కాబట్టి ఎవడు ఈ నా మాటలు విని, వాటి చొ 24
ప్పున చేసునో, బండమీద తన ఇల్లు కట్టిన బుద్ధిగల
మనుష్యునితో వాని పోల్తును. । వాన కురిసెను, వర 25
దలు వచ్చెను, గాలి విసిరి ఆ ఇంటి మీద కొట్టెను;
దాని పునాది? బండమీద వేయబడెను గనుక పడలేదు. ।
మరియు ఎవడు ఈ నా మాటలు విని, వాటి చొప్పున 26
చేయడో, వాడు ఇసుక మీద తన ఇల్లు కట్టిన బుద్ధి
లేని మనుష్యునితో పోల్చబడును. । వాన కురిసెను, 27
వరదలు వచ్చెను, గాలి విసిరి ఆ ఇంటి మీద కొట్టెను;
అది కూలబడెను, దాని పాటు గొప్పదని పలికెను.

*లేక, ముఖ్యముగా.

28 యేసు ఈ మాటలు ముగించినప్పుడు, ప్రజలు ఆ
29 యన ఉపదేశమునకు ఆశ్చర్యపడిరి.। ఎందుకంటే ఆ
యన శాస్త్రుల వలె కాకుండా, అధికారము గలవాని
వలె వారికి ఉపదేశించుచుండెను.

## 8. అధ్యాయము.

1 ఆయన ఆ కొండనుంచి దిగినప్పుడు, అనేక ప్రజ
2 లు ఆయనను వెంబడించిరి.। అప్పుడు ఇదుగో! ఒక
కుష్ఠరోగి వచ్చి ఆయనకు నమస్కరించి,—ప్రభువా!
నీకు మనస్సు కలిగితే నన్ను శుద్ధపరచగలవనెను.।
3 అప్పుడు యేసు చెయ్యి చాపి, వాని ముట్టి — నాకు
మనస్సు కలదు, నీవు శుద్ధపరచబడుమని పలికెను. వెం
4 టనే వాని కుష్ఠరోగము శుద్ధపరచబడెను.। అప్పుడు
యేసు,—నీవు ఎవనితోను చెప్పక, జాగ్రత్తపడుము;
అయితే వెళ్లి నిన్ను నీవే యాజకునికి చూపించుకొని,
మోశే వారికి సాక్ష్యముగా నియమించిన కానుక సమ
ర్పించుమని వానితో చెప్పెను.

5 యేసు కపెర్నహూములో ప్రవేశించినప్పుడు,
6 ఒక శతాధిపతి ఆయన యొద్దికి వచ్చి,। ప్రభువా!
నా దాసుడు పక్షవాయువు కలిగి మిక్కిలీ బాధ
పడుతూ, ఇంట్లో పండుకొని యున్నాడని చెప్పి, ఆయ
7 నను వేడుకొనెను.। అందుకు యేసు—నేను వచ్చి వాని
8 స్వస్థపరుతునని అతనితో పలికెను.। అప్పుడు ఆ
శతాధిపతి,—ప్రభువా! నీవు నా ఇంట్లోకి వచ్చుటకు
నేను యోగ్యుడను కాను; అయితే నీ నోటి మాట
మాత్రమే రానిమ్ము; అప్పుడు నా దాసుడు స్వస్థత
9 పొందును;। నేను కూడా అధికారమునకు లోబడిన
మనుష్యుడనై యున్నాను; నా చేతి కింద రాణువవారు
ఉన్నారు; నేను ఒకని పొమ్మంటే పోవును; మరి యొ
కని రమ్మంటే వచ్చును; నా దాసుని దీని చేయుమంటే
10 చేసును అని ప్రత్యుత్తరమిచ్చెను.। యేసు విని, ఆశ్చ
ర్యపడి,— ఇశ్రాయేలందైనా నేను ఈపాటి విశ్వాస
ము చూడలేదని నిజముగా మీతో చెప్పుతున్నాను.।
11 మరియు, అనేకులు తూర్పునుంచి పడమటనుంచి
వచ్చి, ఆకాశ రాజ్యమందు, అబ్రాహాము, ఈసాకు,
యాకోబు అనే వారితో కూడా కూర్చుందురని నేను
12 మీతో చెప్పుతున్నాను.। అయితే ఆ రాజ్యపు పిల్ల
లు వెలపటి చీకటిలోకి తోయబడుదురు. అక్కడ
ఏడ్పు, పండ్లు కొరుకుటయు కలుగునని వెంబడించే
13 వారితో పలికెను.। అప్పుడు యేసు,— నీవు వెళ్లుము;
నీవు విశ్వసించిన ప్రకారము నీకు అవును గాకని
శతాధిపతితో చెప్పెను. ఆ గడియలోనే అతని దా
సుడు బాగుపడెను.

తర్వాత యేసు, పేతురు ఇంట్లో ప్రవేశించి, జ్వర 14
ముతో పండుకొని యున్న అతని అత్తను చూచి,। ఆమె 15
చెయ్యి ముట్టగానే, జ్వరము ఆమెను విడిచెను. అప్పు
డు ఆమె లేచి వారికి సేవచేసెను.

సాయంకాలమైనప్పుడు, దయ్యములు పట్టిన అనే 16
కులను ఆయన యొద్దికి తీసుకొని వచ్చిరి.—। ఆయన మన 17
బలహీనతలను తీసుకొని, మన రోగములను వహించె
నని ప్రవక్తయైన యెషయా మూలముగా చెప్పబడినది
నెరవేరేటట్టు, ఆయన తన మాటవల్ల ఆత్మలను వెళ్ల
గొట్టి, రోగులనందరిని స్వస్థపరిచెను.

యేసు తన చుట్టూ ఉన్న బహు సమూహములను 18
చూచి, అద్దరికి వెళ్లుటకు ఆజ్ఞాపించెను.। అప్పుడు 19
ఒక శాస్త్రి వచ్చి,—బోధకుడా! నీవు ఎక్కడికి వెళ్లు
తున్నప్పటికి, నిన్ను వెంబడింతునని ఆయనతో పలి
కెను.। అందుకు యేసు,—నక్కలకు బొరియలు, ఆకాశ 20
పక్షులకు గూళ్లును కలవు; అయితే మనుష్య కుమారు
నికి తల వాల్చుకొనుటకు స్థలము లేదని వానితో చె
ప్పెను.। అప్పుడు ఆయన శిష్యులలో మరియొకడు— 21
ప్రభువా! నేను ముందుగా వెళ్లి నా తండ్రిని పాతి
పెట్టుటకు నాకు సెలవిమ్మని ఆయనతో చెప్పినప్పుడు।
యేసు, నన్ను వెంబడించుము మృతులను తమ మృతు 22
లను పాతిపెట్టనిమ్మని వానితో పలికెను.

ఆయన దోనె ఎక్కినప్పుడు, ఆయన శిష్యులు 23
ఆయనను వెంబడించిరి.। అప్పుడు ఇదుగో! ఆ దోనె 24
తరంగములచేత కప్పబడేటట్టు సముద్రముమీద తుఫా
ను కలిగెను; అయితే ఆయన నిద్రిస్తూ ఉండెను.। ఆ 25
యన శిష్యులు ఆయన యొద్దికి వచ్చి, ఆయనను లేపి,—
ప్రభువా! నశించిపోతున్నాము; మమ్ము రక్షించుమని
చెప్పినప్పుడు। ఆయన,—ఓ అల్ప విశ్వాసులారా! ఎం 26
దుకు భయపడుతున్నారు! అని వారితో పలికి, లేచి
గాలిని సముద్రమును గద్దించెను. అప్పుడు మిక్కిలీ
నిమ్మళముగా ఉండెను.। ఆ మనుష్యులు ఆశ్చర్యపడి— 27
ఈయన ఏలాటివాడో! ఈయనకు గాలి సముద్రము
ను లోబడి ఉన్నవని పలికిరి.

ఆయన అవతల ఉన్న గెర్గెసేనీయుల* దేశము 28
నకు చేరినప్పుడు, దయ్యములు పట్టిన ఇద్దరు, సమాధు
లలోనుంచి బైలువెళ్లి ఆయనకు ఎదురుగా వచ్చిరి.
వారు మిక్కిలీ ఉగ్రులైనందున ఎవడును ఆ త్రోవను

* లేక, గదరేనీయుల.

29 వెళ్లలేక ఉండెను. । అప్పుడు ఇదుగో! వారు,—దేవుని
కుమారుడవైన యేసూ! నీతో మాకేమి? కాలము రాక
మునుపు మమ్ము బాధపరుచుటకు ఇక్కడికి వచ్చితి
30 వా? అని కేకలు వేసిరి. । వారికి దూరముగా, అనేక
31 మైన పందుల మంద మేస్తూ ఉండెను. । అప్పుడు ఆ
దయ్యములు,—నీవు మమ్ము వెళ్లగొట్టితే, పందుల మం
దలోకి వెళ్లుటకు మాకు సెలవిమ్మని ఆయనను వేడు
32 కొనెను. । ఆయన వాటిని పొమ్మంటే, అవి బైలువెళ్లి ఆ
పందుల మందలోకి పోయెను. అప్పుడు ఇదుగో! ఆ
పందుల మందంతయు ప్రపాతమునుంచి వడిగా సము
33 ద్రములోకి పరుగెత్తి నీళ్లలో నశించెను. । మేపేవారు
పారిపోయి, పట్టణములో ప్రవేశించి, దయ్యములు
పట్టినవారిని గురించినవి మొదలుకొని సమస్తమును
34 తెలిపిరి. । అప్పుడు ఇదుగో! ఆ పట్టణపు వారందరు
యేసును ఎదురుకొన వచ్చి ఆయనను చూచి, తమ
ప్రాంతములు విడిచి వెళ్ల వలెనని ఆయనను బతిమా
లుకొనిరి.

## 9. అధ్యాయము.

1 అప్పుడు ఆయన దోనె ఎక్కి అద్దరికి వెళ్లి తన
2 పట్టణమందు ప్రవేశించెను. । అప్పుడు ఇదుగో! పక్ష
వాయువు కలిగి మంచము మీద పండుకొని ఉన్న
ఒకని, ఆయన యొద్దికి తీసుకొని వచ్చిరి. యేసు వారి
విశ్వాసము చూచి,—కుమారుడా! ధైర్యము తెచ్చుకొ
నుము; నీ పాపములు క్షమించబడినవని పక్షవాయువు
3 గల వానితో చెప్పెను. । అప్పుడు ఇదుగో! శాస్త్రులలో
కొందరు—వీడు దేవదూషణ చేస్తున్నాడని తమలో
4 తామే తలంచుకొనిరి. । యేసు వారి తలంపులు చూచి,
—మీరు ఎందుకు మీ హృదయములలో చెడ్డవాటిని
5 తలచుకొంటున్నారు? ।—నీ పాపములు క్షమించబడిన
వని చెప్పుట సులభమా? లేక—నీవు లేచి నడువుమని
6 చెప్పుట సులభమా? । అయితే పాపములు క్షమించు
టకు భూమి మీద మనుష్య కుమారునికి అధికారము
కలదని మీరు తెలుసుకొనే కొరకు, అని పలికి,—
నీవు లేచి నీ మంచము ఎత్తుకొని, నీ ఇంటికి వెళ్లు
7 మని పక్షవాయువు గల వానితో చెప్పెను. । అతడు
8 లేచి తన ఇంటికి వెళ్లెను. । అయితే ప్రజలు దాని
చూచి ఆశ్చర్యపడి మనుష్యులకు ఈలాటి అధికార
ము ఇచ్చిన దేవుని మహిమపరిచిరి.

9 యేసు అక్కడనుంచి వెళ్లుతూ, సుంకపు మెట్టు
యొద్ద కూర్చున్న మత్తై అనే పేరు గల ఒక మను
ష్యుని చూచి,—నన్ను వెంబడించుమని అతనితో చె
10 ప్పెను. అతడు లేచి ఆయనను వెంబడించెను. । ఆయన
ఇంట్లో భోజనపంక్తియందు కూర్చుండి ఉన్నప్పుడు
జరిగినదేమంటే, ఇదుగో! అనేకులైన సుంకరులు, పా
పులు వచ్చి యేసుతోను ఆయన శిష్యులతోను పంక్తి
యందు కూర్చుండిరి. । ఫరిసైయులు దాని చూచి,— 11
మీ బోధకుడు సుంకరులతోను పాపులతోను ఎం
దుకు భోజనము చేస్తున్నాడని ఆయన శిష్యులతో
పలికిరి. । యేసు దాని విని,— రోగులకే గాని ఆరో 12
గ్యము గల వారికి వైద్యుడు అక్కర లేదు. । అయితే 13
—కనికరము నాకు ఇష్టము గాని యజ్ఞము కాదు అనే
దాని భావము ఏమిటి అని మీరు వెళ్లి నేర్చుకొనండి;
మనస్సు తిప్పుకొనుటకు పాపులను పిలువ వచ్చితిని
గాని నీతిమంతులను కాదు అని పలికెను.

అప్పుడు యోహాను శిష్యులు ఆయన యొద్దికి 14
వచ్చి,—మేము ఫరిసైయులును తరచుగా ఉపవాసము
చేస్తున్నాము; నీ శిష్యులు ఉపవాసము చేయరు; దీనికి
హేతువు యేమని అడిగిరి. । అందుకు యేసు,—పెండ్లి 15
కుమారుని వారు, పెండ్లి కుమారుడు తమతో కూడా
ఉండే కాలములో దుఃఖపడ గలరా? పెండ్లి కుమా
రుడు వారి యొద్దనుంచి కొంచుపోబడిన దినములు
వచ్చును; అప్పుడు వారు ఉపవాసము చేతురు. । ఎవ 16
డును పాత వస్త్రమునకు కొత్త గుడ్డ మాసిక వేయడు;
వేయబడిన మాసిక ఆ వస్త్రము వెల్తిపరుచును, చిరుగు
మరీ చెడును. । మరియు ఎవడును పాత సిద్దెలలో 17
కొత్త మద్యము పోయడు. పోసితే ఆ సిద్దెలు పగిలి,
మద్యము కారును, సిద్దెలు చెడును. అయితే కొత్త
మద్యము కొత్త సిద్దెలలో పోయ వలెను; అప్పుడు
ఆ రెండును భద్రముగా ఉండునని పలికెను.

ఆయన వీటిని వారితో పలుకుతూ ఉన్నప్పుడు, 18
ఇదుగో! ఒక అధికారి వచ్చి ఆయనకు నమస్కరించి,—
నా కుమార్తె ఇందాక చనిపోయెను; అయితే నీవు
వచ్చి నీ చెయ్యి ఆమె మీద ఉంచితే ఆమె బ్రతు
కునని వేడుకొనెను. । యేసు లేచి తన శిష్యులతో 19
కూడా అతని వెంబడించెను. । అప్పుడు ఇదుగో పన్నెం 20
డు సంవత్సరములనుంచి రక్తకుసుమ రోగము గల ఒక
స్త్రీ, ।—నేను ఆయన వస్త్రము మాత్రమే ముట్టితే నాకు 21
స్వస్థత కలుగునని అనుకొని ఆయన వెనుకకు వచ్చి
ఆయన వస్త్రపు చెంగు ముట్టెను. । అయితే యేసు తిరిగి, 22
ఆమెను చూచి,— కుమారీ! ధైర్యము తెచ్చుకొనుము;
నీ విశ్వాసము నిన్ను స్వస్థపరిచెనని పలికెను. ఆ గడి
యనుంచి ఆ స్త్రీ స్వస్థత పొందెను.

23 అప్పుడు యేసు ఆ అధికారి ఇంటికి వచ్చి వీణ
వాయించే వారిని, జనులు అంగలార్చుటను చూచి,।
24 ఆవలికి పొండి; ఈ చిన్నది నిద్రపోతున్నదే గాని చని
పోలేదని వారితో చెప్పెను. వారు ఆయనను అపహ
25 సించిరి.। అయితే ఆ జనులు వెలపట ఉంచబడినప్పు
డు, ఆయన లోపటికి వెళ్లి ఆమె చెయ్యి పట్టగానే,
26 ఆ చిన్నది లేచెను.। ఈ సమాచారము ఆ దేశమందం
తటా వ్యాపించెను.

27 యేసు అక్కడనుంచి వెళ్లుతూ ఉండగా ఇద్దరు
గుడ్డివారు ఆయనను వెంబడించి—దావీదు కుమారుడా!
28 మమ్ము కరుణించుమని కంఠమెత్తి పలికిరి.। ఆయన
ఇంట్లో ప్రవేశించిన తర్వాత, ఆ గుడ్డివారు ఆయన
యొద్దికి వచ్చిరి. అప్పుడు యేసు,—దీని నేను చేయ
గలనని మీరు నమ్ముతున్నారా? అని వారిని అడిగెను.।
29 అందుకు వారు—అవును ప్రభువా! అని ఆయనతో
చెప్పిరి. అప్పుడు ఆయన వారి కన్నులు ముట్టి,—మీ
నమ్మికె చొప్పున మీకు కలుగును గాక అని పలికెను.।
30 అప్పుడు వారి కన్నులు తెరవబడెను. అంతట యేసు,—
ఇది ఎవనికిని తెలియకుండా జాగ్రత్తపడండని వా
31 రికి గట్టిగా ఆజ్ఞాపించెను.। అయితే వారు బయిలువెళ్లి
ఆ దేశమంతటా ఆయన కీర్తి ప్రచురము చేసిరి.

32 వారు బయిలువెళ్లుతూ ఉండగా ఇదుగో! దయ్య
ము పట్టిన ఒక మూగవాని ఆయన యొద్దికి తీసుకొని
33 వచ్చిరి.। దయ్యము వెళ్లగొట్టబడిన తర్వాత, ఆ మూగ
వాడు మాట్లాడెను. అప్పుడు ప్రజలు ఆశ్చర్యపడి,
—ఇశ్రాయేలులో ఈలాగు ఎన్నడును కనబడలేదని పలి
34 కిరి.। అయితే ఫరిసైయులు,—వీడు దయ్యముల అధిపతి
ద్వారా దయ్యములను వెళ్లగొట్టుతున్నాడని పలికిరి.

35 యేసు వారి సునగోగులలో ఉపదేశిస్తూ, రాజ్యపు
సువార్త ప్రకటిస్తూ, జనులలో ప్రతి రోగమును
ప్రతి వ్యాధిని స్వస్థపరుస్తూ సమస్త పట్టణములయం
36 దును గ్రామములయందును సంచరించెను.। అయితే ఆ
యన సమూహములను చూచి, వారు విసికి కాపరిలేని
గొర్రెలవలె చెదిరి ఉన్నందున, వారి మీద కనికరప
37 డెను.। అప్పుడు ఆయన,—కోత విస్తారమేగాని పని
38 వారు కొద్దిగా ఉన్నారు,। గనుక కోత యజమానుని,
తన కోతకు పనివారిని పంపుటకు వేడుకొనండని తన
శిష్యులతో చెప్పెను.

## 10, అధ్యాయము.

1 ఆయన తన పన్నెండుమంది శిష్యులను పిలిచి, అప
విత్రమైన ఆత్మలను వెళ్లగొట్టుటకు, ప్రతి రోగము ప్రతి
వ్యాధిని స్వస్థపరుచుటకును వాటి మీద వారికి అధి
కారము ఇచ్చెను.। ఆ పన్నెండుమంది అపొస్తలుల 2
పేళ్లు ఇవి, మొదటివాడై పేతురు అనబడిన సీమోను,
అతని సహోదరుడైన అంద్రెయ, జెబెదై కుమారు
డైన యాకోబు, అతని సహోదరుడైన యోహాను,।
ఫిలిప్పు, బర్తొలొమై, థోమా, సుంకరియైన మత్తయి, 3
అల్ఫైకుమారుడైన యాకోబు, తద్దై అనే మారు పేరు
గల లెబ్బై,। కానానీయుడైన సీమోను, ఆయనను అ 4
ప్పగించిన ఇస్కరియోతనే యూదా అనేవే.। యేసు 5
ఆ పన్నెండుమందిని చూచి—మీరు అన్యజనుల దారి
లోకి వెళ్లకండి; సమరైయుల ఏ పట్టణమందైనా ప్రవే
శించకండి.। ఇశ్రాయేలు ఇంటియొక్క నశించిన గొర్రె 6
లయొద్దికి వెళ్లండి.। మీరు వెళ్లుతూ,—ఆకాశ రాజ్యము 7
సమీపించెనని ప్రకటించండి.। బలహీనులను స్వస్థప 8
రచండి; కుష్ఠరోగులను శుద్ధపరచండి; చనిపోయిన
వారిని లేపండి; దయ్యములను వెళ్లగొట్టండి. ఉచిత
ముగా పొందితిరి; ఉచితముగా ఇవ్వండి.। మీ సంచు 9
లలో బంగారమునైనా, వెండినైనా, రాగినైనా, ప్ర
యాణము కొరకు అసిమినైనా, రెండు అంగీలనైనా,
చెప్పులనైనా, కర్రనైనా, సిద్ధపరుచుకొనకండి;। పని 10
వాడు తన ఆహారమునకు పాత్రుడై యున్నాడు.।
మరియు ఏ పట్టణములోనైనా గ్రామములోనైనా 11
ప్రవేశించేటప్పుడు, అందులో ఎవడు యోగ్యుడో ఆ
విచారణ చేసి మీరు బయిలువెళ్లే వరకు అక్కడనే
ఉండండి.। ఇంటిలో ప్రవేశించి దాని దీవించండి.। 12
ఆ ఇల్లు యోగ్యమైనదైతే మీ క్షేమము దాని మీదికి 13
రానివ్వండి, అయితే అది అయోగ్యమయినదైతే మీ
క్షేమము మీకు తిరిగి రానివ్వండి.। ఎవడైనా మిమ్ము 14
చేర్చుకొనక, మీ మాటలు వినక ఉంటే, మీరు ఆ
ఇల్లైనా ఆ పట్టణమైనా విడిచి వెళ్లేటప్పుడు, మీ కాలి
ధూళి దులిపివేయండి.। న్యాయపు తీర్పు దినమందు 15
ఆ పట్టణముకంటే సొదొమ గొమొర్రాల గతి ఓర్వ
తగినదై ఉండునని నిజముగా మీతో చెప్పుతున్నాను.
ఇదుగో! నేను తోడేళ్ల నడుమకు గొర్రెలవలె 16
మిమ్ము పంపుతున్నాను గనుక పాములవలె వివేకులు,
గువ్వలవలె సాధువులునై ఉండండి.। అయితే మనుష్యు 17
లనుంచి జాగ్రత్తపడండి; వారు మిమ్మును సభలకు అ
ప్పగించి, తమ సునగోగులలో మిమ్మును వారులతో
కొట్టింతురు.। వీరికి, రాష్ట్రములకును సాక్ష్యముకొరకు, 18
నా నిమిత్తము అధిపతుల యొద్దికి రాజుల యొద్దికిని
తేబడుదురు.। అయితే వారు మిమ్మును అప్పగించేట 19
ప్పుడు, ఏలాగు ఏమి పలుకుదుమని చింతించకండి.
మీరు ఏమి పలుక వలెనో, అది ఆ గడియలోనే

20 మీకు ఇవ్వబడును.। పలికేవారు మీరు కారు; అయితే
మీ తండ్రియొక్క ఆత్మ మీలో పలుకుతున్నది.।
21 అప్పుడు సహోదరుడు సహోదరునిని, తండ్రి కుమా
రునిని, మరణమునకు అప్పగింతురు. పిల్లలు తల్లిదండ్రు
లకు విరోధముగా లేచి వారిని మరణము పొందింతు
22 రు.। మీరు నా నామము నిమిత్తము అందరిచేత ద్వేషిం
చబడుదురు. అంతము వరకూ సహించే వాడెవడో,
23 వాడే రక్షించబడును.। వారు ఈ పట్టణములో మిమ్ము
తరిమేటప్పుడు మరియొక దానికి పారిపొండి. మనుష్య
కుమారుడు రాక మునుపు మీరు ఇశ్రాయేలు పట్టణ
ములయందు సంచరించి ఉండరని నిజముగా మీతో
24 చెప్పుతున్నాను,। శిష్యుడు బోధకుని కంటే అధికుడు
కాడు. దాసుడు యజమానుని కంటే అధికుడు కాడు.।
25 శిష్యుడు తన బోధకుని వలెను దాసుడు తన యజమా
నుని వలెను ఉంటే చాలును. వారు ఇంటి యజమా
నునికి బయెల్జెబూలని పేరు పెట్టితే ఆయన ఇంటివా
26 రికి మరీ యెక్కువగా ఆ పేరు పెట్టుదురుగదా.। కాబ
ట్టి మీరు వారికి భయపడకండి; బయలుపరచబడని
27 మరుగైనది యేదియు లేదు.। తెలియబడని రహస్యమై
నది యేదియు లేదు. నేను మీతో చీకటిలో చెప్పేది
వెలుగులో పలుకండి; మీరు చెవిలో వినేది మేడల
మీద ప్రకటించండి.

28 మరియు ప్రాణము చంప నేరక, శరీరమే చంపే
వారికి భయపడకండి; ప్రాణమును శరీరమును గెహె
న్నలో నాశము చేయగల వానికి ముఖ్యముగా భయ
29 పడండి.। రెండు పిచ్చుకలు ఏగానికి అమ్మబడును గదా,
అయినప్పటికి మీ తండ్రి సెలవు లేక వాటిలో ఒకటి
30 యు నేల పడదు.। అయితే మీ తల వెంట్రుకలన్నియు
31 లెక్కించబడి ఉన్నవి,। గనుక భయపడకండి; మీరు
అనేకమైన పిచ్చుకలకంటే శ్రేష్ఠులై ఉన్నారు.

32 కాబట్టి మనుష్యుల యెదుట నన్ను గూర్చి ఒప్పు
కొనే వాడెవడో వాని గూర్చి నేనును ఆకాశమం
33 దున్న నా తండ్రి యెదుట ఒప్పుకొందును.। అయితే
మనుష్యుల యెదుట నన్ను ఎవడు నిషేధించునో నేను
ఆకాశమందున్న నా తండ్రి యెదుట వాని నిషే
ధింతును.

34 నేను భూమి మీదికి సమాధానము పంపుటకు
వచ్చితినని తలంచకండి. నేను ఖడ్గమే గాని సమాధా
35 నము పంపుటకు రాలేదు.। మనుష్యునికి అతని తండ్రి
కిని, కుమార్తెకు ఆమె తల్లికిని, కోడలికి ఆమె అత్తకును
36 విరోధము పుట్టించుటకు వచ్చితిని.। ఈలాగు మను
37 ష్యుని ఇంటివారు అతని శత్రువులై ఉందురు.। తండ్రి
నైనా తల్లినైనా నాకంటే ఎక్కువగా ప్రేమించే
వాడు నాకు పాత్రుడు కాడు. కుమారునినైనా కుమా
ర్తెనైనా నాకంటే ఎక్కువగా ప్రేమించే వాడు
నాకు పాత్రుడు కాడు.। తన శిలువ ఎత్తుకొని నన్ను 38
వెంబడించని వాడు నాకు పాత్రుడు కాడు.। తన 39
ప్రాణము దక్కించుకొనే వాడు దాని పోగొట్టుకొ
నును. నా కొరకు తన ప్రాణము పోగొట్టుకొనే
వాడు దాని దక్కించుకొనును.

మిమ్ము చేర్చుకొనే వాడు నన్ను చేర్చుకొంటు 40
న్నాడు. నన్ను చేర్చుకొనే వాడు నన్ను పంపినవాని
చేర్చుకొంటున్నాడు.। ప్రవక్త అనుకొని ప్రవక్తను చే 41
ర్చుకొనే వాడు ప్రవక్త ఫలము పొందును. నీతిమం
తుడనుకొని నీతిమంతుని చేర్చుకొనే వాడు నీతిమం
తుని ఫలము పొందును.। మరియు ఎవడైనా ఈ చిన్న 42
వారిలో ఒకనికి; శిష్యుడనుకొని గిన్నెడు చల్లని నీళ్లు
మాత్రమే తాగనిస్తే, అతడు తన ఫలము పోగొట్టుకొ
నడని నిజముగా మీతో చెప్పుతున్నానని వారికి ఆజ్ఞా
పించి పంపెను.

## 11. అధ్యాయము.

యేసు తన పన్నెండుమంది శిష్యులకు ఆజ్ఞాపించుట 1
చాలించిన తర్వాత జరిగినదేమంటే, ఆయన వారి పట్ట
ణములలో బోధించుటకు ప్రకటించుటకును అక్కడ
నుంచి వెళ్లెను.। యోహాను క్రీస్తుయొక్క కార్యము 2
లను చెరసాలలో విని—రాబోయే వాడవు నీవేనా,
లేక మరియొకని కొరకు కనిపెట్టవలెనా అని। ఆయ 3
నతో పలుకుటకు తన శిష్యులలో ఇద్దరిని ఆయన
యొద్దికి పంపెను.। అప్పుడు, యేసు,—మీరు తిరిగీ 4
వెళ్లి మీరు విన్నవాటిని చూచినవాటిని యోహానుకు
తెలుపండి.। గుడ్డివారు దృష్టి పొందుతున్నారు, కుం 5
టివారు నడుస్తున్నారు, కుష్ఠరోగులు శుద్ధపరచబడు
తున్నారు, చెవిటివారు వింటున్నారు, చనిపోయిన
వారు లేపబడుతున్నారు, బీదలకు సువార్త ప్రకటిం
చబడుతున్నది.। మరియు నా విషయమై ఆటంకపడని 6
వాడు ధన్యుడని వారికి ప్రత్యుత్తరమిచ్చెను.

వారు వెళ్లుతు ఉండగా, యేసు యోహానును గురించి 7
జనసమూహములతో ఈలాగు చెప్పనారంభించెను,—
మీరు ఏమి చూచుటకు అరణ్యములోకి బైలువెళ్లితిరి?
గాలిచేత కదిలించబడిన రెల్లునా? లేక ఏమి చూచు
టకు బైలువెళ్లితిరి?। సన్నపు బట్టలు ధరించుకొన్న మ 8
నుష్యునా? ఇదుగో సన్నపు బట్టలు ధరించుకొనేవారు
రాజుల ఇండ్లలో ఉన్నారు.। అయితే ఏమి చూచు 9
టకు బయిలువెళ్లితిరి? ప్రవక్తనా? అవును గాని ప్రవక్త
కంటే గొప్పవాడని మీతో చెప్పుతున్నాను.।—ఇదు 10

గో! నేను నా దూతను నీకు ముందుగా పంపుతు
న్నాను; ఆయన నీ యెదుట నీ మార్గమును సిద్ధప
రుచునని ఎవనిగురించి వ్రాయబడెనో ఆయన ఈ
11 యనే. । మరియు స్త్రీలు కన్న వారిలో, స్నానికుడనే
యోహాను కంటే గొప్పవాడు పుట్టలేదని నిజముగా
మీతో చెప్పుతున్నాను. అయినప్పటికి ఆకాశరాజ్య
ములో మిక్కిలీ అల్పమైన వాడు అతనికంటే గొప్ప
12 వాడు. । అయితే స్నానికుడనే యోహాను దినములు
మొదలుకొని ఇదివరకు, ఆకాశరాజ్యమునకు బలాత్కా
రము కలుగుతున్నది; బలాత్కారులు దాని పట్టుకొంటు
13 న్నారు. । యోహాను పర్యంతము బోధనా ప్రమాణము
సకల ప్రవక్తలును ప్రవచనములు చెప్పుతూ ఉండిరి.।
14 గ్రహించుటకు మీకు మనస్సు కలిగితే రాబోయే
15 ఎలీయా ఇతడే. । వినుటకు చెవులు గలవాడు వినును
16 గాక. । అయితే ఈ వంశమును* దేనితో పోల్చ
17 దును? సంత వీధిలో కూర్చుండి, ।—మీకు పిల్లన గ్రో
వి ఊదినాము గాని మీరు నాట్యమాడలేదు; మీకు
మొరబెట్టినాము గాని మీరు ఏడవ లేదని తమ చెలి
కాండ్లతో చెప్పి పిలుపులాటలాడే ఆ చిన్నవారిని
18 పోలి ఉన్నది. । ఏలాగంటే యోహాను వచ్చి భోజనమై
నా పానమైనా చేసేవాడు కాడు గనుక—వీడు దయ్య
19 ము పట్టినవాడని చెప్పుకొనిరి. । మనుష్య కుమారుడు
భోజనము పానమును చేస్తూ వచ్చెను గనుక – ఇదుగో
వీడు తిండిపోతు, మద్యపాని, సుంకరులకును పాపు
లకును స్నేహితుడునైన మనుష్యుడని పలుకుతున్నా
రు. అయినప్పటికి, జ్ఞానము జ్ఞానమని దాని పిల్లలచేత†
తీర్పు పొందెనని పలికెను.
20 అప్పుడు ఏ పట్టణములలో ఆయన చేత అద్భుత
కార్యములు విస్తారముగా చేయబడెనో అవి మనస్సు
తిప్పుకొనక పోవుటవల్ల వాటిని గద్దించుటకు అరంభిం
21 చెను. । అయ్యో! కొరాజీనా! అయ్యో! బేత్సయిదా!
మీ మధ్యను చేయబడిన గొప్ప కార్యములు తూరు,
సీదోనులలో చేయబడి ఉంటే, అవి పూర్వము గోనె
పట్టె వేసుకొని బూడిదెలో మనస్సు తిప్పుకొని ఉం
22 డును. । అయితే న్యాయపు తీర్పు దినమందు మీకం
టే తూరుకు సీదోనుకు గతి ఓర్వతగినదై ఉండునని
23 మీతో చెప్పుతున్నాను. । ఆకాశము మట్టుకు హె
చ్చించబడిన ఓ కపెర్నహూమా! నీవు పాతాళము
మట్టుకు అణపబడుదువు; నీలో జరిగిన గొప్ప కార్య
ములు సొదొమలో జరిగి ఉంటే అది నేటి వరకు
24 నిలిచి ఉండును. । అయితే న్యాయపు తీర్పు దినమం
దు నీకంటే సొదొమ దేశమునకు గతి ఓర్వతగినదై
ఉండునని మీతో చెప్పుతున్నానని పలికెను.
ఆ సమయమున యేసు చెప్పిన ప్రత్యుత్తరము,— 25
ఆకాశమునకు భూమికి ప్రభువై యున్న తండ్రీ! నీవు
జ్ఞానులకు ప్రాజ్ఞులకును వీటిని మరుగుచేసి బాలురకు
బయిలుపరిచినావని నీతో ఒప్పుకొంటున్నాను.। అవు 26
ను తండ్రీ! ఈలాగు నీ దృష్టికి ఇష్టమై ఉండెను.।
సమస్తమును నా తండ్రిచేత నాకు అప్పగించబడి ఉ 27
న్నది. తండ్రి గాక ఎవడును కుమారుని ఎరుగడు;
కుమారుడుగాకను, కుమారుడు ఎవనికి ఆయనను బయి
లుపరుచుటకు ఇచ్ఛయించునో వాడుగాకను తం
డ్రిని మరి ఎవ్వడున్ను ఎరుగడు.। ప్రయాసపడి భారము 28
మోసుకొని ఉన్న సమస్తమైనవారలారా! నా యొద్దికి
రండి నేను మీకు విశ్రాంతి కలుగచేతును. । నేను 29
సాత్వికుడను, దీనమనస్సుగలవాడనునై ఉన్నాను గనుక
మీ మీద నా కాడి ఎత్తుకొని నావల్ల నేర్చుకొనండి.
అప్పుడు మీ ప్రాణములలో మీకు విశ్రాంతి కలు
గును; । నా కాడి సులువుగాను, నా భారము తేలిక 30
గాను ఉన్నవని పలికెను.

## 12. అధ్యాయము.

ఆ కాలమందు యేసు సబ్బాతు దినమందు, చేల 1
ద్వారా వెళ్లుతూ ఉన్నప్పుడు, ఆయన శిష్యులు ఆకలి
గొని వెన్నులు తుంచి, తినుటకు మొదలుబెట్టిరి. । అయి 2
తే ఫరిసైయులు చూచి, — ఇదుగో! సబ్బాతు యందు
చేయ కూడనిది నీ శిష్యులు చేస్తున్నారని ఆయనతో
చెప్పిరి. । అందుకు ఆయన, — దావీదుకు అతనితో 3
కూడా ఉన్న వారికిని ఆకలి పుట్టినప్పుడు, అతడు
చేసినది మీరు చదువలేదా?। అతడు గుడిలో ప్రవే 4
శించి సమ్ముఖపు రొట్టెలు తినెను. వాటిని యాజకులే
గాని అతడైనా అతనితో కూడా ఉన్నవారైనా తిన
కూడదు. । మరియు యాజకులు సబ్బాతు దినముల 5
యందు గుడిలో సబ్బాతును మీరి నిరపరాధులై
ఉన్నారని మీరు బోధనాప్రమాణమందు చదువలేదా?।
అయితే గుడికంటే గొప్పవాడు ఇక్కడ ఉన్నాడని‡ 6
మీతో చెప్పుతున్నాను. । మరియు,— యజ్ఞముకాదు, 7
కనికరమే కోరుతున్నాననే దాని భావము మీకు తె
లిసియుంటే, నిరపరాధుల మీద నేరము మోపరు; ।
మనుష్య కుమారుడు సబ్బాతుకును ప్రభువై ఉన్నా 8
డని వారితో చెప్పెను.
ఆయన అక్కడనుంచి వెళ్లి, వారి సునగోగులో 9
ప్రవేశించగా, ఇదుగో ఎండిన చెయ్యి గల ఒక మను

*లేక, తరమును. †లేక, ద్వారా. ‡లేక, గొప్పది ఇక్కడ ఉన్నదని.

10 ష్యుడు ఉండెను. । అప్పుడు వారు ఆయన మీద నేర
ము మోపుటకు,—సబ్బాతు దినములయందు స్వస్థపరు
11 చుట న్యాయమా అని ఆయనను అడిగిరి. । అందుకు
ఆయన,—మీలో ఏ మనుష్యునికైనా ఒక గొఱ్ఱెక
లిగి, అది సబ్బాతుయందు గుంటలో పడితే, దాని
12 పట్టుకొని పైకి తియ్యడా?। గొఱ్ఱెకంటే మనుష్యుడు
ఎంతో శ్రేష్ఠుడు! కాబట్టి సబ్బాతు దినములయందు
13 మేలు చేసుట న్యాయమే అని వారితో చెప్పి।—నీ
చెయ్యి చాపుమని ఆ మనుష్యునితో పలికెను. అతడు
దాని చాపెను. అప్పుడు రెండోదాని వలె అది ఆరో
14 గ్యముగా కుదుర్చబడెను. । అయితే ఫరిసైయులు బైలు
వెళ్లి ఆయనను ఏలాగు సంహరించ వచ్చునని ఆయనకు
15 విరోధముగా ఆలోచన చేసిరి. । అయితే యేసు అది
తెలిసి, అక్కడనుంచి తర్లిపోయెను. అప్పుడు బహు
16 జనులు ఆయనను వెంబడించిరి. । ఆయన వారినందరిని
స్వస్థపరిచి,—ఇదుగో! నేను ఏర్పరుచుకొన్న నా సేవ
17 కుడు! । నా ప్రాణమునకు* ఇష్టుడైన నా ప్రియుడు!
18 నేను ఆయనయందు నా ఆత్మను ఉంతును. । ఆయన
19 రాష్ట్రములకు న్యాయవిధి ప్రచురము చేసును. । ఆయన
జగడమాడడు, కేకలు వేయడు, వీధులలో ఎవడును
20 ఆయన శబ్దము వినడు. । న్యాయవిధికి జయము కలుగ
చేసే పర్యంతము, ఆయన నలిగిన రెల్లు విరువక, పొగ
21 రాజే జనపనార పీచు ఆర్పక ఉండును. । రాష్ట్రములు
ఆయన నామమందు విశ్వాసముంచునని ప్రవక్తయైన
ఎషయా ద్వారా పలికించబడినది నెరవేరేటట్టు తన్ను
ప్రసిద్ధి చేయ వద్దని వారికి ఆజ్ఞాపించెను.

22 అప్పుడు దయ్యము పట్టి గుడ్డివాడును మూగవా
డునైన ఒకడు ఆయన యొద్దికి తేబడెను. ఆయన
గుడ్డితనముగల ఆ మూగవాడు పలుకుతు చూస్తు ఉండే
23 టట్టు వాని బాగుచేసెను. । అందుకు ప్రజలందరు ఆ
శ్చర్యపడి,—ఈయన దావీదు కుమారుడు కాడా? అని
24 పలుకుతు ఉండిరి. । అయితే ఫరిసైయులు విని,—వీడు
దయ్యముల యజమానుడైన బయెల్జెబూబు వల్లనేగాక
25 దయ్యములను వెళ్లగొట్టడనిరి. । యేసు వారి తలంపులు
ఎరిగి, వారితో చెప్పినదేమంటే,—తనకు తానే విరో
ధముగా వేరుపడిన ప్రతి రాజ్యము పాడవును; తనకు
తానే విరోధముగా వేరుపడిన ఏ పట్టణమైనా ఏ
26 ఇల్లైనా నిలువదు. । సైతాను సైతానును వెళ్లగొట్టితే
తనకు తానే విరోధముగా వేరుపడును గనుక దాని
27 రాజ్యము ఏలాగు నిలుచును?। మరియు నేను బయెల్జె
బూబువల్ల దయ్యములను వెళ్లగొట్టితే మీ కుమారులు
ఎవనివల్ల వాటిని వెళ్లగొట్టుతున్నారు? కాబట్టి వారు
మీ న్యాయకర్తలై ఉందురు. । అయితే నేను దేవుని 28
ఆత్మచేత దయ్యములను వెళ్లగొట్టితే నిశ్చయముగా దే
వుని రాజ్యము మీ యొద్ద చేరి ఉన్నది. । లేక ఒకడు 29
మొదట బలవంతుని బంధించకుంటే, ఏలాగు బలవం
తుని ఇంట్లో ప్రవేశించి అతని సొమ్ము దోచుకొన
గలడు? బంధించితే అతని ఇల్లు దోచుకొనవచ్చును. ।
నా పక్షముగా ఉండని వాడు నాకు విరోధియై ఉ 30
న్నాడు. నాతో కూర్చని వాడు చెదరగొట్టుతున్నా
డు. । కాబట్టి నేను మీతో చెప్పేదేమంటే, ప్రతిపా 31
పము, దూషణయు మనుష్యులకు క్షమించబడును
గాని పరిశుద్ధాత్మను గురించిన దూషణ మనుష్యు
లకు క్షమించబడదు. । మనుష్య కుమారునికి విరోధము 32
గా మాట్లాడే వానికి క్షమించబడును; అయితే పరిశు
ద్ధాత్మకు విరోధముగా మాట్లాడే వానికి ఈ యుగమం
దైనా రాబోయే యుగమందైనా క్షమించబడదు. ।
చెట్టు మంచిదిగాను, దాని పండును మంచిదిగాను 33
చేయండి; లేక చెట్టు చెడ్డదిగాను దాని పండును చెడ్డ
దిగాను చేయండి; చెట్టు ఫలమువల్ల తెలియబడును. ।
సర్పసంతతివారలారా! మీరు చెడ్డవారై ఉండి ఏలా 34
గు మంచి వాటిని పలుక గలరు? హృదయ పరిపూర్ణ
తవల్ల నోరు మాట్లాడును. । మంచి మనుష్యుడు తన 35
హృదయముయొక్క మంచి పదార్థములోనుంచి,
మంచి వాటిని వెలపటికి తెచ్చును. చెడ్డ మనుష్యుడు
తన చెడ్డ పదార్థములోనుంచి చెడ్డవాటిని వెలపటికి
తెచ్చును. । అయితే నేను మీతో చెప్పేదేమంటే, మ 36
నుష్యులు పలికే వ్యర్థమైన ప్రతి మాటను గురించియు
న్యాయపు తీర్పు దినమందు ఉత్తరము చెప్పుదురు. ।
నీ మాటలవల్ల నీతిమంతుడవని తీర్చబడుదువు; నీ మా 37
టలవల్ల అపరాధివని తీర్చబడుదువని పలికెను.

అప్పుడు శాస్త్రులలోను ఫరిసైయులలోను కొం 38
దరు,—బోధకుడా! నీవల్ల ఒక గురుతు చూడ కోరు
తున్నామని ఆయనతో ప్రత్యుత్తరము చెప్పిరి. । అం 39
దుకు ఆయన—వ్యభిచారము గల చెడ్డవంశము* గురు
తును అడుగుతున్నది. ప్రవక్తయైన యోనా గురుతే
గాని మరి ఏ గురుతైనా దానికి ఇవ్వబడదు. । యోనా 40
దివారాత్రులు మూడు దినములు గొప్ప చేప కడుపులో
ఉన్న ప్రకారము, మనుష్య కుమారుడు భూగర్భములో
దివారాత్రులు మూడు దినములు ఉండును. । న్యాయపు 41
తీర్పు దినమందు, నినివే మనుష్యులు ఈ వంశముతో*

*లేక, నాకు. *లేక, తరము.

లేచి నిలిచి వారి మీద నేరము మోపుదురు; వారు
యోనా ప్రకటించుటవల్ల మనస్సు తిప్పుకొనిరి. అయితే
ఇదుగో! యోనా కంటే గొప్పది ఇక్కడ ఉన్నది.।
42 దక్షిణ దేశపు రాణి న్యాయపు తీర్పు దినమందు ఈ
వంశముతో* లేచి నిలిచి, వారి మీద నేరము మో
పును. ఆమె సొలొమోను జ్ఞానము వినుటకు భూమి
యొక్క అంత్య భాగములనుంచి వచ్చెను అయితే ఇదు
గో! సొలొమోనుకంటే గొప్పది ఇక్కడ ఉన్నది.

43 అపవిత్రమైన ఆత్మ ఒక మనుష్యునిలోనుంచి బైలు
వెళ్లినప్పుడు, నీరులేని చోట్ల తిరుగుతు, నెమ్మది వె
44 తుకుతునుండును. అది దొరకనందున,। — నేను విడిచి
వచ్చిన నా ఇంటికి తిరిగి వెళ్లుదునని అనుకొని వచ్చి,
ఆ ఇల్లు వట్టిదై, ఊడ్చబడి, శృంగారించబడి ఉండుట
45 చూచి, వెళ్లి,। తనకంటే చెడ్డవైన మరీ ఏడు ఆత్మలను
చేరదీసును; అప్పుడు అవి ప్రవేశించి అక్కడ కాపు
రమున్నందున, ఆ మనుష్యుని కడపటి స్థితి మొదటి
దానికంటే చెడ్డదై ఉండును. ఆలాగే ఈ చెడ్డవంశ
మునకు* కలుగునని వారితో ప్రత్యుత్తరము పలికెను.

46 ఆయన జనసమూహములతో ఇంక మాట్లాడుతుండ
గా, ఇదుగో! ఆయన తల్లియు సహోదరులును వెల
పట నిలిచి, ఆయనతో మాట్లాడ కోరుతు ఉండిరి.।
47 అప్పుడు ఒకడు,—ఇదుగో! నీ తల్లి నీ సహోదరులు
వెలపట నిలిచి, నీతో మాట్లాడుటకు కోరుతున్నారని
48 ఆయనతో పలికెను.। అందుకు ఆయన — నా తల్లి
ఎవతె? నా సహోదరులు ఎవరు? అని తనతో చెప్పిన
49 వానికి ప్రత్యుత్తరమిచ్చి। తన శిష్యులతట్టు తన చెయ్యి
చాపి,—ఇదుగో! నా తల్లి నా సహోదరులు వీరే.।
50 ఆకాశమందున్న నా తండ్రి చిత్తముచొప్పున ఎవడు
చేసునో, వాడు నా సహోదరుడు నా సహోదరి
నా తల్లియునై ఉన్నాడని పలికెను.

## 13. అధ్యాయము.

1 ఆ దినమందు యేసు ఇంట్లోనుంచి బైలువెళ్లి,
2 సముద్రము యొద్ద కూర్చుండెను.। బహు సమూహ
ములు ఆయన యొద్దికి కూడివచ్చినందున, ఆయన దోనె
ఎక్కి కూర్చుండెను; ఆ సమూహమంతా దరిని నిలి
3 చెను.। అప్పుడు ఆయన—ఇదుగో! విత్తేవాడు విత్తుటకు
4 బైలు వెళ్లెను.। అతడు విత్తుతు ఉండగా కొన్ని విత్తన
ములు తోవ పక్కను పడెను. అప్పుడు పక్షులు వచ్చి
5 వాటిని తినెను.। మరి కొన్ని చాలా మన్నులేని రాతి
భూమి మీద పడెను. అక్కడ మంటి లోతు లేదు
6 గనుక అవి వెంటనే మొలిచెను.। అయితే సూర్యుడు
ఉదయించినప్పుడు, ఎండ తగిలి వాటికి వేరు లేనందున,
అవి మాడిపోయెను.। మరి కొన్ని ముండ్ల పొదల 7
మీద పడెను. అప్పుడు ముండ్ల పొదలు మొలిచి
వాటిని అణిచివేసెను.। అయితే మరి కొన్ని మంచి 8
భూమి యందు పడి ఒకటి నూరింతలుగాను ఒకటి
అరువదింతలుగాను ఒకటి ముప్పదింతలుగాను ఫలిం
చెను.। వినుటకు చెవులు గలవాడు వినును గాక 9
అని ఉపమానములుగా అనేక సంగతులు వారితో
చెప్పెను.

తరువాత శిష్యులు వచ్చి,— నీవు వారితో ఉపమా 10
నములతో ఎందుకు మాట్లాడుతున్నావని ఆయనను
అడిగిరి.।ఆయన వారితో ప్రత్యుత్తరము చెప్పినదేమం 11
టే,—ఆకాశ రాజ్యపు మర్మములు ఎరుగుటకు మీకు
ఇవ్వబడి ఉన్నది. అయితే వారికి ఇవ్వబడలేదు.।
కలిగిన వానికి ఇవ్వబడును; అప్పుడు వానికి సమృద్ధి 12
కలుగును. అయితే కలుగని వానికి కలిగినది కూడా
వాని యొద్దనుంచి తీసుకొని పోబడును.। ఇందు నిమిత్త 13
ము నేను ఉపమానములరీతిగా వారితో మాట్లాడుతు
న్నాను; వారు చూచియు చూడకను; వినియు వినకను
గ్రహించకను ఉన్నారు.। మరియు, మీరు విని విని 14
యు తెలియక ఉందురు; చూచి చూచియు కానక
ఉందురు.। ఒకవేళ ఈ ప్రజలు కన్నులతో చూడకను, 15
చెవులతో వినకను, హృదయమువల్ల గ్రహించి మనస్సు
తిప్పుకొనకను, నేను వారిని స్వస్థపరచకను ఉండే
కొరకు, వారి హృదయము కొవ్వి తమ చెవులతో మం
దముగా విని, తమ కన్నులు మూసుకొని ఉన్నారని
యెషయ పలికిన ప్రవచనము వీరివల్ల నెరవేరుతున్నది.।
అయితే చూచుటవల్ల మీ కన్నులు, వినుటవల్ల మీ 16
చెవులు ధన్యమైనవి.। అనేక ప్రవక్తలు, నీతిమంతులును 17
మీరు చూచే వాటిని చూడగోరి చూడకను మీరు
వినే వాటిని వినగోరి వినకను ఉండిరని నేను మీతో
నిజముగా చెప్పుతున్నాను.

కాబట్టి మీరు ఆ విత్తేవాని గురించిన ఉపమాన 18
భావము వినండి। ఎవడైనా రాజ్యసంబంధ వాక్యము 19
విని గ్రహించక ఉంటే, అప్పుడు దుష్టుడు వచ్చి
అతని హృదయములో విత్తబడినది ఎత్తుకొని పోవును.
తోవ పక్కను విత్తబడిన వాడు వీడే.। రాతి భూమి 20
యందు విత్తబడిన వాడైతే, వాక్యము విని వెంటనే
సంతోషముతో దాని గైకొని।తనలో వేరు లేనం 21
దున కొంత కాలము ఉండి వాక్యనిమిత్తము శ్రమ
యైనా హింసయైనా కలిగేటప్పుడు, వెంటనే ఆతం
కపడే† వాడు వీడే.। ముండ్లపొదలో విత్తబడిన వా 22

*లేక, తరము. †లేక, కుంటుపడే.

డైతే, వాక్యము విని, ఐహికవిచారము, ఐశ్వర్యము
వలని మోసము వాక్యమును అణిచివేసును గనుక
23 నిష్ఫలమయే వాడు వీడే. । అయితే మంచి భూమి
యందు విత్తబడిన వాడైతే, వాక్యము విని గ్రహించి
ఒకటి నూరింతలుగాను ఒకటి అరువదింతలుగాను
ఒకటి ముప్పదింతలుగాను ఫలించే వాడు వీడే అని
పలికెను.

24 ఆయన మరియొక ఉపమానము వారితో చెప్పె
ను,—ఆకాశరాజ్యము తన పొలములో మంచి విత్త
25 నము విత్తిన ఒక మనుష్యుని పోలియున్నది. । అయితే
మనుష్యులు నిద్రపోతున్నప్పుడు, అతని శత్రువు వచ్చి
26 గోధుమల మీద గురుగులు* విత్తిపోయెను. । మొల
కలు పెరిగి పండినప్పుడు గురుగులు కూడా అగుపడె
27 ను । గనుక, యజమానుని నౌకరులు ఆయన యొద్దికి
వచ్చి,—అయ్యా! నీవు నీ పొలములో మంచి విత్తనము
విత్తితివి గదా అందులో గురుగులు ఎక్కడనుంచి పుట్టి
28 నవని అతనితో పలికిరి. । అందుకు అతడు,—శత్రువు
దీని చేసెనని వారితో చెప్పినప్పుడు, ఆ నౌకరులు,—
మేము వెళ్లి వాటిని పెరికివేయ వలెనని నీకు మనస్సు
29 కలదా అని అతని అడిగిరి. । అందుకు అతడు,—వద్దు
ఒకవేళ గురుగులు పెరికేటప్పుడు, వాటితో కూడా
గోధుమలు పెరుకుదురు; కోతకాలము మట్టుకు రెం
30 డును ఎదుగనివ్వండి. । కోతకాలమందు,— గురుగులు
ముందుగా కూర్చి కాల్చుటకు వాటిని కట్టలు కట్టి,
గోధుమలను నా కొట్టులో చేర్చిపెట్టండని కోసే
వారితో చెప్పుదునని పలికెను.

31 ఆయన మరియొక ఉపమానము వారితో చెప్పె
ను,—ఆకాశ రాజ్యము, ఒక మనుష్యుడు తీసుకొని
32 తన పొలములో విత్తిన ఆవగింజను పోలి ఉన్నది. । అది
విత్తనములన్నిటికంటే చిన్నది; అయితే పెరిగినప్పుడు
సమస్తమైన కూరమొక్కలకంటే పెద్దదై, వృక్షమవును
గనుక, ఆకాశ పక్షులు వచ్చి దాని కొమ్మలయందు
33 నివసించునని పలికెను. । ఆయన మరియొక ఉపమా
నము వారితో చెప్పెను,—ఆకాశ రాజ్యము, ఒక
స్త్రీ మూడు కుంచముల పిండి పట్టుకొని అదంతా పులి
సేమట్టుకు అందులో దాచిపెట్టిన పులిసిన పిండిని
పోలి ఉన్నది.

34 —ఉపమానములతో నా నోరు తెరతును; లోక
ము పుట్టినది మొదలుకొని మరుగుచేయబడిన వాటిని
బైలుపరతునని ప్రవక్త పలికిన మాట నెరవేరేటట్టు.।

యేసు వీటినన్నిటిని జనులతో ఉపమానములుగా 35
మాట్లాడెను గాని ఉపమానము లేక వారితో ఏమియు
మాట్లాడలేదు.

అప్పుడు యేసు సమూహములను పంపివేసి, ఇంటికి 36
వచ్చెను. తరువాత ఆయన శిష్యులు ఆయన యొద్దికి
వచ్చి, పొలముయొక్క గురుగులను గురించిన ఉపమా
నము మాకు తెలియ చెప్పుమనిరి. । ఆయన వారితో 37
ప్రత్యుత్తరము చెప్పెను—మంచి విత్తనము విత్తినవాడు
మనుష్య కుమారుడు, । పొలము లోకము, మంచి విత్తన 38
ములు రాజ్యముయొక్క కుమారులు; గురుగులు దుష్ట
ని కుమారులు, । వాటిని విత్తే శత్రువు సైతాను, కోత 39
లోకాంతము, కోసేవారు దేవదూతలు. । కాబట్టి గురు 40
గులు ఏలాగు కూర్చబడి అగ్నిలో కాల్చబడునో, ఆ
లాగే లోకాంతమందు కలుగును. । మనుష్య కుమా 41
రుడు తన దూతలను పంపును. వారు ఆయన రాజ్యము
లోనుంచి సకలమైన ఆతంకములను†, దుర్నీతి చేసేవా
రిని కూర్చి, । అగ్నికుండములో పడవేతురు; అక్కడ 42
యేడ్పు పండ్లు కొరుకుటయు ఉండును. । అప్పుడు నీతి 43
మంతులు తమ తండ్రియొక్క రాజ్యములో సూర్యుని
వలె ప్రకాశింతురు. వినుటకు చెవులు గలవాడు విను
నుగాక.

మరియు ఆకాశ రాజ్యము పొలములో దాచబ 44
డిన ద్రవ్యమును పోలి ఉన్నది. ఒక మనుష్యుడు
దాని కనుగొని, దాచిపెట్టి అందును గురించిన సంతో
షమువల్ల వెళ్లి, తనకు కలిగినదంతా అమ్మి ఆ పొలము
కొనెను.

మరియు ఆకాశ రాజ్యము మంచి ముత్యములను 45
వెతికే వర్తకుని పోలి ఉన్నది. । అతడు మిక్కిలి విలు 46
వగల ఒక ముత్యము కనుగొని, వెళ్లి తనకు కలిగిన
దంతా అమ్మి దాని కొనెను.

మరియు ఆకాశ రాజ్యము, సముద్రములో వేయ 47
బడి నానా విధమైన వాటిని కూర్చే వలను పోలి
ఉన్నది. । అది నిండినప్పుడు, దరికి దాని లాగి కూ 48
చుండి మంచి వాటిని గంపలలో చేర్చి, చెడ్డ
వాటిని పారవేసిరి. । ఆ ప్రకారము లోకాంతమందు 49
కలుగును. దూతలు బైలువెళ్లి నీతిమంతులలోనుంచి
దుర్మార్గులను వేరుపరిచి । వారిని అగ్నికుండములో 50
వేతురు. అక్కడ యేడ్పు, పండ్లు కొరుకుటయు కలు
గునని పలికెను.

యేసు—వీటినన్నిటిని మీరు గ్రహించితిరా అని 51
వారిని అడిగెను. అందుకు వారు,—అవును ప్రభువా!

*లేక, గొలివెలు. †లేక, ఆతంకపరిచే వారినందరిని.

52 అని చెప్పిరి.। అప్పుడు ఆయన,—ఇందువల్ల ఆకాశ
రాజ్యమును గురించి నేర్పబడిన ప్రతి శాస్త్రియు తన
పదార్థములోనుంచి క్రొత్తవాటిని పాతవాటిని బైలు
పెట్టే ఇంటి యజమానుని పోలియున్నాడని వారితో
పలికెను.

53 యేసు ఈ ఉపమానములు చెప్పి చాలించిన
తర్వాత, ఆయన అక్కడనుంచి వెళ్లి తన దేశమునకు
వచ్చి, వారి సునగోగులో వారికి ఉపదేశిస్తు ఉండె
54 ను.। అందువల్ల వారు ఆశ్చర్యపడి,—ఈ జ్ఞానము, ఈ
గొప్ప కార్యములు ఇతనికి ఎక్కడనుంచి కలిగి ఉన్న
55 వి.। ఇతడు వడ్లవాని కుమారుడు కాడా? ఇతని తల్లి
మరియ అనే పేరు కలది కాదా? ఇతని సహోదర
రులు యాకోబు, యోసే, సీమోను, యూదా, అనే
56 వారు కారా?। ఇతని చెల్లెండ్లందరు మనలో ఉన్నారు
కారా? ఇతనికి ఇవన్నీ యెక్కడనుంచి కలిగి ఉన్న
వని చెప్పుకొని ఆయన యందు అభ్యంతరపడిరి.*।
57 అయితే యేసు,—ప్రవక్త తన దేశములోను తన ఇంటి
లోను గాని మరి ఎక్కడనైనా ఘనహీనుడై ఉండడని
58 వారితో పలికెను.। వారి అవిశ్వాసమువల్ల ఆయన
అక్కడ అనేకమైన గొప్ప కార్యములు చేయలేదు.

## 14. అధ్యాయము.

1 ఆ కాలమందు చతుర్థాధిపతియైన హేరోదు
2 యేసు కీర్తిని విని।— ఇతడు స్నానికుడైన యోహాను;
ఆయన చనిపోయిన వారిలోనుంచి లేచి ఉన్నాడు
గనుక శక్తులు ఆయనయందు క్రియా సాధకములై
3 ఉన్నవని తన నౌకరులతో చెప్పెను.। హేరోదు తన
తమ్ముడైన ఫిలిప్పు భార్యయైన హేరోదియ నిమిత్తము,
యోహానును పట్టించి, అతని కట్టించి, చెరసాలలో
4 వేయించెను.। ఎందుకంటే యోహాను,—నీవు ఈమెను
ఉంచుకొనుట న్యాయము కాదని అతనితో చెప్పె
5 ను.। జనసమూహము ఆయన ప్రవక్త అని ఎంచినందున
6 అతడు ఆయనను చంపగోరి వారికి భయపడెను.। అయి
తే హేరోదుయొక్క జన్మదినోత్సవము జరిగినప్పుడు,
హేరోదియ కుమార్తె వారి మధ్యను నాట్యమాడి,
7 హేరోదును సంతోషపరిచెను,। గనుక ఆమె ఏమి
అడిగినా, ఇచ్చుటకు ఆయన ఒట్టుబెట్టుకొని వాగ్దత్తము
8 చేసెను.। అప్పుడు ఆమె ముందర తన తల్లిచేత ప్రేరే
పించబడి,—స్నానికుడైన యోహాను తలను ఇక్కడ
9 తబుకులో పెట్టి నాకు ఇప్పించుమని అడిగెను.। అం
దును గురించి రాజు దుఃఖపడెను. అయితే తన ఒట్టు
నిమిత్తము తనతో కూడా భోజన పజ్తిలో కూర్చున్న
వారి నిమిత్తము, ఇచ్చుటకు ఆజ్ఞాపించి,। పంపి చెరసా 10
లలో యోహాను తల కొట్టించెను. అప్పుడు అతని 11
తల తబుకుతో తేబడి ఆ చిన్నదానికి ఇవ్వబడెను;
ఆమె తన తల్లి యొద్దికి దాని తీసుకొని వచ్చెను.।
అప్పుడు అతని శిష్యులు వచ్చి, మొండెము ఎత్తుకొని 12
వెళ్లి దాని పాతిపెట్టి, యేసు యొద్దికి వచ్చి తెలియ
చేసిరి.

యేసు దీని విని, అక్కడనుంచి ఓడమీద అడవి 13
చోటికి ఏకాంతముగా వెళ్లెను. అయితే జనసమూహ
ములు విని, పట్టణములనుంచి కాలినడకతో ఆయ
నను వెంబడించెను.। అప్పుడు యేసు బైలుదేరి, ఆ 14
గొప్ప సమూహము చూచి, వారియందు కనికరపడి
వారి రోగులను స్వస్థపరిచెను.

సాయంకాలమైనప్పుడు ఆయన శిష్యులు ఆయన 15
యొద్దికి వచ్చి,—ఇది అడవి చోటు; ఇప్పుడు కాలము
గతించెను; ఈ జనసమూహములు గ్రామములలోకి
వెళ్లి, తమకు ఆహారము కొనుకొనుటకు, వారిని వదిలి
వేయుమని చెప్పిరి.। అయితే యేసు,— వెళ్లుటకు వా 16
రికి అగత్యము లేదు; మీరే వారికి తినుటకు ఇవ్వం
డని వారితో పలికెను.। అందుకు వారు,— ఇక్కడ 17
మన యొద్ద, అయిదు రొట్టెలు రెండు చేపలు గాక
మరి ఏమియు లేదని ఆయనతో పలికినప్పుడు। ఆ 18
యన—వాటిని నా యొద్దికి తెండని చెప్పెను.। అప్పు 19
డు ఆయన,— పచ్చికమీద పజ్తిగా కూచుండుడని
జనసమూహములకు ఆజ్ఞాపించి, ఆ అయిదు రొట్టెలు
రెండు చేపలును పట్టుకొని, ఆకాశము తట్టు కన్ను
లెత్తి, స్తోత్రము చేసి, ఆ రొట్టెలు విరిచి, శిష్యులకు
ఇచ్చెను; శిష్యులు జనసమూహములకు పంచిపెట్టిరి.।
వారందరు తిని, తృప్తిపొందిరి. తర్వాత పన్నెండు 20
గంపలనిండా మిగిలిన ముక్కలు ఎత్తిరి.। స్త్రీలు పిల్ల 21
లు గాక, తినినవారు కొంచెము యెక్కువ తక్కువ
అయిదువేల పురుషులు ఉండిరి.

వెంటనే యేసు ఆ సమూహములను తాను వదిలి 22
వేసేమట్టుకు, తన శిష్యులు ఓడయెక్కి తనకంటే
ముందుగా అద్దరికి వెళ్లుటకు వారిని బలవంతము
చేసెను.। ఆయన ఆ సమూహములను వదిలివేసి, ప్రా 23
ర్థించుటకు ఏకాంతముగా ఒక కొండ ఎక్కి, సా
యంకాలమైనప్పుడు అక్కడ ఒంటిగా ఉండెను.।
అయితే ఆ ఓడ సముద్ర మధ్యను ఉండినప్పుడు 24
గాలి ఎదురుగా ఉండుటవల్ల తరంగములచేత అల్లా

*లేక, తుంటుపడిరి.

25 డించబడుతూ ఉండెను. । రాత్రి నాలుగో జామున,
యేసు సముద్రము మీద నడుస్తు వారి యొద్దికి వచ్చె
26 ను. । శిష్యులు సముద్రము మీద ఆయన నడుచుట
చూచి, దిగులుపడి—భూతమని చెప్పుకొని, భయము
27 వల్ల కేక వేసిరి. । వెంటనే యేసు, — ధైర్యము తెచ్చు
కొనండి; నేనే ఉన్నాను; భయపడ వద్దని వారితో
28 పలికెను. । అప్పుడు పేతురు, — ప్రభువా! నీవైతే,
నీటి మీద నీ యొద్దికి వచ్చుటకు నాకు సెలవిమ్మని ఆ
29 యనకు ప్రత్యుత్తరమిచ్చెను. । అందుకు ఆయన,—రమ్మ
నగానే పేతురు ఓడ మీదనుంచి దిగి, యేసు యొద్దికి
30 వెళ్లుటకు, నీటి మీద నడిచెను. । అయితే గాలి వడి
గా ఉండుట చూచి, జడిసి మునిగిపోవనారంభించి ।
31 —ప్రభువా! నన్ను రక్షించుమని కేక వేసెను. వెం
టనే యేసు, చెయ్యి చాపి అతని పట్టుకొని,—అల్ప
విశ్వాసీ! ఎందుకు సందేహపడితివని పలికెను.
32,33 వారు ఓడ ఎక్కినప్పుడు, గాలి అణిగెను. । అయితే
ఓడలో ఉన్న వారు వచ్చి, — నిశ్చయముగా దేవుని
కుమారుడవని చెప్పి ఆయనకు నమస్కరించిరి.
34 వారు అద్దరికి దాటి వెళ్లినప్పుడు, గెన్నేసరెతనే
35 దేశమునకు వచ్చిరి. । అక్కడి మనుష్యులు ఆయనను
తెలుసుకొనినప్పుడు, వారు చుట్టు ఉన్న సర్వ ప్రదే
శమునకు (వర్తమానము) పంపి, రోగులనందరిని ఆయన
36 యొద్దికి తెప్పించి, । — వీరిని నీ వస్త్రపు జాలరు మా
త్రమే అంటుకొననిమ్మని ఆయనను వేడుకొనిరి. అం
టుకొనిన వారందరు స్వస్థపరచబడిరి.

## 15. అధ్యాయము.

1 అప్పుడు యెరూశలేమునుంచి శాస్త్రులు ఫరిసై
2 యులును యేసు యొద్దికి వచ్చి । —నీ శిష్యులు ఎందుకు
పెద్దల పారంపర్యమును అతిక్రమిస్తున్నారు! వారు
తమ చేతులు కడుగుకొనక భోజనము చేస్తున్నారని
3 పలికిరి. । అప్పుడు ఆయన, — ఎందుకు మీరును మీ
పారంపర్యమువల్ల దేవుని ఆజ్ఞను అతిక్రమిస్తున్నారు?।
4 తలిదండ్రులను ఘనపరుచుమనియు, తండ్రినైనా తల్లి
నైనా దూషించేవాడు మరణము పొంద వలెననియు
5 దేవుడు ఆజ్ఞాపించెను; । అయితే,—యెవడైనా—నావల్ల
నీకు ఏది ప్రయోజనమై యుండునో అది కానుక అని
తన తండ్రితోనైనా తల్లితోనైనా పలికితే* వాడు ।
6 తన తండ్రినైనా తల్లినైనా ఘనపరచ కూడదని మీరు
చెప్పుతున్నారు. ఆలాగు మీ పారంపర్యమువల్ల, దే
7 వుని ఆజ్ఞ నిరర్థకము చేసి యున్నారు. । వేషధారు

లారా! ।—ఈ ప్రజలు తమ నోటితో నా యొద్దికి 8
చేరి, నన్ను పెదవులతో ఘనపరుస్తున్నారే గాని
వారి హృదయము నాకు దూరమై యున్నది. । వారు 9
మనుష్యుల సంప్రదాయములు బోధలని బోధిస్తు,
నన్ను వ్యర్థముగా ఆరాధిస్తున్నారని, యెషయా
మిమ్మునుగురించి బాగా ప్రవచించెనని వారితో ప్రత్యు
త్తరము పలికెను. । మరియు ఆయన జనసమూహమును 10
పిలిచి,—మీరు ఆలకించి గ్రహించండి: । నోటపడేది 11
మనుష్యుని అపవిత్రము చేయదు; అయితే నోటి
నుంచి బైలువెళ్లేది యేదో అది మనుష్యుని అపవి
త్రము చేసునని వారితో పలికెను.

అప్పుడు ఆయన శిష్యులు దగ్గరకు వచ్చి,—ఫరిసై 12
యులు ఈ మాట విని అభ్యంతరపడిరని నీకు తెలు
సునా? అని ఆయనను అడిగిరి. । అందుకు ఆయన,— 13
ఆకాశమందున్న నా తండ్రిచేత నాటబడని ప్రతి
మొలక వేరుతో ఊడ తీయబడును. । వారిని విడువండి; 14
వారు గుడ్డివారికి తోవ చూపే గుడ్డివారై యున్నారు.
గుడ్డివాడు గుడ్డివానికి తోవ చూపితే వారిద్దరు గుం
టలో పడుదురని ప్రత్యుత్తరము చెప్పెను. । అప్పుడు 15
పేతురు,—ఈ ఉపమానము మాకు తెలియ చెప్పుమని
ఆయనకు ప్రత్యుత్తరమిచ్చెను. । అందుకు యేసు,— 16
మీరును ఇదివరకు తెలివి లేనివారైతిరా? । నోట 17
ప్రవేశించేదంతా కడుపులోకి వెళ్లి, బహిర్భూమిలో
విడువబడును. । అయితే నోటినుంచి బైలు వెళ్లేవి 18
హృదయములోనుంచి వస్తున్నవి; ఇవే మనుష్యుని అప
విత్రపరుచునని మీరు గ్రహించరా? । దురాలోచనలు, 19
నరహత్యలు, వ్యభిచారములు, వేశ్యాగమనములు, దొం
గతనములు, అబద్ధ సాక్ష్యములు, దేవదూషణలు హృ
దయములోనుంచి బైలు వెళ్లుతున్నవి. । మనుష్యుని అ 20
పవిత్రపరిచేవి ఇవే; అయితే కడుగుకొనని చేతులతో
భోజనము చేయుట మనుష్యుని అపవిత్రపరచదని
పలికెను.

యేసు అక్కడనుంచి బైలుదేరి తురు సీదోనుల 21
ప్రాంతములకు తర్లి వెళ్లెను. । అప్పుడు ఇదుగో! ఆ 22
ప్రాంతములనుంచి కనాను దేశస్థురాలైన ఒక స్త్రీ బై
లుదేరి వచ్చి,—ప్రభువా! దావీదు కుమారుడా! నన్ను
కరుణించుము; నా కుమార్తె ఒక దయ్యమువల్ల చాలా
బాధపడుతు ఉన్నదని ఆయనతో నోరెత్తి పలికెను. ।
అయితే ఆయన ఆమెతో ప్రత్యుత్తరముగా ఒక్క 23
మాటయు చెప్పలేదు. అప్పుడు ఆయన శిష్యులు
వచ్చి,—ఈమె మనవెంబడి వచ్చి కేకలువేస్తు ఉన్నది

*లేక, పలికి తన తండ్రినైనా తల్లినైనా ఘనపరచనప్పటికి (తప్పులేదని) మీరు చెప్పుతున్నారు.

గనుక ఈమెను పంపివేయుమని ఆయనను వేడుకొ
24 నిరి.।అందుకు ఆయన,—ఇశ్రాయేలు ఇంటివై నశించిన
గొఱ్ఱెల యొద్దికే గాని నేను (మరి యెవరి యొద్దికి)
25 పంపబడ లేదని ప్రత్యుత్తరము చెప్పెను.।అప్పుడు
ఆమె వచ్చి ఆయనకు నమస్కరించి,—ప్రభువా! నాకు
26 సహాయము చేయుమని పలికెను.। అందుకు ఆయన,—
పిల్లల రొట్టెలు పట్టుకొని కుక్కలకు వేయుట తగదని
27 ప్రత్యుత్తరము చెప్పెను.। అందుకు ఆమె,—అవును
ప్రభువా! కుక్కలైతే తమ యజమానుల భోజనపు
28 బల్లనుంచి పడే ముక్కలు తినునని పలికెను.।అప్పుడు
యేసు,—ఓ స్త్రీ! నీ విశ్వాసము గొప్పది; నీవు కోరి
నట్టు నీకు అవును గాక అని ఆమెకు ప్రత్యుత్తరమి
చ్చెను. ఆ గడియనుంచి ఆమె కుమార్తె బాగుపడెను.
29 తర్వాత యేసు అక్కడనుంచి వెళ్లి, గలిలైయ సము
ద్రము యొద్దికి వచ్చి, కొండ ఎక్కి అక్కడ కూర్చుం
30 డెను.। అప్పుడు బహు జనసమూహములు, కుంటి
వారు, గుడ్డివారు, మూగవారు, అంగహీనులు మొద
లైన అనేకులను యేసు యొద్దికి తీసుకొని వచ్చి, వారిని
ఆయన పాదముల యొద్ద వేసెను. ఆయన వారిని స్వ
31 స్థపరిచెను,।గనుక మూగవారు మాట్లాడుటయు అం
గహీనులు బాగుపడుటయు కుంటివారు నడుచుటయు
గుడ్డివారు దృష్టి పొందుటయు జనసమూహములు
చూచి ఆశ్చర్యపడి ఇశ్రాయేలు దేవుని స్తుతించెను.
32 అప్పుడు యేసు తన శిష్యులను తన యొద్దికి పిలిచి
వారితో,—జనులు నేటికి మూడు దినములనుంచి నా
యొద్ద ఉన్నారు; తినుటకు వారికి ఏమియు లేదు గను
క వారి మీద కనికరపడుతున్నాను; వారు తోవలో
విసికిపోదురేమో అని వారిని ఉపవాసముతో వదిలి
33 వేయుటకు నాకు మనస్సు లేదని పలికెను.।అప్పుడు
ఆయన శిష్యులు,—ఇంత గొప్ప సమూహమును తృప్తిప
రచుటకు కావలసిన రొట్టెలు ఈ అరణ్యములో మన
34 కు ఎక్కడనుంచి దొరుకునని ఆయనతో పలికిరి.।అం
దుకు యేసు,—మీ యొద్ద ఎన్ని రొట్టెలు ఉన్నవని
వారిని అడిగినప్పుడు, వారు—ఏడు రొట్టెలు కొన్ని
35 చిన్న చేపలు ఉన్నవని చెప్పిరి.।అప్పుడు ఆయన
భూమిమీద పజ్తులుగా కూర్చుండ వలెనని ఆ సమూ
36 హమునకు ఆజ్ఞాపించి,।ఆ ఏడు రొట్టెలు చేపలు
పట్టుకొని, స్తోత్రముచేసి, విరిచి తన శిష్యులకు ఇచ్చె
37 ను.। శిష్యులు సమూహమునకు పంచిపెట్టిరి. వారం
దరు తిని తృప్తి పొందిరి. తరువాత ఏడు గంపల
38 నిండా మిగిలిన ముక్కలు ఎత్తిరి.। తినినవారు స్త్రీలు
పిల్లలు గాక నాలుగు వేల పురుషులు.।అప్పుడు ఆయన 39
సమూహములను వదిలివేసి, ఓడ ఎక్కి మగ్దలా ప్రాం
తములకు వచ్చెను.

## 16. అధ్యాయము.

అప్పుడు ఫరిసైయులు సద్దూకైయులతో కూడా 1
వచ్చి, ఆకాశమునుంచి ఒక ఆనవాలును తమకు అగు
పరచ వలెనని ఆయనను శోధిస్తూ వేడుకొనిరి.।అప్పుడు 2
ఆయన,—సాయంకాలమున మీరు — ఆకాశము యె
ఱ్ఱనిది గనుక నిర్మలమనియు,।ఉదయమున—ఆకా 3
శము యెఱ్ఱగాను మబ్బుగాను ఉన్నది గనుక నేడు
గాలివాన వచ్చును అనియు మీరు చెప్పుతున్నారు.
వేషధారులారా! ఆకాశ ముఖము వివేచించుట మీకు
తెలుసునే గాని ఈ కాలముల ఆనవాళ్లను వివేచించ
లేరా.। వ్యభిచరించే చెడ్డవంశము* ఆనవాలు అడుగు 4
తున్నది; అయితే ప్రవక్తయైన యోనాయొక్క ఆన
వాలే గాని వేరే ఆనవాలు దానికి ఇవ్వబడదని వారి
తో ప్రత్యుత్తరము చెప్పి వారిని విడిచి వెళ్లెను.
ఆయన శిష్యులు అద్దరికి చేరి రొట్టెలు తెచ్చుట మరి 5
చిరి.। అప్పుడు యేసు,—ఫరిసైయులయొక్క సద్దూకై 6
యులయొక్కయు పులిసిన పిండిని గురించి జాగ్రత్త
పడి చూడండని వారితో చెప్పెను,। గనుక వారు, 7
—మనము రొట్టెలు తేనందున ఈ మాట పలికెనని తమ
లోతాము ఆలోచించుకొనిరి.। యేసు అది తెలిసి,— 8
అల్ప విశ్వాసులారా! రొట్టెలు తేనందున అని మీలో
మీరు ఎందుకు ఆలోచించుకొంటున్నారు.?। మీరు 9
ఇంకా గ్రహించరా? అయిదువేల మందికి పంచిపెట్టిన
అయిదు రొట్టెలలో (మిగిలిన ముక్కలు) ఎన్ని గం
పల నిండా ఎత్తితిరో అది అయినా,।నాలుగు వేల మం 10
దికి (పంచిపెట్టిన) ఏడు రొట్టెలలో (మిగిలిన ము
క్కలు) ఎన్ని గంపల నిండా ఎత్తితిరో అది అయినా
మీకు జ్ఞాపకము లేదా?। ఫరిసైయుల యొక్కయు 11
సద్దూకైయుల యొక్కయు పులిసిన పిండి విషయమై
జాగ్రత్తపడుటకేగాని నేను రొట్టెలను గురించి మీతో
చెప్పలేదు; అది మీరు యేల గ్రహించ లేదని పలి
కెను.।అప్పుడు ఫరిసైయుల యొక్కయు సద్దూకైయుల 12
యొక్కయు ఉపదేశమును గురించి జాగ్రత్తపడవలె
నని తమతో చెప్పెను గాని రొట్టె పులిసిన పిండిని
గురించి చెప్ప లేదని వారు గ్రహించిరి.
యేసు ఫిలిప్పుదైన కైసరైయ ప్రాంతములకు వస్తూ 13
ఉండగా,—మనుష్య కుమారుడనైన నేను ఎవడనని
జనులు చెప్పుకొంటున్నారని ఆయన తన శిష్యులను

*లేక, తరము.

14 అడిగెను. । అందుకు వారు,—కొందరు స్నానికుడనే
యోహాను అనియు, మరి కొందరు ఏలీయా అనియు,
మరి కొందరు యెరెమియా అనియు లేక ప్రవక్తలలో
15 ఒకడనియు చెప్పుకొంటున్నారని పలికిరి. । అందుకు
ఆయన,—అయితే నేను ఎవడనని మీరు చెప్పుకొంటు
16 న్నారని వారిని అడిగినప్పుడు,। సీమోను పేతురు,—నీవు
జీవముగల దేవుని కుమారుడవైన క్రీస్తువని ప్రత్యుత్తర
17 మిచ్చెను. । అందుకు యేసు — సీమోను బర్‌యోనా!
నీవు భాగ్యవంతుడవు! ఆకాశమందున్న నా తండ్రి
వల్లనే గాని రక్తమాంసములవల్ల* ఇది నీకు బైలుపరచ
18 బడ లేదు. । మరియు నీవు పేతురువు; ఈ బండమీద
నా సంఘమును కట్టుదును; అదృశ్యలోక ద్వారములు
దాని జయించ లేవని నేను కూడా నీతో చెప్పుతున్నా
19 ను. । మరియు ఆకాశ రాజ్యము యొక్క తాళములు
నీకు ఇస్తాను; నీవు భూమియందు దేని బంధింతువో అది
ఆకాశమందు బంధించబడును. నీవు భూమియందు
దేని విప్పుదువో అది ఆకాశమందు విప్పబడునని
20 అతనితో ప్రత్యుత్తరము పలికెను. । అప్పుడు తాను
క్రీస్తునని ఎవనితోను చెప్ప వద్దని ఆయన తన శిష్యు
లకు గట్టిగా ఆజ్ఞాపించెను.

21 అప్పటినుంచి యేసు, తాను యెరూశలేముకు వెళ్లి,
పెద్దల వల్లను ప్రధాన యాజకుల వల్లను శాస్త్రుల వల్లను
మిక్కిలి శ్రమ పొంది, చంపబడి, మూడవ దినమందు
లేవవలెనని తన శిష్యులకు అగుపరచనారంభించెను.।
22 అప్పుడు పేతురు ఆయనను పట్టుకొని, — ప్రభువా!
నీయందు కరుణించు గాక! ఇది నీకు కలగదని ఆయ
23 నను గద్దించ నారంభించెను. । అయితే ఆయన తిరిగి,—
సైతానా! నా వెనుకకు పొమ్ము; నా అభ్యంతరము నీవే;
నీవు మనుష్యుల వాటి యందే గాని దేవుని వాటి
యందు మనస్కరించవని పేతురుతో చెప్పెను.

24 అప్పుడు యేసు,—ఎవడైనా నన్ను వెంబడించ
వలెనని ఉంటే తన్నుతాను ఉపేక్షించి, తన శిలువ
25 ఎత్తుకొని నన్ను వెంబడించ వలెను. । తన ప్రాణము
రక్షించుకొనుటకు కోరేవాడెవడో వాడు దాని పోగొ
ట్టుకొనును. నా నిమిత్తము తన ప్రాణము పోగొట్టు
26 కొనే వాడెవడో వానికి అది దొరుకును. । ఒక మను
ష్యుడు లోకమంతా సంపాదించి, తన ప్రాణము పో
గొట్టుకొంటే అతనికి యేమి లాభము? మనుష్యుడు తన
27 ప్రాణమునకు ప్రతిగా ఏమి ఇవ్వ గలడు? । మనుష్య
కుమారుడు తన తండ్రి మహిమగలవాడై తన దూతల
తో కూడా రాబోతున్నాడు; అప్పుడు ప్రతి వానికి
వాని క్రియ చొప్పున ఫలమిచ్చును. । ఇక్కడ నిలిచి 28
యున్న వారిలో కొందరు మనుష్య కుమారుడు తన
రాజ్యమందు వచ్చుట చూచే పర్యంతము, మరణము
పొందరని నేను నిశ్చయముగా మీతో చెప్పుతున్నా
నని తన శిష్యులతో పలికెను.

## 17. అధ్యాయము.

ఆరు దినములైన తర్వాత, యేసు పేతురును యా 1
కోబును అతని సహోదరుడైన యోహానును గొప్ప
కొండ మీదికి ఏకాంతముగా తీసుకొని వెళ్లి। వారి 2
ఎదుట రూపాంతరము పొందెను. ఆయన ముఖము
సూర్యుని వలె ప్రకాశించెను; ఆయన వస్త్రములు వెలు
గువలె తెల్లనివాయెను. । అప్పుడు ఇదుగో! మోషే, ఏలీ 3
యాయు ఆయనతో మాట్లాడుతూ వారికి అగుపడిరి.।
అప్పుడు పేతురు,—ప్రభువా! మనము ఇక్కడ ఉం 4
డుట మంచిది; నీకు ఇష్టమైతే, ఇక్కడ నీ కొరకు
ఒకటి, మోషే కొరకు ఒకటి, ఏలీయా కొరకు ఒకటియు
మూడు పర్ణశాలలు కట్టుదుమని యేసుతో చెప్పె
ను. । అతడు ఇంకా మాట్లాడుతూ ఉన్నప్పుడు, ఇ 5
దుగో! కాంతిగల ఒక మేఘము వారిని కమ్మెను. అ
ప్పుడు ఇదుగో!—ఈయన నా ప్రియ కుమారుడై ఉ
న్నాడు; ఈయన యందు నేను సంతోషపడుతున్నా
ను; ఈయన మాట వినండి అనే శబ్దము ఆ మేఘము
లోనుంచి పుట్టెను. । శిష్యులు దీని విని, నేల బోర్లపడి 6
మిక్కిలీ జడిసిరి. । అయితే యేసు వారి యొద్దికి వచ్చి 7
వారిని ముట్టి— మీరు లేవండి, భయపడకండి అని
పలికెను. । వారు తమ కన్నులెత్తి యేసును గాక మరి 8
యెవనిని చూడలేదు.

వారు ఆ కొండ మీదనుంచి దిగి వస్తూ ఉండగా,— 9
మనుష్య కుమారుడు చనిపోయిన వారిలోనుంచి లేచే
వరకు ఈ దర్శనము మీరు ఎవనితోను చెప్పకండని
యేసు వారికి ఆజ్ఞాపించెను. । అప్పుడు ఆయన శిష్యు 10
లు,—ఈలాగైతే, ఏలీయా ముందర రావలెనని శా
స్త్రులు ఎందుకు చెప్పుతున్నారని ఆయనను అడిగిరి.।
అందుకు యేసు—ఏలీయా ముందర వచ్చి సమస్తమును 11
కుదుర్చుననే మాట నిజమే. । అయితే నేను మీతో 12
చెప్పేదేమంటే, ఏలీయా ఇదివరకు వచ్చి యున్నాడు;
వారు ఆయనను ఎరుగక, ఆయన యెడల తమ ఇష్ట
ప్రకారము చేసిరి. ఆలాగే మనుష్య కుమారుడు వారి
వల్ల శ్రమపడబోతున్నాడని వారికి ప్రత్యుత్తరమిచ్చె

* అనగా, నరునివల్ల.

13 ను. అప్పుడు ఆయన స్నానికుడనే యోహానును గు
రించి తమతో పలికెనని శిష్యులు గ్రహించిరి.

14 వారు సమూహము యొద్దికి వచ్చినప్పుడు, ఒక
మనుష్యుడు ఆయన యొద్దికి వచ్చి ఆయన యెదుట మో
15 కాళ్లూని।—ప్రభువా! నా కుమారుని కరుణించుము;
కాకి చెమ్మలు కలిగి, మిక్కిలీ బాధపడుతున్నాడు;
ఏలాగంటే తరుచుగా అగ్నిలోను నీళ్లలోను పడుతు
16 న్నాడు. నీ శిష్యుల యొద్దికి అతని తీసుకొని వచ్చి
నాను, అయితే వారు అతని స్వస్థపరచ లేకపోయిరని
17 చెప్పెను. అందుకు యేసు,—విశ్వాసములేని ఓ మూ
ఖవంశమా*! నేను ఎన్నాళ్లమట్టుకు మీ మధ్యను
ఉండి ఎన్నాళ్లమట్టుకు మిమ్మును సహింతును! అతని
నా యొద్దికి తీసుకొని రండని ప్రత్యుత్తరమిచ్చెను.
18 అప్పుడు యేసు వాని గద్దించెను. అప్పుడు దయ్యము
వానిని విడిచి పోయెను. ఆ గడియనుంచి ఆ చిన్న
వాడు బాగుపడెను.

19 తర్వాత శిష్యులు ఏకాంతముగా యేసు యొద్దికి
వచ్చి,—మేము దాని ఎందుకు వెళ్లగొట్ట లేకపోతిమని
20 అడిగిరి. అందుకు యేసు,—మీ అవిశ్వాసమువల్లనే;
ఒక ఆవగింజంత విశ్వాసము మీకు కలిగితే ఈ కొం
డను,—ఇక్కడనుంచి అక్కడికి పొమ్మనగానే అది
పోవును. మీకు అసాధ్యమైనది ఏమియు ఉండదని
21 నిశ్చయముగా మీతో చెప్పుతున్నాను. అయితే ఈ
జాతి ప్రార్థనోపవాసములవల్లనే గాని బైలువెళ్ల
దని వారితో పలికెను.

22 వారు గలిలైయలో సంచరిస్తూ ఉన్నప్పుడు, యేసు,
—మనుష్య కుమారుడు మనుష్యుల చేతులకు అప్పగించ
23 బడబోతున్నాడు; వారు ఆయనను చంపుదురు; మూ
డవ దినమందు ఆయన లేచునని వారితో చెప్పెను
గనుక వారు బహు దుఃఖపడిరి.

24 వారు కపెనహూముకు వచ్చినప్పుడు ద్విద్రక్ష్మ
లు† పుచ్చుకొనేవారు పేతురు యొద్దికి వచ్చి—మీ
బోధకుడు ద్విద్రక్ష్మలు చెల్లించును గదా అని అడిగిన
25 ప్పుడు,—అవునని చెప్పెను. అయితే అతడు ఇంట్లోకి
వచ్చినప్పుడు, యేసు అతనికంటే ముందుగా పలక
రించి,—సీమోనూ! నీకు ఏలాగు తోస్తున్నది? భూరాజు
లు సుంకమైనా పన్నైనా ఎవరివల్ల పుచ్చుకొందురు?
తమ కుమారులవల్లనా, అన్యులవల్లనా? అని అడిగెను.
26 పేతురు—అన్యులవల్లనే అని ఆయనతో చెప్పెను. అం
దుకు యేసు,—ఆలాగైతే కుమారులు స్వతంత్రులై
యున్నారు గదా; అయినప్పటికి, మనము వారికి ఆతం 27
కము చేయక ఉండేటట్టు, నీవు సముద్రము యొద్దికి
వెళ్లి, గాలము వేసి, మొదట పైకి వచ్చే చేపను పట్టు
కొని దాని నోరు విప్పితే ఒక స్తాతేరు‡ నీకు దొరు
కును; దాని పుచ్చుకొని నా కొరకు నీ కొరకును వారికి
ఇమ్మని అతనితో చెప్పెను.

## 18. అధ్యాయము.

ఆ వేళనే శిష్యులు యేసు యొద్దికి వచ్చి—ఆకాశ 1
రాజ్యములో ఎవడు గొప్పవాడని అడిగిరి. అప్పుడు 2
యేసు ఒక పిల్లను తన యొద్దికి పిలిచి వారి మధ్యను
నిలువబెట్టి।—మీరు తిప్పబడి పిల్లలవలె ఉంటేనే గాని 3
ఆకాశ రాజ్యములో ప్రవేశించరని మీతో నిశ్చయ
ముగా చెప్పుతున్నాను, గనుక ఈ పిల్లవలె తన్నుతాను 4
తగ్గించుకొనే వాడెవడో వాడే ఆకాశ రాజ్యములో
గొప్పవాడై యుండును. మరియు ఈలాటి ఒక పిల్లను 5
నా పేరట చేర్చుకొనే వాడెవడో వాడు నన్ను చేర్చు
కొంటున్నాడు. అయితే నాయందు విశ్వాసముంచే 6
ఈ చిన్నవారిలో ఒకని ఆతంకపరిచే వాడెవడో,
వాని మెడకు తిరగటి రాయి కట్టబడి వాడు సముద్రపు
లోతు నీటిలో ముంచివేయబడుట వానికి మేలు.

ఆతంకములవల్ల లోకమునకు శ్రమ! ఆతంకములు 7
వచ్చుటకు అగత్యము కలదు; అయితే ఎవనివల్ల ఆతం
కము వచ్చునో ఆ మనుష్యునికి శ్రమ! కాబట్టి నీ 8
చేతివల్లనైనా, నీ పాదమువల్లనైనా నీకు ఆతంకము
వస్తే, దాని నరికి నీ యొద్దనుంచి పారవేయుము; రెండు
చేతులైనా రెండు పాదములైనా కలిగి నిత్యాగ్నిలో
తోయబడుటకంటే, కుంటితనముతోనైనా అంగహీన
తతోనైనా జీవములో ప్రవేశించుట నీకు మేలు. మరి 9
యు నీ కన్ను నిన్ను ఆతంకపరిచితే, దాని పెరికి నీ
యొద్దనుంచి పారవేయుము; రెండు కన్నులు కలిగి అ
గ్నిగల గహెన్నలో తోయబడుటకంటే ఒక కన్ను
కలిగి జీవములో ప్రవేశించుట నీకు మేలు.

ఈ చిన్నవారిలో ఒకనినైనా తిరస్కరించక ఉం 10
డుటకు మీరు జాగ్రత్తపడండి; ఆకాశమందు వీరి
దూతలు నిరంతరము, ఆకాశములో ఉన్న నా తండ్రి
ముఖము చూస్తున్నారని మీతో చెప్పుతున్నాను.
మనుష్య కుమారుడు నశించినదాని రక్షించే కొరకు 11
వచ్చి యున్నాడు. మీకు ఏలాగు తోస్తున్నది? ఒక 12
మనుష్యునికి నూరు గొర్రెలు కలిగి యుండగా, వాటి

*లేక, తరమా. †ఎక్సోదసు, 30: 13. దేవాలయనిమిత్తమైన అరషెకెలు. అది 10 అణాలు కావచ్చును.
‡ఒక షెకెలు వెలగల ఒక నాణ్యము, రూ. 1, 4, 0.

లో ఒకటి తప్పిపోతే, తొంభైతొమ్మిదింటిని విడిచి,
13 కొండలకు వెళ్లి, తప్పిపోయినదాని వెతుకడా?। అది
దొరికితే, తప్పిపోని తొంభైతొమ్మిది గొఱ్ఱెలకంటే
దాని గురించి ఎక్కువగా సంతోషపడునని నిశ్చయ
14 ముగా మీతో చెప్పుతున్నాను.। అలాగున ఈ చిన్న
వారిలో ఒకడైనా నశించుటకు ఆకాశమందున్న మీ
తండ్రికి మనస్సులేదు.

15 మరియు నీ సహోదరుడు నీకు విరోధముగా
తప్పుచేస్తే, నీవు వెళ్లి, అతనితో ఒంటిగా అతని తప్పు
చెప్పుము. అతడు నీ మాట వింటే నీ సహోదరుని
16 సంపాదించుకొన్నావు.। అయితే అతడు వినకపోతే,
ఇద్దరు ముగ్గురు సాక్షుల నోట ప్రతి మాట స్థిరపరచ
బడేకొరకు, నీతోకూడా ఒకనినైనా ఇద్దరినైనా వెం
17 టబెట్టుకొని వెళ్లుము.। అతడు వారి మాట వినకపోతే,
సంఘమునకు తెలియ చెప్పుము. అతడు సంఘముయొ
క్క మాట వినకపోతే, నీకు అన్యుడుగాను సుంకరి
గాను వాని ఉండనిమ్ము.

18 భూమియందు మీరు వేటిని కట్టుదురో, అవి ఆ
కాశమందు కట్టబడును. భూమియందు మీరు వేటిని
విప్పుదురో అవి ఆకాశమందు విప్పబడునని నిశ్చయ
19 ముగా మీతో చెప్పుతున్నాను.। ఇదగాక మీలో
ఇద్దరు భూమియందు వేడుకొనవలసిన ఏ కార్యమును
గురించియైనా ఏకీభవించితే, అది ఆకాశమందున్న
నా తండ్రివల్ల వారికి కలుగునని మీతో చెప్పుతున్నా
20 ను.। ఇద్దరు ముగ్గురు నా నామమందు ఎక్కడ కూడి
ఉన్నారో, అక్కడ నేను వారి మధ్యను ఉన్నానని
పలికెను.

21 అప్పుడు పేతురు ఆయన యొద్దికి వచ్చి,—నా
సహోదరుడు నా ఎడల తప్పు చేసితే, ఎన్నిమార్లు
అతని క్షమించ వలెను? ఏడు మార్లమట్టుకా? అని
22 అడిగెను.। అందుకు యేసు—ఏడుమార్ల మట్టుకు
కాదు; డెబ్బది యేళ్ల మట్టుకని నీతో చెప్పుతున్నాను.
23 కాబట్టి ఆకాశ రాజ్యము, తన నౌకరుల యొద్ద
లెక్క చూచుకొనుటకు కోరిన ఒక రాజును పోలి
24 యున్నది.। అతడు లెక్క చూచుటకు మొదలు బెట్టిన
ప్పుడు, అతనికి పదివేల తలాంతులు* అచ్చి యున్న
25 ఒకడు అతని యొద్దికి రప్పించబడెను.। అయితే అప్పు
తీర్చుటకు అతని యొద్ద యేమియు లేనందున, అతని
యజమానుడు అతనిని, అతని భార్యను, పిల్లలను, అత
నికి కలిగినది యావత్తును అమ్మి అప్పు తీర్చవలెనని ఆ
జ్ఞాపించెను,। గనుక ఆ నౌకరు అతని ఎదుట సాగిల 26
పడి,—ప్రభువా! నా ఎడల ఓరిమి చేయుము; నీకు అం
తా చెల్లింతునని నమస్కరించెను.। కాబట్టి ఆ నౌకరు 27
యొక్క యజమానుడు కనికరపడి, వాని విడిపించి,
అతని అప్పు క్షమించెను.। అయితే ఆ నౌకరు బైలువెళ్లి, 28
తనకు నూరు దీనారములు† అచ్చి యున్న తనతోటి
పనివారిలో ఒకని చూచి, అతని గొంతుక పట్టుకొని,
—నీవు నాకు అచ్చి యున్నదంతయు చెల్లించుమనెను,।
గనుక అతనితోటి పనివాడు అతని కాళ్ల మీద పడి,— 29
నా ఎడల ఓరిమి చేయుము; నీకు అంతా చెల్లింతునని
అతని బతిమాలుకొనెను.। అయితే అతడు ఒప్పక వెళ్లి, 30
అప్పు చెల్లించే పర్యంతము చెరసాలలో అతని వేయిం
చెను.। అయితే అతనితోటి పనివారు జరిగినవాటిని 31
చూచి, మిక్కిలీ దుఃఖపడి వచ్చి, జరిగినవన్ని తమ
యజమానునికి తెలియచేసిరి.। అప్పుడు అతని యజమా 32
నుడు అతని పిలిపించి,—ఓ చెడ్డ నౌకరూ! నీవు నన్ను
బతిమాలుకొనినందున ఆ అప్పంతటి విషయమై నిన్ను
క్షమించితిని.। నేను నీయందు కరుణించిన ప్రకారము, 33
నీవును నీతోటి పనివాని యందు కరుణించ వలెను
గదా అని అతనితో చెప్పెను.। అప్పుడు అతని యజ 34
మానుడు కోపపడి, తనకు అచ్చి యున్నదంతా చెల్లించే
పర్యంతము, బాధపరచే వారికి అతని అప్పగించెను.।
కాబట్టి మీలో ప్రతివాడు తన తన సహోదరుని 35
తప్పులను మీ హృదయములలో క్షమించకపోతే, ఆ
కాశమందున్న నా తండ్రి ఆ ప్రకారమే మీ యెడల
చేసునని పలికెను.

## 19. అధ్యాయము.

యేసు ఈ వాక్యములు పలికి చాలించిన తర్వాత, 1
ఆయన గలిలైయనుంచి యొర్దానుకు అవతల ఉన్న
యూదైయ ప్రాంతములకు వచ్చెను.। బహు జనసమూ 2
హములు ఆయనను వెంబడించెను గనుక, ఆయన వారిని
అక్కడ స్వస్థపరిచెను.

అప్పుడు ఫరిసైయులు ఆయన యొద్దికి వచ్చి ఆ 3
యనను శోధించుటకు,—పురుషుడు తన భార్యను
ప్రతి హేతువు చేతను విడనాడుట న్యాయమా? అని
పలికిరి.। అందుకు ఆయన,—చేసిన వాడు ఆదియందు 4
పురుషునిగా స్త్రీనిగాను వారిని చేసి,।—ఇందువల్ల పురు 5
షుడు తలిదండ్రులను విడిచి తన భార్యను హత్తుకొని
వారిద్దరు ఏక శరీరమై ఉండ వలెనని చెప్పిన మాట
మీరు చదువలేదా?। కాబట్టి వారు ఇకను ఇద్దరుగా 6

* తలాంతు అనగా, కొంచెము యెక్కువ 2437-తులముల వెండియైనా బంగారమైనా.

† దీనారమనగా, కొంచెము యెక్కువ తక్కువ అయిదణాలనర కావచ్చును.

ఉండక ఏక శరీరమై ఉన్నారు గనుక దేవుడు జతప
రిచినదాని, మనుష్యుడు వేరు చేయ కూడదని వారికి
7 ప్రత్యుత్తరమిచ్చెను. । అప్పుడు వారు—ఆలాగైతే పరి
త్యాగ పత్రమిచ్చి ఆమెను విడనాడుటకు మోశే ఎం
8 దుకు ఆజ్ఞాపించెనని ఆయనను అడిగిరి. । అందుకు ఆ
యన,—మోశే మీ హృదయ కాఠిన్యము వల్ల మీ భా
ర్యలను విడనాడుటకు సెలవిచ్చెను. అయితే ఆదినుంచి
9 ఆలాగు ఉండలేదు. । మరియు వ్యభిచార నిమిత్తమే
గాక తన భార్యను విడనాడి మరి ఒకతెను పెండ్లాడే
వాడెవడో, వాడు వ్యభిచరిస్తున్నాడనియు, విడనాడ
బడిన ఆమెను పెండ్లాడేవాడు వ్యభిచరిస్తున్నాడని
యు మీతో చెప్పతున్నానని వారితో పలికెను.

10 ఆయన శిష్యులు,—భార్యతో పురుషునికి సంబం
ధము ఈ విధముగా ఉంటే, పెండ్లాడుట మంచిది
11 కాదని ఆయనతో పలికిరి. । అందుకు ఆయన,—ఇది
ఎవరికి ఇవ్వబడునో వారేగాని అందరూ ఈ మాట
12 అంగీకరించ నేరరు. । తల్లి గర్భమునుంచి నపుంసకులై
పుట్టినవారు కొందరు కలరు; మనుష్యులవల్ల నపుంసకు
లగా చేయబడిన నపుంసకులు కొందరు కలరు; ఆకాశ
రాజ్యము కొరకు తమ్ముతామే నపుంసకులగా చేసుకొ
నిన నపుంసకులు కొందరు కలరు. అంగీకరించుటకు శక్తి
గల వాడు అంగీకరించుగాక అని వారితో చెప్పెను.

13 అప్పుడు ఆయన వారి మీద చేతులు ఉంచి ప్రా
ర్థించే కొరకు, చిన్నపిల్లలు ఆయన యొద్దికి తేబడిరి.
14 అయితే ఆయన శిష్యులు వారిని గద్దించిరి. । అప్పుడు
యేసు,—చిన్న పిల్లలను నిషేధించక వారిని నా యొద్దికి
రానివ్వండి; ఆకాశ రాజ్యము ఈలాటి వారిదని వారి
15 తో చెప్పి । వారి మీద చేతులు ఉంచి అక్కడనుంచి
వెళ్లిపోయెను.

16 అప్పుడు ఇదుగో ఒకడు (ఆయన) యొద్దికి వచ్చి,—
మంచి బోధకుడా! నేను నిత్యజీవము పొందుటకు ఏ
సత్కార్యము చేయవలెనని ఆయనను అడిగెను.

17 అందుకు ఆయన,—నన్ను మంచివానిగా ఎందుకు
చెప్పతున్నావు? ఒక్కడే అనగా దేవుడే గాని మరి
ఎవడును మంచివాడు కాడు. అయితే ఆ జీవములో
ప్రవేశించుటకు నీవు కోరితే, (ఆయన) ఆజ్ఞలు గైకొను
మని చెప్పెను. అతడు—ఏవని ఆయనను అడిగెను. ।
18 అందుకు యేసు,—నరహత్య చేయ వద్దు, వ్యభిచరించ
వద్దు, దొంగిల వద్దు; అబద్ధ సాక్ష్యము పలుక వద్దు, నీ
19 తలిదండ్రులను ఘనపరుచుము, । నిన్నువలె నీ పొరుగు
20 వాని ప్రేమించ వలెననేవే అని చెప్పెను. । అందుకు
ఆ యౌవనస్థుడు,—వీటినన్నిటిని నా బాల్యమునుంచి
గైకొని యున్నాను; ఇకను నాకు కొదువ ఏమని ఆయ
నను అడిగెను.

అందుకు యేసు,—పూర్ణుడవౌటకు కోరితే, నీవు 21
వెళ్లి, నీ ఆస్తిని అమ్మి దరిద్రులకు ఇమ్ము; అప్పుడు ఆకా
శమందు నీకు ధనము కలుగును: నీవు వచ్చి నన్ను
వెంబడించుమని అతనితో పలికెను. । అయితే ఆ యౌ 22
వనస్థుడు మిక్కిలీ ఆస్తిగలవాడు గనుక ఆ మాట విని
దుఃఖపడి వెళ్లిపోయెను.

అప్పుడు యేసు,—ధనవంతుడు ఆకాశ రాజ్య 23
ములో దుర్లభముగా ప్రవేశించునని మీతో నిజ
ముగా చెప్పతున్నాను. । ధనవంతుడు దేవుని రాజ్య 24
ములో ప్రవేశించుటకంటే, సూది బెజ్జములో ఒంటె
దూరుట సులువుగా ఉన్నదని తిరిగీ మీతో చెప్పతు
న్నానని తన శిష్యులతో పలికెను.

శిష్యులు దీని విని మిక్కిలీ ఆశ్చర్యపడి,—ఈలా 25
గైతే ఎవడు రక్షణ పొంద గలడని పలికిరి. । యేసు 26
వారిని చూచి,—ఇది మనుష్యులకు అసాధ్యము;
అయితే దేవునికి సమస్తము సాధ్యమని చెప్పెను.

అప్పుడు పేతురు,—ఇదుగో మేము సమస్తమును 27
విడిచి నిన్ను వెంబడించినాము గనుక మాకు ఏమి కలు
గునని ఆయనకు ప్రత్యుత్తరమిచ్చెను.

అందుకు యేసు—పునస్థాపనమందు,* మనుష్య 28
కుమారుడు తన మహిమగల† సింహాసనము మీద కూ
ర్చుండేటప్పుడు, నన్ను వెంబడించిన మీరును పన్నెండు
సింహాసనముల మీద కూర్చుండి, ఇశ్రాయేలు పన్నెం
డు గోత్రములకు తీర్పు చేతురు. । మరియు నా నామ 29
ము కొరకు ఇండ్లనైనా అన్నదమ్ములనైనా అక్కచెల్లెం
డ్లనైనా తండ్రినైనా తల్లినైనా భార్యనైనా పిల్లలనైనా
భూములనైనా విడిచిపెట్టిన ప్రతివాడు నూరంతలు
ఎక్కువ పొంది, నిత్యజీవము స్వతంత్రించుకొనును. ।
అయితే మొదటివారైన అనేకులు కడపటివారౌదురు; 30
కడపటివారు మొదటివారౌదురు.

## 20. అధ్యాయము.

ఆకాశరాజ్యము ఇంటి యజమానుడైన మనుష్యుని 1
పోలి యున్నది. అతడు తన ద్రాక్షతోటలో పనివా
రిని కూలికి పెట్టుకొనుటకు ప్రొద్దుట బైలు వెళ్లెను. ।
దినమునకు ఒక దీనారము చొప్పున ఇచ్చుటకు పని 2
వాండ్లతో ఒడబడి ద్రాక్షతోటలోకి వారిని పం
పెను. । తరువాత దాదాపుగా మూడు ఘంటలకు బైలు 3
వెళ్లి, సంతలో ఊరకే నిలిచి యున్న మరి కొందరిని

*లేక, కుదురబాటున. †లేక, వైభవముగల.

4 చూచి।—మీరును ద్రాక్ష తోటకు వెళ్లండి; ఏది
న్యాయమో అది మీకు ఇత్తునని వారితో చెప్పెను
5 గనుక వారు వెళ్లిరి.। తిరిగీ దాదాపుగా ఆరు ఘంట
లకును తొమ్మిది ఘంటలకును బైలు వెళ్లి ఆలాగు చేసె
6 ను.। మరియు దాదాపుగా పదకొండు ఘంటలకు బైలు
వెళ్లి ఊరకే నిలిచి యున్న మరి కొందరిని చూచి,—
మీరు ఇక్కడ దినమంతా ఎందుకు ఊరకే నిలుస్తు
7 న్నారని వారిని అడిగెను.। అందుకు వారు,—ఎవ
డును మమ్మును కూలికి పెట్టుకొనలేదనిరి. అందుకు
అతడు,—మీరును ద్రాక్ష తోటకు వెళ్లండి; న్యాయ
మైనది మీకు దొరుకునని వారితో చెప్పెను.

8 సాయంకాలమందు ఆ ద్రాక్షతోట యజమా
నుడు తన ఉగ్రాణపు వానితో,—పనివాండ్లను పిలిచి,
కడపటి వారు మొదలుకొని మొదటి వారి మట్టుకు
9 వారికి కూలి ఇమ్మని చెప్పెను.। అప్పుడు దాదాపుగా
పదకొండు ఘంటలప్పుడు కూలికి పెట్టబడినవారు
వచ్చి ఒక్కొక్క దీనారము చొప్పున పుచ్చుకొనిరి.।
10 అయితే మొదటి వారు వచ్చి, తమకు ఎక్కువ దొరు
కునని తలంచుకొనిరి. అయితే వారును ఒక్కొక్క దీనా
11 రము చొప్పున పుచ్చుకొనిరి.। వారు పుచ్చుకొని—
12 ఈ కడపటి వారు ఒక ఘంట మాత్రమే పని చేసిన
ప్పటికి, దినముయొక్క భారము, మాడ్చే ఎండయు
సహించిన మాతో వారిని సముల చేసినావని ఆ ఇంటి
13 యజమానుని మీద సణుగుకొనిరి.। అయితే అతడు,—
స్నేహితుడా! నీకు అన్యాయము నేను చేయలేదు;
14 నీవు నాయొద్ద ఒక దీనారమునకు ఒడబడలేదా?। నీది
నీవు పుచ్చుకొని పొమ్ము; నీకు ఇచ్చిన ప్రకారమే ఈ
కడపటి వానికి ఇచ్చుటకు నాకు మనస్సు కలదు.।
15 నాకు మనస్సు వచ్చినట్టు, నా వాటిలో చేయుట
న్యాయము కాదా? నేను మంచివాడనైనందున నీ
కన్ను చెడ్డదై యున్నదా? అని వారిలో ఒకనికి ప్రత్యు
త్తరమిచ్చెను.

16 ఈ ప్రకారము కడపటి వారు మొదటివారౌదురు,
మొదటి వారు కడపటివారౌదురు; పిలువబడిన వారు
అనేకులు; ఏర్పరచబడినవారు కొందరని వారితో
చెప్పెను.

17 యేసు యెరూశలేమునకు వెళ్లుతూ, తోవలో పన్నెం
డుమంది శిష్యులను ఏకాంతమునకు తీసుకొనిపోయి,।
18 —ఇదుగో! యెరూశలేమునకు వెళ్లుతున్నాము; అక్కడ
మనుష్య కుమారుడు ప్రధాన యాజకులకు, శాస్త్రుల
కును అప్పగించబడును. వారు ఆయనను మరణమునకు
19 విధించి। ఆయనను అపహసించుటకును, వారులతో కొ
ట్టుటకు, శిలువ వేయుటకును రాష్ట్రములకు ఆయనను
అప్పగింతురు; మూడవ దినమందు ఆయన మళ్లీ లేచు
నని వారితో చెప్పెను.

అప్పుడు జెబెదై కుమారుల తల్లి తన కుమారులతో 20
కూడా ఆయన యొద్దికి వచ్చి నమస్కరించి ఒకదాని
ఆయనను అడిగెను.। అయితే ఆయన,—నీవు ఏమి 21
కోరుతున్నావని అడిగినప్పుడు ఆమె,—నీ రాజ్యమందు
ఈ నా ఇద్దరు కుమారులు నీ కుడితట్టు ఒకడు నీ
ఎడమతట్టు ఒకడు కూర్చుండుటకు సెలవిమ్మని ఆయ
నతో పలికెను.

అయితే యేసు,—మీరు అడిగినది ఎట్టిదో మీకు 22
తెలియదు; నేను తాగబోయే గిన్నెలో తాగుటకైనా,
లేక నేను పొందుతున్న బాప్తిస్మము పొందుటకైనా
మీకు శక్తి కలదా? అని ప్రత్యుత్తరమిచ్చెను.

అందుకు వారు,—శక్తి కలదనిరి. అప్పుడు ఆయన,— 23
మీరు నా గిన్నెలో తాగుదురు, నేను పొందుతున్న
బాప్తిస్మము పొందుదురు; అయితే నా కుడితట్టున నా
యెడమతట్టున కూర్చుండుట నా తండ్రిచేత ఎవరికి
సిద్ధపరచబడెనో, వారికే గాని మరి ఎవరికిని ఇచ్చు
టకు నాది కాదని చెప్పెను.

పదిమంది దాని విని, ఆ ఇద్దరి సహోదరుల మీద 24
కోపపడిరి.

అయితే యేసు వారిని తన యొద్దికి పిలిచి,—రాష్ట్ర 25
ముల అధిపతులు వారి మీద దొరతనము చేస్తున్నారు;
గొప్పవారు వారి మీద అధికారము జరిగిస్తున్నారని
మీకు తెలుసును;। మీలో ఆలాగు ఉండ కూడదు; 26
మీలో ఎవడైనా గొప్పవాడవుటకు కోరితే, అతడు
మీ పరిచారకుడై ఉండ వలెను.। మీలో ఎవడైనా 27
ముఖ్యుడవుటకు కోరితే, అతడు మీ దాసుడై ఉండ
వలెను.। ఈలాగే మనుష్య కుమారుడు పరిచర్య చేయు 28
టకును, అనేకుల కొరకు విమోచన క్రయధనముగా
తన ప్రాణము ఇచ్చుటకును వచ్చెను, గాని పరిచర్య
పొందుటకు కాదని చెప్పెను.

వారు యెరిఖోనుంచి బైలు వెళ్లుచుండగా బహు 29
జనసమూహము ఆయనను వెంబడించెను.। అప్పుడు 30
ఇదుగో! తోవ పక్కను కూర్చున్న ఇద్దరు గుడ్డివారు
యేసు ఈలాగు వెళ్లుతున్నాడని విని,—ప్రభువా! దా
వీదు కుమారుడా! మమ్ము కరుణించుమని నోరెత్తి
పలికిరి.। వారు ఊరకుండుటకు ఆ సమూహము వారిని 31
గద్దించెను. అయితే వారు,—ప్రభువా! దావీదు కుమా
రుడా! మమ్ము కరుణించుమని మరీ ఎక్కువగా నో
రెత్తి పలికిరి.

32 అప్పుడు యేసు నిలిచి వారిని పిలిచి,—నేను మీ
కొరకు ఏమి చేయుటకు కోరుతున్నారని అడిగెను.।
33 అందుకు వారు,—ప్రభువా! మా కన్నులు తెరవబడు
34 టకే అని ఆయనతో చెప్పిరి.। అప్పుడు యేసు కనిక
రపడి వారి కన్నులు ముట్టెను. వెంటనే వారి కన్నులు
దృష్టి పొందెను; వారు ఆయనను వెంబడించిరి.

## 21. అధ్యాయము.

1 తర్వాత యెరూశలేముకు సమీపిస్తూ, ఒలీవ చెట్ల
కొండ దగ్గర ఉన్న బేత్ఫగేకు చేరినప్పుడు యేసు।
2 —మీ ఎదుట ఉన్న పల్లెకు వెళ్లండి; అప్పుడే, కట్టబడిన
ఒక గాడిదెను, దానితో ఉన్న ఒక పిల్లను కనుగొం
దురు. వాటిని విప్పి నా యొద్దికి తీసుకొని రండి.।
3 ఎవడైనా మీతో ఏమైనా పలికితే,—అవి ప్రభువుకు
కావలసి యున్నవని చెప్పండి; వెంటనే అతడు వాటిని
పంపునని ఇద్దరు శిష్యులతో చెప్పి వారిని పంపెను.
4,5 —ఇదుగో! నీ రాజు సాత్వికుడై గాడిదెను ఎక్కి,
భారవాహక పశువుయొక్క పిల్లయైన చిన్న గాడి
దెనెక్కి, నీ యొద్దికి వచ్చుచున్నాడని, సీయోను
కుమారితో చెప్పండని ప్రవక్త ద్వారా పలికించబడి
నది నెరవేరుటకు ఇదంతయు జరిగెను.
6 శిష్యులు వెళ్లి, యేసు వారికి ఆజ్ఞాపించిన ప్రకా
7 రము చేసి,। ఆ గాడిదెను గాడిదెపిల్లను తీసుకొనివచ్చి,
వాటిమీద తమ బట్టలు వేసి, వాటి మీద ఆయనను
8 ఎక్కించిరి.। మరియు అత్యధికమైన జనసమూహము
తమ బట్టలు దారి పొడుగున పరిచెను. మరి కొందరు
9 చెట్ల కొమ్మలు నరికి దారి పొడుగున పరిచిరి.। ఆ జన
సమూహములలో ముందు నడిచేవారును వెనుక వచ్చే
వారును,—

దావీదు కుమారునికి హొసన్నా*!
ప్రభువు పేరట వచ్చేవాడు స్తుతించబడు గాక!
సర్వోన్నతమైన వాటిలో హొసన్నా!

అని నోరెత్తి పలికిరి.
10 .ఆయన యెరూశలేములోకి వచ్చినప్పుడు, పట్టణ
11 మంతయు కలతపడి,—ఈయన ఎవడని అడిగిరి.। అం
దుకు ఆ జనసమూహములు,—ఈయన గలిలైయలోని
నజరెతుయొక్క ప్రవక్తయైన యేసు అని చెప్పెను.
12 యేసు దేవుని గుడిలోకి వెళ్లి, గుడిలో క్రయ
విక్రయములు చేసే వారినందరిని వెళ్లగొట్టి, రూకలు
మార్చేవారి బల్లలను, గువ్వలు అమ్మేవారి పీఠములను
13 పడదోసి।—నా ఇల్లు ప్రార్థన ఇల్లు అనబడును;†
మీరు దాని దొంగలగుహగా చేసితిరని‡ వ్రాయబడి
యున్నదని; వారితో చెప్పెను.

అప్పుడు గుడ్డివారు, కుంటివారును గుడిలో ఆయన 14
యొద్దికి వచ్చిరి. ఆయన వారిని స్వస్థపరిచెను.
అప్పుడు ప్రధాన యాజకులు, శాస్త్రులును ఆయన 15
చేసిన అద్భుతములను,—దావీదు కుమారునికి హొసన్నా! అని గుడిలో నోరెత్తి పలుకుతు ఉన్న చిన్న
వారిని చూచి, కోపము తెచ్చుకొని।—వీరు పలుకు 16
తున్నదాని వింటున్నావా? అని ఆయనను అడిగిరి.
అందుకు యేసు,—అవును బాలురయొక్కయు, చంటి
పిల్లలయొక్కయు, నోటిలోనుంచి స్తోత్రము సిద్ధింప
చేసితివి§ అనే దాని మీరు ఎన్నడును చదువలేదా అని
వారితో పలికెను.
అప్పుడు ఆయన వారిని విడిచి, పట్టణమునుంచి 17
బేథనియకు బైలువెళ్లి అక్కడ బస చేసెను.
ఉదయమందు ఆయన పట్టణమునకు తిరిగీ వెళ్లుతూ 18
ఉండగా ఆయనకు ఆకలి పుట్టెను.। అప్పుడు తోవ 19
పక్కను ఒంటిగా ఉన్న అంజూరపు చెట్టు చూచి,
దాని యొద్దికి వచ్చి, ఆకులు మాత్రమే గాక దాని
యందు మరి ఏమియు కనుగొనలేదు గనుక, — ఇక
మీదట నీకు ఎప్పుడును ఫలము పుట్టక ఉండును
గాక అని దానితో పలికెను. వెంటనే ఆ అంజూరపు
చెట్టు వాడిపోయెను.। శిష్యులు దీని చూచి ఆశ్చర్య 20
పడి,—అంజూరపు చెట్టు ఎంత శీఘ్రముగా వాడిపో
యెనని చెప్పుకొనిరి.
అందుకు యేసు, — మీరు విశ్వాసము గలవారై 21
సందేహపడకుంటే, ఈ అంజూరపు చెట్టుకు జరిగినది
చేయుట మాత్రమే కాదు, — నీవు ఎత్తబడి సముద్ర
ములో పడవేయబడుదువు గాక అని ఈ పర్వతము
తో చెప్పితే అలాగు అవునని మీతో నిజముగా
చెప్పుతున్నాను.। మరియు మీరు విశ్వాసము గలవారై 22
ప్రార్థనవల్ల ఏవి అడుగుదురో వాటినన్నిటిని పొం
దుదురని వారికి ప్రత్యుత్తరమిచ్చెను.
ఆయన గుడిలో ప్రవేశించి బోధిస్తూ ఉన్నప్పుడు, 23
ప్రధాన యాజకులు, ప్రజల పెద్దలును ఆయన యొ
ద్దికి వచ్చి, — ఏ అధికారమువల్ల వీటిని చేస్తున్నావు!
ఈ అధికారము నీకు ఎవడు ఇచ్చెనని ఆయనను
అడిగిరి.
అందుకు యేసు, — నేనును మిమ్ము ఒక మాట 24
అడుగుదును; అది మీరు నాతో చెప్పితే నేనును
ఏ అధికారమువల్ల వీటిని చేస్తున్నానో అది మీతో
చెప్పుదును.। యోహాను బాప్తిస్మము ఎక్కడనుంచి కలి 25
గెను? ఆకాశమువల్లనా? మనుష్యులవల్లనా? అని వారిని
అడిగెను.

*అనగా, పాహి, రక్షించుమి. †యెషయ, 56: 7. ‡యెరెమి. 7: 11. §కీర్తన, 8: 2.

అయితే వారు, — మనము ఆకాశమునుంచి అని
చెప్పితిమా, ఆయన, — ఆలాగైతే మీరు యెందుకు
26 ఆయనను నమ్మలేదని మనతో పలుకును. । మనుష్యుల
వల్లనని చెప్పితిమా, జనులకు భయపడుతున్నాము; అం
దరు యోహానును ప్రవక్త అని ఎంచుతున్నారు అని
27 తమలోతాము ఆలోచించుకొని। —మాకు తెలియదని
యేసుకు ప్రత్యుత్తరమిచ్చిరి.

28 అప్పుడు ఆయన, — నేనును ఏ అధికారమువల్ల
వీటిని చేస్తున్నానో అది మీతో చెప్పను. అయితే
మీకు ఏమి తోస్తున్నది? ఒక మనుష్యునికి ఇద్దరు
కుమారులు ఉండిరి. ఆయన మొదటి వాని యొద్దికి
వచ్చి, — కుమారుడా! నీవు వెళ్లి ఈ దినమున నా
29 ద్రాక్ష తోటలో పని చేయుమని పలికెను.। అందుకు
అతడు, — నాకు మనస్సు లేదని ప్రత్యుత్తరమిచ్చి,
30 తర్వాత పశ్చాత్తాపపడి వెళ్లెను.। ఆయన రెండవ వాని
యొద్దికి వచ్చి ఆ ప్రకారమే చెప్పినప్పుడు, అతడు,—
ప్రభువా! నేను (వెళ్లుతున్నాను) అని ప్రత్యుత్తర
మిచ్చెను గాని వెళ్లలేదు. ఈ ఇద్దరిలో ఎవడు తండ్రి
ఇష్టము చొప్పున చేసెనని అడిగెను.

31 అందుకు వారు, — మొదటివాడే అని ఆయనతో
చెప్పిరి. యేసు వారితో పలికినదేమంటే,—సుంకరులు
వేశ్యలును మీ కంటే ముందుగా దేవుని రాజ్యము
లోకి సాగుతున్నారని మీతో నిజముగా చెప్పుతు
32 న్నాను. । యోహాను నీతి మార్గమున మీ యొద్దికి
వచ్చెను; మీరు ఆయనను నమ్మలేదు; అయితే సుంక
రులు వేశ్యలును ఆయనను నమ్మిరి. మీరు దాని చూ
చిన తర్వాత, ఆయనను నమ్మటకు పశ్చాత్తాపపడలేదు.

33 మరియొక ఉపమానము వినండి, ఇంటి యజమాను
డైన ఒక మనుష్యుడు ఉండెను. అతడు ద్రాక్ష
తోట నాటించి, దాని చుట్టూ కంచె వేయించి, అం
దులో ద్రాక్షల తొట్టి తొలిపించి, అరప కట్టించి,
దాని కాపులకు గుత్తకిచ్చి పరదేశమునకు వెళ్లెను.।
34 పండ్ల కాలము సమీపించినప్పుడు, తన పండ్లను పుచ్చు
కొనుటకు, ఆ కాపుల యొద్దికి తన నౌకరులను పం
35 పెను. । అప్పుడు ఆ కాపులు ఆయన నౌకరులను పట్టు
కొని, ఒకని కొట్టిరి, మరి యొకని చంపిరి, మరియొకని
36 మీద రాళ్లు రువ్విరి. । మళ్లీ అతడు మునుపటి వారి
కంటే ఎక్కువగా వేరే నౌకరులను పంపెను. వారు
37 వీరినిని ఆప్రకారమే చేసిరి.। తుదకు,—నా కుమారుని
సన్మానింతురనుకొని, తన కుమారుని వారి యొద్దికి పం
38 పెను. । అయితే ఆ కాపులు ఆ కుమారుని చూచి,—
ఇతడు ఆస్తికర్త, ఇతని చంపి ఇతని ఆస్తి కర్తృత్వము
పొందుదము రండని తమలో తాము అనుకొని, । అతని 39
పట్టుకొని ద్రాక్షతోట వెలపట వేసి చంపిరి. । కా 40
వున ఆ ద్రాక్షతోట యజమానుడు వచ్చినప్పుడు, ఆ
కాపులను ఏమి చేసునని (అడిగెను.)

అందుకు వారు,—ఆ దుష్టులను కఠినముగా సంహ 41
రించి, అతనికి ఫలములు వాటి కాలములయందు ఇయ్య
గల వేరే కాపులకు ఆ ద్రాక్షతోట గుత్తకిచ్చునని
ఆయనతో పలికిరి.

అప్పుడు యేసు, 42

—ఇల్లు కట్టేవారు ఏ రాతిని ఉపేక్షించిరో
అదే మూలకు తల అయినది;
ఇది ప్రభువు వల్లనే కలిగెను,
ఇది మన కన్నులకు ఆశ్చర్యమైయున్నది*

మీరు లేఖనములలో ఎన్నడును చదువలేదా! । కా 43
బట్టి దేవుని రాజ్యము మీ యొద్దనుంచి తీయబడి,
దాని ఫలమియ్యగల జనులకు ఇయ్యబడునని మీతో
చెప్పుతున్నాను. । మరియు ఈ రాతిమీద పడే వాడు 44
నలిగి పోవును; అది ఎవని మీద పడునో, వానిని
పొడి చేసునని వారితో పలికెను.

ప్రధాన యాజకులు, ఫరిసైయులును ఆయన ఉప 45
మానములను విని తమ్మును గురించి మాట్లాడెనని గ్ర
హించి, । ఆయనను పట్టుకొనుటకు కోరుతునుండిరి 46
గాని జనులకు భయపడిరి; జనులు ఆయనను ప్రవక్త
అని ఎంచిరి.

## 22. అధ్యాయము.

కాబట్టి యేసు తిరిగీ ఉపమానములతో వారికి 1
ఇట్లనియె।—ఆకాశ రాజ్యము తన కుమారునికి పెండ్లి 2
విందు చేసిన ఒక రాజుని పోలియున్నది.। ఆయన 3
పిలువబడిన వారిని, ఆ విందుకు పిలుచుటకు తన నౌక
రులను పంపెను. అయితే వారు వచ్చుటకు మనస్సు
లేక ఉండిరి. । తిరిగీ ఆయన,—ఇదుగో! నా భోజనము 4
సిద్ధపరిచి యున్నాను; నా యెద్దులు, కొవ్విన పశువు
లును చంపబడి అంతా సిద్ధమై యున్నది. పెండ్లి విం
దుకు రండని పిలువబడిన వారితో చెప్పుటకు వేరే
నౌకరులను పంపెను. । అయితే వారు అశ్రద్ధచేసి, 5
ఒకడు తన పొలమునకు, మరి యొకడు తన వర్తకము
నకు వెళ్లిరి.। తక్కినవారు అతని నౌకరులను పట్టుకొని, 6
అవమానపరిచి చంపిరి. । రాజు దీని విని, కోపపడి, 7
తన దండును పంపి ఆ నరహంతకులను నాశము చే
యించి, వారి పట్టణము కాల్చివేసెను.

*కీర్త. 118: వ. 22.

8 అప్పుడు ఆయన,—పెండ్లి విందు సిద్ధమైయున్నది;
9 అయితే పిలువబడిన వారు యోగ్యులు కారు। గనుక
రాజమార్గములకు వెళ్లి, మీరు చూచే వారినందరిని
పెండ్లి విందుకు పిలువండని తన నౌకరులతో చెప్పె
10 ను.। కాబట్టి ఆ నౌకరులు మార్గములకు వెళ్లి, చెడ్డ
వారే గాని మంచివారే గాని తమకు అగుపడే వారి
నందరిని పోగుచేసిరి; అప్పుడు కూర్చున్న వారితో
11 ఆ పెండ్లి విందు నెరవేరెను.। రాజు కూర్చున్న వారిని
పారచూచుటకు లోపలికి వచ్చి, అక్కడ పెండ్లి వస్త్ర
12 ము వేసుకొనని ఒక మనుష్యుని చూచి।—స్నేహితుడా!
పెండ్లి వస్త్రము లేక ఇక్కడికి ఏలాగు వచ్చితివని
అడిగెను. అప్పుడు అతడు మౌనియై యుండెను.।
13 అప్పుడు రాజు, — ఇతని కాళ్లు చేతులు కట్టి, ఇతని
మోసుకొని పోయి, వెలపటి చీకటిలో పడవేయండి.
అక్కడ ఏడ్పు, పండ్లు కొరుకుటయు ఉండునని పరి
14 చారకులతో చెప్పెను;। పిలువబడినవారు అనేకులు,
ఏర్పరచబడినవారు కొందరే అని పలికెను.

15 అప్పుడు ఫరిసైయులు వెళ్లి, ఆయనను మాటవల్ల
ఏలాగు చిక్కుపరచ వచ్చునో అది ఆలోచించి।—
16 బోధకుడా! నీవు సత్యవంతుడవై ఎవని గూర్చియు
లక్ష్యపెట్టక దేవుని మార్గము నిజముగా బోధిస్తు
న్నావు; నీవు మనుష్యుల ముఖము చూడవని ఎరుగు
17 దుము;। కైసరుకు పన్ను ఇచ్చుట న్యాయమా కాదా?
నీకు తోచినది మాతో చెప్పుమని అడుగుటకు హేరో
దీయులతో తమ శిష్యులను ఆయన యొద్దికి పంపిరి.
18 అయితే యేసు వారి చెడుతనము ఎరిగి,—వేషధా
19 రులారా! నన్ను ఎందుకు శోధిస్తున్నారు?। పన్ను ము
ద్రిక ఒకటి నాకు చూపండని వారితో చెప్పినప్పుడు,
20 వారు ఆయన యొద్దికి ఒక దీనారము తెచ్చిరి.। అప్పుడు
ఆయన,—ఈ స్వరూపము, పై వ్రాతయు ఎవరివని
21 వారిని అడిగెను.। అప్పుడు వారు,—కైసరువని చెప్పిరి.
అందుకు ఆయన,—కావున, కైసరువి కైసరుకును దేవు
నివి దేవునికిని చెల్లించండని వారితో పలికెను.
22 వారు దీని విని ఆశ్చర్యపడి, ఆయనను విడిచి
వెళ్లిరి.

23 ఆ దినమందు పునరుత్థానము లేదని చెప్పే సద్దూ
కైయులు ఆయన యొద్దికి వచ్చి, ఆయనను అడిగినదే
24 మంటే।—బోధకుడా! ఎవడైనా పిల్లలు లేక చనిపోతే
అతని సహోదరుడు అతని భార్యను పెండ్లాడి, తన
సహోదరునికి సంతానము కలుగచేయ వలెనని
25 మోషే చెప్పెను.। ఆ చొప్పున మాలో ఏడుగురు స
హోదరులు ఉండిరి. మొదటివాడు పెండ్లాడి చని
పోయెను; అతనివల్ల సంతానము లేనందున తన భా
ర్యను తన సహోదరునికి విడిచెను.। ఏడవ వాని 26
మట్టుకు రెండవవాడు మూడవవాడు మొదలైనవారు
ఈలాగే జరిగించిరి.। అందరి వెనుక ఆ స్త్రీ కూడా 27
చనిపోయెను.। కాబట్టి ఆమె వీరందరికిని భార్యగా 28
ఉండెను గనుక పునరుత్థానమందు ఈ ఏడుగురిలో
ఎవనికి భార్యగా ఉండునని అడిగిరి.

అందుకు యేసు,—మీరు లేఖనములను, దేవుని శక్తిని 29
ఎరుగక తప్పి పోతున్నారు;। పునరుత్థానమందు పెం 30
డ్లాడరు, పెండ్లికియ్యబడరు, ఆకాశమందున్న దేవుని
దూతలవలె ఉందురు.। అయితే, — నేను అబ్రాహా 31-
ము దేవుడను, ఈసాకు దేవుడను, యాకోబు దేవు 32
డనై యుంటున్నానని పలికిన దేవునివల్ల మృతుల
పునరుత్థానమును గురించి మీతో చెప్పబడిన దాని
మీరు చదువలేదా! దేవుడు జీవించుచున్న వారికే దే
వుడై యున్నాడు గాని చనిపోయిన వారికి కాడని
వారికి ప్రత్యుత్తరమిచ్చెను.। జనసమూహములు అది 33
విని ఆయన బోధకు ఆశ్చర్యపడెను.

అయితే ఆయన సద్దూకైయుల నోరు మూయించె 34
నని ఫరిసైయులు విని కూడి వచ్చిరి.। అప్పుడు వారిలో 35
ఒక శాస్త్రి ఆయనను శోధిస్తూ।— బోధకుడా! బోధన 36
ప్రమాణములో ముఖ్యమైన ఆజ్ఞ ఏదని అడిగెను.।
అందుకు యేసు,—నీ పూర్ణ హృదయముతోను నీ 37
పూర్ణాత్మతోను నీ పూర్ణ మనస్సుతోను నీ దేవు
డైన ప్రభువును ప్రేమించ వలెననేదే.। ఇది మొదటిది 38
గొప్పదియునైన ఆజ్ఞయై యున్నది.। నీవు నిన్నువలె నీ 39
పొరుగువాని ప్రేమించ వలెననే రెండవదియు దాని
వంటిదే.। బోధన ప్రమాణమంతటికి ప్రవక్తలకును ఈ 40
రెండు ఆజ్ఞలు ఆధారమై యున్నవని అతనితో చె
ప్పెను.

ఫరిసైయులు కూడి యున్నప్పుడు, యేసు వారిని 41
చూచి।—క్రీస్తును గూర్చి మీకేమి తోస్తున్నది? ఆయన 42
యెవని కుమారుడని అడిగెను. వారు,—దావీదు కుమా
రుడని చెప్పిరి.। అందుకు ఆయన,—అలాగైతే,—నేను 43-
నీ శత్రువులను నీ పాదపీఠముగా ఉంచేమట్టుకు, నీవు 44
నా కుడివైపున కూర్చుండుమని నా ప్రభువుతో ప్ర
భువు చెప్పెను అని దావీదు పలుకుతూ ఆత్మవల్ల ఆయ
నను ప్రభువని ఏలాగు చెప్పెను?। కాబట్టి దావీదు 45
ఆయనను ప్రభువని చెప్పితే, ఆయన ఏలాగు అతని
కుమారుడై యుండునని వారితో పలికెను.

46 అందుకు ఎవడును ఒక మాటనైనా ప్రత్యుత్తర
ముగా చెప్పలేక పోయెను. మరియు ఆ దినమునుంచి
ఎవడును ఆయనను ఏమియు అడుగుటకు తెగించలేదు.

## 23. అధ్యాయము.

1 అప్పుడు యేసు జనసమూహములతోను, తన శిష్యు
2 లతోను, ఇట్లనియె।—శాస్త్రులు ఫరిసైయులును మోషే
3 పీఠము మీద కూర్చుంటున్నారు। గనుక వారు వేటిని
గైకొనుటకు మీతో చెప్పుదురో వాటినన్నిటిని
గైకొని చేయండి; అయితే వారి కార్యముల చొప్పున
చేయకండి; వారు చెప్పుతున్నారే గాని చేయరు।
4 ఏలాగంటే వారు దుస్సహనము భారమునైన బరు
వులు కట్టి, మనుష్యుల భుజముల మీద పెట్టుతు
న్నారే గాని తమ వేలితో వాటిని కదుపుటకైనా
5 వారికి ఇష్టము లేదు.। మనుష్యులకు అగుపడుటకు తమ
సమస్త కార్యములు చేస్తున్నారు. తమ రక్షరేకులు
వెడల్పుగాను, తమ వస్త్రముల జాలరులు విశాలము
6 గాను చేస్తూ। విందులలో అగ్రస్థానములను సునగో
7 గులలో అగ్రపీఠములను,। సంతలలో వందనములను,
మనుష్యులచేత రబ్బీ! రబ్బీ! అనిపించుకొనుటను కోరు
8 తున్నారు। గాని మీరైతే, రబ్బీ అనిపించుకొన వద్దు;
క్రీస్తు ఒక్కడే మీ బోధకుడై యున్నాడు; మీరం
9 దరు సహోదరులై యున్నారు.। మరియు భూమి
యందు మీ తండ్రి అని యెవనినైనా పిలువ వద్దు;
ఆకాశమందున్న ఒక్కడే మీ తండ్రియై యున్నా
10 డు.। మరియు మీరు గురువులనిపించుకొన వద్దు; క్రీస్తు
11 ఒక్కడే మీకు గురువైయున్నాడు.। అయితే మీలో
12 గొప్పవాడు మీ పరిచారకుడై యుండవలెను.। తన్ను
తాను హెచ్చించుకొనే వాడు తగ్గించబడును, తన్ను
తాను తగ్గించుకొనే వాడు హెచ్చించబడును.

13 అయ్యో! వేషధారులైన శాస్త్రులారా! ఫరిసైయు
లారా! మనుష్యుల యెదుట ఆకాశ రాజ్యమును మూ
స్తున్నారు; మీరు అందులో ప్రవేశించక, ప్రవేశించే
వారిని ప్రవేశించనియ్యరు.

14 అయ్యో! వేషధారులైన శాస్త్రులారా! ఫరిసైయు
లారా! మీరు మిషచేతను దీర్ఘ ప్రార్థనలు చేసి,
విధవల ఇండ్లు తినివేస్తున్నారు. ఇందువల్ల మీరు
ఎక్కువైన శిక్షావిధి పొందుదురు.

15 అయ్యో! వేషధారులైన శాస్త్రులారా! ఫరిసైయు
లారా! మీరొక మతస్థుని కలుపుకొనుటకు సముద్ర
మందును భూమియందును సంచరిస్తున్నారు. అతడు
కలిస్తే, అతనిని మీకంటే రెండంతలు గహెన్న కుమా
రునిగా చేస్తున్నారు.

అయ్యో! అంధులైన మార్గదర్శకులారా!—ఎవడు 16
దేవాలయము మీద ఒట్టుబెట్టుకొన్నప్పటికి దానిలో
ఏమియు లేదు; అయితే దేవాలయపు బంగారము
మీద ఒట్టుబెట్టుకొనే వాడు బాధ్యపడి యున్నాడని
మీరు చెప్పుతున్నారు.। అవివేకులారా! అంధులారా! 17
ఏది గొప్పది? బంగారమా? లేక బంగారము పరిశుద్ధ
పరిచే దేవాలయమా?। మరియు—వేదిక మీద ఎవడైనా 18
ఒట్టుబెట్టుకొన్నప్పటికిని దానిలో ఏమియు లేదు,
అయితే దాని పైని ఉండే కానుక మీద ఒట్టుబెట్టు
కొనే వాడు బాధ్యుడై యున్నాడని మీరు చెప్పుతు
న్నారు.। అవివేకులారా! అంధులారా! ఏది గొప్పది, 19
కానుకా? లేక కానుకను పరిశుద్ధపరిచే వేదికా?।
కాబట్టి వేదిక మీద ఒట్టుబెట్టుకొనే వాడు దాని 20
మీదను, దాని పైని ఉండే అన్నిటి మీదను ఒట్టు
బెట్టుకొంటున్నాడు.। మరియు దేవాలయము మీద 21
ఒట్టుబెట్టుకొనే వాడు దాని మీదను, అందులో నివ
సించే వాని మీదను ఒట్టుబెట్టుకొంటున్నాడు.। మరి 22
యు ఆకాశము మీద ఒట్టుబెట్టుకొనే వాడు దేవుని
సింహాసనము మీదను, దాని పైని కూర్చున్న వాని
మీదను ఒట్టుబెట్టుకొంటున్నాడు.

అయ్యో! వేషధారులైన శాస్త్రులారా! ఫరిసైయు 23
లారా! మీరు పుదీనాలోను సోపులోను జీలకర్ర
లోను పదోవంతు అర్పించి, బోధన ప్రమాణము
యొక్క ముఖ్యమైన వాటిని, అనగా న్యాయమును
కనికరమును విశ్వాసమును మానితిరి. వాటిని మానక,
వీటిని చేయవలసియుండెను.। అంధులైన మార్గదర్శ 24
కులారా! దోమను గురించి వడియకట్టి, ఒంటెను
మింగే వారు మీరే.

అయ్యో! వేషధారులైన శాస్త్రులారా! ఫరిసైయు 25
లారా! మీరు గిన్నెయు, తబుకును వెలపట శుచి
చేస్తున్నారే గాని అవి లోపట దోపుతోను బలా
త్కారముతోను నిండి యున్నవి.। గుడ్డి ఫరిసైయు 26
డా! గిన్నెయు తబుకును వెలపట శుచి అయ్యే కొరకు,
ముందుగా వాటి లోపల శుచి చేయుము.

అయ్యో! వేషధారులైన శాస్త్రులారా! ఫరిసైయు 27
లారా! మీరు సున్నము వేసిన సమాధులను పోలి
యున్నారు. అవి వెలపట శృంగారముగా అగు
పడుతున్నవి గాని, లోపట అవి చచ్చిన వారి యెము
కలతోను, సమస్తమైన అపవిత్రతతోను, నిండి యు
న్నవి.। ఆలాగే మీరును వెలపట నీతిమంతులుగా 28

మనుష్యులకు అగుపడుతున్నారు గాని, లోపట వేష
ధారణతోను అక్రమముతోను నిండి యున్నారు.
29 అయ్యో! వేషధారులైన శాస్త్రులారా! పరిసైయులా
రా! మీరు ప్రవక్తల సమాధులు కట్టించి, నీతిమంతుల
30 సమాధులు శృంగారించి।—మనము మన పితృల దినము
లలో ఉంటే, వారితో ప్రవక్తల రక్తములో* పాలు
31 పుచ్చుకొనమని చెప్పుకొంటున్నారు.। కాబట్టి ప్రవ
క్తలను చంపిన వారి కుమారులు మీరే అని మీకు
32 సాక్ష్యమిస్తున్నారు.। మీరును మీ పితృల పరిమా
33 ణము నింపండి.। విషసర్పముల సంతానమైన సర్పము
లారా! మీరు గెహెన్నకు విధించబడుట యేలాగు
తప్పించుకొందురు.

34 ఇందు నిమిత్తము, ఇదుగో! నేను మీ యొద్దికి ప్రవక్త
35 లను జ్ఞానులను శాస్త్రులను పంపుతున్నాను.। నీతిమం
తుడైన ఆబేలు రక్తము మొదలుకొని వేదికకును దేవా
లయమునకును మధ్యను మీరు చంపిన బరఖీయ కుమా
రుడైన జఖరీయ రక్తము వరకు భూమి మీద చిందబ
డిన నీతిమంతుల రక్తమంతయు మీ మీదికి వచ్చేకొ
రకు, మీరు వారిలో కొందరిని మీ సునగోగులలో
వారులతో కొట్టి, పట్టణమునుంచి పట్టణమునకు తరు
36 ముదురు.। ఇవన్నీ ఈ తరము† మీదికి వచ్చునని నిశ్చ
యముగా మీతో చెప్పుతున్నాను.

37 ఓ యెరూశలేమా! యెరూశలేమా! ప్రవక్తలను చం
పుతును, నీ యొద్దికి పంపబడిన వారిని రాళ్లతో కొట్టు
తునుండేదానా! కోడి తన పిల్లలను తన రెక్కల కింద
ఏలాగు చేర్చుకొనునో ఆలాగే నేను నీ పిల్లలను
ఎన్నోమార్లు చేర్చుకొన వలెనని యుంటిని; అయితే
38 మీరు ఒల్లక పోతిరి.। ఇదుగో! మీ ఇల్లు మీకు పా
39 డుగా విడువబడుచున్నది.। ఇది మొదలుకొని,—ప్రభు
వు పేరట వచ్చేవాడు స్తుతించబడు గాక అని మీరు
చెప్పేపర్యంతము, నన్ను చూడరని మీతో చెప్పుతు
న్నానని పలికెను.

## 24. అధ్యాయము.

1 తరువాత యేసు గుడిలోనుంచి బైలుదేరి వెళ్లుతు
ఉన్నప్పుడు ఆయన శిష్యులు ఆయనకు గుడి కట్టడ
2 ములు చూపించుటకు వచ్చిరి.। యేసు,— మీరు వీటి
నన్నిటినిని చూస్తున్నారు గదా పడదోయపడక రాతి
మీద రాయి ఒకటిన్ని ఇక్కడ విడువబడదని నిశ్చ
యముగా మీతో చెప్పుతున్నానని వారితో పలికెను.

ఆయన ఒలీవ చెట్ల కొండ మీద కూచుండి యుం 3
న్నప్పుడు, శిష్యులు ఏకాంతముగా ఆయన యొద్దికి
వచ్చి,—ఇవి ఎప్పుడు జరుగును? నీవు వచ్చుటకును ఈ
యుగాంతమునకును ఏ ఆనవాలు కలుగును? మాతో చె
ప్పుమనిరి.। అందుకు యేసు వారితో ఈ ప్రత్యుత్త 4
రము చెప్పెను,—ఎవడైనా మిమ్మును మోసపరచకుండా
చూచుకొనండి;। అనేకులు నా పేరట వచ్చి—నేనే 5
క్రీస్తునని చెప్పి అనేకులను మోసపరుతురు.। అయితే, 6
మీరు యుద్ధములను గూర్చి, యుద్ధముల సమాచారము
లను గూర్చి వినబోదురు. మీరు కలతపడక ఉండేటట్టు
చూచుకొనండి; సమస్తము జరగవలసినది అయితే అం
తము ఇంకా లేదు;। రాష్ట్రము రాష్ట్రము పైకి, 7
రాజ్యము రాజ్యము పైకి లేచును. మరియు కరు
వులు, రోగములు, భూకంపములును అక్కడక్కడ
కలిగి యుండును.। అయితే ఇవి యన్నియు వేదనలకు 8
ప్రారంభమే.। అప్పుడు మిమ్ము హింసకు అప్పగించి, 9
మిమ్ము చంపుదురు. మీరు నా నామము నిమిత్తము
సకల రాష్ట్రములవల్ల ద్వేషించబడుదురు.। అప్పుడు 10
అనేకులు ఆతంకపరచబడి ఒకని ఒకడు అప్పగించి,
ఒకని ఒకడు ద్వేషింతురు.। మరియు అనేకులైన అబద్ధ 11
ప్రవక్తలు లేచి అనేకులను మోసపరుతురు.। అక్ర 12
మము విస్తరించుటవల్ల, అనేకుల ప్రేమ చల్లారును.।
తుదమట్టుకు ఓర్చినవాడే రక్షణ పొందును. 13

మరియు, రాజ్యమును గూర్చిన ఈ సువార్త సకల 14
రాష్ట్రములకు సాక్ష్యముకొరకు లోకమందంతటా ప్రక
టించబడును. అప్పుడు అంతము వచ్చును.

కాబట్టి ప్రవక్తయైన దానియేలువల్ల చెప్పబడిన 15
నాశనకరమైన ఏహ్యవస్తువు పరిశుద్ధస్థలమందు నిలు
చుట మీరు చూచేటప్పుడు, చదివే వాడు గ్రహించు
గాక,। యూదైయలో ఉండేవారు కొండలకు పారి 16
పోవలెను.

ఇంటి మీద ఉండే వాడు తన ఇంట్లోనుంచి యే 17
మైనా తీసుకొని వెళ్లుటకు దిగకపోగాక.। పొలము 18
లో ఉండే వాడు తన బట్టలు తీసుకొని వెళ్లుటకు
తిరిగి వెళ్లకపోగాక.। అయ్యో! ఆ దినముల యందు 19
గర్భిణులకు, పాలిచ్చే వారికిని శ్రమ!। మీరు పారి 20
పోవుట చలికాలమందైనా, సబ్బాతుయందైనా సంభ
వించక ఉండుటకు ప్రార్థించండి;। అప్పుడు గొప్ప 21
హింస కలుగును. జగత్తు పుట్టినది మొదలుకొని ఇది

*లేక, హత్య. †లేక, వంశము.

వరకు అటువంటిది కలుగ లేదు, ఇకమీదట కలగదు.।
22 ఆ దినములు తక్కువ చేయబడకపోతే ఏ శరీరు
లును రక్షించబడరు; ఏర్పరచబడిన వారి కొరకు ఆ
దినములు తక్కువ చేయబడును.

23 ఆ కాలమందు ఎవడైనా,—ఇదుగో! క్రీస్తు ఇక్కడ
ఉన్నాడు, లేక—అక్కడ ఉన్నాడని మీతో చెప్పితే
24 నమ్మకండి; । అబద్ధపు క్రీస్తులు అబద్ధ ప్రవక్తలును
లేచి, సాధ్యమైతే ఏర్పరచబడిన వారినిని మోసపు
చ్చేటట్టు గొప్ప గురుతులు అద్భుతములును అగుపరు
25,26 తురు. । ఇదుగో! మీకు ముందర తెలిపితిని. । కాబట్టి
వారు, — ఇదుగో! అరణ్యములో ఉన్నాడని మీతో
చెప్పితే బైలు వెళ్లవద్దు. — ఇదుగో! గదిలో ఉన్నా
27 డంటే, నమ్మకండి. । మెరుపు తూర్పునుంచి బైలుదేరి
పడమటి మట్టుకును ఏలాగు ప్రకాశించునో ఆలాగే
28 మనుష్య కుమారుడు వచ్చుటయును ఉండును. । పీనుగ
ఎక్కడ ఉండునో, అక్కడ గద్దలు కూడి యుండును.
29 ఆ దినముల శ్రమ తరువాత, వెంటనే సూర్యునికి
చీకటి కలుగును. చంద్రుడు తన వెలుగు ఇయ్యడు.
నక్షత్రములు ఆకాశమునుంచి పడును. ఆకాశమం
30 దలి శక్తులు కదిలించబడును. । అప్పుడు మనుష్య కుమా
రుని గురుతు ఆకాశమందు అగుపడును. అప్పుడు
మనుష్య కుమారుడు బలముతోను మహా మహిమ
తోను ఆకాశ మేఘముల మీద వచ్చుట భూమియొ
క్క వంశములన్నీ చూచి రొమ్ము కొట్టుకొనును. ।
31 మరియు, ఆయన తన దూతలను బూరయొక్క మహా
ధ్వనితో పంపును. వారు ఆకాశముయొక్క ఈ మూ
లనుంచి ఆ మూలమట్టుకు, నాలుగు దిక్కులనుంచి
ఆయన ఏర్పరచుకొనిన వారిని పోగుచేతురు.

32 అంజూరపు చెట్టువల్ల ఒక ఉపమానము నేర్చుకొ
నండి; దాని కొమ్మ ఇంకా లేతనిదై చిగిరించేట
ప్పుడు వసంతకాలము సమీపమైనదని మీకు తెలు
33 సును. । ఆ ప్రకారమే మీరు వీటినన్నిటిని చూచేట
ప్పుడు, అది సమీపమై గడపమీదనున్నదని తెలుసు
34 కొనండి. । ఇవి యన్నియు జరిగే పర్యంతము ఈ తర
ము* గతించదని మీతో నిజముగా చెప్పుతున్నాను. ।
35 ఆకాశము భూమియు గతించును గాని. నా మాటలు
ఏమాత్రము గతించవు.

36 అయితే ఆ దినమును గురించియు ఆ గడియను
గురించియు నా తండ్రి మాత్రమే గాక ఏ మనుష్యు
37 డైనా ఆకాశపు దూతలైనా ఎరుగరు. । అయితే
నోవహు యొక్క దినములు ఏలాగు ఉండెనో ఆ
లాగే మనుష్య కుమారుడు వచ్చుటయును ఉండును. ।
జలప్రళయమునకు ముందటి దినములలో నోవహు 38
నావలోకి వెళ్లిన దినము వరకు వారు తింటు, తాగుతు,
పెండ్లాడుతు, పెండ్లికిచ్చుచును ఉండి, । జలప్రళయము 39
వచ్చి అందరిని కొట్టుకొనిపోయే పర్యంతము, ఏలాగు
తెలియక పోయిరో ఆలాగే మనుష్య కుమారుడు
వచ్చుటయును ఉండును. । అప్పుడు ఇద్దరు పొలము 40
లో ఉందురు; ఒకడు, కొంచుపోబడును, మరియొ
కడు విడువబడును. । ఇద్దరు ఒక తిరగలి విసురుతు 41
ఉండగా ఒకతె కొంచుపోబడును. మరియొకతె విడు
వబడును.

కాబట్టి ఏ దినములో మీ ప్రభువు వచ్చునో, 42
అది మీకు తెలియదు గనుక మెళుకువపడండి. । అ 43
యితే ఏ జామున దొంగ వచ్చునో, అది ఇంటి యజ
మానునికి తెలిసియుంటే, ఆయన మెళుకువపడి, తన
ఇల్లు కన్నము వేయబడనియ్యడని మీరు తెలుసుకొ
నండి. । కాబట్టి మీరును సిద్ధముగా ఉండండి; మీరు 44
తలంచని గడియలో మనుష్య కుమారుడు వచ్చును.

కాబట్టి ప్రభువు, తన ఇంటి వారికి తగిన వేళను 45
అన్నము పెట్టుటకు వారి పైని ఎవని ఉంచెనో ఆ
నమ్మకమైన బుద్ధిగల నౌకరు ఎవడు? । ప్రభువు వచ్చి, 46
ఎవడు ఈలాగు చేయుట కనుగొనునో, ఆ నౌకరు
ధన్యుడు. । అతడు తన యావదాస్తి మీద ఇతని ఉం 47
చునని నిజముగా మీతో చెప్పుతున్నాను. । అయితే 48
ఆ చెడ్డ నౌకరు — నా యజమానుడు వచ్చుటకు ఆల
స్యము చేస్తున్నాడని తన హృదయములో అనుకొని ।
తన తోటి నౌకరులను కొట్టుటకు, మద్యపానులతో 49
కూడా తిని తాగుటకు మొదలుబెట్టితే, । ఆ నౌకరు 50
ఎదురుచూడని దినమందు ఎరుగని గడియలోను, అ
తని ప్రభువు వచ్చి, । అతని కొట్టివేసి, వేషధారులతో 51
కూడా అతనికి గతి విధించును. అక్కడ ఏడ్పును
పండ్లు కొరుకుటయు కలుగును.

## 25. అధ్యాయము.

అప్పుడు ఆకాశ రాజ్యము తమ దివిటీలను పట్టు 1
కొని పెండ్లి కుమారుని యెదురుకొనుటకు బైలువెళ్లిన
పదిమంది కన్యకలతో పోల్చబడును. । వీరిలో అయి 2
దుగురు వివేకులు అయిదుగురు అవివేకులునై యుం
డిరి. । అవివేకులు తమ దివిటీలు పట్టుకొని తమతో 3
కూడా నూనె తేలేదు. । అయితే వివేకులు తమ దివి 4
టీలతో కూడా తమ సిద్దెలతో నూనె తెచ్చిరి. । పెండ్లి 5

*లేక, వంశము.

కుమారుడు ఆలస్యము చేయుచుండగా వారందరు
6 కునికి నిద్రించిరి. । అయితే మధ్య రాత్రివేళ,—ఇదు
గో! పెండ్లి కుమారుడు వస్తున్నాడు, ఆయనను యెదురు
7 కొనుటకు బైలు వెళ్లండి అనే ధ్వని కలిగెను. । అప్పు
డు ఆ కన్యకలందరు లేచి తమ దివిటీలను చక్కపరి
8 చిరి. । అయితే అవివేకులు,—మా దివిటీలు ఆరిపోతు
న్నవి గనుక మీ నూనెలో కొంచెము మాకు ఇ
9 య్యండని వివేకులతో పలికిరి. । అందుకు వివేకులు,—
మాకు మీకును ఇది చాలదేమో, మీరు అమ్మేవారి
యొద్దికి వెళ్లి, మీ నిమిత్తము కొనండని ప్రత్యుత్తరము
10 చెప్పిరి. । వారు కొనుటకు వెళ్లుతున్నప్పుడు పెండ్లి
కుమారుడు వచ్చెను. అప్పుడు సిద్ధపడి యున్నవారు
ఆయనతో కూడా పెండ్లి విందుకు ప్రవేశించిరి.
11 అప్పుడు తలుపు వేయబడెను. । ఆ మిగిలిన కన్యకలు
ఆలస్యముగా వచ్చి, — ప్రభువా, ప్రభువా! మాకు
12 తలుపు తీయుమని పలుకుతు ఉండిరి. । అయితే ఆ
యన,—మిమ్మును ఎరుగనని నిజముగా మీతో చెప్పు
13 తున్నానని ఉత్తరమిచ్చెను. । కాబట్టి మనుష్య కుమా
రుడు వచ్చే దినమైనా గడియయైనా మీకు తెలియదు
గనుక, మెలకువపడండి.

14 పరదేశమునకు ప్రయాణమై, తన నౌకరులను పిలిచి
తన ఆస్తిని వారికి అప్పగించిన ఒక మనుష్యుని (పోలి
15 యుండును.) । ఆయన ఒకనికి అయిదు తలాంతులు*
మరి యొకనికి రెండు మరి యొకనికి ఒకటి, వాని
వాని సామర్థ్యము చొప్పున ప్రతివానికిచ్చి, వెంటనే
16 బైలు వెళ్లెను. । అప్పుడు అయిదు తలాంతులు పుచ్చు
కొనిన వాడు వెళ్లి, వాటితో వ్యాపారముచేసి మరి
17 అయిదు తలాంతులు సంపాదించెను. । ఆ ప్రకారమే
రెండు పుచ్చుకొనిన వాడును మరి రెండు సంపాదిం
18 చెను. । అయితే ఒక తలాంతు పుచ్చుకొనిన వాడు
వెళ్లి, భూమి తవ్వి తన ప్రభువుయొక్క సొమ్ము దాచి
19 పెట్టెను. । బహు కాలమైన తర్వాత ఆ నౌకరుల ప్ర
20 భువు వచ్చి, వారియొద్ద లెక్క చూచుకొనెను. । అ
ప్పుడు అయిదు తలాంతులు పుచ్చుకొనిన వాడు మరి
అయిదు తలాంతులు తెచ్చి,— ప్రభువా! నీవు నాకు
అయిదు తలాంతులు అప్పగించితివి; ఇదిగో! ఇవి
గాక, మరి అయిదు తలాంతులు సంపాదించితినని
21 పలికెను. । అతని ప్రభువు,—భళా! నమ్మకమైన మంచి
నౌకరూ! నీవు కొన్నిటిలో నమ్మకముగా ఉంటివి
గనుక, నిన్ను అనేకమైన వాటిమీద నియమింతును;
నీ ప్రభువుయొక్క సంతోషములో ప్రవేశించుమని
అతనితో పలికెను. । ఆలాగే రెండు తలాంతులు పు 22
చ్చుకొనిన వాడు వచ్చి,—ప్రభువా! నీవు నాకు రెం
డు తలాంతులు అప్పగించితివి; ఇదుగో! అవి గాక,
మరి రెండు తలాంతులు నేను సంపాదించితినని పలి
కెను. । అతని ప్రభువు, — భళా! నమ్మకమైన మంచి 23
నౌకరూ! నీవు కొన్నిటిలో నమ్మకముగా ఉంటివి
గనుక నిన్ను అనేకమైన వాటి మీద నియమింతును;
నీ ప్రభువుయొక్క సంతోషములో ప్రవేశించుమని
అతనితో పలికెను. । తరువాత ఒక తలాంతు పుచ్చు 24
కొనినవాడు వచ్చి, — ప్రభువా! నీవు విత్తని చోటను
కోసే వాడవును, చల్లని చోటను కూర్చుకొనే వాడ
వునైన కఠిన మనుష్యుడవని యెరుగుదును, । గనుక 25
నేను భయపడి వెళ్లి నీ తలాంతు భూమిలో దాచి
పెట్టితిని, ఇదుగో! నీది నీకు కలదని పలికెను. । అతని 26
ప్రభువు అతని చూచి, — సోమరివైన చెడ్డ నౌకరూ!
నేను విత్తని చోటను కోసేవాడననియు చల్లని చోట
ను కూర్చుకొనే వాడననియు నీవు ఎరుగుదువా! ।
ఆలాగైతే నీవు నా సొమ్ము సాహుకారుల యొద్ద 27
ఉంచ వలెను; అప్పుడు నేను వచ్చి వడ్డితో నాది
పొంది యుందును. । కాబట్టి ఆ తలాంతు అతని యొద్ద 28
నుంచి తీసుకొని పది తలాంతులు గలవానికియ్యండి. ।
ఎందుకంటే కలిగిన వాడెవడో వానికి ఇయ్యబడును, 29
అతనికి ఎక్కువ కలుగును. కలగని వాని యొద్దనుంచి
వానికి కలిగినదిని తీసుకొని పోబడును. । మరియు 30
పనికిమాలిన ఆ నౌకరును వెలపటి చీకటిలోకి త్రోసి
వేయండి. అక్కడ ఏడ్పు, పండ్లు కొరుకుటయూ కలు
గునని ఉత్తరమిచ్చెను.

తన మహిమతో మనుష్య కుమారుడును ఆయన 31
తో కూడా పరిశుద్ధులైన సమస్త దూతలును వచ్చేట
ప్పుడు, ఆయన తన మహిమగల సింహాసనము మీద
కూర్చుండును. । అప్పుడు సమస్త రాష్ట్రములు ఆయన 32
యెదుట పోగు చేయబడును. గొల్లవాడు మేకలలో
నుంచి గొర్రెలను వేరు చేసే ప్రకారము ఆయన వా
రిని వేరే వేరే ఏర్పరిచి । గొర్రెలను తన కుడిపక్కను 33
మేకలను తన ఎడమపక్కను ఉంచును.

అప్పుడు రాజు,—నా తండ్రివల్ల ఆశీర్వదించబడిన 34
వారలారా! రండి; లోకము పుట్టినది మొదలుకొని
మీకు సిద్ధపరచబడిన రాజ్యము స్వతంత్రించుకొనండి; ।
నేను ఆకలి గొనినప్పుడు మీరు నాకు భోజనము 35
పెట్టినారు, దప్పి గొనినప్పుడు నాకు తాగుటకు ఇచ్చి

*తలాంతు అనగా, కొంచెము యెక్కువ తక్కువ వెయిన్ని తొమ్మన్నూరు తులముల
వెండియైనా బంగారమైనా కావచ్చును.

36 నారు, పరదేశినైనప్పుడు నన్ను చేర్చుకొంటిరి. । వస్త్ర
హీనుడనైనప్పుడు నాకు బట్టలు తొడిగించినారు, రోగి
నైనప్పుడు నన్ను దర్శించినారు, చెరసాలలో ఉన్న
ప్పుడు నా యొద్దకు వచ్చినారని తన కుడి పక్కను
ఉండే వారితో పలుకును.

37 అందుకు నీతిమంతులు,—ప్రభువా! ఎప్పుడు ఆకలి
గొనిన నిన్ను చూచి, భోజనము పెట్టినాము? లేక
దప్పిగొనిన నిన్ను చూచి తాగుటకు ఇచ్చినాము? ।
38 ఎప్పుడు పరదేశివైన నిన్ను చూచి చేర్చుకొంటిమి?
లేక వస్త్రహీనుడవైన నిన్ను చూచి బట్టలు తొడిగిం
39 చినాము? । ఎప్పుడు రోగముతోనైనా చెరసాలలో
నైనా ఉన్న నిన్ను చూచి, నీ యొద్దకు వచ్చినామని
40 ఆయనను అడుగుదురు. । అందుకు రాజు, — ఈ నా
సహోదరులలో మిక్కిలీ అల్పుడైన ఒకనికి చేసుట
వల్ల నాకు చేసితిరని నిజముగా మీతో చెప్పుతున్నా
నని వారికి ప్రత్యుత్తరమిచ్చును.

41 అప్పుడు ఆయన,—శపించబడిన వారలారా! నన్ను
విడిచి సైతానుకు, దాని దూతలకును, సిద్ధపరచబడిన
42 నిత్యాగ్నిలోకి పొండి; । నేను ఆకలి గొనినప్పుడు
మీరు నాకు భోజనము పెట్టలేదు, నేను దప్పిగొని
43 నప్పుడు మీరు నాకు తాగుటకు ఇయ్యలేదు,। పరదేశి
నైనప్పుడు మీరు నన్ను చేర్చుకొనలేదు, వస్త్రహీ
నుడనైనప్పుడు మీరు నాకు బట్టలు తొడిగించలేదు,
రోగినై చెరసాలలో ఉన్నప్పుడు మీరు నన్ను ద
ర్శించ లేదని ఎడమ పక్కను ఉండే వారితో చెప్పు
44 ను. । అందుకు వారును, — ప్రభువా! మేము ఎప్పుడు
నీవు ఆకలి గొనుటయైనా దప్పిగొనుటయైనా పరదే
శివిగా ఉండుటయైనా వస్త్రహీనుడవై యుండుటయై
నా రోగివై యుండుటయైనా చెరసాలలో ఉండుట
యైనా చూచి నిన్ను సేవించమయితిమని ఆయనను
45 అడుగుదురు. । అందుకు ఆయన,—ఈ మిక్కిలీ అల్పు
లైన వారిలో ఒకనికైనా మీరు ఈలాగు చేయనం
దున నాకు చేయలేదని నిజముగా మీతో చెప్పుతు
న్నానని వారికి ప్రత్యుత్తరమిచ్చును.

46 అప్పుడు వీరు నిత్యమైన దండనకు, నీతిమంతులు
నిత్యజీవమునకు వెళ్లుదురని చెప్పెను.

## 26. అధ్యాయము.

1 యేసు ఈ మాటలన్నీ పలికి చాలించిన తరువాత
2 జరిగినదేమంటే, ఆయన తన శిష్యులను చూచి ।—రెం
డు దినములైన పిమ్మట పస్కాపండుగ వస్తున్నదని మీకు
తెలుసును; అప్పుడు మనుష్య కుమారుడు శిలువ వేయ
బడుటకు అప్పగించబడునని చెప్పెను.

అప్పుడు ప్రధాన యాజకులు శాస్త్రులు ప్రజల పెద్ద 3
లును కయఫ అనే పేరుగల ప్రధాన యాజకుని వాకి
టిలోకి కూడివచ్చి, । యేసును తంత్రమువల్ల పట్టు 4
కొని చంపుటకు ఏకమై ఆలోచించిరి. । అయితే— 5
జనులలో అల్లరి కలుగక ఉండుటకు పండుగలో వద్దని
చెప్పుకొనిరి.

యేసు బేథనియలో కుష్ఠరోగియైన సీమోను ఇం 6
టిలో ఉన్నప్పుడు । ఒక స్త్రీ మిక్కిలీ విలువగల 7
అత్తరు బుడ్డి ఆయన యొద్దకు తీసుకొని వచ్చి, భోజన
పఙ్తిలో కూర్చున్న ఆయన తలమీద దాని పోసెను.।
ఆయన శిష్యులు అది చూచి కోపపడి,—ఈ నష్టము 8
ఎందుకు? । ఈ అత్తరు చాలా వెలకు అమ్మబడి దరిద్రు 9
లకు ఇయ్యబడ వచ్చునని పలికిరి.। యేసు దాని ఎరిగి,— 10
మీరు ఎందుకు ఈ స్త్రీని వ్యాకులపరుస్తున్నారు?
ఈమె నాకు మంచి కార్యము చేసెను. । దరిద్రులు 11
ఎల్లప్పుడు మీతో కూడా ఉన్నారు గాని నేను మీ
తో ఎల్లప్పుడు ఉండను. । ఈమె ఈ అత్తరు నా శరీ 12
రము మీద పోసి, పాతిపెట్టబడుటకు నన్ను సిద్ధము
చేసెను. । సర్వలోకమందు ఈ సువార్త ఎక్కడ 13
ప్రకటించబడునో, అక్కడ ఈమె చేసినది ఈమె
జ్ఞాపకార్థముగా తెలుపబడునని నిజముగా మీతో
చెప్పుతున్నానని వారితో పలికెను.

అప్పుడు పన్నెండుమందిలో యూదా ఇస్కరి 14
యోతనే పేరుగల ఒకడు ప్రధాన యాజకుల యొద్దకు
వెళ్లి ।— నేను ఆయనను మీకు అప్పగించితే నాకేమి 15
ఇచ్చుటకు మీకు మనస్సు కలదని వారిని అడిగెను.
అప్పుడు వారు ముప్పది వెండి నాణ్యములు వానికి
తూచి ఇచ్చిరి. । అప్పటినుంచి, ఆయనను అప్పగించు 16
టకు సమయము వెతుకుతు ఉండెను.

పొంగని రొట్టెల పండుగ మొదటి దినమందు, 17
శిష్యులు యేసు యొద్దకు వచ్చి,— పస్కా భోజనము
చేయుటకు మేము నీ కొరకు ఎక్కడ సిద్ధపరచుటకు
కోరుతున్నావని ఆయనను అడిగిరి. । అందుకు ఆయ 18
న,—మీరు పట్టణమందున్న ఫలాన మనుష్యుని యొ
ద్దకు వెళ్లి,— నా కాలము సమీపమై యున్నది, నా
శిష్యులతో కూడా నేను నీ ఇంటిలో పస్కాను ఆచ
రింతునని బోధకుడు పలుకుతున్నాడని అతనితో చె
ప్పండి అని పలికెను. । శిష్యులు యేసు వారికి ఆజ్ఞా 19
పించిన ప్రకారము చేసి, పస్కాను సిద్ధపరిచిరి.

20 సాయంకాలమైనప్పుడు, ఆయన పన్నెండుమం
దితో కూడా భోజన పఙ్తియందు కూర్చుండెను. ।
21 వారు భోజనము చేయుచున్నప్పుడు, ఆయన,—మీలో
ఒకడు నన్ను అప్పగించునని నిజముగా మీతో చెప్పు
22 తున్నానని పలికెను. । అప్పుడు వారు బహు దుఃఖ
పడి వారిలో ప్రతివాడును,—ప్రభువా! నేనా? అని
23 ఆయనను అడుగ సాగిరి. । అందుకు ఆయన,—నాతో
కూడా పాత్రలో చెయ్యి పెట్టినవాడు నన్ను అప్ప
24 గించును. । మనుష్య కుమారుడు ఆయనను గురించి
వ్రాయబడిన ప్రకారము చనిపోతున్నాడు; అయితే
ఎవని చేత మనుష్య కుమారుడు అప్పగించబడునో
ఆ మనుష్యునికి శ్రమ! ఆ మనుష్యుడు పుట్టక ఉంటే
25 అతనికి మేలై యుండునని ఉత్తరము చెప్పెను. । అప్పు
డు ఆయనను అప్పగించే యూదా,—ఓ రబ్బీ! నేనా?
అని అడిగెను. అందుకు ఆయన, నీవు చెప్పినావని*
పలికెను.

26 వారు భుజిస్తూ ఉండగా, యేసు ఒక రొట్టె పట్టు
కొని, స్తోత్రము చేసి† విరిచి తన శిష్యులకు ఇచ్చి,—
మీరు పుచ్చుకొని తినండి; ఇది నా శరీరమై యున్న
27 దని చెప్పెను. । మరియు, ఆయన గిన్నె పట్టుకొని
స్తోత్రము చేసి† వారికిచ్చి,—దీనితో మీరందరు తా
28 గండి; । పాపములు క్షమించబడుటకు ఇది అనేకుల
కొరకు చిందించబడుతున్న క్రొత్త నిబంధనయొక్క నా
29 రక్తమై యున్నది. । నేను నా తండ్రి రాజ్యములో
మీతో కూడా క్రొత్తది తాగే దినము మట్టుకు ఇకను
ఈ ద్రాక్షారసము తాగనని నేను మీతో చెప్పు
30 తున్నానని పలికెను. । వారు కీర్తన పాడి ఒలీవ చెట్ల
కొండకు బైలువెళ్లిరి.

31 అప్పుడు యేసు,—ఈ రాత్రి మీరందరు నా విష
యమై ఆతంకపరచబడుదురు;—గొర్రెల కాపరిని కొ
ట్టుదును, గొర్రెల మంద చెదరగొట్టబడునని వ్రాయ
32 బడి యున్నది. । అయితే నేను లేచిన తరువాత గలి
లైయకు మీకంటే ముందుగా వెళ్లుదునని వారితో
చెప్పెను.

33 అప్పుడు పేతురు,—నీ విషయమై అందరు ఆతంక
పరచబడినప్పటికిని నేను ఎప్పుడును ఆతంకపరచబడ
34 నని ఆయనకు ప్రత్యుత్తరమిచ్చెను. । అందుకు యేసు,—
ఈ రాత్రియందే, కోడి కూసియుండక మునుపు నీవు
నన్ను ఎరుగనని మూడుమార్లు చెప్పుదువని నిశ్చయ
35 ముగా నీతో చెప్పుతున్నాననెను. । అందుకు పేతురు,
ఆయనను చూచి — నేను నీతో చావవలసినప్పటికి
నిన్ను ఎరుగనని చెప్పననెను. ఆప్రకారమే ఆయన
శిష్యులందరు పలికిరి.

అప్పుడు యేసు వారితో గెత్సేమనే అనబడిన 36
చోటికి వచ్చి,—నేను అక్కడికి వెళ్లి ప్రార్థించే మ
ట్టుకు, మీరు ఇక్కడ కూర్చుండండి అని శిష్యులతో
చెప్పి, । పేతురును, జెబెదై ఇద్దరు కుమాళ్లను వెంట 37
బెట్టుకొని వెళ్లి, దుఃఖపడుటకును వ్యాకులపడుటకును
ఆరంభించెను. । అప్పుడు యేసు, — నా ప్రాణము 38
మరణమంతమట్టుకు దుఃఖపడుతున్నది; మీరు ఇక్కడ
నాతో కూడా మెలుకువపడండని వారితో చెప్పి, ।
కొంత దూరము వెళ్లి, సాగిలపడి — నా తండ్రీ! సా 39
ధ్యమైతే ఈ గిన్నె నా యొద్దనుంచి తొలగి పోనిమ్ము;
అయినప్పటికిని నా చిత్తము కాదు నీ చిత్తమే కాని
మ్మని ప్రార్థించెను. । అప్పుడు ఆయన, శిష్యుల యొద్దికి 40
వచ్చి, వారు నిద్రపోవుట చూచి, — ఒక గడియయై
నా నాతో కూడా మెలుకువపడి యుండ లేరా! ।
మీరు శోధనలోకి రాకుండా మెలుకువపడి ప్రార్థిం 41
చండి. ఆత్మ సిద్ధమే గాని శరీరము బలహీనమని
పేతురుతో చెప్పి, । మళ్లీ రెండవమారు వెళ్లి, — నా 42
తండ్రీ! నేను ఈ గిన్నెతో తాగితేనే గాని అది నా
యొద్దనుంచి తొలగి పోవుట అసాధ్యమైతే, నీ చిత్తము
సిద్ధించు గాక అని ప్రార్థించి, । వచ్చి, వారు మళ్లీ 43
నిద్రపోవుట చూచెను; వారి కన్నులు భారముగా
ఉండెను.

అప్పుడు ఆయన వారిని మళ్లీ విడిచి వెళ్లి, ఆ మాటనే 44
పలుకుతూ మూడవమారు ప్రార్థించెను. । అప్పుడు ఆ 45
యన తన శిష్యులయొద్దికి వచ్చి,—ఇకను నిద్రపోయి
అలసట తీర్చుకొనండి; ఇదుగో! గడియ సమీపించె
ను; మనుష్య కుమారుడు పాపుల చేతులకు అప్పగించ
బడుతున్నాడు; । లేవండి, వెళ్లుదాము, ఇదుగో! నన్ను 46
అప్పగించే వాడు సమీపించి యున్నాడని వారితో
చెప్పెను.

ఆయన ఇంకా మాట్లాడుచుండగా, ఇదిగో! పన్నెండు 47
మందిలో ఒకడైన యూదాయును, అతనితో కూడా
కత్తులు, గుదియలు పట్టుకొనిన బహు జనసమూహ
ము ప్రధాన యాజకుల యొద్దనుంచి, ప్రజల పెద్దల
యొద్దనుంచియు వచ్చిరి.

ఆయనను అప్పగించే వాడు—నేను ఎవని ముద్దు 48
బెట్టుకొందునో అతడే ఆయన; అతని పట్టుకొనండని

*అనగా, అవునని. †లేక, ఆశీర్వదించి.

49 వారికి ఆనవాలు చెప్పి, । వెంటనే యేసు యొద్దికి
వచ్చి—రబ్బీ! శుభమని పలికి ఆయనను ముద్దుబెట్టు
50 కొనెను. । అప్పుడు యేసు—చెలికాడా! ఇందుకా
వచ్చితివి? అని అతని అడిగెను. అప్పుడు, వారు
వచ్చి యేసు మీద చేతులు వేసి ఆయనను పట్టుకొ
51 నిరి. । అప్పుడు ఇదుగో! యేసుతో కూడా ఉన్న
వారిలో ఒకడు చెయ్యి చాచి, కత్తి దూసి, ప్రధాన
యాజకుని నౌకరును కొట్టి అతని చెవి తెగ కోసెను.।
52 అప్పుడు యేసు — నీ కత్తి దాని చోట తిరిగీ వేయు
ము; కత్తి పట్టుకొనే వారందరు కత్తివల్ల నశింతురు. ।
53 ఈ సమయమున నా తండ్రిని వేడుకొనుటకు నాకు
శక్తి లేదని నీకు తోస్తున్నదా? వెంటనే ఆయన పన్నెం
డు సేనల దూతల కంటే యెక్కువ వారిని నాకు
54 ఇచ్చును. । అయితే—ఈలాగు జరగవలెననే లేఖన
ములు ఏలాగు నెరవేరును అని అతనితో చెప్పెను.

55 ఆ గడియలోనే యేసు — దొంగ మీదికి వచ్చి
నట్టు కత్తులతో, గుదియలతోను నన్ను పట్టుకొను
టకు బైలుదేరి వచ్చితిరా? నేను అనుదినము మీ యొద్ద
గుడిలో కూర్చుండి బోధించుచున్నప్పుడు, మీరు
56 నన్ను పట్టుకొన లేదు. । అయితే ప్రవక్తల లేఖనములు
నెరవేర్చబడుటకు ఇదంతయు సంభవించెనని ఆ జన
సమూహములతో చెప్పెను. అప్పుడు శిష్యులందరు
ఆయనను విడిచి పారిపోయిరి.

57 యేసుని పట్టుకొనిన వారు ప్రధానయాజకుడైన
కయఫ యొద్దికి ఆయనను తీసుకొని వెళ్లిరి. అక్కడ
58 శాస్త్రులు, పెద్దలును కూడి యుండిరి. । అయితే పే
తురు ప్రధానయాజకుని వాకిటి మట్టుకు ఆయనను
దూరమునుంచి వెంబడించి, లోపటికి వెళ్లి అంతము
చూచేకొరకు నౌకరులతో కూడా కూచుండెను.

59 అప్పుడు ప్రధానయాజకులు, పెద్దలు, సభవారంద
రును యేసుని చంపుటకు ఆయనకు విరోధముగా
60 అబద్ధపు సాక్ష్యము వెతుకుచుండిరి. । అయితే ఏమి
యు దొరకలేదు. అబద్ధపు సాక్షులు అనేకులు వచ్చి
నప్పటికిని యేమియు దొరకలేదు. తుదకు ఇద్దరు
61 అబద్ధపు సాక్షులు వచ్చి । — దేవాలయము పడగొట్టి,
మూడు దినములలో దాని కట్టుటకు నాకు శక్తి కల
62 దని వీడు చెప్పెననిరి. । అప్పుడు ప్రధాన యాజకుడు
నిలువబడి—నీవు ప్రత్యుత్తరము యేమియు చెప్పవా?
వీరు నీకు విరోధముగా పలుకుచున్న సాక్ష్యము యేమి?
63 అని అడిగెను. । అయితే యేసు ఊరకుండెను. అప్పుడు
ప్రధాన యాజకుడు—నీవు దేవుని కుమారుడవైన క్రీస్తు
వైతే అది మాతో చెప్పుటకు జీవముగల దేవుని తోడని
నీ చేత ప్రమాణము చేయిస్తున్నానని ఆయనతో పలి
కెను. అందుకు యేసు — నీవు చెప్పితివి. । మరియు 64
ఇకమీదట మనుష్యకుమారుడు శక్తిమంతుని కుడి పా
ర్శ్వమందు కూర్చుండుటయును ఆకాశ మేఘముల
మీద వచ్చుటయును మీరు చూతురని చెప్పెను. ।
అప్పుడు ప్రధానయాజకుడు తన వస్త్రము చించు 65
కొని—వీడు దేవదూషణ చేసియున్నాడు; మనకు ఇక
సాక్షులనిమిత్తమేమి? ఇదుగో! వీడు చెప్పిన దూషణ
మీరు ఇప్పుడు వినియున్నారు; । మీకు ఏలాగు తో 66
స్తున్నదని పలికెను. అందుకు వారు — మరణమునకు
ఇతడు పాత్రుడై యున్నాడని ఉత్తరమిచ్చిరి. । అప్పు 67
డు వారు ఆయన ముఖము మీద ఉమ్మివేసి ఆయనను
గుద్దిరి. । కొందరు ఆయనను చరిచి — క్రీస్తూ! నిన్ను 68
కొట్టిన వాడెవడు? మాతో ప్రవచించుమని పలికిరి.

అయితే పేతురు అవతలి వాకిటిలో కూర్చుండెను. 69
అప్పుడు ఒక చిన్నది అతని యొద్దికి వచ్చి—నీవును
గలిలైయుడైన యేసుతో కూడా ఉంటివని పలికెను.।
అందుకు అతడు — ఆలాగు కాదు; నీవు చెప్పినది 70
నాకు బోధపడ లేదని అందరి యెదుట చెప్పెను. ।
అతడు నడవలోకి వెళ్లిన తరువాత, మరియొకతె అతని 71
చూచి — వీడును నజరేథువాడైన యేసుతో కూడా
ఉండెనని అక్కడి వారితో చెప్పెను. । అయితే 72
అతడు ఒట్టుబెట్టుకొని — ఆలాగు కాదు, ఆ మను
ష్యుని నేనెరుగను అని మళ్లీ చెప్పెను. । కొంతసేపైన 73
తరువాత, నిలిచి యున్న వారు పేతురు యొద్దికి వచ్చి
నిశ్చయముగా నీవును వారిలో ఒకడవు; నీ పలుకు
నిన్ను అగపరుస్తున్నదని అతనితో చెప్పిరి. । అప్పుడు 74
అతడు — ఆ మనుష్యుని నేనెరుగనని శపించుకొను
టకు, ఒట్టుబెట్టుకొనుటకును ఆరంభించెను. వెంటనే
కోడి కూసెను. । అప్పుడు — కోడి కూసియుండకము 75
నుపు, నీవు నన్ను ఎరుగనని మూడు మార్లు చెప్పుదువు
అని యేసు అతనితో పలికిన మాట పేతురు జ్ఞాప
కము తెచ్చుకొని వెలపటికి వెళ్లి సంతాపముతో
ఏడ్చెను.

## 27. అధ్యాయము.

ఉదయమైనప్పుడు సకల ప్రధానయాజకులును 1
ప్రజల పెద్దలును యేసుని చంపుటకు ఆయనకు విరో
ధముగా ఏకాలోచన చేసి, । ఆయనను కట్టించి తీసు 2
కొని వెళ్లి, ఆయనను అధిపతియైన పొంతిపిలాతుకు
అప్పగించిరి.

అప్పుడు ఆయనను అప్పగించిన యూదా, ఆయ 3
నకు శిక్ష విధించబడెనని చూచి, పశ్చాత్తాపపడి, ఆ

ముప్పది వెండి షెకెలులు ప్రధానయాజకుల యొద్దికిని
4 పెద్దల యొద్దికిని తిరిగి తెచ్చి ।—నేను నిరపరాధమైన
రక్తమును అప్పగించి పాపము చేసితినని చెప్పెను.
అందుకు వారు — అది మాకేమి? నీవే చూచుకొమ్మని
5 చెప్పిరి. । అప్పుడు అతడు ఆ వెండి షెకెలులు దేవాల
యములో పడవేసి, వెళ్లి ఉరి పెట్టుకొనెను.

6 ప్రధానయాజకులు ఆ వెండి షెకెలులు పుచ్చు
కొని—ఇవి రక్తపు క్రయధనము గనుక వాటిని కా
7 నుక పెట్టెలో వేయ కూడదని చెప్పుకొనిరి. । అయితే
వారు ఏకాలోచన చేసి పరదేశులను పాతిపెట్టుటకు
8 కుమ్మరవాని పొలము వాటితో కొనిరి. । కాబట్టి నేటి
వరకు ఆ పొలము రక్తపు పొలమనబడుచుండెను. ।
9 అప్పుడు,—విలువ కట్టబడిన వాని, అనగా ఇశ్రాయేలు
పుత్రులలో కొందరు విలువ కట్టిన వాని క్రయధన
10 మైన ముప్పది వెండి షెకెలులు పుచ్చుకొని, । ప్రభువు
నాకు నియమించిన ప్రకారము వాటిని కుమ్మరవాని
పొలము కొరకు ఇచ్చిరని, ప్రవక్తయైన ఎరెమీయా
వల్ల పలుకబడినది నెరవేరెను.

11 యేసు అధిపతి యెదుట నిలిచినప్పుడు అధిపతి—
నీవు యూదుల రాజవై యున్నావా అని ఆయనను
అడిగెను. అందుకు యేసు—నీవు చెప్పుచున్నావని*
12 అతనితో పలికెను. । ప్రధాన యాజకుల వల్లను పెద్దల
వల్లను ఆయన మీద అపరాధము మోపబడినప్పుడు,
13 ఆయన ఉత్తరమేమియు చెప్పలేదు. । అప్పుడు పిలా
తు—నీ మీద వీరు యెన్నో అపరాధములు మోపు
చున్నారు; నీవు వినలేదా? అని ఆయనను అడిగెను. ।
14 అయితే ఆయన ఒక్క మాటకైనా అతనికి ఉత్తరమి
య్యలేదు గనుక అధిపతి మిక్కిలీ ఆశ్చర్యపడెను.

15 ఆ పండుగలో జనసమూహము కోరిన ఒక ఖయి
దీని విడిపించుట అధిపతికి మర్యాదయై యుండెను. ।
16 ఆ కాలమందు బరబ్బా అనే పేరు గల ఒక ప్రసిద్ధ
17 మైన ఖయిదీ వారికి కలిగి యుండెను । గనుక, వారు
కూడినప్పుడు పిలాతు — నేను మీకు ఎవని విడిపిం
చుటకు కోరుచున్నారు? బరబ్బానా? లేక క్రీస్తు అన
18 బడిన యేసునా? అని వారిని అడిగెను; । వారు ఆయ
నను అసూయవల్ల అప్పగించిరని ఆయనకు తెలుసును.
19 ఆయన న్యాయపీఠము మీద కూర్చుని యున్న
ప్పుడు, ఆయన భార్య—నీవు ఆ నీతిమంతుని జోలికి
పోవద్దు ఈప్రొద్దున ఆయనను గూర్చి నేను స్వప్న
మందు మిక్కిలీ బాధపడితినని ఆయన యొద్దికి వర్త
మానము పంపెను.

అయితే ప్రధానయాజకులు, పెద్దలును బరబ్బాను 20
అడుగుటకును యేసుని సంహరించుటకును జనసమూ
హములను ప్రేరేపించిరి. । అప్పుడు అధిపతి—ఈ ఇద్ద 21
రిలో మీ నిమిత్తము నేను ఎవని విడిపించుటకు మీరు
కోరుచున్నారని వారిని అడిగెను. అందుకు వారు—
బరబ్బానే అని చెప్పిరి. । అందుకు పిలాతు — ఆలా 22
గైతే క్రీస్తు అనబడిన యేసుని నేను యేమి చేయుటకు
కోరుచున్నారని వారిని అడిగెను.—శిలువ వేయబడని
మ్మని అందరును ఆయనతో చెప్పిరి. । అయితే అధి 23
పతి—ఎందుకు? అతడు యేమి నేరము చేసెనని అడి
గెను. అయితే వారు—శిలువ వేయబడనిమ్మని మరీ
యెక్కువగా కేకలు వేసిరి.

పిలాతు కలహము యెక్కువవుచున్నదేగాని మరి 24
యేమియు ప్రయోజనము లేదని చూచి, నీళ్లు తీసు
కొని ఆ జనసమూహము యెదుట చేతులు కడుగు
కొని — ఈ నీతిమంతుని రక్తమును గూర్చి నేను
నిరపరాధిని, మీరే చూచుకొనండని చెప్పెను. । అం 25
దుకు జనులందరు — వాని రక్తము మా మీదను, మా
పిల్లల మీదనును ఉండుగాక అని ప్రత్యుత్తరమిచ్చిరి. ।
అప్పుడు అతడు బరబ్బాను వారికి విడిపించి యేసుని 26
వారులతో కొట్టించి శిలువ వేయబడుటకు అప్పగిం
చెను.

అప్పుడు అధిపతియొక్క రాణువవారు యేసుని 27
ప్రేతోర్యమనబడిన కూటములోకి తీసుకొని వెళ్లి
ఆయన యొద్ద తమ స్తోమమంతా కూర్చిరి. । అప్పుడు 28
వారు ఆయన వస్త్రములు తీసి, ఆయన పైని ఎర్ర
వస్త్రము వేసి । ముండ్ల కిరీటము నల్లి అది ఆయన తల 29
మీదను ఒక రెల్లుపుడక ఆయన కుడిచేతనును ఉంచి,
ఆయన యెదుట మోకాళ్లూని—యూదుల రాజా!
నీకు శుభమని ఆయనను అపహసించి, । ఆయన మీద 30
ఉమ్మి వేసి ఆ రెల్లు పుడక పట్టుకొని ఆయన తల
మీద కొట్టిరి. । ఆయనను అపహసించిన తరువాత, 31
ఆయన మీదనున్న ఆ వస్త్రము తీసి ఆయన బట్టలు
ఆయనకు తొడిగించి శిలువవేయుటకు ఆయనను తీసు
కొని వెళ్లిరి.

వారు బైలు వెళ్లుచు ఉండగా కురేనీయుడైన 32
సీమోననే పేరు గల ఒక మనుష్యుని చూచి, ఆయన
శిలువను మోయుటకు అతని బలవంతము చేసిరి. ।
వారు కపాలస్థలమనే అర్థమిచ్చే గొల్గొథా అనబ 33

*అనగా, అవునని.

34 డిన చోటికి వచ్చి, । చేదు కలిపిన చిరక ఆయనకు
త్రాగుటకు ఇస్తు ఉండిరి. ఆయన దాని రుచి చూచి
త్రాగనొల్లకుండెను.

35 వారు ఆయనను శిలువ వేసినప్పుడు చీట్లు వేసి
ఆయన వస్త్రములు పంచుకొనిరి. — నా బట్టలను
తమలో తాము పాలు పంచుకొని నా చొక్కాయిని
గూర్చి చీట్లు వేసిరని ప్రవక్త పలికినది ఆలాగున నెర
36 వేరెను. । అప్పుడు కూర్చుండి ఆయనను అక్కడ కా
37 చుకొనుచుండిరి. । మరియు — ఇతడు యూదుల రా
జైన యేసు అని ఆయన మీద మోపబడిన నేరము
ఆయన తల పైని వ్రాసి యుంచిరి.

38 అప్పుడు కుడి వైపున ఒకడును ఎడమ వైపున
ఒకడును ఇద్దరు దొంగలు ఆయనతో కూడా శిలువ
39 వేయబడిరి. । అప్పుడు ఆ త్రోవ వెళ్లేవారు తమ తలలు
40 ఆడించుచు ।— దేవాలయము పడద్రోసి మూడు దినము
లలో కట్టేవాడా! నిన్ను నీవే రక్షించుకొనుము; నీవు
దేవుని కుమారుడవైతే శిలువ మీదనుంచి దిగుమని
41 చెప్పుతు ఆయనను దూషించిరి. । ఆలాగే శాస్త్రులతో
ను పెద్దలతోను ప్రధాన యాజకులు కూడా ఆయన
42 ను అపహాస్యము చేస్తూ । — అన్యులను రక్షించెను;
తన్ను తానే రక్షించుకొనలేడు. ఇశ్రాయేలు రాజైతే,
ఇప్పుడు శిలువ మీదనుంచి దిగ వచ్చును, అప్పుడు
వాని నమ్ముదుము. దేవుని ఆశ్రయించుచున్నాడు. ।
43 — నేను దేవుని కుమారుడనని చెప్పెను గనుక ఆయనకు
ఇష్టుడైతే ఇప్పుడు వాని విడిపించుగాక అని పలికిరి. ।
44 ఆయనతో కూడా శిలువవేయబడిన దొంగలును ఆ
లాగే ఆయనను నిందించిరి.

45 అయితే ఆరు ఘంటలు మొదలుకొని తొమ్మిది
ఘంటల పర్యంతము* ఆ దేశమంతటి మీద చీకటి
46 కలిగెను. । కొంచెము యెక్కువ తక్కువ తొమ్మిది
ఘంటలకు యేసు— ఏలీ ఏలీ లామాసబక్తానీ అనగా,
నా దేవా! నా దేవా! నన్ను ఎందుకు విడిచితివని
గొప్ప శబ్దముతో మొరబెట్టెను.

47 అక్కడ నిలిచిన వారిలో కొందరు అది విని—
48 ఇతడు ఏలియాను పిలుస్తున్నాడని చెప్పిరి. । వెంటనే
వారిలో ఒకడు పరుగెత్తి స్పంజీ పట్టుకొని చిరకతో
దాని నింపి, రెల్లున తగిలించి ఆయనకు త్రాగనిచ్చెను. ।
49 తక్కిన వారు — వద్దు, ఏలీయా అతని రక్షించుటకు
వచ్చునేమో, చూతామని చెప్పుకొనిరి.

యేసు తిరిగీ గొప్ప శబ్దముతో కేకవేసి ప్రాణము 50
విడిచెను. । అప్పుడు ఇదుగో! దేవాలయపు తెర మీది 51
నుంచి కింది మట్టుకు రెండు ముక్కలుగా చినిగెను.
భూమి వణికెను. కొండలు బద్దలాయెను. । మరియు 52
సమాధులు తెరవబడెను. అప్పుడు నిద్రపోయిన పరి
శుద్ధుల అనేక శరీరములు లేచి, । ఆయన పునరుత్థాన 53
మైన తరువాత సమాధులలోనుంచి బైలు వెళ్లి, పరి
శుద్ధ పట్టణములోకి వచ్చి అనేకులకు అగుపడెను.

శతాధిపతియును, అతనితో కూడా యేసుని కా 54
చుకొనిన వారును భూకంపమును జరిగినవన్నియును
చూచి మిక్కిలీ భయపడి — నిశ్చయముగా ఈయన
దేవుని కుమారుడై యుండెనని చెప్పుకొనిరి.

మరియు యేసుని సేవిస్తూ, ఆయనను గలిలైయ 55
నుంచి వెంబడించిన అనేక స్త్రీలు అక్కడ దూరము
నుంచి చూస్తూ ఉండిరి. । వారిలో మగ్దల వూరి మరి 56
య, యాకోబు యోసే అనే వారి తల్లియైన మరియ,
జెబెదై కుమారుల తల్లియును ఉండిరి.

సాయంకాలమైనప్పుడు అరిమథైయ గ్రామస్థు 57
డును, యేసు శిష్యుడునైన యోశేఫనే పేరు గల
ఒక ధనవంతుడు వచ్చెను. । అతడు పిలాతు యొద్దికి 58
వెళ్లి, యేసు శరీరమును అడిగెను. అప్పుడు పిలాతు
ఆయన శరీరము అప్పగించబడుటకు ఆజ్ఞాపించెను
గనుక, । యోశేఫు ఆ శరీరము తీసుకొని నిర్మలమైన 59
నారబట్టలతో దాని చుట్టి, । తాను రాతిలో తొలిపిం 60
చిన తన క్రొత్త సమాధిలో దాని ఉంచి సమాధి ద్వార
మునకు పెద్ద రాయి పొర్లించి వెళ్లెను. । అక్కడ 61
మగ్దల ఊరి మరియ, వేరే మరియయును సమాధికి
ఎదురుగా కూర్చుని యుండిరి.

సిద్ధపరిచే దినమైన తరువాత, వచ్చే మరునాటి 62
యందు, ప్రధాన యాజకులు, ఫరిసైయులును పిలాతు
యొద్దికి కూడి వచ్చి । — ప్రభువా! ఆ వంచకుడు ప్రా 63
ణముతో ఉన్నప్పుడు— మూడు దినములైన తర్వాత
నేను లేతునని చెప్పినది మాకు జ్ఞాపకమున్నది. । కా 64
బట్టి మూడవ దినపర్యంతము సమాధి భద్రము చేయ
బడుటకు ఆజ్ఞాపించుము; అతని శిష్యులు రాత్రి వేళ
వచ్చి, అతని దొంగిలి— అతడు చనిపోయిన వారిలో
నుంచి లేచియున్నాడని జనులతో చెప్పుదురేమో.
అప్పుడు మొదటి వంచన కంటే కడపటిది చెడ్డదై
యుండునని పలికిరి. । అందుకు పిలాతు — మీకు కా 65

*అనగా మధ్యాహ్నము మొదలుకొని మూడో జాము అయే పర్యంతము.

వలి కలదు; మీరు వెళ్లి మీ చేతనైనంతమట్టుకు దాని
66 భద్రము చేయండని వారితో చెప్పెను. । ఆ ప్రకా
రము వారు వెళ్లి సమాధి యొద్ద కావలి ఉంచి రాతికి
ముద్రవేసి భద్రము చేసిరి.

## 28. అధ్యాయము.

1 సబ్బాతు అయిన తరువాత, ఆదివారమున తెల్ల
వారగానే మగ్దల ఊరి మరియ, ఆ వేరే మరియయును
2 సమాధి చూడ వచ్చిరి. । అప్పుడు ఇదుగో! మహా
భూకంపము కలిగెను; ప్రభువుయొక్క దూత ఆకా
శమునుంచి దిగి వచ్చి, ద్వారమునుంచి రాయి పొ
3 లిరించి, దాని మీద కూర్చుండెను. । ఆయన స్వ
రూపము మెరుపువలె ఉండెను. ఆయన వస్త్రము
4 మంచువలె తెలుపుగా ఉండెను. । ఆయనకు భయప
డుటవల్ల కావలివారు నణికి చచ్చిన వారి వలె ఉం
5 డిరి. । అయితే ఆ దూత ఆ స్త్రీలను చూచి మీరు
భయపడకండి; మీరు శిలువ వేయబడిన యేసుని వెతు
6 కుతున్నారని నాకు తెలుసును. । ఆయన ఇక్కడ
లేడు; తాను చెప్పిన ప్రకారము లేచి యున్నాడు;
7 రండి, ప్రభువు పండుకొనిన స్థలము చూచి, । త్వరగా
వెళ్లి, ఆయన చనిపోయిన వారిలోనుంచి లేచియు
న్నాడని ఆయన శిష్యులకు తెలియచేయండి; ఇదుగో
ఆయన గలిలైయలోకి మీకు ముందుగా వెళ్లుతు
న్నాడు; అక్కడ మీరు ఆయనను చూతురు. ఇదుగో!
మీతో చెప్పితినని పలికెను.

8 అప్పుడు వారు భయముతో, మహా సంతోషముతో
నును సమాధి యొద్దనుంచి త్వరగా బైలువెళ్లి, ఆయన
శిష్యులకు ఆ వర్తమానము తెలుపుటకు పరుగె
9 త్తిరి. । అయితే వారు ఆయన శిష్యులకు తెలుపుటకు
వెళ్లుచుండగా, ఇదుగో! యేసు వారిని యెదురుకొని—
మీకు శుభమని చెప్పెను. అప్పుడు వారు ఆయన
యొద్దికి వచ్చి, ఆయన పాదములు పట్టుకొని, ఆయ
నకు నమస్కరించిరి. । అప్పుడు యేసు — భయపడ 10
కండి; మీరు వెళ్లి నా సహోదరులు గలిలైయకు
వెళ్లవలెనని వారికి తెలుపండి; వారు నన్ను అక్కడ
చూతురని వారితో చెప్పెను.

వారు వెళ్లుతుండగా ఇదుగో! కావలివారిలో కొం 11
దరు పట్టణములోకి వచ్చి, జరిగినవన్నియు ప్రధాన
యాజకులతో చెప్పిరి. । అప్పుడు వారు పెద్దలతో 12
కూడివచ్చి, ఆలోచనచేసి ఆ రాణువవారికి చాలా
సొమ్ము ఇచ్చి ।—మేము రాత్రిలో నిద్రపోయినప్పుడు 13
ఆయన శిష్యులు వచ్చి ఆయనను దొంగిలిరని మీరు
చెప్పండి. । ఇది అధిపతికి వినబడితే మేము ఆయనను 14
సమ్మతిపరిచి మిమ్మును నిర్భయులగా చేతుమని పలి
కిరి. । అప్పుడు వారు ఆ సొమ్ము పుచ్చుకొని తాము 15
బోధించబడిన ప్రకారము చేసిరి. ఈ మాట యూదు
లలో నేటివరకు ప్రసిద్ధమై యున్నది.

పదకొండుమంది శిష్యులు యేసు వారికి నిర్ణయిం 16
చిన గలిలైయలో ఉన్న కొండకు వెళ్లిరి. । వారు ఆ 17
యనను చూచి ఆయనకు నమస్కరించిరి, అయితే
కొందరు సందేహించిరి. । అప్పుడు యేసు వారి యొ 18
ద్దికి వచ్చి—ఆకాశమందును భూమియందును నాకు
సర్వాధికారము ఇయ్యబడి యున్నది. । కాబట్టి మీరు 19
వెళ్లి, తండ్రియొక్కయు కుమారునియొక్కయు పరిశు
ద్ధాత్మయొక్కయు పేరట సమస్త రాష్ట్రములకు బాప్తి
స్మము చేయిస్తూ, । నేను మీకు ఆజ్ఞాపించినవన్నియు 20
గైకొనుటకు వారికి బోధిస్తూ వారిని శిష్యులగా
చేయండి. ఇదుగో! నేను లోకాంత పర్యంతము, ప్రతి
దినము మీతో కూడా ఉంటున్నానని వారితో పలి
కెను. [ఆమేన్.]

# మార్కు వ్రాసిన సువార్త.

## 1. అధ్యాయము.

1 దేవుని కుమారుడైన యేసుక్రీస్తు సువార్త ప్రా
2 రంభము. । —ఇదుగో! నీకు ముందుగా నీ మార్గము
సిద్ధపరచుటకు నా దూతను నీ యెదుట పంపుతు
3 న్నాను, । ప్రభువుయొక్క మార్గము సిద్ధపరిచి ఆయన
త్రోవలను సరాళము చేయండని అరణ్యములో కంఠ
మెత్తి పలికే ఒకని శబ్దము అని ప్రవక్తలవల్ల వ్రాయబ
4 డిన ప్రకారము, । యోహాను అరణ్యములో బాప్తిస్మ
ము చేయిస్తు, పాపముల క్షమ కొరకు మారుమనస్సు
5 విషయమైన బాప్తిస్మము ప్రకటిస్తూ ఉండెను. । అప్పు
డు యూదైయ దేశమంతయు యెరూశలేమువారును
బైలుదేరి అతని యొద్దికి వచ్చి, తమ పాపములు ఒప్పు
కొని, అందరును యొర్దాను నదిలో అతనిచేత బాప్తి
స్మము చేయించబడిరి*.
6 యోహాను ఒంటె వెంట్రుకల బట్టయు, తన మొల
చుట్టు తోలు దట్టిని కట్టుకొని మిడతలు అడవి తేనె
7 యు తినే వాడు. । మరియు అతడు,—నా కంటే శక్తి
గల ఒకడు నా వెనుక వస్తున్నాడు, ఆయన చెప్పుల
వారును వంగి విప్పుటకు నేను యోగ్యుడను కాను. ।
8 నేను నీళ్లతో మీకు బాప్తిస్మము చేయించితినేగాని
ఆయన పరిశుద్ధాత్మతో మీకు బాప్తిస్మము చేయించు
నని ప్రకటిస్తూ ఉండెను.
9 ఆ దినములలో, యేసు గలిలైయ దేశపు నజరెథు
నుంచి వచ్చి, యొర్దానులో యోహానువల్ల బాప్తిస్మము
10 చేయించబడెను†. । వెంటనే ఆయన నీళ్ల యొద్దనుంచి
వచ్చుచుండగా ఆకాశము తెరవబడుటయు, ఆత్మ
పావురమువలె ఆయన మీద వాలుటయు చూచెను. ।
11 మరియు,—నీవు నా ప్రియ కుమారుడవు, నీ యందు
నేను సంతోషపడుతున్నాననే ఒక శబ్దము ఆకాశ
మునుంచి కలిగెను.
12 వెంటనే ఆత్మ ఆయనను అరణ్యములోకి తరిమి
13 వేసెను. । ఆయన ఆ యరణ్యములో నలుభై దినములు
ఉండి సైతానువల్ల శోధించబడి అడవి మృగము
లతో ఉండెను. అప్పుడు దూతలు వచ్చి, ఆయనను
సేవించిరి.

యోహాను అప్పగించబడిన తరువాత యేసు దేవుని 14
రాజ్యమును గూర్చిన సువార్త ప్రకటిస్తూ । —కాల 15
ము సంపూర్ణమైనది, దేవుని రాజ్యము సమీపమై
యున్నది, మనస్సు తిప్పుకొని సువార్త నమ్మండి అని
చెప్పుతు గలిలైయకు వచ్చెను.

ఆయన గలిలైయ సముద్రము దగ్గిర నడుస్తూ ఉం 16
డగా, సీమోను, సీమోను సహోదరుడయిన అం
ద్రెయయు సముద్రములో వల వేయుట చూచెను;
వారు జాలరులై యుండిరి. । అప్పుడు యేసు,—నా 17
వెంబడి రండి, నేను మిమ్మును మనుష్యులను పట్టే
జాలరులగా చేతునని వారితో చెప్పెను. । వెంటనే 18
వారు తమ వలలు విడిచి, ఆయనను వెంబడించిరి.

ఆయన అక్కడనుంచి కొంత దూరము వెళ్లి, జెబెదై 19
కుమారుడైన యాకోబును, అతని సహోదరుడైన
యోహానును చూచెను. వారుకూడా దోనెలో తమ
వలలను బాగుచేస్తూ ఉండిరి. । వెంటనే ఆయన వా 20
రిని పిలిచెను; వారు తమ తండ్రియైన జెబెదైని కూలి
వారియొద్ద దోనెలో విడిచి ఆయనను వెంబడించిరి.
వారు కపెర్నహూములో ప్రవేశించిరి. వెంటనే 21
ఆయన సబ్బాతుయందు, సునగోగులోకి వెళ్లి బో
ధిస్తూ ఉండెను. । వారు ఆయన బోధకు ఆశ్చర్యప 22
డిరి; ఆయన శాస్త్రులవలె కాదు, అధికారముగల
ఒకనివలె వారికి బోధిస్తూ ఉండెను.

వారి సునగోగులో అపవిత్రమైన ఆత్మకు లోబడిన 23
ఒకమనుష్యుడు ఉండెను. । అతడు,—వద్దు! యేసూ! నజ 24
రెథువాడా! నీతో మాకేమి, మమ్ము నశింపచేయుటకు
వచ్చితివా? నీవు యెవడవో నాకు తెలుసును, దేవుని
పరిశుద్ధుడవని కేకలు వేసెను. । అందుకు యేసు,— 25
ఊరకొని అతనిలోనుంచి బైలు వెళ్లుమని దాని గద్దిం
చెను. । అప్పుడు ఆ అపవిత్రమైన ఆత్మ అతని విలవి 26
లలాడించి, పెద్ద కేకవేసి అతనిలోనుంచి బైలువె
ళ్లెను. । అందరును మిక్కిలీ ఆశ్చర్యపడి,—ఇది యేమి 27
టో? ఈ కొత్త బోధ యేలాటిదో? అధికారముతో
ఈయన అపవిత్రమైన ఆత్మలకు ఆజ్ఞాపించుచున్నా

*లేక, చేయించుకొనిరి. †లేక, చేయించుకొనెను.

డు, అవి ఆయనకు లోబడుతున్నవని ఒకనితో ఒకడు
28 చెప్పుకొనిరి. । వెంటనే ఆయన కీర్తి గలిలైయ
చుట్టూ ఉన్న దేశమందంతటా వ్యాపించెను.

29 వెంటనే సునగోగులోనుంచి బైలువెళ్లి, వారు యా
కోబుతోను, యోహానుతోను, సీమోను అంద్రెయ
30 అనే వారి ఇంట ప్రవేశించిరి. । అయితే సీమోను అత్త
జ్వరముతో పండుకొని యుండెను. వెంటనే ఆమెను
31 గూర్చి ఆయనతో మాట్లాడిరి. । ఆయన వచ్చి, ఆమె
చెయ్యి పట్టుకొని ఆమెను లేవనెత్తెను. వెంటనే
జ్వరము ఆమెను విడిచెను; ఆమె వారికి పరిచర్య
చేసెను.

32 సాయంకాలమందు సూర్యుడు అస్తమించినప్పుడు
సకలమైన రోగులను, దయ్యములు పట్టినవారినిని
33 ఆయన యొద్దికి తీసుకొని వచ్చిరి. । అప్పుడు ఆ పట్ట
34 ణమంతా వాకిటి యొద్ద కూడి యుండెను. । అప్పుడు
ఆయన నానావిధమైన వ్యాధులచేత పీడించబడిన
అనేకులను స్వస్థపరిచి, అనేకమైన దయ్యములను
వదలగొట్టి, అవి తన్ను ఎరిగినందున ఆయన ఆ దయ్య
ములను మాట్లాడనివ్వలేదు.

35 తెల్లవారక మునుపు ఇంకా చాలా రాత్రియున్న
ప్పుడు, ఆయన లేచి బైలుదేరి, అడవి చోటికి వెళ్లి
36 అక్కడ ప్రార్థన చేస్తూ ఉండెను. । తరువాత సీమో
ను, అతనితో కూడా ఉన్నవారును ఆయనను వెంబ
37 డించి । ఆయనను కనుగొని, — అందరు నిన్ను వెతుకు
38 తున్నారని ఆయనతో చెప్పిరి. । అందుకు ఆయన,—
నేను అక్కడ ప్రకటించేకొరకు సమీపమైన గ్రామ
ములకు వెళ్లుదాము; ఇందునిమిత్తము నేను బైలుదేరి
39 వచ్చితినని వారితో చెప్పెను. । ఆయన గలిలైయయం
దంతటా వారి సునగోగులలో ప్రకటిస్తూ దయ్యముల
ను వదలగొట్టుతూ ఉండెను.

40 అప్పుడు ఒక కుష్ఠరోగి ఆయన యొద్దికి వచ్చి ఆయన
యెదుట మోకాళ్లూని, — నీకు మనస్సు కలిగితే,
నన్ను శుద్ధపరచ గలవని ఆయనతో పలుకుతూ ఆయ
41 నను వేడుకొనెను. । యేసు కనికరపడి చెయ్యి చాపి
అతని ముట్టి, — నాకు మనస్సుకలదు నీవు శుద్ధిగా
42 ఉండుమని అతనితో చెప్పెను. । ఆయన చెప్పగానే
కుష్ఠరోగము అతని విడిచెను, అతడు శుద్ధపరచబడెను.

43 అప్పుడు ఆయన,—ఎవనికిని యేమిన్ని చెప్పక
44 జాగ్రత్తపడుము. । అయితే వెళ్లి యాజకునికి నిన్ను
నీవు చూపించుకొని నీ శుద్ధిని గూర్చి మోషే వారికి
సాక్ష్యార్థముగా నియమించినవాటిని సమర్పించు
మని అతనికి గట్టిగా ఆజ్ఞాపించి వెంటనే అతని పంపి
వేసెను. । అయితే అతడు బైలువెళ్లి ఆ సంగతి చాలా 45
ప్రకటించుటకును ప్రచురము చేయుటకును ఆరంభిం
చెను గనుక ఆయన ఇకను బహిరంగముగా పట్టణ
మందు ప్రవేశించలేక, వెలపట అడవి చోట్లను ఉం
డెను. అన్నిదిక్కులనుంచియు ఆయన యొద్దికి వచ్చిరి.

## 2. అధ్యాయము.

కొన్ని దినములైన పిమ్మట, ఆయన మళ్లీ కపెర్నా 1
హూములోకి వెళ్లెను. । ఆయన ఇంటిలో ఉన్నాడని 2
వినబడెను. వెంటనే, అనేకులు కూడివచ్చిరి గనుక
వాకిటనైనా వారికి స్థలము లేకపోయెను. అప్పుడు
ఆయన వారికి వాక్యము చెప్పెను.

అప్పుడు పక్షవాయువు గల మనుష్యుని నలుగురి 3
చేత మోయించి ఆయన యొద్దికి తీసుకొని వచ్చిరి. ।
అయితే గుంపు కూడినందున ఆయన యొద్దికి చేరలేక 4
ఆయన ఉన్న ఇంటి కప్పు విప్పి సందు చేసి పక్షవా
యువు గలవాడు పండుకొన్న పరుపు దించిరి. । యేసు 5
వారి విశ్వాసము చూచి, — కుమారుడా! నీ పాప
ములు క్షమించబడు గాక అని ఆ పక్షవాయువుగల
వానితో చెప్పెను. । అయితే శాస్త్రులలో కొందరు 6
అక్కడ కూర్చుండి, । —వీడు ఈలాగు ఎందుకు దేవ 7
దూషణలు పలుకుతున్నాడు? దేవుడు మాత్రమే
గాక పాపములు క్షమించుటకు అధికారముగల వాడె
వడని తమ హృదయములలో ఆలోచించుకొంటూ
ఉండిరి. । వారు తమలో తాము ఈలాగు ఆలో 8
చించుకొంటున్నారని యేసు వెంటనే తన ఆత్మలో
ఎరిగి, — మీరు ఈలాటివి మీ హృదయములలో
ఎందుకు ఆలోచించుకొంటున్నారు? । ఈ పక్షవా 9
యువు గల వానితో, — నీ పాపములు క్షమించ
బడుగాక అని చెప్పట సులభమా? లేక, — నీవు
లేచి నీ పరుపు ఎత్తుకొని నడువుమని చెప్పట సుల
భమా? । అయితే పాపములు క్షమించుటకు మను 10
ష్య కుమారునికి భూమియందు అధికారము కలదని
మీరు తెలుసుకొన వలెనని వారితో చెప్పి । — నీవు 11
లేచి నీ పరుపు ఎత్తుకొని నీ ఇంటికి వెళ్లుమని నీతో
చెప్పుతున్నానని పక్షవాయువుగల వానితో పలికె
ను. । వెంటనే అతడు లేచి పరుపు ఎత్తుకొని వారం 12
దరి యెదుట బైలు వెళ్లెను గనుక వారందరు మిక్కిలీ
ఆశ్చర్యపడి,—మనము ఈలాటివి యెన్నడున్ను చూ
డలేదని పలుకుతూ దేవుని స్తుతించిరి.

ఆయన సముద్రము దగ్గరకు తిరిగీ బైలువెళ్లెను. 13
సమూహమంతయు ఆయన యొద్దికి వచ్చెను; అప్పుడు
ఆయన వారికి బోధించుచుండెను.

14 ఆయన వెళ్లుతూ, సుంకపు మెట్టుయొద్ద కూర్చు
న్న అల్ఫయి కుమారుడైన లేవి అనే వాని చూచి,—
నీవు నన్ను వెంబడించుమని అతనితో చెప్పెను.
15 అప్పుడు అతడు లేచి ఆయనను వెంబడించెను. । ఆ
యన అతని ఇంట పఙ్తిలో కూర్చున్నప్పుడు, చాలా
మంది సుంకరులు, పాపులు యేసుతోను ఆయన
శిష్యులతోను పఙ్తిలో కూర్చుండిరి. వారు అనే
16 కులై యుండిరి; వారు ఆయనను వెంబడించిరి. । శా
స్త్రులు, ఫరిసైయులును ఆయన సుంకరులతోను పా
పులతోను భుజించుట చూచి—ఆయన సుంకరులతో
ను పాపులతోను భోజన పానములు చేయుటకు
హేతువు యేమిటి అని ఆయన శిష్యులను అడిగిరి. ।
17 యేసు దాని విని, — రోగులకే గాని అరోగులకు
వైద్యుడు అక్కరలేదు. మనస్సు తిప్పుకొనుటకు పా
పులనే గాని నీతిమంతులను పిలుచుటకు నేను రాలే
దని వారితో చెప్పెను.

18 యోహానుయొక్క శిష్యులు ఫరిసైయులును ఉప
వాసము చేయుచుండిరి గనుక వారు వచ్చి, — యో
హాను శిష్యులు ఫరిసైయుల శిష్యులును ఉపవాసము
చేస్తున్నారు అయితే నీ శిష్యులు ఉపవాసము చేయ
19 రు, అది ఎందుకు అని ఆయనను అడిగిరి. । అందుకు
యేసు, — పెండ్లివారు తమతో కూడా పెండ్లి కుమా
రుడు ఉన్న కాలములో ఉపవాసము చేయగలరా?
పెండ్లి కుమారుడు తమతో కూడా ఉండే కాలములో
20 ఉపవాసము చేయలేరు. । అయితే పెండ్లి కుమారుడు
వారి యొద్దనుంచి కొంచుపోబడే దినములు వచ్చును;
21 అప్పుడు ఆ దినములలో ఉపవాసము చేతురు. । ఎవ
డును పాత వస్త్రమునకు కొత్త గుడ్డ మాసిక వేయడు,
వేస్తే ఆ కొత్త మాసిక పాత వస్త్రము వెల్తిపరుచును,
22 చిరుగు మరీ చెడును. । ఎవడును పాత సిద్దెలలో కొత్త
మద్యము పోయడు; పోసితే, కొత్త మద్యము ఆ సిద్దె
లు పిగుల్చుటవల్ల ఆ మద్యము కారును, సిద్దెలు చెడి
పోవును. అయితే కొత్త మద్యమును కొత్త సిద్దెలలో
పోయవలెనని పలికెను.

23 మరియు, ఆయన సబ్బాతుయందు చేల ద్వారా
వెళ్లుచుండెను. అప్పుడు ఆయన శిష్యులు సాగుతూ
24 వెన్నులు తుంచుటకు ఆరంభించిరి.। అప్పుడు ఫరి
సైయులు,— ఇదుగో సబ్బాతు యందు చేయ తగని
దాని వారు ఎందుకు చేస్తున్నారని ఆయనతో చెప్పి
25 రి. । అందుకు ఆయన,—దావీదుకు అక్కర కలిగిన
ప్పుడు, అతడు అతనితో కూడా ఉన్నవారును ఆక
26 లిగొనినప్పుడు అతడు ఏమి చేసెనో, । అతడు ఏలాగు
అభియాథారనే ప్రధాన యాజకుని కాలమందు దేవ
మందిరములో ప్రవేశించి, యాజకులే గాని ఇతరులు
తిన కూడని సమ్ముఖపు రొట్టెలు తిని తనతో కూడా
ఉన్నవారికి ఇచ్చెనో మీరు ఎన్నడును చదువలేదా?
అని పలికెను; । మరియు ఆయన — సబ్బాతు మను 27
ష్యుల నిమిత్తమే గాని మనుష్యులు సబ్బాతు నిమిత్తము
చేయబడలేదు. కాబట్టి మనుష్య కుమారుడు సబ్బా 28
తుకును ప్రభువై యున్నాడని వారితో చెప్పెను.

## 3. అధ్యాయము.

ఆయన సునగోగులో తిరిగీ ప్రవేశించెను. అక్కడ 1
ఎండిన చెయ్యిగల ఒక మనుష్యుడు ఉండెను. । అ 2
ప్పుడు వారు ఆయన మీద తప్పు మోపుటకు సబ్బాతు
యందు ఇతని స్వస్థపరుచునేమో అని ఆయనను కని
పెట్టుచుండిరి. । అప్పుడు ఆయన ఎండిన చెయ్యి గల 3
వానితో,— నీవు లేచి మధ్యను నిలువుమని చెప్పి ।
—సబ్బాతుయందు మేలు చేయుట న్యాయమా, లేక 4
కీడు చేయుటా? ప్రాణము రక్షించుట న్యాయమా,
లేక చంపుటా? అని వారిని అడిగెను; అయితే వారు
ఊరకుండిరి. । అప్పుడు ఆయన వారి హృదయ కాఠి 5
న్యమునకు దుఃఖపడి, కోపముతో వారి చుట్టూ చూ
చి,— నీ చెయ్యి చాపుమని ఆ మనుష్యునితో చెప్పెను.
అతడు దాని చాపెను. అతని చెయ్యి రెండవ దాని
వలె బాగు చేయబడెను.

వెంటనే, ఫరిసైయులు బైలువెళ్లి, తాము ఆయ 6
నను ఏలాగు చంపుదుమో అని హేరోదీయులతో
కూడా ఆయనకు విరోధముగా ఆలోచన చేయుచుం
డిరి. । అప్పుడు యేసు తన శిష్యులతో కూడా సము 7
ద్రము యొద్దికి వెళ్లెను. । గలిలైయనుంచి గొప్ప సమూ 8
హము ఆయనను వెంబడించెను. యూదైయనుంచి,
యెరూశలేమునుంచి, ఇదూమైయనుంచి, యొర్దాను
అవతలనుంచి, తురు సీదోను అనే పట్టణముల ప్రాం
తమునుంచియు గొప్ప సమూహము ఆయన ఇంతలేసి
కార్యములను చేస్తున్నాడని విని, ఆయన యొద్దికి
వచ్చెను. । గుంపు కూడినందున వారు తన్ను ఇరుకున 9
వేయక ఉండుటకు ఒక చిన్న దోనె తనకు సిద్ధమై
యుండ వలెనని తన శిష్యులతో చెప్పెను. । ఆయన 10
అనేకులను స్వస్థపరిచెను గనుక వ్యాధులు గల వారం
దరు ఆయనను ముట్టుకొనుటకు ఆయన మీద పడు
తు ఉండిరి. । అపవిత్రమైన ఆత్మలు ఆయనను చూడ 11
గానే, ఆయన యెదుట సాగిలపడి, — నీవు దేవుని
కుమారుడవై యున్నావని పలుకుతూ కేకలు వేసె
ను. । అయితే తన్ను ప్రసిద్ధపరచకుండుటకు ఆయన 12
వాటిని బహుగా గద్దించెను.

13 తరువాత ఆయన కొండ ఎక్కి తాను ఇచ్ఛయిం
చుకొనిన వారిని పిలిచెను; వారు ఆయన యొద్దికి
14 వచ్చిరి. । వారు తనతో కూడా ఉండే నిమిత్తమును;
15 ప్రకటించుటకు, । రోగులను స్వస్థపరుచుటకు దయ్య
ములను వెళ్లగొట్టుటకు వారికి అధికారము కలుగుట
కును తాను వారిని పంపే నిమిత్తమును— ఆయన పన్నెం
16 డుమందిని నియమించెను. । వారెవరంటే సీమోను,
17 ఇతనికి ఆయన పేతురు అనే పేరు పెట్టెను.। జెబెదై
కుమారుడైన యాకోబు అతని సహోదరుడైన యో
హాను, వీరిద్దరికి ఆయన వురుపు కుమాళ్లనే అర్థ
18 మిచ్చే బోనెగెర్సనే పేరు పెట్టెను.। అంద్రెయ, ఫిలి
ప్పు, బర్తొలొమై, మత్తై, థోమా, అల్ఫయి కుమా
రుడైన యాకోబు, థద్దయి, కననీయుడైన సీమోను।
19 ఆయనను అప్పగించిన ఇస్కరియోతనే యూదా
అనేవారు.

20 వారు ఇంటిలోకి వెళ్లినప్పుడు । సమూహము తిరిగీ
కూడివచ్చెను, గనుక వారు భోజనము చేయలేకపో
21 యిరి. । ఆయన బంధువులు దీని విని, ఆయన వెర్రి
వాడనుకొని ఆయనను పట్టుకొనుటకు బైలువెళ్లిరి. ।
22 మరియు యెరూశలేమునుంచి వచ్చిన శాస్త్రులు,—
వీడు బయల్జెబూలు గలవాడై* దయ్యముల అధిప
తివల్ల దయ్యములను వదలగొట్టుతున్నాడని చెప్పు
23 కొనిరి. । అప్పుడు ఆయన వారిని తన యొద్దికి పిలి
చి ఉపమానములుగా వారితో చెప్పినదేమంటే, —
24 సైతాను సైతానును ఏలాగు వదలగొట్టును. । మరియు
ఒక రాజ్యము తనకు తానే విరోధముగా వేరుపడితే
25 ఆ రాజ్యము నిలువ నేరదు. । ఒక ఇల్లు తనకు తానే
విరోధముగా వేరుపడితే ఆ ఇల్లు నిలువ నేరదు. ।
26 సైతాను తనకు తానే విరోధముగా లేచి వేరుపడితే
27 నిలువ నేరక అంతము పొందును. । ఒకడు మొదట
ఒక బలవంతుని బంధించితేనే గాని ఆ బలవంతుని
ఇంటిలో చొచ్చి వాని సామగ్రి దోచుకొన నేరడు.।
28 బంధించితే వాని ఇల్లు దోచుకొన వచ్చును. మనుష్య
కుమారులకు సమస్త పాపములు, వారు దూషించే దూష
29 ణలన్నియు క్షమించబడును. । అయితే పరిశుద్ధాత్మను
దూషించే వాడెవడో వాడు ఎప్పుడును క్షమ పొందక
నిత్యమైన శిక్షావిధికి† లోబడునని నిశ్చయముగా
30 మీతో చెప్పుతున్నానని పలికెను; । ఎందుకంటే అప
31 విత్రమైన ఆత్మగల వాడని చెప్పిరి. । తరువాత ఆయన
సహోదరులు తల్లియు, వచ్చి వెలపట నిలిచి ఆయ
నను పిలువనంపించిరి. । అప్పుడు జనసమూహము ఆయ 32
న చుట్టూ కూర్చుండెను. వారు — ఇదుగో! నీ తల్లి
నీ సహోదరులును వెలపట నిన్ను వెతుకుతున్నారని
ఆయనతో చెప్పిరి. । అందుకు ఆయన,— నా తల్లి నా 33
సహోదరులును ఎవరని వారిని అడిగి, । తన చుట్టు 34
కూర్చున్న వారిని చుట్టు చూచి— ఇదుగో! నా తల్లి,
నా సహోదరులును; । దేవునికి ఇష్టమైనవి చేసే వా 35
డెవడో వాడు నాయొక్క సహోదరుడు, సహో
దరి, తల్లియునై యున్నాడని పలికెను.

## 4. అధ్యాయము.

ఆయన సముద్రము దగ్గెర మళ్లీ బోధించుటకు 1
ఆరంభించెను. అప్పుడు బహు జనసమూహము ఆయన
యొద్దికి కూడి వచ్చినందున, ఆయన సముద్రములో
ఒక దోనె యెక్కి కూర్చుండెను. ఆ సమూహమంతా
సముద్రము యొద్ద భూమి మీద ఉండెను. । అప్పుడు 2
ఆయన ఉపమానములతో అనేక సంగతులు వారికి
బోధిస్తూ, తన బోధయందు, । — ఆలకించండి; ఇదుగో! 3
విత్తేవాడు విత్తుటకు బైలువెళ్లెను. । అతడు విత్తుతూ 4
ఉన్నప్పుడు, కొన్ని త్రోవ పక్కను పడెను; ఆకాశ
పక్షులు వచ్చి వాటిని తినివేసెను. । మరి కొన్ని చాలా 5
మన్ను లేని రాతి భూమిలో పడెను. మంటి లోతు
లేనందున అవి వెంటనే మొలిచెను. । అయితే సూ 6
ర్యుడు ఉదయించినప్పుడు, అవి కమిలి, వాటికి వేరు
లేనందున ఎండిపోయెను. । మరికొన్ని ముండ్ల తుప్ప 7
లలో పడెను. ఆ ముండ్ల తుప్పలు మొలిచి, వాటిని
అణిచివేసెను గనుక అవి ఫలించలేదు. । మరి కొన్ని 8
మంచి భూమిలో పడెను. అవి మొలిచి, వృద్ధిపొంది,
పైరై, ఒకటి ముప్పదింతలుగాను, మరియొకటి అరువ
దింతలుగాను, మరియొకటి నూరింతలుగాను పంట పం
డెనని చెప్పెను. । అప్పుడు ఆయన,— వినుటకు చెవులు 9
గలవాడు వినుగాక అని పలికెను.

ఆయన ఒంటిగా ఉన్నప్పుడు, పన్నెండుమంది 10
తో కూడా ఆయన చుట్టు ఉన్నవారు ఉపమానము
లను గురించి ఆయనను అడిగిరి. । అప్పుడు ఆయ 11
న,— దేవుని రాజ్యము యొక్క మర్మము ఎరుగుట
మీకు ఇయ్యబడి యున్నది. । అయితే వెలపటి వారు, 12
ఒక వేళ దేవుని తట్టు తిరిగి పాపక్షమ పొంద
కుండేటట్టు, వారు చూచియు కానక చూచుటకు,
వినియు గ్రహించక వినుటకును, ఇవన్నీ వారికి ఉప
మానములుగా ఉన్నవని వారితో పలికెను. । మరియు 13

* లేక, పట్టినవాడై. † కొన్ని ముఖ్య ప్రతులలో, పాపమునకు.

ఆయన,—ఈ ఉపమానము మీ రెరుగరా? ఆలాగైతే
ఉపమానములన్నియు ఏలాగు ఎరుగుదురని వారిని
అడిగెను.

14,15 విత్తేవాడు వాక్యము విత్తుతున్నాడు. । త్రోవ
పక్కను ఉన్నవారు ఎవరంటే, వాక్యము అక్కడ విత్త
బడును; అయితే వారు వినగానే, సైతాను వచ్చి, వారి
హృదయములలో విత్తబడిన వాక్యము ఎత్తుకొని పో
16 వును. । అటువలె, రాతి భూమియందు విత్తబడినవారు
ఎవరంటే, వీరు వాక్యము విని సంతోషముతో దాని
17 అంగీకరిస్తున్నవారు; । అయితే వారికి తమలో వేరు
లేదు గనుక కొంత కాలమే ఉందురు. వాక్యమువల్ల
శ్రమయైనా హింసయైనా కలిగితే, వెంటనే ఆతంక
18 పరచబడుదురు. । ముండ్ల తుప్పలలో విత్తబడినవారు
19 ఎవరంటే, వీరు వాక్యము వింటున్నవారు; । అయితే
ఈ లోకవిచారములు, ధనమువల్లనైన మోసము,
తక్కినవాటి విషయమైన అపేక్షలును లోపల చొచ్చి,
20 వాక్యము అణిచివేయుటవల్ల నిష్ఫలమౌను. । మంచి
భూమియందు విత్తబడినవారు ఎవరంటే, వీరు వా
క్యము విని దాని అంగీకరించి, ఒకటి ముప్పదింతలు
గాను, ఒకటి అరువదింతలుగాను ఒకటి నూరింతలు
గానును, ఫలిస్తున్నవారు అని పలికెను.

21 మరియు ఆయన,—దీపము దీపస్తంభముమీద ఉం
చబడుటకే గాని కుంచము కిందనైనా మంచము కింద
22 నైనా ఉంచబడుటకు తేబడదుగదా? । తేటపరచబ
డని రహస్యము యేదియు లేదు, బైలుపరచబడుటకే
23 గాని యేదియు మరుగుచేయబడలేదు. । వినుటకు ఎవని
కైనా చెవులు కలిగితే వాడు వినుగాక అని వారితో
చెప్పెను.

24 మరియు ఆయన,—మీరు ఏమి వింటున్నారో
దాని చూచుకొనండి. ఏకొలతతో మీరు కొలుతురో
దానితోనే మీకు కొలువబడును. ఆలకించే మీకు మరీ
25 యెక్కువ ఇయ్యబడును; । కలిగినవాడెవడో వానికి
ఇయ్యబడును. కలుగని వాడెవడో వానికి కలిగినదిని
వాని యొద్దనుంచి తీసుకొనబడునని వారితో పలికెను.

26,27 మరియు ఆయన,—ఒక మనుష్యుడు భూమి
యందు విత్తనము వేసి, దివారాత్రులు నిద్రపోతూ
మేలుకొంటూ ఉండేటప్పుడు వానికి తెలియని రీతిగా
ఆ విత్తనము మొలిచి పెరిగితే ఏలాగో, ఆలాగే దేవుని
28 రాజ్యము ఉన్నది. । భూమి మొదట మొలక, తరువాత
వెన్ను, తరువాత వెన్నులో పూర్ణమైన గింజ కలిగిం
29 చుకొని తనంతట తానే ఫలించును. । పంట పండితే,
కోతకాలము వచ్చినదని వాడు వెంటనే కొడవలి చా
పును అని పలికెను.

మరియు ఆయన,—దేవుని రాజ్యమును దేనితో 30
పోల్తము? ఏ ఉపమానముతో దాని ఉపమింతము? ।
అది ఆవ గింజ వంటిది. అది భూమియందు విత్తబడే 31
టప్పుడు, భూమి మీద ఉన్న అన్ని విత్తనములకంటే
చిన్నది. । అయితే విత్తబడిన తరువాత, అది మొలిచి 32
కూరచెట్లన్నిటికంటె పెద్దదై కొమ్మలు వేసును గనుక
గొప్ప ఆకాశ పక్షులు దాని నీడను నివసించునని
పలికెను.

వారికి వినుటకు కలిగిన శక్తి కొలది ఈలాటి అనే 33
కమైన ఉపమానములతో ఆయన వారికి వాక్యము
చెప్పుచుండెను. । ఉపమానము లేక వారితో మాట్లాడ 34
లేదు. అయితే ఏకాంతముగా తన శిష్యులకు అన్ని
టిని విశదపరిచెను.

ఆ దినమందే, సాయంకాలమైనప్పుడు, ఆయన 35
వారితో,—అద్దరికి వెళ్లుదామని చెప్పెను. । వారు ప్రజ 36
లను పంపివేసి ఆయన దోనెలో ఉన్నపాటున ఆయ
నను తీసుకొని వెళ్లిరి. అయితే ఆయనతో మరి కొన్ని
దోనెలు ఉండెను. । అప్పుడు మిక్కిలి పెద్ద గాలి 37
రేగి తరంగములు ఆ దోనె మీద కొట్టెను గనుక,
అది వెంటనే నింపబడుతూ ఉండెను. । అయితే ఆయన 38
దోనె వెనుకతట్టు తలగడ మీద నిద్రిస్తూ ఉండెను.
వారు ఆయనను లేపి,—బోధకుడా! మేము నశించిపో
తున్నాము, నీకు విచారములేదా? అని ఆయనతో పలి
కిరి. । అప్పుడు ఆయన లేచి గాలిని గద్దించి,—నిశ్శబ్ద 39
ముగా ఊరకుండుమని సముద్రముతో చెప్పెను. అ
ప్పుడు గాలి నిలిచి మిక్కిలి నిమ్మళముగా ఉండెను. ।
అప్పుడు ఆయన,—మీరు ఎందుకు ఇంత భయపడు 40
తున్నారు? మీకు నమ్మిక లేకపోవుట యేల? అని
వారితో పలికెను. । వారు మిక్కిలి భయపడి,—ఈ 41
యన ఏలాటివాడో; గాలి సముద్రమును ఈయనకు
లోబడుతున్నవని ఒకనితో ఒకడు చెప్పుకొనిరి.

## 5. అధ్యాయము.

తరువాత వారు ఆ సముద్రమునకు అద్దరినున్న 1
గదరేనీయుల దేశమునకు వచ్చిరి. । ఆయన దోనె మీద 2
నుంచి దిగగానే, అపవిత్రమైన ఆత్మగల మనుష్యుడు
సమాధులలోనుంచి ఆయనకు ఎదురుపడెను. । అతడు 3
సమాధులలో వాసము చేస్తూ ఉండెను. ఎవడును
సంకెళ్లతోనైనా అతని బంధించలేక పోయెను. । అతని 4
కాళ్లకు చేతులకును పలుమారు సంకెళ్లువేసి బంధిం
చినప్పటికిని అతనిచేత ఆ చేతి సంకెళ్లు తెంపబడెను,
కాలి సంకెళ్లు ముక్కలు చేయబడెను. ఎవడును అతని
సాధువుగా చేయలేక పోయెను. । వాడు ఎల్లప్పుడును 5
దివారాత్రులు కొండలయందు, సమాధులయందును

కేకలు వేస్తూ, తన్నుతాను రాళ్లతో కోసుకొంటూ
6 ఉండెను. । అయితే అతడు యేసుని దూరమునుంచి
7 చూచి, పరుగెత్తి ఆయనకు నమస్కరించి,।—యేసూ!
సర్వోన్నతుడైన దేవుని కుమారుడా! నీతో నాకేమి!
నన్ను బాధపరచకుమని దేవుని పేరట నిన్ను ఆన
బెట్టుతున్నానని గొప్ప శబ్దముతో కేకలు వేసెను.।
8 ఎందుకంటే ఆయన,—అపవిత్రమైన ఆత్మా! ఈ మను
ష్యునిలోనుంచి బైలువెళ్లుమని దానితో చెప్పెను. ।
9 అప్పుడు ఆయన,—నీ పేరేమని దాని అడిగెను. అం
దుకు వాడు,—నా పేరు సేన, మేము అనేకులము అని
10 ఉత్తరమిచ్చి, । తమ్మును ఆ దేశములోనుంచి తోలివేయ
11 వద్దని ఆయనను మిక్కిలీ వేడుకొనెను. । ఆ కొండ
దగ్గర, పందుల పెద్ద మంద అక్కడ మేస్తూ ఉండెను.।
12 అప్పుడు,—మేము ఆ పందులలో ప్రవేశించుటకు,
మమ్మును వాటి యొద్దికి పంపుమని ఆ దయ్యములన్ని
13 ఆయనను బతిమాలుకొనెను. । వెంటనే యేసు వాటికి
సెలవిచ్చెను. అప్పుడు ఆ అపవిత్రమైన ఆత్మలు బైలు
వెళ్లి పందులలో ప్రవేశించెను. అప్పుడు దాదాపుగా
రెండువేలుగల ఆ మంద ప్రపాతమునుంచి ఉరువడిగా
సముద్రములోకి పరుగెత్తి, సముద్రములో ఊపిరి
14 తిరుగక చచ్చెను. । అయితే ఆ పందులు మేపేవారు
పారిపోయి, పట్టణములోను గ్రామములలోను ఆసం
గతి తెలియచేసిరి. అప్పుడు జరిగినది చూచుటకు వా
15 రు బైలువెళ్లి, । యేసు యొద్దికి వచ్చి, సేన అనే దయ్య
ములు పట్టినవాడు బట్టలు వేసుకొని స్వస్థచిత్తుడై
16 కూచుణ్నియుండుట చూచి భయపడిరి. । అప్పుడు
చూచినవారు, దయ్యములు పట్టినవానికి ఏగతి కలి
గెనో అదిని, పందులను గురించినదిని వారితో చెప్పిరి.।
17 అప్పుడు తమ ప్రాంతములు విడిచి వెళ్లుటకు ఆయ
నను వేడుకొన మొదలుబెట్టిరి.

18 ఆయన దోనె యెక్కినప్పుడు, దయ్యములు పట్టిన
వాడు ఆయన యొద్ద ఉండుటకు ఆయనను బతిమాలు
19 కొనెను. । అయితే యేసు వానికి సెలవియ్యక,—నీవు
నీ ఇంటికి నీవారి యొద్దికిని వెళ్లి, ప్రభువు నిన్ను కనిక
రించి నీకు ఎంత గొప్ప కార్యములు చేసెనో వారికి
20 తెలియచెప్పుమని పలికెను. । అతడు వెళ్లి యేసు తనకు
ఎంత గొప్పవి చేసెనో వాటిని దెకపొలిలో ప్రక
టించుటకు ఆరంభించెను. అందుకు అందరు ఆశ్చర్య
పడిరి.

21 అంతట యేసు మళ్లీ దోనె మీద అద్దరికి వెళ్లిన
ప్పుడు, బహు జనసమూహము ఆయన యొద్దికి కూడి
22 వచ్చెను. ఆయన సముద్రము దగ్గిర ఉండెను. । అప్పు
డు సునగోగు అధికారులలో యయీరనే పేరుగల
ఒకడు వచ్చి ఆయనను చూచి, ఆయన పాదముల
మీద పడి । —నా చిన్న కుమార్తె అంత్య దశలో 23
ఉన్నది ఆమె రక్షించబడే నిమిత్తము, నీవు వచ్చి
ఆమె మీద చేతులు ఉంచితే ఆమె బ్రతుకునని ఆయ
నను మిక్కిలీ వేడుకొనెను: । యేసు అతనితో కూడా 24
వెళ్లెను; అయితే బహు జనసమూహము ఆయనను
వెంబడించి ఆయనను ఇరుకుపరిచెను.

అప్పుడు పన్నెండు సంవత్సరములనుంచి రక్తకు 25
సుమ రోగము గల ఒక స్త్రీ ఉండెను. । ఆమె అనేక 26
వైద్యులచేత బహుగా శ్రమపడి, తనకు కలిగినదంత
యు వ్రయముచేసి, ఎంతమాత్రమును స్వస్థతపొం
దక, మరీ ఎక్కువగా సంకటపడుతూ ఉండెను. ।
ఆమె యేసుని గూర్చి విని, జనసమూహములో వెను 27
కకు వచ్చి,।—నేను ఆయన వస్త్రము మాత్రమే ముట్టితే 28
నాకు బాగుకలుగును అనుకొని ఆయన వస్త్రము ము
ట్టెను. । వెంటనే ఆమె రక్తధార నిలిచెను గనుక తన 29
శరీరములో ఆ బాధనుంచి స్వస్థత కలిగెనని ఎరి
గెను. । వెంటనే, యేసు తనలోనుంచి శక్తి బైలు వెళ్లె 30
నని తనలో తాను ఎరిగి జనసమూహముతట్టు తిరిగి,—
నా వస్త్రములు ఎవడు ముట్టెనని అడిగెను. । అం 31
దుకు ఆయన శిష్యులు,—నిన్ను ఇరుకుపరుస్తున్న
జనసమూహము చూస్తున్నావు—నన్ను ఎవడు ముట్టె
నని అడుగుతున్నావా? అని పలికిరి. । దీని చేసిన 32
ఆమెను కనుగొనుటకు ఆయన చుట్టూ చూచెను.।
అయితే ఆ స్త్రీ తనకు కలిగినది ఎరిగి, భయపడి, వణు 33
కుతూ వచ్చి ఆయన యెదుట సాగిలపడి, ఆ నిజమం
తయు ఆయనతో చెప్పెను. । అప్పుడు ఆయన,— 34
కుమారీ! నీ విశ్వాసము నిన్ను స్వస్థపరిచెను; సమా
ధానముతో వెళ్లుము; నీ బాధనుంచి నీకు స్వస్థత కలు
గుగాక అని ఆమెతో పలికెను.

ఆయన మాట్లాడుతు ఉండగా, సునగోగుయొక్క 35
ఆ అధికారి ఇంటినుంచి కొందరు వచ్చి,—నీ కుమా
ర్తె చనిపోయెను; నీవు ఇకను బోధకుని ఎందుకు శ్రమ
పరుస్తున్నావని పలికిరి. । అయితే చెప్పబడిన మాట 36
యేసుకు వినబడి,—ఆయన వెంటనే భయపడకుము,
నమ్మిక మాత్రము ఉంచుమని సునగోగు అధికారితో
చెప్పెను. । అప్పుడు ఆయన పేతురు, యాకోబు, 37
యాకోబు సహోదరుడైన యోహాను అనే వీరిని
గాక మరి యెవరినైనా తన వెంబడి రానివ్వక । సున 38
గోగుయొక్క అధికారి ఇంటికి వచ్చి, ఆక్రందన
మును, ఏడుస్తూ చాలా ప్రలాపిస్తూ ఉన్నవారినిని

39 చూచి,। లోపటికి వెళ్లి — మీరు ఎందుకు ఆక్రంద
నము చేసి ఏడుస్తున్నారు? ఈ చిన్నది నిద్రిస్తున్నదే
40 గాని చనిపోలేదని వారితో పలికెను. । అప్పుడు
వారు ఆయనను అపహసించిరి. అయితే ఆయన అంద
రిని వెలపట ఉంచి, ఆ చిన్నదాని తల్లిదండ్రులను
తనతో కూడా ఉన్నవారినిని వెంటబెట్టుకొని, ఆ
41 చిన్నది పండుకొనియున్న స్థలములో ప్రవేశించి, । ఆ
చిన్నదాని చెయ్యి పట్టుకొని,—తలీథా కూమీ! అని,
ఆమెతో చెప్పెను. అది భాషాంతరమందు, చిన్నదా
42 నా! లెమ్మని నీతో చెప్పుతున్నాననేదే. । వెంటనే, ఆ
చిన్నది లేచి నడిచెను; ఆమె పన్నెండు సంవత్సరము
లదై యుండెను. అప్పుడు వారు మిక్కిలీ ఆశ్చర్యము
43 తో ఆశ్చర్యపడిరి. । ఆయన ఈ సంగతి ఎవనికిని తెలి
యబడకూడదని వారికి గట్టిగా ఆజ్ఞాపించి, ఆమెకు
భోజనము పెట్టబడ వలెనని చెప్పెను.

## 6. అధ్యాయము.

1 ఆయన అక్కడనుంచి బైలువెళ్లి స్వదేశమునకు
వచ్చెను. ఆయన శిష్యులు ఆయనను వెంబడించిరి. ।
2 సబ్బాతు వచ్చినప్పుడు,ఆయన సునగోగులో బోధించు
టకు ఆరంభించెను. అప్పుడు అనేకులు వింటూ ఆశ్చ
ర్యపడి,—ఇవి ఇతనికి ఎక్కడనుంచి కలిగెను? ఇతని
చేతులవల్ల ఇంత గొప్ప కార్యములు చేయబడుటకు
3 ఇతనికి ఇయ్యబడిన ఈ జ్ఞానము ఏలాటిది?। ఇతడు మరి
య కుమారుడును, యాకోబు, యోసే, యూదా,
సీమోను అనే వారి అన్నయునైన వడ్లవాడు గదా,
ఇతని చెల్లెండ్లు ఇక్కడ మనయొద్ద ఉన్నారు గదా!
అని చెప్పుకొంటూ ఆయనయందు అభ్యంతరపడిరి. ।
4 అయితే యేసు,—ప్రవక్త తన దేశములోను, తన బం
ధువులలోను, తన ఇంటిలోనును గాక మరి ఎక్కడ
5 నైనా ఘనహీనుడై ఉండడని చెప్పెను. । ఆయన,
కొందరి రోగులమీద చేతులు ఉంచి వారిని స్వస్థపరి
చెను గాని మరి ఏ అద్భుతమును అక్కడ చేయలేక
6 పోయెను.। ఆయన వారి అవిశ్వాసమునకు ఆశ్చర్య
పడుచు ఉండెను. తరువాత ఆయన,చుట్టు ఉన్న గ్రా
మములలో తిరుగుతు బోధిస్తు ఉండెను.

7 అప్పుడు ఆయన ఆ పన్నెండుమందిని తన యొద్దికి
పిలిచి, వారిని ఇద్దరిద్దరినిగా పంపుటకు ఆరంభించి,
అపవిత్రమైన ఆత్మలమీద వారికి అధికారమిచ్చెను. ।
8 వారు ప్రయాణము కొరకు చేతి కర్ర గాక అసిమియై
నా, రొట్టెయైనా, సంచితో రూకలైనా పుచ్చుకొన
వద్దనియు । చెప్పులు తొడుగుకొని, రెండు అంగీలు 9
వేసుకొన వద్దనియు వారికి ఆజ్ఞాపించెను. । మరియు 10
ఆయన — మీరు ఎక్కడ ఇంటిలో ప్రవేశింతురో,
మీరు అక్కడనుంచి వెళ్లేపర్యంతము, ఆ ఇంటిలోనే
బస చేయండి. । ఎవరైనా మిమ్ము చేర్చుకొనక, మీ 11
మాటలు వినకుంటే, మీరు అక్కడనుంచి వెళ్లేటప్పుడు
వారికి సాక్ష్యము కొరకు మీ పాదముల కింది ధూళి
దులిపివేయండి. న్యాయపు తీర్పు దినమందు, ఆ పట్ట
ణముకంటే సొదమ గొమొఱ్ఱా అనే పట్టణముల
గతి ఓర్వ తగినదై యుండునని మీతో నిశ్చయముగా
చెప్పుతున్నానని పలికెను.

అప్పుడు వారు బైలుదేరి (మనుష్యులు) మనస్సు 12
తిప్పుకొన వలెనని ప్రకటించుచుండిరి. । వారు అనే 13
కమైన దయ్యములను వెళ్లగొట్టిరి, అనేకులైన రోగు
లకు నూనె రాచి, వారిని స్వస్థపరిచిరి.

అప్పుడు ఆయన కీర్తి ప్రసిద్ధమైనందున, హేరో 14
దనే రాజు విని,—బాప్తిస్తనే* యోహాను చనిపోయిన
వారిలోనుంచి లేచియున్నాడు గనుక శక్తులు అతని
యందు కార్యసాధకములై యున్నవని చెప్పెను. ।
అయితే ఇతరులు—ఈయన ఏలీయా అనియు, మరి 15
కొందరు—ఈయన ప్రవక్తలలో ఒక ప్రవక్తవలె ఉన్నా
డనియు చెప్పుకొనుచుండిరి. । అయితే హేరోదు అది 16
విని— నేను తల కొట్టించిన యోహాను ఇతడే; చని
పోయిన వారిలోనుంచి లేచియున్నాడని పలికెను. ।
హేరోదు తన సహోదరుడైన ఫిలిప్పు భార్యయైన 17
హేరోదియను పెండ్లాడెను గనుక ఆమె నిమిత్తము
పంపి, యోహానును పట్టించి, చెరసాలలో అతని
కట్టించి యుండెను. । యోహాను — నీ సహోదరుని 18
భార్యను ఉంచుకొనుట నీకు న్యాయము కాదని హే
రోదుతో చెప్పుచుండెను గనుక । హేరోదియ అతని 19
యందు పగపట్టి అతని చంపించుటకు కోరుచుండెను;
అయితే ఆమెవల్ల కాకపోయెను. । యోహాను నీతి 20
యు పరిశుద్ధతయు గల మనుష్యుడని హేరోదు యె
రిగి, అతనికి భయపడుతు, అతని కాపాడుతు† అతని
(మాటలు) విని అనేక కార్యములు చేస్తు, అతని మాట
సంతోషముతో వినుచుండెను. । అయితే సమయో 21
చితమైన దినము వచ్చెను; హేరోదు తన జన్మదినోత్స
వమందు తన ప్రధానులకు, సహస్రాధిపతులకు, గలి
లైయ దేశపు అధికారులకును విందు చేసినప్పుడు, । ఆ 22
హేరోదియ కుమార్తె లోపలికి వచ్చి, నాట్యమా
డెను. అది హేరోదును, అతనితో కూడా పజ్తిలో

* అనగా, బాప్తిస్తము చేయించేవాడు. †లేక, కనిపెట్టుతూ.

కూర్చున్న వారినిని సంతోషపరిచెను గనుక రాజు—
నీవు యేమి కోరుతున్నావో అది నన్ను అడుగుము;
23 నేను నీకిత్తునని ఆ చిన్నదానితో చెప్పెను. । మరి
యు,—నీవు నా రాజ్యములో సగము మట్టుకు ఏమి
అడిగినప్పటికి నీకిత్తునని, అతడు ఆమెతో ప్రమా
24 ణముచేసి చెప్పెను. । అప్పుడు ఆమె బైలువెళ్లి—నేను
ఏమి అడుగ వలెనని తన తల్లితో పలికినందుకు, ఆమె—
బాప్తిస్తనే యోహాను తల అడుగుమని చెప్పెను.
25 వెంటనే, ఆమె త్వరగా రాజు యొద్దికి వచ్చి —
బాప్తిస్తనే యోహాను తల తబుకులో పెట్టి ఈ వేళనే
నీవు నాకు ఇప్పించుటకు కోరుతున్నానని అడిగెను. ।
26 అప్పుడు రాజు బహు దుఃఖపడెను. అయినప్పటికి
ప్రమాణముల నిమిత్తము, తనతో కూడా కూర్చున్న
వారి నిమిత్తమును ఆమెకు ఇవ్వననుటకు మనస్సులేక
ఉండెను.
27 వెంటనే రాజు అతని తల తెమ్మని ఆజ్ఞాపించి, ఒక
బంటును పంపెను. వాడు వెళ్లి చెరసాలలో అతని
28 తల కొట్టి, । తబుకుతో అతని తల తెచ్చి, ఆ చిన్న
దానికి ఇచ్చెను; ఆ చిన్నది తన తల్లికి దాని ఇచ్చెను. ।
29 అతని శిష్యులు దీని విని, వచ్చి అతని మొండెము మో
సుకొని వెళ్లి, సమాధిలో దాని ఉంచిరి.
30 అంతలో అపొస్తలులు యేసు యొద్దికి కూడివచ్చి:
తాము జరిగించిన వాటినన్నిటిని, బోధించిన వాటిన
31 న్నిటిని ఆయనకు తెలియ చేసిరి. । అప్పుడు ఆయన—
మీరు ఏకాంతముగా అరణ్య స్థలమునకు వచ్చి, కొంత
అలసట తీర్చుకొనండని చెప్పెను. అనేకులు వస్తు
పోతు ఉండుటవల్ల భోజనము చేయుటకైనా వారికి
32 అవకాశములేక పోయెను. । కాబట్టి వారు ఒక దోనె
మీద అరణ్య స్థలమునకు ఏకాంతముగా వెళ్లిరి. ।
33 అయితే వారు వెళ్లుట అనేకులు చూచి, ఆయనను
గుర్తెరిగి, అక్కడికి కాలినడకతో సకల పట్టణముల
నుంచి పరుగెత్తి, వారికంటే ముందుగా చేరి ఆయన
34 యొద్దికి కూడివచ్చిరి. । అప్పుడు యేసు వెలపటికి
వచ్చి, విస్తార జనమును చూచి, వారు మేపేవాడు
లేని గొర్రెల వలె ఉన్నందున, వారిని కనికరించి వా
రికి అనేక సంగతులను బోధించుటకు ఆరంభించెను.
35 చాలా ప్రొద్దు పోయిన తరువాత, ఆయన శిష్యు
లు ఆయన యొద్దికి వచ్చి — ఇది అరణ్య స్థలము;
36 ఇప్పుడు చాలా ప్రొద్దుపోయినది; । చుట్టు ఉన్న పల్లె
టూళ్లకు వారు వెళ్లి రొట్టెలు కొనుకొనుటకు, వారిని
పంపివేయుము; వారికి తినుటకు ఏమియు లేదని పలి
కిరి. । అందుకు ఆయన — తినుటకు మీరు వారికి 37
ఇయ్యండని వారికి ఉత్తరమిచ్చెను. అందుకు వారు—
మేము వెళ్లి ఇన్నూరు దెనారముల* రొట్టెలు కొని
వారికి తినుటకు ఇయ్యగలమా? అని ఆయనతో పలి
కిరి. । అందుకు ఆయన—మీ యొద్ద ఎన్ని రొట్టెలు 38
ఉన్నవి? వెళ్లి చూడండని వారితో చెప్పెను. వారు
తెలుసుకొని—ఐదు రొట్టెలు, రెండు చేపలును ఉన్న
వనిరి. । అప్పుడు ఆయన — పచ్చిక మీద అందరిని 39
గుంపు గుంపులుగా కూర్చుండబెట్టండని వారికి ఆజ్ఞా
పించెను గనుక । వారు చచ్చౌకముగా నూరుమంది 40
చొప్పున, యేబదిమంది చొప్పున, పజ్తులు తీర్చి కూ
ర్చుండిరి. । అప్పుడు ఆయన ఆ ఐదు రొట్టెలు ఆ రెం 41
డు చేపలును పట్టుకొని, ఆకాశముతట్టు కన్నులెత్తి,
స్తోత ము చేసి, ఆ రొట్టెలు విరిచి, వారికి వడ్డించే
నిమిత్తము తన శిష్యులకు ఇచ్చి, ఆ రెండు చేపలును
అందరికిని వడ్డింప చేసెను. । వారందరు తిని తృప్తి 42
పొందిరి. । తరువాత ముక్కలు, మిగిలిన చేపలును 43
పన్నెండు గంపల నిండా ఎత్తిరి. । ఆ రొట్టెలు తినిన 44
వారు కొంచెము ఎక్కువ తక్కువ అయిదు వేల పురు
షులు.
వెంటనే ఆయన తాను జనసమూహమును పంపి 45
వేసే మట్టుకు, తన శిష్యులను ఆ దోనె ఎక్కి, అద్దరి
నున్న బేథ్సయిదాకు ముందుగా వెళ్లుటకు, బలవంత
ము చేసెను. । ఆయన వారిని వీడుకొలిపి,† ప్రార్థించే 46
నిమిత్తము, కొండకు వెళ్లెను. । సాయంకాలమైనప్పుడు 47
ఆ దోనె సముద్రపు మధ్యను ఉండెను. అయితే
ఆయన ఒంటిగా భూమి మీద ఉండెను. । అప్పుడు 48
గాలి వారికి ఎదురుగా ఉన్నందున, దోనె నడిపిం
చుటకు వారు మిక్కిలీ కష్టపడుట ఆయన చూచి
కొంచెము ఎక్కువ తక్కువ రాత్రి నాలుగోజామున
సముద్రము మీద నడుస్తు, వారి యొద్దికి వచ్చి, వా
రిని దాటి వెళ్ల వలెనని ఉండెను. । వారు సముద్రము 49
మీద ఆయన నడుచుట చూచి,—భూతమని తలంచి
కేక వేసిరి. । అందరును ఆయనను చూచి తొందర 50
పడిరి. అయితే వెంటనే ఆయన—ధైర్యము తెచ్చుకో
నండి; నేనే ఉన్నాను, భయపడకండని వారితో చెప్పి
వారి యొద్దికి దోనె ఎక్కివచ్చెను. అప్పుడు గాలి
నిలిచెను. । అందుకు వారు తమలో తాము మిక్కిలీ 51
ఆశ్చర్యపడి విస్మయము పొందిరి; । వారు రొట్టెలను 52
గురించినది తలపోసుకొన లేదు; వారి హృదయము
కఠినమైనది.

*దెనారమనగా, ఐదణాలనరకావచ్చును. †లేక, సాగనంపి.

53 తరువాత వారు అద్దరికి వెళ్లి, గెన్నేసరెతనే దేశ
54 మునకు వచ్చి లంగరు వేసిరి. । వారు దోనె మీద
నుంచి దిగినప్పుడే, (జనులు) ఆయనను గుర్తెరిగి ।
55 చుట్టు ఉన్న ఆ ప్రదేశమంతటా పరుగెత్తి, ఆయన
ఎక్కడ ఉన్నాడని విన్నారో, అక్కడికి రోగులను
మంచములతో మోసుకొని వచ్చుటకు ఆరంభించిరి. ।
56 గ్రామములలోను పట్టణములలోను పల్లెటూళ్లలోను
ఆయన ఎక్కడెక్కడ ప్రవేశించినా, అక్కడక్కడి
వారు రోగులను వీధులలో ఉంచి వారు ఆయన
వస్త్రపు జాలరు మాత్రమే ముట్టే కొరకు ఆయనను
వేడుకొనుచుండిరి. ఆయనను ముట్టిన వారందరు
స్వస్థత పొందిరి.

## 7. అధ్యాయము.

1 అప్పుడు ఫరిసైయులు శాస్త్రులలో కొందరును
2 యెరూశలేమునుంచి వచ్చి । ఆయన శిష్యులలో కొం
దరు అపవిత్రమైన—అనగా కడుగని చేతులతో భో
జనముచేయుట చూచి ఆయన యొద్దికి కూడి వచ్చిరి. ।
3 ఫరిసైయులు, యూదులందరును పెద్దల పారంపర్యము
పట్టి పిడికిట చేతులు కడుగుకొంటేనేగాని భోజ
4 నము చేయరు. । మరియు వారు సంతనుంచి (వచ్చేటప్పు
డు) బాప్తిస్మము చేయించబడితేనే* గాని భుజించరు.
వారు ఆచరించుటకు పొందినవి ఇంకా అనేకమైనవి
కలవు. వాటిలో, గిన్నెలకు, కుండలకు, ఇత్తడి పాత్ర
లకు, మంచములకును బాప్తిస్మము చేయించుట మొద
5 లైనవి కలవు. । అప్పుడు ఫరిసైయులు, శాస్త్రులును—
నీ శిష్యులు ఎందుకు పెద్దల పారంపర్యము చొప్పున
నడవక, కడుగుకొనని చేతులతో భోజనము చేస్తు
6 న్నారని ఆయనను అడిగిరి. । అందుకు ఆయన —
ఈ జనులు పెదవులతో నన్ను ఘనపరుస్తున్నారు;
అయితే వారి హృదయము నాకు దూరమై ఉన్నది. ।
7 మనుష్యుల సంప్రదాయములు బోధలని బోధిస్తూ,
వారు వ్యర్థముగా నన్ను ఆరాధిస్తున్నారు అని
వ్రాయబడిన ప్రకారము, యెషయ వేషధారులైన
8 మిమ్మును గూర్చి బాగా ప్రవచించెను. । మీరు దేవుని
ఆజ్ఞను పరిహరించి, కుండలకు గిన్నెలకును బాప్తిస్మము
చేయించుటను గూర్చి మనుష్యుల పారంపర్యము
గైకొని ఇంకా అనేకమైన వాటిని చేస్తున్నారని వా
9 రికి ప్రత్యుత్తరమిచ్చెను. । మరియు ఆయన — మీరు
మీ పారంపర్యము గైకొనేకొరకు, దేవుని ఆజ్ఞను
10 బాగా నిరాకరించినారు. ।—నీ తండ్రిని, నీ తల్లినిని
ఘనపరచ వలెననియు, తండ్రినైనా తల్లినైనా శపిం
చేవాడు మరణము పొంద వలెననియు మోషే చెప్పె
ను. । అయితే మీరు— నా వల్ల నీకు ఏది ప్రయోజన 11
మవునో, అది కొర్బాను, అనగా కానుక† అని ఒక
మనుష్యుడు తన తండ్రితోనైనా తల్లితోనైనా పలి
కితే (పలుకవచ్చునని) చెప్పి, । అతని తన తండ్రి 12
కైనా తన తల్లికైనా ఇకను ఏమియు చేయనియ్యక, ।
మీరు నియమించిన మీ పారంపర్యము వల్ల దేవుని 13
వాక్యము నిరర్థకము చేస్తున్నారు. వీటివంటివి అనే
కమైనవి మీరు జరిగిస్తున్నారని చెప్పెను.

అప్పుడు ఆయన తన యొద్దికి యావత్సమూహము 14
తిరిగీ పిలిచి—మీరందరు నా మాట ఆలకించి గ్రహిం
చండి. । మనుష్యుని వెలపటనుంచి వాని లోపటికి 15
వెళ్లి, వాని అపవిత్రము చేయ గలిగేది యేదియు లేదు.
అయితే వాని లోపటనుంచి బైలువెళ్లేవి యేవో అవే
మనుష్యుని అపవిత్రుని చేసేవై యున్నవి. । ఎవడైనా 16
వినుటకు చెవులుగల వాడైతే వినుగాక అని వారితో
చెప్పెను.

ఆయన జనసమూహము విడిచి, ఇంట్లోకి వెళ్లిన 17
ప్పుడు, ఆయన శిష్యులు ఈ ఉపమానమును గూర్చి
ఆయనను అడిగిరి. । అందుకు ఆయన—ఈలాగు మీ 18
రును తెలివి లేనివారై యున్నారా? వెలపటనుంచి
మనుష్యుని లోపటికి వెళ్లేది యేదో అది వాని అప
విత్రుని చేయుట అసాధ్యమని మీరు గ్రహించరా? ।
అది వాని కడుపులోనే గాని హృదయములో ప్రవే 19
శించక, బహిర్భూమిలో విడువబడును. అది ఆహార
ద్రవ్యములన్నిటిని పవిత్రము చేసును. । అయితే మను 20
ష్యుని లోపటనుంచి బైలువెళ్లేది యేదో, అది మను
ష్యుని అపవిత్రుని చేసును. । ఏలాగంటే మనుష్యుల 21
హృదయములోనుంచి దురాలోచనలు, వ్యభిచారము
లు, వేశ్యాగమనములు, నరహత్యలు, । దొంగతనములు, 22
లోభము, దుష్టత్వము, కపటము, కామవికారము,
మత్సరము, దేవదూషణ, గర్వము, దుర్బుద్ధి; । ఈ 23
చెడ్డవన్నియు లోపటనుంచి బైలువెళ్లి, మనుష్యుని
అపవిత్రుని చేస్తున్నవని వారితో చెప్పెను.

అప్పుడు ఆయన అక్కడనుంచి లేచి తురు సీదోను 24
అనే పట్టణముల ప్రాంతములకు వెళ్లి ఒక ఇంటిలో
ప్రవేశించి, అది ఎవనికిని తెలియక ఉండుటకు కో
రెను. అయితే ఆయన మరుగై యుండలేక పోయెను. ।
అపవిత్రమైన ఆత్మ పట్టిన చిన్న కుమార్తెగల ఒక 25

*లేక, చేయించుకొంటేనే. †లేక, మ్రొక్కుబడి.

స్త్రీ ఆయన సమాచారము విని, వచ్చి ఆయన పాద
ముల మీద పడి, తన కుమార్తెలోనుంచి ఆ దయ్యము
26 వదలగొట్టుమని ఆయనను వేడుకొనెను. । ఆ స్త్రీ సు
రోఫేనికైయలో పుట్టి, హెల్లేని మతస్థురాలై యుం
27 డెను. । అప్పుడు యేసు — పిల్లలను మొదట తృప్తి
పొందనిమ్ము; పిల్లల రొట్టె తీసుకొని, కుక్కలకు వేసుట
28 యుక్తము కాదని ఆమెతో చెప్పెను. । అందుకు
ఆమె—అవును, ప్రభువా! కుక్కలైతే, భోజనపు బల్ల
క్రింద ఉండి, పిల్లల రొట్టె ముక్కలు తినునని ఆయ
29 నకు ప్రత్యుత్తరమిచ్చెను. । అప్పుడు ఆయన — ఈ
మాట నిమిత్తము నీవు వెళ్లుము; నీ కుమార్తెను దయ్య
30 ము వదిలిపోయెనని ఆమెతో చెప్పెను. । ఆమె తన
ఇంటికి వచ్చి, దయ్యము విడిచి పోవుటను, తన
కుమార్తె మంచము మీద పండుకొని యుండుటనును
చూచెను.

31 ఆయన తిరిగి తూరు సీదోను ప్రాంతములు విడిచి,
దెకపొలి ప్రాంతముల ద్వారా గలిలైయ సముద్రము
32 యొద్దకు వచ్చెను. । అప్పుడు వారు చెవిటివాడైన ఒక
నత్తివాని ఆయన యొద్దకు తీసుకొని వచ్చి, అతని
మీద చెయ్యి ఉంచుమని ఆయనను వేడుకొనిరి. ।
33 ఆయన సమూహములోనుంచి అతని ప్రక్కకు తీసుకొని
వెళ్లి, అతని చెవులలో తన వేళ్లు పెట్టి, ఉమ్మివేసి
34 అతని నాలుక ముట్టి, । ఆకాశముతట్టు కన్నులెత్తి,
నిట్టూర్పు విడిచి—తెరువబడుమనే అర్థమిచ్చే ఎప్ఫతా
35 అని అతనితో చెప్పెను. । వెంటనే అతని చెవులు
తెరవబడి అతని నాలుక నరము సడలెను గనుక
36 అతడు తేటగా మాట్లాడెను. । అప్పుడు ఆయన, ఎవ
నితోను చెప్ప వద్దని వారికి ఆజ్ఞాపించెను. అయితే
ఆయన వారికి ఆజ్ఞాపించిన కొద్దీ, వారు మరీ ఎక్కు
37 వగా దాని ప్రసిద్ధి చేస్తూ । — ఈయన సమస్తమును
బాగా జరిగించి యున్నాడు; చెవిటివారు వినుటకు,
మూగవారు మాట్లాడుటకును చేస్తున్నాడు అని చెప్పు
కొని మిక్కిలీ ఆశ్చర్యపడుతు ఉండిరి.

## 8, అధ్యాయము.

1 ఆ దినములయందు జనసమూహము మళ్లీ విస్తారమై
యున్నప్పుడు, వారికి తినుటకు ఏమియు లేనందున,
2 యేసు తన శిష్యులను తన యొద్దకు పిలిచి । — ఈ జన
సమూహము నేటికి మూడు దినములు నా యొద్ద
ఉన్నది; తినుటకు వారికి ఏమియు లేదు గనుక, నేను
వారియందు కనికరపడుతున్నాను. । నేను వారిని ఉప 3
వాసముతో వారి ఇండ్లకు పంపితే వారు త్రోవలో
మూర్ఛపోదురు; వారిలో కొందరు దూరమునుంచి
వచ్చియున్నారని వారితో చెప్పెను. । అందుకు ఆయన 4
శిష్యులు — ఇక్కడ అరణ్యములో, ఒకడు ఎక్కడ
నుంచి రొట్టెలు తెచ్చి వీరిని తృప్తిపరచ గలడని ఆయ
నకు ఉత్తరమిచ్చిరి. । అప్పుడు ఆయన — మీ యొద్ద 5
ఎన్ని రొట్టెలు ఉన్నవని వారిని అడిగెను. అందుకు
వారు — ఏడని చెప్పిరి. । ఆయన, భూమి మీద కూ 6
ర్చుండ వలెనని జనసమూహమునకు ఆజ్ఞాపించి, ఆ
యేడు రొట్టెలు పుచ్చుకొని, స్తోత్రము చేసి,* విరిచి,
వడ్డించుటకు తన శిష్యులకు ఇచ్చెను; వారు జనసమూ
హమునకు వడ్డించిరి. । కొన్ని చిన్న చేపలు కూడా 7
వారి యొద్ద ఉండెను. ఆయన స్తోత్రము చేసి* వాటి
నిని వడ్డించండని చెప్పెను. । ఆలాగు వారు భోజనము 8
చేసి తృప్తిపొందిన తరువాత, ఏడు గంపల నిండా మిగి
లిన ముక్కలు ఎత్తిరి. । భోజనము చేసినవారు కొం 9
చెము ఎక్కువ తక్కువ నాలుగు వేలమంది యుండిరి.
అప్పుడు ఆయన వారిని వదిలివేసెను.

వెంటనే ఆయన తన శిష్యులతో కూడా, ఆ దోనె 10
ఎక్కి దల్మనూథా ప్రాంతములకు వచ్చెను. । అప్పుడు 11
ఫరిసైయులు బైలుదేరి వచ్చి, ఆయనను శోధిస్తూ
ఆకాశమునుంచి ఒక ఆనవాలు ఆయనను అడిగి,
ఆయనతో తర్కించుటకు ఆరంభించిరి. । ఆయన ఆత్మ 12
లో నిట్టూర్పు విడిచి — ఈ వంశము† ఎందుకు ఆన
వాలు అడుగుతున్నది? ఈ వంశమునకు† ఆనవాలు
ఇయ్యబడదని‡ నిశ్చయముగా మీతో చెప్పుతున్నా
నని పలికి, । వారిని విడిచి మళ్లీ దోనె ఎక్కి అద్దరికి 13
వెళ్లెను.

వారు రొట్టెలు తెచ్చుటకు మరచిపోయిరి. దో 14
నెలో వారియొద్ద ఒక్క రొట్టెగాక మరి యేదియు
ఉండలేదు. । అప్పుడు ఆయన — మీరు ఫరిసైయుల 15
పులిసిన పిండినైనా హేరోదుయొక్క పులిసిన పిండి
నైనా (పుచ్చుకొనకుండా) జాగ్రత్తపడి చూచుకొ
నండి, అని వారికి ఆజ్ఞాపించెను. । అప్పుడు వారు—మన 16
యొద్ద రొట్టెలు లేవు గనుక ఈ మాట పలికెనని తమ
లో తాము ఆలోచించుకొనిరి. । యేసు, అది తెలిసి— 17
మీకు రొట్టెలు లేనందున మీరు ఎందుకు ఆలోచిం
చుకొంటున్నారు? మీరు ఇంకా గ్రహించరా? వివే
చించరా? మీ హృదయము ఇంకా కఠినమై యున్న
దా? । మీరు కన్నులు కలిగిన్ని చూడరా? చెవులు కలి 18

*లేక, ఆశీర్వదించి. †లేక, తరము. ‡గ్రేకులో, ఇవ్వబడితే.

19 గిన్ని వినరా? జ్ఞాపకము చేసుకొనరా? । నేను ఆ ఐదు
వేలమందికి ఆ ఐదు రొట్టెలు విరిచి (వడ్డింప చేసిన
నప్పుడు) మీరు ఎన్ని గంపల నిండా ముక్కలు ఎత్తి
తిరని వారిని అడిగెను. వారు — పన్నెండని ఆయ
20 నతో చెప్పిరి. । ఆ నాలుగు వేలమందికి, ఆ ఏడు
రొట్టెలు నేను (విరిచి వడ్డింపచేసినప్పుడు) ఎన్ని గం
పల నిండా ముక్కలు ఎత్తినారు అన్నప్పుడు వారు—
21 ఏడనిరి. । అందుకు ఆయన — మీరు ఏల గ్రహించక
ఉన్నారని పలికెను.

22 తరువాత ఆయన బెత్సయిదాకు వచ్చెను. అప్పుడు
వారు ఆయన యొద్దికి ఒక గుడ్డివాని తీసుకొని వచ్చి,
23 అతని ముట్ట వలెనని ఆయనను వేడుకొనిరి. । అప్పుడు
ఆయన ఆ గుడ్డివాని చెయ్యి పట్టుకొని, ఊరి వెలప
టికి అతని తీసుకొని వెళ్లి, అతని కన్నుల మీద ఉమ్మి
వేసి అతని మీద చేతులు ఉంచి — ఏదైనా చూస్తు
24 న్నావా? అని అతని అడిగెను. । అతడు కన్నులెత్తి—
నడుస్తున్న మనుష్యులను చెట్లవలె చూస్తున్నాననెను.।
25 తరువాత ఆయన మళ్లీ తన చేతులు అతని కన్నుల
మీద ఉంచి, అతని కన్నులెత్త చేసెను. అప్పుడు
అతడు కుదుర్చబడి, సమస్తమును తేటగా చూచెను.।
26 అప్పుడు ఆయన—నీవు ఊరిలోకి వెళ్లవద్దు; ఊరిలో
ఎవనికిని తెలపవద్దని చెప్పి అతని ఇంటికి అతని పం
పెను.

27 యేసు తన శిష్యులతో కూడా ఫిలిప్పుదైన కైస
రైయ గ్రామములకు బైలుదేరి— నేను ఎవడనని మను
ష్యులు చెప్పుకొంటున్నారు అని తోవలో తన శిష్యు
28 లను అడిగెను. । అందుకు వారు—బాప్తిస్తనే యోహా
ను అనియు, కొందరు ఏలియా అనియు, మరి కొందరు
ప్రవక్తలలో ఒకడు అనియు చెప్పుకొంటున్నారని ఉత్త
29 రమిచ్చిరి. । అందుకు ఆయన,—అయితే నేను ఎవడనని
మీరు చెప్పుకొంటున్నారని వారిని అడిగినప్పుడు,
పేతురు—నీవు క్రీస్తువని ఆయనకు ఉత్తరమిచ్చెను. ।
30 అప్పుడు తన్ను గూర్చి అది ఎవనితోను చెప్ప వద్దని
ఆయన వారికి ఆజ్ఞాపించెను.

31 అప్పుడు మనుష్యకుమారుడు చాలా శ్రమలు
పొంది, పెద్దల చేతను, ప్రధాన యాజకుల చేతను,
శాస్త్రుల చేతనును నిరాకరించబడి, చంపబడి, మూడు
దినములైన తరువాత, తిరిగీ లేవ వలెనని ఆయన వారికి
32 బోధించుటకు ఆరంభించెను. । ఆయన ఈ మాట విశ
దముగా చెప్పెను; అప్పుడు పేతురు ఆయనను తన
యొద్దికి పిలిచి, ఆయనను గద్దించుటకు ఆరంభించెను.।
అయితే ఆయన తిరిగి తన శిష్యుల తట్టు చూచి, — 33
సైతానా! నీవు నా వెనుకకు పొమ్ము; నీవు మనుష్యుల
వాటియందే గాని దేవుని వాటియందు మనస్కరిం
చక ఉన్నావని పేతురును గద్దించెను.

అప్పుడు ఆయన తన శిష్యులతో కూడా ప్రజ 34
లను తన యొద్దికి పిలిచి—నన్ను వెంబడించుటకు కోరే
వాడెవడో, వాడు తన్ను తానే ఉపేక్షించి తన శిలువ
ఎత్తుకొని నన్ను వెంబడించ వలెను; । తన ప్రాణము 35
రక్షించుకొనుటకు కోరే వాడెవడో, వాడు దాని పో
గొట్టుకొనును. అయితే నా నిమిత్తము, సువార్త నిమిత్త
మును తన ప్రాణము పోగొట్టుకొనే వాడెవడో,
వాడు దాని రక్షించుకొనును. । ఒక మనుష్యుడు సర్వ 36
లోకము సంపాదించుకొని తన ప్రాణము పోగొట్టు
కొంటే అతనికి ఏమి లాభము? । మనుష్యుడు తన 37
ప్రాణమునకు ప్రతిగా ఏమి ఇయ్యగలడు? । వ్యభిచా 38
రము గల ఈ పాపవంశములో* నన్ను గూర్చి నా
మాటలను గూర్చి సిగ్గుపడే వాడెవడో, వాని గూర్చి,
మనుష్య కుమారుడు తన తండ్రియొక్క మహిమ సమే
తుడై పరిశుద్ధ దూతలతో వచ్చేటప్పుడు, సిగ్గుపడునని
పలికెను.

## 9. అధ్యాయము.

మరియు ఆయన—ఇక్కడ నిలుస్తు ఉన్న వారిలో 1
కొందరు దేవుని రాజ్యము బలముతో వచ్చుట చూచే
పర్యంతము, మరణము పొందరని మీతో నిశ్చయ
ముగా చెప్పుతున్నానని పలికెను.

ఆరు దినములైన తరువాత, యేసు పేతురు, యా 2
కోబు, యోహాను అనే వారిని మాత్రమే, ఎత్తుగల
కొండ మీదికి ఏకాంతముగా తీసుకొని వెళ్లి, వారియె
దుట రూపాంతరము పొందెను. । ఆయన వస్త్రములు 3
కాంతిగలవై, హిమమువలె మిక్కిలీ తెల్లనివై ప్రకా
శించెను. భూమియందు ఏ చాకలివాడును అంత
తెలుపు చేయలేడు. । మరియు మోషేతో కూడా ఏలీ 4
యా వారికి అగుపడెను. వీరు యేసుతో మాట్లాడుచు
ఉండిరి. । అప్పుడు పేతురు—రబ్బీ! మనము ఇక్కడ 5
ఉండుట మంచిది; మేము నీకు ఒకటి, మోషేకు
ఒకటి, ఏలీయాకు ఒకటిని మూడు పర్ణశాలలు కట్టు
దుమని పలికెను. । ఏమి చెప్ప వలెనో అతనికి తెలియ 6
లేదు. వారు మిక్కిలీ భయపడిరి. । అప్పుడు ఒక 7

*లేక, తరములో.

మేఘము కలిగి వారిని కమ్మెను. ఆ మేఘములో
నుంచి—ఈయన నా ప్రియ కుమారుడై యున్నాడు;
ఈయన మాట ఆలకించండి అనే శబ్దము పుట్టెను. ।
8 వెంటనే వారు చుట్టు చూచినప్పుడు, తమ యొద్ద
యేసు మాత్రమే గాక మరి యెవడును వారికి అగు
పడలేదు.

9 వారు ఆ కొండ మీదనుంచి దిగి వస్తు ఉండగా—
మనుష్యకుమారుడు చనిపోయిన వారిలోనుంచి లేచిన
తరువాతనే గాని మీరు చూచిన వాటిని ఎవనితోను
10 చెప్ప వద్దని ఆయన వారికి ఆజ్ఞాపించెను. । చనిపో
యిన వారిలోనుంచి లేవడమనగా ఏమిటో అని వారు
ఒకనితో ఒకడు తర్కిస్తు, ఆ మాట మనస్సులో ఉం
11 చుకొనిరి.। *అప్పుడు వారు—ఏలీయా ముందర రావలె
నని శాస్త్రులు ఎందుకు చెప్పుతున్నారని ఆయనను
12 అడిగిరి. । అందుకు ఆయన—ఏలీయా ముందర వచ్చి,
సమస్తమును కుదుర్చుననే మాట నిజమే; అయితే
అనేక శ్రమలు పొంది, తృణీకరించబడునని మనుష్య
కుమారుని గూర్చి ఏలాగు వ్రాయబడి యున్నది! ।
13 అయినప్పటికి, నేను మీతో చెప్పేది యేమంటే, ఏలీ
యా కూడా వచ్చి యున్నాడు; ఆయనను గూర్చి
వ్రాయబడిన ప్రకారము, వారు తమ ఇష్టము చొ
ప్పున అతని విషయమై చేసినారని వారికి ఉత్తర
మిచ్చెను.

14 ఆయన తన శిష్యులయొద్దికి వచ్చి, వారి చుట్టు
బహు జనసమూహమును, శాస్త్రులు వారితో తర్కిం
15 చుటనును చూచెను. । వెంటనే ఆ జనసమూహమం
తయు ఆయనను చూచి, మిక్కిలీ ఆశ్చర్యపడి,
ఆయన యొద్దికి పరుగెత్తి, ఆయనకు నమస్కరించెను.।
16 అప్పుడు ఆయన—మీరు వారితో దేనిగూర్చి తర్కి
17 స్తున్నారని శాస్త్రులను అడిగెను. । అందుకు జనసమూ
హములో ఒకడు — బోధకుడా! నేను మూగ దయ్య
ము పట్టిన నా కుమారుని నీ యొద్దికి తీసుకొని వచ్చి
18 నాను .। అది ఎక్కడ అతని పట్టునో అక్కడ అతని
విలవిలలాడిస్తున్నది! అప్పుడు అతడు నురుగు కార్చు
కొంటు తన పండ్లు కొరకుకొంటు, కృశించి పోతు
న్నాడు. దాని వదలగొట్టుటకు నీ శిష్యులతో చెప్పి
తిని; అయితే వారివల్ల కాలేదని ఆయనకు ఉత్తరమి
19 చ్చెను. । అందుకు ఆయన—విశ్వాసము లేని వంశమా†
నేను మీతో ఎందాక ఉందును? మిమ్మును ఎందాక
సహింతును! అతని నా యొద్దికి తీసుకొని రండని
వారికి ఉత్తరమిచ్చెను. । అప్పుడు వారు ఆయన యొ 20
ద్దికి అతని తీసుకొని వచ్చిరి. ఆయనను చూడగానే,
ఆ ఆత్మ అతని విలవిలలాడించెను గనుక అతడు నేల
పడి నురుగు కార్చుకొంటు పొర్లాడెను. । అప్పుడు 21
ఆయన—ఇది ఇతనికి కలిగి, ఎంత కాలమైనదని అతని
తండ్రిని అడిగెను. అందుకు అతడు — బాల్యము
నుంచి; । అది అతని నాశము చేయుటకు తరుచుగా 22
అగ్నిలోను నీళ్లలోను అతని పడద్రోసెను. అయినప్ప
టికి ఏదైనా నీవల్లనైతే మా యందు కనికరపడి మాకు
సహాయము చేయుమనెను. । అందుకు యేసు—నమ్ముట 23
నీ వల్లనైతే; నమ్మే వానికి సమస్తమును శక్యమానని
అతనితో చెప్పెను. । వెంటనే ఆ చిన్నవాని తండ్రి— 24
ప్రభువా! నమ్ముతున్నాను; నా అవిశ్వాసమునకు సహా
యము చేయుమని కన్నీళ్లతో నోరెత్తి పలికెను. ।
యేసు జనసమూహము తన యొద్దికి పరుగెత్తి గుంపు 25
కూడుట చూచి,—మూగవైన చెవిటి దయ్యమా! అతని
వదిలిపొమ్ము, ఇకను అతనిలో ప్రవేశించ వద్దని నీకు
ఆజ్ఞాపిస్తున్నాను అని ఆ అపవిత్రమైన ఆత్మను గద్దిం
చెను. । అప్పుడు అది కేక వేసి, అతని చాలా విలవిల 26
లాడించి, వదిలిపోయెను గనుక వాడు చచ్చినవాని
వలె ఉన్నందున, అనేకులు — చనిపోయెననిరి. ।
అయితే యేసు అతని చెయ్యి పట్టుకొని అతని లేవ 27
నెత్తెను. అప్పుడు వాడు లేచి నిలిచెను.

ఆయన ఇంటిలోకి వెళ్లిన తరువాత, ఆయన 28
శిష్యులు—మేము ఎందుకు దాని వదలగొట్టలేక పో
తిమని, ఏకాంతముగా ఆయనను అడిగిరి. । అందుకు 29
ఆయన—ప్రార్థనోపవాసముల వల్లనేగాని మరి
దేనివల్లనైనా ఈ జాతి వదిలిపోవుట అసాధ్యమని
వారితో పలికెను.

వారు అక్కడనుంచి బైలుదేరి గలిలైయ ద్వారా 30
వెళ్లిరి. అయితే ఎవడును అది ఎరుగుట ఆయనకు
ఇష్టమై యుండలేదు; । ఆయన తన శిష్యులకు బో 31
ధిస్తు—మనుష్యకుమారుడు మనుష్యుల చేతులకు అప్ప
గించబడును; వారు ఆయనను చంపుదురు, ఆయన చం
పబడి మూడవ దినమందు తిరిగి లేచునని వారితో
చెప్పెను. । అయితే ఆ మాట వారు గ్రహించలేదు. 32
వారు ఆయనను అడుగుటకు భయపడిరి.

* లేక, మరుగు చేసిరి. † లేక, తరమా.

33 తరువాత ఆయన కపెర్నహూముకు వచ్చి, ఇంట
ఉన్నప్పుడు—త్రోవలో మీరు ఒకనితో ఒకడు దేని
గూర్చి తర్కిస్తు ఉంటిరని ఆయన వారిని అడిగెను.।
34 అయితే వారు ఊరకుండిరి; ఎవడు గొప్పవాడని త్రో
35 వలో ఒకనితో ఒకడు తర్కించిరి.। అప్పుడు ఆయన
కూర్చుండి, పన్నెండుమందిని పిలిచి—ఎవడైనా మొ
దటివాడై యుండుటకు కోరితే, వాడు అందరిలో
కడపటివాడును, అందరికి సేవకుడునై యుండునని
36 చెప్పి,। ఒక పిల్లను తీసుకొని, వారి మధ్యను దాని
నిలువబెట్టెను. అప్పుడు తన చేతులలో దాని ఉంచు
37 కొని।—ఈలాటి పిల్లలలో ఒక పిల్లను నా పేరట
చేర్చుకొనే వాడెవడో, వాడు నన్ను చేర్చుకొం
టున్నాడు; నన్ను చేర్చుకొనే వాడెవడో, వాడు
నన్ను మాత్రమేగాక నన్ను పంపినవానిని చేర్చు
కొంటున్నాడని వారితో చెప్పెను.
38 అందుకు యోహాను—బోధకుడా! మనలను వెంబ
డించని ఒకడు, నీ పేరట దయ్యములను వదలగొ
ట్టుట చూచినాము. అతడు మనలను వెంబడించుట
లేదు గనుక అతని నిషేధించినామని ఉత్తరమిచ్చెను.।
39 అయితే యేసు—అతని నిషేధించకండి; నా నామము
వల్ల ఒక అద్భుతము చేసి నన్ను త్వరగా నిందించ గలి
40 గిన వాడెవడును లేడు.। మనకు విరోధముగా ఉండని
41 వాడు మన పక్షముగా ఉన్నాడు.। మీరు క్రీస్తువారై
యున్నందున, ఆ పేరట మీకు ఒక గిన్నెడు నీళ్లు
తాగనిచ్చే వాడెవడో వాడు తన ఫలము పోగొట్టు
42 కొనడని మీతో నిశ్చయముగా చెప్పుతున్నాను.। అ
యితే నాయందు విశ్వాసముంచే ఈ చిన్నవారిలో
ఒకని ఆతంకపరిచే వాడెవడో వాని మెడకు తిరగటి
రాయి కట్టబడి, వాడు సముద్రములో పడవేయబ
43 డుట వానికి మేలైయుండును.। నీ చెయ్యి నిన్ను ఆతంక
పరిచితే, దాని కోసివేయుము; నీవు రెండు చేతులు
కలిగి, గెహెన్నలో ఉన్న ఆరని అగ్నిలోకి వెళ్లుట
కంటే, అంగహీనుడవై నిత్యజీవములో ప్రవేశించుట
44 నీకు మేలైయుండును;। అక్కడ వారి పురుగు చావదు,
45 అగ్ని ఆరదు.। నీ పాదము నిన్ను ఆతంకపరిచితే, దాని
కోసివేయుము; రెండు పాదములు కలిగి గెహెన్నలో
ఉన్న ఆరని అగ్నిలో పడవేయబడుటకంటే, కుంటి
వాడవై నిత్యజీవములో ప్రవేశించుట నీకు మేలైయుం
46 డును;। అక్కడ వారి పురుగు చావదు, అగ్ని ఆరదు.।
47 నీ కన్ను నిన్ను ఆతంకపరిచితే, దాని పెరికివేయుము;
రెండు కన్నులు కలిగి అగ్నిగల గెహెన్నలో పడవే
యబడుట కంటే, ఒక్క కన్ను గలవాడవై దేవుని రా
48 జ్యములో ప్రవేశించుట నీకు మేలైయుండును;। అ
49 క్కడ వారి పురుగు చావదు, అగ్ని ఆరదు.। ప్రతివా
నికి ఉప్పుసారము అగ్నివల్ల కలుగును. ప్రతి యజ్ఞ
ద్రవ్యమునకు ఉప్పుసారము ఉప్పువల్ల కలుగును.।
ఉప్పు మంచిది గాని ఉప్పు నిస్సారమైతే, మీరు 50
దేనివల్ల దానికి సారము కలుగచేతురు? మీలో మీరు
ఉప్పుగలవారై ఒకనితో ఒకడు సమాధానముగా ఉం
డండి అని చెప్పెను.

## 10. అధ్యాయము.

తరువాత ఆయన అక్కడనుంచి లేచి యొర్దా 1
నుకు అద్దరి మార్గమున యూదైయ ప్రాంతములకు
వచ్చెను. జనసమూహములు తిరిగీ ఆయన యొద్దికి కూడి
వచ్చెను. ఆయన తన వాడిక చొప్పున వారికి మళ్లీ
బోధించుచుండెను.। అప్పుడు ఫరిసైయులు ఆయన యొ 2
ద్దికి వచ్చి, ఆయనను శోధించుటకు—పురుషుడు తన
భార్యను విడనాడుట న్యాయమా? అని ఆయనను
అడిగిరి.। అందుకు ఆయన—మోషే మీకు ఏమి ఆ 3
జ్ఞాపించెనని వారిని అడిగెను.। అప్పుడు వారు—పరి 4
త్యాగ పత్రిక వ్రాసి ఆమెను విడనాడుటకు మోషే
సెలవిచ్చెనని చెప్పిరి.। అందుకు యేసు—మీ హృదయ 5
కాఠిన్యమువల్ల అతడు ఈ ఆజ్ఞను మీకొరకు వ్రా
సెను.। అయితే సృష్టి ఆరంభములో దేవుడు పురుషు 6
నిగాను స్త్రీనిగాను వారిని చేసెను.। ఇందువల్ల పురు 7
షుడు తన తల్లిదండ్రులను విడిచి, తన భార్యను
హత్తుకొన వలెను; వారిద్దరు ఏక శరీరమై ఉందురు.।
కాబట్టి వారు ఇకను ఇద్దరుగా ఉండక ఏక శరీరమై 8
ఉన్నారు.। గనుక దేవుడు జతపరిచినదాని మనుష్యు 9
డు వేరు చేయ కూడదని వారికి ఉత్తరమిచ్చెను.

ఇంటిలో ఆయన శిష్యులు దాని గూర్చి ఆయనను 10
మళ్లీ అడిగిరి.। అందుకు ఆయన—తన భార్యను విడ 11
నాడి మరి యొకతెను పెండ్లాడేవాడు ఆమెకు వ్యతి
రిక్తముగా వ్యభిచరిస్తున్నాడు.। మరియు స్త్రీ తన పు 12
రుషుని విడిచి మరియొకని పెండ్లాడితే, ఆమె వ్యభి
చారము చేస్తున్నదని వారితో చెప్పెను.

అప్పుడు ఆయన వారిని ముట్ట వలెనని చిన్న 13
పిల్లలను ఆయన యొద్దికి తీసుకొని వచ్చిరి. అయితే
(ఆయన) శిష్యులు వారిని తీసుకొని వచ్చిన వారిని
గద్దించిరి.। యేసు దాని చూచి, కోపపడి వారితో— 14
చిన్న పిల్లలను నా యొద్దికి రానియ్యండి; వారిని నిషే
ధించ వద్దు; దేవుని రాజ్యము ఈలాటివారిదై యు
న్నది.। చిన్న పిల్లవలె, దేవుని రాజ్యము అంగీకరించని 15
వాడెవడో, వాడు దానిలో ప్రవేశించడని మీతో
నిశ్చయముగా చెప్పుతున్నానని పలికి,। వారిని ఎత్తు 16
కొని వారిమీద చేతులు ఉంచి వారిని ఆశీర్వదించెను.

17 ఆయన త్రోవలోనికి బైలు వెళ్లుచు ఉండగా, ఒకడు
పరుగెత్తి వచ్చి ఆయన యెదుట మోకాళ్లూని—మం
చి బోధకుడా! నిత్యజీవము స్వతంత్రించుకొనుటకు,
18 నేను ఏమి చేయ వలెనని ఆయనను అడిగెను.। అం
దుకు యేసు— నీవు నన్ను మంచివానిగా ఎందుకు
అంటున్నావు! ఒక్కడే అనగా దేవుడేగాని మరి
19 ఎవడును మంచివాడు కాడు.। వ్యభిచరించ వద్దు, నర
హత్య చేయ వద్దు, దొంగిల వద్దు, అబద్ధపు సాక్ష్యము
పలుక వద్దు, మోసపుచ్చ వద్దు, నీ తల్లిదండ్రులను ఘన
పరచుము అనే ఆజ్ఞలు నీకు తెలుసునని అతనితో
20 చెప్పెను.। అందుకు అతడు—బోధకుడా! నా బాల్య
మునుంచి వీటినన్నిటిని గైకొని యున్నానని పలి
21 కెను.। అప్పుడు యేసు అతని వైపు చూచి అతని
ప్రేమించి—నీకు ఒకటి కొదువగా ఉన్నది; నీవు వెళ్లి
నీకు కలిగినవన్నియు అమ్మి, బీదలకు ఇమ్ము; అప్పుడు
ఆకాశమందు, నీకు ధనము కలుగును; నీవు వచ్చి శిలువ
22 ఎత్తుకొని నన్ను వెంబడించుమని పలికెను.। అయితే
అతడు మిక్కిలీ ఆస్తి గలవాడు గనుక ఆ మాటకు చిన్న
బోయి, దుఃఖించి వెళ్లిపోయెను.

23 అప్పుడు యేసు చుట్టుచూచి—ఆస్తిగలవారు ఎంతో
దుర్లభముగా దేవుని రాజ్యమందు ప్రవేశింతురు! అని
24 తన శిష్యులతో చెప్పెను.।ఆయన మాటలకు శిష్యులు
ఆశ్చర్యపడిరి. అయితే యేసు — పిల్లలారా! ఆస్తి
యందు నమ్మిక ఉంచేవారికి దేవుని రాజ్యములో
25 ప్రవేశించుట ఎంతో దుర్లభమై యున్నది!। ధనవం
తుడు దేవుని రాజ్యమందు ప్రవేశించుటకంటే, ఒం
టె సూది బెజ్జములో దూరుట చులకనైయున్నదని
26 వారితో తిరిగీ ఉత్తరము పలికెను.। అందుకు వారు అ
త్యధికముగా ఆశ్చర్యపడి — ఆలాగైతే ఎవడు రక్షిం
27 చబడ గలడని ఒకనితో ఒకడు చెప్పుకొనిరి.। అప్పు
డు యేసు వారిని చూచి—ఇది మనుష్యులకు అసాధ్య
మేగాని దేవునికి అసాధ్యము కాదు; దేవునికి సమస్త
మును సాధ్యమని పలికెను.

28 అప్పుడు పేతురు — ఇదుగో! మేము సమస్తమును
విడిచి నిన్ను వెంబడించినామని ఆయనతో చెప్పనా
29 రంభించెను.। అందుకు యేసు—నా నిమిత్తము, సువార్త
నిమిత్తమును ఇంటినైనా అన్నదమ్ములనైనా, అక్కచె
ల్లెండ్లనైనా, తండ్రినైనా, తల్లినైనా, భార్యనైనా,
30 పిల్లలనైనా, భూములనైనా విడిచి,। ఇప్పుడు ఇహ
మందు హింసలతో కూడా, నూరంతలుగా ఇండ్లను,
అన్నదమ్ములను, అక్కచెల్లెండ్లను, తల్లులను, పిల్లలను,
భూములనును, పరమందు నిత్యజీవమునును పొందని
వాడెవడును లేడని మీతో నిశ్చయముగా చెప్పుచు
న్నాను.। అయితే మొదటివారు అనేకులు కడపటి 31
వారౌదురు, కడపటివారు మొదటివారౌదురని పలి
కెను.

వారు యెరూషలేముకు త్రోవను వెళ్లుచు ఉండిరి. 32
యేసు వారికి ముందుగా నడుచుచు ఉన్నప్పుడు వారు
విస్మయముగలవారై వెంబడించుచు భయపడిరి. అప్పుడు
ఆయన తిరిగీ పన్నెండుమందిని పిలిచి, తనకు సంభ
వించబోయేవాటిని వారికి తెలియ చెప్పుటకు ఆరం
భించెను.।—ఇదుగో! యెరూషలేముకు మనము వెళ్లు 33
చున్నాము; మనుష్య కుమారుడు ప్రధానయాజకులకు
శాస్త్రులకును, అప్పగించబడును; ఆయనను చావుకు
విధించి, ఆయనను అన్యజనులకు అప్పగింతురు.। వారు 34
ఆయనను అపహాస్యము చేసి, వారులతో ఆయనను
కొట్టి, ఆయన మీద ఉమ్మివేసి, ఆయనను చంపు
దురు; అయితే మూడవ దినమందు ఆయన తిరిగీ లేచు
నని చెప్పెను.

అప్పుడు జెబెదై కుమారులైన యాకోబును యో 35
హానును ఆయన యొద్దికి వచ్చి — బోధకుడా! మేము
అడిగేది యేదో అది నీవు మాకొరకు చేయ వలెనని
కోరుచున్నామనిరి.। అందుకు ఆయన—నేను మీకొరకు 36
ఏమి చేయ వలెనని కోరుచున్నారు? అని వారిని అడి
గెను.। అందుకు వారు—నీ మహిమయందు నీ కుడితట్టు 37
ఒకనిని, నీ యెడమతట్టు ఒకనిని మమ్ము కూచుండని
మ్మని పలికిరి.। అయితే యేసు—మీరు అడిగినది ఎట్టి 38
దో మీకు తెలియదు. నేను తాగుచున్న గిన్నెలో
తాగితే సహించుటకును, నాకు చేయించబడే బాప్తి
స్మము మీకు చేయించబడితే సహించుటకును మీకు
శక్తి కలదా? అని వారితో పలికెను. అందుకు వారు—
శక్తి కలదనిరి.। అప్పుడు యేసు—నేను తాగుచున్న 39
గిన్నెలో మీరు తాగుదురు; నాకు చేయించబడుచున్న
బాప్తిస్మము మీకు చేయించబడును.। అయితే నా కుడి 40
తట్టున నా ఎడమతట్టున కూర్చుండుట ఎవరికి సిద్ధప
రచబడెనో, వారికేగాని (మరి యెవరికిని) ఇచ్చుటకు
నాది కాదని వారితో చెప్పెను.। పదిమంది దాని 41
విని, యాకోబు యోహాననే వారిమీద కోపపడుటకు
ఆరంభించిరి.।అయితే యేసు తన యొద్దికి వారిని పిలి 42
చి—రాష్ట్రముల అధిపతులని ఎంచబడేవారు వారి
మీద దొరతనము చేస్తున్నారు; వారిలో గొప్పవారు
వారిమీద అధికారము జరిగిస్తున్నారు అని మీకు
తెలుసును.। అయితే మీలో ఆలాగు ఉండకూడదు. 43
మీలో ఎవడైనా గొప్పవాడవుటకు కోరితే, వాడు
మీ పరిచారకుడై యుండును.। మీలో ఎవడైనా ము 44

ఖ్యుడవుటకు కోరితే, వాడు అందరికి దాసుడై యుం
45 డును. । మనుష్యకుమారుడు పరిచర్య చేసుటకు, అనే
కులకొరకు విమోచనక్రయధనముగా తన ప్రాణము
ఇచ్చుటకును వచ్చెను గాని పరిచర్య చేయించుకొను
టకు కాదని వారితో చెప్పెను.

46 తరువాత వారు యెరిఖో పట్టణమునకు వచ్చిరి.
ఆయన, ఆయన శిష్యులును బహు జనసమూహమును
యెరిఖోనుంచి బైలువెళ్లుతు ఉండగా, తీమై కుమా
రుడగు బర్తీమై అనే గుడ్డివాడైన ఒక భిక్షకుడు
47 తోవ పక్కను కూచుండని యుండెను. । —ఈయన
నజోరీయుడైన యేసు అని అతడు విని — దావీదు
కుమారుడా! యేసూ! నన్ను కరుణించుమని నోరెత్తి
48 పిలువ మొదలుపెట్టెను. । అతడు ఊరకుండుటకు అనే
కులు అతని గద్దించిరి; అయితే అతడు—ఓ దావీదు
కుమారుడా! నన్ను కరుణించుమని మరీ యెక్కువగా
49 నోరెత్తి పిలిచెను. । అప్పుడు యేసు నిలిచి,—వాని పిలు
వుమని చెప్పెను గనుక వారు ఆ గుడ్డివాని పిలిచి—
నీవు ధైర్యము తెచ్చుకొని లెమ్ము, ఆయన నిన్ను పిలు
50 స్తున్నాడని అతనితో చెప్పిరి. । అప్పుడు అతడు తన
బట్ట పారవేసి లేచి, యేసుయొద్దికి వచ్చినప్పుడు, ।
51 యేసు—నేను నీకు ఏమి చేయుటకు కోరుతున్నావు?
అని అతని అడిగెను. అందుకు ఆ గుడ్డివాడు —
రబ్బూనీ!* నేను చూపు పొందుటకని ఆయనతో
52 చెప్పెను. । అందుకు యేసు—నీవు వెళ్లుము, నీ నమ్మిక
నిన్ను రక్షించెనని పలికెను. వెంటనే వాడు చూపు
పొంది తోవలో యేసును వెంబడించెను.

## 11. అధ్యాయము.

1 వారు యెరూశలేముకు సమీపించి ఒలీవచెట్ల
కొండ దగ్గర ఉన్న బేత్ఫగే బేథనియ అనే ఊళ్లకు
వచ్చినప్పుడు ఆయన తన శిష్యులలో ఇద్దరిని
2 చూచి । — మీ యెదుట ఉన్న పల్లెకు వెళ్లండి; అం
దులో మీరు ప్రవేశించగానే, కట్టబడియున్న ఒక
గాడిదె పిల్లను కనుగొందురు; దాని మీద ఏ మను
ష్యుడును కూచుండలేదు; దాని విప్పి తీసుకొని
3 రండి. । అప్పుడు ఎవడైనా—మీరు ఎందుకు ఈలాగు
చేస్తున్నారని మిమ్మును అడిగితే, — అది ప్రభువునకు
కావలసి యున్నదని చెప్పండి. వెంటనే అతడు దాని
ఇక్కడికి తోలిపెట్టునని పలికి, వారిని పంపెను.

4 వారు వెళ్లి వీధిలో తలవాకిట కట్టబడిన గాడిదె
5 పిల్లను కనుగొని దాని విప్పుతున్నప్పుడు, । అక్కడ
నిలిచియున్న వారిలో కొందరు—మీరు ఆ గాడిదె
పిల్లను ఎందుకు విప్పుతున్నారని వారితో పలికిరి. ।
అందుకు వారు, యేసు ఆజ్ఞాపించిన ప్రకారము వారి 6
తో చెప్పినప్పుడు వారికి సెలవిచ్చిరి.

వారు ఆ గాడిదె పిల్లను యేసు యొద్దికి తీసుకొని 7
వచ్చి, తమ బట్టలు దానిమీద వేసిరి. అప్పుడు ఆ
యన దానిమీద ఎక్కి కూర్చుండెను. । అప్పుడు అనే 8
కులు తమ బట్టలు దారి పొడుగున పరిచిరి. మరి కొం
దరు చెట్ల కొమ్మలు నరికి, దారిపొడుగున పరిచిరి.
ముందు నడిచేవారును, వెనుక నడిచేవారును, 9
—హొసన్నా!†
ప్రభువు పేర వచ్చేవాడు దీవించబడు గాక!
ప్రభువు పేర వచ్చే, 10
మా తండ్రియైన దావీదు రాజ్యము దీవించబడు
గాక!‡
ఉన్నతమైన వాటిలో హొసన్నా!
అని పలికి కేకలు వేయుచుండిరి.

యేసు యెరూశలేముకు (వచ్చి) గుడిలో ప్రవే 11
శించి సమస్తమును చుట్టు చూచెను. అప్పుడు సాయం
కాలమైనది గనుక పన్నెండుమందితో బేథనియకు
వెళ్లెను.

మరునాడు వారు బేథనియనుంచి బైలువెళ్లుతు ఉం 12
డగా ఆయనకు ఆకలి పుట్టెను. । అప్పుడు ఆకులుగల 13
ఒక అంజూరపు చెట్టు దూరమునుంచి చూచి, దాని
యందు ఏదైనా దొరకునేమో అని వచ్చెను. దాని
యొద్దికి వచ్చి, ఆకులే గాక మరి యేమియు చూడ
లేదు; అంజూరపు పండ్ల కాలము ఇంకా రాలేదు. ।
అప్పుడు యేసు—ఇకమీదట ఎన్నటికిని ఎవడును నీ 14
పండ్లు తినక ఉండుగాకని పలికెను. ఆయన శిష్యులు
ఆ మాట వినిరి.

వారు యెరూశలేముకు వచ్చినప్పుడు, యేసు గుడి 15
లోకి వెళ్లి క్రయ విక్రయములు గుడిలో చేసేవారిని
వెళ్లగొట్టుటకు ఆరంభించి, రూకలు మార్చేవారి బల్ల
లను, గువ్వలు అమ్మేవారి పీటలను పడదోసి, । గుడి 16
ద్వారా ఏ పాత్రయైనా తెచ్చుటకు యెవనికిని సెలవి
య్యలేదు.
మరియు ఆయన 17
— నా ఇల్లు సమస్త రాష్ట్రములకు
ప్రార్థన ఇల్లనబడుననియు,‖
మీరు అది దొంగల గుహగా చేసితిరనియు
వ్రాయబడలేదా? అని వారికి బోధించుచుండెను.

---

*అనగా, నా బోధకుడా! †అనగా, పాహి రక్షించుమి. ‡కీర్తన. 118: 26. ‖యెషయ. 56: 7.

18 అప్పుడు శాస్త్రులు, ప్రధానయాజకులును అది విని
ఆయనను ఏలాగు సంహరించ వచ్చునో అని వెతు
కుతు ఉండిరి; జనసమూహమంతా ఆయన బోధకు
మిక్కిలీ ఆశ్చర్యపడినందున, వారు ఆయనకు భయప
19 డుతు ఉండిరి.। సాయంకాలమైనప్పుడు ఆయన పట్టణ
ములోనుంచి బైలుదేరెను.

20 ప్రొద్దున వారు తోవను వెళ్లుతు ఉండగా, ఆ అం
జూరపు చెట్టు వేళ్లతో ఎండియుండుట చూచిరి.।
21 అప్పుడు పేతురు జ్ఞాపకము తెచ్చుకొని—రబ్బీ! ఇదు
గో! నీవు శపించిన అంజూరపు చెట్టు ఎండిపోయెనని
22 ఆయనతో చెప్పెను.। అందుకు యేసు—మీరు దేవుని
23 యందు విశ్వాసముంచండి;।—నీవు ఎత్తబడి సముద్ర
ములో వేయబడుదువుగాక అని ఈ పర్వతముతో
చెప్పి, తన హృదయములో సందేహించక తాను చెప్పి
నవి కలుగునని నమ్మేవాడెవడో వాడు చెప్పినది వానికి
కలుగునని మీతో నిశ్చయముగా చెప్పుతున్నాను.।
24 కాబట్టి మీరు ప్రార్థిస్తూ, వేటిని అడుగుదురో వాటి
నన్నిటిని మీరు పొందుదురని నమ్మండి; అప్పుడు అవి
మీకు కలుగునని మీతో చెప్పుతున్నాను.

25 మీరు నిలిచి ప్రార్థించేటప్పుడు, ఆకాశమం
దున్న మీ తండ్రి మీ అపరాధములు క్షమించే నిమి
త్తము, ఎవనియందైనా మీ విషయమైన తప్పితము
26 ఉంటే క్షమించండి.। మీరు క్షమించకపోతే, ఆకాశ
మందున్న మీ తండ్రి మీ అపరాధములు క్షమించ
డని వారికి ఉత్తరము పలికెను.

27 వారు యెరూశలేముకు మళ్లీ వచ్చిన తరువాత
ఆయన గుడిలో తిరుగుతు ఉన్నప్పుడు, ప్రధానయా
జకులు, శాస్త్రులు, పెద్దలును ఆయన యొద్దికి వచ్చి,।
28 —నీవు ఏ అధికారము* వల్ల వీటిని చేస్తున్నావు? నీవు
వీటిని చేయుటకు నీకు అధికారము* ఇచ్చిన వాడె
29 వడు? అని ఆయనను అడిగిరి.। అందుకు యేసు వారికి
ప్రత్యుత్తరమిచ్చినదేమంటే—నేను కూడా మిమ్మును
ఒక మాట అడుగుదును; మీరు నాకు ఉత్తరమియ్యండి;
అప్పుడు నేను ఏ అధికారము* వల్ల వీటిని చేస్తున్నానో
30 అది మీకు తెలుపుదును.। యోహాను బాప్తిస్మము ఆకా
శమునుంచి కలిగెనా? లేక మనుష్యులవల్ల కలిగెనా?
నాకు ప్రత్యుత్తరమియ్యండని పలికెను.

31,32 అప్పుడు వారు—మనము ఆకాశమునుంచి అని చెప్పి
తిమా, ఆయన—ఆలాగైతే మీరు ఎందుకు ఆయనను
నమ్మలేదని అడుగును. మనము మనుష్యులవల్ల అని
చెప్పితిమా, జనులకు భయపడుతున్నాము; యోహాను
నిజముగా ప్రవక్త అని అందరును ఎంచుతున్నారని
తమలో తామే ఆలోచించుకొని,। మేము యెరగమని 33
యేసుతో ప్రత్యుత్తరము చెప్పిరి. అందుకు యేసు—
నేనును ఏ అధికారమువల్ల వీటిని చేస్తున్నానో అది
మీతో చెప్పనని ప్రత్యుత్తరమిచ్చెను.

## 12. అధ్యాయము.

అప్పుడు ఆయన ఉపమానములుగా వారితో మా 1
ట్లాడుటకు ఆరంభించి ఇట్లనెను.—ఒక మనుష్యుడు
ద్రాక్ష తోట వేయించి, దాని చుట్టు కంచె నాటించి,
ద్రాక్షల తొట్టి తొలిపించి, అరప కట్టించి, కాపు
లకు దాని అప్పగించి, పరదేశమునకు వెళ్లెను.। (పండ్ల) 2
కాలమందు ఆ కాపులవల్ల ఆ ద్రాక్ష తోట పండ్లలో
కొంచెము పుచ్చుకొని వచ్చుటకు కాపులయొద్దికి ఒక
దాసుని పంపెను.। అయితే వారు వాని పట్టుకొని, 3
కొట్టి, వట్టి చేతులతో పంపివేసిరి.। తిరిగీ ఆయన మరి 4
యొక దాసుని వారియొద్దికి పంపినప్పుడు, వారు అతని
పైని రాళ్లు రువ్వి, తల గాయము చేసి అవమానపరిచి,
పంపివేసిరి.। తిరిగీ ఆయన మరియొకని పంపెను; వారు 5
అతని చంపి, ఇంకా అనేకులలో కొందరిని కొట్టిరి,
కొందరిని చంపిరి.। కాబట్టి, ఆయనకు ఇంకా ప్రియ 6
కుమారుడు ఒకడే ఉండెను గనుక ఆయన—వారు
నా కుమారుని సన్మానింతురనుకొని, తుదకు వారి
యొద్దికి అతని పంపెను.। అయితే ఆ కాపులు—ఇతడు 7
ఆస్తికర్త, ఇతని చంపుదాము రండి; అప్పుడు ఈ ఆస్తి
కర్తృత్వము మనదవునని ఒకనితో ఒకడు చెప్పుకొని,।
అతని పట్టుకొని చంపి, ద్రాక్ష తోటకు వెలపట 8
వేసిరి.। కాబట్టి ఆ ద్రాక్ష తోట యజమానుడు ఏమి 9
చేసును! ఆయన వచ్చి, ఆ కాపులను సంహరించి,
అన్యులకు ఆ ద్రాక్షతోట ఇచ్చును. మరియు,

—ఇల్లు కట్టేవారు ఏ రాతిని తృణీకరించిరో 10
అదే మూలకు తల అయినది.
ఇది ప్రభువవల్లనే కలిగెను; 11
ఇది మన కన్నులకు ఆశ్చర్యమై యున్నది†

అనే లేఖనము మీరు చదువలేదా అని పలికెను.

అప్పుడు వారు తమ్మును గూర్చి ఆ యుపమాన 12
ము చెప్పెనని గ్రహించి ఆయనను పట్టుకొనుటకు
వెతుకుచుండిరి. అయితే జనులకు భయపడి ఆయనను
విడిచి వెళ్లిరి.

*లేక, శక్తి. †కీర్త. 118. వ 22, 23.

13 తరువాత వారు ఆయనను మాటవల్ల చిక్కుపరుచు
టకు, ఫరిసైయులలోను, హేరోదీయులలోను కొంద
14 రిని ఆయన యొద్దకు పంపిరి. । వారు వచ్చి—బోధకు
డా! నీవు సత్యవంతుడవై ఎవనినైనా లక్ష్యపెట్టవని
మాకు తెలుసును; నీవు మనుష్యుల ముఖము చూడక,
దేవుని మార్గము నిజముగా బోధిస్తున్నావు; కైస
15 రుకు పన్ను ఇచ్చుట న్యాయమవునా కాదా? । ఇత్తు
మా ఇవ్వక మానుదుమా? అని ఆయనతో పలికిరి.

అయితే ఆయన వారి వేషధారణ ఎరిగి—మీరు
ఎందుకు నన్ను శోధిస్తున్నారు? నేను దాని చూచు
టకు ఒక దేనారము నా యొద్దకు తెండని వారితో
16 చెప్పెను. । వారు దాని తెచ్చిరి; అప్పుడు ఆయన—
ఈ స్వరూపము, ఈ పై వ్రాతయు ఎవనివని వారిని
17 అడిగెను. అందుకు వారు —కైసరువనిరి. । అప్పుడు
యేసు—కైసరువి కైసరుకు, దేవునివి దేవునికి చెల్లిం
చండని వారికి ఉత్తరమిచ్చెను. వారు ఆయనను గూర్చి
ఆశ్చర్యపడిరి.

18 తరువాత పునరుత్థానము లేదని చెప్పే సద్దూకై
19 యులు ఆయన యొద్దకు వచ్చి ।—బోధకుడా! ఒకని
సహోదరుడు పిల్లలు లేక, తన భార్య ఉండగా చని
పోతే, వాని సహోదరుడు వాని భార్యను పెండ్లాడి,
తన సహోదరునికి సంతానము కలుగచేయ వలెనని
20 మోషే మాకు వ్రాసెను. । మంచిది; యేడుగురు సహో
దరులు ఉండిరి. మొదటివాడు ఒక స్త్రీని పెండ్లాడి,
21 సంతానము లేక చనిపోయెను. । అప్పుడు రెండవ
వాడు ఆమెను పెండ్లాడెను; వాడును, ఆ ప్రకారమే
మూడవవాడును సంతానము లేకనే చనిపోయిరి. ।
22 అట్లా యేడుగురు ఆమెను పెండ్లాడి సంతానము
లేకనే చనిపోయిరి. అందరి వెనుక ఆ స్త్రీ చనిపో
23 యెను. । కాబట్టి ఆమె ఆ యేడుగురికి భార్యయై యుం
డెనుగదా పునరుత్థానమందు వారు లేచేటప్పుడు, వా
రిలో ఎవనికి ఆమె భార్యయై యుండునని అడిగిరి. ।
24 అందుకు యేసు—ఇందువల్లనేగదా మీరు లేఖనముల
నైనా దేవుని శక్తినైనా ఎరుగక తప్పిపోతున్నారు. ।
25 వారు చనిపోయిన వారిలోనుంచి లేచేటప్పుడు, పెం
డ్లాడరు. పెండ్లికి ఇయ్యబడరు; ఆకాశమందున్న దూ
26 తలవలె ఉన్నారు. । అయితే చనిపోయినవారు లేతు
రనే దాని విషయమై మోషే గ్రంథమందు పొద
(చరిత్రలో)—నేను అబ్రాహాము దేవుడను, ఈసాకు
దేవుడను, యాకోబు దేవుడను అని దేవుడు ఆయ
27 నతో ఏలాగు చెప్పెనో మీరు చదువలేదా? । ఆయన
సజీవులకేగాని చనిపోయిన వారికి దేవుడు కాడు.
కాబట్టి మీరు మిక్కిలీ తప్పిపోతున్నారని వారికి
ఉత్తరమిచ్చెను.

అప్పుడు శాస్త్రులలో ఒకడు వచ్చి వారు తర్కిం 28
చుట విని, ఆయన వారికి బాగా ఉత్తరమిచ్చెనని
గ్రహించి — అన్నిటిలోను ఏ ఆజ్ఞ మొదటిది? అని
ఆయనను అడిగెను. । అందుకు యేసు—ఆజ్ఞలన్నిటిలో 29
మొదటిది యేదంటే—ఓ ఇశ్రాయేలూ! వినుము, మన
దేవుడైన ప్రభువు అద్వితీయ ప్రభువై యున్నాడు. ।
మరియు—నీవు నీ పూర్ణ హృదయముతో, నీ పూ 30
ర్ణ ప్రాణముతో, నీ పూర్ణ మనస్సుతో, నీ పూ
ర్ణ శక్తితోను, నీ ప్రభువైన దేవుని ప్రేమించ వలె
ననేది మొదటి ఆజ్ఞ. । రెండవదియు అటువంటిది,— 31
నీవు నిన్నువలె నీ పొరుగువాని ప్రేమించ వలెననేదే.
వీటికంటే ముఖ్యమైన ఆజ్ఞ ఒకటెని లేదని అతనికి
ఉత్తరమిచ్చెను.

అప్పుడు ఆ శాస్త్రి — సరి, బోధకుడా! ఆయన 32
అద్వితీయుడై యున్నాడు, ఆయన గాక వేరొకడు
లేడని సత్యము చెప్పినావు; । ఆయనను పూర్ణ హృ 33
దయముతో, పూర్ణమైన తెలివితో, పూర్ణ ప్రా
ణముతో, పూర్ణ శక్తితోను ప్రేమించుటయు, తన్ను
వలె తన పొరుగువాని ప్రేమించుటయు సర్వాంగ
హోమము మొదలైన యాగములన్నిటికంటే అధిక
మని ఆయనతో చెప్పెను. । అతడు వివేకముగా ఉత్త 34
రమిచ్చెనని యేసు అతని చూచి—నీవు దేవుని రాజ్య
మునకు దూరస్థుడవు కావని అతనితో పలికెను. అటు
తరువాత ఎవడును ఆయనను ఏమియు అడుగుటకు
తెగించలేదు.

యేసు గుడిలో బోధిస్తూ—క్రీస్తు దావీదు కుమా 35
రుడని శాస్త్రులు ఏల చెప్పుతున్నారు?
—నేను నీ శత్రువులను నీ పాదపీఠముగా ఉంచేవరకు, 36
నీవు నా కుడిపక్కను కూచుండుమని,
ప్రభువు నా ప్రభువుతో చెప్పెను*
అని దావీదు తానే పరిశుద్ధాత్మవల్ల పలికెను. । కాబట్టి 37
దావీదు తానే ఆయనను ప్రభువని చెప్పుతున్నాడు
గనుక ఆయన ఏలాగు అతని కుమారుడైయున్నాడు?
అని ఉత్తరమిచ్చెను. ఆ విస్తార జనసమూహము ఆయన
మాటలు సంతోషముతో వినెను.

* కీర్త. 110; 1.

38 అప్పుడు ఆయన తన బోధయందు — నిలువుటంగీ
39 లతో నడుచుటను, సంతవీధులలో వందనములను । సున
గోగులలో ముఖ్యపీఠములను, విందులలో అగ్రస్థాన
40 ములనను కోరుతూ, । విధవల ఇండ్లు తినివేస్తూ,
మాయవేషముతో దీర్ఘ ప్రార్థనలు చేసే శాస్త్రు
లను గూర్చి జాగ్రత్తగా ఉండండి. వీరు యెక్కువైన
శిక్షావిధి పొందుదురని వారితో పలికెను.

41 తరువాత యేసు కానుకపెట్టెయెదుట కూర్చుండి
జనసమూహము ఆ కానుక పెట్టెలో ఏలాగు రూకలు
వేయుచుండెనో అది చూచుచుండెను. అప్పుడు
అనేక ధనవంతులు దానిలో చాలా వేయుచుండిరి. ।
42 అప్పుడు ఒక బీద విధవ వచ్చి, రెండు పైసలకు సరి
43 యైన రెండు చిన్న నాణెములు వేసెను. । అప్పుడు
ఆయన తన శిష్యులను తన యొద్దకి పిలిచి — కానుక
పెట్టెలో వేసే వారందరికంటే ఈ బీద విధవ ఎక్కువ
వేసెనని మీతో నిశ్చయముగా చెప్పుతున్నాను; ।
44 వారందరు తమకు కలిగిన సమృద్ధిలో (కొంచెము)
వేసియున్నారు. అయితే ఈమె తన లేమిలో తన
సమస్త జీవము అనగా ఆమెకు కలిగినది యావత్తును
వేసెనని పలికెను.

## 13. అధ్యాయము.

1 ఆయన గుడిలోనుంచి బైలువెళ్లుచుండగా, ఆయన
శిష్యులలో ఒకడు — బోధకుడా! ఈ రాళ్లు ఏలా
టివో, ఈ కట్టడములు ఏలాటివో చూడుమని ఆయ
2 నతో పలికెను. । అందుకు యేసు—ఈ గొప్ప కట్టడ
ములు చూస్తున్నావా? పడదోయబడకుండా రాతి
మీద రాయి ఒకటిని విడువబడదని అతనికి ఉత్తర
మిచ్చెను.

3 ఆయన గుడి యెదుట ఉండే ఒలీవచెట్ల కొండమీద
కూర్చుండియున్నప్పుడు, పేతురు, యాకోబు, యో
4 హాను అంద్రెయయు ।—ఇవి ఎప్పుడు కలుగును? ఇవ
న్నియు నెరవేరబోయేటప్పటికి ఏ గురుతులు కలు
గును? మాతో చెప్పుమని ఆయనను ఏకాంతముగా
5 అడిగిరి. । అందుకు యేసు వారికి ఉత్తరమిచ్చుటకు
ఆరంభించి ఇట్లనెను;—

6 —ఎవడైనా మిమ్మును మోసపరచకుండా చూచుకో
నండి; అనేకులు నా పేరట వచ్చి—నేనే ఆయనని
7 చెప్పి అనేకులను మోసపరుతురు. । మీరు యుద్ధము
లను గూర్చి, యుద్ధముల సమాచారములను గూర్చియు
8 వినేటప్పుడు, మీరు కలతపడకండి; । ఇవి జరగ వలెను
గాని అంతము ఇంకా లేదు; రాష్ట్రము పైకి రాష్ట్రము,
రాజ్యము పైకి రాజ్యమును లేచును. ఇదియు గాక
భూకంపములు, కరువులు, కలతలును అక్కడక్కడ
కలుగును. ఇవి వేదనలకు ప్రారంభమే.

అయితే మిమ్మునుగూర్చి మీరే చూచుకొనండి; 9
వారు మిమ్మును సభలకు అప్పగింతురు, మీరు సునగో
గులలో కొట్టబడి, వారికి సాక్ష్యముకై అధిపతుల
యెదుటను, రాజుల యెదుటనును నా నిమిత్తము నిలు
వబడుదురు. । అయితే సకల రాష్ట్రములకును సువార్త 10
ముందర ప్రకటించబడ వలెను.

అయితే వారు మిమ్ము పట్టుకొనివెళ్లి అప్పగించేట 11
ప్పుడు మీరు—ఏమి పలుకుదుమని ముందర చింతిం
చకండి, ఆలోచన చేయకండి; అయితే ఆ గడియ
లోనే మీకు ఏది ఇయ్యబడునో, అది పలకండి;
పలికేవాడు పరిశుద్ధాత్మయేగాని మీరు కారు. । అప్పు 12
డు సహోదరుడు సహోదరునిని, తండ్రి కుమారు
నిని మరణమునకు అప్పగింతురు; కుమారులు తల్లిదం
డ్రులకు విరోధముగా లేచి వారిని చంపింతురు. । నా 13
నామము నిమిత్తము మీరు అందరిచేత ద్వేషించబడు
దురు. అయితే తుదమట్టుకు సహించి నిలకడగా ఉం
డేవాడు రక్షించబడును.

ప్రవక్తయైన దానియేలువల్ల చెప్పబడిన పాడుచేసే 14
ఏహ్యవస్తువు ఉండ కూడని స్థలమందు నిలుచుట
మీరు చూచేటప్పుడు (చదివేవాడు గ్రహించుగాక)
యూదైయలో ఉండేవారు కొండలకు పారిపో వలె
ను. । ఇంటిమీద ఉండేవాడు ఇంటిలోకి దిగవద్దు; 15
తన ఇంటిలోనుంచి ఏమైనా తీసుకొని వెళ్లుటకు అం
దులో ప్రవేశించవద్దు. । పొలములో ఉండేవాడు 16
తన వస్త్రము తీసుకొని వెళ్లుటకు తిరిగీ రావద్దు.

ఆ దినములలో గర్భిణులకును, పాలిచ్చేవారికిని 17
శ్రమ! । అయితే మీరు పారిపోవుట చలికాలమందు 18
సంభవించక ఉండేకొరకు ప్రార్థించండి; । అవి 19
శ్రమగల దినములు; దేవుడు సృష్టించిన సృష్టి మొదలు
కొని నేటివరకు అంత శ్రమ కలిగి యుండలేదు, ఇక
మీదట కలుగదు. । ప్రభువు ఆ దినములు తక్కువ 20
చేయకపోతే, ఎవడును రక్షించబడడు గాని తాను
ఏర్పరుచుకొనిన వారి నిమిత్తము ఆయన ఆ దినములు
తక్కువ చేసియున్నాడు.

ఆ కాలమందు ఎవడైనా—ఇదుగో! క్రీస్తు ఇక్కడ 21
ఉన్నాడు; లేక అదుగో! అక్కడ ఉన్నాడని మీతో
చెప్పితే, నమ్మకండి; । అబద్ధపు క్రీస్తులు, అబద్ధ ప్రవ 22
క్తలును లేచి, సాధ్యమైతే ఏర్పర్చబడినవారినిని మో
సపుచ్చుటకు గురుతులను, అద్భుతములను అగుపరుతు
రు. । అయితే మీరు చూచుకొనండి; ఇదుగో! మీతో 23
సమస్తమును ముందర చెప్పితిని.

24 అయితే ఆ దినములలో, ఆ శ్రమయైన తరువాత
సూర్యునికి చీకటి కలుగును, చంద్రుడును తన వెలుగు
25 ఇయ్యడు, ఆకాశ నక్షత్రములును రాలును. ఆకాశ
26 మందలి శక్తులు కదిలించబడును. అప్పుడు మనుష్య
కుమారుడు మహా బలముతోను మహిమతోను మేఘ
27 ములమీద వచ్చుట చూతురు. అప్పుడు ఆయన తన
దూతలను పంపి నాలుగు దిక్కులనుంచి, భూమి
యొక్క మూలనుంచి ఆకాశముయొక్క మూలమట్టుకు
తాను ఏర్పరుచుకొనినవారిని పోగుచేయించును.

28 అయితే అంజూరపు చెట్టువల్ల ఒక ఉపమానము
నేర్చుకొనండి. దాని కొమ్మ ఇంకా మెత్తనిదై చిగి
రించేటప్పుడు వసంతకాలము సమీపమైనదని మీకు
29 తెలుసును. ఆలాగే మీరు ఇవి కలుగుట చూచేట
ప్పుడు, అది సమీపించి గడపమీద ఉన్నదని తెలు
30 సుకొనండి. ఇవన్నియు జరిగే వరకు ఈ వంశము*
గతించదని మీతో నిశ్చయముగా చెప్పుతున్నాను.
31 ఆకాశము భూమియు గతించునుగాని నా మాటలు
గతించవు.

32 అయితే ఆ దినమును గూర్చి ఆ గడియను గూర్చి
తండ్రికేగాని ఏ మనుష్యునికైనా, ఆకాశమందున్న
33 దూతలకైనా కుమారునికైనా తెలియదు. చూచుకొ
నండి, మెలకువపడి ప్రార్థన చేయండి; ఆ కా
34 లము ఎప్పుడు వచ్చునో అది మీకు తెలియదు. తన
ఇల్లు విడిచి దేశాంతరమునకు వెళ్లిన మనుష్యుడు తన
దాసులకు అధికారమును, ప్రతివానికి వానివాని
పనిని ఇచ్చి, — మెలకువగా ఉండుమని ద్వారపాల
35 కునికి ఆజ్ఞాపించినట్టే. కాబట్టి మెలకువపడండి; ఇంటి
యజమానుడు సాయంకాలమందో, మధ్యరాత్రియం
దో, కోడి కూసేటప్పుడో, ఉదయకాలమందో, ఎప్పు
36 డు వచ్చునో అది మీకు తెలియదు; ఆయన అక
స్మాత్తుగా వచ్చి మిమ్ము నిద్రించేవారినిగా కనుగొను
37 నేమో! నేను మీతో చెప్పుతున్నది అందరితోను
చెప్పుతున్నాను; మెలకువగా ఉండండి అని పలికెను.

## 14. అధ్యాయము.

1 రెండు దినములైన తరువాత పస్కా అనే పొంగని
రొట్టెల పండుగ వచ్చెను. అప్పుడు ప్రధానయాజ
కులు, శాస్త్రులును కృత్రిమమువల్ల ఆయనను ఏలాగు
2 పట్టుకొని చంపుదుమని ఆలోచించిరి. అయితే వారు
జనులలో అల్లరి కలుగునేమో అని పండుగలో వద్దని
చెప్పుకొనిరి.

ఆయన బేథనియలో కుష్ఠరోగియైన సీమోను ఇం 3
టిలో భోజనపజ్తియందు కూర్చున్నప్పుడు, ఒక
స్త్రీ మిక్కిలీ విలువగల అచ్చ జటామాంసి అత్తరుగల
చలువరాతి బుడ్డి తీసుకొని వచ్చి, ఆ బుడ్డి పగల
గొట్టి ఆ అత్తరు ఆయన తలమీద పోసెను. అయితే 4
కొందరు తమలో తాము చిరాకుపడి—ఈ అత్తరు
నష్టము చేసుట ఎందుకు? ఈ అత్తరు మున్నూరు 5
దేనారములకు† పైని అమ్మబడి బీదలకు ఇయ్యబడ
వచ్చునని చెప్పి, ఆమెను గూర్చి సణుగుకొనిరి. అయితే 6
యేసు—ఆమెను విడువండి; ఆమెను ఎందుకు వ్యా
కులపరుస్తున్నారు? ఆమె నాకు మంచి కార్యము
చేసెను; బీదలు ఎల్లప్పుడును మీలో ఉన్నారు; 7
మీకు ఇష్టమైనప్పుడు మీరు వారికి మేలు చేయ
గలరు. అయితే నేను ఎల్లప్పుడును మీలో ఉండను.
ఆమె తన శక్తి కొద్దీ చేసెను; నా ఉత్తరక్రియల కొ 8
రకు నా శరీరమును ముందుగా అభిషేకించెను. లోక 9
మందంతటా ఈ సువార్త ఎక్కడ ప్రకటించబడు
నో, అక్కడ ఆమె చేసినది కూడా జ్ఞాపకార్థమై
చెప్పబడునని మీతో నిశ్చయముగా చెప్పుతున్నానని
పలికెను.

అప్పుడు పన్నెండుమందిలో ఇస్కరియోతనే 10
యూదా, ఆయనను ప్రధానయాజకుల చేతికి అప్ప
గించ వలెనని వారి యొద్దకు వెళ్లెను. వారు విని సం 11
తోషించి, అతనికి సొమ్ము ఇచ్చుటకు వాగ్దత్తము
చేసిరి గనుక అతడు ఆయనను అప్పగించుటకు తగిన
సమయము వెతుకుతు ఉండెను.

వారు పస్కా పశువు వధించే పొంగని రొట్టెల పం 12
డుగలో మొదటి దినమందు ఆయన శిష్యులు — నీవు
పస్కా భోజనము చేయుటకు మేము ఎక్కడికి వెళ్లి
సిద్ధపరచ వలెనని కోరుతున్నావు? అని ఆయనను అడి
గిరి. అందుకు ఆయన—మీరు పట్టణములోకి వెళ్లండి; 13
అక్కడ నీళ్ల కుండ మోయుచున్న ఒక మనుష్యుడు
మీకు ఎదురుపడును; అతని వెంబడించి అతడు 14
ఎక్కడ ప్రవేశించునో ఆ ఇంటి యజమానుని చూ
చి—నేను నా శిష్యులతో పస్కా భోజనము చేయు
టకు అతిథుల గది ఎక్కడ ఉన్నదని బోధకుడు అడు
గుతున్నాడు అని చెప్పండి. అప్పుడు అతడు సామ 15
గ్రితో ఆయత్తపరచబడిన గొప్ప మేడగది మీకు
చూపించును; అక్కడ మనకొరకు సిద్ధపరచండని చె
ప్పి, తన శిష్యులలో ఇద్దరిని పంపెను. ఆయన శిష్య 16

*లేక, తరము. †దేనారమనగా—కొంచెము యెక్కువ తక్కువ అయిదణాలు.

లు బైలుదేరి, పట్టణములోనికి వచ్చి ఆయన వారితో
చెప్పిన ప్రకారము కనుగొని పస్కాను సిద్ధపరిచిరి.
17 సాయంకాలమైనప్పుడు, ఆయన పన్నెండుమంది
18 తో వచ్చెను. । వారు పజ్త్తిలో కూర్చుండి భోజనము
చేయుచున్నప్పుడు, యేసు — మీలో ఒకడు, అనగా
నాతో భుజించుచున్నవాడు నన్ను అప్పగించునని
నిశ్చయముగా మీతో చెప్పుతున్నానని వారితో పలి
19 కెను. । అప్పుడు వారు దుఃఖపడి—నేనా? అని ఒక
డును; నేనా? అని మరి యొకడును ఒక్కొకడుగా
20 ఆయనను అడుగనారంభించిరి. । అందుకు ఆయన —
పన్నెండుమందిలో ఒకడు అనగా నాతో కూడా
21 చెయ్యి పాత్రలో పెట్టేవాడే. । మనుష్య కుమారుడు
ఆయనను గూర్చి వ్రాయబడినప్రకారము చనిపోవుచు
న్నాడు; అయితే ఎవనిచేత మనుష్యకుమారుడు అప్ప
గించబడునో, ఆ మనుష్యునికి శ్రమ! ఆ మనుష్యుడు
పుట్టకుంటే వానికి మేలై యుండునని వారికి ఉత్తర
మిచ్చెను.

22 వారు భోజనము చేయుచుండగా, యేసు ఒక
రొట్టె పట్టుకొని స్తోత్రము చేసి* దాని విరిచి, వారి
కిచ్చి—మీరు పుచ్చుకొని తినండి; ఇది నా శరీరమై
23 యున్నదని చెప్పెను. । ఆలాగున, గిన్నె పట్టుకొని
స్తోత్రముచేసి* దాని వారికిచ్చెను. అందరు దానితో
24 తాగిరి. । అప్పుడు ఆయన—ఇది అనేకుల కొరకు చిం
దించబడుచున్న నా రక్తమనగా కొత్త నిబంధన† రక్తమై
25 యున్నది. । నేను దేవుని రాజ్యములో కొత్తది తాగే
దినము వరకు ద్రాక్షారసము ఇకను తాగనని మీతో
నిశ్చయముగా చెప్పుతున్నానని పలికెను.

26 తరువాత, వారు కీర్తన పాడి, ఒలీవచెట్ల కొండకు
27 వెళ్లిరి. । అప్పుడు యేసు — ఈ రాత్రి నావిషయము
మీరందరు ఆతంకపరచబడుదురు; — గొర్రెల కాప
రిని కొట్టుదును, గొర్రెలు చెదరగొట్టబడునని వ్రాయ
28 బడియున్నది. । అయితే నేను లేచిన తరువాత, మీ
కంటే ముందుగా గలిలైయలోనికి వెళ్లుదునని వారితో
చెప్పెను.

29 అప్పుడు పేతురు—అందరు ఆతంకపరచబడినప్ప
టికి, నేను ఆతంకపరచబడనని ఆయనతో పలికెను. ।
30 అందుకు యేసు-ఈ నేటి రాత్రియందే, కోడి రెండు
మార్లు కూయకమునుపు నీవు నన్ను ఎరుగనని మూడు
మార్లు చెప్పుదువని నీతో నిశ్చయముగా చెప్పుతు
31 న్నాను అని అతనితో పలికెను. । అయితే అతడు
మరీ ఎక్కువగా—నేను నీతో కూడా చావ వలసినప్ప
టికి, నిన్ను ఎరుగనని చెప్పననెను. ఆప్రకారమే వా
రందరును పలికిరి.

తరువాత, వారు గెత్సేమనే అనబడిన చోటికి 32
వచ్చినప్పుడు ఆయన — నేను ప్రార్థించేమట్టుకు,
మీరు ఇక్కడ కూర్చుండండని తన శిష్యులతో చెప్పె
ను. । అప్పుడు ఆయన పేతురు, యాకోబు, యోహా 33
ననే వారిని వెంటబెట్టుకొని వెళ్లి, మిక్కిలీ విస్మయము
పొందుటకును, వ్యాకులపడుటకును ఆరంభించెను. ।
అప్పుడు ఆయన—నా ప్రాణము మరణమంత మట్టుకు 34
మిక్కిలీ దుఃఖపడుతున్నది; మీరు ఇక్కడ మెలుకు
వగా ఉండండని వారితో చెప్పి, । కొంత దూరము 35
వెళ్లి, నేలపడి, సాధ్యమైతే ఆ గడియ తన యొద్ద
నుంచి తొలగిపోవుటకు ప్రార్థిస్తూ । — అబ్బా! 36
తండ్రీ! నీకు సమస్తమును సాధ్యమైనది; ఈ గిన్నె
నా యొద్దనుంచి తొలగించుము; అయితే నా చిత్తము
కాదు, నీ చిత్తమే కానిమ్మని పలికెను.

తరువాత ఆయన వచ్చి వారు నిద్రపోవుట చూచి— 37
సీమోనా! నీవు నిద్రిస్తున్నావా? ఒక్క గడియయైనా
నీవు మెలుకువపడి యుండలేవా? । మీరు శోధనలోకి 38
రాకుండా, మెలుకువపడి ప్రార్థించండి; ఆత్మ సిద్ధమే
గాని శరీరము బలహీనమని పేతురుతో చెప్పి, । తిరిగీ 39
వెళ్లి ఆ మాటనే పలుకుతూ ప్రార్థించెను. । ఆయన 40
తిరిగీ వచ్చి వారు మళ్లీ నిద్రపోవుట చూచెను; వారి
కన్నులు భారముగా ఉండెను; ఆయనకు యేమి ఉత్తర
మియ్యవచ్చునో అది వారికి తోచలేదు.

ఆయన మూడవసారి వచ్చి — మీరు ఇకమీదట 41
నిద్రపోయి అలసట తీర్చుకొనండి; చాలును, గడియ
వచ్చినది; ఇదుగో! మనుష్య కుమారుడు పాపుల చేతు
లకు అప్పగించబడుతున్నాడు; । లేవండి, వెళ్లుదాము; 42
ఇదుగో! నన్ను అప్పగించేవాడు సమీపించెనని చె
ప్పెను.

వెంటనే, ఆయన ఇంకా మాట్లాడుతు ఉండగా, 43
పన్నెండుమందిలో ఒకడైన యూదాయు వానితో
కూడా కత్తులు, గుదియలు పట్టుకొనిన బహు జనస
మూహమును, ప్రధానయాజకులు, శాస్త్రులు, పెద్దలు
మొదలైన వారి యొద్దనుంచి వచ్చిరి. । అయితే ఆయ 44
నను అప్పగించేవాడు — నేను ఎవని ముద్దుబెట్టుకొం
దునో అతడే ఆయన; అతని పట్టుకొని భద్రముగా
కొంచుపొండని, వారికి ఆనవాలు చెప్పియుండెను. ।
అతడు చేరగానే, ఆయన యొద్దికి వచ్చి—రబ్బీ! రబ్బీ!‡ 45
అని చెప్పి ఆయనను ముద్దుబెట్టుకొనెను.

*లేక, ఆశీర్వదించి. †లేక, ఒడంబడిక. ‡అనగా, బోధకుడా.

46 అప్పుడు వారు ఆయన మీద చేతులువేసి ఆయ
47 నను పట్టుకొనిరి. । అప్పుడు దగ్గిర నిలిచియున్న వారి
లో ఒకడు కత్తి దూసి ప్రధానయాజకుని దాసుని
48 కొట్టి వాని చెవి తెగవేసెను. । అప్పుడు యేసు—మీరు
దొంగ మీదికి వచ్చినట్టు నన్ను పట్టుకొనుటకు కత్తు
49 లతోను, గుదియలతోను బైలుదేరి వచ్చితిరా? । నేను
ప్రతిదినము మీ యొద్ద గుడిలో బోధిస్తు ఉన్నప్పుడు,
మీరు నన్ను పట్టుకొన లేదు; అయితే లేఖనములు
50 నెరవేర్చబడ వలెనని పలికెను. । అప్పుడు వారందరు
ఆయనను విడిచి పారిపోయిరి.

51 తన దిగంబర శరీరము మీద అవిసె నారబట్ట
వేసుకొనిన ఒక పడుచువాడు ఆయనను వెంబడిం
52 చగా, పడుచువారు అతని పట్టుకొనిరి. । అతడు తన
నారబట్ట విడిచి వారి యొద్దనుంచి దిగంబరుడై పారి
పోయెను.

53 వారు యేసుని ప్రధానయాజకుని యొద్దికి తీసు
కొని వెళ్లిరి. అతనితోకూడా ప్రధానయాజకులు,
54 పెద్దలు, శాస్త్రులు, అందరును కూడియుండిరి. । అయితే
పేతురు ప్రధానయాజకుని లోపలి వాకిటి మట్టుకు
ఆయనను దూరమునుంచి వెంబడించి, దాసులతో
కూర్చుండి, అగ్ని యొద్ద చలికాచుకొంటు ఉండెను.

55 అప్పుడు ప్రధానయాజకులు, సభవారందరును యే
సుని చంపించుటకు ఆయనకు విరోధముగా సాక్ష్య
ము వెతుకుతు ఉండిరి. అయితే ఏమియు వారికి దొరక
56 లేదు. । అనేకులు ఆయనకు విరోధముగా అబద్ధపు
సాక్ష్యము చెప్పినప్పటికి ఆ సాక్ష్యములు సరిపడ
57,58 లేదు. । అప్పుడు కొందరు లేచి — నేను చేతిపని
యైన ఈ దేవాలయము పడగొట్టి, మూడు దినముల
లో చేతిపని కాని మరి యొకటి కట్టుదునని వీడు
చెప్పుట విన్నామని ఆయనకు విరోధముగా అబద్ధపు
59 సాక్ష్యము పలికిరి. । అయితే ఆలాగైనను వీరి సాక్ష్య
ము సరిపడలేదు.

60 అప్పుడు ప్రధానయాజకుడు మధ్యను నిలువబడి—
వీరు నీకు విరోధముగా పలుకుచున్న సాక్ష్యమునకు
నీవు ఉత్తరము ఏమియు చెప్పవా? అని యేసుని అడి
61 గెను. । అయితే ఆయన ఉత్తరమేమియు చెప్పక, ఊర
కుండెను. తిరిగీ ప్రధానయాజకుడు — నీవు శ్రీభగవం
తుని కుమారుడవైన క్రీస్తువై యున్నావా? అని ఆయ
62 నను అడిగెను. । అందుకు యేసు — అవును; మీరు
మనుష్య కుమారుడు శక్తియొక్క కుడిపక్కను కూర్చుం
డుటయు, ఆకాశ మేఘములమీద వచ్చుటయు చూ
తురని చెప్పెను.

అప్పుడు ప్రధానయాజకుడు తన వస్త్రము చించు 63
కొని—ఇక సాక్షుల నిమిత్తమేమి? । ఈ దేవదూషణ 64
మీరు విని యున్నారు; మీకు ఏమి తోస్తున్నది? అని
అడిగెను. అందుకు వారందరు—మరణమునకు పాత్రు
డై యున్నాడని ఆయనకు శిక్షవిధించిరి. । అప్పుడు 65
కొందరు ఆయన మీద ఉమ్మివేయుటకు, ఆయన
ముఖము కప్పుటకు, ఆయనను గుద్దుటకు,—ప్రవచిం
చుమని ఆయనతో చెప్పుటకును మొదలుబెట్టిరి. పరి
చారకులును ఆయనను అరచేతితో చరిచిరి.

పేతురు కింది వాకిటిలో ఉన్నప్పుడు, ప్రధానయా 66
జకుని పడుచులలో ఒకతె వచ్చి, । పేతురు చలికాచు 67
కొనుట చూచి అతని మీద కన్ను ఉంచి—నీవును
నజరేనీయుడైన యేసుతో కూడా ఉంటివని పలి
కెను. । అందుకు అతడు—ఆలాగు కాదు, అతని నేనె 68
రుగను, నీవు చెప్పినది నాకు బోధపడ లేదని పలికి
నడవలోకి వెళ్లెను. అప్పుడు కోడి కూసెను.

ఆ పడుచు అతని చూచి, దగ్గిర నిలిచిన వారితో 69
—వీడు వారిలో ఒకడని చెప్పనారంభించెను; । అయితే 70
అతడు తిరిగీ—కాదనెను.

కొంత సేపైన తరువాత, దగ్గిర నిలిచిన వారు మళ్లీ
పేతురుతో—నిశ్చయముగా నీవును వారిలో ఒకడవు;
నీవు గలిలైయుడవు; అందుకు నీ పలుకు సరిపడుతున్న
దని చెప్పిరి. । అయితే అతడు— మీరు చెప్పుతున్న మను 71
ష్యుని నేను ఎరుగనని శపించుకొనుటకును, ఒట్టుబె
ట్టుకొనుటకును ఆరంభించెను. । అప్పుడు రెండవమారు 72
కోడి కూసెను గనుక—కోడి రెండుమాలుగా కూయక
మునుపు, నీవు నన్ను ఎరుగనని మూడుమాలుగా చెప్పు
దువని యేసు తనతో పలికిన మాట పేతురు జ్ఞాప
కము తెచ్చుకొని, దాని తలంచుకొంటు* ఏడ్చెను.

## 15. అధ్యాయము.

ఉదయమందు వెంటనే ప్రధానయాజకులు పెద్దల 1
తో, శాస్త్రులతో, సభవారందరితోను ఏకాలోచన
చేసి యేసుని కట్టించి తీసుకొని వెళ్లి, పిలాతుకు అప్ప
గించిరి. । అప్పుడు పిలాతు—నీవు యూదుల రాజవా? 2
అని ఆయనను అడిగెను. అందుకు ఆయన, — నీవు
చెప్పుచున్నావని† అతనికి ఉత్తరమిచ్చెను. । అప్పుడు 3

*లేక, బహుగా. †అనగా, అవునని.

ప్రధానయాజకులు ఆయన మీద అనేకాపరాధములు
4 మోపుతు ఉండగా, । పిలాతు—నీవు ప్రత్యుత్తరమేమి
యు చెప్పవా? ఇదుగో! వీరు నీ మీద యెన్నొ
అపరాధములు మోపి సాక్ష్యమిస్తున్నారని మళ్లీ ఆయ
5 నతో పలికెను. । అయితే యేసు మళ్లీ ఉత్తరమేమియు
ఇయ్యలేదు గనుక పిలాతు ఆశ్చర్యపడెను.

6 అతడు పండుగలో వారు అడిగిన ఒక ఖయిదీని
7 వారికి విడుస్తు ఉండేవాడు. । అప్పుడు కలహమందు
నరహత్య చేసిన తన కలహ సహవాసులతో కట్టబ
8 డిన బరబ్బా అనే పేరు గల ఒకడు ఉండెను. । అప్పు
డు జనసమూహము తమ కొరకు అతడు ఎల్లప్పుడును
చేసే ప్రకారము చేయ వలెనని కేకవేసి అడుగుటకు
9 ఆరంభించెను. । అందుకు పిలాతు—నేను యూదుల
రాజుని విడిపించుట మీకు ఇష్టమవునా? అని అడి
10 గెను. । ప్రధానయాజకులు అసూయవల్ల ఆయనను అప్ప
11 గించిరని అతనికి తెలుసును. । అయితే అతడు బర
బ్బాను వారికి విడిపించ వలెనని ప్రధానయాజకులు
జనసమూహమును ప్రేరేపించిరి.

12 అప్పుడు పిలాతు—ఆలాగైతే, యూదుల రాజని
మీరు చెప్పేవాని నేను ఏమి చేయుటకు కోరుతు
13 న్నారని తిరిగీ వారిని అడిగెను. । అప్పుడు వారు—
14 వాని శిలువ వేయుమని తిరిగీ కేకలువేసిరి. । అందుకు
పిలాతు—ఎందుకు? ఏ అపరాధము చేసెను? అని వారి
తో పలికినందుకు వారు—వాని శిలువవేయుమని మరీ
ఎక్కువగా కేకలు వేసిరి.

15 అప్పుడు పిలాతు జనసమూహమునకు సంతుష్టిచే
యుటకు మనస్సు గలవాడై, వారికి బరబ్బాను విడి
పించి, యేసుని వారులతో కొట్టించి, శిలువవేయబ
డుటకు అప్పగించెను.

16 అప్పుడు రాణువవారు ఆయనను ప్రేతోర్య
మనే* శాలలోకి తీసుకొనివెళ్లి, తమ స్తోమమంతయు
17 కూర్చుకొనిన । తరువాత, ఆయనకు ధూమ్ర వస్త్రము
తొడిగించి, ముండ్ల కిరీటము నల్లి ఆయన తలమీద
18 ఉంచి. । —యూదుల రాజా! నీకు శుభమని ఆయనకు
19 వందనము చేయుటకు ఆరంభించిరి. । అప్పుడు రెల్లు
పుడకతో ఆయన తలమీద కొట్టి, ఆయన మీద ఉ
20 మ్మివేసి, మోకాళ్లూని ఆయనకు నమస్కరించిరి. । వారు
ఆయనను అపహసించిన తరువాత, ఆయన మీద ఉన్న
ధూమ్ర వస్త్రము తీసి, ఆయన స్వవస్త్రములు ఆయ
నకు తొడిగించి, ఆయనను శిలువవేయుటకు బైటికి
తీసుకొని వెళ్లిరి.

అప్పుడు పల్లెటూరినుంచి వచ్చి ఆతోవను వెళ్లుతు 21
న్న సీమోననే కురేనీయుడైన ఒకని ఆయన శిలువ
మోయుటకు బలవంతము చేసిరి. । అతడు అలెక్సంద్రు 22
కును రూఫుకును తండ్రి. అప్పుడు కపాలస్థలమనే
అర్థమిచ్చే గొల్గొథ అనబడిన చోటికి ఆయనను
తీసుకొని వచ్చిరి. । అప్పుడు బోళము కలిపిన మద్య 23
ము ఆయనకు తాగుటకు ఇచ్చుచు ఉండిరి. అయితే
ఆయన దాని పుచ్చుకొనలేదు. । వారు ఆయనను శిలువ 24
వేసి, ఎవరు దేని పుచ్చుకొన వలెనో అని ఆయన
వస్త్రములను గూర్చి చీట్లువేసి వాటిని పంచుకొనిరి. ।
ఆయనను శిలువవేసినప్పుడు మూడు ఘంటలాయె 25
ను.† । — యూదుల రాజు అని దోషారోపణగల పైవి 26
లాసము ఆయన పైని వ్రాయబడెను.

మరియు కుడి పక్కను ఒకనిని, యెడమ పక్కను 27
ఒకనిని ఇద్దరు దొంగలను ఆయనతో కూడా శిలువ
వేసిరి. । అప్పుడు—ఆయన అపరాధులలో ఒకడుగా 28
ఎంచబడుననే వ్రాత నెరవేర్చబడెను.

అప్పుడు ఆ తోవను వెళ్లేవారు తమ తలలు ఆ 29
డిస్తూ—ఆహా! దేవాలయము పడదోసి మూడు దినము
లలో కట్టే వాడా! । నిన్ను నీవే రక్షించుకొని శిలువ 30
మీదనుంచి దిగుమని చెప్పుతు, ఆయనను దూషించు
చు ఉండిరి. । ఆ ప్రకారమే ప్రధానయాజకులు శాస్త్రు 31
లతో కూడా అపహాస్యము చేయుచు—ఇతరులను
రక్షించెను; తన్ను తానే రక్షించుకొన లేదు; । మనము 32
చూచి నమ్ముటకు ఇశ్రాయేలు రాజైన క్రీస్తు ఇప్పుడు
శిలువ మీదనుంచి దిగివచ్చుగాక అని ఒకనితో ఒకడు
చెప్పుకొంటు ఉండిరి. మరియు ఆయనతో కూడా
శిలువ వేయబడినవారు ఆయనను నిందించిరి.

అయితే ఆరు ఘంటలు మొదలుకొని తొమ్మిది 33
ఘంటలు అయేవరకు‡ ఆ దేశమంతటి మీద చీకటి
కలిగెను. । తొమ్మిది ఘంటలకు యేసు—నా దేవా! నా 34
దేవా! నన్ను ఎందుకు విడిచినావనే అర్థమిచ్చే—ఎలో
యి, ఎలోయి లమ్మా సబక్థాని! అని గొప్ప శబ్దముతో
మొరబెట్టెను. । దగ్గిర నిలిచిన వారిలో కొందరు అది 35
విని—ఇదుగో! ఏలీయాను పిలుస్తున్నాడనిరి. । అప్పుడు 36
ఒకడు పరుగెత్తి ఒక స్పంజీ చిరకతో నింపి రెల్లు

*అనగా, అధికారస్థానము. †అనగా, రెండవ జాము ఆరంభము. ‡అనగా, మధ్యాహ్నము
మొదలుకొని మూడవ జాము అయేవరకు.

పుడకకు దాని తగిలించి ఆయనకు తాగనిచ్చి—తా
ళండి! వాని దించుటకు ఏలీయా వచ్చునేమో, చూతా
37 మనెను. । అయితే యేసు గొప్ప కేకవేసి ప్రాణము
38 విడిచెను. । అప్పుడు దేవాలయపు తెర, పైనుంచి కింది
39 మట్టుకు రెండు ముక్కలుగా చినిగి పోయెను. । మరి
యు ఆయన యెదుట నిలిచిన శతాధిపతి, ఆయన
ఈలాగు కేకవేసి, ప్రాణము విడిచెనని చూచి—నిశ్చ
యముగా ఈ మనుష్యుడు దేవుని కుమారుడైయుం
డెనని పలికెను.

40,41 స్త్రీలు కూడా దూరమునుంచి చూస్తు ఉండిరి.।
ఆయన గలిలైయలో ఉన్నప్పుడు ఆయనను వెంబ
డించి ఆయనకు పరిచర్య చేసిన మగ్దల ఊరి మరియ,
చిన్న యాకోబు యోసే అనే వారి తల్లియైన మరియ,
సలోమే, ఆయనతో కూడా యెరూషలేముకు వచ్చిన
వేరే అనేక స్త్రీలును వారిలో ఉండిరి.

42 సాయంకాలమైనప్పుడు అది సిద్ధపరిచే దినమనగా
43 సబ్బాతుకు పూర్వదినము । గనుక అరిమథైయ వాడైన
యోశేపు ధైర్యము తెచ్చుకొని, పిలాతు యొద్దికి వెళ్లి
యేసు శరీరము అడిగెను. ఆయన ఘనత వహించిన
ఆలోచనకర్తయై, దేవుని రాజ్యమునకు ఎదురుచూస్తు
44 ఉండెను. । అయితే పిలాతు — ఆయన ఇంతలోనే
చనిపోయెనా అని ఆశ్చర్యపడి, శతాధిపతిని తన
యొద్దికి పిలిపించి — ఆయన చనిపోయి చాలాసేపు
45 ఆయెనేమో అని అతని అడిగెను. । శతాధిపతివల్ల
తెలుసుకొని, యోశేపుకు శవమును ఇప్పించెను. ।
46 అతడు అవిసె నారబట్ట కొని, ఆయనను దింపి, ఆ
బట్టతో చుట్టి, రాతిలో తొలిపించబడిన సమాధిలో
ఆయనను ఉంచి పరుండబెట్టి ఆ సమాధి ద్వారమునకు
47 రాయి పొర్లించెను. । అయితే మగ్దల ఊరి మరి
య, యోసే తల్లియైన మరియయు ఆయన ఉంచబడిన
చోటు చూచిరి.

## 16. అధ్యాయము.

1,2 సబ్బాతు అయిన తరువాత, మగ్దల ఊరి మరియ
యు, యాకోబు తల్లియైన మరియయు, సలోమేయు,
తాము వచ్చి, ఆయనకు పూసే నిమిత్తము, సుగంధ
ద్రవ్యము కొనిరి. వారు ఆదివారమున పెందలాడి,
3 సూర్యోదయమందు సమాధి యొద్దికి వచ్చిరి. । అప్పుడు
వారు — సమాధి ద్వారమునుంచి మన కొరకు ఆ
రాయి ఎవడు పొర్లించును? అని ఒక దానితో ఒకతె
4 చెప్పుకొనుచుండగా, । వారు కన్నులెత్తి ఆ రాయి
పొర్లించబడి యుండుట చూచిరి. అది చాలా పె
5 ద్దది. । అప్పుడు సమాధిలో ప్రవేశించి, తెల్లని నిలువు
టంగీ ధరించుకొని, కుడితట్టు కూర్చున్న ఒక పడు
చువాని చూచి, మిక్కిలీ భయపడిరి. । అయితే అతడు 6
—భయపడకండి; శిలువవేయబడిన నజరేనీయుడైన
యేసుని మీరు వెతుకుతున్నారు. ఆయన లేచి యు
న్నాడు; ఇక్కడ లేడు; వారు ఆయనను ఉంచిన
స్థలము చూడండి. । అయితే మీరు వెళ్లి ఆయన శిష్యు 7
లతో, పేతురుతోనును—ఆయన మీ కంటే ముం
దుగా గలిలైయలోకి వెళ్లుతున్నాడనియు, ఆయన
మీతో చెప్పిన ప్రకారము అక్కడ ఆయనను చూతు
రనియు చెప్పండి అని పలికెను. । అప్పుడు వారు త్వ 8
రగా బైలువెళ్లి సమాధి యొద్దనుంచి పారిపోయిరి.
వణుకు, విభ్రాంతియు వారిని పట్టెను. వారు మిక్కిలీ
భయపడి, ఎవనితోనైనా ఏమియు చెప్పలేదు.

యేసు ఆదివారమున పెందలాడి లేచి మగ్దల ఊరి 9
మరియకు మొదట కనబడెను. ఆయన ఆమెలోనుంచి
యేడు దయ్యములను వదలగొట్టి యుండెను. । ఆమె 10
వెళ్లి, ఆయనతో కూడా ఉండిన వారు దుఃఖపడి, ఏ
డ్చుచుండగా, వారికి ఆ సంగతి తెలియచేసెను. ।
అయితే ఆయన బ్రతికియున్నాడనియు ఆమెకు అగు 11
పడెననియు వారు విని నమ్మరైరి.

ఆ తరువాత వారిలో ఇద్దరు ఊరికి నడిచి వెళ్లు 12
చుండగా, ఆయన వారికి వేరే రూపముగా అగప
డెను. । వారు వెళ్లి తక్కిన వారికి తెలియచేసిరి. వారు 13
వీరి మాటనైనా నమ్మలేదు.

పదకొండుమంది భోజనపఙ్తిలో కూచున్న 14
ప్పుడు ఆయన వారికి అగపడి, తాను లేచిన తరువాత
తన్ను చూచిన వారిని నమ్మనందున వారి అవిశ్వాస
మును గూర్చి, హృదయ కాఠిన్యమును గూర్చియు
వారిని గద్దించెను. । అప్పుడు ఆయన—మీరు సర్వలో 15
కమునకు వెళ్లి, యావత్సృష్టికి సువార్త ప్రకటిం
చండి. । నమ్మి బాప్తిస్మము పొందినవాడు రక్షించబ 16
డును. నమ్మనివానికి శిక్ష విధించబడును. । నమ్మినవారిని 17
ఈ అద్భుతములు వెంబడించును; నా నామమువల్ల
దయ్యములను వదలగొట్టుదురు, క్రొత్త భాషలతో పలు
కుదురు. । పాములను పట్టుకొందురు, మరణకరమైనది 18
ఏమైనా తాగినను అది వారికి హానిచేయదు, రోగుల
మీద చేతులు ఉంచితే వారు స్వస్థత పొందుదురని
వారితో చెప్పెను.

కాబట్టి ప్రభువు వారితో మాట్లాడిన తరువాత, 19
ఆకాశమునకు ఎత్తబడి, దేవుని కుడిపార్శ్వమందు
కూచుండెను. । తరువాత ప్రభువు వారితో కూడా 20
కార్యకర్తయై, వెంబడించే అద్భుతములవల్ల వాక్యము
స్థిరపరుచుచుండగా, వారు బైలుదేరి అంతటా ప్రక
టించిరి. ఆమేన్.

# లూకా వ్రాసిన సువార్త.

## 1. అధ్యాయము.

1,4 ఓ అతిశ్రేష్ఠుడవైన థెయొఫిలా! ఆరంభమునుంచి
కన్నులార చూచి వాక్య సేవకులైనవారు మనకు అప్ప
గించిన ప్రకారముగా, మనలో రూఢిపడియున్న కా
ర్యములను గూర్చి చరిత్రము వ్రాయుటకు అనేకులు
పూనుకొనియున్నారు గనుక నీకు బోధింపబడిన సం
గతులను గూర్చి నీవు వాస్తవము తెలుసుకొనుటకు
నాటినన్నిటిని మొదటినుంచి తరిచి బాగా తెలుసు
కొనిన నాకును నీ పేరట క్రమముగా వ్రాయ వలెననే
తాత్పర్యము పుట్టెను.
5 యూదైయ దేశపు రాజైన హేరోదు దినముల
యందు, అబీయాయొక్క వరసలో ఉన్న జఖరీయ
అనే పేరుగల ఒక యాజకుడు ఉండెను. అతని
భార్య అహరోను కుమార్తెలలో ఒకతె. ఆమె పేరు
6 ఎలీశబెతు. । వీరిద్దరు ప్రభువుయొక్క సకలమైన ఆజ్ఞ
లలోను న్యాయ విధులలోను నిరపరాధులై నడుచుచు,
7 దేవుని దృష్టికి నీతిమంతులై యుండిరి. । అయితే ఎలీశ
బెతు గొడ్రాలైనందున వారికి సంతానము లేకపో
యెను. మరియు, వారిద్దరికి బహు సంవత్సరములు
గతించెను.
8 అప్పుడు అతడు తన వరస క్రమము చొప్పున,
దేవుని యెదుట యాజకధర్మము చేయుచుండగా, ।
9 యాజక మర్యాద చొప్పున ప్రభువుయొక్క ఆలయ
ములోకి వెళ్లి ధూపము వేయుటకు వంతు ఆయనకు
10 వచ్చెను. । అప్పుడు ధూప కాలమందు ప్రజల సమూ
హమంతయు వెలపట ప్రార్థించుచు ఉండగా, ।
11 ప్రభువుయొక్క దూత ధూప పీఠమునకు కుడి వైపున
12 నిలిచి అతనికి కనబడెను. । జఖరీయ ఆయనను చూచి
13 తొందరపడి జడిసెను. । అయితే ఆ దూత అతనితో
—జఖరీయా! భయపడకుము; నీ ప్రార్థన వినబడెను;
నీ భార్యయైన ఎలీశబెతు నీకు కుమారుని కనును;
14 అతనికి యోహాను* అనే పేరు పెట్టుదువు.। నీకు సం
తోషము ఆనందమును కలుగును. అతడు పుట్టినందున
15 అనేకులు సంతోషింతురు; । అతడు ప్రభువు దృష్టికి
గొప్పవాడై, ద్రాక్షారసమైనా మద్యమైనా తాగక,
తన తల్లి గర్భములో పుట్టినది మొదలుకొని పరిశు
ద్ధాత్మతో నిండుకొని, । ఇశ్రాయేలు కుమాళ్లలో అనే 16
కులను వారి దేవుడైన ప్రభువుతట్టు తిప్పును. । మరి 17
యు, అతడు తండ్రుల హృదయములను పిల్లల తట్టును,
అవిధేయులను నీతిమంతుల జ్ఞానము తట్టును తిప్పి,
ప్రభువు కొరకు ఆయత్తపడియున్న జనమును సిద్ధప
రుచుటకు, ఏలీయాయొక్క ఆత్మతోను శక్తితోను ఆయ
నకు ముందుగా వెళ్లునని చెప్పెను.

అప్పుడు జఖరీయ—ఇది నాకు యేలాగు తెలు 18
సును? నేను ముసలివాడనై యున్నాను, నా భార్య
కును బహు సంవత్సరములు గతించెనని ఆ దూతతో
పలికెను.

అందుకు, ఆ దూత—నేను దేవుని యెదుట నిలిచే 19
గబ్రియేలును; నీతో మాట్లాడుటకు, ఈ సువర్తమా
నము నీకు తెలుపుటకును పంపబడితిని.। మరియు, ఇదు 20
గో! ఇవి జరిగే దినముమట్టుకు నీవు మూగవై మాట్లాడ
లేక ఉందువు; వాటి కాలమందు నెరవేర్చబడే నా
మాటలను నీవు నమ్మలేదని అతనితో ఉత్తరము చెప్పెను.

ఇంతలో ప్రజలు జఖరీయ కొరకు కనిపెట్టుతు, 21
ఆలయములో అతడు ఆలస్యము చేసినందుకు ఆశ్చ
ర్యపడిరి. । అయితే అతడు వెలపటికి వచ్చి, వారితో 22
మాట్లాడ లేకపోయినప్పుడు, ఆలయములో అతనికి
దర్శనమైనదని గ్రహించిరి. అప్పుడు అతడు వారికి
సంజ్ఞ చేసి మౌనముగా ఉండెను.

మరియు, అతడు సేవ చేసే దినములు సంపూర్ణ 23
మైనప్పుడు, అతడు తన ఇంటికి వెళ్లెను.। ఆ దినములైన 24
పిమ్మట, అతని భార్యయైన ఎలీశబెతు గర్భవతియై—
ప్రభువు మనుష్యులలో నా అవమానము పరిహరించు
టకు, । తాను కటాక్షించిన దినములలో నన్ను ఈలా 25
గున చేసియున్నాడు గదా అనుకొని తాను అయిదు
నెలలు దాగి యుండెను.

మరియు ఆరవ నెలలో గబ్రియేలనే దూత, గలి 26
లైయలో నజరెథనే పేరుగల ఊరిలో ఉన్న। దావీదు 27
వంశస్థుడైన యోశేఫనే పేరు గల ఒక పురుషునికి
ప్రధానము చేయబడిన కన్యక యొద్దికి దేవుని చేత
పంపబడెను. ఆ కన్యక పేరు మరియ.। ఆ దూత ఆమె 28
యొద్దికి చేరి, — దయాప్రాప్తురాలా! సంతోషిం

---

*అనగా, యెహోవాదయ.

చుము, ప్రభువు నీకు తోడైయున్నాడు, స్త్రీలలో
నీవు ఆశీర్వచనము పొందితివని చెప్పెను.
29 ఆమె ఆయనను చూచి ఆయన మాటకు తొందర
పడి, ఈ శుభవచనము ఏమిటో అని యోచించుకొ
30 నుచు ఉన్నప్పుడు, । ఆ దూత—మరియా! భయపడ
31 కుము; దేవునియొద్ద కృప నీకు దొరికినది. । ఇదుగో!
నీవు గర్భము ధరించి కుమారుని కని ఆయనకు
32 యేసు* అనే పేరు పెట్టుదువు. । ఆయన గొప్పవాడై
సర్వోన్నతుని కుమారుడనబడును. ప్రభువైన దేవుడు
ఆయన తండ్రియైన దావీదు సింహాసనమును ఆయనకు
33 ఇచ్చును. । ఆయన యాకోబు వంశమును నిరంతర
మును ఏలును. ఆయన రాజ్యము అంతము లేనిదై
యుండునని ఆమెతో చెప్పెను.

34 అందుకు మరియ—నేను పురుషుని యెరుగనిదానినై
యున్నాను గనుక ఇది ఏలాగు సంభవించునని దూత
35 తో పలికినప్పుడు, । ఆ దూత—పరిశుద్ధాత్మ నీ మీదికి
వచ్చును, సర్వోన్నతుని బలము నీ పైని నీడగా ఉం
డును గనుక, నీ యందు పుట్టబోయే పరిశుద్ధమైనది
36 దేవుని కుమారుడనబడును. । మరియు, ఎలీశబెతనే
నీ బంధువురాలిని చూడుము—ఆమె కూడా తన ము
సలితనమందు పురుషగర్భము ధరించి యున్నది. గొ
37 డ్రాలనబడిన ఆమెకు ఇది ఆరవ మాసము. । దేవునికి
అసాధ్యమైన మాట ఒకటియు లేకపోవునని ఆమె
38 తో ప్రత్యుత్తరము చెప్పెను. । అందుకు మరియ—ఇదు
గో! ప్రభువుయొక్క సేవకురాలను; నీ మాట చొ
ప్పున నాకు సంభవించుగాకని చెప్పినప్పుడు దూత
ఆమె యొద్దనుంచి వెళ్లిపోయెను.

39 ఆ దినములయందు మరియ లేచి, కొండల దేశ
40 ములోని యూదా అనే ఊరికి త్వరగా వెళ్లి । జక
రీయ ఇంటిలో ప్రవేశించి ఎలీశబెతును చూచి,—నీకు
శుభమనెను.

41 అప్పుడు ఎలీశబెతు మరియయొక్క శుభవచనము
వినగానే, ఆమె గర్భములో శిశువు గంతులు వేసెను.
అప్పుడు ఎలీశబెతు పరిశుద్ధాత్మతో నిండుకొని వడిగా
42 కంఠమెత్తి
—స్త్రీలలో నీవు ఆశీర్వచనము పొందియున్నావు,
నీ గర్భఫలము కూడా ఆశీర్వదించబడియున్నది.
43 నా ప్రభువుయొక్క తల్లి నా యొద్దికి రావడము
నాకు ఏలాగు సంభవించెను!

ఇదుగో! నీ శుభవచనము నా చెవిని పడగానే, 44
నా గర్భములో శిశువు సంతోషముతో గంతులు
వేసెను.
నమ్మిన ఆమె ధన్యురాలు; ప్రభువు ఆమెకు తెలియ 45
చేయించిన మాటలకు సిద్ధి కలుగునని† పలికెను.
అప్పుడు మరియ— 46
నా ప్రాణము ప్రభువుని మహిమపరుచుచున్నది,
నా ఆత్మ నా రక్షకుడైన దేవునియందు ఆనందించెను. 47
ఆయన తన సేవకురాలి దీనస్థితి కటాక్షించెను. 48
ఇదుగో! ఇకమీదట అన్ని తరములు‡ నన్ను
ధన్యురాలని పలుకును.
శక్తిమంతుడు నాకు గొప్ప కార్యములు చేసెను, 49
ఆయన నామము పరిశుద్ధము.
ఆయనకు భయపడే వారికి ఆయన కృప తరతర 50
ముల పర్యంతముండును.
ఆయన తన బాహుబలము చూపెను; 51
వారి హృదయముల ఆలోచన విషయము ఆయన
గర్వపడే వారిని చెదరగొట్టి యున్నాడు.
ఆయన సింహాసనములనుంచి బలవంతులను పడదోసి 52
దీనులను ఎక్కించి యున్నాడు.
ఆకలిగొనిన వారిని మంచి పదార్థములతో తృప్తి 53
పరిచి,
ధనవంతులను వట్టి చేతులతో పంపివేసి యున్నాడు.
ఆయన మన పితృలతో పలికిన ప్రకారముగా, 54,55
అబ్రాహాము కొరకు అతని సంతానము కొరకు,
నిరంతరము తన కృప జ్ఞాపకము చేసుకొనుటకు,
ఆయన తన సేవకుడైన ఇశ్రాయేలుకు సహాయము
చేసెనని పలికెను.

అంతట మరియ కొంచెము యెక్కువ తక్కువ 56
మూడు నెలలు ఆమెతో కూడా ఉండి తన ఇంటికి
తిరిగి వెళ్లెను.

అప్పట్లో ఎలీశబెతుకు ప్రసూతి కాలము వచ్చి 57
నప్పుడు, ఆమె కుమారుని కనెను. । అప్పుడు ప్రభువు 58
ఆమెయందు మహా కృపను ఉంచెనని ఆమె పొరుగు
వారు, బంధువులును విని ఆమెతో కూడా సంతో
షించిరి.

మరియు, ఎనిమిదవ దినమున వారు ఆ పిల్లకు ఛేద 59
నసంస్కారము చేయించుటకు వచ్చినప్పుడు, జఖరీయ
అని అతని తండ్రి పేరు అతనికి పెట్టుచుండిరి. । అం 60
దుకు అతని తల్లి—ఆలాగు కాదు, అతడు యోహాను

*అనగా, యెహోవా రక్షణ. †లేక, కలుగునని నమ్మిన ఆమె భాగ్యవంతురాలు.
‡లేక, సకలమైన వంశస్థులును.

61 అనబడునని చెప్పెను. । అందుకు వారు—నీ బంధువు
లలో ఆ పేరుగలవాడు ఎవ్వడును లేడని ఆమెతో
62 చెప్పి, । అతనికి ఏ పేరు పెట్టుటకు కోరుచున్నావని
63 అతని తండ్రికి సంజ్ఞ చేసిరి. । అప్పుడు చిన్న వ్రాతప
లకను అడిగి—అతని పేరు యోహానని వ్రాసెను. అం
64 దుకు వారందరును ఆశ్చర్యపడిరి. । వెంటనే ఆయన
నోరు తెరవబడి, నాలుక సడలి, దేవుని స్తుతిస్తూ
మాట్లాడుచు ఉండెను.
65 అంతట వారిచుట్టు కాపురమున్న వారందరికిని
భయము కలిగెను. అప్పుడు ఆ సంగతులన్నియు యూ
దైయ కొండ ప్రాంతములయందంతట ప్రచురమైనవి. ।
66 వాటిని వినిన వారందరును—ఈ పిల్ల ఏలాటివాడ
వునో! అని వాటిని తమ హృదయములలో ఉంచు
కొనిరి. ప్రభువుయొక్క చెయ్యి అతనికి తోడైయుం
డెను.
67 మరియు అతని తండ్రియైన జఖరీయ పరిశుద్ధాత్మ
తో నిండుకొని ఇట్లు ప్రవచించెను;—
68-75 ఇశ్రాయేలు దేవుడైన ప్రభువు స్తుతించబడు గాక.
ఆయన తన ప్రజలకు దర్శనమిచ్చి,
వారికి విమోచనము కలుగచేసి యున్నాడు.
మనము మన శత్రువుల చేతులలోనుంచి తప్పించబడి
మన జీవితకాలమంతయు
ఆయన యెదుట పరిశుద్ధతతోను నీతితోను
నిర్భయముగా ఆయనను సేవించేటట్టు అనుగ్రహిం
తునని
మన పితృలను కరుణించి తన పరిశుద్ధ నిబంధనను,
(అనగా)
మన తండ్రియైన అబ్రాహాముతో
ఆయన చేసిన ప్రమాణము జ్ఞాపకము చేసుకొనుచు,
ఆయన పూర్వకాలమునుంచి
తన పరిశుద్ధ ప్రవక్తల నోట పలికించిన ప్రకారముగా
తన సేవకుడైన దావీదు వంశములో
మనకు రక్షణ శృంగమును,
మన శత్రువులనుంచి,
మనలను ద్వేషించే వారందరి చేతులనుంచి రక్షణను
కలుగ చేసి యున్నాడు.
76-79 మరియు, ఓ చిన్నవాడా!
నీవు మహోన్నతుని ప్రవక్తవనబడుదువు;
ఆయన మార్గములను సిద్ధపరుచుటకు (అనగా)
మా పాదములను సమాధాన మార్గములోకి
నడిపించే నిమిత్తము,
చీకటిలోను మరణ ఛాయలోను
కూర్చుండే వారికి వెలిగిచ్చుటకు,
పైనుంచి మాకు అరుణోదయ దర్శనము
కలిగించిన దేవుని అధిక కరుణ మూలముగా,
వారి పాపముల క్షమించుటవల్ల
తన ప్రజలకు రక్షణ జ్ఞానము అనుగ్రహించే నిమిత్తము
నీవు ప్రభువునకు ముందుగా నడుతువు.
ఆ శిశువు ఎదిగి ఆత్మలో బలాభివృద్ధియై ఇశ్రాయే 80
లుకు ప్రత్యక్షమయే దినముల పర్యంతము, అరణ్య
ములో ఉండెను.

## 2. అధ్యాయము.

ఆ దినములలో సర్వలోక ప్రజాసంఖ్య వ్రాయ 1
బడ వలెనని కైసరౌగూస్తువల్ల ఆజ్ఞ ప్రచురము చేయ
బడెను. । సూరియ దేశమునకు కురేనియు అధిపతియై 2
యున్నప్పుడు, ఈ మొదటి ప్రజాసంఖ్య వ్రాయబ
డెను. । అప్పుడు అందరు ఆ సంఖ్యలో వ్రాయబడు 3
టకు తమ తమ పట్టణములకు వెళ్లిరి.
కాబట్టి దావీదు సంతతిలోను గోత్రములోను 4,5
పుట్టిన యోశేపును, తనకు భార్యగా ప్రధానము
చేయబడి, గర్భవతియైన మరియతో కూడా ఆ సంఖ్య
లో వ్రాయబడుటకు గలిలైయ దేశమందలి నజరెథనే
పట్టణములోనుంచి, యూదైయ దేశమందలి బేత్లెహే
మనబడిన దావీదు ఊరికి వెళ్లెను.
వారు అక్కడ ఉన్నప్పుడు, ఆమెకు ప్రసూతి 6
దినములు సంభవించినందున, । తన తొలిచూలు కుమా 7
రుని కని, బట్టతో చుట్టి, సత్రములో వారికి స్థలము
లేనందున, ఆయనను పశువుల తొట్టిలో పరుండ
బెట్టెను.
అప్పుడు, ఆ దేశములో కొందరు గొర్రెల కాప 8
రులు బైట ఉండి రాత్రివేళ తమ మందను కాచు
కొనుచుండగా, । ఇదుగో! ప్రభువుయొక్క దూత 9
వారికి ప్రత్యక్షమై, ప్రభువుయొక్క తేజము వారి
చుట్టూ ప్రకాశించెను గనుక వారు మిక్కిలీ భయ
పడిరి. । అయితే ఆ దూత వారితో—భయపడకండి; 10
ఇదుగో! నేను మహా సంతోషకరమైన సువార్తను
మీకు తెలియ చేస్తున్నాను; అది ప్రజలందరికిని కలు
గును. । దావీదుయొక్క పట్టణమందు మీకు రక్షకుడు 11
నేడు పుట్టియున్నాడు; ఈయన ప్రభువైన క్రీస్తు. ।
ఇందుకు ఇదే మీకు ఆనవాలు, ఒక శిశువు బట్టతో 12
చుట్టబడి ఒక తొట్టిలో పండుకొనుట చూతురని
చెప్పెను.
వెంటనే ఆ దూతతో ఆకాశముయొక్క సైన్య 13
సమూహము ప్రత్యక్షమై, ।—సర్వోన్నతమైన వాటి 14
లో దేవునికి మహిమయు, భూమి మీద సమాధాన
మును, మనుష్యులయందు కటాక్షమును కలుగుగాకని
దేవుని స్తుతిస్తు ఉండెను.

15 ఆ దూతలు వారి యొద్దనుంచి ఆకాశమునకు
వెళ్లిన తరువాత, ఆ గొర్రెల కాపరులు—మంచిది, మన
ము బేత్లెహేము దాకా వెళ్లి, ప్రభువు మనకు తెలియ
చేయించిన ఈ జరిగిన కార్యము చూతాము రండని ఒక
16 నితో ఒకడు చెప్పుకొని, । త్వరగా వెళ్లి, మరియను,
యోశేపును, తొట్టిలో పండుకొనియున్న శిశువును
17 చూచిరి. । వారు చూచి ఈ పిల్లను గూర్చి తమతో
18 చెప్పబడిన మాటలను ప్రచురము చేసిరి. । అప్పుడు
విన్నవారందరు తమతో గొర్రెల కాపరులు పలికిన
19 వాటిని గూర్చి మిక్కిలీ ఆశ్చర్యపడిరి. । అయితే
మరియ ఆ మాటలన్నియు తన హృదయములో యో
20 చించి జ్ఞాపకముంచుకొనెను. । అంతట ఆ గొర్రెల
కాపరులు, తమతో చెప్పబడిన ప్రకారము తాము
విన్నవాటిని చూచినవాటిని అన్నిటిని గూర్చి దేవుని
మహిమపరుస్తు, స్తుతిస్తు తిరిగీ వెళ్లిరి.

21 మరియు ఆ పిల్లకు ఛేదనసంస్కారము చేసే ఎని
మిదవ దినము వచ్చినప్పుడు, గర్భమందు ఆయన పడక
మునుపు, యేసు అని దూతచేత పెట్టబడిన పేరు
ఆయనకు పెట్టిరి.

22-24 మోషేయొక్క బోధన ప్రమాణము చొప్పున
వారి పరిశుద్ధి దినములు వచ్చినప్పుడు — ప్రతి తొలు
చూలు మగపిల్ల ప్రభువునకు పరిశుద్ధుడనబడ వలెనని
ప్రభువుయొక్క బోధనప్రమాణ గ్రంథమందు వ్రా
యబడిన ప్రకారము, ఆయనను ప్రభువునకు అర్పిం
చుటకు — గువ్వల జతనైనా లేక రెండు పావురపు
పిల్లలనైనా అని ప్రభువుయొక్క బోధనప్రమాణ
గ్రంథమందు* చెప్పబడిన ప్రకారము యాగము
చేయుటకును ఆయనను యెరూషలేముకు తీసుకొని
వెళ్లిరి.

25 అప్పుడు ఇదుగో! యెరూషలేము యందు సుమె
యోను అనే పేరు గల ఒక మనుష్యుడు ఉండెను.
ఆ మనుష్యుడు నీతియు భక్తియు గలవాడై ఇశ్రాయే
లుయొక్క ఆదరణ కొరకు కనిపెట్టుచుండెను. మరి
26 యు, పరిశుద్ధాత్మ ఆయన యందు ఉండెను. । ఆయన
ప్రభువుయొక్క అభిషిక్తుని† చూడక మునుపు మర
ణము పొందడని అతనికి పరిశుద్ధాత్మవల్ల బైలుపరచ
27 బడెను. ఆత్మవల్ల ఆయన గుడిలోకి వచ్చెను. । అంతట
బోధనప్రమాణ మర్యాద చొప్పున ఆయనను గూర్చి
చేయుటకు తలిదండ్రులు యేసు అనే పిల్లను గుడి
28 లోకి తీసుకొని వచ్చినప్పుడు, । అతడు తన చేతుల
లోకి అతని చేర్చుకొని,

—ఓ కర్తా! ఇప్పుడు నీ మాట చొప్పున సమా 29-32
ధానముగా నీ సేవకుని వెళ్లనిస్తున్నావు;
రాష్ట్రముల మునుకు తీయుటకును, నీ ప్రజలైన
ఇశ్రాయేలు మహిమకున్నైన వెలుగుగా,
నీవు సకలమైన జనుల సమ్ముఖమందు సిద్ధపరిచిన
నీ రక్షణ నా కన్నులు చూచినవని దేవుని స్తుతించెను.

అప్పుడు యోశేపును ఆయన తల్లియును ఆయనను 33
గూర్చి చెప్పబడిన వాటికి ఆశ్చర్యపడిరి. । అయితే 34
సుమెయోను వారిని ఆశీర్వదించి ఆయన తల్లియైన
మరియతో—ఇదుగో! అనేక హృదయముల ఆలోచ
నలు బైలుపడేటట్టు, ఇశ్రాయేలులో అనేకులు పడు
టకును తిరిగీ లేచుటకును ఎదురాడబడే ఆనవాలు
కును ఈయన నియమించబడియున్నాడు. । మరియు 35
నీ ప్రాణములోకి ఒక కత్తి దూసిపోవునని చెప్పెను.
మరియు ఆషేరు గోత్రమందున్న ఫనూయేలు 36
కుమార్తెయైన అన్న అనే ఒక ప్రవక్త్రి ఉండెను.
ఆమె కన్యాత్వము మొదలుకొని, ఏడు సంవత్సరముల
పర్యంతము పెనిమిటితో సంసారము చేసి, బహు కా
లము గడిపినదై యుండెను. । ఆమె కొంచెము ఎక్కువ 37
తక్కువ ఎనభై నాలుగు సంవత్సరముల విధవయై, ఉప
వాసములతోను, ప్రార్థనలతోను రేబగల్లు సేవిస్తు,
గుడి విడువకనుండెను. । ఆమె కూడా ఆ గడియ 38
లోనే లోపటికి వచ్చి, ప్రభువుని స్తోత్రము చేసి,
యెరూషలేముయందు విడుదల కొరకు కనిపెట్టుచున్న
వారందరికిని ఆయనను గూర్చి పలుకుచుండెను.

అప్పుడు వారు ప్రభువుయొక్క బోధనప్రమా 39
ణము చొప్పున సమస్తము తీర్చిన పిమ్మట, గలిలైయలో
ఉన్న నజరెథనే తమ ఊరికి తిరిగి వెళ్లిరి. । ఆ పిల్ల 40
ఎదిగి, జ్ఞానముతో నిండుకొనుచు, ఆత్మయందు బలా
భివృద్ధి పొందెను; దేవుని దయ ఆయనయందు ఉం
డెను.

పస్కాపండుగలో ఆయన తలిదండ్రులు ప్రతి 41
సంవత్సరమును యెరూషలేముకు వెళ్లుచుండేవారు. ।
ఆయన పన్నెండు సంవత్సరములవాడై యున్నప్పుడు, 42
ఆ పండుగ మర్యాద చొప్పున వారు యెరూషలే
ముకు వెళ్లిరి. । ఆ దినములు తీరిన తరువాత వారు 43
తిరిగీ వెళ్లుచుండగా, చిన్నవాడైన యేసు యెరూష
లేముయందు నిలిచెను. । అయితే యోశేపు, ఆయన 44
తల్లియు దాని ఎరుగక, ఆయన పరసలో ఉన్నాడని
తలంచి, ఒక దినప్రయాణము వెళ్లి తమ బంధువుల

*లైవికకాండము. 12. అ. 8. వ. †అనగా, క్రీస్తును.

లోను, నెళ్ళైన వారిలోను ఆయనను వెతుకుతు
45 ఉండిరి. । అయితే ఆయనను కనుగొనలేక ఆయనను
46 వెతుకుతు యెరూషలేముకు తిరిగీ వెళ్లిరి. । మూడు
దినములైన తరువాత ఆయన గుడిలో విద్వాంసుల
మధ్యను కూర్చుండి, వారి మాటలను ఆలకిస్తు, వారిని
47 ప్రశ్నలు అడుగుతును ఉండుట కనుగొనిరి. । అప్పుడు
ఆయన మాట వినిన వారందరు ఆయన ప్రజ్ఞకు,
ప్రత్యుత్తరములకును ఆశ్చర్యపడిరి.

48 వీరును ఆయనను చూచి మిక్కిలీ ఆశ్చర్యపడిరి.
అప్పుడు ఆయన తల్లి ఆయనతో—చిన్నవాడా! మమ్ము
ఎందుకు ఈలాగు చేసినావు! ఇదుగో! నీ తండ్రి,
నేనును చింతపడి నిన్ను వెతుకుచుంటిమని పలికెను. ।
49 అయితే ఆయన—మీరు ఎందుకు నన్ను వెతుకుచుం
టిరి! నేను నా తండ్రి సంగతులలో ఉండ వలెనని
మీరు ఎరుగరా? అని వారితో పలికెను.

50 అయితే ఆయన వారితో చెప్పిన మాట వారికి
51 బోధపడలేదు. । అప్పుడు ఆయన వారితో కూడా
బైలుదేరి నజరెథుకు వెళ్లి వారికి లోబడియుండెను.
ఆయన తల్లి ఈ మాటలన్నియు తన హృదయములో
52 ఉంచుకొనెను. । యేసునకు బుద్ధి, వయస్సు, దేవుని
దయయును మనుష్యుల దయయును పెంపారుచుం
డెను.

## 3. అధ్యాయము.

1 తిబెరికైసరు ఆధిపత్యముయొక్క పదిహేనవ సం
వత్సరమందు, యూదైయ దేశమునకు పొంతిపిలాతు
అధిపతిగాను, గలిలైయ దేశమునకు హేరోదు చతు
ర్థాణాధిపతిగాను, ఇతూరైయ త్రాఖోనీతి అనే దేశ
ములకు అతని తమ్ముడైన ఫీలిప్పు చతుర్థాణాధిపతిగాను,
2,3 అబిలేనే దేశమునకు లుసానియ అధిపతిగాను, । అన్న
యు, కయఫయు ప్రధానయాజకులుగాను ఉన్న
ప్పుడు, అరణ్యములో జకరీయ కుమారుడైన యోహాను
యొద్దికి దేవుని వాక్యము వచ్చెను.

4-6 అంతట—ప్రభువుయొక్క మార్గము సిద్ధపర
చండి; ఆయన త్రోవలను సరాళము చేయండి. ప్రతి
పల్లము నింపబడును, ప్రతి కొండయు మెట్టయును
అణపబడును; వంకరవి తిన్ననివిగాను కరుకువి నున్న
నివిగాను ఉండును. అప్పుడు సకలశరీరులు దేవుని
రక్షణ చూతురని అరణ్యములో కంఠమెత్తి పలుకు
చున్న ఒకని శబ్దము అని యెషయా* అనే ప్రవక్త
యొక్క వాక్యముల గ్రంథమందు వ్రాయబడిన ప్రకా
రము, ఆయన యొర్దానునే నదియొక్క అన్ని ప్రాం
తములకు వచ్చి పాపక్షమ కొరకు మారు మనస్సు
విషయమైన బాప్తిస్మము ప్రకటించుచుండెను.

కాబట్టి అతడు తనవల్ల బాప్తిస్మము చేయించు 7
కొనుటకు బైలుదేరి వచ్చిన సమూహములతో—సర్ప
వంశస్థులారా! రాబోయే కోపము తప్పించుకొనుటకు
మీకు ఎవరు బుద్ధి చెప్పిరి!। కాబట్టి మారు మనస్సుకు 8
తగిన ఫలములు ఫలింప చేయండి.—అబ్రాహాము మాకు
తండ్రి అని మీలో అనుకొనుటకు మొదలుబెట్టవద్దు;
దేవుడు ఈ రాళ్లవల్ల అబ్రాహాముకు పిల్లలను పుట్టించ
గలడని మీతో చెప్పుతున్నాను. । మరియు, ఇప్పుడు 9
గొడ్డలి చెట్ల వేరున వేయబడియున్నది గనుక మంచి
ఫలము ఫలింపచేయని ప్రతి చెట్టును నరకబడి అగ్ని
లో వేయబడునని చెప్పెను.

అప్పుడు జనసమూహములు—ఆలాగైతే మేము ఏమి 10
చేయవలెనని అతని అడిగెను. । అందుకు అతడు— 11
రెండు అంగీలు గలవాడు లేనివానికి ఇయ్య వలెనని
యు, ఆహారము గలవాడు ఆలాగున చేయ వలెనని
యు వారికి ఉత్తరమిచ్చెను.

సుంకరులును,† బాప్తిస్మము చేయించుకొనుటకు 12
వచ్చి—బోధకుడా! మేము ఏమి చేయ వలెనని అతని
అడిగిరి. । అందుకు అతడు — మీకు నిర్ణయించబ 13
డినదానికంటే ఎక్కువ పుచ్చుకొన వద్దని వారితో
చెప్పెను.

అప్పుడు రాణువవారు కూడా—మేమును ఏమి 14
చేయ వలెనని అడిగినందుకు, అతడు—ఎవని మీదను
జులుము చేయ వద్దు, ఎవని మీదను అపనింద వేయ
వద్దు, మీ జీతములతో తృప్తి పొంద వలెనని వారి
తో చెప్పెను.

అప్పుడు ప్రజలు కనిపెట్టుతు, యోహానునుగూర్చి— 15
ఈయన క్రీస్తు ఏమో అని అందరును తమ హృదయ
ములలో ఆలోచన చేయుచుండగా । యోహాను — 16
నేను నీళ్లతో మీకు బాప్తిస్మము చేయిస్తున్నాను;
అయితే నాకంటే బలవంతుడైన వాడు వస్తున్నాడు;
ఆయన చెప్పుల వారునైనా విప్పుటకు యోగ్యుడను
కాను; ఆయన పరిశుద్ధాత్మతోను అగ్నితోను మీకు
బాప్తిస్మము చేయించును. । ఆయన చేట ఆయన చేతి 17
లో ఉన్నది; ఆయన తన కళ్లమును బాగా శుభ్రము
చేసి తన కొట్టులో గోధుములు పోసి ఆరని అగ్నితో
పొట్టు కాల్చివేసునని అందరితో ఉత్తరము చెప్పెను. ।
అంతే కాకుండా ఆయన ఇంకా అనేకమైన సంగ 18
తులను బోధపరిచి ప్రజలకు సువార్తను ప్రకటించెను.

*యెషయా. 40. 3, 5. †లేక, సుంకపు గుత్తదారులును.

19 అయితే చతుర్థాధిపతియైన హేరోదు, తన
తమ్ముని భార్యయైన హేరోదియ నిమిత్తము, హేరోదు
చేసిన సకలమైన చెడ్డ కార్యముల నిమిత్తమును అతని
20 చేత గద్దించబడి, । ఇంకా వాటికన్నిటికిని తోడుగా
యోహానును చెరసాలలో వేయించెను.

21 ప్రజలందరును బాప్తిస్మము చేయించబడినప్పుడు,
యేసు కూడా బాప్తిస్మము చేయించబడి ప్రార్థించు
22 చుండగా ఆకాశము తెరవబడెను. । అప్పుడు పరిశు
ద్ధాత్మ దేహాకారముగా గువ్వవలె ఆయన మీద వాలె
ను. అప్పుడు—నీవే నా ప్రియ కుమారుడవు, నీయందు
నేను ఆనందిస్తున్నాను అనే ఒక శబ్దము ఆకాశము
నుంచి కలిగెను.

23 అప్పుడు యేసు కొంచెము యెక్కువ తక్కువ ము
ప్పది సంవత్సరముల వయస్సు గలవాడు కావచ్చెను.
ఆయన యోశేఫు కుమారుడని ఎంచబడెను. అతడు
24 హేలీకి, । అతడు మత్థతుకు, అతడు లేవీకి, అతడు
25 మల్కీకి, । అతడు యన్నకు, అతడు యోశేఫుకు, అతడు
మత్తథీయకు, అతడు ఆమోసుకు, అతడు నాయూముకు,
26 అతడు ఎస్లికి, అతడు నగ్గయికి, । అతడు మయథుకు,
అతడు మత్తథీయకు, అతడు షిమీకి, అతడు యోశే
27 ఫుకు, అతడు యూదాకు, । అతడు యోహన్నకు, అత
డు రేసాకు, అతడు జెరుబ్బాబెలుకు, అతడు సలథియే
28 లుకు, అతడు నేరికి, । అతడు మెల్కీకి, అతడు అద్దికి,
అతడు కోసముకు, అతడు యెల్మోదాముకు, అతడు
29 ఏరుకు, । అతడు యోసేకు, అతడు ఎలీయెజెరుకు, అతడు
30 యోరీముకు, అతడు మత్థతుకు, అతడు లేవీకి, । అతడు
సుమెయోనుకు, అతడు యూదాకు, అతడు యోశే
ఫుకు, అతడు యోనానుకు, అతడు ఎల్యాకీముకు, ।
31 అతడు మెలెయాకు, అతడు మైనానకు, అతడు మత్త
32 థాకు, అతడు నాతానుకు, అతడు దావీదుకు, । అతడు
యెష్షైకి, అతడు ఓబేదుకు, అతడు బోజుకు, అతడు
33 శల్మోనుకు, అతడు నష్షోనుకు, । అతడు అమ్మీనాదా
బుకు, అతడు ఆరాముకు, అతడు ఎస్రోముకు, అతడు
34 ఫరెసుకు, అతడు యూదాకు, । అతడు యాకోబుకు,
అతడు ఈసాకుకు, అతడు అబ్రాహాముకు, అతడు
35 తెరహుకు, అతడు నాహోరుకు, । అతడు సరూఖుకు,
అతడు రగౌకు, అతడు ఫలెగుకు, అతడు హేబెరుకు,
36 అతడు సలాకు, । అతడు కయినానుకు, అతడు అర్ఫ
క్సదుకు, అతడు షేముకు, అతడు నోవహుకు, అతడు
37 లామెఖుకు, । అతడు మతూషెలకు, అతడు ఎనోఖుకు
అతడు యారెదుకు, అతడు మహలలేలుకు, అతడు
కయినానుకు, । అతడు ఎనోషుకు, అతడు షేతుకు, అ 38
తడు ఆదాముకు, అతడు దేవునికి కుమారుడై యుండెను.

## 4. అధ్యాయము.

మరియు యేసు పరిశుద్ధాత్మతో నిండుకొని, యొ 1
ర్దాను నదినుంచి తిరిగి వచ్చి, ఆత్మవల్ల అరణ్యము
లోకి తీసుకొనిపోబడి, । నలుబది దినములు సైతాను* 2
వల్ల శోధించబడెను.

ఆ దినములలో ఆయన ఏమియు తినలేదు. అవి తీరిన
తరువాత ఆయనకు ఆకలి పుట్టెను. । అప్పుడు సైతాను 3
—నీవు దేవుని కుమారుడవై యుంటే, రొట్టె అయ్యే
టట్టు ఈ రాతికి ఆజ్ఞాపించుమని ఆయనతో చెప్పెను. ।
అయితే యేసు — మనుష్యుడు రొట్టెవల్ల మాత్రమే 4
కాకుండా, దేవుని ప్రతిమాట వల్లను బ్రతుకునని వ్రా
యబడి యున్నది అని దానితో ఉత్తరము చెప్పెను.

అప్పుడు సైతాను ఆయనను ఎత్తుగల కొండ మీ 5
దికి తీసుకొని వెళ్లి, భూలోక రాజ్యములన్నియు ఒక
నిమిషములో ఆయనకు చూపించెను. । అప్పుడు సైతాను 6
—ఈ అధికారమంతయు వీటి మహిమయును నీకు
ఇత్తును; అది నాకు అప్పగించబడెను, అది ఎవనికియ్య
వలెనని నాకు మనస్సు కలుగునో వానికి ఇత్తును. । కా 7
బట్టి నీవు నా యెదుట నమస్కరించితే అంతయు నీదై
యుండునని ఆయనతో చెప్పెను. । అందుకు యేసు— 8
సైతానా! నా యెదుటనుంచి పొమ్ము; —నీ దేవుడైన
ప్రభువునకు నమస్కరించి, ఆయనను మాత్రమే సేవించ
వలెనని వ్రాయబడి యున్నది అని దానితో ఉత్తరము
చెప్పెను.

అప్పుడు ఆయనను యెరూషలేముకు తీసుకొని వెళ్లి, 9
గుడిశిఖరము మీద ఆయనను నిలువబెట్టి—నీవు దేవుని
కుమారుడవైతే ఇక్కడనుంచి నీకు నీవే కింద పడుము; ।
— నిన్ను కాపాడుటకు తన దూతలకు నిన్ను గూర్చి 10
ఆజ్ఞాపించుననియు, । నీ పాదము ఎప్పుడైనా రాతిమీద 11
తగలకుండా వారు నిన్ను చేతులతో యెత్తుదురనియు
వ్రాయబడి యున్నదని ఆయనతో చెప్పెను. । అందుకు 12
యేసు—నీ దేవుడైన ప్రభువుని శోధించ వద్దని చెప్ప
బడి యున్నది అని దానితో ఉత్తరము పలికెను.

సైతాను శోధన యావత్తు చాలించి ఒక సమయము 13
(దొరికే) మట్టుకు ఆయన యొద్దనుంచి పోయెను.

అప్పుడు యేసు ఆత్మ శక్తివల్ల గలిలైయ దేశమునకు 14
తిరిగి వెళ్లెను, ఆయనను గూర్చిన సమాచారము ఆ

*అనగా, విరోధి.

15 ప్రాంతమందంతటను బైలువెళ్లెను. । అప్పుడు ఆయన
అందరిచేత ఘనతపొంది వారి సునగోగులలో బోధిం
చుచుండెను.

16 తరువాత ఆయనను తాను పెరిగిన నజరథనే ఊరికి
వచ్చి, తన మర్యాద చొప్పున సబ్బాతు దినమందు
17 సునగోగులోకి వెళ్లి చదువుటకు నిలిచెను. । అప్పుడు
యెషయా అనే ప్రవక్తయొక్క గ్రంథము ఆయన
చేతికి అప్పగించబడెను. ఆయన ఆ గ్రంథము విప్పి
చూడగా—

18 ప్రభువుయొక్క ఆత్మ నా మీద ఉన్నది;
బీదలకు సువార్త ప్రకటించుటకు,
ఆయన నన్ను అభిషేకించెను.
అవిసిన గుండెగల వారిని స్వస్థపరుచుటకును,
చెరలో ఉన్న వారికి విడుదలను,
గుడ్డివారికి దృష్టిని ప్రకటించుటకును,
నలిగే వారిని విడిపించుటకును,
19 ప్రభువుయొక్క హితవత్సరము ప్రకటించుటకును,
ఆయన నన్ను పంపెనని వ్రాయబడిన చోటు ఆయ
20 నకు దొరికెను. । అప్పుడు ఆయన గ్రంథము చుట్టి పరి
చారకునికి అప్పగించి కూర్చున్న తరువాత సునగో
గులో ఉన్న వారందరి కన్నులు ఆయన మీద ఉండెను.

21 అప్పుడు ఆయన—నేడు మీ వినికిలో ఈ లేఖ
నము నెరవేర్చబడి యున్నదని వారితో చెప్ప సాగెను.
22 అప్పుడు అందరును ఆయనను గూర్చి సాక్ష్య
మిస్తూ, ఆయన నోట వచ్చిన దయ గల మాటలకు
ఆశ్చర్యపడి—ఈయన యోశేపు కుమారుడు కాడా?
అనుకొనిరి.

23 అయితే ఆయన—మీరు—వైద్యుడా! నిన్ను నీవే
స్వస్థపరుచుకొనుమనే సామెతె చొప్పున, కపెర్న
హూములో యే యే కార్యములు జరిగినవని మేము
వింటిమో అవి ఈ నీ స్వదేశమందును చేయుమని నిశ్చ
24 యముగా నాతో పలుకుదురని వారితో పలికెను.। మరి
యు ఆయన — మీతో సత్యము చెప్పుతున్నాను,
ఏ ప్రవక్తయు తన స్వదేశమందు హితుడు కాడు;।
25 అయితే, ఏలీయా దినములయందు మూడు ఏండ్ల ఆరు
నెలలు ఆకాశము మూయబడి దేశమందంతటను గొప్ప
కరువు కలిగినప్పుడు ఇశ్రాయేలులో అనేక విధవలు
26 ఉండిరి. । అయితే ఏలీయా సీదోను సంబంధమైన
సరెప్త అనే ఊరిలో ఉన్న విధవయైన ఒక స్త్రీ యొ
ద్దికే గాని వారిలో ఒకతె యొద్దికైనా పంపబడలేదు.।
27 మరియు ప్రవక్తయైన ఏలీషాయొక్క కాలమందు,
ఇశ్రాయేలులో అనేక కుష్ఠరోగులు ఉండిరి; అయి
నప్పటికిని, సురియ దేశస్థుడైన నయమాననే అతడే
గాని వారిలో ఒకడైనా శుద్ధిపరచబడ లేదని నేను
నిజముగా మీతో చెప్పుతున్నానని పలికెను.

సునగోగులో ఉన్న వారందరు ఆ మాటలు విని 28
ఆగ్రహముతో నిండుకొని । లేచి, ఆయనను పట్టణము 29
లోనుంచి వెళ్లగొట్టి, ఆయనను తలకిందుగా పడదోయ
వలెనని, తమ పట్టణము కట్టబడిన కొండ అంచు
మట్టుకు ఆయనను తీసుకొని వెళ్లిరి. । అయితే ఆయన 30
వారి మధ్యనుంచి వెళ్లిపోయెను.

అప్పుడు ఆయన గలిలైయలో ఉన్న కపెర్నహూ 31
మనే పట్టణమునకు వచ్చి, సబ్బాతు దినములలో వారికి
బోధించుచుండెను. । అప్పుడు వారు ఆయన బోధకు 32
ఆశ్చర్యపడిరి; ఆయన మాట అధికారముగలదై
యుండెను.

ఆ సునగోగులో అపవిత్రమైన దయ్యముయొక్క 33
ఆత్మగల మనుష్యుడు ఉండెను. । అతడు—వద్దు! నజరీ 34
యుడవైన యేసూ! నీతో మాకేమి? మమ్ము నశింపచేయ
వచ్చితివా? నీవు ఎవడవో ఎరుగుదును; దేవుని పరి
శుద్ధుడవని కంఠమెత్తి పలికెను. । అయితే యేసు దాని 35
గద్దించి — ఊరకొని ఇతని వదిలి వెళ్లుమని చెప్పెను.
అప్పుడు ఆ దయ్యము, మధ్యను అతని పడదోసి అత
నికి ఏ హానియైనా చేయక అతని వదిలి పోయెను.

అందుకు అందరు ఆశ్చర్యపడి, ఒకనితో ఒకడు— 36
ఇది ఎటువంటి మాట? ఏమిటి! ఈయన అధికారము
తోను బలముతోను అపవిత్రమైన ఆత్మలకు ఆజ్ఞాపిం
చగానే, అవి వదిలి పోతున్నవని చెప్పుకొనిరి. । అప్పు 37
డు ఆయనను గూర్చి సమాచారము ఆ ప్రాంతము
యొక్క ప్రతి స్థలమందు వ్యాపించెను.

ఆయన సునగోగులోనుంచి లేచి, సీమోను ఇంటి 38
లోకి వెళ్లెను. అప్పుడు సీమోను అత్త అధిక జ్వరముతో
పండుకొని యుండెను గనుక, ఆమెను గూర్చి ఆయ
నను వేడుకొనిరి. । ఆయన ఆమె యొద్ద నిలిచి, జ్వర 39
మును గద్దించగానే, అది ఆమెను విడిచెను; వెంటనే
ఆమె లేచి వారికి సేవచేసెను.

సూర్యుడు అస్తమించేటప్పుడు నానా విధములైన 40
రోగములచేత బలహీనులైన వారు ఎవరి యొద్ద ఉం
డిరో, వారందరు వారిని ఆయన యొద్దికి తీసుకొని
వచ్చిరి. అప్పుడు ఆయన వారిలో ప్రతివాని మీద
చేతులు ఉంచి వారిని స్వస్థపరిచెను. । అంతే కాకుం 41
డా దయ్యములును—నీవు దేవుని కుమారుడవైన క్రీస్తు
వని కేకలు వేసి అనేకులను వదిలి పోయెను. అయితే
ఆయన వాటిని గద్దించి పలుకనియ్య లేదు; ఆయన
క్రీస్తయి యున్నాడని వాటికి తెలుసును.

42 ఉదయమైన తరువాత, ఆయన బైలుదేరి, అడవి
చోటికి వెళ్లెను. అంతట ప్రజలు ఆయనను వెదకుచు,
ఆయన యొద్దకు వచ్చి, తమ యొద్దనుంచి వెళ్లకుండా
43 ఆయనను బలవంతము చేసిరి. । అందుకు ఆయన—నేను
ఇతర పట్టణములలోనును దేవుని రాజ్యమును గూర్చిన
సువార్తను ప్రకటించ వలెను. దీనికొరకు నేను పంప
44 బడితినని వారితో చెప్పెను. । తరువాత ఆయన గలి
లైయ సునగోగులలో ప్రకటించుచుండెను.

## 5. అధ్యాయము.

1 జనసమూహము దేవుని వాక్యము వినుటకు ఆయ
నను ఇరికించుచున్నప్పుడు, ఆయన గెన్నేసరెతు
2 సముద్రముయొద్ద నిలిచి, । ఆ సముద్రము దగ్గిర ఉన్న
రెండు దోనెలను చూచెను. అయితే జాలరులు వాటి
3 లోనుంచి దిగి, తమ వలలు కడుగుచు ఉండిరి. । ఆ
దోనెలలో సీమోనుదైన ఒక దోనె ఎక్కి—దరినుంచి
కొంచెము అవతలికి త్రోయుమని అతని వేడుకొనెను.
అప్పుడు ఆయన కూర్చుండి, దోనెలోనుంచి వెలపటి
జనసమూహములకు బోధించెను.

4 ఆయన మాటలాడుట చాలించిన తరువాత—నీవు
లోతుకు నడిపించి వేట కొరకు మీ వలలు వేయుం
5 డని సీమోనుతో చెప్పెను. । అందుకు సీమోను —
అయ్యా! రాత్రియంతయు మేము ప్రయాసపడితిమి,
అయితే మాకు ఒకటైనా దొరకలేదు; అయినప్ప
టికిని నీ మాట చొప్పున వల వేతునని ఆయనతో ఉత్త
6 రము చెప్పెను. । వారు ఆలాగు చేసి, విస్తారముగా
చేపలు పట్టిరి. అందువల్ల వారి వల పిగిలిపోతూ ఉం
7 డెను. । అంతట వారు వేరొక దోనెలో ఉన్న తమ
పాలివారు వచ్చి, తమకు సహాయము చేయ వలెనని వా
రికి సంజ్ఞలు చేసిరి. వారు వచ్చి రెండు దోనెలును
మునిగేలాగున నింపిరి.

8 సీమోను పేతురు దాని చూచి యేసు మోకాళ్ల
యొద్ద పడి—ప్రభువా! నా యొద్దనుంచి వెళ్లుము; నేను
పాపము గల మనుష్యుడనై యున్నానని చెప్పెను. ।
9 ఎందుకంటే, వారు పట్టిన చేపల రాశికి అతడును అత
10 నితో కూడా ఉన్న వారందరును ఆశ్చర్యపడిరి. । సీమో
నుతో కూడా పాలివారైన యాకోబు, యోహాను అనే
జెబెదై కుమాళ్లును ఆలాగే ఉండిరి. అయితే యేసు—
భయపడకుము, ఇప్పటినుంచి నీవు మనుష్యులను పట్టే
11 వాడవై యుందువని సీమోనుతో చెప్పెను. । అంతట
వారు దోనెలను దరికి చేర్చినప్పుడు సమస్తమును విడిచి
ఆయనను వెంబడించిరి.

12 ఆయన ఒక పట్టణములో ఉన్నప్పుడు ఇదుగో!
కుష్ఠరోగముతో నిండిన ఒక మనుష్యుడు ఉండెను.
అతడు యేసును చూచి సాగిలపడి — ప్రభువా! నీకు
మనస్సు కలిగితే నన్ను శుద్ధిపరచ గలవని ఆయనను
వేడుకొనెను. । అప్పుడు ఆయన చెయ్యి చాపి అతని 13
ముట్టి—నాకు మనస్సు కలదు నీవు శుద్ధిగా ఉండుమని
చెప్పగానే కుష్ఠరోగము అతని విడిచిపోయెను.

అప్పుడు ఆయన—నీవు ఎవనితోను చెప్పక, వెళ్లి 14
నిన్ను నీవే యాజకునికి చూపించుకొని వారికి సాక్ష్య
ము కొరకు మోషే విధించినదాని నీ శుద్ధిని గూర్చి
అర్పించుమని ఆజ్ఞాపించెను. । అయితే ఆయనను 15
గూర్చి వాక్యము మరీ ఎక్కువగా వ్యాపించెను. అనేక
జనసమూహములు ఆయన మాట వినుటకును, ఆయన
చేత తమ రోగములనుంచి స్వస్థత పొందుటకును కూడి
వచ్చెను.

అంతట ఆయన అరణ్యములోకి ఒంటిగా వెళ్లి 16
ప్రార్థించుచుండెను.

ఒకనాడు ఆయన బోధిస్తూ ఉండగా, గలిలైయ, 17
యూదైయ దేశముల ప్రతి గ్రామమునుంచియు యె
రూషలేమునుంచియు వచ్చిన న్యాయోపదేశకులును
ఫరిసైయులును కూర్చుండిరి. అప్పుడు ప్రభువుయొక్క
శక్తి వారిని స్వస్థపరచుటకై యుండెను.

అప్పుడు ఇదుగో! పురుషులు ముద్దవాయువు గల 18
ఒక మనుష్యుని మంచముతో మోసుకొని, లోపటికి
అతని తెచ్చుటకును ఆయన యెదుట ఉంచుటకును
ప్రయత్నము చేసిరి, । అయితే సమూహమువల్ల లోప 19
టికి అతని తెచ్చుటకు ఏ మార్గమైనా వారికి దొర
కనందున, ఇంటిమీద ఎక్కి, పెంకులు విప్పి మంచము
తోకూడ యేసు యెదుట మధ్యను అతని దించిరి.

ఆయన వారి విశ్వాసము చూచి—మనుష్యుడా! 20
నీ పాపములు క్షమించబడినవని అతనితో చెప్పెను.

అప్పుడు శాస్త్రులు, ఫరిసైయులును—దూషణ వాక్య 21
ములు పలికే వీడు ఎవడు? దేవుడు మాత్రమేగాక
మరి ఎవడు పాపములు క్షమించ గలడని ఆలోచింప
సాగిరి.

అయితే యేసు వారి ఆలోచనలు ఎరిగి—మీరు 22
ఎందుకు మీ హృదయములలో ఆలోచిస్తున్నారు? ।—
నీ పాపములు క్షమించబడినవని చెప్పుట సులభమా? 23
లేక—నీవు లేచి నడువుమని చెప్పుట సులభమా? ।
అయితే పాపములు క్షమించుటకు భూమియందు 24
మనుష్య కుమారునికి అధికారము కలదని మీరు తెలు
సుకొన వలెను అని వారికి ఉత్తరమిచ్చి — నీవు లేచి
నీ మంచము ఎత్తుకొని, నీ ఇంటికి వెళ్లుమని నీతో
చెప్పుతున్నాను అని ముద్ద వాయువుగల వానితో పలి
కెను. । వెంటనే అతడు వారి యెదుట లేచి, తాను 25

పండుకొని యున్నదాని ఎత్తుకొని, దేవుని మహిమప
26 రుస్తూ, తన ఇంటికి వెళ్లెను. । అప్పుడు అందరును మి
క్కిలీ ఆశ్చర్యపడి—నేడు గొప్ప వింతలు చూచితిమని
దేవుని మహిమపరుస్తూ భయముతో నింపబడిరి.
27 అవియైన తరువాత, ఆయన బైలుదేరి లేవీ అనే
పేరుగల ఒక సుంకరి సుంకపు మెట్టుయొద్ద కూర్చుం
డుట చూచి—నన్ను వెంబడించుమని అతనితో చెప్పి
28 నప్పుడు, । అతడు సమస్తమును విడిచి లేచి ఆయనను
వెంబడించెను.
29 లేవీ ఆయన కొరకు తన ఇంటిలో గొప్ప విందు
చేయించెను. అప్పుడు వారితో కూడా భోజనపఙ్త్తి
లో కూర్చుండిన సుంకరులును, ఇతరులును చాలా
30 మంది ఉండిరి. । అయితే వారి శాస్త్రులు, ఫరిసైయు
లును—మీరు సుంకరులతోను, పాపులతోను ఎందుకు
అన్నపానములు పుచ్చుకొంటున్నారని ఆయన శిష్యు
లకు విరోధముగా సణుగుతూ ఉండిరి.
31 అందుకు యేసు—రోగులకే గాని ఆరోగ్యము గల
32 వారికి వైద్యుడు అక్కరలేదు. । మనస్సు తిప్పుకొను
టకు పాపులను పిలువవచ్చితిని గాని నీతిమంతులను
కాదని వారితో ఉత్తరము చెప్పెను.
33 వారు—యోహాను శిష్యులు తరుచుగా ఉపవాస
మును ప్రార్థనలును చేస్తున్నారు; అలాగే ఫరిసై
యులవారును (చేస్తున్నారు;) అయితే నీవారు అన్న
పానములు పుచ్చుకొంటున్నారు; దీనికి హేతువు
ఏమని ఆయనను అడిగిరి.
34 అందుకు ఆయన—మీరు పెండ్లి కుమారుని వారిచేత,
పెండ్లి కుమారుడు తమతో కూడా ఉండేటప్పుడు, ।
35 ఉపవాసము చేయించ గలరా? । అయితే పెండ్లి కుమా
రుడు వారి యొద్దనుంచి కొంచుపోబడే దినములు
వచ్చును. అప్పుడు వారు ఆ దినములలో ఉపవాసము
చేతురని వారితో చెప్పెను.
36 మరియు ఆయన వారితో—ఎవడును పాత వస్త్ర
మునకు కొత్త బట్టముక్క మాసిక వేయడు; వేసితే
కొత్తదాని చింపివేసును. అదియు గాక కొత్త దానిలో
నుంచి తీసినది పాత దానితో బాగా కలియదు.
37 ఎవడును పాత సిద్దెలలో కొత్త ద్రాక్షారసము
పోయడు; పోసితే కొత్త ద్రాక్షారసము సిద్దెలను పిగ
38 లగొట్టి కారును, ఆ సిద్దెలును చెడిపోవును. । అయితే
కొత్త ద్రాక్షారసము కొత్త సిద్దెలలో పోయబడ వలసి
నది; అప్పుడు ఆ రెండును భద్రముగా ఉండును. ।
39 పాత ద్రాక్షారసము తాగి వెంటనే కొత్తదాని కోరే
వాడెవడును లేడు;—పాతదే మంచిదనునని వారితో
ఉపమానము చెప్పెను.

## 6. అధ్యాయము.

ద్వితీయా ప్రథమమైన* సబ్బాతు దినమందు, ఆ 1
యన పంట చేలలోబడి వెళ్లుచుండగా, ఆయన
శిష్యులు వెన్నులు తుంచి, చేతులతో నలుపుకొని తిం
టూ ఉండిరి.
అప్పుడు ఫరిసైయులలో కొందరు—సబ్బాతు దిన 2
ములయందు చేయకూడని దాని మీరు ఎందుకు చేస్తు
న్నారని వారితో పలికిరి.
అందుకు యేసు—దావీదు తనకును తనతో కూడా 3
ఉండినవారికిని ఆకలి పుట్టినప్పుడు, ఏమి చేసెనో
దాని మీరు చదువలేదా? । అతడు దేవుని ఇంటిలోకి 4
వెళ్లి, యాజకులు మాత్రమే గాని మరి ఎవరును తిన
కూడని సముఖపు రొట్టెలు పుచ్చుకొని, తిని తనతో
కూడా ఉన్నవారికిని ఇచ్చెనని వారికి ఉత్తరమిచ్చెను. ।
మరియు—మనుష్య కుమారుడు సబ్బాతుకును ప్రభువై 5
ఉన్నాడని ఆయన వారితో చెప్పెను.
మరియొక సబ్బాతుదినమందు, ఆయన సునగోగు 6
లోకి వెళ్లి బోధించుచు ఉన్నప్పుడు, అక్కడ ఎండిన
కుడిచెయ్యి గల ఒక మనుష్యుడు ఉండెను. । అప్పుడు 7
శాస్త్రులును ఫరిసైయులును ఆయన మీద నేరము
మోపే నిమిత్తము—సబ్బాతు దినమందు స్వస్థపరుచు
నేమో అని కనిపెట్టుచుండిరి.
అయితే ఆయన వారి ఆలోచనలు ఎరిగి—నీవు 8
లేచి మధ్యను నిలువుమని, ఎండిన చెయ్యిగల మను
ష్యునితో చెప్పెను. అతడు లేచి నిలిచెను. । అప్పుడు 9
యేసు—నేను మిమ్మును ఒక సంగతి అడుగుదును;
సబ్బాతు దినముల యందు యేది న్యాయము—మేలు
చేయడమా లేక కీడు చేయడమా? ప్రాణము రక్షించ
డమా లేక చంపడమా? అని వారితో పలికి । వారం 10
దరి తట్టు తిరిగి చూచి—నీ చెయ్యి చాపుమని ఆ మను
ష్యునితో చెప్పెను. అతడు అలాగు చేయగానే రెం
డవ దానివలె ఆ చెయ్యి కుదిరెను.
అప్పుడు వారు వెర్రి కోపముతో నిండుకొని, 11
యేసుని ఏమి చేయుదమని ఒకనితో ఒకడు మాట్లా
డుకొనిరి.
ఆ దినముల యందు ఆయన ప్రార్థన చేయుటకు 12
ఒక కొండకు బైలుదేరి దేవుని గూర్చిన ప్రార్థన
యందు ఆ రాత్రి వెళ్లబుచ్చెను. । ఉదయమైనప్పుడు 13

*రెండవ సంవత్సరములోని మొదటి ఆదివారము కాబోలును.

ఆయన తన శిష్యులను తన యొద్దికి పిలిచి వారిలో
పన్నెండు మందిని ఏర్పరిచి వారికి అపొస్తలులనే*
14 పేరు పెట్టెను. । వీరు ఎవరంటే, ఆయన ఎవనికి పేతు
రనే పేరు కూడా పెట్టెనో ఆ సీమోను, అతని
సహోదరుడైన అంద్రెయయు, యాకోబు, యో
15 హాను, ఫిలిప్పు, బర్థొలొమై, । మత్తయి, థోమా, అల్ఫై
కుమారుడైన యాకోబు, జెలోతే అనబడిన సీమోను, ।
16 యాకోబు సహోదరుడైన యూదా, ఆయనను పట్టి
అప్పగించిన ఇస్కరియోతనే యూదాయునవారు.

17 ఆయన వారితో కూడా దిగి వచ్చి మైదానములో
నిలిచినప్పుడు, ఆయన శిష్యుల సమూహమును ఆయన
మాట వినుటకును తమ రోగములనుంచి స్వస్థపరచబ
డుటకును యూదైయ దేశమంతటినుంచియు యెరూ
షలేమునుంచియు తురు సీదోననే పట్టణముల సముద్ర
ప్రాంతములనుంచియు వచ్చిన బహుజనసమూహము
18 ను, । అపవిత్రమైన ఆత్మలవల్ల బాధపడినవారును వచ్చి
19 ఆరోగ్యము పొందిరి. । ఆ సమూహమంతయు ఆయ
నను ముట్టుకొన వలెనని యత్నము చేసెను; ప్రభా
వము ఆయన యొద్దనుంచి బైలువెళ్లి అందరిని స్వస్థ
పరిచెను.

20 అప్పుడు ఆయన తన శిష్యులతట్టు కన్నులెత్తి
చూచి ఇట్లనెను—

బీదలైన మీరు ధన్యులు; దేవుని రాజ్యము మీదై
యున్నది.

21 ఇప్పుడు ఆకలి గొనియున్న మీరు ధన్యులు; మీరు
తృప్తిపరచబడుదురు.

ఇప్పుడు ఏడ్చుచు ఉన్న మీరు ధన్యులు; మీరు
నవ్వుదురు.

22 మనుష్యకుమారుని నిమిత్తము మనుష్యులు మీ
యందు పగపట్టి, మిమ్మును వెలివేసి, నిందించి మీ
పేరు చెడ్డదని కొట్టివేసేటప్పుడు, మీరు ధన్యులు. ।
23 ఆ దినమందు మీరు సంతోషించి గంతులు వేయండి;
ఇదుగో! మీ ఫలము ఆకాశమందు గొప్పది; వారి
పితృలు ప్రవక్తలను ఆప్రకారమే చేసిరి.

24 అయితే అయ్యో! ధనవంతులారా! మీరు మీ ఆద
రణ పొందియున్నారు.

25 అయ్యో! సంపూర్ణులారా! మీరు ఆకలిగొని
యుందురు.

ఇప్పుడు నవ్వుచున్న వారలారా! అయ్యో! మీరు
విచారపడి ఏడ్తురు.

మనుష్యులందరు మిమ్మును కొనియాడేటప్పుడు 26
(చూచుకొనండి), అయ్యో! వారి పితృలు అబద్ధ ప్రవక్త
లను ఆ ప్రకారమే చేసేవారు.

అయితే వింటున్న మీతో నేను చెప్పేది యేమం 27
టే—మీ శత్రువులను ప్రేమించండి, మిమ్మును ద్వే
షించే వారికి మేలు చేయండి, । మిమ్మును తిట్టేవా 28
రిని దీవించండి, మిమ్మును అవమానపరిచే వారికొరకు
ప్రార్థన చేయండి. । నిన్ను ఈ చెంపమీద కొట్టే 29
వారి తట్టు ఆ చెంపకూడా తిప్పుము. నీ పైబట్ట ఎత్తు
కొని పోయేవాడు నీ అంగీనిని ఎత్తుకొని పోకుండా
నిషేధించకుము. । నిన్ను అడిగే ప్రతివానికిని ఇమ్ము, నీ 30
సొమ్ము ఎత్తుకొని పోయేవాని తిరిగి దాని అడగ
వద్దు; । మనుష్యులు మీకు ఏలాగు చేయ వలెనని మీరు 31
కోరుదురో ఆలాగు మీరును వారికి చేయండి. । మిమ్మును 32
ప్రేమించే వారిని మీరు ప్రేమించితే మీకు ఏపాటి
కృతజ్ఞత† కలదు? పాపులు కూడా తమ్మును ప్రేమించే
వారిని ప్రేమింతురు. । మీకు మేలు చేసే వారికి మేలు 33
చేసితే మీకు ఏపాటి కృతజ్ఞత కలదు? పాపులును
ఆలాగే చేతురు. । మీరు ఎవరి యొద్ద తిరిగి పుచ్చు 34
కొన వలెనని నిరీక్షింతురో, వారికే అప్పు ఇచ్చితే
మీకు ఏపాటి కృతజ్ఞత కలదు? పాపులును ఇచ్చినంత
మట్టుకు తిరిగి పుచ్చుకొనుటకు పాపులకు అప్పు
ఇత్తురు. । అయితే మీరు మీ శత్రువులను ప్రేమించి, 35
మేలు చేసి ఏమియు తిరిగి ఆశించక, అప్పు ఇయ్యండి;
అప్పుడు మీ ఫలము గొప్పదై యుండును; మీరు
సర్వోన్నతుని కుమారులై యుందురు; ఆయన కృతజ్ఞత
లేని వారి యెడలను దుష్టుల యెడలను ఉపకారియై
యున్నాడు. । కాబట్టి మీ తండ్రి కనికరము గలవాడై 36
ఉన్నలాగున మీరును కనికరముగలవారై యుండండి.

మరియు మీరు తీర్పు చేయకండి, అప్పుడు మిమ్మును 37
గూర్చి తీర్పు చేయబడదు; శిక్ష విధించకండి, అప్పుడు
మీకు శిక్ష విధించబడదు. । క్షమించండి, అప్పుడు 38
మీరు క్షమించబడుదురు. ఇయ్యండి, అప్పుడు మీకు
ఇయ్యబడును; అణిచి, కుదిలించబడి, దిగజారే మంచి
కొలతను మనుష్యులు మీ ఒడిలో పోయుదురు; మీరు
ఏ కొలతతో కొలుతురో ఆ కొలతతోనే మీకు తిరిగి
కొలువబడునని పలికెను.

మరియు ఆయన వారితో ఈ ఉపమానము చెప్పె 39
ను—గుడ్డివాడు గుడ్డివానికి దారి చూప గలడా? వారి
ద్దరు గుంటలో పడుదురు గదా. । శిష్యుడు తన బోధ 40

*అపొస్తలనగా, పంపబడినవాడు. †లేక కృప.

కునికంటే అధికుడు కాడు, ప్రతివాడును తన బోధ
కునివలె సిద్ధపరచబడును.*
41 నీవు నీ కంటిలో ఉన్న దూలము ఎంచక, నీ
సహోదరుని కంటిలో ఉన్న నలుసును చూచుట
42 ఎందుకు? । లేక నీ కంటిలో ఉన్న దూలము చూడక,
నీ సహోదరునితో—సహోదరుడా! నీ కంటిలో
ఉన్న నలుసు తీయనిమ్మని నీవు ఏలాగు చెప్పగలవు!
ఓ వేషధారీ! మొదట నీ కంటిలో ఉన్న దూలము
తీసివేయుము; అప్పుడు నీ సహోదరుని కంటిలో
ఉన్న నలుసు తీసివేయుటకు బాగా చూతువు.

43 మంచి చెట్టున చెడ్డ పండ్లు పండవు, చెడ్డ చెట్టున
44 మంచి పండ్లు పండవు; । ప్రతి చెట్టు తన స్వకీయమైన
పండ్లవల్ల తెలియబడును; ముండ్ల పొదలో అంజూరపు
పండ్లు కోయరు; కోరింద పొదలో ద్రాక్ష పండ్లు
45 కోయరు. । మంచి మనుష్యుడు తన హృదయముయొక్క
మంచి పదార్థములోనుంచి మంచిదాని బైట పె
ట్టును. చెడ్డ మనుష్యుడు తన హృదయముయొక్క
చెడ్డ పదార్థములోనుంచి చెడ్డదాని బైట పెట్టును;
హృదయ సంపూర్ణత పట్టి అతని నోరు మాట్లాడును.
46 నేను చెప్పే వాటిని మీరు చేయక — ప్రభువా,
47 ప్రభువా! అని నన్ను పిలుచుట ఎందుకు? । నా యొ
ద్దికి వచ్చి, నా మాటలు విని వాటిని గైకొనే ప్రతివా
డును ఎవని పోలియున్నాడో మీకు తెలియచేతును. ।
48 అతడు ఇల్లు కట్టవలెనని లోతుగా తవ్వి బండ మీద
పునాది వేసిన మనుష్యుని పోలియున్నాడు. వరద
వచ్చినప్పుడు ప్రవాహము ఆ ఇంటిని వడిగా కొట్టిన
ప్పటికిని దాని పునాది బండ మీద వేయబడెను గనుక
49 దాని కదిలించ లేక పోయెను. । అయితే వినియు
చేయనివాడు, పునాది వేయక నేల మీద ఇల్లు కట్టిన
వానితో సమానుడై యున్నాడు. ప్రవాహము దాని
వడిగా కొట్టగానే అది కూలిపోయెను. ఆ ఇంటిపాటు
గొప్పదని పలికెను.

## 7. అధ్యాయము.

1 ఆయన తన మాటలన్నియు ప్రజలకు సంపూర్తిగా
వినిపించిన తరువాత కపెర్నహూములోకి వచ్చెను.

2 అప్పుడు ఒక శతాధిపతికి ప్రియుడైయున్న దా
3 సుడు సంకటపడి చావబోతూ ఉండెను. । అతడు యే
సుని గూర్చి విని, ఆయన వచ్చి తన దాసుని స్వస్థ
పరచ వలెనని ఆయనను వేడుకొనుటకు ఆయన యొ
ద్దికి యూదుల పెద్దలను పంపెను.

వారు యేసు యొద్దికి వచ్చి — నీ వల్ల ఈ మేలు 4
పొందుటకు అతడు యోగ్యుడై యున్నాడు; । అతడు 5
మన ప్రజలను ప్రేమించి మన కొరకు సునగోగును
కట్టించెనని ఆయనతో చెప్పి, మిక్కిలీ బతిమాలు
కొనిరి. । అప్పుడు యేసు వారితో కూడా వెళ్లెను. 6
అయితే ఆయన ఆ ఇంటికి కొద్ది దూరముగా ఉన్న
ప్పుడు, ఆ శతాధిపతి—ప్రభువా! ప్రయాసపడకుము;
నీవు నా ఇంటిలోకి వచ్చుటకు నేను యోగ్యుడను
కాను; । అందుచేతను నీ యొద్దికి వచ్చుటకు నేను యో 7
గ్యుడనని ఎంచుకొన లేదు. అయితే నీ నోటిమాట
రానిమ్ము, అప్పుడు నా నౌకరు స్వస్థపరచబడును; ।
నేను అధికారమునకు లోబడిన మనుష్యుడనై యు 8
న్నాను; అయితే నేమి, నా చేతి కింద రాణువవారు
ఉన్నారు; నేను ఇతని పొమ్మంటే పోవును, మరియొ
కని రమ్మంటే వచ్చును; నా దాసుని ఇది చేయుమంటే
చేసును అని ఆయనతో చెప్పుటకు ఆయన యొద్దికి
స్నేహితులను పంపెను.
యేసు వీటిని విని అతని గూర్చి ఆశ్చర్యపడి, తన్ను 9
వెంబడించే జనసమూహము తట్టు తిరిగి—నేను ఇశ్రా
యేలులోనైనా ఇంత విశ్వాసము కనుగొన లేదని
మీతో చెప్పుతున్నాననెను.
అప్పుడు పంపబడినవారు ఇంటికి తిరిగి వెళ్లి, సం 10
కటపడిన దాసుడు స్వస్థుడై యుండుట చూచిరి.
మరునాడు ఆయన నాయీననే పేరు గల ఒక 11
ఊరికి వెళ్లుచుండగా, ఆయన శిష్యులలో అనేకులును
బహు జనసమూహమును ఆయనతో కూడా వెళ్లిరి.
ఆయన ఆ ఊరి గవిని యొద్దికి వచ్చినప్పుడు, 12
ఇదుగో! చచ్చిన ఒకడు వెలపటికి తేబడుచుండెను.
అతని తల్లికి అతడు ఒక్కడే కుమారుడు; ఆమె విధ
వరాలై యుండెను.
ఆ ఊరి జనసమూహములో అనేకులు ఆమెతో 13
కూడా ఉండిరి. ప్రభువు ఆమెను చూచి ఆమెయందు
జాలిపడి—ఏడువ వద్దని ఆమెతో చెప్పి, దగ్గిరికి వచ్చి,
ఆ శవవాహనము ముట్టెను. అప్పుడు మోసేవారు నిలి
చిరి. । మరియు ఆయన—పడుచువాడా! లెమ్మని నీతో 14
చెప్పుతున్నాను అని పలికెను. । అప్పుడు ఆ చచ్చిన 15
వాడు లేచి కూర్చుండి మాట్లాడ సాగెను. అప్పుడు
అతని తల్లికి అతని అప్పగించెను.
అందరు భయాక్రాంతులై—మనలో గొప్ప ప్రవక్త 16
పుట్టియున్నాడనియు, దేవుడు తన ప్రజలను చూడ
వచ్చి యున్నాడనియు దేవుని మహిమపరిచిరి. । అ 17

*లేక, ప్రతివాడున్ను తన గురువువలె సిద్ధము చేయబడును.

ప్పుడు ఆయనను గూర్చి ఈ సమాచారము యూదైయ
యందంతటను ఆ ప్రాంతమందంతటను వ్యాపించెను.
18 అప్పుడు యోహాను శిష్యులు ఈ సంగతులన్ని
19 అతనికి తెలియచేసిరి. । అంతట, యోహాను తన శిష్యు
లలో ఇద్దరిని పిలిచి—రాబోయే వాడవు నీవేనా? లేక
మేము మరియొకని కొరకు కనిపెట్ట వలెనా? అని అడు
గుటకు యేసు యొద్దికి వారిని పంపెను.
20 ఆ మనుష్యులు ఆయన యొద్దికి వచ్చి—రాబోయే
వాడవు నీవేనా? లేక మరి యొకని కొరకు కనిపెట్ట
వలెనా? అని అడుగుటకు బాప్తిస్మము చేయించే యో
హాను మమ్మును నీ యొద్దికి పంపెనని పలికిరి.
21 ఆ గడియలోనే ఆయన అనేకులను రోగములనుం
చియు సంకటములనుంచియు అపవిత్రమైన ఆత్మల
బాధలనుంచియు స్వస్థపరిచి, అనేకులైన గుడ్డివారికి
22 దృష్టి దయచేసెను. । అప్పుడు యేసు — మీరు వెళ్లి
మీరు చూచిన వాటిని వినిన వాటినిని యోహానుకు
తెలియ చెప్పండి; ఏవంటే, గుడ్డివారు చూస్తున్నారు,
కుంటివారు నడుస్తున్నారు, కుష్ఠరోగులు శుద్ధి పొందు
తున్నారు, చెవిటివారు వింటున్నారు, చచ్చినవారు
లేస్తున్నారు, బీదలకు సువార్త ప్రకటించబడుతు
23 న్నది. । మరియు నా విషయమై ఆతంకపడని వాడె
వడో వాడు ధన్యుడని వారితో ఉత్తరము చెప్పెను.
24 యోహానుయొక్క దూతలు వెళ్లిన తరువాత, ఆయన
యోహానును గూర్చి జనసమూహములతో ఇట్లు చెప్ప
సాగెను— మీరు అరణ్యములోకి ఏమి చూచుటకు
25 బైలు వెళ్లితిరి? గాలిచేత కదులుతున్న రెల్లునా?। లేక,
మీరు ఏమి చూచుటకు బైలు వెళ్లితిరి? సన్నపు బట్టలు
వేసుకొనిన మనుష్యునా? ఇదుగో! ప్రశస్త వస్త్రములు
ధరించుకొని సుఖముగా జీవించేవారు రాజ గృహము
26 లలో ఉందురు. । అయితే మీరు ఏమి చూచుటకు
బైలు వెళ్లితిరి? ఒక ప్రవక్తనా? అవును గాని ఇతడు
ప్రవక్తకంటే గొప్పవాడని మీతో చెప్పుతున్నాను. ।
27 -ఇదుగో! నేను నా దూతను నీ కంటే ముందట పం
పుదును; ఆయన నీ యెదుట నీ త్రోవ సిద్ధపరుచునని
ఎవని గూర్చి వ్రాయబడియున్నదో అతడే ఇతడు; ।
28 స్త్రీలు కనినవారిలో, బాప్తిస్మము చేయించే యోహా
నుకంటే గొప్ప ప్రవక్త ఒకడును లేడు. అయినప్పటి
కిని, దేవుని రాజ్యములో అత్యల్పుడు అతనికంటే
గొప్పవాడని నేను మీతో చెప్పుతున్నాను.
29 ప్రజలందరు సుంకరులును విని, యోహాను చే
యించే బాప్తిస్మము చేయించుకొని దేవుడు న్యాయ
వంతుడని ఎంచిరి. । ఫరిసైయులు, శాస్త్రులును తమ 30
ఎడల దేవుని ఆలోచన కొట్టివేసి అతనిచేత బాప్తిస్మము
చేయించుకొన లేదు.

కాబట్టి ఈ తరము* మనుష్యులను నేను దేనితో 31
పోల్తును? వారు దేని పోలియున్నారు? । సంతలో కూ 32
చుండి,—మీ కొరకు పిల్లనగ్రోవి ఊదినాముగాని
మీరు ఆడలేదు; మీ కొరకు మొర్రబెట్టినాముగాని
మీరు ఏడవలేదని ఒకనితో ఒకడు చెప్పుకొని పిలుపు
లాటలాడుకొనే పిల్లలను పోలియున్నారు;। బాప్తిస్మము 33
చేయించే యోహాను రొట్టె తినక, ద్రాక్షారసము
తాగక వచ్చెను గనుక—అతడు దయ్యము పట్టినవా
డని మీరు చెప్పుకొంటున్నారు. । మనుష్య కుమారుడు 34
వచ్చి తింటును తాగుతును ఉన్నాడు గనుక మీరు—
ఇదుగో! తిండిపోతును, మద్యపానియు, సుంకరులకు,
పాపులకును స్నేహితుడునైన మనుష్యుడని పలుకు
తున్నారు. । అయితే జ్ఞానము జ్ఞానమని జ్ఞానవంతుల 35
చేత తీర్పు పొందెనని చెప్పెను.

మరియు ఫరిసైయులలో ఒకడు తనతో కూడా 36
భోజనము చేయుటకు ఆయనను వేడుకొనెను గనుక
ఆ ఫరిసైయుని ఇంటిలోకి వెళ్లి భోజనపఙ్తిలో కూ
చుండెను. । అప్పుడు ఇదుగో! ఆ ఊరిలో ఉన్న 37
పాపాత్మురాలైన ఒక స్త్రీ, యేసు ఫరిసైయుని ఇంటిలో
భోజనమునకు కూచుండెనని తెలుసుకొని, శిలామ
యమైన అత్తరు బుడ్డి తీసుకొని వచ్చి, । ఆయన పాద 38
ముల యొద్ద వెనుక తట్టు నిలిచి, ఏడుస్తూ కన్నీళ్లతో
ఆయన పాదములను తడుపుటకు ఆరంభించెను.
అప్పుడు ఆమె తన తల వెంట్రుకలతో వాటిని తుడిచి,
ఆయన పాదములను ముద్దుబెట్టుకొని ఆ అత్తరు
వాటికి పూసెను.

ఆయనను పిలిచిన ఫరిసైయుడు దీని చూచి — 39
ఈయన ప్రవక్తయైతే, తన్ను ముట్టిన ఈ స్త్రీ ఎవతో
ఎటువంటిదో ఎరుగును; ఇది పాపాత్మురాలని తనలో
తాను అనుకొనెను. । అప్పుడు యేసు—సీమోనా! నీ 40
తో ఒక మాట చెప్పుటకై యున్నానని అతనితో
ఉత్తరము పలికెను. అందుకు అతడు — బోధకుడా!
చెప్పుమనెను. । — అప్పిచ్చే ఒకనికి ఇద్దరు ఋణస్థులు 41
ఉండిరి. వారిలో ఒకడు ఏనూరు దేనారములు,† మరి
యొకడు ఏబది దేనారములును అచ్చియుండిరి. । ఆ 42
అప్పు తీర్చుటకు వారికి ఏమియు లేకపోయెను గనుక
అతడు వారిద్దరిని దయగా క్షమించెను. కాబట్టి వీరిలో

*లేక, వంశపు. †దేనారమనగా—కొంచెము యెక్కువ తక్కువ అయిదణాలు.

ఎవడు అతని మిక్కిలీ ప్రేమించునో అది చెప్పు
43 మని పలికెను. । అందుకు సీమోను — అతడు ఎవనికి
ఎక్కువ క్షమించెనో వాడే అని నాకు తోస్తున్నది
అని ఉత్తరము చెప్పెను. అప్పుడు ఆయన—నీవు యుక్త
44 ముగా ఎంచితివని అతనితో చెప్పి,। ఆ స్త్రీతట్టు తిరిగి
సీమోనుతో—ఈ స్త్రీని చూస్తున్నావు గదా, నీ ఇం
టిలోకి వచ్చితిని నా పాదములకు నీవు నీళ్లు ఇయ్య
లేదు; అయితే ఈమె తన కన్నీళ్లతో నా పాదము
45 లను తడిపి తన తల వెండ్రుకలతో తుడిచెను. । నీవు
నన్ను ముద్దుబెట్టుకొనలేదు; అయితే నేను లోపటికి
వచ్చినప్పటినుంచి ఈమె నా పాదములు ముద్దుబెట్టు
46 కొనుట మానలేదు. । నీవు నూనెతో నా తల అంట
లేదు; అయితే ఈమె నా పాదములకు అత్తరు పూ
47 సెను. । కాబట్టి ఆమెయొక్క విస్తార పాపములు
క్షమించబడినవని నీతో చెప్పుతున్నాను; ఆమె విస్తా
రముగా ప్రేమించెను. అయితే ఎవనికి కొంచెము
క్షమించబడునో వాడు కొంచెముగా ప్రేమించు
48 నని పలికి।—నీ పాపములు క్షమించబడెనని ఆమెతో
49 చెప్పెను.। అప్పుడు ఆయనతో కూడా భోజనపఙ్క్తిలో
ఉన్నవారు — పాపములను క్షమించుచున్న ఇతడు
50 ఎవడని తమలో తాము అనుకొన సాగిరి. । అయితే
ఆయన— నీ విశ్వాసము నిన్ను రక్షించెను, సమాధాన
ముతో వెళ్లుమని ఆ స్త్రీతో చెప్పెను.

## 8. అధ్యాయము.

1 తరువాత ఆయన దేవుని రాజ్యమును గూర్చిన
సువార్తను తెలుపుతు, ప్రకటిస్తు, ప్రతి పట్టణము
2 లోను ప్రతి గ్రామములోను తిరుగుచుండగా। పన్నెం
డుగురు, చెడ్డ ఆత్మలనుంచి సంకటములనుంచియు
స్వస్థపరచబడిన కొందరు స్త్రీలును అనగా, ఏడు
దయ్యములు వదిలిపోయిన మగ్దలేననే పేరు గల మరి
యు, హేరోదుయొక్క ఉగ్రాణపువాడైన ఖూజా
భార్యయైన యోహన్న, సూసన్నయు ఆయనతో
3 కూడా ఉండిరి.। వీరు మొదలైన అనేకులు తమకు కలి
గిన ఆస్తివల్ల వారికి ఉపచారము చేసిరి.

4 బహు జనసమూహము కూడి, ప్రతి పట్టణమునుం
చియు ఆయన యొద్దికి ఇంకా వచ్చుచుండగా ఆయన
5 ఈ ఉపమానము చెప్పెను. । — విత్తేవాడు తన విత్తన
ములు విత్తుటకు బైలు వెళ్లెను. అతడు విత్తుచుండగా
కొన్ని తోవ పక్కను పడి త్రొక్కబడెను. అప్పుడు
6 ఆకాశ పక్షులు వాటిని తినివేసెను. । మరికొన్ని రాతి
మీద పడి, మొలిచి చెమ్మలేనందున ఎండిపోయెను.।

మరికొన్ని ముండ్ల తుప్పల నడుమ పడెను; ఆ ముండ్ల 7
తుప్పలు వాటితో మొలిచి వాటిని అణిచివేసెను. ।
అయితే కొన్ని మంచి భూమియందు పడి, మొలిచి, 8
నూరంతలుగా ఫలించెనని చెప్పి — వినుటకు చెవులు
గలవాడు వినుగాకని, ఆయన కంఠమెత్తి పలికెను.

తరువాత ఆయన శిష్యులు — ఈ యుపమానము 9
ఏమిటి అని ఆయనను అడిగిరి. । అందుకు ఆయన — 10
దేవుని రాజ్యముయొక్క మర్మములు ఎరుగుట మీకు
ఇయ్యబడెను; ఇతరులకైతే చూచి చూడకను, విని
గ్రహించకనును ఉండుటకు ఉపమానములచేత చెప్ప
బడును.

ఈ ఉపమానము ఏమిటంటే, విత్తనము దేవుని వా 11
క్యము. । తోవ పక్కను ఉండే వారు వినే వారు; 12
అయితేనేమి, వారు నమ్మి రక్షణ పొందక ఉండుటకు,
సైతాను వచ్చి వారి హృదయములోనుంచి ఆ వాక్యము
ఎత్తుకొనిపోవును. । రాతి మీద ఉండే వారైతే, వినే 13
టప్పుడు వాక్యము సంతోషముగా గైకొంటున్నారు
గాని వీరికి వేరు లేదు గనుక కొంత కాలము నమ్మి,
శోధన కాలమందు తొలగిపోదురు. । ముండ్ల తుప్పల 14
లో పడినవి ఏవంటే, వీరు విని వెళ్లి ఈ జీవముయొక్క
విచార ధన భోగములచేత అణిచివేయబడి నిండుగా
ఫలించని వారు. । అయితే మంచి భూమి యందు ఉం 15
డేది ఏదంటే, యోగ్యమైన మంచి హృదయముతో
ఆ వాక్యము విని ఉంచుకొని ఎడతెగక ఫలించేవారు.

ఎవడును దీపము వెలిగించి ముంతతో కప్పివే 16
యడు, మంచము కింద పెట్టడుగాని లోపటికి వచ్చే
వారికి వెలుగు అగుపడుటకు దీపస్తంభము మీద దాని
పెట్టును; । తేటపడని రహస్యమేదియు లేదు, తెలియ 17
చేయబడకను బైటపడకను ఉండే మరుగైనది యేది
యు లేదు. । కాబట్టి మీరు ఏలాగు వింటున్నారో 18
చూచుకొనండి; కలిగిన వాడు ఎవడో వానికి ఇయ్య
బడును; లేనివాడు ఎవడో అతని యొద్దనుంచి అత
నికి కలదని తోచినదియు తీసుకొని పోబడునని
చెప్పెను.

ఆయన తల్లి సహోదరులును ఆయన యొద్దికి వచ్చి, 19
సమూహమువల్ల ఆయనకు సమీపించ లేకపోయిరి. ।
అప్పుడు — నీ తల్లియు నీ సహోదరులును నిన్ను 20
చూడవలెనని కోరి వెలపట నిలిచి యున్నారని ఎవరో
ఆయనకు తెలియ చేసిరి. । అందుకు ఆయన – దేవుని 21
వాక్యము విని ఆ చొప్పున జరిగించే వీరు నా తల్లియు
నా సహోదరులునై యున్నారని వారితో ఉత్తరము
చెప్పెను.

22 మరియొక దినమున ఆయన తన శిష్యులతోకూడా
ఒక దోనె ఎక్కి—ఈ సముద్రము అద్దరికి వెళ్లుదా
మని వారితో చెప్పినప్పుడు, వారు దాని త్రోసి
23 బైలుదేరిరి. । అయితే వారు పోవుచుండగా ఆయన
నిద్రించెను. అప్పుడు గాలివాన సముద్రము మీదికి
వచ్చి, (ఆ దోనె) నీళ్లతో నిండి ఉన్నందున వారు
24 ఉపద్రవము పొందిరి. । అప్పుడు వారు ఆయన యొద్దికి
వచ్చి — అయ్యా! అయ్యా! నశించిపోతున్నామని
ఆయనను లేపిరి. అప్పుడు ఆయన లేచి, గాలిని నీటి
పొంగును గద్దించగానే, అవి అణిగి నిమ్మళించెను. ।
25 అప్పుడు ఆయన—మీ విశ్వాసము ఎక్కడ ఉన్నదని
వారితో పలికెను. అయితే వారు జడిసి—ఈయన ఎటు
వంటివాడు? ఈయన గాలికిని నీళ్లకును ఆజ్ఞాపించే
టప్పుడు, అవియు ఆయనకు లోబడి ఉన్నవని ఒకని
తో ఒకడు అనుకొని ఆశ్చర్యపడిరి.

26 వారు గలిలైయకు ఎదురుగా ఉండే గదరేనీయుల
దేశమునకు చేరిన తరువాత, ఆయన ఆ దరిని దిగి
27 నప్పుడు, । ఆ ఊరివాడైన ఒక మనుష్యుడు ఆయనకు
ఎదురుగా వచ్చెను. అతడు బహు కాలమునుంచి
దయ్యములు పట్టినవాడై, బట్ట కట్టక సమాధులలోనే
28 గాని ఇంటిలో నివసించలేదు. । అయితే అతడు,
యేసుని చూచి కేకలు వేసి, ఆయన యెదుట సాగిల
పడి—యేసూ! సర్వోన్నతుడైన దేవుని కుమారుడా!
నీతో నాకేమి? నన్ను బాధపెట్ట వద్దని నిన్ను వేడు
29 కొంటున్నాను అని కంఠమెత్తి పలికెను; । ఎందుకంటే
ఆయన — ఆ మనుష్యునిలోనుంచి వెలపటికి రమ్మని
అపవిత్రమైన ఆ యాత్మకు ఆజ్ఞాపించెను. అది అనేక
పర్యాయములు* అతని పట్టెని గనుక అతడు గొలుసుల
చేతను సంకెళ్లచేతను కావలియందు కట్టబడి ఆ బం
ధకములను తెంపి ఆ దయ్యమువల్ల అడవిలోకి త్రోల
30 బడెను. । అప్పుడు యేసు—నీ పేరు ఏమి అని అతని
అడిగినందుకు, అతడు — సేన అని చెప్పెను; యెందు
కంటే చాలా దయ్యములు అతనిలో చొచ్చి యుం
31 డెను. । అప్పుడు అవి — అగాధస్థానములోకి పోవు
టకు మాకు ఆజ్ఞాపించ వద్దని ఆయనను వేడుకొనెను. ।
32 అయితే అక్కడ కొండమీద మేయుచున్న అనేక
మైన పందుల మంద ఉండెను గనుక—వాటిలో
చొచ్చుటకు మాకు సెలవిమ్మని ఆయనను వేడుకొని
33 నప్పుడు, ఆయన వాటికి సెలవిచ్చెను. । అప్పుడు ఆ
దయ్యములు ఆ మనుష్యునిలోనుంచి వెలపటికి వచ్చి
ఆ పందులను పట్టెను గనుక, ఆ మంద ప్రపాతము
నుంచి సముద్రములోకి వడిగా పరుగెత్తి మునిగి
పోయెను. । మేపేవారు జరిగిన దాని చూచి పారి 34
పోయి పట్టణములోను గ్రామములలోను ఆ సంగతి
తెలియచెప్పిరి. । వారు జరిగిన దాని చూచుటకు బైలు 35
దేరి యేసుయొద్దికి వచ్చి, దయ్యములు విడిచిన మను
ష్యుడు బట్టలువేసుకొని సుబుద్ధితో యేసు పాదముల
యొద్దకూర్చుండుట చూచి భయపడిరి. । దయ్యములు 36
పట్టినవాడు ఏలాగు రక్షణ పొందెనో దాని చూచిన
వారు వారికి తెలియచేసిరి. । అంతట గదరేనీయుల 37
ప్రాంతముల జనసమూహమంతయు తమ్మును విడిచి
పొమ్మని ఆయనను వేడుకొనెను; వారు బహు భయా
క్రాంతులైయుండిరి.
ఆయన దోనె మీద యెక్కి తిరిగి వెళ్లెను; అప్పు 38
డు దయ్యములు విడిచిన మనుష్యుడు ఆయనతో
కూడా ఉండ వలెనని ఆయనను బతిమాలుకొనెను. ।
అయితే యేసు—నీవు నీ ఇంటికి తిరిగి వెళ్లి, దేవుడు 39
నీకు ఎంత గొప్ప కార్యములు చేసెనో అది తెలియ
చేయుమని అతనితో చెప్పి అతని పంపెను. అతడు
వెళ్లి యేసు తనకు ఎంత గొప్ప కార్యములు చేసెనో
అది ఆ పట్టణమందంతటను ప్రకటించెను.
యేసు తిరిగి వచ్చినప్పుడు, ప్రజలు ఆయనను 40
చేర్చుకొనిరి; ఎందుకంటే అందరును ఆయన కొరకు
ఎదురు చూస్తూ ఉండిరి.

అప్పుడు ఇదుగో! సునగోగుకు అధికారియైన యా 41
యీరనే పేరుగల మనుష్యుడు వచ్చి, యేసు పాద
ములమీద పడి, తన ఇంటికి వచ్చుటకు ఆయనను
వేడుకొనెను; । ఎందుకంటే అతనికి కొంచెము ఎక్కు 42
వతక్కువ పన్నెండు సంవత్సరములు గల కుమార్తె
యొకతె గలదు; ఆమె చావనై యుండెను.

ఆయన వెళ్లుచుండగా, ప్రజలు ఆయనను ఇరికిం 43
చిరి. అప్పుడు పన్నెండు సంవత్సరములనుంచి రక్త
కుసుమ రోగము కలిగి అందుకు తన జీవనోపాది
యంతయు వైద్యులకుగా వ్యయము చేసి, ఎవనిచేతను
స్వస్థత పొందనేరక యున్న ఒక స్త్రీ ఆయన వెనుక
కు వచ్చి, । ఆయన పైబట్ట జాలరు ముట్టెను. వెంటనే 44
ఆమె రక్తకుసుమము నిలిచెను. । అప్పుడు యేసు— 45
నన్ను ఎవడు ముట్టెనని అడిగెను. అందరు—మేము
కామని చెప్పినప్పుడు, పేతురును అతనితో ఉన్నవా
రును—అయ్యా! జనసమూహములు నిన్ను ఒత్తుకొని
ఇరికిస్తున్నవిగదా—నన్ను ఎవడు ముట్టెనని అడుగుతు
న్నావా? అని పలికిరి. । అందుకు యేసు—ఎవడో నన్ను 46
ముట్టెను; నాలోనుంచి ప్రభావము బైలువెళ్లెనని
చెప్పెను.

* లేక, బహుకాలమునుంచి.

47 ఆ స్త్రీ తాను మరుగై యుండలేదని చూచి వణ
కుతూ వచ్చి, ఆయన యెదుట సాగిలపడి, తాను ఎందు
నిమిత్తము ఆయనను ముట్టెనో, వెంటనే తాను ఏలాగు
స్వస్థపడెనో దాని ఆ ప్రజలందరి సమ్ముఖమందు ఆ
48 యనకు తెలియ చెప్పెను. । అంతట ఆయన—కుమారీ!
ధైర్యము తెచ్చుకొనుము; నీ విశ్వాసము నిన్ను రక్షిం
చెను; సమాధానముతో వెళ్లుమని ఆమెతో చెప్పెను.
49 ఆయన మాటలాడుచున్నప్పుడు, సునగోగు అధికారి
ఇంటిలోనుంచి ఒకడు వచ్చి— నీ కుమార్తె చనిపోయె
ను, బోధకుని ప్రయాసపెట్ట వద్దని ఆయనతో చెప్పె
50 ను. । అయితే యేసు విని — భయపడ వద్దు; నమ్మిక
మాత్రము ఉంచితే ఆమె రక్షించబడునని అతనితో
ఉత్తరము చెప్పెను.
51 ఆయన ఆ ఇంటికి వచ్చినప్పుడు, పేతురు, యా
కోబు, యోహాననే వారిని ఆ చిన్నదాని తలిదండ్రు
లను గాక మరి ఎవనిని లోపటికి చేరనియ్యలేదు. ।
52 అందరు ఆమె కొరకు ఏడుస్తు, దుఃఖపడుతునున్న
ప్పుడు ఆయన—ఏడువ వద్దు; ఆమె నిద్రిస్తున్నదిగాని
53 చనిపోలేదని చెప్పెను. । అప్పుడు వారు ఆమె చని
54 పోయెనని ఎరిగి ఆయనను అపహాస్యము చేసిరి. । అయి
తే ఆయన వారందరిని అవతలకు పంపించి, ఆమె చెయ్యి
55 పట్టుకొని—చిన్నదానా! లెమ్మని పలికెను. । అప్పుడు
ఆమె ఆత్మ తిరిగి వచ్చెను; వెంటనే ఆమె లేచెను.
అప్పుడు ఆయన ఆమెకు భోజనము పెట్టుమని ఆజ్ఞా
56 పించెను. । అందుకు ఆమె తలిదండ్రులు ఆశ్చర్యపడిరి.
అయితే ఆయన—జరిగిన దాని ఎవనితోను చెప్ప వద్దని
వారికి ఆజ్ఞాపించెను.

## 9. అధ్యాయము.

1 ఆయన తన పన్నెండుమంది శిష్యులను పిలిచి,
సమస్తమైన దయ్యముల మీదను రోగములను స్వస్థప
2 రుచుటకును వారికి శక్తిని అధికారమును ఇచ్చి, । దేవుని
రాజ్యమును ప్రకటించుటకును అశక్తులను స్వస్థపరు
3 చుటకును వారిని పంపెను. । మరియు ఆయన—మీరు
ప్రయాణము కొరకు కర్రనైనా సంచినైనా రొట్టె
నైనా వెండినైనా మరి దేనినైనా పట్టుకొని వెళ్లవద్దు;
4 మీరు రెండేసి అంగీలు ఉంచుకొన వద్దు. । మీరు ఏ
ఇంటిలో ప్రవేశింతురో అక్కడనే నివసించి అక్కడ
5 నుంచి బైలువెళ్లండి. । మిమ్మును ఎవరు చేర్చుకొనరో ఆ
పట్టణములోనుంచి బైలుదేరేటప్పుడు మీ పాదధూళి
వారికి విరోధమైన సాక్ష్యము కొరకు దులిపివేయండని
వారితో చెప్పెను.
6 వారు బైలుదేరి అంతటను సువార్తను ప్రకటిస్తు,
ఆరోగ్యము చేస్తు, గ్రామములలో తిరుగుతునుండిరి. ।

చతుర్థాధిపతియైన హేరోదు ఆయనవల్ల జరిగినవన్ని 7
యు విని తొందరపడెను; కొందరు యోహాను చనిపో
యిన వారిలోనుంచి లేచెననియు, । కొందరు ఏలీయా 8
కనబడెననియు, మరి కొందరు పూర్వీకులలో ఒక
ప్రవక్త తిరిగీ లేచెననియు చెప్పిరి. । అయితే హేరోదు— 9
నేను యోహాను తల కొట్టించితిని; ఎవని గూర్చి ఈ
లాటి సంగతులు వింటున్నానో ఆ ఇతడు ఎవడు అని
పలికి ఆయనను చూడ కోరెను.

అపొస్తలులు తిరిగీ వచ్చి తాము చేసినవన్నియు 10
ఆయనకు తెలియచేసిరి. అప్పుడు ఆయన వారిని వెంట
బెట్టుకొని, బేత్సయిదా అనే ఊరి అడవి చోటికి
రహస్యముగా వెళ్లెను. । అయితే జనసమూహములు 11
దాని తెలుసుకొని ఆయనను వెంబడించెను. ఆయన
వారిని చేర్చుకొని దేవుని రాజ్యమును గూర్చి వారితో
మాటలాడుతు, ఆరోగ్యము కావలసినవారిని స్వస్థప
రుచుచుండెను.

అయితే ప్రొద్దు గ్రుంకుటకు ఆరంభించెను. అ 12
ప్పుడు పన్నెండుమంది వచ్చి—మనము ఈ అరణ్యస్థల
ములో ఉన్నాము గనుక చుట్టునున్న గ్రామములకు
పల్లెలకును వెళ్లి బసలు చేయుటకును ఆహారము సంపా
దించుకొనుటకును జనసమూహమును పంపుమని ఆయ
నతో చెప్పిరి. । అయితే ఆయన—మీరే వారికి తిను 13
టకు పెట్టండని వారితో చెప్పెను. అందుకు వారు,—
మేము వెళ్లి ఈ ప్రజలందరి కొరకును ఆహార వస్తువులు
కొన గలిగితేనే గాని మన యొద్ద అయిదు రొట్టెలు
రెండు చేపలు గాక మరి ఏవియు లేవని చెప్పిరి; । కొం 14
చెము ఎక్కువ తక్కువ అయిదువేలమంది పురుషులు
ఉండిరి.

అప్పుడు ఆయన—వారిని యాభైయేసిమంది చొ 15
ప్పున, పజ్తులుగా సాగించండని తన శిష్యులతో చె
ప్పెను. వారు ఆలాగు చేసి అందరిని కూర్చుండబెట్టిరి.।
అప్పుడు ఆయన ఆ ఐదురొట్టెలు రెండు చేపలు పట్టు 16
కొని, ఆకాశము వైపు కన్నులెత్తి స్తోత్రముచేసి, విరిచి,
ఆ జనసమూహమునకు వడ్డించుడని శిష్యులకు ఇచ్చెను.।
వారందరు భోజనము చేసి, తృప్తిపొందిన తరువాత, 17
వారికి మిగిలిన ముక్కలు పన్నెండు గంపల నిండా
ఎత్తబడెను.

మరియు ఆయన ఏకాంతమందు ప్రార్థించుచుండ 18
గా ఆయన శిష్యులు ఆయనతో కూడా ఉండిరి. అప్పు
డు ఆయన—నేను ఎవడనని జనసమూహములు చెప్పు
కొంటున్నవని వారిని అడిగెను. ।అందుకు వారు—బాప్తి 19
స్మము చేయించే యోహాననియు, కొందరు ఏలీయా
అనియు, మరి కొందరు పూర్వీకులైన ప్రవక్తలలో

ఎవడో ఒకడు లేచెననియు చెప్పుకొంటున్నారని
20 ఉత్తరమిచ్చిరి. । అప్పుడు ఆయన—అయితే నేను ఎవ
డనని మీరు చెప్పుకొంటున్నారని వారిని అడిగినందుకు
పేతురు—నీవు దేవుని క్రీస్తువని ప్రత్యుత్తరమిచ్చెను.

21 అప్పుడు ఆయన— ఇది ఎవనితోను చెప్ప వద్దని
22 ఆనబెట్టి వారికి ఆజ్ఞాపించి, । మనుష్య కుమారుడు బహు
శ్రమలు పొంది పెద్దలచేతను ప్రధాన యాజకులచేతను
శాస్త్రులచేతను నిరాకరించబడి, చంపబడి మూడవ దిన
మందు తిరిగి లేవ వలెనని చెప్పెను.

23 మరియు ఆయన అందరితో ఇట్లనెను—నా వెంట
వచ్చుటకు ఎవడైనా మనస్సు గలవాడైతే తన్ను తాను
ఉపేక్షించుకొని, ప్రతిదినము తన శిలువ ఎత్తుకొని,
24 నన్ను వెంబడించ వలెను; । తన ప్రాణము రక్షించుకొ
నుటకు కోరేవాడెవడో వాడు దాని పోగొట్టుకొనును.
నా నిమిత్తము ఎవడు తన ప్రాణము పోగొట్టుకొను
25 నో వాడు దాని రక్షించుకొనును; । ఒక మనుష్యుడు
లోకమంతయు సంపాదించుకొని తన్ను తాను పో
గొట్టుకొనినా లేక నష్టపరుచుకొనినా, అతనికి ఏమి
26 లాభము? । నన్ను గూర్చియు నా మాటలను గూర్చియు
సిగ్గుపడే వాడెవడో వాని గూర్చి మనుష్యకుమారుడు
తనకు, తన తండ్రికి, దూతలకును కలిగే మహిమతో
27 వచ్చేటప్పుడు సిగ్గుపడును. । అయితే ఇక్కడ నిలిచి
యున్న వారిలో కొందరు దేవుని రాజ్యము చూచే
పర్యంతము మరణము పొందరని నేను నిజముగా మీ
తో చెప్పుతున్నాననెను.

28 ఈ మాటలు చెప్పినది మొదలుకొని కొంచెము
ఎక్కువ తక్కువ ఎనిమిది దినములైన తరువాత, ఆయన
పేతురును యోహానును యాకోబును వెంటబెట్టుకొని
29 ప్రార్థించుటకు ఒక కొండ మీదికి ఎక్కెను. । ఆయన
ప్రార్థించుచుండగా, ఆయన ముఖరూపము మార్చ
30 బడెను. ఆయన వస్త్రము తెల్లనిదై మెరిసెను. । అప్పుడు
ఇదుగో ఇద్దరు పురుషులు ఆయనతో మాట్లాడుచుం
31 డిరి. వారు మోషే ఏలీయా అనే వారు. । వారు మ
హిమతో అగుపడి ఆయన యెరూషలేములో నెరవే
ర్చనైయున్న ఆయన నిర్గమమును గూర్చి పలుకు
చుండిరి.

32 అయితే పేతురును ఆయనతో కూడా ఉన్నవా
రును నిద్రాభారము పొందిరి. అయినప్పటికిని వారు మె
లుకువపడి, ఆయన మహిమను, ఆయనతో కూడా నిలిచి
33 యున్న ఆ ఇద్దరు పురుషులను చూచిరి. । వీరు ఆయన
యొద్దనుంచి వెళ్లిపోవుచుండగా పేతురు — అయ్యా!
మనము ఇక్కడ ఉండుట మంచిది గనుక నీకు ఒకటి
మోషేకు ఒకటి ఏలీయాకు ఒకటి మూడు పర్ణశా
లలు కట్టనిమ్మని, తాను చెప్పినది తానే గ్రహించక,
యేసుతో పలికెను.

అతడు ఈలాగు మాటలాడుచుండగా ఒక మే 34
ఘము వచ్చి వారికి నీడ చేసెను. వారు ఆ మేఘము
లోకి వెళ్లినప్పుడు వీరు భయపడిరి. । మరియు ఆ మే 35
ఘములోనుంచి — ఈయన నా ప్రియకుమారుడు;
ఈయన మాట వినండి అనే ఒక శబ్దము పుట్టెను.

ఆ శబ్దము పుట్టిన తరువాత యేసు మాత్రమే 36
అగుపడెను. తాము చూచిన వాటిలో ఒకటి అయినా
ఆ దినములలో వారు ఎవనికిని తెలియచేయక ఊర
కుండిరి.

మరునాడు వారు ఆ కొండనుంచి దిగి యున్నప్పుడు 37
బహు జనసమూహము ఆయనకు ఎదురుగా వచ్చెను.।
అప్పుడు ఇదుగో! ఆ సమూహములో ఒక పురుషుడు— 38
బోధకుడా! నా కుమారునియందు కటాక్షించ వలెనని
నిన్ను వేడుకొంటున్నాను; అతడు నాకు ఒక్కడే
కుమారుడు. । అయితే ఇదుగో! ఒక ఆత్మ అతని పట్టును, 39
అప్పుడు అతడు అకస్మాత్తుగా కేకలు వేసును; నురుగు
కారేటట్టు అది అతని విలవిలలాడించుచు, నలుపుచు
ప్రయాసముతోనే అతని వదిలిపోవును. । దాని వెళ్ల 40
గొట్ట వలెనని నీ శిష్యులను వేడుకొంటిని గాని వారి
వల్ల కాకపోయెనని కంఠమెత్తి చెప్పెను.

అందుకు యేసు — విశ్వాసములేని మూర్ఖవం 41
శమా*! నేను ఎన్నాళ్లమట్టుకు మీతో కూడా ఉండి
మిమ్మును సహింతును? నీ కుమారుని ఇక్కడికి తీసుకొని
రమ్మని ఉత్తరమిచ్చెను.

అప్పుడు అతడు వచ్చుచుండగా, ఆ దయ్యము 42
అతని పడదోసి విలవిలలాడించెను. అయితే యేసు
అపవిత్రమైన ఆత్మను గద్దించి, ఆ చిన్నవాని స్వస్థప
రిచి, అతని తండ్రికి అప్పగించెను. । అప్పుడు అందరు 43
దేవుని మాహాత్మ్యమును గూర్చి ఆశ్చర్యపడిరి.

అయితే యేసు చేసిన వాటినన్నిటిని గూర్చి అం 44
దరు ఆశ్చర్యపడుచుండగా ఆయన — ఈ మాటలు
మీ చెవులలో నాటనియ్యండి; మనుష్య కుమారుడు
మనుష్యుల చేతులకు అప్పగించబడబోతున్నాడని తన
శిష్యులతో చెప్పెను. । అయితే ఈ మాట వారికి బో 45
ధపడలేదు. వారు దాని గ్రహించక ఉండేలాగున
అది మరుగు చేయబడెను. మరియు ఆ మాటను గూర్చి
వారు ఆయనను అడుగుటకు భయపడిరి.

* లేక, తరమా.

46 మరియు, తమలో ఎవడు గొప్పవాడో అనే ఆలో
47 చన వారిలో పుట్టెను.। అయితే యేసు వారి హృదయ
48 మందలి ఆలోచన తెలిసి,। ఒక పిల్లను ఎత్తుకొని తన
యొద్ద నిలువబెట్టి—ఈ పిల్లను నా పేరట ఎవడు చే
ర్చుకొనునో వాడు నన్ను చేర్చుకొనును; నన్ను ఎవ
డు చేర్చుకొనునో వాడు నన్ను పంపినవాని చేర్చు
కొనును; మీ అందరిలో ఎవడు అల్పుడై యుండునో
వాడే గొప్పవాడై యుండునని వారితో చెప్పెను.

49 మరియు, యోహాను—అయ్యా! ఒకడు నీ పేరట
దయ్యములను వెళ్లగొట్టుట చూచితిమి, అయితే అత
డు మనలను వెంబడించలేదు గనుక నిషేధించితిమని
50 ఉత్తరము పలికెను.। అయితే యేసు—మీరు వాని
నిషేధించకండి; మనకు విరోధముగా ఉండనివాడు
మన పక్షముగా ఉన్నాడని చెప్పెను.

51 మరియు ఆయన పైకి ఎత్తబడే దినములు పరిపూర్ణ
52 మవుతూ ఉన్నప్పుడు,। ఆయన యెరూషలేముకు వెళ్లు
టకు తన ముఖము స్థిరముగా త్రిప్పుకొని, తనకంటే
ముందుగా దూతలను పంపెను. వారు వెళ్లి ఆయన
కొరకు సిద్ధము చేయుటకు సమరైయుల గ్రామమునకు
53 చేరిరి.। అయితే ఆయన యెరూషలేముకు వెళ్లుటకు
అభిముఖుడైనందున, వారు ఆయనను చేర్చుకొనలేదు.

54 అంతట ఆయన శిష్యులైన యాకోబు, యోహా
నును దాని చూచి—ప్రభువా! ఏలీయా చేసిన ప్రకా
రముగా మేమును ఆకాశమునుంచి అగ్ని దిగి వీరిని
55 సంహరించుటకు ఆజ్ఞాపించుట నీకు ఇష్టమవునా?। అని
పలికినప్పుడు, ఆయన తిరిగి, వారిని గద్దించి—మీరు
ఎటువంటి ఆత్మసంబంధులై యున్నారో మీరు యెరు
56 గరా?। మనుష్య కుమారుడు మనుష్యుల ప్రాణము
లను రక్షించుటకే గాని నాశనము చేయుటకు రాలేదు
అని పలికెను. అప్పుడు వారు మరియొక గ్రామము
నకు వెళ్లిరి.

57 మరియు, వారు వెళ్లుచుండగా, తోవలో ఒకడు—
ప్రభువా! నీవు ఎక్కడికి వెళ్లినప్పటికిని నిన్ను వెంబ
58 డింతునని ఆయనతో పలికెను.। అందుకు యేసు—
నక్కలకు బొరియలు, ఆకాశ పక్షులకు గూళ్లు కలవు;
అయితే మనుష్య కుమారునికి, తల వాల్చుటకు స్థలము
లేదని వానితో చెప్పెను.

59 మరియు ఆయన—నన్ను వెంబడించుమని మరియొ
కనితో చెప్పెను. వాడు—ప్రభువా! నేను వెళ్లి ముందు
గా నా తండ్రిని పాతిపెట్టుటకు నాకు సెలవిమ్మనెను.।
అందుకు యేసు — చచ్చినవారు తమ చచ్చినవారిని 60
పాతిపెట్టనిమ్ము; నీవు వెళ్లి దేవుని రాజ్యమును ప్రక
టించుమని వానితో చెప్పెను.

మరియొకడు — ప్రభువా! నిన్ను వెంబడింతును; 61
అయితే ముందుగా నా ఇంట్లో ఉన్న వారియొద్ద సె
లవు పుచ్చుకొనుటకు నాకు సెలవిమ్మని పలికినప్పుడు,।
యేసు—నాగటి మీద తన చెయ్యి ఉంచి వెనుకతట్టు 62
చూచే వాడెవడును దేవుని రాజ్యమునకు ఉపయుక్తుడు
కాడని వానితో చెప్పెను.

## 10. అధ్యాయము.

అటుతరువాత, ప్రభువు డెబ్బదిమంది ఇతరులను 1
నియమించి తాను వెళ్లబోయే ప్రతి ఊరికిని ప్రతి
చోటికిని తనకంటే ముందర ఇద్దరిద్దరినిగా వారిని
పంపెను.। కాబట్టి ఆయన—కోత విస్తారమేగాని పని 2
వారు కొద్దిగా ఉన్నారు గనుక, కోత యజమానుని,
తన కోతకు పనివారిని పంపుటకు వేడుకొనండి.

వెళ్లండి; ఇదుగో! నేను తోడేళ్ల నడిమికి గొర్రె 3
పిల్లలవలె మిమ్ము పంపుతున్నాను.। మీరు జాలెమునై 4
నా అసిమినైనా చెప్పులనైనా పట్టుకొని పోవద్దు.।
తోవలో ఎవని కుశలప్రశ్నలు అడగ వద్దు. మీరు 5
ఏ ఇంటనైనా ప్రవేశించేటప్పుడు—ఈ ఇంటికి క్షేమ
మవుగాక అని ముందుగా చెప్పండి.। క్షేమ కుమా 6
రుడు* అక్కడ ఉంటే, మీ క్షేమము దాని మీద నిలిచి
యుండును; లేకపోతే, అది మీకు తిరిగీ వచ్చును.।
వారికి కలిగిన అన్నపానములు పుచ్చుకొంటూ, ఆ 7
ఇంటిలోనే ఉండండి; పనివాడు తన జీతమునకు పా
త్రుడై యున్నాడు. ఇల్లు విడిచి మరియొక ఇంటికి
వెళ్ల వద్దు.

మరియు మీరు ఏ పట్టణమందైనా ప్రవేశించే 8
టప్పుడు వారు మిమ్ము చేర్చుకొంటే వారు మీకు
పెట్టేవి తినండి,। అందులో ఉన్న రోగులను స్వస్థప 9
రచండి,—దేవుని రాజ్యము మీకు సమీపించినదని వా
రితో చెప్పండి.। అయితే మీరు ఏ పట్టణమందైనా 10
ప్రవేశించేటప్పుడు, వారు మిమ్ము చేర్చుకొనకపోతే,।
మీరు దాని వీధులలోకి బైలు వెళ్లి — మా పాదములకు 11
అంటిన మీ పట్టణపు ధూళిని మీకు విరోధముగా
దులిపివేస్తున్నాము. అయినప్పటికిని దీని తెలుసుకొ
నండి, దేవుని రాజ్యము మీకు సమీపించినది అని
చెప్పండి.। ఆ పట్టణముకంటే సొదొమ† గతి ఆ దిన 12
మందు ఓర్వతగినదై యుండునని మీతో చెప్పుతు
న్నాను.

* లేక, క్షేమశీలుడు. †ఒక పట్టణము. ఆదికాండము, 19 అధ్యాయము.

13 అయ్యో! కొరాజీనా! అయ్యో! బేత్సైదా! మీ
మధ్యను చేయబడిన గొప్ప కార్యములు తూరు, సీదోను
లలో చేయబడియుంటే అవి పూర్వము గోనెపట్ట
వేసుకొని బూడిదెలో కూర్చుండి మనస్సు తిప్పుకొని
14 ఉండును. । కావున న్యాయపు తీర్పుయందు మీకంటే
15 తూరు, సీదోనుల గతి ఓర్వతగినదై ఉండును. । ఓ కపె
ర్నహూమా! ఆకాశము మట్టుకు హెచ్చించబడిన
నీవును పాతాళము మట్టుకు అణచబడుదువు!

16 ఎవడు మీ మాట వినునో వాడు నా మాట వినును.
ఎవడు మిమ్ము తిరస్కరించునో వాడు నన్ను తిరస్క
రించును; నన్ను ఎవడు తిరస్కరించునో వాడు నన్ను
పంపినవాని తిరస్కరించును అని వారితో చెప్పెను.
17 తరువాత ఆ డెబ్బదిమంది సంతోషముతో తిరిగి
వచ్చి—ప్రభువా! దయ్యములును నీ నామమువల్ల మాకు
లోపరచబడియున్నవని చెప్పిరి.

18 అందుకు ఆయన—సైతాను మెరుపు వలె ఆకాశ
19 మునుంచి పడుట చూచితిని. । ఇదుగో! పాములను,
తేళ్లను త్రొక్కుటకు, శత్రువుయొక్క బలమంతటి
మీద మీకు అధికారము* ఇస్తున్నాను; ఏదియు మీకు
20 ఎంత మాత్రము హాని చేయదు. । అయినప్పటికిని ఆ
త్మలు మీకు లోపరచబడియున్నందున సంతోషించ
కండి; మీ పేళ్లు ఆకాశమందు వ్రాయబడినందున
సంతోషించండి అని వారితో చెప్పెను.

21 ఆ గడియలో యేసు ఆత్మ యందు ఆనందించి చె
ప్పినదేమంటే — ఆకాశమునకు భూమికిని ప్రభువై
యున్న తండ్రీ! నీవు జ్ఞానులకు ప్రాజ్ఞులకును వీటిని
మరుగుచేసి, బాలురకు బైలుపరిచినావని నీతో ఒప్పు
కొంటున్నాను. అవును, తండ్రీ! ఈలాగు నీ దృష్టికి
22 ఇష్టమై ఉండెను. । అప్పుడు ఆయన తన శిష్యులతట్టు
తిరిగి—సమస్తమును నా తండ్రిచేత నాకు అప్పగించబ
డి ఉన్నది. కుమారుడు ఎవడో తండ్రికే గాని మరి
ఎవనికిని తెలియదు. తండ్రి ఎవడో కుమారునికిని
కుమారుడు ఎవనికి ఆయనను బైలుపరుచుటకు ఇచ్ఛ
యించునో వానికిని తప్ప మరి ఎవనికిని తెలియదని
చెప్పెను.

23 మరియు ఆయన తన శిష్యులతట్టు తిరిగి—మీరు
చూచుచున్న వాటిని చూచే కన్నులు ధన్యమైనవి, ।
24 అనేకులైన ప్రవక్తలు రాజులు మీరు చూచుచున్న
వాటిని చూడ కోరి చూడకను, విన కోరి వినకను,
ఉండిరని మీతో చెప్పుతున్నాను అని ఏకాంతముగా
వారితో పలికెను.

మరియు, ఇదుగో! ఒక ధర్మశాస్త్రి నిలిచి—బోధకు 25
డా!—నేను నిత్యజీవము పొందుటకు ఏమి చేయ వలె
నని ఆయనను శోధించి అడిగెను. । అందుకు ఆయన—26
బోధనాప్రమాణ గ్రంథమందు ఏమి వ్రాయబడి
యున్నది? నీవు ఏలాగు చదువుతున్నావని అతనితో
పలికెను.। అందుకు అతడు— నీవు నీ పూర్ణ హృదయ 27
ముతో, నీ పూర్ణాత్మతో, నీ పూర్ణ శక్తితో, నీ పూర్ణ
మనస్సుతో నీ దేవుడైన ప్రభువుని, నిన్ను వలె నీ పొ
రుగువాని ప్రేమించ వలెనని వ్రాయబడియున్నదని
ఉత్తరము చెప్పెను. । అందుకు ఆయన — నీవు యుక్త 28
ముగా ఉత్తరమిచ్చితివి, ఈలాగు చేయుము, అప్పుడు
జీవింతువని అతనితో చెప్పెను.

అయితే అతడు, తన్ను నీతిమంతునిగా అగుపరు 29
చుకొన వలెనని కోరి—అవునుగాని, నా పొరుగువాడు
ఎవడని యేసుని అడిగెను.

అందుకు యేసు ఇట్లనెను—ఒక మనుష్యుడు యె 30
రూషలేమునుంచి యెరిఖో (పట్టణమునకు) వెళ్లుచూ,
దొంగలచేత పట్టుబడెను. అప్పుడు వారు అతని
దోచుకొని, గాయముచేసి, సగము ప్రాణముతో అతని
విడిచి వెళ్లిరి. । ఆ సమయమందు ఒక యాజకుడు ఆ 31
తోవను పోవుచు, అతని చూచి, యెదిటి పక్కను
వెళ్లెను. । ఆలాగున ఒక లేవీయుడును ఆ చోటికి చేరి, 32
వెళ్లి చూచి యెదిటి పక్కను పోయెను. । అయితే 33
ఒక సమరైయుడు ప్రయాణమై పోవుచు, అతడు
ఉన్న చోటికి వచ్చి, । వాని చూచి కనికరపడి దగ్గిరికి 34
వెళ్లి, నూనె, ద్రాక్షారసమును పోసి, వాని గాయము
లను కట్టి, తన పశువుమీద ఎక్కించి, ఒక పూట
కూళ్లవాని ఇంటికి తీసుకొని వెళ్లి వాని పరామర్శిం
చెను. । మరియు మరునాడు అతడు బైలుదేరినప్పుడు, 35
రెండు దేనారీలు† తీసి, ఆ పూటకూళ్లవానికిచ్చి—
ఇతని పరామర్శించుము; ఇంకా నీవు యేమైనా ఖర్చు
చేసితే, నేను మళ్లీ వచ్చేటప్పుడు అది నీకు ఇత్తునని
అతనితో చెప్పెను. । కాబట్టి దొంగలచేత పట్టుబడిన 36
వానికి ఈ ముగ్గురిలో ఎవడు పొరుగువాడని నీకు తో
చును? అని పలికినప్పుడు అతడు—వానియందు కనిక
రపడిన వాడే అని చెప్పెను. । అప్పుడు యేసు—నీవు 37
వెళ్లి ఆలాగే చేయుమని అతనితో పలికెను.

మరియు వారు పోవుచుండగా ఆయన ఒక గ్రా 38
మములో ప్రవేశించెను. అప్పుడు మర్థా అనే పేరు
గల ఒక స్త్రీ ఆయనను తన ఇంట చేర్చుకొనెను. ఆ

*లేక, శక్తి: †దేనారి అనగా, ఐదణాలనర కావచ్చును.

39 మెకు మరియ అనే ఒక సహోదరి ఉండెను. । ఈమె
యేసు పాదములయొద్ద కూర్చుండి, ఆయన మాటలు
40 వినుచుండెను. । అయితే మర్థా విస్తారమైన పనిచేత
తొందరపడి, ఆయనయొద్దికి వచ్చి—ప్రభువా! నేను
ఒంటిగా పనిచేయుటకు నా సహోదరి నన్ను విడిచి
నందున నీకు విచారము లేదా? కాబట్టి ఆమె నాకు
41 సహాయము చేయుటకు ఆమెతో చెప్పుమనెను. । అం
దుకు యేసు—మర్థా! మర్థా! నీవు అనేకమైనవాటిని
గూర్చి చింతించి తొందరపడుచున్నావు; అయితే
42 ఒకటి అక్కర ఉన్నది; । మరియ ఆ మంచి భాగము
ఏర్పరచుకొనెను; అది ఆమె యొద్దనుంచి తీసివేయ
బడదని ఆమెకు ఉత్తరమిచ్చెను.

## 11. అధ్యాయము.

1 మరియు ఆయన ఒక చోట ప్రార్థించుచుండగా, ఆ
యన చాలించిన తరువాత, ఆయన శిష్యులలో ఒక
డు—ప్రభువా! యోహాను తన శిష్యులకు బోధించిన
ప్రకారము మాకు ప్రార్థన చేయుట బోధించుమని
ఆయనతో పలికెను.

2 అందుకు ఆయన — మీరు ప్రార్థించేటప్పుడు—
ఆకాశమందున్న మా తండ్రీ! నీ నామము పరిశుద్ధప
రచబడుగాక, నీ రాజ్యము వచ్చుగాక, ఆకాశమందు
ఏలాగో ఆలాగే భూమియందును నీ చిత్తము జరుగు
3 గాక. । మా జీవనోపాధియైన ఆహారము దినదినము
4 మాకు దయ చేయుము. । మా పాపములు క్షమించుము;
మేమును మాకు అచ్చియున్న ప్రతివానిని క్షమిస్తు
న్నాము. మమ్మును శోధనలోకి తేకుము, కీడునుంచి
మమ్ము తప్పించుము అని పలుకండని వారితో చెప్పెను.
5 మరియు ఆయన వారిని చూచి—మీలో ఎవనికైనా
ఒక స్నేహితుడు ఉండగా, అతడు అర్ధరాత్రివేళ అతని
యొద్దికి వెళ్లి—స్నేహితుడా! నాకు మూడు రొట్టెలు
6 బదులిమ్ము! । నా స్నేహితుడు ప్రయాణమై వెళ్లుచు,
నా యొద్దికి వచ్చియున్నాడు; అతనికి పెట్టుటకు
7 నాయొద్ద యేమియు లేదని అతనితో పలికితే, । అత
డు లోపటినుంచి — నన్ను శ్రమ పెట్ట వద్దు, తలుపు
వేసియున్నది, నా పిల్లలు నాతోకూడా పండుకొని
8 యున్నారు; నేను లేచి ఇయ్యలేనని చెప్పునా? । అతడు
అతని స్నేహితుడైనందున లేచి ఇయ్యకపోయినప్ప
టికి, అతడు సిగ్గుమాలి, మాటిమాటికి అడుగుటవల్ల లేచి
అతనికి కావలసినవన్నియు ఇచ్చునని మీతో చెప్పు
9 తున్నాను. । అటువలె మీరును అడుగండి, మీకు
ఇయ్యబడును, వెతుకండి మీకు దొరుకును, కొట్టండి
మీకు తీయబడును; । అడిగే ప్రతివాడును పొందును, 10
వెతికే వానికి దొరుకును, కొట్టేవానికి తీయ్యబడునని
మీతో చెప్పుతున్నాను. । మీలో ఎవని కుమారుడైన 11
నను తన తండ్రిని రొట్టెను అడిగితే, అతనికి రాయి
ఇచ్చునా? చేపను అడిగితే చేపకు బదులుగా పాము
ఇచ్చునా? గుడ్డు అడిగితే తేలు ఇచ్చునా? । కాబట్టి 12
చెడ్డవారైన మీరు మీ పిల్లలకు మంచి ఈవులు ఇచ్చు
టకు మీకు తెలివి కలిగితే, । ఆకాశమందున్న మీ 13
తండ్రి తన్ను అడిగేవారికి పరిశుద్ధాత్మను ఎంతో నిశ్చ
యముగా ఇచ్చునని చెప్పెను.

మరియు ఆయన మూగదయ్యమును వదలగొట్టు 14
చుండెను. ఆ దయ్యము వదిలిపోయిన తరువాత మూ
గవాడు మాట్లాడెను గనుక జనసమూహములు ఆశ్చ
ర్యపడెను. । అయితే వారిలో కొందరు — ఇతడు 15
దయ్యముల అధిపతియైన బయెల్జెబూలవల్లనే దయ్య
ములను వదలగొట్టుచున్నాడని చెప్పుకొనిరి. । మరి 16
కొందరు ఆయనను శోధిస్తూ—ఆకాశమునుంచి ఒక
ఆనవాలు ఇమ్మని ఆయనను అడిగిరి.

అయితే ఆయన వారి ఆలోచనలను ఎరిగి వారితో 17
ఇట్లనెను— తనకు విరోధముగా వేరుపడిన ప్రతిరాజ్య
ము పాడైపోవును. ఇంటికి* విరోధమైన ఇల్లు కూలి
పోవును. । సైతాను కూడా తనకు విరోధముగా వేరుపడి 18
తే, దాని రాజ్యము ఏలాగు నిలుచును? నేను బయెల్జె
బూలవల్ల దయ్యములను వదలగొట్టుచున్నానని మీరు
పలుకుచున్నారు. । అయితే నేను బయెల్జెబూలువల్ల 19
దయ్యములను వదలగొట్టితే, మీ కుమారులు ఎవనివల్ల
వాటిని వదలగొట్టుచున్నారు? అందుచేతను వారు మీ
న్యాయకర్తలవుదురు. । అయితే నేను దేవుని వేలివల్ల 20
దయ్యములను వదలగొట్టితే, ఇంతకులోగా దేవుని
రాజ్యము మీ యొద్దికి చేరియున్నది. । ఆయుధము ధరిం 21
చిన బలవంతుడు—తన లోగిలి కాచుకొనేటప్పుడు అత
నికి కలిగినవి భద్రముగా ఉండును. । అయితే అతని 22
కంటే బలవంతుడు అతని మీదికి వచ్చి, అతని జయిం
చేటప్పుడు, అతడు నమ్ముకొనిన ఆయుధములన్నియు
పట్టుకొనిపోయి, అతని ఆస్తి పంచుకొనును. । నా 23
పక్షముగా ఉండనివాడు నాకు విరోధియై ఉన్నాడు;
నాతో కూచర్చనివాడు చెదరగొట్టుచున్నాడు.

అపవిత్రమైన ఆత్మ ఒక మనుష్యుని వదలిపోయిన 24
తరువాత, అది నీరులేని చోట్ల తిరుగుచు, నెమ్మది వెతు
కుచుండును; అయితే అది దొరకనందున—నేను విడిచి
వచ్చిన నా ఇంటికి తిరిగీ వెళ్లుదుననుకొని, । వచ్చి, అది 25
ఊడ్చబడి శృంగారించబడియుండుట చూచును. ।

* లేక, తనకు.

26 అప్పుడు అది పోయి తనకంటె చెడ్డవైన మరి యేడు ఆత్మ
లను చేరదీసును. అవి ప్రవేశించి అక్కడనే కాపుర
ముండును, ఆ మనుష్యుని కడపటి స్థితి మొదటిదాని
కంటె చెడ్డదై ఉండునని పలికెను.

27 ఆయన ఈ మాటలు పలుకుచుండగా ఆ సమూహ
ములో ఉన్న ఒక స్త్రీ కంఠమెత్తి—నిన్ను మోసిన గర్భ
ము, నీవు కుడిచిన స్తనములును ధన్యమైనవని ఆయన
28 తో పలికెను. । అందుకు ఆయన—అవునుగాని దేవుని
వాక్యము విని దాని గైకొనువారు మరి ధన్యులని
చెప్పెను.

29 మరియు జనసమూహములు ఒత్తుగా కూడినప్పుడు
ఆయన ఈలాగు పలుక నారంభించెను—ఈ వంశము*
చెడ్డది, అది ఆనవాలు అడుగుచున్నది. ప్రవక్తయైన
యోనా ఆనవాలే గాని వేరే ఆనవాలు దానికి ఇయ్య
30 బడదు. । యోనా నినెవె పట్టణస్థులకు ఏలాగో ఆలా
గే మనుష్య కుమారుడు ఈ వంశమునకు* ఆనవాలై
31 యుండును. । దక్షిణ దేశపు రాణి న్యాయపు తీర్పు
లో ఈ వంశస్థులతో* లేచి నిలిచి వారికి విరోధమైన
తీర్పు చేయించును. ఆమె సొలొమోను జ్ఞానము విను
టకు భూమిదిగంతములనుంచి వచ్చెను. అయితే ఇదు
గో! సొలొమోను కంటె గొప్పవాడు† ఇక్కడ ఉన్నా
32 డు. । నినెవె మనుష్యులు న్యాయపు తీర్పులో ఈ వం
శము వారితో* కూడా లేచి నిలిచి వారికి విరోధ
మైన తీర్పు చేయింతురు; వారు యోనా ప్రకటించు
టవల్ల మనస్సు తిప్పుకొనిరి. అయితే ఇదుగో! యోనా
కంటె గొప్పవాడు† ఇక్కడ ఉన్నాడు.

33 ఎవడును దీపము వెలిగించి రహస్య స్థలమందైనా,
కుంచము క్రిందనైనా ఉంచడు కాని లోపటికి వచ్చే
వారికి వెలుగు అగుపడుటకు దీపస్తంభము మీద దాని
34 పెట్టును. । కన్ను శరీరమునకు దీపమై ఉన్నది గనుక
నీ కన్ను స్వస్థమైనదైతే నీ శరీరమంతయు వెలుగై ఉం
డును. అది చెడ్డదైతే నీ శరీరమును చీకటియై ఉండు
35 ను. । కావున నీలో ఉండే వెలుగు చీకటియై ఉండకుం
డా చూచుకొనుము. కావున ఏ భాగమైనా చీకటియై
36 ఉండక । నీ శరీరమంతయు వెలుగయే పక్షమందు దీప
ము తన కాంతివల్ల నీకు వెలుగిచ్చేటప్పుడు ఏలాగో
ఆలాగు సమస్తమును వెలుగై ఉండునని చెప్పెను.

37 ఆయన మాట్లాడినప్పుడు, ఒక ఫరిసైయుడు తనతో
భోజనము చేయుటకు ఆయనను వేడుకొనెను. అప్పు
డు ఆయన లోపటికి వెళ్లి భోజన పఙ్తి యందు కూ
చుండెను. । అయితే ఆ ఫరిసైయుడు దాని చూచి, 38
ఆయన భోజనముకంటె ముందుగా స్నానము‡ చేయక
ఉన్నందున ఆశ్చర్యపడెను. । అందుకు ప్రభువు అత 39
నితో—ఇప్పుడు ఫరిసైయులైన మీరు గిన్నెయు పళ్లె
మును వెలపట శుచి చేస్తున్నారు; మీ అంతరంగము
దోపుతోను చెడుతనముతోను నిండియున్నది. । అవి 40
వేకులారా! వెలపటిదాని చేసినవాడు లోపటిదాని
కూడా చేయలేదా. । అయితే లోపల ఉన్నవాటిని 41
ధర్మము చేయండి; అప్పుడు మీకు అన్నియు శుభ్ర
ముగా ఉండును.

అయ్యో! ఫరిసైయులారా! మీరు పుదీనా, సదాప 42
మొదలైన ప్రతి కూరలోను పదోవంతు అర్పిస్తున్నా
రు గాని, న్యాయమును, దేవుని ప్రేమను అతిక్రమిస్తు
న్నారు; వాటిని మానక వీటిని చేయ వలెను. । అయ్యో! 43
ఫరిసైయులారా! మీరు సునగోగులలో అగ్రపీఠము
లను, సంతలలో వందనములను కోరుతున్నారు. । అ 44
య్యో! వేషధారులైన శాస్త్రులారా! ఫరిసైయులారా!
మీరు అగుపడని సమాధుల వలె ఉన్నారు. మనుష్యు
లు వాటిమీద నడుస్తూ వాటిని ఎరుగరని చెప్పెను.
అప్పుడు న్యాయశాస్త్రులలో ఒకడు—బోధకుడా! 45
వీటిని చెప్పి మమ్ము కూడా నిందించుచున్నావని ఆయ
నకు ఉత్తరమిచ్చెను.

అందుకు ఆయన—అయ్యో! న్యాయశాస్త్రులారా! 46
మోయుటకు కష్టమైన బరువులను మీరు మనుష్యుల
మీద మోపుతున్నారు; మీరు మీ వేళ్లలో ఒక దాని
తోనైనా ఆ బరువులను ముట్టరు. । అయ్యో! మీరు 47
ప్రవక్తల సమాధులను కట్టిస్తున్నారు. మీ పితృలు వా
రిని చంపిరి. । కావున మీరు సాక్ష్యమిచ్చి మీ పితృల 48
కార్యములకు సమ్మతిస్తున్నారు; వారు వారిని చంపిరి,
మీరు వారి సమాధులు కట్టిస్తున్నారు. । అందుచేతను 49
దేవుని జ్ఞానము చెప్పినదేమంటే—నేను వారియొద్దికి
ప్రవక్తలను అపొస్తలులను పంపుదును; వారు వీరిలో
కొందరిని చంపుదురు, (కొందరిని) తరుముదురు. ।
కాబట్టి లోకము పుట్టినది మొదలుకొని—అనగా ఆ 50
హేబెలు రక్తము మొదలుకొని, । వేదికకును దేవాలయమున 51
కును మధ్యను నశించిన జెఖరీయ రక్తమువరకు చిందబ
డిన ప్రవక్తలందరి రక్తము ఈ తరము§ వారియొద్ద అడు
గబడును; నిశ్చయముగా అది ఈ తరము§ వారియొద్ద
అడుగబడునవి మీతో చెప్పుతున్నాను.

* లేక, తరము వారి. † లేక, గొప్పది ‡ గ్రేకులో, బాప్తిస్మము. § లేక, వంశపు.

52 అయ్యో! న్యాయశాస్త్రులారా! మీరు జ్ఞానమనే*
తాళముచెవి తీసుకొనిపోతిరి. మీరు లోపటికి ప్రవే
శించుచున్న వారిని ఆతంకపరిచితిరని చెప్పెను.
53 ఆయన వారితో వీటిని చెప్పుచుండగా శాస్త్రులు
54 ఫరిసైయులును ఆయనయందు మిక్కిలీ పగపట్టి, । ఆ
యన మీద దోషారోపణ చేయ వలెనని ఆయన నోటి
నుంచి వచ్చినది యేదైనా లంకించుకొనుటకు ఆయనను
గూర్చి పొంచి వెతుకుతు, అనేకమైన సంగతులను
గూర్చి ఆయనను మాట్లాడించ సాగిరి.

## 12. అధ్యాయము.

1 అంతలో ప్రజలు ఒకని ఒకడు త్రొక్కుకొనే
ట్టు వేలకొలది కూడినప్పుడు, ఆయన తన శిష్యుల
తో మొదట చెప్పసాగినదేమంటే—ఫరిసైయుల వేష
ధారణ అనే పులిసిన పిండినిగూర్చి జాగ్రతపడండి. ।
2 బైలుపరచబడని మరుగైనది యేదియులేదు; తెలియబ
3 డని రహస్యమైనది యేదియు లేదు.। అందుచేతను మీరు
చీకటిలో వేటిని మాట్లాడితిరో అవి వెలుగులో విన
బడును. మరియు, మీరు గదులయందు చెవిలో చెప్పి
నది మేడలమీద ప్రకటించబడును.
4 నా స్నేహితులైన మీతో నేను చెప్పేది (వినండి)
శరీరము చంపిన తరువాత మరి యేమియు చేయనేరని
5 వానికి భయపడకండి. । మీరు ఎవనికి భయపడ వలె
నో వాని మీకు చూపింతును. చంపిన తరువాత గహె
న్నలో తోయుటకు శక్తిగల వానికి భయపడండి. నిశ్చ
యముగా అతనికి† భయపడండని మీతో చెప్పుతు
6 న్నాను. । అయిదు పిచ్చుకలు ఏగానికి అమ్మబడును
గదా అయినప్పటికి నాటిలో ఒకటైనా దేవుని యెదుట
7 మరువబడదు. । మీ తలవెంట్రుకలన్నియు లెక్కించ
బడియున్నవి, కాబట్టి భయపడకండి; మీరు అనేక
మైన పిచ్చుకలకంటే శ్రేష్ఠులైయున్నారు.
8 మరియు నేను మీతో చెప్పేది వినండి, నన్ను గూర్చి
మనుష్యుల యెదుట ఒప్పుకొనే వాడెవడో వాని
గూర్చి మనుష్యకుమారుడు దేవుని దూతల యెదుట ఒప్పు
9 కొనును.। అయితే మనుష్యుల యెదుట నన్ను ఎరుగనని
పలికేవాని నేను ఎరుగనని దేవుని దూతల యెదుట
10 పలుకుదును. । మనుష్యకుమారునికి విరోధముగా ఒక
మాట పలికేవాడు క్షమించబడును గాని పరిశుద్ధాత్మను
11 దూషించే వాడు క్షమించబడడు. । వారు సునగోగుల
కు, యేలేవారి యొద్దికిని, అధికారుల యొద్దికిని మిమ్మును
తీసుకొని వెళ్లేటప్పుడు మీరు—ఏలాగు ఏమి ఉత్తరము
చెప్పుదుము? ఏమి పలుకుదుము అని చింతించకండి; ।
మీరు ఏమి చెప్ప వలెనో అది ఆ గడియలోనే పరి 12
శుద్ధాత్మ మీకు బోధపరుచునని పలికెను.

మరియు, ఆ జనసమూహములో ఒకడు—బోధకుడా! 13
పిత్రార్జితములో నాకు పాలు పంచిపెట్టుటకు నా
సహోదరునితో చెప్పుమని ఆయనతో పలికెను. ।
అయితే ఆయన — మనుష్యుడా! మీ మీద న్యా 14
యకర్తగానైనా పంచిపెట్టే వానిగానైనా నన్ను
ఎవడు నియమించెను? అని అతనితో పలికెను. । మరి 15
యు, ఆయన—మీరు సమస్తలోభమును గూర్చి జాగ్ర
త్తపడి కాచుకొనండి; ఒకనికి కలిమి విస్తరించుటవల్ల
వానికి జీవనము కలగదని వారితో చెప్పెను.

అప్పుడు ఆయన వారితో ఈ ఉపమానము చెప్పె 16
ను—ఒక ధనవంతుని భూమి నిండా పండెను; । అప్పు 17
డు అతడు—నా పంట సమకూర్చుకొనుటకు నాకు
స్థలము చాలదు గనుక నేను ఏమిచేతునని తనలో తాను
ఆలోచించుకొని—నేను ఈలాగు చేతును; । నా కొట్లు 18
విప్పి వాటికంటే గొప్పవాటిని కట్టించి, అందులో
నా పంటలన్నిటిని నా యాస్తిని సమకూర్చుకొందును. ।
తరువాత నేను—ప్రాణమా! అనేక సంవత్సరముల 19
మట్టుకు విస్తారమైన ఆస్తి నీకు కూర్చబడియున్నది;
నీవు సుఖించుము, తినుము, తాగుము, సంతోషించు
ము అని నా ప్రాణముతో చెప్పుకొందుననుకొనెను. ।
అయితే దేవుడు—వెర్రివాడా! ఈ రాత్రి నీ ప్రాణ 20
మును అడుగుతున్నారు; నీవు సిద్ధపరిచినవి ఎవనికి
కలుగునని అతనితో పలికెను. । దేవుని యెడల ధనవం 21
తుడు కాక తన కొరకే కూర్చుకొనే వాడు ఆలాగు
ఉండునని చెప్పెను.

తరువాత ఆయన తన శిష్యులతో ఇట్లనెను—ఈ 22
హేతువుచేతను మీరు, ఏమి తిందుమో అని మీ ప్రా
ణమును గూర్చియైనా లేక, ఏమి ధరించుకొందుమో
అని మీ శరీరమును గూర్చియైనా మీరు చింతించ
కండి.। ఆహారముకంటే ప్రాణము వస్త్రములకంటే శరీ 23
రము గొప్పవైయున్నవి. । కాకులను చూడండి; అవి 24
విత్తవు, అవి కోయవు, వాటికి కొట్లు లేదు, గాదెలేదు;
అయినను దేవుడు వాటిని పోషిస్తున్నాడు. మీరు
పక్షులకంటే ఎంతో శ్రేష్ఠులై యున్నారు! । మరియు 25
మీలో ఎవడు చింతించుటవల్ల తన ఆయుస్సును ఒక
మూరెడు యెక్కువ చేసుకొనగలడు!। కాబట్టి అన్నిటి 26
కంటే తక్కువైనవి మీవల్ల కాకపోతే, తక్కిన వాటిని
గూర్చి మీరు ఎందుకు చింతించుచున్నారు. । పుష్ప 27
ములు యేలాగు ఎదుగుతున్నవో వాటిని చూడండి.

*లేక, జ్ఞానముయొక్క. †లేక, ఆయనకు.

అవి కష్టపడవు, అవి ఒడకవు, అయినను సొలొమో
ను గూడా* తన సమస్త వైభవముతో వీటిలో ఒకదాని
వలెనైనా అలంకరించబడ లేదని మీతో చెప్పుతున్నా
28 ను. । కాబట్టి నేడు పొలములో ఉండి రేపు పొయిలో
వేయబడే అడవి గడ్డికి దేవుడు ఈలాగు వస్త్రము వే
సితే, ఓ అల్ప విశ్వాసులారా! మీకు మరియెంత
ఎక్కువగా వేసును.

29 మీరు—ఏమి తిందుమో ఏమి తాగుదుమో అని
30 వాటిని వెతుకకండి; అనుమానించకండి; । ఈలోక
రాష్ట్రములు వీటినన్నిటిని వెతుకుచున్నవి. ఇవి మీకు
31 కావలెనని మీ తండ్రికి తెలుసును. । అదియుగాక
మీరు దేవుని రాజ్యము వెతికితే ఇవియన్నియు కూడా
32 మీకు సమకూర్చబడును. । చిన్న మందా! భయపడ
వద్దు; మీకు రాజ్యము ఇచ్చుటకు మీ తండ్రికి ఇష్టమై
33 యున్నది. । మీకు కలిగినవాటిని అమ్మి, ధర్మము చే
యండి. పాతగిలని జాలెలములను, ఆకాశమందు అ
క్షయమైన ధనమును సంపాదించుకొనండి; అక్కడికి
34 దొంగ సమీపించడు, చిమ్మెట కొట్టదు; । మీ ధనము
ఎక్కడ ఉందునో అక్కడ మీ హృదయమును ఉం
డును.

35 మీ నడుములు కట్టుకొని ఉండుడి; మీ దీపములు
36 వెలుగుచుండనియ్యుడి; । మీరైతే—తమ ప్రభువు పెం
డ్లినుంచి వచ్చి కొట్టగానే అతనికి తలుపుతీయుటకు
అతడు ఎప్పుడు వచ్చునో అని అతని కొరకు యెదురు
37 చూచే మనుష్యుల వలెనుండుడి. । ప్రభువు వచ్చి ఎవరు
మెలుకువగా ఉండుట చూచునో ఆ నౌకరులు ధన్యు
లు. అతడు నడుము కట్టుకొని వారిని భోజన పఙ్తిలో
కూర్చుండబెట్టి తానే వచ్చి వారికి పరిచర్య చేసునని మీ
38 తో నిశ్చయముగా చెప్పుతున్నాను. । మరియు అతడు
రెండవ జామున వచ్చినా మూడవ జామున వచ్చినా
ఈలాగు ఉండుట చూచితే ఆ నౌకరులు ధన్యులై
39 యుందురు. । అయితే మీరు దీని తెలుసుకొనుడి,
దొంగ ఏ గడియకు వచ్చునో అది ఇంటియజమాను
నికి తెలిసియుంటే, అతడు మెలుకువపడి తన ఇంట్లో
40 కన్నము వేయనియ్యడు. । కాబట్టి మీరును సిద్ధముగా
ఉండండి; మీరు ఊహించని గడియలో మనుష్య
కుమారుడు వచ్చునని చెప్పెను.

41 అప్పుడు పేతురు — ప్రభువా! ఈ ఉపమానము
మాతోనే చెప్పుతున్నావా? లేక అందరితోను చెప్పు
42 తున్నావా? అని ఆయనను అడిగెను. । అందుకు ప్రభు
వు—తగిన కాలమందు ప్రతివానికి ఆహారముపెట్టు
టకు యజమానుడు తన ఇంటి వారి మీద ఎవని నియ
మించును? నమ్మకమైన బుద్ధిగల ఆ గృహనిర్వాహకుడు
ఎవడు? । ఎవని ప్రభువు వచ్చి అతడు ఆలాగు చే 43
యుట చూచునో ఆ నౌకరు ధన్యుడు. । తనకు కలి 44
గిన అన్నిటి మీద అతని ఉంచునని మీతో నిశ్చయ
ముగా చెప్పుతున్నాను.

అయితే ఆ నౌకరు—నా యజమానుడు వచ్చుటకు 45
ఆలస్యము చేస్తున్నాడని తన హృదయములో అను
కొని నౌకరులైన పురుషులను స్త్రీలను కొట్టి, తిని, తాగి,
మత్తుగా ఉండ సాగితే, । ఆ నౌకరుయొక్క ప్రభువు 46
అతడు కనిపెట్టని దినములోను, ఎరుగని గడియలోను
వచ్చి, అతని నరికించి అవిశ్వాసులతో అతనికి పాలు
నియమించును.

మరియు తన ప్రభువుయొక్క చిత్తము ఎరిగియుం 47
డియు, సిద్ధపడక అతని చిత్తము చొప్పున జరిగించక
ఉండే నౌకరుకు అనేకమైన దెబ్బలు తగులును. ।
అయితే తెలియక, దెబ్బలకు తగిన వాటిని చేసిన వానికి 48
కొన్ని దెబ్బలు తగులును; ఎవనికి ఎక్కువ ఇయ్యబ
డెనో, వానియొద్ద ఎక్కువ అడుగబడును; ఎవనికి
ఎక్కువ అప్పగించిరో వానియొద్ద ఎక్కువ అడుగుదురు.

నేను భూమి మీద అగ్ని వేయుటకు వచ్చితిని; నేను 49
కోరేది యేమిటి? అది ఇప్పుడే రవులుకొని యుండ కో
రుతున్నాను. । అయితే నాకు చేయించబడ వలసిన 50
బాప్తిస్మము కలదు; అది నెరవేరేమట్టుకు నేను ఎంతో
ఇబ్బందిపడుతున్నాను. । నేను భూమియందు సమా 51
ధానము కలుగచేయుటకు వచ్చితినని మీరు తలస్తు
న్నారా? ఆలాగు కాదు భేదము కలుగచేయుటకని
మీతో చెప్పుతున్నాను. । ఇప్పటినుంచి ఒక ఇంట్లో 52
అయిదుగురు భేదించబడి, ఇద్దరికి ముగ్గురును ముగ్గురికి
ఇద్దరును విరోధులుగా ఉందురు. । తండ్రి కుమారునికి, 53
కుమారుడు తండ్రికిని, తల్లి కుమార్తెకు కుమార్తె
తల్లికిని, అత్త కోడలికి కోడలు అత్తకును విరోధులుగా
భేదించబడుదురని చెప్పెను.

మరియు ఆయన ఆ జనసమూహములతో—మీరు 54
ఒక మబ్బు పడమటినుంచి లేవడము చూచేటప్పుడు
—వాన వచ్చునని తక్షణమే పలుకుదురు. ఆలాగే సంభ
వించును. । దక్షిణపుగాలి విసరడము చూచితే—వెట్ట 55
కలుగునని చెప్పుదురు. ఆలాగు కలుగును. । వేషధారు 56
లారా! మీరు భూమ్యాకాశముల ముఖము పరీక్షించే
తెలివి గలవారు; ఈ కాలమును మీరు ఎందుకు

* లేక, సమేతము.

57 పరీక్షించరు. । మరియు ఏది న్యాయమో మీ అంతట
మీరైనా ఎందుకు నిర్ణయించుకొనరు.
58 నీవు నీ ప్రతివాదితో అధికారియొద్దికి వెళ్లుచుం
డగా, ఆయన యొద్దనుంచి విడుదల పొందుటకు త్రో
వలోనే ప్రయత్నము చేయుము; లేకపోతే అతడు
ఒకవేళ నిన్ను న్యాయకర్తయొద్దికి ఈడ్చుకొని పో
వును; అప్పుడు న్యాయకర్త నిన్ను బంటుకు అప్ప
59 గించును, బంటు నిన్ను ఖయిదులో వేసును. । నీవు
కడపటి కాసుకూడా తీర్చే పర్యంతము వెలపటికి రానే
రావని నీతో చెప్పుతున్నానని పలికెను.

## 13. అధ్యాయము.

1 ఆ కాలమందు అక్కడ ఉన్న కొందరు, పిలాతు
ఎవరి రక్తము వారి యాగములతో కలిపెనో ఆ గలిలై
2 యులను గూర్చి ఆయనతో చెప్పిరి. । అందుకు యేసు
వారిని చూచి — ఈ గలిలైయులు అటువంటి శ్రమ
పొందినందున, వారే సమస్తమైన గలిలైయుల కంటె
పాపులై యున్నారని మీరు తలస్తున్నారా? కాదు; ।
3 మీరు మారు మనస్సు పొందకపోతే, మీరందరు ఆ
4 లాగే నశింతురని మీతో చెప్పుతున్నాను. । మరియు
సిలోయములో ఉన్న గోపురము ఎవరి మీద పడి
వారిని చంపెనో ఆ పద్దెనిమిదిమందే యెరూషలేము
లో కాపురమున్న వారందరి కంటె అపరాధులై*
5 యున్నారని తలస్తున్నారా? । కాదు; మీరు మారు
మనస్సు పొందకపోతే, మీరందరు ఆలాగే నశింతు
రని మీతో చెప్పుతున్నానని పలికెను.
6 మరియు ఆయన ఈ ఉపమానము వారితో చెప్పెను
—ఒక మనుష్యుడు తన ద్రాక్షతోటలో ఒక అంజూ
రపు చెట్టు నాటించి, దాని పండ్లు అడగ వచ్చినప్పుడు
7 ఏమియు దొరకలేదు. । అప్పుడు ఆయన — ఇదుగో!
మూడు సంవత్సరములనుంచి నేను ఈ అంజూరపు
చెట్టున పండ్లు అడగ వస్తున్నానుగాని ఏమియు దొరక
లేదు, దీని నరికివేయుము, ఇది భూమిని ఎందుకు
వ్యర్థపరుస్తున్నదని తన ద్రాక్షతోటవానితో చెప్పె
8 ను. । అందుకు అతడు—నేను దాని చుట్టు తవ్వి, గెత్త
ము వేసేమట్టుకు, ఈ సంవత్సరమును ఉండనిమ్ము; ।
9 తరువాత అది ఫలిస్తే సరి లేకపోతే అటుమీదట నరి
కించివేతువుగాని, అని ఆయనతో ఉత్తరము చెప్పెను.
10 మరియు ఆయన సబ్బాతు దినమందు ఒక సున
11 గోగులో బోధించుచున్నప్పుడు, । ఇదుగో! పద్దెనిమిది
సంవత్సరములనుంచి బలహీనత చేసే ఆత్మ పట్టిన ఒక స్త్రీ
ఉండెను. ఆమె నడుము వంగిపోయి ఎంతమాత్రము
తిన్నగా నిలువ లేక పోయెను. । యేసు ఆమెను చూచి, 12
రమ్మని పిలిచి—ఓ అమ్మా! నీవు నీ బలహీనతనుంచి విడు
దల పొంది యున్నావని ఆమెతో చెప్పి, । ఆమె మీద 13
చేతులు వేయగానే ఆమె తిన్నగా చేయబడి దేవుని
మహిమపరిచెను.

అయితే యేసు సబ్బాతు దినమందు స్వస్థపరిచి 14
నందున, ఆ సునగోగుయొక్క అధికారి కోపగించు
కొని—పని చేయతగిన ఆరు దినములు ఉన్నవి గనుక
ఆ దినములలోనే స్వస్థపరచబడుటకు రండి, కాని
సబ్బాతు దినమందు వద్దని ప్రజలతో ఉత్తరము చెప్పె
ను. । అందుకు ప్రభువు—వేషధారులారా! మీలో 15
ప్రతివాడును సబ్బాతు దినమందు తన యెద్దునైనా
గాడిదనైనా సాలలోనుంచి విప్పి నీళ్లు తాగించుటకు
తీసుకొని పోవును గదా? । ఇదుగో! పద్దెనిమిది సంవ 16
త్సరములనుంచి సైతాను కట్టిన అబ్రాహాముయొక్క
కుమార్తెయైన ఈమెను సబ్బాతు దినమందు ఈ కట్ల
లోనుంచి విడిపించ తగదా? అని అతనికి ప్రత్యుత్తర
మిచ్చెను.

ఆయన వీటిని చెప్పినప్పుడు ఆయనకు ఎదురాడిన 17
వారందరు సిగ్గుపడిరి. అయితే ప్రజలందరు ఆయన
చేత చేయబడిన ఘన కార్యములన్నిటిని గూర్చి సం
తోషించిరి.

మరియు ఆయన—దేవుని రాజ్యము దేని పోలియు 18
న్నది? దేనితో దాని పోల్తును? । ఒక మనుష్యుడు తీసు 19
కొని, తన తోటలో వేసిన ఆవగింజను పోలి యున్నది.
అది పెరిగి గొప్ప చెట్టు ఆయెను; ఆకాశ పక్షులు
దాని కొమ్మల యందు నివాసము చేసెనని చెప్పెను.

మరియు ఆయన—దేవుని రాజ్యము దేనితో పో 20
ల్తును? । ఒక స్త్రీ పట్టుకొని, మూడు కుంచముల పిండి 21
లో, అంతా పులిసే మట్టుకు దాచిపెట్టిన పుల్ల పిండిని
పోలియున్నదని చెప్పెను.

మరియు ఆయన—బోధిస్తు, యెరూషలేముకు ప్ర 22
యాణమై వెళ్లుతు ఉండి పట్టణములలోను గ్రామము
లలోను తిరుగుతు ఉండెను.

మరియు ఒకడు—ప్రభువా! రక్షణ పొందేవారు 23
కొందరేనా అని ఆయనను అడిగెను. । అప్పుడు ఆయన 24
వారిని చూచి—ఇరుకు ద్వారమున ప్రవేశించుటకు
పోరాడండి; అనేకులు ప్రవేశించుటకు వెతుకుదురు
గాని వారివల్ల కాదని నేను మీతో చెప్పుతున్నాను. ।
ఇంటి యజమానుడు లేచి తలుపు వేసినందున, మీరు 25
వెలపట నిలిచి తలుపు కొట్టి,—ఓ ప్రభువా! ప్రభు

* లేక, ఋణస్థులై.

వా! మా కొరకు తలుపు తీయుమని పలుకుటకు ఆరం
26 భించినప్పుడు, ఆయన—మిమ్మును ఎరుగను, । మీరు
ఎక్కడి వారు? అని ఏకాలమందు మీతో ఉత్తరము
చెప్పునో, అప్పుడు మీరు—నీ సమ్ముఖమందు మేము
భోజనము చేయుచు తాగుచు ఉంటిమి; నీవు మా వీధు
27 లలో ఉపదేశించితివని చెప్ప సాగుదురు. । అప్పుడు
ఆయన—మీరు ఎక్కడివారు? మిమ్మును ఎరుగను అని
మీతో చెప్పుతున్నాను; అన్యాయము చేసే మీరందరు
28 నా యొద్దనుంచి వెళ్లండని చెప్పును. । అబ్రాహాము,
ఈసాకు, యాకోబును సకలమైన ప్రవక్తలును దేవుని
రాజ్యములో ఉండుటయు మీరు వెలపటికి తోయ
బడుటయు మీరు చూచేటప్పుడు అక్కడ ఏడ్పును
29 పండ్లు కొరుకుటయును కలిగియుండును. । మరియు
జనులు తూర్పునుంచి, పడమటినుంచి, ఉత్తరము
నుంచి దక్షిణమునుంచియు వచ్చి, దేవుని రాజ్యమందు
30 కూర్చుండుదురు. । మరియు ఇదుగో! కడపటివారిలో
కొందరు మొదటివారును, మొదటివారిలో కొంద
రు కడపటివారునై యుందురని పలికెను.

31 ఆ దినమందే కొందరు ఫరిసైయులు వచ్చి—నీవు
ఇక్కడనుంచి బైలుదేరి వెళ్లుము; హేరోదు నిన్ను
చంపుటకు కోరుతున్నాడని ఆయనతో చెప్పినప్పుడు ।
32 ఆయన వారిని చూచి,—మీరు వెళ్లి ఆ నక్కతో చెప్పం
డి—ఇదుగో! నేడును రేపును నేను దయ్యములను
వెళ్లగొట్టుతు, ఆరోగ్యము చేస్తు ఉండి, మూడవ దిన
33 ము (నాపని) సంపూర్ణము చేయుదును. । అయినప్ప
టికి నేడు, రేపు, ఎల్లుండి, నేను వెళ్లుతు ఉండవలె
ను; ప్రవక్త యెరూషలేముకు వెలపట నశించ కూడదు.

34 ఓ యెరూషలేమా! యెరూషలేమా! ప్రవక్తలను
చంపుతు, నీ యొద్దికి పంపబడిన వారిని రాళ్లతో కొ
ట్టుతునుండేదానా! కోడి తన రెక్కల కింద తన పిల్ల
లను ఏలాగో ఆలాగు నేను నీ పిల్లలను ఎన్నో
మార్లు చేర్చుకొన వలెనని యుంటిని! అయితే మీరు
35 సమ్మతించ లేదు. । ఇదుగో! మీ ఇల్లు మీకు పాడుగా
విడువబడి యున్నది; మరియు—ప్రభువుయొక్క పే
రట వచ్చుచున్నవాడు ఆశీర్వదించబడును గాక* అని
మీరు చెప్పే కాలము వచ్చే పర్యంతము నన్ను చూడ
రని మీతో నిశ్చయముగా చెప్పుతున్నానని పలికెను.

## 14. అధ్యాయము.

1 మరియు, సబ్బాతు దినమందు ఆయన భోజనము
చేయుటకు, ఫరిసైయుల ప్రధానులలో ఒకని ఇంట్లోకి
వెళ్లినప్పుడు, వారు ఆయనను కనిపెట్టుతు ఉండిరి. ।
అప్పుడు ఇదుగో! జలోదర రోగము గల ఒక మను 2
ష్యుడు ఆయన యెదుట ఉండెను. । కాగా యేసు,— 3
సబ్బాతు దినమందు స్వస్థపరుచుట న్యాయమా? అని
శాస్త్రులను, ఫరిసైయులను అడిగెను. । అయితే వారు 4
ఊరకుండిరి. అప్పుడు ఆయన వాని చేరదీసి, స్వస్థ
పరిచి పంపివేసి।— మీలో ఎవని గాడిదెయైనా ఎద్దై 5
యినా గుంటలో పడితే, సబ్బాతు దినమున దాని పైకి
తీయడా? అని వారికి ఉత్తరమిచ్చెను. । వీటిని గూర్చి 6
వారు ఆయనకు ఉత్తరమియ్యలేకపోయిరి.

మరియు పిలువబడినవారు పజ్తిలో అగ్రపీఠములు 7
ఏర్పరుచుకొనుట చూచి, వారితో ఈ ఉపమానము
చెప్పెను. । — నీవు ఎవని చేతనైనా పెండ్లికి పిలువ 8
బడితే, అగ్రపీఠముల యందు కూర్చుండ వద్దు; ఒక
వేళ నీకంటే ఘనుడు అతనిచేత పిలువబడునేమో; ।
అప్పుడు నిన్ను అతని పిలిచినవాడు వచ్చి—ఈయనకు 9
స్థలమిమ్మని నీతో చెప్పును. అందుచేతను నీవు సిగ్గు
పడి కడపటి స్థలమున కూర్చుండ సాగుదువు. । అయి 10
తే నీవు పిలువబడేటప్పుడు నిన్ను పిలిచిన వాడు
వచ్చి— స్నేహితుడా! పైచోటికి వెళ్లుమని నీతో
చెప్పేలాగున, నీవు వెళ్లి కడపటి స్థలమున కూర్చుండు
ము; అప్పుడు నీతో కూడా కూర్చుని యుండే వారి
యెదుట నీకు ఘనత కలుగును. । తన్ను తాను హె 11
చ్చించుకొనే ప్రతివాడును కొద్దిపరచబడును, తన్ను
తాను కొద్దిపరుచుకొనే వాడు హెచ్చించబడునని పలి
కెను.

మరియు ఆయన తన్ను పిలిచినవానితో ఇట్లనె 12
ను—నీవు పగటి విందైనా రాత్రి విందైనా చేసేట
ప్పుడు, నీ స్నేహితులనైనా నీ సహోదరులనైనా
నీ బంధువులనైనా ధనవంతులైన నీ పొరుగువారినైనా
పిలువ వద్దు; వారును ఒకవేళ నిన్ను తిరిగి పిలుతు
రేమో; అప్పుడు నీకు ప్రత్యుపకారము కలుగునే
మో; । అయితే నీవు విందు చేసేటప్పుడు బీదలను, 13
అంగహీనులను, కుంటివాండ్లను, గుడ్డివాండ్లను పిలు
వుము, । అప్పుడు నీకు ప్రత్యుపకారము చేయుటకు 14
వారికి ఏమియు లేదు గనుక నీవు ధన్యుడవవుదువు;
నీవు నీతిమంతుల పునరుత్థానమందు ప్రత్యుపకారము
పొందుదువని పలికెను.

అప్పుడు ఆయనతో కూడా పజ్తియందు కూర్చు 15
న్న వారిలో ఒకడు వీటిని విని—దేవుని రాజ్యమందు
రొట్టె తినేవాడు ధన్యుడని ఆయనతో పలికెను. । అం 16
దుకు ఆయన వాని చూచి—ఒక మనుష్యుడు గొప్ప

*లేక, జయమవుగాక.

17 విందు సిద్ధపరిచి అనేకులను పిలిచెను. । విందు కాల
మందు అతడు—అప్పుడు సమస్తము సిద్ధమై యున్నది
గనుక—రండని పిలువబడిన వారితో చెప్పుటకు తన
18 నౌకరును పంపెను. । అయితే వారందరు క్షమింప
చేయుమని ఏక మనస్సుతో చెప్పసాగిరి. మొదటి
వాడు అతనితో—నేను ఒక పొలము కొంటిని, నేను
అవశ్యముగా బైలువెళ్లి దాని చూడ వలెను గనుక
నా యెడల క్షమింప చేయ వలెనని నిన్ను వేడుకొం
19 టున్నానసెను. । మరియొకడు — నేను అయిదు జతల
యెడ్లను కొంటిని గనుక నేను వాటిని పరీక్షించుటకు
వెళ్లనైయున్నాను; నా యెడల క్షమింప చేయ వలె
20 నని వేడుకొంటున్నానసెను. । మరియొకడు — నేను
ఒక స్త్రీని వివాహము చేసుకొన్నాను; అందుచేతను
21 నేను రాలేనసెను. । అప్పుడు ఆ నౌకరు తిరిగీ వచ్చి
వీటిని తన యజమానునికి తెలియ చేసెను. అప్పుడు ఆ
ఇంటి యజమానుడు కోపగించి—నీవు త్వరగా పట్టణ
పు వీధులలోకిని సందులలోకిని బైలువెళ్లి బీదలను, అంగ
హీనులను, కుంటివారిని, గుడ్డివారిని ఈ లోపటికి తీసు
22 కొని రమ్మని ఆ నౌకరుతో చెప్పెను. । అప్పుడు ఆ
నౌకరు—ప్రభువా! నీవు ఆజ్ఞాపించిన ప్రకారము జరి
గెను, అయితే ఇంకా స్థలము ఉన్నదని చెప్పెను. ।
23 అందుకు ఆ యజమానుడు—నా ఇల్లు నిండే కొరకు,
నీవు రాజమార్గములలోకి, కంచెలలోకిని బైలువెళ్లి,
అక్కడి వారిని లోపటికి వచ్చుటకు బలవంతము
24 చేయుము; । పిలువబడిన ఆ మనుష్యులలో ఒకడైనా
నా విందు రుచి చూడడని నీతో చెప్పుతున్నానని
నౌకరుతో పలికెనసెను.

25 విస్తారమైన జనసమూహములు ఆయనతో వెళ్లుతు
26 ఉన్నప్పుడు, ఆయన వారితట్టు తిరిగి।—ఎవడైనా నా
యొద్దికి వచ్చి తన తండ్రిని, తల్లిని, భార్యను, పిల్లలను,
అన్నదమ్ములను, అక్కచెల్లెండ్రను, తన ప్రాణమును
27 ద్వేషించకపోతే, నా శిష్యుడు కానేరడు. । మరియు,
తన శిలువను మోసుకొని నన్ను వెంబడించనివాడు
28 నా శిష్యుడు కానేరడు; । మీలో ఎవడైనా ఒక నగ
రును కట్టించ వలెనని యుంటే, దాని కొనసాగించు
టకు కావలసినది తనకు కలదో లేదో అని మొదట
29 కూర్చుండి తగులుబడి లెక్క చూచుకొనడా? । లేక
పోతే అతడు దాని పునాది వేసి ఒకవేళ దాని కొన
30 సాగించుటకు శక్తి లేనందున, । చూచే వారందరు—ఈ
మనుష్యుడు కట్టించుటకు మొదలుబెట్టెను గాని కొన
31 సాగించ లేకపోయెనని అతని అపహసింతురు. । మరి
యు, ఏ రాజైనా మరియొక రాజుతో యుద్ధము చేయ
బోతే; తన మీదికి ఇరువది వేలతో వచ్చేవాని, పది
వేలతో ఎదిరించుటకు శక్తి తనకు కలదో లేదో అని
మొదట కూర్చుండి ఆలోచించడా. । లేకపోతే, 32
అతడు ఇంకా దూరముగా ఉన్నప్పుడే, రాయభారు
లను పంపి సమాధానము కొరకు అడిగించును.

కాబట్టి ఆ ప్రకారమే మీలో ఎవడు తనకు కలి 33
గినదంతయు విడిచిపెట్టడో వాడు నా శిష్యుడు కా
నేరడు. । ఉప్పు మంచిది గాని ఉప్పు నిస్సారమైతే, 34
దేనివల్ల దానికి రుచి కలుగును? । అది భూమికైనా 35
పెంటకైనా పనికిరాదు గనుక అది బైట పోతురు.
వినుటకు చెవులు గలవాడు వినుగాక అని వారితో
చెప్పెను.

## 15. అధ్యాయము.

అప్పుడు సమస్తమైన సుంకరులు, పాపులు ఆయన 1
మాట వినుటకు ఆయన సమీపమునకు వస్తూ ఉన్న
ప్పుడు, । ఫరిసైయులు, శాస్త్రులును చూచి — వీడు 2
పాపులను చేర్చుకొని వారితో కూడా భోజనము
చేస్తున్నాడని సణుగుకొనుచుండిరి.

అయితే ఆయన వారితో ఈ ఉపమానము చెప్పె 3
ను, । మీలో ఏ మనుష్యునికైనా నూరు గొర్రెలు కలిగి 4
యున్నప్పుడు, వాటిలో ఒకటి తప్పిపోతే తొంబది
తొమ్మిదింటిని అడవిలో విడిచి, తప్పిపోయినది దొరికే
పర్యంతము దాని నిమిత్తము వెళ్లడా? । అప్పుడు దాని 5
కనుగొని సంతోషముతో తన భుజములమీద వేసు
కొని ఇంటికి వచ్చి తన స్నేహితులను, । పొరుగువా 6
రిని పిలిచి — మీరు నాతో కూడా సంతోషించండి,
తప్పిపోయిన గొర్రెను కనుగొన్నానని వారితో చెప్పు
ను గదా. । అటువలె మారుమనస్సు అక్కరలేని 7
తొంబది తొమ్మిదిమంది నీతిమంతుల కంటే మారు
మనస్సు పొందే ఒక్క పాపిని గూర్చి ఆకాశమందు
సంతోషము కలుగునని మీతో చెప్పుతున్నాను.

మరియు ఏ స్త్రీకైనా పది వెండి రూకలు కలిగి 8
యున్నప్పుడు వాటిలో ఒక రూక పోగొట్టుకొంటే
ఆమె దీపము వెలిగించి ఇల్లు తుడిచి అది దొరికే
పర్యంతము జాగ్రత్తగా వెతకదా? । ఆమె దాని కను 9
గొని తన చెలికత్తెలను పొరుగువారిని పిలిచి—నేను
పోగొట్టుకొనిన రూక దొరికెను గనుక నాతో సం
తోషించండని వారితో చెప్పును గదా! । ఆలాగే మ 10
నస్సు తిప్పుకొనే ఒక పాపిని గూర్చి దేవుని దూత
లయెదుట సంతోషము కలుగునని మీతో చెప్పుతు
న్నాను.

మరియు ఆయన ఇట్లనెను—ఒక మనుష్యునికి 11
ఇద్దరు కుమారులు ఉండిరి. । వారిలో చిన్నవాడు— 12

తండ్రి! ఆస్తిలో నాకు వచ్చే పాలు ఇమ్మని తండ్రితో
పలికినప్పుడు ఆయన వారికి తన ఆస్తిని పంచిపెట్టె
13 ను. । కొన్ని దినములైన తరువాత ఆ చిన్న కుమారుడు
సమస్తము కూర్చుకొని, దూరదేశమునకు ప్రయాణ
మై వెళ్లి తన ఆస్తిని దుర్వ్యాపారమువల్ల పాడుచే
14 సెను. । అదంతయు వ్యయముచేసిన తరువాత, ఆ దేశ
మందు పెద్ద కరువు పట్టెను. అప్పుడు అతడు ఇబ్బం
15 దిపడ సాగెను. । అప్పుడు అతడు వెళ్లి, ఆ దేశస్థుల
లో ఒకనికి లోబడి* యుండెను. అతడు పందులను
16 మేపుటకు తన పొలములలోకి అతని పంపెను. । అతడు
పందులు తినే పొట్టుతో తన కడుపు నింపుకొనుటకు
ఆశపడెను గాని ఎవడును అతనికి ఇయ్యలేదు.

17 అయితే బుద్ధి వచ్చి† అతడు—నా తండ్రియొద్ద
ఎంతో మంది కూలివాండ్లకు రొట్టెలు అతి విస్తారమై
యున్నవి! అయితే నేను ఆకలివల్ల నశించిపోతున్నా
18 ను. । నేను లేచి నా తండ్రియొద్దికి వెళ్లి—ఓ తండ్రీ!
నేను ఆకాశమునకు విరోధముగాను నీ యెదుటను
19 పాపము చేసియున్నాను; । ఇకమీదట నీ కుమారు
డనని చెప్పబడుటకు యోగ్యుడను కాను; నన్ను నీ
కూలివాండ్లలో ఒకని వలె చేయుమని ఆయనతో
చెప్పుదుననుకొని, లేచి తన తండ్రి యొద్దికి వెళ్లెను.
20 అయితే అతడు ఇంకా దూరముగా ఉన్నప్పుడు, అ
తని తండ్రి అతని చూచి కనికరించి, పరుగెత్తి అతని
21 మెడమీద పడి అతని ముద్దుబెట్టుకొనెను. । అప్పుడు
ఆ కుమారుడు—తండ్రీ! నేను ఆకాశమునకు విరోధము
గాను నీ యెదుటను పాపము చేసియున్నాను; ఇక
మీదట నీ కుమారుడనని చెప్పబడుటకు యోగ్యుడను
22 కానని ఆయనతో పలికెను. । అయితే తండ్రి—
ప్రధాన వస్త్రము తెచ్చి ఇతనికి తొడిగించి, ఇతని
చేతికి ఉంగరము పెట్టి, పాదములకు చెప్పులు తొడి
23 గించండి; । కొవ్విన దూడను తీసుకొనివచ్చి వధించుడి;
24 మనము తిని సంతోషపడుదాము; । ఈ నా కుమారుడు
చనిపోయి తిరిగి బ్రతికెను, తప్పిపోయి దొరికెనని
తన నౌకరులతో చెప్పెను. అప్పుడు వారు సంతోష
పడసాగిరి.

25 అయితే ఆయన పెద్ద కుమారుడు పొలములో ఉం
డెను. అతడు వస్తూ, ఇంటికి సమీపించినప్పుడు, వా
26 ద్యము నాట్యమును విని । నౌకరులలో ఒకని పిలిచి—
27 ఇవి యేమిటి? అని అడిగెను. । ఆ నౌకరు అతనితో—
నీ తమ్ముడు వచ్చెను. అతడు తనయొద్ద సురక్షితముగా
చేరినందున నీ తండ్రి కొవ్విన దూడను వధచేయించి
యున్నాడని చెప్పెను. । అయితే అతడు కోపగించి 28
లోపటికి వచ్చుటకు సమ్మతించ లేదు గనుక అతని
తండ్రి వెలపటికి వచ్చి అతని బతిమాలుకొనెను. ।
అయితే అతడు—ఇదుగో! ఇన్ని సంవత్సరములనుంచి 29
నేను నిన్ను సేవిస్తున్నాను, నీ ఆజ్ఞను నేను ఎప్పు
డును మీరలేదు. అయినప్పటికిని నేను నా స్నేహితు
లతో సంతోషపడేటట్టు నాకు ఎన్నడును ఒక మేక
పిల్లనైనా ఇయ్యలేదు. । అయితే నీ ఆస్తిని వేశ్యలతో 30
కూడా తినివేసిన ఈ నీ కుమారుడు రాగానే, వీని
కొరకు కొవ్విన దూడను వధ చేయించితివని తన తం
డ్రితో ఉత్తరము చెప్పెను. । అందుకు ఆయన—కుమా 31
రుడా! నీవు ఎల్లప్పుడును నాతోకూడా ఉన్నావు;
నావన్నియు నీవై యున్నవి. । మనము సంతోషపడి 32
ఆనందించుట యుక్తమే; నీ తమ్ముడైన ఇతడు చనిపోయి
తిరిగి బ్రతికెను, తప్పిపోయి దొరికెనని అతనితో
చెప్పెననెను.

## 16. అధ్యాయము.

మరియు ఆయన తన శిష్యులను చూచి—ధనవంతు 1
డైన ఒక మనుష్యుని యొద్ద ఒక గృహనిర్వాహకుడు
ఉండెను. వాడు అతని ఆస్తిని పాడుచేస్తున్నాడని,
అతని యొద్ద వానిమీద నేరము మోపబడెను. । అప్పు 2
డు అతడు వాని పిలిపించి—యెందుచేత నిన్ను గూర్చి
ఇది విన్నాను? నీ నిర్వాహకత్వపు లెక్క ను అప్పగిం
చుము; నీవు ఇకమీదట నిర్వాహకుడవై యుండరా
దని వానితో చెప్పెను. । అయితే ఆ గృహనిర్వా 3
హకుడు తనలో తాను—నా యజమానుడు ఈ నిర్వా
హకత్వమునుంచి నన్ను తప్పించి వేస్తున్నాడు గనుక
నేను ఏమిచేతును? నేను త్రవ్వలేను, భిక్షమెత్తుటకు
సిగ్గుపడుతున్నాను. । నేను ఈ నిర్వాహకత్వమునుంచి 4
తప్పించి వేయబడినప్పుడు, వారు నన్ను తమ ఇండ్ల
లోకి చేర్చుకొనే కొరకు, ఏమి చేయ వలెనో అది
నాకు తెలుసుననుకొని, । తన యజమానుని ఋణస్థు 5
లలో ప్రతివానిని పిలిపించి—నీవు నా యజమానునికి
యెంత అచ్చియున్నావు? అని మొదటివాని అడిగె
ను. । అందుకు వారు—నూరు మణుగుల నూనె అని 6
చెప్పినప్పుడు—నీవు నీ చీటి తీసుకొని త్వరగా కూ
ర్చుండి, యేబది అని వ్రాసుకొమ్మని వానితో చెప్పె
ను. । తరువాత అతడు—నీవు యెంత అచ్చియున్నావు? 7
అని మరియొకని అడిగెను. అందుకు వాడు—నూరు
తూముల గోధుములని చెప్పినప్పుడు వానితో—నీవు నీ
చీటి తీసుకొని, యెనబది అని వ్రాసుకొమ్మని చెప్పె

*లేక, ఒకనితో కలుసుకొని. †లేక, వివేకమంది.

8 ను.। అన్యాయముగల ఆ గృహనిర్వాహకుడు యుక్తి
గా జరిగించెనని అతని యజమానుడు అతని మెచ్చెను;
వెలుగుయొక్క కుమారులకంటే ఈ లోకముయొక్క
కుమారులు తమ తరములో యుక్తిమంతులై యున్నారు.

9 మీరు * వదిలిపోయినప్పుడు, వారు నిత్యమైన గుడా
రములలో మిమ్మును చేర్చుకొనే కొరకు అన్యాయపు
సిరివల్ల మీకు మీరే స్నేహితులను చేసుకొనండి అని
10 మీతో చెప్పుతున్నాను.। మిక్కిలి కొంచెములో నమ్మ
కముగా ఉండేవాడు ఎక్కువలోనును నమ్మకముగా
ఉండును. మిక్కిలి కొంచెములో అన్యాయముగా
ఉండేవాడు ఎక్కువలోనును అన్యాయముగా ఉం
11 డును.। కాబట్టి మీరు అన్యాయమైన సిరిలో నమ్మక
ముగా ఉండకపోతే, సత్యమైనది ఎవడు మీ వశము
12 చేసును?। మీరు పరుని సొమ్ముయందు నమ్మకముగా
ఉండకపోతే, మీ స్వంతమైనది మీకు ఎవడు అప్ప
13 గించును?। ఏ నౌకరును ఇద్దరు యజమానులను సేవించ
లేడు; వాడు ఒకని ద్వేషించి, మరియొకని ప్రేమిం
చును; లేక ఒకని యందు భక్తి కలిగి మరియొకని అల
క్ష్యపెట్టును. మీరు దేవునిని సిరినిని సేవించ లేరని
చెప్పెను.

14 లుబ్ధులైన ఫరిసెయులును ఈ మాటలన్నియు విని,
15 ఆయనను ఎగతాళి చేసిరి.। అప్పుడు ఆయన—మను
ష్యుల యెదుట మిమ్ము మీరే నీతిమంతులమనుకొం
టున్నారు; అయితే మీ హృదయములను దేవుడు
ఎరిగియున్నాడు; మనుష్యులలో గొప్పగా ఎంచబ
డినది యేదో అది దేవుని దృష్టికి అసహ్యమైనది.।
16 యోహాను మట్టుకు బోధనప్రమాణమును ప్రవక్త
లును ఉండిరి; అప్పటినుంచి దేవుని రాజ్యపు సువా
ర్త ప్రకటించబడుతున్నది; ప్రతివాడును అందులో
17 బలవంతముగా చొరబడుతున్నాడు.। అయితే బోధన
ప్రమాణములో రవంతైనా తప్పిపోవుటకంటే, ఆకా
శము భూమియు గతించిపోవుట సులువుగా ఉండును.

18 ఎవడైనా తన భార్యను విడిచి మరియొకతెను
వివాహము చేసుకొంటే, వాడు వ్యభిచారి. మరియు
పెనిమిటి విడిచినదాని ఎవడైనా వివాహము చేసు
కొంటే, అతడు వ్యభిచారి.

19 ధనవంతుడైన ఒక మనుష్యుడు ఉండెను. అతడు
ఊదారంగు బట్టలును సన్నపు నారబట్టలును వేసు
20 కొని ప్రతిదినము బహుగా సంతోషించేవాడు.। మరి
యు లాజరనే పేరుగల ఒక బీదవాడు ఉండెను.
అతడు కురుపులతో నిండినవాడై ధనవంతుని వీధి
ద్వారము దగ్గర వేయబడి। అతని బల్ల మీదనుంచి పడే 21
ముక్కలతో ఆకలి తీర్చుకొనుటకు కోరెను. అంతే
కాకుండా, కుక్కలు వచ్చి అతని కురుపులు నాకెను.।
ఆ బీదవాడు చనిపోయి దూతలచేత అబ్రాహాము 22
యొక్క రొమ్ము మీదికి కొంచుపోబడెను. ఆ ధనవం
తుడును చనిపోయి పాతిపెట్టబడెను.। అప్పుడు అత 23
డు అదృశ్యలోకములో వేదనపడుతు తన కన్నులెత్తి
దూరమునుంచి అబ్రాహామును, ఆయన రొమ్ముమీది
లాజరునును చూచి।—తండ్రివైన ఓ అబ్రాహామా! 24
నాయందు కనికరించి, లాజరు తన వేలి కొనను
నీళ్లలో ముంచి నా నాలుకను చల్లార్చుటకు అతని
పంపుము; నేను ఈ మంటలో యాతనపడుతున్నా
నని కంఠమెత్తి పలికెను.

అందుకు అబ్రాహాము—కుమారుడా! నీవు నీ జీవిత 25
కాలమందు నీ మంచి వస్తువులను పొందితివి; లాజరు
ఆలాగే చెడ్డ వస్తువులను పొందెనని జ్ఞాపకము తెచ్చు
కొనుము. అయితే ఇప్పుడు అతడు ఇక్కడ నెమ్మది
పొందుతున్నాడు, నీవు వేదనపడుతున్నావు.। ఇంతే 26
కాకుండా ఇక్కడనుంచి మీ యొద్దికి దాటుటకు
ఇచ్ఛయించే వారు దాట నేరకను, అక్కడివారు మా
యొద్దికి దాటకను ఉండేకొరకు మాకు మీకు మధ్యను
మహాగాధము స్థాపించబడి యున్నదని చెప్పెను.

అప్పుడు అతడు—తండ్రీ! ఆలాగైతే, నాకు అయి 27
దుగురు సహోదరులు ఉన్నారు గనుక। వారుకూడా 28
ఈ వేదన స్థలమునకు రాక ఉండే నిమిత్తము వారికి
సాక్ష్యమిచ్చుటకు, నా తండ్రి ఇంటికి అతని పంప
వలెనని నిన్ను వేడుకొంటున్నానని పలికెను.। అం 29
దుకు అబ్రాహాము—వారికి మోషేయు, ప్రవక్తలును
ఉన్నారు; వారి మాటలు విన వలెనని అతనితో చెప్పి
నప్పుడు,। అతడు — తండ్రివైన ఓ అబ్రాహామా! ఆ 30
లాగు కాదు; అయితే చనిపోయిన వారిలోనుంచి
ఒకడు వారి యొద్దికి వెళ్లితే వారు మనస్సు తిప్పు
కొందురని పలికెను.। అందుకు ఆయన—మోషేయు, 31
ప్రవక్తలును పలికిన మాటలు వారు వినకపోతే, చని
పోయిన వారిలోనుంచి ఒకడు లేచినప్పటికిని వారు
నమ్మరని అతనితో చెప్పెనసెను.

## 17. అధ్యాయము.

మరియు ఆయన తన శిష్యులతో ఇట్లనెను—ఆతంక 1
ములు రాకపోవుట అసాధ్యమై యున్నది. అయితే
ఎవనివల్ల వచ్చునో, వానికి శ్రమ!। వాని మెడకు 2

* లేక, అది.

తిరగటి రాయి కట్టబడి సముద్రములో పడద్రోయ
బడితే ఈ చిన్నవారిలో ఒకనికి ఆతంకము కలుగ
చేయుటకంటె వానికి మేలై యుండును.
3 మీకు మీరే జాగ్రత్తపడండి; నీ సహోదరుడు
నీకు విరోధముగా తప్పు చేసితే అతని గద్దించుము;
అతడు మనస్సు తిప్పుకొంటే అతని క్షమించుము.
4 మరియు అతడు ఒక దినమున ఏడుమార్లు నీకు విరో
ధముగా తప్పు చేసి, ఆ దినమున యేడుమార్లున్ నీ
తట్టు తిరిగి—పశ్చాత్తాపపడుతున్నానని చెప్పితే, అతని
క్షమించ వలెనని చెప్పెను.
5 అప్పుడు అపొస్తలులు—మా విశ్వాసము ఎక్కువ
6 చేయుమని ప్రభువుతో పలికిరి. అందుకు ప్రభువు—
మీరు ఆవగింజంత విశ్వాసము గలవారైతే — నీవు
వేరుతో పెల్లగించబడి సముద్రములో నాటబడుదువు
గాక అని ఈ మేడి చెట్టుతో చెప్పేటప్పుడు అది
7 మీకు విధేయమవును. అయితే మీలో ఎవనికైనా
దున్నేవాడే గాని మేపేవాడే గాని ఒక దాసుడు
కలిగియుండగా అతడు—నీవు ఇప్పుడే వెళ్లి భోజనము
చేయుమని పొలములోనుంచి వచ్చిన ఆ దాసునితో
8 చెప్పునా? చెప్పడు. —నేను రాత్రిభోజనము చేయు
టకు ఏమైనా సిద్ధపరిచి, నడుము కట్టుకొని, నేను
అన్నపానములు పుచ్చుకొనే పర్యంతము నా పరిచర్య
చేయుము, ఆ తరువాత నీవు అన్నపానములు పుచ్చు
9 కొన వచ్చునని వానితో చెప్పునుగదా. ఆ దాసుడు
తనకు విధించబడిన వాటిని చేసినందున,—అది దయ
అని అతడు వాని మెచ్చునా? ఆలాగు తోచదు.
10 అటువలె మీరును మీకు విధించబడినవన్నియు చేసిన
తరువాత—మేము పనికిమాలిన దాసులమై యున్నా
ము, మేము చేయతగిన వాటినే చేసియున్నామని పలు
కండనెను.
11 మరియు ఆయన యెరూషలేముకు ప్రయాణమై
వెళ్లుతు, సమరైయ గలిలైయ దేశముల మధ్యనుంచి
వెళ్లెను.
12 ఆయన ఒక గ్రామములోకి వెళ్లుచుండగా కుష్ఠ
రోగులు పదిమంది మనుష్యులు ఆయనకు ఎదురుగా
13 వచ్చి, దూరమందు నిలిచి, —యేసూ! ప్రభువా! మమ్ము
14 కరుణించుమని కంఠమెత్తి పలికిరి. ఆయన వారిని
చూచి—మీరు వెళ్లి మిమ్ము యాజకులకు అగుపరచు
కొనండని వారితో చెప్పెను. వారు వెళ్లుచుండగా
15 వారికి శుద్ధియైనది. అప్పుడు వారిలో ఒకడు తనకు
16 స్వస్థత కలుగుట చూచి, గొప్ప శబ్దముతో దేవుని
మహిమపరుస్తు, తిరిగి వచ్చి తన కృతజ్ఞత ఆయనకు
తెలుపుతు, ఆయన పాదముల యొద్ద సాగిలపడెను.
అతడు సమరైయుడు. అందుకు యేసు—పదిమంది 17
శుద్ధి పొందిరి గదా, ఆ తొమ్మండుగురు ఎక్కడ ఉ
న్నారు? ఈ పరదేశి గాక దేవుని మహిమపరుచుటకు 18
తిరిగి వచ్చిన వాడెవడును అగుపడ లేదని ఉత్తరమి
చ్చి, అతనితో—నీవు లేచి పొమ్ము, నీ విశ్వాసము 19
నిన్ను రక్షించెనని పలికెను.
దేవుని రాజ్యము ఎప్పుడు వచ్చునని ఫరిసైయులు 20
ఆయనను అడిగినప్పుడు, ఆయన—దేవుని రాజ్యము
ప్రత్యక్షముగా రాదు. మరియు ఇక్కడ చూడుము, 21
అక్కడ చూడుము అని చెప్పరు; ఇదుగో! దేవుని
రాజ్యము మీ అంతరంగమందు ఉన్నదని వారితో
ఉత్తరము చెప్పెను.
అప్పుడు ఆయన—మనుష్య కుమారుని దినములలో 22
ఒక (దినము) చూడ వలెనని మీరు కోరే దినములు వచ్చు
ను; అయితే మీరు దాని చూడరు. అప్పుడు వారు— 23
ఇదుగో! ఇక్కడ, అదుగో! అక్కడ అని మీతో పలి
కితే, మీరు వారి యొద్దికి వెళ్లకండి, వారిని వెంబడిం
చకండి; ఆకాశము కింద ఒక వైపునుంచి మెరిసే 24
మెరుపు ఆకాశము కింద ఎదుటివైపు మట్టుకు ఏలాగు
ప్రకాశించునో, ఆలాగు మనుష్య కుమారుడు తన
దినమున ఉండును. అయితే ఆయన, ముందుగా 25
అనేక శ్రమలు పొంది ఈ వంశముచేత నిరాకరించ
బడ వలెను.
నోవహు దినములలో ఏలాగు జరిగెనో ఆలాగు 26
మనుష్య కుమారుని దినములలోనుండును. నోవహు 27
నావలోకి వెళ్లిన దినము మట్టుకు వారు తింటు తాగు
తును, పెండ్లి చేసుకొంటు పెండ్లికియ్యబడుతును ఉం
డిరి. అప్పుడు జలప్రళయము వచ్చి వారినందరిని
నాశము చేసెను. ఆలాగున లోతుయొక్క దినము 28
లలో కూడా జరిగినట్టే ఉండును. వారు తింటు
తాగుతును, కొంటు అమ్ముతును, నాటుతును ఇండ్లను
కట్టుతును ఉండిరి. అయితే లోతు సొదొమనే పట్ట 29
ణములోనుంచి బైలువెళ్లిన దినమందు, ఆకాశమునుంచి
అగ్నియు గంధకమును కురిసి వారినందరిని నాశము
చేసెను. ఆప్రకారమే మనుష్య కుమారుడు ప్రత్యక్ష 30
మయే దినమందు ఉండును.
ఆ దినమున ఎవడైనా మేడమీద ఉన్నప్పుడు, అతని 31
సామగ్రి ఇంట్లో ఉంటే, అతడు దాని తీసుకొని వెళ్లు
టకు దిగ కూడదు. ఆలాగే పొలములో ఉండేవాడు
తిరిగి రా కూడదు. లోతుయొక్క భార్యను జ్ఞాపకము 32
చేసుకొనండి. తన ప్రాణము ఎవడు రక్షించుకొను 33
టకు వెతుకునో వాడు దాని పోగొట్టుకొనును; ఎవడు
దాని పోగొట్టుకొనునో వాడు దాని కాపాడుకొ

34 సును. । ఆ రాత్రియందు ఇద్దరు ఒక్క మంచము
మీద ఉన్నప్పుడు, వారిలో ఒకడు కొంచుపోబడును,
35 మరియొకడు విడువబడును. । ఇద్దరు ఒక్క తిరగలి
విసురుచుండగా, ఒకతె కొంచుపోబడును, ఒకతె
36 విడువబడును. । ఇద్దరు పొలములో ఉన్నప్పుడు ఒకడు
కొంచుపోబడును ఒకడు విడువబడును అని మీతో
చెప్పుతున్నానని తన శిష్యులతో పలికెను.

37 అందుకు వారు—ప్రభువా! ఎక్కడనని ఆయనను
అడిగినందుకు ఆయన—పీనుగ ఎక్కడనో అక్కడ
గద్దలు కూడునని వారితో చెప్పెను.

## 18. అధ్యాయము.

1 వారు విసుకక నిత్యము ప్రార్థన చేయ వలెనని
2 ఆయన వారితో ఈ ఉపమానము చెప్పెను. । దేవు
నికి భయపడక, మనుష్యులను లక్ష్యపెట్టని ఒక న్యా
3 యాధిపతి ఒక పట్టణములో ఉండెను. । ఆ పట్టణ
ములో ఒక విధవ కూడా ఉండెను. ఆమె అతని యొ
ద్దికి వచ్చి—నా ప్రతివాదికిని నాకును న్యాయము
4 తీర్చుమని పలికినప్పుడు, । అతనికి కొంత కాలముమ
ట్టుకు మనస్సు లేకపోయెను. అయితే ఆతరువాత
అతడు — నేను దేవునికి భయపడక మనుష్యులను
5 లక్ష్యపెట్టక పోయినప్పటికిని । ఈ విధవ నన్ను ఆ
యాసపెట్టుతున్నది గనుక, ఆమె నిత్యము వచ్చి నన్ను
విసికించక ఉండుటకు, ఆమెను గూర్చి న్యాయము
తీర్తునని తనలో తాను అనుకొనెను.

6 మరియు ప్రభువు ఇట్లనెను — ఆ అన్యాయమైన
7 అధిపతి చెప్పిన మాట వినండి. । దేవుడు తాను ఏర్ప
రుచుకొనిన వారు దివారాత్రులు తన్ను పిలిచి వేడు
కొంటు ఉన్నప్పుడు, వారి విషయము, ఆయన దీర్ఘ
శాంతుడైనప్పటికి, వారికి న్యాయము తీర్చడా? ।
8 ఆయన వారికి త్వరగా న్యాయము తీర్చునని మీతో
చెప్పుతున్నాను. అయినప్పటికి మనుష్య కుమారుడు
వచ్చేటప్పుడు, ఆయన భూమిమీద ఈ విశ్వాసము
కనుగొనునా? అని పలికెను.

9 తామే నీతిమంతులమని తమ్ము నమ్ముకొని ఇతరులను
తిరస్కరించే కొందరితో ఆయన ఈ ఉపమానము
10 చెప్పెను. । ఇద్దరు మనుష్యులు ప్రార్థన చేయుటకు
గుడికి వెళ్లిరి. వారిలో ఒకడు ఫరిసైయుడు, మరి
11 యొకడు సుంకపు గుత్తవారుడు. । ఆ ఫరిసైయుడు
నిలువబడి — దేవా! నేను చోరులు, అన్యాయస్థులు
వ్యభిచారులునైయున్న ఇతర మనుష్యుల వలెనైనా,
ఈ సుంకపు గుత్తదారుని వలెనైనా ఉండనందున, నిన్ను
స్తోత్రము చేస్తున్నాను. । వారమునకు రెండు మారులు 12
ఉపవాసము చేస్తు, నేను సంపాదించే అన్నిటిలో
పదోవంతు చెల్లిస్తున్నానని తనలో తాను ప్రార్థన
చేసెను. । అయితే ఆ సుంకరి దూరముగా నిలిచి, 13
ఆకాశముతట్టు కన్నులు ఎత్తుటకైనా ధైర్యము చాలక,
తన రొమ్మును కొట్టుకొని — దేవా! పాపినైన నన్ను
కరుణించుమని పలికెను. । అతనికంటే ఇతడు నీతి 14
మంతుడని తీర్చబడి తన ఇంటికి వెళ్లెనని మీతో
చెప్పుతున్నాను; తన్ను తాను హెచ్చించుకొనే వాడు
తగ్గించబడుననియు, తన్ను తాను తగ్గించుకొనే వాడు
హెచ్చించబడుననియు చెప్పెను.

అప్పుడు ఆయన వారిని ముట్ట వలెనని, ఆయన 15
యొద్దికి తమ శిశువులను తీసుకొని వచ్చిరి. ఆయన
శిష్యులు దాని చూచి వారిని గద్దించిరి. । అయితే 16
యేసు వారిని తన యొద్దికి పిలిచి—చిన్న పిల్లలను నా
యొద్దికి రానియ్యండి, వారిని నిషేధించకండి; దేవుని
రాజ్యము ఈలాటివారిదై యున్నది. । చిన్న పిల్లవలె 17
ఎవడు దేవుని రాజ్యమును అంగీకరించడో వాడు
దానిలో ఎంత మాత్రమును ప్రవేశించడని మీతో
నిశ్చయముగా చెప్పుతున్నాననెను.

ఒక అధికారి ఆయనను చూచి—మంచి బోధకు 18
డా! నేను నిత్యజీవము పొందుటకు, ఏమి చేయ వలె
నని ఆయనను అడిగెను. । అందుకు యేసు— నన్ను 19
మంచివానిగా ఎందుకు చెప్పుతున్నావు! ఒక్కడే
అనగా దేవుడేగాని మరి యెవడును మంచివాడు
కాడు. ।—వ్యభిచరించ వద్దు, నరహత్య చేయ వద్దు, 20
దొంగిల వద్దు, అబద్ధ సాక్ష్యము పలుక వద్దు, నీ తం
డ్రిని నీ తల్లిని ఘనపరుచుమనే ఆజ్ఞలను ఎరుగుదు
వని వానితో పలికెను. । అందుకు వాడు — వీటినన్ని 21
టిని నా బాల్యమునుంచి గైకొనియున్నానని చెప్పెను.

యేసు వీటిని విని—ఇంకా ఒకటి నీకు కొదువగా 22
ఉన్నది; నీకు కలిగినవన్ని అమ్మి బీదలకు ఇమ్ము; అప్పు
డు ఆకాశములో నీకు ధనము కలిగి యుండును. మరి
యు నీవు వచ్చి నన్ను వెంబడించుమని అతనితో
పలికెను.

అయితే అతడు మిక్కిలి ధనవంతుడు గనుక, అత 23
డు వీటిని విని మిక్కిలి దుఃఖపడెను. । అప్పుడు యేసు 24
అతడు మిక్కిలి దుఃఖపడుట చూచి — ఆస్తిగలవారు
ఎంత దుర్లభముగా దేవుని రాజ్యమందు ప్రవేశింతు
రో! । ధనవంతుడు దేవుని రాజ్యములో ప్రవేశించుట 25
కంటె, సూది బెజ్జములో ఒంటె దూరుట సులభమని
చెప్పెను.

26 దాని వినిన వారు—ఆలాగైతే ఎవడు రక్షణ పొంద
27 గలడని పలికిరి. । అందుకు ఆయన—మనుష్యులకు అసా
ధ్యమైనవి దేవునికి సాధ్యమైనవని చెప్పెను.
28 అప్పుడు పేతురు — ఇదిగో! మేము సమస్తమును
29 విడిచి నిన్ను వెంబడించినామని పలికెను. । అందుకు
ఆయన — దేవుని రాజ్యముకొరకు ఇంటినైనా, తలిదం
డ్రులనైనా, అన్నదమ్ములనైనా, భార్యనైనా, పిల్లలనై
30 నా విడిచి । ఈ కాలమందు చాలా రెట్లు ఎక్కువను,
వచ్చే లోకమందు నిత్యజీవమును పొందని వాడెవ
డును లేడని మీతో నిశ్చయముగా చెప్పుచున్నానని
వారితో పలికెను.
31 అప్పుడు ఆయన పన్నెండు మందిని పిలిచి—ఇదు
గో! యెరూషలేముకు వెళ్లుచున్నాము; ప్రవక్తలచేత
మనుష్య కుమారుని గూర్చి వ్రాయబడినవన్నియు నెర
32 వేర్చబడును; । ఆయన రాష్ట్రములకు అప్పగించబడి
అపహాస్యము అవమానమును పొంది, ఉమ్మివేయబడు
33 ను. । మరియు వారు ఆయనను వారులతో కొట్టి చంపు
దురు; ఆయన మూడవ దినమున తిరిగి లేచునని చెప్పెను.
34 వారు వీటిలో ఒకటైనను గ్రహించ లేదు. ఈ
మాట వారికి మరుగు చేయబడెను; చెప్పబడినవి వా
రికి బోధపడలేదు.
35 తర్వాత ఆయన యెరిఖో అనే పట్టణమునకు సమీ
పించినప్పుడు ఒక గుడ్డివాడు దారిలో కూర్చుండి అడు
36 గుకొనుచుండెను. । అతడు దాటిపోయే సమూహము
యొక్క (చప్పుడు) విని—ఇది ఏమని అడిగినప్పుడు ।
37 వారు—నజోరైయుడైన యేసు ఈలాగు వెళ్లుచున్నా
38 డని అతనితో చెప్పిరి. । అప్పుడు అతడు—యేసూ! దా
వీదు కుమారుడా! నన్ను కరుణించుమని కంఠమెత్తి పలి
39 కెను. ।—ఊరకుండుమని, ముందర నడిచేవారు అతని
గద్దించిరి. అయితే అతడు మరి ఎక్కువగా—దావీదు
కుమారుడా! నన్ను కరుణించుమని కంఠమెత్తి పలికెను.
40 అప్పుడు యేసు నిలిచి, అతని తన యొద్దికి తీసు
కొని రమ్మని ఆజ్ఞాపించెను. అతడు దగ్గిరికి వచ్చినప్పు
41 డు । ఆయన—నేను నీకు ఏమి చేయ కోరుచున్నావని
అడిగెను. అందుకు వాడు — ప్రభువా! నేను చూచు
42 టకని చెప్పినప్పుడు । యేసు అతనితో — చూడుము;
43 నీ విశ్వాసము నిన్ను రక్షించెనని చెప్పెను. । వెంటనే
అతడు చూచి దేవుని మహిమపరుచుచు, ఆయనను
వెంబడించెను. అప్పుడు ప్రజలందరు దాని చూచి
దేవుని స్తుతించిరి.

## 19. అధ్యాయము.

తరువాత ఆయన యెరిఖో అనే పట్టణమందు 1
ప్రవేశించి, దానిలోనుంచి వెళ్లుచుండగా । ఇదిగో! 2
జక్కయ్య అనే మనుష్యుడు ఉండెను. । అతడు సుం 3
కపు గుత్తదారులలో పెద్దవాడును ధనికుడునై ఉండె
ను. అతడు యేసు ఎవడో ఆయనను చూడ వలెనని
కోరెను. అయితే పొట్టివాడైనందున, సమూహమువల్ల
(చూడ) లేకపోయెను. । అప్పుడు అతడు ముందుగా 4
పరుగెత్తి, ఆయన ఆలాగు రాబోయెను గనుక ఆయ
నను చూచుటకు ఒక మేడిచెట్టు ఎక్కెను. । యేసు 5
ఆ చోటికి వచ్చినప్పుడు, కన్నులెత్తి అతని చూచి—
జక్కయ్యా! త్వరగా దిగుము; నేను నీ ఇంట్లో నేడు
ఉండ వలెనని అతనితో చెప్పెను. । అప్పుడు అతడు 6
త్వరగా దిగి సంతోషముతో ఆయనను చేర్చుకొనెను.
అందరు దాని చూచి—ఈయన పాపియైన మను 7
ష్యుని యొద్ద అతిథియై ఉండుటకు వెళ్లెనని సణుగు
కొనిరి. । అప్పుడు జక్కయ్య నిలిచి—ఇదిగో! ప్రభు 8
వా! నా ఆస్తిలో సగము బీదలకు ఇస్తున్నాను; నేను
ఎవని యొద్దనైనా అన్యాయముగా దేనినైనను పుచ్చు
కొని ఉంటే, అతనికి నాలుగంతలు తిరిగి ఇస్తున్నా
నని ప్రభువుతో చెప్పెను. । అందుకు యేసు — నేడు 9
రక్షణ ఈ ఇంటికి వచ్చెను; ఇతడు కూడా అబ్రాహా
ము కుమారుడు; । నశించినదాని వెతికి రక్షించుటకు 10
మనుష్యకుమారుడు వచ్చెనని అతనితో పలికెను.
వారు వీటిని వినుచుండగా, తాను యెరూషలే 11
ముకు సమీపముగా ఉండుటవల్లను, దేవుని రాజ్యము
వెంటనే అగపడబోయెనని వారికి తోచుటవల్లను
ఆయన మరియొక ఉపమానము చెప్పెను. । కాబట్టి 12
ఆయన ఇట్లనెను. — రాజకుమారుడు* ఒక రాజ్యము
సంపాదించుకొని తిరిగి రా వలెనని దూరదేశమునకు
ప్రయాణమై, । తన నౌకరులను పదిమందిని పిలిచి 13
వారికి పది మినాలు† ఇచ్చి—నేను వచ్చే పర్యంతము,
వ్యాపారము చేయండని వారితో చెప్పెను. । అయితే 14
ఆయన పట్టణస్థులు ఆయన యందు పగబట్టి—ఇతడు
మా మీద రాజై యుండుట మాకు ఇష్టము లేదని,
ఆయన వెనుకను రాయభారము పంపిరి.
ఆయన ఆ రాజ్యము సంపాదించి తిరిగి వచ్చిన 15
ప్పుడు,—ప్రతివాడును ఏయే వ్యాపారము చేసెనో
తెలుసుకొనుటకు, తాను సొమ్మిచ్చిన నౌకరులను తన
యొద్దికి పిలువుమని చెప్పెను. । మొదటివాడు వచ్చి— 16
ప్రభువా! నీ మినావల్ల మరి పది మినాల లాభము

*లేక, కులీనుడు. †మినా అనగా, కొంచెము యెక్కువ నలభైరూపాయీలు.

17 కలిగినదని పలికెను. । అందుకు ఆయన—భళా! మంచి
నౌకరూ! నీవు కొద్దిలో నమ్మకముగా ఉన్నావు గనుక,
నీవు పది పట్టణముల మీద అధికారము గలవాడవై
ఉండుమని అతనితో చెప్పెను.
18 అప్పుడు రెండవవాడు వచ్చి—ప్రభువా! నీ మినా
19 వల్ల అయిదు మినాలైనవని చెప్పెను. । ఆయన—నీవు
కూడా అయిదు పట్టణముల మీద ఉండుమని అతనితో
చెప్పెను.
20 అప్పుడు మరి ఒకడు వచ్చి—ప్రభువా! ఇదుగో!
21 నీ మినా; అది నేను రుమాలున కట్టి ఉంచినాను;। నీవు
కఠిన మనుష్యుడవై ఉండి, నీవు ఉంచని దాని ఎత్తు
కొనుచు, విత్తని దాని కోయుచున్నావు గనుక నీకు
22 భయపడుచుంటినని చెప్పెను.। అందుకు ఆయన—చెడ్డ
నౌకరూ! నీ నోటి మాట చొప్పున నీకు తీర్పు చేతును.
నేను ఉంచని దాని ఎత్తుచు, విత్తని దాని కోయుచున్న
23 కఠిన మనుష్యుడనని నీకు తెలుసును, గనుక। నీవు
ఎందుకు నా సొమ్ము కొఠీలో ఉంచలేదు? అప్పుడు
నేను వచ్చి వడ్డితో దాని పుచ్చుకొందునని వానితో
24 పలికి।—ఇతని యొద్ద ఆ మినా పుచ్చుకొని, పది మినా
లు గల వానికి దాని ఇయ్యుండని, దగ్గిర నిలిచిన వారి
25 తో చెప్పినప్పుడు । వారు—ప్రభువా! వానికి పది మి
26 నాలు కలిగి ఉన్నవని పలకగా।—కలిగిన ప్రతివానికిని
ఇయ్యబడును; లేనివాని యొద్దనుంచి అతనికి కలిగినది
సహా పుచ్చుకొనబడునని మీతో చెప్పుచున్నాను.।
27 మరియు నేను తమ్మును ఏలుటకు మనస్సు లేని నా
శత్రువులను ఇక్కడికి తీసుకొని వచ్చి, నా యెదుట
28 నరికివేయుడని చెప్పెననెను. । ఆయన ఆ మాటలు
చెప్పి యెరూషలేముకు వెళ్లుటకు ముందు సాగెను.
29 ఆయన ఒలీవ వనమనబడిన కొండ దగ్గిర ఉన్న
బేత్ఫగే, బేథనియ అనే ఊళ్లకు సమీపించినప్పుడు,
30 ఆయన తన శిష్యులలో ఇద్దరిని పిలిచి।—మీరు ఎదు
టనున్న పల్లెకు వెళ్లండి; అందులో మీరు ప్రవేశిం
చుచు, కట్టబడిన ఒక గాడిదె పిల్లను చూతురు; దాని
మీద ఏ మనుష్యుడైనను ఎన్నడును కూచుండలేదు;
31 దాని విప్పి తీసుకొని రండి. । అప్పుడు ఎవడైనను—
మీరు ఎందుకు దీని విప్పుచున్నారని మిమ్మును అడి
గితే — ఇది ప్రభువుకు కావలసి ఉన్నదని అతనితో
చెప్పండని వారిని పంపెను.
32 పంపబడిన వారు వెళ్లి, ఆయన తమతో చెప్పిన
33 ప్రకారమే చూచిరి. । వారు ఆ గాడిదె పిల్లను విప్పు
చుండగా, దాని యజమానులు — మీరు ఆ గాడిదె
34 పిల్లను ఎందుకు విప్పుచున్నారని వారిని అడిగిరి. । అం
దుకు వారు — ఇది ప్రభువుకు కావలసి ఉన్నదని
చెప్పిరి. । తరువాత వారు యేసు యొద్దికి దాని తీసు 35
కొని వచ్చి, ఆ గాడిదెపిల్ల మీద తమ బట్టలు వేసి,
యేసుని దాని మీద ఎక్కించి । ఆయన వెళ్లుచుం 36
డగా, తమ వస్త్రములను దారి పొడుగున పరిచిరి.

ఒలీవ చెట్ల కొండనుంచి దిగే చోటికి ఆయన 37
సమీపించుచున్నప్పుడు, శిష్యుల సమూహమంతయు
సంతోషించి—

ప్రభువు పేరట వచ్చే రాజు దీవించబడుగాక, 38
ఆకాశమందు సమాధానము,
సర్వోన్నతమైనవాటిలో మహిమయునుండుగాకని,
తాము చూచిన గొప్ప కార్యములనుగూర్చి, మహా
శబ్దముతో దేవుని స్తోత్రము చేయనారంభించిరి.

అయితే ఆ సమూహములోనున్న కొందరు ఫరి 39
సైయులు — బోధకుడా! నీ శిష్యులను గద్దించుమని
ఆయనతో చెప్పిరి.। అందుకు ఆయన—వీరు ఊరకుంటే 40
ఈ రాళ్లు కేకలు వేసునని మీతో చెప్పుచున్నానని
వారికుత్తరమిచ్చెను.

ఆయన సమీపించినప్పుడు, పట్టణము చూచి దాని 41
గూర్చి ఏడ్చి।—నీవు ఈ నీ దినమందైనను నీ సుఖసంబం 42
ధమైన వాటిని తెలుసుకొంటే మేలు; ఇప్పుడు అవి
నీ కన్నులకు మరుగు చేయబడినవి.। నీ శత్రువులు నీ 43
చుట్టు గట్టు కట్టి, ముట్టడి వేసి, అంతటను నిన్ను అరి
కట్టి నీలో ఉన్న నీ పిల్లలతోకూడా నిన్ను నేల కలిపి।
నీలో రాతి మీద రాయి ఉండనియ్యని దినములు వచ్చు 44
ను; నీ దర్శనకాలము నీవు ఎరుగ లేదని చెప్పెను.

తరువాత ఆయన గుడిలో ప్రవేశించి—మరియు 45,46
నా ఇల్లు ప్రార్థన ఇల్లు,* అయినను అది దొంగల
గుహగా చేసితిరని వ్రాయబడి యున్నది, అని వారి
తో చెప్పి, అందులో అమ్మే వారిని, కొనే వారిని వెల
పటికి తోలివేయనారంభించెను.

ఆయన ప్రతిదినమున గుడిలో బోధించుచున్నప్పు 47
డు, ప్రధానయాజకులు శాస్త్రులు ప్రజలలో ప్రధా
నులును ఆయనను నాశము చేయుటకు వెతుకుచుం
డిరి. । అయితే ప్రజలందరు ఆయన వాక్యమును విను 48
టకు అత్యాసక్తిగా ఉండిరి గనుక వారు ఏమి చేయ
వలెనో దాని కనుగొన లేదు.

## 20. అధ్యాయము.

ఆ దినములలో ఒకనాడు ఆయన గుడిలో ప్రజ 1
లకు బోధించుచు, సువార్తను ప్రకటించుచున్నప్పు

* యెషయ. 56: 7.

డు, ప్రధానయాజకులు, శాస్త్రులును పెద్దలతో కూడా
2 ఆయన మీదికి వచ్చి।—నీవు ఏ అధికారము వల్ల వీటిని
చేయుచున్నావో, ఈ అధికారము ఎవడు నీకు ఇచ్చె
3 నో, అది మాతో చెప్పుమని ఆయనతో పలికిరి. । అం
దుకు ఆయన—నేనును మిమ్మును ఒక మాట అడుగుదు
4 ను, నాకు ఉత్తరమియ్యండి; । యోహాను బాప్తిస్మము,
ఆకాశమునుంచి వచ్చెనా? లేక మనుష్యుల వల్ల కలిగి
నదా అని వారిని అడిగెను.
5 అప్పుడు వారు — మనము ఆకాశమునుంచి అని
పలికితే, ఈయన — ఆలాగైతే మీరు ఎందుకు అతని
6 నమ్మలేదని అడుగును; । మనుష్యుల వల్లనే అని పలికితే,
ప్రజలందరు మనలను రాళ్లతో కొట్టుదురు; యోహాను
ప్రవక్త అని అందరును నమ్ముచున్నారని తమలో తాము
7 ఆలోచించుకొని । — అది దేనివల్లనో మాకు తెలియ
8 లేదని ఆయనకుత్తరమిచ్చిరి. । అప్పుడు యేసు— నేనును
ఏ అధికారమువల్ల వీటిని చేయుచున్నానో అది మీ
తో చెప్పనని వారితో పలికెను.
9 అంతట ఆయన ప్రజలతో ఈ యుపమానము చె
ప్పెను — ఒక మనుష్యుడు ద్రాక్షతోట వేయించి,
కాపులకు దాని గుత్తకిచ్చి, పరదేశమునకు వెళ్లి బహు
10 కాలము ఉండెను. । పంట కాలములో ఆయన ఆ ద్రా
క్షతోట పండ్లలో పాలు ఇయ్య వలెనని, ఆ కాపుల
యొద్దికి ఒక దాసుని పంపెను. అప్పుడు ఆ కాపులు
11 అతని కొట్టి వట్టి చేతులతో పంపివేసిరి. । తిరిగి ఆయన
మరియొక దాసుని పంపెను. అప్పుడు వారు అతని
కూడా కొట్టి అవమానపరిచి వట్టి చేతులతో పంపి
12 వేసిరి. । మళ్లీ ఆయన మూడవవాని పంపెను; వారు
అతని కూడా గాయపరిచి వెలపట వేసిరి.
13 అప్పుడు ఆ ద్రాక్షతోట యజమానుడు — నేను
ఏమి చేతును? ప్రియుడైన నా కుమారుని పంపుదును;
వారు ఆయనను చూచి సన్మానింతురేమో అనుకొనె
14 ను. । అయితే ఆ కాపులు ఆయనను చూచి — ఇతడు
ఆస్తికర్త; ఈ ఆస్తికర్తృత్వము మనదయేకొరకు ఇతని
చంపుదము రండని తమలో తాము ఆలోచించుకొని।
15 ఆయనను ద్రాక్షతోట వెలపట వేసి చంపిరి. కాబట్టి
ఆ ద్రాక్షతోట యజమానుడు వారిని ఏమి చేసును? ।
16 ఆయన వచ్చి ఆ కాపులను సంహరించి, తన ద్రాక్ష
తోట ఇతరులకు ఇచ్చునని చెప్పినప్పుడు, వారు విని—
అది దూరమౌగాక అని పలికిరి.
17 అప్పుడు ఆయన వారిని చూచి, — ఆలాగైతే,
—ఇల్లు కట్టేవారు ఉపేక్షించిన రాయి మూలకు తల

అయినదని* వ్రాయబడినది ఏమిటి? । ఈ రాతి మీద 18
పడే ప్రతివాడును నలిగిపోవును; అది ఎవని మీద
పడునో వాని పొడి చేయునని పలికెను.
అప్పుడు ప్రధానయాజకులు శాస్త్రులును తమ్మును 19
గూర్చి ఆ యుపమానము చెప్పెనని గ్రహించి, ఆ
గడియలోనే ఆయనను పట్టుకొనచూచిరి గాని జను
లకు భయపడిరి.
తరువాత వారు ఆయనను కనిపెట్టి అధికారులకు 20
అధిపతి వశమునకును ఆయనను అప్పగించ వలె
నని, ఆయన మాటలయందు తప్పు పట్టుటకు, తాము
నీతిమంతులమని మిష పెట్టుకొనేటట్టు కుదర్చబడిన
వారిని† ఆయన యొద్దికి పంపిరి. । వారు (వచ్చి)— 21
బోధకుడా! నీవు యుక్తముగా చెప్పుచు ఉపదేశించు
చున్నావు; నీవు ఎవనియందును పక్షపాతము లేక, నిజ
ముగానే దేవుని మార్గమును ఉపదేశించుచున్నా
వని ఎరుగుదుము. । మనము కైసరునికి‡ పన్ను ఇచ్చుట 22
న్యాయమా కాదా? అని ఆయనను అడిగిరి.
అయితే ఆయన వారి కాపట్యము గుర్తెరిగి— 23
మీరు ఎందుకు నన్ను శోధించుచున్నారు? । ఒక 24
దేనారి నాకు చూపండి; దీని మీద ఎవని స్వరూపము
పైవ్రాతయు ఉన్నవని అడిగెను. అందుకు వారు—
కైసరునివని ఉత్తరము చెప్పినప్పుడు, । ఆయన—కాగా 25
కైసరునివి కైసరునికి, దేవునివి దేవునికిని చెల్లించ వలె
నని వారితో చెప్పెను. । అప్పుడు వారు ప్రజల యె 26
దుట మాటవల్ల ఆయనను పట్టుకొన నేరక, ఆయన
ప్రత్యుత్తరమునకు ఆశ్చర్యపడి ఊరకుండిరి.
తరువాత పునరుత్థానము లేదని ఎదురాడే సద్దూ 27
కైయులలో కొందరు ఆయన యొద్దికి వచ్చి ఆయనను
అడిగినదేమనగా।—బోధకుడా! ఒకని సహోదరుడు, 28
భార్య కలిగి, చనిపోయేటప్పుడు, అతడు సంతానము
లేకనే చనిపోతే, అతని సహోదరుడు అతని భార్యను
పెండ్లాడి, తన సహోదరునికి సంతానము కలుగచేయ
వలెనని మోషే మనకు వ్రాసెను.§ । మంచిది, ఏడుగురు 29
సహోదరులు ఉండిరి; మొదటివాడు ఒక స్త్రీని పెం
డ్లాడి, సంతానము లేక చనిపోయినప్పుడు । రెండవ 30
వాడు ఆ స్త్రీని పెండ్లాడి, అతడును సంతానము లేక
చనిపోయెను. । అప్పుడు మూడవ వాడు ఆమెను పెం 31
డ్లాడెను. ఆచొప్పున ఏడుగురును ఆమెను పెండ్లాడి,
సంతానము లేక చనిపోయిరి. । అందరి వెనుక ఆ స్త్రీ 32
కూడా చనిపోయెను. కాబట్టి ఆ యేడుగురికి ఆమె

* కీర్త. 118: 22. † లేక, వేగులవారిని. ‡ అనగా, ఆ దేశమును ఏలిన చక్రవర్తి. § ద్వితీయోపదేశకాండము. 25: 3.

33 భార్యయై యుండెను గనుక, । పునరుత్థానమందు ఆమె
వారిలో ఎవని భార్యయై యుండునని అడిగిరి.
34 అందుకు యేసు—ఈ లోకజనులు పెండ్లాడుచు,
35 పెండ్లికి ఇయ్యబడుచున్నారు; । అయితే ఆ లోకము
నకును చనిపోయినవారిలోనుంచి పునరుత్థానమునకును
యోగ్యులని యెంచబడినవారు పెండ్లాడరు, పెండ్లికి
36 ఇయ్యబడరు. । వారు పునరుత్థాన కుమారులై యుండి,
దూత సమానులును దేవుని కుమారులునై యున్నారు
37 గనుక, వారు ఇకమీదట చావలేరు. । అయితే ఆ
మోషే—ప్రభువును, అబ్రాహాము దేవుడనియు, ఇ
సాకు దేవుడనియు, యాకోబు దేవుడనియు చెప్పుచు
మృతులు లేతురని, పొద (చరిత్ర) లో బైలుపరిచి
38 యున్నాడు. । ఆయన జీవించే వారికేగాని చనిపో
యిన వారికి దేవుడు కాడు; అందరును ఆయన కొరకు
జీవించుచున్నారని వారికి ఉత్తరమిచ్చెను.
39 అప్పుడు శాస్త్రులలో కొందరు—బోధకుడా! నీవు
40 లెస్సగా పలికితివని ఉత్తరము చెప్పిరి. । తరువాత వారు
ఆయనను మరి ఏమియు అడుగుటకు తెగువ చేయలేదు.
41 మరియు ఆయన—ఏ విషయము క్రీస్తు దావీదు కు
42 మారుడని వారు చెప్పుచున్నారు?।—నీ శత్రువులను నీ
43 పాద పీఠముగా నేను ఉంచేమట్టుకు । నీవు నా కుడిపై
పున కూర్చుండుమని, ప్రభువు నా ప్రభువుతో చెప్పె
నని, కీర్తనల గ్రంథములో దావీదు తాను చెప్పుచున్నా
44 డు గదా! । కాబట్టి దావీదు ఆయనను ప్రభువని పలు
కుచున్నాడు; ఆయన ఏలాగు అతని కుమారుడై యు
న్నాడని అడిగెను.
45 అప్పుడు ప్రజలందరు వినుచుండగా, ఆయన—నిలువు
46 టంగీలు వేసుకొని తిరగవలెనని కోరుచు, । అంగడివీధు
లలో వందనములను, సునగోగులలో అగ్రపీఠములను,
విందులలో మొదటి స్థలములనును అపేక్షించే శాస్త్రు
47 లను గూర్చి జాగ్రత్తపడండి. । వీరు విధవల ఇండ్లను తిని
వేయుచు, మిషచేత బహుగా ప్రార్థించుచున్నారు. వీరు
ఎక్కువ శిక్షావిధి పొందుదురని తన శిష్యులతో చెప్పెను.

## 21. అధ్యాయము.

1 ఆయన కన్నులెత్తి ధనవంతులు తమ కానుకలను
2 కానుక పెట్టెలో పడవేయుట చూచెను. । అప్పుడు
ఆయన ఒక బీద విధవ కూడా రెండు పైసలు అందు
3 లో పడవేయుట చూచి ।—ఈ దరిద్రురాలైన విధవ
అందరికంటె ఎక్కువ వేసెనని మీతో నిశ్చయముగా
4 చెప్పుచున్నాను; । వీరందరు తమ తమ సమృద్ధి చొ
ప్పున దేవుని కానుకలలో వేసి యున్నారు; అయితే
ఈమె తన లేమిలో తనకు కలిగిన జీవనమంతయు
వేసెనని వారితో చెప్పెను.

తరువాత కొందరు—ఇది అందమైన రాళ్లతోను 5
కానుకలతోను శృంగారించబడి ఉన్నదని గుడిని
గూర్చి మాటలాడుచుండగా, । ఆయన—మీరు చూచు 6
చున్న వీటిలో రాతిమీద ఒక రాతియైనను ఉండని
య్యక పడదోసే దినములు వచ్చుచున్నవని చెప్పెను.
అప్పుడు వారు—బోధకుడా! ఆలాగైతే, ఇవి ఎప్పుడు 7
సంభవించును? ఇవి సంభవించబోయేటప్పటికి ఏ ఆన
వాలు కలుగునని ఆయనను అడిగిరి.
అందుకు ఆయన—మీరు మోసపోకుండ జాగ్రత్త 8
పడుడి; అనేకులు నా పేరట వచ్చి—నేనే (క్రీస్తును),
కాలము సమీపించెనని పలుకుదురు; మీరు వారిని
వెంబడించ వద్దు. । మీరు యుద్ధములను గూర్చి కలహ 9
ములను గూర్చి వినేటప్పుడు, దిగులు పడకండి; ఇవి
మొదట జరుగ వలెనుగాని వెంటనే అంతము రాదని
చెప్పెను.
తరువాత ఆయన వారితో—రాష్ట్రము రాష్ట్రము 10
పైకి, రాజ్యము రాజ్యము పైకి లేచును. । మరియు 11
నానా స్థలములలో గొప్ప భూకంపములు, కరువులు,
రోగములును కలుగును. ఆకాశమునుంచి భయోత్పా
తములు, గొప్ప ఆనవాళ్లును పుట్టును.
అయితే ఇవి అన్ని సంభవించక మునుపు, వారు మీ 12
మీద చేతులు వేసి, నా నామము నిమిత్తము మిమ్ము
రాజుల యొద్దికి, అధిపతుల యొద్దికిని తీసుకొని వెళ్లి,
సునగోగులలో చెరసాలలలో అప్పగించి హింస పెట్టు
దురు. । అది సాక్ష్యము కొరకు మీకు సంభవించును. 13
కాబట్టి మీరు ఉత్తరమిచ్చుటకు ముందర చింతిం 14
చక ఉండుటకు, మీ మనస్సులలో నిశ్చయించుకొనుడి;।
మీకు విరోధులైన వారందరు ఎదురాడుటకు ఖండించు 15
టకు అసాధ్యమైన మాటయు జ్ఞానమును నేను మీకిత్తు
ను. । అప్పుడు మీరు తలిదండ్రుల చేతను, సహోద 16
రుల చేతను, బంధువుల చేతను, స్నేహితుల చేతనును అ
ప్పగించబడుదురు; మీలో కొందరిని చంపింతురు. । నా 17
నామము కొరకు మీరు అందరిచేత ద్వేషించబడుదు
రు. । అయితే మీ తల వెంట్రుకలలో ఒకటైనను నశిం 18
చదు; । మీ ఓర్పుచేత మీ ప్రాణములను దక్కించుకొనుడి. 19
యెరూషలేము దండులచేత చుట్టుకొనబడుట మీరు 20
చూచినప్పుడు, దాని నాశము సమీపించెనని తెలును
కొనుడి. । అప్పుడు యూదైయ దేశమందు ఉండేవా 21
రు కొండలకు పారిపో వలెను; దాని మధ్యనున్నవారు
వెలపటికి వెళ్లవలెను. పల్లెటూళ్లలోనున్నవారు దానిలో
ప్రవేశించ కూడదు; । వ్రాయబడినవన్నియు నెరవే 22
రుటకు ఇవి శిక్షాదినములై ఉన్నవి.
అయ్యో! ఆ దినములలో గర్భము ధరించిన వారి 23
కిని, పాలిచ్చే వారికిని శ్రమ! ఈ దేశమునకు మిక్కిలి

ఇబ్బంది, ఈ ప్రజల మీద కోపము కలుగును. వారు
24 కత్తి వాతిచేత కూలుదురు. । వారు సమస్త రాష్ట్రము
లకు చెర తీసుకొని పోబడుదురు. అప్పుడు రాష్ట్రముల
కాలములు సంపూర్ణమయే మట్టుకు యెరూషలేము
రాష్ట్రములచేత త్రొక్కబడును.
25,26 మరియు సూర్య చంద్ర నక్షత్రములలో ఆన
వాళ్లును, భూమి మీద సముద్ర తరంగముల ఘోషవల్ల
కలవరపడిన రాష్ట్రముల శ్రమయును ఉండును. భయ
ము వల్లను, లోకము మీదికి రాబోయే వాటి కొరకు
ఎదురుచూచుట వల్లను, మనుష్యులు అధైర్యపడుచుం
27 దురు; ఆకాశ శక్తులు కదిలించబడును. । అప్పుడు
మనుష్య కుమారుడు మేఘములో శక్తితోను మహా
28 మహిమతోను వచ్చుట చూతురు. । ఇవి జరగనారం
భించినప్పుడు మీరు ధైర్యపడి మీ తలలు ఎత్తుకొను
డి*; మీ విడుదల సమీపమై ఉండునని చెప్పెను.

29 మరియు ఆయన వారితో ఈ ఉపమానము చెప్పె
ను,— అంజూరపు చెట్టును, సమస్తమైన చెట్లను చూ
30 డుడి. । అవి చిగిరించగానే మీరు చూచి వసంతకా
లము అప్పుడే సమీపమై ఉన్నదని మీకు మీరే తెలు
31 సుకొందురు. । అటువలె మీరు ఇవి జరుగుచుండుట
చూచినప్పుడు, దేవుని రాజ్యము సమీపమై ఉన్నదని
32 తెలుసుకొనుడి. । సమస్తమును సంభవించే మట్టుకు ఈ
తరము† గతించదని, నేను మీతో నిశ్చయముగా చె
33 ప్పుచున్నాను. । ఆకాశము భూమియు గతించును
గాని ఈ నా మాటలు ఏమాత్రమును గతించవు.

34 మీ హృదయములు ఒక వేళ తిండి వల్లను, మత్తు
వల్లను, ఐహిక విచారములవల్లను మందముగా ఉన్నం
దున, ఆ దినములు అకస్మాత్తుగా మీ మీదికి రాకుండ
35 మీకు మీరే జాగ్రత్తపడుడి; । అది భూమియం
దంతట కాపురముండే వారందరి మీదికి ఒక ఉరి వలె
36 వచ్చును. । కాబట్టి మీరు జరగబోయే వీటినన్నిటిని
తప్పించుకొనుటకు, మనుష్య కుమారుని యెదుట నిలు
వబడుటకును పాత్రులని ఎంచబడే నిమిత్తము ఎల్లప్పు
డును ప్రార్థించుచు మెలకువగా ఉండుడని చెప్పెను.
37 ఈలాగున ఆయన పగటియందు గుడిలో బోధిం
చుచు, రాత్రులయందు బైలువెళ్లి ఒలీవ వనమనబడిన
38 కొండ మీద నివసించుచుండెను. । జనులందరు గుడి
లో ఆయన మాట వినుటకు ఆయన యొద్దికి పెంద
లాడి వచ్చుచుండిరి.

## 22. అధ్యాయము.

పస్కా‡ అనబడిన పొంగని రొట్టెల పండుగ సమీ 1
పించినప్పుడు, । ప్రధానయాజకులు, శాస్త్రులును ఆయ 2
నను ఏలాగు చంపింతుమని విచారించిరి; వారు ప్రజ
లకు భయపడిరి.
అయితే పన్నెండుమందిలో ఒకడైన ఇస్కరియో 3
తనే మారు పేరుగల **యూదాయందు** సైతాను ప్రవే
శించెను. । అప్పుడు అతడు వెళ్లి ప్రధాన యాజకుల 4
తోను, అధికారులతోను ఆయనను వారికి ఏలాగు
అప్పగించ వచ్చునో, దాని గూర్చి మాటలాడెను. ।
అందుకు వారు సంతోషించి, అతనికి కొంత సొమ్ము 5
ఇచ్చుటకు ఒప్పుకొనిరి. । అప్పుడు అతడు అంగీకరించి 6
ఆయనను వారికి అప్పగించుటకు జనసమూహము లేని
సమయము వెతుకుచుండెను.
పస్కాను వధించవలసిన పొంగని రొట్టెల దినము 7
వచ్చెను. । అప్పుడు ఆయన పేతురును, యోహానును 8
చూచి — మనము భుజించుటకు, మీరు వెళ్లి మనకు
పస్కాను సిద్ధపరచుడని వారిని పంపెను. । వారు—మేము 9
ఎక్కడ సిద్ధపరచ కోరుచున్నావని ఆయనను అడిగిరి. ।
అందుకు ఆయన—ఇదుగో! మీరు పట్టణములో ప్రవే 10
శించుచుండగా, నీళ్ల కుండ మోసుకొని పోవుచున్న
ఒక మనుష్యుడు మీకు ఎదురుగా వచ్చును. అతడు
ప్రవేశించే ఇంటికి అతని వెంబడించి । — నేను నా 11
శిష్యులతో పస్కాను భోజనము చేయుటకు అతిథుల
గది ఎక్కడ ఉన్నదని, బోధకుడు । నిన్ను అడుగుచు 12
న్నాడని ఆ ఇంటి యజమానునితో పలుకండి. అప్పు
డు అతడు సామగ్రి గల ఒక గొప్ప మేడ గది మీకు
చూపించును; అక్కడ సిద్ధము చేయుండని వారితో
చెప్పెను. । వారు వెళ్లి ఆయన తమతో చెప్పిన ప్రకా 13
రమే చూచి పస్కాను సిద్ధపరిచిరి.
ఆ గడియ వచ్చినప్పుడు, ఆయన పన్నెండుమంది 14
అపొస్తలులతో కూడా భోజన పఙ్క్తియందు కూర్చుం
డెను. । అప్పుడు ఆయన— నేను శ్రమపడక మునుపు 15
మీతో కూడా ఈ పస్కాను భుజించ వలెనని మిక్కిలి
అపేక్షించి ఉన్నాను. । అది దేవుని రాజ్యములో నెర 16
వేరేమట్టుకు ఇక నెన్నడును దాని భుజించనని మీతో
చెప్పుచున్నాను అని వారితో పలికెను. । అప్పుడు 17
ఆయన గిన్నె పట్టుకొని, స్తోత్రము చేసి§ — మీరు
దీని పుచ్చుకొని మీలో మీరు పంచుకొనుడి; । దేవుని 18
రాజ్యము వచ్చేపర్యంతము నేను ద్రాక్షారసము తాగ
నని మీతో చెప్పుచున్నానని పలికెను.

* లేక, పైకి చూడండి. † లేక, వంశము. ‡ ఆదికాండము. అ. 12. వ. 43. § లేక, ఆశీర్వదించి.

19 అప్పుడు ఆయన ఒక రొట్టె పట్టుకొని, స్తోత్రము
చేసి* దాని విరిచి వారికిచ్చి—ఇది మీ కొరకు ఇయ్య
బడుచున్న నా శరీరము; నన్ను జ్ఞాపకము చేసుకొను
20 టకు దీని చేయుడని చెప్పెను. । ఆ ప్రకారము, ఆ
భోజనమైన తరువాత, ఆయన గిన్నె (పట్టుకొని)—
ఈ గిన్నె మీ కొరకు చిందబడుచున్న నా రక్తము
21 వల్లనైన క్రొత్త నిబంధన†.। ఇదుగో! నన్ను అప్పగించుచు
న్న వాని చెయ్యి నాతో కూడా ఈ బల్లమీద ఉన్న
22 ది.। నిర్ణయించబడిన ప్రకారము మనుష్య కుమారుడు
పోవుచున్నాడు గాని, అయ్యో! ఆయన ఎవనిచేత అ
ప్పగించబడునో ఆ మనుష్యునికి శ్రమ! అని పలికెను.
23 అప్పుడు వారు ఈ కార్యము చేయబోయేవాడు
ఎవడని తమలో తాము ఒకని ఒకడు అడుగుటకు
ఆరంభించిరి.
24 తమలో ఎవడు గొప్పవాడని ఎంచబడునో దాని
25 గూర్చి వివాదము కూడా వారిలో పుట్టెను.। అయితే
ఆయన—రాష్ట్రముల రాజులు వారి మీద దొరతనము
చేయుచున్నారు, వారి మీద అధికారము చేసే వారు
26 ఉపకారులనబడుచున్నారు. । అయితే మీరు ఆలాగు
ఉండరు; మీలో గొప్పవాడు చిన్నవాని వలెను, అధి
కారము గలవాడు పరిచర్య చేసే వాని వలె నుండ
27 వలెను; । గొప్పవాడు ఎవడు? భోజన పఙ్త్తిలో కూర్చుం
డేవాడా? లేక పరిచర్య చేసేవాడా? భోజన పఙ్త్తిలో
కూర్చుండే వాడేగదా; అయితే నేను మీలో పరిచర్య
28 చేసే వాని వలె నున్నాను.। మీరైతే, నా శోధనలలో
29,30 నాతో నిలుకడగా ఉన్నారు. । మీరు నా రాజ్య
ములో నా బల్లయొద్ద అన్నపానములు పుచ్చుకొని సిం
హాసనముల మీద కూర్చుండి, ఇశ్రాయేలుయొక్క ప
న్నెండు గోత్రములకు న్యాయము తీర్చే నిమిత్తము నా
తండ్రి నాకు రాజ్యమును నియమించిన ప్రకారము, నే
నును మీకు నియమించుచున్నానని వారితో చెప్పెను.
31 అప్పుడు ప్రభువు—సీమోనూ! సీమోనూ! ఇదుగో!
సైతాను మిమ్ము పట్టి గోధుములవలె జల్లించుటకు కో
32 రెను. । అయితే నీ నమ్మిక తప్పక ఉండుటకు నేను నీ
నిమిత్తము వేడుకొన్నాను; నీవు తిరిగిన తరువాత, నీ
సహోదరులను స్థిరపరుచుమని చెప్పెను.
33 అయితే అతడు — ప్రభువా! నీతో కూడా చెర
లోకి, మరణమునకును వెళ్లుటకు సిద్ధముగా ఉన్నానని
34 ఆయనతో పలికెను. । అందుకు ఆయన—పేతురూ!
నేడు కోడి కూయక మునుపు, నీవు నన్ను ఎరుగనని
ముమ్మారు చెప్పుదువని నీతో పలుకుచున్నాననెను.

మరియు ఆయన—నేను జాలెయు, అసిమియు, చె 35
ప్పులును లేకుండా మిమ్మును పంపినప్పుడు, మీకు ఏమై
నా తక్కువైనదా? అని వారిని అడిగినప్పుడు వారు—ఏమి
యు తక్కువ కాలేదని చెప్పిరి.। కాబట్టి ఆయన—అయితే 36
ఇప్పుడు జాలె గల వాడు అదియు, అసిమియు పట్టు
కొన వలెను; అవి లేనివాడు తన బట్టను అమ్మి ఒక కత్తి
కొన వలెను; ।—ఆయన అక్రమము చేసే వారిలో ఎం 37
చబడెనని వ్రాయబడినది‡ ఇంకా నాయందు నెరవేర
వలసి యున్నది; నన్ను గూర్చిన వాటికి సమాప్తి కలు
గునని మీతో చెప్పుచున్నానని వారితో పలికెను.
అప్పుడు వారు — ప్రభువా! ఇదుగో! ఇక్కడ 38
రెండు కత్తులు ఉన్నవని పలికిరి. ఆయన—చాలునని
వారితో చెప్పెను.
తరువాత ఆయన బైలుదేరి, తన మర్యాద చొప్పున 39
ఒలీవ చెట్ల కొండకు వెళ్లెను. ఆయన శిష్యులు కూ
డా ఆయనను వెంబడించిరి.। ఆ స్థలము చేరి ఆయన—40
మీరు శోధనలోకి రాకుండా ప్రార్థించుడని వారితో
చెప్పెను.
అప్పుడు ఆయన వారి యొద్దనుంచి రాతి వేత దూ 41
రము వెళ్లి, మోకాళ్లూని। — తండ్రీ! ఈ గిన్నె నా 42
యొద్దనుంచి తీసుకొనుటకు నీకు మనస్సు కలిగితేనా
—అయినప్పటికి నా చిత్తము కాదు, నీ చిత్తమే సిద్ధిం
చుగాక అని ప్రార్థించెను.
అప్పుడు ఆకాశమునుంచి ఒక దూత ఆయనకు 43
ప్రత్యక్షమై, ఆయనను బలపరిచెను.। అప్పుడు ఆయన 44
వేదనపడి మరింత ఆతురముగా ప్రార్థించెను. ఆయన
చెమట నేల పడుచున్న గొప్ప రక్త బిందువుల వలె
నుండెను.
ఆయన ప్రార్థన చాలించి లేచి, తన శిష్యుల యొ 45
ద్దికి వచ్చి వారు దుఃఖముచేత నిద్రించుట చూచి।—
మీరు ఎందుకు నిద్రించుచున్నారు? మీరు శోధన 46
లోకి రాకుండా, లేచి ప్రార్థించుడని వారితో చెప్పెను.
ఆయన ఇంకా మాటలాడుచుండగా, ఇదుగో! ఒక 47
జనసమూహము వచ్చెను. పన్నెండుమందిలో యూదా
అనబడిన ఒకడు వారికంటే ముందుగా నడుచుచు
యేసుని ముద్దుపెట్టుకొనుటకు ఆయన యొద్దికి వచ్చె
ను.। అప్పుడు యేసు—యూదా! నీవు ముద్దుచేత మను 48
ష్యకుమారుని అప్పగించుచున్నావా! అని అతనితో
పలికెను.
అప్పుడు ఆయన చుట్టు ఉన్న వారు, జరుగబో 49
యే దాని చూచి — ప్రభువా! కత్తితో నరుకుదుమా!
అని ఆయనను అడిగిరి. । అప్పుడు వారిలో ఒకడు 50

*లేక, ఆశీర్వదించి. †లేక, ఒడంబడిక. ‡ యెషయ. అ. 53. వ. 12.

ప్రధానయాజకుని దాసుని కొట్టి అతని కుడి చెవి
51 కోసెను. । అందుచేతను యేసు—కొంచెము విడువండి
అని చెప్పి, అతని చెవి ముట్టి బాగుచేసెను.
52 అప్పుడు యేసు తన యొద్దికి వచ్చిన ప్రధానయా
జకులతోను, గుడి అధికారులతోను, పెద్దలతోను—
మీరు దొంగ మీదికి వెళ్లినట్టు, కత్తులతోను, కఱ్ఱల
53 తోను బైలుదేరి వచ్చితిరా!। నేను మీతో కూడా దిన
దినమున గుడిలో ఉన్నప్పుడు, మీరు నా మీదికి
చేతులు చాపలేదు; అయితే ఇది మీ గడియ, చీకటి
యొక్క అధికారమునై ఉన్నదని చెప్పెను.
54 అప్పుడు వారు ఆయనను పట్టి వెంటబెట్టుకొని
ప్రధానయాజకుని ఇంట్లోకి తీసుకొని వెళ్లిరి. పేతురు
దూరముగా వెంబడించెను.
55 అప్పుడు వారు ఆ వాకిటి మధ్యను మంటవేసి,
చుట్టు కూచుండినప్పుడు, పేతురు కూడా వారి
56 మధ్యను కూచుండెను.। అప్పుడు ఒక పడుచు ఆ
వెలుగున అతడు కూర్చుండుట చూచి, అతని నిదానిం
చి—ఇతడును అతనితో కూడా ఉండెనని పలికెను. ।
57 అందుకు అతడు—అమ్మా! నేను అతని ఎరుగనని చెప్పి,
ఆయనను గూర్చి బొంకెను.
58 మరి కొంత సేపటికి మరి యొకడు అతని చూచి—
నీవు కూడా వారిలో ఒకడవని పలికెను. పేతురు—
59 మనుష్యుడా! నేను కానని చెప్పెను.। కొంచెము ఎక్కువ
తక్కువ ఒక గడియ అయిన తరువాత, మరియొకడు
—నిశ్చయముగా వీడును వారితో కూడా ఉండెను;
60 ఇతడు గలిలైయుడని దృఢముగా చెప్పెను.। అందుకు
పేతురు—మనుష్యుడా! నీవు చెప్పినది నాకు తెలియ
దని పలికెను. అతడు మాటలాడుచుండగా వెంటనే
61 కోడి కూసెను.। అప్పుడు ప్రభువు తిరిగి, పేతురు వైపు
చూచెను. అంతట పేతురు—కోడి కూయక మునుపు
నన్ను ఎరుగనని నీవు ముమ్మారు చెప్పుదువని ప్రభువు
62 తనతో చెప్పిన మాట జ్ఞాపకము చేసుకొనెను.। అప్పు
డు పేతురు వెలపటికి వెళ్లి సంతాపముతో ఏడ్చెను.
63 అప్పుడు యేసుని పట్టుకొనిన మనుష్యులు ఆయ
64 నను అపహసించి, కొట్టి। ఆయన కన్నులు కప్పి, ఆయన
ముఖము మీద చరిచి—ప్రవచించుము; నిన్ను ఎవడు
65 కొట్టెనని ఆయనను అడిగి,। ఇంకా అనేక సంగతులు
ఆయనకు విరోధముగా దూషించుచు పలికిరి.
66 ఉదయము కాగానే, ప్రజల పెద్దలు, ప్రధాన యా
జకులు, శాస్త్రులును కూడి, ఆయనను తమ సభలోకి
67 తీసుకొని వెళ్లి। —నీవు క్రీస్తువైతే మాతో చెప్పుమని
పలికిరి. అందుకు ఆయన—నేను మీతో చెప్పితే మీ
రు నమ్మరు.। అదియు గాక నేను మిమ్మును అడిగితే 68
నాకు ఉత్తరమియ్యరు; నన్ను వదిలిపెట్టరు.। ఇకమీ 69
దట మనుష్య కుమారుడు దేవుని శక్తియొక్క కుడి పా
ర్శ్వమందు కూచుండునని వారితో చెప్పెను.
అందుకు వారందరు—మంచిది, నీవు దేవుని కుమా 70
రుడవా? అని అడిగిరి. అందుకు ఆయన —నేను ఎవ
డనో దాని మీరు చెప్పితిరని వారితో పలికెను.।
అప్పుడు వారు — మనకు ఇక సాక్షుల నిమిత్తమేమి? 71
మనమే అతని నోటి మాట విన్నామని పలికిరి.

## 23. అధ్యాయము.

అప్పుడు వారి సమూహమంతయు లేచి, ఆయనను 1
పిలాతు యొద్దికి తీసుకొని వెళ్లి।—వీడు తాను క్రీస్తనే 2
రాజననియు, కైసరునికి పన్ను ఇయ్యవద్దనియు చెప్పి,
రాష్ట్రములు తిరగబడేటట్టు చేయుట కనుగొంటిమి అని
ఆయన మీద నేరము మోప సాగిరి.। అప్పుడు పిలాతు 3
—నీవు యూదుల రాజవా? అని ఆయనను అడిగెను.
అందుకు ఆయన—నీవు చెప్పుచున్నావని* అతనికి ఉత్త
రమిచ్చెను.। అప్పుడు పిలాతు ప్రధాన యాజకులతోను 4
ప్రజలతోను — నేను ఈ మనుష్యునియందు ఏ నేర
మును కనుగొన లేదని చెప్పెను.। అయితే వారు బల 5
వంతము చేసి—ఇతడు గలిలైయ దేశము మొదలుకొని
ఇంతమట్టుకును, యూదైయ దేశమంతట ఉపదేశించు
చు, ప్రజలను రేపుచున్నాడని పలికిరి.
పిలాతు గలిలైయ అనే మాట విని—ఈ మనుష్యు 6
డు గలిలైయుడా? అని అడిగెను.। అప్పుడు ఆయన 7
హేరోదుయొక్క అధికారమునకు లోబడెనని తెలు
సుకొనినప్పుడు, ఆ దినములు యెరూషలేములో ఉన్న
హేరోదు యొద్దికి ఆయనను పంపెను.
హేరోదు యేసుని చూచి, మిక్కిలి సంతోషిం 8
చెను; ఆయనను గూర్చి అనేక సంగతులు విన్నందున,
బహు కాలమునుంచి ఆయనను చూడ కోరి యుండెను.
మరియు ఆయన వల్ల ఏదైనా ఒక అద్భుతము చేయ
బడుట చూడ నిరీక్షించెను.। అప్పుడు అతడు చాలా 9
మాటలతో ఆయనను ప్రశ్న వేసెను; అయితే ఆయన
అతనితో ఉత్తరమేమియు చెప్పలేదు.। అప్పుడు ప్రధా 10
నయాజకులు శాస్త్రులును నిలువబడి ఆయన మీద గట్టి
గా నేరము మోపిరి.। హేరోదు తన రాణువవారితో 11
కూడి, ఆయనను తిరస్కరించి అపహాస్యము చేసి, ఆయ
నకు ఒక ప్రకాశమైన వస్త్రము తొడిగించి, పిలాతు
యొద్దికి ఆయనను తిరిగి పంపెను.। ఆ దినమున, పిలా 12

* అనగా, అవునని.

తు హేరోదును ఒకనికి ఒకడు స్నేహితులైరి; అంతకు
ముందు వారు ఒకనికి ఒకడు శత్రువులై ఉండిరి.
13 అంతట పిలాతు ప్రధానయాజకులను అధికారుల
14 ను ప్రజలను కూడా పిలిపించి।—ప్రజలు తిరగబడేట
ట్లు చేయుచున్నాడని ఈ మనుష్యుని మీరు నా యొ
ద్దికి తీసుకొని వచ్చితిరి. అయితే, ఇదుగో! నేను మీ
యెదుట వాని విమర్శించినప్పుడు, మీరు ఇతని మీద
మోపిన వాటిలో ఒక్క తప్పితమైనను నాకు అగపడ
15 లేదు.। అంతే కాదు, హేరోదును కనుగొన లేదు;
నేను ఆయన యొద్దికి మిమ్ము పంపితిని; అయితే ఇదు
గో! మరణమునకు తగినది యేదియు ఇతనిచేత చేయ
16 బడలేదు.। కాబట్టి నేను ఇతని శిక్షించి వదిలివేతునని
17 వారితో చెప్పెను;। అతడు ఆ పండుగలో వారి నిమిత్త
18 ము ఒకని వదిలివేయుట అగత్యమై ఉండెను.।అయితే
వారందరు—వీని కొనిపొమ్ము; మాకు బరబ్బాను వదిలి
19 వేయుమని ఒక్క మాటగా కేకలు వేసిరి.। వీడు పట్ట
ణములో జరిగించిన ఒక అల్లరి నిమిత్తము నరహత్య
నిమిత్తమును చెరసాలలో వేయబడెను.
20 కాబట్టి పిలాతు యేసుని వదిలివేయుటకు మనస్సు
21 గలవాడై, తిరిగి మాటలాడెను.। అయితే వారు—వీని
శిలువ వేయుము, శిలువ వేయుము అని కేకలు వేసిరి.।
22 అప్పుడు మూడవమారు ఆయన—ఎందుకు! ఇతడు ఏ
దోషము చేసియున్నాడు? ఇతని యందు మరణమునకు
హేతువైనది ఏమియు నాకు అగపడలేదు గనుక ఇతని
23 శిక్షించి వదిలివేయుదునని వారితో చెప్పెను.। అయితే
వారు ఒక్క పట్టుగా, ఆయన శిలువవేయబడుటకు పెద్ద
కేకలు వేసి అడిగిరి. అప్పుడు వారియొక్కయు ప్రధాన
24 యాజకులయొక్కయు శబ్దములు గెలిచెను.। అంతట
పిలాతు వారు అడిగినది చేయబడుటకు తీర్పుచేసి,।
25 అల్లరి నిమిత్తము, నరహత్య నిమిత్తము చెరసాలలో వేయ
బడినవాని, వారు అడిగిన ప్రకారము వారి నిమిత్తము
వదలివేసి, యేసుని వారి ఇచ్ఛకు అప్పగించెను.
26 వారు ఆయనను తీసుకొని పోవుచున్నప్పుడు, నా
టునుంచి వచ్చుచున్న కురేనీయుడైన సీమోననే ఒకని
పట్టుకొని, యేసు వెంటను మోయుటకు అతని మీద
శిలువ ఎత్తిరి.
27 బహు జనసమూహము, ఆయనను గూర్చి రొమ్ము
కొట్టుకొనుచు, దుఃఖించుచున్న స్త్రీల బహు సమూహ
28 మును ఆయనను వెంబడించుచుండెను.।యేసు వారి తట్టు
తిరిగి — యెరూషలేము కుమార్తెలారా! నా కొరకు ఏ
డువ వద్దు; మీ కొరకును మీ పిల్లల కొరకును ఏడు
29 వుడి;। ఇదుగో!—గొడ్రాళ్లును, కనని గర్భములును,
పాలు ఇయ్యని స్తనములును ధన్యములైనవని చెప్పు దిన
ములు వచ్చుచున్నవి.। అప్పుడు వారు—మా మీద పడు 30
మని పర్వతములతోను, మమ్ము కప్పుమని కొండలతో
ను చెప్పసాగుదురు;। వారు పచ్చి మానుకు వీటిని చేసి 31
తే, ఎండిన దానికి ఏమి కలుగునని పలికెను.
దుర్మార్గులైన వేరే ఇద్దరును ఆయనతో కూడా చం 32
పబడుటకు తేబడిరి.। వారు కపాలమనబడిన చోటికి 33
వచ్చినప్పుడు, అక్కడ ఆయనను, ఆ దుర్మార్గు
లను, ఆయన కుడివైపున ఒకనిని, ఎడమవైపున ఒకనిని
శిలువవేసిరి.
అప్పుడు యేసు—తండ్రీ! వీరిని క్షమించుము; వీరు 34
ఏమి చేయుచున్నారో అది వీరికి తెలియదని పలికెను.
తరువాత వారు ఆయన బట్టలు విభజించి చీట్లు వేసిరి.
ప్రజలు నిలిచి చూచుచున్నప్పుడు, వారితో కూ 35
డా అధికారులును—వీడు ఇతరులను రక్షించెను;దేవుడు,
ఏర్పరచుకొనిన క్రీస్తు ఇతడైతే, తన్ను తాను రక్షిం
చుకొననిమ్మని అపహసించిరి.। రాణువవారును ఆయన 36
యొద్దికి వచ్చి, ఆయనకు చిరక ఇచ్చి।— నీవు యూ 37
దుల రాజవైతే, నిన్ను నీవే రక్షించుకొనుమని ఆయన
ను అపహసించిరి.
—ఇతడు యూదుల రాజు అని హెల్లేని, రోమా 38
యి, హెబ్రాయి అక్షరములతో పై విలాసము కూడా
ఆయన మీద వ్రాయబడెను.
వ్రేలాడ వేయబడిన ఆ దుర్మార్గులలో ఒకడు 39
ఆయనను దూషించుచు—నీవు క్రీస్తువైతే నిన్ను మమ్ము
ను రక్షించుకొనుమని చెప్పెను.। అయితే రెండవవాడు 40
అతని గద్దించి—నీవును ఈ శిక్షావిధిలోనే ఉన్నావు
గనుక, దేవునికి భయపడవా! మనకైతే ఇది న్యాయ
మే;। మనము చేసినవాటికి తగిన ఫలము పొందుచున్నా 41
ముగాని ఈయన ఏ తప్పితమైనను చేయలేదని ఉత్త
రమిచ్చెను.। అప్పుడు అతడు—ప్రభువా! నీవు నీ రా 42
జ్యముతో* వచ్చినప్పుడు, నన్ను జ్ఞాపకము చేసుకొ
నుమని యేసుతో చెప్పెను.। అందుకు యేసు — నేడు 43
నీవు నాతో కూడా పరదైసులో ఉందువని నీతో
నిశ్చయముగా చెప్పుచున్నానని అతనితో పలికెను.
కొంచెము ఎక్కువ తక్కువ ఆరు గంటలైనవి. అప్ప 44
టినుంచి తొమ్మిది గంటల వరకు† ఆ దేశమంతటి మీద
చీకటి కలిగెను.। చీకటి సూర్యుని కమ్మెను. ఆలయపు 45
తెర నడిమికి చినిగిపోయెను.। అప్పుడు యేసు గొప్ప 46
శబ్దముతో మొరబెట్టుచు—తండ్రీ! నీ చేతులకు నా
ఆత్మను అప్పగించుచున్నానని పలికెను. ఆయన ఈ
లాగు పలికి ప్రాణము విడిచెను.

*లేక, లో. † అనగా—మధ్యాహ్నము మొదలుకొని మూడవజాము అయ్యేవరకు.

47 అంతట శతాధిపతి జరిగినదాని చూచి—ఈ మను
ష్యుడు నిశ్చయముగా నీతిమంతుడై ఉండెనని చెప్పి,
48 దేవుని మహిమపరిచెను. । వీటిని చూచుటకు కూడిన
ప్రజలందరు, జరిగిన వాటిని చూచి, తమ రొమ్ములను
కొట్టుకొని, తిరిగి వెళ్లిరి.
49 ఆయనకు నెళవైన వారందరును, గలిలైయ దేశము
నుంచి ఆయనను వెంబడించిన స్త్రీలును వీటిని చూడ
దూరముగా నిలిచిరి.
50 అప్పుడు ఇదుగో! యూదైయ దేశములో ఉన్న
అరిమిథైయ పట్టణస్థుడును సభికుడునైన యోశేఫనే
51 పేరుగల ఒక మనుష్యుడు ఉండెను. । అతడు మంచి
వాడును నీతిమంతుడునై, వారి ఆలోచనకు, క్రియ
కును సమ్మతించలేదు. అతడు దేవుని రాజ్యము కొరకు
52 కనిపెట్టుచు ఉండేవాడు. । అతడు పిలాతు యొద్దికి
53 వెళ్లి, యేసు శరీరమును అడిగి, । దాని కిందికి దించి
సన్నపు నారబట్టతో చుట్టి, తొలిచిన రాతి సమాధి
లో దాని ఉంచెను. అందులో ఒకడైనను అంతకు
మునుపు ఎప్పుడును ఉంచబడలేదు.
54 ఆ దినము సిద్ధపరిచే దినము; సబ్బాతు సమీపిం
55 చెను. । అప్పుడు గలిలైయ దేశమునుంచి ఆయనతో
కూడా వచ్చిన స్త్రీలు వెంటను వెళ్లి, ఆ సమాధిని,
ఆయన శరీరము ఏలాగు ఉంచబడెనో దానిని చూ
56 చి, । తిరిగి వెళ్లి సుగంధ ద్రవ్యమును పరిమళ తైల
మును సిద్ధపరిచి, ఆజ్ఞ చొప్పున సబ్బాతు దినమందు
తీరికగా ఉండెను.

## 24. అధ్యాయము.

1 ఆదివారమున తెల్లవారగానే, తాము సిద్ధపరిచిన
సుగంధ ద్రవ్యములు తీసుకొని, వారును వారితో
2 కూడా మరి కొందరును సమాధి యొద్దికి వచ్చి । సమాధి
నుంచి పొరలించబడిన రాతిని చూచి లోపటికి వెళ్లిరి. ।
3 అయితే ప్రభువైన యేసు శరీరము వారికి కనబడలేదు. ।
4 ఇందును గూర్చి వారు కలతపడుచున్నప్పుడు, ఇదుగో!
ప్రకాశమైన వస్త్రములు గల ఇద్దరు మనుష్యులు వారి
5 యొద్ద నిలిచిరి. । వారు భయపడి, ముఖములు నేల
మీద మోపి ఉన్నప్పుడు, వారు—చనిపోయిన వారి
లో మీరు ఎందుకు బ్రతికినవాని వెతుకుచున్నారు?।
6 ఆయన ఇక్కడ లేడు; ఆయన లేచెను. ఆయన ఇంకా
7 గలిలైయ దేశములో ఉన్నప్పుడు। — మనుష్య కుమా
రుడు పాపిష్ఠులైన మనుష్యుల చేతులకు అప్పగించబడి,
శిలువ వేయబడి, మూడవ దినమందు తిరిగి లేవ వలె
నని, ఆయన మీతో చెప్పిన మాట జ్ఞాపకము చేసు
కొనుడి అని వారితో పలికిరి.

అప్పుడు వారు ఆయన మాటలు జ్ఞాపకము చేసు 8
కొని । సమాధి యొద్దనుంచి తిరిగి వెళ్లి, ఈ సంగతు 9
లన్నియు పదకొండు మందికిని తక్కిన వారికందరికిని
తెలియ చేసిరి. । ఈ సంగతులు అపొస్తలులతో చెప్పిన 10
వారు ఎవరంటే, మగ్దలనే ఊరిదైన మరియ, యోహ
న్న, యాకోబు తల్లియైన మరియ, వారితో కూడ
నున్న ఇతర స్త్రీలును; । అయితే వారి మాటలు వారి 11
దృష్టికి పొల్లుగా కనబడెను గనుక వారు వారిని నమ్మ
లేదు.

అప్పుడు పేతురు లేచి సమాధి యొద్దికి పరుగెత్తి 12
వెళ్లి, ఒంగి, నారబట్టలు మాత్రమే పడియుండుట చూ
చెను. అతడు జరిగినదాని గూర్చి ఆశ్చర్యపడుచు, తన
ఇంటికి వెళ్లెను.

మరియు ఇదుగో! ఆ దినమందే వారిలో ఇద్దరు 13
యెరూషలేముకు ఆమడ దూరము గల ఇమ్మాయు అనే
పేరుగల ఒక ఊరికి వెళ్లుచు, । సంభవించిన వీటినన్ని 14
టిని గూర్చి ఒకనితో ఒకడు సంభాషించుచుండిరి.
వారు సంభాషించుచు, ఆలోచించుచుండగా, యేసు 15
తానే సమీపించి వారితో కూడా నడిచెను గాని ।
వారు ఆయనను పోల్చలేకుండా, వారి కన్నులు మూయ 16
బడెను. । అప్పుడు ఆయన—మీరు నడుచుచు ఒకనితో 17
ఒకడు చెప్పుకొనుచున్న సంగతులు ఏవి? మీరు ఎం
దుకు దుఃఖముఖులై యున్నారు అని! వారిని అడిగెను.
అందుకు వారిలో క్లెయొాఫ అనే పేరుగల ఒకడు 18
—నీవు ఒక్కడవే యెరూషలేములో పరదేశివై ఉండి,
దానిలో ఈ దినములయందు జరిగిన వాటిని ఎరగవా!
అని ఆయనతో పలికెను. । అందుకు ఆయన వారితో 19
—అవి ఏవి? అన్నప్పుడు, వారు—నజోరైయుడైన యే
సుని గూర్చినవే. ఆయన దేవుని యెదుటను ప్రజలం
దరి యెదుటను, క్రియలోను వాక్యములోను శక్తిగల
ప్రవక్తయై ఉండెను. । మన ప్రధాన యాజకులు అధి 20
కారులును ఆయనను ఏలాగు మరణ శిక్షావిధికి అప్ప
గించి ఆయనను శిలువ వేయించిరో (నీకు తెలియ లే
దా?) । అయినను ఇశ్రాయేలును విడిపించబోయే వాడు 21
ఈయనే అని నమ్మితిమి. అంతే కాకుండా, ఇవి జరిగి
నేటికి మూడు దినములు అయినవి. । మరియు మాలో 22
కొందరు స్త్రీలు, తెల్లవారగానే, సమాధి యొద్దికి వెళ్లి ।
ఆయన శరీరమును కనుగొనక, వచ్చి కొందరు దూత 23
లు కూడా తమకు ప్రత్యక్షమై ఆయన బ్రతికి యుం
డినట్లు పలికిరని మాతో చెప్పి, మమ్మును ఆశ్చర్య
పరిచిరి. । మాతో కూడా ఉన్న వారిలో కొందరు, 24
సమాధి యొద్దికి వెళ్లి ఆ స్త్రీలు చెప్పిన ప్రకారము

చూచిరి; అయితే ఆయనను చూడ లేదని ఆయనతో
25 చెప్పిరి. । అప్పుడు ఆయన—ఓ బుద్ధిహీనులారా! ప్రవ
26 క్తలు పలికినవన్నియు నమ్మని మందమతులారా! । క్రీస్తు
ఈలాగు శ్రమపడి, తన మహిమలో ప్రవేశించుట
27 అగత్యము కాదా! అని వారితో పలికి । మోషేయు,
సమస్త ప్రవక్తలును మొదలుకొని, లేఖనములన్నిటిలో
తన్నుగూర్చిన వాటి భావము వారికి తెలిపెను.

28 ఇంతలో వారు వెళ్లుచున్న ఊరికి సమీపించినప్పు
డు, ఆయన ఇంకా దూరముగా వెళ్లేటట్టు అగపడగా,।
29 వారు—సాయంకాలము సమీపించెను, ప్రొద్దు గ్రుం
కెను, మాతో కూడనుండుమని ఆయనతో చెప్పి, ఆ
యనను బలవంతము చేసిరి. అప్పుడు ఆయన వారితో
కూడనుండుటకు లోపటికి వెళ్లెను.

30 ఆయన వారితో భోజన పఙ్క్తిలో కూర్చున్నప్పుడు,
ఆయన ఒక రొట్టె పట్టుకొని స్తోత్రము చేసి* దాని
31 విరిచి, వారికిచ్చెను. । అంతట వారి కన్నులు తెరవబడి,
ఆయనను పోల్చిరి. అంతట ఆయన వారి దృష్టికి అగ
పడకపోయెను.

32 అప్పుడు వారు—ఆయన త్రోవలో మనతో మాట
లాడుచు, లేఖనములను మనకు బోధపరుచుచుండగా,
మన హృదయము మనలో మండుచుండెను గదా, అని
ఒకనితో ఒకడు చెప్పుకొనిరి.

33 ఆ గడియలోనే వారు లేచి యెరూషలేముకు తిరిగి
వెళ్లిరి. పదకొండుమందియు వారితోకూడా ఉన్నవా
34 రును గుంపుకూడి । —ప్రభువు నిశ్చయముగా లేచి
35 సీమోనుకు కనబడెనని చెప్పుకొనుట విని । త్రోవలో
జరిగినవియు, ఆయన రొట్టె విరుచుటవల్ల తమకు ఏ
లాగు తెలియబడెనో అదియు తెలియచేసిరి.

36 వారు ఈలాగు మాటలాడుచున్నప్పుడు, యేసు
తాను వారి మధ్యను నిలిచి — మీకు సమాధానమవు
37 గాక అని వారితో పలికెను. । అయితే వారు జడిసి,
దిగులుపడి ఒక ఆత్మ తమకు అగపడెనని తలంచిరి.।
38 అప్పుడు ఆయన—మీరు ఎందుకు కలతపడుచున్నారు!
మీ హృదయములలో ఎందు నిమిత్తము సందేహములు
39 పుట్టుచున్నవి! । నేనే ఆయన అనుటకు నా చేతులను
నా పాదములను చూడుడి. నన్ను పట్టి చూడుడి;
మీరు చూచే ప్రకారముగా నాకు కలిగి ఉన్న యెము
కలు మాంసమును ఆత్మకు లేవని చెప్పి, । తన చేతులను 40
పాదములను వారికి చూపించెను.

అయితే వారు సంతోషము చేతను ఇంకా నమ్మక, 41
ఆశ్చర్యపడుచుండగా, ఆయన — ఇక్కడ మీ యొద్ద
ఏమైనను ఆహారము ఉన్నదా! అని వారిని అడిగెను.।
అప్పుడు వారు కాల్చిన చేప ముక్కను, తేనెపట్టు 42
ముక్కను ఆయనకు ఇచ్చిరి. । ఆయన వాటిని పుచ్చు 43
కొని వారి యెదుట తినెను.

అప్పుడు ఆయన—మోషేయొక్క బోధన ప్రమా 44
ణములోను, ప్రవక్తల గ్రంథములలోను, కీర్తనలలో
ను నన్ను గూర్చి వ్రాయబడినవన్నియు నెరవేర వలె
నని నేను మీయొద్ద ఉండి మీతో పలికిన మాటలు
ఇవే అని వారితో చెప్పెను.

అప్పుడు వారు లేఖనములు గ్రహించే నిమిత్తము, 45
ఆయన వారి మనస్సులను తెరిచి ।—ఈలాగు వ్రాయ 46
బడి ఉన్నది; క్రీస్తు ఈలాగు కష్టపడి మూడవ దిన
మందు చనిపోయిన వారిలోనుంచి లేచుటయు । యె 47
రూషలేము మొదలుకొని, సమస్త రాష్ట్రములయందు
ఆయన పేరట మారుమనస్సు, పాపక్షమయు ప్రక
టించబడుటయు అగత్యమైనవి.। వీటిని గూర్చి మీరు 48
సాక్షులై యున్నారు. । ఇదుగో! నా తండ్రియొక్క 49
వాగ్దత్తమును మీ మీదికి పంపుచుందును. అయితే
మీరు పైనుంచి శక్తిపొందే పర్యంతము యెరూషలే
ములో ఉండుడని వారితో చెప్పెను.

తరువాత ఆయన బేథనియ అనే ఊరి మట్టుకు 50
వారిని తీసుకొని వెళ్లి, తన చేతులు ఎత్తి వారిని ఆశీ
ర్వదించెను. । ఆయన వారిని ఆశీర్వదించుచుండగా, 51
ఆయన వారిలోనుంచి వేరుచేయబడి ఆకాశము పైకి
కొంచుపోబడెను.

అప్పుడు వారు ఆయనకు నమస్కరించి, బహు 52
సంతోషముతో యెరూషలేముకు తిరిగి వెళ్లి । ఎల్లప్పు 53
డును గుడిలో దేవుని కీర్తించుచు, స్తోత్రము చేయు
చుండిరి. ఆమేన్.

* లేక, ఆశీర్వదించి.

# యోహాను వ్రాసిన సువార్త.

## 1. అధ్యాయము.

1 ఆది యందు వాక్యము ఉండెను. వాక్యము దేవుని
2 యొద్ద ఉండెను. వాక్యము దేవుడై ఉండెను. । అది*
ఆది యందు దేవుని యొద్ద ఉండెను. సమస్తమును
3 దాని* వల్ల కలిగెను. । కలిగి యున్నది ఏదియు అది*
4 లేకనే కలుగ లేదు. । దానిలో† జీవము ఉండెను.
5 ఆ జీవము మనుష్యుల వెలుగై ఉండెను. । వెలుగు చీక
టిలో ప్రకాశించుచుండగా చీకటి దాని గ్రహించ
లేదు.

6 దేవుని యొద్దనుంచి పంపబడిన ఒక మనుష్యుడు
7 ఉండెను. ఆయన పేరు యోహాను. । ఆయన వల్ల అంద
రు విశ్వసించే కొరకు, వెలుగును గూర్చి సాక్ష్యమిచ్చు
8 టకు సాక్షిగా వచ్చెను. । ఆయన వెలుగును గూర్చి
సాక్ష్యమిచ్చుటకే గాని ఆ వెలుగై ఉండ లేదు. ।
9 లోకమందు ప్రవేశించి,‡ ప్రతి మనుష్యుని ప్రకాశిం
10 పచేసే నిజమైన వెలుగై ఆయన ఉండెను. । ఆయన
లోకమందు ఉండెను. లోకము ఆయన వల్ల చేయబ
11 డెను. లోకము ఆయనను తెలుసుకొన లేదు. । ఆయన
స్వకీయుల యొద్దికి వచ్చెను; ఆయన స్వకీయులు ఆయ
12 నను అంగీకరించ లేదు. । అయితే ఆయనను అంగీకరిం
చిన వారెందరో అందరికి, అనగా ఆయన నామమందు
విశ్వసించిన వారికి, ఆయన, దేవుని పిల్లలవుటకు అధికా
13 రము§ దయ చేసెను. । వారు రక్తము వల్లనైనా శరీ
రేచ్ఛ వల్లనైనా మనుష్యుని ఇచ్ఛవల్లనైనా కాకుండా,
14 దేవుని వల్ల పుట్టిరి. । ఆ వాక్యము శరీరమై పుట్టి
మనలో నివసించెను. అప్పుడు తండ్రినుంచి జనితైకుని¶
మహిమ వలె, కృపతోను సత్యముతోను నిండుకొనిన
ఆయన మహిమను చూచితిమి.

15 యోహాను ఆయనను గూర్చి సాక్ష్యమిస్తున్నాడు.
అతడు కంఠమెత్తి పలికినదేమంటే—నా వెనుక వచ్చే
వాడు నాకంటే ప్రథముడై ఉండెను గనుక నా కంటే
16 ముఖ్యుడాయెనని నేను చెప్పినవాడు ఈయనే. । ఆయ
నయొక్క పరిపూర్ణతనుంచి మనమందరము కృప
17 మీద కృపను పొందియున్నాము. । బోధనప్రమాణ
ము మోషేవల్ల ఇయ్యబడెను; కృపయు సత్యమును
18 యేసు క్రీస్తు వల్ల కలిగెను. । ఎవడును ఎప్పుడైనా దేవు
ని చూడలేదు, తండ్రియొక్క రొమ్ము మీద ఉన్న జని
తైక కుమారుడైన ఈయనే ఆయనను బైలుపరిచెను.

నీవు ఎవడవని అడుగుటకు, యూదులు యెరూష 19
లేమునుంచి యాజకులను లేవీయులను యోహాను యొ
ద్దికి పంపినప్పుడు, అతడు ఇచ్చిన సాక్ష్యము ఇదే. । అప్పు 20
డు అతడు — ఎరుగననక, ఒప్పుకొని—నేను క్రీస్తును
కానని ఒప్పుకొనెను. । అప్పుడు వారు—ఆలాగైతే నీవు 21
ఎవడవు! నీవు ఏలీయావా? అని అడిగిరి. అందుకు
అతడు—కానని చెప్పెను. । నీవు ఆ ప్రవక్తవా? అం 22
టే—కానని ఉత్తరమిచ్చెను. కాబట్టి వారు—నీవు ఎవ
డవు? మమ్ము పంపిన వారికి మేము ఉత్తరమిచ్చుటకు,
నిన్ను గూర్చి నీవు ఏమి చెప్పుకొంటున్నావని అతని
అడిగిరి. । అప్పుడు అతడు—ప్రవక్తయైన యెషయా 23
చెప్పిన ప్రకారముగా నేను—ప్రభువుయొక్క తోవ
సరాళము చేయండి అని అరణ్యములో కంఠమెత్తి
పలికే ఒకని శబ్దమునని చెప్పెను.

పంపబడిన వారు ఫరిసైయులవారు. । అప్పుడు 24,25
వారు—నీవు క్రీస్తువైనా, ఏలీయావైనా, ఆ ప్రవక్త
వైనా కాకపోతే, ఎందుకు బాప్తిస్మము చేయిస్తున్నా
వని అతని అడిగిరి. । అప్పుడు యోహాను — నేను 26
నీళ్లతో బాప్తిస్మము చేయిస్తున్నాను. మీరు ఎరుగని
వాడొకడు మీ మధ్యను నిలిచి యున్నాడు. । నా 27
వెనుక వచ్చుచుండియు, నా కంటే ముఖ్యుడైన వాడు
ఆయనే. నేను ఆయన చెప్పుల వారును విప్పుటకు
పాత్రుడను కానని వారికి ఉత్తరమిచ్చెను. । యోహాను 28
బాప్తిస్మము చేయిస్తూ ఉన్న యొర్దానుకు అవతల
నున్న బేథనియలో ఇవి జరిగెను.

మరునాడు యోహాను యేసు తన యొద్దికి వచ్చుట 29
చూచి—ఇదుగో! లోకముయొక్క పాపను మోసు
కొని పోయే దేవుని గొర్రెపిల్ల!‖ నా వెంబడి ఒక మ 30
నుష్యుడు వస్తున్నాడు; ఆయన నా కంటే ప్రథముడై
యుండెను గనుక నా కంటే ముఖ్యుడాయెనని నేను
ఎవని గూర్చి చెప్పితినో ఆయనే ఈయన. । నేను 31
ఆయనను తెలుసుకొన లేకపోతిని; అయినప్పటికిని
ఆయన ఇశ్రాయేలుకు అగుపరచబడే కొరకు, నేను వచ్చి
నీళ్లతో బాప్తిస్మము చేయించుచుంటినని చెప్పెను.

---

*లేక, ఆయన. †లేక, ఆయనలో. ‡లేక, ప్రవేశించే. §లేక, శక్తి. ¶లేక, ఏకముగా పుట్టినవాని.
‖అనగా, యాగపశువు.

32 మరియు యోహాను సాక్ష్యమిస్తూ—ఆత్మ పావుర
ము వలె ఆకాశమునుంచి దిగుట చూచితిని, అప్పుడు
33 అది ఆయన మీద వాలెను. । నేను ఆయనను తెలుసు
కొన లేకపోతిని అయినప్పటికిని నీళ్లతో బాప్తిస్మము
చేయించుటకు నన్ను పంపినవాడు — నీవు ఆత్మ ఎవని
మీదికి దిగి ఎవని మీద వాలుట చూతువో, ఆయనే
పరిశుద్ధాత్మతో బాప్తిస్మము చేయించుచున్నవాడని నా
34 తో చెప్పెను. । ఈయన దేవుని కుమారుడై యున్నా
డని నేను చూచి సాక్ష్యమిచ్చి యున్నానని పలికెను.
35 మరునాడు యోహాను తిరిగి తన శిష్యులలో ఇద్దరి
36 తో కూడా నిలిచి, । నడుస్తూ ఉన్న యేసునితట్టు చూచి
37 —ఇదుగో! దేవుని గొర్రెపిల్ల! అని చెప్పెను. । ఆ ఇద్దరు
శిష్యులు ఆయన చెప్పుట విని యేసుని వెంబడించిరి.।
38 అంతట యేసు వెనుక తట్టు తిరిగి, వారు తన్ను వెంబ
డించుట చూచి—మీరు యేమి వెతుకుతున్నారని వా
రిని అడిగినప్పుడు, వారు (భాషాంతరమందు బోధకు
డా అని అర్థమిచ్చే)—రబ్బీ ఎక్కడ కాపురమున్నా
39 వని ఆయనను అడిగిరి. । —మీరు వచ్చి చూడండని ఆ
యన వారితో చెప్పెను. వారు వచ్చి ఆయన కాపుర
మున్న స్థలము చూచి, ఆ దినమున ఆయన యొద్ద నిలి
చిరి. అప్పుడు కొంచెము ఎక్కువ తక్కువ పది ఘంట
లైనది.*
40 యోహాను మాట విని ఆయనను వెంబడించిన ఇద్ద
రిలో ఒకడు, సీమోను పేతురుయొక్క సహోదరు
41 డైన అంద్రెయ అనే వాడు. । ఈయన మొదట సీమో
ననే తన సహోదరుని కనుగొని—మేము (భాషాంతర
మందు క్రీస్తని అర్థమిచ్చే) మెస్సీయను కనుగొంటి
42 మని అతనితో చెప్పి, । యేసుని యొద్దికి అతని తీసుకొని
వచ్చెను. యేసు అతని వైపు చూచి—నీవు యోనా
కుమారుడవైన సీమోనువు; నీవు కేఫా అనబడుదువని
చెప్పెను. ఇది రాయి అని అర్థమిస్తున్నది.
43 మరునాడు యేసు గలిలైయకు బైలు వెళ్లుటకు ఇచ్ఛ
యించెను. అప్పుడు ఆయన ఫిలిప్పును చూచి—నన్ను
44 వెంబడించుమని అతనితో చెప్పెను. । ఆ ఫిలిప్పు బేత్సై
దా, అనగా అంద్రెయ, పేతురు అనే వారి పట్టణపు
45 వాడై యుండెను. । ఫిలిప్పు, నథనయేలుని కనుగొని—
బోధన ప్రమాణములో మోషేయు, ప్రవక్తలును ఎవని
గూర్చి వ్రాసిరో వాని కనుగొంటిమి; ఆయన యోశేపు
కుమారుడైన యేసనే నజరెథునాడని ఆతనితో చె
46 ప్పెను. । అందుకు నథనయేలు—నజరెథులోనుంచి మం
చిది యేదైనా రాగలదా! అని ఆయనతో పలికినప్పు
డు—వచ్చి చూడుమని ఫిలిప్పు అతనితో చెప్పెను.

యేసు నథనయేలు తన యొద్దికి వచ్చుట చూచి— 47
ఇదుగో! యథార్థముగా ఇశ్రాయేలీయుడు; ఇతని
యందు యే కపటమును లేదని అతని గూర్చి పలికెను.।
నథనయేలు — నేనివల్ల నన్ను ఎరుగుదువని ఆయనను 48
అడిగెను. యేసు—ఫిలిప్పు నిన్ను పిలువక మునుపే,
నీవు ఆ అంజూరపు చెట్టుకింద ఉన్నప్పుడు నిన్ను
చూచినానని అతనికి ఉత్తరమిచ్చెను. । నథనయేలు— 49
రబ్బీ! నీవు దేవుని కుమారుడవై యున్నావు; నీవు
ఇశ్రాయేలు రాజవై యున్నావని ఆయనకు ఉత్తరమి
చ్చెను. । యేసు—ఆ యంజూరపు చెట్టుకింద నిన్ను 50
చూచినానని నేను చెప్పినందున నమ్ముతున్నావా!
వీటి కంటే గొప్ప వాటిని చూతువని అతనికి ఉత్తర
మిచ్చెను. । మరియు ఆయన—సత్యము సత్యము మీ 51
తో చెప్పుతున్నాను, ఇకమీదట ఆకాశము తెరవబ
డుటయు, దేవుని దూతలు మనుష్య కుమారుని మీద
ఎక్కుటయు దిగుటయును చూతురని పలికెను.

## 2. అధ్యాయము.

మూడవ దినమందు గలిలైయయొక్క కానా అనే 1
ఊరిలో ఒక వివాహమాయెను. । యేసు తల్లి అక్కడ 2
ఉండెను. యేసు ఆయన శిష్యులును ఆ వివాహ
మునకు పిలువబడిరి. । ద్రాక్షారసము తక్కువైనప్పుడు, 3
యేసు తల్లి—వారికి ద్రాక్షారసము లేదని ఆయనతో
చెప్పెను. । యేసు ఆమెతో—ఓ అమ్మా! నీతో నా 4
కేమి! నా గడియ ఇంకా రాలేదని చెప్పెను. । ఆయన 5
తల్లి— మీతో ఆయన యేమి చెప్పునో దాని చేయం
డని పరిచారకులతో చెప్పెను. । యూదుల శుద్ధిప్రకా 6
రము, రెండేసి మూడేసి తూములు పట్టే ఆరు రాతి
కుండలు అక్కడ ఉంచబడి యుండెను. । యేసు—ఆ 7
కుండలు నీళ్లతో నింపండని వారితో చెప్పెను. అప్పు
డు వారు వాటిని అంచుల మట్టుకు నింపిరి. । అప్పుడు 8
ఆయన—మీరు ఇప్పుడు ముంచుకొని, విందు ప్రధాని
యొద్దికి తీసుకొని వెళ్లండని వారితో చెప్పెను. వారు
తీసుకొని వెళ్లిరి. । అయితే ద్రాక్షారసముగా చేయబ 9
డిన ఆ నీటి రుచి విందు ప్రధాని చూచినప్పుడు, అది
ఎక్కడనుంచి కలిగెనో అతనికి తెలియక పోయెను.
అయితే ఆ నీళ్లు ముంచుకొనిన పరిచారకులకు తెలు
సును. । ఆ విందు ప్రధాని పెండ్లికుమారుని పిలిచి— 10
ప్రతి మనుష్యుడును మొదట మంచి ద్రాక్షారసమును
పెట్టి, తర్వాత వారు మత్తుగా ఉన్నప్పుడు అంత
కంటే చెడ్డదాని పెట్టును. అయితే నీవు ఇదివరకు
శ్రేష్ఠమైన ద్రాక్షారసమును ఉంచుకొని యున్నావని

* మధ్యాహ్నము మొదలుకొని ఘంటలు చూచుకొంటే ఇది నాలుగవ ఘంట.

11 అతనితో చెప్పెను.। గలిలైయయొక్క కానాలో యేసు
ఈ మొదటి అద్భుతము చేసి తన మహిమను బైలు
పరిచెను. అప్పుడు ఆయన శిష్యులు ఆయన యందు
విశ్వాసముంచిరి.

12 అటుతరువాత ఆయన, ఆయన తల్లి, ఆయన సహో
దరులు, ఆయన శిష్యులును కపెర్నహూముకు వెళ్లి
అక్కడ కొన్ని దినములు ఉండిరి.

13 యూదుల పస్కా అనే పండుగ సమీపించినందున,
14 యేసు యెరూషలేముకు వెళ్లి,। గుడిలో ఎడ్లను, గొఱ్ఱె
లను, పావురములను అమ్మేవారును, రూకలు మార్చే
15 వారును కూర్చుండుట చూచెను.। అప్పుడు ఆయన
తాళ్లతో కొరడా చేసి అందరిని, గొఱ్ఱెలను, ఎడ్లనును
గుడిలోనుంచి తోలివేసి, రూకలు మార్చేవారి
16 రూకలు చల్లివేసి, వారి బల్లలు పడదోసి,। పావురము
లను అమ్మేవారితో—వీటిని ఇక్కడనుంచి తీసుకొని
వెళ్లండి, నా తండ్రి ఇల్లు వ్యాపారపు ఇల్లుగా చేయ
17 వద్దని చెప్పెను.। అప్పుడు ఆయన శిష్యులు—నీ ఇంటి
విషయమైన ఆసక్తి నన్ను భక్షించెనని* వ్రాయబడి
యున్నదని జ్ఞాపకము చేసుకొనిరి.

18 కాబట్టి యూదులు—వీటిని చేస్తున్నావు గనుక
యే ఆనవాలు మాకు చూపిస్తున్నావని ఆయనకు ఉత్త
19 రమిచ్చిరి.। అందుకు యేసు—ఈ దేవాలయమును పడ
దోయండి; అప్పుడు మూడు దినములలో దాని లేవ
20 నెత్తుదునని వారితో ఉత్తరము చెప్పెను.। కాబట్టి
యూదులు—నలుబదియారు సంవత్సరములు ఈ దేవా
లయము కట్టబడెను; నీవు మూడు దినములలో దాని
21 లేవనెత్తుదువా! అని పలికిరి.। అయితే ఆయన తన శరీ
22 రమనే దేవాలయమును గూర్చి పలికెను.। కాబట్టి
ఆయన చనిపోయిన వారిలోనుంచి లేచిన తరువాత,
ఆయన శిష్యులు ఆయన దీని చెప్పెనని జ్ఞాపకము
చేసుకొని, లేఖనమును యేసు చెప్పిన మాటను విశ్వ
సించిరి.

23 అయితే ఆయన పస్కాయందు యెరూషలేములో
ఉన్నప్పుడు, ఆ పండుగలో అనేకులు ఆయన చేసిన
అద్భుతములను† చూచి ఆయన నామమందు విశ్వాస
24 ముంచిరి.। అయితే యేసు అందరిని ఎరిగినందున ఆయన
వారిని నమ్మలేదు. మనుష్యునియందు ఉండేది ఆయనకు
25 తెలుసును,। గనుక, ఎవడును మనుష్యుని గూర్చి ఆయ
నకు సాక్ష్యమియ్య నక్కరలేదు.

## 3. అధ్యాయము.

అయితే నికొదేమనే పేరుగల ఫరిసైయుడును 1
యూదుల ప్రధానియునైన ఒక మనుష్యుడు కలడు.।
అతడు రాత్రియందు యేసుని యొద్దికి వచ్చి—రబ్బీ! 2
నీవు దేవుని యొద్దనుంచి వచ్చిన బోధకుడవని ఎరుగు
దుము; దేవుడు తనకు తోడైయుంటేనే గాని ఎవడును
నీవు చేయుచున్న అద్భుతములు చేయ నేరడని ఆయ
నతో చెప్పెను.। అందుకు యేసు—సత్యము సత్యము 3
నీతో చెప్పుతున్నాను, ఎవడైనా తిరిగి జన్మించితేనే
గాని దేవుని రాజ్యమును చూడ నేరడని అతనికి ఉత్త
రమిచ్చెను.। అందుకు నికొదేము—ముసలివాడై యున్న 4
మనుష్యుడు ఏలాగు జన్మించగలడు? రెండవ మారు తల్లి
గర్భమందు ప్రవేశించి జన్మించగలడా? అని ఆయ
నతో పలికినప్పుడు,। యేసు—సత్యము సత్యము నీతో 5
చెప్పుతున్నాను, ఎవడైనా నీళ్ల వల్లను ఆత్మ వల్లను జన్మిం
చితేనేగాని దేవుని రాజ్యమందు ప్రవేశించ నేరడు.।
శరీరమువల్ల జన్మించినది శరీరమును, ఆత్మ వల్ల జన్మిం 6
చినది ఆత్మయునై యున్నది.। మీరు తిరిగి జన్మించ వలె 7
నని నేను నీతో చెప్పినందుకు ఆశ్చర్యపడవద్దు.। గాలి 8
తనకు ఇచ్ఛగల చోటను విసురును; నీవు దాని శబ్దము
వింటున్నావు, అయితే అది ఎక్కడనుంచి వచ్చునో
ఎక్కడికి పోవునో నీకు తెలియదు. ఆత్మ వల్ల జన్మించిన
ప్రతివాడును ఆలాగే ఉన్నాడని ఉత్తరమిచ్చెను.।
అందుకు నికొదేము—ఇవి ఏలాగు సంభవించ గలవని 9
ఆయనను అడిగెను.। అందుకు యేసు — నీవు ఇశ్రా 10
యేలు బోధకుడవే, వీటిని యెరుగవా? సత్యము సత్య
ము నేను నీతో చెప్పుతున్నాను,। మాకు తెలిసిన 11
దాని పలుకుతున్నాము, చూచినదానికి సాక్ష్యమిస్తు
న్నాము; మా సాక్ష్యము మీరు అంగీకరించరు.। భూ 12
సంబంధమైన వాటిని నేను మీతో చెప్పినప్పుడు
మీరు నమ్మని పక్షమందు ఆకాశసంబంధమైన వాటిని
మీతో పలికితే ఏలాగు నమ్మగలరు.। మరియు ఆకా 13
శమునుంచి దిగినవాడే, అనగా ఆకాశములో ఉన్న
మనుష్యకుమారుడే గాని ఆకాశమునకు ఎవడును ఎక్కి
వెళ్లలేదు.। అరణ్యములో మోషే సర్పము ఏలాగున 14
ఎత్తెనో ఆలాగున మనుష్యకుమారుడు,। ఆయన 15
యందు విశ్వాసముంచే ప్రతివాడును నశించక, నిత్య
జీవము పొందే కొరకు ఎత్తబడ వలెను;। దేవుడు లోక 16
మును ప్రేమించుట ఏలాగంటే, ఆయన యందు
విశ్వాసముంచే ప్రతివాడును నశించక, నిత్యజీవము
పొందే నిమిత్తము తన జనితైక కుమారుని ఇచ్చెను.।

* కీర్తన. 69. 9. †లేక, ఆనవాళ్లు.

17 దేవుడు లోకము ఆయన ద్వారా రక్షణ పొందుటకే
గాని లోకమునకు తీర్పు చేయుటకు తన కుమారుని
18 లోకమునకు పంప లేదు. । ఆయన యందు విశ్వాస
ముంచే వానికి తీర్పు చేయబడదు. అయితే విశ్వసిం
చనివాడు దేవుని జనితైక కుమారుని నామమందు
విశ్వాసముంచలేదు గనుక వానికి ఇంతకు మునుపే
19 తీర్పు చేయబడి యున్నది. । ఆ తీర్పు యేదంటే
వెలుగు లోకములోకి వచ్చెను, అయితే మనుష్యులు
తమ క్రియలు చెడ్డవైనందున వెలుగుకంటే చీకటిని
20 ప్రేమించిరి. । చెడ్డ క్రియలు చేసే ప్రతివానికి
వెలుగు అసహ్యమై యున్నది. వాడు తన క్రియలు
గద్దించబడక ఉండుటకు, వెలుగు యొద్దికి రాడు. ।
21 అయితే సత్యవర్తనుడైతే, తన క్రియలు దేవుని మూల
ముగా చేయబడి యున్నవి గనుక అవి అగుపడే
నిమిత్తము, వెలుగు యొద్దికి వస్తున్నాడని ఆయనతో
ఉత్తరము చెప్పెను.

22 అటుతరువాత యేసు తన శిష్యులతో కూడా యూ
దైయ దేశమునకు వచ్చి అక్కడ వారిలో నివసించి
23 బాప్తిస్మము చేయించుచుండెను. । అయితే యోహాను
కూడా సలైము దగ్గిర ఉన్న ఐనోనులో బాప్తిస్మము
చేయించుచుండెను; అక్కడ జలములు విస్తారమైనవి.
24 వారు వచ్చి బాప్తిస్మము చేయించుకొనుచుండిరి. । యో
హాను ఇంకా చెరసాలలో వేయబడలేదు.
25 కాబట్టి శుద్ధిని గూర్చి యోహాను శిష్యులకు ఒక
26 యూదునితో వివాదము పుట్టెను. । అప్పుడు వారు
యోహాను యొద్దికి వచ్చి—రబ్బీ! ఎవడు యొర్దానుకు
అవతల నీతో కూడా ఉండెనో, నీవు ఎవని గూర్చి
సాక్ష్యమిచ్చితివో, ఆయన ఇదుగో! బాప్తిస్మము చేయి
స్తున్నాడు; అందరు ఆయన యొద్దికి వస్తున్నారని ఆయ
27 నతో చెప్పిరి. । అందుకు యోహాను ఇట్లనెను—మను
ష్యుడు తనకు ఆకాశమునుంచి ఇయ్యబడినదైతేనే
28 గాని ఏమియు పుచ్చుకొన లేడు. । నేను క్రీస్తును కా
ననియు, ఆయన కంటే ముందుగా పంపబడి యున్నా
ననియు చెప్పినాననుటకు మీరు నాకు సాక్షులై యు
29 న్నారు. । పెండ్లికుమార్తె గలవాడు పెండ్లికుమారుడై
యున్నాడు. అయితే నిలువబడి పెండ్లికుమారుని శబ్ద
ము వినేవాని స్నేహితుడు ఆ పెండ్లికుమారుని శబ్ద
మువల్ల మిక్కిలీ సంతోషించును. కాబట్టి ఈ నా సం
30 తోషము సంపూర్ణమై యున్నది. । ఆయన హెచ్చ
31 వలెను నేను తగ్గ వలెను. । మీదనుంచి వచ్చేవాడు
అందరి మీద ఉన్నాడు. భూమినుంచి పుట్టినవాడు
భూ సంబంధియై భూమిని గూర్చి మాటలాడుచున్నా
డు. ఆకాశమునుంచి వచ్చినవాడు అందరి మీదనుండి, ।
తాను చూచే దాని గూర్చి వినే దాని గూర్చి సాక్ష్య 32
మిస్తున్నాడు. అయితే ఎవడును ఆయన సాక్ష్యమును
అంగీకరించడు. । ఆయన సాక్ష్యమును అంగీకరించిన 33
వాడు, దేవుడు సత్యవంతుడని ముద్రవేసి యున్నా
డు; । ఏలాగంటే దేవుడు పంపిన వాడు దేవుని మాటలు 34
పలుకుతున్నాడు; దేవుడు మితముగా ఆత్మను ఇయ్యడు. ।
తండ్రి కుమారుని ప్రేమించి ఆయన చేతికి సమస్త 35
మును ఇచ్చెను. । ఆ కుమారుని యందు విశ్వాసముంచే 36
వానికి నిత్యజీవము కలదు; కుమారుని విశ్వసించని*
వాడు జీవమును చూడడు; దేవుని ఉగ్రత వాని మీద
నిలుచును.

## 4. అధ్యాయము.

కాబట్టి యోహాను కంటే యేసు అనేకులను శిష్యు 1
లుగా చేసుకొని వారికి బాప్తిస్మము చేయించుచున్న
సంగతి పరిసైయులు విన్నారని ప్రభువుకు తెలిసిన
ప్పుడు, । ఆయన యూదా దేశము విడిచి గలిలైయకు 2
తిరిగి వెళ్లెను. । అయినప్పటికిని ఆయన శిష్యులే గాని 3
యేసు తానే బాప్తిస్మము చేయించలేదు. । ఆయన సమ 4
రైయ ద్వారా వెళ్ల వలసి యుండెను గనుక, । యాకోబు 5
యోశేపుకు ఇచ్చిన భూమి దగ్గిర ఉన్న సుఖారనబ
డిన సమరైయ దేశ గ్రామమునకు వచ్చెను. । అక్కడ 6
యాకోబు నుయ్యి ఉండెను. కాబట్టి యేసు ప్రయా
ణము వల్ల అలసటపడి ఈలాగున ఆ నూతి యొద్ద కూ
ర్చుండెను. అప్పటికి కొంచెము ఎక్కువ తక్కువ ఆరు
ఘంటలైనది.†

సమరైయ దేశపు స్త్రీ ఒకతె నీళ్లు తోడుకొను 7
టకు వచ్చెను. యేసు—నాకు తాగుటకు నీళ్లు ఇమ్మని
ఆమెను అడిగెను. । ఆయన శిష్యులు ఆహారము కొను 8
కొనుటకు ఊరిలోకి వెళ్లియుండిరి. । కాబట్టి ఆ సమ 9
రైయురాలైన స్త్రీ—యూదుడవైన నీవు సమరైయ
దేశపు స్త్రీనైన నన్ను—తాగుటకు ఇమ్మని ఏల అడుగు
తున్నావని ఆయనతో పలికెను. యూదులు సమరై
యులతో సాంగత్యము చేయరు. । అందుకు యేసు— 10
నీవు దేవుని వరమును,—నాకు తాగుటకు ఇమ్మని
నీతో చెప్పుచున్నవాడు ఎట్టివాడో అదియు ఎరిగి
యుంటే, నీవు ఆయనను అడిగియుందువు; ఆయన
జీవజలము నీకు ఇచ్చియుండునని ఆమెకు ఉత్తరము
చెప్పెను. । అప్పుడు ఆ స్త్రీ—అయ్యా! నీకు చేద 11

* లేక, కుమారునికి విధేయుడు కాని. † అనగా, యూదుల లెక్కచొప్పున మధ్యాహ్నము.

గైనా లేదు; ఈ నుయ్యి లోతైె యున్నది గనుక
12 దేనివల్ల ఆ జీవజలము నీకు కలుగును? । ఈ నుయ్యి
మాకు ఇచ్చి తన కుమాళ్లతోను, పశ్వాదులతోను తాను
కూడా దాని నీళ్లు తాగిన మన* తండ్రియైన యాకో
బుకంటే నీవు గొప్పవాడవా? అని ఆయనతో పలి
13 కెను. । అందుకు యేసు—ఈ నీళ్లు తాగే ప్రతివాని
14 కిని మళ్లీ దాహమవును. । అయితే నేను ఇచ్చే నీళ్లు
ఎవడు తాగునో వానికి ఎప్పుడును దాహము కాదు;
నేను వానికి ఇచ్చే నీళ్లు నిత్యజీవమునకు ఊరే నీటి
15 బుగ్గయై ఉండునని ఆమెకుత్తరమిచ్చెను. । అందుకు ఆ
స్త్రీ ఆయనను చూచి,—అయ్యా! నాకు దాహము కా
కుండుటకును, నేను చేదుటకు ఇక్కడికి రాకుండు
16 టకును ఆ నీళ్లు నాకు దయ చేయుమనెను. । అప్పుడు
యేసు—నీవు వెళ్లి నీ పెనిమిటిని పిలుచుకొని ఇక్క
17 డికి రమ్మని ఆమెతో చెప్పెను. । అందుకు ఆ స్త్రీ—
నాకు పెనిమిటి లేడని ఉత్తరమిచ్చెను. యేసు—నాకు
18 పెనిమిటి లేడని నిజముగా చెప్పినావు. । నీకు అయి
దుగురు పెనిమిట్లు ఉండిరి. ఇప్పుడు నీకు కలిగిన
వాడు నీ పెనిమిటి కాడు, దీని నిజముగా చెప్పితివని
19 ఆమెతో పలికెను. । అప్పుడు ఆ స్త్రీ—అయ్యా! నీవు
20 ప్రవక్తవనుకొంటున్నాను. । మా పితృలు ఈ పర్వత
మందు ఆరాధించేవారు; అయితే ఆరాధన చేయవల
సిన స్థలము యెరూషలేములో ఉన్నదని మీరు చెప్పు
21 తున్నారు అని ఆయనతో పలికెను. । అందుకు యే
సు—ఓ అమ్మా! ఈ పర్వతమందైనా యెరూషలేము
యందైనా ఉండక తండ్రిని ఆరాధించే కాలము
22 వచ్చునని నా మాట నమ్ముము. । మీరు మీకు తెలియని
దాని ఆరాధిస్తున్నారు. మేము మాకు తెలిసిన దాని
ఆరాధిస్తున్నాము; రక్షణ యూదులలో కలుగుచు
23 న్నది. । అయితే నిజమైన ఆరాధకులు ఆత్మతోను సత్య
ముతోను తండ్రిని ఆరాధించే కాలము వస్తున్నది;
ఇప్పుడును ఉన్నది; తండ్రి తన్ను ఆరాధించేవారు
అటువంటివారవుటకు తండ్రి కూడా కోరుతున్నాడు. ।
24 దేవుడు ఆత్మ గనుక ఆయనను ఆరాధించేవారు ఆత్మ
తోను, సత్యముతోను ఆరాధించవలెనని ఆమెతో
25 చెప్పెను. । ఆ స్త్రీ—క్రీస్తనే అర్థమిచ్చే మెస్సీయా
వచ్చునని ఎరుగుదును; ఆయన వచ్చినప్పుడు మాకు
సమస్తమును తెలియచేసునని ఆయనతో పలికెను. ।
26 అందుకు యేసు—నీతో పలుకుతున్న నేనే ఆయనని
ఆమెతో చెప్పెను.

ఇంతలో ఆయన శిష్యులు వచ్చి ఆయన స్త్రీతో 27
మాటలాడుతూ ఉండెనని ఆశ్చర్యపడిరి. అయినప్ప
టికి—నీవు దేని విచారిస్తున్నావు? ఈమెతో ఎందుకు
మాటలాడుతున్నావు అని ఎవడును అడుగలేదు.

కాబట్టి, ఆ స్త్రీ తన కుండ విడిచి, ఊరిలోకి వెళ్లి, । 28
—ఇదుగో! నేను చేసినవన్నియు నాతో చెప్పిన ఒక 29
మనుష్యుని చూడ రండి; ఈయన క్రీస్తు కాడా? అని
జనులతో పలికెను. । వారు ఊరిలోనుంచి బైలుదేరి 30
ఆయన యొద్దికి వచ్చినారు.

ఆ మధ్యను శిష్యులు — ఓ రబ్బీ! భుజించుమని 31
ఆయనను వేడుకొనిరి. । అయితే ఆయన—నేను భుజిం 32
చుటకు మీకు తెలియని ఆహారము నాకు కలదని
వారితో చెప్పెను. । కాబట్టి ఆ శిష్యులు ఒకనితో 33
ఒకడు— ఆయన భుజించుటకు ఎవడైనా, ఏమైనా
తెచ్చినాడేమో అని చెప్పుకొనిరి. । యేసు వారిని 34
చూచి—నన్ను పంపినవాని ఇచ్ఛ నెరవేర్చుటయు,
ఆయన పని సంపూర్తి చేసుటయు నా ఆహారమై
యున్నది. । మీరు ఇంకా నాలుగు నెలలైన తరువాత 35
కోత కాలము వచ్చునంటున్నారుగదా? ఇదుగో! మీ
కన్నులెత్తి పొలములను చూడండి, అవి ఇప్పుడే తెల్ల
బడి కోతకు సిద్ధమై యున్నవని మీతో చెప్పుతున్నా
ను. । —విత్తినవాడును, కోసినవాడును కూడా సంతో 36
షించేటట్టు, చేను కోసినవాడు జీతము పుచ్చుకొని,
నిత్యజీవము కొరకు ఫలము కూర్చుకొంటున్నాడు. ।
—ఒకడు విత్తును, మరియొకడు కోసుననే మాట ఇం 37
దులో సత్యమే. । మీరు దేనిగూర్చి కష్టపడ లేదో, 38
అది కోసుటకు మిమ్మును పంపినాను.† ఇతరులు కష్ట
పడిరి; మీరు వారి కష్టార్జితములలో ప్రవేశించితిరని
పలికెను.

మరియు — నేను చేసినవి ఏవో అవి యన్నియు 39
నాతో చెప్పెనని సాక్ష్యమిచ్చిన స్త్రీయొక్క మాటవల్ల
ఆ పట్టణస్థులైన సమరైయులలో అనేకులు ఆయన
యందు విశ్వాసముంచిరి. । కాబట్టి ఆ సమరైయులు 40
ఆయన యొద్దికి వచ్చి తమయొద్ద ఉండుటకు ఆయ
నను వేడుకొనిరి. అక్కడ ఆయన రెండు దినములు
ఉండెను. । అప్పుడు ఆయన వాక్యము వల్ల ఇంకా 41
అనేకులు నమ్మి ఆ స్త్రీని చూచి — ఇకమీదట నీవు
చెప్పిన దానివల్ల నమ్ముతున్నాము కాము; । మేము కూ 42
డా విని ఈయన నిశ్చయముగా లోక రక్షకుడైన
క్రీస్తని యెరిగియున్నామనిరి.

*లేక, మా. †యెహోషువా. 24: 13.

43 ఆ రెండు దినములైన తరువాత ఆయన అక్కడ
44 నుంచి బైలుదేరి గలిలైయకు వెళ్లెను; । ప్రవక్త తన
స్వదేశములో ఘనత పొందడని యేసు సాక్ష్యమి
45 చ్చెను. । కాబట్టి ఆయన గలిలైయకు వచ్చినప్పుడు, గలి
లైయులు, ఆయన యెరూషలేములో పండుగ వేళ
చేసినవన్ని చూచినందున, ఆయనను చేర్చుకొనిరి; వా
46 రుకూడా ఆ పండుగకు వెళ్లిరి. । కాబట్టి యేసు తాను
నీళ్లు ద్రాక్షారసముగా చేసిన గలిలైయలో ఉన్న
కానానుకు తిరిగి వచ్చెను.

47 అప్పుడు కపెర్నహూములో రోగియైన కుమా
రుడుగల ఒక ప్రధాని ఉండెను. యేసు యూదైయ
నుంచి గలిలైయకు వచ్చెనని అతడు వినినప్పుడు, ఆయన
యొద్దికి వెళ్లి, ఆయన వచ్చి తన కుమారుని స్వస్థపరు
చుటకు వేడుకొనెను; అతడు మృతిపొందనై యుం
48 డెను. । కాబట్టి యేసు — మీరు గురుతులను అద్భుతము
లను చూడకపోతే నమ్మనే నమ్మరని అతనితో పలికెను. ।
49 ఆ ప్రధాని — ఓ ప్రభువా! నా పిల్ల చావకమునుపే
50 రమ్మని ఆయనను వేడుకొనెను. । యేసు — నీవు వెళ్లుము,
నీ కుమారుడు బ్రతుకునని అతనితో చెప్పెను. ఆ
మనుష్యుడు యేసు తనతో చెప్పిన మాట నమ్మి వెళ్లి
51 పోయెను. । అతడు ఇంకా వెళ్లుచు ఉండగా అతని
దాసులు అతనికి ఎదురుగా వచ్చి — నీ కుమారుడు
52 బ్రతికియున్నాడని తెలియ చెప్పిరి. । కాబట్టి అతనికి
యే గడియలో స్వస్థత కలిగినదని వారిని అడిగినప్పు
డు వారు — నిన్న ఏడో గడియను జ్వరము అతని విడి
53 చెనని అతనితో చెప్పిరి. । యేసు — నీ కుమారుడు బ్రతు
కునని తనతో చెప్పిన గడియ అదే అని తండ్రి తెలు
సుకొనెను గనుక అతడు అతని ఇంటివారందరును
54 నమ్మిరి. । యేసు యూదైయనుంచి గలిలైయకు వచ్చి
చేసిన రెండవ అద్భుతము అదే.

## 5. అధ్యాయము.

1 అటుతరువాత, యూదుల పండుగ ఒకటి వచ్చెను.
2 అప్పుడు యేసు యెరూషలేముకు వెళ్లెను. । యెరూష
లేములో గొఱ్ఱెల ద్వారము దగ్గిర, హెబ్రీ భాషలో
బేథెస్ద అనబడిన ఒక కోనేరు కలదు. దానికి అయిదు
3 మంటపములున్నవి. । వాటిలో బహు విస్తారమైన బల
హీనులు, గుడ్డివారు, కుంటివారు, ఎండిన వారును
పండుకొని ఉండిరి. [వారు నీళ్లు చలించబడుటకు కని
4 పెట్టుచుండిరి; । ఒక దూత ఒకానొకప్పుడు ఆ
కోనేటిలో ప్రవేశించి నీళ్లు కలగేటట్టు చేసెను గనుక
నీళ్లు కలగిన తరువాత మొదట ప్రవేశించిన వానికి
5 ఏ రోగము కలిగినప్పటికీ బాగు చేయబడెను.] । అక్కడ
ముప్పది ఎనిమిది సంవత్సరములనుంచి రోగము కలిగిన
ఒక మనుష్యుడు ఉండెను. । అతడు పండుకొనియుం 6
డుట యేసు చూచి, అతడు అప్పటికి బహు కాలము
నుంచి ఆ స్థితిలో ఉన్నాడని యెరిగి — స్వస్థపడుటకు
కోరుతున్నావా అని అతని అడిగెను. । అప్పుడు ఆ 7
రోగి — ప్రభువా! నీళ్లు కలగించబడేటప్పుడు నన్ను
కోనేటిలో ఉంచుటకు నాకు ఏ మనుష్యుడును లేడు
గనుక నేను వచ్చుచున్నప్పుడు, మరియొకడు నాకంటే
ముందుగా దిగునని ఆయనకు ఉత్తరమిచ్చెను. । అప్పుడు 8
యేసు — నీవు లేచి నీ పరుపు ఎత్తుకొని నడువుమని
అతనితో చెప్పెను. । వెంటనే ఆ మనుష్యుడు స్వస్థత 9
పొంది తన పరుపు ఎత్తుకొని నడిచెను.

ఆ దినము సబ్బాతువారము గనుక యూదులు — 10
ఇది సబ్బాతు, నీవు నీ పరుపు ఎత్తుకొన కూడదని
స్వస్థత పొందిన వానితో చెప్పిరి. । అందుకు అతడు — 11
నన్ను స్వస్థపరిచినవాడే — నీ పరుపు ఎత్తుకొని నడువు
మని నాతో చెప్పెననెను. । కాబట్టి వారు — నీ పరుపు 12
ఎత్తుకొని నడువుమని నీతో చెప్పిన మనుష్యుడు
ఎక్కడ ఉన్నాడని అతని అడిగిరి. । అయితే ఆయన 13
ఎవడో స్వస్థత పొందినవానికి తెలియక పోయెను;
ఆ చోటను సమూహము ఉండెను గనుక యేసు జారి
పోయెను.

ఆ తరువాత యేసు గుడిలో అతని చూచి — ఇదుగో! 14
నీవు స్వస్థత పొందితివి, మరీ ఎక్కువ కీడు నీకు కలుగక
ఉండుటకు ఇకమీదట పాపము చేయకుమని చెప్పె
ను. । ఆ మనుష్యుడు వెళ్లి తన్ను స్వస్థపరిచినవాడు 15
యేసని యూదులకు తెలియచెప్పెను. । కాబట్టి వీటిని 16
సబ్బాతులో చేసినందున యూదులు యేసుని తరిమి,
ఆయనను చంపుటకు చూచిరి. । అయితే యేసు — నా 17
తండ్రి ఇదివరకు క్రియ చేస్తున్నాడు, నేనును చేస్తు
న్నానని వారికి ఉత్తరమిచ్చెను. । కాబట్టి యూదులు 18
దీనివల్ల మరీ యెక్కువగా ఆయనను చంపుటకు కోరిరి;
ఆయన సబ్బాతు వదలుట మాత్రమే కాకుండా దేవుడు
తన స్వకీయమైన తండ్రి అని చెప్పి తన్ను దేవునితో
సమానునిగా చేసుకొనెను.

కాబట్టి యేసు — సత్యము సత్యము నేను మీతో 19
చెప్పుతున్నాను, కుమారుడు తండ్రి ఏది చేయుట
చూచునో అదేగాని తనంతట తాను దేనిని చేయ
నేరడు; ఆయన వేటిని చేసునో వాటిని కుమారు
డును అలాగే చేసును; । తండ్రి కుమారుని ప్రేమిస్తూ 20
తాను చేసే వాటినన్నిటినిని ఆయనకు అగుపరుస్తు
న్నాడు. మరియు, మీరు ఆశ్చర్యపడుటకు, వీటికంటే
గొప్ప కార్యములను ఆయనకు అగుపరుచును; । తండ్రి 21

చనిపోయిన వారిని ఏలాగు లేపి బ్రతికించునో, ఆలా
గే కుమారుడు కూడా తాను ఇచ్ఛయించే వారిని బ్రతి
22 కించును. । అంతేకాదు, తండ్రి ఎవనికిని తీర్పైనను
23 చేయడు; । అయితే అందరును తండ్రిని ఘనపరిచే
ప్రకారము కుమారుని ఘనపరిచే నిమిత్తము, తీర్పు
చేయ నధికారము కేవలము కుమారునికి అప్పగించెను.
కుమారుని ఘనపరచనివాడు, ఆయనను పంపిన తం
24 డ్రినిని ఘనపరచడు. । సత్యము సత్యము నేను మీతో
చెప్పుతున్నాను, నా వాక్యము విని నన్ను పంపిన
వాని యందు విశ్వాసముంచే వానికి నిత్యజీవము కలిగి
యుండును. అతడు తీర్పులోకి రాక, మరణమునుంచి
25 జీవములోకి వచ్చేయున్నాడు. । సత్యము సత్యము మీ
తో చెప్పుతున్నాను, మృతులు దేవుని కుమారుని శబ్ద
ము వినే గడియ వస్తున్నది; అప్పుడు వినేవారు జీవిం
26 తురు; ఆ గడియ ఇప్పుడును ఉన్నది; । తండ్రి ఏలాగు
తనంతట తానే జీవము గలవాడై యున్నాడో, ఆలాగే
కుమారుడును తనంతట తానే జీవముగలవాడై యుండ
27 నిచ్చెను. । మరియు ఆయన మనుష్యకుమారుడై యు
న్నాడు గనుక తీర్పు చేయుటకును ఆయనకు అధి
28 కారము ఇచ్చెను. । దీనికి ఆశ్చర్యపడకండి; సమాధు
లలో ఉన్నవారందరు ఆయన శబ్దము విని, మంచి
క్రియలు చేసినవారు జీవము నిమిత్తము పునరుత్థానమై,।
29 చెడ్డ క్రియలు చేసినవారు తీర్పు నిమిత్తము పునరుత్థా
నమై బైటికి వచ్చే గడియ వస్తున్నది.

30 నా యంతట నేనే ఏమియు చేయలేను. నేను వినే
ప్రకారము తీర్పు చేస్తున్నాను; నన్ను పంపిన వాని
ఇచ్ఛసే గాని నా ఇచ్ఛను నేను కోరను గనుక నా
31 తీర్పు న్యాయమై యున్నది. । నన్ను గూర్చి నేను సా
32 క్ష్యమిచ్చితే, నా సాక్ష్యము నిజము కాదు. । నన్ను
గూర్చి సాక్ష్యమిచ్చే వేరొకడు కలడు. ఆయన నన్ను
33 గూర్చి ఇచ్చే సాక్ష్యము సత్యమని ఎరుగుదును. । మీరు
యోహాను యొద్దికి కొందరిని పంపినప్పుడు, ఆతడు
34 సత్యమునకు సాక్ష్యమిచ్చెను. । అయితే మనుష్యులవల్ల
నేను సాక్ష్యము పుచ్చుకొనను; అయినప్పటికి, మీరు
35 రక్షించబడ వలెనని వీటిని చెప్పుతున్నాను. । ఆతడు
వెలిగించబడి ప్రకాశించుచున్న దీపమైయుండెను.
మీరు అతని వెలుగులో ఉండి కొంత కాలము సం
36 తోషించుటకు మనస్సు గలవారైతిరి. । అయితే యో
హాను సాక్ష్యము కంటే నాకు ఎక్కువైనది కలదు; నేను
నెరవేర్చుటకు తండ్రి ఏ కార్యములను నాకు ఇచ్చె
నో, నేను చేయుచున్న ఆ కార్యములు, తండ్రి నన్ను
పంపెనని నన్ను గూర్చి సాక్ష్యమిస్తున్నవి. । మరియు 37
నన్ను పంపిన తండ్రి తాను నన్ను గూర్చి సాక్ష్య
మిచ్చి యున్నాడు. మీరు ఏ కాలమందైనను ఆయన
శబ్దము వినలేదు, ఆయన రూపము చూడ లేదు. ।
మీరు, మీలో ఆయన వాక్యము ఉంచుకొని యుండ 38
లేదు; ఆయన ఎవని పంపెనో ఆయనను మీరు విశ్వ
సించక ఉన్నారు. । లేఖనములను పరిశోధించుడి; 39
వాటియందు మీకు నిత్యజీవము కలిగి యున్నదని
తలంచుకొంటున్నారు. అవే నన్ను గూర్చి సాక్ష్యమి
స్తున్నవి. । అయితే మీకు జీవము కలిగే నిమిత్తము 40
నా యొద్దికి వచ్చుటకు మీకు మనస్సు లేదు. । నేను 41
మనుష్యులవల్ల మహిమను అంగీకరించను. । అయితే 42
దేవుని ప్రేమ మీలో లేదని మిమ్మును ఎరిగి ఉన్నా
ను. । నేను నా తండ్రి నామమున వచ్చి ఉన్నాను, 43
అయితే మీరు నన్ను అంగీరించరు; మరి యొకడు
తన స్వకీయ నామమున వచ్చితే, అతని అంగీకరిం
తురు. । అద్వితీయ దేవునివల్ల వచ్చే ఘనత* కోరక, 44
ఒకనివల్ల ఒకడు ఘనత* పొందుచున్న మీరు ఏలాగు
విశ్వసించ గలరు? నేను తండ్రియొద్ద మీ మీద నేర
ము మోపుదునని తలంచకండి. । మీరు ఆశ్రయించు 45
చున్న మోషే అనేవాడు మీయందు నేరము మోపు
చున్నవాడు; । అతడు నన్ను గూర్చి వ్రాసెను గనుక 46
మీరు మోషేను నమ్మితే నన్ను నమ్ముదురు. । అయితే 47
మీరు అతని లేఖనములు నమ్మకపోతే, నా మాటలను
ఏలాగు నమ్ముదురని వారికుత్తరమిచ్చెను.

## 6. అధ్యాయము.

అటుతరువాత, యేసు తిబెరియ సముద్రమనే గలి 1
లైయ సముద్రము దాటి అద్దరికి వెళ్లెను. । అప్పుడు 2
బహు జనసమూహము ఆయన రోగుల యెడల చేసిన
అద్భుతములను చూచి ఆయనను వెంబడించెను. । అయి 3
తే యేసు పర్వతమెక్కి అక్కడ తన శిష్యులతో
కూడా కూర్చుండెను. । అప్పుడు యూదుల పండు 4
గైన పస్కా సమీపించెను. । కాబట్టి యేసు కన్నులెత్తి 5
బహు సమూహము తన యొద్దికి వచ్చుట చూచి—వీరు
భోజనము చేయుటకు ఎక్కడనుంచి రొట్టెలు కొని
తెప్పింతమని ఫిలిప్పును అడిగెను. । అయితే తాను 6
ఏమి చేయనై ఉండెనో అది తనకు తెలుసును గనుక
అతని శోధించుటకే అట్లా పలికెను. । అందుకు ఫిలిప్పు 7
—వారిలో ప్రతివాడును కొంచెము కొంచెము పుచ్చు
కొనేకొరకు ఇన్నూరు దేనారములు† రొట్టెలు చాల
వని ఆయనకు ఉత్తరమిచ్చెను. । ఆయన శిష్యులలో 8

* లేక, మెప్పు. † దేనారమనగా—కొంచెము యెక్కువ తక్కువ అయిదణాలు.

ఒకడు, అనగా సీమోను పేతురు సహోదరుడైన
9 అంద్రెయ, ।—ఇక్కడ ఉన్న ఒక చిన్నవానికి ఐదు
యవల రొట్టెలు, రెండు చిన్న చేపలు కలిగియున్నవి.
అయితే ఇంతమందికి ఇవి యేమాత్రమని ఆయనతో
10 పలికెను. । అయితే యేసు—మనుష్యులను కూర్చుండ
బెట్టుండని చెప్పెను. అప్పుడు ఆ స్థలమందు చాలా
పచ్చిక ఉండెను గనుక, లెక్కకు కొంచెము ఎక్కువ
11 తక్కువ ఐదు వేల పురుషులు కూర్చుండిరి. । అప్పుడు
యేసు ఆ రొట్టెలు పట్టుకొని స్తోత్రముచేసి,* వాటిని
శిష్యులకు ఇచ్చెను. శిష్యులు కూర్చుండినవారికి
వడ్డించిరి. ఆలాగున చేపలు కూడా వారికి ఇష్టమై
12 నంత మట్టుకు వడ్డించిరి. । వారు తృప్తి పొందిన తరు
వాత—ఏమియు నష్టపడకుండా, మిగిలిన ముక్కలు
13 పోగు చేయుడని తన శిష్యులతో చెప్పెను. । కాబట్టి
వారు భోజనము చేయగా, వారియొద్ద మిగిలిన ఐదు
యవల రొట్టెల ముక్కలు పోగుచేసి పన్నెండు గం
పలు నింపిరి.

14 కాబట్టి ఆ మనుష్యులు యేసు చేసిన అద్భుతము
చూచి—నిజముగా ఈ లోకమునకు రాగల ప్రవక్త
15 ఈయనే అని చెప్పుకొనుచుండిరి. । కాబట్టి తన్ను
రాజుని చేయుటకు వారు వచ్చి తన్ను తీసుకొన బోవు
చున్నారని యేసు ఎరిగి, మళ్లీ పర్వతము మీదికి ఒం
టిగా వెళ్లెను.

16 అయితే సాయంకాలమైనప్పుడు ఆయన శిష్యులు
సముద్రము యొద్దికి వెళ్లి దోనె ఎక్కి కపెర్నహూ
17 ము తట్టు సముద్రము అద్దరికి వెళ్లుచుండిరి. । అప్పు
డు చీకటి అయినది; అయితే యేసు వారి యొద్దికి
18 వచ్చి యుండ లేదు. । మరియు పెద్ద గాలి విసురుట
19 వల్ల సముద్రము పొంగుతూ ఉండెను. । కాబట్టి వారు
కొంచెము తక్కువ రెండు కోసుల మట్టుకు దోనె
నడిపించిన తరువాత, యేసు సముద్రము మీద నడిచి,
20 తమ దోనె దగ్గరకు వచ్చుట చూచి భయపడిరి.।అయితే
ఆయన—నేనే ఉన్నాను; భయపడకండి అని వారితో
21 చెప్పెను. । కాబట్టి ఆయనను దోనె మీద ఎక్కించు
కొనుటకు ఇచ్ఛయించిరి. వెంటనే ఆ దోనె వారు
వెళ్లుతూ ఉన్న దేశమందు చేరెను.

22 మరునాడు సముద్రమునకు అద్దరి నిలిచియున్న
జనసమూహము, ఆయన శిష్యులు ఎక్కిన చిన్న దోనె
ఒక్కటే గాక అక్కడ మరియొకటి లేదనియు, యేసు
తన శిష్యులతో కూడా ఆ చిన్న దోనెలో ప్రవేశించ
లేదు గాని ఆయన శిష్యులు మాత్రము వెళ్లినారనియు
చూచిరి. । అయితే ప్రభువు స్తోత్రము చేసినప్పుడు, 23
వారు రొట్టె భుజించిన స్థలము దగ్గర ఉన్న తిబెరియ
నుంచి వేరే చిన్న దోనెలు వచ్చినవని చూచిరి.। కాబట్టి 24
యేసును ఆయన శిష్యులును అక్కడ లేరని జనసమూ
హము తెలుసుకొన్నప్పుడు, వారు ఆ చిన్న దోనె
లెక్కి, కపెర్నహూముకు యేసుని వెతుకుతూ వచ్చి
రి. । అప్పుడు సముద్రము అద్దరిని ఆయనను కనుగొని— 25
రబ్బీ! నీవు ఎప్పుడు ఇక్కడికి వచ్చితివని అడిగిరి. ।
అందుకు యేసు—సత్యము సత్యము నేను మీతో చెప్పు 26
తున్నాను, మీరు అద్భుతములు చూచుటవల్ల కాదు
అయితే ఆ రొట్టెలు భుజించి తృప్తి పొందుటవల్లనే
నన్ను వెతుకుతున్నారు. । నిత్యజీవమునకు నిలిచే భోజ 27
నము కొరకేగాని నశించే భోజనము కొరకు కష్టపడ
కండి; మనుష్య కుమారుడు దాని మీకు ఇచ్చును;
తండ్రి, అనగా దేవుడు, ఆయనకు ముద్రవేసెనని వా
రికి ఉత్తరమిచ్చెను.

కాబట్టి వారు—మేము దేవుని కార్యములు జరిగిం 28
చుటకు, ఏమి చేయ వలెనని ఆయనను అడిగిరి. ।
అందుకు యేసు—దేవుని కార్యమనగా ఆయన పంపిన 29
వాని యందు మీరు విశ్వాసముంచుటే అని వారికి
ఉత్తరమిచ్చెను । గనుక వారు— కాబట్టి మేము చూచి 30
నిన్ను విశ్వసించుటకు, నీవు ఏ అద్భుతము చేస్తున్నా
వు? ఏమి చేస్తున్నావు? ।—ఆకాశమునుంచి రొట్టెను భు 31
జించుటకు ఆయన వారికిచ్చెనని† వ్రాయబడిన ప్రకా
రముగా మన పితృలు అరణ్యములో మన్నా‡ భుజిం
చిరని ఆయనతో పలికిరి.

కాబట్టి యేసు—సత్యము సత్యము నేను మీతో 32
చెప్పుతున్నాను, మోషే ఆకాశమునుంచి వచ్చే రొట్టె
మీకు ఇయ్యలేదు; అయితే నా తండ్రి ఆకాశమునుంచి
నిజమైన రొట్టె మీకు ఇస్తున్నాడు; । ఆకాశమునుంచి 33
దిగి, లోకమునకు జీవము ఇచ్చేది, దేవుని రొట్టెయై
యున్నదని వారితో చెప్పెను. । అందుచేతను వారు— 34
ప్రభువా! ఎల్లప్పుడును ఈ రొట్టెను మాకు దయచే
యుమని పలికిరి.। అందుకు యేసు వారితో—నేను జీవ 35
మనే రొట్టెనై యున్నాను; నాయొద్దికి వచ్చేవానికి
ఆకలి ఏమాత్రమును కలుగదు. నాయందు విశ్వాస
ముంచేవానికి దాహము ఎప్పుడును కలుగదు.। అయి 36
తే—మీరు నన్ను చూచియుండియు విశ్వసించకున్నా
రని మీతో చెప్పితిని. । తండ్రి నాకిచ్చే ప్రతివాడును 37
నా యొద్దికి వచ్చును; నా యొద్దికి వచ్చేవాని నేను
ఎంతమాత్రమును బైటికి తోలివేయను; । నన్ను పంపిన 38

* లేక, ఆశీర్వదించి. †కీర్తన. 78. 24. ‡ దేవుడు అరణ్యములో తన ప్రజలకిచ్చిన ఆహారము.

వాని ఇచ్ఛనే గాని నా ఇచ్ఛ నెరవేర్చుటకు ఆకా
39 శమునుంచి వచ్చి ఉండలేదు. । నన్ను పంపిన తండ్రి
ఇచ్ఛ ఏదంటే—ఆయన నాకు ఇచ్చిన యావత్తులో
నేను ఏమియు పోగొట్టుకొనక, అంత్య దినమందు
40 దాని లేప వలెననేదే; । కుమారుని చూచి ఆయనయందు
విశ్వాసముంచే ప్రతివాడును నిత్యజీవము పొంద వలె
ననేది నన్ను పంపిన నా తండ్రి ఇచ్ఛయై ఉన్నది;
నేను అంత్య దినమందు వాని లేపుదునని వారితో
పలికెను.

41 కాబట్టి—నేను ఆకాశమునుంచి దిగిన రొట్టెనై
యున్నానని ఆయన పలికినందున, యూదులు ఆయ
నను గూర్చి సణుగుకొంటు—ఈయన యోసేపు కుమా
42 రుడైన యేసు కాడా?।ఈయన తలిదండ్రులను మనము
ఎరుగుదుము గదా? అందు చేతను—నేను ఆకాశము
నుంచి వచ్చి యున్నానని ఈయన ఏలాగు చెప్పుచు
43 న్నాడని పలికిరి. । కాబట్టి యేసు — మీలో మీరు
44 సణుగుకొనకండి; । నన్ను పంపిన తండ్రి అతని లాగు
కొంటేనే గాని ఏ మనుష్యుడును నా యొద్దికి రానేర
45 డు; నేను అంత్య దినమందు అతని లేపుదును.।—వారం
దరును దేవునిచేత బోధింపబడుదురని ప్రవక్తల లేఖ
నములలో వ్రాయబడి యున్నది. కాబట్టి తండ్రివల్ల
విని, బోధపరుచుకొనిన ప్రతి వాడును నా యొద్దికి
46 వచ్చును. । దేవుని యొద్దనుంచి వచ్చియున్న వాడు
గాక, మరి ఎవడైనను తండ్రిని చూచినాడని కాదు,
ఈయనే తండ్రిని చూచి యున్నాడు.

47 సత్యము సత్యము నేను మీతో చెప్పుచున్నాను,
నా యందు విశ్వాసముంచే వానికి నిత్యజీవము కలిగి
48 యున్నది.* । నేను జీవముగల రొట్టెనై యున్నాను.।
49 మీ పితృలు అరణ్యములో మన్నా తిని చనిపోయిరి;।
50 దీని తినే ప్రతివాడును చావకుండుటకు ఆకాశము
51 నుంచి వచ్చిన రొట్టె ఇదే. । నేను ఆకాశమునుంచి
వచ్చిన జీవముగల రొట్టెనై ఉన్నాను; ఎవడైనను ఈ
రొట్టె తింటే ఎల్లప్పుడును జీవించును. మరియు నేను
ఇచ్చే రొట్టె లోకముయొక్క జీవము నిమిత్తము నేను
ఇచ్చే నా మాంసమై యున్నదని పలికెను.

52 కాబట్టి యూదులు — ఈయన తన మాంసము ఏ
లాగు తినుటకు ఇయ్యగలడని ఒకనితో ఒకడు వాదిం
53 చిరి. । కావున యేసు—సత్యము సత్యము నేను మీతో
చెప్పుతున్నాను; మీరు మనుష్య కుమారుని మాంసము
తిని, ఆయన రక్తము తాగితేనే గాని మీకు మీలో
54 జీవము ఉండదు. । నా మాంసము తిని నా రక్తము
తాగే వానికి నిత్యజీవము ఉన్నది. అంత్య దినమందు
అతని లేపుదును; । నా మాంసము నిజమైన భోజన 55
ము, నా రక్తము నిజమైన పానీయమునై ఉన్నది. ।
నా మాంసము తిని నా రక్తము తాగేవాడు నా యం 56
దును నేను వాని యందును ఉందుము. । జీవముగల 57
తండ్రి నన్ను పంపిన ప్రకారము, నేను తండ్రి నిమిత్తము
జీవించే ప్రకారము, నన్ను తినే వాడెవడో వాడును
నా నిమిత్తము జీవించును.। ఇది ఆకాశమునుంచి వచ్చిన 58
రొట్టె. పితృలు మన్నా తిని చనిపోయిన ప్రకారము
కాదు; ఈ రొట్టె తినే వాడు ఎల్లప్పుడును జీవించి
ఉండునని చెప్పెను.

ఆయన కపెర్నహూములో బోధిస్తూ, సునగోగు 59
లో వీటిని చెప్పెను గనుక ఆయన శిష్యులలో అనే
కులు విని । — ఇది కఠినమైన మాట; దాని ఎవడు విన 60
గలడని పలికిరి. । అయితే యేసు తన శిష్యులు దీని 61
గూర్చి సణుగుకొనుచున్నారని తనలో తానే ఎరిగి—
ఇది మీకు అభ్యంతరము కలుగ చేస్తున్నదా?। కాబట్టి 62
మనుష్యకుమారుడు మునుపు ఉన్న చోటికి ఎక్కుట
చూచితే, ఏమనుకొందురు? ఆత్మయే జీవింప చేస్తున్న
ది; । మాంసము, కేవలము నిష్ప్రయోజనమై యున్నది. 63
నేను మీతో పలికిన మాటలు ఆత్మయు, జీవమునై
యున్నవి. । అయితే మీలో నమ్మనివారు కొందరు 64
ఉన్నారని వారితో చెప్పెను; నమ్మనివారు ఎవరో
అదియు, తన్ను అప్పగించనై యున్నవాడెవడో అది
యు మొదటినుంచి యేసునకు తెలుసును. । అప్పుడు 65
ఆయన—నా తండ్రిచేత ఇయ్యబడకుంటే ఏ మనుష్య
డును నా యొద్దికి రాలేడని దీనివల్ల మీతో చెప్పితినని
వారితో పలికెను.

అప్పటినుంచి ఆయన శిష్యులలో అనేకులు వెను 66
కకు వెళ్లి, ఆ తరువాత ఆయనతో నడువక పోయిరి. ।
కాబట్టి యేసు—మీరు కూడా వెళ్లిపోవుటకు ఇచ్ఛ 67
యిస్తున్నారా? అని పన్నెండుమందిని అడిగెను. ।
అందుకు సీమోను పేతురు—ప్రభువా! ఎవని యొద్దికి 68
వెళ్లిపోదుము? నిత్యజీవముగల మాటలు నీకు ఉన్నవి. ।
నీవు జీవముగల దేవుని కుమారుడవైన క్రీస్తువని† 69
మేము నమ్మి ఎరిగి యున్నామని ఆయనకు ఉత్తర
మిచ్చెను. । అందుకు యేసు—నేను పన్నెండు మంది 70
యైన మిమ్మును ఏర్పరుచుకొనలేదా? అయితే మీలో
ఒకడు సైతాను స్వరూపుడని వారికి ఉత్తరమిచ్చెను. ।
సీమోను కుమారుడైన ఇష్కరియోతనే యూదాను 71
గూర్చి దీని పలికెను; అతడు పన్నెండుమందిలో ఒకడై
ఆయనను అప్పగించనై యుండెను.

*యెషయా. 54. 13. †కొన్ని మంచి ప్రతులలో, దేవుని పరిశుద్ధుడవని.

## 7. అధ్యాయము.

1 ఆ తరువాత యేసు గలిలైయలో తిరుగుచునుం
డెను; యూదులు ఆయనను చంపుటకు చూచినారు
గనుక యూదైయలో తిరుగుటకు ఆయనకు మనస్సు
లేక పోయెను.

2 పర్ణశాలల పండుగ అనే యూదుల పండుగ
3 సమీపమై యుండెను గనుక, । ఆయన సహోదరులు
—నీ శిష్యులు కూడా నీవు చేసే నీ కార్యములు చూ
చుటకు, ఈ స్థలము విడిచి యూదైయకు వెళ్లుము; ।
4 ఎవడును బహిరంగమందు ఉండుటకు కోరి, రహస్య
మందు యేదియు చేయడు. నీవు వీటిని చేయుచున్నా
వు గనుక నిన్ను నీవే లోకమునకు అగుపరచుకొను
5 మని ఆయనతో చెప్పిరి; । ఆయన సహోదరులు కూ
డా ఆయనయందు విశ్వాసముంచలేదు.

6 కాబట్టి యేసు—నా సమయము ఇంక రాలేదు;
మీ సమయము ఎల్లప్పుడును సిద్ధమై యున్నది. ।
7 లోకులు మిమ్మును ద్వేషించ లేరు; అయితే నేను వారి
క్రియలు చెడ్డవని వారిని గూర్చి సాక్ష్యమిస్తున్నాను
8 గనుక, నన్ను ద్వేషిస్తున్నారు. । మీరు ఈ పండుగకు
వెళ్లండి. నా సమయము ఇంక సంపూర్ణము కా
లేదు గనుక నేను ఈ పండుగకు ఇంక వెళ్లనని
వారితో చెప్పెను.

9 ఆయన వారితో ఈలాగు పలికి గలిలైయలో
10 నిలిచెను. । అయితే ఆయన సహోదరులు వెళ్లిపో
యిన తరువాత, ఆయన కూడా బహిరంగము కాక,
రహస్యముగానే పండుగకు వెళ్లెను.

11 కాబట్టి యూదులు—ఆయన ఎక్కడ ఉన్నాడని
12 ఆ పండుగలో ఆయనను వెతుకుచుండిరి. । మరియు
ఆ జనసమూహములలో ఆయనను గూర్చి మిక్కిలీ
సణుగుట కలిగెను. కొందరు—ఆయన మంచివాడనిరి.
మరికొందరు—కాదు గాని, అతడు ప్రజలను మోసప
13 రుస్తున్నాడనిరి. । అయినప్పటికి యూదుల భయమువల్ల
ఎవడును ధైర్యముగా ఆయనను గూర్చి పలుకలేదు.
14 అయితే ఆ పండుగ మధ్యను, యేసు గుడిలో
15 ప్రవేశించి బోధించుచుండెను. । అప్పుడు యూదులు
ఆశ్చర్యపడి—నేర్చుకొనని ఈయనకు లేఖనములు
ఏలాగు తెలిసినవని చెప్పుకొనిరి.

16 కాబట్టి యేసు — నా బోధ నాది కాదు, అది
17 నన్ను పంపిన వానిది. । ఆయన ఇచ్ఛ జరిగించుటకు
ఎవడైనను ఇచ్ఛయించితే, ఈ బోధ దేవునివల్ల కలిగి
నదో, లేక నాయంతట నేనే పలికినదో దాని తెలు
సుకొనును. । తనంతట తానే పలికేవాడు తన స్వకీయ 18
మహిమను వెదకుకొనుచున్నవాడు. అయితే తన్ను
పంపిన వాని మహిమపరుచుటకు చూచేవాడు సత్య
వంతుడు; ఆయనయందు దుర్నీతి లేదు. । మోషే 19
మీకు బోధనప్రమాణము ఇయ్యలేదా! అయితే మీలో
ఎవడును ఆ బోధన ప్రమాణము గైకొనుచుండుట
లేదు. మీరు ఎందుకు నన్ను చంపుటకు వెదకుచున్నా
రని వారికి ఉత్తరమిచ్చెను.

అందుకు జనసమూహము—నీవు దయ్యము పట్టిన 20
వాడవు; ఎవడు నిన్ను చంపుటకు వెదకుచున్నాడని
ప్రత్యుత్తరమిచ్చెను. । యేసు—నేను ఒక కార్యము 21
చేసితిని; అందువల్ల మీరందరు ఆశ్చర్యపడుచున్నారు. ।
మోషే మీకు ఛేదనసంస్కారము నియమించెను; 22
అయితే అది పితృలవల్లనే గాని మోషేవల్లనైనది
కాదు. మీరు సబ్బాతు దినమందు మనుష్యునికి ఛేద
నసంస్కారము చేతురు. । మోషే బోధన ప్రమాణము 23
మీరబడక ఉండుటకు, ఒక మనుష్యుడు సబ్బాతు
దినమందు ఛేదనసంస్కారము పొందగా, నేను సబ్బా
తు దినమందు ఒక మనుష్యుని కేవలము స్వస్థుని చేసి
నందున నా మీద కోపపడ వచ్చునా? । వెలి చూపువల్ల 24
తీర్పు చేయక, న్యాయము చొప్పున తీర్పు తీర్చుం
డని వారికి ప్రత్యుత్తరమిచ్చెను.

కాబట్టి యెరూషలేము వారిలో కొందరు—వారు 25
చంపుటకు కోరుచున్నవాడు ఈయన కాడా? । అయితే 26
ఇదుగో! ఆయన ధైర్యముగా మాటలాడుచున్నప్పటికి
ఆయనతో ఏమియు చెప్పకున్నారు. నిజముగా ఈయన
క్రీస్తని అధికారులు ఒక వేళ తెలుసుకొని యున్నా
రేమో. । అయితే ఈయన ఎక్కడివాడో ఈయనను 27
ఎరుగుదుము; క్రీస్తు వచ్చేటప్పుడు ఆయన ఎక్కడి
వాడో ఎవనికిని తెలియదని చెప్పుకొనుచుండిరి.

కాబట్టి యేసు—మీరు నన్ను ఎరుగుదురు, నేను 28
ఎక్కడివాడనో ఎరుగుదురు. మరియు నాకు నేనే
రాలేదు; నన్ను పంపినవాడు సత్యవంతుడై యున్నా
డు.* ఆయనను మీరు ఎరుగరు; । నేను ఆయనను 29
ఎరుగుదును; ఆయన యొద్దనుంచి వచ్చినాను; ఆయన
నన్ను పంపెనని గుడిలో బోధించుచు, నోరెత్తి
పలికెను.

కాబట్టి వారు ఆయనను పట్టుకొనుటకు చూచిరి. 30
అయితే ఆయన గడియ ఇంక రాలేదు గనుక, ఎవ
డును ఆయన మీద చెయ్యి వేయలేదు. । మరియు 31
జనసమూహములో అనేకులు ఆయనయందు విశ్వా

*లేక, నిజముగా ఉన్నాడు.

సముంచి—క్రీస్తు వచ్చినప్పుడు ఈయన చేసినవాటి
కంటె ఎక్కువైన అద్భుతములు చేసునా? అని చెప్పు
కొనుచుండిరి.

32 జనసమూహము ఆయనను గూర్చి ఈలాగు గుస
గుసలాడుచుండుట ఫరిసయ్యులు వినిరి. అప్పుడు ఫరి
సయ్యులును ప్రధానయాజకులును ఆయనను పట్టుకొ
33 నుటకు బంట్రౌతులను పంపిరి. । కాబట్టి యేసు—
ఇంక కొంత కాలము నేను మీతో ఉన్నాను; తరు
34 వాత నన్ను పంపిన వాని యొద్దికి వెళ్లుదును. । మీరు
నన్ను వెతికియు నన్ను కనుగొనలేరు; నేను ఎక్కడ
ఉందునో అక్కడికి మీరు రాలేరని చెప్పెను.

35 కాబట్టి యూదులు — మనము ఇతని కనుగొన
కుండేలాగున, ఇతడు ఎక్కడికి వెళ్లబోతున్నాడు!
హెల్లేనీయులలో* చెదిరిపోయిన వారి యొద్దికి వెళ్లి
36 హెల్లేనీయులకు ఉపదేశించ బోతున్నాడా?।—నన్ను
వెతికి చూడలేరు, నేను ఎక్కడ ఉందునో అక్కడికి
మీరు రాలేరు అని వాడు చెప్పిన ఈ మాట ఏమిటో
అని తమలో తాము చెప్పుకొనుచుండిరి.

37 ఆ పండుగలో గొప్పదైన అంత్య దినమందు యేసు
నిలిచి—ఎవనికైనను దాహమైతే, నా యొద్దికి వచ్చి
38 తాగ వచ్చును.। నాయందు విశ్వాసముంచే వాడెవడో,
లేఖనము చెప్పిన ప్రకారము, అతని† కడుపులోనుంచి
జీవజలము గల నదులు పారునని నోరెత్తి పలికెను.।
39 అయితే ఆయన యందు విశ్వాసముంచేవారు పొంద
బోయే ఆత్మను గూర్చి ఈలాగు పలికెను; యేసు
ఇంక మహిమపరచబడ లేదు గనుక పరిశుద్ధాత్మ ఇంక
(వచ్చి) ఉండలేదు.

40 కాబట్టి జనసమూహములో అనేకులు ఆ మాట
విని—నిజముగా ఈయన ఆ‡ ప్రవక్తయై యున్నాడ
41 నిరి. । ఇతరులు—ఈయన క్రీస్తే అని పలికిరి. అయితే
మరి కొందరు—క్రీస్తు గలిలైయలోనుంచి వచ్చునా?।
42 క్రీస్తు దావీదు సంతానమందు పుట్టి, దావీదు ఉన్న
బేత్లెహేమనే ఊరిలోనుంచి వచ్చునని లేఖనము చెప్ప
43 లేదా? అని పలికిరి. । కాబట్టి ఆయనను గూర్చి ఆ
44 సమూహములో భేదము కలిగెను. । వారిలో కొందరు
ఆయనను పట్టుకొన కోరిరి. అయితే ఎవడును ఆయన
మీద చేతులు వేయలేదు.

45 కాబట్టి ఆ బంట్రౌతులు ప్రధానయాజకుల యొద్ది
కిని ఫరిసయ్యుల యొద్దికిని వచ్చినప్పుడు, వారు—
మీరు ఎందుకు ఆయనను తీసుకొని రాలేదని అడి
46 గిరి. । అందుకు, ఆ బంట్రౌతులు — ఈ మనుష్యుని
వలె మనుష్యుడు యెన్నడును మాటలాడ లేదని ఉత్తర
మిచ్చిరి. । అందుకు ఫరిసయ్యులు—మీరు కూడా మోస 47
పోతిరా? । అధికారులలో గాని ఫరిసయ్యులలో గాని 48
ఎవడైనను ఆయన యందు విశ్వాసముంచెనా? । అయితే 49
బోధన ప్రమాణము ఎరుగని ఈ జనసమూహము శాప
గ్రస్తమై యున్నదని వారికి ప్రత్యుత్తరమిచ్చిరి.
రాత్రి వేళ ఆయన యొద్దికి వచ్చిన నికొదేము 50
వారిలో ఒకడు. । అతడు—ఆ మనుష్యుని మాట వినక, 51
వాడు చేసేదాని తెలుసుకొనక మునుపే, మన బోధన
ప్రమాణము వానికి తీర్పు చేసునా? అని పలికెను. ।
అందుకు వారు—నీవును గలిలైయనుంచి వచ్చితివా? 52
విచారించి చూడుము, గలిలైయలో ఏ ప్రవక్తయు
పుట్ట లేదని ఉత్తరమిచ్చిరి.
ప్రతివాడును తన తన ఇంటికి వెళ్లినప్పుడు, యేసు 53
ఒలీవ చెట్ల కొండకు వెళ్లెను.

## ౮. అధ్యాయము.

ఉదయమందు యేసు తిరిగి గుడిలోకి వెళ్లెను. । 1
అప్పుడు ప్రజలందరు ఆయన యొద్దికి వచ్చిరి. ఆయన 2
కూర్చుండి వారికి బోధించుచుండెను. । అయితే శా 3
స్త్రులు ఫరిసయ్యులును, వ్యభిచారమందు పట్టబడిన
ఒక స్త్రీని తీసుకొని వచ్చి, ఆమెను మధ్యను నిలువ
బెట్టి । —బోధకుడా! ఈ స్త్రీ వ్యభిచరించుచు క్రియ 4
లోనే పట్టబడెను. । అటువంటి వారిని రాళ్లతో కొట్ట 5
వలెనని మోషే బోధన ప్రమాణములో మాకు ఆజ్ఞా
పించెను. కాబట్టి (ఆమెను గూర్చి) నీవు ఏమి చెప్పు
దువని ఆయనను అడిగిరి. । ఆయన యందు నేరము 6
స్థాపించుటకు ఆయనను శోధించుచు ఈలాగు పలి
కిరి. అయితే యేసు వంగి, నేల మీద వేలితో వ్రా
యుచుండెను. । వారు ఆయనను ఇంకా అడుగుచుం 7
డగా, ఆయన లేచి—మీలో నిష్పాపియైన వాడు
మొదట ఆమె మీద రాయి వేయవచ్చునని వారితో
చెప్పి, । తిరిగి వంగి నేల మీద వ్రాయుచుండెను. । 8
అయితే వారు విని, తమ మనస్సాక్షివల్ల గద్దించబ 9
డుచు, పెద్దలు మొదలుకొని కడపటి వారి పర్యం
తము అందరు ఒకడొకడుగా బైటికి వెళ్లిరి. అప్పుడు
మధ్యను నిలిచిన ఆ స్త్రీతో, యేసు మాత్రమే ఉం
డెను. । యేసు లేచినప్పుడు, ఆ స్త్రీ గాక మరి ఎవ 10
డును కనబడలేదు గనుక, ఆయన—ఓ స్త్రీ! నీ మీద
నేరము మోపినవారు ఎక్కడ ఉన్నారు? ఎవడును

*అనగా, అన్యదేశములలో నివసించిన యూదులు. †లేక, ఆయన. ‡లేక, రావలసిన.

11 నీకు శిక్ష విధించ లేదా? అని అడిగినప్పుడు, । ఆమె
—ప్రభువా! ఎవడును శిక్ష విధించ లేదని చెప్పెను.
అందుకు యేసు—నేను కూడా నీకు శిక్ష విధించను;
నీవు వెళ్లి ఇకమీదట పాపము చేయ వద్దని ఆమెతో
పలికెను.

12 కాబట్టి యేసు — నేను లోకమునకు వెలుగునై
యున్నాను; నన్ను వెంబడించే వాడు చీకటిలో నడు
వక జీవపు వెలుగు గలవాడై యుండునని తిరిగి వారి
13 తో చెప్పెను. । కాబట్టి పరిసైయులు—నిన్ను గూర్చి
నీకు నీవే సాక్ష్యమిస్తున్నావు; నీ సాక్ష్యము నిజము
కాదని ఆయనతో చెప్పిరి.

14 అందుకు యేసు—నన్ను గూర్చి నేను సాక్ష్యమి
చ్చినప్పటికి, నా సాక్ష్యము నిజమై యున్నది. ఎక్క
డనుంచి వచ్చితినో, ఎక్కడికి వెళ్లుదునో నేను
ఎరుగుదును; అయితే నేను ఎక్కడనుంచి వచ్చి యు
న్నానో, ఎక్కడికి వెళ్లుదునో మీకు తెలియదు. ।
15 మీరు శరీరము పట్టి తీర్పు చేస్తున్నారు; నేను
16 (ఆలాగున) ఎవనికిని తీర్పు చేయను. । అయితే నేను
తీర్పు చేసే పక్షమందు, నా తీర్పు నిజమై యుం
డును; నేను ఒక్కడనే కాను, నేను నన్ను పంపిన
17 తండ్రియు నున్నాము. । మరియు ఇద్దరు మనుష్యుల
సాక్ష్యము నిజమై యున్నదని మీ బోధన ప్రమాణ
18 ములో వ్రాయబడి యున్నది. । నన్ను గూర్చి నేను
సాక్ష్యమిచ్చే వాడనై యున్నాను; నన్ను పంపిన
తండ్రియు నన్ను గూర్చి సాక్ష్యమిస్తున్నాడని ఉత్తర
మిచ్చెను.

19 అందుకు వారు—నీ తండ్రి ఎక్కడ నున్నాడని
ఆయనను అడిగిరి. అప్పుడు యేసు—మీరు నన్నైనా
నా తండ్రినైనా ఎరుగరు; నన్ను ఎరిగియుంటే నా
తండ్రిని కూడా ఎరుగుదురని వారికి ఉత్తరమిచ్చెను. ।
20 ఆయన గుడిలో బోధించుచు, కానుకల పెట్టె యున్న
చోట ఈలాగు పలికెను; అయితే ఎవడును ఆయ
నను పట్టుకొన లేదు. ఆయన గడియ ఇంక రాలేదు.

21 కాబట్టి యేసు — నేను వెళ్లిపోతున్నాను; మీరు
నన్ను వెతుకుదురు గాని మీ పాపముతో* చనిపో
దురు; నేను వెళ్లే చోటికి మీరు రాలేరని తిరిగి వారి
22 తో చెప్పెను. । అందుకు యూదులు — నేను వెళ్లే
చోటికి మీరు రాలేరని ఈయన చెప్పుచున్నాడు
గనుక తన్ను తానే చంపుకొనునా అని చెప్పుకొను
23 చుండిరి. । అప్పుడు ఆయన—మీరు కిందివారు, నేను
మీదివాడను. మీరు ఈ లోకపువారు, నేను ఈ
లోకపువాడను కాను, । గనుక మీ పాపములతో* 24
మీరు చనిపోదురని మీతో చెప్పితిని; నేను ఆయ
ననని మీరు నమ్మకపోతే మీరు మీ పాపములతో*
చనిపోదురని వారితో చెప్పెను. । కాబట్టి వారు— 25
నీవు ఎవడవు? అని ఆయనను అడిగిరి. । అప్పుడు 26
యేసు—మొదట నేను మీతో పలుకుచున్నదే. నేను
మిమ్మును గూర్చి పలుకుటకును తీర్పు చేయుటకును
అనేకమైనవి నాకు కలవు; అయితే నన్ను పంపిన
వాడు సత్యవంతుడు. నేను ఆయన యొద్ద వేటిని విం
టినో, వాటిని లోకములో పలుకుచున్నానని వారి
తో చెప్పెను.

ఆయన తండ్రిని గూర్చి తమతో మాటలాడెనని 27
వారు గ్రహించలేదు । గనుక యేసు—మీరు మనుష్య 28
కుమారుని ఎప్పుడు ఎక్కించియుందురో, అప్పుడు
నేను ఏమైయున్నానో† మీరు తెలుసుకొందురు.
నాయంతట నేనే ఏమియు చేయక, నా తండ్రి
నాకు నేర్పిన ప్రకారము వీటిని పలుకుచున్నాను. ।
మరియు నన్ను పంపినవాడు నాకు తోడై యున్నా 29
డు. ఆయనకు ఇష్టమైన వాటిని ఎల్లప్పుడును చేస్తు
న్నాను గనుక, తండ్రి నన్ను ఒంటిగా విడువ లేదని
వారితో పలికెను.

ఆయన వీటిని పలుకుచున్నప్పుడు, అనేకులు 30
ఆయనయందు విశ్వాసముంచిరి. । కాబట్టి యేసు— 31
మీరు నా వాక్యమందు నిలిచి యుంటే, యథార్థ
ముగా నా శిష్యులై యుండి । సత్యము తెలుసుకొం 32
దురు; అప్పుడు సత్యము మిమ్మును విడిపించునని తన
యందు విశ్వాసముంచిన వారితో చెప్పెను. । అందుకు 33
వారు — మేము అబ్రాహాముయొక్క సంతానము,
మేము ఎన్నడును ఎవనికిని దాసులమై యుండలేదు,
—మీరు విడిపింపబడుదురని నీవు ఏల చెప్పుతున్నావు!
అని ఆయనకుత్తరమిచ్చిరి. । అందుకు యేసు—సత్యము 34
సత్యము నేను మీతో చెప్పుచున్నాను. పాపము
చేసే ప్రతివాడును పాపముయొక్క దాసుడై యు
న్నాడు. । దాసుడు ఎల్లప్పుడును ఇంటిలో నిలువడు; 35
కుమారుడు ఎల్లప్పుడును నిలుచును. । కాబట్టి, కుమా 36
రుడు మిమ్మును విడిపించితే, నిశ్చయముగా విడుదల
గలవారై యుందురు. । మీరు అబ్రాహాముయొక్క 37
సంతానమని నాకు తెలుసును; అయితే నా వాక్యము
మీలో సాగదు గనుక నన్ను చంపుటకు చూచుచు
న్నారు. । నేను నా తండ్రియొద్ద చూచినదాని పలు 38
కుచున్నాను; ఆ ప్రకారము మీరును మీ తండ్రియొద్ద
చూచినదాని చేయుచున్నారని వారికి ఉత్తరమిచ్చె

*లేక, పాపస్థితిలో. †లేక, నేను ఆయనని.

39 ను.। అందుకు వారు—మా తండ్రి అబ్రాహామని ఆయ
నకు ఉత్తరమిచ్చిరి. యేసు—మీరు అబ్రాహాము పిల్ల
40 లైతే అబ్రాహాము చేసిన క్రియలు చేతురు.। అయితే
నేను దేవునివల్ల వినిన సత్యమే మీతో చెప్పిన మను
ష్యుడనైన నన్ను మీరు ఇప్పుడు చంపుటకు చూచు
41 చున్నారు. అబ్రాహాము ఈలాగు చేయలేదు.। మీరు
మీ తండ్రియొక్క క్రియలు చేస్తున్నారని వారితో
చెప్పెను. అందుకు వారు—మేము వ్యభిచారము వల్ల
పుట్టలేదు, దేవుడైన తండ్రి ఒక్కడే మాకు కలడనిరి.।
42 అందుకు యేసు—దేవుడు మీ తండ్రియై యుంటే,
నన్ను ప్రేమింతురు; నేను దేవుని యొద్దనుంచి బైలు
దేరి వచ్చియున్నాను. అంతే కాదు, నాయంతట
నేనే రాలేదు; అయితే ఆయన నన్ను పంపెను.।
43 మీరు ఎందుకు నా పలుకును గ్రహించరు? మీరు నా
44 మాట విన నేరక ఉండుటవల్లనే.। మీరు (మీ) తండ్రి
యైన సైతాను సంబంధులు; మీ తండ్రియొక్క దురా
శలు నెరవేర్చుటకు ఇచ్ఛయిస్తున్నారు; వాడు మొద
టినుంచి నరహంతకుడై, సత్యమందు నిలుచుట లేదు;
వానియందు సత్యము లేదు. వాడు అబద్ధము పలికే
టప్పుడు స్వకీయమైన వాటినుంచి పలుకును; అబద్ధి
45 కుడును దాని తండ్రియునై యున్నాడు.। మరియు
నేను సత్యము చెప్పుచున్నాను గనుక మీరు నన్ను
46 నమ్మరు.। మీలో ఎవడు నామీద పాపము మోప
గలడు? నేను సత్యము చెప్పుచుంటే, మీరు ఎందుకు
నన్ను నమ్మరు? దేవుని సంబంధియైనవాడు దేవుని
47 మాటలు వినును.। ఆ ప్రకారము మీరు దేవుని సంబం
ధులు కారు గనుక, మీరు వినరని వారితో చెప్పెను.
48 అందుకు యూదులు—నీవు సమరైయుడవు, దయ్య
ము పట్టినవాడవునై యున్నావని మేము బాగా చెప్ప
49 లేదా? అని ఆయనకు ఉత్తరమిచ్చిరి.। అప్పుడు యేసు—
నేను దయ్యము పట్టినవాడను కాను; అయితే నా
తండ్రిని ఘనపరుస్తున్నాను; మీరు నన్ను అవమానపరు
50 స్తున్నారు.। నేను నా మహిమను చూచుకొనను. చూ
చుచు తీర్పు చేయుచునుండేవాడు ఒకడు ఉన్నాడు.।
51 సత్యము సత్యము మీతో చెప్పుచున్నాను, ఎవడైనను
నా వాక్యము గైకొంటే, ఎన్నడును మరణము చూడ
డని ఉత్తరమిచ్చెను.

52 అందుకు యూదులు—నీవు దయ్యము పట్టిన వాడ
వని ఇప్పుడు తెలుసుకొంటిమి. అబ్రాహాము, ప్రవక్త
లును చనిపోయిరి; అయినప్పటికి—నా వాక్యము ఎవ
డైనను గైకొంటే, ఎన్నడును మరణముయొక్క రుచి
53 చూడడని నీవు చెప్పుచున్నావు.। చనిపోయిన అబ్రా
హామనే మా తండ్రికంటే నీవు గొప్పవాడవా? ప్రవక్త
లు కూడా చనిపోయిరి; నిన్ను నీవే ఎవనిగా చేసు
కొంటున్నావని ఆయనతో పలికిరి.

అందుకు యేసు—నన్ను నేనే మహిమపరుచుకొం 54
టే, నా మహిమ వట్టిది.—మా దేవుడని మీరు ఎవని
గూర్చి చెప్పుకొందురో ఆ నా తండ్రి నన్ను మహి
మపరుస్తున్నాడు.। మీరు ఆయనను తెలుసుకొనలేదు; 55
నేను ఆయనను ఎరుగుదును; ఆయనను ఎరుగనని నేను
చెప్పితే, మీ వలె అబద్ధికుడనై యుందును; అయితే
ఆయనను ఎరుగుదును, ఆయన వాక్యము గైకొనుచుం
దును.। మీ తండ్రియైన అబ్రాహాము నా దినము 56
చూతునని* సంతోషించెను. ఆయన చూచి ఆనందిం
చెనని పలికెను.। అందుకు యూదులు—నీకు ఇంక 57
యేబది సంవత్సరములు లేవు గదా, అబ్రాహామును
చూచితివా? అని ఆయనతో పలికిరి.

అందుకు యేసు—సత్యము సత్యము మీతో చెప్పు 58
చున్నాను, అబ్రాహాము పుట్టకమునుపు నేను ఉన్నా
నని పలికెను.। కాబట్టి వారు ఆయన మీద రువ్వు 59
టకు రాళ్లు పట్టుకొనిరి. అయితే యేసు దాగి గుడి
లోనుంచి బైలుదేరి, వారి మధ్యనుంచి ఆలాగు వెళ్లి
పోయెను.

## 9. అధ్యాయము.

ఆయన వెళ్లిపోవుచు, పుట్టినప్పటినుంచి గుడ్డియైన 1
ఒక మనుష్యుని చూచెను.। అప్పుడు ఆయన శిష్యులు 2
—రబ్బీ! ఇతడు గుడ్డివాడై పుట్టుటకు, ఎవడు పాపము
చేసెను? ఇతడా? లేక ఇతని కన్నవారా? అని ఆయ
నను అడిగిరి.

అందుకు యేసు—ఇతడైనా ఇతని కన్నవారైనా 3
పాపము చేయలేదు; అయితే దేవుని క్రియలు అతని
యందు అగుపరచబడుటకే.। పగలు ఉన్నంతమట్టుకు, 4
నన్ను పంపినవాని క్రియలు నేను చేయుచుండ వలెను.
రాత్రి వస్తున్నది; అప్పుడు ఎవడును కార్యము చేయ
లేడు.। నేను ఈ లోకమందు ఉన్నప్పుడు లోకము 5
నకు వెలుగునై యున్నానని పలికెను.

ఆయన వీటిని పలికి నేల మీద ఉమ్మివేసి, ఆ 6
ఉమ్మితో బురద చేసి, ఆ గుడ్డివాని కన్నుల మీద
ఆ బురద రాచి,। పంపబడిన వాడనే అర్థమిచ్చే, 7
సీలోహామనే కోనేటికి నీవు వెళ్లి అందులో కడుగు
కొనుమని చెప్పెను. అతడు వెళ్లి కడుగుకొని చూపు
గలవాడై వచ్చెను.

*లేక, చూచే నిమిత్తము.

8 కాబట్టి ఆ పొరుగువారును, వాడు భిక్షకుడని*
ముందు చూచిన వారును—వీడు కూర్చుండి భిక్షమె
త్తుచుండే వాడు కాడా? అని చెప్పుకొనుచుండిరి.।
9 వీడే అని కొందరు, వాని పోలియున్నవాడని మరి
కొందరు పలికిరి. అప్పుడు అతడు—వాడు నేనే
10 అని చెప్పెను.। కాబట్టి వారు—నీ కన్నులు ఏలాగు
11 తెరవబడెనని అతని అడిగిరి.। అందుకు అతడు—
యేసు అనబడిన ఒక మనుష్యుడు బురద చేసి, నా
కన్నుల మీద దాని రాచి—నీవు సీలోహామనే కోనే
టికి వెళ్లి, నీ కన్నులు కడుగుకొనుమని నాతో చెప్పె
ను. నేను వెళ్లి కడుగుకొని చూపు పొందినాననెను.।
12 అంతట వారు—ఆయన ఎక్కడ ఉన్నాడని అడిగిన
ప్పుడు వాడు—నేనెరుగనని పలికెను.

13 వారు ముందు గుడ్డియైనవాని, ఫరిసైయుల యొ
14 ద్దికి తీసుకొని వెళ్లిరి.। మరియు యేసు ఆ బురద చేసి
15 అతని కన్నులు తెరవ చేసిన దినము సబ్బాతు।గనుక
అతడు ఏలాగు చూపు పొందెనో దాని గూర్చి ఫరి
సైయులు కూడా తిరిగి అతని అడిగిరి. అప్పుడు
అతడు—నా కన్నుల మీద ఆయన బురద వేసెను;
నేను కడుగుకొని చూస్తున్నాను అని వారితో చెప్పె
16 ను.। కాబట్టి ఫరిసైయులలో కొందరు—ఈ మను
ష్యుడు సబ్బాతును గైకొనక ఉన్నాడు గనుక దేవుని
యొద్దనుంచి వచ్చినవాడు† కాడని పలికిరి. మరి కొం
దరు—పాపియైన మనుష్యుడు ఈలాటి అద్భుతము
లు ఏలాగు చేయగలడని పలికిరి. అంతట వారిలో
17 భేదము కలిగెను.। కాబట్టి వారు తిరిగి ఆ గుడ్డి
వానితో—అతడు నీ కన్నులు తెరవచేసినందున నీవు
18 అతని గూర్చి ఏమి అనుకొనుచున్నావనిరి.। అందుకు
19 అతడు—ఆయన ప్రవక్త అని పలికెను.। కాబట్టి యూ
దులు, వాడు గుడ్డివాడై చూపు పొందెనని నమ్మలేక,
చూపు పొందినవాని తలిదండ్రులను పిలిపించి—గుడ్డి
వాడై పుట్టెనని మీరు చెప్పే మీ కుమారుడు ఇతడా?
ఆలాగైతే ఇప్పుడు ఇతనికి దేనివల్ల దృష్టి కలిగెను?
అని వారిని అడిగిరి.

20 అందుకు అతని తలిదండ్రులు—ఇతడే మా కుమా
రుడనియు, ఇతడు గుడ్డివాడై పుట్టెననియు ఎరుగు
21 దుము.। అయితే ఇప్పుడు ఇతనికి చూపు ఏలాగు
కలిగెనో అది ఎరుగము; ఎవడు ఇతని కన్నులు తె
రవ చేసెనో అదియు మేమెరుగము; ఇతనికి(యుక్త)
వయస్సు కలిగెను, ఇతని అడుగండి; తన్ను గూర్చి
22 తానే పలుక గలడని వారితో పలికిరి.।అతని తలిదం
డ్రులు యూదులకు భయపడినందున ఆలాగు పలికిరి.
ఎందుకంటే, ఆయన క్రీస్తని ఎవడైనను ఒప్పుకొంటే
వాడు సునగోగులోనుంచి వెలివేయబడుటకు, యూ
దులు అంతకు మునుపు నిర్ణయించుకొనిరి,। గనుక 23
అతని తలిదండ్రులు—అతనికి యుక్త వయస్సు కలి
గెను, అతని అడుగండనిరి.

కాబట్టి వారు రెండవమారు గుడ్డివాడైయుండిన 24
మనుష్యుని పిలిపించి—నీవు దేవుని మహిమపరుచుము;
ఈ మనుష్యుడు పాపియని మేము ఎరుగుదుమని అత
నితో పలికిరి.। అందుకు అతడు—ఆయన పాపి 25
అవునో కాడో నాకు తెలియదు; నాకు తెలిసినదే
మంటే, నేను గుడ్డినై యుండి, ఇప్పుడు చూస్తున్నా
ననెను.। అప్పుడు వారు—ఆయన నీకు ఏమి చేసెను. 26
నీ కన్నులు ఏలాగు తెరవ చేసెనని తిరిగి అతని అడి
గిరి.। అందుకు అతడు—ఇందాక మీతో చెప్పినాను 27
గాని మీరు వినలేదు. మళ్లి విన వలెనని మీరు ఎందుకు
కోరుతున్నారు! ఆయన శిష్యులవుటకు మీరును కోరు
తున్నారా? అని వారికి ఉత్తరమిచ్చెను.। అప్పుడు 28
వారు—నీవు వాని శిష్యుడవు; మేము మోషే శిష్యు
లమై యున్నాము;। దేవుడు మోషేతో మాటలాడె 29
నని ఎరుగుదుము; అయితే వీడు ఎక్కడనుంచి వచ్చె
నో అది యెరుగమని అతని దూషించి చెప్పిరి.। అం 30
దుకు ఆ మనుష్యుడు—ఆలాగైతే దీనిలో ఆశ్చర్య
మైనది కలదు; ఆయన ఎక్కడనుంచి వచ్చెనో మీరె
రుగరు; అయినప్పటికి ఆయన నా కన్నులు తెరవ
చేసెను.। దేవుడు పాపుల మనవి ఆలకించడని ఎరు 31
గుదుము; ఎవడైనా దేవభక్తుడై యుండి, ఆయనకు
ఇష్టమైనది చేసితే అతని మనవి ఆలకించును.। పుట్టు 32
గుడ్డివాని కన్నులు ఎవడైనా తెరవ చేసెనని ఎన్న
డును వినబడ లేదు.। ఈయన దేవుని యొద్దనుంచి 33
వచ్చినవాడు† కాకపోతే, ఏమియు చేయ నేరడని
వారికి ప్రత్యుత్తరమిచ్చెను.। అందుకు వారు—నీవు 34
కేవలము పాపివై పుట్టినావు; నీవు మాకు బోధపరుచ
గలవా? అని అతనికి ఉత్తరమిచ్చి అతని వెలివేసిరి.

వారు అతని వెలివేసిరని యేసు విని అతని కను 35
గొని—నీవు దేవుని కుమారునియందు విశ్వాసముంచి
యున్నావా? అని అడిగెను.। అప్పుడు అతడు—ప్రభు 36
వా! నేను ఆయనయందు విశ్వాసముంచుటకు ఆయన
ఎవడని అడిగెను.। అందుకు యేసు—నీవు ఆయనను 37
చూచి యున్నావు, నీతో మాటలాడుచున్నవాడు
ఆయనే అని చెప్పినప్పుడు,। అతడు—ప్రభువా! 38
నమ్ముతున్నానని చెప్పి ఆయనకు నమస్కరించెను.।
అప్పుడు యేసు—చూపు లేనివారు చూచుటకును 39

*అనేక ప్రతులలో, గుడ్డియని. †లేక, దేవుని సంబంధి.

చూపుగలవారు గ్రుడ్డివారవుటకును న్యాయము తీర్చు
టకు ఈ లోకమునకు వచ్చినానని చెప్పెను.
40 అప్పుడు ఆయన యొద్ద ఉన్న ఫరిసైయులలో కొం
దరు వీటిని విని మేముకూడా గ్రుడ్డివారమా? అని పలి
41 కిరి. । అందుకు యేసు — మీరు గ్రుడ్డివారైతే పాపము
గలవారు కారు; అయితే ఇప్పుడు — చూస్తున్నామని
మీరు చెప్పుకొంటున్నారు గనుక మీ పాపము నిలిచి
యున్నది.

## 10. అధ్యాయము.

1 సత్యము సత్యము నేను మీతో చెప్పుచున్నాను—
గొర్రెల దొడ్డిలో ద్వారముగుండా ప్రవేశించక, వే
రొక మార్గమున ఎక్కువాడు దొంగయు దోచుకొ
2 నేవాడునై యున్నాడు. । అయితే ద్వారముగుండా
ప్రవేశించేవాడు గొర్రెల కాపరియై యున్నాడు. ।
3 అతనికి ద్వారపాలకుడు తలుపు తీసును; గొర్రెలు
అతని శబ్దము ఆలకించును. అతడు తన గొర్రెలను
4 పేరుపెట్టి పిలిచి, వాటిని వెలపటికి నడిపించును. । మరి
యు అతడు స్వకీయమైన గొర్రెలను వెలపటికి నడి
పించేటప్పుడు, వాటి కంటే ముందుగా నడుచును; ।
5 అప్పుడు గొర్రెలు అతని శబ్దము ఎరుగును గనుక
అతని వెంబడించును. అన్యుల శబ్దము ఎరుగవు గనుక
అన్యుని వెంబడించక వాని యొద్దనుంచి పారిపోవు
నని వారితో పలికెను.
6 ఈ సాదృశ్యము యేసు వారితో చెప్పెను; అయితే
ఆయన వారితో చెప్పిన వాటి భావము వారికి బోధ
పడలేదు.
7 కాబట్టి యేసు తిరిగి—సత్యము సత్యము నేను మీ
8 తో చెప్పుచున్నాను, । గొర్రెల ద్వారము నేను; నాకు
ముందు వచ్చిన వారందరు దొంగలును దోచుకొనే
వారునై యున్నారు. అయితే గొర్రెలు వారి మాట
9 వినలేదు. । నేను ద్వారమునై యున్నాను; నా ద్వారా
ఎవడైనా ప్రవేశించితే, అతడు రక్షించబడి ప్రవేశిం
10 చుచు బైటికి వెళ్లుచు మేపు పొందును. । దొంగ దొం
గతనము, హత్య, నాశనమును చేసుటకే గాని మరి
దేనికిని రాడు. వాటికి జీవము కలుగుటకు, సమృద్ధి
11 కలుగుటకును నేను వచ్చితిని. । నేను గొర్రెలకు మంచి
కాపరిని. మంచి కాపరి గొర్రెల కొరకు తన ప్రాణము
12 పెట్టును. । అయితే గొర్రెల కాపరి* కానటువంటి
జీతగాడు, గొర్రెలు తన స్వకీయమైనవి కానందున,
తోడేలు వచ్చుట చూచి గొర్రెలను విడిచి పారిపోవు
ను; అప్పుడు తోడేలు వాటిని పట్టి† గొర్రెలను చెదర
చేసును. । జీతగాడు, జీతగాడై గొర్రెలను గూర్చి చిం 13
తించడు గనుక పారిపోవును. । నేను గొర్రెల మంచి 14
కాపరినై యున్నాను; । తండ్రి నన్ను ఏలాగు ఎరిగి 15
యున్నాడో నేను తండ్రిని ఏలాగు ఎరిగి యున్నా
నో, అలాగే నేను నా వాటిని ఎరిగి నా వాటివల్ల
ఎరుగబడుచున్నాను; మరియు గొర్రెల కొరకు నా
ప్రాణము పెట్టుచున్నాను. । మరియు ఈ దొడ్డివి కాని 16
గొర్రెలు వేరే నాకు కలవు; వాటిని కూడా నేను తీసు
కొని రా వలెను. అవి నా శబ్దము వినును; అప్పుడు
మంద ఒక్కటి, గొర్రెల కాపరి ఒక్కడును ఉండు
ను. । ఇందువల్ల నా తండ్రి నన్ను ప్రేమించుచున్నా 17
డు; తిరిగి దాని పొందుటకు, నా ప్రాణము పెట్టుచు
న్నాను. । నా యొద్దనుంచి ఎవడును దాని పుచ్చుకొన 18
డు; నాకు నేనే దాని పెట్టుచున్నాను. దాని పెట్టు
టకు నాకు అధికారము‡ కలదు; దాని తిరిగి పుచ్చు
కొనుటకును నాకు అధికారము‡ కలదు. నా తండ్రి
వల్ల ఈ ఆజ్ఞ పొందినానని వారితో పలికెను.

కాబట్టి ఈ మాటలవల్ల యూదులలో భేదము తిరిగి 19
పుట్టెను. । వారిలో అనేకులు—ఆయన దయ్యము పట్టిన 20
వాడు, వెర్రివాడునై యున్నాడు; వాని (మాట) ఎం
దుకు వింటున్నారని పలికిరి. । మరి కొందరు — ఇవి 21
దయ్యము పట్టినవాని మాటలు కావు. దయ్యము గ్రుడ్డి
వారి కన్నులు తెరవ చేయగలదా? అని పలికిరి.

మరి ఆలయ ప్రతిష్ఠ అనే పండుగ యెరూషలేము 22
లో కలిగెను. । అది శీతకాలము గనుక యేసు సొల 23
మోను మంటపములో తిరుగులాడుచుండెను. । కాబట్టి 24
యూదులు ఆయన చుట్టు కూడి — ఎంత పర్యంతము
మమ్ము సందేహపెట్టుదువు? నీవు క్రీస్తువైతే మాతో
ధైర్యముగా§ చెప్పుమనిరి.

అందుకు యేసు—మీతో చెప్పితిని, అయితే మీరు 25
నమ్ముట లేదు. । నేను నా తండ్రి నామమందు ఏ కా 26
ర్యములు చేయుచున్నానో, అవి నన్ను గూర్చి సా
క్ష్యమిచ్చుచున్నవి. అయితే నేను మీతో చెప్పిన
ప్రకారము మీరు నా గొర్రెల సంబంధులు¶ కారు
గనుక మీరు నమ్ముట లేదు. । నా గొర్రెలు నా శబ్ద 27
ము వినును, నేను వాటిని యెరుగుదును, అవి నన్ను
వెంబడించును. । నేను వాటికి నిత్యజీవము ఇస్తున్నాను; 28
అవి ఎన్నడును నశించవు; ఎవడును వాటిని నా చేతి
లోనుంచి అపహరించడు. । వాటిని నాకు ఇచ్చిన నా 29
తండ్రి అందరికంటే గొప్పవాడు గనుక నా తండ్రి
చేతిలోనుంచి వాటిని అపహరించుటకు శక్తి గల వా

*అనగా, గొర్రెల యజమానుడు. †లేక, చీల్చి. ‡లేక, శక్తి. §లేక, ధారాళముగా. ¶లేక, లోచేరినవారు.

30 డెవడును లేడు.। నేను, తండ్రియు ఏకమై యున్నా
మని వారికి ఉత్తరమిచ్చెను.
31 కావున యూదులు ఆయనను కొట్టుటకు తిరిగి
32 రాళ్లు పట్టుకొనిరి,। గనుక యేసు — నా తండ్రివల్ల
అనేకమైన మంచి క్రియలు మీకు అగుపరిచితిని; వా
టిలో ఏ క్రియ నిమిత్తము నన్ను రాళ్లతో కొట్టుచు
న్నారని వారిని అడిగెను.
33 యూదులు—నీవు మనుష్యుడవై యుండి, నిన్ను
నీవే దేవుని చేసుకొంటున్నావు గనుక, దూషణ నిమి
త్తమే గాని మంచి క్రియ నిమిత్తము నిన్ను రాళ్లతో
కొట్టుచున్నాము కామని ఆయనకు ప్రత్యుత్తరమిచ్చిరి.
34 అందుకు యేసు—మీరు దేవుండ్లు అయి యున్నారు
అంటినని మీ బోధన ప్రమాణములో వ్రాయబడలే
35 దా.। దేవుని వాక్యము ఎవరికి వచ్చెనో వారిని దేవుం
డ్లని చెప్పితే, లేఖనము తప్ప వల్లకాదు గనుక,—నేను
36 దేవుని కుమారుడనై యున్నానని చెప్పినందున,। తండ్రి
పరిశుద్ధపరిచి ఈ లోకములోకి పంపిన వానితో—
37 నీవు (దేవుని) దూషిస్తున్నావని చెప్పవచ్చునా?। నేను
నా తండ్రి క్రియలు చేయకుంటే, నన్ను నమ్మకండి.।
38 అయితే నేను చేసిన పక్షమందు, నన్ను నమ్మక పోయి
నప్పటికిని తండ్రి నా యందు, నేను ఆయన యందును
ఉన్నామని మీరు తెలుసుకొని నమ్ముటకు, ఆ క్రియ
లను నమ్ముండని వారికి ఉత్తరమిచ్చెను.
39 కాబట్టి వారు తిరిగి ఆయనను పట్టుకొనుటకు చూ
40 చిరి;। అయితే ఆయన వారి చేతులనుంచి తప్పించుకొ
ని, యొర్దాను అద్దరిని యోహాను మొదట బాప్తిస్మము
చేయించుచుండే స్థలమునకు తిరిగి వెళ్లి అక్కడ నివ
41 సించెను.। అప్పుడు అనేకులు ఆయన యొద్దికి వచ్చి—
యోహాను ఏ అద్భుతము చేయ లేదు, అయితే ఈయ
నను గూర్చి యోహాను చెప్పినవన్నియు నిజమైనవని
42 చెప్పుకొనిరి.। అక్కడ అనేకులు ఆయన యందు విశ్వా
సముంచిరి.

## 11. అధ్యాయము.

1 మరియ, ఆమె సహోదరియైన మర్థా యనే
వారి గ్రామమైన బేథనియలో ఉన్న లాజరనే ఒకడు
2 రోగియై యుండెను.। ఏ మరియ ప్రభువుకు అత్తరు
పూసి తన తల వెంట్రుకలతో ఆయన పాదములు
తుడిచెనో ఆమె సహోదరుడైన లాజరు రోగియై
3 యుండెను.। కాబట్టి అతని అక్కచెల్లెండ్లు — ప్రభు
వా! ఇదుగో! నీవు ప్రేమించేవాడు రోగి అని ఆయన
యొద్దికి వర్తమానము పంపిరి.

అయితే యేసు అది విని— ఈ రోగము దేవుని 4
కుమారుడు దానివల్ల మహిమపరచబడుటకు దేవుని
మహిమ నిమిత్తమైనది గాని మరణార్థమైనది కాదని
చెప్పెను.
యేసు మర్థాను, ఆమె సహోదరిని, లాజరును 5
ప్రేమించెను.। కాబట్టి అతడు రోగి అని యేసు విన్న 6
ప్పుడు తానున్న స్థలమందు ఇంకా రెండు దినములు
నిలిచెను.। అటుపిమ్మట ఆయన— మనము యూదై 7
యకు తిరిగి వెళ్లుదామని తన శిష్యులతో పలికెను.
అప్పుడు, ఆయన శిష్యులు—రబ్బీ! ఇప్పటికి యూ 8
దులు నిన్ను రాళ్లతో కొట్టుటకు చూచుచుండిరి గదా,
అక్కడికి తిరిగి వెళ్లుదువా? అని ఆయనతో పలికిరి.।
అందుకు యేసు—పగటి గంటలు పన్నెండు ఉన్నవి 9
గదా? ఎవడైనా పగటియందు నడిచితే ఈ లోకపు
వెలుగు చూచును గనుక, అతనికి ఏ ఆతంకమును
ఉండదు.। అయితే ఎవడైనా రాత్రియందు నడిచితే 10
వానికి వెలుగు లేదు గనుక, అతడు ఆతంకపరచబడు
నని ఉత్తరమిచ్చెను.
ఆయన వీటిని చెప్పిన తరువాత—మన స్నేహితు 11
డైన లాజరు నిద్రించి యున్నాడు; అయితే అతని
లేపుటకు వెళ్లుచున్నానని వారితో చెప్పెను.
అందుకు ఆయన శిష్యులు—ప్రభువా! ఆయన 12
నిద్రించితే బాగుపడుననిరి.। యేసు అతని మరణమును 13
గూర్చి పలికెను. అయితే ఆయన, నిద్ర విశ్రాంతిని
గూర్చి పలికినాడని వారికి తోచినది కావున యేసు—
లాజరు చనిపోయెను.
మీరు నమ్మేకొరకు, నేను అక్కడ ఉండలేదని, 14
మీ నిమిత్తము సంతోషించుచున్నాను.। అయితే అతని 15
యొద్దికి వెళ్లుదామని వారితో ధారాళముగా చెప్పెను.
అందుచేతను, దిదుము అనబడిన థోమ— ఆయ 16
నతో చనిపోవుటకు మనము కూడా వెళ్లుదామని,
తోటి శిష్యులతో పలికెను.
అప్పుడు యేసు వచ్చి, అంతకు మునుపు అతడు 17
నాలుగు దినములు సమాధిలో పడియుండెనని తెలు
సుకొనెను.। బేథనియ యెరూషలేముకు సమీపమై 18
యుండెను; దానికి కొంచెము ఎక్కువ తక్కువ ఒక
కోసు దూరమే,। గనుక యూదులలో అనేకులు 19
మర్థా మరియ అనే వారి సహోదరుని గూర్చి వా
రిని పరామర్శించేకొరకు వారి యొద్దికి వచ్చియుం
డిరి.। అప్పుడు మర్థా యేసు వస్తున్నాడని విని ఆయ 20
నను ఎదురుకొనుటకు వెళ్లెను. అయితే మరియ ఇంటి
లో కూర్చుండియుండెను.

*అనగా, బోధకుడా.

21 అప్పుడు మర్థా యేసుని చూచి—ప్రభువా! నీవు
ఇక్కడ ఉంటే, నా సహోదరుడు చావక పోవు
22 ను. । అయితే నేమి, నీవు వేటిని దేవుని అడిగినప్పటికి
ఇప్పుడును దేవుడు వాటిని నీకు ఇచ్చునని ఎరుగుదు
ననెను.
23 అందుకు యేసు — నీ సహోదరుడు తిరిగి లేచు
నని ఆమెతో చెప్పెను.
24 మర్థా ఆయనతో—అంత్య దినమందు, పునరు
త్థానమయేటప్పుడు లేచునని యెరుగుదుననెను.
25 అందుకు యేసు—నేనే పునరుత్థానము, జీవమునై,
యున్నాను. నాయందు విశ్వాసముంచేవాడు చనిపో
26 యినప్పటికి బ్రతుకును. । మరియు, బ్రతికి నాయందు
విశ్వాసముంచే ప్రతివాడును ఎన్నటికిన్ని చనిపోడు;
దీని నమ్ముచున్నావా? అని ఆమెతో పలికినప్పుడు,
27 ఆమె ఆయనతో—అవును, ప్రభువా! ఈ లోక
మునకు రావలసిన దేవుని కుమారుడవైన క్రీస్తువని నేను
నమ్మియున్నాననెను.
28 ఆమె ఆలాగు చెప్పి, వెళ్లి, రహస్యముగా—బోధ
కుడు వచ్చి నిన్ను పిలుస్తున్నాడని చెప్పుచు, తన
29 సహోదరియైన మరియను పిలిచెను. । ఆమె విని త్వ
30 రగా లేచి ఆయన యొద్దికి వచ్చెను. । అయితే యేసు
ఇంకా ఆ గ్రామములోకి ప్రవేశించక మర్థా ఆయ
31 నను కలుసుకొనిన స్థలమందే ఉండెను. । గనుక, ఇం
ట్లో మరియయొద్ద ఉండి ఆమెను పరామర్శించు
చుండే యూదులు, మరియ త్వరగా లేచి వెళ్లుట
చూచి — ఆమె సమాధి యొద్ద ఏడ్చుటకు అక్కడికి
వెళ్లుచున్నది అనుకొని ఆమెను వెంబడించిరి.
32 అంతట మరియ యేసు ఉన్న చోటికి వచ్చి ఆయ
నను చూచి, ఆయన పాదముల మీద పడి—ఓ ప్రభు
వా! నీవు ఇక్కడ ఉంటే, నా సహోదరుడు చావక
పోవునని ఆయనతో పలికెను.
33 కాబట్టి యేసు ఆమె ఏడ్చుటను ఆమెతో వచ్చిన
యూదులు ఏడ్చుటను చూచి, ఆత్మలో మూలుగుతూ
34 కలతపడి—అతని ఎక్కడ ఉంచినారనెను. । అందుకు
వారు — ప్రభువా! వచ్చి చూడుమని ఆయనతో చె
35 ప్పిరి. । యేసు ఏడ్చెను.
36 కాబట్టి యూదులు—ఇదుగో! అతని ఏలాగు ప్రే
37 మించెనని పలికిరి. । అయితే వారిలో కొందరు—ఆ
గుడ్డివాని కన్నులు తెరవచేసిన ఈయన ఇతని చావ
38 కుండా చేయ లేడా అని పలికిరి. । కావున యేసు తిరిగి
తనలో మూలుగుచు, సమాధి యొద్దికి వచ్చెను. అది
39 గుహ. దానిమీద ఒక రాయి ఉంచబడెను. । అప్పుడు
యేసు — ఆ రాయి తీసివేయండని చెప్పెను. చనిపో
యినవాని సహోదరియైన మర్థా — ప్రభువా! ఆ
యన చనిపోయి నాలుగు దినములాయెను గనుక ఇప్ప
టికి వాసన వేసునని ఆయనతో చెప్పెను.
అందుకు యేసు — నీవు నమ్మితే దేవుని మహిమ 40
చూతువని నేను నీతో చెప్పలేదా అని ఆమెతో
పలికెను.
కాబట్టి [చనిపోయినవాడు ఉంచబడిన చోటి 41
నుంచి] ఆ రాయి తీసివేసిరి. అప్పుడు యేసు తన కన్ను
లు పైకెత్తి — ఓ తండ్రీ! నీవు నా మనవి వినినందున
నిన్ను స్తుతిస్తున్నాను. । నీవు ఎల్లప్పుడును నా మనవి 42
వింటున్నావని యెరుగుదును; అయితే చుట్టునున్న ఈ
ప్రజల నిమిత్తము, నీవు నన్ను పంపితివని వారు నమ్ము
టకు చెప్పితినని పలికెను.
ఆయన ఈలాగు పలికి—లాజరూ! బైటికి రమ్మని 43
నోరెత్తి పిలిచెను. । అప్పుడు చనిపోయినవాడు కాళ్లు 44
చేతులు ప్రేతవస్త్రములతో కట్టబడినవాడై వెలపటికి
వచ్చెను. ఆయన ముఖముకూడా రుమాలుతో కట్టబ
డెను. అప్పుడు యేసు — మీరు అతని విప్పి నడువ
నియ్యండి అని వారితో చెప్పెను.
కాబట్టి మరియ యొద్దికి వచ్చి, ఆయన చేసినవాటిని 45
చూచిన యూదులలో అనేకులు ఆయనయందు విశ్వా
సముంచిరి. । అయితే వారిలో కొందరు ఫరిసైయుల 46
యొద్దికి వెళ్లి యేసు చేసినవాటిని వారితో చెప్పిరి.
కాబట్టి ప్రధానయాజకులు, ఫరిసైయులు, సభను 47
కూర్చి — మనము ఏమి చేయుదము! ఈ మనుష్యు
డు అనేకమైన అద్భుతములు చేయుచున్నాడు. । మన 48
ము ఆయనను ఈలాగు విడిచితే అందరు ఆయనయం
దు విశ్వాసముంతురు. అప్పుడు రోమీయులు వచ్చి
మన స్థలము మన దేశము తీసుకొందురని పలికిరి.
అయితే వారిలో కాయిఫ అనే ఒకడు ఆ సంవత్సర 49
మందు ప్రధానయాజకుడై యుండి—మీకు ఏమియు
తెలియదు; । ఈ దేశజనమంతయు నశించక ఉండు 50
టకు ఒక మనుష్యుడు ప్రజల కొరకు చనిపోవుట
మనకు ఉపయోగమై యున్నదని మీరు యోచించు
కొనరని వారితో పలికెను. । తనకు తానే ఈలాగు 51
చెప్పలేదు; అయితే ఆ సంవత్సరమందు ప్రధానయా
జకుడై యుండెను, । గనుక యేసు ఆ రాష్ట్రము కొర 52
కును ఆ రాష్ట్రము కొరకు మాత్రమే కాకుండా, చెదరి
పోయిన దేవుని పిల్లలను ఏకముగా కూర్చే కొరకును
చావనై యున్నాడని ప్రవచించెను.
కాబట్టి ఆ దినమునుంచి ఆయనను చంపుటకు వారు 53
ఆలోచించుకొనిరి.

54 కాబట్టి యేసు యూదులలో అప్పటినుంచి బహి
రంగముగా సంచరించక, అక్కడనుంచి అరణ్యమునకు
సమీపమైన ప్రదేశములో ఉన్న ఎఫ్రయిమనే పేరు
గల ఒక ఊరికి వెళ్లి అక్కడ తన శిష్యులతో కూడా
నివసించెను.

55 మరియు యూదుల పస్కా సమీపమై ఉండెను గనుక
అనేకులు తమ్మును తామే శుచి చేసుకొనుటకు, పస్కాకు
మునుపు పల్లెటూళ్లలోనుంచి యెరూషలేముకు వెళ్లిరి। 
56 అంతట వారు యేసుని వెతుకుచు — మీకేమి తోస్తు
న్నది? ఆయన పండుగకు రాడా అని గుడిలో నిలువ
57 బడి ఒకనితో ఒకడు చెప్పుకొనుచుండిరి। మరియు
ప్రధానయాజకులు ఫరిసైయులును ఆయన ఎక్కడ
ఉన్నాడో అది ఎవనికైనను తెలిసియుంటే, తాము
ఆయనను పట్టుకొనే కొరకు తెలియచేయ వలెనని ఆజ్ఞ
ఇచ్చియుండిరి.

## 12. అధ్యాయము.

1 కాబట్టి చనిపోయిన తరువాత మృతులలోనుంచి
యేసు లేపిన లాజరు ఉన్న బేథనియకు యేసు, పస్కాకు
ఆరు దినముల కిందట వచ్చెను గనుక వారు అక్కడ
2 ఆయన కొరకు విందు చేసిరి। అప్పుడు మర్థా పరి
చర్య చేసెను; లాజరు ఆయనతో కూడా పఙ్తిలో కూ
3 ర్చున్నవారిలో ఒకడు। అప్పుడు మరియ మిక్కిలి
విలువ గల శుద్ధమైన జటామాంసి అత్తరు ఒక శేరు
పుచ్చుకొని, యేసు పాదములకు పూసి తన తల వెం
డ్రుకలతో ఆయన పాదములను తుడిచెను. ఇల్లు ఆ
అత్తరు వాసనతో నిండుకొనెను.

4 కాబట్టి ఆయన శిష్యులలో ఒకడు, అనగా ఆయ
నను అప్పగించనైయున్న [సీమోను కుమారుడగు
5 యూదా] ఇస్కరియోతు।—ఈ అత్తరు ఎందుకు ము
న్నూరు దేనారీలకు* అమ్మబడి బీదలకు ఇయ్యబడ లేద
6 నెను। అతడు బీదల కొరకు చింతించి పలుకలేదు
అయితే అతడు దొంగయై, వారి సొమ్ము సంచి పట్టు
కొని దానిలో వేయబడినవి తీసుకొనేవాడు గనుక
ఆలాగు పలికెను.

7 కాబట్టి యేసు—ఆమెను విడువండి; నా ఉత్తరక్రి
8 యల దినమునకు ఆమె దీని ఉంచుకొనెను.† । బీదలు
యెల్లప్పుడును మీలో ఉందురు, అయితే నేను ఎల్లప్పు
డును ఉండనని పలికెను.

9 కాబట్టి యూదులలో బహు జనసమూహము ఆ
యన అక్కడ ఉన్నాడని తెలుసుకొని, యేసు నిమిత్త
ము మాత్రమే కాకుండా, చనిపోయిన వారిలోనుంచి
ఆయన లేపిన లాజరును కూడా చూడ వలెనని వచ్చె
ను। అయితే ప్రధానయాజకులు లాజరును కూడా చం 10
పుటకు ఆలోచించిరి; । అతని చూచిన యూదులలో 11
అనేకులు వెళ్లి యేసు యందు విశ్వాసముంచిరి.

మరునాడు ఆ పండుగకు వచ్చిన బహు జనసమూ 12
హము యేసు యెరూషలేముకు వచ్చుచున్నాడని విని, । 
ఖర్జూరపు మట్టలు పట్టుకొని ఆయనను యెదురు 13
కొనుటకు బైలువెళ్లి—హోసన్నా! ప్రభువు పేరట
వచ్చే, ఇశ్రాయేలు రాజు స్తుతించబడుగాక అని
కేకలు వేసిరి। మరియు—సీయోను కుమారీ! భయ 14,15
పడకుము; ఇదుగో! నీ రాజు గాడిదె పిల్లమీద కూ
ర్చుండి వచ్చుచున్నాడని వ్రాయబడిన ప్రకారము,
యేసు ఒక చిన్న గాడిదెను తెప్పించుకొని దాని ఎక్కి
కూర్చుండెను.‡

ఇవి ఆయన శిష్యులకు మొదట బోధపడ లేదు 16
అయితే యేసు మహిమపరచబడినప్పుడు ఇవి ఆయ
నను గూర్చి వ్రాయబడెననియు ఆయనకు వీటిని చేసి
రనియు వారు జ్ఞాపకము చేసుకొనిరి.

కాబట్టి ఆయన లాజరును సమాధిలోనుంచి పిలిచి, 17
మృతులలోనుంచి అతని లేపినప్పుడు ఆయనతో కూ
డా ఉండిన జనసమూహము సాక్ష్యమిచ్చెను। అందు 18
చేతను, జనసమూహము ఆయన ఆ యద్భుతము చేసె
నని వినినందున ఆయనను ఎదురుకొనుటకు వెళ్లెను, । 
గనుక ఫరిసైయులు—మీ యత్నములు నిష్ప్రయోజన 19
మైనవని చూచితిరి; ఇదుగో! లోకము ఆయన వెంట
వెళ్లెనని ఒకనితో ఒకడు చెప్పుకొనిరి.

అయితే ఆ పండుగలో ఆరాధించే కొరకు వచ్చిన 20
వారిలో కొందరు హెల్లేనీయులు ఉండిరి। అంతట 21
వారు గలిలైయలోనున్న బేత్సయిదనే ఊరివాడైన
ఫిలిప్పు యొద్దకి వచ్చి — అయ్యా! మేము యేసుని
చూడ కోరుచున్నామని అతని వేడుకొనిరి। ఫిలిప్పు 22
వచ్చి అంద్రెయతో చెప్పెను. తిరిగి అంద్రెయ, ఫిలి
ప్పు యేసుతో చెప్పిరి.

అందుకు యేసు వారితో ఇట్లనెను—మనుష్య కుమా 23
రుడు మహిమ పొంద వలసిన గడియ వచ్చెను। సత్యము 24
సత్యము మీతో చెప్పుచున్నాను, గోధుమ గింజ భూ
మిలో పడి చావకపోతే అది ఒంటిగా ఉండును;
అది చచ్చితే విస్తారముగా ఫలించును। తన ప్రాణము 25
ప్రేమించేవాడు దాని పోగొట్టుకొనును. ఈ లోక
ములో తన ప్రాణము ద్వేషించేవాడు నిత్యజీవము
కొరకు దాని కాపాడుకొనును। నన్ను ఎవడైనను సేవిం 26

* దేనారి అనగా, కొంచెము యెక్కువ తక్కువ ఐదణాలనర. † లేక, ఉంచుకొననిమ్ము. ‡ జకర్య. 9: 9.

చితే, నన్ను వెంబడించ వలెను; అప్పుడు నేను ఎక్కడ
ఉందునో అక్కడ నా సేవకుడును ఉండును. నన్ను
ఎవడైనను సేవించితే, నా తండ్రి అతని ఘనపరుచు
ను. ఇప్పుడు నా ప్రాణము కలతపడియున్నది.
27 నేను ఏమందును—తండ్రీ! ఈ గడియనుంచి నన్ను
రక్షించుము;* అయితే దీని నిమిత్తము నేను ఈ గడి
28 యకు వచ్చితిని. । ఓ తండ్రీ! నీ నామము మహిమపరు
చుమని చెప్పెను. అంతట—నేను దాని మహిమపరిచి
తిని, తిరిగి మహిమపరుతును అనే ఒక శబ్దము ఆకా
శమునుంచి వచ్చెను.
29 కాబట్టి అక్కడ నిలిచి వినిన ప్రజలు—ఉరుము
పుట్టెనని చెప్పుకొనిరి. మరి కొందరు ఒక దూత ఆయ
30 నతో పలికియున్నాడని చెప్పుకొనిరి. । అందుకు యే
సు—ఈ శబ్దము మీ కొరకే గాని నా కొరకు కలిగి
31 నది కాదు. । ఇప్పుడు ఈ లోకవిషయము న్యాయపు
తీర్పు చేయబడుచున్నది. ఇప్పుడు ఈ లోకాధిపతి
32 బైట వేయబడును. । మరియు, నేను భూమి మీదనుంచి
పైకెత్తబడితే అందరిని నా యొద్దికి లాగుకొందునని
33 చెప్పెను. । తాను ఏలాటి మరణమువల్ల చనిపోనై
యుండెనో అది సూచించుటకు దీని చెప్పెను.
34 కాబట్టి జనసమూహము—క్రీస్తు ఎల్లప్పుడును ఉం
డునని బోధన ప్రమాణమువల్ల వింటిమి గనుక—మను
ష్యకుమారుడు ఎత్తబడ వలెనని నీవు ఏల చెప్పుచున్నా
వు? మనుష్యకుమారుడైన ఈయన ఎవడని ఆయనను
అడిగిరి.
35 అందుకు యేసు—ఇంకా కొంత కాలము వెలుగు
మీలో ఉండును; చీకటి మిమ్ము కమ్మకయుండుటకు,
వెలుగు మీకు కలిగియుండగానే నడువండి. చీకటిలో
36 నడిచేవానికి, తాను వెళ్లే చోటు తెలియదు. । మీరు
వెలుగు కుమారులవుటకు, వెలుగు మీకు కలిగియుం
డగా ఆ వెలుగుయందు విశ్వాసముంచండి అని వారి
తో చెప్పెను.

యేసు వీటిని చెప్పి వెళ్లి వారికి మరుగై పోయెను. ।
37 అయితే ఆయన వారి యెదుట ఇన్ని ఆనవాళ్లను
చూపినప్పటికి, వారు ఆయనయందు విశ్వాసముంచ
38 లేదు. । అందువల్ల—ప్రభువా! మా వర్తమానము నమ్మిన
వాడెవడు? ప్రభువుయొక్క బాహువు ఎవనికి బైలు
పరచబడెనని ప్రవక్తయైన యెషయా† పలికిన వాక్యము
నెరవేర్చబడెను.
39,40 కావున వారు నమ్మలేకపోయిరి; ఎందుకంటే—వా
రు కన్నులతో చూచి, హృదయమున గ్రహించి, మళ్లు
కొని, నావల్ల స్వస్థపరచబడకుండేటట్టు, ఆయన వారి
కన్నులు గుడ్డిచేసి వారి హృదయము కఠినపరిచెనని
యెషయా మళ్లీ పలికెను. । యెషయా ఆయన మహిమ 41
చూచి‡ ఆయనను గూర్చి పలికినప్పుడు, వీటిని చెప్పె
ను. । అయినప్పటికి అధికారులలోను అనేకులు ఆయ 42
నయందు విశ్వాసముంచిరి. అయితే సునగోగులోనుంచి
వెలివేయబడకుండే కొరకు ఫరిసైయుల (భయము)
వల్ల ఆలాగు ఒప్పుకొనలేదు; । వారు దేవుని మెప్పు§ 43
కంటే మనుష్యుల మెప్పు§ ఎక్కువగా ప్రేమించిరి.

అప్పుడు యేసు నోరెత్తి ఇట్లనెను—నాయందు 44
విశ్వాసముంచేవాడు నాయందు కాదు, నన్ను పంపిన
వానియందు విశ్వాసముంచును. । నన్ను చూచేవాడు 45
నన్ను పంపినవాని చూస్తున్నాడు. । నాయందు విశ్వాస 46
ముంచే ప్రతివాడు చీకటిలో నిలువకుండుటకు, నేను
ఈ లోకమునకు వెలుగుగా వచ్చియున్నాను. । మరియు 47
ఎవడైనను నా మాటలు విని వాటిని నమ్మకపోతే, నేను
అతనికి తీర్పు చేయను; నేను లోకమును రక్షించు
టకేగాని లోకమునకు తీర్పు చేయుటకు రాలేదు. ।
నన్ను తిరస్కరించి, నా మాటలు అంగీకరించనివానికి 48
తీర్పు చేసేవాడు ఒకడు కలడు; నేను పలికిన మాట
అంత్యదినమందు వానికి తీర్పు కలుగచేసును; । నాకు 49
నేనే పలుకలేదు; నేను ఏమన వలెనో ఏమి పలుక
వలెనో దానిగూర్చి ఆయన, అనగా నన్ను పంపిన
తండ్రి నాకు ఆజ్ఞ ఇచ్చినాడు. । మరియు ఆయన 50
ఆజ్ఞ నిత్యజీవార్థమై యున్నదని ఎరుగుదును గనుక
నేను పలికేవాటిని, తండ్రి నాతో ఏలాగు చెప్పి
యున్నాడో ఆలాగే నేను పలుకుచున్నాననెను.

## 13. అధ్యాయము.

అయితే పస్కా అనే పండుగకు ముందు యేసు 1
తాను ఈ లోకమునుంచి తండ్రి యొద్దికి వెళ్లవలసిన
తన గడియ వచ్చెనని ఎరిగి, లోకములో ఉన్న స్వకీ
యులను ప్రేమించి, తుదమట్టుకును వారిని ప్రేమిం
చెను.

ఆయనను అప్పగించుటకు, సైతాను, సీమోను 2
కుమారుడైన యూదా ఇస్కరియోతుయొక్క హృద
యములో తలంపు పుట్టించేయుండెను. । వడ్డన సిద్ధమై 3
యున్నప్పుడు, యేసు తన చేతికి తండ్రి సమస్తము
అప్పగించెననియు, తాను దేవుని యొద్దనుంచి బైలుదేరి
వచ్చి, దేవుని యొద్దికి వెళ్లుదుననియు ఎరిగి, । భోజన 4
పఙ్త్తినుంచి లేచి తన పైబట్టలు తీసివేసి, ఒక రుమాలు
తీసుకొని నడుము కట్టుకొనెను. । అప్పుడు ఆయన 5
ఒక పళ్లెములో నీళ్లుపోసి శిష్యుల పాదములను కడు

*లేక, రక్షించుమందునా. †యెషయా. 53: 1. ‡కొన్ని ప్రతులచొప్పున, చూచినప్పుడు. §లేక వల్లనైన ఘనత.

గుటకు, తాను కట్టుకొనియున్న రుమాలుతో వాటిని
తుడుచుటకును మొదలుబెట్టెను.

6 అలాగున ఆయన సీమోను పేతురుయొద్దికి వచ్చి
నప్పుడు అతడు—ప్రభువా! నీవు నా పాదములు
కడుగ వచ్చునా? అని ఆయనతో పలికెను.

7 అందుకు యేసు—నేను ఏమి చేయుచున్నానో,
అది ఇప్పుడు నీకు తెలియదు; అయితే ఇకమీదట
ఎరుగుదువని అతనితో పలికెను.

8 అందుకు పేతురు—నీవు ఎన్నడును నా పాదములు
కడుగ కూడదని ఆయనతో పలికెను.

అందుకు యేసు—నేను నిన్ను కడిగితేనే గాని
నాతో పాలు పొందవని చెప్పెను.

9 ఆయనతో సీమోను పేతురు—ప్రభువా! నా పాద
ములు మాత్రమే కాదు, నా చేతులు నా తలను కడు
గుమని చెప్పెను.

10 యేసు—శిరస్నానము పొందినవానికి పాదములే
గాని మరి యేదియు కడుగుకొన నక్కరలేదు; అతడు
కేవలము పవిత్రుడైయున్నాడు. అటువలె, మీరు పవి
త్రులై యున్నారు; అయితే మీలో అందరు కారని
11 అతనితో చెప్పెను; । తన్ను అప్పగించనై యున్నవాని
ఎరిగెను; అందుచేతను—మీరందరు పవిత్రులు కారని
చెప్పెను.

12 కాబట్టి వారి పాదములు కడిగి తన పైబట్టలు
వేసుకొనిన తరువాత, ఆయన తిరిగి కూర్చుండి—నేను
13 మీకు చేసినది మీకు తెలుసునా? । మీరు నన్ను బోధ
కుడనియు ప్రభువనియు చెప్పుచున్నారు. అది మం
14 చిదే; నేను అలాటివాడను. । కాబట్టి ప్రభువును,
బోధకుడనునైన నేను మీ పాదములు కడిగితే, మీరు
కూడా ఒకని పాదములు ఒకడు కడుగ తగియున్నది; ।
15 నేను మీకు చేసిన ప్రకారము మీరు చేసే నిమిత్తము,
16 మీకు దృష్టాంతము ఇచ్చియున్నాను. । సత్యము సత్య
ము నేను మీతో చెప్పుచున్నాను, దాసుడు తన యజ
మానునికంటే అధికుడు కాడు, అపొస్తలు* తన్ను
17 పంపిన వానికంటే అధికుడు కాడు. । ఇవి మీకు
తెలిసియుండగా వీటిని చేసితే మీరు ధన్యులవుదురు.

18 మిమ్మునందరిని గూర్చి పలుకుచున్నాను కాను;
నేను ఏర్పరుచుకొనిన వారిని యెరుగుదును. అయితే
—నాతో కూడా రొట్టె తినేవాడు నాకు విరోధ
ముగా తన మడమ ఎత్తెనని† లేఖనము నెరవేర్చ
19 బడుటకు (ఈలాగు జరగ) వలెను. । అయితే అది కలి
గేటప్పుడు నేను ఆయననని‡ వారు నమ్మేనిమిత్తము,
కలగకమునుపు అది మీతో చెప్పుచున్నాను. । సత్య 20
ము సత్యము మీతో చెప్పుచున్నాను, నేను ఎవని
పంపుదునో వాని చేర్చుకొనేవాడు నన్ను చేర్చుకొ
నును, నన్ను చేర్చుకొనేవాడు నన్ను పంపినవాని
చేర్చుకొనునని వారితో పలికెను.

యేసు వీటిని చెప్పి తన ఆత్మలో కలతపడి—సత్య 21
ము సత్యము మీతో చెప్పుచున్నాను, మీలో ఒకడు
నన్ను అప్పగించునని సాక్ష్యము చెప్పెను. । ఆయన 22
ఎవని గూర్చి పలికెనో దానికి శిష్యులు సందేహపడి
ఒకనితట్టు ఒకడు చూచుకొనుచుండిరి.

అయితే ఆయన శిష్యులలో యేసునికి ప్రియుడైన 23
ఒకడు యేసు రొమ్మున ఆనుకొనుచుండెను, । గనుక 24
ఎవని గూర్చి ఆయన పలికెనో దాని తెలుసుకొను
మని సీమోను పేతురు అతనికి సైగ చేసెను. । అప్పుడు 25
ఆయన యేసు రొమ్మున ఆనుకొంటూ—ప్రభువా!
అతడు ఎవడని ఆయనను అడిగెను.

అందుకు యేసు—నేను ఒక ముక్క ముంచి ఎవ 26
నికి ఇత్తునో అతడే అని చెప్పి, ఒక ముక్క ముంచి,
సీమోను కుమారుడైన యూదా ఇస్కరియోతుకు
ఇచ్చెను.

ఆ ముక్కవెంట, సైతాను అతనిలో ప్రవేశించెను. 27
కావున యేసు—నీవు ఏమి చేయబోవుచున్నావో దాని
త్వరగా చేయుమని అతనితో చెప్పెను. । ఆయన దేని 28
నిమిత్తము అతనితో ఆలాగు చెప్పెనో అది పజ్తిలో
కూర్చున్నవారిలో ఎవనికిన్ని తెలియలేదు; । సొమ్ము 29
సంచి యూదా యొద్ద ఉండెను గనుక—పండుగ
కొరకు మనకు కావలసిన వాటిని కొనుమనియైనా,
లేక బీదలకు కొంచెము ఇయ్య వలెననియైనా యేసు
అతనితో చెప్పెనని కొందరు తలంచుకొనిరి. । అతడు 30
ఆ ముక్క పుచ్చుకొని వెంటనే బైలు వెళ్లెను. అయితే
రాత్రియై యుండెను.

అతడు బైలు వెళ్లిన తరువాత యేసు—ఇప్పుడు 31
మనుష్య కుమారుడు మహిమపరచబడి యున్నాడు;
దేవుడు ఆయనయందు మహిమపరచబడి యున్నాడు। ।
దేవుడు ఆయనయందు మహిమపరచబడి యుంటే, 32
దేవుడు తనయందు ఆయనను మహిమపరుచును, వెం
టనే ఆయనను మహిమపరుచును. । పిల్లలారా! ఇంకా 33
కొంత కాలము మీతో కూడా ఉందును. మీరు
నన్ను వెతుకుదురు, నేను ఎక్కడికి వెళ్లుదునో అక్క
డికి మీరు రాలేరని నేను యూదులతో చెప్పిన ప్ర
కారము, ఇప్పుడు మీతోనును చెప్పుచున్నాను. ।
మీరు ఒకని ఒకడు ప్రేమించ వలెనని నేను మిమ్మును 34

*లేక, పంపబడినవాడు. †కీర్త. 41: 9. ‡లేక, యేనైయున్నానో.

ప్రేమించిన లాగున మీరు కూడా ఒకని ఒకడు
ప్రేమించ వలెనని మీకు క్రొత్త ఆజ్ఞ ఇచ్చుచున్నాను.।
35 మీరు ఒకని ఒకడు ప్రేమించితే దీనివల్ల మీరు నా
శిష్యులై యున్నారని అందరు తెలుసుకొందురనెను.
36 సీమోను పేతురు—ప్రభువా! నీవు ఎక్కడికి వెళ్లు
చున్నావని ఆయనను అడిగెను.

అందుకు యేసు—నేను వెళ్లే చోటికి నీవు ఇప్పుడు
నన్ను వెంబడించ లేవు; అయితే మరియొకప్పుడు నన్ను
వెంబడింతువని అతనితో చెప్పెను.

37 అందుకు పేతురు—ప్రభువా! ఇప్పుడు నేను ఎం
దుకు నిన్ను వెంబడించ లేను? నీ కొరకు నా ప్రాణము
38 పెట్టుదునని ఆయనతో చెప్పెను. । అందుకు యేసు—
నా కొరకు నీ ప్రాణము పెట్టుదువా? సత్యము సత్య
ము నీతో చెప్పుతున్నాను, నీవు నన్నుగూర్చి—వాని
ఎరుగనని మూడుమారులు పలుకకమునుపు కోడి కూ
యదని చెప్పెను.

## 14. అధ్యాయము.

1 మీ హృదయము కలతపడనియ్యకండి; దేవుని
యందు విశ్వాసముంచుడి, నా యందును విశ్వాసముం
2 చుడి. । నా తండ్రి ఇంటిలో అనేక నివాసములు
ఉన్నవి; లేకుంటే మీతో చెప్పుదును, మీకు స్థలము
3 సిద్ధపరచుటకు వెళ్లుచున్నాను.* । నేను వెళ్లి మీకు
స్థలము సిద్ధపరచితే, నేను ఉండే స్థలములో మీరును
ఉండుటకు తిరిగి వచ్చి మిమ్ము నా యొద్దికి చేర్చుకొం
4 దును. । నేను ఎక్కడికి వెళ్లుచున్నానో [అది మీకు
తెలుసును], ఆ మార్గము మీకు తెలుసునని పలికెను.

5 అప్పుడు థోమా — ప్రభువా! ఎక్కడికి వెళ్లుచు
న్నావో అది మాకు తెలియదు, ఆ మార్గము ఏలాగు
6 తెలుసుకొన గలమని ఆయనతో పలికెను. । అతనితో
యేసు — నేను మార్గమును సత్యమును జీవమునై
యున్నాను. నా వల్లనేగాని ఎవడును తండ్రి యొ
7 ద్దికి రాడు. । మీరు నన్ను ఎరిగియుంటే, నా తండ్రిని
కూడా ఎరుగుదురు. ఇప్పటినుంచి ఆయనను ఎరుగు
దురు, ఆయనను చూచియున్నారని చెప్పెను.

8 అప్పుడు ఫిలిప్పు—ప్రభువా! తండ్రిని మాకు అగు
పరచుము; అది మాకు చాలునని ఆయనతో పలికెను.
9 యేసు—ఫిలిప్పా! నేను ఇంతకాలము మీ యొద్ద
ఉండినప్పటికిని నీవు నన్ను తెలుసుకొన లేదా? నన్ను
చూచినవాడు తండ్రిని చూచియున్నాడు గనుక, తం
డ్రిని మాకు అగుపరచుమని ఏల చెప్పుచున్నావు?।
తండ్రియందు నేను, నా యందు తండ్రి యున్నామని 10
నీవు నమ్ముట లేదా? నేను మీతో పలుకుచున్న మా
టలు నాకు నేనే చెప్పుట లేదు. అయితే నాయందు
నివసించే తండ్రి ఈ కార్యములు చేయుచున్నాడు. ।
తండ్రియందు నేను, నాయందు తండ్రియు ఉన్నా 11
మని నమ్మండి; లేకుంటే ఈ కార్యములవల్ల నన్ను
నమ్మండి.

సత్యము సత్యము నేను మీతో చెప్పుచున్నాను, 12
నేను చేసే క్రియలు నాయందు విశ్వాసముంచేవాడును
చేసును. వీటికంటే అతడు గొప్పవాటిని చేసును,
ఎందుకంటే నేను నా తండ్రి యొద్దికి వెళ్లుచున్నా
ను. । మీరు నా నామమున దేని అడుగుదురో తండ్రి 13
కుమారునివల్ల మహిమపరచబడుటకు దాని చేతును. ।
నా నామమున యేమి అడిగినప్పటికి నేను కలుగ 14
చేతును.

నన్ను ప్రేమించితే నా ఆజ్ఞలను గైకొనండి. నేను 15
తండ్రిని వేడుకొందును; । అప్పుడు మీ యొద్ద ఎల్ల 16,17
ప్పుడును ఉండుటకు, ఆయన మీకు వేరొక సహాయ
కుని† అనగా సత్యాత్మను ఇచ్చును. లోకము దాని
చూడదు, దాని ఎరుగదు గనుక దాని పొంద నేరదు.
అయితే మీరు దాని ఎరుగుదురు; అది మీతో నివ
సించుచున్నది; మీలో ఉండును. మిమ్మును అనాథు
లుగా విడువను; మీ యొద్దికి వత్తును.

మరి కొంత కాలమైన తరువాత లోకము నన్ను 18
మరి ఎన్నడును చూడదు; । అయితే మీరు నన్ను చూ 19
తురు. నేను బ్రతుకుదును గనుక మీరును బ్రతుకు
దురు. । నేను నా తండ్రియందు, మీరు నాయందు 20
నేను మీయందును ఉండుట, ఆ దినమున మీరు ఎరు
గుదురు. । నా ఆజ్ఞలు కలిగి వాటిని గైకొనేవాడే 21
నన్ను ప్రేమించుచున్నాడు. నన్ను ప్రేమించేవాడు
నా తండ్రివల్ల ప్రేమించబడును. నేను కూడా అతని
ప్రేమించి అతనికి ప్రత్యక్షమై యుందునని పలికెను.

ఇస్కరియోతు కాని యూదా—ప్రభువా! నీవు 22
లోకమునకు కాకుండా మాకే ప్రత్యక్షమవుటకు కార
ణమేమి అని అడిగెను.

అందుకు యేసు — ఎవడైనా నన్ను ప్రేమించితే, 23
నా మాట గైకొనును; అప్పుడు నా తండ్రి అతని
ప్రేమించును; మేము అతని యొద్దికి వచ్చి అతని యొద్ద
నివాసము చేతుము. । నన్ను ప్రేమించనివాడు నా 24
మాటలు గైకొనడు. మరియు మీరు వినే మాట నాది
కాదు; అది నన్ను పంపిన తండ్రిదైయున్నది.

*లేక, మీకు స్థలము సిద్ధపరచుటకు వెళ్లుచున్నానని మీతో చెప్పుదునా? †లేక, ఆదరణకర్త.

25 నేను మీ యొద్ద నివసించుచు వీటిని మీతో పలికి
26 యున్నాను; । అయితే తండ్రి నా నామమున పంప
గల పరిశుద్ధాత్మ అనే సహాయకుడు* సమస్తమును మీకు
బోధపరిచి, నేను మీతో పలికినవన్నియు మీకు జ్ఞాప
కము చేసును.

27 సమాధానమును† మీకు విడిచిపెట్టుచున్నాను. నా
సమాధానము మీకు ఇచ్చుచున్నాను. లోకము ఇచ్చే
ప్రకారము నేను మీకు ఇయ్యను. మీ హృదయమును
28 కలతపడనియ్యకండి భయపడనియ్యకండి. । నేను వెళ్లి
తిరిగి మీ యొద్దికి వచ్చెదనని నేను మీతో పలికినదాని
వింటిరి. నన్ను ప్రేమించితే నేను తండ్రియొద్దికి వెళ్లు
చున్నందున సంతోషింతురు; నా తండ్రి నాకంటే
29 గొప్పవాడు. । అది సంభవించినప్పుడు మీరు నమ్ము
టకు, అది సంభవించక మునుపు మీతో పలికియు
30 న్నాను. । ఇకమీదట నేను మీతో విస్తరించి మాటలా
డను; ఈ లోకనాధుడు వచ్చుచున్నాడు. అయితే
31 నాయందు అతనికి కలిగినది యేదియు లేదు. । అయి
నప్పటికి నేను తండ్రిని ప్రేమించుచున్నానని లో
కము తెలుసుకొనుటకు తండ్రి నాకు యేలాగు ఆజ్ఞా
పించెనో ఆలాగే చేస్తున్నాను. లేవండి, ఇక్కడ
నుంచి వెళ్లుదాము.‡

## 15. అధ్యాయము.

1 నేను యథార్థమైన ద్రాక్షావల్లిని; నా తండ్రి
2 వ్యవసాయికుడై యున్నాడు. । నాయందు ఏ తీగె
ఫలించదో, దాని ఆయన తీసివేసును; ఏ తీగె ఫలించు
నో, అది మరి ఎక్కువగా ఫలించుటకు దాని శుద్ధి
3 చేసును. । నేను మీతో పలికిన మాటవల్ల మీరు
ఇప్పుడు శుద్ధులైయున్నారు.

4 నాయందు మీరు ఉండుడు; మీయందు నేను
ఉందును. ద్రాక్షావల్లియందు ఉంటేనే గాని దాని
తీగె దానంతట అదే ఏలాగు ఫలించదో, ఆలాగే
నాయందు ఉంటేనే గాని మీరును (ఫలించరు.) ।
5 ద్రాక్షావల్లిని నేను, తీగెలు మీరు; ఎవడైనను నా
యందును, నేను వానియందును ఉంటే, వాడు బహు
గా ఫలించును; నాకు వేరై, మీరు యేమియు చేయ
లేరు.

6 నాయందు ఎవడైనను ఉండకుంటే, వాడు తీగె
వలె బైట పారవేయబడి ఎండిపోవును; వాటిని సమ
కూర్చి అగ్నిలో వేతురు, అప్పుడు అవి కాల్చబడును. ।
7 మీరు నాయందు ఉండి నా మాటలు మీయందు
ఉంటే, మీరు దేని కోరుదురో దాని అడుగుడు; అది
మీకు కలుగును. । ఇందువల్ల మీరు బహుగా ఫలించి 8
నా శిష్యులవుటకు నా తండ్రి మహిమపరచబడును.

తండ్రి నన్ను ఏలాగు ప్రేమించెనో, నేను మి 9
మ్మును ఆలాగు ప్రేమించినాను. నా ప్రేమయందు
నిలుకడగానుండుడు. । నేను నా తండ్రి ఆజ్ఞలు గైకొని 10
ఆయన ప్రేమయందు నిలకడగానుండిన ప్రకారము,
మీరు నా ఆజ్ఞలు గైకొంటే నా ప్రేమయందు
ఉందురు.

మీయందు ఆ నా సంతోషము ఉండుటకు, మీ 11
సంతోషము సంపూర్ణమవుటకును ఇవి మీతో చెప్పి
యున్నాను. । నేను మిమ్మును ప్రేమించిన ప్రకారము, 12
మీరు ఒకనినొకడు ప్రేమించ వలెననేది నా యా
జ్ఞయై యున్నది. । ఒకడు తన స్నేహితులకొరకు తన 13
ప్రాణము పెట్టించే ప్రేమకంటే ఎక్కువైన ప్రేమ
గలవాడు ఎవడును లేడు. । నేను మీకు ఆజ్ఞాపించిన 14
వన్నియు చేసితే, మీరు నా స్నేహితులైయుందురు.

దాసుడు తన యజమానుడు చేసేదాని ఎరుగడు 15
గనుక ఇకమీదట మిమ్మును దాసులని చెప్పక, మిమ్మును
స్నేహితులని చెప్పితిని; ఎందుకంటే నేను నా తండ్రి
వల్ల వినినవన్నియు మీకు తెలియచేసితిని. । మీరు 16
నన్ను ఏర్పరుచుకొనలేదు. మీరు నా పేరట తం
డ్రిని ఏమి అడుగుదురో అది ఆయన మీకు ఇచ్చు
టకు, మీరు వెళ్లి ఫలించుటకును, మీ ఫలము నిలు
చుటకును మిమ్మును ఏర్పరుచుకొని, మిమ్మును నియ
మించితిని. । మీరు ఒకనినొకడు ప్రేమించ వలెనని 17
ఇవి మీకు ఆజ్ఞాపించుచున్నాను.

లోకము మిమ్మును ద్వేషించితే, మీకంటే ముం 18
దుగా నన్ను ద్వేషించెనని యెరుగుదురు. । మీరు 19
లోకసంబంధులైతే, లోకము స్వకీయ్యమైన దాని స్నే
హించును. అయితే మీరు లోకసంబంధులు కారు;
నేను మిమ్మును లోకములోనుంచి యేర్పరుచుకొం
టిని గనుక, ఇందువల్ల లోకము మిమ్మును ద్వేషించు
చున్నది. । నేను మీతో చెప్పిన మాట జ్ఞాపకము చేసు 20
కొనుడి — దాసుడు తన ప్రభువుకంటే అధికుడు
కాడు. నన్ను తరిమి యుంటే, మిమ్మును కూడా తరు
ముదురు; వారు నా మాట గైకొని యుంటే మీది కూ
డా గైకొందురు. । అయితే వారు నన్ను పంపినవాని 21
ఎరుగరు గనుక నా నామము నిమిత్తము ఇవి యన్ని
యు మీకు చేయుదురు.

*లేక, ఆదరణకర్త. †లేక, క్షేమము. ‡లేక, అయినప్పటికి నేను తండ్రిని ప్రేమిస్తున్నాననియు తండ్రి యేలాగు నాకు ఆజ్ఞాపించెనో ఆలాగే నేను చేస్తున్నాననియు లోకము తెలుసుకొనుటకు, లేవండి, ఇక్కడనుంచి వెళ్లుదాము.

22 నేను వచ్చి వారితో మాటలాడకుంటే వారికి పా
పము కలుగదు. అయితే ఇప్పుడు తమ పాపము కొ
23 రకు వారికి మిష లేదు. । నన్ను ద్వేషించే వాడు నా
24 తండ్రిని కూడా ద్వేషించును. । ఎవడును చేయకపో
యిన కార్యములు నేను వారి మధ్యను చేయకుంటే
వారికి పాపము కలుగదు; అయితే ఇప్పుడు వారు
నన్ను నా తండ్రిని కూడా చూచి ద్వేషించి యున్నా
25 రు. । అయితే—నన్ను ఊరకే ద్వేషించిరని వారి బోధన
ప్రమాణములో* వ్రాయబడిన వాక్యము నెరవేర్చ
బడుటకు (ఈలాగు కలుగును.)
26 అయితే నేను మీ యొద్దికి తండ్రి యొద్దనుంచి
పంపగల సహాయుడు, అనగా తండ్రి యొద్దనుంచి
బైలుదేరే సత్యాత్మ వచ్చినప్పుడు ఆయన నన్ను గూర్చి
27 సాక్ష్యమిచ్చును; । మీరును మొదటనుంచి నా యొద్ద
ఉన్నందున సాక్ష్యమిత్తురు.

## 16. అధ్యాయము.

1 మీరు అభ్యంతరపడక ఉండుటకు ఇవి మీతో
2 చెప్పియున్నాను. । వారు మిమ్మును సునగోగులలోనుం
చి వెలివేతురు. మరియు మిమ్మును చంపే ప్రతివానికి,
దేవుని యజించుచున్నానని తోపింప చేసే కాలము
3 వచ్చుచున్నది. । వారు తండ్రిని, నన్నును తెలుసుకొన
4 లేదు గనుక వీటిని చేతురు. । అయితే ఆ కాలము
వచ్చినప్పుడు నేను ఇవి మీతో చెప్పితినని మీరు జ్ఞా
పకము చేసుకొనుటకు ఇవి మీతో చెప్పియున్నా
ను. నేను మీ యొద్ద ఉంటిని గనుక మొదట ఇవి
5 మీతో చెప్పలేదు. । అయితే ఇప్పుడు నన్ను పంపిన
వాని యొద్దికి వెళ్లుచున్నాను. — నీవు ఎక్కడికి వెళ్లు
చున్నావని మీలో ఎవడును నన్ను అడుగుట లేదు. ।
6 అయితే నేను ఇవి మీతో చెప్పినందున, మీ హృద
7 యము దుఃఖముతో నిండి యున్నది. । అయినప్పటికి
నేను మీతో నిజమే చెప్పుచున్నాను; నేను వెళ్లిపో
వుట మీకు ఉపయోగమై యున్నది; నేను వెళ్లిపో
కుంటే, ఆ సహాయుడు మీ యొద్దికి రాడు; అయితే
8 నేను వెళ్లితే, ఆయనను మీ యొద్దికి పంపుదును. । ఆ
యన వచ్చి, పాపమును గూర్చి, నీతిని గూర్చి, న్యా
యపు తీర్పును గూర్చి లోకులను ఒప్పుకొన చేసు
9 ను. । నా యందు విశ్వాసముంచ లేదు గనుక† పాప
10 మును గూర్చియు, । నేను నా తండ్రి యొద్దికి వెళ్లి
మీకు ఇకమీదట అగుపడను గనుక† నీతిని గూర్చి
11 యు, । ఈ లోకాధిపతి న్యాయపు తీర్పు పొందెను
గనుక† న్యాయపు తీర్పును గూర్చియు ఒప్పుకొన
చేసును.

నేను మీతో చెప్పుటకు ఇంకా అనేకమైనవి 12
కలవు గాని ఇప్పుడు మీరు వాటిని సహించ లేరు. ।
అయితే ఆయన అనగా సత్యాత్మ వచ్చినప్పుడు ఆయన 13
ఈ సత్యమంతటను మిమ్మును నడిపించును; ఆయన తన
కు తానే ఏమియు చెప్పక, వేటిని వినునో వాటిని
చెప్పి, రాబోయే సంగతులు మీకు తెలియచేసును. ।
ఆయన నా వాటిని పుచ్చుకొని మీకు తెలియచేసుట 14
వల్ల నన్ను మహిమపరుచును. । తండ్రికి కలిగినవన్ని 15
యు నావి. అందుచేతను—ఆయన నా వాటిని పుచ్చు
కొని మీకు తెలియచేసునని పలికితిని. । నేను తండ్రి 16
యొద్దికి వెళ్లుచున్నాను గనుక, కొంత కాలమునకు మీ
రు నన్ను చూడరు, మరి కొంత కాలమునకు నన్ను
చూతురని పలికెను.

కాబట్టి ఆయన శిష్యులలో కొందరు—కొంత కాల 17
మునకు నన్ను చూడరు, మరి కొంత కాలమునకు నన్ను
చూతురు; మరియు—నేను తండ్రి యొద్దికి వెళ్లుచున్నా
ను గనుక, అని ఆయన మనతో చెప్పినది ఏమిటి, అని
ఒకనితో ఒకడు చెప్పుకొనిరి. । కాబట్టి—కొంత కాల 18
మునకు అని ఆయన చెప్పుచున్నది ఏమిటి? ఆయన
చెప్పుచున్నది మనకు తెలియదని చెప్పుకొనిరి. । కాబట్టి 19
తన్ను అడుగుటకు వారు కోరుచుండిరని యేసు ఎరిగి
వారితో ఇట్లనెను.—కొంత కాలమునకు మీరు నన్ను
చూడరు; మరి కొంత కాలమునకు నన్ను చూతురని
నేను చెప్పిన మాటను గూర్చి మీరు ఒకనితో ఒకడు
విచారించుకొనుచున్నారా? । సత్యము సత్యము మీ 20
తో చెప్పుచున్నాను, మీరు ఏడ్చి విలపింతురు; అయి
తే లోకులు సంతోషింతురు, మీరు దుఃఖింతురు,
అయితే మీ దుఃఖము సంతోషమవును. । స్త్రీ ప్రస 21
వించేటప్పుడు, ఆమె కాలము వచ్చెను గనుక, ఆమెకు
దుఃఖము కలుగును; అయితే శిశువు పుట్టగానే, లోక
మందు నరుడు పుట్టెననే సంతోషముచేత, ఆ వేదన
మరి జ్ఞాపకము చేసుకొనదు. । అటువలె మీరు ఇప్పు 22
డు దుఃఖము గలవారు; అయితే మిమ్మును తిరిగి చూ
తును; అప్పుడు మీ హృదయము సంతోషించును; మీ
సంతోషమును ఎవడును మీ యొద్దనుంచి తీసివేయ
డు. । ఆ దినమున మీరు దేని గూర్చి నన్ను అడుగరు. 23
సత్యము సత్యము నేను మీతో చెప్పుచున్నాను, మీ
రు తండ్రిని వేటిని అడుగుదురో ఆయన వాటిని నా
పేరట మీకిచ్చును. । ఇది వరకు మీరు ఏమియు నా 24
పేరట అడుగ లేదు; మీ సంతోషము పరిపూర్ణ
మవుటకు అడుగండి, మీరు పొందుదురు.

* కీర్తన. 69: 4. † లేక, అని.

25 ఇవి ఉపమానములుగా మీతో చెప్పియున్నాను;
అయితే రాబోయేకాలమందు, నేను ఇకను ఎన్నడును
ఉపమానములుగా మీతో ఏమియు చెప్పక, తండ్రిని
26 గూర్చి మీకు స్పష్టముగా తెలియ చెప్పుదును. । ఆ దిన
మందు మీరు నా పేరట అడుగుదురు; మీ నిమిత్తము
నేను తండ్రిని ప్రార్థించుతునని మీతో చెప్పుట లేదు;।
27 మీరు నన్ను ప్రీతిపరిచి, నేను దేవుని యొద్దనుంచి
బైలుదేరి వచ్చితినని నమ్మితిరి గనుక, తండ్రి తానే మి
28 మ్మును ప్రీతిపరుచుచున్నాడు. । తండ్రి యొద్దనుంచి
బైలుదేరి లోకమునకు వచ్చి యున్నాను; తిరిగి లోక
ము విడిచి తండ్రి యొద్దికి వెళ్లుచున్నానని వారితో
పలికెను.

29 ఆయన శిష్యులు—ఇదుగో! నీవు ఇప్పుడు ఉపమా
నము ఏ మాత్రము చెప్పక, స్పష్టముగా పలుకుచున్నా
30 వు. । సమస్తమును ఎరిగిన వాడవనియు, ఎవడును నిన్ను
అడుగుట నీకు అక్కర లేదనియు ఇప్పుడు ఎరుగుదు
ము; దేవుని యొద్దనుంచి నీవు బైలుదేరి వచ్చితివని దీని
వల్ల నమ్ముచున్నాము అని ఆయనతో పలికిరి.

31 అందుకు యేసు—మీరు ఇప్పుడు నమ్ముచున్నారే.
ఇదుగో! మీలో ప్రతివాడును తన తన వాటికి చెదిరి,।
32 నన్ను ఒంటిగా విడిచే గడియ వచ్చుచున్నది, వచ్చే
యున్నది. అయితే తండ్రి నాతో ఉన్నాడు గనుక
33 నేను ఒంటిగా ఉండను. । మీకు నా యందు సమా
ధానము కలిగే నిమిత్తము వీటిని మీతో చెప్పియు
న్నాను. లోకములో మీకు శ్రమ కలుగును; అయితే
నేమి, ధైర్యము తెచ్చుకొనుడు; నేను లోకము జయించి
యున్నానని వారికి ఉత్తరమిచ్చెను.

## 17. అధ్యాయము.

1 యేసు ఈ మాటలు పలికినతరువాత, ఆయన ఆకాశ
ముతట్టు తన కన్నులెత్తి ఇట్లనెను.—తండ్రీ! ఆ గడియ
2 వచ్చెను. । నీ కుమారుడు నిన్ను మహిమపరిచే నిమిత్తము
నీ కుమారుని నీవు మహిమపరుచుము; నీవు ఆయనకిచ్చిన
వారందరికిని ఆయన నిత్యజీవమిచ్చే నిమిత్తము సర్వ
3 శరీరుల మీదను ఆయనకు అధికారమిచ్చితివి. । అద్వి
తీయ సత్యదేవుడవైన నిన్ను, నీవు పంపిన యేసుక్రీస్తు
4 ను ఎరుగుటయే నిత్యజీవమై యున్నది. । నేను భూమి
మీద నిన్ను మహిమపరిచినాను; నేను చేయుటకు
5 నీవు నాకిచ్చిన కార్యము నెరవేర్చి యున్నాను; । కా
వున ఓ తండ్రీ! లోకము లేక మునుపు, నీ యొద్ద నాకు
కలిగిన మహిమతో నీ యొద్ద నన్ను మహిమపరుచుము.

6 లోకములోనుంచి, నీవు నాకిచ్చిన మనుష్యులకు
నీ నామమును అగుపరిచి యున్నాను. వారు నీవారై
యుండిరి; నీవు నాకు వారిని ఇచ్చినావు. వారు నీ
వాక్యము గైకొని యున్నారు. । నీవు నాకిచ్చినవన్ని 7
యు నీవల్ల ఉన్నవని ఇప్పుడు వారు ఎరిగియున్నారు;।
నీవు నాకిచ్చిన మాటలు వారికిచ్చియున్నాను. వారు 8
వాటిని అంగీకరించి, నేను నీ యొద్దనుంచి బైలుదేరి
వచ్చితినని నిశ్చయముగా ఎరిగి, నీవు నన్ను పంపితివని
నమ్మియున్నారు.

నేను వారి నిమిత్తము ప్రార్థించుచున్నాను. నీ 9
వారైనందున నీవు నాకిచ్చినవారి నిమిత్తమేగాని లో
కము నిమిత్తము ప్రార్థించుటలేదు. । మరి నావన్ని 10
యు నీవై యున్నవి, నీవియు నావి; వారి యందు
మహిమపరచబడి యున్నాను. । ఇకను ఈలోకములో 11
ఉండను; వీరు ఈలోకములో ఉన్నారు; నేను నీ
యొద్దికి వచ్చుచున్నాను. పరిశుద్ధతగల తండ్రీ! మన
వలె వారు ఏకమైయుండుటకు, నీవు నాకిచ్చిన నీ నా
మమందు వారిని* కాపాడుము. । నేను ఈ లోకములో 12
వారితో కూడా ఉన్నప్పుడు, వారిని నీ నామమం
దు కాపాడితిని. నీవు నాకిచ్చిన వారిని కాపాడి
తిని. లేఖనము నెరవేరుటకు, నాశము (కనిన) కుమా
రుడే గాని వారిలో ఎవడును నశించ లేదు. । అయితే 13
ఇప్పుడు నీ యొద్దికి వచ్చుచున్నాను; వారియందు పరి
పూర్ణము చేయబడిన నా సంతోషము వారికి కలుగు
టకు, ఈ లోకమందు ఇవి పలుకుచున్నాను. । వారికి 14
నీ వాక్యము ఇచ్చి యున్నాను; నేను ఈ లోకసంబం
ధిని కాను; ఆలాగు వారును ఈ లోకసంబంధులు
కారు గనుక ఈ లోకులు వారిని ద్వేషించిరి. । నీవు 15
వారిని దుష్టునినుంచి† కాపాడుటకే గాని వారిని
లోకమునుంచి తీసుకొని పోవుటకు నేను ప్రార్థిం
చుటలేదు. । నేను ఈ లోకసంబంధిని కాని ప్రకార 16
ముగా, వారును ఈ లోకసంబంధులు కారు. । వారిని 17
నీ సత్యమందు పరిశుద్ధపరుచుము; నీ వాక్యము సత్య
ము. । నీవు నన్ను ఈ లోకమునకు పంపిన ప్రకారము, 18
నేను కూడా వారిని ఈ లోకమునకు పంపియున్నా
ను. । వారు కూడా సత్యమందు పరిశుద్ధపరచబడుటకు, 19
వారి నిమిత్తము నన్ను పరిశుద్ధపరుచుకొనుచున్నాను.

మరియు నీవు నన్ను పంపితివని ఈ లోకులు నమ్ము 20
టకు, । ఓ తండ్రీ! నా యందు నీవు నీ యందు నేను 21
ఉన్న ప్రకారము, వారు కూడా మన యందు ఏకమై
యుండుటకు, వారి నిమిత్తము మాత్రమే కాకుండా,
అందరును ఏకమై యుండుటకు, వారి వాక్యమువల్ల
నాయందు విశ్వాసముంచే వారి నిమిత్తమును ప్రార్థిం
చుచున్నాను; । మనము ఏకమై యున్న ప్రకారము, 22

* కొన్ని ప్రతులలో, ఇచ్చిన వారిని నీ నామమందు. † లేక, దౌష్ట్యమునుంచి.

23 వారును ఏకమై యుండుటకు, । వారి యందు నేను,
నా యందు నీవు ఉండగా వారు ఏకమై పరిపూర్ణ
ము చేయబడుటకును, నీవు నన్ను పంపితివనియు, నన్ను
ప్రేమించిన ప్రకారము వారిని ప్రేమించితివనియు
ఈ లోకులు తెలుసుకొనుటకును నీవు నాకిచ్చిన మహి
మను నేను వారికి ఇచ్చి యున్నాను.
24 తండ్రీ! నేను ఎక్కడనుందునో, అక్కడ నీవు
నాకిచ్చిన వారు కూడా నాతో ఉండ వలెననియు, నీవు
నాకిచ్చిన నా మహిమ చూడవలె ననియు ఇచ్ఛయించు
చున్నాను; జగత్తు పునాది వేయబడక మునుపు నీవు
నన్ను ప్రేమించితివి.
25 న్యాయముగల తండ్రి! లోకులు నిన్ను యెరిగి
యుండలేదు; నేను నిన్ను యెరుగుదును; నీవు నన్ను
26 పంపితివని వీరు ఎరిగి యున్నారు. । నీవు నా యందు
ఉంచిన ప్రేమ వారి యందు, నేను వారియందును
ఉండుటకు, నేను వారికి నీ నామము తెలియచేసితిని,
ఇంకా తెలియచేతునని పలికెను.

## 18. అధ్యాయము.

1 యేసు వీటిని చెప్పి తన శిష్యులతో కెద్రోననే
యేటి ఆద్దరికి బైలువెళ్లెను. అక్కడ తోట ఉండెను.
దానిలోకి ఆయన శిష్యులును ప్రవేశించిరి.
2 యేసు తన శిష్యులతో అనేక పర్యాయములు
అక్కడికి వెళ్లేవాడు గనుక ఆయనను అప్పగించిన
3 యూదాకు ఆ స్థలము తెలిసెను. । కాబట్టి ఆ యూ
దా కొందరు రాణువవారిని, ప్రధాన యాజకుల వల్లను
పరిసయ్యుల వల్లను బంట్రౌతులను పుచ్చుకొని దీపము
లతోను దివిటీలతోను ఆయుధములతోను అక్కడికి
వచ్చెను.
4 కాబట్టి యేసు తన మీదికి వచ్చుచున్నవన్నియు
ఎరిగి బైలువెళ్లి — మీరు ఎవని వెతుకుచున్నారని
5 వారిని అడిగెను. । వారు—నజరేథువాడైన యేసునని
ఆయనకు ఉత్తరమిచ్చిరి. యేసు—నేనే ఆయననని వా
రితో చెప్పెను. ఆయనను అప్పగించిన యూదా కూ
6 డా వారితో నిలుచుచుండెను. । కాబట్టి ఆయన—
నేనే ఆయనని వారితో చెప్పగానే, వారు వెనుకకు
7 వెళ్లి నేల మీద పడిరి, । గనుక ఆయన—మీరు ఎవని
వెతుకుచున్నారని తిరిగి వారిని అడిగెను. అందుకు
8 వారు—నజరేథువాడైన యేసుని అనిరి. । అప్పుడు—
నీవు నాకు ఇచ్చిన వారిలో ఒకనినైనను నేను పోగొ
ట్టుకొన లేదని ఆయన పలికిన మాట నెరవేర్చబడుటకు,।
9 యేసు—నేనే ఆయనని మీతో చెప్పితిని గనుక
మీరు నన్ను వెతికితే, వీరిని వెళ్లనియ్యుడని వారికి
ఉత్తరమిచ్చెను.

అప్పుడు సీమోను పేతురు యొద్ద కత్తి ఉండగా, 10
అతడు దాని దూసి, ప్రధానయాజకుని దాసుని కొట్టి,
అతని కుడి చెవి తెగ కోసెను. । ఆ దాసుని పేరు మల్కు. 11
అప్పుడు యేసు—నీ కత్తి ఒరలో వేయుము; తండ్రి
నాకు ఇచ్చిన గిన్నెలో నేను త్రాగనా అని పేతురు
తో పలికెను.

కాబట్టి రాణువవారు, సహస్రాధిపతియు, యూ 12
దుల బంట్రౌతులు యేసుని పట్టుకొని, ఆయనను కట్టి,
మొదట అన్నా యొద్దకు ఆయనను తీసుకొని వెళ్లిరి; ।
అతడు ఆ సంవత్సరము ప్రధానయాజకుడైన కయఫకు 13
మామయై యుండెను. । కయఫ—ఒక మనుష్యుడు 14
ప్రజల కొరకు చనిపోవుట ఉపయోగమని యూదు
లకు ఆలోచన చెప్పిన వాడే.

అప్పుడు సీమోను పేతురు, మరి యొక శిష్యుడును 15
యేసుని వెంబడించిరి. ఆ శిష్యుడు ప్రధానయాజకునికి
నెళవైనవాడు గనుక ప్రధానయాజకుని లోపలి వాక
టికి యేసుతో కూడా వెళ్లెను. । అయితే పేతురు 16
ద్వారము యొద్ద బైట నిలిచెను గనుక ప్రధానయాజ
కునికి నెళవైన ఆ వేరొక శిష్యుడు బైలువెళ్లి ద్వార
పాలకురాలితో మాటలాడి, పేతురును లోపటికి తీసు
కొని వచ్చెను. । కాబట్టి ద్వారపాలకురాలైన చిన్నది 17
పేతురుని చూచి—నీవు కూడా ఈ మనుష్యుని శిష్యు
లలో ఒకడవా? అని అడిగినప్పుడు, ఆయన కానని
పలికెను. । అక్కడ చలి వేసినందున దాసులు బంట్రౌ 18
తులు మంట వేసి కాచుకొనుచుండిరి; పేతురు వారి
తో నిలిచి కాచుకొనుచుండెను.

కాబట్టి ప్రధానయాజకుడు ఆయన శిష్యులను గూ 19
ర్చి ఆయన బోధను గూర్చి యేసుని అడిగినప్పుడు, ।
యేసు—నేను బహిరంగముగా లోకులతో పలికితిని. 20
యూదులందరు కూడి వచ్చే గుడిలోను, సునగోగుల
లోను ఎల్లప్పుడును బోధించితిని; రహస్యముగా నేను
ఏమియు పలుకలేదు. । మీరు నన్ను అడుగుట ఎం 21
దుకు? నేను వారితో పలికినది విన్నవారిని అడుగండి;
ఇదుగో! నేను పలికినవి వీరికి తెలుసునని ఆయనకు
ఉత్తరమిచ్చెను. । ఆయన ఇవి చెప్పినప్పుడు, దగ్గిర నిలి 22
చిన పరిచారకులలో ఒకడు—ప్రధానయాజకునికి ఈ
లాగు ఉత్తరమిస్తున్నావా? అని యేసుని చేతితో చరి
చెను. । అందుకు యేసు—నేను కానిమాట పలికియుం 23
టే, ఆ చెడుతనమును గూర్చి నీవు సాక్ష్యము చెప్పు
ము; మంచిదైతే నన్ను ఎందుకు చరుచుచున్నావని
అతనికి ఉత్తరమిచ్చెను.

కాబట్టి అన్నా కట్టబడిన ఆయనను ప్రధానయా 24
జకుడైన కయఫ యొద్దకు పంపెను.

25 అప్పుడు సీమోను పేతురు నిలిచి, కాచుకొను
చుండెను గనుక వారు అతని చూచి—నీవును ఆయన
శిష్యులలో ఒకడవా? అని అతని అడిగిరి. అతడు—
26 నేను కానని పలికెను.। పేతురు ఎవని చెవి కోసెనో
వాని బంధువును ప్రధానయాజకుని దాసులలో ఒక
డునైన వాడు—నీవు తోటలో వానియొద్ద ఉండుట
27 నేను చూడలేదా? అని పలికెను,। గనుక పేతురు
తిరిగి—ఆలాగు కాదనెను. వెంటనే కోడి కూసెను.
28 కాబట్టి వారు కయప యొద్దనుంచి ప్రేతోర్యము
నకు* యేసుని తీసుకొని వెళ్లిరి. అప్పుడు ఉదయ
మైనది. అయితే వారు పస్కాను భుజించుటకు మైల
తగులునేమో అని ప్రేతోర్యములో ప్రవేశించ లేదు.।
29 కాబట్టి పిలాతు వారి యొద్దికి బైలువెళ్లి—ఈ మనుష్యు
నికి విరోధముగా మీరు ఏ ఫిర్యాదు చేయుచున్నా
రనెను.
30 అందుకు వారు—ఇతడు దుర్మార్గుడు కాకపోతే
ఇతని నీకు అప్పగించక ఉందుమని అతనితో ఉత్తర
ము చెప్పిరి.
31 కాబట్టి పిలాతు—మీరు అతని పట్టుకొని మీ
బోధన ప్రమాణము చొప్పున అతనికి తీర్పు చేయం
డని చెప్పెను.
32 అప్పుడు యూదులు—ఒకని చంపించుటకు మాకు
అధికారము లేదని అతనితో పలికిరి. అందువల్ల యేసు
తాను ఎటువంటి మరణము పొంద వలెనో దాని
సూచించి చెప్పిన మాట నెరవేరెను.
33 కాబట్టి పిలాతు తిరిగి ప్రేతోర్యములో ప్రవేశిం
చి యేసుని పిలిపించి—నీవు యూదుల రాజువా? అని
ఆయనను అడిగెను.
34 అందుకు యేసు—నీయంతట నీవే దీని అడుగుచు
న్నావా? లేక ఇతరులు నీతో నన్ను గూర్చి ఇది చెప్పి
నారా? అని అతనికి ఉత్తరమిచ్చెను.
35 అందుకు పిలాతు—నేను యూదుడనా? నీ దేశ
స్థులు, ప్రధానయాజకులును నిన్ను నాకు అప్పగించిరి;
ఏమి చేసితివి? అని అడిగెను.
36 అందుకు యేసు — నా రాజ్యము ఈ లోకసంబం
ధమైనది కాదు; నా రాజ్యము ఈ లోకసంబంధమైన
దైతే, నేను యూదులకు అప్పగించబడకుండుటకు నా
బంట్రౌతులు నా కొరకు పోరాడుదురు. అయితే
ఇప్పుడు నా రాజ్యము ఇక్కడిది కాదని ఉత్తరమిచ్చెను.
37 అందుకు పిలాతు — ఆలాగైతే నీవు రాజువు కా
వా? అని పలికెను. అందుకు యేసు—నీవు (సత్యము)
చెప్పుచున్నావు; నేను రాజునై యున్నాను; దీని నిమి
త్తమనగా నేను సత్యమును గూర్చి సాక్ష్యమిచ్చుటకు
పుట్టితిని; దీని నిమిత్తము ఈ లోకమునకు వచ్చితిని.
సత్యసంబంధియైన ప్రతివాడును నా శబ్దము వినునని
ఉత్తరమిచ్చెను.
పిలాతు ఆయనతో—సత్యమనగా ఏమిటి అనెను. 38
అతడు ఈలాగు పలికి యూదుల యొద్దికి తిరిగి బైలు
వెళ్లి—నేను వాని యందు ఏ దోషము కనుగొనలేదు.।
అయితే పస్కా (పండుగ) లో మీ కొరకు నేను ఒకని 39
విడిపించ వలెననే ఒక మర్యాద మీకు కలిగియున్నది
గనుక, నేను యూదుల రాజుని మీ కొరకు విడిపిం
చుట మీకు ఇష్టమవునా? అని వారిని అడిగెను.। అయి 40
తే వారందరు—వీని కాదు, బరబ్బాను అని తిరిగి కేక
లు వేసిరి. ఈ బరబ్బా దొంగయై యుండెను.

## 19. అధ్యాయము.

కాబట్టి పిలాతు అప్పుడు యేసుని పట్టుకొని ఆయన 1
ను కొరడాతో కొట్టించెను.। రాణువవారు ముండ్లతో 2
కిరీటము నల్లి ఆయన తలమీద పెట్టి,। ధూమ్రవస్త్రము 3
ఆయనకు తొడిగించి,— యూదుల రాజా! నీకు శుభ
మని చెప్పి ఆయనను చేతితో చరుచుచుండిరి.
కాబట్టి పిలాతు తిరిగి వెలపటికి బైలువెళ్లి — ఇదు 4
గో! ఈయన యందు దోషమేమియు నాకు అగుపడ
లేదని మీకు తెలియబడ వలెనని మీకొరకు ఈయనను
వెలపటికి తీసుకొని వచ్చుచున్నానని వారితో పలికె
ను.। కాబట్టి ఆ ముండ్ల కిరీటము, ధూమ్రవస్త్రము 5
ధరించిన యేసు వెలపటికి వచ్చెను. అప్పుడు (పిలా
తు)—ఇదుగో! ఈ మనుష్యుడు! అని వారితో చెప్పె
ను.। కాబట్టి ప్రధానయాజకులు పరిచారకులును ఆయ 6
నను చూచి—అతని శిలువవేయుము, శిలువవేయుము
అని కేకలు వేసిరి. పిలాతు—నేను ఆయన యందు ఏ
దోషమును కనుగొన లేదు గనుక, మీరే అతని పట్టు
కొని శిలువ వేయండని చెప్పెను.। అందుకు యూదు 7
లు—మాకు బోధన ప్రమాణము ఉన్నది; ఇతడు తన్ను
దేవుని కుమారునిగా చేసుకొనెను గనుక మా బోధన
ప్రమాణము చొప్పున ఇతడు చావ వలెనని అతనికి
ఉత్తరమిచ్చిరి.
కాబట్టి పిలాతు ఆ మాట విని, మరి మిక్కిలి భయ 8
పడి, తిరిగి ప్రేతోర్యములో ప్రవేశించి,।—నీవు ఎక్క 9
డనుంచి వచ్చితివని యేసుని అడిగెను. అయితే యే
సు అతనికి ఉత్తరమియ్యలేదు,। గనుక పిలాతు—నా 10
తో పలుకవా? నిన్ను శిలువ వేయుటకు నాకు అధి

* అనగా, అధికారస్థానము.

కారము కలదనియు, నిన్ను విడిపించుటకు నాకు అధి
కారము కలదనియు నీవు యెరుగవా? అని ఆయన
11 తో పలికెను. । అందుకు యేసు—పైనుంచి నీకు ఇయ్య
బడకపోతే, నాకు విరోధముగా నీకు యే అధికార
మును కలుగదు; అందుచేతను నీకు నన్ను అప్పగించిన
వానికి ఎక్కువ పాపము కలదని ఉత్తరమిచ్చెను.

12 అప్పటినుంచి పిలాతు ఆయనను విడిపించుటకు
యత్నపడెను. అయితే యూదులు—నీవు వీని విడిపిం
చితే, కైసరు స్నేహితుడవు కావు; తన్ను రాజుని చే
సుకొనే ప్రతివాడును కైసరునకు విరోధముగా మాట
13 లాడుచున్నాడని కేకలు వేసిరి. । కాబట్టి పిలాతు ఈ
మాట విని యేసుని బైటికి తీసుకొని వచ్చి, హెబ్రా
యి భాషలో గబ్బథా అనబడిన చిత్రవర్ణ శిలాస్థల
14 మందు న్యాయపీఠము మీద కూర్చుండెను. । అది
పస్కాను సిద్ధపరిచే దినము. అప్పుడు కొంచెము తక్కువ
ఆరు గంటలు* కావచ్చును ఆయన — ఇదుగో! మీ
15 రాజు అని యూదులతో చెప్పెను. । అయితే వారు—
వీని కొనిపొమ్ము, కొనిపొమ్ము; శిలువ వేయుమని కేక
లు వేసిరి. పిలాతు—మీ రాజుని శిలువవేయనా? అని
వారితో పలికెను. అందుకు ప్రధానయాజకులు—కైస
16 రు గాక మాకు వేరే రాజు లేడని ఉత్తరమిచ్చిరి. । కా
బట్టి శిలువ వేయబడుటకు ఆయనను వారికి అప్పగించె
17 ను. । వారు యేసుని పట్టి తీసుకొని వెళ్లిరి. ఆయన తన
శిలువ మోసుకొని హెబ్రాయి భాషలో గొల్గొథా
అనబడిన కపాలస్థలమనే పేరుగల చోటికి బైలు వెళ్లె
18 ను. । అక్కడ ఆ తట్టు ఒకని, ఈ తట్టు ఒకని, మధ్యను
యేసుని పెట్టి ఆయనతో ఆ ఇద్దరినికూడా శిలువవేసిరి.

19 మరియు పిలాతు పైవిలాసము వ్రాసి శిలువ మీద
వేయించెను. నజోరీయుడైన యేసనే యూదుల రాజు
20 అని వ్రాయబడెను. । యేసు శిలువ వేయబడిన స్థలము
పట్టణమునకు సమీపమై యుండెను గనుక యూదు
లలో అనేకులు ఈ పైవిలాసము చదివిరి. అది హె
బ్రాయి, హెల్లేని, రోమాయి భాషలతో వ్రాయబ
21 డెను. । కాబట్టి—నేను యూదుల రాజునని అతడు
చెప్పెననేదే గాని—యూదుల రాజని వ్రాయ వద్దని
యూదుల ప్రధానయాజకులు పిలాతుతో చెప్పిరి. ।
22 అందుకు పిలాతు—నేను వ్రాసినది వ్రాసే యున్నా
23 నని ఉత్తరమిచ్చెను. । అంతట రాణువవారు యేసుని
శిలువవేసిన తరువాత, ఆయన వస్త్రములను పట్టుకొని
ప్రతి రాణువవానికి ఒక భాగము ఉండేటట్టు వాటిని
నాలుగు భాగములుగా చేసిరి. ఆయన నిలువుటంగి
కూడా (పుచ్చుకొనిరి). అయితే ఆ నిలువుటంగి కుట్టు
లేక, మీదనుంచి కేవలము నేయబడెను, । గనుక 24
వారు—దాని చింపక అది ఎవనిదౌనో దాని గూర్చి
చీట్లు వేతామని ఒకనితో ఒకడు చెప్పుకొనిరి. అం
దువల్ల — వారు నా వస్త్రములను తమకు తామే పం
చుకొని నా అంగిని గూర్చి చీట్లు వేసిరని చెప్పే
లేఖనము† నెరవేర్చబడెను. కావున రాణువవారు
ఈలాగు చేసిరి.

అప్పుడు ఆయన తల్లి, ఆయన తల్లి సహోదరి, 25
క్లోపా (భార్యయైన) మరియ, మగ్దలా ఊరి మరియ
యేసు శిలువయొద్ద నిలిచిరి. । కాబట్టి యేసు తన తల్లి 26
తాను ప్రేమించిన శిష్యుడు దగ్గిర నిలుచుట చూచి—
ఓ అమ్మా ఇదుగో! నీ కుమారుడు అని ఆమెతో చె
ప్పెను. తరువాత — ఇదుగో! నీ తల్లి, అని ఆ శిష్య
నితో చెప్పెను. । ఆ గడియనుంచి ఆ శిష్యుడు ఆమెను 27
తన ఇంట చేర్చుకొనెను.

ఆ తరువాత లేఖనము నెరవేర్చబడుటకు, సమస్త 28
మును అప్పటికి సంపూర్తి చేయబడెనని యేసు
యెరిగి—నాకు దాహమయినదని చెప్పెను. । చిరకతో 29
నిండుకొనిన ఒక పాత్ర అక్కడ ఉంచబడెను గనుక
వారు ఒక స్పంజీ చిరకతో నింపి, హిస్సోపు పుడక
మీద వేసి, ఆయన నోటికి అందిచ్చిరి. । అంతట 30
యేసు ఆ చిరక పుచ్చుకొనిన తరువాత, ఆయన—సం
పూర్తియైనదని చెప్పి, తల వంచుకొని తన ఆత్మను
అప్పగించెను.

కాబట్టి, అది సిద్ధపరిచే దినము గనుక, ఆ దేహ 31
ములు సబ్బాతున శిలువమీద నిలువక ఉండుటకు,
యూదులు వాటి కాళ్లు విరవబడుటకు, అవి తీసు
కొని పోబడుటకును, పిలాతును వేడుకొనిరి; ఎందు
కంటే ఆ సబ్బాతు దినము గొప్పది. । కాబట్టి రాణువ 32
వారు వచ్చి ఆయనతో కూడా శిలువ వేయబడిన
మొదటివాని కాళ్లను రెండవవాని కాళ్లను విరిచిరి. ।
అయితే వారు యేసు యొద్దికి వచ్చి, అంతకు ముందు 33
చనిపోయిన ఆయనను చూచి, ఆయన కాళ్లు విరువ
లేదు. । అయితే రాణువవారిలో ఒకడు ఈటెతో 34
ఆయన పక్కను పొడిచెను. వెంటనే రక్తము నీళ్లు
బైటికి వచ్చెను. । దాని చూచినవాడు సాక్ష్యమిచ్చి 35
యున్నాడు; వాని సాక్ష్యము నిజమై యున్నది. మీ
రును నమ్ముటకు, తాను నిజమైనవి చెప్పుచున్నాడని
యెరిగి యున్నాడు. । వాని‡ యెముకలలో ఒకటై 36

* అనగా మధ్యాహ్నము. †కీర్తన. 22: 19. ‡లేక, దాని.

నను విరువబడదనే లేఖనము* నెరవేర్చఁబడుటకు ఇవి
37 జరిగెను. । మరి—తాము పొడిచిన వానితట్టు చూతు
రని మరియొక లేఖనము† చెప్పుచున్నది.

38 ఇవియైన తరువాత, అరిమతైయ ఊరివాడును,
యూదుల భయమువల్ల రహస్యముగా యేసు శిష్యు
డునైన యోశేఫు తాను యేసు దేహమును తీసుకొని
వెళ్లుటకు, పిలాతును వేడుకొనెను. పిలాతు సెలవి
చ్చెను గనుక ఆతడు వచ్చి, యేసు దేహమును తీసు
39 కొని వెళ్లెను. । మరియు, మొదట రాత్రివేళ యేసు
యొద్దికి వచ్చిన నికొదేము కూడా బోళము, అగురు,
కలిపి, కొంచెము ఎక్కువ తక్కువ నూట ఇరువై శేర్లు
40 తీసుకొని వచ్చెను. । అంతట వారు యేసు దేహము
పట్టుకొని, యూదులు పాతిపెట్టే మర్యాద చొప్పున
ఆ సుగంధ ద్రవ్యములు వేసి, నారబట్టలు దానికి
41 చుట్టిరి. । మరియు ఆయన శిలువవేయబడిన స్థలములో
ఒక తోట ఉండెను. ఆ తోటలో ఒక క్రొత్త సమాధి
ఉండెను. దానిలో ఎవడును యెప్పుడైనను ఉంచబడ
42 లేదు. । కాబట్టి ఆ సమాధి సమీపమైనది గనుక యూ
దుల పండుగకు తొలి దినమైనందున, దానిలో యేసుని
ఉంచిరి.

## 20. అధ్యాయము.

1 అయితే, ఆదివారమునాడు ఇంకా చీకటిగా
ఉన్నప్పుడు, మగ్దలా ఊరి మరియ పెందలాడి, ఆ
సమాధి యొద్దికి వచ్చి, రాయి సమాధి యొద్దనుంచి
2 తీయబడియుండుట చూచెను, । గనుక ఆమె పరు
గెత్తి సీమోను పేతురు యొద్దికిని యేసు ప్రీతిపరిచిన
ఆ మరియొక శిష్యుని యొద్దికిని వచ్చి — ప్రభువుని
సమాధిలోనుంచి తీసుకొని వెళ్లిరి; ఆయనను ఎక్కడ
3 ఉంచిరో మాకు తెలియదని చెప్పెను. । కాబట్టి పేతు
రు, ఆ మరియొక శిష్యుడును బైలువెళ్లి, సమాధి
యొద్దికి వచ్చుచుండిరి. వారిద్దరును కూడి పరుగెత్తిరి; ।
4 అయితే ఆ మరియొక శిష్యుడు పేతురుకంటే త్వ
రగా పరుగెత్తి, ముందుగా సమాధి యొద్దికి వచ్చి ।
5 వంగి, పడియున్న నార బట్టలు చూచెను. అయినప్ప
6 టికి అతడు దానిలో ప్రవేశించలేదు. । కాబట్టి సీమో
ను పేతురు అతని వెంబడి వచ్చి, సమాధిలో ప్రవే
7 శించి, । పడియున్న నార బట్టలను, నార బట్టలయొద్ద
పడియుండక వేరుగా ఒక చోట చుట్టబడిన ఆయన
8 తల రుమాలును చూచెను. । అప్పుడు మొదట సమాధి
యొద్దికి వచ్చిన ఆ మరియొక శిష్యుడు కూడా లోప
9 టికి వెళ్లి, చూచి నమ్మెను. । ఆయన చనిపోయిన వారి
లోనుంచి లేచుట అగత్యమని వ్రాయబడిన మాట
వారు ఇంకా గ్రహించుకొన లేదు. । అంతట ఆ 10
శిష్యులు తిరిగి తమ వారి యొద్దికి వెళ్లిపోయిరి.

అయితే మరియ సమాధి బైట నిలిచి, ఏడ్చుచుం 11
డెను. ఆమె ఏడ్చుచు సమాధిలోకి వంగి చూచెను. ।
అప్పుడు ఆమె, తెల్లని వస్త్రములుగల ఇద్దరు దూతలు 12
యేసు దేహము పడిన స్థలములో తలవైపున ఒకడును
కాళ్లవైపున ఒకడును కూర్చుండుట చూచెను. । వారు— 13
ఓ, అమ్మా! ఎందుకు ఏడ్చుచున్నావని ఆమెను అడి
గిరి. ఆమె — నా ప్రభువుని యెవరో ఎత్తుకొని పో
యిరి; ఆయనను ఎక్కడ ఉంచిరో అది నాకు తెలియ
లేదు గనుకనే అని చెప్పెను. । ఆమె ఆ మాటలు ప 14
లికి, వెనుకతట్టు తిరిగి, యేసు నిలిచియుండుట చూ
చెనుగాని ఆయన యేసని తెలియకపోయెను. । యేసు 15
—ఓ అమ్మా: ఎందుకు ఏడ్చుచున్నావు? ఎవని వెతుకు
చున్నావని ఆమెను అడిగినప్పుడు, ఆమె ఆయనను
తోటవాడని తలంచి-అయ్యా! నీవు ఆయనను మోసు
కొని వెళ్లియుంటే, ఆయనను ఎక్కడ ఉంచితివో
నాతో చెప్పుము, అప్పుడు నేను ఆయనను తీసుకొని
వెళ్లుదునని చెప్పెను. । యేసు ఆమెను చూచి—మరి 16
యా! అనెను. ఆమె తిరిగి, ఆయనను చూచి, హె
బ్రాయి భాషతో — రబ్బూనీ! అనగా బోధకుడా!
అనెను. । యేసు ఆమెతో—నన్ను ముట్టకుము; ఎందు 17
కంటే నేను ఇంకా నా తండ్రి యొద్దికి పైకి వెళ్ల
లేదు. అయితే నా సహోదరుల యొద్దికి వెళ్లి—నా
తండ్రి మీ తండ్రియు, నా దేవుడు మీ దేవుడు
నైన వాని యొద్దికి యెక్కి వెళ్లుచున్నానని వారితో
చెప్పుమని పలికెను. । మగ్దల ఊరి మరియ వచ్చి, తాను 18
ప్రభువుని చూచితిననియు ఆయన తనతో ఇవి పలి
కెననియు శిష్యులకు తెలియ చేసెను.

ఆ దినము ఆదివారము, సాయంకాలమున యూ 19
దుల భయమువల్ల శిష్యులు కూడియున్న (ఇంటి) తలు
పులు మూయబడినప్పుడు, యేసు వచ్చి మధ్యను నిలిచి
—మీకు సమాధానమవుగాక అని వారితో చెప్పెను. ।
ఆయన ఆలాగు చెప్పి వారికి తన చేతులను తన 20
పక్కను చూపించెను. అంతట శిష్యులు ప్రభువుని
చూచి సంతోషించిరి. । కాబట్టి యేసు—నాకు సమా 11
ధానమవుగాక; తండ్రి నన్ను పంపినప్రకారము నేను
ను మిమ్మును పంపుచున్నానని తిరిగి వారితో పలికె
ను. । ఆయన ఇవి చెప్పి, వారి మీద ఊపిరి విడిచి— 22
పరిశుద్ధాత్మను పొందుడి; । మీరు ఎవరి పాపములు 23

* నిర్గమ కాండము. 12: 46. కీర్తన. 34. 20. † జకర్య. 12: 10.

పరిహరింతురో వారికి పరిహరించబడును; ఎవరి పాప
ములు మీరు నిలువ చేతురో అవి నిలువ చేయబడు
నని వారితో చెప్పెను.
24 అయితే యేసు వచ్చినప్పుడు పన్నెండు మంది
లో ఒకడైన దిదుము అనబడిన థోమా వారితో
ఉండలేదు గనుక ఇతర శిష్యులు—మేము ప్రభువుని
25 చూచితిమని అతనితో చెప్పిరి. । అయితే —అతడు
నేను ఆయన చేతులలో మేకుల గురుతు చూచి, నా
వేలు మేకుల గురుతులో ఉంచి, నా చెయ్యి ఆయన
పక్కలో ఉంచితేనేగాని నేను నమ్మనని వారితో
చెప్పెను.

26 ఎనిమిది దినములైన తరువాత, తిరిగి ఆయన శిష్యులు
లోపట ఉండగా, థోమా వారితో కూడా ఉండెను.
తలుపులు మూయబడినప్పుడు, యేసు వచ్చి మధ్యను
27 నిలిచి—మీకు సమాధానమవుగాక అనెను. । అప్పుడు
ఆయన—నీ వేలు ఈలాగు చాచి నా చేతులు చూడు
ము, నీ చెయ్యి చాచి నా పక్కలో ఉంచి అవిశ్వా
సివి కాక విశ్వాసివై యుండుమని థోమాతో చెప్పె
28 ను. । అందుకు థోమా—నా ప్రభువా! నా దేవా! అని
29 ఉత్తరమిచ్చెను. । అప్పుడు యేసు—నీవు నన్ను చూచి
నందున నమ్మితివి; చూడకనే నమ్మినవారు ధన్యులని
అతనితో చెప్పెను.

30 మరియు వేరే అనేకమైన అద్భుతములను యేసు
తన శిష్యుల యెదుట చేసెను. అవి ఈ గ్రంథమందు
31 వ్రాయబడ లేదు. । అయితే యేసు దేవుని కుమారుడైన
క్రీస్తని మీరు నమ్ముటకును, నమ్మి ఆయన నామమందు
జీవము పొందుటకును ఇవి వ్రాయబడి యున్నవి.

## 21. అధ్యాయము.

1 అటుతరువాత యేసు తిబెరి సముద్రము దగ్గర
తిరిగి తాను శిష్యులకు ప్రత్యక్షమాయెను. ఈ విధము
2 గా ఆయన ప్రత్యక్షమాయెను. । సీమోను పేతురు,
దిదుము అనబడిన థోమా, గలిలైయలోని కానా ఊరి
నతనయేలు, జెబెదై కుమాళ్లు, ఆయన శిష్యులలో మరి
3 యిద్దరును కూడియున్నప్పుడు, । సీమోను పేతురు—
నేను చేపలు పట్టుటకు వెళ్లుదునని వారితో పలికెను.
వారు—మేము కూడా నీతో వస్తామనిరి. వారు బైలు
వెళ్లి, తమ దోనె ఎక్కిరి. అయితే ఆ రాత్రి ఏమియు
పట్టలేదు.

4 అయితే ఉదయమైన తరువాత, యేసు దరిని నిలి
చెను. అయినప్పటికి, ఆయన యేసని శిష్యులు తెలు
5 సుకొన లేదు. । అప్పుడు యేసు—పిల్లలారా! భోజన
మునకు మీకు యేమైనా* కలదా అని వారిని అడిగెను. ।
వారు—లేదనిరి. అప్పుడు ఆయన—దోనె కుడిపక్క 6
నుంచి వల వేయండి; అప్పుడు దొరుకునని చెప్పెను
గనుక, వారు ఆలాగు చేసి, చేపలు విస్తారమైనందున
దాని లాగలేక పోయిరి. । కాబట్టి యేసు ప్రేమిం 7
చిన ఆ శిష్యుడు—ఈయన మన ప్రభువని పేతురుతో
చెప్పెను. ప్రభువు ఉన్నాడని సీమోను పేతురు విని,
దిగంబరియైనందున పైబట్ట వేసుకొని, సముద్రములోకి
దుమికెను. । భూమికి కొంచెము ఎక్కువ తక్కువ ఇన్నూ 8
రు మూరల దూరము ఉన్నందున ఇతర శిష్యులు చేప
లు గల వల లాగుచు ఆ చిన్న దోనెలో వచ్చిరి.

వారు దరికి రాగానే, అక్కడ వేయబడిన నిప్పు 9
లు, వాటి మీద ఉంచబడిన చేపలు, రొట్టెయు
చూచిరి. । యేసు—మీరు ఇప్పుడు పట్టిన చేపలలో 10
కొన్ని తీసుకొని రండని వారితో చెప్పెను. । సీమోను 11
పేతురు పడవ ఎక్కి, నూట యేబది మూడు గొప్ప చే
పలతో నిండుకొనియున్న వలను భూమికి లాగెను. ।
అంత విస్తారమైనవై యున్నప్పటికి ఆ వల పిగల లేదు. 12
యేసు—మీరు రండి, భోజనము చేయుడని వారితో
చెప్పెను. అయితే ఆయన ప్రభువని వారికి తెలిసినం
దున — నీవు ఎవడవని శిష్యులలో ఎవడును అడుగు
టకు తెగించలేదు. । అప్పుడు యేసు వచ్చి ఆ రొట్టె 13
యు చేపలును పుచ్చుకొని, వారికిచ్చెను. । యేసు చని 14
పోయిన వారిలోనుంచి లేచి, ఈ మూడవసారి తన
శిష్యులకు ప్రత్యక్షమాయెను.

అంతట వారు భోజనము చేసిన తరువాత యేసు— 15
యోనా కుమారుడవైన సీమోనా! వీరి కంటె నన్ను
మిక్కిలి ప్రేమించుచున్నావా? అని సీమోను పేతురుని
అడిగెను. అతడు—అవును ప్రభువా! నేను నిన్ను ప్రీతి
పరుచుచున్నానని యెరుగుదువని ఆయనతో చెప్పెను.
యేసు—నా గొర్రెపిల్లలను పోషించుమని అతనితో చె
ప్పెను. । తిరిగి ఆయన—యోనా కుమారుడవైన సీమో 16
నా! నన్ను ప్రేమిస్తున్నావా? అని రెండవసారి అతని
అడిగెను. అతడు — అవును, ప్రభువా! నేను నిన్ను
ప్రీతిపరుచుచున్నానని నీవు యెరుగుదువని ఆయన
తో చెప్పెను. ఆయన—నా గొర్రెలను మేపుమని చె
ప్పెను. । మూడవ సారి ఆయన—యోనా కుమారుడవైన 17
సీమోనా! నన్ను ప్రీతిపరుచుచున్నావా? అని అతని
అడిగెను.—నన్ను ప్రీతిపరుచుచున్నావా? అని అతని
తో మూడవసారి పలికినందున, పేతురు దుఃఖించి—
ప్రభువా! నీవు సమస్తమును ఎరిగినవాడవు; నిన్ను

*లేక, యే చేపయైనా.

ప్రీతిపరుచుచున్నానని యెరుగుదువు అని ఆయనతో
18 చెప్పెను. । యేసు—నా గొర్రెలను పోషించుము. సత్య
ము సత్యము నేను నీతో చెప్పుచున్నాను; నీవు యౌ
వనస్థుడవైనప్పుడు నీకు నీవే నడుము కట్టుకొని నీకు
ఇష్టమైన చోటికి వెళ్లితివి; అయితే నీవు ముసలివాడ
వైనప్పుడు నీ చేతులు నీవు చాతువు; వేరొకడు నీ
నడుము కట్టి నీకు ఇష్టముకాని చోటికి నిన్ను మోసు
19 కొని పోవునని అతనితో పలికెను. । ఆయన ఎటువంటి
మరణమువల్ల దేవుని మహిమపరుచునో, దాని సూ
చించి ఇది చెప్పెను. అప్పుడు ఈలాగు చెప్పి,—నన్ను
వెంబడించుమని అతనితో పలికెను.

20 అప్పుడు పేతురు వెనుకకు తిరిగి, యేసు ప్రేమిం
చినటువంటియు భోజన పఙ్తిలో ఆయన రొమ్మున
ఆనుకొని—ప్రభువా! నిన్ను అప్పగించేవాడు ఎవడు
అని అడిగినటువంటియు శిష్యుడు వెంబడించుట చూ
చెను. । పేతురు అతని చూచి—ప్రభువా! ఇతని గతి 21
ఏమవునని యేసుని అడిగెను. । అప్పుడు యేసు— 22
నేను వచ్చేపర్యంతము అతడు ఉండ వలెనని నాకు
ఇష్టమైతే, అది నీకేమి? నీవు నన్ను వెంబడించుమని
అతనితో పలికెను. । కాబట్టి ఆ శిష్యుడు చావడనే 23
మాట సహోదరులలో ప్రచురమాయెను. అయితే—
చావడని, యేసు అతనితో చెప్పక—నేను వచ్చేపర్యం
తము ఆయన ఉండవలెనని నాకు ఇష్టమైతే అది నీ
కేమి అని పలికెను.

వీటిని గూర్చి సాక్ష్యమిచ్చుచు, ఇవి వ్రాసిన 24
శిష్యుడు ఇతడే. అతని సాక్ష్యము నిజమని యెరుగు
దుము. । అయితే యేసు చేసినవి ఇంకా అనేకమైనవి 25
కలవు. అవన్నియు వేరుగా వ్రాయబడితే, ఆ వ్రాయ
బడిన గ్రంథములకు లోకమందు స్థలము చాలదని
నాకు తోచును

# అపొస్తలుల కార్యములు.

## 1. అధ్యాయము.

1 ఓ థెయొఫిలా! యేసు తాను ఏర్పరచుకొనిన
అపొస్తలులకు పరిశుద్ధాత్మవల్ల ఆజ్ఞాపించిన తరువాత,।
2 ఆయన, మీదికి ఎక్కించబడిన దినము వరకు, ఆయన
చేయుటకు, బోధించుటకు ఆరంభించిన వాటినన్నిటిని
గూర్చి నేను మొదటి గ్రంథము వ్రాసి యున్నాను.।
3 ఆయన శ్రమపడిన తరువాత, నలుబది దినముల పర్యం
తము వారికి దర్శనమిచ్చుచు, దేవుని రాజ్యమును గూ
ర్చిన వాటిని చెప్పుచు అనేకమైన సత్య దృష్టాంతముల
చేత వారి యెదుట సజీవుడై వారికి కనబడెను.

4 మరియు ఆయన వారిని పోగుచేసి, వారికి ఈలాగు
ఆజ్ఞాపించెను—మీరు యెరూషలేమునుంచి వెళ్లక, మీ
రు నావల్ల వినిన తండ్రియొక్క వాగ్దత్తము కొరకు కని
5 పెట్టుచుండుడి;। యోహాను నీళ్లతో బాప్తిస్మము చేయిం
చెను; అయితే బహు దినములు కాక మునుపు, మీకు
పరిశుద్ధాత్మతో బాప్తిస్మము చేయించబడునని చెప్పెను.
6 కాబట్టి వారు కూడి వచ్చి,—ప్రభువా! ఈ కాల
మందు ఇశ్రాయేలుకు రాజ్యమును మళ్లి ఇత్తువా? అని
ఆయనను అడిగిరి.

7 అందుకు ఆయన వారితో—తండ్రి తన స్వకీయాధి
కారమందు ఉంచుకొని యున్న కాలములనైనను సమ
8 యములనైనను తెలుసుకొనుట మీదికాదు;।అయితే మీ
మీదికి పరిశుద్ధాత్మ వచ్చేటప్పుడు, మీరు బలము పొంది
యెరూషలేములో, యూదైయ సమరైయ దేశముల
యందంతటను, భూమియొక్క దిగంతముల వరకును
నాకు సాక్షులై యుందురని పలికెను.

9 ఆయన వీటిని చెప్పి, వారు చూచుచుండగా, పైకి
యెక్కించబడెను. అప్పుడు ఒక మేఘము వారి కన్ను
లకు మరుగుగా ఆయనను కొంచుపోయెను.

10 ఆయన వెళ్లుచుండగా, వారు ఆకాశము తట్టు తేరి
చూచుచుండిరి. అప్పుడు ఇదుగో! తెల్లని వస్త్రములు
11 గల ఇద్దరు మనుష్యులు వారి యొద్ద నిలిచి।—గలిలైయ
మనుష్యులారా! మీరు ఎందుకు నిలిచి ఆకాశముతట్టు
తేరి చూచుచున్నారు? మీ యొద్దనుంచి ఆకాశమునకు
ఎక్కించబడిన ఈ యేసే, ఏరీతిగా ఆయన ఆకాశ
మునకు వెళ్లుట మీరు చూచితిరో, ఆ రీతిగానే తిరిగి
వచ్చునని వారితో పలికిరి.

అప్పుడు వారు యెరూషలేముకు సబ్బాతు దినమున 12
పోతగినంత దూరమున్న ఒలీవల వనమనబడిన కొండ
నుంచి యెరూషలేముకు తిరిగి వెళ్లిరి.। వారు ప్రవేశించి, 13
మేడ గదిలోకి ఎక్కి వెళ్లిరి. అక్కడ పేతురు, యా
కోబు, యోహాను, అంద్రెయ, ఫిలిప్పు, థోమా, బర్థో
లొమై, మత్థయి, అల్ఫయి కుమారుడైన యాకోబు,
జెలోతే అనే సీమోను యాకోబు సహోదరుడైన
యూదా, నివసించుచుండిరి.। వీరందరు స్త్రీలతోను, 14
యేసు తల్లియైన మరియతోను, ఆయన సహోదరుల
తోను ఏక మనస్సుతో ఎడతెగక ప్రార్థన చేయుచు,
వేడుకొనుచునుండిరి.

ఆ దినములలో కొంచెము ఎక్కువ తక్కువ నూట 15
ఇరువదిమంది శిష్యులు కూడి యున్నప్పుడు, వారి మ
ధ్యను పేతురు నిలువబడి ఇట్లనెను,।—సహోదరులైన 16
మనుష్యులారా! యేసుని పట్టుకొనిన వారికి తోవ చూ
పిన యూదాను గూర్చి పరిశుద్ధాత్మ దావీదు నోట
పూర్వము పలికించిన ఈ లేఖనము నెరవేరవలసి యుం
డెను.। ఎందుకంటే అతడు మనలో ఒకడుగా ఎంచ 17
బడి, ఈ పనిలో పాలు పొందెను.। అయితే అతడు 18
అన్యాయపు ఆదాయము వల్ల ఒక పొలము కొని బో
ర్లపడి, నడిమికి పగిలినందున అతని పేగులన్నియు
జారి వచ్చెను.। ఇది యెరూషలేములో కాపురమున్న 19
వారికందరికి తెలియబడెను గనుక ఆ పొలము వారి
స్వభాషలో రక్త భూమి అనే అర్థమిచ్చేటి అకెల్దమ
అనబడియున్నది.

—అతని పాళెము పాడై పోవుగాక; 20
దానిలో ఎవడును కాపురముండక పోవుగాక;
అతని అధ్యక్షత వేరొకడు పుచ్చుకొనుగాక అని
కీర్తనల గ్రంథములో వ్రాయబడి*యున్నది.। కాబట్టి 21
ప్రభువైన యేసు యోహానుయొక్క బాప్తిస్మము మొద
లుకొని,। తాను మన యొద్దనుంచి యెక్కించబడిన దిన 22
ము వరకు, మనలో వచ్చుచు పోవుచునున్న కాలమంత
యు మనతో కలుసుకొనిన వారిలో ఒకడు మనతో

* కీర్తన. 69: 25; 109: 8.

కూడా ఆయన పునరుత్థానమును గూర్చి సాక్షిగా నిర్ణ
23 యించబడ వలెనని పలికెను.। అప్పుడు వారు యూస్తు
అనే మారు పేరు గల బర్సబా అనబడిన యోసేఫు,
మత్థీయ అనే వీరిద్దరిని నిలవబెట్టి ప్రార్థన చేసిరి.।
24 ఏలాగంటే — అందరి హృదయములను ఎరిగియున్న
25 ప్రభువా!। యూదా తన చోటికి పోవుటకు, తప్పితము
వల్ల విడిచిన ఈ పనిలోను అపొస్తలుల ఉద్యోగము
లోను పాలు పొందుటకు వీరిద్దరిలో నీవు ఎవని ఏర్ప
26 రుచుకొంటివో వాని తెలియపరుచుమనిరి.*। తరువాత
వారి చీట్లువేసిరి. మత్థీయ మీద చీటి వచ్చినందున
అతడు పదకొండు మంది అపొస్తలులతో లెక్కింప
బడెను.

## 2. అధ్యాయము.

1 పెంతేకొస్తనే పండుగ దినము వచ్చినప్పుడు వారం
దరు ఏక మనస్సుతో ఒక చోట కూడి యుండిరి.।
2 అప్పుడు అకస్మాత్తుగా, కొట్టుకొని పోయే బలమైన
గాలి వలె ఆకాశమునుంచి ఒక శబ్దము కలిగెను; అది
వారు కూర్చుండి యున్న ఇల్లంతయు నిండించెను.।
3 మరియు అగ్ని నాలుకల వలె,। విభాగించబడిన నాలు
కలు వారికి కనబడి వారిలో ప్రతివాని మీద వ్రాలె
4 ను.। అప్పుడు వారందరు పరిశుద్ధాత్మతో నిండుకొని,
ఆ ఆత్మ వారికి ఉచ్చారణశక్తి కలిగించిన ప్రకారము
గా అన్యభాషలతో మాటలాడుటకు మొదలుబెట్టిరి.।
5 ఆకాశము కిందనుండే ప్రతి రాష్ట్రమునుంచి వచ్చిన
భక్తి గల యూదులు యెరూషలేములో కాపురముం
6 డిరి.। ఆ శబ్దము కలిగిన పిమ్మట జనసమూహములు
కూడి వచ్చి, ప్రతి మనుష్యుడు తన తన స్వభాషతో
వారు మాటలాడుట వినినందున కలతపరచబడెను.।
7 అప్పుడు అందరు భ్రమపడి ఆశ్చర్యపడి — ఇదుగో!
మాటలాడుచున్న వీరందరు గలిలైయులు కారా?।
8 మనలో ప్రతివాడు తాను పుట్టిన దేశభాషతో వీరు
9 మాటలాడుట మనము ఏలాగు వింటున్నాము?। పా
ర్థీయులు, మేదీయులు, ఎలమీయులు, మెసొపొ
తమియ, యూదైయ, కపదొకియ, పొంతు, ఆసియ,
10 ఫ్రుగియ, పంఫులియ,। ఐగుప్తు, అనే దేశముల యందలి
వారు, కురేనే చుట్టూ ఉన్న లిబ్యేయొక్క భాగముల
యందు కాపురమున్న వారును, (యెరూషలేములో)
11 నివాసులైన రోమీయులు,। యూదులు, (యూదుల)
మతప్రవిష్టులు, క్రేతీయులు, అరబీయులు మొదలైన
మనమందరమును వీరు మన మన భాషలతో దేవుని
గొప్ప కార్యములను చెప్పుట వింటున్నామని ఒకని
తో ఒకడు చెప్పుకొనిరి.
అందరు భ్రమపడి సందేహించి—ఇదేమి అని ఒక 12
నితో ఒకడు చెప్పుకొనిరి.। కొందరు—వీరు క్రొత్త మద్య 13
ముతో నిండి యున్నారని అపహాస్యము చేసిరి.
అయితే పేతురు ఆ పదకొండుమందితో కూడా 14
లేచి నిలిచి, తన కంఠమెత్తి వారితో ఇట్లనెను:—యూ
దైయ మనుష్యులారా! యెరూషలేములో నివసించే
సమస్త జనులారా! ఇది మీకు తెలియబడుగాక; నా
మాటలకు చెవినొగ్గి వినండి.। మీరు ఊహించిన 15
ప్రకారము వీరు మత్తుగా ఉండలేదు; ప్రొద్దు పొడిచి
జాము కాలేదు;। అయితే యోవేలనే ప్రవక్తవల్ల చెప్ప 16
బడినది ఇదే.
—అంత్య దినములయందు, మనుష్యులందరి మీద, 17
నేను నా ఆత్మను కుమ్మరింతును; మీ కుమారులు, మీ
కుమార్తెలు ప్రవచనములు చెప్పుదురు; మీ పడుచు
వారికి దర్శనములు కలుగును; మీ వృద్ధులు కలలు కం
దురు.। ఆ దినములలో నా సేవకుల మీదను నా సేవకు 18
రాండ్ర మీదను నా ఆత్మను కుమ్మరింతును గనుక, వారు
ప్రవచనములు చెప్పుదురు.
పైనున్న ఆకాశమందు ఉత్పాతములను, కిందనున్న 19
భూమి యందు గురుతులను, రక్తమును, అగ్నియు,
పొగ యావిరిని కలుగ చేతును.
ఘనత ప్రకాశత గల ప్రభు దినము రాక మునుపు, 20
సూర్యుడు చీకటిగాను, చంద్రుడు రక్తముగాను
మార్చబడుదురు.। అప్పుడు ప్రభువు పేరున పిలిచే† 21
వాడెవడో వాడు రక్షించబడునని‡ దేవుడు పలుకుచు
న్నాడనెను.
ఇశ్రాయేలు వంశస్థులారా! ఈ మాటలు వినుడి— 22
నజోరీయుడైన యేసుని, మీరు ఎరిగి యున్న ప్రకా
రము దేవుడు ఆయనచేత మీ మధ్యను చేయించిన బల
మైన కార్యముల వల్లను, అద్భుతముల వల్లను, ఆనవాళ్ల
వల్లను మీకు దేవుని చేత అగుపరచబడిన మనుష్యుని,।
దేవుని నిర్ణయమైన సంకల్పము వల్లను, పూర్వ జ్ఞా 23
నము వల్లను అప్పగించబడిన ఈయనను మీరు పట్టు
కొని నీతిహీనులచేత శిలువవేయించి చంపించితిరి.।
అయితే మరణముచేత ఆయన బంధించబడుట అసా 24
ధ్యము గనుక దేవుడు దాని కట్లు విప్పి ఆయనను లేపి
యున్నాడు. దావీదు ఆయనను గూర్చి;
—నేను ఎల్లప్పుడు నా యెదుట ప్రభువును చూ 25
చుచుంటిని; నేను కదలించబడకుండుటకు, ఆయన నా
కుడిపక్కనున్నాడు.

* లేక, నియమించుమనిరి. † లేక, పేర ప్రార్థించే. ‡ యోవేలు. 2: 28—32.

26 కావున నా హృదయము సంతోషించెను; నా నా
లుక ఆనందపడెను; నా శరీరము కూడా నిరీక్షణతో
నివసించును;
27 నీవు నా ఆత్మను అదృశ్య లోకములో విడిచిపె
ట్టవు; కుళ్లును నీ పరిశుద్ధుని చూడనియ్యవు.
28 నాకు జీవ మార్గములు తెలిపి యున్నావు; నీ
సమ్ముఖమందు ఆనందముతో నన్ను నింపుదువని* పలి
కెను.
29 సహోదరులారా! గోత్ర కర్తయైన దావీదుని
గూర్చి మీతో ధారాళముగా మాటలాడ వచ్చును;
ఏమనగా—అతడు చనిపోయి పాతిపెట్టబడెను; ఆ
30 యన సమాధి నేటివరకు మనలో ఉన్నది. । అయితే
ఆయన ప్రవక్తయై యుండెను గనుక, దేవుడు—నీ సిం
హాసనము మీద కూర్చుండుటకు, శరీర ప్రకారముగా
నీ గర్భ ఫలమునుంచి క్రీస్తుని పుట్టింతునని ప్రమాణ
31 పూర్వకముగా, ఒట్టు బెట్టుకొనెనని యెరిగి, । క్రీస్తు
యొక్క పునరుత్థానమును గూర్చి, ఆయన ఆత్మ అదృ
శ్యలోకములో విడువబడ లేదనియు, ఆయన శరీరము
32 కుళ్లు చూడ లేదనియు ముందు ఎరిగి చెప్పెను. । ఈ
యేసుని దేవుడు లేపి యున్నాడు; దీనికి మేమందరము
33 సాక్షులమై యున్నాము. । కాగా ఆయన దేవుని కుడి
చేత† ఎక్కించబడి, తండ్రివల్ల పరిశుద్ధాత్మను గూర్చిన
వాగ్దత్తము నెరవేర్చబడి, మీరు ఇప్పుడు చూచుచు
34 వింటూ ఉన్న దీని కుమ్మరించి యున్నాడు. । దావీదు
ఆకాశమునకు ఎక్కి పోలేదు; అయితే అతడు,
35 —నేను నీ శత్రువులను నీ పాద పీఠముగా చేసే ప
ర్యంతము, నీవు నా కుడి పార్శ్వమందు కూర్చుండు
మని నా ప్రభువుతో ప్రభువు పలికెనని చెప్పుచు
న్నాడు.
36 కాబట్టి మీరు శిలువవేసిన ఈ యేసుని దేవుడు
ప్రభువుగాను, క్రీస్తుగాను నియమించి యున్నాడని
ఇశ్రాయేలు వంశమంతయు నిశ్చయముగా తెలుసు
కొనుగాక అని పలికెను.
37 వారు వీటిని విని, హృదయములో గుచ్చబడి,—
సహోదరులారా! మేము ఏమి చేతుమని పేతురును
కడమ అపొస్తలులను అడిగిరి.
38 అందుకు పేతురు—మీరు మనస్సు తిప్పుకొని, ప్రతి
వాడు పాపక్షమ కొరకు యేసుక్రీస్తు పేరట బాప్తి
స్మము చేయించుకొనుడి; అప్పుడు మీరు పరిశుద్ధాత్మ
39 అనే వరము పొందుదురు; । ఆ వాగ్దత్తము మీకు, మీ
పిల్లలకు, మన దేవుడైన ప్రభువు పిలిచే దూరస్థులందరి
కిని కలిగి యున్నదని వారితో చెప్పి । —మీరు ఈ 40
మూర్ఖ సంతతినుంచి రక్షించబడుడని నానావిధము
లైన వాక్యములవల్ల సాక్ష్యమిచ్చి వారికి బుద్ధి చెప్పెను.
కాబట్టి అతని వాక్యము సంతోషముగా అంగీక 41
రించినవారు బాప్తిస్మము చేయించుకొనిరి. ఆ దినమం
దు కొంచెము ఎక్కువ తక్కువ మూడు వేలమంది
చేర్చుకొనబడిరి. । వీరు అపొస్తలుల బోధయందు, 42
అన్యోన్య సహవాసమందు, రొట్టె విరుచుటయందు,
ప్రార్థనలయందు నిలకడగా ఉండిరి.
అప్పుడు ప్రతి ఆత్మకు భయము కలిగెను. మరియు 43
అనేకమైన అద్భుతములును ఆనవాళ్లును అపొస్తలుల
వల్ల చేయబడెను. । విశ్వసించిన వారందరు ఏకముగా 44
కూడి తమకు కలిగినదంతయు సమష్టిగా ఉంచుకొనిరి. ।
ఇదిగాక వారు తమ చరస్థిరాస్తులు అమ్మి, అందరికిని 45
వారి వారికి అక్కర కలిగిన కొద్దీ, పంచిపెట్టేవారు. ।
మరియు వారు ప్రతిదినము దేవాలయములో ఏక మన 46
స్సుతో ఎడతెగక ఉండి, ఇంటింట‡ రొట్టె విరుచుచు,
దేవుని స్తుతించుచు, జనులందరియెడల§ దయగలవారై
సంతోషముతోను, । నిష్కపట హృదయముతోను తమ 47
ఆహారము పుచ్చుకొనుచుండిరి. మరియు, ప్రతిదినము
ప్రభువు రక్షించబడుచున్న వారిని సంఘముతో కలు
పుచుండెను.

## 3. అధ్యాయము.

ప్రార్థన వేళయైన మూడవ జామున, పేతురు 1
యోహాను కూడి గుడికి వెళ్లుచుండిరి. । అప్పుడు తల్లి 2
గర్భమునుంచి పుట్టినది మొదలుకొని కుంటివాడైన
ఒక మనుష్యుడు తీసుకొని పోబడుచుండెను. వాడు
గుడిలోకి వెళ్లువారిని భిక్షము అడుగుటకు, అనుదినము
శృంగారమనబడిన గుడి ద్వారముయొద్ద అతని ఉంచే
వారు. । అతడు గుడిలో ప్రవేశించబోయే పేతురును 3
యోహానును చూచి భిక్షము అడిగెను.
అప్పుడు పేతురు యోహానుతోకూడా, అతని తేరి 4
చూచి,—మాతట్టు చూడుమనెను. । అతడు వారివల్ల 5
ఏమైనా దొరుకునేమో అని కనిపెట్టుచు, వారి మీద
లక్ష్యముంచెను. । అప్పుడు పేతురు—వెండి బంగార 6
ములు నాయొద్ద లేవు; అయితే నాకు కలిగినది నీకు
ఇచ్చుచున్నాను; నజోరీయుడైన యేసుక్రీస్తు పేరట,
నీవు లేచి నడువుమని చెప్పి, । అతని కుడిచెయ్యి పట్టు 7
కొని అతని లేవనెత్తెను. వెంటనే అతని పాదములు,
చీలమండలు బలపరచబడెను.

* కీర్తన. 16: 8—11. † లేక, కుడిపక్కను. ‡ లేక, ఇంట. § లేక, వల్ల.

8 అప్పుడు అతడు యెగిరిలేచి, నిలిచి, నడిచెను. నడు
చుచు గంతులువేయుచు దేవుని స్తుతించుచు వారితో
9 కూడా గుడిలోకి వెళ్లెను. । అతడు నడుచుచు దేవుని
10 స్తుతించుట జనులందరు చూచిరి.। వారు, శృంగారమనే
గుడి ద్వారముయొద్ద భిక్షము కొరకు కూర్చుండిన వాడు
వీడే అని తెలిసి, అతనికి జరిగినదాని గూర్చి భ్రమతోను
11 ఆశ్చర్యముతోను నిండుకొనిరి. । అయితే స్వస్థత పొం
దిన కుంటివాడు పేతురును యోహానును వదలకున్న
ప్పుడు, జనులందరు భ్రమపడి సొలొమోను మంటప
మనబడిన మంటపములో ఉన్న వారియొద్దికి పరుగెత్తి
కూడి వచ్చిరి.

12 అప్పుడు పేతురు దీని చూచి, జనులతో చెప్పినదే
మనగా—ఇశ్రాయేలీయులారా! మీరు ఎందుకు ఇతని
గూర్చి ఆశ్చర్యపడుచున్నారు? మా స్వశక్తివల్లనైనను
భక్తివల్లనైనను, మేము ఇతని నడిపించినట్టుగా మీరు
13 ఎందుకు మాతట్టు తేరి చూచుచున్నారు?।అబ్రాహాము,
ఈసాకు, యాకోబు అనే వారి దేవుడు, మన పితృల
దేవుడు తన సేవకుడైన యేసుని మహిమపరిచి యు
న్నాడు. ఆయనను మీరు అప్పగించితిరి. మరియు,
పిలాతు ఆయనను విడిపించుటకు నిర్ణయించినప్పుడు,
14 అతని యెదుట ఆయనను నిషేధించితిరి. । అయితే
మీరు పరిశుద్ధత నీతియుగల వాని నిషేధించి, నరహం
తకుడైన మనుష్యుని మీకు అనుగ్రహించబడ వలెనని
15 అడిగితిరి. । అప్పుడు మీరు జీవాధిపతిని చంపితిరి.
ఆయనను దేవుడు చనిపోయిన వారిలోనుంచి లేపి
యున్నాడు. అందుకు మేము సాక్షులమై యున్నాము.।
16 ఆయన నామమందలి విశ్వాసమువల్ల, ఆయన నామము
మీరు చూచుచు యెరిగిన ఇతని బలపరిచెను. అవును,
ఆయన వల్లనైన విశ్వాసమే మీ అందరి యెదుట ఇతనికి
ఈ సర్వాంగపుష్టి ఇచ్చెను.

17 కాబట్టి సహోదరులారా! మీరు మీ అధికా
రులు అజ్ఞానమువల్ల దీని చేసితిరని నాకు తెలుసును.।
18 అయితే—క్రీస్తు శ్రమపడునని దేవుడు తన సమస్త
ప్రవక్తల నోట ముందు తెలిపిన వాటిని ఈలాగు
19 నెరవేర్చెను. । కాబట్టి ప్రభువు సమ్ముఖమునుంచి ఆ
20 విశ్రాంతి కాలములు వచ్చుటకును,। లోగడ మీ కొరకు
నియమించబడిన యేసుక్రీస్తుని ఆయన పంపుటకును,
మీ పాపములు తుడిచివేయబడే నిమిత్తము మనస్సు
21 తిప్పుకొని తిరగండి. । అయితే మొదటినుంచి దేవుడు
తన పరిశుద్ధ ప్రవక్తలందరి నోట పలికించిన అన్నిటికి
కుదురుబాటు కాలములు వచ్చేవరకు, ఆకాశము ఆయ
నను చేర్చుకొన వలెను.। మోషేకూడా మన పితృలతో 22
ఇట్లనెను—నావంటి ఒక ప్రవక్తను మీ దేవుడైన ప్ర
భువు మీ సహోదరులలోనుంచి మీ కొరకు పుట్టిం
చును, ఆయన మీతో చెప్పే వాటినన్నిటిని గూర్చి
మీరు ఆయన మాట విన వలెను. । అయితే ఆ ప్రవక్త 23
మాట వినని వాడెవడో వాడు జనులలోనుంచి నశింప
చేయబడుననెను.।* మరియు, సాముయేలు మొదలుకొని 24
ఎంతమంది ప్రవక్తలు ప్రవచించిరో వారందరు ఈ
దినములనుగూర్చి ముందు తెలియ చేసిరి. । దేవుడు 25
అబ్రాహాముతో—నీ సంతానము వల్ల భూలోకమం
దున్న వంశములన్నియు దీవించబడునని† చెప్పి, మన
పితృలతో చేసిన నిబంధనలకును ప్రవక్తలకును మీరు
పుత్రులై యున్నారు. । దేవుడు తన సేవకుడైన యేసుని 26
లేపి, మీలో ప్రతివానిని వాని వాని అపరాధముల
నుంచి మళ్లించుటవల్ల మిమ్మును ఆశీర్వదించే ఆయనను
మొదట మీ యొద్దికి పంపియున్నాడని పలికెను.

## 4. అధ్యాయము.

వారు జనులతో మాటలాడుచుండగా, యాజకులు, 1
గుడియొక్క అధిపతి, సద్దూకైయులు,। వారు ప్రజలకు 2
బోధించుట వల్లను, యేసు పునరుత్థానము పట్టి, చని
పోయిన వారిలోనుంచి పునరుత్థానము ప్రకటించుట
వల్లను, దుఃఖపడి వారి మీదికి వచ్చి, । వారి మీద చే 3
తులు వేసి పట్టుకొని, మరునాటి వరకు వారిని ఖయి
దులో ఉంచిరి; అప్పుడు సాయంకాలమైనది.

అయితే వారి వాక్యము వినిన వారిలో అనేకులు 4
విశ్వసించిరి. ఆ పురుషుల లెక్క కొంచెము ఎక్కువ
తక్కువ అయిదు వేలమంది ఆయెను.

మరునాడు వారి అధికారులు, పెద్దలు, శాస్త్రులు, 5,6
ప్రధానయాజకుడైన అన్న, కయఫ, యోహాను, అలె
క్సంద్రు, ప్రధానయాజకుని వంశపు వారు యెందరో
అందరును యెరూషలేములో కూడుకొని, । వారిని 7
మధ్యను నిలువబెట్టి—మీరు ఏ బలమువల్ల, ఏ నామ
మువల్లను దీని చేసితిరని అడిగిరి.

అప్పుడు పేతురు పరిశుద్ధాత్మతో నిండుకొని—జనుల 8
యధికారులారా! ఇశ్రాయేలు పెద్దలారా! । ఆ బల 9
హీన మనుష్యునికి చేయబడిన ఉపకారమును గూర్చి,
అతడు దేనివల్ల స్వస్థతపొందెనని మేము నేడు విమ
ర్శించబడితే,। మీరు శిలువ వేసినటువంటియు చనిపో 10
యిన వారిలోనుంచి దేవుడు లేపినటువంటియు నజో
రీయుడైన యేసుక్రీస్తు నామమువల్లనే ఇతడు మీ యె

* ద్వితీయోపదేశకాండము. 18: 15—18, 19. † ఆదికాండము. 12: 3.

దుట స్వస్థుడై నిలుచుచున్నాడని మీకందరికి ఇశ్రా
11 యేలు జనులకును తెలియబడునుగాక. । ఇల్లు కట్టు
వారైన మీ వల్ల తిరస్కరించబడిన రాయి ఈయనే; అది
12 మూలకు తలరాయియై యున్నది ।* వేరొకనిచేత ఏ
మాత్రమైనను రక్షణ లేదు; ఈ నామమువల్ల మనము
రక్షించబడ వలెనుగాని ఆకాశముకింద, మనుష్యులలో
ఇయ్యబడిన వేరొకటి యేదియు లేదని వారితో పలి
కెను.

13 వారు పేతురు యోహాను అనే వారి ధైర్యము చూచి
నప్పుడు, వారు విద్య లేని అజ్ఞానులైన మనుష్యులని
యెరిగి, ఆశ్చర్యపడి, వారు యేసుతోకూడా ఉండి
14 రని పోల్చిరి. । అయితే స్వస్థపరచబడిన మనుష్యుడు
వారితోకూడా నిలిచియుండుట చూచి, విరోధముగా
చెప్పుటకు యేమియు తోచలేదు.

15 అప్పుడు సభ వెలపటికి పొండని వారికి ఆజ్ఞాపించి
16 తమలో ఆలోచన చేసి।—ఈ మనుష్యులకు మనము
ఏమి చేతుము? వారివల్ల సందేహించ కూడని అద్భుత
కార్యము చేయబడెనని యెరూషలేములో కాపురము
న్న వారికందరికి తేటగా తెలుసును; అది కాదని చెప్ప
17 లేము. । అయినప్పటికి, ఇది జనులలో ఇంకా వ్యాపిం
చకుండుటకు,—ఇకమీదట ఏ మనుష్యునితోనైనను ఈ
పేరట మీరు మాటలాడ కూడదని, వారిని గట్టిగా
18 గద్దించ వలెనని చెప్పుకొని, ।వారిని పిలిచి,—మీరు యేసు
పేరట ఎంతమాత్రము మాటలాడ కూడదు, బోధించ
19 కూడదు అని వారికి ఆజ్ఞాపించిరి. । అందుకు పేతురు,
యోహాను వారిని చూచి—దేవుని మాట వినుటకంటే
మీ మాట వినుట దేవుని దృష్టికి న్యాయమేమో మీరే
20 ఎంచుకొనుడి; । మేము చూచిన వాటిని వినిన వాటిని
చెప్పకుండ లేమని వారికి ఉత్తరమిచ్చిరి.

21 వారు జనుల నిమిత్తము, వారిని శిక్షించే విధమేమి
యు కనుగొనక, వారిని ఇంకా గద్దించి, విడిచిపెట్టిరి; ।
22 స్వస్థపరిచిన ఆ అద్భుతము ఎవనికి చేయబడెనో, ఆ
మనుష్యునికి నలబది సంవత్సరముల కంటే ఎక్కువ
వయస్సు కలిగియుండెను గనుక జరిగిన దాని గూర్చి
అందరును దేవుని మహిమపరుచుచుండిరి.

23 వారు విడిపించబడి తమ స్వజనుల యొద్దికి వచ్చి,
ప్రధానయాజకులు పెద్దలు తమతో చెప్పిన వాటినన్ని
టిని తెలిపిరి.

24 వీరు వాటిని విని ఏక మనస్సుతో దేవుని తట్టు
కంఠమెత్తి —ప్రభువా! నీవు ఆకాశము భూమియు,
సముద్రము, వాటిలోనిది యావత్తును కలుగచేసిన
దేవుడవై యున్నావు.
—రాష్ట్రములు ఎందుకు గల్లత్తు చేయుచున్నవి? 25

ప్రజలు ఎందుకు వ్యర్థమైనవి తలంచుకొనిరి? 26
ప్రభువుకు, ఆయన అభిషిక్తునికి విరోధముగా
భూరాజులు లేచిరి,

అధిపతులును ఏకముగా కూడుకొని యుండిరని,†
నీవు నీ సేవకుడైన దావీదు నోట పలికించితివి; ।
జరగ వలెనని నీ హస్తము, నీ సంకల్పము లోగడ నిర్ణ 27
యించినవన్నియు చేసుటకు, నిశ్చయముగా హేరో
దు, పొంతిపిలాతు, రాష్ట్రములతోను ఇశ్రాయేలు
ప్రజలతోను, నీవు । అభిషేకించిన నీ పరిశుద్ధ సేవకు 28
డైన యేసునకు విరోధముగా గుంపుకూడిరి. । ఇప్పుడు, 29
ఓ ప్రభువా! వారి బెదిరింపులు చూచి, । రోగులను 30
స్వస్థపరుచుటకు, నీ పరిశుద్ధ సేవకుని నామము వల్ల
ఆనవాళ్లు, అద్భుతములును కలుగ చేయబడుటకు, నీ
చెయ్యి చాచియుండగా, నీ సేవకులు బహు ధైర్య
ముగా నీ వాక్యము చెప్పుటకు దయచేయుమని పలికిరి.

వారు వేడుకొనిన తరువాత వారు కూడియున్న 31
చోటు కంపించెను; అప్పుడు వారందరు పరిశుద్ధాత్మతో
నిండుకొని, దేవుని వాక్యము ధైర్యముగా పలుకుచుం
డిరి.

విశ్వసించిన వారి సమూహమునకు హృదయము, 32
ఆత్మయు ఏకమై యున్నందున, ఎవడును తనకు కలిగిన
వాటిలో ఒకటియైనను తనదని అనుకొనలేదు; వారికి
కలిగినదంతయు వారికి సమష్టిగా ఉండెను. । ఇదిగాక 33
అపొస్తలులు నిండా బలమువల్ల ప్రభువైన యేసు
యొక్క పునరుత్థానమునకు సాక్ష్యమిచ్చిరి. మరియు
వారందరి మీద అధికమైన కృప కలిగి యుండెను. ।
వారిలో కొదువబడిన వాడొకడును ఉండ లేదు; భూ 34
ములైనా ఇండ్లయినా కలిగిన వారందరు వాటిని అమ్మి,
అమ్మబడిన వాటి క్రయధనము తెచ్చి, అపొస్తలుల
పాదములయొద్ద పెట్టిరి. । కాబట్టి ప్రతివానికి వాని 35
వాని అక్కర కొలది అది పంచబడెను.

ఆలాగే కుప్రలో పుట్టిన లేవీయుడును, అపొస్త 36
లులవల్ల బోధ కుమారుడనే అర్థమిచ్చే బర్నబా
అనబడిన వాడునైన యోశేపు భూమిగల వాడై, దాని
అమ్మి । క్రయధనము తెచ్చి అపొస్తలుల పాదముల 37
యొద్ద పెట్టెను.

* కీర్తన. 118: 22. † కీర్తన. 2: 1, 2.

## 5. అధ్యాయము.

1 అయితే అననీయ అనే పేరు గల ఒక మనుష్యుడు
తన భార్యయైన సప్పీరాతో ఏకీభవించి స్వాస్థ్యము
2 అమ్మి, । తన భార్య యెరుకనే క్రయధనములో కొంత
ఉంచుకొని, కొంత తెచ్చి అపొస్తలుల పాదముల
యొద్ద పెట్టెను.
3 అప్పుడు పేతురు—అననీయా! నీవు పరిశుద్ధాత్మ
తో అబద్ధమాడుటకును, నీ భూక్రయధనములో కొంత
ఉంచుకొనుటకును సైతాను ఎందుకు నీ హృదయము
4 నిండించెను? । అది నీ యొద్ద ఉన్నప్పుడు నీదే గదా?
అమ్మబడిన పిమ్మట అది నీ వశమై యుండలేదా? ఎం
దుకు ఈ సంగతి నీ హృదయములో ఉంచుకొన్నా
వు? నీవు మనుష్యులతోనే కాదు దేవునితో అబద్ధము
చెప్పితివని అతనితో పలికెను.
5 అననీయ ఈ మాటలు విని, పడి, ప్రాణము విడి
చెను. వీటిని వినిన వారందరికిని చాలా భయము
6 కలిగెను. । అప్పుడు పడుచునారు లేచి అతని కట్టి,
మోసుకొని పోయి పాతిపెట్టిరి.
7 మరియు, కొంచెము యెక్కువ తక్కువ మూడు
గంటల వేళయైన పిమ్మట, అతని భార్య జరిగినది ఎరు
8 గక లోపటికి వచ్చెను. । అందువల్ల పేతురు—మీరు ఆ
భూమి ఇంతకే అమ్మితిరా? నాతో చెప్పుమని ఆమె
ను అడిగెను. అందుకు ఆమె—అవును, ఇంతకే అని
చెప్పెను.
9 అందుకు పేతురు—ప్రభువుయొక్క ఆత్మను శోధిం
చుటకు మీరు దేని నిమిత్తము ఏకీభవించితిరి? ఇదుగో!
నీ పెనిమిటిని పాతిపెట్టిన వారి పాదములు వాకిట
ఉన్నవి; వారు నిన్ను మోసుకొని పోదురని ఆమెతో
పలికెను.
10 వెంటనే ఆమె అతని పాదముల యొద్ద పడి ప్రా
ణము విడిచెను. అప్పుడు ఆ పడుచువారు లోపటికి
వచ్చి, చనిపోయిన ఆమెను చూచి, ఆమెను మోసు
11 కొని వెళ్లి, ఆమె పెనిమిటి యొద్ద పాతిపెట్టిరి. । అప్పు
డు సంఘమంతటికిని వీటిని వినిన వారందరికిని నిండా
భయము కలిగెను.
12 అపొస్తలులచేత అనేకమైన ఆనవాళ్లు, అద్భుతము
లును జనులలో చేయబడెను. మరియు వారందరు ఏక
మనస్సుతో సొలొమోను మంటపములో ఉండిరి. ।
13 మిగిలిన వారిలో ఎవడును వారితో కలుసుకొనుటకు
తెగించలేదు; అయితే ప్రజలు వారిని గొప్పచేసిరి. ।
14 అప్పుడు మరి ఎక్కువగా పురుషులలోను స్త్రీలలోను
అనేకులు ప్రభువును విశ్వసించి ప్రభువుతో కలప
15 బడిరి. । అందువల్ల జనులు రోగులను వీధుల పొడుగున
వెలపటికి తెచ్చి, పేతురు వచ్చుచుండగా, వారిలో కొం
దరి మీద అతని నీడయైనను పడుటకు, మంచముల మీ
దను, పరుపుల మీదను వారిని ఉంచిరి. । మరియు, చు 16
ట్టునుండే పట్టణముల జనసమూహము రోగులను, అప
విత్రమైన ఆత్మవల్ల పీడించబడిన వారిని తీసుకొని యె
రూషలేముకు కూడుకొని వచ్చెను. వారందరు స్వస్థ
పరచబడిరి.

అప్పుడు ప్రధానయాజకుడు, అతనితో కూడా 17
ఉన్న వారందరు, అనగా సద్దూకైయుల మతస్థులు లేచి
కోపాగ్నితో నిండుకొని, । అపొస్తలుల మీద చేతులు 18
వేసి, సర్వసాధారణమైన చెరసాలలో వారిని ఉంచిరి.
అయితే ప్రభువుయొక్క దూత రాత్రివేళ ఆ చె 19
రసాల తలుపులు తీసి, వారిని వెలపటికి తీసుకొని వచ్చి
—మీరు వెళ్లి గుడిలో నిలువబడి, । ఈ జీవ వాక్యము 20
లన్నియు ప్రజలతో చెప్పుడని వారితో పలికెను. ।
వారు ఆ మాట విని తెల్లవారగానే గుడిలోకి వెళ్లి, బో 21
ధించుచుండిరి.

అయితే ప్రధానయాజకుడు, అతనితో కూడా ఉన్న
వారును వచ్చి సభను, ఇశ్రాయేలు పుత్రుల పెద్దలనం
దరిని గుంపుకూర్చి, వారిని తీసుకొని వచ్చుటకు చెర
సాలకు బంట్రౌతులను పంపిరి. । బంట్రౌతులు అక్క 22
డికి వెళ్లినప్పుడు, వారు వారికి చెరసాలలో కనబడలేదు
గనుక తిరిగివచ్చి । —చెరసాల బహు భద్రముగా మూ 23
యబడుటయు, కావలివారు (తలుపు) ముందర నిలువబ
డుటయు చూచితిమి; అయితే తలుపు తీసినప్పుడు
లోపట మాకు ఒకడైనను కనబడలేదని వారికి తెలిపిరి.
అంతట యాజకుడు, గుడి అధిపతియు, ప్రధాన 24
యాజకులు ఆ మాటలు విని—ఇది ఏమవునని వారిని
గూర్చి సందేహపడిరి. । అప్పుడు ఒకడు వచ్చి—ఇదుగో! 25
మీరు ఖయిదులో వేసిన మనుష్యులు గుడిలో నిలిచి
జనులకు బోధించుచున్నారని వారికి తెలిపెను.

అప్పుడు ఆ అధిపతి బంట్రౌతులతో కూడా 26
వెళ్లి, బలాత్కారము చేయక వారిని తీసుకొని వచ్చెను;
తమ్మును ప్రజలు రాళ్లతో కొట్టుదురేమో అని భయప
డుచుండిరి. । వారు వారిని తీసుకొనివచ్చి సభలో నిలు 27
వబెట్టిరి. అప్పుడు ప్రధానయాజకుడు వారిని చూచి, ।
—మీరు ఈ పేరట బోధించ కూడదని మేము మీకు 28
గట్టిగా ఆజ్ఞాపించలేదా? అయితే ఇదుగో! మీరు యె
రూషలేమును మీ బోధతో నింపి ఈ మనుష్యుని
రక్తము మా మీదికి తెచ్చుటకు తలంచుకొనుచున్నా
రని పలికెను. । అందుకు పేతురు (కొదువ) అపొస్త 29
లులును—మనుష్యులకు కాదు దేవునికి విధేయులమై
యుండ వలెను. । మీరు మానున అంటవేసి సంహరిం 30

31 చిన యేసుని మన పితృల దేవుడు లేపి, । ఆయనను
ఇశ్రాయేలుకు మారు మనస్సు పాపక్షమయు దయ
చేయుటకు అధిపతిగాను రక్షకుడుగాను తన కుడి
32 చేత* హెచ్చించి యున్నాడు. । మేము, దేవుడు తనకు
విధేయులైన వారికి ఇచ్చిన పరిశుద్ధాత్మయు ఈ సంగ
తులను గూర్చి ఆయనకు సాక్షులమై యున్నామని
33 ప్రత్యుత్తరము చెప్పిరి. । వారు దీని విని అత్యాగ్ర
హము తెచ్చుకొని, వారిని చంపివేయుటకు ఆలోచిం
చుచుండిరి.

34 అప్పుడు సమస్త ప్రజలవల్ల ఘనత పొందిన వాడు
ను బోధకుడునైన గమలియేలనే పేరుగల ఒక పరిసై
యుడు సభలో లేచి, అపొస్తలులను కొంత సేపు వెల
35 పట ఉంచుమని ఆజ్ఞాపించి । —ఇశ్రాయేలు వారలా
రా! ఈ మనుష్యులకు మీరు చేయబోయే దాని గూర్చి
36 జాగ్రత్తపడుడి; । ఈ దినములకు మునుపు, థైదా లేచి
తాను గొప్పవాడనని చెప్పుకొనెను. కొంచెము ఎక్కువ
తక్కువ నన్నూరుమంది మనుష్యులు అతనితో కలుసు
కొనిరి. అతడు చంపబడెను; మరియు అతనికి లోబ
37 డిన వారందరు చెదిరి వ్యర్థులైరి. । అతని తరువాత,
ప్రజాసంఖ్య వ్రాయబడిన దినములలో, గలిలీయుడైన
యూదా లేచి, బహు జనమును తన వెంట రావించు
కొనెను. అతడు కూడా నశించెను; అతనికి లోబడిన
38 వారందరు చెదిరిపోయిరి. । కాబట్టి నేను మీతో చెప్పే
దేమనగా ఈ మనుష్యుల జోలికి పోక, వీరిని వదలివే
యుడి; ఈ ఆలోచనయైనను కార్యమైనను మనుష్యుల
39 వల్ల కలిగితే, అది వ్యర్థమే అవును. । అయితే దేవుని
వల్ల కలిగితే, మీరు దాని వ్యర్థము చేయలేరు; మీరు
ఒక వేళ దేవుని తోనే పోరాడువారవుదురేమో అని
వారితో పలికెను.

40 వారు అతని బుద్ధికి లోబడి, అపొస్తలులను పిలి
పించి, కొట్టించి, యేసు పేరట మాటలాడ కూడదని
41 ఆజ్ఞాపించి వారిని వదిలివేసిరి, । వారు ఆయన నామము
కొరకు అవమానము పొందుటకు పాత్రులని ఎంచబ
డుటవల్ల సంతోషించుచు, సభ యెదుటనుంచి వెళ్లి, ।
42 ప్రతిదినము గుడిలోను, ఇంటింటను మానక బోధిం
చుచు, యేసే క్రీస్తని సువార్త ప్రకటించుచుండిరి.

## 6. అధ్యాయము.

1 ఆ దినములలో శిష్యులు విస్తరించినప్పుడు, ప్రతి
దినము ధనము పంచిపెట్టుచుండగా, తమ విధవలు
అశ్రద్ధ చేయబడిరని, హెబ్రీయుల మీద హెల్లెనిస్టు
లలో† సణగు పుట్టెను.

అప్పుడు పన్నెండుమంది తమ యొద్దికి శిష్యుల 2
సమూహమును పిలిచి—మేము దేవుని వాక్యము విడిచి,
బల్లలయొద్ద కొలువు చేయుట యుక్తము కాదు. । కా 3
బట్టి సహోదరులారా! పరిశుద్ధాత్మతోను జ్ఞానము
తోను నిండుకొని, మంచి పేరు పొందిన ఏడుగురు
మనుష్యులను మీలో ఏర్పరచుకొనుడి. । వారిని మేము 4
ఈ పనిమీద నియమింతుము అయితే మేము ప్రా
ర్థన యందు, వాక్య సేవయందును నిలకడగా ఉం
డుదుమని పలికెరి.

ఈ మాట సమస్తమైన సమూహమునకు ఇష్టమైనది 5
గనుక వారు విశ్వాసముతోను పరిశుద్ధాత్మతోను నిం
డుకొనిన వాడైన స్తెఫనును, ఫిలిప్పును, ప్రొఖోరును,
నికానొరును, తీమోనును, పమేనాసుని, యూదుల
మతమందు చేరిన అంతియొకువాడైన నీకొలాయును
ఏర్పరిచి, । వారిని అపొస్తలుల యెదుట నిలువబె 6
ట్టిరి. వీరు ప్రార్థన చేసి, వారి మీద చేతులు ఉం
చిరి.

అప్పుడు దేవుని వాక్యము ప్రబలమై, శిష్యుల 7
లెక్క యెరూషలేములో బహుగా విస్తరించెను. మరి
యు యాజకులలో అనేకులు విశ్వసించి విధేయులైరి.

స్తెఫను విశ్వాసముతోను బలముతోను నిండుకొని, 8
ప్రజల మధ్యను అద్భుతములను గొప్ప ఆనవాళ్లను
చేసెను. । అప్పుడు లిబెర్తీనులది‡ అనబడిన సునగో 9
గులోను, కురేనీయుల దానిలోను, అలెక్సంద్రీయుల
దానిలోను కిలికియనుంచి, ఆశియనుంచి వచ్చిన వారి
లోను కొందరు లేచి స్తెఫనుతో వాదించిరి. । అయితే 10
అతడు మాటలాడుచు అగుపరిచిన జ్ఞానమును ఆత్మను
వారు యెదిరించ లేకపోయిరి.

అప్పుడు వారు—వీడు మోషే మీదను దేవుని మీ 11
దను దూషణ వాక్యములు పలుకుట మేము వినియు
న్నామని చెప్పుటకు మనుష్యులను కుదుర్చుకొనిరి. ।
తరువాత వారు జనులను పెద్దలను శాస్త్రులను రేపి, 12
అతని మీదికి వచ్చి, । అతని పట్టుకొని సభ యొద్దకి 13
తీసుకొని వెళ్లి అబద్ధపు సాక్షులను నిలువబెట్టిరి. వారు
—ఈ మనుష్యుడు ఈ పరిశుద్ధ స్థలమునకు మన బోధ
ప్రమాణమునకు విరోధముగా దూషణ వాక్యములు
మానక పలుకుచున్నాడు. । ఈ నజోరీయుడైన యేసు 14

*లేక, కుడిపార్శ్వమందు. †అన్యదేశములలో పుట్టి గ్రేక భాషతో పలికిన యూదులు.
‡రోమాలో దాసులుగా చెరపట్టబడిన యూదులైనా వారి సంతతివారైనా విడిపించబడి
తిరిగి యెరూషలేముకు వచ్చినప్పుడు లిబెర్తీనులనబడిరి.

ఈ చోటును పాడు చేసి, మోషే మనకు ఇచ్చిన ఆ
చారములను మార్చునని వీడు చెప్పుట మేము వింటి
మని పలికిరి.

15 అప్పుడు సభలో కూర్చున్న వారందరు అతని
తట్టు తేరిచూడగా, అతని ముఖము దూత ముఖము
వలె వారికి కనబడెను.

## 7. అధ్యాయము.

1 అప్పుడు ప్రధానయాజకుడు—ఇవి ఈలాగు ఉన్న
2 వా? అని అడిగెను. । అందుకు అతడు చెప్పినదేమన
గా—సహోదరులారా! తండ్రులారా! మీరు వినుడి;
మన తండ్రియైన అబ్రాహాము హారానులో కాపు
రముండక మునుపు, మెసొపొతమియలో ఉన్న
ప్పుడు, మహిమ గల దేవుడు అతనికి ప్రత్యక్షమై।—
3 నీవు నీ దేశము, నీ స్వజనమును విడిచి, బైలుదేరి,
నేను నీకు చూపించే దేశమునకు రమ్మని* అతనితో
4 చెప్పెను. । అప్పుడు అతడు ఖల్దీయుల దేశమునుంచి
బైలువెళ్లి, హారానులో కాపురముండెను. అతని తండ్రి
చనిపోయిన తరువాత, అక్కడనుంచి, మీరు ఇప్పుడు
నివసించుచున్న ఈ దేశమందు అతని నివసింప చేసెను.।
5 అయితే ఇందులో అతనికి ఒక అడుగెడు స్వాస్థ్య
మైనను ఇయ్యక, అతనికి సంతానము లేనప్పుడు, అతనికి,
అతని తరువాత అతని సంతానమునకును అది స్వాస్థ్య
6 ముగా ఇత్తునని అతనికి వాగ్దత్తము చేసెను. । అయితే
దేవుడు ఇట్లనెను—అతని సంతానము అన్య దేశమందు
కాపురముండుననియు, నన్నూరు సంవత్సరములమట్టు
కు దాస్యమునకు దాని తెచ్చుకొని కష్టపరుతురనియు;।
7 మరియు, ఏ దేశస్థులకు వారు దాసులై యుందురో
వారికి నేను తీర్పు చేతుననియు, ఆ తరువాత వారు
బైలు వెళ్లి† ఈ చోట నన్ను ఆరాధింతురనియు, దేవుడు
8 చెప్పెను. । ఆయన ఛేదనసంస్కార నిబంధన అతనికి
దయచేసెను. ఆ చొప్పున అతడు ఇసాకును కని,
ఎనిమిదవ దినమందు అతనికి ఛేదనసంస్కారము
చేసెను. ఇసాకు యాకోబును కనెను. యాకోబు
పన్నెండుమంది గోత్రకర్తలను కనెను.

9 ఆ గోత్రకర్తలు మత్సరపడి, యోశేఫును ఐగు
పులోకి పోవుటకు అమ్మివేసిరి; అయితే దేవుడు అత
నికి తోడైయుండి, అతని శ్రమలన్నిటిలోనుంచి అ
10 తని తప్పించి, । ఐగుప్తు రాజైన ఫరో యెదుట దయను,
జ్ఞానమును అతనికి కలుగచేసుటవల్ల, ఫరో ఐగుప్తుకు,
తన ఇంటికంతటికిని అతని అధిపతిగా నియమించెను.

తరువాత ఐగుప్తు దేశమంతటికి కనాను దేశమంత 11
టికిని కరువు, బహు శ్రమయు వచ్చెను. అప్పుడు మన
పితృలకు ఆహారము లేకపోయెను. । అయితే ఐగుప్తులో 12
ధాన్యము కలవని యాకోబు విని, మన పితృలను అక్క
డికి మొదట పంపెను. । రెండవ మారు, యోశేఫు 13
తన అన్నదమ్ములకు తన్ను తెలియపరిచెను. అప్పుడు
యోశేఫుయొక్క స్వజనము ఫరోకు తెలియ చేయ
బడెను. । అప్పుడు యోశేఫు తన తండ్రియైన యా 14
కోబును, డెబ్బది అయిదుగురైన తన స్వజనులనంద
రిని పిలువనంపెను గనుక యాకోబు ఐగుప్తుకు వెళ్లె
ను.। అక్కడ అతడు, మన పితృలును చనిపోయి, అక్క 15
డనుంచి సుఖేముకు తేబడి, । సుఖేము తండ్రియైన 16
ఎమ్మోరు కుమారుల యొద్ద అబ్రాహాము, తగిన వెలకు
కొనిన సమాధిలో ఉంచబడిరి.

అయితే దేవుడు ప్రమాణముచేసి అబ్రాహాముతో 17
చెప్పిన వాగ్దత్త కాలము సమీపించిన కొలది, జనము
ఐగుప్తులో వృద్ధిపొంది విస్తరించెను. తుదకు యోశే
ఫును యెరుగని వేరొక రాజు పుట్టెను. । ఇతడు మన 18
వంశము యెడల కపటముగా ప్రవర్తించి, । తమ శిశు 19
వులు జీవించకుండుటకు, వారిని పారవేయ వలెనని మన
పితృలను బాధపెట్టెను. । ఆ కాలమందు మోషే పుట్టె 20
ను. అతడు దివ్యసుందరుడై, తన తండ్రి ఇంట్లో
మూడు నెలలు పెంచబడెను. । తరువాత అతడు బైట 21
వేయబడినప్పుడు, ఫరో కుమార్తె అతని ఎత్తుకొని,
తనకు కుమారునిగా పెంచుకొనెను.

అప్పుడు ఐగుప్తీయుల సకల విద్యలు మోషేకు 22
నేర్పబడి, మాటలయందు కార్యములయందును గట్టి
వాడై యుండెను. । అతనికి నలుబది యేండ్లు నిండిన 23
ప్పుడు, ఇశ్రాయేలు పుత్రులైన తన సహోదరులను
చూచుటకు మనస్సు పుట్టెను. । అప్పుడు అతడు అన్యా 24
యము పొందుచున్న ఒకని చూచి అతని కాపాడి,
ఐగుప్తీయుని చంపి కష్టపడిన వాని కొరకు ప్రతి దం
డన చేసెను.। ఇదిగాక అతడు తన చేతివల్ల తన సహో 25
దరులకు దేవుడు రక్షణ దయచేసునని వారు గ్రహిం
తురని తలంచెను; అయితే వారు గ్రహించలేదు. ।
మరునాడు పోట్లాడుచున్న వారికి అగుపడి — మను 26
ష్యులారా! మీరు సహోదరులు, మీరు ఎందుకు ఒక
నికి ఒకడు అన్యాయము చేయుచున్నారని వారు
సమాధానపడుటకు ప్రేరేపించెను. । అయితే తన పొ 27
రుగువాని యెడల అన్యాయము చేసినవాడు అతని
తోసివేసి—మా మీద న్యాయాధిపతిగాను అధికారి

* ఆదికాండము. 12: 1. † ఆదికాండము. 15: 13, 14.

28 గాను నిన్ను నియమించిన వాడెవడు. । నీవు నిన్న ఐగు
ప్తీయుని చంపిన రీతిగా నన్ను చంప కోరుదువా?*
29 అని అడిగెను. । మోషే ఆ మాట విని పారిపోయి
మిద్యాను దేశములో పరవాసియై యుండి, అక్కడ
ఇద్దరు కుమారులను కనెను.
30 నలుబది సంవత్సరములైన పిమ్మట, సీనాయి పర్వ
తారణ్యమందు ప్రభువు దూత ఒక పొదలోని అగ్ని
31 జ్వాలలో అతనికి అగపడెను. । మోషే దాని చూచి
ఆ దర్శనమునకు ఆశ్చర్యపడి దాని నిదానించుటకు
32 దగ్గిరికి రాగా।—నేను నీ పితృల దేవుడను, అబ్రా
హాము దేవుడను, ఈసాకు దేవుడను, యాకోబు దేవు
డను అని ప్రభువుయొక్క శబ్దము కలిగెను గనుక,
33 మోషే వణికి నిదానించుటకు తెగించలేదు. । అయితే
ప్రభువు—నీ చెప్పులు తీసివేయుము; నీవు నిలిచియున్న
34 చోటు పరిశుద్ధ భూమియై యున్నది; । ఐగుప్తులో
ఉన్న నా జనుల బాధను నేను చూడనే చూచితిని;
వారి మూలుగు విని వారిని విడిపించుటకు దిగి వచ్చి
యున్నాను; కాబట్టి నేను ఇప్పుడు నిన్ను ఐగుప్తుకు
పంపుదునని† అతనితో పలికెను.
35 —అధికారిగాను, న్యాయాధిపతిగాను నిన్ను నియ
మించిన వాడెవడు అని వారు విసర్జించిన ఈ మో
షేను అతనికి పొదలో కనబడిన దూత చేతివల్ల, దేవు
డు అధికారిగాను, విమోచనకర్తగాను పంపెను. ।
36 ఇతడు ఐగుప్తులోను యెర్ర సముద్రములోను, నలుబది
ఏండ్లు అరణ్యములోను అద్భుతములను ఆనవాళ్లను
చేసి, వారిని అక్కడనుంచి తీసుకొని వచ్చెను.
37 —నావంటి ఒక ప్రవక్తను మీ దేవుడైన ప్రభువు,
మీ సహోదరులలో మీకు పుట్టించును; మీరు ఆ
యన మాట ఆలకించ వలెనని ఇశ్రాయేలు పుత్రులతో
38 చెప్పిన మోషే ఇతడే. । సీనాయి పర్వతము మీద
తనతో మాటలాడిన దూతతోను, మన పితృలతోను
అరణ్యములోని సంఘమందు ఉండి, మనకు ఇచ్చుటకు
జీవముగల వాక్యములు పుచ్చుకొనిన వాడు ఇతడే. ।
39 ఇతనికి లోబడుటకు మన పితృలు మనస్సు లేనివారై
ఇతని విసర్జించి తమ హృదయములలో ఐగుప్తుకు
40 తిరిగి వెళ్లి।— మాకు ముందర నడిచే దేవతలను మాకు
చేయుము; ఐగుప్తు దేశములోనుంచి మనలను తీసు
కొని వచ్చిన ఈ మోషేకు ఏమి కలిగెనో అది మాకు
41 తెలియదని అహరోనుతో చెప్పి, । ఆ దినములలో
తమకు ఒక దూడను చేయించుకొని, ఆ విగ్రహము
నకు బలి సమర్పించి తమ చేతుల పనులయందు సం
తోషించిరి. । అప్పుడు దేవుడు తిరిగి, ఆకాశసైన్యము 42
ఆరాధించుటకు వారిని అప్పగించెను. ఇందుకు ప్రవ
క్తల గ్రంథమందు వ్రాయబడినదేమనగా, — ఇశ్రా
యేలు ఇంటివారలారా! మీరు అరణ్యములో నలు
బది ఏండ్లు బలులను కానుకలను నాకు అర్పించితి
రా? । మీరు నమస్కరించుటకు కలుగచేసుకొనిన 43
రూపములైన మొలొఖు‡ గుడారమును మీ దేవుడైన
రెంఫా అనే చుక్కను ఎత్తుకొని వెళ్లితిరి గనుక బబు
లోను ఆవలికి మిమ్మును కొంచుబోదును.§
అతడు చూచిన మాదిరి చొప్పున దాని చేయ వలె 44
నని మోషేతో పలికిన వాడు ఆజ్ఞాపించిన ప్రకార
ము‖ సాక్ష్యపు గుడారము అరణ్యములో మన పితృల
యొద్ద ఉండెను. । మన పితృలు దాని పుచ్చుకొని, 45
దేవుడు మన పితృల సమ్ముఖమునుంచి వెళ్లగొట్టిన రా
ష్ట్రములను స్వాధీనపరిచినప్పుడు దాని యెహోషు
వతో ఈ దేశములోకి తీసుకొని వచ్చిరి. అది దావీదు
దినముల మట్టుకు ఉండెను. । అతడు దేవుని యెదుట 46
దయ పొంది, యాకోబు దేవునికి నివాసస్థలము కను
గొన కోరెను. । అయితే సొలొమోను ఆయన కొరకు 47
ఇల్లు కట్టించెను. । అయినప్పటికి—ఆకాశము నా సిం 48
హాసనము; । భూమి నా పాదపీఠము; మీరు నా కొ 49
రకు ఏలాటి ఇల్లు కట్టుదురు? నా విశ్రాంతి స్థలము
ఏది? । నా చెయ్యి వీటినన్నిటిని చేసెను గదా,¶ అని 50
ప్రభువు చెప్పుచున్నాడని ప్రవక్త పలికిన ప్రకారము,
సర్వోన్నతుడు హస్తకృతమైన వాటిలో నివసించడు.
వంచని మెడ గల వారలారా! హృదయమందు 51
చెవులయందు ఛేదనసంస్కారము పొందని వారలా
రా! మీ పితృల వలె మీరు ఎల్లప్పుడు పరిశుద్ధాత్మను
ఎదిరించుచున్నారు. । మీ పితృలు ప్రవక్తలలో ఎవని 52
హింసించక ఉండిరి? అవును; ఆ నీతిమంతుని రాకను
ముందు తెలిపిన వారిని చంపిరి. ఆయనను మీరు ఇం
దాక అప్పగించి హత్య చేయించిన వారైతిరి. । మీరు 53
దూతల యేర్పాటువల్ల బోధప్రమాణము పొంది, దాని
గైకొన లేదని పలికెను.
వారు వీటిని విని, అత్యాగ్రహము తెచ్చుకొని 54
అతని మీద పండ్లు కొరికిరి. । అయితే అతడు పరిశు 55
ద్ధాత్మతో నిండుకొని, ఆకాశముతట్టు తేరిచూచి దేవుని
మహిమను, యేసు దేవుని కుడిపక్కను నిలిచి యుండు
టయు చూచి ।— ఇదుగో! ఆకాశము తెరవబడుట 56
యు, మనుష్య కుమారుడు దేవుని కుడి పక్కను
నిలిచి యుండుటయు చూచుచున్నానని చెప్పెను.

* నిర్గమకాండము. 2: 14. † నిర్గమకాండము. 3: 6—10. ‡ లేక, మీ స్వామి.
§ ఆమోసు. 5: 25—27. ‖ నిర్గమకాండము. 25: 40; 26: 30. ¶ యెషయా. 66: 1, 2.

57 అప్పుడు వారు పెద్ద కేకలు వేసి తమ చెవులు
మూసుకొని, ఏక మనస్సుతో అతని మీద పడి, పట్ట
ణపు వెలుపటికి అతని త్రోలివేసి రాళ్లతో కొట్టిరి.।
58 సాక్షులు సౌలనే ఒక పడుచువాని పాదముల యొద్ద
59 తమ బట్టలు పెట్టిరి.। అప్పుడు (యేసుని) గూర్చి
మొరబెట్టుచు—ప్రభువైన యేసూ! నా ఆత్మను చేర్చు
కొనుమని పలుకుచున్న స్తెఫనును రాళ్లతో కొట్టిరి.
60 అప్పుడు అతడు మోకాళ్లూని—ప్రభువా! వారి
మీద ఈ పాపము మోపకుమీ అని కంఠమెత్తి పలి
కెను. దీని చెప్పుచు నిద్రపోయెను.

## 8. అధ్యాయము.

1 అతని చావుకు సౌలు సమ్మతించెను. ఆ కాల
మందు యెరూషలేములోని సంఘమునకు విరోధ
ముగా మిక్కిలి హింస కలిగెను గనుక, అపొస్తలులు
దప్ప, కడమ వారందరు యూదైయ సమరైయ దేశ
ములయందు చెదరిపోయిరి.
2 భక్తి గల మనుష్యులు స్తెఫనును మోసుకొని వెళ్లి
3 (పాతిపెట్టి) అతని కొరకుచాలా దుఃఖించిరి.। అయితే
సౌలు ఇంటింట చొచ్చి, పురుషులను స్త్రీలను ఈడ్చు
కొనిపోయి, ఖయిదులో వేయించి సంఘము పాడు
4 చేయుచుండెను.। కాబట్టి చెదరిపోయిన వారు సువా
ర్తమాన వాక్యము ప్రకటించుచు అంతట సంచరించిరి.।
5 అప్పుడు ఫిలిప్పు సమరైయ పట్టణమునకు వెళ్లి, క్రీస్తుని
6 గూర్చి వారికి ప్రకటించెను.। జనసమూహములు ఫిలి
ప్పు చేసిన ఆనవాళ్లు వినిచూచినందున, అతనివల్ల చెప్ప
7 బడిన వాటిని ఏక మనస్సుతో లక్ష్యపెట్టిరి;। అనేకు
లను పట్టిన అపవిత్రాత్మలు పెద్ద కేకలు వేసి వారిని
వదలిపోయెను. పక్షవాయువు కలిగి కుంటివారైన
8 అనేకులు స్వస్థపరచబడిరి.। అప్పుడు ఆ పట్టణములో
మిక్కిలి సంతోషము కలిగెను.
9 అయితే సీమోననే పేరుగల ఒక మనుష్యుడు లో
గడ ఆ పట్టణములో గారడీలు చేయుచు, తాను
గొప్పవాడనని చెప్పుకొనుచు, సమరైయ ప్రజలను
10 భ్రమపెట్టుచుండెను.। చిన్నవాడు మొదలుకొని పెద్ద
వాని మట్టుకు అందరు — ఇతడు గొప్పదనబడిన
దేవుని శక్తి అని చెప్పుకొనుచు అతని లక్ష్యపెట్టిరి.।
11 అతడు బహు కాలము గారడీలవల్ల వారిని భ్రమపెట్టి
12 నందున, వారు అతని లక్ష్యపెట్టిరి.। అయితే దేవుని
రాజ్యమును గూర్చియు, యేసు క్రీస్తు నామమును
గూర్చియు సువార్తమాన ప్రకటించుచున్న ఫిలిప్పును
వారు నమ్మినప్పుడు, పురుషులు స్త్రీలును బాప్తిస్మము
13 చేయించుకొనిరి.। అప్పుడు సీమోను కూడా విశ్వ
సించి, బాప్తిస్మము చేయించుకొని, ఫిలిప్పును ఎడబా
యకుండి, చేయబడిన అద్భుతములను, గొప్ప ఆనవా
ళ్లను చూచి, ఆశ్చర్యపడెను.
సమరైయ వారు దేవుని వాక్యము అంగీకరించిరని 14
యెరూషలేములోని అపొస్తలులు విని, పేతురును,
యోహానును వారి యొద్దికి పంపిరి.। వీరు వచ్చి, వారు 15
పరిశుద్ధాత్మను పొందే నిమిత్తము వారి కొరకు ప్రా
ర్థించిరి;। అంతకు ముందు వారిలో ఎవని మీదనును 16
అది వాలి యుండ లేదు. ప్రభువైన యేసు పేరట
మాత్రమే వారికి బాప్తిస్మము చేయించ బడెను.।
అయితే వారి మీద చేతులు ఉంచినప్పుడు, వారు 17
పరిశుద్ధాత్మను పొందిరి.
అపొస్తలులు తమ చేతులను ఉంచుటవల్ల పరిశు 18
ద్ధాత్మ ఇయ్యబడెనని సీమోను గ్రహించి,। వారి కొరకు 19
ద్రవ్యము తెచ్చి—నేను ఎవని మీద చేతులు ఉంచు
దునో వాడు పరిశుద్ధాత్మను పొందుటకు ఈ సామ
ర్థ్యము నాకియ్యుండని పలికెను.
అందుకు పేతురు—నీవు ద్రవ్యమువల్ల దేవుని వరము 20
సంపాదించుకొన తలంచుకొనినందున, నీ వెండి నీతో
కూడా నశించుగాక.। ఈ కార్యమందు నీకు పాలు 21
పంపులు లేవు; నీ హృదయము దేవుని యెదుట సరళ
మైనది కాదు.। కాబట్టి ఈ నీ చెడుతనమునుంచి 22
మనస్సు తిప్పుకొని, నీ హృదయములోని అభిప్రాయ
ము క్షమించబడునేమో దేవుని వేడుకొనుము;। నీవు 23
చేదైన పైత్యములోను దుర్నీతి బంధకములోను ఉం
డుట చూస్తున్నానని చెప్పెను.
అందుకు సీమోను—మీరు చెప్పిన వాటిలో ఏది 24
యు నామీదికి రాకుండా, మీరు నా కొరకు ప్రభు
వును వేడుకొనండని పలికెను.
అంతట వారు ప్రభువుయొక్క వాక్యము చెప్పి, 25
సాక్ష్యమిచ్చి యెరూషలేముకు తిరిగి వెళ్లి, సమరైయుల
యనేక గ్రామములలో సువార్త ప్రకటించిరి.
ప్రభువుయొక్క దూత—నీవు లేచి దక్షిణముగా 26
యెరూషలేమునుంచి గజ్జాకు పోయే అరణ్య మార్గము
నకు వెళ్లుమని ఫిలిప్పుతో చెప్పెను. అతడు లేచి వెళ్లె
ను.। అప్పుడు ఇదుగో! ఐథియొపీయుల రాణియైన 27
కందాకే కింద మంత్రియై, ఆమెయొక్క సమస్తమైన
ధనము మీదనున్న ఐథియొపీయుడైన నపుంసకుడు
ఆరాధించుటకు యెరూషలేముకు వచ్చి,। తిరిగి వెళ్లు 28
చు, తన రథముమీద కూర్చుండి, ప్రవక్తయైన యెష
యా గ్రంథము చదువుచుండెను.
అప్పుడు—నీవు ఆ రథము దగ్గిరికి వెళ్లి దాని కలు 29
సుకొనుమని ఆత్మ ఫిలిప్పుతో చెప్పెను.। ఫిలిప్పు పరు 30

గొత్తిపోయి, అతడు ప్రవక్తయైన యెషయా గ్రంథము
చదువుట విని—నీవు చదివే వాటిని గ్రహించుచున్నా
31 వా? అని అడిగెను.। అందుకు అతడు—నాకు ఎవ
డైనను మార్గము చూపకుంటే ఏలాగు గ్రహించ
గలనని చెప్పి, రథమెక్కి తనయొద్ద కూర్చుండుటకు,
ఫిలిప్పును వేడుకొనెను.
32 అతడు లేఖనమందు చదువుచున్న వచనమేమ
నగా—ఆయన గొర్రె వలె చంపబడుటకు తేబడెను;
బొచ్చు కత్తిరించే వాని యెదుట గొర్రెపిల్ల యేలాగు
నిశ్శబ్దముగా ఉండునో ఆలాగే ఆయన తన నోరు
33 తెరవ లేదు.। ఆయన దీనతలో ఆయన న్యాయపు
తీర్పు తీసివేయబడెను. ఆయన తరము* ఎవరు వివ
రించ గలరు? ఆయన ప్రాణము భూమిమీదనుంచి
తీసివేయబడుచున్నది.†
34 అప్పుడు నపుంసకుడు — ప్రవక్త ఎవని గూర్చి
ఇది చెప్పుచున్నాడు? తన్ను గూర్చినదా? వేరొకని
గూర్చినదా? అది దయచేసి నాకు తెలుపుమని ఫిలి
35 ప్పును అడిగెను.। అందుకు ఫిలిప్పు తన నోరు తెరిచి,
ఆ లేఖనము అనుసరించి, అతనికి యేసుని గూర్చిన
సువార్త ప్రకటించెను.
36 వారు త్రోవలో వెళ్లుచుండగా ఒక నీళ్లున్నచో
టికి వచ్చినప్పుడు, నపుంసకుడు—ఇదుగో! నీరు! నాకు
బాప్తిస్మము చేయబడుటకు ఆతంకమేమని అడిగెను.।
37 (అందుకు ఫిలిప్పు — నీవు పూర్ణ హృదయముతో
నమ్మితే యుక్తమని పలికెను. అతడు — యేసుక్రీస్తు
దేవుని కుమారుడని నమ్ముచున్నానని ఉత్తరమిచ్చెను.।)‡
38 అప్పుడు అతడు రథము నిలుపుమని ఆజ్ఞాపించెను.
అంతట ఫిలిప్పు నపుంసకుడు వీరిద్దరు దిగి నీళ్లయొద్దికి§
వెళ్లిరి; అప్పుడు అతడు ఇతనికి బాప్తిస్మము చేయించెను.
39 వారు నీళ్లనుంచి వెడలి వచ్చినప్పుడు ప్రభువుయొ
క్క ఆత్మ ఫిలిప్పును కొంచుపోయినందున నపుంసకుడు
ఆయనను ఇంక చూడలేదు; అతడు సంతోషించుచు తన
40 త్రోవను వెళ్లెను.। ఫిలిప్పు అజోతులో కనుగొనబడి,
అక్కడనుంచి కైసరైయకు వచ్చే మట్టుకు సమస్తమైన
పట్టణములలో సువార్త ప్రకటించుచుండెను.

## 9. అధ్యాయము.

1 అయితే సౌలు ఇంక ప్రభువుయొక్క శిష్యులకు
విరోధమైన కోపావేశముగలవాడై వారిని బెదరించుచు
2 చంపుచు ప్రధానయాజకుని యొద్దికి వెళ్లి,। ఈ మార్గ
మందలి పురుషులలోనేమి స్త్రీలలోనేమి ఎవరినైనను
చూచితే, వారిని బంధించి యెరూషలేముకు తీసు
కొని వచ్చుటకు, దమస్కులోని సునగోగులయొద్దికి
ఉత్తరములు అతని అడిగెను.
అతడు బైలుదేరి దమస్కుకు సమీపించినప్పుడు, 3
అకస్మాత్తుగా ఆకాశమునుంచి ఒక వెలుగు అతని
చుట్టు ప్రకాశించెను.। అప్పుడు అతడు నేల పడి— 4
సౌలా! సౌలా! నీవు ఎందుకు నన్ను హింస పెట్టుచు
న్నావని అతనితో పలికిన ఒకని శబ్దము వినెను.
అందుకు అతడు—ప్రభువా! నీవు ఎవడవని అడి 5
గెను.
అందుకు ప్రభువు — నేను నీవు హింసించుచున్న 6
యేసునై యున్నాను. (మునికోలలకు విరోధముగా
తన్నుట నీకు ప్రయాసమని చెప్పెను. అప్పుడు అతడు
వణికి భ్రమపడి — ప్రభువా! నేను యేమి చేయుట
నీకు ఇష్టమని అడిగెను. అందుకు ప్రభువు.||) నీవు
లేచి పట్టణములోకి వెళ్లుము. అక్కడ, నీవు ఏమి
చేయవలెనో అది నీకు తెలుపబడునని పలికెను.
అయితే అతనితో ప్రయాణము చేసిన మనుష్యులు 7
ఆ శబ్దము విని, ఎవనిని చూడక, మూగవారై నిలి
చిరి.। సౌలు నేలమీదనుంచి లేచి, తన కన్నులు తెరిచి 8
నప్పుడు ఎవనిని చూడలేక పోయెను గనుక వారు
అతని చెయ్యి పట్టుకొని దమస్కులోకి తీసుకొని
వచ్చిరి.। అతడు మూడు దినములు చూడలేకపోయెను, 9
ఏమియు తిన లేదు, ఏమియు తాగ లేదు.
అయితే దమస్కులో అననీయ అనే పేరు గల ఒక 10
శిష్యుడు ఉండెను. ప్రభువు దర్శనమందు అతని
తో — అననీయా! అని పలికెను.। అందుకు అతడు— 11
ప్రభువా! ఇదుగో! నేను ఉన్నాననెను. అప్పుడు ప్రభు
వు—నీవు లేచి తిన్ననిది అనబడిన వీధికి వెళ్లి, యూదా
అనే వాని ఇంట్లో తార్సీయుడైన సౌలనే పేరు గల
వాని అడుగుము; ఇదుగో! అతడు ప్రార్థించుచున్నా
డు.। మరియు అతడు అననీయ అనే పేరుగల ఒక మను 12
ష్యుడు లోపటికి వచ్చి, తాను దృష్టి పొందుటకు తన
మీద చెయ్యి ఉంచుట దర్శనమందు చూచి యున్నా
డని చెప్పెను.
అందుకు అననీయ —ప్రభువా! ఈ మనుష్యుని 13
గూర్చి యెరూషలేములో నీ పరిశుద్ధులకు ఎన్నో
కీడులు చేసి యున్నాడని అనేకుల వల్ల వింటిని;।
ఇక్కడను నీ పేరున ప్రార్థించే వారందరిని బంధిం 14

*లేక, వంశము. †యెషయ. 53: 7, 8. ‡ఈ వాక్యము మిక్కిలి పాతవైన ఏ ప్రతులలోను ఉండలేదు.
§లేక, నీళ్లలోకి. ||ఈ వాక్యము ఏ పాతప్రతులలోను ఉండలేదు.

చుటకు ప్రధానయాజకులవల్ల అధికారము పొందియు
న్నాడని ఉత్తరమిచ్చెను.
15 అందుకు ప్రభువు — నీవు వెళ్లుము; అన్యజనుల
యెదుటను రాజుల యెదుటను ఇశ్రాయేలు పుత్రుల
యెదుటను నా నామము భరించుటకు ఇతడు నాకు
16 ఏర్పరచబడిన సాధనమై* యున్నాడు; । ఇతడు నా
నామము కొరకు యెన్ని శ్రమలు పొంద వలెనో
నేను అతనికి చూపుదునని అతనితో పలికెను.
17 అప్పుడు అననీయ వెళ్లి ఆ ఇంట్లో ప్రవేశించి అతని
మీద చేతులు ఉంచి — సహోదరుడా! సౌలా! నీవు
తోవలో వచ్చుచుండగా నీకు అగపడిన ప్రభువైన
యేసు, నీవు దృష్టి పొందుటకును పరిశుద్ధాత్మవల్ల నింప
బడుటకును నన్ను పంపియున్నాడని పలికెను. అప్పుడే
ఆతని కన్నులనుంచి పొలుసు వంటివి రాలెను.
18 వెంటనే దృష్టి కలిగి, అతడు లేచి బాప్తిస్మము
చేయించుకొనెను. అప్పుడు ఆహారము పుచ్చుకొని
బలపరచబడెను.
19 తరువాత సౌలు దమస్కులో ఉన్న శిష్యులతో కూ
20 డా కొన్ని దినములు ఉండి,। వెంటనే సునగోగులలో
—ఈయనే దేవుని కుమారుడై యున్నాడని యేసుని
21 ప్రకటించుచుండెను.। వినిన వారందరు ఆశ్చర్యపడి—
యెరూషలేములో ఈ పేరున ప్రార్థించే వారినందరిని
నాశము చేసినవాడు ఇతడు కాడా! వారిని బంధించి
ప్రధానయాజకుల యొద్దికి కొంచుబోవుటకు ఇక్కడికి
కూడా వచ్చియున్నాడు గదా అని చెప్పుకొనిరి.।
22 అయితే సౌలు మరి యెక్కువగా బలపరచబడి—ఈ
యనే క్రీస్తని దృష్టాంతపరుచుచు, దమస్కులో కాపుర
మున్న యూదులను కలవళపరిచెను.†
23 మరియు అనేక దినములు గతించిన పిమ్మట, యూ
24 దులు అతని చంపుటకు ఆలోచించిరి. । అయితే వారి
ఆలోచన సౌలుకు తెలుపబడెను. వారు అతని చంపు
టకు దివారాత్రులు ద్వారముల యొద్ద కాచుకొనుచుం
25 డిరి. । అయితే శిష్యులు రాత్రివేళ అతని తీసుకొని
గంపలో పెట్టి గోడమీదనుంచి అతని కిందికి దింపిరి.
26 అతడు యెరూషలేముకు వచ్చి శిష్యులతో కలు
సుకొనుటకు యత్నముచేసెను. అయితే అందరును
అతడు శిష్యుడని నమ్మక అతనికి భయపడుచుండిరి.।
27 అప్పుడు బర్నబా అతని చేర్చుకొని అపొస్తలుల యొ
ద్దికి తీసుకొనివచ్చి, అతనికి తోవలో ప్రభువు కనబడి
అతనితో పలుకుటను గూర్చియు అతడు, దమస్కులో
యేసు పేరట ధైర్యముగా మాటలాడుటను గూర్చియు
వారికి వివరముగా తెలియచెప్పెను.
అప్పుడు అతడు యెరూషలేములో వారితో కూ 28
డా వచ్చుచు పోవుచు, ప్రభువైన యేసు పేరట ధైర్య
ముగా మాటలాడుచు హెల్లేనిస్తులతో‡ పలుకుచు
తర్కించుచునుండెను. । అయితే వారు అతని చంపుటకు 29
ప్రయత్నము చేసిరి. । సహోదరులు దీని తెలుసుకొని 30
అతని కైసరైయకు తీసుకొని వచ్చి తార్సుకు పంపిరి.
అప్పుడు యూదైయ గలిలైయ సమరైయ దేశము 31
లయందంతట సంఘములు నెమ్మది పొందెను. అవి కట్ట
బడుచు§ ప్రభువుయందు భయభక్తులు కలిగి పరిశుద్ధాత్మ
సహాయమువల్ల నడుచుచు విస్తరించుచుండెను.
ఆతరువాత పేతురు సకల స్థలములలో సంచరించు 32
చు లుద్దలో కాపురమున్న పరిశుద్ధుల యొద్దికి వచ్చెను.।
అక్కడ పక్షవాయువు కలిగి, ఎనిమిది సంవత్సరముల 33
నుంచి పరుపుమీద పండుకొనిన ఐనెయ అనే ఒక మను
ష్యుని చూచెను. । అప్పుడు పేతురు—ఐనెయా! యేసు 34
క్రీస్తు నిన్ను స్వస్థపరుచుచున్నాడు; నీవు లేచి నీ పరుపు
నీవే పరుచుకొనుమని అతనితో పలికెను. । వెంటనే, 35
అతడు లేచెను. అప్పుడు లుద్దలోను, సారోనులో
ను, కాపురమున్న వారందరు అతని చూచి ప్రభువు
తట్టు తిరిగిరి.
మరియు యొప్పేలో, భాషాంతరమై లేడి‖ అని 36
అర్థమిచ్చే తబీథ అనే ఒక శిష్యురాలు ఉండెను.
ఆమె తాను చేసిన మంచి క్రియలతోను ధర్మములు
తోను నిండియుండెను. ఆ దినములయందు ఆమె
రోగముకలదై చనిపోయెను. । అప్పుడు వారు ఆమె 37
ను కడిగి మేడగదిలో పరుండబెట్టిరి. । అయితే లుద్ద 38
యొప్పేకు దగ్గిర ఉండుటవల్ల పేతురు అక్కడ ఉన్నా
డని శిష్యులు విని, అతడు తడవు చేయక, తమ యొ
ద్దికి రావలెనని వేడుకొనుటకు ఇద్దరు మనుష్యులను
అతని యొద్దికి పంపిరి.
పేతురు లేచి వారితో వెళ్లి చేరినప్పుడు, వారు 39
మేడ గదిలోకి అతని తీసుకొని వచ్చిరి. అప్పుడు విధవ
లందరు వచ్చి యేడ్చుచు, దొర్కా తమతో కూడా ఉన్న
ప్పుడు కుట్టిన అంగీలు మొదలైన వస్త్రములు చూపుచు
అతని యెదుట నిలిచిరి.। అయితే పేతురు అందరిని వెల 40
పటికి పంపి, మోకాళ్లూని ప్రార్థించి, ఆమె దేహము
తట్టు తిరిగి—తబీథా! లెమ్మనెను. అప్పుడు ఆమె తన
కన్నులు తెరిచి, పేతురును చూచి, లేచి కూర్చుండె

* లేక, పాత్ర. † లేక, నిరుత్తరుల చేసెను. ‡ అనగా, గ్రేకులభాషతో మాటలాడిన యూదులతో.
§ లేక, అభివృద్ధి పొందుచు. ‖ గ్రేకులో, దొర్కా.

41 ను. । అతడు ఆమెకు చెయ్యి ఇచ్చి ఆమెను లేవనెత్తి
పరిశుద్ధులను విధవలను పిలిచి ఆమెను ప్రాణముతో
వారి యెదుట నిలువబెట్టెను.
42 ఇది యొప్పే యందంతట తెలియబడినప్పుడు అనే
43 కులు ప్రభువుయందు విశ్వాసముంచిరి. । తరువాత
అతడు యొప్పేలో సీమోనను ఒక చర్మకారుని యొద్ద
చాలా దినములు నివసించెను.

## 10. అధ్యాయము.

1 అప్పుడు ఇతలియ దండనబడిన దండులో శతా
ధిపతియైన కొర్నేలియనే పేరుగల ఒక మనుష్యుడు
2 కైసరైయలో ఉండెను. । అతడు తన ఇంటివారందరితో
దేవునియందు భయభక్తులు గలవాడై ప్రజలకు బహు
ధర్మము చేయుచు ఎల్లప్పుడు దేవుని గూర్చి ప్రార్థిం
చేవాడు.
3 కొంచెము యెక్కువ తక్కువ పగటి మూడవ
జామున దేవుని దూత అతనికి దర్శనమందు తేటగా
కనబడి, తనయొద్దికి వచ్చి తనతో—కొర్నేలీ! అని
4 పలుకుట వినెను. । అతడు అతనితట్టు తేరి చూచి భయ
పడి—ప్రభువా! ఇదేమని అడిగెను. అందుకు అతడు
—నీ ప్రార్థనలు, నీ ధర్మములు దేవుని యెదుటికి
5 జ్ఞాపకార్థముగా యెక్కినవి. । ఇప్పుడు నీవు యొప్పేకు
మనుష్యులను పంపి పేతురనే మారుపేరుగల సీమోనును
6 పిలిపించుము. । అతడు సముద్రము యొద్ద సీమోనను
ఒక చర్మకారుని ఇంట దిగియున్నాడని* అతనితో
పలికెను.
7 అతనితో మాటలాడిన దూత వెళ్లిన పిమ్మట, అతడు
తన ఇంటి పనివారిలో ఇద్దరని, తనయొద్ద కనిపెట్టుకొనే
8 వారిలో దేవ భక్తిగల ఒక రాణువవాని పిలిచి, । వారికి
సమస్తమైన వాటిని వివరించి వారిని యొప్పేకు పంపెను.
9 మరునాడు వారు ప్రయాణమైపోయి, పట్టణము
నకు సమీపించినప్పుడు, పేతురు కొంచెము ఎక్కువ
తక్కువ రెండవ జామున ప్రార్థించుటకు మేడ మీది
10 కెక్కియుండెను. । అప్పుడు అతడు మిక్కిలి ఆకలిగొని
11 భోజనము చేయగోరెను. । అయితే వారు సిద్ధము చేయు
చుండగా అతడు పరవశుడై, ఆకాశము తెరవబడుట
యు, నాలుగు చెంగులు కట్టబడిన పెద్ద దుప్పటి వలె
12 ఒక వస్తువు భూమి మీదికి దిగుటయు చూచెను. । అం
దులో భూమియొక్క సకల విధములైన చతుష్పాద
జంతువులు, అడవి మృగములు, పాకే పురుగులు, ఆ
13 కాశపక్షులును ఉండెను. । అప్పుడు—పేతురూ! నీవు
లేచి చంపి తినుమనే శబ్దము అతనికి వినబడెను. ।
అయితే పేతురు—ప్రభువా! ఆలాగు వద్దు; సాధారణ 14
మైనదైనను, అపవిత్రమైనదైనను నేను ఎన్నడును తిన
లేదని చెప్పెను. । అప్పుడు మళ్లీ ఆ శబ్దము—దేవుడు 15
పవిత్రము చేసినవి నీవు సాధారణమైనవి అనకొన
వద్దని రెండవ మారు అతనితో చెప్పెను. । ఈలాగు 16
మూడుమారులు జరిగిన తరువాత, వెంటనే ఆ వస్తువు
తిరిగి ఆకాశమునకు ఎత్తబడెను.
పేతురు తనకు కలిగిన దర్శనము ఏమిటో అని తన 17
లో తాను సందేహపడుచుండగా ఇదుగో! కొర్నేలి
వల్ల పంపబడిన మనుష్యులు, సీమోను ఇల్లు ఏదని
విచారణ చేసి, । తలుపుయొద్ద నిలిచి (ఒకని) పిలిచి— 18
పేతురనే మారుపేరుగల సీమోను ఇక్కడ దిగియు
న్నాడా? అని అడుగుచుండిరి.
అయితే పేతురు ఆ దర్శనమును గూర్చి తలం 19
చుచు యోచించుచున్నప్పుడు ఆత్మ—ఇదుగో! ముగ్గురు
మనుష్యులు నిన్ను వెతుకుచున్నారు; నీవు లేచి కిందికి
దిగి, । సందేహపడక, వారితో కూడా వెళ్లుము; నేను 20
వారిని పంపియున్నానని అతనితో చెప్పెను.
అప్పుడు పేతురు ఆ† మనుష్యులయొద్దికి దిగివెళ్లి— 21
ఇదుగో! మీరు వెతికే వాడు నేనే; మీరు వచ్చిన
కారణమేమని అడిగెను.
అందుకు వారు — నీతిమంతుడును, దేవునియందు 22
భయభక్తులు గలవాడును, యూదులనే జనులందరి వల్ల
మంచి పేరు పొందిన వాడునైన కొర్నేలియనే శతా
ధిపతియైన ఒక మనుష్యుడు నిన్ను తన ఇంటికి పిలు
చుటకును, నీవల్ల మాటలు వినుటకును పరిశుద్ధ దూత
ద్వారా దేవుని వల్ల ఆజ్ఞాపించబడెనని చెప్పిరి.
అప్పుడు అతడు వారిని లోపలికి పిలిచి ఆతిథ్యమి 23
చ్చెను. మరునాడు అతడు లేచి వారితో కూడా బైలు
దేరెను. యొప్పేవారైన కొందరు సహోదరులు వారి
తో కూడా వెళ్లిరి. । మరునాడు వారు కైసరైయలో 24
ప్రవేశించిరి. అప్పుడు కొర్నేలియు తన దేహబంధు
వులను, ముఖ్య స్నేహితులను పిలిపించి, వారి కొరకు
కనిపెట్టుచుండెను.
పేతురు లోపలికి వచ్చుచుండగా, కొర్నేలియు 25
అతని ఎదురుకొని, అతని పాదముల మీదపడి నమ
స్కారము చేసెను.
అయితే పేతురు—నీవు లేచి నిలువుము; నేను కూ 26
డా మనుష్యుడనని చెప్పి అతని లేవనెత్తి ।అతనితో మా 27
టలాడుచు లోపటికి వచ్చి, కూడియున్న అనేకులను

* అతడు నీవు చేయువలసిన దాని నీతో చెప్పును అనే వాక్యము కొన్ని ప్రతులలో ఉన్నది.
† యొ కొర్నేలివల్ల తనయొద్దికి పంపబడిన—అనే వాక్యము కొన్ని ప్రతులలో ఉన్నది.

28 చూచెను.। అప్పుడు అతడు—అన్యజాతివానితో సహ
వాసమైనను చేరడమైనను యూదుడైన మనుష్యునికి
నిషేధమని మీకు తెలుసును. అయితే ఏ మనుష్యుడు
సాధారణమైన వాడనియైనను అపవిత్రుడనియైనను చె
29 ప్పకూడదని దేవుడు నాకు చూపించి యున్నాడు.। కా
బట్టి నేను పిలువనంపబడి, ఏమియు ఎదురాడక వచ్చి
తిని గనుక ఎందునిమిత్తము నన్ను పిలువనంపితిరో
దాని గూర్చి అడుగుచున్నానని వారితో పలికెను.
30 అందుకు కొర్నేలియు—నాలుగు దినముల కిందట,
ఈవేళదాక నేను ఉపవాసముతో ఉంటిని. మూడవ
జామున నేను నా ఇంటిలో ప్రార్థన చేయుచుం
డగా, ఇదుగో! ప్రకాశమైన వస్త్రములు గలవాడొ
31 కడు నా యెదుట నిలిచి।—కొర్నేలియు! నీ ప్రా
ర్థన వినబడెను; నీ ధర్మములు దేవుని సమ్ముఖమందు
జ్ఞాపకములో ఉంచబడెను గనుక నీవు యొప్పేకు
32 పంపి,। పేతురు అనబడిన సీమోనును పిలిపించుము;
అతడు సముద్రముయొద్ద చర్మకారుడైన సీమోను
ఇంట్లో దిగి ఉన్నాడు. అతడు వచ్చి నీతో మాటలా
33 డునని నాతో చెప్పెను.। కాబట్టి వెంటనే నీ యొద్దకి
మనుష్యులను పంపితిని. నీవు రావడము మంచిది గనుక
దేవునివల్ల నీకు ఆజ్ఞాపించబడినవన్నియు వినుటకు మే
మందరము దేవుని యెదుట ఇక్కడ కూడి ఉన్నామని
పలికెను.
34 అప్పుడు పేతురు నోరు తెరిచి ఇట్లనెను:।—
35 దేవుడు పక్షపాతి కాడని నిజముగా గ్రహించియు
న్నాను. ప్రతి రాష్ట్రములోను, ఆయనకు భయపడి నీ
తిగా నడిచేవాడు ఆయన చేత చేచుర్కొనబడును.।
36 అందరికి ప్రభువైన యేసుక్రీస్తు ద్వారా (దేవుడు) సమా
ధానము ప్రకటించి ఇశ్రాయేలు పుత్రులకు పంపిన
37 వాక్యము ఇదే.। యోహాను ప్రకటించిన బాప్తిస్మము
తరువాత, గలిలైయ మొదలుకొని యూదైయ యందం
38 తట ప్రసిద్ధమైన సంగతి మీకు తెలుసును.। అదేమన
గా, దేవుడు నజోరీయుడైన యేసును పరిశుద్ధాత్మతోను
బలములోను అభిషేకించిన తరువాత, దేవుడు ఆయనకు
తోడైయుండుట వల్ల, ఆయన మేలు చేయుచు సైతా
ను వల్ల పీడించబడిన వారినందరిని స్వస్థపరుచుచు సం
39 చరించుచు ఉండెను.। ఆయన యూదుల దేశమందు,
యెరూషలేమునందు, చేసిన వాటికన్నిటికిని మేము
సాక్షులమై యున్నాము. ఆయనను వారు మానున అం
40 టవేసి చంపిరి.। అయితే దేవుడు ఆయనను మూడవ
41 దినమందు లేపి,। ప్రజలందరికి కాదు దేవుని వల్ల ముందు
ఏర్పరచబడిన సాక్షులకే, అనగా ఆయన చనిపోయిన
వారిలోనుంచి లేచిన తరువాత ఆయనతో కూడా
అన్నపానములు పుచ్చుకొనిన మాకే, ఆయన తేటగా
కనబడుటకు దయచేసెను.। ఇదిగాక జీవించే వారికి, 42
చనిపోయిన వారికిని న్యాయాధిపతిగా దేవునిచేత
నియమించబడిన వాడు ఈయనే అని జనులకు ప్రక
టించి, సాక్ష్యము చెప్పుటకు మాకు ఆజ్ఞాపించెను.।
ఆయన యందు విశ్వాసముంచే వాడెవడో వాడు ఆ 43
యన నామమూలముగా పాపపరిహారము పొందునని
ప్రవక్తలందరు ఆయనను గూర్చి సాక్ష్యము పలికి యు
న్నారనెను.
పేతురు ఆ మాటలు ఇంకా పలుకుచుండగా 44
ఆ వాక్యము విన్నవారందరి మీద పరిశుద్ధాత్మ వాలె
ను.। ఛేదనసంస్కారము పొందిన వారిలో* ఎంతమంది 45
విశ్వాసులు పేతురుతో కూడా వచ్చిరో వారు పరి
శుద్ధాత్మ అనే వరము రాష్ట్రముల మీద కుమ్మరించ
బడుట చూచి ఆశ్చర్యపడిరి;। వారు (అన్య) భాష 46
లతో మాటలాడుచు దేవుని మహిమపరుచుట వినిరి.
కాబట్టి, పేతురు—మనవలె పరిశుద్ధాత్మను పొందిన 47
వీరికి బాప్తిస్మము చేయించబడకుండా ఎవడైనను నీళ్లు
నిషేధించ వచ్చునా? అని పలికి,। ప్రభువుయొక్క నా 48
మమందు వారికి బాప్తిస్మము చేయించబడుటకు ఆజ్ఞా
పించెను. తరువాత వారు కొన్ని దినములు తమయొద్ద
ఉండుమని అతని వేడుకొనిరి.

## 11. అధ్యాయము.

రాష్ట్రములు దేవుని వాక్యము అంగీకరించెనని 1
యూదైయులో ఉన్న అపొస్తలులు, సహోదరులును
వినిరి.। పేతురు యెరూషలేముకు వచ్చినప్పుడు, ఛేదన 2
సంస్కారము పొందినవారు।— నీవు ఛేదనసంస్కా 3
రము లేని వారి యొద్దకి వెళ్లి వారితో భోజనము చేసి
తివని అతనితో వాదించిరి.
అయితే పేతురు మొదటినుంచి వరసగా వారికి ఈ 4
లాగు వివరించెను:।— నేను యొప్పేలో ప్రార్థించుచుం 5
డగా, పరవశుడనైతిని. అప్పుడు ఒక దర్శనము నాకు
కలిగెను. అదేమనగా, నాలుగు చెంగులు కట్టబడిన పెద్ద
దుప్పటి వలె ఒక వస్తువు ఆకాశమునుంచి దిగి నాయొ
ద్దకి వచ్చెను.। దాని తట్టు నేను తేరిచూచి నిదానించగా, 6
భూమియొక్క చతుష్పాద జంతువులు, అడవి మృగము
లు, పాకే పురుగులు, ఆకాశపక్షులును నాకు కనబడె
ను.। అప్పుడు—పేతురూ! నీవు లేచి చంపి తినుమని ఒక 7
శబ్దము నాతో చెప్పుట వింటిని.। అందుకు నేను—ప్రభు 8

* అనగా, యూదులు.

వా! ఆలాగు వద్దు; సాధారణమైనదైనా అపవిత్రమైన
9 దైనా నా నోట ఎన్నడును పడలేదని చెప్పితిని.। అయి
తే రెండవ మారు ఆ శబ్దము ఆకాశమునుంచి—దేవుడు
పవిత్రము చేసినవాటిని నీవు సాధారణమైనవి అను
10 కొన వద్దని నాకుత్తరమిచ్చెను.। ఈలాగు మూడు మా
ర్లు జరిగిన తరువాత అదంతయు ఆకాశమునకు తిరిగి
11 ఎత్తబడెను.। అప్పుడు ఇదుగో! వెంటనే కైసరైయనుంచి
నా యొద్దికి పంపబడిన ముగ్గురు మనుష్యులు నేను
12 ఉన్న ఇంటియొద్ద నిలిచి యుండిరి.। అప్పుడు ఆత్మ—
నీవు ఏమియు సందేహించక, వారితో కూడా వెళ్లు
మని నాతో చెప్పెను. ఈ ఆరుగురు సహోదరులు
నాతో కూడా వచ్చిరి; మేము ఆ మనుష్యుని ఇంట్లో
13 ప్రవేశించితిమి.। అప్పుడు—నీవు యొప్పేకు మనుష్యు
లను పంపి, పేతురు అనే మారుపేరు గల సీమోనును
14 పిలిపించుము;। నీవు, నీ ఇంటివారును ఏ మాటలవల్ల
రక్షణ పొందుదురో, వాటిని అతడు నీతో చెప్పునని
తన ఇంట్లో నిలిచి, తనతో పలికిన ఒక దూతను చూ
15 చితినని అతడు మాకు తెలిపెను.। నేను మాటలాడ
నారంభించినప్పుడు, పరిశుద్ధాత్మ మొదట మన మీద
16 వాలిన ప్రకారము వారి మీదనును వాలెను.। అప్పు
డు-యోహాను నీళ్లతో బాప్తిస్మము చేయించెను, అయి
తే మీకు పరిశుద్ధాత్మతో బాప్తిస్మము చేయించబడునని
ప్రభువు చెప్పిన మాట నేను జ్ఞాపకము తెచ్చుకొం
17 టిని,। గనుక ప్రభువైన యేసు క్రీస్తుయందు విశ్వసిం
చిన మనకు ఏలాగో ఆలాగే దేవుడు వారికి కూడా
సమానవరమును ఇచ్చిన తరువాత దేవుని అడ్డగించు
టకు నేను ఏపాటి వాడనని చెప్పెను.
18 వారు వీటిని విని మౌనముగా ఉండి—మంచిది,
రాష్ట్రములకును దేవుడు జీవార్థముగా మారు మన
స్సు దయచేసియున్నాడని దేవుని స్తోత్రము చేసిరి.
19 అయితే స్తెఫనునుగూర్చి కలిగిన హింసవల్ల చెదిరి
పోయినవారు యూదులకు దప్ప మరి యెవనికిని వా
క్యము* చెప్పక, ఫేనీకే, కుప్ర, అంతియొఖైయ ప్రదే
20 శముల మట్టుకు సంచరించిరి.। అయితే వారిలో కొం
దరు కుప్రీయులు, కురేనీయులునై యుండిరి. వారు
అంతియొఖైయకు వచ్చి ప్రభువైన యేసుని గూర్చిన
సువార్త ప్రకటించుచు హెల్లేనీయులతో మాటలా
21 డిరి.। ప్రభువుయొక్క చెయ్యి వారికి తోడై యుండు
టవల్ల, అనేకులు విశ్వసించి ప్రభువు తట్టు తిరిగిరి.
22 ఎరూషలేములో ఉన్న సంఘము, వారి చెవులకు
వారిని గూర్చిన సమాచారము వినబడినప్పుడు, బర్న
బాను అంతియొఖైయ మట్టుకు పంపిరి.। అతడు ప్రవే 23
శించి, దేవుని కృప చూచి, సంతోషపడి ప్రభువుని
స్థిర హృదయముతో హత్తుకొనుటకు అందరికిని బోధిం
చెను;। అతడు పరిశుద్ధాత్మతోను విశ్వాసముతోను 24
నిండుకొనిన మంచి మనుష్యుడు. అప్పుడు బహు జన
సమూహము ప్రభువుతో కలపబడెను.

అప్పుడు బర్నబా సౌలును వెతుకుటకు తర్సుకు 25
వెళ్లి అక్కడ అతని కనుగొని అంతియొఖైయకు తీసు
కొని వచ్చెను.। అప్పుడు జరిగినదేమనగా—వారు ఒక 26
సంవత్సరమంతయు సంఘముతో కూడుకొని బహుజను
లకు బోధించిరి. మొదట అంతియొఖైయలో శిష్యు
లు క్రైస్తవులనబడిరి.

ఆ దినములయందు యెరూషలేమునుంచి ప్రవక్తలు 27
అంతియొఖైయకు వచ్చిరి.। వారిలో అగబు అనే పేరు 28
గల ఒకడు నిలిచి, భూలోకమంతట మిక్కిలి కరువు
కలుగునని ఆత్మవల్ల సూచించెను.। అది క్లౌది కైసరు† 29
కాలమందు సంభవించెను. అప్పుడు శిష్యులలో ప్రతి
వాడును తన తన శక్తి కొలది యూదైయలో కాపుర
మున్న సహోదరులకు సహాయార్థముగా (సొమ్ము)
పంపుటకు నిశ్చయించుకొనెను.। ఆలాగున చేసి, బర్న 30
బా సౌలు అనే వారిచేత పెద్దల యొద్దికి దాని పంపిరి.

## 12. అధ్యాయము.

ఆ కాలమందు రాజైన హేరోదు సంఘము వారి 1
లో కొందరికి కీడు చేయుటకు వారిమీద చేతులు వేసి,।
యోహాను సహోదరుడైన యాకోబును కత్తివల్ల చం 2
పించెను.। ఇది యూదులకు ఇష్టమైనదని తెలుసుకొ 3
ని, పేతురును కూడా పట్టుకొనసాగెను. అప్పుడు పులి
యని రొట్టెల దినములు వచ్చియుండెను.। అతని పట్టి 4
ఖయిదులో వేయించి పస్కాపండుగైన పిమ్మట ప్రజల
యొద్దికి అతని తెచ్చుటకు ఆలోచించి, అతని కాచుటకు
నలుగురేసి రాణువవారు గల నాలుగు జతలకు అతని
అప్పగించెను.। కాబట్టి పేతురు ఖయిదులో ఉంచబ 5
డెను అయితే సంఘముచేత అతని కొరకు దేవునిగూ
ర్చి అత్యాసక్తిగా ప్రార్థన చేయబడుచుండెను.

అయితే హేరోదు ఎప్పుడు అతని వెలపటికి తీసు 6
కొనిరా వలెనని యుండెనో ఆ పూర్వ రాత్రి పేతురు
రెండు సంకెళ్లతో బంధించబడి ఇద్దరు రాణువవారి
మధ్యను నిద్రించుచుండెను. మరియు కావలివారు
తలుపుల యెదుట చెరసాల కాచుకొనుచుండిరి.। అప్పు 7
డు ఇదుగో! ప్రభువుయొక్క దూత అతనిదగ్గర నిలిచె
ను. అప్పుడు వెలుగు చెరసాలలో ప్రకాశించెను.

---

* అనగా, సువార్త. † రోమా చక్రవర్తి.

అప్పుడు ఆ దూత పేతురు పక్కను కొట్టి—త్వరగా
8 లెమ్మని చెప్పి, అతని లేపనెత్తెను.। అప్పుడు అతని
సంకెళ్లు చేతులనుంచి ఊడిపడెను. అప్పుడు ఆ దూత
అతనితో—నీవు నడుము కట్టుకొని నీ చెప్పులు తొడు
గుకొనుమనెను. అతడు ఆలాగు చేసిన తరువాత అత
డు—నీ వస్త్రము వేసుకొని నా వెంబడి రమ్మని అత
9 నితో పలికెను.। అతడు వెలపటికి వచ్చి అతని వెంబ
డించి, ఆ దూతవల్ల చేయబడినది నిజమని గ్రహించక,
10 తనకు దర్శనమే కలిగెనని తలంచెను.। మొదటి కావ
లిని, రెండవ కావలిని దాటి పట్టణమునకు పోయే ఇనుప
తలుపు యొద్దకి చేరినప్పుడు, దానంతట అదే వారి
కొరకు విడిపోయెను. వారు బైలువెళ్లి ఒక వీధి దాటిన
తరువాత, వెంటనే ఆ దూత అతని విడిచి వెళ్లెను.
11 పేతురుకు తెలివి వచ్చి, ప్రభువు తన దూతను పంపి
హేరోదు చేతిలోనుంచి, యూదులనే ప్రజలు నిరీ
క్షించే అన్నిటిలోనుంచి నన్ను తప్పించి యున్నాడని
ఇప్పుడు నాకు నిశ్చయముగా తెలిసెననుకొనెను.।
12 దీని గ్రహించి మార్కు అని మారు పేరుగల యో
హాను తల్లియైన మరియ ఇంటికి వచ్చెను. అక్కడ
13 అనేకులు కూడుకొని ప్రార్థించుచుండిరి.। అతడు
తలవాకిటి తలుపు కొట్టుచుండగా రోదే అనే పేరు
14 గల ఒక చిన్నది వినుటకు వచ్చెను.। ఆమె పేతురు
స్వరము పోల్చి, సంతోషమువల్ల తలుపు తీయక,
లోపటికి పరుగెత్తిపోయి — పేతురు తలుపు యొద్ద
15 నిలిచి యున్నాడని తెలిపెను.। అందుకు వారు—
నీవు వెర్రిదానవనిరి. అయితే — ఆలాగు ఉన్నదని
ఆమె దృఢముగా చెప్పినప్పుడు, వారు—అతని దూత
16 అని చెప్పుకొనిరి.। అయితే పేతురు ఇంకా కొట్టు
చున్నందున, వారు తలుపు తీసి అతని చూచి ఆశ్చ
17 ర్యపడిరి.। అప్పుడు మౌనముగా ఉండుటకు వారికి
చేసంజ్ఞ చేసి, ప్రభువు తన్ను చెరసాలలోనుంచి
ఏలాగు తీసుకొని వచ్చెనో: అది వారికి వివరించి
యాకోబుకును సహోదరులకును వీటిని తెలుపుడని
చెప్పి, బైలుదేరి వేరొక చోటికి వెళ్లెను.
18 తెల్లవారినప్పుడు పేతురు యేమైనాడో అనుకొనే
19 రాణువవారిలో కలిగిన గలిబిలి ఇంతంత కాదు.। అయి
తే హేరోదు అతని గూర్చి విచారణ చేసినప్పుడు,
అతడు లేకపోయినందున, కావలివారిని విమర్శించి వా
రిని చంపుటకు ఆజ్ఞాపించెను. తరువాత అతడు యూ
దైయనుంచి కైసరైయకు వెళ్లి, అక్కడ నివసించెను.
20 మరియు [హేరోదు] తురీయుల మీదను, సీదోనీ
యుల మీదను, మిక్కిలి కోపగించెను, అయితే* వారు
ఏక మనస్సుతో అతని యొద్దకి వచ్చి రాజు పడక
గది మీద ఉండిన† బ్లాస్తు అనే వాని తమ పక్ష
ముగా చేసుకొని, సంధి వేడుకొనిరి; ఎందుకనగా
రాజుయొక్క దేశమునుంచి వారి దేశమునకు గ్రాసము
వచ్చుచుండేది.। అయితే నియమించబడిన దినమందు 21
హేరోదు రాజ వస్త్రములు ధరించుకొని సింహాసనము
మీద కూర్చుండి వారితో ప్రసంగము చేసెను.।
అందుకు ప్రజలు—అది మనుష్యుని శబ్దము కాదు, 22
దేవుని శబ్దమే అని కంఠమెత్తి పలికిరి.। అతడు దేవుని 23
స్తుతించనందున, వెంటనే ప్రభువు దూత అతని కొ
ట్టెను గనుక పురుగులవల్ల తినబడి ప్రాణము విడిచెను.
అయితే దేవుని వాక్యము వృద్ధి పొంది ప్రబలమా 24
యెను.। అప్పుడు బర్నబాయు, సౌలును తమ పని నెర 25
వేర్చిన తరువాత మార్కు అని మారు పేరుగల యోహా
నును వెంటబెట్టుకొని యెరూషలేమునుంచి తిరిగివచ్చిరి.

## 13. అధ్యాయము.

అంతియొకైయ యందున్న సంఘములో బర్నబా, 1
నీగెరనబడిన సుమెయోను, కురేనీయుడైన లూకి
యు, చతుర్థాధిపతియైన హేరోదుతో కూడా పెం
చబడిన మనయేను, సౌలును అనే కొందరు ప్రవ
క్తలు, బోధకులును ఉండిరి.। వారు ప్రభువుని సేవిం 2
చుచు ఉపవాసము చేయుచుండగా, పరిశుద్ధాత్మ—
నేను బర్నబాను, సౌలును పిలిచిన పని కొరకు వారిని
నాకు వేరుపరుచండని వారితో చెప్పెను.। అంతట 3
వారు ఉపవాసము, ప్రార్థనయు చేసి, వారిమీద
చేతులు ఉంచి వారిని పంపిరి.

కాబట్టి వీరు పరిశుద్ధాత్మచేత పంపబడి సెలైకీయకు 4
వచ్చి, అక్కడనుంచి ఓడనెక్కి, కుప్రకు వెళ్లిరి.। సల 5
మీకి వచ్చి, యూదుల సునగోగులలో దేవుని వాక్య
ము తెలియచేసిరి. మరియు యోహాను వారికి పరి
చారకుడై యుండెను.

వారు పాఫు మట్టుకు ఆ ద్వీపమందంతట సంచరిం 6
చుచు, జ్ఞానియు, అబద్ధ ప్రవక్తయునైన బరియేసు అనే
పేరుగల ఒక యూదుని చూచిరి.। ఇతడు వివేకముగల 7
మనుష్యుడైన సెర్గి పౌలనే అధిపతి యొద్ద ఉండెను.
అతడు బర్నబాను, సౌలును పిలిపించి, దేవుని వాక్య
ము వినగోరెను.। అయితే జ్ఞాని అని అర్థమిచ్చే 8
పేరుగల ఎలుమ ఆ యధిపతిని విశ్వాసమునుంచి తొల
గించు ఆటకు యత్నపడుచు వారిని ఎదిరించెను.

అప్పుడు పౌలు అనబడిన సౌలు పరిశుద్ధాత్మతో 9
నిండుకొని,। అతని వైపు తేరిచూచి — సమస్త వంచ 10

*లేక, తురీయులతోను సీదోనీయులతోను యుద్ధము చేయవలెనని యుండగా. †లేక, రాణివాసమునకు అధిపతియైన.

నలతోను సమస్త తంత్రములతోను నిండియున్న, సై
తాను కుమారుడా! సమస్త నీతి విరోధీ! నీవు ప్రభువు
యొక్క తిన్నని మార్గములు వ్యత్యయపరచక మాన
11 వా?। ఇప్పుడు ఇదుగో! ప్రభువు చెయ్యి నీ మీదను
ఉన్నది; నీవు కొంతకాలము గుడ్డివై సూర్యుని చూడ
కుందువని చెప్పెను. వెంటనే మబ్బు, చీకటియు అతని
కమ్మెను. అప్పుడు అతడు తిరుగుచు, చెయ్యి పట్టు
12 కొని నడిపించే వారిని వెతుకుచుండెను.। అంతట ఆ
అధిపతి జరిగిన దాని చూచి, ప్రభువు బోధకు ఆశ్చ
ర్యపడి విశ్వసించెను.

13 తరువాత పౌలును, అతనితో కూడా ఉన్నవా
రును ఓడనెక్కి పాఫును విడిచి, పంఫులియలో ఉన్న
పెర్గేకు వచ్చిరి. అయితే యోహాను వారిని విడిచి
యెరూషలేముకు తిరిగి వెళ్లెను.

14 అప్పుడు వారు పెర్గేను విడిచి, పిసిదియలో
ఉన్న అంతియొకైయకు వచ్చి, సబ్బాతు దినమందు
సునగోగులో ప్రవేశించి కూర్చుండిరి.

15 బోధన ప్రమాణము, ప్రవక్తల లేఖనములు చదువ
బడిన తరువాత, సునగోగు అధికారులు—సహోదరు
లారా, ప్రజల కొరకు మీకు బోధన వాక్యము ఉంటే
దాని చెప్పుడని, వారికి వర్తమానము పంపిరి.

16 అప్పుడు పౌలు నిలిచి చేసైగచేసి పలికినదేమనగా,
—ఇశ్రాయేలీయులారా! దేవునికి భయపడేవారలారా!
17 వినుడి.। ఇశ్రాయేలనే ఈ ప్రజల దేవుడు మన పితృ
లను ఏర్పరుచుకొని, వారు ఐగుప్తు దేశమందు పరవా
సులైనప్పుడు, ప్రజలను హెచ్చించి, ఎత్తబడిన బాహు
18 వువల్ల వారిని అక్కడనుంచి తీసుకొని వచ్చి,। కొంచె
ము ఎక్కువ తక్కువ నలుబది ఏండ్లమట్టుకు అరణ్య
19 ములో వారిని పోషించెను.*। మరియు కనాను ఖండ
ములో ఏడు దేశముల ప్రజలను నాశముచేసి, వారి
20 దేశములను వీరికి చీట్లవల్ల పంచి ఇచ్చెను.। అటుతరు
వాత, కొంచెము ఎక్కువ తక్కువ నన్నూట ఏబది సం
వత్సరములు, ప్రవక్తయైన సామూయేలు వరకు, ఆయన
21 వారికి న్యాయాధిపతులను నియమించెను.। ఆ తరువాత
వారు రాజు కావలెనని కోరిరి. అప్పుడు దేవుడు నలు
బది ఏండ్ల పర్యంతము, బెన్యామీను గోత్రుడు కీసు
22 కుమారుడునైన సౌలును వారికి నియమించెను.। అతని
తీసివేసి దావీదును వారికి రాజుగా హెచ్చించెను.
మరియు అతని గూర్చి—నేను యెష్షై కుమారుడైన దా
వీదును కనుగొంటిని; అతడు నా హృదయానుసారమైన
మనుష్యుడు; ఇతడు నా ఇష్టములన్నియు నెరవేర్చు
నని సాక్ష్యము పలికెను.

ఇతని సంతానమునుంచి దేవుడు తన వాగ్దత్తము 23
చొప్పున, ఇశ్రాయేలు కొరకు యేసనే రక్షకుని
పుట్టించి యున్నాడు.। ఆయన ప్రవేశమునకు ముందు 24
గా యోహాను ఇశ్రాయేలు జనులందరికి మారు మనస్సు
విషయమైన బాప్తిస్మము ప్రకటించెను.। యోహాను 25
తన పని నెరవేర్చుచుండగా—మీరు నన్ను ఎవడనని
ఊహించుచున్నారు! నేను ఆయనను కాను; ఇదుగో!
నా వెనుక ఒకడు వచ్చుచున్నాడు; ఆయన పాదముల
చెప్పుల(వారు) విప్పుటకైనను నేను పాత్రుడను కానని
పలికెను.

సహోదరులారా! అబ్రాహాము వంశస్థ కుమా 26
రులారా! మీలో దేవునికి భయపడే వారలారా! ఈ
రక్షణ వాక్యము మీకు పంపబడి యున్నది;। యెరూ 27
షలేములో కాపురముండే వారును వారి అధికారు
లును ఆయననైనను, ప్రతి సబ్బాతుయందు చదువబడే
ప్రవక్తల వాక్యములనైనను ఎరుగక, ఆయనకు శిక్ష
విధించుటవల్ల వాటిని నెరవేర్చిరి.। ఆయన యందు 28
మరణమునకు ఏ హేతువును కనుగొనకనే, ఆయన చం
పబడుటకు పిలాతును వేడుకొనిరి.। వారు ఆయనను 29
గూర్చి వ్రాయబడినవన్నియు నెరవేర్చిన తరువాత,
ఆయనను మాను మీదనుంచి దింపి సమాధిలో ఉం
చిరి.। అయితే దేవుడు చనిపోయిన వారిలోనుంచి 30
ఆయనను లేపెను.। ఆయనతో కూడా గలిలైయనుంచి 31
యెరూషలేముకు వచ్చినవారికి, అనేక దినముల పర్యం
తము ఆయన కనబడెను. ఇప్పుడు వారు ఆయనను
గూర్చి జనులయెదుట సాక్షులై యున్నారు.। దేవుడు 32
యేసుని లేపి†, పితృలకు చేయబడిన వాగ్దత్తమును।
వారి పిల్లలమైన మనకు నెరవేర్చియున్నాడని మేము 33
కూడా మీకు సువార్త తెలుపుచున్నాము. ఆలాగే—

నీవు నా కుమారుడవు,
నేను నిన్ను నేడు కంటినని,

రెండవ కీర్తనయందు వ్రాయబడి యున్నది.। మరి 34
యు కుళ్లుటకు ఇకను తిరుగని ఆయనను, చనిపోయిన
వారిలోనుంచి లేపడమును గూర్చి—దావీదుయొక్క
నమ్మకమైన పరమార్థములను మీకిత్తునని చెప్పెను.। కా 35
గా వేరొక కీర్తనయందు—కుళ్లును నీ భక్తుని‡చూడనియ్య
వని చెప్పుచున్నాడు.§। అయితే దావీదు తన తరము 36
వారికి, దేవుని చిత్తప్రకారము సేవ చేసి, నిద్రపోయి
తన పితృల యొద్దికి చేర్చబడి కుళ్లును చూచెను.। అయి 37
తే దేవుడు లేపినవాడు కుళ్లును చూడలేదు.

కాబట్టి, సహోదరులారా! మీకు ఈయన మూల 38
మైన పాపపరిహారము ప్రకటించబడుచున్నదనియు,।

* లేక, వారి నడతలను సహించెను. † లేక, పుట్టించి. ‡ లేక, పరిశుద్ధుని. § కీర్తన. 16: 10.

39 మీరు మోషేయొక్క బోధనప్రమాణమువల్ల వేటినుంచి
విముక్తులని తీర్పుపొంద లేకపోతిరో వాటియన్నిటి
నుంచి ఈయనయందు విశ్వసించే ప్రతివాడును విము
క్తుడని తీర్పు పొందుననియు మీకు తెలియబడును
గాక.
40,41 కాబట్టి—తిరస్కరించేవారలారా! చూడుడి, ఆశ్చ
ర్యపడుడి, నశించుడి; మీ దినములలో నేను ఒక
కార్యము చేతును; ఆ కార్యమును ఒకడు మీకు వివ
రించినప్పటికి, మీరు నమ్మరని ప్రవక్తల గ్రంథమందు
చెప్పబడినది మీ మీదికి రాకుండా చూచుకొనుడని
పలికెను.*
42 వారు సునగోగులోనుంచి వెళ్లుచుండగా, ఈ వాక్య
ములు మరుసటి సబ్బాతుయందు తమతో చెప్పబడ
వలెనని వేడుకొనిరి.
43 సంఘము విడిపోయిన తరువాత, యూదులలోను,
యూదుల మతమందు చేరిన భక్తులలోను అనేకులు
పౌలును బర్నబాను వెంబడించిరి. వీరు వారితో మాట
లాడుచు దేవుని కృపయందు నిలుకడగా ఉండుటకు
వారిని ప్రేరేపించిరి.
44 మరుసటి సబ్బాతుయందు కొంచెము తక్కువ ఆ
పట్టణమంతయు దేవుని వాక్యము వినుటకు కూడి
45 వచ్చెను.। అయితే యూదులు సమూహములను చూచి,
మత్సరముతో నిండుకొని యెదురాడుచు, దూషిం
చుచు, పౌలుచేత చెప్పబడినవాటికి విరోధముగా మా
టలాడిరి.
46 అప్పుడు పౌలు, బర్నబాయు ధైర్యము తెచ్చు
కొని ఇట్లనిరి—దేవుని వాక్యము మొదట మీకు చెప్పుట
అగత్యమే, అయితే మీరు దాని త్రోసివేసి మిమ్మును
మీరు ఈ నిత్యజీవమునకు అపాత్రులుగా ఎంచుకొ
నుచున్నారు గనుక, ఇదుగో! మేము రాష్ట్రముల లట్టు
తిరుగుచున్నాము; ఎందుకనగా—
47 నీవు భూదిగంతముల వరకు రక్షణార్థముగా ఉం
డుటకు, నిన్ను రాష్ట్రములకు వెలుగుగా ఉంచితినని,
ప్రభువు మాకు ఈలాగు ఆజ్ఞాపించి యున్నాడనిరి.
48 రాష్ట్రజనులు దాని విని సంతోషించి ప్రభువుయొ
క్క వాక్యము స్తోత్రముచేసిరి. అప్పుడు నిత్యజీవ
మునకు ఏర్పరుచబడిన వారందరు విశ్వసించిరి.
49 ప్రభువుయొక్క వాక్యము ఆ దేశమంతట ప్రచు
50 రము చేయబడెను.। అయితే యూదులు ఆ పట్టణ
ముయొక్క గొప్పవారిని, భక్తిమర్యాదలుగల స్త్రీలను
రేపి, పౌలును, బర్నబాకును విరోధముగా హింస కలు
గజేసి వారిని తమ ప్రాంతములనుంచి వెళ్లగొట్టిరి.।
అయితే వారు తమ పాద ధూళిని వారి యెదుట 51
సాక్ష్యముగా దులిపి, ఈకొనియకు వచ్చిరి.। అప్పుడు 52
శిష్యులు ఆనందముతోను, పరిశుద్ధాత్మతోను నిండు
కొనిరి.

## 14. అధ్యాయము.

ఈకొనియలో జరిగినదేమనగా, వారిద్దరు కూడా 1
యూదుల సునగోగులో ప్రవేశించి, యూదులలోను
హెల్లేనీయులలోను అనేకులు విశ్వసించేలాగున మాట
లాడిరి.। అయితే అవిశ్వాసులైన యూదులు అన్యజను 2
లను పురికొలిపి, సహోదరులకు విరోధముగా వారి
మనస్సులలో పగ పుట్టించిరి.। గనుక, వారు అక్కడ 3
బహుకాలము గడిపి, వారిచేత గురుతులు అద్భుతము
లు చేయించి తన కృపా విషయమైన వాక్యమునకు
దృష్టాంతమిచ్చుచుండిన ప్రభువుని ఆనుకొని ధైర్య
ముగా మాటలాడుచుండిరి.
అయితే ఆ పట్టణముయొక్క జనసమూహము 4
విభాగించబడి కొందరు యూదుల పక్షముగా కొంద
రు అపొస్తలుల పక్షముగానుండిరి.। మరియు వారిని 5
అవమానించి రాళ్లతో కొట్టుటకు తమ అధికారులతో
కూడిన రాష్ట్రములకును యూదులకును కలహము కలిగి
నప్పుడు, వారు దాని తెలుసుకొని,। లుకవునియ దేశ 6
ములోని లుస్త్రకు, దెర్బేకు, చుట్టున్న ప్రాంతమునకును
పారిపోయి,। అక్కడ సువార్తను ప్రకటించుచుండిరి. 7
లుస్త్రలో బలహీనపాదములు గల ఒక మనుష్య 8
డు కూర్చుండెను. అతడు తల్లి కన్నది మొదలుకొని
కుంటివాడై ఎన్నడును నడువ లేదు.। అతడు పౌలు 9
మాటలాడుట వినుచుండెను. ఇతడు అతని వైపు తేరి
చూచి, స్వస్థత పొందుటకు అతనికి విశ్వాసము కలిగె
నని గ్రహించి।—నీ పాదములు మోపి తిన్నగా నిలు 10
వుమని గొప్ప శబ్దముతో పలికెను. అతడు ఎగిరి
నడిచెను.
జనసమూహములు పౌలు చేసిన దాని చూచి, 11
—దేవతలు మనుష్యరూపముతో మా యొద్దికి దిగి వచ్చి
యున్నారని లుకవునియ భాషతో కంఠమెత్తి పలికి,।
బర్నబాకు ద్యుపతి అనియు, ముఖ్యమైన వక్తయైనం 12
దున పౌలుకు హెర్మే† అనియు పేరు పెట్టిరి.
అప్పుడు వారిపట్టణమునకు ఎదురుగానున్న ద్యుపతి 13
యొక్క పూజారి, యెద్దను, పూదండలను ద్వారముల

* యెషయా. 29: అ. 14. వ.   † అనగా, వాగీశ్వరుడు.

యొద్దికి తీసుకొని వచ్చి, సమూహముతో కూడా యా
14 గముచేయ వలెనని యుండెను. । అయితే అపొస్తలు
15 లైన బర్నబాయు, పౌలును దీని విని, । తమ వస్త్రములు
చించుకొని—అయ్యలారా! మీరెందుకు వీటిని చేయు
చున్నారు? మేము కూడా మీవంటి గుణములు గల మను
ష్యులమే, మీరు ఈ వ్యర్థమైన వాటిని విడిచి ఆకా
శము భూమియు సముద్రమును, వాటిలో ఉండే సమ
స్తమును సృజించిన, జీవము గల దేవుని తట్టు తిరుగ వలె
16 నని మీకు సువార్తను ప్రకటించుచున్నాము. । ఆయన,
గతకాలములలో సమస్త ప్రజలను తమ తమ మార్గముల
17 యందు నడువనిచ్చెను. । అయినప్పటికి, ఆయన ఆకా
శమునుంచి మనకు వర్షము, పంటగల ఋతువులు దయ
చేయుచు, ఆహారముతోను, సంతోషముతోను, మన
హృదయములను నింపుచు, మేలు చేసుటవల్ల తన్ను
గూర్చి సాక్ష్యమియ్యకుండలేదని కంఠమెత్తి చెప్పుచు
బైలుదేరి సమూహములోకి చొరబడిరి.
18 వారు వీటిని చెప్పుచు, తమకు యాగము చేయకుం
డా సమూహములను ప్రయాసముతోనే నిలిపిరి.
19 అయితే అంతియొఖైయనుంచియు, ఈకోనియనుం
చియు యూదులు వచ్చి సమూహములను తమ పక్ష
ముగా చేసుకొని, పౌలును రాళ్లతో కొట్టి, అతడు
చనిపోయెనని తలంచి, పట్టణపు వెలపటికి ఈడ్చిరి. ।
20 అయితే శిష్యులు అతని చుట్టు నిలిచి యుండగా,
అతడు లేచి పట్టణములో ప్రవేశించి, మరునాడు
బర్నబాతో కూడా దెర్బేకు బైలుదేరెను.
21 వారు ఆ పట్టణములో సువార్త ప్రకటించి, అనే
కులను శిష్యులగా చేర్చుకొనిన తరువాత, లుస్త్రకు ఈ
22 కొనియకు, అంతియొఖైయకు, । తిరిగి వచ్చి శిష్యుల
ఆత్మలను స్థిరపరిచి విశ్వాసమందు నిలుకడగా ఉండ
వలెననియు, అనేక శ్రమలవల్ల మనము దేవుని రాజ్య
ములో ప్రవేశించ వలెననియు వారికి బోధపరిచిరి.
23 మరియు వారి కొరకు ప్రతి సంఘములో పెద్దలను
నియమించి, ఉపవాసములతో ప్రార్థన చేసి, వారు
విశ్వసించిన ప్రభువుకు వారిని అప్పగించిరి.
24 తరువాత పిసిదియ దేశమంతట సంచరించి పంఫులి
25 యకు వచ్చిరి. । మరియు పెర్గేలో వాక్యము* చెప్పి,
26 అత్తలైయకు వెళ్లిరి. । అక్కడనుంచి, తాము నెరవేర్చిన
పని నిమిత్తము దేవుని కృపకు అప్పగించబడి విడిచిన
అంతియొఖైయకు ఓడెక్కి వెళ్లిరి.

వారు వచ్చి, సంఘమును సమకూర్చి, దేవుడు తమకు 27
తోడై చేసినవన్నియు, ఆయన రాష్ట్రములు విశ్వసిం
చుటకు వారికి ద్వారము తెరిచెననియు వారికి తెలిపిరి. ।
అక్కడ శిష్యులయొద్ద వారు బహుకాలము గడిపిరి. 28

## 15. అధ్యాయము.

అయితే కొందరు యూదైయనుంచి వచ్చి—మీరు 1
మోషేయొక్క ఆచారము చొప్పున ఛేదనసంస్కారము
పొందకుంటే, రక్షించబడ లేరని సహోదరులకు బో
ధించుచుండిరి. । కాబట్టి పౌలుకు, బర్నబాకు వారితో 2
కొంచెము కాని తర్కమును వాదమును కలిగినప్పుడు,
ఈ వాదమును గూర్చి పౌలు, బర్నబా, తమలో వేరే
కొందరు యెరూషలేములోని అపొస్తలుల యొద్దికిని
పెద్దల యొద్దికిని వెళ్ల వలెనని నిర్ణయించిరి, । గనుక 3
వారు సంఘమువల్ల సాగనంపబడి, ఫేనీకే సమరెయ
దేశముల ద్వారా వెళ్లుచు అన్యజనులు† (దేవుని తట్టు)
మళ్లుకొనుట వివరించి సహోదరులందరికిని మహా
సంతోషము కలుగచేసిరి. । మరియు వారు యెరూషలే 4
ముకు వచ్చి, సంఘము వల్లను, అపొస్తలుల వల్లను పె
ద్దల వల్లను చేర్చుకొనబడి, దేవుడు తమకు తోడై, చేసి
నవన్నియు తెలిపిరి.
అయితే ఫరిసైయుల మతస్థులలో విశ్వసించిన కొం 5
దరు లేచి, వారికి ఛేదనసంస్కారము చేయించ వలె
ననియు, మోషే బోధనప్రమాణము గైకొనుటకు వారికి
ఆజ్ఞాపించ వలెననియు చెప్పిరి. । అప్పుడు అపొస్తలులు, 6
పెద్దలు, ఈ మాటను గూర్చి ఆలోచన చేసుటకు కూడి
వచ్చిరి.
బహు వాదము జరిగిన తరువాత, పేతురు లేచి 7
వారితో—సహోదరులారా! అనేక దినముల కిందట
దేవుడు రాష్ట్రములు నా నోట సువార్త వాక్యము
విని విశ్వసించేలాగున, మనలో నన్ను ఏర్పరుచుకొనె
నని మీకు తెలుసును. । మరియు హృదయములను ఎరిగే 8
దేవుడు మనకు ఏలాగో, ఆలాగే వారికిని పరిశుద్ధాత్మను
దయచేసి వారిని గూర్చి సాక్ష్యమిచ్చెను. । మరియు వారి 9
హృదయములను విశ్వాసమువల్ల శుద్ధపరిచి, మనకు వారికి,
ఏ భేదమైనను చేయలేదు । గనుక, మన పితృలైనను 10
మనమైనను వహించ లేని కాడి, శిష్యుల మెడమీద
పెట్టి, మీరు ఎందుకు దేవుని శోధించుచున్నారు? ।
ఏమి! ప్రభువైన యేసు కృపచేత, వారు ఏలాగో 11
ఆలాగే మనమును రక్షణ పొందుదుమని నమ్ముచున్నా
మనెను.

* అనగా, సువార్త. † అనగా, రాష్ట్రములు.

12 అప్పుడు సమూహమంతయు ఊరుకొని బర్నబా,
పౌలు తమ ద్వారా దేవుడు రాష్ట్రములలో చేసిన గురు
తులను అద్భుతములను వివరించుట ఆలకించెను.
13 వారు చాలించిన తరువాత యాకోబు దాని గూర్చి
పలికినదేమనగా — సహోదరులారా! నా మాట
14 వినుడి. । దేవుడు తన నామము కొరకు రాష్ట్రముల
లోనుంచి జనమును ఏర్పరుచుకొనుటకు వారిని ఏలాగు
మొదట కటాక్షించెనో దాని సీమోను* వివరించి
15 యున్నాడు. । ఇందుకు ప్రవక్తల వాక్యములు సరిపడి
యున్నవి, ఏమనగా—ఆ తరువాత నేను తిరిగి వచ్చెదను;।
16 మనుష్యులలో కడమవారు, నావారని నా నామము
యెవరికి పెట్టబడునో ఆ సమస్త రాష్ట్రములును ప్రభు
17 వును వెతుకుటకు, । పడిపోయిన దావీదు గుడారము
తిరిగి కట్టి, దాని పాడైనవాటిని తిరిగి కట్టి, దాని నిలువ
18 బెట్టుదునని అనాది కాలమునుంచి, । వీటిని తెలిపిన†
ప్రభువు చెప్పుచున్నాడని వ్రాయబడియున్నది.‡ ।
19 కాబట్టి రాష్ట్రములలోనుంచి దేవుని తట్టు తిరుగుచున్న
20 వారిని మనము కష్టపెట్టక, । అపవిత్రత కలిగించే విగ్రహ
ములను, జారత్వమును, గొంతుక పిసుకుటవల్ల చచ్చిన
వాటిని, రక్తమును విసర్జించుటకు వారికి వ్రాసి ఆజ్ఞా
21 పించ వలెనని నాకు తాత్పర్యమున్నది. । ఎందుకనగా
సునగోగులలో ప్రతి సబ్బాతున మోషే లేఖనములు
చదువబడుటవల్ల, మునుపటి తరములనుంచి వాటిని ప్రక
టించేవారు ప్రతి పట్టణములోను ఉన్నారని పలికెను
22 అప్పుడు తమలో ఏర్పరచబడినటువంటియు,
సహోదరులలో శ్రేష్ఠులైనటువంటియు బర్సబా
అని మారు పేరు గల యూదాను, సీలను, పౌలు, బర్న
బాయనే వారితో కూడా అంతియొకైయకు పంపుట
అపొస్తలులకును పెద్దలకును సంఘమంతటికిని యుక్త
23 మని తోచెను. । వీరు వ్రాసి వారిచేత పంపినదేమ
నగా—అపొస్తలులు, పెద్దలు§ సహోదరులును అం
తియొకైయలోను, సురియలోను, కిలికియలోను ఉండే
24 రాష్ట్రజనులైన సహోదరులకు శుభమాగాక. । మేము
ఆజ్ఞాపించకపోయిన కొందరు మా యొద్దనుంచి,‖ వెళ్లి, మి
మ్మును మాటలవల్ల కలతపరిచి, మీరు ఛేదనసంస్కారము
పొంది బోధన ప్రమాణము గైకొన వలెనని చెప్పి, మీ
మనస్సులను చెరుపుచున్నారని మేము వినియున్నాము।
గనుక మన ప్రభువైన యేసుక్రీస్తు పేరు కొరకు తమ 25
ప్రాణములను అప్పగించిన । బర్నబా, పౌలు అనే మన 26
ప్రియులతో కూడా, ఏర్పరచబడిన మనుష్యులను మీ
యొద్దికి పంపుట, ఏక మనస్సుతో కూడిన మాకు
యుక్తమని తోచెను,। గనుక యూదాను, సీలను పంపి 27
యున్నాము. వారు కూడా నోటి మాటలవల్ల వీటిని
మీకు తెలియచేతురు. । విగ్రహములకు అర్పించబడిన 28
వాటిని, రక్తమును, । గొంతుక పిసుకుటవల్ల చచ్చిన 29
వాటిని, జారత్వమును విసర్జించ వలెననే ఈ అవశ్య
మైన వాటికంటే ఎక్కువగా ఏ భారమైనను మీ మీద
వేయ కూడదని పరిశుద్ధాత్మకు, మాకును తోచెను. వాటి
నుంచి మిమ్మును మీరు కాపాడుకొంటే మీకు మేలు;
మీకు క్షేమము కలుగును గాకని వ్రాసిరి.
వీరు సెలవు పుచ్చుకొని అంతియొకైయకు వచ్చి 30
సమూహము సమకూర్చి ఆ ఉత్తరమిచ్చిరి. । వారు దాని 31
చదువుకొని, ఆ ఆదరణవల్ల¶ సంతోషపడిరి. । మరియు, 32
యూదా, సీల అనే వారును కూడా ప్రవక్తలై చాలా
మాటలవల్ల సహోదరులకు బోధించి స్థిరపరిచిరి.। వారు 33
అక్కడ కొంత కాలము ఉండి, సహోదరుల యొద్ద
నుంచి సమాధానముతో అపొస్తలుల యొద్దికి (వెళ్లు
టకు) సెలవు పుచ్చుకొనిరి, । [సీల అక్కడ నిలిచియుం 34
డుట యుక్తమనుకొనెను]. । అయితే పౌలు, బర్నబా 35
యు, వారితో కూడా వేరే అనేకులును ప్రభువుయొ
క్క సువార్తను బోధించుచు ప్రకటించుచు అంతియొ
కైయలో నిలిచిరి.
కొన్ని దినములైన తరువాత పౌలు—మనము ఏ పట్టణ 36
ములలో ప్రభువుయొక్క వాక్యము తెలియచేసితి
మో ఆ ప్రతి పట్టణములో ఉన్న సహోదరుల యొ
ద్దికి మనము తిరిగి వెళ్లి వారు ఏలాగు ఉన్నారో చూ
తామని బర్నబాతో పలికెను.
అప్పుడు మార్కు అనే మారుపేరు గల యోహానును 37
వెంటబెట్టుకొని వెళ్లుటకు బర్నబాకు మనస్సు ఉండెను.।
అయితే పౌలు పంఫులియలో తమ్మును విడిచి పని కొ 38
రకు తమతోకూడా రాకపోయిన వాని వెంటబెట్టు
కొని వెళ్లుట యుక్తము కాదని తలంచెను. । అందువల్ల 39
వారిలో తీక్ష్ణవాదము కలిగెను గనుక, వారు ఒకని ఒక
డు విడిచి వేరైయుండిరి. అప్పుడు బర్నబా మార్కును
వెంటబెట్టుకొని, ఓడెక్కి కుప్రకు వెళ్లెను. । పౌలు సీలను 40
ఏర్పరుచుకొని, సహోదరులచేత దేవుని దయకు అప్ప

* లేక, సుమెయోను అనగా, పేతురు. † ఆమోసు. 9. అ. 11, 12. వ. ‡ కొన్ని ప్రతులలో—అనాది కాలమునుంచి వీటిని తెలిపిన అనే మాటలకు బదులుగా—అనాది కాలమునుంచి దేవునికి తన క్రియలన్నియు తెలిసి యున్నవి అనేవి వాక్యాంతమందు ఉన్నవి. § లేక, పెద్దలైన. ‖ లేక, లోనుంచి. ¶ లేక, బోధవల్ల.

41 గించబడి బైలుదేరి సంఘములను స్థిరపరుచుచు, । సురి
య, కిలికియ దేశముల ద్వారా సంచరించుచుండెను.

## 16. అధ్యాయము.

1 తరువాత ఆయన దెర్బేకు, లుస్త్రకు వచ్చెను. అప్పు
డు ఇదుగో! విశ్వాసముగల యూదురాలైన స్త్రీ కుమా
రుడగు తిమొతెయు అనే పేరుగల ఒక శిష్యుడు అక్క
2 డ ఉండెను. । అతని తండ్రి హెల్లేనీయుడు; అతడు
లుస్త్రలోను, ఈకొనియలోనున్న సహోదరులవల్లమం
3 చి పేరు పొందెను. । పౌలు తమతో కూడా అతడు
బైలుదేరి రావలెనని కోరి ఆ స్థలములలోని యూదుల
నిమిత్తము అతని తీసుకొని అతనికి ఛేదనసంస్కారము
చేయించెను; ఎందుకంటే అతని తండ్రి హెల్లేనీయు
డని అందరికిని తెలుసును.
4 వారు పట్టణముల ద్వారా వెళ్లుచు, యెరూషలేము
లో ఉన్న అపొస్తలుల చేతను పెద్దల చేతను నిర్ణయిం
చబడిన విధులను గైకొనుటకు వారికి తెలియచేసిరి. ।
5 అందువల్ల సంఘములు విశ్వాసమందు స్థిరపడి అను
దినము లెక్కకు మిక్కిలి హెచ్చాయెను.
6 వారు ఫ్రుగియ, గలతియ దేశముల ద్వారా వెళ్లి,
ఆసియలో వాక్యము చెప్పకుండా పరిశుద్ధాత్మవల్ల
నివారించబడి, ముసియకు వచ్చి, బిథునియకు వెళ్లు
7 టకు ప్రయత్నము చేసిరి; । అయితే యేసుయొక్క ఆత్మ
8 వారిని వెళ్లనియ్యలేదు. । అంతట వారు ముసియ దాటి
త్రోయకు వచ్చిరి.
9 అప్పుడు, రాత్రివేళ పౌలుకు దర్శనము కలిగెను; అ
దేమనగా మకెదొనియ దేశస్థుడైన ఒక మనుష్యుడు
నిలిచి—నీవు మకెదొనియకు వచ్చి మాకు సహాయము
10 చేయుమని అతని వేడుకొనుచుండెను. । అతనికి ఆ ద
ర్శనము కలిగినప్పుడు, వారికి సువార్తను తెలుపుటకు
ప్రభువు మమ్మును పిలిచి యున్నాడని, మేము నిశ్చ
యించుకొని, వెంటనే మకెదొనియకు బైలుదేరుటకు
11 యత్నము చేసితిమి. । కాబట్టి మేము త్రోయను విడి
చి, ఓడెక్కి తిన్నగా సమొత్రాకేకును, మరునాడు
నెయపొలికిని వెళ్లి, అక్కడనుంచి పిలిప్పుయికి వచ్చితిమి. ।
12 మకెదొనియ దేశమందు ఆ భాగములో, అది ముఖ్య
పట్టణమును, కొలోనియయునై యున్నది.
13 మేము కొన్ని దినములు ఆ పట్టణములోనే ఉండి,
సబ్బాతు వారమున గవునుల ద్వారా బైలుదేరి, వాడిక
చొప్పున ప్రార్థనాస్థలముండిన నదీ తీరమునకు వచ్చి,
అక్కడ కూర్చుండి, కూడివచ్చిన స్త్రీలతో మాటలాడు
చుంటిమి. । అప్పుడు ధూమ్రవర్ణపు బట్టలు అమ్మే 14
తుయతైరు పట్టణపు లూదియ అనే దైవ భక్తి గల ఒక
స్త్రీ వినుచుండెను. పౌలు వల్ల చెప్పబడుచున్న వాటి
యందు లక్ష్యపెట్టుటకు ప్రభువు ఆమె హృదయము
తెరిచెను. । ఆమెకు ఆమె ఇంటివారికి బాప్తిస్మము చేయిం 15
చబడినప్పుడు, ఆమె—మీరు నన్ను ప్రభువు యందు
విశ్వాసము గల దాననని యెంచితే, నా ఇంట ప్రవే
శించి యుండుడని వేడుకొని మమ్మును బలవంతము
చేసెను.
తరువాత మేము ప్రార్థనా స్థలమునకు వెళ్లుచున్న 16
ప్పుడు, జరిగినదేమనగా, పుథోననే* ఆత్మగలదై, సోది
చెప్పుటవల్ల తన యజమానులకు బహు లాభము కలు
గచేయుచున్న ఒక చిన్నది మాకు యెదురుగా వచ్చె
ను. । ఆమె పౌలును, మమ్మును వెంబడించి—ఈ మను 17
ష్యులు సర్వోన్నతుడైన దేవుని సేవకులు; వీరు మనకు
రక్షణ మార్గము తెలియచెప్పేవారునై యున్నారని
కంఠమెత్తి పలికెను. । అది ఈలాగు అనేక దినములు 18
చేయుచుండెను గనుక పౌలు దుఃఖపడి, తిరిగి—నీవు
దాని వదలి వెళ్లుటకు యేసుక్రీస్తు పేర నీకు ఆజ్ఞా
పించుచున్నానని ఆ ఆత్మతో చెప్పెను. అది ఆ నిమి
షమందే దాని వదలిపోయెను.
ఆమె యజమానులు, తమ ఆదాయ నిరీక్షణ తప్పి 19
పోయెనని చూచి, పౌలును సీలను పట్టుకొని చావడి
లోని అధికారుల యొద్దికి ఈడ్చుకొని పోయిరి. । ఆ 20
సేనాధిపతుల యొద్దికి వారిని తీసుకొని వచ్చి—ఈమ
నుష్యులు యూదులైయుండి, మన పట్టణము గలిబిలి
చేసి, । రోమీయులమైన మనము అంగీకరించుటకైనను 21
చేయుటకైనను కూడని మర్యాదలను ఉపదేశించుచు
న్నారని చెప్పిరి.
అప్పుడు జనసమూహము వారికి విరోధముగా కూడి 22
లేచెను. సేనాధిపతులు వారి వస్త్రములు లాగివేసి, వా
రిని బెత్తములతో కొట్టుటకు ఆజ్ఞాపించిరి. । వారిని 23
చాలా దెబ్బలు కొట్టి చెరసాలలో వేసి వారిని భద్ర
ముగా కాచుకొన వలెనని చెరసాల నాయకునికి ఆ
జ్ఞాపించిరి. । అతడు అటువంటి ఆజ్ఞను పొంది, వారిని 24
లోపటి చెరసాలలో ఉంచి, వారి కాళ్లకు బొండ
వేసి బిగించెను. । అయితే మధ్య రాత్రివేళ పౌలు, 25
సీలయు దేవుని గూర్చి ప్రార్థించుచు, కీర్తనలు పాడు
చుండిరి. వాటిని ఖయిదీలు ఆలకించుచుండిరి. । అయి 26

* ఒక విధమైన దెయ్యము.

తే అకస్మాత్తుగా చెరసాల పునాదులు వణికేలాగున,
మహా భూకంపము కలిగెను. వెంటనే తలుపులన్నియు
27 తెరవబడెను; అందరి బంధకములు ఊడెను. । అంతలో
చెరసాల నాయకుడు మేలుకొని తలుపులన్నియు తెర
వబడియుండుట చూచి, ఖయిదీలు పారిపోయిరనుకొని
28 కత్తి దూసి, తన్ను చంపుకొనబోవుచుండెను. । అయితే
పౌలు—నీకు నీవే కీడు చేసుకొన వద్దు; మేమందరము
ఇక్కడనే ఉన్నామని మహా శబ్దముతో పలికెను.
29 అప్పుడు అతడు దీపములు తెమ్మని, లోపటికి దుమికి
30 వచ్చి, వణుకుచు పౌలుకు సీలకు సాగిలపడి, । వారిని
వెలపటికి తీసుకొని వచ్చి—ప్రభువులారా! రక్షించబ
డుటకు నేనేమి చేయ వలెననెను.
31 అందుకువారు—ప్రభువైన యేసుక్రీస్తు యందు విశ్వా
సముంచుము; అప్పుడు నీవు, నీ ఇంటి వారును రక్షిం
32 చబడుదురని పలికి, । అతనికి అతని ఇంటిలో ఉన్న
వారికందరికిని ప్రభువుయొక్క వాక్యము చెప్పిరి.
33 ఆ రాత్రి, ఆ గడియలోనే అతడు వారిని తీసు
కొని వారి దెబ్బల గాయములు కడిగెను. అప్పుడే
అతనికి అతని వారందరికి బాప్తిస్మము చేయించబడెను. ।
34 మరియు అతడు వారిని తన ఇంటికి తోడుకొని వచ్చి
భోజనము పెట్టి, తన ఇంటివారందరితో కూడా, దే
వునియందు విశ్వాసముంచి సంతోషపడెను.
35 ఉదయమైనప్పుడు సేనాధిపతులు—ఆ మనుష్యు
లను వదలివేయుమని చెప్పుటకు, వేత్రధరులను పంపిరి. ।
36 అప్పుడు చెరసాల నాయకుడు ఈ మాటలు పౌలుకు
తెలిపి — మీరు వదలివేయబడుటకు సేనాధిపతులు
(ఆజ్ఞ) పంపియున్నారు గనుక మీరు ఇప్పుడు బైలు
37 దేరి సమాధానముగా వెళ్లుడనెను. । అయితే పౌలు—
వారు న్యాయము విచారించక, రోమీయులమైన మ
మ్మును బహిరంగముగా కొట్టించి చెరసాలలో వేయిం
చి, ఇప్పుడు మమ్మును రహస్యముగా పైకి తోలివేయు
చున్నారా? ఆలాగు కాదు; వారే వచ్చి మమ్మును వెల
పటికి తీసుకొని వెళ్ల వలెనని పలికెను.
38 అప్పుడు ఆ వేత్రధరులు ఈ మాటలు సేనాధిపతు
లకు తెలిపిరి. వారు రోమీయులై యున్నారని వారు
39 విని, । భయపడి వచ్చి, వారిని బతిమాలుకొని వెలపటికి
తీసుకొని వెళ్లి పట్టణములోనుంచి బైలు వెళ్లుటకు వా
40 రిని వేడుకొనిరి. । అప్పుడు వారు చెరసాలలోనుంచి వెల
పటికి వచ్చి, లూదియ ఇంటికి వెళ్లి సహోదరులను
చూచి వారిని బోధించి* బైలుదేరి పోయిరి.

## 17. అధ్యాయము:

వారు అంఫిపొలి, అపొల్లోనియ పట్టణముల 1
ద్వారా వెళ్లి, తెస్సలొనీకేకు వచ్చిరి. అక్కడ యూ
దుల సునగోగు ఉండెను, । గనుక పౌలు తన మర్యాద 2
చొప్పున, వారి యొద్ద ప్రవేశించి, । క్రీస్తు శ్రమపడి, 3
చనిపోయిన వారిలోనుంచి లేవ వలసి యుండెనని—
నేను మీకు తెలియజేసే యేసే ఆ క్రీస్తయి యున్నా
డని తేటగా వివరించుచు లేఖనములలో మాటలెత్తి
వారితో మూడు సబ్బాతులు ప్రసంగించుచుండెను. ।
అప్పుడు వారిలో కొందరు, భక్తిగల హెల్లేనీయు 4
లలో చాలామందియు, శ్రేష్ఠ స్త్రీలలో అనేకులును
విశ్వసించి పౌలుతోను సీలతోను కలుపబడిరి.
అయితే (విశ్వసించని) యూదులు అసూయపడి 5
బద్ధకులలో కొందరు దుష్టులను చేర్చుకొని, గుంపు
కూర్చుకొని పట్టణము గలిబిలి చేసి, యాసోను
ఇంటి మీద పడి, వారిని ప్రజలయొద్దికి తీసుకొని
వచ్చుటకు యత్నము చేసిరి. । అయితే వారిని కనుగొన 6
లేక, యాసోనును, సహోదరులైన కొందరిని ఆ పట్ట
ణపు అధికారుల యొద్దికి ఈడ్చుకొని పోయి—భూ
లోకమును తల కిందు చేసిన వీరు ఇక్కడికి కూడా
వచ్చియున్నారు. । యాసోను వారిని చేర్చుకొని 7
యున్నాడు. వీరందరు యేసనే మరియొక రాజు ఉ
న్నాడని చెప్పి, కైసరుయొక్క ఆజ్ఞలకు విరోధముగా
నడుచుచున్నారని కేకలు వేసిరి.
వారు ఈ మాటలు వినిన జనసమూహమును పట్ట 8
ణపు అధికారులను కలతపెట్టిరి. । వారు యాసోను 9
యొద్దను, కడమ వారి యొద్దను జామీను పుచ్చుకొని
వారిని వదలివేసిరి.
వెంటనే సహోదరులు రాత్రివేళ పౌలును సీల 10
ను బెరైయకు పంపించిరి. వారు వచ్చి యూదుల సున
గోగులో ప్రవేశించిరి. । వీరు తెస్సలొనీకేలో ఉన్న 11
వారికంటె సద్గుణము గలవారైయుండిరి; ఏలాగనగా,
వారు మనస్ఫూర్తిగా వాక్యమును అంగీకరించి ఆ
సంగతులు ఆలాగు ఉన్నవేమో అని ప్రతిదినమును
లేఖనములు శోధించుచుండిరి। గనుక, వారిలో అనేకు 12
లును, ఘనతగల హెల్లేనీ స్త్రీలలోను పురుషులలోను
చాలామందియు విశ్వసించిరి.
అయితే బెరైయలో దేవుని వాక్యము పౌలువల్ల 13
ప్రకటించబడుచున్నదని తెస్సలొనీకే పట్టణస్థులైన
యూదులు తెలుసుకొని, వచ్చి అక్కడనను సమూ

* లేక, ఆదరించి.

హము లను రేపిరి. వెంటనే సహోదరులు పౌలును
14 సముద్రము యొద్దికి వెళ్లనంపిరి. । అయితే సీలయు,
15 తిమొతెయు అక్కడ ఉండిరి. । అప్పుడు పౌలును
సాగనంప వెళ్లినవారు అతని అతేనై మట్టుకు తీసు
కొని వచ్చి, సీలయు తిమొతెయును శక్యమైనంత
శీఘ్రముగా తన యొద్దికి రా వలెననే ఆజ్ఞను పొంది
బైలుదేరిపోయిరి.
16 అయితే అతేనైలో పౌలు వారి కొరకు కనిపెట్టు
చుండి, ఆ పట్టణము విగ్రహములతో నిండియుండుట
చూచుచుండగా, అతని ఆత్మ అతనిలో రేపబడెను,।
17 గనుక సునగోగులో యూదులతోను, భక్తిగల వారి
తోను, ప్రతిదినమున సంతవీధిలో కలుసుకొనే వారి
తోను ప్రసంగించుచుండెను.
18 అప్పుడు ఎపికూరీయులలోను స్తోయికులలోనున్న
కొందరు విద్వాంసులు అతనితో యెదురాడిరి. కొం
దరు— ఈ వదురుబోతు ఏమి పలుకునో అనియు,
మరికొందరు—వీడు అన్య దేవతలను తెలిపేవాడుగా
కనబడుచున్నాడనియు చెప్పుకొనిరి; ఎందుకనగా అత
డు యేసుని గూర్చి, పునరుత్థానమును గూర్చి సువార్తను
19 వారికి ప్రకటించెను. । కాబట్టి వారు అతని పట్టుకొని
అరెయొపగనే కొండకు* తీసుకొని వెళ్లి—నీవు చేయు
చున్న ఈ నూతన బోధ యేమిటో మేము తెలుసు
20 కొన వచ్చునా? । కొన్ని ఆశ్చర్యమైన సంగతులు మా
చెవులకు వినిపించుచున్నావు గనుక వీటి భావము యే
మిటో మేము తెలియ కోరుచున్నామని పలికిరి. ।
21 అయితే అతేనైయులందరికిని, అక్కడి పరవాసుల
కును కొత్తది ఏదైనను చెప్పుటకు, వినుటకును గాక
వేరే దేనికిని అవకాశము లేదు.
22 అప్పుడు పౌలు అరెయొపగనే కొండ మధ్యను
నిలిచి చెప్పినదేమనగా — అతేనై మనుష్యులారా!
మీరు సమస్త విషయములయందు అతిభక్తి గలవారై
23 యున్నారని నాకు కనబడుచున్నది; । నేను సంచరిం
చుచు మీ ఆరాధనములు† చూచుచుండగా, ఒక వే
దిక నాకు కనబడెను. దాని మీద—తెలియబడని దేవు
నికి అని వ్రాయబడెను. కాబట్టి మీరు ఎవని‡ ఎరు
గక ఆరాధించుచున్నారో, వానినే నేను మీకు తె
24 లియ చేయుచున్నాను. । జగత్తును, అందులోని సమ
స్తమును నిర్మించిన దేవుడు, తానే ఆకాశమునకు,
భూమికి ప్రభువై యున్నందున, హస్తకృతములైన ఆల
25 యములలో నివసించడు. । మరియు, ఆయన అందరికిని
జీవము, ఊపిరి, సమస్తమును దయచేసేవాడై యున్నా
డు గనుక,తనకు మరి యేదైనను కావలసినట్టు మనుష్యుల
చేత సేవించబడడు. । మరియు యావద్భూమి మీద 26
కాపురముండుటకు, ఆయన ఏక రక్తమువల్ల సకల రా
ష్ట్రముల మనుష్యులను సృష్టించి, వారు ఒక వేళ
దేవుని తడువులాడి కనుగొందురేమో అని । ఆయనను 27
వెతికే నిమిత్తము, నిర్ణయించబడిన కాలమును, వారి
నివాసస్థలముయొక్క పొలిమేరలనును ఏర్పరిచెను.
అయినను, ఆయన మనలో ఎవనికిని దూరముగా
ఉండుటలేదు; । మనము ఆయన వల్ల బ్రతుకుచున్నా 28
ము, చలించుచున్నాము, ఉంటున్నాము. అటువలె—
మనము అతని సంతానమని మీ కవీశ్వరులలో కొం
దరు చెప్పియున్నారు. । కాబట్టి మనము దేవుని సం 29
తానమై యుండి, మనుష్యుల చమత్కార కల్పనలవల్ల
చెక్కబడిన బంగారమునైనను, రాతినైనను, దైవము పో
లియున్నదని తలంచ కూడదు. । ఆ అజ్ఞానకాలములు 30
దేవుడు చూడనట్టుగా ఉండెను. అయితే ఇప్పుడు
అందరు అంతట మనస్సు తిప్పుకొన వలెనని మనుష్యు
లకు ఆజ్ఞాపించుచున్నాడు; । ఎందుకనగా తాను నియ 31
మించిన మనుష్యుని వల్ల, న్యాయము చొప్పున, భూ
లోకమునకు తీర్పు చేయబోయే దినము నిర్ణయించి
యున్నాడు. చనిపోయిన వారిలోనుంచి ఆయనను
లేపుటవల్ల అందరికిని దీని నమ్ముటకు హేతువు అగప
రిచి యున్నాడని పలికెను.
చనిపోయిన వారి పునరుత్థానమును గూర్చి వారు 32
వినినప్పుడు, కొందరు అపహాస్యము చేసిరి; మరి కొం
దరు—దీని గూర్చి నీవు చెప్పేది మళ్లి విందుమని
పలికిరి. । ఆలాగు ఉండగా పౌలు వారి మధ్యనుంచి 33
వెళ్లెను. అయితే కొందరు మనుష్యులు అతని హత్తు
కొని, విశ్వసించిరి. । వారిలో అరెయొపగీతుడైన దియొ 34
నుసియు, దమరి అనే పేరు గల స్త్రీయు, వీరితో కూడా
మరి కొందరును ఉండిరి.

## 18. అధ్యాయము.

అటుతరువాత పౌలు అతేనైనుంచి బైలుదేరి, కొ 1
రింతుకు వచ్చెను. । యూదులందరు రోమేను విడిచి 2
వెళ్ల వలెనని, క్లౌది ఆజ్ఞాపించినందున, పొంతులో పుట్టి
ఈతలియనుంచి కొత్తగా వచ్చిన అకుల అనే పేరుగల
ఒక యూదుని, అతని భార్యయైన ప్రిస్కిల్లను
చూచి, వారి యొద్దికి వెళ్లెను. । వారు తమ వృత్తి ప్ర 3

* లేక, ఆ కొండమీదనున్న సభకు. † లేక, దేవస్థానాదులను. ‡ కొన్నిప్రతులలో, దేని...దాని.

కారము డేరా పని చేసేవారు గనుక అతడును ఆ పని
వాడైనందున, వారి యొద్దనుండి పనిచేయుచుండెను. ।
4 అయితే ప్రతి సబ్బాతువారమున అతడు సునగోగు
లో ప్రసంగించుచు యూదులను హెల్లేనీయులను
ప్రేరేపించుచుండెను.*
5 సీలయు, తీమొతెయు మకెదొనియనుంచి వచ్చి
నప్పుడు, పౌలు వాక్యమందు† ఆతురత గలవాడై యే
సే క్రీస్తని యూదులకు సాక్ష్యము చెప్పుచుండెను. ।
6 అయితే వారు యెదురాడి దూషించినప్పుడు, అతడు
తన వస్త్రములు దులుపుకొని—మీ రక్తము మీ తల
మీదనే ఉండుగాక; నేను పవిత్రుడను; ఇకమీదట
రాష్ట్రముల యొద్దికి పోదునని వారితో చెప్పి, అక్కడ
నుంచి వెళ్లి దైవభక్తిగల యూస్తు అనే ఒకని ఇంటికి
7 వచ్చెను. । అతని ఇల్లు సునగోగుతో కలిసి యుండె
8 ను. । అయితే ఆ సునగోగు అధికారియైన క్రీస్పు
తన ఇంటివారందరితో కూడా ప్రభువుయందు విశ్వా
సముంచెను. మరియు, కొరింతీయులలో అనేకులు
9 వింటూ విశ్వసించి బాప్తిస్మము చేయించుకొనిరి. । అప్పు
డు ప్రభువు రాత్రివేళ దర్శనమందు పౌలుతో—
నీవు భయపడక మాటలాడుము, మౌనముగా ఉండ
కుము; నేను నీకు తోడై యున్నాను; నీకు కీడు చేయు
10 టకు నీ మీద ఎవడును పడడు; । ఈ పట్టణములో
11 నాకు విస్తార జనము ఉన్నదని పలికెను. । అప్పుడు
అతడు వారిలో, దేవుని వాక్యము బోధించుచు, ఒక
సంవత్సరము మీద ఆరునెలలు అక్కడ నివసించెను.
12 అయితే గల్లియోను అకైయకు అధిపతియైనప్పుడు
యూదులు ఏక మనస్సుతో పౌలుకు విరోధముగా
లేచి న్యాయపీఠము యొద్దికి అతని పట్టుకొని వచ్చి।
13 —వీడు బోధనప్రమాణమునకు వ్యతిరిక్తముగా దేవుని
ఆరాధించుటకు మనుష్యులను ప్రేరేపించుచున్నాడని
పలికిరి.
14 పౌలు నోరు తెరవబోవుచున్నప్పుడు, గల్లియో
ను—యూదులారా! ఇది ఒక అన్యాయమైనను, కపట
దుష్కార్యమైనను కలిగినదైతే, యుక్తము చొప్పున నేను
15 మీ మాట సహనముగా విందును. । అయితే ఇది మాట
లను గూర్చి పేళ్లను గూర్చి మీ బోధనప్రమాణమును
గూర్చి వివాదమైతే, మీరే దాని చూచుకొనండి;
ఈలాటి సంగతులను గూర్చి న్యాయాధిపతినై యుండు
టకు నాకు మనస్సు లేదని యూదులతో చెప్పి, ।
16 వారిని న్యాయపీఠము యొద్దనుంచి తోలివేసెను. ।
17 అప్పుడు హెల్లేనీయులందరు సునగోగు అధికారియైన
సోస్తెనేను పట్టుకొని, న్యాయపీఠము యెదుట కొట్టిరి;
అయితే గల్లియోనుకు వీటిలో దేని గూర్చియు చింత
లేదు.
పౌలు ఇంకా బహు దినములు అక్కడ ఉండిన 18
తరువాత, సహోదరులయొద్ద సెలవు పుచ్చుకొని
తనకు మ్రొక్కుబడి ఉన్నందున కెంక్రేయలో తల
క్షౌరము చేయించుకొని ఓడనెక్కి సురియకు బైలుదే
రెను. ప్రిస్కిల్ల అకుల అనేవారు అతనితో కూడా
ఉండిరి. । అతడు ఎపెసుకు వచ్చి అక్కడ వారిని 19
విడిచెను; అయితే అతడు సునగోగులో ప్రవేశించి
యూదులతో ప్రసంగించుచుండెను. । వారు ఇంకా 20
కొంత కాలము తమ యొద్ద ఉండుటకు అతని వేడు
కొనుచుండగా, । అతడు సమ్మతించక (—నేను యెరూ 21
షలేములో వచ్చే పండుగను అవశ్యముగా ఆచరించ
వలెనుకాని) దేవునికి ఇష్టమైతే మీ యొద్దికి తిరిగి వత్తు
నని చెప్పి, వారి యొద్ద సెలవు పుచ్చుకొని ఎఫెసు
నుంచి ఓడెక్కి వెళ్లెను. । అప్పుడు కైసరైయ యొద్ద 22
దిగి వెళ్లి, సంఘపు వారి క్షేమమడిగి, అంతియొకైయ
కు వచ్చెను. । అక్కడ కొంత కాలముండిన తరువాత, 23
బైలుదేరి గలతియ ఫ్రుగియ దేశములయందు క్రమక్రమ
ముగా సంచరించుచు శిష్యులనందరిని స్థిరపరిచెను.
అప్పుడు అలెక్సంద్రియలో పుట్టి, వాక్చాతుర్య 24
ము కలిగి, లేఖనముల యందు గట్టివాడైన అపొల్లో
అనే పేరుగల ఒక యూదుడు ఎఫెసుకు వచ్చెను. ।
అతడు ప్రభువు మార్గమందు ఉపదేశించబడి, ఆత్మ 25
తీక్ష్ణత గలవాడై యోహానుయొక్క బాప్తిస్మము మా
త్రమే తెలుసుకొని, ప్రభువును గూర్చిన సంగతులు
శ్రద్ధగా చెప్పి బోధించుచుండెను. । అతడు సునగో 26
గులో ధైర్యముగా పలుకనారంభించినప్పుడు, అకుల
యు, ప్రిస్కిల్లయు విని, అతని చేర్చుకొని దేవుని మా
ర్గము మరింత పూర్తిగా అతనికి విశదపరిచిరి. ।
తరువాత అతడు అకైయకు వెళ్లుటకు కోరినప్పుడు, 27
సహోదరులు ప్రోత్సాహపరిచి, అతని చేర్చుకొన
వలెనని అక్కడి శిష్యులకు వ్రాసిరి. అతడు అక్కడ
చేరి (దేవుని) దయవల్ల విశ్వసించిన వారికి నిండా సహా
యము చేసెను; । అతడు లేఖనముల ద్వారా, యేసే 28
క్రీస్తని దృష్టాంతపరిచి, బహిరంగముగా యూదులను
గట్టిగా ఖండించుచుండెను.

## 19. అధ్యాయము.

అపొల్లో కొరింథులో ఉన్నప్పుడు జరిగినదేమన 1
గా—పౌలు పైదేశములలో సంచరించి ఎఫెసుకు వచ్చి

* లేక, సమ్మించుచుండెను. † కొన్ని ప్రతులలో—తన ఆత్మయందు.

కొందరు శిష్యులను చూచి—మీరు విశ్వసించి పరిశు
2 ద్ధాత్మను పొందితిరా? అని వారిని అడిగెను. । అందుకు
వారు — పరిశుద్ధాత్మ ఉన్నదనే సంగతి మేము విననే
3 లేదని చెప్పిరి. । అప్పుడు అతడు—ఆలాగైతే మీకు దేని
విషయము బాప్తిస్మము చేయించబడెనని వారిని అడి
గెను. అందుకు వారు—యోహాను బాప్తిస్మము విష
యమే అనిరి.
4 అందుకు పౌలు—యోహాను, తన వెనుక వచ్చుచున్న
వాని యందు అనగా, యేసు యందు విశ్వాసముంచ
వలెనని జనులతో చెప్పుచు, మారు మనస్సు విషయ
5 మైన బాప్తిస్మము చేయించెనని పలికెను. । వారు ఆ మా
టలు విని ప్రభువైన యేసు పేరట బాప్తిస్మము చేయిం
6 చుకొనిరి. । తరువాత పౌలు వారి మీద చేతులు ఉం
చినప్పుడు, పరిశుద్ధాత్మ వారి మీదికి వచ్చెను. అప్పుడు
వారు అన్యభాషలతో మాటలాడుచు ప్రవచించు
7 చుండిరి. । ఆ పురుషులందరు కొంచెము ఎక్కువ తక్కువ,
పన్నెండుగురు.
8 తరువాత అతడు సునగోగులో ప్రవేశించి మూడు
నెలల మట్టుకు ప్రసంగించుచు, దేవుని రాజ్యమును
గూర్చినవి నమ్ముటకు ప్రేరేపించుచు, ధైర్యముగా మా
9 టలాడుచుండెను. । అయితే కొందరు కఠినపరచుకొని,
విశ్వసించక, సమూహము యెదుట మార్గమును నిందిం
చుచున్నప్పుడు, అతడు వారిని విడిచి, శిష్యులను వేరు
పరచుకొని, ప్రతి దినము తురన్ను అనే పేరుగల ఒ
10 కని పాఠశాలలో ప్రసంగించుచుండెను. । ఈలాగున
రెండేండ్ల పర్యంతము ఉండెను గనుక ఆసియలో కా
పురమున్న యూదులందరును హెల్లేనీయులందరును।
11 ప్రభువైన యేసుయొక్క వాక్యము వినిరి. । మరియు
దేవుడు పౌలు చేత విశేషమైన అద్భుత కార్యములను
12 చేయించెను. । అతని శరీరమునకు తగిలిన చేతిగుడ్డలై
నను నడికట్లయినను రోగుల యొద్దికి తేబడినప్పుడు
రోగములు వారిని విడిచెను; దురాత్మలు కూడా వదలి
పోయెను.
13 అప్పుడు తిరుగుచు, ఉచ్చాటన చేసే యూదులలో
కొందరు — పౌలు ప్రకటించే యేసుతోడు మిమ్ము
ఉచ్చాటన చేయుచున్నానని, దురాత్మలుగల వారి
మీద ప్రభువైన యేసుయొక్క నామము పలుకుటకు
14 పూనుకొనిరి. । యూదుడైన స్కేవనే ఒక ప్రధానయా
జకుని యేడుగురు కుమారులు ఆలాగు చేయుచుండిరి. ।
15 అప్పుడు ఆ దురాత్మ—నేను యేసుని ఎరుగుదును, పౌ
లును కూడా ఎరుగుదును, అయితే మీరు ఎవరు? అని
ఉత్తరమిచ్చెను. । అప్పుడు ఆ దురాత్మ పట్టిన మనుష్యుడు 16
వారి మీద ఎగిరిపడి, ఇద్దరిని లోపరచుకొని, వారిని
గెలిచెను. అందువల్ల వారు దిగంబరులును గాయము
గలవారునై ఆ ఇంటిలోనుంచి పారిపోయిరి.
ఇది ఎఫెసులో కాపురమున్న సమస్తమైన యూదుల 17
కును హెల్లేనీయులకును తెలియబడినప్పుడు, వారందరికి
భయము కలిగెను. అందువల్ల ప్రభువైన యేసు నామ
ము మహిమపరచబడెను. । అప్పుడు విశ్వసించినవారి 18
లో అనేకులు వచ్చి తమ క్రియలను, ఒప్పుకొని తెలి
యచేసిరి. । మరియు మాంత్రిక విద్యలు చేసిన వారిలో 19
అనేకులు తమ పుస్తకములు తెచ్చి, అందరి యెదుట
వాటిని కాల్చివేసిరి. వారు లెక్క చేసి వాటి వెల ఏబది
వేల వెండి (దేనారములని*) తెలుసుకొనిరి. । ఇంత 20
బలముగా ప్రభువుయొక్క వాక్యము హెచ్చి ప్రబల
మాయెను.
అటుతరువాత పౌలు మకెదోనియ, అఖైయ దేశ 21
ముల ద్వారా వచ్చి, యెరూషలేము వెళ్లుటకు ఆత్మ
లో† ఉద్దేశించుకొని—నేను అక్కడ ఉండినతరువాత,
రోమేను కూడా చూడ వలెననుకొనెను. । అప్పుడు 22
తనకు పరిచర్య చేసే వారిలో తీమొథెయు, ఎరస్తు
అనే వారిద్దరిని మకెదోనియకు పంపి, తాను ఆసియ
లో కొంతకాలము నిలిచి యుండెను.
ఆ కాలమందు మార్గమును‡ గూర్చి చాలా అల్లరి 23
పుట్టెను;। ఏలాగనగా— ఆర్తెమి దేవికి వెండి గుళ్లను 24
చేయించే దేమేత్రి అనే పేరు గల ఒక కంసాలి ఆ
పనివారికి బహుగా ఆదాయము కలుగచేయుచుం
డెను. । అతడు వారిని, అటువంటి పని మీద ఉన్న 25
ఇతరులనును గుంపు కూర్చి—అయ్యలారా! ఈ పని
వల్ల మనకు జీవనము కలుగుచున్నదని మీకు తెలుసు
ను. । అయితే చేతులవల్ల చేయబడినవి దేవతలు కావని 26
ఈ పౌలు ఎఫెసులో మాత్రమే కాదు, కొంచెమె
క్కువ తక్కువగా ఆసియయందంతట చాలామంది
ప్రజలను సమ్మతిపరిచి తిప్పియున్నాడని మీరు చూచి
వినియున్నారు. । మరియు ఈ మన ఉద్యోగము తిర 27
స్కరించబడుట మాత్రమే కాకుండా, మహా దేవియైన
ఆర్తెమియొక్క గుడి కూడా అలక్ష్యము చేయబడి ఆసి
య యావత్తు, భూలోకము యావత్తును పూజించేదాని
మాహాత్మ్యము నశించిపోవుననే భయము మనకు కలిగి
యున్నదని వారితో పలికెను.
వారు (ఆ మాటలు) విని కోపముతో నిండుకొని 28
— ఎఫెసీయుల ఆర్తెమి గొప్పదని కేకలు వేసిరి. ।

*దేనారము 1-కి అయిదణాలచొప్పున యివి 17,187 రూ. †లేక, వల్ల. ‡అనగా, క్రీస్తు మతము.

29 అప్పుడు పట్టణమంతయు గలిబిలితో నిండి యుండెను.
మరియు వారు పౌలుతో ప్రయాణమై వచ్చిన మకె
దొనియవారైన గాయును అరిస్తార్ఖును పట్టుకొని,
30 ఏకముగా నాటకశాలలోనికి చొరబడిరి.।అంతట పౌలు
జనుల యొద్ద ప్రవేశించుటకు కోరినప్పుడు, శిష్యులు
31 అతని వెళ్లనియ్యలేదు.। మరియు అతనికి స్నేహితులైన
ఆసియ దేశాధికారులలో కొందరు—నీవు నాటకశాల
లోనికి వెళ్ల వద్దని అతని వేడుకొనుటకు అతని యొద్దికి
32 వర్తమానము పంపిరి.। కాబట్టి కొందరు ఈలాగున
కొందరు ఆలాగున కేకలు వేసిరి; ఆ సంఘము గలిబి
లిపడెను. ఎందు నిమిత్తము తాము కూడుకొనిరో
33 చాలామందికి అది తెలియబడలేదు.। అప్పుడు యూ
దులు అలెక్సంద్రును ముందుబెట్టగా, సమూహములో
నుంచి* అతని యెదుటికి నడిపించిరి. అప్పుడు అలె
క్సంద్రు చేసైగ చేసి, జనులతో ఉత్తరము చెప్పుకొన
వలెనని యుండెను.
34 అయితే అతడు యూదుడని వారు తెలుసుకొని
నప్పుడు, అందరు ఏకశబ్దముతో అయిదు గడియల
మట్టుకు—ఎఫెసీయుల అర్తెమి గొప్పదని కేక వేసిరి.
35 అయితే కరణము, సమూహమును సముదా
యించి—ఎఫెసీ మనుష్యులారా! ఎఫెసీయుల పట్ట
ణము గొప్ప అర్తెమిదేవికి, ద్యుపతి యొద్దనుంచి
పడిన విగ్రహమునకు కావలియై యున్నదని తెలి
36 యని మనుష్యుడు ఎవడు?। ఇవి ఎదురాడ కూడనివై
యున్నవి గనుక మీరు ఊరకుండి, యేదియు ఆ
37 తురపడి చేయకుడి;। గుడి దోచకను, మీ దేవ
తను దూషించకుండే ఈ మనుష్యులను తీసుకొని
38 వచ్చితిరి.। కాబట్టి దేమేత్రికిని, అతనితో కూడా
ఉన్న కంసాలులకును ఎవని మీదనైనను ఒక మాట
చెప్ప వలెనని ఉంటే, న్యాయవిమర్శ దినములు కలవు,
మరియు అధిపతులు ఉన్నారు. వారు ఒకనితో ఒక
39 డు వ్యాజ్యమాడ వచ్చును.। అయితే మీరు ఇతర సం
గతులను గూర్చి, ఏమైనను విచారణ చేయ వలెనని
యుంటే, అది న్యాయ సభలో తీర్పు చేయబడును.।
40 మనము ఈ గలిబిలిని గూర్చి చెప్పుకొనుటకు శక్యమై
న హేతువు ఏమియు లేనందున, నేటి అల్లరిని గూర్చి
విచారించబడుదుమేమో అని భయమవుచున్నదని వా
41 రితో పలికెను.। అతడు వీటిని చెప్పి ఆ సంఘమును
పంపివేసెను.

## 20. అధ్యాయము.

1 ఆ అల్లరి అణగిన తరువాత, పౌలు శిష్యులను
తన యొద్దికి పిలిచి కౌగలించుకొని, మకెదొనియకు
వెళ్లుటకు బైలుదేరి,। ఆ ప్రదేశములయందు సంచ 2
రించి చాలా మాటలతో వారికి బోధపరిచి హెల్లకు
వచ్చెను.। అతడు అక్కడ మూడు నెలలు గడిపి 3
ఓడెక్కి సురియకు వెళ్ల వలెనని యున్నప్పుడు, తన
కొరకు యూదులు పొంచియున్నారని తెలిసి, మకె
దొనియ ద్వారా తిరిగి వచ్చుటకు నిర్ణయించుకొ
నెను.।మరియు పుర్రు కుమారుడును బెరైయ దేశస్థుడు 4
నైన సోపత్రును, థెస్సలోనీకులలో అరిస్తార్ఖును,
సెకుందును, దెర్బే పట్టణస్థుడైన గాయును, తిమోథె
యును, ఆసియ దేశస్థులైన తుకికు, త్రోఫిము అనే
వారును ఆసియ మట్టుకు అతనితో కూడా వచ్చిరి.।
వీరు ముందుగా వెళ్లి త్రోయలో మా కొరకు కనిపె 5
ట్టుచుండిరి.। అయితే పొంగని† రొట్టెల దినములైన 6
తరువాత మేము ఓడెక్కి ఫిలిప్పియు‡ విడిచి, ఐదు దిన
ములైన పిమ్మట త్రోయలో వారి యొద్దికి వచ్చి అక్కడ
ఏడు దినములు గడిపితిమి.
మరియు ఆదివారమున మేము§ రొట్టె విరుచుటకు 7
కూడినప్పుడు, పౌలు, మరునాడు వెళ్లనైయుండి, వారి
తో ప్రసంగించుచు అర్ధరాత్రి మట్టుకు, విస్తరించి
మాటలాడుచుండెను.। వారు కూడియున్న మేడ గది 8
లో అనేక దీపములు ఉండెను.। అప్పుడు ఐతుకు 9
అనే పేరుగల ఒక పడుచువాడు కిటికి ద్వారమందు
కూర్చుండి గాఢనిద్రపోయి, పౌలు విస్తరించి ప్రసం
గించుచుండగా, నిద్రాభారమువల్ల జోగి, మూడవ
అంతస్తునుంచి కింద పడి చనిపోయినవాడై యెత్తబ
డెను.। తరువాత పౌలు కిందికి వెళ్లి అతని మీద పడి 10
కౌగలించుకొని — మీరు తొందరపడకండి; అతనికి
ప్రాణము ఉన్నదని వారితో చెప్పెను.। అతడు తిరిగి 11
మీదికి వచ్చి, రొట్టె విరిచి, భక్షించి, తెల్లవారేమట్టుకు
మిక్కిలి సంభాషించి, బైలుదేరెను.। వారు సజీవుడైన 12
ఆ పడుచువాని తీసుకొని వచ్చినప్పుడు, వారికి అన
ల్పమైన నెమ్మది కలిగెను.
అయితే మేము ముందుగా ఓడెక్కి, అస్సులో 13
పౌలును ఎక్కించుకొన వలెనని అక్కడికి వెళ్లితిమి;
అతడు తాను నడిచి వెళ్ల వలెనని, ఆ ప్రకారముగా
మాకు నియమించి యుండెను.। అస్సులో అతడు 14
మాతో కలుసుకొనినప్పుడు మేము అతని ఎక్కించు
కొని, మితులేనేకు వచ్చితిమి.। అక్కడనుంచి వెళ్లి 15
మరునాడు ఖీయొకు యెదురుగా వచ్చితిమి. మరు
నాడు సామొకు చేరి త్రోగుల్లియులో ఉండి, మరు
నాడు మిలేతుకు వచ్చితిమి;। ఎందుకనగా పౌలు 16
ఆసియలో కాలము గడపకుండే నిమిత్తము, ఎఫెసును

* లేక, సమూహములో కొందరు. †నిర్గమకాండము. 12:అ.18.వ. ‡ఒక పట్టణము. §కొన్ని ప్రతులలో—శిష్యులు.

దాటి వెళ్లుటకు నిర్ణయించుకొని యుండెను. అతడు
తనకు సాధ్యమైతే, పెంతెకొస్తనే దినమున యెరూష
లేములో ఉండ వలెనని త్వరపడుచుండెను.
17 అతడు మిలేతునుంచి ఎఫెసుకు పంపి సంఘపు
18 పెద్దలను పిలిపించెను. । వారు తన యొద్దికి వచ్చిన
ప్పుడు, అతడు వారితో ఇట్లనెను—నేను ఆసియకు
వచ్చిన మొదటి దినమునుంచి సర్వకాలము ఏలాగు
మీతో కూడా ఉంటినో మీరు ఎరుగుదురు. ।
19 యూదుల దురాలోచనలవల్ల నాకు సంభవించిన శోధ
నలతోను, కన్నీళ్లతోను, పూర్ణమైన మనోవిన
యముతోను నేను ఏలాగు ప్రభువును సేవించుచు, ।
20 ప్రయోజనమైన వాటిలో యేదియు దాచుకొనక,
బహిరంగముగాను, ఇంటింటను మీకు తెలియచేయు
21 చు, । మీకు ఉపదేశించుచు, దేవుని తట్టు మనస్సు
తిప్పుకొన వలెననియు, మన ప్రభువైన యేసుక్రీస్తు
యందు విశ్వాసముంచ వలెననియు, యూదులకు,
హెల్లేనీయులకును, ఏలాగు సాక్ష్యము చెప్పినానో
22 మీకు తెలుసును. । ఇదుగో! ఇప్పుడు నేను ఆత్మవల్ల
నిర్బంధించబడి, యెరూషలేముకు వెళ్లుచున్నాను. ।
23 బంధకములు, ఆపదలును నా కొరకు కాచుకొని
యున్నవని పరిశుద్ధాత్మ ప్రతి పట్టణములోను నాతో
చెప్పి సాక్ష్యమిచ్చుచున్నదే గాని, అక్కడ నాకు
24 సంభవించబోయేవి తెలియవు. । అయితే నేను వీటిలో
దేనిని లక్ష్యపెట్టక, దేవుని కృపా సువార్తను గూర్చి
సాక్ష్యము చెప్పుటకు నేను ప్రభువైన యేసువల్ల పొం
దిన కొలువు, నా పరుగును సంతోషముతో నెరవే
ర్చే నిమిత్తము నా ప్రాణమైనను నాకు ప్రియమై
నదిగా ఎంచను.
25 ఇప్పుడు ఇదుగో! ఎవరి మధ్యను నేను తిరుగు
లాడుచు, దేవుని రాజ్యమును ప్రకటించుచుంటినో,
ఆ మీరందరు ఇకమీదట నా ముఖము చూడరని
26 యెరుగుదును. । కాబట్టి అందరి రక్తవిషయము నేను
నిరపరాధినని నేడు మిమ్మును సాక్ష్యము పెట్టుచు
27 న్నాను. । నేను దేవుని చిత్తమంతయు మీకు తెలు
28 పకుండా దాచుకొన లేదు. । కావున దేవుడు తన
స్వరక్తమువల్ల సంపాదించిన* సంఘమును పోషించు
టకు† పరిశుద్ధాత్మ మిమ్మును దేనిమీద అధ్యక్షులుగా
ఉంచెనో, ఆ సమస్తమైన మందను గూర్చియు మిమ్ము
29 ను గూర్చియు జాగ్రతపడుడి; । ఎందుకనగా నేను
వెళ్లిన తరువాత క్రూరమైన తోడేళ్లు మీలో ప్రవే
శించునని నాకు తెలుసును. వారు మందయందు కనిక
30 రించరు. । మరియు శిష్యులను తమ వెనుకకు ఈడ్చు
కొనుటకు ప్రతికూలములు పలికే మనుష్యులు మీలో
లేతురు. । అందువల్ల నేను మూడు సంవత్సరములనుంచి, 31
దివారాత్రులు ప్రతి మనుష్యునికిని కన్నీళ్లతో,
మానక బుద్ధి చెప్పితినని మీరు జ్ఞాపకము చేసుకొని
మెళుకువగా ఉండుడి.
ఇప్పుడు సహోదరులారా! దేవునికి ఆయన 32
కృపావాక్యమునకును మిమ్మును అప్పగించుచున్నాను.
ఆయన మిమ్మును అభివృద్ధి పొందించుటకు, పరిశుద్ధ
పరచబడిన వారందరిలో మీకు స్వాస్థ్యమిచ్చుటకును
శక్తిగలవాడు. । ఎవని వెండినైనను బంగారమునైనను 33
వస్త్రమునైనను నేను ఆశించ లేదు; । నా నిమిత్తము, 34
నాతో ఉన్నవారి నిమిత్తమును ఈ నా చేతులు
అక్కర కొలది పని చేసినవని మీకు తెలుసును. ।
మీరు ఈలాగు ప్రయాసపడి బలహీనులను సంర 35
క్షించ వలెననియు, — పుచ్చుకొనుటకంటే ఇచ్చుట
భాగ్యమని ప్రభువైన యేసు చెప్పిన మాటలు జ్ఞాప
కము చేసుకొన వలెననియు, అన్నిటివిషయము మీకు
చూపించితినని పలికెను.
అతడు వీటిని పలికి, వారందరితో మోకాళ్లూని 36
ప్రార్థన చేసెను. । అప్పుడు వారందరు మిక్కిలి 37
ఏడ్చుచు—మీరు ఇకమీదట నా ముఖము చూడరని
అతడు చెప్పిన మాటకు విశేషముగా దుఃఖించి, । పౌలు 38
మెడమీద పడి అతని ముద్దుపెట్టుకొనిరి. అప్పుడు
వారు ఓడదాక అతని సాగనంపిరి.

## 21. అధ్యాయము.

మేము వారిని ఎడబాసి ఓడెక్కి తిన్నగా నడిచి, 1
కోసుకు, మరునాడు రోదుకు, అక్కడనుంచి పతర
కును వచ్చితిమి. । అప్పుడు ఫైనీకేకు వెళ్లనైయున్న 2
ఓడ కనుగొని దాని ఎక్కి బైలుదేరితిమి. । కుప్రను 3
చూచి, దాని ఎడమతట్టు విడిచి, సురియకు వచ్చి,
తురులో దిగితిమి; అక్కడ, ఓడ సరుకు దింపుచుండె
ను. । మేము శిష్యులను వెతికి కనుగొని, అక్కడ ఏడు 4
దినములు ఉంటిమి. వారు—నీవు యెరూషలేముకు వెళ్ల
వద్దని ఆత్మవల్ల పౌలుతో చెప్పిరి.
అయితే మేము ఆ దినములు గడిపిన తరువాత 5
బైలుదేరి వెళ్లితిమి. అప్పుడు వారందరు తమ తమ
భార్యలతోను పిల్లలతోను మమ్మును పట్టణపు వెలపటి
మట్టుకు సాగనంప వచ్చి సముద్రతీరమందు మోకా
ళ్లూని ప్రార్థించి, ఒకని ఒకడు కౌగలించుకొం
టిమి. । అప్పుడు మేము ఓడెక్కితిమి; వారు తమ 6
తమ ఇండ్లకు తిరిగి వెళ్లిరి. । మేము సబురు ముగించి 7

*లేక, కొనిన. †లేక, పరిపాలించుటకు.

తురునుంచి ప్తొలెమాయికి వచ్చి, సహోదరులను
కౌగలించి వారి యొద్ద ఒక దినము ఉంటిమి.
8 మరునాడు మేము బైలుదేరి కైసరైయకు వచ్చి,
ఏడుగురిలో* ఒకడైన ఫిలిప్పు అనే సువార్తికుని
9 ఇంటిలో ప్రవేశించి అతని యొద్ద ఉంటిమి.। ప్రవ
చించే కన్యకలైన నలుగురు కుమార్తెలు అతనికి
ఉండిరి.
10 మేము అనేక దినములు అక్కడనుండగా, అగబు
11 అనే ఒక ప్రవక్త యూదైయనుంచి వచ్చెను.। అత
డు మా యొద్దికి వచ్చి, పౌలు నడికట్టు పట్టుకొని
తన చేతులను కాళ్లను కట్టుకొని—యెరూషలేములోని
యూదులు ఈ నడికట్టు గల మనుష్యుని ఈలాగు
కట్టి, రాష్ట్రముల చేతికి అప్పగింతురని పరిశుద్ధాత్మ
12 చెప్పుచున్నదనెను.। వీటిని వినినప్పుడు, మేమును అక్క
డివారును యెరూషలేముకు వెళ్ల వద్దని అతని వేడు
13 కొంటిమి.। అందుకు పౌలు—ఇదెందుకు? మీరు ఏడ్చు
చు నా హృదయము విరగగొట్టనేల? నేనైతే ప్రభువైన
యేసు నామము నిమిత్తము నేను యెరూషలేములో
బంధించబడుటకు మాత్రమే కాదు, చనిపోవుటకును
14 సిద్ధమై యున్నానని పలికెను.। అతడు సమ్మతించక
న్నప్పుడు మేము—ప్రభువుయొక్క చిత్త ప్రకారము
కలుగుగాకని ఊరకొంటిమి.
15 ఆ దినములైన తరువాత, సామాను కట్టుకొని,
16 యెరూషలేముకు తర్లిపోతిమి.। మరియు కైసరైయ
నుంచి కొందరు శిష్యులు, కుప్రవాడైన మ్నాసోననే
ఒక వృద్ధశిష్యుని యొద్ద ఉండుటకు, మమ్మును తీసు
కొని వెళ్ల వలెనని మాతోకూడా వచ్చిరి.
17 మేము యెరూషలేముకు వచ్చినప్పుడు, సహో
18 దరులు మమ్మును సంతోషముతో చేర్చుకొనిరి.। మరు
నాడు పౌలు మాతో కూడా యాకోబు యొద్దికి
19 వచ్చెను; అక్కడ పెద్దలందరు కూడియుండిరి.। అతడు
వారిని కౌగలించుకొని, తన పరిచర్యవల్ల దేవుడు
రాష్ట్రములలో చేయించినవాటిని వివరముగా తెలియ
చెప్పెను.
20 వారు దాని విని ప్రభువును స్తుతించిరి. అప్పుడు
వారు — సహోదరుడా! విశ్వసించే యూదులు
ఎన్నివేలమంది యున్నారో చూచుచున్నావు; వారం
దరు బోధన ప్రమాణమును గూర్చి ఆసక్తులై యు
21 న్నారు.। అయితే నీవు రాష్ట్రములలో ఉన్న యూ
దులు తమ పిల్లలకు ఛేదనసంస్కారము చేయ వద్ద
నియు, మన ఆచారముల చొప్పున నడవ వద్దనియు
చెప్పుచు వారందరు మోషేను విడుచుటకు బోధించు
చున్నావని వీరు నిన్ను గూర్చి విని యున్నారు। గనుక 22
ఏమి చేయుదము? జనసమూహము నీవు వచ్చి యు
న్నావని విని అవశ్యముగా కూడివచ్చును.। కాబట్టి 23
మేము నీకు చెప్పే ప్రకారము చేయుము. మొక్కు
కొనియున్న నలుగురు మనుష్యులు మా యొద్ద ఉన్నా
రు.। నీవు వారిని తీసుకొని వారితో కూడా శుద్ధిచేసు 24
కొని, వారు తల క్షౌరము చేయించుకొనుటకు వారి
నిమిత్తము ఖర్చు పెట్టుకొనుము. అప్పుడు అం
దరు నిన్ను గూర్చి తమకు తరుచుగా చెప్పబడిన
వాటిలో ఏమియు లేదనియు, నీవును బోధన ప్రమా
ణము గైకొని క్రమముగా నడుచుచున్నావనియు
తెలుసుకొందురు.। అయితే, విశ్వసించిన రాష్ట్రము 25
లను గూర్చి — వారు విగ్రహార్పితమైన వాటిని, రక్త
మును, గొంతుక పిసుకుటవల్ల చచ్చిన వాటిని, జార
త్వమును మాన వలసినదే గాక అటువంటిది ఏదైనను
గైకొన వద్దని నిర్ణయించి వారికి వ్రాసి పంపియు
న్నామనిరి.
అప్పుడు పౌలు ఆ మనుష్యులను తీసుకొని, మరు 26
నాడు వారితో కూడా శుద్ధి చేసుకొని, గుడిలో
ప్రవేశించి, వారిలో ప్రతి వాని కొరకు కానుక
అర్పించబడే వరకు శుద్ధి దినములు నెరవేర్చుదునని
తెలిపెను.
అయితే ఏడు దినములు కావచ్చినప్పుడు, ఆసియ 27
నుంచి వచ్చిన యూదులు గుడిలో అతని చూచి,
సమూహమంతయు రేపి, అతని మీద చేతులు వేసి—
ఇశ్రాయేలు మనుష్యులారా!। సహాయము చేయుడి! 28
ఈ జనులకు, బోధన ప్రమాణమునకు, ఈ స్థలమున
కును విరోధముగా అందరికిని అంతట బోధించు
చున్న మనుష్యుడు వీడే. మరియు వీడు హెల్లేనీ
యులను గుడిలోకి తీసుకొని వచ్చి, ఈ పరిశుద్ధ
స్థలము అపవిత్రపరిచి యున్నాడని కేకలు వేసిరి.।
ఎందుకనగా ఎఫెసీయుడైన త్రొఫిమును అతనితో 29
కూడా పట్టణములో మునుపు చూచినందున, పౌలు
గుడిలోకి అతని తీసుకొని వచ్చెనని తలంచిరి.
అప్పుడు పట్టణమంతయు గలిబిలిగా ఉండెను; 30
జనులు గుంపుగుంపులుగా పరుగెత్తి, పౌలును పట్టు
కొని గుడిలోనుంచి వెలపటికి ఈడ్చిరి. వెంటనే తలు
పులు మూయబడెను.। అయితే వారు అతని చంపు 31
టకు చూచినప్పుడు, యెరూషలేమంతయు కలతపడె

* అ.6: వ.5 చూడుము.

నని రాణువయొక్క సహస్రాధిపతికి వర్తమానము
32 తెలుపబడెను. । వెంటనే అతడు రాణువ వారిని శతా
ధిపతులను తీసుకొని, వారి యొద్దికి పరుగెత్తి వచ్చె
ను. వారు సహస్రాధిపతిని రాణువ వారిని చూచి
పౌలును కొట్టుట మానిరి.
33 అప్పుడు సహస్రాధిపతి దగ్గరకు వచ్చి, అతని
పట్టుకొని, రెండు సంకెళ్లతో వాని బంధించుటకు
ఆజ్ఞాపించి — ఇతడు యెవడు? ఏమి చేసెను? అని
34 అడిగెను. । అయితే సమూహములో కొందరు ఈ
లాగు కొందరు ఆలాగు కేకలు వేయుచున్నప్పుడు,
దొమ్మివల్ల అతడు నిజము తెలుసుకొన లేనందున,
కోటలోకి అతని తీసుకొని పోవుటకు ఆజ్ఞాపించెను. ।
35 అతడు మెట్ల మీద ఉన్నప్పుడు ఆ జనసమూ
హము చేసిన బలాత్కారము నిమిత్తము, అతడు
రాణువవారిచేత మోసుకొనిపోబడిన వాడాయెను; ।
36 ఎందుకనగా — వాని కొనిపొమ్మని జనసమూహము
కేకలువేయుచు వెంబడించెను.
37 పౌలు కోటలోకి తీసుకొని పోబడుచుండి, సహ
స్రాధిపతిని చూచి—నేను నీతో ఒక సంగతి మాట
లాడ వచ్చునా? అని అడిగెను. అందుకు అతడు—
యూనాన భాష నీకు తెలుసునా? ఈ దినములకు మును
38 పు, । కలహము కలుగచేసి నరహంతకులైన నాలుగు
వేలమంది మనుష్యులను అరణ్యమునకు వెంటబెట్టు
కొని వెళ్లిన ఐగుప్తీయుడవు నీవు కావా? అని అడి
గెను.
39 అందుకు పౌలు — నేను తార్సు నివాసమైన
యూదైయ మనుష్యుడను. కిలికియలోని అల్పము
కాని పట్టణమందు పట్టణస్థుడనై యున్నాను. జను
లతో మాటలాడుటకు, నాకు సెలవిమ్మని నిన్ను వేడు
40 కొనుచున్నానని పలికెను. । అతడు సెలవిచ్చిన తరు
వాత, పౌలు మెట్లమీద నిలిచి జనులకు చేసైగ చేసె
ను. చాలా నిశ్శబ్దముగా ఉన్నప్పుడు అతడు హెబ్రీ
భాషతో ఇట్లనెను:—

1 22. అధ్యాయము. సహోదరులారా! తండ్రు
లారా! నేను మీ యెదుట ఇప్పుడు చెప్పుకొనే
2 ఉత్తరము ఆలకించుడి. । అతడు హెబ్రీభాషతో మాట
లాడుట వారు విని మరింత నిశ్శబ్దముగా ఉండిరి. ।
3 అప్పుడు అతడు చెప్పినదేమనగా—నేను కిలికియలో
ఉన్న తార్సులో పుట్టిన యూదైయ మనుష్యుడను;
అయితే ఈ పట్టణములో గమలీయేలు పాదముల
యొద్ద పెంచబడి, మన పితృల బోధనప్రమాణ విధి
చొప్పున, ఉపదేశించబడి, మీరందరు నేడు ఉన్న
ప్రకారము, దేవుని గూర్చి ఆసక్తుడనై యుంటిని. ।
మరియు నేను పురుషులను స్త్రీలను కట్టించుచు చెర 4
సాలలోకి అప్పగించుచు, ఈ మార్గములోని వారిని,
మరణ పర్యంతమును తరిమితిని. । ప్రధానయాజకుడును 5
సభలో పెద్దలందరును ఇందును గూర్చి నాకు సాక్షు
లై యున్నారు; నేను వారివల్ల సహోదరుల కొరకు
ఉత్తరములు పుచ్చుకొని, దమస్కులోనివారు కూడా
శిక్షించబడుటకు వారిని కట్టించి యెరూషలేముకు
తెచ్చుటకు అక్కడికి వెళ్లితిని.
అయితే నేను ప్రయాణము చేయుచు దమస్కుకు 6
సమీపించినప్పుడు నాకు జరిగినదేమనగా, కొంచెము
యెక్కువ తక్కువ మధ్యాహ్న కాలమందు, ఆకాశ
మునుంచి అధికమైన వెలుగు అకస్మాత్తుగా నా చుట్టు
ప్రకాశించెను. । అప్పుడు నేను నేలపడి — సౌలా! 7
సౌలా! ఎందుకు నన్ను తరుముచున్నావని నాతో
పలికిన ఒక శబ్దము వింటిని. । అందుకు నేను — 8
ప్రభువా! నీవు ఎవడవని అడిగినప్పుడు ఆయన—
నేను నీవు తరిమే నజోరీయుడనైన యేసునై యున్నా
నని నాతో చెప్పెను. । నాతో కూడా ఉన్నవారు ఆ 9
వెలుగు చూచి భయపడిరి, గాని నాతో పలికినవాని
శబ్దము వారు విన లేదు. । అప్పుడు నేను—ప్రభువా! 10
నేనేమి చేయ వలెనని పలికితిని. అందుకు ప్రభువు
—నీవు లేచి దమస్కులోకి వెళ్లుము; అక్కడ నీవు
చేయ వలెనని నియమించబడినవన్నియు నీకు తెలుప
బడునని నాతో పలికెను. । అయితే ఆ వెలుగుయొక్క 11
మహిమవల్ల నేను చూడ లేనందున, నాతో కూడా
ఉన్నవారి చేత నడిపించబడి దమస్కులోకి వచ్చితిని.
తరువాత, బోధనప్రమాణము చొప్పున భక్తిగల 12
మనుష్యుడును అక్కడ కాపురమున్న యూదులందరివల్ల
మంచి పేరు పొందినవాడునైన, । అననీయ అనే ఒకడు 13
నాయొద్దికి వచ్చి నిలిచి — సహోదరుడా! సౌలా!
కన్నులు తెరిచి చూడుమని నాతో పలికెను. ఆ గడి
యలోనే నేను కన్నులెత్తి అతని చూచితిని. । అప్పుడు 14
అతడు—మన పితృల దేవుడు తన చిత్తమును నీవు తెలు
సుకొనుటకును, ఆ నీతిమంతుని చూచుటకును ఆయన
నోటి శబ్దము వినుటకును నిన్ను నియమించి యు
న్నాడు; । నీవు చూచిన వాటిని వినిన వాటిని పట్టి, 15
సకల మనుష్యుల యెదుట ఆయనకు సాక్షివై యుం
దువు గనుక, । నీవు తడువు చేసుట ఎందుకు? లేచి, 16
ఆయన పేరున ప్రార్థన చేసి బాప్తిస్మము చేయించు
కొని నీ పాపములను కడిగివేసుకొనుమని చెప్పెను.
నేను యెరూషలేముకు తిరిగి వచ్చిన తరువాత గుడి 17
లో నేను ప్రార్థన చేయుచుండగా జరిగినదేమనగా
నేను పరవశుడనై ఆయనను చూచితిని. । అప్పుడు 18

ఆయన — నీవు త్వరపడి శీఘ్రముగా యెరూషలేము
విడిచి వెళ్లుము; నన్ను గూర్చిన నీ సాక్ష్యము వారు
19 అంగీకరించరని నాతో చెప్పెను. । అందుకు నేను—
ప్రభువా! నీయందు విశ్వాసముంచే వారిని నేను చెర
పట్టుచు, ప్రతి సునగోగులో కొట్టించుచుంటినని
20 వారికి బాగా తెలియును. । మరియు సాక్షియైన స్తెఫను
రక్తము చిందించబడినప్పుడు, నేను కూడా దగ్గర
నిలిచి, సమ్మతించి, అతని చంపుచున్న వారి బట్టలు
21 కాపాడుచుంటినని చెప్పితిని. । అందుకు ఆయన—
వెళ్లుము; నేను దూరముగా రాష్ట్రముల యొద్దికి నిన్ను
పంపుదునని నాతో చెప్పెననెను.
22 ఈ మాట దాకా, వారు అతడు చెప్పినదాని
ఆలకించుచుండిరి. అప్పుడు — ఇటువంటివాని, భూ
మిమీదనుంచి కొనిపొమ్ము; వాడు బ్రతుకుట తగదని
23 కంఠమెత్తి పలికిరి. । వారు కేకలు వేయుచు, తమ బట్ట
లు విదల్చుకొని ఆకాశము తట్టు ధూళి యెత్తి పోయు
24 చుండగా, । సహస్రాధిపతి అతనికి విరోధముగా
వారు ఈలాగు కేకలు వేసిన హేతువు ఏమని తెలుసు
కొనుటకు, బెత్తములతో అతని కొట్టి విమర్శించ వలె
నని చెప్పి, కోటలోకి అతని తీసుకొని వెళ్లుటకు ఆజ్ఞా
25 పించెను. । అయితే వారు వారులతో అతని కట్టుచున్న
ప్పుడు, పౌలు తన దగ్గర నిలిచిన శతాధిపతిని చూ
చి—శిక్ష విధించబడని రోమీయుడైన మనుష్యుని
26 కొట్టుటమీకు న్యాయమా? అని అడిగెను. । శతాధిపతి
ఆ! మాట విని, సహస్రాధిపతి యొద్దికి, వచ్చి—నీవు
ఏమి చేయబోవుచున్నావు! ఈ మనుష్యుడు రోమీ
27 యుడని చెప్పెను. । అప్పుడు సహస్రాధిపతి వచ్చి అతని
చూచి నీవు రోమీయుడవా? నాతో చెప్పుమనెను. ।
28 అందుకు అతడు—అవునని పలికెను. అప్పుడు సహస్రా
ధిపతి—నేను బహు ద్రవ్యమిచ్చి ఈ ఆధిక్యము పొంది
తినని ఉత్తరమిచ్చెను. అందుకు పౌలు—అయితే నేను
29 పుట్టువుతోడనే పొందితిననెను. । కాబట్టి అతని కొట్టి
విమర్శించబోయినవారు వెంటనే అతని విడిచి పో
యిరి. మరియు సహస్రాధిపతి కూడా అతడు రోమీ
యుడని తెలుసుకొన్నప్పుడు, తాను అతని కట్టించినం
దున భయపడెను.
30 మరునాడు యూదులచేత అతని మీద మోపబడిన
నేరము ఎటువంటిదో తాను నిశ్చయముగా తెలుసు
కొనుటకు ఇచ్ఛయించి, బంధకములనుంచి అతని వద
లించి ప్రధానయాజకులును వారి సభవారందరును
కూడి వచ్చుటకు ఆజ్ఞాపించి, పౌలును తీసుకొని వచ్చి
వారి యెదుట అతని నిలువబెట్టెను.

## 23. అధ్యాయము.

అప్పుడు పౌలు సభను తేరిచూచి—నా సహోదరు 1
లారా! నేను నేటివరకు కేవలము నిర్మలమైన మనస్సా
క్ష్యముతో దేవుని యెదుట నడుచుకొంటినని పలికెను.
అందువల్ల ప్రధానయాజకుడైన అననీయ అతని 2
నోటిమీద కొట్టుటకు, దగ్గర నిలిచియున్న వారికి
ఆజ్ఞాపించెను. । అప్పుడు పౌలు అతని చూచి—తెలుపు 3
చేయబడిన గోడా! దేవుడు నిన్ను కొట్టబోవుచున్నా
డు; నీవు బోధన ప్రమాణము చొప్పున, నాకు తీర్పు
చేయుటకు కూర్చుండి, । బోధనప్రమాణమునకు విరో 4
ధముగా నన్ను కొట్టుటకు ఆజ్ఞాపించుచున్నావా అని
పలికెను. అందువల్ల దగ్గర నిలిచినవారు—నీవు దేవుని
ప్రధానయాజకుని దూషించ వచ్చునా? అని పలికెను. ।
అందుకు పౌలు—సహోదరులారా! ఇతడు ప్రధాన 5
యాజకుడని నాకు తెలియలేదు.—నీ జనుల అధిపతిని
నిందించ వద్దని వ్రాయబడి యున్నదనెను.
వారిలో కొందరు సద్దూకైయులు, మరికొందరు 6
ఫరిసైయులునై యున్నారని పౌలు తెలుసుకొని—
సహోదరులారా! నేను ఫరిసైయుడను, పరిసైయుల
కుమారుడనై యున్నాను. చనిపోయిన వారి పునరు
త్థాన నిరీక్షణను గూర్చి నేను విమర్శించబడుచున్నా
నని, సభలో నోరెత్తి పలికెను.
అతడు అది చెప్పినప్పుడు ఫరిసైయులకును సద్దూ 7
కైయులకును వాదము కలిగెను. అప్పుడు ఆ సమూ
హము విభాగించబడెను. । ఎందుకనగా సద్దూకైయులు 8
పునరుత్థానము లేదనియు, దేవదూతయైనను ఆత్మయై
నను లేదనియు చెప్పుచున్నారు. అయితే ఫరిసైయులు
ఆ రెండును కలవని ఒప్పుకొంటున్నారు. అప్పుడు
మిక్కిలి కేకలు వేయబడెను. । ఫరిసైయుల పక్షముగా 9
ఉన్న శాస్త్రులు లేచి వాదించుచు—ఈ మనుష్యుని
యందు ఏ దోషమును మాకు కనబడలేదు; ఆత్మయైనను
దేవదూతయైనను అతనితో మాటలాడియుంటేనేమి!
[మనము దేవునికి విరోధముగా పోరాడ కూడదు]
అని చెప్పిరి. । అయితే నిండా వాదము కలిగినప్పుడు 10
పౌలు వారివల్ల ముక్కలు ముక్కలుగా చేయబడు
నేమో అని సహస్రాధిపతి భయపడి, రాణువవారు
వెళ్లి వారి నడుమనుంచి బలవంతముగా అతని పట్టు
కొని కోటలోకి రప్పించుటకు ఆజ్ఞాపించెను.
ఆ రాత్రి, ప్రభువు అతని యొద్ద నిలిచి — పౌలా! 11
ధైర్యముగా ఉండుము; యెరూషలేములో నీవు నన్ను
గూర్చి బాగా సాక్ష్యమిచ్చిన లాగున రోమేలోను
సాక్ష్యము చెప్ప వలెనని పలికెను.

12 ఉదయమైనప్పుడు యూదులు ఏకీభవించి, తాము
పౌలును చంపే పర్యంతము తినము తాగము అని
13 ఒట్టువేసుకొనిరి. । ఈలాగు కుట్రచేసినవారు నలుబది
14 మందికంటే ఎక్కువగా ఉండిరి. । వారు ప్రధానయా
జకుల యొద్దికి పెద్దల యొద్దికిని వచ్చి—మేము పౌలును
చంపే పర్యంతము దేని రుచియు చూడమని శపథ
15 ముతో ఒట్టువేసుకొని యున్నాము. । కాబట్టి మీరు
సభతో కూడా అతని గూర్చి మరి సరిగా విచారించి
తెలుసుకొన బోయేటట్టుగా అతని మీ యొద్దికి రేపు
తీసుకొని వచ్చుటకు సహస్రాధిపతితో మనవి చేయం
డి. అయితే అతడు దగ్గరకు రాకమునుపే, అతని చం
పుటకు మేము సిద్ధపడి యున్నామని పలికిరి.
16 అయితే పౌలు సహోదరి కుమారుడు వారు
పొంచి యుండుట తెలుసుకొని వచ్చి, కోటలో
17 ప్రవేశించి పౌలుకు దాని తెలిపెను.। అప్పుడు పౌలు
శతాధిపతులలో ఒకని తన యొద్దికి పిలిచి—ఈ పడు
చువాని సహస్రాధిపతి యొద్దికి తీసుకొని వెళ్లుము;
అతనితో ఒక మాట చెప్ప వలెనని యున్నాడనెను.।
18 అప్పుడు ఇతడు సహస్రాధిపతి యొద్దికి అతని తీసు
కొని వెళ్లి—ఖయిదీయైన పౌలు నన్ను పిలిచి నీతో ఒక
మాట చెప్పుటకైయున్న ఈ పడుచువాని నీ యొద్దికి
తీసుకొని వచ్చుటకు నన్ను వేడుకొనెనని పలికెను.
19 అప్పుడు సహస్రాధిపతి అతని చెయ్యి పట్టుకొని,
అవతలకు అతని తీసుకొని వెళ్లి—నీవు నాకు తెలుప వల
సినదేమని రహస్యముగా అడిగెను.
20 అందుకు అతడు—నీవు పౌలును గూర్చి ఏదైనను
ఒక సంగతి మరి సరిగా విచారించబోయేటట్టు, అతని
రేపు సభ యొద్దికి తీసుకొనిరా వలెనని నిన్ను వేడు
21 కొనుటకు యూదులు ఏకీభవించి యున్నారు.। అయితే
నీవు వారి మాటకు సమ్మతించ వద్దు; వారిలో నలుబది
మందికంటే ఎక్కువమంది మనుష్యులు అతని కొరకు
పొంచి యున్నారు. వారు అతని చంపేపర్యంతము
ఏదియు తినము, ఏదియు తాగమని శపథము చేసు
కొని, ఇప్పుడు నీవల్ల వాగ్దత్తము పొందుటకు కనిపె
ట్టుచు సిద్ధపడి యున్నారని చెప్పెను.
22 కాబట్టి సహస్రాధిపతి—నీవు వీటిని నాకు తెలి
పిన సంగతి ఎవనితోను చెప్ప వద్దని ఆజ్ఞాపించి, ఆ
23 పడుచువాని పంపివేసెను. । తరువాత అతడు శతాధి
పతులలో ఇద్దరిని తన యొద్దికి పిలిచి — కైసరైయ
పర్యంతము వెళ్లుటకు ఇన్నూరుమంది రాణువవారిని,
డెబ్బదిమంది గుర్రపు రౌతులను, ఇన్నూరుమంది
ఈటెలవారిని రాత్రి మొదటి జామున సిద్ధపరచండి.।
మరియు పౌలును ఎక్కించి అధిపతియైన ఫేలిక్సు 24
యొద్దికి భద్రముగా తీసుకొని వెళ్లుటకు వాహనము
లను సిద్ధపరచండని చెప్పెను.
మరియు ఈ ప్రకారముగా ఒక ఉత్తరము వ్రా 25
సెను;—మహా ఘనతగల అధిపతియైన ఫేలిక్సుకు క్లౌది 26
లూసియ వందనము. । ఈ మనుష్యుడు యూదులచేత 27
పట్టబడి వారివల్ల చంపబడ బోయినప్పుడు అతడు రో
మీయుడని నేను తెలుసుకొని రాణువతో వచ్చి అతని
తప్పించితిని. । వారు అతని మీద మోపిన నేరమేమని 28
తెలుసుకొనుటకు కోరి, నేను వారి సభ యొద్దికి అతని
తీసుకొని వచ్చి, । అతనియందు వారి ధర్మశాస్త్ర వాదము 29
లను గూర్చి దోషారోపణ చేయబడుటయేగాని మరణ
మునకైనను బంధకములకైనను తగిన నేరము ఏమియు
లేదని కనుగొంటిని. । అయితే ఈ మనుష్యునికి విరోధ 30
ముగా యూదులవల్ల కుట్ర చేయబడనై యున్నదని
నాకు తెలియవచ్చినందున, వెంటనే అతని నీ యొద్దికి
పంపించితిని. నేరము మోపినవారు కూడా అతని
గూర్చిన వాటిని నీ యెదుట చెప్పుటకు ఆజ్ఞాపించితిని.
నీకు శుభమవుగాక.
కాబట్టి రాణువవారు తమకు ఆజ్ఞాపించబడిన 31
ప్రకారము పౌలును రాత్రివేళ అంతిపత్రికి తీసు
కొని వెళ్లిరి. । మరునాడు వారు, అతనితో కూడా 32
వెళ్లుటకు గుర్రపు రౌతులను విడిచి, తాము కోటకు
తిరిగి వచ్చిరి. । వారు కైసరైయకు వచ్చి, అధిపతికి 33
ఆ ఉత్తరము అప్పగించి పౌలునుకూడా అతని యెదుట
నిలువబెట్టిరి. । అధిపతి దాని చదివినప్పుడు—ఇతడు 34
ఏ దేశపు వాడని అడిగి, అతడు కిలికియ దేశస్థుడని
తెలుసుకొని ।—నీ మీద నేరము మోపేవారు కూడా 35
వచ్చినప్పుడు, నీ సంగతి సంపూర్ణముగా విచారిం
తునని చెప్పి, హేరోదు, కొలువు కూటములో* అత
డు కావలియందు ఉంచబడుటకు ఆజ్ఞాపించెను.

## 24. అధ్యాయము.

ఐదు దినములైన తరువాత, ప్రధానయాజకుడైన 1
అననీయ, పెద్దలు, తెర్తుల్లనే ఒక వక్తయు వచ్చి, పౌలుకు
విరోధముగా అధిపతితో మనవి చేసిరి.
అతడు పిలిపించబడినప్పుడు, తెర్తుల్లు అతని మీద 2
నేరముమోపనారంభించి ఇట్లనెను — అతిశ్రేష్ఠుడవైన
ఫేలిక్సా! మేము నీ వల్ల బహు సమాధానము పొందుచు
న్నాము గనుకను, నీ దివ్య పరిపాలనచేత, ఈ దేశ
ప్రజలకు ఘనమైన కార్యములు ఎల్లప్పుడు, అంతటను
జరుగుచున్నవి । గనుకను, మేము పూర్ణ కృతజ్ఞతతో 3

*లేక, ప్రేతోర్యమనగా అధికారమందిరము.

4 అంగీకరించుచున్నాము. । అయితే నేను నిన్ను మిక్కిలి
ఆయాసపరచకుండుటకు, నీవు నీ శాంతమువల్ల మేము
క్లుప్తముగా చెప్పుకొనే దాని వినుటకు నిన్ను వేడుకొ
5 నుచున్నాను. । ఈ మనుష్యుడు తెగులువంటి వాడును,
భూలోకమందున్న సకలమైన యూదులలో కలహ
ము రేపే వాడును, నజోరీయుల మతభేదమునకు ము
6 ఖ్యుడునై యుండుట కనుగొంటిమి. । మరియు ఇతడు
మా గుడి అపవిత్రము చేయుటకు యత్నపడెను గనుక
మేము అతని పట్టుకొని మా బోధనప్రమాణము చొ
ప్పున తీర్పు చేయ వలెనని యుంటిమిగాని సహ
7 స్రాధిపతియైన లూసియ వచ్చి, । మిక్కిలి బలాత్కా
రముతో మా చేతులలోనుంచి ఇతని తీసుకొని వెళ్లి,
ఇతని మీద నేరము మోపే వారిని నీ యొద్దికి వెళ్లవలె
8 నని ఆజ్ఞాపించెను. । నీవే విమర్శించితే, మేము ఇతని
మీద మోపుచున్నవన్నియు తెలుసుకొన వచ్చునని
పలికెను.

9 అవి ఆలాగే ఉన్నవని యూదులు కూడా సమ్మ
తించిరి.

10 అప్పుడు అధిపతి మాటలాడుటకు పౌలుకు సైగ
చేసెను గనుక అతడు — నీవు బహు సంవత్సరముల
నుంచి ఈ రాష్ట్రమునకు న్యాయాధిపతివై యున్నా
వని ఎరిగి, నేను నన్ను గూర్చిన మరి ధైర్యముతో
11 ప్రత్యుత్తరము చెప్పుకొంటున్నాను. । ఏలాగనగా —
యెరూషలేములో ఆరాధించుటకు, నేను వెళ్లిన నాటి
నుంచి పన్నెండు దినములు మాత్రమే అయినవని నీవు
12 తెలుసుకొన వచ్చును. । అయితే గుడిలోనేమి, సునగో
గులలోనేమి, పట్టణములోనేమి నేను ఎవనితోను
తర్కించుటయైనను, ప్రజలలో అల్లరి చేయుటయై
13 నను వారు చూడ లేదు. । మరియు, వారు ఇప్పుడు
నా మీద మోపే వాటిని వారు రుజువుపరచలేరు. ।
14 అయితే నేను మా బోధనప్రమాణమందును, ప్రవక్తల
గ్రంథములయందును వ్రాయబడినవన్నియు నమ్మి, వీరు
15 కూడా నిరీక్షించే ప్రకారము, । చనిపోయిన నీతిమం
తులకు అనీతిమంతులకును పునరుత్థానము కలుగబో
వుచున్నదని దేవునియందు నిరీక్షణను ఉంచి, వారు
మతభేదమని చెప్పే మార్గము చొప్పున, నా పితృల
దేవుని సేవించుచున్నానని, నీ యెదుట ఒప్పుకొంటు
16 న్నాను. । ఆ ప్రకారము నేనును దేవుని విషయము
మనుష్యుల విషయము ఎప్పుడును నాకు నిర్మలమైన
మనస్సాక్ష్యము ఉండుటకు ప్రయత్నము చేసుకొం
17 టున్నాను. । అయితే అనేక సంవత్సరములైన తరు
వాత, నేను నా స్వదేశ ప్రజలకు ధర్మములు కానుక
18 లును ఇచ్చుటకు వచ్చితిని. । అప్పుడు సమూహమైనను
సందడియైనను లేక, గుడిలో శుచి చేసుకొనిన నన్ను,
ఆసియనుంచి వచ్చిన కొందరు యూదులు కనుగొనిరి. ।
నా మీద ఏ నేరమైనను మోప వలెనని వారికి ఉంటే, 19
వారే నీ సన్నిధికి వచ్చి చెప్పతగినది. । లేక నేను వారి 20
మధ్యను నిలిచి — చనిపోయిన వారి పునరుత్థానమును
గూర్చి, । నేడు మీ యెదుట నేను విమర్శించబడుచు 21
న్నానని నేను కంఠమెత్తి పలికిన ఆ ఒక్క వాక్యమే
గాక, సభ యెదుట నిలిచియున్నప్పుడు, నా యందు
మరి యే నేరమైనను కనుగొని యుంటే, వీరే చెప్ప
వచ్చునని పలికెను.

ఫేలిక్సు ఆ మాట విని, తాను ఈ మార్గ విష 22
యమైన సంగతులు బాగా ఎరిగినందున — సహస్రాధి
పతియైన లూసియ వచ్చినప్పుడు మీ సంగతి నేను
బాగా విచారించి తెలుసుకొందునని చెప్పి, వారి విమ
ర్శ నిలుపు చేసెను. । మరియు, అతని కాచుకొని, 23
అతని విడిగా ఉంచి, అతనికి ఉపచారము చేయుట
కైనను అతని యొద్దికి వచ్చుటకైనను అతని స్వజను
లలో ఎవరినిని ఆతంకపరచ కూడదని శతాధిపతికి
ఆజ్ఞాపించెను.

కొన్ని దినములైన తరువాత ఫేలిక్సు యూదురా 24
లైన ద్రుసిల్ల అనే తన భార్యతో వచ్చి, పౌలును పిలి
పించి, క్రీస్తుయందున్న విశ్వాసమును గూర్చి అతడు
పలుకుట వినెను. । అయితే అతడు నీతిని గూర్చి, 25
మితానుభవమును గూర్చి, రాబోయే న్యాయపు తీర్పు
ను గూర్చి, ప్రసంగించుచుండగా, ఫేలిక్సు భయపడి
— ఇప్పుడు సెలవు పుచ్చుకొనుము; నాకు సమయమై
నప్పుడు నిన్ను పిలువనంపింతునని ఉత్తరమిచ్చెను. । తరు 26
వాత, పౌలు తనకు రూకలు ఇచ్చునని నిరీక్షించి, అతని
చాలా మార్లు పిలిపించి అతనితో సంభాషణ చేయు
చుండెను.

అయితే రెండు సంవత్సరములైన తరువాత, ఫేలి 27
క్సుకు ప్రతిగా పొర్కి ఫేస్తు వచ్చెను. అప్పుడు ఫేలి
క్సు యూదులు కృతజ్ఞతగలవారవుటకు, పౌలుకు సం
కెళ్లు వేయించి వెళ్లెను.

## 25. అధ్యాయము.

ఫేస్తు ఆ దేశాధికారమునకు వచ్చి, మూడు దినము 1
లైనతరువాత కైసరైయనుంచి యెరూషలేముకు వెళ్లెను. ।
అప్పుడు ప్రధానయాజకుడు యూదులలో ముఖ్య 2
లును అతని యెదుట పౌలు మీద నేరము మోపిరి. ।
మరియు తోవలో అతని చంపుటకు కుట్రచేసి — 3
మీరు దయ చేసి అతని యెరూషలేముకు రప్పించు
మని, అతనికి విరోధముగా మనవి చేసి వేడుకొనుచుం
డిరి. । అందుకు ఫేస్తు — పౌలు కైసరైయలో ఉంచ 4

బడ వలెను; అయితే నేను శీఘ్రముగా అక్కడికి వెళ్ల
5 నైయున్నాను, । గనుక మీలో గట్టివారు నాతో
కూడా వచ్చి, ఆ మనుష్యుని యందు తప్పితము
ఏదైనను ఉంటే, అతని మీద మోప వచ్చునని ఉత్తరము
చెప్పెను.

6 అతడు వారి పట్టణములో కొంచెము ఎక్కువ
తక్కువ ఎనిమిది దినములు* గడిపి, కైసరైయకు వెళ్లి
మరునాడు న్యాయపీఠము మీద కూర్చుండి, పౌలును
7 తీసుకొని వచ్చుటకు ఆజ్ఞాపించెను. । అతడు వచ్చిన
ప్పుడు యెరూషలేమునుంచి వచ్చిన యూదులు చుట్టు
నిలిచి, తాము రుజువుపరచలేనివి బలువైనవియునైన
8 చాలా నేరములను పౌలు మీద మోపిరి. । అందుకు
అతడు—యూదుల బోధన ప్రమాణమును గూర్చియై
యైనను, గుడిని గూర్చియైనను, కైసరును గూర్చియై
నను, ఎంత మాత్రమును తప్పితము చేయ లేదని ఉత్తర
మిచ్చెను.

9 అయితే ఫేస్తు, యూదులు కృతజ్ఞత గలవారై
యుండ వలెనని—యెరూషలేముకు వచ్చి, అక్కడ
నా యెదుట వీటిని గూర్చి న్యాయపు తీర్పుకై పొందు
టకు నీకు మనస్సు కలదా? అని పౌలును అడిగెను. ।
10 అందుకు పౌలు—కైసరు† న్యాయ పీఠము యెదుట
నిలువబడియున్నాను. నేను న్యాయపు తీర్పు పొంద
వలసిన స్థలమిదే; యూదులకు నేను అన్యాయమే
11 మియు చేయలేదని నీకు బాగా తెలుసును. । నేను
న్యాయము తప్పి చావుకు తగినది యేదైనను చేసి
యుంటే, చావుకు వెనుకతీయను. అయితే వీరు
నామీద మోపుచున్న నేరములలో ఏదియు లేకుంటే,
ఎవడైనను నన్ను వారికి అప్పగించ లేడు; కైసరుతో
నా సంగతి చెప్పుకొందునని పలికెను.

12 అప్పుడు ఫేస్తు తన ఆలోచన సభవారితో మా
టలాడిన తరువాత—కైసరుతో చెప్పుకొందువా? కైసరు
యొద్దికి వెళ్ల వలెనని ఉత్తరమిచ్చెను.

13 కొన్ని దినములు గతించిన తరువాత రాజైన అగ్రి
ప్పయు, బెర్నీకేయు ఫేస్తును దర్శించే నిమిత్తము
14 కైసరైయకు వచ్చిరి. । అక్కడ వారు అనేక దినములు
గడిపిన తరువాత, ఫేస్తు పౌలు సంగతి రాజుకు తెలియ
చెప్పెను. అదేమనగా—ఫేలిక్సువల్ల బందికాడుగా
15 విడువబడిన ఒక మనుష్యుడు కలడు. । నేను యెరూ
షలేములో ఉన్నప్పుడు ప్రధానయాజకులు యూదుల
పెద్దలును అతని గూర్చి సమాచారము చెప్పి, అతనికి
విరోధముగా తీర్పు చేయ వలెనని వేడుకొనిరి. ।
అందుకు నేను—నేరము మోపబడినవాడు, నేరము 16
మోపే వారికి ముఖాముఖిగా ఉండి, తన మీద
మోపబడిన నేరమును గూర్చి ప్రత్యుత్తరము చెప్పుకో
నుటకు అతనికి అవకాశమియ్యక మునుపు ఏ మనుష్యు
నినైనను అప్పగించుట రోమీయుల ఆచారము కాదని
ఉత్తరమిచ్చితిని. । కాబట్టి వారు ఇక్కడికి వచ్చినప్పుడు 17
నేను ఆలస్యమేమియు చేయక, మరునాడు న్యాయ
పీఠముమీద కూర్చుండి, ఆ మనుష్యుని తీసుకొని
వచ్చుటకు ఆజ్ఞాపించితిని. । నేరము మోపిన వారు 18
నిలిచినప్పుడు, నేను తలంచిన నేరములలో ఒకటిని
అతనిమీద మోపలేదు. । అయితే తమ మతమును 19
గూర్చియు, చనిపోయిన యేసు అనే ఒకని గూర్చియు
ఇతనితో వారికి కొన్ని తర్కములు కలిగెను. । అతడు 20
బ్రతికి యున్నాడని పౌలు చెప్పెను. నేను అట్టి
వాదముల విషయము సందేహపడి, అతడు యెరూష
లేముకు వెళ్లి అక్కడ వీటిని గూర్చి తీర్పుకై పొందు
టకు, అతనికి ఇష్టమవునేమో అని అడిగితిని. । అయితే 21
పౌలు ఔగుస్తు‡ విమర్శకు తాను ఉంచబడుటకు
చెప్పుకొనినందున నేను అతని కైసరుయొద్దికి పంపించే
మట్టుకు అతడు ఉంచబడుటకు ఆజ్ఞాపించితినని పలి
కెను.

అప్పుడు అగ్రిప్ప—ఆ మనుష్యుని నోటి మాట 22
వినుటకు నాకును మనస్సు కలదని ఫేస్తుతో పలి
కెను. అందుకు అతడు—రేపు విన వచ్చునని చెప్పెను.
కాబట్టి మరునాడు అగ్రిప్పయు బెర్నీకేయు మి 23
క్కిలి డంబముతో వచ్చి, సహస్రాధిపతులతోను,
పట్టణమందలి శ్రేష్ఠులతోను కొలువుకూటములో ప్రవే
శించిన తరువాత, ఫేస్తు సెలవిచ్చినప్పుడు పౌలు
తేబడెను.

అప్పుడు ఫేస్తు—రాజువైన అగ్రిప్పా! మాతో 24
కూడా ఇక్కడ ఉన్న సమస్త మనుష్యులారా! మీరు
ఈ మనుష్యుని చూస్తున్నారు; యూదుల సమూహ
మంతయు యెరూషలేములోను, ఇక్కడనును—వీడు
ఇంకా బ్రతుకుట తగదని కేకలువేయుచు, ఇతని
గూర్చి నన్ను బతిమాలుకొనిరి. । అయితే అతడు చా 25
వుకు తగినది యేదియు చేయలేదని నేను తెలుసు
కొని, అతడు—ఔగుస్తుతో చెప్పుకొందునని పలికినం
దున అతని పంపుటకు నిర్ణయించి యున్నాను. ।
అతని గూర్చి మన ప్రభువు పేర వ్రాయుటకు, నాకు 26
నిశ్చయమైనది యేదియు లేదు గనుక, విచారణ

*లేక, పదికంటే యెక్కువైన దినములు. † చక్రవర్తి పేరు. ‡ అనగా, చక్రవర్తి.

అయిన తరువాత వ్రాయుటకు ఏమైనను నాకు కలి
గేటట్టు మీ అందరి యెదుటికి, రాజువైన అగ్రిప్పా!
ముఖ్యముగా నీ యెదుటికి అతని తెప్పించి యున్నా
27 ను. । ఖయిదీ మీద మోపబడిన నేరములు చూపక,
అతని పంపుట యుక్తము కాదని నాకు తోచుచున్న
దనెను.

## 26. అధ్యాయము.

1 అప్పుడు అగ్రిప్ప — నీ కొరకు చెప్పుకొనుటకు
2 సెలవు అయినదని పౌలుతో పలికెను. । అప్పుడు పౌలు
చెయ్యి చాచి ఉత్తరమిచ్చినది యేమనగా
—రాజువైన అగ్రిప్పా! యూదులు నా మీద మోపే
నేరములన్నిటిని గూర్చి నేడు నీ యెదుట ఉత్తరము
3 చెప్పుకొన బోవుటవల్లను, । విశేషముగా నీవు యూ
దులలో ఉండే సమస్తమైన మర్యాదలును తర్కము
లును ఎరుగుటవల్లను, నన్ను ధన్యునిగా ఎంచుకొను
చున్నాను, గనుక తాల్మితో నా మనవి విన వలెనని
4 నిన్ను వేడుకొంటున్నాను. । నేను మొదటినుంచి యె
రూషలేములో నా రాష్ట్రములో నేను నా బాల్య
మునుంచి బ్రతికిన బ్రతుకు ఏలాటిదో, యూదులం
5 దరికిని తెలుసును. । సాక్ష్యము చెప్పుటకు వారికి ఇష్ట
మైతే, నేను మన ఆరాధన మార్గములో బహు ఖం
డితమైన మత ప్రకారముగా ఫరిసైయుడనై బ్రతికితి
6 నని మొదటినుంచి నన్ను ఎరిగియున్నారు. । అయితే
దేవుడు మన పితృలకు చేసిన వాగ్దత్త నిరీక్షణ నిమిత్త
ము నేను ఇప్పుడు న్యాయపు తీర్పు పొందుటకు
7 నిలిచి యున్నాను. । మా పన్నెండు గోత్రములు ఎడ
తెగక, దివారాత్రులు దేవుని ఆరాధించుచు, దాని
పొందుటకు నిరీక్షించుచున్నవి. రాజువైన అగ్రిప్పా!
ఆ నిరీక్షణ నిమిత్తము, యూదులవల్ల నా మీద నేర
8 ము మోపబడి యున్నది. । ఏమీ! దేవుడు చనిపోయిన
వారిని లేపునంటే, అది నమ్మ కూడదని మీరు యెన్ను
9 చున్నారా? । నేను కూడా నజోరీయుడైన యేసు నా
మమునకు విరోధముగా అనేక కార్యములు చేయ
10 వలెననుకొంటిని. । యెరూషలేములో నేను ఆలాగు
చేసితిని; నేను ప్రధానయాజకులవల్ల అధికారము
పొంది, పరిశుద్ధులలో అనేకులను ఖయిదులో పడవేసి,
11 వారు చంపబడినప్పుడు సమ్మతించితిని. । అనేక పర్యా
యములు సమస్తమైన సునగోగులలో వారిని దండించి,
దూషించేటట్టు వారిని బలవంతము చేసితిని. మరియు
వారి మీద మిక్కిలి క్రోధపడుచు, అన్యపట్టణముల
మట్టుకును వారిని తరిమితిని.

అందువల్ల నేను ప్రధానయాజకులవల్ల అధికారము 12
సెలవును పొంది, దమస్కుకు వెళ్లుచుండగా, । మధ్యా 13
హ్నమందు, ఓ రాజా! నా చుట్టు, నాతో కూడా
వచ్చిన వారి చుట్టును ఆకాశమునుంచి, సూర్యుని
కాంతి కంటే మిక్కిలి ప్రకాశమైన ఒక వెలుగు
తోవలో ప్రకాశించుట చూచితిని. । మేమందరమును 14
నేల పడినప్పుడు ఒక శబ్దము నాతో మాటలాడుచు
—సౌలా! సౌలా! నన్ను ఎందుకు తరుముచున్నావు!
మునుకోలల మీద తన్నుట నీకు కఠినమని ఇబ్రీభా
షతో పలుకుట వింటిని. । అప్పుడు నేను—ప్రభువా! 15
నీవు ఎవడవని! అడిగితిని. అందుకు ఆయన— నేను
నీవు తరిమే యేసునై యున్నాను. । అయితే నీవు లేచి 16
నీ పాదములు మోపి నిలువుము; ఎందుకనగా నీవు
చూచిన వాటిని గూర్చియు, వేటిలో నేను నీకు కనబ
డుదునో వాటిని గూర్చియు నిన్ను సేవకునిగాను
సాక్షినిగాను నియమించుటకు నీకు కనబడితిని. । నేను 17
ఈ జనులలోనుంచి రాష్ట్రములలోనుంచి నిన్ను తప్పిం
చుచు, । వారు చీకటినుంచి వెలుగులోకి, సైతాను అధి 18
కారమునుంచి దేవునితట్టు తిరిగేనిమిత్తము, నా యందు
ఉంచబడే విశ్వాసమువల్ల పాపక్షమను, పరిశుద్ధపరచ
బడిన వారిలో స్వాస్థ్యమును పొందే నిమిత్తము, వారి
కన్నులు తెరుచుటకు నిన్ను వారి యొద్దికి పంపుచు
న్నానని చెప్పెను.

కాబట్టి రాజువైన అగ్రిప్పా! నేను ఆకాశమునుం 19
చియైన ఆ దర్శనమునకు అవిధేయుడను కాక, । మొ 20
దట దమస్కులోనివారికి యెరూషలేములోనివారికి
యూదైయ దేశమంతటను, తరువాత రాష్ట్రములకును,
జనులు పశ్చాత్తాపపడి దేవుని తట్టు తిరిగి, పశ్చాత్తా
పమునకు తగిన క్రియలు చేయ వలెనని చాటించితిని. ।
ఈ హేతువులచేతను యూదులు గుడిలో నన్ను 21
పట్టుకొని చంపుటకు ప్రయత్నము చేసిరి. । కాబట్టి 22
నేను దేవునివల్లనైన సహాయము పొంది—క్రీస్తు శ్రమ
పడి, చనిపోయిన వారిలో, పునరుత్థానము పొందే
మొదటివాడై, ఈ జనులకును అన్యజనులకును* వెలుగు
అగపరుచబోవునని, । ప్రవక్తలు, మోషేయు జరగబో 23
వునని పలికినవిగాక మరి యేమియు చెప్పక పిన్న
పెద్దలతో సాక్ష్యము చెప్పుచు, నేటివరకు నిలిచి
యున్నాను.

అతడు ఈలాగు తన కొరకు ఉత్తరము చెప్పుకొను 24
చుండగా, ఫేస్తు—పౌలా! నీవు వెర్రివాడవు! బహు

*లేక, రాష్ట్రములకు.

విద్యలు నిన్ను వెఱ్ఱితనమునకు లోపరచుచున్నవని
గొప్ప శబ్దముతో చెప్పెను.
25 అందుకు అతడు—అతిశ్రేష్ఠుడవైన ఫేస్తూ! నేను
వెఱ్ఱివాడనుకాను; అయితే సత్యము, స్వస్థబుద్ధియు
26 గల మాటలు పలుకుచున్నాను. । రాజు ఈ సంగతులు
ఎరిగి యున్నాడు. అతని యెదుట నేను ధైర్యముగా
మాటలాడుచున్నాను; వాటిలో ఒకటిని అతనికి
మరుగై ఉండ లేదని నమ్ముచున్నాను; ఇది ఒక మూ
27 లను చేయబడిన కార్యము కాదు. । రాజా! అగ్రిప్పా!
నీవు ప్రవక్తలను నమ్ముచున్నావా? నమ్ముచున్నావని
28 యెరుగుదుననగా, । అగ్రిప్ప—క్రైస్తవుడనౌటకు నన్ను
సులభముగా ప్రేరేపించుచున్నావని పౌలుతో పలికె
29 ను. । అందుకు పౌలు—సులభమో, దుర్లభమో, నీవు
మాత్రమే కాదు, నేడు నా మాట వినే వారందరును
ఈ బంధకములు తప్ప, నావలె ఉండుటకు దేవుని
వేడుకొంటున్నానని పలికెను.
30 అతడు వీటిని చెప్పిన తరువాత, రాజును, అధి
పతియు, బెర్నీకేయు, వారితో కూడా కూర్చుండిన
31 వారును లేచి అవతలకు వెళ్లి—ఈ మనుష్యుడు మరణ
మునకైనను బంధకములకైనను తగినది యేదియు చేయ
32 లేదని తమలో తాము మాటలాడుకొనిరి. । అప్పుడు
అగ్రిప్ప—ఈ మనుష్యుడు—కైసరుతో చెప్పుకొందు
నని పలుకకుంటే, వాడు విడిపించబడ వచ్చునని
ఫేస్తుతో చెప్పెను.

## 27. అధ్యాయము.

1 అంతట మేము ఓడెక్కి, ఈతలియకు వెళ్ల వలెనని
నిశ్చయించబడినప్పుడు, వారు పౌలును, మరి కొందరు
ఖైదీలను ఔగుస్తు రాణువలో శతాధిపతియైన
2 యూలి అనే వానికి అప్పగించిరి. । మేము ఆసియ
దరి సబురుచేయబోయే అద్రముత్యపు ఓడెక్కి బైలు
దేరితిమి. మకెదొనియ దేశమందలి థెస్సలొనీకే
పట్టణస్థుడైన అరిస్తార్ఖు మాతో కూడా ఉండెను. ।
3 మరునాడు సీదోనుకు వచ్చితిమి. అప్పుడు యూలి
పౌలుకు ఉపకారియైయుండి అతడు స్నేహితులయొద్దికి
4 వెళ్లి పరామర్శ పొందుటకు సెలవిచ్చెను. । అక్కడ
నుంచి వెళ్లిన తరువాత, గాలి ఎదురుగా ఉన్నందున,
5 కుప్ర మరుగున ఓడ నడిపించితిమి. । మరియు కిలికి
యకు, పంఫులియకు ఎదురుగా ఉన్న సముద్రమున
సబురు చేసి, లుకియలో ఉన్న మూరకు వచ్చితిమి. ।
6 అక్కడ శతాధిపతి ఈతలియకు వెళ్లగల అలెక్సంద్ర
యయొక్క ఓడ కనుగొని, అందులో మమ్మును యె
క్కించెను. ' బహు దినములు మెల్లగా నడిచి ప్రయాస 7
ముతోనే క్నీదుకు ఎదురుగా వచ్చినప్పుడు, గాలి మ
మ్మును వెళ్లనియ్యకున్నందున, క్రేతు మరుగున సల్మోను
తట్టు ఓడ నడిపించితిమి. ' ప్రయాసముతో దాని 8
దాటి, మంచి రేవులనే పేరుగల ఒక స్థలమునకు వచ్చి
తిమి. దాని దగ్గర లసైయ పట్టణము ఉండెను.
బహు కాలమైన తరువాత, ఉపవాస దినము కూడా 9
గతించినందున, అప్పుడు సబురు చేయుట ఉపద్రవ
ముతోనే యుండగా, పౌలు—అయ్యలారా! ' ఈ 10
ప్రయాణమువల్ల సరుకులకు, ఓడకును మాత్రమేగాక,
మన ప్రాణములకు కూడా కీడు బహు నష్టమును కలు
గునని చూచుచున్నానని అనెను. ' అయినప్పటికి, శతాధి 11
పతి పౌలు చెప్పిన మాటలకంటే, నావికుని ఓడ
యజమానునిని ఎక్కువగా నమ్మెను. ' మరియు, శీతకా 12
లము గడుపుటకు, ఆ రేవు ఉపయుక్తము కానిదైనం
దున, అక్కడనుంచి వెళ్లి, శక్యమైతే ఒక వేళ ఫేనికేకు
వెళ్లి, అక్కడ శీతకాలము గడప వలెనని ఎక్కువమంది
ఆలోచన చెప్పిరి. అది నైఋతి వాయవ్య దిక్కుల
తట్టున్న క్రేతే రేవైయున్నది.
మరియు దక్షిణపు గాలి మెల్లగా విసురుచుండగా, 13
వారు తమ ఆలోచన సమకూడినదని తలంచి, లంగరు
ఎత్తుకొని క్రేతుకు సమీపముగా ఓడ నడిపించిరి. ।
అయితే, కొంతకాలమైన తరువాత, ఐరొక్లుదోననే 14
తుఫానువంటి గాలి దానిమీదనుంచి విసరెను. । ఓడ 15
చిక్కుబడి గాలికి ఎదురుగా నిలువ లేక పోయినం
దున, దాని పోనిచ్చి కొట్టుకొని పోబడితిమి. । తరు 16
వాత క్లౌదే అనబడిన ఒక చిన్న ద్వీపము మరుగున,
దాని నడిపించి, బహు ప్రయాసముతోనే పడవ
స్వాధీనపరచుకొంటిమి. ' దాని ఎత్తుకొనిన తరువాత, 17
సాధనములు తీసుకొని ఓడచుట్టు బిగించిరి. మరియు
దొంగ ఇసుకలో పడుదుమేమో అని భయపడి, ఓడ
చాపలు దిగవిడిచి* కొట్టుకొని పోబడిరి. ' అయితే 18
మిక్కిలి పెద్ద గాలివల్ల మేము మిక్కిలి అల్లాడుచు
న్నందున, మరునాడు ఓడను కొంచెము చులకనగా
చేసిరి. ' మూడవ దినమందు, మా చేతులతో ఓడ 19
సామగ్రి పారవేసితిమి. ' అయితే అనేక దినములు 20
సూర్యుడైనా నక్షత్రములైనా కనబడనందున, పెద్ద
గాలి మా మీద విసిరినందున రక్షించబడుటకు ఊహ
కేవలము అణిగి పోయెను.
అప్పుడు బహు కాలము భోజనము లేక సోయినందున 21
పౌలు వారి నడుమ నిలిచి—అయ్యలారా! ఈ కీడును
నష్టమును పొందకుండుటకు, మీరు నా మాట విని,

*లేక, కొయ్యలు దించి.

22 క్రేతేనుంచి రాకపోవలసి యుండెను.' అయితే ఇప్పు
డు ధైర్యము తెచ్చుకొనండని మిమ్మును వేడుకొంటు
న్నాను; ఈ ఓడకే గాని మీలో ఎవని ప్రాణమున
23 కును హాని కలుగదు; 'నేను ఎవనివాడనో, ఎవని
సేవించుచున్నానో ఆ దేవుని దూత, పోయిన రాత్రి
24 నా యొద్ద నిలిచి—పౌలా! భయపడకుము;' నీవు కైస
రు యెదుట నిలువ వలెను. మరియు, ఇదుగో! నీతో
కూడా ఓడలో ప్రయాణమై వెళ్లుచున్న వారందరిని
దేవుడు నీకు దయచేసి యున్నాడని నాతో చెప్పెను.'
25 కాబట్టి అయ్యలారా! ధైర్యము తెచ్చుకొనుడి; నా
తో చెప్పబడిన ప్రకారము కలుగునని నేను దేవుని
26 నమ్ముచున్నాను.' అయితే మనము ఒక ద్వీపమునకు
కొట్టబడ వలెనని పలికెను.
27 పదునాలుగవ రాత్రి వచ్చినప్పుడు, మేము అద్రి
య సముద్రములో ఇటు అటు కొట్టుకొని పోబడు
చుండగా, అర్ధరాత్రి వేళ, ఓడవారు ఏదో ఒక
28 భూమి తమకు సమీపించుచున్నదని ఊహించి,। బుడు
దువేసి చూచి, ఇరువై బారల లోతని తెలుసుకొనిరి.
ఇంకా కొంత దూరము వెళ్లిన తరువాత మళ్లీ బుడుదు
వేసి చూచి, పదిహేను బారల లోతని తెలుసుకొనిరి.।
29 అప్పుడు తాము రాతి తిప్పలు గల చోట్ల పడుదుమే
మో అని భయపడి, ఓడ వెనుకతట్టు నాలుగు లంగ
రులు వేసి, పగలు వచ్చుటకు మిక్కిలి కోరుచుండిరి.
30 అయితే ఓడవారు ఓడ విడిచి పారిపోవుటకు యో
చించుకొనుచు, తాము ముందటి వైపున లంగరులు
వేయబోయేటట్టుగా, సముద్రములో పడవ దింపిన
31 ప్పుడు,' పౌలు—వీరు ఓడలో ఉంటేనే గాని మీరు
రక్షించబడ లేరని శతాధిపతితోను రాణువవారితోను
32 పలికెను.। అప్పుడు రాణువవారు పడవ తాళ్లు కోసి,
దాని పడిపోనిచ్చిరి.
33 తెల్లవారుచుండగా, పౌలు—మీరు ఏమియు పుచ్చు
కొనక నిరాహారులై యుండి, ఎదురు చూచుచున్న
34 పదునాలుగవ దినము నేడే.। కాబట్టి ఆహారము పుచ్చు
కొనుడని మిమ్మును వేడుకొంటున్నాను. ఇది మీ
ప్రాణరక్షణ కొరకు ఉండును; మీలో ఎవని తలనుం
డియు ఒక వెంట్రుకయైనను పడిపోదని చెప్పుచు,
ఆహారము పుచ్చుకొనుటకు అందరిని వేడుకొనుచుం
35 డెను.। అతడు వీటిని చెప్పుచు ఒక రొట్టె పట్టు
కొని అందరి యెదుట దేవుని స్తుతించి, దాని విరిచి
36 తినుటకు మొదలుబెట్టెను.। అప్పుడు అందరు ధైర్యము
37 పొంది తాము ను ఆహారము పుచ్చుకొనిరి.। ఓడలో
ఉన్న మేమందరము ఇన్నూట డెబ్బదియారుగురమై
యుంటిమి.। వారు తిని తృప్తిపొందిన తరువాత, 38
ధాన్యము సముద్రములో పారపోసి, ఓడ చులకన
చేసిరి.
ఉదయమైనప్పుడు వారు ఆ భూమి పోల్చలేదు. 39
అయితే దరిగల ఒక సముద్రపు, మూలను కను
గొని, సాధ్యమైతే అందులోకి ఓడ త్రోయ వలెనని
ఇచ్ఛయించిరి.। అప్పుడు లంగరులు కోసి సముద్రము 40
లో విడిచి చుక్కానుల కట్లు విప్పి, గాలికి పెద్ద
చాప యెత్తి దరికి సరిగా నడిపించిరి.। అయితే రెం 41
డు సముద్రముల ప్రవాహములు కూడే స్థలమందు
చిక్కుబడి, నేలకు ఓడ తగిలించిరి. అందువల్ల ముం
దటి భాగము నాటుకొని, కదలకుండెను; అయితే వెను
కటి భాగము తరంగముల బలమువల్ల బద్దలై పోయెను.
అప్పుడు ఖైదీలలో ఎవడును ఈదుకొని పారి 42
పోకుండా వారిని చంప వలెనని, రాణువవారికి
ఆలోచన పుట్టెను.। అయితే శతాధిపతి పౌలును రక్షిం 43
చుటకు మనస్సుగలవాడై, వారి ఆలోచన కొనసాగ
నియ్యక, ఈద గలవారు మొదట (సముద్రములో)
దుముకుట వల్లను,। కడమవారిలో కొందరు పలకల 44
మీదను కొందరు ఓడ చెక్కలమీదను దరికి వెళ్లు
టకు ఆజ్ఞాపించెను. ఈలాగు అందరు తప్పించుకొని,
సురక్షితముగా దరికి వచ్చిరి.

## 28. అధ్యాయము.

మేము తప్పించుకొని ఆ ద్వీపము మెలీతే ద్వీపమని 1
తెలుసుకొంటిమి.। ఆ దేశస్థులు మాకు చేసిన ఉపచా 2
రము ఇంతంత కాదు; ఏలాగనగా అప్పుడు వర్షము,
చలియు కలిగినందున, వారు అగ్ని రాజబెట్టి, మమ్ము
నందరిని చేర్చుకొనిరి.
అప్పుడు పౌలు మోపెడు పుడకలు కూర్చి, అగ్ని 3
మీద వేసినప్పుడు ఒక పాము అగ్ని కాకవల్ల వెలుపటికి
వచ్చి అతని చెయ్యి కరిచి పట్టెను.। ఆ దేశస్థులు ఆ 4
విషజంతువు అతని చేతిని వ్రేలాడుట చూచినప్పుడు—
నిశ్చయముగా ఈ మనుష్యుడు నరహంతకుడు. ఇతడు
సముద్రమునుంచి తప్పించుకొనినప్పటికి న్యాయము*
ఇతని బ్రతుకనియ్యదని తమలో తాము చెప్పుకొనిరి.।
అయితే అతడు ఆ విషజంతువును అగ్నిలో జాడించి 5
యేహానియు పొందలేదు.। అయితే వారు అతని శరీ 6
రము వాచునో, లేక అతడు అకస్మాత్తుగా పడి
చచ్చునో అని కనిపెట్టుచుండిరి. అయితే వారు
చాలామట్టుకు కనిపెట్టుచుండిన తరువాత, అతనికి

* లేక, న్యాయదేవి.

ఏ హానియు కలుగకుండుట చూచి, ఆ తాత్పర్యము
విడిచి—ఇతడు దేవుడని చెప్పుకొనిరి.
7 ఆ ద్వీపముయొక్క ముఖ్యుడైన పొప్లి అనే పేరు
గల వానికి, ఆ ప్రాంతములలో మాన్యములు ఉండెను.
అతడు మమ్మును చేర్చుకొని, మూడు దినములు స్నేహ
8 ముగా అతిథి సత్కారము చేసెను.। అప్పుడు జరిగిన
దేమనగా పొప్లియొక్క తండ్రి జ్వరమువల్లను రక్తబేది
వల్లను తల్లడిల్లుచు పండుకొనియుండెను. పౌలు అతని
యొద్దికి వెళ్లి ప్రార్థనచేసి, అతని మీద చేతులు ఉంచి
9 అతని స్వస్థపరిచెను.। కాబట్టి, ఆ ద్వీపములో ఉన్న
10 కడమ రోగులు కూడా వచ్చి స్వస్థపరచబడిరి.। మరి
యు వారు అనేక మర్యాదలవల్ల మమ్మును మర్యాద
చేసి మేము ఓడెక్కి వెళ్లినప్పుడు మాకు కావలసిన
వాటిని తెచ్చి ఇచ్చిరి.
11 మూడు నెలలైన తరువాత, ఆ ద్వీపమందు శీతకా
లము వరకు నిలిచిన మిథునమనే గురుతుగల అలెక్సం
12 ద్రియ ఓడెక్కి బైలుదేరి,। సురకూసైకి వచ్చి అక్కడ
13 మూడు దినములు ఉంటిమి.। అక్కడనుంచి చుట్టు
వెళ్లి రేగియకు వచ్చి, ఒక దినమైన తరువాత, దక్షిణపు
గాలి విసరుటవల్ల, మరునాడు పొతియొలీకి వచ్చితి
14 మి.। అక్కడ సహోదరులను కనుగొని, వారి యొద్ద
ఏడు దినములు ఉండుటకు వారివల్ల వేడుకొనబడి
15 తిమి. ఈలాగున రోమేకు వచ్చితిమి.। అక్కడనుంచి
సహోదరులు మమ్మును గూర్చిన సంగతి విని అప్పీ
ఫోరు* మట్టుకును, త్రిసత్రముల* మట్టుకును మమ్మును
ఎదురుకొనుటకు వచ్చిరి. పౌలు వారిని చూచి దేవుని
స్తుతించి, ధైర్యము తెచ్చుకొనెను.
16 మేము రోమేకు వచ్చినప్పుడు శతాధిపతి ఖైదీ
లను సేనాధిపతికి అప్పగించెను, గాని పౌలు అతని
కాచుకొనిన రాణువవానితో కూడా ప్రత్యేకముగా
ఉండుటకు సెలవు పొందెను.
17 మరియు మూడు దినములైన తరువాత జరిగినదేమ
నగా, పౌలు యూదులలో ముఖ్యులైనవారిని కూడి
వచ్చుటకు పిలిపించెను. వారు కూడివచ్చినప్పుడు,
అతడు—సహోదరులారా! జనులకైనను పితృల మర్యా
దలకైనను విరోధమైనది ఏదియు చేయకపోయిన నేను
యెరూషలేములోనుంచి రోమీయులచేతికి ఖయిదీగా
18 అప్పగించబడితిని.। వీరు నన్ను విచారించి నా యందు
చావుకు తగిన నేరము ఏదియు లేనందున నన్ను విడి
19 పించుటకు కోరిరి.। అందుకు యూదులు ఎదురాడు
టవల్ల, నేను కైసరుతో చెప్పుకొందునన వలసి వచ్చెను.
అయినను, ఇందువల్ల నా దేశజనులమీద ఏ నేరమైనను
మోపుటకు నాకు మనస్సు ఉండలేదు.। ఈ హేతువు 20
చేతను మిమ్మును చూచి మాటలాడుటకు పిలిపించితిని;
ఇశ్రాయేలుయొక్క నిరీక్షణ కొరకు ఈ సంకెళ్లతో
కట్టబడి యున్నానని వారితో చెప్పెను.
అందుకు వారు—యూదైయనుంచి నిన్ను గూర్చిన 21
ఉత్తరములు మాకు అందలేదు. వచ్చిన సహోదరు
లలో ఒక్కడైనను నిన్ను గూర్చి చెడ్డది ఏదైనను
తెలుపలేదు, మాటలాడలేదు.। అయితే నీ తాత్ప 22
ర్యము నీ వల్ల విన కోరుచున్నాము; ఈ మతభేదమును
గూర్చి అంతట ఆక్షేపణ జరుగుచున్నదని మాకు
తెలుసుననిరి.
అప్పుడు అతనికి ఒక దినము నిర్ణయించి అతని 23
యొద్దికి, అతని బసలోకి అనేకులు వచ్చిరి. ఉదయము
నుంచి సాయంకాలమువరకు అతడు దేవుని రాజ్య
మును గూర్చి పూర్తిగా సాక్ష్యము చెప్పుచు, మోషే
యొక్క బోధన ప్రమాణమువల్లను ప్రవక్తల వల్లను
యేసుని గూర్చిన సంగతులు నమ్ముటకు వారిని ప్రేరే
పించుచు వివరముగా పలుకుచుండెను.
చెప్పబడిన వాటిని కొందరు నమ్మిరి; కొందరు నమ్మ 24
లేదు.। ఈలాగు వారు ఏక మనస్కులు కానందున, 25
పౌలు వారితో ఒక వాక్యము చెప్పిన తరువాత వారు
వెళ్లిపోయిరి. అదేమనగా,
—మీరు వింటూ విందురుగాని గ్రహించరు; చూ 26
చుచు చూతురుగాని కానరు, అని ఈ జనులయొద్దికి
వెళ్లి చెప్పుము.। ఈ జనులు—కన్నులతో చూచి, చెవుల 27
తో విని, హృదయముతో గ్రహించి, నా తట్టు తిరుగ
కుండుటకును, నేను వారిని స్వస్థపరచకుండుటకును,
వారి హృదయము కొవ్వెను; వారు తమ చెవులతో మం
దముగా విని, తమ కన్నులు మూసుకొని యున్నారని†
పరిశుద్ధాత్మ, ప్రవక్తయైన ఎషయా ద్వారా మన పితృ
లతో బాగా చెప్పెను.। కాబట్టి రాష్ట్రముల యొద్దికి 28
దేవుని రక్షణ పంపబడియున్నదనియు, వారు దాని
ఆలకింతురనియు మీకు తెలుసునుగాక అని పలికెను.
అతడు ఆ సంగతులు చెప్పిన తరువాత యూదులు 29
తమలో తాము చాలా తర్కించుకొనుచు వెళ్లిరి.
అయితే పౌలు రెండు సంవత్సరములు పూర్ణ 30
మయే పర్యంతము, తన అద్దె ఇంట కాపురముండి,
తన యొద్దికి వచ్చేవారినందరిని చేర్చుకొని,। ఆతం 31
కము లేక పూర్ణ ధైర్యముతో దేవుని రాజ్యమును
ప్రకటించుచు, ప్రభువైన యేసుక్రీస్తును గూర్చిన సం
గతులు ఉపదేశించుచుండెను.

*ఊరుల పేరులు. †యెషయ. అ. 6, వ. 9, 10.

అపొస్తలుడైన పౌలు

# రోమీయులకు పంపిన

## పత్రిక.

### 1. అధ్యాయము.

1-7 ఎవడు దావీదు సంతానమందు శరీరియై పుట్టి,
పరిశుద్ధి గల ఆత్మ స్వభావుడై మృతుల పునరుత్థానము
వల్ల దేవుని కుమారుడని బలముతో* నిర్ణయించబ
డెనో, దేవుడు తన కుమారుడైన ఆ యేసుక్రీస్తనే
మన ప్రభువును గూర్చి తన ప్రవక్తల మూలముగా,
పరిశుద్ధ లేఖనములలో పూర్వమందు వాగ్దత్తము చేసిన
ఆయన సువార్త కొరకు ఏర్పరచబడి అపొస్తలుడవుటకు
పిలువబడిన వాడును, యేసుక్రీస్తు సేవకుడునైన పౌలు
రోమేలో దేవుని ప్రియులై పరిశుద్ధులవుటకు పిలువ
బడియున్న వారందరికి (వ్రాయునది యేమనగా),
మన తండ్రియైన దేవునివలన, ప్రభువైన యేసుక్రీస్తు
వలన మీకు కృపయు సమాధానము కలుగు గాక. ఆ
యేసుక్రీస్తు నామము కొరకు, సమస్త రాష్ట్రములలో
విశ్వాసమునకు విధేయత కలిగే నిమిత్తము, ఆయనవలన
కృపను అపొస్తలుతనమును పొందితిమి. వారిలో మీ
రును యేసుక్రీస్తువలన పిలువబడినవారై యున్నారు.

8 మొదట, మీ విశ్వాసము సర్వలోకమందు ప్రచుర
ము చేయబడెనని మీయందరి నిమిత్తము యేసు క్రీస్తు
9 ద్వారా నా దేవుని స్తుతించుచున్నాను; ఒక వేళ
నేను ఏలాగైనను దేవుని చిత్తమువల్ల మీ యొద్దికి వచ్చు
10 టకు మంచి సమయము పొందే నిమిత్తము, నా ప్రా
ర్థనలయందు నిత్యము వేడుకొనుచు, మిమ్మును ఎడ
తెగక జ్ఞాపకము చేసుకొనుచున్నాననుటకు, నేను
ఎవని కుమారుని సువార్త విషయము నా ఆత్మతో
ఎవని కొలుచుచున్నానో, ఆ దేవుడు నాకు సాక్షియై
11 యున్నాడు; మీరు స్థిరపరచబడే నిమిత్తము, అనగా
మీది నాదియైన మన విశ్వాసమువల్ల మీ మధ్యను
మీతో కూడా నాకు సుఖలాభము కలిగే నిమిత్తము,
12 మీకు ఆత్మసంబంధ వరమేదైనను ఇచ్చుటకు, మిమ్మును
చూడ వలెనని అపేక్షించుచున్నాను.

అయినను, సహోదరులారా! ఇతర రాష్ట్రములలో 13
ఏలాగో, ఆలాగున మీలోను నాకు కొంత ఫలము కలి
గే నిమిత్తము, మీ యొద్దికి వచ్చుటకు, అనేక పర్యాయ
ములు యోచనచేసి, ఇదివరకు ఆతంకపరచబడిన సం
గతి మీకు తెలియబడకుండ కూడదని కోరుచున్నాను.
నేను హెల్లేనీయులకు బర్బరస్థులకును, జ్ఞానులకు అవి 14
వేకులకును ఋణస్థుడనై యున్నాను; కాగా, నా వల్ల 15
నైనంత మట్టుకు రోమేలో ఉన్న మీకును సువార్త
ప్రకటించుటకు సిద్ధముగా ఉన్నాను.

ఎందుకనగా, నేను సువార్తను గూర్చి సిగ్గుపడేది 16
లేదు; అది, నమ్మే ప్రతివానికి, మొదట యూదునికి
హెల్లేనీయునికి కూడా, రక్షణ కొరకు దేవుని శక్తి
రూపమైయున్నది; ఏలాగనగా—నీతిమంతుడు విశ్వా 17
సమువల్ల బ్రతుకునని వ్రాయబడిన ప్రకారము, విశ్వా
సము నిమిత్తము విశ్వాసమూలమైన దేవుని నీతి ఆ సు
వార్తలో బైలుపరచబడియున్నది.

ఎందుకనగా సత్యమును అక్రమము చేత అడ్డ 18
గించే మనుష్యులయొక్క సమస్త భక్తిహీనతకును అక్ర
మమునకును విరోధముగా దేవుని కోపము ఆకాశము
నుంచి బైలుపరచబడియున్నది. ఎందుకనగా, దేవుని 19
గూర్చి ఏమి తెలియబడ వచ్చునో అది వారిలో విశ
దమైయున్నది; దేవుడు అది వారికి విశదపరిచెను.
ఆయనయొక్క అదృశ్యమైనవి, అనగా ఆయనయొక్క 20
అనంతమైన శక్తియు దేవత్వమును, జగదుత్పత్తి మొద
లుకొని, చేయబడిన వాటివల్ల తెలియబడి అగపడుచు
న్నవి గనుక వారు నిరుత్తరులై యున్నారు; ఎందుకన 21
గా, వారు దేవుని ఎరిగియు, ఆయన దేవుడని† మహిమ
పరచలేదు, కృతజ్ఞత గలవారై యుండలేదు; వారు
తమ తర్కములందు వ్యర్థులైరి. వారి అవివేక హృ 22
దయము అంధకారయుక్తమాయెను. తాము జ్ఞానుల
మనుకొని బుద్ధిహీనులైరి. అప్పుడు వారు అక్షయ 23

*లేక, దృఢముగా. †లేక, దేవునివలె.

దేవుని మహిమను, క్షయమయే మనుష్యునియొక్క
యు, పక్షులయొక్కయు, నాలుగు కాళ్ల జంతువుల
యొక్కయు, పురుగులయొక్కయు ప్రతిమాస్వరూప
మునకు మార్చిరి.

24 మరియు ఆ హేతువుచేతను, తమలో తాము తమ
శరీరములను అవమానపరుచుకొనుటకు, తమ హృద
యముల దురాశల యందుండగా దేవుడు వారిని అప
25 విత్రతకు అప్పగించెను. । అట్టివారు దేవుని సత్యమును
అబద్ధమునకు మార్చివేసి, సృష్టికర్తకు ప్రతిగా సృష్టి
యందు భక్తి కలిగి, ఆరాధించేవారైరి. ఆయనే నిరం
తరము స్తోత్రార్హుఁడై యున్నాడు; ఆమేన్.

26 అందుచేతను దేవుడు వారిని కుచ్చితాభిలాషలకు
అప్పగించెను; వారి స్త్రీలు కూడా స్వాభావికమైన
ప్రయోజనమును స్వభావమునకు విరోధమైన దానికి
27 మార్చిరి. । ఆప్రకారము, పురుషులు కూడా స్త్రీ స్వా
భావికమైన ప్రయోజనము విడిచి, ఒకనియందు ఒకడు
మోహము చేతను తప్తుడై, పురుషులతో పురుషులు
అవాచ్యమైనది చేసి, తమ తప్పితమునకు తగిన ప్రతి
ఫలము తమలోతాము పొందిరి.

28 మరియు వారు దేవుని జ్ఞాపకము ఉంచుకొనుటకు
ఎంచుకొనలేదు గనుక, తగని కార్యములు చేయుటకు,
దేవుడు వారిని ఎన్నికలేని మనస్సుకు అప్పగించెను. ।
29 అట్టివారు సమస్తమైన అక్రమము, జారత్వము, దుష్ట
త్వము, లోభిత్వము, దుర్బుద్ధి అనే వాటిచేత నింపబ
డి, మత్సరము, నరహత్య, జగడము, కపటము, వైరము
30 అనే వాటితో నిండుకొని, । కొండెగాండ్లు, అపవాద
కులు, దేవద్వేషులు, హింసకులు, గర్విష్ఠులు, బింకము
లాడేవారు, చెడ్డ వాటిని కల్పించేవారు, తలిదండ్రు
31 లకు అవిధేయులు, బుద్ధిహీనులు,* । మాట తప్పేవారు,
32 వాత్సల్యరహితులు, అసంఘతులు, నిర్దయులునై, । అటు
వంటి కార్యములను చేసే వారు మరణమునకు తగినవా
రన్న దేవుని న్యాయపు తీర్పు తెలిసియుండియు, వీరు
వాటిని చేయుట మాత్రమే కాకుండా, వాటినిచేసే
వారితో సంతోషముగా సహవాసము చేయుచున్నారు.

## 2. అధ్యాయము.

1 కాబట్టి, ఓ మనుష్యుడా! తీర్పు చేసే నీవు ఎవ
డవైనప్పటికి నిరుత్తరుడవై యున్నావు; నీవు వేని విష
యము పరునికి తీర్పు చేయుచున్నావో, దాని విష
యము నీకు నీవే తీర్పు చేసుకొనుచున్నావు; తీర్పు
చేసే నీవును వాటినే చేయుచున్నావు.

మరియు అట్టి పనులు చేసే వారి యెడల, దేవుని 2
తీర్పు, సత్యప్రకారముగానే ఉన్నదని యెరుగుదుము. ।
అట్టి వాటిని జరిగించే వారికి తీర్పు చేయుచు, వాటి 3
నే చేయుచున్న ఓ మనుష్యుడా! నీవు దేవుని తీర్పు
తప్పించుకొందువని తలంచుకొనుచున్నావా? । మరియు 4
దేవుని ఉపకారము నీవు పశ్చాత్తాపపడుటకు ప్రేరే
పించుచున్నదని యెంచుకొనక, సహనము దీర్ఘశాం
తియు గల ఆయన అనుగ్రహ సంపద అలక్ష్యము
చేయుచున్నావా? । అయితే పశ్చాత్తాపపడని నీ కఠిన 5
హృదయ ప్రకారముగా, దేవుని న్యాయపు తీర్పు
బైలు పరచబడే దండన† దినమందలి దండన† నీకు
నీవే కూడబెట్టుకొనుచున్నావు. । ఆయన ప్రతివానికి, 6
వానివాని క్రియల చొప్పున ప్రతిఫలమిచ్చును. । సత్క్రి 7
యలు ఓపికగా చేయుచు, మహిమ, ఘనత, అమరత్వ
మును కోరు వారికి నిత్యజీవము యిచ్చును, । గాని స్వా 8
ర్థపరులై సత్యమునకు విధేయులుకాక, అక్రమ
మునకు విధేయులైన వారికి, । దండన,† కోపమును; 9
దుష్కార్యము చేసే ప్రతి మనుష్యుని ఆత్మకును, మొదట
యూదునికి హెల్లేనీయునికి కూడా, శ్రమయు, వేద
నయు కలుగును; । సత్క్రియ చేసే ప్రతివానికిని, మొద 10
ట యూదునికి హెల్లేనీయునికి కూడా, మహిమ, ఘ
నత, సమాధానమును కలుగును; । దేవునికి పక్షపాత 11
ము లేదు.

బోధనప్రమాణము లేనప్పుడు, పాపము చేసిన వా 12
రందరు బోధనప్రమాణము లేకుండా నశింతురు; మరి
యు బోధనప్రమాణము కింద, పాపము చేసిన వారం
దరు బోధనప్రమాణమువల్ల తీర్పు పొందుదురు; ।
బోధనప్రమాణము వినేవారు దేవుని దృష్టికి నీతిమం 13
తులు కారు, గాని బోధనప్రమాణము చొప్పున జరి
గించేవారే నీతిమంతులని యెంచబడుదురు. । బోధన 14
ప్రమాణము లేని అన్యజనులు ఒకవేళ స్వభావము
చేతను బోధనప్రమాణమందలి క్రియలు చేసేటప్పు
డు, వీరు బోధనప్రమాణము లేనివారై, తమకు తామే
బోధనప్రమాణమై యున్నారు. । అట్టివారు తమ హృ 15
దయములలో వ్రాయబడిన బోధనప్రమాణమందలి
క్రియను చూపించుచున్నారు. వారి తలంపులు మధ్య
మధ్యను నిందించుచు లేక ఒప్పుకొనుచునుండగా, అం

*లేక, అవివేకులు. †లేక, ఉగ్రత.

దుకు వారి మనస్సాక్షి వారితో కూడా సాక్ష్యమిచ్చు
16 చుండును. । నా సువార్త ప్రకారము దేవుడు యేసు
క్రీస్తు ద్వారా మనుష్యుల రహస్యములను గూర్చి
తీర్పు చేసే దినమందు (కలుగును.)
17 ఇదుగో! నీవు యూదుడనే పేరు పెట్టుకొని, బో
ధనప్రమాణమును ఆశ్రయించి, దేవునిగూర్చి అతిశ
18 యపడి, । ఆయన చిత్తము ఎరిగి బోధనప్రమాణమువల్ల
బోధపరచబడి, శ్రేష్ఠమైన వాటిని పరీక్షించ గలవా
19 డవు. । మరియు బోధనప్రమాణములో జ్ఞానముయొక్క
యు సత్యము యొక్కయు క్రమము * కలిగి — నేనే
20 గుడ్డివారికి తోవ చూపించేవాడను, । చీకటిలో ఉండే
వారికి వెలుగును, అవివేకులకు ఉపదేశకుడను, బాలు
రకు బోధకుడను అని నిశ్చయించుకొనుచున్నావు. ।
21 కాబట్టి పరునికి బోధపరిచే నీవు నీకు నీవే బోధపరు
చుకొనవా? దొంగతనము చేయ వద్దని ప్రకటించే నీవు,
22 దొంగతనము చేయుచున్నావా? । వ్యభిచరించ వద్దని
చెప్పే నీవు వ్యభిచరించుచున్నావా? విగ్రహముల
యందు అసహ్యపడే నీవు గుడిలో ఉన్నవి అపహ
23 రించుచున్నావా? । బోధనప్రమాణమును గూర్చి అతి
శయపడే నీవు బోధనప్రమాణము మీరుటవల్ల దేవుని
24 అవమానపరుచుచున్నావా? । వ్రాయబడిన ప్రకార
ము, మీ ద్వారా దేవుని నామము రాష్ట్రముల మధ్య
ను దూషించబడుచున్నది.†
25 నీవు బోధనప్రమాణము గైకొనుచుంటే, ఛేదనసం
స్కారము ప్రయోజనమవును, గాని నీవు బోధనప్రమా
ణము అతిక్రమించువాడవైతే, నీ ఛేదనసంస్కారము
26 అఛేదనసంస్కారమైనది. । కాబట్టి ఛేదనసంస్కారము
లేనివాడు, బోధనప్రమాణముయొక్క న్యాయవిధులు
గైకొనిన పక్షమందు, అతని అఛేదనసంస్కారము
27 ఛేదనసంస్కారమని యెంచబడదా? । మరియు స్వా
భావికమైయుండే, ఛేదనసంస్కారము లేనివాడు బో
ధనప్రమాణము గైకొనినయెడల, లేఖనము ఛేదనసం
స్కారము కలిగియు, బోధనప్రమాణమును మీరే నీకు
28 తీర్పు చేయడా? । బాహ్యముగా యూదుడైనవాడు
యూదుడు కాడు; శరీరమందు బాహ్యమైన ఛేద
29 నము ఛేదనసంస్కారము కాదు, । గాని అంతరంగ
మందు యూదుడైన వాడు యూదుడు; ఆత్మలో హృ
దయ ఛేదనసంస్కారమే గాని లేఖనములోనిది ఛేదన
సంస్కారము కాదు. అతనికి స్తోత్రము మనుష్యుల
చేత కలుగదు, గాని దేవునిచేత కలుగును.

## 3. అధ్యాయము.

ఆలాగైతే, యూదుని అతిశయము ఏమిటి? ఛేద 1
నసంస్కార లాభము ఏమిటి? । ప్రతి విషయమందు 2
అది అధికము. మొదటిది యేదనగా, వారికేగదా
దేవోక్తులు అప్పగించబడెను; । కొందరు అవిశ్వాసు 3
లైననేమి? వారి అవిశ్వాసము దేవుని విశ్వాస్యతను
వ్యర్థము చేసునా? । అది దూరమవుగాక. దానికంటే— 4
నీవు నీ వాక్యములయందు నీతిమంతుడవని తీర్పబడు
టకును, నీవు విమర్శించబడేటప్పుడు గెలుచుటకును
అని వ్రాయబడిన ప్రకారముగా‡ ప్రతిమనుష్యుడును
అబద్ధికుడైనప్పటికి దేవుడు సత్యవంతుడనుకొన వలెను.
సరి; అయినను మన దుర్నీతి దేవుని నీతిని వెల్ల 5
డిపరిచితే, ఏమందుము? । దండన చేయు దేవుడు దు 6
ర్నీతిమంతుడా? మనుష్యుని వలె పలుకుచున్నాను;
ఆ ఊహ దూరమవుగాక. ఆ పక్షమందు దేవుడు
లోకమునకు ఏలాగు తీర్పు చేయ గలడు? । దేవుని సత్య 7
ము నా అబద్ధమువల్ల ఆయన మహిమ నిమిత్తము మరి
ప్రసిద్ధిగానుండిన పక్షమందు, నేను ఇంకా పాపినని
తీర్చబడనేల? । — మేలు వచ్చుటకు కీడు చేతామని 8
మేము పలుకుచున్నామని కొందరు మమ్మును దూషిం
చి చెప్పే ప్రకారముగా మేము ఎందుకనుకొన రాదు?
వారి శిక్షావిధి న్యాయమైయున్నది.
ఆలాగైతే ఏమి? మేము అతిశ్రేష్ఠులమా? ఎంత మా 9
త్రమును కాము. యూదులేమి, హెల్లేనీయులేమి,
వారందరును పాపమునకు లోబడి యున్నారనుటకు,
ముందుగా హేతువు చెప్పి యున్నాము. । ఆ ప్రకా 10
రము వ్రాయబడి యున్నది:—
నీతిమంతుడు ఒక్కడైనను లేడు. గ్రహించే వా 11
డెవడును లేడు. దేవుని వెతికేవాడెవడును లేడు;
అందరు తోవ తప్పి యున్నారు; । ఏకముగా పని 12
కిమాలిన వారైరి. మేలు చేసే వాడు లేడు; ఒక్క
డైనను లేడు.§
వారి గొంతుక తెరచిన సమాధియైయున్నది; తమ 13
నాలుకలచేత మోసము చేసియున్నారు; పాముల
విషము వారి పెదవులకింద ఉన్నది.‖
వారి నోరు శాపముతోను, చేదుతోను, నిండి 14
యున్నది.¶
వారి పాదములు రక్తము చిందించుటకు త్వరపడు 15
చున్నవి. । నాశము ఉపద్రవమును వారి మార్గ 16

*లేక, స్వరూపము. †యెషయ. 52: 5; యెహెజెకేలు. 36: 20.
‡కీర్తన. 51: 4. §కీర్తన 14; 1–3. ‖కీర్తన. 5. 9; 140. 3. ¶కీర్తన. 10. 7.

17 ములలో ఉన్నవి; । శాంతి మార్గము వారు తెలుసు
18 కొనలేదు.* । వారి దృష్టికి దేవుని భయము లేదు.†
19 మరియు ప్రతి నోరును మూయబడుటకును, సర్వ
లోకమును దేవుని శిక్షావిధికి లోబడియుండుటకును,
బోధనప్రమాణము వేటిని చెప్పుచున్నదో వాటిని ఆ
బోధనప్రమాణమునకు లోబడిన వారితో పలుకుచున్న
20 దని యెరుగుదుము; । ఎందుకనగా బోధనప్రమాణ క్రి
యల మూలముగా, ఏ మనుష్యుడును ఆయన దృష్టికి
నీతిమంతుడని తీర్పుపొందలేదు; బోధనప్రమాణమువల్ల
పాపము తెలియపరచబడుచున్నది.

21 అయినను ఇప్పుడు బోధనప్రమాణమునకు వేరుగా‡
దేవుని నీతి, అనగా బోధనప్రమాణము వల్లను, ప్రవ
22 క్తల వల్లను సాక్ష్యము పొందుచు, । అందరికిని, నమ్మే
వారందరి మీదికిని, యేసుక్రీస్తు విశ్వాసమూలమైన
23 దేవుని నీతి తేటపరచబడి యున్నది; । ఏ భేదమును
లేదు; అందరు పాపము చేసి, దేవుని మెప్పు§ పొం
24 దకపోవుచున్నారు. । క్రీస్తు యేసువల్లనైన విముక్తిమూ
లముగా, ఆయనయొక్క కృపచేతను ఉచితముగా నీతి
25 మంతులని తీర్చబడుదురు. । దేవుని ఓరిమివల్ల, పూర్వ
మందు కలిగిన పాపములు క్షమించబడినందున, ఆయన
26 తన నీతిని అగపరిచే నిమిత్తము, । అనగా తాను నీతి
మంతుడును, యేసు విశ్వాసము గలవాని నీతిమంతు
డని తీర్చేవాడునై యుండుటకు, ఇప్పటి కాలమందు
తన నీతిని అగపరిచే నిమిత్తము, ఆయన రక్తమందు
విశ్వాసముంచుటవల్ల ప్రాయశ్చిత్తార్థమైనదిగా ఆయన
ను బైలుపరిచెను.

27 కాబట్టి ఆత్మస్తుతి‖ యెక్కడ? అది పోగొట్టబడె
ను. ఏ బోధనప్రమాణమువల్ల? క్రియల బోధనవల్లనా?
కాదు; విశ్వాస విషయమైన బోధనప్రమాణమువల్లనే.।
28 బోధనప్రమాణ క్రియలకు వేరుగా, మనుష్యుడు వి
శ్వాసముచేత నీతిమంతుడని తీర్చబడును అని యెంచు
29 చున్నాము. । ఆయన యూదులకు మాత్రమే దేవుడా?
రాష్ట్రములకును ¶ దేవుడు కాడా? రాష్ట్రములకును
30 దేవుడే అవును. । విశ్వాస మూలముగా, ఛేదనసంస్కా
రము గలవారిని, విశ్వాసము ద్వారా, ఛేదనసంస్కార
ము లేనివారిని నీతిమంతులని తీర్చే దేవుడు ఒక్కడే
31 గదా. । కాబట్టి విశ్వాసమువల్ల మనము బోధనప్రమా
ణము వ్యర్థము చేయుచున్నామా? అది దూరమవుగాక,
బోధనప్రమాణము స్థిరపరుచుచున్నాము.

## 4. అధ్యాయము.

కాబట్టి మన తండ్రియైన అబ్రాహాముకు శరీరవిష 1
యము ఏమి దొరికెనని అనగలము? । అబ్రాహాము క్రియ 2
లమూలముగా నీతిమంతుడని తీర్చబడినయెడల, అత
నికి అతిశయాస్పదము కలుగును, । గాని దేవుని యె 3
దుట లేదు; లేఖనము ఏమి చెప్పుచున్నది?—అబ్రా
హాము దేవుని నమ్మెను, అది అతనికి నీతి అని యెంచబ
డెను.** । మరియు పని చేసే వానికి జీతము ఋణమే, అది 4
కృపగా ఎంచబడదు, । గాని పనిచేయక, భక్తిహీనుని 5
నీతిమంతుడని తీర్చేవానియందు విశ్వాసముంచే వానికి,
వాని విశ్వాసము నీతి అని యెంచబడును.

ఆ ప్రకారమే, దేవుడు క్రియలకు వేరుగా, ఎవని 6
నీతిగలవాడని యెంచునో, ఆ మనుష్యుని ధన్యతను
దావీదు కూడా చెప్పుచున్నాడు; । ఏలాగనగా—ఎవరి 7
అపరాధములు క్షమించబడెనో, ఎవరి పాపములు
కప్పివేయబడెనో వారు ధన్యులు; । ప్రభువు ఎవని 8
యందు పాపము ఎంచడో ఆ మనుష్యుడు ధన్యుడు.††

కాబట్టి ఈ శుభవచనము ఛేదనసంస్కారము గల 9
వారిని గూర్చినదా? లేక ఛేదనసంస్కారము లేని వా
రిని గూర్చినదియునైనదా? విశ్వాసము అబ్రాహాముకు
నీతి అని యెంచబడెననుచున్నాము.

మంచిది; అది ఏలాగు ఎంచబడెను? అతనికి ఛేదన 10
సంస్కారము కలిగినప్పుడా? లేక ఆ సంస్కారము
లేనప్పుడా? ఛేదనసంస్కారము కలిగినప్పుడు కాదు,
ఆ సంస్కారము లేనప్పుడే. । మరియు, ఛేదనసంస్కా 11
రము లేకనే నమ్మే వారందరికిని నీతియెంచబడే నిమి
త్తము, అతడు వారికి తండ్రియు, ఛేదనసంస్కారము
పొందుట మాత్రమే కాకుండా, । మా తండ్రియైన 12
అబ్రాహాముకు ఛేదనసంస్కారము లేనప్పుడు అతనికి
కలిగిన విశ్వాసముయొక్క అడుగులయందు నడిచే వా
రికిని, ఛేదనసంస్కారము గలవారికి తండ్రియునై
యుండే నిమిత్తము, అతనికి ఛేదనసంస్కారము లేన
ప్పుడు కలిగిన విశ్వాసమువల్లనైన నీతికి ముద్రగా ఛేదన
సంస్కారమనే గురుతు పొందెను.

అబ్రాహాము లోకబాధ్యుడవుననే వాగ్దత్తము 13
విశ్వాసమువలని నీతిమూలముగానే గాని అతనికైనను,
అతని సంతానమునకైనను బోధనప్రమాణ మూలము
గా చేయబడలేదు. । బోధనప్రమాణ సంబంధులు వా 14

*యెషయా. 59. 7, 8. †కీర్తన. 36. 1. ‡లేక, కంటే వేరేలాగున. §లేక, మహిమ. ‖లేక, అతిశయాస్పదము.
¶లేక, అన్యజనులకును. **ఆదికాండము. అ. 15, వ. 6. ††కీర్తన. 32. 1.

ధ్యులైతే విశ్వాసము వ్యర్థమవును, ఆ వాగ్దత్తము
15 కొట్టివేయబడును; । ఎందుకనగా బోధనప్రమాణము
కోపము కలుగచేయును; బోధనప్రమాణము ఎక్కడ
16 ఉండదో అక్కడ అతిక్రమమును లేదు. । ఈ హేతు
వుచేతను ఆ యావత్సంతతికి అనగా బోధనప్రమాణము
గల వారికి మాత్రమే కాకుండా, అబ్రాహాముయొ
క్క విశ్వాసముగల వారికిని ఆ వాగ్దత్తము దృఢమయే
నిమిత్తము, కృప చొప్పున కలుగుటకు విశ్వాసమూల
17 మైనది.।—నిన్ను అనేక దేశస్థులకు తండ్రిగా నియ
మించితినని వ్రాయబడిన ప్రకారము,* చనిపోయిన
వారిని బ్రతికించే వాడును, లేని వాటిని ఉన్న వాటి
వలె పిలిచే వాడును, అబ్రాహాము నమ్మినవాడునైన
దేవుని దృష్టికి అతడు మనకందరికిని తండ్రియై యు
న్నాడు.

18 —నీ సంతానము ఈలాగు ఉండుననిꝉ చెప్పబడిన
ప్రకారము, తాను అనేక రాష్ట్రములకు తండ్రియై
యుండే నిమిత్తము అతడు నిరీక్షణకు విరోధమైన నిరీ
19 క్షణ కలిగి విశ్వసించెను. । మరియు విశ్వాస విషయము
బలహీనుడుకాక, అతడు కొంచెము ఎక్కువ తక్కువ
నూరు సంవత్సరముల వయస్సు కలిగియు, అప్పటికి మృ
తమైయున్న తన దేహమునైనను, శారాయొక్క నిర్జీవ
20 గర్భమునైనను లక్ష్య పెట్టలేదు. । అవిశ్వాసమువల్ల
21 దేవుని వాగ్దత్తమును గూర్చి సందేహించక । దేవుని మ
హిమపరిచి, ఆయన ఏమి వాగ్దత్తము చేసెనో దాని
నెరవేర్చుటకును శక్తిమంతుడని రూఢిగా విశ్వసించి,
22 విశ్వాసమువల్ల బలపరచబడెను. । అందుచేతను అది
అతనికి నీతి అని యెంచబడెను.

23 మరియు అది అతనికి ఎంచబడెనని అతని నిమిత్త
ము మాత్రమే కాదు, మననిమిత్తమును వ్రాయబడెను;।
24 ఏలాగనగా మన ప్రభువైన యేసుని చచ్చినవారిలో
నుంచి లేపిన వానియందు విశ్వాసముంచినయెడల అది
25 మనకును యెంచబడును; । ఆయన మన అపరాధముల
నిమిత్తము అప్పగించబడి, మనకు నీతి కలుగుటకు లేప
బడెను.

## 5. అధ్యాయము.

1 కాబట్టి విశ్వాసమూలముగా మనము నీతిమంతుల
మని ఎంచబడి మన ప్రభువైన యేసుక్రీస్తు ద్వారా
2 దేవునియెడల సమాధానము పొంది యున్నాము. । ఆ
యన ద్వారా విశ్వాసమువల్ల ఈ కృపయందు ప్రవే
శము కూడా మనకు కలిగియున్నది. అందులో మనము
నిలిచి, దేవుని మహిమను‡ గూర్చిన నిరీక్షణ కలిగి,
ఉత్సహించుచున్నాము.

అంతేకాదు, శ్రమ ఓర్పును, ఓర్పు పరీక్షను, పరీక్ష 3
నిరీక్షణను కలుగచేయునని యెరిగి, । శ్రమల యందును 4
ఉత్సహించుచున్నాము. । ఆ నిరీక్షణ సిగ్గుపరచదు; 5
మనకు ఇయ్యబడిన పరిశుద్ధాత్మవల్ల, దేవుని ప్రేమ మన
హృదయములలో పోయబడియున్నది. । మనము ఇం 6
కా బలహీనులమై యున్నప్పుడు, నిర్ణయకాలమందు
క్రీస్తు భక్తిహీనుల కొరకు చనిపోయెను. । నీతిమంతుని 7
కొరకు ఎవడైనను చనిపోవుట అరుదు; అయినప్పటికి,
మంచివాని కొరకు ఒకానొకడు ఒకవేళ చనిపోవుట
కైనను సాహసించును. । అయితే దేవుడు తన ప్రేమను 8
మనకు వెల్లడి చేయుచున్నాడు; ఏలాగనగా, మనము
ఇంకా పాపులమైనప్పుడు, క్రీస్తు మన కొరకు చని
పోయెను. । కాబట్టి మరి యెక్కువగా ఆయన రక్తము 9
వల్ల ఇప్పుడు నీతిమంతులమని యెంచబడి, మనము
ఆయన ద్వారా కోపమునుంచి§ రక్షించబడుదుము;।
మనము శత్రువులమైయున్నప్పుడు, దేవునితో ఆయన 10
కుమారుని మరణమువల్ల సమాధానపరచబడితే, మనము
సమాధానపరచబడి మరి ఎక్కువగా ఆయనయొక్క
జీవమువల్ల రక్షించబడుదుము.

అంతేకాదు, మన ప్రభువైన యేసుక్రీస్తు ద్వారా, 11
మనము దేవుని యందును ఉత్సహించుచున్నాము;
ఆయన ద్వారా మనము ఇప్పుడు ఆ సమాధానస్థితి
పొందియున్నాము.

కాబట్టి ఒక్క మనుష్యునివల్ల పాపము, ఆ పాపము 12
వల్ల మరణమును లోకమందు ఏలాగు ప్రవేశించెనో,
ఈ విధముగా సమస్త మనుష్యులు పాపము చేసినం
దున, మరణము అందరి మీదను ఏలాగు వ్యాపించె
నో(ఆలాగే ఉన్నది.) । ఎందుకనగా బోధనప్రమాణ 13
ము వరకు, పాపము లోకమందు ఉండెను గాని బో
ధన ప్రమాణము లేనప్పుడు, పాపము ఎంచబడదు.।
అయినప్పటికి రాగల వానికి గురుతైయున్న ఆదాము 14
యొక్క అతిక్రమమువలె పాపము చేయని వారి
మైనిని మరణముయొక్క యేలుబడి ఆదాము మొదలు
కొని మోషే పర్యంతము జరుగుచుండెను.

అయినను ఆ అపరాధము ఎట్టిదో ఈకృపావరము 15
అట్టిది కాదు; ఏలాగనగా ఒకని అపరాధమువల్ల
అనేకులు చనిపోయిరిగదా మరి యెక్కువగా దేవుని కృ
పయు, యేసుక్రీస్తు అనే ఒక్క మనుష్యుని కృపచేత

*ఆదికాండము. అ. 17. వ. 5. †ఆదికాండము. 15: 5. ‡లేక, మెప్పును. §లేక, దండనను౦చి.

16 మైన వరమును అనేకులకు విస్తరించి యున్నవి. । మరి
యు ఆ వరము పాపము చేసిన ఒకనివల్ల వచ్చిన దాని
వంటిది కాదు; ఏలాగనగా, ఆ తీర్పు ఒక దాని మూ
లముగా శిక్షావిధికైనది, గాని ఆ కృపావరము అనేక
17 మైన అపరాధములనుంచి నీతివిధికైనది. । ఒకని అప
రాధమువల్లనే మరణము ఆ ఒకని ద్వారా యేలితే,
విస్తారమైన కృపను నీతి వరమును పొందే వారు మరి
విశేషముగా, యేసుక్రీస్తు అనే ఒకని ద్వారా జీవ
మందు ఏలికలవుదురు.

18 కాబట్టి ఒక్క* అపరాధము సమస్త మనుష్యుల
శిక్షావిధికి ఏలాగు మూలమైనదో, ఆలాగే ఒక్క*
నీతిక్రియ † సమస్త మనుష్యులకు జీవసంబంధమైన
19 నీతి విధించబడుటకు మూలమైనది; । ఏలాగనగా,
ఒక్క మనుష్యుని అవిధేయతవల్ల అనేకులు ఏలాగు
పాపులుగా చేయబడిరో, ఆలాగే ఒకని విధేయత
వల్ల అనేకులు నీతి మంతులుగా చేయబడుదురు.

20,21 అయితే ఆ అపరాధము విస్తరించే నిమిత్తము,
బోధనప్రమాణము కూడా ప్రవేశించెను. అయినను
పాపము మరణమందు ఏలాగు రాజ్యము చేసెనో,
ఆలాగే కృపయు మన ప్రభువైన యేసుక్రీస్తు ద్వారా
నీతివల్ల నిత్య జీవార్థముగా రాజ్యము చేసే నిమిత్తము,
పాపము ఎక్కడ విస్తరించెనో, అక్కడ ఆ కృప విశే
షముగా ప్రబలమాయెను.

## 6. అధ్యాయము.

1 కాబట్టి ఏమనగలము? కృప విస్తరించే నిమిత్తము
2 పాపమందు నిలువ వచ్చునా? । అది దూరమవుగాక.
పాపము మట్టుకు మృతిబొందిన మనము దానిలో ఇక
3 మీదట ఏలాగు జీవింతుము? । యేసుక్రీస్తులో నుండు
టకు‡ బాప్తిస్మము పొందిన మనమందరము ఆయన మర
ణములోనుండుటకు§ బాప్తిస్మము పొందినామని మీరు
4 ఎరుగరా? । కాబట్టి, తండ్రి మహిమవల్ల క్రీస్తు ఏలాగు
మృతిబొందిన వారిలోనుంచి లేపబడెనో, ఆలాగు
మనము కూడా జీవనముయొక్క నూతన స్థితిలో నడు
చుకొనే నిమిత్తము, ఆయనయొక్క మరణములోనుం
డుటకు§ బాప్తిస్మము పొందుటవల్ల, ఆయనతో కూడా
5 పాతిపెట్టబడితిమి. । కాగా, మనము ఇకమీదట పా
పమునకు దాసులము కాకుండుటకు, పాప శరీరము
నివారించబడే నిమిత్తము, మన ప్రాచీన నరస్వభావము
6 ఆయనతో కూడా శిలువ వేయబడెనని యెరిగి, । మన
ము ఆయన మరణముయొక్క పోలికతో సంయుక్తుల
మైయుంటే, ఆయన పునరుత్థానముయొక్క పోలిక
తో సంయుక్తులమై యుందుము; । మృతిపొందినవా 7
డు పాపమునుంచి విముక్తి పొందియున్నాడు. । మరి 8
యు, క్రీస్తు మృతిపొందిన వారిలో నుంచి లేపబడి,
ఇకమీదట చావడనియు, । ఇకమీదట ఆయన పైని 9
మరణమునకు అధికారము లేదనియు తెలుసుకొని,
మనము ఆయనతో మృతి పొందియుంటే ఆయనతో
జీవించుదుమని నమ్ముచున్నాము. । ఎందుకనగా, ఆయన 10
మరణము చూస్తే, పాపము నిమిత్తము ఒక్కమారే మృతి
బొందెను; ఆయన జీవము చూస్తే, దేవుని నిమిత్తము
జీవించుచున్నాడు. । అటువలె మీరును పాపము మట్టుకు 11
మృతులమనియు, యేసు క్రీస్తుయందు దేవుని మట్టుకు
జీవితులమనియు మీకు మీరే ఎంచుకొనుడి.

కాబట్టి దాని ఆశలకు విధేయులవుటకు, చావగల 12
మీ శరీరమందు పాపము రాజ్యము చేయనియ్యకుడి. ।
మరియు మీ అవయవములను దుర్నీతి ఆయుధముల 13
గా పాపమునకు అప్పగించక, మృతిబొందిన వారిలో
నుంచి జీవించినామనుకొని, మిమ్మును మీరే దేవునికి,
నీతి ఆయుధములగా మీ అవయవములను దేవునికే
అప్పగించుడి. । మీరు కృపకే గాని, బోధనప్రమాణ 14
మునకు లోబడరు గనుక పాపమునకు మీ మీద ప్రభు
త్వము కలగదు.

ఆలాగైతే, మనము కృపకేగాని బోధనప్రమాణ 15
మునకు లోబడుట లేదని పాపము చేయుదమా? అది
దూరమవుగాక. । మీరు విధేయతకొరకు మిమ్మును మీరు 16
దేనికి దాసులగా అప్పగించుకొందురో, మరణార్థము
గా పాపమునకే గాని, నీతి నిమిత్తము విధేయతకే,
గాని, దేనికి విధేయులై యుందురో, దానికి దాసులై
యున్నారని మీరు ఎరుగరా? । అయినను మీరు పాప 17
మునకు దాసులై యుంటిరి గాని మీరు ఏ ఉపదేశ
క్రమమునకు అప్పగించబడితిరో‖ దానికి హృదయ
ముతో విధేయులైతిరని దేవుడు స్తుతించబడుగాక. ।
మరియు పాపమునుంచి విమోచించబడి నీతికి దాసు 18
లుగా చేయబడితిరి. । మీ శరీర బలహీనతవల్ల మను 19
ష్యునివలె పలుకుచున్నాను; మీరు మీ అవయవము
లను అపవిత్రతకును, అన్యాయము కొరకు అన్యా
యమునకును దాసులుగా ఏలాగు అప్పగించితిరో,
ఆలాగు ఇప్పుడు మీ అవయవములను పరిశుద్ధత కొ
రకు నీతికి దాసులుగా అప్పగించుడి; । ఎందుకనగా 20
మీరు పాపమునకు దాసులైనప్పుడు, నీతివిముక్తులై
యుంటిరి.

*లేక, ఒకని. †లేక, నీతి విధించబడుట. ‡అనగా, యేసుక్రీస్తుయందు ఐక్యమునకు.
§అనగా, మరణమందు ఐక్యమునకు. ‖లేక, మీకు ఏ ఉపదేశక్రమము అప్పగించబడెనో.

21 కాగా, అప్పుడు మీకేమి ఫలము కలిగెను? మీరు ఇ
ప్పుడు సిగ్గుపడేవిగదా? వాటియొక్క అంతము మరణమే.।
22 అయినను ఇప్పుడు పాపమునుంచి విముక్తులుగాను దే
వునికి దాసులుగాను చేయబడిన మీకు పరిశుద్ధి నిమి
త్తమైన ఫలమును, తుదకు నిత్యజీవమును కలుగుచు
23 న్నవి; । ఎందుకనగా పాపమునకు జీతము మరణము,
గాని దేవుని కృపాదానము మన ప్రభువైన యేసుక్రీస్తు
యందు నిత్యజీవము.

## 7. అధ్యాయము.

1 సహోదరులారా! బోధనప్రమాణము ఎరిగిన వారి
తో పలుకుచున్నాను; మనుష్యుడు బ్రతికినంత కాలమే
బోధనప్రమాణమునకు అతని మీద ప్రభుత్వము కల
2 దని మీకు తెలియదా! । ఎందుకనగా, పెనిమిటిగల
స్త్రీ, బ్రతికియున్న ఆ పెనిమిటికి బోధన ప్రమాణము
వల్ల బద్ధురాలైయున్నది గాని ఆమె పెనిమిటి మృతి
బొందిన యెడల, పెనిమిటి బోధనప్రమాణము నుంచి
3 విడువబడి యుండును. । కాబట్టి పెనిమిటి బ్రతికి
యున్నప్పుడు, ఆమె వేరొక పురుషునికి కలిగితే,
వ్యభిచారిణి అనబడును గాని, ఆమె పెనిమిటి మృ
తిబొందినప్పుడు ఆ బోధనప్రమాణమునుంచి విడుదల
పొందును గనుక వేరొక పురుషునికి కలిగినప్పటికి
వ్యభిచారిణి కాకపోవును.

4 కాగా, నా సహోదరులారా! మనము దేవుని
నిమిత్తము ఫలము ఫలించుటకు మీరు, మృతిపొందిన
వారిలోనుంచి లేపబడిన వేరొకనికి కలుగుటకు, మీరు
ను క్రీస్తుయొక్క శరీరము ద్వారా బోధనప్రమాణ
5 ము మట్టుకు మృతులుగా చేయబడితిరి. । ఏలాగనగా,
మనము శారీరస్థితిలో ఉన్నప్పుడు బోధనప్రమాణము
వల్లనైన పాపముల ప్రోత్సాహములు మరణమునకు
ఫలము పుట్టించే నిమిత్తము, మన అవయవములలో కా
6 ర్యసాధకములై యుండెను. । అయినను ఇప్పుడు మన
ము దేనియందు కట్టబడితిమో దాని మట్టుకు మృతు
లమై ఆ బోధనప్రమాణమునుంచి విడువబడితిమి గను
క, మనము లేఖనప్రకారమైన పురాతన స్థితిలో కా
కుండా, ఆత్మ నూతనస్థితిలో సేవ చేయుచున్నాము.

7 కాబట్టి మనము ఏమనగలము? బోధనప్రమాణము
పాపమా! అది దూరమవుగాక; అయినను బోధన
ప్రమాణము వల్లనేగాని పాపము నాకు తెలియబడ
దు.—ఆశించ వద్దని బోధనప్రమాణము చెప్పకపోతే,
8 దురాశ నాకు తెలియదు, । గాని పాపము ఆజ్ఞను
హేతువు చేసుకొని, సమస్త విధమైన దురాశలను నా
యందు కలుగ చేసెను; బోధనప్రమాణము లేనప్పు
డు, పాపము మృతమై యుండెను. । ఒకప్పుడు నేను 9
బోధనప్రమాణము లేకుండా జీవించుచుంటిని. ఆజ్ఞ
వచ్చినప్పుడు, పాపము బ్రతికెను, గాని నేను మృతి
బొందితిని. । అప్పుడు జీవార్థమైన ఆజ్ఞ నాకు మరణా 10
ర్థముగా కనబడెను; । ఏలాగనగా, పాపము ఆజ్ఞను 11
హేతువు చేసుకొని, నన్ను మోసపుచ్చి దానివల్ల నన్ను
చంపెను. । కాబట్టి బోధనప్రమాణము పరిశుద్ధమైనది; 12
ఆజ్ఞ కూడా పరిశుద్ధముగాను న్యాయముగాను మంచి
దిగానున్నది.

కాబట్టి, ఏది మంచిదో అది నాకు మరణకరమైన 13
దా? అది దూరమవుగాక; అయినను పాపము ఆజ్ఞవల్ల
అత్యధిక పాపమై యుండేనిమిత్తము, పాపము మం
చిదానివల్ల నాకు మరణము కలుగచేయుచు, పాపమని
అగపడే నిమిత్తము (మరణమునకు కారణమాయెను); ।
బోధనప్రమాణము ఆత్మ సంబంధమైనదని యెరుగుదు 14
ము గాని నేను పాపమునకు లోబడుటకు అమ్మబడిన
శరీరముయుడనై యున్నాను. । ఏలాగనగా, నేను ఏమి 15
చేయుచున్నానో, దాని ఎరుగను; నేను ఇచ్ఛయించే
దాని జరిగించక, నాకు అసహ్యమైన దాని చేయుచు
న్నాను. । కావున, నేను ఏమి యిచ్ఛయించనో దాని 16
నేను చేసితే, బోధనప్రమాణము శ్రేష్ఠమని దానికి
సమ్మతించుచున్నాను. । కాగా నాయందు వసించే పా 17
పమే గాని ఇకను అది జరిగించేవాడను నేను కాను. ।
ఎందుకనగా, నాయందు అనగా నా శారీర స్థితిలో 18
మంచిది యేదియు వసించదని యెరుగుదును; ఇచ్ఛ
నాకు తటస్థమై యున్నది గాని మేలు చేయుట నాకు
కనబడదు; । నేను ఇచ్ఛయించే మేలు చేయక, నాకు 19
ఇష్టము కాని* కీడు చేయుచున్నాను. । నేను నాకు 20
ఇష్టముకానిది† చేసితే, నాయందు వసించే పాపమే,
గాని దాని జరిగించేవాడను ఇకను నేను కాను.

కాబట్టి మేలు చేయ వలెనని ఇచ్ఛయించుకొనే 21
నాకు కీడు తటస్థమై యున్నదనే ఒక బోధనప్రమా
ణము నాకు కనబడుచున్నది. । ఏలాగనగా అంతర్యా 22
మి‡ ప్రకారము నేను దేవుని బోధన ప్రమాణమందు
ఆనందించుచున్నాను. । అయినను నా మనస్సుయొక్క 23
బోధనప్రమాణముతో కలహించి, నా అవయవము
లలో ఉన్న పాపముయొక్క బోధనప్రమాణమునకు
నన్ను చెరపట్టి, లోపరుచుకొనే మరియొక ప్రమా
ణము నా అవయవములలో నాకు అగపడుచున్నది.

*లేక, నేను ఇచ్ఛయించనిది. †లేక, ఇచ్ఛయించనిది. ‡లేక, అంతరంగ పురుషుని.

24 ఆహా! నేను ప్రయాసముగల మనుష్యుడను; ఈ
మరణ శరీరమునుంచి నన్ను ఎవడు విడిపించును! ।
25 మన ప్రభువైన యేసుక్రీస్తు ద్వారా, దేవుని స్తుతిం
చుచున్నాను. కావున, నేను మనస్సుతో దేవుని బోధ
నప్రమాణమునకు, శరీరముతో పాపముయొక్క బోధ
నప్రమాణమునకును దాసుడనై యున్నాను.

## 8. అధ్యాయము.

1 కాబట్టి క్రీస్తు యేసు యందు ఉండే వారికి ఏ
శిక్షావిధి లేదు, [వారు ఆత్మ ప్రకారమేగాని శరీర
2 ప్రకారము నడవరు.] । క్రీస్తు యేసులో జీవముగల ఆత్మ
యొక్క బోధనప్రమాణము, పాప మరణములయొక్క
,4 బోధనప్రమాణమునుంచి నన్ను విడిపించెను; । ఏలాగ
నగా, ఆత్మ ప్రకారమేగాని శరీర ప్రకారము నడవని
మనయందు, బోధనప్రమాణముయొక్క నీతి నెరవేర్చ
బడే నిమిత్తము, దేవుడు పాపశరీరముయొక్క పోలిక
యందును, పాపము కొరకును తన కుమారుని పంపి,
శరీరములో పాపమునకు విరోధముగా తీర్పు చేసెను;
బోధనప్రమాణము శరీరమువల్ల బలహీనమైనందున, అది
దానికి అసాధ్యమైనది.

5 ఎందుకనగా, శరీరానుసారులు శరీరవిషయములను,
ఆత్మానుసారులు ఆత్మ విషయములను మనస్కరింతురు. ।
6 మరియు, శరీరమును మనస్కరించుట మరణము, గాని
ఆత్మను మనస్కరించుట జీవము సమాధానమునై యు
7 న్నది. । ఏలాగనగా శరీరము మనస్కరించేది దేవునికి
విరోధమైయున్నది; అది దేవుని బోధనప్రమాణమునకు
8 లోబడదు, ఏమాత్రమును లోబడ నేరదు. । శారీరస్థితి
గలవారు దేవునికి ఇష్టులు కానేరరు.

9 అయినను దేవుని ఆత్మ మీలో వసించియుంటే, మీ
రు ఆత్మీయ స్థితిగలవారేగాని శారీరస్థితిగలవారు కారు.
మరియు, ఎవడైనను క్రీస్తు ఆత్మ లేనివాడైతే ఆయన
10 వాడు కాడు. । క్రీస్తు మీలో ఉండినయెడల, పాప
మువల్ల శరీరము మృతమవునుగాని, నీతివల్ల ఆత్మ జీవ
11 మవును. । మరియు మృతిబొందిన వారిలోనుంచి యే
సుని లేపిన వానియొక్క ఆత్మ మీలో వసించినయెడల,
మృతిబొందిన వారిలోనుంచి క్రీస్తుని లేపిన వాడు, మీ
లో వసించే ఆయనయొక్క ఆత్మ కలుగుటవల్ల, మీ
మృతమైన శరీరములను జీవింపచేసును.

12 కాబట్టి, సహోదరులారా! (ఆత్మకేగాని), శరీరా
నుసారముగా జీవించుటకు, శరీరమునకు ఋణస్థులము
13 కాము; । మీరు శరీరానుసారముగా జీవించితే, చావ
నైయుందురు గాని, మీరు ఆత్మచేత శారీరక్రియలను
చావచేసితే, జీవింతురు; । ఎందుకనగా దేవుని ఆత్మ 14
చేత ఎందరు నడిపించబడుదురో, వారే దేవుని కుమా
రులైయుందురు; । మీరు తిరిగి భయపడుటకు దాసుల 15
ఆత్మ పొందలేదు గాని, పుత్రులకు తగిన ఆత్మను పొం
దితిరి. అది కలిగి—అబ్బా! తండ్రీ! అని మొరబెట్టు
చున్నాము. । మనము దేవుని పిల్లలమై యున్నామని, 16
ఆ యాత్మ తానే మన ఆత్మతో కూడ సాక్ష్యము చెప్పు
చున్నది. । మరియు, పిల్లలమైతే బాధ్యులము, అనగా 17
దేవుని బాధ్యులము, క్రీస్తుతో శ్రమపడుచుంటే, ఆ
యనతో మహిమపరచబడుటకు, ఆయనతో కూడ బా
ధ్యులమునై యున్నాము.

ఇప్పటి కాలశ్రమలు, మనయెడల ప్రత్యక్షము కా 18
బోయే మహిమ యెదుట ఎన్నతగినవి కావని యెం
చుకొనుచున్నాను. । సృష్టి* తేరి పారచూచుచు, దేవు 19
ని కుమారుల ప్రత్యక్షత కొరకు కనిపెట్టుచున్నది. ।
ఎందుకనగా, ఆ సృష్టియు క్షయాధీన దాస్యమునుం 20
చి విడిపించబడి, । దేవుని పిల్లలయొక్క మహిమగల 21
స్వాతంత్ర్యము పొందునని నిరీక్షణతో, సృష్టి స్వే
చ్ఛవల్లకాక, దాని లోపరిచిన ఆయన నిమిత్తమే మా
యకు లోపరచబడెను. । సృష్టియావత్తు ఇదివరకు ఏక 22
ముగా మూలుగుచు, ప్రసవవేదనపడుచున్నదని యెరు
గుదుము. । అంతేకాదు, మనము, ఆత్మయొక్క ప్రథమ 23
ఫలములు పొందిన మనము కూడ, దత్తపుత్రత్వము కొర
కు, మన దేహమునకు విముక్తి కొరకు కనిపెట్టుచు, మన
లో మనము మూలుగుచున్నాము. । ఎందుకనగా, మన 24
ము నిరీక్షణతో రక్షించబడితిమి; కనబడే నిరీక్షణ నిరీ
క్షణ కాదుగదా; ఎవడైనను చూచుచున్న దాని నిమి
త్తము ఇకను ఏల నిరీక్షించును? । కావున మనకు కన 25
బడని దానికొరకు నిరీక్షించితే, దాని నిమిత్తము ఓపిక
తో కనిపెట్టుదుము.

ఆ ప్రకారము ఆత్మయు మన బలహీనతలో సహా 26
యము చేయుచున్నది; ఏలాగనగా మనము తగిన ప్ర
కారము దేని నిమిత్తము ప్రార్థించ వలెనో ఎరుగము;
అయినను ఉచ్చరించబడని మూలుగులతో ఆ ఆత్మ
తానే మన కొరకు విజ్ఞాపనము చేయుచున్నది. । మరి 27
యు హృదయములను పరిశోధించే ఆయన, ఆత్మయొ
క్క మనస్సు ఏమిటో అది యెరుగును; ఎందుకనగా;
దేవుని (చిత్త) ప్రకారము పరిశుద్ధుల కొరకు విజ్ఞాప
నము చేసును.

మరియు దేవుని స్నేహించే వారికి, అనగా, ఆయన 28
సంకల్పము చొప్పున పిలువబడిన వారికి మేలు నిమి

*లేక, లోకము.

త్తము సమస్తమును సమకూడి జరుగునని యెరుగుదు
29 ము; । ఎందుకనగా ఆయన ఎవరిని ముందుగా ఎరిగి
యుండెనో, తన కుమారుడు అనేక సహోదరుల
లో జ్యేష్ఠుడగు నిమిత్తము, వారిని ఆయన పోలిక
తో సారూప్యము గల వారవుటకు, ముందుగా నిర్ణ
30 యించుకొనెను. । మరియు ఆయన ఎవరిని ముందుగా
నిర్ణయించుకొనెనో, వారిని పిలిచెను; ఎవరిని పిలి
చెనో వారిని నీతిమంతులని తీర్చెను; ఎవరిని నీతి
మంతులని తీర్చెనో; వారిని మహిమపరిచెను.

31 కాబట్టి, వీటిని గూర్చి ఏమనగలము? దేవుడు మనకు
32 తోడైయుండగా, మనకు విరోధి యెవడు? । తన స్వకీ
యమైన కుమారుడని వెనుకతియ్యక, మనయందరి కొ
రకు ఆయనను అప్పగించినవాడు, ఆయనతో కూడ
33 సమస్తమును మనకెందుకు అనుగ్రహించడు? । దేవుని
చేత ఏర్పరచబడిన వారిమీద నేరము మోపే వాడెవ
34 డు? నీతిమంతులని తీర్చేవాడు దేవుడే. । శిక్ష విధించే
వాడు ఎవడు? చనిపోయినవాడు క్రీస్తే; అంతేకాదు
ఆయన లేపబడి, దేవుని కుడిపార్శ్వమందు ఉండి,
35 మనకొరకు విజ్ఞాపనము చేయుచున్నాడు. । యేసుక్రీ
స్తు ప్రేమనుంచి మనలను ఎడబాపేవాడు ఎవడు? ।
36 వ్రాయబడిన ప్రకారము*—

మేము నీ నిమిత్తము దినమెల్ల
చంపబడుచున్నాము;
వేట గొర్రెలవలె ఎంచబడుచున్నాము. అయితే

శ్రమయైనను, బాధయైనను, హింసయైనను, కరవైనను,
వస్త్రహీనతయైనను, ఉపద్రవమైనను, ఖడ్గమైనను మ
37 నలను ఎడబాపునా? । అంతే కాదు; మనలను స్నేహిం
చిన వాని ద్వారా మనము వీటి అన్నిటిలోను అత్య
38 ధిక విజయము పొందుచున్నాము. । మరణమైనను, జీవ
మైనను, దూతలైనను, ప్రధానులైనను, అధికారులైనను
39 ఉన్నవైనను ఉండబోయేవైనను, । ఎత్తయినను, లోతై
నను, మరి యే సృష్టియైనను మన ప్రభువైన యేసుక్రీ
స్తు యందలి దేవుని ప్రేమనుంచి మనలను ఎడబాప
నేరవని రూఢిగా నమ్ముకొనుచున్నాను.

## 9. అధ్యాయము.

1-3 క్రీస్తు యందు నేను నిజము చెప్పుచున్నాను; అ
బద్ధమాడను; పరిశుద్ధాత్మయందు నా మనస్సాక్షి కూ
డ, నాకు బహు దుఃఖము, నా హృదయములో మా
నని బాధయు ఉన్నవని నా కొరకు సాక్ష్యము చెప్పు
చున్నది; ఏలాగనగా నాకు దేహబంధువులైన నా స
హోదరుల కొరకు, నేను కూడ క్రీస్తు యొద్దనుంచి
శాపగ్రస్తుడనవుటకు కోరి యుందును. । వీరు ఇశ్రా 4
యేలీయులు; దత్తపుత్రత్వము, మహిమ, నిబంధనలు,†
బోధనప్రమాణ దానము, అర్చనాచారము, వాగ్దత్తము
లును వీరివై యున్నవి. । పితృలు వీరి వారు; క్రీస్తు 5
వీరిలో దేహధారియై పుట్టెను. ఈయన నిరంతరము
అన్నిటిపైని స్తుతింపతగిన దేవుడు. ఆమేన్.

అయినను దేవుని మాట తప్పి పోయినట్టు కాదు; 6
ఇశ్రాయేలు సంబంధులందరు ఇశ్రాయేలు కారు. ।
మరియు అబ్రాహాము సంతానమైనందున, అందరు కు 7
మారులు కారుగాని — ఇసాకు వల్లనైనది నీ సంతాన
మనబడును;‡ । అనగా శరీర కుమారులు దేవుని కుమా 8
రులు కారు గాని, ఆ వాగ్దత్తపుత్రులు సంతానమని
యెంచబడుదురు. । —రాగల ఈ ఋతువున వచ్చెదను; 9
అప్పుడు శారా కుమారుని కనుననిక్ష్ మాట ఇయ్యబ
డెను. । అంతే కాదు, రెబెక్క— ఈసాకనే మన తండ్రి 10
యైన ఒకనివల్ల గర్భము ధరించుకొనినప్పుడు, ఏర్పాటు
ప్రకారము దేవుని సంకల్పము, క్రియలవల్లకాక పిలి
చే వానివల్లనే నిలకడగా ఉండే నిమిత్తము, । అప్ప 11
టికి ఆ పిల్లలు పుట్టి మేలైనను కీడైనను చేయకమును
పే,—అన్న తమ్ముని సేవించునని చెప్పబడెను.‖ । ఆ ప్ర 12
కారమే—నేను యాకోబును స్నేహించి, । ఏశావును 13
ద్వేషించియున్నానని వ్రాయబడి యున్నది.¶

కాబట్టి మనము ఏమనగలము? దేవునియందు అన్యా 14
యము కలదా? అది దూరమవునుగాక. । ఎందుకనగా 15
ఆయన—నేను ఎవనియందు కృప చేయుచున్నానో
వానియందు కృపచేతును; నేను ఎవని కరుణించుచు
న్నానో వాని కరుణింతునని** మోషేతో చెప్పుచు
న్నాడు. । కాబట్టి ఇచ్ఛయించే వానివల్లనైనను పరు 16
గెత్తే వానివల్లనైనను కాదుగాని, కృప చేసే దేవుని
వల్లనవును. । మరియు లేఖనము ఫరోతో — నేను నీ 17
యందు నా బలము కనపరుచుటకును, నా నామము
భూమియందంతటను తెలియబడుటకును, ఇందు నిమిత్త
ము నిన్ను నిలువబెట్టి†† యున్నానని చెప్పుచున్నది.‡‡ । 18
కాబట్టి తన ఇచ్ఛాప్రకారము ఒకని కనికరించి, తన
ఇచ్ఛాప్రకారము ఒకని దృఢపరుచును.

కాబట్టి—ఆయన ఇంకా నేరము ఎందుకు మోపు 19
ను? ఏమి? ఆయన చిత్తము ఎవడు ఎదిరించునని నాతో
చెప్పుదువు. । అవును గాని, ఓ మనుష్యుడా! దేవునికి 20
విరోధముగా ప్రత్యుత్తరమిచ్చే నీవు ఎవడవు?—నన్ను

* కీర్త. 44. వ. 22. †ఒడంబడికలు. ‡ఆదికాండము. 21. అ. 12. వ. §ఆదికాండము. 18. అ. 10. వ.
‖ఆదికాండము. 25. అ. 23. వ. ¶మలాకీ. 1. అ. 2. వ. **నిర్గ. 33. అ. 19. వ. ††లేక, లేపి. ‡‡నిర్గమ. 9. అ. 16. వ

ఈలాగు ఎందుకు చేసితివని నిర్మితమైనది నిర్మించి
21 నవాని అడుగునా? । ఒక్క ముద్దలోనుంచి ఒక ఘట
ము ఘనత నిమిత్తము, ఒకటి ఘనహీనత నిమిత్తము
చేసుటకు, కుమ్మరవానికి మంటిమీద అధికారము లేదా?।
22 ఆలాగు దేవుడు తన కోపము అగపరుచుటకు, తన
బలము తెలుపుటకును ఇచ్ఛయించి, నాశమునకు సిద్ధ
పడిన కోపకారణ ఘటములను, బహు దీర్ఘశాంత
23 ముచేత సహించితేనేమి! । ఆయన తాను మహిమ నిమి
త్తము ముందు సిద్ధపరిచిన కృపాకారణ ఘటములయె
డల తన మహిమ సంపూర్తి తెలియచేయ వలెనని యుం
24 టేనేమి? । అట్టివారిలో మనలను, యూదులలోనుంచి
మాత్రమే కాకుండా రాష్ట్రములలోనుంచియు ఆయన
25 పిలిచెను. । ఆ ప్రకారమే — నా ప్రజలు కానివారిని
నా ప్రజలనియు, ప్రియురాలు కానిదాని ప్రియురా
26 లనియు పేరు పెట్టుదును. । మరియు జరిగేది యేమన
గా—మీరు నా ప్రజలు కారని ఏచోటను వారితో
చెప్పబడెనో, అక్కడ జీవముగల దేవుని కుమారు
లని వారికి పేరు పెట్టబడునని హోషేయలోను
పలుకుచున్నాడు. *
27 మరియు యెషయా కూడా—ఇశ్రాయేలు కుమా
రులు సముద్రముయొక్క ఇసుకవలె విస్తారముగా ఉ
28 న్నప్పటికి శేషమే రక్షించబడును; । ఎందుకనగా, తన
మాట కొనసాగించి, నీతితో దాని క్లుప్తపరుచును; ఎం
దుకనగా, ప్రభువు క్లుప్తపరచబడిన మాట దేశముమీద
జరిగించునని ఇశ్రాయేలును గూర్చి కంఠమెత్తి పలుకు
29 చున్నాడు. । మరియు, ఎషయా ముందుగా చెప్పిన
ప్రకారము—సైన్యముల ప్రభువు మనకు శేషము విత్త
నముగా ఉండనియ్యకపోతే, సొదమవలె యుందుము,
గొమొర్రను పోలియుందుము.†
30 కాబట్టి మనము ఏమనగలము? ఏమనగా నీతి వెతు
కని రాష్ట్రములు నీతి, అనగా, విశ్వాసమువల్లనైన నీతి
31 పొందెను । గాని, ఇశ్రాయేలు నీతి బోధనప్రమాణ
మును వెతుకుచు, నీతి బోధనప్రమాణము సంగ్రహిం
32 చుకొనలేదు;। ఎందుకనగా, వారు విశ్వాసమువల్ల కాక,
బోధనప్రమాణ క్రియలవల్లనైనట్టు దాని వెతుకుచు।—
33 ఇదుగో! నేను సీయోనులో అడ్డురాతిని, అడ్డు బం
డను వేయుచున్నాను; ఆయన యందు నమ్మిక ఉంచే
వాడెవడును అవమానపరచబడడని, వ్రాయబడిన ప్ర
కారము‡ వారు ఆ రాతిని తగిలించుకొనిరి.

## 10. అధ్యాయము.

సహోదరులారా! వారి§ కొరకు నా అంతఃక 1
రణ, దేవుని గూర్చిన నా ప్రార్థన వారి రక్షణ నిమిత్త
ము ఉన్నవి; । వారు దేవునియందు ఆసక్తి గలవారని 2
వారికి సాక్ష్యము చెప్పుచున్నాను గాని, అది జ్ఞాన
ప్రకారము కాదు; । ఏలాగనగా వారు దేవుని నీతి 3
ఎరుగక, తమ స్వనీతి స్థాపించుటకు చూచుకొని, దేవుని
నీతికి లోబడి యుండలేదు; । నమ్మే ప్రతివానికి క్రీస్తు, 4
నీతి నిమిత్తము బోధనప్రమాణమునకు అంతమైయు
న్నాడు.

మోషే—వీటిని చేసిన మనుష్యుడు వీటివల్ల|| జీవిం 5
చునని బోధనప్రమాణము వల్లనైన నీతిని గూర్చి వ్రా
యుచున్నాడు¶. । అయితే విశ్వాసమువల్లనైన నీతి ఈ 6
లాగు చెప్పుచున్నది — ఎవడు ఆకాశమునకు ఎక్కి
వెళ్లును?** అనగా క్రీస్తును కిందికి తెచ్చుటకు;। లేక— 7
ఎవడు అగాధ స్థలములోకి దిగ వెళ్లును?†† అనగా
క్రీస్తును మృతిపొందిన వారిలోనుంచి మీదికి తెచ్చు
టకు, అని నీ హృదయములో అనుకొనవద్దు. । అయితే 8
అది ఏమి చెప్పుచున్నది?—వాక్యము, అనగా మేము
ప్రకటించే విశ్వాస వాక్యము, నీకు సమీపమై నీ నో
టిలో, నీ హృదయములోనున్నది.‡‡ ।అదేమనగా, యే 9
సు ప్రభువని నీ నోటితో ఒప్పుకొని, దేవుడు ఆయ
నను మృతిబొందిన వారిలోనుంచి లేపినాడని నీ హృ
దయముతో నమ్మియుంటే, రక్షించబడుదువు; । నీతి 10
నిమిత్తము హృదయముతో నమ్మబడును; రక్షణ నిమి
త్తము నోటితో ఒప్పుకొనబడును; । దానిగూర్చి— 11
ఆయనయందు నమ్మిక ఉంచే వాడెవడును సిగ్గుపరచ
బడడని§§ లేఖనము చెప్పుచున్నది; ।యూదునికి, హె 12
ల్లేనీయునికి భేదము లేదు; అందరికి ప్రభువైన ఒక్కడే
తన్ను ప్రార్థించే వారందరి నిమిత్తము ఐశ్వర్యవం
తుడై యున్నాడు; । ఎందుకనగా — ప్రభువుయొక్క 13
నామముపట్టి ప్రార్థించే వాడెవడో వాడు రక్షిం
చబడును.||||

కాబట్టి వారు నమ్మనివాని ఏలాగు ప్రార్థించగలరు? 14
వారు విననివాని ఏలాగు నమ్మగలరు? ప్రకటించేవాడు
లేకుంటే, ఏలాగు వినగలరు! । వారు పంపబడక పోతే 15
ఏలాగు ప్రకటించగలరు? ఆ ప్రకారము—సమాధాన
సువార్తను ప్రకటించుచు, మంచి వాటినిగూర్చి సువా

*2. అ. 23. వ; 1. అ. 10. వ. †యెషయా. 10. అ. 22, 23. వ. 1. అ. 9. వ. ‡యెషయా. 8. అ. 14. వ; 28. అ. 16. వ. §లేక, ఇశ్రాయేలు. ||అనేక ప్రతులలో, దానివల్ల. ¶లైవికకాండము. 18. అ. 5. వ. **ద్వితీయోపదేశకాండము. 30. అ. 12. వ. ††ద్వితీ. 30. అ. 13. వ. ‡‡ద్వితీ. 30. అ. 14. వ. §§యెషయా. 28. అ. 16. వ. ||||యోయేలు. 2. అ. 32. వ.

ర్తను ప్రకటించుచున్న వారి పాదములు ఎంత చక్క
నివై యున్నవి అని వ్రాయబడి యున్నది.*
16 అయినప్పటికి, అందరు ఆ సువార్తకు విధేయులు
కాలేదు; యెషయా — ప్రభువా! మా వర్తమానము
17 ఎవడు నమ్మెను అని పలుకుచున్నాడు†। కాబట్టి విశ్వా
సము వర్తమానమువల్లను, వర్తమానము దేవుని మాట
మూలముగా కలుగును.
18 అయితే, నేను చెప్పేది యేమనగా, వారు వినలే
దా? విన్నారుగదా,—వారి శబ్దము భూమియందంత
టను, వారి మాటలు భూదిగంతముల మట్టుకును బైలు
వెళ్లెను.‡
19 మరియు నేను చెప్పేది యేమనగా, ఇది ఇశ్రాయే
లుకు తెలియలేదా? మొదట మోషే—నేను రాష్ట్రము
కాని వారివల్ల మీకు ఆసక్తి కలుగచేతును; అవివేక
రాష్ట్రమువల్ల మీకు ఆగ్రహము తెప్పింతునని పలుకు
20 చున్నాడు.§। అయితే యెషయా ధైర్యపడి—నన్ను
వెతుకని వారికి నేను దొరికితిని, నన్ను గూర్చి విచా
రించని వారికి ప్రత్యక్షమైతినని పలుకుచున్నాడు‖.।
21 అయితే అతడు ఇశ్రాయేలునుగూర్చి — అవిధేయులై
ఎదురాడే ప్రజలకు నేను దినమంతయు నా చేతులు
చాపితినని పలుకుచున్నాడు.¶

## 11. అధ్యాయము.

1 ఆలాగైతే నేను అడిగేది యేమనగా,— దేవుడు
తన ప్రజలను విసర్జించెనా? అది దూరమవుగాక;
ఎందుకనగా నేను కూడా అబ్రాహాము సంతతిలోను,
బెన్యామీను గోత్రములోను పుట్టిన ఇశ్రాయేలీయు
2 డనై యున్నాను.। దేవుడు తాను మునుపు ఎరిగిన తన
ప్రజలను విసర్జించలేదు. ఏలీయాలో** లేఖనమేమి
3 చెప్పుచున్నదో మీరెరుగరా?।—ప్రభువా! నీ ప్రవక్త
లను చంపిరి, నీ వేదికలను విరగగొట్టిరి;†† నేను ఒక్క
డనే మిగిలియున్నాను; వారు నాకు ప్రాణహత్యచేయ
చూచుచున్నారని అతడు ఇశ్రాయేలుకు విరోధము
గా దేవునితో విజ్ఞాపనము చేయుచున్నాడు గదా!।
4 అయితే దేవోక్తి అతనితో ఏమి చెప్పుచున్నది!—బా
యలుకు మోకాళ్లు వంచనట్టి ఏడువేల మనుష్యులను
5 మిగిలించుకొని యున్నాననేది.‡‡ । కాబట్టి ఆలాగు,
ఇప్పటి కాలమందును కృప యేర్పాటు చొప్పున శేష
6 ము మిగిలియున్నది. । మరియు అది కృపచేతనైతే,
ఇకను క్రియలవల్లకాదు,§§ అట్టిదైతే‖‖ కృప ఇకను
కృప కాకపోవును. మరియు క్రియలవల్లనైతే ఇకను
కృపకాదు; అట్టిదైతే¶¶ క్రియ ఇకను క్రియకాదు.
ఆలాగైతేనేమి? ఇశ్రాయేలు దేని వెతుకుచున్నా 7
డో, అది వానికి దొరకలేదు గాని, అది యేర్పరచబడిన
వారికి దొరికెను; తక్కిన వారు కఠినపరచబడిరి. । ఆ 8
ప్రకారము—నేటివరకు, దేవుడు వారికి గాఢ నిద్ర
గల ఆత్మను, చూడని కన్నులను, వినని చెవులను ఇచ్చి
యున్నాడని*** వ్రాయబడి యున్నది.।మరియు దావీ 9
దు—వారి భోజనపు బల్ల వారికి బోనుగాను, చిక్కువ
లగాను, ఆతంకముగాను, ప్రతి ఫలముగాను ఉండు
గాక. । వారు చూడలేనట్టు వారి కన్నులకు చీకటి 10
చేయబడుగాక; వారి వీపు నిత్యమును వంచుమని పలు
కుచున్నాడు.†††
కాబట్టి నేను, అడిగేది యేమనగా, వారు పడే 11
నిమిత్తము అడ్డము తగులుకొనిరా? అది దూరమవుగాక.
అయితే వారికి ఆసక్తి పుట్టించుటకు, వారి తప్పితము
వల్ల‡ రాష్ట్రములకు రక్షణ కలిగెను.। అయితే వారి 12
తప్పితము‡‡‡ లోకమునకు భాగ్యము, వారు క్షీణించుట
రాష్ట్రములకు భాగ్యమునై యుండగా, ఎంతో విశేష
ముగా వారి పరిపూర్ణత భాగ్యమవును!। నేను అన్య 13
జనులైన మీతో మాటలాడుచున్నాను. నేను రాష్ట్ర
ములకు అపొస్తలుడనై యున్నాను,। గనుక, ఏ విధము 14
చేతనైనను నా రక్తబంధువులకు ఆసక్తి కలుగచేసి వారి
లో కొందరిని రక్షింతునేమో అని నా ఉద్యోగము
ఘనపరుచుచున్నాను.। వారిని విసర్జించుట, లోకము 15
నకు సమాధానమైతే, వారిని చేర్చుకొనుట ఏపాటిది?
మృతిబొందిన వారిలోనుంచి జీవమవును గదా!
మరియు మొదటి భాగము పరిశుద్ధమైనదైతే, దాని 16
ముద్దయు, వేరు పరిశుద్ధమైతే కొమ్మలును అట్టివే.।
అయినను ఆ కొమ్మలలో కొన్ని విరవబడినప్పుడు, 17
అడవి ఒలీవ చెట్టుగా ఉన్న నీవు వాటిలో అంటుక
ట్టబడి, వాటితో ఒలీవ చెట్టుయొక్క వేరులోను, రస
ములోను పాలు పొందించబడి యుంటే,। ఆ కొమ్మలకు 18
విరోధముగా అతిశయించకుము. నీవు అతిశయించితే,
నీవు వేరును కాదు గాని, వేరు నిన్ను భరించుచున్నది.।
కాబట్టి— నేను అంటు కట్టబడే నిమిత్తము ఆ కొమ్మలు 19
విరువబడెననుకొందువేమో.। మంచిది, అవి అవిశ్వా 20

*యెష. 52. అ. 7. వ. †యెషయా. 53. అ. 1. వ. ‡కీర్త. 19. అ. 4. వ. §ద్వితీ. 32. అ. 21. వ. ‖యెషయా. 65. 1.
¶యెషయా. 65. అ. 2. వ. **అనగా, ఆ పేరుగల అధ్యాయములో. ††1 రాజులు. 19. అ. 10-14. వ.
‡‡1 రాజులు, 19. అ. 18. వ. §§అనగా, పనిజీతముకాదు. ‖‖అనగా, పనిజీతమైతే. ¶¶అనగా కృపాదానమైతే.
***యెషయా. 29. అ. 10. వ; 6. అ. 9. వ. †††కీర్తన. 69. 22, 23. ‡‡‡లేక, వారు తప్పిపోవుట.

సమువల్ల విరువబడెను; నీవు నీ విశ్వాసమువల్ల నిలిచి
21 యున్నావు. గర్వించక, భయపడుము; । ఎందుకనగా,
దేవుడు సహజమైన కొమ్మలను విడువకపోతే, ఒకవేళ
నిన్ను కూడ విడువడేమో.

22 కాబట్టి దేవుని దయా కాఠిన్యములను, అనగా పడి
పోయిన వారి మీది కాఠిన్యమును, నీవు ఆ దయలో
నిలిచియుంటే, నీ మీది దయను చూడుము; లేకపోతే
23 నీవు కూడా నరికివేయబడుదువు. । వారును అవిశ్వాస
ములో నిలువకపోతే, అంటుకట్టబడుదురు; దేవుడు
24 వారిని మళ్లీ అంటుకట్టుటకు శక్తిగలవాడు; । ఏలాగన
గా నీవు స్వభావము చొప్పున అడవిదైన ఒలీవచెట్టు
నుంచి కోయబడి, స్వభావ విరోధముగా ఆ మంచి
ఒలీవచెట్టున అంటుకట్టబడితే, స్వాభావికమైన వీరు
మరి ఎంత నిశ్చయముగా తమ స్వకీయమైన ఒలీవ
చెట్టున అంటుకట్టబడుదురు.

25 ఎందుకనగా, సహోదరులారా! మీ దృష్టికి
మీరే బుద్ధిమంతులు కాకుండ, ఈ మర్మము మీ
కు తెలియబడకుండుటకు నాకు మనస్సు లేదు; అదే
మనగా, రాష్ట్రముల పరిపూర్ణత చేరే పర్యంతము
కాఠిన్యము ఇశ్రాయేలుకు కొంత మట్టుకు సంభవించె
26 ను. అప్పుడు—ఉద్ధారకుడు సీయోనులోనుంచి వచ్చి,
యాకోబు యొద్దనుంచి భక్తిహీనతను నివారణ చేసును.।
27 మరియు నేను వారి పాపములను పరిహరించినప్పుడు,
నాతో వారికి కలిగే నిబంధన ఇదే అని వ్రాయబడి
న* ప్రకారము, ఇశ్రాయేలనే జనమంతయు ఈలాగు
రక్షించబడును.

28 సువార్త విషయము, వారు మీ నిమిత్తము శత్రు
వులై యున్నారు; అయితే ఏర్పాటు విషయము పితృల
29 నిమిత్తము ప్రియులై యున్నారు; । దేవుని కృపాదాన
ముల విషయము, ఆయన పిలుపు విషయము పశ్చాత్తా
30 పముండదు. । మీరు ఒకప్పుడు దేవునికి అవిధేయులై,
ఇప్పుడు వీరి అవిధేయతవల్ల ఏలాగు కరుణించబడితి
31 రో, । ఆలాగే మీ మీది కరుణవల్ల వారును కరుణించ
బడే నిమిత్తము, వారును ఇప్పుడు అవిధేయులై యు
32 న్నారు; । దేవుడు అందరియందు కరుణించే నిమిత్తము,
అందరిని అవిధేయతలో మూసివేసి యున్నాడు.

33 ఓ హో! దేవుని ఐశ్వర్య బుద్ధి జ్ఞానములయొక్క
లోతు! ఆయన న్యాయవిధులు ఎంతో అగోచరము
గానున్నవి! ఆయన మార్గములు తరుచుటకు అశక్య
34 ముగా నున్నవి; । ప్రభువుయొక్క మనస్సు ఎరిగిన వా
డెవడు? ఆయనకు ఆలోచన కర్త ఎవడు? । ఆయనకు 35
ముందుగా ఇచ్చి ప్రతిఫలము పొంద గలవాడెవడు?।
ఎందుకనగా, ఆయన వల్ల, ఆయన ద్వారా, ఆయన 36
నిమిత్తమును సమస్తము ఉన్నది; ఆయనకు నిరంతరము
మహిమ కలుగుగాక. ఆమెన్.

## 12. అధ్యాయము.

కాబట్టి సహోదరులారా! మీ శరీరములను జీవ 1
ముగలదిగాను, పరిశుద్ధమైనదిగాను, దేవునికి అనుకూల
మైనదిగానున్న యాగపశువువలె సమర్పించుటకు, మి
మ్మును దేవుని వాత్సల్యము ద్వారా బతిమాలుకొనుచు
న్నాను. అది వివేకముగల మీ సేవ. । మీరు ఈలోక 2
మర్యాదను అనుసరించక, మంచిదియు, అనుకూల
మైనదియు పరిపూర్ణమైనదియు ఏదో ఆ దేవుని ఇష్ట
మును పరీక్షించే నిమిత్తము మీ మనస్సు నూతనపడు
టవల్ల, రూపాంతరము పొందుడి.

ఏలాగనగా తన్ను ఎంచుకొన తగిన దాని కంటే 3
ఎక్కువగా ఎంచుకొనక, దేవుడు ఒక్కొక్కనికి
విశ్వాస భాగము విభాగించిన ప్రకారము, స్వస్థబుద్ధి
కలుగుటకు ఎంచుకొన వలెనని నాకియ్యబడిన కృప
వల్ల, మీలో ఉన్న ప్రతి మనుష్యునితోను పలుకుచు
న్నాను; । ఒక్క శరీరములో మనకు అనేకమైన అవ 4
యవములు ఉండియు, ఆ అవయవములన్నిటికి ఒక్క
టే పని ఏలాగు ఉండదో, । ఆలాగే అనేకులమైన 5
మనము క్రీస్తులో ఏక శరీరముగా ఉండి, ఒకనికి
ఒకడు అవయవములమై యున్నాము. । అయినను మనకు 6
ఇయ్యబడిన కృప చొప్పున, భేదముగానున్న కృపా
దానములు పొంది యున్నాము. ప్రవచన వరము పొం
దితే, విశ్వాస పరిమాణము చొప్పున, । సేవావరము 7
పొందితే, సేవలోను, ఉపదేశకుడైతే ఉపదేశములో
ను, । బోధకుడైతే బోధలోను, (ధర్మము) పంచిపెట్టే 9
వాడైతే సరళతతోను, అధికారియైతే జాగ్రత్తతోను,
కరుణించేవాడైతే సంతోషముతోను, ఉండ వలెను.

ప్రేమ నిష్కపటముగా ఉండనిమ్ము; చెడ్డదాని 9
యందు అసహ్యపడి, మంచిదాని అత్తి యుండుడి. ।
సహోదర ప్రేమతో ఒకనియందు ఒకడు వాత్స 10
ల్యము గలవారై, ఒకని ఘనత ఒకడు హెచ్చించు
కొనుడి. । మందులు కాక, కదలిక గలవారై, ఆత్మ 11
యందు తీవరపడి, ప్రభువును సేవించుడి. । నిరీక్షణ 12
యందు సంతోషించుచు, శ్రమయందు ఓర్పుగలవా
రై, ప్రార్థనయందు నిలకడగా ఉండుడి. । పరిశుద్ధు 13
లకు అవసరముల యందు సహాయము చేయుచు, ఆ

* యెషయా. 59. అ. 20, 21. వ; 27. అ. 9. వ.

14 తిథ్యము శ్రద్ధగా ఇచ్చుకొనుడి. । మిమ్ము హింసించే
15 వారిని దీవించుడి; దీవించుడి గాని శపించవద్దు. । సం
తోషించే వారితో సంతోషించుడి; ఏడ్చే వారితో
16 ఏడువుడి. । ఒకని యెడల ఒకడు ఏకమనస్కులై
యుండుడి. గొప్పవారి* యందు మనస్కరించక, దీను
లతో పొందు చేయుడి†. మీరే బుద్ధిమంతులమను
17 కొన వద్దు. । కీడుకు ప్రతి కీడు ఎవనికిని చేయ వద్దు.
మనుష్యులందరి దృష్టికి యోగ్యమైన వాటిని గూర్చి
18 ముందుగా సిద్ధపడుడి. । శక్యమైతే సమస్త మనుష్యు
లతో, మీ వల్లనైనంత మట్టుకు సమాధానముగా ఉం
19 డుడి. । ప్రియులారా! మీకు మీరే న్యాయము తీర్చు
కొనక, కోపమునకు స్థలమియ్యుడి; — న్యాయము
తీర్చుట నాదే; నేను ప్రతి ఫలము ఇత్తునని ప్రభువు
20 చెప్పుచున్నాడని‡ వ్రాయబడి యున్నది. । కాబట్టి—
నీ శత్రువు ఆకలి గొనియుంటే, అతనికి ఆహారము
పెట్టుము; అతడు దప్పిగొనియుంటే అతనికి దాహ
మిమ్ము; ఈలాగు చేయుచు అతని తలమీద నిప్పుల
21 కుప్ప పోతువు.§ । కీడువల్ల జయించబడక మేలువల్ల
కీడు జయించుము.

## 13. అధ్యాయము.

1 ప్రతి ఆత్మ|| తన పై అధికారులకు తన్ను లోపరు
చుకొన వలెను; ఎందుకనగా, దేవుని వల్లనేగాని యే
అధికారము కలగదు. ఉన్న అధికారములు దేవునిచేత
2 నియమించబడి యున్నవి. । కాబట్టి ఆ అధికారమును
ఎదిరించే వాడు, దేవుని నియమమును ఎదిరించుచు
న్నాడు; ఎదిరించే వారు తమకు శిక్షావిధి తెచ్చుకొం
3 దురు; । రాజ్యము చేసే వారు చెడ్డ కార్యములకేగాని
మంచి కార్యములకు భయంకరులు కారు. నీవు ఈ
అధికారమునకు భయపడకుండ కోరితివా? మంచిదాని
చేయుము, అప్పుడు దానివల్ల మెప్పు పొందుదువు; ।
4 నీ మేలు కొరకు అతడు దేవుని సేవించుచున్నాడు.
అయినను నీవు చెడ్డదాని చేసితే భయపడుము. ఎందు
కనగా అతడు ఖడ్గమును ఊరక వహించడు; ఎందుక
నగా అతడు దేవుని సేవకుడును, కీడు చేసే వానికి
శిక్షావిధి నిమిత్తము న్యాయము తీర్చే వాడునై యు
న్నాడు.
5 కాబట్టి ఆ కోపభయమువల్ల మాత్రమే కాకుండా,
మనస్సాక్షివల్లను మీరు అగత్యముగా (అధికారము
6 నకు) లోబడి యుండ వలెను; । ఇందువల్ల మీరు పన్ను
కూడా ఇచ్చుచున్నారు; వారు దేవుని సేవకులై, ఎల్ల
ప్పుడు దీని నిమిత్తమే పని చేయుచున్నారు. । కాబట్టి 7
ఎవనికి పన్నో, వానికి పన్ను, ఎవనికి సుంకమో,
వానికి సుంకము, ఎవనికి భయమో, వానికి భయము,
ఎవనికి సన్మానమో, వానికి సన్మానము ఇచ్చి, అందరి
కిని వారి వారి ఋణములు తీర్చుడి.

ఒకని ఒకడు ప్రేమించుటయే గాని, మరి ఏమి 8
యు ఎవనికిని అచ్చియుండ వద్దు; అన్యుని ప్రేమించే
వాడు బోధనప్రమాణము నెరవేర్చును; । ఏలాగనగా 9
—వ్యభిచరించ వద్దు, నరహత్య చేయవద్దు, దొంగిల
వద్దు,¶ ఆశించ వద్దు** అనేదియు, మరి యే ఆజ్ఞయైనను
ఉంటే అదియు — నీవలె నీపొరుగువాని ప్రేమించ
వలెననే†† మాటలో సంక్షేపముగా ఇమిడియున్నవి. ।
ప్రేమ పొరుగువానికి హాని చేయదు గనుక ప్రేమ 10
బోధన ప్రమాణముయొక్క సంపూర్తియై యున్నది.

మరియు మనము నిద్రమేలుకొనే వేళ అయినదని, 11
సమయము తెలుసుకొని, ఆలాగు (చేయుడి); మనము
నమ్మినప్పటికంటే, మన రక్షణ ఇప్పుడు సమీపముగా
ఉన్నది. । చాలా రాత్రి గడిచి, పగలు సమీపించెను. 12
అందుచేతను మనము చీకటి పనులు వదులుకొని, వెలు
గుయొక్క ఆయుధములను ధరించుకొందము. । నంద 13
డియైనను, మత్తయినను లేకయు, కామవిలాసములై
నను, పోకిరితనములైనను లేకయు, జగడమైనను, మత్సర
మైనను లేకయు, పగటియందు ఉన్నామని యుక్తము
గా నడుచుకొందము. । మెట్టుకు మీరు ప్రభువైన 14
యేసు క్రీస్తును.‡‡ ధరించుకొని, శరీరమును గూర్చి,
దాని ఆశల నిమిత్తము ముందు విచారించుకొన వద్దు.

## 14. అధ్యాయము.

విశ్వాస బలము లేనివాని చేర్చుకొనుడి; అయితే 1
సంశయములు తీర్చుటకు కాదు; । ఒకడు సమస్తము 2
తిన వచ్చునని నమ్ముచున్నాడు; ఒకడు బలహీనుడై, కూ
రలనే తినును. । తినేవాడు తిననివాని కొద్దిపరచ కూ 3
డదు; తిననివాడు తినేవానికి తీర్పుచేయ§§ కూడదు;
ఎందుకనగా, దేవుడు అతని చేర్చుకొనెను. । అన్యుని 4
సేవకునికి తీర్పు చేయుటకు నీవు ఎవడవు? అతడు
తన స్వకీయ యజమానుని యెదుట నిలుచును, లేక
పడును. అయితే అతడు నిలుచును; దేవుడు అతని
నిలువబెట్టుటకు శక్తి గలవాడు.

*లేక, వాటి. †గ్రేకులో, కొంచుపోబడండి. ‡ద్వితీ. 32. అ. 35. వ. §నీతిసామెతలు. 25. అ. 21, 22. వ.
||గ్రేకులో, జీవము. ¶కొన్ని ప్రతులలో—అబద్ధపుసాక్ష్యమియ్యవద్దు అనేవాక్యమును వ్రాయబడెను.
**నిర్గమకా. 20. అ. 13.—17. వ. ††లైవి. 19. అ. 18. వ. ‡‡అనగా, వస్త్రమువలె. §§లేక, దోషియని యెంచ.

5 ఒకడు ఒకదినము కంటె మరియొక దినము గొప్ప
దని యెంచును; మరియొకడు ప్రతిదినము (ఒక్కలాగే)
ఎంచును. ప్రతివాడును తన స్వకీయ్య మనస్సులో
6 రూఢిపరుచుకొన వలెను. । దినము లక్ష్య పెట్టేవాడు,
ప్రభువు యెదుట దాని లక్ష్యపెట్టును. దినము లక్ష్య
పెట్టని వాడు ప్రభువు యెదుట దాని నిర్లక్ష్య పెట్టు
ను. తినేవాడు ప్రభువు యెదుట తినును; అతడు దే
వుని స్తుతించును; తిననివాడు ప్రభువు యెదుట తిన
7 కమాని, దేవుని స్తుతించును; । మనలో ఎవడును తన
నిమిత్తము జీవించడు, ఎవ్వడును తన నిమిత్తము చా
8 వడు; । మనము జీవించినను ప్రభువు నిమిత్తమే జీవిం
తుము; చనిపోయినను ప్రభువు నిమిత్తమే చనిపోవు
దుము. కాబట్టి మనము జీవించినను చనిపోయినను
9 ప్రభువు వారమై యున్నాము. । క్రీస్తు మృతిబొందిన
వారికిని, జీవించిన వారికిని ప్రభువై యుండుటకు,
ఇందు నిమిత్తము మృతిపొంది తిరిగి జీవించెను.

10 అయితే, నీవు ఎందుకు నీ సహోదరునికి తీర్పు
చేయుచున్నావు? లేక నీవు ఎందుకు నీ సహోద
రుని కొద్దిపరుచుచున్నావు? మనమందరము దేవుని
న్యాయపీఠము యెదుట నిలువ వలెను. అందును గూ
11 ర్చి।—ప్రతి మోకాలు నాకు వంగును; ప్రతి నాలు
కయు దేవునికి ఒప్పుకొనును, నాజీవము తోడని ప్ర
భువు చెప్పుచున్నాడు అని వ్రాయబడి యున్నది*
12 గనుక, । మనలో ప్రతివాడును తన్ను గూర్చి దేవునికి
ఉత్తరమియ్య వలెను.

13 కాబట్టి మనము ఇకమీదట ఒకనికి ఒకడు తీర్పు
చేయకుందము; అయితే ముఖ్యముగా, సహోదరు
నికి అంతకమైనను అడ్డమైనను చేసేది యేదియు వేయ
14 మని నిర్ణయించుకొనుడి. । ఏదియు సహజస్థితివల్ల
అపవిత్రము కాదని ప్రభువైన యేసుయందు నేను
తెలుసుకొని రూఢిగా నమ్ముచున్నాను. అయితే ఏదై
నను అపవిత్రమని యెంచుకొనే వానికి అది అపవి
15 త్రమే. । ఏలాగనగా నీ సహోదరుడు నీ భోజనము
వల్ల దుఃఖపడితే, ఇప్పుడు నీవు ప్రేమ చొప్పున నడు
చుకొనుచున్నావు కావు. ఎవని కొరకు క్రీస్తు మృతి
పొందెనో, వాని నీ భోజనమువల్ల చెరపవద్దు.

16 కావున మీ మేలు దూషించబడనియ్యకుడి; ।
17 దేవుని రాజ్యము, భోజనము, పానము, కాదు గాని నీతి,
సమాధానము, పరిశుద్ధాత్మలోని సంతోషమునై యు
18 న్నది. । ఇందులో క్రీస్తుని సేవించేవాఁడు దేవునికి ఇష్టు
డై, మనుష్యుల పరీక్షకు నిలుచును.

కాబట్టి సమాధానము, అన్యోన్యమైన క్షేమాభి 19
వృద్ధిని కలుగచేసే వాటిని చూచుకొని అనుసరింతము.।
భోజనము నిమిత్తము దేవుని కార్యము విరగదియ్యకుడి. 20
అన్నియు శుద్ధిగానున్నవి, అయినను అభ్యంతరమా
టకు భుజించేవానికి తప్పు. । మాంసభోజనమే గాని 21
ద్రాక్షారసపానమే గాని నీ సహోదరునికి అడ్డమై
నను ఆతంకమైనను బలహీనతయైనను కలుగచేసేది
యేదో అది మానివేయుట మంచిది. । నీకు ఈ విశ్వా 22
సము కలదు. సరి, అది దేవుని యెదుట నీ నిమిత్తము
కలుగనిమ్ము. తాను సమ్మతించినది దోషము కాదని
తీర్పు చేసుకొనేవాడు ధన్యుడు. । అయితే అనుమా 23
నించేవాడు తింటే, అది విశ్వాసమూలమైనది కాదు
గనుక, అతడు దోషియని తీర్చబడును. మరియు విశ్వా
సమూలము కానిది యెదో, అది పాపమై యున్నది.

## 15. అధ్యాయము.

మరియు బలవంతులమైన మనలను మనమే సంతో 1
షపరుచుకొనక, బలహీనుల దౌర్బల్యములు వహించు
కొన తగును. । మనమందరము క్షేమాభివృద్ధి నిమిత్తము 2
మేలు కలుగుటకు మన పొరుగువాని సంతోషపరు
చుదము; । క్రీస్తు తన్ను తానే సంతోషపరుచుకొన 3
లేదు.— ఆ ప్రకారము నిన్ను నిందిచేవారి నిందలు
నా మీద పడెనని వ్రాయబడియున్నది.† । ఆలాగున 4
ఏవి పూర్వమందు వ్రాయబడెనో అవి ఓర్పువల్లను
లేఖనముల సుబోధవల్లను మనకు నిరీక్షణ కలుగుటకు,
మన బోధ నిమిత్తము వ్రాయబడెను. । మీరు ఏక 5,6
మనస్కులై ఒక్క నోటితో మన ప్రభువైన యేసు
క్రీస్తుయొక్క తండ్రియైన (మన) దేవుని మహిమపరిచే
నిమిత్తము, క్రీస్తుయేసు చిత్తప్రకారము మీరు ఒకని
తో ఒకడు ఏకీభవించేటట్టు ఓర్పు, సుబోధయు
కలిగించే దేవుడు మీకు దయ చేసునుగాక. । అందుచే 7
తను, దేవుని మహిమ నిమిత్తము క్రీస్తు కూడా మిమ్ము
ను‡ చేచుఁకొనిన ప్రకారము, మీరు ఒకని ఒకడు
చేచుఁకొనుడి.

నేను చెప్పేదేమనగా పితృలకు చేయ బడిన వాగ్ద 8,9
త్తములను స్థిరపరుచుటకు దేవుని సత్యము నిమిత్తము
యేసుక్రీస్తు ఛేదనసంస్కారము గలవారికి సేవకుడై
యుండెనుగాని రాష్ట్రములు, కృప నిమిత్తము దేవుని
మహిమపరచుటకును (వచ్చెను). ఆప్రకారము,
—రాష్ట్రములలో నిన్ను స్తుతింతును,
నీ నామకీర్తన గానము చేతునని‡

*యెషయ. 45. అ. 23. వ. †కీర్త. 69. 9. ‡కొన్ని ప్రతుల ప్రకారము, మనలను. §కీర్తన. 18, 49.

10 వ్రాయబడియున్నది. । మరియు, ఆయన,—
రాష్ట్రములారా!
ఆయన ప్రజలతో సంతోషించుడి
11 అని పలుకుచున్నాడు.* । మళ్లి,
—సకల రాష్ట్రములారా ?
ప్రభువును స్తుతించుడి;
—సకల ప్రజలారా!
అయినను కొని యాడుడి.†
12 యెషయాకుకూడ,
—యెస్సైయొక్క వేరు,
రాష్ట్రముల నేలుటకు వచ్చెవాడు పుట్టును;
ఆయనయందు రాష్ట్రములు నిరీక్షించునని‡
చెప్పుచున్నాడు.
13 కాగా, నిరీక్షణాశ్రయ దేవుడు పరిశుద్ధాత్మ బల
ముచేత మీకు విశేష నిరీక్షణ కలిగే నిమిత్తము, నమ్ము
టవల్ల సమస్త సంతోషముతో, సమాధానముతోను
మిమ్ము నింపుగాక.
14 అయితే, నా సహోదరులారా! మీరు ఇదివరకు
మంచితనముతో నిండుకొని, సమస్త విజ్ఞానముచేత
నింపబడి, ఒకనికి ఒకడు బుద్ధి చెప్పుటకు శక్తిగలవా
రని నేను కూడ మిమ్మును గూర్చి నమ్ముకొనుచున్నా
15,16 ను. । అయినప్పటికి, సహోదరులారా! రాష్ట్రము
లనే కానుక పరిశుద్ధాత్మవల్ల పరిశుద్ధపరచబడి, అనుకూ
లమయే నిమిత్తము, నేను దేవుని సువార్తతో యా
గము చేయుచు రాష్ట్రముల నిమిత్తము యేసుక్రీస్తు సేవ
కుడనై యుండుటకు, దేవునిచేత నాకు ఇయ్యబడిన
కృపవల్ల మీకు జ్ఞాపకము§ చేయ వలెనని, కొన్ని చో
ట్లను ఎక్కువగా తెగించి మీకు వ్రాసియున్నాను.
17 కాబట్టి దేవుని సంబంధమైన వాటి విషయము అతి
శయపడుటకు, యేసుక్రీస్తుయందు నాకు కారణము
18,19 కలదు;। ఏలాగనగా, వాక్యమందు, క్రియయందును
రాష్ట్రముల విధేయత నిమిత్తము, గురుతుల బలము వల్లను,
అద్భుతముల బలము వల్లను, పరిశుద్ధాత్మ బలము వల్లను,
క్రీస్తు నాచేత చేయించిన వాటినేగాని నాచేత చేయిం
చకుండిన వాటిలో దేనిగూర్చి మాటలాడ తెగింపను.
అది గనుక, నేను యెరూషలేము మొదలుకొని ఇల్లు
రికు పర్యంతము చుట్టునున్న ప్రాంతములయందు
20,21 క్రీస్తు సువార్త ప్రకటన నెరవేర్చితిని. । అయితే
నేను మరియొకని పునాది మీద కట్టకుండే నిమిత్తము,
క్రీస్తు నామము తెలియబడిన చోట్లను కాదు, అయి
తే,—ఆయనను గూర్చి ఎవరికి సమాచారము చెప్పబడ
లేదో, వారు చూతురనియు, విననివారు గ్రహించుకొం
దురనియు‖ వ్రాయబడిన ప్రకారము, సువార్త ప్రక
టించుటకు ఆసక్తితో ప్రయత్నముచేసి యున్నాను.

ఈ హేతువుచేతను నేను మీ యొద్దికి రాకుండా, 22
అనేక పర్యాయములు ఆతంకపరచబడితిని. । అయితే 23
ఈ ప్రాంతములయందు ఇకమీదట నాకుస్థలము లేదు
గనుక, అనేక సంవత్సరములనుంచి మీ యొద్దికి రావ
లెనని మిక్కిలి అపేక్ష కలిగినందున, । నేను స్పానియ 24
లోకి వెళ్లేటప్పుడు, ప్రయాణములో మిమ్మును చూచు
టకును, మొదట మీ సహవాసము వల్ల కొంత మట్టుకు
తృప్తిపొంది మీవల్ల అక్కడికి సాగనంపించబడుట
కును నిరీక్షించుచున్నాను.

అయితే ఇప్పుడు నేను పరిశుద్ధుల కొరకు ఒక పని 25
మీద యెరూషలేముకు వెళ్లుచున్నాను; । ఎందుకనగా 26
యెరూషలేములో ఉన్న పరిశుద్ధులలో బీదలైన వారి
నిమిత్తము మకెదొనియ, అఖాయియ దేశములవారికి,
ఇష్టము వచ్చి ఒక చందా చేసియున్నారు. । అవును, 27
వారికి ఇష్టమే; వీరు వారికి ఋణస్థులై యున్నారు;
ఏలాగనగా ఆత్మ సంబంధమైన వాటిలో రాష్ట్రములు
వారితో పాలుపొందితే, శరీర సంబంధమైన వాటి
విషయము, వారికి సహాయము చేయ తగును. । కాబట్టి, 28
నేను. ఈ పని నెరవేర్చి, ఈ ఫలము వారికి ముద్ర
వేసి, మీ వైపుగా స్పానియకు ప్రయాణము చేతును. ।
మరియు నేను మీ యొద్దికి క్రీస్తు ఆశీర్వాద పరిపూ 29
ర్ణతతో నిశ్చయముగా వత్తునని ఎరుగుదును.

మరియు, సహోదరులారా! నేను యూదైయ 30-32
లో అవిధేయులనుంచి తప్పించబడే నిమిత్తమును, యె
రూషలేము కొరకైన నా సేవ ఆ పరిశుద్ధులకు అను
కూలమయే నిమిత్తమును, నేను దేవుని చిత్తమువల్ల సం
తోషముతో మీ యొద్దికి వచ్చి, మీ మధ్యను విశ్ర
మించే నిమిత్తమును, మీరు నా కొరకు దేవుని గూర్చి
ప్రార్థనల యందు¶ నాతో కూడా ప్రయత్నము
చేయవలెనని, మన ప్రభువైన యేసుక్రీస్తు ద్వారా,
ఆత్మయొక్క ప్రేమ ద్వారా మిమ్ము బతిమాలుకొను
చున్నాను. । సమాధాన దేవుడు మీ అందరికి తోడై 33
యుండుగాక. ఆమెన్.

*ద్వితీ. 32. అ. 43. వ. †కీర్తన. 117. 1. ‡యెషయా. 11. అ. 10 వ.
§లేక, బోధ. ‖యెషయా. 52. అ. 15. వ. ¶లేక, వల్ల.

## 16. అధ్యాయము.

1,2 కెంక్రెయలో ఉన్న సంఘపు పరిచారకురాలైన
ఫైబే అనే మన సహోదరిని మీరు, పరిశుద్ధులకు తగి
నట్టుగా, ప్రభుసంబంధి అని చేర్చుకొని, ఏ పనిలో
నైనను ఆమెకు మీవల్ల సహాయము కావలసియుంటే,
ఆమెకు సహాయము చేసే నిమిత్తము, ఆమెను మీకు
శిఫారసు చేయుచున్నాను; ఆమె కూడా అనేకులకు
నాకును సహాయకురాలై యుండెను.
3 క్రీస్తు యేసుయందు నాతోటి పనివారైన ప్రిస్కి
ల్లకు, అకులకు, వారి ఇంట్లో ఉన్న సంఘమునకు సలా
ములు చెప్పుడి.
4 వీరు నా ప్రాణము కొరకు తమ మెడలను వంచు
కొనిరి.* నేను మాత్రమే కాదు, రాష్ట్రముల సంఘము
5 లన్నియు వీరిని స్తోత్రము చేయుచున్నవి. । ఆశియలో
క్రీస్తుకు ప్రథమఫలమైయున్న నా ప్రియుడైన ఎపై
6 నెతుకు సలాములు.। మన కొరకు బహు ప్రయాసపడిన
7 మరియకు సలాములు. । నా బంధువులును నాతోకూ
డా ఖయిదీలునైన అంద్రొనీకుకు, యూనియకు సలా
ములు. వీరు అపొస్తలులలో ప్రసిద్ధికెక్కిరి. వారు
8 నాకంటే ముందుగా క్రీస్తుయందు ఉండిరి. । ప్రభు
వుయందు నా ప్రియుడైన అంప్లియకు సలాములు. ।
9 క్రీస్తుయందు నాతోటి పనివాడైన ఉర్బానుకు నా
10 ప్రియుడైన స్తఖుకును, । క్రీస్తుయందు పరీక్షించబడిన
అపెల్లెకు సలాములు; అరిస్తొబూలు ఇంటివారికి సలా
11 ములు. । నా బంధువైన హెరోదియోనుకు సలాములు.
నర్కిస్సు ఇంటివారిలో ప్రభువుయందున్న వారికి సలా
12 ములు. । ప్రభువుయందు ప్రయాసపడే త్రుఫైనకు
త్రుఫోసకు సలాములు. ప్రియురాలైన పెర్సికి సలా
ములు. ప్రభువుయందు ఆమె బహు ప్రయాసపడెను.।
13 ప్రభువుయందు ఏర్పరచబడిన రూఫుకు, నాకు తల్లి
యైన అతని తల్లికి సలాములు.
14 అసుంక్రితుకు, ప్లెగోనుకు, హెర్మానుకు, పత్రో
బకు, హెర్మేకు, వారితో ఉన్న సహోదరులకు సలా
15 ములు. । ఫిలొలొగుకు, యూలియకు, నేరైకు, ఇతని
సహోదరికి, ఒలుంపకు, వారితో ఉన్న పరిశుద్ధులం
16 దరికి సలాములు. । పరిశుద్ధమైన ముద్దుతో ఒకనికి ఒక
డు సలాములు చెప్పుడి; క్రీస్తుయొక్క సంఘములన్ని
యుమీకు సలాములు చెప్పుచున్నవి.
మరియు సహోదరులారా! మీరు నేర్చుకొనిన 17
బోధకు విరోధముగా భేదములను అడ్డములను కలుగ
చేసే వారిని గుర్తెరిగి వారిని విడిచిపెట్టుడి; । అట్టివారు 18
తమ కడుపునే గాని మన ప్రభువైన యేసుక్రీస్తును
కొలువక, ఇంపైన మాటలవల్లను ఇచ్చకములవల్లను,
నిష్కపటులయొక్క మనస్సులను మోసపరుచుదురు; ।
మీ విధేయత అందరికిని ప్రచురమైనది. కాబట్టి నే 19
ను మిమ్మును గూర్చి సంతోషించుచున్నాను. అయితే
మీరు మేలు విషయము బుద్ధిమంతులై, కీడు విషయ
ము నిష్కపటులై యుండ వలెనని కోరుచున్నాను. ।
సమాధాన దేవుడు శీఘ్రముగా సైతానును మీ పాద 20
ములకింద చితక త్రొక్కించును.
మన ప్రభువైన యేసుక్రీస్తుయొక్క కృప మీకు
కలుగుగాక. ఆమేన్.
నా తోటి పనివాడైన తీమొథెయు, నాబంధువు 21
లైన లూకియు, యాసోను, సోసిపతెరు, అనే వారు
మీకు సలాములు పంపుచున్నారు.
ఈ ఉత్తరము వ్రాసిన తెర్తియు అనే నేను 22
ప్రభువు యందు మీకు సలాములు పంపుచున్నాను.।
నాకు, ఈ యావత్సంఘమునకును ఆతిథ్యమిచ్చే గా 23
యియు మీకు సలాములు పంపుచున్నాడు. ఈ పట్ట
ణమునకు గ్రాణపువాడైన ఎరస్తు అతని సహోదరు
డైన క్వర్తును మీకు సలాములు పంపుచున్నారు.
మన ప్రభువైన యేసు క్రీస్తుయొక్క కృప మీ 24
అందరికి తోడై యుండుగాక. ఆమేన్.
మరియు పూర్వకాలములయందు దాచబడి, 25-27
ఇప్పుడు బైలుపరచబడి, నిత్యుడైన దేవుని నిర్ణయము
చొప్పున, విశ్వాసవిధేయతనిమిత్తము ప్రవక్తల లేఖన
ములవల్ల సమస్త రాష్ట్రములకు తెలుపబడిన మర్మము
యొక్క ప్రత్యక్షతప్రకారము, యేసుక్రీస్తు ప్రకటన
అనగా నా సువార్తప్రకారము మిమ్మును స్థిరపరుచు
టకు శక్తిమంతుడును అద్వితీయ జ్ఞానవంతుడునైన దే
వునికి, యేసుక్రీస్తు ద్వారా, మహిమ నిరంతరము కలి
గియుండుగాక. ఆమేన్.

*అనగా, చంపబడుటకు సిద్ధపడిరి.

అపొస్తలుడైన పౌలు

# కొరింథీయులకు పంపిన

## మొదటి ఉత్తరము.

### 1. అధ్యాయము.

1 దేవుని చిత్తమువల్ల యేసు క్రీస్తు అపొస్తలుఁడుగ
పిలువబడిన పౌలును సహోదరుఁడైన సోస్తెనేయు,।
2 కొరింథులోనున్న దేవుని సంఘమునకనఁగా, క్రీస్తయిన
యేసు యందు పరిశుద్ధపరచఁబడి, పరిశుద్ధులౌటకు పిలు
వబడిన వారికిని, వారికైనను మనకైనను ప్రతిస్థలము
లో మన ప్రభువైన* యేసు క్రీస్తు పేరు పెట్టుకొనిన
3 వారందరికిని వ్రాసినది;। మన తండ్రియైన దేవుని వలన,
ప్రభువైన యేసు క్రీస్తు వలన మీకు కృపయు సమా
ధానమును కలుగు గాక.

4 యేసు క్రీస్తు యందు మీకు ఇయ్యఁబడిన దేవుని
కృప నిమిత్తము, మిమ్మును గూర్చి నా దేవుని ఎల్లప్పు
5,6 డును స్తుతించుచున్నాను;। ఎందుకనఁగా, క్రీస్తుని గూ
ర్చిన సాక్ష్యము మీలో స్థిరపరచఁబడిన ప్రకారము,
ఆయన యందు మీరు సమస్త వాక్యములోనేమి† సమ
స్త జ్ఞానములోనేమి అన్నిటిలోను ఐశ్వర్యము పొం
7 దితిరి,। గనుక ఏ కృపాదానమందును తక్కువగా ఉం
డక, మన ప్రభువైన యేసుక్రీస్తుయొక్క ప్రత్యక్షము
8 కొరకు ఎదురుచూచుచున్నారు;। మన ప్రభువైన యే
సు క్రీస్తు దినమందు మీరు నిరపరాధులై యుండు
టకు అంతము వరకు ఆయన మిమ్మును స్థిరపరుచును.।
9 మన ప్రభువైన యేసు క్రీస్తనే తన కుమారుని సహ
వాసమునకు మిమ్మును పిలిచిన దేవుడు నమ్మ తగినవాఁడై
యున్నాఁడు.

10 మరియు సహోదరులారా! మీరందరు ఒక్క
విధముగానే పలుక వలెననియు, మీలో భేదములు
లేకుండా ఏక మనస్సుతోను, ఏక తాత్పర్యముతోను
సరిగా మీకు కుదురుబాటు చేయఁబడ వలెననియు
మన ప్రభువైన యేసు క్రీస్తు పేరట మిమ్మును వేఁడు
11 కొంటున్నాను;। నా సహోదరులారా! మీలో జగ
డములు కలవని మిమ్మును గూర్చి క్లోయే (ఇంటి) వారి
12 చేత నాకు తెలుపఁబడెను.। నేను చెప్పేదేమనఁగా, మీ
లో ప్రతివాఁడు—నేను పౌలువాఁడను, నేను అపొల్లో
వాఁడను, నేను కేఫా వాఁడను, నేను క్రీస్తు వాఁడనని
చెప్పుచున్నాఁడు.

క్రీస్తు భేదించఁబడి యున్నాఁడా? పౌలు మీ కొ 13
రకు శిలువ వేయఁబడెనా? లేక పౌలు పేరట మీకు
బాప్తిస్మము చేయించఁబడెనా?। మీకు నా పేరట బాప్తి 14
స్మము చేయించఁబడెనని ఎవరైనను చెప్పకుండుటకు,।
క్రిస్పుకు, గాయుకును దప్ప మరి యెవరికిని నేను బాప్తి 15
స్మము చేయించనందున దేవుని స్తుతించుచున్నాను.।
స్తెఫనాయొక్క ఇంటివారికిని బాప్తిస్మము చేయించితిని, 16
మరి ఎవరికైనను బాప్తిస్మము చేయించినానేమో నేనె
రుఁగను;। బాప్తిస్మము చేయించుటకు కాదు గాని, క్రీస్తు 17
యొక్క శిలువ వ్యర్థము కాకుండుటకు,। వాక్చాండి 18
త్యము‡ లేకుండ, సువార్తను ప్రకటించుటకు నన్ను
పంపెను; ఎందుకనఁగా శిలువను గూర్చిన వాక్యము
నశించే వారికి వెఱ్ఱితనమే గాని, రక్షించఁబడుచున్న
మనకు, అది దేవుని బలమై యున్నది.। ఆ ప్రకారము— 19
జ్ఞానుల జ్ఞానమును నాశము చేతుననియు, వివేకుల వివే
కము నివారింతుననియు వ్రాయఁబడి యున్నది.§

ఈ యుగమున జ్ఞాని యెక్కడ? శాస్త్రి యెక్కడ? 20
తర్కవాది యెక్కడ? ఈ లోక జ్ఞానమును దేవుఁడు
వెఱ్ఱితనముగా చేసియున్నాఁడు గదా?। దేవుని జ్ఞానము 21
కొలఁది, లోకము తన జ్ఞానముచేత దేవుని ఎరుఁగకుండ
గా, ఆ వెఱ్ఱితనమనే ప్రకటనవల్ల దేవుడు నమ్మే వారిని
రక్షించుటకు ఇచ్ఛయించుకొనెను.

యూదులు అద్భుతములను అడుగుచున్నారు; హె 22
ల్లేనీయులు జ్ఞానమును వెతుకుచున్నారు; । అయితే 23
మేము శిలువవేయఁబడిన క్రీస్తును, అనఁగా యూదులకు
ఆతంకము, అన్యజనులకు వెఱ్ఱితనము।అయినను, యూ 24
దులకేమి హెల్లేనీయులకేమి, పిలువఁబడిన వారికి దేవుని
బలమును దేవుని జ్ఞానమునైన క్రీస్తునే ప్రకటించుచు
న్నాము.। దేవుని వెఱ్ఱితనము మనుష్యులకంటే జ్ఞాన 25
ము గలది, దేవుని బలహీనత మనుష్యులకంటే బలమై
యున్నది.

*లేక, ప్రతి స్థలములో వారికిని మనకును ప్రభువైన. †లేక, ఉచ్చారణలోనేమి.
‡లేక, తర్క. §యెషయ. 29. 14.

26 సహోదరులారా! మీ పిలుపును చూడుడి*;
(మీలో) శారీర జ్ఞానులు అనేకులు లేరు, బలవంతులు
27-29 అనేకులు లేరు, కులీనులు అనేకులు లేరు గాని, । ఏ
శరీరియు దేవుని యెదుట అతిశయపడకుండే నిమి
త్తము, జ్ఞానులను సిగ్గుపరుచుటకు లోకములో వెర్రి
వారిని దేవుడు ఏర్పరుచుకొని యున్నాడు; బలమైన
వాటిని సిగ్గుపరుచుటకు, లోకములో బలహీనమైన
వాటిని దేవుడు ఏర్పరుచుకొని యున్నాడు; ఉన్న
వాటిని వ్యర్థము చేసుటకు, లోకములో కులహీనమైన
వాటిని, తృణీకరించబడిన వాటిని, ఉండని వాటినిని
30 దేవుడు ఏర్పరుచుకొని యున్నాడు. । అయితే క్రీస్తు
యేసు యందు మీరు ఆయన సంబంధులై యున్నా
31 రు.।—అతిశయించేవాడు ప్రభువు యందే అతిశయించ
వలెననిౘ వ్రాయబడిన ప్రకారము, ఆయన దేవునిచేత
మనకు జ్ఞానముగాను, నీతిగాను, పరిశుద్ధతగాను విమో
చనముగాను చేయబడెను.

## 2. అధ్యాయము.

1 సహోదరులారా! నేను కూడా మీ యొద్దికి వచ్చి
నప్పుడు, వాక్య చాతుర్యమైనను, జ్ఞాన చాతుర్యమై
నను లేకనే, దేవుని సాక్ష్యమును మీకు తెలుపుచు,
2 వచ్చినాను:। నేను యేసు క్రీస్తును, అనగా శిలువవేయ
బడిన వాని దప్ప, మరిదేనిని మీలో ఎరిగిన వాడనవు
3 టకు నిర్ణయించుకొనలేదు. । మరియు బలహీనతతోను,
భయముతోను, చాలా వణుకుతోను మీ యొద్ద ఉం
4 టిని. । అప్పుడు మీ విశ్వాసము మనుష్య జ్ఞానమందు
5 కాక, దేవుని బలమందే ఉండుటకు, । నా వాక్యము
నా ప్రకటన (మనుష్య) జ్ఞాన ప్రేరేపణలచేత కాక,
ఆత్మయొక్కయు బలముయొక్కయు దృష్టాంతముతోనే
ఉండెను.

6 అయినప్పటికి, పరిపూర్ణులలో జ్ఞానము తెలు
పుచున్నాము గాని, అది ఈ యుగ జ్ఞానము కాదు;
వ్యర్థులలయే ఈ యుగాధికారుల జ్ఞానము కాదు; ।
7 అయినను దేవుడు మన మహిమ నిమిత్తము యుగము
లకు ముందుగా నియమించినదియు మమర్మమందు మ
రుగై యున్నదియునైన దేవుని జ్ఞానము చెప్పుచున్నా
8 ము.। అది యుగాధికారులలో ఎవనికిని తెలియ లేదు;
అది వారికి తెలిసిన పక్షమందు, మహిమగల ప్రభు
9 వును శిలువవేయక పోదురు. । అయితే వ్రాయబడిన
ప్రకారము—ఏవి కంటికి కనబడ లేదో, చెవికి విన
బడ లేదో, మనుష్య హృదయములో ప్రవేశించ లేదో,।
10 దేవుడు తన్ను ప్రేమించే వారి కొరకు వేటిని సిద్ధపరి
చెనో వాటిని దేవుడు తన ఆత్మవల్ల మనకు బైలుప
రిచియున్నాడు;‡ ఆయన ఆత్మ అన్నిటిని, దేవుని అగా
ధమైన వాటిని కూడా శోధించుచున్నది; । ఒక మను 11
ష్యుని సంగతులు అతనిలో ఉండే మనుష్యాత్మకే
గాని మనుష్యులలో మరి ఎవనికి తెలుసును? ఆలాగే
దేవుని సంగతులు దేవుని ఆత్మకే గాని, మరి యెవని
కిని తెలియవు. । అయినను దేవునివల్ల మనకు దయ చేయ 12
బడిన వాటిని మనము తెలుసుకొనుటకు, లౌకికాత్మను
కాక, దేవుని మూలమైన ఆత్మను పొంది యున్నా
ము. । మరియు వీటినే, మనుష్య జ్ఞానము నేర్పే మా 13
టలతో కాక ఆత్మ సంబంధమైన వాటిని ఆత్మ సంబం
ధమైన వాటితో పోల్చుచు,§ ఆత్మ నేర్పే మాటల
తోనే చెప్పుచున్నాము.

అయినను స్వాభావిక ప్రాణసంబంధి, దేవుని ఆత్మ 14
విషయములు అంగీకరించడు; అవి అతనికి వెర్రితన
ముగా ఉన్నవి; అవి ఆత్మ ప్రకారముగా వివేచించ
బడును గనుక వాటిని గ్రహించ లేడు. । ఆత్మ సం 15
బంధి అన్నిటిని వివేచించును గాని, అతడు ఎవని
చేతనైనను వివేచించబడడు; । ప్రభువునకు బోధించు 16
టకు ఆయన మనస్సు ఎరిగినవాడెవడు? అయితే మన
కు క్రీస్తు మనస్సు గలదు.

## 3. అధ్యాయము.

మరియు సహోదరులారా! మీరు (వట్టి) శరీ 1
రులైనట్టు, క్రీస్తుయందు పసిపిల్లలైనట్టేగాని ఆత్మ సం
బంధులైనట్టు నేను కూడా మీతో మాటలాడ లేకపో
తిని. । పాలతోనే గాని అన్నముతో మిమ్మును పెంచ 2
లేదు; ఇదివరకు మీకు బలము చాలదు; ఇప్పుడును
మీరు బలహీనులై యున్నారు. । మీరు ఇంకా శరీర 3
సంబంధులై యున్నారు; ఏలాగనగా, మీలో అసూ
య, జగడము, భేదములు కలిగినందున, శరీరసంబం
ధులై మనుష్య రీతిగా నడుచుచున్నారు కారా?।
ఒకడు — నేను పౌలు వాడను, మరియొకడు — నేను 4
అపొల్లో వాడను అని పలికేటప్పుడు, మీరు శరీర
సంబంధులై యున్నారు కారా?

కాబట్టి పౌలు ఎవడు? అపొల్లో ఎవడు? వారు 5
సేవకులే. ప్రతివానికి ప్రభువు అనుగ్రహించిన ప్రకా
రమే వారి ద్వారా మీరు విశ్వసించితిరి. । నేను నా 6
టినాను, అపొల్లో నీళ్లు పోసెను, దేవుడు అంకురింప
చేసెను. । కాబట్టి అంకురింప చేసే దేవునిలో నేగాని, 7
నాటే వానిలోనైనను నీళ్లు పోసే వానిలోనైనను
ఏమియు లేదు. । కావున నాటే వాడు, నీళ్లు పోసే 8

*చూస్తున్నారు. †ఇర్మియాహు. అ. 9, వ. 23, 24. ‡యెషయ. అ. 64, వ. 4. §లేక, వారికి విశదపరుచుచు.

వాడును ఒక్కటే. ప్రతి మనుష్యుడు తన స్వకీయ కష్ట
ము చొప్పున స్వకీయమైన జీతము పుచ్చుకొనును; ।
9 దేవుని తోటిపనివారమై యున్నాము; మీరు దేవుని
వ్యవసాయము, దేవుడు కట్టే గృహమునై యున్నారు.

10 నాకు ఇయ్యబడిన దేవుని కృప చొప్పున, నేను
బుద్ధిగల శిల్పకారుని వలె, పునాది వేసి యున్నాను;
మరియొకడు దాని మీద కట్టును; అయినను ప్రతివా
డును దాని మీద ఏలాగు* కట్టునో బాగా చూచు
11 కొన వలెను;। వేయబడిన యేసు క్రీస్తనే పునాది గాక
12 మరియొక దాని ఎవడును వేయ జాలడు. । మరియు,
ఎవడైనను ఈ పునాది మీద బంగారము, వెండి, వెల
గల రాళ్లు, కట్టెలు, గడ్డి, కొయ్యకాలు మొదలైన
13 వాటితో కట్టితే, । వాని వాని పని కనబడును; ఆ దిన
మః దాని తేటపరుచును; అది అగ్నితో బైలుపరచ
బడును. మరియు వాని వాని పని యెట్టిదో, దాని
14 ఆ అగ్ని పరీక్షించును.। దాని మీద ఒకడు కట్టిన పని
15 నిలిచినయెడల, జీతము పుచ్చుకొనును. । ఒకని పని
కాలిపోతే, వానికి నష్టమౌను గాని అతడు రక్షించ
బడును, అయినను అది అగ్నివల్లనైనట్టు అవును.

16 మీరు దేవుని ఆలయమై యున్నారనియు, దేవుని
ఆత్మ మీలో నివసించుచున్నదనియు మీకు తెలియదా?।
17 ఎవడైనను దేవుని ఆలయమును చెరిపినయెడల, దేవుడు
అతని చెరుపును; దేవుని ఆలయము పరిశుద్ధమైనది;
అది మీరే.

18 ఎవడును తనకు తాను మోసపరుచుకొనకనుండు
గాక. మీలో ఎవడైనను ఈ కాలమందు జ్ఞానినను
కొని యుంటే, జ్ఞాని అవుటకు వెర్రివాడై యుండ
19 వలెను; । ఎందుకనగా, ఈ లోక జ్ఞానము దేవుని
యెదుట వెర్రితనమై యున్నది. ఆయన—జ్ఞానులను,
20 వారి యుక్తిలో చిక్కించును;† । మరియు—జ్ఞానుల తలం
పులు వ్యర్థమైనవని ప్రభువుకు తెలుసును‡ అని వ్రా
21 యబడి యున్నది. । కాబట్టి, ఎవడును మనుష్యులను
గూర్చి అతిశయపడ కూడదు. సమస్తమైనవి మీవి; ।
22 పౌలైనను, అపొల్లోయైనను, కేఫాయైనను, లోకమై
నను, జీవమైనను, మరణమైనను, ఉండేవియైనను, రా
23 బోయేవియైనను, అవన్నియు మీవే; । మీరు క్రీస్తు
వారు; క్రీస్తు దేవుని వాడు.

## 4. అధ్యాయము.

1 ఈలాగున క్రీస్తు సేవకులమనియు, దేవుని మర్మ
ముల గృహనిర్వాహకులమనియు (ప్రతి) మనుష్యుడు
మమ్మును ఎంచ వలెను. । మరియు నిర్వాహకులలో 2
ప్రతివాడు నమ్మకముగా ఉండ వలెనని కోరబడుచుం
డును. । నేను మీవల్లనైనను మనుష్య విచారణవల్లనై 3
నను తీర్పు పొందుట నాకు మిక్కిలి కొంచెమైనది.
నాకు నేనే తీర్పు చేసుకొనను; । నా మనస్సాక్షికి 4
(దోషము) ఏమియు తెలియదు; అయినప్పటికి ఇందు
వల్ల నీతిమంతుడనని యెంచబడను; మరియు నాకు
తీర్పు చేసేవాడు ప్రభువే. । కాబట్టి ప్రభువు వచ్చే 5
పర్యంతము సమయము కాకమునుపు, దేని గూర్చియు
తీర్పు చేయకుడి. ఆయన అంధకార రహస్యములను
వెలుగులోకి తెచ్చి, హృదయాలోచనలను బైలుపరు
చును. అప్పుడు ప్రతివానికిని దేవునివల్ల (తగిన) మెప్పు
కలుగును.

మరియు సహోదరులారా! వ్రాయబడిన వాటి 6
కంటే ఎక్కువగా (అతిశయించ) కూడదనేది, మీరు
మావల్ల నేర్చుకొనుటకు ఒకని కొరకు ఒకడు మరి
యొకనికి విరోధముగా ఉప్పొంగకుండుటకు వీటిని
నా మీద అపొల్లోమీద బెట్టుకొని వీటిని మీ నిమి
త్తము ఉపమానముగా చెప్పియున్నాను; । ఎందుకన 7
గా నీకు ఆధిక్యము కలుగచేసే వాడెవడు? నీకు కలి
గిన వాటిలో ఏది పరునిచేత నీకు ఇయ్యబడ లేదు?
ఇయ్యబడినప్పటికి ఇయ్యబడనట్టు అతిశయించనేల?।
ఇప్పుడు మీరు తృప్తిపొంది యున్నారు; ఇప్పుడు 8
ఐశ్వర్యవంతులైతిరి; మేము లేకుండా రాజులైతిరి. మె
ట్టుకు మేము మీతో కూడా రాజులమవుటకు, మీరు
రాజులు కా వలెనని కోరుచున్నాను; । ఎందుకనగా ఆ 9
పొస్తలులమైన మమ్మును, చావుకు నియమించబడిన
వారినివలె, కడపటి వారినిగా దేవుడు కనపరచియు
న్నాడని నాకు తోచుచున్నది; ఏలాగనగా లోకమున
కు, దూతలకు, మనుష్యులకును వేడుకగా చేయబడి యు
న్నాము. । మేము క్రీస్తు నిమిత్తము వెర్రివారము; మీరు 10
క్రీస్తుయందు వివేకులు; మేము బలహీనులము, మీరు
బలవంతులు; మీరు ఘనులు, మేము నీచులము. । ఈ 11
గడియ మట్టుకు ఆకలి దప్పులుగల వారము; దిగంబ
రులము; కొట్టబడుచున్నాము; ఉనికిపట్టులేని వార
ము; । స్వకీయమైన చేతులతో పని చేసి కష్టపడుచు 12
న్నాము. నిందించబడి దీవించుచున్నాము; హింసపర
చబడి ఓర్చుకొంటున్నాము; । దూషించబడి బతిమా 13
లుకొంటున్నాము; లోకముయొక్క మైలగాను, అన్ని
టి పెంటగాను ఇదివరకు ఎంచబడి యున్నాము.

మిమ్ము సిగ్గుపరచవలెనని వీటిని వ్రాయుచున్నాను 14
కాను, గాని నా ప్రియమైన పిల్లలని మీకు బుద్ధి చెప్పు

*లేక, వేటితో. †యోబు. 5, 13. ‡కీర్తన. 94, 7.

15 చున్నాను; । క్రీస్తుయందు మీకు ఉపదేశకులు పది
వేలు ఉన్నప్పటికి, తండ్రులు అనేకులు లేరు; యేసు
క్రీస్తుయందు సువార్త మూలముగా మిమ్మును నేనే
16 కంటిని గనుక । నన్ను అనుసరించేవారై యుండ వలె
17 నని మిమ్మును వేడుకొంటున్నాను. । ఇందు నిమిత్తము,
ప్రభువుయందు ప్రియుడును నమ్మకమైన వాడునైన
తీమొథెయును మీ యొద్దికి పంపితిని. నేను అంతట
సంఘములన్నిటిలోను బోధించే ప్రకారము, అతడు
క్రీస్తుయందున్న నా మార్గములను మీకు జ్ఞాపకము
చేసును.

18 నేను మీ యొద్దికి రానని కొందరు ఉప్పొంగుచు
19 న్నారు; । అయినప్పటికి ప్రభువుకు ఇష్టమైతే, త్వర
గా మీ యొద్దికి వచ్చి ఉప్పొంగుచున్న వారి సామ
20 ర్థ్యమునే గాని వారి మాటను తెలుసుకొనను; । దే
వుని రాజ్యము మాటయందు లేదు, సామర్థ్యమందే
21 యున్నది. । మీరు యేది కోరుచున్నారు? బెత్తముతో
నేను మీ యొద్దికి రావలెనా? లేక ప్రేమతోను, సా
త్వికమైన ఆత్మతోను మీ యొద్దికి రా వలెనా?

## 5. అధ్యాయము.

1 మీలో, జారత్వమున్నదని వినికి కూడా కలదు.
అట్టి జారత్వమనగా ఒకడు తన తండ్రి భార్యను ఉం
2 చుకొనుట రాష్ట్రములలోనైనను లేదు. । అయినప్ప
టికి మీరు పొంగుచున్నారు; ఈలాటి కార్యము చేసిన
వాడు మీ మధ్యనుంచి వెలివేయబడ వలెనని మీరు
ఎంత మాత్రము దుఃఖపడ లేదు.

3 నేనైతే దేహవిషయము దూరముగాను, ఆత్మవిష
యము సమీపముగానుండి, ఇప్పుడే, తటస్థమై యు
న్నట్టు, అట్టి కార్యము ఈలాగు చేసినవాని గూర్చి
4,5 తీర్పుచేసి యున్నాను; । ఏలాగనగా ప్రభువైన యేసు
దినమందు వాని ఆత్మ రక్షించబడుటకు, శారీర నాశము
నిమిత్తము, మన ప్రభువైన యేసుక్రీస్తు పేరట, మీరు
నా యాత్మయు మన ప్రభువైన యేసుక్రీస్తు బలముతో
కూడినప్పుడు, అట్టివాని సైతానుకు అప్పగించ వలెను.
6 మీరు అతిశయపడుట మంచిది కాదు.—పులిసినది
కొంచెము ముద్దంతయు పులియ చేసునని మీరు ఎరు
7 గరా? । మీరు పులియని* వారై యున్న ప్రకారము,
కొత్త ముద్దవుటకు ఆ పాతదైన పులిసినది నిరాకరించుడి;
ఎందుకనగా క్రీస్తనే మన పస్కా (పశువు) కూడా
8 మన కొరకు వ్రేల్చబడి యున్నది గనుక, । పాతదైన
పులిసినదానితోనైనను, దుర్మార్గతయు చెడుతనము అనే
పులిసినదానితోనైనను కాకుండ, నిష్కాపట్యము, సత్య
ము అనే పులియని వాటితో పండుగను ఆచరింతము.

జారులతో కూడుకొన వద్దని, నా ఉత్తరములో మీకు 9
వ్రాసినాను । గాని, బొత్తిగా ఈ లోకపుజారులతో 10
నైనను, లోభులతోనైనను, దోచుకొనే వారితోనై
నను, విగ్రహారాధకులతోనైనను కాదు. ఆలాగైతే,
మీరు లోకమునుంచి వెళ్లిపో వలెను. । కావున ఇప్పు 11
డు, సహోదరుడనబడిన వాడెవడైనను, జారుడైనను,
లోభియైనను, విగ్రహారాధకుడైనను, తిట్టేవాడైనను,
తాగుబోతైనను, దోచుకొనే వాడైనను, అయియుంటే,
అట్టి వానితో కలుసుకొన కూడదు, భుజించను కూ
డదని మీకు వ్రాసితిని; । వెలపటి వారికి తీర్పు చేసు 12
టకు నాకేమి? లోపటి వారికి మీరు తీర్పు చేయు
చున్నారు గదా. । వెలపటి వారికి దేవుడు తీర్పు చేసును 13
గనుక, దుర్మార్గుని మీలోనుంచి వెలివేయుడి.

## 6. అధ్యాయము.

మీలో ఎవనికైనను మరియొకని మీద వ్యాజ్య 1
ముంటే, పరిశుద్ధుల యెదుట కాకుండా, అనీతిమంతుల
యెదుట తీర్పు పొందుటకు ధైర్యము తెచ్చుకొనునా?।
పరిశుద్ధులు లోకమునకు తీర్పు చేతురని మీకు తెలియ 2
దా? మీవల్ల లోకమునకు తీర్పు చేయించబడితే, అన్ని
టికంటే తక్కువైన వాటిని గూర్చి తీర్పు చేయుటకు
అయోగ్యులై యున్నారా? । దూతలకు తీర్పు చేయుదు 3
మని యెరుగరా? ఈ జీవ సంబంధమైన వాటిని గూర్చి
మరి యెక్కువగా చేయ రాదా? । కాబట్టి ఈ జీవ 4
సంబంధమైన వ్యాజ్యములు మీకు కలిగి యుంటే,
సంఘములో చులకనగా ఎంచబడిన వారిని(తీర్చుటకు)
కూర్చుండ బెట్టుడి†. । మీరు సిగ్గుపడుటకు చెప్పుచు 5
న్నాను. ఏమీ? తన సహోదరుని వ్యాజ్యము తీర్పు
చేయగల బుద్ధిమంతుడు మీలో ఒకడును లేడా?।
కావున సహోదరుడు సహోదరునిమీద వ్యాజ్యము 6
వేయుచున్నాడు; అవిశ్వాసుల యెదుటనే అది వేయు
చున్నాడు. కాగా,। కేవలము మీ యందు తప్పితము 7
న్నది; ఏమనగా మీలో ఒకని మీద ఒకనికి వ్యాజ్య
ములు కలవు. దానికంటే అన్యాయము పొందుట
మంచిది కాదా? దానికంటే మీ ఆస్తి అపహరించ
బడనిచ్చుట మంచిది గదా; । అయినను మీరు అన్యా 8
యము చేయుచున్నారు, అపహరించుచున్నారు; మీ
సహోదరులకును ఆలాగు చేయుచున్నారు.

*లేక, పులిసినది లేని. †లేక, బెట్టుదురా.

9 అన్యాయస్థులు దేవుని రాజ్యమును స్వతంత్రించు
కొనరని మీకు తెలియదా? మోసపోకండి; వేశ్యా
సంగులైనను, విగ్రహారాధకులైనను, వ్యభిచారులైనను,
ఆడుతనము గల వారైనను, పురుషసంయోగులైనను,।
10 దొంగలైనను, లోభులైనను, తాగుబోతులైనను, దూష
కులైనను, దోచుకొనేవారైనను దేవుని రాజ్యమును
11 స్వతంత్రించుకొనరు. । మరియు, మీలో కొందరు
అట్టి వారై యుండిరి. అయినను ప్రభువైన యేసు
నామమున మన దేవుని ఆత్మవలన కడుగుకొంటిరి, పరి
శుద్ధపరచబడి యున్నారు, నీతిమంతులని తీర్చబడియు
న్నారు.

12 అన్నిటిలో నాకు స్వాతంత్ర్యము కలదుగాని,
అన్ని ఉపయోగమైనవి కావు. అన్నిటిలో నాకు
స్వాతంత్ర్యము కలదు గాని, నేను దేనివలన లోపరు
13 చుకొనబడనొల్లను. । ఆహారములు కడుపుకు, కడుపు
ఆహారములకును కలవు; అయినను దేవుడు దానిని వాటి
నిని నాశము చేసును. మరియు దేహము జారత్వము
నిమిత్తము కాక ప్రభువు నిమిత్తమే. ప్రభువు దేహము
14 నిమిత్తము ఉన్నాడు.।ఇదియుగాక దేవుడు ప్రభువును
లేపెను; ఆయన మనలను కూడా తన శక్తివల్ల లేపును.

15 మీ దేహములు క్రీస్తు అవయవములై యున్నవని
మీకు తెలియదా? కాబట్టి నేను క్రీస్తుయొక్క అవ
యవములను తీసుకొని, వేశ్యయొక్క అవయవములుగా
16 చేయ వచ్చునా? అది దూరమౌగాక. । వేశ్యను హత్తు
కొనే వాడు దానితో ఏక దేహమై యున్నాడని మీరు
ఎరుగరా?—వారిద్దరు ఏక శరీరమై యుందురనెను.* ।
17 అటువలె ప్రభువును హత్తుకొనే వాడు ఏకాత్మయై
18 యున్నాడు. । వేశ్యాగమనము తప్పించుకొనుడి. మను
ష్యుడు చేసే పాపములన్ని దేహమునకు వెలపటనున్నవి
గాని, వేశ్యాగమనము చేసే వాడు తన శరీరము
19 నకు విరోధముగా పాపము చేసును. । మీ దేహము,
మీకు దేవుని వల్ల కలిగి మీలో ఉండే పరిశుద్ధాత్మయొ
క్క ఆలయమై యున్నదనియు, మీరు స్వకీయులు
కారనియు మీకు తెలియదా? మీరు విలువతో కొన
20 బడితిరి గనుక। [దేవునివై యుండే] మీ దేహముతోను,
[మీ ఆత్మతోను] దేవుని మహిమపరుచుడి.

## 7. అధ్యాయము.

1 మరియు మీరు నాకు వ్రాసిన వాటి విషయము,
2 స్త్రీని ముట్టకుండుట పురుషునికి మంచిది. । అయినప్ప
టికి జారత్వములు ఉన్నందున, ప్రతి వానికి భార్య
ఉండ వలెను; ప్రతి స్త్రీకి స్వకీయమైన పెనిమిటి ఉండ
వలెను. । పెనిమిటి భార్యకు, ఆలాగు భార్య పెనిమిటికి 3
తగినదాని చెల్లించ వలెను. । పెనిమిటికే గాని భార్యకు 4
తన దేహము పైని స్వాతంత్ర్యము లేదు; ఆలాగున భా
ర్యకే గాని పెనిమిటికి తన శరీరము పైని స్వాతంత్ర్య
ము లేదు. । ప్రార్థన కొరకు† మీకు తీరుబడి కలుగు 5
టకు ఒకవేళ కొంత కాలము, ఉభయ సమ్మతి వల్లనే
గాక ఒకరిదాని ఒకరు అపహరించకుడి. మరియు మీరు
మనస్సు పట్టలేక పోయినందున, సైతాను మిమ్మును శో
ధించకుండుటకు తిరిగి కలుసుకొనుడి. । అయినను ఇది 6
అనుజ్ఞయేగాని ఆజ్ఞ కాదు. । మనుష్యులందరు నా వలె 7
ఉండ గోరుచున్నాను; అయినను ప్రతి మనుష్యుడు,
ఒకడు ఈలాగున ఒకడు ఆలాగున దేవునివల్ల, తన తన
కృపాదానము పొంది యున్నాడు. । నా వలె ఉండుట 8
వారికి మంచిదని పెండ్లి లేని వారితోను విధవలతోను
చెప్పుచున్నాను. । అయినను మనస్సు పట్ట లేకుంటే 9
పెండ్లాడ వచ్చును; కామ తప్తులవుట కంటే పెండ్లా
డుట మంచిది.

మరియు పెండ్లాడిన వారికి నేను కాదు ప్రభువు 10
ఆజ్ఞాపించేది ఏమనగా — భార్య పెనిమిటిని ఎడబాయ
కూడదు; । ఎడబాసితే, పెండ్లి లేకుండ వలెను; లేదా 11
తన పెనిమిటితో సమాధానపడ వలెను. మరియు పెని
మిటి తన భార్యను ఎడబాయ కూడదు.

ప్రభువు కాదు, నేను తక్కిన వారితో చెప్పేదేమ 12
నగా — ఏ సహోదరునికైనను, విశ్వాసములేని భార్య
కలిగినప్పుడు, అతనితో నివసించుట ఆమెకు ఇష్టమైతే,
అతడు ఆమెను ఎడబాయ కూడదు. । మరియు ఏ స్త్రీ 13
కైనను విశ్వాసము లేని పెనిమిటి కలిగినప్పుడు ఆమెతో
నివసించుట అతనికి ఇష్టమైతే, ఆమె అతని ఎడబాయ
కూడదు; । విశ్వాసము లేని పెనిమిటి భార్యతో పరిశుద్ధ 14
పరచబడి యుండును. మరియు, విశ్వాసములేని భార్య
సహోదరునితో పరిశుద్ధపరచబడియుండును; లేకపో
తే మీ పిల్లలు అపవిత్రులై యుందురు; కావున ఇప్పుడు
వారు పవిత్రులై యున్నారు.

అయినప్పటికి, విశ్వాసములేని వారు ఎడబాసితే, 15
ఎడబాయ వచ్చును; అట్టి సంగతులలో సహోదరు
డైనను, సహోదరియైనను కట్టబడేది లేదు. అయినను
సమాధానమందు (ఉండుటకు) దేవుడు మనలను పిలిచి
యున్నాడు; । ఓ స్త్రీ! నీ పెనిమిటిని రక్షింతువో లేదో 16
నీకు ఏలాగు తెలుసును? లేక ఓ పురుషుడా! నీ భా

*ఆదికాండము. అ. 2, వ. 24. †కొన్ని ప్రతులలో—ప్రార్థన కొరకును ఉపవాసముకొరకును.

ర్యను రక్షింతువో లేదో నీకు ఏలాగు తెలుసును?।
17 అయితేనేమి, ప్రభువు ప్రతివానికి ఏలాగు పంచి
పెట్టెనో, దేవుడు ప్రతివాని ఏలాగు పిలిచెనో
ఆలాగే నడువ వలెను. ఆలాగే సంఘములన్నిటిలో
18 ఈలాగున నియమించుచున్నాను.। ఛేదనసంస్కారము
గల వాడెవడైనను పిలువబడెనా? అతడు అఛేదనసం
స్కారము చేయించుకొన వద్దు. ఛేదనసంస్కారము
లేని వాడెవడైనను పిలువబడెనా? ఛేదనసంస్కారము
19 చేయించుకొన వద్దు.। దేవుని ఆజ్ఞలు గైకొనుటయేగాని
ఛేదనసంస్కారములో ఏమియులేదు, అఛేదనసంస్కా
20 రములో ఏమియు లేదు.। ప్రతివాడు ఏస్థితిలో* పిలువ
21 బడెనో అందులోనే ఉండ వలెను.। దాసుడవై పిలువ
బడితివా? చింతపడ వద్దు. అంతే కాదు† స్వతంత్రుడ
వౌటకు శక్తి కలిగినప్పటికి‡ ఆలాగుండుట మరి మం
22 చిది;। ఎందుకనగా ప్రభువు యందు పిలువబడిన దా
సుడు ప్రభువు యొక్క స్వతంత్రుడై యున్నాడు. ఆ
ప్రకారమే స్వతంత్రుడై యుండి పిలువబడిన వాడు
23 క్రీస్తు దాసుడై యున్నాడు.। మీరు విలువతో కొన
బడి యున్నారు గనుక మనుష్యులకు దాసులై యుం
24 డకుడి. । సహోదరులారా! ప్రతి మనుష్యుడును
దేనిలో పిలువబడునో దానిలోనే దేవునియొద్ద ఉండ
వలెను.

25 మరియు కన్యకల విషయము, ప్రభువుయొక్క ఆజ్ఞ
నాకు కలిగియుండ లేదుగాని, నమ్మకమైనవాడవుటకు
ప్రభువువల్ల కనికరము పొందిన వానివలె ఆలోచన చె
26 ప్పుచున్నాను.। కాబట్టి ఇప్పటి ఇరుకునిమిత్తము, ఇది
మంచిదని, (అనగా) ఈలాగున ఉండుట మనుష్యునికి
27 మంచిదని నా తాత్పర్యము.। భార్యకు బద్ధుడవై యుం
టివా? విడువ కోర వద్దు. భార్య లేక విడిగా ఉంటే
28 వివాహము కోర వద్దు.। అయినను, నీవు పెండ్లాడినప్ప
టికి నీకు పాపము లేదు. మరియు కన్యక పెండ్లాడి
నప్పటికి ఆమెకు పాపము లేదుగాని, అట్టివారికి దేహ
బాధ కలుగును. దానినుంచి నేను మిమ్మును తప్పించ
వలెనని యున్నాను.

29 అయినప్పటికి సహోదరులారా! నేను చెప్పుచు
న్నది యేమనగా, కాలము సంకుచితమైనది గనుక
30 ఇకమీదట భార్యలు కలిగిన వారు కలగనట్టును,। ఏడ్చే
వారు ఏడవనట్టును, సంతోషపడే వారు సంతోష
31 పడనట్టును, కొనేవారు సంపాదించనట్టును,। ఈ లో
కమును అనుభవించే వారు దురనుభవము లేనట్టును
ఉండ వలెను; ఎందుకనగా, ఈ లోకాకారము గతిం
చుచున్నది.

మీరు చింతలేని వారై యుండవలెనని కోరుచున్నా 32
ను. పెండ్లి లేనివాడు ప్రభువును ఏలాగు సంతోష
పరచ వచ్చునని ప్రభు సంబంధమైన వాటిని గూర్చి
చింతించుచున్నాడు. । పెండ్లియైన వాడు భార్యను ఏ 33
లాగు సంతోషపరచ వచ్చునని లోక సంబంధమైన వా
టిని గూర్చి చింతించుచున్నాడు.। ఆలాగు పెండ్లియైన 34
దానికి, కన్యకకును వ్యత్యాసము కలదు. పెండ్లి లేనిది
శరీరమందు, ఆత్మయందును పరిశుద్ధురాలై యుండుటకు
ప్రభు సంబంధమైన వాటిని గూర్చి చింతించుచున్న
ది; పెండ్లియైనది పెనిమిటిని ఏలాగు సంతోషపరచ
వచ్చునని లోకసంబంధమైన వాటిని గూర్చి చింతించు
చున్నది.। మీకు ఉరి ఒడ్డ వలెనని కాదు గాని, తగిన 35
యోగ్యమైనదాని నిమిత్తమును, మీరు తొందర లేక
ప్రభువును కొలుచుటకును, ఇది మీ స్వకీయమైన
ప్రయోజనము నిమిత్తమే చెప్పుచున్నాను.

అయినప్పటికి, ఒకని కన్యకకు ఈడు మిగిలియున్న 36
పక్షమందు, ఆమె యెడల తాను జరిగించే రీతి యో
గ్యమైనది కాదని తలంచితే, మరియు ఈలాగు ఉండ
వలసి యుంటే, తన ఇష్టము చొప్పున చేయ వచ్చును;
పాపము లేదు; వారు పెండ్లాడ వచ్చును.। అయినను 37
అవసరము లేక, తన ఇచ్ఛను గూర్చి అధికారము గల
వాడై, తన కన్యకను యథాస్థితిగా ఉంచుకొనుటకు
తన హృదయములో నిర్ణయించుకొని, హృదయస్థిరత
కలిగిన వాడు, బాగా చేయుచుండును.। కాబట్టి పెం 38
డ్లికి ఇచ్చేవాడు బాగా చేయుచుండును; పెండ్లికి
ఇయ్యనివాడు మరింత బాగా చేయుచుండును.

భార్య తన పెనిమిటి బ్రతికినంత కాలము [బోధన 39
ప్రమాణమువల్ల] బద్ధురాలై యుండునుగాని, పెనిమిటి
నిద్రించి యుంటే,§ ప్రభువు యందు మాత్రమే గాని‖
ఆమె ఇష్టమైన వాని పెండ్లాడుటకు స్వతంత్రురాలై
యుండును.। అయినప్పటికి, ఆమె ఈలాగున ఉంటే, 40
నా ఆలోచన ప్రకారము, మరింత ధన్యురాలై యుం
డును. మరియు దేవుని ఆత్మ నాకును కలిగి యున్నదని
తలంచుకొంటున్నాను.

## 8. అధ్యాయము.

విగ్రహార్పితమైన వాటి విషయము, మనమందరము 1
తెలివి గలవారమని యెరుగుదుము. తెలివి ఉప్పొంగ

*లేక, పెలుపులో. †లేక, అయితే. ‡లేక, కలిగితే. §క్రైస్తవుల మరణము నిద్ర అనబడును.
‖అనగా, ప్రభువుయందున్నవారిలోనే.

2 చేసును, ప్రేమ క్షేమాభివృద్ధి కలుగ చేసును. । ఒకడు
ఏమైనను ఎరుగుదుననుకొని యుంటే, తాను తెలుసు
కొన తగినట్టు, ఇంకా ఏమియు తెలుసుకొన లేదు. ।
3 ఒకడు దేవుని ప్రేమించితే, ఇతడు ఆయనవల్ల తెలియ
బడును.

4 కాబట్టి, విగ్రహార్పితమైనవాటి భోజనమును గూర్చి,
లోకమందు విగ్రహములో ఏదియు లేదనియు, ఒకడే
5 గాక వేరే దేవుడు లేడనియు ఎరుగుదుము. । అనేక
దేవుండ్లు అనేక ప్రభువులు ఉన్నారు గదా! ఆకాశ
మందైనను భూమి మీదనైనను దేవుండ్లనబడినవి ఉన్న
6 ప్పటికి, । మనకు తండ్రియైన దేవుడు ఒకడే ఉన్నాడు.
ఆయన మూలముగా సమస్తము (పుట్టెను); ఆయన
నిమిత్తము మనము పుట్టితిమి. మరియు, యేసుక్రీస్తనే
ప్రభువు ఒక్కడే. ఆయన ద్వారా సమస్తమును (కలి
గెను). ఆయన ద్వారా మనము కలిగి యున్నాము. ।
7 అయినను ఆ తెలివి అందరిలో లేదు. కొందరు ఇది
వరకును విగ్రహమందు మనస్కరించి, విగ్రహార్పితమని
భోజనము చేయుచున్నారు. ఈలాగు వారి మనస్సు
8 బలహీనమైనదై, అపవిత్రపరుచబడును. । అయినను భో
జనమువల్ల దేవుని యెదుట మన స్థితి మార్చబడదు. తినక
పోతే మనకు తక్కువ లేదు, తింటే మనకు ఎక్కువ
లేదు.

9 అయితే ఈ మీస్వాతంత్ర్యము వల్ల ఒకవేళ బల
10 హీనులకు అడ్డము కలుగకుండ చూచుకొనుడి; । ఏలా
గనగా, ఒకడు, తెలివి గల నీవు విగ్రహాలయమందు
పజ్తిలో కూర్చుండ చూచిన యెడల బలహీనుడైయున్న
వాని మనస్సు విగ్రహార్పితమైన వాటిని తినుటకు
11 ధైర్యము తెచ్చుకొనదా! । అప్పుడు ఏ సహోదరుని
కొరకు క్రీస్తు చనిపోయెనో, ఆ బలహీనుడు నీ తె
12 లివి చేత నశించును! । అప్పుడు ఈలాగు సహోదరు
లకు విరోధముగా పాపము చేయుచు, వారి బలహీన
మైన మనస్సు హింసించుచు మీరు క్రీస్తుకు విరోధ
13 ముగా పాపము చేయుచుందురు. । కాబట్టి భోజనము
నా సహోదరునికి అభ్యంతరము కలగచేసిన యెడల,
నా సహోదరునికి అభ్యంతరము కలగ చేయకుండు
టకు, నేను ఎన్నటెన్నటికిని మాంసము తినను.

## 9. అధ్యాయము.

1 నేను అపొస్తలును కానా! నేను స్వతంత్రుడను
కానా! మన ప్రభువైన యేసు క్రీస్తును నేను చూచి
యుండ లేదా! ప్రభువు యందు నా పని మీరు
2 కారా! । ఇతరులకు నేను అపొస్తలును కాక పోయి
నప్పటికి మెట్టుకు మీకై యున్నాను; ప్రభువుయందు
నా అపొస్తలుత్వమునకు మీరు ముద్రగా ఉన్నారు. ।
నన్ను విచారించే వారికి నా ప్రత్యుత్తరము ఇదే, । 3
అన్నపానములు పుచ్చుకొనుటకు మాకు అధికారము 4
లేదా! । తక్కిన అపొస్తలుల వలెను, ప్రభువుయొక్క 5
సహోదరుల వలెను, కేఫా వలెను, సహోదరియైన
భార్యను వెంటబెట్టుకొని తిరుగుటకు మాకు అధికార
ము లేదా! । మరియు పని చేయకుండుటకు నేను, బర్న 6
బా మాత్రమే అధికారము లేని వారమా! । తన స్వకీ 7
యమైన వెచ్చము వల్ల, ఎప్పుడైనను దండు కొలువు
చేసే వాడెవడు! ద్రాక్షావనము నాటి, దాని ఫలము
తినని వాడెవడు! మందను మేపి, ఆ మంద పాలు తాగని
వాడెవడు!

వీటిని మనుష్య ప్రకారము చెప్పుచున్నానా! బో 8
ధన ప్రమాణము కూడా వీటిని చెప్పుచున్నది గదా! ।—
కళ్లము త్రొక్కుచున్న యెద్దు మూతికి బుట్ట వేయ 9
వద్దని మోషే బోధనప్రమాణములో వ్రాయబడి యు
న్నది.* దేవుడు యెద్దులకొరకా విచారించుచున్నాడు! ।
లేక కేవలము మన కొరకా దీని చెప్పుచున్నాడా! 10
అవును; మన కొరకు వ్రాయబడెను; ఎందుకనగా
దున్నేవాడు నిరీక్షణతో దున్న తగినది, కళ్లము త్రొ
క్కించే వాడు (పంటలో) పాలు పొందుటకు నిరీక్ష
ణతో దాని త్రొక్కించ తగినది.

మీ కొరకు ఆత్మ సంబంధమైనవి మేము విత్తి యుం 11
టే మీవైన శరీరసంబంధమైన ఫలములు మేము కోసు
కొనుట గొప్పదా! । ఇతరులకు మీ పైని ఈ అధికార 12
ములో పాలు కలిగితే, మాకు ఎక్కువ కలగదా! అయి
నప్పటికిని మేము ఈ అధికారమును వాడుకొనలేదు.
క్రీస్తుయొక్క సువార్తకు ఏ ఆతంకమైనను చేయకుం
డుటకు అన్నిటిని సహించుచున్నాము.

యాగములు చేసేవారు పరిశుద్ధాలయమునుంచి 13
జీవనము చేయుచున్నారనియు వేదికయొద్ద కాచుకొనే
వారు వేదికతో పాలివాండ్లై యున్నారనియు మీరు
యెరుగరా! । ఆలాగున సువార్తవల్ల జీవించుటకు 14
సువార్త ప్రకటించేవారికి ప్రభువు నియమించి యు
న్నాడు.

అయితే నేను వీటిలో దేనినైనను వాడుకొన లేదు. 15
మరియు ఆలాగున నా యెడల చేసుకొనబడుటకు
వీటిని వ్రాయలేదు; ఎవడైనను నా అతిశయాస్పదము
వ్యర్థము చేయుట కంటే మరణము నాకు మరి మం
చిది; । సువార్తను ప్రకటించుచున్నప్పటికి నాకు అతి 16
శయము లేదు; ఈ భారము నా మీద మోపబడి యు
న్నది. అయ్యో! నేను సువార్తను ప్రకటించకపోతే

*ద్వితియో. అ. 25, వ. 4.

17 నాకు శ్రమ. । ఇది నాయంతట నేనే చేసితే నాకు ఫల
ము కలుగును. స్వేచ్ఛ లేని వాడనైతే, నాకు గృహ
నిర్వాహకత్వము అప్పగించబడి యున్నది.

18 కాగా సువార్త యందు నాకు కలిగిన పూర్ణాధికా
రము వినియోగపరచకుండ, నేను సువార్తను ప్రక
టించుచు ఆ* సువార్తను ఉచితమైనదిగా చేయుట
19 వల్ల, నాకు ఏపాటి ఫలమున్నది? । నేను అందరి విష
యము స్వతంత్రుడనై, ఎక్కువమందిని సంపాదించు
టకు అందరికిని నన్ను దాసునిగా చేసుకొని యున్నా
20 ను. । యూదులను సంపాదించుటకు, యూదుల కొరకు
యూదుని వలెను; బోధనప్రమాణమునకు లోబడిన
వారిని సంపాదించుటకు, నేను బోధనప్రమాణమునకు
లోబడక, వారి కొరకు బోధన ప్రమాణమునకు లో
21 బడిన వాని వలెను; । దేవుని బోధనప్రమాణము లేని
వాడనుకాక క్రీస్తు బోధనప్రమాణమునకు లోబడిన
వాడనై, బోధనప్రమాణము లేనివారిని సంపాదిం
చుటకు బోధనప్రమాణము లేని వారికొరకు బోధ
22 నప్రమాణము లేని వానివలెనుంటిని. । బలహీనులను
సంపాదించుటకు బలహీనుల కొరకు బలహీనుని వలె
నైతిని. ఏలాగైనను కొందరిని రక్షించే నిమిత్తము అం
23 దరి కొరకు అన్నివిధములైతిని. । మరియు నేను సువా
ర్తలో పాలివాడనయే నిమిత్తము; దానికొరకు అం
తయు చేయుచున్నాను.

24 పందెపు రంగమందు పరుగెత్తే వారందరు పరుగెత్తు
దురు గాని, (వారిలో) ఒక్కడే బహుమానము పొం
దునని మీకు తెలియదా? అటువలె, మీరు పుచ్చుకొనే
25 నిమిత్తము పరుగెత్తుడి. । మరియు జెట్టీలందరు అన్నిటి
విషయము మితముగా ఉందురు. అయితే వారు క్షయ
మయే కిరీటము, మనము అక్షయమయే కిరీటము
26 పొంద వలెనని (అట్టివారమై యున్నాము.) । కాబట్టి
నేను ఆలాగున పరుగెత్తుచున్నాను; నిశ్చయము లేని
వానివలె కాదు; ఆలాగున పోరాడుచున్నాను, గాలిని
27 కొట్టేవానివలె కాదు, । గాని ఒక వేళ ఇతరులకు ప్రక
టించిన తర్వాత, నేను విమర్శకు నిలువని వాడనై
యుందు నేమో అని, నా శరీరము బిగబట్టుకొని దాని
లోపరుచుకొంటున్నాను.

## 10. అధ్యాయము.

1 ఎందుకనగా, సహోదరులారా! ఇది మీకు తెలి
యకుండుట నాకు ఇష్టము లేదు; అదేమనగా, మన
పితృలందరు మేఘము కింద ఉండిరి; వారందరును
2 సముద్రము ద్వారా నడిచి వెళ్లిరి; । వారందరును మో
షేలోనుండుటకు మేఘములోను, సముద్రములోను
బాప్తిస్మము పొందిరి; వారందరును ఆత్మ సంబంధమైన
ఒక్క ఆహారము తినిరి; । వారందరును ఆత్మ సంబంధమైన 3
ఒక్క పానము చేసిరి; । ఏలాగనగా వెంబడించిన, ఆత్మ 4
సంబంధమగు బండలోనిది తాగిరి; । ఆ బండ క్రీస్తే. 5
అయినప్పటికి వారిలో ఎక్కువమంది దేవునికి ఇష్టులై
యుండ లేదు; వారు అరణ్యములో సంహరించబడిరి.

వారు ఆశించిన ప్రకారము, మనము చెడ్డవాటిని 6
ఆశించకుండుటకు ఇవి మనకు ఉపమానార్థములుగా
ఉన్నవి. ।—జనులు తినుటకు తాగుటకును కూర్చుండి, 7
ఆడుటకు లేచినారని† వ్రాయబడిన ప్రకారము, వారి
లో కొందరి వలె, మీరు విగ్రహారాధకులై యుండ
కుడి. । మరియు వారివలె మనము వ్యభిచరించక ఉంద 8
ము; వారిలో కొందరు వ్యభిచరించినందున ఒక్క దిన
మున ఇరువైమూడు వేలమంది కూలిరి. । మరియు మన 9
ము క్రీస్తును‡ శోధించక ఉందము; వారిలో కొందరు
శోధించి సర్పముల చేత నశించిరి. । మరియు మీరు 10
సణుగకుడి; వారిలో కొందరు సణిగి సంహారకుని చేత
నశించిరి.

ఇవి యన్నియు ఉపమానార్థములుగా వారికి 11
సంభవించి, యుగాంతములు వచ్చిన మనకు బోధ నిమి
త్తము వ్రాయబడెను. । కాబట్టి తాను నిలుచుచున్నా 12
నని తలంచుకొనే వాడు, పడకుండుటకు జాగ్రతగా
చూచుకొన వలెను. । మనుష్య సంబంధమైన శోధన 13
గాక మరి యేదియు మీకు సంభవించ లేదు. మరియు
దేవుడు నమ్మ తగినవాడే. ఆయన మీరు సహించ గల
దాని కంటే ఎక్కువగా మిమ్మును శోధించబడనియ్య
డు. అంతేకాదు, సహించే శక్తి మీకు కలుగుటకు
ఆయన, శోధనతో, మీరు బైలు వెళ్లే మార్గమును
చేసును.

కాబట్టి, నా ప్రియులారా! విగ్రహారాధన విడిచి 14
దూరస్థులై యుండుడి. । మీరు బుద్ధిమంతులని మీతో 15
పలుకుచున్నాను; నేను చెప్పేదాని మీరే విచారించు
డి. । మనము స్తుతించే స్తుతిపాత్ర, క్రీస్తు రక్తములో 16
పాలు పుచ్చుకొనుట గదా? మనము విరిచే రొట్టె
క్రీస్తుయొక్క శరీరములో పాలు పుచ్చుకొనుటగదా?।
ఏలాగనగా అందరము ఆ ఒక్క రొట్టెలో పాలు 17
పుచ్చుకొనుచున్నాము గనుక, అనేకులమైన మనము
ఒక్క రొట్టెయు, ఒక్క శరీరమునై యున్నాము.

శరీర ప్రకారమైన ఇశ్రాయేలును చూడుడి. యా 18
గపశువుల మాంసము తినేవారు వేదికతో పాలివారై

* ఇతరప్రతులలో, క్రీస్తు. † నిర్గ. 32. అ. 6. వ. ‡ అనేక ప్రతులలో, ప్రభువును.

19 యున్నారు గదా. । కాబట్టి, నేను చెప్పుచున్నది యే
మనగా, విగ్రహములో యేమైనను ఉన్నదా? విగ్రహా
ర్పితములో యేమైనను ఉన్నదా?

20 లేదు గాని, అన్యజనులు అర్పించేవి దేవునికి
కాదు దయ్యములకే అర్పించుచున్నారని చెప్పుచు
న్నాను. కాగా మీరు దయ్యములతో పాలివారవుటకు
21 నాకు ఇష్టములేదు. । మీరు ప్రభువుయొక్క గిన్నెలో
నిది దయ్యముల గిన్నెలోనిది కూడ తాగ నేరరు; ప్రభు
వుయొక్క బల్ల మీదనున్నది దయ్యముల బల్ల మీదను
22 న్నది కూడ పుచ్చుకొన నేరరు. । ప్రభువునకు ఆగ్ర
హము పుట్టించ వచ్చునా? ఆయన కంటే శక్తిమంతుల
మై యున్నామా?

23 అన్నిటిలో నాకు స్వాతంత్ర్యమున్నది గాని అన్ని
యు ప్రయోజనమైనవి కావు. అన్నిటిలో స్వాతం
త్ర్యమున్నది గాని అన్నియు క్షేమాభివృద్ధి కలుగ
24 చేయవు. । ఎవడును తన కొరకే కాదు పరుని కొరకు
మేలు చేయ చూచుకొన వలెను.

25 మనస్సాక్షి నిమిత్తము ఏ విచారణ చేయక కటిక
వారి దుకాణములో అమ్మేది యేదో దాని తిన వచ్చును.।-
26 భూమియు దాని పరిపూర్ణతయు ప్రభునివై యు
న్నవి.* విశ్వాసములేని వారిలో ఒకడు మిమ్మును విం
దుకు పిలిచినప్పుడు, వెళ్లుటకు మనస్సు కలిగి యుం
27 టే, । మీ యెదుట పెట్టినది యేదో దాని గూర్చి, మన
28 స్సాక్షి నిమిత్తము యే విచారణ చేయక తినుడి, । గాని
ఒకడు మీతో — ఇది విగ్రహార్పితమని చెప్పితే, తెలి
పిన వాని నిమిత్తము మనస్సాక్షి నిమిత్తమును తినకుడి; ।
29 స్వకీయ మనస్సాక్షి నిమిత్తము కాదు, ఆ మరియొకని
దాని గూర్చి చెప్పుచున్నాను; ఎందుకనగా నాకు వేరొ
కని మనస్సాక్షి వల్ల నా స్వాతంత్ర్యమును గూర్చి
30 తీర్పు చేయబడనేల? । నేను కృతజ్ఞతతో పుచ్చుకొనిన
యెడల, నేను దేని కొరకు స్తోత్రము చేయుచున్నా
నో దాని నిమిత్తము నేను దూషించబడనేల?

31 కాబట్టి మీరు పానమైనను భోజనమైనను మరి
యేమి చేసినప్పటికి, దేవుని మహిమ కొరకు సమస్త
32 మును జరిగించుడి.। యూదులకును హెల్లేనీయులకును
దేవుని సంఘమునకును అభ్యంతరముగా ఉండకుడి. ।
33 ఈలాగున నేను కూడ నా స్వకీయ్య ప్రయోజనము
గాక, అనేకులు రక్షించబడ వలెనని వారి ప్రయోజన
మును కోరుచు, అందరిని అన్నిటిలో సంతోషపెట్టు
34 చున్నాను.। నేను కూడ క్రీస్తును అనుసరించే ప్రకా
రము మీరు నన్ను అనుసరించుడి.

## 11. అధ్యాయము.

అయినను, సహోదరులారా! మీరు అన్నిటి విష 1,
యము నన్ను జ్ఞాపకము చేసుకొనుచు, నేను మీకు
అప్పగించిన ప్రకారము కట్టడలను గైకొనుచున్నా
రని మిమ్మును కొనియాడుచున్నాను, । గాని ప్రతి 3
పురుషునికి తల క్రీస్తనియు, స్త్రీకి తల పురుషుడని
యు, క్రీస్తుకు తల దేవుడనియు మీరు తెలుసుకొన
వలెనని కోరుచున్నాను. । ఏ పురుషుడు తల మీద 4
ముసుకు వేసుకొని ప్రార్థించునో లేక ప్రవచిం
చునో వాడు తన తలను అవమానపరుచుకొనును. ।
మరియు తల మీద ముసుకు వేసుకొనక, ఏ స్త్రీ ప్రా 5
ర్థించునో లేక ప్రవచించునో ఆమె తన తలను
అవమానపరుచుకొనును; ఎందుకనగా ఆమెకు క్షౌరము
చేయబడినట్టుగానే ఉండును. । ఏమి! స్త్రీ ముసుకు 6
వేసుకొనని యెడల ఆమె కత్తెరించుకొన దగును. కత్తె
రించుకొనుటయైనను క్షౌరము చేయించుకొనుటయై
నను స్త్రీకి అవమానమైతే ముసుకు వేసుకొన వలెను; ।
ఎందుకనగా పురుషుడు దేవుని పోలికయు మహిమ 7
యునై యుండి, తల మీద ముసుకు వేసుకొన కూడ
దుగాని, స్త్రీ పురుషుని మహిమయై యున్నది; । ఎందు 8
కనగా, స్త్రీ పురుషునుంచే గాని పురుషుడు స్త్రీనుంచి
కలుగ లేదు. । మరియు, స్త్రీ పురుషుని కొరకేగాని 9
పురుషుడు స్త్రీ కొరకు సృష్టించబడ లేదు.† । ఇందువల్ల 10
స్త్రీకి, దూతల నిమిత్తము తల మీద అధికారము ఉండ
వలెను. । అయినప్పటికి ప్రభువు యందు, స్త్రీ లేక పురు 11
షుడు లేడు; । పురుషుడు లేక స్త్రీ లేదు; స్త్రీ పురు 12
షునుంచి ఏలాగో ఆలాగే పురుషుడు స్త్రీవల్ల కలిగి
ఉన్నాడు గాని దేవునుంచి సమస్తమైనవి కలిగి యు
న్నవి. । మీలో మీరే యోచించుకొనుడి. స్త్రీ ము 13,14
సుకు లేనిదై దేవుని ప్రార్థించుట తగునా? పురు
షుడు తల వెంట్రుకలు పెంచుకొనుట అతనికి అవ
మానమనియు, । స్త్రీకి తల వెంట్రుకలు పైట చెంగు 15
గా నియ్యబడెను గనుక ఆమె తల వెంట్రుకలు
పెంచుకొనుట ఆమెకు ఘనమనియు సృష్టిక్రమము
మీకు బోధించదా? మరేమి లేదు; । ఎవడైనను కలహ 16

* కీర్తన. 24. 1. † ఆదికాం. 2. 18, 21.

ప్రియుడుగా కనబడితే, మాకైనను దేవుని సంఘముల
కైనను అట్టి మర్యాద లేదు.
17 అయితే మిమ్మును మెచ్చక దీని విధించుచున్నాను;
మీరు ఎక్కువ కీడు నిమిత్తమేగాని ఎక్కువ మేలు
18 నిమిత్తము కూడి వచ్చుచున్నారు కారు; । మొదట
మీరు సంఘమందు కూడి యుండగా, మీలో భేద
19 ములు కలవని వినుచున్నాను. । కొంత మట్టుకు ఆలా
గు నమ్ముచున్నాను: ఎందుకనగా మీలో యోగ్యులు
కనబడుటకు మీలో భేదములు* ఉండక విధి లేదు.
20 కాబట్టి మీరు ఒక్కచోట కూడియుండగా అది
ప్రభువుయొక్క రాత్రిభోజనము చేయుటకు కాదు;।
21 భోజనము చేసేటప్పుడు, ప్రతి వాడును భోజనము
ముందుగా చేయుచున్నాడు. ఒకడు ఆకలిగొనును;
22 మరి యొకడు మత్తుడవును. । ఇదేమి! అన్నపానములు
పుచ్చుకొనుటకు మీకు ఇండ్లు లేవా? లేక దేవుని సం
ఘమును తిరస్కరించి (ఇండ్లు) లేని వారిని సిగ్గుపరు
చుచున్నారా? మీతో ఏమి చెప్పుదును? దీని గూర్చి
మిమ్మును మెచ్చుదునా? మెచ్చను.
23 ఎందుకనగా నేను మీకు అప్పగించిన దాని, ప్రభు
వువల్ల పొందితిని; ప్రభువైన యేసు, తాను అప్పగించ
బడుచున్న రాత్రియందు ఒక రొట్టె పుచ్చుకొని,।
24 స్తోత్రము చేసి దాని విరిచి — ఇది మీ కొరకైన నా
శరీరము; నన్ను జ్ఞాపకము చేసుకొనుటకు దీని చేయు
25 డని చెప్పెను. । ఆ ప్రకారమే భోజనమైన తరువాత,
ఆయన గిన్నెయు పుచ్చుకొని—ఈ గిన్నె నా రక్తము
వల్లనైన క్రొత్త నిబంధనయై† యున్నది. మీరు ఇది
తాగేటప్పుడెల్ల నన్ను జ్ఞాపకము చేసుకొనుటకు దీని
చేయుడనెను.
26 మీరు ఈ రొట్టెను తిని, ఈ గిన్నెతో తాగేటప్పు
డెల్ల ప్రభువుయొక్క మరణమును, ఆయన వచ్చే పర్యం
27 తము అగపరుచుచున్నారు. । కాబట్టి ఎవడు అయో
గ్యతగా ప్రభువుయొక్క రొట్టెను తినునో లేక ఆ
యన గిన్నెతో తాగునో, అట్టివాడు ప్రభువుయొక్క
శరీరమును గూర్చియు రక్తమును గూర్చియు అపరాధి
28 యై యుండును. । కాబట్టి ఒక మనుష్యుడు తన్ను
తాను పరీక్షించుకొన వలెను; ఆలాగు చేసి ఆ రొ
29 ట్టెను తిని ఆ గిన్నెతో తాగ వలెను; । అయోగ్యత
గా తినుచు తాగుచునుండేవాడు, ప్రభువుయొక్క
శరీరమును వివేచించక, తనకు శిక్షావిధి కలుగ తినుచు
30 తాగుచునున్నాడు. । ఇందు వల్ల మీలో అనేకులు
బలహీనులు రోగులునై యున్నారు, చాలామంది
31 నిద్రించుచున్నారు. । అయితే మనలను మనమే పరీ
క్షించుకొనిన యెడల, తీర్పు పొందక పోదుము గాని
మనము తీర్పు పొందినవారమై, । లోకముతో మహా 32
శిక్షకు విధించబడకుండుటకు ప్రభువు చేత శిక్షించబ
డుచున్నాము.
కాబట్టి, నా సహోదరులారా! మీరు భోజనము 33
చేయుటకు కూడి వచ్చుచు, ఒకని కొరకు ఒకడు కని
పెట్టి యుండుడి. । మీరు కూడివచ్చుట శిక్షావిధికి కా 34
రణము కాకుండుటకు, ఎవడైనను ఆకలిగొని యుంటే
ఇంటిలో భోజనము చేయ వలెను. మిగిలిన వాటిని,
నేను వచ్చినప్పుడు క్రమపరుతును.

## 12. అధ్యాయము.

మరియు సహోదరులారా! ఆత్మ సంబంధమైన 1
వాటిని ‡ గూర్చి మీకు తెలియకుండుట నాకు ఇష్ట
ము లేదు. । మీరు అన్యజనులై యున్నప్పుడు, మీరు 2
నడిపించబడిన ప్రకారము, మూగవైన విగ్రహముల
యొద్దికి తిప్పబడితిరని మీకు తెలుసును. । కాబట్టి ఎవ 3
డును దేవుని ఆత్మ వల్ల పలుకుచు, యేసు శాపగ్రస్తుడని
చెప్పడనియు, పరిశుద్ధాత్మ వల్లనే గాని ఎవడును యేసు
ప్రభువని చెప్ప లేడనియు నేను మీకు తెలియ చేయు
చున్నాను.
అయినప్పటికి నానావిధములైన కృపాదానములు 4
కలవుగాని, ఆత్మ ఒక్కటే. । మరియు సేవల భేదములు 5
కలవు గాని ప్రభువు ఒక్కడే. । నానావిధములైన శక్తులు 6
కలవు గాని దేవుడు ఒక్కడే. ఆయన అందరిలో అన్ని
టిని జరిగించేవాడు.
అయినను ఆత్మ ప్రత్యక్షత, ప్రయోజనము కొరకు 7
ప్రతి మనుష్యునికి ఇయ్యబడుచున్నది. । ఏలాగనగా 8
ఒకనికి ఆత్మ వల్ల బుద్ధి వాక్యము, మరి యొకనికి ఆ
ఆత్మ ప్రకారమే జ్ఞాన వాక్యము, । మరియొకనికి ఆ 9
ఆత్మ వల్లనే విశ్వాసము, మరి యొకనికి ఆ అత్మ వల్లనే
స్వస్థపరిచే వరములును, । మరి యొకనికి అద్భుతములు 10
చేసే శక్తులును, మరి యొకనికి ప్రవచనమును, మరియొ
కనికి ఆత్మల పరీక్షలును, మరి యొకనికి భాషా విధము
లును, మరి యొకనికి ఆ భాషల అర్థము చెప్పే శక్తి
యు ఇయ్యబడి యున్నవి. । అయినను వీటినన్నిటిని 11
ఆ ఒక్క ఆత్మయే తన చిత్తము చొప్పున ప్రతి వాని
కిని ప్రత్యేకముగా పంచి జరిగించుచున్నది.
ఏలాగు శరీరము ఏకమై, అనేకమైన అవయవము 12
లుకలదై యున్నదో, మరియు ఏలాగు శరీరముయొక్క
అవయవములన్నియు అనేకములై ఒక్క శరీరమైయు

* లేక, విమతములు. † లేక, ఒడంబడికయై. ‡ లేక, వరములను.

13 న్నను, ఆలాగే క్రీస్తు కూడ ఉన్నాడు.। ఏలాగనగా
యూదులమైనను హెల్లేనీయులమైనను దాసులమై
నను, స్వతంత్రులమైనను, ఒక్క ఆత్మ యందు మనమం
దరమును ఒక్క శరీరములోనుండుటకు బాప్తిస్మము
పొందితిమి. మనమందరము ఒక్క ఆత్మను త్రాగించ
14 బడితిమి;* । ఆలాగే శరీరము ఒక్క అవయవమే కా
15 దుగాని అనేకములై యున్నది।—నేను చేతిని కాను
గనుక నేను శరీరములోనిదానను కానని పాదము
16 చెప్పినందున, శరీరములోనిది కాకపోవునా! । మరి
యు—నేను కన్నుకాను గనుక నేను శరీరములోని
దాననుకానని చెవి చెప్పినందున, శరీరములోనిది కాక
17 పోవునా! । శరీరమంతయు కన్నైతే వినుట యెక్కడ?
అంతయు వినుటయైతే వాసన చూచుట యెక్కడ?।
18 అవునుగాని, దేవుడు అవయవములలో ప్రతి దానిని
19 తన చిత్త ప్రకారము శరీరమందు ఉంచెను.। మరియు
అవన్నియు ఒక్క అవయవమైతే శరీరము ఎక్కడ?।
20 అవునుగాని, అవయవములు అనేకములైనవైనప్పటికి
21 శరీరము ఒక్కటే గనుక, । కన్ను చేతితో—నీవు నాకు
అక్కర లేదనియు, తల పాదములతో— మీరు నాకు
22 అక్కరలేదనియు చెప్ప కూడదు.। అంతేకాదు శరీర
ముయొక్క అవయవములలో ఏవి బలహీనములై అగ
పడునో, అవి మరి యెక్కువగా అవశ్యములై యు
23 న్నవి.। మరియు శరీరములో వేటిని ఘనత లేనివని తలం
తుమో వాటి మీద మరి యెక్కువైన ఘనత ఉంచు
కొందుము. మన కురూపమైన వాటికి ఎక్కువైన
24 సురూపము కలుగును.। మన సురూపమైన వాటికి
అక్కర లేదుగాని, శరీరములో వివాదము లేకుండు
25 టకు, । అవయవములు ఒకదాని కొరకు ఒకటి అన్యో
న్యముగా జాగ్రత్తపడేలాగున, దేవుడు తక్కువ దా
నికి ఎక్కువ ఘనత కలిగించి శరీరమును అమర్చి యు
26 న్నాడు.। అది గనుక ఒక అవయవము శ్రమపడున
ప్పుడు అవయవములన్నియు దానితో శ్రమపడును.
ఒక అవయవము ఘనత పొందినప్పుడు, అవయవము
లన్నియు దానితో సంతోషపడును.

27 అటువలె మీరు క్రీస్తుయొక్క శరీరమును, వేరువే
28 రుగా అవయవములునై యున్నారు.।మరియు దేవుడు
సంఘములో కొందరిని మొదట అపొస్తలులుగాను,
తరువాత ప్రవక్తలుగాను, తరువాత బోధకులుగాను,
అటుపిమ్మట శక్తులను, తరువాత స్వస్థపరిచే కృపాదా
నములను, సహాయములను, దొరతనములను, నానా
29 విధభాషలను ఏర్పరిచెను.। అందరు అపొస్తలులా? అం
దరు ప్రవక్తలా? అందరు బోధకులా?। అందరు శక్తులా? 30
అందరు స్వస్థపరిచే కృపాదానములు గలవారా? అం
దరు భాషలతో మాటలాడుచున్నారా?। అందరు (ఆ 31
భాషల) అర్థము చెప్పగలవారా? అయినను కృ
పాదానములలో గొప్ప వాటిమీద ఆసక్తిపడుడి.
మరియు ఇంకా అత్యధికముగా శ్రేష్ఠమైన మార్గము
మీకు అగపరుచుచున్నాను.

## 13. అధ్యాయము.

మనుష్యుల భాషలతోను, దూతల భాషలతోను, 1
నేను మాటలాడినప్పటికి ప్రేమ లేని వాడనైతే, మ్రోగే
కంచును గణగణలాడే తాళమునై యుందును. । ప్రవ 2
చించే కృపాదానము గలవాడను, మర్మములన్నియు
జ్ఞానమంతయు యెరిగిన వాడనై యున్నప్పటికి, కొండ
లను పెకలించే పరిపూర్ణ విశ్వాసముగల వాడనైనప్ప
టికి ప్రేమ లేని వాడనైతే, నాలో యేమియులేదు.।
మరియు బీదల పోషణ కొరకు నావన్నియు ఇచ్చిన 3
ప్పటికి, కాల్చబడుటకు నా శరీరము అప్పగించినప్ప
టికి ప్రేమ లేని వాడనైతే నాకు ప్రయోజనమేమి
యు లేదు.

ప్రేమ దీర్ఘశాంతమై యున్నది; అది దయను 4
చూపించును; ప్రేమ మత్సరపడదు; ప్రేమ డంబము
చేయదు;। అది ఉప్పొంగదు, అమర్యాదగా నడవదు, 5
స్వకీయమైన వాటిని వెతకదు, త్వరగా కోపపడదు,
చెడుతనము మోపదు,। అన్యాయమును గూర్చి సంతో 6
షపడక, సత్యముతో సంతోషించును,। అన్నిటిని గూర్చి 7
తాళుకొనుచును, అన్నిటిని నమ్ముచున్నది, అన్నిటిని
నిరీక్షించుచున్నది, అన్నిటిని ఓర్చుచున్నది.

ఈ ప్రేమ ఎప్పుడును తప్పిపోదు. ప్రవచనములై 8
నను ఎత్తి వేయబడును; భాషలైనను మానును; తెలివియై
నను ఎత్తివేయబడును;। కొంత మట్టుకు యెరుగుదుము, 9
కొంత మట్టుకు ప్రవచించుచున్నాము,। గాని పూర్ణ 10
మైనది వచ్చినప్పుడు, అపూర్ణమైనది కొట్టివేయబడు
ను;। నేను పిల్లనైనప్పుడు, పిల్ల వలె మాటలాడితిని; పిల్ల 11
వలె తలంచుకొంటిని; పిల్ల వలె యోచించితిని, గాని
పెద్దవాడనైనప్పుడు, పిల్ల వాటిని మానివేసితిని.। ఇప్పు 12
డు అద్దము ద్వారా సూచనగా చూచుచున్నాము, అ
ప్పుడు ముఖాముఖిగా చూతుము. ఇప్పుడు కొంత మ
ట్టుకే తెలుసుకొనుచున్నాను, అప్పుడు నేను పూర్తిగా
తెలియబడే ప్రకారము, పూర్తిగా తెలుసుకొందును.

కాబట్టి విశ్వాసము, నిరీక్షణ, ప్రేమయు ఈ మూ 13
డు నిలుచును గాని వీటిలో గొప్పది ప్రేమ.

---

* లేక, ఒక్క ఆత్మయే మన మీద పోయబడెను.

## 14. అధ్యాయము.

1 ప్రేమను ఆసక్తిగా వెంబడించుడి. ఆత్మ సంబంధ
మైన వాటియందు విశేషముగా మీరు ప్రవచించే నిమి
2 త్తము ఆసక్తిపడుడి; । ఎందుకనగా, అన్యభాషతో మా
టలాడేవాడు మనుష్యులతో కాదు దేవునితోనే మా
టలాడుచున్నాడు; ఎవడును గ్రహించడు.* అయినను
3 ఆత్మలో† మర్మములను పలుకుచున్నాడు. । ప్రవచించే
వాడు, క్షేమాభివృద్ధి, బుద్ధి, ఆదరణ కలుగుటకు మను
4 ష్యులతో మాటలాడుచున్నాడు. । అన్యభాషతో మాట
లాడేవాడు తనకే క్షేమాభివృద్ధి కలుగచేసుకొనును.
ప్రవచించే వాడు సంఘమునకు క్షేమాభివృద్ధి కలుగ
5 చేసును. । కాగా, మీరందరు భాషలతో మాటలాడ
కోరుచున్నాను గాని, విశేషముగా మీరు ప్రవచించ
వలెనని కోరుచున్నాను; ఎందుకనగా సంఘము క్షే
మాభివృద్ధి పొందే నిమిత్తము, అర్థము చెప్పక భాష
లతో మాటలాడేవానికంటే, ప్రవచించే వాడు అధి
కుడు.

6 కాబట్టి సహోదరులారా! అన్యభాషలతో మాట
లాడుచు, నేను మీ యొద్దికి వచ్చి, బైలుపరుచుట వల్ల
నైనను తెలివి వల్లనైనను ప్రవచనము వల్లనైనను బోధ
వల్లనైనను మీతో మాటలాడకపోతే మీకు ప్రయో
7 జనమేమి? । ఆలాగున శబ్దమిచ్చే నిర్జీవమైనవి, పిల్లం
గ్రోవి కానీ, వీణ కానీ, స్వరములలో భేదము చేయ
కుంటే ఊదబడేది అయినను, మీటబడేది అయినను
8 ఏలాగు తెలియబడును?। మరియు కొమ్ము స్పష్టము కాని
శబ్దమిచ్చినప్పుడు, యుద్ధమునకు ఎవడు సిద్ధపడును?।
9 ఆలాగే మీరు అర్థమిచ్చే మాటలు నాలుకతో పలి
కితేనే గాని పలికినది యేలాగు తెలియబడును? మీరు
10 గాలితో మాటలాడుచుందురు. । లోకమందున్న భాషల
విధములన్నిటిలో అర్థము లేనిది ఒకటియు లేదు,।
11 గనుక శబ్దార్థము నాకు తెలియకుంటే, మాటలాడే
వానికి నేను పరదేశినిగా ఉందును, మాటలాడేవాడు
12 నాకు పరదేశిగా ఉండును. । ఆప్రకారము, మీరు కూ
డ ఆత్మసంబంధమైన వాటి మీద ఆసక్తి గలవారై యు
న్నారు గనుక సంఘముయొక్క క్షేమాభివృద్ధి నిమిత్త
ము అవి మీకు విస్తరించి కలుగ కోరుడి.

13 కాబట్టి అన్యభాషతో మాటలాడే వాడు అర్థము
14 చెప్ప కలిగే నిమిత్తము ప్రార్థించ వలెను. । ఎందుకనగా
నేను అన్యభాషతో ప్రార్థించితే నా ఆత్మ ప్రార్థించు
15 ను గాని, నా మనస్సు నిష్ఫలమవును. । కాబట్టి, ఆత్మతో
ప్రార్థింతును, మనస్సుతోను ప్రార్థింతును; ఆత్మతో
పాడుదును, మనస్సుతోను పాడుదును. । లేకపోతే, 16
నీవు ఆత్మతో స్తోత్రముచేసినప్పుడు, విద్య లేని వాడు
నీవు చెప్పేదాని గ్రహించలేనందున, నీవు చేసే స్తోత్ర
మునకు ఆమేనని, యేలాగు పలుకును? । నీవు బాగా 17
స్తోత్రము చేయుచున్నావు గాని ఆ మరియొకడు మేలు
పొందడు. । మీ యందరి కంటే, నేను ఎక్కువగా భా 18
షలతో మాటలాడుచున్నందున, దేవుని స్తుతించుచు
న్నాను. । అయినప్పటికి సంఘములో అన్యభాషతో 19
పది వేల మాటలు పలుకుట కంటే, ఇతరులకు బోధించే
నిమిత్తము, నా వివేకముతో అయిదు మాటలు పలుకుట
నాకు ఇష్టమై యుండును. । సహోదరులారా! మీరు 20
మతియందు పిల్లలు కాక, చెడుతనమందు పిల్లలై యుం
డుడి గాని మతిలో సంపూర్ణులై యుండుడి. ।—అన్య 21
భాషలతోను, వేరే పెదవులతోను ఈ జనులతో
మాటలాడుదును; అయినను అప్పుడు కూడ నా మాట
వినక పోదురని ప్రభువు చెప్పుచున్నాడని బోధన ప్ర
మాణములో వ్రాయబడి యున్నది.‡ । కాబట్టి భాషలు 22
విశ్వసించే వారికి కాదు, అవిశ్వాసులకే గురుతై యు
న్నవి గాని, ప్రవచించుట అవిశ్వాసుల కొరకు కాదు
విశ్వసించే వారి కొరకే గురుతై యున్నది.

కాబట్టి సంఘమంతయు ఒక్క చోట కూడి, అం 23
దరు భాషలతో మాటలాడుచుండగా, ఆ విద్య లేని
వారైనను అవిశ్వాసులైనను లోపటికి వచ్చినప్పుడు,
మీరు వెర్రివారనుకొందురు గదా? । అయితే అందరు 24
ప్రవచించగా అవిశ్వాసియైనను విద్య లేని వాడైనను
లోపటికి వచ్చినప్పుడు, అందరి వల్ల ప్రేరేపించబడు
ను, అందరి వల్ల పరిశోధించబడును. । అప్పుడు అతని 25
హృదయ రహస్యములు బైలుపరచబడును. ఇందువల్ల
అతడు సాగిలపడి దేవునికి నమస్కరించి, దేవుడు నిజ
ముగా మీలో ఉన్నాడని ప్రచురము చేసును.

కాబట్టి, సహోదరులారా! అది యేలాగున్నది? 26
మీరు కూడేటప్పుడు మీలో ప్రతివానికి కీర్తన కల
దు, బోధ కలదు, అన్యభాషావచనము కలదు, బైలుప
రచబడినది కలదు, భాషార్థము చెప్పుట కలదు. సమ
స్తమును క్షేమాభివృద్ధి నిమిత్తము జరగనియ్యుడి. ।
అన్యభాషతో ఎవడైనను మాటలాడితే ఎక్కువమంది 27
కాకుండ, ఇద్దరైనను ముగ్గురైనను వంతులచొప్పున
మాటలాడ వలెను; మరియొకడు అర్థము చెప్ప వలె
ను; । అర్థము చెప్పువాడు లేనియెడల, సంఘములో 28
మౌనియై యుండ వలెను గాని, తనతోను దేవునితో
ను మాటలాడ వచ్చును. । ప్రవక్తలు ఇద్దరు ముగ్గురు 29

---

* గ్రేకులో, వినడు. † లేక, ఆత్మవల్ల. ‡ యెషయా. 28. అ. 11, 12 వ.

మాటలాడ వచ్చును, ఇతరులు వివేచించ వలెను. ।
30 అప్పుడు కూర్చున్న మరియొకనికి యేదైనను బైలుప
రచబడిన యెడల మొదటి వాడు మౌనియై యుండ
31 వలెను; । ఆలాగున అందరు నేర్చుకొనుటకు, అందరు
బోధించబడుటకు మీరందరు ఒకని తరువాత నొకడు
32 ప్రవచించ వచ్చును. । మరియు ప్రవక్తల ఆత్మలు
33 ప్రవక్తలకు లోబడి యున్నవి. । దేవుడు పరిశుద్ధుల సం
ఘములన్నిటిలో ఉన్న ప్రకారము సమాధానమునకే
గాని క్రమహీనతకు కర్త కాడు.

34 మీ స్త్రీలు సంఘములలో మౌనముగా ఉండ వలె
35 ను.। బోధనప్రమాణము చెప్పే ప్రకారము, వారు లో
బడుటకే గాని, మాటలాడుటకు వారికి సెలవు లేదు,
వారు ఏమైనను నేర్చుకొన కోరినప్పుడు ఇంటిలో
తమ తమ పెనిమిటులను అడుగ వలెను; సంఘములో
మాటలాడుట స్త్రీలకు అవమానమౌను.

36 మీ యొద్దనుంచి దేవుని వాక్యము బైలు వెళ్లెనా?
37 లేక మీ యొద్దికి మాత్రమే వచ్చెనా? । ఎవడైనను
తాను ప్రవక్తననియైనను, లేక ఆత్మ సంబంధినని యై
నను తలంచుకొంటే, నేను మీకు వ్రాయుచున్నవి
ప్రభువు యొక్క ఆజ్ఞలని అతడు ఒప్పుకొన వలెను. ।
38 ఎవడైనను తెలివి లేని వాడైతే, తెలివి లేని వాడై
39 యుండనిమ్ము. । కాబట్టి, సహోదరులారా! ప్రవచిం
40 చుటకు ఆసక్తిపడుడి; । అన్యభాషలతో మాటలాడు
టకు నిషేధించకుడి; సమస్తమును మర్యాదగాను క్రమ
ముగాను చేయబడనియ్యుడి.

## 15. అధ్యాయము.

1 మరియు, సహోదరులారా! నేను మీకు ప్రక
టించిన సువార్త మీకు తెలుపుచున్నాను. మీరు
దాని అంగీకరించితిరి; దాని యందు నిలిచి యున్నా
2 రు; । మరియు, మీరు ఒకవేళ వ్యర్థముగా విశ్వసించక
పోయినయెడల, నేను మీకు ఏ వాక్యముతో సువార్త
ప్రకటించితినో దాని మీరు గట్టిగా పట్టుకొనిన
పక్షమందు దానివల్ల రక్షణయు పొందుచున్నారు. ।
3 నాకు ప్రాప్తించినదాని, అన్నిటికంటే మొదట మీకు
అప్పగించితిని; అదేమనగా,—లేఖనముల ప్రకారము
క్రీస్తు మన పాపముల నిమిత్తము మృతిబొందెను; పాతి
4 పెట్టబడెను;। లేఖనముల ప్రకారము మూడవ దినమున
5 లేపబడెను. । ఆయన కేఫకు, తరువాత పన్నెండుగురి
6 కిని అగపడెను. । అటుపిమ్మట ఏనూటికి ఎక్కువైన
సహోదరులకు ఒక్క కాలమందు కనబడెను. వీరిలో
చాలామంది ఇదివరకు నిలిచి యున్నారు; కొందరు
7 నిద్రించి యున్నారు. । తరువాత ఆయన యాకోబుకు,
అటుతరువాత అపొస్తలులందరికిని అగపడెను. । కడ 8
పట గర్భ స్రావము వలెనైన నాకును కనబడెను.।
నేను అపొస్తలులందరిలో తక్కువైనవాడను; దేవుని సం 9
ఘమును తరిమినందున అపొస్తలుడను అనబడుటకు యో
గ్యుడను కాను, । గాని ఏలాగు ఉన్నానో ఆలాగున 10
దేవుని కృపచేతనే ఉన్నాను. మరియు నాయెడల
ఉన్న ఆయన కృప వ్యర్థము కాలేదు. వారందరి
కంటే ఎక్కువగా ప్రయాసపడితిని; నేను కాదు
గాని నాతోడై యున్న దేవుని కృపయే. । కాబట్టి 11
నేనే కానీ, వారే కానీ ఈలాగు మేము ప్రకటించి
తిమి, ఈలాగున మీరు విశ్వసించితిరి.

కాబట్టి క్రీస్తు మృతిబొందిన వారిలోనుంచి లేప 12
బడెనని ప్రకటించబడుచుండగా, మీలో కొందరు,—
చనిపోయిన వారి పునరుత్థానము లేదని యేల చెప్పు
చున్నారు? । చనిపోయిన వారి పునరుత్థానము లేకుం 13
టే, క్రీస్తు కూడ లేపబడ లేదు. । మరియు క్రీస్తు 14
లేపబడకుంటే, మా ప్రకటన వ్యర్థమే, మీ విశ్వా
సమును వ్యర్థమే. । మరియు మేము దేవుని విషయ 15
ము అబద్ధ సాక్షులమని అగపడుచున్నాము; ఏలాగ
నగా దేవుని గూర్చి ఆయన క్రీస్తును లేపెనని సాక్ష్య
ముచెప్పి యున్నాము గాని, చనిపోయిన వారు లేప
బడని పక్షమందు, ఆయనను లేప లేదు. । చనిపోయిన 16
వారు లేపబడకుంటే క్రీస్తు కూడ లేపబడ లేదు. ।
క్రీస్తు లేపబడకుంటే, మీ విశ్వాసము వ్యర్థమే; 17
మీరు ఇంక మీ పాపములలోనే ఉన్నారు. । అంతే 18
కాదు, క్రీస్తుయందు నిద్రించిన వారు, నశించిరి. । ఈ 19
జీవితకాలములోనే మనము క్రీస్తుయందు నిరీక్షించి
నయెడల మనుష్యులందరి కంటే దౌర్భాగ్యులమై
యున్నాము.

కావున, నిద్రించిన వారిలో ప్రథమ ఫలముగా, 20
క్రీస్తు మృతిపొందిన వారిలోనుంచి లేపబడి యు
న్నాడు. । మనుష్యుని వల్ల మరణము వచ్చెను గనుక 21
మనుష్యుని వల్ల, చనిపోయిన వారి పునరుత్థానమును
కలుగును. । ఏలాగనగా ఆదాము యందు అందరు 22
ఏలాగు చనిపోవుచున్నారో, ఆలాగున క్రీస్తు యందు
అందరు బ్రతికించబడుదురుగాని, ప్రతివాడును స్వ
కీయమైన తరగతిలోనే; । ప్రథమ ఫలము క్రీస్తు; తరు 23
వాత క్రీస్తు వచ్చినప్పుడు, ఆయన వారు (లేపబడుదు
రు). । ఆ తరువాత అంతము. అప్పుడు ఆయన సమ 24
స్తమైన దొరతనమును, సమస్తమైన అధికార బలముల
ను కొట్టివేసిన తరువాత, తండ్రియైన దేవునికి రాజ్య
మును అప్పగించును; । ఎందుకనగా తాను శత్రువుల 25
నందరిని ఆయన పాదములకింద ఉంచే పర్యంతము ఆ

26 యన రాజ్యపరిపాలన చేయుచుండ వలెను. । అంత్య
27 శత్రువైన మరణము నశింపచేయ బడును.।—సమస్తమును
ఆయన పాదముల కింద ఉంచి యున్నాడు.*—సమస్త
ము లోపరచబడి యున్నదని చెప్పినప్పుడు, ఆయనకు
సమస్తమును లోపరిచిన వాడు గాకనే (లోపరచబడి
28 యున్నదని) విశదమైనది. । మరియు సమస్తము ఆయ
నకు లోపరచబడి యుండినప్పుడు, దేవుడు సర్వములో
సర్వమయే నిమిత్తము, కుమారుడు తానే తనకు సమస్త
మును లోపరిచిన ఆయనకు లోబడును.

29 మరియు, చనిపోయిన వారు బొత్తిగా లేపబడకుం
టే, చనిపోయిన వారి కొరకు బాప్తిస్మము చేయించు
కొనేవారు ఏమి చేతురు? ఇంకా వారి కొరకు బాప్తి
30 స్మము చేయించుకొననేల?। మరియు మనము గడియ
31 గడియకు అపాయములో నుండనేల?। మన ప్రభువైన
క్రీస్తు యేసు యందు మిమ్మును గూర్చి నాకు కలిగిన
అతిశయముతోడు, దినదినము చనిపోవుచున్నాను.।
32 నేను మనుష్యుని వలెనే ఎఫెసులో మృగములతో
పోరాడినను, నాకు లాభమే? చనిపోయిన వారు లేప
బడని పక్షమందు—తిందాము, తాగుదాము; రేపు చావ
33 బోవుచున్నాము. । మోసపోకండి, దుష్ట సాంగత్య
34 ములు మంచి నడతలను చెరుపును. । తగిన ప్రకారము
మేల్కొని, జాగ్రతపడి, పాపము చేయకుడి; కొంద
రికి దేవుని గూర్చి అజ్ఞానము కలదు. మీకు సిగ్గు కలు
గుటకు మాటలాడుచున్నాను.

35 —అవునుగాని, చనిపోయిన వారు ఏలాగు లేపబ
డుదురు? వారు ఏ శరీరముతో వత్తురని ఒకడు పలు
36 కును. । ఓ అవివేకీ! నీవు విత్తేది చావకగాని జీవింప
37 చేయబడదు. । నీవు విత్తే దాని చూస్తే, ఒక వేళ గో
ధుమల యొక్కయైనా, తక్కిన విత్తనములలో దేనియొ
క్కయైనా వట్టి గింజనే గాని పుట్టబోయే శరీరము
38 విత్తుచున్నావు కావు. ।అయితే దేవుడు తాను ఇచ్ఛ
యించిన ప్రకారము దానికి శరీరమును, విత్తనములలో
39 ప్రతిదానికిని స్వకీయ్య శరీరమును ఇచ్చును. । మాంస
మంతయు ఒక్క మాంసమే కాదు, గాని మనుష్యుల
మాంసము వేరు, మృగముల మాంసము వేరు, చేపలది
40 వేరు, పక్షులది వేరు. । మరియు ఆకాశ శరీరములు
కలవు, భూశరీరములు కలవు. ఆకాశపు వాటి మహిమ
వేరు, భూమి వాటిది వేరు; సూర్యుని మహిమ వేరు,
41 చంద్రుని మహిమ వేరు; । నక్షత్రముల మహిమ వేరు,
మహిమ యందు ఈ నక్షత్రమునకు ఆ నక్షత్రమున
కును భేదము కలదు గదా?

చనిపోయిన వారి పునరుత్థానము అట్టిదే; అది† క్ష 42
యమందు విత్తబడి, అక్షయమందు లేపబడును; । ఘన 43
హీనత యందు విత్తబడి, మహిమ యందు లేపబడును;
బలహీనత యందు విత్తబడి, బలమందు లేపబడును; ।
ప్రాణసంబంధ శరీరముగా విత్తబడి, ఆత్మ సంబంధ 44
శరీరముగా లేపబడును.

ప్రాణసంబంధ శరీరము ఉంటే, ఆత్మసంబంధ 45
మైనది కూడ ఉన్నది. ఈలాగున—ఆదామనే మొదటి
మనుష్యుడు జీవముగల ప్రాణి ఆయెనని వ్రాయబడి
యున్నది; । ‡ కడపటి ఆదాము జీవము కలిగించే ఆత్మ 46
ఆయెను.

ప్రాణ సంబంధమైనదేగాని, ఆత్మ సంబంధమైనది 47
మొదటిది కాదు; తరువాత ఆత్మ సంబంధమైనది. మొ
దటి మనుష్యుడు భూసంబంధమైన మంటివాడు; రెం
డవ మనుష్యుడు ఆకాశసంబంధియైన ప్రభువు. । మం 48
టివాడు ఎట్టివాడో, అట్టివారే మంటివారు. ఆకా
శసంబంధి ఎట్టి వాడో అట్టివారే ఆకాశసంబంధులు.।
మరియు మనము మంటివాని పోలికను వహించిన 49
ప్రకారము, ఆకాశసంబంధి పోలికయు వహింతుము.

మరియు సహోదరులారా! నేను చెప్పేదేమనగా 50
రక్తమాంసములు దేవుని రాజ్యమునకు బాధ్యములై
యుండనేరవు; మరియు క్షయము అక్షయమునకు బా
ధ్యమైయుండదు. । ఇదుగో! మీకు ఒక మర్మము తెలుపు 51
చున్నాను; అదేమనగా మనమందరము నిద్రించము
గాని । నిమిషములో, ఒక రెప్పపాటున కడబూరయొక్క 52
ధ్వని కాగానే, మనమందరము మార్చబడుదుము. బూర
మ్రోగును, అప్పుడు చనిపోయిన వారు అక్షయులై
లేపబడుదురు; మనముకూడ మార్చబడుదుము; । ఈ క్ష 53
యమైనది అక్షయము ధరించుకొన వలెను. ఈ మర్త్య
మైనది అమర్త్యత ధరించుకొన వలెను. । ఈ క్షయ 54
మైనది అక్షయము ధరించుకొనినప్పుడు, ఈ మర్త్య
మైనది అమర్త్యతను ధరించుకొనినప్పుడును—విజయ
మవుటకు మరణము మ్రింగబడెనని వ్రాయబడిన వాక్య
ము నెరవేరును.। ఓ మరణమా! నీముల్లు యెక్కడ!—ఓ 55
మరణమా§ నీ విజయము ఎక్కడ? మరణపు ముల్లు పా
పమే; । పాపముయొక్క బలము బోధన ప్రమాణమే.। 56
అయినను మన ప్రభువైన యేసు క్రీస్తు మూలముగా, 57
మనకు జయమిచ్చే దేవునికి స్తోత్రము కలుగుగాక. ।
కాబట్టి నా ప్రియ సహోదరులారా! మీ ప్రయా 58
సము ప్రభువుయందు వ్యర్థము కాదని తెలుసుకొని,

* కీర్త. 8, 6. † అనగా, విత్తబడినది. ‡ ఆదికాండము. 2. అ. 7. వ. § కొన్ని ప్రతులలో, అదృశ్యలోకమా.

స్థిరులును, కదలనివారును, ప్రభువుయొక్క పని
యందు యెప్పటికిని విస్తరించేవారునై యుండుడి.

## 16. అధ్యాయము.

1 పరిశుద్ధుల కొరకైన చందాను గూర్చినది, నేను
గలతియ* సంఘములకు నియమించిన ప్రకారము మీ
2 రును చేయుడి. । నేను వచ్చినప్పుడు చందా చేయబడ
కుండ ప్రతి ఆదివారమున మీలో ప్రతివాడును తా
ను వర్ధిల్లిన కొలది, తన యొద్ద (కొంత) సొమ్ము కూర్చ
3 వలెను. । నేను వచ్చినప్పుడు మీరు ఎవరిని యోగ్యు
లని ఎంచుదురో వారికి ఉత్తరములిచ్చి మీ ధర్మద్రవ్య
4 ము యెరూషలేమునకు తీసుకొని వెళ్ల పంపుదును. । నేను
కూడ వెళ్ల తగినదై యుంటే, వారు నాతో వత్తురు.
5 అయితే మకెదోనియ ద్వారా వెళ్లేటప్పుడు మీ
యొద్దికి వచ్చెదను; ఎందుకనగా మకెదోనియ ద్వారా
6 వెళ్ల వలెను. । మరియు, నేను ఎక్కడికి వెళ్లుదునో
అక్కడికి మీరు నన్ను సాగనంపే నిమిత్తము మీ యొద్ద
ఒక వేళ దిగి యుండుట మాత్రమే కాకుండ, మీ
యొద్ద చలికాలము గడుపుదును. ఇప్పుడు మార్గ
ములో మిమ్మును చూచుటకు నాకు మనస్సు లేదు; ।
7 ఎందుకనగా ప్రభువు సెలవిచ్చితే మీ యొద్ద కొంత
8 కాలము ఉండ నిరీక్షించుచున్నాను గాని। పెంతెకొస్తు
9 మట్టుకు ఏఫెసులో నిలిచి యుందును. । కార్యసాధక
మైన గొప్ప ద్వారము† నాకు తెరవబడెను. మరియు
ఎదిరించేవారు అనేకులు ఉన్నారు.

10 తిమొథెయు వచ్చిన యెడల అతడు మీ యొద్ద
నిర్భయుడై ఉండునట్లు చూచుకొనుడి; ఎందుకన
గా నావలె ప్రభువుయొక్క పని చేయుచున్నాడు, ।
11 గనుక ఎవడైనను అతని తృణీకరించ వద్దు. నా యొ
ద్దికి వచ్చుటకు అతని సమాధానముతో సాగనంపుడి;
అతడు సహోదరులతో కూడ వచ్చునని యెదురు
చూచుచున్నాను.

12 మన సహోదరుడైన అపొల్లోను గూర్చినదేమన
గా, అతడు సహోదరులతో కూడ మీ యొద్దికి వెళ్ల
వలెనని నేను అతని చాలా వేడుకొంటిని, గాని ఇప్పు
డు వచ్చుటకు అతనికి ఎంత మాత్రము మనస్సు లేదు;
అయినప్పటికి అతనికి సమయమైనప్పుడు వచ్చును.

మెలుకువగా ఉండుడి; విశ్వాసమందు నిలుకడగా 13
ఉండుడి; । పౌరుషము గలవారై యుండుడి. బలవం 14
తులై యుండుడి; మీవన్నియు ప్రేమతో జరుగ
నియ్యుడి.

స్తెఫన యింటివారు అఖాయియొక్క ప్రథమ ఫల 15
మై యున్నారనియు, వారు పరిశుద్ధుల నిమిత్తము సేవ
చేయుటకు తమ్మును అప్పగించుకొని యున్నారనియు
మీకు తెలుసును. । కాబట్టి సహోదరులారా! అట్టి 16
వారికిని, మాతో కూడ పని చేయుచు ప్రయాసపడు
చునుండే వారందరికిని మీరు విధేయులై యుండ
వలెనని మిమ్మును వేడుకొనుచున్నాను.

స్తెఫన, ఫొర్తునాతు, అఖాయికు అనే వారు వచ్చి 17
నందున సంతోషపడుచున్నాను; ఎందుకనగా వారు
మీకు ప్రతిగా నా అక్కర సంపూర్ణము చేసిరి. ।
ఏలాగనగా నా ఆత్మకు మీ ఆత్మకును విశ్రాంతి 18
కలుగ చేసిరి గనుక అట్టివారిని సన్మానించుడి.

ఆసియలోని సంఘములు మీకు సలాములు పం 19
పుచున్నవి. అకుల, ప్రిస్కిల్ల అనేవారు, వారి యింటి
లోని సంఘముతో కూడ ప్రభువు యందు మీకు
అనేక సలాములు పంపుచున్నారు. । సహోదరులం 20
దరు మీకు సలాములు పంపుచున్నారు. పరిశుద్ధమైన
ముద్దుతో మీరు ఒకనితో ఒకడు సలాములు చెప్పు
కొనుడి.

పౌలు అనే నేను నా చేతితో వ్రాసిన సలా 21
ములు.

ఎవడైనను ప్రభువును [అనగా యేసు క్రీస్తును] 22
ప్రేమించకుంటే శపించబడుగాక; ప్రభువు వచ్చెను.
ప్రభువైన యేసు క్రీస్తు కృప మీకు తోడై యుం 23
డుగాక. । క్రీస్తు యేసు యందు మీ అందరి మీద 24
నా ప్రేమ ఉండుగాక. ఆమేన్.

---

*ఒక దేశము. † లేక, సమయము.

అ పొ స్త లై న పౌ లు

# కొరింథీయులకు పంపిన

## రెండవ పత్రిక.

### 1. అధ్యాయము.

1 దేవుని చిత్తమువల్ల యేసు క్రీస్తుయొక్క అపొస్త
లైన పౌలును సహోదరుడైన తిమొథెయు, కొరింథు
లో ఉన్న దేవుని సంఘమునకును, అఖాయియ యం
దంతటను ఉన్న సమస్త పరిశుద్ధులకును (వ్రాసినది.)
2 మన తండ్రియైన దేవుని వల్లను ప్రభువైన యేసు
క్రీస్తు వల్లను కృపయు సమాధానము మీకు కలుగు
గాక.

3 మన ప్రభువైన యేసు క్రీస్తు తండ్రియు, కనికర
ములయొక్క తండ్రియు, పూర్ణమైన ఆదరణ దేవు
4 డునైన దేవుడు స్తుతించబడునుగాక. । మేము ఏ ఆద
రణతో, దేవునిచేత ఆదరించబడుచున్నామో, ఆ యా
దరణతో, ఏ ఉపద్రవములోనున్న వారినైనను మే
ము ఆదరించుటకు శక్తి గలవారమవునట్లు, మా ఉప
ద్రవమంతటిలో, ఆయన మమ్మును ఆదరించుచున్నా
5 డు; । క్రీస్తుయొక్క శ్రమలు మా యెడల ఏలాగు
విస్తరించుచున్నవో, ఆలాగే క్రీస్తు వల్ల మా ఆదరణ
6 యు విస్తరించుచున్నది. । మేము బాధింపబడితే, మేము
కూడ పొందునట్టి శ్రమల సహనమందు అది బలస
హితమైన మీ ఆదరణ కొరకు రక్షణ కొరకునై యు
7 న్నది; । మిమ్మును గూర్చిన మా నిరీక్షణ స్థిరమై యు
న్నది. లేక, మేము ఆదరించబడితే, అది మీ ఆదరణ
కొరకు రక్షణ కొరకునై యున్నది; ఏలాగనగా మీరు
శ్రమలలో ఏలాగు పాలివారై యున్నారో ఆలాగే
ఆదరణలోను ఉందురని యెరుగుదుము.

8 సహోదరులారా! ఆసియలో మాకు కలిగిన బాధ
ను గూర్చి, అనగా మేము ప్రాణమును గూర్చి కేవలము
సందేహపడునట్లు, శక్తికి మించిన అత్యధిక భారము
వల్ల అణగగొట్టబడితిమని మీకు తెలియకుండుటకు
9 మాకు ఇష్టము లేదు. । మరియు మేము, చనిపోయిన వా
రిని లేపే దేవుని యందే గాని మా యందు నమ్మిక
ఉంచకుండే నిమిత్తము, మరణమాదుమని తీర్పు మా
10 లో కలిగి యుండెను. । ఆయన అట్టి గొప్ప మరణము
నుంచి మమ్మును తప్పించి, ఇప్పుడును తప్పించుచున్నా
డు.* మరియు అనేకుల (ప్రార్థన) వల్ల మాకు కలి
గిన దయ కొరకు అనేకులవల్ల మా విషయము స్తోత్ర
ము చేయబడే నిమిత్తము, । మీరు కూడ మా కొరకు 11
ప్రార్థనవల్ల సహాయము చేయుచుండగా, ఆయన
ఇక మీదటను మమ్మును తప్పించుచుండునని ఆయన
యందు విశ్వాసముంచి నిరీక్షించుచున్నాము.

మా అతిశయమేదనగా, శారీర జ్ఞానమువల్ల కాదు 12
గాని దేవుని కృపవల్ల, దేవుని యెదుట నిష్కాపట్య
ముతోను, పరిశుద్ధతతోను, విశేషముగా మీ యెడల,
లోకములో నడుచుకొంటిమని మాకు మనస్సాక్ష్యము
కలదు; । మీరు చదువుకొనినవి, లేక మీరు ఒప్పుకొని 13
నవి గాక, వేరే ఏవియు మీకు వ్రాయము. । మరి 14
యు ప్రభువైన యేసుయొక్క దినమందు మీరు మాకు
ఏలాగో ఆలాగే మేము మీకు అతిశయాస్పదమవుదు
మని మీలో కొందరు మమ్మును ఒప్పుకొనిన ప్రకార
ము అంతము మట్టుకును మీరు ఒప్పుకొందురని నిరీ
క్షించుచున్నాను.

మరియు ఈ నమ్మికగలవాడనై, మీరు రెండవ ఉప 15
కారము పొందే నిమిత్తము మొదట మీ యొద్దికి వచ్చి।
మీ యొద్దనుంచి మకెదొనియకు వెళ్లి, మకెదొనియ 16
నుంచి, మరల మీ యొద్దికి వచ్చి మీవల్ల యూదై
యకు సాగనంపబడ వలెనని యోచించితిని. । కావున, 17
నేను ఈలాగు యోచించి, చపలచిత్తము కలిగి నడుచు
కొంటినా? లేక అవును అవును, కాదు కాదు అనేవి
వినియోగపరచుకొనుటకు, నేను యోచించే వాటిని
శారీర ప్రకారముగా యోచింతునా? । దేవుడు నమ్మ 18
తగినవాడు, మేము మీకు చెప్పిన మా వాక్యము అవు
ను కాదు అనే రీతిగానుండలేదు. । మా వల్ల, అనగా 19
నా వల్లను, సిల్వానును, తిమొథెయు అనే వారివల్లను మీ
లో ప్రకటించబడిన యేసు క్రీస్తనే దేవుని కుమారు
డు అవును కాదు అనేదిగాయుండక, ఆయన యందు
అవుననేదే యుండెను. । దేవుని సమస్త వాగ్దత్తములు 20
ఎన్నియైనను, ఆయనయందే అవుననేది కలదు గనుక,
మా† ద్వారా దేవుని మహిమ నిమిత్తము, ఆయన వల్ల

* లేక, తప్పించును. † లేక, మన.

21 ఆమేననే మాట* నెరవేరును. మరియు,। మీతో కూడ
మమ్ము క్రీస్తు యందు స్థిరపరుచుచు మమ్మును అభి
22 షేకించిన వాడు దేవుడే. । మరియు ఆయన మనకు
ముద్రవేసి మన హృదయములలో మనకు పరిశుద్ధాత్మ
అనే సంచకరువును ఇచ్చి యున్నాడు.

23 అయితే మిమ్మును కనికరించి, నేను ఇది వరకు
కొరింథుకు రాలేదనుటకు, నా ప్రాణముతోడు, అం
24 దుకు దేవుడే సాక్షి. । మీ విశ్వాసము మీద మాకు
ప్రభుత్వము కలిగియున్నదన లేదు గాని, మీ సంతో
షమునకు సహాయకులమై యున్నాము, ఎందుకనగా
విశ్వాసమందు మీరు నిలుకడగా ఉన్నారు.

1 2. అధ్యాయము. మరియు నేను దుఃఖము
తో మీ యొద్దికి తిరిగి రానని నాకు నేనే† నిర్ణ
2 యించుకొంటిని; । ఎందుకనగా మిమ్మును నేను దుఃఖ
పరిచితే, అప్పుడు నావల్ల దుఃఖపరచబడిన వాడు గాక
3 మరి యెవడు నన్ను సంతోషపరుచును? । మరియు నా
సంతోషము మీ అందరిదని, మీ యందరి యందు
విశ్వాసముంచి, నేను వచ్చినప్పుడు నేను ఎవరివల్ల సం
తోషము పొంద తగినదో, వారివల్ల నాకు దుఃఖము
4 కలుగకుండుటకు ఆ సంగతి మీకు వ్రాసితిని; । ఎందు
కనగా మీరు దుఃఖపడుటకు కాదు గాని మీ యెడల
అత్యధికముగా నాకు కలిగి యున్న ప్రేమను మీరు
తెలుసుకొనుటకు, నిండు బాధతోను, హృదయ వేదన
తోను చాలా కన్నీళ్లు విడుచుచు మీకు వ్రాసితిని.

5 ఎవడైనను దుఃఖము కలుగచేసి యుంటే, నాకే
కాదు, గాని కొంత మట్టుకు మీకందరికిని దుఃఖము
కలుగ చేసెను; నేను నిండు భారము వాని మీద
6 మోప కోరను. । అట్టి వానికి ఎక్కువమందివల్ల కలిగిన
7 ఈ శిక్ష చాలును । గనుక, ఒకవేళ అట్టివాడు అత్యధిక
మైన దుఃఖమువల్ల మునిగిపోకుండ, మీరు అది చాలు
8 నని అతని క్షమించి ఆదరించుట మంచిది. । కావున,
అతని యెడల ప్రేమను స్థిరపరుచుటకు మిమ్మును బతి
9 మాలుకొంటున్నాను; । ఎందుకనగా మీరు అన్నిటి
యందు విధేయులై యున్నారేమో అని మీ నాణెము
10,11 తెలుసుకొనుటకు (పూర్వము) వ్రాసితిని. । మీరు
దేని గూర్చి ఎవని క్షమించుచున్నారో నేనును వాని
క్షమించుచున్నాను; నేను ఏమైనను క్షమించి యుంటే
దేని క్షమించితినో, సైతాను మమ్మును‡ మోసపరచ
కుండుటకు మీ నిమిత్తము క్రీస్తు సమ్ముఖమందు (క్ష
మించి యున్నాను). దాని తంత్రములను ఎరుగని
వారము కాము.

అయితే క్రీస్తు సువార్త (ప్రకటించుటకు) నేను 12
త్రోయకు వచ్చినప్పుడు, ప్రభువు యందు నాకు ద్వా
రము తెరవబడి యుండగా, నేను నా సహోదరుడైన
తీతును కనుగొనలేదు గనుక, । నా యాత్మలో నెమ్మది 13
పొందక, వారివల్ల సెలవు పుచ్చుకొని, అక్కడనుంచి
మకెదొనియకు బైలువెళ్లితిని.

అయినను క్రీస్తుయందు మమ్మును ఎల్లప్పుడు విజయో 14
త్సవము చేసి ఊరేగించుచు, మావల్ల ప్రతిస్థలమందు
ఆయన వాసన అనగా ఆయనను గూర్చిన తెలివి అగ
పరిచే దేవునికి స్తోత్రము. । రక్షించబడే వారియందు, 15
నశించేవారి యందును మేము దేవునికి క్రీస్తు సువా
సనయై యున్నాము. । వీరికి మరణార్థమైన మరణ 16
వాసనగాను, వారికి జీవార్థమైన జీవ వాసనగాను ఉ
న్నాము. కాబట్టి వీటికి చాలిన వాడెవడు? । దేవుని 17
వాక్యమును కలిపి చెరిపే అనేకుల వలెనుండక, నిష్కా
పట్యముతోను, దేవుని మాటవల్లను క్రీస్తుయందు మేము
దేవుని యెదుట పలుకుచున్నాము.

3. అధ్యాయము.

మరియు మమ్మును మేమే మెచ్చుకొన మొదలు 1
పెట్టుచున్నామా? లేక కొందరికి వలె మీ యొద్దికైనను
మీ యొద్దనుంచియైనను యోగ్యతా పత్రికలు మాకు
కావలెనా? । మా హృదయములలో వ్రాయబడి మను 2
ష్యులందరి చేత చదివి తెలుసుకొనబడుచున్న మా
పత్రిక మీరు. । రాతి పలకల మీద కాకుండ, హృద 3
యములనే మాంసపు పలకల మీద, శిరాతో కాదు
గాని జీవముగల దేవుని ఆత్మతో వ్రాయబడి, మాచేత
ఉపయోగించుకొనబడిన, క్రీస్తు పత్రికయై యున్నా
రని మీరు తేటపరచబడి యున్నారు. । అయినను క్రీస్తు 4
ద్వారా దేవుని యెడల మాకు అట్టి విశ్వాసము కలదు. ।
మేము మా వల్ల కలిగినట్టుగా ఏమైనను ఆలోచించు 5
టకు మాకు మేమే సమర్థులమని కాదు; మా సామ
ర్థ్యము దేవునివల్ల కలిగి యున్నది. । ఆయనే క్రొత్త 6
నిబంధనకు అనగా, లేఖనమునకు కాదు గాని ఆత్మకే
సేవకులమవుటకు మాకు సామర్థ్యము కలిగించి యు
న్నాడు; లేఖనము చావ చేసును, ఆత్మ జీవింప చేసును.

తరిగిపోవుచున్న, మోషే ముఖముయొక్క మహిమ 7
వల్ల ఇశ్రాయేలు పుత్రులు అతని ముఖము తేరి చూడ
కుండునట్లు, రాళ్ల మీద చెక్కబడినది అనగా, లేఖన
మందు మృతి కారణమైన సేవ చేయుట మహిమతో
కూడినదైతే, । ఆత్మ ప్రధానమైన సేవచేయుట ఎంతో 8

*ఆమేన్ అనగా, తథాస్తు, ఆలాగుండుగాక. †లేక, నా నిమిత్తము. ‡లేక, మనలను.

9 ఎక్కువగా మహిమతో కూడినదియౌను! । ఏలాగన
గా, శిక్షావిధి కారణమైన సేవ చేయుట మహిమ కలి
గినదైతే, అత్యధికముగా, నీతివిధి కారణమైన సేవ
10 చేయుట విశేష మహిమతో కూడినదియౌను. । ఇంత
మట్టుకు, మహిమ కలిగినది అత్యధికమైన మహిమవల్ల
11 మహిమలేనిదాయెను.* । అనిత్యమైనది మహిమగలదై
యుంటే, నిలిచేది మరి యెక్కువగా మహిమ గలదై
యుండును.

12,13 కాబట్టి మేము ఇట్టి నిరీక్షణగలవారమై ఇశ్రా
యేలు పుత్రులు, తరుగుచున్న దాని అంతము వరకు
చూడకుండుటకు, మోషే తన ముఖము మీద ముసుకు
వేసుకొనిన ప్రకారము కాక, బహు ధైర్యముగా పలు
14 కుచున్నాము. । మరియు వారి మనస్సులు కఠినపరచ
బడెను; అటువలె నేటి వరకు పాత నిబంధన చదువ
బడునప్పుడు, అది క్రీస్తు యందు కొట్టివేయబడెనని
వారికి తేటపరచబడక, ఆ ముసుకే నిలిచియున్నది. ।
15 నేటి వరకును మోషే (గ్రంథము) చదువబడునప్పుడు,
16 ముసుకు వారి హృదయము మీద ఉన్నది గాని, । అది†
(మన) ప్రభువు తట్టు తిరిగినప్పుడు ఆ ముసుకు తీసి
వేయబడును.

17 మరియు ఆ ప్రభువే ఆత్మ. మరియు ప్రభువుయొ
క్క ఆత్మ ఎక్కడ ఉండునో, అక్కడనే విడుదల. ।
18 మనమందరమును ముసుకులేని ముఖముతో ప్రభువు
యొక్క మహిమను అద్దములో చూచుచు ఆత్మయనే
ప్రభువు వల్లనైనట్టు, ఆ పోలికగానే మహిమనుంచి
మహిమకు మార్చబడుచున్నాము.

## 4. అధ్యాయము.

1 కాబట్టి ఈ సేవ మాకు కలిగినందున మేము కరు
2 ణించబడిన ప్రకారము, అధైర్యపడక, । కృత్రిమ
మందు నడవక, దేవుని వాక్యమును వంచించక, సత్య
ము కనపరుచుటవల్ల సమస్త మనుష్యుల మనస్సాక్షిచేత
మమ్మును మేమే దేవుని సమ్ముఖమందు మెప్పించుకొను
చు, సిగ్గుగల రహస్యములను విసర్జించియున్నాము. ।
3 మా సువార్త, ముసుకు వల్ల మరుగు చేయబడినప్పటికి,
నశించుచున్న వారిలోనే ఆలాగు మరుగై యున్నది. ।
4 దేవుని పోలికయై యున్న క్రీస్తు మహిమ గల సువార్త
యొక్క వెలుగు, వారికి ప్రకాశించకుండే నిమిత్తము,
ఈ లోక దేవుడు అవిశ్వాసులైన వారి మనోనేత్ర
5 ములకు గుడ్డితనము కలుగచేసి యున్నాడు. । మేము
మమ్మును కాదు, యేసు క్రీస్తును ప్రభువు అనియు,
మమ్మును యేసు నిమిత్తము మీ సేవకులమనియు ప్రక
టించుచున్నాము; । ఏలాగనగా—అంధకారమునుంచి 6
వెలుగు ప్రకాశించునని పలికిన‡ దేవుడే, యేసుక్రీస్తు
ముఖమందు దేవుని మహిమయొక్క తెలివి వెలుగుటకు
మా హృదయములలో ప్రకాశించెను.

అయినను ఆ బలవిశేషము మావల్ల కాక, దేవునిదై 7
యుండుటకు, మంటి ఘటములలో ఈ ఐశ్వర్యము
మాకు కలిగి యున్నది. । ప్రతిపక్కను శ్రమపడు 8
చున్నప్పటికి, ఇరికించబడము; అపాయములో ఉన్న
ప్పటికి, కేవలము ఉపాయము లేని వారము కాము; ।
తరమబడుచున్నప్పటికి, విడవబడము; పడదోయబడి 9
నప్పటికి నశించము; । యేసుని జీవము మా శరీరమందు 10
అగపరచబడుటకు, యేసు§ యొక్క మరణానుభవము
మా శరీరమందు ఎల్లప్పుడును వహించుకొంటున్నా
ము; । ఏలాగనగా యేసుయొక్క జీవము కూడ, చని 11
పోయే మా శరీరమందు అగపరచబడుటకు, సజీవుల
మైన మేము ఎల్లప్పుడు మరణమునకు యేసు నిమిత్తము
అప్పగించబడుచున్నాము. । కావున మాలో మరణము 12
గాని మీలో జీవము కార్యసాధకముగానున్నవి.

అయినను—విశ్వసించితిని గనుక మాటలాడితినని‖ 13
వ్రాయబడిన ప్రకారము ఆ విశ్వాసముగల ఆత్మనే
పొంది మేమును విశ్వసించుచున్నాము గనుక మాట
లాడుచున్నాము; । ప్రభువైన యేసుని లేపిన వాడు, 14
యేసు ద్వారా¶ మమ్ము లేపి మీతో కూడ తన యెదుట
నిలువబెట్టునని యెరుగుదుము; । కృప ఎక్కువమంది 15
ద్వారా ప్రబలించి, దేవుని మహిమ నిమిత్తము కృత
జ్ఞత విస్తరింపచేయుటకు అన్ని మీకొరకున్నవి. । కా 16
వున అధైర్యపడము; మా వెలపలి మనుష్యుడు కృశిం
చినప్పటికి లోపలి** మనుష్యుడు దినదినము నూతన
పరచబడుచున్నాడు; । మేము దృశ్యమైన వాటిని 17,18
గాక, అదృశ్యమైన వాటిని నిదానించి చూచుచుండ
గా, క్షణమాత్రము ఉండే మా చులకని శ్రమ మాకొ
రకు అత్యధికముగా, నిత్యమైన మహిమ భారమును
కలుగచేసును. దృశ్యమైనవి అనిత్యమైనవి, అదృశ్య
మైనవి నిత్యమైనవి.

## 5. అధ్యాయము.

ఎందుకనగా భూమి మీద మన నివాసమైన ఈ 1
గుడారము విప్పబడినప్పటికి, దేవునివల్ల కట్టబడినది అన
గా చేతి పని కానిదియు, నిత్యమైనదియునైన ఇల్లు
ఆకాశమందు మనకు కలదని యెరుగుదుము. । మనము 2-3
దిగంబరులము కాక, వస్త్రము ధరించుకొనినవారమై

*లేక, తేజరిల్లినది, అత్యధికమైన తేజమువల్ల, తేజరిల్లకపోయెను. †అనగా, హృదయము. ‡ఆదికాండము. 1. అ. 3. వ.
§కొన్ని ప్రతులలో, ప్రభువైన యేసు. ‖కీర్త. 116. 10. ¶లేక, తో. **లేక, అంతరంగ పురుషుడు.

కనబడుదుము గనుక ఆకాశమునుంచి వచ్చే మన నివా
సము దీనిపైని ధరించుకొని యుండ కోరుచు, దీనిలో
4 మూల్గుచున్నాము; । ఎందుకనగా ఈ గుడారములో
ఉన్న మనము భారమును మోసుకొని మూల్గుచున్నా
ము; ఇది తీసివేయ వలెనని కాదు, గాని మరణము జీవ
ము వల్ల మ్రింగివేయబడుటకు అది (దీని) పైని ధరిం
చుకొన కోరుచున్నాము.

5 అయినను దీని నిమిత్తము మనలను సిద్ధపరిచిన
వాడు దేవుడే. మరియు ఆయన తన ఆత్మ అనే సంచక
6 రువు మాకు ఇచ్చి యున్నాడు. । కావున ఈ శరీరము
లో నివసించుచు ప్రభువుకు దూరస్థులమని యెరిగి,
7 ఎల్లప్పుడును ధైర్యము తెచ్చుకొంటున్నాము; । ఎందు
కనగా చూపువల్ల కాక, విశ్వాసము వల్లనే నడుచుకొం
8 టున్నాము. । అయినను ధైర్యపడుచు ఈ శరీరమునకు
దూరస్థులమై ప్రభువుయొద్ద నివసించుట మిక్కిలి మం
చిదని తలంచుకొంటున్నాము.

9 కావున శరీరవాసులమైనను పరవాసులమైనను ఆ
యనకు ఇష్టులమై యుండుటకు ప్రయత్నపడుచున్నా
10 ము;* । ఎందుకనగా ప్రతివాడును జరిగించిన వాటి
చొప్పున మంచిదేగాని చెడ్డదేగాని శరీరము ద్వారా
(జరిగిన) వాటిని పొందే నిమిత్తము మనమందరమును
క్రీస్తు న్యాయపీఠము ఎదుట కనబడ వలెను.

11 కావున మేము ప్రభువుయొక్క భయము ఎరిగి
మనుష్యులను ప్రేరేపించుచున్నాము గాని దేవునికి
కనపరచబడి యున్నాము. మరియు మీ మనస్సా
క్ష్యములలోను కనబడి యున్నామని నమ్ముకొంటు
12 న్నాను; । ఎందుకనగా మమ్మును మేమే మీవల్ల తిరిగి
మెప్పించుకొనము గాని, హృదయమందు కాదు ముఖ
మందే అతిశయపడే వారి విషయము అతిశయాస్ప
దము మీకు కలుగుటకు, మాయెడల అతిశయపడుటకు
13 కారణము మీకు కలిగించుచున్నాము; । ఏలాగనగా
మేము వెర్రివారమై యుంటిమా, దేవుని నిమిత్తమే;
లేక స్వస్థబుద్ధి గలవారమై యుంటిమా, మీ కొరకే; ।
14 ఎందుకనగా క్రీస్తు ప్రేమ మమ్మును బలవంతము
చేయుచున్నది; ఏలాగనగా, అందరి కొరకు ఒకడు
మృతిపొందెను గనుక అందరును మృతిపొందిరని
15 నిశ్చయించుకొంటిమి; । మరియు జీవించే వారు ఇక
మీదట తమకొరకు కాదు గాని తమ కొరకు మృతి
పొంది తిరిగి లేచిన ఆయన కొరకే జీవించుటకు, ఆయన
16 అందరి కొరకు మృతిపొందెను. । కావున ఇక మీదట
మేము శరీర ప్రకారము ఎవనినైనను ఎరుగము. మేము
క్రీస్తును శరీర ప్రకారము తెలుసుకొనినప్పటికి, ఇక
మీదట ఆయనను ఎరుగము. । కావున ఎవడైనను క్రీస్తు 17
యందు ఉంటే నూతన సృష్టియై యుండును. పాతవి
గతించెను; ఇదుగో! సమస్తమైనవి కొత్తవాయెను.

మరియు సమస్తమైనవి దేవునివల్లనైనవి. ఆయన 18
మనలను యేసు క్రీస్తుద్వారా తనతో సమాధానపరు
చుకొని, ఆ సమాధాన విషయమైన సేవను మాకిచ్చి
యున్నాడు. । అదేమనగా దేవుడు వారి అపరాధము 19
లను వారి మీద మోపక, క్రీస్తు యందు† లోకమును
తనతో సమాధానపరుచుకొనుచు, ఆ సమాధాన వా
క్యము మాలో ఉంచెను. । కావున దేవుడు మా ద్వారా 20
వేడుకొనినట్టు, క్రీస్తు నిమిత్తము రాయభారులమై—
దేవునికి సమాధానముగా ఉండుడని క్రీస్తు కొరకు
బతిమాలుకొంటున్నాము; । ఎందుకనగా మనము ఆయ 21
నయందు దేవుని నీతియై యుండుటకు, పాపము ఎరు
గని ఆయనను మన కొరకు పాపముగా చేసెను.

## 6. అధ్యాయము.

మరియు మీరు దేవుని కృపను వ్యర్థము చేసుకొన 1
వద్దని మేము (ఆయన) తోటి పనివారమై మిమ్మును
వేడుకొంటున్నాము; । ఎందుకనగా,—అనుకూల సమ 2
యమందు నీ మనవి ఆలకించితిని, రక్షణ దినమందు
నీకు సహాయము చేసితినని‡ చెప్పుచున్నాడు. ఇదుగో!
ఇప్పుడు మిక్కిలి అనుకూలమైన మంచి సమయము;
ఇదుగో! ఇదే రక్షణ దినము. । ఈ పని నిందించ బడ 3
కుండే నిమిత్తము, ఏ విషయమందైనను అడ్డమేమియు
చేయక, । శ్రమల యందు, ఇబ్బందుల యందు, ఇరు 4
కుల యందు, । దెబ్బల యందు, చెరసాలలలోను, అల్లరు 5
లలోను, ప్రయాసములలోను, జాగరములలోను, ఉప
వాసములలోను, । మిక్కిలి ఓపుగలవారమై, నిర్మలత్వ 6
ముతోను, తెలివితోను, దీర్ఘశాంతముతోను, దయ
తోను, పరిశుద్ధాత్మతోను, నిష్కపటమైన ప్రేమతో
ను, । సత్యవాక్యముతోను, దేవుని బలము వల్లను, కుడి 7
యెడమల నీతియొక్క ఆయుధముల వల్లను, । ఘనతా 8
ఘనతల వల్లను, సుకీర్తి దుష్కీర్తుల వల్లను, అన్నిటిలో
దేవుని సేవకులవలె మమ్మును మెప్పించుకొంటున్నాము.
మేము మోసకాండ్లవలెనుండియు, సత్యవంతులము; ।
తెలియబడనివారివలెనుండియు, బాగా తెలియబడిన 9
వారము; చనిపోవుచున్నవారివలెనుండియు, ఇదుగో!
సజీవులము; శిక్షించబడినవారివలెనుండియు, చంపబడ
నివారము; । దుఃఖపడినవారి వలెనుండియు, ఎల్లప్పుడు 10
సంతోషించేవారము; దరిద్రులవలెనుండియు, అనేకు

* లేక, మిక్కిలి అపేక్షించుచున్నాము. † లేక, వల్ల. ‡ యెషయ. 49. అ. 8. వ.

లకు ఐశ్వర్యము కలిగించేవారము; ఏమియు లేని వారి
వలెనుండియు, సమస్తము కలిగినవారము.
11 ఓ కొరింథీయులారా! మా నోరు మీ యెడల
విప్పబడియున్నది; మా హృదయము విశాలపరచబడి
12 యున్నది. । మీరు మా యందు ఇరికించబడ లేదు
గాని, మీ అంతఃకరణమందే ఇరికించబడి యున్నారు. ।
13 దానికి బహుమానముగా మీరును విశాలపరుచుకొను
డి. మీరు నా పిల్లలని మీతో మాటలాడుచున్నాను.
14 మీరు విశ్వాసములేనివారితో విజోడుగా కాడి
కింద ఉండకుడి; నీతికి అనీతితో ఏమి సంబంధము?
15 వెలుగుకు చీకటితో ఏమి సహవాసము? । క్రీస్తుకు బెలి
యారుతో* ఏమి సందర్భము? అవిశ్వాసితో విశ్వా
16 సికి పాలు ఎక్కడిది? । దేవుని ఆలయమునకు విగ్ర
హములతో ఏమి పొందిక?—నేను వారిలో నివసించి
సంచరింతును; నేను వారికి దేవుడనై యుందును;
వారు నాజనులై యుందురని† దేవుడు చెప్పిన ప్రకా
రము, మీరు జీవముగల దేవుని ఆలయమై యున్నా
17 రు. । కావున, ప్రభువు చెప్పేదేమనగా—మీరు వారి
మధ్యనుంచి బైలుదేరి ప్రత్యేకముగా ఉండుడి; అపవి
త్రమైన దాని ముట్టకుడి; అప్పుడు నేను మిమ్మును
18 చేర్చుకొందును; । మీకు తండ్రినై యుందును; మీరు
నాకు కుమారులు, కుమార్తెలునై యుందురని సర్వ
శక్తిగల ప్రభువు చెప్పుచున్నాడు.‡

## 7. అధ్యాయము.

1 కావున ప్రియులారా! మనకు
అట్టి వాగ్దత్తములు కలిగినందున, శరీరమునకు ఆత్మకు
కలిగిన సమస్తకల్మషమునుంచి మనలను పవిత్రులను
చేసుకొని, దేవుని భయమందు పరిశుద్ధతను సంపూ
ర్తి చేయుదము.
2 మమ్మును చేర్చుకొనుడి; మేము ఎవనికిని అన్యా
యము చేయ లేదు, ఎవనిని నష్టపరచ లేదు, ఎవనిని
3 మోసము చేయ లేదు. । శిక్షావిధికి నేను (ఈలాగు)
పలుక లేదు; మేము మీతో కూడ చనిపోవుటకు, జీ
వించుటకును మీరు మా హృదయములలో ఉన్నారని
4 నేను లోగడ చెప్పినాను. । మీ ఎడల నాకు బహు
ధైర్యము కలదు; మిమ్మును గూర్చి నాకు చాలా అతి
శయము కలదు. ఆదరణతో నిండుకొని యున్నాను.
మా సమస్త శ్రమలో అత్యధికమైన సంతోషము నాకు
కలదు.
5 మేము మకెదోనియకు వచ్చినప్పుడు, మా శరీరము
ఏమియు విశ్రాంతి పొంద లేదు; అంతటను మాకు శ్రమ
కలిగెను. వెలపట పోరాటములు, లోపట భయములు
ఉండెను. । అయినను, దీనులను ఆదరించే దేవుడు తీతు 6
వచ్చుటవల్ల, । అతడు వచ్చుటవల్ల మాత్రమే కాకుండ 7
అతడు మీ అత్యభిలాషను, మీ అంగలార్పును, నా
నిమిత్తము మీకు కలిగిన అత్యాసక్తిని మాకు తెలుపుచు
మీ విషయము ఏ ఆదరణతో అతడు ఆదరించబడె
నో, ఆ యాదరణవల్లను మమ్మును ఆదరించెను గనుక
నేను మరి యెక్కువగా సంతోషించితిని.
ఎందుకనగా ఆ పత్రికవల్ల నేను మిమ్ము దుఃఖ 8
పెట్టినందున విచారపడితిని గాని, ఇప్పుడు విచారము
లేదు; ఎందుకనగా ఆ పత్రిక గడియమట్టుకే గాని మి
మ్మును ఎక్కువ దుఃఖపెట్టలేదని తెలుసుకొన్నాను. । మీరు 9
దుఃఖపడుట వల్ల కాదు గాని మారు మనస్సు కలుగు
టకు దుఃఖపడుట వల్లనే ఇప్పుడు సంతోషించుచు
న్నాను; ఎందుకనగా ఏ విషయమందును మా వల్ల మీరు
నష్టము పొందకుండే నిమిత్తము, దేవుని (చిత్త) ప్రకా
రము దుఃఖపరచబడితిరి; । దేవుని (చిత్త) ప్రకారమైన 10
దుఃఖము, పశ్చాత్తాపము లేని రక్షణ కొరకు మారు
మనస్సు కలుగ చేసును గాని, లోకుల దుఃఖము మరణ
ము కలుగ చేసును. । ఇదే చూడుడి; మీరు దేవుని (చిత్త) 11
ప్రకారము పొందిన ఈ దుఃఖము చూడుడి! అది
ఎట్టి జాగ్రతను, ఎట్టి ప్రతివాదమును, ఎట్టి ఆగ్రహ
మును, ఎట్టి భయమును, ఎట్టి అభిలాషను, ఎట్టి అత్యా
సక్తిని, ఎట్టి ప్రతిశిక్షను మీలో పుట్టించెనో! ఆ
కార్యమును గూర్చి సమస్త విషయములయందు మీరు
నిర్దోషులై యున్నారని మిమ్మును మీరే మెప్పిం
చుకొని యున్నారు. । కావున నేను మీకు వ్రాసినప్ప 12
టికి అన్యాయము చేసిన వాని నిమిత్తము కాదు, అన్యా
యము పొందిన వాని నిమిత్తము కాదు గాని దేవుని
యెదుట మా యందలి మీ§ ఆసక్తి మీకు అగపరచబ
డుటకు వ్రాసితిని.
ఇందువల్ల మేము ఆదరించబడితిమి.‖ అంతేకాదు 13
మాకు ఈ ఆదరణ కలిగినప్పుడు, తీతుయొక్క ఆత్మ మీ
అందరివల్ల విశ్రాంతి పొందినందున, అతని సంతోష
ము మీదను మరి యెక్కువగా సంతోషపడితిమి; । ఎం 14
దుకనగా నేను అతని యెదుట మిమ్మును గూర్చి ఏమా
త్రము అతిశయపడినప్పటికి, సిగ్గుపరచబడ లేదు. మే
ము ఏలాగు అన్నిటిని మీతో నిజముగా చెప్పితిమో,
ఆలాగే మేము తీతు యెదుట మిమ్మును గూర్చిన మా
అతిశయమును నిజమని తెలిసెను. । మరియు మీరు 15
భయముతోను వణుకుతోను తన్ను చేర్చుకొంటిరని,
మీ అందరి విధేయతను అతడు జ్ఞాపకము చేసుకొను

---

* లేక, బెలియాలు, అనగా, పనికిమాలినది. † లేవి. 26. అ. 12. వ. ‡ 2. సమూయెలు 7. అ. 8, 14. వ.
§ కొన్ని ప్రతులలో, మీ కొరకైన మా. ‖ లేక, నెమ్మది పొందితిమి.

చుండగా, అతని అంతఃకరణము వారి యెక్కువగా మీ
16 యెడలనున్నది.। అన్నిటిలోను మీ వల్ల నాకు ధైర్య
ము కలిగినందున సంతోషించుచున్నాను.

## 8. అధ్యాయము.

1 సహోదరులారా! మకెదోనియ సంఘములలో
ఉంచబడిన దేవుని కృపను గూర్చి మీకు తెలియ చే
2 యుచున్నాము;। ఏలాగనగా, వారు బహు శ్రమ వల్ల
పరీక్షించబడగా, వారి సంతోషము విస్తరించెను; వారి
అగాధమైన దారిద్ర్యము, వారి ఔదార్యముగల సం
3,4 పద నిమిత్తము బహుగా విస్తరించెను.। వారు తమ సా
మర్థ్యము కొలదే కాక, సామర్థ్యముకంటే ఎక్కువ
గా, తమంతట తామే సిద్ధపడి, పరిశుద్ధుల కొరకైన
కృపగల ఈ పనిలో పాలు పొందుటకు మనవి పూర్వ
కముగా మమ్మును వేడుకొనిరని మీకు సాక్ష్యము చె
5 ప్పుచున్నాము.। మేము నిరీక్షించిన ప్రకారము కాదు
గాని తమ్మును తామే మొదట ప్రభువుకును, దేవుని
6 చిత్తము వల్ల మాకును అప్పగించుకొనిరి.। కావున తీతు
ఏలాగు పూర్వము మొదలుపెట్టెనో ఆలాగున ఈ
కృపను కూడ మీలో కొనసాగించుటకు మేము అతని
వేడుకొంటిమి.

7 మీరు విశ్వాసమందు, వాక్యమందు,* తెలివి యం
దు, సమస్త జాగ్రత యందు, మా మీద ఉండే మీ
ప్రేమ యందు, అన్నిటి యందును విస్తరించే ప్రకా
రము మీరు ఈ కృప యందును విస్తరించుటకు (చూ
8 చుకొనుడి).। ఆజ్ఞ ఇయ్య లేదు గాని ఇతరుల జాగ్ర
త్తవల్ల మీ ప్రేమ యథార్థతను పరీక్షించుచుంటిని.।
9 మీరు మన ప్రభువైన యేసు క్రీస్తు కృపను ఎరుగు
దురు; ఆయన ధనవంతుడై మీరు తన దారిద్ర్యము
వల్ల ధనవంతులవుటకు మీ నిమిత్తము దరిద్రుడాయెను.
10 ఇందును గూర్చి నా తాత్పర్యము చెప్పుచున్నాను;
సంవత్సరమునుంచి మీరు చేయుటకు మాత్రము కా
కుండ ఇచ్ఛయించుటకును మొదలు పెట్టిన మీవంటి
11 వారికి ఇది తగినదై యున్నది.। కావున ఇచ్ఛయించు
టకు సిద్ధమైన మనస్సు ఏలాగు కలిగెనో, ఆలాగే
మీ కలిమి కొలది కొనసాగించబడుటకును మీరు (ఆ
12 ధర్మకార్యము) కొనసాగించుడి;। మొదట సిద్ధమైన మన
స్సు కలిగితే, ఒకని లేమి చొప్పున కాక, వాని కలిమి
13-15 చొప్పుననే అది హితమౌను.। ఏలాగనగా ఇతరు
లకు విశ్రాంతి మీకు శ్రమయు కలుగుటకు కాదు
గాని—నిండ కూర్చిన వానికి ఎక్కువ లేదనియు, కొం
చెము కూర్చిన వానికి తక్కువ లేదనియు† వ్రాయబ
డిన ప్రకారము, సమత్వము కలిగే నిమిత్తము, ఈడుకు
ఈడుగా ఇప్పటి సమయమందు మీ సమృద్ధి వారి
వెలితికిని (మరియొకప్పుడు) వారి సమృద్ధి మీ వెలితి
కిని సహాయమై యుండవచ్చును.

మీ కొరకు (నాకు కలిగిన) అట్టి ఆసక్తినే తీతు 16
హృదయములో పుట్టించుచున్న దేవునికి స్తోత్రము;।
అతడు నా బోధ అంగీకరించెను గాని, అతనికి అత్యా 17
సక్తి కలిగినందున, అతడు స్వచిత్తము వల్ల మీ యొద్దికి
బయిలుదేరి వచ్చెను.। మరియు మావల్ల వినియోగ 18-20
పరచబడే ఈ ధనబాహుళ్యమును గూర్చి మా మీద
ఎవడును తప్పు మోపకుండ, మేము జాగ్రత్తగా
చూచుకొనుచు, సువార్త విషయము సంఘములన్ని
టిలో కీర్తిగల ఒక సహోదరుని, అతనితో కూడ
పంపితిమి. అంతే కాకుండ, మన ప్రభువుయొక్క
మహిమ నిమిత్తమును, మా సిద్ధమైన మనస్సు కనబడే
నిమిత్తమును, అతడు మావల్ల వినియోగపరచబడే ఈ
దాన ద్రవ్యమును‡ గూర్చి మాతో ప్రయాణము చేయు
టకు సంఘముల వల్లను ఏర్పరచబడెను.। ప్రభువుయొ 21
క్క సమ్ముఖమందే కాదు గాని మనుష్యుల సమ్ముఖ
మందును యోగ్యమైన వాటిని సిద్ధపరుచుకొంటు
న్నాము.। మరియు వారితో కూడ మేము మా సహో 22
దరుని పంపితిమి; అనేక పర్యాయములు అనేక విధ
ములుగా అతని పరీక్షించి, ఆసక్తుడనియు, ఇప్పుడును
మీ యెడల అతనికి కలిగిన మిక్కిలి నమ్మికవల్ల మరి
యెక్కువైన ఆసక్తి గలవాడనియు తెలుసుకొని యు
న్నాము.। తీతును గూర్చి అడిగితే, అతడు నా పాలి 23
వాడు, మీ నిమిత్తము నా తోటి పనివాడునై యు
న్నాడు. మన సహోదరులను గూర్చి అడిగితే, వారు
సంఘముల దూతలును§ క్రీస్తుయొక్క మహిమయునై
యున్నారు.। కాబట్టి మీ ప్రేమయొక్కయు, మీ 24
మూలమైన మా అతిశయముయొక్కయు దృష్టాంతము
వారికి సంఘముల యెదుట అగపరుచుడి.

## 9. అధ్యాయము. పరిశుద్ధుల కొరకైన ఈ 1
పనిని గూర్చి మీ పేర వ్రాయుటకు నాకు అవసరము
లేదు;। మీ సిద్ధమైన మనస్సు నాకు తెలుసును. అం 2
దువల్ల—సంవత్సరమునుంచి అఖాయియ సిద్ధమై యుం
డెనని చెప్పి, నేను మిమ్మును గూర్చి మకెదోనియ వారి
యెదుట అతిశయపడుచున్నాను. మీ వల్లనైన ఆసక్తి
అనేకులను ప్రేరేపించెను.। అయినప్పటికి, మీ మూల 3
మైన మా అతిశయము, ఈ విషయము వ్యర్థము కా
కుండ, నేను చెప్పిన ప్రకారము, మీరు సిద్ధపడుటకు

* లేక, ఉచ్చారణ. †నిర్గమకాం. 16. అ. 18. వ. ‡ లేక, కృపను. §లేక, అపొస్తలులును.

4 నేను ఈ సహోదరులను పంపితిని. । లేక పోతే, ఒక
వేళ మకెదొనియ దేశస్థులు నాతో కూడ వచ్చి, మి
మ్మును సిద్ధపడనివారినిగా కనుగొంటే, ఈ నమ్మిక వల్ల,
5 మిమ్మును చెప్పనేల, మేము సిగ్గుపరచబడుదుము. । కా
వున ముందుగా తెలుపబడిన మీ దీవెన,* దీవెనవలెనే
గాని లౌభ్యము వలె కాకుండ, సహోదరులు మీ
యొద్దికి ముందుగా వచ్చి దాని ముందుగా సమకూర్చ
వలెనని వారిని వేడుకొనుట అవసరమని తలంచినాను.

6 ఇదిగో!—కొంచెము విత్తే వాడు కొంచెము పంటకో
సును; దీవెనల రీతిగా విత్తే వాడు దీవెనల రీతిగా పంట
7 కోసును. । ప్రతివాడును తన హృదయములో నిర్ణ
యించుకొనిన ప్రకారము, దుఃఖము వల్లనైనను అవసర
ము వల్లనైనను కాకుండ (ఇయ్యవలెను); దేవుడు సం
8 తోషముతో ఇచ్చేవాని ప్రేమించును. । మరియు మీరు
అన్నిటి యందు ఎల్లప్పుడును సర్వ సమృద్ధిపొంది, ఉత్త
మమైన ప్రతి కార్యము నిమిత్తము విస్తరించుటకు, దేవు
డు మీ యెడల సమస్త కృపను విస్తరింప చేయ గలడు.
ఆ ప్రకారమే—

9 అతడు వెదజల్లి దరిద్రులకు ఇచ్చెను,
వాని నీతి నిరంతరము నిలుచునని†
వ్రాయబడియున్నది.

10 మరియు—విత్తే వానికి విత్తనమును, తినుటకు ఆహా
రమును దయచేసే వాడు మీ విత్తనము విస్తరింపజేసి, ।
11 మా ద్వారా దేవుడు స్తుతించబడునట్లు చేసే సకలౌ
దార్యము నిమిత్తము, అంతట ధనవంతులైన మీ నీతి
12 ఫలములు విస్తరింపచేసును. । ఏలాగనగా, ఈ పని జరి
గించుట పరిశుద్ధుల అక్కరలకు సహాయము చేయుట
మాత్రమే కాకుండ, చాలామట్టుకు దేవుడు స్తుతించ
13 బడుటకు ప్రబలియుండును. । ఏలాగనగా క్రీస్తు సువా
ర్త విషయము ఒప్పుకొనిన మీ విధేయతచేతను, వారి
విషయము అందరి విషయము ఈ పనిలో పాలు పుచ్చు
14 కొనిన మీ ఔదార్యముచేతను, । వారు మీ యెడల
నున్న, దేవుని అత్యధికమైన కృపవల్ల మిమ్మును గారవిం
చుచుండగా మీకొరకు ప్రార్థించుటచేతను ఈ పని
వల్లనైన అనుభవము‡ ద్వారా దేవుని మహిమపరుచు
15 చున్నారు. । ఆయనయొక్క చెప్పనశక్యమైన వరదాన
మువల్ల దేవుడు స్తుతించబడుగాక.

## 10. అధ్యాయము.

1 పౌలు అనే నేను యేసు క్రీస్తుయొక్క సాత్విక
త్వము వల్లను, మృదుత్వము వల్లను మిమ్మును బతిమాలు
కొంటున్నాను. । నేను ముఖాముఖిగా ఉన్నప్పుడు, 2
మీలో అణుకువ గలవాడను, దూరముగా ఉన్నప్పు
డు మీ యెడల ధైర్యము గలవాడనునై యున్నాను;
అయినను శారీరప్రకారము నడచుకొనేవారమని మ
మ్మును ఎంచే కొందరి మీద, ఏ దృఢమైన మనస్సు
తో ధైర్యపడ వలెనని నేను తలంచుకొంటున్నానో
ఆ దృఢమైన మనస్సుతో నేను వచ్చి ధైర్యపడకుండే
నిమిత్తము మిమ్ము వేడుకొంటున్నాను; । మేము శరీరు 3
లమై నడుచుకొనుచున్నప్పటికి, శారీరప్రకారము యు
ద్ధము చేయము; । మా యుద్ధాయుధములు శరీర సం 4
బంధమైనవి కావు గాని, దుర్గములను పడదోయుటకు
దేవుని యెదుట బలము కలవై యున్నవి. । మేము వితి 5
ర్కములను, దేవుని జ్ఞానమునకు విరోధముగా లేచే
ఎత్తుగల ప్రతిదానిని పడదోసి, ప్రతి ఆలోచన క్రీస్తు
విధేయతకు చెరబట్టి, । మీయొక్క విధేయత సంపూర్తి 6
చేయబడినప్పుడు, సమస్తమైన అవిధేయతకు ప్రతిదం
డన చేయ సిద్ధపడియున్నాము.

బహిరంగమైన వాటిని చూచుచున్నారా?§ ఎవడై 7
నను తాను క్రీస్తువాడనని నమ్ముకొంటే అతడు ఏ
లాగు క్రీస్తువాడౌనో, ఆలాగే మేమును క్రీస్తువా
రమై యున్నామని తనంతట తానే తిరిగి తలుచుకొన
వలెను. । మిమ్ము పడదోసే నిమిత్తము కాక, మీ అభివృద్ధి 8
నిమిత్తమే ప్రభువు మాకిచ్చిన అధికారమును గూర్చి
నేను మరి యెక్కువగా కొంచెము అతిశయపడినప్ప
టికి సిగ్గుపరచబడను. । నేను పత్రికలవల్ల మిమ్ము భయప 9
రచ వలెనని కనపడకుండ (ఈలాగు పలుకుచున్నాను). ।
అతని పత్రికలు భారమైనవి, బలమైనవియునై యున్నవి 10
గాని అతని శరీరసన్నిధి బలహీనమైనది, అతని వాక్య
ము నీచమైనది అంటాడు.‖ । మేము దూరస్థులమై, 11
పత్రికల వల్ల వాక్యప్రకారము ఎట్టివారమై యున్నా
మో, సమీపస్థులమై, కార్యమందు అట్టి వారమై
యుందుమని, అట్టివాడు తలంచుకొన వలెను.

తమ్మును తామే మెచ్చుకొనే కొందరిలో వార 12
మని మేము ఎంచుకొనుటకైనను వారితో సరిపోల్చు
కొనుటకైనను మేము ధైర్యము తెచ్చుకొనము. వారు
తమవల్ల తమ్మును ఎన్నిక చేసుకొని తమతో తమ్మును
సరిపోల్చుకొని బుద్ధిహీనులై యున్నారు¶. । మేము 13
మీ దాక చేరుటకు దేవుడు మాకు ఏర్పరిచిన పొలి
మేర కొల ప్రకారమే గాని, కొల లేని వాటిని
గూర్చి అతిశయపడము; । మీ యొద్దికి చేర రానివార 14

* అనగా, ధర్మద్రవ్యము. † కీర్త. 112. వ. 9. ‡లేక, నాణెము.
§లేక, చూడండి. ‖లేక, అంటారు. ¶లేక, గ్రహించరు.

మైనట్టు మేము మా పొలిమేర దాటి వెళ్లుచున్నాము
కాము; మేము క్రీస్తు సువార్తను (ప్రకటించుచు)
15 మీ మట్టుకును ముందుగా వచ్చితిమి. । ఇతరుల ప్రయా
సముల విషయము, మితిలేని రీతిగా అతిశయపడము
గాని ఇతరుల పొలిమేరలో సిద్ధమైనవాటి విషయము
16 అతిశయపడక, । మీ విశ్వాసము అభివృద్ధియైన కొలది,
మీ ఆవలి ప్రాంతములలో సువార్తను ప్రకటించు
టకు, మా పొలిమేర ప్రకారము మీలో అధికముగా
17 విశాలపరచబడుదుమని నిరీక్షించుచున్నాము. । అయి
నను అతిశయించే వాడు ప్రభువు యందే అతిశయిం
18 చుగాక; *। ప్రభువు మెచ్చేవాడెవడో వాడే గాని
తన్ను తానే మెచ్చుకొనే వాడు యోగ్యుడు కాడు.

## 11. అధ్యాయము.

1 అవివేకములో కొంత మట్టుకు మీరు నన్ను గూర్చి
సహించ వలెనని కోరుచున్నాను; నన్ను గూర్చి మీరు
2 ఇదివరకు సహించుచున్నారు. । దేవాసక్తితో మీ యం
దు ఆసక్తిపడుచున్నాను; ఎందుకనగా, పవిత్రురాలైన
కన్యకను క్రీస్తు యెదుట నిలువబెట్ట గోరి మిమ్మును
3 ఒక్క పురుషునికి ప్రధానము చేసితిని గాని, । సర్ప
ము తన కుయుక్తివల్ల హవ్వను ఏలాగు మోసపరిచె
నో, ఆలాగే మీ మనస్సులు చెరపబడి, క్రీస్తు యెడ
లనున్న మీ సరళతను విడిచి పోవునేమో అని భయ
4 పడుచున్నాను; । ఎందుకనగా మేము ప్రకటించని
మరియొక యేసుని, వచ్చేవాడు ప్రకటించితే, లేక
మీరు పొందని వేరే ఆత్మనైనను, మీరు అంగీకరించని
వేరే సువార్తనైనను మీరు పొందుచుంటే, దాని గూర్చి
5 సహించుట యుక్తము గాని, । నేను ఈ మిక్కిలి విశే
షమైన అపొస్తలులకంటే ఏ మాత్రమును తక్కువవా
6 డను కానని తలంచుకొంటున్నాను. । మాటలయందు
నేను నేర్పులేని వాడనై యున్నప్పటికి తెలివి యందు
అట్టివాడను కాను; ప్రతి సంగతి విషయము మేము
అందరిలో మీ నిమిత్తము అగపరిచితిమి.†

7 మీరు హెచ్చించబడే నిమిత్తము, మీకు దేవుని సు
వార్తను ఉచితముగా ప్రకటించుచు, నన్ను నేనే తగ్గిం
8 చుకొని పాపము చేసితినా? । మీ పని నిమిత్తము,
నేను అన్య సంఘములవల్ల జీతము పుచ్చుకొని, వారి
9 ధనము దొంగిలినవాడనైతిని. । మరియు నేను మీ యొద్ద
ఉన్నప్పుడు, నాకు అక్కర కలిగి యుండగా నేను
ఎవనికైనను భారముగా ఉండ లేదు; ఎందుకనగా
సహోదరులు మకెదొనియనుంచి వచ్చినప్పుడు నా
అక్కర సంపూర్ణము చేసిరి. ప్రతి విషయమందు నేను
మీకు భారముగా ఉండకుండ జాగ్రతపడితిని; ఇంక
జాగ్రతపడుదును. । క్రీస్తుయొక్క సత్యము నాలో 10
ఉన్న ప్రకారము, అఖాయియ ప్రాంతములలో ఈ
అతిశయము నా విషయము అణపబడదు. । ఎందువల్ల? 11
నేను మిమ్ము ప్రేమించ లేదు గనుకనా? దేవునికి తె
లుసును; । అయినను, వారు ఏ విషయము అతిశయ 12
పడుచున్నారో, ఆ విషయము వారు మా వలెనే ఉ
న్నారని కనబడేనిమిత్తము, కారణము వెతికే వారి కా
రణము కొట్టివేయుటకు నేను చేసే దాని ఇంక చేతు
ను; । ఎందుకనగా అట్టివారు దొంగ యపొస్తలులు, 13
కపట ప్రవర్తకులు, క్రీస్తుయొక్క అపొస్తలుల వేష
ము ధరించుకొనే వారునై యున్నారు. । అందుకు ఆశ్చ 14
ర్యము లేదు. సైతాను కూడ వెలుగుయొక్క దూత
వేషము ధరించుకొనును. । కావున, దాని సేవకులును 15
నీతి సేవకుల వేషము ధరించుకొనుట గొప్పది కాదు.
వారి క్రియల చొప్పున వారికి అంతము కలుగును.

తిరిగి నేను చెప్పేదేమనగా, నేను అవివేకినని యెవ 16
డును తలంచ వద్దు. తలంచితే, నేను కూడ కొంచెము
అతిశయపడే నిమిత్తము, నన్ను అవివేకినివలె చేర్చు
కొనుడి. । ఏది పలుకుచున్నానో అది ప్రభువు చెప్పిన 17
ప్రకారము కాదు, గాని ఈ నమ్మికగల అతిశయము
లో అవివేకముతో ఉన్నట్టు చెప్పుచున్నాను. । అనే 18
కులు శారీరప్రకారము అతిశయపడుచున్నారు గనుక
నేను కూడ అతిశయపడుదును, । మీరు బుద్ధిమంతులై 19
సంతోషముతో అవివేకులను సహించుచున్నారు; । ఒక 20
డు మిమ్ము దాస్యమునకు లోపరిచినను, ఒకడు మిమ్ము
భక్షించినను, ఒకడు మిమ్ము పట్టుకొనినను, ఒకడు తన్ను
గొప్పచేసికొనినను, ఒకడు ముఖము మీద మిమ్ము కొట్టి
నను మీరు సహింతురు.

మేము బలహీనులమైతిమని అవమానమునిమిత్తము 21
మాటలాడుచున్నాను, గాని దేని విషయము ఎవడు
ధైర్యము తెచ్చుకొనునో, దాని విషయము నేను కూడ
ధైర్యముగలవాడను. అవివేకముగా మాటలాడుచు
న్నాను. । వారు ఇబ్రీయులా? నేను అట్టివాడను; వారు 22
ఇశ్రాయేలీయులా? నేనును అట్టివాడను; వారు అబ్రా
హాము సంతానమా? నేనును అట్టివాడను; । వారు క్రీస్తు 23
సేవకులా? పరవశుని వలె మాటలాడుచున్నాను, ఎక్కువ
వాడను; ప్రయాసముల యందు, మరీ విస్తారముగాను,
దెబ్బల యందు అపరిమితముగాను, చెరసాలలలో
అత్యధికముగాను, మరణముల యందు అనేక పర్యా
యములును ఉంటిని. । యూదులవల్ల అయిదుమార్లు 24

*యెరెమి. 9. వ. 23, 24. †కొన్ని ప్రతులలో, అగపరచబడితిమి.

25 ఒకటి తక్కువ నలుబది దెబ్బలు పడితిని; ముమ్మారు
బెత్తములతో కొట్టబడితిని; ఒకసారి రాళ్లతో కొట్టబ
డితిని; ముమ్మారు ఓడ పగిలి శ్రమపడితిని; ఒక దివా
26 రాత్రము సముద్రములో గడిపితిని. అనేక పర్యా
యములు ప్రయాణముల యందు, నదుల వల్లనైన ఆప
దల యందు, దొంగలవల్లనైన ఆపదల యందు, నా స్వ
జనులవల్లనైన ఆపదల యందు, అన్యజనులవల్లనైన ఆప
దల యందు, పట్టణములో ఆపదల యందు, అరణ్య
ములో ఆపదల యందు, సముద్రములో ఆపదల యం
27 దు, కపట సహోదరులలో ఆపదల యందు, అలసట
యందు, శ్రమయందు, జాగరణముల యందు, ఆకలి
దప్పుల యందు, తరుచుగా ఉపవాసముల యందు,
28 చలి యందు, దిగంబరత్వమందును ఉంటిని. ఇవి గాక
దినదినము నాకు కలిగే భారము అనగా సంఘములన్ని
టిని గూర్చి విచారము కలదు. ఎవడు బలహీనుడైతే
29 నేను బలహీనుడను కాను? ఎవడు ఆతంకపరచబడితే,
నాకు మంట కలగదు?

30 అతిశయపడ వలసి యుంటే నా బలహీనతల విష
31 యమైన వాటిని గూర్చి అతిశయపడుదును. నిరంతర
ము స్తుతింప తగిన యేసు క్రీస్తనే మన ప్రభువుయొ
క్క తండ్రియైన దేవుడు, నేను అబద్ధమాడనని యెరు
గును.

32 దమస్కులో అరెతా అనే రాజు కింద ఉన్న అధి
పతి నన్ను పట్ట కోరి కావలి వారిని ఉంచి దమస్కీ
33 యుల పట్టణమును భద్రము చేసెను. అప్పుడు నేను
కిటికీ ద్వారా గోడనుంచి గంపలో దింపబడి వారి
చేతులలోనుంచి తప్పించుకొని పోతిని.

## 12. అధ్యాయము.

1 అతిశయపడుట ఏలాగైనను నాకు తగదు; ఎం
దుకనగా ప్రభువుయొక్క దర్శనములను, బైలుపరచ
2 బడిన వాటిని చెప్ప సాగుదును. యేసు క్రీస్తు యం
దున్న ఒక మనుష్యుని యెరుగుదును. పదునాలుగు సం
వత్సరముల కిందట, అతడు శరీరమందు ఉండెనో
లేదో నేనెరుగను, శరీరమునకు వెలపట ఉండెనో
లేదో నేనెరుగను; అది దేవునికే తెలుసును. అట్టివా
3 డు మూడవ ఆకాశమునకు కొంచుపోబడెను. అవును,
అట్టి మనుష్యుని యెరుగుదును; శరీరమందు ఉండెనో,
శరీరమునకు వెలపట ఉండెనో నేనెరుగను, అది
4 దేవునికే తెలుసును. అతడు పరదైసులోకి కొంచుపో
బడి పలకలేని మాటలు వినెను; మనుష్యుడు వాటిని
5 పలుక కూడదు. అట్టివాని గూర్చి అతిశయింతును
గాని, నా బలహీనతల యందే గాని నన్ను గూర్చి నేను
అతిశయపడను; నేను అతిశయపడుటకు ఇచ్ఛయించి 6
నప్పటికి బుద్ధిహీనుడను కాకపోదును; ఎందుకనగా
నేను సత్యమే చెప్పుదును, గాని నా యందు ఎవడై
నను చూచే దాని కన్నా లేక నావల్ల వినే దాని కన్నా
నన్ను గూర్చి ఎక్కువగా ఎంచునేమో అని మానుకొం
టున్నాను.

బైలుపరచబడిన వాటి బాహుళ్యమువల్ల నేను అత్య 7
ధికముగా హెచ్చించబడకుండే నిమిత్తము, నాకు శరీ
రములో ముల్లు, అనగా, నేను అత్యధికముగా హె
చ్చించబడకుండే నిమిత్తము నన్ను కొట్టుటకు సైతాను
యొక్క దూత ఇయ్యబడెను. వాని గూర్చి అది నా 8
యొద్దనుంచి తొలగిపోవుటకు, ముమ్మారు ప్రభువును
వేడుకొంటిని. అప్పుడు ఆయన, నీ కొరకు నా కృప 9
చాలును; బలహీనత యందు నా శక్తి పరిపూర్ణము చేయ
బడునని* నాతో చెప్పెను గనుక క్రీస్తు శక్తి నా మీద
నిలిచే నిమిత్తము, విశేషముగా నా బలహీనతల యం
దు బహు సంతోషముతో అతిశయపడుదును. కా 10
వున క్రీస్తు నిమిత్తము బలహీనతల యందు, నిందల
యందు, ఇబ్బందుల యందు, హింసల యందు, ఉప
ద్రవముల యందును నేను అతిశయపడుచున్నాను;
ఎందుకనగా నేను ఎప్పుడు బలహీనుడనైతినో అప్పు
డు బలవంతుడనై యున్నాను.

అవివేకినైతిని; మీరు నన్ను బలవంతము చేసియు 11
న్నారు. నేను మీ వల్ల మెచ్చబడ తగినవాడను; ఎందు
కనగా ఏపాటివాడను కానుగాని ఈ మిక్కిలి విశేష
మైన అపొస్తలులకంటే నేను ఏ విషయము తక్కువ
వాడను కాను. గురుతుల వల్ల, అద్భుతముల వల్ల, 12
గొప్ప కార్యముల వల్ల, అపొస్తలుయొక్క ఆనవాళ్లు
పూర్ణమైన ఓరిమితో మీ మధ్యను జరిగించబడినవి
గదా! నేను మీకు భారముగా ఉండక పోతిని గాని 13
మరి దేని విషయము మీరు ఇతర సంఘముల కంటే
తక్కువ వారైతిరి? ఈ అన్యాయమును గూర్చి నన్ను
క్షమించుడి.

ఇదుగో! ఈ మూడవ సారి మీ యొద్దికి వచ్చుటకు 14
సిద్ధమై యున్నాను. అప్పుడు మీకు భారముగా ఉం
డను; మీ వాటిని కాదు మిమ్మునే వెదకుచున్నాను;
ఎందుకనగా పిల్లలు తల్లిదండ్రుల కొరకు కాదు తల్లి
దండ్రులు పిల్లల కొరకే ఆస్తి కూర్చ తగినది. అయినను 15
నేను మిమ్ము ఎక్కువగా ప్రేమించిన కొలది మీ వల్ల
తక్కువగా ప్రేమించబడినప్పటికి మీ ప్రాణముల
కొరకు, బహు సంతోషముతో వ్యయపరిచి వ్యయ
పరచబడుదును.

* లేక, కొనసాగునని.

16 ఆలాగుండనీ; నేను మీకు భారముగా ఉండ లేదు,
గాని యుక్తిగలవాడనై మిమ్ము తంత్రమువల్ల పట్టుకొం
17 టిని. । నేను మీ యొద్దికి పంపిన వారిలో ఎవని మూ
లముగానైనను మిమ్ము మోసపుచ్చి ఆర్జించుకొంటి
18 నా! । తీతును వేడుకొని అతనితో కూడ ఒక సహో
దరుని పంపితిని. తీతు ఏలాగైనను మిమ్ము మోస
పుచ్చి ఆర్జించుకొనెనా! మేము ఒక్క ఆత్మయందే
ఒక్కయడుగు జాడల యందే నడుచుకొనలేదా.

19 ఇందాక మేము మీ యెడలనే (మా యోగ్యత) చె
ప్పుకొంటున్నామని మీకు తోచునేమో. దేవుని యె
దుట క్రీస్తు యందు పలుకుచున్నాము; ప్రియులారా!
మీ క్షేమాభివృద్ధి కొరకు ఇవన్నియు పలుకుచున్నా
20 ము; । ఎందుకనగా ఒక వేళ నేను వచ్చినప్పుడు మిమ్ము
నాకు ఇష్టులనుగా కనుగొననేమో అనియు నేను మీకు
ఇష్టుడనుగా మీవల్ల కనుగొనబడనేమో అనియు ఒక
వేళ జగడములు, అసూయలు, కోపములు, స్వార్థా
పేక్షలు, కొండెములు, గుసగుసలాడుటలు, ఉప్పొంగు
21 టలు, కలహములును ఉండునేమో అనియు, । నేను
తిరిగి వచ్చినప్పుడు, నా దేవుడు మీ మధ్య నన్ను
తగ్గించునేమో అనియు మునుపు పాపము చేసి తాము
జరిగించిన అపవిత్రత, జారత్వ, కామవికారములకొ
రకు పశ్చాత్తాపపడని అనేకులను గూర్చి అంగలార్తు
నేమో అనియు భయపడుచున్నాను.

## 13. అధ్యాయము.

1 ఈమూడవ సారి నేను మీ యొద్దికి వచ్చుచున్నా
ను. ఇద్దరు ముగ్గురు సాక్షుల నోట ప్రతి మాట
2 యు స్థిరపరచబడును. । నేను మునుపు చెప్పి, రెండవ
మారు మీ యొద్ద ఉన్నప్పుడు ఏలాగో ఆలాగే ఇప్పు
డు నేను దూరముగా ఉండి, మునుపు పాపముచేసిన
వారికిని మిగిలినవారికందరికిని ముందు తెలిపేదేమన
గా నేను తిరిగి వచ్చినయెడల శిక్షించక విడువను; ।
3 ఎందుకనగా యేసు క్రీస్తు నాలో పలుకుచున్నా
డనుటకు మీరు పరీక్ష చేయగోరుచున్నారు. ఆయన
మీ యెడల బలహీనుడు కాడు గాని మీ యందు శక్తి
మంతుడై యున్నాడు; । ఆయన బలహీనతవల్ల శిలువ 4
వేయబడెను గాని దేవుని శక్తివల్ల సజీవుడైయున్నాడు.
అటువలె మేము కూడ ఆయన యందు బలహీనుల
మైయున్నాము గాని మీ యెడల దేవుని శక్తివల్ల ఆయ
నతో కూడ బ్రతుకుదుము. । మీరు విశ్వాసమందు 5
స్థిరులైయున్నారో లేదో మిమ్ము మీరే శోధించుకొ
నుడి, మిమ్ము మీరే పరీక్షించుకొనుడి. మీరు పరీక్షకు
నిలువనివారు కాకపోతే యేసు క్రీస్తు మీలో ఉన్నా
డని మిమ్ము మీరే యెరుగరా. । మేము పరీక్షకు నిలు 6
వని వారము కామని మీరు ఎరుగుదురని నిరీక్షించు
చున్నాను. । ఇప్పుడు మీరు ఏ దుష్కార్యమైనను 7
చేయకుండుటకు, దేవుని గూర్చి ప్రార్థించుచున్నాను;
మేము పరీక్షితులమై కనబడే నిమిత్తము కాదు, గాని
మేము పరీక్షకు నిలువనివారమైనట్టు ఉన్నప్పటికి మీరు
మేలు చేసే నిమిత్తమే; । మేము సత్యము నిమిత్తమేగాని 8
సత్యమునకు విరోధముగా ఏమియు చేయ నేరము; ।
మేము బలహీనులమైయుండగా మీరు బలవంతులై 9
యుంటే సంతోషపడుదుము. దీని నిమిత్తము, అనగా
మీ కుదురుబాటునిమిత్తము ప్రార్థింతుము. । కాబట్టి నా 10
శమునిమిత్తముగాక, క్షేమాభివృద్ధినిమిత్తమే ప్రభువు
నాకు ఇచ్చిన అధికారము చొప్పున, నేను మీ యొద్ద
ఉండి (మీ యెడల) కాఠిన్యము కనపరచకుండే నిమి
త్తము, దూరముగా ఉండి వీటిని వ్రాయుచున్నాను.
తుదకు సహోదరులారా! మీరు సంతోషించుడి, 11
కుదురుబాటు గలవారై యుండుడి, ఆదరించుకొనుడి.
ఏకమనస్సు గలవారై యుండుడి. సమాధానముగా ఉం
డుడి. అప్పుడు ప్రేమ సమాధానములుగల దేవుడు
మీకు తోడై యుండును. । పరిశుద్ధమైన ముద్దుతో 12
ఒకనికి ఒకడు సలాములు చెప్పుకొనుడి. । పరిశుద్ధు 13
లందరు మీకు సలాములు చెప్పుచున్నారు.

ప్రభువైన యేసు క్రీస్తుయొక్క కృప, దేవునియొ 14
క్క ప్రేమ, పరిశుద్ధాత్మయొక్క సహవాసము, మీ
అందరికిని తోడై యుండుగాక.

అపొస్తలుడైన పౌలు

# గలతీయలోఉన్న సంఘములకు పంపిన

# పత్రిక.

## 1. అధ్యాయము.

1 గలతీయలో ఉన్న సంఘములకు, మనుష్యుల మూ
లముగానైనను, మనుష్యుని వల్లనైనను కాక, యేసు
క్రీస్తువల్లను ఆయనను మృతిపొందిన వారిలోనుంచి
లేపిన తండ్రియైన దేవుని వల్లను అపొస్తలుడైన పౌలు।
2 అనే నేను, నాతో కూడ ఉన్న సహోదరులందరును
3 (వ్రాసినది);। మన తండ్రియైన దేవుని మూలముగాను
మన ప్రభువైన యేసు క్రీస్తు మూలముగాను మీకు కృ
4 పయు సమాధానమును కలుగు గాక.। ఆయన చెడ్డ
దైన ఇహలోకమునుంచి, మన తండ్రియైన దేవుని యి
ష్టప్రకారము, మనలను తప్పించుటకు మన పాపము
5 లను గూర్చి తన్ను అప్పగించెను.। ఆయనకు యుగ
యుగముల పర్యంతము మహిమ కలుగు గాక. ఆమెన్.
6 క్రీస్తు కృపయందు మిమ్ము పిలిచిన వాని యొద్దనుంచి
వేరే సువార్తకు మీరు ఇంత త్వరితముగా మళ్లుకొం
7 టిరని* ఆశ్చర్యపడుచున్నాను.। అది మరి యొకటి
కాదుగాని, మిమ్ము కలతపరుచుచు క్రీస్తు సువార్తను
8 చెరుపకోరే వారు కొందరు ఉన్నారు.। అయినను
మేము మీకు ప్రకటించిన సువార్త కాక మరియొ
కటి మాలో ఎవడైనను, ఆకాశపు దూతయైనను
మీకు ప్రకటించినయెడల, అతడు శపించబడినవాడౌ
9 ను గాక,। మేము మునుపు చెప్పిన ప్రకారము, ఇప్పు
డును మళ్లీ చెప్పుచున్నాను; మీరు అంగీకరించిన సు
వార్త కాక, ఎవడైనను మీకు మరియొకటి ప్రకటిం
10 చిన పక్షమందు, శపించబడినవాడవునుగాక.। కాగా
ఇప్పుడు నేను మనుష్యులను అనుకూలపరుచుకొంటు
న్నానా? లేక దేవుని అనుకూలపరుచుకొంటున్నా
నా? నేను మనుష్యులను సంతోషపెట్ట కోరుచున్నా
నా? ఇకను నేను మనుష్యులను సంతోషపెట్టినవాడ
నైతే, క్రీస్తు సేవకుడనై యుండను.
11 సహోదరులారా! నావల్ల ప్రకటించబడిన సువా
ర్త మనుష్యుని ప్రకారమైనది కాదని మీకు తెలియ
12 చెప్పుచున్నాను;। యేసు క్రీస్తు బైలుపరుచుట వల్లనే
గాని మనుష్యునివల్ల అది నాకు ప్రాప్తించను లేదు;
బోధించబడను లేదు.। పూర్వమందు యూదుడనై 13
యున్నప్పుడు, నేను దేవుని సంఘమును అత్యధికము
గా తరిమి, దాని పాడుచేయుచు,। నా పితృల పరంప 14
రాగత బోధ యందు అత్యధికమైన ఆసక్తి గలవాడనై
నా దేశస్థులలో నా సమానవయస్కులైన అనేకులకంటే
యూదుల మతమందు పరిశ్రమ చేసితినని నా నడువ
డిని గూర్చి వింటిరి.। అయినను నా తల్లి గర్భమందు 15
పుట్టినది మొదలుకొని నన్ను ఏర్పరిచి, తన కృపవల్ల
నన్ను పిలిచిన దేవుడు, నేను రాష్ట్రములలో తన కుమారుని
ప్రకటించేనిమిత్తము,।ఆయనను నాద్వారా బైలుపరచు 16
టకు అనుగ్రహించినప్పుడు, మాంసరక్తములతో నేను
ఆలోచించుకొన లేదు,। నా కంటే ముందుగా అపొ 17
స్తలులైన వారియొద్దికి యెరూషలేముకు వెళ్ల లేదు
గాని, వెంటనే అరబ్బీ దేశములోకి వెళ్లిన తరువాత,
దమస్కులోకి తిరిగి వచ్చితిని.। అటుపైని, మూడు 18
సంవత్సరములైన తరువాత, కేఫా పరిచయము చేసు
కొనుటకు, యెరూషలేముకు తిరిగి వచ్చి, అతనితో
కూడ పదిహేను దినములు ఉంటిని.। అయినను నేను 19
ప్రభువుయొక్క సహోదరుడైన యాకోబునే గాని,
అపొస్తలులలో మరి యెవనిని చూడ లేదు.। నేను 20
మీకు వ్రాయుచున్న వాటి విషయము, ఇదుగో!
దేవుని యెదుట అబద్ధములాడను.
తరువాత సురియ, కిలికియ ప్రాంతములలోకి వచ్చి 21
తిని గాని,। క్రీస్తు యందున్న యూదైయ సంఘముల 22
ముఖపరిచయము నాకుండ లేదు.। — మునుపు మన 23
లను హింసపెట్టిన వాడు, తాను పూర్వమందు పాడు
చేయుచున్న సువార్త విశ్వాసము ప్రకటించుచున్నా
డనే సంగతి మాత్రమే వినుచుండిరి.। అప్పుడు వారు 24
నా యందు† దేవుని మహిమపరిచిరి.

## 2. అధ్యాయము.

అటుపిమ్మట, పదునాలుగు సంవత్సరములైన తరు 1
వాత, నేను తీతును వెంటబెట్టుకొని, బర్నబాతో కూడ
యెరూషలేముకు తిరిగి వెళ్లితిని.। అవును, దేవాదేశ 2

* లేక, తిరుగబడితిరని. † లేక, నాద్వారా.

ప్రకారమే వెళ్లి, నా పరుగు వ్యర్థమవునేమో, లేక
వ్యర్థమైనదేమో అని, నేను* రాష్ట్రములలో ప్రకటిం
చుచున్న సువార్తను గూర్చి వారితోను, ప్రత్యేకము
3 గా, ఎన్నికైన వారితోను మాటలాడుకొంటిని. । అయి
నప్పటికి నాతోకూడ ఉన్న హెల్లేనీయుడైన తీతైనను
ఛేదనసంస్కారము పొందుటకు బలవంతము చేయ
4 బడ లేదు. । మనలను దాసులుగా చేసుకొనే నిమిత్తము,
క్రీస్తు యేసువల్ల మనకు కలిగిన మన విడుదలను వేగు
చూచుటకు, రహస్యముగా చేర్చబడి, ఏమరిపాటుగా
ప్రవేశించిన కపట సహోదరుల నిమిత్తము (సమ్మతిం
5 చలేదు). । సువార్త సత్యము మీ మధ్యను నిలిచే నిమి
త్తము, మేము వారికి ఒక గడియయైనను లోబడుటకు
ఒప్పుకొనలేదు.

6 ఎన్నికైన వారివల్ల, వారు ఏపాటి వారైనను నాకు
అక్కర లేదు, దేవుడు నరుని వేషముచూడడు; ఆ ఎన్ని
7 కైనవారు నాకు ఘేరేమియు ఆనతియ్యలేదు గాని। ఛేద
నసంస్కారము గలవారి కొరకు సువార్త పేతురుకు
ఏలాగో, ఆలాగు ఛేదనసంస్కారము లేనివారి కొరకు
8 నాకు అప్పగించబడెనని వారు చూచినప్పుడు,। అనగా
ఛేదనసంస్కారము గల వారికి అపొస్తలవుటకు పేతు
రుకు సామర్థ్యము కలుగచేసినవాడే రాష్ట్రముల నిమి
త్తము నాకును సామర్థ్యము కలుగచేసెనని గ్రహిం
9 చినప్పుడు, । వారు నాకు ఇయ్యబడిన కృపను తెలుసు
కొనినప్పుడు, స్తంభములని యెంచబడిన యాకోబు,
కేఫాయు,† యోహాను, మేము అన్యజనుల యొద్దికిని
తాము ఛేదనసంస్కారము గలవారి యొద్దికిని వెళ్లవలె
నని, నాకును బర్నబాకును సహవాస హస్తమిచ్చిరి. ।
10 మేము బీదలను జ్ఞాపకము చేసుకొనవలెనని మాత్రమే
కోరిరి; నేనును ఆలాగు చేయుటకు ఆతురపడితిని.

11 తరువాత కేఫా అంతియొకైయకు వచ్చినప్పుడు,
నేను ముఖాముఖిగా అతని ఎదిరించితిని; ఎందుకన
12 గా, అతడు అపరాధిగా కనబడెను; । ఏలాగనగా యా
కోబు యొద్దనుంచి కొందరు రాక మునుపు, అతడు
అన్యజనులతో భోజనము చేయుచుండెను గాని, వారు
వచ్చినప్పుడు, అతడు ఛేదనసంస్కారము గల వారికి
13 భయపడి, ఎడబాసి వేరే ఉండెను; । తక్కిన యూదు
లును అతనితో మాయవేషము వేసుకొనిరి గనుక, బర్న
బా కూడ వారి వేషధారణమువల్ల కొంచుపోబడెను.

14 వారు సువార్త సత్యము చొప్పున సరిగా నడు
చుకొన లేదని నేను చూచినప్పుడు, అందరి యెదుట
కేఫాతో నేను చెప్పినదేమనగా,—నీవు యూదుడవై
యుండి, యూదులవలె కాక అన్యజనుల వలెనే జీవిం
చుచుండగా, అన్యజనులు యూదులవలె ఉండుటకు
బలవంతము చేయనేల? । మనము సహజముగా యూ 15
దులమై అన్యజనుల సంబంధులైన పాపులము కాము;
అయినను, మనుష్యుడు యేసు క్రీస్తు విశ్వాసమువల్లనే
గాని, । బోధన ప్రమాణ క్రియల మూలముగా నీతి 16
మంతుడని తీర్చబడడని యెరిగి, మనమును బోధనప్ర
మాణ క్రియల మూలము కాక, క్రీస్తు విశ్వాసమూలము
గానే నీతిమంతులమని తీర్చబడుటకు, యేసు క్రీస్తు
యందు విశ్వాసముంచి యున్నాము; ఎందుకనగా, బో
ధనప్రమాణ క్రియల మూలముగా ఏ శరీరియు నీతి
మంతుడని తీర్చబడడు. । కాగా, మనము క్రీస్తు యం 17
దు నీతిమంతులమని తీర్చబడ వెతుకుచుండగా మనము
పాపులమై కనబడితే, ఆ పక్షమందు క్రీస్తు గదా పాప
సేవకుడై యున్నాడు. । అది దూరమవు గాక; నేను 18
విరగదీసిన వాటిని తిరిగి కట్టితే, నాకు నేనే అపరాధి
నని అగపరుచుకొందును. । నేనైతే దేవుని మట్టుకు 19
బ్రతికే నిమిత్తము, బోధనప్రమాణమువల్ల బోధనప్ర
మాణము మట్టుకు చనిపోతిని. । నేను క్రీస్తుతో శిలువ 20
వేయబడినవాడనైతిని; కాగా, బ్రతుకుచున్న వాడను
ఇకను నేను కాను గాని, నాయందు క్రీస్తు బ్రతుకు
చున్నాడు. మరియు నేను ఇప్పుడు శరీరమందు బ్రతు
కుచున్న బ్రతుకుమట్టుకు, నన్ను ప్రేమించి నా కొరకు
తన్ను అప్పగించిన దేవుని కుమారుని విశ్వాసమందు
బ్రతుకుచున్నాను. । నేను దేవుని కృపను నిరాకరించను; 21
నీతి బోధనప్రమాణము వల్లనైతే, ఆ పక్షమందు క్రీస్తు
ఊరకనే చనిపోయెనుగదా!

## 3. అధ్యాయము.

ఓ అవివేకులైన గలతీయులారా! శిలువ వేయబడిన 1
యేసు క్రీస్తు ఎవరి కన్నుల యెదుట, మీ మధ్యమందు
ప్రచురము చేయబడెనో, ఆ మిమ్మును ఎవడు భ్రమ
పెట్టెను? । ఇది మాత్రమే మీవల్ల తెలుసుకొన కోరు 2
చున్నాను, బోధనప్రమాణ క్రియలవల్ల ఆత్మను పొం
దితిరా? లేక విశ్వాసము గల శ్రవణము వల్ల పొంది
తిరా? । మీరు ఇంత అవివేకులై యున్నారా? మొదట 3
ఆత్మను పొంది ఇప్పుడు శరీరమున సంపూర్ణ చేసు
కొంటున్నారా? । వ్యర్థముగానే ఇవన్నియు అనుభ 4
వించితిరా? । అది వ్యర్థము కావచ్చునా! కాబట్టి, 5
ఆత్మను మీకు ఇచ్చి, మీలో శక్తులను కలిగించిన వాడు
బోధనప్రమాణ క్రియల వల్లనా? లేక విశ్వాసము గల
శ్రవణము వల్లనా (ఆలాగు చేసును?) । ఆప్రకారము, 6

* లేక, అక్కడివారు. †అనగా, పేతురు.

—అబ్రాహాము దేవుని నమ్మెను, అది అతనికి నీతి అని
7 యెంచబడెను. ।కాబట్టి విశ్వాసమూలమైనవారే అబ్రా
8 హాము కుమారులై యున్నారని మీకు తెలుసును. । మరి
యు దేవుడు విశ్వాసమూలముగా రాష్ట్రములను నీతి
మంతులగా తీర్చునని లేఖనము ముందుగా చూచి—
నీ యందు రాష్ట్రములన్నియు ఆశీర్వదించబడునని అ
9 బ్రాహామునకు సువార్తను ముందు తెలిపెను. । కాబట్టి,
విశ్వాసమూలమైనవారే విశ్వాసముగల అబ్రాహాము
తో ఆశీర్వదించబడుదురు.

10 మరియు, బోధనప్రమాణ క్రియల మూలమైన వా
రందరు శాపము కింద ఉన్నారు; ఎందుకనగా — బో
ధనప్రమాణ గ్రంథమందు వ్రాయబడినవన్నియు చే
యుటకు వాటి యందు నిలువని ప్రతివాడును శాప
11 గ్రస్తుడని వ్రాయబడి యున్నది. । అంతే కాదు, బో
ధనప్రమాణమందు ఎవడును దేవుని యెదుట నీతిమం
తుడని తీర్చబడడనే మాట పరిష్కారమే; ఎందుకన
గా—నీతిమంతుడు విశ్వాసమూలముగా జీవించును. ।
12 బోధనప్రమాణము విశ్వాసమూలము కాదుగాని, — ।
13 వాటిని చేసినవాడు వాటియందు జీవించును. ఆత్మను
గూర్చిన వాగ్దత్తము విశ్వాసమువల్ల మనయందు నెర
వేరుటకు, అబ్రాహాము పొందిన ఆశీర్వచనము, యేసు
14 క్రీస్తు యందు అన్యజనులకు కలుగుటకు । క్రీస్తు
మా కొరకు శాపమై, మమ్మును బోధనప్రమాణ శాప
మునుంచి తప్పించెను. ఆప్రకారము — మాను మీద
వ్రేలాడిన ప్రతివాడును శాపగ్రస్తుడని వ్రాయబడి
యున్నది.

15 సహోదరులారా! మనుష్యుని వలె పలుకుచు
న్నాను; మనుష్యుని నిబంధన* అయినను, నిర్ణయిం
చబడిన తరువాత, ఎవడును దాని కొట్టివేయడు; దాని
16 తో మరేమియు కలపడు.। ఆలాగే అబ్రాహామునకును
అతని సంతానమునకును వాగ్దత్తములు చేయబడెను.
అతడు అనేకులను గూర్చినట్టు—సంతానములకును అని
చెప్పక ఒకని గూర్చినట్టే—నీ సంతానమునకును అనె
17 ను. । ఆ సంతానము క్రీస్తు. నేను చెప్పేది యేమనగా—
ఆవాగ్దత్తము వ్యర్థము చేయుటకు, పూర్వమందు
దేవునివల్ల నిర్ణయించబడిన నిబంధనను,* నన్నూట
ముప్పది సంవత్సరములైన తరువాత కలిగిన బోధన
18 ప్రమాణము కొట్టివేయనేరదు; । ఆ స్వాస్థ్యము బో
ధనప్రమాణ మూలమైన పక్షమందు, ఇకను వాగ్దత్త
మూలమైనది కాదు. అయితే దేవుడు అబ్రాహామునకు
వాగ్దత్తము వల్లనే దాని అనుగ్రహించి యున్నాడు.

ఆలాగైతే బోధనప్రమాణమేమిటి†? అది అతి 19
క్రమముల నిమిత్తము కూర్చబడెను. ఎవనికి ఆ వాగ్ద
త్తము చేయబడెనో ఆ సంతానము వచ్చే పర్యంతము,
అది మధ్యవర్తి చేత, దూతల ద్వారా, ఏర్పరచబడె
ను. । మధ్యవర్తి ఒకని వాడు కాడు గాని, దేవుడు 20
ఒక్కడే.

కాబట్టి, బోధనప్రమాణము దేవుని వాగ్దత్తములకు 21
విరోధమైనదా? అది దూరమవుగాక. జీవింప చేయు
టకు శక్తిగల బోధనప్రమాణము ఇయ్యబడినయెడల,
వాస్తవముగా నీతి కలుగుట బోధనప్రమాణ మూల
ముగా ఉండును గాని, । యేసు క్రీస్తు విశ్వాసమూల 22
మైన వాగ్దత్తము, విశ్వాసముగల వారికి ఇయ్యబడే
నిమిత్తము, లేఖనము అందరిని ఏకముగా పాపము
కింద మూసి వేసెను. । అయినను ఆ విశ్వాసము రాక 23
మునుపు, మేము బైలుపరచబడబోయే విశ్వాసము
పర్యంతము మూయబడి, దుర్గములో ఉన్నట్టు బో
ధనప్రమాణము కింద ఉంచబడితిమి.

కాబట్టి, మేము విశ్వాసమూలముగా నీతిమంతుల 24
మని తీర్చబడుటకు, బోధనప్రమాణము క్రీస్తు పర్యం
తము‡ మాకు బాలశిక్షకుని వలె యుండెను । గాని, ఆ 25
విశ్వాసను వచ్చిన తరువాత ఇకను ఆ బాలశిక్షకునికి
లోబడి యుండము. । యేసు క్రీస్తు యందు, విశ్వాస 26
మువల్ల మీరందరు దేవుని కుమారులై యున్నారు; ।
క్రీస్తులోనుండుటకు బాప్తిస్మము పొందిన మీరందరు 27
క్రీస్తును ధరించుకొన్నారు. । ఇందులో యూదుడని 28
హెల్లేనీయుడని లేదు, దాసుడని స్వతంత్రుడని లేదు,
మగవాడని ఆడుదని లేదు; యేసు క్రీస్తు యందు
మీరందరు ఏకముగా ఉన్నారు. । మరియు మీరు 29
క్రీస్తు అవయవములైతే, ఆ పక్షమందు అబ్రాహాము
యొక్క సంతానమై, వాగ్దత్తము చొప్పున బాధ్యులై
యున్నారు.

## 4. అధ్యాయము:

మరియు నేను చెప్పేది యేమనగా, బాధ్యుడు 1
అన్నిటికిని కర్తయై యున్నప్పటికి, బాలుడై యున్నంత
కాలము, అతనికిని దాసునికిని ఏ భేదమును లేదు. ।
తండ్రి చేత ముందు నిర్ణయించబడిన దినము పర్యం 2
తము, అతడు పాలకులకును గృహనిర్వాహకులకును
లోబడి యుండును. । అటువలె మనమును బాలురమై 3
యున్నప్పుడు, ఇహలోక సంబంధమైన మూలపాఠ
ములకు లోబడిన దాసులమై యుంటిమి గాని, । కాల 4
పరిపూర్ణత వచ్చినప్పుడు, మనము కుమారస్థితి పొం

* లేక, ఒడంబడిక. † లేక, యెందుకు. ‡ లేక, నిమిత్తము.

5 దేనిమిత్తము, । దేవుడు బోధనప్రమాణమునకు లోబడిన
వారిని తప్పించే నిమిత్తము, స్త్రీనుంచి పుట్టి, బోధన
ప్రమాణమునకు క్రిందుగా పుట్టిన తన కుమారుని పం
6 పెను. । మరియు, మీరు కుమారులై యున్నందున—
అబ్బా తండ్రీ* అని మొరబెట్టే తన కుమారుని ఆత్మను,
7 మన హృదయములోకి పంపెను. । కాబట్టి, ఇకను నీవు
దాసుడవు కావు, కుమారుడవే; కుమారుడవైతే, క్రీస్తు
ద్వారా దేవుని† బాధ్యుడవునై యున్నావు.

8 అయినను అప్పుడు మీరు దేవుని ఎరుగక, సహ
జముగా దేవుండ్లు కాని వారికి దాసులై యుంటిరి
9 గాని, । ఇప్పుడు మీరు దేవుని తెలుసుకొని, విశేష
ముగా మీరు దేవునిచేత తెలియబడి, బలహీనమైనవి
యు, అర్థహీనమైనవియునైన మూలపాఠములతట్టు
మళ్లి తిరుగనేల! వాటికి మునుపటివలె తిరిగి దాసులై
10 యుండ కోరనేల? । మీరు దినములను మాసములను
కాలములను సంవత్సరములను ఆచరించుచున్నారు. ।
11 వ్యర్థముగానే మీ యెడల కష్టపడితినేమో అని
మిమ్మును గూర్చి భయపడుచున్నాను.

12 సహోదరులారా! మీరు నావలెనుండుడని మి
మ్మును వేడుకొంటున్నాను; నేను మీవలెనున్నాను.
13 మీరు నాకు హాని చేయ లేదే. । మొదట శరీర బల
హీనతతో నేను సువార్తను మీకు ప్రకటించితినని
14 మీరు ఎరుగుదురు. । అప్పుడు నా శరీరములో ఉన్న
మీ శోధన మీరు తృణీకరించ లేదు, నిర్లక్ష్యపెట్టనైనను
లేదు గాని, దేవుని దూతను వలె, యేసు క్రీస్తును వలె
15 నన్ను అంగీకరించితిరి. । కాబట్టి, మీరు చెప్పుకొనిన
ధన్యత యేమిటి?‡ అప్పుడు శక్యమైతే మీ కన్నులు
ఊడదీసి నాకు ఇచ్చివేతురని మీకు సాక్షినై యు
16 న్నాను. । కాబట్టి నేను మీతో నిజమాడి మీ శత్రు
17 వునైతినా? । వారు మిమ్మును అయుక్తముగా ఆశ్రయిం
తురు.§ ఎందుకయుక్తమనగా, మీరు తమ్మును ఆశ్ర
యించే నిమిత్తము మిమ్మును వెలివేయ కోరుచున్నారు. ।
18 అయితే, నేను మీ యొద్ద ఉన్నప్పుడే కాక, ఎల్లప్పు
డును యుక్తముగా ఆశ్రయింపబడుట యుక్తమే. ।
19 క్రీస్తు పోలిక మీయందు కలిగే పర్యంతము తిరిగి
నాకు ప్రసవవేదనలు కలుగచేయుచున్న నా పిల్లలా
20 రా । ఇప్పుడు మీ మధ్యనుండి, నా శబ్దము మార్చ
కోరుదును; ఎందుకనగా మిమ్మును గూర్చి కళవళ
పడుచున్నాను.

బోధనప్రమాణమునకు లోబడి యుండ కోరే వా 21
రలారా! మీరు బోధనప్రమాణము వినరా? నాతో
చెప్పుడి; । అబ్రాహాముకు దాసినుంచి ఒకడును స్వ 22
తంత్రురాలినుంచి ఒకడును ఇద్దరు కుమారులు కలి
గిరి. । అయినను దాసినుంచి పుట్టినవాడు శరీరప్రకా 23
రము పుట్టెను. స్వతంత్రురాలినుంచి పుట్టిన వాడు
వాగ్దత్తమువల్ల పుట్టెను. ఇట్టి సంగతులు ఉపమాన
ముగా చెప్పబడుచున్నవి; । ఏలాగనగా, ఈ స్త్రీలు 24
రెండు నిబంధనలై యున్నారు. వాటిలో ఒకటి సీనా
కొండనుంచి దాస్యమునకు పిల్లలను కనును. ఇట్టిది
హాగరు. । ఈ సీనాయి అరబ్బీలో ఉన్న కొండగదా! 25
ఆ నిబంధన ఇప్పటి యెరూషలేముయొక్క వరసలో
ఉన్నది; । ఎందుకనగా, అది దాని పిల్లలతో దాస్య 26
ములో ఉన్నది గాని, పైనున్న యెరూషలేము స్వతం
త్రముగా ఉన్నది. అది మనకు తల్లియై యున్నది.
ఇందుకు—కనని గొడ్రాలా! సంతోషించుము; ప్ర 27
సవవేదనపడనిదానా! కంఠమెత్తి కేక వేయుము; ఎం
దుకనగా పెనిమిటిగల దానికంటే ఒంటరికత్తె పిల్లలు
బహు విస్తారముగా ఉన్నారని వ్రాయబడి యున్నది. ।
కాగా, సహోదరులారా! ఈసాకువలె మనము వా 28
గ్దత్త కుమారులమై యున్నాము. । అయినను అప్పుడు 29
శరీర ప్రకారము పుట్టిన వాడు, ఆత్మ ప్రకారము
పుట్టిన వాని ఏలాగు హింస పెట్టెనో, ఇప్పుడును
ఆలాగే ఉన్నది. । అందును లేఖనము యేమి చెప్పుచు 30
న్నది?—దాసిని దాని కుమారుని పైకి తోలివేయుము;
దాసి కుమారుడు స్వతంత్రురాలి కుమారునితో స్వా
స్థ్యము పొందడు‖. । అందుచేతను సహోదరులారా! 31
మనము స్వతంత్రురాలి కుమారులమే గాని, దాసి
కుమారులము కాము.

5. అధ్యాయము. కాబట్టి, క్రీస్తు మనలను విడి 1
పించిన విడుదలలో మీరు నిలిచి మళ్లి దాస్యపు కాడికి
కట్టబడకుడి.
ఇదుగో! మీరు ఛేదనసంస్కారము పొందిన యె 2
డల, క్రీస్తు మీకు నిష్ప్రయోజనముగా ఉండునని
పౌలు అనే నేను మీతో చెప్పుచున్నాను. । మరియు 3
బోధన ప్రమాణము యావత్తును గైకొనుటకు ఋణస్థు
డవై యున్నావని, ఛేదనసంస్కారము చేయించుకొనే
ప్రతిమనుష్యునికిని నేను మళ్లి సాక్ష్యము చెప్పుచు

*లేక, మా తండ్రీ. †అనేకమైన మంచి ప్రతులలో, దేవుని ద్వారా. ‡లేక, ఏమైపోయెను?
§లేక, ఉపసర్పింతురు. ‖లేక, బాధ్యుడై యుండడు.

4 న్నాను.। మీలో ఎవరు బోధనప్రమాణమందు నీతి
మంతులని తీర్చబడుదురో, వారు క్రీస్తునుంచి బొ
5 త్తిగా విడువబడియున్నారు; । కృపనుంచి పోదురు;
ఎందుకనగా మేము ఆత్మవల్ల విశ్వాసమూలముగా నిరీ
క్షించబడే నీతి కొరకు ఎదురుచూచుచున్నాము; అ
వును, యేసు క్రీస్తుయందు ప్రేమవల్ల పనిచేయించే।*
6 విశ్వాసమే గాని, ఛేదనసంస్కారమైనను, అఛేదనసం
స్కారమైనను ఏమాత్రమును పనికిరాదు.

7 మీరు బాగా పరుగెత్తుచుంటిరి. మీరు సత్యము
నకు విధేయులు కాకుండ, మిమ్ము ఎవడు అడ్డుకొనె
8 ను? । ఈ ప్రేరేపణ మిమ్ము పిలిచే వానివల్ల కలుగ
9 లేదు. । పులిసిన కొంచెము పిండి ముద్దంతయు పులియ
10 చేసును. । మీరు ఎంత మాత్రమును వేరుగా తలంచు
కొనరని ప్రభువు యందు మిమ్మును గూర్చి నేను రూ
ఢిగా నమ్ముకొంటున్నాను. అయితే మిమ్ము కలత పెట్టే
11 వాడు యెవడైనప్పటికిని తన తీర్పు భరించును. । స
హోదరులారా! నేను ఛేదనసంస్కారము (కావలె
నని) ఇంక ప్రకటించుచుండిన యెడల, నేను యింక
తరుమబడ నేల? శిలువయొక్క ఆతంకము కొట్టివేయ
12 బడునేమో! । మిమ్ము కలత పెట్టే వారు తమ్మును ఛేదించు
కొన కోరవచ్చును.

13 సహోదరులారా! మీరు విడుదలలోకి పిలువబ
డితిరి. అయితే ఒకటి, ఆ విడుదలను శరీరము కొరకు
హేతువు చేసుకొనక, ప్రేమవల్ల ఒకనికి ఒకడు సేవ
కులై యుండుడి; ఎందుకనగా బోధన ప్రమాణమం
14 తయు । — నీ వలె నీ పొరుగువాని ప్రేమించుమనే
15 ఒక్క వాక్యమందు సంపూర్తియై యున్నది.।అయితే
మీరు ఒకని ఒకడు కరుచుకొని భక్షించినయెడల,
మీరు ఒకని వల్ల ఒకడు బొత్తిగా నశింతురేమో చూ
చుకొనుడి.

16 కాబట్టి నేను చెప్పేది యేమనగా, ఆత్మవల్ల నడుచు
కొనుడి; అప్పుడు మీరు శరీరముయొక్క అపేక్షను
17 నెరవేర్చరు; । శరీరము ఆత్మకును, ఆత్మ శరీరమునకును
విరోధముగా అపేక్షించును. మీరు వేటిని ఇచ్ఛ
యింతురో వాటిని చేయకుండ ఇవి ఒకదానికొకటి
18 వ్యతిరిక్తముగా ఉన్నవి. । అయినను మీరు ఆత్మవల్ల
నడిపించబడినయెడల బోధనప్రమాణము కింద ఉండ
19 రు. । మరియు, శరీర కార్యములు స్పష్టమైనవి; అవి
ఏవనగా—వ్యభిచారము, వేశ్యాగమనము, అపవిత్రత,
20 కామాతురత, । విగ్రహారాధన, అభిచారము, ద్వేష
ములు, వివాదము, మత్సరములు, క్రోధములు, స్వార్థ
ప్రయత్నములు, । ద్రోహకూటములు, విమతములు, 21
అసూయలు, నరహత్యలు, మత్తతలు సంభ్రమములు†
ఇట్టివి. వీటినిగూర్చి నేను మునుపును చెప్పిన ప్రకా
రము, ఇట్టి వాటిని చేసే వారు దేవుని రాజ్యమును
స్వతంత్రించుకొనరని మీతో ముందుగా చెప్పుచు
న్నాను.

అయితే ఆత్మ ఫలములు ఏవనగా, ప్రేమ, సంతో 22
షము, సమాధానము, దీర్ఘశాంతము, మృదుత్వము,
మంచితనము, విశ్వాసము, సాత్వికము, ఆశానిగ్రహ
ము; । ఇట్టి వాటికి విరోధమైన ఆజ్ఞ యేదయు లేదు.। 23
మరియు క్రీస్తు వారు ఇచ్ఛలతోను, ఆశలతోను, శరీ 24
రమును శిలువవేసియున్నారు.

మనము ఆత్మవల్ల‡ జీవించుచుంటే, ఆత్మవల్ల§ నడు 25
చుకొనుచుందము. । ఒకని ఒకడు వివాదమునకు రేపు 26
చు, ఒకనియందు ఒకడు అసూయపడుచు వ్యర్థకీర్తి
కాములమై యుండకుందము.

## 6. అధ్యాయము.

సహోదరులారా! ఒక మనుష్యుడు ఏ తప్పితము 1
లోనైనను చిక్కబడినయెడల, ఆత్మ సంబంధులైన మీ
రు, సాత్వికమైన మనస్సుతో అట్టివాని కుదుర్చుడి;
నీవును శోధించబడుదువేమో అని నీకు నీవే చూచు
కొనుము. । ఒకని భారములను ఒకడు మోసుకొని, ఈ 2
లాగు క్రీస్తుయొక్క బోధను బాగా నెరవేర్చుడి.

ఎవడైనను తన్ను గొప్పగా ఎంచుకొనినయెడల, 3
వట్టివాడై తనకుతానే మోసపరుచుకొనును. । ప్రతివా 4
డును తన కార్యమును పరీక్షించుకొన వలెను. అప్పుడు
ఇతరుని యెడల కాక, తన యెడల మాత్రమే అతనికి
అతిశయము కలుగును; । ప్రతివాడును తన బరువు 5
తానే మోసుకొనును.

మరియు వాక్యమును బోధించబడే వాడు, బో 6
ధించే వానికి మంచి పదార్థములన్నిటిలో భాగ
మియ్య వలెను. । మోసపోకుడి; దేవుడు వెక్కిరించబ 7
డడు. మనుష్యుడు ఏమి విత్తునో ఆ పంటనే కో
సును; । ఏలాగనగా తన శరీరమందు|| విత్తేవాడు తన 8
శరీరములోనుంచి కుళ్లనే పంట కోసును. ఆత్మ యం
దు విత్తేవాడు ఆ ఆత్మలోనుంచి నిత్యజీవమనే పంట
కోసును.

మరియు మనము విసుకక మేలు చేయుచుందము; 9
మనము అలసటపడకుంటే, తగిన సమయమందు పంట

* లేక, ప్రేమార్థముగా జరిగించే. † లేక, తిని తాగి తుల్లుటలు. ‡ లేక, ఆత్మమట్టుకు.
§ లేక, ఆత్మానుసారముగా. || లేక, కొరకు.

10 కోతుము. । కాబట్టి ఇప్పుడు మనకు సమయము కలిగిన
కొలది, అందరి యెడలను, విశేషముగా విశ్వాసుల
కుటుంబము యెడలను మేలు చేయుదము.
11 నా చేతితో మీకు ఏపాటి అక్షరములతో వ్రాసి
తినో చూడుడి.
12 శరీరమందు చక్కగా అగపడ కోరే వారెవరో,
వారు క్రీస్తుయొక్క శిలువవల్ల తరుమబడకుండుటకు
మాత్రమే, మిమ్మును ఛేదనసంస్కారము పొందు
13 టకు బలవంతము చేయుచున్నారు। గాని, ఛేదనసం
స్కారము పొందే వారును బోధన ప్రమాణము గైకొ
నరు. తాము మీ శరీరమందు అతిశయించే నిమిత్తము
మీరు ఛేదనసంస్కారము పొంద వలెనని కోరుచు
న్నారు.

నేనైతే, మన ప్రభువైన యేసు క్రీస్తుయొక్క 14
శిలువ యందు గాక, అతిశయించుట నాకు దూరమ
వుగాక. అందువల్ల, నామట్టుకు లోకము, లోకము
మట్టుకు నేనును శిలువ వేయబడి యున్నాము.। యేసు 15
క్రీస్తులో కొత్త సృష్టియే గాని ఛేదనసంస్కారమైనను
అఛేదనసంస్కారమైనను పనికి రాదు. । ఈ పద్ధతి 16
చొప్పున నడుచుకొనే వారెవరో వారి యందును
దేవుని ఇశ్రాయేలు యందును సమాధానము, కృపయు
ఉండు గాక.

ఇక మీదట ఎవడును నన్ను శ్రమపెట్టవద్దు; నేను 17
ప్రభువైన యేసు మచ్చలు నా శరీరమందు భరించు
చున్నాను.

సహోదరులారా! మన ప్రభువైన యేసు క్రీస్తు 18
కృప మీ ఆత్మతో ఉండునుగాక. ఆమేన్.

అపొస్తలుడైన పౌలు

# ఎఫెసులోఉన్న పరిశుద్ధులకు పంపిన

## ఉత్తరము.

### 1. అధ్యాయము.

1 దేవుని ఇష్టమువల్ల యేసు క్రీస్తుయొక్క అపొస్త
2 లైన పౌలు ఎఫెసులో ఉన్న పరిశుద్ధులును, । క్రీస్తు
యేసు యందు విశ్వాసులునైన వారికి, వ్రాసినది;
మన తండ్రియైన దేవునినుంచియు ప్రభువైన యేసు
క్రీస్తునుంచియు మీకు కృపయు సమాధానమును
కలుగుగాక.

3 మన ప్రభువైన యేసు క్రీస్తుయొక్క తండ్రియైన
దేవుడు స్తుతించబడు గాక. ఆయన క్రీస్తు యందు
ఆకాశ స్థలములలో ఆత్మీయమైన సమస్తాశీర్వాదము
4 లతో మనలను ఆశీర్వదించెను;।ఏలాగనగా, ప్రియుని
యందు, ఆయన మనకు అనుగ్రహించిన తన కృపా
5 మహిమయొక్క కీర్తి నిమిత్తము,।తన ఇష్టమూలమైన
దయాలోచన ప్రకారము, యేసు క్రీస్తు ద్వారా ఆ
6 యనకు కుమారులమవుటకు,।మనలను ముందుగా నిర్ణ
యించి, ప్రేమ యందు మనము తన యెదుట పరిశుద్ధు
లమును నిర్దోషులమునై యుండుటకు, జగత్తు పునాది
వేయబడక మునుపే, ఆయన యందు మనలను ఏర్ప
రుచుకొనెను.

7 ఆయన కృపయొక్క ఐశ్వర్యము చొప్పున, ఈ
యన యందు, ఈయన రక్తమువల్ల మనకు విమోచనము,
8 అనగా అపరాధముల క్షమము కలుగుచున్నది. । ఆ (కృ
పను) సర్వసంపూర్ణమైన బుద్ధి వివేకములతోను మనయె
9 డల విస్తరింపచేసెను; । ఏలాగనగా ఆకాశము మీదివే
కాని, భూమి మీదివే కాని సమస్తమును క్రీస్తు యం
10 దు ఏకముగా కూర్చుటకు, । కాలముల పరిపూర్ణ
11 తలో, గృహనిర్వాహ నిమిత్తము,। ఆయన తనలో తానే
12 సంకల్పించిన తన దయాలోచన ప్రకారము, । తన ఇష్ట
ముయొక్క మర్మమును మనకు తెలియ చేసెను; ఆ
యన యందే; మరియు, క్రీస్తు యందు మునుపు నిరీ
క్షించిన మేము, ఆయన మహిమయొక్క కీర్తి నిమిత్త
ముండుటకు, తన ఇష్టముయొక్క ఆలోచన ప్రకార
ము సమస్త క్రియలు చేసేవాని సంకల్పము చొప్పున,
ముందుగా నిర్ణయించబడి, ఆయన యందు స్వాస్థ్య
ముగా* ఏర్పరచబడితిమి. । ఆయన యందు మీరును, 13
సత్యవాక్యమును, అనగా మీ రక్షణ సువార్తను విని,
ఆయన యందు విశ్వాసముంచి, వాగ్దత్తము చేయబడిన
పరిశుద్ధాత్మవల్ల ముద్రించబడితిరి. । ప్రాప్తించిన దాని 14
విమోచన నిమిత్తము, ఆయన మహిమ కీర్తి నిమిత్తము
ఈయన† మన స్వాస్థ్యమునకు సంచకరువుగా ఉ
న్నాడు.

అందుచేతను మీలో ప్రభువైన యేసు యం 15-
దున్న విశ్వాసమును, సమస్త పరిశుద్ధుల యెడలనున్న 23
మీ ప్రేమయు నాకు వినబడినప్పుడు, నేనును మిమ్మ
ను గూర్చి విడువక స్తోత్రము చేయుచు, మన ప్రభు
వైన యేసు క్రీస్తుయొక్క దేవుడును, మహిమకు తం
డ్రియునైన ఆయనను గూర్చిన విజ్ఞానమందు, మీకు
జ్ఞానమును దేవాదేశమును కలిగించే ఆత్మను, అనగా,
మీరు ఆయన పిలుపు నిరీక్షణ ఎట్టిదో పరిశుద్ధులలో
ఆయన స్వాస్థ్యముయొక్క మహిమ యైశ్వర్యము‡ ఎ
ట్టిదో, ఆయన క్రీస్తును మృతి పొందిన వారిలోనుంచి
లేపి సమస్తమైన దొరతనము మీదను అధికారము మీ
దను సామర్థ్యము మీదను ప్రభుత్వము మీదను, ఈ
లోకమందు మాత్రమే కాకుండ, వచ్చేదానిలోను పె
ట్టబడిన ప్రతి నామము మీదను, ఆకాశ స్థలములలో
ఆయనను తన కుడి చేతివైపున కూర్చుండబెట్టుకొని,
ఆయన పాదముల కింద సమస్తమును లోపరిచి సర్వ
ముతో సర్వమును నింపేవాని సంపూర్తి, అనగా తన
శరీరమై యున్న సంఘముకొరకు ఆయనను అన్నిటి
పైని శిరస్సుగా దయచేసి, ఆయన యెడల జరిగించిన
తన శక్తి సామర్థ్యము చొప్పున, విశ్వసించే మన యె
డల ఆయన సామర్థ్యముయొక్క అత్యధిక మాహాత్మ్య
ము ఎంతో, మీరు తెలుసుకొనే నిమిత్తము మీకు వెలి
గించబడిన హృదయ నేత్రములను ఆయన మీకు దయ
చేయ వలెనని, నా ప్రార్థన యందు మిమ్ము జ్ఞాపకము
చేసుకొంటున్నాను.

---

* లేక, స్వకీయులముగా. † అనగా, పరిశుద్ధాత్మ. ‡ లేక, సంపద.

## 2. అధ్యాయము.

1 అపరాధములచేత పాపములచేతను చచ్చిన మిమ్ము
2 ను కూడ (లేపెను). । వాటిలో మీరు ఇహ లోకము
యొక్క క్రమము చొప్పున, వాయువుయొక్క అధి
కారమును, అనగా అవిధేయతయొక్క కుమారుల యం
దు ఇప్పుడు పని జరిగించే ఆత్మను ఏలేవాని అనుసరించి
3 మునుపు నడుచుకొంటిరి. । అందులో మనమందరము
శరీరముయొక్కయు మనస్సుయొక్కయు ఇచ్ఛలను తీ
ర్చుకొంటు, మన శరీరముయొక్క ఆశలయందు మునుపు
ప్రవర్తించేవారమై కడమవారి వలె స్వభావముచేత
ఉగ్రత సంతానమై యుంటిమి.
4-7 అయినను దేవుడు కరుణాసంపన్నుడై యుండి,
తాను క్రీస్తు యేసుయందు మన యెడల ఉపకారము
వల్ల, తన కృపయొక్క అత్యధికమైన యైశ్వర్యమును,
వచ్చే యుగములలో అగపరిచే నిమిత్తము, తాను మన
లను ప్రేమించిన మహా ప్రేమవల్ల, అపరాధముల
చేత చచ్చిన మనలను క్రీస్తుతో కూడ బ్రతికించెను.
కృపచేతనే మీరు రక్షించబడి యున్నారు. మరియు,
క్రీస్తు యేసుయందు మనలను ఆయనతో లేపి ఆకాశ
స్థలములలో ఆయనతో కూర్చుండబెట్టెను.
8 అట్లు మీరు కృపచేత విశ్వాసమువల్ల రక్షించ
బడి యున్నారు. మరియు ఇది మీ మూలము కాదు,
9 దేవుని దానమే. । ఎవడును అతిశయపడకుండే నిమిత్త
10 ము, అది క్రియలమూలమైనది కాదు; । ఎందుకనగా
మనము వేటిలో నడుచుకొన వలెనని దేవుడు ముందు
సిద్ధపరిచెనో* ఆ మంచి క్రియల నిమిత్తము మనము
క్రీస్తు యేసు యందు సృష్టించబడి, ఆయన పనియై
యున్నాము.
11 కాబట్టి మునుపు శరీర విషయము అన్యజనులై
యుండి, చేతితో శరీరమందు చేయబడిన ఛేదన సం
స్కారము గలవారనబడిన వారిచేత, ఛేదనసంస్కార
12 ము లేని వారనబడిన మీరు, । ఆ కాలమందు క్రీస్తు
లేకుండ ఉండి, ఇశ్రాయేలుతోటి పౌరులు కాక, పర
దేశులై, వాగ్దత్త నిబంధనలు లేని అన్యులై యుండి,
నిరీక్షణ లేనివారై, లోకమందు నిర్దేవులై యుంటిరి.
13 అయినను, క్రీస్తు యేసు యందు, మునుపు దూర
స్థులైన మీరు ఇప్పుడు క్రీస్తు రక్తమువల్ల దగ్గరకు తే
14- బడి యున్నారు; । ఎందుకనగా, ఆయనే మన సమా
16 ధానమై యున్నాడు; ఆయన సమాధానము చేయు
చు, వీరిద్దరిని తన యందు ఒక నూతన మనుష్యుని
గా నిర్మించుటకును, తన శిలువ మీద ద్వేషము చంపి,
దాని వల్ల, ఏకశరీరమైయున్న మనలనిద్దరిని† దేవునితో
సమాధానపరుచుటకును, ఆయన, విధులయందలి ఆజ్ఞల
యొక్క, బోధనప్రమాణమును‡ తన శరీరమందు కొట్టి
వేసి, వేరుపరిచే అడ్డగోడను, అనగా ఆ ద్వేషమును
విరగ దీసి రెండును ఒక్కటిగా చేసెను. । మరియు ఆ 17
యన వచ్చి దూరస్థులైన మీకు సమాధానమును, సమీ
పస్థులైన వారికి సమాధానమును ప్రకటించెను.। ఆలా 18
గున ఆయన ద్వారా మనమిద్దరము ఒక్క ఆత్మయందు
తండ్రి సన్నిధికి చేర సెలవు పొంది యున్నాము.
కాబట్టి, మీరు ఇక మీదట అతిథులును పరకు 19
టుంబస్థులునై యుండక, పరిశుద్ధుల యేకపట్టణస్థులు
ను దేవుని యింటివారునై యుండి, । అపొస్తలులు, ప్ర 20
వక్తలు వేసిన పునాది మీద కట్టబడి యున్నారు.।
యేసు క్రీస్తే మూలకు తలరాయియై యుండగా, కట్ట 21
బడేది యావత్తును ఆయనలో చక్కగా సంయుక్తపర
చబడి, ప్రభువులో పరిశుద్ధమైన దేవాలయమవుటకు
అభివృద్ధి పొందుచున్నది. । అందులో మీరు కూడ 22
ఆత్మ యందు, దేవునికి నివాసస్థలముగా కట్టబడుచు
న్నారు.

## 3. అధ్యాయము.

ఈ హేతువు చేతను రాష్ట్రములైన మీ కొరకు 1
క్రీస్తు యేసు యొక్క ఖైదినైన పౌలనే నేను, । మీ 2
కొరకు నాకు ఇయ్యబడిన దేవుని కృపానిర్వాహము
ను గూర్చి మీరు విని యున్నారు గదా, । అదేమన 3
గా, నేను పైని క్లుప్తముగా వ్రాసిన ప్రకారము, ఆ
మర్మము దేవాదేశమువల్ల నాకు తెలియపరచ బడె
ను. । అందువల్ల మీరు బాగా చదువుచు, క్రీస్తు 4
మర్మమును గూర్చిన నా తెలివి గ్రహించుకొన గలరు.।
అన్యజనులు సువార్తవల్ల క్రీస్తు యందు, ఆయన వాగ్ద 5
త్తములో భాగరులును ఏకశరీరమును సమానభాగస్థ
లునై యుందురనే (ఆ మర్మము) ఇప్పుడు ఆత్మవల్ల‖
ఆయన పరిశుద్ధులైన అపొస్తలులకును ప్రవక్తలకును
బైలుపరచబడిన లాగున,। ఇతరమైన తరములలో మను 6
ష్యుల కుమారులకు తెలుపబడ లేదు. । నేను, (నా) 7
యందు ఆయన చూపిన బలము చొప్పున, నాకు ఇ
య్యబడిన దేవుని కృపావరము చొప్పున ఆ సువా
ర్తకు సేవకుడనైతిని.
దేవుడు మన ప్రభువైన యేసు క్రీస్తు యందు 8-
చేసిన యుగముల సంకల్పము చొప్పున, ఆకాశస్థల 11
ములలో ప్రధానులకును అధికారులకును, సంఘము
ద్వారా ఆయనయొక్క నానా విధమైన జ్ఞానము ఇప్పు
డు తెలియబడే నిమిత్తము, రాష్ట్రములలో క్రీస్తు

---

* లేక, నియమించెనో. † లేక, రెండు తరగతులవారిని. ‡ అనగా, మోషే బోధన. ‖ లేక, యందు.

యొక్క అగోచరమైన ఐశ్వర్యమును ప్రకటించుట
కును, [యేసు క్రీస్తువల్ల] సమస్తమును సృష్టించిన దే
వుని యందు పూర్వకాలమునుంచి మరుగైయున్న ఆ
మర్మనిర్వాహము ఎట్టిదో అది అందరికిని తేటపరుచు
టకును, పరిశుద్ధులందరిలో నీచాతినీచుడనైన నాకు
12 ఈ కృప ఇయ్యబడెను. । ఆయన యందు, ఆయన యం
దలి విశ్వాసమువల్ల మనకు నిర్భయముగా ధైర్యము,
13 ప్రవేశమును కలిగి యున్నవి. । కాబట్టి మీ కొరకు
నాకు వచ్చిన శ్రమలవల్ల, మీరు విసుకుకొన వద్దని వే
డుకొంటున్నాను; అట్టివి మీకు మహిమయై యున్నవి.
14 ఈ హేతువు చేతను ఆకాశమందును భూమి మీ
దనున్న ప్రతి* కుటుంబము ఎవని పేరట పిలువబడు
15 నో, । ఆ [మన ప్రభువైన యేసు క్రీస్తు] తండ్రి యె
16-దుట నేను మోకాళ్లూని, । క్రీస్తు మీ హృదయము
18 లలో విశ్వాసమువల్ల నివసించుటకును, మీరు అంతరంగ
పురుషునియందు బలముతో తన ఆత్మవల్ల బలపరచబడు
టకు, తన మహిమయొక్క ఐశ్వర్యము చొప్పున మీ
కు దయచేసే నిమిత్తము, మీకు ప్రేమ యందు మూల
ము, పునాదియు కలిగి యుండగా, సమస్త పరిశుద్ధుల
తో, వెడల్పు, పొడుగు, లోతు, యెత్తును ఎంతో
19 గ్రహించుకొనుటకును, । తెలివికి మించే క్రీస్తు ప్రేమను
తెలుసుకొనుటకు తగిన శక్తి గల వారరయే నిమిత్తము,
మీరు దేవుని సర్వ సంపూర్ణతతో నింపబడే నిమి
త్తము (ప్రార్థించుచున్నాను).
20 మనలో పనిచేయించే శక్తి చొప్పున, మనము అడి
గేవి యేవో, తలంచుకొనేవి యేవో వాటి అన్నిటి
కంటే మిక్కిలి అత్యధికముగా చేయుటకు శక్తి గల
21 ఆయనకు, । క్రీస్తు యేసు యందు సంఘము ద్వారా
యుగయుగములయొక్క తరములన్నిటి పర్యంతమును
మహిమ కలుగు గాక. ఆమేన్.

## 4. అధ్యాయము.

1-3 కాబట్టి మీరు ప్రేమవల్ల ఒకనినొకడు సహిం
చుచు, సమాధానమనే అనుబంధమందు, ఆత్మ కలిగిం
చే ఐక్యము కాపాడుకొనుటకు ఆతురపడుచు, సం
పూర్ణవినయము గల మనస్సుతోను, సాత్వికముతో
ను దీర్ఘశాంతితోను నడుచుకొనుచుండ వలెనని,
ప్రభువు యందు ఖైదినైన నేను మిమ్మును బతిమాలు
4 కొనుచున్నాను. । మీరు మీ పిలుపు కారణమైన యేక
నిరీక్షణతో పిలువబడిన ప్రకారము, ఏక శరీరము
5 న్నది, ఏకాత్మయునున్నది. । ప్రభువు ఒక్కడే, విశ్వా
సము ఒక్కటే, బాప్తిస్మము ఒక్కటే, అందరికి తండ్రి
6 యైన దేవుడు ఒక్కడే. । ఈయన అందరి మీదను,
అందరి ద్వారాను, అందరిలోను ఉన్నాడు. । అయినను 7
మనలో ప్రతివానికిని, క్రీస్తు దానముయొక్క మితి
చొప్పున, కృప ఇయ్యబడెను. । అందుచేత—ఆయన 8
మీదికి ఎక్కి చెరను చెరగా పట్టుకొనివెళ్లి, మనుష్యు
లకొరకు ఈవులను ఇచ్చెను.† । అయితే—ఎక్కెను అన 9
గా, ఆయన భూమియొక్క కింది భాగములకు దిగెన
నియు అర్థమిచ్చుచున్నది గదా. । దిగిన వాడు, సమ 10
స్తమును నింపే నిమిత్తము ఆకాశములన్నిటికంటే
మహోన్నతముగా ఎక్కినవాడునై యున్నాడు. ।
మరియు మనుష్యుల మాయోపాయములో, వంచన 11-
క్రమముగా పని జరిగించుటకు కుయుక్తిలో మనము 15
ఇక మీదట ఇటు అటు కొట్టుకొని ప్రతి ఉపదేశ
వాయువు చేత చుట్టు మోయబడిన పిల్లలమై యుం
డక, ప్రేమ యందు, నిజమాడి, క్రీస్తనే శిరస్సైన ఆ
యనవలె నుండుటకు, అన్నివిషయములయందు ఎదిగే
నిమిత్తము, మనమందరము దేవుని కుమారునియొక్క
జ్ఞాన విశ్వాసముల ఐక్యమునకు, పరిపూర్ణ పురుషుడ
వుటకు, క్రీస్తుయొక్క పరిపూర్ణ వయఃప్రమాణము
నకు చేరే పర్యంతము, పరిశుద్ధులను సన్నద్ధపరిచే నిమి
త్తము,‡ క్రీస్తు శరీరమును అభివృద్ధి పొందించుటకు
ను, ఉద్యోగధర్మము చేయుటకును, ఆయన కొందరిని
అపొస్తలులగాను, కొందరిని ప్రవక్తలగాను, కొందరిని
సువార్తికులగాను, కొందరిని కాపరులగాను, ఉపదేశ
కులగాను ఇచ్చెను. । ఈయననుంచి ఈ సర్వ శరీరము 16
చక్కగా సంయుక్తపరచబడి, ఒక్కొక్క భాగముయొ
క్క ప్రమాణములో జరిగే బలము చొప్పున, సహా
యము చేసే ప్రతి నరమువల్ల§ అతకబడి, తాను ప్రే
మలో కట్టుకొనే నిమిత్తము శరీరాభివృద్ధి చేసుకొను
చున్నది.
కాబట్టి మిగిలిన రాష్ట్రములును, వివేకమందు అం 17
ధులై, । వారి హృదయ కాఠిన్యమువల్ల వారిలో ఉన్న 18
అజ్ఞానమువల్ల దేవుని జీవమునుంచి కేడించబడిన అన్యు
లైయుండి, తమ మనస్సుయొక్క వ్యర్థత యందు నడు
చుకొనే ప్రకారము ఇక మీదట మీరు నడుచుకొన
వద్దని, నేను దీని చెప్పి ప్రభువు యందు సాక్ష్యము
చెప్పుచున్నాను.‖ । వీరు సిగ్గు లేనివారై, ఆతురపడి 19
సమస్తవిధమైన అపవిత్రత చేసుకొనుటకు, తమ్మును తా
మే కాముకత్వమునకు అప్పగించుకొనిరి.
అయితే మీరు ఆలాగు క్రీస్తును తెలియ నేర్చు 20
కొన లేదు, అనగా యేసు యందు సత్యము ఉన్న
ప్రకారము, । మీరు ఆయన మాట విని ఆయన యం 21-
దు నేర్పబడి యుంటే; అనగా మునుపటి ప్రవర్తన 22

*లేక, సర్వ. † కీర్తన. 68. 18. ‡ లేక, సన్నద్ధపరచ వలెనని. § లేక, కీలు వల్ల. ‖ లేక, ఆనబెట్టుచున్నాను.

విషయము, మోసము యొక్క ఆశల ప్రకారము చెడి
23 పోయిన పురాతన పురుషుని* విడిచి, । మీ మనస్సు
24 తో కూడిన ఆత్మచేత నూతనపరచబడి। సత్యము యొ
క్క నీతిలోను పరిశుద్ధతలోను దేవుని పోలికగా సృ
ష్టించబడిన క్రొత్త పురుషుని ధరించుకొన వలెను.
25 కాబట్టి మనము ఒకరిలో ఒకరము అవయవముల
మై యున్నాము గనుక, మీరు అబద్ధమాడుట మాని,
ప్రతి వాడును తన పొరుగువానితో నిజమే చెప్ప
వలెను.
26 కోపపడుడి గాని పాపము చేయకుడి. సూర్యు
డు అస్తమించిన పైని మీ కోపము నిలిచి యుండ
27 కూడదు. । పిశాచమునకు చోటు ఇయ్యకుడి.
28 దొంగిలు వాడు ఇక మీదట దొంగిలక, అవసర
ము గల వానికి పంచిపెట్టుటకు కలిగే నిమిత్తము, తన
29 చేతులతో కష్టపడి మంచిదాని చేయ వలెను.। వినేవా
రికి మేలు దయచేసే నిమిత్తము, అవసరములు పట్టి అభి
వృద్ధి చేయుటకు, అనుకూలవచనమేగాని చెడ్డది యే
30 దైనను మీ నోటనుంచి రానియ్యకుడి. । దేవుని పరి
శుద్ధాత్మను దుఃఖపరుచకుడి; ఆయన యందు మీరు
విమోచన దినము మట్టుకు† ముద్రించబడి యున్నారు.
31 సమస్తమైన చేదుతనము, కోపము, క్రోధము, అరు
పు, దూషణయు, సకలమైన ఈర్ష్యతో కూడ మీ
32 యొద్దనుంచి తీసివేయబడనియ్యుడి. । ఒకనికి ఒకడు,
ఉపకారులై, కరుణాహృదయులై, క్రీస్తు యందు దే
వుడు మిమ్ము క్షమించిన ప్రకారము ఒకని ఒకడు క్ష
మించుడి.

## 5. అధ్యాయము.

1 కావున, ప్రియులైన పిల్లల వలె దేవుని పోలి యుం
2 డుడి. క్రీస్తు మనలను ప్రేమించి, । పరిమళ వాసన
నిమిత్తము మన కొరకు తన్ను దేవునికి కానుకగాను
యాగపశువుగాను అప్పగించిన ప్రకారము, మీరును
ప్రేమలో నడుచుకొనుడి.
3 అయితే పరిశుద్ధులకు యుక్తము కాని వ్యభిచార
ము, సమస్తవిధమైన అపవిత్రత, ధనాపేక్షయైనను
4 మీలో వచించబడనైనను కూడదు. । మరియు కృతజ్ఞ
తావచనమేగాని, తగని బూతులు, అపహాస్యపు మాట
5 లును, లేక సరసోక్తులును ఉండ కూడదు.। ఇది మీకు
తెలుసును; వ్యభిచారియైనను, అపవిత్రుడైనను, విగ్ర
హారాధకుడై యున్న లోభియైనను క్రీస్తుయొక్క, దే
వునియొక్క రాజ్యములో స్వాస్థ్యము పొందడని మీ
6 రు ఎరుగుదురు. । వట్టి మాటలవల్ల ఎవడును మిమ్మును
మోసపరుచ నియ్యకుడి; వీటివల్ల దేవుని కోపము అవి
ధేయతయొక్క కుమారుల మీదికి వచ్చును గనుక మీరు
వారితో పాలివారై యుండకుడి. । మీరు పూర్వమం 7
దు చీకటియై యుండి, । ఇప్పుడు ప్రభువు యందు 8
వెలుగై యున్నారు.। వెలుగు ఫలము సమస్తవిధములైన 9
మంచితనము, న్యాయము, సత్యము అనేవాటితో కూ
డి యున్నది । గనుక, ప్రభువుకు ఏది అనుకూలమైన 10
దో, దాని పరీక్షించుచు, వెలుగు పిల్లలవలె నడుచుకొ
నుడి.
మరియు, చీకటియొక్క నిష్ఫలమైన కార్యముల 11
లో పాలివారైయుండక, వాటిని గద్దించుడి; । ఎందు 12
కనగా వారిచేత రహస్యమందు చేయబడే వాటిని గూ
ర్చి మాటలాడుటయైనను అవమానకరమై యున్నది।
గాని, అవన్ని వెల్లడి చేయబడి, వెలుగుచేత కనపరచ 13
బడును; కనపరచబడేది యేదో అది వెలుగు. । అందు 14
చేతను — నిద్రించే నీవు మేలుకొని చచ్చినవారిలో
నుంచి లెమ్ము; క్రీస్తు నీకు వెలుగిచ్చునని ఆయన చెప్పు
చున్నాడు.
కాగా దినములు చెడ్డవై యున్నవని మీరు సమ 15
యమును సంపాదించుకొని, । బుద్ధిహీనులవలె కాక, 16
బుద్ధిమంతులవలె సరిగా నడుచుకొన చూచుకొనుడి. ।
ఇందు నిమిత్తము, మీరు అవివేకులు కాక, ప్రభువు 17
యొక్క ఇష్టము ఏమిటో గ్రహించుకొనుచుండుడి.।
మరియు మద్యముతో మత్తుగా ఉండకుడి; అందులో 18
దుర్వ్యాపారము కలదు. । అయితే ఆత్మచేత నింపబడి 19
ఒకనితో ఒకడు కీర్తనలతోను, సంగీతములతోను,
ఆత్మసంబంధమైన పాటలతోను మాటలాడుచు, మీ
హృదయములతో ప్రభువును గూర్చి పాడుచు, కీర్తిం
చుచు, । మన ప్రభువైన యేసు క్రీస్తు పేరట సమస్త 20
మును గూర్చి తండ్రియైన దేవుని ఎల్లప్పుడును స్తోత్ర
ముచేయుచు, । క్రీస్తు భయభక్తిలో ఒకనికి ఒకడు 21
లోబడి ఉండుడి.
స్త్రీలారా! క్రీస్తు సంఘమునకు శిరస్సై యున్న 22-
లాగున, పురుషుడు భార్యకు శిరస్సై యున్నాడని 23
ప్రభువుకు వలె మీ స్వపురుషులకు లోబడి యుం
డుడి. ఆయనే శరీరమునకు రక్షకుడై యున్నాడు ।
గాని, సంఘము క్రీస్తుకు ఏలాగో ఆలాగు భార్యలు 24
అన్నిటి యందు తమ పురుషులకు లోబడ వలెను.
పురుషులారా! క్రీస్తు కూడ సంఘమును ప్రే 25-
మించి, వాక్యముతో ఉదక స్నానముచేత, దాని పవి 27
త్రము చేసి, పరిశుద్ధపరుచుటకును, దానికి మచ్చయై
నను ముడతయైనను అట్టివాటిలో ఏదైనను లేకుండ,
అది పరిశుద్ధమైనది, నిర్దోషమైనదియునై యుండుటకు,

* లేక, నూతనపరచబడని నరస్వభావము. † లేక, దినమునకు.

మహిమ గల సంఘముగా ఆయన తానే తన యెదుట
దాని నిలువబెట్టుకొనుటకును, దాని కొరకు తన్ను
అప్పగించుకొనిన ప్రకారము మీరు మీ భార్యలను
ప్రేమించుడి.
28 ఆలాగు పురుషులు కూడ తమ శరీరములను వలె
తమ భార్యలను ప్రేమించ తగినది. తన భార్యను ప్రే
29 మించేవాడు, తన్ను ప్రేమించుకొంటున్నాడు. । ఎవ
డును తన శరీరమును ఎప్పుడును ద్వేషించక, క్రీస్తు
సంఘమును ఏలాగో ఆలాగు దాని పోషించి సంర
30 క్షించుకొనును. । మనము ఆయన మాంసమునుంచియు
ఆయన యెముకలనుంచియు, ఆయన శరీరముయొక్క
31 అవయవములమై యున్నాము. । —ఈ హేతువుచేతను
మనుష్యుడు తన తండ్రిని తల్లిని విడిచి తన భార్యతో
హత్తుకొనును; అప్పుడు వారిద్దరు ఒక్క శరీరమై
32 యుందురు.* । ఈ మర్మము గొప్పదై యున్నది గాని
నేను క్రీస్తును గూర్చియు సంఘమును గూర్చియుపలు
33 కుచున్నాను. । అయినను మీలో ప్రతి మనుష్యుడును
తన్ను వలె తన భార్యను ప్రేమించవలెను గాని భార్య
తన పెనిమిటి యందు భయభక్తులు ఉంచవలెను.

## 6. అధ్యాయము.

1 పిల్లలారా! ప్రభువు యందు మీ తలిదండ్రులకు
2 విధేయులై యుండుడి; ఇది న్యాయమే. । — నీకు మే
లు కలుగుటకును, భూమిమీద నీకు దీర్ఘాయువు
3 కలుగుటకును । నీ తండ్రిని తల్లిని సన్మానించుము.† అది
వాగ్దత్తము గల మొదటి ఆజ్ఞ.

4 తండ్రులారా! మీ పిల్లలకు కోపము పుట్టించక,
ప్రభువుయొక్క శిక్షలోను, బోధలోను వారిని పో
షించుడి.

5-8 దాసులారా! మనుష్యులను ఇష్టపరచుకొనేవారి
వలె, దృష్టి సేవతో కాక, క్రీస్తు దాసులమని దేవుని
ఇష్టము ఆత్మతో జరిగించుచు, మనుష్యులకు కాక ప్ర
భువుకు అయినట్టు సంతోషముగా సేవ చేయుచు, దా
సుడు గాని స్వతంత్రుడు గాని ప్రతివాడును ఏ
సత్క్రియ చేసునో దాని (ఫలము) ప్రభువువల్ల పొం
దునని యెరిగి, శరీర విషయము మీ యజమానులకు
క్రీస్తుకు వలె భయముతోను, వణుకుతోను, మీ హృ
దయ సరళతతోను విధేయులై యుండుడి.

9 ప్రభువులారా! మీరును మీయొక్క వారియొ
క్కయు ప్రభువు, ఆకాశమందు ఉన్నాడనియు ఆయ
నకు పక్షపాతము లేదనియు ఎరిగి, వారి యెడల బెది
రింపు మాని ఆ ప్రకారమే చేయుడి.

తుదకు నా సహోదరులారా! ప్రభువు యందు, 10
ఆయన శక్తిసామర్థ్యమందు బలపరచబడుడి.

మీరు సైతాను తంత్రములకు విరోధముగా నిలు 11
చుటకు బలవంతులయే నిమిత్తము, దేవుని యుద్ధోపకర
ణములన్ని ధరించు కొనుడి; । ఎందుకనగా రక్తమాంస 12
ములకు విరోధము కాక, మనము ప్రధానులకును అధి
కారులకును ఈ చీకటియొక్క విశ్వనాథులకును, ఆ
కాశ స్థలముల యందలి దుష్టత్వముగల ఆత్మలసమూ
హములకును విరోధముగా పోట్లాడుచున్నాము. । అం 13
దుచేతను మీరు దుర్దినమందు ఎదిరించుటకును, సమస్త
ము నెరవేర్చి నిలుచుటకును బలవంతులయే నిమిత్తము
దేవుని యుద్ధోపకరణములన్ని పట్టుకొనుడి.

కాబట్టి, మీ నడుమును సత్యముతో కట్టుకొని, 14
నీతి అనే మైమరువు తొడుగుకొని, । కాళ్లకు సమా 15
ధాన సువార్తవలన సిద్ధపడుటయనే జోడు తొడు
గుకొని నిలువుడి; । అన్నిటి పైని విశ్వాసమనే డాలు 16
పట్టుకొనుడి; దానివల్ల మీరు దుష్టుని అగ్ని బాణము
లన్నియు ఆర్పుటకు శక్తిమంతులవుదురు. । మరియు 17
రక్షణ అనే శిరస్త్రాణమును, దేవుని వాక్యమనే ఆత్మ
ఖడ్గమును పుచ్చుకొనుడి. । ఎల్లప్పుడును ఆత్మయందు 18
సమస్తవిధమైన ప్రార్థనతోను యాచనతోను ప్రా
ర్థించుచు; అందు కొరకు సమస్త పరిశుద్ధుల నిమిత్త
మును, । నేను దేని నిమిత్తము రాయభారినై సంకెళ్ల 19-
లో ఉన్నానో, । ఆ సువార్త మర్మము ధైర్యము 20
గా తెలియచేసుటకు నా నోరు విప్పినప్పుడు వాక్య
ము నాకు ఇయ్యబడేటట్టును, దాని గూర్చి నేను మా
టలాడ తగినట్టుగా తెగించి మాటలాడేటట్టును నా
నిమిత్తము పూర్ణమైన పట్టుదలతోను యాచనతోను
మెలుకువగా ఉండుడి.

నన్ను గూర్చినవి, నేను ఏలాగు ఉన్నానో అది 21
మీకును తెలియబడుటకు, ప్రియసహోదరుడును ప్ర
భువు యందు నమ్మకమైన సేవకుడునైన తుకికు మీకు
ఈ సమస్తమును తెలియచేసును. । ఇందునిమిత్తమే మీ 22
రు మమ్మును గూర్చినవి తెలుసుకొనుటకును, అతడు
మీ హృదయములను ఓదార్చుటకును అతని మీ యొ
ద్దికి పంపితిని.

తండ్రియైన దేవునివల్లను ప్రభువైన యేసుక్రీస్తు 23
వల్లను సమాధానము విశ్వాసముతో కూడిన ప్రేమ
యు సహోదరులకు కలుగు గాక.

అక్షయత యందు, మన ప్రభువైన యేసు క్రీస్తు 24
ను ప్రేమించే వారందరికిని కృప కలుగు గాక. ఆమేన్.

* ఆదికాండము. 2 అ. 24 వ. † నిర్గ. 20 అ. 12 వ.

అపొస్తలుడైన పౌలు

# ఫిలిప్పీయులకు పంపిన

## ఉత్తరము.

### 1. అధ్యాయము.

1 ఫిలిప్పిలోఉన్న క్రీస్తు యేసు యందలి సకల పరి
శుద్ధులకును అధ్యక్షులకును పరిచారకులకును యేసు
క్రీస్తు సేవకులైన పౌలును తీమోతియు వ్రాసినది:
2-5 మీ విషయము నేను చేసుకొనే నా యావత్తు
జ్ఞాపకములో ఎల్లప్పుడు, నా ప్రతి ప్రార్థనలో, సం
తోషముతో ఆప్రార్థన చేయుచు, మొదటి దినము
నుంచి ఇదివరకు మీరు సువార్త నిమిత్తము నాతోసహా
యులైనందున మీ అందరికొరకు నా దేవుని స్తోత్రము
6 చేయుచున్నాను; । ఎందుకనగా, మీలో సత్క్రియను
ఆరంభించినవాడు, యేసు క్రీస్తు దినమువరకు కొనసా
7 గించునని దీని గూర్చి రూఢిగా నమ్ముచున్నాను. । ఆ
ప్రకారము నా బంధములయందును నేను సువార్త
సిద్ధాంతపరుచుచు, దృఢపరుచుచుండుట యందును
మీరందరు నాతో కృపలో* పాలివారై యుండగా
మిమ్మును నేను† నా హృదయములో ఉంచుకొనినం
దున మిమ్మునందరిని గూర్చి ఈలాగు తలంచుట నాకు
8 న్యాయమై యున్నది. । యేసు క్రీస్తుయొక్క అంతఃక
రణలో మిమ్మునందరిని నేను ఎంతగా వాంఛించుచు
న్నానో దానికి దేవుడే నా సాక్షి.
9-11 మరియు మీరు శ్రేష్ఠమైనవాటిని పరీక్షించుటకు,
విజ్ఞానముతోను, సమస్తవిధమైన వివేకముతోను మీ
ప్రేమ అంతకంతకు అభివృద్ధి అయే నిమిత్తము, దేవు
నికి మహిమయు, స్తోత్రము కలుగుటకు, మీరు యేసు
క్రీస్తు వల్లనైన నీతి ఫలముచేత నింపబడి క్రీస్తు దినము
నకు, పవిత్రులును నిర్దోషులునయే నిమిత్తము ఆలా
గున ప్రార్థించుచున్నాను.
12 అయితే నా సహోదరులారా! నన్ను గూర్చినవి సు
వార్తకు ప్రతికూలముకాక, అనుకూలముగానే సంభవిం
13 చెనని మీరు తెలుసుకొన కోరుచున్నాను; । ఏలాగన
గా ప్రేతోర్యనుందంతటను‡ తక్కిన వారందరికిని నా
14 బంధములు క్రీస్తు యందు అగపరచబడెను. । మరియు
సహోదరులలో ఎక్కువమంది నా బంధముల చేత
ప్రభువు యందు రూఢిగా నమ్ముకొని నిర్భయముగా
దేవుని వాక్యము చెప్పుటకు మరి అతిధైర్యము తెచ్చు
కొనిరి.
కొందరు అసూయచేతను కలహముచేతను, మరి 15
కొందరు దయాలోచనచేతను క్రీస్తును ప్రకటించుచు
న్నారు. । వారు నా బంధములతో శ్రమ కలప వలె 16
నని తలంచి, శుద్ధ మనస్సుతో కాక, స్వార్థ ప్రయ
త్నముచేతను, । నేను సువార్త సిద్ధాంతపరుచుటకు నియ 17
మించబడి యున్నానని, వీరు ఎరిగి ప్రేమచేతను క్రీస్తు
ను ప్రకటించుచున్నారు. । అయితేనేమి, మిషచేతనే 18
కాని, సత్యముచేతనే కాని యే విధముచేతనైనను
క్రీస్తు ప్రకటించబడుచున్నాడు. అందువల్ల నేను సం
తోషించుచున్నాను; మరియు ఇంక సంతోషింతును.
సరేగదా, నేను దేనిలోను సిగ్గుపడక, । ఎప్పటివలె 19-
ఇప్పుడును సమస్త ధైర్యముతో పలుకుటవల్ల, జీవము 20
వల్లనేకాని మరణము వల్లనేకాని క్రీస్తు నా శరీర
మందు మహిమపరచబడునని నేను నిరీక్షించి పార
చూచుచున్న ప్రకారము, మీ ప్రార్థన వల్లను యేసు
క్రీస్తు ఆత్మ సమృద్ధి వల్లను ఇది నా రక్షణార్థముగా
సంభవించునని యెరుగుదును; । నాకు, బ్రతుకుట క్రీస్తు 21
చచ్చుట లాభము. । అయినను, శరీరములో నేను బ్రతు 22
కుటయే, పనివల్ల నాకు సఫలమైనదైతే, నేనేమి
ఎంచుకొన వలెనో అది ఎరుగను. । ఆ రెండింటి 23
మధ్యను ఇరుకునబడియున్నాను. నేను వెడలిపోయి
క్రీస్తుతో ఉండ వలెనని నాకు ఆశ యున్నది; అది
నాకు అత్యధికముగా మంచిది. । అయినను నేను శరీ 24
రములో నిలిచియుండుట మీ కొరకు మరి అవసరమై
యున్నది । మరియు ఇది రూఢిగా నమ్మి, నేను మళ్లీ 25-
మీలో ప్రవేశించి యుండుటవల్ల నన్ను గూర్చి క్రీస్తు 26
యేసుయందు మీ అతిశయము అధికమయే నిమిత్తము,
మీ విశ్వాసముయొక్క అభివృద్ధి, సంతోషముల నిమి
త్తము నేను నిలిచి, మీ అందరితో కూడ నిలిచి యుం
దునని యెరుగుదును.

---

* లేక, ఆ కృపలో. † లేక, నన్ను మీరు. ‡ సేనానివేశము; అపొస్తలులకార్యములు. 28 అ. 16, 31 వ.

27 అయితే ఒకటి—నేను వచ్చి మిమ్మును చూచినను,
28 లేక రాక పోయినను, । మీరు దేనిలోను ఎదిరించేవారి
వల్ల వణకక ఒక్క ప్రాణముతోనే సువార్త విశ్వా
సముతోకూడ పోరాడుచు, ఏకాత్మలోనే నిలిచి
యున్నారని నేను మిమ్మును గూర్చి వినే నిమిత్తము,
మీరు క్రీస్తు సువార్తకు తగిన రీతిగా ప్రవర్తించుడి.
అట్టి (ధైర్యము) వారికి నాశనమునకును, మీకు రక్షణ
కును దృష్టాంతమై యున్నది. అది దేవుని వల్లనైనదే; ।
29 ఎందుకనగా క్రీస్తు కొరకు, ఆయన యందు విశ్వాస
ముంచుట మాత్రమే కాక, ఆయన కొరకు బాధపడు
30 టయు మీకు అనుగ్రహించబడెను; । ఏలాగనగా
మీరు నా యందు చూచినదియు ఇప్పుడు నా యందు
ఉన్నదని వినుచున్నదియునైన పోరాటము మీకు
కలిగి యున్నది.

## 2. అధ్యాయము.

1 కావున, క్రీస్తులో ఏ బోధయైనను ప్రేమకారణ
మైన ఆదరణయైనను ఆత్మతో ఏ సహవాసమైనను
ఏ అంతఃకరణ వాత్సల్యములైనను ఉంటే, ఒక్క దాని
2 యందే మనస్కరించుటకు, । మీరు ఏకమనస్కులై,
ఏక ప్రేమ కలిగి, ఏకప్రాణులై, నా సంతోషము
3 సంపూర్ణము చేయుడి. । స్వార్థబుద్ధి చేతనైనను
వ్యర్థాతిశయము చేతనైనను ఏమియు జరగనియ్యక
వినయముగల మనస్సుతో ఒకని ఒకడు తనకంటే
4 యోగ్యుడని ఎంచి, । ఒక్కొకడు తన స్వకీయమైన
సంగతులనే కాక, ప్రతివాడును ఇతరుల వాటిని
5 కూడ చూడుడి; । క్రీస్తు యేసుకు కలిగిన ఈ మనస్సు
6 మీకును కలిగి ఉండనియ్యుడి. । ఆయన మొదట దేవుని
రూపమందు ఉండి దేవునితో సమానముగా ఉండుట
7 అపహరణమని* యెంచుకొనక, । ఆయన మనుష్యుల
పోలికగా పుట్టి, దాసుని రూపమును ధరించుకొని,
8 తన్ను రిక్తుని చేసుకొనెను. । మరియు ఆయన ఆకార
మందు మనుష్యునివలె ఉండి, మరణ పర్యంతము, అన
గా సిలువ మరణ పర్యంతము విధేయుడై, తన్ను తాను
9 తగ్గించుకొనెను. । అందుచేతను ఆకాశమందు ఉన్నవే
10 కాని, । భూమి యందు ఉన్నవే కాని, భూమికింద
ఉన్నవే కాని వాటియొక్క ప్రతి మోకాలును యేసు
నామమున వంగే నిమిత్తము, ప్రతి నాలుకయును ।
11 తండ్రియైన దేవుని మహిమ నిమిత్తము యేసు క్రీస్తు
ప్రభువని ఒప్పుకొనే నిమిత్తము దేవుడు ఆయనను
మిక్కిలి హెచ్చించి, ప్రతి నామమునకు పైనున్న
నామము ఆయనకు అనుగ్రహించెను.

కాగా, నా ప్రియులారా! మీరు ఎల్లప్పుడును 12
విధేయులై యున్న ప్రకారము నా సమ్ముఖమందు ఉన్న
ప్పుడు మాత్రమే కాకుండ, ఇప్పుడు నేను లేకనే మరి
యెక్కువగా భయముతోను వణకుతోను మీ స్వర
క్షణ కొనసాగించుకొనుడి; । ఎందుకనగా మీరు ఇచ్ఛ 13
యించుటకును, పని చేయుటకును తన దయాలోచన
నిమిత్తము మీలోపల జరిగించే వాడు దేవుడు.

నేను వ్యర్థముగా పరుగెత్త లేదనియు, వ్యర్థ 14-
ముగా కష్టపడ లేదనియు క్రీస్తు దినమునకు నాకు అతి 16
శయము కలుగుటకు, మీరు మూర్ఖమైన వక్రవంశ
ములో నిరపరాధులును నిష్కళంకులును దేవుని అనిం
ద్యులైన కుమారులునై యుండే నిమిత్తము, సణుగు
లును సంశయములును మాని సమస్తము చేయుడి. (ఆ
వంశము) వారిలో మీరు జీవవాక్యము ఎత్తుకొని లో
కమందు జ్యోతులవలె కనబడుచున్నారు.

మరియు మీ విశ్వాసయాగము, దాని క్రియలును 17
చేయబడుచుండగా,† నేను పానార్పణముగా పోయ
బడినప్పటికి, నేను సంతోషించి మీ అందరితో కూడ
సంతోషింతును. । ఈ హేతువుచేతనే, మీరును సం 18
తోషించి, నాతో కూడ సంతోషించుడి.

అయినను, నేనును మీ సంగతులు తెలుసుకొని 19
ధైర్యపడే నిమిత్తము, తిమొథెయును శీఘ్రముగా మీ
యొద్దకి పంపుటకు ప్రభువైన యేసు యందు నిరీక్షిం
చుచున్నాను; । ఎందుకనగా మీ సంగతులను గూర్చి 20
నిజముగా శ్రద్ధచేసే సమబుద్ధిగలవాడు ఎవడును నా
యొద్ద లేడు. । అందరును తమ స్వకీయమైన వాటినే 21
గాని యేసు క్రీస్తు వాటిని లక్ష్యపెట్టరు. । కాని తం 22
డ్రిని కుమారుడు ఏలాగో ఆలాగే అతడు నాతో
కూడ సువార్త నిమిత్తము సేవ చేసెనని అతడు పరీ
క్షించబడిన రీతి మీకు తెలుసును. । కాబట్టి నన్ను గూ 23
ర్చిన సంగతులు ఏలాగు జరుగునో దాని చూచి
వెంటనే అతని పంపుటకు నిరీక్షించుచున్నాను. । నే 24
నును శీఘ్రముగా వచ్చెదనని ప్రభువు యందు నిశ్చ
యించుకొంటున్నాను.

అయినను, నా సహోదరుడును, జత పనివాడును, 25
నాతోటి రాణువవాడును, మీయొక్క దూతయును,
నా అవసరమునకు ఉపచరించే వాడునైన ఎపఫ్రొది
తును మీయొద్దకి పంపుట అగత్యమని ఎంచుకొన్నా
ను; । ఎందుకనగా తాను రోగియై యుండెనని మీరు 26
విన్నారు గనుక అతడు మీ అందరిని వాంఛించి మి
క్కిలి విచారపడుచుండెను. । అవును, అతడు రోగియై 27

* లేక, అపహరించవలసినదని. † అనగా, నారక్తము.

మరణమునకు సమీపించెను గాని, దేవుడు అతని యం
దును, అతని యందు మాత్రమే కాక, నాకు విచార
ము మీద విచారము లేకపోవుటకు నా యందును
28 కరుణించెను.। కాబట్టి మీరు అతని చూచి తిరిగి సం
తోషించే నిమిత్తము, నాకు కూడ విచారము తక్కువ
29 యే నిమిత్తము అతని మరి శీఘ్రముగా పంపితిని.। కా
బట్టి పూర్ణ సంతోషముతో ప్రభువు యందు అతని
చేర్చుకొని, అట్టి వారిని ఘనులని యెంచుకొనుడి;।
30 ఎందుకనగా అతడు నా యెడల మీ సేవలో ఉన్న
కొదువను సంపూర్తి చేసేనిమిత్తము తన జీవము లక్ష్య
పెట్టక, క్రీస్తుయొక్క పని నిమిత్తము మరణమునకు
సమీపించెను.

## 3. అధ్యాయము.

1 తుదకు, నా సహోదరులారా! ప్రభువు యందు
సంతోషించుడి. ఆ సంగతులనే, మీకు వ్రాయుట
నాకు కష్టము కాదు; మీకు అది క్షేమకరమై యు
2 న్నది.। కుక్కలనుంచి జాగ్రత్తగా చూచుకొనుడి; దు
ష్కర్మకులనుంచి జాగ్రత్తగా చూచుకొనుడి. ఈ ఛే
3 దనమునుంచి జాగ్రత్తగా చూచుకొనుడి.। ఆత్మతో దే
వుని ఆరాధించి క్రీస్తు యేసు యందు అతిశయపడి
శరీరమందు విశ్వాసముంచని మనమే ఛేదనసంస్కా
4 రము గలవారమై యున్నాము.। అయినప్పటికి, నేను
శరీరమందును విశ్వాసముంచ వచ్చును. మరి యెవడై
నను శరీరమందు విశ్వసించ తలంచుకొనినయెడల, నా
5 కు అధికమవును.। ఎనిమిదవ దినము ఛేదన సంస్కార
ము పొంది, ఇశ్రాయేలు వంశములోని బెన్యామీను
గోత్రములో పుట్టి, హెబ్రీయుల సంతానమైన హె
బ్రీయుడనై, బోధనప్రమాణ విషయము ఫరిసైయు
6 డనై,। ఆసక్తి విషయము సంఘమును తరుముచు, బోధన
ప్రమాణమువలని నీతి విషయము అనింద్యుడనై(యుం
7 టిని).। అయినను, ఎట్టివి నాకు లాభములై యుండె
నో, అట్టివి క్రీస్తు నిమిత్తము, నష్టమని యెంచుకొం
8 టిని.। అంతే కాదు, నా ప్రభువైన యేసు క్రీస్తు తెలి
వియొక్క అతిశ్రేష్ఠత నిమిత్తము, సమస్తమును నష్టమని
9- ఎంచుకొంటున్నాను.।క్రీస్తనే లాభము పొంది, బో
11 ధనప్రమాణ మూలమైవ నా నీతి కాక, క్రీస్తు విశ్వా
సమువల్లనైనది, అనగా విశ్వాసము మీదట దేవుని మూ
లమైన నీతిగలవాడనై, మృతి పొందిన వారిలోనుంచి
నాకు ఏలాగైనను పునరుత్థానము కలుగునేమో అని,
నేను ఆయన మరణమునకు పోల్చబడి ఆయనను ఆయన
పునరుత్థాన బలమును, ఆయన శ్రమల సాంగత్యమును
ఎరుగుటకు, ఆయన యందు అగపడే నిమిత్తము సమస్త
మును నష్టపరుచుకొని, అవి చెత్త అని ఎంచుకొంటు
న్నాను.। ఇప్పుడు నేను పొందితినని అయినను, ఇప్పు 12
డు సంపూర్ణుడనని అయినను కాదు గాని, నేను
దేని నిమిత్తము క్రీస్తువల్ల పట్టబడితినో, దాని పట్టు
కొందునేమో అని పరుగెత్తుచున్నాను.। సహోదరు 13
లారా! నేను పట్టుకొంటినని తలంచుకొన లేదు. అయి
తే, ఒకటి వెనుకనున్నవి లక్ష్యపెట్టక, ముందటనున్న
వాటికి వేగిరపడి,। క్రీస్తు యేసు యందు, దేవుని పై 14
పిలుపుయొక్క బహుమానము నిమిత్తము, గురి యొద్దికి
పరుగెత్తుచున్నాను.

కాబట్టి మనలో ఎందరము సంపూర్ణులమై యు 15
న్నామో అందరము దీని మనస్కరింతము. అప్పుడు
దేని యందైనను మీకు వేరే మనస్సు కలిగినయెడల,
అదియు దేవుడు మీకు బైలుపరుచును.। అయినను మ 16
నము వచ్చినంతమట్టుకు, అదేప్రకారము నడుచుకొం
దము. [ఏకమనస్కులమై యుండము.]

సహోదరులారా! ఏకీభవించి, నన్ను పోలియుం 17
డుడి. మేము మీకు దృష్టాంతమై యున్న ప్రకారము,
ఆలాగు నడుచుకొనే వారిని గురిపెట్టి చూడుడి;।
ఎందుకనగా అనేకులు (వేరుగా) నడుచుకొంటున్నా 18
రు; వారు క్రీస్తుయొక్క శిలువకు శత్రువులని వీరిని
గూర్చి మీతో అనేకావృత్తులు చెప్పి, ఇప్పుడు ఏడ్చు
చు చెప్పుచున్నాను.। నాశము వారి అంతము; కడుపు 19
వారి దేవుడు; వారి మహిమ వారి అవమానములో ఉ
న్నది. వారు భూసంబంధమైన వాటినే మనస్కరిం
తురు.। మా పౌరస్థితి ఆకాశములో ఉన్నది. అక్కడ 20
నుంచి, రక్షకుడని ప్రభువైన యేసు క్రీస్తు నిమిత్తము
ఎదురుచూచుచున్నాము.। సమస్తమును తనకు లోపర 21
చుకొనుటకు ఆయనకు కలిగిన శక్తి ప్రకారము ఆయన
మన దైన్య శరీరమును, తన మహిమ శరీరమునకు సమ
రూపముగా ఉండుటకు మార్చును.

## 4. అధ్యాయము.

కావున, ప్రేమించబడి, వాంఛించబడి, నా సం 1
తోషము నా కిరీటమునై యున్న నా సహోదరు
లారా! నా ప్రియులారా! ఈలాగు ప్రభువు యందు
నిలుకడగా ఉండుడి.

ప్రభువు యందు ఏక మనస్సు గలవారై యుం 2
డుటకు, ఎవొదియను బతిమాలుకొంటున్నాను.। అవు 3
ను, నిజమైన సహకారీ! ఆ స్త్రీలకు సహాయము చేయు
టకు నిన్ను, క్లెమెంతును, సువార్త పనిలో నాతో
ప్రయాసపడిన నా యితరసహకారులను వేడుకొంటు
న్నాను. వారి పేరులు జీవగ్రంథమందు వ్రాయబడి
యున్నవి.

4 ఎల్లప్పుడును ప్రభువు యందు సంతోషించుడి;
5 మల్లి చెప్పుదును, సంతోషించుడి. । మీ మృదుత్వము
6 సకల మనుష్యులకును తెలియబడనియ్యుడి. । ప్రభువు
సమీపముగా ఉన్నాడు. దేనిగూర్చియు చింతిం
చక, ప్రార్థనచేతను వేడుకొనుటచేతను, స్తోత్రముతో
అన్నిటివిషయము మీ కోరికలు* దేవుని యెదుట తెలి
7 యచేయుడి. । అప్పుడు సమస్తయోచనకు మించే దే
వుని నెమ్మది† యేసు క్రీస్తు వల్ల మీ హృదయములకు
మీ తలంపులకు కావలి యుండును.

8 తుదకు సహోదరులారా! ఏవి సత్యమైనవో,
ఏవి గౌరవమైనవో; ఏవి న్యాయమైనవో, ఏవి పవి
త్రమైనవో; ఏవి రమ్యమైనవో, ఏవి మాననీయమైన
వో; ఏ యోగ్యతయైనను‡ ఏ స్తుతియైనను ఉంటే,
9 వీటిని తలంచుకొనుడి. । మరియు మీరు నావల్ల ఏవి
నేర్చుకొని అంగీకరించినారో, నాయందు ఏవి విని
చూచినారో, వాటిని జరిగించుడి; అప్పుడు సమా
ధాన§ దేవుడు మీకు తోడై యుండును.

10 నన్ను గూర్చిన మీ యోచన ఇన్నాళ్లకు మల్లి
చిగిరించెనని ప్రభువు యందు మిక్కిలి సంతోషించి
తిని. అందుకు మీకు యోచన కలిగెను గాని సమ
11 యము లేకపోయెను. । నాకు కొదువ కలిగి నేనీలా
గు చెప్పుచున్నానని కాదు; నేను ఏ స్థితిలో ఉన్నా
నో అందులో సంతుష్టిగా ఉండ నేర్చుకొన్నాను. ।
12 దీనస్థితిని ఎరుగుదును; సంపన్నస్థితిని ఎరుగుదును. అం
తటిలోను అన్నిటిలోను తృప్తిపడుటకు ఆకలిగొను
టకు సమృద్ధి పొందుటకు వెల్తిపడుటకును నేర్పబడి
యున్నాను. । నన్ను బలపరిచేవానియందు సమస్తము 13
చేయ గలను. । అయినప్పటికి నా శ్రమలో మీరు పా 14
లు పుచ్చుకొని యుక్తముగా చేసితిరి.

మరియు, ఫిలిప్పీయులారా! సువార్త ఆరంభ 15
మందు, నేను మకెదొనియలోనుంచి వచ్చినప్పుడు,
ఇచ్చి పుచ్చుకొనుటల సంబంధము నాకు మీతో
మాత్రమే గాని మరి ఏ సంఘముతో నుండలేదని
మీకును తెలుసును; । ఏలాగనగా థెస్సలొనీకలో 16
కూడ మీరు ఒకటి రెండు సారులు నా అవసరము
కొరకు పంపితిరి. । నేను దానము అపేక్షించుచున్నా 17
నని కాదు, గాని మీకు లెక్కకు విస్తారఫలము కలగ
వలెనని అపేక్షించుచున్నాను. । అయినను సమృద్ధిగా 18
నాకు సమస్తమును కలిగి యున్నది. మనోహరమైన
సువాసనయు, మెచ్చబడి దేవునికి అనుకూలమైన యా
గమునైన మీ ఈవులు ఎపఫ్రొదితు ద్వారా పుచ్చు
కొని తృప్తిపొంది యున్నాను. । కాగా, నా దేవుడు 19
యేసు క్రీస్తు యందు మహిమలో, తన ఐశ్వర్యము
చొప్పున, మీ అవసరమంతయు సంపూర్తి చేసును. ।
మన తండ్రియైన దేవునికి నిరంతరము మహిమ కలుగు 20
గాక. ఆమేన్.

యేసు క్రీస్తు యందు ప్రతి పరిశుద్ధునికి సలాము 21
లు. । నాతో ఉన్న సహోదరులందరు మీకు సలా 22
ములు చెప్పిరి. పరిశుద్ధులందరును, విశేషముగా కైసరు
ఇంటివారు మీకు సలాములు చెప్పిరి. । ప్రభువైన 23
యేసు క్రీస్తుయొక్క కృప మీ ఆత్మలతో నుండు
గాక.

*లేక, అడిగేవి. † లేక, సమాధానము. ‡ లేక, సద్గుణమైనను. §లేక, నెమ్మది.

అపొస్తలైన పౌలు

# కొలొస్సయులకు పంపిన

## పత్రిక.

### 1. అధ్యాయము.

1,2 కొలొస్సైలో ఉన్న పరిశుద్ధులకనగా, క్రీస్తు
యందు నమ్మకమైన సహోదరులకు, దేవుని ఇష్టము
వల్ల యేసు క్రీస్తుయొక్క అపొస్తలైన పౌలును సహో
దరుడైన తీమొథెయు (వ్రాసినది). మన తండ్రియైన
దేవుని వల్ల [ప్రభువైన యేసు క్రీస్తు వల్ల] మీకు కృ
పయు సమాధానము కలుగు గాక.

3-6 క్రీస్తు యేసు యందున్న మీ విశ్వాసమును గూ
ర్చియు, ఆకాశమందు మీ కొరకు ఉంచబడిన నిరీక్షణ
ఉండబట్టి, పరిశుద్ధులందరి మీదనున్న మీ ప్రేమను
గూర్చియు మేము విని, ఎల్లప్పుడు మీకొరకు ప్రా
ర్థించుచు, యేసు క్రీస్తనే మన ప్రభువుయొక్క
తండ్రియైన దేవునికి కృతజ్ఞత అగపరుచుచున్నాము.
సర్వలోకమందు చేరిన ప్రకారము మీయొద్ద చేరి
యున్న సువార్తయొక్క సత్యవాక్యములో ఆ నిరీ
క్షణ సంగతి మీరు పూర్వము వింటిరి. మీరు దేవుని
కృపను గూర్చి విని గ్రహించిన నాటినుంచి (ఆ సు
7 వార్త) మీలోను ఫలించుచు విస్తరించుచున్నది.। ఆలా
గే ఎపఫ్రాయనే ప్రియమైన మా తోటి పనివాని
8 చేత మీరు బోధించబడితిరి. । అతడు మీ కొరకు*
నమ్మకముగల క్రీస్తు సేవకుడు, ఆత్మయందు మీ ప్రే
మను మాకు తెలిపినవాడునై యున్నాడు.

9 అందువల్ల మేము వినిన నాటినుంచి, మేము కూడా
మీ కొరకు ప్రార్థించుట మానక, మీరు అన్నిటి
లో (దేవుని) సంతోషపరిచే నిమిత్తము ప్రభువుకు
తగిన రీతిగా నడుచుకొనుటకు, సమస్త సత్క్రియలో
10 ఫలించుచుండుటకు, । దేవుని విజ్ఞానముచేత అభివృద్ధి
11 పొందుటకు, । సంతోషముతో నిండైన ఓర్పు నిమిత్తము
దీర్ఘ శాంతము నిమిత్తము ఆయన యొక్క మహిమ
సామర్థ్యము చొప్పున సమస్త బలముతో బలపరచ
12 బడుటకు, । వెలుగు యందలి పరిశుద్ధుల స్వాస్థ్యము
లో పాలు పొందే నిమిత్తము, మనకు సామర్థ్యమి
చ్చిన తండ్రికి కృతజ్ఞత అగపరుచుటకు మీరు సమస్త
మైన జ్ఞానముతో, ఆత్మ సంబంధమైన వివేకముతోను
ఆయన ఇష్టమును గూర్చిన విజ్ఞానముచేత నింపబడే
నిమిత్తము వేడుకొంటున్నాము.। ఆయన చీకటియొక్క 13
అధికారములోనుంచి మనలను విడిపించి, తన ప్రేమ
కుమారుని రాజ్యములో ప్రవేశపెట్టెను. । ఆయన 14
యందు విమోచనము అనగా పాపపరిహారము పొందు
చున్నాము. । ఆయన అదృశ్య దేవుని పోలిక, సర్వ 15
సృష్టికి మొదట పుట్టినవాడునై యున్నాడు; । ఎందు 16
కనగా, ఆకాశమందు ఉన్నవి, భూమియందు ఉన్నవి,
దృశ్యమైనవి, అదృశ్యమైనవి, సింహాసనములైనవే గాని,
ప్రభావములైనవే గాని, దొరతనములైనవే గాని అధికా
రములైనవే గాని సమస్తమును ఆయన యందు సృజించ
బడెను; సమస్తమును ఆయన ద్వారా, ఆయన నిమిత్తము
సృజించబడి యున్నది. । మరియు, అన్నిటికంటే మొ 17
దట ఆయన ఉన్నాడు; సమస్తమును, ఆయనయందు కూ
ర్చబడియున్నది.। సంఘమనే ఆయన శరీరమునకు ఆయ 18
నే శిరస్సై యున్నాడు. ఆయన అన్నిటిలో మొదటి
వాడయే నిమిత్తము, ఆయన మొదలును, మృతి పొం
దినవారిలోనుంచి మొదట పుట్టినవాడునై యున్నా
డు.। ఎందుకనగా, ఆయన యందు సర్వపరిపూర్ణత 19
నివసించుటకును, । ఆయన శిలువయొక్క రక్తమువల్ల 20
సంధిచేసి, ఆయన ద్వారా అన్నిటిని, అనగా భూమి
మీదనున్నవేగాని, ఆకాశస్థలముల యందున్నవే గాని
హాటిని ఆయనవల్ల తనతో సమాధానపరుచుకొనుట
కును ఇచ్ఛయించెను.

మరియు మునుపు అన్యులును, చెడ్డక్రియల యందు 21
మనోవిరుద్ధము గలవారునై యుండిన । మిమ్మును కూ 22
డా ఆయన మాంస శరీరమందు ఆయన మరణమువల్ల
ఇప్పుడు సమాధానపరచబడిన మిమ్మును పరిశుద్ధుల
గాను నిర్దోషులగాను తన దృష్టియెదుట నిలువబెట్టు

* లేక, మనకొరకు.

23 టకు ఇచ్ఛయించెను; । అనగా మీరు పునాది మీద
కట్టబడి నిలకడగానుండి, మీరు విన్నదియు, ఆకాశ
ము కిందనున్న సమస్త సృష్టికిని ప్రకటించ బడినదియు
నైన సువార్త (కలిగించే) నిరీక్షణనుంచి తొలగించ
బడక విశ్వాసమందు నిలిచి యుంటే (నిలువబెట్టు
కొనును). పౌలనే నేను ఆ సువార్తకు సేవకుడనైతిని.

24 ఇప్పుడు మీ కొరకైన నాశ్రమలయందు నేను
సంతోషించుచు, క్రీస్తు సంఘమైన ఆయన శరీరము
కొరకు, నా మాంసమందు ఆయన బాధలలో కొదు
వలను* నా మట్టుకు నేను సంపూర్ణము చేయుచు
25,26 న్నాను. । దేవుని వాక్యమును, అనగా యుగముల
నుంచియు తరములనుంచియు మరుగు చేయబడిన
మర్మమును సంపూర్ణముగా ప్రకటించుటకు మీ
నిమిత్తము నాకు ఇయ్యబడిన నిర్వాహకత్వము చొ
27 ప్పున, నేను ఆ సంఘమునకు సేవకుడనైతిని. । ఇప్పుడు
ఆ మర్మము పరిశుద్ధులకు కనపరచబడి యున్నది. వారికి
దేవుడు రాష్ట్రములలో ఈ మర్మముయొక్క మహిమ
సంపద యెట్టిదో అది, అనగా మీలో క్రీస్తు, మహిమ
నిరీక్షణకారణమై యున్నాడనేది తెలుపుటకు ఇచ్ఛ
28 యించెను. । ప్రతి మనుష్యుని యేసు క్రీస్తు యందు
సంపూర్ణునిగా ఆయనయెదుట నిలువబెట్టే నిమి
త్తము సమస్తవిధమైన జ్ఞానము చేత మేము ప్రతి మను
ష్యునికి బుద్ధి చెప్పుచు, ప్రతిమనుష్యునికిని బోధిం
29 చుచు ఆయనను ప్రకటించుచున్నాము. । అందు నిమి
త్తము నేను నాయందు బలముగా జరిగించే ఆయన
క్రియ ప్రకారము పోరాడుచు ప్రయాసపడుచు
న్నాను.

## 2. అధ్యాయము.

1 ఎందుకనగా, మీ కొరకును, లౌదికైయ వారి కొర
కును, శరీరమందు (మీ వలె) నా ముఖము చూడ
కున్న వారందరు ప్రేమయందు అతకబడి యుండగా,।
2 వారికి పూర్ణ వివేకముయొక్క సర్వసంపత్తియు,
దేవుని మర్మమును గూర్చి, అనగా, ఎవనిలో జ్ఞాన విజ్ఞా
నముల సర్వసంపదలు మరుగైయున్నవో ఆ క్రీస్తు
మర్మమును గూర్చిన విజ్ఞానమును కలుగుటకు వారి హృ
దయములు ఓదార్చబడే నిమిత్తము, నాకు ఏపాటి పో
రాటము కలదో మీకు తెలియబడ కోరుచున్నాను.।
3 ఆయనలో జ్ఞాన విజ్ఞానముల సర్వసంపదలు మరుగైన
4 విగా నున్నవి. । ఎవడైనను చక్కని తర్కములచేత
మిమ్మును భ్రమపరచకుండే నిమిత్తము దీని చెప్పుచు
న్నాను. । ఎందుకనగా, నేను శరీరము మట్టుకు దూర 5
ముగా ఉన్నాను గాని ఆత్మమట్టుకు మీతో కూడ
నుండి సంతోషించుచు, మీ మోహారమును క్రీస్తు
యందలి మీ విశ్వాసముయొక్క స్థిరతను చూచుచు
న్నాను.

కావున, మీరు ప్రభువైన యేసనే క్రీస్తును అం 6,7
గీకరించిన ప్రకారము, ఆయనయందు నడువుడి; ఏలా
గనగా, ఆయన యందు వేరుపారి, కట్టబడుచు, మీరు
బోధించబడిన ప్రకారము విశ్వాసమందు స్థిరపరచ
బడుచు, అందులో విస్తరించి కృతజ్ఞత† అగపరుచు
చుండుడి.

క్రీస్తు ప్రకారముకాక, మనుష్యుల సంప్రదా 8,10
యము చొప్పున ఈ లోక సంబంధమైన మూల పాఠ
ముల ప్రకారము, వట్టి మోసమైన పాండిత్యము వల్ల
మిమ్మును వేటవలె ఎత్తుకొని పోవుచుండే వాడెవ
డైన నుండునేమో అని చూచుకొనుడి; ఎందుకనగా
ఆయనయందు దేవత్వముయొక్క సర్వ పరిపూర్ణత
శరీరాకారముగా నివసించుచున్నది. మరియు ఆయన
యందుండి మీరు పరిపూర్ణత పొందుచున్నారు;
ఆయన సమస్త ప్రధానులకును అధికారులకును శిరస్సై
యున్నాడు. । మీరు క్రీస్తు ఛేదన సంస్కారమున, 11
మాంస శరీరము తీసివేయుటలో, చేతివల్ల చేయబడని
ఛేదనసంస్కారము పొందితిరి. । మీరు బాప్తిస్మమున 12
ఆయనతో పాతిపెట్టబడి, దానిలో,‡ మృతిపొందిన
వారిలోనుంచి ఆయనను లేపిన దేవుడు చూపిన సామ
ర్థ్యమందలి విశ్వాసమువల్ల ఆయనతోకూడా పునరు
త్థానమును పొందితిరి. । మరియు మిమ్మును (అనగా) 13
మీ అపరాధములవల్లను, ఛేదనములేని మీ శారీర స్థితి
వల్లను మృతులైన మిమ్మును కూడా ఆయనతో జీవింప
చేసెను. । ఏలాగనగా, మన అపరాధములన్నిటిని 14
దయగా క్షమించి, ఆజ్ఞలవల్ల మనకు అడ్డముగాను,
మనకు విరోధముగానుండిన చేవ్రాతను తుడిచివేసెను;
ఆయన తన శిలువకు మేకులతో దానికొట్టి, మధ్య
నుంచి దాని పరిహారము చేసి యున్నాడు. । ఆయన 15
ప్రధానులను అధికారులను తప్పించివేసి, దానియందు
వారిని ధైర్యముతో వేడుకగా అగపరుచుచు వారిని
జయోత్సవముగా ఊరేగించెను.

కాబట్టి, అన్నపానముల విషయమైనను, పండుగ, 16
అమావాస్య, సబ్బాతు మొదలైన వాటిలో దేని విష
యమైనను, ఎవడును మీకు తీర్పు చేయ నియ్యకుడి.।

* లేక, ఆయన పొందగా మిగిలిన బాధలను. † లేక, స్తోత్రము. ‡ లేక, ఆయనలో.

17 ఇవి రాబోయేవాటి నీడయైయున్నవేగాని, శరీరము
18 క్రీస్తుదై యున్నది. । ఎవడును వినయమందు, దూతా
రాధనయందు ఇచ్ఛకలిగి, తానుచూడని* వాటిమీద
శ్రద్ధ వహించి, తన శారీర మనస్సువల్ల ఊరకే ఉప్పొం
19 గుచు, । శిరస్సును పట్టుకొననివాడై, మీ బహుమాన
మును మోసముగా అపహరించనియ్యకుడి; ఆయన
మూలముగా సర్వ శరీరము కీళ్లచేతను సంధిబంధముల
చేతను† పోషించబడి అతకబడి, దేవుని సంబంధమైన
వృద్ధితో అభివృద్ధి పొందుచున్నది.
20 మీరు క్రీస్తుతోకూడ లోకముయొక్క మూల పా
ఠముల మట్టుకు మృతిపొందితే, మీరు లోకములో
బ్రతుకుచున్నట్టుగా, మనుష్యుల ఆజ్ఞలను బోధలను
21 పట్టి।—ముట్టవద్దు, రుచి చూడవద్దు, చేత పట్టుకొన
22 వద్దు అనే కట్టడలకు లోబడనేల?। అవన్నియు వ్యయ
23 పరచబడి నశించిపోవును.।అట్టివి స్వేచ్ఛారాధనలోను,
వినయములోను దేహ శిక్షలోను జ్ఞానరూపకమైన
వని యెంచబడుచున్నవేగాని శరీర స్వస్థత నిమిత్తము
ఏమాత్రము పనికిరావు.

## 3. అధ్యాయము.

1 కావున, మీరు క్రీస్తుతో కూడ లేపబడితే మీద
నున్నవాటిని వెతుకుడి; అక్కడ క్రీస్తు దేవుని కుడిచేతి
2 వైపున కూర్చుండి యున్నాడు. । మీదనున్న వాటినే
గాని భూమి మీదనున్న వాటిని మనస్కరించకుడి;।
3 ఎందుకనగా, మీరు మృతిపొందితిరి; మీ జీవము క్రీస్తు
తో కూడా దేవుని యందు దాచబడి యున్నది.।
4 మనకు‡ జీవమైయున్న క్రీస్తు కనపరచబడినప్పుడు
మీరును ఆయనతో మహిమ యందు కనపరచబడు
దురు.

5 కావున భూమి మీదనున్న మీ అవయవములను
చావచేయుడి; వ్యభిచారమును, అపవిత్రతను, కామా
తురతను, దురాశను, విగ్రహారాధనయైన ధనాపేక్షను
6 (కొట్టివేయుడి).।వాటివల్ల దేవుని కోపము అవిధేయ
7 తగలవారి మీాద వచ్చును. । వాటియందు§ మీరు
బ్రతుకుచుండగా, వీటియందు మీరును నడుచుకొను
8 చుంటిరి.।అయినను ఇప్పుడు మీరు కూడ కోపము,
ఆగ్రహము, ఈర్ష్య, మీనోట రాకుండ, దూషణ దుర్వ
చనము మొదలైన వాటినన్నిటిని విడిచిపెట్టుడి. ।
9 ఒకనితో ఒకడు అబద్ధమాడకుడి; పురాతన పురుషుని,
10 వాని క్రియలతోకూడ వదులుకొని,।విజ్ఞానము కలిగే
నిమిత్తము వాని సృష్టించిన వాని పోలికె చొప్పున
నూతనపరచబడుచున్న క్రొత్త పురుషుని ధరించుకొ
నుడి, । అందులో హెల్లేనీయుడని యూదుడని భేద 11
ములేదు; ఛేదన సంస్కారమని అఛేదన సంస్కారమని
లేదు, బర్బరస్థుడని, స్కుథాయుడని, దాసుడని, స్వ
తంత్రుడని లేదు గాని క్రీస్తే సర్వమై సర్వములో‖
నున్నాడు.

కావున దేవునివల్ల ఏర్పరచబడి, పరిశుద్ధులును 12
ప్రియులునైయున్న వారివలె మీరు కరుణా హృద
యమును, దయను, వినయమును, సాత్వికమును, దీర్ఘ
శాంతిని ధరించుకొని, । ఒకనినొకడు సహించుచు, 13
ఒకనికి విరోధముగా ఒకనియందు అపరాధము కలి
గితే, ఒకనినొకడు దయగా క్షమించుకొనుడి. ప్రభు
వు¶ మిమ్మును ఏలాగో ఆలాగే మీరును (దయ
గా క్షమించుడి). । వీటి అన్నిటిపైని, పరిపూర్ణతకు 14
అనుబంధమైన ప్రేమను ధరించుకొనుడి. । అప్పుడు 15
క్రీస్తు సమాధానము మీ హృదయములలో ఏలికగా
ఉండనియ్యుడి. అందు నిమిత్తము మీరు ఒక్క శరీ
రమవుటకు పిలువబడితిరి. మరియు కృతజ్ఞులై యుం
డుడి.

సమస్త జ్ఞానముతోను, క్రీస్తు వాక్యము మీలో విస్తా 16
రముగా నివసించనిచ్చుచు, ఒకనికి ఒకడు సంగీతము
లతో కీర్తనలతో ఆత్మసంబంధమైన పద్యములతో బో
ధించుచు, బుద్ధిచెప్పుచు, కృపయందు మీ హృదయ
ములతో దేవుని గూర్చి గానము చేయుడి. । మరియు 17
వాక్యమందైనను క్రియయందైనను మీరు చేసేది యే
దో అంతయు ప్రభువైన యేసు పేరట చేయుచు
ఆయన ద్వారా తండ్రియైన దేవునియెడల కృతజ్ఞత
అగపరుచుడి.

స్త్రీలారా! ప్రభువుయందు తగిన ప్రకారము 18
మీ పురుషులకు విధేయులై యుండుడి.

పురుషులారా! మీ భార్యలను ప్రేమించుడి; వారి 19
యెడల నిష్ఠురపడకుడి.

పిల్లలారా! అన్నిటిలో మీ తలిదండ్రులకు విధే 20
యులై యుండుడి; ప్రభువుయందు ఇది అనుకూలము
గానున్నది.

తండ్రులారా! మీ పిల్లల మనస్సు కుంగునేమో 21
వారికి కోపము పుట్టించకుడి.

దాసులారా! మనుష్యులను ఇష్టపరుచుకొనేవారి 22
వలె దృష్టిసేవతోకాక, మన ప్రభువుకు భయపడుచు

* అనేకమైన మంచి ప్రతులలో, చూచిన. † లేక, నరములచేతను. ‡ లేక, మీకు.
§ లేక, వారిలో. ‖ లేక, అన్నియునై అన్నిటిలో ¶ లేక, క్రీస్తు.

హృదయ నిష్కాపట్యముతో, శరీరము మట్టుకు మీ
ప్రభువులైన వారికి అన్నిటిలో విధేయులై యుండు
23,24 డి. । మరియు మీరు ప్రభువువల్ల స్వాస్థ్యమనే
ప్రతిఫలము పొందుదురని యెరిగి, మీరు ఏమి చేతు
రో అది మనుష్యుల నిమిత్తముగాక, మన ప్రభువు
25 నిమిత్తమని మనస్ఫూర్తిగా నెరవేర్చుడి. । మీరు
మన ప్రభువైన క్రీస్తుకు దాసులై యున్నారు.* కా
గా, అన్యాయము చేసేవాడు తాను చేసిన అన్యాయ
మునకు తగినదాని పొందును; పక్షపాతము ఉండదు.
26 ప్రభువులారా! మీరు కూడ, ఆకాశములో మీకు
ప్రభువు ఉన్నాడని యెరిగి, న్యాయమైనది సరియైన
దియు మీ దాసులకు ఇయ్యుడి.

## 4. అధ్యాయము.

1,2 ప్రార్థనయందు నిలుకడగానుండి, అందులో
3,4 కృతజ్ఞతతో మెలుకువపడుడి. । మరియు నేను బంధిం
చబడుటకు హేతువైన క్రీస్తు మర్మమును నేను పలుక
తగినట్టు అగపరిచే నిమిత్తము దాని పలుకుటకు, దేవుడు
మాకు వాక్య ప్రవేశ ద్వారము తెరవ వలెనని మా
కొరకును ప్రార్థించుడి.

5 సమయము సంపాదించుకొని, వెలపటి వారి యె
6 డల జ్ఞానముతో నడుచుకొనుడి. । ప్రతి మనుష్యునికి
ఏలాగు ప్రత్యుత్తరమియ్య వలెనో, అది మీకు తెలి
యబడుటకు, మీ సంభాషణ ఎల్లప్పుడు ఉప్పురుచి
గలదై కృపాసహితముగా నుండనియ్యుడి.

7 ప్రియ సహోదరుడును ప్రభువుయందు నమ్మక
మైన పరిచారకుడును నాతోటి సేవకుడునైన తుఖికు
నన్ను గూర్చిన వన్నియు మీకు తెలియ చేసును. ।
8 అతడు మీ స్థితి తెలుసుకొని మీ హృదయములను
9 ఆదరించే నిమిత్తము ఈ హేతువుచేతనే అతని, । అతని
తోకూడ నమ్మికగల ప్రియసహోదరుడును మీలో
ఒకడునైన ఒనేసిమును మీ యొద్దికి పంపియున్నాను.
వీరు ఇక్కడి సంగతులన్నియు మీకు తెలియచేతురు.

నాతోకూడ చెరలో ఉన్న అరిస్తార్ఖును, బర్న 10
బా సమీప జ్ఞాతియైన మార్కును మీకు సలాములు
చెప్పుచున్నారు. ఇతని గూర్చి మీరు ఆజ్ఞలను పొం
దితిరి. ఇతడు మీ యొద్దికి వచ్చిన యెడల ఇతని
చేర్చుకొనుడి. । యుస్తు అనే యేసు కూడ మీకు సలా 11
ములు చెప్పుచున్నాడు. వీరు ఛేదనసంస్కారముగల
వారిలో ఉన్నారు.† వారిలో వీరు మాత్రమే దేవుని
రాజ్యము నిమిత్తము నా తోటి పనివారై యున్నారు.
వీరివల్ల మాకు ఉపశాంతి కలిగెను.

మీలో ఒకడును క్రీస్తు సేవకుడునైన ఎపఫ్రా 12
మీకు సలాములు చెప్పుచున్నాడు. మీరు సంపూ
ర్ణులును, దేవుని ఇష్టమంతటియందు పూర్ణ నిశ్చ
యముగలవారునై, నిలుకడగా ఉండ వలెనని ఇతడు
ఎల్లప్పుడును మీ కొరకు ప్రార్థనలవల్ల పోరాడుచు
న్నాడు. । ఇతడు మీ కొరకును, లౌదికైయ వారికొర 13
కును, హియరపొలివారి కొరకును బహు ప్రయాస
పడుచున్నాడని ఇతనిగూర్చి సాక్ష్యమిచ్చుచున్నాను.

లూకా అనే ప్రియుడైన వైద్యుడును, దేమాయు 14
మీకు సలాములు చెప్పుచున్నారు.

లౌదికైయలోనున్న సహోదరులకును, నుంఫా 15
కును, వారి ఇంటిలోనున్న సంఘమునకును సలాములు
చెప్పుడి.

ఈ పత్రిక మీలో చదువబడిన తరువాత లౌదికై 16
యవారి సంఘములోను దాసి చదివించుడి. లౌదికై
యనుంచి వచ్చేదాని చదివించుకొనుడి. । మరియు— 17
ప్రభువుయందు నీవు పొందిన సేవను నెరవేర్చుటకు
దానిమీద జాగ్రత్తపడుమని అర్ఖిప్పుతో చెప్పుడి.

పౌలనే నేను నా చేతితో వ్రాసిన సలాములు. 18
నా బంధకములను జ్ఞాపకము చేసుకొనుడి. కృప
మీకు తోడై యుండుగాక.

* లేక, యుండుడి. † అనగా, యూదులు.

అపొస్తలైన పౌలు

# థెస్సలోనీకైయులకు పంపిన

## మొదటి పత్రిక.

### 1. అధ్యాయము.

1 తండ్రియైన దేవుని యందు, ప్రభువైన యేసు క్రీస్తు
యందున్న థెస్సలొనీకైయుల సంఘమునకు పౌలు,
సిల్వాను, తిమొథెయు (వ్రాసినది.)
మన తండ్రియైన దేవుని వల్లను, ప్రభువైన యేసు
క్రీస్తు వల్లను, కృపయు సమాధానమును మీకు కలుగు
గాక.
2,3 మీ విశ్వాస క్రియను, ప్రేమ ప్రయాసమును, మన
ప్రభువైన యేసు క్రీస్తు యందలి మీ నిరీక్షణ గల
ఓర్పును మేము జ్ఞాపకము చేసుకొనుచు, మన తండ్రి
యైన దేవుని యెదుట మానక, మా ప్రార్థనల యందు
మిమ్ము జ్ఞాపకము చేయుచు, మీ అందరి నిమిత్తము
ఎల్లప్పుడును దేవుని యెడల కృతజ్ఞత అగపరుచుచు
4 న్నాము. । ఎంచుకనగా; దేవునివల్ల ప్రేమించబడిన
సహోదరులారా! మీరు ఏర్పరచబడుట మాకు తెలు
5 సును; । ఎందుకనగా, మా సువార్త మీ యొద్దికి వాక్య
ముతో మాత్రమే కాక, శక్తితోను, పరిశుద్ధాత్మతోను,
సంపూర్ణ నిశ్చయముతోను తేబడెను. ఆ ప్రకారము
మేము మీలో మీ కొరకు ఎట్టి వారమై యుంటిమో
6 దాని మీరు ఎరుగుదురు. । మరియు మీరు మిక్కిలి
ఉపద్రవమందు పరిశుద్ధాత్మవలని సంతోషముతో వా
క్యము నైకొని, మమ్మును ప్రభువును అనుసరించిన* వా
7 రైతిరి గనుక, । మకెదొనియలోను, అఖాయలోను
8 విశ్వాసులందరికిని మచ్చుగా ఉంటిరి. । ఏలాగనగా,
మీ యొద్దనుంచి ప్రభువుయొక్క వాక్యము మకెదొ
నియలోను, అఖాయలోను మ్రోగెను. అక్కడనే
కాదు, ప్రతి స్థలమందును దేవుని యెడలనున్న మీ
విశ్వాసము బైలువెళ్లెను గనుక ఏమియు చెప్పుటకు
9,10 మాకు అవసరము లేదు; । ఎందుకనగా మీ యొద్ద
ఎట్టి ప్రవేశము మాకు కలిగెనో అదియు, జీవము గల
నిజమైన దేవుని సేవించుటకు, మృతిపొందినవారిలో
నుంచి ఆయన లేపిన తన కుమారుడు—అనగా రాబో
యే ఉగ్రతనుంచి మనలను తప్పించుచున్న యేసు ఆ
కాశమునుంచి వచ్చుటకై ఎదురుచూచుటకును, మీరు
విగ్రహములను విడిచి దేవునితట్టు ఏలాగు తిరిగితిరో
అదియు వారు తామే మమ్మును గూర్చి తెలియచేయు
చున్నారు.

### 2. అధ్యాయము.

ఏలాగనగా, సహోదరులారా! మీ యొద్ద మా 1
ప్రవేశము వ్యర్థము కాలేదని మీకు తెలుసును. ।
అవును మీకు తెలిసినప్రకారము, మేము ఫిలిప్పిలో 2
ముందర శ్రమపడి అవమానముపొంది, చాలా పోరా
టముతో దేవుని సువార్తను మీతో చెప్పుటకు, మా
దేవుని యందు ధైర్యము తెచ్చుకొంటిమి; । ఏలాగనగా, 3
మా సుబోధ కపటము వల్లనైనను, అపవిత్రత వల్లనై
నను మోసముతోనైనను కాదు గాని, । సువార్త మాకు 4
అప్పగించబడుటకు, మేము దేవునివల్ల పరీక్షించబడిన
ప్రకారము మనుష్యులను కాదు, మా హృదయములను
పరీక్షించే దేవుని సంతోషపెట్టుటకు మాటలాడుచు
న్నాము; । ఎందుకనగా, మీరు ఎరిగిన ప్రకారము మే 5
ము, ఇచ్చకపు మాటలనైనను, దురాశను కప్పే వేషము
నైనను ఎన్నడును వాడుకొనలేదు; ఇందుకు, దేవుడు
సాక్షి. । మరియు మేము క్రీస్తుయొక్క అపొస్తలులమై 6
నందున, భారముగా ఉండుటకు అధికారము కలిగిన
ప్పుడు, మీ వల్లనే గాని, ఇతరుల వల్లనే గాని ఏ మను
ష్యులవల్లనైనను మేము ఘనత కోర లేదు గాని, మీ
లో సాధువులమై యుంటిమి. । దాది తన శిశువులను 7
ఏలాగు పెంచునో, ఆలాగే మేమును మిమ్మును గార
వించి, । మీరు మాకు ప్రియులైనందున, దేవుని సువా 8
ర్తను మాత్రమే కాదు మా ప్రాణములనుకూడ మీకు
ఇచ్చుటకు మనస్సుగలవారమై యుంటిమి; । అవును, 9
సహోదరులారా! మా ప్రయాసము, కష్టము మీరు
జ్ఞాపకము చేసుకొంటున్నారు గదా; మేము మీలో
ఎవనికైనను భారముగా ఉండకుండే నిమిత్తము, దివా
రాత్రులు పని చేయుచు మీకు దేవుని సువార్తను
ప్రకటించితిమి.

---

*లేక, పోలిన.

10 మేము విశ్వాసులైన మీకొరకు ఎంత పరిశుద్ధము
గాను, న్యాయముగాను నిర్దోషముగాను, ప్రవర్తిం
చితిమో,అందుకు మీరును దేవుడును సాక్షులైయున్నా
11,12 రు.। ఆప్రకారము తన రాజ్యమునకు, మహిమకును
మిమ్మును పిలిచిన దేవునికి తగిన రీతిగా మీరు నడవ
వలెనని, తండ్రి తన పిల్లలకు ఏలాగో ఆలాగే మేము
మీలో ప్రతివానికిని బుద్ధి చెప్పుచు, ధైర్యము తెలు
పుచు, ఆనబెట్టి చెప్పితిమని మీకు తెలుసును.
13 ఆ హేతువుచేత మీరు మావల్ల వినిన దేవుని వా
క్యము మీకు కలిగినప్పుడు, అది మనుష్యుల వాక్య
మని కాక, ఉన్నది ఉన్నట్టుగా, విశ్వాసులైన మీలో
కార్యసాధకమైన దేవుని వాక్యమని దాని అంగీకరిం
చితిరి గనుక మేమును మానక దేవునికి కృతజ్ఞత అగ
14 పరచుచున్నాము.। అవును సహోదరులారా! మీరు
యూదైయలో యేసు క్రీస్తు యందున్న, దేవుని సం
ఘములను అనుసరించే వారైతిరి; వారు యూదులవల్ల
అనుభవించినట్టి శ్రమలే మీరును మీ స్వదేశులవల్ల
అనుభవించితిరి.
15 వారు* తమ పాపములను ఎల్లప్పుడును నిండ చేసే
నిమిత్తము ప్రభువైన యేసు క్రీస్తును తమ ప్రవక్తలను
16 చంపిరి; మమ్మును తరిమిరి; దేవునికి ఇష్టులు కారు;। అన్య
జనులు రక్షణ పొందే నిమిత్తము వారితో మాటలాడ
కుండ మమ్మును నిషేధించుచు, మనుష్యులందరికి విరో
ధులై యున్నారు. కోపము తుద ముట్ట వారి మీదికి
వచ్చెను.
17 అయినను, సహోదరులారా! మేము హృదయము
మట్టుకు కాక, ముఖము మట్టుకే కొంత కాల పర్యం
తము మీ యొద్దనుంచి వేరు చేయబడి, చాలా కోరిక
తో మీ ముఖమును చూచుటకు మరి ఎక్కువగా ప్ర
18 యత్నపడితిమి గనుక మేము,। (పౌలుననే నేను కూడ,)
ఒకటి రెండు మార్లు మీ యొద్దికి రావలెనని ఇచ్ఛ
యించుకొంటిమి గాని, సైతాను మమ్మును అడ్డగించెను;।
19 ఎందుకనగా, మా నిరీక్షణయైనను సంతోషమైనను
ఉత్సాహ కిరీటమైనను ఏది? మన ప్రభువైన యేసు
క్రీస్తు వచ్చినప్పుడు, ఆయన యెదుట మీరే గదా?।
20 నిశ్చయముగా మీరు మా మహిమ, సంతోషమునై
యున్నారు.

1-3 3. అధ్యాయము. కాబట్టి ఇకను సహించ
లేనందున, అథేనైలో ఒంటిగా విడువబడుట యుక్త
మనియెంచి ఈ శ్రమలలో ఎవడును కదలకుండే నిమి
త్తము, మిమ్మును స్థిరపరుచుటకును, మీ విశ్వాసము
నిమిత్తము మీకు బోధపరుచుటకును, మన సహోదర
రుడును, దేవుని సేవకుడును, క్రీస్తు సువార్తలో మా
జతపనివాడునైన తీమొథెయును పంపితిమి. ఆ శ్రమ
లకు మనము నియమించబడితిమని మీరును ఎరుగు
దురు;। ఎందుకనగా మేము మీ యొద్ద ఉన్నప్పుడు— 4
శ్రమపడ బోదుమని మీతో ముందర చెప్పితిమి. ఆ
లాగు కలిగినది. అది మీకును తెలిసినది.। ఇందువల్ల 5
నేనును ఇకను సహించలేక, శోధకుడు మిమ్ము శోధిం
చుటవల్ల మా ప్రయాసము ఒక వేళ వ్యర్థమై పోవు
నేమో అని, మీ విశ్వాసమును తెలుసుకొనే నిమిత్తము
పంపితిని.

అయితే తీమొథెయు ఇప్పుడు మీ యొద్దనుంచి 6
మా యొద్దికి వచ్చి, మేము మిమ్మును చూచుటకు ఏలా
గో ఆలాగే మీరును మమ్మును చూచుటకు అపేక్షిం
చుచు ఎల్లప్పుడును మమ్మును బాగా జ్ఞాపకము చేసు
కొనుచున్నారని, మీ విశ్వాసమును గూర్చియు మీ
ప్రేమను గూర్చియు మాకు మంచి సమాచారము
తెలియ చేసెను;। అందువల్ల, సహోదరులారా! మా 7
సమస్తమైన ఇబ్బందిలోను, శ్రమలోను మీ విశ్వాస
మువల్ల మీ నిమిత్తము ఆదరించబడితిమి;। ఎందుకనగా 8
ఇప్పుడు మీరు ప్రభువు యందు స్థిరపడితే, మేము
జీవింతుము;। ఏలాగనగా, మన దేవుని యెదుట మేము 9
మీ నిమిత్తము ఏ సంతోషము పొందుచున్నామో, ఆ
సమస్త సంతోషము నిమిత్తము దేవునికి ఏమి కృతజ్ఞత
అగపరచగలము? ఎందుకనగా,। మేము మీ ముఖము 10
ను చూచుటకు, మీ విశ్వాసముయొక్క కొదువలను
సంపూర్ణము చేయుటకును దివారాత్రులు అత్యధిక
ముగా వేడుకొంటున్నాము.

మరియు మన తండ్రియైన దేవుడు తానును మన 11
ప్రభువైన యేసుక్రీస్తును మీ యొద్దికి మా మార్గ
మును సరాళము చేయునుగాక.। మన ప్రభువైన యేసు 12
క్రీస్తు తన పరిశుద్ధులందరితో వచ్చినప్పుడు, ఆయన
మన తండ్రియైన దేవుని యెదుట మీ హృదయము
లను పరిశుద్ధత యందు నిర్దోషమైనవిగా స్థిరపరిచే
నిమిత్తము మేమును మీ యెడల ఏలాగో ఆలాగే
మీరు అన్యోన్య ప్రేమతో,। మనుష్యులందరి యెడ 13
లను ప్రేమతో విస్తరించి, మిగుల ప్రబలించునట్లు
ప్రభువు చేయునుగాక.

## 4. అధ్యాయము.

కావున తుదకు, సహోదరులారా! మేము ప్రభు 1
వైన యేసుద్వారా మీకు ఇచ్చిన ఆజ్ఞలను మీరు ఎరు

* అనగా, యూదులు.

2 గుదురు గదా,। మీరు ఏలాగు నడుచుకొని దేవుని సం
తోషపరచ వలెనో అది మా వల్ల గైకొనిన ప్రకా
రము, మీరు నడుచుకొనుచున్న ప్రకారము మీరు
అంతకంతకు విస్తరించే నిమిత్తము ప్రభువైన యేసు
యందు మిమ్మును వేడుకొని, బుద్ధి చెప్పుచున్నాము;।
3,4 ఏలాగనగా, ఇది మన దేవుని ఇష్టము, అనగా మీ
పరిశుద్ధతయే, అనగా మీరు జారత్వమునకు దూరస్థులై
5 యుండ వలెను.। మీలో ప్రతివాడు, దేవుని ఎరుగని
అన్యజనుల వలె, కామాభిలాషయందు కాక, పరిశుద్ధత
యందును ఘనతయందును తనతన ఘటము సంపాదిం
6 చుటకు చూచుకొన వలెను.। ఈ విషయమందు ఎవ
డును అతిక్రమించి తన సహోదరునికి మోసము
చేయకుండ వలెను; ఎందుకనగా, మేము పూర్వము
మీతో చెప్పి ఆనబెట్టినప్రకారము, ప్రభువు వీటియ
7 న్నిటి విషయము, న్యాయము తీర్చేవాడు.। మరియు,
పరిశుద్ధత యందే, గాని అపవిత్రతకు, దేవుడు మిమ్మును
8 పిలువ లేదు.। కాబట్టి ఉపేక్షించే వాడు మనుష్యుని
కాక మాకు తన పరిశుద్ధాత్మను ఇచ్చిన దేవుని ఉపేక్షిం
చుచున్నాడు.

9 మరియు, సహోదర ప్రేమను గూర్చి నేను
మీకు వ్రాయ నక్కరలేదు; ఎందుకనగా, మీరు ఒకని
ఒకడు ప్రేమించుటకు దేవునివల్ల బోధించబడి యు
10 న్నారు.। అదియుగాక, మకెదొనియ అంతటిలో ఉన్న
సహోదరులందరి యెడలను మీరు ఆలాగున చేయు
11 చున్నారు గాని,। సహోదరులారా! మీరు మరి
12 ఎక్కువగా విస్తరించ వలెననియు,। మీరు వెలపటి వారి
యెడల మర్యాదగా నడుచుచు, మీకు ఎవని అక్కర
లేకుండుటకు మీరు శాంతులై యుండి, మేము మీకు
ఆజ్ఞాపించిన ప్రకారము మీ స్వకీయమైనవాటిని జరి
గించుచు మీ చేతులతో పని చేయుటకు ఆసక్తిపడ
వలెననియు మీకు బుద్ధి చెప్పుచున్నాము.

13 అయితే సహోదరులారా! నిరీక్షణ లేని ఇతరుల
వలె, మీరు దుఃఖపడకుండే నిమిత్తము నిద్రించుచున్న
వారిని గూర్చి మీరు ఎరుగకుండుట మాకు ఇష్టము
14 లేదు;। ఎందుకనగా, యేసు మృతిపొంది తిరిగి లేచె
నని మనము నమ్మితే, ఆ ప్రకారము దేవుడు యేసు
ద్వారా నిద్రింప చేయబడిన వారినిని ఆయనతో
15 కూడ రాజేసును.। ఎందుకనగా మేము ప్రభువు మా
టపట్టి మీతో చెప్పేదేమనగా ప్రభువుయొక్క రా
కడ పర్యంతము నిలిచి సజీవులమైన మనము, నిద్రిం
16 చినవారి కంటే ముందుగా ప్రవేశించము;। ప్రభువు
తాను ఆర్భాటముతోను ప్రధానదూతయొక్క శబ్దము
తోను దేవునిబూరతోను ఆకాశమునుంచి దిగి వచ్చు
ను. అప్పుడు క్రీస్తు యందు మృతులు ముందుగా
లేతురు.।ఆ మీదట, సజీవులమై నిలిచి యున్న మనము 17
వారితోకూడ ఏకముగా ప్రభువును ఎదురుకొనుటకు
మేఘములలో ఆకాశముపైకి కొంచుపోబడుదుము.
ఈలాగు మనము ఎల్లప్పుడును ప్రభువుతో కూడ ఉం
దుము.।కాబట్టి మీరు ఈ మాటలుపట్టి ఒకని ఒకడు 18
ఆదరించుకొనుడి.

## 5. అధ్యాయము.

సహోదరులారా! ఆ కాలములను గూర్చియు, 1
ఆ సమయములను గూర్చియు మీకు వ్రాయనక్కర
లేదు;। ఎందుకనగా, రాత్రివేళ దొంగ ఏలాగో ఆలా 2
గే ప్రభువుయొక్క దినము వచ్చునని మీకు పరిష్కా
రముగా తెలుసును.। లోకులు—నెమ్మది నిర్భయత కల 3
వని చెప్పుకొనుచుండగ, గర్భవతియైన స్త్రీకి ప్రసవ
వేదన వచ్చునట్లు, ఆకస్మికముగా నాశము వారికి సంభ
వించును గనుక వారు ఎంత మాత్రము తప్పించు
కొనలేరు.

అయితే, సహోదరులారా! ఆ దినము దొంగవలె 4
మీ మీద పడునట్లు మీరు చీకటిలో ఉండరు;।
మీరందరు వెలుగు పిల్లలు, పగటి పిల్లలునై యున్నారు. 5
మనము రాత్రివారము కాము, చీకటివారము కాము.।
కావున, మనము ఇతరులవలె నిద్రించక, మెలకువ 6
పడి, బుద్ధిమంతులమై యుందుదము.। నిద్రించే వారు 7
రాత్రి నిద్రింతురు; మత్తుగా ఉండేవారు రాత్రివేళ
మత్తుగానుందురు గాని,। పగటివారమైన మనము బుద్ధి 8
మంతులమై యుండి, విశ్వాస ప్రేమలనే మైమరు
వును, రక్షణ నిరీక్షణయనే శిరస్త్రాణమును ధరించు
కొందము;। ఎందుకనగా, మన ప్రభువైన యేసు క్రీస్తు 9
ద్వారా రక్షణ పొందుటకే గాని, కోపమునకు దేవుడు
మనలను నియమించ లేదు.। మనము మెలకువపడి 10
నను, నిద్రించినను ఆయనతో కలుసుకొని ఏకముగా
జీవించేనిమిత్తము, ఆయన మనకొరకు మృతిపొందెను.।
కాబట్టి, మీరు ఇప్పుడు చేయుచున్న ప్రకారము, 11
ఒకని ఒకడు ఆదరించి, ఒకనికి ఒకడు క్షేమాభివృద్ధి
కలుగచేయుడి.*

మరియు సహోదరులారా! మీలో ప్రయాసపడి, 12
ప్రభువు యందు మీ పైని ఉండి, మీకు బుద్ధి చెప్పే
వారిని ఎరిగి,। వారి పని నిమిత్తము వారిని ప్రేమతో 13

* లేక, ఒకనినొకడు కట్టుకొనుడి.

మిక్కిలి గొప్పగా ఎంచ వలెనని వేడుకొంటున్నాము;
మరియు ఒకనితో ఒకడు సమాధానపడుచుండుడి.

14 మరియు, సహోదరులారా! మేము మీకు బోధిం
చేది యేమనగా, అక్రమముగా నడిచే వారికి బుద్ధి
చెప్పుడి; కుంగిన మనస్సుగల వారిని ధైర్యపరచుడి;
బలహీనులకు ఊత ఇయ్యుడి. అందరి యెడల దీర్ఘ
శాంతులై యుండుడి. కీడుకు ప్రతికీడు ఎవడును ఎవని
15 కైనను చేయకుండ చూచుకొనుడి. । మీరు ఒకని యె
డల ఒకడును అందరి యెడలను ఎల్లప్పుడు మేలు
చేయ వెంబడించుచుండుడి.*

16,17 ఎల్లప్పుడును సంతోషముగా ఉండుడి. । ఎడతె
18 గక ప్రార్థన చేయుడి. । అన్నిటి యందు కృతజ్ఞత అగ
పరచుడి; ఇది యేసు క్రీస్తు యందు మీ యెడల దేవుని
ఇష్టమై యున్నది.
19,20 ఆత్మను ఆర్పకుడి. । ప్రవచనములను తిరస్కరించ
కుడి. । సమస్తమును పరీక్షించి యుక్తమైన దాని పట్టు 21
కొనుడి. । ప్రతివిధమైన కీడుకు దూరముగా ఉండుడి. 22

అయితే, సమాధాన దేవుడు తానే మిమ్మును సం 23
పూర్ణముగా పరిశుద్ధపరుచు గాక. మరియు, మీ
ఆత్మ, జీవాత్మ, శరీరమును మన ప్రభువైన యేసుక్రీస్తు
వచ్చినప్పుడు నిర్దోషముగా కేవలము కాపాడబడు
గాక. । మిమ్మును పిలిచిన వాడు నమ్మకమైన వాడు 24
గనుక ఆలాగు చేసును.

సహోదరులారా! మా కొరకు ప్రార్థించుడి. । 25
సహోదరులందరిని పరిశుద్ధమైన ముద్దుతో కౌగిలిం 26
చుడి.

పరిశుద్ధ సహోదరులందరి యొద్ద ఈ పత్రిక చదు 27
వబడుటకు, ప్రభువు పేర మీకు ఆనబెట్టుచున్నాను.

మన ప్రభువైన యేసు క్రీస్తు కృప మీకు తోడై 28
యుండుగాక.

* లేక, తరుముచుండుడి.

అపొస్తలుడైన పౌలు

# థెస్సలొనీకైయులకు పంపిన

## రెండవ ఉత్తరము.

### 1. అధ్యాయము.

1 మన తండ్రియైన దేవుని యందును, ప్రభువైన యేసు
క్రీస్తు యందును ఉండే థెస్సలొనీకైయుల సంఘము
నకు పౌలు, సిల్వాను, తీమొథెయు (వ్రాసినది.)
2 మన తండ్రియైన దేవుని వల్లను, ప్రభువైన యేసు
క్రీస్తు వల్లను కృపయు సమాధానమును మీకు కలుగు
గాక.

3 సహోదరులారా! తగిన ప్రకారము, మేము ఎల్ల
ప్పుడును మీ నిమిత్తము దేవునికి కృతజ్ఞత అగపరుచు
టకు బాధ్యతపడి యున్నాము; ఎందుకనగా మీ
4 విశ్వాసము మిక్కిలి అభివృద్ధి పొందుచున్నది.। మీ అం
దరిలో ప్రతివాని అన్యోన్యమైన ప్రేమ విస్తరించుచు
న్నది. అందునిమిత్తము మీరు అనుభవించే మీ హిం
సాబాధలన్నిటిలో మీ ఓపుకె కొరకును, విశ్వాసము
కొరకును, మేము దేవుని సంఘములలో మీ యందు
5 అతిశయపడుచున్నాము.। దేని కొరకు మీరు ఇప్పుడు
శ్రమపడుచున్నారో, ఆ దేవుని రాజ్యమునకు మీరు
యోగ్యులని యెంచబడే నిమిత్తము, ఇది దేవుని న్యా
6-10 యమైన తీర్పునకు దృష్టాంతమై యున్నది.। ఎందు
కనగా, దేవుని ఎరుగక, మన ప్రభువైన యేసు క్రీస్తు
సువార్తకు లోబడని వారికి ప్రతి దండన చేయుటకు,
ప్రభువైన యేసు తన శక్తి సంబంధులైన దూతలతో
ఆకాశమునుంచి అగ్నిజ్వాలలో, ప్రత్యక్షమైనప్పుడు,
మిమ్మును హింసించే వారికి హింసను, హింసించబడే
మీకు మాతో కూడ విశ్రాంతిని ఇచ్చుట దేవునికి
న్యాయమైనదికాదా! ఆ దినమున, తన పరిశుద్ధుల యం
దు మహిమపరచబడుటకును, మీ యెడల మా సాక్ష్య
ము నమ్మబడినందున, విశ్వసించిన వారందరికిని ఆశ్చ
ర్యము కలిగించుటకును, ప్రభువు వచ్చినప్పుడు, అట్టి
వారు ఆయన సమ్ముఖమునుంచి, ఆయన పరాక్రమ
సంబంధమైన మహిమనుంచి, నిత్యమైన నాశనమనే
న్యాయదండన పొందుదురు.
11,12 అందునిమిత్తము మన దేవుని యొక్కయు ప్రభు
వైన యేసు యొక్కయు కృప చొప్పున, మీ యందు
మన ప్రభువైన యేసు క్రీస్తు నామమునకును, ఆయన
యందు మీకును మహిమ కలిగేనిమిత్తము,। దేవుడు ఈ
పిలుపునకు మిమ్మును యోగ్యులని యెంచి, మంచితన
మును గూర్చిన ప్రతి యోగ్యాలోచనను, విశ్వాస
క్రియను బలముతో నెరవేర్చ వలెనని మీ కొరకు ఎల్ల
ప్పుడును ప్రార్థించుచున్నాము.

### 2. అధ్యాయము.

మరియు సహోదరులారా! మన ప్రభువైన యే 1,2
సు క్రీస్తు రాకడను గూర్చియు మనము ఆయన యొద్ద
కూడుకొనుటను గూర్చియు, క్రీస్తుయొక్క దినము చేరి
యున్నట్లు, ఆత్మవల్లనైనను మాట వల్లనైనను మా యొద్ద
నుంచి వచ్చినదనిన పత్రికవల్లనైనను మీరు త్వరగా
చంచలమనస్కులు కాకుండుటకైనను, కలతపడకుండు
టకైనను మిమ్మును వేడుకొంటున్నాము.। ఏ విధము 3
గానైనను ఎవడును మిమ్మును మోసపరచనియ్యకుడి;
ఎందుకనగా, మొదట ఆ భ్రష్టత్వము వచ్చుటయు,
ఆ పాపమనుష్యుడు,। అనగా, ఎవడు ఎదిరించుచు, 4
దేవుని మందిరములో కూర్చుండి తానే దేవుడనని తన్ను
అగపరుచుకొనినట్లు, ఏది దేవుడనబడునో, ఏది పూ
జ్యమనబడునో దానియంతటి మీద తన్ను తానే హె
చ్చించుకొనుచున్న ఆ నాశన కుమారుడు బైలుబడు
టయు కలిగితేనే గాని (ఆ దినము రాదు.)
నేను ఇంక మీ యొద్ద ఉన్నప్పుడు, వీటిని మీతో 5
చెప్పుచుంటినని మీకు జ్ఞాపకము లేదా.। కాగా వా 6
డు తన స్వకాలమందు బైలుపరచబడే నిమిత్తము,
ఇప్పుడు అడ్డగించేది ఏదో అది మీరు యెరిగియున్నా
రు.।అయినను బోధనపరిత్యాగమనే మర్మము ఇప్పుడు 7
జరగుచున్నది, గాని అడ్డగించేవాడు మధ్యనుంచి తియ్య
బడే పర్యంతమే.। అప్పుడు ఆ బోధన పరిత్యాగి బైలు 8
పరచబడును. ప్రభువైన యేసు తన ముఖ నిశ్వాసము
వల్ల వాని క్షీణింపచేసి, తన రాకడ ప్రకాశమువల్ల సం
హరించును.। వాని* రాకడ అబద్ధముయొక్క సమస్త 9

* అనగా, ఆ బోధనవిరోధి.

మైన బలముతోను ఆనవాళ్లతోను అద్భుతములతోను,।
10 రక్షించబడుటకు సత్యమందలి ప్రేమను అంగీకరించక
పోయినందున నశించుచున్న వారిలో అన్యాయము యొ
క్క సమస్తమైన మోసముతోను, సైతాను బలము జరిగిం
11,12 చేప్రకారము* ఉండును.।ఇందువల్ల వారు సత్యము
నమ్మక,అన్యాయమందు ఇచ్ఛగల వారందరును శిక్షావిధి
పొందే నిమిత్తము,।వారు ఆ అబద్ధము నమ్ముటకు మోస
ము జరిగించే బలము దేవుడు వారికి పంపుచున్నాడు.

13 అయినను ప్రభువునల్ల ప్రేమించబడిన సహోదర
లారా! ఆత్మ పరిశుద్ధపరుచుట వల్లను సత్యము నమ్ముట
వల్లను రక్షణ కొరకు దేవుడు ఆదినుంచి మిమ్మును ఏర్ప
రుచుకొనెనని, మేము మీ నిమిత్తము ఎల్లప్పుడు దేవు
నికి కృతజ్ఞత అగపరుచుటకు, బాధ్యులమై యున్నా
14 ము.।అందు నిమిత్తము మీరు మన ప్రభువైన యేసు
క్రీస్తుయొక్క మహిమ పొందుటకు, ఆయన మా సు
వార్తవల్ల మిమ్మును పిలిచెను.

15 కాబట్టి, సహోదరులారా! నిలుకడగా ఉండి మా
మాట వల్లనైనను మా పత్రికవల్లనైనను మీకు బోధించ
16 బడిన విధులను గట్టిగా పట్టుకొనుడి.।మన ప్రభువైన
యేసు క్రీస్తు తానును, మనలను ప్రేమించి కృపయందు
నిత్యమైన నెమ్మదియు, మంచి నిరీక్షణయుఇచ్చిన మన
తండ్రియైన దేవుడును మీ హృదయములకు నెమ్మది కల
గచేసి, ప్రతి సద్వాక్యమందును ప్రతి సత్కార్యమం
దును మిమ్మును స్థిరపరుతురు గాక.

## 3. అధ్యాయము.

1,2 తుదకు, సహోదరులారా! మీలో ఉన్న ప్రకా
రము, ప్రభువుయొక్క వాక్యము వ్యాపించి, పరుగెత్తి,
మహిమ పొందే నిమిత్తమును,।మేము మూర్ఖులైన
దుష్టమనుష్యులనుంచి తప్పించబడే నిమిత్తమును మా
కొరకు ప్రార్థించుడి; ఎందుకనగా, విశ్వాసము అంద
3 రిది కాదు.।అయినను ప్రభువు నమ్మకముగా ఉన్నా
డు. ఆయన మిమ్మును స్థిరపరిచి కీడునుంచి కాపాడు
4 ను.।మరియు మేము మీకు ఆజ్ఞాపించే వాటిని మీరు
చేయుచున్నారనియు చేతురనియు ప్రభువు యందు
మిమ్మును గూర్చి నమ్ముచున్నాము.।ప్రభువు, దేవుని 5
ప్రేమకును క్రీస్తు ఓర్పునకును మీ హృదయములను
నడిపించుగాక.

మరియు, సహోదరులారా! మీరు మా వల్ల పొం 6
దిన పద్ధతుల ప్రకారము కాక, అక్రమముగా నడిచే
ప్రతి సహోదరుని యొద్దనుంచి తొలగిపో వలెనని
మన ప్రభువైన యేసు క్రీస్తు పేరట మీకు ఆజ్ఞాపిం
చుచున్నాము;।ఎందుకనగా మమ్మును ఏలాగు వెంబ 7
డించ† వలెనో అది మీకు తెలుసును. ఏలాగనగా,
మేము మీలో అక్రమముగా నడువక,।ఎవని యొద్దను 8
ఉచితముగా ఆహారము పుచ్చుకొనలేదు గాని, మేము
మీలో ఎవని మీదను భారము మోప కూడదని ప్రయా
సముతోను కష్టముతోను దివారాత్రులు పని చేయు
చుంటిమి.।మీరు మమ్మును పోలియుండ వలెనని మమ్మును 9
మేము మచ్చుగా అగపరిచే నిమిత్తమేగాని, మాకు అధి
కారము లేదని కాదు;।మరియు మేము మీ యొద్ద 10
ఉన్నప్పుడు—ఎవడైనను పని చేయనొల్లక పోతే, తిన
కూడదని మీకు ఆజ్ఞాపించినది ఇదేగదా!।మీలో 11
కొందరు ఏ పని చేయక పరుల జోలికి పోవుచు, అక్ర
మముగా నడుచుచున్నారని వింటున్నాము.।అట్టివారు 12
నిమ్మళముగా పని చేయుచు, తమ స్వకీయమైన ఆహా
రము తిన వలెనని మన ప్రభువైన యేసు క్రీస్తు పేర
వారికి ఆజ్ఞాపించి బుద్ధి చెప్పుచున్నాము.

అయితే సహోదరులారా! యుక్తముగా ప్రవర్తిం 13
చుటకు‡ విసకవద్దు.।ఈ పత్రికవల్లనైన మా మాటకు 14
ఎవడైనను లోబడని యెడల, అతడు సిగ్గుపడే నిమిత్త
ము, అతనికి గురుతు వేసి అతనితో సహవాసము చేయ
వద్దు.।అయినను అతని శత్రువుడని యెంచక, సహో 15
దరుడని అతనికి బుద్ధి చెప్పుడి.

సమాధాన ప్రభువు తాను ఎల్లప్పుడును ప్రతి విధ 16
ము చేతను మీకు సమాధానము ఇచ్చుగాక. ప్రభువు
మీ అందరికి తోడై యుండుగాక.

పౌలుననే నా చేవ్రాత వల్లనైన ఆశీర్వచనము; ఇది 17
ప్రతి పత్రికయందును నా గురుతై యున్నది; ఆలాగు
వ్రాయుచున్నాను.

మన ప్రభువైన యేసు క్రీస్తుయొక్క కృప మీ 18
కందరికి తోడై యుండు గాక.

* లేక, శక్తి ప్రకారము. † లేక, అనుసరించ. ‡ లేక, మేలు చేయుటకు.

అపొస్తలైన పౌలు

# తిమొథెయుకు పంపిన

## మొదటి ఉత్తరము.

### 1. అధ్యాయము.

1 మన రక్షకుడైన దేవుని యొక్కయు, మననిరీక్షణ
యైన యేసు క్రీస్తుయొక్కయు ఆజ్ఞాప్రకారము యేసు
క్రీస్తు యొక్క అపొస్తలైన పౌలు (వ్రాసినది;)
2 విశ్వాసమందు నా నిజమైన కుమారుడగు తీమొథె
యుకు, తండ్రియైన దేవుని వల్లను, మన ప్రభువైన
యేసు క్రీస్తు వల్లను కృపయు, కరుణయు, సమాధాన
ము కలుగుగాక.

3,4 నేను మకెదొనియకు వెళ్లుచుండగా, ఇతర బోధ
చేయ వద్దనియు, విశ్వాసమందున్న, దేవుని యేర్పాటు
కంటే తర్కములను ఎక్కువగా జరిగించే కల్పనాకథ
లను, మితములేని వంశావళులను లక్ష్యపెట్ట వద్దనియు
కొందరికి ఆజ్ఞాపించే నిమిత్తము, నీవు ఎఫెసులో ఉండ
వలెనని నిన్ను వేడుకొనిన ప్రకారము (చేయుము).

5 ఆజ్ఞయొక్క అభిప్రాయము ఏదనగా, పవిత్రహృ
దయమునుంచి, మంచి మనస్సాక్షినుంచి, నిష్కపటమైన
6 విశ్వాసమునుంచియు కలుగు ప్రేమ. । వీటినుంచి కొం
దరు తప్పిపోయి, బోధనప్రమాణ బోధకులై యుండ
7 గోరి, । తాము చెప్పే వాటినైనను, వేటిని గూర్చి
రూఢిగా పలుకుదురో వాటినైనను గ్రహించక, వట్టి
8- వదురు మాటలతట్టు తమ్ము తాము తిప్పుకొనిరి. । అయి
11 నను, నాకు అప్పగించబడిన, ధన్యుడగు* దేవుని మహి
మగల సువార్త ప్రకారము, బోధన ప్రమాణము అనీతి
మంతులకు, అవిధేయులకు, భక్తిహీనులకు పాపిష్ఠులకు,
అపరిశుద్ధులకు, మతదూషకులకు, పితృ హంతకులకు,
మాతృ హంతకులకు, నరహంతకులకు, । వ్యభిచారులకు,
పురుషసంయోగులకు, మనుష్యచోరులకు, అబద్ధికులకు,
అప్రమాణికులకును, స్వస్థబోధకు విరోధమైనది మరి
యేదైనను ఉంటే (దానికిని) నియమించబడెను గాని,
నీతిమంతునికి కాదని ఎవడైనను ఎరిగి బోధన ప్రమా
ణమునకు అనుకూలముగా దాని వాడుకొనినయెడల,
అది మంచిదని యెరుగుదుము.

12,13 పూర్వము దూషకుడను, తరుమువాడను, హిం
సకుడనునైన నన్ను సేవలోకి చేర్చుకొని, నన్ను నమ్మక
మైన వానిగా ఎంచినందున, నన్ను బలపరిచిన వాని
గూర్చి, అనగా మన ప్రభువైన యేసు క్రీస్తు యెడల
కృతజ్ఞుడనై యున్నాను. అయినను, తెలివి లేనివా
డనై అవిశ్వాసమందు చేసినాను గనుక కనికరించ
బడితిని. । అయితే మన ప్రభువుయొక్క కృప, యేసు 14
క్రీస్తుయందున్న విశ్వాసముతోను ప్రేమతోను అత్య
ధికముగా విస్తరించెను.

పాపులను రక్షించుటకు, క్రీస్తయిన యేసు లోక 15
మునకు వచ్చెననే వాక్యము నమ్మ తగినదియు పూ
ర్ణాంగీకారమునకు యోగ్యమైనదియునై యున్నది;
వారిలో నేను మొదటి వాడనై యున్నాను. । అయి 16
నను, యేసు క్రీస్తు తనయందు నిత్యజీవము నిమిత్తము
విశ్వసించ బోయేవారికి మచ్చుగా, తన పూర్ణమైన
దీర్ఘ శాంతమును, ఆ మొదటి వాడనైన నాయందు
అగపరిచే నిమిత్తము, నేను కనికరించబడితిని.

యుగముల రాజుకు† అనగా అక్షయుడు, అదృ 17
శ్యుడు, అద్వితీయుడునైన దేవునికి ఘనతయు, మహి
మయు యుగయుగముల పర్యంతము కలుగు గాక;
ఆమేన్.

కుమారుడవైన తీమొథెయా! నిన్ను గూర్చి ముం 18
దర చెప్పబడిన ప్రవచనముల ప్రకారము, నీవు, విశ్వా
సము మంచి మనస్సాక్షియు కలిగి, వాటిలో‡ ఈ
మంచి యుద్ధము జరిగించే నిమిత్తము, ఈ ఆజ్ఞను నీకు
అప్పగించుచున్నాను. । అట్టి మనస్సాక్షిని కొందరు 19
త్రోసివేసి, విశ్వాస విషయము, బద్దలైన ఓడవలెనుండి
యున్నారు. । వారిలో హుమనైయు, అలెక్షంద్రును 20
ఉన్నారు. వీరు దూషించకుండుటకు శిక్షించబడేనిమి
త్తము, వీరిని సైతానుకు ఒప్పగించితిని.

### 2. అధ్యాయము.

కాబట్టి అన్నిటిలో ముఖ్యముగా నేను బోధిం 1
చుచున్న దేమనగా, మనము, సంపూర్ణమైన భక్తియు,
మాన్యత కలిగి, నెమ్మదిగాను సుఖముగాను బ్రతికే
నిమిత్తము, మనుష్యులందరి కొరకును, । రాజుల కొరకును, 2
అధికారము గల వారందరి కొరకును, యాచనలు,

* లేక, శ్రీమంతుడగు. † లేక, నిత్యుడైన రాజుకు. ‡ అనగా ఆ ప్రవచనములలో.

ప్రార్థనలు, విజ్ఞాపనములు, కృతజ్ఞోపకార స్తోత్ర
3- ములు చేయబడ వలెను. । ఎందుకనగా, మనుష్యులం
4 దరు రక్షణ పొందుటకును, సత్య విజ్ఞానముమట్టుకు, చే
రుటకును ఇచ్ఛయించే మన రక్షకుడగు దేవుని యెదుట,
5 ఇది మంచిదియు ఇష్టమైనదియునై యున్నది; । ఎందు
కనగా, ఒక్కడే దేవుడు; దేవునికి మనుష్యులకు మధ్య
వర్తియు ఒక్కడే; ఆయన క్రీస్తయిన యేసనే మను
6 ష్యుడు. । ఈయన అందరికొరకు తన్ను తానే విమో
చన క్రయధనముగా ఇచ్చెను; అది స్వకాలముల యం
7 దలి సాక్ష్యము. । సత్యమే చెప్పుచున్నాను, అబద్ధ మా
డను; అందు నిమిత్తము నేను ప్రకటించువాడనుగా,
అపొస్తలునుగా, విశ్వాస సత్యముల ముందు అన్యులకు
బోధకుడనుగాను నియమించ బడితిని.

8 కావున ప్రతి స్థలమందు పురుషులు, కోపము
సంశయము లేకుండ, పవిత్రమైన చేతులెత్తి ప్రా
9 ర్థించ వలెనని కోరుచున్నాను. । అలాగు స్త్రీలును,
అణకువతోను స్వస్థ బుద్ధితోను, తగిన వస్త్రముల చేత
నేగాని, జడ వెంట్రుకలతోనైనను, బంగారముతో
నైనను, ముత్యములతోనైనను, మిక్కిలి వెలగల వస్త్ర
10 ములతోనైనను కాక, । దైవభక్తి గల వారమని చెప్పు
కొనే స్త్రీలకు తగిన ప్రకారముగా మంచి క్రియల
11 వల్ల తమ్ము తామే అలంకరించుకొన వలెను. । స్త్రీలు
మౌనముగా ఉండి సంపూర్ణ విధేయతతో బోధ
పరుచుకొన వలెను; అయితే బోధించుటకైనను, పురు
షుని మీద అధికారము చేయుటకైనను స్త్రీకి సెలవి
13 య్యను; ఆమె మౌనముగా ఉండ వలెను; । ఎందుకన
గా, మొదట ఆదాము, తరువాత ఏవయు నిర్మించబడి
14 రి. । మరియు ఆదాము మోసపరచ బడలేదు గాని, స్త్రీ
మోసపరచబడి, అపరాధములో పడెను. అయినను
స్వస్థబుద్ధితో వారు విశ్వాస ప్రేమ పరిశుద్ధతల
యందు నిలుకడగా ఉంటే, శిశు ప్రసూతి ద్వారా
ఆమె రక్షించబడును.

## 3. అధ్యాయము.

1 ఎవడైనను అధ్యక్షతను ఆశించితే, దొడ్డపని కోరు
2 చున్నాడనే మాట నమ్మ తగినదై యున్నది. । కాగా,
అధ్యక్షుడు నిందారహితుడును, ఏకపత్నీ పురుషుడు
ను, జాగ్రత్త గల వాడును, స్వస్థబుద్ధి గలవాడును,
మర్యాదగల వాడును, ఆతిథ్య ప్రియుడును, బోధించ
3 తగినవాడునై, । మద్యపానియు, కొట్టువాడును కాక,
సాత్వికుడును, జగడమాడని వాడును, ధనాపేక్ష లేని
వాడునై, సంపూర్ణ మాన్యతతో తన పిల్లలను లో
పరుచుకొనుచు, । తన యింటి వారిని బాగా ఏలే 4
వాడునై యుండ వలెను; । ఎవడైనను తన యింటివా 5
రిని ఏలుట ఎరుగకపోతే, అతడు దేవుని సంఘమును
ఏలాగు పరిపాలించ గలడు?। అతడు గర్వమనే మబ్బు 6
కలిగి, సైతానువలె శిక్షావిధికి లోబడకుండుటకు, కొత్త
గా చేరినవాడై యుండక, । నిందలోను, సైతాను ఉరి 7
లోను పడకుండే నిమిత్తము, పైవారివల్ల మంచి సాక్ష్య
ము పొందినవాడై యుండ వలెను.

ఆలాగున పరిచారకులు మాన్యులై, రెండు నాలు 8
కలు గలవారును, మిగుల మద్యపానాసక్తులును, దుర్లా
భము అపేక్షించే వారునై యుండక, । విశ్వాసముయొ 9
క్క మర్మమును పవిత్రమైన మనస్సాక్షితో గైకొనే
వారై యుండ వలెను. । మరియు, వారును మొదట 10
పరీక్షించబడ వలెను; తరువాత, వారు అనింద్యులైతే,
పరిచారకులై యుండనిమ్ము. । అటువలె, వారి భార్యలు 11
మాన్యులై, కొండెములు చెప్పని వారును, స్వస్థబుద్ధి గల
వారును, అన్నిటియందు నమ్మకమైన వారునై యుండ
వలెను.

పరిచారకులు ఒక్కొక్క స్త్రీకి పురుషులై, పిల్లలను, 12
తమ యింటి వారిని బాగా ఏలువారై యుండవలెను;।
ఎందుకనగా, పరిచారకులై ఆ పని బాగా చేసినవారు 13
యేసు క్రీస్తు యందలి విశ్వాసమందు, మంచి అభివృ
ద్ధిని బహు ధైర్యమును సంపాదించుకొందురు.

శీఘ్రముగా నీ యొద్దికి వచ్చుటకు నిరీక్షించుచు 14-
న్నాను గాని । నేను ఆలస్యము చేసే పక్షమందు, జీవము 15
గల దేవుని సంఘములో, అనగా సత్యముయొక్క స్తం
భమును ఆధారమునైన దేవుని ఇంటిలో నీవు ఏలాగు
ప్రవర్తించ వలెనో అది నీకు తెలియబడే నిమి
త్తము వీటిని నీకు వ్రాయుచున్నాను. । దైవభక్తియొక్క 16
మర్మము నిరాక్షేపముగా గొప్పదై యున్నది; ఆయన
సశరీరుడై ప్రత్యక్షమాయెను; ఆత్మ యందు నీతిమం
తుడని తీర్చబడెను; దూతలకు అగపడెను; ప్రజలలో
ప్రకటించబడెను; లోకమందు నమ్మబడెను; మహిమ
లోకి ఎత్తబడెను.

## 4. అధ్యాయము.

అయితే వచ్చే దినములలో, అబద్ధమాడేవారి వేష 1,2
ధారణవల్ల, కొందరు మోసపరిచే ఆత్మల యందును
దయ్యముల బోధయందును లక్ష్యముంచి, విశ్వాసత్యా
గము చేతురని, ఆత్మ తేటగా చెప్పుచున్నది. । (ఆ అబ 3
ద్ధికులు) తమ మనస్సాక్షి యందు వాత వేయబడి,
పెండ్లాడుట నిషేధించుచు, కృతజ్ఞతతో పుచ్చుకొను
టకు, విశ్వాసమును సత్యవిజ్ఞానమును కలిగిన వారి కొ

రకు దేవుడు సృజించిన కొన్ని ఆహారములను మాన
4 వలెనని చెప్పుచుందురు; । ఎందుకనగా దేవుని సృష్టి
యావత్తును మంచిది; కృతజ్ఞతతో పుచ్చుకొనబడుచు
5 న్నది యేదియు త్యాజ్యము కాదు; । ఎందుకనగా, అది
దేవుని వాక్యము వలన పరిశుద్ధపరచబడును.

6 వీటిని నీవు సహోదరులకు వివరించుచుండగా,
నీవు అనుసరించిన సుబోధ యొక్కయు విశ్వాసము
యొక్కయు వాక్యములచేత పెంచబడుచు, యేసు
7 క్రీస్తు యొక్క మంచి సేవకుడవై యుందువు. । వృద్ధ
స్త్రీల యొక్క అపరిశుద్ధమైన కథలను విసర్జించుము
గాని, దేవభక్తి నిమిత్తము, నీకు నీవే సాము చేసుకొ
8 నుము; । ఎందుకనగా, శరీర సంబంధమైన సాము కొం
తమట్టుకే ప్రయోజనమవును గాని దేవభక్తికి, ఇప్పటి
జీవమును గూర్చి రాబోయే జీవమును గూర్చి వాగ్దత్త
ము చేయబడినందున, అది అన్నిటికి ప్రయోజనమై
9 యున్నది. । ఈ వాక్యము నమ్మ తగినదియు పూర్ణాంగీ
10 కారమునకు తగినదియునై యున్నది. । ఎందుకనగా,
మనుష్యులకందరికి, విశేషముగా విశ్వాసులకు రక్షకు
డైన జీవము గల దేవుని యందు నిరీక్షణ ఉంచి యు
న్నాము గనుక, ఇందు నిమిత్తము ప్రయాసపడుచు
అవమానము పొందుచున్నాము.

11,12 వీటిని ఆజ్ఞాపించి బోధించుము; । నీ యౌవనము
ఎవనిని ఉపేక్షించ నియ్యకుము. మాట యందు నడత
యందు ప్రేమ యందు విశ్వాసమందు పవిత్రత యం
13 దు విశ్వాసులకు మచ్చుగా ఉండుము. । నేను వచ్చే
పర్యంతము, చదివి వినిపించుట యందు బుద్ధి చెప్పుట
14 యందు బోధించుట యందును జాగ్రత్తపడుము. । పె
ద్దలు చేతులుంచగా ప్రవచనము ద్వారా, నీకు ఇయ్య
బడి, నీలో ఉన్న వరమును గూర్చి అలక్ష్యము చేయ
15 కుము. । నీ అభివృద్ధి అందరికి తేటబడే నిమిత్తము వీటి
యందు మనస్కరించుము; వీటిలో సాము చేసుకొను
16 ము.* । నిన్ను గూర్చి, నీ బోధను గూర్చి చూచుకొను
ము; వీటిలో నిలిచి యుండుము; నీవు ఆలాగు చేసి
నిన్ను, నీ మాట వినే వారిని కూడ రక్షించుకొందువు.

## 5. అధ్యాయము.

1 వృద్ధుని గద్దించక తండ్రి అని బుద్ధి చెప్పుము; అన్న
2 దమ్ములని యౌవనస్థులను, । తల్లులని వృద్ధ స్త్రీలను, అక్క
చెల్లెండ్రు అని పూర్ణపవిత్రతతో యౌవన స్త్రీలను
3 చూచి బుద్ధి చెప్పుము. । నిజముగా విధవలైన విధవలను
4 సన్మానించుము, । కాని ఏ విధవకైనను పిల్లలు కానీ
మనుమలు కానీ ఉండిన యెడల, వీరు తమ ఇంట భక్తి
కనపరుచుటయు తమ తలిదండ్రులకు ప్రత్యుపకార
ము చేయుటయు మొదట నేర్చుకొన వలెను. ఇది
దేవుని దృష్టికి మంచిది, ఇష్టమైనదియునై యున్నది.

అయినను ఒంటిగా విడువబడి నిజమైన విధవ, దేవుని 5
ఆశ్రయించుచు, యాచనల యందు, ప్రార్థనల యందు,
దివారాత్రము నిలుకడగా ఉండును. । సుఖభోగముల 6
యందు ప్రవర్తించుచున్నది సజీవురాలై యుండగా,
చచ్చినదై యున్నది. । వారు నిర్దోషులై యుండే నిమి 7
త్తము వీటిని ఆజ్ఞాపించుము. । ఎవడైనను స్వకీయు 8
లను విశేషముగా తన యింటివారిని సంరక్షించకపోతే,
వాడు విశ్వాసత్యాగము చేసి, విశ్వాసము లేని వాని
కంటే దుష్టుడై యుండును.

అరువది యేండ్ల కంటే తక్కువ కాక, ఒక్క పురు 9
షునికే భార్యయై, । మంచి పనుల యందు పేరు పొం 10
దిన విధవ, పిల్లలను పెంచి, ఆతిథ్యముచేసి, పరిశుద్ధుల
పాదములను కడిగి, బాధపడుచున్న వారికి సహాయ
ము చేసి, ప్రతి సత్కార్యమును వెంబడించినదైతేనే
గాని ఆమె, విధవల లెక్కలో చేర్చబడనియ్యకుము.

తక్కువ వయస్సు గల విధవలను చేర్చ కూడదు; 11,12
వారు క్రీస్తుకు విరోధముగా నిరంకుశలైనప్పుడు పెం
డ్లాడ గోరి, తమ మొదటి విశ్వాసము విడిచినారనే†
తీర్పు వహింతురు. । మరియు వారు యింటింటికి తిరు 13
గులాడుచు, బద్ధకురాండ్లు మాత్రమే కాక, వదరువా
రును, పరుల జోలికి వచ్చే వారునై, పలుక రాని మా
టలు పలుకుదురు.

కాబట్టి యౌవన స్త్రీలు వివాహము చేసుకొని, పిల్ల 14
లను కని, గృహ పరిపాలన జరిగించి, నింద నిమిత్తము
ఏ హేతువును విరోధికియ్యకుండ వలెనని కోరుచు
న్నాను. । ఇంతకు ముందు కొందరు తోవనుంచి తొలగి 15
సైతానును వెంబడించి యున్నారు.

విశ్వాసము గల పురుషునికైనను స్త్రీకైనను విధవలు 16
ఉంటే, సంఘము నిజమైన విధవలకు సహాయము చేసే
నిమిత్తము, దాని మీద భారముంచక వారే వీరికి సహా
యము చేయ వలెను.

బాగా అధికారము చేసే పెద్దలు, వాక్యమందును । 17
ఉపదేశమందును ప్రయాసపడే వారు విశేషముగా,
రెట్టింపు సన్మానమునకు పాత్రులని యెంచబడనిమ్ము. ।
అటువలె — నూర్చే యెద్దు మూతికి బుట్ట వేయ వద్దని 18
లేఖనము చెప్పుచున్నది. మరియు—పనివాడు తన జీత
మునకు పాత్రుడు.

* అభ్యసించుకొనుము. † లేక, మా మొదటి విశ్వాసము విడిచినామనే.

19 ఇద్దరు ముగ్గురు సాక్షుల యెదుటనే* గాని పెద్దకు
విరోధముగా దోషారోపణ అంగీకరించకుము.
20 ఇతరులు భయపడే నిమిత్తము, పాపము చేసే వా
రిని, అందరి యెదుట గద్దించుము.
21 పక్షపాతముతోనైనను, విచారణ చేయక మును
పైనను ఏదియు చేయక వీటిని గైకొన వలెనని దేవుని
యెదుటను యేసు క్రీస్తు యెదుటను, ఏర్పరచబడిన
దూతల యెదుటను నీకు ఆనబెట్టుచున్నాను.
22 ఎవని మీదనైనను త్వరగా చేతులను ఉంచకుము;
పరుల పాపములలో పాలివాడవై యుండకుము. నిన్ను
23 నీవే పవిత్రునిగా కాపాడుకొనుము. । ఇకను నీళ్లు తా
గువాడవు కాక, నీ కడుపుకొరకు, తరుచుగా వచ్చే నీ
బలహీనతల కొరకు కొంచెము ద్రాక్షారసము పుచ్చు
కొనుము.
24 కొందరు మనుష్యుల పాపములు తేటగా బైలుపడి
న్యాయపు తీర్పునకు ముందర నడుచుచున్నవి; మరి కొం
దరిని వెంబడించుచున్నవి. అటువలె కొందరి మంచి
క్రియలు తేటగా బైట బడును, ఆలాగు కానివి దాచ
బడ నేరవు,

## 6. అధ్యాయము.

1 దేవుని నామము ఆయన బోధయు దూషించబడ
కుండే నిమిత్తము, ఎందరు దాసులై కాడి కిందనున్నా
రో వారు తమ యజమానులు పూర్ణమైన ఘనతకు
2 పాత్రులని యెంచ వలెను. । విశ్వాసులైన యజమానులు
గలవారు, వారు సహోదరులని వారిని నిర్లక్ష్యపెట్టక,
ఈ ఉపకారము పొందే వారు విశ్వాసులు ప్రియు
లునై యున్నారని మరి యెక్కువగా వారికి సేవచేయ
వలెను. వీటిని బోధించి బుద్ధి చెప్పుము.
3 ఎవడైనను మన ప్రభువైన యేసు క్రీస్తు యొక్క
స్వస్థవాక్యములను, దైవ భక్తికి అనుగుణమైన బోధను
4 అంగీకరించక, వేరే రీతిగా ఉపదేశించితే, । అతడు గర్వ
మనే మబ్బుచేత కప్పబడి, ఏమియు ఎరుగక, తర్క
ములను గూర్చి, వాగ్వాదములను గూర్చి ప్రయాస
పడుచున్నాడు. వాటి మూలముగా అసూయ, జగడ
5 ము, దూషణలు, దురనుమానములు, । చెరపబడిన మన
స్సు గల సత్యహీనులై దైవ భక్తి లాభవ్యాపారమను
కొనే మనుష్యుల వ్యర్థ వివాదములును కలుగుచు
6 న్నవి. । అయినను సంతుష్టిసహితమైన దైవ భక్తి బహు
7 లాభవ్యాపారమై యున్నది; । మనము ఈ లోకము
లోకి ఏమియు తేలేదు; దీనిలోనుంచి ఏమియు తీసు
8 కొని వెళ్ల లేమని విశదమై యున్నది. । కాగా అన్న
వస్త్రములు గలవారమై యుండగా, వాటివల్ల తృప్తి
పొందుదుము†. । ధనవంతులౌటకు అపేక్షించే వారు 9
శోధనలోను, ఉరిలోను, అవివేకమైనవియు హానికర
మైనవియునైన అనేక దురాశలలోను పడుదురు. అ
ట్టివి మనుష్యులను నాశన ప్రళయములలో ముంచివే
సును; । ఎందుకనగా, ధనప్రేమ‡ సమస్తమైన కీడులకు 10
ఒక వేరుగా ఉన్నది. కొందరు దాని ఆశించి, విశ్వా
సమునుంచి తొలగి, నానా దుఃఖములతో తమ్ము తామే
పొడుచుకొనిరి.

అయితే, దేవుని మనుష్యుడా! నీవు వీటికి దూర 11
ముగానుండి, నీతిని, భక్తిని, విశ్వాసమును, ప్రేమను,
ఓర్పును, సాత్వికమును అనుసరించుము. । విశ్వాసము 12
యొక్క పోరాటము పోరాడుము; నిత్యజీవమును
గ్రహించుము. దాని నిమిత్తము నీవు పిలువబడి, అనేక
సాక్షుల యెదుట మంచి ఒప్పందము ఒప్పుకొంటివి.

సమస్తమును సజీవముగా కాపాడే దేవుని యెదు 13
టను, పొంతిపిలాతుయొద్ద ఈ మంచి ఒప్పందమునకు
సాక్ష్యమిచ్చిన యేసు క్రీస్తు యెదుటను । నీవు నిష్క 14
ళంకముగాను అనింద్యముగాను ఈ ఆజ్ఞను, మన
ప్రభువైన యేసు క్రీస్తు ప్రత్యక్షమయే పర్యంతము
గైకొన వలెనని నీకు ఆనబెట్టుచున్నాను. । అది§ తన 15
స్వకాలముల యందు, శ్రీమంతుడైన అద్వితీయ నా
థుడు అగపరుచును; ఆయన రాజులకు రాజు, ప్రభు
వులకు ప్రభువునై యున్నాడు; । ఆయన మాత్రమే 16
అమరత్వము గల వాడై, దురవగాహమైన వెలుగులో
వసించుచున్నాడు. ఆయనను మనుష్యులలో ఎవడును
చూడ లేదు, ఎవడును చూడ నేరడు. ఆయనకు శాశ్వ
తమైన ఘనత, బలమును ఉండుగాక. ఆమేన్.

ఇప్పటి లోకమందు ధనవంతులైనవారు ఉన్నత 17
మనస్కులుకాక, అనుభవించుటకు సమస్తమును మనకు
సంపూర్ణముగా దయచేసే దేవుని యందే, కాని ధన
ముయొక్క అస్థిరత యందు నమ్మిక ఉంచక, । మంచి 18
క్రియలనే ధనము గలవారును, ఔదార్యము గల
వారును, పంచిపెట్టుటకు సిద్ధపడినవారునై యుండి, ।
వాస్తవమైన జీవము పట్టుకొనే నిమిత్తము, రాబోయే 19
కాలమునకు, మంచి పునాది తమ కొరకు సమకూర్చు
కొన వలెనని వారికి ఆజ్ఞాపించుము.

ఓ తిమొథెయా! నీకు అప్పగించబడినదాని కా 20
పాడి, అపరిశుద్ధమైన వట్టి మాటలకును, జ్ఞానమని అబ
ద్ధముగా చెప్పబడిన విపరీతములకును దూరముగా ఉం
డుము. । అది పొందితిమని, కొందరు తలంచి విశ్వాస 21
మునుంచి తొలగి పోయిరి.

కృప నీకు తోడైయుండు గాక.

* లేక, సాక్షులుంటే. † లేక, పొందుదము. ‡ లేక, ధనాపేక్ష. § అనగా, ఆ ప్రత్యక్షము.

అపొస్తలుడైన పౌలు

# తిమొథెయునకు పంపిన

## రెండవ ఉత్తరము.

### 1. అధ్యాయము.

1 యేసు క్రీస్తు యందలి జీవమును గూర్చిన వాగ్దత్త
ప్రకారము, దేవుని చిత్తమువల్ల యేసు క్రీస్తు యొక్క
అపొస్తలుడైన పౌలు ప్రియ కుమారుడగు తిమొథెయునకు
2 (వ్రాసినది). । తండ్రియైన దేవుని వలన, మన ప్రభు
వైన యేసుక్రీస్తు వలన కృపయు, కరుణయు, సమా
ధానము కలుగు గాక.

3 నేను యెడతెగక దివా రాత్రము నా ప్రార్థన
నల యందు నిన్ను జ్ఞాపకము చేసుకొనుచుండగా,
నీ కన్నీళ్లు జ్ఞాపకము చేసుకొని, నీలోని నిష్కపట
4 మైన విశ్వాసమును జ్ఞాపకము తెచ్చుకొని, । నేను
సంతోషముతో నిండుకొనే నిమిత్తము నిన్ను చూడ
వాంఛించుచు, నేను శుద్ధమనస్సుతో నా పూర్వికులు
సేవించిన ప్రకారముగా సేవించుచున్న దేవుని స్తుతిం
5 చుచున్నాను; । ఆ (విశ్వాసము) మొదట లోయి అనే
నీ అవ్వలోను నీ తల్లిలోను వసించెను; అది నీలోను
కూడ వసించుచున్నదని నిశ్చయించుకొంటున్నాను. ।
6 ఆ హేతువచేత, నేను (నీమీద) చేతులు ఉంచుట
వల్ల నీలో కలిగియున్న దేవుని కృపావరము ప్రజ్వ
లింప చేయ వలెనని నీకు జ్ఞాపకము చేయుచున్నాను;।
7 దేవుడు మనకు శక్తియు ప్రేమయు ఇంద్రియ నిగ్ర
హము గల ఆత్మనే గాని పిరికితనముగల ఆత్మను ఇచ్చి
యుండలేదు.

8 కాబట్టి నీవు ప్రభువుయొక్క సాక్ష్యమును గూ
ర్చియైనను, ఆయన ఖైదినైన నన్ను గూర్చియైనను సిగ్గు
పడక, దేవుని శక్తి ప్రకారము నీవు సువార్త నిమిత్త
మైన శ్రమానుభవములో పాలివాడవై యుండుము. ।
9 ఆయన మన క్రియల ప్రకారము కాక, యుగములకు
ముందుగా యేసు క్రీస్తు యందు మనకు ఇయ్యబడిన
10 వియు, । మరణము కొట్టివేసి జీవమును అక్షయతను
సువార్తవల్ల వెలుగులోకి తెచ్చిన యేసు క్రీస్తనే మన
రక్షకుని ప్రత్యక్షమువల్ల కనపరచబడినవియునైన తన
స్వకీయ దయా నిర్ణయముల చొప్పున మనలను రక్షించి
11 పరిశుద్ధమైన పిలుపుతో మనలను పిలిచెను. । అందుకు
నేను రాష్ట్రములకు ప్రకటించేవాడగాను అపొస్త
లునుగాను, బోధకుడగాను నియమించబడితిని. । ఆ 12
హేతువ చేతను ఈ శ్రమలను పొందుచున్నాను.
అయినను సిగ్గుపడను; ఎందుకనగా నేను నమ్మినవాని
ఎరుగుదును. నేను ఆయనకు అప్పగించినదాని,*(వచ్చే)
దినము నిమిత్తము ఆయన కాపాడగలడని నమ్ముకొను
చున్నాను.

యేసు క్రీస్తు యందలి విశ్వాస ప్రేమలతో, నీవు 13
నా వల్ల వినిన స్వస్థవాక్యముల మచ్చు గైకొనుము. ।
నీకు అప్పగించబడిన ఆ మంచి పదార్థమును మనలో 14
వసించే పరిశుద్ధాత్మ ద్వారా కాపాడుకొనుము.

అసియలోని వారందరు నన్ను ఎడబాసి పోయిరి 15
వారిలో ఫుగెల్లు, హెర్మొగెనే అనువారు ఉన్నారు. ।
ప్రభువు ఒనెసిఫోరు ఇంటివారియందు కృపచేసు 16
గాక; అతడు అనేక పర్యాయములు నా యలసట
తీర్చెను. । అతడు రోమేలో చేరియున్నప్పుడు, నా 17
సంకెళ్లను గూర్చి సిగ్గుపడక, మరియెక్కువైన జాగ్ర
త్తతో నన్ను వెతికి కనుగొనెను. । ప్రభువు అతని 18
యందు దయచేసి (ఆయనవచ్చే) దినమందు ప్రభువు
వల్ల కృప పొందనిచ్చుగాక. మరియు అతడు ఎఫెసు
లో ఎంత పరిచర్య చేసెనో అది నీకు మరి బాగా
తెలుసును.

### 2. అధ్యాయము.

కావున, నా కుమారుడా! యేసు క్రీస్తు యందలి 1
కృపయందు బలపరుచబడుము. । నీవు అనేక సాక్షుల 2
ద్వారా నావల్ల వేటిని వింటివో వాటిని ఇతరులకును బో
ధించుటకు సామర్థ్యము, నమ్మకముగల మనుష్యులకు
అప్పగించుము.। యేసు క్రీస్తుయొక్క మంచి యోధుని 3
వలె నా శ్రమలలో పాలు పుచ్చుకొనుము. । దండెత్తి 4
నవాని సంతోషపెట్టే నిమిత్తము, యోధులలో ఎవ
డును జీవనవ్యాపారములలో తన్ను తాను చిక్కుపరు
చుకొనకుండును. । మరియు జెట్టి పోరాడుచుండగా, 5
న్యాయముగా పోరాడకుంటే కిరీటము పొందడు. ।
ప్రయాసపడు వ్యవసాయకుడు మొదట ఫలములలో 6

*లేక, నాకు అప్పగించబడినదాని.

7 పాలు పుచ్చుకొన వలెను. । నేను చెప్పినవాటిని గ్ర
హించుకొనుము; అన్నిటి యందు ప్రభువు నీకు వివేక
మిచ్చును.
8 దావీదు సంతానమునుంచి పుట్టి, మృతిపొందిన
వారిలోనుంచి, నా సువార్త ప్రకారము లేపబడిన
9 యేసు క్రీస్తును జ్ఞాపకము చేసుకొనుము. । అందులో
నేను దుర్మార్గుడనై యున్నట్లు, బంధకముల మట్టుకు
శ్రమపడుచున్నాను. అయినప్పటికి దేవుని వాక్యము
10 బంధించబడి యుండలేదు.। అందుచేత, ఏర్పరుచబడిన
వారు కూడ శాశ్వతమైన మహిమతో, యేసు క్రీస్తు
యందలి రక్షణ పొందే నిమిత్తము, నేను వారి కొరకు
11 సమస్తమును ఓర్చుకొంటున్నాను. । ఈ మాట నమ్మత
గినది; ఏదనగా,—మనము ఆయనతో కూడ చనిపో
12 యిన వారమైతే, ఆయనతో బ్రతుకుదుము; । ఆయన
తో ఓర్చితే, ఆయనతోకూడ రాజులమై యుందుము;
ఆయనను ఎరుగమంటే, మనలను ఎరుగననును; ।
13 మనము అవిశ్వాసులమైనను, ఆయన విశ్వాస్యతగల
వాడై యుండును; ఆయన అన్నమాట లేదన లేడు.
14 వీటిని జ్ఞాపకము చేయుము; వినువారిని చెరుపుట
కేగాని మరి దేనికిని పనికిరాని వాగ్వాదము చేయ
15 వద్దని ప్రభువు యెదుట ఆనబెట్టుము. । నిన్ను నీవే
పరీక్షితునిగాను, సిగ్గుపరుచబడని వానిగాను, సత్యము
యొక్క వాక్యమును సరిగా విభాగించువానిగాను
16 దేవునికి అగపరుచుకొనుటకు జాగ్రత్తపడుము.। అపరి
శుద్ధమైన వట్టి మాటలకు విముఖుడవై యుండుము;
17 వారు మరి యెక్కువైన భక్తిహీనతకు సాగుదురు. । వారి
మాటలు కుళ్లు పుండువలె చెడకొట్టును. వారిలో హు
18 మెనైయు, ఫిలేతు ఉన్నారు. । వారు పునరుత్థానము
గతించెనని చెప్పుచు, సత్య విషయము తోవ తప్పి, కొం
19 దరి విశ్వాసమును చెరుపుచున్నారు, । అయినప్పటికి
దేవునియొక్క స్థిరమైన పునాది నిలుకడగా ఉన్నది;
దానికి—ప్రభువు తన వారిని ఎరుగుననేదియు,—క్రీస్తు
యొక్క పేరు ఒప్పుకొనే ప్రతివాడును దుర్నీతి
త్యజించ వలెననేదియునైన ముద్ర కలిగి యున్నది. ।
20 అయినను గొప్ప యింటిలో వెండి బంగారముల పా
త్రలు మాత్రమే గాక, మానువి, మంటివి కూడ ఉం
డును. వాటిలో కొన్ని ఘనతకు, కొన్ని ఘనహీనత
21 కు నౌను గనుక, । ఎవడైనను వీటినుంచి తన్ను తాను
పవిత్రపరుచుకొని యుంటే, వాడు పరిశుద్ధపరుచ
బడి, యజమానునికి ప్రయోజనమై, ప్రతి సత్కార్య
మునకు సిద్ధపరుచబడి ఘనత నిమిత్తమైన పాత్రయై
యుండును.

కాగా, నీవు యౌవనేచ్ఛలను విడిచి, పవిత్ర హృ 22
దయముతో ప్రభువుయొక్క పేరు పెట్టుకొనిన వారి
తో కూడ, నీతిని, విశ్వాసమును, ప్రేమను, సమాధాన
మును అనుసరించుము. । అయితే నేర్పులేని మూఢుల 23
వితర్కములను విసర్జించుము; వీటివల్ల జగడములు పుట్టు
నని యెరుగుదువు. । ప్రభువుయొక్క సేవకుడు జగడ 24
మాడక, సాధువును, బోధించ తగిన వాడును, కీడులు
సహించేవాడును, । సత్యముయొక్క విజ్ఞానము నిమిత్త 25
ము దేవుడు ఒక వేళ వారికి మారు మనస్సు దయ
చేసునేమో అని ఎదిరించేవారికి బుద్ధి చెప్పే వాడునై
యుండ వలెను;। అప్పుడు వారు, ఆయన ఇష్టము (నెర 26
వేరుట) కొరకు, తమ్మును చిక్కపరిచి పట్టుకొనిన సై
తానుయొక్క ఉరిలోనుంచి తప్పించుకొందురేమో.

## 3. అధ్యాయము.

మరియు అంత్య దినములలో అపాయ కాలములు 1
వచ్చునని జ్ఞాపకము చేసుకొనుము; । ఏలాగనగా మను 2
ష్యులు స్వార్థప్రియులు, ధనాపేక్షులు, బింకములా
డువారు, గర్విష్ఠులు, దూషకులు, తలిదండ్రులకు అవి
ధేయులు, కృతజ్ఞత లేనివారు, అపరిశుద్ధులు, । వాత్స 3
ల్యరహితులు, అసంధితులు, అపవాదకులు, అజితేం
ద్రియులు, క్రూరులు, సజ్జనద్వేషులు, । ద్రోహులు, 4
ఆతురులు, గర్వమనే మబ్బు కమ్ముకొనిన వారు, దేవుని
కంటే సుఖభోగములను ఎక్కువగా స్నేహించువారు,।
భక్తి స్వరూపము కలిగి దాని శక్తిని విసర్జించినవారునై 5
యుందురు; వీరిని ఎడబాసి పోవుము;* । ఎందుకనగా, 6
పాపభరితలై, నానా విధములైన ఆశలవల్ల నడిపించ
బడి, । ఎల్లప్పుడును నేర్చుకొనుచు, సత్యముయొక్క 7
విజ్ఞానమునకు ఎప్పుడును రాని అవివేక స్త్రీలయొక్క
ఇండ్లలో చొచ్చి వారిని చెరపట్టుకొని పోయే వారు
వీరిలో ఉన్నారు. । అయితే యన్నే, యంబ్రే అనే 8
వారు మోషేకు ఎదురాడినట్లు, వీరును భ్రష్టమనస్సు
కలిగి పరీక్షకు నిలువని మనుష్యులై సత్యమునకు ఎదు
రాడుదురు. । అయినప్పటికి వీరు ఇకను ముందటికి సా 9
గరు; వారి దుర్బుద్ధి యేలాగో ఆలాగే వీరిది కూడ
అందరికి తేటబడును.

అయితే నీవు నా బోధన, నా ప్రవర్తన, నా 10
ఉద్దేశము, నా విశ్వాసము, నా దీర్ఘశాంతము, నా
ప్రేమ, నా ఓర్పును, । అంతియొకైయ, ఈకొనియ, 11
లుస్త్ర అనే పట్టణములలో నాకు కలిగినట్టి హింసలు
శ్రమలును అనుసరించినావు; అట్టి హింసలు పొంది

* లేక, దూరముగా నుండుము.

తిని, కాని వాటి అన్నిటిలోనుంచి ప్రభువు నన్ను
12 తప్పించెను. । అటువలె యేసు క్రీస్తు యందు సుభక్తిగా
బ్రతుకుటకు ఇచ్ఛయించే వారందరు హింసించబడు
13 దురు. । అయినను దుర్జనులు, వంచకులు మోసపరుచుచు
మోసపరుచబడుచు, మరి యెక్కువ చెడుతనమునకు
14, 15 సాగుదురు. । అయితే నీవు నేర్చుకొని రూఢిగా
నమ్మించబడిన వాటిని ఎవరి వల్ల నేర్చుకొంటివో దాని
ఎరిగి, యేసు క్రీస్తు యందలి విశ్వాసము ద్వారా రక్ష
ణార్థమైన జ్ఞానము నీకు కలిగించుటకు శక్తిగల పరిశుద్ధ
లేఖనములను బాల్యమునుంచి ఎరుగుదువు గనుక వాటి
16, 17 యందు నిలుకడగా ఉండుము. । దేవుని మనుష్యు
డు సన్నద్ధుడై ప్రతి సత్కార్యము నిమిత్తము కేవలము
సిద్ధపడి యుండుటకు ప్రతి లేఖనము దేవావేశమువల్ల
కలిగి, ఉపదేశించుటకును, ఖండించుటకును, కుదుర్చుట
కును, నీతి యందు శిక్ష చేసుటకును ప్రయోజనమై
యున్నది.

## 4. అధ్యాయము.

1 దేవుని యెదుటను, బ్రతుకుచుండు వారికి చచ్చిన
వారికి తీర్పు చేయబోయే [ప్రభువైన] యేసు క్రీస్తు
యెదుటను, ఆయన ప్రత్యక్షము తోడని, ఆయన రా
జ్యము తోడనియు నేను ఆనబెట్టి చెప్పుచున్నదేమన
2 గా, । వాక్యమును ప్రకటించుము; సమయమందు అస
మయమందు జాగ్రత్తపడుము. సంపూర్ణమైన దీర్ఘ
శాంతముతోను ఉపదేశముతోను ఖండించుము, గద్దిం
3 చుము, బుద్ధి చెప్పుము; । ఎందుకనగా, వారు స్వస్థమైన
ఉపదేశమును సహించక, దురద చెవులు గలవారై, తమ
స్వకీయ దురాశల చొప్పున బోధకులను తమ కొరకు
4 పోగు చేసుకొని, । సత్యమునుంచి చెవులు తిప్పుకొని
కల్పనాకథలకు తిరిగిపోవు కాలము వచ్చును.

5 అయితే నీవు అన్నిటిలో మితముగా ఉండుము;
శ్రమపడుము; సువార్తికుని పని చేయుము; నీ సేవను
6 సంపూర్ణముగా జరిగించుము; । నేను ఇప్పుడు పా
నార్పణముగా పోయబడుచున్నాను; నా విడుదల కా
7 లము సమీపమై యున్నది. । మంచి పోరాటము పో
రాడి యున్నాను; నా పరుగు కడ ముట్టించి యున్నా
8 ను; విశ్వాసము గైకొని యున్నాను. । ఇకమీదట, నా
కొరకు నీతి కిరీటము ఉంచబడి యున్నది. ఆ దిన
మందు, నీతి గల న్యాయాధిపతియైన ప్రభువు, దాని
నాకును, నాకు మాత్రమే కాకుండ, తన ప్రత్యక్ష
మును ప్రేమించి యుండిన వారందరికిని ఇచ్చును.

నా యొద్దికి త్వరగా వచ్చుటకు జాగ్రత్తపడుము; । 9
దేమా ఇహలోకమును ప్రేమించి నన్ను విడిచి థెస్స 10
లొనీకకు పోయెను; క్రేస్కే గలతియకు, తీతు దాల్మతి
యకు వెళ్లిరి. । లూకా మాత్రమే నాయొద్ద నున్నాడు. 11
మార్కును వెంట బెట్టుకొని రమ్ము; అతడు సేవ నిమి
త్తము నాకు ప్రయోజనమైనవాడు. । తుఖికును ఎఫె 12
సుకు పంపినాను. నీవు వచ్చేటప్పుడు, । నేను త్రో 13
యలో కర్పు యొద్ద విడిచిన అంగవస్త్రమును, పుస్తక
ములను, విశేషముగా నా తోలు కాగితములను తీసు
కొని రమ్ము.

అలెక్షంద్రు అనే కంచరివాడు నాకు చాలా కీడులు 14
చేసెను. అతని క్రియల చొప్పున ప్రభువు అతనికి
ప్రతి ఫలమిచ్చును. । అతనినుంచి నీవును జాగ్రత్తగా 15
చూచుకొనుము; అతడు మా మాటలకు బహుగా విరో
ధించెను.

నా మొదటి ప్రత్యుత్తరము చెప్పగా, ఎవడును 16
నా పక్షముగా నిలువ లేదు; అందరు నన్ను విడిచిపో
యిరి. ఇది వారికి (తప్పుగా) ఎంచబడకుండు గాక. ।
అయితే నా ద్వారా సువార్త ప్రకటన నిండ నెరవే 17
ర్చబడే నిమిత్తము, సమస్త రాష్ట్రములు దాని వినే నిమి
త్తము, ప్రభువు నాకు తటస్థుడై నన్ను బలపరిచెను;
మరియు నేను సింహము నోటినుంచి విడిపించబడి
తిని. । ప్రభువు ప్రతి దుష్కార్యమునుంచి నన్ను విడి 18
పించి, ఆకాశము పైనున్న తన రాజ్యము నిమిత్తము
నన్ను రక్షించును. ఆయనకు యుగ యుగములకు మ
హిమ కలుగు గాక; ఆమేన్.

ప్రిస్కకు,* అకులకు, ఒనెసిఫోరు యింటివారికిని 19
సలాములు. । ఎరస్తు కొరింతులో నిలిచిపోయెను. త్రో 20
ఫిము రోగపడినందున, అతని మిలేతులో విడిచి వచ్చి
నాను. । శీతకాలము రాక మునుపు నీవు వచ్చుటకు 21
జాగ్రత్తపడుము. యుబూలు, పూదే, లీను. క్లౌదియ,
సహోదరులందరును నీకు సలాములు పంపుచున్నారు.

ప్రభువైన యేసు క్రీస్తు నీ ఆత్మకు తోడై యుం 22
డుగాక. కృప మీకు తోడై యుండుగాక.

---

* అనగా, ప్రిస్కిల్ల.

అపొస్తలైన పౌలు

# తీతుకు వ్రాసిన

## ఉత్తరము.

### 1. అధ్యాయము.

1 దేవుడు ఏర్పరచుకొనిన వారి విశ్వాసము నిమిత్త
ము, నిరీక్షణయందు, (అనగా) అబద్ధమాడని దేవుడు
2 యుగములకు ముందుగా వాగ్దత్తము చేసి, । ఇప్పుడు
మన రక్షకుడైన దేవుని సెలవు ప్రకారము నాకు అప్ప
3 గించబడిన సువార్త ప్రకటనవల్ల । ఆ తన వాక్యమును
స్వకాలములలో బైలుపరిచిన నిత్య జీవమును గూర్చిన
నిరీక్షణయందు, భక్తి నిమిత్తమైన సత్యముయొక్క విజ్ఞా
నము నిమిత్తము దేవుని సేవకుడను, యేసు క్రీస్తుయొక్క
అపొస్తలుడైన పౌలు, అనే నేను (మన) సాధారణ
విశ్వాస విషయమై నా నిజమైన కుమారుడగు తీతుకు
4 (వ్రాసినది): । తండ్రియైన దేవుని వల్లను మన రక్షకు
డైన యేసు క్రీస్తు వల్లను కృపయు, కనికరము, సమా
ధానము, నీకు కలుగు గాక.

5 ఇందు నిమిత్తము, నీవు కొదువగల వాటిని క్రమ
పరచుటకును, నేను నీకు ఆజ్ఞాపించిన ప్రకారము పెద్ద
6 లను అనగా, । ఎవడైనను నిందా రహితుడును, ఏక పత్నీ
పురుషుడును, దుర్వ్యాపార విషయము నేపము పెట్ట
బడక, అవిధేయులు కాక విశ్వాసులైన పిల్లలు గల
వాడునై యుంటే, ప్రతి పట్టణములో నియమించుట
7 కును క్రేతేలో నిన్ను విడిచి వచ్చితిని; । ఎందుకనగా,
అధ్యక్షుడు దేవుని గృహనిర్వాహకుడు గనుక అతడు
అనింద్యుడై యుండ వలెను. అతడు స్వేచ్ఛాపరుడును,
కోపచిత్తుడును, మద్యపానియు, కొట్టేవాడును, ధనా
8 పేక్షియుకాక, । ఆతిథ్య ప్రియుడును, సజ్జన ప్రియు
డును, స్వస్థబుద్ధిగలవాడును, న్యాయస్థుడును, పరిశుద్ధు
9 డును, స్వాధీన మనస్కుడునై యుండి, । తాను స్వస్థ
మైన ఉపదేశమందు బుద్ధి చెప్పుటకును, ఎదురాడువారి
మాట ఖండించుటకును శక్తి గల వాడయే నిమిత్తము,
తనకు నేర్పబడిన ప్రకారము నమ్మ తగిన వాక్యము
10 పట్టుకొనువాడునై యుండ వలెను; । ఎందుకనగా,
అనేకులు, విశేషముగా ఛేదనసంస్కారము పొందిన
వారు అవిధేయులైన వదురుబోతులును మోసపుచ్చు
11 వారునై యున్నారు; । వారి నోళ్లు మూయించబడ
వలెను. అట్టివారు దుర్లాభము కొరకు తగని వాటిని
ఉపదేశించుచు, సంపూర్ణ కుటుంబములను చెరుపు
దురు. । వారిలో ఒకడు అనగా వారి స్వకీయ ప్రవక్త 12
ఇట్లనెను—క్రేతీయులు ఎల్లప్పుడు అబద్ధికులును, దుష్ట
మృగములును, సోమరి తిండిబోతులునై యున్నారు. ।
ఈ సాక్ష్యము నిజమైనది. ఆ హేతువు చేతను, వారు 13
యూదుల కల్పనాకథలను, సత్యమునుంచి తప్పించు
కొనే మనుష్యుల ఆజ్ఞలను లక్ష్యపెట్టక, । విశ్వాసమం 14
దు స్వస్థులయే నిమిత్తము, వారిని కఠినముగా ఖండిం
చుము. । పవిత్రులకు అన్నియు పవిత్రమైనవి; అయితే 15
అపవిత్రులకును, అవిశ్వాసులకును, ఏదియు పవిత్రమై
నది కాదు; వారి మనస్సు వారి మనస్సాక్ష్యము అప
విత్రపరచబడి యున్నవి. । దేవుని ఎరుగుదుమని ఒప్పు 16
కొందురు, కాని అసహ్యులును, అవిధేయులును, ప్రతి
సత్క్రియ విషయము పరీక్షకు నిలువని వారునై
యుండి, తమ క్రియల వల్ల ఆయనను ఎరుగమన్నట్టు
ఉన్నారు.

### 2. అధ్యాయము.

అయితే నీవు స్వస్థమైన ఉపదేశమునకు అనుకూ 1
లమైన మాటలు పలుకుము; । ఏలాగనగా వృద్ధులు జా 2
గ్రత్త గలవారును, మాన్యులును, స్వస్థబుద్ధి గలవారు
ను, విశ్వాస ప్రేమ సహనములయందు స్వస్థులునై
యుండ వలెననియు; । ఆలాగున వృద్ధస్త్రీలు కొండె 3
కత్తెలును మిక్కిలి మద్యపానా సక్తలునై యుండక
ప్రవర్తనయందు పరిశుద్ధతకు అనుగుణలై యుండి,
దేవుని వాక్యము దూషించ బడకుండే నిమిత్తము, । యౌ 4
వన స్త్రీలు పతిప్రియలును శిశుప్రియలును, । స్వస్థబుద్ధి 5
గలవారును, పవిత్రలును, ఇంటిపని చేసేవారును,
మంచివారును, తమ పెనిమిట్లకు లోబడే వారునై
యుండుటకు వారికి బుద్ధిచెప్పే నిమిత్తము, మంచి ఉప
దేశకు రాండ్లునై యుండ వలెననియు చెప్పుము: । ఆలా 6
గున, స్వస్థబుద్ధి గలవారై యుండ వలెనని యౌవనస్థు
లకు బుద్ధి చెప్పుము. । పరపక్షమందు ఉండేవాడు మన 7
లను గూర్చి చెడ్డది యేదియు చెప్ప నేరక, సిగ్గుపడే
నిమిత్తము, అన్నిటియందు నిన్ను నీవే మంచి పనుల

8 విషయమై మచ్చుగా అగపరచుకొనుము. । ఉపదేశ
మందు నిర్మలత్వమును, మాన్యతను, నిరాక్షేపమైన
9 స్వస్థవాక్యమును (అగపరచుము). । దాసులు అన్నిటి
యందు మన రక్షకుడగు దేవుని ఉపదేశమును అలం
కరించే నిమిత్తము, తమ యజమానులకు లోబడి, ఎదు
10 రాడక, । ఏమియు అపహరించుకొనక, సంపూర్ణమైన
మంచి నమ్మకమును అగపరచ వలెనని బుద్ధి చెప్పుము.

11 ఎందుకనగా, సమస్త మనుష్యులకు రక్షణకరమైన
12 దేవుని కృప ప్రత్యక్షమై, । మనము భక్తిహీనతను ఇహ
13 లోక సంబంధమైన ఆశలను వదులుకొని, । మహా దేవు
డును మన రక్షకుడునైన యేసు క్రీస్తు మహిమ యొక్క
ధన్యమైన నిరీక్షణయనగా ప్రత్యక్షము నిమిత్తము ఎదు
రుచూచుచు, ఇప్పటి యుగములో స్వస్థ బుద్ధియు,
న్యాయము, భక్తియు కలిగి బ్రతుకుచుండ వలెనని, మన
14 లను శిక్షించుచున్నది.* । ఆయన సమస్తమైన దుర్నీతి
నుంచి మనలను విమోచించుటకును, మంచి క్రియల
యందు ఆసక్తి గల స్వకీయ ప్రజలను తన నిమిత్తము
పవిత్రపరచుకొనుటకును, తన్ను తానే మనకొరకు
15 అర్పించెను. । వీటి పలుకుచు, బుద్ధి చెప్పుచు, సంపూ
ర్ణాధి కారముతో ఖండించుము; నిన్ను ఎవని నుపే
క్షించ నియ్యకుము.

## 3. అధ్యాయము.

1 ప్రధానులకును అధికారులకును లోబడుటకు, విధే
2 యులవుటకు, ప్రతి సత్క్రియకు సిద్ధపడుటకు, । ఎవ
నిని దూషించక, జగడమాడని వారును, శాంతులును,
మనుష్యులందరికి సంపూర్ణమైన సాత్వికము అగప
రుచువారునై యుండ వలెనని వారికి జ్ఞాపకము చేయు
3 ము. । ఎందుకనగా మనము కూడ, మునుపు అవివేకుల
ము, అవిధేయులము, త్రోవ తప్పిన వారము, నానా విధ
ములైన ఆశలకు భోగములకు దాసులమునై, ఈర్ష్య
యందు మాత్సర్యమందును బ్రతుకుచు, అసహ్యులమై,
4 ఒకని నొకడు ద్వేషించుచుంటిమి. । అయినను మన
రక్షకుడైన దేవుని యొక్క దాక్షిణ్యమును, మనుష్యుల
5 యెడలనున్న ప్రేమయు ప్రత్యక్షమైనప్పుడు, । మనము
చేసిన నీతియందలి క్రియల మూలము కాక, తన కని
కరము చొప్పున, పరిశుద్ధాత్మ కలిగించు నూతన స్థితి
పునర్జన్మములనే స్నానము ద్వారా, మనలను రక్షించె
ను. । మనము ఆయన కృపవల్ల నీతిమంతులముగా తీర్చ 6
బడి, । నిరీక్షణ ప్రకారము నిత్యజీవము స్వతంత్రించు 7
కొనే నిమిత్తము, (ఆ పరిశుద్ధాత్మను) మన ప్రభువైన
యేసు క్రీస్తు ద్వారా, మన మీద విస్తారముగా కుమ్మ
రించెను.

ఈ వాక్యము నమ్మ తగినది; దేవునియందు విశ్వా 8
సముంచిన వారు, మంచి క్రియలయందు ప్రధాను
లవుటకు జాగ్రత్తపడే నిమిత్తము, నీవు ఈ సంగతులను
గూర్చి దృఢముగా పలుకుచుండ వలెనని కోరుచు
న్నాను. ఇవి మనుష్యులకు ప్రయోజనమైనవి, మం
చివియునై యున్నవి. । అయితే అవివేక తర్కములకు, 9
వంశావళులకు, జగడములకు, బోధనప్రమాణమును
గూర్చిన పోరాటములకును దూరముగా ఉండుము;
అవి నిష్ప్రయోజనమైనవి వ్యర్థమైనవియునై యున్నవి.

భేదములు కలిగించు మనుష్యునికి, ఒకటి రెండు 10
మారులు బుద్ధి చెప్పినతరువాత, వాని విసర్జించుము; ।
అట్టివాడు చెరపబడి, తనకు తాను విరోధమైన తీర్పు 11
విధించుకొని, పాపము చేయుచున్నాడని నీకు తెలు
సును.

అర్తెమానైనను, తుఖికునైనను నేను నీ యొద్దికి పంపి 12
నప్పుడు, నీకొపొలిలో నా యొద్దికి వచ్చుటకు జాగ్ర
త్తపడుము. అక్కడ చలికాలము గడుపుటకు నిర్ణ
యించుకొని యున్నాను. । న్యాయశాస్త్రియైన జేన 13
ను, అపొల్లోనును శీఘ్రముగా పంపుము. వారికి ఏమి
యు తక్కువ లేకుండ చూడుము. । మన వారును, నిష్ఫ 14
లులు కాకుండే నిమిత్తము, కావలసిన అక్కరల కొర
కు, సత్క్రియల యందు ప్రధానులవుటకు నేర్చుకొం
దురు గాక. । నా యొద్దనున్న వారందరు నీకు సలాము 15
లు పంపినారు. విశ్వాసమందు మమ్మును ప్రేమించు
వారితో మా సలాము చెప్పుము. మీకందరికి కృప
కలుగు గాక.

* లేక, బోధించుచున్నది.

అపొస్తలుడైన పౌలు

# ఫిలేమోనుకు వ్రాసిన

## ఉత్తరము.

### 1. అధ్యాయము.

1 యేసు క్రీస్తుయొక్క ఖైదీయైన పౌలును, సహో
దరుడైన తిమోతియు, ప్రియుడును మా తోటి పనివా
2 డునైన ఫిలేమోనుకు, । మా సహోదరియైన* అప్పియ
కును, మా తోటి రాణువవాడైన ఆర్ఖిప్పునకును, నీ యిం
3 టనున్న సంఘమునకును (వ్రాసినది). । మన తండ్రియైన
దేవుని వలన, ప్రభువైన యేసు క్రీస్తు వలన కృపయు
సమాధానము మీకు కలుగు గాక.

4-6 ప్రభువైన యేసు యెడలను, సమస్త పరిశుద్ధుల
యందు, నీకు కలిగి యున్న విశ్వాసమును గూర్చియు
నీ ప్రేమను గూర్చియు వినుచు, నీ విశ్వాస ప్రదాన
ము, మనలో ఉన్న సర్వ క్షేమ విజ్ఞానమందు, యేసు
క్రీస్తు నిమిత్తము, బలము గలదై యుండుటకు, నా
ప్రార్థనల యందు నిన్ను జ్ఞాపకము చేసుకొని, ఎల్ల
ప్పుడు నా దేవునికి కృతజ్ఞత అగపరుచుచున్నాను. ।
7 ఎందుకనగా, సహోదరుడా! పరిశుద్ధుల హృదయ
ములు నీ వలన నెమ్మది పొందినవని, నీ ప్రేమ వలన
నాకు బహు సంతోషము, ఆదరణయు కలుగుచున్నవి.।
8 కావున, తగినది నీకు ఆజ్ఞాపించుటకు, క్రీస్తు యందు
9,10 నాకు బహు ధైర్యము కలిగినను, । ప్రేమ యున్నం
దున, వేడుకొనుట మరి మంచిదనుకొనుచున్నాను. రా
యభారిని, ఇప్పుడు యేసు క్రీస్తు ఖైదినై యున్న పౌ
లనే నేను నా బంధకములలో కనిన నా కుమారుడగు
11 ఒనేసిము కొరకు నిన్ను వేడుకొనుచున్నాను. । అతడు
మునుపు నీకు నిష్ప్రయోజనమైన వాడు గాని, ఇప్పు
12 డు నీకు నాకు ప్రయోజనమైన వాడాయెను. । అతని
నీ యొద్దకు తిరిగి పంపినాను; నా హృదయమని అతని
చేర్చుకొనుము. । సువార్త కారణమైన బంధకముల 13
యందు నీకు ప్రతిగా అతడు నాకు సేవ చేసే నిమిత్త
ము, నా యొద్ద అతని ఉంచుకొన తలంచుచుంటిని
గాని, । నీ ఉపకారము బలవంతముచేతనైనట్లు కాక, 14
స్వేచ్ఛాప్రకారమవుటకు, నీ సమ్మతి లేక ఏమియు
చేయ నిచ్ఛయించ లేదు. । మరియు, దాసుడైనట్టు 15,16
కాక, దాసునికంటే గొప్ప వాడును, విశేషముగా
నాకు గాని, శరీరమందు ప్రభువుయందు, ఎంతో ఎక్కు
వగా నీకును ప్రియుడగు సహోదరుడునై యుండి,
తిరిగి నీకు నిత్యమును ఉండుటకే, అతడు కొంతకాల
ము వేరు చేయబడెనేమో. । కాబట్టి నీవు నన్ను సహ 17
వాసినని యెంచితే, నన్నువలె అతని చేర్చుకొనుము. ।
మరియు, అతడు నీకు ఏ నష్టమైనను కలిగించిన యెడ 18
లను, ఋణపడిన యెడలను, అది నా లెక్కలో చేర్చు
ము. । పౌలు అనే నేను నా చేతితో వ్రాసితిని; అది 19
నేను తీర్తును; నీ ప్రాణము కూడ నాకు ఋణమని నేను
చెప్ప నేల. । అవును, సహోదరుడా! నీవల్ల నాకు సం 20
తోషము కలుగనిమ్ము; క్రీస్తుయందు నా హృదయము
విశ్రమింప చేయుము. । నేను చెప్పినదానికంటే నీవు 21
ఎక్కువగా చేతువని, నీ విధేయతను నమ్మి నీకు వ్రాసి
తిని, । అంతే కాదు, నా నిమిత్తము బసగది సిద్ధపరు 22
చుము; ఎందుకనగా, నీ ప్రార్థనల ద్వారా, నేను నీకు
అనుగ్రహించబడుదునని నిరీక్షించుచున్నాను.

యేసు క్రీస్తు యందు నా తోటి ఖైదియైన ఎపా 23
ఫ్రాయు, । నా జత పనివారైన మార్కు, అరిస్తార్ఖు, 24
దేమ, లూకాయు సలాములు పంపిరి. । మన ప్రభువైన 25
యేసు క్రీస్తు కృప మీ ఆత్మకు తోడై యుండు గాక.

---

* కొన్ని ప్రతులలో, ప్రియురాలైన.

అపొస్తలైన పౌలు

# హెబ్రీయులకు వ్రాసిన

## ఉత్తరము.

### 1. అధ్యాయము.

1 పూర్వమందు అనేక భాగములుగాను అనేక విధ
ములుగాను మన పితృలతో ప్రవక్తల ద్వారా పలికిన
2 దేవుడు, । తన కుమారుని ద్వారా ఈ దినముల అంతమం
దు, మనతో పలికి యున్నాడు. ఆయనను అన్నిటికిని
బాధ్యునిగా నియమించెను; ఆయన ద్వారా ప్రపంచ
3 ములను కూడ చేసెను. । ఈయన ఆయన మహిమ
యొక్క ప్రకాశమును ఆయన స్వభావముయొక్క
ప్రతిమయునై యుండి, తన శక్తి గల వాక్యమువల్ల
సమస్తమును వహించుచు, తన వల్ల మన పాపములను
శుద్ధి చేసి, మీది లోకములలో మాహాత్మ్యముయొక్క
4 కుడిచేతివైపున కూర్చుండెను. । ఆయన దూతలకంటే
ఎంత శ్రేష్ఠమైన నామము పొందెనో, వారికంటే
అంత అధికుడై యున్నాడు.

5 ఎందుకనగా—నీవు నా కుమారుడవు; నేను నేడు
నిన్ను కని యున్నాననియు, మరియు — నేను ఆయ
నకు తండ్రిని, ఆయన నాకు కుమారుడు అనియు,*
6 ఆ దూతలలో ఎవనితో పలికెను? । మరియు ఆయన
తన ప్రథమ జాతుని మళ్లీ భూలోకమునకు రావించి
యున్నప్పుడు — మరియు దేవుని దూతలందరు ఆయ
నకు నమస్కరించ వలెనని† చెప్పుచున్నాడు.

7 మరియు ఆయన దూతలను గూర్చి—తన దూతలను
వాయువులుగాను, తన పరిచారకులను అగ్ని జ్వాల
గాను చేసుకొనే వాడు‡ అని పలుకుచున్నాడు. ।
8 అయితే ఆయన కుమారుని గూర్చి—
దేవా! నీ గద్దె యుగ యుగమునకును ఉన్నది;
నీ రాజ్యముయొక్క దండము
న్యాయ దండమై యున్నది.
9 నీవు న్యాయము ప్రేమించితివి,
అక్రమమును ద్వేషించితివి;
అందువల్ల, దేవా! నీ దేవుడు నీ పాలివారికంటే
నిన్ను ఎక్కువగా ఆనంద తైలముతో
అభిషేకించెను;§
మరియు— 10
ప్రభువా! నీవు ఆది యందు
భూమియొక్క పునాది వేసితివి;
ఆకాశ స్థలములు నీ చేతుల పని;
అవి నశించును, నీవు నిలిచి యుందువు, 11
అవన్నియు వస్త్రమువలె పాతవై పోవును; 12
అంగ వస్త్రమువలె వాటిని మడిచి వేతువు;
అప్పుడు అవి మార్చబడును గాని,
నీవు ఏకరీతిగానే ఉన్నావు;
నీ సంవత్సరములు తరుగవని||
పలుకుచున్నాడు. అయితే 13
—నేను నీ శత్రువులను నీ పాదములకు
పాదపీఠముగా ఉంచే పర్యంతము,
నా కుడిచేతి వైపున కూర్చుండుమని,¶
దూతలలో ఎవని గూర్చి ఎప్పుడు చెప్పెను? । వీరం 14
దరు రక్షణమను స్వాస్థ్యము పొందబోయే వారి నిమి
త్తము, సేవ చేసుటకు పంపబడిన పరిచారకులైన
ఆత్మలు కారా?

### 2. అధ్యాయము.

కావున, మనము ఒకవేళ వాటినుంచి దాటి పో 1
కుండ, వినబడిన వాటియందు మరి జాగ్రత్తగా మన
స్కరించ వలెను; । ఎందుకనగా దూతల ద్వారా పలుక 2
బడిన వాక్యము స్థిరపరచబడెను గనుకను, సమస్తమైన
అతిక్రమము, అవిధేయతయు న్యాయమైన ప్రతిఫల
మును పొందినవి గనుకను । మనము ఇంత గొప్ప రక్షణ 3
మును అలక్ష్యపెట్టితే, ఏలాగు తప్పించుకొన గలము?।
దేవుడు గురుతుల చేతను అద్భుతముల చేతను నానా 4
విధములైన శక్తుల చేతను తన చిత్త ప్రకారము పరిశు
ద్ధాత్మ వరములు పంచిపెట్టుట చేతను సాక్ష్యమిచ్చు
చుండగా, అట్టి రక్షణ మొదట ప్రభువువల్ల చెప్పబడి,
వినిన వారిచేత మనకు దృఢపరచబడెను. । అప్పుడు, 5
మనము దేని గూర్చి మాటలాడుచున్నామో, ఆ వచ్చు

* కీర్తన. 2. 7; 2. సమూయేలు, 7.14. † కీర్త. 97.7. ‡ కీర్త. 104. 4. § కీర్త. 45. 6,7. || కీర్త. 102. 25—27. ¶ కీర్త. 110.1.

6 లోకమును దూతలకు ఆయన లోపరచ లేదు. । అయితే
ఒకడు ఒక చోటను సాక్ష్యమిచ్చి—
నీవు మనుష్యుని జ్ఞాపకము చేసుకొనుటకును,
లేక నరపుత్రుని సందర్శించుటకును
అతడు ఏపాటివాడు?
7 నీవు దూతల కంటె
వాని కొంత కాలము* తక్కువ చేసితివి
మహిమ ప్రభావములనే కిరీటము ధరింపచేసినావు;
నీ చేతి పనులమీద, వానికి అధికారమిచ్చి
వాని పాదముల కింద సమస్తమును ఉంచితివని†
పలుకుచున్నాడు.
8 ఎందుకనగా, ఆయన సమస్తమును వానికి లోప
రచినప్పుడు, వానికి లోపరచబడకుండ ఏదియు విడిచి
పెట్ట లేదు; అయితే మనము సమస్తమును వానికి లో
పరచబడి యుండుట ఇంకా చూడలేదు, గాని దేవుని
9 కృపవల్ల ప్రతి మనుష్యుని కొరకు, । మరణమును అను
భవించుటకు దూతలకంటె కొంత కాలము* తక్కువ
చేయబడిన యేసుకు, మరణము పొందినందున మహిమ
ప్రభావములనే కిరీటము వేయబడి యుండుట చూ
10 చుచున్నాము; । ఎందుకనగా అన్నియు ఎవని నిమిత్త
మును, అన్నియు ఎవని వల్లను కలుగునో, ఆయన అనే
కులైన కుమారులను మహిమకు నడిపించుచుండగా, వారి
రక్షణ కర్తను శ్రమలవల్ల పరిపూర్ణునిగా చేయుట
ఆయనకు యుక్తమై యుండెను.
11,12 ఎందుకనగా పరిశుద్ధపరిచే ఆయనయు, పరిశు
ద్ధపరచబడే వారును ఒక్కని సంతానమై యున్నారు.
ఈ హేతువు చేతను వారిని సహోదరులని చెప్పు
టకు ఆయన సిగ్గుపడక,
—నీ నామము నా సహోదరులకు తెలియ చేతును,
సంఘము మధ్యను నిన్ను కీర్తింతుననియు,‡
13 మరియు,
— నేను ఆయనను నమ్ముకొని యుందుననియు;
మరియు,
—ఇదుగో! నేనును దేవుడు నాకిచ్చిన పిల్లలును
అని పలుకుచున్నాడు.§
14 కాబట్టి ఆ పిల్లలు మాంస రక్తములు గలవారైనం
దున, ఆ ప్రకారము వాటిలో ఆయన కూడ మరణము
యొక్క బలము గలవాని, అనగా సైతానును నశింప
15 చేసుటకును, । జీవిత కాలమంతయు, మరణ భయము
చేత దాస్యమునకు లోబడిన వారిని తప్పించుటకును
16 ఆ మాంస రక్తములను ధరించుకొనెను. । ఎందుకనగా
ఆయన ఎంత మాత్రము దూతలకు సహాయము చేయక
అబ్రాహాముయొక్క సంతతికి సహాయము చేయుచు
న్నాడు. । కావున, ప్రజల పాపములను ప్రాయశ్చిత్త 17
మువల్ల నివృత్తిచేయుటకు, దేవుని సంబంధమైనవాటి
విషయము కనికరము నమ్మకమును గల ప్రధానయాజకు
డయే నిమిత్తము, అన్నిటిలో తన సహోదరులతో
పోల్చబడ వలసి యుండెను; । ఎందుకనగా తాను శో 18
ధించబడి శ్రమ పొందెను గనుక, శోధించబడు వారికి
సహాయము చేయగలడు.

## 3. అధ్యాయము.

కాబట్టి, ఆకాశ సంబంధమైన పిలుపులో పాలు 1
పొందిన పరిశుద్ధ సహోదరులారా! మనము ఒప్పు
కొనిన అపొస్తలును ప్రధానయాజకుడునైన యేసును
శ్రద్ధగా లక్ష్యపెట్టుకొనుడి. । ఆయనయొక్క ఇల్లంతటి 2
లో మోషే వలె, ఆయన కూడ తన్ను నియమించిన
వానికి నమ్మకముగా ఉండెను; । ఎందుకనగా ఇంటి 3
కంటె దాని కట్టిన వాడు ఎక్కువ ఘనత పొందునట్లు,
ఈయన మోషే కంటె ఎక్కువ ఘనత పొంద తగి
యున్నాడు. । ప్రతి ఇల్లును ఒకని వల్ల కట్టబడును; 4
అన్నిటిని కట్టినవాడు దేవుడు. । మరియు, చెప్పబడ 5
బోయే వాటి సాక్ష్యము కొరకు, మోషే ఆయన ఇల్లం
తటిలో పరిచారకుని వలెను గాని, క్రీస్తు ఆయన యిం
టిమీద కుమారుని వలెను నమ్మకముగా ఉన్నాడు. ।
మనము నిరీక్షణ వలని ధైర్యమును ఉత్సాహమును 6
తుద మట్టుకు స్థిరముగా పట్టుకొనిన యెడల ఆయన
ఇల్లు మనమే.

కాబట్టి పరిశుద్ధాత్మ చెప్పుచున్న ప్రకారము, 7
—నేడు మీరు ఆయన శబ్దమును వినినయెడల,
అరణ్యములో శోధన దినమందు 8
కోపము‖ పుట్టినప్పటివలె
మీ హృదయములను కఠినపరుచుకొనకుడి;
అక్కడ మీ పితృలు నన్ను శోధించిరి; 9
వారు నలుబది సంవత్సరములు నన్ను పరీక్షించి
నా కార్యములను చూచిరి.
కావున నేను ఆ తరమందు కోపగించితిని; 10
—వీరు ఎల్లప్పుడును హృదయమందు
తప్పిపోవుచున్నారు,
నా మార్గములను తెలుసుకొన లేదు.
కాబట్టి వారు నా విశ్రాంతిలో ప్రవేశించరని, 11
నా కోపములో ప్రమాణము చేసితినని పలికితిని.¶
సహోదరులారా! జీవముగల దేవుని విడుచునట్టి 12
అవిశ్వాసమైన చెడ్డ హృదయము మీలో ఎవనికైనను

* లేక, కొంచెము. † కీర్త. 8. 4—6. ‡ కీర్త. 22. 22. § యెష. 8. 17, 18. ‖ లేక, వివాదము. ¶ కీర్త. 95; 7—11.

13 ఒకవేళ ఉండునేమో అని చూచుకొనుడి. । అయితే
భ్రమ పెట్టే పాపమువల్ల మీలో ఎవడును కఠినపర
చబడకుండే నిమిత్తము— నేడు అనబడిన సమయములో
ప్రతి దినమును ఒకనితో ఒకడు బుద్ధి చెప్పుకొనుడి;।
14 ఎందుకనగా మనము మన మొదటి దృఢనిరీక్షణ తుద
మట్టుకు గట్టిగా గైకొనియున్న యెడలనే, క్రీస్తుతో
పాలివారమై యుందుము.
15 —నేడు మీరు ఆయన శబ్దమును వినిన యెడల,
కోపము* పుట్టినప్పటివలె మీ హృదయములను కఠిన
16 పరచుకొనకుడి అని ఆయన చెప్పగా, । విని కోపము
పుట్టించినవారు ఎవరు! మోషే ద్వారా ఐగుప్తులో
17 నుంచి బైలుదేరి వచ్చిన వారందరు గదా! । మరియు
ఆయన ఎవరియందు నలుబది యేండ్లు కోపగించెను!
అరణ్యములో శవములై పడి యున్న ఆ పాపుల యందే
18 కదా! । మరియు అవిధేయులైన వారిని గూర్చే గాని
మరి యెవరిని గూర్చి తన విశ్రాంతిలో ప్రవేశిం
19 చరని ప్రమాణము చేసెను? । కాబట్టి అవిశ్వాసము
వల్ల వారు ప్రవేశించ లేకపోయిరని గ్రహించుచు
న్నాము.

## 4. అధ్యాయము.

1 కాబట్టి ఆయనయొక్క విశ్రాంతిలో ప్రవేశించు
టకు వాగ్దత్తము ఇంక నిలిచి యుండగా, మీలో
ఎవడైనను ఒక వేళ తప్పిపోవునేమో అని భయపడు
2 దము. । ఎందుకనగా వారికి వలె మనకును శుభవర్త
మానము ప్రకటించబడెను గాని, వినబడిన వాక్యము
వినిన వారియందు విశ్వాసముతో కలపబడ లేదు
3 గనుక, వారికి నిష్ప్రయోజనమైనదాయెను; । ఏలాగ
నగా—వారు నా విశ్రాంతిలో, అనగా జగత్తు పునాది
వేసినప్పుడు చేయబడిన కార్యములనుంచి (విశ్రాంతి
లో)† ప్రవేశించరని నేను కోపములో ప్రమాణము
చేసితినని‡ ఆయన చెప్పిన మాట ప్రకారము నమ్మిన
4 మనము ఆ విశ్రాంతిలో ప్రవేశించుచున్నాము, । ఎం
దుకనగా—అప్పుడు దేవుడు ఏడవ దినమందు తన కా
5 ర్యములన్నిటినుంచి విశ్రమించెననియు;§ ।మరియు ఈ
చోటున—వారు నా విశ్రాంతిలో ప్రవేశించరనియు
ఆయన ఏడవ దినమును గూర్చి ఒకచోటున చెప్పి
యున్నాడు.

6 కాబట్టి కొందరు దానిలో ప్రవేశించుటకు ఇంక
అది నిలువబడి యున్నది గనుకను, ఆ శుభవర్తమా
నము ముందు వినిన వారు అవిధేయత చేతను ప్రవే
శించ లేదు గనుకను,।—నేడు మీరు ఆయన శబ్దమును 7
వినినయెడల, మీ హృదయములను కఠినపరచుకొనకుడి
అని ముందు చెప్పబడిన ప్రకారము, దావీదు ద్వారా,
ఇంత కాలమైన తరువాత పలుకుచు—నేడని మళ్లి ఒక
దినమును నిర్ణయించుచున్నాడు; । యెహోషువ వారికి 8
విశ్రాంతి కలుగచేసియుంటే, తర్వాత మరియొక దిన
మునుగూర్చి చెప్పక పోవును. । కాబట్టి దేవుని ప్రజల 9
కొరకు, సబ్బాతువంటి విశ్రాంతి మిగిలియున్నది;।ఎం 10
దుకనగా, దేవుడు తన స్వకార్యములనుంచి విశ్రమిం
చిన ప్రకారము, ఆయనయొక్క విశ్రాంతిలో ప్రవే
శించినవాడు కూడ తన కార్యములనుంచి విశ్రమించి
యున్నాడు.

కాబట్టి ఎవడైనను ఆ అవిధేయత ఉదాహరణము 11
లో పడకుండే నిమిత్తము, ఆ విశ్రాంతిలో ప్రవేశిం
చుటకు జాగ్రత్తగా త్వరపడుదము; । ఎందుకనగా, 12
దేవుని వాక్యము సజీవమై బలముగలదై, రెండంచులు
గల ప్రతి ఖడ్గముకంటే వాడిగా ఉండి, ప్రాణాత్మ
లను, కీళ్ల మూలుగలను విభజించునంతమట్టుకు దూ
రుచు హృదయముయొక్క తలంపులను ఆలోచనలను
విమర్శించుచున్నది. । మరియు ఆయన దృష్టికి ప్రత్య 13
క్షముకాని సృష్టి యేదియు లేదు; మనకు ఎవనితో
పని కలుగునో, ఆయనయొక్క కన్నులకు సమస్తము
ను దిగంబరముగాను తేటగాను ఉన్నది.

కాబట్టి ఆకాశము ద్వారా వెళ్లిన గొప్ప ప్రధాన 14
యాజకుడు, అనగా దేవుని కుమారుడైన యేసు మనకు
కలిగినందున, మనము ఒప్పుకొనినదాని గట్టిగా పట్టు
కొందము; । మన బలహీనతల యందు మనతో కష్టప 15
డని ప్రధానయాజకుడు మనకు ఉండలేదు గాని, పాప
ము లేకనే, సమస్త విషయముల యందు మన వలె
శోధించబడెను గనుక, । మనము కరుణించబడి సమ 16
యోచితమైన సహాయము కొరకు కృప పొందుటకు,
ధైర్యముతో కృపాసనము యొద్దికి చేరుదము.

## 5. అధ్యాయము.

ఏలాగనగా, ప్రతి ప్రధానయాజకుడు మనుష్య 1
లలోనుంచి యేర్పరచబడి, పాపములకొరకు యాగప
శువులను కానుకలను అర్పించుటకు, దేవుని విషయ
ముల యందు మనుష్యులకొరకు నియమించబడును. ।
తాను కూడ బలహీనతచేత కట్టబడి, ఆ హేతువుచేత, 2
ప్రజలకొరకు ఏలాగో ఆలాగే తనకొరకును పాప
ముల నిమిత్తము అర్పణము చేయ తగి యున్నందున, ।

*లేక, వినాదము. † లేక, జగత్తు పునాది వేసినప్పుడు ఆయన కార్యములుచేయబడినప్పటికి,
నా విశ్రాంతిలో. ‡ కీర్త. 95. 11. § ఆదికా. 2. 3.

3 అజ్ఞానులకును త్రోవ తప్పిన వారికిని కనికరము చూ
పుటకు శక్తిగలవాడై యున్నాడు.
4 మరియు అహరోనువలె దేవునిచేత పిలువబడితేనే
గాని ఎవడును ఈ ఘనత తనకు తానే కలిగించు
5 కొనడు. । అటువలె క్రీస్తు కూడ ప్రధాన యాజకుడ
వుటకు తన్ను తానే ఘనపరచుకొనలేదు గాని—నీవు
నా కుమారుడవు, నేడు నిన్ను కని యున్నానని* ఆయ
6 నతో చెప్పిన వాడే. । ఆ ప్రకారమే—నీవు మెల్కీసె
దెకుయొక్క క్రమము చొప్పున నిరంతరము యాజ
కుడవై యున్నావని,† మరియొక చోట చెప్పుచున్నా
7 డు. । ఈయన తనకు శరీరము కలిగిన దినములలో
మహా శబ్దముతోను కన్నీళ్లతోను, తన్ను మరణము
నుంచి రక్షించుటకు శక్తిగలవాని గూర్చి ప్రార్థనలను
యాచనలను చేసి భక్తి కలిగి యున్నందున, ఆయన మనవి
8 వినబడెను; ‡ । ఆలాగు ఆయన, కుమారుడై యుండి
యు, పొందిన శ్రమలవల్ల విధేయతను నేర్చుకొనెను;।
9,10 మరియు, ఆయన పరిపూర్ణత పొందినప్పుడు।—మెల్కీ
సెదెకుయొక్క క్రమము చొప్పున ప్రధానయాజకు
డని దేవుని చేత చెప్పబడి, తనకు విధేయులైన వారం
దరికిని నిత్యమైన రక్షణకు కారణమాయెను.
11 దాని గూర్చి చెప్పుటకు మాకు కలిగిన వాక్యము
విస్తారముగాను, మీరు గ్రహించుట యందు మందు
12 లైనందున బోధించుటకు దుష్కరముగానున్నది; । ఎం
దుకనగా కాలము బట్టి చూచితే, మీరు బోధకులై
యుండ వలెను గాని దేవోక్తులయొక్క మొదటి మూ
లపాఠములు ఏవో వాటిని ఒకడు మీకు మళ్లి బో
ధించుటకు అక్కర గలవారై యున్నారు. పాలు
మాత్రమే గాని బలమైన ఆహారము అక్కర లేని వా
13 రైతిరి. । మరియు, పాలు పుచ్చుకొనే ప్రతివాడును
శిశువే గనుక నీతి వాక్యములో అప్రవీణుడై యు
14 న్నాడు. । బలమైన ఆహారము, మేలు కీడులను వివే
చించుటకు అలవాటుచేత సాధకము చేయబడిన బు
ద్ధీంద్రియములు గల పూర్ణులదై యున్నది.

## 6. అధ్యాయము.

1 కాబట్టి మృతి సంబంధమైన క్రియలనుంచి మన
స్సు తిప్పుకొనుటయు, దేవుని యందలి విశ్వాసము, ।
2 స్నానములను§ గూర్చినదియు, చేతులు ఉంచుటను
గూర్చినదియు, చనిపోయినవారి పునరుత్థానమును గూ
ర్చినదియు, శాశ్వతమైన తీర్పును గూర్చినదియునైన
బోధ అనే పునాది తిరిగి వేయక, క్రీస్తును గూర్చిన
ఆదివాక్యమును విడిచి పరిపూర్ణతకు సాగుదము. ।
దేవుడు సెలవిచ్చిన యెడల ఈలాగు చేయుదము; । 3
ఎందుకనగా, ఒకసారి వెలిగించబడి, ఆకాశ సంబంధ 4
మైన వరము అనుభవించి,|| పరిశుద్ధాత్మలో పాలు
పొందినవారై, । దేవుని మంచి వాక్యము యొక్కయు, 5
వచ్చే యుగ శక్తుల యొక్కయు రుచి చూచి, । తప్పి 6
పోయిన వారు తమ మట్టుకు తాము దేవుని కుమారుని
తిరిగి శిలువవేయుచు, బాహాటముగా అవమానపరచు
చున్నారు గనుక, పశ్చాత్తాపమునకు వారిని తిరిగి నూ
తనపరచుట అసాధ్యమై యున్నది.।ఆలాగున, భూమి 7
తన మీదికి తరుచుగా వచ్చే వర్షము తాగి, ఎవరి కొరకు
వ్యవసాయము చేయబడునో వారికి అనుకూలమైన
కూరలను పుట్టించుచుండగా, అది దేవునివల్ల ఆశీర్వ
చనములో పాలు పొందుచుండును । గాని, ముండ్ల 8
తుప్పలు, గచ్చతీగెలు పుట్టించుచుండగా అది పరీక్షకు
నిలువక, శాప సమీపముగా ఉండును; తుదకు అది
కాల్చబడుటకై యుండును.
అయితే ప్రియులారా! మేము ఈలాగు మాటలా 9
డుచున్నప్పటికి, మిమ్మును గూర్చి (వీటికంటె) మంచి
వియు, రక్షణ సంబంధమైనవియునైన వాటిని పట్టి నిశ్చ
యించుచున్నాము; । ఎందుకనగా దేవుడు మీ కార్య 10
మును, మీరు పరిశుద్ధులకు సేవ చేసి ఇంక సేవ చేయు
చు తన నామము కొరకు చూపిన ప్రేమను మరిచే
అన్యాయస్థుడు కాడు.
మరియు మీరు మందులుకాక, విశ్వాసము 11,12
వల్లను దీర్ఘ సహనము వల్లను, వాగ్దత్తములను స్వ
తంత్రించుకొనే వారిని అనుసరించే నిమిత్తము, మీలో
ప్రతివాడును నిరీక్షణ పరిపూర్ణత నిమిత్తము, తుద
మట్టుకు ఆ చురుకునే అగపరచ వలెనని అపేక్షించు
చున్నాము; । ఏలాగనగా దేవుడు అబ్రాహామునకు వా 13
గ్దత్తము చేసినప్పుడు, తనకంటె ఏ గొప్పవాని తో
డను ప్రమాణము చేయ లేదు గనుక।—నిశ్చయముగా 14
నేను నిన్ను ఆశీర్వదించనే ఆశీర్వదింతును, నిన్ను అభి
వృద్ధి పొందించనే పొందింతునని¶ చెప్పి తన తోడని
ప్రమాణము చేసెను. । ఆ చొప్పున అతడు సహనపె 15
ట్టుచు ఆ వాగ్దత్తము పొందెను. । మనుష్యులు (తమ 16
కంటె) గొప్ప వానితోడ ప్రమాణము చేతురు. అప్పు
డు ప్రమాణము, స్థిరత కొరకు వారిలో సమస్త వివాద
మునకు అంతమై యుండును.। కాగా దేవుడు అబద్ధ 17,18
మాడుట అసాధ్యమని, రెండు నిశ్చల సంగతులవల్ల,
మన యెదుట ఉండే నిరీక్షణ గ్రహించుకొనుటకు,

* కీర్త. 2. 7. † కీర్త. 110. 4. ‡ లేక, ఆ భయమునుంచి విడిపించబడెను. § లేక, బాప్తిస్మములను.
|| లేక, రుచిచూచి, ¶ ఆదికా. 22. 16. 17.

శరణాగతులమైన మనకు దృఢమైన ధైర్యము కలిగే
నిమిత్తము, దేవుడు ఆ వాగ్దత్తమును పొంద బోయే
వారికి తన సంకల్పముయొక్క నిశ్చలత్వమును మరి
అధికముగా అగపరుచుటకు సంకల్పించి, ప్రమాణ
19 మును మధ్యస్థము చేసెను. । ఆ నిరీక్షణ నిశ్చలమైనది,
ఆత్మకు స్థిరమైనది, తెరలోపలికి చేరునదియునైన లంగ
20 రువలె మనకు కలిగి యున్నది. । అందులో అగ్రేసరు
డనగా యేసు, మెల్కీసెదెకుయొక్క క్రమము చొప్పున
నిరంతరమును ప్రధానయాజకుడై మన కొరకు ప్రవే
శించెను.

## 7. అధ్యాయము.

1 ఆ రాజులను సంహారముచేసి* తిరిగి వచ్చుచున్న
అబ్రాహాముమను ఎవడు కలుసుకొని అతని ఆశీర్వదిం
2 చెనో,।ఎవనికి అబ్రాహాము అన్నిటిలో దశమాంశము
ను ఇచ్చెనో అట్టివాడైన ఈ మెల్కీసెదెకు సాలేముయొ
క్క రాజును, మహోన్నతుడైన దేవుని యాజకుడునై
యున్నాడు. భాషాంతరముచేయబడి, అతడు మొదట
నీతి రాజును, తరువాత సమాధానపు రాజనే అర్థ
3 మిచ్చే సాలేముయొక్క రాజునై, । తండ్రి లేనివాడును
తల్లి లేనివాడును, వంశావళి లేనివాడును, దినముల ఆది
యైనను జీవాంతమైనను లేనివాడునై యుండి, దేవుని
కుమారుని పోలి నిరంతరమును యాజకుడై యున్నాడు.
4 ఇతడు ఎంతటివాడో చూడుడి, పితామహుడైన
అబ్రాహాము అతనికి కొల్లగొన్న మంచిదానిలో దశ
5 మాంశమును ఇచ్చెను. । మరియు, లేవి కుమాళ్లలో ఉండి
యాజకత్వము పొందువారు, బోధనప్రమాణము చొ
ప్పున, ప్రజల యొద్ద, అనగా అబ్రాహాము యొక్క
నడుములోనుంచి బైలుదేరిన తమ సహోదరుల యొద్ద,
దశమాంశమును పుచ్చుకొనుటకు ఆజ్ఞ పొంది యున్నా
6 రు । గాని, వారిలో వంశావళి లేనివాడు అబ్రాహాము
యొద్ద దశమాంశమును పుచ్చుకొని, వాగ్దత్తములను
7 పొందిన వాని ఆశీర్వదించెను. । అయితే తక్కువ వాడు
ఎక్కువవాని చేత ఆశీర్వదించబడును; ఇది కేవలము
నిరాక్షేపమైనది.
8 మరియు ఇక్కడ మృతి పొందు మనుష్యులు దశ
మాంశములను పుచ్చుకొందురు గాని, అక్కడ జీవిం
చుచున్నాడని సాక్ష్యము పొందినవాడు (పుచ్చుకొ
9 న్నాడు.) । అంతే కాకుండ ఒకలాగున పలికితే, దశ
మాంశములను పుచ్చుకొనే లేవియు అబ్రాహాము
10 ద్వారా దశమాంశములను ఇచ్చెను; । ఏలాగనగా మెల్కీ
సెదెకు, అతని తండ్రిని కలుసుకొనినప్పుడు, అతని
నడుములో ఉండెను.

కాబట్టి లైవీయుల యాజకత్వమువల్ల సంపూర్ణ 11
సిద్ధి కలిగిన పక్షమందు; (ప్రజలు దానికింద బోధన
ప్రమాణమునకు లోపరచబడిరి గదా), అహరోను క్ర
మము చొప్పున ఉన్నాడని చెప్పబడక, మెల్కీసెదెకు
క్రమము చొప్పున వేరొక యాజకుడు పుట్టుటకు ఇక
నేమి అక్కర కలదు? । సరే గదా, యాజకత్వము మా 12
ర్చబడిన యెడల, అవశ్యముగా, బోధనప్రమాణము
లోను మార్పు కలుగును; । ఎందుకనగా, ఎవని గూర్చి 13
ఇవి చెప్పబడెనో ఆయన వేరొక గోత్రములో పుట్టె
ను; దానిలో ఎవడును యజ్ఞవేదిక యొద్ద పరిచర్య చేయ
లేదు. । మన ప్రభువు యూదా సంతానమందు అంకు 14
రించెనని పరిష్కారమై యున్నది. ఆ గోత్ర విషయము
మోషే యాజకత్వమును గూర్చి ఏమియు చెప్పలేదు.

మరియు, శరీర సంబంధమైన పద్ధతి విషయము 15
బోధనప్రమాణ ప్రకారము కాక, వదలని జీవముయొ 16
క్క శక్తి ప్రకారము నియమించబడిన వేరొక యాజ
కుడు మెల్కీసెదెకు పోలికె చొప్పున కలిగితే, మరింత
విశదమై యున్నది; । ఎందుకనగా—నీవు మెల్కీసెదెకు 17
క్రమము చొప్పున నిరంతరము యాజకుడవై యున్నా
వని సాక్ష్యము చెప్పబడెను. । కాగా ముందు కలిగిన 18
ఆజ్ఞ, దాని బలహీనత వల్లను ప్రయోజన హీనత వల్లను
నివారణ చేయబడగా, । (ఆ బోధనప్రమాణము దేని 19
కిని పరిపూర్ణసిద్ధి కలుగ చేయలేదు గదా) మరి శ్రేష్ఠ
మైన నిరీక్షణ కూడ ప్రవేశింప చేయబడెను; దీని
ద్వారా దేవుని యొద్దికి సమీపించుచున్నాము. । మరి 20,
యు, అది ప్రమాణము లేకనే జరగనిది ఏలాగో,
ఆలాగే యేసు మరి శ్రేష్ఠమైన నిబంధనయొక్క మధ్య 21
వర్తియై యున్నాడు. వీరైతే ప్రమాణము లేకుండ యా
జకులయేవారు. । ఇతడైతే — నీవు మెల్కీసెదెకుయొక్క 22
క్రమము చొప్పున నిరంతరము యాజకుడవై యున్నా
వని ప్రభువు ప్రమాణము చేసి, మనస్సు తిప్పకొన
డని ఈయనతో చెప్పిన ఆయనవల్ల ప్రమాణ పూర్వ
కముగా నియమించబడెను.

మరియు ఆ యాజకులు నిలువకుండ మరణముచేత 23
ఆతంకపరచబడినందున, అనేకులై యున్నారు. । అయి 24
తే ఈయన నిరంతరమును నిలిచి యున్నందున, పరు
నికి జెందని యాజకత్వము ఆయనకు ఉన్నది. । కాబట్టి 25
ఆయన వారి కొరకు మధ్యస్థుడవుటకు ఎల్లప్పుడును
జీవించుచు, తన ద్వారా దేవుని యొద్దికి వచ్చువారిని
పరిపూర్ణముగా రక్షించుటకును శక్తిమంతుడై యు
న్నాడు. । ఎందుకనగా పరిశుద్ధుడు, నిర్దోషియు, నిష్క 26

* ఆదికాండము. 14 అ. 18—20 వ.

_ల్మషుడు, పాపులనుంచి ప్రత్యేకించ బడినవాడు, ఆకా
శముకంటే మిక్కిలి హెచ్చించబడినవాడునైన అట్టి
27 ప్రధానయాజకుడు మనకు తగి యుండెను. ఈయన
ఆ ప్రధానయాజకుల వలె, మొదట తన పాపముల కొ
రకు, తరువాత ప్రజల వాటి కొరకును దినదినము యా
గపశువులను అర్పించుటకు అక్కర గలవాడు కాడు;
ఎందుకనగా తన్నుతాను ఒక్కసారే (యాగపశువు
28 గా) అర్పించుకొని దాని చేసెను. ఎందుకనగా, బో
ధనప్రమాణము, బలహీనత గల మనుష్యులను యాజ
కులగా నియమించును గాని, బోధనప్రమాణమునకు
తర్వాత కలిగిన, ప్రమాణ పూర్వకమైన వాక్యము,
నిరంతరమును సంపూర్ణసిద్ధి పొందిన కుమారుని (నియ
మించెను.)

## 8. అధ్యాయము.

1,2 కాగా, చెప్పబడినవాటి విషయము, ముఖ్యమైనది
యేదనగా, మనకు అట్టి ప్రధానయాజకుడు ఉండుట
యే. ఆయన అతిపరిశుద్ధ స్థలముయొక్కయు, ప్రభువే
గాని మనుష్యులు స్థాపించని నిజమైన గుడారముయొ
క్కయు ఉద్యోగస్థుడై ఆకాశమందు మహాత్మ్యము
యొక్క సింహాసనము మీద కుడి చేతి వైపున కూర్చుం
3 డెను. ప్రతి ప్రధానయాజకుడు కానుకలను యాగపశు
వులను అర్పించుటకు నియమించబడును, గనుక అర్పిం
చుటకు ఈయనకును ఏమైనను కలిగి యుండ వలెను.
కావున బోధనప్రమాణము చొప్పున కానుకలు అర్పిం
4 చు యాజకులు ఉండగా, ఆయన భూమి మీదనుంటే,
5 యాజకుడై ఉండనే ఉండడు. మోషే గుడారమును
సమకూర్చ బోయినప్పుడు — కొండమీద నీకు చూప
బడిన మాదిరి చొప్పున సమస్తమును చేయుటకు జాగ్ర
త్తపడుమని* దేవుని వల్ల బోధపరచబడిన ప్రకారము,
అట్టి వీరు ఆకాశమందున్న వస్తువుల ఛాయా రూపక
మైన పోలికయందు అర్చన చేయుదురు.

6 అయితే ఇప్పుడు మరి మంచి వాగ్దత్తములమీద
నియమించబడిన మరి మంచి నిబంధనయొక్క మధ్య
వర్తియై యున్న కొలది, మరి శ్రేష్ఠమైన ఉద్యోగము
7 పొంది యున్నాడు; ఏలాగనగా, ఆ మొదటిది అనిం
ద్యముగా ఉంటే, రెండవ దానికి స్థలము వెతకబడదు.
8 ఐనను ఆయన ఆక్షేపించి వారితో చెప్పుచున్న దేమనగా,

ప్రభువు ఇట్లనెను, ఇదుగో! రాబోయే దినములలో
ఇశ్రాయేలు ఇంటివారితోను,
యూదా ఇంటివారితోను,
నేను కొత్త నిబంధన ఏర్పరుచుకొందును;
నేను ఐగుప్తులోనుంచి 9
వారిని వెలపటికి తీసుకొని వచ్చుటకు,
వారి చెయ్యి పట్టుకొనిన దినమందు,
వారి తండ్రుల కొరకు,
నేను చేసుకొనిన నిబంధన ప్రకారము కాదు;
వారు ఆ నా నిబంధనలో నిలువ లేదు,
అప్పుడు వారిని అశ్రద్ధ చేసితినని,
ప్రభువు చెప్పుచున్నాడు.
అయితే ఆ దినములైన తరువాత, 10
ఇశ్రాయేలు ఇంటివారికి,
నేను నియమించ బోయే నిబంధన ఏదనగా,
నా బోధన వాక్యములు వారి మనస్సులో ఉంచుచు,
వారి హృదయముల మీదను వాటిని వ్రాయుదును;
నేను వారికి దేవుడనై యుందును,
వారు నాకు ప్రజలై యుందురు:
అప్పుడు వారిలో ప్రతివాడు 11
—ప్రభువును తెలుసుకొనుడని,
తన పట్టణస్థునికి తన సహోదరునికి బోధించడు;
వారిలో చిన్నలు మొదలుకొని పెద్దల పర్యంతము,
వారందరు నన్ను ఎరుగుదురు;
నేను వారి అక్రమములను క్షమించి, 12
వారి పాపములను వారి అపరాధములను
ఇకనెన్నడును జ్ఞాపకము చేసుకొననని
ప్రభువు చెప్పుచున్నాడు.

ఆయన కొత్త నిబంధన అనగా, మొదటిది పాతగిల 13
నిదిగా చేసియున్నాడు. ఏది పాతగిలి ఉడిగి పోవు
నో, అది అదర్శనమవుటకు సమీపముగా ఉన్నది.

## 9. అధ్యాయము.

అవును గాని, మొదటిదానికి† కూడ ఆరాధన 1
నిర్ణయములు; లౌకికమైన పరిశుద్ధ స్థలమును ఉండెను.
ఏలాగనగా ఒక గుడారము ఏర్పరచబడెను. అందు 2
లో మొదటి భాగము అతిపరిశుద్ధ స్థలమని చెప్ప
బడెను. దానిలో దీపస్తంభము, బల్లయు, సమ్ముఖపు రొ
ట్టెలునుండెను. రెండవ తెరలోపట,‡ అతిపరిశుద్ధమైన 3
వాటిలో అతిపరిశుద్ధమైనదని చెప్పబడిన గుడారము
ఉండెను. దానికి సువర్ణ ధూపార్తియు§ అంతట 4
బంగారు రేకులచేత దాపబడిన నిబంధన పెట్టెయునుం
డెను. దీనిలో మన్నాగల బంగారపు గిన్నెయు, చిగి
రించిన అహరోను చేతి కర్రయు, నిబంధన పలకలు
నుండెను. దాని పైని ప్రాయశ్చిత్తార్థ పీఠమును 5

* నిర్గమ. 25. 40. † అనగా, నిబంధనకును. ‡ లేక, ఆవల. § లేక, ధూపపీఠము.

కమ్ముకొనుచున్న మహిమగల ఖెరూబీములు ఉండెను;
వీటిని గూర్చి ఇప్పుడు వివరముగా చెప్పలేము.
6 ఇవి ఈలాగు ఏర్పరచబడిన తర్వాత, యాజకులు
ఆరాధనలు కొనసాగించుచు నిత్యమును మొదటి గుడా
7 రములోకి వెళ్లుచుందురు। గాని, సంవత్సరమునకు ఒక్క
సారే ప్రధానయాజకుడు మాత్రమే, తన కొరకును,
ప్రజల అజ్ఞాన కృతముల కొరకును తాను అర్పించు
రక్తముతోనే రెండవ దానిలోకి (ప్రవేశించును). ।
8 అందువల్ల, ఆ మొదటి గుడారము ఇంక నిలుచుచుం
డగా, అతిపరిశుద్ధ స్థలములో ప్రవేశించు మార్గము
కనపరచబడి యుండ లేదని, పరిశుద్ధాత్మ తెలియచేయు
9 చున్నది. । అట్టి (గుడారము) ఇప్పటి కాలము వరకు
ఉపమానమై యున్నది. దీని ప్రకారము మనస్సాక్షి
మట్టుకు, ఆరాధకుని సంపూర్ణము చేయలేని కా
10 నుకలు యాగపశువులును అర్పించబడుచున్నవి.। అవి
అన్నపానముల మీదను నానావిధములైన స్నానముల*
మీదను కుదురుబాటు కాల పర్యంతము విధించబడిన
శరీరాచారములే.
11 అయితే, రాబోయే మంచివాటి విషయము, క్రీస్తు
ప్రధానయాజకుడై వచ్చి, చేతివల్ల చేయబడని, అనగా
ఈ సృష్టి సంబంధము కానిదియు, మరి గొప్పదియు
12 పరిపూర్ణమైనదియునైన గుడారము ద్వారా,। ఎడ్ల
యొక్కయు మేకల యొక్కయు రక్తము ద్వారా కాక,
తన స్వరక్తము ద్వారా, నిత్యమైన విడుదల సంపాదిం
చుచు, ఒక్కసారే, అతిపరిశుద్ధ స్థలములోకి వెళ్లియు
13 న్నాడు.। ఎందుకనగా, ఎడ్లయొక్కయు మేకలయొక్క
యు రక్తమును, మైలగానున్న వారి మీద చల్లుచున్న
దూడ బూడిదెయును శరీర శుద్ధి మట్టుకు పరిశుద్ధపరి
14 చిన యెడల,।శాశ్వతమైన ఆత్మ ద్వారా తన్ను దేవునికి
మచ్చ లేనివానిగా అర్పించిన క్రీస్తుయొక్క రక్తము,
సజీవుడైన దేవుని ఆరాధించుటకు, మన మనస్సాక్షిని,
మృతి సంబంధమైన క్రియలనుంచి, ఎంతో ఎక్కువ
గా శుద్ధి చేసును!
15 మరియు ఈ హేతువు చేతను, మొదటి నిబంధన
కింద జరిగిన అపరాధములనుంచి విడుదల నిమిత్తము
మరణము కలిగియుండగా, నిత్యమైన స్వాస్థ్యమును
గూర్చిన వాగ్దత్తమును, పిలువబడినవారు సంపాదించు
కొనే నిమిత్తము, ఆయన కొత్త నిబంధనకు మధ్యవర్తియై
16 యున్నాడు.। ఎందుకనగా నిబంధన† ఎక్కడ ఉండు
నో, అక్కడ నిబంధన† చేసిన వాని మరణము సంభ
17 వించ వలెను;। ఎందుకనగా, ఆ నిబంధన† చేసినవాడు
మరణమైన తరువాతనే అది దృఢముగా ఉండును.
నిబంధన† చేసినవాడు జీవించుచుండగా, అది ఏ మా
త్రము దృఢముగా ఉండదు. । కాబట్టి మొదటిది రక్త 18
ము లేకుండ ప్రతిష్ఠించబడ లేదు;। బోధనప్రమాణము 19
చొప్పున, ప్రతి ఆజ్ఞ మోషే చేత ప్రజలతో పలుక
బడినప్పుడు, ఆయన నీళ్లతోను రక్తవర్ణముగల గొర్రె
బొచ్చుతోను, హిస్సోపుతోను, ఎడ్లయొక్కయు మే
కలయొక్కయు రక్తము పుచ్చుకొని, ఆ గ్రంథము
మీదను, ప్రజలందరి మీదను చల్లి । —దేవుడు మీకు 20
విధించిన నిబంధన రక్తము ఇదే అని చెప్పెను.। ‡ మరి 21
యు, ఆయన గుడారము మీదను, ఆరాధన సామగ్రు
లన్నిటి మీదను రక్తమును ఆలాగు చల్లెను. । మరియు 22
బోధనప్రమాణము చొప్పున, దాదాపుగా సమస్తము
ను రక్తముచేత శుద్ధి చేయబడును. మెట్టుకు, రక్తము
చిందకుండ క్షమాపణ కలుగదు. । కాబట్టి ఆకాశమం 23
దున్న వాటి పోలికలు వీటివల్లను గాని, ఆ యాకాశ
సంబంధమైనవి, వీటికంటే శ్రేష్ఠమైన యాగపశువుల
వల్లను శుద్ధి చేయబడుటకు అవసరమై యుండెను;। ఎం 24
దుకనగా, నిజమైన అతిపరిశుద్ధ స్థలముయొక్క పోలిక
చొప్పున చేతివల్ల చేయబడిన అతిపరిశుద్ధ స్థలములో
క్రీస్తు ప్రవేశించక, మన కొరకు దేవుని సమ్ముఖమందు
ఇప్పుడు అగపడుటకు, ఆకాశమందే ప్రవేశించెను.।
అంతేకాదు, ప్రధానయాజకుడు ప్రతి సంవత్సరము 25
అన్యరక్తముతో అతిపరిశుద్ధ స్థలములోకి వెళ్లినట్లు,
ఆయన అనేక పర్యాయములు తన్ను అర్పించుటకు
(వెళ్ల) లేదు;। ఆలాగైతే జగత్తు పునాది (వేయబడినది) 26
మొదలుకొని, ఆయన అనేక పర్యాయములు శ్రమ
పడవలసి యుండును. అయితే ఆయన యుగముల అం
తమందు తన్నే యాగపశువుగా అర్పించుటవల్ల, పాప
పరిహారము నిమిత్తము ఒక్కసారే అగపరచబడెను.।
మరియు, ఒక సారి మృతి పొందుటయు, తరువాత న్యా 27
యపు తీర్పును మనుష్యులకు నియమించబడిన ప్రకా
రము, । క్రీస్తు కూడ అనేకుల పాపములను వహించు 28
కొనుటకు ఒక్క సారే అర్పించబడి, ఆయన కొరకు
కనిపెట్టుచున్న వారికి రక్షణ నిమిత్తము రెండవ సారి,
పాపము లేకుండ, ప్రత్యక్షమవును.

## 10. అధ్యాయము.

ఎందుకనగా, రాబోయే మంచివాటి నీడయే 1
గాని ఆ వస్తువుల నైజ స్వరూపము§ లేని బోధనప్ర
మాణము, వారు ప్రతి సంవత్సరము ఎడతెగక అర్పించే
ఏక విధమైన యాగపశువులవల్ల, వచ్చువారిని ఎన్నడును
పరిపూర్ణులగా చేయ నేరదు; । ఎందుకనగా, ఆ పక్ష 2

* లేక, బాప్తిస్మముల. † లేక, మరణశాసనము. ‡ నిర్గ. 24. 8. § లేక, పోలిక. కొలొస్సీ. 3. 10.

మందు, ఒకసారి శుద్ధిపరచబడిన ఆరాధకులు, ఆ తరు
వాత, పాపముగల మనస్సాక్షి లేని వారైనందున, వాటిని
3 అర్పించుట మానరా? । అయితే వాటిలో ప్రతి సంవ
త్సరము పాపముల జ్ఞాపకము తిరిగి చేయబడుచున్నది; ।
4 ఎందుకనగా, ఎడ్లయొక్కయు, మేకలయొక్కయు రక్త
5 ము పాపములను పరిహరించుట అసాధ్యము. । కాబట్టి
ఆయన ఈ లోకమందు ప్రవేశించుచు, చెప్పుచున్న
దేమనగా—

యాగమును కానుకను నీవు కోరలేదు
కాని, నాకు ఒక శరీరమును సిద్ధపరిచితివి;
6 సర్వాంగ హోమములు,
పాపము కొరకైన యాగములు నీ కిష్టమైనవి కావు.
7 అప్పుడు నేను—దేవా! నీ ఇష్టము నెరవేర్చుటకు,
ఇదుగో! వచ్చి యున్నాను; గ్రంథపుచుట్టలో
నన్ను గూర్చి వ్రాయబడి యున్నది అన్నాను.

8 —యాగపశువు, కానుక, సర్వాంగ హోమములు,
పాపనివారణ కొరకైన వాటిని, అనగా బోధనప్రమాణ
ము చొప్పున అర్పించబడుచుండే వాటిని నీవు కోరలే
దనియు, అవి నీకు ఇష్టమైనవి కావనియు, పైని చెప్పిన
9 తరువాత, । ఆయన—దేవా! ఇదుగో! నీ ఇష్టము నెర
వేర్చుటకు, నేను వచ్చియున్నానని చెప్పుచున్నాడు. ।
10 ఆ రెండవదాని స్థిరపరుచుటకు, మొదటిదాని కొట్టి
వేయుచున్నాడు. యేసు క్రీస్తుయొక్క శరీరము ఒక్క
సారే అర్పించబడుట వల్ల, ఆ ఇష్టమందు మనము పరి
శుద్ధపరచబడి యున్నాము.

11 మరియు, ప్రతి యాజకుడు నిలిచి, దినదినము ఆరా
ధించుచు, ఎప్పుడును పాపములను పరిహరించ లేని
ఆ యాగపశువులనే, అనేక పర్యాయములు అర్పించు
12 చున్నాడు. । అయితే ఈయన పాపముల కొరకు ఒక్క
యాగపశువును అర్పించి, నిరంతరమును దేవుని కుడి
13 చేతి వైపున కూర్చుండి, । అప్పటినుంచి తన శత్రువులు
తన పాదములకు పాదపీఠముగా వేయబడే పర్యంత
14 ము కనిపెట్టుచున్నాడు; । ఎందుకనగా, పరిశుద్ధపరచ
బడుచుండే వారిని ఒక్క యాగమువల్ల నిరంతరమును
పరిపూర్ణులగా చేసియున్నాడు.

15 అందుకు పరిశుద్ధాత్మ కూడ మనతో సాక్ష్యము
16 చెప్పుచున్నది; । ఏలాగనగా—ఆ దినములైన తరువాత
నేను వారికి నియమించబోయే నిబంధన ఇదే అని,
పైని చెప్పిన తరువాత, ఆయన—నా ఆజ్ఞలను వారి
హృదయములమీద పెట్టి, వారి మనస్సులమీద వా
17 టిని వ్రాయుదుననియు, । ఇకమీదట వారి పాపము
లను, వారి అక్రమములను జ్ఞాపకము చేసుకొననని
యు, ప్రభువు చెప్పుచున్నాడు. । వాటి క్షమ ఎక్కడ 18
కలుగునో, అక్కడ పాపమును గూర్చిన యాగము
ఇకనేమియు నుండదు.

కాబట్టి సహోదరులారా! తెర ద్వారా, అన 19-
గా తన శరీరము ద్వారా, ఆయన క్రొత్తదియు, జీవము 20
గలదియునైన మార్గముగా, మన కొరకు తెరిచిన
ద్వారమున ప్రవేశించుటకు, యేసు రక్తమందు ధైర్య
మును, । దేవుని ఇంటి మీద గొప్ప యాజకుడును 21
మనకు ఉండగా, । మన హృదయములు చెడ్డ మనస్సా 22
క్షినుంచి (విడుదల పొంద) చిలకరించబడి, । విశ్వాస 23
పరిపూర్ణతయందు నిజమైన హృదయముతో దగ్గి
రకు చేరుదము; మన శరీరములు శుభ్రమైన నీళ్లతో
కడుగబడి, మనము ఒప్పుకొనిన నిరీక్షణ నిశ్చలముగా
పట్టుకొందము; వాగ్దత్తము చేసినవాడు నమ్మతగినవాడు.
మరియు ప్రేమను సత్క్రియలను రేపే నిమిత్తము 24
ఒకని ఒకడు తలంచుకొందము. । కొందరి మర్యాద 25
చొప్పున, సంఘములో కూడుకొనుట మానక, ఒకనికి
ఒకడు బుద్ధి చెప్పుచు, దినము సమీపించుట చూచిన
కొలది, మరి యెక్కువగా (ఆలాగు చేయుదము.)

ఎందుకనగా మనము సత్య విజ్ఞానము పొందిన 26
తర్వాత స్వేచ్ఛగా పాపము చేయుచుండగా, పాప
ములకొరకు మరి ఏ యాగముండదు. । అంతేకాదు, 27
న్యాయపు తీర్పు కొరకు భయముతో ఎదురుచూచు
టయు, విరోధులను దహించబోయే అగ్నియుద్రేక
మును ఉండును. । ఎవడైనను మోషే బోధను నిరాకరిం 28
చిన యెడల, వాడు, ఇద్దరు ముగ్గురు సాక్షులు ఉంటే,
కనికరించబడక మృతి పొందును. । దేవుని కుమారుని 29
మీద త్రొక్కి, తాను పరిశుద్ధపరచబడిన నిబంధన
రక్తము సాధారణమైనదిగా ఎంచి, కృప గల ఆత్మను
తిరస్కరించినవాడు ఎంత ఎక్కువైన దండనకు పా
త్రుడుగా ఎంచబడునని మీకు తోచును? । ఎందుకన 30
గా—దండన విధించుట నాది; నేను ప్రతి ఫలమిత్తునని
ప్రభువు చెప్పుచున్నాడనియు, మళ్లీ — ప్రభువు తన
ప్రజలకు న్యాయము తీర్చుననియు చెప్పినవాని ఎరు
గుదుము. । సజీవుడైన దేవుని చేతులలో పడియుండుట 31
భయంకరమైనది.

అయితే, మీరు వెలిగించబడి, శ్రమలతో గొప్ప 32
పోరాటము సహించిన మునుపటి దినములు జ్ఞాపకము
నకు తెచ్చుకొనుడి; । ఏలాగనగా, కొంత మట్టుకు 33
మీరు నిందల చేతను బాధలచేతను బహిరంగపరచ
బడి, కొంతమట్టుకు అట్టివాటిని అనుభవించినవారి
తో సహవాసులైతిరి; । ఏలాగనగా, మీరు ఖైదీల 34
యందు కరుణించి, ఆకాశమందు మీ కొరకు మరి

శ్రేష్ఠమైనదియు స్థిరమైనదియునైన పదార్థము ఉన్న
దని యెరిగి, మీ పదార్థముల దోపును సంతోషము
గా ఓర్చితిరి.
35 కాబట్టి మీ ధైర్యమును పారవేయకుడి; అట్టిదా
36 నికి గొప్ప బహుమాన దానము ఉన్నది;। ఎందుకనగా,
మీరు దేవునికి ఇష్టమైనది చేసి, వాగ్దత్తము పొందే
37 నిమిత్తము, ఓరిమి మీకు అవసరమై యున్నది.। ఇక
కొంచెమే కాలమున్నది; వచ్చుచున్నవాడు ఆలస్యము
38 చేయక వచ్చును.। అయినను — నీతిమంతుడు విశ్వాస
మూలముగా జీవించును కాని, అతడు వెనుక తీసినయె
39 డల వాని యందు నా ఆత్మకు ఇష్టముండదు.। అయితే
మనము నశించునట్లు వెనుక తీసేవారిలో ఉండక, ప్రా
ణము దక్కించుకొనుటకు విశ్వాసము గలవారమై యు
న్నాము.

## 11. అధ్యాయము.

1 విశ్వాసమనగా, నిరీక్షించబడే వాటియొక్క నిశ్చ
యము, కనబడని వాటి దృష్టాంతమునై యున్నది;।
2 దానియందు పెద్దలను గూర్చి మంచి సాక్ష్యము చెప్ప
బడెను.

3 చూడబడేవి అగపడే వాటినుంచి పుట్టనట్లు, ప్రపం
చములు దేవుని వాక్యముచేత నిర్మించబడెనని* విశ్వా
సమువల్ల గ్రహించుకొంటున్నాము.

4 విశ్వాసమువల్ల, ఆబేలు కయీనుకంటే శ్రేష్ఠమైన
యాగము దేవునికి చేసెను. అందువల్ల, దేవుడు అతని
కానుకలను గూర్చి సాక్ష్యము చెప్పుచుండగా, అతడు
నీతిమంతుడని సాక్ష్యము చెప్పబడెను; దానివల్ల అతడు
మృతి పొందియు, ఇంక పలుకుచున్నాడు.

5 విశ్వాసమువల్ల, ఏనోఖు మరణము చూడకుండు
నట్లు కొంచుపోబడెను. అప్పుడు అతడు కనబడలేదు;
ఎందుకనగా దేవుడు అతని కొంచుపోయెను. అయితే
అతడు కొంచుపోబడక మునుపు, దేవునికి ఇష్టుడై
6 యుండెనని సాక్ష్యము చెప్పబడెను. । విశ్వాసము
లేని యెడల, దేవునికి ఇష్టుడై యుండుట అసాధ్యము;
ఎందుకనగా దేవుని యొద్దికి వచ్చేవాడు, ఆయన ఉన్నా
డనియు, తన్ను జాగ్రత్తగా వెతికే వారికి ఫలము
దయచేసుననియు నమ్మవలెను.

7 విశ్వాసమువల్ల నోవహు అదివరకు చూడబడని
వాటిని గూర్చి దేవునివల్ల బోధపరుచబడి, భయభక్తులు
గలవాడై తన ఇంటివారి రక్షణ కొరకు, ఒక నావను
సిద్ధము చేసెను. అందువల్ల అతడు లోకమునకు తీర్పు
చేసి విశ్వాస ప్రకారమైన నీతిమత్వము పొందెను.

విశ్వాసమువల్ల, అబ్రాహాము తాను స్వాస్థ్యము 8
గా పొందబోయిన స్థలమునకు బైలు వెళ్లుటకు పిలువ
బడి, మన్నించి, ఎక్కడికి చేరునో అది తెలియక
బైలు వెళ్లెను.। విశ్వాసమువల్ల, ఆయన అప్పటికి అన్య 9
లదైన వాగ్దత్త దేశమందు పరవాసియై, అతనితో ఆ
వాగ్దత్తమునకు బాధ్యులైన ఈసాకు, యాకోబు అనే
వారితో కూడ గుడారములలో నివసించెను; । ఎందు 10
కనగా దేవుడు దేనికి శిల్పియు నిర్మాణకుడునై యు
న్నాడో, పునాదులుగల ఆ పట్టణము కొరకు ఎదు
రుచూచుచుండెను.

విశ్వాసమువల్ల, శారాయు, తనకు ప్రాణవయ 11
స్సు గతించినదైనను, గర్భము ధరించుటకు శక్తి పొం
దెను; ఏలాగనగా, వాగ్దత్తము చేసినవాడు నమ్మతగిన
వాడని ఎంచుకొనెను. అందుచేతను, వీటిమట్టుకు 12
చనిపోయినవాడైనప్పటికి, ఆ ఒకనికి, ఆకాశ నక్ష
త్రములవలె విస్తారముగాను, లెక్కించ లేని సముద్ర
తీరమందలి ఇసుక వలెను సంతానము పుట్టెను.

వీరందరు ఆ వాగ్దత్తములను పొందక, వాటిని 13
దూరముగా చూచి, వందనము చేసి, తాము భూమి
మీద అతిథులము పరదేశులమునై యున్నామని ఒప్పు
కొని, విశ్వాస ప్రకారము మృతిపొందిరి; । ఎందుకన 14
గా అట్టివి చెప్పుకొనువారు స్వదేశమును వెతుకుచు
న్నామని విశదపరుచుచున్నారు.। వారు దేనిలోనుంచి 15
వచ్చిరో, దాని జ్ఞాపకము చేసుకొనిన యెడల, తిరిగి
వెళ్లుటకు సమయము వారికి కలిగి యుండును।కాని, 16
వారు మరి శ్రేష్ఠమైన దాని, అనగా ఆకాశ సంబం
ధమైనదాని కోరుచున్నారు. అందువల్ల, దేవుడు వారి
దేవుడని చెప్పబడుటకు వారిని గూర్చి సిగ్గుపడుట లేదు;
ఎందుకనగా ఆయన వారి కొరకు ఒక పట్టణము సిద్ధ
పరిచెను.

విశ్వాసమువల్ల, అబ్రాహాము శోధించబడి, ఈ 17-19
సాకును యాగపశువుగా అర్పించెను. ఎవడు ఆ వా
గ్దత్తములు అంగీకరించెనో,—ఈసాకు యందు నీ సం
తానము చెప్పబడునని† ఎవనిగూర్చి‡ చెప్పబడెనో
ఆ తన జనితైక కుమారుని అర్పించుచుండెను. మృతి
పొందిన వారిలోనుంచియు వాని లేపుటకు దేవుడు
శక్తిమంతుడని ఎంచుకొని, వారిలోనుంచి అతని ఉప
మానముగా పుచ్చుకొనెను.

విశ్వాసమువల్ల, ఈసాకు, రాబోయే వాటిని గూ 20
ర్చి యాకోబును, ఏశావును ఆశీర్వదించెను.

* లేక, ఏర్పరచబడెనని. † ఆదికా. 21. 12. ‡ లేక, తో.

21 విశ్వాసమువల్ల, యాకోబు చనిపోవుచుండగా,యో
శేపు కుమారులలో ప్రతివానిని ఆశీర్వదించి, తన చేతి
కర్ర కొన మీద వంగి, నమస్కారించెను.

22 విశ్వాసమువల్ల, యోశేపు తనకు కాలము సమీ
పించినప్పుడు, ఇశ్రాయేలు కుమారులు బైలు దేరుటను
గూర్చి పలికి, తన ఎముకలను గూర్చి వారికి ఆజ్ఞా
పించెను.

23 విశ్వాసమువల్ల, మోషే పుట్టి, తన తలిదండ్రులచేత
మూడు మాసములు దాచబడెను; ఎందుకనగా, ఆ
శిశువు సుందరుడై యుండుట చూచిరి; మరియు వారు
రాజు ఆజ్ఞకు భయపడలేదు.

24,25 విశ్వాసమువల్ల, మోషే పెద్దవాడై, కొంత కా
లము మట్టుకు, పాప భోగము అనుభవించుటకంటే,
దేవుని ప్రజలతో శ్రమానుభవము మంచిదని ఏర్పరు
26 చుకొని, । ఐగుప్తుయొక్క ధనముకంటే క్రీస్తుయొక్క
నింద గొప్ప భాగ్యమని ఎంచుకొని, ఫరో కుమా
ర్తెయొక్క కుమారుడని చెప్పబడుటకు ఒప్పుకొన
27 లేదు; అతడు బహుమతి వైపు చూచెను. । విశ్వాసము
వల్ల, అతడు రాజు కోపమునకు భయపడక, ఐగుప్తును
విడిచెను; ఎందుకనగా అతడు అదృశ్యుని చూచుచు
28 న్నట్టు నిలుకడగా ఉండెను. । విశ్వాసమువల్ల, తొలి
చూలి పిల్లలను నాశము చేసిన దూత, వారిని ముట్ట
కుండే నిమిత్తము అతడు పస్కాను రక్త ప్రోక్షణమును
ఆచరించెను.

29 విశ్వాసమువల్ల, వారు ఆరిన భూమి మీద వలె,
ఎర్ర సముద్రములోబడి వెళ్లిరి. ఐగుప్తీయులు ఆ ప్ర
యత్నము చేసి, మునిగి పోయిరి.

30 విశ్వాసమువల్ల, యెరికో గోడలు ఏడు దినములు
చుట్టబడిన తరువాత కూలెను.

31 విశ్వాసమువల్ల, రాహాబనే వేశ్య వేగులవారిని
సమాధానముగా చేర్చుకొనినందున, అవిధేయులతో
నశించక పోయెను.

32 ఇక నేమి చెప్పుదును? । ఎందుకనగా గెద్యోను, బా
రాకు, సంసోను, యెఫ్తా, దావీదు, షమూయేలు అనే
వారిని గూర్చియు, ప్రవక్తలను, గూర్చియు, పలుకుటకు
33 కాలము చాలదు. । వారు విశ్వాసమువల్ల, రాజ్యములను
జయించిరి, న్యాయములను జరిగించిరి, వాగ్దత్తములను
34 పొందిరి, సింహముల నోళ్లను మూసిరి, । అగ్ని బలము
చల్లార్చిరి, ఖడ్గధారను తప్పించుకొనిరి; బలహీనత
నుంచి బలపరచబడిరి; యుద్ధములో సాహసించినవా
35 రైరి, అన్యుల సేనలను పారజేసిరి. । స్త్రీలు తమ మృతు
లను పునరుత్థాన మూలముగా పొందిరి కాని, కొందరు
మరి మంచి పునరుత్థానము పొందే నిమిత్తము, విడుదల
పొందనొల్లక, యాతనపెట్టబడిరి. । మరి కొందరు తిర 36
స్కారముల చేతను, కొరడా దెబ్బలచేతను, ఇంక
బంధముల చేతను, ఖైదులో వేయబడుటచేతను, శోధిం
చబడిరి. । రాళ్లతో కొట్టబడిరి; రంపముతో కోయబ 37
డిరి; శోధించబడిరి; ఖడ్గముచేత చంపబడిరి; గొర్రె
చర్మములను, మేకచర్మములను వేసుకొని తిరుగు
లాడుచు, దరిద్రులై యుండి, శ్రమపడి, హింస పొం
దుచుండిరి; । లోకము వారికి పాత్రమైనది కాదు; అడ 38
వులలోను కొండల మీదను గుహలలోను దేశపు సందు
లలోను సంచరించేవారు.

వీరందరు, విశ్వాసము ద్వారా వారిని గూర్చి సా 39
క్ష్యము చెప్పబడియు, వాగ్దత్తమును అనుభవించలేదు; ।
ఎందుకనగా వారు మనము లేకుండ పరిపూర్ణులు 40
కాకుండే నిమిత్తము దేవుడు మనకొరకు మరి శ్రేష్ఠ
మైనదాని ముందుగా సిద్ధపరిచెను.

## 12. అధ్యాయము.

కావున, మనలను చుట్టుకొనుచున్న ఈపాటి సాక్షి 1
మేఘము మనకు ఉండగా, మనము కూడ ప్రతి బరు
వును సుళువుగా చిక్కులబెట్టు పాపమును విడిచి, ।
విశ్వాసమునకు అగ్రేసరుడును, దాని కొనసాగించు 2
వాడునైన యేసు వైపు చూచుచు, మన ముందట ఉంచ
బడిన పందెమందు ఓపికతో పరుగెత్తుదము. ఆయన తన
ముందట ఉండిన సంతోషము కొరకు శిలువను సహించి,
అవమానమును నిర్లక్ష్యపెట్టి, దేవుని సింహాసనము
యొక్క కుడిచేతి వైపున కూర్చుండి యున్నాడు; ।
ఎందుకనగా, మీరు మీ ప్రాణముల యందు అల 3
సటపడి, విసుకకుండే నిమిత్తము తనకు విరోధముగా
పాపులు చేసినంత తిరుగుబాటుకు ఓర్చిన వాని తలం
చుకొనుడి.

మీరు పాపమునకు విరోధముగా పోరాడుచు, 4
రక్తము మట్టుకు ఇంకా ఎదిరించ లేదు. । మరియు— 5
నా కుమారుడా! ప్రభువుయొక్క శిక్షను నిర్లక్ష్య
పెట్టకుము; ఆయనచేత గద్దించబడునప్పుడు విసుక
కుము; । ఎందుకనగా, ప్రభువు తాను ప్రేమించు వాని 6
శిక్షించి, తాను చేర్చుకొను ప్రతి కుమారుని దండించు
నని, కుమారులవలె మీతో సంభాషించే బోధను మరి
చితిరా? । శిక్ష నిమిత్తము మీకు శ్రమానుభవము కలదు. 7
దేవుడు కుమారులని మిమ్మును గూర్చి విచారించుచు
న్నాడు; । తండ్రి శిక్షించని కుమారుడు ఎవడు? దేనిలో 8
వారందరు పాలు పొందిరో, ఆ శిక్ష లేకుంటే మీరు
దుర్బీజులే గాని కుమారులు కారు. । మరియు శిక్షకు 9
లైన మన శరీరముల తండ్రులు మనకు ఉండగా, వారి

యందు భక్తి ఉంచేవారము. మరి ఎక్కువగా మన ఆత్మల
10 తండ్రికి లోబడి జీవించమా! । వారు కొన్ని దినముల
మట్టుకు తమ చిత్తము చొప్పున మనలను శిక్షించే వారు
గాని, మనము ఆయన పరిశుద్ధతలో పాలు పొందవలె
నని మన మేలు కొరకు (ఆయన శిక్షించుచున్నాడు.)
11 మరియు ప్రస్తుతమందు సమస్త శిక్షయు దుఃఖక
రమే గాని, సంతోషకరమైనట్టు అగపడదు; అయినను
దానివల్ల సాధకము చేయబడు వారికి, అది నీతిమత్వ
మనే సమాధాన ఫలమిచ్చును.
12 కాబట్టి వడలిన చేతులను సడలిన మోకాళ్లను కుదు
13 ర్చుకొనుడి. । మరియు, కుంటి కాలు బెణికించబడక,
బాగు పొందే నిమిత్తము మీ పాదములకు మార్గము
లను సరళముగా చేసుకొనుడి.

14 అందరితో సమాధానమును పరిశుద్ధతను అనుసరిం
చుడి; ఇది లేకుంటే ఎవడును ప్రభువును చూడడు.
15 ఎవడైనను దేవుని కృప తప్పిపోకుండునట్లు చేదుగల
ఏ వేరైనను మొలిచి కలతపరుచగా, దాని ద్వారా అనే
16 కులు అపవిత్రపరచబడకుండునట్లును, । ఒక్క భోజన
ము కొరకు తన జ్యేష్ఠత్వము అమ్మిన ఏసావువలె, ఏ
మత దూషకుడైనను, ఏ వ్యభిచారియైనను ఉండనట్లును
17 జాగ్రత్తగా చూచుకొనుడి; । అతడు ఆ తరువాత ఆశీ
ర్వాదము పొంద కోరుచు విసర్జించబడెనని మీరు
ఎరుగుదురు; ఏలాగనగా అతడు చాలా మట్టుకు కన్నీ
ళ్లతో దాని వెతికినప్పటికి మారుమనస్సుకు సందు కను
గొనలేదు

18 అదియు గాక, స్పర్శ చేయగల కొండకును, మండు
చున్న అగ్నికిని, మేఘమునకును, చీకటికిని, తుఫాను
19 కును, । బూర ధ్వనికిని, మాటల శబ్దమునకును, మీరు
చేరలేదు. ఆ శబ్దము వినిన వారు మరి ఏ వాక్యమును
20 తమతో చెప్పబడ కూడదని బతిమాలుకొనిరి; । ఎందు
కనగా—ఒక జంతువైనను ఆ కొండను ముట్టితే, రాళ్ల
తో కొట్టబడ వలెనని ఆజ్ఞాపించబడిన మాట ఓర్చలేక
21 పోయిరి. । మరియు మోషే—నేను మిక్కిలి భయపడి
వణుకుచున్నానని చెప్పెను; అగపడినది అంత భయం
22 కరమైనదై యుండెను. । అయితే మీరు సీయోననే
కొండకును, సజీవుడైన దేవుని పట్టణమనగా ఆకాశ
మందలి యెరూషలేముకును, దశ సహస్రములనగా దూ
23 తల ఆనంద సంఘమునకును, । ఆకాశమందు వ్రాయ
బడిన జ్యేష్ఠుల సంఘమునకును, అందరి న్యాయాధిపతి
యైన దేవుని యొద్దకిని, పరిపూర్ణులుగా చేయబ
24 డిన నీతిమంతుల యాత్మల యొద్దకిని, । క్రొత్త నిబంధనకు
మధ్యవర్తియైన యేసు యొద్దకిని, ఆబేలు కంటే
విశేషముగా పలికే ప్రోక్షణ రక్తమునకును వచ్చియు
న్నారు.

పలుకుచున్న వాని ఉపేక్షించకుండునట్లు చూచు 25
కొనుడి; ఎందుకనగా, భూమి మీద దేవవాక్యము
పలుకుచుండిన వాని ఉపేక్షించిన వారు తప్పించుకొ
నక పోతే, ఆకాశమునుంచి పలుకుచున్న వాని విడిచే
మనము మరి నిశ్చయముగా తప్పించుకొన లేము గదా. ।
అప్పుడు ఆయన శబ్దము భూమిని చలింప చేసెను 26
గాని, ఇప్పుడు—నేను ఇంకొక సారి భూమిని మాత్ర
మే కాకుండ, ఆకాశమును చలింపచేతునని వాగ్ద
త్తము చేసి యున్నాడు. ।—ఇంకొక సారి అనే మాట, 27
చలింప చేయబడనివి నిలుకడగా ఉండే నిమిత్తము,
చేయబడిన వాటివలె చలింప చేయబడిన వాటి నివా
రణ తెలియ చేయుచున్నది. । కాబట్టి మనము నిశ్చలమైన 28
రాజ్యమును పొందుచు, కృతజ్ఞత గలవారమై యుండ
ము. దానివల్ల, వినయ భయభక్తులతో దేవుని అనుకూ
లముగా ఆరాధించ గలము. । మన దేవుడు దహించే 29
అగ్నియై యున్నాడు.

## 13. అధ్యాయము.

సహోదర ప్రేమ నిలువనియ్యుడి. అతిథి ప్రే 1
మ మరవకుడి; । దానివల్ల కొందరు తెలియక దేవ దూ 2
తలకు ఆతిథ్యము చేసిరి. । మీరు వారితో బంధించ 3
బడినట్టు బంధించబడిన వారినిని, మీరు కూడ శరీర
ములో ఉన్నారు గనుక బాధపడే వారినిని జ్ఞాపక
ము చేసుకొనుడి.

అన్నిటిలోను పెండ్లి ఘనమైనది; పానుపు నిష్కల్మ 4
షమైనదియునై యుండ వలెను. అయితే వేశ్యాసంగు
లకు వ్యభిచారులకును దేవుడు న్యాయపు తీర్పు
చేసును.

ధనాపేక్ష లేని నడువడి గలవారై, మీకు కలిగిన 5
వాటితో తృప్తి పొందుడి; ఎందుకనగా ఆయన —
నిన్ను ఏ మాత్రమును విడువను, నిన్ను ఎన్నడును ఎడ
బాయనని చెప్పెను. । కాబట్టి—ప్రభువు నా సహా 6
యుడు; నేను భయపడను; నరుడు నాకు ఏమి చేయ
గలడని మనము చెప్పుకొనుటకు ధైర్యము గలవారమై
యున్నాము.

మీతో దేవుని వాక్యమును పలికిన మీ ప్రధాను 7
లను జ్ఞాపకము చేసుకొని, వారి నడునడి అంతము
శ్రద్ధగా తలంచుకొనుచు, వారి విశ్వాసమును అనుస
రించుడి. । యేసు క్రీస్తు నిన్న, నేడు, నిరంతరమును, 8
ఒక్కలాగే ఉన్నాడు.

నానా విధములైన అన్యబోధలచేత కొంచుపోబడ 9
కుడి. ఎందుకనగా వేటి యందు ప్రవర్తించినవారు
ప్రయోజనము పొంద లేదో, ఆ భోజనములవల్ల కాక
కృప వల్లనే హృదయము స్థిరపరచబడుట మంచిది. ।

10 మనకు ఒక యజ్ఞవేదిక ఉన్నది; దాని మీదివి తినుటకు,
గుడారమున ఆరాధన చేసే వారికి అధికారము లేదు. ।
11 ఎందుకనగా, వేటి రక్తము పాపమును గూర్చి అతిపరి
శుద్ధ స్థలములోకి ప్రధానయాజకుని వల్ల తేబడునో
ఆ జంతువుల శరీరములు వేలమునకు వెలపట దహిం
12 చబడును. । అందువల్ల యేసు కూడ తన స్వరక్తమువల్ల
ప్రజలను పరిశుద్ధపరిచే నిమిత్తము గుమ్మము వెలపట
13 హింసించబడెను. । కాబట్టి మనము ఆయన నిందను
మోసుకొనుచు, వేలము వెలపటనున్న ఆయన యొద్దికి
14 బైలు వెళ్లుదము; । ఎందుకనగా ఇక్కడ మనకు నిత్య
మైన పట్టణము లేదు గాని రాబోయేదాని వెతుకుచు
15 న్నాము. । కాబట్టి మనము దేవునికి, ఎల్లప్పుడును స్తుతి
యాగము, అనగా, ఆయన నామమును కొనియాడే పెద
16 వుల ఫలార్పణము చేయుదము. । మరియు ఉపకారము
ఔదార్యమును మరిచి పోకుడి; ఎందుకనగా అట్టి
యజ్ఞములు దేవునికి ఇష్టమై యున్నవి.
17 ఉత్తరమియ్య వలసిన వారి వలె, మీ ప్రధానులు
మీ ప్రాణముల నిమిత్తము మెళుకువపడుచున్నారు
గనుక వారు సంతోషముతోనే గాని దుఃఖముతో
దాని చేయకుండే నిమిత్తము, వారికి విధేయులై లోబడి
యుండుడి; ఎందుకనగా అది* మీకు నిష్ప్రయోజన
మైనదై యుండును.

మా నిమిత్తము ప్రార్థించుడి; ఎందుకనగా మేము 18
అన్నిటిలోను యోగ్యముగా ప్రవర్తించుటకు కోరి,
మంచి మనస్సాక్షి గలవారమని నమ్ముకొంటున్నాము. ।
మరియు మేము మరి త్వరగా మీకు తిరిగి అప్పగించ 19
బడే నిమిత్తము ఈలాగు చేయ వలెనని మరి యెక్కువ
గా బతిమాలుకొంటున్నాను.

శాశ్వతమైన నిబంధనయొక్క రక్తము వల్ల, గొర్రెల 20
గొప్ప కాపరియైన యేసనే మన ప్రభువును చనిపోయిన
వారిలోనుంచి లేపిన సమాధాన దేవుడు, । యేసు క్రీస్తు 21
ద్వారా, తన దృష్టికి అనుకూలమైనదాని, మీలో నెర
వేర్చుచు ప్రతి మంచి క్రియ యందును మిమ్మును
కుదుర్చును గాక. ఆయనకు యుగయుగములకును
మహిమ కలుగు గాక. ఆమేన్.

మరియు, సహోదరులారా! మీకు సంక్షేపము 22
గా వ్రాసియున్నాను గనుక ఈ బోధ వాక్యమును
సహించుడి.

సహోదరుడైన తిమోథెయు విడిపించబడెనని 23
తెలుసుకొనుడి.† అతడు రాగానే‡ అతనితో మిమ్మును
చూచెదను. । మీ అగ్రేసరులైన వారినందరిని పరిశుద్ధుల 24
నందరిని కౌగిలించుడి. ఈ తలివారు మిమ్మును కౌగిలిం
చుచున్నారు.

కృప మీ అందరితోను ఉండు గాక. 25

*అనగా, ఆ దుఃఖకరమైనది. †లేక, ఎరుగుదురు. ‡లేక, శీఘ్రముగా వస్తే.

అపొస్తలై

# యాకోబు వ్రాసిన

## ఉత్తరము.

### 1. అధ్యాయము.

1 దేవుని యొక్కయు ప్రభువైన యేసు క్రీస్తు యొ
క్కయు సేవకుడైన యాకోబు, చెదిరి యున్న పన్నెం
డు గోత్రములకు వ్రాసినది.

2,3 నా సహోదరులారా! మీ విశ్వాసముయొక్క
పరీక్ష ఓర్పును పుట్టించునని ఎరిగి, నానా విధము
లైన శోధనలలో పడేటప్పుడు, అది కేవలము సంతో
4 షమని ఎంచుకొనుడి.। అయితే మీరు సంపూర్ణు
లును, అనూనాంగులును, దేనిలోనైనను కొదువ లేని
వారునై ఉండుటకు, ఓరిమి క్రియ కొనసాగ ని
య్యుడి.

5 మీలో ఎవనికైనను జ్ఞానము కొదువగా ఉంటే,
దేవుని అడుగ వలెను; అప్పుడు అది వానికి ఇయ్యబ
డును. ఆయన నిందించక, అందరికిని ధారాళముగా
6 దయ చేసును.। అయితే అతడు ఏమాత్రమును సందే
హించక, విశ్వాసముతో అడుగ వలెను. ఎందుకనగా
సందేహించు వాడు, గాలిచేత కొట్టబడి, చంచలించే
7 సముద్ర తరంగమును పోలి ఉన్నాడు.। కాగా
ప్రభువువల్ల తనకు ఏమైనను దొరుకునని ఆ మనుష్యు
8 డు తలంచ కూడదు.।రెండు మనస్సులు గల మనుష్యుడు
తన సమస్త మార్గములయందు అస్థిరుడై యున్నాడు.

9 దీనుడైన సహోదరుడు తన ఔన్నత్యమందును,
ధనవంతుడు తన దీనతయందును సంతోషించ వలెను;।
10 ఎందుకనగా ఇతడు గడ్డి పువ్వువలె గతించి పోవును;।
11 సూర్యుడు వేంద్రముతో ఉదయించి, గడ్డిని ఎండజే
సెను, దాని పువ్వు రాలెను, దాని ఆకార సౌందర్య
మును నశించెను. ఆలాగే ధనవంతుడును తన మా
ర్గములలో వాడిపోవును.

12 పరీక్ష సహించే మనుష్యుడు ధన్యుడు; ఎందుకనగా
అతడు పరీక్షకు నిలిచిన వాడై, ప్రభువు, తన్ను ప్రే
మించువారికి వాగ్దత్తము చేసిన జీవ కిరీటము పొం
దును.

13 ఎవడును శోధించబడి,—నేను దేవుని చేత శోధించ
బడుచున్నాను అనుకొన కూడదు. ఎందుకనగా దేవు
డు చెడ్డవాటిలో అభ్యాసము లేనివాడు. అంతేకాదు,
ఆయన ఎవనిని (ఆలాగు) శోధించడు;।అయితే, ప్రతి 14
వాడును తన స్వకీయమైన దురాశ చేత ఈడ్చబడి
మరలుకొల్పబడి శోధించబడును.। అప్పుడు దురాశ 15
గర్భము ధరించినదై పాపమును కనును; ఆ పాపము
పరిపూర్ణమైనదై మరణమును కనును.

నా ప్రియ సహోదరులారా! మోసపోకుడి. 16
మంచిదైన ప్రతి దానము,। సంపూర్ణమైన ప్రతి వర 17
మును పైనుంచి వచ్చి, జ్యోతుల తండ్రి యొద్దనుంచి
దిగును. ఆయన యందు ఏ చంచలత్వమైనను గమనా
గమన చ్ఛాయయైనను లేదు.। ఆయన ఉద్దేశించి, తాను 18
సృష్టించిన వాటిలో మనము ఒక విధమైన ప్రథమ
ఫలములమవుటకు, సత్యము గల వాక్యమువల్ల మనలను
కనెను.

కాబట్టి, నా ప్రియ సహోదరులారా! ప్రతి మ 19
నుష్యుడు వినుటకు వేగముగలవాడును, మాటలాడు
టకు మందుడును, కోపించుటకు మందుడునై యుండ
వలెను.। ఎందుకనగా నరుని కోపము దేవుని నీతిని నెర 20
వేర్చదు.। అందుచేతను సమస్త కల్మషమును చెడుతనము 21
యొక్క బాహుళ్యమును మాని, లోపట నాటబడినది
యు, మీ ప్రాణములను రక్షించుటకు శక్తి గలదియు
నైన వాక్యమును సాత్వికముతో గైకొనుడి.

మరియు మిమ్మును మీరే మోసపుచ్చుకొనక, వినే 22
వారవుట మాత్రమే కాకుండ వాక్యము చొప్పున
ప్రవర్తించువారునై యుండుడి;।ఎందుకనగా ఎవడైనను 23
వాక్యమును వినియు, ఆ ప్రకారము ప్రవర్తించక
పోతే, అతడు అద్దములో తన సహజ ముఖమును చూ
చుకొను మనుష్యుని పోలియున్నాడు;। ఏలాగనగా, 24
అతడు తన్ను చూచుకొని, వెళ్లి తాను ఎటువంటి వా
డో వెంటనే మరిచి పోవును గాని,। విముక్తి గల సం 25
పూర్ణ బోధనప్రమాణము వైపు తేరి చూచి, నిలు
కడగా ఉండు వాడెవడో వాడు విని, మరచువాడు
కాక, క్రియను చేయువాడై తన క్రియలో ధన్యుడ
వును.

26 ఎవఁడైనను తన నాలుకకు కళ్లెము పెట్టుకొనక, తన
హృదయమును మోసపరచుకొని, భక్తి* గలవాడనని
27 ఎంచుకొంటే, వాని భక్తి* వ్యర్థమే. । తండ్రియైన
దేవునియెదుట పవిత్రమైనది, నిష్కళంకమైనదియునైన
భక్తి* ఏదనగా,దిక్కులేని పిల్లలను విధవలను వారి ఇబ్బం
దిలో పరామర్శించుటయు, ఇహలోక మాలిన్యము
తనకు తగలకుండ తన్ను తాను కాపాడుకొనుటయు.

## 2. అధ్యాయము.

1 నా సహోదరులారా! మహిమ గల మన ప్రభు
వైన యేసు క్రీస్తుయొక్క విశ్వాసమును పక్షపాతము
2 తో చేకొనకుడి; । ఏలాగనగా, బంగారపు ఉంగరము
గల మనుష్యుడు ప్రశస్త వస్త్రముతో మీ సునగోగు
లోకి† వచ్చినప్పుడు, మురికి బట్టలు గల ఒక దరిద్రు
3 డును లోపటికి వచ్చిన యెడల । మీరు ప్రశస్త వస్త్రము
ధరించుకొనిన వాని వైపు చూచి సన్మానించి—నీవు
ఇక్కడ సుఖముగా కూచుండుమని చెప్పి, ఆ దరి
ద్రునితో—నీవు అక్కడ నిలువుము, లేక ఇక్కడ
నా పాదపీఠమునకు దిగువను కూచుండుమని చెప్పిన
4 పక్షమందు, । అప్పుడు మీలో మీరు భేదపరచుకొని,
దురాలోచనలు గల విమర్శకులైతిరి గదా.

5 నా ప్రియ సహోదరులారా! ఆలకించుడి, విశ్వాస
భాగ్యవంతులును, తన్ను ప్రేమించువారికి తాను వా
గ్దత్తము చేసిన రాజ్యమునకు బాధ్యులునైన ఈ లోక
6 దరిద్రులను దేవుడు ఏర్పర్చుకొన లేదా! । అయితే,
మీరు దరిద్రుని అవమానించితిరి. ధనవంతులు మిమ్మును
హింసపెట్టరా? మిమ్మును న్యాయసభలకు నారే ఈడ్చ
7 రా? । మీకు పెట్టబడిన యోగ్య నామమును వారు దూ
8 షించరా? । మెట్టుకు—నీ వలె నీ పొరుగువాని ప్రేమిం
చుమను‡ లేఖనము చొప్పున, రాజన్యమైన బోధనప్ర
మాణము నెరవేర్చిన యెడల, బాగానే ప్రవర్తించు వా
9 రవుదురు; । కాని మీరు పక్షపాతులైతే, అపరాధులని ఆ
బోధనప్రమాణమువల్ల తీర్చబడి, పాపము చేయుచుం
10 దురు. । ఎందుకనగా ఎవడైనను బోధనప్రమాణమంత
యు గైకొని, ఒక ఆజ్ఞను మీరితే, అన్నిటి విషయము
11 అపరాధి అవును; । ఎందుకనగా— వ్యభిచరించ వద్దని
చెప్పిన వాడు§ నరహత్య చేయ వద్దనియు|| చెప్పెను
గనుక, నీవు వ్యభిచరించక పోయినప్పటికి నరహత్య
చేసిన యెడల, బోధనప్రమాణము అతిక్రమించిన వా
12 డవైతివి. । విముక్తి గల బోధనప్రమాణము చొప్పున
తీర్పు పొందబోయే వారి వలె, ఆలాగు పలికి, ఆ
లాగు ప్రవర్తించుడి; । ఎందుకనగా కృప చేయని 13
వాడు కృప లేనితీర్పు పొందును. కనికరము న్యా
యపు తీర్పును గూర్చి అతిశయపడును.

నా సహోదరులారా! ఎవడైనను క్రియలు లేకనే 14
తనకు విశ్వాసము కలదని చెప్పితే, ఏమి ప్రయోజన
ము? ఆ విశ్వాసము అతని రక్షించ గలదా? । సహో 15
దరుడైనను సహోదరియైనను దిగంబరులై దినాహార
ము లేకుండ ఉన్నప్పుడు, । మీలో ఎవడైనను శరీరము 16
నకు కావలసిన వాటిని దయ చేయక,—సమాధానము
గా వెళ్లండి, చలి కాచుకొనండి, తృప్తి పొందండి అని
చెప్పితే, ఏమి ప్రయోజనము? । ఆలాగే విశ్వాసమును 17
క్రియలు లేకుండ ఉంటే, అది ఒంటిగా ఉండి మృ
తమై యున్నది. । అయితే, ఎవడైనను—నీకు విశ్వాస 18
ము ఉన్నది, నాకు క్రియలు ఉన్నవని చెప్పునేమో.
నీ క్రియలు లేకుండ నీ విశ్వాసము నాకు అగపరచు
ము; అప్పుడు నా క్రియలవల్ల నా విశ్వాసమును నీకు
అగపరతును. । దేవుడొక్కడే ఉన్నాడని నమ్ముచున్నా 19
వు. అది మంచిది; దయ్యములును నమ్మి వణకుచున్నవి. ।
అయితే, ఓ బుద్ధిహీన మనుష్యుడా! క్రియలు లేని 20
విశ్వాసము మృతమైనదని తెలుసుకొన కోరుచున్నా
వా? । మన పితృడైన అబ్రాహాము తన కుమారుడైన 21
ఇసాకును యజ్ఞవేది మీద అర్పించినప్పుడు, అతడు
క్రియలవల్ల నీతిమంతుడని తీర్పు పొందలేదా? । విశ్వా 22
సము అతని క్రియలతో పని జరిగించెననియు, క్రియ
లవల్ల అతని విశ్వాసము సంపూర్ణముగా కొనసాగెనని
యు గ్రహించుచున్నావు గదా? । అప్పుడు,—మరియు 23
అబ్రాహాము దేవుని నమ్మెను; అది అతనికి నీతి నిమిత్త
ము ఎంచబడెనని చెప్పు లేఖనము¶ నెరవేర్చబడెను.
అప్పుడు అతడు దేవుని స్నేహితుడని చెప్పబడెను. । **
కాబట్టి మనుష్యుడు వట్టి విశ్వాస మూలముగానే 24
కాక, క్రియల మూలముగా నీతిమంతుడని ఎంచబ
డుట మీరు చూచుచున్నారు.

అటువలె రాహాబనే వేశ్య కూడ దూతలను రహ 25
స్యముగా చేర్చుకొని, వేరొక మార్గమున వారిని వెల
పటికి పంపినప్పుడు, క్రియల మూలముగా నీతిమంతు
రాలని యెంచబడ లేదా? । ఎందుకనగా, ప్రాణము 26
లేని శరీరము ఏలాగు మృతమై యున్నదో, ఆలాగే
క్రియలు లేని విశ్వాసమును మృతమై యున్నది.

## 3. అధ్యాయము.

నా సహోదరులారా! మనము మరి కఠినమైన 1
తీర్పు పొందుదుమని ఎరిగి, మీరు అనేకులైన ఉపదే

* లేక, ఆరాధన. † అనగా, సంఘములోకి. ‡ లేవి. 19. 18 § లేక, చెప్పేది.
|| నిర్గ. 20 అ. 13, 14 వ. ¶ ఆదికాం. 15. 6. ** యెషయా, 41. 8.

2 శకులై యుండకుడి; । ఎందుకనగా అనేక విషయము
లయందు, మనమందరము తప్పి పోవుచున్నాము. ఎవ
డైనను వాక్యమందు తప్పక పోతే, అట్టివాడు పరిపూ
ర్ణ మనుష్యుడై, సర్వ శరీరమునకును కళ్లెము పెట్టు
3 కొనుటకు శక్తి గల వాడు.। ఇదుగో! గుర్రములు మనకు
లోబడుటకు, కళ్లెములు వాటి నోళ్లలో పెట్టి, వాటి
4 శరీరమంతయు తిప్పుదుము.। ఓడలను కూడ చూడు
ము; అవి అంత గొప్పవై ఘోరమైన గాలి చేత కొట్టు
కొని పోబడినప్పటికి, నావికుని ఉద్దేశము చొప్పున,
5 మిక్కిలి చిన్న చుక్కాని చేత తిప్పబడును.। ఆలాగు
నాలుక కూడ చిన్న అవయవమై బహుగా అతిశయప
డును. ఇదుగో! కొంచెము నిప్పు ఎంతో విస్తారమైన
6 అడవిని తగల బెట్టును. । నాలుక అగ్నియు అన్యాయ
లోకమునై యున్నది. నాలుక మన అవయవములలో
ఉంచబడి సర్వ శరీరమునకును మాలిన్యము కలుగ
చేసును. అది జనన చక్రమును రవులుకొల్పును. అది గ
7 హెన్న* చేత రవులుకొల్పబడును;। ఎందుకనగా మృగ
పక్షుల యొక్కయు, సర్ప జలచరముల యొక్కయు,
ప్రతి జాతియు నరజాతివల్ల సాదు చేయబడును, సాదు
8 చేయబడెను. । అయితే మనుష్యులలో ఎవడును నాలు
కను సాదు చేయ నేరడు; అది మరణకరమైన విష
9 ముతో నింపబడి, నిరర్గళమైన దుష్టత్వమే. । దానివల్ల
తండ్రియైన దేవుని స్తుతించి దానివల్ల దేవుని పోలిక
చొప్పున పుట్టించబడిన మనుష్యులను శపింతుము. ।
10 ఒక్క నోటిలోనుంచే ఆశీర్వచనము శాప వచనమును
బైలు వెళ్లును. నా సహోదరులారా! అవి ఆలాగు
11 ఉండ కూడదు. । ఊట ఒక్క రంధ్రములోనుంచే
12 తియ్యనిది చేదైనదియు ఊర చేసునా! । నా సహో
దరులారా! అంజూరపు చెట్టున ఒలీవ పండ్లయినను,
ద్రాక్ష తీగెను అంజూరపు పండ్లయినను పుట్టువా!
అటువలె ఉప్పు నీళ్ల ఊటనుంచి తియ్యని నీళ్లును
పుట్టవు.

13 మీలో తెలివి బుద్ధియు గలవాడు ఎవడు? బుద్ధి
యొక్క సాత్వికముతో, తన యుక్త ప్రవర్తనవల్ల తన
14 క్రియలను అగపరచ వలెను.।అయితే మీ హృదయము
లలో చేదైన మత్సరమును వివాదమును మీరు ఉంచు
కొంటే, అతిశయపడవద్దు; సత్యమునకు విరోధముగా
15 అబద్ధమాడ వద్దు. । అది పైనుంచి దిగివచ్చు బుద్ధి కాక,
భూసంబంధమైనది, ఇంద్రియ విషయమైనది, దయ్య
16 ములదియునై యున్నది; । ఎందుకనగా, మత్సరము,
వివాదము ఎక్కడ ఉండునో, అక్కడ అల్లరియు,
17 ప్రతి దుష్కార్యమును ఉండును. । అయితే పైనుంచి
వచ్చు బుద్ధి మొదట పవిత్రమైనది, తర్వాత సమాధాన
మైనది, మృదువైనది, సులభమైనది, కనికరముతోను
మంచి ఫలములతోను నింపబడినది, పక్షపాతమైనను
వేషధారణమైనను లేనిదియునై యున్నది. । అయితే 18
నీతియొక్క ఫలము సమాధానము చేయువారివల్ల†
సమాధానమందు విత్తబడును.

## 4. అధ్యాయము.

మీలో యుద్ధములు, పోరాటములును ఎక్కడనుంచి 1
వచ్చును. ఇక్కడనుంచే గదా, అనగా మీ అవయవము
లలో పోరాడు మీ భోగములనుంచే వచ్చును.। మీరు 2
ఆశించుచున్నారు గాని అది మీకు ఉండదు. మీరు
సంహరించి ఆసక్తిపడుచున్నారు గాని సంపాదించు
కొన లేరు. మీరు పోట్లాడుచు యుద్ధము చేయుచు
న్నారు గాని మీరు అడుగనందున మీకు (ఏమియు)
దొరకదు. । మీరు అడిగినప్పటికి మీ భోగముల కొ 3
రకు వ్యయము చేసుటకు, దుష్టత్వముతో అడుగుచు
న్నారు గనుక మీరు (ఏమియు) పొందరు.

వ్యభిచారిణులారా! ఈ లోక స్నేహము దేవశత్రు 4
త్వమని ఎరుగరా? కాబట్టి ఎవడు ఈ లోక స్నేహితు
డవుటకు ఉద్దేశించునో, వాడు దేవుని శత్రువై యుం
డును. । ఆయన మనలో నివసింపచేసిన ఆత్మ సహిం 5
చలేక, అపేక్షించుచున్నదని లేఖనము వ్యర్థముగా
పలుకుచున్నదని మీకు తోచుచున్నదా! । మరియు 6
ఆయన ఎక్కువ కృపను ఇచ్చును. అందువల్ల—దేవుడు
గర్విష్ఠులను ఎదిరించి, దీనులయందు దయ ఉంచునని
చెప్పుచున్నది. । ‡ కాబట్టి దేవునికి లోబడి యుండుడి; 7
సైతానును ఎదిరించుడి; అది మీ యొద్దనుంచి పారి
పోవును. । దేవునికి సమీపించుడి; అప్పుడు ఆయన 8
మీకు సమీపించును. పాపులారా! మీ చేతులను
శుభ్రము చేసుకొనుడి. ద్విమనస్కులారా! మీ హృద
యములను పరిశుద్ధపరుచుకొనుడి, బాధ పరుచుకొ
నుడి; । దుఃఖపడుడి, ఏడువుడి. మీ నవ్వు దుఃఖము 9
నకు, మీ సంతోషము చింతకును మార్చుకొనుడి. ।
ప్రభువు దృష్టికి దీనులై యుండుడి; అప్పుడు ఆయన 10
మిమ్మును హెచ్చించును.

సహోదరులారా! ఒకనికి విరోధముగా ఒకడు 11
మాటలాడకుడి. తన సహోదరునికి విరోధముగా మా
టలాడి, తన సహోదరునికి తీర్పు చేసేవాడు బో
ధనప్రమాణమునకు విరోధముగా మాటలాడి బోధన
ప్రమాణమునకు తీర్పు చేయుచున్నాడు. అయితే నీవు
బోధనప్రమాణమునకు తీర్పు చేసిన యెడల, బోధన

* లేక, నరకము. † లేక, వారి కొరకు. ‡ సామెతె. 3. 34.

ప్రమాణము నెరవేర్చువాడవు కాక, దానికి న్యాయ
12 ము విధించేవాడవైతివి. । రక్షించుటకు, నశింప చేయు
టకును శక్తిమంతుడైన ఒక్కడే బోధనప్రమాణము
నియమించి న్యాయము తీర్చువాడునై యున్నాడు.
13 కాగా, పరునికి తీర్పు చేయు నీవు ఎవడవు? ఆలకిం
చుడి—నేడైనను రేపైనను పట్టణమునకు వెళ్లి అక్కడ
ఒక సంవత్సరము ఉండి క్రయ విక్రయములు చేసి,
లాభము కలుగ చేసుకొందుమని పలుకువారలారా! ।
14 రేపు ఏమి సంభవించునో, అది మీకు తెలియదు
గదా? ఎందుకనగా, మీ జీవము ఏపాటిది? అది కొంత
సేపు కనబడిన తరువాత, కనబడని ఆవిరి గదా? ।
15 మీరు ఆలాగు పలుకక—ప్రభువుకు ఇష్టమైతే మేము
జీవించి, ఇదియైనను అదియైనను చేతుమన వలెను. ।
16 అయినను, ఇప్పుడు మీ డంబముల యందు అతిశయ
17 పడుచున్నారు. ఇట్టి అతిశయమంతయు చెడ్డది. । కా
బట్టి యుక్తముగా ప్రవర్తించుటకు ఎరిగియు, ఆలాగు
చేయని వానికి పాపము ఉన్నది.

## 5. అధ్యాయము.

1 ఇదుగో! ధనవంతులారా! మీ మీదికి వచ్చుచున్న
ఉపద్రవముల నిమిత్తము ప్రలాపించుడి; ఏడువుడి; ।
2 మీ ధనము కుళ్లి పోయెను, మీ వస్త్రములను చిమ్మటలు
3 కొట్టినవాయెను. । మీ బంగారము, మీ వెండియు
తుప్పు పట్టినవి. వాటి తుప్పు మీకు విరోధమైన సా
క్ష్యముగా ఉండి, అగ్నివలె మీ శరీరములను భక్షిం
చును. అంత్య దినముల యందు ధనము కూర్చుకొం
4 టిరి. । ఇదుగో! మీ చేలు కోసిన పనివారి కూలి బిగ
పట్టబడి మీ యొద్దనుంచి మొరబెట్టుచున్నది. మీ కో
తవారి కేకలు, సేనల ప్రభువుయొక్క చెవులలో ప్రవే
5 శించెను. । మీరు భూమి మీద సుఖముగా జీవించి
కాముకులై, సంహార దినము కొరకు మీ హృదయము
6 లను పోషించుకొంటిరి. । మీరు నీతిమంతుని, శిక్ష
విధించి చంపితిరి; ఆయన మిమ్మును ఎదిరించుట లేదు.
7 కాబట్టి, సహోదరులారా! ప్రభువు వచ్చే పర్యం
తము దీర్ఘసహనులై* యుండుడి. ఇదుగో! వ్యవసా
యకుడు తొలకరి వర్షమును, కడవరివర్షమును సమ
కూడు పర్యంతము, భూమియొక్క విలువైన ఫలముల
కొరకు కనిపెట్టుచు వాటి నిమిత్తము దీర్ఘసహనుడై
8 యుండును. । ప్రభువుయొక్క రాకడ సమీపించుచున్న
దని మీరును దీర్ఘసహనులై, మీ హృదయములను
స్థిరపరుచుకొనుడి.

సహోదరులారా! మీరు శిక్షావిధి పొందకుండే 9
నిమిత్తము, ఒకనికి విరోధముగా ఒకడు సణగకుడి.
ఇదుగో! న్యాయకర్త తలుపుల యెదుట నిలిచి యు
న్నాడు.

నా సహోదరులారా! ప్రభువుయొక్క పేరట పలి 10
కిన ప్రవక్తలను, శ్రమానుభవమునకును దీర్ఘ సహన
మునకును దృష్టాంతముగా గైకొనుడి. । ఇదుగో! శ్రమ 11
సహించు వారిని ధన్యులనుకొంటున్నాము. మీరు యో
బుయొక్క సహనమును గూర్చి వింటిరి; ప్రభువుయొ
క్క అంతము కూడ చూచితిరి; ప్రభువు బహు వాత్స
ల్యమును కనికరమును గలవాడై యున్నాడు.

అయితే నా సహోదరులారా! ముఖ్యమయినది 12
ఏదనగా—ఆకాశము తోడనే గాని, భూమి తోడనే
గాని, మరి ఏ ఒట్టును పెట్టుకొనక, మీరు శిక్షావిధి
లో పడకుండే నిమిత్తము మీయొక్క అవును అవుననేది
యు, మీయొక్క కాదు కాదనేదియునై యుండ వలెను.

మీలో ఎవనికైనను బాధ సంభవించితే, ప్రా 13
ర్థించ వలెను. ఎవడయినను సంతోషము గలవాడై
యుంటే, కీర్తనలను పాడ వలెను. । మీలో ఎవడైనను 14
రోగియై యుంటే సంఘములోని పెద్దలను పిలిపించ
వలెను. వారు ప్రభువు యొక్క పేరట అతనికి నూనె
రాచి అతని కొరకు ప్రార్థించ వలెను. । అప్పుడు 15
విశ్వాస ప్రార్థన ఆ రోగిని స్వస్థ పరుచును; ప్ర
భువు అతని లేపును. అతడు పాపములను చేసి యు
న్నప్పటికి, అవి క్షమించబడును.

మీరు స్వస్థత పొందే నిమిత్తము, మీరు మీ అపరా 16
ధములను ఒకనితో ఒకడు ఒప్పుకొని, ఒకనికొరకు
ఒకడు ప్రార్థించుడి. న్యాయస్థుని దృఢమైన ప్రా
ర్థన బహుబలము చేసును. । ఏలియా మన వలె సమానుభ 17
వము గల మనుష్యుడు. వర్షించకుండే నిమిత్తము అత
డు మనఃపూర్వకముగా ప్రార్థించినప్పుడు, మూడు
సంవత్సరముల ఆరు నెలల పర్యంతము భూమి మీద
వర్షించలేదు. । అతడు తిరిగి ప్రార్థించినప్పుడు, 18
ఆకాశము వర్షమిచ్చెను గనుక భూమి తన ఫలములు
పుట్టించెను.

సహోదరులారా! మీలో ఎవడైనను సత్యము 19
నుంచి తప్పబడినప్పుడు, మరి యొక్కడు దాని తట్టు
అతని మళ్లించితే, । పాపిని వాని వంకర మార్గము 20
నుంచి మళ్లించే వాడు మరణమునుంచి ఆత్మను రక్షించి,
అనేక పాపములను కప్పివేసునని తెలుసుకొన వలెను.

---

* లేక, దీర్ఘశాంతులై.

అపొస్తలుడైన

# పేతురు వ్రాసిన

## మొదటి ఉత్తరము.

### 1. అధ్యాయము.

1 యేసు క్రీస్తు అపొస్తలుడైన పేతురు, పొంతు, గల
తియ, కప్పదొకియ, ఆసియ, బిథునియ (అనే దేశ
ముల యందు) చెదిరిన వారిలో, తండ్రియైన దేవుని
2 ముందెలివి చొప్పున, ఆత్మ పరిశుద్ధీకరణమందు విధే
యతకును యేసు క్రీస్తు రక్త ప్రోక్షణకును ఏర్పరచ
బడిన పరదేశులకు వ్రాసినది. మీకు కృపయు, సమా
ధానము, విస్తరింప చేయబడు గాక.

3 మన ప్రభువైన యేసు క్రీస్తు తండ్రియైన దేవుడు
స్తుతింపబడు గాక. మృతులలోనుంచి యేసు క్రీస్తు
4 తిరిగి లేచుటవల్ల, సజీవ నిరీక్షణ కొరకు అనగా। చెడ
నిది, నిర్మలమైనది, వాడబారనిదియునైన స్వాస్థ్యము
కొరకు, ఆయన తన కరుణా బాహుళ్యము చొప్పున
5 మనలను తిరిగి జన్మింప చేసెను. । అది* కడవరికాల
మందు బయలుపరచ బడుటకు సిద్ధమైన రక్షణ నిమిత్త
ము విశ్వాసమువల్ల దేవుని శక్తిలో భద్రము చేయబడు
చున్న మీ కొరకు ఆకాశమందు కాపాడబడి యు
6 న్నది. । అందులో మీరు మిక్కిలి సంతోషించుచు
7 న్నారు. । అయినను అగ్నివల్లనైన పరీక్షకు నిలిచినప్ప
టికి నశించు సువర్ణ (పరీక్ష) కంటే మీ విశ్వాస
పరీక్ష మిక్కిలి అమూల్యమైనదై యేసు క్రీస్తు ప్రత్య
క్షములో స్తోత్ర, ఘనత, మహిమలకు కారణముయే
నిమిత్తము, అక్కర ఉన్నందున కొంతకాలము మట్టుకు
నానా విధములైన శోధనలవల్ల దుఃఖపడుచున్నారు.
మీరు ఆయనను చూడక పోయినప్పటికి ప్రేమించు
8 చున్నారు. । ఇప్పుడు మీరు ఆయనను కన్నులతో
చూడక విశ్వసించుచు, చెప్పనశక్యమైనదియు మహిమ
కలిగినదియునైన ఆనందముతో ఆయనయందు సంతో
9 షించుచు, । మీ విశ్వాసముయొక్క ఫలము అనగా
10 మీ ప్రాణముల రక్షణను పొందుదురు. । మీ యెడల
నున్న ఈ కృపనుగూర్చి ముందుగా ప్రవచించిన ప్రవ
క్తలు తమలో ఉన్న క్రీస్తు ఆత్మ, క్రీస్తు కొరకైన †
శ్రమలను గూర్చియు వాటి తర్వాత అధిక మహిమను
11 గూర్చియు ముందుగా సాక్ష్యము చెప్పినప్పుడు, । అది
ఏ కాలమును ఏ విధమైన కాలమును సూచించెనో,
దాని పరిశోధించుచు, ఆ రక్షణ విషయము శ్రద్ధగా
విచారణ చేసి పరిశోధించిరి. । అయితే ఆకాశము 12
నుంచి పంపబడిన పరిశుద్ధాత్మతో మీకు సువర్తమా
నమును ప్రకటించిన వారి ద్వారా మీకు తెలుపబడిన
ఆ సంగతులను గూర్చి, తమ కొరకు కాదు గాని మన
కొరకు తాము సేవ చేసిరని వారికి బైలు పరచబడెను.
దేవదూతలు వాటిని తొంగి చూడ కోరుచున్నారు.

కాబట్టి మీ మతి నడుము కట్టుకొని సుబుద్ధిగల 13
వారై, యేసు క్రీస్తు ప్రత్యక్షములో మీకు తేబడు
చున్న కృప నిమిత్తము తుద మట్టుకు నిరీక్షించుడి. ।
పూర్వము మీ అజ్ఞానములోని మీ ఆశలను అనుస 14
రించక, । మిమ్మును పిలిచిన పరిశుద్ధుని ప్రకారము, మీ 15
రును విధేయతయొక్క పిల్లలవలె, సమస్త ప్రవర్తనలో
పరిశుద్ధులై యుండుడి; । ఎందుకనగా—నేను పరిశు 16
ద్ధుడనైయున్నాను గనుక మీరు కూడ పరిశుద్ధులై
యుండుడని వ్రాయబడి యున్నది.

మరియు పక్షపాతము లేకుండ ప్రతివాని క్రియా 17
ప్రకారము తీర్పు చేయువాని, తండ్రి అని ప్రార్థిం
చుచున్నారు గనుక మీరు పరదేశులై యున్న కాల
మును, భయ భక్తులతో గడపుడి; । మీరు పితృపారం 18
పర్యమైన మీ వ్యర్థ ప్రవర్తనలోనుంచి అనింద్య
మైనదియు । నిష్కళంకమైనదియునైన గొర్రెపిల్ల రక్త 19
మువలె, అమూల్యమైన క్రీస్తుయొక్క రక్తముచేతనే
గాని వెండి బంగారములవంటి క్షయవస్తువులచేత
విమోచించబడలేదు. । ఆయన జగత్తు పునాది వేయ 20
బడక మునుపు, నియమించబడెను, । గాని మృతుల 21
లోనుంచి ఆయనను లేపి ఆయనకు మహిమ ఇచ్చిన
దేవుని యందు ఆయన ద్వారా విశ్వాసముంచే మీ
నిమిత్తము ఆయన ఈ కడవరి కాలముల యందు కను
పరచబడెను.

కాగా, మీ విశ్వాసము, నిరీక్షణయు దేవుని యందు 22
ఉంచబడి యున్నవి. నిష్కపటమైన సహోదర ప్రే
మ నిమిత్తము, మీరు సత్యమునకు విధేయులవుటచేత
[ఆత్మవల్ల] మీ ప్రాణములను పవిత్ర పరుచుకొంటిరి
గనుక, శుద్ధ హృదయమునుంచి, ఒకని యందు ఒకడు

* అనగా, ఆ స్వాస్థ్యము. † లేక, వచ్చేమట్టుకైన.

23 మిక్కుటమైన ప్రేమ ఉంచుడి; । మీరు క్షయ బీజ
మునుంచి కాదు కాని అక్షయ బీజమునుంచి, అనగా,
జీవించి ఎల్లప్పుడును ఉండు దేవుని వాక్యమునల్ల
24 అక్షయ బీజమునుంచి తిరిగి పుట్టించబడితిరి; । ఎందు
కనగా సర్వశరీరము గడ్డివలె ఉన్నది; దాని సర్వమహి
మయు గడ్డి పువ్వు వలె ఉన్నది. గడ్డి వాడెను; దాని
పువ్వును రాలెను, గాని ప్రభువుయొక్క వాక్యము
25 ఎల్లప్పుడును నిలుచును. । మీకు ప్రకటించబడిన సు
వార్త అనే వాక్యమిదే.

## 2. అధ్యాయము.

1 కాబట్టి సమస్తమైన ఈర్ష్యను, సమస్తమైన కపటము
ను,వేషధారణలును, అసూయలును, సమస్త దుర్వచనము
లును మాని, మీరు, ప్రభువు దయాళుడని రుచి చూచి
2,3 తిరే,।* క్రొత్తగా పుట్టిన శిశువులవలె, నిర్మలమైన†।వాక్య
మను పాలవల్ల [రక్షణ పర్యంతము] ఎదిగే నిమిత్తము
4 ఆ పాలు వాంఛించుడి. । మనుష్యులచేత మెచ్చబడక,
దేవుని యెదుట ఏర్పరచబడినదియు, ఘనమైనదియు,
జీవముగల రాయియునైన ఆయన యొద్దికి వచ్చుచుం
5 డగా, । మీరును జీవము గల రాళ్ల వలె, యేసు క్రీస్తు
ద్వారా దేవునికి ఇష్టమైన ఆత్మీయ యాగపశువు
లను అర్పించుటకు, పరిశుద్ధ యాజకులుగాను ఆత్మీయ
6 మైన మందిరముగాను కట్టబడి యున్నారు.।ఆ ప్రకార
ము— ఇదుగో! నేను మూలకు ముఖ్యమైనది, ఏర్పరచ
బడినది, ఘనమైనదియునైన రాతిని సీయోనులో వేయు
చున్నాను. ఆయన యందు విశ్వాసముంచేవాడు అవ
మానపరచబడడనే వాక్యము లేఖనమందు ఇమిడి యు
7 న్నది. । కాబట్టి విశ్వసించుచున్న మీకు ఈ ఘనత
కలదు అవిశ్వాసులకు‡ అయితే— ఇల్లు కట్టేవారు
ఏ రాతిని ఉపేక్షించిరో అదేమూలకు ముఖ్యమైనది
గాను, అభ్యంతరముచేసే రాయిగాను, ఆతంకముచేసే
8 బండగాను చేయబడెను. । వారు ఆ వాక్యమునకు అవి
ధేయులై, అభ్యంతరపడుచున్నారు. దానికే వారు
9 నియమించ బడిరి. । అయితే చీకటిలోనుంచి ఆశ్చర్య
మైన తన వెలుగులోకి మిమ్మును పిలిచినవాని సద్గుణ
ములను ప్రచురము చేసే నిమిత్తము, మీరు ఏర్పరచబ
డిన సంతానమును, రాజులయిన యాజకుల సమూహ
మును, పరిశుద్ధ జనమును, స్వకీయార్థమైన ప్రజలునై
10 యున్నారు;। ఒకప్పుడు ప్రజలు కాక, ఇప్పుడు దేవుని
ప్రజలైతిరి; కరుణించబడక, ఇప్పుడు కరుణించబడిన
వారైతిరి.
11 ప్రియులారా! పరవాసులును పరదేశులునైన వారి
వలె, ప్రాణమునకు విరోధముగా పోరాడే శరీరాశ
లను విసర్జించుకొని, మిమ్మును ఏ విషయమందు దుర్మా
ర్గులని దూషింతురో, । ఆ విషయమందు వారు మీ 12
సత్క్రియలను చూచి, వాటి మూలముగా దర్శన దిన
మున దేవుని మహిమపరిచే నిమిత్తము, వారి మధ్యను
మంచి ప్రవర్తన గలవారై యుండ వలెనని మిమ్మును
బతిమాలు కొనుచున్నాను.

కావున ముఖ్యుడని రాజుకే గాని, దుర్మార్గులకు 13
దండన కలుగుటకును సన్మార్గులకు మెప్పు కలుగుట
కును, । ఆయనవల్ల పంపబడిరని అధిపతులకే గాని,మను 14
ష్యుల ప్రతి కట్టడకును ప్రభువు నిమిత్తము లోబడి
యుండుడి; । ఎందుకనగా మీరు మేలు చేయుచు 15
ఆలాగు అవివేకులయొక్క అజ్ఞానమునకు చిక్కుము
వేయుట దేవునికి ఇష్టమై యున్నది. । స్వతంత్రులవ 16
లెనే గాని, దుష్టత్వము పైని వేషముగా మీ స్వాతం
త్ర్యము వినియోగపరచక, దేవుని దాసుల వలె అంద
రిని సన్మానించుడి; । సహోదరులను ప్రేమించుడి; 17
దేవునికి భయపడుడి; రాజును సన్మానించుడి.

సేవకులారా! మంచివారును సాత్వికులునైన వారికి 18
మాత్రమే కాకుండ, ముష్కరులైన మీ యజమానుల
కును పూర్ణభయముతో లోబడి యుండుడి;।ఎందుక 19
నగా,ఎవడైనను అన్యాయముగా హింసపడుచు, దేవుని
జ్ఞానము పట్టి, దుఃఖమును సహించితే, అది హితమైన
దవును.। అయితే మీరు తప్పితము చేసినందున, దండించ 20
బడుచుండగా సహించితే, ఏమి ఖ్యాతి! అయితే మీరు
మేలు చేయుచు హింసపడుచుండగా, సహించిన యె
డల, అది దేవుని కృపాఫలము. । అందు నిమిత్తము పిలు 21
వబడితిరి; ఎందుకనగా, క్రీస్తు కూడ మన కొరకు హింస
పడి, మీరు ఆయన అడుగులను పట్టి వెంబడించే నిమి
త్తము, మీకు జాడలు ఉంచెను.।ఆయన పాపము చేయ 22
లేదు; ఆయన నోట ఏ కపటమును అగపడ లేదు. ।
ఆయన దూషించబడుచు తిరిగి దూషించలేదు; ఆయన 23
హింసపడుచు, బెదరించక, న్యాయముగా తీర్పు చేసే
వానికి తన్ను తాను అప్పగించుకొనుచుండెను. । మన 24
ము పాపముల మట్టుకు చనిపోయి, నీతిమట్టుకు జీవించే
నిమిత్తము, ఆయన తన శరీరమందు మన పాపములను
మాను మీదికి తానే మోసుకొనెను. ఆయన దెబ్బల
మచ్చలవల్ల మీరు స్వస్థ పరచబడితిరి;। మీరు తప్పిపో 25
యిన గొర్రెల వలె యుంటిరి గాని, ఇప్పుడు మీ
ప్రాణముల కాపరియు, అధ్యక్షుడునైన ఆయన యొ
ద్దికి మళ్లి యున్నారు.

* లేక, చూచితిరి గనుక. † లేక, నిష్కపటమైన. ‡ లేక, అవిధేయులకు.

## 3. అధ్యాయము.

1 అటువలె, స్త్రీలారా! మీరు మీ స్వపురుషులకు
లోబడి యుండుడి. అప్పుడు వారిలో ఎవరైనను
2 వాక్యమునకు అవిధేయులయితే, । వారు భక్తిసహిత
మైన మీ పవిత్ర ప్రవర్తన చూచి, వాక్యము వినక
పోయినను, స్త్రీల నడువడి వల్ల రాబట్టబడవచ్చును. ।
3 వెంట్రుకలను అల్లుటయు, సువర్ణ భూషణములు పెట్టు
కొనుటయు, వస్త్రములు వేసుకొనుట అనే వెలపటి
4 అలంకారము మీకు అలంకారము కాదు గాని,। సాధు
వైనది నిమ్మళమైనదియునైన ఆత్మయొక్క అక్షయత్వము
తో సహితమైన హృదయమందలి అంతరంగ పురు
షుడు మీకు అలంకారముగా నుండ వలెను. అది దేవుని
5 దృష్టికి మిక్కిలి విలువ గలది.। అటువలె పూర్వము
దేవునియందు నిరీక్షించిన పరిశుద్ధ స్త్రీలును తమ స్వ
పురుషులకు లోబడి మేలు చేయుచు ఏ భయమువలన
బెదరనివారై, ఆలాగున తమ్మును తాము అలంకరించు
6 కొనిరి. ఆ ప్రకారను,। మీరు ఏ స్త్రీ పిల్లలైతిరో ఆ
సారా, అబ్రాహామును ప్రభువా! అని అతనికి లోబ
డినది.

7 అటువలె పురుషులారా! మీ ప్రార్థనలకు అభ్యం
తరము రాకుండుటకు, జ్ఞానము చొప్పున వారితో నివ
సించుచు, జీవమనే కృపావరములో మీరు పాలివా
రైతిరి గనుక, ఎక్కువ బలహీనత గల దేహమని, స్త్రీని
సన్మానించుడి.

8 తుదకు మీరందరు ఏక మనస్కులై ఒకని సుఖ
దుఃఖములకు ఒకడు పాలుపడి, సహోదరప్రియులై,
9 కరుణాచిత్తులై, వినయమనస్కులై యుండుడి.। ఇందు
నిమిత్తము, అనగా ఆశీర్వాదము పొందు నిమిత్తము
మీరు పిలువబడితిరని, కీడుకు ప్రతి కీడైనను దూషణకు
ప్రతి దూషణయైనను చేయక దానికి ప్రతిగా ఆశీర్వ
10 దించుడి;। జీవించుటకు, మంచి దినములు ప్రేమించి
చూచుటకు కోరేవాడు కీడునుంచి తన నాలుకను,కపట
వాక్యము చెప్పకుండ తన పెదవులను తిప్పుకొనవ
11 లెను.। అతడు కీడునుంచి తొలగి, మేలు చేయ వలెను;
12 సమాధానము వెతికి దాని వెంబడించ వలెను;। ఎందుక
నగా ప్రభువుయొక్క కన్నులు నీతిమంతుల మీదను,
ఆయన చెవులు వారి ప్రార్థనల వైపు ఉన్నవి అయితే
ప్రభువుయొక్క ముఖము కీడు చేసేవారికి విరోధము
13 గా ఉన్నది.। మరియు మీరు మంచిదాని అనుసరించు
14 వారైతే మీకు హాని చేయ గలవాడు ఎవడు?। మీరు
నీతి నిమిత్తము హింసపడితేనేమి, మీరు శుభులు.
కాగా, వారి బెదరింపునకు భయపడకుడి; కలతపడ
కుడి;। మీ హృదయముల యందు, ప్రభువని క్రీస్తుని 15-
పరిశుద్ధ పరచుడి. అయితే వారు దేని విషయము 16
మిమ్మును దుర్మార్గులని దూషింతురో, దాని విషయము
క్రీస్తుయందున్న, మీ మంచి ప్రవర్తన మీద అపనింద
వేసేవారు సిగ్గుపడుటకు మీరు మంచి మనస్సాక్ష్యము
గలవారై, మీలో ఉన్న నిరీక్షణను గూర్చి మిమ్మును
హేతువును అడిగే ప్రతి వానికిని సాత్వికముతోను
భక్తితోను ఉత్తరమిచ్చుటకు ఎల్లప్పుడు సిద్ధముగా ఉం
డుడి; । ఎందుకనగా దేవుని చిత్తమునకు ఇష్టమైతే, 17
కీడు చేసి హింసపడుటకంటే మేలు చేసి హింస
పడుట మిక్కిలి మంచిది. । ఎందుకనగా మనలను 18
దేవుని యొద్దికి తెచ్చుకొనుటకు, శరీరము మట్టుకు
మరణము పాలై, ఆత్మ మట్టుకు బ్రతికించబడిన క్రీస్తు
కూడ, అనగా అనీతిమంతుల కొరకు నీతిమంతుడు ఒక
సారె పాపములను గూర్చి హింసపడెను. । మరియు 19
ఆయన ఆత్మతోనే వెళ్లి ఖైదులో ఉన్న ఆత్మలకు కూడ
(సువార్త) ప్రకటించెను.। అవి పూర్వము నావ నిర్మిం 20
చబడుచుండగా, నోవహు దినములలో దేవుని దీర్ఘ
శాంతము ఇంక కనిపెట్టుచున్నప్పుడు, అవిధేయత
గలవై యుండెను. దానిలో కొందరు, అనగా ఎని
మిది ఆత్మలు నీటి ద్వారా సంరక్షణ పొందెను.। దీనికి 21
సాదృశ్యమైన బాప్తిస్మము అనగా శరీరమాలిన్యము
తీసివేయుట కాదు గాని యేసు క్రీస్తు పునరుత్థానము
వల్ల దేవుని గూర్చిన మంచి మనస్సాక్షిని కోరుకొనుట
మనలను రక్షించుచున్నది.। ఆయన ఆకాశమునకు వెళ్లి 22
దేవుని కుడిచేతి వైపున ఉన్నాడు. మరియు దూతలు,
అధికారులు శక్తులును ఆయనకు లోపరచబడి యు
న్నారు.

## 4. అధ్యాయము.

కాబట్టి క్రీస్తు మన కొరకు* శరీరము మట్టుకు 1
హింసపడెను । గనుక, మీరు ఇకమీదట దేవుని ఇష్ట 2
ప్రకారమే గాని మనుష్యుల ఆశల ప్రకారము, శరీర
మందు తక్కిన కాలము జీవించకుండే నిమిత్తము ఆ
తాత్పర్యమనే ఆయుధము పట్టుకొనుడి; ఎందుకనగా
శరీరము మట్టుకు హింసపడిన ఆయన పాప విముక్తి
పొంది యున్నాడు.। మరియు, మనము కామవికార 3
ములు, దురాశలు, అధిక మద్యపానము, చెడుసంబర
ములు, తాగుబోతుల విందులు, అపవిత్రమైన విగ్ర
హ పూజలు మొదలైన వాటియందు నడుచుకొనియుం

*లేక, మనకు ప్రతిగా.

డగా, మనము రాష్ట్రముల చిత్తము నెరవేర్చియుండు
4 టకు, గతించిన మన జీవిత కాలము చాలును. । అందు
వల్ల వారు దూషించుచు, ఆ దుర్వ్యాపార ప్రవాహ
ములోకి మీరు వారితో కూడ పరుగెత్తక పోయినం
5 దుకు ఆశ్చర్యపడుచున్నారు. । జీవించువారికిని చచ్చిన
వారికిని న్యాయపు తీర్పు చేయుటకు సిద్ధముగానున్న
6 ఆయనకు వీరు ప్రత్యుత్తరమియ్య వలెను. । ఎందుక
నగా, ఇందు నిమిత్తము, వారు శరీరము మట్టుకు మను
ష్యుల ప్రకారము తీర్పు పొందుటకును, ఆత్మ మట్టుకు
దేవుని ప్రకారము జీవించుచుండుటకును, మృతి పొం
దినవారికి కూడ సువార్త ప్రకటించబడెను.

7 అయితే అన్నిటి అంతము సమీపమై యున్నది
గనుక, ప్రార్థనల నిమిత్తము, మీరు స్వస్థబుద్ధి గలవారై
8 మితముగా ఉండుడి. । ప్రేమ అనేక పాపములను
కప్పునని, అన్నిటికంటే విశేషముగా, ఒకనియెడల
9 ఒకడు మిక్కుటమైన ప్రేమ గలవారై యుండుడి. । గొ
ణుగులు లేకుండ, ఒకనియెడల ఒకడు ఆతిథ్యప్రియులై
10 యుండుడి. । దేవుని నానా విధమైన కృపను గూర్చిన
మంచి నిర్వాహకులైయుండి, ప్రతివాడు కృపావరము
పొందిన కొలది, దానితో ఒకని ఒకడు సేవించుడి. ।
11 ఒకడు మాటలాడితే, దేవుని ప్రవచనముల వలె మాట
లాడ వలెను. ఒకడు సేవ చేసినను, దేవుడు ఇచ్చెడి
సామర్థ్య మూలమైనదని చేయ వలెను. అందువల్ల,
దేవుడు అన్నిటిలోను యేసు క్రీస్తు ద్వారా మహిమ
పరచబడును. ఆయనకు మహిమయు శక్తియు యుగ
యుగముల పర్యంతముండును. ఆమేన్.

12 ప్రియులారా! మీకు వింత సంభవించినట్లు, మీ
లో శోధన కొరకు మీకు కలుగుచున్న పరితాపమును
13 గూర్చి ఆశ్చర్యపడక, । మీరు క్రీస్తు మహిమ ప్రత్య
క్షతలో, మహానందముతో సంతోషించు నిమిత్తము,
ఆయన హింసలలో పాలివారయ్యున్నంతమట్టుకు సం
తోషించుడి.

14 మీరు క్రీస్తు నామమున* నిందించబడితే మీరు
ధన్యులు; ఎందుకనగా, మహిమ గల ఆత్మ అనగా దేవుని
ఆత్మ మీ మీద నివసించుచున్నది. ఆయన వారివల్ల†
దూషించబడును, మీ వల్ల† మహిమపరచబడును.

15 అయితే మీలో ఎవడును నరహంతకుడనియైనను
దొంగ అనియైనను దుర్మార్గుడనియైనను పరుల జోలికి
16 వెళ్లువాడనియైనను హింసింపబడ కూడదు. । ఎవడైనను
క్రైస్తవుడని హింసించబడితే, ఈ పేరు కలిగినందున
దేవుని మహిమపరచ వలెను. । మరియు తీర్పు దేవుని 17
ఇంటి యొద్ద ఆరంభమయే కాలము వచ్చెను గాని,
అది మన యొద్ద ఆరంభించితే, దేవుని సువార్తకు
అవిధేయులైన వారి అంతము ఎట్టిదవును? । మరియు 18
నీతిమంతుడు రక్షించబడుట దుర్లభమైతే, పాపియు
భక్తిహీనుడును ఎక్కడ కనబడుదురు. । కాబట్టి దేవుని 19
ఇష్టప్రకారము హింస పొందువారు, నమ్మకమైన సృష్టి
కర్త అని, ఆయనకు తమ ప్రాణములను మంచి ప్రవ
ర్తనలో అప్పగించ వలెను.

## 5. అధ్యాయము.

తోటి పెద్దను, క్రీస్తు హింసలను గూర్చిన సాక్షిని, 1
బైలుపరచబడబోయే మహిమలో పాలివాడనునైన
నేను మీలో ఉన్న పెద్దలకు బోధించుచున్నాను. ।
మీ మధ్యనున్న దేవుని మందను మేపుడి; బలిమిచేత 2
కాక స్వేచ్ఛగాను, లోభిత్వమువల్ల కాక సిద్ధమనస్సు
తోను అధ్యక్షులై యుండుడి. । దేవుని స్వకీయులపైని 3
ప్రభువులు కాక, మందకు మాదిరులై యుండుడి. ।
అప్పుడు కాపరుల ప్రధాని అగపడినప్పుడు, మీరు 4
వాడబారని మహిమ కిరీటము పొందుదురు.

చిన్నలారా! ఆ ప్రకారము మీరు పెద్దలకు లో 5
బడి యుండుడి. మీరందరు ఒకనికి ఒకడు లోబడి,
దీన మనస్సు అను వస్త్రము కట్టుకొనుడి; ఎందుకనగా,
దేవుడు గర్విష్ఠులను ఎదిరించి, వినయము గలవారియం
దు కృప చేసును. । కాబట్టి ఆయన, తగిన సమయమం 6
దు మిమ్మును హెచ్చించు నిమిత్తము దేవుని బలిష్ఠమైన
చేతిక్రింద వినయమనస్కులై యుండుడి. । ఆయన మి 7
మ్మును గూర్చి లక్ష్యము చేయుచున్నాడు గనుక, మీ
చింత యావత్తును ఆయన మీద వేయుడి.

స్వస్థబుద్ధి గలవారై మెళుకువగా ఉండుడి. మీ 8
విరోధియైన సైతాను గర్జించు సింహము వలె తిరుగుచు
ఎవనినైనను తాను భక్షించుటకు వెతుకుచున్నది. ।
లోకమందున్న మీ సహోదరుల మీద ఈ విధమైన 9
హింసలే నెరవేర్చబడుచున్నవని ఎరిగి విశ్వాసమందు
స్థిరులై వాని ఎదిరించుడి. । అయితే యేసు క్రీస్తుయందు 10
మిమ్మును తన నిత్య మహిమ కొరకు పిలిచిన సర్వకృప
గల దేవుడు, కొంత మట్టుకు హింసపడిన మిమ్మును సం
పూర్ణులగా చేసి, స్థిరపరిచి, బలపరిచి, స్థాపించును. ।
మహిమయు బలమును యుగ యుగముల పర్యంతము 11
ఆయనవై యున్నవి. ఆమేన్.

* లేక, క్రీస్తువారని. † లేక, ప్రకారము.

12 మిమ్మును నేను బోధించుచు, ఇది దేవుని సత్య
కృప అని సాక్ష్యము చెప్పుచు, మీకు నమ్మకమైన
సహోదరుడని నేను ఊహించు సిల్వాను ద్వారా
కొద్దిగా మీ పేరట వ్రాసియున్నాను; ఆ సత్యకృప
లో నిలకడగా ఉండుడి.
బబులోనులో మీ వలె ఏర్పరచబడినదియు,* నా 13
కుమారుడైన మార్కును మీకు సలాములు చెప్పినారు.
ప్రేమగల ముద్దుతో ఒకని ఒకడు కౌగిలించుడి. 14
క్రీస్తు యేసు యందున్న మీ కందరికిని నెమ్మది కలు
గునుగాక. ఆమేన్.

---

* అనగా, సంఘము కాబోలు

అపొస్తలైన

# పేతురు వ్రాసిన

## రెండవ ఉత్తరము.

### 1. అధ్యాయము.

1 యేసు క్రీస్తు దాసుడును అపొస్తలుడునైన సుమె
యోను పేతురు, మన దేవుడును రక్షకుడునైన యేసు
క్రీస్తు నీతియందు మావలె మిక్కిలి విలువైన విశ్వా
సము పొందిన వారికి—
2 దేవుని గూర్చినది, మన ప్రభువైన యేసును గూర్చి
నదియునైన విజ్ఞానమందు మీకు కృపయు, సమాధా
3 నమును విస్తరించు గాక, । తన మహిమ వల్లను సామ
ర్థ్యము వల్లను మనలను పిలిచిన వాని గూర్చిన విజ్ఞాన
ము ద్వారా, ఆయన దైవశక్తి, జీవమునకును భక్తికిని
కావలసిన వాటిసన్నిటిని మనకు దయచేసెను గనుక,।
4 మీరు ఆశ వల్ల లోకమందున్న భ్రష్టత్వమును తప్పిం
చుకొనుచు వీటివల్ల దేవ స్వభావమందు పాలివారై
యుండ వలెనని, ఆయన ఆ మహిమ సామర్థ్యము
వల్ల మనకు అత్యధికమైనవియు అమూల్యమైనవియు
నైన వాగ్దత్తములు అనుగ్రహించి యున్నాడు.
5 అయినను, ఆ హేతువు చేతనే మీరు పూర్ణ
జాగ్రత కలిగి మీ విశ్వాసముతో ధైర్యమును, ధైర్య
ముతో జ్ఞానమును, జ్ఞానముతో ఆశానిగ్రహమును,।
6,7 ఆశానిగ్రహముతో సహనమును, ।సహనముతో భక్తిని,
భక్తితో సహోదర ప్రేమను, సహోదర ప్రేమతో
8 దయను చూపుడి; । ఎందుకనగా ఇవి మీకు కలిగి విస్త
రించుచుంటే, మీరు సోమరులైనను మన ప్రభువైన
యేసు క్రీస్తును గూర్చిన విజ్ఞాన విషయము నిష్ఫలు
9 లైనను కాకుండ చేసును. । ఇవి ఎవనికి ఉండవో వాడు
గుడ్డివాడును దూరదృష్టి లేని వాడునై యుండి, తన
పూర్వ పాపముల పరిశుద్ధిని మరిచి పోయెను.
10 కాబట్టి సహోదరులారా! విశేషముగా మీ పిలు
పును ఏర్పాటును నిశ్చయము చేసుకొనుటకు, జాగ్ర
తపడుడి; ఎందుకనగా మీరు వీటిని చేయుచున్న యె
11 డల, ఎప్పుడును తప్పిపోరు; । ఎందుకనగా మన ప్రభు
వును రక్షకుడునైన యేసు క్రీస్తుయొక్క నిత్య రాజ్య
ములో ఆలాగు ప్రవేశము మీకు విశాలముగా అను
గ్రహించబడును.

కాబట్టి మీరు తెలుసుకొని ప్రస్తుత సత్యమందు 12
స్థిరపరచబడినప్పటికి, వీటిని గూర్చి ఎల్లప్పుడును మీకు
జ్ఞాపకము చేయుటకు అజాగ్రత్తగా ఉండను. । మరి 13
యు, మన ప్రభువైన యేసు క్రీస్తు నాకు సూచించిన
ప్రకారము, నా గుడారము త్వరగా విడిచిపెట్ట వలె
నని యెరిగి నేను ఈ గుడారములో ఉన్నంత కాల
ము జ్ఞాపకము చేయుటవల్ల మిమ్మును రేపుట న్యాయ
మని యెంచుకొంటున్నాను. । అయితే నా నిర్గమ 14,15
మైన* తర్వాత కూడ మీరు నిత్యమును వీటిని జ్ఞాప
కము చేసుకొనునట్లు జాగ్రత పడుదును;
ఎందుకనగా, చమత్కారముగా కల్పించబడిన కథ 16
లను అనుసరించిన వారముకాక, ఆయన మాహాత్మ్య
మును చూచిన వారమై, మన ప్రభువైన యేసు క్రీస్తు
శక్తిని రాకడను మీకు తెలిపితిమి. । ఎందుకనగా—ఈ 17
యన నా ప్రియకుమారుడు; ఈయనయందు నాకిష్ట
ముండెనని† అట్టి శబ్దము ఆయనకు మహా దివ్య మహి
మనుంచి తేబడి, తండ్రియైన దేవుని వల్ల ఘనత మహి
మయు ఆయన పొందినప్పుడు, । మేము ఆ పరిశుద్ధ 18
పర్వతము మీద ఆయనతో కూడ ఉండి, ఆ శబ్దము
ఆకాశమునుంచి కలుగుట వింటిమి.
మరియు, మరి స్థిరమైన, ప్రవచన వాక్యము మనకు 19
ఉన్నది. తెల్లవారే పర్యంతము, వేకువ చుక్క మీ
హృదయములయందు ఉదయించు పర్యంతము ఆ (వా
క్యము), చీకటిగల చోటున వెలుగిచ్చు దీపమని మీరు
లక్ష్యపెట్టుచుంటే మేలు । అయితే లేఖనములో, ఏ 20
ప్రవచనమును ఒకడు స్వతాత్పర్యము చెప్పుటవల్ల కలు
గదని‡ మొదట గ్రహించుకొన వలెను; । ఎందుకనగా 21
ప్రవచనము ఎప్పుడును మనుష్యుని ఇచ్ఛ వల్ల తేబడ
లేదు, గాని దేవుని పరిశుద్ధ మనుష్యులు పరిశుద్ధాత్మవల్ల
నడిపించబడి పలికిరి.

### 2. అధ్యాయము.

అయితే అబద్ధికులైన ప్రవక్తలు కూడ ప్రజలలో 1
ఉండిరి. ఆలాగు మీలోను అబద్ధికులైన బోధకులు
ఉందురు. అట్టివారు నాశము చేయు మతభేదములను

* లేక, నేను బయిలువెళ్లిన. † మత్తయి, 17 అ. 5 వ. ‡ లేక, తన అర్థము విప్పిచెప్పదని.

రహస్యముగా ప్రవేశపెట్టుదురు. వారు తమ్మును కొనిన
వాడు యజమానుడు కాడని* పలుకుచు తమకు తామే
2 శీఘ్రముగా నాశము కలుగ జేసుకొందురు.। మరియు
అనేకులు వారి కామవికారములను వెంబడింతురు.
3 వారి ద్వారా సత్యమార్గము దూషించబడును.। వారు
అధిక లోభిత్వమునకు లోబడి కల్పనా వాక్యముల
చేత మిమ్మును మోసపరుతురు, గాని వారికి పూర్వము
నుంచి విధించబడిన తీర్పు ఆలస్యము చేయదు; వారి
నాశము నిద్రపోదు;

4 ఎందుకనగా దేవుడు పాపము చేసిన దూతలను
వదలక, వారిని అధోలోకమందలి కటిక చీకటిగల
బిలములలో త్రోసి తీర్పు నిమిత్తము భద్రము చేయ
5 బడుటకు అప్పగించెను. । మరియు ఆయన పురాతన
లోకమును వదలక, నీతి ప్రకటించిన నోవహును
మరి యేడుగురిని కాపాడి, భక్తిహీనుల లోకము మీదికి
6 జల ప్రళయము రాజేసెను.। మరియు ఆయన సొదొమ
గొమొర్రలను పట్టణములను బూడిదె చేసి, నాశము
నకు వాటిని విధించి, భక్తిహీనులై యుండ బోయే
వారికి ఉదాహరణముగా వాటిని ఉంచినప్పుడు,।
7 కామ వికారములో మునిగిన నీతివిరుద్ధుల నడువడి
చేత ప్రయాసపడిన నీతిగల లోతును తప్పించెను.।
8 ఆ నీతిమంతుడు వారి మధ్యను కాపురముండి, చూపు
వల్లను వినికివల్లను వారి అక్రమమైన క్రియల చేత
దినదినము నీతిగల తన ఆత్మను బాధపరుచుకొనుచుం
9 డెను.। కాబట్టి భక్తులను శోధనలోనుంచి తప్పించుట
కును, న్యాయపుతీర్పు దినము పర్యంతము దండించ
10 బడుచుండు అన్యాయస్థులను,। విశేషముగా, శరీరము
అనుసరించి మాలిన్యమందలి దురాశలో నడుచుకొ
నుచు, ప్రభుత్వమును ఉపేక్షించుచుండు వారినిని
భద్రము చేయుట ప్రభువు ఎరిగి యున్నాడు. వీరు
దుడుకువారు, స్వేచ్ఛాసక్తులు, వెరవక మాన్యులను
11 దూషించువారు.। అయితే మరి అధికమైన బలిమి
శక్తియు గల దూతలు ప్రభువు యెదుట తమకు విరో
12 ధమైన దూషణ తీర్పు సహించక పోదురు.। వీరైతే,
వేటకొరకును భ్రష్టత్వము కొరకును స్వాభావికముగా
పుట్టిన బుద్ధిహీన జంతువుల వలె, తమకు తెలియబడని
13 వాటిని దూషించుచు,। దుర్నీతి జీతము పుచ్చుకొ
నుచు, తమ భ్రష్టత్వములో నాశమును పొందుదురు.
పగటి భోగవృత్తి ఆనందమని ఎంచుకొందురు. వారు
కళంకములు నిందాస్పదములునై, మీ విందులకు వచ్చు
14 చు, తమ మాయలలో సుఖము పొందుచు,। వ్యభిచా
రిణితో నిండుకొని, పాపము మానని కన్నులు గల
వారై, అస్థిరములైన ప్రాణములను మరులుకొల్పుచు,
లోభిత్వమందు సాధకము చేయబడిన హృదయము
గలవారై, శాపసంతానమై, తిన్నని మార్గము విడిచి,।
బొసొరు కుమారుడైన బలయాముయొక్క మార్గము 15
పట్టి వెంబడించి తోవ తప్పిపోయిరి.। ఇతడు దుర్నీతి 16
జీతము ప్రేమించెను గాని, తన స్వకీయమైన అక్ర
మమువల్ల గద్దించబడెను; ఏలాగనగా నోరు లేని
వాహన పశువు మనుష్యుని శబ్దముతో వచించి, ఆ
ప్రవక్తయొక్క వెర్రితనము నిషేధించెను.। వీరు నీళ్లు 17
లేని నూతులు, తుఫానుచేత కొట్టబడుచుండు మేఘ
ములునై యున్నారు. వారి కొరకు చీకటి మబ్బు
భద్రము చేయబడి యున్నది;। వారు వ్యర్థమైన గొప్ప 18
వాక్యములు పలుకుచు, తప్పితమందు నడుచువారిని,
ఇంచుమించు† తప్పించుకొనుచున్న వారిని శరీరసం
బంధమైన దురాశలలో కామ వికారములచేత మరు
లుకొల్పుచున్నారు;। ఏలాగనగా, వారికి స్వాతం 19
త్ర్యము వాగ్దత్తము చేయుచున్నారు గాని, తామే
చెడుతనమునకు దాసులై యున్నారు; ఎందుకనగా
ఒకడు దేనికి‡ లోకువ చేయబడునో, దానికి అతడు
దాసుడై యున్నాడు;। కాగా వారు ప్రభువును రక్ష 20
కుడునైన యేసుక్రీస్తు విజ్ఞానము చేతను ఈ లోక
మాలిన్యములను తప్పించుకొనినప్పటికి, వారు తిరిగి
వాటిలో చిక్కుబడి, లోకువ చేయబడితే వారి కడ
వరి స్థితి మొదటి దానికంటే మరి చెడ్డదై యుం
డును.। వారు నీతి మార్గమును తెలుసుకొని, తమ 21
కు అప్పగించబడిన పరిశుద్ధమైన ఆజ్ఞనుంచి తొలగి
పోవుటకంటే, ఆ మార్గము తెలియకనే ఉండుట
వారికి మేలు.। అయితే — దాని స్వంతమైన వాంతి 22
తట్టు తిరిగిన కుక్క,— కడుగబడి బురదలో దొర్లేట
చోటుకు తిరిగిన పంది, అనే నిజమైన సామితె చొ
ప్పున వారికి సంభవించెను.

## 3. అధ్యాయము.

ప్రియులారా! ఈ రెండవ పత్రిక మీకు ఇప్పు 1,2
డు వ్రాయుచున్నాను. పరిశుద్ధ ప్రవక్తలవల్ల పూర్వ
మందు పలుకబడిన మాటలను, మీ అపొస్తలుల
వల్ల పలుకబడిన ప్రభువైన రక్షకుని ఆజ్ఞను మీరు
జ్ఞాపకము చేసుకొనుటకు, నిర్మలమైన మీ మనస్సు
లను ఈ పత్రికలవల్ల జ్ఞాపకము చేసి రేపుచున్నా
ను.। మొదట మీరు దీని తెలుసుకొనవలెను; దిన 3
ముల అంతమందు అపహాసకులు వచ్చి, తమ స్వకీయ

*లేక, కొనిన యజమానుని. †కొన్ని ప్రతులలో, కేవలము. ‡లేక, దేనివల్ల జయించబడునో.

4 దురాశల చొప్పున, నడుచుకొనుచు, ।—ఆయన రాక
విషయమైన వాగ్దత్తము ఎక్కడ? ఏమి! పితృలు నిద్రిం
చినది మొదలుకొని, సమస్తమును, సృష్టి ఆరంభము
5 నుంచి ఏలాగే నిలిచి యున్నదని చెప్పుదురు; । ఎం
దుకనగా పూర్వమునుంచి ఆకాశములును, నీళ్లనుంచి
యు నీళ్లవల్లనును సమకూర్చబడిన భూమియు దేవుని
వాక్యమువల్ల కలిగెనని జ్ఞాపకమందు ఉంచుకొనుట
6 వారికి ఇష్టము లేదు. । వాటివల్ల, అప్పుడున్న లోకము
7 నీళ్ల వరదవల్ల ముంచబడి నశించెను. । అయితే ఇప్పటి
ఆకాశ భూములు ఆయన వాక్యమువల్ల కూర్చబడినవై,
భక్తిలేని మనుష్యుల నాశమును తీర్పును కలిగే దినము
వరకు అగ్నికొరకు భద్రము చేయబడి యున్నవి.

8 అయితే ప్రియులారా! ఈ ఒక సంగతి మరిచి
పోకండి; ఏదనగా ప్రభువు దృష్టికి, ఒక దినము వెయి
సంవత్సరముల వలెను, వెయి సంవత్సరములు ఒక దిన
9 ము వలెనున్నవి. । కొందరు ఆలస్యమని ఎంచుకొను
నట్లు, ప్రభువు తన, వాగ్దత్తమును గూర్చి ఆలస్యము
చేయడు గాని, ఎవడును నశించ వలెనని ఇచ్ఛయిం
చక, అందరు మనస్సు తిప్పుకొన కోరుచు మన యె
10 డల దీర్ఘ శాంతము గలవాడై యున్నాడు. । అయితే
ప్రభువు దినము దొంగ వలె వచ్చును. అందులో
ఆకాశములు పెద్ద ధ్వనితో గతించిపోవును; భూత
ములు రవులుచు కరిగించబడును. భూమియు దాని
మీద ఉన్న పనులును కాల్చివేయబడును.

11 ఇవి అన్నియు విడిపోవుచుండగా, మీరు దేవుని
దినము వచ్చుట కొరకు కనిపెట్టుచు, దాని త్వర
పెట్టుచు, పరిశుద్ధమైన ప్రవర్తనలోను, । భక్తిలోను 12
ఎటువంటివారై యుండ వలెను! ఎందుకనగా దాని
నిమిత్తము ఆకాశము రవులుచు విడిపోవును. । భూత 13
ములు కాల్చబడి కరుగును. అయినను మనము ఆయన
వాగ్దత్తము చొప్పున, క్రొత్త ఆకాశముల కొరకు, క్రొత్త
భూమి కొరకు కనిపెట్టుచున్నాము; వాటిలో నీతి
నివసించును.

కాబట్టి ప్రియులారా! వాటి కొరకు మీరు కని 14
పెట్టుచున్నారు గనుక, సమాధానమందు ఆయనచేత
నిష్కళంకులుగాను నిందారహితులుగాను కనుగొనబ
డుటకు జాగ్రతపడి, । మన ప్రభువుయొక్క దీర్ఘ 15
శాంతము రక్షణార్థమైనదని ఎంచుకొనుడి. । ఆలాగున 16
మా ప్రియ సహోదరుడైన పౌలు కూడ తనకు ఇయ్య
బడిన జ్ఞానము చొప్పున, తన పత్రికలన్నిటిలోను
వీటిని గూర్చి చెప్పుచున్న ప్రకారము, మీకు వ్రాసె
ను, వాటిలో కొన్ని సంగతులు గ్రహించుటకు కఠిన
మైనవి; వీటిని విద్యాహీనులును అస్థిరులునైనవారు,
ఇతర లేఖనములను వలె, తమ స్వకీయ నాశమునకు
అపార్థము చేయుచున్నారు.

కాబట్టి ప్రియులారా! మీరు వీటిని ముందు తెలు 17
సుకొంటిరి గనుక మీరు, నీతి విరుద్ధుల తప్పితమువల్ల
తొలగించబడి, మీ స్వకీయ స్థిరతనుంచి పడిపోకుండ
కాచుకొని యుండుడి. । మరియు, మన ప్రభువైన 18
యేసు క్రీస్తను రక్షకుని జ్ఞానమందు కృపయందు
అభివృద్ధి పొందుడి. ఆయనకు మహిమ ఇప్పుడును
నిత్యదినము వరకును ఉండుగాక. ఆమేన్.

అపొస్తలైన

# యోహాను మొదటి ఉత్తరము.

## 1. అధ్యాయము.

1 ఆదినుంచి ఏది ఉండెనో, మేము ఏది వింటిమో,
మా కన్నులతో ఏది చూచితిమో, ఏది నిదానించితి
2 మో, మా చేతులు ఏది ముట్టెనో,। ఆ జీవ* వాక్యమును
గూర్చి, అనగా, జీవము కనపరచబడెను; తండ్రి యొద్ద
ఉండి మాకు కనపరచబడిన ఆ నిత్యజీవమును, మేము
చూచి సాక్ష్యము చెప్పుచు మీకు తెలుపుచున్నాము;।
3 మీకు కూడ మాతో సహవాసము కలుగునట్లు, మేము
ఏది చూచితిమో ఏది వింటిమో దాని మీకు తెలియ
4 చేయుచున్నాము.। అదియు గాక, మా సహవాసము
తండ్రితోను, ఆయన కుమారుడైన యేసు క్రీస్తుతో
నున్నది. మీ సంతోషము పరిపూర్ణమవునట్లు వీటిని
మీకు వ్రాయుచున్నాము.

5 మరియు మేము ఆయనవల్ల విని, మీకు తెలియ
చేయు వర్తమానము ఏదనగా, దేవుడు వెలుగై యు
న్నాడు; ఆయనయందు చీకటి ఏమాత్రము లేదు.।
6 ఆయనతో సహవాసము గల వారమని చెప్పుచు చీక
టిలో నడిచిన యెడల, అబద్ధమాడి సత్యము జరిగించ
7 కుందుము.। అయితే ఆయన వెలుగులో ఉన్న ప్రకా
రము, మనము వెలుగులో నడిచిన యెడల, అన్యోన్య
సహవాసము గల వారమవుదుము; అప్పుడు ఆయన
కుమారుడైన యేసు క్రీస్తు రక్తము మనలను సమస్త పా
పములనుంచియు పవిత్రులను చేయుచున్నది.

8 మనము పాపము లేని వారమనుకొంటే, మనలను
మనమే మోసపుచ్చుకొందుము; ఆయన సత్యము మన
9 యందు లేదు.। మన పాపములను ఒప్పుకొంటే, ఆయన
మన పాపములను క్షమించునట్లును, సమస్త దుర్నీతి
నుంచి మనలను పవిత్రుల చేయునట్లును, నీతిమంతుడు
10 ను నమ్మతగిన వాడునై యున్నాడు.। మనము పాపము
చేయలేదనుకొంటే, ఆయనను అబద్ధికుని చేతుము;
ఆయన వాక్యము మనయందు ఉండదు.

## 2. అధ్యాయము.

1 నా పిల్లలారా! మీరు పాపము చేయకుండునట్లు
వీటిని మీకు వ్రాయుచున్నాను. ఎవడైనను పాపము
చేసియుంటే, నీతిమంతుడైన యేసు క్రీస్తను ప్రాప
2 కుడు† తండ్రి యొద్ద మనకు ఉన్నాడు.। ఆయన తానే
మన పాపముల కొరకు, మనవాటి కొరకే కాదు, సర్వ
లోకముయొక్క పాపముల కొరకును ప్రాయశ్చిత్తమై
యున్నాడు.

మరియు మనము ఆయనయొక్క ఆజ్ఞలను గైకొ 3
నిన యెడల ఆయనను ఎరిగి ఉన్నామని, దీనివల్ల
ఎరుగుదుము.। — ఆయనను ఎరిగి యున్నానని చె 4
ప్పుచు ఆయన ఆజ్ఞలను గైకొననివాడు అబద్ధికుడు;
వానియందు సత్యము లేదు.। అయితే ఆయన వాక్య 5
మును ఎవడు గైకొనునో, వానియందు దేవుని ప్రేమ
నిజముగా పరిపూర్ణము చేయబడి యున్నది. మనము
ఆయన యందు ఉన్నామని దీనివల్ల ఎరుగుదుము.। — 6
ఆయన యందు నిలిచి యున్నానని చెప్పువాడు, ఆయన
ఏలాగు నడుచుకొనెనో ఆలాగే తానును నడుచుకొన
వలెను.

ప్రియులారా! మొదటినుంచి మీకున్న పాత ఆజ్ఞనే 7
గాని నేను కొత్త ఆజ్ఞను మీకు వ్రాయుటలేదు. ఈ
పాత ఆజ్ఞ మీరు మొదటినుంచి వినిన వాక్యమే. మరి
యు కొత్త ఆజ్ఞను మీకు వ్రాయుచున్నాను.। ఈ సం 8
గతి ఆయన యందును మీ యందును సత్యమే; ఎం
దుకనగా చీకటి గతించెను, సత్యమైన వెలుగు ఇప్పు
డు ప్రకాశించుచున్నది.

—వెలుగులో ఉన్నానని చెప్పుచు తన సహోద 9
రుని ద్వేషించువాడు ఇదివరకు చీకటిలో ఉన్నాడు.।
తన సహోదరుని ప్రేమించువాడు వెలుగులో నిలుచు 10
చున్నాడు; అతని యందు, ఆతంకపరిచేది ఏదియు
లేదు.। తన సహోదరుని ద్వేషించువాడు చీకటిలో 11
ఉండి చీకటిలో నడుచును. చీకటి అతని కన్ను
లకు అంధత్వము కలుగ చేసెను, గనుక తాను ఎక్క
డికి పోవునో ఎరుగడు.

పిల్లలారా! ఆయన నామము నిమిత్తము మీ పాప 12
ములు క్షమించబడినందున, మీకు వ్రాయుచున్నాను.।
తండ్రులారా! మొదటినుంచి ఉన్న ఆయనను తెలుసు 13
కొని యున్నారు గనుక మీకు వ్రాయుచున్నాను.
పడుచువారలారా! దుష్టుని జయించితిరి గనుక మీకు
వ్రాయుచున్నాను. చిన్నవారలారా! తండ్రిని తెలు
సుకొంటిరి గనుక మీకు వ్రాయుచున్నాను.

* లేక, జీవమును. † లేక, వకీలు.

14 తండ్రులారా! మొదటినుంచి ఉన్న ఆయనను
తెలుసుకొంటిరి గనుక మీకు వ్రాసితిని. పడుచువార
లారా! మీరు బలవంతులు, దేవుని వాక్యము మీ
యందు నిలుచుచున్నది, దుష్టుని జయించితిరి గనుక
మీకు వ్రాసితిని.

15 ఈ లోకమునైనను లోకములో ఉన్న వాటినైనను
ప్రేమించకుడి; ఎవడైనను లోకము ప్రేమించితే,
16 తండ్రి ప్రేమ అతని యందు లేదు;। ఎందుకనగా లో
కములో ఉన్నదంతయు అనగా శరీరాశయు కన్నుల
ఆశయు జీవపు డంబమును తండ్రి సంబంధమైనవి
17 కావు, అవి లోక సంబంధమైనవే, । లోకము దాని
ఆశయు గతించును గాని, దేవుని చిత్తప్రకారము చే
యువాడు నిరంతరమును నిలిచి ఉండును.

18 చిన్నవారలారా!ఇది కడవరి గడియ. క్రీస్తు విరోధి
వచ్చునని వింటిరి గదా, ఇప్పుడును అనేకులైన క్రీస్తు
విరోధులు ఉన్నారు. కడవరి గడియ ఉన్నదని దీని
19 వల్ల తెలుసుకొని యున్నాము. । వారు మనలోనుంచి
బైలువెళ్లిరి గాని, వారు మన సంబంధులు కారు. వారు
మన సంబంధులైతే, మనతో కూడ నిలిచియుందురు;
అయితే అందరు మన సంబంధులు కారని కనపరచ
బడునట్లు బైలువెళ్లిరి.

20 మీరు పరిశుద్ధునివల్ల అభిషేకము పొంది సమస్త
21 మును ఎరుగుదురు.।మీరు సత్యము ఎరగరని కాదు గాని,
మీరు దాని ఎరుగుదురనియు, ఏ అబద్ధమును సత్య
సంబంధమైనది కాదనియు మీకు వ్రాసి యున్నాను.।
22 యేసు క్రీస్తు కాడని చెప్పువాడు గాక ఎవడు అబ
ద్ధికుడు! తండ్రిని కుమారుని ఒప్పుకొనని ఇతడు క్రీస్తు
23 విరోధి. । కుమారుని ఒప్పుకొనని ప్రతివాడును తం
డ్రియు లేకుండ ఉన్నాడు. కుమారుని ఒప్పుకొను
వాడు తండ్రియు గలవాడై యున్నాడు.

24 మీరయితే మొదటినుంచి దేని వింటిరో, అది మీ
యందు నిలువనియ్యుడి. మీరు మొదటినుంచి విని
నది మీ యందు నిలిచి యుంటే, మీరు కూడ కుమా
25 రుని యందును తండ్రి యందును నిలుతురు. । ఇత్తునని
ఆయన మనకు వాగ్దత్తము చేసినది ఇదే, అనగా
నిత్యజీవము.

26 మిమ్మును మోసపరుచు వారిని గూర్చి వీటిని మీకు
27 వ్రాసినాను. । అయితే మీరు ఆయన వల్ల పొందిన
అభిషేకము మీ యందు నిలుచుచున్నది. ఎవడును
మీకు బోధించనక్కర లేదు. ఆ అభిషేకము అన్ని
టిని గూర్చిన్ని మీకు బోధించుచున్నది. అది సత్యమే;
అది అబద్ధము కాదు గనుక అది మీకు బోధించిన
ప్రకారము దాని యందు నిలువుడి.

కాబట్టి, పిల్లలారా! ఆయన కనపరచబడిన యె 28
డల, మనము ధైర్యము తెచ్చుకొని, ఆయన ప్రత్యక్ష
మందు ఆయనను ఎడబాసి సిగ్గుపరచబడకుండునట్లు
ఆయన యందు నిలువుడి.

ఆయన నీతిమంతుడని మీకు తెలిసి యుంటే, నీతి 29
ప్రకారము జరిగించు ప్రతి వాడును ఆయన మూల
ముగా పుట్టి యున్నాడని మీరు ఎరుగుదురు.

## 3. అధ్యాయము.

మనము దేవుని పిల్లలమని చెప్పబడునట్లు తండ్రి 1
మన యందు ఎంత ప్రేమ ఉంచెనో చూడుడి. అట్టి
వారమైనందున, లోకము మనలను తెలుసుకొనదు;
అది ఆయనను తెలుసుకొన లేదు. । ప్రియులారా! 2
ఇప్పుడు మనము దేవుని పిల్లలమై యున్నాము. మనము
ఏమవుదుమో, అది ఇంక కనబడ లేదు గాని, అది
కనపరచబడిన యెడల, ఆయన ఉన్న ప్రకారము
ఆయనను చూతుము గనుక, ఆయనను పోలి యుం
దుమని యెరుగుదుము. । మరియు, ఆయన యందు 3
ఈ నిరీక్షణ కలిగిన ప్రతివాడును ఆయన పవిత్రుడై
యున్న ప్రకారము తన్ను పవిత్రుని చేసుకొనును.

పాపము చేయు ప్రతి వాడును ఆజ్ఞాతిక్రమము 4
చేయుచున్నాడు. ఆజ్ఞాతిక్రమమే పాపము. । మన 5
పాపములను పరిహరించునట్లు ఆయన కనపరచబడెనని
మీకు తెలుసును. ఆయన యందు పాపమేమియు
లేదు.। ఆయన యందు నిలిచువాడెవడును పాపము 6
చేయడు. పాపము చేయు వాడెవడును ఆయనను చూడ
లేదు, ఆయనను తెలుసుకొన లేదు.

పిల్లలారా! ఎవడును మిమ్మును మోసపరచనియ్య 7
కుడి; ఆయన నీతిమంతుడయ్యున్న ప్రకారము, నీతి
ప్రకారము చేయు ప్రతివాడును నీతిమంతుడు. ।
పాపము చేయువాడు సైతాను సంబంధి; ఎందుకనగా 8
సైతాను మొదటినుంచి పాపము చేయుచున్నది. ఇందు
నిమిత్తము, సైతాను క్రియలను లయపరుచునట్లు, దేవుని
కుమారుడు కనపరచబడెను.।దేవుని మూలముగా పుట్టిన 9
వాడెవడును పాపము చేయడు; ఎందుకనగా ఆయన
బీజము అతని యందు నిలుచును. అతడు దేవుని మూల
ముగా పుట్టి యున్నాడు గనుక పాపము చేయలేడు.

దీనివల్ల దేవుని పిల్లలు సైతాను పిల్లలు తేటపడుదు 10
రు; నీతి ప్రకారము చేయని వాడును, తన సహో
దరుని ప్రేమించని వాడును దేవుని సంబంధులు కారు.

మొదటినుంచి మీరు వినిన వర్తమానము ఇదే— 11
మనము ఒకని ఒకడు ప్రేమించ వలెననేదే. । కయీను 12
దుష్టుని సంబంధియై తన సహోదరుని చంపిన ప్రకా
రము కాదు; అతని ఎందుకు చంపెను? ఎందుకా? తన

క్రియలు చెడ్డవియు, అతని సహోదరుని క్రియలు నీతి
13 గలవియునై యుండెను. । నా సహోదరులారా! లో
14 కము మిమ్ము ద్వేషించితే ఆశ్చర్యపడకుడి. । మనము
సహోదరులను ప్రేమించుచున్నాము గనుక మరణము
నుంచి జీవమునకు దాటి యున్నామని ఎరుగుదుము.
ప్రేమించని వాడు మరణమందు నిలిచియుండును. ।
15 తన సహోదరుని ద్వేషించు వాడు నరహంతకుడు.
ఏ నరహంతకుని యందు నిత్యజీవము నిలువదని మీరు
ఎరుగుదురు.

16 ఆయన మన కొరకు తన ప్రాణము పెట్టెను గనుక
దీనివల్ల ప్రేమను తెలుసుకొంటిమి. మనము కూడ
సహోదరుల కొరకు మన ప్రాణములను పెట్టుటకు
17 బాధ్యులమై యున్నాము. । కాగా ఈ లోక జీవనో
పాధి గల వాడై, తన సహోదరునికి లేమి కలుగుట
చూచియు అతని విషయము తన హృదయమును మూ
సుకొను వానిలో దేవుని ప్రేమ ఏలాగు నిలుచును?
18 నా పిల్లలారా! మాటతోనైనను, నాలుకతోనైనను
కాదుగాని, క్రియతోను సత్యముతోను ప్రేమింతము.
19 ఇందులో మనము సత్య సంబంధులమని ఎరిగి,
ఆయన యెదుట మన హృదయములను సమ్మతిపరుచు
20 కొందుము; । ఎందుకనగా (మన) హృదయము మన యం
దు దోషారోపణ చేసినను, దేవుడు మన హృదయము
కంటే అధికుడై సమస్తమును ఎరిగి యున్నాడని (ఎరు
21 గుదుము). । ప్రియులారా! మన హృదయము మన
యందు దోషారోపణ చేయక పోతే, దేవుని యెదుట
22 ధైర్యము గలవారమై యుందుము. । మరియు మనము
ఆయన ఆజ్ఞలను గైకొనుచు, ఆయన దృష్టికి ఇష్టమైన
వాటిని చేయుచున్నందున, మనము ఏమి అడుగుదు
23 మో, దాని ఆయన వల్ల పొందుచున్నాము. । ఆయన
ఆజ్ఞ ఏదనగా, ఆయన కుమారుడైన యేసు క్రీస్తు నా
మమందు విశ్వాసముంచి, ఆయన మనకు ఇచ్చిన ఆజ్ఞా
ప్రకారముగా, ఒకని ఒకడు ప్రేమించ వలెననేదే. ।
24 ఆయన ఆజ్ఞలను జరిగించువాడు ఆయన యందును,
ఆయన వాని యందును నిలుతురు. ఆయన మన యందు
నిలుచుచున్నాడని దీనివల్ల, అనగా ఆయన మనకు
ఇచ్చిన ఆత్మ మూలముగా తెలుసుకొనుచున్నాము.

## 4. అధ్యాయము.

1 ప్రియులారా! ప్రతి ఆత్మను నమ్మక, దేవుని సంబంధ
మైనవో కావో, ఆత్మలను పరీక్షించుడి; ఎందుకనగా
అనేకులైన అబద్ధ ప్రవక్తలు లోకములోకి బైలుదేరి
2 యున్నారు. । దేవుని ఆత్మను దీనివల్ల మీరు ఎరుగుదురు.
శరీరమెత్తి వచ్చిన యేసు క్రీస్తును ఒప్పుకొను ప్రతి
ఆత్మయు దేవుని సంబంధమైనది. । యేసు క్రీస్తును ఒప్పు 3
కొనని ప్రతి ఆత్మయు దేవుని సంబంధమైనది కాదు.
మరియు వచ్చునని మీరు వినిన క్రీస్తు విరోధి (ఆత్మ)
ఇదే; ఇప్పుడు అది లోకములో ఉన్నది.

పిల్లలారా! మీరు దేవుని సంబంధులై యుండి, 4
వారిని జయించితిరి; ఎందుకనగా మీలో ఉన్న వాడు
లోకములో ఉన్న వానికంటే గొప్పవాడు. । వారు 5
లోక సంబంధులు గనుక, లోక సంబంధమైనవి మాట
లాడుదురు. లోకము వారి మాట వినును. । మనము 6
దేవుని సంబంధులము; దేవుని ఎరిగిన వాడు మన మాట
వినును. దేవుని సంబంధి కాని వాడు మన మాట విన
డు. దీని మూలముగా, మనము సత్యము గల ఆత్మను,
మోసపుచ్చు ఆత్మను ఎరుగుదుము.

ప్రియులారా! మనము ఒకని ఒకడు ప్రేమింతము; 7
ఎందుకనగా ప్రేమ దేవుని మూలముగా నున్నది. ప్రే
మించు ప్రతి వాడును దేవుని మూలముగా పుట్టి, దేవుని
తెలుసుకొనుచున్నాడు. । ప్రేమించనివాడు దేవుని ఎరు 8
గడు; ఎందుకనగా దేవుడు ప్రేమయై యున్నాడు. ।
దేవుడు మన యందు ఉంచిన ప్రేమ దీనివల్ల కనబడె 9
ను; । మనము ఆయన ద్వారా జీవించునట్లు దేవుడు జని 10
తైకుడైన* తన కుమారుని లోకములోకి పంపెను. దీని
లో ప్రేమ యున్నది; । మనము దేవుని ప్రేమించితిమని 11
కాదు; ఆయన మనలను ప్రేమించి మన పాపములను
గూర్చి తన కుమారుని ప్రాయశ్చిత్తముగా పంపెను.

ప్రియులారా! దేవుడు మనలను ఈలాగు ప్రేమిం
చితే, మనము ఒకని ఒకడు ప్రేమించ బాధ్యపడియు
న్నాము. । ఎవడును దేవుని ఎప్పుడును చూడలేదు. మ 12
నము ఒకని ఒకడు ప్రేమించిన యెడల, దేవుడు మన
యందు ఉన్నాడు; ఆయన ప్రేమ మన యందు సం
పూర్ణము చేయబడి యున్నది. । ఆయన మనకు తన ఆత్మ 13
లో పాలు దయచేసెను గనుక, మనము ఆయన యం
దు, ఆయన మన యందు ఉన్నామని, దీనివల్ల తెలుసు
కొనుచున్నాము.

మరియు, తండ్రి లోకరక్షకునిగా కుమారుని పం 14
పెనని మేము చూచి సాక్ష్యము చెప్పుచున్నాము. ।
యేసు దేవుని కుమారుడని, ఎవడు ఒప్పుకొనునో 15
దేవుడు వాని యందును వాడు దేవుని యందును
ఉన్నారు. । మరియు దేవుడు మన యందు ఉంచు 16
ప్రేమను మనము ఎరిగి నమ్మి యున్నాము. దేవుడు
ప్రేమయై యున్నాడు. ప్రేమ యందు ఉండువాడు
దేవుని యందు, దేవుడు వాని యందు ఉన్నారు.

* అనగా, ఒక్కడే పుట్టిన.

17 ఈ లోకములో ఆయన ఉన్న ప్రకారము మనము
18 కూడ ఉన్నాము గనుక । తీర్పు దినమందు మనకు
ధైర్యము కలుగునట్లు, దీని యందు, మనలో ప్రేమ
పరిపూర్ణము చేయబడియున్నది. భయము ప్రేమలో
ఉండదు; అంతే కాదు. పరిపూర్ణ ప్రేమ భయమును
వెళ్లగొట్టును; ఎందుకనగా, భయముతో దండనయు
నున్నది. అయితే భయపడువాడు ప్రేమ యందు పరి
19 పూర్ణము చేయబడ లేదు. । ఆయన మొదట మన
లను ప్రేమించెనని మనము ఆయనను ప్రేమించుచు
న్నాము.

20 ఎవడైనను—దేవుని ప్రేమించుచున్నాను అనుకొని
తన సహోదరుని ద్వేషించితే, అతడు అబద్ధికుడు; ఎం
దుకనగా తాను చూచిన తన సహోదరుని ప్రేమిం
చని వాడు, తాను చూడని దేవుని ఏలాగు ప్రేమించ
21 గలడు! । దేవుని ప్రేమించువాడు తన సహోదరుని
కూడ ప్రేమించ వలెనని ఈ ఆజ్ఞను మనము ఆయనవల్ల
పొంది యున్నాము.

## 5. అధ్యాయము.

1 యేసే క్రీస్తయ్యున్నాడని నమ్ము ప్రతివాడును
దేవుని మూలముగా పుట్టి యున్నాడు. పుట్టించిన ఆయ
నను ప్రేమించు ప్రతివాడును, ఆయన మూలముగా
2 పుట్టిన వాని కూడ ప్రేమించును. । మనము దేవుని ప్రే
మించి ఆయన ఆజ్ఞలను గైకొనునప్పుడు, దీనివల్ల, దేవుని
3 పిల్లలను ప్రేమించుచున్నామని ఎరుగుదుము; । ఎందు
కనగా, మనము ఆయన ఆజ్ఞలను గైకొనుటయే దేవుని
4 ప్రేమ. ఆయన ఆజ్ఞలు భారమైనవి కావు; । దేవుని
మూలముగా పుట్టించబడినదంతయు లోకమును జయిం
చును; అదే, అనగా మన విశ్వాసము, లోకమును జయిం
5 చిన విజయము. । యేసు దేవుని కుమారుడని నమ్మువాడు
గాక లోకమును జయించువాడు ఎవడు?

6,7 నీళ్ల ద్వారా, రక్తము ద్వారా; నీళ్లతో మాత్రమే
కాక, నీళ్లతోను రక్తముతోను వచ్చినవాడు ఈయనే,
అనగా యేసు క్రీస్తు. మరియు, సాక్ష్యము చెప్పెడి ఆత్మ;
8 ఎందుకనగా ఆత్మ సత్యమే. । సాక్ష్యము చెప్పువారు ము
గ్గురు, అనగా, ఆత్మ, నీళ్లు, రక్తము; ఈ ముగ్గురు ఏకీభ
9 వించియున్నారు. । మనము మనుష్యుల సాక్ష్యము అంగీ
కరించితే, దేవుని సాక్ష్యము మరి గొప్పది; దేవుడు తన
కుమారుని గూర్చి చెప్పిన సాక్ష్యము ఇదే. । దేవుని 10
కుమారుని యందు విశ్వాసముంచు వానికి తనలో ఈ
సాక్ష్యమున్నది. దేవుని విశ్వసించనివాడు ఆయనను
అబద్ధికుని చేసెను; ఎందుకనగా, దేవుడు తన కుమా
రుని గూర్చి చెప్పిన సాక్ష్యము విశ్వసించ లేదు. । ఆ సా 11
క్ష్యము ఏదనగా—దేవుడు మనకు నిత్యజీవమును దయ
చేసెననేదే. ఈ జీవము ఆయన కుమారుని యందు
ఉన్నది. । కుమారుడు ఎవనికి ఉన్నాడో, వానికి ఆ 12
జీవమున్నది. దేవుని కుమారుడు ఎవనికైనను ఉండ
కుంటే వానికి జీవముండదు.

దేవుని కుమారుని నామమందు విశ్వాసముంచు 13
మీకు నిత్యజీవమున్నదని మీరు ఎరుగునట్లు, వీటిని
మీకు వ్రాసి యున్నాను. । ఆయనను గూర్చి మనకు 14
కలిగిన ధైర్యము ఏదనగా, । మనము ఆయన ఇష్టప్ర 15
కారము ఏదైనను అడిగితే, ఆయన మన మనవి విను
చుండును. మరియు, మనము ఏమి అడిగినను, ఆయన
మన మనవి వింటున్నాడని మనము ఎరిగి యుంటే,
మనము ఆయనను అడిగేవి మనకు కలిగి ఉండునని
ఎరుగుదుము.

ఎవడైనను తన సహోదరుడు మరణార్థము 16
కాని పాపము చేయుట చూచిన యెడల, అతడు
అడిగి అతనికి, (అనగా) మరణార్థము కాని పాపము
చేసిన వారికి జీవము కలుగ చేయును. మరణార్థమైన
పాపమున్నది; దాని గూర్చి వేడుకొన వలెనని నేను
చెప్ప లేదు. । సకల దుర్నీతి పాపము. మరణార్థము 17
కాని పాపమున్నది.

దేవుని మూలముగా పుట్టిన వాడెవడును పాపము 18
చేయడని ఎరుగుదుము; దేవుని మూలముగా పుట్టిన
వాడు తన్ను తాను* భద్రము చేసుకొనును. అప్పుడు
దుష్టుడు అతని ముట్టడు. । మనము దేవుని మూలముగా 19
పుట్టినామనియు, సర్వలోకము దుష్టుని యందు పడి
యున్నదనియు ఎరుగుదుము. । మరియు, మనము సత్య 20
వంతుని తెలుసుకొనునట్లు, దేవుని కుమారుడు వచ్చి,
మనకు వివేకమిచ్చియున్నాడని ఎరుగుదుము. సత్యవం
తుని యందు, అనగా ఆయన కుమారుడైన యేసు క్రీస్తు
యందు ఉన్నాము. ఈయనే నిజమైన దేవుడును నిత్య
జీవమునై యున్నాడు. । పిల్లలారా! విగ్రహములకు 21
దూరస్థులై యుండుడి.

* లేక, వాని ఆయన.

అపొస్తలుడైన

# యోహాను రెండవ పత్రిక.

1,2 పెద్దనైన నేనును, నేను మాత్రమే కాకుండ, సత్య
ము ఎరిగిన వారందరును, మనలో నిలిచి మనతో ఎల్ల
ప్పుడు నుండగల సత్యము కొరకు సత్యముగా ప్రేమిం
చు వారును ఏర్పరచబడిన వారునైన కురియకును* ఆమె
3 పిల్లలకును వ్రాసినది. । తండ్రియైన దేవునివల్లను, తండ్రి
కుమారుడగు యేసు క్రీస్తను ప్రభువు వల్లను కృపయు
కనికరము సమాధానము సత్య ప్రేమల యందు మీ
కుండుగాక.

4 మనము తండ్రివల్ల ఆజ్ఞను పొందిన ప్రకారము,
సత్యమందు నడుచుచుండు వారిని, నీ పిల్లలైనవారిలో
5 కనుగొంటినని మిక్కిలి సంతోషించితిని. । కాగా, మొ
దటినుంచి మనకు కలిగిన ఆజ్ఞనే గాని, కొత్తదాని మీకు
వ్రాయక, మనము ఒకని ఒకడు ప్రేమించ వలెనని
6 నిన్ను వేడుకొంటున్నాను. । మనము ఆయన ఆజ్ఞల
ప్రకారము నడుచుటయే ప్రేమ; మీరు మొదటినుంచి
వినిన ప్రకారము, ప్రేమలో నడువ వలెనని ఆయన
7 ఆజ్ఞ; । ఎందుకనగా యేసు క్రీస్తు శరీరధారియై వచ్చుట
ఒప్పుకొనని అనేకవంచకులు లోకమందు ప్రవేశించిరి;
ఇతడు వంచకుడు, క్రీస్తు విరోధియునై యున్నాడు
మనము జరిగించిన వాటిని పోగొట్టుకొనక, సం 8
పూర్ణఫలము పొందునట్లు జాగ్రత్తగా చూచుకొనుడి.।
క్రీస్తు బోధ యందు నిలువక, ముందు నడుచు† ప్రతి 9
వాడును దేవుడు లేనివాడు. క్రీస్తు బోధ యందు
నిలుచువాడు తండ్రియు కుమారుడును గలవాడై యు
న్నాడు. । ఎవడైనను ఈ బోధను తేక మీ యొద్దకి 10
వచ్చినయెడల, ఇంట్లోకి అతని చేర్చుకొన వద్దు,—శుభ
మవును గాక అని అతనితో చెప్ప వద్దు; । ఎందుకన 11
గా,—శుభమవు గాక అని అతనితో చెప్పువాడు అతని
దుష్ట క్రియలలో పాలివాడై యుండును.

నేను అనేక సంగతులు మీకు వ్రాయ వలెనని 12
యున్నాను గాని, సిరాతోను కాగితము మీదను (వ్రా
యుటకు) నాకు మనస్సు లేదు; ఎందుకనగా మన సం
తోషము పరిపూర్ణమవునట్లు, మీ యొద్దకి వచ్చి ము
ఖాముఖిగా మాటలాడ నిరీక్షించుచున్నాను. । ఏర్పర 13
చబడిన నీ సహోదరి పిల్లలు నీకు సలాములు చెప్పు
చున్నారు.

---

* లేక, దొరసానికి. † లేక, అతిక్రమించు.

అపొస్తలైన

# యోహాను మూడవ పత్రిక.

1 పెద్దనైన నేను సత్యమందు ప్రేమించు ప్రియు
డైన గాయియుకు వ్రాసినది.
2 ప్రియుడా! నీ ఆత్మ వర్ధిల్లు ప్రకారము నీవు అన్నిటి
లోను వర్ధిల్లుచు, బాగా ఉండ ప్రార్థించుచున్నాను;।*
3 ఎందుకనగా, సహోదరులు వచ్చుచు, నీవు సత్యమం
దు నడుచు ప్రకారము, నీ సత్యమును గూర్చి సాక్ష్య
4 ము చెప్పుచుండగా, మిక్కిలి సంతోషించితిని. । నా
పిల్లలు సత్యమందు నడుచుచున్నారని వినుటకంటే
నాకు ఎక్కువైన సంతోషములేదు.

5 ప్రియుడా! నీవు సహోదరులకును, అతిథులకును
ఏమి చేయుదువో, అది నమ్మకముగా చేయుచున్నా
6 వు. । వారు నీ ప్రేమను గూర్చి సంఘము ఎదుట
సాక్ష్యము చెప్పిరి. దేవునికి తగినట్టుగా నీవు వారిని
7 సాగనంపితే, నీవు యుక్తమే చేయుదువు; । ఎందుకన
గా, వారు ఆయన నామము నిమిత్తము బైలుదేరి, రా
8 ష్ట్రికులవల్ల ఏమియు పుచ్చుకొనలేదు. । కావున, మన
ము సత్యమునకు సహాయకులమవుటకు, అట్టివారిని
చేర్చుకొన బాధ్యపడి యున్నాము.
9 నేను సంఘమునకు ఒక మాట వ్రాసితిని గాని, వా
రిలో ప్రధానత్వము కోరుచున్న దియొత్రెపే మమ్మును
చేర్చుకొనడు. । అందుచేత, నేను వచ్చిన యెడల, అత 10
డు చేయు నతని క్రియలను జ్ఞాపకము చేసుకొందు
ను.† అతడు మమ్మును గూర్చి చెడ్డ మాటలను వదరుచు,
అది చాలదనుకొని, వారిని చేర్చుకొన మనస్సు గల
వారిని నిషేధించి, సంఘములోనుంచి వారిని వెలి
వేయుచున్నాడు.

ప్రియుడా! మేలే గాని కీడు అనుకరించకుము. 11
మేలు చేయువాడు దేవుని వల్ల పుట్టినవాడు. కీడు
చేయువాడు దేవుని చూచి యుండలేదు.

దేమేత్రిని గూర్చి అందరి వల్లను, సత్యము వల్లను 12
సాక్ష్యము చెప్పబడి యున్నది; మేము కూడ సాక్ష్య
ము చెప్పుచున్నాము; మా సాక్ష్యము సత్యమైనదని
మీరు ఎరుగుదురు.

అనేక సంగతులు నీకు వ్రాయ వలెనని యున్నాను 13
గాని, సిరా కలములతో నీకు వ్రాయ నాకిష్టము లేదు.
అయినను శీఘ్రముగా నిన్ను చూడ నిరీక్షించుచున్నా
ను. అప్పుడు ముఖాముఖిగా మాటలాడుకొందము.

నీకు సమాధానమవుగాక. స్నేహితులు నీకు సలా 14
ములు చెప్పుచున్నారు. స్నేహితులకు పేరు పేరు వర
సను సలాములు చెప్పుము.

---

* లేక, కోరుచున్నాను. † లేక, చేయుదును.

అపొస్తలైన

# యూదా పత్రిక.

1 యేసు క్రీస్తు సేవకుడును యాకోబు సహోద
రుడునైన యూదా, పిలువబడినవారికి, అనగా తండ్రి
యైన దేవునికి ప్రియులై, యేసు క్రీస్తు కొరకు భద్రము
2 చేయబడిన వారికి వ్రాసినది.। మీకు కనికరము, సమా
ధానము, ప్రేమయు విస్తరించుగాక.

3 ప్రియులారా! సాధారణ రక్షణమును గూర్చి,
మీకు వ్రాయ మిక్కిలి జాగ్రత్తపడుచు, పరిశుద్ధులకు
ఒక్కసారే అప్పగించబడిన విశ్వాసము నిమిత్తము
పోరాడ వలెనని మీకు వ్రాసి వేడుకొనుట అవశ్యక
4 మనుకొంటిని;। ఎందుకనగా, పూర్వకాలమందు ఈ
తీర్పునకు ముందు వ్రాయబడిన కొందరు నక్కి జొర
బడిరి. వారు భక్తిహీనులై, మన దేవుని కృపను కామా
తురత్వమునకు దుర్వినియోగపరుచుచు, మన అద్వితీయ
నాథుడును ప్రభువునైన యేసు క్రీస్తును ఒప్పుకొనరు.
5 అయినను, మునుపే ఈ సమస్తమును గుర్తెరిగిన
మీకు, నేను జ్ఞాపకము చేయ కోరుచున్నదేమనగా,
యేసు ఐగుప్తులోనుంచి ప్రజలను రక్షించి,మరియొకప్పు
6 డు నమ్మకపోయిన వారిని నాశము చేసెను.। మరియు,
తమ ప్రధానత్వము నిలుపుకొనక, తమ నివాసస్థలము
విడిచిన దూతలను, మహా దినముయొక్క తీర్పు నిమిత్త
7 ము, చీకటి కింద నిత్యపాశములచేత నిలిపెను.। మరి
యు, సొదొమ, గొమొర్రా, వాటి చుట్టున్న పట్టణ
ములును, వారితో సమానరీతిగా అతివ్యభిచారము చే
యుచు, పరశరీరముల వెంట పోయినందున, నిత్యాగ్ని
దండన దృష్టాంతముగా ఉంచబడెననేది.

8 అయినను కలలు కనువీరు కూడ, అలాగున శరీర
మును అపవిత్రపరుచుకొనుచు, ప్రభుత్వమును నిరా
9 కరించుచు అధికారులను దూషించుచున్నారు.।అయితే
ప్రధాన దూతయైన మీఖాయేలు, అపవాదితో* పోరా
డుచు, మోషే శరీరమును గూర్చి వాదించినప్పుడు,
దూషించి తీర్పు చేయ తెగించక,—ప్రభువు నిన్ను
10 గద్దించు గాక అని పలికెను.। వీరైతే, తాము ఎరుగని
వాటిని దూషించుచున్నారు గాని, బుద్ధిలేని జంతువుల
వలె, వేటిని స్వాభావికముగా ఎరుగుదురో, వాటిలో
11 తమ్ము తాము చెరుపుకొందురు.। అయ్యో! వారికి శ్రమ!
వారు కయీను మార్గమున పోయిరి;† జీతము కొరకు,
బలాముయొక్క తప్పు త్రోవలో ఆతురముగా పరు
గెత్తిరి; కోరయొక్క తిరుగుబాటున నశించిరి.‡

వీరు నిర్భయముగా సుభోజనము చేయుచు, తమ్ము 12
తాము మేపుకొనుచు, మీ ప్రేమ విందులలో పెట్ట
లు;§ వాయువులచేత ఇటు అటు కొట్టబడుచుండు
నిర్జలమేఘములు; కాయలు రాలినవి, ఫలములు లేనివి,
రెండు రెట్లు చచ్చినవి, వేళ్లతో పెళ్లగించబడినవియు
నైన చెట్లు;। నురుగు వలె తమ అవమానమును వెళ్లగక్కు 13
సముద్రముయొక్క ప్రచండమైన అలలు; తిరుగులా
డు నక్షత్రములునై యున్నారు. వారి కొరకు చీకటి
మబ్బు నిరంతరము నిలుపబడి యున్నది.

ఆదాము మొదలుకొని ఏడవ వాడైన ఎనోఖు 14,15
కూడ వారిని గూర్చి ప్రవచించి ఇట్లనెను:—ఇదిగో!
అందరికిని తీర్పు చేయుటకును, వారిలో భక్తిహీనులం
దరును, భక్తిహీనముగా చేసిన తమ భక్తిహీనత క్రియ
లన్నిటిని గూర్చియు, భక్తిలేని పాపులు తనకు విరోధ
ముగా చెప్పిన కఠిన వాక్యములన్నిటిని గూర్చియు
వారి మీద దోషారోపణ చేయుటకును, ప్రభువు తన
పరిశుద్ధుల అయుతములతో వచ్చెననెను.। వారు మూ 16
లుగువారును సణుగువారును, తమ ఆశలచొప్పున నడు
చువారునై యున్నారు; వారు లాభము నిమిత్తము మ
నుష్యులను కొనియాడుచుండగా, వారి నోరు డంబ
మైన మాటలు పలుకును.

అయితే ప్రియులారా! కాలాంతములో భక్తి 17,18
లేని తమ ఆశలచొప్పున నడుచు పరిహాసకులు ఉందు
రని మన ప్రభువైన యేసు క్రీస్తు అపొస్తలుల వల్ల పూ
ర్వము మీతో చెప్పబడిన మాటలను జ్ఞాపకము చేసు
కొనుడి.। అట్టివారు తమ్మును తాము వేరు చేసుకొని 19
ఇంద్రియాసక్తులును ఆత్మ లేనివారునై యున్నారు.

అయితే ప్రియులారా! మీరు మీ అతిపరిశుద్ధ 20,21
విశ్వాసము మీద మిమ్మును కట్టుకొనుచు, పరిశుద్ధాత్మ
లో ప్రార్థించుచు, నిత్యజీవము నిమిత్తము మన ప్రభు
వైన యేసు క్రీస్తు కనికరము కొరకు కనిపెట్టుచు,
దేవుని ప్రేమలో మిమ్మును భద్రము చేసుకొనుడి.

* లేక, సాతాను. † ఆదికాం. 4 ప. 1—8 వ. ‡ సాంఖ్యకా. 16 ప. § లేక, మచ్చలు.

22 వాదించువారిని ఖండించుడి గాని, కొందరిని
23 అగ్నిలోనుంచి లాగుచు రక్షించుచుండుడి; । శరీరము
వలని మచ్చలు గల అంగీని ద్వేషించుచు, భయముతో
కొందరిని కరుణించుడి.
24 తుదకు, పడకుండ మిమ్మును కాపాడుటకును, తన
మహిమ యెదుట అధిక సంతోషముతో మిమ్మును
నిర్దోషులగా నిలువబెట్టుటకును శక్తిగల ఆయనకు, ।
అనగా, మన ప్రభువైన యేసు క్రీస్తు ద్వారా మన 25
రక్షకుడైన అద్వితీయ దేవునికి, మహిమ, ప్రభావము,
పరాక్రమము, అధికారము, సర్వ యుగమునకు పూర్వ
మును, ఇప్పుడును, సర్వ యుగములకును కలుగు గాక.
ఆమేన్.

# యోహాను వ్రాసిన ప్రకటన.

## 1. అధ్యాయము.

1 యేసు క్రీస్తు ప్రకటన, అనగా, త్వరగా జరగ
వలసిన వాటిని దేవుడు తన దాసులకు అగుపరచుటకు
ఆయనకు ఇచ్చినది. ఆయన పంపి, తన దూత ద్వారా,
2 తన దాసుడైన యోహానుకు సూచించెను.। ఇతడు దేవుని
వాక్యమును గూర్చియు, యేసు క్రీస్తుయొక్క సాక్ష్య
మును గూర్చియు, తాను చూచినంత మట్టుకు సాక్ష్య
3 ము చెప్పెను.। ఈ ప్రవచన వాక్యములను చదువుకొను
వాడును వినువారును ఇందులో వ్రాయబడిన వాటిని
గైకొనువారును ధన్యులు; ఎందుకనగా కాలము సమీ
పమై యున్నది.

4- యోహాను ఆశియలోనున్న ఏడు సంఘములకు
5 వ్రాసినది — ఉండుచున్నవాడు ఉండినవాడు వచ్చు
చున్నవాడునైన ఆయననుండియు, ఆయన సింహాసన
ము యెదుటనున్న ఏడు ఆత్మలనుండియు, నమ్మకమైన సా
క్షియు, మృతిపొందిన వారిలోనుంచి మొదట పుట్టిన
వాడును, భూరాజులకు అధిపతియునైన యేసు క్రీస్తు
నుంచియు మీకు కృపయు సమాధానము కలుగుగాక.।
6 మనలను ప్రేమించుచు, మన పాపములనుంచి మనలను
తన రక్తముతో కడిగి* మనలను తన తండ్రియైన దేవునికి
రాజ్యము అనగా యాజకులగా చేసిన ఆయనకు మహిమ
యు బలమును యుగయుగములకు కలుగుగాక. ఆమేన్.।
7 ఇదుగో! ఆయన మేఘములతో వచ్చుచున్నాడు. ప్రతి
నేత్రము, ఆయనను పొడిచినవారును ఆయనను చూ
చెదరు. భూమియొక్క గోత్రములన్నియు ఆయ
నను చూచి రొమ్ము కొట్టుకొనును; అవును, ఆమేన్.
8 ఉండుచున్నవాడు, ఉండినవాడు, వచ్చుచున్న
వాడు, అనగా సర్వాధికారియగు ప్రభువైన దేవుడు—
నేనే అల్ఫాను, ఓమెగనునై† యున్నానని చెప్పుచు
న్నాడు.

9 మీ సహోదరుడను, యేసు యందు, శ్రమలో
ను, రాజ్యములోను, సహనములోను పాలివాడనైన
యోహాను అను నేను, దేవుని వాక్యము కొరకును
యేసు సాక్ష్యము కొరకును పత్మను ద్వీపములో ఉం
10 టిని.। ప్రభువు దినమున నేను ఆత్మ వశుడనైతిని‡.।
11 అప్పుడు — నీవు చూచుచున్నవాటిని పుస్తకమందు
వ్రాసి, ఏడు సంఘములకు అనగా ఎఫెసుకు, స్ముర్నకు,
పెర్గాముకు, థుయతైరకు, సర్దీసుకు, ఫిలదెల్ఫియకు,
లవుదికయ్యకు, పంపుమని చెప్పుచున్న బూరగ ధ్వని
వలె గొప్ప శబ్దమును నా వెనుక వింటిని.

అప్పుడు నాతో పలుకుచుండిన శబ్దము చూడ 12
తిరిగితిని;। తిరిగి ఏడు సువర్ణ దీపస్తంభములను, ఆ ఏడు 13
దీపస్తంభముల మధ్యను, పాదముల మట్టుకైన వస్త్రము
ధరించుకొని, రొమ్ముకు బంగారపు దట్టి కట్టుకొని, మ
నుష్య కుమారుని పోలిన ఒకని చూచితిని.। ఆయన 14
తలయు వెంట్రుకలును తెల్లని గొర్రెబొచ్చు వలె హి
మమంత తెల్లనివై యుండెను.। ఆయన కన్నులు అగ్ని 15
జ్వాలవంటివి; ఆయన పాదములు కొలిమిలో కాలి
నట్టుగా మెరియు కంచును పోలినవి.। ఆయన శబ్దము 16
విస్తార జలముల శబ్దము వలె నుండెను. ఆయన ఏడు
నక్షత్రములను తన కుడిచేత పట్టుకొని యుండెను.
ఆయన నోటినుంచి రెండంచులు గల వాడియైన ఖడ్గ
ము బైలువెళ్లుచుండెను. ఆయన ముఖము, తన బలము
తో ప్రకాశించు సూర్యుని వలె నుండెను.

నేను ఆయనను చూచినప్పుడు, చచ్చిన వాని వలె, 17
ఆయన పాదముల యొద్ద పడితిని. అప్పుడు ఆయన
తన కుడి చెయ్యి నా మీద ఉంచి నాతో ఇట్లనెను:—
భయపడకుము; నేను మొదటివాడను, కడపటివాడను,
జీవించువాడనునై యున్నాను; । మరణమైతిని గాని, 18
ఇదుగో! యుగయుగముల పర్యంతము జీవించుచున్నా
ను. మరియు మరణము యొక్కయు, అదృశ్యలోకము
యొక్కయు తాళపు చెవులు నావే.। కాబట్టి నీవు చూ 19
చిన వాటిని, ఉన్నవాటిని, వీటి తరువాత కలుగబో
యెడి వాటిని, (అనగా)।నా కుడిచేతిలో నీవు చూచిన 20
ఏడు నక్షత్రముల మర్మమును, ఏడు సువర్ణ దీపస్తంభ
ముల మర్మమును వ్రాయుము. ఆ ఏడు నక్షత్రములు
ఏడు సంఘముల దూతలు, ఆ ఏడు దీపస్తంభములు
ఏడు సంఘములు.

## 2. అధ్యాయము.

ఎఫెసులోనున్న సంఘముయొక్క దూతకు వ్రా 1
యుము—ఏడు నక్షత్రములను తన కుడిచేత పట్టుకొను
చు, ఏడు సువర్ణ దీపస్తంభముల మధ్యను నడుచుచున్న
వాడు చెప్పుచున్నవి యేవనగా, నీ క్రియలను, నీ కష్ట
మును, నీ ఓర్పును, నీవు దుష్టులను సహించ లేకపోవు

---

* లేక, విడిపించి. † అనగా, ఆదియు అంతమును. ‡ లేక, ఆత్మయందు ఉంటిని.

2 టను ఎరుగుదును; । అపొస్తలులు కాక తాము అపొస్త
లులమని చెప్పుకొనువారిని శోధించి, వారు అబద్ధికు
3 లగా కనుగొంటివి. । నీవు ఓర్పు గలవాడవై నా నా
4 మము నిమిత్తము సహించి, అలసియుండ లేదు. । అయి
నను, నీవు నీ మొదటి ప్రేమను వదిలితివని, నాకు నీ
5 మీద విరోధము కలదు. । కావున, నీవు ఎక్కడనుంచి
పడియున్నావో, అది జ్ఞాపకము చేసుకొని మనస్సు
తిప్పుకొని, ఆ మొదటి క్రియలను చేయుము. లేక
పోతే, నీవు మనస్సు తిప్పుకొనని పక్షమందు, నేను నీ
యొద్దికి వచ్చి, నీ దీపస్తంభము దాని చోటినుంచి ఎత్తి
6 వేతును.। అయితే నీకు ఉన్నది ఏదనగా, నీవు నీకొలా
యితుల క్రియలను ద్వేషించుచున్నావు; వీటిని నేనును
ద్వేషించుచున్నాను.

7 చెవిగలవాడు, ఆత్మ సంఘములతో చెప్పుదాని
వినును గాక. జయించువానికి నా దేవుని పరదైసు
లోనున్న జీవవృక్ష ఫలములు తిననిత్తును.

8 స్ముర్నలోనున్న సంఘముయొక్క దూతకు వ్రా
యుము — మొదటివాడును, కడపటివాడును, మర
ణమై జీవించినవాడునైన వాడు చెప్పుచున్నవి ఏవన
9 గా, । నేను నీ శ్రమను, నీ దరిద్రతను ఎరుగుదును;
అయినను నీవు ధనవంతుడవు. యూదులై యుండక
తాము యూదులమని చెప్పుకొని, అపవాది* సున
10 గోగెవారైన వారి దూషణను నేను ఎరుగుదును. । నీవు
పొందబోవు హింసలకు ఎంత మాత్రము భయపడకు
ము. ఇదుగో! మీరు శోధించబడునట్లు, అపవాది*
మీలో కొందరిని చెరసాలలో వేయించ బోవుచున్నా
డు; మీకు పది దినముల హింస కలుగును. నీవు మరణ
పర్యంతము నమ్మకముగా ఉండుము; అప్పుడు నీకు
జీవ కిరీటము ఇచ్చెదను.

11 చెవి గలవాడు, ఆత్మ సంఘములతో చెప్పుచున్న
దాని వినునుగాక. జయించువాడు రెండవ మరణము
వల్ల హాని పొందడు.

12 పెర్గములోనున్న సంఘముయొక్క దూతకు
వ్రాయుము—వాడియైన రెండంచులు గల ఖడ్గము గల
వాడు చెప్పేవి ఏవనగా, నీవు ఎక్కడ కాపురమున్నా
13 వో అది నాకు తెలుసును.। అక్కడ అపవాది* సింహా
సనమున్నది. నా నామమును గైకొంటున్నావు; మీ
మధ్యను, అపవాది* నివసించు చోట చంపబడిన అంతి
పయను నా నమ్మకమైన సాక్షి దినములలో, నీవు నా
14 యందలి† విశ్వాసము విసర్జించ లేదు.। అయినను నాకు
నీ మీద విరోధమైనవి కొన్ని కలవు; ఏవనగా ఇశ్రాయేలు
పుత్రుల యెదుట అడ్డు‡ వేసుటకును, విగ్రహార్పితము
లను తినుటకును, జారత్వము చేసుటకును,§ బలాకను
వానికి నేర్పిన బిలాముయొక్క బోధను గైకొనినవారు
అక్కడ నీకు ఉన్నారు. । ఆలాగు, నీకొలాయితుల బో 15
ధను గైకొను కొందరు నీకు కూడ ఉన్నారు. । మనస్సు 16
తిప్పుకొనుము; లేకపోతే నీ యొద్దికి త్వరగా వచ్చి
నా నోటి ఖడ్గముతో వారికి విరోధముగా యుద్ధము
చేసెదను.

చెవి గలవాడు ఆత్మ సంఘములతో చెప్పుచున్నది 17
వినును గాక. జయించువానికి నేను మరుగైన మన్నా
ఇత్తును. మరియు, అతనికి తెల్ల రాతిని, ఆ రాతి మీద
వ్రాయబడిన క్రొత్త పేరును ఇచ్చెదను. అది పొందు
వానికే గాని మరి యెవనికిని తెలియదు.

థుయతైరలో ఉన్న సంఘము యొక్క దూతకు 18
వ్రాయుము. అగ్ని జ్వాలవంటి కన్నులును, మెరయు
కంచును పోలిన పాదములును గల దేవుని కుమారుడు
చెప్పుచున్నవి యేవనగా। — నీ క్రియలను, ప్రేమను, 19
విశ్వాసమును, పరిచర్యను, నీ ఓర్పును, మొదటి క్రియ
లకంటె ఎక్కువైన నీ కడపటి క్రియలనును నేను ఎరు
గుదును. । అయినను నాకు నీ మీద విరోధమైనది యే 20
దనగా — తన్నుతానే ప్రవక్త్రినని చెప్పుకొను యెజబె
లను స్త్రీకి స్థలమిచ్చుచున్నావు. జారత్వము చేయుట
కును, విగ్రహార్పితములు తినుటకును, ఆమె నా సేవ
కులకు బోధించుచు మోసపరుచుచున్నది. । మనస్సు 21
తిప్పుకొనునట్లు నేను సమయము ఆమెకిచ్చితిని గాని,
ఆమె తన జారత్వమునుంచి మనస్సు తిప్పుకొన నొల్లక
పోయెను. । ఇదుగో! నేను మంచము మీద ఆమెను, 22
ఆమెతోకూడ వ్యభిచారము చేయువారు ఆమె క్రియ
లనుంచి మనస్సు తిప్పుకొనక పోతే చాలా శ్రమలో
వారిని కూడ పడవేతును. । మరియు ఆమె పిల్లలను మర 23
ణమువల్ల చంపెదను. అప్పుడు అంతరింద్రియములను,
హృదయములను పరీక్షించువాడను నేనే అని సంఘ
ములన్నియు తెలుసుకొనును. మరియు, మీలో ప్రతి
వానికిని మీ మీ క్రియల చొప్పున ఇచ్చెదను.

అయితే థుయతైరలోనున్న కడమ వారితో, 24
అనగా ఎవరికి ఈ బోధ కలగదో, ఎవరు, వారు చెప్పు
చున్న ప్రకారము, అపవాది* యొక్క అగాధములను
ఎరగరో, ఆ మీతో నేను చెప్పునది ఏమనగా, । మీ 25
మీద మరి ఏ భారమునైనను వేయను గాని, మీకు కలి
గినదాని నేను వచ్చు పర్యంతము పట్టుకొనుడి.

* లేక, సాతాను. † గ్రీకులో, నాయొక్క. ‡ లేక, బోను. § సాంఖ్యకా. 24, 25 ప.

26 జయించి అంతమువరకు నా క్రియలను గైకొను
27 వానికి, ప్రజలమీద అధికారము ఇచ్చెదను. అతడు
ఇనుపదండముతో వారిని పరిపాలించును; వారు కుమ్మరి
వాని కుండలవలె పగులగొట్టబడుదురు; ఇలాగు నేనును
28 నా తండ్రివల్ల పొంది యున్నాను. మరియు, అతనికి
29 వేకువ చుక్కను దయచేసెదను. చెవి గలవాడు, ఆత్మ
సంఘములతో చెప్పుచున్నది విను గాక.

## 3. అధ్యాయము.

1 సర్దైణలోనున్న సంఘముయొక్క దూతకు వ్రా
యుము—దేవుని ఏడు ఆత్మలును ఏడు నక్షత్రములును
గలవాడు చెప్పుచున్నవి యేవనగా, నీ క్రియలను నేను
ఎరుగుదును; నీవు జీవించుచున్నావని పేరు పొందితివి
2 గాని మృతుడవు; నీవు మెలుకువపడుచు, మిగిలి
చావబోయినవాటిని స్థిరపరచుము; నీ క్రియలు నా
దేవుని యెదుట సంపూర్ణము చేయబడినవిగా నేను
3 కనుగొన లేదు. కావున నీవు ఏలాగు పొందియున్నా
వో, ఏలాగు వింటివో జ్ఞాపకము చేసుకొని, వాటిని
గైకొని, మనస్సు తిప్పుకొనుము. కావున నీవు మెలు
కువపడక పోతే, నేను దొంగ వలె నీ మీదికి వచ్చె
దను; ఏ గడియను నీ మీదికి వచ్చెదనో, అది నీకు
4 తెలియనే తెలియదు. అయినను సర్దైణలో తమ
వస్త్రములను మైల చేయకపోయిన కొన్ని నామములు
నీకు కలవు; వారు యోగ్యులు గనుక నాతో కూడ
తెల్లనివి గలవారై, నాతో కూడ నడుచుచుందురు.
5 జయించువాడు తెల్లని వస్త్రములచేత అలంకరించ
బడును; జీవగ్రంథములోనుంచి అతని పేరు తుడిచివే
యక, నా తండ్రి యెదుటను, ఆయన దూతల యెదు
6 టను అతని పేరు ఒప్పుకొందును; చెవి గలవాడు,
ఆత్మ సంఘములతో చెప్పుచున్నది వినును గాక.
7 ఫిలదెల్ఫియలోనున్న సంఘముయొక్క దూతకు
వ్రాయుము—పరిశుద్ధుడు, సత్యవంతుడు, దావీదు
యొక్క తాళపు చెవి గలవాడు, ఎవడును తీయ లేకుండ
వేసేవాడు, ఎవడును వేయ లేకుండ తీయువాడునైన
ఆయన చెప్పుచున్నవి ఏవనగా, నీ క్రియలను ఎరుగు
8 దును. ఇదిగో! తీయబడిన తలుపు నీ యెదుట ఇచ్చి
యున్నాను; దాని ఎవడును వేయ నేరడు; ఎందుకన
గా కొంచెమే శక్తిగలవాడవై, నా వాక్యమును గైకొని
నా నామము ఎరుగనన లేదు.
9 ఇదిగో! యూదులు కాక తాము యూదులమని
చెప్పుకొని అబద్ధమాడుచున్న అపవాది సునగోగువా
రిని అప్పగించుచున్నాను. ఇదిగో! వారు వచ్చి నీ
పాదముల యెదుట సాగిలపడి, నేను నీ యందు ప్రేమ
ఉంచితినని తెలిసికొనునట్లు చేసెదను. నీవు నా 10
ఓర్పు వాక్యమును గైకొని యున్నావు గనుక భూమి
మీద నివసించువారిని శోధించుటకు, లోకమంతటి
మీదికి రాబోవు శోధన గడియలోనుంచి నేను నిన్ను
కాపాడెదను.
నేను త్వరగా వచ్చుచున్నాను. ఎవడును నీ కిరీటమును 11
అపహరించకుండునట్లు, నీకు కలిగిన దాని పట్టుకొ
నుము. జయించువాని నా దేవుని ఆలయములో 12
స్తంభముగా చేయుదును; అతడు ఇక మీదట వెలపటికి
పోడు. మరియు నా దేవుని పేరును ఆకాశములోను
న్న నా దేవుని యొద్దనుంచి దిగుచున్న నూతనమైన యె
రూషలేమనగా, నా దేవుని పట్టణముయొక్క పేరును,
నా క్రొత్త పేరును అతని మీద వ్రాయుదును. చెవి గల 13
వాడు, ఆత్మ సంఘములతో చెప్పుచున్నది వినును గాక.
లవుదికయ్యలో ఉన్న సంఘముయొక్క దూతకు 14
వ్రాయుము—నమ్మకమైన సత్య సాక్షియు, దేవుని సృష్టి
మొదలునైన ఆమేన్ చెప్పుచున్నవి ఏవనగా, — నీ 15
క్రియలను ఎరుగుదును; నీకు చల్లనైనను వెచ్చనైనను
లేదు. నీకు చల్లనైనను వెచ్చనైనను ఉండ వలెనని కో
రుచున్నాను. కాబట్టి, నీకు చల్లనైనను వెచ్చనైనను 16
లేదు గాని నీవు నులివెచ్చనగా నున్నావు గనుక, నిన్ను
నా నోట్లోనుంచి కక్కివేయ బోవుచున్నాను. నీవు 17
ప్రయాసపడువాడవును, దిక్కుమాలిన వాడవును, దరి
ద్రుడవును, గుడ్డివాడవును, దిగంబరుడవునై యున్నా
వని ఎరుగక,—నేను ధనవంతుడను, ధనవృద్ధి చేసుకొం
టిని, నాకు ఏమియు తక్కువ లేదని చెప్పుకొంటు
న్నావు, గనుక, నీవు ధనవంతుడవవునట్లు, అగ్నిచేత 18
శుద్ధపరచబడిన బంగారమును, నీవు ధరించుకొనునట్లు
నీ దిసమొల సిగ్గు కనబడకుండునట్లు తెల్లని వస్త్రములను,
నీకు దృష్టి కలుగునట్లు నీ కన్నులకు అంటించుకొన
కలికమును నా యొద్ద కొనుమని నీకు బుద్ధి చెప్పుచు
న్నాను. నేను ఎవరిని ప్రేమింతునో, వారిని గద్దించి 19
శిక్షించుచున్నాను గనుక నీవు ఆసక్తిపడి మనస్సు తిప్పు
కొనుము.
ఇదిగో! నేను తలుపు యొద్ద నిలిచి కొట్టుచున్నా 20
ను; ఎవడైనను నా స్వరము విని, తలుపు తీసిన యెడల,
నేను అతని యొద్దకు ప్రవేశించి, అతనితో నేను, నా
తో అతడు భోజనము చేయుదుము.
నేను జయించి నా తండ్రితో కూడ ఆయన సింహా 21
సనమందు ఏలాగు కూర్చుండి యున్నానో, ఆలాగే
జయించువానికి నాతో కూడ నా సింహాసనమందు
కూర్చుండ నిచ్చెదను. చెవి గలవాడు, ఆత్మ సంఘము 22
లతో చెప్పుచున్నది వినుగాక.

## 4. అధ్యాయము.

1 వాటి తరువాత, నేను చూడగా, ఇదుగో! ఆకాశ
మందు తీయబడిన ఒక తలుపు. అప్పుడు నాతో మాట
లాడుచున్న బూరగ ధ్వని వలె నేను వినిన మునుపటి
శబ్దము — ఇక్కడికి ఎక్కిరమ్ము; వీటి తరువాత రాబో
2 యెడి వాటిని నీకు అగుపరిచెదనని చెప్పెను. । వెంటనే
ఆత్మ వశమైతిని. అప్పుడు ఇదుగో! ఆకాశమందు సిం
హాసనముండెను. సింహాసనము మీద ఒకడు కూర్చుం
3 డెను. । కూర్చుండినవాడు దృష్టికి వజ్ర పద్మరాగము
లను రత్నములవలె నుండెను. దృష్టికి పచ్చవంటిదైన
4 ఇంద్రధనుస్సు సింహాసనము చుట్టు ఉండెను. । సింహా
సనము చుట్టు ఇరువది నాలుగు సింహాసనములు ఉం
డెను. ఈ సింహాసనముల మీద తెల్లని వస్త్రములు ధరిం
చుకొనిన ఇరువది నలుగురు పెద్దలు కూర్చుండిరి. వారి
5 తలల మీద సువర్ణ కిరీటములు ఉండెను. । ఆ సింహా
సనములోనుంచి మెరుపులు, ఉరుములు, శబ్దములును
బయలుదేరుచున్నవి. ఆ సింహాసనము యెదుట వెలు
6 గుచున్న ఏడు అగ్ని దీపములుండెను. । అవి దేవుని
ఏడు ఆత్మలు. ఆ సింహాసనము యెదుట స్ఫటికమును
పోలిన గాజు సముద్రమున్నట్టు ఉండెను. ఆ సింహా
సన మధ్యను, సింహాసనము చుట్టును, వెనుకముందు
కన్నులతో నిండి యున్న నాలుగు జీవులుండెను. ।
7 మొదటి జీవి సింహము వలెను, రెండవ జీవి దూడ
వలెనున్నవి, మూడవ జీవికి మనుష్యుని ముఖమువంటి
ముఖము కలదు, నాలుగవ జీవి ఎగురుచుండు గద్ద
8 వలె నుండెను. । ఆ నాలుగు జీవులలో ప్రతిదానికి
ఆరేసి రెక్కలు కలిగినవి. అవి చుట్టును లోపటను
కన్నులతో నిండినవై దివారాత్రములు విశ్రాంతి పొం
దక — ఉండినవాడు, ఉండుచున్నవాడు, వచ్చుచున్న
వాడునైన సర్వాధికారియైన దేవుడగు ప్రభువు పరి
శుద్ధుడు, పరిశుద్ధుడు, పరిశుద్ధుడు అని పలుకుచున్నవి. ।
9 ఆ సింహాసనము మీద కూర్చుండి యుగయుగములకు
జీవించువానికి, ఆ జీవులు మహిమ, ఘనత, కృతజ్ఞతయు
10 అర్పించునప్పుడు, । ఆ ఇరువది నలుగురు పెద్దలు సిం
హాసనము మీద కూర్చుండిన వాని యెదుట సాగిల
పడి, యుగయుగములకు జీవించువానికి నమస్కారము
చేసి, తమ కిరీటములను సింహాసనము ఎదుట పడవేసి ।
11 — ప్రభువా! * మా దేవా! నీవు ఈ మహిమ, ఘనత,
బలము పొంద యోగ్యుడవై యున్నావు; నీవు అన్ని
టిని సృష్టించితివి; నీ ఇష్టము కొరకు అవి యుండెను;
అవి సృష్టించబడెనని పలుకుచుందురు.

## 5. అధ్యాయము.

మరియు, లోపటను వెలపటను వ్రాయబడి, ఏడు 1
ముద్రల వల్ల ముద్రవేయబడిన ఒక పుస్తకము, సింహా
సనము మీద కూర్చుండిన వాని కుడిచేతి యందు చూ
చితిని. । అప్పుడు ఆ పుస్తకము తెరుచుటకును, దాని 2
ముద్రలు విప్పుటకును ఎవడు యోగ్యుడు? అని బలి
ష్ఠుడైన దూత గొప్ప శబ్దముతో ప్రకటించుట చూచి
తిని. । అయితే ఆకాశమందు గాని, భూమి మీద 3
గాని, భూమి కింద గాని ఎవనికిని ఆ పుస్తకము విప్పు
టకైనను దాని చూచుటకైనను శక్తి ఉండలేదు. । ఆ పుస్త 4
కము విప్పి దాని చూచుటకు యోగ్యుడు ఎవడును
కనుగొనబడలేదు గనుక, నేను చాలా ఏడ్చితిని.
అప్పుడు ఆ పెద్దలలో ఒకడు నాతో — ఏడవవద్దు; 5
ఇదుగో! యూదా గోత్ర సింహమును దావీదు వేరు
చిగురునైనవాడు ఆ పుస్తకమును దాని ఏడు ముద్ర
లను విడదీయ జయము పొందెనని చెప్పెను.
అప్పుడు సింహాసన మధ్యను నాలుగు జీవుల మధ్యను 6
పెద్దల మధ్యను, చంపబడినదానివంటి గొర్రెపిల్ల నిలు
చుట చూచితిని. ఆయనకు ఏడు కొమ్ములు ఏడు కన్ను
లునుండెను. ఇవి భూమియంతటి మీదికిని పంపబడిన
దేవుని ఏడు ఆత్మలు. । అది† వచ్చి సింహాసనము మీద 7
కూర్చుండిన వాని కుడిచేతిలోనుంచి ఆ పుస్తకము పుచ్చు
కొనెను. । అది దాని పుచ్చుకొనినప్పుడు, ఆ నాలుగు 8
జీవులు, ఇరువది నలుగురు పెద్దలును ఆ గొర్రెపిల్ల యె
దుట సాగిలపడిరి. వారిలో ప్రతి వానికిని వీణెలును
ధూప ద్రవ్యములతో నిండిన సువర్ణ పాత్రలునుం
డెను. అవి పరిశుద్ధుల ప్రార్థనలు. । అప్పుడు వారు 9
క్రొత్తపాట పాడుచు — నీవు ఆ పుస్తకము పట్టుకొని,
దాని ముద్రలు విడదీయ యోగ్యుడవు; నీవు చంపబడి
ప్రతి వంశములోనుంచి, ప్రతి భాషలోనుంచి, ప్రతి
జనములోనుంచి, ప్రతి రాష్ట్రములోనుంచి దేవుని కొ
రకు నీ రక్తమువల్ల కొని, । మా దేవునికి వారిని‡ రాజు 10
లగాను యాజకులగాను చేసితివి. వారు భూమి మీద
ఏలికలవుదురని§ పలికిరి.
మరియు, నేను చూచి, సింహాసనమును జీవులను 11
పెద్దలను చుట్టుకొనిన అనేక దూతల శబ్దము వింటిని.
వీరి లెక్క అయుతాయుతములును, సహస్ర సహస్ర
ములునై యుండెను. । వారు — చంపబడిన గొర్రెపిల్ల,‖ 12

---

* అనేక ప్రతులలో, మా ప్రభువైన దేవుడా! † లేక, ఆయన. ‡ కొన్ని ప్రతులలో, మమ్మును.
§ లేక, ఏలికలై యున్నారు. ‖ యోహాను. 1. 29—16.

బలమును ఐశ్వర్యమును జ్ఞానమును శక్తిని ఘనతను మహి
మను స్తోత్రమును పొంద యోగ్యుడని గొప్ప శబ్ద
13 ముతో చెప్పుచుండిరి. । ఆకాశమందును భూమి యం
దును భూమి కిందనున్న ప్రతి సృష్టియు సముద్రము
మీదనున్నవియు వాటిలోనున్నవన్నియు — సింహాసన
ము మీద కూర్చుండిన వానికిని గొఱ్ఱెపిల్లకును స్తోత్ర
ము, ఘనత, మహిమ, శక్తి యుగయుగములకు కలుగు
గాకని చెప్పుట వింటిని.
14 అప్పుడు ఆ నాలుగు జీవులు — ఆమేన్ అనెను.
మరియు ఆ పెద్దలు సాగిలపడి నమస్కారించిరి.

## 6. అధ్యాయము.

1 ఆ గొఱ్ఱెపిల్ల ఆ ఏడు ముద్రలలో ఒకదాని విడ
దీసినప్పుడు, నేను చూడగా ఆ నాలుగు జీవులలో
ఒకటి—రమ్మని ఉరుమువంటి శబ్దముతో పలుకుట విం
2 టిని. । నేను చూచినప్పుడు ఇదిగో! తెల్లని గుర్రము;
దాని మీద కూర్చుండిన వానికి విల్లు ఉండెను. ఆయ
నకు కిరీటము ఇయ్యబడెను. అప్పుడు ఆయన జయిం
చుచు, జయించునట్లు బైలు వెళ్లెను.
3 రెండవ ముద్ర విడదీసినప్పుడు—రమ్మని రెండవ జీవి
4 చెప్పుట వింటిని. । అప్పుడు ఎఱ్ఱనిదైన వేరొక గు
ర్రము బైలు వెళ్లెను, భూమి మీదనుంచి సమాధానము
తీసివేయుటకును, వారు ఒకని ఒకడు చంపునట్లును
దాని మీద కూర్చుండిన వానికి అధికారమియ్యబడె
ను. మరియు అతనికి పెద్ద ఖడ్గము ఇయ్యబడెను.
5 మూడవ ముద్ర విడదీసినప్పుడు—రమ్మని మూడవ
జీవి చెప్పుట వింటిని. నేను చూచినప్పుడు, ఇదిగో!
నల్ల గుర్రము; దాని మీద కూర్చుండిన వాని చేత
6 త్రాసు ఉండెను. । అప్పుడు — దేనారమునకు శేరు
గోధుమలనియు దేనారమునకు మూడు శేర్లు యవలని
యు; నూనెకు, ద్రాక్షారసమునకు, హాని చేయ వద్దని
యు ఆ నాలుగు జీవుల మధ్యను శబ్దమువంటిది చెప్పుట
వింటిని.
7 నాలుగవ ముద్ర విడదీసినప్పుడు—రమ్మని నాలుగవ
8 జీవి శబ్దము పలుకుట వింటిని. । నేను చూడగా, ఇదు
గో! పాండురమైన గుర్రము; దాని మీద కూర్చుండిన
వాని పేరు మరణము. అదృశ్యలోకము అతనితో వెం
బడించుచుండెను. ఖడ్గము వలన, కరువు వలన, మర
ణము వలన, భూమి కారు మృగముల వలన చంపుటకు,
భూమియొక్క నాలుగవ భాగము పైని అధికారము
అతనికి ఇయ్యబడెను.

అయిదవ ముద్ర విడదీసినప్పుడు, దేవుని వాక్యము 9
కొరకును, వారికి కలిగిన సాక్ష్యము కొరకును వధించ
బడిన వారి ప్రాణములను యజ్ఞవేదిక కింద చూచితిని. ।
వారు — పరిశుద్ధుడవైన సత్యవంతుడా! ఏలినవాడా! 10
మా రక్త నిమిత్తము ఎందాక తీర్పు చేసి భూ నివాసు
లకు న్యాయ శిక్ష చేయకుందువని గొప్ప శబ్దముతో
కంఠమెత్తి పలుకుచుండిరి. । అప్పుడు తెల్లని వస్త్రములు 11
వారిలో ప్రతివానికి ఇయ్యబడెను. మరియు వారి వలె
చంపబడబోవు వారి సహ దాసులును సహోదరులును
సంపూర్ణులయ్యే పర్యంతము, ఇంకా కొంత కాలము
నిమ్మళించ వలెనని వారితో చెప్పబడెను.
ఆరవ ముద్ర విడదీసినప్పుడు, నేను చూడగా మహా 12
కంపము కలిగెను; సూర్యుడు వెంట్రుకల కంబళి వలె
నలుపాయెను; పూర్ణ చంద్రుడు కూడ రక్తము వలె
ఆయెను. । పెద్ద గాలి వల్ల అల్లాడు అంజూరపుచెట్టు 13
దాని అకాలపు కాయలు రాల్చు ప్రకారము, ఆకాశ
నక్షత్రములు భూమి మీద పడెను. మరియు, । ఆకా 14
శము చుట్టబడు చుట్ట వలె గతించిపోయెను. ప్రతి
పర్వతమును ప్రతి ద్వీపమును వాటి చోట్లనుంచి కద
లించబడెను. । మరియు, భూరాజులు, గొప్పవారు, సహ 15
స్రాధిపతులు, ధనికులు, బలిష్ఠులు, ప్రతి దాసుడు,
ప్రతి స్వతంత్రుడు, కొండ గుహలలోను, బండలమ
ధ్యను । దాగి, కొండలతోను బండలతోను—మీరు మా 16
మీద పడి సింహాసనము మీద కూర్చుండిన వాని
ముఖమునకును, గొఱ్ఱెపిల్ల కోపమునకును మమ్మును మ
రుగు చేయుడి; । ఆయన* కోపముగల గొప్ప దినము 17
వచ్చెను; నిలువ చాలిన వాడెవడు! అని చెప్పుచున్నారు.

## 7. అధ్యాయము.

అటుతరువాత, భూమియొక్క నాలుగు దిక్కుల 1
యందు, నలుగురు దూతలు నిలిచియుండుట చూచితిని.
వారు భూమి మీదనైనను సముద్రము మీదనైనను ఏ
చెట్టుమీదనైనను గాలి విసరకుండునట్లు, భూమియొక్క
నాలుగు వాయువులను పట్టుకొని యుండిరి.
మరియు సజీవ దేవుని ముద్రగల వేరొక దూత 2
సూర్యోదయ దిశనుంచి ఎక్కుట చూచితిని. భూమి
కిని సముద్రమునకును హాని చేయుటకు అధికారము
పొందిన ఆ నలుగురు దూతలతో । అతడు — మేము 3
మన దేవుని దాసులను వారి నొసళ్లమీద ముద్రించు
పర్యంతము, భూమికైనను, సముద్రమునకైనను వృక్ష
ములకైనను హాని చేయ వద్దని మహా శబ్దముతో చె
ప్పెను.

---

*లేక, వారి.

4 అప్పుడు ముద్రించబడినవారి లెక్కను వింటిని,
ఇశ్రాయేలు పుత్రుల గోత్రములన్నిటిలో ముద్రించ
5 బడినవారు నూట నలుబది నాలుగు వేలు. । యూదా
గోత్రములో ముద్రించబడినవారు పన్నెండువేలు;
రూబేను గోత్రములో,* పన్నెండువేలు; గాదు గో
6 త్రములో, పన్నెండువేలు; । ఆషేరు గోత్రములో,
పన్నెండువేలు; నఫ్తాలీ గోత్రములో, పన్నెండువేలు;
7 మనష్షే గోత్రములో, పన్నెండువేలు; । సుమెయోను
గోత్రములో, పన్నెండువేలు; లేవి గోత్రములో, ప
న్నెండు వేలు; ఇశ్శాఖారు గోత్రములో, పన్నెండువే
8 లు; । జబూలూను గోత్రములో, పన్నెండువేలు; యో
సేపు గోత్రములో, పన్నెండువేలు; బెన్యామీను గో
త్రములో ముద్రించబడినవారు పన్నెండువేలు.

9 తరువాత నేను చూడగా, ఇదిగో! ప్రతి రాష్ట్రము
నుంచి, గోత్రములలోనుంచి, ప్రజలలోనుంచి, భాషల
లోనుంచి, ఎవడును లెక్కించ లేని గొప్ప జన సమూ
హము తెల్లని వస్త్రములు ధరించుకొని సింహాసనము యె
దుటను గొర్రెపిల్ల యెదుటను నిలిచియుండెను. వారి
10 చేతుల యందు మట్టలు ఉండెను. । వారు—సింహాసన
ము మీద కూర్చుండియున్న మా దేవునికిని గొర్రెపిల్ల
కును మా రక్షణ అని మహా శబ్దముతో పలుకుచున్నారు.
11 అప్పుడు, దూతలందరు, సింహాసనమును పెద్దలను
నాలుగు జీవులను చుట్టుకొని నిలిచి యుండిరి. వారు
12 సింహాసనము యెదుట సాగిలపడి, ।— ఆమేన్†; మా
దేవునికి స్తోత్రము, మహిమ, జ్ఞానము, కృతజ్ఞత, ఘ
నత, శక్తి, బలము, యుగయుగములకు కలుగు గాక;
ఆమేన్ అనుచు, దేవునికి నమస్కరించిరి.

13 అప్పుడు పెద్దలలో ఒకడు—తెల్లని వస్త్రములు ధరిం
చుకొనిన వీరు ఎవరు? ఎక్కడనుంచి వచ్చిరి? అని
14 నన్ను అడిగెను. । అందుకు నేను—ప్రభువా! అది నీకు
తెలుసునని చెప్పినప్పుడు, అతడు—వీరు ఈ మిక్కిలి
శ్రమలోనుంచి వచ్చువారు. వీరు గొర్రెపిల్ల రక్తము
15 తో తమ వస్త్రములను ఉతికి తెలుపు చేసుకొనిరి । గనుక,
దేవుని సింహాసనము ఎదుటనున్నారు; వారు ఆయన
ఆలయములో దివారాత్రులు ఆయనను సేవించుచు
న్నారు! సింహాసనము మీద కూర్చుండియున్న వాని
16 గుడారము వారి పైని వేయబడును. । ఇకమీదట వా
రికి ఆకలియైనను దాహమైనను కలుగదు. సూర్యుని
17 ఎండైనను, ఏ వేడిమియైనను వారి మీద పడదు; । ఎం
దుకనగా సింహాసన మధ్యనుండు గొర్రెపిల్ల వారికి కా
పరియై జీవజలముల బుగ్గలకు వారిని నడిపించును. దేవు
డు వారి కన్నులనుంచి ప్రతి బాష్పబిందువును తుడిచి
వేసునని నాతో పలికెను.

## 8. అధ్యాయము.

ఆయన ఏడవ ముద్ర విడదీసినప్పుడు, ఆకాశమం 1
దు ఇంచుమించు అరఘంట మట్టుకు నిశ్శబ్దమాయెను.
తరువాత దేవుని ఎదుట నిలుచు ఏడుగురు దూత 2
లను చూచితిని; వారికి ఏడు బూరగలు ఇయ్యబడెను. ।
అప్పుడు సువర్ణ ధూపార్తి గల వేరొక దూత వచ్చి 3
ధూప పీఠము యొద్ద నిలిచెను. అప్పుడు సింహాసనము
యెదుటనున్న సువర్ణ ధూప పీఠము మీద, పరిశుద్ధు
లందరి ప్రార్థనలకు పెట్టునట్లు, అతనికి బహు ధూప
ద్రవ్యములు ఇయ్యబడెను. । అప్పుడు ఆ ధూప ద్రవ్య 4
ముల పొగ పరిశుద్ధుల ప్రార్థనలకు, ఆ దూత చేతిలో
నుంచి దేవుని ఎదటికి లేచెను. । అప్పుడు ఆ దూత 5
ఆ ధూపార్తిని పట్టుకొని, ధూప పీఠమునుంచి తీసిన
నిప్పులతో దాని నింపి, భూమి మీద పడవేసెను.
అప్పుడు శబ్దములు, ఉరుములు, మెరుపులు, కంపము
కలిగెను. । అప్పుడు ఏడు బూరగలు గల ఆ ఏడుగురు 6
దూతలు ఊదునట్లు తమ్మును సిద్ధపరచుకొనిరి.

మొదటి దూత, బూర ఊదినప్పుడు, రక్తముతో 7
కలపబడిన వడగండ్లు అగ్నియు కలిగెను. అవి భూమి
మీద వేయబడెను; అప్పుడు భూమి మూడవ భాగ
ము కాలిపోయెను; చెట్ల మూడవ భాగము కాలిపో
యెను; సమస్తమైన పచ్చని గడ్డియు కాలిపోయెను.

రెండవ దూత బూర ఊదినప్పుడు, మండుచున్న 8
గొప్ప కొండవంటిది సముద్రములో వేయబడెను. ।
అప్పుడు సముద్రములో మూడవ భాగము రక్తమాయె 9
ను. మరియు సముద్రములోని ప్రాణముగల జంతు
వులలో మూడవ భాగము చనిపోయెను. ఓడలలో
మూడవ భాగమును నాశము చేయబడెను.

మూడవ దూత బూర ఊదినప్పుడు దీపము వలె 10
మండుచున్న పెద్ద నక్షత్రము ఆకాశమునుంచి పడెను.
అది నదులలో మూడవ భాగము మీదను నీటి బుగ్గల
మీదను పడెను. । ఆ నక్షత్రనామము మాచిపత్తిరి అన 11
బడును. అప్పుడు ఆ నీళ్లలో మూడవ భాగము మాచి
పత్తిరి ఆయెను. ఆ నీళ్లు చేదుగా చేయబడినందున
వాటివల్ల మనుష్యులలో అనేకులు చచ్చిరి.

నాలుగవ దూత బూర ఊదినప్పుడు సూర్య చంద్ర 12
నక్షత్రములలో మూడవ భాగము చీకటి కమ్మునట్లును,
పగలు దాని మూడవ భాగమందు ప్రకాశించకుండు

* కొన్ని ప్రతులలో, ముద్రించబడినవారు అని ప్రతి వాక్యములో ఉన్నది. † అనగా, తథాస్తు.

నట్లును రాత్రి కూడ అలాగే ఉండునట్లును, సూర్యుని
మూడవ భాగమును, చంద్రుని మూడవ భాగమును,
నక్షత్రముల మూడవ భాగమును కొట్టబడెను.
13 మరియు నేను చూడగా, ఆకాశమధ్యను ఒక గద్ద
ఎగురుచు — బూర ఊదబోవుచున్న ముగ్గురు దూతల
బూరగయొక్క కడమ శబ్దముల మూలముగా భూమి
మీద నివసించు వారికి శ్రమ, శ్రమ, శ్రమ అని గొప్ప
శబ్దముతో చెప్పుచుండుట వింటిని.

## 9. అధ్యాయము.

1 తరువాత అయిదవ దూత బూర ఊదినప్పుడు,
ఆకాశమునుంచి భూమి మీద పడిన ఒక నక్షత్రము
చూచితిని. వానికి అబిస్సు* గుండముయొక్క తాళపు
2 చెవి ఇయ్యబడెను। వాడు అబిస్సు గుండము తెరిచెను.
ఆ గుండములోనుంచి పెద్ద కొలిమి పొగవంటి పొగ
లేచెను. ఆ గుండము పొగ మూలముగా చీకటి సూ
3 ర్యుని ఆకాశమును కమ్మెను। ఆ పొగలోనుంచి మిడ
తలు భూమి మీదికి బైలువెళ్లెను. భూమియొక్క తే
ళ్లకు బలమున్న ప్రకారము, వాటికి బలము ఇయ్యబ
4 డెను। మరియు తమ నొసళ్ల మీద దేవుని ముద్ర లేని
మనుష్యులకే గాని భూమియొక్క గడ్డికైనను ఏ పచ్చని
దానికైనను ఏ చెట్టుకైనను హాని చేయ కూడదని వాటి
5 తో చెప్పబడెను। అయితే వారిని చంపుటకు కాదు
గాని వారు అయిదు నెలల మట్టుకు బాధపడునట్లు వీటికి
అధికారము ఇయ్యబడెను. వీటి బాధ, మనుష్యుని
6 కుట్టిన తేలువలని బాధవంటిది। ఆ దినములలో మను
ష్యులు మరణము వెతుకుదురు గాని దాని కనుగొనరు;
చావ వలెనని మిక్కిలి కోరుదురు గాని మరణము వారి
యొద్దనుంచి పారిపోవును.
7 ఆ మిడతలు, రూపముల యందు యుద్ధమునకు సిద్ధ
పరచబడిన గుఱ్ఱములను పోలెను. వాటి తలల మీద
బంగారమును పోలిన కిరీటముల వంటివి ఉండెను.
8 వాటి ముఖములు మనుష్య ముఖముల వంటివి। స్త్రీల
తల వెంట్రుకల వంటి వెంట్రుకలు వాటికి ఉండెను.
9 వాటి పండ్లు సింహపు కోరల వలెనుండెను। ఇనుప
మైమరువుల వంటి మైమరువులు వాటికి ఉండెను.
వాటి రెక్కల ధ్వని యుద్ధమునకు పరుగెత్తు విస్తార
మైన గుఱ్ఱముల రథముల ధ్వని వలె నుండెను. తేళ్ల
10 తోకలవంటి తోకలు వాటికి కలవు;। వాటి తోకల
యందు ముండ్లు కలవు. అయిదు నెలల మట్టుకు, మను
ష్యులకు హాని చేయుటకు వాటితోకలలో అధికార
11 ముండెను। అబిస్సుయొక్క† దూతయైన ఒక రాజు
వాటి పైని యున్నాడు. హెబ్రీ భాష యందు అతని
పేరు అబద్దోను; హెల్లేని భాష యందు అతనికి అపొ
ల్లుయోనను పేరు‡ కలదు.
మొదటి శ్రమ గతించెను. ఇదుగో! మరి రెండు 12
శ్రమలు, వాటి తరువాత వచ్చును.
ఆరవ దూత బూర ఊదినప్పుడు, దేవుని యెదుట 13
నున్న సువర్ణ ధూప పీఠముయొక్క నాలుగు కొమ్ముల
నుంచి ఒక శబ్దము।— యుఫ్రాతను పెద్ద నది యొద్ద 14
బంధించబడిన నలుగురు దూతలను వదిలించుమని బూ
రగ గల ఆరవ దూతతో చెప్పుట వింటిని। అప్పుడు 15
మనుష్యుల మూడవ భాగమును చంపునట్లు, ఘంట,
దినము, మాసము, సంవత్సరము మట్టుకు సిద్ధపరచబడిన
నలుగురు దూతలు వదలించబడిరి। గుఱ్ఱపు రౌతుల 16
సైన్యముయొక్క లెక్క రెండు అయుతాయుతములు.
నేను వారి లెక్క వింటిని.
ఆ గుఱ్ఱములను, వాటి మీద కూర్చుండిన వారిని 17
ఆ దర్శనమందు ఈలాగు చూచితిని. వారికి అగ్ని
నీల గంధకముల వంటి మైమరువులు ఉండెను. ఆ గుఱ్ఱ
ముల తలలు సింహముల తలల వలె నుండెను. వాటి
నోళ్లలోనుంచి, అగ్ని, ధూమ, గంధకములు బైలు
వెళ్లుచున్నవి। ఈ మూటివల్ల అనగా వాటి నోళ్లలో 18
నుంచి బైలువెళ్లు అగ్ని ధూమ గంధకముల వల్ల మను
ష్యుల మూడవ భాగము చంపబడెను;। ఎందుకనగా 19
ఆ గుఱ్ఱముల బలము వాటి నోటి యందును వాటి
తోకల యందును ఉన్నది; వాటి తోకలు తలలు కలవై
సర్పములను పోలినవి; వాటి వల్ల హాని చేయుచున్నవి.
ఈ దెబ్బలచేత చంపబడని కడమ మనుష్యులు 20
దయ్యములకును చూచుటకైనను వినుటకైనను నడుచుట
కైనను శక్తిలేని బంగారు, వెండి, కంచు, రాయి, కఱ్ఱల
వల్లనైన విగ్రహములకును, నమస్కరించకుండునట్లు మ
నస్సు తిప్పుకొన లేదు। వారు తమ నరహత్యలనుంచి 21
యు, తమ తంత్రములనుంచియు, తమ వ్యభిచారముల
నుంచియు, తమ దొంగతనములనుంచియు మనస్సు
తిప్పుకొన లేదు.

## 10. అధ్యాయము.

బలవంతుడైన వేరొక దూత మేఘము ధరించు 1
కొని, ఆకాశమునుంచి దిగుట చూచితిని; అతని తల
మీద ఇంద్ర ధనుస్సు ఉండెను; ఆయన ముఖము సూ
ర్యుని వలె నుండెను; అతని పాదములు అగ్ని స్తంభముల
వలె నుండెను;। విప్పబడిన చిన్న పుస్తకము ఆయన చేతి 2

* అనగా, అగాధము. † లేక, అగాధ స్థలముయొక్క. ‡ అనగా, నశింప చేసేవాడు.

లోనుండెను. ఆయన తన కుడి పాదము సముద్రము
మీదను, ఎడమ పాదము భూమి మీదను మోపి,।
3 సింహము గర్జించు ప్రకారము గొప్ప శబ్దముతో
ఆర్భటించెను. అతడు ఆర్భటించినప్పుడు, ఏడు ఉరు
4 ములు తమ శబ్దములు పలికెను.। ఆ ఏడు ఉరుములు
పలికినప్పుడు, వ్రాయబోతిని. అప్పుడు—ఏడు ఉరు
ములు పలికిన వాటిని వ్రాయక, వాటికి ముద్రవేయు
మని ఆకాశము నుంచి ఒక శబ్దము చెప్పుట వింటిని.

5 అప్పుడు సముద్రము మీదను భూమి మీదను
ఎవడు నిలిచియుండుట చూచితినో, ఆ దూత తన
6 కుడిచెయ్యి ఆకాశముతట్టు ఎత్తి,। ఆకాశమును అందు
లోనున్న వాటినిని, భూమిని అందులోనున్న వాటినిని,
సముద్రమును అందులోనున్న వాటినిని సృష్టించి యు
గయుగములవరకు జీవించు వానితోడని ఒట్టు బెట్టు
7 కొని — ఇకను ఆలస్యము* ఉండదు;। అయితే ఏడవ
దూత శబ్దముయొక్క దినములలో, అతడు బూర ఊద
బోవు సమయమందు, దేవుడు తన దాసులైన ప్రవక్త
లకు సువర్తమానము తెలిపిన ప్రకారము, దేవుని మర్మ
ము సమాప్తమవునని పలికెను.

8 ఆకాశమునుంచి నేను వినిన శబ్దము మళ్లి నాతో
పలుకుచు—నీవు వెళ్లి సముద్రము మీదను భూమి మీ
దను నిలిచియున్న ఆ దూత చేతియందు విప్పబడిన
ఆ చిన్న పుస్తకము పుచ్చుకొనుమని చెప్పుట వింటిని.।
9 అప్పుడు నేను ఆ దూత యొద్దికి వెళ్లి—ఆ చిన్న పుస్త
కము నాకిమ్మని చెప్పితిని. అప్పుడు అతడు — నీవు
దాని పుచ్చుకొని తినివేయుము. అది నీ కడుపు చేదు
చేసును, అయినను నీ నోటికి తేనె వలె తియ్యనిదై
10 యుండునని నాతో చెప్పెను.। అప్పుడు ఆ దూత చేతి
నుంచి ఆ చిన్న పుస్తకము పుచ్చుకొని దాని తిని వేసి
తిని. అది నా నోటికి తేనె వలె తియ్యనిదై యుం
డెను; అయినను నేను దాని తినివేసిన తరువాత, నా
11 కడుపు చేదుగా చేయబడెను.। అప్పుడు వారు—నీవు
మళ్లి ప్రజలను గూర్చి రాష్ట్రములను గూర్చి భాషలను
గూర్చి అనేక రాజులను గూర్చియు ప్రవచించ వలె
నని నాతో చెప్పెను.

## 11. అధ్యాయము.

1 మరియు బెత్తమువంటి రెల్లు నాకు ఇయ్యబడెను.
అప్పుడిట్లనెను—నీవు లేచి దేవుని ఆలయమును, యజ్ఞ
వేదికను అందులో ఆరాధించు వారిని కొలువుము.।
2 ఆలయముయొక్క వెలపటి ఆవరణ బైటవేయుము;
దాని కొలవ వద్దు; ఎందుకనగా, అది రాష్ట్రములకు ఇయ్య
బడెను. వారు నలుబది రెండు నెలలు పరిశుద్ధ పట్టణ
ము అణగద్రొక్కుదురు.। నా ఇద్దరు సాక్షులకు అధి 3
కారమిచ్చెదను. వారు గోనెపట్ట వేసుకొని, వెయ్యిని
న్నూట అరువది దినములు ప్రవచింతురు.

వీరు భూమియొక్క ప్రభువు యెదుట నిలుచు 4
రెండు ఒలీవ చెట్లును, రెండు దీపస్తంభములునై యు
న్నారు.। ఎవడైనను వారికి హాని చేయ గోరితే వారి 5
నోటినుంచి అగ్ని బైలువెళ్లి, వారి శత్రువులను కా
ల్చివేసును. ఎవడైనను వారికి హాని చేయ గోరితే,
వాడు ఆలాగున చంపబడ వలెను.। వారు ప్రవచించు 6
దినములు వాన కురవకుండునట్లు ఆకాశము మూయ
అధికారము వారికి కలదు. మరియు, వారు కోరునప్పు
డెల్ల, నీళ్లు రక్తముగా చేయుటకును అన్ని దెబ్బలతో
భూమిని కొట్టుటకును వారికి అధికారమున్నది.

వారు తమ సాక్ష్యము నెరవేర్చిన తరువాత, అబి 7
స్సులోనుంచి పైకి వచ్చు క్రూర మృగము వారితో
యుద్ధము చేసి, వారిని జయించి వారిని చంపును.।
మరియు వారి శవములు, ఆత్మరూపకముగా† సొదొమ 8
ఐగుప్తు అనబడిన గొప్ప పట్టణముయొక్క వీధిలో‡
ఉండును. అక్కడ వారి ప్రభువుకూడ శిలువ వేయ
బడెను.

మరియు, ప్రజలలోను గోత్రములలోను భాషల 9
లోను రాష్ట్రములలోను కొందరు వారి శవములు మూడు
దినములనర మట్టుకు చూచును, వారి శవములు సమా
ధులలో ఉంచబడనియ్యరు.। ఈ యిద్దరు ప్రవక్తలు 10
భూమి మీద నివసించువారిని బాధపరుచుచుండిరి
గనుక భూమి మీద నివసించువారు వారిని గూర్చి సం
తోష పడుచు, ఉత్సహించుచు, ఒకనికి ఒకడు కాను
కలను పంపుదురు.

ఆ మూడు దినములనర అయిన తరువాత దేవుని 11
నుంచి జీవద్వాత్మ వారిలో ప్రవేశించెను గనుక వారు
పాదములూని నిలిచిరి. అప్పుడు వారిని చూచిన వారికి
మిక్కిలి భయము కలిగెను.। మరియు,—ఇక్కడెక్కిరం 12
డని తమతో ఆకాశము నుంచి గొప్ప శబ్దము చెప్పుట
వారు విని, ఆ మేఘమందు ఆకాశమునకు ఎక్కిపో
యిరి; వారి శత్రువులు వారిని చూచిరి.

ఆ గడియలోనే మహా కంపము§ కలిగినందున, 13
ఆ పట్టణములో పదియవ భాగము పడిపోయెను. మరి
యు ఆ కంపములో ఏడు వేల మనుష్యుల నామములు

---

*లేక, కాలము. †లేక, ఉపమానముగా. ‡లేక, విశాల మార్గమున. §అనగా, భూకంపము కాబోలును.

చంపబడెను. మిగిలినవారు భయపడినవారై ఆకా
శముయొక్క దేవుని మహిమపరచిరి.
14 రెండవ శ్రమ గతించెను; ఇదుగో! మూడవ శ్రమ
త్వరగా వచ్చును.
15 ఏడవ దూత బూర ఊదినప్పుడు—లోక రాజ్యము
మన ప్రభువుదు, ఆయన క్రీస్తుదు కలిగినదాయెను;
ఆయన యుగయుగముల పర్యంతము ఏలునని చెప్ప
16 చున్న గొప్ప శబ్దములు ఆకాశమందు కలిగెను. । అప్ప
డు దేవుని యెదుట తమ సింహాసనముల మీద కూ
చుండిన ఇరువది నలుగురు పెద్దలు తమ ముఖములు
17 నేల మోపి దేవునికి నమస్కరించుచు ।—ఉండుచున్న
వాడవు ఉండినవాడవునైన దేవా! సర్వాధికారము
గల ప్రభువా! నిన్ను స్తుతించుచున్నాము; నీవు నీ
18 మహా బలము తెచ్చుకొని, ఏలినవాడవైతివి. । రాష్ట్రము
లు కోపగించెను. నీ కోపము వచ్చెను; మృతులు తీర్పు
పొందుటకును నీ సేవకులైన ప్రవక్తలకును, పరిశుద్ధుల
కును నీ నామమును గూర్చి భయపడు పిన్న పెద్దల
కును వారి వారి ప్రతి ఫలమిచ్చుటకును, భూమి చెరు
పు వారిని చెరుపుటకును సమయము వచ్చెనని చెప్పిరి.
19 మరియు, ఆకాశమందు దేవుని ఆలయము తెరవ
బడెను. అప్పుడు ప్రభువుయొక్క నిబంధన పెట్టె
ఆయన ఆలయములో కనబడెను. అప్పుడు మెరుపులు,
ఉరుములు, కంపము గొప్ప వడగండ్లును కలిగెను.

## 12. అధ్యాయము.

1 అప్పుడు ఆకాశమందు గొప్ప గురుతు, అనగా
సూర్యుని ధరించుకొనిన ఒక స్త్రీ కనబడెను; ఆమె పాద
ముల క్రింద చంద్రుడు, తలమీద పన్నెండు నక్షత్ర
2 ముల కిరీటము నుండెను. । ఆమె గర్భిణియై ప్రసవ
మవుచు, కన వేదనపడి కేక వేయుచున్నది.
3 అప్పుడు మరియొక గురుతు ఆకాశమందు కనబ
డెను; ఇదుగో! ఎఱ్ఱని పెద్ద ఘటసర్పము. దానికి ఏడు
తలలు పది కొమ్ములున్నవి; దాని తలల మీద ఏడు కిరీ
4 టములున్నవి. । దాని తోక, ఆకాశ నక్షత్రములలో
మూడవ భాగమును ఈడ్చి, వాటిని భూమి మీద పడ
వేసెను. కనబోవుచున్న ఆ స్త్రీ కనినప్పుడు, ఆమె
పిల్లను మింగివేయునట్లు ఆ ఘటసర్పము ఆమె యెదుట
5 నిలిచెను. । అప్పుడు ఆమె, సమస్త రాష్ట్రములను ఇనుప
గదతో ఏలబోవుచున్న మగపిల్లను కనెను. అప్పుడు
ఆమె పిల్ల దేవునియొద్దకును ఆయన సింహాసనము యొ
ద్దకును త్వరగా ఎత్తబడెను;। ఆ స్త్రీ అరణ్యమునకు పారి 6
పోయెను. అక్కడ వారు వెయ్యిన్నూట అరువది
దినముల మట్టుకు, ఆమెను పోషించునట్లు అక్కడ
ఆమెకు, దేవునివల్ల సిద్ధము చేయబడిన స్థలము కలదు.
ఆకాశమందు యుద్ధము జరిగెను. మిఖాయేలును, 7
అతని దూతలును ఆ ఘటసర్పముతో యుద్ధము చేసిరి.
ఆ ఘటసర్పము దాని దూతలును యుద్ధము చేసిరి గాని
అసమర్థులై యుండిరి. । ఆ మీదట ఆకాశమందు 8
వారి స్థలమైనను కనుగొనబడలేదు.
అప్పుడు సర్వలోకమును మోసపరచు అపవాది 9
అనియు సైతానుయు పేరుగల పాత సర్పమైన ఆ
పెద్ద ఘటసర్పము పడద్రోయబడెను. అతడు భూమి
మీద పడద్రోయబడెను; వాని దూతలు వానితో కూడ
పడద్రోయబడిరి.
మరియు ఆకాశమందు మహా శబ్దము వింటిని. అది 10
చెప్పిన దేమనగా—ఇప్పుడు రక్షణ, బలము, మన దేవుని
రాజ్యము, ఆయన క్రీస్తుయొక్క అధికారమును వచ్చి
యున్నవి; మన దేవుని యెదుట దివారాత్రులు మన
సహోదరులను నిందించువాడైన వారి అపవాది పడ
ద్రోయబడియున్నాడు. । వారు గొఱ్ఱెపిల్ల రక్తము 11
వల్లను తాముచెప్పిన సాక్ష్యము వల్లను వాని జయించిరి.
వారు మరణ పర్యంతము, తమ ప్రాణములను ప్రే
మించరైరి. । ఇందువల్ల, ఆకాశములారా! వాటిలో నివ 12
సించు వారలారా! సంతోషపడుడి. భూమికిని సము
ద్రమునకును శ్రమ! ఎందుకనగా, అపవాది తనకు కొం
చెమే కాలము కలదని ఎరిగి బహు క్రోధము గలవాడై
మీ యొద్దకు దిగివచ్చియున్నాడు.
ఘటసర్పము తాను భూమి మీద పడద్రోయబడి 13
యుండుట చూచి, ఆ మగపిల్లను కనిన స్త్రీని తరిమెను.।
అప్పుడు ఆ స్త్రీ అరణ్యములోని తనచోటికి ఎగురు 14
నట్లు, గొప్ప గద్ద రెక్కలు, రెండు ఆమెకు ఇయ్యబ
డెను. అక్కడ ఆమె ఆ సర్పముఖమునకు దూరముగా,
ఒక కాలము కాలములు, అర్థకాలము పోషించబడును.।
అయితే ఆ స్త్రీ వరదవల్ల కొట్టుకొని పోబడుటకు, ఆ 15
సర్పము తన నోటినుండి నది వలె నీళ్లు ఆమె వెనుక
వెళ్లగక్కెను.। అప్పుడు భూమి స్త్రీకి సహాయము చేసెను. 16
భూమి తన నోరు తెరచి, ఘటసర్పము తన నోటినుంచి
వెళ్లగక్కిన నది * తాగివేసెను.
అప్పుడు ఘటసర్పము స్త్రీ విషయము కోపపడినవాడై, 17
దేవుని ఆజ్ఞలు గైకొని, యేసు సాక్ష్యము కలిగిన ఆమె

* లేక, వరద.

సంతానముయొక్క కడమవారితో యుద్ధము చేయ
వెళ్లిపోయెను. అది సముద్రపు ఇసుకమీద నిలిచెను.

## 13. అధ్యాయము.

1 అప్పుడు పది కొమ్ములును ఏడు తలలును దాని
కొమ్ముల మీద పది కిరీటములును దాని తలల మీద
దూషణగల పేళ్లును గల ఒక క్రూరమృగము సముద్ర
2 ములోనుంచి పైకి వచ్చుట చూచితిని. । మరియు నేను
చూచిన మృగము చిరుతపులిని పోలెను; దాని పాద
ములు ఎలుగుబంటి పాదముల వలెను దాని నోరు
సింహపు నోటి వలె నుండెను. దానికి ద్రాకోను తన
బలమును సింహాసనమును గొప్ప అధికారమును ఇచ్చె
3 ను. । దాని తలలలో ఒకటి మరణము మట్టుకు వధించ
బడిన దానివలె నాకు కనబడెను. దాని దెబ్బ స్వస్థ
పరచబడెను. అప్పుడు సర్వ భూలోకము, ఆ క్రూర
4 మృగమును వెంబడించి* ఆశ్చర్యపడుచుండెను. । ఆ
క్రూరమృగమునకు అధికారమిచ్చెనని, ద్రాకోనుకు నమ
స్కరించిరి. మరియు వారు—ఈ క్రూరమృగ సమా
నుడు ఎవడు! దానితో యుద్ధము చేయగలవాడు ఎవ
డని చెప్పుకొనుచు, ఆ క్రూరమృగమునకును నమస్క
5 రించిరి. । గొప్ప మాటలను, దూషణలను పలుకు నోరు
దానికియ్యబడెను. నలుబది రెండు నెలలు పనిచేయనధి
కారము దానికియ్యబడెను.

6 అప్పుడు దేవుని నామమును, ఆయన గుడారమును,
ఆకాశమందు కాపురమున్నవారిని దూషించుటకు,
దేవుని గూర్చిన దూషణ నిమిత్తము తన నోరు తెరచె
7 ను. । మరియు పరిశుద్ధుల మీద యుద్ధము చేయను, వా
రిని జయించను దానికి అధికారమియ్యబడెను. మరి
యు ప్రతి గోత్రము మీదను, ప్రతి జనము మీదను
ప్రతి భాష మీదను ప్రతి రాష్ట్రము మీదను దానికి అధి
8 కారమియ్యబడెను. । భూ నివాసులందరిలో ఎవని పేరు
జగదుత్పత్తి మొదలుకొని వధించబడిన గొర్రెపిల్లయొ
క్క జీవగ్రంథమందు వ్రాయబడ లేదో, వాడు దానికి
నమస్కరించును.

9 ఎవనికైనను చెవి కలిగితే, వాడు వినును గాక.

10 ఎవడైనను చెరను కోరితే చెరలోకి పోవును; ఎవ
డైనను ఖడ్గముతో చంపితే, వాడు ఖడ్గముతో చంప
బడ వలెను. ఇందులో పరిశుద్ధుల ఓర్పు విశ్వాసము
నున్నవి.

11 మరియు, భూమిలోనుంచి మరియొక మృగము
పైకి వచ్చుట చూచితిని. అది గొర్రెపిల్ల వలె రెండు
కొమ్ములు గలదై, ద్రాకోనువలె పలుకుచుండెను. । అది 12
మొదటి క్రూరమృగముయొక్క అధికారమంతయు
దాని యెదుట చూపించుచు, దేని చావు దెబ్బ స్వస్థ
పరచబడెనో, ఆ మొదటి మృగమునకు భూమియు
దాని మీద నివసించువారును నమస్కరించునట్లు చే
యుచున్నది. । మరియు, అది గొప్ప గురుతులు చూపు 13
చున్నది; . ఏలాగనగా అది మనుష్యుల యెదుట ఆకా 14
శమునుంచి అగ్ని దిగచేయుచున్నది. కత్తి దెబ్బ గలదై,
బ్రతికిన మృగమునకు ప్రతిమ చేయ వలెనని భూమి
మీద నివసించువారితో చెప్పి, ఆ మృగము యెదుట
చేయుటకు తనకు ఇయ్యబడిన గురుతులవల్ల భూమి మీద
నివసించువారిని మోసపరుచుచున్నది. । మరియు, ఆ 15
మృగముయొక్క ప్రతిమ మాటలాడునట్లును, ఆ మృ
గముయొక్క, ప్రతిమకు నమస్కరించని వారందరు
చంపబడ చేయునట్లును మృగముయొక్క ప్రతిమకు
ప్రాణమిచ్చుటకు దానికి అధికారము ఇయ్యబడెను.

మరియు పిన్నలు పెద్దలును, ధనవంతులు దరిద్రు 16
లును, స్వతంత్రులు దాసులును, । అందరును తమ కుడి 17
చేతి మీదనైనను, వారి నొసటి నిమిత్తమైనను ముద్ర
పొందునట్లును, ఆ ముద్ర (అనగా) ఆ మృగము పేరై
నను, దాని పేరిటి సంఖ్యయైనను గల వాడు గాక, మరి
ఎవడును కొనుటకైనను అమ్ముటకైనను శక్తి లేక పోవు
నట్లును చేయుచున్నది.

ఇందులో జ్ఞానము కలదు; బుద్ధిగలవాడు ఆ మృ 18
గముయొక్క సంఖ్య లెక్కించు గాక, అది మనుష్యుని
సంఖ్య దాని సంఖ్య-666.

## 14. అధ్యాయము.

మరియు, నేను చూడగా, ఇదుగో! సీయోను కొండ 1
మీద ఆ గొర్రెపిల్ల నిలిచి ఉండెను. నూట నలుబది
నాలుగు వేలమంది ఆయనతో కూడ ఉండిరి. ఆయన
పేరు ఆయన తండ్రి పేరును వారి నొసళ్ల మీద వ్రా
యబడియున్నవి.

అప్పుడు విస్తార జలశబ్దము వలె, గొప్ప ఉరుము 2
యొక్క శబ్దము వలెనునైన శబ్దము ఆకాశమునుంచి
వింటిని. నేను వినిన శబ్దము, తమ వీణెలు వాయించు
వైణికుల శబ్దము వలె నుండెను. । వారు సింహాసనము 3
యెదుటను, ఆ నాలుగు జీవుల యెదుటను, ఆ పెద్దల
యెదుటను కొత్త కీర్తన పాడుచున్నారు. భూమి మీద
నుంచి క్రయమువల్ల విడిపించబడిన నూట నలుబది నా
లుగు వేలమంది తప్ప, మరి ఎవడును ఆ కీర్తన నేర్చు

* లేక, చూచి.

4 కొన లేదు. । స్త్రీలతో మలిన పరచబడక పోయినవారు
వీరే; వీరు అవివాహులు. గొఱ్ఱెపిల్ల ఎక్కడికి పోవు
నో, ఆయనను వెంబడించువారు వీరే. వీరు దేవుని
కిని గొఱ్ఱె పిల్లకును ప్రథమ ఫలముగా, మనుష్యులలో
5 నుంచి, క్రయమువల్ల విడిపించబడిరి. । వీరి నోట కప
టము కనబడలేదు. వీరు నిర్దోషులు.

6 అప్పుడు భూమి మీద నివసించు వారికిని, ప్రతి
రాష్ట్రమునకును, ప్రతి గోత్రమునకును, ప్రతి భాష
కును, ప్రతి జనమునకును, ప్రకటించుటకు, నిత్యమైన
సువార్త గలమరియొక దూత మధ్యాకాశమందు ఎగు
7 రుచు । —మీరు దేవునికి భయపడి ఆయనను మహిమ
పరచుడి; ఆయన తీర్పు గడియ వచ్చెను. ఆకాశమును,
భూమిని సముద్రమును నీటి బుగ్గలను చేసిన వానికే
నమస్కరించుడని గొప్ప శబ్దముతో చెప్పుట చూచితిని.
8 వేరొక రెండవదూత వెంబడించి,—తన వ్యభిచార
క్రోధమను మద్యమును సమస్త రాష్ట్రికులను తాగచేసిన
బబులోనను గొప్ప పట్టణము పడిపోయెను పడిపో
యెను అని పలికెను.

9 వేరొక మూడవ దూత వారిని వెంబడించి మహా
శబ్దముతో చెప్పినదేమనగా—ఎవడైనను ఆ మృగమున
కును దాని ప్రతిమకును నమస్కరించుచు, తన నొసటి
మీద నైనను తనచేతి మీద నైనను ఆ ముద్ర పొంది
10 తే, । అతడు కూడ దేవుని ఆ గ్రహముగల పాత్రలో
అచ్చనిదై పోయబడిన ఆయన క్రోధమను మద్యము
తాగి, పరిశుద్ధ దూతల యెదుటను గొఱ్ఱెపిల్ల యెదు
11 టను అగ్ని గంధకములవల్ల బాధించబడును. । వారి బా
ధయొక్క పొగ యుగయుగముల మట్టుకు లేచును,
మృగమునకును దాని ప్రతిమకును నమస్కరించువారు
ను, దాని పేరిటి ముద్ర ఎవడైనను పొందితే వాడును
12 దివారాత్రములు విశ్రాంతి పొందరు. । ఇక్కడ దేవుని
ఆజ్ఞలను యేసు విశ్వాసమును గైకొను పరిశుద్ధుల ఓర్పు
ఉన్నది.

13 అప్పుడు ఆకాశమునుంచి ఒక శబ్దము వింటిని.
అది నాతో చెప్పినదేమనగా—ఇప్పటినుంచి ప్రభువు
యందు మృతిపొందు మృతులు ధన్యులు —.అవును;
వారు తమ ప్రయాసములనుంచి విశ్రాంతి పొందుట
కే, వారి క్రియలు వారితో కూడ వెంబడించునని ఆత్మ
చెప్పుచున్నది అని వ్రాయుమనెను.

14 మరియు నేను చూడగా, ఇదుగో! తెల్లని మేఘము;
ఆ మేఘము మీద మనుష్య కుమారుని పోలిన ఒకడు
కూర్చుండి యున్నాడు ఆయన తల మీద సువర్ణ కిరీ
టమును, తన చేత వాడిగల కొడవలియు నున్నవి.
అప్పుడు । మరియొక దూత దేవాలయములోనుంచి బై 15
టికి వచ్చి—నీ కొడవలి పెట్టి కోయుము; భూమి పైరు
పండెను గనుక, కోత కాలము వచ్చెనని గొప్ప శబ్దము
తో ఆ మేఘము మీద కూచుండిన వానితో పలి
కెను. । అప్పుడు ఆ మేఘము మీద కూచుండినవాడు 16
తన కొడవలి భూమి మీద పెట్టెను; అప్పుడు భూమి
పైరు కోయబడెను.

తర్వాత మరియొక దూత ఆకాశమందున్న దేవాల 17
యములోనుంచి బైటికి వచ్చెను; అతనికి కూడ వాడి
గల కొడవలి ఉన్నది. । మరియు, అగ్నిమీద అధికా 18
రముగల వేరొక దూత యజ్ఞవేదికనుంచి బైటికి వచ్చి,
వాడిగల కొడవలి గలవానితో—నీ వాడిగల కొడవలి
పెట్టి భూమి ద్రాక్ష గెలలు కోయుము; దాని పండ్లు
పరిపక్వమైనవని గొప్ప శబ్దముతో చెప్పెను. । అప్పుడు 19
ఆ దూత తన కొడవలి భూమి మీద పెట్టి భూమి
ద్రాక్ష ఫలములు కోసి, దేవుని క్రోధమను ద్రాక్షల
పెద్ద తొట్టిలో వేసెను. । ఆ ద్రాక్షల తొట్టి పట్టణపు 20
వెలపట త్రొక్కబడెను. అప్పుడు నూరు క్రోసుల
దూరముగా గుర్రముల కళ్లెముల మట్టుకు ద్రాక్షల
తొట్టిలోనుంచి రక్తము వచ్చెను.

## 15. అధ్యాయము.

మరియు,గొప్పది ఆశ్చర్యమైనదియునైన మరియొక 1
గురుతును ఆకాశమందు చూచితిని. అది ఏదనగా,
ఏడు దెబ్బలుగల ఏడుగురు దూతలు, అవి కడవరివి;
ఎందుకనగా వాటిలో దేవుని క్రోధము తుదముట్టెను.
మరియు, అగ్నితో కలపబడిన స్ఫటికమయసము 2
ద్రము వంటిది నాకు కనబడెను. మరియు, కౄరు
మృగమును దాని ప్రతిమను దాని పేరిటి సంఖ్యను,
జయించి, తప్పించుకొనినవారు, దేవుని వీణెలు పట్టు
కొని ఆ స్ఫటికమయసముద్రము యొద్ద నిలుచుట
చూచితిని. । వారు దేవుని సేవకుడైన మోషే కీర్తనయు 3
గొఱ్ఱెపిల్ల కీర్తనయు పాడుచు—సర్వశక్తిగల దేవుడవైన
ప్రభువా! నీ క్రియలు గొప్పవి ఆశ్చర్యమైనవియునై
యున్నవి. రాష్ట్రముల రాజా! నీ మార్గములు న్యాయ
మైనవి సత్యమైనవియునై యున్నవి. । ప్రభువా! నీకు 4
భయపడని వాడెవడు! నీ నామము మహిమపరచని
వాడెవడు! నీవు మాత్రమే దయాళుడవు; నీ న్యాయ
విధులు తేటపడెను గనుక* రాష్ట్రికులందరు వచ్చి
నీ ఎదుట నమస్కారము చేసెదరు.

* లేక, తేటపడెనని.

5 ఇవియైన తరువాత నేను చూడగా, ఆకాశమందు
సాక్ష్యపు గుడారముయొక్క దేవాలయగర్భము తెరవ
6 బడెను. । అప్పుడు ఏడు దెబ్బలుగల ఆ ఏడుగురు దూ
తలు, పవిత్రమైనవియు మెరియునవియునైన నార
బట్టలు ధరించుకొని, బంగారు దట్టీలు రొమ్ముల మీద
కట్టుకొని, దేవాలయగర్భములోనుంచి వెలపటికి
7 వచ్చిరి. । అప్పుడు నాలుగు జీవులలో ఒక జీవి—యుగ
యుగములు జీవించు దేవుని కోపముతో నిండిన ఏడు
బంగారు గిన్నెలను ఆ ఏడుగురు దూతలకు ఇచ్చెను. ।
8 అప్పుడు దేవుని మహిమనుంచియు, ఆయన శక్తినుంచి
యు కలిగిన పొగతో దేవాలయగర్భము నింపబడెను.
మరియు ఆ ఏడుగురు దూతలయొక్క ఏడు దెబ్బలు
సమాప్తమయ్యెండు పర్యంతము, దేవాలయమందు ఎవ
డును ప్రవేశించ లేకపోయెను.

## 16. అధ్యాయము.

1 మరియు—మీరు వెళ్లి దేవుని క్రోధముగల గిన్నెలు
భూమి మీద కుమ్మరించుడని దేవాలయగర్భములో
నుంచి, గొప్ప శబ్దము ఆ ఏడుగురు దూతలతో చెప్పుట
వింటిని.

2 అప్పుడు మొదటివాడు వెళ్లి తన గిన్నె భూమి మీద
కుమ్మరించెను. అప్పుడు కారుమృగముయొక్క ముద్ర
పొందిన మనుష్యులకును, దాని ప్రతిమకు నమస్కరిం
చువారికిని విషమించు చెడ్డ పుండు పుట్టెను.

3 రెండవ దూత తన గిన్నె సముద్రములో కుమ్మ
రించెను. అప్పుడు అది మృతుని రక్తమువంటి రక్తమా
యెను. సముద్రచరములలో ప్రతి జీవాత్మయు చనిపో
యెను.

4 మూడవ దూత తన గిన్నె నదులలోకి నీటి బుగ్గల
లోకి కుమ్మరించెను. అప్పుడు అవి రక్తమాయెను.

5 అప్పుడు—వర్తమాన భూత కాలములయందు దయా
6 ళుడవైన* నీవు న్యాయవంతుడవు. । పరిశుద్ధుల రక్తము,
ప్రవక్తల రక్తమును చిందించినవారికి రక్తము త్రాగనిచ్చి
తివి. దీనికి వారు పాత్రులని జలముల దూత పలు
7 కుట వింటిని. । మరియు—అవును; సర్వాధికారముగల
దేవుడవైన ప్రభువా! నీ తీర్పులు సత్యమైనవి న్యాయ
మైనవియునై యున్నవని, యజ్ఞవేదిక చెప్పుట వింటిని.

8 నాలుగవ దూత తన గిన్నె సూర్యుని మీద కుమ్మ
రించెను. అప్పుడు అతడు అగ్నివల్ల మనుష్యులను కా
9 ల్చ సెలవునొందెను. । అప్పుడు మనుష్యులు మిక్కిలి వేడి
మితో కాల్చబడి, ఈ దెబ్బల మీద అధికారముగల
దేవుని నామమును దూషించిరి; ఆయనను మహిమ
పరచ మనస్సు తిప్పుకొనలేదు.

అయిదవ దూత తన గిన్నె, కారుమృగముయొక్క 10
సింహాసనము మీద కుమ్మరించెను. అప్పుడు చీకటి దాని
రాజ్యము కమ్మెను. । ఆ వేదనవల్ల వారు తమ నాలుకలు 11
కరుచుకొనుచు, తమ వేదనలవల్లను, తమ పుండ్లవల్లను,
ఆకాశమందలి దేవుని దూషించిరి; తమ క్రియలను
విడువ మనస్సు తిప్పుకొనలేదు.

ఆరవ దూత తన గిన్నెయు ప్రాతను గొప్ప నది 12
మీద కుమ్మరించెను. అప్పుడు సూర్యోదయ దిక్కు
నుంచి వచ్చు రాజుల మార్గము సిద్ధపరచబడునట్లు దాని
నీళ్లు ఎండి పోయెను. । అప్పుడు డ్రాకోను నోటి 13
నుంచియు కారుమృగముయొక్క నోటినుంచియు
అబద్ధ ప్రవక్త నోటినుంచియు కప్పలవలె అపవిత్రా
త్మలు మూడు బైలు వెళ్లుట చూచితిని; । అవి సురు 14
తులు చూపు దయ్యముల ఆత్మలు. అవి సర్వాధికారి
యైన దేవుని మహాదిన యుద్ధమునకు వారిని పోగు
చేయుటకు, సర్వలోక రాజుల యొద్దకు బైలు వెళ్లును.

—ఇదుగో! నేను దొంగ వలె వచ్చుచున్నాను; ఎవ 15
డు మెలుకువపడి, తాను దిగంబరుడై సంచరించుచుం
డగా వారు తన దిసమొలను చూడకుండునట్లు తన
వస్త్రములను కాపాడునో, వాడు ధన్యుడు. । అప్పుడు 16
హెబ్రీ భాషయందు ఆర్మగెదోనను పేరుగల చోటికి
వారిని పోగుచేసినవి.

ఏడవ దూత తన గిన్నె వాయువుమీద కుమ్మరిం 17
చెను. అప్పుడు — అయినదని చెప్పుచున్న గొప్ప శబ్ద
ము దేవాలయగర్భములోనున్న సింహాసనమునుంచి
వచ్చెను. ।అప్పుడు శబ్దములు, ఉరుములు, మెరుపులును 18
కలిగెను. పెద్ద కంపము కూడ కలిగెను. మనుష్యులు
భూమి మీద ఉండినది మొదలుకొని అట్టి మహా
కంపము కలుగలేదు, అంత గొప్పది. । అప్పుడు ఆ 19
గొప్ప పట్టణము మూడు భాగములాయెను; రాష్ట్రముల
పట్టణములు పడిపోయెను. తన కోపముయొక్క క్రోధ
మను మద్యముగల పాత్రను గొప్ప బబులోనుకు ఇచ్చు
నట్లు దేవుని ఎదుట జ్ఞాపకము చేయబడెను. । అప్పు 20
డు ప్రతి ద్వీపము పారిపోయెను. పర్వతములును
కనుగొనబడకపోయెను. । తలాంతు బరువుగల పెద్ద 21
వడగండ్లు ఆకాశమునుంచి మనుష్యుల మీద పడెను.
ఆ వడగండ్ల దెబ్బవల్ల మనుష్యులు దేవుని దూషించిరి;
ఎందుకనగా వాటి దెబ్బ మిక్కిలి గొప్పది.

* లేక, పరిశుద్ధుడవైన.

## 17. అధ్యాయము.

1,2 ఆ ఏడు గిన్నెలుగల ఏడుగురు దూతలలో ఒకడు
వచ్చి నాతో మాటలాడుచు—ఈలాగు రమ్ము; భూరా
జులు దేనితో వ్యభిచారము చేసిరో, దేని వ్యభిచార
మద్యమువల్ల భూ నివాసులు మత్తుకొనిరో అనేక జల
ములమీద కూర్చుండియున్న ఆ గొప్ప వ్యభిచారిణి
3 తీర్పు నీకు చూపెదనని చెప్పి, । ఆత్మ వశమందు నన్ను
అరణ్యమునకు కొంచుపోయెను. అప్పుడు, దేవదూ
షణ నామములతో నిండుకొని, ఏడు తలలు పది కొ
మ్ములుగల రక్తవర్ణ మృగము మీద కూర్చుండిన ఒక
4 స్త్రీని చూచితిని. । ఆ స్త్రీ ధూమ్ర రక్తవర్ణములుగల
వస్త్రము ధరించుకొని, బంగారముతోను, రత్నములతో
ను, ముత్యములతోను అలంకరించబడి, హేయమైనవా
టితోను, తన వ్యభిచార సంబంధమైన మైలతోను నిం
డిన సువర్ణ పాత్ర తనచేత పట్టుకొని యుండెను;।
5 దాని నొసట వ్రాయబడిన పేరు ఏదనగా—మర్మము,
వ్యభిచారులకును భూమియొక్క హేయమైన వాటికిని
తల్లియైన గొప్ప బబులోను.

6 మరియు, ఆ స్త్రీ పరిశుద్ధుల రక్తముచేతను యేసు
సాక్షుల రక్తముచేతను మత్తుకొనియున్నదిగా చూచి
తిని. దాని చూచి, మిక్కిలి ఆశ్చర్యముతో ఆశ్చర్య
7 పడితిని. । అప్పుడు ఆ దూత — ఎందుకు ఆశ్చర్యపడి
తివి! ఆ స్త్రీని గూర్చిన మర్మమును, ఏడు తలలు పదికొ
మ్ములు కలిగినదై దాని మోయుచున్న కారుమృగమును
8 గూర్చిన మర్మమును నేను నీతో చెప్పెదను. । నీవు
చూచిన కారుమృగము ఉండెను; ఇప్పుడు లేదు; అది
అబిస్సులోనుంచి పైకి వచ్చి, నాశనమునకు వెళ్ల బోవు
చున్నది. భూమిమీద నివసించువారిలో ఎవరి పేర్లు
జగత్తు పుట్టినది మొదలుకొని జీవగ్రంథమందు వ్రా
యబడ లేదో వారు—అది ఉండెను, లేదు, ఉండబో
వును అని గ్రహించి, కారుమృగమును చూచుచు
9 ఆశ్చర్యపడుదురు. । ఇందులో బుద్ధిగల మనస్సు కలదు.
ఆ ఏడు తలలు, ఆ స్త్రీ కూర్చుండియున్న ఏడు కొం
10 డలు. । మరియు, అవి ఏడుగురు రాజులు. అయిదుగురు
కూలిపోయిరి; ఒకడు ఉన్నాడు; కడమవాడు ఇంక
రాలేదు. అతడు వచ్చినప్పుడు, కొంతకాలము ఉండ
11 వలెను. । ఉండినదియు, ఇప్పుడు లేనిదియునైన కారు
మృగము కూడ ఎనిమిదవవాడును ఆ ఏడుగురిలో
ఒకడునై యుండి, నాశమునకు పోవును.

12 నీవు చూచిన పదికొమ్ములు పదిమంది రాజులు.
వారు ఇది వరకు రాజ్యము పొందలేదు. అయినను
కారుమృగముతోడ ఒక గడియ రాజుల వలె అధికా
రము పొందెదరు. । వీరు ఏక తాత్పర్యము గలవారై, 13
తమ బలమును అధికారమును ఆ మృగమునకు ఇచ్చె
దరు. । వీరు గొఱ్ఱెపిల్లతో యుద్ధము చేతురు. అప్పు 14
డు గొఱ్ఱెపిల్ల వారిని జయించును; ఎందుకనగా, ఆయన
ప్రభువులకు ప్రభువును రాజులకు రాజునై యున్నా
డు. మరియు, ఆయనతో కూడ ఉండువారు పిలువ
బడినవారును ఏర్పరచబడినవారును నమ్మకమైనవారునై
యున్నారని నాతో చెప్పెను.

మరియు, ఆయన—ఆ వ్యభిచారిణి కూర్చుండిన 15
చోటను నీవు చూచిన జలములు, ప్రజలును, జనసమూ
హములును రాష్ట్రములును భాషలునై యున్నవి. । నీవు 16
పదికొమ్ములను కారుమృగమును చూచితివే, వారు
వ్యభిచారిణిని ద్వేషించి, అది ఏకాంతవాసిగాను దిగం
బరిగానుండ జేసి, దాని మాంసము భక్షించి అగ్నివల్ల
దాని కాల్చివేతురు. । ఎందుకనగా, దేవుని మాటలు 17
నెరవేరు పర్యంతము, తన తాత్పర్యము కొనసాగించు
నట్లును, ఏక తాత్పర్యము కొనసాగించునట్లును, వారు
తమ రాజ్యమును కారుమృగమునకు ఇచ్చునట్లును దేవు
డు వారికి మనస్సు పుట్టించెను. । నీవు చూచిన స్త్రీ 18
భూరాజుల మీద రాచరికము పొందిన గొప్ప పట్టణ
మని నాతో చెప్పెను.

## 18. అధ్యాయము.

ఇవియైన తరువాత, అత్యధికారముగల వేరొక 1
దూత ఆకాశమునుంచి దిగి వచ్చుట చూచితిని. అతని
మహిమవల్ల భూమి వెలిగించబడెను. । అతడు గొప్ప 2
శబ్దముతో ఆర్భటించి ఇట్లనెను;—గొప్ప బబులోను
కూలిపోయెను కూలిపోయెను; అది దయ్యముల నివా
సస్థలమును ప్రతి అపవిత్రాత్మకు ఉనికిపట్టును,
అపవిత్రమైనది అసహ్యమైనదియునైన ప్రతి పక్షికి
ఉనికిపట్టునాయెను. । ఎందుకనగా దాని వ్యభిచార 3
క్రోధమను మద్యమును రాష్ట్రికులందరు తాగి యున్నా
రు. భూరాజులు దానితో వ్యభిచారము చేసిరి. భూ
మియొక్క వర్తకులు దాని సుఖభోగ బలమువల్ల ధన
వంతులైరనెను.

ఆకాశమునుంచి వేరొక శబ్దము వింటిని; అది 4
చెప్పినదేమనగా—నా జనులారా! మీరు దాని పాప
ములలో పాలివారు కాకుండునట్లు దాని దెబ్బలలో
ఏదియు పొందకుండునట్లును, దాని విడిచి రండి. । దాని 5
పాపములు ఆకాశము అంటునట్లు కుప్పచేయబడెను.
దాని అక్రమ కార్యములను దేవుడు జ్ఞాపకము చేసు

6 కొని యున్నాడు. । అది ఇచ్చిన ప్రకారము దానికి
నియ్యుడి. దాని క్రియల చొప్పున రెండంతలు దానికి
రెట్టించుడి. అది కలిపిన పాత్రలో దాని కొరకు రెం
7 డంతలు కలుపుడి. । అది ఎంత విభవముగలదై సుఖభో
గము ననుభవించెనో, అంత వేదన దుఃఖమును దానికి
కలుగచేయుడి; ఎందుకనగా అది తన హృదయమం
దు—రాణినై కూర్చుండి యున్నాను; నేను విధవను
కాను; దుఃఖము చూడనే చూడనని అనుకొనుచున్నది.।
8 అందువల్ల ఒక్క దినమున దాని దెబ్బలు అనగా దాని
మరణమును దుఃఖమును కరువును వచ్చును. అది అగ్ని
వల్ల బొత్తిగా కాల్చబడును; ఎందుకనగా, దానికి న్యా
యము తీర్చిన దేవుడగు ప్రభువు శక్తిమంతుడు.

9 దానితో వ్యభిచారము చేసి సుఖముగా జీవించిన
భూరాజులు దాని దహన ధూమము చూచునప్పుడు,
10 దాని కొరకు ఏడ్చుచు, । రొమ్ము కొట్టుకొనుచు, దాని
వేదన భయమువల్ల దూరముగా నిలిచి — అయ్యో!
అయ్యో! బబులోనను గొప్ప పట్టణమా! బలమైన పట్ట
ణమా! ఒక్క గడియలోనే నీకు తీర్పు వచ్చెనని చెప్పు
కొందురు.

11 భూమియొక్క వర్తకులును దాని కొరకు ఏడ్చుచు
దుఃఖపడుదురు; ఎందుకనగా ఇకమీదట ఎవడును
వారి సరుకులను కొనడు, అనగా బంగారము, వెండి,
12 రత్నములు, ముత్యములు, । సన్నపు నారబట్టలు, ఊదా
రంగు బట్టలు, పట్టుబట్టలు, రక్తవర్ణముగల బట్టలు అను
సరుకులను; ప్రతి విధమైన దబ్బమ్రానును, ప్రతివిధమైన
దంతపు వస్తువును; మిక్కిలి విలువగల మ్రాను, ఇత్తడి,
ఇనుము, చలువరాళ్లు మొదలైన వాటితో చేయబడిన
13 ప్రతి విధ వస్తువును; । కారపు చెక్క, ఓమము, ధూప
ద్రవ్యము, అత్తరు, సాంబ్రాణి, ద్రాక్షారసము, నూనె,
సన్నపు పిండి గోధుములు, పశువులు, గొఱ్ఱెలు అను
వాటిని; గుఱ్ఱములు, రథములు, శరీరములునైన సరుకు
లను; మనుష్యుల ప్రాణములను, ఎవడును కొనడు.।
14 నీ ప్రాణము ఆశించిన నీ సస్య సంగ్రహము నిన్ను
విడిచిపోయెను. రమ్యమైనవన్నియు ప్రకాశమైనవన్ని
యు నిన్ను విడిచి నశించెను; ఇకమీదట వాటిని మరి
ఎన్నడును కనుగొనరు.

15 దానివల్ల ధనము పొందిన వీటి వర్తకులు దాని
బాధ భయమువల్ల దూరముగా నిలిచి ఏడ్చుచు దుఃఖిం
16 చుచు। — అయ్యో! అయ్యో! సన్నపు నారబట్టలను
ధూమ్ర రక్త వర్ణములుగల వస్త్రములను ధరించుకొని,
బంగారముతోను, రత్నములతోను, ముత్యములతోను
అలంకరించబడిన గొప్ప పట్టణమా! । ఇంత ఐశ్వర్యము 17
ఒక్క గడియలోనే పాడైపోయెనని చెప్పుకొందురు.

ప్రతి నావికుడును, ఎక్కడికైనను సబురుచేయు 18
ప్రతివాడును, ఓడవారును, సముద్రము మీద పని
చేయువారందరును దూరముగా నిలిచి దాని దహన
ధూమము చూచి—ఈ గొప్ప పట్టణముతో సమానమై
నది ఏది? అని కేకలు వేయుచుండిరి. । వారు తమ తలల 19
మీద ధూళి పోసుకొని, ఏడ్చుచు, దుఃఖించుచు,—
అయ్యో! అయ్యో! ఆ గొప్ప పట్టణము! అందులో
సముద్రము మీద ఓడలుగల వారందరు దాని అధిక
వ్యయము వల్ల ధనము పొందిరి. ఒక గడియలోనే అది
పాడై పోయినదని కేకలు వేయుచుండిరి.

ఓ ఆకాశమా! పరిశుద్ధులారా! అపొస్తలులారా! 20
ప్రవక్తలారా! దాని గూర్చి ఆనందించుడి; మీ తీర్పు
దేవుడు దానికి నెరవేర్చెను.

అప్పుడు బలిష్ఠుడైన ఒక దూత గొప్ప తిరగటివంటి 21
రాయి ఎత్తి సముద్రములో పడవేసి — ఈలాగు బబు
లోనను గొప్ప పట్టణము వేగముగా పడవేయబడి, ఇక
మీదట ఎన్నడును దొరకదు. । వైణికులయొక్కయు 22
గాయకులయొక్కయు పిల్లంగ్రోవి ఊదువారియొక్క
యు బూరగలూదువారియొక్కయు శబ్దము ఇక నెన్న
డు నీలో వినబడదు. ఏ శిల్పమైనను చేయు శిల్పకారు
డెవడును ఇకనెన్నడు నీలో దొరకడు. తిరగటి ధ్వని
ఇకనెన్నడు నీలో వినబడదు. । దీపముయొక్క వెలు 23
గు నీలో ఇకనెన్నడు ప్రకాశించదు. పెండ్లికుమా
రుని శబ్దము పెండ్లికుమార్తె శబ్దము నీలో ఇకనెన్నడు
వినబడవు; నీ వర్తకులు భూమి మీద గొప్పవారై
యుండిరి; నీ మాయమంత్రములవల్ల రాష్ట్రములన్నియు
మోసపరచబడెననెను. । అప్పుడు ప్రవక్తలయొక్కయు 24
పరిశుద్ధులయొక్కయు భూమి మీద వధించబడిన వా
రందరియొక్కయు రక్తము దానిలో దొరికెను.

## 19. అధ్యాయము.

ఇవియైన తరువాత ఆకాశమందు బహు జనసమూ 1
హముయొక్క మహా శబ్దము వలె — హల్లేలూయా! *
రక్షణ, మహిమ, బలము మన దేవునివే! । ఆయన తీర్పు 2
లు నిజమైనవి, న్యాయమైనవియునై యున్నవి; ఏలా
గనగా తన వ్యభిచారమువల్ల భూలోకమును చెరిపిన
గొప్ప వ్యభిచారిణికి ఆయన తీర్పు చేసి, తన దాసుల
రక్తము కొరకు దానికి ప్రతి దండన చేసెనని చెప్పు
వారి శబ్దము వింటిని. । రెండవసారి వారు — హల్లేలూ 3

* అనగా, యెహోవాను స్తుతించుడి.

యా! అనిరి. దాని పొగ యుగయుగములవరకు లేచు
చున్నది.
4 అప్పుడు ఆ ఇరువది నలుగురు పెద్దలును నాలుగు
జీవులును సాగిలపడి — ఆమేన్, హల్లెలూయా! అని
పలుకుచు, సింహాసనము మీద కూర్చుండియున్న దే
వునికి నమస్కారించెను.
5 మరియు—మన దేవుని దాసులారా! ఆయనకు భయ
పడువారలారా! పిన్న పెద్దలు మీరందరు ఆయనను
స్తుతించుడని చెప్పునొక శబ్దము సింహాసనమునుంచి
వచ్చెను.
6,7 మరియు, బహు జనసమూహముయొక్క శబ్దము
వలెను, విస్తార జలముల శబ్దము వలెను, బలమైన ఉరు
ముల శబ్దము వలెను—హల్లెలూయా! సర్వాధికారము
గల దేవుడైన మన ప్రభువుకు ఏలుబడి వచ్చెను; మన
ము సంతోషపడి ఉత్సహించి, ఆయనను మహిమపరి
చెదము; గొఱ్ఱెపిల్ల వివాహము వచ్చెను; ఆయన భార్య
తన్ను తానే సిద్ధపరచుకొనెనని పలుకువారి శబ్దము
8 వింటిని.। మరియు ఆమె ప్రకాశమైనవియు నిర్మలమై
నవియునైన సన్నపు నారబట్టలు ధరించుకొన సెలవు
పొందెను. ఆ సన్నపు నారబట్టలు, పరిశుద్ధుల నీతి.
9 అప్పుడు అతడు—గొఱ్ఱెపిల్ల పెండ్లి విందుకు పిలువ
బడినవారు ధన్యులని వ్రాయుమని నాతో చెప్పెను.
మరియు, అతడు — ఇవి దేవుని సత్యవాక్యములని నా
10 తో చెప్పెను.। అప్పుడు, అతనికి నమస్కారించుటకు
అతని పాదముల యెదుట పడితిని. అప్పుడు అతడు—
వద్దు సుమీ! నీతోను యేసును గూర్చిన సాక్ష్యముగల
నీ సహోదరులతో సహ దాసుడనై యున్నాను.
దేవునికే నమస్కారించుము; యేసును గూర్చిన సాక్ష్య
ము ప్రవచన సారమని నాతో చెప్పెను.
11 మరియు తెరవబడిన ఆకాశము చూచితిని. అప్పుడు
ఇదిగో! తెల్లని గుఱ్ఱము; వాని మీద కూర్చుండి
యున్న ఆయన, నమ్మకమైనవాడనియు సత్యవంతుడని
యు పిలువబడినవాడై, న్యాయముతో తీర్పుచేయుచు
12 యుద్ధము చేయుచున్నాడు.। ఆయన కన్నులు అగ్ని
జ్వాల; ఆయన తలమీద అనేక కిరీటములు; వ్రాయ
బడిన నామము ఆయనకు కలదు; అది ఆయనకే గాని
13 మరి ఎవనికిని తెలియదు.। రక్తములో ముంచబడిన
వస్త్రము ధరించుకొని యున్నాడు. ఆయన నామము,
14 దేవుని వాక్యమనబడి యున్నది.। ఆకాశమందలి సేన
లు తెల్లనివియు పవిత్రమైనవియునైన నారబట్టలు తొ
డుగుకొని, తెల్లని గుఱ్ఱములెక్కి, ఆయనను వెంబడిం
చుచుండెను.। మరియు ఆయన రాష్ట్రములను కొట్టు 15
నట్లు, ఆయన నోటినుంచి వాడిగల ఖడ్గము బైలు
వెళ్లుచున్నది. ఆయన ఇనుప గదతో వాటిని ఏలును.
ఆయనే సర్వాధికారియైన దేవుని కోపముయొక్క
క్రోధమను మద్యముయొక్క తొట్టి త్రొక్కును.।
మరియు— రాజులకు రాజు, ప్రభువులకు ప్రభువు అని, 16
ఆయన వస్త్రముమీదను, ఆయన తొడమీదను వ్రాయ
బడిన నామము ఆయనకు కలదు.
మరియు ఒక దూత సూర్యుని యందు నిలిచి 17,18
యుండుట చూచితిని. అతడు గొప్ప శబ్దముతో ఆర్భ
టించి — రండి; రాజుల మాంసము, సహస్రాధిపతుల
మాంసము, బలిష్ఠుల మాంసము, గుఱ్ఱముల మాంసము,
వాటి మీద కూర్చుండినవారి మాంసము, స్వతంత్రుల
దేమి దాసులదేమి పిన్నలదేమి పెద్దలదేమి అందరి మాం
సము తినునట్లు, దేవుని గొప్ప విందుకు కూర్చబడు
డని ఆకాశ మధ్యమందు ఎగురు సమస్త పక్షులతో
చెప్పెను.
మరియు, క్రూరమృగమును భూరాజులును వారి 19
సేనలును గుఱ్ఱము మీద కూర్చుండియున్న వానితోను
ఆయన సేనతోను యుద్ధము చేయ కూర్చబడియుం
డుట చూచితిని.। అప్పుడు క్రూరమృగమును, దాని 20
యెదుట గురుతులను చూపి, వాటివల్ల క్రూరమృగము
యొక్క ముద్ర పొందిన వారిని, దాని ప్రతిమకు నమ
స్కారించినవారిని మోసపరిచిన అబద్ధ ప్రవక్తయు దా
నితో కూడ పట్టబడిరి. వారిద్దరు సజీవులై, గంధ
కముతో మండు అగ్ని ఆవలో వేయబడిరి.। అప్పుడు 21
కడమవారు గుఱ్ఱము మీద కూర్చుండియున్నవాని
నోటినుంచి బైలువెళ్లుచుండు ఆయన ఖడ్గముచేత
చంపబడిరి. వారి మాంసమువల్ల పక్షులన్నియు తృప్తి
పరచబడెను.

## 20. అధ్యాయము.

అప్పుడు అబిస్సుయొక్క తాళపు చెవిని, తన 1
చేత పెద్ద సంకెలను పట్టుకొనిన ఒక దూత ఆకాశ
మునుంచి దిగుట చూచితిని.। అతడు పాత సర్పమైన 2
డ్రాకోనును, అనగా అపవాదియు, సైతాను* అన
బడినవాని పట్టుకొని, వెయ్యి సంవత్సరముల వరకు
దాని బంధించి,। అబిస్సులో దాని వేసి మూసిపెట్టి, 3
ఆ వెయ్యి సంవత్సరములు నిండు పర్యంతము, రాష్ట్ర
ములను ఇకను మోసపరచకుండునట్లు దానిమీద ముద్ర

* లేక, విరోధి.

వేసెను. వాటితరువాత అది కొంతకాల పర్యంతము
విడిపింపబడ వలెను
4 మరియు సింహాసనములను చూచితిని. వాటి మీద
కూర్చుండిరి. తీర్పు చేయుటకు వారికి అధికారము
ఇయ్యబడెను. మరియు, క్రూరమృగమునకు దాని ప్రతి
మకు నమస్కరించకయైనను తమ నొసళ్ల మీదను తమ
చేతుల మీదను దాని ముద్ర పొందకయైనను, యేసు సా
క్ష్యము నిమిత్తమును దేవుని వాక్యము నిమిత్తమును తల
కొట్టబడినవారి ప్రాణములను చూచితిని. వారు
జీవించి వెయ్యి సంవత్సరములు క్రీస్తుతో కూడ ఏలి
5 కలైరి. । అయితే కడమ మృతులు ఆ వెయ్యి సంవత్స
రములు నిండు పర్యంతము మళ్లీ జీవించలేదు. ఇది
6 మొదటి పునరుత్థానము. । మొదటి పునరుత్థానములో
పాలు పొందువాడు ధన్యుడును పరిశుద్ధుడునై యుం
డును. వారి మీద రెండవ మరణమునకు అధికారము
లేదు. వారు దేవునికిని క్రీస్తుకును యాజకులై, ఆయ
నతో వెయ్యి సంవత్సరములు ఏలికలవుదురు.
7 ఆ వెయ్యి సంవత్సరములు నిండిన తరువాత సైతాను
8 తన చెరలోనుంచి విడిపించబడి, । భూమియొక్క నాలుగు
దిక్కుల యందున్న గోగు మాగోగు అను రాష్ట్రములను
మోసపరిచి, వారిని యుద్ధమునకు పోగుచేయ బైలు
వెళ్లును. వారి లెక్క సముద్రపు ఇసుక వలెనున్నది.
9 అప్పుడు వారు భూమి మైదానము మీద వ్యా
పించి, పరిశుద్ధుల వేలమును ప్రియ పట్టణమును చుట్టు
కొనిరి. అప్పుడు ఆకాశమందున్న దేవుని యొద్దనుంచి
10 అగ్ని దిగి వారిని కాల్చివేసెను. । మరియు, వారిని మో
సపరుచు నపవాది, అగ్ని గంధకములుగల ఆవలో
వేయబడెను. అక్కడ క్రూరమృగమును అబద్ధ ప్రవక్త
యునున్నారు. వారు యుగయుగములవరకు దివారా
త్రులు బాధపరుచబడుదురు.
11 అప్పుడు తెల్లని మహా సింహాసనమును దాని మీద
కూర్చుండియున్న ఆయనను చూచితిని. ఆయన సమ్ముఖ
మునుంచి భూమియు ఆకాశమును పారిపోయెను. వా
టికి స్థలము దొరకలేదు.
12 మరియు, చనిపోయిన పిన్న పెద్దలు ఆ సింహాసన
ము యెదుట నిలిచియుండుట చూచితిని. అప్పుడు
గ్రంథములు విప్పబడెను; మరియొక గ్రంథమనగా జీవ
గ్రంథము విప్పబడెను. అప్పుడు ఆ గ్రంథముల యందు
వ్రాయబడిన వాటి మూలముగా తమ తమ కార్య
13 ముల చొప్పున మృతులు తీర్పు పొందిరి. । మరియు
సముద్రము తనలోనున్న మృతులను అప్పగించెను. మర
ణమును అదృశ్యలోకమును తమలోనున్న మృతులను
అప్పగించెను. అప్పుడు ప్రతివాడును తన కార్యముల
చొప్పున తీర్పు పొందెను.
అప్పుడు మరణమును అదృశ్యలోకమును అగ్ని 14
గల ఆవలో వేయబడెను. ఇది రెండవ మరణము, అన
గా అగ్ని గల ఆవ. । ఎవడైనను జీవ గ్రంథమందు 15
వ్రాయబడినవాడని కనుబడక పోతే, అగ్ని గల ఆవ
లో వేయబడెను.

## 21. అధ్యాయము.

అప్పుడు కొత్త ఆకాశమును కొత్తభూమిని చూచి 1
తిని; మొదటి ఆకాశము మొదటి భూమియు గతించి
పోయెను; సముద్రము ఇకనుండలేదు.
మరియు, నేను నూతనమైన యెరూషలేమను పరి 2
శుద్ధ పట్టణము, తన పెనిమిటి కొరకు అలంకరించబ
డిన పెండ్లి కుమార్తె వలె సిద్ధపడి, ఆకాశమందలి
దేవుని యొద్దనుంచి దిగి వచ్చుట చూచితిని. । మరియు— 3
ఇదుగో! దేవుని గుడారము మనుష్యులతో కూడను
న్నది; ఆయన వారితో కాపురముండును; వారు ఆయన
ప్రజలై యుందురు; దేవుడు తానే వారికి తోడై వారి
దేవుడవును *. । దేవుడు ప్రతి బాష్పబిందువును వారి 4
కన్నులనుంచి తుడిచి వేసును. మరణము ఇకనుండదు.
దుఃఖము, ఏడ్పు, ప్రయాసమును ఇకనుండవు, మొ
దటివి గతించిపోయెనని ఆకాశమునుంచి గొప్ప శబ్ద
ము చెప్పుట వింటిని.
మరియు, సింహాసనము మీద కూర్చుండి యున్న 5
వాడు — ఇదుగో! అన్నియు నూతనమైనవిగా చేయు
చున్నానని పలికెను. మరియు— ఈ మాటలు నమ్మక
మైనవి సత్యమైనవియునై యున్నవి గనుక, వ్రాయు
మని నాతో చెప్పెను.
మరియు, ఆయన నాతో ఇట్లనెను — అయినది; 6
నేను అల్ఫాను ఓమెగను, ఆదిని అంతమునునై యు
న్నాను; నేను దప్పిగొనిన వానికి జీవ జలముల బుగ్గ
లోనిది ఉచితముగా దయచేతును. । జయించువాడు 7
వీటిని స్వతంత్రించుకొనును; నేను అతనికి దేవుడనై
యుందును; అతడు నాకు కుమారుడై యుండును. ।
అయితే భయస్థులు, అవిశ్వాసులు అసహ్యులు, నర 8
హంతకులు, వ్యభిచారిణులు, మాంత్రికులు, విగ్రహా
రాధకులు, అబద్ధికులును, అగ్ని గంధకములు, మండు
ఆవలో తమ తమ పాలు పొందుదురు; ఇది రెండవ
మరణమనెను.

* లేక, ఆయనే (అనగా) వారితోనున్న దేవుడు వారి దేవుడై యుండును.

9 అప్పుడు ఏడు కడపటి దెబ్బలతో నిండి, ఏడు
గిన్నెలు గల ఏడుగురు దూతలలో ఒకడు వచ్చి నా
తో మాటలాడి—రమ్ము; గొఱ్ఱెపిల్ల భార్యయైన పెండ్లి
10 కుమార్తెను నీకు చూపుదుననెను. । అప్పుడు ఆయన,
ఆత్మ వశమందున్న నన్ను ఎత్తయిన గొప్ప పర్వతము
మీదికి కొంచుపోయి, యెరూషలేమను పరిశుద్ధ పట్ట
ణము దేవుని మహిమగలదై, ఆకాశమందలి దేవుని
11 యొద్దనుంచి దిగి వచ్చుట నాకు అగుపరిచెను. । దాని
వెలుగు స్ఫటికమువలె మెరియు వజ్రమువంటి అమూ
12 ల్య రత్నమును పోలెను. ।దానికి ఎత్తయిన గొప్ప గోడ
ఉండెను. దానికి పన్నెండు ద్వారములు, ఆ ద్వార
ముల యొద్ద పన్నెండుగురు దూతలు నుండిరి. వాటి
మీద నామములు వ్రాయబడెను. అవి ఇశ్రాయేలు
13 పుత్రుల పన్నెండు గోత్రముల నామములు. । తూ
ర్పు వైపు మూడు ద్వారములు, ఉత్తరపు వైపు
మూడు ద్వారములు, దక్షిణపు వైపు మూడు ద్వార
ములు, పశ్చిమపు వైపు మూడు ద్వారములు నుండెను.।
14 ఆ పట్టణపు గోడకు, పన్నెండు పునాదులును, వాటి
మీద గొఱ్ఱెపిల్లయొక్క పన్నెండుమంది అపొస్తలుల నా
15 మములు నుండెను.।మరియు ఆ పట్టణమును, దాని ద్వా
రములను, దాని గోడను కొలుచునట్లు, నాతో మాటలా
డుచున్నవానికి బంగారపు కొలకఱ్ఱ కలదు; ఆ పట్ట
16 ణము చచ్చౌకమైనది. । దాని పొడుగు దాని వెడల్పు
తో సమమైనది. అప్పుడు అతడు ఆ కొల కఱ్ఱతో
పట్టణమును కొలిచెను. అది పన్నెండు వేల స్తాదియులు.
స్తాదియులనగా దాని పొడుగు, వెడల్పు, ఎత్తును సమ
17 మైనవి. । అప్పుడు అతడు మనుష్యుని కొలత చొప్పున,
ఆ గోడను నూట నలుబదినాలుగు మూరలుగా కొలిచెను.
అది దూత కొలతే. దాని గోడ సజ్రమయముగా కట్ట
18 బడెను. । ఆ పట్టణము స్వచ్ఛమైన స్ఫటికమును పోలిన
19 శుద్ధ సువర్ణము. । ఆ పట్టణముయొక్క గోడ పునాదులు
అమూల్యమైన ప్రతి రత్నముతో అలంకరించబడెను.
మొదటి పునాది వజ్రము; రెండవది నీలము; మూడవది
20 యమునారాయి; నాలుగవది పచ్చ; । అయిదవది వైదూ
ర్యము; ఆరోది కెంపు; ఏడవది సువర్ణరత్నము; ఎనిమిదవ
ది గోమేధికము*; తొమ్మిదవది పుష్యరాగము; పదియవది
సువర్ణలశునీయము; పదకొండవది పద్మరాగము; పన్నెం
21 డవది సుగంధము.।దాని పన్నెండు ద్వారములు పన్నెం
డు ముత్యములు; ఒకొక ద్వారము ఒకొక ముత్యమ
యమైనది. ఆ పట్టణముయొక్క వీధి స్వచ్ఛ స్ఫటికము
22 వలె శుద్ధమైన సువర్ణమే. । అందులో నేను దేవాలయ
మును చూడలేదు; ఎందుకనగా సర్వాధికారము గల
దేవుడైన ప్రభువును, గొఱ్ఱెపిల్లయు దాని దేవాలయమై
యున్నారు. । ఆ పట్టణములో ప్రకాశించునట్లు సూ 23
ర్యుడైనను చంద్రుడైనను దానికి అక్కరలేదు. దేవుని
మహిమ దాని మీద ప్రకాశించెను. గొఱ్ఱెపిల్ల దానికి
దీపము. । రాష్ట్రములు దాని వెలుగు ద్వారా సంచరిం 24
చును. భూరాజులు తమ మహిమను అందులోకి తీసు
కొని వచ్చెదరు. । దాని ద్వారములు పగటిలో ఏమా 25
త్రము వేయబడవు; అక్కడ రాత్రి ఉండదు. । రాష్ట్ర 26
ముల మహిమను ఘనతను అందులోకి తీసుకొని వచ్చె
దరు. । గొఱ్ఱెపిల్లయొక్క జీవగ్రంథమందు వ్రాయబ 27
డిన వారే గాని అపవిత్రమైనదై అసహ్యతను అబద్ధ
మును చేయునది ఏదైనను అందులోకి వెళ్లదు.

## 22. అధ్యాయము.

మరియు స్ఫటికమువలె మెరియు జీవజల నది 1
దేవునియొక్కయు, గొఱ్ఱెపిల్లయొక్కయు సింహాసన
మునుంచి బైలు వెళ్లుట నాకు అగుపరిచెను. । దాని వీధి 2
మధ్యనున్న నదియొక్క ఈవలను ఆవలను,† పన్నెండు
ఫలములు ఫలించు జీవవృక్షము నెలనెలకు తన ఫల
మిచ్చుచున్నది. ఆ వృక్షముయొక్క ఆకులు రాష్ట్రము
లను స్వస్థపరుచు మందు. । ఇకమీదట శాపగ్రస్తమై 3
నది ఏదియునుండదు, దేవుని యొక్కయు గొఱ్ఱెపిల్ల
యొక్కయు సింహాసనము దానిలో నుండును. । ఆయన 4
దాసులు ఆయనను సేవించుచు, ఆయన ముఖమును చూ
తురు. ఆయన పేరు వారి నొసళ్ల మీద నుండును.।రాత్రి 5
ఇకనెన్నడునుండదు. దీపకాంతి సూర్యుని కాంతి వారికి
అక్కరలేదు; ప్రభువైన దేవుడు వారి మీద వెలుగు
ప్రకాశింప చేయును. వారు యుగయుగములకు ఏలు
దురు.

మరియు ఆయన నాతో ఇట్లనెను—ఈ మాటలు 6
నమ్మకమైనవి నిజమైనవియునై యున్నవి. ప్రవక్తల
యొక్క ఆత్మల దేవుడైన ప్రభువు త్వరగా జరుగ వల
సిన వాటిని తన దాసులకు చూపు నిమిత్తము తన దూ
తను పంపెను. । ఇదుగో! త్వరగా వచ్చుచున్నాను. ఈ 7
గ్రంథ ప్రవచన వాక్యములు గైకొనువాడు ధన్యుడ
నెను. । యోహాను అను నేను వీటిని విని చూచితిని. 8
నేను విని చూచినప్పుడు, వీటిని నాకు చూపిన దూత
పాదముల యెదుట నమస్కారము చేయ సాగిలపడి
తిని. । అప్పుడు అతడు — వద్దు సుమీ! నేను నీతో నీ 9
సహోదరులైన ప్రవక్తలతో ఈగ్రంథ వాక్యములను
గైకొనువారితోను సహ దాసుడను; దేవునికే నమస్క

* లేక, లేతపచ్చ. † లేక, నదియొక్క ఈవల నావలనున్న విశాలమార్గమునకు నదికిని మధ్యమందు.

10 రించుమని నాతో చెప్పెను. । మరియు ఆయన నాతో
చెప్పినదేమనగా — ఈ గ్రంథ ప్రవచన వాక్యములకు
ముద్ర వేయ వద్దు; ఎందుకనగా కాలము సమీపమై
11 యున్నది. । అన్యాయస్థుడు ఇకను అన్యాయము చేయ
నిమ్ము, అపవిత్రుడు ఇకను తన్ను అపవిత్రపరచుకొన
నిమ్ము; నీతిమంతుడు ఇకను నీతి క్రియలు చేయనిమ్ము;
పరిశుద్ధుడు ఇకను తన్ను పరిశుద్ధపరచుకొననిమ్ము. ।
12 ఇదిగో! త్వరగా వచ్చుచున్నాను; ప్రతివానికిని వాని
క్రియలచొప్పున ఫలమిచ్చుటకు, నా జీతము నాయొద్ద
13 ఉన్నది. । నేను అల్ఫను, ఓమెగను, ఆదిని అంతము
ను, మొదటివాడను కడపటివాడనునై యున్నాను. ।
14 జీవవృక్షము మీద అధికారము గలవారవునట్లును,
ద్వారములవల్ల పట్టణములోకి వెళ్లునట్లును తమ వస్త్ర
15 ములను ఉతుకుకొనినవారు ధన్యులు. । కుక్కలు, మాం
త్రికులు, జారులు, నరహంతకులు, విగ్రహారాధకులు,
అబద్ధము ప్రేమించి కల్పించువారందరును వెలపట
నుందురు.

16 సంఘములను గూర్చి మీకు ఈ సాక్ష్యము చెప్ప
నట్లు యేసు అను నేను నా దూతను పంపితిని. నేను
దావీదు వేరుచిగురును, సంతానమును, మెరియు వేకువ
చుక్కనునై యున్నాను. । ఆత్మయు పెండ్లి కుమార్తెయు 17
యు—రమ్మని చెప్పుచున్నారు. వినువాని, రమ్మని చెప్ప
నిమ్ము. దప్పిగొనినవాడు వచ్చుగాక. ఇచ్ఛగలవాడు
జీవజలము ఉచితముగా పుచ్చుకొనుగాక.

ఈ గ్రంథ ప్రవచన వాక్యములు విను ప్రతి వాని 18
కిని నేను చెప్పు సాక్ష్యము ఏదనగా—ఎవడైనను వీటి
తో మరి ఏమైనను కలిపితే, దేవుడు ఈ గ్రంథము
లో వ్రాయబడిన దెబ్బలను అతనికి కలుగ చేసెదను. ।
మరియు, ఎవడైనను ఈ ప్రవచన గ్రంథముయొక్క 19
వాక్యములలో ఏవైనను తీసివేసిన ఎడల, దేవుడు ఈ
గ్రంథమందు వ్రాయబడిన జీవ వృక్షములోనుంచి
యు పరిశుద్ధ పట్టణములోనుంచియు అతని పాలు తీసి
వేసును. । వీటిని గూర్చి సాక్ష్యమిచ్చువాడు—అవును, 20
త్వరపడి వచ్చుచున్నానని చెప్పుచున్నాడు. ఆమేన్.
ప్రభువైన యేసూ! రమ్ము.

ప్రభువైన యేసు కృప పరిశుద్ధులందరికి తోడై 21
యుండును గాక. ఆమేన్.

సమాప్తి.

